## 6. పూర్ణజీవితం

తిక్కన కాల నిర్ణయంలో కొన్ని చిక్కులున్నా క్రీ.శ. 1205 లేక 1210 నుండి 1288 వరకు (78 సంవత్సరాలు లేదా 83 ఏళ్ళు సహస్రచంద్రదర్శనం చేసేంతవరకు) పూర్ణజీవితం నిర్వహించాడని చారిత్రకులు భావిస్తున్నారు. మనుమసిద్ధి తండ్రి తిక్కరాజు 1190 నుండి 1252 వరకు రాజ్యం చేసినట్లు తెలుస్తున్నది. అంతకు ముందు ఒకటి రెండేళ్ళు మనుమసిద్ధి రాజకార్యాలను చక్కదిద్దుతూ ఉన్నా, తండ్రి గతించిన కాలంలో దాయాదుల కుట్రలకు గురియై కొంతకాలం అజ్ఞాతంలో ఉండి మరల బైటపడి, తేరుకొని, స్థిరపడేసరికి 1253 వరకూ పట్టి ఉండవచ్చును. 1255 నాటికి తిక్కన నిర్వచనోత్తర రామాయణం రచించి మనుమసిద్ధికి అంకితం ఇచ్చి ఉంటాడు. 1255-1260 సంవత్సరాల నడుమ మహామంత్రిగా తిక్కన ఆంధ్రదేశంలోని మత పరిస్థితులను గమనించి సంక్షోభపడి ఉంటాడు. మనుమసిద్ధి భూపాలుడు క్రీ.శ. 1260లోనో 1263లోనో దివంగతుడైనట్లు భావింపబడుతున్నది. 1260 నాటికి తిక్కన హరిహరాద్వైత దర్శనాన్ని తెలుగునాట ప్రచారం చేసి, మతపరంగా శాంతిదూతవలె ప్రవర్తిల్లాడు. మనుమసిద్ధి రాజ్య సంస్థాపనాచార్యకత్వం 13వ శతాబ్దిలో తెలుగు మహామంత్రి తిక్కన ప్రదర్శించిన రాజకీయ చాతుర్యం ప్రకటించగా, హరిహరనాథతత్త్వం ఆ తెలుగు మహామనీషి ప్రవచించిన శాంతి ప్రబోధం వలె వినిపిస్తుంది. ఆ తరువాత హరిహరనాథుడి కంకితం చేసిన మహాభారతం తిక్కన మహాకవి జాతికిచ్చిన ధార్మిక సందేశంవలె కావ్యకళాశిల్ప ప్రస్థానంవలె ప్రకాశిస్తుంది. మనుమసిద్ధి మరణానంతరం తిక్కన మంత్రిపదవి వదలి, యజ్ఞం చేసి సోమయాజి అయి, భారతాన్ని రచించి ఉంటాడు. 1255 నుండి తెలుగునాట భారత రచనావసరం తలయెత్తినట్లున్నది. కృతితోపాటు కృతిపతికూడా అవతరించవలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. అప్పటినుండి దాదాపు మూడు దశాబ్దాలు మహాభారత రచన సాగి ఉంటుంది. తిక్కన విరాటపర్వం దాదాపు 50 సంవత్సరాల వయసులో మొదలై ఉండవచ్చును. లేకపోతే అంతటి జిగి, బిగి, నానారసాభ్యుదయోల్లాసం మరొక వయస్సులో సాధ్యం కాదు. ఉద్యోగపర్వం ముగిసేనాటికి షష్టిపూర్తి అయి ఉండవచ్చును. లేకపోతే అంతటి రాజనీతి పరిపక్వత అందులో ప్రతిఫలించదు. యుద్ధషట్కం ముగిసేనాటికి 70వ పడిలో పడిఉండవచ్చును. శాంతిపర్వం నాటికి అంపశయ్యమీది భీష్ముడివలెనే 75 సంవత్సరాల వాడయి ఉండవచ్చును. పండిన విజ్ఞానఖని శాంతిపర్వ తిక్కన. ఆ తరువాత త్వరత్వరగానే చివరి పర్వాలు ముగించి ఉండవచ్చును. ఆంధ్ర మహాభారతం పూర్తికావాలన్న సంకల్పం పూర్ణఫలాన్ని పొందిన పూర్ణజీవితం తిక్కన సోమయాజిది.

## 7. హరిహరాద్వైతం శాంతిసూక్తం

వేదవిహితమైన జీవనధర్మం సమాజంలో ఎప్పుడు సంక్షోభానికి గురి అవుతుందో అప్పుడు పంచమవేదమైన మహాభారతం ఏదో ఒక రూపంలో అవతరిస్తుంది. నన్నయ తరువాత రెండు శతాబ్దాలకు అటువంటి పరిస్థితులే మరల దేశంలో నెలకొన్నాయి. నన్నయకాలంలో జైన బౌద్ధాల వలన వైదికమైన గృహస్థ ధర్మం సమాజంలో కుంటుపడింది. దానిని పునరుద్ధరించటానికి భారత రచన చేపట్టాడు నన్నయ. తిక్కన కాలంలో శైవ వైష్ణవాలు సంఘర్షణపడి సమాజంలో వైదికమైన జీవనతత్త్వాన్ని స్వీయమతానుగుణంగా వ్యాఖ్యానించి పరస్పర ద్వేషభావంతో మతకలహాలను కల్పించి రక్తపాతం సృష్టించాయి. బసవేశ్వర ప్రోక్తమైన వీరశైవం ఒకవైపు, పండిత ప్రోక్తమైన ఆరాధ్యశైవం మరొకవైపు, రామానుజ ప్రోక్తమైన వైష్ణవం మరొకవైపు, దానిలోని తెగలు మరొకవైపు ఆంధ్రదేశంలో వ్యాపించి, సంఘంలో తమ తమ ప్రాచుర్యాలను నిలువబెట్టుకొనటానికి వ్యూహాలు పన్నటం సాగించాయి. ఈ మతాలన్నిటికీ భక్తి మూలాధారం. శైవులు శివుడే పరదైవమనీ, వైష్ణవులు విష్ణువే మూలదైవమనీ భావించి, అన్యదేవతాశ్రవణ దర్శనాదులను నిషేధించి, అన్యమతావలంబులను గర్హించి, స్వీయమత చిహ్నాలైన లింగధారణ, ముద్రాధారణాదులవంటి బాహ్యాచారాలకు అధిక ప్రాధాన్యాన్ని ఇచ్చి, లింగం ధరించిన జంగములనూ, ఊర్ధ్వపుండ్రాలు తాల్చిన భాగవతులనూ భగవంతుడి జంగమరూపాలుగా భావించి, పూజించి స్వీయమతాభినివేశాన్ని ప్రకటించారు. పరంపరానుగతంగా వస్తున్న చాతుర్వర్ణ్యవ్యవస్థను వీరు కాదని, మతాన్నే ఒక కులంగా వ్యాప్తి చేశారు. తరువాత కులాలలో మతాల వారిని వేరు చేశారు. కులాని కొకవిధమైన ఆచారాలను ప్రవేశపెట్టారు. అందరూ కలిసి వైదిక ధర్మం మీద ఉండే ప్రామాణిక భావాన్ని సంక్షోభంలో పడవేశారు. ప్రజాదరణంకొరకు శైవ వైష్ణవులు జ్ఞాన విశిష్టమైన భక్తికంటె మూఢమైన భక్తినే ఎక్కువగా ప్రచారం చేశారు. జ్ఞానం కంటె విశ్వాసం గొప్పదన్నారు. విశ్వాసాన్ని మతానుకూలంగా ప్రదర్శించటం ముఖ్యమన్నారు. అన్యమత ద్వేషం భక్తిలో భాగమన్నారు. స్వీయమత రక్షణ వ్యాపనలు ధర్మవర్తనలన్నారు. దానితో

ప్రజలలో పరస్పర వివాదాలు మొదలయ్యాయి. అవి ఒక్కొక్కసారి రాజకీయాలలో చేరి రాజ్యాలు కూలిపోవటానికీ, వంశాలు నాశనం కావటానికీ, వీరులు నిరర్థకంగా రణరంగాలలో బలికావటానికీ దోహదం చేశాయి. తెలుగువారి మహాభారతంగా చెప్పుకొనే పల్నాటి వీరచరిత్ర మతసంక్షోభం మూలంగా సాగిన మారణయజ్ఞమే. తెలుగువీరుల నెందరినో కదనరంగంలో కోల్పోయిన విషాదగాథలు, ఖడ్గతిక్కన వంటి మేటి జోదులు నేలకొరిగిన సన్నివేశాలు తిక్కన జీవించిన కాలం చవి చూచినవే.

వీరశైవం వైష్ణవం కంటె ఆవేశ ప్రధానమైన మతం. శైవేతరులను శైవులు భవులని పిలిచి, వారి దర్శన స్పర్శన సంభాషణాదులను గర్హించి, ఆత్మరక్షణార్థం ఆయుధాలను ధరించేవారు. శివాపరాధులను శిక్షించేవారు. శివాపరాధానికి మరణమే దండనమని భావించటం కూడా పరిపాటిగా ఉండేది. ఇంత తీవ్రంగా సాగే మతోద్యమాన్ని ఎదుర్కొనటానికి వైష్ణవం కూడా కొన్ని తీవ్ర లక్షణాలు అలవరచుకొనక తప్పలేదు. వీరిరువురూ తమలో తాము తగవులాడుకొనేవారు. ఇరువురూ కలిసి వైదిక మతాచారులైన బ్రాహ్మణులను దూయబట్టేవారు. మతం పేరిట అప్పుడప్పుడు రక్తపాతం సృష్టించేవారు. తిక్కన ఈ విపరీత పరిస్థితులకు వేదనపడ్డాడు. కవిగా ఒక శ్లోకంతో తన ఆర్తిని భగవంతుడికి నివేదించుకొన్నాడు:

"కి మస్థిమాలాం కిము కౌస్తుభం వా। పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్
కిం కాలకూటః కిము వా యశోదాస్తన్యం। తవ స్వాదు వద ప్రభో! మే". (విరా.1.11)

తిక్కన ఆర్తి భగవంతుడికి వినిపించింది. అతడు హరిహరాత్మకమైన తత్త్వదర్శనంతో వైదికధర్మంలోని అభేదభక్తిని, అద్వైతసిద్ధిని తిక్కనకు ప్రసాదించాడు. ఆ అభినవ దర్శనంతో తిక్కన లోకాన్ని దర్శించాడు. శైవవైష్ణవాదిమతాలలోని వైదిక మతాచార విలుప్తిని, భేదదృష్టిని, మూఢభక్తిని గర్హించాడు. వేదాల పరమ ప్రామాణ్య భావానికి ప్రాధాన్యమిచ్చాడు. వైదిక మార్గనిష్ఠమగు వర్తనం వలన హరిహరాభేద రూపమైన భక్తి కుదురుతుందని ప్రబోధించాడు. సగుణ స్వరూపం వెనుక నిర్గుణమై అద్వితీయమై భాసించే పరతత్త్వాన్ని దర్శించే జ్ఞానమే భేదంలేని భక్తి అని చాటి చెప్పాడు. హరిహరభేదదృష్టి జ్ఞానంవలన నశిస్తుందనీ, జ్ఞాన విరహితమైన మూఢభక్తి భేదరూపమైన కాలుష్యాన్ని హృదయంలో పెంచుతుందనీ, తత్కాలుష్య పరిక్షాళనవలనమాత్రమే చిత్తానికి నిర్మలవృత్తి ఏర్పడుతుందనీ, దానివలన భక్తుడు భగవత్పాదనిరంతర స్మరణతత్పరభావం పొందగలుగుతాడనీ, అది ఆత్మానంద ప్రదాయక మౌతుందనీ తిక్కన వేదసమ్మతమైన మార్గాన్ని లోకానికి చూపాడు.

భేదదృష్టితో పెనగులాడే శైవ వైష్ణవులకు జ్ఞానజ్యోతితో ఎదురునిలిచాడు తిక్కన. కాని, వారిపై విజృంభించలేదు. నయకోవిదుడై వారి భేదదృష్టికి విరుగుడు పెట్టాడు. "పరివాదాస్పద వాదమోద మదిరాపానంబుచే మత్తులై హరి మేలంచు, హరుండు మేలనుచు (ఉత్తరహరివంశం 2.68) క్రుమ్ములాడుకొనేవారికి హరిహరాత్మకమైన పరతత్త్వాన్ని చూపి, వారికి జ్ఞానదృష్టిని ప్రసాదించాడు. పంచమవేదమైన మహాభారతాన్ని తెలుగులో వినిర్మించి వేదహృదయాన్ని లోకహితంగా ప్రబోధించాలని భావించాడు. ఆవేగంతో పరుగులెత్తే రెండు మతవాహినులకు జ్ఞానవారధి కట్టి, వాటిని వేదక్షేత్రములవైపు మళ్ళించాడు. హరిహరనాథుడిని కల్పించటం వలనా, మహాభారతరచనం వలనా తిక్కన ఈ శాంతి విప్లవాన్ని దేశంలో విస్తరింపజేశాడు.

దీనిని బట్టి 11వ శతాబ్ది తరువాత 13వ శతాబ్ది మహాభారతావతరణాన్ని సామాజిక, మత, ధార్మిక, సాహిత్య, సాంస్కృతిక సముద్ధరణకు సమర్థమైన సాధనంగా భావించినదన్నమాట. తిక్కన రచన ఆ కాలం కడుపార కన్న ఉత్తమ రచన.

చారిత్రక భౌతిక వాదులు శైవ వైష్ణవ మతోద్యమాలను భక్తి ఉద్యమంలోని అంతర్దశలుగా భావిస్తారు. వారి దృష్టిలో భక్తి ఉద్యమం సామాజికంగా వర్గసంఘర్షణకూ, పీడిత వర్గాల తిరుగుబాటుకూ సంబంధించింది. పాలకవర్గం వైదికమైన మార్గాన్నీ, బ్రాహ్మణ మతాన్నీ అనుసరిస్తే, సామాన్య ప్రజలు శైవ వైష్ణవాలను అనుసరించేవారు. పాలకులు ఫ్యూడల్ విధానాన్నీ, చాతుర్వర్ణ్య వ్యవస్థనూ సమర్థిస్తే ప్రజలు వర్ణవ్యవస్థను నిరాకరించి, మతపరంగా ఆయామతాల వారందరూ ఒకేవర్గంవారనే భావాన్ని బలపరచేవారు. అయితే, ఆ మతస్థులలో కూడా చాతుర్వర్ణ్యాన్ని సమర్థించే వర్గాలు కూడా కొన్ని ఉండేవి. ఆ విధంగా ఒకవైపు సమాజంలోమతపరంగా ఒక గొప్ప మార్పు వచ్చే వాతావరణం కనబడటంతో పాటు, మరొకవైపు విభిన్న భావజాలాల మధ్య తీవ్రమైన ఘర్షణ కూడా

సాగేది. అది విప్లవంగా రూపొందే అవకాశాలున్నా, దానిని తిక్కన తన సమన్వయవాదంతో శాంతింపజేసి, మరల ఫ్యూడల్ విధానాన్నీ, చాతుర్వర్ణ్యవ్యవస్థనూ సమర్థించే రాచరిక వర్గానికి బలాన్ని చేకూర్చాడు. తిక్కన సమన్వయ దృక్పథం విప్లవ చైతన్యాన్ని చల్లార్చింది-అని వ్యాఖ్యానిస్తారు.

## 8. ఆత్మాశ్రయకావ్యం ఆంధ్రమహాభారతం

తిక్కన తన జీవితంలో ఎదుర్కొన్న పరిస్థితులతోనే స్వీయ వ్యక్తిత్వాన్ని నిర్మించుకొన్నాడు. అతడు తనంతట తాను మలచుకొన్న సజీవశిల్పం వంటివాడు. పుట్టింది గుంటూరు విభుని కుటుంబంలో, పరిపాలన దక్షత ఉగ్గుతో వచ్చిన విద్య, తాత తండ్రులు సార కవితాభిరాములు. తిక్కనకు కావ్యకళ రక్తనిష్ఠమైన సహజగుణం. మనుమసిద్ధి సాహచర్యం అతడిలో మహామంత్రిని మేల్కొల్పింది. ఆపదలో రాయబారి నైపుణ్యాన్ని అలవరిచింది. అనవరతం దాయాదుల పోరులో ఎత్తుకు పైయెత్తు వేయటంలో రాజుకు తోడ్పడటం వలన వ్యూహరచనా చాకచక్యం అలవడింది. అజ్ఞాతవాసంలో ఉన్న రాజును రక్షించుకొనే యత్నంలో గూఢచర్య తెలిసింది. గణపతిదేవుడి మైత్రి జ్ఞానశిఖరాలను చూపించింది, యుద్ధమర్మాలను నేర్పింది. లోకానుభవాన్ని నూరిపోసింది. మహామంత్రిత్వం, దండనాయకత్వం, మహాకవిత్వం - ఇవన్నీ తిక్కనను మంత్రిగా, సేనానిగా, ధర్మవేత్తగా, నీతివేత్తగా, రాయబారిగా, మాటనేర్పరిగా తీర్చిదిద్దాయి. ఆయన యజ్ఞదీక్ష వేదధర్మాన్ని నేర్పింది. సోమయాజిత్వం జ్ఞాననేత్రం తెరిపించింది. హరిహరనాథదర్శనం మోక్షమార్గాన్ని చూపింది. కవిత్వమే ఒక ఆరాధనా విశేషంగా అతడికి మిగిలింది.

జీవితంలో ఇంతటి అపారమైన అనుభవాన్ని గడించిన తిక్కన విరాటపర్వం నుండి పదునేను పర్వాలు రచించే అర్హత, అనుభవం గడించాడు. పాండవుల అజ్ఞాతవాసం వెనుక మనుమసిద్ధి అజ్ఞాతవాసవ్రతానుభవం తొంగి చూస్తుంది. రాయబారాల ఘట్టాల నిర్వహణలో తిక్కన ఓరుగల్లులో గణపతిదేవుడి సభలో ప్రదర్శించిన మాటనేర్పరితనం పనికి వచ్చింది. యుద్ధపంచకంలో తానూ తన వంశీయులూ చేసిన యుద్ధాల వ్యూహాల అనుభవం అందిపుచ్చుకొన్నట్లుగా తోడ్పడింది. యుద్ధానంతరం ఆప్తజన వియోగంతో కలిగే విషాదజీవిత దృశ్యాలు తిక్కన కళ్లారా చూచిఉంటాడు. వాటిని ఆర్ద్రంగా చిత్రించటానికి స్త్రీపర్వాదులలో అవకాశం దొరికింది. మంత్రిగా, మనీషిగా, సోమయాజిగా తిక్కన సాధించిన విజ్ఞాన శిఖరాలన్నీ శాంతి పంచక పర్వ నిర్వహణంలో కరతలామలకాలుగా పనికివచ్చాయి. తిక్కన చివర సాగించిన ఆశ్రమవాస జీవితం మహాభారత రచనలో చివరకెంతో తోడ్పడింది. ఆ విధంగా తిక్కన స్వీయ జీవితానుభవాన్ని ఆత్మాశ్రయ కావ్యంగానో, స్వీయచరిత్రగానో నిర్మించటానికి బదులు స్వీయ జీవిత ప్రతిఫలనంగా తోచే మహాభారతేతిహాసాన్ని ఆత్మీయంగా, పరాశ్రయంగా ఆవిష్కరించి, సజీవ రసాభ్యుదయోల్లాసాన్ని ప్రబంధ మండలిగా తెలుగులో ఆవిష్కరించాడు. ఒక మహాకవి పరిపూర్ణ జీవితం పరిపూర్ణంగా ప్రతిఫలించిన కావ్యేతిహాసం తిక్కన భారతం.

ఆంధ్రమహాభారత రచనకు తిక్కనకున్న అధికారాన్ని గురించి పింగళి లక్ష్మీకాంతంగారన్న మాటలు స్మరణీయాలు."ఈ పంచమ వేదమును సవిమర్శముగా విభజించినపుడు అందు మూడే ముఖ్య విషయములు గోచరించును. అవి. 1. రాజనీతి 2.యుద్ధతంత్రము 3. బ్రహ్మవిద్యోపదేశము. పుట్టుకచేతను, నడవడిచేతను, విజ్ఞానముచేతను ఈ మూడు మహాధర్మములను ఆత్మధర్మములుగా నిర్వహించి అనుభవ గోచరములు చేసికొనిన కవి తెలుగునాట తిక్కన యొక్కడే. ఈ కారణములచే భారత రచనకు తిక్కనయొక్కడే యుత్తమాధికారి యని చెప్పనగును.'' (ఆంధ్ర సాహిత్య చరిత్ర. పు.222)

## 9. తిక్కన కవితా దృక్పథం

రామాయణంతిక్కనకూ భారతంతిక్కనకూ మధ్య చిత్తపరిపాకంతోపాటు కవితాదృక్పథంలో కూడా పరిణామం కన బడుతుంది. దానిని సంగ్రహంగా సమీక్షించటం సమంజసం. 1. నిర్వచనోత్తర రామాయణ, విరాటపర్వ కావ్యావతారికలు తిక్కన కవితా దృక్పథాన్ని తెలిపే ప్రాథమిక సాక్ష్యాలు. వాటిలో సమానమైన కొన్ని మౌలికాంశాలున్నాయి. అవి ప్రధానంగా కవితాదర్శనానికీ, కావ్యాంతరంగ లక్షణాలకూ సంబంధించినవి. వాటిలో మార్పును సూచించేవి కొన్ని ఉన్నాయి. వాటిలో కొన్ని అంతరంగ లక్షణాలున్నా

బహిరంగ లక్షణాలే ఎక్కువగా గోచరిస్తున్నాయి. స్థూలంగా పరిశీలిస్తే తిక్కన బహిరంగ (Extrinsic) కావ్యదృక్పథాలనుండి అంతరంగ (Intrinsic) దర్శనం వైపు పయనం చేశాడని స్పష్టమవుతుంది.

2. నిర్వచనోత్తరరామాయణం నాటికి తిక్కన తనకు నికట ప్రత్యర్థులైన వీరశైవులకంటె తా నెట్లా కవితాదృక్పథంలో భేదిస్తున్నాడో చెప్పటానికి యత్నించగా, విరాటపర్వం నాటికి తాను నన్నయ ప్రస్థానానికి ఎట్లా సన్నిహితుడయ్యాడో వివరించడానికి యత్నించాడు. రామాయణంతిక్కన కవితా దర్శనంలో నన్నయ బాటకు చెందినవాడే అయినా విరాటపర్వం నాటికిగాని ఆ బాటను పూర్తిగా స్వాయత్తం చేసికొని తన ప్రతిభను ప్రదర్శించలేకపోయాడు.

మ. "అమలోదాత్తమనీష నే నుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శి
ల్పమునం బారగుఁడం, గళావిదుఁడ, నాపస్తంబ సూత్రుండ, గౌ
తమ గోత్రుండ, మహేశ్వరాంఘ్రి కమల ధ్యానైకశీలుండ, న
న్నమకుం గొమ్మన మంత్రికిన్ సుతుఁడఁ దిక్కాంకుండ సన్మాన్యుఁడన్." (నిర్వ.రా.1.13)

తిక్కన తనను పరిచయం చేసికొన్న మొదటి పద్యమిది. తల్లిదండ్రుల సూత్రగోత్రాల కథనాలు సాధారణాలే. "ఉభయ కవిమిత్రుడు' అనే బిరుదం అప్పటికే ఆయనకు సహజాలంకారంగా ఉన్నది. దానిని ఆయన వివరించాడు మొదట. నే నేది వ్రాసినా తెలిసి వ్రాస్తాను - అని చెప్పే ధిషణాశక్తి మనీష. దోషాలు చేయని ఉదాత్తమయిన బుద్ధితో ఉభయకావ్యాలలో కవులు ప్రదర్శించే ప్రౌఢిని పాటించే శిల్పంలో ఆయన నిష్ణాతుడట! ఉభయ కావ్యాలంటే సంస్కృతాంధ్ర కావ్యాలనీ, దృశ్య శ్రవ్య కావ్యాలనీ, మార్గ దేశి కావ్యాలనీ, పద్య చంపూ కావ్యాలనీ, శాస్త్ర రసకావ్యాలనీ- ఇట్లా మరికొన్ని కూడా చెప్పుకొనవచ్చును. ఒక భావాన్ని చెప్పటంలో సామాన్య పదాలనే వాడుతూ అసామాన్యమైన అర్థాన్ని స్ఫురింపజేసే గడుసరితనం ప్రౌఢి. అది వర్ణ్యవస్తువు యొక్క శీలాన్ని (స్వభావాన్ని) సార్థకంగా స్ఫురింప చేయటం లేదా ధ్వనింపజేయటం శిల్పం. దీనినే ఇంగ్లీషులో 'the most delightful and perfect form of utterance' అని అంటారు. కావ్యశీలాన్ని బట్టి సార్థకమైన ప్రౌఢోక్తులు వాడటం తిక్కనకు సహజంగా ఏర్పడిన వాగ్వృత్తి. 3. కళావిదుడంటే- ప్రౌఢోక్తులను రమణీయంగా చెప్పే కళకూడా తెలిసినవాడని భావం. లలితకళాకోవిదుడని మరొక అర్థం. కాబట్టి తిక్కన రమణీయార్థ ప్రతిపాదక ప్రౌఢోక్తి ప్రయోగశిల్పంలో మేధావి అని స్పష్టం. ఇది అతడి మాటతీరు. రామాయణమైనా భారతమైనా ప్రౌఢి సదా నిలిచేదే. తిక్కనకు ముందున్న పాల్కురికి సోమనాథుడు పరుగెత్తే పలుకులవాడు (వడివడి మాటలవాడు), నన్నెచోడుడు వక్రోక్తుల వన్నెవాడు, అలంకార ప్రియుడు. వారి మాటతీరుకంటె తిక్కన క్రొత్త మాటతీరును తెలుగు సాహితికి అందిస్తున్నాడు. అది నన్నయ వలె ప్రసన్నవాక్కు కాదు; తిక్కనదే అని చెప్పదగిన ప్రౌఢశిల్పోక్తి. ఇది మారని లక్షణం. శివకవులకన్నా ఉత్తమ లక్షణం.

4. తిక్కన సాహిత్య దర్శనం ధ్వని ప్రస్థానమని ధ్వనింపజేసే గొప్ప పద్యం ఇది -

ఉ. "భూరి వివేకచిత్తులకుఁ బోలునం దలఁపన్ దళంబులన్
సౌరభ మిచ్చు గంధవహు చందమునం బ్రకటంబు చేసి యిం
పారెడు పల్కులం బడయ నప్పలుకు ల్పరిగ్రుచ్చునట్లుగాఁ
జేరుప నేరఁగా వలయుఁ జేసెద నేఁ గృతి యన్నవారికిన్". **(నిర్వ.రా.1.5)**

కవుల కవిత్వాని కుండవలసిన సామాన్యధర్మంగా తిక్కన చెప్పుతున్నా అది అతడి దృక్పథమని స్పష్టం. ప్రథమ పురుషలో చెప్పటం వినయ వివేకం. పూలు విచ్చుకొంటూ ఉంటే పూలరేకులలో నుండి వెలువడుతున్న సువాసనను మోసికొనివచ్చే పిల్ల గాలివలె అర్థాన్ని ప్రకటించి (ప్రతీయమానం చేసి) లోకోత్తర చమత్కారాన్ని (ఇంపు) కలిగించే పలుకులు దొరికితే సహృదయులైన వివేకవంతులు 'ఎంత బాగున్నాయ్!' అంటూ గమ్యమానమైన రమణీయార్థాన్ని భావించటానికి వీలుగా - వాటిని దండ గ్రుచ్చినట్లుగా

కూర్చగలవాడే కవి అని ఈ పద్యభావం. ఇందులో వ్యంగ్యార్థ ప్రధానమైన రమణీయ శబ్దాల రసానుకూలమైన గుణరీతుల విన్యాసమున్న కవిత ప్రస్తావించబడింది. తిక్కన రసధ్వని దర్శనానికి చెందిన గుణవాది. ఇది అతడి మారని దృక్పథం. శైవకవులు స్వప్నంలో కూడా దర్శించలేని ధ్వనివాదాన్ని, నన్నయ ఒరవడి పెట్టిన ధ్వనివాదాన్ని తిక్కన తన మార్గంగా చెప్పుకొన్నాడు. శివకవుల తరువాత తిక్కన తెలుగు కవితను నన్నయ వైపు మరలించాడు.

5. కవిత్వం ఎట్లా ఉండాలని తిక్కన అనుకొంటున్నాడో, ఎట్లా వ్రాశాడో చెప్పేది సుకవి(తా) ప్రశస్తి అయితే, కవిత్వం ఎట్లా ఉండకూడదని తా ననుకొంటున్నాడో సూచించేది కుకవి(తా)నింద. (నిర్వ. 1.6) తిక్కన శైవకవులవలె కుకవినింద చేశాడు. అది నన్నయ బాట కాదు. కుకవులను దుర్విటులతో పోల్చాడు. మాటల పొందిక లేకపోవటం. అనౌచిత్యంతో రసభంగం చేయటం, పాతబడ్డ మాటలనే పదే పదే వాడుతూ ఎంత ప్రయత్నించినా ఎవ్వరి హృదయాలనూ అలరించలేకపోవటం, ఏ సాహితీ ప్రస్థానానికీ చెందని తమ పద్ధతే గొప్పదిగా భావించి లోకంలో, నవ్వులపాలు కావటం కుకవిలక్షణాలుగా తిక్కన పేర్కొన్నాడు. తిక్కన కవితలో ఈ దోషా లుండవన్నమాట! రచనలో, రసపోషణలో, పదబంధపరికల్పనంలో, కావ్యదర్శనంలో నవ్యత చూపించటం సుకవుల మార్గమని వ్యతిరేక వ్యంగ్యార్థంలో చెప్పాడు తిక్కన. తిక్కన రచనలో కానవచ్చే గుణాలను గుర్తించటానికి ఇది పరోక్షంగా తోడ్పడుతుంది. ఈ లక్షణాలలో కొన్ని కావ్యాంతర్గతమైనవీ, కొన్ని బహిర్నిర్మాణ సంబంధమైనవీ అయి ఉండటం గమనించదగిన విశేషం.

6. క. "తెలుఁగు కవిత్వము చెప్పం । దలఁచిన కవి యర్థమునకుఁ దగి యుండెడుమా
టలు గొని వళులుం బ్రాసం । బులు నిలుపక మొగిని బులిమి పుచ్చుట చదురే?" (నిర్వ.రా.1.7)

ఇది ఎంత లక్షణోక్తియో, అంత అధిక్షేపోక్తి. శివకవుల ద్విపద కవిత్వం మీద చేసిన పరోక్ష విమర్శ. అర్థవంతమైన శబ్దాలను కోరే కవి ధ్వని మార్గాన్ని ఆశ్రయించినవా డౌతాడు. తెలుగులో యతిప్రాసలు నియమాలుగా సాగవలసిందే తప్ప 'ప్రాసోవా యతిర్వా' వంటి మినహాయింపులు పొసగవని పాల్కురికి సోమనాథుడిమీది విసురిది. యతిప్రాసలు కవిత్వ బాహ్యనియమాలు మాత్రమే.

7. ఉ. "జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్ప, వాక్య సాం
గత్యము సేయుచో నయిన గద్యము తోడుగఁ జెప్పిపెట్ట, దౌ
ర్గత్యము దోఁపఁ బ్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులన్
శ్రుత్యనురూపమంచు నిడ, సూరుల కివ్విధ మింపుఁ బెంపదే?" (నిర్వ.రా.1.14)

నిషేధరూపంగా చెప్పిన ఈ పద్ధతి నాశ్రయించి, తనకు ముందున్న శైవకవులు చేసిన దోషాలు తాను చేయనట్లు తిక్కన చెప్పటం గమనార్హం. సంస్కృత పదాలుకానీ, తత్సమ పదాలుకానీ తెలుగులో వాడేటప్పుడు తెలుగువారు వాటిని ఏయే అర్థాలలో వాడతారో ఆ యా అర్థాలలో జాత్యమెరిగి వాడటం ముఖ్యమని తిక్కన నియమం. పద్యానికీ పద్యానికీ, వాక్యానికీ వాక్యానికీ మధ్య వచనంతో అతకటం తిక్కన కిష్టం లేదు. ప్రాసలు ధ్వనిసామ్యంగల వేరే అక్షరాలతో వాడే దుర్గతిని తిక్కన హర్షించడు. ఇవి గొప్ప కవిత్వం కంటె తప్పులు లేని కవిత్వం వ్రాయటానికి తోడ్పడే శబ్దప్రయోగ, ఛందః ప్రయోగ నియమాలు, ఈ రెండూ బాహిరాలే. శివకవులు చేసే ఈ దోషాలు నేను చేయనని తిక్కన నొసలు ఎగురవేస్తూ చెప్పినవే.

8. క. 'లలితపద హృద్య పద్యం । బులన కథార్థంబు ఘటిత పూర్వాపరమై
యలఁతి యలఁతి తునియలఁ గా । హల సంధించిన విధంబు నమరఁగవలయున్." (నిర్వ.రా.1.16)

కవితా లక్షణాలను కవితామయం చేసి చెప్పటం నన్నెచోడు డారంభించాడు. శివకవు లచ్చటచ్చట పాటించారు. తిక్కన దానిని అనుసరించాడు. నన్నయ తన కవిత్వంలో కనబడే సాపేక్ష లక్షణాలను చెప్పాడు. తిక్కన నన్నయ వలె సాపేక్ష లక్షణాలను

ఎన్నుకొని నన్నెచోడుడివలె చెప్పా డీ పద్యంలో. నిర్వచనంగా పద్యాలలోనే కవిత్వం చెప్పటం నిర్వచన రచనా పద్ధతి. అది ప్రక్రియ కాదు. కాని ఛందోమయమైన ఒక పద్ధతి. అది తన ప్రత్యేకత అని తిక్కన హెచ్చరిక ! ఇక- కథ కాలక్రమంతో కాక కార్యకారణ సంబంధ క్రమంతో చెప్పటం, పూర్వాపర సమన్వయంతో ఏకవాక్యత సాధించి, కథార్థాలను సంఘటించటం కథాకథనంతోతిక్కన పూర్వకవులకంటె సాధించిన విశిష్ట లక్షణం. చిన్న చిన్న పదాలతో కూడిన వాక్యాల పోహళింపుతో పద్యం ఆలోచిస్తూ మాట్లాడుతున్నట్లు. ఒక ఆలోచనకు కొంౘ (నాగలిచాలు) కొట్టుతున్నట్లుగా తోచేటట్లు రచించటం తిక్కన రచనకు ఆయువుపట్టు. దీనినే సంభాషణ శైలి అనీ, నాటకీయ రచనమనీ ఆధునికులు పిలుస్తున్నారు. ఇవి తిక్కన కవిత్వంలో పద్యరచనకూ, కథా సంవిధానానికీ, శైలికీ సంబంధించిన సాపేక్ష లక్షణాలు. ఇవి మారేవి కావు. కావ్య నిర్మాణ సంబంధులైన విలువైన అంతర్గత గుణాలు.

**9.** **తే.** "ఎట్టి కవికైనఁ దనకృతి యింపుఁ బెంపఁ। జాలుఁ గావునఁ, గావ్యంబు సరసులైన
కవుల చెవులకు నెక్కినఁగాని నమ్మఁ। డెందుఁ బరిణతి గలుగు కవీశ్వరుండు." **(నిర్వ.రా.1.9)**

తిక్కన పరిణతి చెందే కవీశ్వరుడే. అందుకే కాళిదాస మహాకవి భావాన్ని తెలుగులో చిలకరించాడు. "ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్ । బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః" అన్నది దీనికి ఆధారం. కావ్య ప్రయోజనాలలో సద్యఃపరనిర్వృతిని పేర్కొనే అంశ మిది. ఇది కూడా సాధారణ కావ్య లక్షణమే.

10. శివకవియుగం కంటె క్రొత్తయుగాన్ని నిర్మించాలన్న స్పృహ కలవాడు తిక్కన. పండితులలో, భక్తులలో, పామరులలో మతాన్ని వ్యాప్తి చేయటానికి అనువుగా వస్తువుకూ మతానికీ నీరక్షీరన్యాయం వర్తింపచేయటం, వివిధ ప్రక్రియలను సృష్టించే ప్రయోగాలు చేయటం శివకవుల పరిపాటి. శివకవులు తమ కవితను సర్వసామాన్యంగా ఉండాలని భావిస్తే తిక్కన బుధజనులు మెచ్చేటట్లుండాలనీ, ఆంధ్రావళి ఆనందించేటట్లుండాలనీ భావించి వాటి కనుకూలమైన ప్రక్రియలనే చేపట్టి, మతాన్నీ కవిత్వాన్నీ వేరుగా ఉంచటానికే యత్నించాడు. వినేవారు ఆవేశపడే కవిత్వం కాదు, వినేవారు ఆనందించే కవిత్వం కోరాడు తిక్కన. అదే 'కావ్యరసాన్ని కొనియాడే' పద్ధతి. శివకవులు కవిత్వం వలన లక్షించింది శైవావేశం. తిక్కన కవితా లక్ష్యం శిల్ప నిర్దేశం. "సరస మధుర వచో గుంఫన సప్రసాద సంబోధన గోచర బహువిధార్థ తాత్పర్యంగా" చెప్పటం తిక్కన కవితా ఫణితి.

రామాయణం నాటి తిక్కనకూ భారతం నాటి తిక్కనకూ అంతరం చాలా ఉన్నది. అప్పుడు ప్రయోగం ప్రయోగం కొరకే చేశాడు. ఇప్పుడు ప్రయోజనం కొరకు చేశాడు. అప్పుడు తన సాహిత్య దృక్పథాలను సవాలు చేస్తున్నట్లు ప్రకటించాడు. ఇప్పుడు 'నా నేర్చిన భంగి చెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్' అని వినమ్ర భావంతో పరమ వివేక సౌరభాలను వెదచల్లాడు. అప్పుడు కలం పట్టటానికి హేతువు రాజభక్తి. ఇప్పుడు హరిహరనాథభక్తి. అప్పటి ప్రేరణ ప్రయోగోద్యమం. ఇప్పటి ధారణ కావ్యరసపోషణం. అప్పటి ప్రయోగం రెండు కథల జంటపంట! ఇప్పటి ప్రయోగం రెండు ప్రక్రియల అంటుపంట!

నిర్వచనోత్తర రామాయణావతారికకూ, విరాట పర్వావతారికకూ పొంతనే లేదు. నన్నయవలె ఒకవైపు మహాభారత ప్రశస్తిని చేశాడు. విరాట పర్వ విశిష్ట లక్షణాలను వేరుగా చెప్పాడు. ఉద్యోగాదులను గౌరవంగా సంభావించాడు. నన్నయను 'ఆంధ్రకవిత్వ విశారదుఁ' డనీ 'విద్యాదయితుఁ' డనీ, 'మహితాత్ముఁ'డనీ. 'దక్షుఁ' డనీ ప్రశంసించాడు. ఆయన రచించగా మిగిలిన విరాటాది పర్వాలు పదునేనింటిని బుధులు నిండార సంతోషించేటట్లు వ్రాయాలని సంకల్పించాడు.

నన్నయ అవతారికలో ' తన కులబ్రాహ్మణు ననురక్తు' (ఆది. 1.9) ననే పద్యానికి సమాంతరంగా తిక్కన విరాట పర్వావతారికలో హరిహరనాథుడి నోట చెప్పించిన పద్యం -

ఉ. "వైదికమార్గనిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచున్
భేదము లేని భక్తి మతి నిర్మలవృత్తిగఁ జేయుచుండు మ
త్పాద నిరంతర స్మరణ తత్పర భావము కల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచునుండు దెప్పుడున్." **(వి.రా.1.15)**

నన్నయ వ్యక్తిత్వ సాహితీ వ్యక్తిత్వ విశేషాలవలెనే ఇందులో తిక్కన వ్యక్తిత్వ, సాహితీ వ్యక్తిత్వ గుణాలు పేర్కొనబడ్డాయి. వైదిక మార్గ నిష్ఠమైన వర్తనం, అభేదభక్తి, నిర్మల చిత్తవృత్తి, హరిహరపాద నిరంతర స్మరణ ప్రవృత్తి, ఆత్మానందస్థితి అనేవి తిక్కన వ్యక్తిత్వ లక్షణాలు. కర్మ, భక్తి, జ్ఞానమార్గాల పరిపూర్ణ ప్రస్థానం సాగించిన పరిపూర్ణ వ్యక్తిత్వం ఆయనది. కావ్యరసాన్ని గురించి ప్రశంసిస్తూ ఉండటం ఆయన సాహితీ వ్యక్తిత్వం.

తిక్కన కావ్యరస స్పృహను నిర్వచనోత్తర రామాయణంలో ఆయన చెప్పిన ధ్వని దర్శనానికి అనుబంధంగా అన్వయించుకొనాలి. నన్నయకు మమ్మటాదుల సాహిత్య దృక్పథం వంటిది బలంగా ఉన్నదని స్పష్టమౌతున్నది. (చూడు. సభాపర్వ పీఠిక). తిక్కన మీద కూడా ఆ ప్రభావం పడింది. మమ్మటుని ప్రసిద్ధమైన కావ్యసూక్తం తిక్కన తెలుగు మాటలలో వెలుగు నింపుకొనటం చూస్తాం. మచ్చుకొక్క విషయం. "నియతి కృత నియమ రహితాం హ్లాదైక మయీ మనన్యపరతంత్రాం నవరసరుచిరాం నిర్మితి మాదధతీ భారతీ కవేర్జయతి" (కావ్యప్రకాశం 1.1) అనే సూక్తిని గమనిస్తే తిక్కన అపూర్వ వస్తు నిర్మాణ క్షమమైన ప్రజ్ఞారూపమైన ప్రతిభకు అగ్రతాంబూలం ఇస్తాడు కాబట్టే శిల్పదృష్టి ఏర్పరచుకొన్నాడు. అది నియతి కృత నియమ రహితమైన కవితా ప్రతిభకు లక్షణం! ఆహ్లాదశబ్దం తిక్కనకు ఇష్టం. అందుకే విరాటపర్వాన్ని హృదయాహ్లాదిగా మొదట పేర్కొన్నాడు. మమ్మటుడు కావ్యాన్ని (ఆ)హ్లాదమయి అన్నాడు. 'నవరసరుచిరం' కావ్యమని మమ్మటుడంటే తిక్కన 'నానా రసాభ్యుదయోల్లాసి' విరాటపర్వమన్నాడు. మమ్మటుడు అభినవగుప్తుడి రసధ్వని వాదానికి సాహిత్య క్షేత్రంలో పునఃప్రాచుర్యాన్ని కలిగించిన లాక్షణికుడు. ధ్వన్యనంతర యుగంలో రసధ్వని వాద సమర్థకులలో అగ్రేసరుడు. నన్నయాదులకు ఆదర్శపాత్రుడు. వీరందరికీ ఆదర్శప్రాయుడైన అభినవగుప్తుడి అభిమతంలో "తేన రస ఏవ వస్తుతః ఆత్మా, వస్త్వలంకార ధ్వనీతు సర్వధా రసంప్రతి పర్యవస్యేతే" (లోచన వ్యాఖ్య పు.85) అనే దర్శన సూత్రం తిక్కనకు శిరోధార్యమైనది. నన్నయ వస్తుధ్వనికీ, తిక్కన రసధ్వనికీ, ఆ తరువాత ఎఱ్ఱన అలంకార ధ్వనికీ క్రమంగా ప్రాధాన్యాన్ని తమ తమ కవితలలో కల్పించారు. (చూడు- ఆది, సభా, ఆరణ్యపర్వ పీఠికలు). హరిహరనాథుడు తిక్కనలో గుర్తించిన కావ్యరసాన్ని కొనియాడే లక్షణం ఇటువంటి రసధ్వని విచారమే.

పంచమవేదంలో వేదవ్యాసుడు నిరూపించిన అర్థం తేటపడేటట్లు తెలుగున అధికధీయుక్తితో రచించుమని రాజరాజ నరేంద్రుడు నన్నయను కోరి, ఆ తెలుగు భారతాన్ని తనకు కృతినిమ్మని అర్థించాడు ఆదిపర్వావతారికలో. తిక్కన విరాటపర్వావతారికలో హరిహరనాథుడు కూడా అదే ధోరణిలో కవి నాదేశించాడు.

క. "పారాశర్యుని కృతియయి । భారతమను పేరఁ బరఁగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ ద । ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్"

తే. "తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ । భవ్యపురుషార్థ తరుపక్వఫలము కాదె!
దీని కెడ నియ్యకొని వేడ్కనూని కృతిప । తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ!" **(విరా.రా.1.17-18)**

ఈ మాటలన్నది హరిహరనాథుడు. అతడు అడుగుతున్నది భారత కృతి పతిత్వం. ఆ కాలంలోని జనులు ఆరాధించదగింది పంచమ వేదమనే దేవదేవుడి ఆదేశం. ఆయన హరిహరుడైనా విష్ణుపురాణాన్నో, శివపురాణాన్నో ప్రజలు కోరుతున్నా రనలేదు. హరిహరనాథుడు వైష్ణవ శైవ మతవాదాల కతీతుడు. ప్రజలు కూడా అట్లాగే తయారు కావాలని ఆ దైవ సంకల్పం. పంచమవేదం తెలుగులో వెలుగుచూస్తేనే అది సాధ్యం. కాబట్టి నాటి సాంఘిక మత సాహిత్య పరిస్థితులలో భారత గౌరవాన్ని భావించుమని తిక్కనను హరిహరనాథుడు హెచ్చరించాడు. ఆ కావ్యాన్ని అఖండ భక్తితో తెలుగు బాసలో వినిర్మించుమన్నాడు. అనువాదం చేయుమనలేదు. పునస్సృష్టి చేయుమన్నాడు. అట్లా చేస్తే చతుర్విధ పురుషార్థ తరుఫలం పండి చేతి కందుతుం దన్నాడు. తెలుగు ద్విపదలు ఇహపరసాధకాలని శివకవులంటే, తెలుగు కవితలు (నాలుగు చరణాల పద్యాలు) చతుర్విధ పురుషార్థ సాధకాలని తిక్కన పేర్కొన్నాడు. శివకవుల ద్విపదలు ఇహపరసుఖాలే కలిగిస్తాయి. ఇహపర సుఖాలని అన్నప్పుడు పరానికి స్వర్గసుఖమనే అర్థం ఏర్పడుతుంది. కాని, తిక్కన తెలుగు కవిత చివరకు మోక్షాన్ని కలిగిస్తుందని చెప్పటమేకాక, పంచమవేదం

కావ్యాలన్నింటి కంటె పరమ పురుషార్థ సాధకమని పేర్కొన్నాడు. స్వర్గారోహణ పర్వంతో ముగిసే ఆంధ్ర భారతం మోక్షప్రదమని పరమాత్మ చెప్పిన పరమార్థంగా పలికించాడు తిక్కన. భారతం వింటే ' బహుయాగంబులఫలంబు పరమార్థ మగున్' అని రాజరాజనరేంద్రుడి చేత నన్నయ పలికించటం ఆ కాలం ప్రభావం. భారతం బ్రహ్మానంద స్థితిని (మోక్షాన్ని) ప్రసాదిస్తుందనటం తిక్కన కాలం నాటి ప్రభావం. దానికి తిక్కన మహాభక్తుడు కావటం అంతకంటె మహిమగల కారణం కావచ్చును. తిక్కనది వైష్ణవభక్తి కాదు, వీరశైవభక్తి కాదు, భేదబుద్ధి లేని అద్వైత భక్తి. ఆదిశంకరు లన్నట్లు "స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే". తిక్కనది అటువంటి జ్ఞానభక్తి. అందుకే స్వప్నంలో కూడా హరిహరనాథస్వామికి సాష్టాంగ దండప్రణామం చేస్తూ మహాపదార్థమైన బ్రహ్మానందస్థితిని కోరాడు. స్వామి కరుణించి జనన మరణ రూపమైన సంసారచక్రంలో చిక్కుకొనని మోక్షజ్ఞానమార్గం వెలుగుబాటగా ఆయనకు ప్రసాదించాడు. తిక్కన పుట్టు కృతార్థమైనదని పొంగిపోయాడు. జ్ఞానభక్తికి చిటారుకొమ్మ తిక్కన!

బంగారానికి రత్నాన్ని కూర్చినట్లు భారతానికి హరిహరనాథుడిని కృతిభర్తగా నిలిపాడు తిక్కన. 'అవ్విభుం గట్టెదఁ బట్ట మప్రతిమ కావ్యకవిత్వ మహావిభూతికిన్' (విరా.1-27) అన్నాడు. 'నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద'నని నన్నయ పలికినట్లుగానే వినయముద్రతో తిక్కన "నా నేర్చిన భంగి చెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్" (విరా.1-28) అని చెప్పాడు. ఒక్క భక్తకోటిని వదలిపెట్టితే, నన్నయ తిక్కన లిద్దరూ భారతాన్ని కావ్య కవిత్వంతో నింపాలనే సంకల్పించారు. కాగా, తిక్కన కావ్య కవిత్వ మహావిభూతిని ప్రదర్శింపదలచాడు. అది హరిహరనాథుడి దివ్య విభూతిగా కూడా భావించాడు!

తిక్కన పేర్కొనే భక్తకోటికీ, శైవులూ, వైష్ణవులూ చెప్పే భక్తకోటికీ కొట్టవచ్చినంత తేడా ఉన్నది. తిక్కన కావ్యశ్రోతలైన భక్తజనులు 'విష్ణురూపాయ నమశ్శివాయ' అని పల్కెడి వైదిక మార్గ వర్తనులు. అందుకే తిక్కన అట్టి భక్తుల వైదిక ధ్యాయితకు ఇచ్చమెచ్చే పరతత్త్వాన్ని కొలుస్తూ ఇష్టసిద్ధికొరకు విరాటపర్వానికి శ్రీకారం చుట్టాడు.

ఉ. "శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప, భ
ద్రాయిత మూర్తియై హరిహరంబగు రూపముఁ దాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్." **(విరా.1.1)**

(వివరాలకు విశేష వాఖ్య చూడండి). దేశంలో భక్తులంటే శివభక్తులో, విష్ణుభక్తులో అయి ఉండాలి - అని తలపోస్తున్న రోజులలో తిక్కన అద్వైత భక్తగణాన్ని సాహిత్యలోకంలో సాక్షాత్కరింపజేశాడు. వారిలో శైవులూ, వైష్ణవులూ అంతర్భవించాలని ఆశించాడు. నిజానికి వేదతత్త్వం అదే చెప్పింది. పంచమవేదం అదే ప్రస్తుతించింది. తిక్కన అటువంటి భక్తగణానికి ప్రతినిధి! అందువలన భారతరచన భక్తకోటిని సంతోషపెట్టటానికే రచిస్తున్నానన్నాడు. తిక్కన పరిభాషలో భక్తజనావళియే ఆంధ్రావళి.

ఉ. "కావున భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి
శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్." **(విరా.1.30)**

అని శపథం చేశాడు. నిజానికి తిక్కన భారత కవితా దృక్పథానికి చుక్కాని వంటి దీ పద్యం.

'భారతామృతం' అభేదరూపకాలంకారం. చెవులనే దోసిళ్లతో భారతామృతాన్ని తనివిదీర త్రాగాలనటం ఆలంకారిక అభివ్యక్తి. సాహిత్యపరంగా అమృతం ఆలోచనామృతమే. ధర్మపరంగా మానవుడి త్యాగవీరమే అమృత ప్రస్థానం. 'త్యాగే నైకే అమృతత్వ మానశుః "అన్నది ఉపనిషత్ప్రమాణం. "అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృత మశ్నుతే" అనేది

ఆధ్యాత్మికపరంగా అన్వయించే జ్ఞానప్రస్థానం. చెవులార క్రోలటమంటే చవులూర వినటమే. 'వింటే భారతం వినాలి, తింటే గారెలు తినాలి' అని తెలుగు సామెత. భారతకథను ఆసక్తికరంగా చెప్పుతూనే అందులోని మానవీయ, నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక, తాత్త్విక, కవితా కళామూల్యాలను, ఆలోచనామృతంగా ఆస్వాదింపజేసే అర్థగాంభీర్యం తిక్కన రచనలో సహజంగా ఉంటుందనటం ముఖ్య ప్రమాణం.

భారతాన్ని ఆంధ్రావళి 'కవిత్వ మొక తీరని దాహం' (శ్రీశ్రీ) వలె ఆస్వాదించి ఆమోదించాలి. తెలుగుదనం, తియ్యందనం, తేటదనం, దేశీయత, జాతీయత మొదలైన కవితా గుణాలతో తిక్కనభారతం తెలుగువారి జాతీయ కావ్యంగా రాణించాలి- అని తిక్కన ఆశయం.

తిక్కన తెలుగు భారతాన్ని 'మహాకవిత్వ దీక్షావిధి'గా స్వీకరించి రచించాడట ! ఇది లాక్షణిక పారిభాషిక పదం కాదు కాని, మహాకావ్య కవిత్వం రచించాలనే దీక్షతో (నేను వ్రాసేదేదో తెలిసి వ్రాస్తున్నాను అన్న ధిషణాశక్తితో కావ్యం ముగిసేంతవరకు సాగే కార్యశక్తితో) సాగించే నియమవ్రతం. 'అమలోదాత్త మనీష నే నుభయ కావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునన్ పారగుఁడన్' అని చెప్పిన తిక్కన దృక్పథం ఇక్కడ స్మరణీయం. కవితా శక్తితో రచించదలచుకొన్న కావ్యాన్నంతా ఒక కళాఖండంగా భావించి, అందులోని ప్రత్యంశాన్నీ ఆ అఖండ కళాకృతికి శిల్ప వైభవంగా చిత్రించి రచించే సార్థక సారవంతమైన రచన మహాకావ్య కవిత్వం. కవితా దర్శనంతో కవిముద్రతో కావ్యగౌరవాన్ని ఇనుమడింపచేసే శైలితో చేసే రచన ఆ కవితకు జీవితం, "తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదునాన్" తిక్కన వ్రాశాడన్న కవితయే మహాకావ్య కవిత్వం.

ఆ కవిత్వానికి ఆ శక్తి నిచ్చేది వ్యాసకృత మహాభారత తాత్పర్యం. దానిని తాను భావించి పఠితలచేత భావింపచేయటం మరొక లక్ష్యం. చివరిది ఆ కవిత్వం పద్య గద్యాత్మకమై ఉండటం. ఇది విజ్ఞతతో కూడిన నిర్ణయం. తెలుగులో నిర్వచనకావ్యాలకూ, ద్విపద, వచన కావ్యాలకూ చంపూకావ్యాలకున్న గౌరవం, ప్రాచుర్యం, ప్రామాణికతా లేవు. తెలుగులో మహాకావ్య కవిత్వమంటే పద్యగద్యాత్మకమైన కవిత్వమే అని రూఢి. ఈ సత్యాన్ని నన్నయ ఆదికవిగా గుర్తించి, రచించి నిరూపించాడు. ప్రయోగాల పేరుతో శైవకవులూ, తిక్కనా ఆ మార్గాన్ని తప్పించి క్రొత్త మార్గాలకు తాము నాయకులు కావాలని యత్నించారు. చివరకు శైవకవులతోపాటు తిక్కన కూడా తెలిసికొన్న సత్యం-నన్నయ మార్గమే ఆంధ్రావళి ఆమోదించే మార్గమని.

## 10. తిక్కన ప్రక్రియాదృక్పథం

తిక్కన సోమయాజి ఆంధ్రమహాభారతాన్ని 'ప్రబంధమండలి'గా (విరా.1.8) భావించి వాటికి శ్రోతగా, భర్తగా హరిహరనాథుడిని వరించాడు. ఇది ఆ మహాకవికి గల ప్రక్రియాపరమైన దృక్పథాన్ని తెలుపుతుంది.

శాస్త్రేతిహాసమైన మూలభారతాన్ని నన్నయ కావ్యేతిహాసంగా మలచి తనకు మార్గదర్శకుడైనట్లు 'మూఁడు కృతులాంధ్రకవిత్వవిశారదుండు, విద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్' (విరా.1.6) అని ప్రశంసించటంలోనే స్పష్టపరిచాడు. నన్నయ రచనలో కావ్యమండలిని చూచిన తిక్కన విరాటపర్వంనుండి ఆంధ్ర మహాభారతాన్ని 'ప్రబంధమండలి'గా విశేషించి పోషిస్తున్నట్లు పేర్కొన్నాడు.

తిక్కనకు కథాకావ్యప్రయోగ ప్రీతి జీవలక్షణం. అతడి ప్రభావం తరువాతి కాలంలో చాలమంది కవుల మీద పడింది. అది ఎంత బలంగా ఉన్నదంటే- ఒక నాయకుడి కథ తీసికొని, నిబిడంగా కావ్యమంతా నిర్వహించి, ఒక ప్రధానరసాన్ని సాంగంగా పోషించిన కవులు తెలుగులో లెక్కకు కొద్దిమందే ఉన్నారు. ఈ పరిస్థితికి మూలకారకుడు తిక్కన- అంటే అతిశయోక్తి కాదు, సత్యదూరమూ కాదు.

నన్నయ చేపట్టిన కావ్యేతిహాసాన్ని తిక్కన కూడా చేపట్టి కొనసాగించాడు. ఆ ప్రక్రియకు తనకిష్టమైన కథాకావ్యవ్యూహను కూడా జోడించాడు. తిక్కన భారతానికి తాను కల్పించిన ఈ విశిష్ట వ్యక్తిత్వంతో అది ప్రబంధమండలిగా ప్రకాశిస్తుందని ప్రకటించాడు. నిర్వచనోత్తరరామాయణ కథాస్వభావం సంయుక్తవాక్యంవంటిదైతే, తిక్కన భారత కథ సంశ్లిష్ట మహావాక్యం వంటిది.

ధర్మరాజు కథ ప్రధాన వాక్యం వంటిది. అనునాయకులైన భీమార్జునాదులూ, ఉపనాయకులైన శ్రీకృష్ణాదులూ, ప్రతినాయక పక్షవర్తులైన భీష్మాది మహావీరులూ నిర్వహించిన కార్యాలు ఉపవాక్యసమూహాల వంటివి. ఉపవాక్యాలు అసమాపక క్రియలతో కూడి ఉంటాయి. భీష్మాదులందరూ యుద్ధాలు చేసి అసువులు కోల్పోయిన కథార్థాలు అసమాపకక్రియా వాక్యాలవంటివే. ఎందరు వీరు లస్తమించినా ధర్మజయత్నం ఆగలేదు. అట్లాగే గోవింద భీమార్జునుల వృత్తాలుకూడా ధర్మజుడి విజయానికి అంగాలుగా నిలపటంచేత ప్రధాన వాక్యాన్ని పోషించే ఉపవాక్యాలవంటివే.

ఉపవాక్యాలు అసమాపక క్రియలతో ముగుస్తున్నా, సమాపకక్రియకు అర్థమైన ప్రధానవాక్యం నిర్వహించబడటానికి అంచెలంచెలుగా తోడ్పడుతుంటాయి. ఈ నిర్మాణశిల్పమే తిక్కన కావ్యేతిహాసానికి ఆయువుపట్టు. మహాకార్యాలు గానీ, యుద్ధాలుగానీ నిర్వహించిన భారతవీరుల కథలూ ఘట్టాలూ కొన్ని తిక్కన రచనలో ప్రబంధాలుగా భాసిస్తాయి. ప్రతివీరులలో భీష్మ, ద్రోణ, కర్ణ, దుర్యోధనాదులూ, పాండవవీరులలో అభిమన్యుఘటోత్కచాదులూ విషాదాంత వీరులవలె గోచరిస్తారు. చివరకు కీచకుడిని కూడా తిక్కన విషాదాంత పాత్రగా చిత్రించాడు. వారి వారి కథలన్నీ స్వతంత్ర ప్రతిపత్తిగల వస్తువులుగా అనుభవాని కంది, ఉపకథలవలె ప్రధానకథకు తోడ్పడతాయి. ధర్మరాజు ఉభయాయత్తసిద్ధి అయిన నాయకుడు కాబట్టి అతడి యత్నంతోపాటు అమాత్యుల తీవ్రయత్నాలు కూడా అభ్యుదయ సాధకాలై ఫలసిద్ధికి దారితీస్తాయి. అతడి అభ్యుదయం అమాత్యుల ఉల్లాసం మీద ఆధారపడి ఉంటుంది. అంటే, ధర్మరాజు నాశ్రయించిన ధర్మవీర రసాభ్యుదయం భారతవీరుల రసోల్లాసం వలన సాధించబడుతుందన్నమాట! నాయకాశ్రితమైన ధర్మవీరం ఆయా ఘట్టాలలో నిమిత్త భేదాలనుబట్టి వివిధ వీరరస భేదాలుగా ఉద్దీప్తమౌతుంది. అది వివిధ వీరుల నాశ్రయించి పోషించబడే వివిధ రసాలతో సంవర్ధితమౌతుంది. ప్రక్రియాపరమైన ఇటువంటి నిర్మాణ విధానాన్ని వ్యక్తీకరింపజేసేది 'ప్రబంధమండలి.'

ప్రబంధమండలియొక్క అస్తిత్వాన్ని అంగీకరిస్తే, దానివెంట ఆమోదించవలసింది బహువిధాలైన అంగరసాల వ్యవస్థ. అందులోని స్థాయిభావంయొక్క అభ్యుదయం, అంగరసాల ఉల్లాసం. 'నానా రసాభ్యుదయోల్లాసి' అన్నప్పుడు తిక్కన కావ్యేతిహాసంలో కథాకావ్య స్ఫూహను సంవదించటంలో ఏర్పడే రసపోషణ వ్యవస్థను నిర్దేశించాడన్నమాట!

తిక్కన 'కావ్యరసముం గొనియాడు' తూ ఉంటాడని హరిహరనాథస్వామి ప్రకటించాడు. ఇతిహాసంలో కావ్యరస దృష్టిని సమన్వయించి తిక్కన కావ్యేతిహాసాన్ని వినిర్మించాడు. ధర్మజుడి ధర్మవీరరసానికి భంగం రాకుండా శాస్త్రాంశాలను కుదించటం వలనా, భారతవీరుల వివిధరసేతివృత్తాలను ప్రబంధమండలిగా నిర్మించినా, ప్రధాన నాయకవృత్తానికి వాటిని పోషకంగా నిలపటం వలనా తిక్కన కావ్యరసమర్మజ్ఞు డనిపించుకొన్నాడు.

పంపాదికవులు భారతకథను చేపట్టి భారతవీరుల ప్రత్యేక నాయకత్వ లక్షణాలకు ప్రాధాన్యం కల్పించి కావ్యాలను నిర్మించిన వైఖరి కన్నడ సాహిత్యంలో ప్రసిద్ధమై ఉన్నది. పంపడు విక్రమార్జునీయ కావ్యాన్ని ముగిస్తూ, భారతకావ్యం లోకపూజ్యం కావటానికి భారతపాత్రలే కారణమనీ, వారి విశిష్ట గుణాలు ప్రస్ఫుటంగా ప్రకటితమయ్యేటట్లు రచించటమే తన ప్రత్యేకత అనీ పేర్కొన్నాడు.

మహాస్రగ్ధర.

"చలదొళ్ దుర్యోధనం, నన్నియొళినతనయం, గండినొళ్ భీమసేనం,
బలదొళ్ మద్రేశ, నత్యున్నతియొళమరసింధూద్భవం, చాపవిద్యా
బలదొళ్ కుంభోద్భవం,సాహసద మహిమెయొళ్ ఫల్గునం, ధర్మదొళ్ ని
ర్మలచిత్తం ధర్మపుత్రం మిగిలి వర్గళినీ భారతం లోకపూజ్యం."

నానారసోల్లాసం కన్నడంలో భారతకావ్యాలు రచించిన పంపాదుల రసమార్గమైతే, తిక్కనది అంగరసాభ్యుదయాన్ని అదరించే నానారసాభ్యుదయోల్లాసం.

ప్రబంధమండలి నిర్మాణం అనేకత్వస్ఫూర్తిని కలిగించినా, కావ్యేతిహాసంలోని ఏకవాక్యతకు భంగం కలిగించదనీ, కథాకావ్య ప్రక్రియా ప్రవృత్తిని కావ్యేతిహాసంలో సంవదించినా అంగాంగి రస సమన్వయ సాధనకు అవరోధం ఏర్పడదనీ, ఒక ప్రక్రియలో దాని సహజ స్వభావం కోల్పోకుండా మరొక ప్రక్రియాలక్షణాలను సమన్వయిస్తే మరొక విశిష్ట ప్రక్రియ సిద్ధమౌతుందనీ తిక్కన నిరూపించాడు. నన్నయ నిర్మించిన భారతభాగం సహజ మిశ్ర ప్రక్రియ! తిక్కన భారతభాగం సంశ్లిష్ట మిశ్రప్రక్రియ!

### 11. ఉభయకవిత్వ తత్త్వవిచారం

నిర్వచనోత్తర రామాయణ కాలంనుండి తిక్కన 'ఉభయకవి మిత్రుడు'గా ప్రసిద్ధికెక్కాడు. మహాభారత ఆశ్వాసాంత గద్యాలలో కూడా ఆ బిరుదునే మొదట చెప్పుకొన్నాడు. తిక్కన శిష్యుడు మారన 'ఉభయకవిత్వ తత్త్వ విభవోజ్జ్వలుఁ' డని కీర్తించాడు. ఉభయకవులకు మిత్రుడు కావటం వేరు. అది సమన్వయవాది లక్షణం. ఉభయకవిత్వతత్త్వాల దర్శన ప్రయోగాల చేత ప్రకాశించటం వేరు. ఉభయకావ్య ప్రయోగాలకే ఒక విశిష్టమైన తత్త్వాన్ని ఆవిష్కరించి ప్రయోగాత్మకంగా లోకానికి చాటగలగటం తత్త్వ వైభవ లక్షణం. అది భారతరచనవలననే తిక్కనకు కలిగిందని మారన సాక్ష్యం పలికాడు.

ఉభయకావ్యాలు అనే సమాసంలో విడదీయలేని జంటకే 'ఉభయ' అనే విశేషణం వాడతారు. కావ్యాలలో అట్టి సంబంధం కలవి శ్రవ్య, దృశ్య కావ్యాలు. ఆ రెండు లక్షణాలను కలిపి ఒక మిశ్రప్రక్రియాగౌరవాన్ని కలిగించటమే కాకుండా, వాటి కొక తాత్త్విక పరివేషాన్ని కలిగించిన వైనాన్ని తిక్కన దృక్పథంలో పరిశీలించటం ప్రథమ కర్తవ్యమౌతుంది.

నన్నయ శ్రవ్యకావ్య ప్రక్రియలో దృశ్యకావ్య మర్యాదలను చొప్పించి నాటకీయతను కావ్యేతిహాస రచనలో ప్రవేశపెట్టాడు. దానిని తిక్కన పెంపుచేసి పోషించాడు. నన్నయ నాటకీయతలో ఆకృతిశిల్పం అగ్రతాంబూలం అందుకొంటుంది. తిక్కన నాటకీయతలో అభినయ శిల్పం అగ్రస్థానంలో నిలుస్తుంది. నన్నయనాటకీయత ప్రయోగ సంబంధి; తిక్కన నాటకీయత ప్రదర్శ సంబంధి. (వివరాలకు చూడు; సభాపర్వ పీఠిక).

నన్నయ కాలంనాటికంటె తిక్కన కాలానికి నాటకీయ శిల్పానికి పరిస్థితులు బాగా తోడ్పడ్డాయి. క్రీ.శ.13వ శతాబ్దినాటికి తెలుగు జాతి భారతదేశంలోనే నాట్యకళారంగాలలో స్వీయ వ్యక్తిత్వాన్ని నిర్మించుకొనాలని విశిష్టయత్నం చేస్తున్నది. కాకతీయులకాలంలో భరతనాట్యం కంటె విలక్షణమైన దేశీనృత్యం తెలుగు నాట వెలుగుచూస్తున్నట్లు దాఖలాలున్నాయి. జాయపసేనాని రచించిన నృత్తరత్నాకరం ఆ ప్రయత్నానికి అక్షరసాక్ష్యం. తెలంగాణంలో కాకతీయులు నిర్మించిన దేవాలయాలలో నాట్యమందిరాలు ప్రధాన దేవాలయాలకు అనుబంధంగా ఉండటం, వాటి స్తంభాలపై నాట్య శిల్ప భంగిమలు, వాద్య విశేషాల బొమ్మలు ఉంచటం శిల్ప సాక్ష్యం. రామప్ప, వేయిస్తంభాల దేవాలయాలవంటివి అందుకు ముందుగా నిలిచే ఉదాహరణలు. కాకతీయులకాలంలో కూచిపూడి నృత్య సంప్రదాయానికీ, ఆంధ్రనాట్య సంప్రదాయానికీ అంకురారోపణలు జరిగాయని నాట్యశాస్త్ర "విమర్శకులు చెప్పుతున్నారు. డా॥నటరాజ రామకృష్ణగారు ఆనాటి నాట్యాన్ని "పేరిణి నృత్య" మనే పేర నేడు ప్రచారంలోకి తేవటం గమనిస్తున్నాం. కాకతీయ ప్రతాపరుద్రుడి కాలంవాడైన విద్యానాథుడు రచించిన 'ప్రతాపరుద్ర యశోభూషణ' మనే అలంకార శాస్త్ర గ్రంథంలో మొట్టమొదటిసారి శ్రవ్య కావ్యలక్షణాలతో పాటు దృశ్యకావ్యలక్షణాలు కూడా చర్చించబడ్డాయి. ఉభయకావ్య లక్షణాలు ఉంటేనే సమగ్ర లక్షణ గ్రంథం కాగలదనే భావం ప్రబలిన రోజులలో మహాభారత రచన తిక్కన చేపట్టాడు. అందువలన శ్రవ్యకావ్యంతో దృశ్యకావ్య స్వభావాన్ని సంఘటించి నాటకీయతను అభినయబంధురంగా తన రచనలో ప్రపంచించాడు. తెలుగులో నాటకాల అవసరాన్ని మరపించాడు. తిక్కన పాత్రలు సాత్త్విక భావాభినయంలో, నాట్యముద్రల ప్రదర్శనలో, సందర్భోచిత రసోచిత వాచికాభినయ విలాసంలో, రంగప్రయోగ కళలో సుశిక్షితులవలె కనబడతారు. దానితో కథ నాటకంగా పఠితల మనోరంగాలలో ప్రదర్శితమౌతుంది. చతుర్విధాభినయాల చతుర విన్యాసమే రసధ్వని వ్యంజన సూత్రమని తిక్కన తెలుగు కవిత కందించిన నాటకీయ కళాతత్త్వ వైభవం.

తిక్కన రచనలో మరొక విశేషం గోచరిస్తుంది. ప్రక్రియతోపాటు నృత్యనాట్యశాస్త్ర పరిభాషనుగూడా చొప్పించటం ఆయన చేసిన సాహసం. నృత్యం భావావస్థలను వ్యక్తం చేస్తుంది. నాట్యం సూక్ష్మాతిసూక్ష్మమయిన సంచారిభావస్పందనలను

సైతం ప్రదర్శించగలుగుతుంది. "రసాహి సుఖదుఃఖావస్థా రూపాః"- అనే భోజాదుల సంప్రదాయాన్నిబట్టి మానసిక అవస్థలను సంచారులకంటె విలక్షణంగా గుర్తించి రసశబ్దంతో పిలిచే పద్ధతి ఏర్పడింది. స్థాయి భావాలను మాత్రమే రసశబ్దవాచ్యం చేసే సంప్రదాయం ఆనందవర్ధనాదులది. అభినవగుప్తపాదులు అటు ధ్వన్యాలోకానికీ, ఇటు నాట్య శాస్త్రానికీ వ్యాఖ్యలు వ్రాసి ఉభయ కావ్య సంప్రదాయాలను కలిపే ఉద్యమానికి క్రొత్త ఊపిరి పోశారు. మమ్మటాదులు దీనికి సుముఖులు. నన్నయ తిక్కనలు ఆ వరుసలోని వారు. అయితే నన్నయకంటె తిక్కన తన కాలానికి అనుగుణంగా ఒక అడుగు ముందుకు వేసి పాత్రల మానసికావస్థలను వ్యక్తం చేయటానికీ, వ్యంజింపజేయటానికీ నృత్య సంప్రదాయంనుండి రసశబ్దాన్ని గ్రహించి ప్రయోగించాడు. భరతనాట్య శాస్త్రంలో నృత్య నాట్య సంప్రదాయాలలో అభినయ విశేషాలు చెప్పేటప్పుడు రసదృష్టులనీ, స్థాయిభావదృష్టులనీ, సంచారిభావ దృష్టులనీ (అష్టమాధ్యాయంలో) వివేచించటం జరిగింది. కాబట్టి అవస్థలకు సంబంధించిన రసభావాంశాలను తిక్కన రసశబ్దవాచ్యాలుగా చేయటం, భావాంశాలను వాచ్యం చేయకపోవటం తిక్కన రచనలో విశేషంగా గమనింపవలసిన అంశం. అట్లా వివేచించకపోతే డా॥కేతవరపు వేంకట రామకోటి శాస్త్రిగారన్నట్లు 'దోషం కాని రసదోషంగా' దీనిని సరిపుచ్చుకొనవలసి వస్తుంది. కాబట్టి కావ్యరసాన్ని నాట్యపరిభాషతో ధ్వనింపచేసే నవ్యకావ్యశిల్పం తిక్కన వరప్రసాదం. ఇది తిక్కన కవితలోని ధ్వని శిల్పం.

ఉదాహరణకు కొన్ని:- 1. కొమ్మనమంత్రి తిక్కనను 'కరుణార్ద్ర దృష్టి'తో చూచాడట! (విరా-1.10); స్వామి సిగమీద ఈ శశిరేఖ 'కరుణారసం' పొంగిపొరలుతున్నట్లుగా అమృతాన్ని జాలువారుస్తున్నదట (విరా-1.12); 3. హరిహరనాథుడు 'శాంతమూర్తి'గా శోభిల్లాడట (విరా-1.12); 4. ఆ స్వామి వదనంలో 'దరహాసరసము' తళుకొత్తిందట (విరా- 1.14); 5. 'దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫురద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగులట' సైరంధ్రి భర్తలు (విరా-2.55); 6. కీచకుడు 'రాగరసమున' కడలుకొన్నాడట (విరా-2.83); 7. ధర్మరాజు భీముడి 'కోపరసంబు పేర్మి' చెరిచాడట (విరా-1.137); 8. ఉపకీచకుల వధానంతరం ద్రౌపది మనసులో నిండిన 'హాస్యరసం' మొగంమీద వెల్లివిరియకుండా జాగ్రత్త పడిందట (విరా- 3.38); 9. అర్జునుడు 'వీరరసాత్మకుం డు' అయ్యాడట (విరా-5.3); ఉత్తరుడు 'భయరసం' తో వణకుతూ పరుగెత్తాడట (విరా-5.78); 10. అర్జునుడు రౌద్రరస వినోది అయ్యాడట (విరా-5.154); 11. విరాటుడు పాండవులను గుర్తించి 'అద్భుతరసాక్రాంత'మైన అంతరంగంకలవాడయ్యాడట(విరా-5.334); 12. ఉత్తరాభిమన్యులు 'సౌఖ్యరసంలో' తేలియాడారట (విరా-5.402); 13. కురుసభలోని వారు శ్రీకృష్ణుడి విశ్వరూప ప్రదర్శన సమయంలో కన్నులు మూసికొని అద్భుత భయానకరసాలలో మునిగిపోయారట (ఉద్యో-3.405). ఇట్లా ఎన్ని రసాలను పేర్కొన్నా అవి కావ్య శాస్త్ర మర్యాదలోని రసాలు కావు. నాట్య శాస్త్రమర్యాదలకు చెందినవే. మరొక శాస్త్ర మర్యాదలను సాహిత్యంలో పారిభాషిక పదస్థాయిలో ప్రవేశపెట్టటంవలన కావ్యశాస్త్రానికి విస్తృతి కలుగుతుందనీ, తన రచనలో పాత్రల మానసికావస్థలను పఠితలు నాట్య ముద్రలను ఆశ్రయించి భావించటానికి సౌలభ్యం ఏర్పడుతుందనీ ఆ కాలానికి అనుగుణంగా ఆలోచించి, తిక్కన ఈ ఉభయ కావ్యతత్త్వ వైభవాన్ని ప్రదర్శించాడు. ఈ వైనం తెలిస్తే పెక్కుమంది విమర్శకులు పేర్కొన్న వమనదోషం శమిస్తుంది; చేసిన వాచ్యావాచ్య విచారం వెనుకపడుతుంది. దోషంకాని దోషంగా సరిపుచ్చుకొనే అగత్యం తొలగిపోతుంది.

ఉభయకవిమిత్రుడంటే సంస్కృతాంధ్ర కవులకు మిత్రుడని చెప్పారు కేతనాదులు. మనుమసిద్ధి సభలో "లలిత నానా కావ్యములు చెప్పు నుభయభాషలయందు ననుట ప్రశంసత్రోవ" అన్నాడు కేతన. ఉభయభాషలలో చెప్పిన ఆ లలిత నానా కావ్యాలు మనకు తెలియరాలేదు. తిక్కన సంస్కృత శ్లోకాలు రెండు ప్రచురితమయ్యాయి ఉత్తర రామాయణ ప్రారంభపద్యం సంస్కృత శార్దూలం, విరాటపర్వావతారికలో పేర్కొన్న "కిమస్థిమాలాం.... "శ్లోకం తిక్కన ఆశుకవిత- ఇంతకుమించి తిక్కన సంస్కృత రచనలు కానరావు. కాగా గంగాదేవి రచించిన 'మధురావిజయ' మనే చారిత్రక కావ్యంలోని అవతారికలో పూర్వసంస్కృత కవులను స్తుతిస్తూ తిక్కనను ఇట్లా కీర్తించింది.

"తిక్కయజ్వ కవే స్సూక్తిః । కౌముదీవ కలానిధేః
స తృష్ణైః కవిభి స్స్వైరం । చకోరై రివ సేవ్యతే."

కళానిధి వంటి తిక్కన సోమయాజి కవితాసూక్తులను చంద్రుడి వెన్నెలను చకోర పక్షులవలె నిరంతరాయంగా కవులు ఆస్వాదిస్తున్నారట! 'కొందరు తిక్కయస్య కవే స్సూక్తిః' అనే పాఠాన్ని గ్రహించి ఆయన సోమయాజి తిక్కన కాదేమో అని

అనుమానించారు. కాని, కాకతీయుల కాలంలో మన తిక్కన కంటె మరొక తిక్కన ఉభయకవిమిత్రుడు లేడు. అయినా అంతటి కవి సంస్కృత రచనలు మనకందలేదు.

తిక్కన విజయసేనము, కవివాగ్బంధము, కృష్ణశతకము అనే తెలుగు రచనలు చేశాడని కొన్ని సాక్ష్యాలు చెప్పుతున్నాయి. పెదపాటి జగ్గకవి తన సంకలనగ్రంథమైన 'ప్రబంధ రత్నావళి' లో విజయసేనంలోని కొన్ని పద్యాలు పేర్కొన్నాడు. అప్పకవీ, కస్తూరి రంగకవీ సంశయప్లుతయతికి ఉదాహరణంగా తిక్కన విజయసేనంలోని పద్యాన్ని ఉదాహరించారు. కూచిమంచి తిమ్మకవి ఆ పద్యం చిమ్మపూడి అమరేశ్వరుడి విక్రమసేనంలోనిదని సర్వలక్షణసారసంగ్రహంలో పేర్కొన్నాడు. ఇప్పుడు విజయసేనంగాని, విక్రమసేనంగాని లభించడం లేదు. ఛందోగ్రంథమైన కవివాగ్బంధనానికి కవిసార్వభౌమచ్ఛందమనే మారుపేరున్నా, అది రచించింది తిక్కన అని పేర్కొన్నా, ఆ తిక్కన భారత తిక్కన అని సాక్ష్యాధారాలు సరైనవి దొరకటం లేదు. తిక్కన కృష్ణశతకం రచించినట్లు ప్రశస్తి ఉన్నది. అందులోని ఈ క్రింది పద్యం తెలుగువారి నోట నేటికీ జీవించి ఉన్నది.

"అరయన్ శంతనుపుత్రుపై విదురుపై నక్రూరుపైఁ గుబ్జపై
నరుపై ద్రౌపదిపైఁ గుచేలునిపయిన్ నందవ్రజ శ్రేణిపైఁ
బరఁగం గల్గు భవత్కృపారసము నాపైఁ గొంత రానిమ్ము నీ
చరణాబ్జంబులె నమ్మినాఁడ జగదీశా! కృష్ణ! భక్తప్రియా!"

ఈ మకుటంతో ఉన్న శతకం ఇప్పుడు లభించటం లేదు. కాగా, ఇది వెన్నెలకంటి జన్నయ్య రచించిన "దేవకీనందన శతకం'లోనిదని విమర్శకులు భావిస్తున్నారు. ఏది ఏమైనా ఈ పద్యంలోని శైలి మాత్రం తిక్కనది కాదు. కాబట్టి నిర్వచనోత్తర రామాయణం, మహాభారతం తప్ప తిక్కన రచనలు మరేమీ ఉన్నట్లు లేవు. ఆయన సంస్కృత కవిత్వం చెప్పగలిగినా తెలుగు కవిత్వానికే అంకితమైపోయిన మహాకవి!

'ఉభయ కవిమిత్రు' డనే బిరుదానికి అర్థం చెప్పటంలో విమర్శకులు తికమకపడుతున్నారు. అందరూ సమకాలీనుడైన కేతనను ప్రక్కనపెట్టి చెప్పలేకపోతున్నారు. కాగా సంస్కృతాంధ్ర కావ్య కవితా సంప్రదాయాల సమన్వయంతో వ్రాసేవారు ఉభయ కవులు ఉభయ భాషాకవులు మాత్రమే కారు - ఉభయ మర్యాదల కవులు. సాహిత్య దర్శనాన్ని సంస్కృత సాహిత్యప్రస్థానాలనుండి గ్రహించి ప్రక్రియా ప్రయోగ కళాప్రౌఢులను దేశీయంగా వినిర్మించుకొనే కవులు ఉభయ కవిత్వ విభవులు. ఆనందవర్ధను డన్నట్లుగా వ్యాసభారతం శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయి. దానిని నన్నయ, తిక్కనలు కావ్యరూప శాస్త్రచ్ఛాయాన్వయిగా మార్చుకొని స్వతంత్ర ప్రతిభతో వినిర్మించారు. వీరిద్దరూ ఉభయ కవిత్వతత్త్వవిదులే, కావ్యేతిహాస కవితా తత్త్వజ్ఞులే. కావ్యత్వానికి శాస్త్రత్వాన్ని ఛాయగా నిలుపగలిగిన దక్షులే. అయితే ఆ ప్రవృత్తిని తిక్కన భారత భాగంలో అనేక విధాలుగా ఆవిష్కరించే అవకాశం దొరకటంతో తిక్కనకు ఉభయకవిమిత్ర బిరుదం ఊర్జితంగా మిగిలిపోయింది. ఆధునికులు కొందరు కవిత్వాన్ని కథాకథన ప్రధానమనీ, వర్ణనా ప్రధానమనీ, నాటకీయ రచనా ప్రధానమనీ, అలంకార ప్రధానమనీ విభజిస్తారు. ఇందులో ఏ రెండింటికైనా సమప్రాధాన్యాన్ని కలిగించగలిగినవారు ఉభయ కవిత్వతత్త్వవిదులు. తిక్కన వర్ణనాత్మక నాటకీయ కవితా స్వభావాలను విశిష్టంగా మేళవించే కావ్యతత్త్వవేత్తగా భారత రచనలో ప్రసిద్ధి కెక్కాడు.

ఈ విశిష్ట లక్షణాన్ని ఎన్ని విధాల విశ్లేషించినా శ్రవ్యదృశ్యకావ్యప్రక్రియల సమష్టి తత్త్వాలను అంటుమామిడిగా అంటుత్రొక్కిన గౌరవం తిక్కనకే తొలిసారి దక్కింది. నాటకీయతను అందరూ అనుసరించినా ఉభయ కావ్య పరిభాషా మైత్రిని మాత్రం తెలుగులో మరెవ్వరూ తిక్కనవలె నిర్వహించలేకపోయారు. ప్రబంధపరమేశ్వరుడు కూడా కవిబ్రహ్మ తిక్కన సృష్టి మరెవ్వరికీ సాధ్యం కాదని చేతులెత్తి నమస్కరించాడు.

## 12. హరిహరనాథ (తత్త్వ) దర్శనం

తిక్కన భారత కృతిపతి హరిహరనాథుడు. భారత రచనా కుతూహలుడైన తిక్కన తన కృతిని ఎవరి కంకిత మీయాలా? అని ఆలోచిస్తూ ఇంచుక నిద్రించాడు. అందులో ఒక మహనీయ స్వప్నం వచ్చింది. తిక్కన తండ్రి కొమ్మనామాత్యుడు కలలో

కనబడ్డాడు. తిక్కన చేసిన నమస్కారా లందుకొని కరుణార్ద్రదృష్టితో చూచాడు. తిక్కన ఇదివరలో చెప్పిన 'కిమస్థిమాలాం...'శ్లోకాన్ని విని దయాళుడై భక్తవాత్సల్యంతో అతడిని కృతార్థుడిని చేసి, ఒక కార్యాన్ని అతడివలన పొందాలనే అభిలాషతో హరిహరనాథుడు వస్తూ కొమ్మనకు తన సంకల్పాన్ని దివ్యశక్తితో తెలిసేటట్లు చేసి, ముందుగా తిక్కన దగ్గరికి అతడిని పంపాడు. హరిహరనాథుడు తన సన్నిధానం కల్పిస్తున్న వైఖరిని కొమ్మన ముందుగా తిక్కనకు ప్రకటించాడు. తిక్కన సంభ్రమంతో ఆ వైపు చూచాడు. ఎదుట హరిహరనాథస్వామి ప్రసన్నుడయ్యాడు.

సీ. "కరుణారసము పొంగి తొరఁగెడు చాడ్పున । శశిరేఖ నమృతంబు జాలువాఱ,
హరినీలపాత్రిక సురభిచందనమున్న । గతి నాభిధవళపంకజము మెఱయ,
గుఱియైన చెలువున నెఱసిన లోకర । క్షణ మనంగ గళంబుచాయ దోఁపఁ,
బ్రథమాద్రిఁ దోతెంచు భానుబింబము నా ను । రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప,

తే. సురనదియును గాళిందియు బెరసినట్టి । కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి
నా మనంబు నానందమగ్నముగఁ జేయ । నెలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు." **(విరా.1.12)**

ఆంధ్రసాహిత్యంలో హరిహరనాథుడి అపూర్వమైన అద్భుతమూర్తిని కల్పించి శిల్పించి తెలుగువారి కన్నుల ముందు నిల్పిన అక్షరభావచిత్రశిల్పి తిక్కన. తండ్రిగారు అడుగో చూడుమని చెప్పింది హరిహరనాథుడిని. కాని, తిక్కన ఎదుట నిలిచింది సర్వేశ్వరుడు. ఇదేమిటన్నది మొదటి ప్రశ్న. దీనికి బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగా రిట్లా వ్యాఖ్యానించారు.

"తిక్కనయజ్వమనము ఆనందమగ్నమైనదట!.... సర్వేశ్వరుని సన్నిధి చేత. ఆ సర్వేశ్వరుడు ఏ రూపమును ధరించి సన్నిధి చేసెను? కేవల హరిరూపమును గాదు, కేవల హరరూపమునుగాదు; ఇప్పు డాతని కట్టి వేరువేరు రూపములతోఁ దృష్టి గలుగదు. ఆ మహాభాగుఁడపు డద్వైతమూర్తి. సర్వజ్ఞుఁడు, సర్వాంతర్యామియునగు సర్వేశ్వరునకుఁ దదాశయము విదితమే. కావుననే యతఁ డిప్పుడు కేవల హరిరూపమునఁగాని, కేవల హరరూపమునఁగాని తన భక్తవతంసుఁడగు తిక్కయజ్వకు దర్శన మీఁదలంచలేదు. ఆ రెండు రూపము లేకభావము నందినఁ గాని కుండలీంద్రుఁడు (తిక్కన సోమయాజి) మెచ్చఁడని తా నెఱుఁగును. శైవవైష్ణవ భేదకల్లోల విజృంభణ కీ పృథగ్భావమే కారణమగుటచే నది కవిబ్రహ్మకు అనభిమతము. కావున భక్తహృదయానువర్తియగు సర్వేశ్వరుడు తన కిట్లు సన్నిధి చేసెనని కవిబ్రహ్మ స్వయముగాఁ దెలుపుచున్నాడు". (తిక్కయజ్వ హరిహరనాథతత్త్వము.పు.18-19).

హరిహర శబ్దాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ డా॥ పాటిబండ మాధవశర్మగా రిట్లా అన్నాడు. "హరిహరశబ్దమే విచిత్రమైనది. ఇది వ్యాస మహర్షి కూర్చిన సమాసము. సమర్థములైన పదములు ఏకపదము లగుట సమాసము. ఇక్కడ సమర్థములైన తత్త్వములు ఏకతత్త్వమై సమాసము ఏర్పడినది. "నమో హరాయ హిప్రాయ నమో హరిహరాయ చ" అని వేదవ్యాసుడు హరివంశమున 'హరిహర' సమాసమును ప్రయోగించినాడు. 'హరిహరాయ' అను ప్రయోగము చతుర్థీ ఏకవచనాంతముగా ఉన్నది. కనుక ఇది ఇతరేతర ద్వంద్వసమాసము కాదు. అయినచో ద్వివచనాంతముగా ఉండవలెను. ఏకవచనములో ఉన్నది గనుక సమాహార ద్వంద్వ సమాసము కావలెను. ఆజన్మవిరోధముగాని, అవినాభావ సంబంధముగాని ఉన్నవానిని తెలుపు పదములను మాత్రమే సమాహార ద్వంద్వ సమాసమున కూర్చవలెను. లోకదృష్టిలో హరిహరులకు ఆజన్మవిరోధము. తాత్త్వికదృష్టితో అవినాభావ సంబంధము. కనుక హరిహర శబ్దము సమాహారద్వంద్వమగుట సముచితమే. అయినను తన జీవనిష్ఠమైన యభిరుచిని బట్టి దీనిని విశేషణ పూర్వపద కర్మధారయముగా కూడా గ్రహించుచున్నట్లు 'విష్ణురూపాయ నమఃశివాయ' ఇత్యాదుల వలన తెలియనగును. శివభక్తుడైన తిక్కనగారు హరిహర సమాసమును ఉత్తర పదార్థ ప్రధానముగా భావించుట సహజమే."

"వ్యాస సమాసైక రూప హరిహరనాథా!" అని తిక్కనగారు హరిహరనాథుని ఒకచోట సంబోధించినారు. తాత్త్వికముగా విచారించినప్పుడు హరిహరునకు కరచరణాద్యవయవయుక్తమైన రూపము లేదు. 'హరిహర' అనిన వ్యాసుని సమాసమే ఆయన

మూలరూపము. పై సీసపద్యమునందును ఇతర పద్యములందును తిక్కనగారు వర్ణించిన హరిహరనాథరూపము ఆయనకు భావనాగోచరమైన కల్యాణమూర్తి.''

"దేవతావర్ణన పాదాది మస్తకాంతముగా చేయవలెనని సంప్రదాయము. ఈ సీసపద్యమున తిక్కనగారు ఆ సంప్రదాయము పాటింపలేదు. శిరస్సునందలి శశిరేఖతో వర్ణన ప్రారంభమైనది. ఆద్యంతరహితమైన పరతత్త్వము ధరించిన హరిహరమూర్తికి పాదశిరోభేదము లేదు. 'మరుత్సరిదాకల్పిత మనోజ్ఞ చరణ శిరస్సుందరమూర్తి' హరిహరనాథుడు. ఆయన చరణమున గంగ, శిరమున గంగ, ఆయనకు చరణ శిరోభేదము లేదు. అట్లే వామదక్షిణ భేదము కూడ లేదు. ఆయన హరిహరుడు, హరహరి'' (తిక్కన కవితా వైభవం - యువభారతి ప్రచురణ - పు.12,13).

హరిహరనాథమూర్తిని అర్థాలంకారసుందరంగా తిక్కన వర్ణించాడు. ఉత్ప్రేక్షోపమాలంకారాలను ఉజ్జ్వలంగా ఉపయోగించాడు. కరుణారసంతో ఆరంభమై శాంతరసంతో ముగిసి చూచేవారికీ, ఆ మూర్తితత్త్వాన్ని గురించి ఆలోచించేవారికీ ఆనందరసంలో మగ్నమయ్యే అనుభూతి నందించే అద్భుతమూర్తిని ఆవిష్కరించాడు. కావ్యరస మర్యాదా, నాట్యరస మర్యాదా అద్వైతాన్ని పొందిన రసమూర్తిని చిత్రించాడు. ఇందులో అలంకార ధ్వని రసధ్వనిలో పర్యవసించేటట్లు రచించటం శిల్పం. భగవంతుడు ప్రసన్నుడై భక్తుడి కోర్కెలను తీర్చే ముద్రలో నిలిచిన నాట్యమూర్తిగా ఒకవైపు తోస్తాడు. ఇది నాట్యరసమూర్తి. దయ అనే భావం ఉత్కటమై రసస్థితిని పొందిన సాత్త్వికభావ చైతన్యంతో కనబడే స్వామి కావ్యరసమూర్తి. గంగా యమునల సమైక్య కాంతి ప్రవాహం తరంగితమైనట్లు శోభిల్లే శాంతమూర్తి నాట్యరసమూర్తి. ప్రేక్షకుల హృదయాలను ఆనందరసమగ్నం చేసే శమస్థాయిభావ ప్రసన్నమూర్తి కావ్యరసమూర్తి. శివకేశవు లిద్దరూ ఏకమై తమ అలంకారాలతో అనుగ్రహించే ఏకైక మార్గాన్ని ఆశ్రయించారు. ఆ అలంకారాలు కూడా రెండు రకాలు పుట్టు సొమ్ములు, పెట్టు సొమ్ములు. హరుడు తన పెట్టుడు సొమ్మైన శశిరేఖ అమృతాన్ని వర్షిస్తుంటే అదే తన కరుణారసమా అన్నట్లు తిక్కన మీద జలపాతంవలె జాలువారుస్తున్నాడు. అందులో ఉత్ప్రేక్ష కూడా అలంకారంగా అందగించింది. శివుడి తలమీద ఉన్న శశికళ సహస్రారం మీద పొంగి స్రవించే అమృతమైన ఆనందరసం. దానికి మూలస్థానం నాభి. అక్కడ కుండలిని మేల్కొల్పితే అది షట్చక్రాల ద్వారా పైకి ప్రసరిస్తుంది. మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరం, అనాహతం, విశుద్ధం, ఆజ్ఞాచక్రం దాటి సహస్రారంలో అది ఫలిస్తుంది. వెన్నుపూస నాశ్రయించి సుషుమ్న నాడి ఉంటుంది. తామరతూడువలె ఉండే ఆ మార్గం ద్వారా ఆ కుండలినీశక్తి ప్రసారమౌతుంది. ఇడ, పింగళ అనే నాడులు ఎడమ కుడిభాగాలలో ఉంటాయి. ఇవి చంద్రసూర్యశక్తులకు ప్రతీకలు, గ్రంథిస్థానాలు. ఈ రెండూ మెలికలు తిరుగుతూ వెళ్ళి ఆజ్ఞాచక్రంలో సుషుమ్నలో యోగిస్తాయి. సహస్రార పద్మంలో అమృతరూపంగా ఫలిస్తాయి. హరుడు ఆ అమృతానుభూతిని శశికళ అనే ఆభరణం ధరించిన ముద్రతో ప్రదర్శిస్తున్నాడు. ఈ సీసపద్యంలో తామరతూడుతో పుట్టి వికసించిన పద్మం, చంద్రసూర్యకళలు చెప్పబడటం గమనార్హం. హరి ఆ సహస్రారపద్మానికి మూలమైన తన నాభిని ప్రదర్శిస్తూ, కుండలినీ యోగ సాధనరూపమైన ధవళ పంకజాన్ని సహజాభరణంగా ప్రకాశింపజేసి తన యోగముద్రను ఉపమాలంకార సుందరంగా ఆవిష్కరించాడు. బొడ్డు హరినీల మణినిర్మిత పాత్రికవలె, పద్మం సురభి చందనం వలె రాణించాయట. హరినీలం గాఢమైన ప్రేమకూ, శ్రీగంధం దాని వలన మనసుకు కలిగే సౌఖ్యానికీ చక్కని ఉపమానాలు. శశిరేఖ అమృతసిద్ధిని తెలిపే శివాలంకారం. ధవళపద్మం మూలాన్నీ, సాధన వికాసాన్నీ ధ్వనింపజేసే హరిభూషణం.

నేను సకల లోకాలనూ రక్షిస్తున్నానన్న దివ్యవిభూతిని ప్రకటించే చిహ్నం శివుడి గళంలో నల్లగా మెరిసే గరళరేఖ కాంతి; శివుడి పెట్టుడు సొమ్మైనా సహజాలంకారంగా రాణించిన వన్నె. అట్లాగే హరి ధరించిన కౌస్తుభరత్నం కూడా. హరుడి తెల్లని గళం మీది ఒక నల్లని మచ్చ దివ్యవిభూతికి పతాక. ఒక నల్లని ఉరస్సుమీద తూర్పుకొండ మీద ఉదయిస్తున్న భానుబింబం వలె వెలుగొందే కౌస్తుభరత్నం ఒక దివ్య సంపదకు ప్రతీక. హరుడి అలంకారాలను ఉత్ప్రేక్షతో, హరి అలంకారాలను ఉపమతో వర్ణించటం ఒక విశేషం. ఆ రెండిటినీ సురనదీ కాళిందీ నదులవలె కలిపి ఉత్ప్రేక్షతో ఉన్మీలింపజేయటం మరొక విశేషం. ఉత్ప్రేక్ష అధ్యవసాయ మూలకం. ఉపమ భేదాభేద సాధర్మ్య మూలకం. ఉపమానం యొక్క తాదాత్మ్యాన్ని ఉపమేయంలో సంభావించటం

ఉత్ప్రేక్ష. ఉపమానోపమేయ సాదృశ్య భావనం ఉపమ. విష్ణ్వలంకారాల సాదృశ్యభావనం ద్వారా హరిగుణాలను ధ్వనింపజేయటం అలంకారశిల్పం. పద్మం, లక్ష్మి అనే అలంకారాలు వికసించిన హృదయంలో స్థిరంగా నిలిచే ఐహికాముష్మిక సంపదలను తెలియజేస్తున్నాయి. హరి కరుణారసంతో ఇచ్చే సిద్ధులవి. శశిరేఖ, గరళకంఠం భక్తవశంకరత్వాన్నీ, లోకరక్షణ కళా పాండిత్యాన్నీ ప్రకటిస్తున్నాయి. హరుడు కరుణిస్తే కలిగే సిద్ధులు యోగక్షేమాలు. ఇవి హరిహరుడిలో కాంతిపూరాలుగా ప్రవహించే దివ్య విభూతులు. ఆ ప్రవాహాలు శివుడిలో గంగగా, విష్ణువులో కాళిందిగా కనబడవచ్చును కాని, హరిహరుడిలో ఆ రెండూ కలిసిన ఒక వింత కాంతి కనపడుతుంది. వర్ణసంయోజనంలో తెలుపులో నలుపు కలిసి తెలుపులో భాగమైపోతుంది; లేదా నలుపుతో తెలుపు కలిసి లీనమైపోతుంది.

"శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే శివస్య హృదయం విష్ణుః విష్ణోశ్చ హృదయగ్ం శివః"

అనే మంత్రార్థం అలంకార ధ్వని వలన స్ఫురిస్తుంది. ఆ తత్త్వం పఠితను ఆనందమగ్నం చేస్తుంది. దీనిని ఈ పద్యం ధ్వనింపచేస్తున్నది.

'కిమస్థిమాలాం కిము కౌస్తుభంవా' అనే శ్లోకం కూడా అలంకారాలనూ, అనుభవాలనూ ఆలంబనంగా చేసికొని చెప్పిన అలంకారోక్తి. అస్థిమాల కౌస్తుభం అలంకారాలు, కాలకూటం యశోదాస్తన్యం అనుభవాలు. ఈ అలంకారశిల్పాన్ని దేవుడు మెచ్చాడు కాబట్టి తిక్కన ఈ పద్యాన్నికూడా అదే ఒరవడిలో నడిపి పరమేశ్వరానుగ్రహాన్ని పొందటానికి ప్రయత్నించాడు.

శివకేశవాభేదాన్ని విరోధాభాసంతో ధ్వనింప జేయటం మరొక విశేషం. ఇందులో హరిహరులకు సహజవిరోధం ఉన్నట్లు చెప్పటం, అది ఆభాసమని తెలిపి పరిహరించబడేటట్లు చేయటం ఇందులోని అలంకార శిల్పం. శివుడి తలమీది శశిరేఖకూ హరినాభి ధవళ పంకజానికీ ప్రకృతిసిద్ధమైన వైరం ఉన్నది. కాని, కడుపులో అమృతాన్నీ, మరకరందాన్నీ దాచుకుని లోకానికి పంచిపెట్టటంలో ఆ రెండూ ఒకటే కాబట్టి ఆ వైరం ఆభాసమై తొలగిపోతుంది. గరళం నల్లనిది, ప్రళయహేతువు. కౌస్తుభరత్నం కాంతిమంతమైనది, సంపదలనిచ్చేది. ఈ రెండూ విరుద్ధాలే అయినా లోకాన్ని రక్షించి పోషించే భక్త రక్షణ కళాప్రావీణ్యంలో ఆ వైరుధ్యం ఆభాసమైపోతుంది. గంగా యమునలు విడివిడిగా పారితే వాటి వర్ణాలే వేరు. కలిసి పారితే పాపనివారణంలో అవి పుణ్యాకాంతి ప్రవాహాలే. ఈ భావనం మనస్సులో చేస్తే సహృదయుడికి కలిగేది ఆనందమే. అది అలంకారం వలన ఏర్పడే అలౌకికానందం కావచ్చును. ఆధ్యాత్మిక భావనం వలన కలిగే బ్రహ్మానందం కావచ్చును. దయారసం సగుణబ్రహ్మ భావనలో కలిగే అలౌకికానందం. శాంతరసం నిర్గుణ తత్త్వచింతనం వలన కలిగే బ్రహ్మానందం. అభినవగుప్తుల అభిప్రాయంలో శాంతరసం ప్రకృతి రసం. మిగిలిన రసాలన్నీ వికృతి రసాలే. హరిహరరూపాన్ని ఆశ్రయించి వ్యక్తమయ్యే కరుణారసాదులు ఆ దేవుడి తత్త్వాన్ని దర్శించి సహృదయుడు పొందే శాంతరసంలో లయిస్తాయి. ప్రకృతి రసమైన శాంతంగా మిగిలిపోతాయి. ఆ స్థితియే 'రసోవైసః'. కరుణారసంగా తోచేదీ ఆనందమే, శాంతంగా నిలిచేదీ ఆనందమే. 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అనే వేదతత్త్వమే సర్వేశ్వర తత్త్వం. అలంకారధ్వనిని రసధ్వనిలో పర్యవసింపజేసే ఒక అద్భుత శిల్పం ఈ పద్యం! తిక్కన హరిహరనాథుడి దయ వలన పొందిన బ్రహ్మానందస్థితి ఈ పద్యంలోని పరమ రసధ్వని.

తిక్కన కీర్తించిన హరిహరనాథుడు తిక్కన ప్రతిభాజన్యుడా? పూర్వప్రసిద్ధుడా? అనే అంశంమీద అనేకు లనేకవిధాలుగా తమ అభిప్రాయాలను తెలిపారు. నాథశబ్దం జైన సంప్రదాయాన్ని సూచిస్తుందనీ, ఆ మతంనుండి హరిహరనాథ భావనను క్రమంగా అద్వైతంలోకి తిక్కన తెచ్చుకొన్నాడనీ చెప్పేవారు కొందరున్నారు. భారతీయ సంప్రదాయంలో ఒకే దైవాన్ని ఆయా ప్రయోజనాల ననుసరించి అనేకరూపాలలో ఉపాసించే పరిపాటి ఉన్నది. అంతేకాదు. హరిహరబ్రహ్మలను కలిపి దత్తాత్రేయ రూపంగా ఉపాసించే పరిపాటీ కనబడుతుంది. చతుర్ముఖుడిని వదలి హరిహరోపాసనం చేసే పద్ధతులు కూడా ఉన్నాయి. స్మార్తశైవంలో శివశక్తులను కలిపి అర్ధనారీశ్వరుడుగా భావించే పద్ధతి కనబడుతున్నది. పాణిన్యాదులు 'వృషాకపి' శబ్దాన్ని హరిహరాత్మక రూపం పట్ల కూడా వాడిన పట్టులున్నాయి. మహారాష్ట్ర ప్రాంతంలోని త్ర్యంబక క్షేత్రం దగ్గర హరిహరనాథ దేవులకు దేవాలయాలున్నాయి. నెల్లూరులోకూడా ఈ సంప్రదాయానికి చెందిన దేవాలయం ఉన్నది. కాని, మరెక్కడా తెలుగునాట అట్టి దేవాలయాలు లేవు. అయితే వ్యష్టిమూర్తుల ఆరాధనం సామాన్య జనులకు సన్నిహితంగా ఉండటం వలన, సంయుక్త

రూపారూపనామతత్త్వాలను తెలిసి ఉపాసించటం క్లిష్టం కావటం చేత హరిహరనాథ దేవుడి వంటి మూర్తులు, నృసింహావతారం వలె ఉద్దిష్ట ప్రయోజన సాధన కొరకే మొదట అవతరించి, ఆ తరువాత అవసరాన్ని బట్టి, ప్రజాదరణాన్ని బట్టి కొనసాగుతూ ఉంటాయి. అందువలన పూర్వం ఒక ప్రయోజనం కొరకు హరిహరభావనం భారతదేశంలో కొన్ని కొన్ని ప్రాంతాలలో ప్రవర్ధిల్లి ఉండవచ్చును. దానిని తిక్కన 13వ శతాబ్దంలో సమకాలీన మతసమన్వయ దృష్టి కొరకు వినియోగించుకొని ఉంటాడు. డాక్టర్ ఓగేటి అచ్యుతరామశాస్త్రి వంటి విమర్శకులు హరిహరనాథుడంటే శ్రీ తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామియే అని భావించారు. హరిహరనాథుడు అనే పేరులో హరికి ప్రథమస్థానం ఉన్నది. ఆ తరువాత హరుని ప్రసక్తి వచ్చింది. వ్యాసుడుకానీ, మరెవ్వరైనా కానీ ఈ శబ్దాన్ని మొదట సృష్టించి ఉండవచ్చును. దాన్ని విష్ణుపారమ్యానికి అనుకూలంగా వాడి ఉండవచ్చును. కాని, తిక్కన 'చిత్తనిత్యస్థితశివుడు' కాబట్టి ఎప్పుడు హరిహరనాథుడిని వర్ణించినా శివాంశను ముందుగా చెప్పి విష్ణ్వంశను తరువాత చెప్పుతాడు. తిక్కన వర్ణించే పద్ధతిలో ఆ దేవుడు 'హరహరి' కావాలి. హరిహరసమాసంలోని పదాలు ఉత్తరోత్తరాలు బలీయాలనే న్యాయంతో తిక్కన హరుడిని ముందూ హరిని తరువాతా చెప్పాడని సమర్థించే వారూ ఉండవచ్చును. దీనిని వేదాంతపరంగా వ్యాఖ్యానించవచ్చును అనేవారూ ఉండవచ్చును. భగవంతుడు వస్తుతః హరిహరుడే. అయితే ఆయన ప్రకృతి దర్పణంలో ప్రతిఫలించినప్పుడు కుడి ఎడమలుగా వ్యత్యస్తమై కనబడుతాడు. సగుణమూర్తి దర్పణ ప్రతిబింబతుల్యుడైన పరతత్త్వం. బింబరూపుడు హరిహరుడు, ప్రతిబింబరూపుడు హరహరి. తిక్కన బింబాన్ని ప్రతిబింబముగా దర్శించి బింబాన్నే కీర్తించాడు. అందువలన తిక్కన హరప్రశంస ముందుగా హరిప్రశంస ఆ తరువాతా చేస్తాడని పేర్కొనవచ్చును.

ఇన్ని వాదాలున్నా హరిహరుడు వైదికధ్యాయిత కిచ్చమెచ్చే పరతత్త్వం. అతడు సర్వేశ్వరుడు. నిరాకార నిరంజనుడు. ఆనంద స్వరూపుడు. తిక్కన హరిహరుడికి ఆనందముద్రకూ అవినాభావ సంబంధాన్ని భావించాడు.

ఈ అంశాన్ని ఆరుద్రగారు ఆర్ద్రంగా వివరించారు. 'ఆనందం' అన్నది తిక్కనగారి ఆశయం. భారతంలో ప్రతి పర్వాంతంలో ఆనందముద్ర ఉంటుంది. హరిహరనాథుడిని ఆనందరూపునిగా వారు ఊహించారు. పర్వాంత పద్యాలలో ఆఖరి సంబోధనలు ఎలా ఉన్నాయో చూడండి. 1. విరాట పర్వాంతం-ఆనంద సంసన్త్రాయమానా!;2. ఉద్యోగ పర్వాంతం - పరమానందానుభూత్యేకరూపా!; 3. భీష్మపర్వాంతం-సంతతానంద సాంద్రా!; 4. ద్రోణ పర్వాంతం - శాశ్వతానందమూర్తీ!; 5. కర్ణ పర్వాంతం - నిర్భరానంద దేహా!; 6. శల్యపర్వాంతం - ఆనందరూపా!; 7. సౌప్తికపర్వాంతం - సుస్థిరానందభాసా!; 8. స్త్రీపర్వాంతం - ఆనందశీలా!; 9. శాంతిపర్వాంతం - భాస్వదానందమార్గా!; 10. ఆనుశాసనిక పర్వాంతం - నిష్కలానందమూర్తీ!; 11. అశ్వమేధ పర్వాంతం - దర్శితానంద వర్త్మా!; 12. ఆశ్రమవాస పర్వాంతం - సానందవర్గా!; 13. మౌసల పర్వాంతం - ఆనంద ప్రకాశస్వరూపా!; 14. మహాప్రస్థానిక పర్వాంతం - సంభృతానందలీలా!; 15. గ్రంథాంతం - సంభృతానందభావా!.

పర్వాంతంలో ఆనందముద్రను వేసిన తిక్కనగారు గ్రంథాదిని దానిని వాడారా అన్న అనుమానం కలుగుతుంది. "శ్రీయనగౌరినా బరఁగు...'' అనే మంగళాచరణం అయ్యాక వెంటనే తిక్కనగారు వచనంలో ఆనందముద్ర వేశారు. "...అని సకల బ్రహ్మప్రార్థనంబు చేసి, తత్ప్రసాదాసాదిత కవిత్వ తత్త్వనిరతిశయానుభావానంద భరితాంతఃకరణుండ నగుచు...'' (విరా.1.2). అయితే కావ్యం మొట్టమొదటి పద్యంలో కాక రెండవ నెంబరు వచనంలో 'భావానందం' ఉంది కనుక గ్రంథాంతంలో ఉపథాపద్యంలో (ఆఖరిదానికి ముందున్నదానిలో) కూడా భావానందం వాడితేనేగాని శిల్పంలో నిండుదనం రాదు. అందుకే ఆ ఉపధాపద్యం లోపలే'' కేవల భావానందమయా! వేదవ్యాస వర్ణనారూఢదయా!'' అని ఉపధాచరణంలో వాడి సరిపుచ్చారు. (స్వర్గా.96)'' (సమగ్రాంధ్రసాహిత్యం 2. సం. పుట. 131-133)

తిక్కన హరిహరనాథ తత్త్వ విచారంలో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి ఈ క్రింది మాటలు విలువైనవి. "కల్పితములైన నామరూప భేదములచే భగవంతుని పేరను, మతము పేరను దారుణ కలహములకు లోనై అలజడి పొందుచుండిన ఆంధ్రులకు తిక్కన ప్రసాదించిన భగవత్తత్త్వము హరిహరనాథుడు.''

"హరిహరనాథ నామరూపములను గూర్చి ఆంధ్రులలో భిన్నాభిప్రాయములు కలవు..ఆ తత్త్వము సగుణము, సాకారమును ఐనప్పుడు శివకేశవాత్మకము; నిర్గుణమును, నిరాకారమైనపుడు ఉపనిషత్ప్రతిపాదితమైన పరమాత్మ - ఓంకారము తద్వాచకము. ఆ తత్త్వము సగుణాత్మకముగా సాకారముగా ఆరాధనీయమైనపుడు శ్రీయన గౌరినాబరగెడి స్త్రీతత్త్వము. అయ్యది నిర్గుణాత్మకమై ఓంకార వాచ్యమైనపుడు హ్రీంకార వాచ్యమగును. ఈ అర్థమునే తిక్కన షష్ఠ్యంత పద్యములలో నిట్లు వ్యక్తమొనర్చెను:

క. "ఓంకారవాచ్యునకు నన। హంకార నిరూఢ భావనారాధ్యునకున్
హ్రీంకారమయ మనోజ్ఞా। లంకారోల్లాస నిత్యలాలిత్యునకున్". **(విరా.1.32)**

కాబట్టి హరిహరుని శివకేశవాత్మకమూర్తిగా భావన చేయుట ఆరాధనార్థము. అప్పు డా దేవుడు భక్తిగమ్యుడు; యోగగమ్యుడైనప్పుడు హరిహరునకు ఆకారము లేదు. 'నాదామృత ధారాసారరూపుఁడు', 'నాసాగ్ర నివాసరసికుఁడు' మరియు వ్యాసుని వాఙ్మయప్రపంచమునకు హరిహరనాథుడు లక్ష్యమట. 'వేదవ్యాస వచోవిభవ లక్ష్య హరిహరనాథా!'

క. 'శ్రీసంపాది పదాంబుజ!। నాసాగ్రనివాస రసిక! నాదామృత ధా
రాఽఽసారరూప! వేద। వ్యాస వ్యంజిత విహార! హరిహరనాథా!' **(భీష్మ.1.1.)**

అక్కడ వేదవ్యాసవచస్సు అనగా బ్రహ్మసూత్రము అని అర్థము. కావున బ్రహ్మసూత్రములలో ఏ పరతత్త్వము నిర్దేశింపబడినదో ఆ పదార్థమే తిక్కనార్యునకు లక్ష్యమైన హరిహరనాథతత్త్వము. అదియే ఉపనిషత్ప్రతిపాదితము. ఆ తత్త్వము జ్ఞానగమ్యము. అంతేకాదు. ఆ దేవుడు 'క్రతుభూషణమణి'. నిత్యాగ్నిహోత్రపరతంత్రులకు, క్రతుపరాయణులకు, 'అపూర్వ' మనెడి వేదవిహిత కర్మానుష్ఠాన ఫలము నొసగెడి యజ్ఞపురుషుడు. కావున ఆ దేవుడు పూర్వమీమాంసా ప్రతిపాదితమైన తత్త్వము కూడా అగును....

"ఈ హరిహరనాథ తత్త్వము తిక్కనగారు కల్పించినది కాదు. వ్యాసుని భారతమున గల అనేక తత్త్వములలో ఒక తత్త్వముగనున్నది. మఱియు విష్ణుని అష్టోత్తర శతనామావళిలో "హరిహరరూపైక మూర్తయే నమః" అన్నచోట పేర్కొనబడినది. ఇట్లు అనేక తత్త్వములలో నొకటిగ, అనేక నామములలో నొకటిగా నున్న ఆ సర్వదేవతాద్వైతమూర్తియైన తత్త్వమును తిక్కనార్యుడు ధర్మాద్వైతమూర్తియైన భారతమున ఏకైక పరతత్త్వముగా ప్రతిష్ఠించెను. భారతకృతిపతియైన హరిహరనాథుడు ఏదో ఒక గ్రామమున వెలసిన, గుడి కట్టించుకొన్న దేవుడు కాడు. సృష్టిస్థితిలయములకు కర్తయైన విశ్వమయుడు. సారాంశమేమనగా హరిహరనాథుడు శైవులకు, వైష్ణవులకు, కర్మిష్ఠులకు, జ్ఞానులకు, భక్తులకు, యోగులకు, మంత్రోపాసకులకు, తపస్వులకు, సాధారణ శరణ్యుడు. ఐహిక మనోరథములనుగాని, ఆముష్మికసుఖమునుగాని, మోక్షపదవినిగాని, యోగసిద్ధినిగాని ప్రసాదించెడి సర్వఫలప్రదాత. తిక్కన భారత రచనావసరమున హరిహరనాథుడు సాక్షాత్కరించినపుడు 'జన్మాంతర దుఃఖముల్ తొలఁగునట్లుగఁ జేసి కృతార్థుఁ జేయవే' అని బ్రహ్మానందస్థితిని కోరి నమస్కరింపగా ఆ దేవుడు "జనన మరణాదులైన సంసారదురితములకు నగపడకుండంగఁ దొలఁగు తెరువుగను వెలుంగు నీకిచ్చితి" నని వర మొసగెను. అనగా మోక్షమన్నమాట. తన జీవితయాత్ర సార్థకమైనదనియు, మోక్షపదవి నిశ్చితమని ఎరిగియు, అంతతో కర్మసన్న్యాసము చేయక లోకసంగ్రహార్థమై భారత రచన కుపక్రమించెను." (ఆంధ్ర సాహిత్య చరిత్ర.పు.210-213)

### 13. తిక్కన ఆరణ్యపర్వశేషం ఎందుకు రచించలేదు?

ఉ. "ఆదరణీయ సార వివిధార్థ గతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై పెనుపొందియుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్". **(విరా.1.6.)**

పదునెనిమిది పర్వాల మహాభారత రచనా ప్రణాళికలో నన్నయభట్టు మూడు కృతులు (పర్వాలు) దక్షతతో నిర్వహించాడని తిక్కన కొనియాడాడు. నన్నయభట్టు మూడు పర్వాలు పూర్తిగా రచించాడా? రచిస్తే, తరువాత కొంతకాలానికి కొంతభాగం శిథిలమైతే, ఎఱ్ఱాప్రెగ్గడ ఆరణ్యపర్వశేషం పూరించాడా? ఆరణ్యపర్వం అసమగ్రంగానే ఉండిపోయిందని తెలిసి కూడా తిక్కన సోమయాజి దానిని ఏవో కారణాల వలన వదలిపెట్టి విరాటపర్వంనుండి రచనం చేయటం ఆరంభించాడా? తిక్కన, ఆయన శిష్యులు, మిత్రులు తప్ప తరువాతి కవులందరూ ఎఱ్ఱాప్రెగ్గడను ఆరణ్యపర్వశేషకర్తగా కీర్తించటంలో గల అంతరార్థ మేమిటి? మొదలైన అనేక ప్రశ్నలు బుధజనులను వెంటాడుతూనే ఉన్నాయి. నన్నయభాగం నరాంకితం కావటం, తిక్కన భాగం దైవాంకితం కావటం, ఆరణ్య పర్వరచన అనర్థదాయకమనే అనుమానం ఉండటం మొదలైన కారణాలను కొందరు చెప్పినా అవి నిలిచేవి కావని తేలిపోయాయి. తిక్కన పాటించిన ఒక విశిష్ట సాహిత్య నీతిని ఎఱ్ఱాప్రెగ్గడ పాటించాడనీ భావించటం జరిగింది. (వివరాలకు చూడండి. ఆరణ్యపర్వం ప్రథమ ద్వితీయ భాగాల పీఠికలు). వీటన్నిటితోపాటు మరికొన్ని కారణాలను ఊహించే అంతర్గత సాక్ష్యాలు కనబడుతున్నాయి. ఆరణ్యపర్వకథ తన రచనాప్రవృత్తికి అనువైనదిగా తిక్కన భావించినట్లు లేదు. కారణాలు కొన్ని:

1. తిక్కన 'ఉభయ కవి మిత్రుడు.' శ్రవ్యకావ్య మర్యాదలలో దృశ్యకావ్యమర్యాదలను సమన్వయించి ఉభయ కావ్యకళాతత్త్వ విభవోజ్జ్వలత్వాన్ని ప్రకటించడానికి 'విరాటపర్వం' శ్రీకారంగా తోడ్పడింది.

2. తిక్కన జీవితేతివృత్తం మహాభారతేతివృత్తంలో ప్రతిఫలించటం విరాటపర్వంనుండి ప్రారంభమయింది. మనుమసిద్ధి భూపాలుడి అజ్ఞాతవాసం పాండవ అజ్ఞాతవాసంతో సరిపోలుతుంది. తిక్కన ఓరుగల్లు పయనం, రాయబార లక్షణం, రాజనీతి నైపుణ్యం ఉద్యోగపర్వంతో ఉన్మీలిస్తాయి. ఆరణ్యపర్వకథ తిక్కన ఆత్మాశ్రయ స్వభావానికి అనురూపమైనది కాదు.

3. మహాభారత కథ జగత్ప్రసిద్ధం కాబట్టి పూర్వపర్వంలో జరిగిన కథ చెప్పకుండానే విరాటపర్వం మొదలుపెట్టవచ్చును. పఠితలకు ఏమాత్రమూ అసౌకర్యం ఉండదు. అంతేకాదు; అన్ని పర్వాలూ ఒకేరకంగా ఉండవు కాబట్టి ఒక్కొక్కపర్వాన్ని ఒక్కొక్క విధంగా చెప్పవచ్చును - (విరా.1.42) 'వలసినట్లు చెప్పవచ్చియుండు' అన్నాడు. ఆరణ్యపర్వంకంటె విరాటపర్వం తీరే వేరు.

4. వైశంపాయనుడు 'పరమ పవిత్రులగు పాండుపుత్రుల చరిత్రం బుపాఖ్యాన సహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని' (విరా. 143) జనమేజయుడు విరాటపర్వకథను గురించి ఒక ప్రశ్న వేశాడట. ఈ వాక్యంలో తిక్కన ఆరణ్యపర్వ కథాస్వభావాన్ని తెలిపాడు. అది పాండవుల చరిత్రను (కథను లేదా శీలాన్ని) అనేక ఉపాఖ్యానాల నాధారంగా చేసికొని వ్యాఖ్యానించినట్లు ఉంటుందట. వనవాసవ్రతాన్ని సముచితంగా అనుష్ఠించిన పద్ధతి సవిస్తరంగా చెప్పినట్లుంటుందట. తిక్కన కథాకావ్య స్పృహ ఎక్కువగా కలవాడు. ఆఖ్యాన ఉపాఖ్యానాల సమ్యఙ్నిర్మాణాన్ని నిర్వహించినవాడు నన్నయ. విరాటపర్వ కథ దానికి భిన్నంగా ఉన్నది. అందువలన విరాటపర్వంతో కథ నారంభించటం నన్నయ వస్తు నిర్మాణ దృష్టికంటె విలక్షణంగా గోచరించేది. విరాటపర్వంలో ఉపాఖ్యానాలే లేవు కూడా. అందువలన దాని వైనమే వేరు.

5. ఆరణ్యపర్వం వరకు నన్నయ కథాకథనానికి వన్నెపెట్టే వర్ణనలే నిర్వహించాడు. కథలో ఒదిగిన రూపకనిర్మాణాన్నే రూపుకట్టించాడు. విరాటపర్వంనుండి ఆ తీరు మారింది. తిక్కన కథనూ వర్ణననూ అభినయాన్నీ హరిహరనాథుడి రూపంవలె సగం సగం చేసి సంవిధానం చేశాడు. నన్నయ రచన కృతి (కావ్యం) కాగా, తిక్కన రచన ప్రబంధమయింది.

ఇటువంటి అనేక విధాలైన అంతర్గత కావ్యలక్షణాల వలన తిక్కన విరాటపర్వం నుండి ఆరంభించటమే ఔచిత్యవంతంగా గోచరిస్తున్నది. అంతేకాదు. అష్టాదశపర్వాలలో మిగిలినవాటి కంటె విరాటపర్వానికి విశిష్టలక్షణాలను నాలుగింటిని పేర్కొన్నాడు తిక్కన. దానితో పర్వాలన్నీ ఒక యెత్తు; విరాటపర్వ మొక్కటీ ఒక యెత్తు-అని తిక్కన భావించినట్లు స్పష్టం. తిక్కన రచన చదివిన తరువాత తెలుగువారందరూ ఆ అభిప్రాయంతో ఏకీభవిస్తారు కూడా.

## 14. విరాటపర్వం హృదయాహ్లాది

హృదయానికి ఆహ్లాదాన్ని కలిగించేది విరాటపర్వమట! ఈ లక్షణం అన్నిటికంటె మొదట లెక్కించతగిందట! ఆహ్లాదం కలిగించేది ఎవరికి? సహృదయులకు. పేరు విరాటపర్వం. విరాటనగరంలో పాండవులు అజ్ఞాతవాస జీవితాన్ని నిర్వహించిన

కథను చెప్పేది కాబట్టి అది విరాటపర్వం. ఆహ్లాదం విరాటుడి వలన పాండవులకు కలుగవచ్చును; పాండవుల వలన విరాటుడికి కూడా కలుగవచ్చును; కథను తన్మయత్వంతో భావించే సహృదయులకు వారిరువురి వలన ఆహ్లాదం కలుగవచ్చును; కవి వర్ణనల వలన, కల్పనలవలన పఠితలకు ఆహ్లాదం కలుగవచ్చును. ఈ విధంగా నాలుగు రకాల ఆహ్లాదం కలిగించే స్వభావం విరాటపర్వకథకు సహజంగా ఉన్నదని తిక్కన నిర్దేశం.

విరాటపర్వంలో సహృదయ స్థానీయుడు జనమేజయ మహారాజు. అతడు కథను వినదలచుకొని వేసే ప్రశ్నలోనే శ్రోతృహృదయాన్ని వ్యక్తం చేస్తాడు. మూలంలో అతడు వైశంపాయనుడిని ఇట్లా అడిగాడు:

"కథం విరాట నగరే మమపూర్వపితామహాః। అజ్ఞాతవాసముషితాః దుర్యోధన భయార్దితాః ॥
పతివ్రతా మహాభాగా సతతం బ్రహ్మవాదినీ। ద్రౌపదీ చ కథం బ్రహ్మ న్నజ్ఞాతా దుఃఖితా-వసత్॥" (సం.4.1-2)

'పాండవులు దుర్యోధనుడి వలని భయంతో పీడితులై అజ్ఞాతవాసం ఎట్లా గడిపారు? పతివ్రత, పుణ్యాత్మురాలు, శ్రీకృష్ణస్మరణ తత్పరురాలు అయిన ద్రౌపది దుఃఖంతో ఎట్లా గడిపింది?' అని జనమేజయుడి ప్రశ్నలు. ఇందులో శ్రోత కోరుకొంటున్న ముఖ్యవిషయమేమంటే - దుర్యోధనుడు చారచక్షువై పాండవులను గుర్తించాలని యత్నిస్తూంటే, ఆ ప్రయత్నం సఫలం కాకుండా రహస్యంగా కష్టాల కోర్చి, దుఃఖంతో కాలం ఎట్లా గడిపారో చెప్పుమని అడిగాడు. కథాకథనంలో శ్రోత కోరుతున్న ప్రధానతాత్పర్యమది! మరి తిక్కనగారి జనమేజయుడి తీరు వేరు.

చ. "మహిత సముజ్జ్వలాకృతులు, మానధనుల్, జనమాన్యు లంగనా
సహితముగాఁగ నేమిగతి సమ్యగుపాయనిగూఢవృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నా పదుమూఁడగునేఁడు మత్పితా
మహులు చరించి? రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా!" (విరా.1.44)

పాండవులు సహజంగా సమున్నతమైనవీ, సముజ్జ్వలమైనవీ అయిన ఆకారాలు కలవారు. వారు మారురూపాలు ఎట్లా ధరించారు? రూపాలకు వేషాలు మారినా వారి తేజస్సులు మారవు. ఒకవేళ తేజస్సులను కూడా కప్పిపుచ్చుకొని అణగిమణగి ఉన్నారనుకొన్నా, వారు సహజంగా అభిమానధనులు కావటంతో సేవావృత్తిలో మాటపడి సహించే ప్రవృత్తి తక్కువ. అయినా వారు తలవంచి ఎట్లా మసలగలిగారు? వారు అనామకులు కారు. లోకమంతా వారిని గుర్తించి పూజించే మాననీయులు. ఎంత తమను తాము గోప్యంగా ఉంచుకొని తిరుగుతున్నా ప్రజలు వారిని గుర్తించి పూజిస్తారు. అట్టి లోకకీర్తి గలవారు లోకాన్ని ఎట్లా కన్నుగప్పారు? సరే! పాండవులు మగవారు. ఎన్ని తిప్పలైనా పడి ఎట్లాగో తమను తాము రక్షించుకొంటారు. కాని, వారు భార్యాసహితులే. ఆమెను వదలి అయిదుగురు వేరువేరుగా ఉండటానికి వీలులేదే? ఈ జటిల సమస్యను ఎట్లా ఎదుర్కొన్నారు? ఎటువంటి సమయోచిత సముచిత ఉపాయాలతో వారు శత్రువులకు అప్రభేద్యంగా, రహస్యంగా ఆ పదమూడవ యేడు ఎట్లా గడపగలిగారు? ఈ ప్రశ్నలకు సమాధానాలు వరుసగా సవివరంగా నాకు తెలిసేటట్లు చెప్పుమని జనమేజయుడి వేడుకోలు. మూలంలో శ్రోత పాండవులు ఎట్లా భయంతో బాధపడుతూ గడిపారో చెప్పుమని కోరాడు. తెలుగులో పాండవులు ఎట్లా నిపుణంగా, అద్భుతంగా అజ్ఞాతవాసాన్ని శత్రువుల కంటబడకుండా నిర్వహించారో వినాలని కోరాడు. అడిగేవారికి అనుగుణంగా చెప్పేవారి కథనం సాగుతుంది. అందువలన వ్యాసకథనంలోని పద్ధతి శత్రువుల భయం వలన పాండవులు పొందిన ప్రయాసకు ప్రాధాన్యం ఇస్తుంది. తిక్కన కథనంలో 'సమ్యగుపాయ నిగూఢవృత్తిమై నహితుల కప్రభేద్యముగ' ఎట్లా చరించారో చెప్పే పద్ధతికి ప్రాచుర్యం ఉంటుంది. వ్యాసుడి రచన పఠితలకు హృదయోద్వేగం కలిగిస్తుంది. తిక్కన కథ హృదయాహ్లాదం కలిగిస్తుంది.

మూలంలో జనమేజయుడు తాతలు పడిన బాధలు వినాలని ఆర్ద్రుడై అడిగాడు. తెలుగులో జనమేజయుడు అంత అమాయకుడు కాడు. కథకుడికే ఒక పథకాన్ని చూపించగల ప్రౌఢుడు. అందుకే తానడిగిన క్రమంలోనే కథ చెప్పుమన్నాడు. అన్వయం ఇట్లా కుదురుతుంది: (1) మహిత సముజ్జ్వలాకృతులు సమ్యగుపాయ నిగూఢవృత్తిమై ఏమిగతి చరించిరి? అన్నది

మొదటి ప్రశ్న. దీనికి బదులుగా ప్రథమాశ్వాసంలోని కథ ప్రవర్తిల్లింది. పాండవులు మారువేషాలు వేయలేదు. యముడి దయవలన వారికి మారురూపాలు వచ్చాయి. రూపాలకు తగిన వేషాలు అమరాయి. ఆ రూపాలు పాండవుల ఆకృతులపై ఆరోపిత రూపాలు. అవి వారి సహజమైన మహిత సముజ్జ్వలాకృతులను కప్పివైచి ఆరోపిత రూప సహజత్వాన్ని ప్రకటిస్తాయి. అవీ సముజ్జ్వలంగానే ఉంటాయి. కాని పాండవులని గుర్తించటానికి వీలులేకుండా ఉంటాయి. ద్రౌపది సైరంధ్రీరూపం కూడా అటువంటిదే. దానివలన శత్రువులకు అప్రభేద్యంగా చరించగలిగారు. ద్రౌపదీ పాండవుల ప్రచ్ఛన్న రూపవైభవాలను వర్ణించటానికి తిక్కన తన కావ్యకళాశిల్ప వైభవాన్ని విశేషంగా ప్రదర్శించాడు. మారురూపాలలో మహోజ్జ్వలంగా ఉన్నా అసలు రూపాలను గుర్తించలేని నిగూఢవృత్తి ఈ ఘట్టంలో పఠితల హృదయాలకు ఆహ్లాదం కలిగిస్తుంది.

(2) మానధనులు సమ్యగుపాయ నిగూఢవృత్తిమై ఏమిగతి చరించారు? - అనేది రెండో ప్రశ్న. అభిమానం దెబ్బతినే ఘట్టాలలో అజ్ఞాతవాసం భగ్నం కాకుండా పాండవులు సతీసమేతంగా ఎట్లా తమ గౌరవాలను కాపాడుకొన్నారో వివరించి చెప్పుమని ఈ ప్రశ్న తాత్పర్యం. ఈ ప్రశ్నకు ద్వితీయాశ్వాస వృత్తాంతం ప్రధాన సమాధానం. కీచకుడు ద్రౌపదిని కామించి ఆమెను నిండుకొలువుముందు క్రిందపడవేసి అవమానించాడు. అది ఆమెకూ, పాండవులందరికీ మానభంగమే. భీము డుద్రిక్తుడై మహావృక్షాన్ని పెరికి విజృంభించబోయినప్పుడు ధర్మజుడు అతడిని వారించటం, ద్రౌపదిని మందలించి అంతఃపురానికి పంపటం అజ్ఞాతవాసవ్రతాన్ని నిలుపుకొనటానికే కాని, ఆత్మాభిమానాన్ని చంపుకొని కాదు. అది సమయోచితమైన ఉపాయం. భీముడు కీచకోపకీచక సంహారాన్ని నిగూఢవృత్తితో నిర్వహించటం సమ్యగుపాయం. ఈ ఘట్టాన్ని తిక్కన ఒక ప్రబంధంగా తీర్చిదిద్దాడు. మానధనుల మానవీరాన్ని మహనీయంగా పోషించి ఆహ్లాదాన్ని అద్భుతంగా అందించాడు.

(3) జనమాన్యులు సమ్యగుపాయ నిగూఢవృత్తిమై ఏమిగతి చరించిరి? - అన్నది మూడవ ప్రశ్న. విరాటుడి కొలువులో పాండవులూ, ద్రౌపదీ సేవావృత్తులలో ఉన్నా, వారికి జనాదరణం అపరిమితంగా ఉండేది. కంకుభట్టు రాజు తరువాత రాజంతటివాడి వలె సభలో గౌరవాదరాలు పొందేవాడు. మత్స్యభూనాథుడి నీతివిద్య కంకుభట్టు. అతడి మాటమీదనే భీముడిని మల్లయుద్ధంలోకి దింపాడు. సింహశార్దూలాది క్రూరమృగాలతో పోరించేవాడు. చివరి కతడి మాటమీదనే భీముడికి ధర్మరాజుతోపాటు ఉత్తమ రథతురగాలను ఇప్పించి సుశర్మపై యుద్ధానికి నడిపించాడు. నకుల సహదేవులు ఆయా శాఖలలో ప్రధానాధికారులై రాజు మన్ననలను పొంది సుశర్మపై చేసే యుద్ధంలో తోడ్పడ్డారు. సుశర్మతో జరిగిన యుద్ధంలో విజయం ధర్మజ, భీమ, నకుల, సహదేవులు సాధించిపెట్టిందే. విరాటుడి మానప్రాణాలను రక్షించి అందరి మన్ననలను పొందిన జనమాన్యుల చరిత్ర తృతీయాశ్వాసంలో ప్రధానంగా తురంగలిస్తుంది.

(4) అహితుల కప్రభేద్యముగ సమ్యగుపాయ నిగూఢవృత్తిమై ఏమిగతి చరించిరి? - అన్నది నాలుగవ ప్రశ్న. దీనికి సమాధానం చతుర్థ పంచమాశ్వాసాల వృత్తాంతం. అంటే ఉత్తరగోగ్రహణ కథ. ఇందులో బృహన్నల అయిన అర్జునుడు నిజరూపంతో కౌరవులను ఓడించి, మరల నిగూఢవృత్తితో విరాటనగరం చేరటం, తరువాత సమ్యగుపాయంతో పాండవులు భార్యాసమేతులై బయలు మెరసి, అజ్ఞాతవాసవ్రతాన్ని నిర్విఘ్నంగా ముగించి ఉత్తరాభిమన్యుల వివాహం జరిపించటం అనే కథ ఇందులో వర్ణితం. ఉత్తర కుమారుడి ప్రగల్భాలూ, అర్జునుడి వీరాలాపాలూ, అతడి యుద్ధ విలాసాలూ పఠితలను ఆహ్లాదమగ్నులనుగా చేస్తాయి. ఈ విధంగా ప్రశ్నలే కథాప్రగతికి మార్గదర్శకాలు కావటం కూడా బుధులకు ఆహ్లాదదాయకమే.

విరాటపర్వంలో హృదయాహ్లాదం కలిగించే మరొక విశేషం ఉన్నది. ఈ పర్వం ఒక అంతర్నాటకం వంటిది. పాండవులు మారురూపాలతో వ్యవహరించే విచిత్ర కథావృత్తం విరాటపర్వం. వారికి మారుపేర్లుకూడా ఉన్నాయి. వాటికితోడు గూఢనామాలు కూడా ఉన్నాయి. ఈ పర్వంలో యథావకాశంగా ఒక్కొక్కరూ మూడు రకాల పేర్లతో సూచించబడుతుంటారు. కంకుడు, వలలుడు, బృహన్నల, దామగ్రంథి, తంత్రీపాలుడు, సైరంధ్రి అనే మారుపేర్లతో కథ నడుస్తున్నా వారి సహజ నామాలతో కథకుడు వారి చర్యలను వివరిస్తుంటాడు. ఇందులో ఒక విశేషం ఉన్నది. కంకుడు వృత్తికి సన్న్యాసి, మాటల ధోరణికి ధర్మరాజు, భీముడు వృత్తికి వంటలవాడు, మల్లుడు. కాని, చేష్టలకు భీమసేనుడు. బృహన్నలది చిత్రమైన అవస్థ. అతడు మారురూపంలో

పేడి. కాబట్టి పౌరుష కార్యాలకు పనికిరాడు. అంతఃపుర కన్యలకు నాట్యం నేర్పుతాడు. వేషానికి పేడిగా ఉన్నా రోషానికి అర్జునుడే. దామగ్రంథి, తంత్రీపాలుడు వృత్తులలో నిమగ్నులై ఉన్నా స్వీయప్రవృత్తులను రక్షించుకొనేవారే. అట్లాగే ద్రౌపది. ఆమె సేవావృత్తిలో సైరంధ్రి, మనఃప్రవృత్తిలో పాండవ పట్టమహిషి. పఠితలు మారురూపాలలో ఉన్న పాండవుల అసలురూపాలను భావిస్తుంటారు. పఠితలకు తెలిసిన రహస్యాలు విరాటపర్వంలోని ఇతర పాత్రలకు తెలియవు. వారు భీముడిని చూచి వలలుడని తలపోస్తారు. పఠితలు వలలుడిని చూచి భీముడని తెలిసి ఆనందిస్తారు. ఈ రహస్యం తెలియని పాత్రల అజ్ఞానానికి నవ్వుకొంటారు. అయినా వాళ్ళు పొందే అనుభవాన్ని కూడా పంచుకొంటారు. కాని, అది నిజం కాదనీ, పఠితలు పొందే అనుభవమే సత్యమని చిత్రంగా భావిస్తారు. ఈ ద్వంద్వానుభవమే ఆహ్లాదం.

కథాకథనంలో ఉత్కంఠా పరిపోషణం వలన ఆహ్లాదం కలుగుతుంది. విరాటపర్వంలో అడుగడుగునా వచ్చే అడ్డంకులను అజ్ఞాతవాసవ్రతం భగ్నం కాకుండా సమ్యగుపాయాలతో పాండవులు అధిరోహించటంలో ఉత్కంఠ పోషించబడింది. మల్లముఖ్యుడి సమస్య ఉత్కంఠకు అంకురారోపణం చేసింది. అతడిని భీముడు ఓడించటంతో అది ఉత్కంఠావహంగా ముగిసింది. కీచకుడు పాండవాజ్ఞాతవాసానికి ప్రళయంగా తారసిల్లాడు. పాంచాలి గుట్టు రట్టుకెక్కితే పాండవుల గుట్టు బయటపడ్డట్టే. సుదేష్ణ కపటోపాయం పరిస్థితిని తీవ్రతరం చేసింది. సభాసన్నివేశంలో ధర్మజ భీమ ద్రౌపదుల సంభాషణలు, చేష్టలు ఉత్కంఠకు ఉన్నత స్థాయిని కలిగించాయి. భీముడి వ్యూహం, ద్రౌపది నాటకం, కీచకోపకీచక రహస్య వధ ఉత్కంఠకు ఊపిరిపోశాయి. అవి గంధర్వుల చర్యలనే ప్రవాదం కథలో ఉత్కంఠా వాతావరణాన్ని బలంగా సృష్టించింది. దక్షిణోత్తర గోగ్రహణాలు పాండవ ప్రవాసానికి అగ్నిపరీక్షలు. ఆ రెండు ఘట్టాలూ ముగిసేంతవరకు పఠిత ఉత్కంఠతో ఊగిపోతాడు. పాండవులు బయలుమెరిసే ఘట్టం ఉత్కంఠావహం. ఉత్తరాభిమన్యుల వివాహం విరాటపర్వంలో ఉత్కంఠకు ఉపసంహారం. ఉత్కంఠతో పఠితకు ఊపిరాడని ఆహ్లాదం కలుగుతుంది. అది ఆనందం కాదు.

## 15. చతుర్థం విరాటపర్వం

మహాభారతంలోని అష్టాదశపర్వాలలో విరాటపర్వం నాలుగవది. వరుసలో నాలుగవది అనటంలో విశేషం లేదు. చతుర్థ శబ్దం వలన బుధజనులకు నాలుగు విశేషాలు స్ఫురిస్తాయి. 1. రాజనీతికి సంబంధించిన చతురుపాయాలలో చతుర్థమైన యుద్ధోపాయం గమ్యమానం. ఇది ఒక విధంగా సార్థకం. ఈ పర్వంలో పాండవ అజ్ఞాతవాస భంగ కారణాలైనవన్నీ యుద్ధంతోనే నివృత్తమౌతాయి, లేదా పరిష్కృతమౌతాయి. మల్ల, కీచక, ఉపకీచక యుద్ధాలు, దక్షిణోత్తర గోగ్రహణ యుద్ధాలూ అందుకు సాక్ష్యాలు. 2. రూపక నిర్మాణంలో అంకాలకు సంబంధించిన అర్థ విశేషం రెండవది. సామాన్యంగా సంస్కృతంలో పంచసంధులతో కూడిన ఇతివృత్తం గల నాటకం ఏడంకాలలో రచించబడుతుంది. అందులో చతుర్థాంకం గర్భసంధికి అనుకూలంగా ఉంటుంది. కాళిదాస మహాకవి రచించిన అభిజ్ఞానశాకుంతల నాటకంలో చతుర్థాంకం అత్యుత్తమమైనదిగా పరిగణించబడుతుంది. "కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా। తత్రాపి చ చతుర్థో-ంకః, తత్ర శ్లోక చతుష్టయమ్॥" అని ప్రసిద్ధి. అట్లాగే మహాభారతం ఒక నాటకమైతే అందులో విరాటపర్వం గర్భసంధిని నిర్వహించే చతుర్థాంకం వంటిది. ఇందులో పతాకస్థానీయులుగా కీచకుడు, సుశర్మ కనబడతారు. వారి కథలు స్వీయప్రయోజనాలను సాధిస్తూనే కథాకార్యానికి తోడ్పడతాయి. అర్థప్రకృతి అయిన పతాకతోపాటు ప్రాప్త్యాశ అనే కార్యావస్థ ఇందులో నిర్వహించబడుతుంది. కీచకసంహారం, సుశర్మతోడి, కౌరవులతోడి యుద్ధం అనేవి ప్రాప్త్యాశను చిత్రిస్తాయి. పాండవులు కీచక సంహారంతో గండం గడిచి బయటపడతారు; ఉత్తర గోగ్రహణ యుద్ధంతో గడువు గడిచి గట్టున పడతారు. కార్యం ఏమవుతుందో అనే ఉత్కంఠ గర్భసంధిలో బలంగా ఉండటం గమనార్హం. గర్భసంధ్యంగాలు కూడా ఇందులో సాంగంగా అన్వయించబడటం విశేషం. తిక్కన నాటకీయ శిల్ప ప్రౌఢికి చతుర్థాంకతుల్యమైన చతుర్థ పర్వనిర్వహణం చతురోదాహరణం. 3. చతుర్విధ రాజవిద్యలలో నాల్గవది దండనీతి. దానిని చిత్రించే ఘట్టాలు ఇందులో స్పష్టంగా కనబడుతున్నాయి కాబట్టి చతుర్థమనే పదం రాజవిద్యాపరంగా సార్థకమవుతున్నది. 4. వేదాంతపరంగా విరాటపర్వాన్ని మోక్షశాస్త్రంగా భావిస్తారు.

జీవుడు పురాకృత కర్మఫల భోగం కొరకు ఒక రూపాన్ని ఆశ్రయించి అందులో ఆ భోగాన్ని అనుభవించి చివరకు యోగంతో ఆ శరీరాన్నుండి జీవుడిని ముక్తుని చేసికొనటం మోక్షమంటారు. పాండవులు మారురూపాలతో తాము ప్రతిజ్ఞచేసిన అజ్ఞాతవ్రత రూపకర్మను అనుభవించి, అందులోనుండి దైవానుగ్రహంతో నిపుణంగా ముక్తులైన విధం చెప్పబడింది కాబట్టి, చతుర్థపురుషార్థతుల్యమైన కథ కలిగిందని తాత్త్వికపరంగా వ్యాఖ్యానించ వీలున్నది. తిక్కన వాడిన 'చతుర్థ' పదం పై విధంగా చతురమైన అర్థ చతుష్టయాన్ని స్ఫురింపజేస్తున్నది.

## 16. ఊర్జితకథోపేతం విరాటపర్వం

ఊర్జిత కథ అంటే బిగువు కలిగిన కథ, లేదా జిగిబిగి కల కథ - అని శ్రవ్యకావ్యపరంగానూ, ఇతివృత్తం well-knit plot అని దృశ్యకావ్యపరంగానూ అన్వయం చెప్పవచ్చును. సంవిధానబంధురమైనది శ్రవ్యకావ్యకథ; సంధి పంచక బంధురమైనది దృశ్యకావ్యకథ. ఈ రెండు లక్షణాలూ విరాటపర్వాని కున్నాయి. తిక్కనను ఉభయ కవిత్వ తత్త్వ విభవోజ్జ్వలుడిగా చేశాయి.

### సంవిధాన బంధురమైన కథ

శ్రవ్యకావ్యంలో బిగి సన్నివేశ సంవిధానాన్ని కార్యకారణబద్ధంగా నిబంధించటంలో స్పష్టమవుతుంది. దీనిని రెండు విధాలుగా గమనించవచ్చును:

**1. ఆశ్వాస విభాగం:** ధర్మరాజు ధౌమ్యుడి ఓదార్పుమాటలు విని తేరుకొని, తమ్ముల మనోధైర్యాన్ని గమనించి, ధర్మదేవత ఇచ్చిన వరాలతో మనసు దిటవు చేసికొని, 'నాకుఁజూడ మత్స్యనరపతి సద్ధర్మవర్తి, సుజనహితుఁ, డవార్యబాహుబలుఁడు గాన నతనిపాల నందఱుఁ దగవైన పనుల నిలుచు టభిమతంబు' (1.64) అని నిశ్చయించాడు. దాని కనుగుణంగా వారందరూ మెలగవలసిన పనులను నిశ్చయించుకొని కొలువులో సముచితంగా చేరారు. అంతటితో ఆ కార్యం ముగిసింది. ప్రథమాశ్వాసం కూడా ముగుస్తుంది. రెండవ ఆశ్వాసం భీముడు మల్లుడితో యుద్ధం చేసి అతడిని జయించటంతో ప్రారంభమై, కీచకుడిని సంహరించటంతో ముగుస్తుంది. మల్లుర ద్వంద్వయుద్ధం ఇందులోని సంవిధాన శిల్పం. జగదేకమల్లుడిని భీముడు బహిరంగంగానూ కీచకుడిని రహస్యంగానూ అద్భుతంగా చంపటం వలన ఉభయ మల్లవిద్యా ప్రదర్శనలతో ఒక సంవిధాన సౌష్ఠవాన్ని ద్వితీయాశ్వాసం సంతరించుకొన్నది. తృతీయాశ్వాసంలో దొమ్మియుద్ధం లేదా పలువురు వీరులతో చేసే యుద్ధాలు చిత్రించబడ్డాయి. ఉపకీచకుల వధలో ఒకడు పలువురిని చంపిన పద్ధతి, సుశర్మ తోడి యుద్ధంలో పలువురితో సంకుల, ద్వంద్వయుద్ధాలు చేసిన పద్ధతి వర్ణించబడి సజాతీయ యుద్ధ సన్నివేశ సంవిధానం సాధించబడింది. చతుర్థాశ్వాసం ఉత్తరుడు రథికుడుగా బృహన్నల సారథిగా యుద్ధయాత్ర ప్రారంభించటంతో మొదలవుతుంది. క్రమంగా బృహన్నల అర్జునుడుగా మారి రథికుడై, ఉత్తరుడిని సారథిగా చేసికొని భీష్మాదికురువీరుల కెదురు నడిచిన ఘట్టంతో ముగుస్తుంది. రథిక సారథులు వ్యత్యస్తమయ్యే వృత్తాంతం ఈ ఆశ్వాసానికి సంవిధాన చమత్కారాన్ని సంతరించింది. చివరిది పంచమాశ్వాసం. అర్జునుడు ఏకైక వీరుడై కౌరవ వీరులను నురుమాడటం ఇందులోని కథ. ముగింపులో ఉత్తరాభిమన్యుల వివాహం మంగళాంత సూచకం.

**2. ప్రబంధ మండలి :** శ్రవ్యకావ్యపరంగా తిక్కన మహాభారతాన్ని ప్రబంధ మండలిగా పేర్కొన్నాడు. ఒక కార్యం, ఒక నాయకుడు, ఒక రసం, ఒక విశిష్ట రచనాశైలి ఉన్నది ప్రబంధం. విరాటపర్వమంతా కలిసి ఒక ప్రబంధం కావచ్చును. లేదా, మూడు ప్రబంధాలు కావచ్చును. అవి- 1.కీచకవధ 2. దక్షిణగోగ్రహణం 3.ఉత్తరగోగ్రహణం. ఈ మూడు ఘట్టాలూ నిర్వహణలో ప్రబంధాలవంటివే. కీచకవధలో భీముడు నాయకుడు, యుద్ధవీరం ప్రధానరసం. దక్షిణ గోగ్రహణంలో నలుగురు పాండవులు నాయక స్థానీయులు, యుద్ధవీరం రసం. ఉత్తర గోగ్రహణంలో అర్జునుడు నాయకుడు, యుద్ధవీరం రసం. అనునాయకుల విజయాలన్నీ నాయకుడైన ధర్మరాజుకు అంగభూతాలవుతాయి. అనునాయక కార్యనిర్వహణ రూపాలైన ఈ మూడు ఘట్టాలూ మూడు ప్రబంధాల మండలిగా భావించవచ్చును. లేదా విరాటపర్వంలో పాండవులు ప్రదర్శించిన వీరం ధర్మజనాయకాశ్రితమై ఆరంభంలో మధ్యలో నిర్వహణంలో పోషించబడటం ప్రబంధశిల్పం. ఇది నిబిడ కథాసంవిధానం వలన సిద్ధించిన ప్రబంధ నిబంధనం. తిక్కన విరాటపర్వం కవితాశైలి రసాభ్యుచిత బంధం. వర్ణనాత్మక, ఆలంకారిక, నాటకీయ శైలుల త్రివేణీ సంగమం.

**3. సంధి పంచక బంధురమైన కథ**

ఊర్జితకథ అంటే దృశ్యకావ్య పరిభాషలో ఇతివృత్తం.
"ఇతివృత్తంతు నాట్యస్య శరీరం పరికల్పితమ్।
పంచభిః సంధిభి స్తస్య విభాగః సంప్రకల్పితమ్." (నాట్యశాస్త్రమ్ 10.1)

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికల్పితమ్" అనే పాఠాంతరం కూడా ఉన్నది. వృత్తమంటే కథ. ఇతివృత్తమంటే: పంచసంధులతో అలంకరించబడిన కథ. విరాటపర్వం ఒక నాటకమైతే అందులో అయిదు ఆశ్వాసాలూ వరుసగా అయిదు సంధులకు ఆలవాలాలై ఉన్నాయి. ప్రథమాశ్వాసంలో ముఖసంధి ఉన్నది. విరాటుడి కొలువులో పాండవులు అజ్ఞాతవాసవ్రతాన్ని నిర్వహించాలని సంకల్పించటం బీజం. పాండవులలో ప్రతివారూ విరాటుడి మనసు మెప్పించేటట్లు వర్తించాలని కార్యం ఆరంభిస్తారు. సేవలలో చేరి సేవిస్తారు. ఆరంభ బీజసంబంధం కలది ముఖసంధి. ద్వితీయాశ్వాసంలో ప్రతిముఖసంధి, భీముడు మల్లుడితో యుద్ధం చేసి ఓడించిన ఘట్టం బిందువు. దానివలన భీముడు శత్రుమర్దన క్రియకు ఉన్ముఖుడై ప్రధాన కథా ప్రయోజనానికి అడ్డం వచ్చిన శక్తులను తొలగించే ప్రయత్నంలో ఉంటాడు. కీచకుడు ద్రౌపదిని మోహించి, ఆమెను అవమానించినప్పుడు అతడిని సంహరించే తీవ్రయత్నానికి పూనుకొంటాడు. అందువలన ప్రతిముఖసంధి భాసించింది. మూడవ ఆశ్వాసంలో గర్భసంధి. కీచక సంహారార్థం ద్రౌపదీ భీములు ఒక పన్నాగం పన్నటం, అతడిని అర్ధరాత్రి నర్తనశాలకు రమ్మని సంకేతించటం, భీము డతడిని వంచించి చంపటం అనే కథలోనూ ఉపకీచకోదంతంలోనూ గర్భసంధి అలంకరించబడింది. కీచక వృత్తాంత వ్యాప్తి కారణంగా సుశర్మతో దక్షిణ గోగ్రహణ యుద్ధం జరగటం పతాక. ఫలం సిద్ధిస్తుందో లేదో అనే సంశయంతో కార్యయత్నం ఊగిసలాడినా చివరకు సంవత్సర నియమం ముగియటంతో ప్రాప్త్యాశతో గర్భసంధి సిద్ధించింది. దక్షిణ గోగ్రహణ యుద్ధ విజయానంతరం కథలో ప్రాప్త్యాశ ఏర్పడింది. నాలుగవ ఆశ్వాసంలో విమర్శ సంధి. ఇందులో ఉత్తరుడి కథ ప్రకరి వంటిది. అజ్ఞాతవాస నియమకాలం తీరటంతో అర్జునుడు నిజరూపం ధరించి కౌరవసేనలపై యుద్ధానికి పోవటం విమర్శ సంధి. పంచమాశ్వాసంలో నిర్వహణ సంధి అద్భుతంగా నిర్వహించబడుతుంది. అర్జునుడి యుద్ధవీరం, పాండవులు బయలు మెరయటం, అభిమన్యుడి వివాహం అనే ఘట్టాలలో కార్యం ఫలాన్ని పొందుతుంది. నాటక వస్తువు కెంతటి నిర్మాణ సౌష్ఠవం ఉండాలో అంతటి బిగువు కలిగిన కథ ఇందులో ఉన్నది.

తెలుగులో భారత నాటక కర్తలలో ముఖ్యులు తిరుపతి వేంకటకవులు. వారు భారత నాటకాలు వ్రాస్తూ విరాటపర్వకథను వదలివేశారు. ఎందువలన అంటే- అది స్వయం సమగ్రమైన రెండు మూడు నాటకాలుగా రచించదగిన ఊర్జితకథ కలది కావటమే. కీచక వధను, దక్షిణ గోగ్రహణాన్ని, ఉత్తర గోగ్రహణాన్ని వేరు వేరు నాటకాలుగా కొందరు రచించారు. భారత పాత్రలు మారు రూపాలు ధరించి చరించే ఈ పర్వం భారత నాటక స్రవంతిలో ఒదగటం కష్టం. అది దాని ప్రత్యేకత; ఒక రకమైన ఊర్జిత కథా స్వభావం.

విరాటపర్వంలో ఉపాఖ్యానాలు లేవు. మొదటి నుండి చివరి వరకు వేగంగా సాగిపోయే కార్యచైతన్యం కథను ఊర్జితం చేసింది. ఉజ్జ్వలం చేసింది.

## 17. ఊర్జిత కథలో ఒదిగిన నాటకీయత

విరాటపర్వం ఊర్జితకథతో బిగిని, నాటకీయతతో జిగిని సంతరించుకొన్నది. నిబిడమైన కథలో నిపుణమైన నాటకీయతను నింపి కావ్యశరీరానికి సంధిబంధ రూపసౌందర్యంతోపాటు అభినయబంధురమైన విలాసలావణ్యాలను ప్రదర్శించగల అభివ్యక్తి మాధుర్యాన్ని తిక్కన కల్పించాడు.

కథలో నాటకీయత ఆరు అంశాల నాశ్రయించి ఆవిష్కృతమౌతుంది.

1. కథా సన్నివేశాలను నాటకరంగాలుగా తోచేటట్లు రూపొందించటం - రంగపరికల్పనం.

2. పాత్రల సంభాషణలే కథకు ప్రాణం పోస్తున్నట్లు నిర్వహించటం - సంభాషణ శిల్పం.

3. మాట్లాడే పాత్రలు చతుర్విధాభినయంలో జీవిస్తున్నట్లు చిత్రించటం - చతుర్విధాభినయ ప్రదర్శన చాతుర్యం.

4. కథలో సహజంగా సాగే వర్ణనాంశాలను రూపక మర్యాదలుగా మలచటం - రూపక మర్యాదల రూపకల్పనం.

5. రసాభ్యుదయోల్లాసంతోపాటు రసాభ్యుచిత బంధాన్ని కూడా పోషించి రక్తి కట్టించటం - శ్రవ్యకావ్యశైలితో దృశ్యకావ్యశైలిని సమన్వయించటం.

6. ఉభయ కావ్యశిల్పాలనూ ఔచిత్య పోషకంగా ఉన్మీలింప చేయటం - ఉభయ కావ్యప్రౌఢి పాటించే శిల్పం.

వీటిని సమన్వయించుకొంటూ సమీక్షిస్తే తిక్కన రచనలో నాటకీయత సాక్షాత్కరిస్తుంది. అయిదాశ్వాసాల విరాట పర్వకథను విశ్లేషిస్తే ముప్పది రంగాల మహారూపకంగా తోస్తుంది. మూడు నాటకాల సంపుటిగా ముచ్చట కొలుపుతుంది. ఆ రంగాలలో పరిమాణాన్ని బట్టి చిన్నవి కొన్ని, అంకాలవలె పెద్దవి కొన్ని. స్వభావాన్ని బట్టి వాటిని సభారంగాలనీ, సమావేశరంగాలనీ, సంభాషణ రంగాలనీ, సమరరంగాలనీ సమీక్షించవచ్చును. పాత్రలను బట్టి ఏకపాత్ర, ద్విపాత్ర, బహుపాత్రరంగాలనీ విశ్లేషించవచ్చును. ప్రదర్శన ప్రవృత్తిని బట్టి స్థిరరంగాలనీ, చలద్రంగాలనీ, మిశ్ర రంగాలనీ వివేచించవచ్చును. వీటిలో స్థలకాలపాత్రలకు సంబంధించిన ఐక్యత్రయాన్ని సంభావించవచ్చును. వీటిలో కొన్ని సమాంతర నిర్మాణ, రసభావ, రచనా శిల్పాలను ప్రకటించేవిగా కనబడవచ్చును. శ్రవ్యకావ్యంలో ఒదగగలిగిన దశరూపక స్వభావ సన్నివేశాలను యథావకాశంగా విరాటపర్వంలో విశేషంగా సహృదయులు సందర్శించవచ్చును. ఇంత వైవిధ్యంతో కూడిన నాటకీయత ఈ పర్వంలోని ఊర్జిత కథకు ఉజ్జ్వలతను ప్రసాదించింది.

**(1) సభారంగ సప్తకం :** రాజు తీర్చిన కొలువు సభ. విరాటపర్వంలో విరాటుడు రాజు. అతడి పురంలో అజ్ఞాత జీవితం సాగిస్తున్నారు పాండవులు. సంవత్సరం గడిచేంతవరకు విరాటుడికి పాండవులు అంగభూతులు. అయినా వారు పరోక్షంగా విరాట నగర, సామ్రాజ్య రక్షకులు. వారి కథ కనుకూలంగా విరాటుడు అయిదుసార్లు సభ తీర్చిన ఘట్టాలను తిక్కన తీర్చిదిద్దాడు. ప్రతినాయకుడైన దుర్యోధనుడు, నాయకుడైన ధర్మరాజు తీర్చిన సభలను తుల్యబలంతో తిక్కన చిత్రించాడు. రంగాలలో సభారంగాలకు సమున్నత స్థానం ఉన్నది. అవి వట్టి సన్నివేశాలు మాత్రమే కావు; వస్తుధ్వనితో రసధ్వనిని పోషించటానికి తిక్కన వాడుకొన్న చక్కని శిల్ప సామగ్రులు.

**బయలి కొలువు :** పాండవులు మారురూపాలతో విరాటనగరంలో ప్రవేశించేటప్పుడు దైవయోగం వలన విరాటుడు బయలి కొలువు తీర్చి ఉన్నాడు. మూలంలో యుధిష్ఠిరుడు రాజసభలో ప్రవేశించినట్లున్నది. తిక్కన దానిని బయలికొలువుగా మార్చాడు. రాజసభలో మంత్రులచేత నిశ్చయించబడిన కార్యకలాపాలకు ప్రాధాన్యం ఉంటుంది. బయలి కొలువులో ప్రజలతో రాజుకు ముఖాముఖి ఏర్పడుతుంది. పాండవ ప్రవేశానికి బయలికొలువే సముచితం. నిండుకొలువులో రాజు మంత్రిమండలి సలహాలతో తీర్పులిస్తాడు. బయలి కొలువులో తానే స్వయంగా ఝటితి స్ఫూర్తితో నిర్ణయాలు తీసికొని అమలు చేస్తాడు. కథకు కావలసింది ఈ రెండో మెలకువే. అందువలన పాండవులకూ విరాటుడికీ మాత్రమే సంభాషణలు నడుస్తాయి. కథ వేగవంతమవుతుంది. తిక్కన మార్పు సన్నివేశౌచిత్యానికి చక్కని ఒరవడి.

తిక్కన సభను కల్పించటంలో ఎట్లా చొరవ తీసికొన్నాడో, దానిని నిర్వహించటంలో కూడా మూలం కంటె ముందుచూపుతో శ్రద్ధ తీసికొన్నాడు. దానిని నాలుగు అంశాలలో మనం గమనించవచ్చును. 1. విరాటుడిలో సాత్త్విక సంస్కారాన్ని సముచితంగా పోషించటం. 2. పాత్రోచిత చతుర్విధాభినయాలను చిత్రించటం. 3. పాండవుల ప్రవేశ క్రమాన్ని మూలంలో కంటె భిన్నంగా సంఘటించటం 4. భావికథార్థ సూచనలతో ఉభయకావ్యప్రౌఢి పాటించే శిల్పాన్ని ప్రదర్శించటం.

విరాటుడు ఆనాడు బయలి కొలువు తీర్చటం దైవనియోగం. ఇది తిక్కన ఆ రంగావహనకు ఇచ్చిన అన్వయ సూత్రం. ఈ రంగంలో వ్యవహరించే పాత్రలన్నీ దేవు డాడించే పాత్రలు. పాండవు లజ్ఞాతంగా విరాటుడి కొలువులో ఉండాలి. మారురూపాలలో ఉన్నా పాండవులు మహిత సముజ్జ్వలాకృతులు. వారి ఆకారాలను చూచిన విరాటుడు వారందరూ మహారాజయోగానికి అర్హులని భావిస్తాడు. వారి పుట్టుపూర్వోత్తరాలను గురించి గుచ్చి గుచ్చి అడుగుతాడు. తన రాజ్యాన్ని సైతం ధర్మజాదులకు ఇచ్చుకొనటానికి సిద్ధమౌతాడు. వారందరూ ధర్మరాజు కొలువులో ఉండి ఆయన ప్రశంస లందుకొన్నారని చెప్పుకొన్నా, వారు అయిదుగురు ఆ రోజే వరుసగా తన కొలువులో చేరినా, అతడు వారిని పాండవులని గుర్తించలేకపోయాడు. ఆ తరువాత సుదేష్ణ, కీచకుడు సైతం వారిని పాండవులుగా, సైరంధ్రిని ద్రౌపదిగా గుర్తించలేకపోయారు. ఇది కూడా దైవనియోగమే. మారురూపాలతో ప్రజల మధ్యకు వచ్చిన పాండవులను ప్రజలూ, రాజూ గుర్తించలేకపోయారనటం భావికథాగతికి ధ్వని సంకేతం. దుర్యోధనుడి చారులుకూడా వారిని మారురూపాలతో గుర్తించలేకపోయారు. వారి వీరకృత్యాలవలన మాత్రమే దుర్యోధనుడు అనుమానించగలిగాడు. పాండవులను గుర్తించగలిగినవారు ఆ కాలంలో ఒకరో ఇద్దరో ఉన్నారు. వారు భీష్ముడు, ద్రోణుడు. వారు రంగంలో ప్రవేశించేంతవరకు పాండవులకు భయం లేదని వస్తుధ్వని.

మూలంలో విరాటుడు నిర్మల హృదయుడు, సంస్కారవంతుడు. తిక్కన చిత్రించిన విరాటుడు సాత్త్వికగుణ సంపన్నుడేకాక, సాత్త్వికాభినయ సమర్థుడు. వ్యక్తుల రూపరేఖలను చూచి వారి జాతకాలను చెప్పగలిగిన గడుసరి. ఎంత ఉత్తముడో అంత ఉద్విగ్న హృదయుడు. తెలిసి తెలిసి ఎవరికీ అపకారం చేసేవాడు కాడు. ధర్మజుడే అన్నట్లు అతడు అక్షరాలా సద్ధర్మవర్తి, సుజనహితుడు. అయినా అవార్యబాహుబలుడు. బయలి కొలువులో విరాటుడి చేష్టలు ఈ లక్షణాలన్నిటికీ అభినయ వ్యాఖ్యలు.

విరాటుడు - సన్న్యాసి రూపంలో వస్తున్న ధర్మరాజును చూచి త్రిమూర్తులతో పోల్చాడు. త్రిజగాలనూ ఏలదగినవాడన్నాడు. మూర్ధాభిషిక్తులు మ్రొక్కదగిన పాదపద్మాలు గల సమ్రాట్టుగా ఉన్నాడని ఊహించాడు. మహాత్ముడని ప్రశంసించాడు. మత్స్యరాజ్యాన్నంతా అతడి కిచ్చినా తక్కువే అనుకొన్నాడు. ప్రజలందరూ అతడిని చూచి ప్రత్యుత్థానం చేస్తే, తానూ లేచి, గద్దియ దిగి నమస్కరించి, ఆయన ఇచ్చిన ఆశీస్సులను పొందాడు. ధర్మరాజును సముచిత సమున్నతాసనం మీద కూర్చుండబెట్టాడు. వినయంతో కుశల ప్రశ్నలు ప్రారంభించాడు. మూలంలోని విరాటుడికి ఇంత భక్తిశ్రద్ధలూ, వినయవివేకాలూ లేవు. తెలుగు విరాటుడి మనస్సులో మొదట ధర్మరాజు చిత్రాన్ని ఇట్లా ముద్రించాడు కాబట్టే, ఆ తరువాత అజ్ఞాతవ్రతాంతంలో ధర్మరాజును గుర్తించి అతడు నిశ్శంకగా- 'వినయంబు మిగులఁ గుంతీతనయాగ్రజు పాదపీఠతలమున ఫాలంబును బొందఁ జాఁగిమ్రొక్కి యతని కౌఁగిలి వడెసె సమ్మదము తళుకొత్తన్' **(5.340)** అని తిక్కన చెప్పాడు. బయలు మెరిసిన ధర్మరాజును మ్రొక్కిన విజ్ఞతకూ, అతడి కౌగిలి పొందగలిగే యోగ్యతకూ తగిన బీజాలను విరాటుడి హృదయక్షేత్రంలో ఈ కొలువులోనే నాటాడు తిక్కన. దానితో తిక్కన చెక్కిన చైతన్యశిల్పమయ్యాడు విరాటుడు.

విరాటుడిలో సాత్త్వికభావస్పందన సాంద్రంగా స్ఫురిస్తుంది. మదించిన ఏనుగు వలె వస్తున్న వలలుడిని చూచి విరటుడు ఉలికిపడ్డాడు. వెక్కసపడ్డాడు. అతడి విపుల వక్షఃస్థలాన్ని చూచి పరవశించాడు. భూతలానికి దిగివచ్చిన సూర్యుడో చంద్రుడో అని ఊహించాడు. భీము డంగీకరించగా హర్షోత్కర్షంతో మనసులో పొంగిపోయాడు. పేడిరూపంలో దాగి ఉన్న అర్జునుడి సహజ వీరలక్షణాలను లోలోన భావించి తన కోదండాన్నీ రథాన్నీ ఇవ్వటానికి సిద్ధమయ్యాడు. బృహన్నల శాపవృత్తాంతం విని విషణ్ణహృదయుడైపోయాడు. ముద్దులు మూటకట్టే తన కూతురు ఉత్తర నిండుసభలో తనకు మ్రొక్కితే విరాటుడు ఉబ్బిపోయాడు. కూతురును మక్కువతో దగ్గరకు తీసికొన్నాడు. ఆమె మొగంలో తన మొగముంచి కళ్ళారా చూచాడు. మునివేళ్ళతో ఆమె ముంగురులు సవరించాడు. పులుకుపులుకున చూచాడు. శిరోజాలను వాత్సల్యంతో స్పృశించాడు. విరాటుడికి ఏ భావమైనా అరకొరగా రాదు. గట్లు పొంగేటట్లు ప్రవహిస్తుంది. బృహన్నల చేతిలో ఉత్తరను ఉంచుతూ అంపకాలప్పుడు ఆడపిల్లను అత్తమామల చేతులలో పెడుతున్నంత ఆర్భాటం చేశాడు. కూతురిని గురుకులానికి పంపుతున్నంత సంబరపడ్డాడు. నకుల, సహదేవులకు వారు కోరుకొన్న ఉద్యోగాలిచ్చి మనసులో తృప్తిపడ్డాడు. మూలంలో విరాటుడికి ఇంతటి నాగరకమైన అభినయ నైపుణ్యం లేదు. ఇది విరాటుడికి తిక్కన నేర్పిన నాట్యవిద్య.

రూపాలూ వేషాలూ మారి సాక్షాత్తూ రూపకంలోని నటులవలె రంగప్రవేశం చేసిన పాండవులను అటు వ్యాసుడూ, ఇటు తిక్కనా అభినివేశంతో వర్ణించారు. వ్యాసుడు పాండవుల రూపవేషాల వివరాలను తెలుపుతున్నట్లు వర్ణించగా, తిక్కన ఒక క్రమపద్ధతిలో పాత్రోచిత వేషధారణను అమర్చాడు. తిక్కన వేషాలంకరణమర్మజ్ఞుడుగా పాత్రలను చిత్రించి ఆంగికాభినయాన్ని సాంగంగా సాక్షాత్కరింపజేశాడు. దానికి తోడు పాత్రోచిత విశిష్టాభినయ ముద్రలను (manarisms) తిక్కన మేళవించాడు. దానితో పాత్రోచితాభినయం చేయగలిగిన సుశిక్షిత నటులుగా తెలుగులో వెలుగొందారు. వారి సమున్నత రూప వైభవాలకు అనుగుణంగా సీసపద్యాలను, వృత్తాలనూ వాడి తిక్కన ఛందోమయమైన శిల్పాలంకారాన్ని సంతరించాడు. ధర్మజ భీమార్జున ద్రౌపదుల రూపాలూ, ఉత్తర సౌందర్యం సీసపద్యాలలో చిత్రించటం విశేషం. తిక్కన పాత్రలకు వలెనే సీసపద్యాలకు కూడా క్రమాలంకార సంస్కృతిని అలవరచాడు.

మూలంలో ధర్మరాజాదులు మాట్లాడుతున్నప్పుడు వారికి అసత్యదోషం కలుగకుండా శ్లేషార్థ విశిష్టపద ప్రయోగాలతో వాచికాభినయాన్ని సాగించాడు వ్యాసుడు. అది ఋషి అయిన వ్యాసభట్టారకుడు పాండవులలో సత్యనిరతిని కాపాడటానికి చేసిన ఉదాత్త ప్రయత్నం. సంస్కృత శబ్దాలలోని వ్యుత్పత్తిమూలకమైన శ్లేషను తెలుగులోనికి తెచ్చి తెలుగుదనాన్ని తగ్గించ తలచుకొనలేదు తిక్కన. తాను చేస్తున్న ఈ మార్పును విజ్ఞులు విమర్శిస్తారని ముందే ఊహించి ధర్మరాజుతో మన ముందరికాళ్ళకు బంధాలు వేయించాడు.

ఆ. "ఉన్నరూప పలుకు నన్నరు లెక్కడఁ। గలరు? తోఁచినట్లు పలుకు పలుక
నైన చందమయ్యె; నంతియకా కంత। పట్టి చూడఁగలరె యెట్టివారు?' ' (విరా.1.191)

ఈ మాటలు నాలుగు ప్రయోజనాలు సాధిస్తున్నాయి. సన్న్యాసి రూపంలో ఉన్న ధర్మరాజు వేదాంత ధోరణిలో పలుకుతున్నట్లు పాత్రోచిత సంభాషణను చిత్రించటం ఒక ప్రయోజనం. శ్లేష నాశ్రయించి నిజం పలికినట్లు చిత్రించటం మానవ పాత్రల సహజ స్వభావం కాదని తిక్కన భావించినట్లు చెప్పటం రెండవ ప్రయోజనం. ఒకవేళ కవిత్వంలో శ్లేషమయంగా పాండవులు మాట్లాడినట్లు రచించినా పాఠకు లంత సులభంగా అర్థం చేసికొనలేరని తిక్కన భావించటం మూడవ ప్రయోజనం. తిక్కన ఒక పద్యంలో ఏదైనా విశేషాన్ని నిక్షిప్తం చేసి చెప్పితే దానిని తరువాతి పద్యంలోనూ వచనంలోనూ సూచించటం పరిపాటి. అందువలన ఈ శ్లేషోక్తులను తిక్కన మన్నించి ఉండకపోవచ్చును. ఈ మూడే కాక, నాటక శిల్పమైన మరొక ప్రయోజనాన్ని ఉద్దేశించి ధర్మరాజుచేత ఈ మాటలు తిక్కన పలికించి ఉండవచ్చును.

"మృదు లలిత పదాఢ్యం, గూఢశబ్దార్థహీనమ్। జనపద సుఖబోధ్యం, యుక్తిమ న్నృత్యయోగ్యమ్
బహుకృత రసమార్గం, సంధి సంధానయుక్తమ్। స భవతి శుభకావ్యం, నాటక ప్రేక్షకాణామ్"

అన్న భరతుడి వాక్యం తిక్కనకు కొలమానంగా నిలిచి ఉంటుంది. అందువలన మూలంలో కంటె భిన్నంగా పాండవ పాత్రలు శ్లేషను పరిత్యజించేటట్లు తిక్కన చేశాడు. శ్లేషను వదలినా ఉభయ కావ్య శిల్పాన్ని వదలుకొనేటట్లు చేయలేదు. మచ్చుకు ధర్మరాజు వాక్య విన్యాసాన్ని సమీక్షిద్దాం.

మూలం:"యుధిష్ఠిర స్యాస మహం పురా సఖా। వైయాఘ్రపద్యః పునరస్మి బ్రాహ్మణః
అక్షాన్ ప్రవప్తుం కుశలో-స్మి దేవితా। కఙ్కేతి నామ్నాస్మి విరాట విశ్రుతః" (సం.4-6-10)

నేను పూర్వం యుధిష్ఠిరుడి చెలికాడినని ప్రకృతార్థం. నీకూ యుద్ధంలో స్థిరంగా తోడుగా ఉంటానని శ్లేషార్థం. వ్యాఘ్రపాదగోత్రం వాడినని ఒక అర్థం. యముడి కొడుకునని శ్లేషార్థం (వ్యాఘ్రం వలె ప్రాణులపై పడేవాడు వ్యాఘ్రపదుడు - అంటే యముడు. అతడి కొడుకు వైయాఘ్రపద్యుడు). నేను బ్రాహ్మణుడనని ప్రకృతార్థం. బ్రాహ్మణుల కోర్కెలను విరివిగా

తీర్చేవాడనని రెండో అర్థం. కంకుడంటే యముడనే అర్థం కూడా ఉంది కాబట్టి ధర్మరాజనే అర్థం గూఢంగా స్ఫురిస్తుంది. పాచిక లాడటంలో నేర్పరి కావటం అనే వాక్యంలో శ్లేషేమీ లేదు. 'అక్షాన్ ప్రయోక్తుం కుశలః' అనే అంశం విరాటుడికి కావలసింది. అందులో గూఢార్థంగానీ, శ్లేషార్థం కాని లేదు కాబట్టి, దానిని తెలిసికొని ధర్మరాజును అతడు మన్నించాడు. మిగిలిన మాటలలోని శ్లేషలన్నీ అక్కడ నిరర్థకాలే అయిపోయాయి. అందువలన శ్లేషమూలక ధ్వనిని తిక్కన మన్నించక సన్నివేశానికి 'తోచినట్లు పలుకు పలుకనైన' చందాన్ని అనుసరించాడు. తిక్కన తన మనసులోని మాటను ధర్మరాజుచేత చెప్పించి మిగిలిన పాండవులందరిదీ అదే బాట అని ధ్వనింపజేశాడు.

తిక్కన పలికించిన మాటలు శ్లేషలు కావు; వ్యంగ్యాలు. నేను ద్విజుడ నన్నాడు. ద్విజశబ్దం బ్రాహ్మణ క్షత్రియ వాచి. కురువిషయ జాతుడన్నాడు. పూర్వకాలంలో గోత్రం చెప్పటం పరిపాటి. తిక్కన కాలంలో దేశం చెప్పితే చాలు. సుజనప్రియుడట! అందుకే విరాటుడి వద్దకు వచ్చాడని భావం. ధర్మసుతు సఖుడు కావటం వలన ఉత్తముడని ధ్వని. సన్న్యాసాశ్రమంతో కూడి ఉన్నాడట. ప్రస్తుత సన్న్యాసి వేషం ఒక ప్రయోజనంతో కూడి ఉన్నదని వ్యంగ్యం. రాజులకు కావలసిన బహు వినోదాలు కంకుడికి తెలుసునట. ఆ మాట విరాటుడికి ఆసక్తి కలిగించేది. ద్యూతక్రీడ తెలుసట కాని, బంధువులతో మోసగించబడటం చేత దానిమీద విరక్తిగలిగి దేశం వదలి లేచివచ్చాడట! అందువలన పందెం లేని జూదమే ఆడతాడట! ధర్మపరుల స్నేహంతో రాజనీతి విద్యలో కొంత పరిచయం ఉన్నదట! పేరు కంకుడట! తెలుగులో కంకుభట్టు మూలంలో కంటె ఎక్కువ మాట్లాడాడు. అయినా ప్రతి మాటా విరాటపర్వంలో భావికథలో అతనివృత్తంలో సత్యమయ్యేటట్లు మాట్లాడాడు. భావికథార్థ వ్యంజకమైన పతాకస్థానాన్ని తన మాటలతో రూపకమర్యాదలలో నిలుపగలిగాడు. వ్యాసుడి ధర్మరాజు సత్యసంధుడు, తిక్కన ధర్మరాజు వాక్యనిపుణుడు.

ఇట్లాగే భీమాదుల మాటలూ సాగాయి. తిక్కన వారి మాటలకు వాస్తవరక్తినీ వ్యంజనా శక్తినీ ప్రసాదించాడు. అజ్ఞాతవాసంలో పాండవులు పెట్టుకొన్న పేర్లు మూలంలో కంటె తెలుగులో కొన్ని మారాయి. దీనిని గురించి జనహితవ్యాఖ్య ఇట్లా పేర్కొన్నది. "మూలంలోనూ, తెలుగులోనూ కొన్ని పేర్లు యథాతథంగా ఉన్నాయి. కొన్ని మార్పు చెందాయి. కారణం ఏమిటో! సంస్కృతంలోని పేర్లకు వ్యాఖ్యాతలు అర్థాలు వ్రాశారు. తెలుగులోని పేర్లకు అంతగా అర్థం కొన్నిట కుదరటం లేదు.

ధర్మరాజు- (సం) కంకః (తె) కంకుడు, కంకుభట్టు; కంకుడంటే యమధర్మరాజు, ఇతడు అతని కొడుకు. "ఆత్మావై పుత్ర నామాఽసి'' - అందుచేత అతడూ కంకుడే. భీముడు - (సం) వల్లవః వలలుడు, వల్లవః అంటే వంటవాడని అర్థం. కాని, తెలుగులో ఆ అర్థం ఉందా? పరిశీలించాలి. అర్జునుడు - (సం) బృహన్నలః (తె) బృహన్నల, బృహత్= కప్పబడే, నలః- రలయో రభేదః, నరః=అర్జునుడు; ప్రచ్ఛన్నవేషంలో ఉన్న అర్జునుడు. నకులుడు- (సం) గ్రన్థికః (తె) దామగ్రంథి. గ్రంథమనగా ఆయుర్వేదము. అది ఎరిగినవాడు గ్రన్థికుడు. ఈ అర్థము అశ్వినీదేవతల కుమారుడుగా సముచితము. సహదేవుడు - (సం) తన్తిపాలః; (తె) తంత్రీపాలుడు. తన్తి= గోశాస్త్రజ్ఞానం; దీనితో ఆవుల్ని రక్షించేవాడు అని సంస్కృతంలో అర్థం. కాని, తెలుగులో ఒక రేఫం అదనంగా చేరింది. దీని కర్థం అదే అవుతుంది. సంస్కృతంలో తన పేరు అరిష్టనేమి-అని సహదేవుడు చెప్పుకొంటాడు. ఈ రెండు పేర్లు ఏమిటో? ద్రౌపది- (సం) మాలినీ; (తె) మాలిని - మాలలు కూర్చేది. పాండవుల రహస్య వ్యవహారానికి పేర్లు రెండింటా సమానమే. అవి వరుసగా జయ, జయంత, విజయ, జయత్సేన, జయద్బల-అనేవి'' (పు.1.245, 246)

విరాటుడి బయలుసభకు తుల్యంగా సుదేష్ణ బయలుసభ చిత్రించబడింది. ఆమె అంతఃపురం నుండి బయటకు వచ్చి ఒక భవనోపరితలంమీద చివర నిలిచి బయటి బజారులోకి చూస్తుండగా ద్రౌపది కనబడుతుంది. ఆకర్షితురాలై ఆమెను చెలితో తన కడకు పిలిపించుకొంటుంది. అంతఃపురోచితమైన బయలు సభ. ఎంత చక్కని సామ్యం! సైరంధ్రిగా ద్రౌపది తనను పరిచయం చేసికొంటూ తన కైదుగురు గంధర్వులు పతులని చెప్పుకొన్నది. పతివ్రతలుగా వాసికెక్కిన సైరంధ్రీజాతి వనిత నని చెప్పుకొన్నది. సత్యాన్ని మనోహరంగా చెప్పికొని అజ్ఞాతవాసాన్ని విజ్ఞతతో నడుపుకొన్న ద్రౌపది ఈ రంగానికి అనుబంధమైన ఉపరంగంలో పాత్రోచితంగా ప్రవర్తించింది.

విరాటుడి కొలువులో పాండవులు జ్యేష్ఠానుపూర్విగా ప్రవేశించారు. ఆ తరువాత ద్రౌపది సుదేష్ణ అంతఃపురంలో ప్రవేశించినట్లు తోస్తుంది. అయినా, ఈరెండు సన్నివేశాలూ సమాంతరంగా జరిగాయి. కాని, కథాకథనంలో క్రమం పాటించాడు తిక్కన. విశేషమేమంటే-తిక్కన వర్ణించిన తీరు కుంభకోణప్రతిలో తప్ప మిగిలిన సంస్కృతభారత ప్రతులలో కానరాదు. కాబట్టి భండార్కర్ ప్రతిని బట్టి చూస్తే ఈ కల్పన అమూలకం. అయినా, దీని కొక ఆధారం ఒక సంస్కృత ప్రతిలో ఉన్నది. కాబట్టి కల్పిత మనటానికి వీలులేదు. కాగా, తిక్కన ఈ కల్పననే సమర్థించాడని భావించాలి. భండార్‌కర్ ప్రతిలో పాండవులు - ధర్మరాజు, భీముడు, ద్రౌపది, సహదేవుడు, అర్జునుడు, నకులుడు - అనే క్రమంలో విరాటుడి కొలువులో ప్రవేశించినట్లున్నది. ఇది వ్యూహాత్మకంగా చేసిన ప్రవేశం కావచ్చును. ధర్మరాజు ముందు మార్గం చూపాలి. అతడు నగరిలో ప్రవేశించిన తరువాత అతడికి రక్షాకవచంవలె భీముడు ప్రవేశించాలి.వరుసలో పాండవ పట్టమహిషి సురక్షితంగా సుదేష్ణ అంతఃపురంలో చేరాలి. అంతవరకూ అర్జునుడు ఆమెకు అండగా గుప్తంగా ఉండాలి. ఆ సంధికాలంలో చిన్నవాడైన సహదేవుడు విరాటుడి కొలువులో కుదురుకొనాలి. ఆ తరువాత పేడిరూపంలో ఉన్న అర్జునుడు అంతఃపుర ప్రవేశాన్ని పొందగలగటం జరుగుతుందా? లేదా? అని పరిశీలించాలి. అది ధ్రువపడిన తరువాత నకులుడు ప్రవేశించాలి. పాండవులలో ధర్మరాజు తరువాత నకులుడికి ఒక ప్రత్యేక స్థానమున్నది. మాద్రేయులలో అతడు ప్రథముడు. పెద్ద కొడుకులు చేసే పనులు ఏవైనా చేయవలసి వస్తే ధర్మరాజు నకులుడినే ప్రయోగిస్తాడు. యక్షప్రశ్నల ఘట్టంలో ఆ పనే చేశాడు. పాండవులలో ఇద్దరే బ్రతికి ఉండవలసిన అవసరం వస్తే ధర్మజుడి తరువాత నకులుడే ఉండాలి. ఈ ధర్మాన్ని ఆశ్రయించి ధర్మజాదులందరూ విరాటుడి కొలువులో సురక్షితంగా చేరారన్న విషయాన్ని ధ్రువపరచుకొన్న తరువాతే నకులుడు ప్రవేశించటం లౌకిక వ్యూహాన్ని అనుసరించి సమంజసం. అయితే ఈ వ్యూహంవలన కథలో ఎటువంటి విశిష్ట ప్రయోజనం సాధించబడటం లేదు. కథకు నిబిడబంధం ఏర్పడటం లేదు. తిక్కన అందుకే దీనిని గ్రహించలేదు.

పాండవులు జ్యేష్ఠానుపూర్విగా ప్రవేశించటంతో కథలో ఐక్యత సాధించబడింది. పాండవులు తాము అజ్ఞాతవాసంలో ఎట్లా మెలగాలని భావించి ఏ క్రమంలో ఆ అంశాన్ని ఆవిష్కరించారో ఆ క్రమమే ఇక్కడ పాటించబడింది. రెండవ ఆశ్వాసంలో ద్రౌపది, అయిదవ ఆశ్వాసంలో అర్జునుడు పాండవులను జ్యేష్ఠానుపూర్విగానే పరిచయం చేశారు. తిక్కన ఆ పద్ధతినే ఇక్కడ పాటించాడు. వా రేవరుసలో వచ్చినా ఇతరులు గుర్తించలేని విధంగా యమధర్మరాజు వరం వారికి ఉండటం దైవనిర్ణయం. అట్లని తిక్కన పాండవ పురుషకారాన్ని తక్కువ చేయలేదు. ప్రయోజనం లేని వ్యూహాన్ని ప్రవేశపెట్టలే దంతే!

ఎందువల్లనంటే - పాండవులు బయలు మెరయటంలో మొదట అర్జునుడు నిలుస్తాడు. కాని, విరాటుని ఎదుట ధర్మరాజుతో కలిసి వస్తాడు. దీనికీ మూలప్రతిలోని ప్రవేశక్రమానికీ పొత్తు కుదరలేదు. ఇక కౌరవుల ఆలోచనలో ధర్మరాజున్న దేశం గోసంపదతో వర్ధిల్లుతుందని భీష్ముడు చేసిన సూచన విరాటనగరంలో పాండవులుండ వచ్చునన్న ఊహకు ఊపిరిపోసింది. ఒక స్త్రీ కారణంగా గంధర్వుడు కీచకుడిని వింతగా చంపాడన్న వార్త భీముడినీ, ద్రౌపదినీ గుర్తించటానికి తోడ్పడింది. ఆ తరువాత ఉత్తరగోగ్రహణంలో అర్జునుడిని గుర్తించటం కుదిరింది. మూల భారతం - ఈ క్రమాన్ని ధ్వనింపజేసేటట్లు ప్రవేశక్రమాన్ని కల్పించిందని భావించినా ధర్మజ భీమ ద్రౌపదుల ప్రవేశం తరువాత సహదేవ నకులుల నడుమ అర్జునుడిని ఎందుకు పేర్కొన్నదో తెలియటం లేదు. అందువలన తిక్కన వీటన్నిటికంటె పాండవుల ధర్మశీలాన్ని తెలిపే జ్యేష్ఠానుక్రమమే ఔచిత్యమని భావించి ఉండవచ్చును.

దీనికి తోడు మరొక బలమైన కారణం కూడా ఉన్నది. తిక్కన దేశీయ దృక్పథం కలవాడు కాబట్టి ఉత్తరాది ప్రతుల కంటె దక్షిణాది ప్రతులలో కానవచ్చే విశేషాలకే ఆయన ప్రాముఖ్యమిస్తాడని విమర్శకులు భావిస్తారు. మచ్చుకు ఆచార్య వి.రామచంద్రగారి ఈ పరిశీలన గమనించతగింది.

"శ్రీ పి.పి.యస్.శాస్త్రిగారి దాక్షిణాత్యప్రతియే ఔత్తరాహిక ప్రతికంటెఁ దిక్కన భారతమునకుఁ జేరువగా నున్నదని చెప్పుట కాధారములైన కొన్ని యంశముల నిదే విరాటపర్వమునుండి యుదాహరించుచున్నాను.

(1) పాండవులు విరాట నగరము సొచ్చుటకు మునుపు ధర్మరాజు దుర్గాస్తవ మొనర్చినట్లు ఔత్తరాహప్రతిలో నున్నది. ఇది తిక్కన భారతములోఁగాని, దాక్షిణాత్య సంస్కృత ప్రతిలోఁగాని లేదు.

(2) అర్జునుడు కౌరవులతో మార్కొనునప్పుడు అతని యుద్ధమును జూచుటకు దేవేంద్రాదు లమరావతి నుండి విమానస్థులై వచ్చి యాకాశవీథిలో నదృశ్యులై నిలిచినట్లు దాక్షిణాత్యప్రతి యభివర్ణించుచున్నది. (అధ్యా. 62 శ్లో. 1-24). ఈ విషయః మతిసంక్షిప్తముగానే యైనను దెలుఁగు భారతములోఁ గన్పడుచున్నది. ఇది యౌత్తరాహిక ప్రతిలో లేదు.

(3) దాక్షిణాత్యప్రతిలో భీమార్జునులు రహస్యముగా ధర్మరాజును గలిసికొనుటయు, విరాటాదులను జంపెదమనుటయు, ధర్మజుఁడు వారిని వారించుటయు వర్ణింపబడియున్నవి. (అధ్యా. 63. శ్లో. 94-112). ఇది తెలుగు భారతములో నున్నది. ఔత్తరాహిక ప్రతిలో లేదు.

(4) తెలుగు భారతములో నుత్తరుఁడు అర్జునున కుత్తర నిమ్మని విరాటునికి బోధించుటయు, వల్లెయని విరాటు డంగీకరించుటయు నుల్లేఖింపబడియున్నది. ఇది దాక్షిణాత్యప్రతిలోనే గాని (అధ్యా.65) యౌత్తరాహిక ప్రతిలో లేదు.

(5) తెలుగు భారతములో దుర్యోధనుడు పాండవుల యగపాటు సమయకాలము ముగియకమునుపే జరిగెనేమో తెలిసికొనుటకై ధర్మరాజుకడ కొక దూతను బంపును. అత డా దూతకు సమయాబ్దములు నిండెనని చెప్పి పంపును. ఈ విషయము సంస్కృతమున దాక్షిణాత్యప్రతిలోనేగాని (అధ్యా.66) ఔత్తరాహిక ప్రతిలో లేదు.

(6) పాండవు లాయుధములను శమీవృక్షమున నిక్షేపించి, విరాట నగరమున కేగుటకు మునుపు యమునిఁ బ్రార్థించి యెవరికి వలసిన వేషములను వారు ధరించినట్లు తెలుఁగు భారతములో నున్నది. ఇది దాక్షిణాత్య ప్రతిలోఁ గలదు. (అధ్యా 7.శ్లో.3-10). ఔత్తరాహిక ప్రతిలో నీ ప్రసక్తియే లేదు. ఇంకను గావలెనన్నచో నిట్టి విషయము లనేకములు చూపవచ్చును" (తిక్కన కవితా శిల్పము. పు.9-10). ఇటువంటి తిక్కన దేశీయదృక్పథమే పాండవ ప్రవేశ ఘట్ట రచనకు కూడా దోహదమై ఉండవచ్చును.

తిక్కన తీర్చిన సభారంగాలన్నీ సన్న్యాసిగా ప్రవేశించిన ధర్మరాజు సమ్రాట్టుగా బయలు మెరయటానికి ఏర్పాటైన శిల్పసోపానాలుగా అమరటం విశేషం. బయలి సభలో ధర్మజుడు విరాటుడిని ఆశ్రయించినట్లు పైకి తోచినా విరాటుడే ధర్మజుడికి నమస్కరించి ఆశీస్సులను పొందినట్లు చిత్రించటం అత డున్న పూజ్యస్థానానికి వ్యంజకం. భీమాదులు ధర్మజుడి కొలువులోని వారమని చెప్పుకొన్నప్పుడు విరాటుడు నిస్సంశయంగా వారిని కొలువులో చేర్చుకొనటం ధర్మరాజుకు విరాటుడి హృదయంలో ఉన్న గౌరవ స్థానానికి సంకేతం. రెండవ సభలో కీచకుడి దుష్ప్రవర్తనాన్ని చూచి, సైరంధ్రి ప్రశ్నలకు సమాధానం చెప్పలేక విముఖుడై నిష్క్రమించిన విరాటుడి కొలువులో ప్రభువు తరువాతి ప్రభువువలె మాట్లాడాడు ధర్మరాజు. కీచకుడి వలన విరాటుడు గ్రహణం పట్టాడు. ఆ దురవస్థ నుండి అతడిని ఉద్ధరించగలిగిన ధర్మదేవతగా ధర్మరాజు విరాటసభారంగంలో ప్రవేశించాడు. నిజానికి విరాటనగర ప్రభుత్వ శాసకుడు ధర్మరాజైనాడు. ఆ రెండోరంగంలో దక్షిణగోగ్రహణవార్త విని విరాటుడు ఉగ్రుడై బంధుహితవర్గంతో యుద్ధానికి సిద్ధమయ్యే రంగం మూడవది. అందులో విరాటవర్గం చేసే వీరసన్నాహాలు విస్తృతంగా వర్ణించబడతాయి. అయినా, అతడి బలం చాలదని విరాటుడు బయలి సభలో నిలబడటం స్పష్టం చేస్తుంది. ఇది నాలుగవ రంగం. మొదటి బయలిరంగానికి సమాంతరమైన రంగం. అవసరం వస్తే యుద్ధంలో సాయం చేయగలమని పాండవు లిచ్చిన మాటను నిరూపించుకొనవలసిన వీరరంగం. ధర్మరాజు తననూ భీమనకులసహదేవులనూ యుద్ధవీరులుగా పరిచయం చేసికొని మహారథాలను పొందటం కథలో విజయహేతువుగా ధ్వనించబడుతున్నది. పాండవులు కీచకులను చంపి విరాటుడిని దుష్టశక్తుల నుండి విముక్తుని చేశారు. ఇప్పుడు వైరశక్తుల నుండి రక్షించి విజయుడిని చేశారు. దక్షిణ గోగ్రహణంలో పాండవులు విరాటుడి ప్రాణ మాన రాజ్య రక్షణం చేశారు.

తే. "ఒడలు సిరియును నాకు నీయొసఁగినవియ । కానఁ దగ సమర్పించెదఁ గరుణ; నీవు
సమ్మతించి యిమ్మత్స్యదేశంబుఁ గావు; । పంచి పనిగొని నన్ను రక్షించుకొనుము." (విరా.3.224)

అని విరాటుడిచేత అనిపించుకొన్నారు. ఈ సన్నివేశంలో నైతికంగా, ధార్మికంగా, లౌకికంగా మత్స్య దేశానికి రాజు ధర్మరాజని తేలింది. దానిని పాండవులు బయలు మెరసిన సభలో నిరూపించుకొన్నారు. విరాటుడి సభలో పాండవుల ఉనికి అభేద్యమని వ్యంగ్యంగా నిరూపితమయింది. ఈ విధంగా సభారంగ సప్తకం అజ్ఞాతవాసంలో కూడా ధర్మరాజు సమ్రాట్టుగానే సమ్మానించబడటాన్ని ధ్వనింపజేస్తున్నది.

### (2) సన్నివేశ రంగాలూ, సంభాషణ శిల్పాలూ

విరాటపర్వం సన్నివేశ బంధురం; సంభాషణ సుందరం. ప్రతి సన్నివేశం ఒక ప్రయోజనాన్ని సాధిస్తుంది. ప్రతి సంభాషణం ఒక ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. సన్నివేశాన్ని సంభాషణలు నాటకీకరిస్తాయి. సంభాషణలతో సన్నివేశం ఉభయ కవిత్వ తత్త్వవిభవోజ్జ్వలం ఔతుంది. విరాటపర్వమంతా ఈ గుణాలకు విరామం లేని ఉదాహరణమే. అయినా హృదయాహ్లాదం కొరకు కొన్ని సన్నివేశరంగాలూ, కొన్ని సంభాషణ శిల్పాలూ పరిశీలిద్దాం.

(i) సంభాషణమంటే అడిగిన దానికి అనువైన సమాధానమివ్వటమనే అర్థంలో తిక్కన వాడాడు (విరా. 2.274). కీచకుడు నర్తనశాలకు రాబోతున్నాడని భీముడికి తెలియచెప్పటానికి వంటశాలకు వచ్చింది ద్రౌపది. చతురోక్తితో ఒక చక్కని కందపద్యం చెప్పింది. దానికి భీముడు కూడా చతురోక్తితో ఒక కందపద్యంలో తిరిగి సమాధానం చెప్పాడు. ఆ రెండు పద్యాలు మల్లెచెండ్లవలె మనోహరాలు. వాటిని తిక్కన అభినయదళాలలో పొదివి చెప్పిన తీరు ఆహ్లాదకరం. చూడండి. సగం వికసించిన పద్మం వలె మొగం తేటపడి ఉన్నదట ద్రౌపదికి. ఆమె వాయుపుత్రుడిని చూడగానే అతడిలో గుట్టుగా ఉన్న క్రోధాగ్నిని రాజబెట్టాలని మనసు కలిగిందట. దానికి చతురోక్తిని సాధనంగా తీసికొన్నదట! చతురోక్తి అంటే నర్మోక్తి కావచ్చును. నిపుణోక్తి కావచ్చును, సరసోక్తి కావచ్చును. తలచుకొన్న పనిని సాధించగలిగే కార్యోక్తి కావచ్చును. ఈ లక్షణాలన్నీ కలిసిన ప్రౌఢోక్తి కావచ్చును. తిక్కన ద్రౌపది 'ప్రౌఢి పాటించు శిల్పాన్నే' ప్రదర్శిస్తుందికదా!

క. "నా కొఱఁతఁ దీర్చి వచ్చితి; । నీ కొఱఁతయ యింక, సూతునిం దెగఁజూడన్
లోకము వంచింపను దగు । చీఁకటిరే యొదవె; నేమి సేసెదొ చెపుమా!" (విరా.2.271)

'నా వాటా పని నేను చేసివచ్చాను నా మాట నిలుపుకొన్నాను. ఇక నీ వంతే మిగిలి ఉన్నది. కీచకుడిని చంపటానికీ, లోకం కన్ను కప్పటానికీ అనువుగా ఈ రోజు చీకటి రోజయింది. ఏమి చేస్తావో ఏమో!' అన్నది. భీముడిని రెచ్చగొట్టే నేర్పే ఇందులో చాతుర్యం. 'ఆడదాన్ని నేనే అనుకొన్న పనిని అనుకొన్నట్లుగా చేసి చూపించాను. మరి నీవు మగవాడివి ఏం చేస్తావో? పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నాయి. నీకు కార్యసాధనోత్సాహం ఉన్నదో లేదో?' అని సరసంగా మాట్లాడుతూనే సాహసాన్ని ఎగద్రోసింది. చీకట్లో లోకం కన్ను కప్పి కీచకుడిని చంపటమే ఇక నీ పని - అని లక్ష్యాన్ని గుర్తు చేసింది. ఆ మాట విని భీముడు తన పనిమీద ద్రౌపది ఎంత శ్రద్ధ చూపుతున్నదో గమనించాడు. తన క్రోధాగ్నిని ప్రజ్వలింపజేసే ప్రజ్ఞను లోలోన మెచ్చుకొన్నాడు. ఆమె ముఖం వికసింపజేసికొంటూ, హర్షంతో, ఆశతో, ఆకాంక్షతో, ఆసక్తి కలిగించేటట్లు మాట్లాడుతూ ఉంటే భీముడు చిరునవ్వు చిలికిస్తూ పలికాడట! మగువ మనసు తెలిసిన మనోహరుడు మందహాసం చేయటం సరసోక్తికి ఫలం. చతురోక్తిలోని సరసత్వానికి సమాధానం అభినయంతో ఇచ్చాడు భీముడు. వరుసగా ఆమె ప్రశ్నలకు నిపుణంగా సమాధానం చెప్పనారంభించాడు. అంటే సంభాషించాడని అర్థం.

క. "నన్నడుగ నేల? నీవును । నన్నీచుఁడు నేమి మాటలాడితి? రది నా
కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము । ని న్నే మెచ్చించువాఁడ నీరజవదనా!" (విరా.1.273)

'నీవంతు పని నీవు చేశావు. నా వంతు సంగతి నీవడగకుండానే చేస్తాను. ఆ భయం నీకు వద్దు. అయితే ఆ నీచుడూ నీవూ ఏమి మాట్లాడారో ఉన్నది ఉన్నట్లుగా చెప్పుము' అని అడిగాడు. ' ఆ నీచుడు' అనే విశేషణమే భీమకోపాగ్ని ప్రజ్వలనానికి శిఖవలె నిలిచింది. కాని, ఆ క్రోధాన్ని అప్పుడు వ్యక్తం చెయ్యలేదు. కోపం రగులుకొన్నది. దాన్ని మంటగా మార్చాలంటే శత్రుకృతాపరాధ శ్రవణం కావాలి. దానిని కోరాడు భీముడు. వికసించిన ఆమె ముఖాన్ని చూచాడు. మురిపెంగా 'నీరజవదనా!' అని పిలిచాడు. 'నిన్ను నేను మెప్పిస్తానుగా మాటలెందుకు?' అని కొసమెరుపు వాక్యం చిలిపిగా చిలికించాడు. అది మాట కాదు. ప్రబంధంలో భావికథార్థ ధ్వని. నాటకంలో పతాక స్థానం. నర్తనశాలలో కటిక చీకటిలో కీచకుడిని గూఢమర్దన క్రియతో చంపి, అంతటితో ఆగక ద్రౌపది మనస్సులో తనను మెచ్చుకొనాలని అతడిని వికృతపు చావుకు గురి చేశాడు. మాంసపు ముద్దగా మార్చివేశాడు. అతడి శవాన్ని చూపుతూ ద్రౌపది ప్రతీకారం చల్లారేటట్లు ఆహ్లాదం కలిగేటట్లు మాట్లాడాడు. ఆమెవైపు చూచిన పరాయివాడి గతి అంతేనని ధైర్యం చెప్పాడు. (విరా.2.358) 'పయోజాననా!' అనే సంబుద్ధితో మురిపించాడు. భీముడి చతురోక్తి నర్మోక్తియే కాదు; నిపుణోక్తి, కార్యసాధనోక్తి! (మరి కొన్ని వివరాలకు విరా. 2.354 నుండి 361 వరకూ వ్యాఖ్యలోని విశేషాంశాలు చూడండి.)

సంభాషణ రెండు పద్యాలే. అవి పూర్వాపర సన్నివేశ, సంభాషణల సంవిధాన సామర్థ్యంతో చతురోక్తులుగా భాసించి తిక్కన కవితలో శిల్పోక్తులై ఉభయ కావ్యకళావైభవాన్ని ధ్వనిమయం చేస్తున్నాయి. ఇట్లా అల్పాక్షరాలలో అనల్పార్థభావనం చేయించటం తిక్కన సంభాషణ శిల్పం!

(ii) వక్త తన అభిప్రాయం ఎదుటివారు అంగీకరించేటట్లుగా మాట్లాడటం సప్రయోజన సంభాషణం. దీనికి-విరాటుడు సుదేష్ణతో సైరంధ్రిని అంతఃపురం నుండి పంపివేయుమని నచ్చబలికిన సంభాషణ సార్థకమైన ఉదాహరణ. ముచ్చటగా మూడు పద్యాలలో హేతుబద్ధంగా విరాటుడు మాట్లాడాడు (విరా.3.31-33). సుదేష్ణ దానికి తగినట్లు అంగీకరించింది (విరా.3.34) (వీటి వివరణానికి వ్యాఖ్యలో విశేషాంశాలను గమనించండి).

(iii) ఓదార్పు మాటలు ఎదుటివారి కలత తీరుస్తాయి. అట్లా మాట్లాడటం ఒక సంభాషణ కళ. ఓదార్చేవారిని బట్టీ, ఓదార్చబడేవారిని బట్టీ, అప్పటి సన్నివేశాన్నిబట్టీ ఉపశమన వాక్యాల తీరు మారుతూ ఉంటుంది. ఉదాహరణకు - ఒకటి రెండు:

ధర్మరాజు బ్రాహ్మణులకు వీడ్కోలు పలికాడు. వారి ఎడబాటు అతడి హృదయాన్ని విషాదంలో ముంచింది. మరల అంతమంది బ్రాహ్మణులకు ఆశ్రయమిచ్చి ఆరాధించుకొనే అదృష్టం కలుగుతుందా? అని కుమిలిపోయాడు. గొంతు బొంగురుపోయింది. కన్నీరు మున్నీరయ్యాడు. తమ్ము లెన్ని ఓదార్పు మాటలు చెప్పినా అతడు తేరుకొనటం లేదు. అప్పుడు ప్రక్కనున్న ధౌమ్యుడు అతడి విషాదం తగ్గేటట్లు సంభాషించాడు.

ధౌమ్యుడికి ధర్మరాజు చిత్తవృత్తి బాగా తెలుసు. అతడు వస్తుతః ధీరోదాత్తుడు. ధీరుడు కాబట్టి అతడు సామాన్యంగా విషణ్ణుడు కాడు కాని, ధర్మహాని కలిగినా, ధర్మాన్ని నిర్వహించలేకపోయినా, ఆ దుస్థితికి దుఃఖిస్తాడు. అది ధర్మహానిభీతివలన కలిగే ఆవేదనే కాని, లౌకిక శోకం కాదు. ఈ రహస్యం తెలిసిన ధౌమ్యుడు ధర్మరాజులోని ధర్మవీరుడిని జాగృతం చేశాడు. విధి అలంఘ్యమన్న వాస్తవాన్ని గుర్తు చేశాడు. అతడు పురాణేతిహాస కథార్థ స్మృతియుతుడు. అతడి దుఃఖంవంటి దుఃఖం మరొకడు పొంది ఉన్నాడన్న దృష్టాంతాలు వింటే చాలు; అంతటివారే అంతటి దురవస్థలపాలై తేరుకొని ధర్మనిర్వహణం చేయగా, నే నా పెద్దలు చూపిన బాటనే నడవాలని భావించి తనను తాను నిబ్బరించుకొంటాడు. ఈ మూడు కీలకాలూ తెలిసిన ధౌమ్యుడు మూడు పద్యాలు పలుకుతాడు. (విరా. 1.51, 53,54) ఆ మాటలు విని ధర్మజుడు కలకతేరాడు. తమ్ములవైపు మొగమెత్తి చూచాడు. ముచ్చటైన ఆ మూడు పద్యాలలో మొదటిపద్యం ధర్మజనాయకత్వ ప్రశంసకు మణికిరీటం!

ఉ. "ధర్మనిరూపకత్వమున, ధైర్యమునన్, మహనీయవృత్తి స
త్కర్మ విధిజ్ఞతం, జతురతా మహిమన్, దృఢబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటిగా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైన యిట్టి నీ
పేర్మికి నీడె దుర్దశలపెల్లునకున్ దురపిల్లు టారయన్?" (విరా.1.51)

మనిషిని మూడు రకాలుగా అంచనా వేస్తుంది లోకం. అతడు తాను ఎటువంటి వాడినని భావిస్తున్నాడో అట్లా ఉంటున్నాడా? అతడిని లోకం ఎటువంటివాడని భావిస్తున్నదో అట్లా మసలుతున్నాడా? నిజంగా అతడు ఎటువంటివాడో అట్లా ఉన్నాడా! అని. ఈ మూడు రకాల ప్రశ్నలకూ ఒకే సమాధానం ఇచ్చేవాడు మహితాత్ముడు. ధర్మరాజు అటువంటివాడు. ధౌమ్యుడు ధర్మజుడి ఐదు గుణాలను పేర్కొన్నాడు. అవి లోకంలో రూఢికెక్కాయి అన్నాడు. అవన్నీ విషాదాన్ని కలిగించేవి కావు. అధిగమించగలిగే ఆదర్శ గుణాలు. ధర్మజుడు ధర్మాన్ని, లేదా కర్తవ్యాన్ని నిరూపించుకొనే నిశ్చయాత్మక ప్రజ్ఞ కలవాడు. అతడికి అజ్ఞాతవాస వ్రతం కర్తవ్యం. దాని పాలనం ధర్మం. దానిని ఎట్లా నిర్వహించాలో ఆలోచించటం విశేషం. ఆ వివేకోదయం కలిగితే విషాదం వెనుకకు తిరుగుతుంది - అని ధౌమ్యుడు మొదటి విశేషణంతో సూచించాడు. ధర్మ నిర్వహణంలో ఎన్ని అడ్డంకులు వచ్చినా ధైర్యంతో ఎదుర్కొనటం ధర్మజ లక్షణం. ధర్మవీరులకు విషాదం విరుద్ధ గుణం; దానిని జయించుమని రెండవ విశేషణం వాడాడు ధౌమ్యుడు. ధర్మనిర్వహణంలో ఉదాత్తవర్తనంతో కూడిన విజ్ఞత అవసరం. దానిని జ్ఞాపకం చేశాడు. విషాదం విజ్ఞత కాదని హెచ్చరించాడు. విజ్ఞత ఉన్నా కార్యాన్ని నేర్పరితనంతో నిర్వహించే ప్రతిభ ఉండాలి. దానిని గుర్తు చేశాడు. విషాద పరిత్యాగమే చతురతా మహిమ అని వ్యాఖ్యానించాడు. ఇన్ని ఉన్నా స్థిరబుద్ధి కార్యదక్షులకు అవసరం. స్థిరచిత్తులకు విషాదం కలగటం స్వభావ విరుద్ధం. ఒకవేళ కలిగితే వారు అప్రౌఢు లనబడతారు. ధర్మరాజు నిజంగా ధర్మదేవత వరం వలన పుట్టినవాడైతే ధీరత్వాన్ని విడిచి విషాదమగ్నుడు కాడని లోకం అనుకొంటుంది. కాబట్టి నీవిట్లా దుఃఖించటం నీ వ్యక్తిత్వానికి తగినట్లుగా ఉన్నదా? ఆలోచించుకో!-అని ధౌమ్యుడు ధర్మజుడి వివేకాన్ని మేలుకొలిపి విషాదాన్ని తొలగింపజేశాడు.

తిక్కన అంతటితో ఆగడు. ఆయన ఉభయ కవిత్వ తత్త్వం వెలారుస్తాడు. ఇది విషాదంలో నుండి వీరుడు పుట్టిన వైఖరిని ధ్వనింపజేసే దొడ్డపద్యం. విరాటపర్వ ప్రబంధానికీ, రూపకానికీ నాంది వంటి పద్యం. అయిదాశ్వాసాల విరాటపర్వ కథలో ధర్మజుడు నిర్వహించే నాయక పాత్రలోని అయిదు ముఖ్యాంశాలను ఇందులో శబ్దార్థాల నాశ్రయించి సూత్రధారుడైన ధౌమ్యుడు ధ్వనింపజేశాడు. ధర్మదేవుడి వరం వలన ఏర్పడిన మారురూపాలతో విరాటుడి కొలువులో వర్తించవలసిన విధానాన్ని నిరూపించటంలో ప్రథమాశ్వాసంలో ధర్మజుడు అగ్రస్థానంలో నిలిచాడు. కీచకుడి వలన ఏర్పడిన విపత్తును ధైర్యంగా ఎదుర్కొనే ప్రవృత్తిని భీమాదులకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ నిపుణంగా నేర్పి, తెరవెనుక సూత్రధారిగా నిలిచి ధీరు డనిపించుకొన్నాడు ద్వితీయాశ్వాసంలో, దక్షిణ గోగ్రహణ ఘట్టంలో మహోన్నత బుద్ధితో విరాటుడిని రక్షించి, సుశర్మను విడిపించి ఉదాత్తుడనీ, సత్కర్మ విధిజ్ఞుడనీ ప్రశంసలందుకొన్నాడు. తృతీయాశ్వాసంలో, చతుర్థాశ్వాసంలో ధర్మజ ప్రసక్తి ఉండదు. కాబట్టి పంచమాశ్వాసంలో ధర్మరాజు విరాటుడితో ఉత్తర గోగ్రహణ విజయ ప్రస్తావనలో అర్జునుడే విజయాన్ని సాధించాడని చెప్పటంలో ప్రదర్శించిన వాక్చాతుర్య మహిమా, బయలు మెరిసేటప్పుడు విరాటుడి గద్దెపై కూర్చున్నప్పుడు ప్రదర్శించిన దృఢబుద్ధీ చివరి రెండు విశేషణాలలో ధ్వనిస్తున్నాయి. ఇందులోని వస్తు నిర్దేశాత్మక నాందీలక్షణం తిక్కన సాధించిన ఉభయకావ్యశిల్పం.

(iv) ఒక్కొక్కసారి సన్నివేశంలో ప్రవర్తిల్లే సంభాషణలను రెండు వైపులా పదునున్న కత్తివలె అటు గతాన్నీ ఇటు భవిష్యత్తునూ ధ్వనింపజేసేటట్లు రచించటం తిక్కన ఉభయకావ్యశిల్పం. ధౌమ్యుడి మాటలకు తేరుకొన్న ధర్మజుడు తమ్ములవైపు చూచాడు. అందులో ఎంత లోతున్నదో తమ్ములకే తెలుసు. ధర్మజుడి కీర్తిని నిలువబెట్టవలసిన కార్యశూరులు భీమాదులని ఆయన చూపులలోని అంతరార్థం. దానిని తెలిసికొన్న భీముడు ఇట్లా అన్నాడు:

మ. "భవదాజ్ఞాదృఢబంధ సంయమిత శుంభద్వేగమై కాక నాఁ
డవలీలన్ మన యర్జునద్విపము గ్రోధావేశ దుర్దాంత ద
ర్ప విలాసోద్భటభంగి నే పదరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీకున్ వేడ్క సంధిల్లఁగన్". (విరా.1.56)

ఈ మాటలు విని ధర్మరాజు తెలివొందిన మొగంతో శిరఃకంపం చేశాడట! ఈ అభినయ విశేషం భీముడి మాటలలోని విశేషాన్ని భావింపజేస్తుంది. అర్జున మదేభ విజృంభణాన్ని మత్తేభవిక్రీడితంతో వర్ణించి చెప్పటం మన తలలూపిస్తుంది. అయితే, భీముడు అర్జున పరాక్రమాన్ని గురించి ఇంతగా ఎందుకు చెప్పాడు? అతడి పరాక్రమ ప్రదర్శనానికి ధర్మజుడి ఆజ్ఞ అనే గొలుసులు అడ్డు వచ్చాయని అధిక్షేపించటానికా? ఆనాటి విషాదానికి ఆనాటి ధర్మజవర్తనమే కారణమని ఎత్తిపొడవటానికా? భీముడు తనను గురించి చెప్పుకొనకుండా అర్జునుడిని గురించి చెప్పటం మరొకరకమైన నిష్ఠురం! భీముడి మాట ధర్మజుడికి కళంకప్రాయం. ఆ నింద అతడు మోస్తూనే ఉండాలి. ఇక ఇప్పుడు విషాదపడుతూ కూర్చుంటే తమ్ముల ముందు పరువు కూడా నిలవదని భావించి అతడు మొగం విప్పార జేసికొని తల ఊచాడా? - అని అనేక ప్రశ్నలు తలయెత్తుతాయి. ఈ పద్యంలోని కీలకమంతా 'నాఁడు' అనే కాలనిర్దేశవాచకంలో ఉన్నది. ద్రౌపదికి భంగపాటు జరిగిన ఆనాడు-అని ప్రకరణార్థం. ఆనాడు అర్జున ద్విపాన్ని అనుమతిస్తే కౌరవ్యాంబుజశ్రేణిని చిక్కుపరచేదట! అంతే. రూపుమాపేది కాదట! భీముడు అంత నిగ్రహంగా మాట్లాడటం ఆశ్చర్యకరం! అయితే ఆ మాట అనిపించింది తిక్కన. నాఁడు అట్లయింది. ఇకముందు అజ్ఞాతవాసవ్రతానంతరం ధర్మజుడు అర్జునుడిని నియమించే అవసరం ఉండకపోవచ్చును. ఆ సన్నివేశం ఏనాడు ఏర్పడుతుంది? ఏదో ఒక రోజు ఏర్పడుతుంది - అనే ధైర్యంతో ధర్మజుడు సంతోషించి తలఊపాడు.

తిక్కన అంతటితో పఠితలను ఆగనీయలేదు. ఈ పద్యంలో పతాక స్థానాన్ని ప్రజ్ఞావంతంగా నిలిపాడు. విరాటపర్వంలో భీముడెన్ని యుద్ధాలు చేసినా కౌరవులతో చేసే అవకాశం దొరకలేదు. కాని, అర్జునుడికి మాత్రం లభించింది. ఉత్తరగోగ్రహణయుద్ధంలో అప్పుడు అర్జునుడు ధర్మజ 'ఆజ్ఞాదృఢబంధ సంయమిత శుంభద్వేగుఁడు' కాడు. స్వీయ నిర్ణయంతో 'క్రోధావేశ దుర్దాంత దర్ప విలాసోద్ధతి'తో కౌరవ వీరులను చిక్కుపరచాడు. 'నాఁడు'ను భావికథార్థవ్యంజకంగా సూచించి, తిక్కన పతాకస్థానంగా ప్రయోగించి ఉభయ కావ్య శిల్పాన్ని ప్రదర్శించాడు.

(v) కొన్ని సన్నివేశాలలో ఒక పాత్ర చేసే సంభాషణలను బట్టి, అభినయాన్ని బట్టి ఆ పాత్ర వ్యక్తిత్వాన్ని పాఠకు లూహించే విధంగా చిత్రించటం ఉభయ కావ్యరచనా శిల్పం. తిక్కన రచనలో ఇట్టి శిల్పం అనల్పం. విరాటపర్వమంతా విస్తరించుకొని ఉన్న ఈ కళను సమీక్షించటం సాధ్యం కాదు. అయినా మచ్చుకు సుదేష్ణ పాత్ర చిత్రణకు సంబంధించినంతవరకు పరిశీలిద్దాం.

సుదేష్ణ విరాటుడి పట్టమహిషి. విరాటపర్వంలో ఆ పాత్ర అంతఃపురాన్ని దాటి బయటికి రాలేదు. అందువలన సన్నివేశాలన్నీ ఆమె మందిరానికే పరిమితమై ఉంటాయి.

ఒకనాడు సుదేష్ణ హర్మ్యతలంమీద చెలులతో కూడి విహరిస్తూ వీథిలో వెళుతున్న సైరంధ్రినీ ఆమె వైఖరినీ ప్రీతితో చూచింది. ఆమెను గురించి తెలిసికొనాలని కుతూహలపడింది. ఆమెను పిలుచుకొని రమ్మని ఇద్దరు ప్రౌఢాంగనలను పంపింది. ద్రౌపది ఉదాత్త గంభీరంగా అంతఃపురంలోకి వచ్చింది. ఆమెను సుదేష్ణ గౌరవంతో చూచింది. స్నేహంతో చేతులు ముందుకు చాచింది. శరీరంతో నమ్రభావం ప్రదర్శించింది. దంతకాంతులు సగం వెలువడేటట్లు మందహాసంతో అత్యంత ఆదరంతో దగ్గరికి రమ్మని పిలిచింది. ద్రౌపది దగ్గరికి వచ్చి నిలబడింది. ఆమె రూపాన్ని ఆపాదమస్తకం చూచింది. కుతూహలంతో ఔచిత్యం చెడిపోకుండా కుశలప్రశ్న లడిగింది. ద్రౌపది తాను సైరంధ్రీ జాతి వనితననీ, తనకు అయిదుగురు భర్తలనీ, కారణాంతరాల వలన తాను శత్రువుల చేత అవమానించబడినట్లూ, భర్తలతో కలిసి అడవికి వెళ్ళినట్లూ, బ్రహ్మచర్యంతో ఉన్నట్లూ, ఒక యేడు మాత్రం ఇంకా నియమంతో ఉండాలనీ, ధర్మాత్మురాలని విని సుదేష్ణ వద్ద సేవలో ఉండాలని వచ్చినట్లూ నివేదించుకొన్నది. కాని,

సుదేష్ణ ఆమె మానవాంగన అంటే నమ్మలేకపోయింది. ఎవరివో నిజం చెప్పుమని ఆమెను గ్రుచ్చి గ్రుచ్చి అడిగింది. ఆమె అనుమానం పోయేటట్లు ద్రౌపది మాట్లాడింది. తాను పూర్వం సత్యభామాద్రౌపదుల అంతఃపురాలలో సైరంధ్రిగా ఉండేదాననని, పేరు మాలిని అనీ చెప్పి, తనకు వచ్చిన విద్యలన్నీ పేర్కొని ఆమెను అనునయించింది. సేవకు అనుమతించుమని వేడింది. ఆ మాటలు విని సుదేష్ణ ఆశ్చర్యపోయింది. తన మనసులోని మాట దాచుకోకుండా పైకి చెప్పింది.

మ. "...విను! నీరూపము చూచి మానృపతి యువ్విళ్ళూరు; నే నెమ్మెయిం
బని గొందుం? దగ నింతులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నె
మ్మనముల్ విస్మయమందఁ జూచెదరు; భామా! పల్కు లింకేటికిన్?". (విరా.1.321)

అందువలన 'నిన్ను భరించటం కష్ట' మన్నది. నిన్ను అంతఃపురంలో ఉంచుకుంటే నా నాశనం నేనే కొనితెచ్చుకొన్నట్లే' అని కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడింది.

ఆ మాటలకు ద్రౌపది నిపుణంగా సమాధానం చెప్పింది. తన భర్తలు గంధర్వులనీ, వారు సామాన్యులు కారనీ, బలపరాక్రమాలున్నవారనీ, తనను ఒక్క నిమిషమైనా ఏమరి ఉండరనీ చెప్పింది. అంతటితో ఆగక-

క. "నీచమతి నన్ను నెవ్వఁడు । సూచిన నా రాత్రిలోనఁ జూతురు దెగఁ దా
రా చపలు హరిహరాదులు । గాచిన బలవిక్రమము లఖర్వము లైనన్.'

క. "బంధుశతంబులు శౌర్య మ । దాంధములై శక్తి సంపదాభీలములై
సింధుర సదృశత నున్నను । సంధుల సంధు లెడలించి చంపుదు రతనిన్." (విరా.1.324-325)

అని చెప్పి పురుషులు తనవైపు తేరిపార చూడటానికి భయపడతారనీ, పైపెచ్చు తాను శీలవతిననీ పలికి, సుదేష్ణను అనునయ వాక్యాలతో అంగీకరింపజేసింది. నీచపు పనులకూ, ఎంగిలితిండ్లకూ నియోగించవద్దని వేడింది. సుదేష్ణ సంతోషించి, సైరంధ్రిని ఊరడించి, సేవలో ఉంచుకొన్నది.

స్వభావంలో సుదేష్ణ అన్ని విధాలా విరాటుడి అర్ధాంగిగా కనబడుతుంది. మంచివారిని మంచి మనసుతో చూడటం, సున్నితమైన మనస్సుతో ఉద్విగ్నంగా స్పందించటం, మాటలో నడతలో సంస్కారం ఉట్టిపడటం అనేవి సహజంగా గోచరిస్తాయి. ఉదాత్తురాలుగా కనబడుతున్న ద్రౌపదిని సహజంగా తనంతట తానే పిలిచి ఆదరించిన సుదేష్ణ - సేవించదగిన ఉత్తమురా లనటంలో అనుమానం లేదు.

అయితే ఆమె ఆదర్శవంతురాలు కాదు. తెలుపు నలుపుల వింత కలయిక ఆమె వర్తనం. ఒడుదుడుకులు లేకుండా బ్రతుకు సాగించా లనుకొనే సుఖమయ జీవి. తన సుఖం కంటె ధర్మం గొప్పదని ఆమె తలంచదు. అందువలన ఆమెలో అంతస్సంఘర్షణ అప్పుడప్పుడు చెలరేగుతుంది. ఎట్లాగంటే సైరంధ్రిని అందంగా ఉన్నదని ముచ్చటపడి పిలిపించుకొన్నది. మర్యాద చేసింది. ఆడవారిని కూడా ఆకర్షించే ఆమె అందాన్ని ఎగాదిగా చూచింది. అబ్బురపాటుతో ప్రశంసించింది. కాని, ఆమెను తనవద్ద ఉంచుకొంటే ఆమె అందమే తనకు శత్రువవుతుందని భయపడింది. దానితో - తానే పిలిపించిన ద్రౌపదిని తిరిగి పొమ్మనే స్థితికి వచ్చింది. ద్రౌపది అనునయిస్తే అంగీకరించింది. దానినిబట్టి ఆమెకు స్థిరబుద్ధికాని, స్వయంనిర్ణయశక్తిగాని లేవని తోస్తున్నది. విరాటుడికి కూడా ఈ లక్షణాలున్నాయి. అందుకే వారు కీచకుడి అదుపులో ఉండిపోవలసివచ్చింది.

తిక్కన వీరి సంభాషణలలో పతాకస్థానాలను ప్రదర్శించాడు. ద్రౌపది సౌందర్యం సుదేష్ణ మందిరంలో ప్రవేశించే పురుషులను ఆకర్షిస్తుందన్నమాట సత్యం. భయంతోనో, భక్తితోనో సుదేష్ణ తన భర్తను సైరంధ్రిబారినపడకుండా కాపాడుకొనగలిగింది. మరి కీచకుడిని తాను నియంత్రించలేకపోయింది. అది ఆమె దోషమని అంటే ఆమె పూర్తిగా అంగీకరించకపోవచ్చును. ద్రౌపదికున్న

అపూర్వ సౌందర్యం వలన కలిగే సహజ ప్రమాదంగానే ఆమె భావిస్తుంది. అందుకే కీచకుడి పట్ల ఆమె నిర్లిప్తంగా ఉండిపోయింది. సైరంధ్రి భర్తలు బలవంతులని విన్నది. కాని, వారి ప్రభావాన్ని కన్నులారా చూడలేదు. కీచకుడి భవిష్యత్తును సైరంధ్రికీ, ఆమె పతులకూ వదలివేసింది. ఇటువంటి ప్రవృత్తి సుదేష్ణకున్న సంగతి ఆమె మాటలే ధ్వనింపజేశాయి.

విరాటపర్వంలో సుదేష్ణావిరాటులు తుల్యప్రవృత్తులుగా వారి చేష్టలలో మాటలలో ఎట్లా కనపడతారో, ధర్మజులు ద్రౌపది కూడా వారి వాక్యశక్తులలో తుల్య ప్రవృత్తులుగా స్ఫురిస్తారు. వారు తెలిసి పలికినా, తెలియక పలికినా అవి నిజాలై కూర్చుంటాయి. ద్రౌపది తాను సైరంధ్రిగా సుదేష్ణ మందిరంలో ఉంటానని పేర్కొన్నప్పుడు ధర్మరాజు నవ్వుతూ 'మన వంశంబును వృత్తంబును బెంపును గావఁజాలు పుణ్యవతివి; దుర్జనులగు తులువల తలఁపులు గనుఁగొని యేమఱక మెలఁగఁగా వలయుఁజుమీ!' (విరా.1.110) అని అన్నాడు. ఆ మాట నిజమై కీచకోదంతంగా ప్రవర్తిల్లింది. ఇంతకుముందు రెండు కంద పద్యాలూ ఆత్మరక్షణ కొరకూ, సుదేష్ణను నమ్మించటానికీ ద్రౌపది అన్నమాటలు కానీ, అవి కీచక ఉపకీచకవధకు సూచికలుగా వర్తిల్లాయి. ఉభయ దంపతుల ఊర్జిత లక్షణాలు మాటలతో, చేష్టలతో ధ్వనింపచేయటం తిక్కన రచనా శిల్పం.

విరాటుడికీ సుదేష్ణకూ ధర్మభీతి కంటె మించి బంధుప్రీతి ఉన్నది. ఆ రెండింటికి ఘర్షణ వస్తే బంధుప్రీతివైపే ఎక్కువ మొగ్గుచూపుతారు. (ధర్మో రక్షతి రక్షితః అనేది ద్రౌపది ధర్మజాదుల పట్ల సుముఖంగానూ, సుదేష్ణావిరాటుల పట్ల విముఖంగానూ వర్తిస్తుంది.) కీచకుడు సుదేష్ణమందిరంలో ఆమె ఎదుటనే సైరంధ్రిని మదనావేశంతో వింతవింతగా పలకరించాడు. మదనవికారాలను ప్రదర్శించాడు. తనను పలకరించటానికై వచ్చినప్పుడు సుదేష్ణ కూర్చుండటానికి బంగారు గద్దె వేయించి అతడి పట్ల భ్రాతృవాత్సల్యంతో 'ప్రియము చూడ్కి ముసుఁగువడ' చూచింది. అతడు క్షేమసమాచారాలు మాని సైరంధ్రిని గురించి ప్రశ్నల వర్షం కురిపిస్తూ ఉంటే ఉక్కిరిబిక్కిరైపోయింది. ఉపాయంతో అతడి మాటలు తప్పిద్దామని ప్రయత్నం చేసింది. కాని, విఫలురాలయింది.

సైరంధ్రి పలికిన మందలింపులకు చిన్నబోయి సింహబలుడు సుదేష్ణ వద్దకు మరల వచ్చాడు. సైరంధ్రి వివరాలను చెప్పుమని ఆమెను తొందరపెట్టాడు. తమ్ముడి మనఃస్థితిని చూచి విచారించి, రాగరసమగ్నుడైన వాడు తన మాట విని మాట మార్చుకుంటాడా? 'మాయదైవమ! నేనేమి చేయుదాన?' అని బాధపడింది. అయినా ప్రయత్నించి చూస్తానని అతడి భోగవనితల సౌందర్యాదులను జ్ఞాపకం చేస్తూ నీరసాకార అయిన సైరంధ్రిని కోరటం ఏమి బాగున్నది? అని మందలించింది. అతడు మొండికెత్తి ఏ ఉపాయంతోనైనా సైరంధ్రిని తనకు కూర్చకపోతే మన్మథబాధతో చనిపోతానని బెదిరించాడు. అప్పుడు చనువుగా తమ్ముడితో 'మనసులేని మగువల పొందు సుఖమీయ'దని రసికసూత్రాన్ని వల్లించింది. చివరకు ధర్మవర్తనాన్ని బోధించి మందలించింది.

తే. "ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు । పరసతీ సంగమము ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహరింపంగఁ గనియు । వినియుఁ దెలియవె యిది దుర్వివేకమగుట?" (విరా.2.69)

అని హెచ్చరించింది. గంధర్వుల వలని భయాన్ని బయట పెట్టింది. కానితెరగుల పోయి వివేకవంతులు అపథ్యమైన పనులు చేయరని చెప్పి, తన మాట వినుమని బ్రతిమిలాడింది. ఇంతవరకు ఆమె ధర్మశీలగా, అంతఃపుర ధర్మరక్షకురాలుగా ఆమె మాటలు నిరూపిస్తున్నాయి.

గంధర్వు లెదిరిస్తే కీచకుడు తన బలంతో వారిని చంపుతానన్నాడు. తన మేలు కోరితే సైరంధ్రిని కూర్చుమన్నాడు. దైన్యంతో అక్కకాళ్ళమీద పడ్డాడు. సుదేష్ణ చిన్నబోయింది. పొంగివస్తున్న కన్నీళ్ళను కళ్ళల్లోనే దాచుకొన్నది. లోన ధర్మసంఘర్షణ పడింది. అందులో బంధుప్రీతికి మొగ్గుచూపింది. గతి లేక తన మనోగతిని మార్చుకొన్నది.

ఉ. "అవలవచ్చు నాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి కా
కీ వెడమాటలన్ మరలఁ డెన్నివిధంబులఁ జూపి చెప్పినం,

గావలమైన వీఁడు; తగుకార్యము వట్టునె? వీని కెమ్మెయిం
జావు నిజంబు మన్మథునిశాతశరంబులనైన నక్కటా!" (విరా.2.78)

తమ్ముడి కొరకు సైరంధ్రిని - ఆసవం తెప్పించే మిషతో- అతడి ఇంటికి పంపుతానని మాట ఇచ్చింది. ఇంటికి పొమ్మని తొందరపెట్టింది. 'ఆవలవచ్చు నాపదల కన్నిటి కోర్వ' టానికి మానసికంగా సిద్ధమయింది. తమ్ముడికి చావు తప్పదని నిశ్చయించింది. చనిపోయేవాడి చివరికోర్కె తీర్చబోతున్నట్లుగా జాలిపడింది. కన్నీటితో పాటు ధర్మదృష్టి కారిపోయింది. సైరంధ్రికి ఇచ్చిన మాట ప్రక్కనపెట్టింది. వంచనతో తమ్ముడికి తోడ్పడింది. సైరంధ్రికి అన్యాయం చేయటానికే సిద్ధపడింది.

కౌరవులపై విజయానికి ఉత్తరకుమారుడు కాక బృహన్నలే కారకుడని చెప్పినప్పుడు పరమపూజ్యుడైన కంకుభట్టును సారెతో కొట్టిన విరాటుడు ఎట్లా బంధుప్రీతికి లోనయ్యాడో, అట్లాగే సుదేష్ణ సైంధవునింటికి సైరంధ్రిని పంపటానికై సిద్ధపడింది. తిక్కన ఈ స్థితిని స్పష్టంగా వర్ణించాడు.

క. "అనిన విని యనుచితంబున। కనయము శంకించియును లతాంగి మదిం ద
మ్మని వలవంతఁ దలఁచి యి। ట్లనియెం బాంచాలితోడ సాదరవృత్తిన్." (విరా.2-97)

కీచకుడు సైరంధ్రికి పరపురుషుడు. అతడి గృహం ఆమె వెళ్లకూడనిది. కాని, సుదేష్ణ 'అది పరాయి ఇల్లా?' అని పలికింది! సుదేష్ణ మహారాణి. ఆమె త్రాగే కల్లు నొక నికృష్టురాలు తెస్తే తాగాలా? నెచ్చెలి తెస్తే తప్పు? అని నిష్ఠురాలాడి సైరంధ్రినే పంపటానికి కుంటిసాకు చూపింది. సైరంధ్రి అందరికీ తెలిసిందే కాబట్టి ఏ కీడూ పుట్టదట! సైరంధ్రిని చూచింది మొదలు అందరికీ ఆమె పెంపును గూర్చే సుదేష్ణ చెప్పుతున్నదట! ఇవన్నీ కల్లబొల్లి మాటలు! భ్రాతృప్రేమ సుదేష్ణను పయోముఖ విషకుంభంగా మార్చింది.

కీచకుడి చేత త్రోయబడి, ధర్మజుడి చేత మందలించబడి ద్రౌపది కన్నీరు మున్నీరుగా సుదేష్ణ మందిరానికి తిరిగివస్తూ 'నన్నీ విధంగా ఆ దురాత్ముడి భవనానికి వెళ్ళుమన్న ఆ ధూర్తురాలి పన్నాగాలను బట్టబయలు చేస్తా' నంటూ తూలుతూ వచ్చింది. సుదేష్ణ తన కేమీ తెలియనట్లు తొట్రుబాటుతో ఆమెకు ఎదురు వచ్చింది. కల్లబొల్లి ఆవేదనను ప్రదర్శించింది. గొంతు కావాలని మార్చింది. ఆమె దైన్యానికి జాలిపడింది. ఆమెకు కీడు చేసిన వారిని నొంచుతాను. భంగపరుస్తాను. కష్టాలపాల్చేస్తాను. చివరకు చంపుతాను అని ప్రగల్భాలు పలికింది. సైరంధ్రి సుదేష్ణ పన్నిన పన్నాగం కారణంగా తా ననుభవించిన పాట్లను చెప్పి ఎత్తిపొడిచింది. సుదేష్ణ బిత్తర పోయింది. తత్తరపాటుతో సైరంధ్రికి ధైర్యం చెప్పింది. 'భయపడకు ఇప్పుడే కీచకుడిని దండించి నీకు ఆహ్లాదం కలిగిస్తాను.' అని ఆదరంతో అనునయించింది. ఆమె మాటలు వింటూంటే సైరంధ్రికి 'అసత్య సంవాదిని' అని అనిపించింది ఆ కల్లబొల్లితనానికి ఆమెకు కోపం కూడా వచ్చింది. నిర్లక్ష్యంగా ఆమెను ఉపేక్షించి ఇట్లా అన్నది.

క. "నీ వింత యలుగ నేటికి?। నా వంతయుఁ బౌరజన మనఃఖేదము నొ
క్కావంత ద్రిక్కకుండఁగ। లావంతులు మత్పతులు గలరు పగఁ దీర్పన్." (విరా.2.161)

అని హెచ్చరించింది. ఆ బెదిరింపునకు సుదేష్ణతోపాటు ఆమె పరిజనం కూడా భయంతో వణికిపోయారు. ఎన్నో ఓదార్పు మాటలు పలికారు. అయినా సైరంధ్రి వినలేదు. అన్నపానీయాలు ముట్టలేదు. ఆమె సత్యాగ్రహాన్ని చూచి చేసేది లేక సుదేష్ణ నివ్వెరగంది ఉండిపోయింది. తమ్ముడి చావుకబురు ఏవిధంగా వినవలసి వస్తుందో అని గుండెలో బిక్కుబిక్కుమంటూ సుదేష్ణ కుమిలిపోయింది.

కీచకుడు నర్తనశాలలో గంధర్వులచేత వికృతపు చావు చచ్చాడన్న వార్త అర్ధరాత్రివేళ అంతఃపురంలో పాక్కింది. సుదేష్ణ బయటికి కనబడని బడబాగ్ని వంటి శోకాన్ని అనుభవించింది. మరి కొన్ని క్షణాలలో ఉపకీచకులందరూ ఊచముట్టుగా చంపబడ్డారన్న

వార్త కొరివిమీద పిడుగుపడ్డట్లయింది. 'సహోదర మరణశోకాయత్తచిత్త' అయిన సుదేష్ణను విరాటుడు ఓదార్చాడు. సైరంధ్రి నేవిధంగానైనా అంతఃపురాన్నుండి పంపివేయుమన్నాడు. విరాటుడి మాట ఆమెకు ఊతగా దొరికింది. సైరంధ్రికిచ్చిన మాటను రాజాజ్ఞతో తుడిచివేయవచ్చునని ఊహించి అంగీకరించింది.

తెల్లవారింది. సైరంధ్రి కన్యకాపరివృతయై సుదేష్ణ మందిరానికి తిరిగి వచ్చింది. లోన పొంగివచ్చే ఆనందాన్ని అణచుకొంటూ నిబ్బరంగా రాణి ముందు నిలబడింది. సైరంధ్రిని చూచేసరికి సుదేష్ణకు మనసులో భయశోకాలు ఒక్కసారిగా పొంగివచ్చాయి. వినయంగా ప్రియసంభాషణలతో ఆమెను దగ్గరికి తీసి గౌరవించింది. భర్త ఇచ్చిన ఆజ్ఞను ఆమెకు వినిపించి, తమ్ముడి చావుకు బావురుమని ఏడ్చింది.

క. "బిరుదు గల మగలు గలరని । తర మిడి చంపింపఁ జూచెదవు; జనములు నీ
పొరువునఁ బోవెఱతురు; మా । పురమును రాష్ట్రంబు వెడలి పొ మ్మెంధైనన్". (విరా.3.61)

అని గుండెలోని మంటను గుప్పిస్తూ గద్దించింది. సైరంధ్రి చచ్చిన పామును కఱ్ఱతో కొట్టలేదు. వినయంతోనే వేడుకొన్నది. పదమూడు రోజుల గడువు కోరింది. తనకు మేలు చేస్తే గంధర్వపతులు కృతజ్ఞులై మేలు చేస్తారనీ, కీడు చేస్తే ప్రమాదం తప్పదనీ మెత్తగా చెప్పింది. తన మాటలు మన్నించకపోతే ఏమౌతుందిలే అనుకొనవద్దన్నది. తనను అంతఃపురంలో ఉంచుకొనటం మేలని చెప్పింది. భర్త మాటకు తల ఊపి సైరంధ్రిని ఊరు వదలి పొమ్మన్న గడుసరి సుదేష్ణ ఆమె మాట కాదంటే ఏకీడు మూడుతుందో అని ఆమె కోర్కెను మన్నించింది. దానికి మరల భర్తను సంప్రతించలేదు. రాజు వెళ్ళుమన్నా, రాణి ఉండుమన్నది. కీచకుడు పోయిన తరువాత రాజమందిరంమీద గంధర్వసతి అయిన సైరంధ్రిభయం క్రొత్తగా ఆవరించింది. పాపం, సుదేష్ణా విరాటులు పరభయంతో జీవించటానికి అలవాటుపడ్డారు. చివరకు పాండవుల నాశ్రయించి బ్రతికిపోయారు.

### (3) పాత్రోచిత సందర్భోచిత రసోచిత సంభాషణలు

విరాటపర్వంలోని సంభాషణలు సహజంగా ఆహ్లాదకరంగా ఉంటాయి. అందుకు అవి పాత్రస్వభావోచితంగా ఉండటం ఒక బలమైన కారణం. పాత్రోచితాలంటే పాత్ర స్వభావ వ్యంజకాలని భావం. పాత్రలు వివిధ సన్నివేశాలలో సందర్భోచితంగా మాట్లాడి సమయస్ఫూర్తిని ప్రకటిస్తారు; వివిధ ఘట్టాలలో సాంద్రమైన అనుభవాన్ని మాటలలో రంగరించి ఆవిష్కరిస్తారు. పాత్రోచిత సందర్భోచిత రసోచిత సంభాషణలు మహాభారతమంతా వ్యాపించి ఉన్న పాత్రలలో విరాటపర్వ సందర్భాన్ని అనుసరించి పరిశీలిస్తే ఊర్జిత కథోపేతమైన ఈ పర్వస్వభావం సాక్షాత్కరిస్తుంది. మచ్చుకు కొన్ని:

ధర్మరాజు మెత్తని పులి. ఆ కాలంలో ఆయన పరమ ప్రామాణికుడైన సత్యవాది. ధర్మశీలి. శత్రువులకు కూడా ఆయన మాటల మీద పరమ విశ్వాసం. కపటి అయిన దుర్యోధనుడు అజ్ఞాతవాసవ్రతం నిండకుండానే అర్జునుడు బయలు మెరశాడన్న అనుమానంతో, భీష్ముడు నిండిందని చెప్పినా ఆయన మాట నమ్మక, ధర్మజుడి నడిగి తేల్చుకొనటానికి దూతను పంపాడు. అధిష్ఠిత సత్యవ్రతుడైన యుధిష్ఠిరుఁ డిట్లా అన్నాడు.

క. "నిండె సమయాబ్దములు, నిం । కొండన లే; దిపుడ చని సుయోధనుతో భీ
ష్మండును గురుఁడును వినఁగా । నిండె ననుము; నిండె నిండె నిక్కంబునకున్". (విరా.5.370)

ప్రతిజ్ఞ చేసిన సంవత్సరాలన్నీ నిండాయి అన్నది సత్యవాక్యం. మరొకమాట లేదు-అనటం నిశ్చయార్థకం. ఈ విషయం దుర్యోధనుడికి వెంటనే తెలియచెప్పుమనటంలో ఆ కపటి అంతలోనే ఏమైనా దుష్టవ్యూహం వేయగలడని వ్యంగ్యం. ఆ నిజాన్ని భీష్ముడూ ద్రోణుడూ వింటుండగా చెప్పుమనటం దుర్యోధనుడి దుర్వ్యవసాయం పెద్దలకు తెలియాలనీ, ఈ సత్యానికి పెద్దల సాక్ష్యం ఉండాలనీ భావం. దుర్యోధనుడికి ధర్మరాజు వాక్యం మీద నమ్మకం ఉండటం నైతికమైన విలువ. మరి నిజాన్ని ముమ్మారు చెప్పటం లౌకిక వ్యవహారం. అందుకే నిండెననే పదాన్ని మూడుసార్లు ఉచ్చరించటం. చెప్పినది చిన్న కంద పద్యమైనా అందులో

నాలుగు వాక్యాలు నింపి నాలుగువైపులా బిగించిన గడుసరితనం ప్రకటించాడు. ఇది ధర్మరాజు పాత్రోచిత రస సంభాషణానికి సత్యోదాహరణం. ఈ పర్వంలో సంభాషణలకే ఎక్కువ ప్రాముఖ్యం, ప్రాచుర్యం ఉంటాయి. నాయకుడైన ధర్మరాజు పలికినవి ఇటువంటివి అనేకం ఉన్నాయి. ఆయా సందర్భాలలో విశేష వ్యాఖ్యలలో వాటిని గమనించవచ్చును. ప్రస్తుతం ప్రసిద్ధమైనవి మూడు ఘట్టాలు.

1. సన్న్యాసిగా విరాటుడి ముందు పలికిన పద్యాలు (విరా.1.191, 193, 195, 196,197-వీటిని గురించి ఇదివరకే ముచ్చటించటమైనది.)

2. విరాటుడి సభలో భీముడితో, ద్రౌపదితో పలికిన మాటలు (విరా.2.136,150) (వివరాలకు విశేషవ్యాఖ్య చూడండి).

3. ఉత్తర గోగ్రహణ యుద్ధానంతరం ఆ విజయం ఎవరి వలన కలిగి ఉంటుంది అనే చర్చ సాగినప్పుడు విరాటుడితో ధర్మరాజు (కంకుభట్టు) పలికిన మాటలు (5.249-258), అందులో ఒక పద్యం -

చ. "కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజ ముఖ్య మహోగ్రయోధ వి
స్ఫురణము నోర్వఁజాలి రణభూమి భుజాబల ముల్లసిల్ల ను
త్తరుఁడ జయించెనేని వసుధావర! యింతటికంటె నింక న
చ్చెరువును గల్గునే ధరఁ బ్రసిద్ధికి నెక్కఁడె యాతఁ డొక్కఁడున్." (విరా.5.249)

ధర్మరాజు వ్యంగ్యధోరణిలో మాట్లాడేటప్పుడు కాకువును ప్రయోగిస్తాడు. ఉత్తరుఁడ-అనే ఏవార్థకం అధిక్షేపార్థక కాకువు. ఉత్తరుడే జయించి ఉంటే అనే అనుమానం అందులో వ్యంగ్యం. ఉత్తరుడే జయిస్తే ఈ లోకంలో ఇంతకంటె ఆశ్చర్యం ఏముంటుంది? ఇది నిందాస్తుతి. అత డొక్కడే ప్రసిద్ధికెక్కడా? అన్నదాంట్లో ద్వంద్వార్థం ఉంది. అతడు అర్జునుడితో కీర్తి పంచుకొనవచ్చునుగాని ఏకైక వీరుడు కాలేడని కాకువు. విరాటుడి ముందు ధైర్యంగా అంతమాట అనగలవాడు కంకుభట్టే. అతడి మాట రాజుకు కోపం తెప్పించవచ్చునుగాని భావికథార్థసత్యం. మరొక విశేష మేమంటే ధర్మజు డాడిన ఈ వాక్యం కథాగతికి తోడ్పడుతుంది. విరాటుడికి కోపం వచ్చి ధర్మరాజును సారెతో కొట్టటానికి ఈ వాక్యమే కారణం. ఇది భావికథాసూచకమైన పతాకస్థానం. ఈ విధంగా ఊర్జిత కథాప్రవృత్తికి ఈ సంభాషణ ఉపయోగపడింది. (వివరాలకు చూడండి విశేష వ్యాఖ్య).

ధర్మజుడు ధర్మవీరుడు, దయావీరుడు, యుద్ధవీరుడు, త్యాగవీరుడు, దానవీరుడు. ఆయా సందర్భాలలో ఆయా వీరరసభేదాలు ముందుకు వచ్చి ప్రకాశిస్తుంటాయి. ఆయన సంభాషణలలో దక్షిణ గోగ్రహణ యుద్ధ విజయానంతరం విరాటుడు కృతజ్ఞతలతో ధర్మరాజుకు తన రాజ్యాన్నీ, తన సేనలనూ సమర్పించుకొన్నాడు. కాని, ధర్మజుడు వాటిని స్వీకరించలేదు. ఉత్తమ ధర్మవీరుడివలె ఉన్నతంగా వ్యవహరించాడు. ఇట్లా అన్నాడు:

చ. "మనుజవరేణ్య! నావలని మన్నన యిట్టిద కాదె! శత్రుమ
ర్దన మొనరించి మత్స్యనగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ
చనుటయ నాకుఁ దేజమును సంపదయుం గరిమంబుఁ గాక! యి
ట్లనఁ దగునయ్య? యే నిచట నైనది యేటిది? యింత యేటికిన్?" (విరా.3.226)

అవికత్థనత్వం ధీరోదాత్త లక్షణం. విరాటుడు పొగడటం ఆయనకు సహజంగా నచ్చలేదు. అజ్ఞాతవాసవ్రతం విరాటనగరంలో ఆ రాజు నాశ్రయించి నిర్వహిస్తూ ఉండటం వలన శత్రుమర్దనం అతడి కర్తవ్య మనుకొన్నాడు. కర్తవ్య నిర్వహణ ప్రతిఫలాన్ని కోరదు. విరాటుడితోడి స్నేహం అద్వైత భావానికి దారితీసింది. అందువలన విరాటుడి తేజం, సంపద, గరిమం తనవే ననుకొని తృప్తిపడి తృష్ణను నిగ్రహించుకొనగలిగాడు. మహోపకారం చేసినా దానిని చెప్పుకొనకుండా ఉండటం, ప్రతిఫలాన్ని కోరకుండా

ఉండటం కర్మయోగి లక్షణం. అంత చేసి 'ఇంత ఏటికిన్?' అనగలిగినవాడు దాన, దయా, త్యాగ, వీరస్వభావాలు కలవాడే. 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' అని ఉపనిషత్సూక్తి. ఈ పద్యం పలికిన ధర్మరాజు ధర్మవీర, త్యాగవీర, దయావీర రసమూర్తి. పైవాక్యాలు రసోచిత సంభాషణ శిల్పాలు.

భీముడు రౌద్రోద్రేకి. శత్రువులమీదకు సుడిగాలివలె రేగటం అతడి సహజప్రకృతి. పరవీర భయంకరంగా ప్రతిజ్ఞలు చేయటం అతడి సహజాలంకారం. ద్రౌపది యెదుట కీచకవధ చేస్తానని అతడు చేసిన ఈ ప్రతిజ్ఞ ఉజ్జ్వలోదాహరణం.

మ. "అవనీచక్రము సంచలింపఁగ, దివం బల్లాడ, నాశాచయం
బవధూతంబుగ, గోత్రశైల నికరం బాకంపముం బొంద, న
ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపుదున్." (విరా.2.284)

అతడికి ఆగ్రహం అవధులు మీరి పొంగుతుంది. దానికి అడ్డుకట్ట వేసేవారు వెంట ఉండాలి. భారతకథలో ధర్మరాజు భీమమదేభానికి అంకుశం. ఈ ఘట్టంలో ద్రౌపది నియామకశక్తిగా పనిచేసింది. నిగూఢవృత్తితో యుద్ధం చేయాలని నియోగించింది. భీముడి తీవ్రక్రోధం కథలో నిగూఢయుద్ధస్ఫూర్తికి హేతువయింది. ఈ సంభాషణం ఊర్జిత కథాగతికి సోపానం.

భీముడు నర్తనశాలలో ద్రౌపదిస్థానంలో శయ్యమీద పరుండి ఉంటాడు. కటికచీకటిలో కీచకుడు అతడిని సమీపించి సైరంధ్రి అని భ్రమించి తన వలపును, శృంగారనాయక లక్షణాలను ప్రశంసించుకొంటాడు. అతడికి భీముడు గొంతుమార్చి గూఢార్థగుంఫితంగా గంభీరహాస్యం పల్లవించేటట్లు మాట్లాడాడు. భారతంలో మరెక్కడా భీముడి ఈ లీల కనపడదు. ఆ ముచ్చటైన మాటలు గల మూడు పద్యాలు సందర్భోచిత సంభాషణ శిల్పాలు.

తే. "ఇట్టివాఁడవు గావున నీవు నిన్నుఁ। బొగడికొనఁ దగు; నకట! నాపోల్కియాఁడు
దాని వెదకియు నెయ్యెడ నైన నీకుఁ। బడయవచ్చునె యెఱుఁగక పలికి తిట్లు."

క. "నాయొడలు చేర్చినప్పుడ। నీయొడ లెట్లగునొ దాని నీ వెఱిఁగెదు; న
న్నేయబలల తోడిదిగాఁ। జేయఁ దలంచితివి; తప్పు సేసితి గంటే!"

క. "నను ముట్టి నీవు వెండియు। వనితల సంగతికిఁ బోవువాఁడవె? యైనం
దను వేఁ బడసిన ఫలమే। కనియెద విదె చిత్తభవవికారము లెల్లన్." (విరా.2.337-339)

రౌద్రాన్ని కడుపులో పెట్టుకొని హాస్యాన్ని పెదవుల మీద చిలికించిన ఈ వాక్య విన్యాసం అపూర్వం; వికృతికి వింత ఆవిష్కారం. ఔచిత్యం వీడని వ్యంగ్యార్థ గౌరవం కథకు ఆహ్లాదాన్ని అందించింది. (వివరాలకు విశేష వ్యాఖ్యలు చూడండి).

ద్రౌపదీ హృదయాహ్లాదకరుడు భీముడు. కీచకవధ ఘట్టం అతడి ఆ స్వభావాన్ని ఆద్యంతం రసోచితంగా అనుభవింప జేస్తుంది. కీచకుడిని చూచినప్పటినుండి ద్రౌపది తనతో మాట్లాడేంత వరకు భీముడు మాటలు లేని కోపాన్నే ప్రదర్శించాడు. ఆ తరువాత మాటలు పెంచాడు. చివరకు వాటిని చేతలలోకి మార్చాడు. తన వ్యూహంలో భార్యను భాగస్వామిని చేశాడు. ఆమె కోరిన రీతిలో ఆమెకు ఆహ్లాదం కలిగించేటట్లు కీచకుడిని వికృతపు చావుకు గురిచేశాడు. మరుగున ఉన్న మగువను మనసుపడి రంగం మీదకు తెచ్చాడు. కీచకుడి వింత పీనుగును చూపించాడు. మనసారా ఇట్లా నివేదించాడు:

శా. "చింతాశల్యము వాసెనే? భుజబలోత్సేకంబు నీ కెక్కెనే?
శాంతిం బొందెనె రోషపావకుఁడు? దుశ్చారిత్రునిం జూచితే?

సంతోషించితె? యిట్లుగాక బ్రదుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరినయట్టి వీరులకు నాచేతం బయోజాననా!'' (విరా.2.358)

భీముడి రౌద్రం వీరంగా శృంగార రసాహ్లాద సుందరంగా పరిణామం చెందించిన ఈ పద్యం బీభత్స రమణీయంగా తిక్కన తీర్చిదిద్దాడు. దృశ్యం బీభత్సం. ద్రౌపదికి కలిగింది ఆహ్లాదం. ఆ రెంటినీ వ్యంగ్యంగా సూచించేది ఈ రసోచిత సంభాషణం.

అర్జునుడు గాండీవసుందరుడు, మహాస్త్రకోవిదుడు, జగదేకవీరుడు, శృంగారవీరరసమూర్తి, నారాయణప్రాణమిత్రుడు. ఈ లక్షణాలన్నీ విరాటపర్వంలో మొదట కుంఠితాలై తరువాత పునర్భవిస్తాయి. అతడికి గాండీవమంటే ఆరవప్రాణం. దానిని ఇతరుల కిమ్మని ఎవరైనా అంటే అతడి తల వేయి ముక్కలుగా బ్రద్దలు కొడతానని ప్రతిజ్ఞ చేసిన గాండీవప్రియుడు గాండీవి. గాండీవం వదలి మరల గాండీవాన్ని ధరించే మధ్యకాలమే గాండీవి అజ్ఞాతవాసకాలం. అజ్ఞాతవాసంలో ప్రవేశించేముందు ఆ గాండీవాన్ని గుప్తంగా, తనకు దూరంగా ఉంచవలసి వచ్చినందుకు మనసులో కటకటపడ్డాడు.

చ. "ఇది పెనుఁబాము చందమున నెంతయు భీషణమై జనంబులన్
బెదరఁగఁ జేయు; నట్లగుటఁ బెట్టి చనన్ వలయుం దలంచి నా
హృదయము దీనిఁ బాయుటకు నియ్యకొనం జొర; దెట్టు చెప్పినం
దుది నొకచోట వైచుటయ తోఁచిన కార్యము నయ్యెడుం గటా!'' (విరా.1.160)

శస్త్రములు దాచటం అజ్ఞాతవాస వ్రతానికి పూర్వరంగం. అందరి కళ్ళూ మొదట గాండీవంమీదనే పడ్డాయి. అర్జునుడికి దానితో ఉన్నంత అనుబంధం మిగిలిన పాండవులకు వారి ఆయుధాల మీద లేదు. కాబట్టి విరాటపర్వంలో రూపాల మార్పుకు శ్రీకారం గాండీవగోపనంతో ప్రారంభం కావాలి. మహావీరుడైన అర్జునుడు గాండీవాన్ని తన శరీరంలో ఒక భాగంగా భావించాడు. దానిని దాచక తప్పకపోవటంతో మనసులో వేదనపడ్డాడు. మహాభారతంలో గాండీవంతో విడివడే విషాద సన్నివేశం మరెక్కడా కానరాదు. అంతటి అపూర్వ సన్నివేశంలోని అపూర్వ సంభాషణ మిది!

ఉత్తర గోగ్రహణ యుద్ధంలో అర్జునుడి ప్రధాన లక్ష్యం దుర్యోధనుడిని దెబ్బతీయటమే. ఓడించి పీడించి, అవమానించి కసితీర్చుకొనటమే. అప్పటి ఆ చిత్తవృత్తి ప్రతిఫలించే అధిక్షేపోక్తులు విరాటపర్వంలో అనేకమున్నా, ఈ క్రింది రెండు పద్యాలూ జంట నక్షత్రాలవంటివి:

(1) క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ ! (విరా.5.203)

(2) ఏమంగు నెక్కిపెక్కేనుంగు లిరుగడ...(విరా.5,204)
వీటి విశేష వ్యాఖ్యలను గమనిస్తే కథలో వీటికున్న విలువ తెలియవస్తుంది. (చూడండి వ్యాఖ్య).

ఉత్తరుడి సూచనపై విరాటుడు ఉత్తరను అర్జునుడికి ఇవ్వాలని సిద్ధపడ్డాడు. కాని, విజయుడు ఔచిత్యాన్ని చూపించి, తన గురుత్వాన్ని గౌరవస్థానంలో నిలిపి, తాను కాముకుడను కానని తెలిపికొని, తన కొడుకైన అభిమన్యుడికిచ్చి పెండ్లి చేయటానికి నిశ్చయించిన ఘట్టం అతడి ఉదాత్త వర్తనానికి ఉన్నత శిఖరం.

మ. "హరిమేనల్లుఁడు, బాహువీర్యపటు శౌర్యస్ఫూర్తి, త్రైలోక్య సుం
దరుఁ, డాచార పవిత్రుఁ, డంచితకళాదక్షుం, డుదారుండు, కా
తరసంరక్షకుఁ, డార్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసి, య
త్యురు తేజుండు వరించుఁగాక యభిమన్యుం డీ సరోజాననన్''. (విరా5.363)

విరాటపర్వాన్ని విజయుడు శుభాంతం చేశాడు. అభిమన్యుడి వివాహం పాండవ వంశకర్తకు బీజావాపన. శ్రీకృష్ణుడు పాండవ వంశరక్షకు డనిపించుకొనడానికి శ్రీకారం. అభిమన్యుడికి అర్జునతనయుడనే కీర్తికంటె సుభద్రాతనయుడనీ, అంతకంటే మించి హరిమేనల్లుడనీ ప్రశస్తి ఉన్నది. దానికి భావి భారత కథంతా సాక్షిగా నిలువబోతున్నది. ఈ పద్యం ఆ కథాస్రవంతికి జన్మస్థానం. ఈ సంభాషణ ఒక వంశ చరిత్రాధ్యాయానికి శుభారంభం. (ఇంకా వివరాలకు చూడండి 5.363 పద్య విశేష వ్యాఖ్య).

ద్రౌపది త్రేతాగ్ని సంపుటి 1. పరిభవాగ్ని, 2. ప్రతీకారాగ్ని, 3. క్రోధాగ్ని. మనసులో ఈ అగ్నులు మండినప్పుడు మాటలు అగ్నికీలలుగా వేడిని క్రుమ్మరిస్తాయి. విరాటపర్వంలో ఈ త్రేతాగ్నులు మండిన సంభాషణలు కీచకోదంతంలో కనబడతాయి.

ఉ. "మీ సుభటత్వమున్ బలము మిన్నక పోవఁగ దుస్ససేనుఁ డ
ట్లా సభలోన నన్ బఱిచె; నంతియకాక జయద్రథుండు సం
త్రాసభరంబు లే కనుచితం బొనరించినఁ జెల్లిపోయె; నేఁ
డీ సభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్; వగ నాకు వింతయే?" (విరా2.176)

ఈ పద్యం ఆమె పరిభవాగ్నిని కుళ్ళగించినట్లున్న సంభాషణం. దీనివలన పాండవులకు - ప్రత్యేకించి ఈ సందర్భంలో - భీముడికి - సానుభూతి, రోషం కలిగి ఆమె పరితాపాన్ని తీర్చటానికి ఉత్సహించాలి. కథ ముందుకు సాగాలి. భీముడు దుశ్శాసనుడిని చంపి రక్తం త్రాగుతానని శపథం చేశాడు. జయద్రథుడిని పట్టి బంధించాడు. కాలహరణం పనికిరాదని కీచకుడిని భీముడే ఏదో చేయాలనే స్పృహ ఈ మాటలవెనుక ఉన్నది. ఇటువంటి దుఃఖాలు కలుగటం ఆమెకు పరిపాటే. కాని, వాటిని తీర్చటానికి ముందుకు వచ్చే వీరుడు భీముడే! భీమనాయకమైన కీచక ప్రబంధంలో ప్రేరకశక్తిగా పనిచేసే పరిభవాగ్నిశిఖ ఈ పద్యం.

ఎప్పుడు ఎవరికి ఏ అగ్ని నంటించాలో ద్రౌపదికి బాగా తెలుసు. మహానసంలో నిద్రపోతున్న భీముడిని సమీపించి మందమందంగా మాట్లాడుతూ చేతితో స్పృశిస్తూ ఈ క్రింది మాటలతో మేల్కొల్పింది. అది మేల్కొల్పటమే కాదు; ప్రతీకారాగ్నిని పవనాత్మజుడిలో రగుల్కొలపటం కూడా.

ఉ. "నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్ర సేయ నీ
కన్ను మొగుడ్చునూఱటకుఁ గారణ మెయ్యది? భీమసేన! మీ
యన్న పరాక్రమంబు వలదన్న నొకో దయమాలి తక్కటా!" (విరా2.166)

కీచకుడు ద్రౌపదిని సభ వెలుపల పరాభవించాడు. ఆమెకు సభలో పరాభవాగ్నిని మిగిల్చాడు ధర్మరాజు. అంతేకాక ప్రతీకారాగ్నిని ప్రదర్శించబోయిన భీముడిని అదుపులో పెట్టాడు. పరాభవాగ్ని ప్రతీకారంతోనే ఉపశమిస్తుంది. పరాభవించిన కీచకుడు తన భవనంలో సుఖంగా నిద్రపోతున్నాడు కాని ప్రతీకారాగ్నితో మండిపోవలసిన భీముడు మాత్రం అతడివలెనే సుఖంగా నిద్రపోతున్నాడు. సుఖనిద్రలో అప్పుడు కీచకుడికీ, భీముడికీ తేడా లేదు. నిద్రపోనిది, లేదా ప్రతీకారంతో కుమిలిపోతున్నది ద్రౌపది. ఆమె వచ్చి భీముడిని తాకింది. అది తాకటం కాదు; తన ప్రతీకారాగ్నిని భీముడిలో ప్రవేశపెట్టటం. చెవిలో మందమందంగా మాట్లాడింది. అది మంద్రభాషణం కాదు; అగ్నిని రెచ్చగొట్టటానికి ఊదటం. భీముడు నిద్రపోవటానికి కారణం ధర్మరాజు అతడిని సభలో పరాక్రమించవద్దని నియమించటమే అని శంకించింది. కాని, వెంటనే ' నీ అన్న ఆ మాట అన్నాడని నామీద దయ తప్పావా? ఎంతపని చేశావు!' అని అడిగింది. ఆ మాటకు ఎన్ని అర్థాలో! కాంతాసమ్మితంగా వేసిన ప్రశ్న అది. 'నిన్ను అవేశంతో పరాక్రమించవద్దన్నారు కాని, నా మనసెరిగి తగిన ఉపాయం ఆలోచించవద్దన్నారా? ధర్మరాజు నన్ను ఆదుకొనవద్దన లేదే? నిన్ను నిద్రపొమ్మనలేదే? శత్రువుకు ఎదురు లేదని తెలిస్తే వాడు నిశ్చింతగా నిద్రపోయి రేపు మరల నా వెంట పడడా? ఈ సంగతి నీవే

తెలిసికొని నేను నిద్రపోలేననీ, ప్రతీకారం కొరకు ప్రతీక్షిస్తుంటాననీ ఊహించలేకపోయావా? నన్ను గురించి ఏమాత్రం పట్టించుకొన్నా నీకు నిద్ర ఎట్లా పట్టుతుంది? ఈమాత్రం దయ కూడా లేదా?' అని అనేక విధాల వ్యంగ్యార్థాలు స్ఫురించేటట్లు బ్రతిమిలాడినట్లే పలుకుతూ అధిక్షేపించింది. 'నాకు నిద్ర లేదు', నీవు నిద్రపోరాదు, శత్రువును నిద్రపోనివ్వరాదు. ఈ తాత్పర్యాన్ని గ్రహించి ప్రతీకారం చేయటమే నా హృదయానికి ఆహ్లాదకరం' - అని ధ్వనిమయంగా ఉపదేశించింది. ఇది సార్థకమైన సందర్భోచిత సంభాషణం! (మరికొన్ని వివరాలకు విశేషవ్యాఖ్య చూడండి).

తిక్కన ఔచిత్య పాలనకు ఈ పద్యాన్ని మచ్చుతునకగా పేర్కొనవచ్చును. మూలంలో ద్రౌపది ఈ సందర్భంలో అన్నమాట లివి-

"ఉత్తిష్ఠోత్తిష్ఠ, కిం శేతే, భీమసేన! యథా మృతః।
నా మృతస్య హి పాపీయాన్ భార్యా మాలభ్య జీవతి?" (సం4.16-9)

'భీమసేనా! చచ్చినవాడు పడుకొన్నట్లు అట్టే కదలకుండా పడుకొన్నావేమిటి? లెమ్ము లెమ్ము! నేను బ్రతికున్నవాడి భార్యనైతే ఆ పాపి చావకుండా ఉంటాడా?'- అని శ్లోకతాత్పర్యం. చచ్చినవాడితో భర్తను పోల్చటం గ్రామ్యత్వ లక్షణమని తిక్కన భావించి ఉంటాడు. అందువల్ల తెలుగులో అగ్రామ్యత్వమనే స్వభావం గల ఉదారత అనే అర్థగుణాన్ని ఆవిష్కరించాడు. అయితే వ్యాసహృదయాన్ని నాగరకంగా తెలుగులో పలికించాడు. మూలంలో ద్రౌపది చెప్పిన తాత్పర్యాన్నే తెలుగులో ఔచిత్యవంతంగా చేశాడు. మూలంలో ఉన్నది అనౌచిత్యమా? గ్రామ్యమా? అన్నది చర్చనీయాంశం. మానం పోయిన క్షత్రియుడు ప్రాణం పోయినవాడితో సమానం. భార్యను సభలో తన్నిన దుష్టుడిని చంపకుండా నిశ్చింతగా నిద్రపోయేవాడు మృతుడితో సమానుడే. అందువలననే వ్యాసు డీ ఉపమానాన్ని నిపుణంగా వాడాడు. అంత నిర్లిప్తుడుగా పడుకొన్న భీముడికి అంత ఘాటైన ఉపమానంతో చురక వేస్తేకాని కార్యశూరుడై లేవడు. మల్లయుద్ధంలో ఎదుటివాడు పెద్దదెబ్బకొడితేనే కాని భీముడు వాడిని చచ్చేటట్లు కొట్టడు. D Q®@"` ê‹ # ఇల్లాలు కాబట్టి ఆ పాపి చస్తేనే నేను బ్రతికి ఉన్న భర్త కలదాని ననుకొంటానని అన్నది. సామాన్యంగా ఆమె అట్లా అనకూడదు కాని, కోపం వచ్చినప్పుడు లోకంలో చావుల ప్రసక్తి రావటం సామాన్యమే. అయితే అది అగ్రామ్యం కాదు. ఉదారగుణం కాదు. అందుకే తిక్కన మార్చాడు. ఉపమాలంకారాన్ని మార్చి సంభావన చేశాడు. మృత ప్రసక్తిని మార్చి నిద్రతో తేల్చాడు. ఇటు భీముడూ అటు కీచకుడూ సుఖనిద్రపోవటం ద్రౌపది పట్ల దయ తప్పటమే అని ధ్వనింపజేశాడు. మూలంలో ఉన్న మోటుతనం పోయింది. తెలుగులో తెలివి మెరిసింది. మూలంలో భీముడు ద్రౌపది మాటలు విని శత్రువును ప్రతీకారంతో చంపుతాడు. తెలుగులో భీముడు శత్రువును ఎట్లాగూ చంపుతాడు. దానితో ద్రౌపదికి హృదయాహ్లాదాన్ని పెంచేటట్లు చంపుతాడు. సంభాషణలో మాటల తీరు మారితే సన్నివేశాల తీర్పులు మారుతాయి-అని ఈ పద్యం చాటి చెప్పుతున్నది.

తిక్కన తన పద్య శిల్పానికి తానే ముగ్ధుడౌతూ ఉంటాడు. అటువంటి సూచనలు కూడా వెనుకాముందు సూచిస్తూనే ఉంటాడు. ఒక్కొక్కసారి మంచిపద్యాన్ని ఒక సందర్భంలో కంటె ఎక్కువ సార్లు పూర్తిగానో, పాక్షికంగానో వాడుకొంటాడు. అవి తిక్కన మెచ్చిన పద్యాలుగా మనం భావించవచ్చును. అటువంటి పద్యాలలో ఒక్కటి. రెండుసార్లు రెండు సన్నివేశాలలో, రెండు ప్రయోజనాలను సాధించటానికి వాడిన ప్రసిద్ధ పద్యం ఈ క్రిందిది. ఇది రసోచిత సంభాషణకు రమణీయోదాహరణం.

శా. "దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్టు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిన్ కీచకా!" (విరా.2.55-172)

కీచకుడిని భయపెట్టటానికి ఒకసారీ, భీముడిలోని పౌరుషాన్ని పొంగించటానికి మరొకసారీ ద్రౌపది పలికిన ఈ పద్యం విరాటపర్వ శిరోమణి. (వివరాలకు ఈ పద్యాల విశేష వ్యాఖ్యలు చదవండి).

ఇక్కడ మరొక విశేషం స్మరించాలి. విరాటపర్వంలో ద్రౌపది తన భర్తలను గురించి ప్రశంసించిన పద్యాలు పరమాహ్లాదకరంగా ఉంటాయి. ఉద్యోగపర్వంలో ద్రౌపది తనను గురించి చెప్పుకొనే పద్యాలు పరమోదాత్తంగా ఉంటాయి. అట్టి విరాట పర్వ పద్యాలలో ఇది ప్రథమగణ్యం. ఉద్యోగపర్వ పద్యాలలో 'వరమునఁ బుట్టితిన్, భరతవంశముఁ జొచ్చితి........' (ఉద్యో.3.108) అనేది అగ్రగణ్యం. భర్తల ప్రశంస పద్యాన్ని పునరుక్తి చేసింది కాని, తన పద్యాన్ని ఒక్కసారే పలికి ఔచిత్యం, ఔదాత్త్యం ప్రదర్శించింది. అది తిక్కన నేర్పిన రసోదంచిత సంభాషణ శిల్ప విద్య.

ఈ విధంగా పాత్రోచిత, సందర్భోచిత, రసోచిత సంభాషణలను ప్రతిపాత్రతో పలికించిన ప్రతిభ విరాటోద్యోగపర్వ పద్యాలలో తిక్కన ప్రదర్శించాడు. వాటన్నిటిని విస్తరించటం ఈ పీఠికలో కుదురదు. అయినా కొన్ని గొప్ప పద్యాలను మచ్చుకు సూచించటం సమంజసం.

ప్రశంసాత్మక సంభాషణలకు విరాటపర్వం ప్రసిద్ధి. వాటిలో కొన్ని పద్యాలు ఆంధ్రావళి మోదాన్ని పొందాయి. అజరామరంగా నిలిచిపోయాయి. వాటిని నాలుగు విధాలుగా విశ్లేషించవచ్చును:

1. పాండవుల పూర్వవైభవాన్నీ, అజ్ఞాతవాసవిధానాన్నీ పాండవ వర్గంలోవారే ప్రశంసించిన పద్యాలు.

2. పాండవులను ఇతరులు వివిధ సందర్భాలలో ప్రశంసించిన పద్యాలు.

3. పాండవులు ఇతరులను సన్నివేశగతంగా ప్రశంసించిన పద్యాలు.

4. ద్రౌపదిని కీచకుడు విరహావేశంతో ప్రశంసించిన పద్యాలు.వంటశాలలో ద్రౌపది భీముడియెదుట పాండవుల పూర్వస్థితిని, అజ్ఞాతవాస జీవన దైన్యస్థితిని తులనాత్మకంగా వర్ణిస్తూ పలికిన పద్యాలు ఆణిముత్యాలు. వాటిల్లో జనాదరణం బాగా పొందినవి రెండు.

1. ధర్మరాజు ప్రశంసలోని సీసపద్యం-

సీ. 'ఎవ్వని వాకిట నిభమద పంకంబు । రాజభూషణ రజోరాజి నడఁగు' (విరా.2.191).

2.సహదేవుడిని గురించి కుంతి చెప్పిన మాటలుగా ద్రౌపది పేర్కొన్న పద్యం -

చ. 'కడుఁ బసిబిడ్డ వీఁ డొకటి గా దవునా నెఱుఁగండు...' (విరా.2-213)

పాండవులు బయలుమెరసిన ఘట్టంలో అర్జునుడు పాండవులను, పరిచయం చేస్తూ చేసిన ప్రశంసలు సహృదయుల మన్ననలను బాగా పొందాయి. వాటన్నింటిలో ధర్మరాజు ప్రశంస -

సీ. 'నడదివియలు సేసె నగరికి మాణిక్య । మకుటముల్ పూనిన మనుజపతుల....' (విరా.5-320)

ఇతరవీరులు పాండవులను ప్రశంసించిన పద్యాలు విరాటపర్వంలోని యుద్ధ సన్నివేశాలలో ఎక్కువగా కనుపట్టుతాయి. అయితే అన్నింటిలో అర్జున ప్రశంసలే అధికం.

శా. 'సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి......' (విరా.4.95)

అనే పద్యం అర్జునుడి యుద్ధవీర రసమూర్తిని ఆవిష్కరించే అత్యుత్తమ ప్రశంస- దీనిని ద్రోణాచార్యుడు చేశాడు. శిష్యవాత్సల్యంతో పాటు వీరమర్యాదను కూడా పాటించాడు

ఉ. 'వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు.....' (విరా.4.234)

ఈ మాటలన్నది కురుపితామహుడు భీష్ముడు. ఉత్తరగోగ్రహణ యుద్ధానికి వచ్చిన విజయుడిని ప్రశంసిస్తూనే కురు పాండవులకు మైత్రి కలపాలని యత్నించిన పద్యం. విజయోత్సాహాన్ని ప్రశంసించాలంటే ఈ పద్యాలు రెండూ సామెతలవలె తెలుగువారి జిహ్వాగ్రాలలో నాట్యమాడుతూ ఉంటాయి. సమకాలీన భారతవీరుల మనసులలో అర్జును డంటే ఉన్న అభిప్రాయాలకు ఈ పద్యాలు రెండూ అద్దంపట్టుతాయి. రణరంగంలో ద్రోణభీష్ములు జంటకవులవలె ఆశువుగా చెప్పిన పద్యాలవలె ఇవి హృద్యాలు.

దక్షిణ గోగ్రహణ యుద్ధంలో విజయాన్ని సాధించి పెట్టిన ధర్మరాజ, భీమ, నకుల, సహదేవులను విరాటుడు ప్రశంసించాడు. (చూడు.విరా.3.223-232) అందులో సందర్భోచితంగా భీముడిని ప్రశంసించిన తీరు పలువురి ప్రశంసల నందుకొన్నది. అది-

ఉ. 'మంటయుఁబోని శాత్రవ సమాజము నించుకయేని శంకలే, కంటఁగఁ దాఁకి' (విరా.3.229)

దుర్యోధనుడి సభలో భీష్ముడు ధర్మరాజును గురించి (విరా.3.103, 104), దుర్యోధనుడు భీముడిని గురించి చెప్పిన అంశాలు (విరా.114-117) గమనించదగినవి.

ఉత్తరగోగ్రహణ యుద్ధారంభంలో అర్జునుడు కౌరవవీరులను ఉత్తరుడికి పరిచయం చేసిన తీరు వీరోచిత ప్రశంసలకు ఉదాత్తోదాహరణం. (చూడుడు. విరా.5.4-20). అర్జునుడు తన తాతను, గురువులను, గురుపుత్రుడిని కీర్తించటంలో ఆశ్చర్యం లేదు. అతడి ప్రత్యర్థులైన కర్ణుడిని, దుర్యోధనుడిని కూడా ప్రశంసించటం అతడి ఉత్తమశీలం. శత్రువులను గురించి అతడి అవగాహన అంతటి గాఢమైనది. (చూడు. వివరాలకు - విరా.5 13-15)

ఆంధ్రమహాభారతంలో ద్రౌపది సౌందర్యాన్ని కీచకుడివలె మరెవ్వరూ ప్రశంసించలేదు. విరాటపర్వ ద్వితీయాశ్వాసం ఒకవైపు ద్రౌపది ప్రశంసకు స్వర్ణాధ్యాయం; మరొకవైపు ద్రౌపది పరిభవ దుఃఖానికి కష్టాధ్యాయం. సైరంధ్రి రూపంలో ఉన్న ద్రౌపది సౌందర్యం నివురుగప్పిన నిప్పు. ఆ అందమే కీచకుడిని రాగరససాగరమగ్నుడిని చేసింది. విరహవేదనకు గురిచేసింది. వెర్రెక్కించి వెంటపడేటట్లు చేసింది. కీచకుడు రూపాభిమాని. ఆమె రూపలావణ్యాలను చూచి, భావించి, తన్మయత్వంతో పది పద్యాలలో కీర్తించాడు. తిక్కన స్వయంగా వర్ణించినవి వీటికంటె వేరు. వాటన్నింటిలో పంచరత్నాలవంటి అయిదు పద్యాలు బుధవరుల ప్రశంస లందుకొన్నాయి. పంచరత్నాలు పంచవైభవాలకు ప్రతీకలు!

**1. రూప వైభవం**

ఉ. 'ఎందును నిట్టి రూపు నరు లెవ్వరుఁ గాంచిరె?...' (విరా.2.26)

**2. సౌందర్య వైభవం**

సీ. 'ఇయ్యింతి ప్రాపున నయ్యనంగుఁడు పార్వ। తీశునైనను దక్కనేలకున్నె, (విరా.2.27)

**3. లావణ్య వైభవం**

సీ. 'నెత్తమ్మి రేకుల మెత్తఁదనము దెచ్చి। యచ్చునఁ బెట్టిన ట్లుందమొంది' (విరా.2.52)

**4. సౌకుమార్య వైభవం**

సీ. 'గండుమీలకుఁ బుట్టి కాముబాణములతోఁ। గలసి యాడెడు నట్టి కన్నుఁగవయు' (విరా.2.67)

**5. విలాస వైభవం**

సీ. 'కాంతి దళ్కొత్తు నీ కడగంటి చూడ్కితోఁ। బొందఁగానని మేను పొగులుటయును' (విరా.2.118)

(వివరాలకు ఆయా పద్య విశేష వ్యాఖ్యలు చూడండి).

**(4) ఊర్జితకథలో యుద్ధరంగాలు**

ఊర్జిత కథలో చిత్రించబడే యుద్ధ ఘట్టాలలో వైవిధ్యాన్ని బట్టి సన్నివేశాలలో ప్రత్యేకతలను పాటించటం సర్వసామాన్యం. వాటిలో స్థిర చరసన్నివేశాల నిర్వహణం, ద్వంద్వ సంకులయుద్ధాల వ్యూహ సంయోజనం, సంభాషణలతో సాత్త్వికాది భావాల సమ్మేళనం, కథన వర్ణన పద్ధతుల సముచిత మిశ్రమం, శ్రవ్యదృశ్య కావ్యరస సమ్మేళనం తిక్కన నిబిడ కథాబంధం కొరకు వినియోగించే శిల్ప సామగ్రి. వాటిని దిఙ్మాత్రంగానైనా పరిశీలిస్తే యుద్ధ సన్నివేశ కథా సంవిధానం తేటపడుతుంది.

విరాటపర్వంలో మొదట మల్లయుద్ధాలు ప్రవర్తిల్లుతాయి. అందులో భీముడు నాయకుడు. మొదటి సన్నివేశంలో మల్లుడు ప్రతివీరుడు. ఆ రంగం చిన్నది అయినా అందులో నిర్మాణ శిల్పం ఉన్నది. మల్లుడు రాజసభలో ఒక తేటగీతి పద్యంలో సవాలు విసరుతాడు (2.7). అది ప్రగల్భరూపమైన యుద్ధసంభాషణ. 'ఓ రాజా! నేను నాలుగు చెరగుల నేలలో ఉన్న రాజుల కొలువులన్నింటినీ దర్శించాను. నా కెదురు నిలిచే మల్లు డెక్కడా కానరాలేదు. మీ రాజ్యంలో ఉన్నాడా?' అని ప్రశ్నించాడు. ఇది ఉద్ధతవాక్యం. దీనితో తిక్కన దృశ్యం ప్రారంభించాడు. ఎదురుగా రాజాజ్ఞతో, కంకుడి అనుమతితో నిలిచిన వలలుడిని ప్రవేశపెట్టాడు. అతడూ రాజుతో తేటగీతిలోనే పలికాడు (2.13). అది వినయముద్రితమైన వీరోక్తి. 'నే నప్పుడప్పుడూ ధర్మరాజుకు వేడుక కలిగించటానికి మల్లులతో పోరుతుండేవాడిని. అట్లాగే నా నేర్చిన విధంగా నీ వేడుకకై యుద్ధం చేస్తా' నన్నాడు. ప్రగల్భానికీ ప్రతాపానికీ మధ్య మల్లయుద్ధం!

తిక్కన మల్లయుద్ధంలో మాటలు పెట్టడు. పోరేవారికి విరామం ఉండదు. చూచేవారికి ఉత్కంఠవలన మాట్లాడే తీరిక ఉండదు. కార్యబహుళంగా ద్వంద్వయుద్ధం నడిపిస్తాడు. అయినా అందులో వైవిధ్యం చూపిస్తాడు. ప్రాంగణంలో ప్రవేశించి, భుజాలు చరిచి, రంగానికి మ్రొక్కి, మట్టి మొగానికి రాచుకొని, మీద చల్లుకొని, నడుము బిగించి, మునివేళ్ళతో పట్టు మొదలుపెట్టటం దగ్గరినుండి అంతా ఉత్కంఠతో నడుస్తుంది. ఉపతాయివంటి అనేక గతులు కుస్తీపట్లూ కళ్ళకు విడివిడిగా వరుసగా కనబడతాయి. చివరకు మల్లుడిని పైకెత్తి, నేలకు కొట్టి, వీపున మండిపెట్టి, పెలుకురితాళంతో నొక్కి ముక్కున నెత్తురు కారుతూ ఓడిపోయేంతవరకూ మల్లయుద్ధాన్ని కళ్ళకు కట్టిస్తాడు తిక్కన.

ఊర్జితకథ అంటే వివరాలు వర్ణించిన కథ అని కాదు. కథలోని అంశాలను మధ్యలో విరామం కలిగినట్లు స్ఫురించనీయకుండా ఒకదాని తరువాత మరొకటి సహజ పరిణామంగా సాగినట్లు వర్ణించి సన్నివేశ సాంద్రతను సాధించిన కథ. మల్లయుద్ధ సన్నివేశం దానికి మంచి నిదర్శనం. భీమకీచక మల్లయుద్ధం దీని బృహద్రూపం.

ఇది భీముడు కీచక సంహారం ముందు చేసిన (Rehearsals) అభ్యాసంవలె ఉంటుంది. నర్తనశాలలోని మల్లయుద్ధంలో భీమకీచకులు ముందు దీర్ఘంగా మాట్లాడుకొంటారు. కాని, అది యుద్ధ సంభాషణ కాదు. ఒకరిది కామ విలాస ప్రలాపం; మరొకరిది గూఢవాక్యోల్లాసం. ఆ రెండూ మల్లయుద్ధానికి ముందుమాటలుగా ఉండవు. ఒక్కసారి తుఫాను ముందు కురిసే తొలకరిజల్లులుగా ఉంటాయి. భీముడు విజృంభించి కీచకుడి తలబట్టి వంచటంతో యుద్ధం ప్రారంభమౌతుంది. మల్లుడితో యుద్ధం ఆరు పద్యగద్యాల నిడివితో సాగగా, కీచకుడితో యుద్ధం పదునైదు పద్యగద్యాల పరిమితిలో విస్తరించింది. మల్లుడితో యుద్ధం పగటివేళ జరిగింది కాబట్టి కాబోలు కుస్తీపట్లన్నీ స్పష్టంగా తెలిశాయి పేర్లతోసహా. మరి నర్తనశాలలోని యుద్ధం చీకట్లో సాగింది కదా! మల్లుల పోరాటపు తీరులే గోచరించాయికాని కుస్తీపట్ల వివరాలు తెలియరాలేదు. చీకట్లో గోప్యంగా జరిగే మల్లయుద్ధ శిల్పంలోని కుస్తీపట్ల విశేషాలు వాచ్యంకాకుండా ధ్వనింపచేయటం తిక్కన నేర్పు. భీముడికి మల్లుడితోడి యుద్ధం అసమయుద్ధం. కీచకుడితోడి యుద్ధం సమయుద్ధం. అందుకే చాలసేపు పోరాడవలసివచ్చినట్లు వర్ణన. కీచకు డలసిపోయినట్లు కనబడేంతవరకూ భీముడు సమతౌల్యాన్ని పాటించాడు. ఆ తరువాత ఒక్కసారి విజృంభించి పైకి వస్తున్న శత్రువును క్రిందకు గుంజి పిడికిటితో పిడుగుపాటు దెబ్బలు కొట్టి, పండిన పళ్ళ చెట్టును నిలువున కూల్చినట్లు నేలపై పడవేశాడు. కీచకుడు తన్నుకొని చచ్చాడు. ఆ తరువాత ద్రౌపది హృదయాహ్లాదం కొరకు కీచకుడి శవాన్ని మాంసపు ముద్దగా మార్చాడు. మల్లుడితోడి యుద్ధంలో కుస్తీపట్లనే

గమనించి ఉల్లాసపడే పఠిత కీచకుడితోడి యుద్ధంలో భంగిమలను భావించి ఉత్సాహపడతాడు. మొదటి దానికంటె రెండవది ఉదాత్తమైనదని ఆహ్లాదిస్తాడు.

మొదటి యుద్ధంలో ముందు వెనుకల పలుచని సంభాషణలు, రెండవ యుద్ధంలో మొదలు చివరలలో విస్తృతమైన సంభాషణలు. మల్లయుద్ధ ఘట్టాలకు సంబంధించినంతవరకు ఉభయ కావ్య నిర్మాణ శిల్పంలో కీచకవధ ఒక ఊర్జిత కథ.

దక్షిణ ఉత్తర గోగ్రహణ యుద్ధాలు ప్రతిఘటన (contrast) శిల్పాన్ని ప్రదర్శించే విశిష్ట ఘట్టాలు. ఆ తారతమ్యాన్ని భావిస్తే పఠితకు వైవిధ్యంవలన కలిగే వింత ఆహ్లాదం స్ఫురిస్తుంది. ఊర్జిత కథ కుండే ఉభయపక్షాలు ప్రత్యక్షమౌతాయి.

(i) సుశర్మ దాడి పగతీర్చుకొనేది. కౌరవుల దాడి గోవుల పేరుతో పాండవులను బయటపడేటట్లు చేసేది. మొదటిదానిలో సుశర్మ ఆత్మగౌరవం ముఖ్యం. రెండవదానిలో దుర్యోధనుడి దుర్మంత్ర ఫలితం ముఖ్యం. ఈ రెండు యుద్ధాల ప్రవృత్తులూ ఫలితాలూ ఆ ప్రయోజనాలను ప్రతిఫలించేటట్లు ఉంటాయి. అందువలననే చివరకు సుశర్మ బందీ ఔతాడు. దుర్యోధనుడు ఘోరంగా పరాజితుడౌతాడు.

(ii) సుశర్మ చేసే యుద్ధంలో అతడు ప్రతివీరుడు, ఏకవీరుడు. విరాటుడు బలగంతో కూడుకొన్న బహువీరుడు. సుశర్మసైన్యం అపారం. రథసంఖ్యా బహుళం; అయినా అవ్యవస్థితం. విరాటసైన్యం పరిమితమైనా సంఘటితం. ఆయావీరుల వెంటనడిచే చతురంగబలం సుశిక్షితం. వ్యూహబహుళం. సుశర్మపక్షంలో ఒకడు పెక్కురితో పోరే వైఖరి అధికం. విరాటపక్షంలో ఒకరి తరువాత ఒకరు సమయోచితంగా యుద్ధాన్ని నడిపించటం బహుళం. అయినా మొత్తం మీద అందరూ కలసి శత్రువును క్రమ్ముకొనే అవగాహనతో కూడుకొన్నది. ఇరుపక్షాలూ మెరుపుదాడులతో మెలకువ ప్రదర్శించేవే. సుశర్మ మెరుపుదాడితో విరటుని బంధించి శత్రుసైన్యంతో సంక్షోభాన్ని సృష్టిస్తాడు. దానికి పాండవులు తగిన సమాధానం మెరుపు దాడులతోనే చెప్పి విరాటుడిని విడిపిస్తారు. భీముడు సుశర్మను బంధిస్తాడు. ప్రేక్షకులకు ఇది ఒక పోటీయుద్ధంగా ఉంటుంది. దొమ్మియుద్ధం కూడా పెక్కుసార్లు ప్రవర్తిల్లుతుంది. అప్పుడు ఉభయ సైన్యాలూ పగ్గంలాగే పోటీ (Tug of war) లో ముందుకు వెనుకకు ఊగిసలాడుతున్నట్లు కనిపిస్తాయి. చివరకు పాండవులున్న విరాటపక్షం విజయం సాధిస్తుంది. ఇది మనుష్యులు చూచి మెచ్చుకొనే యుద్ధంగా ఉంటుంది. దీనికి ప్రతిగా ఉత్తర గోగ్రహణయుద్ధం దేవతలు చూచి మెచ్చుకొనే విధంగా సాగుతుంది. ఆ తారతమ్యం ఆ ఉభయ యుద్ధసన్నివేశాలలో స్పష్టంగా తోస్తుంది.

(iii) ఉత్తర గోగ్రహణ యుద్ధంలో అర్జునుడు ఏకవీరుడు. నాయక స్థానీయుడు. ప్రతినాయక పక్షంలో బహునాయకత్వం. ప్రదర్శితమౌతుంది. ఆ సేనకు సర్వసైన్యాధ్యక్షుడు వేరే లేడు. దుర్యోధనుడు రాజుకాబట్టి అతడి భావానికి అనుగుణంగా నడవటం, అతడిని రక్షించుకొనటం ఆ యుద్ధ లక్ష్యం. అందువలన ద్రోణ భీష్మాశ్వత్థామాదులు అంటీ పట్టనట్లు యుద్ధం చేస్తారు. కర్ణుడు అంతా తానే నిర్వహిస్తానని ప్రగల్భా లాడతాడు. ద్రోణభీష్మాదులు అర్జున ప్రతాపాన్ని (అంటే శత్రు పరాక్రమాన్ని) అంచనాకట్టి చెప్పినా కర్ణుడు లెక్కచేయడు. పరబలాన్ని తక్కువగానూ, స్వీయబలాన్ని ఎక్కువగానూ భావించి విజృంభించి చివరకు పరాభవం పాలుకావటం అతడి యుద్ధవీర స్వభావం. దాన్ని వివేకజ్ఞులైన భీష్మాదులు అధిక్షేపిస్తారు. రారాజు కర్ణుడిపై యుద్ధభారముంచి నిర్లిప్తంగా నిలిచిపోతాడు. అతడిని దుర్యోధనుడు సమర్థించి, అతడితోపాటు తానూ భంగపడతాడు. అట్లా జరగాలనీ, దానివలన ఒక గుణపాఠం దుర్యోధనుడు తెలిసికొనవలెననీ కౌరవపక్షంలోని వృద్ధవీరులు భావిస్తారు. దీనితో కౌరవపక్షంలో సంఘటిత యుద్ధం సాధ్యపడలేదు. ఎవరికి వారు తమ ప్రతాపాలను ప్రదర్శించుకొనటానికే అర్జునుడి మీద దాడిచేశారు. వరుసగా వీగిపోయారు. ఐక్యత లేని ఏకవాక్యత లేని కౌరవపక్ష యుద్ధం అడుగడుగునా ఏ విధంగా అపజయం పాలౌతుందో చిత్రించే యుద్ధ విశేష వర్ణనం ఈ ఘట్టంలో పఠితలకు ఆసక్తిని కలిగించే అంశం.

(iv) అర్జునుడి కదలికలు అడుగడుగునా అద్భుతాన్ని ఆవిష్కరిస్తాయి. అతడు పోరిన తీరులు చిత్రించే సన్నివేశాలు పఠితలలో ఆహ్లాదాన్ని పొంగింపచేస్తాయి. బృహన్నలగా అర్జునుడి రూపం భీష్మాదులలో వితర్కాన్ని లేవదీస్తుంది. అర్జునుడు

శమీవృక్షం దగ్గర నిజాకారంతో నిలిచినప్పుడు ఉత్తరకుమారుడిని అద్భుతంలో ముంచివేశాడు. దేవదత్తాన్ని పూరించి శత్రువుల గుండెలలో దడ పుట్టించాడు. అర్జునుడిని గుర్తించిన భీష్మాదులు యుద్ధం అసాధ్యమని నిశ్చయించారు. కర్ణుడు దురహంకారంతో వారిని తృణీకరించి అర్జునుడిని సంహరిస్తానని ప్రగల్భాలాడి ప్రతాపం చూపించాడు. దుర్యోధనుడు యుద్ధంచేయటంకంటె అజ్ఞాతవాస వ్రతకాలం పూర్తికాకుండానే అర్జునుడు బయటపడ్డాడన్న సాకుతో పాండవులను మరల అరణ్యాజ్ఞాతవాసాలకు పంపాలని కపటిగా ఆలోచించాడు. భీష్ముడు పాండవుల అరణ్యాజ్ఞాతవాస కాలం పూర్తయిందని ప్రకటించాడు. దానితో దుర్యోధనుడి దుష్టవ్యూహం భగ్నమైపోయింది. ఇక మిగిలింది కొనితెచ్చుకొన్నయుద్ధమే. కర్ణుడిని నమ్ముకొని చావుతప్పి కన్నులొట్టపోయినట్లు యుద్ధం చేయటమే దుర్యోధనుడికి మిగిలింది. ఆ స్థితికి ముఖ్యకారకుడు ప్రత్యక్షంగా దుర్యోధనుడిపై లక్ష్యం పెట్టి వ్యూహాన్ని పన్ని యుద్ధం సాగించిన అర్జునుడు. అతడి ధాటికి కర్ణుడు నిలువలేడని నిరూపించదలచిన భీష్మద్రోణాదులు పరోక్షకారకులు; గురువులను నిందించిన కర్ణదుర్యోధనులకు తగిన శాస్తి జరగాలని లోన భావించిన అశ్వత్థామాదులు. నిజానికి దుర్యోధనుడు తన వారితోనే లోపలిపోరు చేశాడు. పగవాడితో బైటిపోరు చేశాడు. ఉభయభ్రష్టుడైనట్లు చిత్రించటం వ్యూహ శిల్పం.

(v). అర్జునుడు అద్భుత వ్యూహరచనా ధురంధరుడు. బాణాలతో, బాణాలవంటి మాటలతో పోరాడగలడు. పెద్దలకు బాణాలతో వినయాన్ని ప్రదర్శించగలడు; విక్రమాన్ని చవి చూపించగలడు; సమయోచిత ప్రజ్ఞతో వ్యూహరచనను చేయగలడు. అర్జునుడి యుద్ధవ్యూహం స్థిరమైన, విజయ సాధకమైన వ్యూహం. కౌరవులకు ప్రత్యేకించి యుద్ధవ్యూహం లేదు. గోధనాన్ని అపహరించటమే వారి గొప్ప వ్యూహం. అర్జునుడు అందుకే దుర్యోధనుడిని దొంగగా పరిగణించాడు. దానికి తగినట్లుగానే వ్యూహాన్ని రచించాడు. అందులోని కొన్ని విశేషాలు-

(అ) భీష్మద్రోణాదులు రాజుకు రక్షగా సైన్యముఖంలో ఉన్నారు. అందువలన వారిని ముందుగా ఎదుర్కొనకుండా నమస్కార బాణాలతో కుశల ప్రశ్నలు వేసి, వారి సాముఖ్యాన్ని సాధించి, రథాన్ని ప్రక్కదారి పట్టించటం మొదటి దశ. దీనివలన భీకరయుద్ధం తప్పింది.

(ఆ) సైన్య మధ్యంలో గోవులు నడుస్తున్నాయి. వాటిని తప్పించి, రక్షించి, నగరంవైపు గోపాలురతో సహా క్షేమంగా పంపించటం అర్జునుడి ప్రథమకర్తవ్యం కావటం సముచితం. అందుకే గోవులున్న సైన్య మధ్యభాగంమీద మొదటిదాడి చేశాడు. వాటిచుట్టూ మూగిఉన్న సైన్యంతో సంకులసమరం చేసి లక్ష్యాన్ని సాధించాడు. గోవులు తిరిగిపోయాయి. కౌరవ సైన్య వ్యూహంలో నడిమిభాగం వెలితిపడింది. అందులోకి అర్జునుడు ప్రవేశించి సముద్రాన్ని మహామత్స్యం సంక్షోభపరిచినట్లు సంకులసమరం చేశాడు. ఏకవీరుడు అనేక సైనికులను నేలమట్టం చేసే ఘట్టం ఇందులో ఆసక్తికరంగా సాగింది. ఇది రెండో దశ. దీనివలన గోధన విముక్తి కలిగింది. దుర్యోధనుడి దాడి విఫలమయింది.

(ఇ) కౌరవ వ్యూహం నడుము విరిగి రెండు ముక్కలైంది. మొదటి ముక్క భీష్మాది వీర రక్షితం. రెండవ ముక్క కర్ణరక్షితం. దుర్యోధనుడు కర్ణకవచంలో రెండవభాగంలో ఉన్నాడు. అర్జునుడు మొదటి భాగాన్ని మాని రెండో భాగంవైపు పోరు సాగించాడు. ఇది యుద్ధవ్యూహంలో ఆయువుపట్టు వంటిది. లక్ష్యం దుర్యోధనుడికి బుద్ధిచెప్పటం. అంతేకాదు, ఆ భాగంలో అడ్డం వచ్చినవారికి కూడా బాణాలతో బదులు చెప్పటం. అంతటితో ఆగకపోతే భంగపరచి రంగాన్నివీడి పరుగెత్తేటట్లు చేయటం. కొందరు పొగరుమీరి పొడిచేద్దామని మీదపడితే పరాభవించటం, అవసరంవస్తే ప్రాణాలు తీయటం అర్జునుడి యుద్ధతంత్రంలో భాగం. అందుకే చిత్రాంగదాదులను చంపాడు. కర్ణుడిని విరథుడిని చేసి దూరంగా పంపాడు. దుర్యోధనుడు తాను నమ్ముకొన్న కర్ణుడనే కవచం శిథిలమైపోయింది. తనను తాను రక్షించుకొనే దయనీయస్థితిలో పడ్డాడు. అప్పుడు రాజుకు బాసటగా నిలిచారు ద్రోణాదులు. వీరు ధర్మయుద్ధవీరులు, కాబట్టి ఏకవీరుడైన అర్జునుడితో ఒకరితరువాత ఒకరు ద్వంద్వయుద్ధానికి విల్లమ్ములతో సిద్ధమయ్యారు. క్రమంగా ద్రోణుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు యుద్ధ విముఖులైన తరువాత భీష్ముడు చివరకు తారసిల్లాడు. ఈ సన్నివేశం చూస్తే భారత కావ్య పఠితలకు కురుక్షేత్ర యుద్ధం తలక్రిందుగా మొదలయిందా అని ఆశ్చర్యం కలిగిస్తుంది. ఇందులో మొదట కర్ణపర్వం, ఆ తరువాత ద్రోణపర్వం, ఆ మీద భీష్మపర్వం సాగినట్లుంటుంది. చివరకు దుర్యోధనుడితో జరిగే యుద్ధం ప్రవర్తిల్లుతుంది. విజయుడు అన్నింట విజయుడు కావటం విశేషం.

(ఈ) దక్షిణోత్తర గోగ్రహణ రంగాలలో దొమ్మియుద్ధాలకంటె ద్వంద్వయుద్ధాలు రసవత్తరంగా ఉంటాయి. పెక్కురిమీద పెక్కురు చేసే యుద్ధంలో రసభావాలకంటె బలాబలాల ప్రదర్శనలకే ఎక్కువ అవకాశం ఉండటంచేత పరిస్థితుల పరిణామాలే అందులో ప్రధానంగా ప్రదర్శితమౌతాయి. పెక్కురితో ఒక్కరు చేసే యుద్ధాలలో వీరుల వీరకృత్యాలు వెల్లివిరుస్తాయి. ఒక్కడు పెక్కురితో చేసే యుద్ధాలలో వీరవిహారం విశ్వరూపం తాలుస్తుంది. ఒక్కడు మరొక వీరుడితో చేసే యుద్ధంలో వీరరసపోషకాలైన ఆంగిక, ఆహార్య, వాచిక, సాత్త్వికాభినయ ముద్రితాలైన యుద్ధక్రీడలు ఊర్జితంగా రాణిస్తాయి. ఈ నాలుగు రకాల యుద్ధ విధానాలనూ తిక్కన ఈ రెండు ఘట్టాలలో వర్ణించాడు. కాని, ఉత్తరగోగ్రహణంలో శత్రుపక్షంలో మహాయోధులు ఎందరో ఉండటంచేత వారితో అర్జునుడు చేసే యుద్ధ సన్నివేశాలు ద్వంద్వయుద్ధక్రీడకే అలంకార ప్రాయాలుగా ఉంటాయి. ద్రోణాదివీరుల వ్యక్తిగత వీరస్వభావాల వైవిధ్యం, వాటిని సముచిత వ్యూహాలతో స్వీయ పరాక్రమ ప్రదర్శకంగా అర్జునుడు ఎదుర్కొని విజయంసాధించే వైలక్షణ్యం పఠితలకు హృదయాహ్లాదాన్ని కలిగిస్తాయి. అందువలన లీలాయుద్ధమైనా భీష్మాదులతో సాగిన ద్వంద్వయుద్ధ ఘట్టాలు ఉపరంజకంగా ఉంటాయి. అస్త్రశస్త్ర ప్రయోగాలు అమరులకే అద్భుతాశ్చర్యాలను కలిగిస్తాయి.

(ఉ) కర్ణ దుర్యోధనులతో అర్జునుడు చేసిన ద్వంద్వయుద్ధ ఘట్టాలలో బాణ ప్రయోగాల కెంత ప్రాధాన్యముంటుందో సహజవీరులైన వారినడుమ సాగే సంభాషణల కంత ప్రాముఖ్యముంటుంది. యుద్ధఘట్టాలలో వీరుల మధ్య పోరు వర్ణనకే సాధ్యం. అది శ్రవ్యకావ్య శిల్పానికి శిఖరప్రాయం. మరి వీరుల మధ్య సాగే వీరాలాపాలు నాటకీయతకు పోషకాలు. తిక్కన ఉభయకావ్య శిల్పప్రౌఢి పాటించి ఆయా ఘట్టాలను ఊర్జితం చేశాడు.

## (5) యుద్ధఘట్టాలు : వీరోక్తులు

అందువలన యుద్ధఘట్టాలలో వీరుల వీరోక్తులకు విశిష్టస్థానం తిక్కన కల్పించాడు. మచ్చుకు కొన్ని-

**1. ప్రగల్భోక్తులు :** వీటిని తెలుగులో బడాయిమాట లంటారు. ఇవి సామాన్యంగా మూడు రకాలు. తన శక్తి తనకు తెలియకుండా గొప్పలు సాధిస్తానని చెప్పుకునేవి కొన్ని. దీనికి ఉత్తరకుమారుడు ప్రసిద్ధి. తన శక్తిని ఎక్కువగా అంచనా వేసికొని శత్రువులపట్ల నిర్లక్ష్యంగా మాట్లాడేవి కొన్ని. మల్లుడు, కీచకుడు, సుశర్మ- దీనికి సాక్ష్యం. ఎదుటివారి శక్తిని తక్కువగా అంచనావేసి తన నెప్పుడూ వారికంటె ఎక్కువగా భావించి అసాధ్యమైన విషయాలను సైతం అవలీలగా సాధించగలనని గొప్పలు పలికేవి కొన్ని. కర్ణుడు ఈ రకం ప్రగల్భాలకు ఏకైక నిదర్శనం. పరబలాన్ని నమ్ముకొని అద్భుతాలు సాధించగలనని అహంకరించి మాట్లాడేవి కొన్ని. వీటికి దుర్యోధనుడు పెట్టింది పేరు. ఇవన్నీ కలిపి ప్రతిపక్షంలో హరివిల్లువలె రాణిస్తే వాటికి అర్జునాదులు ప్రతిగా మాట్లాడే పౌరుషవాక్యాలు ప్రతిఘటన శిల్పాన్ని పోషిస్తాయి.

2. పరిశీలిస్తే ఆయా సందర్భాలలో ప్రతిజ్ఞలూ, ప్రతాపాలూ, నిష్ఠురాలూ, అధిక్షేపాలూ, వ్యంగ్యాలూ, ఉపాలంభనలూ, ప్రశంసలూ, నిందలూ, అవహేళనలూ, భయాలూ, భంగపాట్లూ, విజయగర్జనలూ, వెక్కిరింతలూ, వెటకారాలూ మొదలైనవాటిని వ్యక్తం చేసే ఉక్తి విశేషాలు యుద్ధక్రీడను ఉక్తులతో ఉజ్జ్వలతరం చేస్తాయి. తిక్కన ఈ కళలో సిద్ధహస్తుడు. ఉదాహరణ కొకటి రెండు:

**(అ) ఉత్తరుడి అసమర్థ ప్రగల్భం:** చ. 'కురుపతి భీష్మకర్ణ కృపకుంభజ ముఖ్యులు............' (విరా.4.11)

**(ఆ) కర్ణుడి బింకపు ప్రగల్భాలు:**

1. చ. 'వెఱచితిరేని నిల్వుఁ డొకవీరున కొక్కఁడ చాలుఁ గాక..........' (విరా.4.201)

2. శా. 'జ్యాఘోషం బతిభీషణంబయి దిశాచక్రంబు నిండన్..........' (విరా.4.202)

3 క. 'క్రోధజ్వాలలు నిగుడ వి। రోధబలేంధనముఁ బొదువు క్రూరతమై.........' (విరా.4.203)

ఈ యుద్ధఘట్టాలలో వీరులు ముఖాముఖి తలపడ్డప్పుడు చేసికొనే అధిక్షేపోక్తులూ, అవహేళనోక్తులూ, వ్యంగ్యోక్తులూ ప్రసిద్ధాలు. ప్రత్యేకించి అశ్వత్థామకూ కర్ణుడికీ మధ్య జరిగే సంభాషణలలో రవ్వలవలె వెలుగొందే అధిక్షేపాలు ఆసక్తికరాలు.

**అశ్వత్థామ:-**

క. "నిను నీవ పొగడికొని పలి। కిన పలుకులు పెక్కుగలవు క్రీడి యనికి వ
చ్చినవాఁ డిదె పులివలె; మా। ర్కొనరాదే కర్ణ! సేనకుం బ్రియమెసఁగన్".

క. "తలఁకు గలదేని శకునిం। బిలిచి విచారింపఁ బొమ్ము పృథివీపతి నీ
తలన మన కార్యఖడ్గం। బుల మో పెక్కించె; రిత్తవోవునె నీకున్?" (విరా.5.22,23)

దీనికి సమాధానంగా కర్ణుడు పలికిన ప్రతాపోక్తి:-

చ. "తలఁకెడు వానికిన్ మగఁడ తా నటె నన్నడఁకించువాఁ డిసీ!
పలుకకు; భీతున ట్లొదుఁగఁ బాఱునె శూరుఁడు, నిన్ను నచ్చి యే"
"కలనికి వచ్చితిన్ నరుఁడ కాఁడట వాసవుఁ డైన నేమి? నా
బలముఁ జలంబు నేరిమియు బంటుతనంబును నీవ చూడుమీ!" (విరా.5.25)

(వీటిలోని విశేషాలకు వ్యాఖ్యానం చూడండి).

కర్ణాశ్వత్థామల అధిక్షేపోక్తులకంటె ఆసక్తికరమైన కర్ణార్జునుల అమర్షోక్తులు (కోపంతో పలికే ఈటెలవంటి ఎత్తిపొడుపు మాటలు) రసవత్తరాలు. వాటిలో ఒక్కొక్క పద్యం ఒక్కొక్క ఉక్తి విశేషం. (వివరాలకు చూడండి 5.88-95).

ఉత్తరగోగ్రహణ ఘట్టంలో కౌరవ సైన్యంలోని శిష్టచతుష్టయం, చివరకు అర్జునుడు కర్ణుడినే కాక దుర్యోధనుడిని కూడా ఉపాలంభించిన విధం ఒకదాని కంటె మరొకటి విశేషం. కర్ణుడి ప్రగల్భాలను పరిహసించటం ఒక తీరు; దుర్యోధనుడి దురహంకారాన్ని అధిక్షేపించటం మరొక తీరు. ఉపాలంభనమంటే మనసు మర్మస్థానంలో గ్రుచ్చుకొనేటట్లు ఎత్తిపొడవటం. వెనుకా ముందూ ఆలోచించకుండా దుర్యోధనుడిని రెచ్చగొట్టి నే నున్నానని ముందుకు దూకి, చివరకు తానూ రాజూ కలిసి గోతిలోపడే కర్ణుడి ప్రగల్భవైఖరిని ఎత్తిపొడవటం కర్ణోపాలంభనంలో సాధారణాంశమైతే, ఇతరులసాయంతో కార్యాలు సాధించినా ఆత్మాభిమానంతో అతిశయించే దుర్యోధనుడు అపజయంపాలయ్యే సూచనలు అర్జునుడి ప్రతాపంవలన ఏర్పడినా, పగతో తిరగబడాలనే అతడి మూర్ఖప్రవృత్తిని అందరూ ఎగతాళిచేయటం విశేషాంశం.

శిష్టచతుష్టయంలో భీష్ముడు పెద్దవాడు. సమ్మోహనాస్త్రంతో అందరూ మూర్ఛితులైనా, ఆయుధాలు చేతులుజారిపోయినా, తలపాగాలు కోల్పోయినా తెలిసికొనలేక అర్జునుడిపై యుద్ధం చేయాలని లజ్జలేక ఊరుకొనే దుర్యోధనుడిని భీష్ముడు మోమాటంలేకుండా, నిష్ఠురంగా, నిస్సంశయంగా అవహేళన చేస్తూ, మారుమాటాడలేనట్లుగా మాట్లాడతాడు. ఆయన చేసిన ఉపాలంభనం నిష్ఠురాధిక్షేపం.

ఉ. "మోహన బాణపాతమున ముందలచీర లెఱుంగకున్న యీ
బాహుబలంబుతోఁ గడఁగి పార్థునిఁ దాఁకెడుబుద్ధిఁ గ్రమ్మఱన్
సాహసవృత్తిఁ జేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయఁడే మనల నందఱ నొక్కట మార్గణాగ్నికిన్?" (విరా.5.218)

దుర్యోధనుడు పెద్దలతో నిష్కారణంగా వివాదాలు పడతాడు. వారు పాండవ పక్షపాతులని నిందిస్తూ ఉంటాడు. ఇప్పుడా వివాదాలు చేసే సమయం కాదనీ విరోధులతో యుద్ధం చేసే సమయం వచ్చిందనీ ఉపాలంభించాడు. ద్రోణాచార్యుడు. అతడిది మర్మాధిక్షేపం.

ఉ. "అచ్చెరువైన విక్రమము నగ్గలికన్ సమరంబు గోరి యీ
వచ్చుచునున్నవాఁడు బలవద్రిపుభీషణబాహుఁడైన వి
వ్వచ్చుఁడ; యింక మిన్నక వివాదము సేసినఁ బోవ దియ్యెడం,
బొచ్చెములేని బల్మిగలఁ బోరి కమర్పుము దర్ప మేర్పడన్". (విరా.4.181)

అందరికంటె అధికంగా దుర్యోధనుడిని అమర్షాధిక్షేపాలతో ఉపాలంభించేవాడు ఆవేశపరుడైన అశ్వత్థామ. అతడి మాటలతో శ్రుతి కలుపుతాడు కృపాచార్యుడు (4.227).

కపట ద్యూతంలో శకుని సంపాదించిన రాజ్యాన్ని అపహరించి,ద్రౌపదిని అవమానించి, వారి రాజ్యాన్ని భోగిస్తూ సుఖం మరిగిన దుర్యోధనుడు నాడు యుద్ధం గెలవాలంటే శకుని తోడు పనికివస్తుందా? అని గుట్టుమట్టుకొనేటట్లు గట్టిగా మందలించాడు. అతడివి వెటకారపు వ్యంగ్యోక్తులు. మచ్చు కొక్కటి-

చ. "పాండవవీరులం గలన బాహుబలంబున నోర్చియే సము
ద్దండత నీవు దొల్లి ద్రుపదక్షితిపాత్మజఁ గొల్వులోనికిం
దెండని పుచ్చి; తద్దెసకుఁ దెచ్చుట సౌబలునీతిఁ గాదె? యా
తండ మరల్పుఁ గాక సముదగ్రత వచ్చు విరోధి నిప్పుడున్" (విరా.4.194)

ఉపాలంభనలకే ఉదాత్తోదాహరణం అర్జునుడు దుర్యోధనుడిని చేసిన వ్యంగ్యోపాలంభనం.

ఉ. 'క్షత్రియుఁ డోడునే తగదు కౌరవరాజ! యొకండ నేఁ.......' (విరా.5.203)

సీ. 'ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ। రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె?' (విరా.5.204)

(వివరాలకు విశేష వ్యాఖ్యాంశాలను పరిశీలించండి).

## (6) అభినయ విద్యా విలాసం

విరాటపర్వంలోని శ్రవ్యకావ్యశోభకు దృశ్య కావ్య వైభవాన్ని కలిగించేది తిక్కన ప్రబంధ రచనలో ప్రదర్శించే అభినయ విద్యావిలాసం. తిక్కన పాత్రలు మనసును కాని, మాటను కాని అభినయించి చూపుతారు. వాటిని తిక్కన చలనచిత్రంవలె వర్ణించి చూపుతాడు. తిక్కన రచనలో ఒక నృత్యరత్నాకరం తురంగలిస్తుంది; అభినయ దర్పణం మెరుస్తుంది. మచ్చుకు కొన్ని అభినయపద్యాలు:

**1. ద్రౌపది అభినయిస్తూ మాట్లాడుతుంది :** పాండవులు అడవిలో విరాటనగరంవైపు నడుస్తున్నారు. సుకుమారి అయిన ద్రౌపది అలసిపోయింది. తన అలసటను అభినయోచితంగా భర్తలకు చెప్పుకొన్న పద్యం హృద్యం. ఉ. 'డప్పి జనించె, వేళులపుటంబులు పొక్కఁ దొడంగె... ఒక్కడుగు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్' (విరా.1.148). ఈ పద్యంలోని క్రియలను తద్ధర్మకాలంలోకి మార్చి 'డప్పి జనించు, పొక్కఁ దొడంగు. చిప్పిలఁ జొచ్చు' అని చెప్పితే అలసట అనే అవస్థకు నాట్యసూత్రమౌతుంది. సుదేష్ణ కీచకుడి ఇంటికి పోయి కల్లు తీసికొని రమ్మని పనిచినప్పుడు ద్రౌపదికి మొదట ఉల్లం తల్లడిల్లింది. శరీరమంతా చెమటలు పట్టింది. మనిషి డీలాపడింది. మనసులో బాధ అధికంగా మొదలయింది. ఆ తరువాత వితర్కం పెల్లుబికింది. దైవం గుర్తుకు

వచ్చింది. అభినయముద్రితమైన వాచికాభినయం వర్ణించిన ఈ పద్యం (విరా.2.91) ఆస్వాద మధురం. భీముడు ద్రౌపదీ హృదయోల్లాసం కొరకు కీచకుడిని వికృతపు చావుకు గురిచేసి, మాంసపు ముద్దవలె భయానక బీభత్సంగా ఉన్న అతడి శవాన్ని ఆమెకు చూపాడు. అప్పు డామె కన్నార్పకుండా చూస్తూ శవం దగ్గరికి పోయింది. పీడ వదిలిం దన్నట్లు అచ్చమైన తెలుగు పడుచువలె మెటికలు విరిచింది. తగినశాస్తి జరిగిందిలే అన్నట్లు తల ఊపింది. ఎంతలో ఎంతపని జరిగింది? అని ముక్కుమీద వేలువేసికొన్నది. 'కీచకా! దీని కొరకేనా నీ వింత చేశావు? నీకిప్పుడు చావే సుఖం. అంత అతిగా చేసినందుకే ఇంత అనుభవిస్తున్నావు'. అని అనుకొన్నది. ఆ శవాన్ని చూచినకొద్దీ ఆమెకు భయం కలిగింది. అభినయంలోనుండి మాటలు పుట్టి, అవి మరల అభినయంలో మునిగిపోయే వింత పద్యం (2,356) చలనచిత్రం చూపిస్తున్నట్లుంది. ద్రౌపది పాత్ర ఎప్పుడూ అభినయిస్తూ మాట్లాడుతుంది. అది ఆమె నాగరక లక్షణం.

**2. భీముడు మాటకు ముందు అభినయిస్తాడు** : కీచకుడు ద్రౌపదిని నేలమీదకు పడలాగినప్పుడు భీముడు అగ్రహోదగ్రుడైనాడు. అతడి భయంకరాకారాన్ని తిక్కన అపూర్వంగా ఆవిష్కరించాడు. (విరా.1.133, 134) అచ్చమైన అభినయం ఆకృతి కొన్నట్లుండే ఆ రెండు పద్యాలు తెలుగు సాహిత్యంలో క్రోధ భావాభినయానికి తిక్కన చెక్కిన శబ్దార్థ గుణాల అక్షర శిల్పం. ఇంతటి రసభావోద్రేకాన్ని ప్రదర్శించిన భీముడు ఒక్కమాట కూడా మాట్లాడకపోవటం ఒక వింత. అంతేకాదు. అంబరాన్ని అందేటట్లుగా ఆగ్రహాన్ని ప్రదర్శించగలిగిన పవనతనయుడు అవసరం వచ్చినప్పుడు నిగ్రహంతో వ్యవహరించగలడు. కీచకసంహారార్థం చీకట్లో నర్తనశాలకు పోతున్న భీముడు తన నడకలో తేడా రాకుండా ముందుకు సాగాడు. యుద్ధానికి పోతున్న ఉత్సాహాన్ని బయటపెట్టకుండా కప్పిపుచ్చుకొన్నాడు. రోషం వలన కలిగే ఉద్రేకం వేగిరపాటుతనం పైకి వెలువడకుండా నిబ్బరించుకొన్నాడు. ఎవ్వరికీ అతడు శత్రువును చంపటానికి పోతున్నాడన్న అనుమానం ఆవంతకూడా రాకుండా నిభాయించుకొంటూ నిర్నిద్రంగా విక్రమగంభీరంగా వెళ్ళాడు. విభిన్న భావావస్థలలో భీముడు ప్రదర్శించిన అభినయ నైపుణ్యం అపూర్వం.

భీముడు కోపాన్ని పెంచగలడు, కప్పిపుచ్చగలడు, అంతేకాక, అణచిపెట్టగలడుకూడా అని చెప్పే పద్యం (విరా.2.232) అభినయసుందరం. నర్తనశాలలో సంకేతస్థలంలో ద్రౌపది స్థానంలో రహస్యంగా భీముడు కూర్చున్నాడు. కీచకుడు వచ్చి కేలుసాచాడు. భీముడికి ఒడలు మండింది. కోపం కట్టలు త్రెంచుకొంటూ మనసులో పొంగింది. శరీరం ప్రతీకార తీవ్రతకు కంపించింది. కాని ఆ ఆవేశాన్ని ధైర్యంతో నిగ్రహించుకొన్నాడు. కీచకుడి మన్మథ చేష్టలను, మాటలను, వాటి వైఖరిని బాగా గమనించాలని ఓపికపట్టి కదలకుండా కూర్చున్నాడు. అతడి పద్ధతి చూస్తే 'అవికారనిగూఢ నిజప్రకారుడై' ఉన్నాడు. భీముడు కోపాన్ని పొంగించినా, కుదించినా ఎంత మనోహరంగా ఉంటాడో తిక్కన తెలుగువారికి తెలియజెప్పాడు. ఈ అభినయ వివరాలన్నీ వ్యాసుడి రచనలో అంతగా కానరావు.

భీముడి రౌద్రోద్రేకం ఎన్నిసార్లు చూచినా తనివితీరదు. అట్లా చిత్రించాడు తిక్కన. ఉపకీచకులపై కోపం వచ్చినప్పుడు భీముడు 'శుంభన్మూర్తి విస్ఫూర్తితో' శోభిల్లాడు. అంటే తిక్కన పరిభాషలో ఆంగికాభినయ సాత్త్వికాభినయ సమగ్రంగా నిలిచాడన్నమాట! క్రోధభావోద్రేకానికి సజీవ శిల్పం ఈ పద్యం.

మ. "వికట భ్రూకుటి ఘోరఫాలకలిత స్వేదోద్భటుండుం, జల
ద్వికృతోష్ఠద్వయుఁడుం, బ్రమర్దన దశావిర్భావ సంభావితాం
గకుఁడుం, జిత్తవిదాహదోహల సమగ్ర క్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తివిస్ఫూర్తితోన్." (విరా.3.25)

ఈ భయంకరరూపాన్ని చూచి ఉపకీచకులు గంధర్వులు వచ్చారని భయపడి సంక్షోభాత్ములై ప్రాణరక్షణకొరకు వారు పడ్డపాట్లు హాసోల్లాసం కలిగిస్తాయి.

మ. "ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని; రిం కెట్లొక్కొ యంచున్ భయం
బొదవం బల్లములందు డాఁగియు, సమీపోర్వీజముల్ ప్రాఁకియుం.
జెదరం బాఱియు, నీరు సొచ్చియును, నిశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియున్ భరితసంక్షోభాత్ములై రత్తఱిన్". (విరా.3.28)

అనిల సుతుడికి అభినయమే అలంకారమన్నట్లు తిక్కన ఆ పాత్రను తీర్చిదిద్దాడు. (వివరాలకు పై పద్యాల విశేషవ్యాఖ్యలు గమనించండి).

**3. ఉత్తరుడు ఉత్తమ నటుడు :** విరాటపర్వంలో భీముడు క్రోధాన్నీ, ద్రౌపది వేదననూ, కీచకుడు విరహాన్నీ, ఉత్తరుడు భయాన్నీ అభినయించటంలో ఆరితేరినవా రనిపిస్తారు. వారి వారి అభినయాలలో వారి వారి స్వభావాలు కూడా అంతర్జ్యోతులవలె ప్రకాశిస్తూ ఉంటాయి. భీముడు ఉద్ధతుడైనా ఉదాత్తుడివలె వ్యవహరించినవాడు, ద్రౌపది అభిమానవతియైనా భరించలేని అవమాన దుఃఖాన్ని అనుభవించిన ఉదాత్తురాలు. కీచకుడు సింహబలుడైనా విరహోన్మత్తుడు. ఉత్తరుడు ఉత్తముడైనా పిరికివాడు; భూమింజయుడని పేరు పెట్టుకొన్న భూరిభయస్థుడు; అతడు రథికుడైనా సారథిగా రాణించినవాడు. అర్జునుడి సాహచర్యంతో భయాన్ని ధైర్యంగా మార్చుకొనే మర్మం తెలిసికొన్నవాడు. చేసిన మేలు మరవనివాడు. కృతజ్ఞతాభావపూర్ణుడు. వీరాభిమాని, విజయాభిలాషి. అతడి పిరికితనం తెలుగులో బాగా పేరు మ్రోగటానికి తిక్కన అభినయశిల్పమే కారణమయింది. తిక్కన ఉత్తరుడి పాత్రకు ఉజ్జ్వల నవరత్న పద్యహారాన్ని ప్రసాదించాడు. ఆ రత్నాలను ఇవిగా గుర్తించవచ్చును - విరా. చతుర్థాశ్వాసంలోని 51,55,80,173,177. పంచమాశ్వాసంలోని 112,113,186,265 సంఖ్యలు గల పద్యాలు. ఈ పద్యరత్నాల వెలుగులను విశేషవ్యాఖ్యలలో దర్శింపవచ్చును.

**4. కీచకుడు చతుర్విధాభినయ చతురుడు :** తిక్కన చిత్రణలో కీచకు డెంత రూపాభిమానియో, అంత రూపకాభినయాభిమాని; ఎంత నానాభరణ ధరణశీలియో అంత నానా రసభావప్రకటన శీలి. ఎంత దుర్విదగ్ధుడో అంత అభినయ విదగ్ధుడు.ఎంత బలగర్వితుడో అంత విరహ భావోన్మత్తుడు. అతడు సైరంధ్రిని చూచి వలచాడు. కాముకుడుగా కాక ప్రేమికుడుగా స్పందించాడు. అందువలననే అతడు సాత్త్వికాభినయాన్ని సహజంగా సాధించగలిగాడు. విరహమూర్తి అయిన శృంగారనాయకుడు మాత్రమే వెలువరించగల అభినయ ప్రజ్ఞను ప్రదర్శించగలిగాడు. కీచకాభినయాన్ని నాలుగు విధాలుగా విశ్లేషించుకొనవచ్చును. ఒక్కొక్కదానికి మచ్చుకు ఒక్కొక్క ఉదాహరణం.

1. భావావస్థకు తగిన ఆంగికాభినయ ప్రదర్శనం.

చ. "అని యని యుగ్గడించు, ధృతి యల్లల నాడినఁ దల్లడించుఁ, బై
కొను తలపోఁత నించు, మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు, నె
ట్టన తెగ నగ్గలించు, నచటన్ జనులం బరికించు, బుద్ధి దూ
లిన వెస నెంతయుం గళవళించు మనోజ వికార మగ్నుఁడై." (విరా.2.31)

2. భావావస్థకు తగిన ఆహార్యాభినయం.

క. "చిడిముడి పడుచు నెదురుచనఁ। గడఁగుచు హారములు సక్కఁగాఁ ద్రోచుచు మ
ల్లడి గొనుచు, దుర్విలాసం। బొడలికి నొడఁ గూర్చుచుండ..........." (విరా.2.114)

3. భావావస్థకు తగిన వాచికాభినయం.

సీ. "సుదతి నీమైఁ జక్కఁ జూచుట కోడెదఁ। గనుఁబాటు వొరయునో యని తలంచి......" (విరా.2.47)

అభిలాష అనే మదనావస్థను వ్యక్తంచేసే వాచికాభినయానికి సముచితోదాహరణం.

4. భావావస్థకు తగిన సాత్త్వికభావాభినయం.

చ. "తలరు నలందురున్ నవయుఁ దాపభరంబున వెచ్చనూర్చు మే
నలయఁగ నొల్లఁబోవు, వెగడందుఁ, గలంగుఁ, బరిభ్రమించుఁ, గొం
దలపడుఁ, దల్లడం బడరి ధైర్యము దూలిన బెగ్గడిల్లు వి
చ్చలవిడిఁ బేర్చు నెవ్వగల సందడి డెందము గంది చేడ్పడున్". (విరా.2.293)

(పై పద్యాల అన్నింటి విశేషాలకు వ్యాఖ్య చూడండి). చతుర్విధాభినయాలే కాక, మదనావస్థల దశలు, మదన వికార విశేషాలూ తెలిపే అభినయాన్ని కీచకుడు చతురంగా ప్రదర్శించగలిగాడు. శృంగార నాయకుల రంగ ప్రదర్శనానికి తిక్కన చిత్రించిన కీచకుడు ఒక నమూనా పాత్ర!

తిక్కన రచనలోని నాటకీయతను చవిచూచిన తరువాత తెలుగుకవులు నాటకాలను ప్రబంధాలుగా మలచటానికే యుగయుగాలు యత్నించారు. తిక్కన కథాకావ్యస్పృహ బహురూపధారణం చేసింది. నాటకాన్ని గర్భీకరించుకొన్నదే ఊర్జితకథగా వాసికెక్కింది.

## 18. నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వం

ఇది తిక్కన విరాటపర్వానికి నిబంధించిన రససూత్రం. దీనిని వ్యాఖ్యానించి తిక్కన రచనకు అన్వయించడానికి దాదాపు రెండు శతాబ్దులుగా తెలుగు విమర్శకులు నానాయత్నాలు చేస్తున్నారు. అనేక రసాల క్రమవికాసం వలన (పెంపుదల వలన) ప్రకాశించేది అని ఆ సమాసానికి విగ్రహవాక్యం. దీనిని మరి కొందరు మరికొన్ని రకాలుగా చెప్పుతారు. బహువిధాలైన రసాల యొక్క అభ్యుదయాలనూ, రసాలయొక్క ఉల్లాసాలనూ కలిగింది అనీ, పెక్కు రకాలుగా ఉండే రసపోషణల చేత ఉల్లాసకరమైనది అనీ, అనేక రసాల పెంపుదల చేత ఉత్సాహస్ఫూర్తి కలిగిందనీ, బహువిధాలుగా భారత రస అభ్యుదయానికి ప్రకాశం కలిగించేదనీ విగ్రహవాక్యాలు చెప్పటం ఉన్నది. వీటికి ఏకవాక్యత సాధించుకొని అనుశీలించటమే విరాటపర్వ రస విమర్శ.

(1) నానారసాలు - ఈ సమాసానికి ఆరు రకాలుగా అర్థం చెప్పవచ్చును.

1. కావ్యరసాలూ, నాట్యరసాలూ 2. అంగాంగి రసాలు 3. వివిధ రసభేదాలు 4. జన్యజనక రసాలు 5. పరుష లలిత రసాలు 6. ప్రకృతి వికృతి రసాలు.

2. అభ్యుదయ+ఉల్లాసాలు - ఈ సమాసానికి అన్వయం రెండు విధాలు.

1. అభ్యుదయమూ ఉల్లాసమూ అని ద్వంద్వం. అవి కలది విరాటపర్వం.

2. అభ్యుదయం యొక్క ఉల్లాసం తత్పురుషం. అది కలది విరాటపర్వం.

శృంగారాది నవరసాలు కావ్యరసాలుగా ప్రసిద్ధి. అష్టరసాలు లేదా నవరసాలు నాట్యరసాలుగా కూడా ప్రసిద్ధి. ఇవికాక అభినయ రసాలని నాట్యశాస్త్రంలో మరికొన్ని ముద్రలు ప్రసిద్ధి. కావ్యరసాల క్రమవికాసంలో ప్రకాశించే నాట్యరసాల విన్యాసం కలిగిన విస్ఫూర్తిని నిరూపించటం ఒక పద్ధతి నవరసాలేకాక కరుణరసం, భక్తిరసం మొదలైన రసాలనుకూడా తిక్కన చిత్రించిన విధం సమీక్షించటం ఇంకొక పద్ధతి. ప్రబంధమండలిగా భాసించే విరాటపర్వంలో కీచకవధ, దక్షిణ గోగ్రహణం, ఉత్తర గోగ్రహణం

అనే ప్రబంధాలలో నాయకాశ్రితమైన అంగిరసాలూ, వివిధాంగరసాల విచారం మరొక పద్ధతి. మహాభారతంలో ధర్మరాజాశ్రితమైన ధర్మవీరమనే అంగిరసాన్ని పోషించే విరాటపర్వంలోని ప్రబంధాలలోని అంగరసాల సమన్వయం ఇంకొక పద్ధతి. శృంగారాది రసాలలో కానవచ్చే భేదాలూ, రసాభాసాదులూ విరాటపర్వంలో నిర్వహించబడిన విధానంలోని వైవిధ్యాల అభ్యుదయ విలాసాల విచారం మరింకొక పద్ధతి. శృంగార వీర రౌద్ర భయానకరసాలు జనకరసాలు. వాటినుండి క్రమంగా హాస్యాద్భుత కరుణ బీభత్స రసాల ఉత్పత్తి వికాసోల్లాసాల విచారం మరొక పద్ధతి. నవరసాలలో వీర రౌద్ర భయానక బీభత్సాలు పరుష రసాలు. శృంగారాద్భుత హాస్య కరుణ శాంతరసాలు లలిత రసాలు. వాటి మిశ్రమంతో కలిగే విశిష్ట వికాస ప్రకాశాల సమీక్షణం మరొక పద్ధతి. సహృదయులలో ఒక ప్రకృతి రసం ఉండగా కావ్యం వలన కలిగే వికృతిరసాల పొంగులు, హంగులు ప్రకాశించిన విధం సమీక్షించటం మరొక విధం. ఇన్ని విధాలుగా విరాటపర్వ రస సమీక్ష చేయవచ్చునని తిక్కన ఈ విశేషణం వలన సూచించాడు.

పాశ్చాత్యుల దృక్పథంలో ఇతిహాసం అనేక రసాల సమాహారం. భారతీయులలో కూడా భావాలన్నీ కవి నేర్పరితనంతో రసాలుగా రూపొందవచ్చుననే వాదం (అనంతా వై రసాః) కథాకావ్యప్రవృత్తి గల తిక్కన విరాటపర్వంలో ప్రవేశపెట్టాడని భావించేవారూ కొందరున్నారు. రసాభ్యుదయం సహానుభుతితో పఠితలు పొందే రసానుభూతులనూ, రసోల్లాసం సానుభూతితో పఠితలు పొందే రసానుభూతులనూ సూచిస్తాయని భావించవచ్చును. ఈ దృక్పథంతో కూడా విరాటపర్వ రసవిమర్శ చేయవచ్చును.

తిక్కన నాటకీయతను గణనీయంగా సంవదించినా విరాటపర్వం సహజంగా శ్రవ్యకావ్యం. అందులో కవి కథనానికీ, వర్ణనానికీ, కవిత్వానికీ విశేష ప్రాధాన్యం ఉంటుంది. కవి పాత్రలమాటల చుట్టూ పరివేషం వలె తన వాక్కులను ప్రదర్శిస్తాడు. తానూ పాత్రలతోపాటు నడయాడుతూ తన వ్యాఖ్యలతో, వర్ణనలతో హంగుదారుడుగా సమర్థిస్తూ ఉంటాడు. అభినయిస్తున్నది పాత్ర అయినా ఆయా సమయాలలో అభినయాన్ని అన్వయించి చెప్పేది తిక్కన. దానికి తగిన పరిసరాలు కల్పించేది తిక్కన. దీనినే రసపరిభాషలో చెప్పాలంటే ఆలంబన, ఉద్దీపన, తటస్థ విభావాల వర్ణనంతో పాత్రలు పఠితల రసభావాలకు కారకులౌతారు. ఆ రసభావాల భావనకు కవుల కవితోక్తులు తోడుపడతాయి. ప్రకృతి వర్ణనలు, కథావర్ణనలు, మానవ స్వభావ సూచనలు, సార్థక విశేషణాలు, అలంకారాలు, జాతీయాలు, కవితా సౌందర్యాలు, ఛందో-లంకారాలు - ఇవన్నీ పఠితలు రసభావాలను భావనం చేయటానికి రమణీయ ప్రేరకశక్తులు. తిక్కన తన రచనలో ఈ అంశాలనన్నింటిని పొందికగా అమర్చి పఠితల మనసులలో రసస్ఫూర్తి కలిగేటట్లు రాణింపజేస్తాడు. శ్రీనాథు డీ వర్ణనాత్మక కవితా శక్తినే 'రసాభ్యుచితబంధ' మని ప్రశంసించాడు. "వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసా । భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు" (కాశీఖండము. 1.13). తిక్కన రచనలో ఆయన మెచ్చిన గుణమది!

భీముడి రౌద్రరూపాన్ని తిక్కన రసోన్నిద్రంగా వర్ణించాడు.

చ. "కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల, నంగముల్
గనలఁగ సాంద్ర ఘర్మ సలిలంబులు గ్రమ్మ, నితాంతదంతపీ
డనరటదాస్యరంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న
ర్తన ఘటనా ప్రకార భయదస్ఫురణా పరిణద్ధమూర్తియై." (విరా.2.133)

ఈ పద్యంలో వర్ణనం, రచన, నాటకీయత అనే మూడు లక్షణాలు ముప్పేటగా పెనవేసికొన్నాయి. పఠిత ఈ మూడింటి వలనా రసానుభవం పొందుతాడు. వర్ణనం పాత్రరూపాన్ని భావింపజేస్తుంది. రచన రూపాన్ని దర్శింపజేస్తుంది. నాటకీయత ఆంగికాభినయాదులను ఆస్వాదింపజేస్తుంది. ఇందులో ప్రబంధ రచన ప్రధానం. అది శబ్దగుణాలైన ఓజస్సుతో, శాంతితో నిబిడమై తోచింది. అలంకారంలో అభినయం మెరిసింది. అంటే, ఈ పద్యంలో శ్రవ్యకావ్యలక్షణాల వలన రసాభివ్యక్తి కలుగుతూ ఉండగా నాటకీయత దానిని రాణింపజేసిందన్నమాట! ఇందులో రౌద్రరస(మూర్తి) విభావం రూపుకట్టింది. అది సహజాభినయ

ముద్రలతో ఉండేటట్లు వర్ణించటం తిక్కన ప్రతిభ. అభినయ స్వభావాన్ని ముద్రించకుండా వర్ణిస్తే ఇది వట్టి శబ్దాడంబరమయ్యేది. కాని, తిక్కనది ఉభయకావ్య శిల్పం. ఇందులో రూపానికి అభినయం అలంకారం.

అయితే ఆ తరువాతి పద్యం ఈ స్వభావానికి విరుద్ధం. అదీ రౌద్రమూర్తి వర్ణనమే;

సీ. "నేలయు నింగియుఁ దాళముల్గాఁ జేసి । యేపున రేఁగి వాయించి యాడఁ,
గులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ । దాఁకంగ వేఁకమైఁ దన్నియాడ,
నేడుసాగరములు నిక్కడక్కడఁబెట్టి । పలుచని రొంపి మై నలఁదికొనఁగ,
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి । పిసికి పిండలి సేసి పిడుచఁగొనఁగ,

తే. మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ । నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గండరించిన రూపంబు కరణి భీముఁ । డతిభయంకరాకారత నతిశయిల్లె!" (విరా.2.134)

ఇందులో అలంకారాన్ని ఆశ్రయించి భీముడి రూపాన్ని ఆలోచించి భావించాలి. అయినా అది భౌతికమూర్తికంటె మించిన భావచైతన్యమూర్తి. అమూర్తమైన రసానుభవాన్ని గాలిగొడుగులతో ఆకాశాని కెత్తినట్లుంది - ఈ అర్థాలంకార శక్తి, అర్థగుణశక్తి. ఈ పద్యం అందించేది కావ్యరసం. నాట్యరసం కంటె కావ్యరసం భావనామయంగా ఎంత ఎత్తు ఎదుగగలదో చూపించే 'రసాభ్యుచిత బంధం'. బ్రహ్మాండభాండాన్ని పగులగొట్టేటట్లు నిలబడిన ప్రళయాగ్నియొక్క పోతపోసిన విగ్రహంవలె భయంకరాకారంతో అతిశయిల్లాడట భీముడు! ఈ రూపాన్ని భావించి దర్శించినవారికే భయభావం అనుభవంలోకి వచ్చేది. లేదా ఆశ్చర్యంలో మునిగిపోవలసిందే. ఇది రూపకాని కొదిగే రూపం కాదు. చతుర్విధాభినయాల పరిధికంటె మించింది. ఈ వర్ణనం తిక్కన కావ్యరసకల్పకం. రూపాభినయం వలన కలిగే రసానుభవం ఒకసారి, భావనాబలంతో పట్టుకొనే రసానుభవం మరొకసారి కలిగింది. ఒకే రౌద్రరసాన్ని ఆస్వాదింపజేస్తే, ఒకదానికంటె మరొకటి మెరిసిపోతున్న అనుభవంతో పఠిత దీనిని 'నానారసాభ్యుదయోల్లాసం' అంటాడు. అనేక విధాలుగా ఒకే రసాన్ని పెంచి ప్రకాశింపజేసే శిల్పం - అని ఇక్కడ తాత్పర్యం.

స్థాయిభావాలు బలమైనవి కాబట్టి వాటిని ఏమాత్రం పోషించినా రసానుభవాలను కలిగిస్తాయి. ఒక్కొక్కసారి సంచారి భావాలకు కూడా కవి తన ప్రతిభతో రసానుభవం కలిగించే అభ్యుదయాన్ని కలిగించి ప్రకాశింప జేయవచ్చును. విశేష మేమంటే కొన్ని సంచారిభావాలు స్థాయిభావాలను పోషిస్తూనే కాక స్వతంత్రంగా కూడా విస్తరించి రసస్థితిని పొందగలవని లాక్షణికులు గుర్తించారు. అటువంటి సంచారులలో అగ్రగణ్యం 'నిర్వేదం'. ఇది శృంగారాదులలో స్వతంత్ర ప్రతిపత్తిని సాధించగలదు. ఒక్కొక్కసారి శాంతరసానికి స్థాయిగా కూడా నిలువగలదు. ఈ విధంగా బహుళ ప్రయోజనాలకు ఉపయోగించే భావాలకు రసస్థితిని కలిగించటం తిక్కన నేర్పు.

సుదేష్ణ ద్రౌపదిని కీచకుడి ఇంటికి పోయి కల్లు తెమ్మని బలవంతాన ఒప్పించింది. అసలే అంతకు పూర్వం కీచకుడు పలికిన మాటలు ఆమెకు కర్ణశూలాలుగా బాధపెట్టాయి. ఆపైన సుదేష్ణ ఇచ్చిన అనుచితమైన ఆదేశం పిడుగుపడిన వారిని కొరవితో కొట్టినంత బాధ కలిగించింది. అప్పుడు ద్రౌపది 'నిర్వేదనం' పొందిందని తిక్కన వర్ణించాడు (విరా.2.103). దానిని రెండంచెలలో విస్తరించాడు.

చ. "అలమటఁ బొందు 'మాయవిధియా' యని దైవము దూఱు, 'నిత్తఱిం
గలదొకొ నాకు దిక్కను, మొగంబున నశ్రులు వెల్లిగొల్పు, దొ
ట్రిలఁబడు, జల్లనం జెదరు డెందముఁ గూడఁగఁ దెచ్చి 'నన్నుఁ గే
వలమున ముట్ట నెవ్వరికి వచ్చు?' ననుం, గలఁగున్, వెనుంబడున్."

వ. అట్టియెడ.

సీ. "దైన్యంబు తలపోఁత తలకొన్నఁ జెలువ కాననమున వెల్లఁదనంబు గదిరె;
భయరసవేగంబు పైకొని ముట్టినఁ। గాంతకుఁ దనులతఁ గంప మడరె;
బెగ డంతకంతకు మిగిలిన నింతికిఁ। బదముల నటఁ దొట్రుపాటు బెరసెఁ;
దల్లడం బొందినఁ దన్వికి నవయవం। బుల నెల్ల ఘర్మాంబుకళిక లెసఁగెఁ;

ఆ. దలఁకు పుట్టె, గొంకు కొలఁదికి మీఱె, వె। న్బాటు దోఁచె, ముట్టుపాటు దొడరె,
వెఱఁగుపాటు దనికె, నెఱనాడె నొవ్వనె। వ్వగలు వగల నీనె, దిగులు వొదివె". (విరా.2.104-106)

"నిర్వేదో నామ దారిద్ర్య వ్యాధ్యవమానాధిక్షేపాకృష్ట । క్రోధ తాడనేష్టజనవియోగ తత్త్వజ్ఞానాదిభిః" అని నాట్యశాస్త్రం **(7.28).** ఇందులో అవమానం వలన కలిగిన నిర్వేదం వర్ణితం. దీన్ని స్త్రీలు, నీచప్రవృత్తులు, కుత్సితులు అభినయించాలి. వారిలో స్త్రీపరంగా, అందులోనూ ఉదాత్తనాయిక అయిన ద్రౌపదిపరంగా వర్ణిస్తే అది రసస్థాయి పొందటంలో ఔచిత్యం ఉంటుంది. ఈ కీలకం తిక్కన తెలిసి చేశాడు. అంతే కాదు- తత్త్వజ్ఞానం, ఆపద, ఈర్ష్య మొదలైన వాటివలన తనను తాను కించపరచుకొనటం నిర్వేదమౌతుందనీ, నిర్వేదం విభావానుభావ రసాలకు అంగభూతంగానే కాక స్వతంత్రంగా కూడా ఉంటుందనీ దశరూపకం వివేచించింది. తిక్కన ఆపద వలన కలిగిన నిర్వేదానికి స్వతంత్ర రూపకల్పనం చేశా డిక్కడ.

పై రెండు పద్యాలలో తిక్కన చూపిన రసాభ్యుదయ శిల్పం విశిష్టం. సుదేష్ణ యొక్క అనుచిత వ్యాపారం వలన ద్రౌపదిలో నిర్వేద సూచకమైన అనుభావాలు గోచరించినట్లు మొదటి పద్యం వర్ణించింది. విభావం ఆంగికంగానే కాక వాచికంగా కూడా అభివ్యక్తం కావటంచేత అది పుష్టిమంతం అయింది; అభినయసుందరంగా పాఠకులకు అందుబాటులోకి వెంటనే వచ్చింది. "రుదిత, నిశ్వ్వసి, తోచ్ఛ్వసిత సంప్రధారణాదిభిః అనుభావైః త మభినయేత్" అని నాట్యశాస్త్రం. ద్రౌపది ఆ అనుభావాలను నిర్వేద వ్యంజకంగా వ్యక్తం చేసినట్లు తిక్కన వర్ణించాడు. తిక్కన రోదనాన్ని నాగరకం చేసి రెండు దశలలో చెప్పాడు. మొదట అలమటపడింది. లోలోన కటకటపడి బాధపడిందన్నమాట. ఆ బాధను 'ఓ మాయదైవమా!' అనటంలో సూచించింది. ఇది సగంవాక్యమే. 'నిన్ను నమ్మిన నన్ను ఇంతపని చేస్తావా? నీవే రక్షిస్తావనుకొన్నానే, ఆర్తత్రాణపరాయణుడ వనుకొన్నానే, ఇట్లా చేశావేమి?' మొదలైన భావాలను సహృదయుడు భావించగలిగేటట్లు తిక్కన ఆ దైవసంబోధనను ధ్వనిమయంగా నిబంధించాడు. దైవానుగ్రహం తప్పిందని తెలియగానే ఆమెకు కన్నీరు మున్నీరయింది. ఇది సాత్త్వికరోదనం. అందులో వితర్కాన్ని మిశ్రమం చేసింది. 'మరి ఇప్పుడు నాకు దిక్కెవ్వరు?' అని బావురుమన్నది. అంటే, ఆమె తనకు నిస్సహాయత ఏర్పడ్డట్లు భావించింది. దానితో మనసు గుభేలుమన్నది. మరేమాటా ఆమె నోట వెలువడలేదు. అయినా, ఆమె ధీరురాలు కాబట్టి చెదరిన గుండెను దిటవు చేసికొన్నది. ధృతిని మనసులో నిలుపుకొన్నది. 'న న్నెవ్వరు తాకగలరు?' అని లోలోన ధైర్యం చెప్పుకొన్నది, అయినా, సన్నివేశ తీవ్రతను భావించి కలతపడింది. ముందుకు పోవటానికి వెనకాడింది. ధైర్యంతో నిలద్రొక్కుకొన్నా, నిర్వేదం ఉపశమించకుండా ఆమెను ముంచెత్తింది. ఆ ముంపు సంచారిభావం రసంగా పరిణమించే అవస్థ. దానిని దురవస్థగా తిక్కన పేర్కొన్నాడు. ప్రదర్శించిన భావాలూ, సాత్త్వికభావాలూ రసస్థితికి సంకేతాలు. సీసపద్యంలో ఈ రసాభ్యుదయ శిల్పం ప్రదర్శించబడింది. నిర్వేదాన్ని దైన్యాదిసంచారులు పోషించి స్థాయిత్వాన్ని కల్పించినంతపని చేశాయి.

దైన్యం అనే భావాన్ని భావనం చేయగా ఆమెకు భయం పుట్టింది. దానివలన మొగం వెలవెలపోయింది. భయతీవ్రతను అనుభవించటం వలన బెదరుపాటు మేరమీరి శరీరం కంపించింది. ఆ భయం అంతకంతకు పెరగటంవలన ఆమెకు విషాదం కలిగి పాదాలు తడబడ్డాయి. భయంతో ఆమె తల్లడిల్లిపోవటం మొదలుపెట్టింది. దానితో ఆమె క్షోభపడింది. దానివలన ఆమె శరీరానికి ముచ్చెమటలు పట్టాయి. క్రమంగా నిశ్చేష్టురాలైపోయింది. బాధ ఆయువుపట్లు తాకింది. పెనుచింతలు మనసులో పెరిగాయి. చివరకు అంతంలేని దిగులు మనసంతా ఆవరించింది. భావం రసంగా మారిన ఈ అభ్యుదయ క్రమం చిత్రించటం

అపూర్వం. ఇప్పుడు నిర్వేదం సంచారి కాదు. రసనామయోగ్యమైన స్థాయి. దాని అభ్యుదయ ప్రకారం పైపద్యాల వర్ణన వికాసం. ఇటువంటి నానారసాల అభ్యుదయాల ప్రకాశమే నానారసాభ్యుదయోల్లాసం! ఇది ఒక హేల!

నానారస సంసృష్టికి తెలుగు సాహిత్యంలోనే ఒక వెలుగు కిరణం వలె నిలిచే పద్యం:

సీ. 'వెఱవక ననుఁ జూచె వీఁడని యెదఁ గలు । షించిన నొండొండ చెమట వొడమ,
ననుచిత కృత్యంబు లాచరించు విధాతృ । బలిమికి నివ్వెఱపాటు దోఁప,
నిచ్చట దిక్కులే రెవ్వరు నా కను । భయమున మేనఁ గంపంబు పుట్టఁ,
జేయంగ నేమి యుపాయంబు లేమి నా । ననమున వెల్లఁదనంబు గదుర

తే. నున్న పాంచాలిఁ గనుఁగొని య న్నరాధ । ముఁడు వివేకవిహీనుఁడై ముదితుఁ డగుచు
మదనవికృతియ కాఁ దనమదిఁ దలంచి । రాగసాగరపూర నిర్మగ్నుఁడయ్యె.' (విరా.2.33)

(వివరాలకు ముందుగా విశేష వ్యాఖ్య చూడండి).

ఈ పద్యం వర్ణనాత్మక కథన పద్ధతికి చెందింది. కవి ఇందులో సంచారిభావోదయాలకు అనుగుణంగా కలిగిన సాత్త్విక భావోదయాలను నాటకీయ శైలిలో వర్ణించి రసవ్యంజకత్వాన్ని సాధించాడు. అంతటితో ఆగకుండా విరుద్ధరసాలను ధ్వనింపజేయటానికి ఒకే రకమైన సాత్త్వికభావాలను వాడి ఉభయకావ్య ప్రౌఢి పాటించే అపూర్వ రసశిల్పాన్ని చిత్రించాడు. వాటితోపాటు తిక్కన తన వ్యాఖ్యలను కూడా జతపరిచాడు. చివరకు రసానుభూతిని మనకు వదలివేశాడు. ఇది ఒక సంశ్లిష్ట శిల్పం.

సీసపద్యపాదాలలో వర్ణ్యవస్తువు ద్రౌపదికి భయాదులవలన కలిగిన సాత్త్విక భావోదయం. కారణకార్యసంబద్ధంగా స్వేదం, నివ్వెరపాటు, కంపం, వైవర్ణ్యం చిత్రించబడ్డాయి. ఆమెను (ఆ విభావాన్ని) కీచకుడు చూచాడు. అతడికి ఆమె సాత్త్విక భావోదయం మదనవికారం వలన కలిగినదిగా స్ఫురించింది. ఆ భావనవలన అతడు సంతోషించి రాగసాగరంలో మునిగిపోయాడు. (శృంగార రసభావనంలో తాదాత్మ్యం పొందాడు). తిక్కన ఈ మధ్యలో వ్యాఖ్యానం చేస్తూ 'కామీ స్వతాం పశ్యతి' అనే న్యాయంతో చూచిన కీచకుడు నరాధముడనీ, ఆమెవి మదనవికారాలని భావించటం వివేకం లేకపోవటమే ననీ సూచించాడు. సహృదయు డీ పద్యం వలన పొందే రసానుభూతి నానారసాభ్యుదయోల్లాసంలో ఒక ప్రయోగం.

సహజాలూ, ఔచిత్యాలూ, ధర్మసమ్మతాలూ అయిన పాత్రల భావాలలో, సాత్త్వికభావాలలో పఠితలు తాదాత్మ్యం (Identity) పొందుతారు. మిగతా వాటిల్లో కొన్నింటిని సానుభూతి (Sympathy) తో స్వీకరిస్తారు. కొన్నింటిని ప్రతిచర్య (Reaction) తో తిరస్కరిస్తారు. పైపద్యంలో ద్రౌపది ప్రదర్శించే భావాలలో పఠితలందరికీ పరిపూర్ణ తాదాత్మ్యం కలుగుతుంది. కాబట్టి ఈ పద్యం ద్రౌపదివలెనే పఠితకు కూడా భయభావానుభవం కలుగజేస్తుంది. మరి ఆమె సాత్త్వికభావాలను మదన వికారాలుగా భావించిన కీచకుడితో పఠిత తాదాత్మ్యం పొందలేడు. అవి సహజాలు కావు. ఔచిత్యాలు కావు. ధర్మసమ్మతాలూ కావు కాబట్టి. కావని తిక్కన అతడి స్వభావాన్ని గురించి వ్యాఖ్యానించాడు కాబట్టి. కాని, కీచకుడు మాత్రం శృంగార నాయకుడివలె రాగసాగరపూర నిర్మగ్నుడైనాడు. నిజానికి - కీచకుడిలో వ్యక్తమయ్యే శృంగారం సహృదయులు అనౌచిత్యమని భావిస్తే రసభంగం కావాలి. ఏకత్ర భాసిస్తున్న రతిభావన మనుకొంటే రసాభాసం కావాలి. కీచకుడు తుచ్ఛకాముకుడుగా  కాక రూపాభిమానిగా ద్రౌపదిని రమిస్తున్నాడని భావిస్తే సామాన్యంగా విషాదరూపకాలలో విషాదపాత్రలయందు ప్రకటించే సానుభూతితో కూడిన రసానుభూతి ఉండాలి. రసికుల మధ్య చర్చకు పెడితే చివరకు మిగిలేది ఒక్కొక్కసారి రసాభాసమే కావచ్చును. రసాభాసానికి కూడా నానారసదృక్పథాలతో అభ్యుధయోల్లాసాన్ని కలిగించిన గొప్ప పద్య మిది. ద్రౌపది రసవిభావం. ఆమెయందు భయ ముంది కాని రతి లేదు. దానిని కీచకుడు విరుద్ధంగా భావించి రతిగా తలంచి రసానందం పొందాడు. కాని, పఠిత దానిని పొందలేడు. కీచక శృంగారం ఆభాసం ఔతుంది. దానివలన హాసం జనిస్తుంది. దానితో ద్రౌపది భయానుభవం కూడా ఆభాసమౌతుంది. పద్యం మొత్తం కలిసి పఠితకు ఒక మందహాసంగా కూడా మిగలవచ్చును. ఆ స్థితి ఆలోచనా రమణీయం.

## (1) రస ప్రయోగోల్లాసం

తిక్కన పద్యాలలోనే కాక విరాటపర్వ ప్రబంధ ఘట్టాలలో కూడా శృంగారాది కావ్యరసాలలో అపూర్వ ప్రయోగాలు చేసి భావికవులకు బాటలు చూపించాడు. వాటిని స్థూలంగా వివేచించినా కొన్ని విశేషాలు బయటపడతాయి.

**(i) శృంగారరసం :** మహాభారతంలో శృంగారరసస్థితి విచిత్రమైనది. నాయికా నాయకులైన ద్రౌపదీపాండవుల నడుమ శృంగారం దాంపత్యధర్మంగా ప్రవర్తిల్లుతుందే కాని, రసాభ్యుదయోల్లాసంగా సాగదు. అరణ్యాజ్ఞాతవాసాలలో వారు బ్రహ్మచర్యంలో ఉన్నారు. ద్రౌపదితో భీమాదులు మాట్లాడినా క్షేమసమాచారాలూ, కర్తవ్యాంశాలే కాని సరస సల్లాపాలుండవు. ఎడనెడ అర్జునుడి దక్షిణ నాయకత్వం శృంగారరసదీప్తిని ప్రదర్శించినా ఆ అవకాశం విరాటపర్వంలో లేనే లేదు. ఇకపోతే ఉత్తరాభిమన్యుల వివాహ సందర్భంలో వారి పరస్పర దర్శన స్పర్శనాదుల వలన కలిగిన స్పర్శ సౌఖ్యరసం చిగురించింది కాని, అది సంభోగ శృంగార రసోల్లాసంగా వర్ణించబడలేదు. విరాటరాజ దంపతులున్నా వారి మధ్య విలాససన్నివేశాలు లేవు. విషాదఘట్టంలోనో కూతురు వివాహసందర్భంలోనో వారిద్దరు ఒకచోట కనపడతారు. వారి చిక్కులు వారివి, వారి సమస్యలు వారివి. అంతేకాని ఏ దంపతులూ సంభోగ శృంగార భావనలే ప్రసరించరు.

అయితే ద్రౌపదితో పొందుకోరి, ఆమెను వెంటాడి, అక్క మెడలు వంచి, ఆమెను సంకేతస్థలంలో కలిసి భోగించి శృంగారఫలాన్ని పొందాలని అనుకొని, అభిలాష విప్రలంభాన్ని అత్యుత్కటంగా అనుభవించినవాడు కీచకుడు. అతడి పాత్ర శృంగారరసపోషణలో ఒక చిక్కుముడి. అతడు వస్తుతః రసికుడు. రూపాభిమాని. సైరంధ్రివేషంలో ఉన్న ద్రౌపది యొక్క అపూర్వ సౌందర్యశోభను గుర్తించి, కీర్తించి, ఆశించి, దాని కొరకై పరితపించి, ఆమె పొందు పొందకపోతే ప్రాణాలు వదలటానికైనా సిద్ధపడిన రసికుడు; ముమ్మూర్తులా శృంగార నాయకుడు. అతడు నోరారా, మనసారా ద్రౌపది సౌందర్యాన్ని కీర్తించాడు (మూలాతిశయంగా). ద్రౌపది సౌందర్యాన్ని పాండవులకంటె ఇతరులే ఎక్కువగా కీర్తించటం కనబడుతుంది. అట్టివారిలో కీచకుడు అగ్రస్థానంలో నిలుస్తాడు. అతడి శృంగార సౌందర్య ప్రియత్వం అభినందనీయ మనిపిస్తుంది. కాని, అతడు తెలిసి తెలిసి అన్యుల భార్యపై రతిభావాన్ని పెంచుకొని, విరహాన్ని అనుభవించటం ధార్మికంగా దోషం. అందువలన అది ధార్మికులకు నచ్చదు. అతడి రతిభావం స్థాయిత్వం పొందదు. పైపెచ్చు ఔచిత్యదృష్టితో రసభంగహేతు వవుతుంది. అది అతడి వరకు కావ్యన్యాయాన్ని సమకూరుస్తుంది. ఎవడి చావు సబబని సహృదయుల కనిపిస్తుందో అతడు దుష్టపాత్ర (విలన్). సంస్కృత భారతంలో కీచకుడు కాముకుడైన దుష్టపాత్ర. తిక్కన కీచకుడి కాముక ప్రవృత్తిని రసిక ప్రవృత్తిగా మార్చాడు. దానికై వరుసగా నాలుగు గుణాలను అతడికి అమర్చాడు. రూపాభిమాని కావటం చేత సైరంధ్రి అని కూడా తలంచక ఆమె అందాన్ని ఆశించి, ఆరాధించాడు. నానాభరణశీలుడు కావటం చేత క్రొత్త సొమ్ము మీద మోజుపడ్డాడు. దుర్విదగ్ధుడు కావటం చేత తనను చూచి అందరి వలె ఆమె మోహిస్తుందని భ్రమించాడు. బలగర్వితుడు కావటం చేత గంధర్వులు తన మానప్రాణాలు హరిస్తారని బెదిరించినా లెక్కచేయలేదు. సుదేష్ణ నీతులు చెప్పినా తలకెక్కించుకొనలేదు. సైరంధ్రి తిరస్కరించినా ఆమెను కోరి వెంటబడటం మానలేదు. ఒంటరిగా కటిక చీకట్లో నర్తనశాలకు రమ్మన్నా వెనుకాడలేదు. ఆ గుణాలే సైరంధ్రిని పొందగలనని అతడు భావించడానికి ఆశాకిరణాలుగా అమరాయి. మరి ఆ గుణాలే అతడు వికృతపు చావు పొందటానికి విశిష్టకారణాలు కూడా అయ్యాయి. తిక్కన అతడి రూపాభిమానాన్ని అభిలాష విప్రలంభంగా పెంచి అద్భుత కవిత్వం రచించాడు. అందులో అతడిని వనితాశరీరసంగమాన్ని మాత్రమే కోరే కాముకుడిగా కాక ఆమె సాంగత్యాన్ని పొందే అదృష్టాన్ని మనసారా కోరే రసికశేఖరుడిగా చిత్రించాడు. భయంతో అక్క వద్దన్నా, ధర్మాన్ని చూపి భర్తల పరాక్రమాన్ని పొగడి సైరంధ్రి బెదిరించినా అతడు తన మనోధర్మమైన మదనవేదనను మానలేకపోయాడు. శృంగారనాయకుల వలె దశవిధ మన్మథావస్థలను అనుభవించాడు. మూలంలోని కీచకుడికి తిక్కన తీర్చిదిద్దిన కీచకుడికున్న చిత్తశుద్ధిలేదు. మోహంలో కూడా తళుక్కున మెరిసే శృంగారనాయక లక్షణం లేదు. వ్యాసుడు చిత్రించిన దుష్టపాత్రను తిక్కన విరహపాత్రగా, పఠితల సానుభూతికి పాత్రుడయ్యే విషాదపాత్రగా చిత్రించాడు. ఎన్ని విశిష్టగుణాలున్నా ఒక బలమైన బలహీనత వలన చివరకు తననూ, తనవారిని విషాదాంతానికి గురి చేసే పాత్ర విషాద పాత్ర. ఆ పాత్ర వంచనతో చంపబడినా, చచ్చినందుకు

ఎవరూ విచారించకపోయినా, సుదేష్ణవలె కంటతడి పెట్టలేకపోయినా, కొంత సానుభూతిని ప్రదర్శిస్తారు. తిక్కన వర్ణించిన విరహవర్ణనలోని పూర్వరాగ విప్రలంభ శృంగార రసాభ్యుదయోల్లాసం వలన కీచకుడి పట్ల తెలుగువారికి సానుభూతితో కూడిన రసానుభూతి కలిగింది. దుష్టపాత్ర విషాదపాత్రగా మారి సానుభూతిని పొందింది. దానివలన ఆ ఘట్టంలో శృంగారరసభంగస్థితి మారి శృంగార రసాభాసస్థితి ఏర్పడింది. రసాభాసం కూడా రసం వలె అనుభవాన్ని అందిస్తుందని ఆలంకారికు లంగీకరిస్తారు. దానికి ఈ ఘట్టంలోని శృంగార రసాభాసాన్ని మోదంతో ఆమోదించే ఆంధ్రావళియే సాక్షి. నాయికానాయకులలో ఏకత్ర తోచే అనురాగంతో రాణించే రసాభాస శిల్పాన్ని పోషించి తిక్కన పెద్దనకు బాటచూపాడు. ఇంత జరిగినా ఈ శృంగారం సంభోగ పర్యంతం కాకపోవటంతో రసికులు అనౌచిత్యాన్ని మరిచిపోయి అనువుగా ఆభాసాన్ని రసంగా అనుభవించి ఆహ్లాదిస్తారు. శృంగారం రసమైతే ఆనందం; ఆభాసమైతే ఆహ్లాదం.

**(ii) హాస్యరసం :** హాస్యం పేరు చెప్పగానే విరాటపర్వంలో గుర్తుకు వచ్చేవాడు ఉత్తరుడు. వికృతివలన హాసం పుట్టుతుంది. వికృతి ఆకారంలో, వేషంలో, ప్రవృత్తిలో, మాటలో, చేష్టలో, సన్నివేశగతమైన ప్రవర్తనలో- ఎట్లా బయటపడినా ఎదుటివారికి నవ్వు పుట్టిస్తుంది. పాత్రలు నవ్వుతూ నవ్వించేవి కొన్ని, తమ వికారాలతో ఎదుటివారిని నవ్వించేవి కొన్ని ఒక్కొక్కసారి ఉదాత్త ప్రవృత్తులు. రసాలు వికారాన్నీ, ఆభాసనూ పొందినప్పుడు కూడా వికృతి స్ఫురిస్తుంది. అప్పుడు కూడా నవ్వు పుట్టుకొస్తుంది. హాస్యం ప్రహసనాల్లోనో, ప్రకరణాల్లోనో ప్రధానరసంగా ఉండగలుగుతుంది. కాని నాటకాలలోకాని, కావ్యాలలోకాని, ఇతిహాసాది ప్రక్రియలలోకాని అదెప్పుడూ అంగభూతమే. ఒక్కొక్కసారి అది రసస్థాయికి రాకపోవచ్చును. విరాటపర్వంలోని హాస్యం వైవిధ్యంతో కూడుకొని ఉన్నా అది రసస్థాయికి చేరుకోలేదు. భావస్థాయిలోనే ఉండిపోయింది. అందువలన హాస్యరసం విరాటపర్వంలో హాసోల్లాసంగానే అందగిస్తుంది. అంగిరసాభ్యుదయానికి తోడ్పడుతుంది.

"శృంగారరసం నుండి హాస్యం జనిస్తుందని భరతముని పేర్కొన్నాడు- జన్యజనక రసవివేచన సందర్భంలో ఈ అంశాన్ని అర్వాచీనాలంకారికులందరూ అనువదించారు. కాని, ఇది ఒక విధమగు భేదం మాత్రమే. రూపకములందలి విదూషకహాస్యం ఈ విధానికి చెందినది. అంతేకాదు, శృంగారం అనుకృతి రూపంగా-అంటే ఆభాసరూపంగా హాస్యానికి హేతువవుతుంది. వికృతములైన వేష అలంకారాలు హాస్యానికి విభావాలని చెప్పినప్పుడు, వికృతి పదాన్ని దేశ-కాల-వయః ప్రకృతి-అవస్థా వైపరీత్యమని అభినవగుప్తుడు వివరించినాడు. కాగా, సర్వ రసములందలి అనౌచిత్య ప్రవృత్తి (ఆభాసం) హాస్యానికి విభావం అవుతుందని సారాంశం. "వాగంగాది వికార దర్శనజన్మా, వికాసాఖ్యః హాసః" అని జగన్నాథుడు. వాచికం, ఆంగికం మున్నగువాని యందలి వైపరీత్యం దర్శించటం వల్ల కలిగే మనోవికాసం హాసం అనబడుతుంది. విశ్వనాథుడు హాస్యరసాన్ని ఇట్లా వివరించినాడు: "వికృతాకార వాగ్వేష చేష్టాదేః నర్తకాత్ భవేత్ హాస్యః" - వికృతంగా ఉన్న ఆకారం, వాక్కు, వేషం, చేష్ట మున్నగువానితో కూడిన నర్తకుని (నటుని) వల్ల హాస్యం కలుగుతుంది. కాగా ఆకారం, వాక్కు, వేషం, చేష్టలు - అంటే ఆంగిక, వాచిక, ఆహార్య, సాత్త్వికాభినయములందలి వైపరీత్యం హాస్యరసహేతువు అవుతుందని అర్థం. నటుని ద్వారా (పాత్రలద్వారా) ఈ వైపరీత్యం దర్శించిన సదస్యునిలో కలిగే మనోవికాసం హాస్యరసానికి దారితీస్తుంది" (డా.పి.యస్.ఆర్. అప్పారావుగారి - సాత్త్వికాభినయము. పుట.467-468). ఇది లక్షణ సూత్రమైతే దీన్ని సర్వాంగసుందరంగా ఆవిష్కరించిన లక్ష్యం విరాటపర్వం!

విరాటపర్వంలో పాండవులు ధరించిన రూపాలు వారి ప్రకృతిరూపాలకు వికృతులుగా రాణిస్తాయి. అయినా అవి హాస్యానికి విభావాలు కావు. అయితే ఎడనెడ వారు చేసే చేష్టలు సున్నిత హాస్యాన్ని సృష్టించి మనకు చిరునవ్వును (స్మితాన్ని) కలిగించవచ్చును. ఉదాహరణకు భీముడు నర్తనశాలలో గొంతు మార్చి సైరంధ్రివలె కీచకుడితో మాట్లాడిన మాటలు గంభీరమైన చిరునవ్వును కలిగిస్తాయి. ఉత్తరకుమారుడు అంతఃపురంలో పలికిన ప్రగల్భాలు వీరోచితాలుగా ఉన్నా, అవి అతడి తలకు మించినవనే వికృతభావం తోచటం వలన మనకు హసితం కలుగుతుంది. సింహబలు డంతటివాడు సైరంధ్రిని వలచి విరహంలో మునిగి అభిమానాన్ని, లజ్జను, ఔచిత్యాన్ని కోల్పోయి ఉన్మత్తుడివలె వ్యవహరించే తరుణంలో మనకు 'విహసితం' కలుగుతుంది. కర్ణుడు వీరోచిత ప్రగల్భాలాడినప్పుడూ, అర్జునుడి చేతిలో ఓడిపోయినప్పుడూ, అతడిని గురించి అశ్వత్థామాదులు అధిక్షేపించినప్పుడూ

మనకు 'ఉపహసితం' కలుగుతుంది. దుర్యోధనుడు అర్జునుడి చేతిలో చిత్తుగా ఓడిపోయినప్పుడూ, భీష్మాదు లతనిని మందలించినప్పుడూ మనకు అపహసితం స్ఫురిస్తుంది. భీముడి భయంకరరూపాన్ని చూచి ఉపకీచకులు ప్రాణాలు దక్కించుకొనటానికి పరుగెత్తసాగినప్పుడూ, రథాన్ని దిగి ఉత్తరుడు పరుగెత్తుతూ పరిపరివిధాల బేలగా పలికినప్పుడూ, దుర్యోధనాదులను అర్జునుడు ఉపాలంభించినప్పుడూ మనం అతిహసితాన్ని పొందుతాం. సూక్ష్మంగా పరిశీలిస్తే కీచకోదంతం శృంగారం నుండి హాస్యం జనించటానికీ, ఆభాసం నుండి హాస్యం పుట్టటానికీ చక్కని ఉదాహరణం. అందులో ఆరు రకాల హాస్యాలూ అభ్యుదయం చెందాయి. అట్లాగే ఉత్తర గోగ్రహణంలో ఉత్తరుడి చేష్టలలో మాటలలో సహజ వికార చేష్టల వలన పుట్టిన హాస్యం, కర్ణ దుర్యోధనాదులలో వీరాభాసం వలన పుట్టిన హాస్యం, భీమార్జునులు చేసిన శత్రుపరిహాసం వలన కలిగిన హాస్యం గమనిస్తే ఆరువిధాల హాస్యాలూ వీరరసాన్ని ఆశ్రయించి ఉల్లాసాన్ని ప్రదర్శించాయని వెల్లడౌతుంది. నవ దంపతులైన ఉత్తరాభిమన్యుల అభిలాషా వైచిత్రిలో కనపరచిన ఆసక్తులు సున్నితహాస్యాన్ని చిలకరించటం గమనిస్తాం. అంతేకాదు సుదేష్ణ సైరంధ్రి సౌందర్యాన్ని చూచి ఆమె తన భర్తను వశం చేసికొంటుందేమోనని శంకించినప్పుడూ, కపట తృష్ణ అభినయించినప్పుడూ, బృహన్నలా సారథ్యాన్ని గురించి ఉత్తరుడు చిరుబురులాడినప్పుడూ, సుశర్మ శక్తికి మించిన ప్రగల్భాలాడినప్పుడూ, విరాటుడు ప్రతి సన్నివేశంలోనూ చేసే అత్యభినయాన్ని గమనించినప్పుడూ మనకు హాసం కలగటం సహజం. ఒక్కటి మాత్రం సత్యం. విరాటపర్వంలోని ప్రతిపాత్రా ఎక్కడో ఒకచోట, లేక కొన్నిచోట్ల మనలను నవ్విస్తుంది. పాత్రలు కూడా ఆయా సమయాలలో అనువుగా నవ్వుతాయి. తిక్కన అభినయంలో నవ్వుకే ఎక్కువ పంట. విరాటపర్వంలో నవ్వు రసాలను కవ్విస్తుందేకాని వాటిని నవ్వులపాలు చేయదు. నానారసాభ్యుదయోల్లాసానికి నవ్వొక దివ్యౌషధం!

**(iii) వీరరసం:** విరాటపర్వం వీరరస సమగ్రావతారం. మరొక మాటలో చెప్పాలంటే- నానావిధవీరరసాభ్యుదయోల్లాసమే విరాటపర్వం. "వీరోనామోత్తమ ప్రకృతి రుత్సాహాత్మకః సచాసంమోహాధ్యవసాయ నయవినయ బలపరాక్రమ శక్తి ప్రతాప ప్రభావాదిః విభావైః ఉత్పద్యతే. తస్య స్థైర్య ధైర్య శౌర్య త్యాగ వైశారద్యాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యమ్'' అని నాట్యశాస్త్రం (6,67), "శౌర్య ధైర్య వీర్య గర్వై రుత్సాహ పరాక్రమ ప్రభావైశ్చ । వాక్యై శ్చాక్షేపకృతై ర్వీరరసః సమ్యగభినేయః'' (68), "వీరస్యాపి చ యత్కర్మ సో-ద్భుతః పరికీర్తితః'' (42)- ఈ నిర్వచనాలు అక్షరాలా విరాటపర్వంలో నిరూపించబడతాయి.

విరాటపర్వంలో పాండవులు నాయకులు. వారు ఉత్తమ ప్రకృతులు. వారు మెచ్చి ఆశ్రయించిన విరాటుడు ఉత్తముడు. వారి నాశ్రయించుకొని ప్రవర్తిల్లిన ఉత్సాహం రసస్థాయికి చేరగలిగిన పతాక సన్నివేశాలు ఈ పర్వంలో ఉండటంతో ఇది వీరరసోల్లాసం. ఉత్సాహం ధర్మమూలమైనప్పుడు రసంగా అభ్యుదయాన్ని పొందుతుంది. వివిధ ప్రయోజనాల కొరకు దానిని వినియోగించుకొనటం వలన వీరరసభేదాలు ఏర్పడతాయి. వాటి ప్రకాశం చేత వీరరసోల్లాసం వ్యక్తమవుతుంది. విరాటపర్వంలో ఇటువంటి వీరరసాభ్యుదయోల్లాసం విచిత్రంగా అనుభవాని కందుతుంది.

వీరరసమంటే ధర్మవీరమే. అది వీరరసభేదాల కన్నింటికి మూలస్థానం. దయాదానయుద్ధాది వీరాలన్నీ ధర్మసమ్మతాలు కాకపోతే రసాలు కావు. రసాభాసా లౌతాయి. కాబట్టి వీరులందరూ ధర్మవీరాన్నే గౌరవిస్తారు. పాండవులందరూ ధర్మరాజుకు తలవంచుతారు. ధర్మజుడు అజ్ఞాతవాసవ్రత నిర్వహణోత్సాహంతో విరాటపర్వకథాకార్యాన్ని ఆరంభం నుండి నిర్వహణం వరకూ సాగించి ధర్మవీరు డనిపించుకొన్నాడు. ధర్మజుడి ధర్మవీరోత్సాహం భీమార్జునుల వీరోత్సాహాలవలె యుద్ధక్రీడలలో ఉజ్జ్వలంగా వెలువడకపోవచ్చును. కాని, వాటి నన్నింటిని ధర్మసూత్రంతో దర్శకుడివలె ఆడించే సూత్రధారుడు ధర్మరాజు. అతడే విరాటపర్వంలో నిజానికి వీరరస అభ్యుదయ మార్గప్రవర్తకుడు.

అజ్ఞాతవాసం ఎవరి వద్ద ఎట్లా నిర్వహించాలనే ప్రశ్నకు ధర్మరాజు నిర్ణయమే సముచిత సమాధానం:

ఆ. "నాకుఁ జూడ మత్స్యనరపతి సద్ధర్మ। వర్తి, సుజనహితుఁ, డవార్యబాహు
బలుఁడు గాన యతనిపాల నందఱుఁ దగ। వైన పనుల నిలుచు టభిమతంబు''. (విరా.1.64)

విరాటుడి కున్నవని చెప్పిన మూడు గుణాలూ పాండవులకు సహజంగా ఉన్నవే. అందువలన సజాతీయ గుణవరిష్ఠుడైన రాజు నెన్నుకొన్నారు. అతడి కొలువులో కూడా పాండవులు తగనైన పనులే చేపట్టారు. ఆ తరువాత విరాటుడి నిర్ణయాలపై ధర్మజుడి సద్ధర్మవర్తన ప్రభావం కనపడింది. కీచకాదులకు భయపడి తా నేమీ చేయలేకపోయినా రాజు సుజనహితాన్ని కోరి గంధర్వులు నిర్వహించిన పాత్రను సహించే శీలాన్ని సంపాదించుకొన్నాడు. విరాటుడికి సహజంగా బలం ఉండవచ్చును కాని దాన్ని అవార్యబలంగా మార్చింది ధర్మరాజాదులే. ధర్మరాజు మాట పాండవులకు రుజువైన బాట!

విరాటనగరం దృగ్గోచరం కాగానే తమ్ములను చూచి -

క. "చక్కని చిక్కని మేనులు । నిక్కోదండములునైన నెఱుఁగరె; మన మీ
చక్కటి నిలుతమె? శస్త్రము । లొక్కెడ దాఁచుటకు, వేషయోజనములకున్" (విరా.1.156)

అని హెచ్చరించింది ధర్మరాజే. వేషయోజనానికి ముందుగా నడిచి యమధర్మరాజును ధ్యానించిందీ ధర్మరాజే. ఆయనకు సన్న్యాసిరూపం వచ్చింది. వెంటనే అందరికీ అనుకొన్న రూపాలు ఏర్పడ్డాయి. ఇది భారత నాయక తత్త్వాన్ని వ్యంగ్యంగా ధ్వనింపజేసే దృశ్యం. కార్యారంభంలోనూ ఫలానుభవంలోనూ పాండవులైదుగురైనా ధర్మజుడిదే అగ్రస్థానం. అతడి సంకల్పమే అందరి సంకల్పం. ధర్మరాజుది ధర్మవీరం. అందరివీ దానికి అనుబంధవీరాలే. వారిని నియమించటం, నియంత్రించటం, నిర్వహించటం, ప్రేరేపించటం, రక్షించటం, ప్రోత్సహించటం, తనతో కలిపి నడుపుకొనటం అతడికి బాగా తెలుసు. అతడు అన్నింట అజాతశత్రువైన నాయకుడు.

ధర్మరాజు శమీవృక్ష శాఖకు ఆయుధాల మూటను వ్రేలగట్టి, ఆయుధాల అధిదైవతాలను ఉద్దేశించి ఇట్లా ప్రార్థించాడు. ఇది మూలంలో లేనిది.

క. "నరునకు నాకుం దక్కఁగ । నొరులకు మీరూపు సూపకున్నది విష వి
స్ఫురితభుజగభంగి భయం । కరమూర్తులు దాల్చి యుండఁగా వలయుఁ జుడీ!' ' (విరా.1.176)

అజ్ఞాతవాసంలో ఆయుధాలను ముట్టుకొనే అవకాశం తనకూ అర్జునుడికే ఉండాలని ఆశించటం స్వార్థం కాదు. అజ్ఞాతవ్రతధర్మం రక్షించవలసివస్తే శస్త్రాలు చేపట్టదగినవారు వారిరువురే అని ధర్మరాజు నిర్దేశం. తా నెట్లాగూ చేపట్టడు. పేడివాడైన బృహన్నల చేపట్టే అవకాశం లేదు. (అయినా ముందుగా అతడికే ఆ అవకాశం ఏర్పడింది.) అందువలన అజ్ఞాతవాసంలో స్వీయ శస్త్రాల అవసరం ఉండకపోవచ్చుననే భావం ఒకటి; భీముడికి గద ఉపయోగించే అవకాశం లేకుండా చేయటం మరొకటి. ఈ మాట లని భీముడికి సహనం అవసరమని బోధించటం వ్యంగ్యం. తమ్ముల స్వభావాలు తెలిసి, తాను నిర్వహించవలసిన పాత్రను గుర్తించి, వివేకంతో మాట్లాడటం నాయకుడైన ధర్మరాజుకే చెల్లింది. అత డన్నమాట వృథాకాకపోవటం అతడి మహిమకు చిహ్నం!

విరాటపర్వంలో ధర్మరాజు తా నెప్పుడూ భీముడిని తన అదుపులో ఉండేటట్లు చూచుకొనేవాడు. భీముడి ఉద్యోగం వంటశాలలో అయినా విరటుడి కొలువులో ఎప్పుడూ ఉండేటట్లు చూచేవాడు. మల్లయుద్ధాలకని పిలిపించి కనుసన్నలలో మసలేటట్లు జాగ్రత్తపడేవాడు. దక్షిణగోగ్రహణ యుద్ధంలో పాల్గొనటానికి బయటి కొలువులో తన చూపుమేరలో ఉండేటట్లు చూచుకొన్నాడు. యుద్ధంలో కూడా ధర్మరాజు సైగల కనుకూలంగా పోరి విరాటుడిని శత్రువుల నుండి విముక్తుడిని చేసేటట్లు చేశాడు. ఇన్ని జాగ్రత్తలు భీముడిపట్ల తీసికొన్నా ఒక్కొక్కసారి అతడు ఒడలు తెలియని రౌద్రావేశంతో ప్రమాదం తెచ్చిపెట్టేవాడు. అప్పుడు ధర్మరాజు అంకుశం వలె నిలిచి అతడిని అదుపులో పెట్టేవాడు. ధర్మరాజు సామాన్యంగా సైగలతోనే పని సాగిస్తాడు. శ్రుతి మించినప్పుడు మాటలు ప్రయోగిస్తాడు. అజ్ఞాతవాసంలో గూఢంగా, అన్యాపదేశంగా మాట్లాడటం అతడి నేర్పు.

కీచకుడు ద్రౌపదిని నేలపై పడలాగిన దృశ్యం చూచాడు భీముడు. ఆ దుష్టాత్ముని నియంత్రించలేక మొగం త్రిప్పుకొన్న విరాటుడిని చూచాడు. రౌద్రం పొంగివచ్చింది. ప్రక్కనున్న ఎత్తైన చెట్టును పెకలించి, విజృంభించి వారిరువురినీ సంహరిద్దామని సంభ్రమించాడు.. కాని, అనుమతి కొరకు ధర్మజుడివైపు చూచాడు. ఆయన గొప్ప అన్యాపదేశం పలికాడు:

మ. "వలలుం డెక్కడఁ జూచె నొండెడ నసేవ్యక్ష్మాజముల్ పుట్టవే?
ఫలితంబై వరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్?" (విరా.2.136)

ఇది ప్రౌఢవాక్యం. (వివరాలకు వ్యాఖ్య చూడండి). ఇందులోని చెట్టు ఒక్కటే. భీముడు పీకదలచుకున్నదీ, ధర్మజుడు నిలుపదలచుకొన్నదీ కూడా ఒక్కటే. అది మత్స్యభూనాథుడు. మరి భీముడు ఒక్క చెట్టుతో ఇద్దరిని చంపదలచాడు. ధర్మజుడు అసేవ్యక్ష్మాజముల్ పుట్టవా? అని బహువచనంలో మొదట పలికాడు. అయినా అందులో ఒక భూజము ప్రీతిని సంధించేది కాబట్టి దానిని వాటితో కలిపి రూపుమాపవద్దు - అని ధ్వనింపజేశాడు. తాత్పర్యం తేలిందేమిటంటే - ఆసేవ్యక్ష్మాజములను (కీచకోపకీచకులను) చంపవలసిందే, విరాటుడిని మాత్రం కాదు. అందులోనూ అందరినీ ఒకసారి చంపటం వ్యూహం కాదు. పట్టపగలు అందరూ చూచే సభలో నీవే చంపుతున్నట్లుగా తెలిసేటట్లు, ఇంత రౌద్రోద్రేకంతో చంపగూడదు. తగిన సమయం ఇది కాదు.. అని హెచ్చరించాడు వ్యంగ్యంగా. ఆ తరువాత భీముడు ధర్మజుడితో కలవలేదు. అతడి ఆజ్ఞ తీసికొనలేదు. ద్రౌపదికి నిద్రపోతున్నట్లు కనబడ్డాడు. కాని లోలోన ఆలోచించాడు. ఆమె కోరికకు తగినట్లు వ్యూహం పన్నాడు. అప్పుడు ధర్మరాజు ప్రసక్తి వచ్చింది. సభలో భీముడిని వారించటంలోని అంతరార్థం ద్రౌపది చెప్పింది. భీముడు తల ఊపాడంతే! కాని, ధర్మజుడి అంతరాంతరాలను అంచనా వేసి అసేవ్యక్ష్మాజములైన వారిని ఖండించటానికి రహస్యవ్యూహం పన్నాడు. ధర్మజుడి గూఢవాక్యం భీముడికి భావిగూఢ మార్గ నిర్దేశకం! ఈ పద్యం అన్ని విధాలా పాండవులనూ ధర్మాన్నీ రక్షించింది.

విరాటుడి కొలువులో భీముడు ఉపశమించినా ద్రౌపది విజృంభించింది. ఆమె కోపంతో ఎదిరించి మాట్లాడటం మొదలు పెట్టేసరికి ధర్మరాజుకు గుండెదడ పుట్టింది. నెన్నుదురు చెమటతో నిండిపోయింది. రోషం పొడుచుకొని వచ్చింది. కాని నిగ్రహించుకొని, ఆమెను నిగ్రహించుకొనుమని హెచ్చరించాడు. (వి.2.148) ఆమె అధిక్షేపిస్తూ నిష్క్రమించింది. ధర్మరాజు నియంత్రణకు భార్యా, తమ్ములూ బుసలు కొడతారు. కాని, అతడి ధర్మశక్తిని చూచి తలొగ్గుతారు. భీమ ద్రౌపదుల రౌద్రోల్లాసం ధర్మజుడి ధర్మవీరంలో అంతర్లయించిపోయింది. కీచకవధానంతరం ధర్మరాజు కిమ్మనడు.ఎందుకని? ద్రౌపదీ భీములు సభలో కోపగించినా, ఆ తరువాత ధర్మరాజు హృదయాన్ని ఊహించి, దానికి అనువుగా వ్యూహాన్ని నిర్వహించారు. లేకపోతే, అది ధర్మవిరుద్ధమైతే, ధర్మజుడి బాటకు విపరీతమైతే, తానే యమధర్మరాజై ఉండేవాడు. తెర వెనుక సూత్రధారుడు ధర్మరాజు.

పాండవుల అజ్ఞాతవాసాన్ని భంగం చేయాలన్న వ్యూహంతో సుశర్మ దక్షిణ గోగ్రహణం చేశాడు. విరాటుడు తమ్ములతో కొడుకులతో పోరుకు సిద్ధమైనాడు. అతడు ఆశ్రితులైన కంకాదులను సహాయమడుగలేదు. కంకుడు వస్తానని ముందుకు వస్తే కాదనలేదు. వలల దామగ్రంథి తంత్రీపాలురను కూడా యుద్ధానికి పిలిపించుమని సలహా చెప్పగా విని, వెంటనే వారందరికీ రథాలిప్పించాడు. చివరకు విజయానికి కారకులైన కంకాదులను ప్రశంసించాడు. వారిలో పరమపూజ్యుడు ధర్మరాజు. అతడికి రాజ్యాన్ని అర్పించటానికి సిద్ధమయ్యాడు. కాని, అతడు విరటుడి సంతోషమే తన సంతోషమని చెప్పి అతడిని స్నేహంతో గౌరవించాడు. విరాటు డతని ప్రవర్తనకు ఆశ్చర్యపోయాడు.

క. "ఉపకారమొ, బంటుతనమొ। కృపయో, పెంపో, సమగ్రకీర్తి ప్రియమో
రిపుదుస్సహ మగు నీ రణ। నిపుణతకుం గారణంబు నెయ్యమొ యెఱుఁగన్" (విరా.3.228)

ఈ పద్యం ధర్మజుడి నీతికి నీరాజనం. విరాటుడిని రక్షించటంలో చూపిన యుద్ధనైపుణ్యానికి హేతు వేమిటి? అయిదు ప్రశ్నలు వేశాడు. అందులో దయ కేంద్రం. అంటే దయావీరం ముఖ్యం. మిగతావి దానికి పోషకమైన భావాలు. ధర్మజుడి దయావీరం అంతటితో ఆగలేదు. సుశర్మను సపరివారంగా వదలిపెట్టించటంలో మరింత ప్రకాశించింది. యుద్ధం చేసి వీరాన్ని ప్రకటించి శత్రువును బంధించిన భీమాదుల కంటె, దయామయుడై అతడికి క్షమాభిక్ష పెట్టించిన ధర్మజుడు ఘనుడు! యుద్ధ దయారసాలు ధర్మవీర పోషకాలై ఉల్లసిల్లటం ఈ ఘట్టంలోని విశేషం.

ఉత్తరగోగ్రహణ యుద్ధంలో ఉత్తరుడు విజయం సాధించాడన్న వార్త విని ధర్మజుడు చేసిన వ్యాఖ్యానం ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టగలిగిన అతడి విజ్ఞతకు తార్కాణం.

ఉ. “ఆహవకేళి వేడుక బృహన్నల చిత్తమునం దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని సారథిగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నోర్చి నీపసుల నొక్కఁడుఁ దక్కకయుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గావలయుఁ; దప్పదు నాపలు; కట్ల చూడుమీ!” (విరా.5.257)

విరాటునకు విజ్ఞత నేర్పబోయి సారెల దెబ్బలు తిన్న సహనమూర్తి యుధిష్ఠిరుడు. విరాటుడు సారెలతో కొట్టాడని తెలిసిన అర్జునుడు మండిపడి అతడిని సంహరిస్తానని ఆవేశపడినప్పుడు ధర్మరాజు అతడిని శాంతింపజేశాడు. (5.313). మరునాడు-

చ. “చని ధర్మసుతుఁడు సింహా। సనమున భీమాదు లాత్మసముచితరుచిరా
సనముల సభాస్థలిం గయి। కొని పంచాగ్నులును బోలెఁ గూర్చున్నంతన్” (విరా.5.316)

విరాటపర్వంలో నాయకుడు ధర్మరాజనీ, మహాభారతంలో, కురుక్షేత్ర యుద్ధానంతరం మరల అతడే కురురాజ్య సార్వభౌముడనీ కవి ధ్వనింపజేశాడు. ఇందులో రససమన్వయం ధర్మరాజు కనుగుణంగానే సాగుతుంది.

ధర్మవీరం రసానాం రసః, ధర్మజుడు ఆ మూలరసానికి ప్రతీక. అతడు అయిదు ఆశ్వాసాలలోనూ ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా కానీ కీర్తింపబడతాడు. అది అందుకు సాక్ష్యం. భీమాదుల యుద్ధాలలో కానవచ్చే యుద్ధవీరాదులు దాని అభ్యుదయ వీచికలు. దుర్యోధనుడి దుష్టవ్యూహం వలన ప్రవర్తిల్లిన రౌద్రం ధర్మవీరానికి అంగం. ఇట్లా సాగే ఈ కథలో ధర్మజుడి ధర్మవీరం ఈ పర్వానికి మాత్రమే పరిమితమైనది కాదు. అది భారతేతిహాసం చివరిదాకా సాగే అంగిరసం. విరాటపర్వంలోని మూడు ప్రబంధ ఘట్టాలలో వెలుగొందే వివిధరసాలు ఆ మూలరసానికి ఉల్లాసాలు. కాబట్టి ప్రత్యేక ప్రతిపత్తితో కానవచ్చే విరాటపర్వంలో ‘నానారసాభ్యుదయోల్లాసమే’ అనుశీలించదగిందని తిక్కనగారి నిర్దేశం.

**(iv) అద్భుతరసం :** వీరకర్మయొక్క ఫలమే అద్భుతం. “వీరస్యాపి చ యత్కర్మ సో-ద్భుతః పరికీర్తితః” (నాట్య.6.42) అని భరతుడు. విస్మయం దీని స్థాయి భావం. అద్భుతం మానసికం, ఆంగికం, వాచికం- అని మూడు విధాలుగా శారదాతనయాదులు వింగడించారు. సామాన్యంగా ప్రధానపాత్రలు వీరకర్మలు చేస్తున్నప్పుడు ప్రక్కనున్న పాత్రలుకాని, చూపరులుకాని, ఆకాశంలో నిలిచి చూస్తున్న దేవతలు కాని వాటిని చూచి, ఆశ్చర్యపడినట్లు వర్ణించడం వీరరసజన్యమైన అద్భుత రసాన్ని చిత్రించటం. అద్భుతమైన దృశ్యాలనో దేవతామహిమలవంటివో చూచి, భావించి ప్రధాన పాత్రలు పొందే విస్మయ భావాతిశయం జనకరసమైన అద్భుతం.

విరాటపర్వంలో రెండు రకాలైన అద్భుతాలూ అభ్యుదయోల్లాస దశలను పొందినట్లు తిక్కన వర్ణించాడు. ఇందులో ప్రబంధాల వంటి మూడు సన్నివేశాలలోనూ అద్భుతం కలిగించినవాడే నాయకు డన్నట్లు తీర్పు చెప్పాడు. కీచకవధఘట్టంలో భీముడి పరాక్రమానికి అబ్బురపడిన ద్రౌపది అతడిని ఉత్తమ నాయకుడిగా కీర్తించింది.

సీ. “కొలువులోపల నిన్న కోప మగ్లెత్తినఁ। దలఁకక నిలిచిన ధైర్యమహిమ,
నేఁ డిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ। కన్నులు గప్పిన గౌరవంబు,
మనవారిలోన నొక్కనినైనఁ బిల్వ కు। త్సాహంబు సేసిన సాహసంబు,
లోకదుర్జయుఁడగు నీ కీచకునిని వ్రే। ల్మిడి రూపుమాపిన కడిమిసొంపు

తే. సూడఁ, దలపోయ, మెచ్చ, సంస్తుతి యొనర్ప। నాతలంబె నీ యుత్తమనాయకత్వ
మెటిఁగి నినుఁ గొనియాడ నే నెంతదాన?। మహిత విస్మయానంద నిర్మగ్ననైతి.” (విరా.2.360)

ఇది ద్రౌపది చేసిన ప్రశంసయే కాదు. భీముడి వీరాద్భుతాకారాన్ని చూచి, తలపోసి, మెచ్చి, సంస్తుతి చేసి ఆమె పొందిన అభ్యుదయోల్లాస క్రమాన్ని ఆవిష్కరించిన అద్భుత రచన. ఈ పద్యం అమూలకం. (మరికొన్ని వివరాలకు విశేషవ్యాఖ్య చూడండి).

కీచకవధ ఘట్టంలో నాయకుడు భీముడని ప్రకటించడానికి నైతికమైన అర్హత ఉన్న వ్యక్తి ద్రౌపది. కీచకుడు తనను చూచి మోహించి అతడి ఇంటికి అక్కసాయంతో పిలిపించుకొని పొందాలని చేసిన ప్రయత్నాల నన్నింటిని చాకచక్యంతో, ధైర్యంతో, దైవబలంతో ఆమె ఎదుర్కొన్నది. సగం కథకు ఆమెయే నాయకురాలై ముందుకు నడిపించింది. కీచకవధ భీముడే చేయగలడు. అందువలన అతడి చేతిలో పెట్టింది. అతడు అద్భుతంగా దానిని నిర్వహించాడు. అంటే - ద్రౌపదే అద్భుతరసంలో మునిగేటట్లు నిర్వహించాడు. కీచకవధ తరువాత దానిని నలుగురికీ ఎలుగెత్తి చెప్పి తరువాత కథాగతికి కారకురాలైనదీ ద్రౌపదియే. ఉపకీచకు లందరినీ ఒక్కుమ్మడిగా చంపి, అద్భుతంమీద మరొక అత్యద్భుతాన్ని భీముడు సృష్టించాడు. కీచకుడిని చంపి భీముడు ద్రౌపది మానం రక్షించాడు. ఉపకీచకులను చంపి ఆమె ప్రాణం రక్షించాడు. 'మానము ప్రాణమున్ గొనుట'కు ఎవరైనా ప్రయత్నం చేస్తే భీమ పరాక్రమం ఎటువంటి ఫలితాన్ని పొందింపజేస్తుందో ప్రకటించాడు. అందుకే ద్రౌపది గూఢంగా భీముడిని గంధర్వపతిగా కీర్తించింది.

తే. "కీచకుల దెసఁ బుట్టిన కిల్బిషంబు । పాచి నన్ను రక్షించిన పరమధర్మ
రతికి, గంధర్వపతికి నిరంతరంబు । భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి బ్రదుకుదాన." (విరా.3.40)

భీముడి వీరకార్యంలోని పరమధర్మరతిని ప్రశంసించింది. భీముడిలో ధీరోద్ధతుడిని కాక ధీరోదాత్తుడిని దర్శించింది. ఉత్తమ నాయకత్వ లక్షణాలను ఉల్లేఖించింది. దానికి తగ్గట్లు భీముడు 'నిగూఢవచన చాతుర్యధుర్యుఁడై' పలికిన పలుకులు పరమోదాత్తాలు.

చ. "అతివ యపాయముం బొరయునప్పుడు గావక తక్కెనేని నా
పతి పతియే తలంప? మగపాడియె? లోకము పాడియే? భవ
త్పతు లిటు లాచరించుట గదా భవదీయ మనోనువర్తన
స్థితి కుచితంబు; వారల నుతింపఁగ నేల నిసర్గవృత్తులన్?" (విరా.3.42)

ఉద్ధతుడైతే భార్య ప్రశంసలకు ఉబ్బితబ్బిబ్బయ్యేవాడు. కాని, భీముడు భార్యను రక్షించుకొనటం భర్తల ధర్మం. అది ఔచిత్యం; కాబట్టి దానిని ప్రత్యేకించి ప్రశంసించవలసిన అవసరం లేదన్నాడు. అంతేకాదు, తాను ఒక్కడే ఆ పని చేసినా 'భవత్పతులిటు లాచరించుట గదా' అని సమష్టి బాధ్యతగా పేర్కొనటం భీముడిలోని ఉదాత్త నాయక లక్షణం! కీచకుడిని చంపి ద్రౌపదీ రమణుడయ్యాడు, ఉపకీచకులను చంపి ద్రౌపదికి దేవుడయ్యాడు భీముడు. ద్రౌపది పాత్ర ప్రకటించిన అద్భుతం ప్రధానంగా మానసికం. పఠితల హృదయాలకు సన్నిహితం!

కార్యనిర్వహణంలో (నిర్వహణ సంధిలో) అద్భుతం ప్రదర్శితం కావాలని లాక్షణికమతం. తిక్కన విరాటపర్వంలో అట్టి అద్భుతరస వికాసోల్లాసాన్ని ప్రస్ఫుటంగా ప్రదర్శించాడు. కీచకవధవలన విరాటనగరంలో భయంతో కూడిన అద్భుతం ప్రజల హృదయాలలో ప్రకాశించింది. అది కార్యనిర్వహణకు నిండుదనం కల్పించింది. అట్లాగే దక్షిణగోగ్రహణ ఘట్టంలో పాండవ పరాక్రమానికి విరాటుడు పొందే అద్భుతం నీరాజనా లిచ్చింది. ఉత్తరగోగ్రహణ ఘట్టంలో ఉత్తరుడు ప్రదర్శించిన ఆశ్చర్య భావోల్లాసం అర్జునుడి అపూర్వ యుద్ధ వీరంనుండి పుట్టిన విలాసం వలె వింత గొలిపింది. అర్జునుడి ప్రతాప ప్రదర్శనాన్ని అపూర్వంగా దర్శించాలని వచ్చి ఆకాశమార్గంలో నిలిచి ప్రశంసించిన దేవతాసమూహం అద్భుత రసానికి అభివ్యక్తిశక్తిగా అమరింది. దక్షిణగోగ్రహణ ఘట్టంలో నిర్వహణంలో అద్భుతాన్నీ, ఉత్తరగోగ్రహణంలో నిరంతరం సాగిన అద్భుతరసాన్నీ చిత్రించి తిక్కన సన్నివేశోచిత రసప్రయోగ నైపుణ్యాన్ని ప్రదర్శించాడు.

దక్షిణ గోగ్రహణ ఘట్టంలో యుద్ధమంతా ఒక యెత్తు, చివరకు భీముడు సుశర్మను బంధించటం ఒక్కటీ ఒక యెత్తు. ఆ నిర్వహణమే అద్భుత విజయపతాకగా నిలిచింది.

ఉ. “మంటయుఁ బోని శాత్రవసమాజము నించుకయేని శంక లే
కంటఁగఁ దాఁకి వెండి తెగటార్చె మహాద్భుతశక్తిశాలి యీ
వంటలవాని చేసిన యవార్య పరాక్రమ మొండు చోటులం
గంటిమె వింటిమే? యితఁడ కాఁడె వెసన్ గెలిపించె న న్ననిన్.” (విరా.3.229)

విరాటుడిచేత మహాద్భుత శక్తిశాలిగా భీముడిని ప్రశంసింపజేసింది. అతడు పొందిన అద్భుతం కూడా ప్రధానంగా మానసికం.

అర్జునుడు యుద్ధం ఆరంభించినప్పటినుండి అడుగడుగునా అద్భుత ప్రశంసలే. ఉత్తరుడు, భీష్ముడు, ద్రోణుడు, అశ్వత్థామ మొదలైనవారు రణరంగంలోనూ, దేవతలు ఆకాశరంగంలోనూ అద్భుతాన్ని వైవిధ్యంతో దర్శించారు. ఆ రసాభ్యుదయోల్లాసాన్ని ఆవిష్కరించారు. ఆ చిత్రణలో మానసిక, ఆంగిక, వాచికాలను ముప్పేటగా విస్తరింపజేశాడు తిక్కన. ఉత్తరుడూ, విరాటుడూ ఆంగికమైన అద్భుతంతో వాచికాద్భుతాన్ని ప్రకాశింపచేశారు. ధర్మరాజాదులు మానసికమైన అద్భుతాన్ని వాచికంగా వెలువరించారు. దేవతలు వాచికమైన అద్భుతాన్నే ప్రదర్శించారు. ఈ విధంగా అద్భుతం అన్ని రకాలుగా అద్భుతంగా ఆవిష్కృతమైనది.

ఉత్తరగోగ్రహణ ఘట్టంలో అర్జున నాయకత్వాన్ని ధర్మజుడు గూఢార్థ ప్రధానంగా సమర్థించాడు. ఉత్తరుడు లక్ష్యార్థ ప్రధానంగా ప్రదర్శించాడు. కురువీరులు, దేవతలు, విరాటుడు వ్యంగ్యార్థ వాచ్యార్థ ప్రధానంగా వ్యక్తం చేశారు. అభివ్యక్తిలో వైవిధ్యం తోస్తుంది. చివరకు విరాటుడి కృతజ్ఞతోక్తి అర్జున యుద్ధవీరానికి అక్షరనీరాజనంగా (విరా.5,346) నిలిచింది.

**(v) రౌద్రరసం :** క్రోధస్థాయిభావాత్మకం రౌద్రం. విరాటపర్వంలో రౌద్రరసాభ్యుదయమూర్తిగా చెప్పుకొనదగిన ఉత్తమ వీరుడు భీముడు. రౌద్రరసాభాసానికి ఉదాహరణం దుర్యోధనుడు. అయితే అజ్ఞాతవాసంలో ఉన్న భీముడిలోని రౌద్రం లోకానికి ప్రకటితం కాదు. ధర్మనియతి చేత నియంత్రితమౌతుంది. అందువలన భీముడి రౌద్రం వీరానికి అంగమైపోయింది. కాని, తిక్కన భీమరౌద్ర ప్రవృత్తిని అద్భుతంగా చిత్రించాడు. రౌద్రం ఆంగికమనీ, నైపథ్యమనీ, వాచికమనీ మూడు విధాలు. అందులో భీముడి యందు ఆంగికమైన రౌద్రాన్ని అధికంగా చిత్రించి మిగిలిన రెండింటిని దానికి పోషకంగా తిక్కన నిలిపాడు. నిజానికి విరాటపర్వంలో భీముడికి మాటలు తక్కువ, అభినయం ఎక్కువ. అభినయాన్ని ఆచరణగా అనువదించటం అన్నింటికంటె ఎక్కువ. భీముడి రౌద్రాన్ని వర్ణించిన తిక్కనపద్యాలు ఆణిముత్యాలు. ‘భీముడు ధీరోదాత్తుడు కాడు; కీచకుడిని వంచనతో చంపాడు కదా!’ అని అనుమానించవచ్చును. అతడు అజ్ఞాతవాస వ్రతధర్మరక్షణ కొరకు గత్యంతరం లేని ఉపాయంగా వంచనకు పాల్పడవలసి వచ్చింది. అది ధర్మరాజుకు సమ్మతంగా సాగింది కాబట్టి ఔద్ధత్యం ఔదాత్త్యానికి అంగమైపోయింది. కీచకుడు ఉద్ధతుడే. అధర్మమని తెలిసి గర్వోద్ధతితో సైరంధ్రిని వలచి విరహంలో పడ్డాడు. శృంగారనాయకుడైపోయాడు. అతడి రత్యుత్సాహంలో రౌద్రం నామమాత్రంగా నిలిచింది.

ప్రతినాయకుడైన దుర్యోధనుడు ఉద్ధతుడైన రౌద్రరసమూర్తి. ఉదాత్తులు ధర్మసాధకులు; ఉద్ధతులు అర్థసాధకులు. ఉద్ధతులు ఉదాత్తులు కారు. వారు మాయాపరులు, ప్రచండులు, చపలులు, అహంకార దర్పభూయిష్ఠులు, ఆత్మశ్లాఘానిరతులు. దుష్టచతుష్టయంలో ఈ లక్షణాలు సమగ్రంగా ఉన్నవాడు దుర్యోధనుడు. అతడి తమ్ముడు దుశ్శాసనుడు అతడి నీడ. అతడి మామ అతడికి అన్నింట తగినవాడు. కాగా, అతడికి మిత్రుడై, మిత్రుడి కొరకై ఒక్కొక్కసారి ఔదాత్త్యాన్ని ఔద్ధత్యం కొరకు బలిపెట్టుకొనే కర్ణుడు ఉద్ధతప్రాయుడయ్యాడు. అర్థసాధనం ధర్మసమ్మతమైతే రౌద్రం రసాభ్యుదయాన్ని సాధిస్తుంది. అధర్మబద్ధమైతే

అది ఆభాసంగా పరిణమిస్తుంది. ఉత్తరగోగ్రహణంలో దుర్యోధనుడూ, తన మిత్రులూ, అనుజులూ కలిసి, రౌద్రరసాభాసానికి ప్రతినిధులుగా నిలిచారు. గురుజనులైన ఆచార్య పితృభ్రాతృముని సురగణాలపై కోపించటం వలన రౌద్రరసాభాసం కలుగుతుంది. దీనికి పెట్టింది పేరు దుర్యోధనుడు. అతడికి వంతపాడేవాడు కర్ణుడు. ఇద్దరూ ఉత్తర గోగ్రహణ యుద్ధంలో శృంగభంగానికి గురిఅయ్యారు.

దుర్యోధనుడు వీరుడైనా పాండవుల అజ్ఞాతవాసాన్ని భగ్నం చేయటానికే యుద్ధాన్ని తలపెట్టాడు. దానిని ధార్మికులు గర్హించారు. అర్జునుడు అజ్ఞాతవాసవ్రతం భగ్నం చేశాడని నిరూపించటానికి ధర్మజుడినే అడిగి తెలిసికొని దుర్యోధనుడు తన చపలత్వాన్ని ప్రదర్శించాడు. పితామహుడు హితైషియై-

ఉ. "వచ్చినవాఁడు ఫల్గునుఁ; డవశ్యము గెల్తు మనంగ రాదు; రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే?
హెచ్చగుఁ గుందగుం, దొడరు టెల్లవిధంబుల కోర్చు; టట్లుగా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొందగుచేఁతయుం దగున్" (విరా.4.234)

అని మంచిమాట చెపితే తిరస్కరించి నిర్లక్ష్యపు చిరునవ్వుతో ఇట్లా అన్నాడు :

ఆ. "మనకుఁ బాండురాజతనయవర్గమునకు। నెట్లు పొందు గలుగు? నేను రాజ్య
భాగ మీను; సమరభంగిక విక్రమ। నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు" (విరా.4.236)

అని మూర్ఖంగా మాట్లాడాడు. అహంకార దర్ప భూయిష్ఠు డనిపించుకొన్నాడు. ఈ మాటలు ఉద్యోగపర్వంలో చర్చనీయాంశాలౌతాయి. (3,84-88). తిక్కన తన పద్యాలనే మరల వాడుకొన్న విలువైన మాటలివి. కురుక్షేత్రయుద్ధానికి కూకటి వేళ్ళివి.

నాయకపక్ష రౌద్రం వీరానికి ప్రత్యక్షంగా అంగం కావటం, ప్రతినాయకపక్ష రౌద్రం ఆభాసమై నాయకపక్షవీరానికి పరోక్షంగా పోషకం కావటం. విరాటపర్వ రౌద్రరసోల్లాసం.

(vi) **కరుణ రసం :** రౌద్రకర్మ వలన కరుణం పుట్టుతుంది. భీముడు కీచకుడిని చంపటంవలన ఉపకీచకులు దుఃఖించారు. వారిలో కరుణం ప్రతీకారరూపమైన రౌద్రాన్ని సృష్టించింది. దానిని భీముడు మరల రౌద్రచర్యతో రూపుమాపాడు. తత్ఫలితంగా సుదేష్ణావిరటులకు శోకం కలిగింది. ఆ కరుణం గంధర్వ పరాక్రమ భయంతో ప్రతిచర్యకు పూనుకొనకుండానే సమసిపోయింది. తన రౌద్రకర్మవలన పాండవులు శోకసముద్రంలో మునగాలని దుర్యోధనుడి తలంపు.

తే. "సమయ సముచిత కృత్యంబు చక్కఁజేసి। పాండవులు రాజ్యమున కాసపడకమున్న
యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ దొంటి। యట్ల యిడుమలఁ గుడువఁబో నడుపవలయు".
(విరా.3.91)

ఇది క్రోధమూలమైన సంకల్పం. శత్రువులకు శోకం కలిగించాలని యత్నించినవాడు తన ప్రయత్నంలో విఫలుడైతే తన కొరవితో తానే తలగోకికొన్నట్లు స్వీయరౌద్ర కర్మఫలాన్ని తానే అనుభవించవలసి వస్తుంది. అప్పుడు వారి కరుణరసం ఎదుటివారిలో సహానుభూతిని సృష్టించకపోగా వికటించి, ఆభాసమై, నవ్వుల పాలౌతుంది. ఈ రసోల్లాసం దుర్యోధనుడు ప్రదర్శించాడు. తన దుఃఖాన్ని తానే కొనితెచ్చుకొన్నాడు. అతడి మిత్రుడైన కర్ణుడి పనీ, ఇతడికి ప్రతినిధి సుశర్మ పనీ అంతే అయింది. అట్లా అయినందుకు పఠితలు ఆహ్లాదిస్తారు కూడా! విరాటపర్వంలో పాండవ శత్రువులు కార్చే కన్నీరు పఠితలలో కన్నీరు పెట్టించదు. అది కరుణరసాభాస శిల్పం!

**(vii) భయానక బీభత్సరసాలు :** భయం స్థాయి భావంగా కలిగింది భయానకం. ఇది ఉత్తములలో ఉండదు. అందువలన మధ్యమాదులలో చిత్రిస్తారు. విరాటపర్వంలో భయానికి మారుపేరు ఉత్తరుడు. ఆ తరువాత అతడి తండ్రి విరాటుడు. ఆ తరువాత సుదేష్ణ. ఈ ముఖ్యపాత్రలే కాక భయానికి గురి అయ్యేవారు ప్రజలు, కౌరవసేనలోని సైనికులు. రౌద్రరూపంలో భీముడిని చూచి ఉపకీచకులు భయపడ్డారు. (వి.రా.3.28.29); గంధర్వులచేత కీచకులను చంపించిన సైరంధ్రిని చూచి ప్రజలు భయపడ్డారు. (విరా.3.37.38) అర్జునుడి ప్రతాపాన్ని చూచి కురుసైనికులు భయపడ్డారు. వారివారి ప్రవృత్తులను బట్టి వారు భయానక రసాన్ని ప్రదర్శించారు. అనుభవించారు. భయానకాన్ని కూడా ఆంగికం, వాచికం, మానసికం, సాత్త్వికం అని విశ్లేషించి వివేచించవచ్చును. వాటికి విరాటపర్వంలో విలువైన పద్యాలు రచించాడు తిక్కన. సందర్భోచితంగా వాటిని గుర్తించటం సులభం.

భయానక పోషణంలో భయకారకాలైన విభావాలను భయంకరంగా సృష్టించటం, వాటిని చూచి భయపడుతున్న విభావాలను సహజంగా చిత్రించటం ముఖ్యపాత్ర నిర్వహిస్తాయి. ఒక్కొక్కసారి పఠితలకే ప్రత్యక్షంగా భయం కలిగించే దృశ్యాలను వర్ణించటం మరొక విశేషం. మొదటి రెండూ రసాభ్యుదయ ప్రక్రియలు. మూడవది రసోల్లాస ప్రక్రియ. తిక్కన ఈ మూడు శాఖలలో ఆంధ్రావళి మోదపడే గొప్ప పద్య రచన చేశాడు. ఎట్లాగంటే, ప్రత్యక్షంగా పఠితలకు భయానక బీభత్సరసాలను అందిస్తున్నప్పుడు వాటిని రామణీయకంతో మిశ్రమం చేస్తాడు. అంటే భయాన్నీ బీభత్సాన్నీ కలిగించే సన్నివేశాలలోని వస్తువులను ఆహ్లాదకరమైన ఉపమానాలలో పోల్చి చెప్పి, ఆ రసాస్వాదనం వలన ఒక 'సౌఖ్యరసాన్ని' పఠితలకు సమకూరుస్తాడు. ఇది తిక్కన రచనలో అసాధారణమైన సాధారణాంశం.

1. శమీవృక్షవర్ణనం (1.162); ఆ వృక్షం జాతభీతి పరిసరవర్తిగా భయంకరంగా ఉన్నా చక్రవర్తివలె గంభీరంగా ఉన్నదని చేసిన వర్ణనం అమూలకం, అద్భుతం. (వివరాలకు వ్యాఖ్య చూడండి).

2. చీకట్లో తోచే నర్తనశాల వర్ణనం (2.327); అందమైన భవనం అంధకారంలో భయంకరంగా ఉన్నట్లు భ్రాంతి కలిగించటం ఇందులోని శిల్పం. భయానక విభావమైన ఆ భవనంలో భీముడు నిర్భయంగా వెళ్లటం అక్కడి సందర్భం.

3. కురుసైన్య వర్ణనం (4.50.52); 'భీష్మద్రోణకృపాది ధన్వి నికరాభీలంబైన' కౌరవసైన్యం నడుస్తుంటే రేగిన దుమ్ము ఉత్తరుడికి భయంకరంగా గోచరించినా అది లలితవనలాలిత్యాన్ని ప్రదర్శిస్తున్నట్లు వర్ణించటం విశేషం. సైన్యాన్ని ఉత్తరుడు వర్ణిస్తూనే అతడు దానివలన పొందిన భయాన్ని ఆవిష్కరిస్తాడు. అది భయానక రసాభ్యుదయ చిత్రణం.

4. భయకంపితమైన ప్రకృతి వర్ణనం (4.172): అర్జును డూదిన దేవదత్త శంఖనాదానికి కంపించిన ప్రకృతిని అలంకారసుందరంగా వర్ణించి ఆస్వాదనీయం చేయటం ఇందులోని విశేషం.

5. అర్జునుడి భయంకర విజృంభణం (4.243) అలంకారబంధురం.

6. క్షతగాత్రులైన సైనికులను భీకర రమణీయంగా వర్ణించటం (5.38).

శా. "శక్తిస్ఫార ధనంజయాయత భుజాసంరంభ గాండీవ ని
ర్ముక్త క్రూర శరావలీ దళిత శత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్ర కుసుమశ్రేణీ వికాసోల్లస
ద్రక్తాశోక తరువ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెం గడున్". (విరా.5.38)

ఈ విధమైన వర్ణనం భయానక బీభత్స విభావాలను రమణీయంగా పఠితలకు ప్రదర్శించి ఆస్వాదయోగ్యత కలిగించే తిక్కన శిల్ప ముద్ర.

బీభత్స భయానకరసాలు జన్యజనకరసాలు. ఈ రెండింటిని మిశ్రమం చేసి పఠితలకు అలంకారసుందరంగా అందించటం

తిక్కనగారికి ఇష్టం. విరాటపర్వంలో అర్జునుడు భయంకర సంకులసమరంలో కౌరవసైన్యాన్ని తురుమాడినప్పుడు రణక్షేత్రం 'అభిరామంబయ్యును ఘోరప్రకారం బయ్యె'నని (విరా.5.60) చేసిన తిక్కన వర్ణన ఈ శిల్పానికి కలికితురాయి. భయానక బీభత్సాలు కూడా రసానందం కలిగించేటట్లు చేసే రమణీయ శిల్పం తిక్కన సొత్తు.

**(viii) శాంతరసం :** తిక్కన శాంతరసాన్ని అవతారికలో, ఆశ్వాసారంభాంత పద్యాలలో హరిహరనాథస్వామిని వర్ణించిన పట్టులలో పోషించాడు. కావ్యవర్ణనాంశాలలోని నానారసాభ్యుదయోల్లాసాలన్నీ స్వామికి అంకితమౌతున్న అనుభూతినీ, చివరకు ఆనందముద్రతో ఆనందాన్నీ తిక్కన తనతోపాటు పఠితలకూ అందించాడు.

(2) **పరుష లలిత రస సంయోజనం:** విరాటపర్వం హృదయాహ్లాదంగా ఉండటానికి మరొక కారణం పరుష రసాల నడుమ లలిత రసాలను పొదగటం. నన్నయ పర్వ సంగ్రహంలో పేర్కొన్నట్లు విరాటపర్వం సభారంజనం, సర్వమనోజ్ఞం కావటానికి (ఆది.1.42) పరుష లలిత రస సంయోజనమే కారణం.

పాండవులు విరాటుడి కొలువులో ప్రవేశించే ఘట్టంలో సైరంధ్రి సౌందర్యలావణ్య వర్ణనం పరుష రసాల మధ్య మాధుర్యాన్ని కల్పించింది. సైరంధ్రి రూపమాధుర్యాన్ని 'ఆపాదమస్తకము తద్రూపము వీక్షించుచుం గుతూహల మడరన్' (విరా.1.311) మాట్లాడిందట సుదేష్ణ! అటువంటి కుతూహలం ఆడవారికే కలిగితే ఇక కీచకుడి మాట చెప్పాలా? మూలంలోవలె కాక తిక్కన పాండవులందరూ ప్రవేశించిన తరువాత సైరంధ్రి రూపమాధుర్యాన్ని ప్రవేశపెట్టడం సముచితం. అది తరువాతి కథకు చక్కని పూర్వరంగం.

ద్వితీయాశ్వాసంలో మొదటా చివరా మల్లయుద్ధాలు. అవి పరుషరసాలు. మధ్యలో విరహ మాధుర్యం, రూపవిలాస విభ్రమం. ద్రౌపది సౌందర్యభావనం కథను రమణీయ మధురంగా మార్చాయి. రౌద్ర భయానకాదులూ, కరుణ హాస్యాదులూ ఆ శృంగార లాలిత్యానికి దాసోహమంటాయి. భీముడి రౌద్రోద్రేకంతో దీటుగా కీచకుడి విరహతాపం వర్ణింపబడటంచేత పరుషలాలిత్యాలు చెరిసగంగా కలిసి చెలిమి చేసి ఆంధ్రావళికి ఆహ్లాదం కలిగిస్తాయి.

ఉద్ధత రసాల మధ్య ఉపకీచకుల అసమర్థ అనౌచిత్య కార్యకలాపం హాస్యాన్ని పుట్టిస్తుంది. దక్షిణగోగ్రహణంలో సుశర్మ యుద్ధాట్టహాసం హాస్యాస్పదంగా మారుతుంది. ఉద్ధత రసాల నడుమ ఆభాసాలు ఆహ్లాదదాయకాలవుతాయి.

ఉత్తర గోగ్రహణంలో వీర రౌద్రరసాలకు విరుద్ధమైన ఉత్తర కుమారుడి హాస్యం రసాభాసానికి దారితీయకుండా రసాభ్యుదయానికి దోహదం చేయటం అపూర్వం. ఆ రసలాలిత్యం ఉత్తరగోగ్రహణ యుద్ధ రసాస్వాదన రసిక ద్వారం. ఉత్తరుడు సహృదయ స్థానీయుడై అర్జునుడి అద్భుత యుద్ధవీరాన్ని సమయోచితంగా అనుభవిస్తూ వ్యాఖ్యానిస్తాడు. ఉత్తరగోగ్రహణ యుద్ధంలో ఉత్తరుడు హృదయాహ్లాద మార్గదర్శి. ఆ యుద్ధ రథసారథి, యుద్ధానంతరం కథాసారథి. అర్జునుడు పరుషరసాల ప్రవర్తకుడైతే, ఉత్తరుడు లలితరసాల అనువర్తకుడు. ఉత్తరుడు లేకపోతే ఉత్తరగోగ్రహణ యుద్ధంలో లాలిత్యం లేదు. ఆత్మీయత లేదు.

చివరకు విరాటపర్వానికే ఒక అపూర్వ మాధుర్యాన్ని ప్రసాదించిన రమణీయదృశ్యం ఉత్తరాభిమన్యుల వివాహం. 'కుంతీనందను ల ట్లత్యంత విభవ మెసఁగఁ బరిణయము సేసి సుహృత్ సంతోషోజ్జ్వలురై' (విరా.5.404) నారని కథ ముగించాడు తిక్కన. ఆ సుహృత్తులలో సహృదయులు కూడా దాగి ఉన్నారు.

'బుధసంతోషంబు నిండారఁగన్' రచించబూనిన తిక్కన విరాటపర్వాన్ని 'సుహృత్ సంతోషోజ్జ్వలంగా' చెప్పి, మాట నిలబెట్టుకొన్నాడు. హృదయాహ్లాదాన్ని కలిగించాడు.

### 19. తిక్కన శిల్పపు తెనుగు తోట

"ఈనిన ఆలమందగతి, ఇంపు లిగిర్చి ఫలించినట్టి యు
ద్యానము పోల్కి, సస్యరమ యాడెడి వేదికఁబోలు నీ తెలం

గాణమునం దనంత సుముఖస్వరజీవనమైన శబ్దసం
తానము నేలె తిక్కనవిధాత తెనుంగుల జాతు లేర్పడన్''        -రాయప్రోలు సుబ్బారావు (తెనుగు మాన్యము)

తిక్కన తెలుగుదనానికి కల్పించిన పలుకు సొగసంతా జిలుగునుడికారంతో జీవిస్తుంది. దానిని కీర్తించని కవి లేడు. విమర్శకుడు లేడు. 'తిక్కన శిల్పపుఁదెనుఁగుతోఁట' (రామాయణ కల్పవృక్షం) అని విశ్వనాథవారంటే, రాయప్రోలువారు 'తెనుంగుల జాతులేర్పడన్ తిక్కనవిధాత శబ్దసంతానాన్ని ఏలా' డన్నారు. వీరిద్దరివీ కవితామయమైన సమీక్షలు. కాగా, పింగళి లక్ష్మీకాంతంగారు తిక్కన భాషాప్రయోగ శక్తిని ప్రామాణికంగా వివేచించారు.

"కావ్యరచనకు యోగ్యమైన ఆంధ్రభాష లేని రోజులలో శిష్టమైన భాషను నిర్మించుకొని కావ్యరచనను నిర్వహించిన సిద్ధసంకల్పుడు నన్నయ. ఆయన చేతిలో తత్సమ శబ్దజాలమువలె శుద్ధాంధ్రము పెంపొందలేదు. అచ్చతెనుఁగున కా గౌరవము తెచ్చినవాడు తిక్కన. ఒక భాషయొక్క శక్తియు, సంపన్నతయు అది వ్యక్తము చేయు భావములయు, నర్థములయు గంభీరతను బట్టి తెలియవచ్చును. అచ్చ తెనుఁగు భాష సూక్ష్మాతిసూక్ష్మములైన మనోభావములను వ్యక్తము చేయుటయందును, అతి గంభీరములైన శాస్త్రపరమార్థములను నిష్కర్షగా వివరించుటయందును కూడ సమర్థమే యని తన ప్రయోగములచే లోకములకు చూపినవాడు తిక్కన. అట్టి యీ భాషయంతయు ఆయన సృష్టించుకొన్నదే. ఆ భాషాసృష్టిలో కొంతవరకు నాటి వాడుకపదముల సహాయము చాల కలదు. ఆయన వాక్యములు వ్యాకరణ లక్షణానుసారముగానే ఉన్నను, భాషయంతయు వ్యావహారిక భాష. అందును నెల్లూరు మాండలిక పద ప్రయోగములు అమితముగా కలవు. (ఆ మండలములో 'పనిలేదు, పలుకకుండుము' అను మాటలు ఇతర ప్రాంతములలో 'అక్కరలేదు, ఊరకుండుము' అని వాడుదురు. అట్లే వచ్చిన దానికి, పోయిన దానికి' అనునవి 'వచ్చుటకు, పోవుటకు' అను భావార్థమున ఉపయోగింతురు. ప్రశ్నార్థకమున 'ఎట్ల!, అనుట ఇంకొక మాండలికము. 'నీవు రావా ఎట్ల?' అనిన 'నీవు రావా ఏమి?' అని అర్థము. ఇట్టి ప్రయోగములు (తిక్కన) భారతమున తండోపతండములుగా నున్నవి. వ్యావహారిక భాషాపదములకే శుద్ధరూపమును కొత్త ప్రాణము నిచ్చి ఆయన భారతము రచించెను.'' (ఆంధ్ర సాహిత్య చరిత్ర పు. 236).

చ. "ఇది కడుముద్దరాలు; పను లేమియుఁ జేయఁగ నేర; దెంతయున్
మృదు; వొక కీడుపాటునకు మేకొనఁజాల; దుదాత్తచిత్త; యొం
టి దిరుగుదాని కోర్వ; దొకటిం దనుఁ దా నవరించు చొప్పెఱుం
గదు; తగ నొడ్లనుం గొలువఁగా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా!''        (విరా.1.103)

తిక్కన తెలుగుదనాని కీపద్యం 'మచ్చుతునక. మృదువు, ఉదాత్తచిత్త, అనే తత్సమ పదాలు తప్ప మిగిలినవన్నీ అచ్చ తెలుగులే. వీటిలో కొన్ని తెలుగు జాతీయాలుగా వాడుకలో నిలిచిన తెలుగు జాతులే. అయితే, వాడిన తత్సమ పదాలకు బదులు అచ్చ తెలుగుపదాలు వాడితే ఉద్దిష్టభావం ఒద్దికగా కలుగకపోవచ్చును. 'తిరుగుదాని కోర్వదు' అన్నది నెల్లూరి మాండలికం. ఇందులో మాధుర్యం (పృథక్పదత్వం + ఉక్తివైచిత్ర్యం), సౌకుమార్యం (అపారుష్యం + సుకుమారంగా చెప్పటం) అనే శబ్దార్థగుణాల సంయోజనంతో పుట్టిన పాంచాలీరీతి ప్రకాశిస్తున్నది. పాంచాలిని పాంచాలీరీతిలో పరిచయం చేయటం తిక్కన శిల్పం. తేనెవంటి తెలుగు మాటలు పూనినట్లు చెప్పటం తెనుగుతోట.

పైపద్యంలో ధర్మరాజు అనురాగవతి, సుకుమార అయిన భార్యను గురించి పలికాడు కాబట్టి సౌకుమార్యం కొరకు తెలుగు పదాలు వాడాడనుకొన్నా, యుద్ధంలో అర్జునుడు బద్ధశత్రువైన కర్ణుడితో పలికేటప్పుడు కూడా అచ్చతెలుగులో అధిక్షేపించాడు.

క. 'మాటలు పెక్కాడితి వీ। పోటు మగలు వినఁగ నింకఁ బోవుట దగ దె
ప్పాట; నదిగాక తమ్ముని। పాటును గన్నారఁ గంటి; పాఱకు మింకన్'.        (విరా.5.89)

ఇందులో ఒక్క తత్సమపదం కూడా లేదు. కాని దీప్తరసత్వం కలిగిన కాంతి అనే అర్థగుణం ఉన్నది. అది అధిక్షేపోక్తికి పోషకం.

తిక్కన అచ్చ తెనుగులోనే కవిత్వమంతా వ్రాయలేదు. అచ్చ తెనుగును అంత విరివిగా కావ్యస్ఫూహతో వాడింది ఆయనే అని తాత్పర్యం. వీలైనంతవరకు సంస్కృత భారతానికి తెలుగుదనంతో కూడిన క్రొత్త జీవితాన్ని ఆయన ఇచ్చాడు. పునస్సృష్టి చేశాడు. "సంస్కృతమూలంలో భావం ఉంది. అది తెలుగువారి అనుభూతికి రావాలి. ఆ శ్లోకాలకు తాత్పర్యం చెబితే సరిపడదు. ఆ మూలం ఉత్తేజం ఇవ్వగా తెలుగులో ఒక రసాయన చర్య జరగాలి (Alchemy). అప్పు డది కళగా రూపొందుతుంది" అన్నారు ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారు. (ఆరు యుగాల ఆంధ్రకవిత - పు.108)

కీచకుడు ద్రౌపదిని మోహపారవశ్యంతో ఎన్నో విధాల ప్రశంసించాడు, ప్రార్థించాడు, అనునయించాడు, ప్రాధేయపడ్డాడు. మూలంలోని మాటలు ముచ్చటైన మెచ్చుకోళ్లు. తెలుగులో అవి సాలంకార సరసోక్తులు. మచ్చు కొక్కటి.

"ఏవం రూపా మయా నారీ కాచి దన్యా మహీతలే
న దృష్టపూర్వా సుశ్రోణి యాదృశీ త్వ మనిందితే" (సం.అనువాదం.4.14.15)

డాక్టర్ శలాక రఘునాథశర్మగారు పేర్కొన్న పై మూల శ్లోకంలోని రూపా, సుశ్రోణి - అనే రెండు పదాలను ఆధారంగా చేసికొని తెలుగుపద్యం గాలిగుమ్మటంవలె భావనాకాశంలో లేచింది. ఉత్ప్రేక్షలో ఉయ్యాల లూగింది. రూపం తత్సమ పదాలతో అందం అచ్చ తెలుగు పదాలతో - ఒక రుచిరమూర్తి రూపొందింది.

సీ. "నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి । యచ్చునఁ బెట్టిన ట్లందమొంది,
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి । కుప్పలు పోసిన ట్లొప్పు మెఱసి,
చందురు నునుఁగాంతి కం దేర్చి కూర్చి బా । గునకుఁ దెచ్చినయట్లు కొమరు మిగిలి,
యళికులంబుల కప్పు గలయంతయును దెచ్చి । నారు వోసిన భంగి నవకమెక్కి

తే. యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ । గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు । కాదె; యీ త్రిప్పు లేటికిఁ గమలవదన!' (విరా.2.52)

మూలం ద్రౌపది కచకుచకటిభారాన్ని బాగా వర్ణించింది. తిక్కన కుచాలనూ, ముఖాన్నీ, శిరోజాలనూ వర్ణించాడే కాని పిరుదుల జోలికి పోలేదు. కుచాలను కూడా చక్రవాక పక్షుల ఉపమానంతోనే సరిపుచ్చాడు. ఇది తిక్కన ఔచిత్య దృష్టికి దృష్టాంతం. ఉదారత (వికటత్వం, నృత్యత్పదవద్భావం+అగ్రామ్యత్వం) అనే శబ్దార్థాల గుణసమ్మేళనం ఈ పద్యంలో వర్ణించబడుతున్న ద్రౌపది యొక్క, అభ్యర్థిస్తున్న కీచకుడి యొక్క ఉదారతను చాటుతున్నాయి. ఉత్ప్రేక్షతో అర్థగుణ వికటత్వాన్ని సాధించిన తీరు తెలుగు మాటలలో చెప్పటం, ఆమె శరీరావయవాలను సంస్కృత పదాలలో పేర్కొనటం, తన మాట వచ్చేసరికి 'త్రిప్పులేటికి' అని అచ్చ తెలుగులో పలకటం గ్రామ్యత్వ నివారణం కొరకే. గుణాలంకార శోభితమైన ఉక్తి విశేషం తిక్కన రచనా సౌందర్యం.

ఇట్లాగే మూలంతో పోల్చి తిక్కన తెలుగువెలుగును సమీక్షించటం వ్యాఖ్యానంలో పలుచోట్ల జరిగింది. వాటిని గమనింప వేడికోలు!

### 20. అలంకారశిల్పం

తిక్కన అలంకారాలలో ఉపమను ఎక్కువగా వాడతాడని విమర్శకులు వివేచించారు. అంతేకాదు తిక్కన నిత్యజీవితంలోనుండి ఉపమానాలు తీసికొని సర్వజనసులభంగా కావ్యార్థాలను వర్ణిస్తాడనే ప్రశస్తి ఉన్నది. మచ్చుకు కొన్ని-

1. 'నీఱు గవిసియున్న నిప్పుఁబోలె (విరా.1.228)

2. 'పిడుగు పడినవానిఁ గొఱవిం జూఁడిన తెఱంగున' (విరా.2.103)

3. 'బెబ్బులియున్న పొదరు సొచ్చు లేడి చందంబున' (విరా.2.112)

4. 'నివుఱు గవిసిన మెఱయని నిప్పువోలె' (విరా.4.75)

5. 'పెన్నిధిఁ గన్న పేద చందంబున' (విరా.4.149)

6. 'మంటలో మిడుతలు సొచ్చినట్లయిన' (విరా.5.33)

7. 'వేల్పు వచ్చిన యట్ల మేను పొంగ' (విరా.5.40)

8. 'ఏనుంగునకు సిళ్ల చూపినట్లు' (విరా. 5.81)

9. 'ఉపలాలితుండగు ఢింభకుండు తన కొలది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున' (విరా.1.22)

10. 'పంచాగ్నులును బోలెఁ గూర్చున్నంతన్ (విరా.5.316)

తిక్కన ఉపమాలంకారాలను శిల్ప సుందరంగా వాడతాడు. ఉదాహరణకు ఒక సూర్యోపమానంతో అతడు సాధించిన శిల్ప వైశిష్ట్యాన్ని డాక్టర్ సజ్జాజు లక్ష్మీనరసింహారావుగారు ఇట్లా వివేచించారు - "తిక్కన ఉపమానములందు వస్తువులకన్న వాని చైతన్యప్రభావ జీవలక్షణాదుల ప్రాధాన్య ముండుటచే నవి విస్తృత భావావరణము తమలో నిక్షేపించుకొని పరమసార్థకము లగుచున్నవి. ఆంధ్ర భారతమున సూర్యునకు సంబంధించిన ఉపమానములు ఏబది వరకు నున్నవి. ఉత్తర గోగ్రహణ సన్నివేశమున నర్జునుడు కౌరవసేనలపైబడి మహాద్భుత సమరక్రీడ ప్రదర్శించినాడు. తిక్కన మహావీరుని రణవైశారద్యమును పాఠకులకు హృదయగతము చేయుటకై ఎన్నో చక్కని ఉపమాచిత్రముల వినియోగించెను. 'వేల్పు వచ్చినట్లు' మేనుపొంగ అర్జునుడు కోదండము వలయోదాత్త స్ఫురణ వెలుఁగుచుండ జ్యానాదము చేసి, అసంఖ్యాకబాణముల ప్రయోగించెను. 'యథారశ్మిభి రాదిత్యః ప్రాచ్ఛాదయత మేదినీమ్' అనుమూలము ననుసరించి తిక్కన చేసిన వర్ణన మిది.

మ. "ఒక మాత్రన్ వితత ప్రసార నిబిడాత్యుగ్రాస్త్ర సంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరు భాస్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తి కలాపంబులు లోకమంతటను విస్తీర్ణంబులై యొగప
ద్యకృతవ్యాప్తి వెలుంగ నొప్పెసఁగు మార్తాండున్ విడంబించుచున్." (విరా.5.42)

మరియొక భావమును తిక్కన మార్చెను.

క. "నరు లొరులు దృశ్యములపైఁ। బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు పడుఁ దప్పక య
ప్పరుసున నరుఁ డేయు నిశిత। శరములు లక్ష్యములు తప్పి చనవించుకయున్". (విరా.5.43)

సుదూరదృశ్యమగు నరశర ప్రయోగ విలాసమును ప్రత్యక్షము చేయుటకు తొలుత సూర్యకిరణ ప్రసార స్వభావముతో పోల్చి, మరల ఇంకను సులభముగా నవగతమగు సార్వత్రిక విషయముతో కూడ పోల్చినాడు. అర్జునుని బాణప్రయోగవేగము తెల్పుటకుగాని, లక్ష్యశుద్ధిని తెల్పుటకుగాని ఇంతకన్న సరిపోవు ఉపమానము లుండవను భావము కల్గించు రచనము ఇది. గగన మధ్యస్థుడై సూర్యుడు చండకిరణముల నేలనాల్గుచెరగుల ఒక్కసారి గుప్పించునట్లు అర్జునుడు రణరంగమున విస్తరించియున్న కురుసేనా సమూహములం దన్నింటను బాణముల నింపుట వర్ణించబడినది. అర్జునుని బలశౌర్యములు తెలియుటకు తిక్కన ఇట్టివే ఎన్నో ఉపమలు ప్రయోగించినాడు. కాని, ఈ సూర్యోపమ ఒక శిల్పమున భాగమైనది. ఈ శిల్పము విరాటపర్వమున

నర్జునపాత్ర చిత్రణమునకు సంబంధించినది. ధర్మజాదుల వేషధారణ విధానము వేరు. అర్జునున కూర్వశి శాపము వలన కల్గిన బృహన్నలాత్వము వేరు. విరటుని చేరవచ్చిన అతనిని తిక్కన-

ఆ. 'మంచు మఱుఁగుపడిన మార్తాండుఁడును బోలె। నీఱు గవిసియున్న నిప్పుఁ బోలె
వేషధారి యైన విష్ణుండుఁబోలె న। వ్విరటు కొలువు సేర నరుఁడు వచ్చె'. (విరా.1.228)

అని వర్ణించెను. ఇట మూలమున "శిఖీవ యజ్ఞేషు ఘృతేన సిక్తః" వంటి ఉపమలుండగా తిక్కన వానిని వదలెను. తేజః ప్రతాప వైభవములు తొలగి కాంత్యుదగ్రత లేని ఆకారముతో నత డిట ప్రవేశించెను. పాండవుల దుర్గతి కిది పరాకాష్ఠ. పాశుపతాస్త్రవేదికి నర్తనవేదిక దక్కినది. చతుర్థాశ్వాసమున నజ్ఞాతవాస సమయము పరిసమాప్త మగుచుండుటచే బృహన్నలాకృతి తొలగి యథాపూర్వాకృతి నంది అర్జునుడు వచ్చుటకు తిక్కన 'రాత్రిం బుచ్చి తోతెంచు మార్తాండు మాడ్కి' (విరా.4.254) అని పోల్చెను. ఇది నవాభ్యుదయమును సూచించును. పంచమాశ్వాసమున రణోజ్జ్వలు డగుటచే అర్జును దైన్యస్థితి పూర్తిగా తొలగుటను పైన చెప్పబడిన పద్యమున సూర్యోపమాన గ్రహణముచే తిక్కన నిరూపించెను. ఈ పోలికచే అజ్ఞాతవాసదైన్యము పూర్తిగా తొలగి, భావి కురుక్షేత్ర సమరనాయకత్వము స్ఫురించు తీవ్రతతో నర్జునుడు మనకు దర్శన మిచ్చుచున్నాడు. అభిమన్యుడు పద్మవ్యూహమునఁజొచ్చి దివసకాలమంతయు చండపరాక్రమముతో శత్రుభీకరుడై పోరి, సాయం సమయమున కూలిపోవుటను గూడ తిక్కన సూర్యసంబంధములగు అనేకోపమానములతో నిర్వహించెను. (ద్రోణ. 2.39, 48, 60, 96, 126). ఇట్టి భావ సంయమనము, పూర్వోత్తర విషయానుక్రమణరూపశిల్పము కవిబ్రహ్మ నైపుణ్యమును తెలుపును." (ఆంధ్ర మహాభారతము అలంకార సమీక్ష. పు.115.116). విరాటపర్వంలో తిక్కన ప్రదర్శించిన అలంకారశిల్పాన్ని వ్యాఖ్యలో విస్తృతంగా వివరించటం జరిగింది. సహృదయు లాయా విశేషాలను ఆయా చోట్ల గమనింప ప్రార్థన.

## 21. తిక్కన కళాప్రతిభలు

విరాటపర్వ శిల్ప సౌందర్యాన్ని గురించి ఎందరో మహానుభావులు ఇదివరకే ఎన్నో విలువైన అంశాలను పేర్కొని ఉన్నారు. వారి పరిశీలనలు భారత కవితా తత్త్వ దీపికలు. వాటిలో కోరాడ రామకృష్ణయ్యగారి ఆంధ్రభారత కవితా విమర్శనం (1929) ప్రత్యేకంగా పేర్కొనదగింది. తిక్కన భావిప్రబంధ కవులకు ఎట్లా కవితలో మార్గదర్శకుడైనాడో కోరాడ వారు అట్లా భారత విమర్శలో భావివిమర్శకులకు బాటలు చూపారు. తిక్కనార్యుని కళాప్రతిభలను గురించి చెప్పిన కొన్ని అంశాలు:

**1. తిక్కనార్యుని వర్ణనలు** : "తిక్కనార్యుని వర్ణనలన్నియు సహజగుణశోభితములుగాని కృత్రిమ భావగర్భితములు కావు. స్వాభావికములు, సందర్భానుకూలము లైయుండునే కాని సాంకేతికములును (conventional) పాండిత్య ప్రకర్షను చాటునవియై సమయము దొరకినది కదాయని చేయబడినవిగా నుండవు...వర్ణనలు కూడా కథాగమనమునే సూచించుచుండును.' (పు.385)

**2. ప్రకృతి వర్ణనలు** : "తిక్కనార్యుడు మూలమున లేని ప్రకృతి వర్ణనలను పలుచోట్లఁ దెచ్చిపెట్టినాడు. అవి యాయా కథాసందర్భముల కత్యంతానుకూలములై కథాప్రవృత్తికిఁ దోడుపడుచు, కథాగమనముయొక్క కాలవైఖరిని సూచించుచుండును. మరియు నాయక పాత్రల యవస్థలలో ప్రకృతి తన సానుభూతిని తెలుపుచున్నదా యన్నట్లుండును." (పు.391)

3. "తిక్కనార్యుని కథ సచలనంబై, పాత్రలు సచేతనంబులై మనల నంతగా నాకర్షించుటకుఁ గల కారణములలో ముఖ్యమైనవి రెండు: అతని మనోవృత్తి వివరణశక్తి, నాటకకళాచాతుర్యము. వీనికిఁ దగినట్లుగా సహజము, స్వాభావికము నగు నాతని కవితా నైపుణ్యము, జాతీయ ప్రయోగ నైపుణ్యంబును దోడుపడి యతని కవితాసృష్టి నప్రతిమానమైనదానినిగాఁ జేసినవి." (పుట: 396, 397)

4. "సందర్భానుకూలముగ నీతడు ప్రయోగించిన జాతీయము (Telugu idiom) తరువాతి కవులుగాని, పూర్వమున నున్న నన్నపార్యుడుగాని ప్రయోగించినట్లగపడదు. కాని, యా పదబంధముల బిగి, శక్తి (force and vigour) యిప్పటి మన వ్యావహారిక భాషలో వలెనే కనబడుచుండును. కొన్ని యుదాహరణములు మాత్రము చూపెదను-

(1) విప్రులం జుట్టలం బెట్టుకొని సుఖముండుదుమో. (2) దీని నౌ గాదనుఁడా. (3) ఈ త్రిప్పులేటికి కమలవదన- (డొంకతిరుగుడు మాటలని యిప్పుడు మనమందుము.) (4) కొంకుగొస రించుకయు లేక కూలఁదాఁచె. (5) మీ ముక్కున నూర్పుగలుగ నొక మూర్ఖునిచేఁ బడితిన్. (8) ఆపదల కెల్ల నోర్చెద దాని కేమి? (7) విచారము కోర్కికిఁ గాని వావియే? (8) ఇట్టి యవగాఢపుఁ బొత్తు మనంగవచ్చునే? (9) నన్ను ని ట్లాలిగొనఁగనేల? (10) ఆ తల కెయ్యుట లేదు నేనియున్. (11) రాధేయుం డొక చీతికిం గొనఁడు. (12) సంవత్సరంబునుం జేరువ చేరువల్ గడచె. (13) తప్పుగ్రుంకఁ దీఱదు నీకున్. (14) కని కొలువు చేసికొని, (15) ఆశాచక్రముల కొలఁదులు బారవెట్టంగ. (16) నా నేర్చు పనుల వెంట నీకడ నిలువం దలంచి. (17) నేల నాలుగు చెఱఁగుల నృపుల కొలువులందు వర్తించితి. (18) వీనికి మార్కొనఁ జాలెడు దానికి. (19) ఆఁడుఁబుట్టువులతోడన నీవును బుట్టినావు.(20) వలదన్న నుడిగెడువాఁడు గాఁడు- మాయదైవమ- నేనేమి చేయుదాన? (21) ఆ లేమ పొలసిన చూడ్కికిఁ జుబ్బనచూఱగాదె (22) కొని రమ్మా చూతముగాని నీ గమన వేగంబున్ (23) పిడుగు పడినవానిం గొఱవిం జూఁడిన తెఱంగున. (24) ఏడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి పలుచని రొంపి మై నలఁది కొనఁగ. (25) వెనుకన్ గూడఁగ ముట్టి పట్టుకొని తన్నెన్; పల్కు లింకేటికిన్. (26) అకట యాఁడుకూయు  నాల కూయు లాఁతివారికైన నరయవలయు. (27) వీఁడొకటి కాదవునా నెఱుఁ గండు. (28) నెయ్యంబు తియ్యంబు నెఱప నడచి. (29) వన్యసత్త్వముల పాల్పడి చచ్చిన చోటఁ బూరియున్ మొలవదె? (30) నావలని మన్నన యట్టిద కాదె. (31) సారథి నారయుచున్నవాఁ డెటింగిన పని సెప్పఁగావలయు. (32) బొమ్మపొత్తికలకుం దెండీ. (33)పసుల దయ్యె మెఱుఁగుఁ బడఁతుల సంతోషమేల నాకు? (34) ఎవ్విధిఁ జని తేమి యనుచు. (35) చెప్పఁ దొడఁగితి నింకఁ గొఱఁత వెట్టంగ నేల? (36) ఏచి మున్నీరు చేయీఁత నీఁద. (37) తగినవారి చెవికిఁ జేఁదుగాఁగ. (38) చిత్తములం దెడ సేయునట్టి తరమే మీరల్. (39) తానట నన్నుడికించువాఁ డిసీ! (40) తన చేతికొలఁది చూపి క్రీడి సెలఁగె. (41) కన్గిఱిపిన మాత్రలోన. (42) తొల్లింటి చూఱగలదె! (43) పని దెగుఁ గొంతేయుఁడు సొరఁడుగాని క్రౌర్యంబునకున్. (44) నీ వరవాయించుకలేక పఱపవలయు రథంబున్. ఇక భాషా విషయమును బరికింపగా నీతని కవితలో నిప్పు డర్థము మారిపోయిన పదజాల మెంతైనఁ గనఁబడును.'' (పుటలు. 439-441)

ఈ విధంగా తిక్కన కవితాకళా ప్రతిభలు వివరించాలంటే మరల భారతమంత ఔతుంది. పదునేను పర్వాల పీఠికలలో వాటి ప్రశంస చేసే అవకాశం ముందున్నది.

## 22. తిక్కన తెలుగు ముద్ర

తిక్కన భారతం చదువుతూ ఉంటే వ్యాసభారతానికి అనువాదమనే స్ఫూర్తి కలుగదు. తెలుగునేలమీద జరిగిన కథను తెలుగు వాతావరణంలో నుడికారంతో వెలువరిస్తున్నట్లుగా ఉంటుంది. అది తిక్కన వేసిన తెలుగు ముద్ర. ఉదాహరణకు కొన్ని అంశాలు:

1. తెలుగుకవికి కలలో కనబడ్డ దేవుడు కూడా తెలుగు రాచరికపు మర్యాదలు పాటించాడు.
2. తెలుగుబాసలో కవిత్వం వ్రాస్తే పురుషార్థఫలం అందుతుందని గీర్వాణభాషా కవిత్వం మెచ్చుకొనే భగవంతుడంటాడు.
3. పాండవులకు నీతులు చెప్పే ధౌమ్యుడు తెలుగువాళ్ళను దృష్టిలో పెట్టుకొని సమకాలీన స్పృహతో మాట్లాడుతాడు.
4. పాండవులకు అమరిన వేషాలలో తెలుగువారి అలంకారాలు కూడా చేరి వాళ్ళమీద తెలుగువారి ముద్రలు వేశాయి. వారి చేష్టలలో కొన్ని తెలుగునాట నున్న వివిధవృత్తులవారినుండి ఎన్నుకొన్నవి ఉన్నాయి.
5. అశ్వశాస్త్రం, పశుశాస్త్రం, వృక్షశాస్త్రం మొదలైన శాస్త్రాల ప్రసంగాలు వచ్చినప్పుడు తెలుగునాట వాడుకలో ఉన్న పరిభాష వెలుగు చూచింది.

6. నాట్యశాస్త్ర మర్యాదలలో తెలుగుదనం ఉట్టిపడింది. గురుకులాలలో గురుపూజ చేసి కన్యలను విద్యాభ్యాసాలకంపే సంప్రదాయం కన్నులకు కట్టుతుంది.

7. సంస్కృత మల్లయుద్ధం ముసుగులో తెలుగువారి కుస్తీపట్లు చోటుచేసికొన్నాయి.

8. కీచకుడి విరహ ఘట్టంలో యక్షగాన వైఖరి స్పష్టమౌతుంది. తిక్కన సూత్రధారుడుగా కీచకాది పాత్రల అభినయానికి వంత పాడుతూ అభినయిస్తాడు.

9. భీముడి రౌద్రం ఆంధ్రుల ఆవేశానికి అనువుగా ఉంటుంది.

10. ద్రౌపది పాత్ర ప్రదర్శించే పౌరుషాభిమానాలు సత్యభామ పాత్రను అభిమానించే ఆంధ్రులకు అభిమానపాత్రాలు ఔతాయి.

11. ఉపకీచకవధఘట్టం అద్భుత కథాప్రవృత్తిలో నడిచి ఆకాలపు తెలుగువారికి ఆహ్లాదం కలిగించింది.

12. విరాటుడి ఔదార్యం తెలుగువారి అతిథి సత్కార సంస్కృతికి ఆదర్శం.

13. సుదేష్ణ అంతఃపురం తిక్కననాటి అంతఃపుర మర్యాదలకు ఆలవాలం.

14. దక్షిణ గోగ్రహణంలో తిక్కన ప్రవేశపెట్టిన దొమ్మిపోరూ, అందులోని వీరుల విహారాలూ పల్నాటియుద్ధం వంటి తెలుగువారి యుద్ధాలను తలపిస్తాయి.

15. ఉత్తరకుమారుడు ఎంతటి భారతీయుడో అంతటి తెలుగువాడయ్యాడు. ఆ పుణ్యం తిక్కనది.

16. ఉత్తరగోగ్రహణయుద్ధంలోని వీరుల మాటలు తెలుగు పలుకుబళ్ళు.

17. తెలుగువారికి ఈటెల యుద్ధం కంటె మాటల యుద్ధం కష్టం. అందువలన తిక్కనలో క్రియాత్మక యుద్ధం కంటె అధిక్షేపాత్మక సంభాషణలు మూలంలో కంటె అధికం. అది తెలుగువారి పోరుతీరు.

18. విరాటుడి ద్యూత వ్యసనం తెలుగు జానపదుల జూదాల మోజువలె ఉండటంతో ఆసక్తికరంగా తోస్తుంది.

19. పెళ్లితో ముగిసే కావ్యమంటే తెలుగువారికి హృదయాహ్లాదం కలుగుతుంది. విరాటపర్వం ఉత్తరాభిమన్యుల వివాహంతో ముగుస్తుంది. కాబట్టి భారతపఠనం ఈ పర్వంతోనే తెలుగువారు ప్రారంభిస్తారు.

20. ఉత్తర తెలుగు రాచబిడ్డవలె వ్యవహరిస్తుంది. అలంకరించుకొంటుంది. మాట్లాడుతుంది. ఉత్తరాభిమన్యుల వివాహం తెలుగు రాజకుటుంబాలలో సాగే ఆచారాలతో ముడిపడ్డ ముచ్చట. పెళ్ళిపీటల మీద వధూవరులు కూర్చొనటం, వారి మధ్య తెరపట్టడం, వారు పోసికొనే తలంబ్రాలూ తెలుగువారికి సర్వశుభాలను కలిగించే వేడుక సంబరాలు. అందుకే తెలుగువారి పెండ్లి శుభలేఖలలో సీతారాముల తలంబ్రాల ప్రశస్తిని మంగళగీతంగా ముద్రించుకొంటారు. ఆ సంప్రదాయాన్ని అచ్చంగా తిక్కన విరాటపర్వంలో చిత్రించి కనుల పండువుగా చేశాడు. మొత్తంమీద విరాటపర్వం తిక్కన్న తీర్చిదిద్దిన 'శిల్పపుఁ దెనుఁగు తోఁట!'

## 23. నన్నయ తిక్కనల కవితలు: భేద సాదృశ్యాలు

నన్నయ తరువాత మహాభారత రచన చేపట్టిన కవి తిక్కన. మహాకవులైన వారిద్దరి కవితలలో కొన్ని భేదాలున్నాయి. సాదృశ్యాలున్నాయి. సూత్రప్రాయంగా వాటిని ఇట్లా పేర్కొనవచ్చును.

**భేదాలు:**

| నన్నయ కవిత్వం | తిక్కన కవిత్వం |
|---|---|
| 1. ప్రసన్న కథాకలి(వి)తార్థయుక్తి ఆఖ్యానపద్ధతి (Narrative Style) | 1. నాటకీయత, నాటకీయ పద్ధతి (DramaticStyle) కథ చెప్పుతున్నా నాటకం చూచినట్లుంటుంది. |
| 2. అక్షర రమ్యత; శబ్దాల కూర్పుతో కలిగే రచనా సౌందర్యం కవితకు శ్రవణానందశక్తిని కలిగిస్తుంది. | 2. వాక్య రమ్యత; పదాలూ వాక్యాలూ శైలీసార్థకంగా కుదిరి పద్యంలో మాట్లాడుతున్న అనుభూతినిస్తుంది. |
| 3. నానారుచిరార్థసూక్తి. | 3. రసాభ్యుచిత బంధం. |
| 4. శబ్దగుణ ప్రధాన రచన. | 4. అర్థగుణప్రధాన రచన. |
| 5. వస్తుధ్వని ప్రధాన రచన. | 5. రసధ్వని ప్రధాన రచన. |
| 6. ధారామధురమైన పద్యరచన. | 6. ఆలోచిస్తూ మాట్లాడుతున్నట్లుండే రచన. |
| 7. రచనలో శబ్దార్థాలకు సమప్రాధాన్యం | 7. రచనలో శబ్దంకంటె అర్థానికి ప్రాధాన్యం. |
| 8. తత్సమపద బహుళమైన శైలి. | 8. దేశ్యపదబహుళమైన శైలి |
| 9. వర్ణనలలో స్థిరచిత్రా లెక్కువ. | 9. వర్ణనలలో చలనచిత్రా లెక్కువ. |
| 10. నన్నయలో పాత్రచిత్రణం అధికం. | 10. తిక్కనలో పాత్రపోషణం అధికం. |
| 11. నన్నయ భారతభాగం నరాంకితం. | 11. తిక్కన భారతభాగం దైవాంకితం. |

**సాదృశ్యాలు:**

1. ఇరువురూ వైదిక ధర్మంలో అభినివేశం కలవారే. సమకాలీన స్పృహ కలవారే.
2. ఇరువురూ ఆంధ్ర మహాభారతాన్ని మతదృష్టితోకంటె కావ్యశిల్పదృష్టితోనే రచించారు.
3. ఇరువురూ ఆంధ్ర మహాభారతాన్ని కావ్యేతిహాసంగా తీర్చిదిద్దారు. ధ్వని ప్రస్థానాన్ని అనుసరించారు.
4. ఇరువురూ వీలైన చోటులలో భారతకథలో, పాత్రచిత్రణలో, పోషణలో తెలుగుదనాన్ని రంగరించి తెలుగువారి ముద్రవేశారు.
5. ఇరువురూ తాము నివసించిన కాలంలో ప్రజలలో వాడుకలో ఉన్న తెలుగు పదజాలాన్ని కావ్యస్థం చేశారు.
6. ఇరువురూ ఒకే ప్రణాళికను (విషయానుక్రమణికను) అనుసరించారు.

ఇరువురూ ధ్వనిరసదర్శనానికి సంబంధించినవారు కావటం చేత మాటలతీరులలో తేడా ఉన్నా, మనసొక్కటిగా మహాభారతాన్ని తెలుగువారికి అందించగలిగారు.

## 24. జంట పర్వాలు

అష్టాదశ పర్వాలలో కొన్నింటిని జంటగా భావించటం తెలుగువారికి పరిపాటి. అవి - ఆదిసభాపర్వాలు, విరాటోద్యోగపర్వాలు, భీష్మద్రోణపర్వాలు, కర్ణశల్యపర్వాలు, శాంత్యానుశాసనిక పర్వాలు, అశ్వమేధాశ్రమవాసపర్వాలు. వీటిలో విరాటోద్యోగాలను కలిపి అనుశీలించటం అవసరం. "తిక్కన కవితా సువర్ణానికి ఒరగల్లుల వంటి విరాట ఉద్యోగ పర్వాలు చదివితే ఆయన పని'వాడి' తనాన్ని పసిగట్టినట్టే- తక్కిన పర్వాలన్నీ ఆ పునాదుల మీద లేచినవే" (ఆరుయుగాల ఆంధ్రకవిత- పు.112) అన్న ఇంద్రగంటి

హనుమచ్ఛాస్త్రిగారి మాటలు స్మరణీయాలు. అందువలన విరాటోద్యోగాల సమ్యక్పరిశీలనం ఉద్యోగపర్వపీఠికలో ఉండటం వాంఛనీయం.

## 25. విరాటపర్వం : ధర్మోపదేశం

విరాటపర్వం ఉపరంజనంతోపాటు ఉపదేశాన్ని కూడా అందిస్తుంది. రామాయణంలో సుందరకాండకువలె మహాభారతంలో విరాటపర్వానికి ఒక ప్రత్యేక స్థానం ఉన్నది. చతుర్విధపురుషార్థాలకు సంబంధించిన అనేకాంశాలు ఈ పర్వంలో సముచితంగా సంగ్రహంగా సందర్భోచితంగా సంతరించబడ్డాయి. విరాటపర్వం చదివిన పఠిత ఎంతటి విపత్తులలో ఉన్నా వాటిని సమర్థవంతంగా ఎదుర్కొని విజయుడౌతాడు. దానికి తగిన వ్యుత్పత్తి ఇందులో అక్షరబద్ధం చేయబడి ఉన్నది.

సంస్కృత భారతంలో వ్యాసభట్టారకుడు విరాటపర్వాన్ని సూక్తిసుధాకరంగా నిర్మించాడు. తిక్కన తెలుగులో సూక్తులు తగ్గించి కవితోక్తులను పెంచాడు. అందువలన ఉభయకవుల వాఙ్మయ ధారలను కొన్నింటిని పేర్కొనటం సమంజసం.

(1)పంచమవేదం ఆరాధ్యం: తిక్కన మహాభారత ప్రశస్తిని గురించి చెప్పిన ఈ క్రింది రెండు పద్యాలూ తెలుగువారి నాల్కలమీద సదా నాట్యం చేస్తుంటాయి.

క. "వేదములకు నఖిలస్మృతి। వాదములకు బహుపురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా। మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్." (విరా.1.4)

క. "పారాశర్యుని కృతి యయి। భారతమను పేరఁ బరఁగు పంచమవేదం
బారాధ్యము జనులకుఁ; ద। ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్". (విరా.1.17)

వేదవ్యాస విరచిత మహాభారతం పంచమవేదం, పరమప్రామాణ్యం. ప్రజలకు అది ఆరాధించదగింది. అంటే అనుసరించ దగింది. ఎందువలననంటే వేదాలకూ, ధర్మశాస్త్రార్థాలకూ, బహుపురాణ ప్రతిపాదిత అర్థాలకూ వాదు ఏర్పడితే ధర్మార్థ కామ మోక్ష పురుషార్థ సంబంధులైన అంశాలలో భారతమే ఉపాదేయం అని తాత్పర్యం. శ్రుతిస్మృతి పురాణవాదాలకు వారధిగా నిలిచే భారతం భారతీయ జీవన ధార్మికసూక్తం!

**(2) విధి బలీయం** : విరాటపర్వం పేరు వినగానే సముజ్జ్వలాకృతులు, మానధనులు, జనమాన్యులూ అయిన పాండవులు ఎంత దీనమైన స్థితి ననుభవించవలసివచ్చింది? - అని జాలివేస్తుంది. దానికి లౌకిక కారణంకంటె మరేదైనా అలౌకిక కారణముంటుందా? అన్న ప్రశ్న కలుగుతుంది. మహాభారత శ్రోత అయిన జనమేజయుడికి అటువంటిప్రశ్న కలిగింది, నాయకుడైన ధర్మరాజుకూ కలిగింది. ధౌమ్యుడు దానికి కారణం 'విధి' అని పేర్కొన్నాడు. జనజీవితంలో అటువంటి ఘట్టాలు ఏర్పడ్డప్పుడు అందరినీ ఊరటపరచేది 'విధివిలాస'మని చెప్పే ఆ కర్మసిద్ధాంతమే. కథలో భాగంగానే ఉంటూ ఆ సత్యం సూక్తిగా రాణించింది.

క. "దేవతలకైన నొక్కొక। చో వలయున కాదె శత్రుసూదనవిధి కా
లావాప్తికి మును దమస। ద్భావంబు లడంచి యుడుగఁబడి యుండంగన్". (విరా.1.53)

విధి ప్రభావాన్ని ధౌమ్యుడు పరోక్షంగా పేర్కొంటే, ద్రౌపది భీముడితో ప్రత్యక్షంగానే ప్రస్తావనకు తెచ్చింది మహానసంలో జరిగిన ఏకాంత సమావేశంలో.

"దత్వా యాచన్తి పురుషా హత్వా వధ్యన్తి చాపరే।
పాతయిత్వా చ పాత్యన్తే పరై రితి చ మే శ్రుతమ్ ॥" (సం.4.19.5)

ఒకప్పటి దాతలే యాచకులై పోవచ్చును. ఒకప్పటి విజేతలే పరాజితులు కావచ్చును. ఒకప్పుడు ఇతరులను కూల్చినవాడే తాను కూలిపోవచ్చును. విధి ప్రభావం (కాలమహిమ) ఇటువంటిదని నేను విని ఉన్నాను.

"న దైవ స్యాతి భారో-స్తి న దైవ స్యాతి వర్తనమ్।
ఇతి చా ప్యాగమం భూయో దైవస్య ప్రతిపాలయే॥". (సం.4.19.6)

దైవం(విధి) దుష్కరమైనది. దైవాన్ని (విధిని) అతిక్రమించలేం. కాబట్టి మరల దైవం అనుకూలించాలి (వక్రించిన విధి అనుకూలం కావాలి) అని ఎదురుచూస్తున్నాను.

"స్థితం పూర్వం జలం యత్ర పునస్తత్రైవ తిష్ఠతి ।
ఇతి పర్యాయ మిచ్ఛన్తీ ప్రతీక్షామ్యుదయం పునః". (సం.4.19.7)

జలం ముందెక్కడుండేదో అక్కడికే మరల చేరుతుంది. (సాగరం-> మేఘం-> వర్షం-> నది-> సాగరం-> ఇది జలవర్తులం.) అట్లాగే సంపదకూడా పూర్వమున్న చోటికే చేరుతుంది. కాని, అటువంటి కాలం కలిసివచ్చేంతవరకు ఓపికపట్టాలి. (ఓపిక పట్టి ఉన్నాను.)

"దైవేన కిల యస్యార్థః సునీతో-పి విపద్యతే।
దైవస్యచాగమే యత్న స్తేన కార్యో విజానతా॥". (సం.4.19.8)

మానవయత్నం ఎంత సవ్యంగా సాగినా దైవం అనుకూలించకపోతే కార్యం చెడిపోవచ్చును. అయినా, నిరాశా నిస్పృహలకు గురికాక, మరల దైవానుకూల్యం కొరకు ప్రయత్నిస్తే కార్యం ఫలిస్తుంది.

తిక్కన ఈ ప్రబోధాంశాలను తెలుగులో నిలుపలేదు. ఆ సందర్భంలో సంభాషణ శిల్పానికి ప్రాధాన్యాన్ని కల్పించి నీతిబోధను తగ్గించాడు. వ్యాసుడు ఋషి, తిక్కన కవి.

**(3) బోధించటం బుధుల స్వభావం :** విరాటపర్వంలో పాండవులు విరటుడి కొలువులో అజ్ఞాతంలో నివసించారు. ఆ సంగతి నూహించి ధౌమ్యుడు పాండవులకు సేవాధర్మాలు బోధించాడు. ఆ బోధ మొదలుపెట్టబోతూ 'వినేవారికి తెలియనివి కావు. కాని, సనాతన ధర్మార్థకామ పురుషార్థ వ్యుత్పత్తి లోకానికి యథావకాశంగా జ్ఞాపకం చేయటం ఋషులకు, ప్రవక్తలకు, ఆచార్యులకు, కవులకు సహజధర్మం' -అని అన్నాడు.

"విదితే చాపి వక్తవ్యం సుహృద్భి రనురాగతః ।
ఏష ధర్మశ్చ కామశ్చ అర్థశ్చైవ సనాతనః॥" (సం.4.4.6)

అన్నీ తెలిసినప్పటికీ మిత్రులు అనురాగంతో చెప్పటం ధర్మం. దానివలన సనాతనధర్మం, అర్థం, కామం అనుసరించి వస్తాయి. ఇది కావ్యాలలో సూక్తులు చెప్పే ప్రక్రియకు వెనుకనున్న ధర్మరహస్యం! దీనిని తిక్కన చక్కని కందపద్యంగా మన కందించాడు.

క. "ఎఱిఁగెడువారికి నైనను । గఱపక తక్క రుచిత ప్రకారము శుభముం
గొఱలు హితు లట్లగుట నం । దఱకును జెప్పంగవలయుఁ దగియెడు బుద్ధుల్." (విరా.1.116)

**(4) సేవాధర్మాలు యోగక్షేమ సూత్రాలు :** విరాటపర్వంలో ధౌమ్యుడు పాండవులకు బోధించిన రాజసేవాధర్మాలు రాజాస్థానాలలో పనిచేసే ఉద్యోగులకు ఏర్పరచిన ప్రవర్తన నియమావళిగా రాణించాయి. ధౌమ్యోపదేశాలన్నీ (విరా. 1.116-140) కథలో అన్వయించక పోవచ్చును. కొన్ని కథలో ప్రతిఫలించవచ్చును. అది కథాంశంగా కంటె ప్రబోధాంశంగా వ్యాసతిక్కనలు భావించారు. అయితే

వ్యాససూక్తులను కొన్నింటిని తిక్కన కథ కనుగుణంగా మార్చి మలచి చెప్పిన పద్ధతి స్పష్టంగా గోచరిస్తుంది. మచ్చు కొకటి రెండు.

"నాస్యయానం న పర్యఙ్కం న పీఠం న గజం రథమ్ ।
ఆరోహేత్ సమ్మతో-స్మీతి స రాజవసతిం వసేత్॥" (సం.4.4.10)

రాజసేవలో ఉన్నవాడు తాను రాజుకు చాలా ఇష్టుడనని గర్వించి రాజులకు, తదితరులకు సంబంధించిన వాహనాలనూ, పాన్పునూ, పీఠాన్నీ, ఏనుగునూ, రథాన్నీ ఎక్కనివాడే రాజగృహంలో ఉండగలడు - అని వ్యాససూక్తి. దీనిని తిక్కన సందర్భోచితంగా మార్చాడు.

ఆ. "ఉత్తమాసనములు నుత్కృష్టవాహనం । బులును గరుణఁ దమకు భూమిపాలుఁ
డీక తార యెక్కు టెంతటి మన్నన । గలుగువారి కైనఁ గార్య మగునె?" (విరా.1.132)

మూలంలో ఎక్కకూడనివి ఇతరుల వాహనాలూ, పాన్పులూ, పీఠాలూ, ఏనుగులూ, రథాలూ. తిక్కన రచనలో ఉత్తమ ఆసనాలూ, ఉత్కృష్ట వాహనాలూ మాత్రమే. అవి ఇతరులవని కాదు. విరాటపర్వ కథలో పాండవులు ఇతరుల వాహనాలనుగానీ, పీఠాలనుగానీ ఎక్కిన జాడలు లేవు. వారు ఎక్కింది విరాటుడి సింహాసనం (రాజుయొక్క ఉత్తమ ఆసనం). దక్షిణ గోగ్రహణంలో ఉత్కృష్ట రథాలూ. ఆ రథాలు రాజు ఇచ్చినవే. ఉత్తమాసనం కూడా రాజు ఇస్తానన్నదే. కాని, ఇస్తానన్నప్పుడు స్వీకరించలేదు- అప్పుడు వారు సేవావృత్తిలో ఉన్నారు కాబట్టి. అజ్ఞాతవాసం అయిపోయిన తరువాత తమ రాజాధిరాజ పదవిని నిరూపించుకొనటానికి రాజసింహాసనాన్ని గ్రహించారు. ఆసనాలను, వాహనాలను మాత్రమే పేర్కొనటం తిక్కన పాటించిన సన్నివేశౌచిత్యం. 'భూపాలుడు ఈయక తమంతట తామే ఎక్కటం' - అనే మార్పు అమూలకం. వీటివలన తిక్కనసూక్తికి సందర్భశుద్ధి ఏర్పడింది.

"యచ్చ భర్తానుయుఞ్జీత తదేవాభ్యనువర్తయేత్।
ప్రమాద మవహేలాం చ కోపం చ పరివర్జయేత్ ॥ (సం.4.4.17)

ప్రభువు ఏది శాసిస్తాడో, అడుగుతాడో దానినే చేయాలి, చెప్పాలి. పొరపాటు, కోపం, గర్వం అనేవాటిని పూర్తిగా వదలిపెట్టాలి- ఇది వ్యాససూక్తి. దీనిని తిక్కన తెలుగులోనికి తీసికొని రాలేదు. తెస్తే బాగుండేది. సుదేష్ణ కీచకుడి మందిరానికి వెళ్ళి మద్యం తెమ్మని ఆజ్ఞాపించింది సైరంధ్రిని. సైరంధ్రిగా రాజ్ఞిసేవలో ఉన్న ద్రౌపది తనను పంపవద్దని వేడికొనగలిగిందే కాని, ఆమె ఆజ్ఞను తిరస్కరించలేకపోయింది. కారణం - ఈ సేవాధర్మమే.

"అనుకూలో భవేచ్చాస్య సర్వార్థేషు కథాసు చ।
అప్రియం చాహితం యత్ స్యాత్ తదస్మై నానువర్ణయేత్ ॥". (సం.4.4.19)

పనులలో, పలుకులలో సేవకుడు రాజుకు అనుకూలంగానే ఉండాలి. రాజుకు ప్రియం, హితం కాని దానిని చెప్పనేరాదు - అని వ్యాసోక్తి. దీనిని తిక్కన తెలుగులో చెప్పలేదు. కాని, ఉండదగిన సేవాధర్మం - ఉత్తరగోగ్రహణ యుద్ధ విజయం సాధించింది ఉత్తరు డొంటిగా కాదు; బృహన్నలతో కూడటం వలననే అది సాధ్యమయి ఉంటుందని ధర్మజు డన్నాడు. రాజు కది అప్రియవాక్యం కావటం చేత అతడు పాచికతో కంకుభట్టును కొట్టాడు. కథా సందర్భౌచిత్యం గల సూక్తి ఇది.

"యస్య కోపో మహాబాధః ప్రసాదశ్చ మహాఫలః।
కస్తస్య మనసా పీచ్ఛే దనర్థం ప్రాజ్ఞ సమ్మతః ॥" (సం.4.4.27)

ఎవరికోపం మహాభయంకరమో, ఎవరి అనుగ్రహం మహాఫలమో అట్టి యజమానికి బుద్ధిమంతుడు మనస్సులో కూడా కీడుతలపెట్టడు - అని వ్యాసోక్తి. తిక్కన దీనిని తెలుగులోనికి తేలేదు. భీముడు రాజసభలో రౌద్రోద్రేకం ప్రదర్శించటం విరాటుడికి కీడు తలపెట్టటమే ఔతుంది. కాబట్టి సేవాధర్మాన్ని అనుసరించి ధర్మజుడు అతడిని వారించాడు. ఇది ఆ సందర్భంలో పనికివచ్చింది.

"లాభేన హర్షయేద్ యస్తు నవ్యథేద్ యో-వమానితః।
అసంమూఢశ్చ యో నిత్యం స రాజవసతిం వసేత్॥" (సం.4.4.31)

రాజువలన లాభం పొందినప్పుడు పొంగిపోకుండా, అవమానం పొందినప్పుడు క్రుంగిపోకుండా ఎవడు నిరంతరం మెలకువతో మెలగుతూ ఉంటాడో వాడే రాజమందిరంలో సేవలో ఉండగలడు - అని వ్యాసుడి సూక్తి. ఇది పాండవుల అజ్ఞాతవాస ప్రవర్తనను సూచిస్తుంది. తిక్కన దీనిని గ్రహించాడు.

క "మన్నన కుబ్బక యవమతి। దన్నొందిన స్రుక్కఁబడక ధరణీశుకడన్
మున్నున్నయట్ల మెలఁగిన। యన్నరునకు శుభము లొదవు, నాపద లడఁగున్." (విరా.1.133)

మూలంలో కొలువులో స్థిరంగా ఉండే లక్షణంగా చెప్పగా, తెలుగులో ఆపదలు తొలగి, శుభాలు కలిగే లక్షణంగా చెప్పటం సందర్భోచిత రచనాశిల్పం !

రాజసేవలో రాణించే వారి గుణగణాలనన్నీ ఒక శ్లోకంలో మణిహారంగా కూర్చి చెప్పాడు వ్యాసమహర్షి.

"అమ్లానో బలవాన్ శూర శ్ఛాయే వానుగతః సదా।
సత్యవాదీ మృదు ర్దాన్తః స రాజవసతిం వసేత్॥" (సం.4.4.37)

అలసతలేనివాడూ, బలం కలవాడూ, శూరుడూ, ఎప్పుడూ రాజును నీడవలె అనుసరిస్తూ ఉండేవాడూ, సత్యం పలికేవాడూ, మృదుస్వభావం కలవాడూ, ఇంద్రియాలను జయించినవాడూ రాజమందిరంలో సేవలో ఉండగలడు - అని వ్యాసుడు పలికిన సూక్తి అన్నివిధాలా విరాటపర్వంలోని పాండవ ప్రవర్తనకు మార్గదర్శక సూత్రంగా రాణించింది. తిక్కన దీనిని గ్రహించలేదు.

**(5) పరదారాభిలాష పాపం :** కీచకుడి వృత్తాంతం ద్వారా లోకానికి చెప్పదలచుకొన్న నీతి - వరదారాభిలాషవలన పాపమే కాక ప్రాణహాని కూడా కలుగుతుందని. దాని కనుకూలంగా స్త్రీపాత్రలైన ద్రౌపది నోట, సుదేష్ణనోట కీచకుడికి ప్రబోధం నిర్వహించబడింది. అందులో ఈ క్రింది పద్యాలు సూక్తి మౌక్తికాలు.

క. "చనుఁ జనదని చూడక యం। దని మ్రాఁకుల పండ్లు గోయఁ దలఁచుట హితమే?
మును చెడిన రావణాదుల। విని యెఱుఁగవె యెన్నఁడును వివేకవిహీనా!". (విరా.2.58)

ఇది సైరంధ్రి సందర్భోచితంగా పలికిన హితోక్తి అయినా, తెలుగువారు 'వివేకవిహీనా!' అనే మకుటంగల శతకంలోని పద్యం వలె హృద్యంగా సంభాషణలలో కూడా వాడుకొంటారు. ఈ సూక్తివలన రావణుడి ప్రక్కన కీచకుడికి ఇంత చోటు దొరికింది.

తే. "ఆయురైశ్వర్య కీర్తుల నపహరించు। పరసతీసంగమము; ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహరింపంగఁ గనియు। వినియుఁ దెలియవె యిది దుర్వివేక మగుట". (విరా.2.69)

పరదారా సంగమం ధార్మికులు - పరిహరించదగింది. ఎందువలన అంటే దానివలన ఆయువు, ఐశ్వర్యం, కీర్తి నశిస్తాయి కాబట్టి. ఈ ధర్మాన్ని ఇదివరకే పెద్దలవలన వినికూడా తెలిసికొనలేకపోతే దానిని దుర్వివేకం అంటారు - అని ఘాటుగా ధర్మబోధ

చేసింది తన తమ్ముడికి సుదేష్ణ. ఇరువురూ ఒకే అంశాన్ని చెప్పినా సైరంధ్రి మిత్ర సమ్మితంగా చెప్పింది. సుదేష్ణ ప్రభుసమ్మితంగా పలికింది. అందుకే అవి వైవిధ్యంతో రాణించాయి. పాత్ర స్వభావ వ్యంజకాలుగా శోభించాయి.

**(6) యోద్ధల యుద్ధనీతి :** విరాటపర్వం యుద్ధమయం. భీమార్జున నాయకత్వాలలో సాగిన యుద్ధాలలో ధర్మజ దర్శకత్వం ఉంటుంది. పాండవపక్షంలో ధర్మజు డెంత పెద్దవాడో, కౌరవపక్షంలో భీష్ము డటువంటివాడు. యుద్ధఘట్టాలలో వీరోక్తులు తిక్కన విస్తృతంగా రచించాడు. అక్కడక్కడ యుద్ధనీతికి సంబంధించిన సూక్తులు వెలయించాడు. నన్నయవలె తిక్కన నానారుచిరార్థసూక్తిని ప్రత్యేకించి ఒక్కొక్క పద్యంలో ఆవిష్కరించటం అరుదు. అందువలన వాటిని సంభాషణల వరుసలలోనుండి వేరు చేయటం కష్టం. అయినా అక్కడక్కడ అటువంటి అవకాశం లేకపోలేదు. మచ్చుకు భీష్మయుద్ధనీతి సూక్తులు.

ఆ. "నేల ప్రొద్దెటింగి చాలు మానిసి రణో । ద్యమ మొనర్చి కాక, తగినవారి
చెవికిఁ జేదు గాఁగ నవమాన వాక్యంబు । లుడుగ కిట్లు పలుకు టొప్పు నెట్లు?"

క. "బీరము లావును మిగులఁగ । వైరులు తఱియైనఁ దొడర వచ్చిన చోటన్
దూరమున వెరవుతోడి వి । చారము గలుగు టిది తగదె సద్బుద్ధులకున్?"

ఆ. "అరుల గుణములైన నగ్గింతు రెప్పుడుఁ । గలయ బెరసినపుడు కలితనంబు
మెఱయుదురు మహాత్ము; లెఱుఁగఁడు తుదిమొద । లెట్టివారి నితఁడు బెట్టు పలుకు". (సం.4.221-223).

మొదటిపద్యంలో 'ఇట్లు', మూడవపద్యంలో 'ఇతఁడు' - అనే పదాలు కథాసందర్భంతో సూక్తి కున్న లంకె. వాటిని సాధారణీకరణం చేసికొంటే సూక్తి స్వతంత్రంగా రాణిస్తుంది. రెండవపద్యం సూక్తికి ముక్తకం.

**(7) సంభాషణలలో దొరలిన సాధారణ నీతులు :** పాండవులు విరటుడి కొలువులో చేరేటప్పుడు పలికిన పలుకులలో లోకనీతికి, సేవానీతికి సంబంధించిన సూక్తులు సహజంగా రాణించాయి. ఆ పాత్రలలో ధర్మరాజు పాత్ర అగ్రగణ్యం. ఆయన సందర్భశుద్ధిగా మాట్లాడిన కొన్ని మాటలే వన్నెగల సూక్తులుగా భాసించాయి. మచ్చుకు.

(i) 'ఉన్న రూప పలుకు నన్నరు లెక్కడఁ । గలరు? - ' (విరా.1.191)

(ii) 'నానావిధభూతమయము । మే నతి చంచలము ...' (విరా.1.193)

**భీముడు :**

(iii) 'కొలువు గొన నొల్లకుండుట । గలిగినఁ బొమ్మనుట యంతకంటెను మే(లు)- (విరా.1.224)

**విరాటుడు :**

(iv) "ఎల్లచుట్టములును దల్లియుఁ దోడును । జెలియుఁ బరిజనంబుఁ జెలువ నీకు
గురువ యింక నొక్క కొఱఁతయు లేదిందుఁ । జేరి బ్రదుకు బుద్ధి గౌరవమున". (విరా.1.253)

**నకులుడు :**

(v) 'దేవ ! తమ తమ । నేర్పు పనుల వెంట నెగడి బ్రదుకఁ వలయుఁగాక-' (విరా.1.266)

**(8) భార్యను గౌరవించటం పరమధర్మం :** ద్రౌపది కీచకుడిని మందలిస్తూ చెప్పిన మాటలలో సూక్తులు కొన్ని ముత్యాలవలె మెరుస్తున్నాయి. వ్యాసుడు ద్రౌపదిని ధర్మప్రబోధిని వలె మలచాడు; తిక్కన నీతిసూచికవలె చిత్రించాడు. అందువలన తెలుగులోకంటె సంస్కృతంలోనే ద్రౌపది వాక్యాలు కొన్ని సూక్తులవలె రాణిస్తాయి. మచ్చుకు-

కీచకుడికి భార్యపట్ల పచరించవలసిన ధర్మాలను గురించి చెప్పినట్లు కొన్ని సంస్కృత ప్రతులలో కనపడుతున్నది. తిక్కన వాటిని గ్రహించలేదు. అయినా అవి మూలహృదయంలోని భాగంగానే గ్రహించాలి. ఆ శ్లోకా లివి-

“స్వేషు దారేషు మేధావీ కురుతే యత్న ముత్తమమ్ ।
స్వదారనిరతో హ్యాశు నరో భద్రాణి పశ్యతి ॥”

(తెలివిగలవాడు, తన భార్యయందు ఆసక్తి గల నరుడు శీఘ్రంగా శుభములు పొందుతాడు.)

“న చాధర్మేణ లిప్యేత నాపకీర్తి మవాప్నుయాత్ ।
స్వదారేషు రతిర్ధర్మో మృతస్యాపి న సంశయః॥”

(అధర్మం అంటకుండుగాక! అపకీర్తి పొందకుండుగాక! చచ్చినను తన భార్యయందు ప్రీతి ఉండటం ధర్మం. అందులో సందేహం లేదు.)

“స్వజాతి దారా మర్త్యస్య ఇహలోకే పరత్ర చ ।
ప్రేతకార్యాణి కుర్వన్తి నివాపై స్తర్పయన్తి చ
తదక్షయ్యం చ ధర్మంచ స్వర్గ్య మాహు ర్మనీషిణః॥”

(స్వజాతిభార్య భర్తకు ఇహలోకంలోనూ, పరలోకంలోనూ ప్రేతకార్యాన్నీ, నువ్వుల నీళ్ళతో తర్పణాలనూ ఇస్తుంది. అవి క్షయం కాని ధర్మాన్నీ, స్వర్గాన్నీ కలిగిస్తా యని పెద్దలంటారు.)

“ప్రియా హి ప్రాణినాం దారా స్తస్మా త్త్వం ధర్మభాగ్ భవ ।
పరదారరతో మర్త్యో న చ భద్రాణి పశ్యతి ॥”

(జీవులకు భార్య మిక్కిలి ప్రియురాలు. కాబట్టి ధర్మవంతుడవు కమ్ము. ఇతరుల భార్యలను పొందగోరేవాడు శుభాలను పొందడు.)

“పరదారే న తే బుద్ధి ర్జాతు కార్యా కథంచన ।
వివర్జనం హ్యకార్యాణా మేతత్ సుపురుషవ్రతమ్ ॥”

(పరభార్యల మీద మనసు నిలుపరాదు. చేయరాని పనులు వదలివేయటం మంచివారి లక్షణం.)

స్వీయదారా మాహాత్మ్యాన్ని చెప్పటం వలన కీచకుడు పరదారావ్యామోహాన్ని వదలుకొంటాడేమోనని ద్రౌపది నీతిబోధ చేసి ఉంటుంది. లోకంలో కొందరి పట్ల ఇటువంటి ప్రబోధం సత్ఫలితాల నివ్వ వచ్చును. (పై శ్లోకాలు డా॥ శలాక రఘునాథశర్మగారు అనువదించిన విరాటపర్వం నుండి గ్రహించటం జరిగింది. పు. 110-111).

**(9) మహాత్ముల భార్యలను అవమానిస్తే మరణం తథ్యం :**

“దిశః ప్రపన్నో గిరిగహ్వరాణి వా ।
Q® ఠO క్ష ɋ‘ త్రి౽న్తరితో౽పివా క్షితేః ॥”

జుహ్వాన్ జపన్ వా ప్రపతన్ గిరే స్తటా ।
ద్ధుతాశనాదిత్య గతిం గతో౽పివా ॥

భార్యాభిమన్తా పురుషో మహాత్మనాం ।
నజాతు ముచ్యేత కథం చ నాహతః ॥''

దిక్కులలో శరణు జొచ్చినా, కొండగుహలలో దూరినా, సొరంగంలోనికి చొరపడ్డా, భూగర్భంలోనికి ప్రవేశించినా, హోమాలూ, జపాలూ చేస్తున్నా, కొండకొమ్ముపై నుండి దూకుతున్నా, అగ్నివలె, ఆదిత్యుడి వలె పరుగెత్తుతున్నా మహాత్ముల భార్యను అవమానించినవాడు చావునుండి ఎన్నటికి తప్పించుకొనలేడు. (డా॥ శలాక రఘునాథశర్మగారి విరాటపర్వం. పు.115)

**(10) పాపాత్ముడు వంశనాశకుడు :** సుదేష్ణ కీచకుడి మదనోన్మాదాన్ని గమనించి, అతడికి మరణం తప్పదని భావించి, లోకులు తలచే సూక్తిని తలపోసినట్లు కొన్ని సంస్కృత ప్రతులలో కనపడుతున్నది.

"అపి చైతత్ పురా ప్రోక్తం నిపుణై ర్మనుజోత్తమైః ।
ఏకస్తు కురుతే పాపం స్వజాతి స్తేన హన్యతే ॥'' (శ.ర.శ.విరా.పు.121)

ఒకడు పాపం చేస్తాడు. దానితో అతడి కులమంతా నాశనమౌతుంది - అని పూర్వం విజ్ఞులన్నారు. కీచకుడి కథ చెప్పే నీతి ఇదే.

**(11) ప్రజా రక్షణం ప్రభువుల ధర్మం :**

కీచకుడిచేత తరుమబడి విరాటుడి సభాద్వారం వద్ద నిలిచి ద్రౌపది రాజుకు చేసిన అభ్యర్థన రాజధర్మనిర్వహణ ప్రబోధిని. ఈ క్రింది శ్లోకాలు కొన్ని ప్రతులలో ఉన్నాయి.

"ప్రజారక్షణశీలానాం రాజ్ఞాం హ్యమిత తేజసామ్ ।
కార్యం హి పాలనం నిత్యం ధర్మే సత్యే చ తిష్ఠతామ్ ॥

స్వప్రజాయాం ప్రజాయాం చ విశేషం నాధిగచ్ఛతామ్ ।
ప్రియేష్వపి చ ద్వేష్యేషు సమత్వం యే సమాశ్రితాః ॥

వివాదేషు ప్రవృత్తేషు సమం కార్యానుదర్శినా ।
రాజ్ఞా ధర్మాసనస్థేన జితౌ లోకావుభావపి ॥'' (శ.ర.శ.విరా.పు.132-133)

ప్రజారక్షణమే స్వభావంగా గల తేజస్వులగు రాజులకు సత్యధర్మాలలో నిష్ఠ కలిగినవారిని రక్షించటం కార్యం. అటువంటి రాజులు తమ కన్నబిడ్డలనూ, ప్రజలనూ వేరుగా భావించరు. వారు ప్రియులపట్లా, ద్వేషించతగినవారిపట్లా సమభావాన్ని కలిగిఉంటారు. ధర్మాసనంమీద కూర్చొన్న రాజు సమదృష్టితో కార్యాలను సమీక్షిస్తే ఇహపరాలను పొందుతాడు.

**(12) స్త్రీ సదా రక్షణీయ :** విరాటుడి సభలో ధర్మరాజు ద్రౌపదికి స్త్రీ ధర్మాలు ఉపన్యసించినట్లు కొన్ని సంస్కృతప్రతులలో కానవస్తున్నది. ఆ శ్లోకాలలో ప్రసిద్ధమైనది.

"పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే ।
పుత్రస్తు స్థావిరేభావే న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి ॥'' (శ.ర.శ.విరా.పు.143)

బాల్యంలో తండ్రీ, యౌవనంలో భర్తా, ముసలితనంలో పుత్రుడూ స్త్రీని రక్షిస్తారు. కాబట్టి స్త్రీని ఎప్పుడూ రక్షణ లేకుండా ఆమె పాటికి ఆమెను వదలిపెట్టకూడదు. (ఈ సందర్భంలో స్వాతంత్ర్యం అనే మాటకు స్వేచ్ఛ అనే ఇప్పటి అర్థం కాదు) స్త్రీ సదా రక్షణీయ అని భావం.

**(13) క్షమ ఉత్తమోత్తమ గుణం :** ధర్మరాజు ద్రౌపదికి విరాటుడి సభలో క్షమాగుణ వైశిష్ట్యాన్ని వివరించాడు.

"క్షమా సత్యం, క్షమా దానం, క్షమా ధర్మః, క్షమా తపః ।
క్షమావతా మయం లోకః పరలోకః క్షమావతామ్ ॥

క్షమా ధర్మః 'క్షమా దానం, క్షమా యజ్ఞం, క్షమా యశః ।
క్షమా సత్యం, క్షమా శీలం, క్షమా కీర్తిః, క్షమా పరమ్ ॥

క్షమా పుణ్యం, క్షమా తీర్థం, క్షమా సర్వ మితి శ్రుతిః ।
క్షమావతా మయం లోకః పరశ్చైవ క్షమావతామ్ ॥
ఏతత్ సర్వం విజానన్తీ సా క్షమా మనస్యద్యతే". (డా॥ వై. రామకృష్ణరావుగారి - విరాట భారతి. పుట. 34-35)

**(14) మూలంలో ఉన్న కొన్ని ముచ్చటైన సూక్తులు :**

1. ద్రౌపదికి భీముడి యెదుట చెప్పించినవి.

"భార్యాయాం రక్ష్యమాణాయాం ప్రజాభవతి రక్షితా ।
ప్రజాయాం రక్ష్యమాణాయా మాత్మా భవతి రక్షితః ॥

ఆత్మాహి జాయతే తస్యాం తేన జాయాం విదుర్బుధాః ।
భర్తా తు భార్యయా రక్ష్యః, కథం జాయా న్మమోదరే ॥

వదతాం వర్ణ ధర్మాంశ్చ బ్రాహ్మణానాం హి మే శ్రుతమ్।
క్షత్రియస్య సదా ధర్మో నాన్యః శత్రునిబర్హణాత్ ॥" (సం.4.20.27- 29)

సంతానాన్ని రక్షించుకొనటం అంటే తనను తాను రక్షించుకొనటమే. ఆత్మయే భార్యయందు జన్మిస్తుంది. అందుకే భార్య 'జాయ' అనబడుతుంది. భర్త తన కడుపున సంతానమై పుడతాడు కాబట్టి, భార్య కూడా భర్తను రక్షించుకొనాలి. వర్ణ ధర్మాలను చెప్పే బ్రాహ్మణులు ఇట్లా చెప్పారు. ఇవి భార్యనూ, భర్తనూ, సంతానాన్నీ పరస్పరం రక్షించుకొనే ధర్మాలు. తిక్కన వీటిని సందర్భశుద్ధిని గమనించి వదలివేసినట్లున్నాడు.

2. దుర్యోధనుడితో భీష్ముడు పాండవాన్వేషణోపాయాన్ని చెప్పే సందర్భంలో అనిన మాటలు.

"వృద్ధానుశాసనే తాత తిష్ఠతః సత్యశీలినః ।
అవశ్యం త్విహ ధీరేణ సతాం మధ్యే వివక్షతా ।
యథామతి వివక్తవ్యం సర్వశో ధర్మ లిప్సయా॥ " (సం.4.27.10 - 11)

పెద్దల మాటమీద విశ్వాసం గల సత్యశీలుడైనవాడు సజ్జనుల మధ్య ధీరుడై పలకాలి. ఎప్పుడూ ధర్మసాధనోద్దేశంతో యోగ్యమైన విధంగా పలకాలి. ఈ శ్లోక తాత్పర్యాన్ని తిక్కన సంభాషణలలో కలిపివేశాడు. (విరా.3.102). అందువలన సూక్తిగా రూపుకట్టలేదు.

3. కృపాచార్యుడు దుర్యోధనుడికి చెప్పిన రాజనీతి, యుద్ధనీతి -

"ఉచ్చావచం బలం జ్ఞాత్వా మధ్యస్థం చాపి భారత।
ప్రహృష్ట మప్రహృష్టంచ సందధామ తథా పరైః॥

సామ్నా దానేన భేదేన దణ్డేన బలి కర్మణా।
న్యాయే నాక్రమ్య చ పరాన్ బలా చ్చానమ్య దుర్బలాన్।
సాన్త్వయిత్వా చ మిత్రాణి బలం చాభాష్యతాం సుఖమ్।
సకోశ బల సంవృద్ధః సమ్యక్ సిద్ధి మవాప్స్యసి"॥ (సం.4.28.10 - 12)

శత్రువులతో తలపడేటప్పుడు ఉభయ బలాలలో ఉండే ఎక్కువ తక్కువలూ, సమస్థితులూ, రాగద్వేషాలూ గుర్తించాలి. సామ దాన భేద దండోపాయాలతో శత్రువులను స్వాధీనం చేసికొనాలి. తగినంత బలం లేని వారిని బలంతో లొంగదీసికొనాలి. మిత్రులను మంచిమాటలతో వశపరచుకొనాలి. స్వీయసేనల యోగక్షేమాలు విచారిస్తూ ఉండాలి. కోశాగారాన్నీ, సేనలనూ పెంచుకొంటే నీవు జయాన్ని సాధించగలవు. అజ్ఞాతంలో ఉన్న పాండవులను గుర్తించే మార్గాలను చర్చిస్తున్న సందర్భంలో ఈ మాటలు అంతగా పొసగవు. అందువలన తిక్కన ఈ యుద్ధనీతి వాక్యాలను వదలివేశాడు.

4. బృహన్నల ఉత్తరకుమారుడితో చెప్పిన క్షత్రియలక్షణం:

"నైష శూరైః స్మృతో ధర్మః క్షత్త్రియస్య పలాయనమ్।
శ్రేయస్తే మరణం యుద్ధే న భీతస్య పలాయనమ్॥" (సం.4.36.26)

శూరుడైన క్షత్రియుడి హృదయంలో పారిపోదామనే అధర్మమైన ఆలోచన రావటమే తప్పు. భయపడి పారిపోవటం కంటె రణరంగంలో చావటం మేలు.

5. కృపాచార్యుడు కర్ణుడితో పలికినమాటలలో యుద్ధనీతి.

"దేశకాలేన సంయుక్తం యుద్ధం విజయదం భవేత్।
హీనకాలం తదే వేహ ఫలవన్న భవత్యుత॥

దేశేకాలేన విక్రాన్తం కల్యాణాయ విధీయతే।
ఆనుకూల్యేన కార్యాణా మన్తరం సంవిధీయతామ్।
భారం హి రథకారస్య న వ్యవస్యన్తి పణ్డితాః॥" (సం.4.44.3-4)

దేశకాలాలు కలిసివచ్చిన యుద్ధం విజయాన్ని కలిగిస్తుంది. కాలం కలిసిరాకపోతే అది నిష్ఫలమౌతుంది. కాబట్టి దేశకాలాలను గమనించి పరాక్రమించటం మంచిది. దేశకాలాలు సరిపడితేనే యుద్ధకార్యాలు ఫలించేది. రథాలు తయారుచేసేవాడిమీద భారముంచి వివేకవంతులు యుద్ధాలకు పూనుకోరు. ఈ తాత్పర్యాన్నంతా తిక్కన ఒక కందపద్యంలో ధ్వనింపచేశాడు. (విరా.4.208).

6. ధర్మరాజు విరాటుడితో జూదంవలన కలిగే నష్టాలు చెప్పాడు. అది ఒక మంచి సూక్తిగా కుదిరింది.

"అస్మాత్క్షితి వినాశశ్చ, వాక్పారుష్య మనంతరమ్।
అవిశ్వాసం బుధై ర్నిత్యం ఏకాహ్నో ద్రవ్యనాశనమ్." (సం.4.64.34అనుబంధం)

జూదం వలన రాజ్యం నశిస్తుంది. వాక్పారుష్యం కలుగుతుంది. పండితులకు విశ్వాసం నశిస్తుంది. ఒక దినంలోనే ద్రవ్యమంతా నశిస్తుంది.

మొత్తంమీద గమనిస్తే మూలంలోని సూక్తులను తిక్కన బాగా తగ్గించాడు. దానివలన రచనలో చిక్కదనాన్నీ, ఔచిత్యాన్నీ పాటించాడు. మూలంలో సూక్తులను విడిగా ఎన్నవచ్చును. తిక్కన రచనలో సూక్తులను రచనలోనుండి పిండుకొనవచ్చును. ఒకటి శాస్త్రేతిహాస రచన. మరొకటి కావ్యేతిహాస రచన.

**(15) విరాటపర్వం సూక్తి తిలకం :**

సూక్తులన్నీ ఒక యెత్తు. ద్రౌపది సుదేష్ణతో పలికిన మాటలలోని సూక్తి ఒక్కటీ మరొక ఎత్తు.

"సాధులు చేరి నెమ్మిగ నిజస్థిర వృత్తము దుష్టకోటిచే
బాధలఁ బొందకుండఁ దమపాల వసించినఁ, బెద్ద వారు ది
క్కై ధరియించి వారి కొక యాపద పుట్టక యుండఁ గాచుటొ
ప్పై ధరఁ గీర్తి కెక్కదె? యపాయము సేసిన నింద వుట్టదే?" (విరా.2.95)

విరాటపర్వానికి తాత్త్విక తిలకం ఈ పద్యం. పలికింది కృష్ణ (ద్రౌపది).

తిక్కన ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సూక్తి తిలకంతో అలంకరించి, దాని తత్త్వాన్ని ఆవిష్కరిస్తాడు. పై పద్యంలో అజ్ఞాతవాసంలో ఉన్న ఆశ్రితులపట్ల ఆశ్రయ మిచ్చిన వారు నిర్వహించవలసిన ధర్మం చెప్పబడింది. అది విరాటపర్వానికి ధర్మమూలం.

మరి ఉద్యోగపర్వానికి సూక్తి తిలక మేది? ధర్మసూత్ర మేది?

ఉ. "సారపు ధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱిన దైన యవస్థ, దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని, ధర్మని
స్తారక మయ్యు, సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్." (ఉద్యో. 3.273)

విరాటపర్వ సూక్తి తిలకం దిద్దింది కృష్ణ! ఉద్యోగపర్వ సూక్తి తిలకం నిలిపింది కృష్ణుడు! ఉభయపర్వాలకు ఉజ్జ్వల తిలకాలను అందించిన తిక్కన సోమయాజి ధన్యుడు!

## 26. విరాటపర్వం: ఆధ్యాత్మిక సందేశం

మహాభారతాన్ని అధ్యాత్మ విదులు వేదాంతంగా భావిస్తారు. ఇతిహాస వస్తువులో చెప్పబడే పాత్రలూ, సన్నివేశాలూ మొదలైనవి పైకి కథాకథనంలో భాగంగా కనపడుతున్నా అంతరార్థంలో అవి గూఢమైనవిగా తోచి, ఆధ్యాత్మిక సాధనను ధ్వనింపచేసే ప్రతీకాత్మక సందేశాన్ని అందిస్తాయని వేదాంతులు భావిస్తారు, వ్యాఖ్యానిస్తారు. అవి కావ్యగత తత్త్వానందాన్ని ఆస్వాదింపచేసి బ్రహ్మానందాన్ని పొందే ఆధ్యాత్మిక సాధనామార్గాన్ని ఆవిష్కరిస్తాయి. భారతకథ ఉత్తమోత్తమ ఆధ్యాత్మిక ప్రతీకాత్మక కావ్యేతిహాసం. అందులో విరాటపర్వం ఒక విశిష్ట సందేశకావ్యం.

**1. పాండవులు - ముక్తిసాధనశక్తులు :**

పాండవులు మత్స్యదేశాన్ని పాలించే విరాటుడి నగరంలో ఒక సంవత్సరంపాటు నియమం తప్పకుండా అజ్ఞాతవాసం చేయటం విరాటపర్వ ప్రధానేతివృత్తం. పాండవులంటే ముక్తి సాధనశక్తులు. పాండురాజు కుంతీదేవియందు యముడి అనుగ్రహంతో

ధర్మరాజును పుత్రుడుగా పొందాడు. అంటే - సాధకుడిలోని రజోమిశ్రిత సాత్త్వికవృత్తి, కుంతీవృత్తి అని పిలువబడే భూవిషయక వాసనావృత్తిని యమాది అష్టాంగ యోగకర్మ సాధనలద్వారా ముక్తి సాధకమైన ధర్మగుణాన్ని (ధర్మరాజును) పొందిందన్నమాట! ధర్మరాజంటే - యమనియమాద్యష్టాంగయోగంతో వెలిగే ధర్మప్రకాశం.

భీముడు వాయుపుత్రుడు. అంటే కుంభక ప్రాణాయామ యోగంతో సాధకుడు పొందే నిర్భయస్థితి - భీముడు భయంలేనివాడు కాబట్టి అభయసాధనా వృత్తి. అర్జునుడు ఇంద్ర తనయుడు. ఇంధతే ప్రకాశతే - అనే ధాత్వర్థంతో శరీరంలో మిలమిల ప్రకాశించే మనస్సు ఇంద్రుడు. ఋజుపదంనుండి అర్జునశబ్దం పుట్టుతుంది కాబట్టి - ఋజువర్తనం అనే అర్థం ఇస్తుంది. అందువలన అర్జునుడంటే సాధకుడి మనోనిగ్రహ సాధనాయోగంతో వెలుగొందే ఋజుశీలం, లేదా నిత్య సత్య ప్రభావం.

మాద్రి అశ్వినీదేవతలవలన నకుల సహదేవులను కవలలుగా కన్నది. అశ్వినీదేవతలు అద్వైతపరమాత్మ వృత్తులకు ప్రతీకలు. ప్రకృతిపురుషుల అద్వైతభావనం, ధ్యానం మాద్రీవృత్తి. న+కుల - అంటే భూ విషయకాంశాలను గ్రహించని అసంగస్థితి. దివ్ అంటే ప్రకాశం. సహదేవుడంటే సహజ ప్రకాశంతో కూడుకొన్న పరమాత్మ జ్ఞానవృత్తి.

కౌరవులు ముక్తి విరోధకాలైన ఐహిక వృత్తులకు ప్రతీకలు. వారు ధృతరాష్ట్రుడికి గాంధారియందు జన్మించారు. అంటే- తమోగుణంవలన వాసనలను పూర్తిగా గ్రహించే మనోవృత్తినుండి నూటొక్కరకాలైన తామసిక వృత్తులు పుట్టాయన్నమాట! వాటిలో మొదటి వృత్తి దుర్యోధన వృత్తి. దుర్+యోధనుడు= చెడుమార్గంలో యుద్ధం చేసేవాడు. అతడికి పాండవులంటే పడదు. అంటే-ముక్తి సాధనాశక్తుల ప్రగతిని ఎప్పుడూ ఎదుర్కొని నిరోధించే ముక్తి విరోధక శక్తులకు దుర్యోధనుడు నాయకుడన్నమాట! దుర్యోధనుడు మాయావి అయి పాండవుల కేర్పరచిన అరణ్య అజ్ఞాతవాస నియమాలు ముక్తినిరోధకమైన అవరోధాలే. ఆ అవరోధాలను క్రమంగా జయించి సాధన కనుకూలంగా మలచుకొనటమే పాండవుల అరణ్యాజ్ఞాతవాస కథలోని అంతరార్థం.

ధర్మరాజు అసలు పేరు యుధిష్ఠిరుడు. అంటే, యుధి= యుద్ధమునందు; స్థిరుడు= నిశ్చలంగా ఉండేవాడని అర్థం. తామసిక వృత్తులు (కౌరవులు) తమను అంతం చేయటానికి దుర్నీతితో (దుర్యోధనుడు) పోరాడుతుంటే, సాత్త్విక వృత్తి అయిన ధర్మతేజం (ధర్మరాజు) ధర్మంనుండి చలించకుండా నిలకడగా తమోవృత్తులతో యుద్ధం సాగించే ప్రవృత్తికి ప్రతినిధి కాబట్టి ఆయనకు ఆకాశవాణి ఆపేరు పెట్టింది. అతడికి ఎల్లప్పుడూ భీమార్జున నకుల సహదేవుల సహాయం ఉంటుంది. అంటే ముక్తి సాధనమైన సాత్త్విక ధర్మప్రవృత్తికి అభయం, ఋజువర్తనం, అసంగచిత్తవృత్తి, జ్ఞానవృత్తి సహాయకంగా, పోషకంగా ఉంటాయన్నమాట. వీరందరూ కలిసి తామసిక వృత్తులతో యుద్ధం చేస్తారు. ఒక్కొక్కసారి ఒక్కొక్కరుగా చేసినా యుధిష్ఠిర శక్తిగా వారు రాణించటం గమనార్హం!

పాండవపత్ని ద్రౌపది. ఆమె పేరు కృష్ణ. ద్రౌపది సాధకుడి మనసులోని ముక్తి కామనకు ప్రతీక. అందుకే ఆమెను నివృత్తి తత్త్వమని (కృష్ణ అని) పిలుస్తారు. ఆమె పంచపాండవుల భార్య. ఆమె అట్లా పాండవపత్ని కావటానికి పంచేంద్రోపాఖ్యానం కారణం. ఒకే ఇంద్రుడు అయిదు రూపాలు తాల్చాడని ఆ ఉపాఖ్యానం చెప్పింది. ఇంద్రుడు మనస్సుకు ప్రతీక కాబట్టి పాండవులు అంటే - అష్టాంగ యోగసాధన, అభయసాధన, ఋజువర్తన సాధన, ఐహిక భోగవిరక్తి సాధన, జ్ఞాన ప్రకాశ సాధన - అనే పంచసాధనలు మనస్సంయమనానికి సంబంధించినవే కావటంచేత ద్రౌపది పాండవపత్ని అయింది. అంటే ఒక మనస్సే అయిదు సాధనలను గ్రహించగా ముక్తికామన వాటి నాశ్రయించి ప్రసరిస్తుంది - అని అంతరార్థం.

**2. అజ్ఞాతవాసం - అహంకార మమకారనాశన సాధన :**

ఈ విధంగా ముక్తి సాధన శక్తులుగా భావించబడే పాండవులూ, ద్రౌపదీ కలిసి అజ్ఞాతవాసంలో మారుపేర్లతో, మారు వృత్తులలో విరాటుడిని సేవిస్తూ నియమాన్ని పూర్తి చేసి నిజస్థితిని పొందారు. ఈ కథలోని అంతరార్థాన్ని ఆధ్యాత్మికంగా అందుకొనాలి. దాని కనుగుణంగా ఆధ్యాత్మిక ప్రతీకాత్మక తత్త్వార్థసంభావనం చేయాలి.

1. అరణ్యావాసం = పాండవులు పన్నెండేళ్ళ అరణ్యావాసాన్ని ముగించారు= సాధకుడిలో ముక్తిని కోరే సాత్త్విక వృత్తులు - పది ఇంద్రియాలూ, మనస్సు, వాసనావృత జీవుడూ అనే పన్నెండు జీవప్రకృతి తత్త్వాలలోనూ ప్రశాంత స్థితిలో ఉండగలిగేటట్లు చేసే ఆధ్యాత్మిక సాధన పన్నెండేళ్ళ వనవాసం. దానిని ముగించి, ఆ తరువాత వారు అజ్ఞాతవాసాన్ని స్వీకరించారు.

2. అజ్ఞాతవాసం = అహంకార మమకార నాశన సాధన. అంటే సాధకుడిలో ముక్తిని కోరే సాత్త్విక వృత్తులు 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధనా క్రమాన్ని ఎన్నుకొన్నాయన్నమాట.

3. అరణ్య అజ్ఞాతవాసాలు = అహం బ్రహ్మా-స్మి, సర్వం ఖల్విదం బ్రహ్మ-అనేవి సాధనలు; ఈ రెండూ సాధించటం పూర్ణయోగం-జీవన్ముక్తావస్థను చేరుకొనే సాధనాక్రమం. అరణ్యపర్వంలో సాత్త్విక వృత్తులు శరీర ప్రవృత్తులలో ప్రతిదానిలోనూ ఉన్న వినశ్వరశీలమైన గుణాన్ని గుర్తిస్తూ నేతి నేతి వాదంతో నిషేధించుకొంటూ చివరకు శరీరంలోని మనోబుద్ధ్యహంకారాలనే అంతఃకరణ చతుష్టయంలో చిట్టచివరిదైన 'అహం' అనే దాని యొక్క బ్రహ్మతత్త్వాన్ని గుర్తించి, దానిని బ్రహ్మగానే తెలియటం అరణ్యపర్వం ధ్వనింపజేసే ఆధ్యాత్మిక సాధన. ఈ సాధన ముగిసిన తరువాత 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధన చేపట్టాలి. అదే అజ్ఞాతవాసంలోని ఆధ్యాత్మికమైన అంతరార్థం. ఈ సాధనలో సర్వప్రకృతిలోనూ ప్రతిబింబంగా భాసిస్తూ, దానిని పుట్టించి, పోషించి, లయింపజేసే చైతన్యపురుషుడిని పరబ్రహ్మతత్త్వంగా గుర్తించటం జరుగుతుంది. అప్పుడు ప్రకృతిలోని ప్రతిపదార్థమూ అవినశ్వరమైన బ్రహ్మస్వరూపమే అనే విజ్ఞానం సాధకుడికి సిద్ధిస్తుంది. అంటే - సాధకుడు సాధనలలో సర్వప్రకృతినీ నిషేధిస్తూ ఆరోహణ క్రమంలో సాగి తానే బ్రహ్మముగా గుర్తించి, తిరిగి అవరోహణ క్రమంలో - మొదట తానే నిషేధించిన ప్రకృతినంతా బ్రహ్మమయంగానే దర్శించటం - అని తాత్పర్యం.

**3. విరాటపర్వం - ప్రకృతిని బ్రహ్మమయంగా దర్శించటం :**

విరాటపర్వం అంటే ప్రకృతినంతా బ్రహ్మమయంగా దర్శించటం. దానికి అనుగుణంగా సాగే ఆధ్యాత్మిక సాధనను ఇందులోని పాత్రలూ, సన్నివేశాలూ ప్రతీకాత్మకంగా ధ్వనింపచేస్తూ ఉంటాయి. వాటిని ఈ క్రింది విధంగా భావించవచ్చును.

(i) మత్స్య దేశాన్ని పాలించే వాడు విరాటరాజు= అహంకార మమకారాలను నశింపజేసే సాధనా నిలయంలో సాధించదగిన తత్త్వం- వివిధ ప్రకృతి జీవులలోనూ ప్రకాశిస్తూ ఉన్న పరమాత్మ తత్త్వం. మత్+స్యదేశం= అహంకార మమకారాలను నశింపచేసే సాధనాస్థలం. వి+రాట్= వివిధ రూపాలతో ప్రకృతిలో ప్రకాశించే పరబ్రహ్మ తత్త్వం - అని శబ్దవ్యుత్పత్తుల నాశ్రయించి ప్రతీకలుగా భావించాలి. ఆ తత్త్వాన్ని ముక్తిసాధనాలైన సాత్త్విక శక్తులు సేవిస్తాయి (ఉపాసిస్తాయి).

(ii) శమీవృక్షం మీద ఆయుధాలు దాచటం = శమి అంటే శమం = ఇంద్రియ నిగ్రహం. ఆయుధాలు= తామసిక వృత్తులు: ఇంద్రియ నిగ్రహంతో తామసిక వృత్తులు బయటపడకుండా గుప్తంగా అణచి ఉంచటం.

(iii) పాండవులు, ద్రౌపది సేవావృత్తులను స్వీకరించటం= ముక్తిసాధన శక్తులు రాజసవృత్తులను దూరంగా ఉంచటం.

(iv) అజ్ఞాతవాస జీవితాలకు అనుగుణమైన రూపాలను తాల్చటం= విరాట్ పురుష ధ్యానయోగంలో ప్రవేశించే సాధనావస్థలను ఎన్నుకొనటం.

(v) **కంకుభట్టు :** యుధిష్ఠిరుడు కంకుడనే పేర బ్రాహ్మణసన్న్యాసి రూపం తాల్చి అక్షముల సాయంతో విరాటుడి కొలువులో చేరి అతడికి మిత్రుడిగా కుదురుకొనటం= కంకుడంటే యముడనీ, కంకతే ఉద్గచ్ఛతే ఇతి కంకః - అనే వ్యుత్పత్తిని ఆశ్రయించి ఉన్నతస్థితికి ఎగిరే సాధనావృత్తి అనీ, బ్రహ్మమును చేర్చే సాధన అనీ గ్రహించాలి. బ్రాహ్మణసన్న్యాసి వేషమంటే - బ్రహ్మభావనమని అర్థం. అక్షములంటే ఇంద్రియ వ్యాపారాలు. అవి కృష్ణ లోహిత వర్ణాలు కలవి. అంటే - తామసిక రాజస గుణాలని భావం. సుహృత్‌ద్యూత మంటే అన్నిటిని సాధించే మానసిక వ్యాపారమని భావం.

దీనివలన గ్రహించవలసిన తాత్పర్యం ఇది- అష్టాంగ యోగసాధన మనే ముక్తి సాధన శక్తి బ్రహ్మమును చేరే సాధనగా భావించి, విజృంభించి దానికి తగిన సిద్ధుల నన్నింటినీ సాధించటానికి రాజస తామసిక గుణాలను క్రీడామాత్రంగా నిగ్రహించి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే ఆధ్యాత్మికానుభవాన్ని పొందటం. అదే సాధన కంకపాత్ర మన కందించే ఆధ్యాత్మికానుభూతి.

(vi) **వలలుడు** : భీముడు వలలుడనే పేర వంటలవాడుగా, మల్లుడుగా విరాటుడిని సేవిస్తూ వినోదాన్ని కలిగిస్తాడు. భీముడంటే అభయవృత్తి. వలలుడు అనే పదానికి 'వబయో రభేదః' అనే న్యాయాన్ని అనుసరించి బలలుడు - లేదా శక్తిమంతుడు అని అర్థం. దీనినిబట్టి అభయ సాధనా ప్రవృత్తి విశేష ప్రయోజనం సాధించే విధంగా గొప్ప శక్తిని ప్రదర్శిస్తూ సాధనలో బలంగా పాల్గొనటం - అనే ఆధ్యాత్మిక సాధనను వలలుడి వృత్తం వ్యక్తం చేస్తుంది.

(vii) **బృహన్నల** : ఋజువర్తనకే మారుపేరైన అర్జునుడు బృహన్నలగా మారాడు. బృహన్నల= బృహత్+నల, 'న, లాతి, గృహ్ణాతి, ఇతి నలః' అనే వ్యుత్పత్తి నాశ్రయించి నల - అంటే దేనినీ గ్రహించని అసంగవృత్తి అని గ్రహించ వీలౌతుంది. బృహత్- అంటే గొప్పది అని అర్థం. కాబట్టి బృహన్నల అనగా - ఎంతో గొప్ప స్థాయిలోని అసంగవృత్తి అని భావం. బృహన్నల వేషం స్త్రీ పురుష లక్షణాలు లేని షండం. అది పరమాత్మతత్త్వం వంటిది. నాట్యం అంటే అనుకరణం. తాత్త్వికంగా దానిని గ్రహిస్తే - గురువులు బోధించిన సాధనాభ్యాసాలను అనుకరిస్తూ పరమాత్మను పొందటం అని చెప్పాలి. దీనిని సమన్వయించుకొంటే - సాధకుడిలోని ఋజువర్తన శీలం గురుశిక్షణ క్రమంతో గొప్పదైన అసంగవృత్తితో 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధనకు ఉపక్రమించటం - అని తాత్పర్యం.

(viii) **దామగ్రంథి** : నకులుడు దామగ్రంథి నామంతో విరటుడి కొలువులో అశ్వశిక్షకుడుగా చేరాడు. భూసంబంధమైన (భౌతికమైన విషయ సుఖాలను) ఆశించని మానసిక ప్రవృత్తి నకులుడు. అత డిప్పుడు దామగ్రంథి సాధనలో నిలిచాడు. అంటే దండను గట్టిగా ముడివేసే ప్రవృత్తిలో సాధన సాగించాడని భావం. ఐహిక భోగవిరక్తి వృత్తిని గట్టిగా ముడివేసి నడిపించటం దామగ్రంథి సాధన. అతడి వృత్తి అశ్వశిక్షణ. అశ్వాలు ఇంద్రియాలకూ, ప్రకృతికీ ప్రతీకలు. అశ్వశిక్షణ అతడి వృత్తి. అంటే ఇంద్రియాలను 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధనకు అనుగుణంగా శిక్షించటం (నియమించటం) అతడి వృత్తి. దీనిని ప్రకృతి శిక్షణ అని కూడా అంటారు. తాత్పర్య మేమంటే- ప్రకృతి (ఇంద్రియ) శిక్షణ కార్యాన్ని ఐహిక భోగ విరక్తిగల చిత్తవృత్తితో గట్టిగా ముడివేసి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధనను సాగించటం దామగ్రంథి పాత్ర మనకు బోధించే ఆధ్యాత్మిక తత్త్వం.

(ix) **తంత్రీపాలుడు** : సహదేవుడు తంత్రీపాలుడనే పేరుతో గోసంరక్షణ కార్యాన్ని చేపట్టి విరాటుడిని సేవించాడు. సహదేవుడు జ్ఞాన ప్రకాశంతో వెలుగొందే చిత్తవృత్తికి ప్రతీక. తంత్రీపాలుడంటే- క్రమం తప్పని ధారావాహికమైన ధ్యాన శిక్షణావృత్తి. గోరక్షణం అంటే ఇంద్రియ వృత్తులను రక్షించి సాధన సాగించటం. మొత్తంమీద తాత్పర్య మేమంటే-జ్ఞానంతో ప్రకాశించే మనః ప్రవృత్తిని సక్రమ శిక్షణ పద్ధతిలో నిరంతరంగా దృఢపరచి, ఇంద్రియ వ్యాపారాలను సాధన కనుగుణంగా తోడ్పడేటట్లు రక్షించుకొంటూ 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే ఆధ్యాత్మిక స్థితిని సాధించటమే సహదేవుడు తంత్రీపాలుడుగా గోరక్షణ చేసే వృత్తి మనకందించే పరమార్థం.

(x) **మాలిని (సైరంధ్రి)** : ద్రౌపది మాలిని అనే పేరుతో సైరంధ్రీ వేషం ధరించి విరాటుడి పట్టమహిషి అయిన సుదేష్ణ అంతఃపురంలో సైరంధ్రిగా చేరింది. దీనిని ఆధ్యాత్మికంగా భావించాలి. ద్రౌపది అంటే ముక్తికామన. మాలిని అంటే 'మాలము' కలది. 'మాల మున్నత భూతలమ్' అనే అర్థాన్ని గ్రహిస్తే ఉన్నతస్థితిని పొందేది అని భావం. ఆమె వృత్తిచేత సైరంధ్రి. సీరంధ్ర అనే పదం మీద స్వార్థంలో 'అణ్' ప్రత్యయం చేరితే వృద్ధి వచ్చి సైరంధ్ర ఔతుంది. స్త్రీ పరంగా జీప్ చేరిస్తే సైరంధ్రీ ఔతుంది. సీ= నాశనం చేసేది; రంధ్రం= లోపం. కాబట్టి లోపాలను నశింపజేసే మనఃప్రవృత్తి సైరంధ్రీవృత్తి.

(xi) **సుదేష్ణ** : సుధేష్ణ అనే పదానికి తద్భవం సుదేష్ణ. ఈ శబ్దాన్ని రెండు రకాలుగా భావించవచ్చును. సు+ధా+ఈషణ= సుధేషణ; సు+ధిషణ= సుధిషణ. వీటినే సుధేష్ణగా పేర్కొన్నారు. సు= చక్కగా; ధా= ఉంచిన; ఈషణ= కోరికలు కలది సుధేషణ అని అర్థం. కోర్కెలను నిగ్రహించి సమస్థితిలో ఉంచే మానసిక ప్రవృత్తి అని తాత్పర్యం. సు= చక్కని; ధిషణ= బుద్ధి కలది -

అంటే ముక్తిని సాధించాలనే మనోవృత్తి అని భావం. ఆమెను ద్రౌపది సేవించింది. అంటే మోక్షసాధన ప్రవృత్తిని మోక్ష కామన భజించిందని భావం.

(xii) **షడ్విధాత్మగతానుశీలములు :** ముక్తి సాధన శక్తులు ఆరు - ముక్తి సాధన ప్రవృత్తులను ఆరింటిని ఎన్నుకొని, వాటి స్వభావాన్ని సూచించే మారుపేర్లను పెట్టుకొని 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధనను సాగించాయి. ఆ సాధనలో ఆరు రకాలైన ఆత్మగతానుశీలన పద్ధతులు ద్రౌపదీపాండవుల పాత్రల ప్రవర్తన పద్ధతులలో ప్రకటితమయ్యేటట్లు చిత్రించబడ్డాయి. వాటిని సూక్ష్మంగా ఇట్లా భావించవచ్చును.

(1) సఖ్యం - ధర్మరాజు విరాటుడిని స్నేహప్రవృత్తితో సేవించాడు.

(2) ఆత్మ నివేదనం - భీముడు తన బలసంపదనంతా విరాటుడిని సేవించటంలో ధర్మరక్షణపరంగా సమర్పించుకొన్నాడు.

(3) భగవంతుడి కొరకు సమస్త కర్మాచరణం - అర్జునుడి జీవితం అటు అంతఃపురంలో నాట్యాచార్యుడుగా, యుద్ధభూమిలో శత్రు సంహారశక్తిగా ప్రకాశించి విరాటుడి అంతర్బహిశ్శత్రు మర్దన సర్వకార్య చతురుడై భాసించాడు.

(4) అవసరమయ్యేటంత వరకు విషయ స్వీకారం - ఇది నకులుడి వర్తనకు తగింది. నకులుడు అశ్వరక్షకుడిగా పరోక్షంగా, విరాటుడికి యుద్ధ ప్రక్రియలో ప్రత్యక్షంగా, పరిమితంగా సహాయపడ్డాడు.

(5) భగవంతుడికై సర్వభోగవర్జనం - గోరక్షణ వృత్తిలో విరాటుడిని సేవించిన సహదేవుడి శీలంలోని అంకితభావం ఇందులో స్ఫురిస్తుంది.

(6) సాధుమార్గానువర్తనం - ఇది విరాటపర్వంలోని ద్రౌపది ప్రవర్తనలో ముమ్మూర్తులా ప్రత్యక్షమౌతుంది.

**4. కీచక వధ - మనశ్చాంచల్య నివారణ సాధన :**

కీచక మంటే లోపల గుల్లగా ఉన్న వెదురు బొంగు. అది గాలికి ఈలలు వేస్తుంది. అట్లాగే కీచకుడు కూడా మనస్సులో ధర్మప్రవృత్తి లేక చరించే కాముకుడు, చంచలుడు, రాగజీవి. కాబట్టి మనశ్చాంచల్యానికి అతడు ప్రతినిధిగా భావించాలి. వేదాంతుల పరిభాషలో దీనిని అపరాశక్తియొక్క చంచల మనోవ్యాపారంగా గ్రహించవచ్చును. కీచకుడు సుదేష్ణ సోదరుడు. సుదేష్ణ మోక్షసాధన చిత్తవృత్తి. ఆమె పరాశక్తి యొక్క సుస్థిర మనోవ్యాపారమైతే కీచకుడు అపరాశక్తియొక్క చంచల మనోవ్యాపారం. అతడు విరాటుడి సేనాపతి. అంటే - విశ్వ ప్రకృతియొక్క వృత్తులను నడిపించే చంచలాత్మకమైన మనస్సని గ్రహించాలి. అతడు సైరంధ్రిని మోహించాడు. ఆమెను కోరాడు; ఆమెయొక్క సైరంధ్రీ వృత్తికీ, సుదేష్ణ సేవకూ, అజ్ఞాతవాస వ్రతానికీ అడ్డు తగిలాడు. అంటే - మోక్షసాధన చిత్తవృత్తి నాశ్రయించిన మోక్షకామన దోషాలను తొలగించుకొనే సాధనలో ఉండగా విషయ వాసనలతో కూడుకొన్న చంచలమనఃప్రవృత్తి అడ్డుతగిలి, ఆధ్యాత్మిక సాధనకు విఘ్నం కలిగించటానికి యత్నం చేసిందన్న మాట. చంచలమనఃప్రవృత్తి మోక్షకామనను తన వశం చేసికొని చెరచటానికి ప్రయత్నిస్తుంది. మోక్షసాధన చిత్తవృత్తిని వక్రమార్గం పట్టించటానికి యత్నిస్తుంది. మదిర వంటి మోహంలో ముంచటానికి పూనుకొంటుంది. విషయ భోగరుచులను ఎరగా చూపిస్తుంది. అట్లాగే కీచకుడు తన అక్కను ఒప్పించి సైరంధ్రిని కల్లు నెపంగా తన మందిరానికి వచ్చేటట్లు చేశాడు.

ద్రౌపది కీచకుడి బారిన పడకుండా రక్షించటానికి సూర్యుడు ఒక రాక్షసుడిని సృజించి అదృశ్యశక్తిగా ఆమెకు రక్షగా నిలిపాడు. సూర్యుడు జ్ఞానతేజస్సుకు ప్రతీక. సాధకుడిలో సంస్కారరూపంగా ఉన్న జ్ఞానం ప్రబుద్ధమై చాంచల్యరూప విఘ్నాన్ని ఎదుర్కొని, దానినుండి తప్పించుకొనే సహజ ప్రతిభను ప్రదర్శిస్తుంది - అని దీని తాత్పర్యం. సైరంధ్రిని తాకిన కీచకుడు సూర్యుడు పంపిన రాక్షసశక్తి ప్రయోగానికి తట్టుకొనలేక నేలపై పడతాడు. అంటే - అపరాశక్తి సాధకుడిలో హఠాత్తుగా ఉద్దీప్తమైన జ్ఞానదీప్తిని తట్టుకొనలేక కూలిపోయిందని భావం. అయినా కీచకుడు మోహాన్ని వీడలేదు. ద్రౌపది కీచకుడిని తుదముట్టించాలని సంకల్పించింది. అంటే చాంచల్య ప్రభావం తనమీద పడకుండా తనను తాను ఉద్ధరించుకొనటానికి యత్నించిందని భావం. ఆ

ప్రయత్నంలో భీముడిని ఆశ్రయించింది. అంటే-అభయవృత్తిని ఆశ్రయించింది. అతడు కీచకుడిని బృహన్నల విద్యాలయమైన నర్తనశాలలో రాత్రివేళ రహస్యంగా చంపే ఉపాయం పన్నాడు. దానికి తగ్గట్లుగా ద్రౌపది సహాయాన్ని తీసికొన్నాడు. కీచకుడిని మల్లయుద్ధంలో తుదముట్టించాడు. ఈ అంశాన్ని ఆధ్యాత్మికంగా భావిస్తే ఇట్లా ఉంటుంది - అభయవృత్తి విజృంభించి, ఋజువృత్తికి సంబంధించిన కార్యక్షేత్రంలో చరించి, ముక్తికామనకు విఘ్నంగా నిలిచిన చంచలత్వాన్ని బలవంతాన అణచివేసే తీవ్రయత్నం చేసిందన్నది కీచకవధలోని తత్త్వ రహస్యం.

భీముడు చేసిన ఉపకీచక సంహారానికి కూడా అంతరార్థం ఉన్నది. సాధకుడిలో చాంచల్యం తొలగినా దానిని పునరుద్ధరించి మోక్షకామనకు దానితో ముడిపెట్టి తుదముట్టించాలని మనసులోని మాయావ్యాపారాలన్నీ కలిసి కృషి చేస్తాయి. వాటిని నిర్దయగా ఒక్కసారిగా అణచి వేయటం కర్తవ్యం. ఆ పని అభయవృత్తితో మోక్షకామన సాధించగలుగుతుందని ఉపకీచక వధ తత్త్వబోధ చేస్తుంది.

భర్త యొక్క ప్రేరణతో సుదేష్ణ సైరంధ్రిని బహిష్కరించటానికి యత్నించటం అజ్ఞాతవ్రతంలో అంతఃపుర పరంగా ఏర్పడిన పెద్ద విఘ్నం. దీనిని తట్టుకొంటే మోక్షకామన విజయం సాధించినట్లే. విఘ్నాలలో ప్రకృతికి సంబంధించిన భయాదులు, బుద్ధికి సంబంధించిన అనుమానాలూ ప్రధానమైనవి. విరాటుడూ సుదేష్ణా ఆ రెండు విఘ్నాలనూ సైరంధ్రికి కల్పించారు. ఆమె గంధర్వపతుల ఆగ్రహానుగ్రహాలను గూర్చి చెప్పి తన సైరంధ్రీ వృత్తిని స్థిరపరచుకొన్నది. అంటే మోక్ష కామనకు అంతశ్శత్రువులు (అంతఃపురంలోని శత్రువులు) ఎదురైతే తనలో దివ్యశక్తులను ప్రదర్శించగలిగిన యమ నియమాది అష్టాంగ యోగాది సిద్ధులను చూపించి వాటిని దమించటం జరుగుతుంది. ఈ తాత్పర్యమే సుదేష్ణ కొలువులో ఆమెకు గంధర్వభయాన్ని కలిగించి సైరంధ్రి నిర్భయంగా జీవించటంలో ధ్వనింపజేయబడుతున్నది.

మొత్తంమీద కీచకవధ మనశ్చాంచల్య నివారణ సాధనను బోధిస్తుందని తాత్పర్యం.

**5. దుర్యోధన దురాలోచన - తామసికవృత్తుల విజృంభణ**

(1) దుర్యోధనుడి గూఢచారులు అజ్ఞాతవాసంలో ఉన్న పాండవులను గుర్తించలేకపోయారు= దుర్యోధనుడంటే చెడు మార్గంలో ముక్తిసాధన శక్తులను నాశనం చేయాలని యత్నించే తామసిక ప్రవృత్తి. అతడి చారులు అతడి దుష్టమైన ఆలోచనలకు, యత్నాలకు ప్రతినిధులు. వారికి యమ నియమాభయ ఋజువర్తనాది వృత్తులు గుప్తంగా జ్ఞానంలో లీనమై సర్వప్రకృతి యందు బ్రహ్మాన్ని దర్శించే యోగంలో బ్రహ్మాభేద స్థితిని సాధించి ఉండటం చేత, అట్టి సాత్త్వికవృత్తులను తామస వృత్తులు గుర్తించలేకపోయాయి. దుర్యోధనుడు స్వయంగా తామసవృత్తులకు నాయకుడు కావటం చేత అతడూ విఫలుడైనాడు.

(2) దుర్యోధనుడు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామల సలహాలను కోరాడు. భీష్ముడు పాండవులుండే దేశ లక్షణాలు చెప్పాడు. దుర్యోధనుడి నాశ్రయించి ఉన్న భీష్మాదులు బ్రదుకు తెరువుకై తామసవృత్తుల నాశ్రయించి స్వేచ్ఛను కోల్పోయి ఉన్న సాత్త్విక వృత్తులు. వీరిని పాక్షిక సాత్త్వికవృత్తు లనవచ్చును. ఈ పాక్షిక సాత్త్విక వృత్తులు సాధకులలో శుద్ధ సాత్త్విక వృత్తులు గూఢంగా ఏ విధంగా ఉంటాయో తెలిసికొని చెప్పగలరు. కాని, వాటిని బహిర్గతం చేయలేవు. భంజించలేవు. అందువలన భీష్ముడి సలహా ననుసరించి పాండవుల అజ్ఞాతవాసవ్రతాన్ని భగ్నం చేయటానికి దుర్యోధనుడు యత్నం చేశాడు. అంటే పాక్షిక సాత్త్విక వృత్తుల సహాయంతో మోక్ష సాధన వృత్తులను గుర్తించే మెలకువ తెలిసికొన్నాడన్నమాట. తామస వృత్తులతోనే కాక, పాక్షిక సాత్త్విక వృత్తులవలన కూడా మోక్షసాధన వృత్తులకు విఘ్నాలు తప్పవన్నమాట!

(3) కీచక సంహార వార్త ఒక కీలకం. కీచకుడిని చంపింది భీముడనీ, దానికి కారణమైన వనిత ద్రౌపది అనీ దుర్యోధనుడు ఊహించాడు. ముక్తికామన సాధనలోని లోపాలను సరిచేసే మనఃప్రవృత్తితో ప్రేరేపించబడిన అభయవృత్తిచేత మనశ్చాంచల్యాన్ని తుదముట్టించగలదన్న కీలకాన్ని తామసవృత్తి పసికట్టింది. దొంగ గుట్టు దొంగకే తెలుసు. అందుకే దుర్యోధనుడికి కీచకవృత్తాంతం కీలకమై తోచింది. కర్ణాదులకు ఆ రహస్యం తోచకపోవటానికి కారణం వారు శుద్ధ తామసగుణ వృత్తులు కాకపోవటమే.

**6. గోగ్రహణ వ్యూహం - ఇంద్రియ వ్యాపారాల వశీకరణ యత్నం**

దుర్యోధనుడు పాండవులను గుర్తించి వారిని మరల అరణ్యాజ్ఞాతవాసాలకు పంపాలని దురాలోచనం చేశాడు. పాండవులను గుర్తించటానికి గోగ్రహణం ఉపాయమయింది. అంటే బ్రహ్మానుభవ యోగంలో మునిగి ఉన్న ఇంద్రియ వృత్తులను వక్రమార్గానికి మళ్ళించి తామసిక వృత్తుల అధీనంలోకి తీసికొని రావాలని చేసే తామసిక ప్రయత్నం గోగ్రహణ యత్నం.

గోగ్రహణం రెండు ముఖాలుగా సాగింది. 1. దక్షిణ గోగ్రహణం 2. ఉత్తర గోగ్రహణం. దక్షిణగోగ్రహణమంటే దక్షిణ దిక్కున ఉన్న విరాటుడి గోవులను గ్రహించటమని బాహ్యార్థం. సాధకుడిలో 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధనలో సమర్థములైన ఇంద్రియాల గుట్టు మట్టులను గ్రహించటమని అంతరార్థం. ఉత్తర గోగ్రహణమంటే ఉత్తర దిక్కున ఉన్న విరాటుడి గోవులను గ్రహించటమని బాహ్యార్థం. సాధకుడిలోని సాత్త్విక శక్తులతో నిత్యం పోరాటం సాగించే అపరాశక్తి యొక్క తామసిక వృత్తి (దుర్యోధనుడు) పాక్షిక సాత్త్విక వృత్తుల (భీష్మాదుల) సాయంతో అహంకారమమకార వృత్తులను నాశనం చేసే దేశంలో (మత్స్యదేశంలో) విశ్వ ప్రకృతిలో (విరాటుడి) శ్రేష్ఠమైన మార్గంలో (ఉత్తర దిశలో) ఉన్న ఇంద్రియ వ్యాపారాలను (గోవులను) పట్టుకొని ముక్తి వృత్తులను (పాండవులను గుర్తించి) నాశనం చేసే ప్రయత్నం - అని ఉత్తర గోగ్రహణంలోని అంతరార్థం.

**7. దక్షిణ గోగ్రహణం - అభయవృత్తి విజయం**

(1) త్రిగర్తాధీశుడయిన సుశర్మ దక్షిణ గోగ్రహణం చేశాడు= సు+శర్మ అంటే చక్కని మోక్షసుఖం అని భావం. త్రిగర్త దేశం అంటే త్రిపుటీసాధన. ధ్యాత ఒక్కటే తప్ప ధ్యేయం ధ్యానం వేరుగా లేవని తెలిసి, తానే సర్వప్రకృతి స్వరూపంగా తెలిసికొనటం త్రిపుటీ సాధన. సాధకుడే సాధ్యమైన భగవంతుడూ, సాధకుడే సాధనలూ కూడ ఔతాడు- అని గుర్తించే సాధన సుశర్మ. మోక్షం త్రిపుటీ సాధన వలననే సాధ్యం అనే విశ్వాసానికి సుశర్మ ప్రతినిధి. మత్స్యదేశం మీద సుశర్మ ఇదివరలో దాడి చేశాడు కాని, కీచకుడి చేతిలో ఓడిపోయాడు. కీచకుడు లేని మత్స్యదేశం మీద దండెత్తి విరాటుడిని ఓడించి పగతీర్చుకొనటం సుశర్మ వ్యూహంలోని పరమ ప్రయోజనం. దక్షిణ గోగ్రహణ యుద్ధానికి విరాటుడితో కలిసి పాండవులు రాకపోవచ్చుననీ, ఆ తరువాత దుర్యోధనుడు చేసే ఉత్తర గోగ్రహణంలో తమకు ఆశ్రయమిచ్చిన విరాటుడిని రక్షించుకొనటానికై పాండవులు కౌరవులతో యుద్ధానికి దిగవచ్చుననీ దుర్యోధనుడి ఊహ.

దీని తాత్పర్యం గ్రహిస్తే - సుశర్మ భావంలో విరాటుడిని పట్టుకొంటే పాండవులను గుర్తించినట్లే, పట్టుకొన్నట్లే. "సర్వంఖల్విదం బ్రహ్మ" అనే సాధనలో ప్రకాశించే విరాట్టును పట్టుకొంటే మోక్ష సాధన ప్రవృత్తులను పట్టుకొన్నట్టే. అయితే మోక్ష సుఖానికి ప్రతినిధి అయిన సుశర్మ మనశ్చాంచల్యం వలన ఒకసారి ఓడిపోయాడు. ఇప్పుడు దుష్టమార్గంలో ముక్తి సాధన ప్రవృత్తులకు అపకారం తలపెట్టే తామసప్రవృత్తి (దుర్యోధనుడి) అండ చేరాడు. తామసికవృత్తి యొక్క వ్యూహంలో భాగంగా మోక్షసాధన ప్రవృత్తిలో సమర్థాలైన ఇంద్రియాలను పట్టి కల్లోలపరచాలని యత్నించాడు. అందువలన అతడి సాధన కపట సాధనగా మారింది.

విరాటుడికి స్వయంగా తమ్ములున్నారు. కొడుకులున్నారు. వారందరు సమర్థులే. వారందరి కంటే మిన్నగా ధర్మజ భీమ నకుల సహదేవులు ఆసటగా బాసటగా నిలిచారు. కవచంగా అతడిని రక్షించారు. అట్లా జరుగుతుందని సుశర్మ ఊహించలేదు.

(2) సుశర్మ విరాటుడిని బంధించి తన రథం మీద ఉంచాడు. ధర్మజుడు విరాటుడిని విడిపించండని భీమనకుల సహదేవులను ఆజ్ఞాపించాడు. భీముడు విజృంభించి నకులసహదేవులతో కలసి, సుశర్మను బంధించి విరాటుడిని విడిపించాడు. దీని తాత్పర్యాన్ని ఇట్లా భావించవచ్చును. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనే సాధనలో విరాట్పురుషుడిని (విశ్వప్రకృతిని) త్రిపుటి బద్ధమైన వాసనా విముక్తి జన్యమైన సుఖ వృత్తి వశపరచుకొన్నది. కాని, ఆ త్రిపుటి సాధన శుద్ధసాత్త్వికవృత్తితో కాక, తామసిక వృత్తి యొక్క స్నేహంతో కూడిన పాక్షిక సాత్త్విక వృత్తి (సుశర్మ)తో జరిగింది. కాబట్టి మొదటి నుండి సాధనలో బలాన్ని బాగా పుంజుకొని ఉన్న యమనియమాది సాత్త్విక సాధన పాటవం యొక్క ఆమోదంతో సాధకుడిలోని అభయవృత్తి, ఐహిక భోగ విరక్తి

వృత్తీ జ్ఞానవృత్తీ కలిసి విశ్వప్రకృతిని కపట సాధన నుండి విడిపించి శుద్ధ సాత్త్విక సాధనంతో విశ్వప్రకృతిని జ్ఞానప్రకాశంలో విలీనం చేశాయని గ్రహించాలి.

ఒక్కొక్కసారి దుర్యోధనాది తామసిక శక్తుల కంటె సుశర్మవంటి కపట సాత్త్విక శక్తుల వలననే మోక్షసాధనకు బలమైన అవరోధాలు కలుగుతాయనీ, వాటిని మోక్షసాధన శక్తులు సంఘటితంగా ఎదుర్కొని తమ ఆధ్యాత్మిక సాధనను రక్షించుకొనాలనే హితవు దక్షిణ గోగ్రహణ కథ వలన మనకు అందుతుంది.

**8. ఉత్తర గోగ్రహణం - తామసిక వృత్తులపై ఋజువర్తన సాధించిన విజయం**

1. దుర్యోధనుడు భీష్మాదుల సాయంతో పాండవులను గుర్తించి వారి అజ్ఞాతవాసవ్రత నియమాన్ని భంగం చేయాలని చేసిన బృహత్తరమైన ప్రయత్నం ఉత్తర గోగ్రహణం. అంటే- అపరాశక్తి యొక్క తామసిక వృత్తి - తనకు సాయపడుతూ తనతో జతపడి ఉన్న పాక్షిక సాత్త్విక శక్తులను తన వెంట నడిపించుకొని సాధకుడి విశ్వప్రకృతిలోని శ్రేష్ఠములైన సాత్త్వికాలైన ఇంద్రియ వ్యాపారాలను పట్టుకొని ఆ ముక్తి వృత్తులను నాశనం చేయటానికి పూనుకొన్నది. అది ముక్తిసాధన ముందుకు సాగకుండ అపరాశక్తి కపటవర్తనంతో చేసిన ప్రబల విఘ్న ప్రయత్నం.

2. విరాట నగరంలో అప్పుడున్న విరటుడి సంతానం ఉత్తరుడు, ఉత్తర. అంటే ఉన్నత మార్గాన సాధకుడిని తరింపజేసే ముక్తిసాధనావృత్తు లన్నమాట. అవి విశ్వరూప ప్రకృతిలో చైతన్యవంతంగా ఉన్నాయి- అని భావం. ఉత్తరుడికి భూమింజయుడు అనే మరొక పేరు ఉన్నది. అంటే- భూమికి సంబంధించిన (ఐహికాలైన) వాంఛలను జయించే కోర్కెల ఉన్నత సాధనా వృత్తి.

3. గోపాలుడు ఉత్తర గోగ్రహణ వార్తను ఉత్తరుడికి నివేదించి, కౌరవులను ఓడించి గోగణాన్ని రక్షించుకొనుమని కోరుతారు. సాధకుడిలోని శ్రేష్ఠములైన ఇంద్రియ వ్యాపారాలను పరిరక్షించే మనోవృత్తులు అపరాశక్తియొక్క తామసికవృత్తులు చేసిన అపహరణ వృత్తిని గురించి ఉన్నత మార్గాన తరింపజేసే పరాశక్తియొక్క ఉన్నతమైన విశ్వరూపోపాసనా సాధనను ప్రబోధించి తెలియ జేశాయన్నమాట.

4. బృహన్నలను సారథిగా చేసికొనుమని ఉత్తరద్వారా ఉత్తరుడికి ద్రౌపది సూచించింది. విపత్కర పరిస్థితులలో సాధకుడిలోని ముక్తిమనోవృత్తి (ద్రౌపది) విశ్వ ప్రకృతిలోని ఉన్నత చైతన్యవృత్తిని (ఉత్తరను) ప్రేరేపించింది. ఐహిక వాంఛా విజయం సాధించాలని ఉత్సాహపడే శ్రేష్ఠమైన ముక్తిసాధన (ఉత్తరుడు) విస్తారమైన అసంగయోగవృత్తిని (బృహన్నలను) సారథిగా చేసికొంటే అపరాశక్తి యొక్క తామసిక వృత్తిని ఓడించవచ్చునని సూచించబడింది.

5. షండవేషంలో రథంమీద శమీవృక్షాన్ని సమీపిస్తున్న అర్జునుడిని చూచి భీష్మాదులు భయపడ్డారు. శమీ వృక్షం అంటే శమం. అంతరింద్రియ నిగ్రహం. షండవేషం అంటే నిర్గుణ నిరాకార తత్త్వం. రథం అంటే శరీరం. శరీరం ధరించిన అద్వైత భగవత్తత్త్వంగా శమప్రధానమైన ఋజుప్రవర్తనా శీలాన్ని గుర్తించటమే, షండవేషంలో రథం మీద ఉన్న అర్జునుడిని గుర్తించటం. సాధకుడిలోని పాక్షిక సాత్త్విక వృత్తులు (భీష్మాదులు) సాక్షాత్ అద్వైత పరమాత్మతత్త్వాన్ని గుర్తించటంతో తమలోని అపరాశక్తి యొక్క తామసిక వ్యాపారం ఇక పనిచేయలేదని భయపడ్డాయి.

6. యుద్ధంలో అర్జునుడు తనంతట తాను భీష్మ ద్రోణులను ముందుగా కవ్వించలేదు. లక్ష్యం దుర్యోధనుడికి ఓటమి రుచి చూపించి బుద్ధి చెప్పటమే. అతడికి అండగా నిలిచేవారిని తగిన విధంగా దండించటమే. గోవులను మళ్ళించటం ముఖ్య ప్రయోజనంగా కనపడుతున్నా, అది అవాంతర ప్రయోజనంగా మారింది. ఈ కథార్థాల అంతరార్థాన్ని ఈ విధంగా భావించవచ్చును. సాధకుడిలోని పాక్షిక సాత్త్విక వృత్తులు రాజ్యసంపద కొరకు తామసిక వృత్తికి లోబడినా, అవి సహజంగా సాత్త్విక ప్రవృత్తులే కావటం చేత అవి ముక్తిమార్గానికి అడ్డం నిలువవు కాబట్టి, వాటిని నిర్లిప్తంగా వదలివేయటం నీతి. ఒకవేళ తామసిక వృత్తి ప్రేరణతో అడ్డుపడ్డప్పుడు అణచివేయాలి. అంటే- సాధనకు అడ్డురాని ప్రవృత్తుల జోలికి అనవసరంగా వెళ్ళగూడదని సాధన రహస్యం.

7. దుర్యోధన కర్ణాదులను ఓడించటమే అర్జున పరాక్రమ ధ్యేయం. ధర్మానుశాసనంలో వర్ధిల్లి మోక్షసాధన కనువైన శమమార్గంలో సాగుతున్న ఋజుప్రవర్తనాశీలం తామసిక రాజసిక శక్తులను అవలీలగా ఓడించి విజయాన్ని సాధించగలదనే ఆధ్యాత్మిక సందేశం అర్జున పరాక్రమ వృత్తమైన ఉత్తరగోగ్రహణ యుద్ధగాథలో ధ్వనితం.

8. ఉత్తరార్జునుల వృత్తం - ఉత్తరుడు= ఉన్నత మార్గాన సాధకుడిని తరింపజేసే ముక్తి సాధనా వృత్తి. అర్జునుడు ఋజువర్తన ప్రవృత్తి. బృహన్నల= పరమాత్మ తత్త్వం. సాధకుడి ముక్తి సాధనా ప్రవృత్తి పరతత్త్వాన్ని ఆశ్రయించి, తామసిక ప్రవృత్తులపై చేసే యుద్ధానికి సారథ్యం వహించుమని ప్రార్థించింది. ధైర్యం కోల్పోయిన ఉత్తరుడి రథానికి బృహన్నల సారథిగా ఉండి నడిపాడు. తామస ప్రవృత్తి విజృంభణాన్ని చూచి ముక్తి సాధన ప్రవృత్తి ధైర్యాన్ని కోల్పోయింది. అప్పుడు పరమాత్మతత్త్వం అభయమిచ్చి ముక్తి సాధన రూప ఋజువర్తన శీలరూపమైన తన సగుణరూపాన్ని చూపి ఉన్నత మార్గంలో ముక్తిసాధన పద్ధతిని ప్రదర్శించి చూపించింది. అప్పుడు ఆ ఋజు ప్రవర్తన లీలను దర్శిస్తూ ముక్తి మార్గాన్ని తెలిసికొన్న ఉన్నత మార్గవర్తి అయిన సాధకుడు ఉత్తరుడు. రథికుడు సారథి అయ్యాడు. సారథి రథికుడయ్యాడు. విజయం సాధించింది ఒకరు. విజయుడని ప్రకటించబడింది మరొకరు. అయినా వారిరువురి భావనలో అద్వైతమే నిలిచింది. అది ఉత్తరార్జునులు బోధించిన అద్వైతానుభూతి.

9. విరాటుడు ధర్మరాజును సారెతో కొట్టటం. ద్రౌపది ధర్మజుని రక్తం భూమిమీద పడకుండా బంగారు పాత్రలోనికి పట్టటం-అంటే= అష్టాంగ యోగ సాధన చాల పవిత్రమైనదనీ, దానికి ఏమాత్రమూ ఆఘాతం జరుగనీయకూడదనీ, అట్లా జరిగితే ముక్తి మార్గ సాధన పూర్తిగా దెబ్బతింటుందనీ అంతరార్థంగా గ్రహించాలి.

10. ఉత్తరాభిమన్యుల వివాహం: ఉత్+తర= ఉన్నత పదంలో తరింపజేసే జ్ఞాన మనోవృత్తి అని అర్థం. అభిమన్యుడూ 'అభితః మనుతే ఇతి అభిమన్యుః'- అంతటా పరమాత్మను తలచే (దర్శించే) వాడు అని అర్థం. ఉత్తరాభిమన్యుల వివాహమంటే ఉన్నత పథంలో సాగే సాధకుడి మనోవృత్తి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' సాధనను కూడినప్పుడే ముక్తిని సాధించగలదని తాత్పర్యం. ఈ ముక్తి సాధనాసిద్ధికి మూలం గొప్ప అసంగవృత్తితో కూడిన ఋజుప్రవర్తన శీలం అనే సత్యాన్ని కూడా ఇక్కడ స్మరించాలి.

### 9. విరాటపర్వతత్త్వం - "సర్వం ఖల్విదం బ్రహ్మ"సాధన

"సర్వం ఖల్విదం బ్రహ్మ" సాధనాక్రమంలో ముఖ్యములైన సాధనములలో బలమైనవి అభయవృత్తి ఒకటీ; గొప్ప అసంగవృత్తితో కూడిన ఋజు ప్రవర్తన మఱియొకటీ అనీ, ఆ రెండింటిలోనూ కూడా ఋజువర్తనా శీలానికి ఎంతో ప్రాధాన్యం ఇవ్వాలనీ, విరాటపర్వకథలో అంతరార్థపరంగా సారాంశాన్ని సాధకులు సులభంగానే అర్థం చేసికొనగలరు. రామాయణంలో సుందరకాండ పఠనం సర్వకామితాలను తీరుస్తుం దన్నట్లే భారతంలో విరాటపర్వం చదివితే వర్షాలు కురువక క్షామం వచ్చిన కాలంలో వర్షాలు కురిసి పంటలు పండి సుభిక్షంగా కాలం గడుస్తుందనే వాడుక వుంది. అంటే - సాధనాలు గొడ్డుపోయి మనస్సు కలవరము పడే సమయంలో బలమైన అభయవృత్తితోనూ, గొప్ప ఋజుప్రవర్తనతోనూ "సర్వం ఖల్విదం బ్రహ్మ" సాధన సాగిస్తే పాఠకులకు సంపూర్ణ ముక్తి లభించటం ఖాయం అని విరాటపర్వ పఠనానికి చెప్పిన ఫలశ్రుతిని మనం అంతరార్థపరంగా అర్థం చేసికొనాలి." (అంతరార్థ భారతము పు.271).

(కళాప్రపూర్ణ, సరస్వతీ కంఠాభరణ, తత్త్వార్థ ప్రబోధక, విద్వాన్ డా. వేదుల సూర్యనారాయణ శర్మగారు రచించి ప్రచురించిన 'అంతరార్థ మహాభారతము' (ముక్తిసాధనా మార్గము) (1986) అనే గ్రంథం ఈ అంశాన్ని వివరించటంలో బాగా తోడ్పడింది. కొన్ని వాక్యాలు అందులో నుండి యథాతథంగా కూడా వాడుకొన్నాను. అందుకు కృతజ్ఞుడను).

## 27. కవిత్రయ మహాభారతం - వ్యాఖ్యానం

ఆదికావ్యమైన ఆంధ్ర మహాభారతం తెలుగులో అవతరించి దాదాపు వెయ్యేళ్ళు ఔతున్నా ఇంతవరకు దానికి సమగ్రవ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్ట

వ్యావహారిక భాషలో సరళవ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి ఆనందించే అపూర్వమైన సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు భారతీయ వైదిక ధర్మ ప్రచార మహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమ వేద వ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండలస్వామి మాత్రమే చేపట్టి ధర్మరక్షణ కళా ప్రావీణ్యంతో ఈ బృహత్తర ధర్మకార్యాన్ని ప్రజలకు ప్రసన్నంగా ప్రసాదించగలిగిన పరమదయాళువు. ఆ దేవదేవుడి కృపాకటాక్షాలతో పండితులు, పెద్దలు పదునెనిమిది పర్వాల ఈ దివ్య ప్రబంధమండలిని పరిష్కరించి, ప్రతిపద్యానికి వ్యాఖ్యానం వెలయించి, సవిమర్శకమైన పీఠికలు సంతరించి, కథాసారాదులతో సర్వార్థసాధకంగా రూపొందించి, సర్వాంగసుందరంగా ప్రచురించి, సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీ తిరుమలేశుని పక్షాన బాధ్యత వహించి అభ్యుదయ పరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి. బోర్డు ఛైర్మన్, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, సంపాదకులూ, వారి సహకారులూ, సంపాదక సలహా మండలుల సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, 'ఎడిటోరియల్ సెల్' సభ్యులూ, పలురకాలుగా దీనికి తోడ్పడుతున్న అధికార అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. అది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన ఆరణ్యపర్వం మూడవ సంపుటిగా రెండు భాగాలలో ప్రచురించబడింది. మొదటిభాగం నన్నయ రచించిన ఆరణ్యపర్వభాగం. రెండవ భాగం ఎఱ్ఱాప్రెగడ పూరించిన ఆరణ్యపర్వశేషం. ఈ విధంగా విభజించబడి ప్రచురించటం తెలుగులో ఇదే ప్రథమం. అది దాని ప్రత్యేకత కూడా. ఇక నాల్గవ సంపుటి ఈ విరాటపర్వం.

ప్రతి యేటా, పల్లెపల్లెలా విరాటపర్వాన్ని వినటం తెలుగువారి ధార్మిక సంస్కృతి. ఈ పర్వాన్ని విన్నా, తెలిసి చదివినా, చదువుకొన్నా వారి జీవితాలలో విజయపరంపరలూ, శుభపరంపరలూ కలుగుతాయి. విరాటపర్వం చదివినచోట సకాలంలో వానలు పడి దేశం సుభిక్షమౌతుంది. దేశాన్ని క్రమ్మిన అజ్ఞాత ప్రమాదజీమూతాలు తొలగిపోయి ధర్మప్రకాశం వెల్లివిరుస్తుంది. విరాటపర్వం చతుర్థమే కాదు, చతుర్విధ పురుషార్థఫలప్రదం!

విరాటపర్వ వ్యాఖ్యానాన్ని, ఒక్కొక్కరు ఒక్కొక్క ఆశ్వాసం చొప్పున, విద్వన్మణులైదుగురు రచించారు. ప్రథమాశ్వాస వ్యాఖ్యాత ఆచార్య కె. సర్వోత్తమరావుగారు - శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖాధ్యక్షులుగా పనిచేసిన ప్రసిద్ధ పరిశోధకులు. ద్వితీయాశ్వాస వ్యాఖ్యాత డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావుగారు - ప్రసిద్ధాంధ్రాచార్యులేకాక ప్రస్తుతం క్రొత్త ఢిల్లీలో దూరదర్శన్ డిప్యూటీ డైరెక్టర్ జనరల్. తృతీయాశ్వాస వ్యాఖ్యాత శ్రీ సింగరాజు సచ్చిదానందంగారు - తిరుమల తిరుపతి దేవస్థానం కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేసిన ప్రముఖ విద్వాంసులు. చతుర్థాశ్వాస వ్యాఖ్యాత డాక్టర్ మేడవరం వేంకట నారాయణశర్మగారు - మదనపల్లె బి.టి. కళాశాలలో ప్రాచార్యుడుగా పనిచేసిన పండితవర్యులు. పంచమాశ్వాస వ్యాఖ్యాత డాక్టర్ కె. రామగోపాల కృష్ణమూర్తిగారు - ప్రభుత్వ కళాశాలాచార్యులు, ప్రముఖ సాహితీవేత్త. పంచాగ్నుల వలె ప్రకాశించే ఈ పండిత పంచకం ప్రతిభాపూర్ణంగా వ్యాఖ్యానాలను రచించి ఈ విరాటపర్వాన్ని విజ్ఞానపర్వంగా మార్చారు. వారికి నా నమోవాకాలు.

తిక్కన కవిత్వంలోని కళాశిల్ప విశేషాలను సహృదయులకు అందుబాటులోకి తీసికొని రావటానికి నేను చాలా చోట్ల విశేషవ్యాఖ్యలు వ్రాసి వివరించాను. అవి 'సంపా.' అనే సంకేతాక్షరాలతో సూచించబడ్డాయి. విరాటపర్వ వైశిష్ట్యాలను తిక్కన జీవిత కవితా శిల్ప విశేషాలను సవిమర్శకంగా పీఠికలో వివరించాను. విరాటపర్వ కథాసారం సర్వజన సులభంగా సంతరించాను. అందులో ఈనాటికీ తెలుగువారి నాల్కలమీద నాట్యం చేస్తున్న కొన్ని మధురమైన పద్యాలను మధ్యలో పేర్కొన్నాను. ఈ ప్రయత్నం ఆంధ్రావళి ఆమోదాన్ని పొందుతుందని ఆశిస్తున్నాను. విరాటపర్వ వ్యాఖ్యానం ప్రామాణికంగా వెలువడటానికి నాకెన్నో విధాల సహకరించిన ప్రముఖ విద్వత్కవులు, పరిశోధకులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారికీ, మిత్రులు డా.అట్లా

వెంకటరామిరెడ్డిగారికీ, ప్రూఫులు సరిచూడటంలో తోడ్పడిన మిత్రులు శ్రీకె.పి. బాబుగారికీ, శ్రీమతి సుశీలా లక్ష్మీ విద్యానాథులకూ, ముద్రణ కనువైన అక్షరాకృతినిచ్చిన శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ అధినేత్రి డాక్టర్ జి.యస్.లక్ష్మికీ నా హార్దమైన కృతజ్ఞతలు.

పరమ కళ్యాణ భద్రమూర్తి శ్రీపద్మావతీ సహిత శ్రీ వేంకటేశ్వరస్వామి దివ్యమూర్తి. ఆ స్వామి వేదాత్ముడు, వేదాంతవేద్యుడు పరతత్త్వరూపుడు; అయినా భక్తసులభుడు, సాహిత్య సంగీత ప్రియుడు, రసానందరూపుడు. తిక్కన కృతి నిచ్చిన హరిహరనాథదేవుడు శ్రీ వేంకటేశ్వరస్వామివారే అని ఒక వాదం ఉన్నది. అదే నిజమైతే అంతకంటే కావలసిందేమున్నది? ఆ స్వామికే ఈ అక్షరవేదం అంకితం అయినట్లే. ఆ స్వామికి ఈ పంచమవేదం తులసీమాల, వ్యాఖ్యానం సుగంధ పరిమళసేవ, విరాటపర్వం విరులపూదండ. పూజ, విశేషాంశాలు పణ్యారాల సుగంధాల నివేదన, విరాటపర్వ పీఠిక విరాణ్మూర్తికి మంగళనీరాజనం. ఈ పర్వం స్వామివారికి సారస్వతమైన అక్షరార్చనం. సత్య శివ సుందర రూపుడైన స్వామివారి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలోని పుణ్య పూజాకుసుమ మంజరిగా సమర్పించుకొంటున్నాను. విశ్వశ్రేయస్సును ప్రసాదించుమని ఆ విరాడ్రూపుని వేడుకొంటున్నాను.

**హైదరాబాదు**
**23-11-2001**

**జి.వి.సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు
**కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు**
**తిరుమల తిరుపతి దేవస్థానములు**

# విరాటపర్వ కథాసారం

"మహిత సముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితము గాఁగ నేమిగతి సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నా పదుమూఁడగు నేఁడు మత్పితా
మహులు చరించి రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా!"

అని జనమేజయుడు వైశంపాయన మహర్షిని ఆసక్తిగా అడిగాడు. చతుర్థం, ఊర్జితకథోపేతం, నానారసాభ్యుదయోల్లాసి అయిన విరాటపర్వకథ వైశంపాయనుడు వినిపించ నారంభించాడు. పాండవులు తమ వెంట అగ్నిహోత్రాదులతో వస్తున్న వేలాది బ్రాహ్మణోత్తములను ఆగండని అభ్యర్థించారు. బాహ్య పరివారానికి సముచితమైన వీడ్కోలు పలికారు. వారొక ఏకాంత ప్రదేశంలో నిలిచారు. ధౌమ్యుడు వారివెంట ఉన్నాడు. కురుజనపదానికి చుట్టుపట్లనున్న పాంచాల, చేది, మత్స్య, సాళ్వ, విదేహ, బాహ్లిక, దశార్ణ, శూరసేన, కళింగ, మగధ దేశాలలో నివాసయోగ్యమైనదానినిగా మత్స్యదేశాన్ని ఎన్నిక చేశారు. మత్స్యనరపతి సుజనహితుడు, ధర్మశీలుడు కావటం చేత అతడి కొలువులో మారువేషాలలో చేరి అజ్ఞాతవాస వ్రతాన్ని నిర్వహించాలని నిర్ణయించారు.

## పాండవుల అజ్ఞాతవాస జీవితం

ధర్మజుడు సన్యాసి వేషంలో కంకుడనే పేరుతో రాజుకు చెలికాడై విద్యాగోష్ఠులతో, పుణ్యకథా సల్లాపాలతో, అనువైనప్పుడు అక్షక్రీడతో గౌరవప్రదంగా గడపాలని నిర్ణయించుకొన్నాడు.

భీమసేనుడు వంటలవాడై, వలలుడనే పేరుతో రుచికరాలైన వివిధ వంటకాలను ప్రభువుకు వండి వడ్డించటానికీ, రాజు కోరితే మల్లులతో గాని, కరిసింహవ్యాఘ్రాదులతో గాని పోరి వినోదాన్ని కలిగించటానికి పూనుకొన్నాడు.

అర్జునుడు బృహన్నలాఖ్యుడైన పేడియై అంతఃపుర కన్యలకు వివిధ నాట్య విశేషాలను నేర్పటానికి చేరదలచుకొన్నాడు. ఊర్వశి యిచ్చిన శాపం, ఇంద్రుడి వరం పార్థుడికి అజ్ఞాతవాసంలో అనువైన సాధనాలుగా పనికివచ్చాయి.

నకులుడు దామగ్రంథిగా అశ్వశాలలో ప్రవేశించి అశ్వశిక్షణ చాతుర్యాన్ని ప్రదర్శించటానికీ, సహదేవుడు తంత్రీపాలుడుగా గోరక్షణ నైపుణ్యాన్ని వెలార్చటానికీ నిశ్చయించుకొన్నారు. ద్రౌపది సైరంధ్రిగా సుదేష్ణారాణి కొలువులో చేరి మాలిని అనే పేరుతో మలినమైన పనుల జోలికిపోక, గౌరవప్రదంగా అంతఃపురంలో అజ్ఞాతవాసం గడపటానికి నిర్ణయించుకొన్నది. ధౌమ్యుడు శాంతి రక్షా మంత్రాలు చదివి వారిని సాగనంపి తానొక ఆశ్రమంలో ఆగిపోయాడు.

పాండవులు భార్యా సమేతులై అడవి దారులలో నడిచి మత్స్యనగరాన్ని సమీపించారు. ఊరి వెలుపల నున్న శ్మశానంలో భయంకరంగా పెరిగి ఉన్న శమీవృక్షానికి తమ ఆయుధాలను శవాకారంలో మూటగట్టి వ్రేలగట్టారు. తాము నదిలో స్నానం చేశారు. అజ్ఞాతవాసంలో ఎవరూ వారిని కనుగొనకుండా ఉండేటట్లు వరమిచ్చిన ధర్మదేవతను ప్రార్థించారు. వారు సంకల్పించిన రూపాలు, వేషాలు అత్యంత సహజంగా అమరాయి. అదృష్టవశాత్తు విరాటరాజు ఆనాడు నగరం వెడలివచ్చి బయలికొలువు ఇస్తూ ఉండటం చేత అవలీలగా అతని కొలువులో చేరిపోయారు. ద్రౌపది సైరంధ్రిగా కుదిరిపోయింది. తమ తమ కొలువులలో నైపుణ్యాన్ని ప్రకటించి అందరి మన్ననలనూ పొందగలిగారు. వారిలో వారు రహస్య నామాలతో పిలుచుకొంటూ వీలైనప్పుడెల్లా కళ్ళారా చూచుకొంటూ కాలక్షేపం చేస్తున్నారు.

ఒకసారి విరటుడి కొలువులో మల్లవీరుల సమావేశమయింది. ఆ సమయంలో ఎక్కడినుండో ఒక భయంకరకాయుడైన మల్లుడు వచ్చి తనను గెలిచే వారెవరైనా మత్స్యనాథుడి సభలో ఉన్నారా? అని గద్దించాడు. అక్కడ గుమికూడిన మల్లయుద్ధ నిపుణులందరూ అతడి భీకరాకారం చూచి నీరుగారిపోయారు. దేశం పరువు గంగపాలైపోయేటట్లుంది. విరాటుడు విచారపడ్డాడు.

అప్పుడు కంకుభట్టు వలలుడిని గురించి చెప్పి అతడిని పిలిపించుమన్నాడు. విరటుడు వలలుడిని పిలిచి ఆ మల్లుడిని ఎదుర్కొనుమని ఆజ్ఞాపించాడు; ధర్మరాజు కనుసైగతో అనుమతించాడు.

భీముడి కానాడు పండుగగా తోచింది. వివిధ మల్లయుద్ధక్రీడా నైపుణ్యాలతో ఆ మల్లుడిని చాలా సేపు మూడు చెరువుల నీళ్ళు త్రాగించాడు. చివరకు కాళ్ళూ చేతులూ పట్టి గిరగిర తిప్పి నేలపై కొట్టి నెత్తురు కక్కేటట్లు చరచాడు. ఆ మల్లుడు భయంకరంగా ఓడిపోయాడు. విరటుడు మెచ్చి వలలుడికి కానుక లిచ్చాడు. వాటిని బీద ప్రజలకు పంచుకొంటూ వలలుడు మత్తగజంవలె వంటశాలవైపు నడిచిపోయాడు.

వలలుడి మల్లయుద్ధమంటే విరటుడి కొక వినోదమయింది. అతడిచేత పులులు, సింహాల వంటి క్రూరమృగాలతో పోరించుకొని చూడటం మత్స్యరాజు కొక ప్రీతి అయింది. అట్లా కొన్ని రోజులు తక్కువగా సంవత్సరం పూర్తికావస్తున్నది. ఒకనాడు-

## కీచకోదంతం

మత్స్యరాజు బావమరది, ఆ దేశానికి దండనాథుడు, నూటైదుగురు కీచకులకు పెద్దన్న, రూపాభిమాని, నానాభరణశీలుడు, దుర్విదగ్ధుడు, బలగర్వితుడు అయిన సింహబలుడు - అక్కగారైన సుదేష్ణకు మ్రొక్కటానికి వచ్చి ప్రక్కనే ఉన్న అపూర్వ లావణ్యమూర్తి సైరంధ్రిని చూచాడు. మొదటి చూపులోనే మదనాస్త్రానికి దాసుడైనాడు. ఆమెపై నుండి చూపును ప్రక్కకు త్రిప్పుకోలేకపోయాడు. అంతవర కాతడు అంతటి అందగత్తెను చూడలేదు. అందుకు ఆశ్చర్యంలో మునిగిపోయాడు. త్రిమూర్తులకు కూడ పొందజాలనంత అందాన్ని సహజంగా పొందగల ఆ సుందరాంగి ఎవరో తెలిసికొనాలని అతడి మనసు ఉరకలు వేసింది. తమకంతో తలపులు తల్లడిల్లిపోసాగాయి. అతడికి తెలియకుండానే అతడు మన్మథవికార చేష్టలు పలురకాలుగా ప్రకటించడం ప్రారంభించాడు.

సైరంధ్రివైపు సూటిగా చూపులో చూపుపెట్టి చూచాడు. ఆమెకు కోపం వచ్చి మొగమంతా చెమట పోసింది. అనుచితమైన పనులు ఆచరించటానికి ఆరంభించాడు. ఆమె నివ్వెరపోయింది. ఆమెను కళ్ళతో మ్రింగేటట్లు చూశాడు. ఆమె గజగజవణికిపోయింది. ఆమెను సమీపించబోయాడు. ఆమె తెల్లబోయింది. ఆమె భయపడి సాత్త్వికభావాలు ప్రకటించినా ఆ దుర్విదగ్ధుడు అవన్నీ మారవికారాలుగా భావించి రాగసాగర నిర్మగ్నుడైనాడు. ఆమెను గురించిన వివరాలను అక్కగారి నడిగాడు.

కీచకుడి చిత్తవృత్తి సుదేష్ణకు చీకాకు కలిగించింది. మాటమార్చి చూచింది. అతడి మనసు మారేటట్లు లేదు. అక్కగారితో మాట్లాడటం మాని సైరంధ్రితోనే సంభాషణ మొదలుపెట్టాడు. 'ఓ చంద్రవదనా! నీవంటి అందచందాలు ఈ లోకంలో మరెవ్వరికైనా ఉన్నాయా? నీ వెవరి కూతురవు? నీ భర్త ఎవరు? నీ పేరేమిటి?' అని గుచ్చి గుచ్చి అడిగాడు. ఆమె మొగం తప్పించింది. అతడు విరహాతప్తుడై ఆమె సౌందర్యాన్ని సంకీర్తనం చేయనారంభించాడు. ఆమెను పొందలేకపోతే తనకు ప్రాణాలు పోతాయనీ, ప్రాణం పోయిన తరువాత తనను మరలా పొందవచ్చునా? అని ఆమెను అనునయించాడు. అతడి స్థితిని చూచి సైరంధ్రి తొందరపాటులేకుండా నేర్పుతో వ్యవహరించటం మేలనుకొన్నది.

'అన్నా! నేనున్న స్థితిని, నా శరీరాన్ని, నా మాసిన చీరలనూ చూస్తే ఏవగింపు కలగటం లేదూ? ఉత్తములు ఇటువంటి మదన వికారపు మాటలు మాట్లాడతారా? నీకూ అప్పచెల్లెళ్ళున్నారుగదా! ఇట్లా వ్యవహరించటం ఉచితమా? పైపెచ్చు నేను పతివ్రతను. నన్ను ఇట్లా అడుగవచ్చునా?' అని అతడిని నిలవదీసి అడగింది సైరంధ్రి.

అతడు వినిపించుకొనే స్థితిలో లేడు. ఆమె శరీరాంగాలను వర్ణిస్తూ 'పరసతీసంగమం వలన వచ్చే పాపానికైనా సిద్ధపడతానుగాని, నీ తనూసంగమాన్ని మాత్రం వదులుకొని, బ్రతుకలేను' అని వెంటపడ్డాడు. ద్రౌపది అతడిని నీచునిగా నిశ్చయించి బెదిరించి అదలించడానికి యత్నించింది.

"దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథనవిద్యా పారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులు లేవు రిప్టు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిన్ గీచకా!"

అని గద్దించింది సైరంధ్రి. కీచకుడు గంధర్వుల బలాన్ని లెక్కచేయకుండా మాట్లాడాడు. 'అందని మ్రానిపండ్ల కొరకు అర్రులు చాచి రావణాదులవలె చెడిపోవద్ద'ని సైరంధ్రి మందలించింది. అతడు మొగం చిన్నబుచ్చుకొని సుదేష్ణను సమీపించాడు. సైరంధ్రి వివరాలను చెప్పుమని బలవంతపెట్టాడు.

సుదేష్ణ కీచకుడికి నీతులు బోధించింది. అతడిని వలచి వలపించే వనిత లెందరో ఉండగా, పరవనితను కోరటం ధర్మం కాదన్నది. 'లోకంలోని వనితలందరూ ఆమె కాలిగోటికి సరిరా'రనీ, ఆమెను ఏదో ఒక ఉపాయంతో తన వద్దకు పంపకపోతే మన్మథతాపంతో మరణించటం తథ్య మనీ కీచకుడన్నాడు. ఆమె మరలా నీతులు చెప్పబోయింది. అతడు వారించి ఆమెకు నమస్కరించి 'ఇక ఈ వెడమాటలు చాలు. ఆమెను నాతో కలిపే మాటలేవైనా ఉంటే చెప్పుము. లేదా నా చావు నిజం. ఆ మీద నీ తమ్ముడిని స్మరించుకొంటూ ఉందువుకాక' అని లేచి వెళ్లబోయాడు. సుదేష్ణ మనసులో భయపడింది. చివరకు తమ్ముడికి మాట ఇచ్చింది. ఒక రోజులో సైరంధ్రిని మద్యం కొరకు అతడి నివాసానికి పంపుతాననీ, అప్పుడు అభిమతాన్ని తీర్చుకొనుమనీ సూచించింది. ఆ మాట విని కీచకుడు ఉప్పొంగిపోయి నిజమందిరానికి పోయి, వివిధ మధురసాలను సిద్ధం చేసికొని విరహవేదనపడుతూ సైరంధ్రి రాకకొరకు ఎదురుచూస్తూ ఉన్నాడు.

సుదేష్ణ ఆసవ పిపాస అభినయించింది. సైరంధ్రిని పిలిచి రుచిగల ఆసవాన్ని కీచకుడి యింటినుంచి తెచ్చిపెట్టుమన్నది. తన నా అనుచిత కార్యానికి నియోగించవద్దని సైరంధ్రి బ్రతిమిలాడుకొన్నది. అందుకు సుదేష్ణ నిష్ఠురాలాడింది. సుదేష్ణ తమ్ముడికి మేలు చేయాలని పన్నుగడ పన్నిందని స్పష్టమైంది. ఆసవ పాత్రను తీసికొని సైరంధ్రి కీచకునింటికి ఒంటిగా బయలుదేరింది. తనకు కలుగనున్న ఆపదను స్మరించుకొని మహాపదలకు పరిహారమైన హరినామస్మరణను మనసులో నిలుపుకొని, పుండరీకాక్షుడిని అంతః ప్రసన్నుడిని చేసికొని ముందుకు సాగింది. సూర్యనారాయణుడిని స్మరించింది. 'తండ్రీ! నేను నిజంగా పాండవులను ఏకచిత్తంతో భావించేదానినైతే నాకెటువంటి కీడూ కలుగకుండా రక్షించే భారం నీదే!' అని నమస్కరించింది. సూర్యనారాయణుడు వెంటనే ఆమెను రక్షించే నిమిత్తం ఒక రక్కసుని కల్పించి కనపడకుండా ఆమె వెంట రక్షకుడుగా ఉండేటట్లు కరుణించాడు. ఎట్టకేలకు మెల్లగా సైరంధ్రి పులిపొదలో లేడి ప్రవేశించినట్లు కీచకమందిరంలో అడుగుపెట్టింది.

కీచకు డామెను చూచి సంతోషంతో సంభ్రమంతో ఉక్కిరిబిక్కిరయిపోయాడు. ఆమె కెదురుపోతూ వింత విలాసాలు వెలార్చటం ఆరంభించాడు. ఆమె అతడి వైఖరిని గమనించి గంభీరంగా నించున్నది. 'దేవి ఆసవ పిపాసతో మదిర తెమ్మన్నది. ఇప్పించండి' అని ముక్తసరిగా పలికింది. కీచకుడు చనువుగా సమీపించి మొగంలో మొగం పెట్టి తమకంతో ఇట్లా అన్నాడు. 'లీలావతీ! నీవు దేవి దప్పిక తీర్చాలని చూస్తున్నావే కాని, నా దప్పికను నీ రసవత్తర సంభావనతో తీర్చాలని అనుకోవేమిటి? ఇదేం న్యాయం చెప్పుము? నీ పొందు నాకిచ్చి ఈ జన్మ సఫలం చెయ్. మన్మథుడిని బంటుగా నన్నేలుకో. ఈ సిగ్గుతెరలు మాని చెలిమికలిమిని పంచు' అని తొందరపెట్టాడు. 'ఆలస్యమవుతున్నది. దేవి ఎదురుచూస్తూ ఉంటుంది. తడవైతే ఆమె కోపగిస్తుంది. తిరిగి వెళ్ళాలి. త్వరగా మదిర నిప్పించండి' అని నిబ్బరంగా పలికింది సైరంధ్రి. దానికి కీచకుడు బాధపడుతూ 'మదిర తీసికొనిపోవటానికి మదవతు లెందరో ఉన్నారు. కాని, మదన సుధారసాన్ని అందించగలిగిన నీ అధరాన్ని నేను కోరుతున్నాను. నా సైన్య సంపదను, పరిచారికా సహస్రాన్ని నీ కర్పిస్తాను. నా కులకాంతలచేత నీకు సేవలు చేయిస్తాను. నేను నీ కనుసన్నలలో మసలుతాను' అని తమకంతో తనను తాను నిగ్రహించుకోలేక ఆమె పైబడి పట్టుకొన్నాడు కీచకుడు.

సూర్యవరం చేత ఆమెను రక్షిస్తున్న అసురశక్తి ఆమె శరీరంలో చేరి కీచకుడిని ఆవలకు తోసింది. వడిగా మందిరాన్ని వీడి సైరంధ్రి పరుగు పెట్టింది. కీచకుడు ఆమె వెంటపడ్డాడు. భయంతో ఎక్కడికి పోవాలో తోచక ద్రౌపది విలవిలలాడింది. విరాటరాజు కొలువుతీర్చి ఉండటం తెలియవచ్చింది. ఆ సభవైపు ఆమె పరుగులు తీసింది. జనులు చూస్తున్నారన్న లజ్జ కూడా లేకుండా కీచకుడు ఆమెను తరుముకొంటూ వెళ్ళాడు. మదపుటేనుగు జంగమలతను పట్టుకొన్నట్లు, పెద్ద గద్ద ఆడుపామును ఒడిసి పట్టినట్లు రాక్షసుడు దేవకాంతను బలవంతాన పొదివినట్లు సింహబలుడు ఆమె తలపట్టి తిగిచి కూలపడద్రోశాడు. అప్పుడు పాంచాలీ రక్షకుడైన రాక్షసుడు కీచకుడిని నేలపై పొరలిపడేటట్లు గట్టిగా కొట్టాడు. తనపాటు ఇతరులు చూడకుండా గబగబా లేచి కీచకుడు వెంటనే వెళ్ళలేదు. ఒడుపు తప్పిన మహాసర్పంవలె నిట్టూర్పులు నిగుడిస్తూ ఉన్నాడు.

ఆ సమయంలో రాజు కొలువులో భీమసేను డుండటంచేత ఈ దృశ్యాన్ని చూచాడు. సతికి జరిగిన ఆ అవమానాన్ని సహించలేక అగ్నిహోత్రుడుగా మండాడు. ప్రళయకాల రుద్రాకారంతో మేను పెంచి కీచకుడిని మట్టు పెట్టాలని తలపెట్టి, అతడి ఆనతి మీరలేని మత్స్యపతిని కూడా మడియింపచేయాలని ప్రక్కనున్న మహావృక్షాన్ని పెకలించటానికి చూపులు సారించాడు. భీముడి అసమయ సాహసం వలన అజ్ఞాతవాసం భంగమౌతుందని కంకుభట్టుగా సభలో ఉన్న ధర్మరాజు నిపుణంగా, ఎవరూ బయటివారు తెలిసికొనలేనివిధంగా భీమయత్నాన్ని ఇట్లా వారించాడు.

"వలలుం డెక్కడఁ జూచె నొండెడ నసేవ్యక్ష్మాజముల్ పుట్టవే?
ఫలితం బై వరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ
గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్?"

ధర్మరాజు మాటలలో నిగూఢార్థాన్ని తెలిసికొని భీముడు శాంతించాడు.

సైరంధ్రిగా ఉన్న ద్రౌపది కీచకుడు లాగగా నేలపైబడి, వేడి నిట్టూర్పులు నిగుడిస్తూ, కన్నులవెంట నీరుకారగా, దీనవదనంతో లేచి విరటుడి కొలువులోకి వచ్చింది. కోపాతిశయంతో సమయభంగం మాట మరచి సాగ్రహంగా తన భర్తలకు తగిలి వచ్చేటట్లు మాట్లాడసాగింది. 'మహావీరులు గంధర్వులైదుగురు నాకు భర్తలై ఈవిధంగా ఒకడు నన్ను అవమానం చేస్తుంటే చూస్తూ మిన్నకుండటం ఆశ్చర్యం కాదా! ఇక ఎవరి భార్యలు ఈ రాజ్యంలో మర్యాదగా బ్రతుకగలుగుతారు? ఈ సభలో ధర్మభీతితో ఎవరైనా ఒక మాటైనా మాట్లాడారా? ఈవిధంగా కీచకుడు పతివ్రతనైన నన్ను ఏ ఆడవారినీ అవమానించని విధంగా అవమానిస్తుంటే చూస్తూ కూర్చున్న మీలో కొందరికైనా దయ రాలేదా? ఇందుకు ఈ మత్స్యదేశానికి ప్రభువుగా ఉన్న ఈ రాజు ననాలి. కీచకుడు చేసిన అధర్మాన్ని చూచి దండించకుండా వదిలిపెడతారా?' అని రోషంగా పలికింది. ఆ మాటలకు విరాటుడు మారు పల్కలేకపోయాడు. పైగా కీచకుడిని సాంత్వన వాక్యాలతో సమాధానపరచి పంపాడు. ప్రజ లామె దైన్యానికి సానుభూతి ప్రకటించారు.

ధర్మరాజుకు రోషం వచ్చింది. కాని, నిగ్రహించుకొన్నాడు. నిర్వికారంగా సహజ స్వరంతో ద్రౌపదితో ఇట్లా అన్నాడు. 'ఓవనితా! నీ మాటలన్నీ రాజూ, సభవారూ విన్నారు. ఇంక పలుమాటలు పలుకకుండా సుదేష్ణ సదనానికి వెళ్లుము. నీ పరాభవాన్ని చూచి నీ పతులైన గంధర్వులు కోపించకుంటారా? ఇది సమయం కాదు. నీకైనా, వారికైనా ఇప్పు డేమైనా వారు కోపాన్ని ప్రకటించరు. కాబట్టి నీ పతులను నిందించబోకుము. సభలలో ఇంతసేపు శంకలేకుండా ప్రకటంగా నిలిచి ధిక్కరించటం సమంజసం కాదు' అని ధర్మరాజు హెచ్చరించినా సైరంధ్రి అక్కడినుండి కదలలేదు. అప్పుడు ధర్మరాజు మరలా ఇట్లా మందలించాడు. 'నీవు కులసతీ గౌరవం కించపడేటట్లు ఇట్లా సభలో పలుపోకలతో విచ్చలవిడిగా నాట్యం చేస్తున్న విధంగా మెలగటం తగునా?' అన్నాడు. ఆ మాటకు పాంచాలి సాభిప్రాయంగా సమాధానం చెప్పింది. 'కంకభట్ట! నా భర్త నటుడు. ఆ మాట నిజం. పెద్దవారివలెనే చిన్నవారు కూడా! కాబట్టి నా పతివలెనే నేనూ నటిని కాబట్టి నాకు నాట్యం పరిచయమే. నా భర్త నటుడే కాదు, జూదరి కూడా. ఇక జూదరి ఆలికి మర్యాద ఎక్కడుంటుంది?' అని ఆర్తితో అక్కడినుండి వెళ్లిపోయింది సైరంధ్రి.

అంతఃపురానికి వెళ్ళి జరిగినదంతా ఆ రాణికి చెప్పింది సైరంధ్రి. 'దుఃఖించకు. నేను కీచకుడిని దండిస్తా'నని సుదేష్ణ ఓదార్చింది. ఆమె మాటలు లెక్క సేయకుండా సైరంధ్రి 'నీకెందుకమ్మా అంతకష్టం? కాలాంతకులు నా పతులున్నారు. వారే పగతీర్చుకొంటారులే' అని చెప్పింది. ఆ మాటలకు అంతఃపురంలోని స్త్రీలందరూ భయపడ్డారు. ఆ రాత్రి అందరూ శయనించారు.

## కీచకవధ

ద్రౌపది వంటశాలలో నిద్రిస్తున్న భీముడి వద్దకు రహస్యంగా పోయింది. కరస్పర్శ చేస్తూ మెల్లగా పిలిచి లేపింది. భీమసేనుడు మేల్కొన్నాడు. ఇంత అర్ధరాత్రివేళ ఇక్కడికి ఎందుకొచ్చావని అడిగాడు. తెలిసికూడా నన్నడుగుతావేమిటని తన అవమానగాథనంతా వివరించి చెప్పింది ద్రౌపది. 'మహా బలులైన మీరందరూ ఉన్నా ఆనాడు దుశ్శాసనుడు ఆ సభలో ఆ విధంగా అవమానం చేశాడు. ఆపైన సైంధవు డావిధంగా అనుచితంగా వ్యవహరించాడు. ఇప్పుడు ఈ విధంగా కీచకుడు నన్ను పరాభవించాడు'. 'అని వాపోయింది. ఆ మాటలకు వాయుసుతుడు ఉద్రిక్తుడై 'నన్ను ధర్మరాజు వారించకుండా ఉన్నట్లయితే కీచకుడినీ, మత్స్యపతినీ అక్కడే మట్టుపెట్టి ఉండేవాడిని' అన్నాడు. 'అయితే దానివలన అజ్ఞాతవాస సమయ భంగమయ్యేది. మరలా అరణ్య, అజ్ఞాతవాసాలు చేయవలసివచ్చేది. ఆ విపత్తుకు మనమిద్దరమూ కారకులమయ్యేవారం. అందువలన ధర్మజుడు మనలను వారించాడు. ఆయన సత్యవ్రతనిష్ఠు'డని ద్రౌపది వివరించింది. భీముడి మనసులో ధర్మజుడిపై భక్తి కుదిరేటట్లు ధర్మరాజును కీర్తించింది.

"ఎవ్వని వాకిట నిభమదపంకంబు। రాజభూషణ రజోరాజి నడఁగు,
ఎవ్వని చారిత్ర మెల్లలోకములకు। నొజ్జయై వినయంబు నొఱపుఁ గఱపు,
నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి। మానితసంపద లీనుచుండు,
నెవ్వని గుణలత లేడు వారాసుల। కడపటి కొండపైఁ గలయఁ బ్రాకు,
నతడు భూరి ప్రతాప మహాప్రదీప। దూరవిఘటిత గర్వాంధకారవైరి
వీరకోటీర మణిఘృణి వేష్టితాంఘ్రి। తలుఁడు; కేవల మర్త్యుఁడె ధర్మసుతుడు?"

ధర్మజుడి నాయకత్వంలో ధైర్యాన్ని వీడకుండా ధర్మాన్ని సాధించుమని భీముడిని ప్రోత్సహించింది. భీమ పరాక్రమాన్ని పలువిధాల ప్రశంసించింది. అర్జునాదుల దైన్యానికి జాలిని ప్రకటించింది. సమయభంగం కాకుండా కీచకుడిని చంపకపోతే తాను ఉరి వేసుకొనిగాని, నీట మునిగికాని, అగ్నిలోపడికాని, విషం తినిగాని చనిపోతానని చెప్పింది.

భీముడు చిరునవ్వు నవ్వి ఇట్లా అన్నాడు. 'కమలాక్షీ! కీచకుడిని చంపటానికి నీ వింతగా చెప్పాలా? నిన్ను పరాభవించినవాడు ఇప్పటికీ బ్రతికి ఉండటమే తప్పు. అయినా ఉపాయంతో చంపాలి. వాడు రేపు కూడా నిన్ను సమీపించవచ్చును. నీవు క్రమంగా ఒడబడినట్లు నటించి వాడికి నర్తనశాలను సంకేతస్థలంగా పేర్కొని, ఒంటరిగా రమ్మని నిర్దేశించుము. సంకేతస్థలంలో నీ బదులు నేనే చిమ్మచీకట్లో పరుండి ఉంటాను. కీచకుడు సమీపించగానే, నేను విజృంభించి చంపి నీకు చూపుతాను' -అని నిశ్చయించాడు. ఆ విధంగా జరిగేటట్లు యత్నించుమని చెప్పి ద్రౌపదిని ఆమె శయనమందిరానికి పంపాడు భీముడు.

తెల్లవారింది. సింహబలుడు ద్రౌపదిపైని మమకారంతో మరొకటి చూడలేక వినలేక సింగారం చేసికొని సుదేష్ణ మందిరానికి బయలుదేరివెళ్ళాడు. ఆ మందిరంలో ఆమెను దర్శించి, ఏకాంతంలో మనసు విప్పి మాట్లాడి, ఏవిధంగానైనా అంగీకరించేటట్లుచేసి, దగ్గరికి తీసికొని, ఆ పైని శయ్యకు చేర్చి మన్మథ రాజ్య సాఫల్యాన్ని పొందాలని ఉవ్విళ్ళూరుతూ ఉన్నాడు. దానికి అనుకూలంగా ద్రౌపది కూడా ఒంటరిపాటున కనపడింది. ఆమె ఎదుట తన పరాక్రమాన్ని చెప్పుకొని విరాటనగరంలో తాను కోరిన వనిత వశంకాక తప్పదని ప్రగల్భాలాడాడు. ద్రౌపది కూడా భీముడు చెప్పిన పన్నాగాన్ని మనసులో ఉంచుకొని అతడివైపు మెత్తబడినట్లు చూచింది. మగువలు తమ భంగులు రహస్యంగా ఉండాలని కోరుకొంటారనీ, విచ్చలవిడిగా బాహాటంగా వలపులు వారికి నచ్చవనీ అంటుంది. ఆమె హృదయం కనిపెట్టి కీచకుడు ఆమె చెప్పినట్లే నడుచుకొంటానంటాడు. రాత్రివేళ నర్తనశాల రహస్య వర్తనానికి

అనుకూలంగా ఉంటుందని సూచిస్తుంది సైరంధ్రి. కీచకుడు ఉబ్బితబ్బిబ్బై ఆ రాత్రికే ఒంటిగా నర్తనశాలకు వస్తానని చెప్పి వెళ్ళుతాడు. ద్రౌపది భీముడి కీ సంగతిని నిపుణంగా తెలియపరుస్తుంది. అత డారాత్రికి కీచకుడిని సంహరిస్తానని పరమోత్సాహంగా ప్రతిజ్ఞ చేశా డామెముందు.

చీకటి పడింది. నర్తనశాలలో గాఢాంధకారం అలముకొని ఉన్నచోట, ఉత్తర విశ్రాంతి తీసుకొనే లీలాపర్యంకం మీద భీముడు గుడ్డకప్పుకొని పండుకొని ఉన్నాడు. దానికి దగ్గరలోనే ద్రౌపది చాటుగా నిలువబడి ఉన్నది. కీచకుడు మన్మథోన్మాదంతో సింహముండే గుహాంతర్భాగానికి మాతంగం వచ్చినట్లుగా భీముడిని చేరవచ్చాడు. శయనం మీద సైరంధ్రి ఉన్నట్లు తోచింది. కీచకుడు గగుర్పాటుతో సరసభాషణం మొదలు పెట్టాడు. 'వనితా! నీ కిష్టమైన వస్తువులు కానుకలుగా తెచ్చాను. సంతోషంతో తీసికో! విచిత్రమేమిటంటే ఎప్పుడూ స్త్రీలే నాకు కానుకలు లంచంగా పెట్టి నన్ను పొందుతూ ఉంటారు. నా రూపాన్ని చూచినా, నా లావణ్యాన్ని గమనించినా, నా విలాసాన్ని భావించినా, నా వివేకాన్ని గుర్తించినా ఏ వనిత కూడా నా పొందు విడువలేదు. ఇంతవరకు నేనే వనితల నేలుకునేవాడిని; ఇప్పుడు నీవే నన్నేలుకోవాలి! ఆ గౌరవం నీకొక్కతెకే దక్కుతున్నది' -అని అన్నాడు కీచకుడు.

ద్రౌపదికి కూడా వినపడేటట్లు గొంతు మార్చి కీచకుడితో పరిహాసాలు పలికాడు పవనపుత్రుడు. 'నిన్ను నీవు పొగడుకొనటానికి నీ వంటి వాడికే చెల్లింది. ఇక నాసంగతి నీకు తెలియదు. నావంటి ఆడుది ఎంత వెదకినా నీ కెక్కడా కనపడదు. పొందటం మరీ కష్టం. నా ఒడలికి నీ ఒడలు తాకితే చాలు. అది ఎట్లా ఉంటుందో నీకే తెలిసి వస్తుంది. నన్ను ఏ అబలతోనైనా పోల్చదలుచుకొంటే నీవు తప్పుచేసినట్లే! నను ముట్టి నీవు మరలా వనితల సంగతికి పోగలవా? నేనీ తనువును పొందిన ఫలాన్నీ, చిత్తభవ వికారాలన్నీ ఒక్కసారి చవిచూస్తావు. రా' అని వెంటనే లేచి రోషకఠినమైన హాసంతో విజృంభించి కీచకుడి శిరస్సు వంచి బలంగా కొట్టబోయాడు భీముడు. కీచకుడు వెంటనే విదుల్చుకొని గంధర్వుడని భావించి భీముడిని కాళ్ళు చేతులు పట్టి నేలపై నెట్టాడు. పవనకుమారుడు విజృంభించి కీచకుడిని పట్టాడు. ఇద్దరూ మదేభాలవలె ద్వంద్వయుద్ధం సాగించారు. భీముడు గాఢమర్దన క్రియలతో కీచకుడిని చంపి, కాళ్లూ చేతులూ కడుపులోకి చొప్పించి ముద్ద చేసి భయంకరంగా పడవేశాడు. ఆ వికృతాకారాన్ని ద్రౌపదికి చూపి 'ఇదిగో నా మాట నిలుపుకొన్నాను. నీ అవమానభారాన్ని మాన్పాను ద్రౌపదీ! నీ చింత తొలగిందా? నా భుజబలం నీకు నచ్చిందా? నీకు శాంతి చిక్కిందా? ఈ దుర్మార్గుడి గతి చూచావా? నిన్ను అవమానించదలచుకొన్న ఎంతటి వీరుడిగతి అయినా ఇంతే! ఇది తెలిసి ఆనందించు' అని పలికాడు భీముడు. భీముడిని ఉత్తమనాయకుడిగా కీర్తించింది ద్రౌపది.

## ఉపకీచక వధ

భీముడు వంటశాలకు వెళ్ళాడు. ద్రౌపది నర్తనశాల బయటకు వచ్చి కావలివారలను పిలిచి, కీచకమరణాన్ని ప్రకటించింది. ఉపకీచకులూ కీచక శవాన్ని గమనించారు. ద్రౌపదియే దీనికి కారణమని భావించి ఆమెను తెచ్చి అతడి శవానికి కట్టి శ్మశానానికి తీసికొని శోకిస్తూ ఎలుగెత్తి వెళ్ళసాగారు. ద్రౌపది గంధర్వులను పిలిచింది; రక్షించండని రోదించింది. ఆ సంగతి గమనించిన భీముడు ఉపకీచకులను సంహరించి, ద్రౌపదిని విడిపించి రహస్యంగా తన వంటశాలకు చేరాడు. ద్రౌపది సుదేష్ణ మందిరానికి చేరింది.

విరాటుడు కీచకోపకీచకుల మరణవార్త విని భార్యతో సహా విచారించాడు. సైరంధ్రిని అంతఃపురం నుండి పంపివేయడానికి నిశ్చయించాడు. ఆ పని సుదేష్ణకు అప్పగించాడు. కాని, సైరంధ్రి పదమూడు రోజులు మాత్రమే అంతఃపురంలో ఉండటానికి అనుమతి కోరింది. అట్లా చేస్తే గంధర్వులు మేలు చేస్తారనీ లేకపోతే ఆగ్రహిస్తారనీ చెప్పింది. సుదేష్ణ భయంతో మారుమాటాడలేక ఆమె కోరికను అంగీకరించి, అంతఃపురంలో ఉండటానికి అంగీకరించింది.

## దుర్యోధనుని దురాలోచన

పాండవుల అజ్ఞాతవాసాన్ని భగ్నం చేయాలని దుర్యోధనుడి దుర్మంత్రం. నలుదిక్కులా చారులను పంపాడు. వారు పాండవుల తెరగును గుర్తించలేక నిరాశతో తిరిగి వచ్చారు. అయితే, 'మత్స్యదేశంలో కీచకుడినీ, ఉపకీచకులనూ ఒక స్త్రీ

కారణంగా నడిరేయి గంధర్వులు అతి విచిత్రంగా, భయంకరంగా చంపారు. విరాటు డెంత ప్రయత్నించినా గంధర్వులు కనపడలేదట' అని విన్నవించుకొన్నారు. దుర్యోధనుడు కర్ణ దుశ్శాసన శకునులతోనూ భీష్మాదులతోనూ చర్చలు జరిపాడు. ధర్మరా జెక్కడ ఉంటే అక్కడ దేశం సుభిక్షంగా ఉంటుందనీ, గోధనం అధికంగా పెంపొందుతుందనీ, పాడి సమృద్ధిగా ఉంటుందనీ భీష్ముడు తెలియజెప్పాడు. అప్పటి దేశాలన్నింటిలో మత్స్యదేశం సుభిక్షంగానూ, సమృద్ధంగానూ ఉన్నట్లు చారుల వలన గ్రహించారు. మరొక నిదర్శనం. బాహుయుద్ధంలో సింహబలుడు, భీమసేనుడు, శల్యుడు, బలరాముడు సమాన బలురు. కాబట్టి, గెలుపు ఈ నలుగురిలోనే ఒకరిపై మరొకరికి కలుగుతుంది. ఈ విధంగా ఊహించగా కీచక మర్దనుడు భీముడే కావచ్చునని నిశ్చయించారు. మత్స్యదేశంలో పాండవుల ఉనికిని దుర్యోధనాదులు శంకించారు.

దుష్టచతుష్టయం ఒక పన్నాగం సిద్ధం చేసింది. మొదట విరాటుని గోధనాన్ని అపహరించాలి. దానిని రక్షించటానికి మారువేషాలలో ఉన్న పాండవులు బయటపడతారు. పోరు చేస్తారు. వారిని గుర్తించి మరలా అరణ్య, అజ్ఞాతవాసాలకు పంపాలి అని వ్యూహం పన్నారు. మొదట సుశర్మ దక్షిణదిశగా విరాటనగరాన్ని ముట్టడించి గోవులను హరించాలి. దానితో విరటుడు ససైన్యుడై ఆ వైపు నడచి యుద్ధాన్ని సాగిస్తాడు. వెనువెంటనే ఉత్తరదిశగా కౌరవులు దాడి చేసి గోవులను హరించాలి. ఆ సమయంలో గోధనాన్ని, రాజును, తమను రక్షించుకొనడానికి పాండవులు బయటపడి యుద్ధానికి రాకమానరు. వ్రతభంగానికి పాల్పడకమానరని చిక్కని చక్కని రచన చేసికొని దుర్యోధనుడు గోగ్రహణ ద్వయ యాత్రలకు రణభేరి మ్రోగించాడు.

## దక్షిణ గోగ్రహణం

బహుళాష్టమినాడు సుశర్మ దక్షిణ గోగ్రహణం చేశాడు. సుశర్మ సైనికులచేత దెబ్బలు తిన్న గోపాలురు విరాటుడికి గోగ్రహణ వృత్తాంతాన్ని విన్నవించుకొన్నారు. విరాటుడు సుశర్మ సాహసానికి కోపించి రాజధానిలో రణభేరి మ్రోగించి సైన్యాన్ని క్షణాలలో సమీకరించాడు. స్వయంగా తాను రథమెక్కి ఊరి వెలుపల సిద్ధమైనాడు. అతడి వెంట అతడి తమ్ముడు శతానీకుడు, అతడి తమ్ముడు మదిరాశ్వుడు, అతడి అనుజుడు సూర్యదత్తుడు రథాలతో సిద్ధమైనారు. మత్స్యభూపాలుడి పెద్దకొడుకు శంఖుడు సైన్యాలన్నింటినీ మోహరించి విభీషణ శంఖాన్ని పూరించాడు. అందరూ యుద్ధయాత్రకు సిద్ధమయ్యారు.

అంతలో కంకుభట్టు విరాటుడితో ఒక మనవి చేసికొన్నాడు. తాను, వలలుడు, దామగ్రంథి, తంత్రీపాలుడు కూడ శస్త్రాస్త్రప్రయోగాలు తెలిసినవారు కాబట్టి యుద్ధానికి రథాలపై తీసికొనిపోవట ముచితమని పేర్కొన్నాడు. ఆ రాజు సంతోషించి వారందరికీ సముచిత రథాల నిచ్చి తమలో కలుపుకొని యుద్ధయాత్ర సాగించాడు.

విరాట సుశర్మల సైన్యాలు సంకులంగా సమరం చేశాయి. విరాట విజృంభణం సుశర్మకు భారమైంది. సుశర్మ విరాటుడి మీద రథాలతో దొమ్మియుద్ధం చేసి అతడి తేరు విరుగగొట్టి బందీగా పట్టి తన రథం మీద పెట్టి సమరాన్ని సాగించాడు. ధర్మరాజు దానిని గమనించి భీముడిని హెచ్చరించి తమ కాశ్రయ మిచ్చిన విరాటుడిని విజయుడిని చేయుమని ఆదేశించాడు. అయితే, భీముడు వృక్షాలను పెకలించి భీకరయుద్ధం చేసి తన ఉనికిని బయటపెట్టుకొనకుండా నకుల సహదేవులు చక్రరక్షకులుగా గదా, చక్ర, కోదండాలతోనే పోరి విజయం సాధించాలని నిర్దేశించాడు. భీముడు ధర్మజాదులు చూస్తుండగానే సుశర్మ సైన్యాన్ని కార్చిచ్చువలె చుట్టుముట్టి ఊచకోత కోశాడు. వేల రథాలను నేలమట్టం చేశాడు. ధర్మజుడు కూడా బాణాలతో సుశర్మ సైన్యాలను ధ్వంసం చేశాడు. విరటుడు తప్పించుకొని భూమి మీదకు దూకి గదతో యుద్ధాన్ని ఆరంభించాడు. సుశర్మ రథాన్ని విరగగొట్టాడు. భీముడు సుశర్మ రథం మీదకు దూకి అతడిని పెడరెక్కలు విరిచి కట్టి బంధించాడు. అతడి సేనానులు భయంతో కొందరు పారిపోయారు; మిగిలినవారు లొంగిపోయారు. పాండవుల కారణంగా విరాటుడికి విజయం లభించింది.

విరటుడు ధర్మజుడికి కృతజ్ఞతలు తెలుపుకొన్నాడు. 'నీవు నా మానాన్ని, ప్రాణాన్ని కాపాడావు. దీనికి తగిన బహుమానాన్ని నేనే మివ్వగలను? నా సింహాసనాన్నే నీవు స్వీకరించుము. ఈ శరీరం ఈ సంపద ఈ రెండూ నీ విచ్చినవే ఇప్పుడు. కాబట్టి ఆ రెంటినీ నీకే సమర్పిస్తాను. స్వీకరించి మత్స్యదేశాన్ని రక్షించుము. నాచేత సేవలు కొని నన్ను మన్నించుము' అని వేడికొన్నాడు.

ధర్మరాజు వినయంగా 'నేను మీ దేశంలో ఉన్నాను. మీ ప్రాపున ఉన్నాను. మిమ్మల్నీ, మీ దేశాన్నీ రక్షించటం నా ధర్మం. ఇందులో నన్ను ప్రత్యేకంగా పొగడవలసిన అవసరం లే' దని పేర్కొన్నాడు. కంక, వలల, దామగ్రంథి, తంత్రీపాలుల యుద్ధనైపుణ్యాన్ని విరటుడు మెచ్చుకొన్నాడు. ధర్మజుడు చేసిన సహాయానికి కోరిన కోర్కె తీర్చి ఋణ విముక్తుడ నౌతానని విరటుడన్నాడు. దానికి ధర్మరాజు సుశర్మను సపరివారంగా క్షమించి విడిచిపెట్టుమని కోరాడు. విరటుడు సంతోషంగా అంగీకరించి దానిని అమలు చేశాడు.

గోధనం తిరిగి చేతికి లభించింది. విరటుడు విజయోత్సవాన్ని నగరంలో జరుపుకొనటానికి చారుల చేత కబురు పంపాడు. విరాటనగరం విజయోత్సవ శృంగారాలతో కళకళలాడుతున్నది.

## ఉత్తర గోగ్రహణం

నవమినాడు ఉదయమే దుర్యోధనుడు భీష్మద్రోణకృపాదులైన వీరులందరూ కలసిరాగా అపారసైన్యంతో ఉత్తరదిక్కున విరాటుడి గోవులను ముట్టడించి మరలించి హస్తినవైపు తోలుకొనిపోసాగాడు. ఆ విపత్తును గవాధ్యక్షుడు రాజధాని అంతః పురంలో ఉన్న భూమింజయుడిని దర్శించి విన్నవించుకొన్నాడు. అపార కురుసైన్యాన్ని ఎదుర్కొని గోధనాన్ని రక్షించుకొని అభిమానాన్ని కాపాడుకొమ్మని కోరాడు. ఉత్తరుడు కౌరవులపై దాడి వెడలటానికి సిద్ధమయ్యాడు. కాని, తగిన సారథి నగరంలో లేడని తెలిసికొన్నాడు. సారథిని సమకూర్చండని ఆజ్ఞాపించాడు. తగిన సారథియే కనుక దొరికితే దుర్యోధన, భీష్మ, కర్ణ, కృప, ద్రోణాశ్వత్థామాది వీరులందరితో రణరంగంలో పార్థుడివలె పోరి గోవులను అవలీలగా తిరిగి తెస్తానని ప్రకటించాడు.

ఆ మాటలు ద్రౌపది విన్నది. అప్పు డేర్పడిన క్లిష్టపరిస్థితిని పేడిరూపంలో ఉన్న అర్జునుడికి చెప్పింది. అజ్ఞాతవాసకాలం ఆ రోజుతో ముగుస్తున్నదని గమనించి పార్థుడు తన సారథ్యానికి ఉత్తరుడు ఒప్పుకొనేటట్లు చేయుమని ద్రౌపదిని కోరాడు. ఆమె బృహన్నల రథచోదనశక్తిని గురించి ఉత్తరకు చెప్పి, ఆమెఅన్న అయిన ఉత్తరకుమారుడికి నివేదించుమన్నది. పూర్వం ఖాండవ దహన సమయంలో బృహన్నల అర్జునుడికి రథసారథిగా ఉండి విజయాన్ని సాధించటానికి తోడ్పడ్డాడని ఉత్తర ఉత్తరకుమారుడితో చెప్పింది.

భీష్మాదులతో యుద్ధం చేయబోతూ పేడివాడిని సారథిగా పెట్టుకొంటే అపహాస్యాల పాలౌతానని ఉత్తరుడు మొదట ఒప్పుకొనలేదు. కాని, ద్రౌపది కూడా బృహన్నల నేర్పును చెప్పి ఒప్పించటంతో అంగీకరించాడు. ఉత్తర బృహన్నలను రథసారథిగా ఉండటానికి కోరింది. ఉత్తరుడు కూడా అతడిని ఆహ్వానించాడు. అర్జునుడివలె తనకూ విజయాన్ని కలిగించుమని కోరాడు. బృహన్నల రథాన్ని ఆయత్తం చేశాడు. ఉత్తర తనకు కురువీరుల తలపాగాలను బొమ్మపొత్తిళ్ళుగా తెచ్చి పెట్టుమని బృహన్నలను కోరుకొన్నది. అందుకు బృహన్నల అంగీకరించాడు. ఉత్తరుడు రథమెక్కాడు. ఉత్తరదిశగా రథాన్ని పోనిచ్చాడు బృహన్నల.

నగరం వెలువడుతున్నది రథం. గోవులను తరలించుకొని వెళ్ళుతున్న కౌరవసైన్యం వలన రేగిన ధూళి ఆకాశాన్నంతా జేవురురంగుతో అవరించుకొని ఉన్నది. ఎట్టఎదుట కౌరవసేన భీషణంగా నిలువబడి ఉన్నది. ఉత్తరు డాసేనను చూచి నిలువెల్లా కంపించిపోయాడు. తడబడుతూ ఇట్లా అన్నాడు:

"భీష్మద్రోణ కృపాది ధన్వి నికరాభీలంబు, దుర్యోధన
గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు, శస్త్రాస్త్రజా
లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం, బుదగ్రధ్వజా
ర్చిష్మత్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే?"

'ఆ మహావీరుల ముందు నేనెంత, నా బలమెంత? కౌరవ బలమింత ఉంటుందని తెలియక యుద్ధానికి వచ్చాను. ఎదుర్కొనే ధైర్యం నాకు లేదు' అని గడగడ వణుకుతూ రథాన్ని వెనక్కు త్రిప్పుమన్నాడు ఉత్తరకుమారుడు.

బృహన్నల అతడికి నగరంలో చేసిన ప్రతిజ్ఞలను జ్ఞాపకం చేశాడు. 'విజయం దేవుడెరుగు, పసులమాట దయ్యమెరుగు, పడతుల సంతోషం ముఖ్యం కాదు. వీరితో నేను యుద్ధం చేయలే' నని నీరు కారిపోయి మాట్లాడాడు ఉత్తరుడు. అప్పుడు బృహన్నల ఉత్తరకుమారుడికి ధైర్యం చెప్పాడు. ఉత్తమవీరుడుగా విజృంభించి కురువీరులమీద విజయాన్ని సాధించటం కార్యం కాని, వెనుదిరిగి పోవటం కాదని నచ్చచెప్పటానికి ప్రయత్నించాడు. ఒంటరిగా యుద్ధం చేయలేనని ఉత్తరుడు వెనుకాడాడు. 'ధైర్యం తెచ్చుకొని కౌరవ సైన్యాన్ని ముట్టడించి గోవర్గాన్ని కొనిపోవాలి కాని ఈ భయమెందుకు? సైరంధ్రి నన్ను గురించి చెప్పిన తరువాత సారథిగా ఎన్నుకొన్నావు. నేను నొగలెక్కిన తరువాత మడమ త్రిప్పటమనే మాట ఉండకూడ' దని రథాన్ని విప్పచ్చుడు ముందుకు పోనిచ్చాడు.

ఉత్తరుడు భయకంపితుడయ్యాడు. 'పారిపోతే పౌరులు నవ్వుతారని ప్రాణాలు పోగొట్టుకొంటానా? నన్ను ఆపబోకుము నీకంత క్రొవ్వు అరగకపోతే యుద్ధం చేయి' అని బాణాలూ విల్లంబులూ రథంమీద పడవేసి నేలమీదకు దూకి సిగ్గువదలి పురంవైపు పరుగు తీయటం ప్రారంభించాడు. బృహన్నల గుర్రాలను ఆపి, నొగలు దూకి ఉత్తరుడిని పట్టి తీసికొని రావటానికి అతడి వెంట పరుగెత్తసాగాడు.

బృహన్నల ఆకారాన్నీ గమనాన్నీ గమనించి కౌరవులు అనుమానంలో పడ్డారు. రూపం పౌరుషం, తీరు స్త్రైణం. బాహువుల వైనం నడిచే వైఖరి అర్జునుడిది. బహుశః పార్థుడు అజ్ఞాతవాసంలో ఈ వేషంలో ఇక్కడ ఉన్నాడేమో! దక్షిణ గోగ్రహణానికి సారథులందరు పోగా మిగిలిన ఇతడిని పట్టుకొని ఉత్తరుడు తెచ్చాడేమో! కౌరవ సైన్య బలాబలాలు తెలియక మొదట రథమెక్కి వచ్చినా రాజకుమారుడు భయపడి తిరిగి పోతున్నాడేమో-నని పరిపరివిధాల భావించటం మొదలుపెట్టారు కౌరవవీరులు.

మదకరి గమనంతో అర్జునుడు సాగి ఉత్తరుడిని నిలువరించాడు. ఉత్తరుడు వెలవెలపోయాడు. నోట తడియారి తల్లడిల్లాడు. శరీరమంతా చెమటలు కారిపోయాయి. కాళ్ళూ చేతులూ గజగజ వణికిపోయాయి. గుండె దడదడ కొట్టుకొన్నది. దీనదృష్టులతో కంపించిన గొంతుతో తనను వదలిపెట్టుమని బృహన్నలను వేడుకొన్నాడు. వదలితే విలువైన కానుక లిస్తా నన్నాడు. తన కొరకు ఆతురతతో ఎదురు చూచే అమ్మ దగ్గరకు తొందరగా వెళ్ళాలన్నాడు. ఇట్లా ఎన్నో రకాలుగా దీనాలాపాలను చేస్తున్న ఉత్తరుడికి అర్జునుడు ధైర్యం చెప్పి, కురువీరులతో యుద్ధం తానే చేస్తాననీ, ఉత్తరుడిని రథసారథ్యం చెయ్యుమనీ కోరాడు. అతడంగీకరించక పోయినా బలవంతాన నొగలమీద కూర్చుండబెట్టి శమీవృక్షంవైపు రథాన్ని పోనిచ్చాడు.

పేడిరూపంలో ఉన్నా ప్రతాపతేజుడివలె నివురుగప్పిన నిప్పువలె ఉన్న బృహన్నలను అర్జునుడిగా అనుమానించారు భీష్మద్రోణులు. అజ్ఞాతవాసం గడువు పూర్తికాకుండా బయటపడుతున్నాడేమిటని ద్రోణుడు భీష్ముడిని అడిగాడు. భీష్ముడు కాలాన్ని లెక్కగట్టి గడువు ముగిసిందనీ, ప్రతాప ప్రకటనకు సమయం ఆసన్నమైందనీ గూఢంగా హెచ్చరించాడు. ఆచార్యుడు అర్జునుడికి సమయభంగం లేదని గ్రహించాడు.

"సింగం బాకటితో గుహాంతరమునం జేడ్పాటు మై నుండి మా
తంగ స్ఫూర్జిత యూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్."

'అర్జునుడితో సమానంగా పోరగలిగిన వీరులు మనలో ఉన్నారా? అనేదే అనుమానం. పరమేశ్వరుడిని ప్రీతుడిని చేసి పాశుపతాస్త్రాన్ని సంపాదించాడని విన్నాం. అతడికి ఆవులను మరలించటం అవలీల'.

ఆ మాటలు విని కర్ణుడు కటకట పడ్డాడు. పాండవ పక్షపాతంతో ఆచార్యుడు పార్థుడిని పొగడాడని ఈసడించుకొన్నాడు. అర్జునుడే కనుక వస్తే యుద్ధంలో బాణాలతో సమాధానం చెపుతానని బీరాలు పలికాడు. దుర్యోధనుడు అర్జునుడిని గుర్తించి మరల పాండవులను అరణ్య, అజ్ఞాతవాసాలకు పంపుదామని హెచ్చరించాడు. భీష్మద్రోణాశ్వత్థామలు వారి మాటలకు తమలో తాము నవ్వుకొని ఊరకున్నారు.

అర్జునుడు శమీవృక్షం దగ్గర రథం ఆపాడు. ఉత్తరుడిని ఆ వృక్షం ఎక్కించి ఆయుధాల మూటలోనుండి గాండీవాన్నీ, అక్షయతూణీరాలనూ తీయించాడు. తాను అర్జునుడి నని ఉత్తరుడికి తెలియబలికాడు. అజ్ఞాతవాసవ్రతకాలం పూర్తి కావటంతో నిజతేజోరూపాన్ని మరల పొందాడు. గాండీవధారియై రథమెక్కాడు.

ఉత్తరుడు బృహన్నలను అర్జునుడిగా తెలిసికొని పరమానందభరితుడయ్యాడు. తెలియక పలికిన పలుకులకు మన్నింపుమని వేడుకొన్నాడు. అర్జునుడు ఉత్తరుడిని వాత్సల్యంతో కౌగిలించుకొన్నాడు. పార్థుడి రథానికి సారథిగా ఉండాలని ఉత్తరుడి మనసులో ఎప్పటినుండో కోరికగా ఉండేది. అది ఈనాటికి తీరిందని సంతోషపడ్డాడు. అర్జునుడు రథారూఢుడై గాండీవాన్ని చేపట్టి గుణధ్వని చేశాడు. దేవదత్తాన్ని పూరించాడు. దిక్కులు దద్దరిల్లాయి. కపిధ్వజం రెపరెపలాడింది. కిరీటం సూర్యకాంతులను ప్రసరించింది. కౌరవవీరులు అర్జునుడిని గుర్తించారు. ఇక యుద్ధం తప్పదనుకొన్నారు.

అప్పుడు ద్రోణాచార్యుడు దుర్యోధనుడిని పిలిచి 'ఇక పార్థుడు పరాక్రమాన్ని ప్రదర్శించబోతున్నాడు. అందరూ ఇక యుద్ధానికే సిద్ధంకం' డని హెచ్చరించాడు. 'అజ్ఞాతవాసకాలం పూర్తికాకుండా పాండవులను గుర్తించి మరల అరణ్యాజ్ఞాతవాసాలకు పంపాలనే గదా ఇంతయత్నం చేసింది. దీనికి విచారపడవలసిన పనిలేదు' అని అన్నాడు సుయోధనుడు. ద్రోణాచార్యులను అధిక్షేపించాడు. అర్జునుడి పరాక్రమాన్ని ప్రశంసించిన కృపాచార్యుడిని కర్ణుడు తూలనాడాడు. అందుకు అశ్వత్థామ ఆగ్రహించాడు. దుర్యోధనుడు వారందరినీ సమాధానపరిచి భీష్ముడివద్దకు వెళ్ళి పాండవులకు అరణ్య అజ్ఞాతవాస కాలం పూర్తి అయిందా? తెలియజెప్పుమన్నాడు. భీష్ముడు పూర్తి అయిందని నిష్కర్ష చేశాడు. గడువు పూర్తి అయిన తరువాత అడుగు ముందుకు వేస్తున్న అర్జునుడిని తక్కువ అంచనా వేయవద్దని హెచ్చరించాడు. ఇట్లా హితవు కూడా చెప్పాడు.

"వచ్చినవాడు ఫల్గునుఁ డవశ్యము గెల్తుమనంగ రాదు; రా
లచ్చికి నై పెనంగిన బలంబులు రెండును గెల్వవచ్చునే?
హెచ్చుగుఁ గుందగుం; దొడరు టెల్ల విధంబుల కోర్చు; టట్లుగా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొందగు చేతయుం దగున్."

ఈ మాటలకు సుయోధనుడు చిరునవ్వు నవ్వి 'మనకూ పాండవులకూ పొత్తు కుదరదు. నేను రాజ్యభాగ మీయను. యుద్ధం చేసి పరాక్రమాన్ని ప్రదర్శించటమే నా ఇష్టం' అని స్పష్టం చేశాడు.

భీష్మాదులు చిన్నబుచ్చుకొన్నారు. కవ్వడి గాండీవ గుణధ్వని కౌరవవీరులకు హెచ్చరిక చేసింది. అందరూ వ్యూహం పన్ని సమరానికి సన్నద్ధమయ్యారు.

అర్జునుడు ముందుగా గోవులను మళ్ళించి, ఆ తరువాత వ్యూహంలో ఉన్న కురువీరులపై దాడి చేయాలని నిశ్చయించాడు. భీష్మద్రోణులకు నమస్కార బాణాలను యోగక్షేమ బాణాలను పాదాల వద్ద చెవులవద్ద పడేటట్లు వేసి వారి వాత్సల్యాన్నీ ప్రశంసలనూ చూరగొన్నాడు. ఆ తరువాత అర్జునుడు కౌరవసైన్యంమీద విరుచుకపడ్డాడు. అందరినీ రక్తసిక్తం చేశాడు శరపరంపరలతో.

"శక్తి స్ఫార ధనంజయాయత భుజాసంరంభ గాండీవని
ర్ముక్త క్రూర శరావలీ దళిత శత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్ర కుసుమశ్రేణీ విలాసోల్లస
ద్రక్తాశోక తరు వ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెం గడున్".

కౌరవ సైన్యవ్యూహంలో అర్జునుడు మధ్యభాగంలో ప్రవేశించి సేనను రెండు పాయలుగా చీల్చాడు. ఆ మీద అడ్డంగా దాడి చేశాడు. నాలుగు మూలలా కలయ తిరిగాడు. పెక్కురకాల రథచంక్రమణ విధానాలను ప్రదర్శించి పార్థుడు సైన్యాన్ని కలతపెట్టాడు. ఒక సముద్రంలో మహామత్స్యం విచ్చలవిడిగా విహరిస్తూ సంక్షోభాన్ని కలిగించినట్లయింది అర్జునుడి యుద్ధ రథయాత్ర.

అర్జునుడు మహావీరులపై బాణాలు సంధించాడు. ద్రోణాచార్యుడిని డెబ్బై బాణాలతో కొట్టాడు. అశ్వత్థామను ఏడు బాణాలతో చరిచాడు. కృపాచార్యుడిని పది బాణాలతో బాదాడు. దుశ్శాసనుడిని పదునైదు బాణాలతో కొట్టాడు. శకునికి ఎనిమిది బాణాల రుచి చూపించాడు. భీష్ముడి మీద అరవై బాణాలను అనుసంధించాడు. కర్ణుడి సారథిని, గుర్రాలను చంపి, మర్మాంగాలు ఛేదించేటట్లు అతడిని కొట్టాడు. ఆ దెబ్బకు తట్టుకోలేక కౌరవవీరులు తల్లడిల్లారు. భీష్ముడి అండన చేరి తల దాచుకొన్నారు. భీష్ముడు వారినందరిని పురికొలిపి యుద్ధాన్ని ముమ్మరం చేశాడు.

అర్జునుడు కర్ణుని ఢీకొనాలని యత్నించాడు. నడుమ చిత్రాంగదాది కురుకుమారులు చాలామంది కలిసి అడ్డుపడ్డారు. వారిలో కొందరిని పార్థుడు ఓడించాడు. కొందరిని చంపాడు. కర్ణుడి తమ్ముడు సంగ్రామజిత్తు విప్పచ్చుడి మీదకు వచ్చాడు. కాని, అతని చేతిలో చచ్చాడు. తమ్ముడి చావు చూచి కోపించి కర్ణుడు అర్జునుడిపై విజృంభించాడు. పోరు ఘోరంగా సాగింది. నరుడి రథ తురగాలను నాలుగు బాణాలతో కొట్టాడు కర్ణుడు. ఉత్తరుడిని ఆరు బాణాలతో, రథాన్ని ఎనిమిది బాణాలతో, టెక్కాన్ని పది బాణాలతో, అర్జునుడి శరీరాన్ని అరవై బాణాలతో కొట్టాడు. అర్జునుడికి రోషం పొంగింది. కర్ణుడి శిరాన్ని, లలాటాన్ని, కంఠాన్ని, బాహువులను, వక్షఃస్థలాన్ని బాణాలతో గుప్పించాడు. ఆ ధాటికి ఓర్వలేక కర్ణుడు రణరంగాన్ని వీడి వెళ్ళిపోయాడు. అతడిని చూచి నవ్వుతూ అర్జును డిట్లా అన్నాడు: 'వీ డొకడు కురుబలంలో నేనే మహావీరుడిని - అంటాడు. వీడి పరాక్రమం ఇట్లా నీరుగారింది.'

అర్జునుడు రథాన్ని ద్రోణాచార్యుడివైపు మళ్లించుమన్నాడు ఉత్తరుడితో. ఎర్రని గుర్రాలు కట్టి రథం మీద వీరమూర్తివలె నిలుచున్న ద్రోణుడికి సూటిగా రథం సాగింది. పార్థుడు గురువుకు నమస్కరించాడు. 'చాలా కాలం అడవులలో ఉండి అగచాట్లు పడ్డాం. ఇప్పుడు యుద్ధం చేసే అవకాశం దొరికింది. మాయందు దయచూపండి' -అని ప్రార్థించాడు. ముందు మీరు బాణం వేస్తే కాని నేను వేయను' అని అర్జును డనగానే ద్రోణుడు ఇరవై వాడిబాణాలు కిరీటిపై సంధించాడు. వాటి నతడు మధ్యలోనే విరుగకొట్టాడు. ఇరువురూ మత్తేభాల వలె ఢీకొన్నారు. ఇంద్రాగ్ని వాయు వరుణాది దేవతాకాలైన బాణా లొకరిపై మరొకరు వేసికొన్నారు. విరుగుడు అస్త్రాలను కూడా ప్రయోగించుకొన్నారు. యుద్ధభూమంతా చీకట్లు క్రమ్మినట్లయింది. భయంకర యుద్ధం ఇరువురి మధ్య సాగింది. అర్జునుడి యుద్ధం ముందు గురుడుగాని, హరుడు గాని నిలువగలరు గాని మరొకరికి సాధ్యమౌతుందా? అని దేవతలు మెచ్చుకొన్నారు. ద్రోణుడిని బాణాల వెల్లువలో పార్థుడు ముంచాడు. సైనికులు హాహాకారాలు చేశారు. అంతలో అశ్వత్థామ తన తండ్రికి తోడువచ్చి అర్జునుడిపై బాణాలు గుప్పించాడు. అతడు కూడా రెట్టించి గుప్పించాడు. ఇరువురి నడుమా మహేంద్ర వృత్రాసురుల యుద్ధంవలె పోరు సాగింది. అశ్వత్థామ తూణీరాలు ఓటువోయాయి. అర్జునుడి అక్షయ తూణీరాలు పెంపుగాంచాయి.

అశ్వత్థామను వదలి అర్జునుడు కృపాచార్యుడిని ఢీకొన్నాడు. ఇరువురికీ సంకులంగా సమరం జరిగింది. పార్థుడు పంతంతో కృపాచార్యుడి రథం విరుగగొట్టాడు. అతడు అశ్వత్థామరథమెక్కి తొలగిపోయాడు. అడ్డం వచ్చిన సైన్యాన్ని నురుమాడుతూ విజయుడు భీష్ముడివైపు రథం పోనిచ్చాడు. మదించిన ఆబోతులవలె రంకెలు వేసికొంటూ తాతా మనుమడూ శరయుద్ధంలో కలియబడ్డారు. పితామహుడు వివిధాస్త్ర ప్రయోగాలు చేస్తే వాటిని విప్పచ్చుడు విఫలం చేశాడు. పై పెచ్చు భీష్ముడి విల్లును రెండుసార్లు విరుగగొట్టాడు. రెండవసారి మరొక విల్లందుకొనేలోగా అతడి వక్షంలో బాణాలు నాటాడు. వాటికి భీష్ముడు ఒరిగి పడబోయి రథకంబాన్ని ఆలంబనంగా చేసికొని నిలబడ్డాడు. ఆ స్థితిలో సారథి భీష్ముడి రథాన్ని ప్రక్కకు తీసికొనిపోయాడు.

అర్జునుడు గాండీవ గుణాన్ని మ్రోగించుకొంటూ భుజబలం ప్రదర్శిస్తూ రథంమీద నిరాఘాటంగా పోతుంటే కర్ణ కృపాచార్యాది ప్రభృతులందరూ కళ్ళప్పగించి చూస్తూ నిలుచుండిపోయారు.

విజయుడు క్రమంగా - తమ్ములూ ఆప్తభృత్యులు పరివేష్టించి ఉండగా మధ్యలో దుర్యోధనుడు నిలిచి ఉన్న చోటుకు రథాన్ని పోనిచ్చాడు.ముందుగా రెండు బాణాలు వక్షఃస్థలం మీద కొట్టాడు. దుర్యోధనుడు బొమలు ముడిచి వాడి బాణాన్ని పార్థుని నొసలిపై నాటాడు. ఇంతలో వికర్ణుడు ఒక భద్రగజం మీద కెక్కి అర్జునుడికి అడ్డం వచ్చాడు. క్రుద్ధుడై అర్జునుడు ఒక్క బాణంతో ఏనుగును కూలగొట్టాడు. వికర్ణుడు వెల్లకిలబడి లేచి పరుగెత్తాడు. దుర్యోధనుడిని శరపరంపరతో ముంచెత్తుతున్నాడు విప్వచ్చుడు. రారాజు వెనుకంజ వేస్తున్నాడు. రాజును రక్షించుకొనటం వీరుల బాధ్యతగా గుర్తించండని ఎలుగెత్తి చాటుతున్నాడు కర్ణుడు. ద్రోణాదు లతడి మాటలు పట్టించుకొనే స్థితిలో లేరు. అర్జునుడు దుర్యోధనుడిని సంబోధించి ఇట్లా అధిక్షేపించటం మొదలు పెట్టాడు: 'ఓ కౌరవరాజా! వీరక్షత్రియుడు యుద్ధంలో ఓడి ఇట్లా పారిపోతాడా? నేనా చిన్నవాడిని! అభిమానివిగా, బలదర్ప సమగ్రుడివిగా పేరొందిన నీవు మిత్రులతో సహా ఇట్లా పలాయనం చిత్తగిస్తే బలవంతులు మెచ్చుతారా? ఇరుగడలా పెక్కేనుగులు కదలి వస్తూంటే రేపు పురవీథులలో నీవు భద్రగజం మీద ఊరేగవద్దా? భూషణాలంకారాలతో, కస్తూరీ చందనాదులతో రేపు నిండు సభలో గండుమీరవద్దా? మనోహర చతురాంగనలతో నీవు మదన లీలల్లో తేలియాడవద్దా? ఇట్లా యుద్ధంలో ఓడి తిరిగిపోయేదానికన్నా తనువు చాలించటం మంచిది. ఇది రణరంగం. జూదమాడే నేర్పు ఇక్కడ సాగదు సుమా! నీవంటి వాడు వెనుదిరిగి పరుగెత్తటమా? నిలు నిలు' మని విజయుడు రారాజును ములుకులవంటి మాటలతో ఎత్తిపొడిచాడు.

ఆ మాటలకు అభిమానపడి సుయోధనుడు వెనుదిరిగి యుద్ధం చేయ నారంభించాడు. భీష్మాదులు కూడా ఆయనకు సాయంగా నిలిచారు. పోరు సంకులంగా సాగింది. పార్థుడు ఉత్తర మాటలు తలచి సమ్మోహనాస్త్రాన్ని సంధించాడు. వీరులందరు మూర్ఛలో మునిగిపోయారు. అప్పుడు ఉత్తరుడిని దుర్యోధనాదుల తలపాగాలను తెచ్చి భద్రపరుచుమని, ఉత్తరకుమారికి బొమ్మపొత్తికలుగా బహూకరించవచ్చునని నిర్దేశించాడు. భీష్ముడి జోలికి వెళ్ళవద్దన్నాడు. ఉత్తరుడు తలపాగాలు తెచ్చి రథంమీద పెట్టాడు. భీష్ము డంతలో ఒడలు తెలిసి అర్జునుడిపై బాణాలు గుప్పాడు. పార్థుడు గూడ తాతను నొప్పించి దూరంగా రథాన్ని నడిపించి విరామప్రాంతంలో నిలిపాడు.

దుర్యోధనాదులు సమ్మోహనాస్త్ర భ్రాంతి నుండి మేల్కొని యుద్ధానికి సిద్ధమవుతుండగా భీష్ముడు వారి తలపాగాలు లేని విషయం తెలియజెప్పి, ఒడలు తెలియనప్పుడు అర్జునుడు ప్రాణాలు తీయనందుకు అభినందించాలని నచ్చచెప్పాడు. కౌరవుల ప్రాణాలు అర్జునుడి దయాభిక్షగా అభివర్ణించాడు. దుర్యోధనుడు చేసేది లేక సైన్యాన్ని హస్తినాపురం వైపు నడిపించుమన్నాడు. విరటుడి గోవులను విప్వచ్చునకు వదలిపెట్టి వెళ్ళిపోయాడు. కిరీటి కొంతదూరం కౌరవసైన్యాన్ని తరిమి గాంగేయాదులకు నమస్కరించి, మధ్యందిన మార్తాండబింబంవలె దుర్నిరీక్ష్య తేజంతో వెలుగుతూ విజయశంఖాన్ని పూరించాడు.

కురుబలాలను గెలిచింది ఉత్తరుడే అని నగరంలో చెప్పుమన్నాడు అర్జునుడు. దానికి ఉత్తరుడు వినయంతో 'నేను విజయాన్ని సాధించి గోవులను మరలించానని చెప్పినా జనులు నమ్మవద్దా? అయినా అర్జునా, నీవు చెప్పుమన్నప్పుడే చెప్పుమన్న విధంగానే రాజుకు నిజం చెప్పి ఒప్పిదాన్ని పాటిస్తా' నని మాట ఇచ్చాడు. రథాన్ని శమీవృక్షం దగ్గరకు తీసికొని వెళ్ళారు. గాండీవ తూణీరాలను యథాస్థలంలో ఉంచారు. విజయుడు బృహన్నల వేషాన్ని ధరించాడు. దివ్యాభరణాలను ప్రార్థించి అంతర్హితం చేయించాడు. తాను సారథిగా నొగలెక్కాడు, ఉత్తరుడు రథికుడుగా రథమెక్కాడు. గోపాలుర చేత విజయవార్త ముందుగా మత్స్యమహీపతికి తెలియపంపాడు.

విరాటుడు విజయోత్సాహంతో దక్షిణ దిక్కు నుండి నగరానికి చేరికొన్నాడు. వేడుకలు చేసికొన్నాడు. ఉత్తరుడు నగరంలో కనపడకపోవటంతో అతడిని గురించి అడిగాడు. ఉత్తరగోగ్రహణ వృత్తాంతం, భీష్మాది మహావీరులతో యుద్ధం చేసి ఒంటిగా విజయాన్ని సాధించటానికి బృహన్నలను సారథిగా చేసికొని ఉత్తరుడు వెడలిన సంగతి తెలిసికొన్నాడు. కురుసైన్యాన్ని ఎదిరించే

శక్తి ఉత్తరకుమారుడికి లేదని, అతడు రణరంగంలో ఏమయిపోతాడోనని భయవిహ్వాలుడయ్యాడు. బృహన్నల బాహుపరాక్రమంతో రాకుమారుడు విజయం సాధించగలడని కంకుభట్టు ధైర్యం చెప్పాడు. అంతలో ఉత్తరుని విజయవార్తలు గోపాలురు వచ్చి నివేదించారు. విరటుడి ఆనందోత్సాహాలకు అవధులు లేకుండా పోయాయి. విజయోత్సాహంతో ఊగిపోయాడు. ఆ ఆనంద సమయంలో కంకుభట్టుతో కలిసి జూదం ఆడటానికి పూనుకొన్నాడు. ఆ సమయంలో మత్స్యమహీపతి ఉత్తరకుమారుడి పరాక్రమాన్ని ప్రశంసించి తన కుమారుడి ఉత్తమ వీరత్వాన్ని ప్రశంసించాడు. ఆ విజయానికి మూలకారకుడు ఖాండవ దహనాది యుద్ధాలలో అఖండకీర్తిని గడించిన బృహన్నలగా కంకుభట్టు కీర్తించాడు. అందుకు విరటుడికి కోపం వచ్చి చేతిలో ఉన్న సారెతో కంకుభట్టు నుదురుపై కొట్టాడు. రక్తం చిందింది. ప్రక్కనున్న సైరంధ్రి బంగారు కలశంలోని నీటితో కడిగి నెత్తురు బొట్లు నేలమీద పడకుండా చీరకొంగుతో తుడిచి అదిమి పట్టింది. అట్లా చేయటానికి గల కారణమేమి టని విరటుడు ఆమె నడిగాడు. 'కంకుభట్టు ధర్మమూర్తి. అతడి నెత్తురు ఎన్ని బొట్లు నేలమీద పడితే అన్నేళ్ళు ఆ దేశంలో వానలుండవు. అందువలన రక్తం స్రవించకుండా అదిమిపట్టా'నని చెప్పింది. అంతలో ఉత్తరకుమారుడు ప్రవేశించాడు. విరటుడు అతనిని కౌగిలించుకొని సన్మానించాడు. 'కుమారా! భీష్మ ద్రోణ కృప కర్ణాది మహావీరులు గోగ్రహణ సమయంలో శస్త్రాస్త్రాలను పుంఖానుపుంఖంగా ప్రయోగిస్తుంటే ఒంటరిగా నీవు ఎట్లా పోరు సల్పి రణరంగంలో నిలువగలిగావు? ప్రచండ పరాక్రమంతో వారు నిన్ను కమ్ముకొని ముమ్మరిస్తుంటే నీ కెవ్వరూ తోడు కూడా లేరే! ధైర్యంతో ఎట్లా ఎదురొడ్డగలిగావు? ఒకడా పరశురాముడిని గెలిచినవాడు, మరొకడా ధనుర్విద్యాగురువు; మిగిలినవారిలో ఒక్కొక్కరూ దేవదానవులు కలిసి దండెత్తినా వారిని ఓడింపగలిగిన ధీరవరేణ్యులు; వీరందరినీ ఒంటిగా ఎట్లా జయించావు? గోవులను ఎట్లా మరల్చావు? అభిమానధనుడైన ఆ సుయోధనుడు నీ విజయాన్ని అంగీకరించి ఎట్లా వెనుదిరిగి వెళ్ళగలిగాడు? ఇవన్నీ మనసులో భాసిస్తేనే భయం వేస్తున్నది. ఆ యుద్ధగాథను సవిస్తారంగా వివరించి చెప్పు'మని ఉత్కంఠతో ఉత్తరకుమారుడిని అడిగాడు విరటుడు.

'తండ్రీ! ఆ కౌరవ సేనలను నేను గెల్వలేదు. ఆ గోవులను నేను మరల్చ లేదు. దేవ సంభవుడైన ఒక మహానుభావుడు నాకు అభయమిచ్చి, తానే యుద్ధాన్ని చేసి, విజయాన్ని సాధించి, మన గోధనాన్ని మనకిచ్చి, అంతర్ధానమైనాడు' అని చతురంగా సమాధానం చెప్పాడు ఉత్తరకుమారుడు. యుద్ధ కథంతా వివరంగా విని ఆ మహానుభావుడిని చూడాలని ఆసక్తి పడ్డాడు విరటుడు. అతడు ఇవ్వాళ రేపట్లో దర్శనమిస్తాడని ఉత్తరుడు సమాధానపరిచాడు.

విరటుడు బృహన్నలను సముచితంగా సమాదరించాడు. బృహన్నల అంతఃపురానికి వెళ్ళి ఉత్తరకు తాము తెచ్చిన వీరుల తలపాగాలను బొమ్మ పొత్తికలుగా ఇచ్చి ఆమెను సంతోషపెట్టాడు.

### పాండవులు బయలు మెరయటం

ఆ రాత్రి ద్రౌపదీ పాండవులు రహస్యంగా సమావేశమై మరునాడు రాజసభలో బయలు మెరయటానికి నిర్ణయించుకొన్నారు. మరునాడు సూర్యోదయ కాలానికి పాండవులు సముజ్జ్వల వేషాలతో రాజసభకు వెళ్ళి సింహాసనం మీద ధర్మరాజు, అతడి ప్రక్కన ఉచితాసనాలపై భీమాదులు కూర్చుండి పంచాగ్నులవలె వెలుగొందుతూ ఉన్నారు. విరాటుడు సభకు వచ్చి కంకుభట్టు గద్దెపై కూర్చుండి లేవనందుకు ఆగ్రహించాడు. అప్పుడు అర్జునుడు ధర్మరాజును విరటుడికి పరిచయము చేశాడు.

"నడదివియలు సేసె నగరికి మాణిక్య। మకుటముల్ పూనిన మనుజపతులఁ,
దగునాజ్ఞ సూయాణముగ నొనరించె మం। చిగ నేల నాలుగు చెఱఁగులకును,
బ్రీతార్థిజనుల సచేతన త్యాగధ్వ। జములుగా నన్ని దేశములఁ బఱపె,
దిక్కులన్నింటను దెలుపారు పూఁత గా। వించె నుజ్జ్వల యశోవిభ్రమంబు,
రాజసూయాధ్వర ప్రవర్తకుఁడు, నిత్య। సత్యభాషా మహావ్రతశాలి, పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ। రాజు సుమ్ము మత్స్యావనీరమణ! యితడు."

"ఈతఁ డజాతశత్రుుడు మహిం దగ దిగ్విజయంబు సేసె వి
ద్యాతిశయార్థి వాసవుమహాసనమైనను నెక్క నర్జు డు
ద్యోతిత మూర్తి, కౌరవకులోద్వహుఁ, డార్యనికాయ సంతత
ఖ్యాతచరిత్రుఁ డీ చిఱుత గద్దియకుం దగఁడే నరేశ్వరా!"

ఆ మాటలు విని విరటుడు విస్మయానందమగ్నుడై, 'ఇతడు ధర్మారాజైతే భీమార్జున నకుల సహదేవులు, ద్రౌపది ఏరి?' అని ఆసక్తిగా అడిగాడు. కవ్వడి ఇట్లా అన్నాడు. 'వలలుడనే వంటవాడుగా మీవద్ద ఉంటూ, మల్లయుద్ధ ప్రతాపాలను ప్రదర్శిస్తూ మీ ప్రశంసలందుకొనిన బకాసుర సంహారకుడు అవక్రపరాక్రముడు భీముడు, ఉత్తమ హయశిక్షకుడుగా నీ మెచ్చు లందుకొనిన దామగ్రంథి నకులుడు, సమస్త గోపాలక ముఖ్యవృత్తిలో ఉండి తంత్రిపాలుడనే పేరుతో మెలగిన వీరుడు సహదేవుడు. ఇకమాలినిపేర సైరంధ్రిగా సుదేష్ణాంతఃపురంలో వర్తించిన ఇల్లాలు ద్రౌపది. ఆమె కొరకై కీచకోపకీచకులు గంధర్వకార్యమనే పేర భీమసేనుడిచేత రాత్రికి రాత్రే చంపబడ్డారు.'

భీముడు అర్జునుడిని - బృహన్నల వేషంలో ప్రచ్ఛన్న రూపుడుగా ఉన్న బీభత్సుడిగా పరిచయం చేశాడు. విరటుడితోపాటు అందరూ అద్భుతరసాక్రాంతులయ్యారు. తా నిదివరలో చెప్పినట్లు కౌరవసేనతో యుద్ధం చేసి గోవులను మరలించిన దేవసంభూతుడే అర్జును డని ఉత్తరుడు తెలియపరిచాడు. ద్రౌపదీ పాండవులను వినయభక్తి ప్రవత్తులతో విరటాదులందరూ సేవించారు. పాండవు లిచ్చిన తనువులే, సంపదలే తమవని మత్స్యభూపతీ, ఉత్తరుడూ కృతజ్ఞతలు ప్రకటించారు. పాండవులకు ప్రత్యుపకారం బంధుత్వం కలుపుకొనటంతో సార్థకమవుతుందని ఉత్తరుడు సూచించాడు. విరటుడు ఉప్పొంగి అర్జునుడికి ఉత్తర నిచ్చి వివాహం చేయాలని భావించాడు. కాని, నాట్యగురువైన అర్జునుడు తాను తండ్రివంటివాడినని, అభిమన్యుడి కిచ్చి వివాహం చేయటం తన అభీష్టమని స్పష్టం చేశాడు.

'హరిమేనల్లుఁడు బాహువీర్య పటు శౌర్య స్ఫూర్తి త్రైలోక్య సుం
దరుఁ, డాచారపవిత్రుఁ, డంచితకళాదక్షుం, డుదారుండు గా
తర సంరక్షకుఁ, డార్యసమ్మతుఁడు, విద్యావైభవోల్లాసి, యు
త్కురుతేజుండు వరించుఁగాక యభిమన్యుం డీ సరోజాననన్.'

ఆ ప్రతిపాదనను యుధిష్ఠిరుడు ఆమోదించాడు. అందరూ అంగీకరించారు. అర్జునుడితో వియ్యమందే అదృష్టం కలిగినందుకు విరటుడు ఉప్పొంగిపోయాడు. అపూర్వాలంకారాలతో ప్రకాశిస్తున్న పాండవులకు, ద్రౌపదికి ఉత్తర చేత మ్రొక్కించారు. మాత్స్య కౌరవ వంశాలు ఉత్తరాభిమన్యుల వివాహంతో అన్యోన్య బాంధవ్యాలను పెంచుకొన్నాయి. అగణితపుణ్యాలను గడించుకొన్నాయి.

## ఉత్తరాభిమన్యుల వివాహం

హస్తినాపురానికి తిరిగిపోతున్న దుర్యోధనుడి మనస్సులో ఒక అనుమానం పీడిస్తూనే ఉన్నది. 'అజ్ఞాతవాసకాలం ముగియకుండానే అర్జునుడు బయటపడ్డాడా? అట్లా జరిగితే పాండవులు మరలా అరణ్యాజ్ఞాతవాసాలు చేయాలి కదా!' అని అతడి శంక. భీష్ముడు గడువు ముగిసిందని చెప్పాడు. అయినా దుర్యోధనుడికి నమ్మకం కుదరలేదు. ధర్మరాజు అబద్ధమాడ డని అతడి వద్దకు ఒక దూతను పంపాడు. అతడు గడువు ముమ్మాటికి ముగిసిందని నొక్కి చెప్పి పంపాడు. ఆ దూతమాట బయట పెట్టకుండా దుర్యోధనుడు నిండుసభ పెట్టి మరలా అందరిముందు అదే ప్రశ్న అడిగాడు. భీష్ముడు లేచి 'నే నప్పుడే

చెప్పాను ముగిసిందని. ముగియలేదని ఎవరన్నా అంటే నవ్విపోతారు. ఇటువంటి మాటలు తెలివిలేని మాటలు' అని -అన్నాడు. అందరూ దానికి అంగీకరించారు. చేసేది మరేమీ లేక మాయదారులు సాగక దుర్యోధనుడు ఇంటి త్రోవ పట్టాడు.

విరాటనగరంలో వివాహ ముహూర్తాలు పెట్టించారు. బంధుజనుల కందరికీ పిలుపులందాయి. అటు యాదవులూ, ఇటు ద్రుపద వంశంవారూ కదలి వచ్చారు. వసుదేవుని వెంట సుభద్రాభిమన్యులు వచ్చారు. పాండవులు సర్వ వైభవాలతో ఉపప్లావ్యంలో విడిది చేశారు.

వివాహ సన్నాహాలన్నీ వడివడిగా సాగిపోసాగాయి. లగ్న మాసన్నమైనదని పెళ్లివారు మగపెళ్ళివారికి తెలియపరిచారు. యుధిష్ఠిరుడు వాసుదేవాదులతో కలిసి అభిమన్యుడిని అలంకరించుకొని బంధుమిత్ర సమేతంగా వివాహవేదికవద్దకు చేరారు. విరటుడు మంగళతూర్యాలు మ్రోగుతూ ఉండగా వరపూజ చేశాడు. వివాహమంటపంలో వధూవరుల నుంచారు. నూత్నవధూవరులు ఒకరినొకరు చూసుకొనాలన్న ఆసక్తితో ఆలస్యాన్ని ఓర్చుకోలేకపోయారు. తొలి చూపుల జల్లులు కురిసినప్పుడు తలంబ్రాలు పోసుకొన్నప్పుడు, వధూవరులకు చిరుచెమటలు పొటమరించాయి. పాణిగ్రహణానంతరం ఒకే పీటపై ఆసీనులైన వారిరువురు పెనుపాదులో కలిసిమెలసిన చూతవృక్షం నవమల్లికవలె నూత్నశోభతో అన్యోన్య అనురాగంతో వెలుగొందారు. ఉత్తరాభిమన్యుల వివాహమహోత్సవం పరమానంద భరితం.

**- జి.వి.సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము



# చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము





# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాట పర్వము

(1,2,3,4,5 ఆశ్వాసాలు)

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ**
**ద్రాయితమూర్తి యై హరిహరంబగు రూపము దాల్చి "విష్ణు రూ**
**పాయ నమశ్శివాయ" యని పల్కెడు భక్తజనంబు వైదిక**
**ధ్యాయిత కిచ్చ మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.** **1**

**ప్రతిపదార్థం:** శ్రీ+అనన్= 'శ్రీ' (లక్ష్మి) అనీ; గౌరినాన్= 'గౌరి' (పార్వతి) అనీ; పరఁగు= ఒప్పే; చెల్వకున్= సౌందర్యవతి అయిన వనితకు; చిత్తము= మనస్సు; పల్లవింపన్= చిగురించగా (కోరికలు మోసులెత్తగా, ఆహ్లాదించగా); భద్రాయితమూర్తి+ఐ= మంగళకరమైన రూపం కలిగినది అయి; హరిహరంబు+అగు= హరిహరాత్మకమయిన; రూపము+తాల్చి= ఆకారం ధరించి; విష్ణు రూపాయ శివాయనమః+అని పల్కెడు= 'విష్ణు స్వరూపుడైన శివునికి (కొరకు) నమస్కారం' అని కీర్తించే; భక్త జనంబు= భక్తులయిన జనులయొక్క; వైదిక ధ్యాయితకున్= వేదవిహిత ధ్యానానికి; ఇచ్చన్= మనసులో; మెచ్చు= మెచ్చుకొనే; పరతత్త్వమున్= పరతత్త్వవాచ్యుడయిన పరబ్రహ్మ స్వరూపాన్ని; ఇష్టసిద్ధికిన్= నా కోరిక ఫలించేందుకు; కొల్చెదన్= సేవిస్తాను.

**తాత్పర్యం:** శ్రీ (లక్ష్మి) అనీ, గౌరి (పార్వతి) అనీ పిలువబడే వనితకు మనసు చిగురించేటట్లు మంగళకరమైన హరిహరులు కలిసిన రూపాన్ని ధరించి, 'విష్ణు రూపుడైన శివుడికి నమస్కార'మని కీర్తించే భక్తుల వేదవిహితమైన ఉపాసనా పద్ధతికి మనసులో మెచ్చుకొనే ఆ పరమాత్మను (పరబ్రహ్మతత్త్వాన్ని) నా కోరిక ఫలించాలని ప్రార్థిస్తున్నాను.

**విశేషం :** నన్నయ తరువాత తిక్కన ఆంధ్ర మహాభారతాన్ని విరాటపర్వం నుండి రచించటానికి ప్రారంభిస్తూ మంగళారంభంగా ఈ పద్యాన్ని రచించాడు. తాను రచిస్తున్న భారత భాగానికి అవతారికను నిర్వహించాడు. దానిలోని మొదటి అంగం నాంది వంటి మంగళాశాసనం. అది శ్రీకారంతో ప్రారంభం కావటం సంప్రదాయం, శుభాలనూ, సంపదలనూ, కోరిన కోరికలను ఇచ్చే దేవత లక్ష్మి. ఆమె 'శ్రీ' శబ్దం చేత సూచించబడింది.

'ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశోవాఽపి తన్ముఖమ్' అనే నియమంచేత గ్రంథారంభం ఆశీఃపురస్సరంగా కానీ, నమస్క్రియా రూపంగా కానీ, వస్తు నిర్దేశకంగా (కథార్థ సూచకంగా) కానీ ఉండాలి. తిక్కన పరతత్త్వాన్ని ఇష్టసిద్ధికై ప్రార్థిస్తున్నాడు కాబట్టి, ఈ మంగళారంభ పద్యం నమస్క్రియా రూపమై రాణిస్తున్నది. నన్నయ ఆశీఃపురస్సరంగా మొదటి పద్యం వ్రాయగా తిక్కన నమస్క్రియా రూపంగా వ్రాయటం గమనించదగింది.

తిక్కన హరిహరులకు అభేదమని చెప్పే భక్తితత్త్వాన్ని ప్రతిపాదించాడు. ఆ స్వామిని నిర్గుణంగా ఉపాసిస్తే పరబ్రహ్మతత్త్వం; సగుణంగా ఆరాధిస్తే హరిహరనాథస్వామి. ఆయన భార్యకూడా శ్రీగౌరుల ఏకస్వరూపం. ఆమెను లోకంలో లక్ష్మీదేవి అనీ, గౌరీదేవి అనీ పిలుస్తారు- అని చెప్పటం విశేషం. అందుచేత దేవుడి రూప మొక్కటే; ఆయన దేవేరి కూడ ఒక్కతే, దీనితో పాటు మంత్రం కూడా ఒక్కటే-అది 'విష్ణురూపాయ నమః శివాయ'. గ్రంథాన్ని శ్రీకారంతో మొదలు పెట్టటం మంగళప్రదం; విష్ణు రూపుడైన శివుడికి నమస్కారమన్నాడు తిక్కన. అంతే కాదు భారతం కార్ష్ణవేదం (శ్రీకృష్ణ సంబంధమైన వేదం) అని ప్రసిద్ధి చెందింది. అందులో ఉపాసించదగింది వాసుదేవ తత్త్వమని పండితులు చెప్పుతారు. కాబట్టి శ్రీకారంతో తన కృతిని ఆరంభించి అనేక ప్రయోజనాలను సాధించాడు తిక్కన.

హరిహరనాథుడు తిక్కన కృతిభర్త కూడా కావటం విశేషం. హరిహరాత్మకమైన రూపం ధరించిన ఆ పరమాత్మ భద్రాయితమూర్తి. భద్రవ దాచరితామూర్తిః యస్యసః - మంగళకరమైన మూర్తికలవాడని అర్థం. 'కర్తః క్యఙ్ సలోపశ్చ' అనే సూత్రం ప్రకారం క్యఙ్.' అకృత్ సార్వ ధాతుకయో ర్దీర్ఘః' అనే సూత్రం చేత దీర్ఘం వచ్చింది. భూతార్థక క్తప్రత్యయమున్నూ, ఇడాగమమున్నూ రాగా 'భద్రాయిత మూర్తి' అనే రూపం ఏర్పడింది.

శ్రీగౌరీ శబ్దవాచ్యురాలైన పరాశక్తికి పరమానందం కలిగించే భద్రమూర్తి హరిహరనాథుడని వర్ణించటం చేత మహాభారతంలో ప్రతిపాదించబడే వైదికధర్మ నిష్ఠమైన గార్హస్థ్య జీవితతత్త్వం ధ్వనిమయంగా సూచించబడుతున్నది. నన్నయ త్రిమూర్త్యాత్మకంగా సూచిస్తే తిక్కన ఆ తాత్పర్యాన్నే హరిహరనాథ పరంగా చెప్పి వస్తునిర్దేశంలో ఏకవాక్యతను పాటించాడు.

తిక్కన ఈ పద్యంలో తన ఇష్టసిద్ధిని కోరుతున్నాడు. కృతిభర్త అయిన హరిహరనాథుడు ఉత్తమ కవితాశక్తిని ప్రసాదిస్తాడు; పరతత్త్వమైన ఆతడే జన్మాంతర దుఃఖం లేని మోక్షాన్ని అనుగ్రహిస్తాడు. ఈ రెండు రకాల కోరికలూ అవతారికలో సూచించబడనున్నాయి. అంటే మొత్తం మీద - కావ్యం వ్రాసిన తిక్కనకూ, చదివిన పఠితలకూ ఇహ పర సౌఖ్యాలు భారతం వలన కలుగుతాయని తాత్పర్యం. వృత్తం: ఉత్పలమాల, (సంపా.)

## కృతి నిర్మాణ ప్రస్తావన

**వ. అని సకల బ్రహ్మప్రార్థనంబు సేసి, తత్ప్రసాదాసాదిత కవిత్వ తత్త్వ నిరతిశయాను భావానంద భరితాంతః కరణుండ నగుచుండి యొక్కనాఁ డిట్లని వితర్కించితి.** **2**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; సకల బ్రహ్మ ప్రార్థనంబు+చేసి= కళాసహితమయిన పరబ్రహ్మను (సగుణబ్రహ్మను) ప్రార్థించి; తద్= అతని; ప్రసాద+ఆసాదిత= అనుగ్రహంచేత పొందబడిన; కవిత్వతత్త్వ= కవిత్వతత్త్వము యొక్క; నిరతిశయ= సంపూర్ణమయిన; అనుభావ= అనుభవం చేత (అంటే తద్ భావ భావనం వలన) కలిగిన; ఆనంద= ఆనందం చేత; భరిత= నిండిన; అంతఃకరణుండన్+అగుచున్+ఉండి= మనసు కలవాడనై ఉండి; ఒక్కనాఁడు= ఒక దినం; ఇట్లు+అని= ఈ విధంగా; వితర్కించితిన్= ఆలోచించాను.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా కళాప్రపూర్ణమయిన పరబ్రహ్మను (సగుణ బ్రహ్మను) ప్రార్థించి, ఆ పరబ్రహ్మ అనుగ్రహం వలన పొందిన కవిత్వతత్త్వాన్ని నిరంతర భావనం చేయటంవలన కలిగిన మహానందంతో నిండిన మనస్సుతో ఒకనాడు ఇట్లా ఆలోచించాను.

**విశేషం :** సకల అంటే కళలతో కూడిందని విశేషార్థం. తిక్కన ప్రార్థించినది సకల (సగుణ) బ్రహ్మమును, నిష్కల (నిర్గుణ) బ్రహ్మమును కాదు. శ్రీదేవి, గౌరీదేవి ఇద్దరూ కళలే. పరతత్త్వం కళాసహితం. ఇక్కడ పరతత్త్వం హరిహరనాథుడే. ఆ స్వామిప్రసాదంవలన తిక్కనకు కవిత్వం అబ్బింది. కవితాతత్త్వం తెలిసింది. తత్ భావభావనం వలన కలిగే ఆనందం ఆలోచనామృతం, అనిర్వచనీయం. అటువంటి ఆనందానుభవంతో తిక్కన ఒకసారి ఇట్లా ఆలోచించాడు.

**శా. విద్వత్సంస్తవనీయ భవ్య కవితావేశుండు, విజ్ఞాన సం**
**పద్విఖ్యాతుఁడు, సంయమి ప్రకర సంభావ్యానుభావుండు, గృ**
**ష్ణద్వైపాయనుఁ డర్థి లోకహితనిష్ఠం బూని కావించె ధ**
**ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యంబైన యామ్నాయమున్.** **3**

**ప్రతిపదార్థం:** విద్వత్= విద్వాంసుల చేత; సంస్తవనీయ= కొనియాడతగిన; భవ్య= శుభప్రదమయిన, ఉదాత్తమయిన; కవితా+ఆవేశుండు= కవితావేశం కలవాడు; విజ్ఞాన= ఆధ్యాత్మిక జ్ఞానమనే; సంపద్= ఐశ్వర్యంతో; విఖ్యాతుఁడు= సుప్రసిద్ధుడయిన వాడు; సంయమి ప్రకర= మునుల సముదాయం చేత; సంభావ్య= గౌరవింపతగిన; అనుభావుండు= మహిమ కలవాడు అయిన; కృష్ణద్వైపాయనుఁడు= వేదవ్యాస భగవానుడు; అర్థిన్= కోరికతో; లోకహిత నిష్ఠన్+పూని= లోకులకు హితం చేయటంలో దీక్ష వహించి (లోకాలకు హితం సమకూర్చే విషయంలో పట్టుదల వహించి); ధర్మ= ధర్మస్థితితోనూ; అద్వైతస్థితిన్= అద్వైత స్థితితోనూ; భారత+ఆఖ్యము+అగు= భారతమనే పేరుకలదైన; లేఖ్యంబు+ఐన= వ్రాయదగిన; ఆమ్నాయమున్= పరంపరగా అభ్యసించబడే దానిని, (వేదాన్ని); కావించెన్= రచించాడు.

**తాత్పర్యం:** పండితులు ప్రశంసించే ఉదాత్త కవితావేశం కలవాడు కృష్ణద్వైపాయనుడు. ఆధ్యాత్మిక జ్ఞానంతో సుప్రసిద్ధుడయిన వాడు. మహర్షుల చేత గౌరవించదగిన ప్రభావం కలవాడు. ఆ మహర్షి లోకహితం కోరి ధర్మాద్వైత స్థితితో భారత సంహితను రచించాడు.

**విశేషం :** కృష్ణద్వైపాయనుడనే పేరు వ్యాసుడిది. 'ద్వీప మేవ అయనం యస్యసః' - ద్వీపాయనః, యమునా ద్వీపమే స్థానంగా కలవాడనీ, లేదా యమునాద్వీపంలో పుట్టినవాడనీ వ్యుత్పత్త్యర్థం. ద్వీపాయనుడే ద్వైపాయనుడు. ద్వైపాయనుడు+కృష్ణుడు= కృష్ణద్వైపాయనుడు. విశేషణానికి పరనిపాతం వచ్చి కృష్ణద్వైపాయనుడు అనే పదం ఏర్పడింది. కృష్ణుడని వేదవ్యాసుడికి పేరు.

ఆమ్నాయ మంటే గురుశిష్యపరంపరచేత కంఠస్థవిద్యగా అభ్యసించబడేదీ, ధర్మాధర్మాలను ఉపదేశించేదీ ఐన వేదమని భావం. 'భారతం పంచమో వేదః' అని ప్రసిద్ధి. చతుర్వేదసారం పంచమవేదం. వేదం అపౌరుషేయం; పంచమవేదం పౌరుషేయం. కాబట్టి అది అలేఖ్యం, ఇది లేఖ్యం.

'ధర్మాద్వైత స్థితి' అనే సమాసానికి అనేక అర్థాలున్నాయి. అది పూర్వ మీమాంస, ఉత్తర మీమాంసల జోడింపునూ, ధర్మజిజ్ఞాస, బ్రహ్మజిజ్ఞాసల సమన్వయాన్నీ సూచిస్తుంది. అట్లాగే నిష్కామ కర్మలను అనుష్ఠించటం వలన పరమాత్మతో అద్వైతాన్ని పొందటం కూడా ధర్మాద్వైత స్థితియే. ధర్మంతో అద్వైతమైన లేదా అభిన్నమైన స్థితినే ధర్మాద్వైత స్థితిగా కూడా పండితులు వ్యాఖ్యానిస్తారు. కర్మ జ్ఞానాల కలిమి 'ధర్మాద్వైతస్థితి' అని మరి కొందరు.

**క. వేదములకు నఖిల స్మృతి । వాదములకు బహు పురాణ వర్గంబులకున్**
**వా దైన చోటులను దా । మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్. 4**

**ప్రతిపదార్థం:** వేదములకున్= ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం - అనబడే నాలుగు వేదాలకు; అఖిల స్మృతి వాదములకున్= మను గౌతమాది స్మృతులన్నిటిలోని వాక్యాలకు; బహు పురాణ వర్గంబులకున్= బ్రహ్మాండ పురాణం మొదలయిన పురాణ సమూహాలకు; వాదు+ఐన చోటులను= వివాదగ్రస్తాలయిన స్థలాలలో; ధర్మ+అర్థ కామ మోక్ష స్థితికిన్= ధర్మార్థ కామ మోక్షాల స్థాపనకు; తాన్= భారతం; మూదల= ప్రమాణం - అంటే నిర్ణాయకం (నిశ్చయించేది; మూల+తల= మూదల).

**తాత్పర్యం:** వేదాలకూ, స్మృతులకూ, పురాణాలకూ, ధర్మార్థ కామ మోక్షాల విషయంలో వివాదం ఏర్పడితే ఆయా సందర్భాలలో మహాభారతం పురుషార్థ నిర్ణాయక గ్రంథంగా నిలుస్తుంది.

**విశేషం :** వేదాలూ, స్మృతులూ, పురాణాలూ భిన్న భిన్న కాలాలలో వెలసిన గ్రంథాలు. వేదాలు అపౌరుషేయా లయితే శాస్త్రకారులు, మహాకవులు వ్రాసినవి స్మృతులూ, పురాణాలూ, ఒక్కొక్కప్పుడు వీటిలో పరస్పర వైరుధ్యాలు కనిపించవచ్చును. వాటివలన ఆయా అంశాల వాస్తవ స్వరూపం పఠితకు స్పష్టం కాకపోవచ్చును. అటువంటి సందర్భాలలో భారత మొక్కటే ప్రమాణం.

శాస్త్రవిహిత కర్తవ్యం ధర్మం. డబ్బు మొదలయిన వాటిని సంపాదించటం అర్థం. ఇంద్రియాదులను తృప్తి పరచటం కామం. అన్ని రకాల బంధాల నుండి విముక్తి పొందటం మోక్షం. అర్థాన్ని, కామాన్ని ధర్మదృష్టితోనే చూడాలి. ఆ దృష్టితోనే సాధించాలి. పురుషార్థ సాధనలో అన్నింటికీ మూలం ధర్మం; అన్నింటినీ పాలించేది ధర్మం. అటువంటి ధర్మతత్త్వాన్ని గురించి సూక్ష్మంగా వివేచించేదీ, దాని ఆచరణ విధానాన్ని బోధించేదీ మహాభారతం.

**వ. అదియును.** **5**

**తాత్పర్యం:** ఆ మహాభారతం (ఆ తరువాత).

**ఉ. ఆదరణీయ సార వివిధార్థ గతి స్ఫురణంబు గల్గి య**
**ష్టాదశ పర్వ నిర్వహణ సంభృతమై పెనుపొందియుండ; నం**
**దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్ర కవిత్వ విశారదుండు వి**
**ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.** **6**

**ప్రతిపదార్థం:** ఆదరణీయ= ఆదరింపదగిన; సార= శ్రేష్ఠమయిన; వివిధ= అనేక విధాలయిన; అర్థగతి= అర్థాల పోకడల యొక్క; స్ఫురణంబు= స్ఫూర్తి; కల్గి= కలిగి; అష్టాదశ పర్వ= పదునెనిమిది పర్వాల యొక్క; నిర్వహణ= నిర్వహణ చేత; సంభృతము+ఐ= కూడినదై; పెనుపొంది+ఉండన్= మహత్త్వంతో కూడి ఉండగా; అందున్= ఆ మహాభారతంలో; ఆదిన్+తొడంగి= ఆదిపర్వం నుండి మొదలుపెట్టి; మూఁడు కృతులు= మూడు పర్వాలు; ఆంధ్ర కవిత్వ విశారదుండు= తెనుగులో కవిత్వం చెప్పటంలో విద్వాంసుడయిన వాడున్నూ; విద్యాదయితుండు= సరస్వతీదేవికి (విద్యలకు) ప్రియుడయిన వాడున్నూ; మహిత+ఆత్ముఁడు= మహాత్ముడున్నూ (అయిన); నన్నయభట్టు; దక్షతన్= సామర్థ్యంతో; ఒనర్చెన్= రచించాడు.

**తాత్పర్యం:** ఆదరించదగిన అనేక అర్థ స్ఫూర్తులతో నిండిన భారతం పదునెనిమిది పర్వాలతో కూడి పెంపారి ఉండగా, అందులో మొదటి మూడు పర్వాలను దక్షతతో నన్నయభట్టారకుడు తెనుగులో రచించాడు. అతడు ఆంధ్రకవితా విశారదుడు, విద్యాదయితుడు, మహితాత్ముడు.

**విశేషం :** 'విద్యాదయితుడు' అనే పదానికి సరస్వతీదేవికి ప్రియుడనీ, సర్వ విద్యలకు ప్రియుడనీ, విద్యలే ప్రియురాండ్రుగా కలవాడనీ, బ్రహ్మతో సమానుడనీ, శ్రీవిద్యా రూపమయిన విజ్ఞానానికి ప్రతీక అనీ పండితులు వ్యాఖ్యానిస్తారు.

మూడు కృతులంటే ఆది, సభా, ఆరణ్యపర్వాలు, తిక్కన మూడు కృతులను నన్నయ వ్రాశాడని చెప్పటం వలన ఆయన కాలం నాటికి నన్నయ భారతభాగం పూర్తిగా ఉండేదనీ, ఆ తరువాత ఏ కారణాలవలననో కొంత భాగం నశించి పోగా ఎఱ్ఱన దానిని పూరించి ఉంటాడనీ, కొందరు భావించే అవకాశం ఏర్పడింది.

**మ. హృదయాహ్లాది, చతుర్థ, మూర్జిత కథోపేతంబు, నానా రసా**
**భ్యుదయోల్లాసి విరాటపర్వ; మట యుద్యోగాదులుం గూడఁగాఁ**
**బదియేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునం**
**దుదిముట్టన్ రచియించు టొప్పు బుధ సంతోషంబు నిండారఁగన్.** **7**

**ప్రతిపదార్థం:** హృదయ= మనస్సుకు; ఆహ్లాది= సంతోషాన్ని ప్రసాదించేదీ; ఊర్జిత= కట్టుదిట్టమయిన; కథా+ఉపేతంబు= కథలతో కూడినదీ; నానా రస+అభ్యుదయ+ఉల్లాసి= అనేక రసాల అభ్యుదయం చేత (క్రమపోషణంతో) ప్రకాశించేదీ; చతుర్థము= పదునెనిమిది పర్వాల వరుసలో నాల్గవదయిన విరాటపర్వం; అట, ఉద్యోగ+ఆదులున్+కూడఁగాన్= ఆ పైన ఉద్యోగపర్వం (మొదలయినవి) ఒనగూడగా (లెక్కపెట్టగా); పది+ఏనింటిన్= పదునైదుపర్వాలను; తెనుంగు బాసన్= తెలుగు భాషలో; జన సంప్రార్థ్యంబులు+ఐ= జనులచేత ప్రార్థించదగినవై; పెంపునన్= అతిశయంతో; తుది ముట్టన్= చివరిదాకా; బుధ= పండితుల; సంతోషంబు, నిండారఁగన్= సంతోషం బాగా కలిగేటట్లు; రచియించుట+ఒప్పున్= రచించటం తగును.

**తాత్పర్యం:** సహృదయుల హృదయాలకు ఆహ్లాదం కలిగించేదీ, భారతంలోని పదునెనిమిది పర్వాలలో నాల్గవదీ, నిబిడమైన కథతో కూడుకొన్నదీ, వివిధ రసాల క్రమపోషణతో ఏర్పడే వికాసం వలన ఉల్లాసాన్ని కలిగించేదీ విరాటపర్వం, ఆపైన ఉద్యోగపర్వం మొదలుకొని స్వర్గారోహణపర్వం దాకా ఉన్న పర్వాలతో కలుపుకొని పదునైదు పర్వాలు జనులచేత కీర్తించబడేటట్లుగా, పండితులు సంతోషించేటట్లుగా తెలుగుభాషలో పూర్తిగా రచించటం సమంజసం. (అంటే నిర్మించవలసిన అవసరం ఉన్నది అని భావం.)

**విశేషం :** పాండవులు అజ్ఞాతవాస కాలంలో విరాటనగరంలో నివసించినప్పుడు జరిగిన కథార్థాలను చెప్పేది కాబట్టి ఈ పర్వానికి విరాటపర్వమనే పేరు పెట్టబడింది. ఈ పర్వంలో పాండవులు మారువేషాలలో జీవించే కథ ప్రధానంగా ఉండటం చేత శ్రవ్యకావ్యంలో దృశ్యకావ్య మర్యాదలు ఆసక్తిదాయకంగా చోటు చేసికొంటాయి. అందువలన పఠితలకు మానసికోల్లాసం కలుగుతుంది. భారతంలో విరాటపర్వం మహానాటకంలో అంతర్నాటకంగా ఉత్కంఠను రేకెత్తిస్తుంది. ఈ కావ్యగుణంలో అన్ని పర్వాలకంటే విరాటపర్వమే మిన్న. అందువలన 'హృదయాహ్లాది' అనే విశేషణం ముందుగా వాడాడు తిక్కన.

పంచ సంధులు పోషించబడిన నాటకాలలో చతుర్థాంకానికి ప్రాధాన్యం ఉంటుంది. 'కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా, తత్రాపి చ చతుర్థోఽఙ్కః అనే శ్లోకం ప్రసిద్ధి కెక్కింది. అందుకే చతుర్థాంకంలో గర్భసంధి వర్తిల్లుతుంది. ప్రారంభించబడిన కార్యం ఏవిధంగా సఫలమౌతుందో అనే ఉత్కంఠ అందులో పోషించబడుతుంది. విరాటపర్వం వరుససంఖ్యకు నాల్గవదే కాక, రూపక మర్యాదలో నాల్గవ అంకానికి ఉండే ప్రాముఖ్యాన్ని పొంది ఉన్నదని తాత్పర్యం.

'ఊర్జిత కథ' అంటే నిబిడమైన కథ అనీ, సంధిబంధాలతో సంపన్నమైన కథ అనీ, ఉదాత్తమైన కథ అనీ అర్థాలున్నాయి. ఉపాఖ్యానాలు దాదాపు లేని విరాటపర్వ కథ కడు చిక్కనిది. మూడు ప్రబంధాల వంటి కీచకవధ, దక్షిణ గోగ్రహణ, ఉత్తర గోగ్రహణ ఘట్టాల వలన విరాటపర్వం ఒక ఉదాత్త ప్రబంధ మండలిగా రాణిస్తున్నది. ఒక్కొక్క ఘట్టం ఒక్కొక్క ప్రబంధంగా రాణించే బిగువైన కథ కలిగినది. అందువలన అన్ని పర్వాలలో కంటె విరాటపర్వ కథలో బిగు వెక్కువ.

విరాటపర్వంలో శృంగారాది సర్వరస పోషణకు అవకాశం ఉన్నది. ఆ గుణాన్ని గుర్తించి అంగి రసాల అభ్యుదయం, అంగరసాల ఉల్లాసం పఠితలు అనుభవించేటట్లు పండిత పామరులు మెచ్చుకొనేటట్లు విరాటపర్వాన్ని రచించాలనీ, మిగతా పర్వాలను అట్లాగే రచించి భారతాన్ని ముగించాలనీ తిక్కన సంకల్పించాడు. (సంపా.)

**క. అని రచనా కౌతుకమున। మన మలరఁగ ' నీ ప్రబంధ మండలి కధినా**
**ధునిఁగా నే పురుషునిఁ బే। ర్కొనువాఁడనొ' యను తలంపు గూరిన మదితోన్. 8**

**ప్రతిపదార్థం:** అని= అని తలంచి అని భావం; రచనా కౌతుకమునన్= భారత రచన కొనసాగించాలనే కుతూహలంతో; మనము= మనస్సు; అలరఁగన్= సంతోషించగా; ఈ ప్రబంధ మండలికిన్= ఈ ప్రబంధ సముదాయానికి; అధినాథునిగాన్= కృతిభర్తనుగా; ఏ పురుషునిన్= ఏ పురుషుని; పేర్కొనువాఁడనొ= ఎన్నుకోవాలో; అను= అనే; తలంపు= ఆలోచన; కూరిన= బాగుగా నాటుకొన్న; మదితోన్= మనస్సుతో.

**తాత్పర్యం:** అని తలంచి, భారతరచన చేయాలనే కుతూహలంతో మనస్సు ఉత్సాహపడింది. ఈ ప్రబంధ మండలికి 'కృతిపతిగా ఏ పురుషుడిని ఎన్నుకొనాలో!' అనే ఆలోచన మనస్సులో బాగా నాటుకొన్నది.

**విశేషం :** ఈ పద్యంలోని 'ప్రబంధమండలి' అనే పద సముదాయానికి నిర్దిష్టమయిన అర్థం చెప్పలేము. తిక్కన నన్నయ్యను ప్రశంసించిన పద్యంలో 'కృతులు' అనే మాట వాడాడు. సందర్భం బట్టి 'కృతులు' అంటే పర్వాలు అనే అర్థం కుదురుతుంది. అట్లాగే 'ప్రబంధ మండలి' అంటే 'పర్వాల సముదాయం' అని చెప్పుకొనటం సమంజసం. అంతేకాని అష్టాదశ (18) వర్ణనలున్న సాహిత్య ప్రక్రియ కాదు.

**వ. ఇంచుక నిద్రించు సమయంబున.** **9**

**ప్రతిపదార్థం:** ఇంచుక= కాసేపు; నిద్రించు సమయంబునన్= కునుకు పట్టిన వేళ.

**తాత్పర్యం:** కృతి భర్తగా ఎవరిని ఎన్నుకొనాలా అని ఆలోచిస్తూ కాసేపు కునుకు తీసిన వేళ.

**విశేషం :** నిద్ర పోవటం రెండు రకాలు. ఆలోచిస్తూ నిద్రపోవటం, నిద్రపోతూ ఆలోచించటం. నిద్రలో చాల వాటికి 'పరిష్కార మార్గాలు' స్ఫురిస్తాయి. తిక్కనకు కూడా అట్లాగే 'పరిష్కారమార్గం' తెలియటానికి వీలయింది.

2. కావ్య పరిభాషలో నిద్రను ముద్రగా గ్రహిస్తారు. కావ్య సృష్టికి మూలమైన ప్రతిభాచైతన్యం సమాధ్యవస్థలో నిత్య జాగృతమై ఉంటుందనీ, మేల్కొన్నప్పుడు స్ఫురించని అపూర్వాంశాలు భావసమాధిలో స్ఫురిస్తాయనీ కావ్య శాస్త్రజ్ఞులు చెపుతారు. తిక్కన నిద్ర భావసమాధికి సంకేతంగా గ్రహించాలి. (సంపా.)

**సీ. మజ్జనకుండు, సమ్మాన్య గౌతమ గోత్ర । మహితుండు, భాస్కరమంత్రి తనయుఁ,**
**దన్నమాంబాపతి, యనఘులు కేతన । మల్లన సిద్ధనామాత్యవరుల**
**కూరిమి తమ్ముండు, గుంటూరి విభుఁడు కొ । మ్మన దండనాథుండు, మధుర కీర్తి**
**విస్తర స్ఫారుఁ డాపస్తంబసూత్ర ప । విత్రశీలుఁడు సాంగవేదవేది**

**తే. యర్థిఁ గల వచ్చి వాత్సల్య మతిశయిల్ల । నస్మదీయ ప్రణామంబు లాదరించి**
**తుష్టి దీవించి, కరుణార్ద్ర దృష్టిఁ జూచి । యెలమి ని ట్లని యానతి యిచ్చె నాకు.** **10**

**ప్రతిపదార్థం:** మత్= నాయొక్క; జనకుండు= తండ్రి; సమ్మాన్య= చక్కగా పూజింపదగిన; గౌతమగోత్ర మహితుండు= గౌతమ గోత్రంలో పుట్టటం వలన గొప్పవాడు; భాస్కర మంత్రి= భాస్కర మంత్రి యొక్క; తనయుఁడు= కుమారుడు; అన్నమాంబాపతి= అన్నమాంబకు మగడు; అనఘులు= పాపరహితులైన; కేతన, మల్లన, సిద్ధన= కేతన, మల్లన, సిద్ధనలనబడే; అమాత్యవరుల= శ్రేష్ఠులయిన మంత్రుల యొక్క; కూరిమి తమ్ముండు= ప్రేమాస్పదుడయిన (ముద్దుల) తమ్ముడు; గుంటూరి విభుఁడు= గుంటూరి సీమకు దండనాథుడయిన వాడు; కొమ్మన దండనాథుండు; మధుర= ఇంపయిన; కీర్తి= కీర్తి యొక్క; విస్తర= వ్యాపనం చేత; స్ఫారుఁడు= ప్రకాశించేవాడు; ఆపస్తంబ సూత్ర= ఆపస్తంబ సూత్రం చేత; పవిత్రశీలుఁడు= పవిత్రమయిన ఆచారం కలవాడు; సాంగ వేద వేది= శిక్ష, కల్పం మొదలయిన ఆరు వేదాంగాలతో వేదాన్ని చక్కగా అధ్యయనం చేయటంద్వారా చక్కగా తెలిసికొన్నవాడు; అర్థిన్= కోరికతో; కలన్= కలలో; వచ్చి= కనబడి; వాత్సల్యము+అతిశయిల్లన్= వాత్సల్యభావం పెల్లుబుకగా; అస్మదీయ= నాయొక్క; ప్రణామంబులు= నమస్కారాలను; ఆదరించి= గ్రహించి; తుష్టిన్= సంతోషంతో; దీవించి= ఆశీర్వదించి; కరుణా+ఆర్ద్రదృష్టిన్= దయతో తడిసిన చూపులతో; చూచి= కనుగొని; ఎలమిన్= సంతోషంతో; నాకున్= నాకు; ఇట్లు= ఈ ప్రకారంగా; ఆనతి= ఆజ్ఞను; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** నా తండ్రి కొమ్మన. ఆయనది గౌతమగోత్రం. ఆయన తండ్రి భాస్కర మంత్రి. కేతన, మల్లన, సిద్ధనలు కొమ్మనకు అన్నలు. అతడు ఆ అన్నలకు ముద్దు తమ్ముడు, అన్నమాంబ మగడు. గుంటూరి సీమకు దండనాథుడు. గొప్పగా పేరు ప్రతిష్ఠ లున్న వ్యక్తి, ఆపస్తంబ సూత్రుడు. పవిత్ర స్వభావుడు. వేదవేదాంగాలను చక్కగా అభ్యసించినవాడు. అటువంటి తండ్రి కలలో కనిపించాడు. నా నమస్కారాలు స్వీకరించాడు. మనసారా దీవించాడు. వాత్సల్యంతో కరుణార్ద్ర దృష్టితో నన్ను చూచాడు. ఈ విధంగా ఆజ్ఞాపించాడు.

**విశేషం :** శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం - వీటిని 'షడంగములు' అంటారు. వేదాన్ని షడంగాలతో అధ్యయనం చేసేవారిని 'సాంగవేద 'వేది' అంటారు. కొమ్మనలోని వైదికనిష్ఠ, పరిపాలనానుభవం గుర్తించదగిన అంశాలు. ఇవే తిక్కనలో పరిమళించాయి.

**వ. "కి మస్థి మాలాం కిము కౌస్తుభం వా। పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్। కిం కాలకూటః కిము వా యశోదా । స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే," అని నీవు తొల్లి రచియించిన పద్యంబు గాఢాదరంబున నవధరించి, భక్తవత్సలుం డగు హరిహరనాథుండు నీదెస దయాళుండై యునికిం జేసి నిన్నుం గృతార్థునిఁ జేయం గార్యార్థి యయి నాకలోక నివాసి యయిన నాకుఁ దన దివ్య చిత్తంబునం గల యక్కారుణ్యంబు తెఱం గెఱుంగునట్టి శక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి కొలిపించికొని వీఁడె విజయం చేయుచున్నవాఁడనుచుం జూపుటయు సవిశేష సంభ్రమ సంభరిత హృదయుండ నయి యవ్వలనుఁ గలయం గనుంగొనునప్పుడు.11**

**ప్రతిపదార్థం:** ప్రభో!= దేవా! ఓ భగవంతుడా!; త్వమ్= నీవు; పరిష్క్రియాయాం= అలంకరణలో; అస్థి మాలాం= ఎముకల దండను; బహుమన్యసే కిం?= అమితంగా అభిమానిస్తావా?; వా= లేకపోతే; కౌస్తుభం= కౌస్తుభరత్నాన్ని; బహుమన్యసే కిము= ఇష్టపడతావా?; కాలకూట= క్షీరసాగర మథన సమయంలో సమస్తలోకాలను కలవరపెట్టుతూ పుట్టిన కాలకూట విషం; తవ= నీకు; స్వాదు కిమ్?= రుచికరమా?; వా= లేకపోతే; యశోదాస్తన్యం= యశోద చనుబాలు; తవ= నీకు; స్వాదు కిమ్?= రుచికరమా?; మే= నాకు; వద= చెప్పుము; అని; నీవు; తొల్లి= పూర్వం; రచియించిన, పద్యంబున్; గాఢ+ఆదరంబునన్= ఎక్కువ ఆదరంతో; అవధరించి= శ్రద్ధగా ఆలకించి; భక్తవత్సలుండు+అగు= భక్తులపై వాత్సల్యం గల; హరిహరనాథుండు; నీ దెసన్= నీ పట్ల; దయాళుండు+ఐ= దయ కలిగినవాడై; ఉనికిన్+చేసి= ఉండటం చేత; నిన్నున్= నిన్ను; కృతార్థునిన్+చేయన్= ధన్యుడిని చేయటానికి; కార్య+అర్థి+అయి= పనిగట్టుకొని; నాకలోక నివాసి+అయిన= స్వర్గలోకంలో ఉన్న; నాకు; తన దివ్య చిత్తంబునన్+కల= తన మహిమాన్వితమైన మనసులో ఉన్న; ఆ+కారుణ్యంబు తెఱంగు= ఆ దయా స్వభావాన్ని; ఎఱుంగున్+అట్టి= తెలిసికొనే; శక్తిన్= శక్తిని; ప్రసాదించి= అనుగ్రహించి; నన్నున్= నన్ను; ఆకర్షించి= దగ్గరకు రప్పించుకొని; కొలిపించుకొని= సేవచేయించుకొని; వీఁడె= ఇదిగో; విజయం చేయుచున్న వాఁడు= వస్తున్నాడు; అనుచున్= అంటూ; చూపుటయును= చూపించగా; సవిశేష సంభ్రమ సంభరిత హృదయుండన్+అయి= అబ్బురమైన తొందరతో కూడిన మనసుకలవాడనయి; ఆ+వలనున్= ఆ దిక్కు; కలయన్+ కనుఁగొను+అప్పుడు= కలయచూసే వేళ.

**తాత్పర్యం:** "ఓ ప్రభూ! నీ అలంకరణలో ఎముకల దండలూ ఉన్నాయి, కౌస్తుభ రత్నం కూడా ఉన్నది. వాటిలో నీకేది ఇష్టం? నీవు కాలకూటం త్రాగావు; యశోద చనుబాలూ త్రాగావు. వాటిలో నీకేది రుచిగా ఉంది? తేల్చి చెప్పుము!" అంటూ సంస్కృతంలో నీవు వ్రాసిన పద్యాన్ని హరిహరనాథుడు గుర్తించాడు. 'నీ వంటే ఆ స్వామికి ఎంతో దయ, నిన్ను ధన్యుడిని చేయాలని అనుకొన్నాడు. నీమీద ఉన్న ఆ అభిమానాన్ని తెలిసికొనే శక్తిని స్వర్గంలో ఉన్న నాకు

ప్రసాదించాడు. నన్ను తన దగ్గరికి రప్పించుకొన్నాడు. నా సేవలందుకొన్నాడు. ఇదిగో ఆ స్వామి వేంచేస్తున్నాడు' -అని అంటూ ఉండగా నేను ఆ వైపు తేరిపార చూశాను. అప్పుడు.

**విశేషం :** భగవదనుగ్రహం సామాన్యమయింది కాదు. హరిహరనాథుడు తిక్కన వ్రాసిన శ్లోకాన్ని మెచ్చుకొనటం తిక్కన తపః పుణ్యఫల పరిపాకమే. తిక్కన తండ్రి స్వర్గంలో ఉన్నాడనటం వలన తిక్కన వంశీయుల గొప్పతనం, పుణ్యసంపద వెల్లడౌతున్నవి.

**సీ. కరుణారసము పొంగి తొరఁగెడు చాడ్పున । శశిరేఖ నమృతంబు జాలువాఱ**
**హరినీలపాత్రిక సురభిచందన మున్న । గతి నాభి ధవళపంకజము మెఱయ**
**గుఱియైన చెలువున నెఱసిన లోక ర । క్షణ మనంగ గళంబు చాయ దోఁపఁ**
**బ్రథమాద్రిఁ దోఁతెంచు భానుబింబము నా ను । రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప**

**తే. సురనదియును గాళిందియు బెరసినట్టి । కాంతిపూరంబు శోభిల్లు శాంతమూర్తి**
**నా మనంబు నానంద మగ్నముగఁ జేయ । నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు.** **12**

**ప్రతిపదార్థం:** కరుణారసము= దయ అనే రసం; పొంగి తొరఁగెడు చాడ్పునన్= పొంగి పొరలుతున్నట్లుగా; శశిరేఖన్= చంద్రరేఖ నుండి; అమృతంబు జాలువాఱన్= అమృతం ప్రవహించగా; హరినీల పాత్రికన్= ఇంద్రనీలమణులు పొదిగిన చిన్న పాత్రలో; సురభి చందనము+ఉన్నగతిన్= గుబాళించే మంచి గంధం ఉన్నట్లుగా; నాభిన్= బొడ్డులో; ధవళ పంకజము= తెల్లని తామరపూవు; మెఱయన్= ప్రకాశించగా; గుఱి+ఐన= గుర్తయిన; చెలువునన్= అందంతో; నెఱసిన= ఒప్పిన; లోకరక్షణము+అనంగన్= లోక రక్షణమా అనునట్లు; గళంబు చాయ= కంఠ కాంతి; తోఁపన్= కనబడగా; ప్రథమ+అద్రిన్= తూరుపు కొండమీద; తోఁతెంచు= కనిపించే; భానుబింబము నాన్= సూర్యబింబమా అని ఊహించేటట్లు; ఉరమ్మునన్= వక్షఃస్థలంలో; కౌస్తుభరత్నము+ఒప్పన్= కౌస్తుభ మనే పేరు గల రత్నం ప్రకాశించగా; సుర నదియును= గంగానది; కాళిందియున్= యమునా నది (రెండూ); బెరసినట్టి= కలసి ఒకటయిన; కాంతిపూరంబు= కాంతిప్రవాహం; శోభిల్లు= ప్రకాశించే; శాంతమూర్తి= శాంతస్వరూపు డయిన; సర్వ+ఈశ్వరుండు= సర్వానికి ఈశ్వరుడయిన హరిహరనాథుడు; నా మనంబున్= నా మనస్సును; ఆనంద మగ్నముగన్+చేయన్= ఆనందంలో మునిగేటట్లు చేసేందుకు; ఎలమిన్= సంతోషంతో; సన్నిధి+చేసెన్= ప్రత్యక్షమయ్యాడు.

**తాత్పర్యం:** నాకు హరిహరనాథుడు ప్రత్యక్షమైనాడు. ఆయన శిరసు మీద చంద్రరేఖ ఉన్నది. చంద్రరేఖ నుండి స్రవించే అమృతం దయారసం పొంగి పొరలుతూ ఉన్నట్లుగా ఉన్నది. ఆ స్వామి బొడ్డులో తెల్లని తామరపూవు ఉన్నది. అది ఇంద్ర నీల మణులు పొదిగిన పాత్రలో గుబాళించే మంచిగంధంవలె ఉన్నది. కంఠం నలుపుగా ఉన్నది. అది లోకరక్షణ కొరకు నిలిచిన గుర్తు వలె ఉన్నది. రొమ్మున కౌస్తుభరత్నం ఉన్నది. అది తూరుపు కొండ మీద ఉదయించే సూర్యబింబం వలె ఉన్నది. గంగా యమునా నదుల కలయికలోని వెలుగుల వెల్లువవలె హరిహరనాథుడు సాక్షాత్కరించాడు.

**విశేషం :** పద్యం సీస పద్యం. సీస పద్యానికి 4 పెద్ద పాదాలుంటాయి. ఆ తరువాత ఆటవెలది గాని తేటగీతి గాని జోడిస్తారు. తిక్కన 1,3 (బేసి) పాదాలలో శివుడినీ, 2,4 (సమ) పాదాలలో విష్ణువునూ కీర్తించాడు. చివర తేటగీతిలో ఇద్దరిని కలిపి వర్ణించాడు. ఈ క్రమం సగుణోపాసన నుండి నిర్గుణోపాసనకు సాగే విధాన్ని సూచిస్తున్నది.

పద్యంలోని 'కరుణారసం' అనే మాట భగవంతుడి దయాగుణాన్ని స్పష్టం చేస్తుంది. విష్ణువు నీలమేఘ శ్యాముడు కావటం వలన ఇంద్రనీలమణులచేత నిర్మించబడిన పాత్రతో నాభిని పోల్చటం సమంజసం. భగవంతుడు జగద్రక్షకు డనటానికి

'గరళకంఠం' సాక్ష్యం. భారతీయులకు గంగాయమునలు పవిత్ర నదులు, తీర్థాలు. శివుడికీ గంగకూ తెలుపుదనంలోనూ యమునకూ విష్ణువుకూ నల్లని రంగులోనూ పోలికలుండటం విశేషం. గంగాయమునలు భిన్న నదులయినా అవి కలిసిన చోట నీళ్ళు రంగుల తేడా చేత వేరువేరుగా కొంతదూరం కనిపించినా ఆ తరువాత ఒకటిగా కలిసిపోతాయి. అట్లాగే హరిహరులు రంగులలో వేషాలలో ఇద్దరుగా తోచినా తత్త్వంలో వారు ఒక్కరే అన్న అభేదం దృష్టికి ఆనటం ఒక ప్రత్యేకత. ఆంధ్ర వాఙ్మయంలోని హరిహరనాథ స్తుతిపద్యాలలో ఈ పద్యం తలమానికమైనది.

**వ. ఏనును భక్తిమయం బగు సాష్టాంగదండప్రణామం బాచరించి, కొండొక దొలంగి వినయావనతుండనై, లలాటోపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి, నయనంబులు నవయవంబులును బ్రమదబాష్ప సలిల విలులితంబులును, బులకపటల పరికలితంబులునుం గా నంతంత నిలిచిన నద్దేవుండు. 13**

**ప్రతిపదార్థం:** ఏనును= నేను కూడా; భక్తిమయంబు+అగు= భక్తితో నిండినదైన; స+అష్ట+అంగ దండ ప్రణామంబు+ఆచరించి= శరీరంలోని ఎనిమిది అంగాలు నేలకు తగిలేటట్లు దండం వలె బోరగిల పడుకొని చేసే నమస్కారం చేసి; కొండొక+తొలంగి= కొద్దిగా ప్రక్కకు తప్పుకొని; వినయ+అవనతుండను+ఐ= వినయంతో వంగినవాడనై; లలాట+ఉపరిభాగంబునన్= నుదుటి పైభాగం మీద; అంజలిపుటంబు ఘటించి= దొప్పవలె ముకుళింపచేసిన దోసిలితో నమస్కారం చేసి; నయనంబులున్= కన్నులూ; అవయవంబులును= శరీరంలోని భాగాలన్నీ; ప్రమద బాష్పసలిల విలులితంబులును= ఆనంద బాష్ప జలాన్ని విడిచేవి; పులక పటల= గగుర్పాటుల సముదాయంతో; పరికలితంబులునున్+కాన్= కూడినవి కాగా; అంతంతన్= అల్లంత దూరాన; నిలిచినన్= నిలువగా; ఆ+దేవుండు= అప్పుడు ఆ దేవుడు.

**తాత్పర్యం:** నేను భక్తితో సాష్టాంగ నమస్కారం చేశాను. ఒకప్రక్కకు ఓరగా నిలబడ్డాను. వినయంతో కొంచెం ముందుకు వంగాను. నొసటి మీద చేతులు జోడించాను. నా కళ్ళు ఆనంద బాష్పాలతో నిండాయి. నా శరీరమంతా రోమాంచంతో గగుర్పొడిచింది. అప్పుడా దేవుడు.

**విశేషం :** భగవంతుడు ప్రసన్నుడైనప్పుడు భక్తుడు ప్రదర్శించే భక్తిభావాన్ని తెలిపే ఆంగిక సాత్త్వికాభినయాలు ఇందులో వర్ణించబడ్డాయి. సాష్టాంగ దండప్రణామం శరణాగతికీ, వినయంతో లలాటం వద్ద దోసిలితో సంఘటించిన నమస్కారం ఆత్మార్పణ భావానికీ ఆంగికాభినయాలు. ఆనందబాష్పాలూ, పులకలూ ఆనందానుభవానికి సాత్త్వికాభినయాలు. (సంపా.)

**క. అనుకంపాతిశయంబునఁ । దన దక్షిణనేత్రమును సుధారోచియ కా**
**నను వింత లేక చూచి, వ । దనమున దరహాసరసము దళుకొత్తంగన్. 14**

**ప్రతిపదార్థం:** అనుకంపా+అతిశయంబునన్= దయాధిక్యం చేత; తన= తనయొక్క; దక్షిణ నేత్రమును= కుడి కన్ను కూడా; సుధారోచియ కాన్= చంద్రుడే కాగా; ననున్= నన్ను; వింత లేక= కొత్త లేక; చూచి= పరిశీలించి; వదనమునన్= ముఖంలో; దరహాస రసము= చిరునవ్వు అనే రసం; తళుకొత్తంగన్= చిందగా (తొణికిసలాడగా).

**తాత్పర్యం:** హరిహరనాథుడు నా వైపు దయతో చూచాడు. అప్పుడా దేవుడి కుడి కన్ను కూడా చంద్రుడే అయినాడు. చిరునవ్వు తొణికిసలాడుతూ నాతో ఈ విధంగా అన్నాడు.

**విశేషం :** విష్ణువు కుడికన్ను సూర్యుడు. ఎడమ కన్ను చంద్రుడు. సూర్యుడనటం వలన వేడిమి తప్పని సరి. కాని, కుడికన్ను చంద్రుడు కావటంతో 'చల్లనయ్య' అయినాడు ఆ స్వామి. 'దరహాసరసం' వంటి వింత ప్రయోగాలు తిక్కన ప్రత్యేకతను తెలుపుతాయి.

**ఉ. 'వైదిక మార్గ నిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచున్**
**భేదము లేని భక్తి మతి నిర్మల వృత్తిఁగఁ జేయుచుండు మ**
**త్పాద నిరంతర స్మరణ తత్పర భావము కల్మి, నాత్మ స**
**మ్మోదముఁ బొందఁ గావ్య రసముం గొనియాడుచు నుండు దెప్పుడున్. 15**

**ప్రతిపదార్థం:** వైదిక మార్గ నిష్ఠము+అగు= వేద సమ్మతమయిన మార్గాన్ని అనుసరించే; వర్తనమున్= ప్రవర్తనను; తగన్+నిర్వహించుచున్= తగిన విధంగా కొనసాగిస్తూ; భేదము లేని= శివకేశవ భేదం లేని; భక్తిన్= భక్తితో; మతిన్= మనస్సును; నిర్మల వృత్తిఁగన్= మాలిన్యం లేని ప్రవృత్తి కలదానినిగా; చేయుచుండు= చేసే; మత్= నాయొక్క; పాద= పాదాలయొక్క; నిరంతర= ఎల్లప్పుడూ; స్మరణ తత్పర భావము= భక్తితో తలంచటంవలన భావించటంలో తన్మయమైన భావం; కల్మిన్= ఉండటం చేత; ఆత్మ= మనస్సు, అంతరాత్మ; సమ్మోదమున్+పొందన్= ఆనందాన్ని పొందగా; కావ్య రసమున్= కావ్యములందలి రసాన్ని; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; కొనియాడుచున్+ఉండుదు(వు)= మెచ్చుకుంటూ ఉంటావు.

**తాత్పర్యం:** 'నీవు వైదిక మార్గంలో జీవిస్తున్నావు. శివకేశవ భేదరహిత మయిన భక్తితో నాపాద స్మరణ చేస్తున్నావు. ఆ రీతిగా ఆత్మానందం పొందుతూ కావ్యరసాన్ని ఆస్వాదిస్తూ ఉంటావు.

**విశేషం :** భారతం మొదలు పెట్టేనాటికి తిక్కనలో నాలుగు లక్షణాలున్నాయి. మొదటిది వైదిక మార్గవర్తనం, రెండవది శివకేశవ భేదరహిత మయిన భక్తి, మూడవది కావ్యరసాస్వాదం, నాల్గవది బ్రహ్మానంద స్థితి పొందాలనే ఆకాంక్ష. 'నిరంతర భగవన్నామస్మరణ' సర్వశుభాలను కలిగిస్తుంది.

**వ. అందును. 16**

**తాత్పర్యం:** అందులో కూడా విశేషించి.

**క. పారాశర్యుని కృతి యయి । భారత మను పేరఁ బరఁగు పంచమవేదం**
**బారాధ్యము జనులకుఁ ద । ద్గౌరవ మూహించి నీ వఖండిత భక్తిన్. 17**

**ప్రతిపదార్థం:** పారాశర్యుని= పరాశరుని కుమారుడయిన వ్యాసుని; కృతి+అయి= రచన అయి; భారతము+అను పేరన్= భారతమనే పేరుతో; పరఁగు= ప్రసిద్ధము అయిన; పంచమ వేదంబు= ఐదవ వేదం; జనులకున్= ప్రజలకు; ఆరాధ్యము= ఆరాధించదగినది; తద్= ఆ; గౌరవము= గొప్పతనాన్ని, మహిమను; ఊహించి= భావన చేసి; నీవు; అఖండిత భక్తిన్= నిరంతరమయిన (అంతరాయంలేని) భక్తితో.

**తాత్పర్యం:** వేదవ్యాసుడు రచించిన భారతం పంచమవేదం అని ప్రసిద్ధి పొందింది. ప్రజల కది ఆరాధించదగింది. దాని గొప్పతనాన్ని మనసులో భావించి, దానిమీది నిరంతర భక్తితో నీవు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం :** వేదాలు నాలుగు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వ వేదం, భారతం పంచమవేదం. అంటే వేదాల సారాన్ని తనలో ఇముడ్చుకొన్న వేదమని అభిప్రాయం.

**తే. తెనుఁగుబాస వినిర్మింపఁ దివురు టరయ । భవ్య పురుషార్థ తరుపక్వ ఫలము గాదె!**
**దీని కెడ నియ్యకొని వేడ్క నూని కృతిపతిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ!' 18**

**ప్రతిపదార్థం:** తిక్కశర్మ!= ఓ తిక్కనా!; తెనుఁగు బాసన్= తెలుగు భాషలో; వినిర్మింపన్= సరిక్రొత్త రచన అన్నట్లుగా రచన చేయటానికి; తివురుట= ప్రయత్నించటం; అరయన్= పరిశీలించగా; భవ్య= మంగళకరమయిన; పురుషార్థ= ధర్మార్థ కామ మోక్షములనే; తరు= చెట్టుయొక్క; పక్వ= పండిన; ఫలము కాదె= పండు కదా; దీనికిన్= తెలుగులో నిర్మించే నీ ప్రయత్నానికి; ఎడన్= మనస్సులో; ఇయ్యకొని= అంగీకరించి; వేడ్కన్+ఊని= ఎంతో కుతూహలపడి; కృతిపతిత్వము= కృతికి పతిగా ఉండాలనే భావంతో; అర్థించి= కోరి; వచ్చితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** తిక్కనా! నీవు తెలుగు భాషలో భారతం నిర్మించటానికి పూనుకొనటం ఎటువంటిదంటే। పురుషార్థములనే చెట్టుకు పండిన పండు వంటిది. ఈ నీ ప్రయత్నం నా మనసుకు నచ్చింది. ఇందుకు నే నెంతో కుతూహలపడి కృతిపతిత్వాన్ని కోరి వచ్చాను.'

**విశేషం :** 'వినిర్మింపన్' అనే మాట సాభిప్రాయం. తెలుగు భారతం యథానువాదం కాదు. అనుసృజనం వంటిది. వ్యాస భారతంలో నిబంధింపబడి నిరూపింపబడిన తాత్పర్యాన్నీ, తత్త్వాన్నీ తెలుగులో తేటపడేటట్లు పునర్నిర్మించటమే ఆ 'వినిర్మించటం'. వినిర్మాణమంటే విశిష్టమైన నిర్మాణమని కూడా భావం. వ్యాస భారతం శాస్త్రేతిహాసమైతే తెలుగులోని కవిత్రయ భారతం కావ్యేతిహాసంగా అవతరించింది. ఆ ప్రక్రియా భేదం వినిర్మాణంలోని విశేషం. మహాభారతంలో పాండవులు సాధించిన చతుర్విధ పురుషార్థ జీవిత సమగ్రేతివృత్తం వర్ణించబడింది. కాబట్టి అది పురుషార్థ పరిపక్వ ఫలం వంటిది. ఆ భారతాన్ని రచించిన కవి జీవితం కూడా పురుషార్థ వృక్షానికి పండిన పండే అవుతుందని - అంటే ఆ మహాకవికి మోక్ష ఫలాన్ని అందిస్తుందని భావం. భగవంతుడిని కూడా కృతిపతిత్వం కోసం ప్రేరేపించే పరమార్థ గ్రంథం భారతం. (సంపా.)

**వ. అనిన నద్దివ్యవచనామృతంబు నా యుల్లంబున వెల్లిగొనినఁ బునః పునః ప్రణామంబు లాచరించి, యప్రమేయ ప్రభావ భావనాతీతుండయ్యును నప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంత సులభుండని బుధులవలన విని యునికిం జేసి ననుబోఁటి బాలస్వభావునకు నిట్టి మహనీయ మహిమ దొరఁకొనుటయుం గలుగున కాక యని తలంచుచు నవ్విభునకు విన్నపంబు సేయువాఁడనయి కొమ్మనామాత్యునాననం బాలోకించి తదనుమతి వడసి యిట్లంటి. 19**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; ఆ+దివ్య వచన+అమృతంబు= హరిహరనాథుని మహిమగల ఆ మాటలనే అమృతం; నా+ఉల్లంబునన్= నా మనసులో; వెల్లిగొనినన్= పొంగి పొరలగా; పునఃపునః= మాటి మాటికి; ప్రణామంబులు+ఆచరించి= నమస్కారాలు చేసి; అప్రమేయ= మితియిడడానికి వీలు లేని; ప్రభావ= మహిమచేత; భావనా+అతీతుండు+అయ్యునున్= ఊహకు అందని వాడయినా; ఆ+పరమేశ్వరుండు= ఆ దేవదేవుడు; ఆశ్రితులకున్= తనను శరణుపొందినవారికి; అతి+అంత సులభుండు+అని= మిగుల సులభంగా లభించేవాడని; బుధులవలనన్= పండితుల వలన; విని+ఉనికిన్+చేసి= విని ఉండటం వలన; ననున్+బోఁటి= నావంటి; బాలస్వభావునకున్= పరిణతి చెందని స్వభావం కలవానికి కూడా; ఇట్టి మహనీయ మహిమ= ఇటువంటి గొప్పశక్తి; దొరఁకొనుటయున్= లభించటం కూడా; కలుగున్+అ కాక= తప్పక సిద్ధిస్తుంది కదా; అని, తలంచుచున్= అనుకొంటూ; ఆ+విభునకున్= ఆ హరిహరనాథస్వామికి; విన్నపంబు= మనవి; చేయువాఁడన్+అయి= చేసేవాడనయి; కొమ్మన+అమాత్యు+ఆననంబు= కొమ్మనమంత్రి ముఖం; ఆలోకించి= చూచి; తద్+అనుమతిన్= అతని అనుమతిని; పడసి= పొంది; ఇట్లు+అంటిన్= ఈ విధంగా అన్నాను.

**తాత్పర్యం:** ఆ హరిహరనాథుని మాటలు అమృత తుల్యాలు. వాటిని వినగానే నా మనస్సులోని అలౌకికానుభూతి పొంగులెత్తింది. మళ్ళీ మళ్ళీ నమస్కరించాను. ఆ దేవదేవుడు మహాప్రభావం కలవాడు. మానవుల భావనలకు అందని

వాడు, అయినా ఆశ్రితులకు సులభుడు అని పండితులవలన లోగడ విని ఉండటంచేత ఆ భావాన్ని పదే పదే మననం చేసికొన్నాను. అందువలన నావంటి బాలస్వభావుడికి కూడా గొప్ప శక్తి కలుగుతుందికదా! అనే ధైర్యం కలిగింది. దేవుడికి ఏదో విన్నవించాలనే తపనతో మా తండ్రి వైపు చూచాను. ఆయన అనుమతించాడు. ఆ తరువాత ఈ విధంగా అన్నాను.

**విశేషం :** తిక్కన ఎంత చదువరియో అంత సంస్కారవంతుడు. తనను బాలస్వభావుడిగా చెప్పుకొనటం వినయానికి గుర్తు. భగవంతుడికి విన్నవించుకొనేందుకు తిక్కన తండ్రివైపు చూడటం పెద్దలపట్ల గౌరవాన్ని, వృద్ధసేవ పట్ల ఆదరాన్ని వ్యక్తం చేస్తుంది.

**క. భూరి భవత్కారుణ్య । క్షీరాంబుధిలోన నాదు చిత్తంబును వి**
**స్తార మహితముగ నునిచితి । వారయ నచ్చెరువు గాదె యఖిలాండపతీ! 20**

**ప్రతిపదార్థం:** అఖిల+అండపతీ!= బ్రహ్మాండ నాయకా!; భూరి= అధికమయిన; భవత్= నీయొక్క; కారుణ్య= దయ అనే; క్షీర+అంబుధిలోనన్= పాల సముద్రంలో; నాదు= నాయొక్క; చిత్తంబును= మనస్సును; విస్తార మహితముగన్= విరివిఐన గొప్పతనం కలదానినిగా; ఉనిచితివి= ఉంచావు; అరయన్= చూడగా; అచ్చెరువు కాదె?= ఆశ్చర్యం కదా!

**తాత్పర్యం:** బ్రహ్మాండ నాయకా! అతి విస్తారమైన నీ దయ అనే పాలసముద్రంలో నామనస్సును ఎంతో గొప్పదనం కలిగిన దానినిగా చేసి భద్రంగా ఉంచి అనుగ్రహించావు. ఇది నిజంగా ఆశ్చర్యం కదా?

**విశేషం :** అలం: రూపకం; 'క్షీరాంబుధి నాదు తుచ్ఛ చిత్తంబున' అని కొన్ని ప్రతులలో ఉన్నది. తుచ్ఛ శబ్దాన్ని అత్యల్పమనే అర్థంలో వాడటం ప్రసిద్ధి. అప్పుడు అతి విస్తారమైన నీదయ అనే పాలసముద్రాన్ని అత్యల్పమైన నా చిత్తంలో విశాలంగా ఉంచటం ఆశ్చర్యం కాదా! అని తాత్పర్యం ఏర్పడుతుంది. ఉన్న పాఠం కంటె కొన్ని విధాల ఈ పాఠమే అన్వయ సుందరంగా ఉన్నది. (సంపా.)

**ఉ. ఇంతకు నేర్చు నీకు, నొక యింతటిలోన, మదీయవాణి న**
**త్యంత విభూతిఁ బెంపెసఁగు నట్టి నినుం గొనియాడఁ జేత దా**
**నెంతటి పెద్ద? నీ కరుణ నిట్లు పదస్థుఁడ నైతి నింక జ**
**న్మాంతర దుఃఖముల్ దొలఁగు నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే. 21**

**ప్రతిపదార్థం:** ఇంతకున్ నేర్పు= ఇంతటి మహిమను ప్రదర్శించే సమర్థుడవయిన; నీకున్; అత్యంతవిభూతిన్= మిక్కిలి ఐశ్వర్యంతో; పెంపు+ఎసఁగునట్టి= ప్రసిద్ధి గడించిన; నినున్= నిన్ను; ఒక+ఇంతటిలోనన్= అనతికాలంలోనే; మదీయ వాణిన్= నా యొక్క వాక్కుతో; కొనియాడన్+చేత= పొగడింప చేసికొనటం; తాను+ఎంతటి పెద్ద?= అదేమంత ఘనకార్యం? నీ కరుణన్= నీ దయతో; ఇట్లు పదస్థుఁడన్+ఐతిన్= ఈవిధంగా ఇంతటి పదవిలోకి (భారతరచన చేయగల స్థితికి) వచ్చాను; ఇంకన్= ఇకముందు; జన్మ+అంతరదుఃఖముల్= మరోజన్మవలన కలిగే దుఃఖాలను; తొలఁగునట్లుగన్+చేసి= తొలగిపోయే విధంగా చేసి; సుఖ+ఆత్మున్+చేయవే= సుఖస్వరూపునిగా చేయుమా!

**తాత్పర్యం:** ఇంత మహిమను ప్రదర్శించ గలిగిన నీవు అనంతమైన ఐశ్వర్యంతో పెంపారే నిన్ను అనతికాలంలోనే నా వాక్కుల చేత కీర్తింపజేసికొనేటట్లు చేయటం అదెంత గొప్ప? నీ కరుణవలన ఈ పదవి (మహాభారతాన్ని తెలుగులో నిర్మించే అదృష్టం) నాకు దక్కింది. నాకు పునర్జన్మ దుఃఖం లేకుండా చేసి సుఖాత్ముడిని చేయవయ్యా!

**విశేషం :** భక్తుడు భగవంతుడిని స్మరించటం సహజం. కాని భగవంతుడు భక్తుడిని కరుణించడం విశేషం. తిక్కనను మెచ్చి హరిహరనాథుడు అనుగ్రహించాడు; కృతిపతిత్వం కోరాడు; భగవంతుడి పరిపూర్ణానుగ్రహం కలవాడు తిక్కన. అయినా నిగర్వి. మహాభారతాన్ని తెలుగులో నిర్మించే ఉత్తమాధికారం భగవద్దత్తమే అని భావించాడు. మహామహిమాన్వితుడైన దైవమే తన వాక్కులకు తగినంత శక్తినిచ్చి భారతాన్ని రచింప చేయిస్తాడని భావించాడు. భగవత్కృపవలన వ్రాసే ఈ కావ్యంవలన యశస్సు, అర్థలాభం వంటి కావ్య ప్రయోజనాలను తిక్కన కోరలేదు. పునర్జన్మ రహితమైన శాశ్వత మోక్షస్థితిని కోరాడు. కవిత్వం కవికి మోక్ష సాధనమని తిక్కన అభిప్రాయం.

**వ. అని యుపలాలితుం డగు డింభకుండు దన కొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున**
**బ్రహ్మానంద స్థితిం గోరి సర్వాంగాలింగిత మహీతలం బగు నమస్కారంబు సేసిన నజ్జగన్నాథుండు. 22**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; ఉపలాలితుండు+అగు= బుజ్జగింపబడినవాడు అయిన; డింభకుండు= బాలుడు; తన కొలంది= తన శక్తి; ఎఱుంగక= తెలియక; మహత్+పదార్థంబు= గొప్పదైన వస్తువును; వేఁడు విధంబునన్= కోరుకొనే రీతిలో; బ్రహ్మ+ఆనంద, స్థితిన్+కోరి= ఆత్మానందాన్ని పొందే అనుభవస్థితిని కోరి; సర్వ+అంగ+ఆలింగిత మహీతలంబు+అగు= అన్ని అవయవాలతో తాకబడిన భూతలం కలిగిన; నమస్కారంబు+చేసినన్= సాష్టాంగ నమస్కారం చేయగా; ఆ+జగత్+నాథుండు= లోకాలకు నాయకుడయిన హరిహరనాథుడు.

**తాత్పర్యం:** బుజ్జగించబడిన బాలకుడు తన శక్తి ఏమాత్రమూ తెలిసికొనకుండా గొప్ప వస్తువును కోరేవిధంగా నేను బ్రహ్మానందం కలగాలని కోరుకొని సాష్టాంగ దండప్రణామం చేశాను. అప్పుడు ఆ దేవుడు.

**తే. జనన మరణాదులైన సంసార దురిత। ములకు నగపడకుండంగఁ దొలఁగు తెరువు**
**గనువెలుంగు నీ కిచ్చితి ననిన లేచి। నిలిచి సంతోష మెద నిండ నెలవుకొనఁగ. 23**

**ప్రతిపదార్థం:** జనన+మరణ+ఆదులు+ఐన= పుట్టుక, చావు మొదలయిన; సంసార దురితములకున్= సాంసారిక బాధలకు, దుఃఖాలకు; అగపడకుండంగన్= లోబడకుండ; తొలఁగు= తప్పించుకొనే; తెరువు= మార్గం; కను= చూచేటటువంటి; వెలుంగు= వెలుగు, కాంతి (జ్ఞానం, వివేకం, అని భావం); నీకున్= నీకు; ఇచ్చితిన్; అనినన్; లేచి; నిలిచి; ఎదనిండన్= మనసునిండుగా; సంతోషము; నెలవుకొనఁగన్= చోటుచేసికోగా, కలుగగా.

**తాత్పర్యం:** జననమూ, మరణమూ మొదలయిన సంసార దుఃఖాలకు లోబడకుండా తప్పించుకొనే మార్గం తెలిసికొనే వెలుగు నీకు ప్రసాదించాను' అని హరిహరనాథుడు సెలవిచ్చాడు. ఈ మాట వినటంతో నా మనసు ఆనందంతో నిండిపోయింది.

**విశేషం:** మానవుడు జనన మరణాది సంసార దుఃఖాలతో సతమత మవుతుంటాడు. ఈ దుఃఖ నివారణకు భగవదనుగ్రహం కావాలి. ఆ అనుగ్రహాన్ని తిక్కన పొందాడు. జననం, మరణం అనేవి నరక యాతనలకు కేంద్రాలు. పుణ్యం స్వర్గానికి, పాపం నరకానికి హేతువులు. సుఖదుఃఖాల అనుభవం నశిస్తే కాని మోక్షం దక్కదు. ఆ వెలుగు అనుగ్రహపాత్రులకే వేద్యం. బహుజన్మపుణ్యపాకఫలం. ఆ అనుభవం అనిర్వచనీయం.

**వ. ఇట్లు మేలుకాంచి. 24**

**తాత్పర్యం:** ఈ విధంగా మేలుకొని.

**క. ఎలమియు నచ్చెరువును సరి। నెలసి పొదలు మానసమున నెంతయుఁబ్రొద్దేఁ**
**గలలోనఁ గన్న చందము। దలఁచుచు నుండితిని భక్తి తాత్పర్యమునన్. 25**

**ప్రతిపదార్థం:** ఎలమియున్= సంతోషమూ; అచ్చెరువునున్= ఆశ్చర్యమూ; సరిన్+ఎలసి పొదలు= సమానంగా వ్యాపించి వర్ధిల్లే; మానసమునన్= మనస్సుతో; ఏన్= నేను; కలలోనన్+కన్నచందము= కలలో చూచిన విధం; తలఁచుచున్= భావించుకొంటూ; ఎంతయున్+ప్రొద్దు= ఎంతోసేపు; భక్తి తాత్పర్యమునన్= భక్తి పారవశ్యంతో; ఉండితిని= ఉండిపోయాను.

**తాత్పర్యం:** నా మనసు సంతోషంతో, ఆశ్చర్యంతో సమానంగా నిండిపోయింది. నేను కలలో దర్శించిన దృశ్యాన్ని తలచుకొంటూ ఎంతోసేపు భక్తి పారవశ్యంతో ఉండిపోయాను.

**విశేషం:** భారతీయుల స్వప్నశాస్త్రంలో, శకునశాస్త్రంలో 'కలలకు' ప్రాధాన్యం ఉన్నది. ఆ శాస్త్రజ్ఞులు కలలు భావి సూచకాలుగా భావిస్తారు. కొందరు అవి శుభాశుభ శకునాలుగా విశ్వసిస్తారు. కలల సమయాన్ని బట్టి ఫలితాలను చెప్పేవారున్నారు. మంచి కల వస్తే మేలుకొన్న తరువాత నిద్ర పోకూడదని శాస్త్రం. అందుచేత తిక్కన తన 'కలను' తలచుకొంటూ భక్తిపారవశ్యంతో ఉన్నాడు.

**వ. తదనంతరంబ. 26**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**ఉ. ఇట్టి పదంబు గాంచి పరమేశ్వరునిం గృతినాథుఁ జేసి యే**
**పట్టునఁ బూజ్యమూర్తి యగు భారత సంహితఁ జెప్పఁగంటి; నా**
**పుట్టుఁ గృతార్థతం బొరసెఁ, బుణ్యచరిత్రుఁడ నైతి; నవ్విభుం**
**గట్టెదఁ బట్ట మప్రతిమ కావ్య కవిత్వ మహావిభూతికిన్. 27**

**ప్రతిపదార్థం:** ఇట్టి పదంబు+కాంచి= ఇటువంటి ఉన్నతమైన పదవిని పొంది; పరమేశ్వరునిన్= హరిహరనాథుని; కృతినాథున్+చేసి= (భారతానికి) కృతిభర్తనుగా చేసి; ఏ పట్టునన్= ఏ సందర్భంలోనైనా, ఏ విధంగా చూచినా; పుజ్యమూర్తి+అగు= ఆరాధించటానికి తగిన స్వరూపం కలిగిన; భారత సంహితన్= భారతమనే వేదాన్ని; చెప్పన్+కంటిన్= (తెలుగులో) చెప్పే భాగ్యం పొందగలిగాను; నా పుట్టున్= నా జన్మకూడా; కృతార్థతన్+పొరసెన్= సాఫల్యం పొందింది; పుణ్యచరిత్రుఁడన్+ఐతిన్= పుణ్యశీలుడిని అయ్యాను; అప్రతిమ= సాటిలేని; కావ్యకవిత్వ= కావ్య సంబంధమైన కవిత్వమనే; మహావిభూతికిన్= గొప్ప ఐశ్వర్యానికి; ఆ+విభున్= ఆ హరిహర నాథుడిని; పట్టము+కట్టెదన్= పట్టాభిషిక్తుడిని చేస్తాను.

**తాత్పర్యం:** నేను ఉన్నతస్థితిని అందుకొన్నాను. పరమేశ్వరుడిని కృతిపతిగా ఎన్నుకొన్నాను. భారతమనే పంచమవేదాన్ని తెలుగులో నిర్మించే అదృష్టం పొందాను. ఆ భారతం అన్ని విధాలా ఆరాధనీయం. నా జన్మ సఫలమయింది. నా చరిత్ర పుణ్యవంతమైనది. ఈ కావ్య కవిత్వ మహత్త్వ సంపదకు ఆ హరిహరనాథుడిని పట్టం కట్టుతాను.

**విశేషం:** తిక్కన ఒక మహాకవి. అతడికి కవిత్వం దైవానుగ్రహం వలన లభించింది. ఆ కవిత్వకళతో భారతం చెప్పాలనుకొన్నాడు. దేవుడే కృతిపతిత్వం కోరాడు. ఈరీతిగా లక్ష్యమూ సంప్రార్థనా రెండూ ఒకరిలో ఒకే కవిలో ఫలించటం చాలా గొప్ప విషయం. 'అప్రతిమకారుణికత్వ మహావిభూతికిన్' - ఈ పాఠం కొన్ని ప్రతులలో కనపడుతున్నది.

**ఉ. కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్; జనా**
**భ్యర్చిత మైన భారత మపార కృపాపరతంత్రవృత్తిమైఁ**
**బేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి; నా**
**నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్.** **28**

**ప్రతిపదార్థం:** నూత్నరత్నమునకున్= కొత్తరత్నానికి; కనకంబునకున్= మేలిమి బంగారానికి; కూర్చుట= జత చేయటం; తగున్= ఒప్పుతుంది; జన= జనులచే; అభి+అర్చితము+ఐన భారతము= పూజించబడిన భారతం; అపార= హద్దులేని; కృపాపరతంత్ర= దయాపరవశమైన; వృత్తిమైన్= ప్రవర్తనతో; పేర్చిన= అతిశయించిన; దేవదేవునకున్= దేవదేవునికి; ప్రీతిగన్= ప్రీతికలిగే విధంగా; ఇచ్చుట= ఇవ్వటం అంటే; సర్వసిద్ధి= సర్వమూ సిద్ధించినట్లే; నా నేర్చిన భంగిన్= నాకు చేతనైన విధంగా; చెప్పి; భక్తకోటికిన్= భక్తుల సమూహానికి; వరణీయుఁడన్+అయ్యెదన్= వరించ (అభిమానించ, ప్రేమించ) తగిన వాడినిగా ఔతాను.

**తాత్పర్యం:** బంగారానికి నూత్న రత్నాన్ని కూర్చటం సముచితం. భారతం జనులందరూ ఆరాధించే గ్రంథం. బంగారంవంటిది. దేవదేవుడూ దయాపరుడూ అయిన హరిహరనాథుడు రత్నం. ఆయనకు ప్రీతితో కృతి ఇవ్వటం అంటే బంగారానికి రత్నం కూర్చినట్లే, సిద్ధులన్నీ సమకూరినట్లే. కాబట్టి నా చేతనైనట్లు భారతాన్ని తెలుగులో చెప్పి భక్తులకు ప్రేమపాత్రుడను ఔతాను.

**విశేషం:** అలం: సమాలంకారం. ఇక్కడ భారతాన్ని నూత్న రత్నంగానూ, హరిహరనాథుడిని బంగారంగానూ చెప్పటం సహజసుందరంగా ఉన్నది. అందువలన రెంటికీ సరిపోయింది. భూతదయను, అహింసను భారతం ప్రబోధిస్తుంది. భగవంతుడేమో దయాసముద్రుడు. అందువలన ఆనురూప్యం కుదిరింది.

నన్నయ భారతం నరాంకితం. తిక్కన భారతం హరిహరనాథాంకితం. తిక్కన ఆరణ్యపర్వ శేషాన్ని వదలి విరాటపర్వం మొదలు పెట్టాడు. అందుచేత తిక్కన రచన నూత్నరత్నమైనది. బంగారంలో పొదగటంవలన రత్నానికి స్వచ్ఛత ఏర్పడినట్లు భారతానికి కూడా క్రొత్త అమరిక సహజంగా కలిగింది.

తిక్కన పండితుడైనా వినయశీలుడు. చదువరైనా తనను సామాన్య మానవునిగానే చెప్పుకొన్నాడు. వినయంతో 'నా నేర్చిన భంగి' అని చెప్పుకొన్నాడు. ఇది అహంకారం నశించిన స్థితిని తెలియజేస్తుంది. నన్నయకూడా 'నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద' - అనటం గమనార్హం.

**వ. ఇది యనన్య సామాన్య కరణం బగు పరమధర్మ ప్రకారంబు.** **29**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ భగవదంకిత ప్రక్రియ; (న+అన్య) అనన్య+సామాన్య కరణంబు+అగు= సామాన్యములైన ఇతర సాధనాలవల్ల సమకూరని; పరమధర్మ= ఉత్కృష్టమైన ధర్మముయొక్క; ప్రకారంబు= విధానం.

**తాత్పర్యం:** ఈ విధంగా భగవంతుడికి అంకితమిచ్చే ప్రక్రియ మరే ఇతర సాధనాలవలన కలిగేది కాదు. ఇది ఒక ఉత్తమ ధర్మం ఆచరించే పద్ధతి.

**విశేషం:** భగవదంకితం పరమధర్మ మని తిక్కన భావించాడు. నరాంకితం కంటె దైవాంకితం దివ్యమైన దనీ, ఉత్తమమైన దనీ ఆయన భావం. నిర్వచనోత్తర రామాయణ కావ్యాన్ని మనుమసిద్ధి భూపాలుడికి అంకితమిచ్చి, ఆంధ్రమహాభారతాన్ని దైవాంకితం చేసిన తిక్కనకు రెండు విధానాలలో ఉన్న తారతమ్యం బాగా తెలుసు. (సంపా.)

**ఉ. కావున భారతామృతముఁ గర్ణపుటంబుల నారఁగ్రోలి యాం**
**ధ్రావళి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయ సంస్మృతి**
**శ్రీ విభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ**
**క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదన్ గృతుల్. 30**

**ప్రతిపదార్థం:** కావునన్= అందువలన; భారత+అమృతమున్= భారతమనే అమృతాన్ని; కర్ణపుటంబులన్= దొప్పలవంటి చెవులతో; ఆరన్+క్రోలి= తనివి తీరేటట్లు పూర్తిగా సేవించి, త్రాగి; ఆంధ్ర+ఆవళి= తెలుగు వారంతా; మోదమున్+పొరయునట్లుగన్= ఆహ్లాదం పొందేవిధంగా; సాత్యవతేయసంస్మృతి= వేదవ్యాసుడిని స్మరించటమనే; శ్రీవిభవ+ఆస్పదంబు+అయిన= మంగళకరమైన వైభవానికి నిలయమైన; చిత్తముతోడన్= మనస్సుతో; మహాకవిత్వదీక్షావిధిన్+ఒంది= గొప్పకవిత వ్రాయాలి అనే దీక్ష వహించి; పద్యములన్, గద్యములన్= పద్యాలలో, గద్యాలలో (చంపువుగా); కృతుల్= పర్వాలను; రచియించెదన్= రచిస్తాను,

**తాత్పర్యం:** అందువలన - ఆంధ్రులందరూ మహాభారత మనే అమృతాన్ని చెవులనే దొప్పలతో తనివితీరా త్రాగి, ఆహ్లాదాన్ని పొందేటట్లుగా - వ్యాసమహర్షి భావనమనే సంపదయొక్క వైభవంతో నిండిన మనస్సుతో భారతపర్వాలను మహాకావ్యంలో ఉండదగిన ఉత్తమ కవిత్వంతో రచించవలెనన్న గొప్పదీక్షను పూని నియమంతో పద్యాలలోనూ గద్యాలలోనూ (అంటే చంపూ రచనగా) రచిస్తాను.

**విశేషం:** భారతాన్ని అమృతంగా రూపకం చేసి చెప్పటంలో దాని నిత్యత్వాన్నీ, ఆస్వాదనీయత్వాన్నీ, విశ్వజనీనత్వాన్నీ తిక్కన వ్యంగ్యంగా పేర్కొన్నాడు. దొప్పలవంటి చెవులతో ఆంధ్రులందరూ త్రాగేటట్లు వ్రాస్తానని తిక్కన ప్రతిజ్ఞ చేస్తున్నాడు. తన కవిత శ్రవణానందాన్ని కలిగిస్తుందనీ, చవులూరిస్తుందనీ, ఆలోచనామృతాన్ని అందిస్తుందనీ, పఠితలకు కావ్యానందాన్ని కలిగిస్తుందనీ ఈ రూపకాలంకార నిర్వహణంలోని సార్థక్యం. 'ఆంధ్రావళి మోదముంబొరయునట్లుగ' అని అనటంలో కావ్యం నిర్వహించవలసిన సామాజిక ప్రయోజనాలను (ఉపరంజన ఉపదేశాలను) తిక్కన సూచించాడు. 'జనమత కృష్ణద్వైపాయన మునివృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున' రచించిన నన్నయ వలెనే తిక్కన కూడా వేదవ్యాసమహర్షియెడగల భక్తితోకూడిన తాత్పర్య భావనం చేత మహనీయ మైన బుద్ధితో భారతపర్వాలను రచించాలనుకొన్నాడు. ఆ రచనకు అనువైన మహాకవిత్వ దీక్షను చేపట్టాడు. విస్తృతమైన కావ్యాన్ని రసమయంగా, శిల్పసుందరంగా, అర్థగంభీరంగా, ఉదాత్తశైలిలో రచించే కవిత్వ రచనా ప్రవృత్తిని మహాకవిత్వ దీక్షావిధి అంటారు. తిక్కన మొదట నిర్వచన కావ్యం రచించి క్రొత్త ప్రయోగం చేశాడు. అది పండితుల మన్ననలను పొందింది కాని, 'ఆంధ్రావళి' ఆదరాన్ని పొందలేదు. అందువలన ఆంధ్రులందరి ఆదరాన్ని పొందాలని గద్యపద్యాత్మకమైన రచనను చేపట్టాడు. ఇది అంతకు పూర్వమే నన్నయ చూపిన మార్గం. (సంపా.)

**వ. అని పూని యీదృశంబు లగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషం బగుటం జేసి. 31**

**ప్రతిపదార్థం:** అని; పూని; ఈ దృశంబులు+అగు= ఇటువంటి; పుణ్యప్రబంధంబులు= పుణ్యగ్రంథాలు; దేవసన్నిధిన్= దేవుడి సమక్షంలో; ప్రశంసించుటయున్= బాగా చెప్పటం కూడా; ఒక్క+ఆరాధన విశేషంబు= ఒక ఆరాధన మార్గం; అగుటన్+చేసి= కావటం చేత.

**తాత్పర్యం:** నేను కవిత్వ దీక్ష వహించాను. ఈవిధంగా దైవసన్నిధిలో పుణ్యప్రబంధాలు చెప్పటం కూడా ఒక విశిష్టమైన ఆరాధన ఔతుంది.

**విశేషం:** శివాలయాలలో 'తేవారం' విష్ణ్వాలయాలలో 'నాలాయిరం' పఠించటం సంప్రదాయం. అంతేకాకుండా దేవాలయంలో 'పురాణాలు' చదవటం కూడా ఆనవాయితి. అందుచేత భారతం రచించి, వినిపించటం కూడ ఒక 'ఆరాధనావిశేషం'.

### షష్ఠ్యంతములు

**క. ఓంకార వాచ్యునకు, నన। హంకార నిరూఢ భావనారాధ్యునకున్,**
**హ్రీంకారమయ మనోజ్ఞా। లంకారోల్లాస నిత్యలాలిత్యునకున్. 32**

**ప్రతిపదార్థం:** ఓంకార వాచ్యునకున్= 'ఓం' అనే శబ్దంచేత చెప్పబడే వానికి; అనహంకార నిరూఢభావనా= అహంకారం ఏ మాత్రమూ పొతుకొనని భావన చేత; ఆరాధ్యునకున్= ఆరాధించదగిన వానికి; హ్రీంకారమయ= హ్రీంకారరూపమయిన; మనోజ్ఞ= మనోహరమయిన; అలంకార= భూషణం యొక్క; ఉల్లాస= ప్రకాశం చేత; నిత్యలాలిత్యునకున్= ఎల్లప్పుడు సౌందర్యం కలవానికి.

**తాత్పర్యం:** ఓంకార మనే ప్రణవం చేత చెప్పబడేవాడున్నూ, అహంకారం లేని భావనకు అందేవాడున్నూ, హ్రీంకార రూపమయిన అలంకారంతో ప్రకాశించేవాడున్నూ అయిన హరిహరనాథుడికి.

**విశేషం:** భగవంతుడు ఓంకార స్వరూపుడు. ఓంకారంలో అ-ఉ-మ కారాలు ఉన్నాయి. ఇవి బ్రహ్మ విష్ణు మహేశ్వర వాచకాలు. ఈ వర్ణమే ప్రణవం. హరిహరనాథుడు ఓంకారవాచ్యుడు. అహంకార రహితులే స్వామిని గుర్తించగలరు. హ్రీంకారం పరమేశ్వరీ వాచకం. దీనికి మాయాబీజ మని, హృల్లేఖామంత్రమని సంకేతం కూడా. రూపరహితుడయిన పరమేశ్వరుడికి హ్రీంకారం వలన సుందరరూపం సిద్ధిస్తుంది. ఈ రూపం ఉపాసకులకు అవసరం.

**క. త్రిభువన శుక దృఢపంజర। విభవ మహితునకు, సమస్త విష్టప నిర్మో**
**క భుజంగపతి, కఖిల జగ। ద భిన్న రూపునకు, భావనాతీతునకున్. 33**

**ప్రతిపదార్థం:** త్రిభువన= మూడు లోకా లనే; శుక= చిలుకకు; దృఢ= గట్టిదైన; పంజర= పంజరము యొక్క; విభవ= ఐశ్వర్యశక్తిచేత; మహితునకున్= పూజితు డయినవానికి; సమస్త విష్టప= అన్ని లోకాలనే; నిర్మోక= కుబుసం కల; భుజంగపతికిన్= నాగరాజుకు; అఖిలజగత్+అభిన్నరూపునకున్= అన్ని లోకాల తోడను భేదము లేని రూపం కలవానికి; భావనా+అతీతునకున్= ఊహాకందనివానికి.

**తాత్పర్యం:** స్వర్గ మర్త్య పాతాళాలని మూడు లోకాలు, లేదా భూర్భువస్సువర్లోకాలని మూడు లోకాలు. ఈ త్రిలోకాలనే చిలుకకు సంరక్షకమైన గట్టి పంజరంవంటివాడు హరిహరనాథుడు. లోకాలు అనేవి పాముకుబుసం వంటివి కూడా. ఆ సమస్తలోకాలనే కుబుసాన్ని విడిచిన సర్పరాజు వంటివాడు హరిహరనాథుడు. సర్వలోకాలు ధరించిన వాడూ, సర్వలోక స్వరూపుడూ అయిన హరిహరనాథుడు ఊహలకు అందనివాడు. అటువంటివానికి.

**విశేషం:** అలం: రూపకం. శుకం పంజరస్థమయినా పంజరం కంటె శుకం భిన్నం. అట్లాగే కుబుసం పామును అంటిపెట్టుకొన్నా పాము వదలి వేయటంతో భిన్నమవుతుంది. మొదటిదానిని సుస్పష్ట భేదసంబంధంగా, రెండవదానిని అస్పష్ట భేద సంబంధంగా చెప్పవచ్చును. ముల్లోకాలు భిన్నం కాకపోయినా హరిహరనాథుడి కంటె 'భిన్నంగా' కనిపిస్తాయి.

**క. శ్రుతి సీమంత మణికి, నా। శ్రిత వాంఛాపూర్తి కరణ చింతామణి, కా**
**నత దురిత తమో ద్యుమణికిఁ। గ్రతుభూషణమణికి, లోకరక్షా మణికిన్. 34**

**ప్రతిపదార్థం:** శ్రుతి సీమంత మణికిన్= వేదాల పాపట అయిన ఉపనిషత్తులకు చివర చేర్చుక్కగా ప్రకాశించే రత్నమయిన వాడికి; ఆశ్రిత= తనను ఆశ్రయించిన భక్తజనుల; వాంఛాపూర్తికరణ= కోరికలను నెరవేర్చటంలో; చింతామణికి= చింతామణి అయిన వానికి; ఆనత= వినయవంతులయిన భక్తుల; దురిత తమోద్యుమణికిన్= పాపాలనే చీకటికి సూర్యుడయిన వానికి; క్రతు భూషణమణికిన్= యజ్ఞాలకు అలంకారంగా విలసిల్లే మాణిక్యమైన వానికి; లోకరక్షామణికిన్= లోకాలకు ఎటువంటి ప్రమాదం జరగకుండా రక్షించే మణి అయిన వానికి.

**తాత్పర్యం:** వేదాల పాపట రత్నం అయిన వాడికి, ఆశ్రయించిన వారి కోర్కెలు తీర్చే చింతామణి అయిన వాడికీ, శరణు వేడిన భక్తుల పాపాలనే చీకట్లను పారద్రోలే సూర్యుడయిన వాడికీ, యజ్ఞాలకు తలమానిక మయినవాడికీ, లోకాలను రక్షించే శ్రేష్ఠుడికీ.

**విశేషం:** అలం: రూపకం. హరిహరనాథుడు వేదం అనే నాయికకు పాపట బొట్టు లాంటివాడు. ఆశ్రితుల కోరికలను తీర్చే చింతామణి. నమస్కరించిన వారి పాపాలనే చీకట్లను పోగొట్టే సూర్యుడు. యజ్ఞాలను ప్రకాశింప చేసేవాడు.

**క. పరమశమ నిరత సంయమి। వరమానస కుముదహాస వర్ధన చంచ**
**చ్చరణ నఖ చంద్రికా వి। స్ఫురణా చిత్రప్రకార శోభాఢ్యునకున్.** **35**

**ప్రతిపదార్థం:** పరమశమ= ఉత్తమ శాంతియందు; నిరత= ఆసక్తులయిన; సంయమివర= యోగీశ్వరుల; మానస= మనస్సు లనెడి; కుముద= కలువ పూవులయొక్క; హాస= వికాసాన్ని; వర్ధన= పెంపొందించే; చంచత్= ప్రకాశించే; చరణ= పాదాల యందలి; నఖ= గోళ్ళయొక్క తెల్లదనమనే; చంద్రికా= వెన్నెలకు సంబంధించిన; విస్ఫురణా= ప్రకాశం యొక్క; చిత్ర ప్రకార= అనేక విధాలయిన; శోభా= సొంపులతో; ఆఢ్యునకున్= కూడిఉన్న గొప్పవాడికి.

**తాత్పర్యం:** పరమశాంతులయిన మహర్షుల మనస్సులనే కలువపూలకు వికాసాన్ని కలిగించే కాళ్ళ గోళ్ళ తెల్లని కాంతులనే వెన్నెల వెలుగుల సొంపులతో కూడిన వాడికి.

**విశేషం:** మునులు పరమశాంతులు. వారి మనస్సులు కలువల వంటివి. ఆ కలువల వికాసానికి హరిహరనాథుడి గోళ్ళ చంద్రకాంతులు సహకరిస్తున్నాయి. అంటే మునుల మనస్సులు భగవచ్చరణాలపై వ్రాలి శరణాగతిని పొందగా భగవంతుడు కరుణించి వారిని కృతార్థులను చేస్తాడని భావం. 'శమం' అంటే అంతరింద్రియ నిగ్రహం. మనస్సును విషయాలపట్ల ఆసక్తం కాకుండా నిగ్రహించటం. శాంతిని తాత్కాలికంగా కాకుండా స్థిరంగా నిలపటమే పరమశమం.

**క. హరిహరనాథునకు, మరు। త్సరిదాకల్పిత మనోజ్ఞ చరణ శిరస్సుం**
**దరమూర్తికి, భావనత। త్పర చేతో యుక్త భక్తపరతంత్రునకున్.** **36**

**ప్రతిపదార్థం:** మరుత్= దేవతల; సరిత్= నది అయిన మందాకిని చేత; ఆకల్పిత= అలంకరింపబడిన; మనోజ్ఞ= మనోహరమయిన; చరణ= పాదాలూ; శిరస్= మూర్ధమూ కల; సుందరమూర్తికిన్= అందమైన స్వరూపం కలవాడికి; భావన= ధ్యానంలో; తత్పర= ఆసక్తమయిన; చేతస్= మనస్సుతో; యుక్త= కూడిన; భక్త= భక్తులకు; పరతంత్రునకున్= వశుడయిన వానికి.

**తాత్పర్యం:** దేవగంగ చేత అలంకరించబడిన అందమైన పాదాలూ, శిరస్సూ కల సుందరమూర్తికీ, ధ్యానంలో నిమగ్నమయిన మనస్సు కల భక్తజనులకు వశుడై ఉండే వాడికి.

**విశేషం:** గంగానది విష్ణుపాదంలో పుట్టిందని, ఆ నదిని శివుడు జటాజూటంలో బంధించాడని ఐతిహ్యం. అయితే హరిహరనాథుడు సమన్వితమూర్తి. అందువలన గంగ హరిహరనాథుడి పాదాలనూ శిరస్సునూ ఒకేసారి అలంకరించింది. దానివలన సుందరస్వరూపుడై నాడు. అటువంటి అపూర్వ సౌందర్యతత్త్వ స్వరూపాన్ని భావించే భక్తులకూ జ్ఞానులకూ ఆ దేవదేవుడు సదా అధీనుడై ఉంటాడు. అంటే హరిహరనాథుడు భక్తపరాధీనుడని భావం.

భగవంతుడిని పాదాలనుండి శిరస్సు దాకా ఆరాధించటం సంప్రదాయం. భక్తులు పాదాలను సేవిస్తారు. శిరస్సును దర్శించి తన్మయులౌతారు. ఇవి భావనకు సంబంధించిన అంశాలు. ఈ భావనలో ఆత్మసంతృప్తి, తన్మయత్వం రెండూ దక్కుతాయి.

కథా ప్రారంభము (సం.4-1-1)

**వ. ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు చేసెద. 37**

**ప్రతిపదార్థం:** ఏను= నేను (తిక్కన); విన్నపంబు+చేయుతెఱంగుగాన్= విన్నవిస్తున్నట్టుగా; అంతస్సన్నిధిన్+కలిగించుకొని= హృదయంలో సాకారంగా ప్రత్యక్షంగా సామీప్యాన్ని కలిగించుకొని; ఆ+మహాకావ్యంబు= కావ్యరూపమైన ఆ మహాభారత ఇతిహాసం యొక్క; అర్థంబు= తాత్పర్యాన్ని, తత్త్వాన్ని, ప్రయోజనాన్ని; సంగతంబు చేసెదన్= స్పష్టం చేస్తాను.

**తాత్పర్యం:** హరిహరనాథుడికి నేను స్వయంగా విన్నవిస్తున్నట్లు మనస్సులో సాన్నిధ్యం కలిగించుకొన్నాను. కావ్య స్వరూప మహాభారతేతిహాసంలోని తాత్పర్యాన్నీ, తత్త్వాన్నీ, ప్రయోజనాన్నీ స్పష్టం చేస్తాను.

**క. శరణాగత సంశ్రిత భయ। హరణా! సురనికర శేఖరానర్ఘమణి**
**స్ఫురణా పరిచయ రంజిత। చరణా! వనమాలికా భుజంగాభరణా! 38**

**ప్రతిపదార్థం:** శరణ+ఆగత= నీవే 'శరణు' అంటూ 'శరణు' పొందిన; సంశ్రిత= ఆశ్రితులయొక్క; భయహరణా!= భయాన్ని పోగొట్టేవాడా!; సురనికర= దేవతల సముదాయంయొక్క; శేఖర= శిరస్సుల మీద ఉన్న భూషణాలలోని; అనర్ఘమణి= అమూల్యమయిన మణులయొక్క; స్ఫురణా= కాంతులయొక్క; పరిచయ= సంబంధం చేత; రంజిత= ఎఱ్ఱబడిన; చరణా!= పాదాలు కలవాడా!; వనమాలికా= వనమాలనూ; భుజంగ= పామునూ; ఆభరణా!= ఆభరణాలుగా కలవాడా!

**తాత్పర్యం:** శరణు కోరి ఆశ్రయించిన వారల భయాన్ని పోగొట్టేవాడా! ఇంద్రాది దేవతలు నమస్కరించగా వారి శిరోభూషణాల (కిరీటాల) కాంతులచేత మిగుల ప్రకాశించే పాదాలు కలవాడా! వనమాలికనూ, పామునూ ఆభరణాలుగా కలవాడా! ఓ హరిహరనాథా!

**విశేషం:** అలం: క్రమం. ఈ పద్యంలో మూడు సంబోధనలున్నాయి. మొదటి రెండూ హరి కయినా హరుడి కయినా సమానమే. కాని, మూడవది హరిహరనాథుడికే. వనమాల ఆభరణంగా కలవాడు విష్ణువు. పామును ఆభరణంగా కలవాడు శివుడు. ఈ రెండూ కలవాడు హరిహరనాథుడు.

**క. అజగవ శార్ఙ్గాలంకృత!। భుజగర్వ నిరస్తదైత్య! భూమస్తుత్యా!**
**త్రిజగద్ధారణ నిత్యా!। భుజగ సమాచరిత శయన భూషణ కృత్యా! 39**

**ప్రతిపదార్థం:** అజగవ= అజగవం (అనే పేరు గల ధనుస్సు) చేతనూ; 'శార్ఙ్గం= శార్ఙ్గం (ధనుస్సు పేరు) చేతనూ; అలంకృత!= అలంకరించబడినవాడా!; భుజ= భుజాలయొక్క; గర్వ= గర్వంచేత; నిరస్త= తొలగించివేయబడిన; దైత్య!= రాక్షసులుకలవాడా!; భూమస్తుత్యా!= ఎన్నో విధాలుగా, సర్వాతిశయత్వం చేత స్తుతింపదగిన వాడా!; త్రిజగత్+ధారణ నిత్యా!= మూడు లోకాలనూ ధరించటంలో శాశ్వతుడవు అయిన వాడా!; భుజగ= పాముచేత; సమాచరిత= ఆచరించబడిన; శయన (కృత్యా)= శయనంగాను; భూషణకృత్యా!= భూషణంగాను చేసికొనిన వాడా!

**తాత్పర్యం:** అజగవం, శార్ఙ్గం అనే ధనుస్సులు ధరించి శత్రు సంహారం చేసినవాడా! ముల్లోకాలకు ఆధార భూతుడవైన నిత్యుడా! అనేక విధాలుగా సర్వాతిశయుడిగా కీర్తింపదగిన సుప్రసిద్ధుడా! సర్పాన్ని శయ్యగానూ (హరి), (హరుడు) ఆభరణంగానూ చేసికొనిన మహనీయా! హరిహరనాథా!

**విశేషం:** అలం: క్రమం. శివుని వింటికి 'అజగవం' అని పేరు. దానికే పినాకం అని మరో పేరు కూడా ఉన్నది. విష్ణుమూర్తి వింటికి 'శార్ఙ్గం' అని పేరు. శయనం ఆధార మయితే భూషణం సహస్రారమౌతుంది. కుండలినీ శక్తి భుజగరూపంలో ఉంటుందని యోగశాస్త్రం. కుండలినీయోగం ద్వారా హరిహరనాథ తత్త్వానుభూతిని పొందవచ్చునని తాత్పర్యం.

**క. జలనిధి హిమవద్భూధర। కలిత జనన కేళికౌతుక వ్యక్తా వ్య**
**క్త లలిత సౌందర్య స్ఫుర। దలఘుతను స్త్రీ సనాథ! హరిహరనాథా!** **40**

**ప్రతిపదార్థం:** జలనిధి= సముద్రం నుండి; హిమవద్భూధర= హిమవత్పర్వతం నుండి; కలిత= కలిగిన; జనన= జన్మమనే; కేళికౌతుక= క్రీడా కుతూహలం చేత; వ్యక్త+అవ్యక్త= స్పష్టమూ అస్పష్టమూ ఐన - అంటే స్పష్టాస్పష్టమైన; లలిత సౌందర్య= మనోహరమయిన సౌందర్యంతో; స్ఫురత్= ప్రకాశించే; అలఘుతను= ఉత్తమ శరీరం గల; స్త్రీ సనాథ= అంగనతో కూడిన వాడా! హరిహరనాథా!

**తాత్పర్యం:** అటు క్షీర సముద్రానికీ, ఇటు హిమవత్పర్వతానికీ పుట్టి లీలగా ధరించిన దివ్యవేషంతో, వ్యక్తావ్యక్తమైన కోమల సౌందర్య స్ఫూర్తితో ప్రకాశించే స్త్రీమూర్తికి నాథుడవైనవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: క్రమం. హరిహరనాథుడి భార్యకు రెండు పేర్లు. అవి లక్ష్మి, పార్వతి అని, కాని, ఆమె ఆకృతి ఒక్కటే. అయితే లోకంలో లక్ష్మి పాలమున్నీటిలో పుట్టిందనీ, గౌరి హిమవంతుడి కూతురనీ ప్రసిద్ధి ఉన్నది. ఒకరికి రెండు పుట్టుకలు, ఇద్దరు తండ్రులు ఎట్లా ఉంటారు? ఇది లోక విరుద్ధం. అందువలన ఆ పుట్టుకలు ఆమె లీలలుగా తిక్కన కీర్తించాడు. ఆమె తత్త్వతః మూల ప్రకృతి అయిన మాయ. ఆమె పరమేశ్వరుడిని ఆశ్రయించుకొని ఉన్నప్పుడు అవ్యక్తరూపిణి, (ప్రత్యేకంగా తెలియబడని రూపం కలది అని భావం.) పరమేశ్వరుడు సృష్టిని నిర్వహించేటప్పుడు ఆ మూలప్రకృతిని ఆధారంగా చేసికొని సృష్టికార్యాన్ని చేస్తాడు. అప్పుడామె ఇరవైమూడు తత్త్వాలుగా వ్యక్తమౌతుంది. ఆ తత్త్వాలు ఇవి - మహత్తత్త్వం, అహంకారం, పంచతన్మాత్రలు, పంచమహాభూతాలు, అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కరణేంద్రియాలు, మనస్సు. **"త్రయోవింశతి తత్త్వాని వ్యక్త శబ్దేన సూరయః। వదన్త్యవ్యక్త శబ్దేన ప్రకృతించ పరాంతథా" అని బ్రహ్మాండపురాణం.** ఆమె శరీరం అలఘువు అనటం చేత విశ్వవ్యాప్తమైన ఆమె తత్త్వం అవ్యక్త సుందరమనీ, ప్రకృతియొక్క పరమసౌందర్యం ఆమె యొక్క వ్యక్త సౌందర్యమనీ, హరిహరనాథుడిలో ప్రతిఫలించిన ఆ మహామాయ అనే స్త్రీ వ్యక్తావ్యక్తమైన సౌందర్య స్ఫూర్తి కలిగినదనీ తిక్కన తత్త్వసుందరంగా అభివర్ణించాడు. పై రెండు పద్యాలూ ఆశ్వాసారంభ పద్యాలు. కృతిపతిని వినుమని సంబోధిస్తూ చెప్పేవి. అందువలననే ఇవి సంబుద్ధ్యంతాలుగా ఉన్నాయి. (సంపా.)

**వ. దేవా, దివ్య చిత్తంబున నవధరింపుము. 41**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; దివ్యచిత్తంబునన్= దివ్యమయిన మనస్సుతో; అవధరింపుము= చిత్తగింపుము.

**తాత్పర్యం:** హరిహరనాథా! నీ మహిమాన్వితమైన మనస్సుతో వినుము.

**విశేషం:** 'అవధరింపుము' అనటంలో ఆంతర్యం గ్రహించవలసిందిగా విన్నపం. దివ్యచిత్త మనటంలో 'నీవే పలికించే ఈ పలుకులను నీ మహిమలుగానే గ్రహించు' మని ఆంతర్యం. తిక్కన సమయం దొరికినప్పుడెల్లా తన వాక్యాలలో హరిహరనాథుడి పట్ల తనకు గల భక్తిని సార్థకములైన విశేషణ విశేష్యాలతో ప్రకటిస్తూ ఉంటాడు.

**ఆ. కథ జగత్ప్రసిద్ధి గావునఁ బూర్వ ప । ర్వార్థ యుక్తి చేయునట్టి యెడల**
**యత్న మించుకంత యయినను వలవదు । వలసినట్లు చెప్పవచ్చి యుండు. 42**

**ప్రతిపదార్థం:** కథ= భారతకథ; జగత్ప్రసిద్ధి= లోక ప్రసిద్ధి కలది; కావునన్= కాబట్టి; పూర్వపర్వ+అర్థయుక్తి= వెనుకటి పర్వాల అర్థాన్ని సమకూర్చటం; చేయు+అట్టి+ఎడలన్= చేసే సందర్భాలలో; యత్నము= ప్రయత్నం; ఇంచుక+అంత+అయినను= ఏకొద్ది పాటి అయినా; వలవదు= అక్కరలేదు; వలసిన+అట్లు= అవసరమైనట్లు; చెప్పన్+వచ్చి+ఉండు= చెప్పటానికి వీలుగా ఉంటుంది.

**తాత్పర్యం:** మహాభారతకథ లోకంలో ప్రసిద్ధమై ఉండటంచేత జరిగిన కథను, జరగబోయే కథను జోడించే సందర్భాలలో ఎటువంటి ప్రత్యేక ప్రయత్నం అక్కర లేకుండానే ఎక్కడనుండైనా మొదలుపెట్టవచ్చును.

**విశేషం:** పూర్వాపరకథార్థ సమన్వయం మహాకావ్యాలలో, ఇతిహాసాలలో పాటించే కథాకథన శిల్పం. దానిని తిక్కన ఇక్కడ సూచించాడు. 'కథ జగత్ప్రసిద్ధ' అనే పాఠాంతరానికి కథ జగత్తునందు ప్రసిద్ధమైనది-అని అర్థం చెప్పవచ్చును.

**వ. మహాభారతంబు సమస్త దురితాపహంబును, నభిమత శుభావహంబును, నశుభ హరణంబునుం గావున నొక్క మహాఫలంబు గోరి జనమేజయుండు కృష్ణద్వైపాయన మహాముని కారుణ్యంబు వడసి, తదీయ ప్రియశిష్యుం డైన వైశంపాయను వలన వినిన కథ యగుటం జేసి తత్ప్రకారంబు నడపెద; నది యె ట్లనినం బరమ పవిత్రు లగు పాండుపుత్త్రుల చరిత్రం బుపాఖ్యాన సహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారల వనవాస సమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె. 43**

**ప్రతిపదార్థం:** మహాభారతంబు; సమస్త, దురిత+అపహంబును= అన్ని పాపాలనూ తొలగించేదీ; అభిమత, శుభ+ఆవహంబును= కోరుకొన్న శుభాలను కలిగించేదీ; అశుభ హరణంబునున్= మంగళకరాలు కాని వాటిని నశింపచేసేదీ కూడా; కావునన్= కాబట్టి; ఒక్క మహత్+ఫలంబు= ఒక గొప్ప ఫలితాన్ని - అంటే మోక్షాన్ని; కోరి= ఆశించి; జనమేజయుండు; కృష్ణద్వైపాయన మహత్+ముని= వ్యాసమహర్షియొక్క; కారుణ్యంబు+పడసి= దయను పొంది; తదీయ, ప్రియ, శిష్యుండు+ఐన= అతని (వ్యాసుని) మనసు కెక్కిన శిష్యుడైన; వైశంపాయను వలన; వినిన; కథ; అగుటన్+చేసి; తద్+ప్రకారంబు= ఆ విధంగా; నడపెదన్= కథను నడుపుతాను; అది= ఆ కథయొక్క క్రమం; ఎట్లు+అనినన్= ఏవిధంగా ఉంటుందంటే; పరమ, పవిత్రులు+అగు= ఎంతో నిర్మలమైన శీలం కలిగిన, చరిత్రకలవారైన; పాండుపుత్త్రుల, చరిత్రంబు= పాండవుల కథను; ఉప+ఆఖ్యాన సహితంబుగా= ఉపకథలతో కలిసినదిగా;

వ్యాఖ్యానంబు= వివరించటం; చేయుచున్+ఉండన్; వారల= పాండవుల యొక్క; వనవాస, సమ్యక్+అనుష్ఠానంబు= వనవాసవ్రతాన్ని సముచితంగా ఆచరించటం (నిర్వహించటం); సవిస్తరంబు+కాన్= విశదంగా; విని; జనమేజయుండు; వైశంపాయనునకున్= వైశంపాయనునికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** మహాభారతం పాపాలన్నింటిని పోగొట్టేది. కోరిన శుభాలను కలిగించేది. అమంగళాలను తొలగించేది. కాబట్టి ఒక మహాఫలాన్ని (మోక్షాన్ని) ఆశించి జనమేజయుడు వ్యాసమహర్షి దయనుపొంది, భారతం ఆతడి ప్రియశిష్యుడగు వైశంపాయనుడు చెప్పగా వినిన కథ కావటం చేత, ఆ పద్ధతి ననుసరించి కథను నడుపుతాను. అది ఎట్లాగంటే వినండి! ఎంతో నిర్మలమైన శీలంగల పాండవుల చరిత్రను ఉపాఖ్యానాలతో జతకలిపి వివరిస్తూ ఉండగా పాండవులు వనవాసవ్రతాన్ని సముచితంగా సాగించిన విధాన్ని విస్తారంగా విని, జనమేజయుడు వైశంపాయనుడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** వ్యాసుడు రచించిన జయకావ్యాన్ని వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పాడు. ఆ చెప్పేటప్పుడు జనమేజయుడికి కలిగిన అనుమానాలను తీర్చటానికి అనేక ఉపాఖ్యానాలను, అంశాలను చేర్చి చెప్పి వ్యాస తాత్పర్యానికి వ్యాఖ్యానం చేశాడు. ఆ అంశాలన్నీ కలిసి జయకావ్యం భారతంగా రూపొందింది. (సంపా.)

**చ. "మహిత సముజ్జ్వలాకృతులు, మానధనుల్, జనమాన్యు లంగనా**
**సహితము గా౦గ నేమిగతి సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై**
**నహితుల కప్రభేద్యముగ నా పదుమూ౦డగు నే౦డు మత్పితా**
**మహులు చరించి? రంతయు౦ గ్రమంబున నా కెఱు౦గంగ౦ జెప్పుమా." 44**

**ప్రతిపదార్థం:** మహిత= గొప్పవయిన; సముజ్జ్వల+ఆకృతులు= ప్రకాశవంతమయిన ఆకారాలు కలవారూ; మానధనుల్= అభిమానమే సంపదగా కలవారూ; జనమాన్యులు= ప్రజలచేత గౌరవించ దగినవారూ అయినటువంటి; మత్+పితామహులు= నా తాతలు; అంగనా సహితము+కా౦గన్= స్త్రీ అయిన ద్రౌపదితో సహా; ఏమిగతిన్= ఏవిధంగా; సమ్యక్= చక్కని; ఉపాయ= ఉపాయంతో కూడిన; నిగూఢ= చాల రహస్యమయిన; వృత్తిమైన్= ప్రవర్తనతో; అహితులకున్= విరోధులకు; అప్రభేద్యముగన్= భేదించటానికి ఏ మాత్రమూ వీలుకాకుండా; ఆ పదుమూ౦డు+అగు+ఏ౦డు= అరణ్యవాసానంతరం చేయవలసిన అజ్ఞాతవాసమయిన పదమూడవ సంవత్సరాన్ని; చరించిరి= గడిపారు? అంతయున్= ఆ వృత్తాంతమంతా; క్రమంబునన్= వరుసగా; నాకున్= నాకు; ఎఱు౦గంగన్= తెలిసేవిధంగా; చెప్పుమా= చెప్పుము.

**తాత్పర్యం:** 'మా తాతలయిన పాండవులు స్ఫురద్రూపులు, అభిమానధనులు, ప్రజల గౌరవాలను అందుకొన్నవారు. అటువంటి పాండవులు ద్రౌపదితో కలిసి అజ్ఞాతవాసకాలాన్ని బయటపెట్టదలచే విరోధులకు అసాధ్యంగా అతిరహస్యంగా చాతుర్యంతో ఎట్లా గడిపారో చెప్పండి.'

**విశేషం:** ఆకారాన్ని బట్టి ఒక మనిషిని సులభంగా గుర్తించవచ్చును. ప్రకాశవంతమైన స్ఫురద్రూపాలు గల పాండవులు తమను గోప్యంగా ఉంచుకొనటం దుర్లభం. అజ్ఞాతవాసంలో పాండవులు తమ రాజసాన్ని, తేజస్వితను ఎట్లా దాచుకొన్నారు? అన్నది ఆశ్చర్యకరమైన మొదటి ప్రశ్న. అట్లాగే అభిమానధనులు ఒకరికి లొంగి బ్రతుకలేరు. ఇతరుల తిరస్కారాన్ని సహించలేరు. అటువంటి వారు ఎన్నడూ బయటపడకుండా ఎట్లా ఒదిగి నివసించగలిగారు? అన్నది రెండో ప్రశ్న. అంతేగాకుండా ఐదుగురు ఒక అంగనతో ప్రచ్ఛన్న జీవితం గడపటం అసాధ్యం. అయిదుగురు భర్తలు, ఒక భార్య ఒకచోటే కలిసి ఉంటే బయటపడటం, ఇతరులు

గుర్తించటం సులభం. అందుచేత పాండవులు అజ్ఞాతవాసాన్ని ఎట్లా గడిపారన్నది కుతూహలమయిన ప్రశ్నే అవుతుంది. పాండవులు గడిపిన అజ్ఞాతవాసంలో వారిని పరీక్షకు గురిచేసిన సన్నివేశాలుగల విరాటపర్వంలో అంశాలు గమనించ తగినవని కావ్యకథాశిల్ప మర్మాన్ని తిక్కన సూచిస్తున్నాడు.

**క. అని యడిగిన వైశంపా। యనుఁ డమ్మనుజేంద్రచంద్రు నధి కౌత్సుక్యం**
**బున కలిమికిఁ దన హృదయం। బున గాఢాదరము భరితముగ ని ట్లనియెన్. 45**

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= అని అడుగగానే; వైశంపాయనుఁడు; ఆ+మనుజ+ఇంద్ర చంద్రున్= ఆ రాజోత్తమునియొక్క; అధిక+ఔత్సుక్యంబున కలిమికిన్= ఎక్కువ కుతూహలంయొక్క ఉనికికి; తన= తనయొక్క; హృదయంబునన్= మనసులో; గాఢ+ఆదరము= దృఢమయిన ఆదరం; భరితము+కన్= నిండగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని జనమేజయుడు తన కుతూహలాన్ని ప్రకటించగానే వైశంపాయనుడు అధికమైన ఆదరంతో ఈ విధంగా అన్నాడు.

**వ. పాండవులు వనవాసంబు సముచితంబుగా సలిపి, పంద్రెండగు నేఁటి కడపటఁ దమకు ధర్మదేవతా సమాగమం బయినం, దత్ప్రసాదంబున నజ్ఞాతవాస సమయంబునకు భంగంబు గాకుండ వరంబు వడసి, యంతకుమున్ను తమ వెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబులఁ దోడన కొని వర్తిల్లు భూసురోత్తములు దమ్ముం బరివేష్టించి యుండఁ దారనుష్ఠింపం బూనిన పని వారల కెఱింగింపం దలంచి కర (కమల)ంబులు మొగిచి సవినయంబుగా ని ట్లనిరి. 46**

**ప్రతిపదార్థం:** పాండవులు= ధర్మరాజాదులు; వనవాసంబున్= అరణ్యవాసాన్ని; సముచితంబుగాన్= తగినవిధంగా; సలిపి= పూర్తిచేసి; పంద్రెండు+అగు+ఏఁటి+కడపటన్= పన్నెండవ సంవత్సరం చివర; తమకున్= తమకు; ధర్మదేవతా సమాగమంబు= యమధర్మరాజుతో కలయిక; అయినన్= కాగా; తద్+ప్రసాదంబునన్= ఆయన అనుగ్రహంచేత; అజ్ఞాతవాస సమయంబునకున్= పదమూడవ సంవత్సరమయిన అజ్ఞాతవాస కాలానికి; భంగంబు+కాకుండన్= విఘ్నం కలుగకుండా; వరంబు+పడసి= వరం పొంది; అంతకుమున్ను= అంతకుముందు అరణ్యవాసంలో; తమ వెనుకన్= తమతో బాటు ఉంటూ; అడవులన్+తిరుగుచున్= అరణ్యాలలో తిరుగుతూ; అగ్నిహోత్రంబులన్= నిత్యమూ తాము ఉపాసించే అగ్నిహోత్రాలను; తోడన్+అ, కొని= వెంటపెట్టుకొని; వర్తిల్లు= ప్రకాశించే; భూసుర+ఉత్తములు= బ్రాహ్మణశ్రేష్ఠులు; తమ్మున్= తమను (పాండవులను); పరివేష్టించి+ఉండన్= చుట్టి ఉండగా; తారు= తాము; అనుష్ఠింపన్+పూనిన= చేయదలచిన; పని= కర్తవ్యాన్ని; వారలకున్= బ్రాహ్మణులకు; ఎఱింగింపన్+తలంచి= తెలియజేయాలని భావించి; కర(కమలం)ంబులు= పద్మాలవంటి చేతులను; మొగిచి= జోడించి; సవినయంబుగాన్= వినయంతో; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** పాండవులు అరణ్యవాసం పూర్తి చేశారు. ఆ అరణ్యవాసం చివర యమధర్మరాజు (యక్షప్రశ్నల ఘట్టంలో) ప్రత్యక్షమైనాడు. 'అజ్ఞాతవాసంలో ఎటువంటి ఇబ్బందులు రా' వని పాండవులకు వరం ఇచ్చాడు. అగ్నిహోత్రాలతో తమతో పాటు అడవులలో ఉంటూ ఉన్న బ్రాహ్మణులు చుట్టూ కూర్చొని ఉండగా వారికి తాము చేయబోయే 'అజ్ఞాతవాసం' గురించి చెప్పాలని పాండవు లనుకొన్నారు. అందువలన బ్రాహ్మణులకు వినయంతో చేతులు జోడించి ఈ విధంగా అన్నారు.

**సీ. 'తెల్లంబు గాదె మీ కెల్ల సుయోధను। చేసిన కుటిల విచేష్టితంబు**

**లకట! మాతో మీరు నడవుల నిడుమలఁ। బొందితి; రొకభంగిఁ బోయెఁ గాల;**

**మిది పదుమూఁ డగు నేఁడు మా కజ్ఞాత। వాసంబు సలుపంగ వలయు; నిందు**

**ధార్తరాష్ట్రులు సూతతనయ సౌబలులును। జెఱుపన వేతురు; చిన్నసన్న**

**ఆ. యెఱిఁగి రేనిఁ జాలనెగ్గు వాటిల్లు, న। ట్లగుట మమ్ము నింక నతి రహస్య**

**వృత్తిమై నిరస్తవిఘ్నుల రై చరి। యింపుఁ డని యనుగ్రహింపవలయు.' 47**

**ప్రతిపదార్థం:** సుయోధను చేసిన= దుర్యోధనుడు చేసినటువంటి; కుటిల విచేష్టితంబులు= వంచనతో కూడిన దుష్టతంత్రాలు; మీకున్+ఎల్లన్= మీకందరికి; తెల్లంబు+కాదె= తెలుసుకదా; అకట; మాతోన్= ప్రతిజ్ఞాపాలనం కొరకు సిద్ధమయిన మాతో; మీరును= అవ్యాజ అభిమానంతో అనుసరించిన మీరు కూడా; అడవులన్= అరణ్యాలలో; ఇడుమలన్+పొందితిరి= కష్టాల పాలయ్యారు; కాలము+ఒకభంగిన్+పోయెన్= ఏదో ఒక రకంగా కాలం గడిచిపోయింది; ఇది పదుమూఁడు+అగు+ఏఁడు= అజ్ఞాతవాసం పూర్తి చేసికొనవలసిన పదమూడవ సంవత్సరం ఇది; మాకున్= ప్రతిజ్ఞ ప్రకారం నడచుకొనవలసిన మాకు; అజ్ఞాతవాసంబు= ఎవరూ గుర్తించకుండా రహస్యంగా నివసించటం; సలుపంగవలయున్= పూర్తిచేయవలసిన అవసరమున్నది; ఇందున్= ఈ అజ్ఞాతవాసకాలంలో; ధార్తరాష్ట్రులు= కౌరవులు; సూతతనయ సౌబలులును= కర్ణుడు, శకునియు; చెఱుపన్+అ+వేతురు= భంగం చేయడానికే చూస్తారు (ప్రయత్నిస్తారు); చిన్నసన్న= చిన్న గుర్తు; ఎఱిఁగిరి+ఏని= తెలుసుకున్నట్లయితే; చాలన్+ఎగ్గు= మిక్కిలి కీడు; పాటిల్లున్= కల్గుతుంది; అట్లు+అగుటన్= అందుచేత; మమ్మున్= మమ్మల్ని; ఇంకన్= ఇకమీద; అతిరహస్య వృత్తిమైన్= మిగుల నిగూఢమయిన ప్రవర్తనతో; నిరస్త విఘ్నులరు+ఐ= పోయిన ఆటంకములు కలవారై - ఎటువంటి ఆటంకాలు లేనివారయి; చరియింపుఁడు+అని= అజ్ఞాతవాస కాలం గడపండి అని; అనుగ్రహింపవలయున్= అనుగ్రహించాలి.

**తాత్పర్యం:** 'బ్రాహ్మణోత్తములారా! దుర్యోధనుడు చేసిన దుష్టతంత్రాలు మీకు తెలుసుకదా! మామీది ఆదరంతో మాతో పాటు మీరంతా అరణ్యాలలో చాల కష్టాలు అనుభవించారు. పన్నెండు సంవత్సరాల కాలం ఏదో ఒకవిధంగా గడిచిపోయింది. ఇది పదమూడవ సంవత్సరం. మేము అజ్ఞాతవాసం పూర్తి చేసికొనవలసిన సంవత్సరం. దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని మొదలయిన వారంతా ఏవిధంగానైనా మా అజ్ఞాతవాసం చెడగొట్టటానికే తప్పక ప్రయత్నిస్తారు. ఏదయినా చిన్న 'ఆచూకి' దొరికితే చాలు. మాకు కష్టాలు తప్పవు. అందుచేత 'అజ్ఞాతవాసం' ఎటువంటి అడ్డంకులు లేకుండా సాగేటట్లు ఆశీర్వదించండి.'

**వ. అని చెప్పి; రట్టి సమయంబున ధర్మనందనుండు విషణ్ణహృదయుండై. 48**

**తాత్పర్యం:** అని చెప్పారు. ఆ సమయంలో ధర్మరాజు విచార హృదయంతో (ఇట్లాఅన్నాడు).

**క. 'ఒకనాఁ డేమును నాపద। లకు విడుమరఁ గాంచి విప్రులం జుట్టలఁ బె**

**ట్టుకొని సుఖముండఁ బడయుదు। మొకొ! యిప్పా టెందుఁ గలదె యొరు లెవ్వరికిన్?' 49**

**ప్రతిపదార్థం:** ఒకనాఁడు= ఏదో ఒకరోజున; ఏమునున్= మేము కూడా; ఆపదలకున్= ఆపదల నుండి; విడుమరన్+కాంచి= విడుదల పొంది; విప్రులన్= బ్రాహ్మణులను; చుట్టలన్= చుట్టాలను; పెట్టుకొని= దగ్గర ఉంచుకొని; సుఖము+ఉండన్= సుఖంగా

జీవితం గడపట మనే (అదృష్టం); పడయుదుము+ఒకొ!= పొందుతామా!; ఒరులు+ఎవ్వరికిన్= ఇతరులెవ్వరికయినా; ఈ+పాటు= ఇటువంటి అరణ్యవాస అజ్ఞాతవాసాల వలని కష్టం; ఎందున్= ఎక్కడయినా; కలదె?= ఉన్నదా? (లేదని భావం).

**తాత్పర్యం:** 'బ్రాహ్మణులారా! మేము ఆపదల బారినుండి ఏనాటికైనా గట్టెక్కుతామా? మీ వంటి బ్రాహ్మణులు, చుట్టాలు అందరూ మా చుట్టూ గుమికూడి ఉండగా సుఖంగా జీవితం గడుపుతామా? ఇటువంటి కష్టం ఇంకెవరికయినా ఎన్నడైనా కలిగిందా?'

**వ. అని డగ్గుత్తిక వెట్టి దుఃఖ పరవశుం డగుటయు, నమ్మహీసురవరులుం దమ్ములు నతని నాశ్వాసించుచుండఁ దత్పార్శ్వంబున నున్న ధౌమ్యుండు తదీయ విషాదాపనోదంబు సేయం దలంచి యి ట్లనియె. 50**

**ప్రతిపదార్థం:** అని= తన బాధలను వారితో చెప్పుకొని; డగ్గుత్తిక+పెట్టి= గద్గదస్వరంతో; దుఃఖపరవశుండు+అగుటయున్= దుఃఖం కారణంగా వశం తప్పిన వాడు కాగా; ఆ+మహీసుర వరులున్+తమ్ములున్= ఆ బ్రాహ్మణులూ, తమ్ములూ కూడా; అతనిన్= ఆ ధర్మరాజును; ఆశ్వాసించుచున్+ఉండన్= ఓదారుస్తుండగా; తత్+పార్శ్వంబునన్+ఉన్న= ఆ బ్రాహ్మణుల ప్రక్కనున్న; ధౌమ్యుండు= పురోహితుడయిన ధౌమ్యుడు; తదీయ= ధర్మరాజుయొక్క; విషాద+అపనోదంబు+చేయన్+తలంచి= విచారం పోగొట్టాలని తలంచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు దుఃఖపరవశుడైనాడు. అందుచేత అతడి గొంతు దుఃఖ తీవ్రతకు గాద్గద్యంతో జీరవోయింది. ఆ స్థితిని గమనించి చుట్టూ ఉన్న బ్రాహ్మణులూ, తమ్ములూ అతడిని ఓదార్చసాగారు. అప్పుడు ప్రక్కనే ఉన్న ధౌమ్యుడు ధర్మరాజుయొక్క విచారాన్ని పోగొట్టాలని తలంచి ఇట్లా అన్నాడు.

ధౌమ్యుండు పాండవుల నూరార్చుట (సం. 4-1-22) (కుంభకోణప్రతి)

**ఉ. 'ధర్మనిరూపకత్వమున ధైర్యముననన్, మహనీయవృత్తి, స**
**త్కర్మ విధిజ్ఞతం జతురతా మహిమన్, దృఢబుద్ధి నెవ్వరున్**
**ధర్మజుపాటిగా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైన యిట్టి నీ**
**పేర్మికి నీడె? దుర్దశల పెల్లునకున్ దురపిల్లు టారయన్. 51**

**ప్రతిపదార్థం:** ధర్మనిరూపకత్వముననన్= ధర్మాధర్మాలను నిరూపించటంలోనూ; ధైర్యముననన్= దిటవుతనంలోనూ; మహనీయ వృత్తిన్= అందరూ మెచ్చుకొనే ఘనమయిన ప్రవర్తనలోనూ; సత్కర్మ విధిజ్ఞతన్= ఉత్తమ కర్మల విధానాన్ని తెలిసి ఉండటంలోనూ; చతురతా మహిమన్= చాతుర్యంతో కూడిన శక్తిలోనూ; దృఢబుద్ధిన్= దృఢమయిన బుద్ధిలోనూ; ఎవ్వరున్= ఎవరుగాని; ధర్మజుపాటి+కారు= ధర్మరాజు సాటి రారు; అనఁగన్= అనేటట్లు; ధాత్రిన్= భూలోకంలో; ప్రసిద్ధుఁడవు+ఐన= ప్రసిద్ధుడ వైన; ఇట్టి= ఇటువంటి; నీ పేర్మికిన్= నీ ఘనతకు; ఆరయన్= బాగా పరిశీలిస్తే; దుర్దశల పెల్లునకున్= దురవస్థల పెంపునకు; దురపిల్లుట= దుః ఖించటం; ఈడె?= తగునా?

**తాత్పర్యం:** 'ధర్మరాజుకు సాటి అయిన వ్యక్తి మరొకడు లేడనీ, అతడు ధర్మాధర్మాలను నిర్ణయించటంలో మేటి అనీ, ధైర్యశాలి అనీ, ఉదాత్తప్రవృత్తి కలవాడనీ, సత్కర్మలూ, వాటి విధులూ బాగా తెలిసినవాడనీ, నేర్పరితనం కలవాడనీ, శక్తియుక్తులను ప్రదర్శించే నైపుణ్యం కలవాడనీ లోకంలో నీవు ప్రశస్తి పొంది ఉన్నావు. అటువంటి ఘనత కలిగిన ధీరుడవైన నీవు కష్టాలు క్రమ్ముకొనినప్పుడు ఈ విధంగా దుఃఖించటం నీ గౌరవానికి తగిందా? (కాదని భావం).

**వ. అట్లుంగాక** **52**

**తాత్పర్యం:** అంతే కాకుండా.

**క. దేవతల కైన నొక్కొక । చో వలయున కాదె శత్రుసూదనవిధి కా**
**లావాప్తికి మును దమ స । ద్భావంబు లడంచి యుడుగఁబడి యుండంగన్.** **53**

**ప్రతిపదార్థం:** దేవతలకున్+ఐనన్= దేవతలకయినా సరే; ఒక్కొక చోన్= ఒక్కొక్కప్పుడు; శత్రుసూదన విధి కాల+అవాప్తికిన్= శత్రుసంహార కాలం రాకకు (విరోధులు సంహరింపబడే కాలం వచ్చేదాక); మును= పూర్వం; తమ సద్భావంబులు= తమవైన దివ్యస్వభావాలను; అడంచి= అణచుకొని; ఉడుగన్+పడి+ఉండంగన్= విజృంభించకుండా ఒదిగి ఉండటం; వలయున్+అ+కాదె= తప్పదు కదా (అవసరం కదా).

**తాత్పర్యం:** దేవతలు సమర్థులు కావచ్చును. కాని, కొన్నివేళలలో వారి సామర్థ్యం పనికి రాదు. ప్రత్యేకించి విరోధులను సంహరించే కాలంలో, అటువంటి సందర్భాలలో కాలం కలిసి వచ్చేదాకా తమ సామర్థ్యాన్ని బహిర్గతం చేయకుండా అణగి ఉండటం అవసరం కదా.

**విశేషం:** దేవతలే కొన్ని వేళలలో అణగి ఉన్నప్పుడు మానవ మాత్రులు ఒదిగి ఉండటం తప్పుకాదు. దీనివలన వారి సామర్థ్యానికి ఎటువంటి లోటు రాదు.

**సీ. నిషధాద్రియం దనిమిషపతి ప్రచ్ఛన్న । సంచరణమున వర్తించుటయును**
**నదితి గర్భంబున నవతార మై వామ । నాకారమున హరి యడఁగుటయును**
**జనని యూరు ప్రదేశంబున నతి నిగూ । ఢంబుగా నౌర్వుండు డాఁగుటయును**
**ధేను శరీర విలీనుఁడై యజ్ఞాత । చర్య మార్తాండుండు సలుపుటయును**

**ఆ. వినమె! యిట్లు వడిన వీరలు పదపడి । తమకు నగ్గమైన తఱి జయింప**
**రెట్లు ప్రబల రిపుల; నీవును నాపద । కోర్చి భంగపాటు దీర్చికొనుము.'** **54**

**ప్రతిపదార్థం:** అనిమిషపతి= దేవేంద్రుడు; నిషధ+అద్రియందున్= నిషధ పర్వతం మీద; ప్రచ్ఛన్న సంచరణమునన్= నిజస్వరూపం ఇతరులకు తెలియకుండా రహస్యంగా; వర్తించుటయున్= నివసించటం; హరి= విష్ణుమూర్తి; అదితిగర్భంబునన్= అదితి కడుపున; అవతారము+ఐ= అవతారం తాల్చి; వామన+ఆకారమునన్= పొట్టివాని రూపంలో; అడఁగుటయును= అణగి ఉండటమూ; ఔర్వుండు= ఔర్వుడు; జనని= తల్లియొక్క; ఊరు ప్రదేశంబునన్= తొడ లోపల; అతి నిగూఢంబుగాన్= ఎంతో రహస్యంగా; డాఁగుటయును= దాగుకొనటమూ; మార్తాండుండు= సూర్యుడు; ధేను శరీర విలీనుఁడు+ఐ= ఆవు శరీరంలో విలీనమయిపోయి; అజ్ఞాత చర్య= ఎవరికీ తెలియటానికి వీలు లేని విధంగా; సలుపుటయును= వాసంచేయుటము; వినమె= వినలేదా; ఇట్లు= ఈ విధంగా; పడిన= కష్టాలు పడిన; వీరలు= దేవేంద్రుడు, విష్ణుమూర్తి, ఔర్వుడు, సూర్యుడు మొదలయిన వారు; పదపడి= ఆ తరువాత; తమకున్= తమకు; అగ్గమైన తఱిన్= వీలయినప్పుడు; ప్రబలరిపులన్= బలవంతులయిన శత్రువులను; జయింపరు+ఎట్లు= జయించలేదా ఏమి, జయించారుకదా!; నీవునున్= నీవుకూడా; ఆపదకున్+ఓర్చి= ఆపదలకు తట్టుకొని; భంగపాటున్= ఇతరులు నీకు చేసిన అవమానానికి ప్రతీకారాన్ని; తీర్చికొనుము.

**తాత్పర్యం:** ఇంద్రుడు నిషధ పర్వతం మీద రహస్య జీవనం గడిపాడు. హరి అదితిగర్భంలో ప్రవేశించి వామన రూపుడయ్యాడు. ఔర్వుడు తల్లి తొడలో దాగి ఉన్నాడు. సూర్యుడు ధేను శరీర విలీను డయి అజ్ఞాతవాసం గడిపాడు.

వీరందరు సమర్థులే. అయినా కష్టాలు పడ్డారు. కాలం కలిసి రాగా విరోధులను జయించారు. అట్లాగే నీవు కూడా ఆపదలకు, ఇబ్బందులకు ఓర్చుకొని, ఆ తరువాత ప్రతీకారంచేసి అవమానం తీర్చుకొమ్ము.'

**విశేషం:** ఇంద్రుడు అనిమిషపతి. ఎంతో జాగ్రత్తగా విరోధి విజృంభణం కాకుండా పాలన సాగించే వ్యక్తి. అతడికి వృత్రుడి వలన 'చిక్కు' ఏర్పడింది. నురుగును వజ్రాయుధానికి కూర్చి వృత్రుడిని చంపాడు. అపుడు బ్రహ్మహత్య చేశావని భూతసంఘం నిందించింది. ఇంద్రుడి త్రిలోకాధిపత్యం ఊడిపోయింది. చివరకు నిషధ పర్వతం మీద తలదాచుకొన్నాడు. అపుడు నహుషుడికి ఇంద్రపదవి దక్కింది. అయినా అహంకారం వలన నహుషుడు శాపగ్రస్తుడయ్యాడు. ఇంద్రుడు బృహస్పతి, అగ్నిహోత్రాదుల సహాయంతో మరల అమర రాజ్యాధిపతి అయ్యాడు. బలిచక్రవర్తిని అణచటంకొఱకు విష్ణువు వామనరూపుడయ్యాడు. అన్నిటిని హరించగలిగిన వాడు హరి. అయినా అదితిగర్భంలో శిశువయ్యాడు. బ్రహ్మాండమంత వ్యాపించగలిగిన వాడు పొట్టి వాడయినాడు. భృగువంశం వాడు ఔర్వుడు. భృగు వంశజులు కృతవీర్యుడికి యాజకత్వం చేసేవారు. అందుచేత రాజు సంతోషించి యాజకులకు ధనం ఇచ్చేవాడు. కొంత కాలానికి కోశాగారం ఖాళీ అయింది. కృతవీర్యుడు కూడా చనిపోయాడు. రాజకుమారులకు దిక్కు తోచలేదు. యాజకత్వం పేరుతో భృగువంశజులు అంతా దోచారని వాళ్ళు అనుమానించారు. తీసికొన్న ద్రవ్యాన్నంతటిని తిరిగి ఇచ్చేయవలసిందిగా ప్రకటించారు. ఆ యాజకులలో కొందరు రాజకుమారులకు డబ్బు ఇచ్చేశారు. మరి కొందరు బ్రాహ్మణులకు దానం చేశారు. ఇంకా కొందరు ఇళ్ళలో పాతిపెట్టారు. రాజకుమారులు వీరిని గుర్తించారు. రాజవంచకులని నిర్ణయించారు. కనబడిన ప్రతి భార్గవుడిని వధించారు. చివరకు 'చూలాంద్రను' కూడా వదలిపెట్టలేదు. ఈ మారణహోమాన్ని ఒకానొక భృగుపత్ని చూచింది. తన కడుపులోని పిండాన్ని తొడలో దాచింది. నూరేళ్ళు నిండాయి. ఆ తరువాత కొడుకును కన్నది. ఊరువు-అంటే తొడ. తొడలో నుండి పుట్టాడు కనుక ఔర్వుడు. ఈ సీసపద్యంలో ధేను శరీర విలీనుడయి మార్తాండుడు ప్రవర్తించాడనే వృత్తాంతాన్ని గురించి డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారిట్లా వ్యాఖ్యానించారు: "ఆ ధేనువు సురభి. విశ్వకర్మ తపోనియతుడై యజ్ఞార్థముగాను, మోక్షార్థముగాను అమృతమయ మూర్తియును, కామరూపిణియు నగు నొక కన్యకను తనమనోవృత్తిచే కల్పించెను. ఆమెయే సురభి. మఱియు నితడు తేజోమయుడగు ఒక పురుషునికూడ సృజించెను. అతడు సురభిని చూచి కామమోహితుడై ఆర్తినొందెను. బ్రహ్మవచ్చి "మాఽఽర్తోభవ - (మా ఆర్తఃభవ) అని ఆతని ఆర్తత్వముడిపి ఆ కన్యనిచ్చెను. కాన వానికి మార్తాండుడని పేరువచ్చెను. వీరికి ఏకాదశ రుద్రులు, సౌరభేయకులు జన్మించిరి. మార్తాండుడు ధేనుశరీర విలీనుడగుట అనగా సురభి శరీరమునందు కామమోహితుడయి అజ్ఞాతచర్య సలుపుట అని తోచుచున్నది."

**క. అనవుడు నప్పలుకులు విని । తన చిత్తము కలఁక దేఱి ధర్మతనూజుం**
**డనుజన్ముల దెసఁ జూచిన । ననిలసుతుం డిట్టు లనియె నాతనితోడన్.** **55**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; ఆ+పలుకులు= ఆ మాటలు; విని; తన చిత్తము= తన మనస్సు; కలఁక+తేఱి= బాధనుండి తేరికొని; ధర్మతనూజుండు= ధర్మరాజు; అనుజన్ముల దెసన్= తమ్ముళ్ళవైపు; చూచినన్= చూడగా; అనిలసుతుండు= వాయుపుత్రుడయిన భీముడు; అతని తోడన్= అతనితో (ధర్మరాజుతో); ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** పురోహితు డయిన ధౌమ్యుడు చెప్పిన మాటలను ధర్మరాజు విన్నాడు. అతడి మనస్తాపం ఉపశమించింది. తమ్ముళ్ళ వైపు చూశాడు. అపుడు భీముడు అతడితో ఈ విధంగా అన్నాడు.

**మ. 'భవదాజ్ఞా దృఢబంధ సంయమిత శుంభ ద్వేగ మై కాక నాఁ**
**డవలీలన్ మన యర్జున ద్విపము గ్రోధావేశదుర్దాంత ద**
**ర్ప విలాసోద్భట భంగి నేపడరి కౌరవ్యాంబుజ శ్రేణిఁ జి**
**క్కువడం జేయదె యొక్క వ్రేల్మిడిన నీకున్ వేడ్క సంధిల్లఁగన్.'** **56**

**ప్రతిపదార్థం:** భవత్= నీ యొక్క; ఆజ్ఞా= ఆజ్ఞ అనే; దృఢబంధ= గట్టి గొలుసులతో; సంయమిత= కట్టబడిన; శుంభత్+వేగము+ఐ= ఉజ్జ్వల వేగం కలది; కాక= కాకపోతే; నాఁడు= ద్రౌపదికి సభలో పరాభవం జరిగిన రోజున; అవలీలన్= తేలికగా; మన అర్జున ద్విపము= మన అర్జును డనే ఏనుగు; క్రోధ+ఆవేశ= కోపావేశం చేత; దుర్దాంత దర్ప విలాస= అణచడానికి వీలుకాని గర్వ విలసనం యొక్క; ఉద్భటభంగిన్= భయంకర మయిన రీతితో; ఏపు+అడరి= విజృంభించి; నీకున్= నీకు; వేడ్క సంధిల్లఁగన్= సంతోషం కలిగేటట్లుగా; ఒక్క వ్రేల్మిడిన్+అ= ఒక్కచిటికెలోనే; కౌరవ్య+అంబుజశ్రేణిన్= కౌరవు లనే పద్మాల వరుసను; చిక్కు+పడన్+చేయదె= చిక్కు పరచగలిగి ఉండేదికదా! (చీకాకు పరచగలిగేదికదా!)

**తాత్పర్యం:** 'నిండుసభలో ద్రౌపది ఆ విధంగా అవమానించబడిన ఆ నాడు మన అర్జునుడనే మదించిన ఏనుగు విజృంభించి ప్రదర్శించిన వేగం నీ ఆజ్ఞ అనే గట్టి బంధంచేత నియమించబడింది. లేకపోతే ఆ అర్జున గజం కోపావేశంతో పెల్లుబికిన గర్వ విలాసంతో భయంకరమైన పద్ధతిలో విజృంభించి కౌరవులనే పద్మాల సమూహాన్ని ఒక్కక్షణంలోనే చిందరవందర చేసి నీకు సంతోషాన్ని కలిగించి ఉండేదే.'

**విశేషం:** అలం: రూపకం.

**వ.** **అనిన విని ధర్మనందనుండు తెలివొందిన మొగంబు తోడ శిరఃకంపంబుసేసె; నట్టి సమయంబున నవ్విప్రులందఱు నొక్క మొగిన 'మీ తలంపునకు దైవం బనుకూలంబు గావుత' మని పాండుపుత్త్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు వీడ్కొని నిజస్థానంబులకుం జనిరి; తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సముచిత ప్రకారంబున వీడుకోలు వడసి తమ తమ పొందుపట్లకుం బోయిన.** 57

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని చెప్పగా విని; ధర్మనందనుండు= ధర్మరాజు; తెలివి+ఒందిన మొగంబుతోడన్= ప్రసన్నముఖంతో; శిరస్+కంపంబు+చేసెన్= తల ఊపాడు. అట్టి సమయంబునన్= ఆ సమయంలో; ఆ+విప్రులందఱును= ఆ బ్రాహ్మణులందరున్నూ; ఒక్క మొగిన= ఏకకంఠంతో; మీ తలంపునకున్= మీ సంకల్పానికి; దైవంబు= దైవం; అనుకూలంబు+కావుతన్= అనుకూలించుగాత; అని= అని; పాండుపుత్త్రులన్= పాండవులను; దీవించి= ఆశీర్వదించి; పునర్దర్శనంబు+అయ్యెడున్= మరల మీదర్శనం అగుగాక! అంటూ; వీడ్కొని= వీడుకోలు పుచ్చుకొని; నిజస్థానంబులకున్= తమ తమ చోట్లకు; చనిరి= వెళ్లారు; తదనంతరంబు+అ= ఆ తరువాత; బాహ్యపరివారంబు+ఎల్లను= బాహ్యపరివారమంతా; సముచిత ప్రకారంబునన్= తగిన రీతిలో; వీడుకోలు+పడసి= వీడ్కోలు పొంది; తమ తమ= తమతమయొక్క; పొందుపట్లకున్= క్షేమంగా నివసించటానికి అనువయిన ప్రదేశాలకు; పోయినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** ధర్మరాజు భీముడి మాటలు విన్నాడు. ప్రసన్నుడయ్యాడు. అపుడు బ్రాహ్మణులందరూ 'దైవం మీ ఆలోచనకు అనుకూలించుగాక' అని దీవించారు. 'మరల మీ దర్శనం సిద్ధించుగాక' అని చెప్పారు. తమ తమ ప్రదేశాలకు వెళ్లిపోయారు. ఆ తరువాత బాహ్యపరివార జనులందరూ పాండవుల దగ్గర సెలవు పుచ్చుకొని తమ తమ అనువైన నివాసాలకు వెళ్ళిపోగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** దుర్యోధనుడి దగ్గర ఉండటానికి ఇష్టపడని వారు, పాండవులంటే అభిమానించే విప్రులు ధర్మరాజుతో అడవికి వచ్చారు. వారితో పాటు పాండవుల వెంట వచ్చినవారు మరికొందరున్నారు. సేవలకొరకు కొందరు వచ్చారు. వీరందరూ కలిసి బాహ్య పరివారజనులుగా పరిగణించబడతారు.

**ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దా నరదంబులతోడఁ గ్రోశమా**
**త్ర మ్మొక చోటి కల్లఁ జని, ధర్మతనూభవుఁ డందు నాఁటిరే**
**యిమ్ముల సల్పి వేగుటయు నీప్సితకార్యము సేయఁగా విచా**
**రమ్మున నున్నచో నమరరాజతనూభవుఁ జూచి యిట్లనున్. 58**

**ప్రతిపదార్థం:** తమ్ములు= తమ్ముళ్ళు; ధౌమ్యుఁడున్= ధౌమ్యుడూ; సతియున్= ద్రౌపది కూడా; తాను= ధర్మరాజు; అరదంబుల తోడన్= రథాలతో; క్రోశమాత్రము= పరుగు (రెండున్నరమైళ్ల) దూరం; ఒకచోటికిన్= ఒక ప్రదేశానికి; అల్లన్= మెల్లగా; చని= వెళ్ళి; అందున్= అక్కడ; నాఁటిరేయి= ఆరోజు రాత్రి; ఇమ్ములన్+చల్పి= సుఖంగా కాలం గడిపి; వేగుటయున్= తెలతెల్లవారగా; ఈప్సిత కార్యము= చేయగోరినకార్యం; చేయఁగాన్= చేయటానికి; విచారమ్మునన్+ఉన్నచోన్= ఆలోచనలో ఉండగా; ధర్మతనూభవుఁ డు= ధర్మరాజు; అమరరాజతనూభవున్= ఇంద్రుని కొడుకయిన అర్జునుని; చూచి= చూచి; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** తమ్ముళ్ళూ, పురోహితుడయిన ధౌమ్యుడూ, ద్రౌపదీ మొదలయిన వారు వెంటరాగా ధర్మరాజు పరుగు దూరం రథాలతో మెల్లగా పయనించాడు. అక్కడ తగిన స్థలంలో రాత్రి సుఖంగా కాలం గడిపాడు. పొద్దు పొడుస్తూ ఉన్నది. ధర్మరాజు కర్తవ్యాన్ని ఆలోచించాడు. అర్జునుడిని చూచి ఇట్లా అన్నాడు.

**క. 'మన మొక యేవుర మీయం । గనయుం దో నరుగుదేరఁగా నెయ్యెడఁ బో**
**యిన నెఱుఁగ కుండుదురె? యి । ద్దినములు గడపంగ నెద్ది తెఱఁ గయ్యెడినో!' 59**

**ప్రతిపదార్థం:** మనము= మనం: ఒక= ఒక; ఏవురము= అయిదుగురం; ఈ+అంగనయున్= ఈ ద్రౌపది; తోన్= మనతో కూడా; అరుగుదేరఁగాన్= రాగా; ఏ+ఎడన్= ఎక్కడకు; పోయినన్= వెళ్ళినా; ఎఱుఁగక+ఉండుదురె?= గుర్తు పట్టకుండా ఉంటారా?; ఈ+దినములు= ఈ అజ్ఞాతవాసకాలపు రోజులు; గడపంగన్= కడపటానికి; ఎద్ది= ఏది; తెఱఁగు= ఉపాయం; అయ్యెడినో= అవుతుందో!

**తాత్పర్యం:** 'మనం ఒక అయిదుగురం. అంగన అయిన ద్రౌపది కూడిరాగా మన మందరం కలిసికట్టుగా ఎక్కడికయినా వెళ్ళితే జనులు మనలను గుర్తించకుండా ఉంటారా? అజ్ఞాతవాసం ఎట్లా గడపాలో ఉపాయ మేదో మరి.'

**విశేషం:** పై పద్యంలో 'ఒక' అనే మాట సార్థకం. పాండవులు అయిదుగురయినా వారంతా ఒకటే. మాటలలో, చేతలలో కొన్ని వేళల తారతమ్యం కనబడ్డా భావంలో ఏకత ఉన్నది. పైగా ధర్మరాజు మాటను అందరూ పాటించటమే ఆ ఏకత.

**వ. అనిన నతం డి ట్లనియె. 60**

**తాత్పర్యం:** ధర్మరాజు మాటలు విన్న అర్జునుడు ఈ విధంగా అన్నాడు.

**తే. 'ధర్మదేవత నీదు సత్కర్మమునకు । మెచ్చి యెంతయుఁ బ్రీతిమై నిచ్చినట్టి**
**వరము గలుగంగ మన మేమి వర్తనమున । నెచట నున్నను నొరులకు నెఱుఁగ నగునె? 61**

**ప్రతిపదార్థం:** ధర్మదేవత= యమధర్మరాజు; నీదు= నీయొక్క; సత్కర్మమునకున్= మంచి పనికి; మెచ్చి; ఎంతయున్= ఎంతో; ప్రీతిమైన్= సంతోషంతో; ఇచ్చిన+అట్టి= ఇచ్చినటువంటి; వరము; కలుగంగన్= ఉండగా; మనము= మనందరం; ఏమి వర్తనమునన్= ఎటువంటి నడవడికతో; ఎచటన్= ఎక్కడ; ఉన్ననున్= ఉన్నప్పటికినీ; ఒరులకున్= ఇతరులకు; ఎఱుఁగన్+అగునె?= తెలియటానికి వీలవుతుందా?

**తాత్పర్యం:** 'యముడు నీ సత్ప్రవర్తనకు మెచ్చుకొన్నాడు. సంతోషంతో వరం అనుగ్రహించాడు. ఆ వరం ఉన్నది కనుక మనకు భయం లేదు. ఎక్కడ ఏవిధంగా నడచుకొన్నా మనలను ఇతరులు గుర్తుపట్టలేరు.

**విశేషం:** ధర్మరాజు అరణ్యవాసకాలంలో యక్షప్రశ్నలకు జవాబు లిచ్చాడు. యక్షుడు సంతోషించాడు. 'నీ తమ్ములలో ఒకరిని బ్రతికిస్తాను. నీ ఇష్టం వచ్చిన వాడిని కోరుకొమ్ము' అన్నాడు. అపుడు ధర్మరాజు నకులుడిని కోరుకొన్నాడు. అదేమిటి భీముడిని గాని, అర్జునుడిని గాని కోరుకొనకూడదా? అని యముడు ప్రశ్నించాడు. 'కుంతి కుమారుడిని నేను. మాద్రి కొడుకు నకులుడు. అందుచేత నకులుడిని కోరుకొన్నాను' అన్నాడు. అతడి ధర్మదృష్టికి యముడు మెచ్చుకొన్నాడు. 'అజ్ఞాతవాసంలో ఎటువంటి ఇబ్బందులు పడకుండా వరం ఇస్తున్నా'నని అనుగ్రహించాడు.

**వ. కురు జనపదంబు చుట్టుం బాంచాల చేది మత్స్య సాళ్వ విదేహ బాహ్లిక దశార్ణ శూరసేన కళింగ మగధ దేశంబులు సుభిక్షంబులు, జనాకీర్ణంబులు, నతిస్థిరంబులు నై నివాసయోగ్యత కలిగి యున్నయవి యని విందుము. వానియందు మీకుఁ జూడం బోలిన యెడఁ దగిన చందంబున నిలుచువారము గాక' యనినం బ్రియంబంది ధర్మనందనుం డి ట్లనియె.** **62**

**ప్రతిపదార్థం:** కురుజనపదంబు= కురుభూమి యొక్క; చుట్లన్= చుట్టుపట్ల; పాంచాల= పాంచాలదేశం; చేది= చేదిదేశం; మత్స్య= మత్స్యదేశం; సాళ్వ విదేహ బాహ్లిక దశార్ణ శూరసేన కళింగ మగధ దేశంబులు= సాళ్వ, విదేహ, బాహ్లిక, దశార్ణ, శూరసేన, కళింగ, మగధ దేశాలు; సుభిక్షంబులు= ఈతి బాధలు లేకుండా పాడిపంటలతో నిండి ఉన్నాయి; జన+ఆకీర్ణంబులు= జనసాంద్రతతో నిండుగా ఉన్నాయి; అతిస్థిరంబులును+ఐ= మిక్కిలి నిలకడ గల్గినవై నివాసయోగ్యత= నివసించడానికి అవసరమయిన సానుకూల పరిస్థితి; కలిగి+ఉన్న+అవి= కలిగి ఉన్నాయి అని; విందుము= వింటాం; వానియందున్= ఆ దేశాలలో; మీకున్= మీకు; చూడన్+పోలిన+ఎడన్= తగినదని తోచినచోట; తగిన చందంబునన్= తగిన రీతిని; నిలుచువారము+కాక= ఉందాము గాక; అనినన్= అని అర్జునుడు చెప్పగా; ప్రియంబు+అంది= సంతోషించి; ధర్మనందనుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'కురుదేశం చుట్టూ పాంచాల, చేది, మత్స్య దేశాలు ఉన్నాయి. ఇవే కాక సాళ్వ, విదేహ, బాహ్లిక, దశార్ణ, శూరసేన, కళింగ, మగధ దేశాలు కూడా ఉన్నాయి. ఈ దేశాలన్నీ సుభిక్షంగా ఉన్నాయి. ఇవన్నీ నివాసయోగ్యాలు. ఇక్కడ సుస్థిర ప్రభుత్వాలు ఉన్నాయి. పైగా జన సంకీర్ణాలు అని వింటున్నాం. ఈ ప్రదేశాలలో మీకు నచ్చిన చోట అందరం ఉందాం' అనగానే ధర్మరాజు అర్జునుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'అగు నది యట్టిద; దైవము । దగ నిచ్చిన యవ్వరంబు దప్పునె? మనకున్**
**విగత భయ వాస యోగ్యం । బుగ నొక్కెడ సెప్పు మిపుడ పోవఁగవలయున్.** **63**

**ప్రతిపదార్థం:** అగును= అవును; అది= నీవు చెప్పిన దేశాల స్థితి; అట్టిది+అ= అట్టిదే; దైవము= భగవంతుడు; తగన్= తగినట్లు; ఇచ్చిన= ఇచ్చినటువంటి; ఆ+వరంబు= అజ్ఞాతవాస రక్షణ వరము; తప్పునె?= తప్పుతుందా; మనకున్= మనకు; విగత భయవాస యోగ్యంబుగన్= ఏమాత్రం భయమన్నది లేని వాస యోగ్యత కలిగేటట్లు; ఒక్క+ఎడ= ఒక్కచోటు; చెప్పు= చెప్పుము; ఇపుడు+అ= ఇప్పుడే; పోవఁగవలయున్= పోవాలి.

**తాత్పర్యం:** 'అవును. నీవన్న మాట నిజం. దైవ మిచ్చిన వరం తప్పుతుందా? అయితే ఎటువంటి భయం లేకుండా మనం ఉండదగిన చోటేదో చెప్పుము. మన మింక ఆలస్యం చేయకుండా సాగాలి.

**విశేషం:** పాండవులు అరణ్యావాసం పూర్తి చేశారు. ఇక అజ్ఞాతవాసం చేయాలి. అజ్ఞాతవాసంలో కూడు గూడు మాత్రం చాలవు. నిర్భయత కూడా అవసరం. ఇవన్నీ శత్రుదేశంలో దొరకవచ్చు; కాని మిత్రదేశంలో ఈ సౌకర్యా లుంటే ఇబ్బంది లుండవు.

**ఆ. నాకుఁ జూడ మత్స్య నరపతి సద్ధర్మ। వర్తి, సుజనహితుఁ, డవార్య బాహు**
**బలుఁడు గాన యతని పాల నందఱుఁ దగ। వైన పనుల నిలుచు టభిమతంబు. 64**

**ప్రతిపదార్థం:** నాకున్; చూడన్= అన్నిరకాలుగా సూక్ష్మబుద్ధితో పరిశీలించి చూస్తే; మత్స్యనరపతి= మత్స్య దేశంలోని ప్రజలకు రాజయిన విరాటుడు; సద్ధర్మవర్తి= చక్కని ధర్మంతో ప్రవర్తించే వాడు; సుజనహితుఁడు= సత్పురుషులకు హితుడు; అవార్య= వారించటానికి వీలుకాని; బాహుబలుఁడు= భుజబలం కలిగినవాడు; కాన= కాబట్టి; అతని పాలన్= అతని దగ్గర; అందఱున్= పాండవులయిన మనమూ, ద్రౌపది కూడా; తగవు+ఐన= మన గౌరవమర్యాదలకు తగిన; పనులన్= పనులలో; నిలుచుట= ఉండటం; అభిమతంబు= ఇష్టం.

**తాత్పర్యం:** మత్స్యదేశానికి రాజయిన విరాటుడు ధార్మికుడు, సుజన ప్రియుడు, భుజబలశాలి. ఎన్ని రకాలుగా ఆలోచించినా మత్స్యదేశంలో విరాటుడి కొలువులో మనం తగిన పనులు చేస్తూ ఉండటమే నాకు ఇష్టం.

### పాంచాలీ పాండవులు తమ మెలంగవలయు పనుల నిశ్చయించుకొనుట (సం 4-1-15)

**క. మనలోన నెవ్వఁ డెమ్మెయి। పని వెంటను విరటు మనము వడయుద? మదియె**
**ల్లను నేర్పరించి యందఱుఁ। దన తనమది నున్న తెఱఁగు తథ్యమ చెపుఁడా! 65**

**ప్రతిపదార్థం:** మనలోనన్= మనలో (పాండవులమయిన మనలో); ఎవ్వఁడు= ఎవడు; ఏ+మెయి= ఏవిధమైన; పని వెంటను= పని నెపంతో; విరటు మనము+పడయుదము= విరాట మహారాజు మనసును మెప్పిద్దాం; అది= అది; ఎల్లనున్= అంతా; ఏర్పరించి= నిర్ణయించి; అందఱున్= అందరూ; తన తనమదిన్= వారి వారి మనస్సులలో; ఉన్న తెఱఁగు= ఆలోచించి నిర్ణయించుకొన్న విధానాన్ని; తథ్యము+అ= వాస్తవంగా (యథాతథంగా); చెపుఁడా= చెప్పండి.

**తాత్పర్యం:** విరాట మహారాజు మెప్పు పొందే విధంగా మనలో ఎవరెవరు ఏపని చేద్దామో నిర్ణయించండి. మీ మీ మనస్సులలోని అభిప్రాయాలను విశదం చేయండి.'

**వ. అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుంగా నతని నుపలక్షించుచు నిట్ల నియె.**
**66**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= ధర్మరాజు వాక్యాన్ని విని; సవ్యసాచి= అర్జునుడు; సవితర్కంబును= ఆలోచనతోనూ; సవిషాదంబును= విచారంతోనూ; సగౌరవంబునున్+కాన్= గౌరవంతోనూ కూడిందిగా; అతనిన్= ధర్మరాజును; ఉపలక్షించుచున్= చూస్తూ; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ధర్మరాజు మాటలు విన్నాడు. అతడి వైపు చూచాడు. ఆ చూపులో ఆలోచన ఉన్నది. విషాదం ఉన్నది. గౌరవమూ ఉన్నది. ధర్మరాజును చూచి అర్జునుడు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** మనిషి చూపులు అనేక రకాలు. చూపులు మనసులోని భావాలను పట్టి ఇస్తాయి. అర్జునుడి చూపులో ఆలోచన ఉన్నది. ఆ ఆలోచనలో కర్తవ్య నిష్ఠ కనిపిస్తున్నది. విషాదం ఉన్నది. తన అన్నకు కష్టదశ కలిగినందుకు విషాదం. గౌరవం ఉన్నది. ఆ గౌరవం భయంతో కాదు. లాంఛనప్రాయమూ కాదు. హృదయ సంబంధి కూడా. తిక్కన కవితలో దృశ్యకావ్య లక్షణాలు అడుగడుగునా కనపడతాయి. వాటిలో నవ్వులను, చూపులను అతడు విశేషించి అభినయాత్మకంగా వర్ణిస్తాడు.

**సీ. 'మహనీయమూర్తియు, మానవైభవమును, । సౌకుమార్యంబును, సరసతయును,**
**మార్దవంబుఁ, బ్రభుత్వ మహిమయు, నపగత । కల్మషత్వంబును, గౌరవంబు**
**శాంతియు, దాంతియుఁ, జాగంబు, భోగంబుఁ, । గారుణ్యమును, సత్యసారతయును,**
**ధర్మమయ క్రియా తత్పరత్వంబును । గీర్తి, ధనార్జన క్రీడనంబుఁ**

**ఆ. గలిగి జనుల నేలఁ గాని, యెన్నందును । నొరులఁ గొల్చి తిరుగ వెరవు లేని**
**యట్టి నీవు విరటు నెట్టి చందంబున । ననుచరించు వాఁడ వధిప! చెపుమ.'** **67**

**ప్రతిపదార్థం:** అధిప!= ధర్మరాజా!; మహనీయమూర్తియున్= గొప్ప రూపమూ; మానవైభవమును= అభిమానంతో కూడిన వైభవమూ; సౌకుమార్యంబును= సుకుమారత్వమున్నూ; సరసతయును= సరసత్వమున్నూ; మార్దవంబున్= మృదుత్వమున్నూ; ప్రభుత్వ మహిమయున్= అధికారం యొక్క అతిశయమూ; అపగత కల్మషత్వంబును= దోషరాహిత్యమూ; గౌరవంబు= గౌరవమున్నూ; శాంతియున్, దాంతియున్= శమమున్నూ దమమున్నూ; చాగంబు= త్యాగమూ; భోగంబున్= భోగమూ; కారుణ్యమును= దయయూ; సత్య సారతయును= శ్రేష్ఠమయిన సత్యమూ; ధర్మమయ క్రియా తత్పరత్వంబును= ధార్మికమయిన పనులు చేయటంలో ఆసక్తి; కీర్తి, ధన+ఆర్జన క్రీడనంబున్= కీర్తిని, ధనాన్ని ఆర్జించే ఆటయున్నూ; కలిగి= కలిగి; జనులన్= ప్రజలను; ఏలన్+కాని= పరిపాలించడానికే కాని; ఎన్నండును= ఏనాడూ; ఒరులన్= ఇతరులను, కొల్చి= సేవించి; తిరుగన్= వ్యవహరించటానికి; వెరవు లేని+అట్టి= ఉపాయమూ, నేర్పూ లేనట్టి; నీవు= నీవు; విరటున్= విరాటుని; ఎట్టి చందంబునన్= ఏ విధంగా; అనుచరించువాఁడవు= అనుసరించి సేవిస్తావు; చెపుము+అ= చెప్పుము.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీకు చక్కని రూపమున్నది. అభిమానవైభవమున్నది. సౌకుమార్యమున్నది. సరసత్వమున్నది. మృదుత్వం ఉన్నది. ప్రాభవం ఉన్నది. నిష్కల్మషత్వం, గౌరవం, శాంతి, దాంతి, త్యాగభోగాలు, దయాసత్యాలు ఉన్నాయి. ధార్మిక క్రియాశీలత ఉన్నది. కీర్తిని ఆర్జించటం నీ ప్రవృత్తి. అన్నీ ఉన్నప్పటికీ ఇతరులను సేవించే నేర్పు నీకు లేదు. (సేవ లందుకొనటమే నీకు తెలుసు). అటువంటి నీవు సామాన్యుడయిన విరాటుడిని ఎట్లా సేవిస్తావో చెప్పుము.'

**విశేషం:** అంతరింద్రియ నిగ్రహం శాంతి. బహిరింద్రియ నిగ్రహం దాంతి. కొందరిలో రూపం ఉంటే వైభవం ఉండదు. సౌకుమార్యముంటే సరసత్వం ఉండదు. దాంతి ఉంటే శాంతి ఉండదు. అన్నీ ఉన్నా ధార్మిక క్రియాశీలం ఉండదు. కాని,

ధర్మరాజులో అన్నీ ఉన్నాయి. అతడు సద్గుణాల రాశి. ధర్మరాజు చంద్రవంశంలో పుట్టినవాడు. చంద్రునికి 16 కళలున్నాయి. అట్లాగే ఈ పద్యంలో ధర్మరాజుకు 16 గుణాలు చెప్పబడ్డాయి. అంటే ధర్మరాజు షోడశ గుణకళాపూర్ణుడని ధ్వని.

**క. అనినం దమ్ముని నెమ్మన । మునఁ బుట్టిన వగపు భావమున నెఱిఁగియు గీ**
**టునఁ బుచ్చుచుఁ బ్రస్తుత కా । ర్య నిరూపణ దశయ మెఱయ నతఁ డి ట్లనియెన్. 68**

**ప్రతిపదార్థం:** అనినన్= ధర్మరాజును చూచి అర్జునుడు పలుకగా; తమ్ముని= అర్జునుడి యొక్క; నెమ్మనమునన్= నిండు మనసులో; పుట్టిన వగపు= కలిగిన బాధ; భావమునన్= మనసులో; ఎఱిఁగియున్= తెలిసికూడా (అర్థం చేసికొన్నప్పటికీ); గీటునన్+పుచ్చుచున్= నిర్లక్ష్యం చేస్తూ; ప్రస్తుత కార్య నిరూపణదశ+అ= ఇప్పటి కార్యం నిర్వహించే అవస్థ (ప్రస్తుతం ఏ పనిచేయాలో ఆ పనిని నిశ్చయించే స్థితి); మెఱయన్= బయల్పడేటట్లుగా; అతఁడు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** తమ్ముడి మనసులోని ఆరాటాన్ని, బాధను ధర్మరాజు గుర్తించాడు. అయినా అట్లాంటి వాటికి ప్రాధాన్యం ఇవ్వలేదు. ప్రస్తుతం తీసికొనవలసిన నిర్ణయంకొఱకు ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. 'స న్న్యాసి వేషమున రా । జన్యునిఁ గని యెపుడుఁ గొలిచి సభ్యత్వమునన్**
**మాన్యుఁడనై పుణ్యకథా । విన్యాస మొనర్తు నతని వేడుకకుఁ దగన్. 69**

**ప్రతిపదార్థం:** సన్న్యాసి వేషమునన్= సన్యాసి వేషంతో; రాజన్యునిన్= విరాట మహారాజును; కని= చూచి; ఎపుడున్= ఎప్పుడూ; కొలిచి= సేవించి; సభ్యత్వమునన్= సభా యోగ్యతతో; మాన్యుఁడన్+ఐ= గౌరవింప దగిన వాడనై; అతని వేడుకకున్+తగన్= విరాటుని వినోదానికి తగినవిధంగా; పుణ్యకథా విన్యాసము+ఒనర్తున్= పుణ్యగాథలను ప్రవచనం చేస్తాను.

**తాత్పర్యం:** నేను సన్యాసివేషంతో విరాటుడి కొలువులో ప్రవేశిస్తాను. అందులో సభ్యుడి నౌతాను. ఆ మహారాజు కుతూహలానికి తగినట్లుగా పుణ్యకథలు చెపుతూ ఉంటాను.

**విశేషం:** ఆంధ్రమహాభారత సంశోధిత ముద్రణంలో 'సన్యాసి' పాఠాన్ని గురించి ఈ క్రింది పాదసూచి ఇవ్వబడింది. 'సన్యాసి-శ,ష,మున్నగు పెక్కు ప్రతులలో నీశబ్దము 'న' కారద్విత్వ రహితముగనే యున్నది. ఈ రూపమే భారతకూలంకష వ్యాఖ్యయందు సమర్థింపబడినది. 'సమ్' అనే ఉపసర్గయొక్క 'మ' కారము బిందువై 'న' కారద్విత్వమును పొంది, ఆపయిని, 'య' కారము ఉండుటచేత నకారద్విత్వమున్ను లోపించినది. ఇది ప్రాసలోనే యున్నది. సన్న్యాసి, రాజన్న్య, మాన్న్య, విన్న్యాస - అనివా; సంన్యాసి - ఉ,ఐ,ఓ,చ,ట (స్థిరవర్ణమునకు ముందు బిందువు; సన్న్యాసి వేషమున - ఇచ్చట మూలము "కంకో నామ ద్విజో భూత్వా మతాక్షః ప్రియదేవనమ్." చిత్రశాలాప్రతి. వావిళ్ళ తెలుఁగు లిపి ప్రతియందును ఇట్లే యున్నది." **(విరా.పు.15)**

**క. శ్రౌత స్మార్త నిమిత్త । జ్యోతిర్విద్యలు వహించి యోగ్య సమయసం**
**జాత ప్రాగల్భ్యుఁడ నై । చాతుర్యము మెఱసి మానసం బలరింతున్. 70**

**ప్రతిపదార్థం:** శ్రౌత, స్మార్త, నిమిత్త, జ్యోతిస్+విద్యలు= వేదాలు, స్మృతులు, శకునాలు, నక్షత్రాలు- అనే విషయాలకు సంబంధించిన విద్యలను; వహించి= అవలంబించి; యోగ్య= తగిన; సమయ= సమయాలలో, సంజాత= కలిగిన; ప్రాగల్భ్యుఁడను+ఐ= ప్రతిభ కలవాడనై; చాతుర్యము= నేర్పు; మెఱసి= బయల్పరచి; మానసంబు= (విరటుని) మనస్సు; అలరింతున్= సంతోషపెట్టుతాను.

**తాత్పర్యం:** శ్రౌతం, స్మార్తం, శకునశాస్త్రం, జ్యోతిషం అనే విద్యలు నాకు తెలుసు. ఈ శాస్త్ర విషయాలకు సంబంధించిన ప్రతిభను తగిన సమయాలలో ప్రకటిస్తూ విరాటుడి మనస్సుకు సంతోషం కలిగిస్తాను.

**క.** **ఆతనితో నొక్కొక మరి। కౌతూహలవృత్తికిం దగం దొడఁగి మృదు**
**ద్యూతంబునఁ గ్రీడింతుం। జేతోముద మొదవ నక్షశిక్షాప్రౌఢిన్.** **71**

**ప్రతిపదార్థం:** ఆతనితోన్= విరాటునితో; ఒక్కొకమరి= ఒక్కొక్కసారి; కౌతుహలవృత్తికిన్+తగన్= ఆసక్తికి తగినట్లుగా; తొడఁగి= పూనుకొని; అక్షశిక్షా ప్రౌఢిన్= పాచికలాటలోని నేర్పుతో; చేతస్+ముదము= మనస్సుకు సంతోషం; ఒదవన్= కలిగేటట్లు; మృదు ద్యూతంబునన్= పందెం ఒడ్డటం లేని మైత్రీపూర్వకమయిన జూదంతో; క్రీడింతున్= ఆడతాను.

**తాత్పర్యం:** అతడితో నేను సుకుమారమయిన సరదా జూదం ఆడతాను. ఆ ఆట ఆతని కుతూహలానికి తగ్గట్లు ఉంటుంది. ఈ ఆటవలన రాజు సంతోష పడతాడు. పైగా నా నేర్పు అతడికి తెలుస్తుంది.

**విశేషం:** మృదుద్యూతం అంటే సరదా కొరకు పందెం లేకుండా ఆడే జూదం.

**తే.** **మణిమయమ్ములుఁ గలధౌతమయములును సు। వర్ణ మయములు నాదిగా వలయునట్టి**
**యడ్డసాళులు గలవు నా కభిమతముగ। వానిఁ గొనిపోయి చూపుదు వరుసతోడ.** **72**

**ప్రతిపదార్థం:** మణిమయమ్ములు= మణులతో చేయబడినవి; కలధౌత మయములును= వెండితో చేసినవి; సువర్ణమయములున్= బంగారంతో చేసినవి; ఆదిగాన్= మొదలుగా; వలయునట్టి= కావలసిన; అడ్డసాళులు= పాచికలు; నాకున్= నాకు; కలవు= కలవు; వానిన్+కొనిపోయి= వాటిని తీసికొని వెళ్ళి; అభిమతముగన్= ఇష్టంతో; వరుసతోడన్= వరుసగా; చూపుదున్= చూపిస్తాను.

**తాత్పర్యం:** నా దగ్గర ఎన్నో పాచిక లున్నాయి. కొన్ని మణిమయాలు, కొన్ని వెండివి, కొన్ని బంగారంవి. వాటిని తీసికొనిపోయి వరుసగా రాజుకు చూపిస్తాను.

**వ.** **మఱియు నవసరోచితంబు లగు వినోదంబులం బ్రమోదంబు పుట్టించుచుఁ బ్రసాదంబునకుం బాత్రుండ నై. కంకుండను నామధేయంబు ధరియించి చరియింతు; నయ్యుర్వీశ్వరుండు మ త్పూర్వవర్తనం బడిగె నేనియు ధర్మపుత్త్రుతోడి మైత్రిం దగిలి యతనిపాల వసియింతు ననంగలవాఁడ' నని చెప్పి, యనిలతనయు నిరీక్షించి తత్కాలజనితం బయిన ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యి ట్లనియె.** **73**

**ప్రతిపదార్థం:** మఱియున్= మరియు; అవసర+ఉచితంబులు+అగు= సమయానికి తగిన; వినోదంబులన్= వినోదాలతో; ప్రమోదంబు = సంతోషం; పుట్టించుచున్= కలిగిస్తూ; ప్రసాదంబునకున్= అనుగ్రహానికి; పాత్రుండను+ఐ= అర్హుడనయి; కంకుండు+అను= కంకుడనే; నామధేయంబు, ధరియించి= పేరుపెట్టుకొని; చరియింతున్= ప్రవర్తిస్తాను; ఆ+ఉర్వీ+ఈశ్వరుండు= ఆ రాజు; మత్+పూర్వవర్తనంబు= నా పూర్వపు+నడవడి; అడిగెన్+ఏనియున్= అడిగితే; ధర్మపుత్త్రుతోడి= ధర్మరాజుతోడి; మైత్రిన్+తగిలి= స్నేహం పెంచుకొని; అతని పాలన్ వసియింతున్= అతని దగ్గర నివసించేవాడిని; అనన్+కలవాఁడన్= అని చెప్పగలవాడను; అని చెప్పి= ఆ విధంగా చెప్పి; అనిలతనయున్= భీముని; నిరీక్షించి= చూచి; తత్కాలజనితంబు+అయిన= ఆ సమయంలో పుట్టిన; ఖేదంబునన్= దుఃఖంచేత; తొరఁగన్ సమకట్టు= స్రవించబోయే; బాష్పజలంబులు= కన్నీరు; మగుడన్= మరల; ఇంకించుచున్= (కనులలోనే) ఇంకిపోయేటట్లు చేసి; నిట్టూర్పులు= నిట్టూర్పులు; అడంచి= అణచికొని; ధైర్యంబు+అవలంబించి= ధైర్యాన్ని తెచ్చుకొని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సమయానికి తగిన వినోదాలతో రాజుకు సంతోషం కలిగిస్తాను. అతడి అనుగ్రహానికి పాత్రుడ నవుతాను. కంకుడనే పేరుతో సంచరిస్తాను. ఆ రాజు ఒకవేళ నా పుట్టుపూర్వోత్తరాలు అడిగితే 'నేను ధర్మరాజు స్నేహితుడిని, అతడి దగ్గరుండేవాడిని' అని చెప్పుతాను. ఇట్లా అంటూ ధర్మరాజు భీముడివైపు చూచాడు. కన్నీటిని ఆపుకొంటూ, నిట్టూర్పు లణచుకొంటూ ధైర్యంతో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**సీ.** **'కడిమిమై సౌగంధికమున యక్షుల మద। మడఁచి కృష్ణకుఁ బువ్వు లట్లు దెచ్చెఁ;**
**గిమ్మీరదానవు నమ్మెయి నిర్జించి। విగతకంటకముఁ గావించె వనము;**
**బకదైత్యుఁ దొడరి యాభంగి రూపఱఁ జేసి। రక్షించె నేకచక్రాపురంబు;**
**నప్పాటఁ బ్రబలు జటాసురు నడరి దం। డితుఁ జేసి మనలఁ బెట్టించుకొనియె;**

**తే.** **నితఁడు పుట్టినకోలెను నెసఁకమెసఁగ। దర్పముననవర్తిల్లు నుదగ్రమూర్తి**
**యకట! యొరు చిత్తమున కెక్కునట్లు గాఁగ। మెలఁగి యేమి విధంబునఁ గొలుచువాఁడు.'** **74**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ భీముడు; కడిమిమైన్= బలంతో; సౌగంధికమునన్= సౌగంధిక కమలాల విషయంలో; యక్షుల మదమున్= యక్షుల గర్వాన్ని; అడఁచి= అణచి; కృష్ణకున్= ద్రౌపదికి; అట్లు= ఆ విధంగా (ఆశ్చర్యం కలిగేటట్లు అని భావం); పువ్వులు+తెచ్చెన్= పువ్వులు తెచ్చాడు; కిమ్మీర దానవున్= కిమ్మీరుడనే రాక్షసుని; ఆ+మెయిన్= ఆ విధంగా (అంత ప్రసిద్ధి వహించేటట్లు); నిర్జించి= చంపి; వనమున్= అరణ్యాన్ని; విగత, కంటకమున్+కావించెన్= శత్రురహితం చేశాడు; బక దైత్యున్= బకాసురుడిని; తొడరి= పూనుకొని; ఆ భంగిన్= ఆ రీతిగా; రూపు+అఱన్+చేసి= రూపుమాపి; ఏక చక్రాపురంబున్= ఏకచక్రపురాన్ని; రక్షించెన్= రక్షించాడు; ఆ+పాటన్= ఆ విధంగా; ప్రబలు= బలిష్ఠుడయిన; జటాసురున్= జటాసురుని; అడరి= ఎదుర్కొని; దండితున్+చేసి= దండించబడిన వాడినిగా చేసి; మనలన్= మనలను (పాండవులను); పెట్టించుకొనియెన్= విడిపించుకొన్నాడు; పుట్టినకోలెను= పుట్టినప్పటినుండి; ఎసకము+ఎసఁగన్= అతిశయించేటట్లు; దర్పమునన్+అ= గర్వంతోనే; వర్తిల్లు= ప్రవర్తించే; ఉదగ్రమూర్తి= భయంకరరూపుడు; అకట= అయ్యో!; ఒరుచిత్తమునకున్= ఇతరుల మనస్సుకు; ఎక్కునట్లు+కాఁగన్= నచ్చేటట్లు; మెలఁగి= ప్రవర్తించి; ఏమి విధంబునన్+కొలుచువాఁడు= ఎట్లా సేవిస్తాడో!

**తాత్పర్యం:** 'అలనాడు పరాక్రమంతో సౌగంధిక కమలం విషయంలో యక్షులమదాన్ని అణచి ద్రౌపదికి ఆ బంగారుపూలను ఆ విధంగా (అద్భుతంగా) తెచ్చిపెట్టాడు. అప్పుడు ఆ రకంగా (అపూర్వంగా) కిమ్మీరు డనే రాక్షసుడిని చంపి అరణ్యంలో శత్రుభయం లేకుండా చేశాడు; బకాసురుడిని ఆ విధంగా (ఆశ్చర్యం కలిగేటట్లు ద్వంద్వ యుద్ధంలో చంపి ఏకచక్రపురాన్ని రక్షించాడు; జటాసురుడిని మహాబలంతో ఆ విధంగా (అబ్బురపాటు కలిగేటట్లు) సంహరించి మనలను విడిపించాడు. అట్టి ఈ భీముడు పుట్టినప్పటినుండి అడ్డులేని గర్వంతో మసలుతున్న క్రోధమూర్తి. అక్కటా! ఇటువంటివాడు ఇతరుల మనసులకు నచ్చేటట్లు వారు మెచ్చేటట్లు మెలగుతూ ఏ విధంగా సేవక వృత్తి నిర్వహించగలడు?' (అది సాధ్యంకాని పనికదా అని భావం)

**విశేషం:** అలం: ఉదాత్తం. ధర్మరాజు తన వాక్యాలలో 'అట్లు', 'అమ్మెయి' 'ఆభంగి', 'అప్పాట' అనే మాటలు వాడి భీముడు ఆయా సందర్భాలలో ప్రదర్శించిన బలపరాక్రమాలను ధ్వనిమయం చేశాడు. మాటలలో తెలుగుపలుకుబడిని ప్రదర్శించాడు. భీముడు స్వభావంచేత ఉద్ధతుడు. పరధిక్కారాన్ని సహించలేని అభిమాని. అటువంటివాడు సేవకావృత్తిలో మసలటం ఎంతకష్టమో ధర్మరాజు ఈ మాటలలో వ్యక్తం చేశాడు. (సంపా.)

**వ. అనిన విని భీమసేనుం డి ట్లనియె. 75**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= ధర్మరాజు మాటలను విని; భీమసేనుండు= భీముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు పలికిన మాటలన్నీ విని భీముడు ఈ విధంగా అన్నాడు.

**తే. 'ఏను వంటలవాఁడ నై యా నరేంద్రుఁ। గొలిచి గరగరగాఁ గూడు గూర చిత్త**
**మునకు వచ్చిన చందంబునన యొనర్చి। నేర్చి మెలఁగుదుఁ గరము వినీతి మెఱసి. 76**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; వంటలవాఁడను+ఐ= వంటలవాడుగా; ఆ నరేంద్రున్= ఆ విరాట మహారాజును; కొలిచి= సేవించి; గరగరగాన్= నిర్మలంగా; కూడు; కూర; చిత్తమునకున్ వచ్చిన= రాజు మనసుకు వచ్చిన; చందంబునన్= రీతిగా; ఒనర్చి= చేసి (వండి); కరమున్= మిక్కిలి; వినీతి మెఱసి= వినయం చూపుతూ; నేర్చి= నేర్పుకలిగి (నేర్పుతో); మెలఁగుదున్= ప్రవర్తిస్తాను.

**తాత్పర్యం:** 'నేను వంటలవాడుగా విరాటుడిని సేవిస్తాను. రుచిగా శుచిగా వంటకాలు వండుతాను. రాజు మనస్సు మెచ్చే విధంగా వంటకాలు చేస్తాను. వినయంతో వ్యవహరిస్తాను. నేర్పుతో ప్రవర్తిస్తాను.

**ఉ. ఆఱురసంబులం జవులయందలి క్రొత్తలు పుట్ట నిచ్చలున్**
**వేఱొకభంగిఁ బాకములు విన్ననువొప్పఁగఁ జేసి చేసి న**
**న్మీఱఁగ బానసీని నొకనిం బురిఁ గానని యట్లుగాఁగ మేన్**
**గాఱియవెట్టియైన నొడికంబుగ వండుదుఁ గూడుగూరలన్. 77**

**ప్రతిపదార్థం:** ఆఱురసంబులన్= షడ్రసాలలోనూ; చవుల+అందలి= రుచులలోని; క్రొత్తలు+పుట్టన్= క్రొత్తదనం కలిగేటట్లు; నిచ్చలున్= ఎల్లప్పుడు; (అన్నివేళలలోనూ); వేఱొకభంగిన్= ప్రత్యేకత కనిపించేవిధంగా; పాకములు= వంటలు; విన్ననువు+ఒప్పఁగన్= నేర్పు కలిగేవిధంగా (నేర్పు స్పష్టమయ్యేటట్లుగా); చేసి చేసి= ఎన్నోసార్లు చేసి; నన్ మీఱఁగన్= నన్ను మించే; బానసీనిన్= వంటలవానిని; ఒకనిన్= మరొకనిని; పురిన్= నగరంలో; కానని+అట్లు+కాఁగన్= వెదకిననూ దొరకనట్లుగా; మేన్= శరీరము; కాఱియపెట్టి+ఐనన్= కష్టపెట్టి అయినా; ఒడికంబుగన్= ఇంపుగా; కూడు కూరలున్; వండుదున్= వండుతాను.

**తాత్పర్యం:** 'నేను రకరకాల వంటలు చేస్తాను. అవి షడ్రసోపేతంగా ఉంటాయి. పైగా వాటి రుచులలో క్రొత్తదనం ఉంటుంది. ఎప్పుడూ చేసేవి కాకుండా నిత్యనూతనంగా కూడా ఉంటాయి. నన్ను మించే వంటలవాడు నగరంలో ఎవరూ లేరు - అన్నట్లుగా వండుతాను. ఈ వంటపనిలో ఎట్లాంటి శారీరక కష్టాన్ని అయినా లెక్కపెట్టక శ్రమించి కూడూ, కూరలూ చక్కగా వండుతాను.

**విశేషం:** ఆరు రసములు - ఉప్పు, పులుపు, తీపి, వగరు, కారం, చేదు. వీటిని షడ్రుచులు అని కూడా అంటారు.

**తే. పఱియ వాపంగఁ దునియఁగా విఱువవలయు। నెడలఁ గాళులఁ జేతులఁ దొడలఁ బట్టి**
**కడఁగి యనువుగఁ జేసి ప్రొయ్యిడుదుఁ గాని। కత్తి గొడ్డలి యడుగ నేఁ గట్టియలకు. 78**

**ప్రతిపదార్థం:** పఱియ+పాపంగన్= (కట్టెలు) చీల్చడానికి; తునియఁగాన్= ముక్కలుగా; విఱువవలయు+ఎడలన్= విరవవలసి వచ్చినపుడు; కాళులన్= కాళ్ళతో; చేతులన్= చేతులతో; తొడలన్= తొడలతో; పట్టి= పట్టి; కడఁగి= ప్రయత్నించి; అనువుగన్+చేసి=

పొయ్యిమంటకు అనుకూలమయ్యేటట్లు చేసి; ప్రొయ్యి+ఇడుదున్= పొయ్యిలో పెడతాను; కాని; ఏన్= నేను; కట్టియలకున్= కట్టెలకోసం; కత్తి= కత్తిని; గొడ్డలి= గొడ్డలిని; అడుగన్= అడగను.

**తాత్పర్యం:** కట్టెలు చీల్చవలసి వచ్చినా, ముక్కలుగా విరవవలసిన అవసరం ఏర్పడ్డా, కాళ్ళతో చేతులతో తొడలతో పట్టి చీలుస్తాను, విరుస్తాను, వాటిని పొయ్యిలో పెడతాను. అంతేకాని కట్టెలకొరకు కత్తి, గొడ్డలి అడగను.

**క. సూపాధ్యక్షుఁడు గలిగిన। నాపురుషునితోడ సఖ్య మగునట్లుగ నే**
**నే పాట నైన నడవఁగ। నోపుదుఁ దత్తద్విధ ప్రయోగముల మెయిన్. 79**

**ప్రతిపదార్థం:** సూప+అధ్యక్షుఁడు= వంటశాలకు అధిపతి; కలిగినన్= ఉంటే; ఆ పురుషునితోడన్= ఆ అధికారితో; సఖ్యము= స్నేహం; అగునట్లుగన్= అయ్యేటట్లు; ఏను= నేను; ఏ పాటన్+ఐనన్= ఏ విధంగానయినా; తద్+తద్+విధ ప్రయోగముల మెయిన్= ఆయా విధాలయిన ప్రయోగాలతో; నడవఁగన్+ఓపుదున్= నడచుకొనగలను.

**తాత్పర్యం:** వంటశాలకు అధికారి ఉన్నట్లయితే అతడితో స్నేహం కలుపుతాను.

**విశేషం:** వైరం ఎవరితోనూ పనికిరాదు. మరీ ఉద్యోగనిర్వహణలో పై అధికారితో వైరం పెట్టుకొనటం తగని పని. అందుచేత సామరస్య పూర్వకంగా ప్రవర్తిస్తానని భీముడు చెప్పాడు.

**వ. అట్లుంగాక. 80**

**తాత్పర్యం:** అంతే కాకుండా.

**తే. జెట్టితండంబుతోడఁ జేపట్టి హొంత। కారి విఱిచినయట్టు లగ్గలిక విఱుతు**
**లాఁగు వేగంబు మెఱసి బలంబు నెఱపి। మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని. 81**

**ప్రతిపదార్థం:** జెట్టి తండంబుతోడన్= మల్లయుద్ధంచేసే వారి సమూహంతో; చేపట్టి= చేపట్లు పట్టి; హొంతకారి= శ్రేష్ఠుడయిన మల్లుడు; విఱిచిన+అట్టులు= విరిచినవిధంగా; అగ్గలికన్= అతిశయంతో; విఱుతున్= ఓడిస్తాను; లాఁగు వేగంబు= లంఘించే మల్లుని నేర్పులోని వేగాన్ని; మెఱసి= ప్రదర్శించి; బలంబు నెఱపి= బలాన్ని ప్రకటించి; మనుజవిభునిన్= విరాట మహారాజును; మల్లుతనమునన్= మల్లుతనంలో; మెప్పింతున్= మెప్పిస్తాను.

**తాత్పర్యం:** హేమాహేమీలయిన మల్లురతో కుస్తీలు పడతాను. వారిని మల్లయుద్ధంలో ఓడిస్తాను. మల్లయుద్ధంలో లంఘించే నైపుణ్యంతో కూడిన వేగాన్ని ప్రదర్శిస్తాను. నా బలాన్ని ప్రకటిస్తాను. మల్లుతనంలో రాజును మెప్పిస్తాను.

**క. పెక్కండ్ర నొక్క పోరను। నుక్కఱ భంజించి చంపు టుడుగుదు; రాజుం**
**దక్కటి చూపఱు లెంతయు। వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్. 82**

**ప్రతిపదార్థం:** ఒక్క పోరనున్= ఒకే యుద్ధంలోనే; పెక్కండ్రను= చాలమందిని; ఉక్కు+అఱన్= గర్వం అణగేటట్లు; భంజించి= ఓడించి, లొంగిపోయేటట్లు చేసి; చంపుట= చంపటం; ఉడుగుదున్= మానివేస్తాను (చంపను అని భావం); రాజున్= రాజు; తక్కటి= మిగిలిన; చూపఱులు= చూచేవారు (ప్రేక్షకులు); ఎంతయున్ వెక్కస పడన్= ఎంతో అబ్బురపడే విధంగా; చిత్రగతులన్= అనేక రకాలయిన మల్ల బంధవిశేషాలతో; తగన్ విహరింతున్= తగినట్లుగా విహరిస్తాను.

**తాత్పర్యం:** ఒకే యుద్ధంలో చాలమందిని ఓడించి చంపకుండా వదలివేస్తాను. రాజూ ఇతర ప్రేక్షకులూ ఆశ్చర్యపడేటట్లుగా చిత్ర విచిత్రాలైన మల్ల బంధపద్ధతులతో సమయానికి తగినట్లుగా వినోదాన్ని కలిగిస్తూ విహరిస్తాను.

**విశేషం:** ఉ.వి. సంశోధిత ముద్రణ ప్రతిలో 'భంజించి జంపుటుడుగుదు' రనే పాఠం ఉన్నది. కాని, అది వ్యాకరణ సమ్మతం కాదు. కాబట్టి 'భంజించి చంపుటుడుగుదు'- అనే పాఠాంతరాన్ని గ్రహించటమైనది. 'భంజింతుఁ జంపు టుడుగుదు' అనే పాఠాంతరం కూడా ఉన్నది కాని, అంతకంటె పై పాఠమే సముచితంగా ఉన్నది. ఎట్లాగంటే- భీముడు మల్లయుద్ధ నిపుణుడు. మల్లయుద్ధంలో సామాన్యంగా ద్వంద్వయుద్ధం ప్రసిద్ధం. భీము డొకేసారి పెక్కురు మల్లురతో తలపడగలడు. అదొక విశేషం. మల్లయుద్ధంలో అనేక ఆవృత్తులు ఉంటాయి. భీముడు చేసే యుద్ధంలో ఒకే ఆవృత్తిలో పెక్కంద్రను ఢీకొని వారిని డీలాపడేటట్లు చేయటం ఆశ్చర్యం. మల్లయుద్ధంలో ప్రత్యర్థి నేలపై కూలి లేవలేని దీనస్థితిలో ఉండవచ్చును. అప్పుడు అతడితో యుద్ధం మానవచ్చును. లేదా అతడిని చంపవచ్చును. పగతో చేసే యుద్ధంలో ప్రత్యర్థిని చంపటం సహజం. పోటీకొరకో, విలాసంకొరకో చేసే మల్లయుద్ధాలలో ప్రత్యర్థిని 'భంజించి', చంపకుండా వదలటమే న్యాయం. భీముడు ప్రత్యర్థిని ప్రాణాలతో వదిలే అలవాటు లేనివాడు. అందువలన అన్నగారికి నమ్మకం కుదిరేటట్లు ప్రత్యేకంగా ఆ విషయాన్ని పేర్కొన్నాడు. కాగా, పలువురితో ఒక్కసారిగా చేసే యుద్ధంలో పలురకాల మల్ల క్రీడలను ప్రదర్శింపవలసివస్తుంది. దొమ్మి యుద్ధంలోవలె భీముడు ఏక వీరుడై మల్లురను ఓడించే ఆ యుద్ధక్రీడ రాజుకే కాదు, చూచేవారికెవ్వరికైనా అపూర్వంగా ఉంటుంది. చిత్రగతులతో వీరవిహారం చేయటం భీముడు ప్రదర్శించబోయే నేర్పరితనం. కొందరు -చంపుట ఉడుగుట' అంటే - యుద్ధంలో ఓడినవారిపై భీముడు దయచూపి వదలుట అని భావిస్తారు. కాని, అది ప్రస్తుతం కాదు. ఆవేశపరుడైన భీముడు తనను తాను నిగ్రహించుకొని వినోదక్రీడను విరోధక్రీడగా భావించకుండా ఉంటానని అన్నకు వ్యంగ్యంగా చెప్పుతున్న మాటే అది. తనమాటకు పోషకంగా రాబోయే పద్యంలో మల్లురవలెనే, సింహాది మృగాలను సైతం చంపకుండా వాటిని తన ఉక్కుపట్టుతో అణచి ఉంచుతానంటాడు. ఇది సమయోచిత సంభాషణం. (సంపా.)

**చ.** **అదియునుఁ గాక కోలుపులి నైనను, గా రెనుపోతు నైన, ను**
**న్మదకరినైన, నుగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి బె**
**ట్టిదముగఁ గాలఁ గేలను గడింది మగంటిమి యుల్లసిల్లఁ బ**
**ట్టుదు నడఁగంగ మాత్స్యుఁడు గడున్ వెఱఁగందుచుఁ బిచ్చలింపఁగన్.** **83**

**ప్రతిపదార్థం:** అదియునున్+కాక= అంతేకాకుండా; కోలుపులిన్+ఐనను= పెద్దపులినయినా; కారు+ఎను పోతున్+ఐనన్= అడవి దున్నపోతునయినా; ఉత్+మదకరిని+ఐనన్= మిక్కిలి మదించిన ఏనుగునయినా; ఉగ్ర, మృగనాథునిన్+ఐనన్= భయంకరమయిన సింహాన్నయినా; కిట్టి= సమీపించి; ముట్టి= ఎదిరించి; బెట్టిదముగన్= క్రూరంగా, కఠినంగా; కాలన్= కాలితో; కేలను= చేతితో; కడింది మగంటిమి= మిక్కుటమయిన పౌరుషం; ఉల్లసిల్లన్= ప్రకటితం కాగా; మాత్స్యుఁడు= విరాటమహారాజు; కడున్= మిక్కిలి (ఎంతో); వెఱఁగందుచున్= ఆశ్చర్యపడుతూ, నిశ్చేష్టుడౌతూ; పిచ్చలింపఁగన్= మిక్కిలి మెచ్చుకొనేటట్లు; అడఁగంగన్+పట్టుదున్= అణచిపట్టుకొంటాను.

**తాత్పర్యం:** అంతే కాదు. విరాటమహారాజు అబ్బురపాటుతో నిశ్చేష్టుడై నన్ను పొగడ్తలతో ముంచెత్తేటట్లు పెద్దపులిని గాని, అడవిదున్ననుగాని, మదించిన ఏనుగునుగాని, భయంకరమయిన సింహాన్నిగాని, సమీపించి, ఎదిరించి, కమ్ముకొని, మేటి పౌరుషాన్ని ప్రదర్శించి, కాలితో, చేతితో అణచి ఉక్కిరిబిక్కిరి అయ్యేటట్లు అదిమి పట్టుకొంటాను.

**విశేషం:** క్రూరమృగాలతో పోరాటం సాహసంతో కూడుకొన్న పని. వేగానికి పులి, ఎదురుదాడికి అడవిదున్న, తిరుగులేని బలానికి మదపుటేనుగు, క్రూరత్వానికి సింహం లోకంలో ప్రసిద్ధం. వాటి నన్నింటిని అదుపులో ఉంచగలిగిన భీమ పరాక్రమం తప్పక ప్రశంసనీయమే ఔతుంది. (సంపా.)

**వ. ఇట్లు నానాప్రకారంబుల నతని మనంబు వడయుచు వలలుండను సమాఖ్య వహింతు; నమ్మహీపతి 'నీ వెవ్వరి వాఁడ?' వని యడిగె నేని 'పాండవాగ్రజునకు బానసంబు సేయుదు నసం గలవాఁడ' ననిన విని ధర్మజుం డమ్మెయికి సమ్మతించి బీభత్సు వీక్షించి ఘూర్ణమాన మానసుం డగుచు నిట్లనియె. 84**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నానా ప్రకారంబులన్= అనేకరకాలుగా; అతని మనంబు= విరాటుని మనస్సును; పడయుచున్= లోగొనుచూ, ఆకర్షిస్తూ; వలలుండు+అను సమాఖ్య= వలలుడు అనే పేరు; వహింతున్= ధరిస్తాను, పెట్టుకుంటాను; ఆ+మహీపతి= ఆ రాజు; నీవు; ఎవ్వరి వాఁడవు= ఎవరివి, ఎవరిదగ్గర ఉన్నావు; అని+అడిగెన్+ఏని= ప్రశ్నించినట్లయితే; పాండవ+అగ్రజునకున్= ధర్మరాజుకు; బానసంబు= వంట; చేయుదున్= చేస్తాను; అనన్+కలవాఁడను= అంటాను; అనినన్= అని చెప్పగా; విని; ధర్మజుండు= ధర్మరాజు; ఆ+మెయికిన్= ఆ పద్ధతికి (భీముడు వలలుడుగా వ్యవహరించటానికి); సమ్మతించి= ఒప్పుకొని; బీభత్సునిన్= అర్జునుని; వీక్షించి= చూచి; ఘూర్ణమాన మానసుండు+అగుచున్= కలతపడిన మనస్సు కలవాడౌతూ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఎన్నో రకాలుగా విరాటమహారాజు మనస్సును ఆకర్షిస్తాను. వలలుడనే పేరుతో వ్యవహరిస్తాను. 'నీ వెవర' వని అడిగితే ధర్మరాజు దగ్గర వంటలు చేసేవాడిని అని చెప్తాను' అని భీము డన్నాడు. ఆ మాటలు వినిన ధర్మరాజు భీముడి అజ్ఞాతవాస వర్తన విధానానికి అంగీకారం తెలిపాడు. ఆ తరువాత అర్జునుడి వైపు చూచాడు. అతడి మనస్సు కలవరపాటుకు లోనయింది. అర్జునుడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'ఖాండవ మేర్చె; దేవతలుఁ గానని యీశ్వరుఁ గాంచె; దోర్బలో**
**ద్దండ మహాసుర ప్రతతి దర్ప మడంచి ప్రియం బొనర్చి యా**
**ఖండలుఁ డున్న గద్దియసగంబున నుండె; మహానుభావుఁ డీ**
**తం డొక మర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁ డొకో!' 85**

**ప్రతిపదార్థం:** ఈతండు= అర్జునుడు; ఖాండవము= ఖాండవవనాన్ని; ఏర్చెన్= దహింపచేశాడు; దేవతలున్+కానని= దేవతలు కూడ దర్శించలేని; ఈశ్వరున్+కాంచెన్= ఈశ్వరుని ప్రత్యక్షం చేసికొన్నాడు; దోర్బల= భుజబలంచేత; ఉద్దండ= భయంకరమయిన; మహా+అసుర= గొప్పరాక్షసుల యొక్క; ప్రతతి= సమూహం యొక్క; దర్పమున్= గర్వాన్ని; అడంచి= అణచి; ప్రియంబు+ఒనర్చి= ప్రీతి చేసి; ఆఖండలుఁడు= ఇంద్రుడు; ఉన్నగద్దియ= అధిష్ఠించిన సింహాసనంయొక్క; సగంబునన్+ఉండెన్= సగభాగంలో కూర్చున్నాడు; మహా+అనుభావుఁడు= (ఇంతటి) మేటి ప్రభావం కలవాడు; ఒకమర్త్యున్+చేరి= ఒక మానవమాత్రుని ఆశ్రయించి; అనుదాత్తతన్= తక్కువదనంతో, దైన్యంతో; ఏ+మెయిన్= ఏ విధంగా; కొల్చువాఁడు+ఒకో!= సేవిస్తాడో కదా!

**తాత్పర్యం:** 'ఈ అర్జునుడు ఖాండవవనాన్ని కాల్చాడు. దేవతలు కూడా చూడలేని ఈశ్వరుడిని ప్రత్యక్షం చేసికొన్నాడు. భుజబలదర్పితులయిన రాక్షసుల గర్వాన్ని అణచివేశాడు. ఇంద్రుడికి సంప్రీతి కలిగించాడు. అతని అర్ధాసనం అలంకరించాడు. అటువంటి మహానుభావుడైన అర్జునుడు సామాన్యుడయిన ఒక రాజును ఆశ్రయించి దైన్యంతో ఏ విధంగా సేవిస్తాడో కదా!'

**విశేషం:** అలం: విషమం. అనురూపాలు కాని వాటికి కలిగిన సంబంధాన్ని గురించి వర్ణిస్తే విషమాలంకారం. ఈ పద్యంలో అర్జునుడు మహానుభావుడుగా చెప్పబడ్డాడు. అతడు ఒక సామాన్య మానవుడిని ఆశ్రయించి సేవించవలసిన హీనస్థితి (అనుదాత్తత) ఏర్పడిందే అని ధర్మరాజు మనసులో కలతచెంది విచారించాడు. అర్జునుడు మహాత్ముడనటానికి నాలుగు హేతువు లిందులో ధర్మరాజు పేర్కొన్నాడు. 1. ఖాండవ దహనం. 2. దేవతలుకూడా చూడలేని పరమేశ్వరుడిని ప్రత్యక్షంగా దర్శించటం, 3. దేవతలకు సింహస్వప్నంగా మారిన నివాతకవచాది భీకర రాక్షస సమూహాన్ని సంహరించి దేవతలకు మేలుచేయటం. 4. ఇంద్రుడితో కలిసి అతడి సింహాసనంమీద కూర్చొనటం. ఈ నాలుగు ఆది సభాపర్వకథార్థాలలో ప్రసక్తాలైనవే. విశేషమేమంటే - ఆ నాల్గింటిని భూలోకంలో అర్జును డొక్కడే సాధించాడు. సత్రయాగాలలో ఆజ్యహవిస్సులను ఆరగించి అజీర్ణవ్యాధికి గురి అయిన అగ్నిదేవుడు శ్రీకృష్ణార్జునుల నాశ్రయించి వారి రక్షణలో ఖాండవదహనంచేసి అందులోని ఓషధుల ప్రభావం వలన తన రుగ్మతను పోగొట్టుకొని అర్జునుడికి గాండీవం, రథం ఇచ్చాడు. ఖాండవదహనంలో అగ్ని అర్జునుడిని ఆశ్రయించాడు. అర్జునుడు ఇంద్రుడిని జయించాడు. పాశుపతాస్త్ర ఘట్టంలో కిరాతవేషంలో వచ్చిన పరమశివుడిని ప్రతాపంతో మెప్పించి వరాలను పొందాడు. ఆ తరువాత ఇంద్రుడు అర్జునుడిని తనువుతో అమరావతికి తీసికొనిపోయి, అర్ధ సింహాసనం మీద కూర్చుండబెట్టుకొని, తనూ దిక్పాలకులూ కలిసి దివ్యాస్త్రాల నెన్నింటినో అతడికి అనుగ్రహించారు. అర్జునుడు ఇంద్రుడి కోరికపై నివాతకవచాదులను సంహరించి అతడికి ప్రీతి కలిగించాడు. ఇంద్రుడు, పరమేశ్వరుడు వంటి సర్వలోకాధిపతులను మెప్పించిన మహావీరుడైన అర్జునుడు అన్ని విధాలా మహానుభావుడు. అంటే దివ్యుడు. అతడు దివ్యుడని దేవతలు కూడ పేర్కొన్నారు. అటువంటి మహానుభావుడు ఒక సామాన్యమానవుడైన విరాటుడిని సేవించటం ఎట్లా సాధ్యం! అని ఆశ్చర్యపోయాడు ధర్మరాజు. అందరికంటె అర్జునుడిదే అధికమైన సమస్య. అతడి దివ్యత్వం దాచిపెట్టుకొనలేనిది. అందుకే అంతటి ఆవేదన ధర్మరాజుకు. (సంపా.)

**క. అను మాటలు విని సంక్రం। దన నందనుఁ డిట్టు లనియె 'దైవంబుకతం**
**బున నాకు నొక్క చందం। బనువై యున్న యది; దీని నౌఁగా దనుఁడా! 86**

**ప్రతిపదార్థం:** అను మాటలు= ధర్మరాజు మాట్లాడిన మాటలను; విని= విని; సంక్రందన నందనుండు= ఇంద్రుని కుమారుడయిన అర్జునుడు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; దైవంబు కతంబునన్= దైవ నిర్ణయం ప్రకారం; నాకున్= నాకు; ఒక్క చందంబు= ఒక పద్ధతి; అనువు+ఐ+ఉన్న+అది= అనుకూలంగా ఉన్నది. దీనిని; ఔన్+కాదు+అనుఁడా!= ఔను కాదు అని మీ అభిప్రాయం చెప్పండి.

**తాత్పర్యం:** ధర్మరాజు మాటలు విని అర్జునుడు ఇట్లా అన్నాడు- 'దైవానుగ్రహంవలన నా అజ్ఞాతవాసవేషానికి ఒక ఉపాయం నిర్ణీతమై ఉన్నది. ఇది తగునో కాదో మీరే చెప్పండి.

**వ. అమరనగరంబున కరిగినయెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన, నాకు నాకేశుండు గరుణించి, 'ఈ శాప ఫలంబు భవదజ్ఞాతవాస వత్సరంబున ననుభవించి, తదనంతరంబ శాప మోక్షంబ వడయు' మని దీవించెం గావునఁ బేడితనంబు దాల్చి బాహులదీర్ఘత్వంబునకు, గుణకిణంబులకు, గంచుకంబును, శంఖ వలయంబులును మాటు సేసికొని విరాటు కడకుం జని. 87**

**ప్రతిపదార్థం:** అమరనగరంబునకున్= అమరావతికి; అరిగిన+ఎడన్= వెళ్ళినపుడు; ఊర్వశి; నన్ను; నపుంసకున్+కాన్= నపుంసకుడయ్యేటట్లు; శపియించినన్= శపించగా; నాకున్= నాకు; నాక+ఈశుండు= స్వర్గాధిపతి అయిన దేవేంద్రుడు; కరుణించి= అనుగ్రహించి; ఈ శాపఫలంబున్= ఊర్వశి ఇచ్చిన ఈ శాపం యొక్క ఫలితాన్ని; భవత్= నీ యొక్క; అజ్ఞాతవాసవత్సరంబునన్= అజ్ఞాతవాసం చేయవలసిన సంవత్సరంలో; అనుభవించి= అనుభవించి; తదనంతరంబు+అ= తరువాత; శాపమోక్షంబు+

పడయుము= శాపవిముక్తిని పొందుము; అని= అని; దీవించెన్= దీవించాడు; కావునన్= కాబట్టి; పేడితనంబు+తాల్చి= నపుంసకత్వాన్ని ధరించి; బాహుల దీర్ఘత్వంబునకున్= చేతుల పొడగరితనానికి; గుణకిణంబులకున్= వింటినారి దెబ్బలవలన ఏర్పడ్డ కాయలకు; కంచుకంబును= రవికెయు; శంఖవలయంబులున్= శంఖాలతో చేసిన గాజులను; మాటు చేసికొని= అడ్డుపెట్టుకొని; విరాటుకడకున్+చని= విరాటమహారాజు దగ్గరికి వెళ్ళి.

**తాత్పర్యం:** నేను అమరావతికి వెళ్ళినప్పుడు ఊర్వశి నన్ను 'నపుంసకుడవు క' మ్మని శపించింది. కాని, దేవేంద్రుడు కరుణించి 'ఈ శాపఫలితాన్ని అజ్ఞాతవాస కాలంలో అనుభవించుము. అది ముగియగానే శాప విముక్తి కలుగుతుందని దీవించాడు. అందుచేత పేడితనం ధరిస్తాను. నా ఆజానుబాహుత్వం కనబడకుండా కంచుకం ధరిస్తాను. చేతులమీద, భుజాలమీద ఉన్న కాయలు కనబడకుండా శంఖపు గాజులు వేసికొంటాను. నపుంసకవేషంలో విరాటుడి దగ్గరికి వెళ్ళుతాను.

**విశేషం:** ఒక్కొకసారి శాపమే వరంగా పరిణమిస్తుందనటానికి ఇది తార్కాణం. అర్జునుడు అమరావతిలో ఉన్నప్పుడు ఇంద్రుడు అతడికి అర్ధాసనం ఇచ్చి, స్వీయకిరీటాన్ని ధరింపచేసి, ఎన్నో సత్కారాలు చేసి, ఒక మణిమయ భవనంలో ఉంచాడు. ఊర్వశి అతడిపై మరులుకొని రాత్రివేళ అతడిని సమీపించి, పొందుకోరింది. అర్జును డామెను తల్లిగా గౌరవించాడు. ఊర్వశి తాను దేవవేశ్య నని, ఉపభోగ్యురాలననీ, అది దేవలోక ధర్మమనీ బోధించింది. కాని, అర్జునుడు భూలోక ధర్మాన్ని అనుసరించి, చంద్రవంశకర్త అయిన పురూరవుడికి పత్నిగా ఉన్న ఊర్వశి తల్లివంటిదని బదులు చెప్పి ఆమె కోర్కెను తిరస్కరించాడు. అందు కామె కోపించి అతడిని నపుంసకుడివి కమ్మని శపించింది. అర్జునుడు ఖిన్నుడయ్యాడు. కాని, అతడి ధర్మవ్రతానికి మెచ్చి ఇంద్రుడాశాపం అజ్ఞాతవాస కాలంలో మాత్రమే ప్రవర్తిల్లేటట్లు అనుగ్రహించాడు. ఇది పూర్వమే దైవ నిర్ణయంగా ఏర్పడింది. కాబట్టి మరొక మార్గం లేదని అర్జునుడు చెప్పాడు. ధర్మజు డనుమతించాడు. నపుంసకుడైనా అర్జునుడు తన శరీర సహజచిహ్నాలను కొన్నింటిని కలిగి ఉంటాడు. అవి పొడవైన చేతులు, గాండీవపు అల్లెత్రాటి ఒరవడివలన భుజాలమీద, చేతులమీద ఏర్పడిన కాయలు; వాటిని సముచితంగా కప్పిపుచ్చుకొనేందుకు కంచుకం, శంఖాల గాజులు ధరించటం విశేషం. (సంపా.)

**క. ఉత్తమ కన్యాజనులకు। నృత్తము గఱపంగ నాకు నేర్పు గలదు; త**
**ద్వృత్తమునకు న న్నేలుము;। చిత్తమునకు నెక్క బనులు చేసెద నందున్. 88**

**ప్రతిపదార్థం:** నాకున్= (అర్జునునికి); ఉత్తమ కన్యాజనులకున్= మంచి గుణాలు కల కన్యల సమూహాలకు; నృత్తము= నాట్యం; కఱపంగన్= నేర్పటానికి (తగిన); నేర్పు= నైపుణ్యం; కలదు= ఉన్నది; నన్నున్= నన్ను; తత్+వృత్తమునకున్= ఆ పనికి; ఏలుము= నియుక్తునిగా చేయుము; చిత్తమునకున్+ఎక్కన్= మనసుకు నచ్చేవిధంగా; పనులు= పనులు; చేసెదన్= చేస్తాను; అందున్= అని మనవి చేస్తాను.

**తాత్పర్యం:** నాకు నాట్యం తెలుసు. అంతఃపురంలోని ఉత్తమ కన్యలకు నాట్యం నేర్పుతాను. ఈ పనికి నన్ను నియోగించుము. నీ మనసుకు నచ్చేటట్లు పనిచేస్తాను- అని అంటాను.

**విశేషం:** 1. అర్జునుడు ధనుర్విద్యా విశారదుడు మాత్రమే కాదు. నాట్యం తెలిసినవాడు కూడా. అజ్ఞాతవాసంలో అవసరం ఉంటుందని గ్రహించి ఇంద్రుడు అమరావతిలో చిత్రసేనుడనే గంధర్వరాజువద్ద అర్జునునికి గీత వాద్య నృత్యాలను నేర్పి పండితుడిని చేయించాడు. ఆ విద్యను అర్జునుడు వినియోగించుకొంటున్నాడు.

2. నాట్యశాస్త్ర మర్యాదలో నృత్తం. నృత్యం, నాట్యం అనే పారిభాషిక పదాలు ప్రసిద్ధాలు. నృత్తం ఆంగికవిన్యాస ప్రచారం. నృత్యం భావప్రధానం. నాట్యం అభినయ రసప్రధానం. భరతనాట్యకోవిదులు నృత్తమును పరమేశ్వరుడు ప్రవర్తింపజేశాడని చెప్పుతారు. ఏమైనా సాహిత్యంలో నృత్త, నృత్య, నాట్యశబ్దాలు నాట్యం అనే అర్థంలోనే వాడబడుతూ ఉంటాయి. (సంపా.)

**క. అని కొలిచి యే బృహన్నల। యను నామముతోడఁ గన్యకాంతఃపుర వ**
**ర్తన మొనరించుచు లాసిక। తనమున నిపుణుండనై యతని మెచ్చింతున్. 89**

**ప్రతిపదార్థం:** అని= నాట్యం నేర్పుతానని; కొలిచి= సేవలో కుదురుకొని; ఏన్= నేను; బృహన్నల+అను నామముతోడన్= బృహన్నల అనే పేరుతో; కన్యకా+అంతఃపురవర్తనము= కన్యలుండే అంతఃపురంలో ప్రవర్తించటం; ఒనరించుచున్= చేస్తూ; లాసికతనమునన్= నాట్యంలో, ఆటకత్తె తనంలో; నిపుణుండన్+ఐ= నేర్పరితనం కలవాడనై; అతనిన్= అతనిని (విరాటుని); మెచ్చింతున్= మెప్పిస్తాను.

**తాత్పర్యం:** విరాటుడి కొలువులో బృహన్నల పేరుతో అడుగుపెట్టుతాను. కన్యకాంతఃపురంలో సంచరిస్తాను. సుకుమారమయిన నాట్యంలో నేర్పరితనాన్ని ప్రదర్శిస్తాను. విరాటుడిని మెప్పిస్తాను.

**క. మానవపతి న 'న్నెక్కడి। దానవు నీ' వనియెనేని 'ద్రౌపదికడ స**
**మ్మానంబు వడసి మెలఁగుదు;। నా నగళుల నృత్యగురువ ననఁగల వాఁడన్'. 90**

**ప్రతిపదార్థం:** మానవపతి= విరాటమహారాజు; నన్నున్; ఎక్కడిదానవు+నీవు+అనియెన్+ఏని= నీవు ఎవరు? ఎక్కడనుండి వచ్చావు? ఎవరి తాలూకు మనిషివి? అని అడిగినట్లయితే; ద్రౌపది కడన్= ద్రౌపది దగ్గర; సమ్మానంబు+పడసి= గౌరవం పొంది; మెలఁగుదున్= ఉండేదానిని; ఆ నగళులన్= ఆ ద్రౌపదియొక్క అంతఃపురాలలో; నృత్యగురువు+అన్+అనన్+కలవాఁడన్= నాట్యం నేర్పే గురువును అని అంటాను.

**తాత్పర్యం:** ఆ రాజు 'నీ వెక్కడిదానవు?'- అని నన్నడిగితే- 'నేను ద్రౌపది ఆదరగౌరవాలను పొంది, ఆమె అంతః పురాలలో నృత్యగురువుగా పేరుపొందానని చెప్పుతాను.'

**విశేషం:** ఉ.వి. సంశోధిత ప్రతిలో 'నృత్యగురువయనఁగలవాఁడన్' అనే పాఠం ఉన్నది. 'నృత్యగురువనంగలవాఁడన్' అని పాఠాంతరం ఉన్నది. వావిళ్ళ ప్రతిలో 'నృత్యగురువననఁగలవాడన్' అని ఉన్నది. ఇక్కడ ఏవార్థకం (నృత్యగురువు+అ) లేదు. 'గురువు' 'నేను'కు విశేషణం. కాబట్టి అస్మద్విశేషణం. దీనికి చివర ఏకత్వంలో 'ను అంతాగమమయి, అది పరం కాగా, విశేషణపదం అంతానికి అత్వంవచ్చి, (నేను) గురువు+అ+ను= (నేను) గురువన్+అనఁగలవాఁడన్. నేను గురువననఁగలవాఁడన్ అగును- (బాల కారక. 33, 34 సూ.) కాబట్టి ఈ పాఠాన్ని గ్రహించడమైనది. (సంపా.) నపుంసకుడిని స్త్రీగా సంబోధించటం లోకవ్యవహారం.

**తే. అనిన 'నిది వోలు' నని యియ్యకొని యజాత। వైరి యల్లన నకులుని వలను సూచి**
**నెమ్మనంబున నుమ్మలికమ్ము గదుర। నెలుఁగు చందంబు వేఱుగా నిట్టు లనియె. 91**

**ప్రతిపదార్థం:** అనినన్= అర్జునుడు తాను బృహన్నలఅయి నాట్యగురువుగా ఉంటానని చెప్పగా; ఇది= ఈ పద్ధతి; పోలున్= తగును (బాగుంది); అని= అని; ఇయ్యకొని= సమ్మతించి; అజాతవైరి= ధర్మరాజు; అల్లనన్= మెల్లగా; నకులుని వలను= నకులుని వైపు; చూచి; నెఱ+మనంబునన్= నిండు మనస్సులో; ఉమ్మలికమ్ము+కదురన్= వేదన అతిశయించగా; ఎలుఁగు చందంబు వేఱు+ కాన్= కంఠస్వరం మారిపోగా (డగ్గుత్తికతో); ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడి మాటలు విన్న ధర్మరాజు 'ఇది చాల బాగుంది' అని తన సమ్మతి తెలియజేశాడు. ఆ తరువాత నకులుడి వైపు చూచాడు. అతడిని చూడగానే ధర్మరాజు మనసులో వేదన కలిగింది. గొంతు బొంగురుపోయింది. అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. అజాతవైరి అంటే పుట్టని శత్రువులు కలవాడు అని అర్థం. ధర్మరాజుకు దుర్యోధనుడు శత్రువుకాదా? అనే సందేహం కలగటం సహజం. కాని, ధర్మరాజు మనసా ప్రతివారిని మిత్రుడిగా భావించేవాడు. దుర్యోధనుడికి ధర్మరాజు శత్రువు కావచ్చును కాని, ధర్మరాజుకు దుర్యోధనాదుల యెడల శత్రుభావం లేదు.

2. మనసులో దుఃఖం పొంగుతున్నప్పుడు కంఠస్వరం మారటం సహజం. ఇది సాత్త్విక భావం. తిక్కన రచనలో అభినయాంశాలు వస్తువును నాటకీయంగా రమ్యతరం చేస్తాయి అనటానికి ఇది ఒక ఉదాహరణ.

**ఉ. 'ఒప్పెడు మేనుఁ బెంపు గల యుల్లము, నాగరికంపుఁ జందముం**
**జెప్పక చూప కీతని విశేషముఁ దెల్పెడుఁ గొల్చుటెంతయున్**
**డెప్పర; మేమి సేయుదుఁ గడింది విచారము పుట్టె; నె ట్లితం**
**డప్పురి సంచరించునొకొ! యన్యు లెఱుంగక యుండునట్లుగన్.'** **92**

**ప్రతిపదార్థం:** ఒప్పెడు మేను= చక్కని శరీరం; పెంపు+కల+ఉల్లము= ఎంతో ఉన్నతమయిన మనస్సు; నాగరికము+చందమున్= నాగరకత తీరు; చెప్పక= చెప్పకుండాను; చూపక= చూపనవసరం లేకుండా; ఈతని విశేషమున్+తెల్పెడున్= ఇతని ఆధిక్యాన్ని తెలుపుతున్నాయి కాబట్టి; కొల్చుట= సేవించటం; ఎంతయున్= ఎంతో; డెప్పరము= చేయడానికి వీలుకానిది; ఏమి+చేయుదున్?= నేనేం చేయగలను?; కడింది= అధికమయిన; విచారము+పుట్టెన్= దుఃఖం కలుగుతున్నది; ఆ+పురిన్= ఆ విరాటుని నగరంలో; అన్యులు= ఇతరులు; ఎఱుంగక+ఉండు+అట్లుగన్= తెలియకుండా ఉండేటట్లు; ఇతండు= నకులుడు; ఎట్లు= ఏ విధంగా; సంచరించును+ఒకొ!= సంచరిస్తాడో మరి!

**తాత్పర్యం:** 'నకులుడికి చక్కని శరీరం ఉన్నది. దానికి తోడు గొప్ప మనసు ఉన్నది. ఈతడి నాగరికతను శరీరం, మనసు రెండూ పట్టిస్తాయి. ఇతరులను సేవించటం సుతరామూ ఇతడికి చాల కష్టం. ఇబ్బందులు తప్పవు. ఇతరులు గుర్తుపట్టకుండా ఇతడు ఆ పట్టణంలో ఏ విధంగా సంచరిస్తాడో ఏమో! ఏం చేసేది? నా మనస్సులో ఎంతో విచారం కలుగుతున్నది'

**విశేషం:** అలం: విషమం. అనురూపాలుకాని అంశాలకు సంబంధం ఇందులో విచారించబడింది. నకులుడు అందగాడు. మేను సుకుమారమైనది. మనసు కోమలమైనది. నడవడిక చాల నాగరకమైనది. అతడి వైఖరి ఒక విశేష వ్యక్తిత్వాన్ని తెలుపుతూ ఉంటుంది.

అతడు సేవకవృత్తికి తగినవాడు కాడు. అయినా చేయవలసివస్తున్నది. అందుకు ధర్మరాజు మనసులో ఎంతో విచారపడుతున్నాడు. నకులుడి లక్షణాలు సుకుమారుడి కుండేవి కాని, సేవకుడికుండేవి కావు. అందువలన అతడు సేవకవృత్తిలో కుదిరినా చూచేవారు అతడిని అన్యథా భావించే అవకాశం ఉన్నది. అజ్ఞాతవాసం అప్పుడు సమస్య కాగలదు. ఈ అననురూపమైన అంశాల విచారంతో ధర్మజుడు వ్యథ చెందాడు. పై అలంకారం వలన నకులుడి పాత్రపట్ల సహృదయులలో సానుభూతిని కలిగించే భావశిల్పం గమనార్హం. (సంపా.)

**వ. అనిన నప్పలుకులకు నకులుం డిట్లనియె.** **93**

**తాత్పర్యం:** అనిన ధర్మరాజు మాటలు విని నకులుడు ఈ విధంగా పలికాడు.

ఆ. 'అశ్వశిక్షకుండనై మత్స్యభూవిభుఁ । గొలుచువాఁడ; గుఱ్ఱములకు వలయు
తెఱఁగు లెల్లఁ జాల నెఱుఁగుదు; రూపుగా । నరయ నేర్తు వాని ననుదినంబు. 94

**ప్రతిపదార్థం:** అశ్వశిక్షకుండను+ఐ= గుర్రాలను శిక్షించేవాడినయి; మత్స్యభూవిభున్= మత్స్యదేశానికి రాజయిన విరాటుని; కొలుచువాఁడన్= సేవిస్తాను; గుఱ్ఱములకున్= గుర్రాలకు; వలయు= అవసరమయిన; తెఱఁగులు= పద్ధతులు; ఎల్లన్= అన్నీ; చాలన్= బాగా; ఎఱుఁగుదున్= తెలిసినవాడిని; అనుదినంబు= ప్రతిదినం; వానిన్= గుర్రాలను; రూపుగాన్= చక్కగా; అరయనేర్తున్= పర్యవేక్షిస్తాను.

**తాత్పర్యం:** అశ్వశిక్షకునిగా సేవలోచేరి నేను మత్స్యరాజును మెప్పిస్తాను. అశ్వాలకు అవసరమయిన శిక్షణ పద్ధతులన్నీ బాగా తెలిసినవాడిని. ప్రతిరోజూ ఎంతో నేర్పుతో గుర్రాల బాగోగులు పర్యవేక్షణ చేస్తాను.

**విశేషం:** 'గుఱ్ఱములకు వలయు తెఱఁగు లెల్లఁ జాల నెఱుఁగుదు' నని నకులుడు చెప్పాడు. ఆ పరిజ్ఞానంతో అశ్వశిక్షణలో విరాటరాజును మెప్పిస్తానన్నాడు. ధర్మజు డామాటలతో సంతృప్తిపడేవాడు కాడు. 'ఆ తెఱఁగు లెల్ల' వివరించి చెప్పితేకాని అనుమతించడు. అందువలన తరువాత సీసపద్యంలో తిక్కన ఆ వివరాలను చెప్పించాడు. (సంపా.)

సీ. గోడిగ జాతిలోఁ గొదమ పెంటుల నేర్చి । మావుల హత్తించు మార్దవంబుఁ,
త్రాళ్ళఁ బట్టింపంగఁ దఱి యైన కొదమల । సంచంబు లెఱిఁగి శిక్షించు నేర్పుఁ,
గళ్యాలఁ బదిలంబు గాని గుఱ్ఱంబులఁ । గ్రొత్త ముట్టున కియ్య కొలుపు వెరవుఁ,
బెనఁగు శూకలముల బిరుసుతనంబులఁ । జలము డింపక తీర్పఁ జాలుటయును.

తే. నలవరించిన వాఁడ; లాయమున నున్న । యపుడు దొసఁగించుకయు లేనియట్లు గాఁగ
మాటి మాటికిఁ బరికించి మందడీల । కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు. 95

**ప్రతిపదార్థం:** గోడిగ జాతిలోన్= ఆడుగుర్రాల జాతిలో; కొదమపెంటులన్= వయసువచ్చిన ఆడుగుర్రాలను; ఏర్చి= వేరుపరచి; మావులన్= మగ గుర్రాలతో; హత్తించు= కలిపేటటువంటి; మార్దవంబున్= మృదువయిన నేర్పునూ; త్రాళ్ళన్+పట్టింపంగన్= త్రాళ్ళు వేయటానికి; తఱి+ఐన= వయసువచ్చిన; కొదమల= పిల్ల గుర్రాలయొక్క; సంచంబులు= జాతివైనాలను; ఎఱిఁగి= తెలిసికొని; శిక్షించు= అలవరచే; నేర్పున్= నేర్పున్నూ; కళ్యాలన్= నోటికి వేసే కళ్ళేలకు; పదిలంబు+కాని= లొంగనటువంటి; గుఱ్ఱంబులన్= గుర్రాలను; కొత్తముట్టునకున్= చిన్న దారపు పోగునకు, ఇయ్యకొలుపు= అలవాటు చేసే; వెరవున్= ఉపాయమున్నూ; పెనఁగు= గింజుకొనే; శూకలముల= మొండి గుర్రాలయొక్క; బిరుసుతనంబులన్= పొగరుబోతుతనాలను; చలము= పట్టుదల; డింపక= వదలిపెట్టకుండా; తీర్పన్+చాలుటయును= చక్కచేయటమున్నూ; లాయమునన్= గుర్రాలశాలలో; ఉన్న+అపుడు= ఉన్నప్పుడు; దొసఁగు= దోషం; ఇంచుకయున్= కొంచెంకూడా; లేని+అట్లు+కాఁగన్= లేకుండా ఉండేటట్లు; అలవరించినవాఁడన్= నేర్చుకొన్నవాడిని; మాటికిన్+మాటికిన్= ప్రతిసారీ; పరికించి= పరిశీలించి; మందడీలకున్+ఎల్లన్= అశ్వశిక్షకులకందరికీ; ఊఱట+అగుచున్= ఓదార్పు, విశ్రాంతి కలిగిస్తూ; వర్తిల్లన్+నేర్తున్= నడచుకొనగలను.

**తాత్పర్యం:** వయసువచ్చిన ఆడు గుర్రాలలో ఎదకు వచ్చిన వాటిని గుర్తిస్తాను. ఎన్నిక చేసిన మగ గుర్రాలతో వాటిని కలిపే నేర్పు నా కున్నది. పిల్ల గుర్రాల లక్షణాలను గుర్తించి వాటిని తాళ్ళతో కళ్లెంవేసి అలవాటుచేసే నేర్పు నా కున్నది.

కళ్ళేలకు లొంగని గుఱ్ఱాలు ఉండవచ్చును. వాటిని కేవలం నూలుపోగు కళ్ళెంచేతనే లోబరచుకొనే నేర్పు నాకున్నది. మారాంచేసే మొండి గుఱ్ఱాల పొగరును తగ్గించి లొంగదీసికొనే నేర్పు నాకున్నది. అశ్వశాలలోని గుఱ్ఱాలకు ఎటువంటి రోగాలూ రాకుండా, లోపాలు ఏర్పడకుండా మెలకువతో ఉంటాను. మాటిమాటికి వాటిని పరీక్షిస్తాను. అశ్వశిక్షకులకు ఊరట, విశ్రాంతి కలిగే విధంగా పరామరికతో ప్రవర్తిస్తాను.

**విశేషం:** మూలంలో ఈ విధంగా లేదు. ఇది తిక్కన చేసిన విస్తృతి. తిక్కన తనకున్న అశ్వశిక్షణ విజ్ఞాన సంపదను నకులుడి పాత్రలో నిక్షేపించాడు. తిక్కన ఏది చెప్పినా ఒక క్రమంలో చెప్పి, తన కావ్యకళా శిక్షణాచార్యకత్వాన్ని నిరూపించుకొంటాడు. అశ్వశిక్షకుడి బాధ్యత అశ్వసంతతిని పెంచి దానిని ఆరోగ్యంగా సుశిక్షితంగా ఉంచటం. రాజుకు హర్షం కలిగించే పద్ధతి అది. అందువలన - ఈ సీసపద్యంలో నకులు డొక క్రమంలో తన అశ్వశిక్షణ విజ్ఞానాన్ని వివరించాడు. ఉత్తమజాతి గుఱ్ఱాలు పుట్టటానికి ఉత్తమజాతివైన ఆడ మగ గుఱ్ఱాలను హత్తించే జ్ఞానం ఉండాలి. వాటికి పుట్టిన గుఱ్ఱపుపిల్లలు ఏ జాతికి చెందాయో తెలిసి, వాటికి తగిన శిక్షణలివ్వాలి. కళ్ళేలు నోట తగిలించుకొనే గుఱ్ఱాలు పరిణతిని సూచిస్తాయి. ఆ స్థితికి వాటిని తీసికొని రావటానికి ముందు నోటిలో మెత్తని దారాల కండెలు ఉంచటం పరిపాటి. వాటిని నిపుణంగా అలవరచే నేర్పు కావాలి. గుఱ్ఱాలలో కొన్ని మొండివి, పెంకెవి, పొగరుబోతువికూడా ఉంటాయి. వాటిని వంచటం అంత సులభం కాదు. మొండివాటిని మొండితనంతోనే వంచవలసి వస్తుంది. అందువలన ఆ యా సమయాలలో అశ్వశిక్షకులు పట్టుదల సడలించకూడదు. అశ్వం ఉపయోగానికి వచ్చేటప్పుడు దాని శరీరంమీద ఉండే ఉత్త మాశ్వ లక్షణాలను, ఆయా సమయాలలో వచ్చే రోగాలూ, వాటి వలన కలిగే దోషాలూ, వాటి నివారణ చర్యలూ, తెలిసిఉండి వాటిని మాటిమాటికి పరిశీలిస్తూ ఎప్పటికప్పుడు సరిచేస్తుండాలి. గుఱ్ఱాలశాలలో ఉన్న సుశిక్షితమైన అశ్వాలు రాజుకు సైన్యబలం. వాటిని తయారుచేసేవారు అశ్వశిక్షకులు. వారిలో కూడా అందరూ అన్నీ తెలిసినవారు ఉండకపోవచ్చును. సమస్యలన్నీ తెలిసినవాడు అశ్వశిక్షకుడుగా ఉంటే, మిగిలినవారికి ఊరట కలుగుతుంది. విజ్ఞానం పెరుగుతుంది. గుఱ్ఱాల ఎదలనుండి - గుఱ్ఱాల గుణాల వరకూ తెలిసిన తన అశ్వవిజ్ఞానాన్ని నకులుడు ఒక క్రమంలో చెప్పినట్లు వర్ణించటం తిక్కనకున్న అశ్వశాస్త్ర విజ్ఞానానికి నిదర్శనం. (సంపా.)

**క. దామగ్రంథి యనఁగ నొక । నామము వెట్టుకొనువాఁడ, నా తొంటి విధం**
**బా మనుజేశ్వరుఁ డడిగిన । నే మీకడవాఁడ నందు; నిది దెఱఁ గధిపా!' 96**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధర్మరాజా!; దామగ్రంథి+అనఁగన్+ఒక నామము= దామగ్రంథి అనే ఒక పేరు; పెట్టుకొనువాఁడన్= పెట్టుకొంటాను; నా తొంటి విధంబు= నా పూర్వపద్ధతిని; ఆ మనుజ+ఈశ్వరుఁడు= ఆ మహారాజు; అడిగినన్= అడిగినట్లయితే; నేన్= నేను; మీ కడవాఁడన్= మీ దగ్గర (ధర్మరాజు దగ్గర) ఉన్నవాడిని అని; అందున్= అంటాను; ఇది తెఱఁగు= ఇది నా పద్ధతి.

**తాత్పర్యం:** ధర్మరాజా! నేను దామగ్రంథి అనే పేరు పెట్టుకుంటాను. 'ఎవరు నీవు? ఇంతకుముందు నీవెక్కడున్నా?' వని నా పూర్వచరిత్ర నడిగితే ధర్మరాజు దగ్గర ఉండేవాడిని అని చెప్పుతాను. ఈ రకంగా మెలగటమే నేను నిర్ణయించుకొన్న పద్ధతి.'

**క. అనినఁ 'గడు లెస్స' యని నె । మ్మనమున నూఱడి, విభుం డమానుష తేజో**
**ధనుఁ డగు సహదేవుఁ గనుం । గొని యిట్లను వగలు మిగిలి కొందలపఱుపన్. 97**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; కడున్ లెస్స= చాలా బాగుంది; అని= అని; నెమ్మనమునన్= నిండుమనసులో; ఊఱడి= ఊరడిల్లి; విభుండు= ధర్మరాజు; వగలుమిగిలి= దుఃఖం ఎక్కువయి; కొందలము+పఱుపన్= కలవరపెట్టగా; అమానుష తేజోధనుఁ

డు+అగు= సామాన్య మానవులకు అతీతమయిన తేజస్సు అనే ధనం కలవాడయిన; సహదేవున్= సహదేవుని; కనుంగొని= చూచి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** నకులుడి మాటలు విని ధర్మరాజు 'చాలా బాగుంది' అని అనుకొన్నాడు, సంతృప్తిపడ్డాడు. ఆ తరువాత మహాతేజస్వి అయిన సహదేవుడిని చూచి మనస్సు బాధతో కలవరపడుతూ ఉండగా ఇట్లా అన్నాడు.

**చ.** **'అకుటిలుఁ; డార్యసమ్మతుఁ, డహంకృతి దూరుఁడు, నీతి నిర్మలా**
**త్మకుఁ డనవద్య శీలుఁడు, సధర్ముఁడు, దాంతుఁడు, గొంతిముద్దుసే**
**యు కొడుకు, మేను లేఁత, దన యుల్లము మెత్తన, యిట్టి యీతఁ డె**
**ట్లొకొ యొరు నాశ్రయించు? విధి యోపదె యెవ్వరి నెట్లు సేయఁగన్!'** **98**

**ప్రతిపదార్థం:** అకుటిలుఁడు= వంకరబుద్ధి లేని ఋజుస్వభావం కలవాడు; ఆర్యసమ్మతుఁడు= పెద్దలకు ప్రీతి పాత్రమయినవాడు; అహంకృతి దూరుఁడు= అహంకారం లేనివాడు; నీతి నిర్మల+ఆత్మకుఁడు= నీతిచేత నిర్మలమయిన మనస్సు కలవాడు; అనవద్య శీలుఁడు= ఏ మాత్రమూ నింద్యం కాని ప్రవర్తన కలవాడు; సధర్ముఁడు= ధర్మముతో కూడినవాడు; దాంతుఁడు= ఇంద్రియ నిగ్రహం కలవాడు; గొంతి= కుంతీదేవి; ముద్దు+చేయుకొడుకు= గారాబం చేసే కొడుకు; మేను లేఁత= శరీరం సుకుమారమైనది; తన+ఉల్లము మెత్తన= అతని మనస్సు మెత్తనిది; ఇట్టి= ఇటువంటి; ఈతఁడు= సహదేవుడు; ఎట్లు= ఏరకంగా; ఒరున్= మరొకరిని; ఆశ్రయించున్+ఒకొ= ఆశ్రయించునో కదా!; విధి= విధి (దైవం); ఏ+వారిన్= ఎవ్వరినయినా; ఎట్లు= ఎట్లయినా; చేయఁగన్= చేయటానికి; ఓపదె?= చాలదా?

**తాత్పర్యం:** 'సహదేవుడు నిష్కపటి, సజ్జనహితుడు, అహంకారరహితుడు, నిర్మలమనస్కుడు, నిష్కళంకశీలుడు, ధార్మికుడు, దాంతుడు. పై పెచ్చు కుంతీదేవి ఎంతో గారాబంగా చూచుకొనే ముద్దుబిడ్డ. అంతే కాదు. ఇతడి శరీరం కోమలం. ఇతడి మనస్సు మృదులం. ఇటువంటివాడు ఎవరిని ఆశ్రయించి ఉండగలడు? నిజానికి విధి ఎంతటిదో? ఎంతటివారినైనా సరే ఏ విధంగానైనా చేయగలుగుతుంది.'

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ఇక్కడ విశేషం సామాన్యంతో సమర్థించబడింది. మూలంలో సహదేవుడిని గురించిన ఈ వర్ణనం లేదు. తమ్ములందరిని సమానంగా ప్రేమించే ధర్మరాజుయొక్క సమచిత్తవృత్తిని ధ్వనింపజేసేటట్లు తిక్కన ఇక్కడ సమతాగుణాన్ని కథాంశ నిర్మాణంలో పాటించాడు. ఈ పద్యంలో విషమాలంకారం కూడా ఉన్నది. సహదేవుడి కుండే సహజలక్షణాలు ఉదాత్తుడైన రాజుకు ఉండేవి కాని, సేవకునికి ఉండేవి కావు. అతడు ఒకరిసేవ ఎట్లా చేయగలుగుతాడు? అని ధర్మరాజు విచారం. తిక్కన సహదేవుడిని వర్ణించేటప్పుడు కుంతి గారాబుబిడ్డగా పేర్కొనటం సామాన్యంగా మరచిపోడు. కుటుంబంలో కడగొట్టుబిడ్డ అదృష్టమది. గారాబంగా పెరిగేవారు శ్రమకు గురికాలేరు. అందుకని ధర్మజుడు మరీ విచారించాడు. ఈ పద్యం అమూలకం కావటం తిక్కన పాత్రచిత్రణ నైపుణ్యానికి పతాకగా నిలుస్తున్నది. (సంపా.)

**క.** **అనుడు నతఁడు దన చిత్తం । బునఁ దోఁచిన విధము ధర్మపుత్రునితో ని**
**ట్లని చెప్పె నాతనికిఁ బు । ట్టిన యుత్తలపాటు గొంత డిందుపడంగన్.** **99**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగానే; ఆతనికిన్= ధర్మరాజుకు; పుట్టిన= ఏర్పడ్డ; ఉత్తలపాటు= దుఃఖం; కొంత= కొంతమట్టుకు; డిందుపడంగన్= తగ్గిపోయేటట్లు; అతఁడు= సహదేవుడు; తన చిత్తంబునన్= తన మనసులో; తోఁచినవిధము= తోచినరీతిని; ధర్మపుత్రునితోన్= ధర్మరాజుతో; ఇట్లు+అని= ఈ విధంగా; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అన్నగారైన ధర్మరాజు హృదయంలో కలిగిన బాధ కొంత ఉపశమించేటట్లు సహదేవుడు తన మనసులోని మాటను ఈ విధంగా ఆయనతో చెప్పాడు.

**క. 'కీలారితనమునకు నేఁ। జాలుదు నని కొలిచిమత్స్య జనపాలుకడన్**
**మేలగు నడవడిఁ దంత్రీ। పాలుం డను పేరుతోడఁ బరఁగుదు నధిపా! 100**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధర్మరాజా!; కీలారి తనమునకున్= పశుపాలనానికి; నేన్= నేను; చాలుదును= తగుదును; అని= అని; కొలిచి= సేవలో చేరి; మత్స్యజనపాలుకడన్= మత్స్యదేశపు రాజైన విరాటుని దగ్గర; మేలు+అగు= అనువైన; నడవడిన్= ప్రవర్తనతో; తంత్రీపాలుఁడు= తంత్రిపాలుడు; అను పేరుతోడన్= అనే పేరుతో; పరఁగుదున్= వ్యవహరిస్తాను.

**తాత్పర్యం:** 'నేను పశుపాలనంలో సమర్థుడనని చెప్పి, విరాటుడి కొలువులో గోరక్షకుడిగా చేరతాను. తంత్రీపాలుడనే పేరుతో వ్యవహరిస్తాను. మంచి నడవడికతో సంచరిస్తాను.

**సీ. వంజల నైనను వల నేర్పడఁగ నొక। భంగిఁ జేఁపఁగ జేసి పాలు గొనఁగ.**
**బడుగుల నైనను బాటించి పరికించి। గోమున మైఁ గండ క్రొవ్వుదేఱఁ,**
**దెవులు గొంటులనైనఁ దీర్చి సంకటమున। కోపి ముందటియట్ల రూపు సేయ,**
**నబ్బల నైనను నలువైన వెరవున। ముట్టె యంటఁగఁ బట్టి కట్టి విడువఁ.**

**ఆ. బిదుకఁ గదుపు సేర్పఁ బెదరు వాపఁగ నీరు। మేపు గలుగు నెడకు మెలఁగ, వెలువ**
**మెకము నరయ, మ్రుచ్చు మెలఁగిన వెలిగొట్ట। నేర్తుఁ; బసికిఁ జాలఁ గూర్తు నేను. 101**

**ప్రతిపదార్థం:** వంజలన్+ఐనను= (వంధ్య ప్రకృతి-వంజ వికృతి) గొడ్డుటావులనయినా; వలను= నేర్పు; ఏర్పడఁగన్= ప్రకటించబడేటట్లు; ఒక భంగిన్= ఒక విధంగా; చేఁపఁగన్+చేసి= చేపేటట్లుచేసి; పాలు+కొనఁగన్= పాలు పితకటానికి; (నేర్తున్ అనే క్రియతో అన్వయం); బడుగులన్+ఐనను= బక్కచిక్కిన వాటినయినా; పాటించి పరికించి= ఆదరించి కారణాలను పరిశీలించి; గోమునన్= గారాబంతో; మైన్= శరీరంలో; కండ క్రొవ్వు తేఱన్= కండా, కొవ్వూ బాగా పట్టేటట్లుగా, (నేర్తున్‌తో అన్వయం); తెవులు గొంటులన్+ఐనన్= రోగం వచ్చిన వాటినయినా; తీర్చి= సరిగాచేసి, రోగం నయం అయ్యేలా చేసి; సంకటమునకున్+ఓపి= కష్టానికి ఓర్చి; ముందటి+ అట్లు+అ= ముందు ఎట్లా ఉందో అట్లాగే; రూపు చేయన్= బలిసేవిధంగా చేయడానికి; ('నేర్తున్'తో అన్వయం); నబ్బలన్+ఐనను= పొగరుబోతు ఆవులనయినా; నలువైన వెరవునన్= తగిన ఉపాయంతో; ముట్టె= మూతి; అంటఁగన్+పట్టి= బిగించిపట్టి; కట్టివిడువన్= ముక్కుత్రాడు వేసి విడవటానికి, (నేర్తున్‌తో అన్వయం); పిదుకన్= పాలు పితకటానికి; కదుపు+చేర్పన్= మందలోకి పంపటానికి; బెదరు+పాపఁగన్= బెదరు పోగొట్టటానికి; నీరు మేపు కలుగు+ఎడకున్= నీరూ మేతా ఉన్న చోటికి; మెలఁగన్= సంచరించేటట్లు; వెలువమెకమున్+అరయన్= మీదపడే సింహాన్ని తెలిసికొంటానికి; మ్రుచ్చు= దొంగ; మెలఁగినన్= ప్రవేశిస్తే; వెలి+కొట్టన్= మందనుండి పారద్రోలటానికి; (నేర్తున్‌తో అన్వయం); పసికిన్= పశువులకు; నేను= నేను; చాలన్= చాలా; కూర్తున్= ఇష్టాన్ని చేకూరుస్తాను.

**తాత్పర్యం:** గొడ్డుటావులను కూడా చేపేటట్లు చేసి పాలు పితుకుతాను. బక్కచిక్కిన వాటినికూడా బాగా పరీక్షచేస్తాను. కండపట్టేటట్లు, క్రొవ్వు పట్టేవిధంగా మేపుతాను. తరచు రోగాలకు పాలయ్యే పశువులకు రోగం నయమయ్యేటట్లు చేస్తాను. ఎంత పొగరుబోతు ఆవునయినా పట్టుకొని ముకుతాడు బిగించి కట్టివేస్తాను. ఆవుల పాలు పితుకుతాను.

వాటిని మందలో చేరుస్తాను. వాటి బెదరు పోగొడతాను. నీరూ మేతా ఉన్నచోటు తెలిసికొని మేపుతాను. సింహం మొదలయిన క్రూరమృగాలుండే ప్రదేశాలు గుర్తిస్తాను. దొంగలను పసిగడతాను. వారిని శిక్షిస్తాను. పశువులకు ప్రీతికరంగా వ్యవహరిస్తాను.

**విశేషం:** 1. మూలపాఠంలో ఈ వివరాలు లేవు. అధికపాఠంలో కొన్ని వివరాలున్నాయి. ఇటువంటి వివరాలు లేకుండా చెప్పటమే మూలంలోని కథాస్వభావం. అజ్ఞాతవాసంలో పాండవులు నిర్వహించబోయే పాత్రలకు సంబంధించిన పరిజ్ఞానాన్ని వివరించటం తిక్కన స్వభావం. నకుల సహదేవులు కవలు. వారిద్దరెన్నుకొన్న వృత్తులు కూడా కవలవంటివి. పశుపాలనకు సంబంధించినవి. తిక్కన వారి వాక్యాలను సీసపద్యాలలోనే చెప్పించి కావ్యకళలో కూడా కవలుగా పలికింపజేశాడు. తిక్కన ఛందశ్శిల్ప మిది. (సంపా.)

2. ఈ సీసంలోని తొలి నాలుగు పాదాలూ - పిదుకన్, కదుపుసేర్పన్, బెదరువాపఁగన్, నీరుమేపుగలుగునెడకు మెలఁగన్ - అనే (ఆటవెలఁదిలోని) నాలుగు అసమాపక క్రియలతో క్రమంగా అన్వయిస్తూ ఉన్నాయి. తిక్కన కవితలో సామాన్యంగా కానవచ్చే ఈ క్రమాలంకార విన్యాసం గమనించదగింది. (సంపా.)

**వ.** **నన్ను విరాటుండు 'మున్ను నీ వెందుండు' దని నిరూపించెనేని' "యుధిష్ఠిరుగోష్ఠంబుల కధిష్ఠాతనై యుండుదు నని యెద' నని పలికినఁ గౌంతేయాగ్రజుం" డిది యుక్తం బగు' నని యనుమతి సేసి, పాంచాలి నాలోకించి, ఖిన్నాంతఃకరణుం డగుచు ని ట్లనియె.** **102**

**ప్రతిపదార్థం:** విరాటుండు= విరాట మహారాజు; మున్ను= ముందు; నీవు= నీవు; ఎందున్+ఉండుదు(వు)+అని= ఎక్కడ ఉండేవాడివని; నన్నున్= నన్నుగురించి; నిరూపించెనేని= తెలిసికొనవలె ననుకొంటే; యుధిష్ఠిరు గోష్ఠంబులకున్= ధర్మరాజు గోశాలలకు; అధిష్ఠాతను+ఐ= అధిపతినై; ఉండుదును+అనియెదను+అని= ఉండేవాడినని చెప్పుతాను అని; పలికినన్= చెప్పగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతీకుమారులలో పెద్దవాడయిన ధర్మరాజు; ఇది= ఈ విధం; యుక్తంబు+అగున్+అని= తగి ఉన్నదని; అనుమతి+చేసి= అంగీకరించి; పాంచాలిన్= ద్రౌపదిని; ఆలోకించి= చూచి; ఖిన్న+అంతఃకరణుండు= కలత చెందిన మనస్సు కలవాడు; అగుచున్= ఔతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'ఇంతకుముందు నీ వెక్కడున్నావయ్యా?!' అని విరాటమహారాజు నన్ను అడిగితే 'ధర్మరాజు గోశాలకు అధ్యక్షుడిగా ఉండేవాడినని చెప్పుతాను. 'సహదేవుడి మాటలను విన్న ధర్మరాజు 'ఈ ఉపాయం బాగున్న' దని తన అనుమతిని ప్రకటించాడు. ఆ తరువాత ద్రౌపదిని చూచి వేదనతో నిండిన మనసుతో ఈ విధంగా పలికాడు.

**చ.** **'ఇది కడు ముద్దరాలు, పను లేమియుఁ జేయఁగ నేర, దెంతయున్**
**మృదు, వొక కీడుపాటునకు మేకొనఁజాల, దుదాత్తచిత్త, యొం**
**టి దిరుగు దాని కోర్వ, దొకటిం దను దా సవరించుచొ ప్పెఱుం**
**గదు, తగ నొడ్లనుం గొలువఁగా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా!'** **103**

**ప్రతిపదార్థం:** అక్కటా!= అయ్యో!; ఇది= ఈ ద్రౌపది; కడుముద్దరాలు= మరీ ముగ్ధరాలు, కడు సుకుమారి; పనులు+ఏమియున్+ చేయఁగన్+నేరదు= పనులేవీ స్వయంగా చేసికొనలేదు (ఎప్పుడూ పరిచారికలచేత పనులు చేయించుకొనటమే తెలిసిన సుఖజీవితానికి అలవడింది అని భావం); ఎంతయున్= ఎంతో; మృదువు= మెత్తని స్వభావం కలది; ఒక కీడుపాటునకున్= ఒక నీచమయిన

పనికి కూడా, కష్టమయిన లేదా కష్టం కలిగించే పనికి కూడా; మేకొనన్+చాలదు= సమ్మతింపలేదు; ఉదాత్తచిత్త= ఉన్నతమైన (ఆశయాలతో కూడిన) మనసు కలిగినది; ఒంటి= ఒంటరిగా; తిరుగుదానికిన్= సంచరించడానికి; ఓర్వదు= తాళజాలదు; ఒకటిన్= ఒకటికూడా (ఏ ఒక్కటీ); తను, తాన్= తనంతట తాను; సవరించుచొప్పు= చక్కబెట్టుకొనే తీరు; ఎఱుంగదు= తెలియనిది; తగన్= తగినట్లు; ఒడ్లనున్= ఇతరులను; కొలువఁగాన్= సేవించటానికి; వెరవు= నేర్పు; ఏ+మెయిన్= ఏ విధంగా; కల్గున్?= కలుగుతుంది? (వీలవుతుంది?).

**తాత్పర్యం:** 'ఈమె సుకుమారి. ఏ పనినయినా చేయించుకొనటమే కాని చేయటం చేతకాని సుతిమెత్తనిది. నీచమయిన పనులకు దూరంగా ఉంటుంది. ఒంటరిగా తిరగడం ఎప్పుడూ అలవాటు లేనిది. చాలా పెద్ద మనసు కలిగింది. ఏ ఒక్కటి కూడా తనంత తాను చక్కబెట్టుకొనే తీరు తెలియనిది. ఇటువంటి ఈమె ఇతరులను ఏ విధంగా సేవిస్తుందో? ఆ నేర్పు ఈమెకు ఎట్లా అలవడుతుందో?'

**విశేషం:** తిక్కనగారి ప్రసిద్ధ పద్యాలలో ఇది ఒకటి. అర్థగుణమైన ప్రసాదం ఈ రచనకు ప్రాణం. ఈ ఘట్టాన్ని మూలంతో పోలిస్తే తిక్కనగారి కవితాకళాశిల్పం మరీ తేటపడుతుంది.

> **"ఇయంతు నః ప్రియా భార్యా । ప్రాణేభ్యోఽపి గరీయసీ । మాతేవ పరిపాల్యా చ పూజ్యా జ్యేష్ఠేవ చ స్వసా॥**
> **కేనస్మ కర్మణా కృష్ణా ద్రౌపదీ విచరిష్యతి । నహి కించిత్ విజానాతి కర్మ కర్తుం యథాస్త్రియః॥**
> **సుకుమారీ చ బాలా చ రాజపుత్రీ యశస్వినీ । పతివ్రతా మహాభాగా కథంను విచరిష్యతి"॥ (సం.4.3. 12-14)**

'ద్రౌపది మనందరికీ ప్రియమైన భార్య. మన ప్రాణాలకంటె మిన్న అయినది. ఆమె తల్లివలె పరిరక్షించదగింది. సోదరివలె మన్నించదగింది'- అని అనటం తిక్కన వదలివేశాడు. మూలంలో ఆర్ద్రత ఉన్నా, తెలుగులో ఔచిత్యం ఉన్నది. పాండవపత్నిగా ఆమె ప్రశంస అజ్ఞాతవాస నియమానికి ప్రస్తుతంకాదు. ఆమె ఇతరుల సేవలో ఎట్లా ఉండగలుగుతుంది-అనేదే ప్రస్తుతాంశం. పాండవు లందరిలో ఆ అంశాన్ని మాత్రమే ఎన్నుకొని తిక్కన విషమాలంకార సుందరంగా వ్యక్తీకరించాడు. ఈ శ్లోకం దానికి భిన్నం. అందువలన తిక్కన దానిని గ్రహించలేదు. ఇక మిగిలిన రెండు శ్లోకాలలోని విశేషణాలు తెలుగు పద్యానికి ముడిసరుకుగా పనికి వచ్చాయి. కాని, తిక్కన పద్యంలో ద్రౌపదిని వర్ణించిన తీరు అనుభావ వ్యంజకంగానూ, భావికథార్థ సూచకంగానూ ఉండటం తిక్కన కావ్యకళాశిల్పం. విరాటపర్వంలో-విశేషించి కీచక ఘట్టంలో-ద్రౌపది పడేపాట్లను ప్రచ్ఛన్నంగా ధ్వనింపజేసే వాక్య విన్యాసం గమనార్హం. ఆమె కడు ముద్దరాలు. ఎంతో మనోజ్ఞమైనది-అని భావం. సుదేష్ణను మెప్పించిందీ, కీచకుడిని ఆకర్షించిందీ అయిన లావణ్యవిశేషం ఇందులో సూచితం. కష్టపడే పనులు చేయలేనిది. కాబట్టే సైరంధ్రిగా అలంకరణ సేవలో ఉండిపోయింది. ఆమె ఎంతో మెత్తనిది కాబట్టి కొలువులో ఒదిగి మర్యాదగా ఉండగలిగింది. ఒక కీడుపాటునకు కూడా సహించలేనిది కాబట్టి కీచకుడి వలపు బాసలను ఓర్చుకొనలేకపోయింది. ఉదాత్తచిత్త కాబట్టి అన్యపురుషవాంఛకు లోనుకాకుండా కీచకుడికి అన్యకాంతాసమాగమవాంఛ హేయమని చెప్పగలిగింది. ఒంటిగా తిరగటానికి సిద్ధపడదనే విశేషం - కీచకుడి ఇంటికి కల్లు తీసికొని రావటానికి ఒంటిగా పోవటాన్ని ఆమె అంగీకరించకపోవటానికి హేతువయింది. ఏ విషయాన్నైనా తాను స్వతంత్రించి ఒంటరిగా చేయటం అలవాటు లేనిదట. అంటే భర్తల అనుమతితో చేసేది అనే భావం ఏర్పడుతుంది. కీచకోదంతాన్ని పాండవుల దృష్టికి తెచ్చి, వారి ఎఱుకతో కార్యాన్ని నిర్వహించిన కథార్థాన్ని ఇది స్ఫురింపజేస్తుంది. ఇది వస్తుధ్వని. ఇక ద్రౌపదికి వాడిన విశేషణాలన్నీ ఆమె మహారాజ్ఞీత్వాన్ని సూచించేవి. సేవలు చేయించుకొన తగిన స్నిగ్ధమూర్తి ఎవరిని సేవించగలదు? అనే విషమాలంకార చిత్రణకు అనువుగా చెప్పబడినవి. తిక్కన తెలుగు పదాల జిలుగు రచనకు ఈ పద్యం హృద్యమైన ఉదాహరణం. (సంపా.)

**క. అనిన నతని చిత్తంబున । వెనుఁబాటంతయును బాయు వెరవు కలిమి యె**
**ల్లను దెలియునట్లుగా ని । ట్లనియెం బాంచాలి యుచితమగు చందమునన్.** 104

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అతని= ధర్మరాజు యొక్క; చిత్తంబునన్= మనసులోని; వెనుఁబాటు= సంకోచం; అంతయున్= అంతా; పాయు= పోయే; వెరవు కలిమి+ఎల్లను= ఉపాయం అంతా; తెలియునట్లుగాన్= తెలిసేవిధంగా; పాంచాలి= పాంచాలదేశపురాజైన ద్రుపదుని కూతురు ద్రౌపది; ఉచితము+అగు= తగిన; చందమునన్= రీతిగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= బదులు పలికింది.

**తాత్పర్యం:** ధర్మరాజు మాటలను ద్రౌపది విన్నది. అతడి మనసులోని బెంగను పోగొట్టాలని అనుకొన్నది. తనకు ఆ నేర్పు ఉన్నదని తెలియబరచాలనుకొన్నది. ఈ విధంగా అతడితో అన్నది.

**క. 'సైరంధ్రీ వేషంబునఁ। జేరుదు నంతఃపురంబు చెంతకు; నన్నా**
**భూరమణుదేవి యెంతయు। గారవమునఁ బిలువనంపఁగా వినయమునన్. 105**

**ప్రతిపదార్థం:** సైరంధ్రీ వేషంబునన్= సైరంధ్రీవేషంలో; అంతఃపురంబు= రాణివాసం; చెంతకున్= దగ్గరకు; చేరుదును= చేరుతాను; ఆ భూరమణుదేవి= ఆ విరాటమహారాజు దేవి అయిన సుదేష్ణాదేవి; నన్నున్= నన్ను; ఎంతయున్ గారవమునన్= ఎంతో గౌరవంతో; పిలువన్+అంపఁగాన్= పిలిపిస్తే; వినయమునన్= వినయంతో.

**తాత్పర్యం:** సైరంధ్రీవేషంలో అంతఃపురసమీపానికి వెళ్ళుతాను. అప్పుడు నన్ను విరాటుడి రాణి సాదరంగా పిలిపిస్తే సవినయంగా దర్శనం చేసికొంటాను.

**విశేషం:** మూలంలో ధర్మరాజు ద్రౌపదితో **"మాల్యగంధానలంకారాన్ వస్త్రాణి వివిధాని చ। ఏతా న్యేవాభిజానాతి యతో జాతా హి భామినీ' (4.3.15)** అని అన్నట్లున్నది. చిన్నప్పటినుండి ఆమెకు పూలమాల లల్లటం, అలంకారాలు చేసికొనటం, వివిధ వస్త్రాలను ఎన్నికచేసి ధరించటం వంటివి చాలా ఇష్టమైనవిగా ఉండేవన్నాడు! అతడి మాటలలో ద్రౌపదికి సైరంధ్రిగా మసలటానికి అనువైన మాలాలంకరణాదిక్రియలతో సహజంగా ఆసక్తి ఉన్నదని, అందువలన సైరంధ్రిగా కుదురుకొనుమని వ్యంగ్యంగా సూచించినట్లు ఉన్నది. తిక్కన ఆ మాటలు తెలుగులోకి తీసికొని రాలేదు. సైరంధ్రీవేషం ద్రౌపది స్వయంనిర్ణయంగానే తెలిపాడు. అది ఆమె వివేకాన్ని ప్రదర్శించింది. (సంపా.)

**క. కని కొలువు సేసికొని మా। లిని నాఁజని 'సాధ్వి యిది ; మలీమసవృత్తం**
**బున పొంతఁ బోవ దెన్నఁడు'। నను వ్రేఁకఁదనంబు దోఁచునట్లు చరింతున్. 106**

**ప్రతిపదార్థం:** మాలిని నాన్+చని= మాలిని అనే పేరుతో వెళ్ళి; కని= చూచి; కొలువు+చేసికొని= కొలువులో స్థానం సంపాదించి; ఇది= ఈమె; సాధ్వి= మహాపతివ్రత; ఎన్నఁడున్= ఎన్నడూ; మలీమసవృత్తంబున పొంతన్= కల్మష ప్రవర్తనంయొక్క దరిదాపులకు (నీచము, దుష్టము నయిన ప్రవర్తన పొంతకు); పోవదు= పోదు; అను వ్రేఁకఁదనంబు= అనే గౌరవభావం; తోఁచునట్లు= మనస్సున కలిగే విధంగా; చరింతున్= ప్రవర్తిస్తాను.

**తాత్పర్యం:** మాలిని - అనే పేరుతో వెళ్ళి, సుదేష్ణ దర్శనం చేసికొని, ఆమె కొలువులో చేరతాను. ఈమె మహాపతివ్రత. ఎన్నడూ కల్మషప్రవర్తనల జోలికి పోదు - అని అందరూ గౌరవించే విధంగా ప్రవర్తిస్తాను.

**సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి। తనువున నలఁదుదుఁ దనువుగాఁగ**
**మృగమదపంకంబు మృదువుగా సారించి। తిలకంబు వెట్టుదుఁ జెలువు మిగులఁ;**
**బువ్వులు బహు విధంబులఁ గట్టి ముడి కొక్క। భంగిగా నెత్తులు వట్టి యిత్తు;**
**హారముల్ మెఱయ నొయ్యారంబుగాఁ గ్రుచ్చి। యందంబు వింతగా నలవరింతు;**

**ఆ. వివిధ శిల్పములఁ బ్రవీణ నై మఱియును। వలయు పనుల వెంట మెలఁగ నేర్తు;**
**మత్స్యరాజమహిషి మనమున మక్కువ। నెలకొనంగ నిట్లు గొలువ నేర్తు. 107**

**ప్రతిపదార్థం:** కలపంబులు= మై పూతలు; అభినవగంధంబులుగన్= క్రొత్తసువాసనలతో గుబాళించే విధంగా; కూర్చి= తయారుచేసి; తనువు+కాఁగన్= చల్లన అయ్యేటట్లుగా; తనువునన్= శరీరంపై; అలఁదుదున్= పూస్తాను; మృగమదపంకంబు= కస్తూరి చందనం కలిపి తయారు చేసిన తడిమిశ్రమాన్ని; మృదువుగాన్= మెత్తగా; సారించి= మెదిపి (రంగరించి); చెలువు మిగులన్= అందం మరికొంత ప్రకాశించేవిధంగా; తిలకంబు+పెట్టుదున్= బొట్టుపెట్టుతాను; పువ్వులు= పూలను; బహువిధంబులన్= అనేక విధాలుగా; కట్టి= కట్టి; ముడికిన్+ఒక్కభంగిగాన్= ఒక్కొక్క రకమైన జుట్టు ముడికి ఒకొక్క రీతిగా; ఎత్తులుపట్టి+ఇత్తున్= చెండ్లుకట్టి ఇస్తాను; హారముల్ మెఱయన్= దండలు ప్రకాశించే విధంగా; ఒయ్యారంబుగాన్= ఒయ్యారంగా; గ్రుచ్చి= కూర్చి; అందంబు= అందం; వింతగాన్= వింత గొలిపే విధంగా; అలవరింతున్= కూరుస్తాను; వివిధ శిల్పములన్= ఎన్నోరకాల పనితనాలలో; ప్రవీణనై= నేర్పరితనం పెంచుకొని; మఱియును= ఇంకా; వలయు పనుల వెంటన్= కావలసిన పనులలో; మెలఁగన్, నేర్తున్= సంచరిస్తాను; మత్స్యరాజమహిషి= మత్స్యదేశపు రాజయిన విరాటుని పట్టమహిషి అయిన సుదేష్ణయొక్క; మనమునన్= మనసులో; మక్కువ నెలకొనంగన్= ప్రీతి కలిగేవిధంగా; ఇట్లు= ఈ విధంగా; కొలువన్+నేర్తున్= సేవించటం ఎరుగుదును.

**తాత్పర్యం:** నేను చక్కని మై పూతలు తయారుచేస్తాను. అవి ఎప్పుడూ గుబాళిస్తూ ఉంటాయి. వాటిని రాణి శరీరానికి సున్నితంగా పూస్తాను. కస్తూరిని చందనంతో కలిపి మెత్తగా మెదుపుతాను. రాణికి అందంగా తిలకం పెట్టుతాను. ఎన్నోరకాలయిన పూలమాలలు కట్టుతాను. ముడి కొకవిధంగా చెండ్లు కట్టి ఇస్తాను. అందంగా హారాలు కూర్చుతాను. వాటితో క్రొత్త అందాలు విరజిమ్మే విధంగా చేస్తాను. ఎంతో నైపుణ్యంతో అవసరమయిన పనులు చేస్తాను. మహారాణికి నాపట్ల మక్కువ కలిగే విధంగా ఆమెను సేవిస్తాను.

**విశేషం:** సైరంధ్రీ జాతి వారు నిర్వహించే పనులు పై పద్యంలో కనిపిస్తాయి. పరిమళభరితమయిన అనులేపనాలు కూర్చటం, రకరకాలయిన బొట్టులు దిద్దటం, అనేక విధాలయిన హారాలు, చెండ్లు తయారుచేయటం. రంగురంగుల దండలు గ్రుచ్చటం. గౌరవానికి ఎటువంటి లోపం కలగకుండా పతివ్రతాచారంతో ప్రవర్తించటం, చాలతక్కువ మాటలాడటం, పాపభీతి కలిగి ఉండటం, 'ఎంగిలి' కి దూరంగా ఉండటం, ఇతరుల కాళ్ళు కడగటం వంటివి చేయకపోవటం, పురుషులతో మాట్లాడకుండటం, చెడునడతల జోలికి పోకుండా ఉండటం. నీచమయిన పనులకు దూరంగా ఉండటం - ఇవి సైరంధ్రీలక్షణాలు. సేవావృత్తిలో ఉన్నా తనదంటూ 'ఒక పద్ధతిని' పాటించటం సైరంధ్రి విశిష్టగుణం.

**క. 'మును నీ వెచ్చో నిలు? తే। పని మెయి వర్తిల్లు?' దనినఁ బాంచాలికి నే**
**నను చారిణినై తగఁ బం। చిన గరువపుఁ బనులు నేర్చి చేయుదు నందున్.' 108**

**ప్రతిపదార్థం:** మును= ముందు; నీవు= నీవు; ఎచ్చోన్= ఎక్కడ; నిలుతు(వు)?= ఉండేదానివి?; ఏ-పనిమెయిన్+వర్తిల్లుదు(వు)?= ఏపనితో ఉండేదానివి?; అనినన్= అని అడిగితే; పాంచాలికిన్= ద్రౌపదికి; నేను= నేను; అనుచారిణిన్+ఐ= పరిచారికనై; తగన్+పంచిన= తగినట్లు చెప్పిన; గరువము+పనులు= గౌరవంతో కూడిన పనులు; నేర్చి చేయుదున్= నైపుణ్యంతో చేసేదానిని(అని); అందున్= మనవి చేస్తాను.

**తాత్పర్యం:** 'ఇంతకు ముందు నీ వెక్కడ ఉన్నావు? ఏం పనిచేసేదానివి?- అని అడిగితే, నేను ద్రౌపదికి పరిచారికగా ఉండి, నా గౌరవానికి ఎటువంటి భంగం కలిగించని పనులు పురమాయిస్తే వాటిని ఎంతో నేర్పుతో చేసేదానిని అని మనవి చేస్తాను.'

**వ. అనవుడు ధర్మనందనుండు ద్రుపదనందన కి ట్లనియె.** **109**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; ధర్మనందనుండు= ధర్మరాజు; ద్రుపదనందనకున్= ద్రౌపదితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అనగానే ధర్మరాజు ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

**క. 'మన వంశంబును, వృత్తం। బును, బెంపును గావఁ జాలు పుణ్యసతివి; దు**
**ర్జను లగు తులువల తలఁపులు। గనుఁగొని యేమఱక మెలఁగఁగా వలయుఁ జుమీ!'** **110**

**ప్రతిపదార్థం:** మనవంశంబును= మనవంశాన్ని; వృత్తంబును= మన ప్రవర్తనను; పెంపును= గొప్పతనాన్ని; కావన్+చాలు= రక్షించగలిగిన; పుణ్యసతివి= సాధ్వివి; దుర్జనులు+అగు= దుర్మార్గులయిన; తులువల= తుంటరుల; తలఁపులు= ఆలోచనలు; కనుఁగొని= తెలిసికొని; ఏమఱక= ఏ మాత్రం ఏమరుపాటు చెందక, ఎటువంటి పొరపాటు జరగకుండా; మెలఁగఁగాన్+వలయున్+చుమీ!= ప్రవర్తించాలి సుమా!.

**తాత్పర్యం:** 'మన వంశం, మన ప్రవర్తన, గొప్పదనం అన్నీ తెలిసిన పతివ్రతవు. దుర్మార్గులయిన తుంటరుల మనస్సులలోని చెడు ఆలోచనలను పసిగట్టి, ఎటువంటి ఏమరుపాటు లేకుండా ప్రవర్తించాలి సుమా!'.

**విశేషం:** ధర్మజుడి మాటలలో దుర్మార్గులయిన తుంటరుల ప్రసక్తి వచ్చింది. ఈ ప్రస్తావనవలన కీచకుడి వృత్తాంతాన్ని తిక్కన స్ఫురింపజేశాడు: ధర్మజుడు వశ్యవాక్కని ధ్వనింపజేశాడు. పతివ్రత అయిన గృహిణివలననే వంశగౌరవం పెరుగుతుందనీ, గృహనీతి విద్య నిలుస్తుందనీ, అభ్యుదయాలు సిద్ధిస్తాయనీ ధర్మజుడు చెప్పిన మాటలు కూడా సార్థకాలు. "మన వంశంబున వృత్తంబును" - ఆనందాశ్రమప్రతి.

**క. 'అనిన విని యాజ్ఞసేని యనాదర మందస్మిత సుందర వదనారవింద యయి యతని కిట్లనియె.** **111**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని చెప్పగా విని; యాజ్ఞసేని= ద్రౌపది; అనాదర= అనాదరంతో కూడిన; మందస్మిత= చిరునవ్వు చేత; సుందర= అందమయిన; వదన+అరవింద+అయి= ముఖపద్మం కలదయి; అతనికిన్= ధర్మరాజు(కు)తో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ధర్మరాజు భయాన్ని ద్రౌపది అర్థంచేసికొన్నది. అతడి మాటలకు స్పందించింది. చిరునవ్వుతో తన అనాదర భావాన్ని వ్యక్తం చేసింది.

**విశేషం:** నవ్వులు అనేక రకాలు. మూలంలో లేని ద్రౌపదియొక్క 'అనాదర మందహాసం' తిక్కన సృష్టి. ద్రౌపది నవ్వులో 'అనాదరణ' కనిపించటంలో ' నాకు తెలియదా? మీ రంతగా చెప్పాలా?' అనే భావాలు వ్యక్తమవుతున్నాయి. 'గతంలో ఎన్నో ఇబ్బందుల నుండి బయటపడిన నాకు ఇటువంటివి క్రొత్తవి కావు. అయినా తుంటరులను నేను లెక్కచేయను. వారు నన్నేమి చేయలేరు. అది నాకు సమస్య కాదు'- అనే భావం నవ్వులో ధ్వనింప చేసింది. ద్రుపదుడికి యజ్ఞసేనుడని మరొక పేరుంది. అతడి కుమార్తె యాజ్ఞసేని. తిక్కన ఈ పదాన్ని సాభిప్రాయంగా వాడాడు.

**క. 'ఆరయ నెందును గౌరవ। భారం బెడలంగనీక పాతివ్రత్యా**
**చారము మై వర్తింతురు। సైరంధ్రీ జాతివారు సౌజన్యమునన్.** **112**

**ప్రతిపదార్థం:** ఆరయన్= బాగా పరిశీలిస్తే; సైరంధ్రీ జాతివారు= సైరంధ్రీ జాతివారు; ఎందును= ఎక్కడైనా; గౌరవభారంబు= మహత్తరమయిన మర్యాద; ఎడలంగన్+ఈక= పోనీకుండా; పాతివ్రత్య+ఆచారము మైన్= పతివ్రతకు తగిన ప్రవర్తనతో; సౌజన్యమునన్= మంచితనంతో; వర్తింతురు= ప్రవర్తిస్తారు.

**తాత్పర్యం:** సైరంధ్రీజాతివారు గౌరవం కలవారు. తమ గౌరవాన్ని ఎప్పుడూ కాపాడుకొంటారు. సౌజన్యబుద్ధితో ప్రవర్తిస్తారు. పాతివ్రత్యంతో నడచుకొంటారు.

**క. కావున నుచితము లగు నా। కా వెంటం గొలిచి తిరుగునప్పుడు, మితభా**
**షా విరచనమును, వ్రతసం। భా వనమును గౌరవంబుఁ బాపభయంబున్.' 113**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; నాకున్= నాకు; ఆ వెంటన్= ఆ పనిమీద; కొలిచి తిరుగునప్పుడు= సేవించి తిరిగేవేళ; మిత భాషావిరచనమును= ముక్తసరిగా మాట్లాడటమున్నూ; వ్రతసంభావనమును= పాతివ్రత్య వ్రతాదరణమున్నూ, అజ్ఞాతవాసం యొక్క ఆంక్షలున్నూ; గౌరవంబున్= మర్యాదయున్నూ; పాపభయంబున్= పాపభీతియున్నూ; ఉచితములు+అగున్= (నాకు) తగినవిగా ఉంటాయి.

**తాత్పర్యం:** సైరంధ్రిగా నేను నాకు తగిన పనులు చేస్తుంటాను. తక్కువగా మాటలాడతాను. పాతివ్రత్యనియమాన్ని, అజ్ఞాతవాస కాలనియమాలను గుర్తుంచుకొంటాను. పాపభీతిని వదలిపెట్టను. గౌరవం కాపాడతాను.'

**క. అని చెప్పిన విని 'యగుఁ బో'। మ్మని కైకొని ధర్మతనయుఁ 'డందఱమును ని**
**ట్లనపాయత వర్తిల్లుద'। మని తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్. 114**

**ప్రతిపదార్థం:** అని= అని; చెప్పినన్= చెప్పగా; విని= విని; అగున్+పొమ్ము= అవుతుందిలే (తెలుగులో 'సరేలే పో' అని అంగీకారాన్ని తెలిపే జాతీయం ఇది); అని= సరేనని; కైకొని= అంగీకరించి; ధర్మతనయుఁడు= ధర్మరాజు; అందఱమును= అందరమూ; ఇట్లు= ఈ విధంగా; న+అపాయతన్= ఎటువంటి ఆపదలు లేకుండా; వర్తిల్లుదము= అజ్ఞాతవాసకాలంలో సంచరిద్దాం; అని= అని; తమ్ములతోడన్= తన తమ్ముళ్ళతో; నిశ్చయంబుగన్= నిర్ధారణగా; పలికెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ద్రౌపది మాటలను విన్న ధర్మరాజు సరేనని ఒప్పుకొన్నాడు. 'అందరమూ నిరపాయంగా అజ్ఞాతవాసకాలాన్ని గడుపుదాం' అని తమ్ముళ్ళతో చెప్పాడు.

**వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి, 'మన యగ్నిహోత్రంబుల నెల్ల ధౌమ్యులు రక్షించువారు; వంటలవారును మహానసాధ్యక్షులును బాంచాలీపరిచారికలును ద్రుపదపురంబున నిలుచువారు; రథంబులుగొని యింద్రసేనాదులైన సారథులు ద్వారకానగరంబున కరుగువారు; వీ రెల్లను దమ్మెవ్వరైనను మన వార్త లడిగిరేని 'ద్వైతవనంబున మమ్ము విడిచి పోయి రట యెఱుంగ' మనంగల వా' రని చెప్పి యిత్తెఱంగున నభ్యంతర పరివారంబు నెల్ల నియోగించి వీడుకొలిపె; నయ్యవసరంబున ధౌమ్యుండు పాండుకుమారుల కి ట్లనియె. 115**

**ప్రతిపదార్థం:** ఇవ్విధంబునన్= ఈ పద్ధతిలో; కార్యంబు= అజ్ఞాతవాసకాలంలో మెలగవలసిన పద్ధతిని (కర్తవ్యాన్ని); నిర్ణయించి= నిశ్చయించుకొని; మన= మనయొక్క; అగ్నిహోత్రంబులన్ ఎల్లన్= అగ్నిహోత్రాలనన్నింటిని; ధౌమ్యులు= ధౌమ్యుడు (బహువచనం గౌరవవాచకం); రక్షించువారు= రక్షిస్తారు; వంటవారును= వంటలవారు; మహానస+అధ్యక్షులును= వంటశాలకు అధిపతులు;

పాంచాలీ పరిచారికలును= ద్రౌపది సేవకురాండ్రు; ద్రుపదపురంబునన్= ద్రుపద మహారాజు పట్టణమయిన అహిచ్ఛత్రమనే నగరంలో; నిలుచువారు= ఉంటారు; రథంబులు+కొని= రథాలను తీసికొని; ఇంద్రసేన+ఆదులు+ఐన సారథులు= ఇంద్రసేనుడు మొదలయిన సారథులు; ద్వారకా నగరంబునకున్= ద్వారకా నగరానికి; అరుగువారు= వెళ్ళుతారు; వీరు+ఎల్లను= వీరందరూ; తమ్మున్= తమను; ఎవ్వరు+ఐననున్= ఎవరైనా; మనవార్తలు= అజ్ఞాతవాస ప్రదేశం గురించిగాని, పాండవుల భావికర్తవ్యాన్ని గురించిగాని; అడిగిరి+ఏనిన్= అడిగినట్లయితే; ద్వైతవనంబునన్= ద్వైతవనంలో; మమ్మున్+విడిచి= మమ్మల్ని వదలిపెట్టి; పోయిరి= వెళ్ళారు; అట= ఆపై; ఎఱుంగము= (తర్వాతి సంగతి) తెలియదు; అనన్+కలవారు= అని చెప్పవలెను; అని, చెప్పి= అని పలికి; ఈ+ తెఱంగునన్= ఈ విధంగా; అభ్యంతర పరివారంబు+ఎల్లన్= అంతఃపురాలలో పనిచేసే ఆంతరంగిక సిబ్బందినంతటిని; నియోగించి= నియమించి; వీడుకొలిపెన్= పంపివేశాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ధౌమ్యుండు= పాండవుల పురోహితుడ యిన ధౌమ్యుడు; పాండుకుమారులకున్= పాండు మహారాజు కుమారులయిన ధర్మరాజాదులకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు కర్తవ్యం నిశ్చయించాడు. ఆటుపై అగ్నిహోత్రరక్షణకు ధౌమ్యుడిని నియోగించాడు. వంటలవారు, పాంచాలీ పరిజనం ద్రుపదుడి నగరానికి వెళ్ళాలని చెప్పాడు. ఇంద్రసేనుడు మొదలయిన సారథులు ద్వారకా నగరానికి వెళ్ళాలని ఆదేశించాడు. ఎవరయినా మా గురించి వివరాలు అడిగితే 'ద్వైతవనంలో మమ్మల్ని వదలిపెట్టి వెళ్ళారు. ఆ తరువాతి సంగతి మా కేమీ తెలియదు' అని చెప్పాలి - అని ఆదేశించాడు. ఆభ్యంతర పరివారాన్ని పంపివేశాడు. ఆ తరువాత ధౌమ్యుడు పాండవులతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. "ద్రుపదుల రాజధాని గంగకుత్తరమున అహిచ్ఛత్రమై యుండెను. అహిచ్ఛత్రము ప్రస్తుతమున సంయుక్తప్రాంతమందలి రామాపురమునకు సమీపమునఁ గలదు. ద్రుపదుని మఱియొక రాజధాని కాంపిల్యము. ఇది గంగకు పడమటి యొడ్డున నుండవచ్చును"- (చర్ల నారాయణశాస్త్రి- మహాభారతమీమాంస-మూడవభాగము (1984, పు. 231).

2. 'రక్షించువారు, నిలుచువారు, అడుగువారు' మొదలైన విధ్యర్థక క్రియలు ధర్మజుడి ప్రభుతను వ్యక్తంచేస్తూ 'ప్రభు సమ్మితంగా' రాణిస్తున్నాయి.

3. రాజుకు-బాహ్యపరివారం, ఆభ్యంతరపరివారం, ఆత్మీయపరివారం-అని మూడురకాల పరివారాలుంటాయి. ధర్మజుడివెంట తమ తమ అగ్నిహోత్రాలతోసహా అనుసరిస్తున్న విప్రవర్యులు బాహ్యపరివారం. వీరు సేవకులు కారు. మిత్రులవంటివారు. సేవకవృత్తిలో ఉండి రాజును సేవించే ఆంతరంగికులు ఆభ్యంతరపరివారం. ఈ వచనంలో చెప్పబడిన వారే, ధౌమ్యుడు పురోహితుడు. అతడు ఆత్మీయపరివారంలో చేరతాడు. ఒక్కొక్కపరివార వర్గం పాండవులను వీడిపోయే క్రమం చెప్పటంలో తిక్కన ప్రదర్శించిన లోకజ్ఞత విశిష్టం. ధర్మరాజు బ్రాహ్మణులకు నమస్కరిస్తూ కన్నీళ్ళతో సాగనంపాడు. (1.46.57); ఆభ్యంతర పరివారాన్ని ఆజ్ఞాపించి సాగనంపాడు (1.115); ధౌమ్యుడిని అగ్నిహోత్రుడివలె గౌరవిస్తూ ప్రదక్షిణ నమస్కారాలు చేసి సెలవుతీసికొని వెళ్ళిపోయాడు (1.146.147). ధర్మజుడి ఔచిత్యవర్తనానికి ఈ మూడువీడ్కోలులు ముచ్చటైన ఉదాహరణలు. (సంపా.)

### ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు లెఱింగించుట (సం.4-4-6)

**క.** **'ఎఱిఁగెడు వారికి నైనను। గఱపక తక్కరుచిత ప్రకారము శుభముం**
**గొఱలు హితు; లట్లగుట నం। దఱకును జెప్పంగ వలయుఁ దగియెడు బుద్ధుల్.** 116

**ప్రతిపదార్థం:** ఎఱిఁగెడువారికిన్+ఐనను= తెలిసినవారికయినా; ఉచిత ప్రకారము= తగిన పద్ధతిలో; శుభమున్= శుభమును; కొఱలు= కోరే; హితులు= స్నేహితులు, మేలు కోరేవారు; కఱపక తక్కరు= ఉపదేశం చేయకుండా వదలిపెట్టరు; అట్లు+అగుటన్= అందుచేత; తగియెడు బుద్ధుల్= ఉచితమైన నీతులు, హితోక్తులు; అందఱకును= అందరికి; చెప్పంగవలయున్= చెప్పాలి.

**తాత్పర్యం:** లోకంలో తెలిసినవా రెందరో ఉండవచ్చును. కాని, శ్రేయోభిలాషులయినవారు అటువంటివిజ్ఞులకు కూడా బుద్ధులు చెప్పకుండా ఉండలేరు. అందుచేత అదనెరిగి అందరికీ తగిన బుద్ధులు చెప్పవలసిందే.

**వ. అదియునుం గాక. 117**

**ప్రతిపదార్థం:** అదీ కాక.

**తే. కౌరవాన్వయజాతులై గారవమునఁ। బెరిఁగినట్టి మీ రొండొక నరునిఁ గొలిచి**
**మసలి వర్తిల్లి మానావమానములకు। నోర్చి, యడఁకువతోడన యునికి యరిది. 118**

**ప్రతిపదార్థం:** కౌరవ+అన్వయజాతులు+ఐ= కౌరవ వంశంలో పుట్టినవారై; గారవమునన్= గౌరవంతో, గొప్పతనంతో; పెరిఁగిన అట్టి మీరు= పెరిగినటువంటి మీరు; ఒండొక= మరొక; నరునిన్= మానవమాత్రుని; కొలిచి= సేవించి; మసలి వర్తిల్లి= అణగిమణగి నడచుకొని; మాన+అవమానములకున్= గౌరవానికీ, అవమానానికీ; ఓర్చి= సహించుకొని; అడఁకువ తోడన్+అ= అణగిమణగి వినయంతో; ఉనికి= ఉండటం; అరిది= కష్టం.

**తాత్పర్యం:** మీరు కురువంశంలో పుట్టినవారు. గౌరవంగా పెరిగినవారు. మీవంటివారు మరొక సామాన్య మానవమాత్రుడిని సేవిస్తూ మానావమానాలు సహిస్తూ అణగిమణగి సవినయంగా ఉండటం వీలుకాని పని.

**క. వాలి వివిధాస్త్ర విద్యా। జ్వాలల వెలుఁగొందు పాండవజ్వలనం బా**
**భీలత మండం దొడరినఁ। గాల విరోధంబు మఱచి కార్యముఁ దప్పున్. 119**

**ప్రతిపదార్థం:** వాలి= విజృంభించి; వివిధ+అస్త్రవిద్యాజ్వాలలన్= అనేకరీతులయిన అస్త్రవిద్యలనే మంటలతో; వెలుఁగొందు= ప్రకాశించే; పాండవజ్వలనంబు= పాండవు లనే అగ్ని; కాలవిరోధంబు మఱచి= ప్రతికూలరూపమయిన కాలాన్ని మరిచి; ఆభీలతన్= భయంకరంగా; మండన్+తొడరినన్= మండటం మొదలు పెట్టితే; కార్యమున్+తప్పున్= అజ్ఞాతవాసంలో రహస్యంగా జీవితం గడపవలసిన కార్యం చెడిపోతుంది.

**తాత్పర్యం:** వివిధాస్త్రాలు మంటలవంటివి. వాటిని ధరించే పాండవులు అగ్నులవంటివారు. అటువంటి పాండవులు కాలవిరోధాన్ని మరచిపోకూడదు. కాదని మరచి మండిపడితే అనగా బాహాటంగా పరాక్రమాదులను ప్రదర్శిస్తే తమ ఉనికిని బహిర్గతం చేసికొంటారు. అజ్ఞాతవాసం భంగమవుతుంది. కార్యం చెడిపోతుంది.

**విశేషం:** అలం: రూపకం. పాండవులు మొదట ఆయుధాలను దాచిపెట్టుకొనాలి అని సూచన. (సంపా.)

**వ. కావున మీకు నప్రమాదార్థంబుగా నా నేర్చిన విధంబున నుపదేశం బవశ్యకర్తవ్యంబు; రాజులం గొలిచి యెమ్మెయి నయినను బ్రదుకు జనంబులు గీడునుం బొరయకుండునట్టి సాధారణ నీతి సంక్షేప రూపంబున నెఱింగించెద సావధానులరయి వినుండు. 120**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; మీకున్= మీకు; అప్రమాద+అర్థంబు= ఏమరుపాటు కలుగకుండా; నా నేర్చిన విధంబునన్= నే నెరిగిన రీతిని; ఉపదేశంబు= హితవు చెప్పటం; అవశ్య కర్తవ్యంబు= తప్పక చేయదగినపని; రాజులన్+కొలిచి= ప్రభువులను సేవించి; ఏ+మెయిన్+అయినను= ఏ విధంగానయినా; బ్రదుకు, జనంబులు= జీవితాన్ని గడిపేవారు; కీడునున్+పొరయక+ ఉండునట్టి= హాని కలుగకుండా ఉండే; సాధారణనీతి= సామాన్యంగా పాటించేవర్తన విధానం; సంక్షేపరూపంబునన్= సంగ్రహంగా; ఎఱింగించెదన్= తెలుపుతాను; సావధానులరు+అయి= ఏకాగ్రచిత్తం కలవారై; వినుండు= వినండి.

**తాత్పర్యం:** మీకు ఎటువంటి ప్రమాదం కలుగకుండా ఉండాలని నా ఆశయం. అందుచేత నాకు చేతనయిన విధంగా ఉపదేశం చేస్తాను. రాజులను సేవించి జీవించే వారు కడు జాగ్రత్తగా ఉండాలి. అందువలన రాజసేవలో ఇబ్బందులకు లోనుగాని విధంగా సాధారణనీతిని సంగ్రహంగా చెప్పుతాను. శ్రద్ధగా వినండి.

**క. తగఁ జొచ్చి తనకు నర్హం । బగు నెడఁ గూర్చుండి రూప మవికృతవేషం**
**బుగ సమయ మెఱిఁగి కొలిచిన । జగతీవల్లభున కతఁడు సమ్మాన్యుఁ డగున్. 121**

**ప్రతిపదార్థం:** తగన్= తగినట్లు; చొచ్చి= సభాప్రాంగణంలోకి ప్రవేశించి; తనకున్= తనకు; అర్హంబు+అగు+ఎడన్= తగినచోట; కూర్చుండి= కూర్చొని; రూపము= తన రూపం; అవికృతవేషంబుగన్= వికారం కాని వేషం కలిగి ఉండేటట్లు; సమయము+ఎఱిఁగి= సమయం తెలిసికొని; కొలిచినన్= సేవించినట్లయితే; జగతీవల్లభునకున్= రాజుకు; అతఁడు= అతడు; సమ్మాన్యుఁడు+అగున్= గౌరవించదగినవాడవుతాడు.

**తాత్పర్యం:** తగిన పద్ధతిలో సభలోనికి అడుగుపెట్టాలి. తన స్థానానికి తగిన ఆసనంలో కూర్చొనాలి. తన రూపంగాని వేషంగాని వికృతంగా ఉండకుండా చూచుకొనాలి. సమయం తెలిసికొని మసలుకొంటూ సేవించాలి. అట్లా చేయగల వ్యక్తి రాజుకు గౌరవార్హుడౌతాడు (రాజు యొక్క గౌరవానికి పాత్రుడౌతాడు).

**విశేషం:** రాజులు సహజంగా అధికారదర్పంవలన తరచూ కోపపడతారు. కొలువుకూటంలో అంగీకారం లేక ప్రవేశించడం వారి ఆగ్రహానికి కారణమవుతుంది. అట్లాగే అర్హతలకు అనుగుణంగా వేసిన ఆసనాలు గుర్తించి తన తాహతుకు తగిన స్థలంలో కూర్చొనాలి. లేకపోతే మర్యాదను అతిక్రమించినట్లవుతుంది. సభలో రాజు ప్రసంగించేవేళ, సమయం చూసి తనకు అవకాశం కలిగినప్పుడు మాత్రమే మాట్లాడటం మంచిది. లేకుంటే అనవసర ప్రసంగ మవుతుంది. సభలోనివారు నాగరకులు. నాగరకుల వేషానికి భిన్నంగా వేషధారణ పనికిరాదు. అంతేకాకుండా వికృతవేషంతో ప్రవేశించడం 'ఎబ్బెట్టుగా' కూడా ఉంటుంది.

**క. 'నరనాథుఁ గొలిచి యలవడఁ । దిరిగితి నా కేమి' యనుచుఁ దేఁకువ లేమిన్**
**మరియాద దప్ప మెలఁగినఁ । బురుషార్థంబునకు హాని పుట్టకయున్నే? 122**

**ప్రతిపదార్థం:** నరనాథున్= రాజును; కొలిచి= సేవించి; అలవడన్= మిగుల పరిచితుడయ్యేటట్లు; తిరిగితిన్= తిరిగాను; నాకున్= నాకు; ఏమి?= ఏమౌతుంది?; అనుచున్= అంటూ; తేఁకువ లేమిన్= జంకు గొంకు లేకుండా; మరియాద+తప్పన్+మెలఁగినన్= హద్దుమీరి ప్రవర్తిస్తే; పురుషార్థంబునకున్= పురుష ప్రయోజనానికే; హాని+పుట్టక+ఉన్నే?= కీడు కలగకుండా ఉంటుందా?.

**తాత్పర్యం:** నేను రాజు కొలువులో ఉన్నాను. రాజుతో చనువుగా తిరుగుతున్నాను. నా కేమిటి?- అని అనుకొంటూ నిర్భయంగా మర్యాద నతిక్రమించి నడచుకొంటే మొదటికే మోసం వస్తుంది.

**ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలు గట్టఁ గూడ, దే**
**యోజ నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచరించు, నే**
**యోజ విహారముల్ సలుప నుల్లమునం గడువేడ్క సేయు, నే**
**యోజ విదగ్ధుఁడై పలుకు; నొడ్డులకుం దగ దట్లు సేయఁగన్. 123**

**ప్రతిపదార్థం:** రాజగృహంబుకంటెన్= రాజుగారి ఇంటికన్నా; అభిరామముగాన్= అందంగా; ఇలు= ఇల్లు; కట్టన్+కూడదు= కట్టగూడదు; నృపాలుఁడు= రాజు; ఏ+ఓజన్= ఏరకంగా; ఆకృతికిన్= ఆకారానికి; ఒప్పు+అగు= తగిన; వేషములున్= వేషధారణలు; ఆచరించున్= ఆచరిస్తాడో; ఏ+ఓజన్= ఏ విధంగా; విహారముల్= విహారాలను; చలుపన్= చేయడానికి; ఉల్లమునన్= మనస్సులో; కడువేడ్క+చేయున్= బాగా ఇష్టపడుతాడో; ఏ+ఓజన్= ఏ విధంగా; విదగ్ధుఁడు+ఐ= నేర్పరియై; పలుకున్= మాట్లాడతాడో; ఒడ్డులకున్= ఇతరులకు; అట్లు చేయఁగన్= ఆ విధంగా చేయటం; తగదు= తగదు.

**తాత్పర్యం:** రాజుగారి ఇంటికన్నా అందంగా ఇల్లు కట్టుకొనకూడదు. రాజుగారి వేషధారణ పద్ధతిలో తాను దుస్తులు తొడుగుకొనకూడదు. రాజు చేసే విహారంవలె తానూ విహరించకూడదు. రాజు మాట్లాడే పద్ధతిలో తాను మాట్లాడటం తగదు.

**విశేషం:** రాజులు సహజంగా అందరికంటె అధికంగా ఉండాలని అనుకొంటారు. రాజసం వారి లక్షణం. అందుచేత సేవకులు రాజుకంటె ఎందులోనూ అధికులుగా ఉండరాదు. రాజభవనంకంటె ఎత్తైన భవనాన్ని సేవకుడు కట్టుకుంటే సంపదలో రాజుకంటె మించిన వాడనే స్ఫూర్తి కలుగుతుంది. అది ఆర్థికమైన ఆధిక్యం. వేషధారణం వైభవానికీ, విహారం విలాసానికీ సంబంధించినవి. ఆయా రంగాలలో కూడా సేవకుడు తన ఆధిక్యాన్ని ప్రదర్శించకుండా అణకువతో జీవించటం మంచిది. (సంపా.)

**క. పుత్రులు పౌత్రులు భ్రాతలు। మిత్రు లనరు రాజు లాజ్ఞ మిగిలిన చోటన్**
**శత్రుల కాఁ దమయలుకకుఁ। బాత్రము సేయుదురు నిజశుభస్థితి పొంటెన్. 124**

**ప్రతిపదార్థం:** రాజులు= రాజులు; ఆజ్ఞ= తమ ఆజ్ఞ; మిగిలినచోటన్= అతిక్రమించే చోట; పుత్రులు= కొడుకులు; పౌత్రులు= మనుమళ్ళు; భ్రాతలు= సోదరులు; మిత్రులు= స్నేహితులు; అనరు= అని భావించరు; నిజశుభస్థితి పొంటెన్= తన భద్రమైన స్థితికొరకు; శత్రువులు+ఐన= శత్రువులే; కాన్= అయినట్లుగా; తమ అలుకకున్= తమ కోపానికి; పాత్రము+చేయుదురు= గురిచేస్తారు.

**తాత్పర్యం:** తమ ఆజ్ఞను మీరినవారిని కొడుకులనిగాని, మనుమలనిగాని, సోదరులనిగాని, స్నేహితులనిగాని రాజులు పరిగణించరు. తమ మేలుకొరకు, భద్రతకొరకు వారిని శత్రువులుగానే పరిగణిస్తారు. కోపం పెంచుకొని వారి అంతు చూస్తారు.

**విశేషం:** రాచరికం ముళ్ళకిరీటం వంటిది. రాజకీయాలలో నీతిని పాటించేవారు అరుదు. అందువలన రాజశాసనాన్ని ధిక్కరించే వాడెవ్వడైనా రాజధిక్కారం చేసినవాడె ఔతాడు. ధిక్కారాన్ని రాజు సహించడు. చిన్నపామునైనా పెద్దకర్రతో కొట్టవలెనని- పుత్రుడైనా, తమ్ముడైనా, మిత్రుడైనా, పౌత్రుడైనా అతడిని శత్రువుగానే భావించి నిగ్రహిస్తాడు. కోపించి చంపుతాడుకూడా, కాబట్టి రాజాజ్ఞాధిక్కారం సేవకుడికి హానికరం. (సంపా.)

**క. చనువాని చేయుకార్యం। బున కడ్డము సొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా**
**నును బయిఁ బూసికొనుటఁ దన। మును మెలఁగిన మెలఁకువకును ముప్పగుఁ బిదపన్. 125**

**ప్రతిపదార్థం:** చనువాని చేయుకార్యంబునకున్= చెల్లుబడి కలిగినవాడు చేసేపనికి; అడ్డము+చొచ్చి= అడ్డుగా ప్రవేశించి; నేరుపునన్= నేర్పుతో; మెలఁగుచున్= ప్రవర్తిస్తూ; తానును= తాను; పయిన్+పూనుకొనుటన్= తగుదునమ్మా అంటూ ఆ పనిని మీదవేసికొనటం; పిదపన్= ఆ తరువాత; తన= తనయొక్క; మును= ముందు; మెలఁగిన= ప్రవర్తించిన; మెలఁకువకును= జాగరూకతతో కూడిన ప్రవర్తనకుకూడా; ముప్పు+అగున్= ముప్పే అవుతుంది.

**తాత్పర్యం:** ఏదయినా సరే సాధించుకొనగలిగిన సమర్థుడి పనికి అడ్డ వెళ్ళకూడదు. అట్లా అడ్డువెళ్ళి తగుదునమ్మా అంటూ ఆ కార్యాన్ని మీదవేసికొని, నేర్పును ప్రదర్శిస్తూ పూసుకుతిరిగితే అసలుస్థితికి కూడా ముప్పురాక తప్పదు.

**ఆ. రాజునొద్దఁ బలువురకు సంకటంబు గాఁ। దిరుగు పనుల నెంత తేజ మయిన**
**వాని బుద్ధి గలుగు వా రొల్ల; రవి మీఁదఁ। జేటు తెచ్చు టెట్లు సిద్ధ మగుట. 126**

**ప్రతిపదార్థం:** రాజు+ఒద్దన్= రాజుదగ్గర; పలువురకున్= అనేకులకు; సంకటంబు+కాన్= ఇబ్బంది కలిగేటట్లు; తిరుగుపనులన్= మెలగే పనులవలన; ఎంత తేజము+అయినన్= ఎంతతేజస్సు ఉన్నా; అది= ఆ ప్రవర్తన; మీఁదన్= తర్వాతికాలంలో; చేటు తెచ్చుట= ఇబ్బంది కలిగించటం; సిద్ధము+అగుటన్= తథ్యం కావటం చేత, వానిన్= ఆ పనులకు; బుద్ధికలుగువారు= తెలివయినవారు; ఒల్లరు= అంగీకరించరు.

**తాత్పర్యం:** రాజుతో సన్నిహితంగా ఉండటంలో తప్పు లేదు. కాని, రాజువద్ద ఉండే చాలామందికి కష్టం కలిగించే పనులలో మాత్రం జోక్యం పనికిరాదు. అటువంటి పనులవలన సేవకుడి శక్తి బహిర్గతం కావచ్చును. కాని, ఆ తర్వాత హాని కలగటం మాత్రం తథ్యం. అందుచేత తెలివిగలవారు అటువంటి పనులకు ఇష్టపడరు.

**క. ఊరక యుండక, పలువుర। తో రవ మెసఁగంగఁ బలుకఁ దొడరకయు, మదిం**
**జేరువ గల నాగరికులుఁ। దారుఁ గలసి పలుక వలయు ధరణీశుకడన్. 127**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశుకడన్= రాజుదగ్గర; ఊరక+ఉండక= మౌనంగా ఉండక; పలువురతోన్= చాలమందితో; రవము+ఎసఁగంగన్= ఆర్భాటాలు ప్రకటిస్తూ; పలుకన్+తొడరకయున్= మాటలాడటం మొదలుపెట్టక; మదిన్= మనస్సులో; చేరువ= సాన్నిహిత్యం; కల= కలిగిన; నాగరికులున్= నాగరికులును; తారున్= తామును; కలసి= కలసి; పలుకవలయున్= మాట్లాడటం సబబు.

**తాత్పర్యం:** రాజు దగ్గర మౌనంగానూ ఉండకూడదు. అట్లా అని పదిమందితో ఆర్భాటంగా మాట్లాడటం పనికిరాదు. తనకు దగ్గరివారైన కొలువుకాండ్రతో కలిసి తాను రాజుతో మాట్లాడటం సబబు.

**క. వేఱొక తెఱఁగున నొరులకు। మాఱాడక యునికి లెస్స మనుజేంద్రుకడం;**
**దీఱమి గల చోటులఁ దా। మీఱి కడఁగి వచ్చి పంపు మెయికొన వలయున్. 128**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్రుకడన్= రాజుదగ్గర; ఒరులకున్= ఇతరులకు; వేఱొక తెఱఁగునన్= ఇంకొకపద్ధతిలో, వ్యతిరేక ధోరణిలో; మాఱు+ఆడక+ఉనికి= సమాధానం (బదులు) చెప్పకుండా ఉండటం; లెస్స= మంచిది; తీఱమి= అక్కర; కలచోటులన్= ఉన్నచోటులలో; తాన్= తానే; మీఱి కడఁగి వచ్చి= పూనుకొని ముందుకు వచ్చి; పంపు= రాజాజ్ఞను; మెయికొనవలయున్= అంగీకరించాలి.

**తాత్పర్యం:** తాను రాజుదగ్గర ఉన్నప్పుడు వ్యతిరేకత తోచే విధంగా ఇతరులకు సమాధానం చెప్పకూడదు. అవసరం ఏర్పడితే మాత్రం తనంతట తానే ముందుకు వచ్చి రాజాజ్ఞను నిర్వర్తించాలి.

**చ. ధరణిపు చక్కఁ గట్టెదురు దక్కి పిఱుందును గాని యట్లుగా**
**నిరుగెలనం దగం గొలిచి యే మనునో, యెటు సూచునొక్కొ! యె**
**వ్వరి దెస నెప్పు డే తలఁపు వచ్చునొ యీతని కంచుఁ జూడ్కి సు**
**స్థిరముగఁ దన్ముఖంబునన చేర్చుచు నుండుట నీతి కొల్వునన్. 129**

**ప్రతిపదార్థం:** ధరణిపు= రాజుయొక్క; చక్కన్= సమక్షంలో; కడు+ఎదురు+దక్కి= సూటియైన ఎట్టఎదుట ఉండటాన్ని వదలిపెట్టి; పిఱుందును= వెనుకవైపును; కాని+అట్లుగాన్= కాని విధంగా; ఇరు+కెలనన్= రెండుపక్కలా; తగన్= తగునట్లు; కొలిచి= సేవించి; ఏమి+అనునో= ఏమి అంటాడో; ఎటు చూచున్+ఒక్కో= ఎటువైపు చూస్తాడో; ఈతనికిన్= ఈతనికి (రాజుకు); ఎవ్వరిదెసన్= ఎవరి పట్ల; ఎప్పుడు= ఎప్పుడు; ఏ తలఁపు= ఎటువంటి అభిప్రాయం; వచ్చునొ= వస్తుందో (కలుగుతుందో); అంచున్= అంటూ; చూడ్కి= చూపు; సుస్థిరముగన్= నిశ్చలంగా; తత్+ముఖంబునన= ఆ రాజు ముఖంమీదనే; చేర్చుచున్= ఉంచుతూ; కొల్వునన్= సభలో; ఉండుట= ఉండటం; నీతి= న్యాయం.

**తాత్పర్యం:** కొలువులో రాజుకు మరీ ఎట్టఎదురుగానూ ఉండకూడదు. అట్లాగని వెనుకవైపూ ఉండకూడదు. ఏదో ఒక ప్రక్కన నిలబడి సేవించాలి. ఏమంటాడో, ఎటు చూస్తాడో, ఎవరిని చూస్తే ఎటువంటి ఆలోచన కలుగుతుందో - మొదలయిన భావాలను మనసులో ఉంచుకొని రాజుముఖంమీదనే దృష్టి సారించి సభలో మెలగాలి.

**క. నగళులలోపలి మాటలు। దగునే వెలి నుగ్గడింపఁ దన? కేర్పడ నొం**
**డుగడం బుట్టినఁ బతి విన। నగుపని చెప్పెడిది గాక యాతనితోడన్. 130**

**ప్రతిపదార్థం:** నగళులలోపలి= అంతఃపురాలలోని; మాటలు= మాటలు; వెలిన్+ఉగ్గడింపన్= పైకి చెప్పటం (బయట పెట్టటం); తనకున్= తనకు(సేవకుడికి); తగునే?= తగునా?; ఏర్పడన్= స్పష్టంగా; ఒండుకడన్+పుట్టినన్= మరో చోట (అటువంటి మాటలు వినటం) సంభవిస్తే; పతి= రాజు; వినన్+అగు= వినదగిన; పని= విషయం; ఆతనితోడన్= రాజుతో; చెప్పెడిది+కాక= చెప్పాలి.

**తాత్పర్యం:** అంతఃపురాలలోని మాటలు ఎప్పటికీ బయటపెట్టరాదు. ఇతరత్రా మరెక్కడయినా రాజుకు సంబంధించిన మాటలు వింటే ముందు ఆలోచించాలి. ఆ తరువాత ఆ మాటలు రాజు వినదగినవయితే చెప్పాలి.

**విశేషం:** అంతఃపుర విశేషాలు బయట పొక్కితే ఆరా తీస్తారు. చెప్పినవాని ప్రాణం నిలవదు. అలాగే సేవకుడు ఇతరత్రా తనకు తెలిసిన విషయం రాజుకు చెప్పకపోయినా తప్పే. అయితే సేవకుడు అందులో కొంత విచక్షణ చూపాలి. విన్న మాటలలో అసలు నిజం తెలిసికొనాలి. ఆ తరువాత రాజుకు చెప్పదగినదా కాదా అని ఆలోచించాలి. రాజు వినదగినదయితేనే చెప్పాలి. అనవసరమయిన విషయం చెప్పరాదు. రాజుకు అప్రియమయిన విషయం ఎపుడూ చెప్పరాదు.

**క. అంతిపురము చుట్టఱికం। బెంతయుఁ గీ, డంతకంటె నెగ్గు తదీయో**
**పాంత చర కుబ్జ వామన। కాంతాదులతోడి పొందుకలిమి భటునకున్. 131**

**ప్రతిపదార్థం:** భటునకున్= సేవకునికి; అంతిపురము చుట్టఱికంబు= అంతఃపురంతో చుట్టరికం; ఎంతయున్+కడు= ఎంతో హాని కలిగిస్తుంది; తదీయ+ఉపాంతచర= అంతఃపుర సమీపంలో తిరిగే; కుబ్జవామన కాంతాదులతోడి= గూనివారు, పొట్టివారు, పరిచారికలు మొదలయిన వారితో; పొందు కలిమి= స్నేహం కలిగి ఉండటం; అంతకంటెన్= అంతకంటే; ఎగ్గు= కీడు.

**తాత్పర్యం:** భటుడికి అంతఃపురంతో సంబంధం మంచిది కాదు. హానికారి. అక్కడ తిరిగే గూనివారు, వామనులు, పరిచారికలు మొదలగువాళ్ళతో స్నేహం అంతకంటె కీడు కలిగిస్తుంది.

**ఆ. ఉత్తమాసనములు, నుత్కృష్ట వాహనం । బులును గరుణఁ దమకు భూమిపాలుఁ**
**డీక తార యెక్కు టెంతటి మన్నన । గలుగువారికైనఁ గార్య మగునె? 132**

**ప్రతిపదార్థం:** ఉత్తమ+ఆసనములున్= శ్రేష్ఠమయిన ఆసనాలును (గద్దెలు); ఉత్కృష్టవాహనంబులును= మహనీయమయిన వాహనాలు (ఏనుగులు గుర్రాలవంటివి); కరుణన్= దయతో; తమకున్= తమకు; భూమిపాలుఁడు= రాజు; ఈక= ఇవ్వకుండానే; తారు+అ= తామే; ఎక్కుట= ఎక్కటం; ఎంతటి= ఎంత ఎక్కువ; మన్నన= గౌరవం; కలుగువారికిన్+ఐనన్= కలవారికయినా; కార్యము+అగునె?= చేయదగింది ఔతుందా? (కాదు).

**తాత్పర్యం:** రాజు అనుగ్రహిస్తేనే ఆసనాలు అధిరోహించాలి. అట్లాగే వాహనాలు కూడా. రాజానుగ్రహం లేకుండ శ్రేష్ఠమైన ఆసనాలు పెద్ద పెద్ద వాహనాలు తమంతట తాము ఎన్నుకొనటమో, అధిరోహించటమో ఎంతగా రాజగౌరవం పొంది ఉన్న వారికైనా పనికిరాదు.

**క. మన్నన కుబ్బక, యవమతి । దన్నొందిన స్రుక్కఁబడక, ధరణీశుకడన్**
**మున్నున్న యట్ల మెలఁగిన । యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్. 133**

**ప్రతిపదార్థం:** మన్ననకున్= రాజు చేసిన గౌరవానికి; ఉబ్బక= పొంగిపోకుండా; అవమతి= అవమానం; తన్ను+ఒందినన్= తనకు కలిగితే; స్రుక్కఁబడక= క్రుంగిపోకుండా; ధరణీశుకడన్= రాజుదగ్గర; మున్ను= పూర్వం; ఉన్న+అట్లు+అ= ఉన్నట్లే; మెలఁగిన= ప్రవర్తించినట్టి; ఆ+నరునకున్= ఆ మనుష్యునకు; శుభములు= శుభాలు; ఒదవున్= కలుగుతాయి; ఆపదలు= ఆపదలు; అడఁగున్= అణగిపోతాయి.

**తాత్పర్యం:** రాజు తనను గౌరవించాడని ఉబ్బిపోరాదు. అవమానించాడని క్రుంగిపోరాదు. ఆ రెండింటిని లెక్కించక వెనుకటివలెనే రాజుదగ్గర ప్రవర్తించే సేవకులకు మంచి జరుగుతుంది. ఆపదలు తొలగిపోతాయి.

**క. జనపతి యెవ్వరి నైనను । మనుపఁ జెఱుపఁ బూనియునికి మది దెలియ నెఱిం**
**గిన యేనిఁ దాను వెలిపు । చ్చునె మునుము న్నెట్టి పాలసుండును దానిన్? 134**

**ప్రతిపదార్థం:** జనపతి= రాజు; ఎవ్వరిన్+ఐనను= ఎవ్వరినైనా; మనుపన్= రక్షించడానికి గాని; చెఱుపన్= చంపటానికిగాని; పూని+ఉనికి= సంసిద్ధుడుగా ఉన్నాడని; మదిన్= మనసులో; తెలియన్+ఎఱింగిన+ఏనిన్= బాగా తెలిసినప్పటికీ; దానిన్= దానిని; ఎట్టి పాలసుండును= ఎంత మూఢుడయినా (అవివేకి అయినా); మునుమున్ను= ముందుగానే; తాను= తాను; వెలిపుచ్చునె?= బయటపెట్టుతాడా?

**తాత్పర్యం:** ఒక వేళ రాజు ఎవరినైనా సంరక్షించాలని అనుకొనవచ్చును. లేదా శిక్షించాలని అనుకొనవచ్చును. ఆ విషయాలు తనకు తెలిసినా, అవి అమలు కాకముందే సేవకుడైనవాడు తనంతట తాను బయటపెట్టేవాడు మూర్ఖుడు.

**విశేషం:** 'నెఱింగెనయేని' - ఆనందాశ్రమ గ్రంథమాల ప్రతి.

**ఉ.** **ఎండకు వాన కోర్చి, తనయిల్లు ప్రవాసపుఁ జోటు నాక, యా**
**కొండు, నలంగుదున్, నిదురకుం దఱి దప్పెడు, డప్పి పుట్టె, నొ**
**క్కండన యెట్లొకో యనక కార్యము ముట్టినచోట నేలినా**
**తం డొక చాయ చూపినను దత్పరతం బని సేయు టొప్పగున్.** 135

**ప్రతిపదార్థం:** ఎండకున్= ఎండకూ; వానకున్= వానకూ; ఓర్చి= ఓర్చుకొని; తన ఇల్లు, ప్రవాసము+చోటు నాక= ఇది తనయిల్లు, ఇది పరాయి చోటు అనుకొనకుండా; ఆ కొండున్= ఆకలిగొందును; నలంగుదున్= నలిగి (ఆలసి) పోతాను; నిదురకున్+తఱి తప్పెడున్= నిద్రకు సమయం మించిపోతుంది; డప్పి+పుట్టెన్= దాహం వేస్తున్నది; ఒక్కండన+ఎట్లు+ఒకో= ఒక్కడినే ఎట్లాగో; అనక= అని తలపక; కార్యము= పని; ముట్టినచోటన్= కలిగినచోట; ఏలిన+అతండు= రాజు; ఒక చాయ= ఒక రీతి; చూపినను= చూపిస్తే కూడా; తత్పరతన్= నిష్ఠతో, ఏకాగ్రతతో; పనిచేయుట= పనిచేయడం; ఒప్పు+అగున్= ఉచితమౌతుంది.

**తాత్పర్యం:** ఎండకూ, వానకూ సహించాలి. తనయిల్లనీ, పొరుగుచోటనీ అనుకొనరాదు. ఆకలి వేస్తుంది, అలసిపోతాను, నిద్రకు సమయం మించిపోతుంది, దాహం వేస్తున్నది, ఒక్కడినే ఎట్లా? అనే ఆలోచనలకు అవకాశం ఎప్పుడూ ఇవ్వకూడదు. అనుకోకుండా రాజు ఒక పనిని సూచించినట్లయితే ఆ పనిని శ్రద్ధతో, భక్తితో చెయ్యాలి.

**క.** **తా నెంత యాప్తుఁ డైన మ । హీనాయకుసొమ్ము పామునెమ్ములుగా లో**
**నూనిన భయమునఁ బొరయక । మానినఁగా కేల కలుగు మానము బ్రదుకున్?** 136

**ప్రతిపదార్థం:** (రాజు) తాను= తాను; ఎంత= ఎంత; ఆప్తుఁడు+ఐనన్= కావలసినవాడైనా; మహీనాయకు సొమ్ము= రాజుసొమ్ము; పాము+ఎమ్ములుగాన్= పాము ఎముకలుగా; లోన్+ఊనిన= లోపల పొందిన; భయమునన్= భయంతో; పొరయక= గ్రహించక; మానినన్+కాక= మానివేస్తే కాని; మానము= గౌరవం; బ్రదుకున్= బ్రదుకును; ఏల కలుగున్?= ఎందుకు కలుగుతుంది? ఎట్లా కొనసాగుతుంది?

**తాత్పర్యం:** రాజుకు తాను ఎంత ఆప్తుడయినా కావచ్చును. రాజధనాన్ని పాము ఎముకలవలె భావించాలి. వాటిని పరికించాలి. వాటిని సంగ్రహించే గుణం మానితేనేగాని మానమూ, ప్రాణమూ నిలువవు.

**విశేషం:** అలం: ఉపమ. రాజధనం పాము ఎముకలవలె సంగ్రహించకూడదని చెప్పింది తిక్కన. ఈ ఉపమానం మూలంలో లేదు. విషతుల్యాలైన పాము ఎముకలు సేకరించగూడనివి అని లోక ప్రసిద్ధి. సేకరిస్తే ప్రాణహాని కలుగుతుంది. అట్లాగే రాజధనం గ్రహించి కూడబెట్టటం చేటని భావం. (సంపా.)

**ఆ.** **ఆవులింత, తుమ్ము, హాసంబు, నిష్ఠీవ । నంబు గుప్త వర్తనములు గాఁగఁ**
**జలుప వలయు నృపతి కొలువున్న యెడల, బా । హిరము లైనఁ గెలని కెగ్గు లగుట.** 137

**ప్రతిపదార్థం:** నృపతి= రాజు; కొలువు+ఉన్న+ఎడలన్= సభతీర్చి ఉన్నప్పుడు; ఆవులింత= ఆవులించటం; తుమ్ము= తుమ్మటం; హాసంబు= నవ్వు; నిష్ఠీవనంబు= ఉమ్మివేయటం; (ఇవి) బాహిరములు+ఐనన్= బయటపెడితే; కెలనికిన్= ప్రక్కన ఉన్నవారికి; ఎగ్గులు+అగుటన్= సహించటానికి శక్యం కానివి అవటంచేత; గుప్త వర్తనములు+కాఁగన్= గుట్టుగా ఆచరించబడేవి అయ్యేటట్లుగా; చలుపన్+వలయున్= చేయాలి.

**తాత్పర్యం:** రాజు కొలువు తీరినపుడు సేవకుడు ఆవులించకూడదు. తుమ్మటం మంచిది కాదు. నవ్వటం అసలే పనికిరాదు. ఉమ్మివేయటం తప్పు అవుతుంది. వీటిని బహిరంగంగా చేస్తే ప్రక్కవాళ్ళకు సహించరానివి. కాబట్టి వాటిని గోప్యంగా చేయాలి.

**క. వైరుల దూతలు, నెరవగు। వారు, నిరాకృతులుఁ బాపవంతులుఁ దమకుం**
**జేరువఁగా వర్తించుట। నేరమి; తుదిఁ బోయి చేటు నిందయు వచ్చున్. 138**

**ప్రతిపదార్థం:** వైరుల దూతలున్= శత్రువుల దూతలు; ఎరవు+అగువారు= భేదం కలిగించేవారు; నిరాకృతులున్= రాజుచేత నిరాకరించబడిన వారూ; పాపవంతులున్= పాపపు పనులు చేసేవారు; తమకున్= తమకు; చేరువఁగా= దగ్గరగా; వర్తించుట= ఉండటం; నేరమి= తప్పు; తుదిన్+పోయి= చివరకు; చేటు= కీడు; నిందయున్= నిందకూడా; వచ్చున్= వచ్చును.

**తాత్పర్యం:** శత్రువుల దూతలుగాని, భేదభావాన్ని కలిగించేవారుగాని, రాజు ఆగ్రహానికి పాత్రులై నిరాకరించబడిన వారుగాని, పాపాత్ములుగాని, తమకు దగ్గరగా ఉండటం మంచిది కాదు. దీనివలన చివరకు కీడూ, నిందా వస్తాయి.

**ఆ. వసుమతీశు పాల వసియించు నేనుంగు। తోడ నైన, దోమతోడ నైన**
**వైర మగు తెఱంగు వలవదు; తా నెంత। పూజ్యుఁ డైన జనుల పొందు లెస్స. 139**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశు పాలన్= రాజుదగ్గర; వసియించు= ఉండే; ఏనుంగుతోడన్+ఐనన్= ఏనుగుతోనయినా (పెద్దవానితోనయినా); దోమతోడన్+ఐనన్= దోమతో అయినా (చిన్నవాడితోనయినా); వైరము+అగు తెఱంగు వలవదు= శత్రుత్వం ఏర్పడే పద్ధతి పనికిరాదు; తాను= తాను; ఎంత- పూజ్యుఁడు+ఐనన్= తానెంత పూజించదగినవాడయినా; జనులపొందు= ప్రజలతో స్నేహం; లెస్స= మంచిది.

**తాత్పర్యం:** రాజుదగ్గర మెలగే ఏనుగుతోనయినా, దోమతోనయినా వైరం కలిగే ప్రవర్తన మంచిది కాదు. భటుడు తా నెంత పూజనీయుడయినా రాజు కొలువుకు సంబంధించిన జనులతో స్నేహం కలిగి ఉండటం మేలు.

**క. కలిమికి భోగముల కదా। ఫల మని తను మెఱసి బయలుపడఁ బెల్లుగ వి**
**చ్చలవిడి భోగింపక వే। డ్కలు సలుపఁగ వలయు భటుఁ దడంకువతోడన్.' 140**

**ప్రతిపదార్థం:** కలిమికిన్= సంపదకు; భోగములు+అ, కదా= భోగాలేకదా; ఫలము+అని= ఫలితం అని; తను మెఱసి= తాను ప్రకాశించి; బయలుపడన్= బయటపడేటట్లుగా; పెల్లుగన్= అధికంగా; విచ్చలవిడిన్= విచ్చలవిడిగా; భోగింపక= అనుభవించకుండా; భటుఁడు= సేవకుడు; అడంకువతోడన్= వినయంతో; వేడ్కలు+చలుపఁగ వలయున్= వేడుకలు చేసుకోవాలి.

**తాత్పర్యం:** భోగాల కొరకే కదా సంపదలని సేవకుడు విచ్చలవిడిగా భోగించరాదు. రాజునకు కంటగింపు కలుగకుండా నమ్రతతో వేడుకలు చేసికొనాలి.

**వ. అని యిట్లు పురోహితుండు సేవాధర్మంబు లెఱింగించిన ధర్మజ భీమార్జున నకుల సహదేవులు ప్రసన్న చిత్తులై యిట్లనిరి. 141**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు= అని ఈ విధంగా; పురోహితుండు= పురోహితుడైన ధౌమ్యుడు; సేవాధర్మంబులు= సేవాధర్మాలను; ఎఱింగించినన్= తెలియపరచగా; ధర్మజ, భీమ+అర్జున, నకుల, సహదేవులు= ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు; ప్రసన్నచిత్తులు+ఐ= ప్రసన్నములైన మనస్సులు కలవారై; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** పురోహితుడయిన ధౌమ్యుడు సేవాధర్మాలు చెప్పగా విని పాండవులు సంతోషించి ఇట్లా అన్నారు.

**క. 'తల్లియుఁ దండ్రియు దైవము। నెల్ల సుహృజ్జనము మీర; యిట్లు గొలిచి వ**
**ర్తిల్లెడు తెఱంగు లెంతయుఁ। దెల్లము సేసితిరి; బ్రతికితిమి మీ కరుణన్.' 142**

**ప్రతిపదార్థం:** మీరు+అ= మీరే (ధౌమ్యుడే) (బహువచనం గౌరవవాచకం); తల్లియున్+తండ్రియున్+దైవమున్= తల్లీ తండ్రీ దైవమే కాక; ఎల్ల, సుహృత్+జనమున్= స్నేహితులనబడేవారందరూ (మీరే); ఇట్లు= ఈ విధంగా; కొలిచి, వర్తిల్లెడి, తెఱంగులు= కొలువు చేసేటప్పుడు పాటించే నడవడిక పద్ధతులు; ఎంతయున్= ఎంతగానో; తెల్లము+చేసితిరి= తెలిసేటట్లు స్పష్టం చేశారు; మీ, కరుణన్= మీ యొక్క దయవలన; బ్రతికితిమి= బ్రతికిపోయాం. (అంటే రక్షించబడ్డాం అని అర్థం, తెలుగు జాతీయం).

**తాత్పర్యం:** 'మాకు తల్లైనా, తండ్రైనా, దైవమైనా, మిత్రసమూహమైనా అన్నీ మీరే. మేము కొలువు చేసేటప్పుడు పాటించవలసిన నడవడికల పద్ధతులను మీరు ఎంతో మేలుగా స్పష్టమయ్యేటట్లు చెప్పారు. నిజంగా మీ దయ వలన మేము బ్రతికిపోయాం.'

**విశేషం:** రాబోయే హితాన్ని సూచించేవాడు పురోహితుడు. అజ్ఞాతవాసంలో ప్రభువును సేవించే పదవులలో ఉండబోతున్నారు పాండవులు. వారందరికీ సామాన్య సేవానియమావళిని ధౌమ్యుడు బోధించాడు. వాటిని ధారణలో ఉంచుకొనండని హితవు చెప్పాడు. సమయోచితమైన భావిహితాన్ని చెప్పిన పురోహితుడిలో పాండవులు తల్లినీ, తండ్రినీ, దైవాన్నీ, హితుడినీ చూచారు. పురోహితుడొకడుంటే వారందరూ ఉన్నట్లే అని వారి భావం. ధౌమ్యుడి యందు పాండవుల కున్న గౌరవభావం ఇందులో ధ్వని. మూలంలో అంత ఆప్యాయంగా మాట్లాడగలిగినవారైనా కుంతి, విదురుడు మాత్రమే పాండవులకున్నారని, ఆ తరువాత ధౌమ్యుడేఅని పాండవులన్నారు. ఇది బంధుత్వంతో పోల్చి చెప్పేమాట. తిక్కన దీనిని విశ్వజనీనం చేశాడు. చెప్పే పద్ధతిలోని ఆప్యాయతకు మూలం ప్రాధాన్యమిస్తే, తిక్కన రచన తత్కాలోచిత వృత్తి ధర్మ ప్రబోధ ప్రవృత్తికి ప్రాధాన్యమిచ్చింది. ధౌమ్యుడిని స్నేహమూర్తిగానే కాక లోకజ్ఞుడిగా, హితుడిగా మూర్తి కట్టించింది. (సంపా.)

**ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె; 'నీ వత్సర। మొకఁడు నెట్టు లయిన నుడిగి మడిఁగి**
**సంకటముల కోర్చి చరియించి యాపద। నిస్తరించి పిదప నెగడవలయు'. 143**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ధౌమ్యుఁడు= ధౌమ్యుడు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; ఈవత్సరము+ఒకఁడున్= ఈ సంవత్సరం ఒకటే; ఎట్టులు+అయినన్= ఏదోవిధంగా; ఉడిగి మడిఁగి= అణగి మణగి ఉండి; సంకటములకున్+ఓర్చి= కష్టాలు సహించి; చరియించి= తిరిగి; ఆపదన్= ఆపదను; నిస్తరించి= దాటి; పిదపన్= తరువాత; నెగడన్+వలయున్= బయటపడాలి.

**తాత్పర్యం:** అపుడు ధౌమ్యుడు ఇట్లా అన్నాడు. 'ఈ ఒక్క సంవత్సరకాలం ఎట్లాగయినా అణగి మణగి ఉండాలి. కష్టాలకు ఓర్చుకొనాలి. ఆపదనుండి గట్టెక్కి బయటపడాలి.'

**విశేషం:** అజ్ఞాతవాసకాలంలో 'సంకటాలకు' ఓర్పువహించాలనీ, 'ఆపదల'ను దాటాలనీ సూచించాడు ధౌమ్యుడు. భావికథలో కీచకాదులవలన సంకటాలు, దక్షిణ ఉత్తర గోగ్రహణాల వలన ఆపదలు వస్తాయి. ఆ యా సందర్భాలలో ఇతరులకు తెలియరాకుండా వ్యవహరించి పాండవులు విజయవంతంగా వ్రతాన్ని ముగించి బయటపడతారనే భావికథ పరితల కిందులో తిక్కన స్ఫురింపచేస్తున్నాడు. (సంపా.)

**క. అనవుడు, 'నట్టుల చేసెద'। మని వారలు భక్తియుక్తి నతనికి నభివం**
**దన మొనరించినఁ దగు దీ। వన లిచ్చె నతండు గాఢవాత్సల్యమునన్. 144**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; వారలు= పాండవులు; అట్టులు+అ= అట్లే; చేసెదము= చేస్తాం; అని= అని; భక్తియుక్తిన్= భక్తితో; అతనికిన్= ధౌమ్యునికి; అభివందనము= నమస్కారం; ఒనరించినన్= చేయగా; గాఢ వాత్సల్యమునన్= మిక్కుటమయిన ప్రేమతో; అతండు= ధౌమ్యుడు; తగు దీవెనలు= తగిన దీవెనలు; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** అనగానే 'అట్లాగే చేస్తామని పాండవు లన్నారు. భక్తితో ధౌమ్యుడికి నమస్కరించారు. అతిశయించిన వాత్సల్యంతో ధౌమ్యుడు పాండవులకు దీవెనలు ఇచ్చాడు.

**క. భూదేవోత్తము నాశీ। ర్వాదంబులఁ బ్రీతిఁ బొంది వారలు ప్రస్థా**
**నాదరపరు లగుటయు స। మ్మోదావహ పుణ్యకర్మముల కుద్యతుఁడై. 145**

**ప్రతిపదార్థం:** వారలు= పాండవులు; భూదేవ+ఉత్తము+ఆశీర్వాదంబులన్= బ్రాహ్మణశ్రేష్ఠుడైన ధౌమ్యుని దీవనలతో; ప్రీతిన్= సంతోషాన్ని, సంతృప్తిని; పొంది= అనుభవించి; ప్రస్థాన+ఆదరపరులు+అగుటయున్= ప్రయాణం చేయటంలో ఆసక్తి కలిగినవారు కాగా; (అతడు) సమ్మోద+ఆవహ= సంతోషం కలిగించే; పుణ్యకర్మములకున్= పుణ్యకార్యాలకు; ఉద్యతుఁడు+ఐ= పూనినవాడై.

**తాత్పర్యం:** ధౌమ్యుడి ఆశీర్వాదాలతో పాండవులు ప్రీతిచెందారు. తరువాత ప్రయాణోన్ముఖులయ్యారు. అపుడు ధౌమ్యుడు పాండవులకు శుభసంతోషాలు కలిగించే పుణ్యకర్మలకు పూనుకొన్నాడు.

**ఆ. అతఁడు నియతితోడ నగ్ని సముజ్జ్వలం। బుగ నొనర్చి కామ్యపూజ దీర్చి**
**యాన సమయ మంగళార్థంబు లగు మంత్ర। సంచయములు దగ జపించుచుండె. 146**

**ప్రతిపదార్థం:** అతఁడు= ధౌమ్యుడు; నియతి తోడన్= నియమంతో; అగ్నిన్, సముజ్జ్వలంబుగన్+ఒనర్చి= అగ్నిని ప్రజ్వలింపచేసి; కామ్యపూజ= కోరికకు అనుగుణంగా చేసే పూజ (అగ్నికార్యం); తీర్చి= నెరవేర్చి (సిద్ధింపజేసి); యాన సమయ= ప్రయాణ సమయంలో; మంగళ+అర్థంబులు+అగు= శుభాలు కలగటానికి ఉద్దేశించబడిన; మంత్ర సంచయములు= మంత్రసముదాయాలు; తగన్= ఉచితమైన విధంగా; జపించుచున్+ఉండెన్= జపిస్తున్నాడు.

**తాత్పర్యం:** ధౌమ్యుడు నియమంతో అగ్నిని ప్రజ్వలింపచేశాడు. కామ్యపూజ నిర్వర్తించాడు. తరువాత, ప్రయాణంలో శుభం జరిగేందుకు తగిన మంత్రాలు జపిస్తున్నాడు.

**విశేషం:** అగ్ని సర్వదేవతలకు ప్రతినిధి, కర్మసాక్షి, ఫలప్రదాత. అందువలననే సర్వకార్యాలలో అగ్నిని ఆరాధించటం వైదికధర్మం. అగ్నికార్యం సకామంగా, నిష్కామంగా చేయవచ్చును. ఆ రెండు పద్ధతులకూ నియమనిష్ఠలు, ఆచరణపద్ధతులు, మంత్రాలూ వేరుగా ఉంటాయి కూడా. ఇక్కడ ధౌమ్యుడు నియమనిష్ఠలతో అగ్నిని ప్రజ్వలింపచేశాడు. కామ్యపూజ చేశాడు. అంటే-పాండవులు

అజ్ఞాతవాసవ్రతాన్ని నియమనిష్ఠలతో విజయవంతంగా పూర్తిచేయాలని సంకల్పించి అగ్నిపూజ చేశాడన్నమాట. మూలంలో **'తేషాం సమిధ్య తానగ్నీన్ మన్త్రవచ్చ జుహావ సః. సమృద్ధి వృద్ధి లాభాయ పృథివీ విజయాయ చ" (4.4.55)** అని ఉన్నది. పాండవులకు సమృద్ధి, వృద్ధి, పృథివీ విజయం కలగాలని సంకల్పించి చేసినట్లు ఉన్నది. తిక్కన దానిని వాచ్యం చేయకుండా సమయోచిత సంకల్పాన్ని పఠితల ఊహకు వదలివేశాడు. రాజ్యలాభంకంటె ముందు అజ్ఞాతవాస నియమ సమాప్తి ముఖ్యమని తిక్కన తీర్పు. అది సందర్భోచిత్యం కూడా. యాత్రలకు, యుద్ధయాత్రలకు పయనమయ్యేటప్పుడు మార్గంలో విఘ్నాలు రాకుండా రక్షించుమని పంచభూతాలనూ, భగవంతుడినీ ప్రార్థించే మంత్రాలను ధౌమ్యుడు చదువుతున్నాడు. మంత్రాలు ముందు నడుస్తాయి. పాండవులు ఆ వెంట మంగళప్రస్థానం సాగిస్తారని భావం. (సంపా.) 'తగ జపించుచుండె' - పెక్కుప్రతులు; 'తెగ జపించుచుండె'- ఉస్మానియా ప్రతి.

పాండవులు పాంచాలితోడ విరాటు నగరంబునకు బయలుదేరుట (సం.**4-4-48**)

**వ. తదనంతరంబ, హుతవహునకుం బురోహితునకుం బ్రదక్షిణంబు సేసి, యమ్మహీసురవరేణ్యు నను మతి వడసి, పాండవులు పాంచాలిం బురస్కరించుకొని, యాతండును దోడన యరుగుదేరం గదలి, శుభ నిమిత్తంబులు గైకొనుచుం జని, దశార్ణ దేశంబున కుత్తరంబునఁ బాంచాల జనపద యామ్యదిగ్భాగంబున సాళ్వ శూరసేన విషయంబులలోనం గాళిందీ దక్షిణతీరం బొరసికొని, పశ్చిమాభిముఖ ప్రయాణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీర యాత్రలు నడపుచు, నానా మృగ వివిధ విహారంబులను, మనోహర కుసుమ కదంబ గంధ మకరంద బిందు సందోహ సుందర తరుచ్ఛాయా సేవనంబులను, గమల పరాగ పరంపరా ధూ సరిత భాసుర జలాశయ సమవగాహనంబులను, సరిత్సంగమ స్నానాద్యనుష్ఠానంబులను, బహుప్రకార పాదప గుల్మలతావ లోకనంబులను, బక్షికుల ప్రకరానేకభంగి విరుతాకర్ణనంబులను వినోదించుచుఁ, గానన మార్గంబుల నరిగి, మత్స్యమండలంబు గడి సేరి ధౌమ్యుని వీడుకొనిరి; అవ్విప్రవరుండును నొక్క పుణ్యాశ్రమంబున వసియించె; వారు మఱియు నూళ్ళు సొరక యడవి తెరువుల నడచి విరాటు నగరంబున కనతిదూరం బగు కాంతారంబునం దఱిమి పోవు సమయంబునఁ బథిశ్రమంబు నూని యాజ్ఞసేని యిట్లనియె. 147**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత వెంటనే; పాండవులు= పాండవులు; హుతవహునకున్= అగ్నిదేవునికి; పురోహితునకున్= పురోహితుడైన ధౌమ్యునికి; ప్రదక్షిణంబు+చేసి= ప్రదక్షిణం చేసి; ఆ+మహీసురవరేణ్యు= బ్రాహ్మణ శ్రేష్ఠుడైన ధౌమ్యుని యొక్క; అనుమతి= అనుజ్ఞ; పడసి= పొంది; పాంచాలిన్= ద్రౌపదిని; పురస్కరించుకొని= ముందిడుకొని; ఆతండును= ధౌమ్యుడును; తోడన్+అ= కూడానే; కదలి= బయలుదేరి; అరుగుదేరన్= రాగా; శుభనిమిత్తంబులు= శుభశకునాలు; కైకొనుచున్= పొందుతూ; చని= వెళ్ళి; దశార్ణ దేశంబునకున్= దశార్ణదేశానికి; ఉత్తరంబునన్= ఉత్తర దిక్కున; పాంచాలజనపద= పాంచాలదేశంయొక్క; యామ్యదిక్+భాగంబునన్= దక్షిణదిక్కున; సాళ్వ, శూరసేన, విషయంబులలోనన్= సాళ్వ, శూరసేన దేశాలలో; కాళిందీ దక్షిణ తీరంబు= యమునానది దక్షిణపుఒడ్డును; ఒరసికొని= రాచుకొని (ప్రక్కనుండి); పశ్చిమ+అభిముఖ ప్రయాణంబులన్= పడమటి దిక్కువైపు చేసే ప్రయాణాలలో; ఎడన్+ఎడన్= అక్కడక్కడ; వన్య+ఆహారంబులన్= కందమూల ఫలాలతో (వనంలో దొరికే ఆహారంతో); శరీర యాత్రలు= శరీరం పోషించుకొనటాలు; నడపుచున్= కొనసాగిస్తూ; నానామృగ వివిధ విహారంబులను= అనేక విధాలనుండే మృగాలయొక్క పెక్కురకాల సంచారాలచేత; మనోహర= అందమైన, మనస్సులనాకర్షించే; కుసుమ కదంబ= పూలగుత్తుల యొక్క; గంధ= సుగంధం యొక్క; మకరంద, బిందు= పూదేనె చుక్కల

యొక్క; సందోహ= సముదాయంచేతను; సుందర= అందంగా ఉన్న; తరుచ్ఛాయా సేవనంబులను= చెట్లనీడలను ఆశ్రయించి ఉండటంతోనూ; కమల పరాగ పరంపరా= పద్మాల పుప్పొడి సముదాయాలతో; ధూసరిత= బూడిద రంగు కలదిగా చేయబడి; భాసుర= ప్రకాశించే; జల+ఆశయ= సరోవరాలలో; సమవగాహనంబులను= మునుకలతో స్నానాలు చేయుటమున్నూ; సరిత్+సంగమ= నదీ సంగమ ప్రదేశాలలో; స్నాన+ఆది+ అనుష్ఠానంబులను= స్నానం మొదలయిన అనుష్ఠానాలు నిర్వర్తిస్తూ; బహుప్రకార= అనేక విధాలయిన; పాదప= చెట్లు; గుల్మ= పొదల; లతా= తీగల; అవలోకనంబులను= చూడటాలచేతనూ; పక్షికుల= పక్షిజాతుల; ప్రకర= సమూహాల యొక్క; అనేక భంగి విరుత= రకరకాల కూతల; ఆకర్ణనంబులన్= వినటాల చేతనూ; వినోదించుచున్= వినోదిస్తూ; కానన మార్గంబులన్= అడవి దారులలో; అరిగి= వెళ్ళి; మత్స్యమండలంబు= మత్స్యదేశం యొక్క; గడి+చేరి= సరిహద్దు చేరి; ధౌమ్యునిన్= ధౌమ్యుని; వీడుకొనిరి= (సెలవు తీసికొన్నారు) విడిచిపెట్టారు; ఆ+ విప్రవరుండును= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడైన ధౌమ్యుడును; ఒక్క= ఒక; పుణ్య+ఆశ్రమంబునన్= పవిత్రమైన ఆశ్రమంలో; వసియించెన్= ఉండిపోయాడు; వారు= పాండవులు; మఱియున్= తరువాత; ఊళ్ళు+చొరక= గ్రామాలలో ప్రవేశించక; అడవి తెరువులన్= అడవి దారులలో; నడచి= నడచుకొంటూ; విరాటు నగరంబునకున్= విరాటనగరానికి; అనతి దూరంబు+అగు= సమీపంలో ఉన్న; కాంతారంబునన్= అడవిలో; తఱిమి పోవు సమయంబునన్= వేగంగా వెళ్ళేసమయంలో; యాజ్ఞసేని= ద్రౌపది; పరిశ్రమంబున్= ప్రయాణపు బడలికను; ఊని= పొంది; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** తరువాత పాండవులు అగ్నిదేవుడికి, ధౌమ్యుడికి ప్రదక్షిణ నమస్కారం చేశారు. ధౌమ్యుడి అనుమతి స్వీకరించారు. ద్రౌపదిని ముందుంచుకొని, ధౌమ్యుడిని వెంటబెట్టుకొని బయలుదేరారు. శుభశకునాలు కనిపిస్తూ ఉంటే దశార్ణదేశానికి ఉత్తరాన, పాంచాలదేశానికి దక్షిణాన, సాళ్వ శూరసేన దేశాలలో ప్రవహించే యమునానది దక్షిణపు ఒడ్డువెంబడి, పశ్చిమంగా ప్రయాణించారు. దారిలో అక్కడక్కడ కందమూల ఫలాదులతో ఆకలిబాధలు తీర్చుకొంటూ వెళ్ళుతున్నారు. ఎన్నో విధాలైన మృగాలు, వివిధ రీతులుగా విహరిస్తూ ఉంటే దర్శిస్తూ కదిలారు. మకరంద బిందువులతో కూడి, మనోహరమయిన పుష్పగుచ్ఛాల సువాసనలతో నిండిన చెట్ల నీడలలో నడిచారు. పద్మాల పుప్పొడి తేలిన చెరువులలో స్నానాలు చేశారు. నదీ సంగమాలలో పవిత్ర స్నానాలు అనుష్ఠానాలు నిర్వర్తించారు. ఎన్నోరకాల చెట్లనూ, పొదరిండ్లనూ, తీగలనూ చూచారు. వ్యక్తుల రకరకాల ధ్వనులు వింటూ వినోదిస్తూ అడవి మార్గాలలో ప్రయాణించారు. మత్స్యదేశం పొలిమేర చేరారు. అక్కడ ధౌమ్యుడివద్ద సెలవుతీసికొని ముందుకు సాగారు. ధౌమ్యుడు ఒక పుణ్యాశ్రమంలో వసించాడు. తరువాత పాండవులు ఊళ్ళ వెంబడి వెళ్ళటం తప్పించి అడవి బాటలలో నడక సాగించారు. వారు విరాటనగర సమీపంలో ఉన్న అడవిలో ప్రయాణాన్ని పరుగులిడుతున్నట్లు వేగంగా సాగించారు. అపుడు ద్రౌపది ప్రయాణపు బడలికతో ఈ విధంగా పలికింది.

**విశేషం:** 1. పురోహితుడు యజమానుడికొరకు సంకల్పించి యజ్ఞకార్యం, కామ్యపూజ చేశాడు. దానిఫలం అనుభవించేది యజమానుడు (ఇక్కడ పాండవులు). పాండవులు ఆ పూజాకార్య కర్తృత్వ భోక్తృత్వాలను వినయంతో అంగీకరించి అగ్నిభట్టారకుడికీ, ధౌమ్యుడికీ సగౌరవంగా ప్రదక్షిణ నమస్కారాలతో తమ భక్తి ప్రపత్తులను తెలిపారు. ధౌమ్యపూజకు వెంటనే ప్రతిఫలంగా శుభశకునాలు గోచరించాయి. అవి దైవానుకూల్య చిహ్నాలు, తిక్కన శకునాలను వదలకుండా వర్ణిస్తాడు. అవి ఆనాటి సాంఘిక విశ్వాసాలలో విశిష్టస్థానం కలిగి ఉండవచ్చును. ఇక్కడ మాత్రం దైవసౌముఖ్యానికి సూచికగా ధ్వనిమయంగా వర్ణించబడ్డాయి.

2. జనపదాలను వదలి పాండవులు వనపదాలలో ప్రయాణించే ఒక మధుర దృశ్యాన్ని అక్షరరమణీయమైన వచనంతో మధుర గుణశోభితంగా తిక్కన వర్ణించాడు. వర్ణనా ప్రియుడైన తిక్కన వచనాన్ని కూడా కవితామయం చేస్తాడన్న దాని కిది

ఉదాహరణం. దట్టమైన అడవులలో దివారాత్రాలు పయనిస్తూ అడవులలో దొరికే శాకాహారం భక్షణంతో మాత్రమే రోజులు సాగిస్తూ సరోవరాలలో, నదులలో, సంగమతీర్థాలలో స్నానాలు చేస్తూ పరిమళభరితాలైన పుష్పిత వృక్షాల ఛాయలలో వసిస్తూ సాగించిన పాండవుల ప్రయాణం ఎంత శ్రమతో కూడి ఉన్నదో అంత మనోహరంగా ఉన్నది. ఇట్టి విరుద్ధ భావాల అనుభూతుల విశిష్టచిత్రణమే తిక్కన శిల్పం. వచనాన్ని వనవిహారవ్యంజకంగా వాడిన రచనా శిల్పి తిక్కన. ఇది అమూలకం. మూలంలో దేశాల పేర్లున్నాయి. కాని వన సౌందర్యం మచ్చుకైనా లేదు. ఈ వచనంలోని వృత్త్యనుప్రాస, అంత్యానుప్రాసల నాదమాధుర్యం లేదు. ఇదంతా తిక్కన కల్పన.

3. 'తటిమి పోవు'- చక్కని తెలుగు జాతీయం ఎవరో తరుముతూ ఉంటే వేగంగా పోతున్నట్లు త్వరగా నడిచే నడకతో చేసే ప్రయాణం 'తటిమిపోవటం'- అన్నిదేశాలు నడిచి వచ్చినప్పుడు ద్రౌపదికి శ్రమ తోచలేదు. చివరి ఘట్టంలో లక్ష్యాన్ని తొందరగా చేరాలని అతివేగంగా నడిచారు. కోమలి అయిన ద్రౌపది ఆయాసానికి గురి అయింది.

4. మూలంలో పాండవులు అగ్నికి ప్రదక్షిణం చేసి ప్రస్థానం సాగించిన తరువాత ధౌమ్యుడు అగ్నిహోత్రాలతో పాంచాలదేశానికి వెళ్ళినట్లు ఉన్నది. తిక్కన దానిని మార్చాడు. మత్స్యదేశపు పొలిమేరలదాకా ధౌమ్యుడు పాండవులను అనుగమించాడనీ, ఆ తరువాత వారిని వీడ్కొని ఒక పుణ్యాశ్రమంలో నివసించాడనీ పేర్కొన్నాడు. ధౌమ్యుడికి ఒక ప్రత్యేకతను, గుర్తింపును తిక్కన కల్పించాడు. (సంపా.)

**ఉ. 'డప్పి జనించె, వ్రేళుల పుటంబులు పొక్కఁ దొడంగె, గోళ్ళలోఁ**
**జిప్పిలఁ జొచ్చె నెత్తురులు, చిత్తము నాకుఁ గడు న్వశంబుగా**
**దప్పుర మిచ్చ టచ్చటను నాసల వచ్చితి, నెంత ద వ్వొకో!**
**యిప్పటి భంగి నొక్కడుగు నేఁగెడు దానికి నోర్వ నెమ్మెయిన్'. 148**

**ప్రతిపదార్థం:** డప్పి జనించెన్= దాహం వేస్తున్నది; వ్రేళుల పుటంబులు= వేళ్ల చివరలు; పొక్కన్+తొడంగెన్= బొబ్బలెక్కటం మొదలు పెట్టాయి. గోళ్ళలోన్= గోళ్లలో; నెత్తురులు= నెత్తురులు; చిప్పిలన్+చొచ్చెన్= చిమ్ముతున్నాయి; నాకున్= నాకు; చిత్తము= మనసు; కడున్= మిక్కిలిగా; వశంబు+కాదు= వశంలో లేదు; ఆ+పురము= ఆ విరాటుని నగరం; ఇచ్చటన్+అచ్చటన్+అను+ఆసలన్= ఇక్కడే, దగ్గరే అనే ఆశలతో; వచ్చితిన్= వచ్చాను; ఎంతదవ్వు+ఒకో!= (ఆ పట్టణం) ఇంకా ఎంతదూరం ఉన్నదో ఏమో; ఇప్పటి భంగిన్= ఇప్పుడున్న పరిస్థితిని బట్టి; ఒక్క+అడుగున్= ఒక్క అడుగు కూడా; ఏఁగెడు దానికిన్= వెళ్లటానికి; ఏ+మెయిన్= ఏ విధంగానూ; ఓర్వన్= శక్తురాలను కాను.

**తాత్పర్యం:** 'దాహం వేస్తున్నది. కాలివ్రేళ్లు పొక్కి బొబ్బలెక్కుతున్నాయి. గోళ్ళలో నెత్తురు చిమ్ముతున్నది. శరీరం స్పృహ తప్పుతున్నది. విరాట నగరం ఇక్కడే ఎంతో దూరం లేదు- అనుకొంటూనే ఎంతో దూరం ఆశతో వచ్చాను. ఇప్పుడున్న పరిస్థితినిబట్టి నే నింక ఒక్క అడుగుకూడా ముందుకు వేయలేను.'

**విశేషం:** తిక్కనది 'రసాభ్యుచితబంధం'. అందులో శ్రవ్యకావ్యంలో దృశ్యకావ్యమర్యాదలను ప్రవేశపెట్టి కల్పించే సన్నివేశ చారుత్వం. నాటకోచిత రచనాశిల్పం పోషించబడుతాయి. మూలంలో 'బలవాన్ మే పరిశ్రమః' అని తాను బాగా అలసిపోయాను అని ద్రౌపది అంటుంది. తెలుగులో ప్రయాణపు బడలికను సూచించే అనుభావాలను ప్రదర్శించి ఎదుటివారికి రసానుకూల విభావంగా ప్రత్యక్షమయ్యేటట్లు తిక్కన చిత్రించిన ద్రౌపది మాట్లాడింది. కాళ్లవేళ్ళ కొసలు బొబ్బలెక్కటం, గోళ్ళు రక్తం చిందటం, మనసు తూలిపోవటం - ఇవి అలసటకు అనుభావాలు (అభినయ చేష్టలు). అలసటలో ద్రౌపది ప్రకటించే వాచికాభినయం కూడా

తెలుగుదనాన్ని పుక్కిట పట్టుతున్నది. 'దూరం దూరం ఎంతెంతదూరం' అని తెలుగునుడికారం. ఇక్కడే ఇక్కడే అనటం ఊతపదం. పాండవులు ఇక్కడే ఇక్కడే అని చెపుతుంటే ద్రౌపది నిజమే కాబోలని ఆశతో వచ్చినట్లు, ఇంకెంత దూరమో అని నీరసించినట్లు కనబడుతుంది. 'నేను ఒక్క అడుగు కూడా వేయలే'ననటం కూడా తెలుగు పలుకుబడియే. 'ఏగెడుదానికి ఓర్వను' అనటంలో నెల్లూరు మాండలిక ప్రభావం కనబడుతున్నది. ఈ పద్యంలో ద్రౌపది బడలికతో తూలిపోవటం అనే విభావాన్ని సృష్టించటం తిక్కన శిల్పమే. అంతేకాదు. ఇక్కడ ఒక నాటకీయమైన సన్నివేశాన్ని కల్పించాడు. అది ముందు పద్యాలలో తెలుస్తుంది. (సంపా.)

**వ. అనవుడు. 149**

**తాత్పర్యం:** అనగానే.

**క. తన మదిఁ గరుణయు ఖేదం । బును బిరిగొనుచుండ ధర్మపుత్త్రుఁడు నకులుం**
**గనుఁగొని ద్రుపదనృపతి నం । దన దెస యాతనికిఁ జూపి తగ నిట్లనియెన్. 150**

**ప్రతిపదార్థం:** తనమదిన్= తన మనస్సులో; కరుణయున్= జాలీ; ఖేదంబును= దుఃఖమూ; పిరిగొనుచుండన్= పెనవేసికొనిపోతుండగా; ధర్మపుత్త్రుఁడు= యమధర్మరాజు కుమారుడయిన ధర్మరాజు; నకులున్= నకులుడిని; కనుఁగొని= చూచి; అతనికిన్= ఆ నకులునికి; ద్రుపదనృపతి నందనదెస= ద్రుపదమహారాజు కుమార్తె అయిన ద్రౌపదివైపు; ఆతనికిన్= అతనికి (నకులునికి); చూపి= చూపించి; తగన్= అనువుగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాను.

**తాత్పర్యం:** ధర్మరాజు ద్రౌపది పడుతున్న అలసటవలని బాధను చూచాడు. జాలి దుఃఖం కలిసి అతడి మనసును పిండివేశాయి. ద్రౌపదిని చూపిస్తూ ధర్మరాజు నకులుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలసిన ద్రౌపదిని చూచిన ధర్మజుడికి జాలి, దుఃఖం పెనవేసికొని మనసులో పొంగాయి. ఈ అనుభవాలు ద్రౌపది అనే విభావాన్ని పరికించిన ధర్మజుడనే సహృదయుడు పొందే స్పందనగా ఏర్పడ్డాయి. తనలో కలిగిన ఈ స్పందనను తమ్ములతో పంచుకొనటానికి పూనుకొన్నాడు ధర్మరాజు. కౌంతేయులలో పెద్దవాడయిన ధర్మజుడు మాద్రేయులలో పెద్దవాడిని చూచి ఇట్లా అనటం విశేషం. (సంపా.)

**ఆ. 'అకట! మనము వచ్చినది గడుదవ్వు, నేఁ । డప్పురంబు సొత్త మని తలంచి**
**తఱిమి నడచితిమి లతాతన్వి యిది; వడ । గొనియె; మోచి తెమ్ము కొంత దవ్వు' 151**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; మనము= మనం; వచ్చినది= ప్రయాణం చేసింది; కడుదవ్వు= చాలాదూరం; నేఁడు= ఈ నాడే; ఆ+పురంబున్= ఆ విరాట మహారాజు పట్టణాన్ని; చొత్తము+అని= ప్రవేశిద్దామని; తలంచి= అనుకొని తలపోసి; తఱిమి నడచితిమి= తరుముతున్నట్లుగా త్వరగా నడిచాము; ఇది= ఈమె (ద్రౌపది); లతాతన్వి= లతవలె సుకుమారమయిన శరీరం కలది; వడగొనియెన్= వడదెబ్బతిన్నది; కొంతదవ్వు మోచి= కొంతదూరం దాకా మోసికొని; తెమ్ము= తీసికొనిరమ్ము.

**తాత్పర్యం:** 'మనం ఇప్పటికే చాలాదూరం నడిచాం. ఈ రోజే విరాటమహారాజు పట్టణం చేరుకొనాలని తరిమి తరిమి వేగంగా నడిచాము. ద్రౌపది శరీరం తీగవలె సుకుమార మయింది. వడదెబ్బ తిన్నది. అందుచేత ఈమెను కొంతదూరం మోసికొనిరమ్ము.'

**విశేషం:** 'వడ గొనియె'- తిక్కన తెలుగు జాతీయం. తీవ్రమైన ఎండవేడికి వడగాడ్పుకు మూర్ఛపొందితే 'వడగొట్టింది.' అనటం సామాన్యం. అంతటి తీవ్రమైన అలసటకు కూడా ఆ మాట వాడటం గమనార్హం. వడదెబ్బ తిన్నవారికి శైత్యోపచారాలు కావాలి. విశ్రాంతి కావాలి. అందువలననే ఆమెను ఎత్తుకొని రమ్మని నకులుడిని ధర్మరాజు ఆదేశించాడు. (సంపా.)

**క. అనిన విని పూని గ్రక్కున। జనుదేరమి, నతఁడు డస్సెఁ జాలం డని నె**
**మ్మనమున నెఱింగి యాతని। యనుజన్మునిఁ బనిచె; నతఁడు నలసుం డయినన్. 152**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= విని; పూని= పూనుకొని; గ్రక్కునన్= తొందరగా; చనుదేరమిన్= ముందుకు రాకపోవటం చేత; అతఁడు= నకులుడు; డస్సెన్= అలసిపోయాడు; చాలండు+అని= మోసికొని రావడానికి సమర్థుడు కాడని; నెఱ+మనమునన్= నిండుమనస్సులో; ఎఱింగి= తెలిసికొని; ఆతని= ఆ నకులుడి; అనుజన్మునిన్= తమ్ముడయిన సహదేవుని; పనిచెన్= ఆజ్ఞాపించాడు; అతఁడున్= అతడు కూడా; అలసుండు+అయినన్= అలసిపోయినవాడు కాగా.

**తాత్పర్యం:** ఆ మాటలను నకులుడు విన్నాడు. అయితే వెంటనే ముందుకు రాలేదు. నకులుడు అలసిపోయాడని ధర్మరాజు గుర్తించాడు. సహదేవుడిని చూచి నకులుడు అలసిపోయాడు ద్రౌపదిని మోసికొనిరాలేడు. నీవు మోసికొని రమ్ము' అని అతడిని పురమాయించాడు. అతడు కూడా అలసిఉన్నందున ముందుకు రాకపోగా అపుడు ధర్మరాజు (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. సవ్యసాచిం జూచి. 153**

**తాత్పర్యం:** అర్జునుడి వైపు చూచి.

**ఉ. 'ఇమ్మదిరాక్షి డస్సె, మన కీనడుమన్ విడియంగ నొండుచో**
**టిమ్మును గాదు; నిక్కమున కేమును డస్సితి; మట్లు గాన నీ**
**వెమ్మెయినైన దీని భరియించి పురంబు సమీప భూమికిం**
**దె' మ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బుష్పకోమలిన్. 154**

**ప్రతిపదార్థం:** ఈ+మదిర+అక్షి= మత్తిల్లిన కళ్ళుగల ఈ ద్రౌపది; డస్సెన్= అలసిపోయింది; మనకున్= మనకు; ఈ నడుమన్= ఈ అరణ్యప్రాంతంలో; విడియంగన్= విడిది చేయటానికి; ఒండుచోటు= ఏదైన ఒక స్థలం; ఇమ్మును+కాదు= అనువైనదిగా లేదు; నిక్కమునకున్= నిజానికి; ఏమును= మేము కూడా; డస్సితిమి= అలసిపోయాము; అట్లు+కానన్= ఆ కారణంవలన; నీవు= నీవు; ఏ+మెయిన్+ఐనన్= ఏ విధంగా నయినా; దీనిన్= ఈ ద్రౌపదిని; భరియించి= మోసికొని; పురంబు సమీపభూమికిన్= విరాటుని పట్టణ ప్రాంతానికి; తెమ్ము= తీసికొనిరమ్ము; అని= అని; చెప్పన్= చెప్పగా; ఆతఁడును= అర్జునుడును; పుష్పకోమలిన్= పువ్వువలె కోమలి అయిన ద్రౌపదిని; ప్రియంబునన్= ప్రీతితో; తెచ్చెన్= మోసికొని వచ్చాడు.

**తాత్పర్యం:** 'ద్రౌపది అలసిపోయింది. ఈ అడవిలో మనం విడిది చేయటానికి అనువయిన ప్రదేశం లేదు. నిజానికి మేము కూడా అలసిపోయాం. అందుచేత అర్జునా! నీవు ఏ విధంగానైనా సరే ద్రౌపదిని విరాటుడి నగరప్రాంతానికి మోసికొని రమ్ము' అని ధర్మరాజు చెప్పాడు. అర్జునుడు కుసుమకోమలి అయిన ద్రౌపదిని ప్రీతితో మోసికొని వచ్చాడు.

**విశేషం:** 1. మూలంలో ద్రౌపది 'వసామేహాపరాం రాత్రిం' అని ఒకరాత్రి అక్కడ ఉండిపోదామని ప్రతిపాదించింది. ఆ మాట తెలుగులో లేదు. కాలసూచనం కథ కనువుగా లేకపోతే తిక్కన వదిలివేస్తాడు. అవసరం వచ్చినచోట అనువుగా సూచిస్తాడు. రాత్రి ప్రసక్తి రాకపోయినా 'మన కీ నడుమన్ విడియంగ నొండు చో టిమ్మును గాదు' అని సూచించి ఆ లోపాన్ని నిపుణంగా ధర్మజుడు తొలగించాడు. తప్పనిసరిగా ప్రయాణం చేయాలన్న విషయాన్ని సమర్థించాడు. 'తటిమినడక' తప్పదని హెచ్చరించాడు. అందువలన ద్రౌపదిని ఎవరైనా ఎత్తుకొని రాక తప్పదని నిశ్చయించుకొన్నాడు.

2. ధర్మరాజు గడుసరి. అంతగా జాలిపడినవాడు ఆమెను తానే ఎత్తుకొని మోయవచ్చుగా? తానుకూడా అలసిపోయాడు. అబల కాబట్టి ద్రౌపది పైకి చెప్పింది. మగవాడుకాబట్టి, పెద్దవాడుకాబట్టి తొందరపని కాబట్టి తా నామాట అనలేకపోయాడు. అయితే భీముడిని అడుగవచ్చునుకదా? అర్జునుడు లేనప్పుడు భీముడే ఆమెను మోసేవాడు. మరి ఇప్పుడు ధర్మరాజు నకులుడిని అడిగాడు. అతడు అలసిపోయి ముందుకు రాలేదు; సహదేవుడూ అట్లాగే చేశాడు. ఇక అర్జునుడి వంతు వచ్చింది. 'అందరమూ అలసిపోయి ఉన్నాం. నీకు తప్పదు' అన్నట్లు ధర్మజు డన్నాడు. అభిమానధనుడైన అర్జునుడు ఆమెను పూలతీవవలె ఎత్తుకొని అవలీలగా వెళ్ళాడు. కౌంతేయులలో పెద్దవాడు ధర్మజుడు. అతడి తరువాత మాద్రేయులలో ప్రథముడు నకులుడు. కర్మకాండకు సంబంధించి పాండవులలో వారిరువురు పెద్దవారు. అందువలననే యక్షుడు ఒక్కడిని బ్రతికిస్తానంటే నకులుడిని ధర్మరా జెన్నుకొన్నాడు. ఆ తరువాతవారే చిన్నవారు. అందువలన నకులుడితో మొదలుపెట్టి, అతడు కాదన్న తరువాత సహదేవుడు. అర్జునుడు అనే క్రమంలో అడుగుతూ వచ్చాడు. అర్జునుడు కూడా కాదంటే భీమునికి తప్పేది కాదు. పాండవులలో భీమార్జునులు సర్వసమర్థులని మరొకసారి ఈ సన్నివేశం నిరూపించింది. మూలంలో ధర్మరాజు సరాసరి అర్జునుడినే అడుగుతాడు. తెలుగులో ధర్మరాజు ఈ చిన్ని నాటక మాడాడు. ఎవరికీ ధర్మమీమాంస రాకుండా సన్నివేశాన్ని కాపాడాడు. (సంపా.)

**క. మోచికొని వాసవాత్మజుఁ। డా చెలువం దేర నిట్టు లరిగి పురము దృ**
**గ్గోచర మగుటయుఁ దమ్ములఁ। జూచుచు వారలకు ధర్మసుతుఁ డిట్లనియెన్. 155**

**ప్రతిపదార్థం:** వాసవ+ఆత్మజుఁడు= ఇంద్రుని కొడుకయిన అర్జునుడు; ఆ చెలువన్= ద్రౌపదిని; మోచికొని తేరన్= మోసికొనిరాగా; ఇట్టులు+అరిగి= ఇట్లా నడిచి; పురము= విరాటుని పట్టణం; దృక్+గోచరము+అగుటయున్= కనుచూపుమేరలో కనబడగా; ధర్మ సుతుఁడు= యమధర్మరాజు కుమారుడయిన ధర్మరాజు; తమ్ములన్= తమ్ములను; చూచుచున్= చూస్తూ; వారలకున్= భీమాది పాండవులతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ద్రౌపదిని మోసికొని వచ్చాడు. పాండవులు నడక సాగించారు. కనుచూపుమేరలో పట్టణం కనిపించింది. ధర్మరాజు తమ్ముళ్ళను చూచి ఈ విధంగా అన్నాడు.

**క. 'చక్కని చిక్కని మేనులు। నిక్కోదండములు నైన నెఱుఁగరె? మన మీ**
**చక్కటి నిలుతమె? శస్త్రము। లొక్కెడ దాఁచుటకు, వేషయోజనములకున్.' 156**

**ప్రతిపదార్థం:** చక్కని= చక్కని; చిక్కని= దృఢమయిన; మేనులున్= శరీరాలును; ఈ కోదండములున్+ఐనన్= ఈ ధనుస్సులూ అయితే; ఎఱుఁగరె= తెలిసికొనరా; మనము= మనం; శస్త్రములు= ఆయుధాలు; ఒక్క+ఎడన్= ఒకచోట; దాఁచుటకున్= దాచటానికి; వేష యోజనములకున్= అజ్ఞాతవాసానికి తగిన విధంగా వేషాలు వేసికొనటానికి; ఈ చక్కటిన్= ఈ ప్రదేశంలో; నిలుతమె?= ఆగుదామా?.

**తాత్పర్యం:** 'మన ఆకారాలను, ధనువులను చూడగానే ప్రజలు మనలను గుర్తుపట్టరా? అందుచేత మన ఆయుధాలు దాచుకొనటానికీ, వేషాలు మార్చుకొనటానికీ ఈ ప్రదేశంలో ఆగుదామా?'

**వ. అనిన నిది కార్యంబని మధ్యమపాండవుం డా సుమధ్య నొక్క శీతల సికతాతలంబున డించె; దక్కినవారలు నట్ల చేయుద మని నిలిచి; రట్టియెడలఁ బాండవాగ్రజుండు గాండీవి చేతి వి ల్లుపలక్షించి యతని కిట్లనియె. 157**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఇది కార్యంబు+అని= ఈ పని చేయతగినదని; మధ్యమ పాండవుండు= పాండవ మధ్యముడయిన అర్జునుడు; సుమధ్యన్= చక్కని నడుము కలిగిన ద్రౌపదిని; శీతలసికతాతలంబునన్= చల్లని ఇసుక తిన్నెమీద; డించెన్= దించాడు; తక్కిన వారలున్= మిగిలినవారును; అట్లు+అ చేయుదము+అని= ఆ రకంగానే చేద్దామని; నిలిచిరి= నిలిచారు; అట్టి+ఎడలన్= ఆ సమయంలో; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; గాండీవి చేతి= అర్జునుని చేతిలో ఉన్న; విల్లు+ఉపలక్షించి= వింటిని తేరిపార చూచి; అతనికిన్= అర్జునునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇది చేయతగినపని అని అర్జునుడు అభిప్రాయపడినాడు. ద్రౌపదిని చల్లని ఇసుకతిన్నెమీద దించాడు. మిగతావారంతా అట్లాగే చేద్దామని అక్కడే ఆగారు. ధర్మరాజు గాండీవాన్ని చూచాడు. అర్జునుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'మన శస్త్రాస్త్రంబులు ద। క్కినయవి యొకభంగి; వీటికిని గాండివముం**
**గొనిపోయితిమేని సుయో। ధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్.' 158**

**ప్రతిపదార్థం:** మన= మనయొక్క; శస్త్ర+అస్త్రంబులు= శస్త్రాలు, అస్త్రాలు; తక్కినయవి= మిగిలినవి; ఒకభంగి= ఒక ఎత్తు; వీటికిని= విరాటుడి నగరంలోపలికి; గాండివమున్= గాండీవాన్ని; కొనిపోయితిమి+ఏనిన్= తీసికొనివెళ్ళితే; సుయోధనునకున్= దుర్యోధనునికి; అగపాటు= తెలియటం; ఊహింపన్= ఆలోచిస్తే; నిశ్చితంబు= నిశ్చయం.

**తాత్పర్యం:** 'మన ఆయుధాలన్నీ ఒక ఎత్తు, అర్జునుడి గాండీవం మరొకఎత్తు. ఈ గాండీవంతో విరాటుడి పట్టణంలో అడుగుపెట్టితే దుర్యోధనుడికి మన 'ఆచూకి' తెలియటం నిశ్చయం.'

**వ. అనవుడు. 159**

**తాత్పర్యం:** అనగానే.

**చ. 'ఇది పెనుఁబాము చందమున నెంతయు భీషణమై జనంబులన్**
**బెదరఁగఁ జేయు; నట్లగుటఁ బెట్టి చనన్ వలయుం; దలంచి నా**
**హృదయము దీనిఁ బాయుటకు నియ్యకొనం జొర; దెట్లు చెప్పినం**
**దుది నొకచోట వైచుటయ తోఁచిన కార్యము నయ్యెడుం గటా!' 160**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ గాండీవం; పెను+పాము చందమునన్= పెద్దపామువలె; ఎంతయున్= ఎంతో; భీషణము+ఐ= భయంకరమై; జనంబులన్= ప్రజలను; బెదరఁగన్+చేయున్= బెదరగొట్టుతుంది; అట్లు+అగుటన్= ఆ విధంగా (బెదరకొట్టేది) కావటంచేత; పెట్టి చనన్+వలయున్= ఎక్కడయినా భద్రంగా దాచిపెట్టి వెళ్ళాలి; తలంచి= దీనిని తలచుకొని; నా హృదయము= నా మనసు; దీనిన్= దీనిని; పాయుటకున్= వదలిపెట్టడానికి; ఇయ్యకొనన్+చొరదు= అంగీకరించటానికి సమ్మతించటం లేదు; ఎట్లు చెప్పినన్= ఏ విధంగా చెప్పినా; తుదిన్= చివరకు; ఒకచోటన్= ఏదో ఒకచోట; వైచుటయ= దాచడమే; తోఁచిన కార్యము+అయ్యెడున్= ఇప్పటికి తోచినపని ఔతుంది; కటా!= అయ్యో!.

**తాత్పర్యం:** 'ఈ గాండీవం పెద్దపామువంటిది. ప్రజలను బెదరగొట్టుతుంది. అందుచేత దీనిని ఎక్కడయినా దాచివెళ్ళాలి. ఈ మాట అనుకొంటున్న కొద్దీ దీన్ని విడిచిపెట్టటానికి నా మనసు ఏమాత్రమూ అంగీకరించటం లేదు. ఏమయినా సరే! చివరకు ఒకచోట దాచిపెట్టి వెళ్ళటమే మంచిదనిపిస్తున్నది.'

**విశేషం:** భారతంలో తాము ధరించే ఆయుధాలతో తమకు బిరుదనామాలు వచ్చినవారు శ్రీకృష్ణార్జునులు- చక్రి, గాండీవులుగా ప్రసిద్ధికెక్కారు. అర్జునుడికి గాండీవం అగ్నిదత్తమైనది. గాండీవం మహాసర్పంవలె భయంకరంగా ఉంటుంది. కవ్వడి అయిన అర్జునుడు రెండు చేతులతో ప్రయోగించే పాశుపతాస్త్రాదులవంటి మహాస్త్రాలను వహించే సామర్థ్యం దానికి ఉన్నది. ఆ గాండీవాన్ని అర్జునుడు ప్రాణంకంటె ఎక్కువగా ప్రేమిస్తాడు. గాండీవాన్ని ఎవరైనా దూషించినా, దానిని మరెవరికైనా ఇమ్మని తనను అవమానించినా వారితలను బ్రద్దలు చేస్తానని స్వయంగా శపథం చేసికొన్నాడు. ఒకసారి ధర్మరాజు (కర్ణపర్వంలో) అర్జునుడిపై కోపగించి 'గాండీవాన్ని శ్రీకృష్ణుడికి ఇస్తే అతడు కర్ణుడిని సంహరించి ఉండేవాడు కదా' అని అధిక్షేపించాడు. అర్జునుడు ఆగ్రహించి ధర్మజుని తల బ్రద్దలు చేయబోయాడు. శ్రీకృష్ణుడు ధర్మసూక్ష్మాన్ని చూపించి ఆ ఆపదను తొలగించాడు. అర్జునుడు స్వర్గారోహణం చేసేంతవరకు గాండీవాన్ని ధరించే ఉన్నాడు. అతడి శరీరంలో అది ఒక భాగమని భావించాడు. అందుకే గాండీవాన్ని వదలి ఉండలేక మనస్సు ఊగిసలాడుతూ ఉండగా అంతగా బాధపడ్డాడు. దానిని దాచిపెట్టక తప్పదని నిశ్చయించి 'కటా' అని చివరకు విట్టూర్చాడు. (సంపా.)

**వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబు నుత్తలం బుడిపికొని నిశ్చయించి, యాయుధంబులు నిక్షేపించుటయ కర్జంబుగాఁ బలికి యోగ్యస్థల నిరూపణంబునకు నలుదిక్కులుం బరికించి ప్రేతభూమి పరిసరారణ్యంబునందు.** **161**

**ప్రతిపదార్థం:** అని= అని; కిరీటి= అర్జునుడు; వితర్కించుచున్= ఆలోచిస్తూ; ఉరియాడు= ఊగులాడే (చలించే); చిత్తంబు+ఉత్తలంబున్= మనసుయొక్క కలతపాటును; ఉడిపికొని= దిగమ్రింగుకొని; నిశ్చయించి= ఒక నిర్ణయానికి వచ్చి; ఆయుధంబులు= ఆయుధాలను; నిక్షేపించుటయ= దాచటమే; కర్జంబుగాన్= చేయతగిన పనిగా; పలికి= చెప్పి; యోగ్యస్థల నిరూపణంబునకున్= తగినచోటు నిరూపించటానికి; నలుదిక్కులున్= నాలుగు దిక్కులను; పరికించి= కలయచూచి; ప్రేతభూమి= శ్మశానం యొక్క; పరిసర+అరణ్యంబునందున్= దగ్గరున్న దట్టమైన అడవిలో.

**తాత్పర్యం:** అర్జునుడు ఆలోచించాడు. ఊగిసలాడే మనసులోని కలతపాటును అణచుకొన్నాడు. ఆయుధాలు దాచడమే కర్తవ్యమని నిశ్చయించుకొన్నాడు. గాండీవం దాచడానికి తగిన చోటుకొరకు నలువైపులా చూచాడు. శ్మశానానికి దగ్గరగా ఉన్న అరణ్యంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. నెగసిన కొనలేచి నింగినంతంతకు । నవులఁ ద్రోచుచుఁ దనరారు దానిఁ,**
**జాఁగిన శాఖ లాశాచక్రమున కొలం । దులు బారవెట్టంగఁ బొలుచు దానిఁ,**
**గవట లొండొంటితోఁ; గదియుచు నెడములు । మ్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులు దాని,**
**లోని జొంపము పవలును బెను జీఁకటి । నొదవించి పొదలంగ నొప్పుదానిఁ**

**తే. గనియెఁ బవమాన వివిధ వర్తన కళాను । వర్తి; గాకఘూకారవస్ఫూర్తి జాత**
**భీతి పరిసరవర్తి నాభీల భుజగ । చండమూర్తి, శమీతరు చక్రవర్తి.** **162**

**ప్రతిపదార్థం:** నెగసిన కొనలు= పైకి లేచిన కొమ్మల రెమ్మల చివరలు; ఏచి= అతిశయించి; నింగిన్= ఆకాశాన్ని; అంతంతకున్= ఇంకా పైపైకి; అవలన్+త్రోచుచున్= బయటికి గెంటుతూ; తనరారుదానిన్= ప్రకాశించేదానిని; చాఁగిన శాఖలు= సాగిన కొమ్మలు; ఆశా చక్రమున= దిక్చక్రం యొక్క; కొలందులు= (హద్దులను) ప్రమాణాలను; బార+పెట్టంగన్= బారలతో కొలిచేవిధంగా; పొలుచుదానిన్= రాణించేదానిని; కవటలు= పెద్దపెద్ద కొమ్మలు; ఒండొంటితోన్= ఒకదానితో ఒకటి; కదియుచున్= రాచుకొనేవిధంగా; ఎడములు ప్రింగి ప్రబ్బఁగన్= నడుమ నున్న ఖాళీలను క్రమ్మి వ్యాపించగా; సొంపు మిగులుదానిన్= సొగసు ఎక్కువైఉన్నదానిని; లోనిజొంపము= లోపలిగుబురు; పవలును= పగలుకూడా; పెను+చీఁకటిన్= దట్టమయిన చీకటిని; ఒదవించి= కలిగించి; పొదలంగన్= వ్యాపించగా; ఒప్పుదానిన్= ఒప్పునటువంటి దానిని; పవమాన= గాలిచేత; వివిధవర్తన= అనేకరీతుల; కళా+అనువర్తిన్= కళలను అనుసరించేదానిని; కాక= కాకుల; ఘూక= గుడ్లగూబలయొక్క; ఆరవ స్ఫూర్తిన్= ధ్వనుల స్ఫురణతో; జాత= పుట్టిన; భీతి= భయంకల; పరిసరవర్తిన్= చుట్టుపట్ల తిరిగేవారు కలిగిన దానిని; ఆభీల= మిక్కిలి భయంకరమయిన; భుజగచండమూర్తిన్= పామువలె తీవ్రమయిన స్వరూపం కలదానిని; శమీతరు చక్రవర్తిన్= శ్రేష్ఠమైన జమ్మిచెట్టును; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** జమ్మిచెట్టుకున్న చిట్టచివరికొనలు ఆకాశాన్ని అంతకంతకు వెనక్కి నెడుతున్నాయి. కొమ్మలు నలువైపులా సాగి దిగంతాలను కొలిచేవిధంగా ఉన్నాయి. పెద్దపెద్ద కొమ్మలు ఒకదానితో ఒకటి రాచుకొంటూ మధ్య ఏమాత్రం ఎడం లేకుండా వ్యాపించి ఉన్నాయి. దట్టమయిన ఆకుల గుబురులు పగటి వేళలోనూ దట్టమైన చీకటిని కలిగిస్తున్నాయి. ఆ చెట్టు గాలికి కదులుతుంటే ఎన్నో నర్తన కళలను అభ్యసిస్తున్నట్లుగా ఉన్నది. ఆ చెట్టుమీద కాకులు, గుడ్లగూబలున్నాయి. భీకరమైన వాటి అరపులకు పరిసరజనం భయపడుతున్నారు. ఆచెట్టుమొత్తం భయంకరమైన మహాసర్పంవలె ప్రచండంగా గోచరిస్తున్నది. అటువంటి ఆ శమీవృక్ష చక్రవర్తిని అర్జునుడు చూచాడు.

**విశేషం:** 1.అలం: రూపకం, అతిశయోక్తి, అంత్యానుప్రాస. భీషణసుందరమైన ఈ శమీవృక్ష వర్ణనం మూలంలో లేదు. ఇది తిక్కన ప్రతిభాజన్యం. శమీతరువును చక్రవర్తిగా చెప్పి రూపకాలంకారాన్ని నిర్వహించారు. తిక్కన మానవులలో చక్రవర్తికి ఏ విధంగా విశిష్ట లక్షణాలుంటాయో తరువులలోకూడ చక్రవర్తి అయిన చెట్టుకు ఆ జాతికి చెందిన విశేషలక్షణా లుండటం సహజం. రూపకం చేస్తున్నప్పుడు మానవతరు లక్షణాలను రెండింటినీ అన్వయించటం అలంకారశిల్పం. దానికి పద్యనిర్మాణ శిల్పం భావవిస్ఫూర్తికి తోడుపడుతుంది.

2. పాండవులు చక్రవర్తులు. వారి చక్రవర్తిత్వానికి వారి బల మెంత కారణమో, వారి ఆయుధాలు కూడ అంతకారణం. ఆ ఆయుధాలను తనవద్ద ఉంచుకొని రక్షించగలిగినవాడు కూడా చక్రవర్తి కావాలి. అధముడు దానికి అధికారి కాడు. అందువలననే తిక్కన శమీతరు చక్రవర్తిని దర్శింపచేశాడు.

3. చక్రవర్తి రూప వైభవ వర్ణనం ఉదాత్తంగా విస్తృతంగా జరగాలి కాబట్టి, తిక్కన సీసపద్యం ఎత్తుకొన్నాడు. దానితో సీసపాదాలకూ, ఎత్తుగీతికీ నడుమ 'కనియెన్' అనే క్రియను ప్రయోగించాడు. పద్యం సహజంగా రెండు భాగాలుగా విభక్తమైపోయింది. రెంటికీ క్రియ ఒకటే. సీసంలోని నాలుగుపాదాలూ 'దానిన్' అనే పదంతో ముగుస్తూ అంత్యానుప్రాసతో అందంగా గోచరిస్తాయి. ఎత్తుగీతిలో 'రసస్ఫూర్తి', 'పరిసరవర్తి', 'చండమూర్తి', 'చక్రవర్తి' అనే పదాలు అనుప్రాసతో ఆసక్తిని పెంచుతాయి. 'కనియెన్' అనేక్రియతో భౌతికంగా చూచిన స్ఫూర్తిని సీసపద్యపాదాలలో, భావుకంగా దర్శించిన స్ఫూర్తిని ఎత్తుగీతిలో నిబంధించటం తిక్కన రచనాశిల్పం.

4. అర్జునుడు తనగాండీవాన్ని 'ఇది పెనుఁబాము చందమున నెంతయు భీషణమై జనంబులన్ బెదరఁగఁ జేయున్' అని చెప్పాడు. దానిని భరించగల శమీవృక్షంకూడా ఆ లక్షణాలు కలిగి ఉండాలి. అర్జునుడు వాటిని శమీతరు చక్రవర్తిలో చూచాడు. అతడు భయంకరమైన భుజగంవలె ప్రచండమూర్తి చండుడు-అంటే ఉగ్రస్వభావుడు, వాడిమి కలవాడు. పెనుఁబాము

లక్షణం ఆ వృక్షరూపానికి ఉండటం అర్జునుడు గమనించాడు. పాములు ఉండటంచేత భయంకరమూర్తి కలిగి ఉన్నది- అని కొందరు వ్యాఖ్యానం చేశారు. అది వృక్షపరంగా మాత్రం అన్వయిస్తుంది. పూర్వాపర శిల్ప సమన్వయ సమర్థం కాదు. 'ఆభీలభుజగ చండమూర్తి' ని ఉపమాన పూర్వపద కర్మధారయంగా గ్రహించటం సమంజసం. చెట్టుకూ, పామువంటి చండమూర్తికీ వర్తించేవి ఎత్తుగీతిలోని విశేషణాలు. గాలిచేత కదలాడటంవలన వివిధ భంగిమలలో అందంగా కనిపించేది చెట్టు. బుసలుకొట్టుతూ అనేకరకాలుగా ప్రసరిస్తూ (వర్తిస్తూ)ఉండే సర్పగతికళానువర్తి భుజగచండమూర్తి ఆ శమీతరు చక్రవర్తి కాకులూ గుడ్లగూబలూ మొదలైన పక్షుల కూతలు బాగా వినపడటంచేత చుట్టుప్రక్కల తిరిగే వారికి భయం కలిగించేది అని వృక్షపరమైన అర్థం. భీకరమైన సర్పం (కొండచిలువ వంటిది) విజృంభించి అడవిలో తిరగటం మొదలుపెడితే పక్షులు భయంతో రొదలు చేయటం సహజం. అటువంటి భయాందోళనలను తనచుట్టూ కలిగించగలిగేది భుజగచండమూర్తి. గాలివాటుగా అనేకవిధాలుగా వర్తించి చుట్టూ ఉన్నవారిని ఆక్రందనలకు గురిచేసేవాడు కోపనుడైన చండశాసనుడు.

5. పామువలె ఉగ్రస్వభావం కలవాడు శమీతరుచక్రవర్తి. ఆ చెట్టుకున్న కొనలు ఆకాశాన్ని ఆవలకు తోస్తున్నట్లుంటాయి. అలాగే పాము నాలుక కొనలు కూడా భాసిస్తాయి. అంటే -భుజగచండమూర్తి రాజ్యవిస్తరణలో కడుక్రూరుడని భావం. సాగిన చెట్టు కొమ్మలు దిక్కులను బారలతో కొలుస్తున్నట్లున్నాయి. చెట్టుకు గుండ్రంగా చుట్టుకొన్న పాము విస్తరించి సాగితే దిక్కులు కొలుస్తున్న మానదండంగా ఉండవచ్చును. ఇది సర్పపరమైన అర్థం. దిగంతాలవరకు రాజ్యవిస్తరణ చేయాలన్న ప్రచండుడి వర్తన అందులో ధ్వని. పెద్దకొమ్మలు కదియబారి ఎడం లేకుండా ఉండటంవలన అందంగా కనపడటం వృక్షలక్షణం. పెద్దవైన ఆడుపాములతో (కొమ్మలతో) కలిసి ఎడం లేకుండా క్రీడించటంవలన అందంగా ఉండేది భుజగచండమూర్తి. (సర్ప క్రీడలో వ్యవధానం ఉండకపోవటం ప్రసిద్ధం). క్రూరుడైన రాజు బలవంతంగా వనితలను భయపెట్టి నిరంతరం క్రీడిస్తుంటాడనే భావం వ్యంగ్యం. లోని ఆకులగుబుర్లవలన పగళ్ళలోకూడ పెనుచీకట్లను కల్పించే నేర్పుతో ఒప్పారేది చెట్టు. జొంపములంటే నిరంతరధార లని అర్థం ఉన్నది. లోని జొంపములంటే సర్పపరంగా విషధారలు. వాటిని వెళ్ళగ్రక్కటం ద్వారా విషధూమాలను వ్యాపింపజేసి పగళ్ళను చీకట్లుగా మార్చే ప్రభావం కలిగి ఉండటం భుజగచండమూర్తి లక్షణం. మనసులోని ఆలోచనల గుంపులచేత వెలుగునుకూడా చీకటిగా మార్చగలిగే దుష్టస్వభావం కలిగి ఉండటం క్రూరుడైన రాజు లక్షణం. ఏతద్భావనతో తిక్కన రూపకాలంకారాన్ని భీకర రమణీయంగా నిర్వహించాడు. పెనుబాముయొక్క స్వభావాన్ని సహజంగా తనలో గర్భీకరించుకొన్న శమీతరుచక్రవర్తి గాండీవధనువును రక్షించగలిగిన ఆభీలభుజగచండమూర్తి అని నిశ్చయించాడు అర్జునుడు.

6. శ్మశానం ప్రక్కన ఉండే జమ్మిచెట్టును ఇంతటి అలంకార సుందరంగా తెలుగులో వర్ణించిన కవి మరొకరు లేరు. శమీతరుచక్రవర్తిని దర్శించగలిగిన వాడు భావుకచక్రవర్తి. తిక్కన భారతంలోని ప్రసిద్ధమైన పద్యాలలో ఇది ఒకటి. రూపకాతిశయోక్తులను, అంత్యానుప్రాసను నిపుణంగా మేళవించిన అలంకృతమైన ఉదాత్త రచన. (సంపా.)

**వ. కని యమ్మహీరుహంబు ధర్మనందనునకుం జూపి యిట్లనియె. 163**

**ప్రతిపదార్థం:** కని= ఆ జమ్మిచెట్టును చూచి; ఆ+మహీరుహంబున్= ఆ శమీవృక్షాన్ని; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; చూపి= చూపించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** చూచి, ఆ జమ్మిచెట్టును ధర్మరాజుకు చూపించి ఈ విధంగా అన్నాడు.

**శా. 'పక్షివ్యాకులముం, బరేత నిలయోపాంతోత్థమున్, డాకినీ**
**రక్షోభూత పిశాచ గోచరము దుర్గంధంబునై చూడఁ జి**
**త్తక్షోభం బొనరించు; నట్లగుటఁ జెంతం జేరరా దీ శమీ**
**వృక్షం బెవ్వరి; కిందుఁ బెట్టుదమె పృథ్వీనాథ! శస్త్రాస్త్రముల్? 164**

**ప్రతిపదార్థం:** పృథ్వీనాథ!= ఓ భూనాథ! (ధర్మరాజా!); పక్షివ్యాకులమున్= పక్షులకలకలం నిండినదీ; పరేత నిలయ+ఉపాంత+ ఉత్థమున్= శ్మశానానికి దగ్గరలో మొలచినదీ; డాకినీ= డాకినులు; రక్షస్= రాక్షసులు; భూత= భూతాలు; పిశాచ= పిశాచాదులతో; గోచరమున్= కనబడేదీ; దుర్గంధంబున్+ఐ= కంపుతో కూడిందీ అయిన; ఈ శమీవృక్షంబున్= ఈ జమ్మిచెట్టును; చూడన్= చూడగానే; చిత్తక్షోభంబు+ఒనరించున్= మనస్సుకు వ్యాకులత కలిగిస్తుంది; అట్లు+అగుటన్= అట్లా కావడంవలన; ఎవ్వరికిన్= ఎవరికిని; చెంతన్+చేరరాదు= దగ్గరికి చేరడానికి వీలు కాదు; (అందుచేత); శస్త్ర+అస్త్రముల్= మన శస్త్రాలు, అస్త్రాలు; ఇందున్+పెట్టుదమె?= ఈ జమ్మిచెట్టుమీద పెట్టుదామా?

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఈ జమ్మిచెట్టు నిరంతరం పక్షులరొదలతో నిండి కలతపెట్టేదిగా ఉంటుంది. శ్మశానానికి దగ్గరగా ఉండటంచేత భూతపిశాచ రాక్షస గణాలతో కూడి భయంకరంగా ఉంటుంది. చుట్టూ దుర్గంధం వ్యాపించి ఉంటుంది. దీనివైపు చూస్తేనే మనస్సులో ఒక విధమైన కలత పుట్టుతుంది. అందువలన ఈ చెట్టు దగ్గరికి ఎవ్వరూ రారు. కాబట్టి మన శస్త్రాస్త్రాలను దీనిమీద భద్రపరుద్దామా?

**విశేషం:** శ్మశానానికి దగ్గరగా ఉండటంవలన చాలమంది రారు. పిశాచాలు భూతాలు ఉండటంవలన భయంకరం. దుర్వాసన కారణంగా దగ్గరికి చేరడానికి అసహ్యం. అందుచేత అస్త్రశస్త్రాలకు భయం లేదని అభిప్రాయం.' దుర్గస్థంబునై'- పెక్కుప్రతులు.

**క. పెనుఁ బొడువుఁ బఱపు జొంప । మ్మును గలయది; దీన నెల్ల పురుషులకుఁ బ్రయో**
**జన మొకఁడు లేదు, చేరం । జనఁ, జూడఁగ, నరయ, నెక్క సమకట్టంగన్. 165**

**ప్రతిపదార్థం:** పెను+పొడువు= పెద్దఎత్తూ; పఱపు= విశాలత్వం; జొంపమ్మును+కల+అది= గుబురూ కలిగింది; దీనన్= ఈ కారణాలవలన; ఎల్ల పురుషులకున్= మానవులందరికి; చేరన్+చనన్= దగ్గరికి రావటానికి కానీ; చూడఁగన్= చూడటానికి కానీ; అరయన్= నిశితంగా పరిశీలించటానికి కానీ; ఎక్కన్ సమకట్టంగన్= ఎక్కటానికి ప్రయత్నం చేయటానికికానీ; ప్రయోజనము= ఉపయోగం; ఒకఁడు= ఒక్కటికూడా; లేదు= లేదు.

**తాత్పర్యం:** ఈ చెట్టు ఎత్తయింది. చాలా విస్తారమయింది. గుబురయింది. అందుచేత ఎవరూ దగ్గరికి రారు. వచ్చినా చూడరు. దానిని నిశితంగా చూడటంవలనగాని, ఎక్కటం వలనగాని, ఎవరికీ ఎటువంటి ప్రయోజనమూ లేదు.

**విశేషం:** శస్త్రాస్త్రాలు రహస్యంగా ఉండగలవు అనటానికి తగిన హేతువులను అర్జునుడు పేర్కొన్నాడు. ఎత్తు, వైశాల్యం, గుబురుతనం అనే గుణాలు చెట్టు నెక్కేవాళ్ళను భయపెడతాయి. అందువలన గుబురులో ఎత్తుగా దాచబడిన ఆయుధాలు ఎవరికీ కనపడవు. గాండీవం వంటి పెద్దవిల్లును కూడా తనలో దాచుకొనే వైశాల్యం ఆ చెట్టుకు ఉన్నది. కాబట్టి భయం లేదు. ఇక ఎవరైనా చూడటానికి దగ్గరికి వచ్చినా, ఎక్కటానికిసమకట్టినా వారికి ఏ లాభమూ ఉండదు. చేరటానికి దుర్గంధం, చూడటానికి భయంకరాకారం, ఎక్కటానికి ఫలపుష్పాదు లేవీ లేకపోవటం అనేవి అడ్డువచ్చే బలమైన కారణాలు. ఆ కారణాలవలన ఆయుధాలు సురక్షితంగా ఉండగలవని నిశ్చితాంశం. ధర్మజుడి అంగీకారం పొందాలంటే ప్రతిపాదన ఎంత తర్కబద్ధంగా ఉండాలో అర్జునుడి మాటలు వ్యక్తం చేస్తున్నాయి. (సంపా.)

**ఉ. కావున దీనియం దిడుట కార్యము కైదువులెల్లఁ; గేశచ**
**ర్మావృత సంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం**
**బోవరు దీని డి క్కొరులు భూవర! నెమ్మది నూఱడిల్లు; మె**
**చ్చో వసియించినం బిదపఁ జొప్పడుఁ గ్రమ్మఱ వచ్చి కైకొనన్.' 166**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; కైదువులు+ఎల్లన్= ఆయుధాలన్నీ; దీని+అందున్= ఈ జమ్మిచెట్టు గుబురులో; ఇడుట= పెట్టటం; కార్యము= చేయదగినపని; కేశచర్మ+ఆవృత+సంచయంబుగన్= వెంట్రుకలతో కూడిన చర్మంతో చుట్టబడిన సముదాయం కలదిగా; శవ+ఆకృతిగాన్= శవాకారంగా; ఒనరించి= చేసి; కట్టినన్= కట్టినట్లయితే; ఒరులు= ఇతరులు; దీని దిక్కు పోవరు= ఈ చెట్టువైపు వెళ్ళరు; భూవర!= రాజా! (ధర్మరాజా!); నెఱ+మదిన్= నిండుమనసుతో; ఊఱడిల్లుము= ఊరటచెందుము; ఎచ్చోవసియించినన్= మనం ఎక్కడ ఉన్నా; పిదపన్= అజ్ఞాతవాసం తరువాత; క్రమ్మఱ వచ్చి= తిరిగివచ్చి; కైకొనన్= తీసికొనటానికి; చొప్పడున్= సాధ్యపడుతుంది.

**తాత్పర్యం:** అందుచేత మన ఆయుధాలను ఈ జమ్మిచెట్టు మీద దాచడం సబబయిన పని, వెంట్రుకలతో కూడిన చర్మంతో ఆయుధాలను చుట్టి శవంవలె అమర్చి కట్టిపెట్టితే ఈ వైపు ఎవరూ రారు. మహారాజా! నీవు మనస్సున బాధపడవద్దు. మనం ఎక్కడున్నా, చివరకు తిరిగివచ్చి మన ఆయుధాలను మనం తీసికొనటానికి వీలవుతుంది.'

### పాండవులు దమ యాయుధంబుల శమీవృక్షమునఁ బెట్టుట (సం. 4-5-9)

**వ. అని చెప్పిన నందఱు నత్తెఱంగున కియ్యకొనుటయు, నతండు గాండీవంబు నవలోకించి. 167**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; చెప్పినన్= చెప్పగా; అందఱున్= అందరును; ఆ+తెఱంగునకున్= ఆ పద్ధతికి; ఇయ్యకొనుటయున్= సమ్మతించగా; అతండు= అర్జునుడు; గాండీవంబున్= గాండీవాన్ని; అవలోకించి= చూసి.

**తాత్పర్యం:** అని చెప్పగా అందరూ దానికి ఒప్పుకొన్నారు. అపుడు అర్జునుడు గాండీవం వైపు చూచి.

**చ. 'అనిమిష దాన వాంబరచరాదిక జాతుల నెల్లఁ బోర నీ**
**ధనువునఁ గాదె గెల్తు! సముదగ్ర విరోధి భయావహంబు; దీ**
**నిని నొక బ్రూనఁ గట్టి చను నిశ్చయ మొందఁగఁ జేసె దైవ; మే**
**మనఁ గల? దట్ల కాక' యని యాత్మ నలందురి మందచేష్టుఁడై. 168**

**ప్రతిపదార్థం:** అనిమిష= దేవతలూ; దానవ= రాక్షసులూ; అంబరచర= గంధర్వులు; ఆదిక= మొదలయిన; జాతులన్+ఎల్లన్= జాతులన్నిటినీ; పోరన్= యుద్ధంలో; ఈ ధనువునన్+కాదె= ఈ వింటితో కదా; గెల్తున్= గెలిచేవాడిని; సముదగ్రవిరోధి భయ+ఆవహంబున్= గొప్పవారయిన విరోధులకు కూడా భయాన్ని కలిగించే; దీనిని= ఈ గాండీవాన్ని; ఒక బ్రూనన్= ఒక చెట్టునందు; కట్టి చనునిశ్చయము= కట్టి వెళ్ళే నిర్ణయాన్ని; ఒందఁగన్+చేసెన్= చేసే విధంగా (తీసికొనే విధంగా) చేసింది; దైవమున్= దైవాన్ని; ఏమి+అనన్+కలదు?= ఏమనటానికి వీలుంది?; అట్లు+అకాక+అని= అట్లాగే కానీ అని; ఆత్మన్= మనస్సులో; అలందురి= బాధపడి; మందచేష్టుఁడు+ఐ= చేష్ట లుడిగిన వాడయి.

**తాత్పర్యం:** 'నేను ఈ ధనుస్సు సహాయంతో అనేక యుద్ధాలలో దేవదానవ గంధర్వాదులను గెలిచినవాడిని. ఈ గాండీవం శత్రుభయంకరమయినది. ఇటువంటి గాండీవాన్ని ఒక చెట్టుకు కట్టిపడవేసే నిర్ణయాన్ని దైవం నిశ్చయించింది. ఈ పరిస్థితిలో ఏమనటానికీ పాలుపోవటంలేదు' -అని అర్జునుడు మనసులో బాధపడి ఉత్సాహరహితుడై ఉండిపోయాడు.

**వ. ఎక్కు డించినఁ బాండవాగ్రజుండు. 169**

**ప్రతిపదార్థం:** ఎక్కు డించినన్= మోపెట్టిన అల్లెత్రాటిని విప్పగా; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడయిన ధర్మరాజు.

**తాత్పర్యం:** అర్జునుడు గాండీవం నారిముడి విప్పాడు. అప్పుడు ధర్మరాజు.

**క. దనుజకుల త్రాసకరం। బును రిపుభంజనము రత్నభూషిత రూపం**
**బును గురుదేశాహ్లాదన। మును నగు నిజకార్ముకంబు మో పెడలించెన్. 170**

**ప్రతిపదార్థం:** దనుజకుల= రాక్షస సమూహానికి; త్రాసకరంబును= భయాన్ని కలిగించేదీ; రిపుభంజనమున్= విరోధులను సంహరించేదీ; రత్నభూషిత= రత్నాలతో అలంకరించబడిన; రూపంబును= ఆకారం కలదీ; కురుదేశ+ఆహ్లాదనమునున్= కురుదేశానికి సంతోషాన్ని కలిగించేదీ; అగు= అయినటువంటి; నిజకార్ముకంబు మోపు= తన వింటినారిబిగువును; ఎడలించెన్= తొలగించాడు.

**తాత్పర్యం:** రాక్షసులకు భయంకర మయినదీ, విరోధినాశనకర మయినదీ, రత్నాలు పొదిగినదీ, కురుదేశానికి సంతోషం కలిగించేదీ అయిన తన వింటినారిని ధర్మరాజు విప్పాడు.

**వ. తదనంతరంబ భీమ నకుల సహదేవులదెసఁ గనుంగొని. 171**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తర్వాత వెంటనే; భీమ నకుల సహదేవుల దెసన్= భీమ నకుల సహదేవులవైపు; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** ఆ తరువాత వెంటనే ధర్మరాజు భీమనకుల సహదేవులవైపు (వారి వింటినారులను కూడ సడలించండి అని సూచిస్తున్నట్లు) చూచాడు.

**సీ. 'సైంధవ యక్ష పాంచాల త్రిగర్తుల। దీనన యోర్చితి మానధనుఁడ!**
**సౌరాష్ట్రనాథాది శత్రులు దీనిచేఁ। గాదె మర్దితు లైరి ఘనభుజుండ!**
**కాళింగ పాండ్య మాగధుల నిర్జించుచో। నిదియ కైదువు నీకు విదితయశుఁడ!'**
**యని క్రమంబున వారలందఱ విండులు। పెంపెసలార వేర్వేఱ పొగడి**

**ఆ. గొనయములు వదల్ప ననుమతి సేయుడు। వారు నట్ల చేసి తేరఁ, జాప**
**ములును దొనలు వర్మములు నసి ముద్గ రా। ద్యాయుధములుఁ గూడ నతఁడు గట్టె. 172**

**ప్రతిపదార్థం:** మానధనుఁడ!= అభిమానమే ధనంగా కలిగిన భీమసేనా!; సైంధవ= సైంధవుడినీ; యక్ష= యక్షులనూ; పాంచాల= పాంచాలురనూ; త్రిగర్తులన్= త్రిగర్తదేశాధిపతి అయిన సుశర్మనూ; దీనన్= దీనితోనే; ఓర్చితి(వి)= నిర్జించావు, జయించావు; ఘనభుజుండ!= దీర్ఘమయిన భుజాలు కల నకులా!; సౌరాష్ట్రనాథ+ఆది= సౌరాష్ట్రదేశానికి రాజు మొదలయిన; శత్రులు= విరోధులు; దీనిచేన్= దీనిచేతనే; మర్దితులు+ఐరి కాదె= తాడించబడ్డారు కదా; విదితయశుఁడ!= ప్రకటితమయిన కీర్తి కలిగిన సహదేవా!; కళింగ= కళింగరాజు; పాండ్య= పాండ్యరాజు; మాగధులన్= మగధరాజులను; నిర్జించుచోన్= జయించటానికి సిద్ధమయినవేళ; నీకున్= నీకు; ఇదియ కైదువు= ఇదే ఆయుధం; అని= అని; క్రమంబునన్= క్రమంగా; వారలు+అందఱ= భీమసేనాదుల; విండులు= ధనుస్సులు; పెంపు+ఎసలారన్= గొప్పతనం ప్రకటితం కాగా; వేర్వేఱన్= వేరువేరుగా; పొగడి= ప్రశంసించి; గొనయములు= అల్లెత్రాళ్ళు; వదల్పన్= వదలించటానికి; అనుమతి= ఆజ్ఞ; చేయుడున్= చేయగానే; వారున్= భీమాది పాండవులందరు; అట్లు+అ=

ఆ విధంగానే; చేసి= చేసి; తేరన్= తేగా; చాపములును= ధనుస్సులను; దొనలు= అమ్ముల పొదులను; వర్మములున్= కవచాదులను; అదిసి= కత్తులను; ముద్గర+ఆది= ఇనుపగుదియలు మొదలయిన; ఆయుధములు= ఆయుధాలను; అతఁడు= ధర్మరాజు; కూడన్+కట్టెన్= చేర్చి కట్టకట్టాడు.

**తాత్పర్యం:** 'మానధనుడవయిన భీమా! సైంధవుడినీ, యక్షులనూ, పాంచాలురనూ, త్రిగర్తుడినీ దీనితోనే కదా ఓడించావు. నకులా! సౌరాష్ట్రదేశరాజు మొదలయిన విరోధులను దీనిచేతనే కదా సంహరించావు. సహదేవా! కళింగపాండ్యమగధ దేశపు రాజులను జయించేవేళ ఈ కోదండమే కదా నీకు సహాయపడ్డది' - అని వరుసగా వారి ధనుస్సులను ప్రశంసించాడు. అలా ప్రశంసించి, వారి ధనుస్సుల నారులు విప్పటానికి ధర్మరాజు అనుమతించాడు. వారు ఆ పనిని పూర్తిచేయగా ధనుస్సులు, అమ్ముల పొదులు, కవచాలు, కత్తులు, గుదియలు మొదలయిన ఆయుధాలను ఒకచోట చేర్చి, ధర్మరాజు కట్టకట్టాడు.

**విశేషం:** ధనువులకు నారులు సడలించి మూటకట్టే ఈ ఘట్టాన్ని తిక్కన నాటకీయంగా చిత్రించాడు. మూలంలో కథాకథనంలో భాగంగా సాగిన అంశాలను పాత్రోచిత భంగిమలలో చిత్రించాడు. అర్జునుడు గాండీవాన్ని వీడలేక విషాదాన్ని ప్రదర్శించాడు. గాండీవ మాహాత్మ్యాన్ని గురించి అర్జునుడే స్మరించి వియోగచింతను పొందినట్లు చిత్రించటం నాటకీయం. ఆ తరువాత భీమనకుల సహదేవుల కార్ముకాల గొప్పతనాలను ధర్మజుడు కీర్తించినట్లు రచించటం నాటకీయం. మధ్య ధర్మజుడు తన వింటి మహిమను తానే చెప్పుకొన్నట్లు కాక తిక్కన వర్ణించి వదలిపెట్టటం ఔచిత్యం. ఆత్మప్రశంస చేసికొనని ధీరోదాత్తుడిగా ధర్మరాజును మిగిల్చాడు తిక్కన. మూలంలో కథా కథన శిల్పంలో భాగంగా ఉన్నదానిని పాత్రోచిత సంభాషణ వైఖరిగా మార్చటం ఇందులోని నాటకీయత. ఆ కళ తిక్కనకు కరతలామలకం. (సంపా.)

**వ. ఇట్లు పూర్వోక్త ప్రకారంబునం బొదివి, మహోరగంబులం బెట్టియలం బెట్టి కట్టు చందంబున బంధించి, వానిం గొనుచు, నయ్యజాతశత్రుండు ధర్మదేవతా దత్తవరుం డగుటంజేసి నిశ్శంకం బైన యంతఃకరణంబుతోడ శమీవృక్ష సమారోహణం బాచరించి. 173**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పూర్వ+ఉక్తప్రకారంబునన్= ముందు చెప్పిన పద్ధతిలో; ఆ+అజాత శత్రుండు= ఆ ధర్మరాజు; పొదివి= పట్టుకొని; మహా+ఉరగంబులన్= పెద్దపెద్ద పాములను; పెట్టియలన్= పెట్టెలలో; పెట్టి కట్టు చందంబునన్= పెట్టి కట్టే విధంగా; బంధించి= గట్టిగా కట్టి; వానిన్+కొనుచున్= వాటిని తీసికొని; ధర్మదేవతా దత్తవరుండు+అగుటన్+చేసి= యమధర్మరాజుచేత ఇవ్వబడిన వరం కలవాడు కావటం వలన; నిశ్శంకంబు+ఐన= సంకోచం లేని; అంతఃకరణంబుతోడన్= మనస్సుతో; శమీవృక్ష సమారోహణంబున్= జమ్మిచెట్టు ఎక్కటాన్ని; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** ఆ విధంగా ముందు చెప్పినట్లు ధర్మరాజు చేర్చి పట్టుకొన్నాడు. పాములను పెట్టెలలో పెట్టి బంధించినట్లుగా ఆ ఆయుధాలన్నిటిని మోపు కట్టాడు. యముడివలన వరం పొందినవాడు కావటంవలన ధర్మరాజు నిస్సంకోచంగా ఆ జమ్మిచెట్టు ఎక్కాడు.

**విశేషం:** అలం: ఉపమ. అర్జునుడు గాండీవాన్ని పామువంటిదని చెప్పినది మొదలు పాండవుల ఆయుధాల నన్నిటినీ సర్పోపమానంతో వర్ణించి కథను నిర్వహించటం తిక్కన కావ్యకళా శిల్పాంశం. (సంపా.)

**తే. బ్రహ్మ విష్ణు మహేశ దిక్పాల చంద్ర। సూర్య వనదేవతా పితృస్తుతు లొనర్చి**
**దివియు భువియును జూచి ప్రార్థించి, యొక్క। విపులశాఖ నాయుధములు వ్రేలఁగట్టె. 174**

**ప్రతిపదార్థం:** బ్రహ్మ, విష్ణు, మహా+ఈశ; దిక్+పాల, చంద్ర, సూర్య, వనదేవతా, పితృ, స్తుతులు= బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, దిక్పాలకులు, చంద్రుడు, సూర్యుడు, వనదేవతలు, పితృదేవతలకు సంబంధించిన స్తోత్రాలను; ఒనర్చి= చేసి; దివియున్= ఆకాశాన్ని; భువియును= భూమిని; చూచి= చూచి; ప్రార్థించి= ప్రార్థన చేసి; ఒక్క విపులశాఖన్= ఒక పెద్ద కొమ్మకు; ఆయుధములు= ఆయుధాలను; వ్రేలన్+కట్టెన్= వ్రేలాడకట్టాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు బ్రహ్మను, ఈశ్వరుడిని, విష్ణువును, దిక్పాలకులను, చంద్రుడిని, సూర్యుడిని, వనదేవతలను, పితృదేవతలను స్తుతించాడు. భూమ్యాకాశాలను చూచాడు, ప్రార్థించాడు. ఒక పెద్దకొమ్మకు ఆయుధాలను వ్రేలాడ గట్టాడు.

**వ. ఇట్లు కట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి. 175**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కట్టి= కట్టి; తదీయ+అధిదైవతంబులన్= వాటి అధిదేవతలను; ఉద్దేశించి= గురించి; నమస్కరించి= నమస్కారం చేసి.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆయుధాలను వ్రేలాడగట్టాడు. ఆ ఆయుధాల అధిదేవతలకు నమస్కరించాడు. తదనంతరం ఆయుధాల నుద్దేశించి ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** 1. ధర్మరాజు ఆయుధాల అధిదేవతలను స్మరించి వారిరక్ష వాటికి ఉండేటట్లు ప్రార్థించాడు. పాండవుల ఆయుధాలలో కొన్ని దైవదత్తాలు. గాండీవం, అక్షయతూణీరాలు మొదలైనవి అటువంటివే. అంతేకాక రాజులు వారి ఆయుధాలను పనిముట్లుగానే భావించరు. దైవస్వరూపాలుగా భావిస్తారు. అందువలననే ఆయుధపూజ ఒక సంప్రదాయ మైంది. ఒక్కొక్క ఆయుధానికి ఒక్కొక అధిదైవం ఉంటుంది. ఆ దైవమే ఆ ఆయుధరూపంలో వర్తిస్తుంది అని విశ్వాసం. ఆయుధాలలో అస్త్రాలు కూడా చేరుతాయి. అవి మంత్రరూపాలు. మంత్రాలకు అధిదైవతా లుండటం ప్రసిద్ధం. ఏమైనా అటువంటి రక్షా దేవతలందరూ కలిసి ఆయుధాలను కాపాడుతూ ఉండాలని సంప్రదాయబద్ధంగా ధర్మజుడు ప్రార్థించాడని భావం. ఇది అమూలకం.

2. మూలంలో చెట్టెక్కి, ఆయుధాలను కొమ్మకు వ్రేలాడకట్టింది నకులుడు. తెలుగులో ధర్మజుడు. ఈ మార్పు తిక్కన ఔచిత్యకల్పనకు తార్కాణం. ధర్మజుడైతేనే అధిదేవతలను ఆరాధించగలడు. వారి రక్షను ఆవహింపచేయగలడు. తనకూ అర్జునుడికీ తప్ప ఇతరులకు ఆ ఆయుధాలు ఆయుధాలవలె కనపడకుండా ఉండేటట్లు చూడండి- అని అడుగ గలడు. అతని మాటలు మన్నించి అధిదేవతలు అనుగ్రహించగలరు. నకులుడు ఇటువంటి పనులు చేయలేడు. ధర్మజుడు కట్టింది ఆయుధాల మూట; చెట్టుకొమ్మకు కట్టిపెట్టింది మంత్రాల మూట! ఇది తిక్కన తీర్పు (సంపా.)

**క. 'నరునకు నాకుం దక్కఁగ। నొరులకు మీరూపు సూపకున్నది; విషవి**
**స్ఫురిత భుజగభంగీ భయం। కర మూర్తులు దాల్చి యుండఁగా వలయుఁ జుఁడీ. 176**

**ప్రతిపదార్థం:** నరునకున్= అర్జునునికి; నాకున్= నాకు; తక్కఁగన్= తప్పించి; ఒరులకున్= ఇతరులకు; మీ రూపు= మీ రూపాన్ని; చూపక+ఉన్నది= చూపించకండి; విష= విషంతో; విస్ఫురిత= ప్రకాశించే (విజృంభించే); భుజగభంగిన్= పాములవలె; భయంకరమూర్తులు= భయంకరమయిన ఆకారాలు; తాల్చి= ధరించి; ఉండఁగాన్ వలయున్+చుఁడీ!= ఉండాలి సుమా!.

**తాత్పర్యం:** 'అర్జునుడికీ నాకూ తప్ప ఇతరులకు మీ ఉనికిని చూపించకండి. మీరు విషసర్పాలవలె కనపడాలి. మీ ఆకారం భయంకరంగా ఉండాలి.

**విశేషం:** భవిష్యత్కథలో అర్జునుడు ఉత్తరగోగ్రహణ సందర్భంలో ఈ ఆయుధాలను వాడుకొనవలసి వస్తుంది. అందుచేత తనకూ, అర్జునునికీ తప్ప ఇతరులకు కనబడరాదని ధర్మరాజు చెప్పటం ఒక విశేషం. అర్జునుడిపట్ల అతని అనురాగానికి ఈ మాట తార్కాణం కూడా. చూపక+ఉండునది - చూపకున్నది.

**ఉ. భీముఁడు ధార్తరాష్ట్రకుల భీషణరోషుఁడు; చిత్త మెప్పు డె**
**ట్లై మదమెత్తునో; యతని యాగ్రహవృత్తికి లోనుగాక మీ**
**రే మెయి నైన వంచన వహించి తొలంగుట మత్సమీహితం;**
**బేమఱకుండఁగా వలయు నివ్విషమాబ్దములోన నాతనిన్.** **177**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీముడు; ధార్తరాష్ట్రకుల= ధృతరాష్ట్రుని పుత్రసమూహానికి (వారిపట్ల); భీషణరోషుఁడు= భయంకరమయిన రోషం కలవాడు; చిత్తము= అతని మనస్సు; ఎప్పుడు+ఎట్లు+ఐ= ఎప్పుడు ఎట్లా అయి; మదము+ఎత్తునో= మదించునో; అతని= భీమునియొక్క; ఆగ్రహవృత్తికిన్= కోపప్రవర్తనకు; లోనుకాక= లోబడక; మీరు= మీరు (ఆయుధాలు); ఏమెయిన్+ఐనన్= ఏ విధంగానయినా; వంచన వహించి= వంచనభావంతో; తొలంగుట= తప్పుకొనటం; మత్+సమీహితంబు= నాకోరిక; ఈ+విషమ+అబ్దములోనన్= ఈ సంక్లిష్ట అజ్ఞాతవాస కాలంలో; అతనిన్= భీముని; ఏమఱక+ఉండఁగాన్+వలయున్= ఏమరకూడదు.

**తాత్పర్యం:** భీముడు కౌరవులందరిమీద పట్టరాని రోషాన్ని ప్రదర్శిస్తాడు. అతడి మనస్సు ఏ సమయంలో ఎట్లా మదావేశాన్ని ప్రకటిస్తుందో. అతడికి ఆగ్రహం వస్తే మిమ్మల్ని ఆశ్రయించవచ్చును. అప్పుడు అతడి కోపప్రవృత్తికి మీరుకూడా వశమై పోకుండా ఏదైనా ఒక కపటమైన మిషతో తప్పుకొనండి. ఇది నా కోరిక, క్లిష్టమైన ఈ అజ్ఞాతవాస సంవత్సర కాలంలో (అందరం అతడిపట్ల) ఏమరకుండా ఉండాలి.

**విశేషం:** 1. ఈ మాటలు మూలంలో లేవు. తిక్కన కల్పించాడు. ఆయుధాల అధిదేవతల భావనం, కీర్తనం వృధా కారాదు. వారు ప్రచ్ఛన్నంగా ధర్మజుడికి ప్రసన్నులై ఉన్నారు. ఆయుధాలు పనిముట్లు కావు. రక్షామూర్తులైన దేవతలు. వారికి తనమనసులోని మాట చెప్పుకొన్నాడు. పరోక్షంగా దేవతలను వరం కోరినట్లు కోరాడు. భీము డావేశపరుడనీ, అసమయ సాహసాలు ప్రదర్శించటం నీతి కాదనీ, అతడిని అదుపులో పెట్టుకొనాలనీ కుబేరుడు (ఆరణ్యపర్వంలో) ధర్మరాజుకు హితవు చెప్పాడు. దాని నిక్కడ అనుసంధించుకొన్నాడు విజ్ఞుడైన ధర్మజుడు. కౌరవులు పాండవుల అజ్ఞాతవాసనియమాన్ని భంగం చేయటానికి కుటిలయత్నాలు చేయవచ్చును. అవి రోషావేశపరుడైన భీముడిని రెచ్చగొట్టవచ్చును. అతడు ఆవేశంతో ఆయుధాలను వెలికితీసి కౌరవులమీద విజృంభించవచ్చును. అటువంటి పని చేయగలవాడు భీముడొక్కడే. ఒకవేళ మేరమీరి సాహసిస్తే ఆయుధాలు అదృశ్యంగా ఉండి అతడిచేతిలో పడగూడదని ధర్మజుడి అభిమతం. అజ్ఞాతవాసంలో పాండవులను గుర్తించటానికి తోడ్పడే ప్రధాన చిహ్నాలు ఆయుధాలని ఈ ప్రకరణం తెలిపింది.

2. విశేషమేమంటే - ఎట్టి పరిస్థితులలోనూ ఆయుధాలను వెలికి తీయవద్దని భీముడితో చెప్పవచ్చును కదా! ఒకడి ఆయుధ ధారణం అందరికి ఆపద కలిగిస్తుందని హెచ్చరించవచ్చును. తన ఆనతి భీముడు మీరినా ఆయుధాలైనా పాటిస్తాయని భీమాదులను పరోక్షంగా హెచ్చరించాడు ధర్మరాజు. అందువలననే ఆయుధాలనే అతడికి వశం కాకుండా ఉండండని కోరటం ప్రకరణౌచిత్యం. దేవతలు పిలిస్తే పలుకుతారు ధర్మరాజుకు. (సంపా.)

**వ. అని వేడికొని వృక్షంబు డిగ్గి దానికిం బ్రదక్షిణంబు వచ్చి ప్రణమిల్లి భీమసేనుదెస మరలి చూచి సాంత్వన వచన సమేతంబుగా నతనిం గౌఁగిటంజేర్చి యనునయించి తమ చేసిన విధంబు తత్ప్రదేశవర్తు లయిన గోపాలాది క్షుద్రజనంబులకు మఱుఁగు వెట్టం దలంచి వారల కభిముఖులై పాండునందను లందఱు నిట్లనిరి.** **178**

**ప్రతిపదార్థం:** అని వేఁడికొని= అని ప్రార్థించి; వృక్షంబు డిగ్గి= జమ్మిచెట్టు నుండి దిగి; దానికిన్= ఆ వృక్షానికి; ప్రదక్షిణంబు వచ్చి= ప్రదక్షిణంచేసి; ప్రణమిల్లి= నమస్కరించి; భీమసేనుదెసన్= భీమునివైపు; మరలిచూచి= తిరిగిచూచి; సాంత్వనవచన సమేతంబుగాన్= ఓదార్పు మాటలతో; అతనిన్= భీముని; కౌఁగిటన్+చేర్చి= కౌగిట్లో చేర్చుకొని (ఆలింగనం చేసికొని); అనునయించి= ఊరడించి; తమ చేసిన విధంబున్= తాము చేసిన దానిని; తత్ప్రదేశవర్తులు= ఆ ప్రదేశంలో తిరిగేవారు (తచ్చాడేవారు); గోపాల+ఆది= పశువుల కాపర్లు మొదలైన; క్షుద్రజనంబులకున్= సామాన్య ప్రజలకు; మఱుఁగు+పెట్టన్+తలంచి= కప్పిపుచ్చాలనుకొని; వారలకున్= ఆ క్షుద్రజనులకు; అభిముఖులు+ఐ= ఎదురు ముఖం కలవారై (ఆ ప్రజల వైపు తిరిగి); పాండునందనులు+అందఱును= పాండవులందరూ; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** ఇట్లా ప్రార్థించి ధర్మరాజు చెట్టు దిగాడు. ఆ చెట్టుకు ప్రదక్షిణం చేశాడు. నమస్కరించాడు. భీముడివైపు తిరిగాడు. అనునయించాడు. ఆప్యాయంగా కౌగిలించుకొని ఊరడించాడు. తాము చేసినపని ఆ చుట్టుప్రక్కలున్న గొడ్ల కాపరులకు తెలియకుండా ఉండేందుకుగాను వారి వైపు తిరిగాడు. పాండవులందరు ఆ గోపాలకులతో ఇట్లా అన్నారు.

**విశేషం:** ధర్మజుడు భీముడి రోషావేశంవలన కలిగే విపత్తును వ్యంగ్యంగా పేర్కొని ఆయుధాల మిషతో ఎత్తిపొడిచాడు. భీముడి మనస్సు నొచ్చుకొని ఉండవచ్చును. అది అతడు బయటపెట్టకుండా గంభీరంగానే అన్నాడు. అయినా అతడి మనసును గుర్తించి ధర్మజుడు అతడిని బుజ్జగించాడు. సమయోచిత వ్యవహారజ్ఞుడు ధర్మజుడు.(సంపా.)

**చ.** **'ఇది శతవృద్ధ మాజనని; యిప్పుడు మృత్యువుఁ బొందె; నట్లు సే**
**యుదుము; కులప్రయుక్త మగుచున్న సనాతన ధర్మ మిత్తెఱం**
**గ; దహన కర్మ మొల్ల; మది గానిదిగా మును నిశ్చయించి మా**
**మొదలిటివా రొనర్చు విధముం గొనియాడితి మేము నియ్యెడన్.** **179**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ శవం; శతవృద్ధ= నూరు సంవత్సరాలు నిండిన ముసలిది; మా జనని= మా తల్లి; ఇప్పుడు= ఇప్పుడు; మృత్యువున్+పొందెన్= మరణించింది; (చచ్చిన వారిని) అట్లు= ఆ విధంగా; చేయుదుము= చేస్తాము; కులప్రయుక్తము+ అగుచున్+ఉన్న= మా కులంవారిచేత చేయబడుతున్న; సనాతన ధర్మము= ప్రాచీన ధర్మం; ఈ+తెఱంగు+అ= ఈ పద్ధతే; దహనకర్మము= అగ్ని సంస్కారం చేసేపద్ధతిని; ఒల్లము= అంగీకరించం; అది కానిదిగాన్= శవదహనం పనికిరానిదిగా; మును= ముందు; నిశ్చయించి= నిర్ణయించి; మా మొదలిటివారు= మా పూర్వులు; ఒనర్చు= చేసే; విధమున్= పద్ధతి ప్రకారం; మేమున్= మేము కూడా; ఈ+ఎడన్= ఈ సమయంలో; కొనియాడితిమి= ఆదరించాము.

**తాత్పర్యం:** 'ఈమె మా తల్లి. నూరేళ్ళు నిండిన ముసలిది. ఇప్పుడు చనిపోయింది. మేము దహనం చేయం. ఇది మా కులాచారం. ఇదే మా సనాతన ధర్మం. మా పెద్దలు ఏ రకంగా చేసేవారో అదే మేము ఇప్పుడు చేశాం.

**విశేషం:** తల్లి (కుంతి) బ్రతికుండగా తల్లి చనిపోయిందని ధర్మరాజు చెప్పటం సమంజసమా కాదా అన్నది ప్రశ్న. అట్లాగే దహనం, ఖననం అనే రెండు పద్ధతులుంటే రెండూ కాక చెట్టుకు కట్టడం ఏమిటన్నది మరో ప్రశ్న. రెండవది కులాచార మనటంవలన సందేహనివృత్తి. మొదటిది ఆపద్ధర్మం.

**క. అని యిట్లు పలుమఱుం దెలియఁబలికి శస్త్రాస్త్రంబుల నిక్షేపణంబు నిగూఢం బగుటకు నూఱడిల్లి; యచ్చేరువం జచ్చిన పసరంబు పడియున్నం జూచి, సహదేవుం బనిచి, ధర్మ తనయుండు దాని చర్మం బొలిపించి, శీతాతప వర్ష పరిహారంబుగా నాయుధంబులం బొదివించి, మఱియును దత్సమీపంబున నొక్క శుష్కశవంబు నవలోకించి 'యిది యుంఛవృత్తి యైన మానవు కళేబరంబు గావలయు' ననుచు నదియునుం గైదువుల కట్టపయిం బెట్టి కట్టించె; నివ్విధంబున నత్యంతగుప్తి యాచరించి, 'దీని దుర్గంధంబున వనచారు లెవ్వరుం జేర రని నవ్వుచు వార లచ్చోటు వాసి విరాట పురాభిముఖులై చనుచుండి, యజ్ఞాతవాస కాలంబునం దమ రహస్యపు వ్యవహారంబునకు ననువుగా నేవుర పేళ్ళను గ్రమంబున జయుండును, జయంతుండును, విజయుండును, జయత్సేనుండును, జయద్బలుండునని సంకేతించుకొని, యాజ్ఞసేనీ పురస్సరంబుగాఁ బుణ్యనదీ తీర్థావతరణంబు సేసి, తదీయస్నానంబునం బథిశ్రమం బపనయించి, దేవపితృతర్పణ మంగళ జపహోమ ధ్యానాద్యనుష్ఠానంబు లొనర్చిరి; తదనంతరంబ యక్కౌంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుం డయి నిర్మలచిత్తంబున ధర్మదేవతం దలంచి యిట్లనియె. 180**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ విధంగా; పలుమఱున్= అనేకసార్లు; తెలియన్+పలికి= తెలిసేవిధంగా చెప్పి; శస్త్ర+అస్త్రంబుల నిక్షేపణంబు= ఆయుధాల దాపరికం; నిగూఢంబు+అగుటకున్= రహస్యమవడానికి; ఊఱడిల్లి= ఎంతో సంతృప్తిపడి; ఆ+చేరువన్= ఆ సమీపంలో; చచ్చిన= మరణించిన; పసరంబు= పశువు; పడియున్నన్+చూచి= పడిఉండటం చూచి; సహదేవున్= సహదేవుని; పనిచి= పంపి (ఆజ్ఞాపించి); ధర్మతనయుండు= ధర్మరాజు; దాని చర్మంబు+ఒలిపించి= చచ్చిన పశువు చర్మాన్ని ఒలిపించి; శీత+అతపవర్షపరిహారంబుగాన్= చలి ఎండ వాన తగలకుండేటట్లుగా; ఆయుధంబులన్= ఆయుధాలను; పొదివించి= చుట్టించి; మఱియును= మరింకా; తద్+సమీపంబునన్= దానిదగ్గర; ఒక్క= ఒక; శుష్క= ఎండిపోయిన; శవంబున్= శవాన్ని; అవలోకించి= చూచి; ఇది= ఇదికదా; ఉంఛవృత్తి+ఐన= పొలాలలో కోతలయిన తరువాత రాలిన గింజలను ఏరుకొని తినేవృత్తిలో బ్రతికే; మానవు కళేబరంబు కావలయున్= మనిషి యొక్క శవం కావచ్చును; అనుచున్; అదియునున్= ఆ శవాన్ని కూడా; కైదువుల కట్టపయిన్= ఆయుధాల కట్టపయిని; పెట్టి కట్టించెన్= పెట్టి కట్టించాడు; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; అత్యంత= మిక్కిలి; గుప్తి= దాపరికాన్ని; ఆచరించి= చేసి; దీని= దీనియొక్క; దుర్గంధంబునన్= చెడుకంపు కారణంగా; వనచారులు= అడవిలో తిరిగేవారు; ఎవ్వరున్+చేరరు+అని= ఎవ్వరుకూడా సమీపించరు అని; నవ్వుచున్= (సంతృప్తి సూచకంగా) నవ్వుతూ; వారలు= పాండవులు; ఆ+చోటు+పాసి= ఆ ప్రదేశాన్ని వదలిపెట్టి; విరాటపుర+అభిముఖులు+ఐ= విరాటమహారాజు పురం వైపు; చనుచున్+ఉండి= వెళ్ళుతూ; అజ్ఞాతవాసకాలంబునన్= అజ్ఞాతవాసకాలంలో; తమ= తమయొక్క; రహస్యము+వ్యవహారంబునకున్= రహస్యంగా పిలుచుకొనటానికి; అనువుగాన్= తగిన విధంగా; ఏవుర పేళ్ళును= ఐదుగురి పేర్లను; క్రమంబునన్= వరుసగా, క్రమంగా; జయుండును= (ధర్మరాజు పేరు) జయుండు; జయంతుండును= (భీముని పేరు) జయంతుడు; విజయుండును= (అర్జునుని పేరు) విజయుడు; జయత్సేనుండును= (నకులుని పేరు) జయత్సేనుడు; జయద్బలుండును= (సహదేవుని పేరు) జయద్బలుండు; అని= అనే పేరుతో; సంకేతించుకొని= సంకేతపు పేర్లు పెట్టుకొని; యాజ్ఞసేనీపురస్సరంబుగాన్= ద్రౌపదిని ముస్నిడుకొని; పుణ్యనదీతీర్థ+అవతరణంబు+చేసి= పుణ్యనదీతీర్థంలో దిగి; తదీయ స్నానంబునన్= ఆ పుణ్యనదిలో స్నానం చేయటం వలన; పథిశ్రమంబు= ప్రయాణపు బడలికను; అపనయించి= పోగొట్టుకొని; దేవపితృతర్పణ మంగళ జపహోమ= దేవతలకూ; పితృదేవతలకూ తర్పణాదులను, శుభాన్ని కలిగించే జపాలనూ, హోమాలనూ; ధ్యాన+ఆది+అనుష్ఠానంబులు= ధ్యానం మొదలయిన అనుష్ఠానాలనూ; ఒనర్చిరి= చేశారు; తద్+అనంతరంబు+అ= ఆ తర్వాత; ఆ+కౌంతేయ+అగ్రజుండు= కుంతీపుత్రులలో పెద్దవాడయిన ధర్మరాజు; ప్రాక్+ముఖుండు+అయి= తూర్పు ముఖం కలవాడయి; నిర్మల చిత్తంబునన్= కల్మషంలేని మనస్సులో; ధర్మదేవతన్+తలంచి= యమధర్మరాజును తలచుకొని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా ఎన్నోసార్లు అందరికీ తెలిపేటట్లు చెప్పాడు. తమ ఆయుధాలు చాల రహస్యమయిన పద్ధతిలో దాచినందుకు ధర్మరాజు సంతోషించాడు. ఆ తరువాత దగ్గరలో చచ్చిపడిఉన్న జంతువును చూచాడు. దాని చర్మాన్ని ఒలిచితీయుమని సహదేవుడిని ఆజ్ఞాపించాడు. దానిని ఆయుధాలకు చలి గాలి, ఎండ, వానలు సోకకుండా వాటిమీద చుట్టించాడు. దగ్గరలో ఒక ఎండిన శవాన్ని చూచాడు. బహుశః దానిని ఉంఛవృత్తి చేసే మానవుడి కళేబరమని భావించాడు. ఆ శవాన్నికూడా ఆయుధాలమీద పెట్టి కట్టించాడు. ఈ విధంగా ఆయుధరక్షణ కార్యక్రమం పూర్తి చేశాడు. దుర్వాసన కారణంగా అడవిలో తిరిగేవారు కూడా ఎవరూ దగ్గరకు రారని భావించి సంతోషించాడు.

ఈవిధంగా వారు ఆ ప్రదేశం విడిచి విరాటనగరంవైపు వెళుతూ అజ్ఞాతవాసకాలంలో తమ రహస్య వ్యవహారాలకు అనుకూలంగా అయిదుగురి పేర్లను వరుసగా జయుడు, జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడు అని మార్చుకొన్నారు. వారు ద్రౌపదిని ముందుంచుకొని పవిత్ర నదులందు దిగి స్నానాలు చేశారు. ఆ స్నానాలతో దారిబడలికలు తీర్చుకొని, దేవతలకు, పితృదేవతలకు తర్పణాలు సలిపారు. జపాలు, హోమాలు, దైవధ్యానాలు మొదలైన అనుష్ఠానాలు నెరవేర్చారు. అటుపిమ్మట కుంతి కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజు తూర్పుముఖంగా కూర్చొని నిర్మలమైన మనస్సుతో ధర్మదేవతను స్మరించి ఇలా అన్నాడు.

**విశేషం:** 1. మారువేషాలలో ఉన్నప్పుడు మారుపేర్లు ఉండటం అవసరం. అందరి పేర్లూ జయశబ్దంతో ప్రారంభం కావటం విశేషం. పేర్లు విజయ సూచకములు. విజయుడి పేరు విజయుడిగానే ఉండటం గమనార్హం. ద్రౌపదికి మారుపేరు పెట్టలేదు. ఆమెను మారుపేరు లేకుండా సర్వనామంగానే పిలవటానికి నిశ్చయించాడు ధర్మరాజు. ఒక పేరుతో అయిదుగురు పురుషులు ఒక స్త్రీని పిలిస్తే ఇతరులు అనుమానించే అవకాశం ఉంది. అందువలన ఆమెకు రహస్యసంజ్ఞ లేకుండటమే ఔచిత్యం.

2. విరాటనగరానికి పోతూ ధర్మరాజు దుర్గాదేవిని స్తుతించినట్లు, ఆమె ప్రత్యక్షమైనట్లు, అజ్ఞాతవాసంలో వారి నెవరు గుర్తించకుండా ఉండేటట్లూ, ఆ తరువాత కొలది కాలంలోనే జరిగేయుద్ధంలో పాండవులకు విజయం లభిస్తుందనీ, రాజ్యం ప్రాప్తిస్తుందనీ అభయం, రక్ష ఇచ్చినట్లూ ఒక అధ్యాయమే (6వ అధ్యాయం) కొన్ని సంస్కృత ప్రతులలో ఉన్నది. తిక్కన దీనిని తెలుగులోనికి తేలేదు. భండార్కరు ప్రతిలోకూడా ఇది లేదు. ఆరణ్యపర్వం చివర ధర్ముడు పాండవులకు ఇటువంటివరమే ఇచ్చి ఉన్నాడు. దానిని స్మరించి ధర్ముడిని ప్రార్థించినట్లు మాత్రమే వ్రాశారు. పూర్వాపరవైరుద్ధ్యం లేని కథానిర్మాణాన్ని తిక్కన సాధించాడు. అవసరమైన కథాంశాలను వదలి ఔచిత్యం పాటించాడు.

3. శ్మశాన దర్శనం, శవస్పర్శనం మొదలైన అమంగళకరమైన చర్యలనుండి పవిత్రులు కావటానికి పుణ్యతీర్థస్నానం, తర్పణాదులు, అర్చనాదులు పాండవులు చేసినట్లు చెప్పటం కూడా తిక్కన కల్పనే. అజ్ఞాతవాసాన్ని ఒక నియమ వ్రతంగా చేపట్టబోతున్న శుభారంభాన్ని ఇది సూచిస్తున్నది. (సంపా.)

**ఆ. 'తండ్రి! నీవు నాకు దయతోడ నిచ్చిన। వరము చిత్తగించి, వలయు తెఱఁగు**
**సమయ సముచితముగ సమకట్టు మయ్య! యీ। రాకుమారు లవిధిఁ బోక యుండ.' 181**

**ప్రతిపదార్థం:** తండ్రి!= తండ్రీ; నీవు= నీవు; నాకున్= నాకు; దయతోడన్= కరుణతో; ఇచ్చిన= ఇచ్చినటువంటి (ప్రసాదించినట్టి); వరమున్= వరాన్ని; చిత్తగించి= తలంచి; ఈ రాకుమారులు= రాజకుమారులయిన ఈ పాండవులు; న+నిధిన్+పోక+ఉండన్= అక్రమాన్ని ఆచరించకుండా; వలయు తెఱఁగు= తగిన పద్ధతిని; సమయసముచితముగన్= అజ్ఞాతవాస కాలానికి తగినట్లుగా; సమకట్టుము+అయ్య= సమకూర్చుము.

**తాత్పర్యం:** 'తండ్రీ! నీవు నాకిచ్చిన వరాన్ని మన్నించి, ఈ రాకుమారులు అధర్మానికి పాల్పడకుండా కాపాడుము. మేము చేయవలసిన పని ఏ సమయాలలో ఏ విధంగా చెయ్యాలో దానికి తగినట్లుగా సమకూర్చుమయ్యా!'

**వ. అనుచు ననుజుల దెసకు దూర వగచి డగ్గుత్తిక వెట్టి మఱియును. 182**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; అనుజులదెసకున్= తమ్ముళ్ళస్థితికి (దెసకు); దూర వగచి= (దురపిల్లి అని భావం) మిక్కిలి దుఃఖించి; డగ్గుత్తిక+పెట్టి= వణికే గొంతుతో; మఱియును= మరలా (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** అని తమ్ముళ్ళ దురవస్థకు చాలా బాధపడ్డాడు. దుఃఖం కారణంగా కంఠం గద్గదం కాగా ఇట్లా పలికాడు.

**ఉ. అంబరవర్తి వైనఁ గని యక్షునిచే నగపడ్డ వీరి ప్రా**
**ణంబులు మున్ను నిన్నడిగి, నల్వురకున్ నయవిక్రమ ప్రభా**
**వంబులు వేఁడికొన్న నతివత్సలభావము; బొంది యాదరా**
**ర్ద్రంబగు చూడ్కితోఁ బ్రియహిత స్థిరభాషల నూఱడింపవే. 183**

**ప్రతిపదార్థం:** అంబరవర్తివి+ఐనన్= ఆకాశంలో ఉండేవాడివి కాగా; కని= చూచి; యక్షునిచేన్+అగపడ్డ= యక్షునికి లోబడిన; వీరి ప్రాణంబులు= తమ్ముళ్ళ ప్రాణాలు; మున్ను నిన్నున్+అడిగి= ముందు నిన్నడిగి; నల్వురకున్= ఆ నలుగురికీ; నయవిక్రమ ప్రభావంబులున్= నీతి, పరాక్రమం, మహిమలను; వేడికొన్నన్= కోరుకొంటే; అతి వత్సల భావమున్+పొంది= అమితమయిన వాత్సల్యభావాన్ని వహించి; ఆదర+ఆర్ద్రంబు+అగుచూడ్కితోన్= ఆదరంతో తడిసిన చూపులతో; ప్రియహిత స్థిర భాషలన్= ప్రియాన్ని, హితాన్ని కలిగించే నిలకడతో కూడిన మాటలతో; ఊఱడింపవే= ఊరడించలేదా.

**తాత్పర్యం:** 'ఆకాశంలో ఉన్న నిన్ను చూచాను. యక్షుడి వశమైన నా తమ్ముళ్ళ ప్రాణాలు అడిగాను. నలుగురికీ నీతిని, పరాక్రమాన్ని, మహిమను వేడుకొన్నాను. నీ వెంతో వాత్సల్యం కనబరచావు. ఆదరదృష్టితో ఊరడించావు'.

**వ. అని తారు మున్ను భూసురవరు నరణి దేర నరిగిన నాఁడు సరోవరతీరంబునం దనకు ధర్ముండు సేసిన మన్నన దోఁప నతనికి విన్నవించినవాఁడై కరకమలంబులు మొగిచి, ఫాలభాగంబునం గదియించి, సంప్రార్థనంబుగా వినయ వినమిత మస్తకుం డగుటయుఁ, దదనుగ్రహంబునఁ బాండవాగ్రజుండున్న యునికిన సన్యాసి రూపం బలవడి ధాతుపట దండకమండలు కలిత మూర్తి యయ్యెఁ; నయ్యవసరంబున వారందఱు మహాద్భుతం బంద వారివారికి నయ్యైవేషంబుల కనుగుణంబులగు నంబరాభరణ మాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబు లయినం జూచి సంతసిల్లి, యెల్లవారిం గలయం గనుఁగొని, క్రమంబున నొంటిమ్రైఁ జనుదెండని నియోగించి, యతండు నానావిధంబులగు నక్షంబులముడి కక్షంబున నిడికొని, చని, దైవయోగంబున విరాటుండు వెడలివచ్చి బయలికొలు విచ్చుటంజేసి తదాస్థానంబు చేరంబోవునప్పుడు. 184**

**ప్రతిపదార్థం:** అని; తారు= తాము (పాండవులు); మున్ను= ముందు; భూసురవరును+అరణిన్= బ్రాహ్మణుని అరణిని; తేరన్= తీసికొని రావటానికి; అరిగిననాఁడు= వెళ్ళిననాడు; సరోవరతీరంబునన్= కొలనుగట్టు మీద; తనకున్= తనకు; ధర్ముండు+చేసిన= యమధర్మరాజు చేసినటువంటి; మన్నన+తోఁపన్= ఆదరం తోచే విధంగా; విన్నవించినవాఁడు+ఐ= విన్నపం

చేసినవాడయి; కరకమలంబులు= పద్మాలవంటి చేతులు; మొగిచి= ముడిచి; ఫాలభాగంబునన్+కదియించి= నుదుటి మీద చేర్చి; సంప్రార్థనంబుగాన్= ప్రార్థనా పూర్వకంగా; వినయ వినమిత మస్తకుండు= వినయంతో వంచిన తల కలవాడు; అగుటయున్= కాగా; తద్+అనుగ్రహంబునన్= అతని అనుగ్రహంచేత; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు ఉండగా; ఉన్న ఉనికిన్+అ= ఉన్నట్టుండి; సన్న్యాసి రూపంబు+అలవడి= సన్న్యాసి రూపం సమకూరగా; ధాతుపట= కాషాయవస్త్రం; దండకమండలు కలిత మూర్తియయ్యెన్= దండం, కమండలువుతో కూడిన రూపం కలవాడయ్యాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; వారు+అందఱున్= పాండవులందరు; మహా+అద్భుతంబు+అందన్= ఆశ్చర్యం పొందగా; వారి వారికిన్= వారివారికి; అయ్యైవేషంబులకున్+ అనుగుణంబులు+అగు= ఆయా వేషాలకు అనుగుణమయిన; అంబర+ఆభరణ+మాల్య+ఆది+ఉపకరణంబులు= వస్త్రాలు, ఆభరణాలు, దండలు మొదలయిన సాధనాలు; సన్నిహితంబులు+అయినన్+చూచి= దగ్గరికి చేరడం చూచి; సంతసిల్లి= సంతోషించి; ఎల్లవారిన్= అందరిని; కలయన్+కనుఁగొని= కలయచూచి; క్రమంబునన్= క్రమంగా; ఒంటిమైన్ చనుదెండు+అని= ఒక్కొక్కరే రండని; నియోగించి= ఏర్పాటు చేసి; అతండు= అతడు (ధర్మరాజు); నానావిధంబులు+అగు= అనేక విధాలయిన; అక్షంబులముడిన్= పాచికలమూటను; కక్షంబునన్= చంకలో; ఇడికొని= పెట్టుకొని; చని= వెళ్ళి; దైవయోగంబునన్= దైవానుగ్రహంచేత; విరాటుండు= విరాటమహారాజు; వెడలి వచ్చి= మందిరంనుండి బయటికి వచ్చి; బయలికొలువు+ఇచ్చుటన్+చేసి= బయట సభచేసి ఉండటంవలన; తద్+ఆస్థానంబు= విరాటమహారాజుయొక్క ఆస్థానాన్ని; చేరన్+పోవునప్పుడు= సమీపిస్తున్నప్పుడు.

**తాత్పర్యం:** విప్రుడి అరణి కొరకు వెళ్ళినరోజున చెరువుగట్టుమీద తనపై, తనతమ్ముళ్ళపై చూపిన అనుగ్రహాన్ని ధర్ముడి హృదయంలో స్ఫురించేటట్లు ధర్మరాజు విన్నవించుకొన్నాడు. చేతులు మోడ్చాడు. వినయంతో నమస్కరించాడు. అపుడు యముడి అనుగ్రహంవలన ధర్మరాజుకు సన్న్యాసివేషం సంక్రమించింది. కాషాయవస్త్రం దండం కమండలువు వచ్చాయి. అదే సమయంలో అందరూ ఆశ్చర్యపడేటట్లు పాండవుల వేషాలకు తగిన వస్త్రాలు ఆభరణాలు, మాలికలు మొదలయినవి ఎదురుగా కనబడ్డాయి. అందరూ సంతోషించారు. అందరిని చూచి ధర్మరాజు 'వరుసగా ఒక్కొక్కరూ రండి' అని ఆజ్ఞాపించాడు. తాను పాచికలమూటను చంకలో పెట్టుకొని వెళ్ళాడు. దైవవశాత్తు ఆనాడు విరాట మహారాజు బయట కొలువయి ఉన్నాడు. ధర్మరాజు ఆస్థానం సమీపిస్తుండగా.

**విశేషం:** యమధర్మరాజు ప్రసన్నుడైనాడు. దానికి కారణం ధర్మజుడి సంప్రార్థన. నమస్కారం, వినమిత మస్తకం, ధ్యానం, విన్నపం- అనే నాలుగు అంశాలు సంప్రార్థనలో ఉన్నాయి. రెండు చేతులు జోడించి నమస్కరించటం ప్రార్థనాముద్ర, మిత్రులకు హృదయందగ్గర, గురుదేవమూర్తులకు నెన్నుదురు దగ్గర, దేవతలకు శిరస్సుమీద చేతులుంచి నమస్కరించటం ఆచారం. ఇక్కడ ధర్మ్యుడిని దేవుడిగా, తండ్రిగా భావించి ధర్మజుడు నమస్కరించాడు కాబట్టి చేతులు ఫాలభాగంలో కదియించి ఉంచటమే నాట్యశాస్త్ర మర్యాద. తిక్కన నాటకీయత కీ నాట్యముద్రలు అలంకారాలు. భావాభివ్యక్తులు. నమస్కరించి, నిర్మలభావంతో ధ్యానించి లోన ధర్ముడి అంతర్దర్శనం చేసికొని అతడి వత్సలరసచైతన్యాన్ని జాగృతం చేశాడు. ఆ ధ్యానఫలమే పాండవుల వేషాలు. ఆ దైవానుగ్రహఫలమే విరాటుడు ఆనాడు నగరం బయట ప్రజలమధ్య కొలువు తీర్చి అందరికీ సులభంగా దర్శనం కలిగే అవకాశం కలిగించటం. ఈ బయటి కొలువు తిక్కన లోకజ్ఞతకు చిహ్నం. అమూలకం (సంపా.)

ధర్మరాజు సన్న్యాసి వేషంబున విరటుఁ గొల్వవచ్చుట (సం.4-6-1)

**ఉ.** **దవ్వులఁ జూచి మత్స్యవసుధావతి 'యీ చనుదెంచుచున్నవాఁ**
**డెవ్వఁడొ? నాదు చూడ్కులకు నెంతయు వ్రేఁగయి తోఁచె నె ట్లితం**
**డివ్విధిఁ బొందెనో? జగము లెల్లను నేలఁగఁ జాలు తేజ మా**
**మువ్వుర తోడి జోడి యగు మూర్తి; యతీంద్రుని యొప్పగంటిరే?** **185**

**ప్రతిపదార్థం:** మత్స్యవసుధావతి= మత్స్యదేశపు రాజయిన విరాటుడు; దవ్వులన్= దూరాన్నుండి; చూచి= చూచి; ఈ చనుదెంచుచున్నవాఁడు+ఎవ్వఁడొ?= ఇటువైపు వస్తున్న వాడెవడో; నాదు చూడ్కులకున్= నా చూపులకు; ఎంతయున్= మిక్కిలి; వ్రేఁగు+అయి, తోఁచెన్= అబ్బురంగా కనిపిస్తున్నాడు; ఇతండు= ఇతడు; ఎట్లు= ఏ విధంగా; ఈ+విధిన్+పొందెనో= ఈ స్థితిని పొందాడో; జగములు+ఎల్లన్= లోకాలన్నిటినీ; ఏలఁగన్+చాలు= పరిపాలించగలిగిన; తేజము= తేజస్సు; ఆ మువ్వురతోడి జోడియగుమూర్తి= ఆ త్రిమూర్తులతో సమానమయిన రూపం కలవాడయి; యతి+ఇంద్రుని ఒప్పు= సన్న్యాసులలో శ్రేష్ఠుడైన అతని తీరును; కంటిరే!= చూచారా!

**తాత్పర్యం:** విరాటుడు దూరం నుండి ధర్మరాజు వైపు చూచాడు. 'ఈ వచ్చేవ్యక్తి ఎవడో మహాతేజస్విగా కనిపిస్తున్నాడు. నా చూపులకు అబ్బురపాటు కలిగిస్తున్నాడు. లోకాలన్నీ పరిపాలించే తేజస్సు, ఆ త్రిమూర్తులతో సమానమయిన రూపం ఇతడికి ఉన్నాయి. యతీంద్రుడివలె ఉన్నాడు. గమనించారా?

**విశేషం:** 1. ధర్మరాజు కంకుభట్టుగా మారి విరాటుడి కొలువుకు చేరబోతున్నప్పుడు కొంత వైశంపాయనుడు చెప్పిన కథగా, కొంత విరాటుడి స్వగతంగా, కొంత ప్రకాశ భాషణంగా మూలంలో చిత్రించబడి ఉన్నది. తిక్కన ఆ మొత్తాన్ని విరాటుడు ప్రకాశంగా ప్రజలతో అన్నట్లే రచించటం విశేషం. ఇది నాటకీయత.

2. యతి వేషంలో ఉన్న కంకుభట్టు శరీర లక్షణాలలో ధర్మరాజే. వేషంలో మార్పేకాని, అంగవిన్యాసంలో లేదు. దీనిని తిక్కన తన కవితలో ధ్వనింపజేశాడు. వరుసగా నాలుగు పద్యాలు వ్రాశాడు. అందులో మొదటిది ఇది.

3. ఇందులో విరాటుడు కంకుభట్టును ఒక మహాత్ముడైన యతీంద్రుడిగా దూరంనుండి దర్శించాడు. ఆశ్చర్యపడ్డాడు. అతడి రూపం అపూర్వవ్యక్తి దర్శనం చేసినప్పుడు కలిగే అబ్బురపాటును చూపులకు కలిగించింది. అతడు లోకాలన్నీ ఏలగలిగినవాడు. త్రిమూర్తులతో దీటైనవాడు. అయినా యతీంద్రు డెందుకైనాడో తెలియని ఒక విరోధాభాసం విరటుడి మాటలలో ప్రశ్నార్థకంగా నిలిచింది. చక్రవర్తి యతీంద్రుడైనట్లు కనపడే ఒక విభ్రాంతి ఈ పద్యంలో ప్రధానాంశం. వర్ణ్యగుణం కంకుభట్టులో ఉన్న తేజస్సు. అది లోన క్షాత్ర లక్షణం, పైకి యతీంద్రలక్షణం. దీనిని విరాటుడు గుర్తించి వివేకవంతు డనిపించుకొన్నాడు. (సంపా.)

**సీ. కరచరణాద్యంగకంబు లేలొకొ రత్న। భూషణ ప్రకరంబు పొందు దొఱఁగె?;**
**నుభయ పార్శ్వంబుల నిభఘట లేలొకో। చనుదేవు సమదాళి సమితి మొరయఁ?;**
**బాయు తొలంగు మంచాయత వేత్ర హ। స్తుల మొత్త మేలొకో తోడ రాదు?;**
**ధవళాతపత్రముల్ దఱచుగా నేలొకో। పట్టరు మౌక్తిక ప్రభలు వెలుఁగ?;**

**తే. నితఁడు రాజగు; రాజను నింత మాత్ర। గాదు; మూర్ధాభిషిక్త వర్గంబుఁ దనదు**
**చరణయుగ్మంబు గొలిపింపఁ జాలు సార్వ। భౌమ పదవికిఁ దగియెడు భంగివాఁడు.** 186

**ప్రతిపదార్థం:** కరచరణ+ఆది+అంగకంబులు= చేతులు, కాళ్ళు మొదలయిన అవయవాలు; రత్నభూషణప్రకరంబు; పొందు= రత్నాలంకార సముదాయం యొక్క సాహచర్యాన్ని; తొఱగెన్= విడిచాయి; ఏల+ఒకొ?= ఎందుచేతనో?; సమద+ఆళి సమితి= మదించిన తుమ్మెదల సముదాయం; మొరయన్= మ్రోగేటట్లు; ఇభఘటలు= ఏనుగుల గుంపులు; ఉభయ పార్శ్వంబులన్= రెండు ప్రక్కలా; చనుదేవు= రావు; ఏల+ఒకో?= ఎందువలననో?; పాయు(ము)= తప్పుకో; తొలంగుము+అంచున్= తొలగిపో అంటూ; ఆయత వేత్రహస్తుల మొత్తము= పొడవైన బెత్తాలు చేతుల్లో ఉన్న వారి సముదాయం; తోడన్+రాదు= కూడా రావటంలేదు;

ఏల+ఒకో?= ఎందుకో?; మౌక్తికప్రభలు= ముత్యాలకాంతులు; వెలుఁగన్= ప్రకాశించేటట్లు; ధవళ+ఆతపత్రముల్= వెల్లగొడుగులు; తఱచుగాన్= విరివిగా; పట్టరు= పట్టుకొనరు; ఏల+ఒకో?= ఎందుకో?; ఇతఁడు= కనిపించే సన్న్యాసి; రాజు+అగున్= రాజయి ఉంటాడు; రాజు+అను+ఇంత మాత్ర, కాదు= రాజు మాత్రమే కాదు; మూర్ధ+అభిషిక్త వర్గంబు= పట్టాభిషేకం పొందిన రాజులను; తనదు చరణ యుగ్మంబున్= తన పాదాల జంటను; కొలిపింపన్+చాలు= సేవింపజేయగలిగిన; సార్వభౌమ పదవికిన్= చక్రవర్తి పదవికి; తగియెడు భంగివాఁడు= తగిన రీతిలో ఉన్నాడు.

**తాత్పర్యం:** కాళ్ళు చేతులు మొదలగు అవయవాలలో ఎందుకో రత్నాభరణాలు తీసివేసినట్లు కనిపిస్తున్నాయి . తుమ్మెదలఝుంకారాలతో ఇరువైపుల ఏనుగులు ఎందుకో రావటంలేదు. 'తప్పుకోండి, ప్రక్కకు జరగండి' అంటూ వేత్రహస్తులు వెంటరావటం లేదు ఎందుచేతనో మరి? ముత్యాల కాంతులను వెదజల్లే వెల్లగొడుగులు విరివిగా పట్టటం లేదు ఎందుచేతనో? ఇతడు బహుశః రాజయి ఉంటాడు. రాజుమాత్రమే కాదు, మూర్ధాభిషిక్తులయిన రాజులతో తన పాదాలు కొలిపించుకొనగల రాజరాజపదవికి తగినవాడు.

**విశేషం:** 1. దూరం నుండి సమీపానికి నడిచి వస్తున్న కంకుభట్టును చూస్తున్నాడు విరాటుడు. అతని నడకలో 'సార్వభౌమపదవికి దగియెడు భంగి' కనపడింది. చక్రవర్తి పురవీధులలో ఊరేగబోయినప్పుడు ఏ విధంగా ఠీవిగా నడిచే వైఖరిని ప్రదర్శిస్తాడో ఆ విధంగా కంకుభట్టు శరీరభంగిమలను ప్రకటిస్తున్నాడు. భేదమంతా ఎక్కడ ఉన్నదంటే ఆ మందీ మార్బలం ఆయన చుట్టూ లేరు. లేకపోయినా ఉన్నట్లు ఒక భావచిత్రాన్ని అతడి తీరు విరాటునికి తోపింపచేస్తున్నది. అరణ్యావాసంలో ధర్మజుడు నడిచినా అట్లాగే ఉండేది. కాని, అక్కడ గుర్తించే నాగరకులు లేరు. ఇప్పుడు విరాటుడు విజ్ఞుడైన భావుకుడు కాబట్టి నడక తీరునుబట్టి చక్రవర్తి హంగుల నన్నింటిని భావించగలిగాడు.

2. కంకుభట్టు రాజలాంఛనాలు తొలగిన రాజశేఖరుడు అని తిక్కన వర్ణించాడు. అతడి కాళ్ళకూ చేతులకూ ఉన్న రత్నాభరణాలు అప్పుడే తీసినట్లున్నాయట! అతడికి ఇరుప్రక్కల మదపుటేనుగులు రావటం అప్పుడే మానివేసినట్లున్నాయట! అతడి ముందు వెనుకల వేత్రహస్తులు ప్రజలను 'తొలగి దూరంగా ఉండండి' అని రాజును ప్రేమతో చూడాలని త్రొక్కిసలాడుతూ ముందుకువస్తున్న ప్రజలను అదుపు చేసే వైభవాన్ని అప్పుడే మానివేసినట్లున్నదట! ఆయన నడుస్తుంటే వెనక ముత్యాల వెల్లగొడుగులు పట్టటం అప్పుడే మానినట్లున్నదట! అవి రాజైన ప్రతివాడికీ ఉండవచ్చును. కాని, అతడు రాజాధిరాజువలె కనబడుతున్నాడు. మూర్ధాభిషిక్తులు పాదాలకు నమస్కరిస్తుంటే వారినతులను స్వీకరించటానికి అనువుగా భద్రంగా నడిచే వైఖరి అతడి పాదపద్ధతులలో కనపడుతున్నదట! అంటే, చక్రవర్తిత్వ వైభవాన్ని మానుకొని తనవద్దకు ఏదో మిషతో వస్తున్న దేవపురుషుడై ఉండి ఉంటాడు అన్న భావన విరాటుడికి కలిగింది. పై పద్యంలో రూపంలోని తేజస్సు, ఈ పద్యంలో నడకలోని భంగిమలు వర్ణించబడ్డాయి. (సంపా.)

**క. మన కడకు నేమిటికి వ। చ్చెనొకో; యే నిమ్మహాత్ము చెప్పిన పనులె**
**ల్లను జేయువాఁడఁ గోరిన। కనకాంబరమణులు తలఁపు గడవఁగ నిత్తున్. 187**

**ప్రతిపదార్థం:** మన కడకున్= మన దగ్గరకు; ఏమిటికిన్= ఎందుకు; వచ్చెన్+ఒకో= వచ్చాడో; ఏను= నేను; ఈ+మహాత్ము చెప్పిన పనులు= ఈ మహాత్ముడు చెప్పిన పనులు; ఎల్లను= అన్నిటిని; చేయువాఁడన్= చేస్తాను; కోరిన= కోరినట్టి; కనక+అంబరమణులు= బంగారం,బట్టలు, మణులు మొదలయినవాటిని; తలఁపు+కడవఁగన్= కోరికకు మించి అడిగినదానికంటె అధికంగా; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** ఇతడు మన దగ్గరికి ఎందుకు వస్తున్నాడో! ఇతడు మహాత్ముడు. ఇతడు చెప్పిన పనులన్నీ నేను చేస్తాను. ఇతడు అడిగే బంగారాన్ని, వస్త్రాలను, మణులను అడిగినదానికంటె అధికంగా ఇస్తాను.

**విశేషం:** సమీపించిన కంకుభట్టును దగ్గరగా చూచాడు విరాటుడు. అత డేదో అర్థార్థి అయి వస్తున్నట్లు పసికట్టాడు. అందువలననే ఎందుకు వస్తున్నాడో (ఏ కోరికను కోరటానికి వస్తున్నాడో) అని మొదట అనుకొన్నాడు. ఒకవేళ అతడే అడిగితే దానిని తప్పకుండా చేయటానికి తరువాత సిద్ధపడ్డాడు. అంతటివాడు అడిగితే అడిగినదానికంటె అధికంగా ఇవ్వటమే ఔచిత్యమని భావించాడు ఈ మాటలంటున్న విరాటుడు ఇంగితజ్ఞుడు, ఉచితజ్ఞుడు, అతిథి సేవాతత్పరుడు అనిపించుకొన్నాడు. ధర్మరాజు వ్యక్తిత్వంలో - అందులోనూ యతీంద్రరూపంలో పరులను ఆకర్షించే ఉదాత్త గుణ రూప గౌరవం ఉన్నదని ధ్వని. (సంపా.)

**ఆ. మత్స్యవిషయ రాజ్యమహిమకు యుక్తుండు। గాఁ దలంచెనేని గారవమున**
**నట్లచేసి, భక్తి ననుచరింతు నమాత్య। సుత సుహృద్భటార్య యుతము గాఁగ'. 188**

**ప్రతిపదార్థం:** మత్స్యవిషయ రాజ్యమహిమకున్= మత్స్యదేశపు రాజ్యవైభవానికి; యుక్తుండుగాన్+తలంచెన్+ఏని= తగినవాడననుకొంటే; గారవమునన్= మర్యాదతో; అట్లు+అ+చేసి= ఆ విధంగానే చేసి; అమాత్య= మంత్రులు; సుత= కొడుకులు; సుహృద్= స్నేహితులు; భట= సేవకులు; ఆర్యయుతము+కాఁగన్= పెద్దలు మొదలయిన వారితో కూడా; భక్తిన్= భక్తితో; అనుచరింతున్= పరిచర్యలుచేస్తాను.

**తాత్పర్యం:** మత్స్యరాజ్యవైభవానికి తాను తగినవాడని అత డనుకొంటే గౌరవభావంతో అతడిని ఆ విధంగానే చేస్తాను. నా మంత్రులతో, కుమారులతో, స్నేహితులతో, భటులతో, పురజనులతో సహా అతడిని భక్తితో సేవిస్తాను.'

**విశేషం:** 'మత్స్య రాజ్య వైభవానికి తాను యోగ్యుడని కంకుభట్టు భావిస్తే గౌరవంతో నే నత డనుకొన్నట్లే చేస్తాను' - ఈ మాటలు సాభిప్రాయాలు. సమ్రాట్టుగా ఉండదగిన కంకుభట్టు మత్స్యరాజ్యాన్ని కోరుకొనడు. కాని, ఒకవేళ కోరుకొంటే అది అతడి యోగ్యతకు తగినంత కానుక కాదు. అందువలన అనుమానం లేకుండా గౌరవంగా సమర్పిస్తానని విరాటుడు భావించటం అతని ఉదాత్తతకు చిహ్నం. కొందరు భావించినట్లుగా బలహీనత కాదు. కాకపోగా, భావికథార్థవ్యంజకం కూడా. (సంపా.)

**ఆ. అని సమస్తజనంబులుఁ దదభిముఖులయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు సేయం దానును గద్దియ డిగ్గి యెదురు సని నమస్కరించి, యతని యాశీర్వాదంబులు గైకొని, సగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సమంచిత సమున్నతాసనంబున నునిచి వినయావనతుం డయి. 189**

**ప్రతిపదార్థం:** అని= అని; సమస్తజనంబులు= ప్రజలందరూ; తద్+అభిముఖులు+అయి= ఆ సన్న్యాసికి ఎదురై; భక్తియుక్తిన్= భక్తితో కూడుకొని; ప్రతి+ఉత్థానంబు= ఎదురుగా లేచి నిలవటం; చేయన్= చేయగా; తానును= విరాటరాజు కూడ; గద్దియ డిగ్గి= ఆసనం దిగి; ఎదురు+చని= ఎదురు వెళ్ళి; నమస్కరించి= నమస్కారం చేసి; అతని= ఆ యతి (వేషధారి) యొక్క; ఆశీర్వాదంబులు కైకొని= దీవెనలు స్వీకరించి; సగౌరవంబుగాన్= గౌరవంతో; తోడ్కొని= తోడుగా వెంబడించి; చనుదెంచి= వచ్చి; సమంచిత= తగిన; సమున్నత= ఎత్తయిన; ఆసనంబునన్= గద్దెమీద; ఉనిచి= సుఖాసీనుడిని చేసి; వినయ+అవనతుండు+అయి= వినయంతో వంగినవాడయి.

**తాత్పర్యం:** అని విరాటు డన్నాడు. సభాసదులందరూ కంకుభట్టుకు ఎదురుగా భక్తితో లేచి నిలుచున్నారు. విరాటుడు కూడా సింహాసనంనుండి దిగాడు. ఎదురేగినాడు. నమస్కరించాడు. అతడి దీవెనలు పొందాడు. మర్యాదలతో వెంటతీసికొని వచ్చాడు. తగిన ఆసనం మీద కూర్చుండబెట్టాడు. వినయంతో నమ్రతతో (ఇట్లా అన్నాడు.)

**విశేషం:** విరాటరాజు కొలువులో ఉన్న సభాసదులు రాజు మనసెరిగి నడచుకొనేవారు. సేవాధర్మం తెలిసినవారు. అందుకే రాజుకంటె ముందు లేచి కంకుభట్టుకు అభివాదనం తెలిపారు. ఆ తరువాత విరాటుడు తాను చేయవలసిన ఉత్తమాతిథి పరిచర్యలు చేశాడు. విరాటుడి సభ సుశిక్షితం. రాజుకు భిన్నంగా భావించేవారు అందులో లేరు. ఉన్నట్లయితే కవి ఏ ఉల్లేఖాలంకారమో ఎత్తుకొని చెప్పేవాడు. తిక్కన ఆ పని చేయలేదు. సన్న్యాసి వేషంలో ఉన్న ధర్మరాజుకు ఏకగ్రీవమైన ఆహ్వానం లభించింది. (సంపా.)

**ఉ. 'ఎయ్యది జన్మభూమి? కుల మెయ్యది? యెయ్యది యున్నచోటు? పే**
**రెయ్యది? మీర లిందులకు నిప్పుడు వచ్చిన దానికిం గతం**
**బెయ్యది? నాకు నింతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్న రూ**
**పయ్యది' నావుడున్ నరవరాగ్రణి క య్యతిముఖ్యుఁ డిట్లనున్. 190**

**ప్రతిపదార్థం:** జన్మభూమి= పుట్టినచోటు; ఏ+అది?= ఏది; కులము= కులం; ఏ+అది= ఏది? ఉన్నచోటు= నివాసస్థలం; ఏ+అది?= ఏది; పేరు= పేరు; ఏ+అది?= ఏది; మీరలు= మీరు; ఇందులకున్= ఈ ప్రదేశానికి (ఇక్కడికి); ఇప్పుడు= కొలువు తీరి ఉన్నవేళ; వచ్చినదానికిన్= రావడానికి; కతంబు+ఏ+అది?= కారణ మేది; నాకున్= నాకు; ఉన్న+రూపు+ఆ+అది+ఇంతయునున్= అసలు విషయమంతా; ఏర్పడఁగాన్= స్పష్టపడేటట్లు; ఎఱిఁగింపుఁడు= తెలియజేయండి; నావుడున్= అనగానే; ఆ+యతిముఖ్యుఁడు= ఆ యతులలో ముఖ్యుడయినవాడు; నరవర+అగ్రణికిన్= మహారాజుతో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ' మీ జన్మస్థల మేది? మీ వంశం ఏది? మీరు ఇంతకుముందు వసించిన చోటేది? పేరేమిటి? మీరు ఇక్కడికి ఇప్పుడు రావటానికి కారణం ఏమిటి? నాకు అన్నీ స్పష్టంగా చెప్పండి' అనగానే విరాటమహారాజుతో ఆ యతివర్యుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. విరాటుడికీ యతీంద్రుడి వేషంలో ఉన్న ధర్మరాజుకూ నడుమ జరిగిన సంభాషణను తిక్కన మూలంలోకంటె భిన్నంగా విశిష్టంగా తీర్చిదిద్దాడు. మూలంలో యతీంద్రుడు రాగానే విరాటు డేమీ మాట్లాడక పూర్వమే. **"సమ్రాడ్ విజానా త్విహ జీవనార్థి నం। వినష్ట సర్వస్వ ముపాగతం ద్విజమ్" (4,6,8)** ప్రభూ! సర్వస్వాన్ని కోల్పోయి బ్రదుకు తెరువుకై మిమ్మల్ని ఆశ్రయించటానికి వచ్చాను-అని నివేదించుకొన్నాడు. రాజాతడి కోర్కె నంగీకరించి స్వాగతంచెప్పి తరువాత అతడి వివరాలను గురించి అడిగాడు. తిక్కన రచనలో ధర్మరాజు అంత బేలగా మొదటనే బయటపడడు. దానివలన పాత్ర చిత్రణలో, సన్నివేశ నిర్వహణంలో ఔదాత్త్యం ఏర్పడింది.

2. మూలంలో అడిగిన ప్రశ్నలు నాలుగు- ఏ రాజు దేశం నుండి ఇక్కడకు వచ్చారు? మీ గోత్రం ఏమిటి? మీ పేరేమిటి? మీ రేవిద్యలో నిపుణులు? అని. తెలుగులో తిక్కన వేయించిన ప్రశ్నలు వేరు. 1. మీ పుట్టిన చోటేది? 2. మీ కుల మేమిటి? 3. మీరున్నచో టేది? 4. మీ పేరేమి? 5. మీ రిప్పుడు ఎందుకు వచ్చారు? మూలంలో అడిగిన ప్రశ్నలు యతీంద్రులను అడిగినట్లున్నాయి. తెలుగులో అడిగిన ప్రశ్నలు యతీంద్రవేషంలో ఉన్న రాజేంద్రుడిని తెలిసికొనాలని అడిగినట్లు ప్రౌఢంగా ఉన్నాయి. తెలుగు భారతంలోని విరాటుడు మూలంలోవలె అమాయకుడు కాడు. విజ్ఞుడు లోగుట్టును తెలిసికొందామని వేస్తున్నట్లున్న విరాటుడి ప్రశ్నలకు ధర్మరాజు ఆచి, తూచి సమాధానం చెప్పాలి. అందుకే సమాధాన స్వభావం కూడా తిక్కన రచనలో మారిపోయింది. తెలుగుభారతం పునస్సృష్టం కదా!

3. విరాటు డడిగిన ప్రశ్నలలో అతడిలో రగుల్కొంటున్న ఆసక్తి వ్యక్తమౌతున్నది. దానిని పద్య రచనా నిర్మాణం ధ్వనింపజేస్తున్నది. పద్యంలో మొదటి మూడు చరణాలు 'ఎయ్యది' అనే ప్రశ్నలతో సమంగా విరుగుతాయి. ఆ రచన వక్త యొక్క

అభిలాషను వ్యక్తం చేస్తున్నది. నాలుగో చరణం 'అయ్యది'తో మొదలౌతుంది. సత్యం తెలిసికొనాలన్న ఆసక్తిని తెలుపుతున్నది. పద్యరచనలో అంత్యానుప్రాస సమత అనే గుణంలోని మార్గాభేదం అనే శబ్ద గుణ లక్షణం. అవైషమ్యం, ప్రక్రమాభేదం అనే అర్థగుణ లక్షణాలు సందర్భోచితంగా పోషించబడ్డాయి. (సంపా.)

**ఆ. 'ఉన్న రూప పలుకు నన్నరు లెక్కడఁ। గలరు? తోఁచినట్లు పలుకు వలుక**
**నైన చంద మయ్యెఁ; నంతియ కా, కంత। పట్టి చూడఁగలరె యెట్టివారు?'** 191

**ప్రతిపదార్థం:** ఉన్నరూపు+అ= ఉన్నరూపును అంటే వాస్తవాన్నే; పలుకు= మాటలాడేటటువంటి; ఆ+నరులు= అట్లాంటి మనుష్యులు; ఎక్కడన్+కలరు?= ఎక్కడున్నారు?; తోఁచినట్లు= తోచిన విధంగా; పలుకు= మాట; పలుకన్+ఐన చందము+అయ్యెన్= మాట్లాడేతీరు అయింది; అంతియ కాక= అంతేకాక; ఎట్టివారున్= ఎలాంటి వారయినా; అంతపట్టిచూడన్+కలరె?= అంతగా పట్టి చూస్తారా?

**తాత్పర్యం:** ఉన్నది ఉన్నట్లు చెప్పే మనుష్యు లెక్కడున్నారు? వారివారికి తోచేవిధంగా మాట్లాడే వైనమే కనిపిస్తుంది. అంతేకాక, ఎవరయినా ఎటువంటి వారయినా అంతగా పట్టి చూస్తారా?

**విశేషం:** యతీంద్రుడిలోని రాజలక్షణాలను ఉద్దేశించి ప్రశ్నించినట్లున్న విరాటుడి ప్రశ్నలకు ధర్మరాజు యతీంద్రుడివలె సమాధానం చెప్పటం మొదలు పెట్టాడు. యతి వేదాంతం మాట్లాడాలి. 'నీ జన్మభూమి ఏది'- అంటే ఏమి చెప్పాలి? జీవుడు పరమాత్మనుండి పుట్టి పరమాత్మలో లీనమౌతాడు కాబట్టి తన జన్మభూమి పరమాత్మ అని చెప్పాలి. లేదా లౌకికంగా అయితే మాతృయోని అని చెప్పాలి. వ్యావహారికంలో - మాతృగర్భం నుండి బయటపడ్డనేల ఏ రాజ్యంలో ఉంటుందో ఆ స్థలం పేరు చెప్పాలి. ఏది సమాధానం? ఎవరైనా గుచ్చి గుచ్చి అడిగితే ఇవన్నీ చెప్పాలా? అసలు యతీంద్రుడికి పూర్వాశ్రమ పరిత్యాగానంతరం జన్మభూమి విశ్వమేఔతుందని చెప్పాలా? విరాటుడు 'ఉన్నరూపు' చెప్పుమంటాడు. ఆ మాటకు అర్థాలెన్నో అసలు సత్యం చెప్పుమని, ప్రస్తుతం ఉన్న వాస్తవం చెప్పుమని, వస్తువు ఆ విధంగా ఉండటానికి గల కారణం చెప్పుమని అర్థాలేర్పడతాయి. వీటిల్లో ఏది చెప్పాలి? అడిగినవారికి తగినట్లు ఏది చెప్పాలి? అడిగినవారికి వీటిలో ఏది కావాలి? కాబట్టి ఉన్నరూపును ఇదమిత్థమని చెప్పేవారు లోకంలో లేరు. ఎందుకంటే ఉన్నది పరమాత్మ ఒక్కడే. అదే సత్యం. దేహాలు ఉపాధి భేదాలు. దేహాన్ని పరమాత్మగా ఎట్లా చెప్పాలి? కాబట్టి ఆత్మ పుట్టిన చోటును కొందరు, దేహంపుట్టిన చోటును కొందరు చెప్పవచ్చును. అది వారు ప్రశ్నలోని అర్థం గ్రహించే స్థాయిమీద ఆధారపడి ఉంటుంది. యతీంద్రుడిని ప్రశ్నించేటప్పుడు పృచ్ఛకుడు ఏ స్థాయిలో ప్రశ్నించవలెనో తెలిసికొనుమని ప్రచ్ఛన్నంగా ధర్మరాజు హెచ్చరించాడు. కాబట్టి అడిగేవారి చందం ఒకటైతే చెప్పేవారి చందం మరొకటి. లోకంలో వారి వారికి తోచిన పద్ధతులే వాటికి ప్రమాణాలు. అందువలన తాత్త్వికులు చెప్పే మాటలను మార్మికంగానే గ్రహించాలి- అని వేదాంతివలె మాట్లాడి విరాటుడి లౌకిక ప్రజ్ఞను మాటల మాయాజాలంతో కప్పివేశాడు. అతడు నిజంగా వేదాంతి అని విరాటుడు నమ్మేటట్లు వ్యవహరించాడు. అది ధర్మరాజు ప్రదర్శించిన ప్రౌఢి. విరాటుడు ధర్మజుడిలో చక్రవర్తిత్వ లక్షణాలకు హేతువు తెలిసికొందామని వేస్తున్న ప్రశ్నల గాలాలకు ప్రతిగా కల్పించిన ఆత్మరక్షాకవచాలు ఈ వచనాలు. ఇవి మూలంలో లేవు. (సంపా.)

**వ. అని మందహాసంబు సేయుచు మఱియును.** 192

**ప్రతిపదార్థం:** అని= అని; మందహాసంబు+చేయుచున్= చిరునవ్వు నవ్వుతూ; మఱియును= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని చిరునవ్వు నవ్వుతూ ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ధర్మరాజు చిరునవ్వునవ్వటం సాభిప్రాయం. 'ఉన్నరూపు చెప్పు'మని అడిగిన విరాటుడితో ఉన్నరూపంటే అతడికి అర్థంకాని ఒక వేదాంత ధోరణిలో మొదలుపెట్టి ఎత్తుకు పైఎత్తు వేశానని, అది తెలిసికొనటం విరాటుడికి సాధ్యం కాదని చిరునవ్వు నవ్వి ఉండవచ్చును. లేదా, అడిగిన వారిమీద వాత్సల్యం ఉప్పొంగగా ఆనందంతో తన వివరాలు చెప్పుతున్నట్లు స్ఫురింపచేయటానికి చిరునవ్వు నవ్వి ఉండవచ్చును. ధర్మరాజుకు గడుసరితనం నేర్పాడు తిక్కన (సంపా.)

**క. నానావిధ భూతమయము। మే; నతిచంచలము మనము; మెయికొని నిక్కం**
**బే నరునకుఁ జెల్లింపం। గానగు? సత్యంబు నడపుక్రమ మట్లుండెన్'. 193**

**ప్రతిపదార్థం:** మేను= శరీరం; నానావిధ= అనేకవిధాలయిన; భూతమయము= భూతాలతో నిండినది; మనము= మనస్సు; అతిచంచలము= చాలా చంచలమయినది; మెయికొని= ప్రయత్నించి; నిక్కంబు= సత్యం; ఏ నరునకున్+చెల్లింపంగాన్+ అగున్= ఏ మానవ మాత్రునికి నెరవేర్చటానికి వీలవుతుంది; సత్యంబు నడపు= సత్యాన్ని నడిపించే; క్రమము= పద్ధతి; అట్లు+ఉండెన్= అట్లా ఉంది.

**తాత్పర్యం:** ఈ శరీరం పంచభూతాలతో కూడినది. ఇక మనసు అయితే అసలు నిలకడలేనిది. వీటిని ఆధారంగా చేసికొని సత్య నిరూపణ చేయటం ఎవరికి సాధ్యమౌతుంది? సత్యమే (ఉన్నరూపే) జీవితంలో చెప్పాలంటే ఇట్లాగే ఉంటుంది.

**వ. అనుచు మత్స్యమహీవల్లభు నవలోకించి. 194**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; మత్స్యమహీవల్లభున్= ఆ విరాట మహారాజును; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** అంటూ విరాటరాజును చూచి.

**క. 'ద్విజుఁడఁ, గురు విషయ జాతుఁడ। సుజనప్రియుఁ డైన ధర్మసుతు సఖుఁడఁ బరి**
**వ్రజనాశ్రమ కలితుండ, మ। నుజవల్లభ యోగ్య బహు వినోదకరుండన్. 195**

**ప్రతిపదార్థం:** ద్విజుఁడన్= బ్రాహ్మణుడిని-లేదా-క్షత్రియుడిని; కురువిషయజాతుఁడన్= కురుదేశంలో పుట్టినవాడిని; సుజన ప్రియుఁడు+ఐన= సజ్జనులకు ప్రియుడయిన; ధర్మసుతు సఖుఁడన్= యమధర్మరాజు కుమారుడయిన ధర్మరాజు స్నేహితుడిని; పరివ్రజన+ఆశ్రమ కలితుండన్= సన్న్యాసాశ్రమ విధానంతో కూడిన వాడిని; మనుజవల్లభ యోగ్య= రాజులకు తగిన; బహు వినోదకరుండన్= ఎన్నో వినోదాలు చేయగలవాడిని.

**తాత్పర్యం:** 'రాజా! నేను ద్విజుడిని. కురుదేశంలో జన్మించాను. ధర్మరాజుకు స్నేహితుడిని. అయితే ఇపుడు సన్న్యాసాశ్రమం స్వీకరించినవాడిని. రాజులకు తగిన వినోదాలను కల్పించగలవాడిని.

**విశేషం:** ఉపనయనసంస్కారం బ్రాహ్మణులకూ క్షత్రియులకూ ఉంటుంది. అందువలన ధర్మరాజు అబద్ధం చెప్పినట్లు కాదు. రెండవది పరివ్రాజక వ్రతమంటే ఒక చోట నిలవకుండా సంచరించేవారి వ్రతం. ఇక్కడ వ్రతం అజ్ఞాతవాసకాలంలో ఎవరికీ ఆచూకీ తెలియనివ్వకుండా మెలగే వ్రతం. ఆస్థానంలో 'విప్రవినోదులు' ఉంటారు కాని, అట్లా కాక నేను ప్రభువులకు మాత్రం ఉచితమైన వినోదాలు చేయగలవాడిని అని చెప్పక చెప్పటం. 'మనుజ వల్లభుడనైన నాకు అనువైన వినోదాలను చేయగలవాడను'

అని చెప్పినట్లు ధర్మరాజుపరంగా కూడా అన్వయించవచ్చును. మనుజవల్లభ!= ఓ రాజా! (విరాటుడా!) అని సంబుద్ధిగానైనా అన్వయించవచ్చును. యోగ్య బహు, వినోదకరుండన్= ఉచితములైన పెక్కు వినోదములను చేయగలవాడిని - అని చెప్పవచ్చును.

**క. ద్యూతక్రీడకుఁ గొండొక। నేతుం; గపటమున నొవ్వని జనంబులు నా**
**చేతి ధనమెల్లఁ గొని పరి। భూతి యొనర్చిన, విరక్తి పుట్టి వెడలితిన్. 196**

**ప్రతిపదార్థం:** ద్యూత క్రీడకున్= జూదం అనే ఆటకు; కొండొకనేతున్= కొంతకు కొంత నేర్చినవాడిని; ఒవ్వని= గిట్టని; జనంబులు= ప్రజలు; కపటమునన్= మోసంతో; నాచేతి ధనము+ఎల్లన్= నా చేతిలోని డబ్బు అంతా; కొని= లాక్కొని; పరిభూతి= పరాభవం, అవమానం; ఒనర్చినన్= చేయగా; విరక్తిపుట్టి= వైరాగ్యం కలిగి; వెడలితిన్= బయటపడ్డాను.

**తాత్పర్యం:** జూదం కొద్దిగా నేర్చినవాడిని కాని, గిట్టనివాళ్ళు మోసంతో నా చేతిలోని డబ్బు అంతా కాజేశారు. నన్ను అవమానించారు. ఆ కారణంగా విరక్తి కలిగింది. అందుచేత స్వస్థలం వదలిపెట్టాను.

**విశేషం:** 1. 'కొండొక నేర్తున్' - అని పాఠాంతరం. దానిని స్వీకరిస్తే ప్రాసమైత్రి చెడుతుంది. మాయాద్యూతం నేర్వలేదని విశేషార్థం. డబ్బుఅంతా పోయిందనటం, అవమానం చేశారనడం అంతా ధర్మరాజుకు సంబంధించిన అంశాలు. విరక్తి కారణంగా గడ్డం పెంచుకొనటం, సన్న్యాసం స్వీకరించడం సమానధర్మాలు. అయితే ఇందులోని అంతరార్థాన్ని గ్రహించే శక్తి విరాటమహారాజుకు లేదు. నేరుచుదును - నేరుతును. బాల. క్రి. 97చే 'రు' లోపింపగా, 'నేతును' ఔతుంది. (బాల.క్రియ.108)

2. ద్యూతవిద్యా నైపుణ్యాన్ని గురించి చెప్పేకథనంలో మూలానికీ, తిక్కన రచనకూ కొంత బేధం కనబడుతున్నది. **'అక్షాన్ ప్రయోక్తుం కుశలోఽస్మి'** -పాచికలాడటంలో నేర్పుకలవాడిని అని మూలంలో కంకుడు చెప్పాడు. ఆ నేర్పరితనం యుధిష్ఠిరుడితో చెలిమి చేయటంవలన వచ్చినట్లు ధ్వనింపచేశాడు. కాని, తిక్కన 'ద్యూతక్రీడకు కొండొకనేరుతును' అని మార్చాడు. శత్రువులు కపటద్యూతంలో తన ధనాన్నంతా కాజేసి అవమానపరచిన విషయం మూలంలో ధర్మరాజు చెప్పాడు. మాయాద్యూత ప్రసక్తి తీసికొనిరాడు తిక్కన కంకుభట్టు. తనకు ధర్మరాజు చెలిమివలన ద్యూతక్రీడలో పరిచయం ఏర్పడిందని చెప్పడు. మూలంలో మరొక విశేషం ఉన్నది. **"ప్రాప్తో వివాదః ప్రథమో విశాంపతే । న విద్యతే కించన మత్స్య హీనతః । న మే జితః కశ్చన ధారయేద్ ధనం వరో మమైషోఽస్తు తవ ప్రసాదతః॥' (సం4,6,12)** అని అన్నట్లు ఉన్నది. 'ఓ మత్స్యభూపతీ! ద్యూతంలో అల్పుని వలన గొప్పవాడికీ వివాదం రాదన లేము. కాబట్టి నేను జూదంలో గెలిచినా ఓడినవాడు అప్పుపడినట్లు కాదు. మీరు అనుగ్రహించి ఆ విధంగా మీతో జూదమాడటానికి వరమిప్పించండి' అని అన్నాడు. ఆ మాటలు వినిన విరాటుడు ఉప్పొంగిపోయాడు. ఇన్నాళ్ళకు నాతో సుహృద్ద్యూతం ఆడే సహృదయుడు దొరికాడనుకొన్నాడు. జూదమాడినా, కయ్యమాడినా, వియ్యమాడినా సములతో చెయ్యాలికాబట్టి విరాటుడు కంకుభట్టుకు తన ఆస్థానంలో తనతో సమానమైన హోదా ఇచ్చాడు. భోగాలన్నీ తనతో సమానంగా జరిపించాడు. ఎవరైనా వేతనంగా కంకుభట్టుకు ధనమిస్తే ఆ రాజోద్యోగిని ప్రాణాలు తీస్తానన్నాడు. తిక్కన కంకుడి సంభాషణను మార్చి ధర్మజుడివలె పరోక్ష సత్యవాదిగా చిత్రించాడు. విరాటుడిచేత "ద్యూతజ్ఞుల దెసఁగొండొక ప్రీతియుఁ గలదు" (విరా.1-207) అని చెప్పించాడు. ధర్మరాజులో ద్యూతజ్ఞుడికంటె ధర్మజ్ఞుని నెక్కువగా ప్రదర్శించటం తిక్కన అభిమతం. అందుకే ఈ స్వల్పమైన మార్పు, ఈ మార్పుకు అనుగుణంగా తిక్కన రాబోయే పద్యంలో 'నృప నయవిద్యకుం దగిన నే ర్పలవడ్డది గొంత కొంత' (విరా.1-197) అని చెప్పించాడు. ఈ మాటలు అమూలకాలు; తిక్కన తీర్చిదిద్దిన కంకుడికి వాఙ్మయ భూషణాలు. (సంపా.)

**చ. నృపనయవిద్యకుం దగిన నే ర్పలవడ్డది గొంత కొంత; ధ**
**ర్మపరుల సంగతిం దగిలి మచ్చిక నుండుదు; బేరు కంకుఁ; డే**
**వపుఁ గొలు వైన నాకు నిలువన్ మది గొల్పదు; కాన నిన్నుఁ భూ**
**మిపతులలోన సాధుజనమిత్త్రుఁడు నా విని కొల్వ వచ్చితిన్. 197**

**ప్రతిపదార్థం:** నృప నయవిద్యకున్= రాజనీతివిద్యకు; తగిన నేర్పు= తగిన చాతుర్యం; కొంత కొంత= కొద్ది కొద్దిగా; అలవడ్డది= అలవడింది; ధర్మపరుల సంగతిన్= ధార్మికుల స్నేహంలో; తగిలి= ఆసక్తి కలిగి; మచ్చికన్+ఉండుదున్= చనువుతో ఉంటాను; పేరు కంకుఁడు= నా పేరు కంకుడు; ఏవము+కొలువు+అయినన్= నీచమయిన సేవ అయితే; నాకున్= నాకు; నిలువన్= ఉండడానికి; మది+కొల్పదు= ఇష్టం కాదు; కానన్= అందుచేత; నిన్నున్= నిన్ను; భూమిపతులలోనన్= రాజులలో; సాధుజనమిత్రుఁడు= సత్పురుషుల స్నేహితుడు; నాన్, విని= అనగా విని; కొలువన్= కొలవడానికి (సేవించటానికి); వచ్చితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** ఓ రాజా! నాకు రాజనీతి విద్య తెలుసు. ఆ విద్యకు తగిన చాతుర్యం నాకు కొంత అలవాటులో ఉన్నది. పైగా ధార్మికులయినవారితో స్నేహంగా ఉంటాను. నా పేరు కంకుడు. నేను నీచమయిన కొలువు చేయను. అట్లాంటి కొలువులో నాకు నిలువ బుద్ధి కాదు. రాజులలో నీవు సజ్జనులకు మిత్రుడవని విన్నాను. నిన్ను సేవించటానికి వచ్చాను.

**విశేషం:** మూలంలో కంకుడు తనకు రాజనీతి విద్యలో పరిచయమున్నదని చెప్పినట్లు లేదు. తిక్కన సందర్భశుద్ధితో కల్పించి చెప్పించాడు. దక్షిణగోగ్రహణ ఘట్టంలో ధర్మజునీతి విరాటునికి ఉపయోగపడుతుంది. దానికి బీజంగా ఈ నైపుణ్యాన్ని ఇక్కడ చెప్పించి తిక్కన ఔచిత్యాన్ని పాటించాడు. (సంపా.)

**తే. వత్సరంబునఁ గడచను వ్రతము నాకు। దాని నీపాలఁ జల్పి యుత్సాహవృత్తి**
**మెఱయ, నీకుఁ గృతజ్ఞత నెఱపి, తొల్లి। యెగ్గు సేసిన వారి జయింపఁ బోదు'. 198**

**ప్రతిపదార్థం:** వత్సరంబునన్= ఒక సంవత్సరకాలంలో; కడచను= పూర్తిచేయవలసిన; వ్రతము= వ్రతం; నాకున్= నాకు (ఉంది); దానిన్= ఆ వ్రతాన్ని; నీ పాలన్= నీ దగ్గర; చల్పి= పూర్తిచేసి; ఉత్సాహవృత్తిమెఱయన్= ఉత్సాహం బయటపడేటట్లు; నీకున్+కృతజ్ఞత= నీపట్ల కృతజ్ఞతను; నెఱపి= ప్రకటించి; తొల్లి= ముందు; నాకున్= నాకు; ఎగ్గు= కీడును; చేసిన= ఆచరించిన; వారిన్= వారిని; జయింపన్+పోదున్= జయించడానికి వెళ్ళుతాను.

**తాత్పర్యం:** నాకు ఒక వ్రతం ఉన్నది. ఆ వ్రతకాలం సంవత్సరం పాటు నీ దగ్గరే ఆ వ్రతం పూర్తి చేసికొంటాను. నీకు కృతజ్ఞత తెలుపుకొంటాను. ఆ తరువాత నాకు అపకారం చేసిన వారిని జయించటం కొరకు ఉత్సాహంతో వెళ్ళుతాను.

**విశేషం:** కంకుడు అంటే యమధర్మరాజు. తండ్రి పేరు కొడుకుకు కూడా సరిపోతుంది. అందుచేత తనను కంకుడు అని పరిచయం చేసుకొనటం సబబు.

**వ. అనిన విని సంప్రీత చేతస్కుండై విరాటుం డతని కిట్లనియె. 199**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= ఆ మాటలను విని; సంప్రీత చేతస్కుండు+ఐ= ప్రీతి పొందిన మనస్సు కలవాడయి; విరాటుండు= విరాటమహారాజు; అతనికిన్+ఇట్లు+అనియెన్= అతనితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలకు విరాటుడు సంతోషించాడు. కంకుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'అట్ల చేయుఁడు రుచిరోన్నతాసనములు। వాహనములు భోజనములు వస్త్రములును**
**వలయు భోగంబులును నెల్లవర్తనములు। నాకు నెట్లట్ల మీకును నడపువాఁడ. 200**

**ప్రతిపదార్థం:** అట్లు+అ= అట్లాగే; చేయుఁడు= చేయండి; రుచిర+ఉన్నత+ఆసనములున్= కాంతిమంతములయిన ఉన్నత ఆసనాలును; వాహనములున్= వాహనాలును; భోజనములున్= భోజనాలును; వస్త్రములునున్= వస్త్రాలును; వలయు భోగంబులును= అవసరమయిన సుఖభోగాదులును; ఎల్లవర్తనములున్= అన్ని పరిచర్యలును; నాకున్+ఎట్లు= నాకు ఎట్లా జరుగుతాయో; అట్లు+అ= అదేవిధంగా; మీకున్= మీకు; నడపువాఁడన్= జరిపిస్తాను.

**తాత్పర్యం:** అట్లాగే చేయండి. ఉన్నత ఆసనాలు, వాహనాలు, ఆహారాలు, వస్త్రాలు ఇంకా ఇతర భోజనాదులు అన్ని మర్యాదలు నాకు ఎట్లా జరుగుతాయో మీకూ అట్లాగే జరిపిస్తాను.

**విశేషం:** విరాట మహారాజు మాటలలో రెండు అంశాలు ఉన్నాయి. మొదటిది ప్రకటన. రెండవది సూచన. కంకుభట్టు వేషంలో ఉన్న ధర్మరాజుకు తనతో సమానమయిన ప్రతిపత్తి ఇస్తున్నట్లు చెప్పటం ప్రకటన. కొలువు నామమాత్రమే ననటం సూచన. అంత్యానుప్రాస రచనకు రక్తి కట్టించింది.

**క. నా యనుచరులం దెవ్వఁడు। మీ యెడ భయభక్తి లేక మిగిలి మెలఁగెనే**
**నా యధముని దండితుఁగాఁ। జేయుదు నతఁ డెంతయుం బ్రసిద్ధుం డయినన్. 201**

**ప్రతిపదార్థం:** నా+అనుచరులందున్= నా సేవకులలో; ఎవ్వఁడు= ఎవ్వడయినా; మీ+ఎడన్= మీ మీద (పట్ల); భయభక్తి లేక= భయంతోడి భక్తి లేకుండా; మిగిలి= హద్దుమీరి; మెలఁగెన్+ఏని= ప్రవర్తించినట్లయితే; అతఁడు= అతడు; ఎంతయున్= ఎంతటి (ఎంతగా); ప్రసిద్ధుండు= ప్రసిద్ధుడు; అయినన్= అయినా; ఆ+అధమునిన్= ఆ నీచుని; దండితున్+కాన్+చేయుదున్= దండింపచేస్తాను.

**తాత్పర్యం:** నా సేవకులలో ఎవడయినా సరే మీ పట్ల భయంతోడి భక్తి లేకుండా హద్దు మీరి ప్రవర్తించినట్లయితే ఆ నీచుడిని దండిస్తాను. అతడు ఎంత ప్రసిద్ధు డయినా సరే దండన తప్పదు.

**వ. అట్లుంగాక. 202**

**తాత్పర్యం:** అంతే కాక.

**చ. వెలయఁగ మత్స్యరాజ్యపదవీ పరిపాలన సేయఁగా మదిం**
**దలఁచుట యెంతయుం బ్రియము తమ్ములుఁ బుత్త్రులు బంధులుం బ్రధా**
**నులును బలంబు నేను సుమనోవిభుతుల్యుఁడవైన నిన్ను మి**
**క్కిలి యగు భక్తిఁ గొల్చి కృతకృత్యతఁ బొందుదు; మట్ల చేయవే! 203**

**ప్రతిపదార్థం:** (నీవు); మత్స్యరాజ్య పదవీ పరిపాలన= మత్స్యరాజ్యానికి రాజుగా ఉండి పరిపాలించటం; వెలయఁగన్+చేయఁగాన్= ప్రసిద్ధికెక్క (విధంగా)టట్లు చేయటానికి; మదిన్+తలఁచుట= మనసులో భావించటం; ఎంతయున్+ప్రియము= నాకుఎంతో ఇష్టం; తమ్ములున్= నా తమ్ముళ్ళు; పుత్త్రులున్= కొడుకులూ; (శౌనకుడు, మదిరాక్షుడు, సూర్యదత్తుడు), (శంఖుడు, ఉత్తరుడు); బంధువులున్= చుట్టాలూ; ప్రధానులును= మంత్రులూ; బలంబున్= బలగమూ - రథ,గజ,తురగ, పదాతిబలం; నేనున్= నేనూ; సుమనో విభు తుల్యుఁడవు+ఐన= దేవతలకు రాజైన ఇంద్రునితో సమానుడవయిన; నిన్నున్= నిన్ను; మిక్కిలి+అగు= ఎక్కువయిన; భక్తిన్= భక్తితో; కొల్చి= సేవించి; కృతకృత్యతన్= కృతార్థతను; పొందుదుము= పొందుతాము; అట్లు+అ= ఆ విధంగా; చేయవే!= చేయుమా!; (చేయవలసిందిగా కోరుతున్నాను.)

**తాత్పర్యం:** నీవు మత్స్యదేశాన్ని పరిపాలించటం నాకు చాలా ఇష్టం. నీవు దేవేంద్రుడితో సమానుడివి. నా అనుజులు, కుమారులు, బంధువులు, అమాత్యులు, నా బలగం, నేనూ నిన్ను అతిభక్తితో సేవిస్తాం. అటువంటి అవకాశం నాకు తప్పక కల్పించవలసిందిగా కోరుతున్నాను.'

**వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ బాండవాగ్రజుం డతని కిట్లనియె. 204**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని చెప్పగా విని; దరహసిత= చిరునవ్వుతో కూడిన; వదనుండు= ముఖం కలవాడు; అగుచున్= ఔతూ; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడయిన ధర్మరాజు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఆ విరాట మహారాజుతో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు విని చిరునవ్వు నవ్వుతూ ధర్మరాజు విరాటమహారాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** విరాటుడు కంకుభట్టును దేవేంద్రుడి వంటివాడవని ప్రశంసించి, సకుటుంబ పరివారంగా అతడికి సేవచేస్తానన్నప్పుడు అతడు చిరునవ్వుతో కూడిన మొగం కలవాడయ్యాడు. ఈ చిరునవ్వు అతడి ధీరోదాత్తతను వ్యక్తం చేస్తున్నది. (సంపా.)

**క. 'ఏను హవిష్యమ కుడుతును। భూనాయక ! నాకు శయ్య భూమియ; యిమ్మైఁ**
**బూని వ్రతంబులు సలిపెడు। వానికి నిన్నియును నిట్లు వలయునె చెపుమా!' 205**

**ప్రతిపదార్థం:** భూనాయక!= రాజా!; ఏను= నేను; హవిష్యము+అ= హోమం చేయటానికి అర్హమైన పదార్థాలనే; కుడుతును= భుజిస్తాను, ప్రసాదంగా ఆరగిస్తాను; నాకున్= నాకు; భూమియ= నేలయే; శయ్య= సెజ్జ; ఈ మైన్= ఈ విధంగా; పూని= ప్రయత్నించి; వ్రతంబులు+చలిపెడు= వ్రతాలు చేసేటటువంటి; వానికిన్= వానికి; ఇన్నియును= ఈ వైభవాలన్నీ; ఇట్లు= ఈ విధంగా; వలయునె?= కావాలా?; చెపుమా!= చెప్పుమా!

**తాత్పర్యం:** రాజా! హోమార్హమైన పవిత్ర పదార్థాలే నా భోజనం, నేలయే సెజ్జ. నేను వ్రతాచరణ చేసేవాడిని. నాకు ఇటువంటి మర్యాదలు కావాలా?.

**విశేషం:** ఈ మాటలు మూలంలో లేవు. ద్విజుడివలె వర్తిస్తున్న ధర్మరాజు ద్విజుని ఆహార విహారాలనే పాటించాడు. హోమం చేయడానికై వండే అన్నం హవిష్యం. ఈ అన్నాన్ని వార్చటం చేయరు. ఇగురపెడతారు. ఇగురపెట్టిన దాన్నే హోమం చేస్తారు. పైగా దైవం కొరకు ఉద్దేశించినది ఆ హోమం, వ్రతం పట్టినవారికి కొన్ని ప్రత్యేక నియమాలు ఉంటాయి. వాటిని నిర్దేశిస్తూ కంకుభట్టు తన ద్విజత్వాన్నే కాక తన నైష్ఠికత్వాన్నీ, వ్రతదీక్షనూ వ్యక్తం చేశాడు.

**ఆ. అనిన విరటుఁ డిట్టు లనియె 'నెత్తెఱఁగున। నడవ నిష్ట మట్ల నడచి మీకు**
**మనసు వచ్చినన్ని దినములు సలుపుఁ డి। చ్చోట నదియ మాకు శోభనంబు. 206**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విరటుఁడు= విరాటమహారాజు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; ఏ+ తెఱఁగునన్= ఏ విధంగా; నడవన్+ఇష్టము= ప్రవర్తించడం ఇష్టమో; అట్లు+అ= ఆ విధంగానే; నడచి= ప్రవర్తించి; మీకున్= మీకు; మనసు వచ్చినన్ని దినములు= మనసుకు నచ్చినన్ని రోజులు; ఈ+చోటన్= ఇక్కడ; చలుపుఁడు= కడపండి; అది+ఆ= అదే; మాకున్= మాకందరికి; శోభనంబు= మేలు, మంచిది.

**తాత్పర్యం:** అపుడు విరాటుడు ఇట్లా అన్నాడు: 'మీకు ఏ విధంగా ఉండాలనే కోరిక ఉందో ఆ విధంగానే మీకు ఇష్టమయినన్ని రోజులు ఇక్కడ ఉండండి. అదే మాకు ఇష్టం. అదే మేలు కూడా.

**క. ద్యూతజ్ఞుల దెసఁ గొండొక। ప్రీతియుఁ గల; దట్లుగాక పెద్దల రగు మీ**
**రే తెఱఁగున విహరించినఁ। జేతోమోదంబు; దగ వసింపుఁడు నెమ్మిన్'. 207**

**ప్రతిపదార్థం:** ద్యూతజ్ఞుల దెసన్= జూదం తెలిసిన వారిపట్ల; కొండొక= ఒకరకమయిన; ప్రీతియున్+కలదు= ప్రీతి ఉంది; అట్లు+కాక= అదీ కాకుండా; పెద్దలరు+అగు= పెద్దలయిన; మీరు= మీరు; ఏ+తెఱఁగునన్+విహరించినన్= ఏ విధంగా ప్రవర్తించినా; చేతస్+మోదంబు= మనస్సుకు సంతోషము; తగన్= తగినట్లు; నెమ్మిన్= స్నేహంతో; వసింపుఁడు= వాసం చేయండి.

**తాత్పర్యం:** జూదం ఆడటం తెలిసిన వారంటే నాకు అభిమానం. అదీకాక మీరు పెద్దలు. మీరు ఏ విధంగా ప్రవర్తించినా నాకు సంతోషం. మీరు మీ హోదాకు తగినట్లుగా సుఖంగా ఉండండి.

**విశేషం:** విరాటునికి పెద్దలంటే భక్తి విశ్వాసా లున్నాయి. ధర్మజ్ఞులు, నీతిజ్ఞ లంటే భయభక్తు లున్నాయి. ద్యూతజ్ఞులంటే అభిమానం ఉన్నది. ధర్మరాజు (కంకుభట్టు) పట్ల ఈ మూడూ కలిసి ముచ్చట కొలిపాయి. (సంపా.)

**వ. అని పలికి కౌంతేయాగ్రజు నత్యంత సంతుష్టాంతరంగుం జేసి. 208**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; కౌంతేయ+అగ్రజున్= కుంతీపుత్రులలో పెద్దవాడయిన ధర్మరాజును; అత్యంత సంతుష్ట+అంతరంగున్= ఎంతో సంతుష్టి చెందిన మనస్సు కలవానిగా; చేసి= చేసి.

**తాత్పర్యం:** అని పలికి విరాటమహారాజు ధర్మరాజును (కంకుభట్టును) సంతోషపెట్టి.

**చ. పొరిఁ బొరిఁ బ్రీతి రెట్టిగ నపూర్వవిలోకన మాచరించుఁ ద**
**త్పరమగు సద్వివేకములు భావ నిరూపణ సేయుఁ గౌతుక**
**స్ఫురణఁ గరంబు దత్కరముఁ బొంద నయంబునఁ జేర్చి వాక్య వి**
**స్తర చతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థితోన్. 209**

**ప్రతిపదార్థం:** పొరిన్+పొరిన్= మాటిమాటికి; ప్రీతి= ప్రియము; రెట్టిగన్= రెట్టింపు కాగా; అపూర్వవిలోకనము+ఆచరించున్= వింతగా చూడడం (వీక్షించడం) చేస్తాడు; తద్+పరము+అగు= ఆసక్తికరమైన; సత్+వివేకములు= చక్కని వివేకాలు; భావనిరూపణ+చేయున్= భావాన్ని స్పష్టం చేస్తాయి; కౌతుక స్ఫురణన్= కుతుహలం కలిగిన స్ఫూర్తితో; నయంబునన్= నీతితో; కరంబున్= తనచేతిని; తద్+కరమున్= అతని చేతితో; పొందన్+చేర్చి; కలియగలిపి= కరచాలనం చేసి; అర్థితోన్= ప్రీతితో; వాక్యవిస్తర చతురత్వము= వాక్కులను వివరించడంలోని చాతుర్యం; ఏర్పడఁగన్= స్పష్టపడే విధంగా; సల్లపనంబు+ఒనరించున్= సల్లాపం చేస్తాడు.

**తాత్పర్యం:** విరాట మహారాజు ధర్మరాజును మాటిమాటికి అపూర్వంగా చూస్తాడు. అతడి చూపులో రెట్టింపు ప్రీతి కనిపిస్తూ ఉన్నది. భావనిరూపణలో ఆసక్తి, విచక్షణ లున్నాయి. అతడి సల్లాపంలో కుతూహలం స్ఫురిస్తూ ఉన్నది. వాక్చాతుర్యం పొడసూపుతూ ఉన్నది.

**విశేషం:** ధర్మరాజు విరాటుడి కొలువులో చేరటం ఒక ఉదాత్త రమణీయ దృశ్యం. దాని ఆరంభ నిర్వహణాలను చిత్రించటంలో వ్యాసుడూ తిక్కనా తమ తమ పద్ధతులలో ప్రత్యేకతలను ప్రదర్శించారు. వ్యాసుడిది పురాణదృష్టి. తిక్కనది ప్రబంధదృష్టి, నాటకీయశిల్పం. మూలంలోని కొన్ని ప్రతులలో ఈ క్రింది రెండు శ్లోకాలు కనబడుతున్నాయి.

**"ఏవం తు రాజ్ఞః ప్రథమం సమాగమో । బభూవ మాత్స్యస్య యుధిష్ఠిరస్య చ,**
**విరాట రాజస్య హి తేన సంగమో । బభూవ విష్ణో రివ వజ్రపాణినా.**
**త మాసనస్థం ప్రియరూప దర్శనం । నిరీక్షమాణో న తతర్ప భూమిపః,**
**సభాం చ తాం ప్రజ్వలయన్ యుధిష్ఠిరః । శ్రియా యథా శుక్ర ఇవ త్రివిష్టపమ్."** (సం. 4.6.15 పాదసూచి)

విరాటరాజుకు ధర్మరాజుతో కలిగిన ఆ ప్రథమ సమావేశం ఇంద్రుడికీ విష్ణువుకూ జరిగిన సమావేశంవలె సొంపారిందట. ధర్మరాజు అసనంమీద కూర్చున్నాడట. ఆయన ప్రియ రూపదర్శనం విరాటుడికి ఎంతచూచినా తనివితీరలేదట! ధర్మరాజు సభలో కూర్చుంటే దేవేంద్రుడు తన ఐశ్వర్యంతో స్వర్గాన్ని అలంకరించినట్లుగా తోచిందట. ఈ వర్ణనం చేసింది వైశంపాయనుడు. ఇందులోని ఉపమాలంకార నిర్వహణం పురాణ కథాకథన శిల్పానికి సముచితంగా ఉన్నది. కంకుడిని విరాటుడు అంత ప్రీతితో చూడటానికి హేతువును అలంకార సుందరంగా ఆ వర్ణన ధ్వనింపజేస్తున్నది.

తిక్కన ఆ శ్లోకాలకు బదులు ఈ పద్యాన్ని తెలుగులో వ్రాశాడు. పై శ్లోకాలు ప్రక్షిప్తాలని భావిస్తే తిక్కన రచించిన ఈ పద్యం అమూలకమే కాదు, అపూర్వం కూడా. ధర్మరాజు యొక్క తేజోమయ రూపవైభవాన్ని దర్శిస్తున్న విరాటుడు సహృదయస్థానీయుడు. అపూర్వవస్తు దర్శనం వలన కలిగే అబ్బురపాటుతో మనసులోని ప్రీతి రెట్టింపు అయ్యేటట్లుగా మాటి మాటికీ తనవితీరకుండా అపూర్వంగా చూస్తున్నాడు. ధర్మజుడి ఔజ్జ్వల్యం విరాటుడిచేత ఆ పని చేయించింది. ధర్మజుడి యందు తత్పరమైన బుద్ధి అతడి గుణ విశేషాదులను వివేచించి అతని వ్యక్తిత్వాన్ని నిరూపించే యత్నం చేస్తున్నది. ఆలోచించిన కొలది అంతందొరకని గుణ గాంభీర్య మాతడిది. అందువలన ఆలోచనలు మాని ఆసక్తితో మిత్రుడితో మాట్లాడినట్లు చతురవాక్యవిన్యాసాలు మనసారా ప్రసరింపచేశాడు. గంభీరోజ్జ్వలుడైన ధర్మజుని వ్యక్తిత్వం విరాటరాజును అయస్కాంతం ఇనుమును ఆకర్షించినట్లు ఆకర్షించింది. మూలకర్త అలంకారం వలన సాధించిన ఈ తాత్పర్యాన్ని తిక్కన అభినయం వలన సాధించాడు. భక్తి గౌరవ పూర్ణమైన స్నేహాభినయం విరాటుడిలో తిక్కన అనుభావస్ఫూర్తితో చిత్రించాడు. పఠితచేత ప్రత్యక్షంగా అనుభవింపజేశాడు. అతడి నాటకీయ రచనాశిల్పానికి ఈ పద్యం ఒక మచ్చుతునక. (సంపా.)

**వ. ఇట్లు మత్స్య మహీవల్లభుం డతనిం గలిపికొని పరివారంబును దానును దదీయ సంభావనా తత్పరులైయుండి; రంత. 210**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రకంగా; మత్స్యమహీవల్లభుండు= మత్స్యదేశపు రాజయిన విరాట మహారాజు; అతనిన్= కంకుడిని, కలిపికొని= కూడుకొని; తదీయ= అతడిదైన; పరివారంబును= బలగమూ; తానును= తానున్నూ (విరాటరాజూ); సంభావనా తత్పరులు+ఐ= గౌరవించటంలో ఆసక్తు లయినవారుగా; ఉండిరి= ఉండసాగారు; అంత= అటుపిమ్మట.

**తాత్పర్యం:** ఈ విధంగా విరాట మహారాజు ధర్మరాజును కలుపుకొన్నాడు. తానూ, తన పరివారమూ కంకుభట్టును గౌరవించటంలో ఆసక్తిని కనబరచారు. అటు పిదప.

భీముఁడు వంటలవాఁడై విరటుఁ గొల్వ వచ్చుట (సం.4.7.1)

**సీ.** **చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము చంకఁ। దగిలించి సురియతో బిగియ ద్రిండు**
**గట్టిన నునుఁజేల కప్పెంతయును జెన్ను। సేయంగ దాపలి చేతి యందు**
**బెడిదంపుఁగోలలు బెడఁగొంద బహువర్ణ। చిత్రితాజినము పై చీర గాఁగఁ;**
**జూపఱెల్లను దన రూపంబు చూడ్కికి। వ్రేఁగైన నత్యంత విస్మయంబుఁ**

**తే.** **బొందుచుండ సమీరణ పుత్త్రుఁ డగ్ర। జుండు వోయిన దెసఁ దప్ప నొండువలన**
**సమదవారణపతి గమనమున మత్స్య। ధరణి వల్లభు సభ చేర నరుగుటయును.** **211**

**ప్రతిపదార్థం:** చట్టువంబున్= గరిటెను; ఒకచేతన్+పట్టి= ఒకచేతితో పట్టుకొని; ఖడ్గము= కత్తిని; చంకన్= చంకకు; తగిలించి= తగిలించుకొని; సురియతోన్= చుర కత్తితో; బిగియన్= బిగిసేటట్లు; ద్రిండు= దట్టి; కట్టిన నును చేల కప్పు= నున్నని వస్త్రంయొక్క నలుపు; ఎంతయును= ఎంతగానో; చెన్ను+చేయంగన్= అందగించగా; దాపలి= ఎడమ; చేతియందున్= చేతిలో; బెడిదము+కోలలు= కరకుట్లు కాల్చడానికి ఉపయోగించే కఠినమయిన శూలాలు; బెడఁగు+ఒందన్= ప్రకాశించగా; బహువర్ణ= అనేక విధాలయిన రంగులున్న; చిత్రిత+అజినము= చిత్రింపబడిన లేడిచర్మం; పై చీర కాఁగన్= ఉత్తరీయం కాగా; చూపఱు= ప్రేక్షకులు; ఎల్లను= అందరును; తన రూపంబు= భీముని రూపం; చూడ్కికిన్= దృష్టికి; వ్రేఁగు+అయినన్= బరువు కాగా; అతి+అంత+విస్మయంబున్= ఎంతో ఆశ్చర్యం (అల్పంగాని వింత); పొందుచున్+ఉండన్= అనుభవిస్తూ ఉండగా; సమీరణ పుత్త్రుఁడు= వాయుపుత్రుడయిన భీముడు; అగ్రజుండు= అన్న అయిన ధర్మరాజు; పోయిన దెసన్+తప్పన్= వెళ్ళిన దిక్కు వదలి; ఒండు వలనన్= మరో దిక్కున; సమద వారణపతి గమనమునన్= మదించిన గజరాజునడకవంటి నడకతో; మత్స్యధరణి వల్లభు సభ= విరాటుని సభ; చేరన్+అరుగుటయును= చేరువకు పోగా.

**తాత్పర్యం:** భీముడి కుడిచేతిలో గరిటె ఉన్నది. అతడు కత్తిని చంకకు తగిలించుకొన్నాడు. చురకత్తిని బిగించి దట్టీకట్టిన నల్లని వస్త్రం నిగనిగలాడుతూ ఉన్నది. ఎడమ చేతిలో కఠినమయిన శూలాలు ఉన్నాయి. రంగురంగుల లేడి చర్మం ఉత్తరీయంగా వేలాడుతున్నది. చూసేవారికి భీముడి రూపం దుస్సహంగా ఉన్నది. ప్రేక్షకులు అతడి ఆకారాన్ని చూచి ఆశ్చర్యపడుతున్నారు. ధర్మరాజు కంకుభట్టుగా వెళ్ళిన వైపునుండి కాక మరో దిక్కు నుండి భీముడు మదించిన గజేంద్రుని నడకవంటి నడకతో గంభీరంగా విరాట మహారాజు సభను సమీపించాడు.

**విశేషం:** 1. తిక్కన నాటకీయతలో ఆహార్యాభినయ వర్ణనం ఒక రమణీయాంశం. భీముడు ధరించింది వంటలవాడి వేషం. ఆ వేషాన్ని తిక్కన స్వభావోక్తి అలంకారంతో నిర్వహించాడు. భీముడి ఆకారం సమున్నతం. దానిని పఠితలకు ప్రత్యక్షం చేయటానికి సీసపద్యాన్ని ఎత్తుకొన్నాడు. మూలకర్త భీమరూపాన్ని అలంకారాలతో నిరూపించ యత్నించాడు. అయితే, ఆ వర్ణనం భీముడి రూపాన్ని ఒక సమన్వయంతో రూపుకట్టించలేదు. మూలంలో అతడు భీమబలుడు. తేజస్సుతో వెలిగిపోతున్నాడు. సింహవిలాసవిక్రముడు, అతడి చేతిలో తెడ్డు, గరిట, మొక్కవోని ఉక్కుకత్తి ఉన్నాయి. వంటలవాడి వేషంలో అతడు సూర్యుడివలె ప్రకాశిస్తున్నాడు. నల్లని వస్త్రాలతో పెద్ద పర్వతంవలె విరాటుడిని సమీపించాడని మూలం వర్ణించింది. తిక్కన మూలంలోని అలంకారాలను తీసివేశాడు. వంటవాడి వేషానికి ఒక పరిపూర్ణతను కల్పించాడు. తిక్కన కాలంనాటి రాజాస్థాన పాకనిపుణుడు ధరించే వేషాన్ని మన కళ్ళముందు ఉంచాడు. వంటలవాడికి వృత్తిపరమైన అలంకారాలు వంట పరికరాలు. వాటినిబట్టి అతడి వృత్తి నైపుణ్యాన్ని అంచనా కట్టవచ్చును. వాటికి ఒక వరుస, వైనం ఉన్నట్లు తిక్కన అమర్చాడు. తెలుగు వంటలవాడికి గరిటె సహజాలంకారం. అది అతడిచేతికి ఉపాంగం. ఆ వృత్తికి ప్రధాన చిహ్నం. దానిని కుడిచేతిలో పెట్టించాడు. పదార్థాలను కలిపేది గరిట, పదార్థాలను ముక్కలు చేసేది ఖడ్గం (కత్తి), వంటవాడు కత్తిని చంకకు తగిలించుకొనటం పరిపాటి. నడుముకు అందంగా

దిండులాగా కట్టుకొన్న నున్నని నల్లటి వస్త్రపు దట్టీలో చురియ (చురకత్తి) చక్కగా బిగింపబడివుంది. ఎడమచేతిలో కరకుట్లు కాల్చటానికి ఉపయోగించే శూలాలు. రంగురంగుల లేడి చర్మంతో ఉత్తరీయం. అది వంటపొయ్యి వేడికి రక్షగా ఉపయోగించే కవచం. ఇవన్నీ వంటవాడి ఆహార్యాభినయంలో అలంకారాలే. ఆ వేషంలో భీముడు వింతైన అత్యంత ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాడు. వంటలవాడు అంతటి మేటి రూపంకలిగి ఉండటం అరుదు. అందుకే అందరికీ ఆశ్చర్యం. వృత్తి ధర్మాన్నిబట్టి వినయంగా రావాలి. కాని, అతడు మదించిన ఏనుగువలె నడిచివస్తున్నాడు. ఆ లక్షణం కూడా చూచేవారికి అబ్బురపాటు కలిగించింది. అద్భుతభావానికి ఆలంబనమైన విభావాన్ని స్వభావోక్తిలో చెప్పి, దానిని చూచి ఆశ్చర్యం చెందిన ప్రేక్షకులను, వారి మనోభావాలను ఆ తరువాత చిత్రించాడు తిక్కన. ఈ క్రమమైన కావ్యశిల్పం మూలంలోకంటె తెలుగులో తేటతనాన్ని ప్రదర్శించింది. మూలంలోని అలంకారాలు తెలుగులో లేకపోవటమే తిక్కన కవితకు సహజాలంకారం. (సంపా.)

2. ధర్మరాజు వెళ్ళిన వైపు వదలిపెట్టి భీముడు మరో దిక్కుగా కదలి రావడంలో అంతరార్థం ఉన్నది. విరాట మహారాజుకు అనుమానం కలగటానికి వీల్లేదు.

**వ. అంతంతం గనుంగొని. 212**

**ప్రతిపదార్థం:** అంతన్+అంతన్= అల్లంత దూరాన; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** అల్లంత దూరాన్నుండి చూచి.

**క. ఉలుకును వెక్కసపాటును। దలకొను నెమ్మనముతోడ ధాత్రీరమణుం**
**డలఘు భుజ విపుల వక్ష। స్థ్సల రేఖాకాంతిఁ బరవశత్వముఁ బొందెన్. 213**

**ప్రతిపదార్థం:** ధాత్రీరమణుండు= భూతలనాథుడయిన విరాటుడు; ఉలుకును= భయమూ; వెక్కసపాటును= ఆశ్చర్యమూ; తలకొను= కలిగే; నెమ్మనముతోడన్= నిండయిన మనస్సుతో; అలఘు= లఘువు కాని, పొడుగయిన; భుజ= చేతులు; విపుల= విశాలమైన; వక్షస్స్థల= వక్షః స్థలముల; రేఖాకాంతిన్= రూపు రేఖలతో; పరవశత్వమున్= తన్మయత్వమును; పొందెన్= పొందాడు.

**తాత్పర్యం:** విరాట మహారాజు భీముడిని చూశాడు. అతడి మనసులో భయం చోటు చేసికొన్నది. ఆశ్చర్యం కలిగింది. అతడి పొడుగాటి భుజాలు, విశాలమయిన వక్షఃస్థలం పరవశత్వాన్ని కలిగించాయి.

**వ. ఇట్లతని రూపాతిశయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున. 214**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అతని= భీముడియొక్క; రూప+అతిశయంబునకున్= రూపం యొక్క ఆధిక్యానికి; ఓటు+పడి= వశమయిపోయి; చూచుచున్= వీక్షిస్తూ; నిజ+అంతర్గతంబునన్= తన మనస్సులో.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడి చక్కని రూపానికి లోబడిపోయాడు. అతడిని చూస్తూ మనసులో.

**క. విహరింప మానవాకృతి। సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచిన ప**
**ద్మహితుఁడొ హిమకరుఁడొ శచీ। గృహమేథియొ కాక యితఁడు కేవల నరుఁడే! 215**

**ప్రతిపదార్థం:** మానవ+ఆకృతి సహితంబుగన్= మానవ రూపంతో కూడా; అర్థిన్= కుతూహలంతో; మహికిన్= భూమిమీదకు; విహరింపన్= విహరించడానికి; చనుదెంచిన= వచ్చినటువంటి; పద్మహితుఁడొ= తామరలకు మేలు చేకూర్చే సూర్యుడో; హిమ కరుఁడొ= మంచుకిరణములుగలచంద్రుడో; శచీగృహమేధియొ= శచీదేవిభర్త అయిన ఇంద్రుడో; కాక= కాక; ఇతఁడు= భీముడు; కేవల నరుఁడే= మానవ మాత్రుడా!

**తాత్పర్యం:** ఇతడు మానవమాత్రుడు కాడు. మానవాకారంలో భూమిమీదికి వచ్చిన సూర్యుడో, చంద్రుడో లేదా ఇంద్రుడో మరి.

**విశేషం:** తేజస్సును బట్టి సూర్యుడు, సౌందర్యాన్నిబట్టి చంద్రుడు, వైభవ, గమనాలనుబట్టి ఇంద్రుడు.

**క.** **ఏమి కులంబున వాఁడొకొ? । నామం బెద్ది యగు నొక్కొ? నా భృత్యులలో**
**నీ మనుజోత్తముఁ దొల్లియు । నే మెఱుఁగుదు మనఁగ నిచట నెవ్వరు గలరో?** **216**

**ప్రతిపదార్థం:** ఏమి కులంబున వాఁడు+ఒకొ= ఏ కులం వాడో; నామంబు+ఎద్ది+అగున్+ఒక్కొ= పేరేమిటో; నా భృత్యులలోన్= నా సేవకులలో; ఈ+మనుజ+ఉత్తమున్= ఈ పురుషశ్రేష్ఠుని; తొల్లియున్= ముందెప్పుడో; ఏము= మేము; ఎఱుఁగుదుము= ఎఱుగుదుము; అనఁగన్= అనగా; ఇచటన్= ఇచ్చట; ఎవ్వరు కలరో= ఎవరున్నారో (ఎవరైనా ఉన్నారా?).

**తాత్పర్యం:** ఇతడు ఏ కులంవాడో, ఇతని పేరేమిటో, ఇతడిని గుర్తుపట్టగలిగినవారు నా సేవకులలో ఎవరైనా ఉన్నారా?

**క.** **అనుచుండ ననతి దూరం । బున కల్లన వచ్చి పవనపుత్త్రుఁడు మనుజేం**
**ద్రునకు జయశబ్దయుతముగ । వినయంబున మ్రొక్కి విన్నవించె నిభృతుఁడై.** **217**

**ప్రతిపదార్థం:** అనుచున్+ఉండన్= విరాట మహారాజు ఈ విధంగా తర్కిస్తూ ఉండగా; పవన పుత్త్రుఁడు= వాయుపుత్రుడయిన భీముడు; అనతి దూరంబునకున్= చాలా దగ్గరికి; అల్లనన్= మెల్లగా; వచ్చి; జయశబ్దయుతముగన్= ప్రభువులకు జయమగుగాక! వంటి జయశబ్దాలతో; మనుజ+ఇంద్రునకున్= రాజుకు; వినయంబునన్= వినయంతో; మ్రొక్కి= నమస్కరించి; నిభృతుఁడు+ఐ= వినమ్రత కలవాడై; విన్నవించెన్= విన్నవించాడు.

**తాత్పర్యం:** ఇట్లా విరాటుడు మనసులో తర్కించుకొంటూ ఉండగా భీముడు దగ్గరికి వచ్చాడు. జయనాదంతో వినమ్రుడై విరాటమహారాజుకు మ్రొక్కాడు. వినయంతో ఈ విధంగా మాట్లాడటం మొదలు పెట్టాడు.

**విశేషం:** 1. విరాటుడి వితర్కాన్ని తెలిసికొన్న భటులు భీముడి వద్దకు వెళ్ళి అతడి వివరాలను రాజు తెలిసికొనదలచాడని చెప్పారనీ, వారి మాటల ననుసరించి భీముడు విరాటుడిని సమీపించాడనీ మూలం. తిక్కన ఆ భటుల ప్రమేయాన్ని వదిలాడు. రాజు చేసే బయలు సభలో ఎవరైనా వచ్చి రాజుకు తమ గోడు చెప్పుకొనవచ్చునన్న సంప్రదాయాన్ని కాపాడాడు.

2. జయ శబ్దం భటులు వచ్చి రాజు ముందు చెప్పే మొదటి గౌరవశుభవాచకం. ధర్మరాజు యతిరూపంలో వచ్చాడు. కాబట్టి అతడు చెప్పలేదు. వంటలవాడైన భీముడు చెప్పాడు. ఇది పాత్రౌచిత్యం, ప్రకరణౌచిత్యం. 'జయ' శబ్దంలో 'జయ' నామంతో రహస్యంగా ఉన్న ధర్మరాజుకు అభివందనం కూడా చెప్పినట్లయింది. మూలంలో లేని 'జయ' శబ్దం తెలుగులో ఈ విశేష ప్రయోజనాలను సాధించింది. (సంపా.)

**శా.** **'దేవా! నాలవజాతివాఁడ నిను నర్థిం గొల్వఁగా వచ్చితిన్;**
**సేవాదక్షత నొండుమై నెఱుఁగ; నీ చిత్తంబునన్ మెచ్చున**
**ట్లే వండం గడునేర్తు; బానసమునం దిచ్చోటనే కాదు న**
**న్నే వీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ డెబ్బంగులం జూచినన్.** **218**

**ప్రతిపదార్థం:** దేవా!= రాజా!; ఏన్= నేను; నాలవజాతివాఁడన్= శూద్రజాతివాడిని (పంచభూతాలలో నాలవదిఅయిన వాయువుకు పుట్టినవాడిని); నినున్= నిన్ను; అర్థిన్= కుతూహలంతో; కొల్వఁగాన్= సేవించాలని; వచ్చితిన్= వచ్చాను. సేవాదక్షతన్= సేవించే నేర్పులో; ఒండుమైన్= మరోవిధంగా (వక్రపద్ధతులు); ఎఱుఁగన్= ఎరగను; నీ చిత్తంబునన్= నీ మనస్సులో; మెచ్చునట్లు= మెచ్చుకొనేటట్లు; ఏన్= నేను; వండన్+కడున్+నేర్తున్= వండటం బాగా నేర్చాను; బానసము నందున్= వండటంలో; ఏ+భంగులన్+చూచినన్=ఏ రకంగా చూచినా; ఈ+చోటనే కాదు= ఇక్కడే కాదు; ఏ వీటన్= ఏ ఊళ్ళోనూ; నన్నున్= నన్ను; మిగులంగన్= అతిక్రమించటానికి (మించటానికి); ఎవ్వఁడును= ఎవ్వడూ; లేఁడు= లేడు.

**తాత్పర్యం:** 'రాజా! నేను నాలవజాతి వాడిని. నీకు సేవ చేయాలని వచ్చాను. వేరేవిధంగా సేవించటం నాకు తెలియదు. నీవు మెచ్చుకొనే విధంగా వంటలు చేస్తాను. ఎన్ని విధాల చూచినా వంటలో నన్ను మించినవాడు ఏ పట్టణంలోనూ లేడు.

**విశేషం:** పంచభూతాలలో 'వాయువు' నాల్గవ భూతం. భీముడు వాయుదేవుడి కుమారుడు. భీముడు తనను తాను పరిచయం చేసికొనటం సవ్యసమన్వితంగా ఉండటం గమనించదగింది.

**క.** **పేరు వలలుండు; కూడుం । జీరయు నిడి సాకతంబు సేసినఁ జాలుం**
**గోరిన వంటకములు నా । నేరిమిఁ దగ నెఱపి కొలుతు నిశ్చలభక్తిన్.'** 219

**ప్రతిపదార్థం:** పేరు= పేరు; వలలుండు= వలలుడు; కూడున్= తిండీ; చీరయున్= గుడ్డా; ఇడి= ఇచ్చి; సాకతంబు+చేసినన్= అనుగ్రహించినట్లయితే; చాలున్= అంతే చాలు; కోరిన వంటకములు= కోరినవంటలు; నానేరిమిన్= నా నేర్పు; తగన్+నెఱపి= తగిన విధంగా ప్రదర్శించి; నిశ్చలభక్తిన్= నిశ్చలమయిన భక్తితో; కొలుతున్= సేవిస్తాను.

**తాత్పర్యం:** నా పేరు వలలుడు. నాకు కూడూగుడ్డా ఇస్తే చాలు. నేర్పుతో కోరిన వంటకాలు చేసి పెట్టుతాను. నిశ్చలమయిన భక్తితో సేవిస్తాను.'

**విశేషం:** సేవలు అనేకవిధాలు. సేవకులకు ఇచ్చే భుక్తి కూడా అనేక విధాలు. కూడూ గుడ్డా మాత్రం తీసికొని చేసేది ఒకరకమయిన సేవావృత్తి. చీర అనేమాటకు తిక్కన కాలంలో 'ఆచ్ఛాదనం' అనే సామాన్యార్థం మాత్రమే ఉన్నది.

**చ.** **అనవుడు మత్స్యభూరమణుఁ డాతని కిట్లను 'నెట్లు శూద్రుఁగా**
**నినుఁ దలఁపంగవచ్చు? ధరణీ భరణ క్షమమూర్తి వీవు; నీ**
**కనుగుణమైన యానమును నాసనమున్ రుచిరాతపత్రముం**
**జనవరి కొల్వు నిచ్చెద గజవ్రజముం బరికింపు పెంపుతోన్.'** 220

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; మత్స్యభూరమణుఁడు= మత్స్యదేశపు రాజు; ఆతనికిన్= భీమునికి; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పటానికి సంసిద్ధుడయ్యాడు; నినున్= నిన్ను; శూద్రున్+కాన్= శూద్రునిగా; ఎట్లు= ఏ విధంగా; తలఁపంగన్+వచ్చున్= భావింపవచ్చు; ఈవు= నీవు; ధరణీభరణక్షమమూర్తివి= భూమిని పాలించగల సమర్థుడివి; నీకున్= నీకు; అనుగుణము+ఐన= తగిన; యానమును= వాహనాన్ని; ఆసనమున్= పీఠాన్ని; రుచిర= కాంతిమంతమయిన; ఆతపత్రమున్= గొడుగును; చనవరి= చనువుతో మెలగదగిన వాడియొక్క చేయగలిగిన; కొల్వున్= సేవను; ఇచ్చెదన్= ఇస్తాను; గజవ్రజమున్= ఏనుగుల సమూహాన్ని; పెంపుతోన్= గౌరవంతో; పరికింపు= పర్యవేక్షణ చేయుము.

**తాత్పర్యం:** అపుడు విరాటమహారాజు భీముడితో ఇట్లా అన్నాడు; "నిన్ను శూద్రుడని ఎట్లా నమ్మమంటావు? నీ రూపం పరిశీలిస్తే భూభారం వహించగలిగిన సమర్థత కనిపిస్తున్నది. నేను నీకు తగిన వాహనం ఇస్తాను. పీఠం సమకూరుస్తాను. గొడుగును సన్నద్ధం చేస్తాను. చనవరిగా ప్రవర్తించే పదవిని సమకూరుస్తాను. నా గజసముదాయాన్ని పర్యవేక్షిస్తూ ఉండవయ్యా.

**విశేషం:** 1. విరాటుడు భీముడిని భూభారాన్ని వహించగల భూపతిలక్షణా లున్నవాడుగా భావించాడు. కాని, అతడు తనది సేవావృత్తి ప్రధానమైన శూద్రకులంగా చెప్పుకొన్నాడు. ఆ రెంటికీ పొంతన కుదరలేదు. రాజప్రతినిధివలె సేవలు చేసే కొలువు అతడికి యోగ్యంగా ఉంటుందని రాజు భావించాడు. అందువలననే చనవరి కొలువు నిస్తానన్నాడు. అంటే రాజపక్షాన తనశాఖలో స్వతంత్ర నిర్ణయాలను తీసికొనే పదవి. అటువంటి పదవులు సేనాధ్యక్షులకు ఉండవచ్చును. వారికి వాహనం, సింహాసనం, గొడుగు మొదలైన రాజలాంఛనా లుంటాయి. అందువలననే గజ సైన్యాధ్యక్షునిగా పదవి నిస్తానన్నాడు. అతడు సభలో గజరాజువలె నడచివచ్చాడని తిక్కన చెప్పాడు. ఆ నడకకు తగిన ఉద్యోగాన్ని విరాటుడు ఇస్తానని అన్నట్లు అతికినట్లు చెప్పాడు తిక్కన, మనిషిని చూచి యోగ్యతను నిశ్చయించే ఇంగితజ్ఞత, లోకజ్ఞత విరాటుడికి ఉన్నట్లు తిక్కన చిత్రించాడు.

2. 'చనవరి కొలువు' ప్రసక్తి మూల భారతంలో లేదు. తిక్కన తన కాలంనాటి రాచరికపు పరిపాలన వ్యవస్థలో ఉన్న కొలువుల తీరులను విరాటుడి కొలువుకు అన్వయించి చెప్పి తెలుగుదనాన్ని కల్పించాడు. నాలవజాతి వాడను - అనటంలోని అంతరార్థాన్ని - అనగా వాయుపుత్రుడను అనే అర్థాన్ని రాజు గమనించినట్లు లేదు (సంపా.)

**క. అనుటయు మోఱకుచందం। బున మో మడ్డము గదల్చి భూవిభుఁడు సభా**
**జనులు విన ననిలసుతుఁ డి। ట్లనియెం బ్రస్ఫుట నిరర్గళాలాపములన్. 221**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; అనిలసుతుఁడు= వాయువు కుమారుడయిన భీముడు; మోఱకు చందంబునన్= మూర్ఖునివలె; మోము+అడ్డము+కదల్చి= ముఖం అడ్డంగా త్రిప్పి; భూవిభుఁడున్= రాజూ; సభాజనులున్= సభలోని వారందరూ; వినన్= వినేటట్లు; ప్రస్ఫుట= స్పష్టమయిన; నిరర్గళ= ధారాళమయిన; ఆలాపములన్= నిండైనమాటలతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** విరాటుడు ఇట్లా అనగానే భీముడు మూర్ఖుడివలె ముఖం అడ్డంగా త్రిప్పాడు. రాజూ, సభాసదులు వినే విధంగా స్ఫుటంగా, ధారాళంగా ఇట్లా చెప్పాడు.

**విశేషం:** మూర్ఖుడివలె మొగం అడ్డంగా త్రిప్పటం వలలపాత్రకు తిక్కన కల్పించిన పాత్రస్వభావాభినయం (మేనరిజం). మూలంలో ఈ నాటకీయత లేదు. అయితే ఇది మూర్ఖుడి అభినయం కాదు. మొరటువాడి అభినయం. తన నిశ్చితాభిప్రాయాన్ని ఏ పరిస్థితులలోనూ మార్చుకొనటానికి ఏ మాత్రం అంగీకరించని ఉద్ధతుని లక్షణం. తిక్కన నాటకీయతలో అది భావానికి భాష్యమై భాసించింది.(సంపా.)

**ఉ. 'నా కవి యెల్ల నేల? నరనాథులకుం బ్రియ మొందునట్లుగాఁ**
**బాకము చేయనేర్తు జనపాలక! ధర్మసుతుండు పెద్దయుం**
**జేకొని యుండు బానసము సేయు విధంబున కిచ్చ మెచ్చి; పు**
**ణ్యాకరమూర్తివైన నిను నాతనిఁ; గొల్చినయట్ల కొల్చెదన్. 222**

**ప్రతిపదార్థం:** జనపాలక!= రాజా!; నాకున్+అవి+ఎల్లన్+ఏల?= నా కవన్నీ ఎందుకు?; నరనాథులకున్= రాజులకు; ప్రియము+ ఒందునట్లుగాన్= ప్రీతి కలిగే విధంగా; పాకము= వంటను; చేయన్+నేర్తున్= చేయగలను; బానసము= వంటను; చేయువిధం బునకున్= చేసేవిధానానికి; ఇచ్చన్+మెచ్చి= మనసులో మెచ్చుకొని; ధర్మసుతుండు= యమధర్మరాజు కుమారుడయిన ధర్మరాజు; పెద్దయున్+చేకొని+ఉండున్= ఎంతగానో ఆదరించేవాడు; పుణ్య+ఆకరమూర్తివి+ఐన= పుణ్యమునకు స్థానమైన మూర్తిగలవాడవైన; నినున్= నిన్ను; ఆతనిన్= ధర్మరాజును; కొల్చిన అట్లు+అ= సేవించిన విధంగానే; కొల్చెదన్= సేవిస్తాను.

**తాత్పర్యం:** 'రాజా! నా కవన్నీ ఎందుకయ్యా? రాజులకు ఇంపుగా వంట చేస్తాను. నేను వంట చేసే పద్ధతికి ధర్మరాజు ఎంతో సంతోషించేవాడు. నన్ను బాగా ఆదరించేవాడు. నీవు పుణ్యాత్ముడివి. అందుచేత ధర్మరాజును సేవించినట్లుగానే నిన్ను సేవిస్తాను.

**విశేషం:** లోకంలో యాచించేవారు తమ కోరికలను ప్రకటించి, పుణ్యముంటుంది బాబూ అనటం అలవాటు. అట్లాగే భీముడు పుణ్యాత్ముడివి అన్నాడు. పాండవులకు అజ్ఞాతవాసకాలంలో రక్షణ ఇవ్వటం తెలియక చేసిన పుణ్యం. ఈ మాటలలో భీముడి వాక్చాతుర్యం స్పష్టమవుతుంది.

**చ. వలసిన నేలు; మేను బలవంతుఁడఁ; గారెనుబోతు దంతి బె**
**బ్బులి మృగనాథునిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁగా**
**దలమును లావు విద్య మెయిదర్పముఁ బేర్చి పెనంగు జెట్టి మ**
**ల్లుల విఱుతున్ వడిన్ గడియలోనన చూడ్కికి వేడ్కసేయుదున్.** 223

**ప్రతిపదార్థం:** ఏను= నేను; బలవంతుఁడన్= బలవంతుడిని; కారు+ఎను+పోతున్= అడవిదున్నను; దంతిన్= ఏనుగును; బెబ్బులిన్= పెద్దపులిని; మృగనాథునిన్= సింహాన్ని; శూరత= శౌర్యం; ఉల్లసిల్లఁగాన్= ప్రకాశించేవిధంగా, విజృంభించే విధంగా; తొడరి పోరుదున్= ఎదుర్కొని పోరాడుతాను; దలమును= ఆధిక్యమూ; లావు= బలమూ; విద్య= విద్య; మెయిదర్పమున్+పేర్చి= ఒంటి పొగరు అతిశయించి; పెనంగు= పోరాడేటటువంటి; జెట్టిమల్లులన్= మల్లయుద్ధ వీరులను; గడియలోనన= గడియలోనే; వడిన్= వేగంగా (త్వరగా); విఱుతున్= చిత్తుచేసి ఓడిస్తాను; చూడ్కికిన్= చూపులకు, కళ్ళకు; వేడ్క+చేయుదున్= వినోదం కలిగిస్తాను; వలసినన్= కావాలంటే; ఏలుము!= ఏలుకోవయ్యా!

**తాత్పర్యం:** 'నేను బలవంతుడిని. అడవి దున్నలతో, ఏనుగులతో, పెద్దపులులతో, సింహాలతోనూ పోరాడతాను. బలవంతులూ, మల్లవిద్యావంతులూ, కండకావరం కలిగినవారయిన మల్లులతో కనులపండువుగా పోరాడతాను. వాళ్ళందరినీ ఒక్క గడియలో విరిచి పారేస్తాను. ఇట్లాంటివాడినైన నన్ను ని కిష్టమైతే ఏలుకొమ్ము.

**విశేషం:** రాజుల కొలువులలో విందులూ, వినోదాలూ జోడుగుర్రాలుగా సాగుతుంటాయి. వలలుడు వంటలు చేయగలడు, వింతరుచులు తినిపించగలడు. అట్లాగే మల్లులతో, మృగాలతో పోరాడి రాజులకు వినోదం కలిగించగలడు. రాజులు స్వయంగా అడవులలో వేటాడేటప్పుడు క్రూరమృగాలను ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు వాటిని లోబరచుకొని, జయించి, చంపేమెలకువలు నేర్చుకోవాలి. మల్లయుద్ధం మనుషులతో చేసేది, క్రూరజంతువులతో చేసేది, బలవంతమైన పశువులతో చేసేది- అని మూడు రకాలుగా ఉంటుంది. వాటిని రాజ సభలలో (ప్రాచ్య పాశ్చాత్య దేశాలలో కూడా) పౌరుష వినోద క్రీడలుగా పరిగణిస్తారు. వాటిల్లో విజేతలకు బిరుదాలూ బహుమతులూ ఇస్తారు. అటువంటి వినోదాలను కూడా అవలీలగా చేసి రాజు మెప్పును పొందగలవని చెప్పాడు. భీముడు అతడి ఉద్యోగం వలన రాజుకు ద్విముఖమైన-లేదా- ద్విగుణీకృతమైన ఫలం దక్కుతుందని సూచన. (సంపా.)

**క. కొలువు గొన నొల్ల కుండుట। గలిగినఁ బొమ్మనుట యంత కంటెను మేఁ; లే**
**వలసిన కడ కేఁగెద; నీ। తలఁ పెయ్యది? యానతిమ్ము ధరణీనాథా!' 224**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా!; కొలువు+కొనన్= నాచేత కొలువు చేయించుకొనటానికి; ఒల్లక+ఉండుట= అంగీకరించక పోవటం; కలిగినన్= కలిగినట్లయితే; అంతకంటెను= దానికంటె; పొమ్ము+అనుట= పొమ్మనటం; మేలు= మంచిది; ఏన్= నేను; వలసిన కడకున్= ఇష్టం వచ్చిన చోటుకు; ఏఁగెదన్= వెళ్ళుతాను; నీ తలఁపు= నీ అభిప్రాయం; ఏ+అది= ఏదో; ఆనతి+ఇమ్ము= చెప్పుము.

**తాత్పర్యం:** మహారాజా! నా చేత కొలువు చేయించుకొనటం నీకు ఇష్టం లేకపోతే నన్ను పొమ్మనటం మంచిది. నా ఇష్టం వచ్చిన చోటుకు నేను వెళ్ళుతాను. నీ ఉద్దేశం ఏమిటో చెప్పవయ్యా.'

**విశేషం:** 'కట్టె విరిచి పొయ్యిలో పెట్టటం' ఒక జాతీయం. వలలుడి వృత్తి వంటపని. అందుచేత ఖండితంగా, పరుషంగా పలకటం వృత్తి సహజమయిన సంభాషణ.

**వ. అనిన విని భూనాథుండు సానునయంబుగా నిట్లనియె. 225**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని చెప్పగా విని; భూ నాథుండు= రాజయిన విరాట మహారాజు; స+అనునయంబు+కాన్= బ్రతిమాలే విధంగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలను విన్న విరాటమహారాజు బ్రతిమాలే ధోరణిలో ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఇమ్మహనీయ రూపమును నేడ్తెఱఁ గన్గొని వేడ్క నీకు యో**
**గ్యమ్మగు భంగిఁ జెప్పితిమి గాని నరోత్తమ! యొండు గాదు; నీ**
**వెమ్మెయి నైన నిల్చుటయ యిష్టము; వంటల మేరవాఁడవై**
**యిమ్ముల నుండు సూదజనమెల్లను నీదగు పంపు చేయఁగన్.' 226**

**ప్రతిపదార్థం:** నర+ఉత్తమ!= నరులలో ఉత్తముడవయిన వాడా!; ఈ+మహనీయ రూపమునున్= గొప్పదయిన ఈ రూపాన్ని; ఏడ్తెఱన్= పరాక్రమాన్ని; కన్గొని= చూచి; వేడ్కన్= కుతూహలంతో; నీకున్= నీకు; యోగ్యమ్ము+అగుభంగిన్= తగిన పద్ధతిలో; చెప్పితిమి= చెప్పాము; కాని= కాని; ఒండు కాదు= మరొకటి కాదు; నీవు= నీవు; ఏ+మెయిన్+ఐనన్= ఏ విధంగా నయినా; నిల్చుట+అ= ఇక్కడ ఉండటమే; ఇష్టము= (మా) కోరిక; సూదజనము+ఎల్లను= వంటలుచేసేవారంతా; నీదు+అగు+పంపు= ఆజ్ఞను; చేయఁగన్= నిర్వర్తించగా; వంటలమేరవాఁడవు+ఐ= వంటలయేర్పాటు చేసేవాడవై, వంటశాలకు అధ్యక్షుడవయి; ఇమ్ములన్+ఉండుము= సుఖంగా ఉండుము.

**తాత్పర్యం:** 'నీ రూపాతిశయాన్ని పరాక్రమాన్ని చూచి వేడుకతో నీకు తగిన విధంగా చెప్పాము. అంతేకాని మరో రకంగా కాదు. ఏ విధంగానయినా నీవు ఇక్కడ ఉండటమే మాకు చాలా ఇష్టం. నీవు వంటశాలకు అధికారిగా ఉండుము. వంట వాళ్ళంతా నీ ఆన పాటిస్తారు.

**విశేషం:** విరాటుడు భీముడికి తగిన ఉద్యోగం గజాధ్యక్షపదవిగా భావించి అతడిని నియోగిస్తానని పలికాడు. భీముడు నా కది వద్దు వంటలవాడి ఉద్యోగమే కావాలన్నాడు. తా నడిగినది ఇవ్వకుండా మరొకటి ఇస్తాను స్వీకరిస్తావా? అనటం మర్యాదగా

ఎదుటివారి కోర్కెను తిరస్కరించటం కూడా ఔతుంది. నాగరక ప్రపంచంలో భీముడామర్యాదను అనుసరించి 'మీ కిష్టంలేకపోతే నన్ను వెళ్ళిపొమ్మనండి కాని నా కిష్టమైన సేవను మార్చకండి' - అని సున్నితంగా హెచ్చరించాడు. భీముడిది అజ్ఞాతవాసనియమ సమస్య. విరాటుడిది యోగ్యుడైన సేవకుడు దొరికినప్పుడు అతడి సేవలు వినియోగించుకొనకుండా జారవిడుచుకొనటం నీతికాదనే వ్యవహార సమస్య. అందువలననే విరాటుడు భీముడిని నయాన, వినయాన అడిగాడే కాని ధిక్కరింపలేదు. తన హృదయాన్ని ఈ పద్యంలో తేటతెల్లం చేశాడు. అతడి తాత్పర్యం ఒక్కటే. భీముడి సేవలను తప్పకుండా వాడుకొనటమే అతడి అభిమతం. అందువలన అడిగిన ఉద్యోగం ఇచ్చాడు. అయితే 'బానసమునం దిచ్చోటనే కాదు నన్నేపీటన్ మిగులంగ నెవ్వరును లేఁ డెబ్బంగులన్ చూచినన్' (విరా.1.218) అని భీముడు చెప్పిన యోగ్యతలకు అనుగుణంగా 'వంటల మేరవాడవై యిమ్ముల నుండు' మన్నాడు. మూలంలో **"మహానసే త్వం భవ మే పురస్కృతః"** అని ఉండగా తిక్కన మహానసశబ్దం వాడకుండా తెలుగు పదాలతోనే కథ నడపటం విశేషం. సంస్కృత పదబంధాలకు, పారిభాషికపదాలకు తెలుగు పలుకుబడులు కల్పించటం తిక్కన నేర్పు. వంటలమేరవాడు, మహానసాధ్యక్షుడు. మేరవాడు అనేమాట సర్వాధికారి అనే పదానికి సమానార్థకం. వంటల పరిధికి సంబంధించినంతవరకు అతడి మాటే మేర-అంటే-అవధి. చివరిమాట, తిరుగులేని ఆజ్ఞ. ఇది తిక్కన నాటి వ్యవహారంలో ఉన్న సేవాపదవీ సూచకమైన పారిభాషిక పదం కావచ్చును. (సంపా) సూదజనమెల్లనుం, సూపజనమెల్లను - అని పాఠాంతరాలు.

**క. అని హర్షోత్కర్షంబున । మన మలరఁగఁ బల్కి మత్స్యమనుజాధీశుం**
**డనిలసుతు నేలె; నాతఁడుఁ । దన మనమున నూఱడిల్లెఁ దదవసరమునన్. 227**

**ప్రతిపదార్థం:** అని= అని; హర్ష+ఉత్కర్షంబునన్= సంతోషాతిశయంతో; మనము= మనస్సు; అలరఁగన్= ఒప్పగా; పల్కి= చెప్పి; మత్స్యమనుజ+అధీశుండు= మత్స్యరాజయిన విరాటుడు; అనిలసుతున్= వాయుసుతుడయిన భీముని; ఏలెన్= సేవకుడుగా స్వీకరించాడు; అతఁడున్= ఆ భీముడు కూడా; తన మనమునన్= తన మనస్సులో; ఊఱడిల్లెన్= సంతృప్తి చెందాడు; తత్+అవసరమునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని సంతోషంతో విరాటమహారాజు మాట్లాడి భీముడిని ఏలుకొన్నాడు. భీముడు కూడా ఎంతో సంతృప్తి పడ్డాడు. ఆ సమయంలో.

అర్జునుఁడు పేడిరూపమున విరటుఁ గొల్వ వచ్చుట (సం.4.10.1)

**సీ. కాళ్ళ యొప్పిద మాఁడు కట్టనుజ్జ్వలము చే । యంగ, సంకుల బాహు లంద మెడలఁ,**
**గంచుక మంగంబు కాంతికి మాటుగా । మెడ హేమ పట్టిక మెఱయ కుండ,**
**వదనంబు కొమరు భావనఁ జేసి వేఱుగా । నుదుటి పెం పలకలఁ బొదువఁ బడఁగఁ,**
**బవడంపు జొత్తులఁ జెవుల రూ పడఁగంగఁ । బాపట తలకట్టు భంగి దప్ప,**

**ఆ. మంచు మఱుఁగు వడిన మార్తాండుఁడును బోలె । నీఱు గవిసియున్న నిప్పుఁ బోలె**
**వేషధారి యైన విష్ణుండుఁ బోలె న । వ్విరటు కొలువు చేర నరుఁడు వచ్చె. 228**

**ప్రతిపదార్థం:** కాళ్ళ+ఒప్పిదము= కాళ్ళ పొందికను; ఆఁడుకట్టు= తానుకట్టిన చీరతీరు; అనుజ్జ్వలము+చేయంగన్= మాటుపరచగా; సంకులన్= శంఖవలయాలతో; బాహుల అందము+ఎడలన్= భుజాలయొక్క సౌందర్యం తొలగిపోగా; కంచుకము= పొడుగాటి రవికె; అంగంబు కాంతికిన్= శరీరకాంతికి; మాటుగాన్= మాటు కాగా; మెడ= కంఠం; హేమపట్టికన్= బంగారు పట్టెడచేత; మెఱయక+ఉండన్= ప్రకాశించకుండా ఉండగా; వదనంబు కొమరు= ముఖసౌందర్యం; భావనన్+చేసి= పసుపు రాసుకొనటం వలన; వేఱుకాన్= వేరే రకంగా అయిపోగా; నుదుటి పెంపు= నొసటి వెడల్పు; అలకలన్= ముంగురులచేత; పొదువన్+పడఁగన్=

కప్పివేయబడగా; పవడంపు జొత్తులన్= పగడాల కమ్మలచేత; చెవులరూపు= చెవుల అందం; అడగంగన్= అణగిపోగా; పాపట= సీమంతం; తలకట్టు భంగితప్పన్= కురులుముడిచిన వైఖరిలో తప్పిపోగా; మంచు= మంచుచేత; మఱుఁగు+పడిన= మరుగుపడిన; మార్తాండుఁడును+పోలెన్= సూర్యుని వలె; నీఱు+కవిసి+ఉన్న= బూడిద కప్పిన; నిప్పున్+పోలెన్= అగ్నివలె; వేషధారి+ఐన= వేషం వేసికొన్న; విష్ణుండున్+పోలెన్= విష్ణువువలె; నరుఁడు= అర్జునుడు; ఆ+విరటు కొలువు= ఆ విరాట మహారాజు సభను; చేరన్= చేరగా; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆడవేషంలో విరటుడి కొలువుకు వస్తున్నాడు. కాళ్ళ అందం కనబడని పద్ధతిలో చీర, చేతులఅందం కనబడనట్లు శంఖవలయాలు, శరీరకాంతిని కప్పిపుచ్చే విధంగా కంచుకం, మెడఅందం సన్నగిల్లే విధంగా హేమపట్టిక, ముఖసౌందర్యం డీలా పడే విధంగా పసుపు పూత, నుదురు కనబడని విధంగా ముంగురులు, చెవుల అందం చెడిపోయే విధంగా పగడాల కమ్మలు పాపటవల్ల-అందం రాణించని విధంగా కురులు ముడిచిన - తలకట్టు ఉన్నాయి. మంచుకప్పిన సూర్యుడివలె, నివురు కప్పిన నిప్పువలె అర్జునుడు కనిపించాడు. వేషధారి అయిన విష్ణువువలె అతడు ఉన్నాడు. ఇటువంటి వేషంలో అర్జునుడు విరటుడి కొలువు చేరాడు.

**విశేషం:** అర్జునుడికి పేడి రూపం వచ్చింది. దానికి తగిన ఆహార్యమంతా ధర్ముడి దయవలన ఏర్పడింది. ఆ అబ్బురమైన రూపవైభవం మూలంలో పఠితకు ప్రత్యక్షం కాదు. అందమైన మగవాడు స్త్రీల అలంకారాలు పెట్టుకొన్నాడనీ, ఉన్నతుడైన పురుషుడు పొడవైన కుండలాలు, బంగారు గాజులు ధరించి ఉన్నట్లున్నాడనీ మూలం పేడివాడి రూపాన్ని చిత్రించింది. విరాటు డడిగిన ప్రశ్నలనుబట్టి బృహన్నల శ్యామవర్ణం వాడనీ, యువకుడనీ, ముడివీడిన జుట్టువాడనీ, పూలమాలలు ధరించాడనీ, వస్త్రాలను వింతగా ధరించాడనీ తెలుస్తుంది. మూలంలో వివరా లిచ్చినట్లుంటుందే కాని, వాటి సంఘటితరూపం కన్నులకు తోచినట్లుండదు. తిక్కన అర్జునుడి పేడిరూపాన్ని అత్యద్భుతంగా చిత్రించాడు. ఈ రూపం వ్యాసభారతకాలం నాటిది కాదు. తిక్కన కాలంనాటిది.

పేడివారిలో ముఖ్యంగా రెండు తెరగులవారుంటారు. స్త్రీ లక్షణాలు శరీరంమీద కనపడుతున్నా స్త్రీత్వం లేనివారు. పురుషశరీరంవంటి శరీరం కలిగి ఉన్నా నపుంసకత్వం వలన స్త్రీ లక్షణాలు భాసించేవారు. ఇందులో రెండవ తెగకు చెందిన రూపం అర్జునుడికి వచ్చింది. ఊర్వశి శాపంకూడా అటువంటిదే. తిక్కన దానిని అలంకార సుందరంగా ఆవిష్కరించాడు. సీసపద్యంలో ఆజానుబాహువైన అర్జునుడి రూపవర్ణనకు సీసపద్యం సముచితం.

పేడివాని రూపాన్ని వర్ణించేటప్పుడు కాళ్ళు, చేతులు, శరీరకాంతి, మెడ, ముఖం, నుదురు, చెవులు, పాపటుతలకట్టు అనే అంగాలను ఎన్నుకొనటం వర్ణ్యవస్తు స్వరూప స్వభావాలను తెలిసి చేసిన పని. అర్జునుడి ఆయా శరీరవయవాల సహజ సౌందర్య శోభ స్త్రీ సహజమైన ఆభరణాలతో కప్పివేయటం వలన అతడి పురుషరూపం కుంఠితమై అనుజ్జ్వలమై పోయిందట. ఇది పేడివాడి అందంలో ఉండే ఆంతర్యం. పురుషరూపం కాంతిహీనమౌతుంది. ఆడవేషం ఆభాసమౌతుంది. అందువలన శృంగార రూపాభాస స్థితి ఏర్పడుతుంది.

దానిని మూడు దశలుగా చిత్రీకరించాడు తిక్కన. అర్జునుడి పురుషత్వం మంచు మరుగునపడిన మార్తాండుడివలె అయిపోయిందట. అర్జునుడి పాదాల సొబగు ఆడుకట్టుతో వెల వెలపోయింది. బాహువుల అందం శంఖవలయాలతో మరుగుపడింది. శరీరకాంతిని కంచుకం కప్పివేసింది. మెడ సొగసును బంగారుపట్టి మ్రింగివేసింది. కాళ్ళనుండి మెడదాకా చూస్తే మంచు కప్పిన మార్తాండుడివలె ఉన్నాడట బృహన్నలాకారంలో అర్జునుడు.

ఆ తరువాత- వదనకాంతి పసుపు పూసుకొనటంచేత, నుదుటి పెంపు ముంగురులతో కప్పబడటంచేత అర్జునుడు సమానధర్మం కలిగిన- నివురుకప్పిన అగ్నివలె భాసించాడు.

ఆ పైన- పగడాల కమ్మలు చెవుల ఇంపును, పాపటతీరు తలకట్టు వైఖరిని మార్చటంతో వేషధారి అయిన విష్ణువలె భాసించాడు.

ఎత్తుగీతిలో ఉన్నమూడు ఉపమానాలూ అర్జునుడి శరీరాన్ని చూచేవారికి మూడు రకాల భావాలను కల్పిస్తున్నాయి. మంచువలె కప్పే ఆభరణాలు లలితాలైనవి. కాంతిని కప్పే శక్తి వాటికంతగా లేనివి. కాదనుకొంటే పోయేవి. నివురువలె ఆభరణాలు దట్టమైనవి. అయినా తొలగిస్తే పోయేవి. వేషధారణం రూపాన్నే మార్చేది. వేషం తీసివేస్తేకాని పోనిది. ఈ మూడురకాల అలంకారాలతో రూప వికృతిని తోపింపచేసే వింతరూపం తెలుగు సాహిత్యంలోనే అపూర్వం. (సంపా.)

**క. చనుదెంచి పేడితనమును । వనితారూపంబు నమర వాసవసుతుఁ డా**
**మనుజాధీశునకు సభా । జనులకుఁ దనుఁ జూపి మందసంచారమునన్. 229**

**ప్రతిపదార్థం:** వాసవ సుతుఁడు= ఇంద్రుడి కుమారుడయిన అర్జునుడు; పేడితనమును= నపుంసకత్వం; వనితారూపంబును= ఆడరూపం; అమరన్= ఒప్పగా; మనుజ+అధీశునకున్= మనుష్యులకు అధికారి అయిన విరటుడికి; సభా జనులకున్= సభలోని వారికి; తనున్+చూపి= కనిపించి; మంద సంచారమునన్= మెల్లని నడకతో.

**తాత్పర్యం:** అర్జునుడు పేడితనంతోను, ఆడరూపుతోను వచ్చి రాజునకు, సభాసదులకు కనిపించి మెల్లని నడకలతో (తరువాతి వచనంతో అన్వయం).

**వ. మెలంగినం గనుంగొని మత్స్యజనవిభుండు దన యొద్దివారలతో నిట్లనియె. 230**

**ప్రతిపదార్థం:** మెలంగినన్= మసలగా; కనుంగొని= చూచి; మత్స్యజనవిభుండు= మత్స్యదేశంలోని జనులకు పాలకుడయిన విరాట మహారాజు; తన+ఒద్దివారలతోన్= తన దగ్గరలో ఉన్న వారితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు పేడిరూపంలో ఆ విధంగా మసలగా విరాటుడు చూచి, తన సమీపంలో ఉన్నవారితో ఇట్లా అన్నాడు.

**మ. 'వనితావేషము గల్గియున్నయది; చెల్వం బాఁడుచందంబు గా**
**దు నిరూపింప మహానుభావతయు, నిర్దోషత్వమున్ రాజసం**
**బును శోభిల్లెడు; నెవ్వఁడే నొక జగత్పూజ్యుండు క్రీడార్థ మి**
**ట్లొనరం దాల్చిన రూపు గావలయు; మీ రూహింపుఁడా యట్లగున్.' 231**

**ప్రతిపదార్థం:** వనితావేషమున్= ఆడవేషాన్ని; కల్గి ఉన్నది= ధరించి ఉన్నది, వేసికొన్నది; చెల్వంబు= రూపురేఖలు చూస్తే; ఆఁడుచందంబు కాదు= ఆడపోలిక లేదు; నిరూపింపన్= పరిశీలించి చూస్తే; మహానుభావతయున్= గొప్ప మహిమ; నిర్దోషత్వమున్= దోషం లేకపోవటమూ; రాజసంబును= రాజసస్వభావమూ; శోభిల్లెడున్= ప్రకాశిస్తుంది; ఎవ్వఁడు+ఏన్+ఒక= ఎవడయినా ఒక; జగత్+పూజ్యుండు= లోకంచేత పూజింపదగినవాడు; క్రీడా+అర్థము= వినోదం కొరకు; ఇట్లు+ఒనరన్= ఇట్లా ఉండాలని; తాల్చిన= ధరించిన; రూపు కావలయున్= రూపం అయి ఉండాలి; మీరు+ఊహింపుఁడా= మీరు ఆలోచించండి; అట్లు+అగున్= అంతే అవుతుంది.

**తాత్పర్యం:** 'వేషం చూస్తే ఆడవేషంగా ఉన్నది. అయితే ఆ తీరులో ఆడపోలిక కనిపించదు. నిదానించి చూస్తే రాజసం కనిపిస్తుంది. పెద్దరికం, పెద్దతనం కనబడుతూ ఉన్నది. ఆకారంలో దోషరాహిత్యం (సాముద్రిక లక్షణాలకు భిన్నమయినవి లేవు) కనిపిస్తూ ఉన్నది. ఇతడు లోకమాన్యుడు కావచ్చును. వినోదం కొరకు ఈ రూపం స్వీకరించాడేమో! మీరు కూడా ఊహించండి. అవును తేరిపార చూస్తే అంతే.'

**తే.** **అనినఁ బరిజనంబులు విస్మయంబు గదుర। నిశ్చయము చేసి పలుకంగ నేర్పు లేక**
**చూచుచుండఁగ నా సవ్యసాచి సేరఁ। జని విరాటనృపాలుతో సవినయముగ.** **232**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; పరిజనంబులు= సేవకులు; విస్మయంబు+కదురన్= ఆశ్చర్యం కలుగగా; నిశ్చయము= నిర్ణయాన్ని; చేసి= చేసి; పలుకంగన్= మాట్లాడటానికి; నేర్పు లేక= నేర్పులేనందున; చూచుచున్+ఉండఁగన్= ఊరక చూస్తూ ఉండగా; ఆ సవ్యసాచి= ఆ అర్జునుడు; చేరన్+చని= దగ్గరికి వచ్చి; సవినయముగన్= వినయంతో; విరాట నృపాలుతోన్= విరాటమహారాజుతో; (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** విరటుడి మాటలకు సేవకులు ఆశ్చర్యపడ్డారు. ఏమి చెప్పాలో నిశ్చయించుకొనలేకపోయారు. ఏమీ మాట్లాడలేక చూస్తూ ఉండిపోయారు. ఈలోగా అర్జునుడు దగ్గరికి వచ్చాడు. విరాటుడితో సవినయంగా ఇట్లా అన్నాడు.

**క.** **'నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ। గన్నియలకు నాట గఱపఁగా నోపుదు వి**
**ద్వన్నుత! మన్నామంబు బృ। హన్నల; యేఁ బేడి' యనుడు నతఁ డిట్లనియెన్.** **233**

**ప్రతిపదార్థం:** విద్వత్+నుత!= విద్వాంసులచేత పొగడబడేవాడా!; నిన్నున్= నిన్ను; కొలువంగన్= సేవించడానికి; వచ్చితిన్= వచ్చాను; కన్నియలకున్= కన్యలకు; ఆట= నృత్యం; కఱపఁగాన్+ఓపుదున్= నేర్పుతాను; మత్+నామంబు= నా పేరు; బృహన్నల= బృహన్నల; ఏన్= నేను; పేడిని= నపుంసకుడిని; అనుడున్= అనగానే; అతఁడు= ఆ విరాట మహారాజు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్=అన్నాడు.

**తాత్పర్యం:** 'మహారాజా! నిన్ను సేవించటానికి వచ్చాను. అంతఃపురంలోని కన్యలకు ఆటపాటలు నేర్పుతాను. నా పేరు బృహన్నల. నేను నపుంసకుడిని' అనగానే విరాటుడు ఇట్లా అన్నాడు.

**ఉ.** **'ఆయతబాహులున్ వెడఁదయైన సమున్నత వక్షమున్ సరో**
**జాయత లోచనంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం**
**గాయజుఁ గ్రేణి సేయు ననఁ గౌశికు మీఱు ననంగ విభ్రమ**
**శ్రీయును బెంపునుం గలుగఁ జేసి విధాతృఁడు పేడిఁ జేసెనే?** **234**

**ప్రతిపదార్థం:** ఆయతబాహులున్= పొడవయిన చేతులూ; వెడఁద+ఐన= విశాలమయిన; సమున్నత వక్షమున్= ఎత్తయిన రొమ్మూ; సరోజ+ఆయత లోచనంబులున్= పద్మాలవంటి విశాలమయిన కనులూ; ప్రసన్నముఖంబున్= నిర్మలమయిన ముఖమూ; ఉదాత్త రేఖయున్= ఉదాత్తమయిన శరీరసౌందర్యం; కాయజున్= మన్మథుని; క్రేణి+చేయున్= తిరస్కరిస్తుంది; అనన్= అనేటట్లు; కౌశికున్= ఇంద్రుని; మీఱున్+అనంగన్= అతిశయిస్తాడనేటట్లు; విభ్రమశ్రీయును= విలాస సంపదనూ; పెంపునున్= ఉదాత్తతనూ (దీనిని); కలుగన్+చేసి= కలిగించి; విధాతృఁడు= బ్రహ్మ; పేడిన్+చేసెనే?= నపుంసకుని చేశాడే!.

**తాత్పర్యం:** ఇతడికి పొడవయిన చేతు లున్నాయి. విశాలమూ. ఉన్నతమూ అయిన వక్షఃస్థలం ఉన్నది. పద్మాలవలె విశాలమయిన కళ్ళున్నాయి. నిర్మలమయిన ముఖం దర్శనీయంగా ఉన్నది. ఉదాత్తమయిన సౌందర్యం స్పష్టంగా కనిపిస్తూ ఉన్నది. ఇవన్నీ చూస్తుంటే ఇతని రూపం మన్మథుడిని మించేటట్లు ఉన్నది. ఇంద్రుడిని తీసిపారేసే విధంగా ఉన్నది. ఇటువంటి విలాసం, వైభవం కల్పించిన బ్రహ్మ చివరకు ఇతడిని నపుంసకుడిని చేశాడే!

**శా.** **మత్కోదండచయంబులోన నొక సమ్మానార్హచాపంబు భా**
**స్వత్కాండంబులు హేమచంద్రక కనద్వర్మంబు నీ కెంతయున్**
**సత్కారంబున నిచ్చి వాహన పరిష్కారాంక సంభావ్య సం**
**పత్కల్యాణుని జేసి వైభవము దర్పంబున్ విజృంభింపఁగన్.** **235**

**ప్రతిపదార్థం:** మత్= నా యొక్క; కోదండచయంబులోనన్= ధనుస్సుల సమూహంలో; ఒక= ఒక; సమ్మాన+అర్హచాపంబు= గౌరవోచితమయిన ధనుస్సు; భాస్వత్+కాండంబులు= మెఱిసిపోయే బాణాలూ; హేమచంద్రక కనత్+వర్మంబు= బంగారు నెమలికన్నులవంటి బొట్లతో తళతళా మెరిసే కవచమూ; నీకున్= నీకు; ఎంతయున్= ఎంతో; సత్కారంబునన్= గౌరవంతో; ఇచ్చి= ఇచ్చి; వాహనపరిష్కార+అంక+సంభావ్య; సంపత్+కల్యాణునిన్+చేసి= వాహనం, అలంకారం అనే చిహ్నాలతో గౌరవించదగిన సంపద అనే శుభం కలవానిగా చేసి; వైభవము= ఐశ్వర్యం; దర్పంబున్= గర్వమూ; విజృంభింపఁగన్= విజృంభించగా.

**తాత్పర్యం:** నాకున్న విండ్లలో నీకు ఒక గౌరవప్రదమైన చాపం ఇవ్వాలని ఉన్నది. వెలుగులీనే బాణాలు, బంగారుపూలు మెరిసే కవచం నీ కిచ్చి సన్మానించాలని ఉన్నది. వాహనం, అలంకారం వంటి గౌరవలాంఛనా లిచ్చి అర్హత కలిగించాలని ఉన్నది. ఐశ్వర్యవంతుడిని చేయాలని ఉన్నది. నిన్ను రాజుగా చేయాలని ఉన్నది.

**విశేషం:** ధనుస్సు, బాణాలు, వాహనాలు, ఆభరణాలు రాజుల గౌరవాలకు చిహ్నాలు. కవచాల పై భాగంలో బంగారు పూల తాపడం అలవాటు. ఇవి పరాక్రమాలకు ప్రతీకలు. పైగా అందం కూడా.

**క.** **ఏము నిను మత్స్యరాజ। శ్రీ మహిమకు నెల్ల యుక్తుఁ జేయఁ దలంపం**
**గా మా మనోరథమునకు। నీ మాట విరుద్ధమయ్యె నిది యెట్లొక్కో!'** **236**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; నినున్= నిన్ను; మత్స్యరాజశ్రీ మహిమకున్+ఎల్లన్= మత్స్య దేశాధిపతి సంపదల మహిమకంతటికీ; యుక్తున్+చేయన్+తలంపంగాన్= నియోగిద్దామనుకుంటే; మా మనోరథమునకున్= మా కోరికకు; ఈ మాట= ఈ మాట; విరుద్ధము+ అయ్యెన్= వ్యతిరేకమయింది; ఇది+ఎట్లు+ఒక్కో!= ఇది ఎట్లో మరి!.

**తాత్పర్యం:** నిన్ను మత్స్యరాజ వైభవాని కంతటికీ అధికారిగా చేద్దామనుకొంటున్నాను. అయితే నీ మాటలు అందుకు విరుద్ధంగా ఉన్నవి. మరి ఇది ఎట్లాగో?

**వ.** **అనిన విని యమ్మహీపతికి బృహన్నల యిట్లనియె.** **237**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; ఆ+మహీపతికిన్= ఆ విరాటమహారాజుకు; బృహన్నల= అర్జునుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** విరాటుడి మాటలను అర్జునుడు విన్నాడు. తదనంతరం ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఆఁడుఁదనంబు నిక్కమున కారసి చూచిన లేదు; పుంస్త్వముం**
**బోఁడిమి దప్పియున్నది; నపుంసకజన్మ మవశ్యభోగ్యమై**
**వాఁడిమి గల్గు శాపమున వచ్చెఁ బురాకృతకర్మ భావ్య మె**
**వ్వాఁడును నేర్చునే! తొలఁగ వైవఁగ నోర్వక పోవవచ్చునే? 238**

**ప్రతిపదార్థం:** నిక్కమునకున్= నిజానికి; అరసి చూచినన్= బాగా పరిశీలించి చూస్తే; ఆఁడుఁదనంబు= స్త్రీత్వం; లేదు= లేదు; పుంస్త్వమున్= మగతనం; పోఁడిమి+తప్పి+ఉన్నది= ఒప్పు (పటుత్వం) తప్పింది - మగతనం రూపు తప్పింది; నపుంసక జన్మము= పేడితనపు పుట్టుక (పేడితనం కలగటం); వాఁడిమి కల్గు శాపమునన్= తీవ్రమయిన, క్రూరమైన శాపంతో; అవశ్యభోగ్యము+ఐ= తప్పకుండా అనుభవించటానికి తగినదిగా; వచ్చెన్= వచ్చింది; ఏ+వాఁడును= ఎవడయినా; పురాకృత= పూర్వం చేసిన; కర్మభావ్యము= కర్మల వలన కాదగిన దానిని; తొలఁగ వైవఁగన్ నేర్చునే!= తొలగించగలడా!; ఓర్వక= అనుభవించకుండా, భరించక; పోవన్వచ్చునే?= తప్పించుకొనగలడా?

**తాత్పర్యం:** 'నిదానించి చూస్తే అసలు ఆడుతనం లేదు. మగతనం రూపు తప్పింది. ఒక క్రూరమైన శాపం వలన నపుంసకత్వం అవశ్యం అనుభవించవలసివచ్చింది. కర్మఫలాన్ని ఎవరూ తప్పించలేరు. తప్పించుకోనూ లేరు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. కర్మ బలీయమయినది. ఎవరికయినా కర్మఫలం తప్పదు. **"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్"** - అని సంస్కృతంలో సూక్తి ఉన్నది. అర్జునుడి పేడివేషం కర్మఫలమే. వేషంలో స్త్రీత్వం ఉండవచ్చును. కాని 'పుంస్త్వం' పోలేదు. అది ఓటు వోయింది. ఊర్వశిశాపఫలితంవలన అర్జునుడు నపుంసకత్వాన్ని వహించవలసి వచ్చింది. దాని కనువైన వేషం ధర్ముడి దయవలన అమరింది. ఒక సంవత్సరంపాటు ఊర్వశిశాపం వర్తించి అజ్ఞాతవాసంలో ఇతరులకు తెలియకుండా ఉండటానికి ఉపయోగపడుతుందనీ, ఆ తరువాత నపుంసకత్వ శాపం తొలగిపోతుందనీ ఇంద్రుడి వరం. దీనిని అర్జునుడు గూఢంగా ధ్వనింపచేసి అసత్యదోషాన్ని నివారించుకొన్నాడు.

**వ. కావున 239**

**తాత్పర్యం:** అందుచేత.

**తే. ఒండు పనులకు సెలవు లేకునికిఁ జేసి। యభ్యసించితి శైశవమాదిగాఁగ**
**దండలాసక విధమును గుండలియును। బ్రెక్కణంబు తెఱంగును బేరణంబు. 240**

**ప్రతిపదార్థం:** ఒండు పనులకున్= ఇతరమయిన పనులకు; సెలవు లేక+ఉనికిన్+చేసి= అనుకూలత, అవకాశము లేకపోవటం చేత; శైశవము+ఆది కాఁగన్= చిన్నతనం నుండి; దండలాసక విధమును= కోలాటమాడేరీతిని; కుండలియును= కుండలాకార నృత్యాన్ని; ప్రెక్కణంబు తెఱంగును= ప్రేంఖణ నృత్యాన్నీ; పేరణంబున్= పేరణియున్నూ; అభ్యసించితి(న్)= నేర్చుకొన్నాను.

**తాత్పర్యం:** పేడితనంవలన ఏ పనీ చేయటానికి వీలు లేకపోయింది. చిన్నప్పటినుండి దండలాసకం, కుండలి, ప్రెక్కణం, పేరణం-అనే నృత్యరీతులను నేర్చుకొన్నాను.

**క. విశ్రుత వాద్యంబులు మం। జుశ్రుతి సంభావ్యగీత సుగతులు సద్భా**
**వాశ్రయములుఁ దజ్జన్యర। సాశ్రయములు నైన యభినయంబు లెఱుఁగుదున్. 241**

**ప్రతిపదార్థం:** విశ్రుత వాద్యంబులు= ప్రసిద్ధమయిన వాద్యాలూ; మంజు= మనోహరమయిన; శ్రుతి= శ్రుతి చేత; సంభావ్య= భావించదగిన; గీత= గీతాల యొక్క; సుగతులున్= మంచి నడకలును; సద్భావ+ఆశ్రయములున్= మంచి భావాలకు ఆశ్రయాలయినవి; తద్+జన్యరస+ఆశ్రయములున్+ఐన= వాటినుండి పుట్టిన రసాలకు నిలయాలయిన; అభినయంబులు= రకరకాలయిన అభినయాలు; ఎఱుఁగుదున్= నాకు తెలుసు.

**తాత్పర్యం:** ప్రసిద్ధాలయిన వాద్యాల వాయింపు నాకు వచ్చును. మంచి శ్రుతులతో కూడిన గీతాలు, గతులు నాకు తెలుసును. రసభావాశ్రయాలయిన అభినయాలు నాకు తెలుసును.

**విశేషం:** మూలంలో బృహన్నల అనిన మాట లివి-

**"గాయామి నృత్యా మ్యథ వాదయామి । భద్రోఽస్మి నృత్యే కుశలోఽస్మి గీతే**
**త్వ ముత్తరాయై ప్రదిశస్వ మాం స్వయం । భవామి దేవ్యా నరదేవ నర్తకః"** (సం.4.10.8.)

మహారాజా! నేను పాడగలను. ఆడగలను. వాద్యాలను వాయించగలను. ఆటపాటలలో ఆరితేరాను. నన్ను ఉత్తరకు నాట్యాచార్యుడిగా నియమించుము. ఆమెకు నృత్యవిద్య నేర్పుతాను - అని సూటిగా సంగ్రహంగా బృహన్నల చెప్పాడు. అయితే, తిక్కన - నృత్యంలో తనకాలంలో ప్రచారంలో ఉన్న భేదాలను పై పద్యంలో పేర్కొన్నాడు. గీత వాద్యాలను ఈ పద్యంలో పేర్కొని వదలి వేశాడు. ఉత్తరకు నాట్యాచార్యుడిగా నియమించుమని అడగటం ఔచిత్యం కాదు. అత డేదో మిషమీద వచ్చాడనే అనుమానం విరాటుడికి కలుగవచ్చును. అందువలన తిక్కన ఆ మాటను బృహన్నలచేత అనిపించక ఔచిత్యం పాటించాడు. విరాటుడే తన కుమార్తెకు బృహన్నలచేత నాట్యం చెప్పించే నిర్ణయం తీసికొన్నట్లు చిత్రించి కథను రక్తి కట్టించాడు. తిక్కన చేసిన మార్పు సూక్ష్మమైనది. విలువైనది. (సంపా.)

**తే. ఇన్ని తెఱఁగుల శ్రమము చేయింతుఁ జతుర। తా విహీనము లైన పాత్రముల నైన**
**నట్టువొజ్జనై మెలఁగుదు నగళులందు। నిపుణ నైపథ్య విధులకు నేర్తు నధిప!' 242**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; చతురతా విహీనములు+ఐన= నేర్పులేనటువంటి; పాత్రములన్+ఐనన్= పాత్రధారులనయినా; ఇన్నితెఱంగులన్= ఇన్ని విధాల; శ్రమము చేయింతున్= సాధన చేయిస్తాను; నగళులందున్= అంతఃపురాలలో; నట్టువు+ఒజ్జను+ఐ= నాట్యాన్ని నేర్పే శిక్షకురాలనై; మెలఁగుదున్= సంచరిస్తాను; నిపుణ= నేర్పరితనంతో కూడిన; నైపథ్య విధులకున్= నాట్యానికి అవసరమయిన వేషాలంకరణాలపద్ధతులను; నేర్తున్= చక్కగా ఎరుగుదును.

**తాత్పర్యం:** రాజా! నా నేర్పు ఎటువంటిదో వినుము. నేర్పరితనం ఏమాత్రం లేనివాళ్ళచేతనయినా సాధన చేయిస్తాను; వారిని తీర్చి దిద్దుతాను. నాట్యం నేర్పుతూ అంతఃపురాలలో ఉంటాను. అంతేకాక నాకు నేపథ్యవిద్యలలో కూడ నైపుణ్యం ఉన్నది.

**విశేషం:** నేపథ్యం అనే మాటకు నాట్యస్నానం, వస్త్రాద్యలంకారం అనే అర్థాలున్నాయి. రంగంలో ప్రదర్శించటానికి ముందు చేసే అలంకరణ మంతా నైపథ్య విధులే. నాట్యం నేర్పే వారికి అలంకరణ విధులు కూడా తెలియవలసిన అవసరముంది.

**చ. అనుడు విషణ్ణమైన హృదయంబున గారవ మొంద నైపుణం**
**బున నుచితంబుమై నరసి పొచ్చెము లేమిఁ దదీయ సేవ గై**
**కొనుటకు నిశ్చయించి తన కూఁతు విరాటుఁడు పిల్వఁబుచ్చె న**
**ర్తనమునకై బృహన్నలకుఁ దత్పరతం దగ నప్పగింపఁగన్. 243**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగానే; విరాటుఁడు= విరాటమహారాజు; విషణ్ణము+ఐన= విషాదంతో కూడిన; హృదయంబునన్= మనసుతో; గారవము+ఒందన్= గౌరవం కలుగగా; నైపుణంబునన్= నిపుణతతో; ఉచితంబుమైన్= తగిన రీతితో; అరసి= పరిశీలించి; పొచ్చెము+లేమిన్= దోషం లేకపోవడంచేత; తదీయ సేవ= ఆ పేడి సేవ; కైకొనుటకున్= స్వీకరించడానికి; నిశ్చయించి= నిశ్చయించుకొని; తన కూఁతున్= తన కూతురయిన ఉత్తరను; నర్తనమునకై= నాట్య శిక్షణ కొరకు; బృహన్నలకున్= బృహన్నలకు; తత్పరతన్= భక్తితో; తగన్+అప్పగింపఁగన్= తగిన విధంగా అప్పగించటానికి; పిల్వన్+పుచ్చెన్= పిలవటానికి కబురంపాడు.

**తాత్పర్యం:** బృహన్నలను చూడగానే విరాటుడి మనసులో బాధతో కూడిన ఆదరం పెరిగింది. ఒకసారి పేడి వేషాన్ని నిశితంగా పరిశీలించాడు. మోసం లేదని గ్రహించాడు. ఆమె చేత సేవలు చేయించుకొనటానికి విరాటుడు నిశ్చయించుకొన్నాడు. తన కూతురిని బృహన్నలకు శిష్యురాలుగా నాట్యాభ్యాసం కొరకు అప్పచెప్పడానికై కబురంపాడు.

**విశేషం:** ఈ ఘట్టాన్ని తిక్కన మూలాతిరిక్తంగా తీర్చిదిద్దాడు. మూలం ఇట్లా ఉన్నది.

**"బృహన్నలాం తా మభివీక్ష్య మత్స్యరాట్ । కలాసు నృత్యేషు తథైవ వాదితే।**
**సమ్మంత్ర్య రాజా వివిధైః స్వమంత్రిభిః । పరీక్ష్య చైవం ప్రమదాభి రాశు వై ।**
**అపుంస్త్వ మస్యస్య నిశమ్యచ స్థిరం । తతః కుమారీపుర ముత్ససర్జ తమ్।**
**స శిక్షయామాస చగీతవాదితం । సుతాం విరాటస్య ధనంజయః ప్రభుః ॥"** (సం.4.11.11-12)

విరాటుడు బృహన్నలకు కళలలోనూ, నృత్యంలోనూ, వాద్యాలలోనూ ఉన్న నేర్పరితనాన్ని తాను పరీక్షించటమే కాకుండా మంత్రుల చేతకూడా పరిశీలింప చేశాడు. అంతటితో ఆగకుండా స్త్రీలచేత అతనిని బాగా పరీక్షింప చేసి అతడి నపుంసకత్వాన్ని నిర్ధారణ చేసికొన్నాడు. ఆ తరువాత నిశ్శంకగా అతడిని కన్యలుండే అంతఃపురానికి పంపాడు. బృహన్నల విరాటుడి పుత్రికకు పాటలను వాద్యాలను నేర్పాడు - ఇది సంస్కృతభారత కథనం. మూలంలోని విరాటుడు లోకజ్ఞుడు. అన్ని పరీక్షలను భౌతికంగా చేయించి వాస్తవాన్ని ధ్రువపరచుకొన్నాడు. బృహన్నలను సరాసరి అంతఃపురానికి పంపాడు.

తిక్కన చిత్రించిన విరాటుడు లోకజ్ఞుడు కాడని చెప్పలేము కాని, అంతకంటె సహృదయుడైన ఇంగితజ్ఞుడు-అని నిశ్చయంగా చెప్పవచ్చును. ఉన్నతుడైన ఒక మహాపురుషుడు విధి వక్రించి నపుంసకు డయ్యాడు. ఆడువారికి ఆటపాటలు చెప్పటానికి సిద్ధమయ్యాడు. అతడి దయనీయ స్థితికి సహృదయుడైన విరాటుడు విషణ్ణుడైనాడు. కాని, కర్తవ్యాన్ని మరవలేదు. నిపుణంగా పరిశీలించి (పరీక్షించి కాదు) అతడి నపుంసకత్వాన్ని నిర్ధారించుకొన్నాడు. మూలకథలో వలె మంత్రుల సాయం, స్త్రీల సహాయం తీసికొనలేదు. వారిచేత పరీక్షలు చేయించలేదు. ఇది విరాటపాత్రకు తిక్కన కల్పించిన హుందాతనం, ఇంగితజ్ఞాన దీప్తి. తాను స్వయంగా నిర్ణయించిన ఈ సత్యాన్ని సభలో పరోక్షంగా ప్రదర్శించాడు. బృహన్నలను అంతఃపురానికి సరాసరి పంపలేదు. తన కుమార్తె అయిన ఉత్తరను నిండుసభకు పిలిపించాడు, గురుపూజ చేయించాడు. గురువు చేతుల్లో తన కూతురిని ఉంచాడు. గురుశిష్య సంబంధాన్ని నాట్యాచార్యుడి వద్ద విద్యనేర్చుకొనే సమయంలో చేసే విద్యారంభోత్సవ సంప్రదాయాన్నీ తిక్కన చిత్రించాడు. అంటే తెలుగునాట ఆ రోజులలో ఉండే నాట్యవిద్యా సంప్రదాయ సంస్కృతిని భారతంలో ప్రతిఫలింప చేశాడన్నమాట. విశ్వనాథవారన్నట్లు - "తిక్కన శిల్పపుఁ దెనుఁగు తోఁట".(సంపా.)

**వ. ఇట్లు రావించిన. 244**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; రావించినన్= రప్పించగా.

**తాత్పర్యం:** విరాట మహారాజు కబురంపించగా ఉత్తర వచ్చింది. రాగా.

**సీ. అల్లఁదనంబున యనువు మైకొనఁ జూచు। నడపు కాంతికి వింతతొడవు గాఁగ;**
**వెడవెడ నూఁగారి వింతయై యేర్పడఁ। దేరని వళులలో నారు నిగుడ;**
**నిట్టలు ద్రోచుచు నెలవుల కల మేర। లెల్లను బిగి యెక్కి యేర్పడంగఁ,**
**దెలుపును గప్పను వెలయంగ మెఱుఁ గెక్కు। తారకంబులఁ గల్కితనము దొడరఁ**

**ఆ. జరణములును నడుముఁ జన్నులుఁ గన్నులు। జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు**
**చునికిఁ దెలుపుచుండ నుత్తర చనుదెంచె। నలరువిలుతు పువ్వుటమ్ము వోలె. 245**

**ప్రతిపదార్థం:** అల్లఁదనంబున యనువు= మాంద్యము యొక్క ఒప్పును; మైకొనన్+చూచు= అలవరించుకొనడానికి చూచే; నడపు= నడక; కాంతికిన్= సహజమయిన అందానికి; వింత తొడవు+కాఁగన్= కొత్త అలంకారం కాగా; వెడవెడ నూఁగారి= కొద్ది కొద్దిగా లేఁతదై; వింత+ఐ= కొత్తయై; ఏర్పడన్= ఏర్పడగా; తేరని= రూపుదిద్దుకొనని; వళులలోన్= కడుపు మీది మడతలలో; ఆరు-నిగుడన్= రోమావళి వ్యాపింపగా; నిట్టలు+త్రోచుచు= పైకి పొంగుతూ; నెలవుల కల= చుట్టూరా ఉన్న; మేరలు+ఎల్లను= హద్దులన్నియు; బిగి+ఎక్కి= బిగువై; ఏర్పడంగన్= స్పష్టంగా కనబడగా; తెలుపును+కప్పును= తెలుపూ, నలుపూ; వెలయంగన్= ప్రకాశించగా; మెఱుఁగు+ఎక్కు తారకంబులన్= మెరసే కనుగ్రుడ్లలో; కల్కి తనము+తొడరన్= మనోజ్ఞత కనిపించగా; చరణములును, నడుమున్, చన్నులున్, కన్నులున్= పాదాలు, నడుమూ, స్తనాలు, కళ్ళూ; జవ్వనంబు చెన్ను= యౌవన సౌందర్యం; నివ్వటిల్లుచున్+ఉనికిన్= నిండారుతూ ఉండటం; తెలుపుచున్+ఉండన్= వ్యక్తపరుస్తూ ఉండగా; అలరు విలుతు= పువ్వులు బాణాలుగా కల మన్మథుని; పువ్వు+అమ్ముపోలెన్= పూలబాణం వలె; ఉత్తర= ఉత్తర; చనుదెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** ఉత్తర- తన నడక కుండే సహజమైన మాంద్యమునందలి ఒప్పు వింత అలంకార మయ్యేటట్లుగా (పాదాలతో నడిచి వచ్చింది). ఏర్పడీ ఏర్పడని వళులమీద మొలిచీ మొలవని రోమావళి నిండుదనం కలిగించగా (నడుము సొగసుతో నడిచి వచ్చింది). ఉరము మీద ఉన్న చోటును త్రోసికొంటూ పెల్లుబుకుతూ అక్కడ ఉన్న తావులన్నీ బిగువుగా ఆవరించిన (యౌవనోదయ సమయంలో పొటమరించిన) వక్షోజాలు ప్రకటమౌతూ ఉండగా (చనుల సొంపుతో వచ్చింది). తెలుపు నలుపుల వింతకాంతులు కంటి పాపలకు మనోజ్ఞత్వాన్ని కలిగిస్తూ ఉండగా(కన్నుల విలాసంతో కదలి వచ్చింది). ఈ విధంగా పాదాలకు, నడుముకు, చన్నులకు కన్నులకూ వయసు వయ్యారం కలిగిస్తున్నట్లు తేటపడగా మన్మథుడి పూవుటమ్ము వలె (కొలువులోకి) వచ్చింది.

**విశేషం:** అలం: ఉపమ, క్రమాలంకారం. ఉత్తర ఉదయిస్తున్న యావనంతో ఒప్పారుతున్న కన్య. ఆమెను మన్మథుడి బాణంతో పోల్చి తిక్కన వర్ణించాడు. మూలంలో ఉత్తర సభలోకి రానేలేదు. కాబట్టి ఇది తిక్కన కల్పించిందే. బాణం ప్రయోగిస్తే ఎట్లా దూసుకొని వస్తుందో అట్లా ఉత్తర వచ్చింది. ఇది సమానధర్మం. మామూలు బాణానికీ మన్మథ బాణానికీ భేదం ఉంటుంది. ఉత్తర యౌవన సౌందర్య లక్షణాలను ప్రకటిస్తున్నది. బాణం మన్మథభావ ప్రేరకమైన లక్షణాలను ప్రదర్శిస్తున్నది. ఆ సామ్యాన్ని సమానగుణ వ్యంజకంగా చిత్రించటమే ఈ సీస పద్య రచనా సౌందర్యం.

**1. నడక** - వేగమైన నడక బాలచేష్ట. వేగం అందమైన మందగమనంగా మారటం యౌవన చేష్ట. వేగంగా దూసుకొని పోవటం మామూలు బాణానికి స్వభావం. నెమ్మదిగా అందంగా సాగటం మన్మథబాణ స్వభావం.

**2. నడుము** - నడుముకు వళులు అందం. వళులకు నూగారు సింగారం. రెండూ బాగా కనపడకపోతున్నా వాటి చెలిమి కలిమి ఒక నిండుదనాన్ని కలిగిస్తున్నది. ఇది ఉత్తర నడుము సొగసు. మన్మథబాణానికి నడుము తామరతూడు. దానికి నూగారు ఉంటుంది. కాని, అది ఉండీ లేనట్లుగా ఉండి నడుముకు పట్టునిస్తుంది. అదే దాని నిండుదనం.

**3. చన్నులు** - ఉదయిస్తున్న యౌవనంలో కన్యలకు చన్నులు విస్తృతంగా కనబడవు. కాని, ఎడదమీద పైకి నిక్కబొడుచుకొంటూ ఉన్న తావునంతా బిగువుతో ఆక్రమిస్తున్న స్ఫూర్తి తోస్తుంది. మన్మథబాణ స్వభావం కూడా ఇటువంటిదే. నిష్ఠలు-ప్రకృతి; నిట్టలు- వికృతి. నియమ నిష్ఠల నన్నింటిని ప్రక్కకు తోస్తూ ఆయా స్థానాలలో (దశలలో) ఉన్నమేరలన్నీ (నియమాలన్నీ) బిగిసేటట్లు చేస్తున్నది మన్మథబాణం. రెంటికీ అర్థసామ్యం గమ్యం.

**4. కన్నులు** - తెల్లని కళ్ళు, నల్లని కనుగుడ్లూ యౌవనంలో మెరుస్తూ ఉంటాయి. కళ్ళలో వలపు చూపుల చాతుర్యం మొగ్గ తొడుగుతూ ఉంటుంది. ఇది ఉత్తరలో కలికితనంగా కళ్ళలో బయటపడుతున్నది. మన్మథబాణంలో తారకవలె మెరుపులతో కూడుకొన్న తెల్లనితనం నల్లని బాణానికి నేర్పరితనంతో ప్రసరించే ప్రజ్ఞను బైట పెడుతున్నది. బాణం లక్ష్యాన్ని తాకుతుంది. ఉత్తర అందరి హృదయాలనూ ఆకట్టుకొన్నది. సీస పాదాలలోని వర్ణనకూ ఎత్తు గీతిలోని చరణములు, నడుము, చన్నులు, కన్నులు అనే పదాలను క్రమంగా అన్వయించుకొనాలి. కాబట్టి ఇందులో క్రమాలంకారం ఉన్నది. తిక్కన విరాటపర్వంలో చేయబోయే స్త్రీ వర్ణనలనే శరపరంపరలలో ఇది తొలిబాణం. తిక్కనకు అత్యంత ప్రీతిపాత్రమైన 'అర్థవ్యక్తి' 'ప్రసాద' గుణాల విశిష్ట సమ్మేళనం ఇందులో పరస్పర పోషకంగా నిబంధించబడటం రచనా సౌందర్యం. (సంపా.)

**5. అల్లఁదనంబున యనువు** - అల్లఁదనము యొక్క అనువు(ఒప్పు) మాంద్యంలో ఉండే ఒప్పు. 'షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు! ప్రౌఢ. సమాస. । అరదంబున యురవడికి - వంటిది.

**ఆ.** **వచ్చి కొలువు సొచ్చి, నెచ్చెలి పిండు నం। తంత నిలువఁబనిచి, యల్ల నల్లఁ**
**గదిసి, ప్రౌఢవనిత కైవడి ముద్దియ। ముద్దువుట్టఁ దనకు మ్రొక్కుటయును.** **246**

**ప్రతిపదార్థం:** వచ్చి= వచ్చి; కొలువు= సభలో; చొచ్చి= ప్రవేశించి; నెచ్చెలి పిండున్= చెలికత్తెల సముదాయాన్ని; అంతన్= అంతన్ నిలువన్+పనిచి= అక్కడే ఆగిపొమ్మని ఆజ్ఞాపించి; అల్లనల్లన్ కదిసి= మెల్లగా దగ్గరకు వచ్చి; ముద్దియ= ముగ్ధ అయిన ఉత్తర; ప్రౌఢ వనిత కైవడిన్= ప్రౌఢురాలయిన యువతివలె; ముద్దు+పుట్టన్= ముద్దు వచ్చేవిధంగా; తనకున్= తండ్రికి; మ్రొక్కుటయును= నమస్కరించగా.

**తాత్పర్యం:** ఉత్తర కొలువులోనికి వచ్చింది. చెలికత్తెలను అల్లంత దూరాన ఆగండని కోరింది. మెల్ల మెల్లగా తండ్రి దగ్గరకు వచ్చింది. ముగ్ధ అయిన ఆమె ప్రౌఢవలె వచ్చి ముద్దువచ్చేటట్లు తండ్రికి మ్రొక్కింది.

**చ.** **తిగిచి కవుంగిలించి, జగతీవిభుఁ డక్కమలాయతాక్షి నె**
**మ్మొగము మొగంబునం గదియ మోపుఁ; గరాంగుళులం గపోల మిం**
**పుగఁ బుడుకుం; బొరింబొరి నపూర్వ విలోకన మాచరించుఁ; గ**
**ప్పగు మృదుమౌళి నుజ్జ్వల నఖాంకురచేష్ట యొనర్చు నర్మిలిన్.** **247**

**ప్రతిపదార్థం:** జగతీవిభుండు= విరాట మహారాజు; తిగిచి= చేరదీసి; కవుంగిలించి= కౌగలించుకొని; ఆ+కమల+ఆయత+అక్షి= కమలాలవంటి విశాలమయిన కళ్ళున్న ఉత్తర యొక్క; నెఱి+మొగము= చక్కని ముఖాన్ని; మొగంబునన్= తన ముఖం మీద; కదియన్ మోపున్= తాకే విధంగా దగ్గరికి చేరదీసికొంటున్నాడు; కర+అంగుళులన్= చేతివేళ్ళతో; కపోలము= చెక్కిళ్ళను; ఇంపుగన్+పుడుకున్= ఎంతో ప్రీతితో నిమురుతాడు; పొరిన్+పొరిన్= మాటి మాటికి; అపూర్వ విలోకనము+ఆచరించున్= వింత చూపు చూస్తాడు; అర్మిలిన్= వాత్సల్యంతో; కప్పు+అగు= నల్లనైన; మృదుమౌళిన్= మెత్తని శిరస్సున; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; నఖ+అంకుర= అంకురాల వంటి గోళ్ళతో; చేష్ట+ఒనర్చున్= స్పృశిస్తాడు.

**తాత్పర్యం:** విరాటుడు ఉత్తరను చేరదీశాడు, కౌగిలించుకొన్నాడు, ఉత్తర ముఖాన్ని దగ్గరికి చేరదీసి స్పృశించాడు. చేతివేళ్ళతో ఆమె బుగ్గలను నిమిరాడు. తన కూతురయినా మాటి మాటికి కొత్తగా చూచాడు. ఆమె మెత్తని నల్లని తలవెంట్రుకలను మునివేళ్ళతో వాత్సల్యంతో స్పృశించాడు.

**విశేషం:** తండ్రి విరాటుడు. అతడు రాజు. రాచరికపు కార్యాలతో మునిగిన వారికి అంతఃపురంలోని పిల్లలతో కలిసి కాలం గడపటం తక్కువ. అందుచేత విరాటుడు కుమార్తె కనబడగానే వాత్సల్యంతో చేరదీశాడు. అదిగాక కుమార్తె అందచందాలు తల్లి కంటె కూడా తండ్రికి వింతగా అగపడటం సహజం కూడా.

**వ.** **ఇవ్విధంబునం దన గాదిలికూఁతు నుపలాలించి, బృహన్నల దెసం గనుంగొని, సాదర దరహసిత రుచిరాననుండై 'యిమ్మగువ నీకు నాట గఱపందగు పాత్రం బగునే?' యని యడిగి, తత్ప్రతివచనంబుల యందలి నాగరికత్వంబునకుఁ జిత్తంబు రంజిల్ల మధుర సల్లాపంబు సేసి, కర్పూర సహితం బగు తాంబూలంబు వెట్టి, చిత్రంబు లగు చీనాంబరంబులిచ్చి, మణిమయంబు లగు నాభరణంబు లొసంగి సంభావించి యవ్విభుండు.** **248**

**ప్రతిపదార్థం:** ఆ+విభుండు= ఆ రాజు; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; తన= తనయొక్క; గాదిలి కూఁతున్= ప్రియమయిన కూతురిని; ఉపలాలించి= ఆదరించి; బృహన్నల దెసన్+కనుంగొని= బృహన్నల కేసి చూచి; సాదర= ఆదరంతో కూడిన; దరహసిత= చిరునవ్వుతో; రుచిర= ప్రకాశించే; ఆననుండు+ఐ= ముఖం కలవాడయి; ఈ+మగువ= ఈ బిడ్డ అయిన ఉత్తర; ఆట= నాట్యం; కఱపన్= నేర్పటానికి; నీకున్= నీకు; తగు పాత్రంబు+అగునే= తగిన పాత్రురాలా; అని= అని; అడిగి= అడిగి; తత్+ప్రతివచనంబుల అందలి= ఆ బృహన్నల సమాధాన వాక్కులలోని; నాగరికత్వంబునకున్= నాగరికతకు; చిత్తంబు= మనసు; రంజిల్లన్= సంతోషించగా; మధురసల్లాపంబు+చేసి= ఇంపయిన ఇష్టాగోష్ఠిని కొనసాగించి; కర్పూర సహితంబు+అగు= కర్పూరంతో కూడిన; తాంబూలంబు+పెట్టి= తాంబూలం ఇచ్చి; చిత్రంబులు+అగు= అబ్బురం కలిగించేవయిన; చీన+అంబరంబు= పట్టువస్త్రాలు; ఇచ్చి= (కానుకగా)ఇచ్చి; మణిమయంబులు+అగు= మణులతో కూడిన; ఆభరణంబులు+ ఒసంగి= నగలు ఇచ్చి; సంభావించి= గౌరవించి.

**తాత్పర్యం:** విరాట మహారాజు తన ముద్దులకూతురిని బుజ్జగించాడు. బృహన్నల వైపు చూచాడు. ఆదరంతో చిరునవ్వు నవ్వాడు. 'నీవు నాట్యం నేర్పటానికి ఈమె తగిన పాత్రమౌనా (యోగ్యురాలేనా)?' అని అడిగాడు. బృహన్నల చెప్పిన సమాధానంలోని నాగరికత్వానికి చాల సంతోషించాడు. అతడితో మధుర ప్రసంగం చేశాడు. కర్పూర తాంబూలం ఇచ్చాడు. చీనాంబరాలు, మణిమయ ఆభరణాలు ఇచ్చి గౌరవించాడు. తదనంతరం విరాటుడు ఈ రీతిగా పలికాడు.

**విశేషం:** 1. గురువులు శిష్యుల విద్యార్హతలను నిర్ణయిస్తారు. అతడంగీకరిస్తేనే శిష్యులకు విద్యాబోధన. అది గురుకుల సంప్రదాయం. అది సాంస్కృతికాంశం. అందువలననే 'ఇమ్మగువ నీకు నాట గఱపందగు పాత్రం బగునే?' అని విరాటుడు బృహన్నలను అడిగాడు. రాజు మర్యాదలు పాటిస్తే ప్రజలు మర్యాదలు పాటిస్తారు. 'యథా రాజా తథా ప్రజా!'

2. విద్యాభ్యాసారంభ సమయంలో గురుపూజ చేయటం సంప్రదాయం. ఆ పూజ పిండి కొద్ది రొట్టె. తాంబూలం ఒక గౌరవప్రదమైన ఒప్పందానికి సాంస్కృతికమైన లౌకిక మర్యాద. అన్ని శుభకార్యాలలోనూ ఇది సర్వసామాన్య మర్యాదగా తెలుగునాట చెలామణి ఔతున్నది. విరాటుడు దానిని పాటించినట్లుగా తిక్కన చిత్రించాడు. (సంపా.)

**ఆ. 'నీవు చతురమతివి; నీకు నిక్కన్నియ। నప్పగింప నేల? యైన నాదు**
**హృదయమతులు దీనియెడఁ గడునార్ద్రమై। యుండుఁ గానఁ జెప్పకుండ రాదు. 249**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; చతురమతివి= నిపుణమయిన బుద్ధి కలదానివి; నీకున్= నీకు; ఈ+కన్నియన్= ఈ ఉత్తరను; అప్పగింపన్+ఏల= అప్పగించట మెందుకు?; ఐనన్= ఐనా; నాదు= నాయొక్క; హృదయమతులు= మనసూ, బుద్ధి; దీని యెడన్= ఈమె యందు; కడున్= ఎంతో; ఆర్ద్రము+ఐ+ఉండున్= వాత్సల్యరసంతో తడిసిఉంటాయి; కానన్= అందుచేత; చెప్పక+ ఉండన్+రాదు= చెప్పకుండా ఊరుకోరాదు.

**తాత్పర్యం:** 'బృహన్నలా! నీవు నిపుణురాలివి. ఈమెను వేరుగా నీకు అప్పగించవలసిన అవసరం లేదు. అయినా ఉత్తర పట్ల నా మనసు వాత్సల్య రసంతో ఆర్ద్రంగా ఉంటుంది. అందుచేత చెప్పకుండా ఉండలేను సుమా.

**క. నెచ్చెలులతోడ నెంతయు। మచ్చికఁ దన యిచ్చ నాడ మరిగినయదియై**
**విచ్చలవిడి నింతకు ము। న్నిచ్చేడియ మెలఁగు; శిక్ష యెఱుఁగదు సుమ్మీ! 250**

**ప్రతిపదార్థం:** నెఱ+చెలులతోడన్= ప్రీతిపాత్రలైన చెలికత్తెలతో; ఎంతయున్ మచ్చికన్=ఎంతో మచ్చికతో; తన+ఇచ్చన్= తన ఇష్టం వచ్చినట్లు; ఆడన్= ఆడడానికి; మరిగిన+అది+ఐ= అలవాటు పడినదై; ఈ+చేడియ= ఈ ఉత్తర; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా (కట్టుబాట్లు, శిక్షణ లేకుండా); ఇంతకున్మున్ను= ఇంతకుముందు; మెలఁగున్= ప్రవర్తించేది; శిక్ష= నాట్య శిక్షణ (విద్య నేర్చుకొనటంలో ఉండే నియమపాలన); ఎఱుఁగదు సుమ్మీ= ఎరగదు సుమా!

**తాత్పర్యం:** ఈ ఉత్తరకు ఆటలంటే ఇష్టం. చెలికత్తెలతో ఇష్టం వచ్చినట్లు ఆడుతుంది. విచ్చలవిడిగా మెలగుతూ ఉంటుంది. శిక్షణ అంటే ఏమిటో ఈమెకు ఏమాత్రమూ తెలియదు.

**ఆ. బాల కేళిమీఁది భరము క్రమంబున। విడువఁ గళలయందు వేడ్క సొనిపి**
**నయముతోడ నర్తనంబుల శిక్షింపు। నెలఁత కేడుగడయు నీవ కాదె!' 251**

**ప్రతిపదార్థం:** బాల= బాలిక అయిన ఉత్తర; కేళిమీఁది భరము= ఆటల పట్ల ఆసక్తి; క్రమంబునన్+విడువన్= క్రమంగా వదలిపెట్టగా; కళల+అందున్= నాట్యకళయందు; వేడ్క= కుతూహలాన్ని; చొనిపి= కలిగించి; నయముతోడన్= నేర్పుతో; నర్తనంబులన్= నాట్య విశేషాలతో; శిక్షింపు(ము)= శిక్షణ కలిగించుము; నెలఁతకున్= ఈ ఉత్తరకు; ఏడుగడయున్= రక్షణం; నీవు+అ,కాదె!= నీవే కదా!

**తాత్పర్యం:** ఈమె బాలిక. ఈమె కున్న క్రీడాసక్తిని కళలపట్ల ఆసక్తిగా మార్చుము. నర్తనంలో తగిన శిక్షణను ఇమ్ము. ఈమెకు అన్నివిధాల నీవే రక్షకుడివి.'

**విశేషం:** ఏడుగడ= తల్లి, తండ్రి, విద్య, గురువు, దైవం, దాత, పురుషుడు - స్త్రీకి ఈ ఏడుగురు రక్షకులు.

**చ.** **అని యుచితంబుగాఁ బలికి, యంగన హస్తముఁ బట్టి, తత్కరం**
**బునఁ గదియించి, 'నీ గురువుఁ బొల్తి! తగం గొనియాడు; మెట్లు సె**
**ప్పె నటుల భక్తిమై నడపు; పెం పెసలారఁగఁ గూడు గూర చం**
**దన కుసుమాదులున్ నడపి తప్పక యారసి గౌరవింపుమీ!** **252**

**ప్రతిపదార్థం:** అని= అని; ఉచితంబుగాన్= తగినవిధంగా; పలికి= మాటలాడి; అంగన= ఉత్తర యొక్క; హస్తమున్= చేతిని; పట్టి= పట్టుకొని; తద్+కరంబునన్+కదియించి= ఆ బృహన్నల చేతిలో పెట్టి; పొల్తి! (పొలతీ)= ఓ అమ్మాయీ!; నీ గురువున్= నీ గురువయిన బృహన్నలను; తగన్= తగినవిధంగా; కొనియాడుము= గౌరవించుము; ఎట్లు+చెప్పెన్= ఎట్లా చెబితే; అటులు+అ= ఆ విధంగా; భక్తిమై నడపు(ము)= భక్తితో జరిపించుము; పెంపు+ఎసలారఁగన్= పెంపు అతిశయించగా; కూడు+కూర= కూడు కూర; చందనకుసుమాదులున్= గంధం, పుష్పం మొదలయినవి; నడపి= జరిపించి; తప్పక+అరసి= తప్పకుండా అందుతున్నాయా లేదా అని తెలిసికొని; గౌరవింపుమీ!= గౌరవించుమా!.

**తాత్పర్యం:** అని తగిన విధంగా మాట్లాడాడు. ఉత్తర చేతిని బృహన్నల చేతిలో పెట్టాడు. 'అమ్మా! ఈమె నీ గురువు. ఆ గురువు హోదాకు తగినట్లు గౌరవించుము. బృహన్నల ఎట్లా చెప్పితే అట్లా భక్తితో నడుచుకొమ్ము. మన గొప్ప తనానికి తగినట్లు ఆహారం. కూడు. కూర, గంధం. పూలు మొదలయినవి సమకూర్చుము. శ్రద్ధతో గౌరవించుము.

**ఆ.** **ఎల్ల చుట్టములును దల్లియుఁ దోడును। జెలియుఁ బరిజనంబుఁ జెలువ! నీకు**
**గురువ; యింక నొక్క కొఱఁతయు లే దిందుఁ। జేరి బ్రదుకు బుద్ధి గౌరవమున.** **253**

**ప్రతిపదార్థం:** చెలువ!= (వనితా) అమ్మా!; ఎల్ల చుట్టములును= నీ కున్న బంధువులందరూ; తల్లియున్= తల్లిన్నీ; తోడును= తోడబుట్టిన వారూ, సన్నిహితులూ; చెలియున్= స్నేహితురాలున్నూ; పరిజనంబున్= సేవకులున్నూ; నీకున్= నీకు; గురువు+అ= గురువయిన బృహన్నల మాత్రమే; ఇందున్= ఈ విషయంలో; ఇంకన్= ఇంకా; ఒక్క కొఱఁతయున్= ఒక్క లోటు కూడా; లేదు= లేదు; చేరి= ఈమె దగ్గర చేరి; బుద్ధి గౌరవమునన్= తెలివి తేటల వలన కలిగే గొప్పతనంతో; బ్రదుకు(ము)= జీవించుము.

**తాత్పర్యం:** అమ్మా! ఉత్తరా! నీకు చుట్టాలు తల్లి, తండ్రి, తోడు, చెలి, బలగం అంతా గురువే. నీకు ఏ లోటూ లేదు. బృహన్నల దగ్గర తెలివితేటలతో గౌరవమైన పద్ధతిలో జీవించుము.

**విశేషం:** ప్రాచీన కాలంలో 'గురువు'కు విశిష్టస్థానం ఉండేది. శిక్షణకాలంలో గురువే సర్వస్వం. తల్లిదండ్రుల ప్రమేయం చాల తక్కువ.

**క.** **మన యింట నిచ్చ టచ్చో। టన కెచ్చట నైన నీ బృహన్నల మెలఁగం**
**జనియెడు మానిసి; తన మన। మున కిమ్మగునట్టి చరితమున వర్తించున్.'** **254**

**ప్రతిపదార్థం:** మన+ఇంటన్= మన ఇంట్లో; ఇచ్చటన్= ఇక్కడ; ఆ+చోటు+అనక= అక్కడ అనకుండా; ఎచ్చటన్+ఐనన్= ఎక్కడయినా; ఈ బృహన్నల= ఈ బృహన్నల; మెలఁగన్+చనియెడు= తిరుగదగిన; మానిసి= మనిషి; తన మనమునకున్= తన మనస్సుకు; ఇమ్ము+అగునట్టి= ఇష్టమయిన; చరితమునన్= నడవడికతో; వర్తించున్= ప్రవర్తిస్తుంది.

**తాత్పర్యం:** ఈ బృహన్నల మనస్సుకు నచ్చిన విధంగా ప్రవర్తించవచ్చును. ఈమెకు అంతఃపుర సంచారంలో నిషేధం ఏ మాత్రం లేదు.'

**వ. అని యిత్తెఱంగున నయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చిన యనంతరంబ నకులుండు. 255**

**ప్రతిపదార్థం:** అని= అని; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరిని; ఒండు+ఒరులకున్= ఒకరి కొకరిని; అప్పగించి= అప్పగించి; పుచ్చిన= పంపించిన; అనంతరంబు+అ= పిదప; నకులుండు= నకులుడు.

**తాత్పర్యం:** ఉత్తరను బృహన్నలకు, బృహన్నలను ఉత్తరకు అప్పగించి పంపించాడు. ఈ లోగా నకులుడు.

నకులుఁ డశ్వపాలకుఁడై విరటుఁ గొల్వవచ్చుట (సం.4-11-1)

**ఉ. అంబుజముల్ సముద్యదరుణాంశునిఁ గన్న విధంబునన్ వికా**
**సంబున నుల్లసిల్లి జనచారువిలోచనముల్ నిజోజ్జ్వలాం**
**గంబున కర్థిమై నభిముఖంబులుగాఁ జనుదెంచి దైవ యో**
**గంబున భూవిభుండు తురగంబులఁ దేరఁగఁ బంచి చూడఁగన్. 256**

**ప్రతిపదార్థం:** అంబుజముల్= పద్మాలు; సమ్+ఉద్యత్= అప్పుడప్పుడే ఉదయించే; అరుణ+అంశునిన్= సూర్యుడిని; కన్న విధంబునన్= చూచినట్లుగా; జన= జనుల; చారు= అందమయిన; విలోచనముల్= కన్నులు; వికాసంబునన్+ఉల్లసిల్లి= వికాసంతో విప్పారి; నిజ= తనయొక్క; ఉజ్జ్వల= కాంతిమంతమయిన; అంగంబునకున్= శరీరానికి; అర్థిమైన్= కోరికతో; అభిముఖంబులు+కాన్= ఎదురు కాగా; చనుదెంచి= వచ్చి; దైవయోగంబునన్= దైవవశాత్తు; భూవిభుండు= రాజు; తురగంబులన్= గుర్రాలను; తేరఁగన్+పంచి= తీసికొని రావలసిందిగా ఆజ్ఞాపించి; చూడఁగన్= చూస్తూ ఉండగా.

**తాత్పర్యం:** పద్మాలు అపుడపుడే ఉదయించే సూర్యుడిని చూచిన విధంగా ప్రజల నేత్రాలు వికాసంతో విప్పారుతున్నాయి, నకులుడి స్ఫురద్రూపం మీద పడుతున్నాయి. దైవవశాత్తు విరాటుడు గుర్రాలను తీసికొనిరమ్మని ఆజ్ఞాపించాడు. వాటిని తదేకంగా పరిశీలిస్తున్నాడు. ఆ సమయంలో నకులుడు.

**విశేషం:** అలం: ఉపమ. పాండవులలో నకులుడు చాల అందగాడు. ఒకసారి చూస్తే మరల చూడాలనిపించే రూపం అతడిది. అతని రూపం ఉదయించే సూర్యుడి వంటిది. ప్రజల చూపులు (కళ్ళు) పద్మాలవంటివి.

**వ. ఆస్థానంబు సేరవచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న నన్నరేంద్రుండు గనుంగొని పరిజనంబుల కతనిం జూపి. 257**

**ప్రతిపదార్థం:** ఆస్థానంబు= కొలువు కూటాన్ని; చేరన్+వచ్చి= సమీపించి; ఘోటకంబులన్= గుర్రాలను; ఉపలక్షించుచున్+ఉన్నన్= చూస్తూ ఉండగా; ఆ+నర+ఇంద్రుండు= ఆ (విరాట మహా) రాజు; గనుంగొని= తేరిపార చూచి; పరిజనంబులకున్= సేవకులకు; అతనిన్+చూపి= అతనిని చూపించి.

**తాత్పర్యం:** నకులుడు కొలువు దగ్గరికి వచ్చాడు. గుర్రాలను చూస్తున్నాడు. మహారాజు నకులుడి పరిశీలనను గుర్తించాడు. పరివారానికి చూపించాడు.

**క. 'ఇతఁ డెవ్వఁ డొక్కొ! రూపు ని । రతి శయమై మనమునకుఁ బ్రియం బొసఁగెడుఁ జూ**
**చితిరే చిత్తంబు ను దా । త్తత గానఁగ నయ్యెడున్ వదనమున భంగిన్. 258**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= గుర్రాలను పరిశీలిస్తున్న ఇతడు; ఎవ్వఁడు+ఒక్కొ!= ఎవడో కదా!; రూపు= ఇతని రూపం; నిరతిశయము+ఐ= ఎంతో అధికమై; మనమునకున్= మనసుకు; ప్రియంబు+ఒసఁగెడున్= ప్రీతి కలిగిస్తున్నది; వదనమున భంగిన్= ముఖం తీరుతెన్నులో; చిత్తంబు+ఉదాత్తత= మనసులోని గొప్పదనం; కానఁగన్+అయ్యెడున్= కనబడుతున్నది; చూచితిరే= చూచారా.

**తాత్పర్యం:** 'ఇత డెవరో? ఇంతటి చక్కని రూపం మనసుకు ఎంతో ప్రీతి కలిగిస్తూ ఉన్నది. ఉదాత్తమయిన మనోగతి ముఖంలో ప్రతిఫలిస్తూ ఉన్నది.

**క. తురగంబులఁ జూచు విధం । బరయఁగ నితఁ డశ్వవిద్యయందు నిపుణతా**
**స్ఫురణము గల వాఁ డగు బం । ధురమూర్తి పరాక్రమాన్వితుఁడు గానోపున్. 259**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= నకులుడు; తురగంబులన్= గుర్రాలను; చూచు విధంబు+అరయఁగన్= పరిశీలించే తీరు చూస్తే; అశ్వవిద్య+అందున్= అశ్వశాస్త్రంలో; నిపుణతాస్ఫురణము= నైపుణ్య స్ఫూర్తి; కలవాఁడు+అగున్= కలిగినవారు అయి ఉండాలి; ఇతఁడు= ఈ నకులుడు; బంధురమూర్తి= రమ్యమయిన ఆకారం కలవాడు; పరాక్రమ+అన్వితుఁడు= పరాక్రమంతో కూడినవాడు; కాన్+ఓపున్= కావచ్చును.

**తాత్పర్యం:** ఇతడు గుర్రాలను పరిశీలించే తీరు చూస్తే ఇతడికి అశ్వశాస్త్రంలో ఎంతో నైపుణ్యం ఉన్నట్లు అనిపిస్తున్నది. ఇతడు సుందరాకారం మాత్రమే కలవాడు కాదు. పరాక్రమోపేతుడు కూడా.

**విశేషం:** విరాటుడు, నకులుడు- ఇద్దరూ అశ్వలక్షణాలు తెలిసినవారే. నకులుడి పరిశీలన విరాటుడిని ఆకట్టుకొన్నది. ఆకారం పరాక్రమం రెండూ ఒకచోట కనబడటం అరుదు. నకులుడిలో ఈ రెండూ ఉండటం విశేషం.

**క. మీ రెఱిఁగినఁ జెప్పుఁ డీతని । పే; రెఱుఁగని యట్టులైనఁ బెంపారంగాఁ**
**జేరం జని యల్లన యొకఁ । డారసి యెఱుఁగంగ వలయు నను సమయమునన్. 260**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు; ఈతని పేరు= ఇతని పేరు; ఎఱిఁగినన్= తెలిసి ఉంటే; చెప్పుఁడు= చెప్పండి; ఎఱుఁగని+అట్టులు+ఐనన్= తెలియక పోతే; పెంపు+ఆరంగాన్= సగౌరవంగా; చేరన్+చని= దగ్గరికి వెళ్ళి; అల్లన= మెల్లగా; ఒకఁడు= ఒకవ్యక్తి; ఆరసి= విచారించి; ఎఱుఁగంగవలయున్= తెలిసికొనాలి; అను సమయమునన్= అని చెబుతున్న సమయంలో.

**తాత్పర్యం:** మీకు తెలిసి ఉంటే ఇతడి పేరు చెప్పండి. తెలియకపోతే ఎవరయినా దగ్గరికి వెళ్ళి హుందాగా విచారించి తెలిసికొనాలి- అని అనుకొంటున్న సయయంలో.

**క. చేరఁ జనుదెంచి పాండవ । వీరుఁడు మత్స్యాధిపునకు వినతుండై 'దే**
**వా! రాజవాహనములగు । వారువముల నరయ నేర్తు వల నేర్పడఁగన్. 261**

**ప్రతిపదార్థం:** పాండవ వీరుఁడు= నకులుడు; చేరన్+చనుదెంచి= దగ్గరకు వచ్చి; మత్స్య+అధిపునకున్= మత్స్య రాజ్యానికి అధిపతి అయిన విరాటునికి; వినతుండు+ఐ= నమస్కరించిన వాడయి; దేవా!= ప్రభూ!; రాజవాహనములు+అగు= మహారాజులు ఎక్కి స్వారి చేయగలిగిన వాహనాలు, మహారాజుకు సంబంధించిన వాహనాలయిన; వారువములన్= గుర్రాలను; వలను+ఏర్పడఁగన్= నేర్పరితనం బయలుపడే విధంగా; అరయన్ నేర్తున్= పర్యవేక్షణ చేయగలను.

**తాత్పర్యం:** నకులుడు విరాటుడి దగ్గరకు వచ్చి నమస్కరించాడు. 'దేవా! నేను రాజవాహనాలయిన గుర్రాలను చాల నేర్పుగా కనిపెట్టి జాగ్రత్తగా చూచుకొంటాను.

**వ. దామగ్రంథి యనువాఁడ, నాకు నశ్వవిషయం బయిన విచక్షణత్వం బెల్లనుం గల; దవధరింపు' మని యిట్లనియె.** 262

**ప్రతిపదార్థం:** దామగ్రంథి+అనువాఁడన్= దామగ్రంథి అనే పేరుగలవాడిని; నాకున్= నాకు; అశ్వవిషయంబు+అయిన= గుర్రాలకు సంబంధించిన; విచక్షణత్వంబు+ఎల్లనున్= జ్ఞానమంతా; కలదు= ఉన్నది; అవధరింపుము+అని= చిత్తగింపుము అని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** నాపేరు దామగ్రంథి. నాకు అశ్వశాస్త్రం తెలుసు. వినవలసినది'- అని ఈ విధంగా అన్నాడు.

**సీ. 'అవయవ లక్షణం, బాయుః ప్రమాణంబు, । గర్భంబు, లింగితాకారములును,**
**మాత్రాంతరము, వయోమానంబు, దేశకా । లోచితాహార ప్రయోగభంగి,**
**జాత్యనురూప శిక్షావిధి, క్రమగతి । వ్యాయామ సాత్మ్య ప్రవర్తనంబు,**
**ప్రమద విషాదాది బహువిధ చిత్తధ । ర్మము, పోషణ ప్రకారము, చికిత్స**

**ఆ. పరిచితములు ధరణిపాల! నీ ముందట । రూపురేఖ మెఱయఁ జూపనేర్తు;**
**బవర మైన నాకుఁ బని యేమి యనఁ, జేతి । బలిమి కలిమి నెఱపఁ దలఁపు గలదు.'** 263

**ప్రతిపదార్థం:** ధరణిపాల!= భూమిని పాలించే ఓ రాజా!; అవయవ లక్షణంబు= గుర్రాల అవయవాల లక్షణం; ఆయుఃప్రమాణంబు = గుర్రాల ఆయువు యొక్క పరిమాణం; గర్భంబులు= చూలుతో ఉందా లేదా అనే అంశాలు; ఇంగిత+ఆకారములును= మానసికమయిన అభిప్రాయాలు, ఆ కారణంగా శరీరంలో కలిగే మార్పులూ; మాత్ర+అంతరము= పరిమాణం యొక్క భేదం; వయోమానంబున్= వయస్సు యొక్క ప్రమాణమూ; దేశ+కాల+ఉచిత+ఆహార+ప్రయోగభంగి= దేశానికి, కాలానికి తగినట్లు తిండి పెట్టేతీరు; జాతి+అనురూప= జాతికి తగిన; శిక్షావిధి= అశ్వశిక్షణ పద్ధతి; క్రమగతి= ఒప్పిదమైన నడకయు; వ్యాయామ= వ్యాయామం చేత; సాత్మ్య= సహజమైన; ప్రవర్తనంబు= నడవడి; ప్రమద= సంతోషం; విషాద= సంతాపం; ఆది= మొదలయిన; బహువిధ= అనేక విధాలయిన; చిత్తధర్మము= మనోలక్షణం; పోషణ ప్రకారము= పోషించే తీరు; చికిత్స= వైద్యం; పరిచితములు= బాగా తెలుసు; నీ ముందటన్= నీ సమక్షంలో; రూపురేఖ మెఱయన్= రూపురేఖ ప్రకాశించగా; చూపన్+నేర్తున్= చూపగలను; బవరము+ఐనన్= యుద్ధం వస్తే; నాకున్= నాకు; పని+ఏమి+అనన్= ఈ యుద్ధంతో ఏమిజోలి అని అనను; బలిమి కలిమి= బల సంపదను; నెఱపన్= ప్రకటించే; తలఁపు= ఊహ - ఆలోచన; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** అశ్వలక్షణాలు ఎటువంటివో నాకు తెలుసు. చూడగానే గుర్రాల ఆయుఃప్రమాణం చెప్పగలను. చూలో కాదో చెప్పగలను. ఆకారాన్ని చూచి మనోభావం చెప్పగలను. వయః పరిమితులు, జాతికి తగిన శిక్షణ విధానము, వ్యాయామ పద్ధతులు, చిత్తవృత్తుల రీతులు, గుర్రాల మేతలు, పోషణ పద్ధతులు, చికిత్సా పద్ధతులు నాకు తెలుసు. వాటిని మీ యెదుట ప్రదర్శించి చూపగలను. ఒకవేళ యుద్ధం వస్తే అది నాపని కాదని ఊరుకోను. నా బల సంపదను ప్రదర్శించాలని భావిస్తాను.

**వ. అనిన విరాటుం డతని కిట్లనియె. 264**

**తాత్పర్యం:** అనగా విని విరాటరాజు నకులుడితో ఇట్లా అన్నాడు.

**క. 'నీకుఁ దగు పదవి యిచ్చెదఁ। నా కలిమికి నెల్ల రక్షణం బొనరింపం**
**గాక హయశిక్షకుఁడ వను। నా కొలఁదియె? యిట్లు పలుకు టనుచిత మరయన్.' 265**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; తగు= తగిన; పదవి= పదవిని; ఇచ్చెదన్= ఇస్తాను; నా కలిమికిన్+ఎల్లన్= నా ఐశ్వర్యానికంతటికీ; రక్షణంబు+ఒనరింపన్+కాక= రక్షణ చేకూరుద్దువు గాని; హయశిక్షకుఁడవు+అను+ఆ కొలఁదియె= హయ శిక్షకుడవు అనటం మాత్రమేనా?; అరయన్= పరిశీలించగా; ఇట్లు= ఈ విధంగా; పలుకుట= మాటలాడటం; అనుచితము= తగదు.

**తాత్పర్యం:** 'నీకు తగిన పదవి ఇస్తాను. నా ఐశ్వర్యాన్ని కాపాడుదువులే. నీవు గుఱ్ఱాల కాపరివని మాత్రమే అనటం తగదు. ఇట్లా మాటలాడటం నీకు సముచితంగా లేదు.'

**ఆ. అనుడు నకులుఁ డిట్టులను 'దేవ! తమ తమ। నేర్చు పనుల వెంట నెగడి బ్రదుక**
**వలయుఁ గాక, నగరఁ దలము దప్పిన మెలం। కువల కొలువు లియ్యకొనుటఁ దగునె? 266**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగానే; నకులుఁడు= నకులుడు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= చెప్పసాగాడు; దేవ= దేవా!; తమ తమ నేర్చు= తాము నేర్చిన; పనుల వెంటన్= పనులలో; నెగడి= ప్రవర్తించి; బ్రదుకవలయున్+కాక= బ్రతకాలి కాని; నగరన్= రాజమందిరంలో; తలము తప్పిన= వీలుకాని; మెలంకువల కొలువులు= నేర్పరితనంతో కూడిన కొలువు సేవలు; ఇయ్యకొనుట= ఒప్పుకొనటం; తగునె?= తగునా? (తగదు).

**తాత్పర్యం:** అనగానే నకులుడు ఈ విధంగా చెప్పసాగాడు. 'రాజా! ఎవరైనా వారికి తెలిసిన పనులు వారు చేస్తూ బ్రతకాలి. అంతేకాని వీలుకాని (చేతకాని) సేవలకు ఒప్పుకొనటం న్యాయం కాదు.

**విశేషం:** ఈ భావం అమూలకం. తగిన వానికే తగిన పదవి- అనే ధర్మం నకులుడి శీలంగా వ్యక్తం చేశాడు. అది ఉత్తమ రాజనీతి. (సంపా.)

**ఉ. ధర్మసుతుండు పెంచె ననుఁ దాన తురంగమ శాస్త్రశిక్షకుం**
**గర్మరుఁ జేసి యాత్మతురగంబుల కెల్లను నన్న యుక్తుఁగా**
**నర్మిలి నిల్పి యీఁగియుఁ బ్రియంబును నాయెడ నాఁడు నాఁటికిం**
**బేర్మి వహించుచుండ నడపెం దన తమ్ములలోని వానిఁగన్. 267**

**ప్రతిపదార్థం:** ధర్మసుతుండు= ధర్మరాజు; ననున్ పెంచెన్= నన్ను పెంచాడు; తాన్+అ= తానే; తురంగమ శాస్త్ర శిక్షకున్= అశ్వశాస్త్రానికి సంబంధించిన విద్యాభ్యాసంలో; కర్మరున్+చేసి= కార్యశూరునిగా తయారుచేసి; ఆత్మతురంగంబులకున్+ఎల్లనున్= తన గుఱ్ఱాలన్నిటికి; నన్నున్+అ= నన్నే; యుక్తున్+కాన్= తగిన వానినిగా; అర్మిలిన్= ఆదరంతో; నిల్పి= నిలిపి; ఈఁగియున్= దానమూ; ప్రియంబును= ప్రీతియు; నా+ఎడన్= నా మీద; నాఁడు నాఁటికిన్= నానాటికి; పేర్మి వహించుచున్+ఉండన్= అధికం అవుతూ ఉండగా; తన తమ్ములలోని వానిఁగన్= తన తమ్ములలో ఒకనిగా; నడపెన్= పోషించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు నన్ను పెంచాడు. అశ్వశాస్త్రశిక్షణలో నన్ను నేర్పరిగా చేశాడు. గుఱ్ఱాలకు అధిపతిని చేశాడు. నానాటికి నా పట్ల ప్రీతి పెరిగింది. అందుచేత నన్ను తన తమ్ముళ్ళలో ఒకడిగా చూచుకొనే వాడు.

**విశేషం:** పాత్రోచిత సంభాషణ శిల్ప రచనలో తిక్కన చూపే ప్రజ్ఞకు ఈ పద్యం మహనీయోదాహరణం. ఆ విషయం మూలంతో పోలిస్తే బాగా తేటపడుతుంది.

**"పంచానాం పాండుపుత్రాణాం జ్యేష్ఠో రాజా (భ్రాతా) యుధిష్ఠిరః**
**తే నాహ మశ్వేషు పురా నియుక్తః శత్రుకర్శన॥**
**అశ్వానాం ప్రకృతిం వేద్మి విషయం చాపి సర్వశః**
**దుష్టానాం ప్రతిపత్తిం చ కృత్స్నం చైవ చికిత్సితమ్"॥ (సం.4.11.6-7)**

'పంచపాండవులలో పెద్దవాడు (రాజు) యుధిష్ఠిరుడు. ఆయన నన్ను తన అశ్వాలకు అధికారిగా నియోగించాడు. గుఱ్ఱాల స్వభావాలు నాకు తెలుసు. వాటికి సంబంధించిన శిక్షణలు, వైద్యవిధానాలూ నాకు కరతలామలకాలు' - అని నకులుడు అంటాడు. మూలంలో. మూలంలో నకులుడు ధర్మరాజు మెచ్చిన అశ్వశాలాధ్యక్షుడు మాత్రమే. తిక్కన రచనలో ధర్మరాజు స్వయంగా శిక్షణ నిచ్చి తన తమ్ములలో ఒకడిగా పరిగణించి ప్రేమించిన విశిష్టవ్యక్తి. ఈ పద్యం నకులుడికి ధర్మరాజు మీద ఉన్న ఆప్యాయతను, ఆదర గౌరవాలను వ్యక్తం చేస్తున్నది. మనసుతో పలికిన మాట లతనివి. అందువలననే పైకి వ్యవహారోచిత వాచ్యార్థం - లోనారసి చూస్తే భక్తి ప్రపత్తులతో ధర్మరాజుకు కృతజ్ఞతలు చెప్పుతున్నట్లు పలికే రమణీయార్థం.

**ప్రకృతార్థం:** 'ధర్మరాజు ఆశ్రయమిచ్చి, అన్నంపెట్టి నన్ను పెంచి పెద్దవాడిని చేశాడు. అంతేకాదు అశ్వశిక్షణలో విద్యావంతుడిని, అనుభవ జ్ఞానం కలవాడినీ చేశాడు. తన వద్దనే కొలువు చూపించాడు. తన గుఱ్ఱాలకు అధిపతిగా అభిమానంతో నియోగించాడు. నాటి నాటికి నా మీద పెరిగే ప్రేమను ప్రకటించాడు. అందాకా ఎందుకు? ఆయన తమ్ములలో ఒకనిగానే నన్ను చూచాడు.'

**రమణీయార్థం:** 'ధర్మరాజు నా వ్యక్తిత్వ వికాసాన్ని పెంపొందింపచేశాడు. తురంగాలు ఇంద్రియాలకు సంకేతాలు. అందువలన ఇంద్రియాలను నిగ్రహించే విద్యలో నన్ను కర్మమార్గంలో కార్యశూరుడిని చేశాడు. తనలోని ఆశల (తురగాల) కన్నిటికీ నేనే అర్హుడిగా నిలచేటట్లు ప్రేమతో చూచాడు. ఆయా సందర్భాలలో నా మీద ప్రత్యేకాభిమానం చూపేవాడు. (యక్ష ప్రశ్నల ఘట్టంలో తమ్ములలో ఒక్కడిని బ్రతికించుకొమ్మని ధర్ముడు అవకాశమిస్తే నకులుడినే ఎన్నుకొన్నాడు ధర్మరాజు. జమ్మిచెట్టు మీదకు ఎక్కి అస్త్రాలను మూటకట్టి దాచినప్పుడు తన తరువాత నకులుడినే నియోగించాడు. ఇటువంటివి దానికి తార్కాణాలు). వ్యవహారంలో తన తల్లికి పుట్టిన తమ్ములు కౌంతేయులైన భీమార్జునుల వలెనే సవతి తల్లి కొడుకునైన మాద్రేయుడనైన నన్ను కూడా భావించి ఏకోదర ప్రేమను పంచిపెట్టాడు. 'తన తమ్ములు'- అనే పదంలో అర్థవైచిత్రి ఉన్నది. 'కర్మతుని', 'ఆత్మ తురగంబులు' మొదలైన పదాలు అంతరార్థాన్ని దర్శించటానికి తోడ్పడే శబ్దార్థవైచిత్రుల కర దీపికలు. మూలంలోని నకులుడికి ఇంతటి వాక్చాతుర్యం లేదు. మాటలలో ధర్మజుడి తమ్ముడనిపించుకొన్నట్లు చిత్రించి నకులపాత్రకు ఒక ఔన్నత్యాన్ని కల్పించాడు తిక్కన. ఆర్ద్రమైన నకులుడి భావాలను మాధుర్యగుణంతో తిక్కన మధురతరం చేశాడు. పృథక్పదత్వం, అర్థవైచిత్ర్యం, ఉక్తి వైచిత్ర్యం అనే మాధుర్య గుణ లక్షణాలు ఈ పద్యరచనలో ప్రసన్నమయ్యాయి. (సంపా.)

**క. ఆ విభుఁడు రాజ్యసుఖ లీ। లా విముఖిత వెడలి బంధులం దొఱఁగి యథే**
**ష్టావాసత బ్రుంగుడు వడి। పోవుట నెచ్చోటఁ గడుపుఁ బ్రోతునొ యనుచున్. 268**

**ప్రతిపదార్థం:** ఆ విభుఁడు= ధర్మరాజు; రాజ్యసుఖలీలా విముఖతన్= రాజ్య సౌఖ్యాల యొక్క విలాసాల పట్ల గల వైరాగ్యం వలన; వెడలి= రాజ్యం వదలి; బంధులన్= బంధువులను; తొఱఁగి= వదలిపెట్టి; యథా+ఇష్ట+ఆవాసతన్= ఇష్టం వచ్చిన చోట నివసించటం వలన; బ్రుంగుడు+పడి= మరుగునపడి; పోవుటన్=పోవటం చేత; ఏ+చోటన్= ఎక్కడ; కడుపున్+ ప్రోతునొ= పొట్ట పోసుకుంటానో; అనుచున్= అనుకొంటూ.

**తాత్పర్యం:** ధర్మరాజు రాజ్యంమీద విముఖతతో వెళ్ళిపోయాడు. చుట్టాలను వదలిపెట్టాడు. తనకు తోచిన చోట (ఉన్నాడు) వసించాడు. ఆ తరువాత అజ్ఞాతంలోకి వెళ్ళిపోయాడు. ఇంక నేను ఎక్కడ పొట్టపోసుకొన గలనా? అని అనుకొంటూ (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తిరిగి తిరిగి లోకోత్తర। చరితుఁడు సుజనుండు మత్స్యజనవిభుఁడు యుధి**
**ష్ఠిరునట్ల యనఁగ విని నినుఁ। గర మనురాగమునఁ గొలువఁగా నియ్యెడకున్. 269**

**ప్రతిపదార్థం:** తిరిగి తిరిగి= తిరిగి తిరిగి; యుధిష్ఠిరున్+అట్ల= ధర్మరాజు వలె; లోక+ఉత్తర చరితుఁడు= అసామాన్యమయిన ప్రవర్తన కలవాడు; సుజనుండు= మంచివాడు; మత్స్య జనవిభుఁడు= మత్స్య దేశంలోని జనులకు అధిపతి అయినవాడు; అనఁగన్+విని= అని చెప్పుకొంటూ ఉంటే విని; నినున్= నిన్ను; కరము= ఎంతో; అనురాగమునన్= ప్రేమతో; కొలువఁగాన్= సేవించడానికి; ఈ+ఎడకున్= ఇక్కడకు.

**తాత్పర్యం:** చాలాచోట్లు తిరిగాను. విరాటుడు సజ్జనుడని, పుణ్యాత్ముడని, ధర్మరాజు వంటివాడని విన్నాను. అందుచేత ఎంతో సంప్రీతితో మిమ్ము సేవించడానికి ఇక్కడకు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. చనుదెంచి కాంచి నా నే। ర్చిన తెఱఁగున విన్నపంబు సేసితి; నన్నుం**
**బని గొనఁ దలఁచిన నేలెడి;। దనుమానము గలిగెనేని నరిగెద నధిపా!' 270**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; కాంచి= చూచి; నా నేర్చిన తెఱఁగునన్= నాకు చేతనయినట్లు ; విన్నపంబు+చేసితిన్= మనవి చేశాను; నన్నున్= నన్ను; పని+కొనన్+తలఁచినన్= పనుల్లో నియోగించ తలచినట్టయితే; ఏలెడిది= ఏలుకొనేది; అధిపా!= రాజా!; అనుమానము+కలిగెన్+ఏనిన్= సందేహం కలిగితే; అరిగెదన్= ఇపుడే తిరిగి వెళ్ళిపోతాను.

**తాత్పర్యం:** ఇక్కడకు వచ్చాను. నిన్ను చూచాను. నాకు చేతనయిన పద్ధతిలో విన్నవించుకొన్నాను. నాచేత పని చేయించుకొన దలచినట్లయితే ఏలుకొమ్ము. లేదా మీకు సందేహం కలిగితే వెళ్ళిపోతాను'.

**వ. అనవుడు. 271**

**తాత్పర్యం:** అనగానే.

**ఉ. ఆ నరనాథుఁ డిట్లనియె; 'నశ్వములం బరికించి యున్కి యిం**
**పేని తురంగశాలలకు నెల్లను ముఖ్యుఁడవై తదీయ నా**
**నా నియత ప్రకార కరణంబులఁ ద్రిమ్మరుచున్న వారి ము**
**న్నే నెటు లట్ల నీ వరసి యిచ్చమెయిం బనిగొమ్ము నెమ్మితోన్.' 272**

**ప్రతిపదార్థం:** ఆ నరనాథుఁడు= విరాటుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అశ్వములన్= గుఱ్ఱాలను; పరికించి+ఉన్కి= పర్యవేక్షిస్తూ ఉండటం; ఇంపు+ఏని= ఇష్టం అయితే; తురంగ శాలలకున్+ఎల్లను= గుఱ్ఱాల శాలలన్నిటికి; ముఖ్యుఁడవు+ఐ= ప్రధానాధికారివై; తదీయ= ఆ అశ్వశాలలకు సంబంధించిన; నానా= అనేకాలయిన; నియతప్రకార= నియమిత విధానాలతో కూడిన; కరణంబులన్= పనులలో; త్రిమ్మరుచున్+ఉన్న= తిరుగుతున్న; వారిన్= వారిని; మున్ను= పూర్వం; ఏన్= నేను; ఎటులు= ఏవిధంగానో; అట్లు+అ= అట్లే; నీవు= నీవు; అరసి= పర్యవేక్షించి; ఇచ్చమెయిన్= నీ ఇష్టం వచ్చినట్లు; నెమ్మితోన్= ప్రేమతో; పని+కొమ్ము= పనిచేయించుకొనుము.

**తాత్పర్యం:** విరాట మహారాజు ఈ విధంగా అన్నాడు - 'అశ్వపరిరక్షణమే నీ కిష్టమయితే అశ్వశాల లన్నిటికీ ప్రధానుడవుగా ఉండుము. నేను అశ్వపాలకులను ఏవిధంగా చూచేవాడినో ఆ రకంగానే నీవూ చూడుము. ప్రీతితో వాళ్ళచేత పనులు చేయించుకొనుము'.

**విశేషం:** నకులుడిని నియోగించటంలో మూలంలో లేని ఎన్నో విశేషాలను సమకాలీన ప్రభుత్వ పరిజ్ఞానంలో నుండి ఎన్నుకొని ఇందులో సందర్భోచితంగా తిక్కన నిబంధించాడు. అతడు మనుమసిద్ధికి మహామంత్రి కదా! విరాటుడికి అశ్వశాలలు ఎన్నో ఉన్నాయి. వాటి అన్నిటి మీదా నకులుడు సర్వాధికారి. ప్రభుత్వంలో పలురకాల బాధ్యతలు నిర్వహించే వారు-వాహనాలైన అశ్వాలను అనేక ప్రయోజనాలకు ఉపయోగించుకొంటారు. వారు ఆయా పనులమీద తిరుగుతూ ఉంటారు. వారందరినీ కనిపెట్టి చూచి ఎవరిని ఏవిధంగా వినియోగించుకొనాలో, గౌరవించాలో, జీత బత్తేలిచ్చి పోషించాలో రాజే స్వయంగా చూచుకొనేవాడు. ఇక ఆ అధికారాలను నకులుడికి దత్తం చేశాడు విరాటుడు. రాజు తన బాధ్యతలను దత్తం చేసి ఏర్పాటు చేసిన ఉన్నత పదవి నకులుడిది అని గ్రహించాలి. (సంపా.)

**క. అని చెప్పి యధిక సమ్మా। నన పూర్వము గాఁగ మత్స్య నరపతి మాద్రీ**
**తనయుఁ దగ నిల్పె నాతఁడు। తనమదిఁ బ్రియమందె; నతని తమ్ముం డంతన్. 273**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని చెప్పి; అధిక సమ్మానన పూర్వము+కాఁగన్= ఎక్కువ గౌరవ పూర్వకం అయ్యే విధంగా; మత్స్య నరపతి= మత్స్య రాజు అయిన విరాటుడు; మాద్రీతనయున్= మాద్రి కొడుకు అయిన నకులుని; తగన్= తగిన విధంగా; నిల్పెన్= ఆస్థానంలో ఉంచాడు; అతఁడున్= ఆ నకులుడూ; తనమదిన్= తన మనసులో; ప్రియము+అందెన్= ప్రీతి చెందాడు; అంతన్= అపుడు; అతని తమ్ముండు= నకులుని తమ్ముడు సహదేవుడు.

**తాత్పర్యం:** అని చెప్పి, విరాట మహారాజు మాద్రి కొడుకు అయిన నకులుడిని గౌరవ పూర్వకమైన ఆస్థానంలో ఉంచాడు. నకులుడు తన మనసులో సంతృప్తి చెందాడు. తరువాత నకులుని తమ్ముడు సహదేవుడు-

సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట (సం.4-9-1)

**క. భావన శాంతత్వము నిజ। భావంబున నూష్మలతయుఁ బ్రకటంబులు గా**
**నా విధుఁడు మనుజవేషుం। డై వచ్చెనొ? శిఖి శరీరి యయ్యెనొ? యనఁగన్. 274**

**ప్రతిపదార్థం:** భావనన్= భావన చేత (ఎదుటివారికి తోచే విధంలో); శాంతత్వము= ప్రశాంతత; నిజభావంబునన్= తన మనసులో; ఊష్మలతయున్= తేజస్సూ; ప్రకటంబులు+కాన్= స్పష్టం కాగా; ఆ విధుఁడు= ఆ చంద్రుడు; మనుజవేషుండు+ఐ= మానవాకారం ధరించిన వాడయి; వచ్చెనొ= వచ్చాడో?; శిఖి= అగ్ని; శరీరి= శరీరం కలవాడు; అయ్యెనొ+అనఁగన్= రూపు తాల్చాడో అన్నట్లు.

**తాత్పర్యం:** పైకి చూస్తే ప్రశాంతత తోచేటట్లూ, మనసులో పరాక్రమ తేజస్సు ప్రకటిత మయ్యేటట్లూ ఉన్న సహదేవుడు ఆ చంద్రుడే మానవాకారంతో వచ్చాడా? లేదా అగ్నిదేవుడే ఆకారం తాల్చాడా? అన్నట్లు ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, క్రమం. సహదేవుడు గోపవేషంతో వచ్చి విరాటుడి కొలువులో చేరిన ఘట్టాన్ని తీర్చిదిద్దిన విధం విశిష్టం. మూలానికీ తెలుగు రచనకూ ఏమీ పోలికలు లేవు. ఈ ఘట్టం తిక్కన పునస్సృష్టి. **"తమాయాన్త మభిప్రేక్ష్య భ్రాజమానం నరర్షభమ్"** (సం.4.9.2) అని మాత్రం మూలంలో ఉన్నది. తిక్కన చిత్రణ వేరు. పైకి చూస్తే ప్రశాంతభావం స్ఫురిస్తుంది. అందువలన భావించే వారికి ఆ చంద్రుడే మానవాకారం ధరించి భూమి మీదకు దిగివచ్చాడా! అని అనిపిస్తాడు. అతడి మనసులో కార్చిచ్చు. అందువలన అగ్నిదేవుడే ఆకారం తాల్చాడా అన్నట్లు అనిపిస్తున్నాడు. విరుద్ధ గుణాల విచిత్ర సమ్మేళనం విశిష్ట వ్యక్తుల స్వభావం. అతడి ఆకారం చూస్తే ఆకర్షణతో దగ్గరికి పోవాలనిపిస్తుంది. అతడి అంతస్తేజం కొంతభయాన్ని కలిగిస్తుంది. సుందర తేజస్సు అతడి రూపునే కాక, స్వభావాన్నికూడా వ్యంజింప చేస్తున్నది. విధిచేత సేవకు వచ్చాడే కాని అభిమాన ధనుడైన సహదేవుడు లోలోన ప్రజ్వలిస్తున్నాడని ధ్వని. ఇందులో ఉత్ప్రేక్షాలంకారం సాభిప్రాయం. శాంతత్వాన్ని చంద్రుడితో, ఊష్మలతను అగ్నితో క్రమంగా అన్వయించటంలో క్రమాలంకారం కూడా ఉన్నది. (సంపా.)

**క. తలుగుల పొది యొక దెసఁ బె । య్యల దామెన యొక్క వలన ననువై యుండన్**
**మొల మోపి పెక్కుచుట్లన్ । బలు ద్రాటం జుట్టి గోపభావం బలరన్. 275**

**ప్రతిపదార్థం:** తలుగుల పొది= పలువుల కట్ట; ఒక దెసన్= ఒక ప్రక్కనూ; పెయ్యల దామెన= పెయ్యదూడలను కట్టే త్రాడు; ఒక్కవలనన్= ఒక ప్రక్కనూ; అనువు+ఐ ఉండన్= వీలుగా ఉండగా; పెక్కుచుట్లన్= ఎన్నో చుట్లను; బలుత్రాటన్+చుట్టి= బలమయిన త్రాటితో కట్టి; మొలన్+మోపి= మొలలో దోపుకొని; గోపభావంబు= గొల్లతనం; అలరన్= ఒప్పగా.

**తాత్పర్యం:** ఒక ప్రక్క పలుపుల మోపు, మరో ప్రక్క పెయ్య దూడల త్రాళ్ళు, ఎన్నోచుట్లు చుట్టిన ఒక పెద్దత్రాడు మొలలో దోపుకొన్న వేషం గొల్లతనాన్ని స్పష్టం చేస్తూండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** సహదేవుడు చక్కని గోపాలుని వేషం కట్టి, గొల్లవానివలెమాట్లాడుతూ విరాటుని వద్దకు వచ్చినట్లు మూలంలో ఉన్నది. కాని. ఆ వేషం వివరాలు లేవు. పాండవులకు ఆయా వేషాలూ, ఆహార్యాభినయం ధర్మదేవుడు ప్రసాదించినవి. అందువలన తిక్కన వాటిని తప్పకుండా వర్ణించాడు. గొల్లవాని వేషంలో మూడు రకాలైన తాళ్ళు అలంకారాలుగా అమరాయి. ఒకటి పశువులను కట్టి వేయటానికి ఉపయోగించే పలుపులమూట ఒకవైపు. పెయ్యదూడలను నిలువరించటానికి ఉపయోగించే సన్నని తాళ్ళ చుట్టలు మరొకవైపు. నీరు తోడటానికీ. పశువులను పలుపువేసి దూరంగా మేతకు పంపి అవి తప్పిపోకుండా చెట్లకు కట్టివేయటానికి ఉపయోగపడే పెద్ద త్రాడు నడుముకు కట్టుకున్న గొల్లవేషం వ్యాసుని నాటిది కాకపోవచ్చును. తిక్కన నాటిదని తప్పక చెప్పవచ్చును.

ఈ వర్ణనలు కవితలో జాతి వార్తలకు ప్రాతినిధ్యం వహిస్తాయి. సమకాలీన జీవన చిత్రాలను తనకవితలో ప్రతిఫలింపచేసి తెలుగుదనాన్ని పోషించటం తిక్కన రచనా శిల్పం. ఈ పద్యంలో గొల్లవేషంలోని సహదేవుడి స్థిరచిత్రం వర్ణించబడింది. రాబోయే పద్యంలో చలచిత్రం ప్రదర్శించబడుతున్నది. (సంపా.)

**చ. నునుసెలగోల చేకొని, మనోహర మౌ తన మేను రాజు చూ**
**పును బ్రజచూడ్కులం దిగువఁ బుష్కరపత్ర నిభంబు లైన లో**
**చనముల మూర్తి దెల్పఁగ ససంభ్రమతం జనుదెంచె నల్లన**
**ల్లన వెడభీతి దోఁప జనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్. 276**

**ప్రతిపదార్థం:** నును= నున్నని; సెలగోల= పసుల కాపరి కఱ్ఱను; చేకొని= ధరించి (చేత పట్టుకొని); మనోహరము+ఔ= అందమయిన; తన మేను= తన శరీరం; రాజు చూపును= విరాట మహారాజు యొక్క చూపును; ప్రజ చూడ్కులన్= ప్రజల

దృష్టులనూ; తిగువన్= ఆకర్షించగా; పుష్కరపత్ర= తామర రేకులతో; నిభంబులు+ఐన= సమానములయిన; లోచనములన్= కన్నులద్వారా; మూర్తి= చలాకీతనంతోకూడిన వర్చస్సు; తెల్పఁగన్= చాటుతుండగా; ససంభ్రమతన్= తొట్రుపాటుతో; అల్లనల్లన= మెల్లగా; వెడభీతి= చిరుభయం; తోఁపన్= కనిపించగా; జనులన్= ప్రజలను; వెగడు+అయ్యెడు దృష్టిన్= తడబడుతున్న చూపుతో; చూచుచున్= చూస్తూ; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** సహదేవుడు చేతిలో నున్నని పసుల కాపరి కర్ర పట్టుకొన్నాడు. అతడి సుందరాకారం గల శరీరం రాజు చూపును ఆకర్షిస్తున్నది. ప్రజల చూపులను కూడా ఆకట్టుకొంటూ ఉన్నది. తామరరేకులవంటి కళ్ళల్లో చలాకీతనం తొంగి చూస్తూ ఉన్నది. అతడి చూపులలో అవ్యక్తభయం తొణికిస లాడుతూ ఉన్నది. తడబడే చూపులతో ప్రజలను చూస్తూ సహదేవుడు మెల్లగా వచ్చాడు.

**విశేషం:** సెలగోల పసులకాపరి వేషానికే అలంకారం. దానికి తోడు సహదేవుడు సహజంగా అందగాడు. అది మనస్సులను హరించే అందం. రాజు, ప్రజలు అందుకే అతడిని అబ్బురపాటుతో చూచారు. వేషానికీ రూపానికీ పొంతన లేదని గమనించి వెగడుపడే దృష్టులు సారించారు. అట్లా వారు గుచ్చిగుచ్చి చూస్తుంటే సహదేవుడికి సంభ్రమం కలగటం సహజం. అజ్ఞాతవాస నియమంలో ఎవరైనా గుర్తిస్తే ప్రమాదం. అందుకే అతడికి వెడభీతి. బెదరు చూపులతో అతడు జనాన్ని చూస్తూ మెల్లమెల్లగా రాజు దగ్గరికి వచ్చాడు. ఎంతటి చైతన్య శీలమైన అభినయ శిల్పం! తిక్కన నాటకీయతకు దక్కిన చక్కని ఉదాహరణం, అలంకారాలు వాడకుండా అచ్చమైన అభినయంతో కవితను రక్తికట్టించటం తిక్కన నేర్పరితనం. (సంపా.)

**వ. ఇట్లు వచ్చి మత్స్యమహీవల్లభు నంతంతం జేరి వినయావనతుం డగుచు నిట్లనియె. 277**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వచ్చి= కొలువు కూటానికి దగ్గరలో ఉన్న ప్రదేశానికి వచ్చి; మత్స్య మహీవల్లభున్= మత్స్య భూమికి అధిపతి అయిన విరాట మహారాజును; అంతన్+అంతన్= దగ్గర దగ్గరగా; చేరి= సమీపించి; వినయ+అవనతుండు+అగుచున్= వినయంతో వంగినవాడు ఔతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** పసుల కాపరి వేషంలో సహదేవుడు వచ్చాడు. విరాటుడిని మెల్లగా సమీపించాడు. వినయంతో నమస్కరించాడు. తదనంతరం ఈ విధంగా అన్నాడు.

**క. 'నీ పసులఁ గావఁ బెట్టుము। భూపాలక! నన్ను; నేను బూని యరసినన్**
**గోపంక్తులు రుజవడ; వొరు। చేపడ వెన్నఁడును; డప్పిఁ జేడ్పడ వెచటన్. 278**

**ప్రతిపదార్థం:** భూపాలక!= భూమిని పాలించే ఓ రాజా!; నన్నున్= నన్ను; నీ పసులన్= నీ పశువులను; కావన్+పెట్టుము= రక్షించడానికి నియమించుము; నేను= నేను; పూని= ప్రయత్నించి; అరసినన్= పరిరక్షిస్తే; గోపంక్తులు= ఆలమందలు; రుజ+పడవు= రోగాల పాలుకావు; ఎన్నఁడును= ఏనాడుగాని; ఒరు చేపడవు= ఇతరులకు లోబడవు; ఎచటన్= ఎక్కడా; డప్పిన్= దాహంతో; చేడ్పడవు= బాధపడవు.

**తాత్పర్యం:** 'రాజా! నీ ఆలమందను కాపాడటానికి నన్ను అధికారిగా నియమించుము. నా పర్యవేక్షణలో ఆలమందలకు రోగాలు అంటవు. ఇతరులు ఈ ఆలమందను లోబరచుకోలేరు. అలసట అసలు ఉండదు. దప్పికతో బాధపడవు.

**తే. తొఱఁగు వోకుండ మెకములు గఱవకుండఁ। బాఁడి దఱుఁగకయుండ నాపాటి గొల్ల**
**లిచ్చమెచ్చ, నీ దృష్టికి నెక్కఁ గదుపు। నరయ నేర్తు; న న్నేలుము ధరణినాథ!' 279**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= భూపాలక!; తొఱఁగు+పోకుండన్= పశువులు తప్పించుకొని పోకుండా; మెకములు= మృగాలు; కఱవక+ఉండన్= కరవకుండా ఉండేటట్లు; పాఁడి తఱుఁగక+ఉండన్= పాడిపాలు తగ్గిపోకుండా ఉండే విధంగా; నాపాటి గొల్లలు= నా వంటి (సాటివారైన) గోపాలకులు; ఇచ్చన్+మెచ్చన్= మనసులో మెచ్చుకొనే విధంగా; నీ దృష్టికిన్+ఎక్కన్= నీమనసుకు నచ్చే విధంగా; కదుపున్= ఆలమందను; అరయన్+నేర్తున్= పరిరక్షించగలుగుతాను; నన్నున్= నన్ను; ఏలుము= ఏలుకొమ్ము.

**తాత్పర్యం:** ఓ మహారాజా! నన్ను పసుల కాపరిగా ఏలుకొంటే పసులు తప్పిపోవు. క్రూరజంతువుల బారిన పడవు. పాడి తగ్గిపోదు. తోటి గొల్లలు మెచ్చుకొంటారు. నీవు కూడా మెచ్చుకొంటావు. అంతగా ఆలమందను కాపాడుతాను. నన్ను ఏలుకొమ్ము.

**విశేషం:** 'మెప్పు' చేసేవారికి ఉత్సాహకారి. ఆ మెప్పు సమానుల మధ్య అయితే ఎంతో సముత్సాహాన్ని ఇస్తుంది. పైగా రాజే మెచ్చితే సాటివారిలో మరికొంత గౌరవం. పశు సంరక్షణలో తీసికొనవలసిన ప్రాథమికాంశాలను ఏకరువు పెట్టి పశుశాస్త్ర విజ్ఞానాన్ని సహదేవుడు ప్రదర్శించి తన యోగ్యతను చాటుకొన్నాడు.

**వ. అనిన విరాటుండు పాండవావరజున కిట్లనియె. 280**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; విరాటుండు= విరాట మహారాజు; పాండవ+అవరజునకున్= పాండవులలో చిన్నవానితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగానే విరాటుడు సహదేవుడితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఎక్కడి మాట? గొల్లతన మించుకయేనియు లేదు నీ దెసం;**
**జక్కని మేను నీ గఱువ చందముఁ గాంతియుఁ జూడవచ్చినన్**
**నిక్కువ మీవు సూర్య శశి నిర్మల వంశజులైన రాజులం**
**దొక్క మహానుభావు తనయుండవు గావలయున్ నరోత్తమా!' 281**

**ప్రతిపదార్థం:** నర+ఉత్తమా!= నరులలో ఉత్తముడవయిన వాడా!; ఎక్కడి మాట?= ఇది యెక్కడి మాట?; నీదెసన్= నీ దగ్గర; గొల్ల తనము= గొల్లతనం; ఇంచుక+ఏనియున్+లేదు= కొంచెం కూడా లేదు; చక్కని మేను= అందమయిన శరీరం; నీ గఱువ చందమున్= నీ గాంభీర్యం; కాంతియున్= కాంతి; చూడవచ్చినన్= చూస్తే; నిక్కువము= నిజంగా; ఈవు= నీవు; సూర్య= సూర్యుని యొక్క; శశి= చంద్రుని యొక్క; నిర్మల= కళంకంలేని; వంశజులు+ఐన= వంశంలో పుట్టిన; రాజులందున్= రాజులలో; ఒక్క మహా+అనుభావు తనయుండవు= ఒక గొప్ప మహారాజు కుమారుడివి; కావలయున్= అయి ఉంటావు.

**తాత్పర్యం:** ఎక్కడి మాట లివి? నీలో గొల్లతనం కాసంతయినా లేదు. నీ శరీరం చక్కగా ఉన్నది. నీలో గాంభీర్యం ఉన్నది. నీలో కాంతి స్పష్టమవుతూ ఉన్నది. బాగా ఆలోచిస్తే నీవు సూర్యవంశజుడివి కావచ్చును, లేదా చంద్రవంశజుడివి కావచ్చును.

**విశేషం:** ఆకారాన్ని చూచి వ్యక్తిత్వాన్నీ, గుణసంపదనూ, అభిజాత్యాన్నీ అలవోకగా చెప్పగల సూక్ష్మబుద్ధి కలవాడు విరాటుడు. పాండవులను విశిష్టవ్యక్తులుగా గుర్తించి, ఆ వివేకాన్ని దాచుకొనకుండా బయటికి చెప్పిన నిర్మలచిత్తుడు. వారి యోగ్యతకు తగిన పదవు లివ్వాలని ముందుకు వచ్చిన ఉచితజ్ఞుడు. ఇది అతడి రాజనీతిలో ఒక భాగమని కొందరు భావిస్తారు. ఎదుటివారిని

ఆకాశానికెత్తి, ఆశలు చూపించి, ప్రలోభపెట్టి పరీక్షించటం ఆయన మొదట ప్రయోగించే సమ్మోహనాస్త్రం. దానికి ఎదుటివారు లొంగితే వారిని అతడు అనుమానించవచ్చును. కాని, పాండవుల వల్ల ఆ పని జరుగలేదు. అంతేకాదు. పాండవులలోని లోవెలుగును చూచి, ఆకార వైభవాన్ని చూచి విరాటుడు ప్రభావితుడై స్పందించాడే కాని, అది రాజకీయం కాదు. సహదేవుడి ఆకృతి చూచి అతడు సూర్యచంద్రవంశజుడై ఉండాలని ఊహించాడు. సత్యానికి ఎంత దగ్గరగా అతడి అంచనా ఉండింది? అంతటి వివేకశాలి కూడా పాండవులను గుర్తించలేకపోయాడు. ధర్మజుడి కొలువులో పనిచేసిన అయిదుగురు ఒకేనాడు తన కొలువులో చేరటానికి రాగా వారిని వరుసగా చేర్చుకొన్న విరటుడికి 'ఈ అయిదుగురు ఎవరు?'-అనే ప్రశ్న స్ఫురించలేదు. అతని కొలువులో ఉన్న జనులకు కూడా ఆ ఆలోచన రాలేదు. అది ధర్మడి వరప్రభావం. పాండవుల కున్న దైవకవచం అడుగడుగున ధ్వనింపబడటం విరాటపాత్ర చిత్రణలోని ప్రబంధ ధ్వని (సంపా.)

**ఆ. వలయు పదవియందు నిలిచి నా రాజ్యమం। తయును జక్కఁ బెట్టి నయము విక్ర**
**మంబు నడపు నంత మానిసివై యుండి। కుచ్చితంపు బ్రదుకు గోరఁ దగునె? 282**

**ప్రతిపదార్థం:** వలయు= నీ ఇష్టం వచ్చిన; పదవి+అందున్= పదవిలో; నిలిచి= కుదురుకొని; నా రాజ్యము+అంతయునున్= నా రాజ్యమంతా; చక్కన్+పెట్టి= చక్కజేసి; నయము= నీతి; విక్రమంబు= పరాక్రమం; నడపునంత= నడిపించగలిగినంతటి; మానిసివి+ఐ= సమర్థుడవయి ఉండి; కుచ్చితము+బ్రదుకు= హీనమయిన బ్రదుకు; కోరన్+తగునె?= కోరడం న్యాయమా?

**తాత్పర్యం:** నీ కిష్టమైన పదవిలో కుదురుకొని నా రాజ్యాన్నంతా చక్కబెట్టి నయనీతి పరాక్రమాలను ప్రదర్శించగలిగిన సమర్థుడవై ఉండికూడా, ఇటువంటి అల్పమైన జీవనోపాధిని కోరట మెందుకు?

**విశేషం:** నీతి అనే మాట మంత్రాలోచనాన్ని తెలియజేస్తుంది. పరాక్రమం సమర నైపుణ్యాన్ని స్పష్టం చేస్తుంది. తగిన వ్యక్తికి తగిన పదవి ఇవ్వటం అవసరం. అట్లా ఇవ్వకపోవటం అధికారి లోపం కూడా అవుతుంది.

**వ. ఉత్తమ వాహనంబులు, మహనీయాయుధంబులు నిచ్చెద; మత్స్యదేశంబున భవదభిమతస్థలం బొసంగెద; మదీయ మండల సేనా పరిపాలనంబు సేసి వర్తిల్లుము.' 283**

**ప్రతిపదార్థం:** ఉత్తమ వాహనంబులు= శ్రేష్ఠమయిన వాహనాలు; మహనీయ= గొప్పవయిన; ఆయుధంబులున్= ఆయుధాలను; ఇచ్చెదన్= ఇస్తాను; మత్స్యదేశంబునన్= మత్స్య దేశంలో; భవత్+అభిమత స్థలంబు+ఒసంగెదన్= నీకు ఇష్టమయిన ప్రదేశాన్ని ఇస్తాను; మదీయ= నాదైన; మండల సేనా పరిపాలనంబు= మండల సేనలను పరిపాలించటం; చేసి= నిర్వహించి (బాధ్యత స్వీకరించి); వర్తిల్లుము= ఉండుము.

**తాత్పర్యం:** నీకు ఉత్తమ వాహనాలు ఇస్తాను. శ్రేష్ఠమయిన ఆయుధాలను ఇస్తాను. మత్స్యదేశంలో నీవు కోరిన ప్రదేశాన్ని కూడా ఇస్తాను. నా మండల సేనలను పరిపాలించుము.'

**క. అనవుడుఁ బాండు నృపాలక। తనయుఁడు మ్రొక్కుచు విరాట ధరణీశున కి**
**ట్లను 'హీనకులుఁడ, బాలుఁడ। మును నాగరికంపుఁ గార్యముల వెర వెఱుఁగన్. 284**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; పాండునృపాలక తనయుఁడు= పాండురాజు కుమారుడయిన సహదేవుడు; విరాట ధరణీశునకున్= విరాట మహారాజుకు; మ్రొక్కుచున్= నమస్కరిస్తూ; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; హీనకులుండన్= తక్కువ కులం వాడిని; బాలుఁడన్= బాలుడిని; ముసు= పూర్వం (ముందటి నుండి); నాగరికము+కార్యముల వెరవు= నాగరికపు పనుల తీరును; ఎఱుఁగన్= తెలిసిన వాడిని కాను.

**తాత్పర్యం:** అనగానే సహదేవుడు విరాటుడికి మ్రొక్కి ఇట్లా అన్నాడు. 'రాజా! నేనేమో హీనకులుడిని. ముందెప్పుడూ నాగరికాలయిన పనుల తీరు తెన్నులు తెలిసిన వాడిని కాను.

**ఆ. పసులఁ గాచి కాని బ్రదుకఁ గౌరవుల ప్రాఁ। తలము మున్ను; నేను ధర్మపుత్త్రు**
**పశుగణంబు నెల్లఁ బాలింతు నమ్మహీ। వరుని చిత్తమునకు వచ్చువాఁడ. 285**

**ప్రతిపదార్థం:** పసులన్= పశువులను; కాచికాని బ్రదుకన్= కాచుకొంటూమాత్రమే బ్రతికేవాడను; మున్ను= గతంలో; కౌరవుల ప్రాఁతలము= కురువంశీయులైన రాజులయొక్క సేవకులం; నేను= నేను; ధర్మపుత్త్రు= యమధర్మరాజు కుమారుడయిన ధర్మరాజు యొక్క; పశుగణంబున్+ఎల్లన్= పశువుల మందలనన్నిటిని; పాలింతున్= రక్షించేవాడిని; ఆ+మహీవరుని చిత్తమునకున్= ఆ మహారాజు మనసుకు నచ్చే విధంగా; వచ్చువాఁడన్= ప్రవర్తించేవాడిని.

**తాత్పర్యం:** గతంలో మేము కౌరవులకు సేవకులం. పశుగణాన్ని రక్షించే వాడిని. పశువులను కాపాడడం తప్ప మరే విధంగా బ్రతుకలేని వాడిని. ఇంతకుముందు ధర్మరాజుయొక్క పశుగణాన్ని పాలిస్తూ ఉండేవాడిని. ఆ విధంగా ఆ మహారాజు మన్ననకు పాత్రుడైనవాడిని.

**వ. తంత్రీపాలుం డనం బరఁగిన వాఁడ; నా చేతం గ్రేపులు పురాణించుటం జేసి కొండొక కాలంబునన కదుపులం బెనుతు; నే నగునని కైకొనిన యాఁబోతు పంచితంబు మూర్కొనినను, బైగాలి వీచినను గొడ్డునకైనం జూలు నిలుచు; నుంగిడి యదురు ద్రిక్క యను వానికి నా పేరు సెప్పినం జాలు; మఱియును బసికి వలయు తెఱంగు లెల్ల నెఱుంగుదు; వేఱొక్క పనికిం గాను గాని యే నీ వెంట నీ మనసు వడయం జాలుదు; నా వలనం బ్రయోజనంబు గొనవలయు నేని నొండుమాటలు దక్కి పసులం బరికింప నియోగింపుము.' 286**

**ప్రతిపదార్థం:** తంత్రీపాలుండు+అనన్= తంత్రీపాలుడు అనే పేరుతో; పరఁగినవాఁడన్= వ్యవహరించబడిన వాడిని; నా చేతన్= నా చేతిలో (నా సంరక్షణలో); క్రేపులు= దూడలు; పురాణించుటన్+చేసి= పెరుగటంవలన - పెరగడం వలన; కొండొక కాలంబునను+అ= కొద్ది కాలంలోనే; కదుపులన్= ఆలమందలను; పెనుతున్= పెంచుతాను; నేను+అగున్+అని= నేను 'అవుతుంది' అని; కైకొనిన= స్వీకరించిన; ఆఁబోతు= ఆంబోతు; పంచితంబు= మూత్రాన్ని; మూర్కొనినను= వాసన చూచినా; పై గాలి వీచినను= పై గాలి వీచినా; గొడ్డునకున్+ఐనన్= గర్భం రానే రాదు అని తేల్చి వేసిన దానికయినా; చూలు= గర్భం; నిలుచున్= నిలుస్తుంది; ఉంగిడి= పశువులకు వచ్చే రోగం; అదురున్+త్రిక్క+అనువానికిన్= అదురుడు, తిరుగుడు అనే పశువుల రోగం వచ్చిన వాటికి; నా పేరు= నా పేరును; చెప్పినన్+చాలున్= చెప్పినాచాలు; మఱియును= ఇంతే కాకుండా; పసికి= పశువులకు; వలయు= అవసరమయిన; తెఱంగులు+ఎల్లన్= పద్ధతులన్నీ; ఎఱుంగుదున్= తెలుసు; వేఱొక్క, పనికిన్= వేరే పనికి; కాను= తగినవాడిని కాను; కాని= అయినప్పటికి; ఏన్= నేను; ఈవెంటన్= ఈ పనిమీద; నీ మనసు= నీ మనసును; పడయన్+చాలుదున్= చూరగొంటాను; నా వలనన్= నావలన; ప్రయోజనంబున్= ఏదయినా ప్రయోజనాన్ని; కొనవలయున్+ఏని= చేయించాలనుకొంటే; ఒండు మాటలు+తక్కి= మరో రకమైన మాటలు వదలిపెట్టి; పసులన్= ఆవులను లేదా గోసంపదను; పరికింపన్= పర్యవేక్షణ చేయడానికి; నియోగింపుము= నియుక్తుడిని చేయుము.

**తాత్పర్యం:** నా పేరు తంత్రీపాలుడు. నా 'హస్తవాసి' మంచిది, అందుచేత దూడలు బాగా పెరుగుతాయి. అతి తక్కువ కాలంలో ఆలమందలను పెంచుతాను. నేను ఎంపిక చేస్తే ఆబోతు మూత్రం వాసన చూచినా, పైగాలి వీచినా

గొడ్డుటావులకు సైతం చూలు నిలవటం ఖాయం. ఉంగిడి, అదురు, త్రిక్క అనే రోగాలు నా పేరు చెప్పితే దగ్గరికి రావు. పశువుల రకాలన్నీ నాకు తెలియును. వేరే పనికి నేను తగను. ఈ పనిలో మాత్రం నేను నీ మనసుకు నచ్చే విధంగా నడుచుకొంటాను. నా వలన నీ కేమయినా ప్రయోజనం ఉన్నదనుకొంటే మరోమాట వద్దు. నన్ను పశుపాలనకు నియోగించుము'.

**విశేషం:** పశువులకు వచ్చే రోగాలు తగ్గించటానికి కొందరు మందులు, మంత్రాలు నేర్చి సిద్ధులు సాధించటం మన దేశంలో కనపడుతుంది. పాము కాటుకు మంత్రాలు మందుకావటం. మంత్రగాని పేరే ఒక్కొకసారి మంత్రంగా పనిచేయటం చూస్తాం. సహదేవుడు తాను అటువంటి వాడినని చెప్పుకొన్నాడు. అటువంటివాడు పశుగణాధ్యక్షుడుగా ఉంటే పశుసంపద భద్రంగా ఉండగలదనే విశ్వాసం విరాటునికి కలిగేటట్లు పలకటం ఇందులో విశేషం. ఆ మహిమ అంతా ధర్మజుని దయవలన కలిగిందని ధ్వని. (సంపా.)

**చ. అనుటయు నెట్టకేలకు ధరాధిపుఁ డట్టుల కాక యంచు నా**
**తని వదనంబు సూచి 'యుచితం బగునేనిఁ బ్రియంబ యేని, నె**
**ట్లును గురుకార్య వర్తనములున్ రుచియింపక యుండునేని, గో**
**ధనముల కెల్ల రక్షణముఁ దత్పరతం దగఁ జేయు ముఖ్యతన్. 287**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ఎట్టకేలకున్= చివరకు; ధరాధిపుఁడు= రాజు; అట్టుల కాక= అట్లే అగుగాక; అంచున్= అంటూ; అతని వదనంబు= అతడి ముఖం; చూచి= చూచి; ఉచితంబు+అగునేనిన్= తగినట్లయితే; ప్రియంబు+అ+ఏనిన్= ఇష్టమయితే; ఎట్లును= ఏవిధంగానూ; గురుకార్య వర్తనములున్= పెద్ద పనులలో ఉండటాలు; రుచియింపక+ఉండునేనిన్= ఇష్టం కాకపోతే; గోధనములకున్+ఎల్లన్= గో సంపదలకంతకూ; రక్షణమున్= కాపాడటాన్ని; తత్పరతన్= ఆసక్తితో; ముఖ్యతన్= ప్రాధాన్యంతో; తగన్+చేయుము= తగినవిధంగా చేయుము.

**తాత్పర్యం:** సహదేవుడి వేడికోలును విరాటుడు విన్నాడు. చివరకు అట్లాగే అని అతడి ముఖం వైపు చూచాడు. సరేనన్నాడు. 'నీకు సరి అనిపిస్తే, ఇష్టమైతే, పెద్ద పనులను చేపట్టటం ఇష్టం కాకపోతే, గోసంపదను శ్రద్ధతో ప్రాధాన్య బుద్ధితో తగిన విధంగా రక్షించుము.

**క. మున్నుఁ గల గోపవర్గము। నిన్నుం గని కొలిచి భక్తి నీ పనిసేయన్**
**మన్నన మానిసివై నీ। వున్నం గడు మేల కాక యొప్పమి గలదే?' 288**

**ప్రతిపదార్థం:** మున్ను+కల= ముందుండే; గోపవర్గము= గోపాలుర సముదాయం; నిన్నున్= నిన్ను; కని= చూచి; కొలిచి= సేవించి; భక్తిన్= భక్తితో; నీ పని చేయన్= నీవు చెప్పిన పనిచేస్తూ ఉండగా; మన్నన మానిసివి+ఐ= గౌరవించ దగిన మనిషివై; నీవు= నీవు; ఉన్నన్= ఉండగా; కడున్= ఎంతో; మేలు+అ= మేలే; కాక= అంతే కాని; ఒప్పమి= (నీ సేవలకు) ఇష్టపడకపోవడం; కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** నా దగ్గర ఇదివరకే గోపాలురు ఉన్నారు. వారందరు నిన్ను కొలుస్తారు. భక్తితో నీవు చెప్పిన పని చేస్తారు. నీవు గౌరవంగా ఉంటే చాలా మేలే కాని, నీ సేవలకు ఇష్టపడకపోవడం ఉంటుందా?' (తప్పక అంగీకరిస్తాను)

**వ. అని పలికి యతని యభిమతంబు సలిపి నిలిపె; నట్లయ్యేవురును విరటుం గొలిచి నిలిచిరి; తదనంతరంబ. 289**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికి= మాటలాడి; అతనిన్= సహదేవుని; అభిమతంబు= కోరికను; సలిపి= తీర్చి; నిలిపెన్= (అతడు కోరిన పదవిలో) నిలిపాడు; అట్లు= ఆ విధంగా; ఆ+ఏవురును= ఆ అయిదుగురును; విరటున్= విరాట మహారాజును; కొలిచి= సేవించి; నిలిచిరి= నిలదొక్కుకున్నారు; తదనంతరంబు+అ= ఆపై.

**తాత్పర్యం:** అని చెప్పి అతడి కోరిక తీర్చాడు. గోపాలకులకు ముఖ్యునిగా సహదేవుడిని ఉంచుకొన్నాడు. అట్లా పాండవులు అయిదుగురూ విరాటుడి కొలువులో చేరారు. అటు తరువాత.

ద్రౌపది సైరంధ్రీవేషమున సుదేష్ణఁ గొలువ వచ్చుట (సం.4-8-1)

**క. గారవమున నిజదేశా। చారముమై నల్లియున్న జడ యగు కబరీ**
**భారంబు విచ్చి తుఱుముగ। సైరంధ్రీ జాతివేష సముచిత భంగిన్. 290**

**ప్రతిపదార్థం:** గారవమునన్= గౌరవంతో; నిజదేశ+ఆచారముమైన్= తన దేశపు అలవాటును బట్టి; అల్లిఉన్న జడ+అగు కబరీ భారంబు= అల్లి ఉన్న జడ కల కేశపాశం; విచ్చి= విప్పి; సైరంధ్రీ జాతి వేష సముచిత భంగిన్= సైరంధ్రీజాతి వేషానికి తగిన రీతిలో; తుఱుముగన్= కొప్పుగా ముడిచినట్లు.

**తాత్పర్యం:** ద్రౌపది తన దేశాచారం ప్రకారం అల్లిన జడగల కేశపాశం అంతా విప్పి, సైరంధ్రీ వేషానికి తగినట్లుగా కొప్పుగా అమర్చటానికి అనువుగా చేసింది.

**క. వలపలి దిక్కున కించుక। మలఁగంగాఁ దుఱు మిడి, కుఱుమాపుడుఁ బుట్టం**
**బలవడఁ గట్టి జరఠవ। ల్కలమున నెవ్వఁగుఁజన్నుఁగవ గప్పి తగన్. 291**

**ప్రతిపదార్థం:** వలపలి దిక్కునకున్= కుడిప్రక్కకు; ఇంచుక= కొద్దిగా; మలఁగంగాన్= ఒరిగేటట్లుగా; తుఱుము+ఇడి= కొప్పుపెట్టి; కుఱుమాపుడు పుట్టంబు= కొద్దిగా మాసిన చీర; అలవడన్+కట్టి= తగినట్లు కట్టి; జరఠవల్కలమునన్= ముదుక అయిన నార వస్త్రంతో; నెవ్వఁగు+చన్నుఁగవన్= ఉన్నతమయిన కుచద్వయాన్ని; తగన్+కప్పి= తగునట్లు (పూర్తిగా) కప్పుకొని.

**తాత్పర్యం:** సైరంధ్రి కుడివైపునకు కొద్దిగా ఒరిగేటట్లు కొప్పు అమర్చుకొన్నది. కొద్దిగా మాసిన చీర కట్టుకొన్నది. ముదుకైన నారవస్త్రంతో స్తనమండలం కప్పుకొన్నది.

**క. పరిచారికాత్వరేఖా। పరిణతి దనమేన నచ్చుపడ భావనకుం**
**దిరమై తలకొను నంతః। కరణముతోఁ బురము ద్రుపదకన్యక చొచ్చెన్. 292**

**ప్రతిపదార్థం:** పరిచారికాత్వరేఖా పరిణతిన్= పరిచారికా లక్షణపు పరిణామం; తనమేనన్= తన శరీరంలో; అచ్చుపడన్= స్పష్ట పడుతుండగా; భావనకున్= ఆ పరిచారికా భావం తన ఆలోచనయందు; తిరము+ఐ= నిశ్చితంగా; తలకొను= తాల్చేటటువంటి; అంతఃకరణముతోన్= మనస్సుతో; ద్రుపద కన్యక= ద్రౌపది; పురము చొచ్చెన్= పట్టణంలో ప్రవేశించింది.

**తాత్పర్యం:** ద్రౌపది తన ఆకారంలో దాసీత్వ లక్షణాన్ని స్పష్టపడేటట్లు చేసికొన్నది. దాసీభావాన్ని స్థిరంగా మనసులో నిలుపుకొని పురప్రవేశం చేసింది.

**వ. ఇట్లు సొత్తెంచి.** **293**

**తాత్పర్యం:** ఇట్లా ప్రవేశించి.

**సీ. పఱమొయిల్ గప్పినఁ బాడఱి నునుఁగాంతి। గదలిన యమృతాంశు కలయుఁ బోలెఁ**
**బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి। చెలువు గుందిన సరోజిని విధమున,**
**ధూమంబు వొదివిన దుఱఁగలి మెఱుఁగులు। నలఁగి మాసిన దీప కళిక పగిది,**
**ధూళి పైఁబొరసినఁ దొంగలించుట మాని। లావణ్య మెడలిన లతిక భంగి,**

**తే. గంధకారికా వేషంబు కతన మూర్తి। యుజ్జ్వలత్వంబు మఱువడియుండఁ బాండు**
**తనయ మహిషి యంచితగతిఁ జనఁగ రాజ। వీథిఁ బౌరజనంబు లవ్వెలఁదిఁ జూచి.** **294**

**ప్రతిపదార్థం:** పఱమొయిల్= పెద్దమేఘం; కప్పినన్= కప్పివేయగా; పాడఱి= పాడయిపోయి (మరుగునపడి); నునుఁగాంతి= మృదువయినకాంతి; కదలిన= తొలగిన (తగ్గిపోయిన); అమృత+అంశు-కలయున్+పోలెన్= అమృత కిరణుడయిన చంద్రుని కళవలె; పెనుమంచు= ఎక్కువ మంచు; మీఁదన్+పర్వినన్= మీద పడగా (కప్పగా); వికాసము+తప్పి= కాంతి తగ్గి; చెలువు= అందం; కుందిన= తరిగిన; సరోజిని విధమునన్= పద్మంవలె; ధూమంబు= పొగ; పొదివినన్= క్రమ్మగా; తుఱఁగలి మెఱుఁగులు= ప్రసరించే కాంతి మెరుపులు; నలఁగి= తగ్గి; మాసిన= మాసిపోయిన; దీపకళిక పగిది= దీపపుమొగ్గ వలె; ధూళి= దుమ్ము; పైన్+పొరసినన్= మీద క్రమ్మగా; తొంగలించుట= ప్రకాశించటం; మాని= మానివేసి (తగ్గి); లావణ్యము= కోమలత్వం; ఎడలిన= తరిగిన; లతిక, భంగి= తీగవలె; గంధకారికా వేషంబుకతన= సైరంధ్రీ వేషం వలన; మూర్తి+ఉజ్జ్వలత్వంబు= శరీరకాంతి; మఱువడి+ఉండన్= మరుగుపడి ఉండగా; పాండుతనయ మహిషి= పాండవుల రాణి (ద్రౌపది); అంచితగతిన్+చనఁగన్= చక్కని గమనంతో రాగా; రాజవీథిన్= రాజవీథిలో; పౌరజనంబులు= పురజనులు; ఆ+వెలఁదిన్+చూచి= ఆమెను చూచి.

**తాత్పర్యం:** ద్రౌపది సైరంధ్రీ వేషంలో మేఘం క్రమ్మటం చేత నిండుకాంతి తరిగిన చంద్రకళ వలె ఉన్నది. మంచు కప్పగా వికాసం లేక అందం తరిగిన పద్మంవలె ఉన్నది. పొగ క్రమ్మగా కాంతి తళుకులు తగ్గిన దీపశిఖవలె ఉన్నది. దుమ్ము పడగా నిగనిగలు తగ్గి లావణ్యం కొరవడిన తీగవలె ఉన్నది. ఈ వేషం వలన రూపంలోని ఉజ్జ్వలత్వం మరుగున పడింది. అటువంటి వేషంతో కదలి వెళ్ళుతున్న ద్రౌపదిని పురజనులు చూచి. (ఇట్లా అనుకొన్నారు - రాబోయే పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: మాలోపమ. సైరంధ్రీ వేషం వలన ద్రౌపది యొక్క ఉజ్జ్వలత్వం మరుగుపడింది. ఔజ్జ్వల్యం ఉత్తమ నాయికా లక్షణాలలో ఒకటి. **"రూప సంపన్న దేహత్వ మౌజ్జ్వల్యం పరికీర్త్యతే"** అని ప్రతాపరుద్రీయకారుడు విద్యానాథు డన్నాడు. అంటే ద్రౌపది యొక్క రూపసంపద మరుగుపడినట్లయింది. ఆ రూపసంపదలోని నాలుగు గుణాలను వ్యంగ్యంగా పేర్కొంటూ అవి మరుగుపడిన విధాన్ని ఉపమాలంకార సుందరంగా వర్ణించాడు తిక్కన. ద్రౌపది రూపసంపద యొక్క మొదటి గుణం 'నునుఁ గాంతి' - అది చంద్రరేఖ ప్రసరించే వెన్నెలవలె మృదువుగా, ఆహ్లాదకరంగా ఉంటుంది. ఆ గుణం దట్టమైన మబ్బుతో కప్పబడినట్లు దృశ్యాదృశ్యమై పోయింది. రెండవ గుణం 'వికాసం' - నిరంతరం నవనవోన్మేషంగా వికసిస్తున్నట్లుండే యౌవన విలాసం వికాసం.

వికాసమే అందంగా ఉండేది పద్మం. మంచువలన పద్మం వికసించటం మాని ముకుళించుకొంటుంది. అట్లాగే దాసీత్వభావం వలన ద్రౌపది ఔజ్జ్వల్యం వాడిపోయి అందాన్ని కోల్పోయినట్లయింది. మూడవ గుణం 'తుఱఁగలి మెఱుఁగులు' - శరీర నైగనిగ్య లక్షణాలు. పొగ మూగటం వలన కాంతి మాసిన దీపపు మొగ్గవలె (అగ్నిశిఖవలె) ఆమె శరీర నైగనిగ్యం మాసిన చీర మొదలైన సైరంధ్రీ వేషాదుల వలన వన్నె తగ్గి కనబడింది. నాల్గవ గుణం 'లావణ్యం' - శరీర కోమలత్వం. సైరంధ్రీ వేషం వలన దేహం ధూళిధూసరితమైన తీగవలె ఉన్నది. అంటే ఆమె శరీరానికున్న సహజ కోమలత్వం దుమ్ముకొట్టుకొని పోయినట్లయింది. ద్రౌపది ఔజ్జ్వల్యం మరుగుపడిందే కాని మాయం కాలేదు. ఆ మరుగుపడిన మేని కాంతియే పౌరజనులకు ఆశ్చర్యం కలిగించింది. వరుసగా ఉపమాలంకారాలు వాడి సైరంధ్రీ రూపవర్ణనం చేయటం వలన మాలవలె ఉపమాలంకారం భాసించటం చేత అలంకారం మాలోపమ. (సంపా.)

**ఉ. 'రోహిణి యొండె, నొండెను నరుంధతి గాక మనుష్య జాతియే?**
**యీ హరిణాక్షి చెల్వమున యేడ్తెఱ చూడ్కుల నాఁచికోల కా**
**దాహితగౌరవం బగు; శుభాంగము తేజముఁ జూడ బుద్ధి సం**
**దేహముఁ బొందుచున్నది; సతీజను లిట్టిరె యెజ్జగంబులన్!' 295**

**ప్రతిపదార్థం:** రోహిణి+ఒండెన్= రోహిణియో; అరుంధతి+ఒండెనున్= అరుంధతియో (అయి ఉండాలి); కాక మనుష్యజాతియే?= కాకపోతే (ఈమె) మానవజాతికి చెందిన స్త్రీయేనా?; ఈ హరిణ+అక్షి= లేడికన్నులవంటి కన్నులు గల ఈ స్త్రీ; చెల్వమున+ఏడ్తెఱ= సౌందర్యముయొక్క, అతిశయం; చూడ్కులన్ నాఁచికోల కాదు= చూపులను ఆకర్షించటమే కాదు; అహిత గౌరవంబు+అగున్= ఉంచబడిన గౌరవం కలది (గౌరవించాలని అనిపించేది) అవుతున్నది; శుభ+అంగము= ఈమె మంగళకరమయిన శరీరం యొక్క; తేజము+చూడన్= కాంతి చూస్తే; బుద్ధి సందేహము పొందుచున్నది= బుద్ధికి సందేహం కలుగుతున్నది; ఏ+జగంబులన్= ఏలోకాలలో అయినా; సతీజనులు= సాధ్వీమణులు; ఇట్టిరె?= ఇట్టివారా?

**తాత్పర్యం:** 'ఈమె రోహిణి కాని, అరుంధతి కాని అయి ఉండాలి. అంతేకాని మానవకాంత మాత్రం కాదు. తన రూపాధిక్యం చేత చూపులను ఆకట్టుకొనటమే కాదు. అందరి గౌరవాన్నీ పొందుతున్నది. శుభప్రదమయిన ఆ శరీరకాంతి చూస్తే సందేహం కలుగుతున్నది. ఏ లోకాలలో అయినా ఇటువంటి సతీమతల్లులు ఉంటారా?'

**విశేషం:** అలం: సందేహం. ద్రౌపదియొక్క మంగళకరమైన శరీరాన్నీ, ఆ శరీర కాంతినీ చూచిన పౌరులకు బుద్ధిలో సందేహం కలిగిందట! సందేహాలంకారాన్ని ప్రయోగిస్తున్నానని తిక్కన ముద్రగా (గుర్తుగా ఆ పేరే వాడి) చెప్పాడు. అనిశ్చయ జ్ఞానం సందేహం. సందేహం వలన ఏర్పడే అలంకారం సందేహం. వర్ణ్యావర్ణ్యాల సాధారణ ధర్మాలను మాత్రమే దర్శించి విశేష ధర్మాన్ని దర్శించకపోవటం వలన కలిగే అనిశ్చయభావం ఇందులో వర్ణించబడుతుంది. స్త్రీముఖాన్ని చూచి ఇది పద్మమో చంద్రబింబమో నాకు నిర్ణయం కాలేదు - అని సందేహాన్ని వ్యక్తం చేయటం సందేహాలంకారం. ఈ పద్యంలో పౌరులు ద్రౌపదిని చూచి ఇటువంటి సందేహమే పొందారు. సతీమణుల పేర్ల మీద ఆకాశంలో కనపడే ఉజ్జ్వల నక్షత్రాలు రెండు. రోహిణి చంద్రబింబం ప్రక్కన మిలమిలా మెరుస్తుంది. తన కాంతితో చూపరులను ఆకర్షిస్తుంది. అరుంధతి మినుకు మినుకుమని దర్శనమిస్తుంది. ఆమెను దర్శిస్తే పుణ్యం వస్తుందనే గౌరవభావాన్ని చూపరులకు కలిగిస్తుంది. ద్రౌపది కాంతిమతిగా, పుణ్యవతిగా కనబడుతున్నదని ధ్వని. ద్రౌపదీ శరీరకాంతి చూస్తే ఆమె రోహిణి కాని, అరుంధతి కాని అయి ఉండాలి తప్ప మానవ జాతిస్త్రీ అయి ఉండటానికి వీలు లేదు. ఏ లోకంలోనైనా ఇల్లాండ్రు ఇటువంటి సందేహాన్ని కలిగించే రూప వైభవం కలవారు ఉన్నారా? అని ఆశ్చర్యపోయారు పౌరులు. ఇందులో ద్రౌపది ఎవరనే ప్రశ్నకు అనిశ్చయ జ్ఞానమే మిగులుతుంది. రోహిణీ అరుంధతుల సాధారణ ధర్మమే దర్శింపబడుతుంది తప్ప ద్రౌపది యొక్క విశేషధర్మం వివేచింపబడదు. అందువలన ఇది సందేహాలంకారం. తిక్కన ఈ అలంకారాన్ని ఇక్కడ ప్రజల భావనలో నిబంధించటం ప్రకరణౌచిత్యం. ద్రౌపది సైరంధ్రి వేషంలో మొదటిసారి ప్రజలముందుకు

వచ్చింది. చూపరు లామెవేషం చూచి ఏమనుకుంటారో ఈ పద్యం సాక్ష్యం పలికింది. దీనినిబట్టి సుదేష్ణగాని, కీచకాదులు కాని, మరెందరైనా కాని ఆమె ద్రౌపదీత్వాన్ని గుర్తించలేరు. దేవాంగనయేమో అని సందేహంతో ఉండిపోతారు. ఆ భావమే ఆమెకూ, ఆమె అజ్ఞాతవాస వ్రతానికీ శ్రీరామరక్ష. ఇది చక్కని అలంకార ధ్వని. (సంపా.)

**వ. అనుచు నంతంతం జేరి. 296**

**తాత్పర్యం:** అనుకొంటూ దగ్గరికి వచ్చి.

**క. 'నీ వెవ్వ, రేమి పనికై । యే వలనికిఁ బోవుచునికి యిది?' నావుడు న**
**ద్దేవియు సౌముఖ్యము స । ద్భావంబును దోఁప నుచితభంగిం జెప్పెన్. 297**

**ప్రతిపదార్థం:** నీవు+ఎవ్వరు?= నీ వెవరవు?; ఏమి పనికై= ఏ పనిమీద; ఏ వలనికిన్= ఎక్కడకు; పోవుచున్+ఉనికి?= పోతూ ఉండటం?; ఇది; నావుడున్= అనగానే; ఆ+దేవియున్= ఆ ద్రౌపదియు; సౌముఖ్యము= సుముఖత; సద్భావంబును+తోఁపన్= మంచి మనసు తోచేటట్లు; ఉచిత భంగిన్= తగిన రీతిగా; చెప్పెన్= చెప్పింది.

**తాత్పర్యం:** 'నీ వెవరవు? ఏ పనిమీద ఎక్కడకి పోతున్నావు?' అని అనగానే ఆ ద్రౌపది సుముఖత, సద్భావమూ ప్రకటితమయ్యేటట్లు (ఇట్లా) చెప్పింది.

**ఆ. 'ఏను గట్టువాలుదాన; నా కెవ్వరు । కడుపు కూడు వెట్టి, కట్టఁ జీర**
**యిచ్చి సాకతమున నేలుదు రట్టి వా । రలకుఁ బనులు సేసి మెలఁగు బుద్ధి. 298**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; గట్టు వాలుదానన్= సైరంధ్రీ జాతి స్త్రీని; నాకున్= నాకు; ఎవ్వరు= ఎవరయితే; కడుపుకూడు= తినడానికి తిండి; పెట్టి= పెట్టి; కట్టన్= కట్టుకొనడానికి; చీర= వలువ; ఇచ్చి= ఇచ్చి; సాకతమునన్= దయతో; ఏలుదురు= పోషిస్తారో; అట్టివారలకున్= అట్టివారికి; పనులు= పనులు; చేసి= చేసి; మెలఁగు బుద్ధిన్= ప్రవర్తించే బుద్ధితో.

**తాత్పర్యం:** 'నేను సైరంధ్రిని. కూడు గుడ్డా నాకు చాలు. ఎవరు దయతో నన్ను పోషిస్తారో వారి దగ్గర పనులు చేయాలనే బుద్ధితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** గట్టువాలు - అంటే పర్వతం వలె చలించనిది. పురుష సాంగత్యాన్ని కోరక ధైర్యంతో ఉండేదని వ్యుత్పత్త్యర్థం.

**క. వచ్చితి' ననవుడు విని జను । లచ్చెరువును సందియంబు నడరెడు మదితో**
**'నిచ్చెలువ గడుపు కూటికి । నెచ్చటనే నిలుచునట్టె! యిది పలుకగునే?' 299**

**ప్రతిపదార్థం:** వచ్చితిన్= వచ్చాను; అనవుడున్= అనగానే; జనులు= ప్రజలు; విని= విని; అచ్చెరువును= ఆశ్చర్యమూ; సందియంబున్= సందేహం; అడరెడు మదితోన్= కలిగే మనసుతో; ఈ+చెలువ= ఈమె (ద్రౌపది); కడుపుకూటికిన్= కడుపుకూటికి; ఎచ్చటన్+ఏన్= ఎక్కడయినా; నిలుచునట్టె= ఉంటుందంట!; ఇది= ఇది; పలుకు+అగునే?= నిజమయిన మాటేనా?

**తాత్పర్యం:** అందుకే వచ్చాను.' అనగానే విని జనులంతా ఆశ్చర్యమూ, సందేహమూ కల మనసులతో 'ఈమె కడుపుకూటికి ఎక్కడయినా ఉంటుందట! ఇది నమ్మదగిన మాటేనా?'

**వ. అనుచుం గనుంగొనుచు ముసురుకొని చనుచుండం బాంచాల రాజనందన రాజమందిరంబు చక్కటికి నరుగు నవసరంబున. 300**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; కనుంగొనుచున్= చూస్తూ; ముసురుకొని= క్రమ్ముకొని; చనుచున్+ఉండన్= వెళ్ళుతుండగా; పాంచాల రాజనందన= పాంచాలదేశపు రాజు-కుమార్తె (ద్రౌపది); రాజమందిరంబు= రాజభవనం; చక్కటికిన్= దగ్గరకు; అరుగు+అవసరంబునన్= వెళ్ళే సమయంలో.

**తాత్పర్యం:** అంటూ ఆమెను చూచారు. ప్రజలు ఆమెను చుట్టుముట్టి నడుస్తున్నారు. అప్పుడు ద్రౌపది రాజమందిరం దగ్గరకు వేళ్లే సమయంలో.

**క. ముదమొదవ రమ్యహర్మ్యము। తుది నిలువునఁ బ్రణయసఖులతోడ విహారా**
**స్పదమగు నెలవున మెలఁగెడు। సుదేష్ణ తజ్జాలకములఁ జూచెం బ్రీతిన్. 301**

**ప్రతిపదార్థం:** సుదేష్ణ; ముదము+ఒదవన్= సంతోషం కలుగగా; రమ్య= అందమయిన; హర్మ్యముతుదినిలువునన్= మేడ చివరి అంతస్తునందు; ప్రణయసఖులతోడన్= తన్ను గాఢంగా అభిమానించే చెలికత్తెలతో; విహార+ఆస్పదము+అగు= విహరించడానికి యోగ్యమయిన; నెలవునన్= ప్రదేశంలో; మెలఁగెడు= సంచరించే; సుదేష్ణ= ఆ విరాటమహారాజు భార్య అయిన సుదేష్ణ; తద్+జాలకములన్= ఆ మేడభాగంలోని కిటికీలగుండా; ప్రీతిన్+చూచెన్= సంతోషంతో చూచింది.

**తాత్పర్యం:** విరాట మహారాజు పట్టమహిషి సుదేష్ణ విహారంకొరకు ఆమె అనుగు చెలికత్తెలతో కలిసి మేడపైభాగంలో విహరిస్తూ ఉన్నది. ఆ మేడ కిటికీలగుండా సైరంధ్రిని ఆసక్తితో చూచింది.

**వ. ఇత్తెఱంగున మత్స్యరాజమహిషి ద్రౌపది నాలోకించి కుతూహలంబున. 302**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; మత్స్యరాజమహిషి= మత్స్యరాజయిన విరాటుని పట్టపురాణి సుదేష్ణ; ద్రౌపదిన్= ద్రౌపదిని; ఆలోకించి= పరిశీలనగాచూచి; కుతూహలంబునన్= వేడ్కతో.

**తాత్పర్యం:** ఈ విధంగా విరాటమహారాజు పట్టపురాణి సుదేష్ణ ద్రౌపదిని చూచి కుతూహలంతో, (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. 'ఎక్కడనుండి యెక్కడకు నేఁగెడినో యిది యొక్క కాంత రూ**
**పెక్కుడు; పెంపు సొంపు మన కేర్పడుచున్నది: దా వినీతయై**
**స్రుక్కుచు నీచభామినుల చొప్పనఁ బల్కెడుఁ బౌరులుం గడున్**
**వెక్కసమంది చూచెదరు; వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్.' 303**

**ప్రతిపదార్థం:** ఇది= ఈమె; ఒక్కకాంత= ఒక్క స్త్రీ; ఎక్కడనుండి= ఎక్కడనుండి; ఎక్కడకున్+ఏఁగెడిన్+ఓ= ఎక్కడికి వెళుతుందో; రూపు+ఎక్కుడు= రూపం ఎక్కువ (అతిశయమయిన రూపం); పెంపు సొంపు= ఔన్నత్య సంపద; మనకున్= మనకు; ఏర్పడుచున్+ఉన్నది= స్పష్టమవుతూ ఉన్నది; తాన్= తాను; వినీత+ఐ= వినయవతి అయి; స్రుక్కుచున్= సంకోచభావం వ్యక్తపరుస్తూ;

నీచభామినుల చొప్పునన్= నీచమయిన పనులు చేసే స్త్రీల విధంగా; పల్కెడున్= మాట్లాడుతూ ఉన్నది; పౌరులున్= పురజనులు కూడా; కడున్= ఎంతో; వెక్కసము+అంది= ఆశ్చర్యపడుతూ; చూచెదరు= చూస్తున్నారు; వేగము+అ= వేగమే; నెమ్మితోన్= ఆదరంతో; తోడ్కొని రండు= వెంటబెట్టుకొని రండి.

**తాత్పర్యం:** 'ఈమె ఎక్కడనుండి ఎక్కడికి వెళ్ళుతున్నదో? ఒంటరి ఆడది. ఈమెలో అందం ఔన్నత్యం (హుందాతనం) కనిపిస్తూ ఉన్నాయి. అయినా సేవకురాలి వలె వినయంతో వంగి మాట్లాడుతూ ఉన్నది. పట్టణంలోని ప్రజలు కూడా ఎంతో వింతగా చూస్తున్నారు. తొందరగా వెళ్ళి ఆమెను వెంటబెట్టుకొని రండి.'

**విశేషం:** సైరంధ్రిని చూడగానే సుదేష్ణకు కుతూహలం కలిగింది. దీనినే ఔత్సుక్యం అని కూడా అంటారు. సంచారిభావాలలో ఒకటి. గాఢమైన ఆసక్తి అని సామాన్యార్థం. "అధునైవాస్యలాభో మమాస్త్వితీచ్ఛా ఔత్సుక్యమ్" అని లాక్షణికు లంటారు. కాలవిలంబనం లేకుండా ఇప్పుడే నాకు ఇది లభించాలి అనే కోరిక యొక్క తీవ్రదశ కుతూహలం, లేదా ఔత్సుక్యం. సైరంధ్రిని చూడగానే సుదేష్ణకు జన్మాంతర సౌహృదరూపమైన ప్రేరణతో కాని, ధర్ముడు పాండవుల కిచ్చిన వరం వలన కాని- అంటే దైవప్రేరణతోకాని కుతూహలం కలిగింది. ఆ కుతూహలాన్ని వ్యక్తం చేసే వాచికాభినయమే ఈ పద్య నిర్మాణ రహస్యం. పద్యం చిన్న చిన్న వాక్యాలతో కాహళ సంధించిన విధంగా ఉంటుంది. అది తిక్కన పద్య శైలికూడా. కుతూహల భావావిష్కార క్రమం ఈ రచనలోని శిల్పం. 1. ఈమె ఎక్కడినుండి ఎక్కడికి పోతున్నదో? ఇది మొదట సుదేష్ణ వేసిన ప్రశ్న. బాటసారులను ఎవరు చూచినా మొదట తెలిసికొనదలచే వివరం ఇది. సుదేష్ణ ఆ సంగతి తెలిసికొనటానికి మాత్రమే అడుగలేదు. ఆమె తన కొరకే వస్తే ఎంత బాగుంటుంది అన్న కుతుహలంతో అడిగినట్లున్నది. 2.ఆమె ఒంటరిగానే ఉన్నది. దానికి కారణ మేమిటో? అని పైకి ఆసక్తి. ఆమె నాతో చెలిమి చేస్తుందేమో! అన్నది లోని ఆసక్తి. 3. ఆమె చాల అందగత్తె. ఔన్నత్య సంపదకూడా తనకు కనబడుతున్నది. ఆమెకు సమానంగా ఉన్న ఆ లక్షణాలు ఆమె ఉన్నత కులసంజాతగా తెలుపుతున్నవి. అటువంటి గుణాలు కల వనిత తనతో కలిసి ఉంటే బాగుంటుందని మనసులోని కుతూహలం. 4. అంతటి ఉదాత్తురాలు వినయంతో దాసీభావంతో అట్లా మాట్లాడుతున్న దేమిటి? దాని కేదో బలమైన కారణం ఉండి ఉండాలి. అది నేను తెలిసికొనాలి - అనే ఆసక్తి సుదేష్ణకు కలిగింది. 5. ఒంటరిగా ఉన్న ఆడదానిని జనులు చాల వింతగా ఒక మాదిరిగా చూస్తారు. అది ఆమెకు మర్యాద కాదు. ఆమెకు ఆశ్రయ మిచ్చి రక్షించటం కులీననైన నాకర్తవ్యం అనుకొన్నది సుదేష్ణ. ఇన్ని లోన అనుకున్నది కాబట్టే చివరకు ఆదరంతో ఆమెను తొందరగా తీసికొని రండని చెలికత్తెలను పురమాయించింది. తిక్కన పాత్రలను ఆలోచిస్తూ మాట్లాడుతున్నట్లు చిత్రిస్తాడు. అది నాటకీయతలో ఒక శిల్పం. అటువంటి శిల్పానికి ఈ పద్యం మచ్చుతునక. (సంపా.)

**క. అని పలికి పనుపఁ బ్రౌఢాం । గన లిరువురు వోయి ద్రుపదకన్యకతో ని**
**ట్లనిరి; 'విరాటుమహిషి నినుఁ । దనపాలికిఁ బిలువఁ బంపె దయ పెంపెసఁగన్.' 304**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని పలికి; పనుపన్= సుదేష్ణ పంపగా; ప్రౌఢ+అంగనలు= నేర్పరులైన స్త్రీలు; ఇరువురు= ఇద్దరు; పోయి= కదలివెళ్ళి; ద్రుపదకన్యకతోన్= ద్రౌపదితో; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు; విరాటుమహిషి= విరాటుని రాణి; నినున్= నిన్ను; దయపెంపు+ఎసఁగన్= దయ ఆధిక్యం అతిశయించగా; తన పాలికిన్= తన దగ్గరికి; పిలువన్= పిలుచుకొని రావటానికి; పంపెన్= ఆజ్ఞాపించింది.

**తాత్పర్యం:** అని సుదేష్ణ చెప్పి పంపింది. ఇద్దరు గడుసరివనితలు బయలుదేరారు. ద్రౌపది దగ్గరికి వెళ్ళి ఇట్లా అన్నారు. 'విరాటమహారాజు పట్టమహిషి సుదేష్ణాదేవి దయతో నిన్ను తన దగ్గరకు తీసికొనిరమ్మని పంపించింది.'

**విశేషం:** సైరంధ్రి యొక్క వివరాలు తెలిసికొని రావటం వేరు. ఆమెను నిపుణంగా ఒప్పించి వెంట తీసికొనిరావటం వేరు. మొదటిపనికి ఎవరైనా చాలు. రెండపనికి ప్రౌఢాంగనలే కావాలి. కావలిసివస్తే తమ నేర్పరితనాన్ని ప్రదర్శించి కార్యం సాధించుకొని రావాలి. అటువంటి చాతుర్యం కలవారిని ఇద్దరిని ఎన్నికచేసి పంపింది సుదేష్ణ. ఆమె కూడా నేర్పరి అనిపించుకొన్నది. (సంపా.)

**వ. అనవుడు. 305**

**తాత్పర్యం:** అనగానే.

**క. తన తలసీర యరసి య। వ్వనితారత్నంబు వినయవైభవము సతీ**
**తను వొందిన చందంబునఁ। జనియెం గేకయసుతానుచారికలబడిన్. 306**

**ప్రతిపదార్థం:** తన తల+చీర= తన తలమీద కప్పుకున్న వస్త్రం; అరసి= సర్దుకుని; ఆ+వనితారత్నంబు= స్త్రీలలో శ్రేష్ఠురాలయిన ఆ ద్రౌపది; వినయవైభవము= వినయం యొక్క సంపద; సతీతనువు= పతివ్రతారూపం; ఒందిన చందంబునన్= పొందిన విధంగా; కేకయసుతా+అనుచారికలబడిన్= సుదేష్ణ సఖుల వెంబడి; చనియెన్= లోపలికి వెళ్ళింది.

**తాత్పర్యం:** ద్రౌపది మేలిముసుగు సవరించుకొన్నది. వినయం స్త్రీ రూపం ధరించిందా అన్నట్లు ఆ ఇద్దరిచెలుల వెంబడి అంతఃపురంలోనికి వెళ్ళింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. వినయమే ద్రౌపదీ రూపాన్ని తాల్చినట్లుగా భావించటం ఉత్ప్రేక్ష. సుదేష్ణ కేకయరాజు కుమార్తె. అంతఃపురంలోనివారు రెండురకాలవారు. పరిచారికలు, అనుచారికలు పరిచారికలు. సేవలు చేసేవారు, అనుచారికలు అనుసరించి తిరిగేవారు. సుదేష్ణ మనోభావం తెలిసినవారు కావటంవలన వారు ద్రౌపదిని తమవెంబడి తీసికొని రాగలిగారు. ద్రౌపదికూడా రావటానికి మారుపలుకకుండా ఒప్పుకొన్నది. మొదటి కారణం తన అవసరం. ఎక్కువకాలం ప్రజలనడుమ బజారులో ఉండరాదు. ఎవరైనా గుర్తించవచ్చును. అందువలన భద్రత కొరకు వెంటనే అంగీకరించింది. అంతేకాక అట్లా అంగీకరించటం రాణిపట్ల ఆమె చూపే వినయంగా తోస్తుంది.

**వ. ఇవ్విధంబునం జని సౌధంబు నుపరిభాగం బెక్కి. 307**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; చని= వెళ్లి; సౌధంబు+ఉపరిభాగంబు= మేడ పైభాగం; ఎక్కి= ఎక్కి.

**తాత్పర్యం:** ద్రౌపది అనుచారికలతో వెళ్ళింది. అంతఃపురసౌధం పైభాగం ఎక్కి (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. పదతలంబుల కెంపు పరఁగిన తలము కుం। కుమలిప్త మైన చందము వహింప,**
**నంగంబు నునుఁగాంతి యడరిన గోడలు। వేదులు మణిమయ విధము నొందఁ,**
**గనుఁగవ మెఱుఁగులు గదిరిన ముందఱఁ। బుష్పోపహారంబు పొలుపుఁ దాల్ప,**
**వేసలికప్పు పర్విన మీఁదు నీల దు। కూలంబు మేల్కట్టు కొమరు వడయఁ,**

**తే. దాను జొచ్చిన కతన మత్స్యక్షితీశు। నింట నిమ్మెయిఁ గ్రొత్తయొ ప్పెసక మెసఁగ**
**న మ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ। బాండురాజతనూభవపత్ని యరిగె. 308**

**ప్రతిపదార్థం:** పదతలంబుల కెంపు= పాదాల అడుగుభాగాల ఎర్రదనం; పరఁగిన= వ్యాపించిన; తలము= ప్రదేశం; కుంకుమ లిప్తము+ఐన= కుంకుమతో పూయబడిన; చందము వహింపన్= రీతిని పొందగా; అంగంబు నునుఁగాంతి= శరీరంయొక్క నున్నదనపు, మిసమిసలు; అడరిన= వ్యాపించిన; గోడలు= గోడలు; వేదులు= అరుగులు; మణిమయవిధమున్+ఒందన్= మణులు తాపించినతీరును పొందగా; కనుఁగవ మెఱుఁగులు= కనుదోయికాంతులు; కదిరిన ముందఱన్= ప్రసరించిన ముందుభాగం; పుష్ప= పువ్వుల; ఉపహారంబు పొలుపున్+తాల్పన్= కానుకరీతిని ధరించగా; వేనలికప్పు= కొప్పునల్లదనం; పర్విన మీఁదు= వ్యాపించిన పైభాగం; నీలదుకూలంబు= నల్లని పట్టువస్త్రం; మేల్కట్టు= పైన కట్టే చాందినియొక్క; కొమరు+పడయన్= అందాన్ని పొందగా; పాండురాజ తనూభవపత్ని= పాండురాజు కుమారులయిన పాండవులయొక్క భార్య అయిన ద్రౌపది; తాను= తాను; చొచ్చినకతనన్= ప్రవేశించటంవలన; మత్స్యక్షితి+ఈశు+ఇంటన్= మత్స్యదేశపురాజు విరాటుని ఇంటిలో; ఈ+మెయిన్= ఈ విధంగా; క్రొత్త+ఒప్పు= కొత్తదయిన సౌందర్యం; ఎసకము+ఎసఁగన్= అతిశయింపగా; ఆ+మహాదేవి= ఆ మహారాణి; ఉన్న+ఎడకున్= ఉన్నచోటికి; అల్లనల్లన్= మెల్ల మెల్లగా; అరిగెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** ద్రౌపది పాదతలాలు ఎర్రగా ఉన్నాయి. అందుచేత నడిచేచోటంతా కుంకుమపూసినట్లు ఎర్రబడిపోతున్నది. ద్రౌపది శరీరం మిసమిసలాడుతూ ఉన్నది. అందుచేత ఆమె తిరిగేప్రదేశంలోని గోడలూ, అరుగులూ మణులు పొదిగిన విధంగా ప్రకాశిస్తున్నాయి. ఆమెకళ్ళల్లో కాంతులు మెరిసిపోతున్నాయి. వాటివలన ముందట పూలు చల్లినట్టుగా ఉన్నది. ఆమెజుట్టు నల్లగా ఉన్నది. ఆ కారణంవలన పైభాగం నల్లని పట్టుచాందినీకట్టుగా కనిపిస్తూ ఉన్నది. ద్రౌపది అడుగుపెట్టగానే విరాటుడి అంతఃపురం క్రొత్తసొంపులతో ప్రకాశిస్తున్నది. ఈ విధంగా ద్రౌపది సుదేష్ణ ఉన్నచోటికి మందగమనంతో గంభీరంగా కదలివెళ్ళింది.

**విశేషం:** అలం: ఉల్లాసం. తద్గుణం. ఉల్లాసాలంకారానికి - **"ఏకస్య గుణదోషాభ్యా ముల్లాసోఽన్యస్య తౌ యది"** - అని లక్షణం. ఒకదాని గుణదోషాలచేత మరియొక దానికి గుణదోషాలు ప్రాప్తించినట్లు వర్ణిస్తే ఉల్లాసాలంకారం. ద్రౌపది ఉల్లాసంగా సుదేష్ణ అంతఃపురానికి వెళ్ళింది. దానిని తిక్కన అర్థాలంకారంతో తీర్చిదిద్దాడు. తాను ఆ అంతఃపురంలో అరుణిమ కారణంగా దానికి నూతనవిలాసం కలిగేటట్లు ప్రవేశించిందట. ఇది అలంకారోక్తి. దానిని విస్తరించటానికి సీసపద్యపాదాలు తిక్కన రచించాడు. ఆమె పాదాలు అడుగిడిన భవనతలంపై కుంకుమ పూసినట్లయింది. ఎఱ్ఱనిగుణం ఎఱ్ఱని గుణాన్ని ప్రాప్తింపచేసింది. అట్లాగే శరీర నైగనిగ్యం గోడలకు మణులకాంతుల సొంపును కలిగించింది. కన్నుల కాంతులు ముందు పూలుచల్లిన పొలుపును కల్పించాయి. నల్లని శిరోజాలకాంతి భవనం పైభాగాన నల్లనిచాందినీ కట్టిన అందాన్ని కలిగింపజేసింది. దాసీవేషంచేత కప్పబడిన ద్రౌపది మేనికాంతియే ఇంతటి వైభవాన్ని ప్రదర్శిస్తుంటే సుదేష్ణ తనకంటె మించిన కాంతిమతి వచ్చిందని ఆశ్చర్యపోకతప్పదు. అర్థాలంకారాన్ని సార్థకంగా వాడి ఔదాత్త్యాన్ని, ఔచిత్యాన్ని పోషించటం తిక్కన నైజం. ఇది స్త్రీ అంగాంగవర్ణన మని కొందరు విమర్శిస్తారు. అది పొరపాటు. ఇది ద్రౌపదియొక్క కాంతిగుణవైభవ ప్రదర్శన వర్ణనం. సుదేష్ణ మనసులో అంకురించిన కుతూహలభావాన్ని కుసుమింపచేయటానికి తోడ్పడే విభావవిస్ఫూర్తి ఈ పద్యం. కొందరిందులోని అలంకారం తద్గుణమంటారు. 'తద్గుణ స్స్వగుణత్యాగా దన్యదీయ గుణగ్రహః' అని తద్గుణ లక్షణం. ఒకటి స్వగుణాన్ని విడిచి అన్యగుణాన్ని గ్రహించడం తద్గుణం. ఇక్కడ 'తలము' (నేల) స్వీయ వర్ణ గుణాన్ని విడిచి, సైరంధ్రి పాదతలముల కెంపువర్ణాన్ని స్వీకరించింది. ఇట్లాగే మిగిలినవి. (సంపా.)

**వ. కేకయరాజనందనయును. 309**

**తాత్పర్యం:** కేకయ రాజకుమార్తె అయిన సుదేష్ణకూడా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. కనుఁగొని గారవంబును మొగంబునఁ గేలఁ బురఃప్రసారముం**
**దనువున నమ్రభావమును దంతమరీచుల సామి నిర్గమం**
**బును దనలోఁ గడల్కొనఁగ భూరితరాదరరేఖ, "నిందు ర."**
**మ్మనవుడు నంత నంత ద్రుపదాత్మజ సేరి వినీతి నిల్చినన్. 310**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; మొగంబునన్= ముఖంలో; గారవంబును= గౌరవం; కేలన్= చేతితో; పురఃప్రసారమున్= ముందుకు చాచడమూ; తనువునన్= దేహంలో (రూపంలో); నమ్రభావమును= వినయస్వభావమున్నూ; దంతమరీచులన్= దంతకాంతులలో; సామినిర్గమంబును= సగం వెడలటమునూ; తనలోన్= తనలో (సుదేష్ణలో); కడల్కొనఁగన్= వ్యాపించగా; భూరితర= అత్యధికమయిన; ఆదరరేఖన్= ఆదరస్ఫూర్తితో; ఇందున్ రమ్ము= ఇటురమ్ము; అనవుడున్= అనగానే; ద్రుపద+ఆత్మజ= ద్రుపదుని కూతురు ద్రౌపది; అంతన్+అంతన్= మెల్లమెల్లగా; చేరి= సమీపించి; వినీతిన్= వినయంతో; నిల్చినన్= నిలబడగా.

**తాత్పర్యం:** సుదేష్ణ ద్రౌపదిని చూచింది. సుదేష్ణ ముఖంలో గౌరవం కనబడింది. చేతులు ముందుకు చాచింది. సగం కనబడీకనబడనట్లు దంతకాంతులు వ్యాపించాయి. ఆదరంతో దగ్గరికి రమ్మని పిలిచింది. మెల్లమెల్లగా ద్రౌపది ఆమె దరికి చేరి నిలబడింది.

**విశేషం:** ఈ పద్యాన్ని ఈ విధంగా సంస్కరించటం యుక్తతరమనిపిస్తున్నది. ఇందులో నాలుగు జంటలున్నాయి. 1) గారవంబును- మొగంబును, 2) పురఃప్రసారమున్-కేలును, 3) నమ్రభావమును- తనువును, 4) సామినిర్గమంబును- దంతమరీచులున్- వీనిలో మొదటి పదముల చివరను' ద్వితీయార్థకం. రెండవపదముల చివరి 'ను' సముచ్చయార్థకం. ఇవి తనలో(సుదేష్ణలో) కడల్గొనఁగన్= కలుగగా- ఇది తెలుగు విశ్వవిద్యాలయమూ, మున్నంగిశర్మా అంగీకరించిన పాఠం. మున్నంగిశర్మ తాత్పర్యం - చూచి, మొగము ప్రేమమును - పెద్దతనమును చేతులు ముందునకు చాచి కోలును (చాచికొనుటయు), తనువు ఇంచుక ముందుకు మ్రొగ్గతిలుటయు, పలువరుస మెఱుఁగులు సగము మాత్రము వెలువడుటయు తనలో (సుదేష్ణలో) నెక్కొనఁగా మిక్కిలి మన్నన భావముతో- ఇట 'గారవంబును మొగంబు' నిత్యాదులగు జతలు భాషాశైలీ ప్రయుక్తములు. ఇట్టివే యితర పర్వములందుం జూపట్టెడి - తెలుగు విశ్వవిద్యాలయ ప్రతిలోని అధోనిర్దిష్ట సూచన గమనించదగినది (సంపా.)

**క. ఆపాదమస్తకము త। ద్రూపము వీక్షించుచుం గుతూహల మడరన్**
**భూపాల మహిషి యిట్లను। నా పాలఁతుకతోడ నుచితమయ్యెడి భంగిన్. 311**

**ప్రతిపదార్థం:** భూపాలమహిషి= విరాటమహారాజు పట్టమహిషి సుదేష్ణ; ఆపాదమస్తకము= కాలినుండి తలదాకా; తద్రూపమున్= ఆమె రూపాన్ని; వీక్షించుచున్= చూస్తూ; కుతూహలము+అడరన్= కుతూహలం కలిగేటట్లు; ఆ పాలఁతుకతోడన్= ఆ ద్రౌపదితో; ఉచితము+అయ్యెడి భంగిన్= తగిన రీతిలో; ఇట్లు+అనున్= ఇలా అన్నది.

**తాత్పర్యం:** ఆమె రూపాన్ని ఆపాదమస్తకం పరిశీలించింది. కుతూహలంతో సుదేష్ణ తగిన రీతిలో ద్రౌపదితో ఇట్లా పలికింది.

**విశేషం:** పురుషుల వీక్షణాలకు స్త్రీల వీక్షణాలకు తేడా ఉన్నది. స్త్రీలు ఒక్కచూపుతో అన్నిటిని ఆకళింపు చేసికొంటారు. సుదేష్ణ ద్రౌపదిని పరిశీలించిన తీరు ఇటువంటిదే!

ఆ. 'ఏది కులము? నామ మెయ్యది? యెవ్వరి। దాన? వేమి పనికిఁ బూని యిప్పు
డెచటు బుద్ధిఁదలఁచి యేఁగెద? వింతయు। నెఱుఁగఁ జెప్పుమాకు మెఱుఁగుఁబోఁడి!' 312

**ప్రతిపదార్థం:** మెఱుఁగుఁబోఁడి!= మెరుపుతీగవంటి శరీరం కలదానా!; ఏది కులము?= నీదేమి కులం?; ఏ+అది= ఏది; నామము= పేరు; ఎవ్వరి దానవు?= ఎవ్వరికి చెందినదానవు? ఏమిపనికిన్= ఏ పనికి; పూని= ప్రయత్నించి; ఇప్పుడు= ఇప్పుడు; ఎచటు= ఏ ప్రదేశాన్ని; బుద్ధిన్+తలఁచి= మనసులో అనుకొని; ఏఁగెదవు?= బయలుదేరావు?; ఇంతయున్= ఇదంతా; మాకున్= మాకు; ఎఱుంగన్+చెప్పు= తెలిసే విధంగా మాకు చెప్పుము.

**తాత్పర్యం:** 'నీకులం ఏది? నీ పేరేమి? నీవు ఎవరిదానవు? ఏ పనిమీద ఎక్కడకు వెళ్ళుదామని బయలుదేరావు? అంతా మాకు స్పష్టంగా చెప్పుము.'

**విశేషం:** అపరిచితులను ప్రశ్నించే విధానం ఈ పద్యంలో కనిపిస్తుంది. నీవు ఎవ్వరిదానవు? అని అడగటంలో ఎవరి భార్యవనీ ఎవరి కూతురవనీ అడిగినట్లయింది.

వ. అనిన విని యాజ్ఞసేని యిట్లను; 'నేను సైరంధ్రీజాతి సంభూత; నభిధానంబు మాలిని; పురుషపంచక సనాథనై యుండుదు; నొక్కకారణంబున నుద్ధతులగు విరోధులచేతం బతుల సన్నిధిం దలవట్టి యీడ్వంబడి, వనంబున కరిగి, వ్రతంబుమై వల్లభసహితంబుగా వన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడపితి; నిటమీఁద నియమాచరణంబునకు నొక్క సంవత్సరంబు గొఱంత కలదు. నీవు ధర్మవర్తిని వని వినుటం జేసి నానేర్చు పనులవెంట నీకడ నిలువం దలంచి యిందు వచ్చితి' ననవుడు సుదేష్ణ యిట్లనియె. 313

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= విని; యాజ్ఞసేని= ద్రౌపది; ఇట్లు+అనున్= ఈవిధంగా అన్నది; నేను= నేను; సైరంధ్రీజాతి సంభూతన్= సైరంధ్రీజాతిలో పుట్టినదానను; అభిధానంబు= పేరు; మాలిని= మాలిని; పురుషపంచక సనాథను+ఐ= అయిదుగురు పురుషులతో కూడినదాననై; ఉండుదున్= ఉంటాను; ఒక్క కారణంబునన్= ఒక కారణంవలన; ఉద్ధతులు+అగు= బలవంతులయిన; విరోధులచేతన్= విరోధుల చేతిలో; పతుల సన్నిధిన్= భర్తల ఎదుట; తలపట్టి= తలపట్టుకొని (శిరోజాలు పట్టుకొని); ఈడ్వన్+పడి= లాగబడి; వనంబునకున్+అరిగి= అడవికి వెళ్ళి; వ్రతంబుమై= వ్రతనియమంతో; వల్లభసహితంబుగాన్= పతులతో సహా; వన్య+ఆహారంబులన్ = అడవిలో దొరికే కందమూల ఫలాదులయిన ఆహారాలతో; కాలంబు= కాలాన్ని; కడపుచున్= గడుపుతూ; బ్రహ్మచర్యంబు= బ్రహ్మచర్యాన్ని; నడపితిన్= ఆచరించాను (నిర్వహించాను); ఇటమీఁదన్= ఇకనైన; నియమ+ఆచరణంబునకున్= నియమాన్ని ఆచరించటానికి (నియమ సంపూర్తికి); ఒక్క సంవత్సరంబు= ఒక ఏడు; కొఱంత= లోటు; కలదు= ఉన్నది; నీవు= నీవు; ధర్మవర్తినివి+అని= ధర్మమార్గంలో నడచే దానివని; వినుటన్+చేసి= వినటంవలన; నానేర్చుపనుల వెంటన్= నాకు చేతనయిన పనులతో; నీ కడన్= నీ దగ్గర; నిలువన్+తలంచి= ఉండాలని అనుకొని; ఇందున్= ఇక్కడికి; వచ్చితిన్= వచ్చాను; అనవుడున్= అనగానే; సుదేష్ణ= సుదేష్ణ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** సుదేష్ణ ప్రశ్నలను ద్రౌపది అర్థం చేసికొన్నది. ద్రౌపది ఇట్లా చెప్పింది - 'నేను సైరంధ్రీజాతిలో పుట్టాను. నా పేరు మాలిని. అయిదుగురు భర్తలతో ఉంటాను. ఒకానొక కారణంవలన అహంకారమతులయిన విరోధులు నా మగల ఎదుటే నన్ను జుట్టుపట్టి లాగారు. మగలతో అడవికి వెళ్ళాను. ఒక వ్రత నియమంచేత కందమూల ఫలాదులతో కాలక్షేపం చేశాను. బ్రహ్మచర్యాన్ని అవలంబించాను. ఇంక నా నియమసంపూర్తికి ఒక ఏడు మాత్రం ఉన్నది. నీవు

ధర్మపరురాలవని విన్నాను. నీ దగ్గరే ఉండాలనుకొన్నాను. అందుచేత ఇక్కడకు వచ్చాను. నా చేతనయిన పనులు చేస్తాను' అనగానే సుదేష్ణ ఇట్లా పలికింది.

**క. 'సుర గరుడ ఖచర విద్యా। ధర కిన్నర యక్ష సిద్ధ తరుణులలో నీ**
**వరయఁగ నొక్కత వగు ది। వ్పురికిం జనుదేరఁ గతము బొంకక చెపుమా!' 314**

**ప్రతిపదార్థం:** సుర= దేవతలు; గరుడ= గరుడులు; ఖచర= ఖేచరులు-ఆకాశంలో సంచరించేవారు; విద్యాధరులు= విద్యాధరులు; కిన్నర= కిన్నరులు; యక్ష= యక్షులు; సిద్ధ= సిద్ధులు అనువారియొక్క; తరుణులలోన్= స్త్రీలలో; నీవు= నీవు; అరయఁగన్= బాగా ఆలోచించి చూస్తే; ఒక్కతవు+అగుదు(వు)= ఒక్కతవు అయి ఉంటావు? ఈ పురికిన్= ఈ నగరానికి; చనుదేరన్= రావడానికి; కతము= కారణం; బొంకక= అబద్ధం ఆడకుండా; చెపుమా!= చెప్పుము!.

**తాత్పర్యం:** 'దేవతల, గరుడుల, ఖేచరుల, విద్యాధరుల, కిన్నరుల, యక్షుల, సిద్ధుల కాంతలలో నీవు ఒకతెవు కావచ్చును. ఈ నగరానికి రావడానికి కారణ మేమిటో అబద్ధమాడకుండా చెప్పుము.'

**విశేషం:** మూలంలో సుదేష్ణ ద్రౌపదిని మానవాంగన అని నమ్మలేకపోయింది. దానికి ఆమె శరీర నిర్మాణ విశేషాలనే సాముద్రిక శాస్త్ర మర్యాదతో వివరించి చెప్పింది. తిక్కన దానినంతా వదలివేశాడు. ఆ శ్లోకాలివి -

> "నైవంరూపా భవన్త్యేవ యథా వదసి భామిని । ప్రేషయన్తీవ వై దాసీ ర్దాసాంశ్చ వివిధాన్ బహూన్॥
> నోచ్చ గుల్ఫా సంహతోరుస్త్రిగంభీరా షడున్నతా । రక్తా పంచసు రక్తేషు హంస గద్గద భాషిణీ॥
> సుకేశీ సుస్తనీ శ్యామా పీనశ్రోణి పయోధరా । తేన తేనైవ సంపన్నా కాశ్మీరీవ తురంగమీ ॥
> అరాల పక్ష్మనయనా బింబోష్ఠీ తనుమధ్యమా । కంబుగ్రీవా గూఢశిరా పూర్ణచంద్ర నిభాననా॥
>
> (శారదోత్పలపత్రాక్ష్యా శారదోత్పల గంధయా । శారదోత్పల సేవిన్యా రూపేణ సదృశీ శ్రియా।) (సం.3.9. 9-12)

**క. అనుటయు దరహసితము మో। మునకుఁ దొడవుగాఁగఁ బలుకు ముద్దియ 'యేఁ గృ**
**ష్ణునిదేవి సత్యభామకుఁ। బనిసేయుదుఁ దొల్లి, పిదపఁ బాంచాలికడన్. 315**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; ముద్దియ= ముద్దరాలయిన ద్రౌపది; మోమునకున్= ముఖానికి; దరహసితము= చిరునవ్వు; తొడవుకాఁగన్= అలంకారం కాగా; పలుకున్= ఇట్లా అన్నది; తొల్లి= పూర్వం; ఏన్= నేను; కృష్ణునిదేవి= కృష్ణుని భార్య; సత్యభామకున్= సత్యభామకు; పని చేయుదున్= సేవలు చేస్తుండేదానిని; పిదపన్= తర్వాత; పాంచాలికడన్= ద్రౌపది దగ్గర.

**తాత్పర్యం:** అనగానే ద్రౌపది ముఖంలో చిరునవ్వు కనిపించింది. ఆ చిరునవ్వు ద్రౌపదికి అలంకారంగా అమరింది. 'నేను ముందు కృష్ణుడి భార్య సత్యభామ దగ్గర, ఆ తరువాత ద్రౌపది దగ్గర పనిచేస్తూ ఉండేదానిని' అని వివరణ నిచ్చింది.

**విశేషం:** ద్రౌపది కూడా ధర్మరాజువలె దరహాసం చేసింది. ఎందువలన అంటే తాను దాదాపు అంతా దాచుకోకుండా చెప్పినా ఆమె నమ్మటం లేదు. ద్రౌపదిగా గుర్తించటం లేదు. మానవవనితలో దైవవనితను దర్శిస్తూ మరేదో అపూర్వ విశేషాలను వినాలని సుదేష్ణ కోరుతున్నది. అందుకు ద్రౌపది నవ్వింది. (సంపా.)

**తే.** **తగవుమైఁ బరిచారికా ధర్మములకు। నెల్లఁ జాలి వర్తించితిఁ; దల్లి! వినుము**
**నాకుఁ బ్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్న। కాఁగ భావించి యాదేవి గారవించు.** **316**

**ప్రతిపదార్థం:** తల్లి!= అమ్మా!; వినుము= ఆలకించుము; తగవుమైన్= తగిన విధంగా; పరిచారికా ధర్మములకున్+ఎల్లన్= పరిచారికల పనుల కన్నిటికిని; చాలి= సమర్థురాలినై; వర్తించితిన్= ప్రవర్తించాను; నాకున్= నాకు; ప్రాణంబు ప్రాణమై= ప్రాణానికి ప్రాణమై; నన్నున్= నన్ను; తన్నున్+అ కాఁగన్= తననే అనుకొనేటట్లు; భావించి= తలచి; ఆ దేవి= ఆ ద్రౌపది; గారవించున్= గౌరవిస్తూ ఉండేది.

**తాత్పర్యం:** 'పరిచారికల విధులు నాకు తెలుసు. పరిచారికలు చేసే పనులన్నీ చేశాను. ఆ పనులలో నేను సమర్థురాలినై ప్రవర్తించాను. అమ్మా! వినుము. ద్రౌపది నన్ను ప్రాణానికి ప్రాణంగా భావించి నేనే తాననుకొన్నట్లు ఆదరించేది.

**విశేషం:** ద్రౌపది సైరంధ్రిని ఏ విధంగా భావించేదో అట్లే సుదేష్ణకూడా భావించాలని భావం. (సంపా.)

**వ.** **నీవును.** **317**

**తాత్పర్యం:** నీవుకూడా.

**క.** **నీచము లయ్యెడు పనులకు। నా చాలమి యెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా**
**నీ చిత్తంబునఁ గైకొని। యాచారము తప్పకుండ నరయుము నన్నున్'.** **318**

**ప్రతిపదార్థం:** నీచములు+అయ్యెడు పనులకున్= తక్కువ రకపు పనులకు; నా చాలమి= నా అసమర్థత; ఎఱిఁగి= తెలిసికొని; మన్ననకున్= గౌరవానికి; పాత్రముగాన్= అర్హమయ్యేటట్లు; నీ చిత్తంబునన్= నీ మనసులో; కైకొని= స్వీకరించి; నన్నున్= నన్ను; ఆచారము తప్పకుండన్= నా సైరంధ్రీజాతి ఆచారం తప్పకుండగా; అరయుము= ఏలుకొమ్ము.

**తాత్పర్యం:** 'నీచమయిన పనులకు నేను తగను. ఈ విషయం నీవు తెలిసికొమ్ము. గౌరవమయిన పద్ధతిలో నన్ను స్వీకరించుము. నా ఆచారము తప్పని విధంగా నన్ను ఏలుకొమ్ము.'

**వ.** **అని యిట్లు దేవజాతి యను సందియంబు వాయం బలికి మఱియును.** **319**

**ప్రతిపదార్థం:** అని= అని; ఇట్లు= ఈ విధంగా; దేవజాతి+అను= దేవజాతి వనిత అనే; సందియంబు= సందేహం; పాయన్= తొలగేటట్లు; పలికి= మాటలాడి; మఱియును= ఆ తరువాత.

**తాత్పర్యం:** తనను దేవజాతికి చెందిన దానినిగా సందేహిస్తూవున్న సుదేష్ణ అనుమానం తొలగేటట్లు ద్రౌపది ఈ విధంగా పలికి, ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **'కలపములు గూర్ప బహువిధ। తిలకంబులు వెట్ట వింత తెరువునఁ బలు పు**
**వ్వులు గట్టి కట్టి ముద్దుగఁ। దల ముడువఁగ సరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్.'** **320**

**ప్రతిపదార్థం:** కలపములు= చందనాదులు; కూర్పన్= కలపటానికి; బహువిధ= రకరకాల; తిలకంబులు+పెట్టన్= తిలకాలు పెట్టటానికి; వింత తెరువునన్= కొత్తదయిన పద్ధతిలో; పలుపువ్వులు= అనేక రకాలయిన పువ్వులు; కట్టికట్టి= చెండుకట్టి; ముద్దుగన్= తనకూ, ఇతరులకూ ముద్దువచ్చేటట్లు; తలన్+ముడువఁగన్= తలలో ముడవటానికి; సరులు= దండలు; క్రువ్వన్= గుచ్చటానికి; తద్దయున్= మిక్కిలి; నేర్తున్= నేర్చాను.

**తాత్పర్యం:** 'కలపాలు కలపటం తెలుసు. రకరకాలయిన తిలకాలు దిద్దటమూ తెలుసు. వింతవింతలుగా చెండ్లు కట్టటం, ముద్దుగా తలలో ముడవటం, దండ గుచ్చటం అన్నీ బాగా నేర్చాను.'

**మ. అనినం గేకయరాజనందన ప్రభూతాశ్చర్యయై యిట్లనున్**
**'విను! నీ రూపము చూచి మా నృపతి యువ్విళ్లూరు; నే నెమ్మెయిం**
**బనిగొందుం? దగ నింతులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నె**
**మ్మనముల్ విస్మయమందఁ జూచెదరు భామా! పల్కు లింకేటికిన్? 321**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగానే; కేకయరాజనందన= కేకయదేశానికి రాజయిన వాడి కుమార్తె సుదేష్ణ; ప్రభూత= ఎక్కువయిన; ఆశ్చర్య+ఐ= ఆశ్చర్యం కలదై; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నది; భామా!= వనితా!; విను= వినుము; నీ రూపమున్+చూచి= నీ అందాన్ని చూచి; మా నృపతి= మా రాజు విరాటుడు; ఉవ్విళ్ళూరున్= మనసులో కోరుకొంటాడు; నేను= నేను; ఏ+మెయిన్= ఏ విధంగా?; పని+కొందున్?= పనిచేయించుకొనగలను; తగన్= చక్కగా; ఇంతులున్= స్త్రీలు కూడా; తగిలి= ఆసక్తలై; నీపైన్+చూడ్కి= నీమీద దృష్టిని; నెక్కొల్పి= నిల్పి; నెఱ+మనముల్= నిండు మనస్సులు; విస్మయము+అందన్= ఆశ్చర్యపడే విధంగా; చూచెదరు= చూస్తారు; పల్కులు= మాటలు; ఇంకన్+ఏటికిన్?= వేరే ఎందుకు?

**తాత్పర్యం:** ఆ మాటలు విన్న సుదేష్ణ ఆశ్చర్యపడుతూ ఇట్లా అన్నది: 'భామా! నీ రూపాన్ని చూచి మా రాజు ఉవ్విళ్లూరటం ఖాయం. అటువంటి నీ చేత నేను ఎట్లా పనిచేయించుకొంటాను? ఆడవాళ్ళుకూడా నీ మీద చూపులు నిలిపి వింతగా చూస్తారు. ఇంకా వేరే మాటలు ఎందుకు?

**విశేషం:** మగవారి స్వభావాన్ని స్త్రీలు ఎట్లా పసికట్టుతారో తెలియటానికి సుదేష్ణ మాటలు చాలు. ఈ సందర్భంలో మూలంలోని సుదేష్ణకంటె తిక్కన సుదేష్ణ చాల నిబ్బరంగా, నిండుగా, హుందాతనంతో మాట్లాడింది. 'ఇంకా వేరే మాట లెందుకు?' అనే వాక్యం మూలానికి కూడా వర్తిస్తుంది. సుదేష్ణ సైరంధ్రి విషయంలో తన భర్తనే అనుమానించింది. తమ్ముడైన కీచకుడిని శంకించలేదు. కీచకుడు చెప్పినమాట వింటాడు. అతడిని సులభంగా అదుపులో పెట్టవచ్చు ననుకున్నదో ఏమో! అదీగాక మొదట భర్తలనే అనుమానించటం స్త్రీల స్వభావం.

**క. దుర్భర యగు నినుఁ గర్కటి। గర్భము ధరియించునట్లు గైకొని నాకై**
**నిర్భర విధ్వంసదశా। విర్భావము దెచ్చుకొనుట వెరవై యున్నే?' 322**

**ప్రతిపదార్థం:** దుర్భర+అగు= భరించడానికి సాధ్యంకాని; నినున్= నిన్ను; కర్కటి= ఆడపీత; గర్భము= కడుపును; ధరియించునట్లు= మోసేవిధంగా; కైకొని= స్వీకరించి; నాకై= నా కొరకు; నిర్భర= అధికమైన; విధ్వంస, దశా+ఆవిర్భావము= వినాశమనే అవస్థ యొక్క పుట్టుక; తెచ్చుకొనుట= కొనితెచ్చుకొనటం; వెరవు+ఐ+ఉన్నే?= తెలివి అవుతుందా?

**తాత్పర్యం:** నిన్ను భరించడం చాల కష్టం. పీతగర్భం వంటిదే నీ రక్షణ. నా సంపూర్ణ వినాశనం నేనే కొనితెచ్చుకొనటం. అది తెలివయిన పని కాదు.'

**విశేషం:** అలం: ఉపమ. ఎండ్రకాయ గర్భం చిత్రమయింది. (తేలు-ఎండ్రకాయ తప్ప) ఇతర ప్రాణులలో ప్రసవం సాధారణంగా తల్లికి బిడ్డకు క్షేమకరం. కాని, ఎండ్రకాయ పిల్లలు పొట్ట బ్రద్దలు కాగా బయటికి వస్తాయి. తల్లి చనిపోతుంది. కొన్ని కడుపులో దాచుకోవచ్చును. కొన్ని దాచుకోవటం కష్టం. అట్లాగే ద్రౌపదీ రక్షణం స్వీయవినాశనానికే దారితీస్తుందని భావం.

**ఆ. అనిన 'నీ తలంచినట్ల కా; దేర్పడ । వినుము! నాదు పతులు వెరవు లావు**
**నలఘు విక్రమంబుఁ గలుగు గంధర్వు; లే । మఱరు నన్ను నొక్క మాత్ర యైన. 323**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; నీ తలంచినట్ల కాదు= నీవు అనుకున్నట్లు కాదు; ఏర్పడన్= స్పష్టంగా; వినుము= ఆలకించుము;నాదు పతులు= నా భర్తలు; వెరవు= ఉపాయం; లావు= బలం; అలఘు విక్రమంబున్= గొప్ప పరాక్రమం; కలుగు= కలిగిన; గంధర్వులు= గంధర్వులు; ఒక్కమాత్ర+ఐనన్= ఒక్క క్షణమయినా; నన్నున్= నన్ను; ఏమఱరు= ఏమరుపాటు లేక జాగ్రత్తగా చూస్తారు.

**తాత్పర్యం:** ఆ మాటలు వినిన తరువాత ద్రౌపది ఇట్లా అన్నది. 'నీవు అనుకొన్నట్లు కానే కాదు. నాభర్తలు సామాన్యులు కారు. ఉపాయం తెలిసినవారు. బలం కలవారు. దీనికితోడు పరాక్రమం కలవారుకూడా. ఒక్క నిమిషమయినా నావిషయంలో పరాకుగా ఉండరు.

**క. నీచమతి నన్ను నెవ్వఁడు । సూచిన నా రాత్రిలోనఁ జూతురు దెగఁ దా**
**రా చపలు హరిహరాదులు । గాచిన బలవిక్రమము లఖర్వములైనన్. 324**

**ప్రతిపదార్థం:** నీచమతిన్= నీచమయిన బుద్ధితో; నన్నున్= నన్ను; ఎవ్వఁడు= ఎవ్వడు; చూచినన్= చూసినప్పటికీ ఆ చపలున్= ఆ చంచలబుద్ధికలవాడిని; హరిహర+ఆదులు= విష్ణువు శివుడు మొదలయినవారు; కాచినన్= రక్షించినా; (అతనికి); బలవిక్రమములు= బలపరాక్రమాదులు; అఖర్వములు+అయినన్= మొక్కవోనివి అయినా; ఆ రాత్రిలోనన్= అదే రాత్రిలో; తెగన్+చూతురు= అంతమొందిస్తారు.

**తాత్పర్యం:** నన్ను ఎవడయినా నీచబుద్ధితో చూసినట్లయితే, నా పతులు ఆ నీచుడిని ఆ రాత్రే నరికివేస్తారు. వారిని హరిహరాదులు రక్షించినా సరే! వారికెంత బలమూ, విక్రమమూ ఉన్నా సరే!

**విశేషం:** ఈ వాక్యాలు భావి కీచకవధను సూచిస్తున్నాయి.

**క. బంధుశతంబులు శౌర్యమ । దాంధములై శక్తి సంపదాభీలములై**
**సింధురసదృశత నున్నను । సంధుల సంధు లెడలించి చంపుదు రతనిన్. 325**

**ప్రతిపదార్థం:** బంధుశతంబులు= వందలకొద్దీ చుట్టాలు; శౌర్యమద= పరాక్రమ గర్వముతో; అంధములు+ఐ= కళ్ళు కానరానివారై; శక్తిసంపద్= శక్తి సంపదతో; ఆభీలములు+ఐ= భయంకరమయినవై; సింధుర సదృశతన్= ఏనుగుల వలె; ఉన్నను= ఉన్నాసరే; (నా భర్తలు) అతనిన్= అతడిని; సంధుల సంధులు+ఎడలించి= సంధిబంధాలను తొలగించి; చంపుదురు= చంపుతారు.

**తాత్పర్యం:** వందలకొద్ది చుట్టాలు శౌర్య గర్వితులై ఉండవచ్చును; స్వయంగా మదాంధులు కావచ్చును. శక్తి సంపదతో భయంకరులు కావచ్చును. ఏనుగువలె ఉండవచ్చును. అయినా నా భర్తలు కీళ్ళకు కీళ్ళు విడదీసి వాడిని చంపివేస్తారు.

**విశేషం:** ఈ పద్యంలో ముందు జరగబోయే నూరుగురు ఉపకీచకులను సైతం భీముడు చంపే వృత్తాంతం రేఖామాత్రంగా సూచితం. కీచకుడికి ఏనుగంత బలం ఉన్నది. చుట్టాలున్నారు. అదిగాక ఎదురులేని అధికారం ఉన్నది. అయినా భీమునిచేతిలో ప్రాణాలు పోగొట్టుకొన్నాడు.

**వ. కావునఁ బురుషులు నాకడం దేఱి చూడను వెఱతు; రదియునుంగాక. 326**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; పురుషులు= మగవాళ్ళు; నాకడన్= నావైపు; తేఱి చూడను= తేరిపార చూడటానికి; వెఱతురు= భయపడతారు; అదియునున్+కాక= అదీ కాక.

**తాత్పర్యం:** మగవాళ్ళు నా వైపు తేరిపారచూడటానికి కూడా భయపడతారు. అదీ కాక.

**క. నా చిత్తము తాదృశులకు। గోచరమే? యస్మదీయ కులజన సంశి**
**క్షాచార మహిమ యట్టిది। యే? చెప్పకు తద్విధాతిహీన వచనముల్. 327**

**ప్రతిపదార్థం:** నా చిత్తము= నా మనసు; తాదృశులకున్= అలాంటి పురుషులకు; గోచరమే= కనబడుతుందా (బయటపడుతుందా?); అస్మదీయ= నా యొక్క; కులజన= వంశపురుషుల; సంశిక్షా+ఆచార= శిక్షణ, ఆచారాలయొక్క; మహిమ= ప్రభావం; అట్టిదియే= అటువంటిదా, సామాన్యమైనటువంటిదా?; తద్విధ= అటువంటి; అతిహీనవచనముల్= మిక్కిలి నీచమయిన మాటలు; చెప్పకు= చెప్పవద్దు.

**తాత్పర్యం:** నా మనసు అటువంటివారికి గోచరించదు. (నాపై ప్రభావం చూపే) కులము, పెద్దల శిక్షణ ఆచారం అటువంటిది కాదు. అటువంటి నీచమయిన మాటలు మాట్లాడకుము.

**చ. మనమున నూఱడిల్లు; మనుమానము మానుము; నన్ను నేలు; మే**
**పనులు నుదాత్త నాగరిక భంగుల నీమది కెక్కు నట్లు నే**
**ర్పును భయభక్తులున్ మెఱయ రూపుగఁ జేసెదఁ; దద్జ్ఞులైన స**
**జ్జనులు నుతింప వర్తనము సాధులు వృద్ధులు మెచ్చఁ జల్పెదన్. 328**

**ప్రతిపదార్థం:** మనమునన్= మనసులో; ఊఱడిల్లుము= ఊరటచెందుము; అనుమానము= సందేహం; మానుము= మానుకొమ్ము; నన్నున్+ఏలుము= నన్ను స్వీకరించుము; ఏ పనులు= ఏ పనులు; ఉదాత్త= ఉన్నతమైన; నాగరిక భంగులన్= సంస్కారవంతమయిన రీతిలో; నీ మదికిన్+ఎక్కునట్లు= నీ మనసుకు హత్తుకొనేవిధంగా; నేర్పును= నిపుణత; భయభక్తులున్= భయమూ భక్తియూ; మెఱయన్= ప్రకాశించేవిధంగా; రూపుగన్+చేసెదన్= చక్కగా చేస్తాను; వర్తనము= నా ప్రవర్తన; తద్జ్ఞులు+ఐన సజ్జనులు= దానిని తెలిసిన సత్పురుషులు; నుతింపన్= స్తుతించేవిధంగా; సాధులు, వృద్ధులు= సన్మార్గులూ, పెద్దలూ; మెచ్చన్= ప్రశంసించే విధంగా; చల్పెదన్= ఆచరిస్తాను.

**తాత్పర్యం:** మనసులో ఊరట చెందుము. నాపట్ల సందేహం వదలిపెట్టుము. నన్ను సేవకురాలిగా స్వీకరించుము. ఏ పనులలో ఉదాత్తత, ఏ పనులలో నాగరికత ఉంటాయో వాటిలో నీకు ఏవి నచ్చుతాయో ఆ పద్ధతిలో నేర్పుతో భయభక్తులతో చేస్తాను. నా చేతలను సజ్జనులు మెచ్చుకొనే విధంగా ఉత్తములు, సాధుజనులు, పెద్దలు ప్రశంసించే విధంగా ప్రవర్తిస్తాను.

**క. ననుఁ గుచ్చితంపుఁ బనులకుఁ । బనుపక, యెంగిలికి లోనుపఱుపక తగు మ**
**న్ననతోడ నరయు వారల । కనురాగము నెఱపి నడతు రస్మత్పతులున్.' 329**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; కుచ్చితము+పనులకున్= నీచమయిన పనులకు; పనుపక= పంపక; ఎంగిలికిన్= ఎంగిలికి; లోనుపఱుపక= లోబరచకుండా; తగు మన్ననతోడన్= తగిన గౌరవంతో; అరయువారలకున్= చూచేవారికి; అస్మద్+పతులున్= నా మగవారుకూడా; అనురాగము నెఱపి= ప్రేమను. అభిమానాన్ని ప్రకటించి; నడతురు= ప్రవర్తిస్తారు.

**తాత్పర్యం:** నన్ను నీచపు పనులకు పంపనివారిని, ఎంగిలి పెట్టకుండా తగిన గౌరవంతో చూచేవారిని నా భర్తలు ఆదరంతో చూస్తారు.'

**ఆ. అనిన సంతసిల్లి యద్దేవి సైరంధ్రి । నూఱడిల్లఁ బలికి యునిచికొనియె;**
**నంతిపురము చరిత కలవడ మెలఁగుచు । నుండె న వ్వధూటియును ముదమున. 330**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+దేవి= సుదేష్ణ;; సంతసిల్లి= సంతోషపడి; సైరంధ్రిన్= సైరంధ్రిని; ఊఱడిల్లన్+పలికి= కుదుటపడేటట్లు మాట్లాడి; ఉనిచికొనియెన్= తన దగ్గర సేవకురాలిగా ఉంచుకొన్నది; ఆ+వధూటియును= ఆ ద్రౌపదికూడా; ముదమునన్= సంతోషంతో; అంతిపురము చరితకున్= అంతఃపురంలో మెలగవలసిన విధానానికి; అలవడన్= తగిన విధంగా; మెలఁగుచున్+ఉండెన్= మెలగుతూ ఉన్నది.

**తాత్పర్యం:** సుదేష్ణ ఆ మాటలకు సంతోషించింది. సైరంధ్రిని ఊరడింపుమాటలతో కుదుటపరిచింది. తన దగ్గర సేవకురాలిగా ఉంచుకొన్నది. సైరంధ్రి కూడా సంతోషంతో అంతఃపుర మర్యాదలకు అనుగుణంగా ప్రవర్తించసాగింది.

**క. ఇవ్విధమున నయ్యేవురు । నవ్వెలఁదియు సకల జనుల కజ్ఞాతముగా**
**న వ్విరటు ప్రోలఁ బ్రమదము । నివ్వటిల వసించి రుచిత నిభృతత్వమునన్. 331**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ విధంగా; ఆ+ఏవురున్= ఆ అయిదుగురూ; ఆ+వెలఁదియున్= ఆ ద్రౌపదియూ; సకలజనులకున్= అన్నిరకాల ప్రజలకు; అజ్ఞాతముగాన్= తెలియకుండా; ఆ+విరటు ప్రోలన్= ఆ విరాటుని నగరంలో; ప్రమదము= సంతోషం; నివ్వటిలన్= కలిగేవిధంగా; ఉచిత= తగిన; నిభృతత్వమునన్= నిబ్బరంతో; వసించిరి= ఉన్నారు, నివసించారు.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవులు అయిదుగురూ, ద్రౌపదీ ఎవ్వరికీ తెలియకుండా విరాటుడి నగరంలో సంతోషంతో ఉన్నారు. నిబ్బరంగా (సహనంతో కూడిన స్తిమిత భావంతో) నివసించారు.

**విశేషం:** ద్రౌపదీ సమేతులై పాండవులు విరాటుడి కొలువు చేరిన క్రమంలో ఔత్తరాహ సంస్కృత మూల భారత ప్రతికీ, దాక్షిణాత్య సంస్కృత మూల భారత ప్రతికీ భేదం ఉన్నది. ఔత్తారహ ప్రతిలో క్రమం - ధర్మరాజు, భీముడు, ద్రౌపది, సహదేవుడు, అర్జునుడు, నకులుడు వరుసగా ప్రవేశించినట్లు ఉన్నది. దాక్షిణాత్య ప్రతిలో - ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు, ద్రౌపది వరుసగా ప్రవేశించినట్లు ఉన్నది. తిక్కన తన భారతంలో 'దాక్షిణాత్య' ప్రతిని అనుసరించినట్లు తోస్తున్నది (సంపా.)

**వ. అనిన విని 'వారల వర్తనం బటమీఁదఁ జెల్లిన తెఱం గెఱింగింపు' మని యడిగిన. 332**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= విని; వారల= వారలయొక్క; వర్తనంబు= జీవనవిధానం; అటమీఁదన్= ఆ తరువాత; చెల్లిన= ప్రవర్తిల్లిన; తెఱంగు= విధానం; ఎఱింగింపుము+అని= తెలియజేయుము అని; అడిగినన్= అడుగగా.

**తాత్పర్యం:** పాండవుల తర్వాతి వృత్తాంతం తెలుపవలసిందిగా జనమేజయుడు అడుగగా.

## ఆశ్వాసాంతము

**సీ.** **బాంధవ శాత్రవాకలిత భావభవా! భవపాశబంధ సం**
**బంధవిరామ రామ! పరిపక్వ వివేక నిరూఢ భక్త హృ**
**ద్గ్రంథి విభేదనా! పరమకారుణికా! పరిమాణదూర! దుః**
**ఖేంధన పావకాయిత సమీక్షణ! నిత్య మహాద్భుత ప్రదా!** **333**

**ప్రతిపదార్థం:** బాంధవ= చుట్టరికంచేతను; శాత్రవ= వైరంచేతను; ఆకలిత= కూడుకొన్న; భావభవా!= మన్మథుడు కలవాడా!; భవపాశబంధ= సంసారం అనెడి పాశబంధంతో; సంబంధ విరామ రామ!= సంబంధాన్ని పోగొట్టే మనోహరుడా; పరిపక్వ= పండిన; వివేక= విజ్ఞానంచేత; నిరూఢ= ప్రసిద్ధులయిన; భక్తహృద్గ్రంథి= భక్తుల యొక్క హృదయానికి సంబంధించిన ముడులను; విభేదనా!= విప్పేవాడా!; పరమకారుణికా!= ఎంతో కరుణా స్వభావం కలవాడా!; పరిమాణదూర!= (భావుకతకు) కొలతకు అందనివాడా!; దుఃఖ+ఇంధన= దుఃఖమనే కట్టెలకు; పావక+ఆయిత= అగ్నివలె ఆచరించిన; సమ్+ఈక్షణ!= చక్కనిచూపులు కలవాడా!; నిత్య= నిత్యమైన; మహా+అద్భుతప్రదా!= చాలగొప్పదయిన ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని ఇచ్చేవాడా!.

**తాత్పర్యం:** మన్మథుడిని శత్రువుగాను మిత్రుడిగాను కలిగినవాడా! సంసారమనే పాశబంధాన్ని త్రెంచే మనోహరుడా! పరిపక్వమయిన విజ్ఞానంచేత ప్రసిద్ధులయిన భక్తుల హృదయగ్రంథులను విప్పేవాడా! కరుణా స్వభావం కలవాడా! భావనకు అందని వాడా! దుఃఖమనే కట్టెలకు అగ్నివంటి చూపులు కలవాడా! నిత్యమయిన గొప్పవయిన ఆశ్చర్యాలను కలిగించేవాడా హరిహరనాథా!

**విశేషం:** అలం: రూపకం. హరిహరనాథుడిలో ఇటు హరిస్వరూపం ఉన్నది. అటు హరుడి స్వరూపంకూడా ఉన్నది. మన్మథుడు విష్ణువు కుమారుడు కావటం వలన హరిహరనాథుడికి - హరికి బంధువు అయ్యాడు. శివుడు మన్మథుడిని దహించటంవలన హరిహరనాథుడిలో - శివుడికి శత్రువయ్యాడు. సంసార జన్మబంధాలు వదలిపెట్టినవారికి మనోహరమయినవాడు. పరిపక్వజ్ఞానం కలిగినభక్తుల హృదయాలలోని చిక్కుముళ్ళను విప్పేవాడు. ఎంతో దయకలవాడు. ఊహలకు అతీతంగా అందనివాడు. భక్తుల దుఃఖాలను దగ్ధం చేసేవాడు. నిత్యమైన ఆనందాన్ని, అద్భుతాలను ప్రసాదించేవాడు.

**క.** **అన్నమయత్వాది విరా । మోన్నత! వాఙ్మనసదూర! యోగిస్మేరా!**
**భిన్నాభిన్నాకార । చ్ఛన్నాత్మీయ ప్రకార! జగదాధారా!** **334**

**ప్రతిపదార్థం:** అన్నమయత్వ+ఆది= అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయము లనెడి పంచకోశాలు మొదలయిన; విరామ+ఉన్నత!= కోశాలను అతిక్రమించినవాడా!; వాక్+మనసదూర!= వాక్కుకు, మనసుకు అందనంతదూరంలో ఉన్నవాడా!; యోగిస్మేరా!= యోగులయొక్క ఆనందహాసమైనవాడా!; భిన్న= భిన్నమైన; అభిన్న= అభిన్నమైన; ఆకారచ్ఛన్న= ఆకారాలతో కప్పబడిన; ఆత్మీయప్రకార!= ఆత్మరూపం కలవాడా!; జగత్+ఆధారా!= జగత్తులకు ఆధారమైనవాడా!.

**తాత్పర్యం:** అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములనెడి పంచ కోశాలకు అతీతుడయినఉన్నతుడా! వాక్కులకు మనసుకు దూరమయినవాడా! యోగుల చిరునవ్వులలో వెల్లివిరిసేవాడా!; జగత్తుకంటె భిన్నంగానూ! జగత్తే తానుగానూ కనిపించేవాడా! లోకాలకు ఆధారమయినవాడా! హరిహరనాథా!

**విశేషం:** అన్నమయం, ప్రాణమయం, మనోమయం, విజ్ఞానమయం, ఆనందమయం అనే పంచకోశాలకు అతీతుడయినవాడా! ఆ హరిహరుడి స్వరూపాన్ని మాటలలో వర్ణించలేము. మనసులో ఊహించలేము. యోగుల హృదయాలలో ఆనందరూపుడుగా ఉంటాడు. జగత్తుకంటె భిన్నంగా, జగత్తే తానుగా కనిపిస్తాడు.

**మాలిని.**

**కమలభవ కిరీటగ్రామ పద్మావలీ సం। గమసుభగ పదాబ్జా! గాఢభక్తి ప్రకార**
**ప్రముదిత ముని శశ్వద్భావనా గమ్య! రమ్య! క్రమపరిణతమూర్తీ! శ్రౌతశాఖాగ్రవర్తీ!** **335**

**ప్రతిపదార్థం:** కమలభవ= బ్రహ్మయొక్క; కిరీటగ్రామ= కిరీటాల సముదాయం అనే; పద్మ+ఆవలీ= పద్మాల సమూహంయొక్క; సంగమ= కలయికతో; సుభగ= సుందరమయిన; పద+అబ్జా= పాదపద్మాలు కలవాడా?; గాఢభక్తిప్రకార= గాఢమయిన భక్తి విధానంచేత; ప్రముదిత= మిక్కిలి సంతోషించే; ముని= మునులయొక్క; శశ్వత్‌భావనా= నిరంతర భావనచేత; గమ్య= పొందదగినవాడా!; రమ్య= రమణీయమయిన; క్రమపరిణత= క్రమపరిణామంగల; మూర్తీ!= రూపంకలవాడా!; శ్రౌతశాఖా+అగ్రవర్తీ= వేదశాఖల చివరలందు- అనగా ఉపనిషత్తుల యందు ఉండేవాడా!.

**తాత్పర్యం:** బ్రహ్మ చతుర్ముఖుడు. నాలుగు ముఖాలకూ నాలుగు కిరీటాలుండడం చేత 'కిరీటిగ్రామ.' అందుచేతనే 'పద్మావలి.' అట్టి బ్రహ్మ చేసే పాదాభివందనం స్వీకరించేవాడా! భక్తుల నిరంతర ధ్యానంలో గోచరించేవాడా! క్రమపరిణామం కలిగిన రూపం కలిగినవాడా! వేదాంత వేద్యుడా!

**విశేషం:** మత్స్యాద్యవతారాలు ఒకరకమైన పరిణామాన్ని తెలియజేస్తాయి. పంచభూతాలలోకూడా కనిపించే మరొక పరిణామం ఉన్నది. ఆకాశం నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి నీరు, నీటినుండి భూమి పుట్టాయని చెప్పే క్రమం ఒకటి. మాలినీ వృత్తంలోని ప్రతిపాదానికీ 15 అక్షరాలుంటాయి. గణాలు: న న మ య య. 9వ అక్షరం యతిమైత్రి స్థానం. ప్రాస నియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతము నందలి విరాటపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.** **336**

**తాత్పర్యం:** ఇది మంగళకరమైన 'ఉభయకవిమిత్రుడు' అనే బిరుదనామం గలవాడు, కొమ్మనామాత్యుడి పుత్రుడు, పండితులను సేవిస్తూ ప్రకాశించేవాడు. (పండితులచేత పూజించబడేవాడు) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలోని విరాటపర్వంలో మొదటి ఆశ్వాసం.

విరాటపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీమదపాంగాలోకన। ధామసకృత్సంగ రూఢ తాదృశ విభవో**

**ద్ధామాశ్రితలోకా! లో। కామయ నిర్వారణ నిపుణ! హరిహరనాథా!'** 1

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= ఓ దేవా!; శ్రీమత్+అపాంగ+ఆలోకన, ధామ= శోభావంతాలైన (సిరిగల) క్రీగంటి చూపుల కాంతి యొక్క; సకృత్‌సంగ= ఒకమారు తగులగానే; రూఢ= కలిగిన; తాదృశ, విభవ= అటువంటి గొప్పతనంచేత (వైభవంచేత); ఉద్ధామ= గొప్పవారైన; ఆశ్రిత, లోకా!= ఆశ్రయించిన భక్తజనులు కలవాడా!; లోక+ఆమయ= సమస్తజనుల యొక్క ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక రుగ్మతలను (రోగాలను); నిర్వారణ నిపుణ= నిశ్శేషంగా హరించడంలో నేర్పరితనం కలవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వైభవోపేతాలైన నీ క్రీగంటి చూపుల కాంతి ఒక్కమారు తగులగానే ఆ గొప్పతనం చేత నిన్ను ఆశ్రయించిన భక్త జనులను గొప్పవారిని చేసేవాడా! లోకుల సమస్త రోగాలనూ, దుఃఖాలనూ పోయేటట్లు చేయగలవాడా!

**విశేషం:** తిక్కన తాను ప్రతిపాదించిన హరిహరనాథ తత్త్వాన్ని తన గ్రంథంలో ఆశ్వాసం మొదట్లోనూ, చివరలోనూ వ్రాసే పద్యాలలో నిరూపించాడు. శివకేశవుల అభేదాన్ని కవి హరిహరనాథ రూపంలో దర్శించాడు. గ్రంథాన్ని హరిహరనాథుడికి అంకితం చేశాడు కాబట్టి, తొలిపద్యం ఆ దేవుడిని సంబోధిస్తూ చెప్పాడు.

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె; నట్టియెడ ధర్మసూనుండు సభాజనంబుల యుల్లంబులు రంజిల్ల రాజునకు వినోదంబులు వివిధోదాత్త ప్రకారంబులఁ జలుపుచు, నొక్కొక్కమాటు మధుర ప్రసంగంబుగా నాడిన నెత్తంబున గెలిచిన విత్తంబులు తమ్ముల కొసంగుచుండు; వాయునందనుండు వంటకు మిగిలిన మాంసంబు లమ్మునెపంబున నిచ్చలు సహోదరులకు నిచ్చుచుండు; వివ్వచ్చుండు సంగీత ప్రసంగంబున మెచ్చువడసిన కనకాంబరాదులు సోదరులకుం జేర్చుచుండు; నకులుండు దురంగంబుల గ్రాసంబులం గనిన ధనంబులు తోడంబుట్టువులకుఁ బెట్టుచుండు; సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంతసిల్లిన సమయంబున సముపార్జితంబు లగు పదార్థంబులన్నియు నన్నలవశంబు సేయుచు వారలకు గోరసంబులం దుష్టి సలుపుచుండు; ద్రౌపది త న్నరసికొని తిరుగుచున్న వీరలం గన్నులారం జూచుచు నుచితంపు నడవడి మెలంగుచుండు.** 2

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్+ఇట్లు+అనియెన్; అట్టి+ఎడన్= ఆ సమయాన; ధర్మసూనుండు= ధర్మరాజు; సభాజనంబుల= విరాట మహారాజు కొలువులోని సభ్యుల యొక్క; ఉల్లంబులు= మనస్సులు; రంజిల్లన్= సంతోషించగా; రాజునకున్= విరాటరాజునకు; వినోదంబులు= ఆహ్లాదాన్ని కలిగించే మాటలను, చర్యలను; వివిధ+ఉదాత్త ప్రకారంబులన్= అనేక రకాలైన సముచిత పద్ధతులలో; చలుపుచున్= చేస్తూ, ఒక్కొక్క మాటు= ఒక్కొక్కసారి;

మధురప్రసంగంబుగాన్= తియ్యని వాక్యాలతో; ఆడిన= ఆటాడిన; నెత్తంబునన్= పాచికలాటలో; గెలిచిన= సంపాదించిన; విత్తంబులు= ధనాలను; తమ్ములకున్= తన తమ్ములకు; ఒసంగుచున్+ఉండున్= ఇస్తూ ఉండేవాడు; వాయునందనుండు= భీముడు; వంటకున్ మిగిలిన మాంసంబులు= వండగా మిగిలిన మాంసాలను; అమ్మునెపంబునన్= అమ్ముతాననే కారణం చూపి; నిచ్చలున్= ప్రతిరోజూ; సహోదరులకున్= తమ్ములకు; ఇచ్చుచున్+ఉండున్= ఇస్తూ ఉండేవాడు; వివ్వచ్చుండు= అర్జునుడు; సంగీతప్రసంగంబునన్= పాటలు పాడేటప్పుడు; మెచ్చు+పడసిన= కానుకగా పొందిన; కనక+అంబర+ఆదులు= బంగారం, పట్టు వస్త్రాలు మొదలైనవాటిని; సోదరులకున్= మిగిలిన తమ్ములకు; చేర్చుచున్+ఉండున్= అందిస్తూ ఉండేవాడు; నకులుండు= నకులుడు; తురంగంబుల= గుర్రాల యొక్క; గ్రాసంబులన్= గడ్డిని కొనేటప్పుడు; కనిన, ధనంబులు= మిగిల్చిన డబ్బులు; తోడంబుట్టువులకున్= అన్నదమ్ములకు; పెట్టుచున్+ఉండున్= ఇచ్చేవాడు; సహదేవుండు= సహదేవుడు; గోవులన్+చూచి= ఆవులను పరిశీలించి; భూవల్లభుండు= రాజైన విరాటుడు; సంతసిల్లిన సమయంబునన్= సంతోషించిన సందర్భాలలో; సముపార్జితంబులు+అగు= సంపాదించిన; పదార్థంబులు= వస్తువులు; అన్నియున్= అన్నిటినీ; అన్నలవశంబు చేయుచున్= అన్నలకు అందిస్తూ; వారలకున్= వారికి; గోరసంబులన్= పాలతో; తుష్టి సలుపుచున్+ఉండున్= సంతోషాన్ని కలిగిస్తుండేవాడు; ద్రౌపది= ద్రౌపది; తన్నున్+అరసికొని= తనను కనిపెట్టి; తిరుగుచున్న వీరలన్= తిరిగే వీళ్లను (పాండవులను); కన్నులు+ఆరన్+చూచుచున్= కంటినిండా చూస్తూ; ఉచితము+నడవడిన్= సందర్భానుసారమైన వర్తనతో; మెలంగుచున్+ఉండున్= మసలుతుండేది.

**తాత్పర్యం:** హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుడికి ఈ విధంగా చెప్పాడు: ఆ అజ్ఞాతవాసకాలంలో ధర్మరాజు అనేకమైన ఉత్తమ పద్ధతులలో రాజుతో వినోద ప్రసంగాలు చేస్తూ సభ్యుల మనస్సులను సంతోషపెట్టుతూ ఉండేవాడు. ఒక్కొక్కసారి తియ్యని మాటలతో స్నేహపూర్వకంగా ఆడిన జూదంలో గెలిచిన ధనాలను ధర్మరాజు తమ్ములకు ఇస్తూ ఉండేవాడు. భీముడు వంటకు వాడగా మిగిలిన వివిధ మాంసాలను అమ్మే మిషతో అన్నదమ్ములకు అందజేస్తూ ఉండేవాడు. అర్జునుడు సంగీత నాట్య ప్రదర్శనల సందర్భంగా మెప్పులు పొంది కానుకలుగా సంపాదించిన బంగారం పట్టువస్త్రాలు మొదలైనవాటిని సోదరులకు ఇస్తూ ఉండేవాడు. నకులుడు గుర్రాల దాణాలను కొనుగోలు చేసేటప్పుడు మిగిలే ధనాలను తోబుట్టువులకు పంచుతూ ఉండేవాడు. విరాటరాజు గోవులను చూచి ఉప్పొంగిపోయిన సమయాలలో కానుకలుగా ఇచ్చిన పదార్థాల నన్నిటినీ సహదేవుడు అన్నలకు అర్పణ చేస్తూ పాలూ, పెరుగూ, వెన్న మొదలైన గోరసాలను వారికిచ్చి తృప్తిపరుస్తూ ఉండేవాడు. తనను కంటిని రెప్పవలె కాపాడుతూ తిరుగుతున్న పాండవులను కన్నారా చూచుకొంటూ తగిన రీతిగా ద్రౌపది మసలుతూ ఉన్నది.

**విశేషం:** 1. ఆశ్వాసాది పద్యం తరువాత తిక్కన 'దేవా!' అని కృతిభర్త, కృతిశ్రోత అయిన హరిహరనాథుడిని సంబోధించి కథ సాగిస్తాడు. ఇది అతని ఆశ్వాసారంభ రచనా శిల్పం. (సంపా.)

2. పాండవులు ఐదుగురు విరాటుడి కొలువులో తలా ఒక పనిలో చేరారు. ఒకరిపై ఒకరికి ఎనలేని ప్రేమ. విధివశాత్తు ఆ సంవత్సరం అట్లా నడుచుకొనక తప్పదు. అయినా సోదర ప్రేమతో ఒకరినొకరు ఆదుకొంటూ, ద్రౌపదిని కంటికి రెప్పవలె కాపాడుతున్నారు.

3. పాండవుల ప్రవర్తనలను తిక్కన మూలంలోకంటె ఉదాత్తీకరించాడు. ధర్మరాజు బ్రాహ్మణులనందరినీ ఒక త్రాట గట్టినట్లు చేసి వారితో ద్యూతక్రీడలు స్వేచ్ఛగా ఆడాడని మూలంలో ఉన్నది. తిక్కన దానిని వదలాడు. ధర్మరాజు సుహృద్ద్యూతం ఆడింది విరాటునితో మాత్రమే అని సూచించాడు. రాజుతో సమానగౌరవాన్ని పొందుతున్న కంకుభట్టు ఇతరులతో పాచికలాడినట్లు చెప్పటం ఔచిత్యం కాదని తిక్కన భావించి ఉంటాడు. మూలంలో భీముడు- విరాటుడు ఉపయోగించగా మిగిలిన వండిన

మాంసాలనూ, భక్ష్యాలనూ సోదరులకు ఇచ్చేవాడని ఉన్నది. తిక్కన - వంటకు మిగిలిన మాంసాలను అమ్మినట్లుగా సోదరులకు అందించేవాడని చమత్కారంగా మార్చాడు. ఇవి వండిన మాంసాలు కాకపోవచ్చును. భుక్తశేషం సోదరులకు పెట్టని ఒక పెద్దరికాన్ని భీముడికి తిక్కన దక్కించాడు. మూలంలో బృహన్నలకు దొరికిన కానుకలు పాతబట్టలే. కాని, తిక్కన రచనలో కనకాంబరాలు. మూలంలో నకులుడు అశ్వశిక్షణలో తన నేర్పును ప్రదర్శించి రాజుగారి మన్ననలు పొందాడని ఉన్నది. కాని, తిక్కన రచనలో గుర్రాల దాణాల మీద వచ్చిన ధనాలు సోదరుల కిచ్చినట్లుగా ఉన్నది. ఇక్కడ మూలమే అందంగా ఉన్నది. మూలంలో ద్రౌపది నిపుణంగా భర్తలను అరసికొంటూ అజ్ఞాతవాస సమయం చెడకుండా ప్రవర్తిల్లినట్లు చెప్పబడింది. తెలుగులో పాండవులే ఆమెను ఒక కంట రక్షించుకొంటూ రహస్యంగా మసలినట్లు ఉన్నది. అజ్ఞాతవాసాన్ని విరాటనగరంలో నిర్వహిస్తున్న పాండవులు మరల తల్లి గర్భంలో ఉన్నట్లు గూఢంగా నివసించారనీ, దుర్యోధనుడి వలన ఏదైనా కీడు కలుగుతుందేమోనని ఎప్పుడూ శంకిస్తుండేవారనీ మూలభారతం చెప్పింది. తిక్కన ఆ ప్రసక్తి తేలేదు. (సంపా.)

**తే. ఇట్లు దమతమ వర్తిల్లు నెడల సకల । జనములకు హృదయానురంజన మొనర్చి**
**తాల్మి, పుయిలోట, యడఁకువ, తగవు మెలపు । నెఱితెఱంగు, వాటింపంగ నేర్పు గలిగి. 3**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తమ తమ వర్తిల్లు+ఎడలన్= వారు వారు నడచుకొనే చోట్ల; సకల జనములకున్= ప్రజలందరికీ; హృదయ+అనురంజనము+ఒనర్చి= హృదయ సంతోషాన్ని కలిగించి; తాల్మి= ఓర్పు; పుయిలోట= జంకు; అడఁకువ= అణగిమణగి ఉండటం; తగవు= ధర్మం; మెలపు= జాగ్రత్త; నెఱితెఱంగు= నిపుణత, మంచినడవడి; పాటింపంగన్= ఆచరణలో కనపడేటట్లు; నేర్పు కలిగి= సమర్థులై (ప్రవర్తించారని భావం).

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవులు తాము పనిచేసే చోట్ల ప్రజలందరూ మనసులలో సంతోషించి మెచ్చుకొనేటట్లు వర్తించారు. ఓర్పు, జంకు, అణగిమణగి ఉండటం, ధర్మం, అప్రమత్తత, మంచివడవడి అనే ఆరు గుణాలను ఆచరణలో పెట్టే నేర్పు కలిగి (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** పాండవులు తమ తమ అజ్ఞాతవాస వృత్తులలో రాణించారు. సేవావృత్తుల వలన ప్రజారంజనం కలిగించారు. ఇక వారి సేవాధర్మంలో ఆరు గుణాలను పాటించారు. అవే ప్రజాహృదయరంజన హేతువులు. ధౌమ్యుడు బోధించిన సేవాధర్మంలో మేలి గుణాలను ఆచరించి చూపించారు. ద్రౌపదీ సహిత పాండవులు మొత్తం ఆరుగురు. తిక్కన చెప్పిన గుణాలు కూడా ఆరే. షాడ్గుణ్యం -వరుసగా ధర్మజుడిలో ఓర్పు, భీముడిలో ఎక్కడ బయటపడతానో అనే జంకు, అర్జునుడిలో ఆడువారి నడుమ అణగిమణగి ఉండే అణకువ, నకులుడిలో స్వీయ కర్తవ్యపాలనలో ధార్మిక ప్రవృత్తి, సహదేవుడిలో అప్రమత్తత, ద్రౌపదిలో మంచి నడవడి, ఉదాత్తశీలం అనేవి అజ్ఞాతవాసంలో ప్రస్ఫుటంగా కానవచ్చే గుణాలు. ఒక్కొక్కరిలో ఒక్కొక్క గుణంగానూ తోచవచ్చును; అందరిలోనూ ఆయా సమయాలలో సందర్భోచితంగా ఆరు గుణాలూ సమష్టిగా ప్రదర్శితం కావచ్చును. ఈ విశ్లేషణ మూలంలో కానరాదు. తన కావ్యరచనలో అనుశీలించవలసిన అంశాలను ఆయా సందర్భాలలో మొదటనే సూచించటం తిక్కన పాటించే కథాకథన కళాశిల్పం. (సంపా.)

**క. ఉన్నతఁటి వివిధదేశో । త్పన్నులు నద్భుతవిధాయి బలవిక్రమ సం**
**పన్నులు నగుమల్లులు విభ । వోన్నతుఁడగు విరటుపాల నుద్భటవృత్తిన్ 4**

**ప్రతిపదార్థం:** ఉన్నతటిన్= ఆ విధంగా అజ్ఞాతవాసం చేస్తున్న సమయంలో; వివిధ దేశ+ఉత్పన్నులు= వివిధ దేశాలలో పుట్టిన వారు; అద్భుత విధాయి= ఆశ్చర్యకరమైన; బలవిక్రమ సంపన్నులు= బలం, పరాక్రమం అనే సంపద కలవారు; అగు మల్లులు= అయిన కుస్తీ పట్టువారు (మల్లయుద్ధ నిపుణులు); విభవ+ఉన్నతుఁడు+అగు= సంపదచే గొప్పవాడయిన; విరటుపాలన్= విరాటునిముందు; ఉద్భటవృత్తిన్= సంరంభంగా, గర్వాన్ని ప్రదర్శిస్తూ (వచ్చారు).

**తాత్పర్యం:** ఆ విధంగా పాండవులు ఉన్నప్పుడు వివిధ దేశాలకు చెందినవారూ, బల పరాక్రమ సంపన్నులూ అయిన మల్లయోధులు సంరంభంగా పటాటోపంతో విరాటరాజు కొలువులోకి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తమలోన మాటలాడెడు । సమయంబున నొక్క రుఁడు విశాలోరస్కుం**
**డమితబలుఁడు, పంచానన । సమమూర్తిస్ఫూర్తి యధిక సంరంభమునన్. 5**

**ప్రతిపదార్థం:** తమలోనన్= వారిలో వారు; మాటలాడెడు సమయంబునన్= మాట్లాడేటప్పుడు; విశాల+ఉరస్కుండు= విశాలమైన ఎదురు రొమ్ము గలిగినవాడు; అమితబలుఁడు= అధికమైన బలం కలవాడు; పంచానన సమమూర్తి, స్ఫూర్తి= సింహంతో సమానమైన ఆకారం గలిగిన తేజస్సు కలవాడు; ఒక్కరుఁడు= ఒకడు; అధికసంరంభమునన్= మిక్కిలి ఆటోపంగా; (తర్వాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** వాళ్లలో వాళ్ళు మాట్లాడుకొంటుండగా సింహంవంటి ఆకారవైభవం కలవాడూ, బలాఢ్యుడు అయిన ఒక గంభీరవ్యక్తి ఆటోపంగా వచ్చాడు.

**విశేషం:** మూలంలో ఆ మల్లుడి పేరు 'జీమూతు' డని ఉన్నది. తిక్కన దానిని చెప్పలేదు. (సంపా.)

**వ. అన్నరపతి కట్టెదుర నిల్చి మ్రొక్కి భుజాస్ఫాలనంబు సేసి యిట్లనియె. 6**

**ప్రతిపదార్థం:** ఆ+నరపతి= ఆ విరాటుని; కడు+ఎదురన్= ఎట్టఎదురుగా; నిల్చి= నిలబడి; మ్రొక్కి= నమస్కరించి; భుజా+ఆస్ఫాలనంబు+చేసి= భుజాలు అప్పళించి (చరచి); ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ వ్యక్తి విరాటమహారాజు కెదురుగా వచ్చి నిలబడి, మల్లయుద్ధాని కాహ్వానిస్తున్నట్లు భుజాలు (జబ్బలు) చరుస్తూ ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. పాండవుల అజ్ఞాతవాసం నాలుగు నెలల కాలం ప్రశాంతంగా గడచిపోయింది. అప్పుడు విరాట నగరంలో బ్రహ్మోత్సవాలు వచ్చాయి. ఆ సందర్భంగా దేశంలో మల్లులందరూ నగరంలో సమావేశమయ్యారు. మల్ల క్రీడలు బ్రహ్మోత్సవ వినోదాలలో ముఖ్యమైనవి. మల్ల వీరులు రాజుగారి ఎదుట తమ నైపుణ్యాలు ప్రదర్శించి బహుమతు లందుకొనటం ఆ ఉత్సవంలో చెప్పుకొన తగిన విశేషం.

"అథ మాసే చతుర్థే తు బ్రహ్మణః సుమహోత్సవః,
ఆసీత్సమృద్ధో మత్స్యేషు పురుషాణాం సుసమ్మతః.
తత్ర మల్లాః సమాపేతు ర్దిగ్భ్యో రాజన్ సహస్రశః,
మహాకాయా మహావీర్యాః కాలఖంజా ఇవాసురాః.
వీర్యోన్నద్ధా బలోదగ్రా రాజ్ఞా సమభిపూజితాః,
సింహస్కంధ కటిగ్రీవాః స్వవదాతా మనస్వినః
అసకృ ల్లబ్ధలక్షాస్తే రంగే పార్థివ సన్నిధౌ॥
తేషా మేకో మహానాసీత్ సర్వమల్లా న్సమాహ్వయత్
ఆవల్గమానం తం రంగే నోపతిష్ఠతి కశ్చన' (సం.4-12-12-15)

మల్లులు విరటుని కొలువుకు రావటాన్ని అలంకారికంగా వ్యాసుడు వర్ణించాడు. సత్యలోకంలో బ్రహ్మకొలువుకూ, కైలాసంలో శివుడి కొలువుకూ వచ్చినట్లు వచ్చారట. వారు కాలఖంజులనే రాక్షసుల వలె భయంకరాకారులట. సింహస్కంధులట. అయినా

వారు నిర్మలులట, అభిమానధనులట, అనేక విజయాలు సాధించారట. వారందరిలో ఒకడు జగదేకమల్లుడట. అతడిని రంగంలో దిగి ఎదిరించేవాడు లేడట! అతడు రాజుకు సవాలుగా మారాడట! ఇది మూల కథనం. వ్యాసుడి కథనంలో సత్యనిష్ఠ కనబడుతుంది కాని, కావ్యకళ తక్కువ. నాలుగు నెలలకు వచ్చిన బ్రహ్మోత్సవం గురించి చెప్పకపోయినా, మల్లులు విరాట నగరానికి రావటం బ్రహ్మలోకానికి, శివలోకానికి భక్తులు వచ్చినట్లున్నదని వర్ణించకపోయినా, మల్లులు రాక్షసులవలె ఉన్నారని పేర్కొనకపోయినా కథ కెటువంటి లోపం లేదు. జగదేక మల్లుడి పాత్ర, అతడి ప్రాగల్భ్యం, విరటుడి కొలువుకే ఒక సవాలుగా మారిందన్న వివరం మూలంలో లేదు. అసలు కథకు ప్రాణం ఆ ఘట్టం. దాని చిత్రణం మూలంలో లేదు. తిక్కన పొల్లునంతా వదలి ప్రాణాన్ని పట్టుకొన్నాడు. ఆ మల్లవీరుడు నానారాజాస్థాన సందర్శనం చేస్తూ విజయపత్రాలను గ్రహిస్తూ విరాటనగరంమీదకు దాడి వచ్చినట్లు వచ్చాడు. బాహువులప్పళించి సవాలు చేశాడు. ఇక్కడ తిక్కన కథా ప్రవృత్తినే మార్చాడు. ఇది పునస్సృష్టి, ఋషి వంటి వేదవ్యాసుల చిత్రణ కంటె కవిబ్రహ్మ కల్పనం రసవత్తరం, సన్నివేశ మధురం. మల్లుడు రాజునకు నమస్కరించి సభామర్యాదను పాటించాడు. బాహువులప్పళించి మల్లవీర మర్యాదను ప్రదర్శించాడు. కొందరు విమర్శకులు బాహువులప్పళించటం అవినయంగా వ్యాఖ్యానించారు. అది పొరపాటు. అది జాతివార్తా విశేషం. తిక్కన సమకాలీన మల్లమర్యాదలకు ఈ ఘట్టంలో ప్రాణం పోశాడు. మూలం కంటె కావ్య కళాగౌరవంతో సన్నివేశాన్ని తిక్కన చిత్రించాడు. (సంపా.)

**తే.** **'నేల నాలుగు సెఱఁగుల నృపుల కొలువు। లందు నేను వర్తించితి నవనినాథ!**
**యగ్గలించి, నా యెదుర బాహప్పళించి। కడఁగఁజాలెడు మల్లులఁ గాన నెందు.'** 7

**ప్రతిపదార్థం:** అవనినాథ!= ఓ విరాటరాజా!; నేల నాలుగు చెఱఁగుల= ఈ ప్రపంచం నలుమూలలా ఉన్న; నృపుల కొలువులందున్= రాజాస్థానాలలో; నేను వర్తించితిన్= నేను తిరిగాను; అగ్గలించి= అతిశయించి, ఉత్సాహంగా వచ్చి; నా+ఎదురన్= నా ముందు; బాహు+అప్పళించి= భుజాలు చరచి; కడఁగన్+చాలెడు= పూనుకొనగల; మల్లులన్= కుస్తీ పట్టేవారిని; ఎందున్= ఎక్కడా; కానన్= చూడలేదు.

**తాత్పర్యం:** 'ఓ విరాటరాజా! భూప్రపంచం నలుమూలలా ఉండే రాజుల కొలువులన్నీ తిరిగాను. కాని, నా ముందుకు వచ్చి నిలబడి ఉత్సాహంగా భుజాలు చరిచి నిలబడగలిగిన వీరుడిని చూడలేదు.'

**చ.** **అనునెడ వాని యుగ్రసమదాకృతియుం, బటువాక్యవృత్తియుం,**
**గని, విని, మల్లులెల్ల భయకంపితమూర్తులు దాల్చి మాఱువ**
**ల్కను, గనువిచ్చి చూడను, మొగం బెగయింపను జాలకున్న న**
**జ్జనపతి వేడ్క మ్రోడుపడు చందము గాంచి యుధిష్ఠిరుం డనున్.** 8

**ప్రతిపదార్థం:** అను+ఎడన్= అట్లా మాట్లాడేటప్పుడు; వాని ఉగ్ర సమద+ఆకృతియున్= అతని భయంకరాకారాన్ని; పటువాక్య వృత్తియున్= కఠినమైన మాటలతీరును; కని,విని= (క్రమంగా) చూచి, విని; మల్లులు+ఎల్లన్= కొలువులోని మల్లులందరూ; భయకంపిత మూర్తులు+తాల్చి= భయంచేత వణకుతున్న ఆకారాలు కలవారై; మాఱు+పల్కను= ఎదురు జవాబు చెప్పడానికీ; కనువిచ్చిచూడను= కళ్ళు తెరచి చూడటానికీ; మొగంబు+ఎగయింపను= మొగం ఎత్తి చూడటానికీ. (కూడ); చాలక+ఉన్నన్= సమర్థులు కాకపోగా; ఆ+జనపతి= ఆ రాజు, విరాటునియొక్క; వేడ్క= ఉత్సాహం; మ్రోడుపడుచందము= వాడిపోయే విధాన్ని; కాంచి=చూచి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** (భయంకరాకారుడైన) ఆ మల్లుడి భయంకరాకారాన్నీ పరుష వాక్యాలనూ విని కొలువులోని మల్లులు అందరూ భయపడి మారుమాటాడలేక కన్నులు విచ్చి చూడలేక, ముఖం పైకెత్తలేక నిశ్చేష్టులయ్యారు. అప్పుడు విరాట మహారాజు యొక్క ఉత్సాహం మోడువారి పోవటాన్ని చూచి ధర్మరా జిట్లా అన్నాడు.

**విశేషం:** తిక్కన రచనలో నాటకీయత అచ్చుపడేటట్లు కనపడే పద్యాలలో ఇది ఒకటి. నాటకీయతలో ఆంగిక, ఆహార్య, వాచిక, సాత్త్వికాభినయ వర్ణనం ముఖ్యాంశం. ఇక్కడ జగదేక మల్లుడి ఉగ్రసముదాకృతి ఆంగికాభినయ సంబంధి. భయంకరమైన మదించిన ఆకారం భయానక రసాన్ని చూపరులలో కలిగించే రౌద్రరస విభావం. అతడి మాటలు పరుషవాక్యవృత్తి కలిగినవి. 'వాక్యవృత్తి' రసవ్యంజకమైన వాచికాభినయ విన్యాసాన్ని ప్రకటించింది. ఆ భయంకర మల్లరూపాన్ని చూచిన ఆస్థాన మల్లులు ప్రేక్షకులవంటివారు. వారిలో భయానకరసం ప్రకోపించింది. రసం సాత్త్విక భావాలవలన వ్యక్తమై సాక్షాత్తు పఠితలు రసానందాన్ని పొందటానికి ఉపకరిస్తుంది. కంపం (శరీరం వణకటం) భయం వలన కలిగే సాత్త్విక భావం. మారుమాట్లాడలేకపోవటం, మొగమెత్తి చూడలేకపోవటం కంపాన్ని పోషించే సాత్త్విక భావాభివ్యక్తులు. ఆస్థాన మల్లులు భయకంపితులయ్యారు. వారిని చూచి విరాటుడి ఉత్సాహం మోడువారింది. వేడ్క, మ్రోడుపడు, చందము - ఈ మూడూ తెలుగు జాతీయపు పలుకుబళ్ళు. పూలతో, పండ్లతో విరిసిన చెట్టు ఒక్కసారిగా ఎండిపోవటం వంటిది - విరాటుడి మానసికోత్సాహం మోడువారటం. ఆ చందాన్ని (ఆ పరిణామ విధానాన్ని) ధర్మరాజు గమనించాడు. వెంటనే తన కర్తవ్యాన్ని గుర్తించాడు. మోడువారిన రాజు వేడ్కను మరల చిగురింప చేసే ఉపాయం చెప్పటం తన ధర్మంగా భావించాడు. మూలంలో ధర్మరాజుప్రసక్తి లేదు. అభినయ చిత్రణ లేదు. **"యదా సర్వే విమనస స్తే మల్లా హతచేతసః అథ సూదేన తం మల్లం యోధయామాస మామత్స్యరాట్"** (సం.4.12.16) అని మాత్రమే ఉన్నది. మూలంలో ధర్మజుడి నీతిసహాయం విరాటునికి అవసరం లేకపోయింది. కంకుభట్టును విరటుని వివేకశక్తిగా చిత్రించ దలచుకొన్న తిక్కన కథ మార్చాడు. ధర్మరాజు సలహాను ప్రవేశపెట్టాడు. రంగంలోని ప్రతిపాత్రా సజీవంగా అభినయిస్తున్నట్లు చిత్రించి నాటకీయతను రక్తి కట్టించాడు. కథలో అడుగడుగున తిక్కన ఉభయకావ్యకళాప్రౌఢి పాటించే శిల్పం ప్రదర్శితమౌతూనే ఉండటం తెలియదగిన విశేషం. (సంపా.)

**క. 'వీనికి మార్కొనఁజాలెడు । దానికిఁ దగువాని ధర్మతనయుని పురిలో**
**నానానియుద్ధలంపటు । నే నొక్కనిఁ గంటి నిపుణుఁ డిందుల కతఁడున్. 9**

**ప్రతిపదార్థం:** వీనికిన్, మార్కొనన్+చాలెడు దానికిన్= ఇతడిని ఎదురించటానికి; తగువానిన్= సమర్థుడైనవాడిని; ధర్మతనయుని పురిలోన్= ధర్మరాజు నగరంలో; నానానియుద్ధలంపటున్= అనేక రకాలైన బాహుయుద్ధాలలో ఆసక్తి కలవాడిని; ఒక్కనిన్= ఒకడిని; ఏను+కంటిన్= నేను చూచాను; అతఁడున్= వాడు; ఇందులకున్= ఈ విషయానికి (విషయంలో) నిపుణుఁడు= సమర్థుడు, నేర్పరి.

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఈ మల్లయోధుడితో సరిసమానంగా బాహుయుద్ధం చేయగల సమర్థుడిని ఒకడిని నేను ధర్మరాజు నగరంలో చూచాను. అత డీ విషయంలో నైపుణ్యం గలవాడు.

**విశేషం:** ధర్మరాజు తాను స్వయంగా రహస్యం బయటపడకుండా ఉండే విధంగా భీముడిని సభకు పరిచయం చేయటం విశేషం. ఆయుధాలు పట్టి యుద్ధం చేయకూడదనే నియమం గల యుద్ధం నియుద్ధం. 'ధర్మతనయుని పురిలో పనిచేసినవాడే కంకుభట్టు. అందువలన వలలుడిని గుర్తించటం సహజం. కంకుడు లేదా కంకుభట్టు కొలువులో ఉన్నప్పుడే వలలుడు విరాటుడి కొలువులో చేరాడు.

**క. మన బానసీఁడు వలలుం । డను శూద్రుఁడు నాకుఁ దెల్ల; మధిక బలుల నో**
**ర్చినవాఁ డనేక మల్లుల । నిను మెచ్చింపంగఁ జాలు; నిజ మిది యధిపా! 10**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ విరాటరాజా!; మన బానసీఁడు= మనవద్ద వంటలవాడుగా ఉన్న; వలలుండు+అను శూద్రుఁడు= 'వలలుడు' అనే పేరుతో ఉన్న శూద్రకులంవాడు; నాకున్+తెల్లము= నాకు+తెలుసు, నేను ఎరిగినవాడు; అధిక బలులన్= మిక్కిలి బలవంతులను; అనేక మల్లులన్= ఎందరో కుస్తీ పట్టేవారిని; ఓర్చినవాఁడు= గెలిచాడు; నిను మెచ్చింపంగన్+చాలున్= నిన్ను సంతోషపరచగల సమర్థుడు; ఇది= ఈ మాట; నిజము= వాస్తవం.

**తాత్పర్యం:** ఓ మహారాజా! మనవద్ద వంటలవాడు అయిన వలలుడు ఎందరినో మల్లయుద్ధంలో ఓడించిన అధిక బలాఢ్యుడు. నా కా సంగతి బాగా తెలుసు. అతడు నీ మనస్సును రంజింప జేయగల సమర్థుడు. నా మాట వాస్తవం.

**విశేషం:** పాత్రోచిత, సందర్భోచిత సంభాషణ చిత్రణం తిక్కనకు సహజవిద్య, భ్రమానుపడిన విరాటుడికి ఉపాయం చెప్పే కంకుడు దీర్ఘ సమాసాలతో, వృత్తాలతో ఉపన్యాసం చేయకూడదు. చిన్న చిన్న వాక్యాలలో కంద పద్యాలవంటి లఘు ఛ్ఛందస్సులలో మాట్లాడింప చేయటం ఔచిత్యం. అలతి అలతి పదాలతో కాహళ సంధించినట్లు, చెవిలో తొందరగా ముక్తసరిగా సలహా చెప్పుతున్నట్లున్నాయి ధర్మజుడి వాక్యాలు. 9,10 పద్యాలు అందుకు చక్కని ఉదాహరణలు. మన బానసీడు వలలుడనే శూద్రుడు - భీముడు జ్ఞాపకం రావటానికి ఈ వాక్యం తోడ్పడుతుంది. నాకు తెల్లము - (నాకు బాగా తెలుసు)- అనే చిన్న వాక్యం అతడిమీద విరటునికి నమ్మకం కలిగిస్తుంది. మిత్రవాక్యం ప్రమాణం. అధికబలులైన మల్లులను అనేకులను ఓడించా డా వలలుడు - అనే వాక్యం మల్లయుద్ధంలో అతడికున్న దీర్ఘమైన, స్థిరమైన, ఉన్నతమైన అనుభవాన్ని చెప్పక చెపుతున్నది. అతడు ఈ మల్లవీరుడిని జయించి నీకు సంతోషాన్ని కలిగిస్తాడు - అనే వాక్యం మోడువారిన అతడి మనసును చిగురింపచేసే ఆశా మంత్రం. నిజ మిది - అని దృఢంగా చెప్పటం అతని మనస్సుకు ధైర్యం చెప్పటం. ఈ వరుసలో వాక్యాలు పలుకగలిగిన ధర్మరాజు వాక్య నిపుణుడు. ఆ మాటలు విన్న తరువాత విరాటుడు మరొక మాట లేకుండానే ధర్మజుడి సలహాను పాటించి తీరాలి. తిక్కన అట్లాగే చిత్రించాడు. నాకు తెల్లము, నిజ మిది - ఇవి తెలుగువారి పలుకుబడిలో ఎదుటివారికి ధైర్యం చెప్పటంలో వాడే ఊతపదాల వంటి వాక్యమూలికలు. జీవద్భాష తెలిసిన కవి వాడే వాక్యవిన్యాసాలు. (సంపా.)

**క.** **అనవుడు భూపతి పిలువం । బనిచె; నతని నతఁడు నపుడ భయభక్తులతోఁ**
**జనుదెంచి, మల్లవర్గముఁ । గని మై వెఱుగంగ నిలిచెఁ గౌతూహలియై.** **11**

**ప్రతిపదార్థం:** అనవుడు= అనగానే; భూపతి= విరాటరాజు; అతనిన్= (భీముని) వలలుని; పిలువన్+పనిచెన్= పిలిపించాడు; అతఁడు= వలలుడు; అపుడు+అ= వెంటనే; భయభక్తులతోన్+చనుదెంచి= వినయ విధేయతలతో వచ్చి; మల్లవర్గమున్= కుస్తీ పట్టేందుకు సిద్ధంగా ఉన్నవారిని; కని= చూచి; మై+పెఱుగంగన్= శరీరంవిజృంభించగా; కౌతూహలి+ఐ= ఉత్సాహం కలవాడై; నిలిచెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** అప్పుడు విరాటరాజు వలలుడిని పిలిపించాడు. అతడు ఎంతో భయం, భక్తి ప్రకటమయ్యే వినయంతో వచ్చి ఎదురుగా ఉన్న మల్లులను చూచి ఉప్పొంగిపోయి శరీరాన్ని పెంచాడు. (సాటి యోధులను చూస్తే యోధులకు ఉత్సాహం రావటం సహజం!)

**విశేషం:** విరాటుడు పిలువనంపితే మూలంలో భీముడు ఇష్టం లేకుండానే వచ్చాడు. అనిష్టంగానే మల్లయుద్ధానికి సిద్ధమయ్యాడు. తెలుగులో దానికి విరుద్ధంగా తిక్కన చిత్రించాడు. (సంపా.)

**వ.** **ఇట్లు నిలిచిన పవనతనయు నవలోకించి, యవనీవల్లభుం డమ్మల్లముఖ్యుం జూపి, 'యితనితోడి యుద్ధంబునకు సన్నద్ధుండవు గ' మ్మనిన నతండును ధర్మతనయు కనుసన్న గనుంగొని యమ్మత్స్యవిభునకు వినయంబుతో నిట్లనియె.** **12**

**ప్రతిపదార్థం:** ఇట్లు నిలిచిన= ఈ విధంగా నిలబడ్డ; పవన తనయున్= భీముని (వలలుని); అవలోకించి= చూచి; అవనీవల్లభుండు= విరాటరాజు; ఆ+మల్లముఖ్యున్+చూపి= ఎదురుగా ఉన్న యోధుని చూపి; ఇతనితోడి యుద్ధంబునకున్= ఇతడితో పోరుకు; సన్నద్ధుండవు, కమ్ము+అనినన్= సిద్ధపడుమని చెప్పగానే; అతండును= వలలుడు కూడా; ధర్మతనయు= ధర్మరాజు యొక్క; కనుసన్న+కనుంగొని= కనుసైగను గమనించి; ఆ+మత్స్యవిభునకున్= ఆ విరాటరాజుతో; వినయంబుతోన్+ఇట్లు+అనియెన్= నెమ్మదిగా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడు విరాటుడి ఎదుట నిలువబడగా ఆ రాజు అక్కడ ఉన్న మల్లవీరుడిని చూపించి, 'ఇతడితో యుద్ధం చేయటానికి సిద్ధం కమ్ము' అని ఆజ్ఞాపించాడు. భీముడు ధర్మరాజు వైపు చూచాడు. అతడి కనుసైగను గమనించాడు. మత్స్యరాజుతో వినయంగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీముడు ధర్మజుడి వైపు చూడటం, అతడు సరే అన్నట్లు సైగ చేయటం - ఆ అన్నదమ్ముల అనుబంధమూ, ధర్మజుడిపై భీముడికి గల భక్తి ఇందు ద్యోతకమవుతున్నాయి.

**తే.** **'అధిప! ధర్మజుపాల నున్నప్పు డతని। వేడుకకుఁ దగఁ బెనఁగుదు వింతలైన**
**జెట్టిమల్లులతో, నిప్పు డట్టువోలె। నీదు వేడ్కకుఁ బెనఁగెద నేర్చినట్లు.'** 13

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ విరాట మహారాజా!; ధర్మజు పాలన్+ఉన్నప్పుడు= ధర్మరాజు వద్ద నే నుండేటప్పుడు; అతని వేడుకకున్+ తగన్= ఆయన ఆనందానికి తగినట్లుగా; వింతలు+ఐన జెట్టి మల్లులతోన్= విశేషమైన ఈ యోధులతో; పెనఁగుదున్= కుస్తీ పట్లు పట్టేవాడిని; అట్టు+పోలెన్+ఇప్పుడు= అప్పటివలె ఇప్పుడు; నీదు వేడ్కకున్= నీ సంతోషం కొరకు; నేర్చినట్లు= నాకు చేతనైననట్లుగా; పెనఁగెదన్= పోరాడుతాను.

**తాత్పర్యం:** 'ఓ విరాటరాజా! నేను ధర్మరాజు కొలువులో ఉన్నప్పుడు ఆయన మనస్సుకు ఉల్లాసం కలిగే విధంగా మల్లులతో కుస్తీ పట్లు పట్టి చూపేవాడిని. ఇప్పుడు కూడా అదేవిధంగా మీ కానందం కలిగేటట్లుగా ఈ మల్లులను ఒక పట్టుపట్టి చూపిస్తాను.

### భీముఁడు మల్లునితో యుద్ధము చేయుట (సం.4-12-17)

**వ.** **అని మెత్తన యియ్యకొని, గర్జించి, గజాలస్యంబునం బ్రాంగణంబు సొచ్చి, భూపాలుని ముందట భుజాస్ఫాలనంబు సేసి, మ్రొక్కి మరలునెడ, నంతకుమున్న యమ్మల్లవరుండు నరపతి యనుమతి వడసి, కృతపరికర బంధుండై యరుగుదెంచి యచ్చట నునికింజేసి యతండును ననిలసుతుండునుం బరస్పర మూర్తుల నవలోకించి యుద్ధరంగంబు మన్ను ఫాలప్రదేశంబున ధరియించి శరీరంబులపైఁ జల్లుకొని రెండు సేతుల మునివ్రేళ్ళను గొండొక పుచ్చికొని యొండొరుల దెసకు వైచి, యున్నతంబులగు నపసవ్య కరంబుల నాకుంచిత సవ్య బాహు తలంబుల నప్పళించు చప్పుళ్ళు గలసి యొక్కరుండ మల్లసఱచిన చందంబున వీతేర వింతతానకంబుల నిలిచి కదిసిన యప్పుడు వృకోదరుండు.** 14

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; మెత్తన+ఇయ్యకొని= వినయపూర్వకంగా అంగీకరించి; గర్జించి= శబ్దం చేసి; గజ+ ఆలస్యంబునన్= ఏనుగుమదంతో; ప్రాంగణంబు+చొచ్చి= లోపలికి వచ్చి; భూపాలుని ముందటన్= విరాటుని ముందు; భుజ+ఆస్ఫాలనంబు+చేసి= భుజాలు చరిచి; మ్రొక్కి= నమస్కరించి; మరలు+ఎడన్= వెనుకకు వెళ్ళేటప్పుడు; అంతకుమున్న+అ= అంతకుముందే; ఆ+మల్లవరుండు= ఆ యోధశ్రేష్ఠుడు; నరపతి= విరాటుడి యొక్క; అనుమతి+పడసి+అంగీకారం తీసికొని; కృతపరికరబంధుండై= నడికట్టు సిద్ధం చేసికొని; అరుగుదెంచి= వచ్చి; అచ్చటన్+ఉనికిన్+చేసి= అక్కడ ఉండటం చేత; అతండును= ఆ మల్లుడును; అనిలసుతుండునున్= భీముడు (వలలుడు)ను; పరస్పర మూర్తులన్= ఒకరొకరి ఆకారాలను; అవలోకించి= చూచి; యుద్ధరంగంబుమన్ను= మల్ల యుద్ధం చేసే నేలపై ఉన్న మట్టిని; ఫాలప్రదేశంబునన్= నొసట; ధరియించి= పూసికొని; శరీరంబులపైన్= ఒడళ్లపై; చల్లుకొని= విదిలించుకొని; రెండుచేతుల= తమ రెండు చేతుల యొక్క; మునివ్రేళ్లను= కొసవ్రేళ్లతో;

కొండొకపుచ్చుకొని= కొద్దిగా తీసికొని; ఒండు+ఒరులదెసకున్+వైచి= ఒకరు మరొకరి వైపునకువేసి; ఉన్నతంబులు+అగు= ఎత్తైన; అపసవ్యకరంబులన్= కుడి చేతులతో; ఆకుంచిత= ముడిచిన; సవ్యబాహుతలంబులన్= ఎడమ భుజాలపై; అప్పళించు= చరచే; చప్పుళ్ళు కలసి= శబ్దాలు ఏకమై; ఒక్కరుండు+అ= ఒక్కడే; మల్ల+చఱచిన చందంబునన్= కుస్తీ పట్టడానికి ముందు చేసే శబ్దం చేసినట్లుగా; వీతేరన్= రాగా; వింతతానకంబులన్= జెట్టీలు నిలిచే విశేషాలతో; నిలిచి= నిలబడి; కదిసినన్= ఒకరిపై ఒకరు లంఘించగా; అప్పుడు= ఆ సమయంలో; వృకోదరుండు= భీముడు (వలలుడు). (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అని భీముడు (వలలుడు) వినయంతో అంగీకరించి, ఉత్సాహంతో గర్జించి, మదించిన ఏనుగువలె ముందుకు వచ్చి, రాజు ఎదుట జబ్బ చరిచి, నమస్కరించి, మరలాడు. మల్లవీరుడు అంతకుముందే విరటుడి అనుమతితో నడుంకట్టు బిగించి వచ్చి కుస్తీపట్టుకు సిద్ధమై నిలిచి ఉన్నాడు. అతడూ భీముడూ ఒకరొకరి ఆకారాలను తేరిపార చూచుకొన్నారు. మల్లయుద్ధ రంగంలో ఉన్న మట్టిని నుదురులపై ధరించారు. శరీరాలపై చల్లుకొన్నారు. మునివేళ్ళతో మరికొంత మట్టి తీసికొని ఒకరివైపు మరొకరు వేసికొన్నారు. ఎడమ చేతులను వంచి కుడిచేతులతో జబ్బలు చరుచుకొన్నారు. వారిద్దరూ ఒకేసారి చరచుకొనటంతో ఒకే చప్పుడుగా వినిపించింది. వింతవింతగా స్థాన భేదాలతో నిలిచి ఒక్కసారి ఇద్దరూ కలియబడ్డారు. అప్పుడు భీముడు.

**విశేషం:** మల్లయుద్ధ సంప్రదాయాలలో పరికరబంధం మొదటిది. ఇందులో అంతకుమించి వస్త్రధారణ ఉండదు. విద్యాప్రదర్శనకు ముందు గురునకు నమస్కారం సంప్రదాయం. గురుస్థానంలో భీముడు రాజుకు నమస్కరించాడు. గురుభావన, రాజభావన కలిసివచ్చాయి. మట్టిని ఫాలప్రదేశంలో బొట్టుగా పెట్టుకొంటారు. పరస్పరం ఒకరివైపు మరొకరు మట్టి చల్లుకొంటారు. బజ్జ చరచడం కూడా అటువంటిదే. అహమహమికగా యుద్ధం ప్రారంభం కాబోతున్నది.

**సీ.** **ఉపతాయిలోఁ దన కొదవిన తోరహ। త్తము సూపి వ్రేయక సమదవృత్తిఁ**
**బాసి క్రమ్మఱఁ జేరు; బలువిడి వాఁడు పై। నదరిన జరగక యవనిఁ గ్రుంగి**
**నిలుచు; నొత్తొరువున వలచినయప్పుడు। గొనిపోవు; నవలీలఁ గూలవైచు;**
**జళికి పట్టిస మను సన్నపు విన్నాణ। ములు దొరకొన్నను ముట్టఁగొనఁడు;**

**తే.** **కాలిదెసఁ జొరవచ్చుట గానిపించి। యుడుగు; సీసానఁ బట్టియు నుప్పళించుఁ;**
**బోవనిచ్చు; మగుడ నేచి పోరఁజేరు। నెడల సరిసేయ నగు తడవీక హత్తు.** 15

**ప్రతిపదార్థం:** ఉపతాయిలోన్= మల్ల విజ్ఞానంలో; తనకున్+ఒదవిన= తనకు తెలిసిన; తోరహత్తము+చూపి= ఒక రకమైన మల్లబంధ విశేషాన్ని చూపించి; వ్రేయక= కొట్టక; సమదవృత్తిన్+పాసి= మదించినట్లుగా (గంభీరంగా) వదలిపెట్టి; క్రమ్మఱన్+చేరున్= మళ్ళీ సమీపించేవాడు; బలువిడిన్= ఎక్కువ బలంతో; వాఁడు= మల్లుడు; పైన్+అదరినన్= పైకిరాగా; జరగక= కదలక; అవనిన్= నేలపై; క్రుంగినిలుచున్= వంగి నిలబడేవాడు; ఒత్తొరువునన్= గట్టిగా అదిమి; వలచిన+అప్పుడు= కోరిన సమయంలో; కొనిపోవున్= తీసికొని వెళ్ళేవాడు; అవలీలన్= తేలికగా; కూలవైచున్= పడత్రోసేవాడు; జళికి, పట్టిసము+అను= జళికి, పట్టిసం అనే పేర్లుగల; సన్నపు విన్నాణములు= సున్నితమైన నేర్పులు; దొరకొన్నను= చూపించినా; ముట్టన్+కొనఁడు= దగ్గరగా తీసికొనడు; కాలిదెసన్= కాలివైపు; చొరవచ్చుట= లోపలికి రావటం; కానిపించి= చూపజేసి; ఉడుగున్= విరమించి నిలిచేవాడు; సీసానన్+పట్టియున్= సీసమనే మల్లబంధంలో ఇరికించి; ఉప్పళించున్= పైకెత్తివేసేవాడు; పోవనిచ్చున్= పోనిచ్చి; మగుడన్+ఏచి= మళ్ళీ పట్టుకొని; పోరన్+ చేరు+ఎడలన్= పోరాడేందుకు దగ్గరగా చేరినప్పుడు; సరిచేయన్+అగు= చక్కచేయటానికి; తడవు+ఈక+హత్తున్= ఆలస్యం చేయకహత్తుకొనేవాడు.

**తాత్పర్యం:** మల్లయోధులైన వారిరువురు ఒకరితో ఒకరు కుస్తీ పట్లు ప్రారంభించారు. మల్లబంధ విశేషాలలో ఆరితేరిన వలలుడు గంభీరంగా అనేక విన్యాసాలు చూపిస్తూ మల్లుడిని గట్టిగా అదిమి నేలపై పడవేశాడు. తన మీదిమీదికి వచ్చే అతగాడిని అదుపులో పెట్టేవాడు. అనేకవిధాలైన జెట్టీల నేర్పును చూపిస్తూ వలలుడు కుస్తీ పట్లు పట్టసాగాడు.

**విశేషం:** తిక్కన ఈ పద్యంలో అనేక విధాలైన జెట్టీల కుస్తీ పట్లు పేర్కొన్నాడు. ఇది ఒక విధమైన ప్రదర్శనా యుద్ధం (Exhibition match). కొంతసేపు వినోదం కలిగించాలి. మల్లుని చంపటం మాత్రమే భీముడి ఉద్దేశం కాదు.

**వ. మఱియు ననేకగతుల యోజలు మెఱయుచుఁ గొండొకసేపు విరాటునకు వినోదంబు సలిపి. 16**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; అనేకగతుల= అనేక విధాలైన; ఓజలు= ప్రకారాలు; మెఱయుచున్= చూపిస్తూ; కొండు+ఒకసేపు= కొంతసేపు; విరాటునకున్+వినోదంబు సలిపి= రాజుకు ఆనందం కలిగించి.

**తాత్పర్యం:** ఇంకా ఎన్నో రకాలుగా ఉత్సాహాన్ని ప్రకటించి రాజుకు ఆనందం కలిగించాడు.

**విశేషం:** విరాటుడికి వేడుక కలిగించటం, వెంటనే చంపకుండా, ప్రజలకు అనుమానం రాకుండా చేయటం ముఖ్యం. అజ్ఞాతవాస సమయం అని గుర్తుంచుకొనాలి.

**ఆ. కచ్చ యమరఁ బట్టి కాళ్ళను జేతులు । వ్రేల మత్తగజములీల మెఱయ**
**ముష్టి బలువు నెఱయ ముక్కున వాతను । నెత్తురొలుక మల్లు నెత్తివైచె. 17**

**ప్రతిపదార్థం:** కచ్చ= దట్టీ; అమరన్+పట్టి= తగినట్లుగా పట్టుకొని; కాళ్ళునున్+చేతులు వ్రేలన్= కాళ్ళు, చేతులు వేలాడుతూ ఉండగా; మత్తగజములీలన్ మెఱయన్= మదించిన ఏనుగువలె ప్రకాశించగా; ముష్టి బలువు నెఱయన్= పిడికిటిబలం నిండగా; ముక్కునన్+వాతను= ముక్కులోను, నోటిలోను; నెత్తుర+ఒలుకన్= రక్తం కారగా; మల్లున్+ఎత్తివైచెన్= మల్లుని పైకెత్తివిసిరివేశాడు.

**తాత్పర్యం:** మల్లుడి దట్టీ పట్టుకొని, కాళ్ళు చేతులు వేలాడుతూ మదించిన ఏనుగులా ఉన్నవానిని పిడికిట గుద్ది ముక్కునా నోటా నెత్తురు కారగా ఎత్తిపడవేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి వీఁపున మండివెట్టిన. 18**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; విసరి= విసరి; నేలతో వ్రేసి= నేలమీద పడవేసి; వీఁపునన్= వీపుమీద; మండి+పెట్టినన్= మోకాలు మోపిపెట్టగా.

**తాత్పర్యం:** ఈ విధంగా నేలమీద పడవేసి వీపుమీద మోకాలు మోపిపెట్టగా.

**క. పెలుకుఱి తాళం బీ మదిఁ । దలఁచి యనువుగాక ధరణీతలము గరతలం**
**బుల నప్పళించె వాఁ డ । క్కొలు వార్వఁగ విఱిచి మెఱసెఁ గుంతీసుతుఁడున్. 19**

**ప్రతిపదార్థం:** వాఁడు= మల్లుడు; పెలుకుఱి= భయం వలన అంగాలు విలవిలపోగా; తాళంబు+ఈన్= ఒక్క చరుపు చరవాలని; మదిన్+తలఁచి= మనస్సులో అనుకొని; అనువుగాక= వీలుపడక; ధరణీతలము= నేలమీద; కరతలంబులన్= అరచేతులతో;

అప్పళించెన్= చరిచాడు; ఆ+కొలువు= ఆ సభలోని అందరూ; ఆర్వఁగన్= భయంకర శబ్దం చేయగా; కుంతీ సుతుఁడున్= భీముడును; విఱిచి మెఱసెన్= ఓడించి ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ఆ మల్లుడు తాళమనే మల్లబంధంతో వలలుడిని పట్టదలచి, వీలుపడక నేలను చేతులతో బాదుతూ ఊపిరాడక విలవిలలాడాడు. సభ్యులందరూ పెద్దగా హర్షధ్వానాలు చేస్తూ ఉండగా భీముడు ఆ మల్లుడిని ఓడించాడు.

**విశేషం:** 1. ఈ మల్లయుద్ధ ఘట్టం తిక్కన కవితలోని జాతివార్తా విశేషాలకు చక్కని నిదర్శనం. మూలంలోవలె తిక్కన కూడా మల్లశాస్త్ర విశేష పరిజ్ఞానంతో యుద్ధ సన్నివేశాన్ని వర్ణించటం విశేషం. మూలంలో మల్లయుద్ధంలోని అనేక రకాలైన పట్టులు, భంగిమలు, చేర్పులు, చర్యలు వర్ణించబడ్డాయి. ఉదాహరణకు కొన్ని శ్లోకాలు -

"ఉభౌ పరమ సంహృష్టౌ ముక్తా వివ మహాగజౌ
కృత ప్రతికృతై శ్చిత్రై, ర్బాహుభిశ్చ సుసంకటైః
సంనిపాతావధూతై శ్చ ప్రమాథోన్మథనై స్తథా
క్షేపణై ర్ముష్టిభి శ్చైవ వరాహోద్ధత నిఃస్వనైః
తలై ర్వజ్రనిపాతై శ్చ ప్రసృష్టాభి స్తథైవ చ॥
శలాకా నఖపాతైశ్చ పాదోద్ధూతై శ్చ దారుణైః।
జానుభి శ్చాశ్మ నిర్ఘోషైః శిరోభి శ్చావఘట్టనైః
తద్యుద్ధ మభవత్ ఘోర మశస్త్రం బాహుతేజసా
బల ప్రాణేన శూరాణాం సమాజోత్సవ సంనిధౌ॥..."
"ప్రకర్షణాకర్షణయో రభ్యాకర్ష వికర్షణైః
ఆకర్షతు రథాన్యోన్యం జానుభిశ్చాపి జఘ్నతః
తతః శబ్దేన మహతా భర్త్సయన్తౌ పరస్పరమ్
వ్యూఢోరస్కౌ దీర్ఘభుజౌ నియుద్ధ కుశలా వుభౌ
బాహుభి స్సమసజ్జేతా మాయసైః పరిఘై రివ॥.."
డా.శలాక రఘునాథశర్మ గారి వ్యాఖ్య. శ్రీమహాభారతమ్-విరాటపర్వ **(13.27-30; 32-33)**

వీటిలో మొదటి మూడు శ్లోకాలలో మల్లయుద్ధంలోని కుస్తీ పట్లను పేర్కొన్నాడు కవి. అవి-1) ఒకచోట పట్టి నొక్కటం, 2)వదలటం, 3) పిడికిలితో చేతులను గట్టిగా పట్టి ఎదుటివారిని బలహీనపరచటం, 4. దేహాన్ని గట్టిగా ఒడిసిపట్టటం, 5. దూరంగా త్రోయటం, 6) నేలమీద పడద్రోసి మర్దించటం, 7) పైకి లేవనెత్తి మర్దించటం, 8) ఉన్నచోటునుండి లాగి పడగొట్టటం, 9) రొమ్ము నడుమ రెండు పిడికిళ్ళతో కొట్టటం, 10) మెడలు వంచి చేతులు భుజంమీద పెట్టి చరుస్తూ ఏదుపంది అరచినట్లు చప్పుడు పుట్టించటం, 11) పిడుగుపాటులవంటి చరపులు చరచటం, 12) వ్రేళ్ళు పట్టుకొని లాగటం వంటి కుస్తీ పట్లు, 13) వ్రేళ్ళు వంచకుండా పెట్టి గోళ్ళతో పొడవటాలు, 14) కాళ్ళు చాచి తన్నటాలు, 15) గండశిల మీదపడ్డట్లు శత్రువు మీదపడి మోకాళ్ళతో పొడవటాలు, 16) తలతో పొడవటాలు అనే ముష్టియుద్ధ చర్యలు, 17) ఒక్క పెట్టున లాగి ముద్దగా చేయటం, 18. ముందు వెనుకలకు గుంజటం, 19) వేగంగా వెనుకకు త్రోసి పడగొట్టటం, 20) మోకాళ్ళతో పొడుచుకొనటం-వంటి నేర్పులు, 21) పెద్ద పెద్ద అరుపులతో ఒకరి నొకరు బెదిరించుకొనటం, 22) విశాలమైన రొమ్ములు, పొడుగైన చేతులు ప్రదర్శించుకొనటం, 23) చేతులతో శత్రువును పైకెత్తి గిరగిరా త్రిప్పటం, 24) నేలపై పడి నిశ్చేష్టితుడై ఉన్న శత్రువును మర్దించటం, 25) ఊపిరి ఆడకుండ చేసి చంపటం, 26) జయించి సింహగర్జనల వంటి విజయఘోష పెట్టటం - ఇవి మల్లయుద్ధంలో ప్రసిద్ధమైన భంగిమలు. ఇవన్నీ ఈ వరుసలోనే వర్తిల్లినట్లు చెప్పిన వ్యాసుడు శాస్త్రవిజ్ఞాన పండితుడివలె మనకు ఆశ్చర్యం కలిగిస్తాడు.

వ్యాసుడు శాస్త్ర విజ్ఞాని. తిక్కన అనుభవ జ్ఞాని. మల్లయుద్ధ శాస్త్రమే కాక, తెలుగునాట ప్రవర్తిల్లే దేశీ కుస్తీల పరిజ్ఞానం తిక్కనకు కరతలామలకం. భీమ. మల్లుల యుద్ధంలోని కుస్తీపట్లకు తెలుగుపేర్లు తెలియచెప్పాడు తిక్కన. ఇది జాతి వార్తా విశేషం. తిక్కన పేర్కొన్న తెలుగు కుస్తీ పట్లు - కొన్ని పేరు పెట్టినవి: కొన్ని తీరు పేర్కొన్నవి.

1. **ఉపతాయి** - మల్లయుద్ధంలో అపార అనుభవ జ్ఞానం, శాస్త్ర వైదుష్యం.
2. **తోరహత్తము** - ఒకచోట పిడికిలితో పట్టటం (పట్టి చరచకుండా వదలటం తరువాతిది)
3. **ఒత్తొరువు** - మిక్కిలి అదమటం, సంపీడనం, దేహాన్ని గట్టిగా ఒడిసి పట్టటం.
4. **జళికి** - రొమ్ము నడుమ పిడికిళ్ళతో కొట్టటం.
5. **పట్టిసము** - మెడలు వంచి చేతులు భుజంమీద పెట్టి చరచటం.
6. **పీసం** - కాళ్ళు చేతులు మెడ కదలకుండా బంధించటం.
7. **ముష్టిబలువు** - పిడికిలితో ఎదుటివారి చేతులను గట్టిగా పట్టి వారిని బలహీనపరచటం.
8. **మండిపెట్టుట** - ఒక కాలు నేలమీద మరొక మోకాలు శత్రువు వీపుమీద పెట్టి నొక్కి పట్టటం.
9. **పెలుకుటి తాళము** - ఒక్కపెట్టున లాగి తాళం వలె ముద్ద చేయటం. ఉక్కిరి బిక్కిరాడకుండా చేయటం.
10. **అప్పళించటం** - చరచటం, భుజాస్ఫాలనం.
11. **విఱుచుట** - నడుం విరిగేటట్లు చేయటం, వికారంగా ఎముకలు విరిగేటట్లు చేయటం, ఓడించటం, చంపటం, చేతులు వెనుకకు త్రిప్పి కట్టటం, అడుగుల కీళ్ళు విరిచివేయటం, శరీరం నుండి ఒక అంగాన్ని వేరు చేయటం మొదలైనవి.

తిక్కన తన కాలం నాటికి మల్లయుద్ధంలో తెలుగు పేర్లతో స్థిరపడిన వాటిని ఎన్నుకొని తన రచనలో నిబంధించాడు. మిగిలిన వాటిని మూలంలోవలెనే వివరించాడు. ఏమైనా వ్యాసుడి శాస్త్ర విజ్ఞానాన్ని తెలుగువారి అనుభవ కళావిజ్ఞానంగా మార్చి, తెలుగువారి కుస్తీపట్ల కౌశల్యాన్ని ఈ ఘట్టంలో వెలుగులోకి తెచ్చాడు. (సంపా.)

2. మూలంలో భీముడు జీమూతుడిని చంపినట్లున్నది.

**"తస్మిన్ వినిహతే వీరే జీమూతే లోకవిశ్రుతే**
**విరాటః పరమం హర్ష మగచ్ఛద్ బాన్ధవైః సహ".** (సం.4.12.14)

లోక ప్రసిద్ధుడైన జీమూతుడు భీముడి చేతిలో చావగా విరాటుడు బంధువు లందరితో కలిసి ఆనందించాడట. తిక్కన తెలుగులో "కొలు వార్వఁగ విఱిచి మెఱసెఁ గుంతీసుతుఁడున్" - అని చెప్పాడు. విఱుచు- అనే క్రియకు చంపు, ఓడించు-అనే రెండర్థాలూ ఉన్నాయి. కొందరు భీముడు మల్లుడిని ఓడించాడని వ్రాశారు. రాబోయే వచనంలో 'ఇవ్విధంబున మహాబలుపట్టి యాజెట్టి నెట్టన గెల్చిన మత్స్యపతి మెచ్చి' - అని ఉండటం వలన. నెట్టన= అనివార్యంగా, కాక తప్పనిదిగా, పూర్ణంగా, సమగ్రంగా, యథార్థంగా, నిక్కంగా - అని అర్థాలున్నాయి (సూర్యరాయాంధ్ర నిఘంటువు) నెట్టన గెల్చాడంటే - పూర్తిగా గెలిచాడు, నిజంగా గెలిచాడు వంటి అర్థమే వస్తుంది. కాని చంపి గెలిచాడు అనే అర్థం రాదని వారు భావించారు. ఒకవేళ అదే నిజమైతే తిక్కన కథను మార్చాడని చెప్పాలి. మూలంలో ఆ జగజెట్టి బ్రతికి ఉంటే భీమపరాక్రమం దేశమంతా అతడివలన వ్యాప్తి చెందుతుందని భావించి ధర్మజుడి కనుసైగకు అనుగుణంగా అతడిని చంపినట్లు చెప్పుతారు. మరి తిక్కన అతడిని జీవచ్ఛవంగా భావించి వదలిపెట్టాడేమో! ఏమైనా, ఎటువంటి అర్థాన్ని చెప్పుకొనటానికైనా తిక్కన వాడిన 'విఱుచు'- అనే క్రియ సమర్థమైనది. తెలుగు క్రియలకున్న అనేకార్థ స్ఫూర్తికి ఇది తిలకం వంటిది.

3.**'బెలుకురికి బోరగిలపడి । దల పరియలు గాగ ధరణీతలమున బడఁజే । తుల నప్పళించి తా న। క్కొలు వార్వఁగ మెరసి విడిచెఁ గుంతీసుతుఁడున్'** - అనే పాఠాంతరం కూడా ఉన్నది. దీనిని బట్టికూడ భీముడు మల్లుడిని చంపక వదలిపెట్టి **'ఉక్కఱ భంజించి, చంపు టుడుగుదు' (విరా.1.82)** నని పలికిన మాటను నిలబెట్టుకొన్నాడని తాత్పర్యం ఏర్పడుతున్నది. (సంపా.)

**వ. ఇవ్విధంబున మహాబలుపట్టి యాజెట్టి నెట్టన గెల్చిన మత్స్యపతి మెచ్చి తన కిచ్చిన ధనంబు లచ్చటి (యర్థి) జనంబుల కిచ్చి నిజ నివాసంబునకుం జనియె; మఱియు నిత్తెఱంగున నతనికి వేడ్కసలుపుచుండుఁ; జిక్కని మల్లులులేని తఱి నంతిపురంబు నింతులు సూడ నయ్యవనీ కాంతుండు పోరింప శార్దూల శుండాలాదులతోడ నీడంబోక పెనంగి భంగంబునకుం దెచ్చి మెచ్చించుచుండు. 20**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; మహాబలుపట్టి= వాయుపుత్రుడైన భీముడు (వలలుడు); ఆ జెట్టిన్= ఆ మల్లుని; నెట్టన గెల్చిన= తుదకు గెలిచినందుకు; మత్స్యపతి మెచ్చి= విరాటరాజు సంతోషించి; తనకున్+ఇచ్చిన ధనంబులు= తనకు బహుమతిగా ఇచ్చిన రొక్కాలను; అచ్చటి (అర్థి) జనంబులకున్= యాచకులకు; ఇచ్చి= ఇచ్చి; నిజనివాసంబునకున్+చనియెన్= తానున్న ప్రదేశానికి వెళ్ళాడు; మఱియున్= ఇంకను; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; అతనికిన్+వేడ్క= ఆయనకు వినోదం; సలుపుచుండున్= కలిగించేవాడు; చిక్కని మల్లులు= బలవంతులైన జెట్టీలు; లేని తఱిన్= లేనప్పుడు; అంతిపురంబు+ఇంతులు= రాజస్త్రీలు; చూడన్= చూడగా; ఆ+అవనీకాంతుండు= విరాటరాజు; పోరింపన్= ఉసిగొల్పగా; శార్దూల= పెద్దపులులు; శుండాల+ ఆదులతోడన్= ఏనుగులు మొదలైన వాటితో; ఈడన్+పోక= వెనుదీయక; పెనంగి= పోరాడి; భంగంబునకున్+తెచ్చి= ఓడించి; మెచ్చించుచున్+ఉండున్= సంతోష పెట్టుతూ ఉండేవాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా వలలుడు ఆ మల్లుడిని ఓడించినందుకు విరాటరాజు సంబరపడి కానుకలిచ్చాడు. వలలుడు ఆ రొక్కాన్ని యాచకుల కిచ్చి వెళ్ళిపోయాడు. వినోదప్రియుడైన ఆ మహారాజు బలవంతులైన మల్లులు లేనప్పుడు వేడ్కకై పులులతోనూ, ఏనుగులతోనూ పోరించగా భీముడు పెనుగులాడేవాడు. అంతఃపుర స్త్రీలు అది చూచి సంబరపడేవారు.

**క. పెఱవారలు తమమెలఁగెడు । తెఱఁగులు దొరఁకొన్న వింత తెరువుల నేర్పుల్**
**మెఱయుచుఁ బతిచిత్తము గొన । నొఱపు గలిగి మాన్యవృత్తి నుండుదురు దగన్. 21**

**ప్రతిపదార్థం:** పెఱవారలు= ఇతరులు; తమ మెలఁగెడు తెఱఁగులు= (పాండవులు) తాము మసలే తీరులు; దొరఁకొన్నన్= ప్రారంభించగా; వింత తెరువులన్= సరిక్రొత్తమార్గాలలో నేర్పుల్= తమ తమ నేర్పులను; మెఱయుచున్= వెలయింపచేస్తూ; పతిచిత్తము+కొనన్= విరాటుని మనస్సు మెప్పించే విధంగా; ఒరపు+కలిగి= చాకచక్యం కలిగిఉండి; మాన్యవృత్తిన్= గౌరవప్రదమైన ప్రవర్తనతో; తగన్+ఉండుదురు= సముచితంగా ఉంటున్నారు.

**తాత్పర్యం:** పాండవులు తమ ప్రవర్తనలు ఇతరులు గుర్తించలేని విధంగా ఎంతో చాకచక్యంగా అపూర్వమైన వింతపద్ధతులతో అజ్ఞాతంగా మెలగుతూ, విరాటుడి కానందం కలిగిస్తూ జీవించారు.

**విశేషం:** సంస్కృతంలో వ్యాసుడు నకులార్జున సహదేవులు తమ విద్యలతో ఎట్లా సంతోష పెట్టేవారో చెప్పాడు (14-12-29 నుండి 32). తిక్కన దానిని వదిలేశాడు.

### కీచకుఁడు పాంచాలిం జూచి మోహించుట (సం.4-13-1)

**వ. ఇట్లు పాండవులు పాంచాలీ సహితంబుగా విరాటు నగరంబున వర్తించుచుఁ గతిపయదినంబులు గొఱంతగా నేఁడుకాలంబు గడపిన సమయంబున మత్స్యపతి మఱంది యు, దండనాథుండును, గీచకాగ్రజుండును, రూపాభిమానియు, నానాభరణ ధరణశీలుండును. దుర్విదగ్ధుండును. బలగర్వితుండును నగు సింహబలుండు దనయప్ప సుదేష్ణకు మ్రొక్కంజనువాఁ డద్దేవి కనతిదూరంబున నున్న ద్రుపదరాజనందనం గనుంగొని. 22**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవులు; పాంచాలీ సహితంబుగాన్= ద్రౌపదితో గూడ; విరాటు నగరంబునన్= విరాటుడు పాలించే మత్స్య దేశరాజధానిలో; వర్తించుచున్= ఉంటూ; కతిపయదినంబులు= కొన్ని రోజులు; కొఱంతగాన్+ఏఁడు కాలంబు= సంవత్సరానికి కొంచెం తక్కువగా; కడపిన సమయంబునన్= గడిపినప్పుడు; మత్స్యపతి మఱందియున్= విరాటుని బావమరదీ; దండనాథుండును= సేనాధ్యక్షుడూ; కీచక+అగ్రజుండును= కీచకులలో పెద్దవాడూ; రూప+అభిమానియున్= తన రూపాన్ని అభిమానించేవాడూ; నానాభరణ ధరణ శీలుండును= అనేక రకాలైన అలంకారాలు ధరించే స్వభావం కలవాడూ; దుర్విదగ్ధుండును= వివేకం లేనివాడూ; బలగర్వితుండునున్+అగు= తనబలంచేత గర్వించినవాడూ అయిన; సింహబలుండు= సింహబలు డనేవాడు; తన అప్ప= తన అక్క అయిన; సుదేష్ణకున్; మ్రొక్కన్+చనువాఁడు= నమస్కరించటానికి వెళ్లుతున్నవాడు; ఆ+దేవికిన్= ఆ మహారాణికి; అనతిదూరంబునన్= సమీపాన; ఉన్న= ఉండిన; ద్రుపదరాజనందనన్= ద్రౌపదిని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవులు ద్రౌపదీ సమేతంగా విరాటనగరంలో ఉంటూ అజ్ఞాతవాసం గడుపుతున్నారు. సంవత్సరానికి కొద్ది రోజులు తక్కువగా ఉండే సమయంలో విరాటరాజు బావమరది అయిన సింహబలు డనేవాడు ఒక రోజు తన అక్క సుదేష్ణను చూచి గౌరవంగా నమస్కరించటానికి వచ్చి ఆమె సమీపంలో ఉన్న ద్రౌపదిని చూచాడు. అతడు నూటైదుగురు కీచకులకు అన్న, అందమైన రూపాన్ని అభిమానించేవాడు, అనేకరకాలైన అలంకారాలను ధరించే స్వభావం కలవాడు, వివేక విహీనుడు, బలగర్వితుడు.

**విశేషం:** 1. యౌవనం, ధనసంపత్తి, ప్రభుత్వం, అవివేకం- వీటిలో ఒక్కొక్కటే అనర్థ దాయకం. నాలుగూ కీచకుడిలో రాశీభూతంగా ఉన్నాయి.

2. సంస్కృతంలో 'మాసా దశ సమత్యయుః, (4-13-1) అని 10 మాసాలు గడిచినట్లు చెప్పబడింది. రెండు నెలల వ్యవధిలో దుర్యోధనుడు గ్రహించకపోడని తిక్కన సమంజసమైన మార్పు చేశాడు.

**ఉ.** **అక్కజమైన చెల్వమున నాత్మకు వ్రేఁగయి పొల్చు పొల్తిపై**
**నెక్కొను చూడ్కిఁ గ్రమ్మఱుప నేరక యూరక నిల్చెఁ గాముచేఁ**
**జిక్కిన నెమ్మనంబుఁ గడుఁ జేడ్పడు మానముఁ జేష్టితంబులం**
**దక్కిన యంగముం దలఁకు ధైర్యమునై యతఁ డప్పు డయ్యెడన్.** **23**

**ప్రతిపదార్థం:** అక్కజము+ఐన= అబ్బురపాటు కలిగించే; చెల్వమునన్= అందంతో; ఆత్మకున్= మనస్సుకు; వ్రేఁగు+అయి పొల్చు= తాపం కలిగించే; పొల్తిపైన్= స్త్రీపై; నెక్కొనుచూడ్కిన్= నిలిచిన చూపును; క్రమ్మఱుపన్+నేరక= మరలించలేక; కాముచేన్+చిక్కిన= మన్మథునికి వశమైన; నెఱ+మనంబున్= నిండు మనస్సూ; కడున్+చేడ్పడు= మిక్కిలి కలత పడే; మానమున్= అభిమానమూ; చేష్టితంబులన్= చేష్టలను; తక్కిన= కోల్పోయిన; అంగమున్= శరీరమున్నూ; తలఁకు= చలించే; ధైర్యమును+ఐ= ధైర్యమూ కలిగి; అతఁడు= సింహబలుడు; అప్పుడు; ఆ+ఎడన్= అచ్చట; ఊరక, నిల్చెన్= వ్యర్థంగా నిలబడ్డాడు.

**తాత్పర్యం:** ఆశ్చర్యాన్ని కలిగించే ద్రౌపది సౌందర్యం కీచకుడి హృదయానికి భరించలేనిదయింది. ఆమె మీద వాలిన చూపులను మరల వెనుకకు మరల్చుకొనలేక అట్లాగే నిశ్చేష్టుడై నిలిచిపోయాడు. మన్మథుడికి లొంగిపోయిన అతడి మనస్సు కలత చెందింది. అతడి నిబ్బరం చెదిరిపోయింది. అతడి శరీరం చేష్టలు దక్కింది. ధైర్యం చలించింది. వరుసగా ఈ అవస్థలను అతడు పొందాడు.

**విశేషం:** విరాటపర్వం నానారసాభ్యుదయోల్లాసి. అపూర్వ సౌందర్యవతి అయిన ద్రౌపది కీచకుడికి శృంగార విభావంగా ప్రత్యక్షమైంది. అతడు మన్మథాయత్తుడైనాడు. శృంగార రసావిష్టులైన నాయికానాయకులలో దశవిధ మన్మథావస్థలను వర్ణించటం ప్రబంధ సంప్రదాయం. తిక్కన కీచకుడిలో ఆ దశావస్థలు చిత్రించాడు.

> "దృఙ్మన స్సంగసంకల్పా, జాగరః కృశతాऽరతిః
> హ్రీత్యాగోన్మాద మూర్చాంతా ఇత్యనంగదశా దశ."

అని లక్షణోక్తి. దృక్సంగమం, (దర్శనం వలన చక్షుప్రీతి), మనస్సంగమం, సంకల్పం, జాగరం, కృశత, అరతి, హ్రీత్యాగం, ఉన్మాదం, మూర్ఛ, అంతం (మరణం) అనేవి దశవిధమన్మథావస్థలు. వీటిలో దృక్సంగమం ఈ పద్యంలో వర్ణించబడింది. ద్రౌపదిది అపూర్వమైన సౌందర్యం. దానివలన కీచకుడికి అద్భుతం, రతిభావం రెండూ కలిగాయి. చూపులు ఆమె అందం మీద వాలాయి. అందులో చిక్కుకొన్నాయి. సంగమించాయి. అది దృఙ్మీలనం - లేదా - దృక్సంగమం. ఆ అవస్థను వ్యక్తం చేసే అనుభావాలు (చేష్టలు) సాత్త్వికభావాలుగా (సహజంగా కలిగే అభినయాలవలె) అతని శరీరంలో పొటమరించాయి. చూపులు వెనుకకు తీసికొనలేని తన్మయత్వం (మైమరపు), రతిభావం చేత మనసు చలించటం, శరీరం స్తంభావస్థను (చేష్టలు లేకుండా కొయ్యబారిపోయినట్లు కావటం) పొందటం, స్థైర్యాన్ని కోల్పోవటం - వలపు చూపులు ప్రసరించిన ప్రథమావస్థకు అభివ్యక్తులైన వారి అభినయముద్రలు. పాత్రలు అభినయిస్తున్నట్లు వర్ణించటం తిక్కన నాటకీయతలో ప్రధాన లక్షణం. (సంపా.)

**తే. ద్రౌపదీ రూప మను నురిఁ దగిలి తనదు। హృదయ మను మృగ మత్తఱి నుదిలగొనుచుఁ**
**గాముఁడను బల్లిదపు వేఁటకాని బారిఁ। బడుట కెంతయు నా సింహబలుఁడు తలరి. 24**

**ప్రతిపదార్థం:** ద్రౌపదీరూపము+అను= ద్రౌపదీ సౌందర్యమను; ఉరిన్+తగిలి= ఉరిత్రాడుకు తగిలికొని; తన హృదయము+అను= మృగము= తన హృదయమనే జింక; ఆ+తఱిన్= ఆ సమయంలో; ఉదిలగొనుచున్= పరితపిస్తూ; కాముఁడు+అను= మన్మథుడనే; బల్లిదము+వేటకాని= బలిష్ఠుడైన వేటగాడియొక్క; బారిన్+పడుటకున్= గురిలోపడినందుకు; ఆ సింహబలుఁడు= ఆ కీచకుడు; ఎంతయున్= ఎంతో; తలరి= చలించి.

**తాత్పర్యం:** ద్రౌపదీ రూప సౌందర్యమనే ఉచ్చులో చిక్కి ఆ కీచకుడి హృదయం అనే జింక మన్మథుడనే బలిష్ఠుడైన వేటగాడి పన్నుగడలో పడిపోవటం వలన అప్పుడు ఆ సింహబలుడు చలించి. (ముందరకు అన్వయం.)

**విశేషం:** 1. అలం: సావయవ రూపకం. ద్రౌపది రూపం, కీచకుడి హృదయం, మన్మథుడు అనే ఉపమేయాలమీద ఉరి, జింక, వేటకాడు అనే ఉపమానాలు ఆరోపించబడ్డాయి.

2. ఇందులో మనస్సంగమమనే ద్వితీయ మన్మథావస్థ అలంకార సుందరంగా వర్ణించబడింది. వలలోపడిన మృగం వేటగాడి చేత చంపబడుతుంది - అనే భావన చేత, ద్రౌపది చేత ప్రేరితుడైన భీముడి చేత కీచకుడు వధించబడతాడని అలంకార ధ్వని.

3. వలలో చిక్కిన జింకవలె హృదయం రాగబద్ధమైనదనీ, మోహమగ్నమైనదనీ వ్యంగ్యం.

4. పేరుకు సింహబలుడు కాని, లేడివలె ద్రౌపదీ రూపమనే ఉచ్చులో పడ్డాడు. విషమాలంకారచ్ఛాయ కనపడుతున్నది. కీచకుడు రూపాభిమాని కాబట్టి అందమైన ఆకారాన్ని చూచి అభిమానించి వశుడైపోయాడని ధ్వని. (సంపా.)

**వ. నిజాంతర్గతంబున. 25**

**తాత్పర్యం:** తన మనస్సులో.

**ఉ. 'ఎందును నిట్టిరూపు నరు లెవ్వరుఁ గాంచిరె? నాక కాదు సం**
**క్రందనసూతికిం దగిలి కన్గొనఁ జాలదె! దీన నిందిరా**
**నందను నాజ్ఞ యేచి భువనంబులఁ బ్రబ్బదె? యిత్తలోదరిం**
**జెందఁగఁ గాన్పుగాదె ఫలసిద్ధి పురాతన పుణ్యవృద్ధికిన్! 26**

**ప్రతిపదార్థం:** నరులు+ఎవ్వరున్= మానవులెవరైనా; ఎందునున్= ఎక్కడైనా; ఇట్టిరూపున్= ఈ విధమైన సౌందర్యాన్ని; కాంచిరె?= చూచారా?; నాకున్+ అ కాదు= నాకే కాదు; సంక్రందన సూతికిన్= ఇంద్రుడి కుమారుడైన జయంతుడికి కూడా; తగిలి= ఆసక్తి పొంది; కన్గొనన్+చాలదె!= చూడ తగిందే సుమా!; దీనన్= దీనిచేత (ఇట్టిరూపుచేత); ఇందిరానందను+ఆజ్ఞ= మన్మథుడి ఆదేశం; ఏచి= అతిశయించి; భువనంబులన్= లోకాలలో; ప్రబ్బదె?= వ్యాపించదా?; పురాతన= పూర్వజన్మ; పుణ్యవృద్ధికిన్= పుణ్యాతిశయానికి; ఫలసిద్ధి= ఫలితం దక్కటం; ఈ+తలోదరిన్= ఈ సుందరిని; చెందఁగన్+కాన్పుకాదె!= పొందగలగటమే కదా!

**తాత్పర్యం:** 'ఎక్కడైనా ఇటువంటి సౌందర్యరాశిని మానవు లెవ్వరైనా చూచారా? నేనే కాదు, ఆ దేవేంద్రుడి కొడుకైన జయంతుడుకూడా ఈమె అందాన్ని ఆసక్తితో చూడక మానలేడు. దీనివలన కలిగిన మన్మథేచ్ఛ అతిశయించి లోకాల నన్నిటిని ముంచెత్తదా? ఈ సుందరాంగి పొందు లభించినవాడి జీవితం నిజంగా పూర్వజన్మల పుణ్యాలపంట!

**విశేషం:** అలం: సంబంధాతిశయోక్తి, కావ్యార్థాపత్తి. సంక్రందనసూతికిన్, ద్రౌపదీరూపమునకును సంబంధం లేకున్ననూ, సంబంధమున్నట్లు వర్ణింపబడటం చేత సంబంధాతిశయోక్తి. సంక్రందన సూతి జయంతుడే కాక, అర్జునుడు కూడా, ఆమె రూపును తగిలికొనువాడే కదా! అయితే అందగాడుగా జయంతుడే కాని, అర్జునుడు చెప్పబడడు. సంక్రందన సూతికే తగిలి కన్గొనవచ్చునంటే ఇంక నా సంగతి వేరే చెప్పాలా? అనటం చేత అలంకారం కావ్యార్థాపత్తి. ఇందిరా నందనుడి (మన్మథుడి) ఆజ్ఞ ఏచి ప్రబ్బుటకు ఈమె రూపే సాధనమనటం వలన, ఆమె సౌందర్యాతిశయం ద్యోతకమవుతున్నది. 'పుణ్యబుద్ధికిన్' అనే పాఠంకంటె 'పుణ్యవృద్ధికిన్' అనే పాఠాంతరం అనువుగా ఉండటంతో దీనిని గ్రహించటం జరిగింది. ఈ పద్యంలో 'సంకల్పం' అనే మూడవ మన్మథావస్థ ప్రారంభమైనది. మనుషులే కాక దేవతలు కూడా చూచి ఆశ్చర్యపడే రూప సౌందర్యం ద్రౌపదిదని పేర్కొంటూ, ఆమెపొందు పూర్వజన్మఫలంవలనగాని లభించదని భావించాడు. ద్రౌపది పుణ్యవతి అని, దివ్యసౌందర్యవతి అని ధ్వని. నాయికా సంగమాన్ని గాఢంగా సంకల్పించటం ఇందులో స్పష్టం. (సంపా.)

**సీ. ఇయ్యింతి ప్రాపున నయ్యనంగుఁడు పార్వ । తీశునైనను దక్కనేలకున్నె!**
**యిన్నాతి చెలువంబు గన్న శచీ ప్రియుం । డైనను గనుకలి నవియకున్నె!**
**యిత్తన్వి కెనలేమి కెదిరి పన్నిదము భా । షావిభుతోనైనఁ జఱవరాదె!**
**యిత్తలోదరి జీవితేశున కిందిరా । పతినైన మెచ్చక పలుకఁజనదె!.**

**తే. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు । కరఁగి నేరిమి వాటించి కరువు గట్టి**
**పోసి చేసి చైతన్యసంపుటము దగ ఘ । టించెనో కాక యిట్టి చేడియలు గలరె! 27**

**ప్రతిపదార్థం:** ఈ+ఇంతిప్రాపునన్= ఈమె అండతో; ఆ+అనంగుఁడు= ఆ మన్మథుడు; పార్వతీ+ఈశున్+ఐనను= శివుడిని అయినా; తక్కన్+ఏలక+ఉన్నె= లొంగేటట్లు చేయలేడా?; ఈ+నాతిచెలువంబు= ఈమె అందాన్ని; కన్న= చూచిన; శచీప్రియుండు+ఐనను= ఇంద్రుడైనా; కనుకలిన్= చూడటం చేతనే; అవియక+ఉన్నె!= విరహంతో చిక్కిపోకుండా ఉంటాడా!; ఈ+తన్వికిన్= ఈమెకు; ఎనలేమికిన్= సాటిలేకపోవటం అనేవిషయమై; భాషావిభుతోన్+ఐనన్= బ్రహ్మతోనైనా; ఎదిరిపన్నిదము=

ఎదురుపందెం; చఱవరాదె!= వేయవచ్చునుకదా!; ఈ+తలోదరి= ఈమెయొక్క; జీవిత+ఈశునకున్= భర్తకు; ఇందిరాపతిన్+ఐనన్= విష్ణువునైనా; మెచ్చక= ప్రశంసించక; పలుకన్+చనదె!= మాట్లాడవచ్చును కదా!; కుసుమబాణుని బాణముల్= మన్మథుని బాణాలు; కూడన్= కలిపి; ఐదు కరఁగి= ఐదూ కరగించి; నేరిమి+పాటించి= నేర్పు ప్రదర్శించి; కరువు+కట్టి= మూసను ఏర్పరచి; పోసి= అందులో పోసి; చేసి= రూపం తయారుచేసి; చైతన్యసంపుటము= ప్రాణచైతన్యాన్ని; తగన్+ఘటించెనో= ఒప్పునట్లుగా కూర్చాడేమో!; కాక= లేకపోతే; ఇట్టి చేడియలు= ఇటువంటి స్త్రీలు; కలరె!= ఉంటారా!.

**తాత్పర్యం:** ఈ అందమైన వనిత అండదండలుంటే అలనాడు మన్మథుడు పార్వతీపతి అయిన పరమేశ్వరుడిని సైతం లొంగదీసికొని తన చెప్పుచేతలలో ఉంచుకొనకుండా ఉండేవాడా! ఈ వయసుకత్తె అందాన్ని చూస్తే శచీమనోహరుడైన ఇంద్రుడు కూడా దృక్సంగమం వలన కలిగిన విరహంతో చిక్కి శల్యమై పోకుండా ఉండేవాడా!; ఈ సన్నని మేనుగల అందగత్తెకు లోకంలో ఎవ్వరూ సాటిలేకపోవటం అనే విషయంపై సరస్వతీదేవి భర్త అయిన బ్రహ్మ దేవుడితో సైతం ఎదురుపందెం వేసి గెలువవచ్చును కదా! ఈ సుందరికి భర్త అయిన వాడు లక్ష్మీపతి అయిన విష్ణుదేవుని సంపదనూ, సౌందర్యాన్ని సైతం లెక్కచేయకుండా మాట్లాడవచ్చును కదా! ఈమె అందాన్ని చూస్తే బ్రహ్మదేవుడు మన్మథబాణాలైదింటిని కలిపి ఒకేసారి కరిగించి, నేర్పుతో మూసలో పోసి, రూపుకట్టించి, ప్రాణంపోసి, చైతన్యస్ఫూర్తిని సంఘటించాడేమో! లేకపోతే ఇటువంటి అందగత్తెలు ఈ సృష్టిలో సామాన్యంగా ఉంటారా? (ఈమె బ్రహ్మదేవుడి విశిష్ట సృష్టి).

**విశేషం:** అలం: పరికరాంకురం, కావ్యార్థాపత్తి, వ్యతిరేకం, ఉత్ప్రేక్ష. ద్రౌపది సౌందర్యాన్ని అలంకారికంగా వర్ణించిన తిక్కన మేటి పద్యాలలో ఇది ఒకటి.

1. సీస పద్యం మొదటి పాదంలో వ్యతిరేకాలంకారం గోచరిస్తుంది. ఉపమానం కంటె ఉపమేయమే బలంగా చిత్రించబడే స్ఫూర్తివలన ద్రౌపది సౌందర్యానికి అతిశయం భాసించింది.

2. ఈ పద్యంలో భార్యాసహితులైన దేవతలనే పేర్కొనటం విశేషం. ద్రౌపది సౌందర్యం వారి ప్రియురాండ్ర నుండి భర్తలను దూరం చేయగల శక్తి కలదని తిక్కన నిరూపణ. వివాహితులైన దేవతలే ఆమె సౌందర్యం చూస్తే విరహానికి గురి ఔతారనగా ఇక కీచకుడి మాట వేరేచెప్పాలా? అని అర్థాపత్తి అలంకారం ధ్వనింపచేశాడు. శచీవల్లభుడి విషయం చెప్పటంచేత కైముతిక న్యాయంతో కీచకుడి అర్థం కూడా ధ్వనిమయంగా సిద్ధించటం అర్థాపత్తి. ఇట్లాగే వాణీచతుర్ముఖుల. లక్ష్మీనారాయణుల విషయంలోనూ కూడ అన్వయించుకొనాలి.

3. వ్యతిరేకాలంకారాన్ని ఆశ్రయించి ద్రౌపది సౌందర్యాన్ని ధ్వనింపచేయటం సీసపద్యపాదాలలోని శిల్పం. ఉపమానం కంటె ఉపమేయం బలంగా ఉన్నట్లు చిత్రించటం ఈ అలంకార స్వభావం. మహేశ్వరుడు మన్మథుడి కంటె గొప్పవాడు. అతడిని కూడా ధిక్కరించగలిగే శక్తి మన్మథుడికి ద్రౌపది సౌందర్యం కలిగిస్తుందట! భోగప్రియుడు ఇంద్రుడు, ఆయనకు భార్య ఉన్నది. వేయి కన్నులున్నాయి. అయినా ఆయన చూపులను ఆకర్షించి విరహంతో చిక్కిపోయేటట్లు చేయగలిగినది ద్రౌపది సౌందర్యం. ఆమె అందానికి ఎదురు లేదు. అందువలన ఆ అందాన్ని సృష్టించిన సరస్వతీ భర్తనే (బ్రహ్మనే) 'మరల నావలె సృష్టి చేయగలవా?' అని అడుగగలిగిన శక్తి కలది ద్రౌపది అందం. ఇందిరాపతి ఐశ్వర్యవంతుడు. ద్రౌపదిని పొందినవాడు అతడికంటె ఘనుడు. ఈ విధంగా ఉపమేయ స్థానీయులందరిని అధికతరం చేసి చెప్పిన వైఖరితో ద్రౌపది సౌందర్యాన్ని ధ్వనిమయం చేశాడు తిక్కన.

4. ఈశ్వరుడు, ఇంద్రుడు, బ్రహ్మ, విష్ణువు - వీరికి బదులుగా పార్వతీశుడు, శచీప్రియుడు, భాషావిభుడు, ఇందిరాపతి అని విశేష్యాలను సాభిప్రాయంగా ప్రయోగించడంచేత అలంకారం పరికరాంకురం.

5. ఎత్తుగీతిలో ఉత్ప్రేక్ష అందగించింది. అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం- అనే అయిదు పూలు మన్మథుడి పంచబాణాలు. ఉపమానం యొక్క తాదాత్మ్యాన్ని ఉపమేయంలో సంభావించటం ఉత్ప్రేక్ష. పంచబాణుడి ఒక్కొక్క బాణమే ఎంతో ప్రభావం కలది. అటువంటి అయిదు బాణాలూ కలిపి ఒక మూసలో పోసి రూపొందించి ప్రాణప్రతిష్ఠ చేసినట్లు ఉన్న సౌందర్యమో అన్నట్లు అపూర్వంగా ఉన్నది ద్రౌపది సౌందర్యం. అంతటి అందగత్తెలు సృష్టిలో లేరు.

6. సీస పాదాలలో క్రమంగా ద్రౌపదీ సౌందర్యబలాన్నీ, ప్రభావాన్నీ, సాటిలేనితనాన్నీ, వైభవాన్నీ చిత్రించాడు. ఎత్తుగీతిలో అపూర్వతను అభివ్యక్తం చేశాడు. కీచకుడు సంకల్పావస్థను ప్రదర్శిస్తూ సంగమానుకూల సౌందర్యాలంబనాన్ని ఉల్లేఖంగా కీర్తించటం-రసభావపోషకం.

7. ఈ సీసపద్యం, విశేషించి ఎత్తుగీతి అల్లసాని పెద్దనాది ప్రబంధకవులకు మార్గదర్శకమైనది. చూడండి: మనుచరిత్ర. 2.36 (సంపా.)

**క. ఈ నెలఁతఁ గన్న మన్మథుఁ। డైనఁ జిగురు గొడుగుఁ పువ్వుటమ్ములపొదులున్**
**లోనుగ సెజ్జలు సేయం। దా నియమింపండె? విరహతాపము పేర్మిన్.' 28**

**ప్రతిపదార్థం:** ఈ నెలఁతన్+కన్న= ఈ స్త్రీని చూచినచో; మన్మథుఁడు+ఐనన్= మదనుడైనా; విరహతాపముపేర్మిన్= విరహతాపాతిశయంచేత; చిగురుగొడుగు= చిగురుటాకుల గొడుగు; పువ్వు+అమ్ములపొదులున్= పూలబాణాల పొదులు; లోనుగన్= మొదలయినవి; తాను= ఆయన; సెజ్జలు+చేయన్= పడకలు తయారుచేయడానికి; నియమింపండె?= ఆజ్ఞాపించడా?

**తాత్పర్యం:** ఈమెను చూచి, మన్మథుడు విరహతాపానికి లోనయి, తన చిగురాకు గొడుగులను, పూలబాణాల పొదులను తనకు మెత్తటి పరుపుగా తయారుచేయుమని ఆజ్ఞాపించక తప్పదు.'

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ద్రౌపదిని చూస్తే మన్మథుడికైనా విరహతాపం కలగకమానదని సూచించి, తిక్కన కీచకుడి మోహాన్నీ ద్రౌపది సౌందర్యాన్నీ వ్యంగ్యంగా చెప్పాడు.

**వ. అని వెండియు. 29**

**తాత్పర్యం:** అని మరలా (ఇట్లా అనుకొన్నాడు.)

**సీ. దీని జన్మంబునఁ దేజంబునొందిన। యింతియుఁ బతియును నెవ్వరొక్కొ!**
**దీని నామాకృతిగా నోఁచి పడసిన। యింపగు వర్ణంబు లెవ్వియొక్కొ!**
**దీని వల్లభుఁ డనఁగా నిల సొబగు సొం। పెసఁగ వర్తిల్లు వాఁ డెవ్వఁడొక్కొ!**
**దీని వసించుటఁ దా నొప్పి పెంపున। నేపారు మందిరం బెద్దియొక్కొ!**

**ఆ. దీనిఁ బొందఁగాంచు తెఱఁగు నా కెయ్యది। యొక్కొ! యిట్టిపనికి నూఱడిల్లి**
**తోడుకొనఁగ నిచట నీడగు చుట్టంబుఁ। దడవి యెట్టులొక్కొ పడయువాఁడ!' 30**

**ప్రతిపదార్థం:** దీని జన్మంబునన్= ఈమె పుట్టుకచేత; తేజంబున్+ఒందిన= ప్రకాశించిన; ఇంతియున్, పతియునున్= భార్యాభర్తలు (తల్లిదండ్రులు); ఎవ్వరు+ఒక్కొ!= ఎవరో కదా!; దీని నామాకృతిగాన్+నోఁచి= ఈమె పేరు అగునట్లుగా నోములు నోచి; పడసిన= పొందిన; ఇంపు+అగు వర్ణంబులు= సొంపయిన అక్షరాలు; ఎవ్వి+ఒక్కొ!= ఏవో కదా!; దీని వల్లభుఁడు+అనఁగాన్= ఈమె భర్తగా;

ఇలన్= భూమిమీద; సొబగు సొంపు+ఎసఁగన్= అందచందాలు అతిశయించగా; వర్తిల్లు= జీవించునట్టి; వాఁడు= ఎవ్వ+డు+ఒక్కొ!= వాడెవడో కదా!; దీని వసించుటన్= ఈమె ఉండటం చేత; తాన్+ఒప్పి= తాను (మందిరం) అందగించి; పెంపునన్= ఐశ్వర్యవంతమై; ఏపారు= ప్రకాశించే; మందిరంబు= గృహం; ఎద్ది+ఒక్కొ!= ఏదో కదా!; దీనిన్+పొందన్+కాంచు= ఈమెను అనుభవించగల; తెఱఁగు= విధం; నాకున్+ఏ+అది+ఒక్కొ!= నా కెట్లా కలుగుతుందో కదా!; ఇట్టిపనికిన్= ఈ పనికి; ఊఁడిల్లి= ఉపశమనం పొంది; తోడుకొనఁగన్= సహాయం పొందటానికి; ఇచటన్= ఇక్కడ; ఈడు+అగు= సరిఅయిన; చుట్టంబున్= బంధువును; తడవి= వెదకి; ఎట్టులు+ఒక్కొ!= ఎట్లా; పడయువాఁడన్?= పొందుతానోగదా!

**తాత్పర్యం:** 'ఈ సుందరికి జన్మనిచ్చి వెలుగొందిన ఆ పుణ్యదంపతులు ఎవరో కదా! ఈమె పేరుగా రూపొందటానికి నోములు నోచిన ఆ అందమైన అక్షరాలు ఏవో! ఈమె భర్తగా ఈ లోకంలో అందచందాలతో ఒప్పారే ఆ సౌభాగ్యవంతుడు ఎవడో! ఈమె నివసించటం చేత తన ఉనికియొక్క అందాన్నీ అతిశయాన్నీ పెంచుకొన్న ఆ మందిరం ఏదో? ఈమెపొందును పొందగలిగే మార్గం నా కేదో? ఈ పనికి న న్నోదార్చి నాకు తోడుపడే తగిన బంధువును (ఆప్తుడిని) నే నెట్లా వెదకి పట్టుకొనవలెనోగదా!

**విశేషం:** అలం: పర్యాయోక్తం. ప్రతిపాదంలోనూ 'ఒక్కొ' - అను మాటను ఆవృత్తం చేయటం చేత పద్యంలో శాబ్దికమైన సమత ఏర్పడింది. స్త్రీ జీవితంలో క్రమబద్ధమైన పరిణామాలు - పుట్టడం, నామకరణం, వివాహమాడటం, అత్తగారింటికి వెళ్ళటం - అనే విషయాలు-ఇవి పద్యంలో క్రమంగా పేర్కొనబడ్డాయి. దానివలన అర్థసంబంధమైన సమతకూడ సిద్ధించింది. పైగా స్త్రీ జీవితంలోని ఆనుపూర్వి పాటించబడింది. ఇది తిక్కన పద్య శిల్పంలోని రహస్యం. ఈమె ఎవరికూతురో, ఈమె పేరేదో, ఈమె భర్త ఎవరో, ఈమె ఇల్లు ఏదో అనక, వాటినే భంగ్యంతరంగా చెప్పటం వలన అలంకారం పర్యాయోక్తం. దానిచేత ఆయా వాటి ఔన్నత్యం ద్యోతకమవుతున్నది.

**చ.** **అని యని యుగ్గడించు, ధృతి యల్లల నాడినఁ దల్లడించుఁ బై**
**కొను తలపోఁత నించు, మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు, నె**
**ట్టన తెగ నగ్గలించు, నచటన్ జనులం బరికించు, బుద్ధి దూ**
**లిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁడై.** 31

**ప్రతిపదార్థం:** మనోజ, వికార, మగ్నుఁడు+ఐ= (కీచకుడు) మన్మథుడి వలన మనసులో కలిగిన భావవికారాలలో మునిగినవాడై (మదనభావావేశపరుడై); అని+అని= మాటిమాటికి (ఈ విధంగా పెక్కుసార్లు); ఉగ్గడించున్= ప్రశంసిస్తాడు; ధృతి= మనోధైర్యం; అల్లన్+అలన్+ఆడినన్= చలిస్తే; తల్లడించున్= కలవరపడతాడు; పైకొను= క్రమ్ముకొని వచ్చే; తలపోఁతన్= ఆలోచనచేత; ఇంచున్= సంతోషిస్తాడు; మదిన్= మనస్సులో; కోర్కులు పేర్చినన్= కోరికలు పెల్లుబ్బగా; అప్పళించున్= తమకిస్తాడు; నెట్టన= అనివార్యంగా, అధికంగా; తెగన్+అగ్గలించున్= తెగించటానికి ఉత్సాహం ప్రదర్శిస్తాడు; అచటన్= అక్కడి; జనులన్= మనుష్యులను; పరికించున్= చూస్తాడు; బుద్ధి+తూలినన్= మనస్సు కలవరపడగా; వెసన్+ఎంతయున్= వెంటనే మిక్కిలిగా; కళవళించున్= తికమక పడతాడు, తల్లడిల్లుతాడు.

**తాత్పర్యం:** రతిభావతీవ్రతచేత కీచకుడు మన్మథ వికారాలకు లోనయ్యాడు. ద్రౌపదీ సౌందర్యాన్ని గురించి అన్నమాటే అంటూ అనేక విధాలుగా ప్రశంసిస్తూ మాట్లాడసాగాడు. ముంచుకొని వచ్చే ఎన్నో వలపు తలపులకు సంతోషించసాగాడు. మనసులో కోరికలు పెల్లుబికితే తట్టుకొనలేక తమకించేవాడు. వారించటానికి వీలులేని ఉద్రేకంతో ఎంతకైనా తెగించటానికి ఉత్సహించేవాడు; తనను (వింతగా) చూస్తున్న జనులను తేరిపార చూచేవాడు. మతి తప్పినట్లు కాగా వెంటనే ఎంతో తల్లడిల్లేవాడు.

**విశేషం:** 26వ పద్యం నుండి 30వ పద్యం వరకు తిక్కన కీచకుడి వాచికాభినయాన్ని కళాసుందరంగా వ్యక్తీకరించాడు. ఈ పద్యంలో ఆంగికాభినయాన్ని అభినయబంధురంగా ఆవిష్కరించాడు.

1. మదన వికార చేష్టలను వర్ణించటంలో ఇంతటి మధురమైన పద్యం తెలుగులో అంతవరకు వెలువడలేదు. తిక్కన వాడిన విశేషణాలూ, క్రియలూ; రమణీయార్థ ప్రతిపాదకాలు. ఉదాహరణకు - 'మనోజ వికార మగ్నుఁడై' అనే విశేషణం గమనిద్దాం. మనోజ= మనస్సునుండిపుట్టిన; మన్మథ సంబంధమైన - అనిన్నీ; వికార= భావాలలో, చేష్టలలో అనిన్నీ చెప్పుకొనవచ్చును. వికార శబ్దాన్ని లాక్షణికులు భావపరంగానూ, చేష్టాపరంగానూ వాడతారు. భావాలంటే సంచారి భావాలు. భావాల వలన వాటికి అనుగుణమైన అనుభావలు (చేష్టలు) జనించటం నాట్యంలో, జీవితంలో గమనిస్తాం. ఇక్కడ తిక్కన ఆ రహస్యాన్ని కళామయంగా శ్లేషలో నిబంధించాడు. అందువలన ఈ పద్యంలోని భావాలనూ, చేష్టలనూ వివేచించటం వివేకం.

2. మన్మథావస్థలలో మూడవదైన సంకల్పంలో రతిభావం ఉత్కటావస్థకు చేరుతుంది. అంటే స్థాయి గౌరవాన్ని పొందుతుంది. ఆ సమయంలో సంచారి భావాలతో రతిభావాన్ని పోషించే ప్రక్రియను తిక్కన చేపట్టటం సార్థక రసాభ్యుదయ శిల్పం. నాలుగు పద్యాలలో సంచారిభావ సమున్మేషాన్ని చిత్రించిన తిక్కన ఇందులో చేష్టలను చిత్రించి ఆ అంశానికి ఒక సమగ్రతను సాధించాడు.

3. మనోజ వికార మగ్నుడైనవాడు ప్రదర్శించే చేష్టలు అప్రయత్నకృతాలు కావటం చేత సాత్త్విక భావాలవంటివి. భావాలని పేరుపెట్టినా సాత్త్వికభావాలు సహజభావాభివ్యక్తులైన చేష్టలే. తిక్కన ఆ చిత్రణను అపూర్వంగా ఈ పద్యంలో నిర్వహించాడు.

(1) పదే పదే ద్రౌపది సౌందర్యాన్ని ప్రస్తావించి ప్రశంసించటం ప్రలాపం. (ఇది వాఙ్మయ చేష్ట).

(2) ఆమె తనను అంగీకరిస్తుందో లేదో అనే అనుమానంతో మనోనిగ్రహం చలించగా అతడు తబ్బిబ్బు పడిపోయేవాడు. (తల్లడిల్లటం భావానుగుణమైన చేష్ట).

(3) వలపు తలపులు ముప్పిరికొంటూంటే దానికి సంతోషించటం తన్మయత్వభంగిమ (చేష్ట).

(4) కోర్కెలు పిచ్చటిల్లుతూ ఉంటే తట్టుకోలేక అప్పళించటం (చేష్ట).

(5) కోర్కెలు అనివార్యం కాగా, తెగించి ఆమెను దరిచేరటానికి ఉత్సహించటం (చేష్ట).

(6) ఆవేశంతో ఆమెవైపు పోతే చూచేవా రేమనుకొంటారో అనే అనుమానంతో జనంవైపు చూడటం (చేష్ట).

(7) వలపు తలపులతో మతిచలించినంత మనోవేదన పడుతూ నిస్సహాయస్థితిని వ్యక్తం చేయటం కళవళింత (చేష్ట).

రసాభ్యుదయం భావానుభావ పరిణామ క్రమంతో వ్యక్తీకరించటంలో ప్రకాశిస్తుంది. ఉగ్గడించు, తల్లడించు, తలపోఁతనించు, అప్పళించు, అగ్గలించు, పరికించు, కళవళించు - క్రియలను వాడి అచ్చతెనుగు క్రియలకున్న అర్థశక్తిని తిక్కన ప్రదర్శించటం ఆయన కవితా శిల్ప విశేషం.

(4) అలం: సముచ్చయం. ఏకకాలంలో అనేక కార్యాలు జరిగినట్లు వర్ణించబడటం సముచ్చయాలంకార లక్షణం. దానికీ పద్యం హృద్యమైన ఉదాహరణ. (సంపా.)

**క. మాసిన చందముఁ దనుఁ గని। రోసిన డెందంబుఁ గల తరుణి నెఱుఁగఁడ బి**
**ట్టేసిన మదనునిచే ధృతి। వాసిన బెగడొందు సింహబలుఁ డట్టియెడన్. 32**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయలో; బిట్టు+ఏసిన= తీవ్రంగా బాణాలతో కొట్టిన; మదనునిచేన్= మన్మథుని చేత; ధృతి+పాసిన= ధైర్యాన్ని కోల్పోగా; బెగడొందు= కలతచెందే; సింహబలుఁడు= కీచకుడు; మాసిన చందమున్= కాంతి తరిగిన విధంగా ఉన్నా; తనున్+కని రోసిన= తనను చూచి అసహ్యించుకొనే; డెందంబున్+కల= మనస్సుగల; తరుణిన్+ఎఱుఁగఁడు+అ= ద్రౌపది మనస్సు తెలిసికొనలేకపోయాడు.

**తాత్పర్యం:** మన్మథ వికారానికి లోనైన ఆ కీచకుడు ఆ సమయంలో నిబ్బరాన్ని కోల్పోయి ఉండటం చేత ద్రౌపది మాసిన దుస్తులలో కళావిహీనంగా ఉన్నా, తనను చూచి అసహ్యించుకొంటున్నా ఆమె మనస్సును గ్రహించలేకపోయాడు.

**విశేషం:** తిక్కన సందర్భాన్ని బట్టి ఒక్కొక్క సంచారిభావాన్ని ఒక్కొక్క పద్యంలో వర్ణించి రసాభ్యుదయోల్లాసాన్ని కలిగించే కావ్య రస శిల్పాన్ని ప్రదర్శిస్తాడు. సంకల్పమనే మదనావస్థలో ఉన్న కీచకుడి చిత్తవృత్తికి పోషకంగా ఈ పద్యంలో మోహమనే సంచారి భావాన్ని తిక్కన పోషించాడు. "భయ వియోగాది ప్రయోజ్యా వస్తుతత్త్వానవధారణీ చిత్తవృత్తి ర్మోహః" అని లక్షణం. రక్తుడైన కీచకుడు మోహావిష్టుడు. అందువలన ద్రౌపది కాంతిహీనంగా ఉన్నా, తనను మనసులో ఏవగించుకొంటున్నా ఆమె మనస్తత్త్వాన్ని (వస్తుతత్త్వాన్ని) వివేచించే స్థితిలో లేడు. దుర్విదగ్ధుడి విశిష్ట లక్షణమిది. (సంపా.)

**సీ.** **వెఱవక ననుఁ జూచె వీఁడని యెదఁ గలు। షించిన నొండొండ చెమట వొడమ,**
**ననుచితకృత్యంబు లాచరించు విధాతృ। బలిమికి నివ్వెఱపాటు దోఁప,**
**నిచ్చట దిక్కులే రెవ్వరు నా కను। భయమున మేనఁ గంపంబు పుట్టఁ,**
**జేయంగ నేమి యుపాయంబు లేమి నా। ననమున వెల్లఁదనంబు గదుర**

**తే.** **నున్న పాంచాలిఁ గనుఁగొని యన్నరాధ। ముఁడు వివేక విహీనుఁడై ముదితుఁ డగుచు**
**మదనవికృతియకాఁ దన మదిఁ దలంచి। రాగసాగరపూర నిర్మగ్నుఁ డయ్యె.** **33**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఇతడు, కీచకుడు; వెఱవక= భయపడక, వెనుకాడక; ననున్+చూచెన్+అని= నన్ను చూచాడని; ఎదన్= హృదయంలో; కలుషించినన్= కలతబారటం చేత; ఒండు+ఒండ= క్రమక్రమంగా; చెమట+పొడమన్= (ఒడలంతా) చెమటపట్టగా; అనుచితకృత్యంబులు= ఒప్పని పనులు; ఆచరించు= చేసే; విధాతృబలిమికిన్= బ్రహ్మదేవుని శక్తికి, విధి బలీయతకు; నిండు+వెఱపాటు+తోఁపన్= (మిక్కలి భయం వలన కలిగే) నిశ్చేష్టత ప్రకటితం కాగా; నాకున్= (ద్రౌపదికి); ఇచ్చటన్= ఇక్కడ; ఎవ్వరున్= ఎవరూ; దిక్కులేరు= రక్షించేవారు లేరు; అనుభయమునన్= అనే భయంతో; మేనన్+కంపంబు+పుట్టన్= శరీరంలో వణకు పుట్టగా; చేయంగన్= చేయటానికి (ఆ విపత్తు నుండి తప్పించుకొనటానికి); ఏమి+ఉపాయంబు= ఎటువంటి ఉపాయమూ; లేమిన్= లేకపోవటం చేత; ఆననమునన్= ముఖంపై; వెల్లన్+తనంబు= వెలవెలబాటు; కదురన్= కలుగగా; ఉన్న పాంచాలిన్= ఉన్నటువంటి ద్రౌపదిని; ఆ+నర+అధముఁడు= ఆ నీచుడు; కనుఁగొని= చూచి; వివేకవిహీనుఁడు+ఐ= ఇది మంచి, ఇది చెడు అని విడమరచి తెలిసికొనే తెలివి కోల్పోయినవాడై; ముదితుఁడు+అగుచున్= (తనలో తాను) సంతోషిస్తూ; మదన వికృతి+అ కాన్= (ద్రౌపది ప్రకటించిన సాత్త్వికభావాలను) మన్మథవికారముగా (శృంగార చేష్టలుగా); తలంచి= తలపోసి; రాగసాగరపూర= అనురాగం (వలపు) అనే సముద్రపు నీటిలో; నిర్మగ్నుఁడు+అయ్యెన్= మునిగిపోయాడు.

**తాత్పర్యం:** ఈ కీచకుడు నన్ను జంకుగొంకులు లేకుండా చూస్తున్నాడే అని ద్రౌపది మనసులో కలత పడింది. దానివలన ఆమె శరీరం నిండా అంచెలంచెలుగా క్రమంగా చెమటపట్టింది. 'బలమైన ఆ విధి నా పట్ల ఎప్పుడూ ఉచితంగాని పనులే ఎందుకు చేస్తాడో? వాటిని తప్పించుకొనటం ఎట్లా?' అనే భావం తోచగానే ఆమె నిశ్చేష్టురాలై పోయింది. ఈ సమయంలో నా కెవ్వరూ ఇక్కడ దిక్కులేరనే భయం కలిగేసరికి ఆమె శరీరంలో వణకు పుట్టింది. ఈ అపాయాన్ని తప్పించుకొనటానికి ఏ ఉపాయమూ లేదనిపించటం చేత ఆమె ముఖం వెలవెలపోయింది. ఇటువంటి భయహావభావాలను ప్రదర్శిస్తున్న ద్రౌపదిని నీచుడూ, వివేకరహితుడూ అయిన కీచకుడు పరిశీలించాడు. ఆమె ప్రకటిస్తున్న భయసాత్త్విక భావాలన్నీ తనపై వలపుచేత ప్రదర్శిస్తున్న చేష్టలని భావించి లోలోన మురిసిపోతూ క్రమంగా వలపు మున్నీట మునిగిపోయాడు.

**విశేషం:** 1. తెలుగు సాహిత్యంలో ఈ పద్యం ఒక అపూర్వ ప్రయోగం. పై సీసంలోని నాలుగు పాదాలలో వరుసగా స్వేదం, స్తంభం, వేపథువు, వైవర్ణ్యం అనే సాత్త్విక భావాలు వర్ణించబడ్డాయి. సాత్త్విక భావాలంటే భావాలు కావు. సమాహిత చిత్తం నుండి అప్రయత్నంగా వెలువడే చేష్టలు. తిక్కన ద్రౌపదిలో భయాన్నీ, కీచకుడిలో రతిభావాన్నీ ఈ సందర్భంలో పోషించాలి. రతి భావానికి శృంగార విభావం కావాలి. ద్రౌపది అందంగా ఉన్నదే కాని భయవిహ్వలురాలై ఆ భావాన్ని వ్యక్తం చేసే సాత్త్విక భావాలను ప్రకటిస్తున్నది. అంచెలంచెలుగా చెమటపోయటం, నిశ్చేష్టురాలై పోవటం, శరీరం వణకటం, ముఖం వెలవెలపోవటం అనేవి భయభావం వలన కలిగే సాత్త్వికభావాలు. వీటినే శృంగార రసపరంగా రతిభావజనకాలైనవిగా కీచకుడు భ్రమించినట్లు తిక్కన చిత్రించాడు. విరుద్ధ రసభావాల నడుమ సాత్త్విక భావాలు సమంగా ఏ విధంగా ఉండటానికి వీలుంటుందో తిక్కన సూక్ష్మబుద్ధితో వివేచించి కవితలో ఆవిష్కరించాడు. సాత్త్వికభావా లొక్కటైనా విరుద్ధభావాలకు అనుగుణంగా వ్యాఖ్యానించే కావ్య రసమర్మం ఈ పద్య శిల్పం. ఇది అసాధారణం.

2. 'కామీ స్వతాం పశ్యతి' - అని కాళిదాసోక్తి, భయభావ జనితమైన సహజ చేష్టలను రతిభావావిష్టుడైన కీచకుడు తన కనుకూలంగా వ్యాఖ్యానించుకొన్నాడు. నాయకుడు సూటిగా నాయికవైపు చూస్తే లజ్జాతిశయం వలన కలిగిన బెరుకు చేత చెమటపోయటం శృంగార రసంలో సహజం. నాయక సాన్నిహిత్యం వలన కలుగబోయే పరిణామాలను భావించి చేష్టలుడిగి అతడికి వశం కావటం స్తంభంగా అతడికి భాసించింది. ప్రథమ సమాగమ భీతిచేత శరీరం కంపించటం ముగ్ధకు సహజం. అంతకాలం నిబ్బరంగా ఉండి నాయకుడికి అంతలోనే వశమై పోతున్నందుకు తన బలహీనతకు తానే తెల్లబోవటం నైజం. కీచకుడు ఆమెను గురించి అట్లా భావిస్తే పఠిత అతడు నీచు డనుకొంటాడు; వివేకవిహీను డనుకొంటాడు - తిక్కన సహృదయుడి ప్రతిస్పందనకు ప్రతిబింబంగా 'అన్నరాధముడు, వివేకవిహీనుడు' అని విశేషణాలు వాడాడు. సామాజిక నిష్ఠమైన కావ్యరస పోషణ తెలిసిన కవి చేసే పని ఇది. భయసాత్త్విక భావాలను, రతి కనుకూలంగా ఎందుకు భావించాడు? అంటే - అతడు రాగసాగర పూర నిర్మగ్నుడైనాడు కాబట్టి. రాగరసం శృంగార రసంగా చెప్పటానికి వీల్లేదు. కాని రసాభాసానికి "ఏకత్రైవానురాగశ్చేత్"అనే శ్లోకంతో ఉన్న ప్రతాపరుద్రీయ నిర్వచనం ప్రసిద్ధం. అటువంటి అనురాగమే ఈ రాగం. ఒక విధంగా అది ఆభాస సూచకంగా తిక్కన వాడాడేమో! రసాభాస శిల్పంలో వాడదగిన రసవదలంకార శిల్పంగా తిక్కన భావించాడేమో! రాగసాగరమన్నప్పుడు రూపకం రాణించింది. సాగరమగ్నుడైన కీచకుడు అకారణంగా మరణించనున్నాడని ధ్వని అనుగమ్యమానమౌతున్నది (సంపా.)

**వ. అయ్యవసరంబున. 34**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**చ. పొలఁతుక కాంతి యింత పొలివోవఁగనీ కెసలారఁ దార ని**
**శ్చలతఁ గడంగి క్రోలికొనఁజాలుటఁ గీచకముఖ్యు లోచనం**
**బులు 'నయనం ప్రధాన' మను పూర్వవచస్స్థితి తప్పకుండఁగా**
**నెలమి వహించెఁ దక్కుఁ గల యింద్రియ వర్గము ధిక్కరించుచున్. 35**

**ప్రతిపదార్థం:** పొలఁతుక= ద్రౌపది యొక్క; కాంతి= శోభ; ఇంత పొలివోవఁగన్+ఈక=కొంచెంకూడా వృథా కాకుండా; ఎసలారన్= ఒప్పారగా; తార నిశ్చలత= కంటి చూపు (కనుగుడ్లను) తదేకంగా నిలిపి; కడంగి= పూని; క్రోలికొనన్+చాలుటన్= చూపులతో జుర్రుకొన గలగటం చేత; తక్కున్+కల= మిగిలిన; ఇంద్రియవర్గమున్= కన్నులు తప్ప మిగిలిన ఇంద్రియ సముదాయాన్ని; ధిక్కరించుచున్= తిరస్కరిస్తూ; కీచకముఖ్యు= కీచకులలో శ్రేష్ఠుడైన సింహబలుడి యొక్క; లోచనంబులు= కళ్ళు; 'నయనం ప్రధానం'= కళ్ళు ముఖ్యమనే; పూర్వవచఃస్థితి= పాతకాలపు సూక్తి, సామెత; తప్పకుండఁగాన్= పొల్లుపోకుండా నిజంచేసే విధంగా; ఎలమి వహించెన్= ప్రీతిని పొందాయి.

**తాత్పర్యం:** ద్రౌపది శరీర సౌందర్య శోభ కొంచెం కూడా వృథా కాకుండా రెప్పపాటు లేని చూపులతో జుర్రుకొందామనే తపనతో తదేకంగా ఆమెనే చూస్తున్న కీచకుడి కన్నులు **"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం"** అనే నానుడిని నిజంచేసే విధంగా ప్రీతిని పొందాయి.

**విశేషం:** అలం: నిరుక్తి, లోకోక్తి, వ్యుత్పత్తి వలన నామాలకు అన్యార్థాన్ని కల్పిస్తే నిరుక్త్యలంకారం. **'సర్వస్య గాత్రస్యశిరః ప్రధానం; సర్వేంద్రియాణాం నయనం ప్రధానం'** అని ప్రసిద్ధమైన సూక్తి. దీనికి సమాహార రూపం **'నయనం ప్రధానం'.** ఆ మాత్రం అంటే ఆ సూక్తి అంతా లోకుల మనస్సులలో స్ఫురిస్తుంది. లోచనం, నేత్రం అనే శబ్దాలు వాడితే సరిపోయేచోట నయన శబ్దాన్ని వాడి తిక్కన చమత్కరించాడు. నీయతే అనేన ఇతి నయనం- అని గురుబాల ప్రబోధిక. దీనిచేత అర్థాలు పొందించబడతాయి కాబట్టి నయనం. కీచకుడి చూపు తన కామ్యార్థ సిద్ధి కొరకు ఉపయోగించిన సాధనం అని దృక్కోలనంతో ఉత్కట మదనావస్థగా తిక్కన వ్యాఖ్యానించాడు. అందువలన నిరుక్త్యలంకారం భాసించింది. అందాన్ని కన్నులతో జుర్రుకోవటం అనే తెలుగు లోకోక్తిని వర్ణనంలో కలిపి చెప్పటం వలన లోకోక్త్యలంకారం. జాగరమనే మదనావస్థను కూడా ఈ సాత్త్వికభావం ధ్వనింప చేస్తున్నది. రాగ సాగర పూర నిర్మగ్నుడైన కీచకుడు రెప్పపాటులేని చూపును ప్రదర్శిస్తున్నాడంటే - నీట మునిగి చనిపోయిన వాడి స్థితి స్ఫురించి భావికథార్థం అలంకార ధ్వనితో పోషించబడిన రసధ్వనిగా గమ్యమానం ఔతున్నది.(సంపా.)

**క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ। దప్పక కనుఁగొనుచునుండఁ దగవేది కరం**
**బొప్పని తమకము చిత్తముఁ। గప్పికొనుట నుత్తలంబు గదురఁగ నచ్చోన్.** **36**

**ప్రతిపదార్థం:** తనున్= కీచకుడిని; ఆ+చోటన్ - అచ్చోన్= అక్కడ; అప్పయున్= అక్క; సుదేష్ణాదేవి; పరిజనములున్= చుట్టూ ఉన్న పరిచారికలూ; తప్పక= విడవక, అదేపనిగా; కనుఁగొనుచున్+ఉండన్= గమనిస్తూ ఉండగా; తగవు+ఏది= మర్యాద లేకుండా; కరంబు= మిక్కిలి; ఒప్పని= తగని, భరించరాని; తమకము= మోహం; చిత్తమున్= మనస్సును; కప్పికొనుటన్= ఆవరించటం చేత; ఉత్తలంబు= కలతతో కూడిన వేగిరపాటు; కదురఁగన్= కలుగగా, అతిశయించగా.

**తాత్పర్యం:** తన అక్క అయిన సుదేష్ణాదేవి, ఆమె చుట్టూ ఉన్న పరిచారికలూ తనవైపే చూస్తూ ఉన్నా, మర్యాద లేకుండా కీచకుడు మిక్కిలి మించిన తగని మోహం మనస్సును ఆవరించటం చేత ఆపలేని వేగిరపాటును అధికంగా పొందుతూ అక్కడ. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** శృంగార దశవిధావస్థల వలెనే అష్టాదశ శృంగార చేష్టలు కూడ చెప్పబడ్డాయి. సాహిత్య దర్పణకారుడు వాటిని ఇరవై ఎనిమిదిగా పేర్కొన్నాడు. అవి నాయికా నాయకులకు సత్త్వజాలైన అలంకారాలని చెప్పాడు. వాటిలో మూడు మనస్సు వలన పుట్టేవనీ, ఏడు అయత్నంగా పుట్టేవనీ, పదునెనిమిది స్వభావం వలన కలిగేవనీ విశ్లేషించి చెప్పాడు. స్వభావజాలైన శృంగార చేష్టలలో 'తపన' అనేది ఒకటి. **"తపనం ప్రియ విచ్ఛేద స్మరావేగోత్థ చేష్టితం"** అని దాని లక్షణం. ప్రియ విరహ సమయంలో మోహాతిరేకం చేత కలిగే చేష్ట తపన. ఇది ఇక్కడ కీచకపరంగా తిక్కన చిత్రించాడు. ఇక్కడ పూర్వరాగ విరహావస్థలో కీచకుడి మోహాతిశయావస్థ వలన వేగిరపాటు, కలతపాటు అనే చేష్టావిశేషాలు సూచించబడుతున్నాయి. తరువాతి పద్యంలో దాని అభినయాంశ వివరించబడింది. తిక్కన నాటకీయ రచనలో సూక్ష్మంగా వివరించే రసభావాభినయ శిల్ప ప్రౌఢిని ఈ పద్యం. తరువాతి పద్యం ప్రదర్శిస్తున్నాయి. (సంపా.)

**సీ. తన్వంగి మవ్వంపుఁ దనులత నెసఁగెడు। నునుఁగాంతి వెల్లువ మునుఁగఁబాఱఁ,**
**గిసలయహస్త కెంగేల నేపారు క్రొ। మ్మిం చను లేయెండ మిగులఁ బర్వఁ,**
**గమలాస్య ముద్దు మొగంబు లేమెఱుఁగుల। మొత్తంబు పరి చుట్టు ముట్టికొనఁగ,**
**ధవళాక్షి తొంగలి తఱచు ఱెప్పల చెన్ను। కప్పను చీఁకటి గవియుదేర,**

**తే.** **బెగ్గలం బంత కంతకు నగ్గలింప । నొదవు చెమటతోఁ జిత్తంబు చెదరి యెందు**
**మెలఁగఁ దలఁపేది యా సింహబలుఁ డనంగు । పట్టి యాడెడు జంత్రంబు పగిది నుండె.** **37**

**ప్రతిపదార్థం:** తను+అంగి= సన్నని మేనుగల సైరంధ్రి (ద్రౌపది) యొక్క; మవ్వము+తనులతన్= కోమలమైన లతవంటి శరీరం పై; ఎసఁగెడు= ప్రకాశించే; నును+కాంతి వెల్లువ= లలితమైన కాంతి అనే వరద; మునుఁగన్+పాఱన్= (కీచకుడు) మునిగిపోయేటట్లు ప్రవహించగా; కిసలయహస్త= చిగురాకులవంటి చేతులు గల ఆ సుందరి యొక్క; కెంపు+కేలన్= ఎర్రని చేతిలో; ఏపు+ఆరు= అతిశయించే; క్రొత్త+మించు+అను= క్రొత్త మెరుపుతీగఅనే; లేత+ఎండ= లేత ఎండ; మిగులన్+పర్వన్= మిక్కుటంగా వ్యాపించగా; కమల+ఆస్య= పద్మం వంటి మొగం గల సైరంధ్రి (ద్రౌపది) యొక్క; ముద్దుమొగంబు= అందమైన ముఖం యొక్క; లేఁత+మెఱుంగులు= నునుకాంతుల; మొత్తంబు= సమూహం అనే; పరి= సేన; చుట్టుముట్టికొనఁగన్= చుట్టూమూగి ఆవహించగా; ధవళ+అక్షి= తెల్లని కన్నులు గల ఆమె యొక్క; తొంగలి= వాలే; తఱచు= దట్టమైన; ఱెప్పల చెన్ను కప్పు= కనురెప్పల అందమైన నల్లని కాంతి; అను చీఁకటి= అనే చీకటి; కనియున్+తేరన్= క్రమ్ముకోగా; బెగ్గలంబు= భయం; అంతకున్+అంతకున్+అగ్గలింపన్= మరీ మరీ అధికంకాగా; ఒదవుచెమటతోన్= పుట్టే చెమట చేత; చిత్తంబు చెదరి= మనసు చెదిరిపోయి; ఎందున్+మెలఁగన్= ఎక్కడా నిలవటానికి; తలఁపు+ఏది= మనసురాక; ఆ సింహబలుఁడు= ఆ కీచకుడు; అనంగు పట్టి+ఆడెడు= మన్మథుడు పట్టి ఆడించే; జంత్రంబు పగిదిన్= యంత్రం వలె; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ సన్నని మేనుగల సైరంధ్రి యొక్క లేతతీగవంటి శరీరంనుండి పెల్లుబికే అందమైన వెలుగు వెల్లువవలె పొంగి అతడిని ముంచివేస్తుండగా; చిగురాకుల వంటి చేతులు గల ఆ సైరంధ్రి కెంపులవలె ఎర్రగా ఉన్న చేతుల నుండి అతిశయించి వెలువడే క్రొత్త మెరుపుల లేతయెండ అతడిపై మిక్కిలి వ్యాపించగా, కమలంవంటి మొగం కలిగిన ఆ సైరంధ్రి అందమైన ముఖం ప్రసరించే లలితమైనకాంతుల సమూహం అతడిపై కాంతి సైన్యం వలె విజృంభించి చుట్టుముట్టగా, తెల్లని కన్నులు గల ఆ వాలుగంటి యొక్క పెద్దవైన కనురెప్పలు అందమైన నల్లని కాంతితో అతడిపై చీకట్లు ముసిరేటట్లు చేయగా, ఆ సింహబలుడు (కీచకుడు) భయం (విహ్వాలం) అంతకంతకూ మనసులో అధికం కాగా, ఒంటినిండా పట్టే చెమటతో ఉక్కిరిబిక్కిరై మనసు చెదిరిపోయి, ఎక్కడా ఒకచోట ఉండటానికి మనసురాక, మన్మథుడు పట్టి ఆడించే ఒక యంత్రపు బొమ్మ వలె కనిపించాడు.

**విశేషం:** 1. అలం: ఉపమ (రూపకానుప్రాణితం), క్రమాలంకారం, సింహబలుడు మన్మథుడి చేతి కీలుబొమ్మవలె అత డాడించినట్లు ఆడుతున్నాడని అపూర్వమైన ఉపమాలంకారాన్ని చెప్పి కీచకుడి మదనావస్థను సహృదయుల హృదయాలకు ఆలంకారికంగా అందేటట్లు చేశాడు తిక్కన. కీచకుడికి 'బెగ్గలము' పుట్టి అంతకంతకు అగ్గలించిందట. బెగ్గలమంటే భయం, విహ్వలత, వివశత్వం, వ్యాకులత, కలత-అని సూర్యరాయాంధ్ర నిఘంటువు. తిక్కన తెలుగు పదం వాడితే దాని కెన్ని అర్థాలున్నాయో అన్నీ అక్కడ అన్వయించేటట్లు ప్రయోగించటం ఆయన ప్రౌఢి. సంస్కృత పదమైతే ఇన్ని అర్థాలు ఒక్కచోట కలిసిరావు. అందువలన 'బెగ్గలం' అనేది మోహాతిశయం వలన కలిగే శృంగార చేష్టలకు మూలమైన సాత్త్విక భావం. దానికి నాలుగు ముఖాలున్నాయి. నాలుగు అభినయాలున్నాయి. వాటిని తిక్కన క్రమాలంకార సుందరంగా ఈ పద్యంలో ఆవిష్కరించాడు. అది భావనామయం. 1. సన్నని తీవెవంటిసైరంధ్రిమేనుకాంతి మెరుపుతీగవలె మెరిసిపోతున్నది. దాని కాంతి వెల్లువవలె కీచకుడిని ముంచివేస్తున్నది. దానికి అతడు భయపడ్డాడు. భయంతో మొదలైన అతడి మానసికావస్థలు అంతటితో ఆగలేదు. ఆపైన మరికొన్ని పరిణామాలకు దారితీశాయి. ద్రౌపది శరీరాన్నంతా తేరిపార చూచినప్పుడు ఆమె శరీరకాంతి అతడి కొక విద్యుద్ఘాతం వలె బెడిసికొట్టింది. అందుకే ఆ భయం. కాని, ఆ అవస్థ మోహమగ్నుడైన అతడికి ఒక వివశత్వాన్ని కలిగించటానికి కారణమయింది. 2. ఆ తరువాత కరగ్రహణం కొరకు ఆమె చేతులను చూచాడు. చూస్తే చిగురుటాకుల వలె కెంపుల రంగును క్రుమ్మరిస్తూ మనోహరంగా ఉన్నాయి. కాని, ఆ కరకాంతులు లేయెండ చిరువేడిని పుట్టిస్తున్నాయి. అందుకు అతడికి చెమటపట్టింది. భయంవలన కలిగిన

సాత్త్వికభావం చెమటపట్టటం. దానికి కారణం ఆమె చేతులనుండి వెలువడే క్రొత్త మెరుపు లేయెండ అని చెప్పటం ఆలంకారికం. ఆమె చేతుల వలన అతడికి మిగిలేది బెదిరింపులే కాని ఆదరింపులు కావని ధ్వని. కాని, మోహమగ్నుడు కావటం చేత అతడు శృంగార విలాసంగా భ్రమించాడు. ఇది విహ్వలత లక్షణం. 3. ముద్దులాడి చేయిపట్టుకొన్న తరువాత రసికుడు ఆమె ముద్దుల మోమును ముద్దుపెట్టుకొనాలని భావిస్తాడు. అది అతడి తపనావస్థలోని స్వభావజమైన వేగిరపాటు లక్షణం. పద్మంవంటి అందమైన ఆమె ముఖంలో లావణ్యకాంతులు ఒక్కసారిగా అతడిని సైన్యం చుట్టుముట్టినట్లు క్రమ్ముకొని బెదిరించాయి. ఆ భావనలో అతడి మనసు చెదరిపోయింది. ఎటూ కదలటానికి వీలులేని బందీగా చిక్కిపోయాడు. ఇది వివశత్వ లక్షణం. 4. సైరంధ్రి సహజంగా ధవళాక్షి. విశాలమైన కన్నులలో కనుగ్రుడ్లకు కాంతినిచ్చే తెల్లదనం ఎవరి కళ్ళలో కనపడుతుందో ఆమె ధవళాక్షి. కళ్ళు తెరిస్తే సైరంధ్రి ధవళాక్షి. ఆమె చూపులలో చూపులుంచి. ఆ చూపులు తనపై నిలిచేటట్లు ఆమెను సమీపించాలని కీచకుడు ఆమె కళ్ళను చూచాడు. ఆమె భయంతో కనురెప్పలు చాలసార్లు మూస్తున్నది. అందువలన కనురెప్పల నూగారువలన ఏర్పడే నల్లనికాంతి చీకటిగా రేగి అతడిని ముంచివేస్తున్నది. ఆ చీకటిలో అతడికీ ఎటూ కదలాడే వీలులేక మనసు చెడి వ్యాకులపాటుతో (కలతతో) ఉండిపోయాడు. ఈ విధంగా 'బెగ్గలం' అనే మాటను కీచకుడు సార్థకం చేశాడు. క్రమాలంకారాన్ని పోషించాడు. సీసపద్యంలోని పూర్వార్థంలో ఉపమను, ఉత్తరార్థంలో రూపకాన్ని సమాసాలలో నిబంధించటం రూపకంతో ఉపమకు వన్నెతెచ్చే అలంకారశిల్పం.

2. తిక్కన సమాంతర తుల్య పద్య శిల్ప నిర్మాత. ఈ పద్యం "వెఱవకు నను౯ జూచె వీ౯డని యెద౯ గలుషించిన నొండొండ చెమట వొడమ" (33వ పద్యం) అనే పద్యానికి ప్రతిరూప శిల్పం. అక్కడ ద్రౌపదికి భయం వలన కలిగిన సాత్త్విక భావాలు వర్ణించాడు. ఇక్కడ కీచకుడికి భయం వలన కలిగిన శృంగార సాత్త్విక స్వభావ చేష్టలు వర్ణించాడు. కీచకుడికి భయకారకమైనది సైరంధ్రి (ద్రౌపది) యొక్క కాంతి గుణం. అది శరీరంలో, చేతులలో, ముఖంలో, కన్నులలో వివిధ రీతులలో ప్రసరించి కీచకుడిని వివిధావస్థలకు గురిచేయించింది. ద్రౌపది పతివ్రతా ప్రభావాన్ని తిక్కన ఆమెలో కాంతిగా నిలిపి, మోహపరవశుడైన కీచకు౯ డా కాంతికి భీతుడు, వివశుడు, క్షుబ్ధుడు, నిశ్చేష్టుడు అయినట్లు ధ్వనింప చేయటం రసధ్వని. శ్రీనాథు డన్నట్లు ఇది 'రసాభ్యుచితబంధం'. (కాశీఖండము 1.13)

4. 'అనంగు పట్టియాడెడు జంత్రంబు పగిదినుండె' - (వ్యావి.) - ధాతుజ విశేషణ పూర్వావ్యవహితకర్తృ ప్రథమకు తఱచుగ యొక్క షష్ఠి ఔతుంది - అన౯గుని యొక్క పట్టి ఆడు జంత్రమని అర్థం. 'యొక్కకు లోపంబు బహుళంబు". అనే సూత్రంచేత యొక్క లోపించి 'అనంగుపట్టియాడెడు..' అని ప్రయోగించబడింది. (సంపా.)

### కీచకు౯డు సుదేష్ణవలన ద్రౌపదితెఱం గెఱుంగ౯ గోరుట (సం.4.13-5)

**వ. ఇట్లు కందర్పదర్ప గోచరుండైన కీచకుండు నిజసహోదరివలన నక్కోమలి కలరూపు తెలియందలంచి దాని దెసం దగిలిన దృష్టి యెట్టకేలకుం దిగిచికొని చని యద్దేవికిం బ్రణమిల్లిన. 38**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; కందర్పదర్పగోచరుండు+ఐన= మన్మథుని గర్వానికి గురి అయినవాడు; కీచకుండు; నిజసహోదరి వలనన్= తన అక్క సుదేష్ణ వలన; ఆ+కోమలి కలరూపు= ఆ వనిత (సైరంధ్రి) యొక్క వాస్తవ పరిస్థితిని; తెలియన్+తలంచి= తెలిసికొనవలెనని భావించి; దానిదెసన్= ఆమె పట్ల; తగిలిన= తగుల్కొనిన; దృష్టి= చూపును; ఎట్టకేలకున్= చిట్టచివరకు ఎట్లాగో; తిగిచికొని= వెనుకకు మరలించికొని; చని= వెళ్ళి; ఆ+దేవికిన్= ఆ రాణికి; ప్రణమిల్లినన్= నమస్కరించగా.

**తాత్పర్యం:** మన్మథ ప్రభావానికి గురిఅయిన కీచకుడు తన అక్క సుదేష్ణ నడిగి సైరంధ్రిని గురించిన వాస్తవాలను తెలిసికొనాలనే కోరికతో, ఎట్టకేలకు సైరంధ్రిపై నుండి దృష్టి మరలించి అక్కను సమీపించి ఆమెకు నమస్కారం చేశాడు.

**విశేషం:** నిర్వ్యాజంగా అక్కకు భక్తితో మ్రొక్కటానికి వచ్చిన కీచకుడు ఇప్పుడు సవ్యాజంగా సైరంధ్రి వివరాలు తెలిసికొనటానికి నమస్కరించాడు. 'సంకల్పం' అనే మదనావస్థను ఫలవంతం చేసికొనటానికి అతడికి ఇది ఒక ఉపాయంగా ఉపయోగపడింది.

**క. కాంచన పీఠము వెట్టఁగఁ। బంచి ప్రియము చూడ్కి ముసుఁగువడఁ దను సంభా**
**వించునెడ నాతఁ డప్పకుఁ। బాంచాలిం జూపి వేగపడి యిట్లనియెన్. 39**

**ప్రతిపదార్థం:** కాంచన పీఠము= బంగారు గద్దెను; పెట్టఁగన్= ఉంచటానికి; పంచి= పరిచారికలను ఆజ్ఞాపించి; ప్రియము= తమ్ముని మీది ప్రేమ; చూడ్కిన్= చూపులో; ముసుఁగుపడన్= క్రమ్ముకొనగా; తనున్= (కీచకుని); సంభావించు+ఎడన్= ఆదరించే మాటలు మాట్లాడేటప్పుడు; అతఁడు= కీచకుడు; అప్పకున్= అక్కకు; పాంచాలిన్= ద్రౌపదిని; చూపి= చూపించి; వేగము+పడి= త్వరపడి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సుదేష్ణ తమ్ముడి కొరకు పరిచారికలను పురమాయించి బంగారు గద్దెను వేయించింది. ప్రీతితో నిండిన చూపులతో తమ్ముడిని ముంచెత్తింది. అనువైన విధంగా మర్యాదగా మాటలాడటం మొదలుపెట్టింది. కాని, అతడు ఆమె మాటలు పట్టించుకొనక తొందరపడి ద్రౌపది వైపు చేయి చూపిస్తూ అక్కతో ఇట్లా పలికాడు.

**విశేషం:** దృఙ్మీలనం, మనస్సంగమం, సంకల్పం అనే మదనావస్థలను పొంది వివశుడైన కీచకుడు ద్రౌపదిని కనుకలితో వలచాడు, ఇప్పుడు వినుకలితో దానిని పెంపొందింప దలచుకొన్నాడు. నడుమ ఎట్టి విఘాతాన్నీ అతడు సహించేటట్లు లేడు. సుదేష్ణ చెప్పే మాటలు వలపునకు పరోక్ష పోషకాలు, ద్రౌపది మాటలు ప్రత్యక్ష పోషకాలు. వాటినే వినదలచుకొని లౌకిక ప్రసంగాలపట్ల అరుచిని ప్రదర్శించాడు. ఇది సంకల్పంలోని వినుకలి ప్రారంభదశ. (సంపా.)

**ఉ. 'ఇయ్యరవిందగంధి కుల మేమి? చరిత్రము చంద మెట్లు? పే**
**రెయ్యది? నాథుఁ డెవ్వఁ? డిది యెచ్చట నెప్పుడు నుండు? నిప్డు దా**
**నియ్యెడ కేఁగుదేవలయు టేపని సేయఁగఁ బూని? దీనిపై**
**నెయ్యము కల్మి యేకొలఁది నీ మది? కింతయు నాకుఁ జెప్పుమా!' 40**

**ప్రతిపదార్థం:** ఈ+అరవిందగంధి= (పద్మగంధం వంటి మేని వాసనగల) ఈ వనిత యొక్క; కులము= వంశం, జాతి; ఏమి?= ఏమిటి?; చరిత్రము చందము= నడవడిక పద్ధతి; ఎట్లు?= ఎటువంటిది?; పేరు= నామం; ఏ+అది= ఏది; నాథుఁడు= భర్త; ఎవ్వఁడు?= ఎవడు?; ఇది= ఈమె; ఎచ్చటన్= ఎక్కడ; ఎప్పుడున్= ఎల్లప్పుడు; ఉండున్?= ఉంటుంది?; ఇప్డు= ఇప్పుడు; తాన్= తాను; ఈ+ఎడకున్+ ఇక్కడికి; ఏఁగుదేవలయుట= రావటం; ఏ పని+చేయఁగన్+పూని?= ఏ పనిని చేయటానికి?; నీ మదికిన్= నీ మనస్సుకు; దీనిపైన్= ఈమె మీద; నెయ్యము= ప్రేమ; కల్మి= కలిగి ఉండటం; ఏ+కొలఁది?= ఏ పాటిది?; నాకున్= నాకు (కీచకుడికి); ఇంతయున్= ఈ వివరాలన్నీ; చెప్పుమా!= చెప్పాలి సుమా!

**తాత్పర్యం:** 'అక్కా! ఈ పద్మసువాసన లీనే కాంత కుల మేమిటి? ఈమె నడవడిక ఎట్లాంటిది? పేరేమిటి? ఊరేమిటి? దీని భర్త ఎవరు? ఎక్కడ ఉంటున్నది? ఇక్కడికి ఏం పనిమీద వచ్చింది? దీనిని నీవు ఎంత ప్రీతితో చూచుకొంటున్నావు? ఇవి అన్నీ వివరించి చెప్పాలి.'

**విశేషం:** ఇన్ని ప్రశ్నలు ఒక్కసారిగా వేయటంలో కీచకుడి తమకం స్ఫురణకు వస్తుంది.

**క. అనవుడు నయ్యంగన 'యితఁ। డనంగశర దళిత హృదయుఁ డయ్యె నకట! యీ**
**తని చిత్తవృత్తి మరలుప। ననురూపం బగు నుపాయ మది యెయ్యదియో?' 41**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆ+అంగన= ఆ సుదేష్ణ; అకట!= అయ్యో!; ఇతఁడు= కీచకుడు; అనంగ శరదళిత హృదయుఁడు= మన్మథ బాణాలచేత చీల్చబడిన మనస్సు కలవాడు; అయ్యెన్= అయినాడు; ఈతని= కీచకుడి యొక్క; చిత్తవృత్తి= మానసిక పద్ధతిని; మరలుపన్= మరలించటానికి; అనురూపంబు+అగు= తగిన; ఉపాయము= ఉపాయం; అది+ఎయ్యదియో!= అదేదో కదా!.

**తాత్పర్యం:** కీచకుడి మాటలు విని సుదేష్ణ ఇట్లా అనుకొన్నది - 'ఇతడి హృదయం మన్మథ బాణాల తాకిడికి గాయపడింది (అంటే ఇతడు మన్మథ భావావేశపరుడైనాడు అని భావం). ఇప్పటి ఇతని మనోధోరణిని మరలించటానికి తగిన ఉపాయం ఏదో?'

**వ. అని తలంచుచుఁ గీచకుని మాటలు గీటునంబుచ్చి యొండు పలుకులు జరిపిన, నతండును సత్త్వహీనుండు గావున సత్వరుండై క్రమ్మఱి, ద్రౌపది యున్న యెడకుం జని, యా సమీపంబున నట్టాడుచు నమ్మానవతితో నిట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** అని, తలంచుచున్= అని ఆలోచిస్తూ; కీచకుని మాటలు; గీటునన్+పుచ్చి= అనాదరించి; ఒండుపలుకులు= వేరే మాటలు; జరిపినన్= కొనసాగించగా; సత్త్వహీనుండు= మనోనిగ్రహం లేనివాడు; కావునన్; సత్వరుండు+ఐ= తొందరపాటు కలవాడై; క్రమ్మఱి= మరలి; ద్రౌపది+ఉన్న+ఎడకున్+చని= ద్రౌపది ఉన్నచోటికి పోయి; ఆ సమీపంబునన్= ఆ ప్రాంతంలో; ఆడుచున్+ఆడుచున్= తారట్లాడుతూ; ఆ+మానవతితోన్= మానధనురాలైన సైరంధ్రితో (ద్రౌపదితో); ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కీచకుడి మాటలు లెక్కపెట్టకుండా సుదేష్ణ మాటమార్చడానికి ప్రయత్నించింది. కాని, వాడు అవివేకికాబట్టి తాల్మికోల్పోయి తొందరపాటుతో మరలివచ్చి ద్రౌపది సమీపంగా తిరుగుతూ ఆమెతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** కార్యసాధనలో ఉపేక్ష ఒక ఉపాయం (శుక్రనీతి). సుదేష్ణ దానిని ప్రయత్నించబోయింది. కీచకుడు లొంగలేదు.

**క. 'ఇవ్వసుమతి నే పొలఁతుల। కివ్విధమునఁ జెలువు గలదె యెన్నండును? నీ**
**వెవ్వరి తనయవు? నీ పతి। యెవ్వఁడు? పే రేమి? సెప్పు మిందునిభాస్యా!' 43**

**ప్రతిపదార్థం:** ఇందు నిభ+ఆస్యా!= చంద్రుడి వంటి ముఖం కలదానా!; ఈ+వసుమతిన్= ఈ భూమిపై; ఎన్నండును= ఎప్పుడైనా; పొలఁతులకున్= స్త్రీలకు; ఈ+విధమునన్= ఇటువంటి; చెలువు= సౌందర్యం; కలదె?= ఉన్నదా? (లేదని భావం); నీవు; ఎవ్వరి; తనయవు?= కూతురివి?; నీ పతి+ఎవ్వఁడు?= నీ మగ డెవరు?; పేరు+ఏమి?= నీ పేరేమిటి? చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ చంద్రవదనా! ఏనాడయినా? ఈ భూమిమీద ఏ వనితలకైనా ఇంతటి అందచందా లున్నాయా? నీ వెవరి కూతురివి? నీ మగ డెవరు? నీ పేరేమి? చెప్పుము'.

**విశేషం:** ఇవ్విధమునఁ జెలువు - ఈ అనే విశేషణం సౌందర్య ప్రశంసాసూచకం. ఇందునిభాస్యా! - అనే సంబోధన సమయస్ఫూర్తిగా వాడాడు. రూపాభిమాని అయిన కీచకుడిని మోహపెట్టే విశిష్ట సౌందర్యం ద్రౌపదికి ఉన్నది.

**వ. అనిన నప్పలుకులు వినియు వినమి భావించి యప్పాంచాలి నిర్వికారయై యూరకున్న నచ్చపలుండు వెండియు నిట్లనియె. 44**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+పలుకులు= ఆ మాటలు; వినియున్= వినికూడా; వినమిన్= విననట్లుగానే; భావించి= నటించి; ఆ+పాంచాలి= పాంచాల రాజపుత్రి అయిన ఆ ద్రౌపది; నిర్వికార+ఐ= ఏవిధమైన వికారం లేని మనస్సు కలదై (చలించక); ఊరక+ఉన్నన్= మాట్లాడకుండా ఉండగా; ఆ+చపలుండు= చంచలచిత్తుడైన ఆ కీచకుడు; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** కీచకుడు మాట్లాడిన మాటలు వినీ విననట్లుగా నటిస్తూ ద్రౌపది నిర్వికారచిత్తంతో మాట్లాడకుండా నిలుచున్నది. కాని, చంచలచిత్తుడైన ఆ కీచకుడు ఆమెతో ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ద్రౌపది అతడి మాటలకు మారు పలకలేదు. చలించలేదు. కానీ, కీచకుడు తమకంతో వేగిరపడుతూ ఉండటం చేత నిగ్రహించుకొన లేకపోయాడు. ఆమె ధీరురాలు, అతడు చంచలుడు. భిన్న ప్రవృత్తుల వైరుధ్యం వైవిధ్యాన్ని కల్పిస్తూ రసోల్లాసాన్ని కలిగిస్తుంది. (సంపా.)

**సీ. 'తెలి గన్నుఁగవ కాంతి పొలుపార నించుక। కను విచ్చి చూచినఁ గాదె యబల!**
**చెలువంపు నెమ్మోము నెలమి సొం పినుమడి। గా నల్ల నవ్వినఁ గాదె యింతి!.**
**దంతమౌక్తికరుచి దలకొన మఱుమాట। వలికినఁ గాదె యుత్పలదళాక్షి!**
**యుల్లంబు సరసత దెల్లంబుగా లీలఁ। గైకొన్నఁగాదె పంకరుహవదన!'**

**ఆ. యనుచుఁ జూచుఁ, జేరుఁ, నమ్ముగ్ధ పలుకులు। వినఁగఁ గోరుఁ, గేలు తనదు కేలఁ**
**గీలుకొలుపఁ దలఁచుఁ గీచకాధముఁడు ని। జానురక్తిఁ దెలుప నప్పళించు. 45**

**ప్రతిపదార్థం:** కీచకాధముఁడు= కీచకుడనే నీచుడు (సంభాషణ కొనసాగిస్తూ); అబల!= ఓ కోమలీ!; తెలి+కన్నుఁగవకాంతి= తెల్లని కనుదోయి యొక్క వెలుగు; పొలుపారన్= ప్రకాశించగా; ఇంచుక= కొంచెం; కనువిచ్చి= కనులు తెరచి; చూచినన్+కాదె= చూడరాదా?; ఇంతి!= ఓ స్త్రీ!; చెలువము+నెఱ+మోము= అందమైన, నిండైన ముఖం యొక్క; ఎలమిసొంపు= వికాస సౌందర్యం; ఇనుమడిగాన్= రెట్టింపుకాగా; అల్లన్= నెమ్మదిగా; నవ్వినన్+కాదె= నవ్వకూడదా?; ఉత్పలదళ+అక్షి!= కలువ రేకులవంటి కనులదానా!; దంతమౌక్తిక రుచి= ముత్యాలపలువరుస కాంతి; తలకొనన్= ప్రసరించగా; మాఱుమాట= బదులు పలుకు; పలికినన్+కాదె?= పలుకరాదా?; పంకరుహవదన!= పద్మముఖీ!; ఉల్లంబు= మనసులోని; సరసత= రసికత్వం; తెల్లంబుకాన్= తెలిసేటట్లు; లీలన్= విలాస చేష్టలను (శృంగారహావభావాలను), కైకొన్నన్+కాదె?= స్వీకరించరాదా?; అనుచున్= అని పలుకుతూ; చూచున్= ఆమె వైపు చూస్తాడు; చేరున్= ఆమెను సమీపిస్తాడు; ఆ+ముగ్ధ పలుకులు= ఆ సహజసుందరియొక్క మాటలు; వినఁగన్+కోరున్= వినాలని ఉబలాటపడతాడు; కేలు= ఆమె చేతిని; తనదుకేలన్= తన చేతితో; కీలుకొలుపన్= పట్టుకొనటానికి; తలఁచున్= భావిస్తాడు; నిజ+అనురక్తిన్= తన వలపును; తెలుపన్= ఆమెకు తెలియచెప్పటానికి; అప్పళించున్= ప్రయత్నిస్తాడు.

**తాత్పర్యం:** 'ఓ కోమలీ! నీ తెల్లని కన్నుల కాంతి వెలిగిపోయేటట్లు కొద్దిగా నీ కన్నులు విచ్చి చూస్తే ఏమౌతుంది? ఓ కాంతా! అందమైన నీ నిండు మొగంలోని వికాస సౌందర్యం రెట్టింపయ్యేటట్లు మెల్లగా నవ్వితే ఏం పోతుంది? కలువ రేకుల కన్నుల దానా! నీ ముత్యాలవంటి పలువరుస మెరుగులు వ్యాపించేటట్లు నోరువిచ్చి మారు పల్కితే ఏమి ఒలికిపోతుంది? పద్మముఖీ! నీ మనసులోని సరసత్వం తేటతెల్లమయ్యేటట్లు, శృంగారహావ భావాలను ప్రదర్శిస్తే ఏం

పోతుంది?' అంటూ ఆ అధముడైన కీచకుడు ఆమె వైపు చూస్తాడు. ఆమెను సమీపిస్తాడు, ఆ ముద్దరాలి మాటలు వినాలని ముచ్చటపడతాడు, ఆమె చేతిని తన చేతిలోకి తీసికొందామని భావిస్తాడు. తన వలపును ఆమెకు తెలపటానికి ప్రయత్నిస్తాడు.

**విశేషం:** 1.అలం: క్రమాలంకారం లేదా యథాసంఖ్యాలంకారం. సైరంధ్రిని కన్నులు విచ్చి చూస్తే ఏమౌతుంది?. అని ఆమె వైపు అదేపనిగా చూస్తాడు: నవ్వితే ఏమౌతుంది అని అంటూ సమీపిస్తాడు: మారు పలికితే ఏమౌతుంది? అని ఆమె మాటలు వినాలని తహతహలాడతాడు; లీలలను ప్రదర్శిస్తే ఏమౌతుంది అని అంటూ ఆమె చేతిని తన చేతిలోకి తీసికొనాలని యత్నిస్తాడు. ఆ విధంగా సీస పద్య పాదాలలోని మాటలకూ, ఎత్తుగీతిలోని క్రియలకూ వరుసగా అన్వయం చెప్పుకొనాలి కాబట్టి క్రమాలంకారం. ఈ అలంకారం కీచకుడు సైరంధ్రిని పొందటంలో అత డనుభవించ దలచుకొన్న నాలుగు దశలను క్రమంగా ధ్వనింప చేస్తుంది.

2. ద్రౌపది తన వైముఖ్యాన్నీ అనాదరాన్నీ అతడి మాటలు విన్నా విననట్లు నటించటం ద్వారా వ్యక్తం చేసింది. కీచకుడు - తిక్కన మాటలలో - అధముడు. వాస్తవాన్ని తెలిసికొనలేక ఆమె శృంగార చేష్టలను ప్రదర్శిస్తున్నదని భావించేవాడు. శృంగార చేష్టలలో 'విహృతం' అనేది ఒకటి. **"వక్తవ్యకాలేఽప్యవచో వ్రీడయా విహృతం మతమ్"** అని లక్షణం. పలుకవలసిన సమయంలో సిగ్గు వలన పలుకకుండా మౌనంగా ఉండటం విహృతం. సైరంధ్రి విహృతాన్ని ప్రదర్శిస్తున్నదని కీచకుడు భావించాడు. విహృతానికి విరుగుడు విలాసం. **"యానవస్థా నాసనాదీనాం ముఖనేత్రాది కర్మణాం । విశేషస్తు విలాసస్స్యా దిష్ట సందర్శనాదినా"** - అని విలాస లక్షణం. ప్రియుడిని చూడగానే నడకలో, నించోటంలో, కూర్చోటంలో, చూడటంలో, మాట్లాడటం మొదలైన వాటిల్లో ప్రదర్శించే హేలా విశేషాలు విలాసంలో ప్రకటితాలౌతాయి. విముఖురాలైన నాయికను ప్రసన్నురాలిని చేసికొని, విలాసవతిగా మార్చుకొనటానికి నాయకుడు అనునయాన్ని (సాంత్వనాన్ని) ఆశ్రయిస్తాడు. కీచకు డీ పద్యంలో ప్రదర్శించింది ప్రార్థనారూప సాంత్వన ప్రక్రియ.

3. సాంత్వన ప్రక్రియలో కీచకుడు మొదట 'కుతూహలాన్ని' ప్రకటిస్తున్నాడు. ప్రదర్శిస్తున్నాడు. "రమ్యవస్తు సమాలోకే లోలతాస్యా త్కుతూహలమ్'' అని లక్షణం. రమించదగిన సైరంధ్రి విలాసాన్ని చూచి, కైవసం చేసికొని, రమించాలని చాపల్యాన్ని ప్రకటించటం కీచకుడు ఈ పద్యంలో చేసిన మదన చేష్ట. ఈ అంశాన్ని 'అచ్చపలుండు' అనే విశేషణంలో తిక్కన సూచించాడు. అటు మాటలో (వాచికాభినయంలో) ఇటు చేతలో (ఆంగికాభినయంలో) దానిని ప్రదర్శిస్తున్నట్లు తిక్కన చిత్రించి నాటకీయతను రక్తికట్టించాడు.

4. కుతూహల ప్రకటనలో కూడా ఒక క్రమాన్ని పాటించటం తిక్కన రసశిల్ప రహస్యం. వలచిన దాని పొందు పొందేటప్పుడు ఆమె మనసులో కూడ కుతూహలం ఉండాలని వలపుకాడు అనుకొనటం సహజం. ఆ కుతూహలం నాలుగు దశలలో ప్రకటితమౌతుంది. (1) చూపు, సిగ్గుతో కనురెప్పలు వాలి ఉన్న నాయిక ఆసక్తితో కళ్ళు అర్ధ నిమీలితంగా తెరిచి తన సాముఖ్యాన్ని తెలుపుతుంది. (2) అందమైన ముఖాన్ని సుముఖంగా చేసి తన మనసులోని రతిభావ సమ్మోదాన్ని చిరునవ్వు కాంతులతో తెలియపరుస్తుంది. (3) ఆ మీద మనసుతోపాటు మధురంగా మాటకూడా కలుపుతుంది. (4) ఆ తరువాత స్పర్శాదుల వలన కలిగే అనుభవాలను లీలలుగా ప్రదర్శిస్తుంది. నాయిక ప్రదర్శించే ఆ నాలుగు దశలను క్రమంగా నాయకుడు చూస్తూ, సమీపిస్తూ, మాటలు రక్తితో వింటూ, కేలు కేలు కలుపుతూ రమిస్తాడు. వాటన్నింటిని భావనామయంగా ఊహిస్తూ కీచకుడు కళ్ళు తెరిచే కలలుకంటూ, ఆమెను ఆ కలలను నిజం చేయుమన్నట్లుగా అనునయించాడు. ఒక మదనావస్థలోని ఇన్ని అంతర్దశలను చిత్రించిన తిక్కన రసబ్రహ్మ.

5. 'చూచుఁజేరు' అను పాఠానికి 'చూచుఁగేరు' అని పాఠాంతరం ఉన్నది. అదే ఉచితమైనదని కొందరి భావం. అది సరికాదు. కేరు అనే క్రియకు ఉత్సహించు, కుతూహలపడు, విజృంభించు, తిరస్కరించు, పరిహసించు-అనే అర్థాలున్నాయి. అందువలన దీనిని గ్రహిస్తే సందర్భశుద్ధి లేకపోగా, విరుద్ధార్థ స్ఫూర్తి కూడా కలుగుతుంది. కాబట్టి ప్రస్తుత పాఠమే ప్రశస్తం. (సంపా.)

**వ. ఇట్లు దాన తమకంబున వడిగొనుచు, నప్పు డయ్యంగన యింగితం బూహింప వెరవుమాలి మఱియును. 46**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తాను+అ= తనకుతానే (కీచకుడు); తమకంబునన్= మోహావేశంతో; వడిగొనుచున్= వేగిరపడుతూ; అప్పుడు= ఆ సమయంలో; ఆ+అంగన= ఆమె యొక్క; ఇంగితంబు= మనోభావాన్ని; ఊహింపన్= ఊహించటానికి; వెరవుమాలి= శక్తిలేక (ఉపాయంతోచక); మఱియును= ఇంకా (ఇట్లా పలికాడు).

**తాత్పర్యం:** మోహావేశంతో వేగిరపడుతున్న కీచకుడు ద్రౌపది మనస్సును తెలిసికొనే ఉపాయం తోచక (శక్తిచాలక) ఇంకా ఇట్లా అన్నాడు.

**సీ. 'సుదతి! నీమై చక్కఁ జూచుట కోడెదఁ। గనుఁ బాటు వొరయునో యని తలంచి;**
**మదిఁ బొనర్చిన మాట మగువ! నీ పెంపునఁ। గుదిసి నా నాలుక తుదికి రాదు ;**
**పడఁతి! నీ కరములు పట్టంగఁ దివిరి శం। కించి వడంకెడుఁ గేలు సూడు;**
**నెఱి నిట్టి దని యింతి! నీ నెమ్మనం బెన్ని। భంగుల నరసినఁ బట్టు వడదు ;**

**తే. చెలువ! యింక నొక్కించుక సేపు నీ వ। నాదరంబున నెప్పటియట్ల యున్న**
**మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ। బడయవచ్చునె యెన్ని యుపాయములను?' 47**

**ప్రతిపదార్థం:** సుదతి!= మంచి దంతములు కలదానా!; కనుఁబాటు= దృష్టిదోషం; పొరయునో+అని= తగులుతుందేమోనని; తలంచి= అనుకొని; నీ మై= నీ శరీరాన్ని; చక్కన్+చూచుటకున్= సూటిగా చూడటానికి; ఓడెదన్= జంకుతాను; మగువ!= ఓ వనితా; మదిన్= మనస్సులో; పొనర్చినమాట= పుట్టిన పలుకు; నీ పెంపునన్= నీ అధిక్యం వలన; కుదిసి= అణగిపోయి (ముడుచుకొని); నా; నాలుక తుదికిన్‌రాదు= నాలుక చివరిదాకా రాదు; పడఁతి!= ఓ వనితా!; నీ కరములు= నీ చేతులు; పట్టఁగన్+తివిరి= పట్టుకొనాలని యత్నించి; శంకించి= జంకు గలిగి; కేలు= చేయి; వడంకెడున్= వణుకుతున్నది; చూడు!= ఇదిగో ఈ చేయి చూడుము!; ఇంతి!= ఓ వనితా!; నీ నెఱ+మనంబు= నీ నిండు మనస్సు; నెఱిన్= పూర్తిగా; ఇట్టిది+అని= ఇటువంటిదని; ఎన్నిభంగులన్+అరసినన్= ఎన్ని రకాలుగా ఆలోచించినా; పట్టు+పడదు= స్పష్టం కాదు; చెలువ!= ఓ అందమైనదానా!; ఇంకన్= ఇక మీద; ఒక్కించుకసేపు= కొంచెం సేపు; నీవు; అనాదరంబునన్= ఆదరం చూపకుండా; ఎప్పటి+అట్లు+అ+ఉన్నన్= ఎప్పటి వలెనే ఉంటే; మన్మథుడు; సమయించినన్= చంపివేస్తే; మగుడన్= తిరిగి; నన్నున్= (కీచకుని); ఎన్ని+ఉపాయములను= ఎన్ని ఉపాయాల చేతనైనా; పడయన్+వచ్చునె?= పొందగలవా? (లేదని భావం).

**తాత్పర్యం:** ఓ సుందరీ! దృష్టిదోషం తగులుతుందేమోనని నీ మేని సౌందర్యాన్ని చూడటానికే జంకుతున్నాను. నీ ఆధిక్యం చూచిన తరువాత మాట్లాడాలన్నా నాలుక చివరిదాకా మాటలు రావటం లేదు. నీ చేతులు పట్టుకొనాలని ప్రయత్నించినా (నన్ను గ్రహిస్తావో లేదో అన్న) అనుమానంతో చేతులు వణుకుతున్నాయి. ఎన్ని రకాలుగా ఆలోచించినా అసలు నీ మనస్సు ఏమిటో నాకు అంతుపట్టటం లేదు. నీ విట్లాగే మరికొంత సేపు నన్ను అలక్ష్యం చేస్తే ఆ పాడు మదనుడు నన్ను మట్టుపెట్టుతాడు. అప్పుడు ఎన్ని ఉపాయాలతో యత్నించినా నన్ను నీవు తిరిగి పొందలేవు.

**విశేషం:** తిక్కన రచించిన గొప్ప పద్యాలలో ఇది ఒకటి. రచనా శిల్పం అనల్పం. 1. తిక్కన ఒక గొప్ప పద్యం రచించి దానికి ప్రతిగా అంతటి గొప్ప పద్యాన్ని మరొకటి వ్రాసి చూపించే ప్రతిభ ప్రదర్శించటం ఆయన నైజం. 'తెలిగన్నుఁగవకాంతి పొలుపార నించుక కనువిచ్చి చూచినఁ గాదె యబల' - అనే 45వ పద్యానికి సమాంతర ప్రతి శిల్పంగా ఈ సీసాన్ని రచించాడు. సైరంధ్రికీ కీచకుడికీ భావసాజాత్యం, తాదాత్మ్యం ఉన్నట్లు కీచకుడు భావిస్తున్నట్లు ఈ పద్యంలో చిత్రించటం ఇక్కడ విశేషం. తిక్కనగా

రన్నట్లు అతడి 'తమకానికి' (46) ఇది నిదర్శనం. సైరంధ్రి కన్నెత్తి చూడదు - కీచకుడూ ఆమెను సూటిగా చూడలేదు. కారణాలు వేరు. కాని అవస్థలు సమం. ఆమె మాట్లాడదు-ఇతడి నోటామాట వెలువడదు. ఆమె లీలగా చేయి అందించదు. ఇతడూ చేయి వణకటం చేత అందించ(గ్రహించ)లేడు. ఆమె తీరు ఎదుటివారు గ్రహించటం కష్టం. అతడు ఆమె తీరునే కాదు తన తీరును కూడా వివేచించుకొనే స్థితిలో లేడు. సమానావస్థల ననుభవించేవాడు సానుభూతిని, సహానుభూతిని పొందాలి. కాని, సైరంధ్రి అటువంటి ఆదరబుద్ధిని ప్రదర్శించటం లేదు. మన్మథావస్థల కన్నింటికి చివరిది మన్మథబాధతో మరణించటం. అది జరిగితే ఇరువురికి పొందు కలుగదు. అది జరుగక పూర్వమే ఉపాయాంతరం చేత సమాన ధర్మాన్ని అనుభవిస్తున్న తనను రక్షించుకొనటం సైరంధ్రి కర్తవ్యమని కీచకుడి విన్నపం. విరుద్ధ రసభావ వ్యంజకాలైన సాత్త్విక భావాలను ద్రౌపది పాత్ర నాలంబనంగా చేసికొని చిత్రించిన పద్యం (33) ఒకవైపు, కీచకుడి పాత్ర నాలంబనంగా నిర్మించిన పద్యం ఇక్కడ ఈ వైపు - సమాంతర రచనా కళాఖండాలు.

2. తిక్కన తన రచనలోని మర్మాన్ని పఠితలకు కొన్ని సంకేతాల ద్వారా వ్యాఖ్యల ద్వారా సూచిస్తుంటాడు. ఈ పద్యం తరువాతి వచనంలో తిక్కన 'తన యభిలాషంబు తేటపడంబలికిన' (48) అని సూచించాడు. అభిలాష - అనేది కోరిక అనే సామాన్యార్థమే కాదు. శృంగార రసపరమైన పారిభాషిక పదార్థాన్ని కూడా ప్రకటిస్తుంది. శృంగారం సంభోగ విప్రలంభ భేదం చేత ద్వివిధం. వాటితో విప్రలంభ శృంగారం అభిలాష, ఈర్ష్యా, విరహ, ప్రవాస కారణాలతో జనించి నాలుగు రకాలుగా రాణిస్తుంది. అభిలాష విప్రలంభానికి పూర్వరాగ విప్రలంభమని కూడా పేరు. తిక్కన ఈ పద్యంలో 'అభిలాష' ను స్పష్టంగా చిత్రించానని చెప్పటం గమనించదగింది. అంటే రతిభావావస్థ రసస్థితిని (ఉత్కటావస్థను, స్థాయిస్థితిని) అందుకొన్నదని ధ్వనింప చేస్తున్నాడు. దశవిధావస్థల నీ ఘట్టంలో చిత్రిస్తున్నానని సూచించాడు. ఇది తిక్కన రసాభ్యుదయ శిల్పం.

3. ఈ పద్యంలో ప్రౌఢమైన వ్యాజస్తుతి ఉన్నది. నిందచేత స్తుతిగాని, స్తుతిచేత నిందగాని స్ఫురింపజేయటం వ్యాజనింద. అది కవిప్రౌఢోక్తిచేత గాఢతరం కావటం ఇక్కడ దర్శనీయం. ఇక్కడ పరోక్షంగా చేసింది ద్రౌపదీ సౌందర్యస్తుతి; ప్రత్యక్షంగా చేసింది తనకు మన్మథావస్థ వలన ఏర్పడిన తొట్రుపాటు. అంటే ఆత్మ నింద. మరొకరకంగా చూస్తే కీచకుడు రసిక ప్రతిస్పందనను ప్రదర్శించి లలితుడివలె రాణించాడు. కాని, దానిని సైరంధ్రి అనాదరించటం చేత బూడిదలో పోసిన పన్నీరైపోతున్నది. కాబట్టి ఈరకంగా చూస్తే కీచకుడిది ప్రశంస; ద్రౌపది పట్ల నింద. ఈ విధంగా విరుద్ధ భావచిత్రణాన్ని అవిరుద్ధంగా సాగించటం తిక్కన నేర్పరితనం.

4. ఇందులో నాటకీయంగా 'గండం' అనే అంగం పోషించబడింది. ఒక పాత్ర అసంకల్పితంగా భావికథలో తనకు జరిగే ఒక కీడును తన మాటలలో ధ్వనింపచేస్తే గండమౌతుంది. ఈ పద్యంలో కీచక వచనాలన్నీ భావికథలో ద్రౌపదీ భీములు పన్నే మాయోపాయం వలన అతడు పొందే విషాదాంతాన్ని ధ్వనింపచేస్తున్నాయి.

5. తిక్కన 45వ పద్యంలో కుతూహలాన్నీ, ఇందులో అభిలాషనూ పోషించాడు. అభిలాషా విప్రలంభంలో చూడటంలో, పలకరించటంలో, కేలు పట్టటంలో, మనసు నర్థం చేసికొనటంలో మోహంవలన విఫలుడైనట్లు చిత్రించటం శృంగార రసాభాస చిత్రణ శిల్పం. (సంపా.)

**వ. అని తన యభిలాషంబు తేటపడం బలికిన నబ్బోటి కలుషించియు, దుర్వారం బైన పరిభవ వికారంబు దోఁ పకుండ తన్నుందాన యుపశమించుకొని 'వీడు దురభిమానియై యున్నవాఁడు, వేగిరపడుట వెరవుగాదు. వెరవు తోడన తప్పించుకొనవలయు' నని తలంచి యతని కిట్లనియె. 48**

**ప్రతిపదార్థం:** అని; తన; అభిలాషంబు= కోరిక; తేటపడన్= స్పష్ట పడేటట్లుగా; పలికినన్= మాటలాడగా; ఆ+బోటి= ద్రౌపది; కలుషించియున్= కోపించినా; దుర్వారంబు+ఐన= వారింపశక్యంగాని; పరిభవ వికారంబు= అవమానం వలన కలిగిన వికారాన్ని;

తోఁపకుండన్= బయటపడనీయకుండా; తన్నున్= తాన్+అ= తనను తానే; ఉపశమించుకొని= నిగ్రహించుకొని; వీఁడు= కీచకుడు; దురభిమాని+అయి= ఎవరిని లెక్కచేయని గర్విష్ఠి అయి; ఉన్నవాఁడు= ఉన్నాడు; వేగిరపడుట= తొందరపడుట; వెరవుకాదు= యుక్తం కాదు; వెరవు తోడను+అ= నేర్పుతోనే, ఉపాయంతో; తప్పించుకొనవలయును+అని; తలంచి= భావించి; అతనికిన్+ఇట్లు+అనియెన్= అతనితో ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** కీచకుడు తన మనస్సులోని కోరిక బయటపడేటట్లు మాట్లాడటంతో ద్రౌపది కోపించి కూడా, ఆ భరించలేని పరాభవాన్ని బయటికి పొక్కనీయకుండా, తనను తాను నిగ్రహించుకొని, వీడు దురహంకారి అని తలచి, తొందరపాటు మంచిది కాదని, ఎట్లాగో నేర్పుగా తప్పించుకొనాలని అనుకొని అతడితో ఇట్లా అన్నది.

**క. 'నాయున్నబాముఁ దలఁపవ; । యీ యొడ లీ చీర యిట్టి యేవపుఁజందం**
**బో యన్న! మదన వికృతిం । జేయు ననుట యెంతయును నిషిద్ధము గాదే! 49**

**ప్రతిపదార్థం:** ఓ+అన్న!= ఓ సోదరా!; నా+ఉన్న బామున్= నే నున్న కష్టపరిస్థితి; తలఁపవు+అ= నీవు ఆలోచించవు;ఈ+ఒడలు= ఈ శరీరం; ఈ+చీర= ఈ వస్త్రం; ఇట్టి= ఇటువంటి; ఏవము+చందంబు= అసహ్యమైన ఆకారం; మదన వికృతిన్+చేయున్+అనుట= మదన వికారం కలిగిస్తుందంటే; ఎంతయును= అధికంగా; నిషిద్ధము కాదే!= తగనిది కదా!

**తాత్పర్యం:** 'ఓ అన్నా! కష్టాలలో ఉన్న నా పరిస్థితి నీ వూహించటం లేదు. నా మేను, నా కట్టు, బొట్టు, తీరు ఎంత అసహ్యంగా ఉన్నాయో ఆలోచించుము. ఈ పరిస్థితిలో కూడా నీకు మదనవికారం కలిగిం దనటం ఏమీ భావ్యం కాదు.

**విశేషం:** 'ఆఈఏ'లు త్రికం. ఆ మూడు సర్వనామాలూ తెలుగులో నిర్దేశార్థకాలే కాక, అనంత భావార్థకాలు. ద్రౌపది తన మేనును, చీరను 'ఈ' తో చూపుతూ చెప్పటం చేత శృంగార విభావ సౌందర్య రాహిత్యం స్ఫురిస్తున్నది. అన్న, అయ్య, అప్ప - అనేవి గౌరవ వాచకాలు. తనకంటె పెద్దవయసు కలవాడు అయితే అతడిని అన్నా అని పిలవటం తెలుగువారి అలవాటు. తనను వలచి విరహాన్ని ప్రకటిస్తున్న కీచకుడిని 'ఓ అన్న!' అని బంధువాచకంతోనూ గౌరవవాచకంతోనూ పిలిచి తనను కామించటం ధర్మవిరుద్ధమని ద్రౌపది పరోక్షంగా హెచ్చరించింది. (సంపా.)

**తే. చనునె యిమ్మాటలాడ సజ్జనుల కాఁడుఁ । బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ;**
**వట్లుగాకయు హీనవంశాభిజాత । నై పతివ్రతనగు నన్ను నడుగఁ దగునె?' 50**

**ప్రతిపదార్థం:** సత్+జనులకున్= మంచివారికి; ఈ+మాటలు+ఆడన్= ఇటువంటి మాటలు పలుకటం; చనునె?= తగునా?; నీవును= నీవుకూడా; ఆఁడుఁబుట్టువులతోడన్= ఆడపడుచులతో; పుట్టినాఁడవు= పుట్టావు; అట్లు+కాకయున్= అట్లా కాకపోయినా; హీనవంశ+అభిజాతను+ఐ= తక్కువ కులంలో పుట్టినదాననై; పతివ్రతన్= పతివ్రతను; అగు= అయిన; నన్నున్; అడుగన్+తగునె?= అడుగవచ్చునా? (కామంతో కోరవచ్చునా?).

**తాత్పర్యం:** మంచివారు ఇటువంటి మాటలు మాటాడవచ్చునా? నీవా తోబుట్టువులు ఉన్నవాడివి. అందువలన అందరినీ ఆడుబడుచులుగా భావించి అసలే అట్లా మాట్లాడకూడదు. అది అట్లా ఉండగా, తక్కువ కులంలో పుట్టిన దాననూ, పతివ్రతనూ అయిన నన్ను ఇట్లా అడుగవచ్చునా?'

**విశేషం:** అడుగుట అనేది అచ్చమైన తెలుగు భాష, కామక్రీడకు అని అర్థం. హీనవంశాభిజాత అనేచోట శ్లేష ఉన్నదని కొందరు. హీనవంశంలో పుట్టావని ఒక అర్థం. హీన!= ఓరీహీనుడా!; వంశ+అభిజాతను= సద్వంశంలో జన్మించినదానను; అనికూడా విరవవచ్చును. పాఠకులు ఈ చమత్కారం గమనించాలి. ఆఁడుపుట్టువులతో పుట్టినవాడవు అనటంలో నీ అప్ప చెల్లెండ్రను ఎవరైనా ఇట్లా అడిగితే ఏం చేస్తావు? -అనే హెచ్చరిక ఉన్నది.

**క. అని వీడఁగఁ బల్కిన న । మ్మనుజాధముఁ డంతఁ బోక మదనోన్మాదం**
**బునఁ దన్ను నెదిరి నెఱుఁగక । వనితకు నిట్లనియె గారవంపుఁ బలుకులన్. 51**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; వీడఁగఁన్= వదలించుకొన్నట్లు; పల్కినన్= మాట్లాడగా; ఆ+మనుజ+అధముఁడు= ఆ నీచమానవుడు, కీచకుడు; అంతన్+పోక= అంతటితో ఆగక; మదన+ఉన్మాదంబునన్= మన్మథోద్రేకంతో; తన్నున్= తనను; ఎదిరిని= ఎదుటివారిని; ఎఱుఁగక= తెలిసికొనలేక; వనితకున్= ఆకాంతకు; గారవము+పలుకులన్= మర్యాదగల మాటలతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా స్పష్టంగా చెప్పినా కీచకుడు అంతటితో ఆగక, మన్మథావేశంతో ద్రౌపది అభిప్రాయం తెలిసికొనలేక మర్యాదగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. తిక్కన కీచకుడిపట్ల నరాధముడు (33వ) కీచకాధముడు (45) మనుజాధముడు (51) అని ముమ్మారు అధమ శబ్దం ప్రయోగించాడు. వివేకం లేనివాడు అనే అర్థం కావచ్చును. 2. వీడు= స్పష్టమగు-అని సూర్యరాయాంధ్ర నిఘంటువు పేర్కొన్నది. వదలించుకొనుట-అనే అర్థం సముచితం.

**సీ. 'నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి । యచ్చునఁ బెట్టిన ట్లంద మొంది,**
**చక్రవాకంబుల చందంబు గొనివచ్చి । కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి,**
**చందురు నునుఁగాంతి కం దేర్చి కూర్చి బా । గునకుఁ దెచ్చిన యట్లు కొమరు మిగిలి,**
**యళికులంబుల కప్పు గలయంతయును దెచ్చి । నారు వోసిన భంగి నవక మెక్కి,**

**తే. యంఘ్రితలములుఁ, గుచములు, నాననంబుఁ, । గచభరంబును నిట్లున్న రుచిరమూర్తి**
**యనుపమాన భోగములకు నాస్పదంబు । కాదె? యీ త్రిప్పు లేటికిఁ గమలవదన?' 52**

**ప్రతిపదార్థం:** కమలవదన!= పద్మం వంటి ముఖం కలదానా!; నెత్తమ్మిరేకుల మెత్తఁదనము= చక్కని తామరరేకుల మృదుత్వాన్ని; తెచ్చి= తీసికొని వచ్చి; అచ్చునన్+పెట్టినట్లు= అచ్చుబోసినట్లు; అందము+ఒంది= అందమైన చందాన్ని పొంది; చక్రవాకంబుల చందంబు= చక్రవాకపక్షుల (గుండ్రని) తీరును; కొనివచ్చి= తీసికొని వచ్చి; కుప్పలు+చేసినట్లు= (రెండు) కుప్పలుగా పోసినట్లు; ఒప్పు+మెఱసి= అందంతో ప్రకాశించి; చందురు నునుకాంతి= చంద్రుని చక్కని కాంతిని; కందు= మచ్చను; ఏర్చి= వేరుచేసి; కూర్చి= అచ్చమైన కాంతిని ఒకచోట ప్రోగుచేసి; బాగునకున్+తెచ్చిన+అట్లు= శుభ్రపరచి తీసికొని వచ్చినట్లుగా; కొమరు, మిగిలి= అందం అతిశయించి; అళికులంబులకప్పు= తుమ్మెదల సమూహాల నల్లదనం; కల+అంతయును= ఉన్నదంతా; నారు+పోసినభంగి= నారుపోసినట్లుగా; నవకము+ఎక్కి= నిగనిగలాడి; అంఘ్రితలములున్= అరికాళ్ళున్నూ; కుచములున్= స్తనాలున్నూ; ఆననంబున్= ముఖమున్నూ; కచభరంబును= ఒత్తైన కేశసమూహమున్నూ; ఇట్లు+ఉన్న= ఇంత బాగా ఉన్న; రుచిరమూర్తి= చక్కని రూపం; అనుపమానభోగములకున్= సాటిలేని సౌఖ్యాలకు; ఆస్పదంబు+కాదె= చోటు కాదా? ఈ త్రిప్పులు= ఈ డొంకతిరుగుళ్ళు; ఏటికిన్?= ఇంకా ఎందుకు?

**తాత్పర్యం:** 'ఓ సుందరీ! తామర రేకుల మెత్తదనం తెచ్చి, అచ్చుపోశారో అన్నట్లు నీ అడుగులు అందంగా ఉన్నాయి. చక్రవాకపక్షుల గుండ్రనితనాన్ని పోగుచేసి కుప్పలు పోసినట్లు నీ స్తనాలు ఒప్పుగా ఉన్నాయి. చంద్రబింబంలోని కళంకాన్ని తొలగించి కాంతిని బాగుచేసి దాని అందాన్ని అతిశయింప జేసినట్లుంది నీ ముఖ సౌందర్యం. తుమ్మెదల నల్లదనాన్ని కుప్ప చేసి ప్రోగుపోసినట్లున్నది నిగనిగలాడుతున్న నీ కొప్పు. ఇంత అందమైన నీ సుందరరూపం సాటిలేని భోగాలను పొందటానికి తగినది సుమా! ఇక నీ కీ త్రిప్పట లెందుకు?

**విశేషం:** 1. పాదాలు చిగురుటాకులతోను, స్తనాలు చక్రవాకాలతోను, ముఖాన్ని చంద్రుడితోను, కురులను తుమ్మెదల బారుతోను పోల్చటం కవి సమయం. ఇక్కడ తిక్కన ఈ నాలుగింటిని సీసపద్యంలో విశేషంగా చెప్పాడు.

2. పాదాలు పద్మాలవలె పూజార్హాలు. చక్రవాకాలతో పోల్చడంతో స్తన సౌష్ఠవం కూడా తోస్తున్నది. కీచకుడు అవయవాల సొంపును పాదాల నుండి తలదాకా ఆపాదమస్తకం వర్ణించాడు. చూపు పాదాల నుండి క్రమంగా పైకి పాకింది. దేవతలను పాదాల నుండి మస్తకం వరకూ, మానవులను మస్తకంనుండి పాదాలవరకూ వర్ణించటం అలవాటు. ఆమె మానవకాంత కాదని కీచకుడి అభిప్రాయం.

**తే.** **నీవు దుర్జాతిగామికి నీవ సాక్షి; । పరసతీ సంగమున వచ్చు పాపమునకు**
**నోరుతును గాని, సైరింప నోపఁ బచ్చ । విలుతు తూపుల తాఁకున కలరుఁ బోఁడి!'** **53**

**ప్రతిపదార్థం:** నీవు; అలరున్+పోఁడి!= పువ్వువంటి మేనుగలదానా!; దుర్జాతి= నీచ జాతిదానివి; కామికిన్= కాకపోవటానికి; నీవు+అ= నీకు నీవే; సాక్షి= సాక్ష్యం; పరసతీ సంగమునన్= పరస్త్రీ సంభోగం వలన; వచ్చు, పాపమునకున్= కలిగే పాపాన్ని; ఓరుతును+కాని= సహిస్తాను గాని; పచ్చవిలుతు= మన్మథుని; తూపుల తాఁకునకున్= బాణాల దెబ్బకు; సైరింపన్+ఓపన్= ఓర్చుకొనలేను.

**తాత్పర్యం:** ఓ సుందరీ! నీవు నీచజాతి దానివి కాదనటానికి నీవే సాక్షివి. నేను పరస్త్రీ సాంగత్యం వలన కలిగే పాపాన్ని ఓర్చుకొనగలను కాని, మన్మథబాణాల తాకిడికి ఓర్చుకొనలేకున్నాను,'

**విశేషం:** ద్రౌపది హీనవంశాభిజాతను, పతివ్రతను అన్నదానికి ఇది కీచకుడి సమాధానం, దోషంలో గుణాన్ని భావించి ఆ దోషాన్ని కోరుకొనటం అనుజ్ఞాలంకారం.

**క.** **అను నప్పలుకుల కయ్యం । గన కోపము గదిరి 'నీచు గావున జంకిం**
**చినఁ గాని మెత్తఁబడి పోఁ' । డని మనమునఁ దలఁచి యిట్టు లనియెం బెలుచన్.** **54**

**ప్రతిపదార్థం:** అను+ఆ+పలుకులకున్= కీచకుడనే ఆ మాటలకు; ఆ+అంగన= ఆ ద్రౌపది; కోపము= కోపం; కదిరి= కలిగి; నీచు= అల్పుడు; కావునన్= కాబట్టి; జంకించినన్+కాని= బెదిరిస్తే గాని; మెత్తఁబడిపోఁడు+అని= అంగీకరించడని; మనమునన్+తలఁచి= మనస్సులో అనుకొని; పెలుచన్= పెద్ద ధ్వనితో గద్దిస్తున్నట్లుగా; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** కీచకుడి మాటలకు ద్రౌపది ఎక్కువ కోపం చెందింది. 'వీడు నీచుడు కాబట్టి భయపెట్టితేగాని తొలగిపోడని భావించి గట్టిగా ఇట్లా చెప్పింది.

**విశేషం:** ద్రౌపది మానసిక పరిస్థితిని, ఆమె కోపస్వభావాన్ని కవి చెప్పబోతున్నాడు. నీచుడితో మాట్లాడదగిన విధంగా మాట్లాడితే కాని వాడు జంకడు.

ద్రౌపది కీచకునితోఁ బరుష వాక్యంబులు వలుకుట (సం.4-13-28)

**శా.** **'దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర**
**ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్**
**గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం**
**ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా!'** **55**

**ప్రతిపదార్థం:** కీచకా!= ఓ కీచకా!; మత్పతుల్= నా భర్తలు; దుర్వార= అణపరాని; ఉద్యమ= ప్రయత్నం గల; బాహువిక్రమరస= భుజ బలాతిశయసారం చేత; అస్తోక= తక్కువగాని; ప్రతాప= పరాక్రమం చేత; స్ఫురత్= ప్రకాశిస్తున్న; గర్వ= గర్వంచేత; అంధ= కనులు మూతబడ్డ; ప్రతివీర= శత్రువుల యొక్క; నిర్మథన= వధించటమనే; విద్యాపారగుల్= విద్యను ఆసాంతం చదివినవారు; గీర్వాణ+ఆకృతులు= దేవతలతో సమానమైన రూపాలు కలవారు; గంధర్వుల్+ఏవురు= గంధర్వులైదుగురు; నినున్= నిన్ను; దోర్లీలన్= భుజబల విలాసంతో; వెసన్+కిట్టి= అవలీలగా పట్టి; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; మానమున్+ప్రాణమున్+కొనుట= నీ పరువునూ;, ప్రాణాన్నీ హరించడం; తథ్యం= తప్పదు.

**తాత్పర్యం:** 'ఓయి కీచకా! వారించటానికి వీలులేని భుజ బల పరాక్రమం గలిగిన గర్విష్ఠులైన శత్రువుల నవలీలగా వధించే విద్యలో ప్రవీణులని ప్రఖ్యాతిగాంచిన ఐదుగురు గంధర్వులు నా భర్తలు. వారు ఇప్పుడే అవలీలగా నీ మానప్రాణాలు హరిస్తారు సుమా!

**విశేషం:** 1. తిక్కన భారత రచనలో తెలుగువారి మక్కువ చూరగొన్న పద్య రత్నాలలో ఇది ఒకటి. తిక్కనే తన రచనకు తానే మురిసిపోయి విరాటపర్వంలోని ఈ అశ్వాసంలోనే మరల మరొకసారి ద్రౌపదినోట పలికించి (172వ పద్యం) తన కీ పద్యం మీద ఉన్న అభిమానాన్ని ప్రకటించుకొన్నాడు. ఇట్లా తిక్కన పునరావృత్తి చేసిన రెండుమూడు వృత్తాలలో ఇది మొదటిది. అదీ దీని ఘనత!

2. తెలుగులోని విమర్శకులు తిక్కన కవితను సమీక్షించేటప్పుడు ఈ పద్యాన్ని సాధారణంగా వదలిపెట్టరు. అందువలన అందరి ప్రశంసలనూ స్మరించలేము కాని, ఈ శతాబ్ది మొదటిపాదంలో 'ఆంధ్ర భారత కవితా విమర్శనము' (1929) అనే విలువైన గ్రంథాన్ని రచించి, భారత విమర్శకు ఒక మంచి బాటను చూపించిన కీ.శే. కోదాడ రామకృష్ణయ్యగారి మాటలు ముందుగా స్మరించదగినవి. వ్యాఖ్యకు మంచి బాటలు వారి ఈ క్రింది మాటలు:

"ద్రౌపదికి బాగుగఁ గోపము గదిరినది. వీఁడు నీచుఁడు గావున జంకించిన గాని పోడని తలంచినది. ఆ స్థితిలో కీచకుని జంకించుటకును, ద్రౌపదికి గదిరిన కోపమును వెలిపుచ్చుటకును తిక్కన యెట్టి గంభీరమగు శైలిని, దానికిఁ దగిన వృత్తము నవలంబించినాఁడో చూడుడు. శార్దూల వృత్తమును వాడినాడు. అందులో ద్రౌపది - 'కీచకా' యని సంబోధించినది. 'ఓ యన్న' యను సమయము దాటినది గదా యిపుడు. అత్యంత గంభీరము, భయంకరమునగు 'దుర్వారోద్య' మేత్యాద్యతిదీర్ఘ సమాసముతో పాటు- **'మత్పతుల్; గీర్వాణాకృతుల్; గంధర్వుల్'** అను నీ హలంత పదములన్నియు నెదుటివానిని జంకించి యదల్చి వేయుటకుఁ దగినవియై యున్నవి. అవసరము కలిగినఁ గాని, తిక్కన ప్రౌఢసంస్కృత దీర్ఘ సమాసములు వాడడు. ఈ సందర్భమున నీ పద్యమును ద్రౌపదిచేఁ బలికించి దానికంటెను గంభీరంబగు నామె స్వభావమును వెల్లడి చేసినాడు. మఱియు నామె చెప్పఁదలచిన విషయమునంత ఒక్క పద్యముననే యిమిడ్చినాఁడు. ఆ సంగ్రహ నైపుణ్యముఁ (brevity of expression) బరికింపుడు. ఇట్టి సమాసములనే కాక యీ శార్దూల వృత్తము సైతము తిక్కన చాల అరుదుగనే వాడినట్లున్నాడు...సంస్కృత మూలమున ద్రౌపది ధర్మాధర్మ విచారణతోఁ గూడిన యొక్క ధర్మోపన్యాస మిచ్చినది...**"గంధర్వాః పతయో మమ - తే త్వాం నిహన్యుః"** అను దానికి గాను తిక్కనార్యుఁ డీ దుర్వారోద్యమేత్యాది పద్యమును రచించినాఁడు". (ఆంధ్రకవితా విమర్శనము - పు. 289-290).

3.ఈ పద్యశిల్పాన్ని గురించి కీ.శే. డాక్టర్ పాటిబండ మాధవశర్మగారి వ్యాఖ్య గమనార్హం: "కీచక భర్త్సనమున ద్రౌపది ప్రయోగించిన "దుర్వారోద్యమ" ఇత్యాది శార్దూల వృత్తము యొక్క నిర్మాణమునందు తిక్కన యద్భుతమైన శిల్పము ప్రదర్శించెను. **"విచ్ఛిన్నపాదం పూర్వార్ధే ద్వితీయార్ధే సమాసవత్ । శార్దూలం క్రీడితం భాతి విపరీత మతో౽ధమమ్" (సువృత్త తిలకము. 2.37)** అని క్షేమేంద్రుని యుపదేశము. తిక్కన దర్శన మందుకు భిన్నముగా నున్నది. క్షేమేంద్రుడు అధమమని తెగడిన నిర్మాణమునే తిక్కన మహాశిల్పముగా నిచ్చట ప్రదర్శించెను. ద్రౌపదీ వాక్యము పూర్వార్ధమున అవిచ్ఛిన్న సమాసవంతము, ఉత్తరార్ధమున అసమస్త పదము, విచ్ఛేద బహుళమునై యున్నది. కీచకుని నీచ ప్రసంగము వినివిని యెట్లును వాడా ప్రసంగమును మానడని నిశ్చయించుకొని చిరము నిరోధించుకొన్న క్రోధమును ద్రౌపది యొక్కసారిగా వాగ్రూపమున బహిర్గతము చేసినది. చిరవిరుద్ధ క్రోధ ప్రవాహముయొక్క యుద్గతి ఆరంభమున అత్యంత మోజోమయమగుట సహజము. ఆ యోజోలక్షణము అవిచ్ఛిన్న కల్లోలాయమాన ధారాపాతము. ఓజోవ్యయమునఁ గ్రమముగ వాగ్విచ్ఛేదనము, క్రమవర్ధమాన క్రోధాద్యుద్వేగ నిర్వహణమున క్షేమేంద్రుని యుపదేశము గ్రాహ్యము. చిరనిరుద్ధ క్రోధావేశము యొక్క హఠాద్యుత్క్రాంతియందు అది త్యాజ్యమే. తిక్కన నిర్మాణమే యిచ్చట ఉపాదేయ మగుచున్నది. పద్యమందలి స్థాయ్యక్షరము రేఫము. మూర్ధన్యమైన రేఫము ఆగ్నేయము. అది శ్రుతినికర్తన చిత్త సంతాపన శీలమని యభినవులు. అట్టి రేఫము బహువారావృత్తిచే స్థాయిత్వమును, ప్రాసాక్షరయోగముచే పుష్టిని పొంది పద్యమున దీప్తిని చక్కగా వ్యాపింపఁజేయుచున్నది. దంత్యత్వముచే కాఠిన్య లక్షణములయిన తవర్గాక్షరములు అనువారి భావమున రేఫకృత దీప్తిని పోషించుచున్నవి. ప్రథమ ద్వితీయ తృతీయ పాదములందు వడి ఉకార అకార ఈకార యుక్తమై ద్రౌపది వాక్యోచ్చారణము అనుదాత్త స్వరమున నారంభించి క్రమముగ ఉచ్చస్వరత్వమును దాల్చుచున్నదని సూచించుచున్నది. ప్రాసాక్షరమురేఫ పరసంయోగముచే ప్రాసాక్షరమురేఫ పరసంయోగముచే పరుషతరమై దారుపిండ ధర్మమును వ్యంజించుచున్నది. "దుర్" అన్న యుపసర్గము వాక్యారంభమునం దుండి కీచక దూషణరూప వాక్యోత్పత్తికి బీజత్వము ధరించుచున్నది. పూర్వపాదద్వయము హలంతత్వముచే తీక్ష్ణమై యున్నది. పద్యపూర్వ భాగమున సుదీర్ఘ సమాసము పాండవుల ప్రతివీర నిర్మథన విద్యాపారగత్వమును వ్యంజింపగా ఉత్తరార్ధము భిన్నాంగమై భీమకృత కీచక మాన ప్రాణాంగ భంగక్రమమును ప్రత్యక్షము చేయుచున్నది. ఘోషాక్షర బాహుళ్యముచే పద్యమున గాఢత్వరూపమైన ఓజస్సు మూర్తీభవించుచున్నది.

ఈ పద్యమునఁ దాను గావించిన శిల్పము తిక్కనకే మెచ్చుకొల్పి యుండవలయును. తాను కీచకుని భంగించిన తెఱంగును భీమసేనునకుఁ జెప్పు సందర్భమునఁ దిక్కన ఈ పద్యమును యథారూపముగ ద్రౌపది ముఖమున బునరుక్తము చేసెను. భర్త్సనమాత్ర ప్రయోజనమైన స్త్రైణ క్రోధమును - అమర్షను వ్యంజించుటకు శార్దూల వృత్త నిర్మాణ మెట్లుండవలెనో తిక్కన శిల్పించి చూపెను." (ఆంధ్ర మహాభారతము: ఛందఃశిల్పము. పు-398. (సంపా.)

**తే. అనుడు నతఁ డిట్టు లనియె 'నా యతుల బాహు । బలముఁ జెనయంగ భవదీయ పతుల కారు**
**మూఁడులోకంబులందు నెవ్వాఁడు లేమి । నిక్కువం బింత నమ్ముము నీరజాక్షి!' 56**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా విని; అతఁడు= కీచకుడు; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికాడు; నీరజ+అక్షి!= పద్మాలవంటి కన్నులు కలదానా!; నా= నా యొక్క; అతుల బాహుబలమున్= సాటిలేని భుజశక్తిని; చెనయంగన్= ఎదిరించటానికి; భవదీయపతులు+అ= నీ భర్తలే; కారు= కాదు; మూఁడు లోకములందున్= (స్వర్గం, భూతలం, పాతాళం అనే) మూడు లోకాలలోనూ; ఏ+వాఁడున్= ఎవ్వడూ; లేమి= లేకపోవటం; నిక్కువంబు= నిజం; ఇంత= దీనిని; నమ్ముము.

**తాత్పర్యం:** ఆమెమాటలు విని కీచకుడు ఇట్లా అన్నాడు. "పద్మాలవంటి కన్నులు కలదానా! నన్నెదిరించటానికి నీ భర్తలే కాదు, మూడులోకాలలో మరెవ్వరూ సమర్థులు లేరన్నది నిజం. ఇది నమ్ముము'.

**విశేషం:** కీచకుడి మదాంధత్వం ఇందులో తెలుస్తుంది.

**వ. అనిన విని సైరంధ్రి సైరణ దక్కి ధిక్కరించి యిట్లనియె. 57**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= అనగా విని; సైరంధ్రి= సైరంధ్రి వేషంలో ఉన్న ద్రౌపది; సైరణ+తక్కి= ఓర్పు కోల్పోయి; ధిక్కరించి= ఎదిరించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అనగా విని సైరంధ్రి సహనాన్ని కోల్పోయి కీచకుడిని ఎదిరించి ఇట్లా అన్నది.

**క. 'చనుఁ జనదని చూడక యం। దని మ్రాఁకులపండ్లు గోయఁ దలఁచుట హితమే?**
**మును చెడిన రావణాదుల। విని యెఱుఁగవె యెన్నఁడును వివేకవిహీనా!' 58**

**ప్రతిపదార్థం:** వివేకవిహీనా!= ఓయీ వివేకం (బుద్ధి) లేనివాడా!; చనున్+చనదు చూడక= ఇది తగింది, ఇది తగనిది అని ఆలోచించకుండా; అందని మ్రాఁకుల= (ఎత్తుగా ఉండి) అందని చెట్ల యొక్క; పండ్లు+కోయన్+తలఁచుట= పండ్లు కోయాలనుకొనటం; హితమే?= మేలా?; మును చెడిన= పూర్వకాలంలో చెడిపోయిన; రావణ+ఆదులన్= రావణాసురుడు మొదలైనవారిని గురించి; ఎన్నఁడును= ఎప్పుడుకూడా; విని+ఎఱుఁగవె?= వినలేదా?

**తాత్పర్యం:** ఓయీ వివేకం లేని కీచకా! ఈ పని తగునా తగదా అని ఆలోచించక, అందని చెట్లకు కాసిన పండ్లు కావాలని కోరుకొన్నట్లుగా, దుర్లభాలైన వాటిని కోరటం మేలుగాదు. తొల్లి రావణాదులు ఇటువంటి కోర్కెలు కోరి చెడిపోయారని ఎన్నడూ వినలేదా?

**విశేషం:** 'అందని మ్రానిపండ్లు' అనేది తెలుగు జాతీయం. అందని ద్రాక్షపండ్లు పుల్లన. పురాణగాథతో ప్రస్తుతాంశాన్ని మేళవించి ద్రౌపది హెచ్చరిస్తున్నది. రావణాదులవలె కీడు తెచ్చుకుంటావని చెప్పింది. త్రేతాయుగంలో రావణుడు స్త్రీ వ్యామోహం చేత తాను తన వంశాన్ని కూడా నాశనం చేయటం ఇక్కడ ద్రౌపది గుర్తుచేస్తున్నది. పరస్త్రీ వ్యామోహం ఎంతటి ఘోరాల పాలు చేస్తుందో తెలియజేసింది. అలం: లలితం; చెప్పదలచుకొన్న విషయాన్ని చెప్పకుండా దానితో సమానంగా మరో అప్రస్తుత విషయం చెప్పటం లలితాలంకారం.

**తే. ఇవ్విధంబునఁ బలికిన యింతి పలుకు। గాన నేరక తమ యప్పకడకు మగుడ**
**నరిగె నెవ్వగ మనమునఁ బిరిగొనంగఁ। జిన్నఁబోయిన మొగముతో సింహబలుఁడు. 59**

**ప్రతిపదార్థం:** ఈ విధంబునన్+పలికిన= ఇట్లా మాట్లాడిన; ఇంతిపలుకు= సైరంధ్రి మాటను; కాననేరక= తెలిసికొనలేక; తమ అప్పకడకున్= తన అక్క వద్దకు; సింహబలుఁడు= కీచకుడు; నెఱ+వగ= మిక్కిలి దుఃఖం; పిరిగొనంగన్= ఆవహించగా; చిన్నఁబోయిన మొగముతోన్= వాడిపోయిన ముఖంతో; మగుడన్+అరిగెన్= మళ్ళీ వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఇట్లా మాట్లాడిన ఆమె మాటను అర్థం చేసికొనలేక సింహబలుడు మనసులో మిక్కిలి బాధ నిండిపోగా మొగం చిన్నబుచ్చుకొని తిరిగి తన అక్క దగ్గరికి వెళ్ళాడు.

**క. చని మదనాగ్ని జ్వాలలు। దనుకఁగ నిట్టూర్పు గాడ్పు దందడి నిగుడం**
**దను నూరార్పఁగ సఖి దొర। కొనమికి వెనుఁబడుచుఁ గీచకుం డా సతితోన్. 60**

**ప్రతిపదార్థం:** కీచకుండు= కీచకుడు; చని= వెళ్ళి; మదన+అగ్నిజ్వాలలు= విరహం అనే అగ్ని యొక్క మంటలు; తనుకఁగన్= పైకి రేగగా; నిడు+ఊర్పు గాడ్పు= నిట్టూర్పు సెగలు; దందడి నిగుడన్= మాటిమాటికీ (సాంద్రతతో) వ్యాపించగా; తనున్=

తనను (కీచకుడిని); ఊరార్పఁగన్= ఊరడించటానికి, సఖి= సైరంధ్రి; దొరకొనమికిన్= అంగీకరించక పోవటం చేత; వెనుఁ బడుచున్= వెనుకకు మరలి; చని= వెళ్లి; ఆ సతితోన్= సుదేష్ణతో.

**తాత్పర్యం:** కీచకుడు అట్లా వెళ్ళి మన్మథాగ్ని జ్వాలలు కాల్చివేయగా నిట్టూర్పులు దీర్ఘంగా విడుస్తూ, ద్రౌపది తన మాటకు అంగీకరించలేదనే పరితాపంతో మళ్ళీ వచ్చి సుదేష్ణతో ఇట్లా అన్నాడు.

**వ. 'ఏ నప్పుడు నీకుం జూపి యన్వయ నామధేయంబు లడిగిన యప్పొలఁతి వలనం జిక్కి చిత్తం బుత్తల పడుచున్నయది; యిటమీఁద నీవ యెఱుంగు; దయ్యింతి యింతసేపు నీ చేరువనుండి యిప్పుడెట మెలఁ గెఁ?' నని యడిగిన విని, యతని వేగిరపాటు చూచి శిరఃకంపంబు సేయుచు సుదేష్ణ నిజాంతర్గతంబున. 61**

**ప్రతిపదార్థం:** ఏన్+అప్పుడు= నేను వచ్చిన వెంటనే; నీకున్+చూపి= నీకు చూపించి; ఏను= నేను; అన్వయ నామధేయంబులు= వంశమూ, పేరూ; అడిగిన= ప్రశ్నించిన; ఆ+పొలఁతి వలనన్+చిక్కి= ఆ వనితపైన లగ్నమై; చిత్తంబు= మనస్సు; ఉత్తలము+పడుచున్+ఉన్న+అది= బాధపడుతున్నది; ఇటమీఁదన్= ఇకపైన; ఈవు+అ= నీవే; ఎఱుంగుదు(వు)= తెలిసికొంటావు; ఆ+ఇంతి= ఆ వనిత; ఇంతసేపు= ఇంతకాలం; నీ చేరువన్+ఉండి= నీ దగ్గర ఉండి; ఇప్పుడు; ఎట మెలఁగెన్?= ఎక్కడికి వెళ్ళింది; అని, అడిగిన; విని; అతని= కీచకుడి యొక్క; వేగిరపాటు= తొందరపాటు; చూచి= గమనించి; సుదేష్ణ; శిరః కంపంబు+చేయుచున్= తల ఆడిస్తూ; నిజ+అంతర్గతంబునన్= తన మనస్సులో.

**తాత్పర్యం:** 'నే నప్పుడు నీకు చూపించి వంశాన్నీ, పేరునూ గురించి అడిగిన స్త్రీమీది మోహంతో నా మనస్సు వేగిరపడుతున్నది. ఆపైన నీకే తెలుసు. ఆమె ఇంతవరకు నీ దగ్గరే ఉండి ఇప్పు డెక్కడికి వెళ్ళింది?' అని కీచకుడడిగాడు. అతడి తత్తరపాటు చూచి సుదేష్ణ తల ఊపుతూ మనస్సులో ఇట్లా అనుకొన్నది.

**విశేషం:** శిరఃకంపం ఒక సాత్త్విక భావం. వితర్క సూచకం. తిక్కన నాటకీయ శిల్ప సంకేతం. (సంపా.)

**తే. 'రాగరసమగ్నుఁడయ్యె సైరంధ్రిఁ జూచి ׀ యకట! దీన నింకేమి యపాయమగునొ?**
**వలదు తగదన్న నుడిగెడు వాఁడె వీఁడు? మాయదైవమ! యే నేమి సేయుదాన? 62**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఇతడు, కీచకుడు; సైరంధ్రిన్+చూచి= సైరంధ్రిని చూచి; రాగరసమగ్నుఁడు+అయ్యెన్= మోహమనే (వలపనే) నీటిలో మునిగాడు; దీనన్= ఇందువలన; ఇంకన్+ఏమి అపాయము+అగునొ?= ఏమి కీడు జరుగుతుందో; వలదు, తగదు+అన్నన్= వద్దు, మంచిది కాదని చెప్పినా; ఉడిగెడు వాఁడె?= మానుకొనే వాడుకాదు; మాయదైవమ!= ఓయి మాయలు కల్పించే భగవంతుడా!; ఏను+ఏమి, చేయుదానన్?= నేనేం చేసేది?

**తాత్పర్యం:** సైరంధ్రిని చూచి కీచకుడు మోహపరవశుడైనాడు. దీనివలన ఏమి అపాయం కలుగుతుందో తెలియదు. వలదని వారించినా వీడు మానేవాడు కాడు (మాట వింటాడా?). భగవంతుడా! ఇప్పుడు నే నేమి చేసేది?

**విశేషం:** ఈ పద్యంలో 'అకట!' అనే విచార సూచకమైన ఆశ్చర్యార్థకం మొదట గమనించ తగింది. సైరంధ్రిని చూచి రాగరసంలో కీచకుడు మునిగాడని గ్రహించింది సుదేష్ణ. అయితే విచార మెందుకు? సైరంధ్రి పరపురుషులను కోరని చిత్తవృత్తి కలిగినందుకా? అంతఃపుర స్త్రీల పట్ల రాణిమందిరంలో ఒక పురుషుడు అట్లా వ్యవహరించినందుకా? ఈ రెండు ప్రశ్నలు ధర్మసంబంధులు. దీనికంటె ఆమెను కలవరపెట్టేది సైరంధ్రి భర్తల పరాక్రమం (ప్రథమాశ్వాసంలో 324,325 పద్యాలు గమనించాలి). నీచమతితో

ఆమెను చూచినవాడిని హరిహరాదులు అడ్డం వచ్చినా ఆమె భర్తలు ఆ రాత్రిలోపే మట్టుపెట్టుతారట! వందలకొలది బంధువులున్నా, ఎంత శక్తిమంతుడైనా అతడు చావటం తప్పదట! సైరంధ్రి చెప్పిన ఆ మాటలు కీచకుడిపట్ల మరణమృదంగం వలె మనస్సులో మారుమ్రోగి ఉంటాయి. ఆ గండాన్ని స్మరించి ఆమె 'అయ్యో!' అని బాధపడింది. అందుకే ఈ వలపు వలన కీచకుడికి ఎటువంటి అపాయం వస్తుందో అని భయపడింది. ఆ సంగతి అతడితో చెప్పటానికి వీలు లేదు. కాక, ఎట్లా చెప్పినా అతడు వినడు. దుర్విదగ్ధుడు కావటం చేత ఒకరు చెప్పిన మాట వినడు. తనకు తోచదు. అందువలన ఆ పరిస్థితులలో ఆమె ఏమీ చేయలేని ఒక నిస్సహాయస్థితిలో నిలిచిపోయింది. అప్పటి ఆమె మానసికస్థితిని 'మాయదైవమా!' అని దయనీయంగా అనటంలో తిక్కన ధ్వనింపచేశాడు. జరుగకూడనిది ఏదైనా జరిగినా, పొసగకూడనిది ఎక్కడైనా పొసగినా అది విధివైపరీత్యంగా భావించటం లోకసహజం. ఆ లోకవైపరీత్య భావానికి వాచికమైన ప్రతిస్పందన 'మాయదైవమా!' అనే తెలుగుజాతీయం. భావానుగుణమైన వాచికాభినయం ఈ పద్యంలోని రసశిల్పం. (సంపా.)

**వ. అయిన నా నేర్చుకొలందిఁ దగిన తెఱంగున వారించి చూచెదంగాక!' యని యూహించి యిట్లనియె. 63**

**ప్రతిపదార్థం:** అయినన్= అయినప్పటికి; నానేర్చుకొలందిన్= నా శక్తి కొలదీ; తగిన తెఱంగునన్= తగిన విధంగా; వారించి చూచెదన్+కాక!= సాధ్యమైనంతవరకు వద్దని చెప్పి చూస్తాను; అని; ఊహించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అయినా నా శక్తివంచన లేకుండా వద్దని చెప్పి చూస్తానని ఊహించి సుదేష్ణ ఇట్లా అన్నది.

**విశేషం:** కీచకుడి ఔద్ధత్యం, తన భద్రత దృష్టిలో పెట్టుకొని మితిమీరకుండా సుదేష్ణ ప్రవర్తించింది.

**సీ. 'లలితంబు లగు మట్టియల చప్పు డింపార। నంచకైవడి నడ నల్ల వచ్చి,**
**యెడ మేని నెత్తావి సుడియంగఁ బయ్యెద। సగము దూలించి పై మగుడఁ దిగిచి,**
**సోలెడు నెలదీఁగె లీలఁ గ్రాలుచు వింత। చెలువంబు దలకొనఁ జేరి నిలిచి**
**తెలిగన్నుఁగవకు నెచ్చెలియైన లేఁతన। వ్వొలయంగ సరసంపుఁ బలుకు పలికి,**

**తే. మెఱయు చెయ్వుల రాగంబు మెయికొనంగ। నెడఁద సొగయించు మాటల నెలమి మిగుల**
**నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నెలఁత లుండ। నీరసాకార సైరంధ్రిఁ గోరఁ దగునె?' 64**

**ప్రతిపదార్థం:** లలితంబులు+అగు= మనోహరమైన; మట్టియల చప్పుడు= కాలిమట్టెల శబ్దం; ఇంపు+ఆరన్= చెవికి ఇంపు కలిగించేటట్లు; అంచకైవడి నడన్= హంసనడకవంటి నడకతో; అల్లన్+వచ్చి= మెల్లగా వచ్చి; ఎడమేని నెత్తావి= సున్నితమైన శరీరపు మంచివాసన; సుడియంగన్= ప్రసరించగా; పయ్యెద= పైట; సగము తూలించి= సగభాగం విలాసంగా జార్చి; మగుడన్+తిగిచి= మళ్ళీ మీదికి లాగుకొని; సోలెడు ఎలదీఁగెలీలన్= వ్రాలే లేత తీగవలె; క్రాలుచున్= చలిస్తూ; వింత చెలువంబు= కొత్త అందం; తలకొనన్= కలిగేటట్లు; చేరి, నిలిచి= ప్రక్కకు వచ్చి నిలబడి; తెలికన్నుఁగవకున్= తెల్లని కన్నుల జంటకు; నెచ్చెలి+ఐన= చెలి అయిన (సైదోడయిన అని భావం); లేఁతనవ్వు= చిరునవ్వు; ఒలయంగన్= వ్యాపించగా; సరసము+పలుకు= వలపు మాటలు; పలికి= మాట్లాడి; మెఱయు చెయ్వులన్= ప్రకాశించే ప్రేమ చేష్టలలో; రాగంబు= వలపు; మెయికొనంగన్= కలుగగా; ఎడఁదన్= మనస్సును; సొగయించుమాటలన్= పరవశింపజేసే మాటలతో; ఎలమి= సంతోషం; మిగులన్= అతిశయించగా; నిన్నున్= (కీచకుడిని); అనురక్తిన్= ప్రేమతో; కొలుచు= సేవించే; ఆ+నెలఁతలు+ఉండన్= ఆ కాంతలుండగా; నీరస+ఆకారన్= రసహీనమైన రూపం కలిగిన; సైరంధ్రిన్= ఆ పూలుముడిచే దానిని; కోరన్+తగునె?= కోరటం భావ్యమా?

**తాత్పర్యం:** అందమైన కాలిమట్టెల చిరుసవ్వడులు చెవికి, మనసుకు హాయి కలిగిస్తూ ఉండగా హంస నడకలతో మెల్లగా వచ్చి, సున్నితమైన శరీరపు సువాసన చుట్టుముట్టగా, పైట సగం జారిపోగా దానిని పైకి మరల సర్దుకొంటూ, గాలికి అటునిటు తూగే లేత తీగవలె ఒప్పారుతూ అబ్బురం కొలిపే అందం తొణికిసలాడేటట్లు దగ్గరగా చేరి నిలువగా, తెల్లని కాంతుల కనుదోయికి ఇష్టసఖి (సాటి) అయిన చిరునవ్వు చిలికేటట్లు వలపు మాటలు పలికి, ప్రదర్శించే ప్రతి చేష్టలోనూ మనసులోని వలపు ఒలకపోయగా, మనసును మరపించే మాటలతో ప్రీతిని పెంచేటట్లు నిన్ను అనురాగంతో సేవించే ఆ అందగత్తెలు (అంతమంది నీ ఇంట) ఉండగా (వారందరినీ వదలి), ఎటువంటి రాగరసాన్ని అందించలేని ఆకారం గల (నీరసాకార) ఈ సైరంధ్రిని కోరటంలో ఏమి న్యాయం ఉన్నది?

**విశేషం:** మట్టెలతో నడచివచ్చే వనిత సామీప్యాన్ని కోరి ఆసక్తిని, పయ్యెదను జార్చుకొనే వనిత అభిలాషను, తీగవంటి మేనును, వింత సోయగాలతో ప్రదర్శించే లలితాంగి పొందును, తెలిగన్నుల కాంతితో చిరునవ్వును ప్రదర్శిస్తూ వలపు మాటలు పలికే వనిత సాముఖ్యాన్నీ, శృంగార చేష్టలు ప్రకటించే వనిత లీలావిభ్రమాన్నీ, మనసును మరపించే మాటలాడే వనిత పారవశ్యాన్నీ ప్రకటిస్తారని సుదేష్ణ చెప్పటం తమ్ముడి మనసు మరల్చటానికే! ప్రియుడికై బయలుదేరిన స్థితి నుండి అతడి పొందులో పరవశించేంతవరకు ఆరు రకాలైన స్త్రీల మదన చేష్టలు ఈ సీసంలో చెప్పబడ్డాయి. ఒక్కొక్క చరణంలో వర్ణించబడిన వనిత ఒక్కొక్కరు వేరుగా ఉండవచ్చును. ఒక్క వనితలోని వివిధావస్థలు కావచ్చును. హావభావాలను అట్లా రసానుభవానికి అనుగుణంగా ఆవిష్కరించగలిగిన అందమైన ఆకారం కలిగినవారు కీచకుడికి ఎందరో ఉన్నారు. అత డప్పటికే దక్షిణ నాయకుడు. అతడి రసికతకు తగినంత రసికురాలు సైరంధ్రి కాదనీ (మనసులో వలపు లేనిదనీ) సుదేష్ణ నచ్చచెప్పి అతడిని వారింపచేయటానికి ప్రయత్నించింది. కాని, కీచకుడి దృష్టికి సుదేష్ణ మాటలు అపరిణతాలు, అనాదరణీయాలుగా తోచాయి. అది నిజం కూడా. ఇంతటి వర్ణనం నిష్ఫలం కావటం అతడి రాగరసమగ్నతకు రమణీయ వ్యాఖ్యానం. సీసపద్య ప్రథమ తృతీయ చరణాలలో ఉపమాలంకారం. ద్వితీయచతుర్థ చరణాల్లో స్వభావోక్తి అలంకారం రచనకు వన్నె పెట్టుతున్నాయి. (సంపా.)

**వ. అనిన నప్పలుకులదెస ననాదరంబు సేయుచు నచ్చేడియం జూచి కీచకుం డిట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+పలుకుల, దెసన్= ఆ మాటల పట్ల; అనాదరంబు+చేయుచున్= లెక్కపెట్టక; కీచకుండు; ఆ+చేడియన్= ఆ సుదేష్ణను; చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సుదేష్ణ మాటలను లెక్కపెట్టక కీచకు డిట్లా అన్నాడు.

**క. 'నా కొలువు వార కా; ర। న్నాకేశుం గొలుచు నంగనలలోనైనన్**
**లేకునికి నాకుఁ దెల్లం। బా కొమ్మకు నీడు పోల్పనయ్యెడు సుదతుల్. 66**

**ప్రతిపదార్థం:** నా కొలువు వారు+అ= నా కొలువులోనివారే; కారు= కాదు; ఆ+నాక+ఈశున్= ఆ ఇంద్రుని; కొలుచు+ అంగనలలోన్+ ఐనన్= సేవించే (దేవ) వనితలలో కూడా; ఆ కొమ్మకున్= ఆ స్త్రీతో; పోల్పన్= పోల్చటానికి; ఈడు= సరి (అయిన); సుదతుల్= స్త్రీలు; లేక+ఉనికి= లేకపోవటం; నాకున్+తెల్లము= నాకు స్పష్టంగా తెలియును.

**తాత్పర్యం:** సైరంధ్రితో పోల్చదగిన స్త్రీలు నా కొలువులోనే కాదు, ఆ ఇంద్రుడిసభలో కూడా లేరు. అది నాకు తెలుసు.

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. నాకేశుడిని కొలిచే స్త్రీలలో కూడా లేరనటంవలన సేవించే స్త్రీలలలో ఇతర స్త్రీలమాట వేరే చెప్పాలా? అని భావం కనుక కావ్యార్థాపత్తి. ద్రౌపది అపూర్వ సౌందర్యవతి అని కీచకుడి భావన. అట్లా చెప్పగలిగిన అనుభవజ్ఞుడు కూడా అతడు. (సంపా.)

సీ. **గండుమీలకుఁ బుట్టి కాము బాణములతోఁ। గలసి యాడెడు నట్టి కన్నుఁ గవయు,**
**బిస కాండముల శిక్షఁ బెరిఁగి లేఁ దీఁగల। మెచ్చక యున్నట్టి మృదు కరములుఁ,**
**జిగురులతో సంధి సేసి యంబుజముల। పై నెత్తి చను నట్టి పదతలములుఁ,**
**గలకంఠములచేతఁ గఱచిన విద్య వీ। ణల కిచ్చునట్టి తిన్నని యెలుంగు,**

తే. **నత్తెఱంగున రేఖయు, నవ్విధంబు। గరువ చందంబు, నమ్మెయి కలికితనము,**
**నట్టి చెన్నును సైరంధ్రియంద కాక। కలవె యొరులకు? నెఱుఁగక పలికి తబల!** 67

**ప్రతిపదార్థం:** గండుమీలకున్= పెద్ద చేపలకు; పుట్టి= జన్మించి; కామబాణములతోన్= మన్మథబాణాలతో; కలిసి+ఆడెడు+అట్టి= కలిసిమెలసి ఆడుకొనే; కన్నుఁగవయున్= కనుదోయి; బిసకాండముల శిక్షన్= తామరతూండ్ల శిక్షణలో; పెరిఁగి= పెద్దవి అయి; లేఁత+తీగల మెచ్చక+ఉన్న+అట్టి= లేత తీగలను మెచ్చని; మృదుకరములున్= మెత్తని చేతులు; చిగురులతోన్ సంధి+చేసి= చిగురుటాకులతో సఖ్యపడి; అంబుజములపైన్+ఎత్తి= తామరల మీద యుద్ధానికి; చను+అట్టి= వెళ్ళే; పదతలములున్= అరికాళ్ళు; కలకంఠముల చేతన్= కోకిలల చేత; కఱచిన విద్య= నేర్చుకొన్న చదువు; వీణలకున్+ఇచ్చు+అట్టి= వీణలకు ఇచ్చే; తిన్నని+ఎలుంగున్= చక్కని కంఠస్వరం; ఆ+తెఱంగున రేఖయున్= ఆ విధమైన ఆకార లక్షణం; ఆ+విధంబు= అటువంటి (సాటిలేని అని భావం); గరువచందంబున్= ప్రౌఢమైన చక్కదనం; ఆ+మెయి కలికితనమున్= ఆ విధమైన సౌందర్యం; అట్టి చెన్నును= అటువంటి (సాటిలేని) చక్కదనం; సైరంధ్రి+అందున్+అ= సైరంధ్రిలో మాత్రమే; కాక= కాకపోతే; ఒరులకున్= ఇతరులకు; కలవె= ఉన్నాయా? అబల!= వనితా! (సుదేష్ణా!); ఎఱుఁగక= తెలియక; పలికితి(వి)= మాట్లాడావు.

**తాత్పర్యం:** పెద్ద చేపలకు పుట్టి, మన్మథబాణాలతో కలిసి ఆడే కళ్ళూ, తామర తూళ్ళ శిక్షణలో పెరిగి లేత తీగల సౌకుమార్యం మెచ్చని చేతులూ, చిగురాకులతో చెలిమి చేసికొని పద్మాలపై దండెత్తే అరికాళ్ళూ, కోకిలల వద్ద నేర్చుకొన్న స్వరవిద్యను వీణెలకు అందించే మెల్లని కంఠస్వరం, ఆ సాటిలేని రూపవైభవం, ఆ సాటిలేని గడుసుదనం, అటువంటిదే అయిన నేర్పరితనం, అంతటి చక్కదనం సైరంధ్రిలోనే ఉన్నాయి కాని ఇతర వనితలలో కనబడతాయా? (లేవని భావం). ఓ అమాయకురాలవైన అక్కా! నీవు ఈ విషయం గమనించకుండా మాట్లాడావు.

**విశేషం:** 1. అలం: ఆర్థీ ఉపమ. క్రమాలంకారం; కారణమాల.

2. ద్రౌపదీ సౌందర్య వర్ణనంలో వాక్యగత పూర్ణ ఆర్థీ ఉపమాలంకారాన్ని తిక్కన సార్థకంగా వాడి ప్రౌఢిని ప్రదర్శించాడు. 'వలె' వంటి ఉపమావాచకాలు వాడకుండా ఆ అర్థాన్ని చెప్పే విశిష్ట పదాలతో వాక్యాల ద్వారా, సమాసాల ద్వారా, తద్ధితాల ద్వారా ఆర్థీ ఉపమ రచనలో రాణిస్తుంది. భావుకుడైన వాడు ఈ అలంకారాన్ని సార్థకంగా ప్రయోగిస్తాడు. సైరంధ్రీ సౌందర్య భావనంలో ఊహాలోకాలలో విహరిస్తూ, సుదేష్ణకు తెలియని సౌందర్య విశేషాలను వివరించాలనే కీచకుడి తమకం ఈ అలంకారోక్తిని ప్రదర్శించినట్లు రచించటం సార్థకశిల్పం. ఆర్థీ ఉపమ ధ్వనికి, అందులోనూ రసధ్వనికి ఎంతో ఉపస్కారకంగా ఉంటుందని లాక్షణికుల అభిమతం. దానికి ఈ తిక్కన పద్యం ఉచితోదాహరణం.

3. సీసపాదాల పూర్వార్ధంలో ఉపమాలంకార ధ్వని పుట్టి, శిక్షఁబెరిగి, సంధి చేసి, కఱచినవిద్య - ఇవి ఉపమాద్యోతకాలు, సమానార్థకాలు. ఇక రెండుమూడు పాదాల ఉత్తరార్ధాలలో ఉపమానాలకంటె ఉపమేయాలకు ఆధిక్యం చెప్పబడటం చేత వ్యతిరేకాలంకారం (మెచ్చని, పైనెత్తిచను= తిరస్కరించు); మొదటిపాదంలోని ఉత్తరార్థంలో కలసియాడు= సమానం - కాబట్టి ఉపమాధ్వని. నాల్గవపాదం ఉత్తరార్థంలో - వీణలకు విద్యలేదు కాబట్టి వ్యతిరేకాలంకారధ్వని.

4. అలంకారధ్వని రసధ్వనిలో పర్యవసించే ఒక శిల్పప్రస్థానం ఈ పద్యంలో ప్రత్యక్షమౌతుంది. ఎత్తుగీతిలో సైరంధ్రి అందంలో రేఖ, గఱువచందము, కలికితనము, చెన్ను-అనేవి క్రమంగా పేర్కొనబడ్డాయి. ఇతరులయందు ఉండనివిధంగా ఒక ప్రత్యేకత, అపూర్వత వాటియందు చెప్పబడింది. ఆ నాలుగింటిలోని ఆ విశేషాలను నాల్గు సీసపద్యపాదాలలో వర్ణించి తిక్కన క్రమాలంకారాన్ని లేదా యథాసంఖ్యాలంకారాన్ని పాటించాడు. అందులో మరొక చమత్కారం కారణమాలను పొదగటం. ఇందులో పూర్వపూర్వములకు ఉత్తరోత్తరాలు కారణాలైనట్లు నిబద్ధించబడటం చేత కారణమాల రాణించింది. ఎట్లాగంటే - సైరంధ్రి అందం ముందుగా కన్నుగవలో రూపుతాల్చింది. అట్లా రూపుకట్టటానికి కారణం ఆమె కన్నులు గండు చేపలకు పుట్టటం, మదనబాణాలతో కలిసి ఆడటం. పుట్టి ఆటలాడుతున్న బాల్యం భావనామయం. గండుమీలకు పుట్టినాయంటే వాటి పోలిక కలిగి ఉన్నాయని కవిసమయం. మదనబాణాలతో కలిసి ఆడాయంటే చూపులు తూపులుగా ఉండటమే కాక కామభావకారకాలవి వ్యంగ్యం. ఆమె అందానికి ఒక తీరును కల్పించేది కన్నుగవ సౌందర్యమని భావం. సైరంధ్రి సౌందర్యంలోని రెండవగుణం సాటిలేని గరువతనం. ఆ గర్వం శిక్షణలో పెరగటం వలన, లేతగుణాన్ని మెచ్చలేకపోవు ప్రౌఢివలన ఏర్పడింది. (కారణమాల). ఆమె కోమలమైన చేతులు తామరతూండ్ల వద్ద శిక్షణతో పెరిగాయట. అంటే ఆ తామరతూండ్ల వలె కోమలత్వాన్ని క్రమంగా అలవరచుకొని అందంతో అతిశయించాయన్నమాట. తామరతూండ్లు గరువచందాన్ని ప్రకటిస్తూ లేతీగలవలె రూపొంది వాటి కంటె మెత్తగా ఉండటం చేత వాటిని మెచ్చలేదట! అంటే తామరతూండ్లవలె, లేతతీగలవలె ఉన్నా వాటికంటె మిన్నగా మృదువులుగా ఉన్నాయని ధ్వని. గరువతనంతో లేదీగలను లెక్కచేయని సైరంధ్రి అందం చిగురాకులతో సంధి చేసిందట. ఆమె అరికాళ్ళు చిగురాకులతో సంధి (చెలిమి) చేసి పద్మాలపై దాడి చేసినట్లు ఉన్నాయట. అంటే చిగురాకుల వలె ఎర్రగా ఉండి పద్మాలకంటె అందంగా ఉండి ఆమె కలికితనాన్ని ప్రదర్శిస్తున్నాయన్నమాట! సైరంధ్రిమాట సౌందర్యం కోకిలవద్ద చదువు నేర్చుకొన్నదట! వీణలకు చదువు చెప్పే సన్నని తియ్యని కంఠనాదంతో తన విలాసాన్నంతా ప్రదర్శించిందట! కళ్ళనుండి కాళ్ళవరకూ ఆమె అందం ఒక క్రమాభివృద్ధి చెందినట్లు పుట్టి పరులపై దండెత్తి పోయేటంత కలికితనం సంపాదించింది. అది ఆంగిక సౌందర్యం తీరు. ఆమె మాటలు పంచమస్వర మధురం. వీణానాదానికి వంకలు తీర్చే గురుపీఠం. ప్రత్యక్షరం మధురం-అని వర్ణించి, సైరంధ్రి అందమే ఒక అందమైన వ్యక్తిత్వంతో పరిణతి చెందినట్లు - ఉపమానాలన్నీ క్రమంగా దానికి కారణమాలగా తోచేటట్లు చిత్రించటం తిక్కన అలంకారధ్వని రసధ్వనిలో పర్యవసింపచేసే కావ్యరసవిద్య. తిక్కనగారి గొప్ప పద్యాలలో ఇది ఒకటి. (సంపా.)

**వ. కావున నా యెలనాఁగ నేమి యుపాయంబుననైన నన్నుం జేర్పవైతేని కందర్పదర్పంబున నలందురి వందుదు' ననిన నవ్వెలంది వెండియు నిట్లనియె. 68**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఆ ఎలనాఁగన్= ఆ సైరంధ్రిని; ఏమి+ఉపాయంబునన్+ఐనన్= ఏ ఉపాయంతోనైనా సరే; నన్నున్= నాతో; చేర్పవు+ఐ(తివి)+ఏని= చేర్చక (కూర్చక)పోతే; కందర్పదర్పంబునన్= మన్మథప్రతాప గర్వంచేత; అలందురి= కృశించి; వందుదున్= బాధపడతాను; అనినన్= అని అనగా; ఆ+వెలంది= ఆ సుదేష్ణ; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** 'కాబట్టి, ఆ సైరంధ్రిని ఏ ఉపాయంతోనయినా సరే నాతో కలపకపోతే నేను మన్మథుడు మదించి వేసే బాణాలకు కృశించిపోతాను' - అని కీచకుడు అనగా సుదేష్ణ ఇంకా ఇట్లా అన్నది.

**తే. 'ఆయురైశ్వర్య కీర్తుల నపహరించుఁ। బరసతీ సంగమము; ధర్మపథమునందుఁ**
**బరఁగువారలు పరిహరింపంగఁ గనియు। వినియుఁ దెలియవె యిది దుర్వివేక మగుట. 69**

**ప్రతిపదార్థం:** పరసతీ సంగమము= పరస్త్రీ పొందు; ఆయుః+ఐశ్వర్య కీర్తులను= ఆయుస్సును, ధనాన్ని, పేరు ప్రఖ్యాతులను; అపహరించున్= నశింపజేయును; ధర్మపథమునందున్= న్యాయమార్గంలో; పరఁగువారలు= ఒప్పెడువారు; పరిహరింపంగన్=

వదలిపెట్టటం; ఇది= ఈ పని; దుర్వివేకము= దుర్బుద్ధి; అగుట= కావటం; కనియున్, వినియున్, తెలియవె?= స్వయంగా చూచికాని, ఎవరైనా చెప్పగా వినికాని తెలిసికొనలేదా?

**తాత్పర్యం:** 'పరస్త్రీతోడి పొందు ఐశ్వర్యాన్ని, కీర్తినీ, ఆయుస్సును నశింపజేస్తుందనీ, ధర్మపరులు దీనిని నిషేధిస్తారనీ నీవు ఎక్కడా చూచిగాని, వినిగాని ఎరుగవా? అది దుర్వివేకం అని తెలియదా?

**విశేషం:** పరసతీ సమాగమం వలన ఆయువు, ఐశ్వర్యము, కీర్తి నశిస్తాయని భారతం (1-8-31) చెప్పుతున్నది. (శీలం వరభూషణమే).

**సీ.** **పతి యెఱింగినఁ దన ప్రాణంబుపై వచ్చు। నను భయంబున నుల్లమదరు చుండ,**
**జనులు గాంచిన మానుషము దూలుఁ దన కను। పుయిలోటమున మోము పుల్లగిలఁగ,**
**బోటికిఁ దోఁచినఁ బొలియుఁ దేఁకువ యను। వెగడునఁ జెయ్వులు వీడుపడఁగ,**
**బంధుల కగపడ్డఁ బాయు నన్వయ మను। కలఁక మైఁ జెమటలు క్రమ్ము దేరఁ,**

**తే.** **గ్రీడ దెసఁ గౌతుకం బురియాడ రతుల। చవులు గొనియాడ నేరని జార పొందు**
**హృదయమున కింపు చేయమి నెఱుక గలుగు। వారు దీని సుఖంబుగాఁ గోర రెందు.** **70**

**ప్రతిపదార్థం:** పతి+ఎఱింగినన్= భర్త తెలిసికొంటే; తన ప్రాణంబుపైన్+వచ్చున్+అను= తన ప్రాణం మీదకు వస్తుందని; భయంబునన్= భయంతో; ఉల్లము+అదరుచుండన్= మనస్సు భయపడుతూ ఉండగా; జనులు కాంచినన్= ఇతరులెవరైనా చూస్తే; తనకు; మానుషము+తూలున్+అను= పరువుపోతుందనే; పుయిలోటమునన్= సంకోచంతో; మోము= ముఖం; పుల్లగిలఁగన్= వెలవెలపోగా; బోటికిన్+తోఁచినన్= చెలికత్తెకు తెలిస్తే; తేఁకువ= గౌరవం (మర్యాద); పొలియున్= నశిస్తుంది; అను వెగడునన్= అనే భయంతో; చెయ్వులు= విలాసచేష్టలు; వీడుపడఁగన్= వదలిపెట్టగా; బంధులకున్+అగపడ్డన్= బంధువుల కంటపడితే; అన్వయము= వంశప్రతిష్ఠ; పాయున్+అను= పోతుందనే; కలఁకన్= భయంతో; మైన్= శరీరమునందు; చెమటలు క్రమ్మదేరన్= చెమటలు పట్టగా; క్రీడదెసన్= రతి క్రీడలో; కౌతుకంబు= ఆసక్తి; ఉరియాడన్= చలించగా; రతుల చవులు= రతిరుచులు; కొనియాడనేరని= పొగడలేని; జారపొందు= రంకుటాలితో కలయిక, రంకుతనం; హృదయమునకున్= మనస్సునకు; ఇంపుచేయమిన్= ప్రియంకలిగించదు కాబట్టి; ఎఱుక+కలుగువారు= బుద్ధిమంతులు; దీని సుఖంబు= జారసుఖాన్ని; ఎందున్+కోరరు= ఎన్నడూ కోరరు.

**తాత్పర్యం:** జారశృంగారంలో (రంకుతనంలో) పాల్గొనే వనిత పురుషుడి హృదయానికి సంతోషాన్ని కలిగించలేదు. భర్త తెలిసికొంటే తన ప్రాణంమీదకే వస్తుందని ఆమె గుండె గడగడలాడుతూ ఉంటుంది. జనాలకు తెలిస్తే పరువుపోతుందనే భయంతో ఆమె ముఖం వెలవెలబోతుంది. చెలికత్తెకు తెలిస్తే అవమానం కలుగుతుందనే భయంతో ఆమె విలాస చేష్టలు ప్రదర్శించలేకపోతుంది. బంధువులకు తెలిస్తే వెలివేస్తారనే భయంతో ఆమె మనసు వికలమై చెమటలు పట్టుతాయి. రతి క్రీడా సమయంలో కూడా మనస్సు బాధపడుతుండటం వలన ఆసక్తిని చూపలేక రతిలోని రుచులను అనుభవించలేదు. కాబట్టి జారిణీ స్త్రీ సాంగత్యం మనస్సుకు ఉల్లాసకరం కాదని తెలివిగల వారు దాని కెప్పుడూ దూరంగా ఉంటారు.

**వ.** **అదియునుంగాక.** **71**

**తాత్పర్యం:** అంతేకాక.

**క. బలవిక్రమ సంపన్నులు । గల రేవురు దానిపతులు గంధర్వులు; వా**
**రలఁ దలఁచిన నా చిత్తము । దలఁకెడు; నది యేల నీకుఁ దమ్ముఁడ! చెపుమా! 72**

**ప్రతిపదార్థం:** దాని పతులు= ఆమె భర్తలు; గంధర్వులు= గంధర్వలోకం వారు; బలవిక్రమ సంపన్నులు= బలపరాక్రమం అధికంగా గలవారు; ఏవురు+కలరు= ఐదుగురున్నారు; వారలన్+తలఁచినన్= వారిని తలచుకొంటే; నా చిత్తము= నా మనస్సు; తలఁకెడున్= కలవరపడుతున్నది; (కాబట్టి) తమ్ముఁడ!= ఓ తమ్ముడా; నీకున్; అది= ఆమె పొందు; ఏల చెపుమా!= ఎందుకు చెప్పుము.

**తాత్పర్యం:** బలోపేతులైన దాని భర్తలు గంధర్వులు ఐదుగురున్నారు. వారిని తలచుకొంటేనే నా మనస్సు కలత పడుతున్నది. ఒరే తమ్ముడా! దాని ధ్యాస నీకెందుకు చెప్పుము.

**విశేషం:** గంధర్వులు, బలవిక్రమ సంపన్నులు ఐదుగురు అని చెప్పి భయపెట్టాలని చెప్పిచూచింది. తమ్ముడా! అని ప్రియంగా సంబోధించింది.

**తే. కాని తెరువునఁ బోయినఁ గలుగునయ్య! । బ్రదుకు? చవి యెంతయైన నపథ్యములకు**
**వేడ్కసేయుదురయ్య వివేకు? లెవ్వి । ధమున నా బుద్ధి వినవయ్య తమక ముడిగి.' 73**

**ప్రతిపదార్థం:** కాని తెరువునన్= చెడుత్రోవలో; పోయినన్= పోతే; బ్రతుకు= జీవితం; కలుగున్+అయ్య!= కలుగదు; చవి+ఎంత+ఐనన్= ఎంతటి రుచి(ఆసక్తి) ఉన్నను; వివేకులు= బుద్ధిమంతులు; అపథ్యములకున్= హితము కానివాటికి; వేడ్క+చేయుదురు+అయ్య?= ఉబలాటపడతారా నాయనా?; తమకము+ఉడిగి= మోహాన్ని వదలిపెట్టి; నాబుద్ధి= నేను చెప్పేమాటలు; వినవయ్య!= వినుము.

**తాత్పర్యం:** చెడుబాటలో సాగితే బ్రతుకు నిలిచేనా? హితం కాని పనులు ఎంత రక్తిని కలిగించినా బుద్ధిమంతులు వాటిని కోరరు. కాబట్టి నా మాట విని ఏ విధంగానైనా సరే నీ మోహాన్ని మానుకొనుము.'

**విశేషం:** ఎంత అందంగా ఉన్నా పరసతీ వ్యామోహం వివేక లక్షణం కాదు. తమకంలో ఉన్న నీవు నా మాటలు వినుమని సుదేష్ణ చనవుగా పలికింది.

**క. అనవుడు నమ్మాటలు దన । మనమునకు సహింపరామి మల్లడిగొనుచున్**
**మనసిజ పరతంత్రత ని । ట్లని పల్కె సుదేష్ణతోడ నతఁ దుద్ధతుఁడై. 74**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; ఆ+మాటలు= ఆమె చెప్పిన పలుకులు; తన మనమునకున్= కీచకుని మనస్సునకు; సహింపరామిన్= ఓర్చుకోలేనివి కావటంచేత; అతఁడు= కీచకుడు; మల్లడి+కొనుచున్= పరితపిస్తూ; మనసిజ పరతంత్రతన్= మన్మథునికి లోబడియుండుటచేత; ఉద్ధతుఁడు+ఐ= గర్వించినవాడై; సుదేష్ణతోడన్= సుదేష్ణతో; ఇట్లు+అని పలికెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సుదేష్ణ చెప్పిన మాటలు కీచకుడి మనస్సుకు ఓర్వరానివైనాయి. మన్మథ పారవశ్యంలో బాధపడుతూ అతడు గర్వంగా సుదేష్ణతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** మనసిజ పరతంత్రత - పదప్రయోగం ఔచిత్యవంతం. మన్మథుడు ప్రవేశించిన మనస్సులో మరొకరు ప్రవేశించటం కష్టం. అందుకే కీచకుడి కా మాటలు రుచించలేదు.

**మ. 'వనితా! యే నొక పల్కు పల్కెదఁ జతుర్వారాశి మధ్యంబునన్**
**ఘనబాహాబల మొప్ప నన్ను నెదురంగా నొక్కఁడున్ లేమి యె**
**వ్వనికిం దెల్లము గాదె! దాని మగలన్ వజ్రాహతిం గూలు శై**
**ల నికాయం బన మద్భుజాసమదలీలన్ గీ టడంగించెదన్. 75**

**ప్రతిపదార్థం:** వనితా!= ఓ సుదేష్ణా!; ఏను+ఒక పల్కుపల్కెదన్= నేనొక మాట చెప్పుతాను; చతుర్+వార్+రాశి మధ్యంబునన్= నాలుగు సముద్రాల నడుమగల భూమిమీద; ఘనబాహాబలము= గొప్పవైన భుజాల బలం; ఒప్పన్= ఒప్పగా; నన్నున్+ఎదురంగాన్= నన్నెదిరించటానికి; ఒక్కఁడున్ లేమి= ఒక్కడు కూడా లేకపోవటం; ఎవ్వనికిన్+తెల్లము కాదె?= ఎవరికి తెలియదు? (అందరికీ తెలుసుకదా!); దాని మగలన్= ఆమె భర్తలను; మత్+భుజాసమదలీలన్= నా భుజబల గర్వంయొక్క విలాసంతో; వజ్ర+ఆహతిన్= వజ్రాయుధంతో కొట్టటం వలన; కూలు= పడిపోయే; శైలకాయంబు= పర్వత సముదాయమో; అనన్= అన్నట్లు; గీటు+అడంగించెదన్= కూల్చివేస్తాను.

**తాత్పర్యం:** 'ఓ సుదేష్ణా! నాలుగు సముద్రాల మధ్యలో ఉన్న ఈ నేలపై నా బాహుబలాన్ని ఎదిరించి నిలువగలవాడు లేడని అందరికీ తెలుసు కదా! వజ్రాయుధం దెబ్బతో కూలిన పర్వతాలో అన్నట్లు నా భుజబలంతో దాని భర్తలను కూల్చి వేస్తాను.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఉపమానం యొక్క తాదాత్మ్యమును ఉపమేయమునందు సంభావించటం ఉత్ప్రేక్ష. ఇంద్రుడు తన వజ్రాయుధంతో పర్వతాల రెక్కలను ఛేదించటం పురాణ ప్రసిద్ధం. అట్లా వజ్రాయుధపాతంతో పడిపోయిన పర్వతాలో అన్నట్లు సైరంధ్రి భర్తలను చంపుతాననటం అలంకారం. సింహబలుడు తన అక్కను 'వనితా!' - అని సంబోధించటం ద్వారా ఔద్ధత్యం వెల్లడయింది.

**ఉ. బుద్ధులు సెప్పు టెల్ల నటు వో విడు; మెమ్మెయి నైన సౌఖ్యసం**
**సిద్ధి యొనర్పు నాకు; నెడ సేసినఁ దాపము రూపుమాపు; నా**
**వృద్ధియ కోరుదేని 'నవివేకివి నీ' వని నన్ను ని ట్లసం**
**బద్ధములైన వాక్యములు పల్కక వే పిలిపింపు కోమలిన్.' 76**

**ప్రతిపదార్థం:** బుద్ధులు చెప్పుట+ఎల్లన్= నీతులు చెప్పటమంతా; అటు+పోవిడుము= అట్లా వదలివేయుము; ఏ+మెయిన్+ఐనన్= ఎట్లాగైనా; నాకున్= (కీచకుడికి) సౌఖ్యసంసిద్ధి= ఆమెపొందువలని సుఖాన్ని; ఒనర్పు= కలిగించుము; ఎడచేసినన్= ఆలస్యం చేస్తే; తాపము= మన్మథతాపము, విరహబాధ; రూపుమాపున్= (నన్ను) నాశనం చేస్తుంది; నా వృద్ధి+అ= నా ఉన్నతినే; కోరుదు(వు)+ఏనిన్= కోరేదానివైతే; నీవు= (కీచకుడా, నీవు); అవివేకివి= బుద్ధిహీనుడవు; అని= అని అంటూ; అసంబద్ధములు+ఐన= అసంగతాలైన; వాక్యములు= మాటలు; పల్కక= ఆడక; కోమలిన్= ఆ సుకుమారిని; వే పిలిపింపు= త్వరగా పిలువనంపుము.

**తాత్పర్యం:** నీవు నాకు బుద్ధులు చెప్పటం మానివేయుము. ఏదో ఒక ఉపాయంతో నాకు ఆమెను పొందే సౌఖ్యాన్ని కలిగించుము. ఆలస్యం చేశావంటే నేను మన్మథ తాపంతో మరణిస్తాను. కాబట్టి నీవు నిజంగా నా మేలునే కోరేదానివైతే 'నీవు అవివేకివి' అంటూ అసంగతాలైన మాటలతో నన్ను నిందించక, శీఘ్రంగా సైరంధ్రిని పిలిపించుము.'

**విశేషం:** వనితా! అని గర్వంగా పలికి ఇప్పుడు హెచ్చరిస్తున్నాడు.

**తే.** **అనుచు దైన్యంబు నొందెడు నాననంబు। తోడ దిగ్గన లేచి యత్తోయజాక్షి**
**చరణ పీఠంబుకడఁ జక్కఁజాఁగి మ్రొక్కి। యున్న నద్దేవి కనుఁగొని చిన్నఁబోయి.** 77

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; దైన్యంబున్+ఒందెడు= దీనత్వం పొందే; ఆననంబుతోడన్= ముఖంతో; దిగ్గనన్ లేచి= వెంటనే లేచి; ఆ+తోయజాక్షి= ఆ సుదేష్ణ యొక్క; చరణపీఠంబుకడన్= అడుగుపీటవద్ద; చక్కన్+చాఁగి మ్రొక్కి= నిలువునా సాష్టాంగపడి; ఆ+దేవి= ఆ సుదేష్ణను; కనుఁగొని= చూచి; చిన్నబోయి= మొగం చిన్నబుచ్చుకొని.

**తాత్పర్యం:** అని మాట్లాడుతూ ముఖంలో దీనత్వం ఉట్టిపడేటట్లు వెంటనే లేచి ఆ సుదేష్ణ పాదాలు పెట్టుకొనే పీటవద్ద నిలువునా పడి సాష్టాంగ నమస్కారం చేసిన ఆ కీచకుడిని చూచి సుదేష్ణ చిన్నబోయి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** కీచకుడు మూర్ఖుడు. అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు - అనే రకం. దాసుడి తప్పులు దండంతో సరి - అని అక్కను ప్రసన్నురాలిని చేసికొనటానికి ఇది ఒక్కటే బ్రహ్మాస్త్ర మనుకొన్నాడు. సప్తవ్యసనాలలో 'వెలది' ని ముందుగానే చెప్పారు. కీచకుడు వ్యసనపరుడు. 'కామాతురాణాం న సుఖం న లజ్జా' అన్న సూక్తి కీచకుడి వర్తనంలో నిజమైనది.

**ఉ.** **'ఆవల వచ్చు నాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి కా**
**కీ వెడ మాటలన్ మరలఁ; డెన్ని విధంబులఁ జూపి చెప్పినం**
**గావల మైన వీఁడు తగు కార్యము వట్టునె? వీని కెమ్మెయిం**
**జావు నిజంబు మన్మథునిశాత శరంబులనైన నక్కటా!'** 78

**ప్రతిపదార్థం:** ఆవలన్= తర్వాత; వచ్చు+ఆపదలకున్= వచ్చే కష్టాలకు; అన్నిటికిన్+ఓర్చి= అన్నీ భరించి; లతాంగిన్+కూర్చికాక= సైరంధ్రిని అతనితో కలిపికాక; ఈ వెడమాటలన్= ఈ వట్టి మాటలతో; మరలఁడు= మనసు మరల్చుకోడు; కావలము+ఐన వీఁడు= కండకావరం కలిగిన వీడు; ఎన్ని విధంబులన్= ఎన్ని రకాలుగా; చూపి, చెప్పినన్= నిరూపించి చెప్పినా; తగు కార్యము= తగిన పనిని; పట్టునె?= చేపట్టుతాడా?; అక్కటా!= అయ్యో!; వీనికిన్= కీచకుడికి; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; మన్మథునిశాత శరంబులన్+ఐనన్= మన్మథుడి యొక్క వాడి అయిన బాణాలతోనైనా; చావు= చావటం; నిజంబు= తథ్యం (తప్పదని భావం).

**తాత్పర్యం:** 'తర్వాత ఎన్ని ఆపదలు వచ్చినా, ప్రస్తుతానికి సైరంధ్రిని వీడికి కూరిస్తే తప్ప, వట్టి మాటలతో తృప్తిపడి తిరిగిపోయేటట్లు లేడు. మిక్కిలి గర్వం గలవాడు కావున ఎంతచెప్పినా మంచిమాటలు గ్రహించలేడు. వీ డెట్లాగూ సైరంధ్రి భర్తలచేత కాకపోయినా, మదనబాణాలచేతనైనా చావటం నిజం.'

**విశేషం:** 1. అక్కపట్ల ఉన్న చనవుతో కీచకుడు అడుగుతున్నాడు. తమ్ముడిపట్ల ఉన్న మమకారంతో సుదేష్ణ ఆలోచిస్తున్నది. వలదన్నా మానని గర్వాంధుడు సింహబలుడు. అతడి చావు రాసిపెట్టినట్లున్నది. అయితే అది సైరంధ్రి భర్తలవలననా? మన్మథుడి బాణాల వలననా అనేదే ప్రశ్న. మన్మథుడి వలన చనిపోతే దానికి కారకురాలు సుదేష్ణ మరొక రకంగా అయితే కీచకుడే బాధ్యుడు. (సంపా.)

2.'కావలము= పాపము. ఇయ్యది కీచకునికి విశేషణము గానఁ గావలము గలవాఁడని చెప్పవలయును. కావలము కీచకుఁడని చెప్పునప్పుడు కీచకుఁడు కావలము కలవాఁడు గాని కావలము కాఁడు కనుకఁ దాత్పర్యము పాపఁగమిచేఁ గావలము గలవాడను నర్థము లక్షణచే వచ్చునని భావము. మహాకవులు మిక్కుటముగ కలవాఁడను నర్థమునఁ గావలమని ధర్మధర్ముల కభేదముగా వాడుచుండుటయుఁ గలదు. "తేజసస్తు న వయస్సమీక్ష్యతే" - ఇచ్చట తేజసః (మహాకవి కాళిదాసు) అనఁగా నెక్కువ ప్రతాపము గలవానికని ధర్మధర్ముల కభేదము చెప్పికొనక తప్పదు" (కీ.శే. పళ్ళె పూర్ణ ప్రజ్ఞాచార్యులు : విరాటపర్వ టిప్పణి).

క. అని మనమునఁ దలపోయుచుఁ । దన తమ్ముని నల్లనెత్తి దందడి దొరఁగం
జనుదెంచు నశ్రుపూరము । కనుఁగవలో మ్రింగికొనుచుఁ గామిని పలికెన్. 79

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; కామిని= సుదేష్ణ; మనమునన్+తలపోయుచున్= మనస్సులో అనుకొంటూ; తన తమ్మునిన్= తన తమ్ముడైన కీచకుడిని; అల్లనన్+ఎత్తి= మెల్లగా ఎత్తి; దందడి తొరఁగన్= వేగంగా కారటానికి; చనుదెంచు= వచ్చే; అశ్రుపూరము= కన్నీళ్ళధారను; కనుఁగవలోన్= కనుదోయిలో; మ్రింగికొనుచున్= అణచుకొంటూ; పలికెన్= మాట్లాడింది.

**తాత్పర్యం:** ఆ విధంగా మనస్సులో అనుకొంటూ కీచకుడిని లేవనెత్తి ధారలుగా పొంగివచ్చే కన్నీళ్ళను కనుదోయిలో కుక్కుకొంటూ సుదేష్ణ మాట్లాడింది.

**విశేషం:** 1. తిక్కన సాత్త్విక భావాలను సందర్భోచితంగా విస్తరించి నాటకీయతను రక్తి కట్టిస్తాడు. వెనుకటి పద్యంలో భావసంఘర్షణలో సుదేష్ణ మథనపడింది. సింహబలుడి చావు నిజం. అది తేలిపోయింది. అతడి కోరిక కాదంటే అతడి చావుకు తాను కారకురాలౌతుంది. కాని ఆమెకు తమ్ముడిమీద అలవిమాలిన మమకారం. ఔనంటే - ఆమె అంతఃపుర ధర్మాన్నీ, ఇచ్చిన మాటనూ తప్పినట్లౌతుంది. దానికితోడు కీచకుడి చావుకు పరోక్ష కారణమౌతుంది. ఆమె స్థితి 'ముందు నుయ్యి - వెనుక గొయ్యి'వలె తారసిల్లింది. కీచకుడు ఏవిధంగానైనా సైరంధ్రిని కూర్చుమంటాడు. ఏవిధంగా కూర్చయత్నించినా అతడి చావు తప్పదని ఆమెకు తెలుసు. అందువలన వలపు కారణంగా తమ్ముడు చనిపోతాడన్న తీవ్ర వేదన ఆమె కన్నులలో ధారాపాతంగా జారే కన్నీరును కలిగించింది. కాని, ఆ భావగాంభీర్యాన్ని, ఆమె మనసులోని బాధను అతడు గ్రహించలేడు. అయినా, తమ్ముడు. అందువలన ఆప్యాయంగా అతడిని పైకి లేపింది. కళ్ళనీళ్ళు మ్రింగికొన్నది. అంటే నిగ్రహించుకొన్నది. ధారలుగా కారటానికి సిద్ధమైన కన్నీరును ఆపుకొనటం ఇందలి అభినయాంశం. అనిశ్చితమైన ఆవేదన నుండి ఆమె ఒక నిశ్చిత స్థితికి వచ్చిందని రసధ్వని. మ్రొక్కుతున్న తమ్ముడికి అక్కగా మాట్లాడ నిశ్చయించటం ఆంగికాభినయంలో అశ్రువు అనే సాత్త్విక భావం చేసే ధ్వని. తరువాతి పద్యంలో వాచికాభినయం వ్యక్తం కాబోతున్నది. తిక్కన రచనలో రసాభ్యుదయ శిల్పం క్రమ పరిణామ రమణీయం. (సంపా.)

ఆ. 'ఇంత దలరనేల? యెమ్మెయినైనను । కొమ్మ నలవరించి కూర్చు టరుదె?
యుమ్మలంబు దక్కి యూఱటతోడ నీ । వేఁగు; మసలవలవ దింక నిచట. 80

**ప్రతిపదార్థం:** ఇంత+తలరన్+ఏల?= ఇంతగా చింతపడటమెందుకు? ఏ+మెయిన్+ఐనను= ఏవిధంగానైనా; కొమ్మన్= ఆమెను అలవరించి= సానుకూలపరచి, అంగీకరించేటట్లు చేసి; కూర్చుట= నీకు పొందుకలిగించటం; అరుదె?= కష్టమా?; ఉమ్మలంబు= విరహతాపాన్ని; తక్కి= వదలిపెట్టి; ఊఱటతోడన్= కుదుటితనంతో; నీవు+ఏఁగు= నీవు వెళ్ళుము; ఇంకన్= ఇక మీదట; ఇచటన్= ఇక్కడ (అంతఃపురంలో); మసలవలవదు= ఆలస్యం చేయవద్దు.

**తాత్పర్యం:** 'ఎందుకు ఇంతగా చింతిస్తావు? ఎట్లాగైనా సైరంధ్రిని ఒప్పించి నీతో పొందు కల్పించటం అసాధ్యమేమీ కాదు. మనసులోని వేదన వదలి నీవు ఊరటపొంది ఇంటికి వెళ్ళిపొమ్ము? ఇక్కడ మసలవద్దు.'

**విశేషం:** సుదేష్ణ నిపుణురాలు. కీచకుడిని ఊరట పరచకపోతే ఆ ప్రదేశాన్ని వీడిపోడు. మొదట అతడిని తిరిగి పంపాలి. ఆ ఉపాయం అతడికి నచ్చేటట్లు ఉండాలి. రాబోయే పద్యం దానికి తార్కాణం.

క. ఆసవమున కని నీదు ని । వాసమునకు దివములో నవశ్యంబును నే
నా సుదతిం బుత్తెంతు ని । జాసక్తి ఫలింపఁ గొఱలు మభిమత కేళిన్.' 81

**ప్రతిపదార్థం:** ఆ సుదతిన్= ఆ సైరంధ్రిని; ఆసవమునకున్+అని= మద్యానికని (మద్యం తెచ్చే మిషతో అని భావం); నీదు నివాసమునకున్= నీ ఇంటికి; దివములోన్= పగటిపూట; అవశ్యంబును= తప్పకుండా; పుత్తెంతున్= పంపుతాను; నిజ+ఆసక్తి= నీ కోరిక; ఫలింపన్= సమకూరేటట్లు; అభిమతకేళిన్= ఇష్టమైన క్రీడను; కొఱలుము= పొందుము.

**తాత్పర్యం:** నేను ఈ రోజు ముగిసేలోగా మద్యం తీసికొనిరమ్మని సైరంధ్రిని నీ మందిరానికి తప్పక పంపుతాను. అప్పుడు నీ యిష్టం ప్రకారం విలాసంగా నీ కోరిక నెరవేర్చుకొనుము.'

**విశేషం:** 1. సుదేష్ణ మాటలను తిక్కన మూలంలోకంటె సందర్భోచితంగా మార్చాడు.

**"పర్వణి త్వం సముద్దిశ్య సురామన్నం చ కారయ । తత్రైనాం ప్రేషయిష్యామి సురాహారీం తవాన్తికమ్॥**
**తత్ర సంప్రేషితా మేనాం విజనే నిరవగ్రహే । సాన్త్వయేథా యథాకామం సాన్త్వమానా రమేద్ యది॥**

**(సం.4.14.5-6)**

పండుగనాడు కీచకుడు సుదేష్ణకొరకు రుచ్యమైన ఆహారాలను, మద్యాలను తయారుచేయించాలట! వాటిలో సురను తెప్పించుకొనే నెపంతో సుదేష్ణ సైరంధ్రిని కీచకుడి మందిరానికి పంపుతుందట! ఆమె అక్కడికి వెళ్ళినప్పుడు అతడు ఆ ప్రాంతంలో జనులెవ్వరూ లేకుండా చూచుకొనాలట! ఎటువంటి ఆటంకాలూ లేని తావును ఎన్నుకోవాలట! అక్కడ అతడు తన కోరికమేరకు ఆమెను ఒప్పించాలట. ఆమె ఇష్టపడితే ఆమెతో భోగించాలట! - ఇది మూలంలో సుదేష్ణ చెప్పిన వ్యూహం. తెలుగులో అది మారింది. ఎప్పుడో వచ్చే పండుగకొరకు సుదేష్ణ ఆగలేదు. ఆ పగలు తెల్లవారే లోపల పంపుతానన్నది. తెచ్చేది సుర కాబట్టి అన్నం వండవలసిన పనిలేదు. పండుగే లేదు కాబట్టి పంచభక్ష్యపరమాన్నాల ప్రసక్తి తెలుగులో రాలేదు. కీచకుడు తయారుచేసిన ఆసవాలూ, వాటి నంజుళ్ళూ సుదేష్ణ కోరిక మీద చేసినవి కావు. అతడి వలపు తెలపటానికి చేసినవి మాత్రమే. సైరంధ్రి కీచకుడి మందిరానికి వెళ్ళినప్పుడు ఆమె నతడు ఒప్పించాలనీ, అంగీకరిస్తేనే ఆమెను పొందాలనీ సూచించింది. ఆ మాటలు తెలుగులో లేవు. ఆమె నంగీకరింపచేసే బాధ్యత తెలుగు భారతంలో సుదేష్ణ తీసికొన్నది. ఈ మార్పులో ఒక లోతైన ఆలోచన సుదేష్ణ మనసులో ఉన్నట్లు తిక్కన చిత్రించాడు. ముందు ముందు అది ఆవిష్కృతమౌతుంది. వ్యాసుడి సుదేష్ణకంటె తిక్కన సుదేష్ణ గడుసరి. (సంపా.)

2. దినము : దినము అని పాఠాంతరము; నిజశబ్దానికి యుష్మదర్థము, అస్మదర్థమూ రెండూ తిక్కన వాడాడు. (విరాటపర్వం 2-263)

**కీచకుండు ద్రౌపదియందలి మోహంబునఁ బరితపించుట (సం. 4-14-7)**

**వ.** **అనిన విని కీచకుండు ముదిత హృదయుండయి నిజసదనంబునకుం జని వివిధ మధురసంబు లొనరించి, సముచిత ఖాద్యంబులు సమకట్టి, తత్ప్రదేశంబు విజనంబు గావించి, యొక్క రమ్యస్థలంబుననుండి పాంచాలివలని తగులు చిత్తంబు నుత్తలపఱుపం దలరి నెవ్వగల కగపడి తలపోఁతలకుం జొచ్చి దుర్విదగ్ధుండు గావున నమ్ముగ్ధకుం దన సన్నిధిఁ గామ వికారంబు పుట్టుట గలుగ భావించుచు.** **82**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని సుదేష్ణ చెప్పగా విని; కీచకుండు; ముదిత హృదయుండు+అయి= సంతోషించిన మనస్సు గలవాడయి; నిజసదనంబునకున్= తన మందిరానికి; చని= వెళ్ళి; వివిధ మధురసంబులు= అనేక రకాలైన మద్యాలను, ఒనరించి= తయారుచేసి; సముచిత ఖాద్యంబులు= వాటికి తగిన తినుబండారాలను; సమకట్టి= సిద్ధపరచి; తద్+ప్రదేశంబు= ఆ స్థలాన్ని;

విజనంబు+కావించి= జనులు లేనట్లుగా చేసి; ఒక్క రమ్యస్థలంబునన్= ఒక మనోహర ప్రదేశంలో; ఉండి; పాంచాలివలని= ద్రౌపదిపట్లగల; తగులు= మోహం; చిత్తంబున్+ఉత్తలపఱుపన్= మనస్సును ఉద్వేగపరచగా; తలరి= చలించి; నెఱ+వగలకున్= మిక్కిలి చింతలకు; అగపడి= లోనై; తలపోఁతలకున్+చొచ్చి= పరిపరివిధాలైన ఊహాలలో ప్రవేశించి (మనసు చొప్పించి); దుర్విదగ్ధుండుకావునన్= అవివేకి కావటం వలన; ఆ+ముగ్ధకున్= ఆ ముద్దరాలికి, ఆ సైరంధ్రికి; తన సన్నిధిన్= తన ఎదుట దగ్గరగా ఉన్న వేళలో; కామవికారంబు+పుట్టుట= (ఆమెలో) కామ (రతి) భావం పుట్టటం; కలుగన్= సాక్షాత్తు కంటిముందు కనపడుతున్నట్లు అనుభవిస్తున్నట్లు; భావించుచున్= తన్మయత్వంలో తనలో తాను ఊహించుకొంటూ.

**తాత్పర్యం:** సుదేష్ణ మాటలకు సంతోషపడి తన మందిరానికి వెళ్ళి పలురకాలైన మద్యాలను, వాటి కనుగుణంగా తినే భక్ష్యాలను సిద్ధపరచి, ఆ మందిరపు చుట్టుపక్కల జనం లేకుండా చేసి, ఒక మనోహర ప్రదేశంలో కూర్చుండి, అవివేకి కావడం వలన సైరంధ్రి తన దగ్గరకు చేరినట్లు, (తన దర్శనస్పర్శనాదులవలన) ఆమెలో మన్మథభావాలు రేకెత్తినట్లు, అవి తన కన్నులకు కనపడుతున్నట్లు, తన్మయత్వంలో భావించి ఆ భావనలో రమిస్తూ - (ఇట్లా అనుకొన్నాడు.)

**విశేషం:** ఈ సన్నివేశం అమూలకం. తిక్కన ప్రతిభాజన్యమైన రమణీయ రంగ పరికల్పనం. ఇందులో కీచకుడు భావుకుడుగా, రసికుడుగా, శృంగారనాయక లక్షణ విశిష్టుడుగా పఠితలకు పరిచయమౌతాడు. భావి శృంగారనాయకులకు వెలుగుబాట చూపిస్తాడు. తిక్కన కవితా శిల్పమంతా ఇతడి నోట పుక్కిటపట్టించినట్లు సన్నివేశం మధురంగా చిత్రించబడింది. విచిత్ర మేమంటే- ఇది భౌతికరంగం కాదు: భావనాలోకంలో సాక్షాత్తూ ప్రత్యక్షంగా అనుభవిస్తున్నట్లు కాల్పనిక, స్వాప్నిక దర్శనం వలె భాసించే రంగం. సంకల్పం అనే మదనావస్థలో ఇదొక మధురతరంగం. (సంపా.)

**సీ.** **'కేలిమై నొక్కట లీలఁ గ్రేళ్ళుఱికెడు । వాలుగు సోగల నేలుదెంచి,**
**కరువలి సుడియమిఁ గందక చెన్నొందు । నెఱవిరితమ్ముల నుఱక తెగడి,**
**బెడఁగొందఁ దుడిచి మైఁ దొడసిన వలరాజు । వాలిక తూపులఁ దూలఁ దోలి,**
**పొలపంబు మెఱసి దిక్కులఁ గాంతి పూరించు । క్రొక్కారు మెఱుఁగుల నుక్కడంచి,**

**తే.** **తన విలోచనములు నాదు మనము నాఁచి । కొనఁగ నయ్యింతి ననుఁ గనుఁగొనియె, నాత్మఁ**
**గై కొనియె, రాగ రసమునఁ గడలుకొనియె । మదన వికృతి బయల్పడ నుదిలకొనియె.** **83**

**ప్రతిపదార్థం:** ఆ+ఇంతి= ఆ సైరంధ్రి; లీలన్= విలాస చేష్టతో; కేలిమైన్= క్రీడగా; ఒక్కటన్= ఒక్కసారిగా; క్రేళ్ళు+ఉఱికెడు= ఎగిరిపడే; వాలుగుసోగలన్= వాలుగ చేపల పొడవును; ఏలు+తెంచి= తగ్గించి; కరువలి= గాలి; సుడియమిన్= వీచకపోవటం వలన; కందక= వాడిపోక; చెన్ను+ఒందు= అందంగా వెలిగే; నెఱ విరి తమ్ములన్= నిండుగా వికసించిన కమలాలను; ఉఱక= లెక్కపెట్టకుండా; తెగడి= తిరస్కరించి; బెడఁగు+ఒందన్= అందం కలిగేటట్లు; తుడిచి= శుభ్రంచేసి; మైన్+తొడసిన= ఆకారాన్ని కడిగిన; వలరాజు వాలికతూపులన్= మన్మథుని వాడిబాణాలను; తూలన్+తోలి= తిరస్కరించి; పొలపంబుమెఱసి= కాంతి జిగేలుమని; దిక్కులన్+కాంతిపూరించు= దిక్కులను వెలుగుతో నింపివేసే; క్రొత్త+కారుమెఱుఁగులన్= వర్షాకాలపు తొలికారు మెఱుపుల యొక్క; ఉక్కు+అడంచి= గర్వం పోగొట్టి; తన విలోచనములు= సైరంధ్రి కనులు; నాదు మనమున్= నా మనస్సును; ఆఁచికొనఁగన్= ఆకట్టుకొనగా; ననున్+కనుఁగొనియెన్= నన్ను చూచింది; ఆత్మన్+కైకొనియెన్= మనస్సు హరించింది; రాగరసమునన్= వలపురసంతో; కడలుకొనియెన్= ఉప్పొంగింది; మదనవికృతి= రతిభావం; బయల్పడన్= బయటపడేటట్లు; ఉదిలకొనియెన్= వేగిరపడుతుంది (ఉత్తలపాటు పొందుతుంది.)

**తాత్పర్యం:** 'విలాస క్రీడగా ఒక్కసారి పైకి కుప్పించి ఎగిరే వాలుగ చేపల పొడుగరితనాన్ని శాసించి ఆ సైరంధ్రి తన చూపులతో నా మనస్సును దోచుకొనేటట్లు నన్ను చూచింది; గాలి కొట్టకపోవటం చేత చెక్కుచెదరకుండా నిలిచి అందాలను విరజిమ్మే వికసించిన పద్మాలను తిరస్కరించేటట్లు చూచి నన్ను లోబరచుకొన్నది; అందం అతిశయించేటట్లు శుభ్రం చేసి బాగా కడిగిపెట్టిన మన్మథుడి వాడి బాణాలను ఓడించిన చూపులతో చూచి నన్ను రాగరసంలో పొంగులు వారేటట్లు చేసింది. కాంతి మిరుమిట్లు కొలిపేటట్లు దిక్కులనిండా మెరిసే తొలకరి మెరుపుల గర్వాన్ని అణచిన చూపులతో మదనవికారం ప్రకటితమయ్యేటట్లు చూచి నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది.

**విశేషం:** అలం: క్రమాలంకారం. మాలోపమ. 1. సీసపద్యపాదాలలోని చూపుల లీలలతో ఆమె సాధించిన వలపు చర్యలు ఎత్తుగీతిలో వరుసగా చెప్పబడ్డాయి. వాటితో క్రమంగా అన్వయం కలిగింది. కాబట్టి క్రమాలంకారం లేదా యథాసంఖ్యాలంకారం.

2. ఇందులో సైరంధ్రి చూపుల విలాస వైభవం వర్ణితం. అది మాలోపమాలంకారంలో ప్రదర్శితం. చేపలవలె విశాలంగా ఉండి వాటికంటె లీలావిలాసంలో మిన్న అయిన చూపులు మనసును ఆకర్షిస్తాయి. ఆకర్షించి ఆమె కీచకుడి వద్దకు సమీపిస్తుంది. గాలికి కదలని పద్మాలవలె తదేకదృష్టితో వికసించిన పద్మాలవంటి కన్నులను అతడిమీదనే నిలిపి అభిలాషను వ్యక్తం చేస్తుంది. ఆ చూపులు అతడి హృదయాన్ని కైవసం చేసుకొంటాయి. అంటే నాయిక కౌగిలికి సమీపించిందని భావం. కడిగి తుడిచి వాడిచేసిన మదన బాణాలకంటె వాడి అయిన చూపులను ఆసక్తితో ప్రసరించి అతడిని కన్నులతో జుర్రుకొంటుంది. ఆ చూపులు అతడిని రాగరసంలో ముంచితేలుస్తాయి. తొలకరి మెరుపులవంటి కాంతి తళతళలను మించిన వెలుగులు వెదచల్లే చూపులతో చూస్తూ మనసులోని రతి కోర్కెను ప్రదర్శిస్తూ అతడిని ఉక్కిరిబిక్కిరి చేస్తుంది. దూరంగా చూచినది మొదలు మదన ప్రీతి కలిగించేవరకు ఒక శృంగారనాయిక ప్రసరించే చూపుల విలాసవైభవాలను, తత్ప్రభావాలను మాలోపమాలంకారంతో ఆవిష్కరించిన ఈ పద్యం కీచకుడి కాల్పనికభావనాశక్తికి (Romantic imagination) చక్కని ఉదాహరణం.

3. దృఙ్మీలన మనే మదనావస్థను స్మరణలో కీచకుడు పునశ్చరణం చేయటం వలన అతడి మనసులోని రతిభావం ఉద్దీప్తమౌతుంది. రసాభ్యుదయశిల్పంలో ఇది ఒక శిల్పం. (సంపా.)

**ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నా లతాంగి య**
**చ్చొత్తిన యట్లు నాకుఁ దన యుల్లము దెల్లము సేయకున్కిఁ దా**
**నత్తఱిఁ గ్రొత్తకాన్పగుట నడ్డము సొచ్చిన సిగ్గుపెంపు త**
**న్నుత్తలమందఁ జేయుటకునో తలపోసి యెఱుంగ నయ్యెదన్.' 84**

**ప్రతిపదార్థం:** చిత్తము మెచ్చి= మనసుపడి; నా వలనన్+చిక్కఁగన్= నా యందు ఆసక్తిని చూపగా; వెండియున్= అంతేగాక; ఆ లతా+అంగి= ఆ సైరంధ్రి; అచ్చు+ఒత్తిన+అట్లు= అచ్చు గ్రుద్దినట్లు విస్పష్టంగా; నాకున్= నాకు; తన ఉల్లము= తన మనస్సు; తెల్లము+చేయక+ఉన్కిన్= బయట పెట్టక పోవటం వలన; తాను+ఆ+తఱిన్= తాను ఆ సమయంలో; క్రొత్త కాన్పు+ అగుటన్= క్రొత్తగా చూడటం జరిగదంవల్ల; అడ్డము+చొచ్చిన= అడ్డుపడిన; సిగ్గు పెంపు= అధికమైన సిగ్గు; తన్ను= తనను; ఉత్తలము+అందక+చేయుటకునో= కలవరపాటును కలిగించినందువల్లనో ఏమో; తలపోసి+ఎఱుంగన్+అయ్యెదన్= భావించి తెలిసికోలేకపోయాను.

**తాత్పర్యం:** సైరంధ్రి మనస్సు నా మీద లగ్నమైనప్పటికీ తన భావం నాకు స్పష్టంగా వెల్లడి చేయలేకపోయింది. దానికి కారణం ఉన్నది. తానప్పుడు నన్ను మొదటిసారి చూడటం వలన సిగ్గు బాగా అడ్డుపడి తనకు తత్తరపాటు కలిగించి ఉండటం కావచ్చునేమో! అప్పుడు నేను దానిని గురించి ఆలోచించలేకపోయాను.'

**విశేషం:** కీచకుడు తన దుర్విదగ్ధత్వాన్ని మరొకసారి ప్రదర్శిస్తున్నా డీ పద్యంలో. ఒక వాస్తవాన్ని విపరీతంగా వ్యాఖ్యానించటం దుర్విదగ్ధత్వం. కీచకుడిని చూచి సైరంధ్రి భయపడింది. అతడిపై కోపగించుకొన్నది. అతడి ప్రవర్తనకు అసహ్యించుకొన్నది. మొదట మాటాడకుండా ఉండిపోయింది. ఈ చర్యల కన్నింటికీ తొలిచూపు వలన కలిగిన సిగ్గు కారణమని దుర్వ్యాఖ్యానం చేయటం ఈ పద్యంలో గమనించవచ్చును. (సంపా.)

**తే. అనుచుఁ గొందలపడు కోర్కె లగ్గలించి। చిఱ్ఱుముఱ్ఱాడుచుండ నచ్చెలువ చెలువు**
**తగిలి తన యిచ్చఁబాఱు చిత్తంబు పజ్జ। నరిగి యిట్లను నక్కీచకాధముండు. 85**

**ప్రతిపదార్థం:** అనుచున్= ఆ విధంగా అంటూ; ఆ+కీచక+అధముండు= నీచుడైన ఆ కీచకుడు; కొందలపడు= కలతపడే; కోర్కెలు+అగ్గలించి= కోర్కెలు అధికమై; చిఱ్ఱుముఱ్ఱు+ఆడుచున్+ఉండన్= పెనగులాడుతూ ఉండగా; ఆ+చెలువ చెలువు= ఆ సైరంధ్రి సొగసునందు; తగిలి= తగుల్కొని; తన+ఇచ్చన్+పాఱు= దాని ఇష్టప్రకారం పరుగెత్తే; చిత్తంబుపజ్జన్= మనస్సు వెంట; అరిగి= వెళ్ళి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా అంటూ అధముడైన ఆ కీచకుడు కలతపెట్టే తన కోర్కెల విజృంభణానికి సంక్షోభపడి కొట్టుమిట్టాడుతూ తన మనసు సైరంధ్రి సొగసులో చిక్కుకొని యథేచ్ఛగా విహరిస్తూ ఉండగా దానివెంట నడుస్తూ ఈ విధంగా అనుకొన్నాడు.

**విశేషం:** 'మనఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః,' అనే సూక్తి స్మరణీయం. కీచకుడు మనస్సుమీది నిగ్రహాన్ని కోల్పోయి మదనావేశంతో ప్రలాపమనే మదనచేష్టను ప్రదర్శించాడు. తిక్కన అతడి ప్రలాపాన్నికూడా కాల్పనిక కళా సుందరంగా చిత్రించాడు. (సంపా.)

**సీ. 'లీల నాముందట నా లేమ పొలసినఁ। జూడ్కికిఁ జుబ్బనచూఱగాదె!**
**కనువిచ్చి నన్ను నా తనుమధ్య సూచినఁ। దనువున కమృతసేచనము గాదె!**
**చిఱునవ్వు బెరయ నచ్చెలువ నా తోడఁ బ। ల్కినఁ జెవులకు రసాయనము గాదె!**
**యెలమి నమ్మెలఁత నన్నేలయింపఁ దివిరిన। నెడఁద కానందంబు నిక్క గాదె!**

**తే. యా నితంబిని మక్కువ ననఁగి పెనఁగి। యింపు పొంపిరివోవ న న్నేలికొనఁగఁ**
**దలఁచి పొందిన నది జన్మఫలము గాదె!' యనుచు వలరాజు బారికి నగ్గమయ్యె. 86**

**ప్రతిపదార్థం:** ఆ లేమ= ఆ వనిత, సైరంధ్రి; లీలన్= విలాసంగా; నా ముందటన్= నా ఎదుట; పొలసినన్= తిరిగితే; చూడ్కికిన్= నా చూపునకు; చుబ్బనచూఱకాదె!= కన్నులతో జుర్రుకొన్న సంబరం కాదా!; ఆ తనుమధ్య= సన్నని నడుముగల ఆమె; కనువిచ్చి= కళ్ళు తెరచి; చూచినన్= చూస్తే; తనువునకున్= శరీరానికి; అమృతసేచనము+కాదె!= అమృతంలో తడిసినట్లేకదా!; ఆ+చెలువ= ఆమె; చిరునవ్వు బెరయన్= చిరునవ్వు చిందించగా; నాతోడన్+పల్కినన్= నాతో మాట్లాడితే చాలు; రస+అయనము కాదె!= శ్రవణానందం కాదా, చెవులకు పండుగ కాదా!; ఆ+మెలఁత= ఆమె; ఎలమిన్= సంతోషంతో; నన్నున్+ఎలయింపన్= నన్ను పొందడానికి; తివిరినన్= ప్రయత్నించినట్లయితే; ఎడఁదకున్= హృదయానికి; ఆనందంబు+ఇక్క= ఆనందానికి చోటు; కాదె?= కాదా!; ఆ నితంబిని= ఆ స్త్రీ; మక్కువన్= ప్రేమతో; అనఁగి పెనఁగి= వశమై క్రీడించి; ఇంపు= ప్రేమ; పొంపిరిపోవన్= అతిశయించగా; నన్ను+ఏలికొనఁగన్= నన్ను భర్తగా మన్నించటానికి; తలఁచి= తలపోసి; పొందినన్= కూడితే; అది జన్మఫలము కాదె!= అది పుట్టుకకు సార్థకం కాదా!; అనుచున్= అంటూ; వలరాజు బారికిన్= మన్మథుడి బారికి; అగ్గమయ్యెన్= వశమయ్యాడు.

**తాత్పర్యం:** 'ఆ సుందరి నా ముందు విలాసంగా మసలితే చాలు - నా చూపులు జుర్రుకొనే ఆనందం కలిగినట్లే. నన్ను కన్ను తెరచి చూస్తే చాలు - నా శరీరానికి అమృతాభిషేకం చేసినట్లే. ఆమె చిరునవ్వు చిందిస్తూ మాట్లాడితే చాలు - నాకు శ్రవణానందాన్ని అందించినట్లే. ఆ వనిత నన్ను సంతోషపెట్టా లనుకొంటే చాలు - పరమానందం సిద్ధించినట్లే. ఆమె వలపుతో కలసి మెలసి నన్ను పొందితే చాలు - ఈ పుట్టుక నెత్తినందుకు ఫలాన్ని పొందినట్లే' అని అనుకొంటూ కీచకుడు మన్మథుడికి వశమైపోయాడు.

**విశేషం:** 1.అలం: అంత్యానుప్రాసం. ప్రతిపాదం చివర 'కాదె!' అనే ఆశ్చర్యార్థకాన్ని పునరావృత్తం చేయటం వలన ప్రలాప స్వభావం ప్రసన్నమౌతున్నది.

2. తిక్కన తన పద్యాలలో పాటించిన శిల్ప రహస్యాలను అక్కడికక్కడ వెంటనే సూచించే స్వభావం కలవాడు. ఈ ఘట్టంలో రచించిన పద్యాలలో గమనించదగిన అంశంగా రాబోయే వచనంలో 'అనంగ విభ్రమములకు అనుగుణమైన అనేకవిధాల ప్రలాపాలతో ప్రొద్దుపుచ్చుతున్నట్లు' చెప్పాడు. దీనినిబట్టి - కీచకుడు సైరంధ్రి ప్రదర్శించినట్లుగా తాను భావిస్తున్న శృంగార హావ భావాలకు అనుగుణంగా అతడు ప్రలాపాలు చేస్తున్నాడన్నమాట. ప్రలాపాలంటే సామాన్యార్థంలో అర్థరహితాలైన మాటలు పలకటమని గ్రహించవచ్చును. కాని, ఇక్కడ అది పారిభాషిక పదంగా వాడబడింది. దశవిధ శృంగారావస్థలకు మరి రెండింటిని చేర్చాడు ప్రతాపరుద్రీయంలో విద్యానాథుడు. అవి ప్రలాపం, (సం)జ్వరం. "ప్రలాపంః ప్రియ సంశ్లిష్ట గుణాలాప ఉదాహృతః" అని ప్రియ (యొ) గుణస్తుతి ప్రలాపమని చెప్పాడు. జ్వరమంటే అధిక మదనతాపంగా పేర్కొన్నాడు. ఈ పద్యంలో కీచకుడు తన ప్రియురాలుగా భావిస్తున్న సైరంధ్రి యొక్క శృంగార విలాసాలు తనలో కలిగించే అనుభవ విశేషాలను పేర్కొంటూ ప్రలాపాలు (గుణకీర్తనలు) చేశాడు. సాన్నిహిత్యం, దృష్టిప్రసారం, పలుకరింపు, విలాసం, సంయోగం - అనే నాయికా శృంగార విభ్రమాల విశేషఫల వర్ణనమే ఈ ప్రలాపరూప పద్యశిల్పం. (సంపా.)

**వ. మఱియు ననేకభంగుల ననంగ విభ్రమంబుల కనురూపంబులైన బహువిధ ప్రలాపంబులం బ్రొద్దుగడుపుచు నమ్మదిరాక్షిరాక కెదురు చూచుచుండె; నక్కడ పాంచాలి రావించి సుదేష్ణ తృష్ణ భావించుచు నిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; అనేకభంగులన్= అనేకవిధాలుగా; అనంగ విభ్రమంబులకున్= మదన విలాసాలకు; అనురూపంబులు+ఐన= తగిన; బహువిధ ప్రలాపంబులన్= పలు రకాల పలవరింతలతో, (ఒకవిధమైన మదనావస్థతో); ప్రొద్దు+కడుపుచున్= ప్రొద్దుపుచ్చుతూ; ఆ+మదిరాక్షి= ఆ సైరంధ్రి యొక్క; రాకకున్= రావటానికి; ఎదురుచూచుచున్+ఉండెన్= ఎదురుచూస్తూ ఉన్నాడు; అక్కడ= రాణి మందిరంలో; సుదేష్ణ= సుదేష్ణాదేవి; పాంచాలిన్+రావించి= సైరంధ్రిని పిలిపించి; తృష్ణ భావించుచున్= మద్యం త్రాగాలనే దప్పికను నటిస్తూ; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అక్కడ ఈ విధంగా కీచకుడు మన్మథ భావాలకు అనుగుణమైన పలవరింతలు ప్రలాపాలు చేస్తున్నాడు. ఆమె రాకకు ఎదురు చూస్తున్నాడు. ఇక్కడ అంతఃపురంలో సుదేష్ణ సైరంధ్రిని రావించి మద్యం త్రాగాలనే దప్పికను నటిస్తూ ఇట్లా అన్నది.

**విశేషం:** కృత్రిమ పిపాసను సుదేష్ణ చక్కగా నటించింది. ఇక్కడ మదిరాక్షి అని సైరంధ్రిని వర్ణించటం సాభిప్రాయం. ఆమె మదిరకోసం తన ఇంటికి రావాలి; కాబట్టి ఆమె మదిరాక్షి వలె వస్తుందని కీచకుడి భావన.

**క. 'ఒదవెడు తృష పెల్లిదమున। వదనము వఱువట్లు వట్టె వాసిత రాజ**
**న్మదిరారస మానఁగ నా। హృదయంబున వేడ్క యెసకమెసఁగెడుఁ దరుణీ! 88**

**ప్రతిపదార్థం:** తరుణీ!= ఓ వనితా!; ఒదవెడు= కలుగుతున్న; తృష పెల్లిదమునన్= దప్పిక యొక్క ఆధిక్యంచేత; వదనము= నోరు; వఱువట్లు+పట్టెన్= మిక్కిలి ఎండిపోయింది; వాసితరాజిత్+మదిరారసము= సువాసనతో కూడిన సురను; ఆనఁగన్= త్రాగటానికి; నా హృదయంబునన్= నా మనస్సులో; వేడ్క= కోరిక; ఎసకమెసఁగెడున్= అధికమవుతున్నది.

**తాత్పర్యం:** 'ఓ తరుణీ! దప్పిక ఎక్కువగా ఉండి నా నోరు ఎండిపోతున్నది. చక్కని సువాసనతో కూడిన మదిరను తాగాలని నామనస్సు తీవ్రంగా వేడుక చూపుతున్నది.

**విశేషం:** సంభాషణ లెక్కువ, కథ చెప్పే తీరు తక్కువ. అంతా రూపకంలోని పాత్రలవలె సుదేష్ణ. సైరంధ్రి రంగస్థలంపై ప్రదర్శించినట్లు కళ్ళకు కట్టిస్తున్నాడు తిక్కన.

**క.** **కీచకుని యింట నెప్పుడు। వాచవి యగు బహువిధముల వారుణి గలుగున్**
**వే చని యచటికిఁ గొని ర। మ్మా చూతముగాని నీ గమన వేగంబున్.** **89**

**ప్రతిపదార్థం:** ఎప్పుడున్= ఎల్లవేళల; కీచకుని+ఇంటన్= కీచకుడి ఇంట్లో; వాచవి+అగు= రుచికరాలైన; బహువిధముల= పలు రకాలైన; వారుణి= మద్యం; కలుగున్= ఉంటుంది; అచటికిన్= అక్కడకు; వే+చని= త్వరగా వెళ్ళి; కొనిరమ్మా= తీసికొని రావాలి; నీ గమనవేగంబున్= నీ వెంత త్వరగా వెళ్ళి వస్తావో; చూతముగాని= చూద్దాంగా.

**తాత్పర్యం:** కీచకుడి ఇంట్లో ఎప్పుడూ మంచి రుచిగల మద్యం ఉంటుంది. నీవు త్వరగా వెళ్ళి తీసికొని రావాలి. నీ వెంత త్వరగా వెళ్ళి వస్తావో చూద్దాం.

**వ.** **అనవుడు.** **90**

**తాత్పర్యం:** అనగా.

**ఉ.** **ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గత ఘర్మజలంబు దాల్చుచున్**
**డిల్లపడంగ 'నా కిది కడింది విచారము పుట్టెఁ నందుఁ బో**
**నొల్ల ననంగ రా, దచటి కూరక పోవను రాదు, నేర్పు సం**
**ధిల్లఁగ దీనిఁ బాపికొను దీమస మెట్టిది యొక్కొ దైవమా!'** **91**

**ప్రతిపదార్థం:** ఉల్లము= మనస్సు; తల్లడిల్లన్= అల్లాడిపోగా; తనువు= శరీరం; ఉద్గత ఘర్మజలంబు= పైకుబికిన చెమటను; తాల్చుచున్= ధరిస్తూ; డిల్లపడంగన్= భయంతో నీరసపడగా; ఇది= సుదేష్ణ ఆదేశం వలన; నాకున్= (సైరంధ్రికి); కడింది విచారము= అధిక దుఃఖం; పుట్టెన్= కలిగింది; అందున్= కీచకుని ఇంటికి; పోన్+ఒల్లను= వెళ్ళటం ఇష్టం లేదు; అనంగరాదు= అనటానికి వీలుకాదు; అచటికిన్+ఊరక పోవను రాదు= అక్కడికి నిస్సహాయంగా (ఒంటరిగా) వెళ్ళటానికీ వీలులేదు; దైవమా!= ఓ భగవంతుడా!; నేర్పు+సంధిల్లఁగన్= నైపుణ్యంతో; దీనిన్= ఈ సమస్యను; పాపికొను= వదిలించుకొనే; దీమసము+ఎట్టిది+ఒక్కొ!= ఉపాయ మెటువంటిదో కదా!

**తాత్పర్యం:** ద్రౌపది మనసు కంపించిపోయింది. దానితో శరీరమంతా చెమటపట్టింది. పైపెచ్చు నీరసించింది. అప్పుడు ఇట్లా అనుకొన్నది; 'సుదేష్ణమాటవలన నాకు మిక్కిలి దుఃఖం కలిగింది. అయినా, నేను కీచకుడి ఇంటికి పోలేను అని అనలేను. అక్కడికి ఒంటరిగా పోనూ లేను. ఓ భగవంతుడా! ఈ చిక్కునుండి బయటపడే ఉపాయం ఏదో నీవే చూపించాలి.'

**విశేషం:** 1. అలం: వికల్పం. **'విరోధే తుల్య బలయో ర్వికల్పాలంకృతి ర్మతా'** అని లక్షణం. సమాన బలం గల రెండు విరుద్ధాంశాల మధ్య వికల్పాన్ని చెప్పేది వికల్పాలంకారం. సేవావృత్తిలో ఉన్న ద్రౌపది యజమానురాలి ఆజ్ఞను దాటటానికి వీలు లేదు. అంటే ఆమె కీచకుడి ఇంటికి పోవటం ధర్మం. అందువలన ఆమె వెళ్ళననటానికి ఒకవైపు వీలు లేదు. ఇక రెండవవైపు ఒంటరిగా ఆతడి మందిరానికి పోతే అతడామెను బలాత్కరించే అపాయం పొంచి ఉన్నది. కాబట్టి పోవటానికీ వీలులేదు. సేవాధర్మం స్వీయధర్మం రెండూ సమానబలం కలిగినవే. ఈ రెండింటి మధ్య సంఘర్షణ ఏర్పడింది. కాబట్టి ఆమె మనస్సు ఉయ్యాల ఊగినట్లు ఊగిసలాడుతున్నది. ఒత్తిడిలో నుండి ఉపాయం పుట్టాలి. ఒత్తిడికి తట్టుకోలేక ఉపాయం కొరకు ఆమె నిస్సహాయతతో భగవంతుడిని స్మరించింది. ద్రౌపది ఎప్పుడు భగవంతుడిని స్మరించినా అతడి అనుగ్రహం పిలిచినట్లు పలుకుతుంది. ఇది ఆమె చరిత్రలో కాదనలేని సత్యం. కథలో ఏర్పడే సన్నివేశాలలో అంతర్గర్భితంగా భగవద్రక్ష కొనసాగుతుందని కథార్థధ్వని.

2. మరొక విశేషం: వ్యాసభారతంలో ఈ మనస్సంఘర్షణ లేదు. మూలంలో ద్రౌపది సూటిగా, మూలంగా ధర్మావేశంతో మాట్లాడుతుంది.

**"న గచ్ఛేయ మహం తస్య రాజపుత్రి ! నివేశనమ్ । త్వ మేవ రాజ్ఞి! జానాసి యథా స నిరపత్రపః॥" (సం.4.14.11)** ఓ రాజపుత్రీ! నేను కీచకుడింటికి పోను, ఓ రాజ్ఞీ ! అత డెంత లజ్జలేనివాడో నీకు తెలియదా?' అని కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడుతుంది. అది సమయోచిత సంభాషణావైఖరి కాదు. అంతర్మథనం. అది కథార్థాలను రక్తి కట్టిస్తుంది. తిక్కన నాటకీయతకు, రసపోషణకు ఈ అమూలక కల్పనం అమూల్యోదాహరణం. (సంపా.)

**వ. అని తలంచుచు డోలాందోళితమానస యగుచు నమ్మానిని సుదేష్ణ కిట్లనియె. 92**

**ప్రతిపదార్థం:** అని తలంచుచున్= అని తలపోస్తూ; డోలా+ఆందోళితమానస= ఉయ్యాలవలె ఊపబడే మనస్సు కలది; అగుచున్= అవుతూ; ఆ+మానిని= ఆ కాంత (ద్రౌపది); సుదేష్ణకున్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అని ఆలోచిస్తూ ఉయ్యాలవలె ఊగిసలాడే మనస్సుగల సైరంధ్రి సుదేష్ణతో ఇట్లా అన్నది.

**ఉ. 'ఉత్పలగంధి! నన్నుడుగు, మొడ్లను బంపుము కల్లుదేర; నే**
**సత్పథవృత్తి నీ కడన సంతతమున్ బహుమానపాత్రనై**
**తత్పరతం జరించి యుచితంపుఁ బనుల్ దగఁ జేయఁ గాక దు**
**ష్కృత్పరివారయోగ్య పరిచారముమైఁ జను నట్టి దాననే? 93**

**ప్రతిపదార్థం:** ఉత్పలగంధి!= కలువల సౌరభంగల శరీరం గలదానా!; నన్నున్+ఉడుగుము= నన్ను వదలిపెట్టుము (విడువుము); కల్లుతేరన్= కల్లు తీసికొనిరావటానికి; ఒడ్లను= ఇతరులను; పంపుము; ఏన్= నేను; సత్పథవృత్తిన్= సన్మార్గ ప్రవర్తనంతో; సంతతమున్= ఎల్లప్పుడును; నీ కడన్+అ= నీవద్దనే; బహుమానపాత్రను+ఐ= గౌరవార్హురాలినై; తత్పరతన్= ఆసక్తితో; చరించి= మెలగి; ఉచితము+పనుల్= తగినపనులను; తగన్+చేయన్+కాక= సరిగా చేయటానికే గాని; దుష్కృత్ పరివారయోగ్య పరిచారముమైన్= నీచ సేవకులకు తగిన పనికై; చను+అట్టిదాననే?= వెళ్ళేటిదాననా?

**తాత్పర్యం:** 'ఓ వనితా! నన్ను వదలిపెట్టుము. కల్లు తీసికొనిరావటానికి ఇంక ఎవ్వరినైనా పంపుము. నీ దగ్గర నేనెప్పుడూ సన్మార్గవర్తినై సమ్మానార్హమైన కార్యాన్ని మాత్రమే చేసే దానినే గాని, ఇట్లా నీచ పరిచారికలు చేయదగిన పనులు చేసేదానినా? (కాదు).

**విశేషం:** పూలు ముడిచే సుకుమారమైన పని చేస్తానే గాని, కల్లు తీసికొనిరావటం వంటి నీచపు పనులు చేయనని మహారాణి కొలువులో చేరేటప్పుడే సైరంధ్రి చెప్పింది. ఇప్పు డామాట ధైర్యంగా గుర్తుచేస్తున్నది.

**క. అతివ! తగునమ్మ నీ గృహ । మతి నిర్మల చరితభరితమని యీ యెడ మ**
**త్పతుల యసన్నిధి నైనను । మతి నూఅడి యున్నచోట మన్నన దప్పన్. 94**

**ప్రతిపదార్థం:** అతివ!= ఓ సుదేష్ణాదేవీ; నీ గృహము= మీ అంతఃపురం; అతినిర్మల చరితభరితము= అత్యంత పవిత్రమైన నడవడికచేత నిండినది; అని= అనుకొని; ఈ+ఎడన్= ఈ ప్రదేశంలో; మత్+పతుల+అసన్నిధిన్+ఐనను= నా భర్తలు దగ్గర లేకున్నా; మతిన్+ ఊఱడి= మనస్సులో ఊఱటపడి; ఉన్నచోటన్= ఉన్నప్పుడు; మన్నన+తప్పన్= గౌరవం తప్పటం; తగునమ్మ?= తగునా తల్లీ?

**తాత్పర్యం:** ఓ దేవీ! ఇక్కడ నీ ఇంట సదాచార సంపన్నత కలదని తెలిసి, నా భర్తలు దగ్గర లేకున్నా, నేను నమ్మకంతో సరిపెట్టుకొని ధైర్యంగా ఉంటూ ఉండగా ఈ విధంగా మర్యాద తప్పటం న్యాయమా?

**ఉ. సాధులు సేరి నెమ్మిగ నిజస్థిర వృత్తము దుష్టకోటిచే**
**బాధలఁ బొందకుండఁ దమపాల వసించినఁ బెద్దవారు ది**
**క్కై ధరియించి వారికొక యాపద వుట్టకయుండఁ గాచు టొ**
**ప్పై ధరఁ కీర్తి కెక్కదె? యపాయము సేసిన నింద వుట్టదే? 95**

**ప్రతిపదార్థం:** సాధులు= సజ్జనులు; చేరి= ప్రయత్నించి; నెమ్మిగన్= ప్రీతితో; నిజస్థిరవృత్తము= తమ నిశ్చల సదాచార ప్రవర్తన; దుష్టకోటిచేన్= దుర్మార్గులచేత; బాధలన్+పొందకుండన్= బాధలుపడకుండా; తమపాలన్+వసించినన్= తమను ఆశ్రయించి ఉండగా; పెద్దవారు= ఉన్నతులైనవారు; దిక్కు+ఐ= ఆధారమై; ధరియించి= పోషించి; వారికిన్= ఆశ్రయించినవారికి; ఒక ఆపద+పుట్టక+ ఉండన్= ఏవిధమైన ఆపదా కలగకుండా; కాచుట+ఒప్పు+ఐ= కాపాడటం తగినదై; ధరన్+కీర్తికిన్+ఎక్కదె?= లోకంలో ప్రశస్తి పొందదా?; అపాయం చేసినన్= కీడు కలిగిస్తే; నింద+పుట్టదే?= నింద కలుగదా?

**తాత్పర్యం:** సజ్జనులైనవారు తమ సత్ప్రవర్తన చెడ్డవారి చేత చెరచబడకుండా కాపాడుకొనటానికి పెద్దలను ఆశ్రయిస్తే వారు వారికి ఆశ్రయమిచ్చి, వారి యోగక్షేమాల భారం వహించి, వారికి ఎటువంటి ఆపదలు కలుగకుండా కాపాడి, అన్నివిధాల రక్షిస్తే కీర్తి పొందుతారు. అట్లాకాక వారిని అపాయానికి గురిచేస్తే నిందల పాలవుతారు.

**విశేషం:** శరణాగత రక్షకులైన సజ్జనుల లక్షణాలు చెప్పే ఈ పద్యం చక్కని సూక్తి. ఇందులో సజ్జనుల ప్రసక్తి పాండవులకు, పెద్దల ప్రసక్తి విరాటరాజునకు పరోక్షంగా వర్తిస్తుంది.

**ఆ. ఎవ్వరేని యింటి కెద్దియే నొకటికి । నన్నుఁ బంపఁదగునె? నిన్ను నాఁడ**
**కొలుచునెడ ననుజ్ఞగొనననె? నీచములగు । పనుల కేను జాలకునికి సెప్పి.' 96**

**ప్రతిపదార్థం:** ఎవ్వరేని+ఇంటికిన్= ఎవరి ఇంటికైనా; ఎద్దియేన్+ఒకటికిన్= దేనికో ఒకదానికి; నన్నున్+పంపన్+తగునె?= నన్ను పంపవచ్చునా?; నిన్నున్+కొలుచున్+ఎడన్= మీ కొలువులో చేరినపుడు; నాఁడు+అ= ఆ రోజే; నీచములు+అగు పనులకున్= చెడుపనులకు; ఏను+చాలక+ఉనికి= నేను సరిపోనని; చెప్పి= విన్నవించి; అనుజ్ఞ+కొననె?= అనుమతి పొందలేదా?

**తాత్పర్యం:** నన్ను ఎవరింటికో ఎందుకో ఒకదానికి పంపటం భావ్యం కాదు. నేను మీకొలువులో చేరేనాడే నీచపు పనులు చేయనని మీతో చెప్పి మీ అంగీకారం పొందలేదా?'

**విశేషం:** 'ఎవ్వరేని యింటికిన్' - ఇది 'ఎవ్వనియేని ముఖామృతాంశుబింబమ్మున' అను వాగనుశాసనుని ప్రయోగము వంటిది. అప్యర్థమునకు సమాసమధ్యపాత మిట విశేషము. 'ఒకటికి నన్నుఁబంపఁ దగునె?' - ఇందలి అశ్లీలత కవినాటికి లేదని యెఱుఁ గనగును. కాళిదాసు తన యభిజ్ఞాన శాకుంతలమున - దుష్యంతుఁడు తననుఁ దోడ్కొని పోవునో పోవడోయని డోలాయమాన మానసయగు శకుంతల నూరడింపజేయుటకు 'విశ్వస్తా భవ' (ఆయన చెప్పినట్లు తోడ్కొనిపోవును గాన - నమ్మకము గలదాని వగుము) అని చెలికత్తెచేఁ బల్కించినాఁడు. ఆయన కాలములో 'విశ్వస్తావిధవే సమే' అనునది ప్రచారములో నుండినచో అప్పుడే వివాహితయగు శకుంతల నట్లాశీర్వదించుట జరుగదు కదా! అట్లే మనకాలమునం దశ్లీలములుగా నొప్పు కొన్ని పదములు తిక్కనాది మహాకవుల కాలములయందు సభ్యార్థములుగనే యున్నవని యూహింపనగు. ఏ కవులైనను వారివారి కాలంబులం దశ్లీల ప్రతీతి జనకంబుల మానుదురే కాని భావికాలాశ్లీల ప్రతీతి జనకంబుల మానసాధ్యము కాదు గదా! 'ఎవ్వరేని యింటి కెద్దియే నొకటికి' ననుటచే ఈ సుదేష్ణ కపట వర్తనము ద్రౌపదికి విదితమైనట్లు గూడ స్ఫురించెడివి. అయిన నేల పోయె నన్నచోఁ దన పాతివ్రత్య మహిమచే సంరక్షితము గాఁగలనను నమ్మికచేతనని తెలియునది." (కీ.శే. పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు - విరాటపర్వ టిప్పణి). ఎవ్వరేని...ఎవరి ఇంటికి బడితే వారి ఇంటికి, దేనికి పడితే దానికి- అని గోప్యంగా చెప్పటంలో, అవి ఎంతటి అవాచ్యాలో తెలుస్తున్నది (సంపా.)

**క. అనిన విని యనుచితంబున। కనయము శంకించియును లతాంగి మదిన్ త**
**మ్ముని వలవంత దలఁచి యి। ట్లనియెం బాంచాలితోడ సాదర వృత్తిన్. 97**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= ఆ మాటలు విని; అనుచితంబునకున్= అనువుకాని పనికి; అనయమున్= మిక్కిలిగా; శంకించియును= అనుమానపడి కూడా; లతా+అంగి= సుదేష్ణ; మదిన్= మనస్సులో; తమ్ముని వలవంత= కీచకుడి విరహ బాధను; తలఁచి= జ్ఞాపకం చేసికొని; పాంచాలితోడన్= (ద్రౌపది) సైరంధ్రితో; స+ఆదరవృత్తిన్= గౌరవభావంతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ద్రౌపది చెప్పిన మాటలు విని చెడుపనిమీద పంపుతున్నందుకు సందేహించినా తమ్ముడైన కీచకుడి విరహబాధను స్మరించి గౌరవపురస్సరంగా సుదేష్ణ ఇట్లా అన్నది.

**ఉ. 'అక్కట! యేను వేడ్కపడి యానెడు నాసవ మర్థిఁ దేర నొం**
**డొక్క నికృష్టఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో**
**సెక్కఁగఁజేసి నిన్ను నతిహీన విధాన నియుక్తఁ జేఁతగా**
**నిక్కమ యుమ్మలించి; తిది నెయ్యము తియ్యము కల్మియే? సఖీ! 98**

**ప్రతిపదార్థం:** సఖీ!= ఓ చెలీ (సైరంధ్రీ)!; ఏను= నేను; వేడ్కపడి= ముచ్చటపడి; ఆనెడు ఆసవము= త్రాగే మద్యం; అర్థిన్+తేరన్= అక్కరగా తీసికొని రావటానికి; ఒండు+ఒక్క= మరొక; నికృష్టన్= నీచ స్త్రీని; పంచుటకున్+ఓపక= పంపటం ఇష్టం లేక; చెప్పినన్= ఈ పని అప్పగిస్తే; నీవు, గోసు+ఎక్కఁగన్+చేసి= నీవు దానిని దోషంగా పెద్ద చేసి; నిన్నున్; అతిహీన విధాననియుక్తన్= మిక్కిలి నీచకార్యానికి పంపినదానిగా; చేఁత+కాన్= చేయుటమని; నిక్కము+అ= తప్పక; ఉమ్మలించితి(వి)= దుఃఖపడుతున్నావు; ఇది నెయ్యము తియ్యము= ఇది స్నేహమూ, ప్రీతీ; కల్మి ఏ?= కలిగి ఉండటమవుతుందా?

**తాత్పర్యం:** 'ఓ చెలీ! నేను ఎంతో మనసుపడి త్రాగే మద్యాన్ని తెచ్చేందుకు నీచస్త్రీ నెవ్వరినీ పంపటం ఇష్టం లేక నీకు చెప్పితే, నీ వేమో దాని నొకక పెద్ద దోషంగా భావించి నీచకార్యం చెప్పానని నిజంగా భావించి లోలోన బాధపడుతున్నావు. ఇది స్నేహమాధుర్యం కలిగి ఉండట మనిపించుకొంటుందా?

**విశేషం:** సైరంధ్రి అనుచిత కార్యమని పేర్కొన్న పనిని ఉచితమైనదని సుదేష్ణ వాదించటమే కాక - స్నేహం, ప్రీతి ఉన్నచోట ఏ పని అయినా నీచమనీ, ఉదాత్తమనీ పాటించటం పాడికాదని స్నేహధర్మమర్మాన్ని చూపుతున్నది. మాటల గడుసరితనాన్ని ప్రదర్శించింది. (సంపా.)

**క. అది లాఁతియిల్లె? నినుఁ దమ । హృదయంబుల నెవ్వరేని నెఱుఁగరె? యేఁ జె**
**ప్పుదు నీదు పెంపు నినుఁగ । న్నది మొదలుగ నెల్లవారి కయ్యై భంగిన్. 99**

**ప్రతిపదార్థం:** అది= ఆ కీచకుని ఇల్లు; లాఁతి+ఇల్లె?= పరాయి యిల్లు కాదు గదా?; నినున్= సైరంధ్రిని; తమ హృదయంబులన్= తమ మనస్సులలో; ఎవ్వరు+ఏనిన్+ఎఱుఁగరె?= ఎవరికైనా తెలియదా?; ఏన్= నేను; నినున్+కన్నది మొదలుగన్= నిన్ను చూసినప్పటి నుండి; ఎల్లవారికిన్= అందరికీ; ఆ+ఐ+భంగిన్= ఎన్నో విధాలుగా; నీదు పెంపు చెప్పుదున్= నీ గొప్పతనం చెప్పుతూ ఉంటాను.

**తాత్పర్యం:** కీచకుడి ఇల్లు నీకేమైనా పరాయి ఇల్లా? నీవు అందరి మనసులకూ ఎక్కినదానవే? (అందరూ మెచ్చేదానివే); నిన్ను చూచినది మొదలు నీలోని సద్గుణాలను అందరికీ ఎన్నో విధాలుగా చెప్పేదానిని. కాబట్టి నీవు అందరికీ తెలుసు.'

**విశేషం:** నా ఇల్లు ఎట్లా నిర్మలచరితభరితమో మా తమ్ముడి ఇల్లు కూడా అట్లాగే; పరాయి ఇల్లు కాదని సుదేష్ణ నమ్మబలుకుతున్నది.

**క. అని మఱియుఁ బెక్కుభంగులఁ । దనుఁ బ్రార్థింపంగ ద్రుపదతనయకుఁ జిత్తం**
**బున'నింకఁ బెద్ద పెనఁగం । జన దీయమతోడ' నను విచారము పుట్టెన్. 100**

**ప్రతిపదార్థం:** అని; మఱియున్= ఇంకా; పెక్కు భంగులన్= అనేక విధాలుగా; తనున్+ప్రార్థింపంగన్= సైరంధ్రిని వేడగా; ద్రుపద తనయకున్= ద్రౌపదికి; చిత్తంబునన్= మనస్సులో; ఈయమ తోడన్= ఈమెతో; ఇంకన్+పెద్ద పెనఁగన్+చనదు= ఇకపై అడ్డం చెప్పటం తగదు; అను విచారము= అనే ఆలోచన; పుట్టెన్= కలిగింది.

**తాత్పర్యం:** అని ఇంకా సైరంధ్రిని అనేక విధాలుగా ప్రార్థించటం చేత, ' ఈ సుదేష్ణతో ఇంకా ఎక్కువగా వాదులాడటం మంచిదికా' దనే ఆలోచన ద్రౌపదికి (సైరంధ్రికి) కలిగింది.

**వ. ఇట్లు దోఁచిన తలంపునం జేసి. 101**

**తాత్పర్యం:** ఈ విధంగా పుట్టిన ఆలోచనతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

ద్రౌపది కీచకునింటికిఁ గల్లు దేరంబోవుట (సం.4-14-17)

**చ. మన మురియాడుచుండ ననుమానముతోన సుదేష్ణఁ జూచి 'నీ**
**వనయముఁ గోరినట్టి పని యర్థిమెయిం జని చేయుదానఁ గా'**

**కను తన మాట కప్పాలఁతి హర్షముఁ బొందుచు నందియిచ్చు కాం**
**చన చషకంబు పుచ్చికొని చారువిలోచన యార్తమూర్తియై. 102**

**ప్రతిపదార్థం:** చారువిలోచన= అందమైన కన్నులు కలది, ద్రౌపది; మనము= మనస్సు; ఉరియాడుచుండన్= ఊగిసలాడుతూ ఉండగా; అనుమానముతోన్+అ= సందేహిస్తూనే; సుదేష్ణన్+చూచి= సుదేష్ణను చూచి; నీవు; అనయమున్+కోరిన+అట్టిపని= ఎంతో, మరిమరీ కోరిన పనిని; అర్థిమెయిన్= ప్రేమతో, ఆసక్తితో; చని= వెళ్ళి; చేయుదానన్+కాక= చేస్తానులే; అను తనమాటకున్= అనే సైరంధ్రి మాటలకు; ఆ+పాలఁతి= ఆ దేవి (సుదేష్ణ); హర్షమున్+పొందుచున్= సంతోషిస్తూ; అంది+ఇచ్చు= చేతికి అందించే; కాంచన చషకంబు= బంగారు మధుపాత్రను; పుచ్చికొని= తీసికొని; ఆర్తమూర్తి+ఐ= దీనమైన ఆకారంకలదై;

**తాత్పర్యం:** ద్రౌపది తన మనస్సు ఊగిసలాడుతూ ఉండగా, సందేహంగానే సుదేష్ణ వైపు చూచి, 'నీ వింతగా కోరిన పనిని నీ మీది ప్రీతితో తప్పక చేస్తాను' అని చెప్పింది. ఆ మాటకు ఆ సుదేష్ణ ఎంతో సంతోషిస్తూ తన కందించిన బంగారు పానపాత్రను తీసికొని శోకమూర్తి అయి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: సముచ్చయం. ఇది చక్కని అభినయ బంధురమైన రచన. మనసు ఊగిసలాడటం, అనుమానంతో చూడటం, నీమీది గౌరవంతో, ఇంతగా అడుగుతున్నావు కాబట్టి ఈ పని చేస్తానని ఒప్పుకొనటం, ద్రౌపది మాటలు విని సుదేష్ణ వెంటనే సంతోషంతో పొంగిపోవటం, ఆలస్యం చేయకుండా పానపాత్రను అందించటం, ద్రౌపది దానిని తీసికొనటం. అంతవరకూ అందంగా ఉన్న ద్రౌపది చూపులు ఆర్తితో నిండిపోవటం, ఆ అభినయంతో ఆమె శోకమూర్తిగా కనపడటం అనే అభినయ విశేషాలు ఒక క్రమ విన్యాసంలో నిబంధించటం ఈ పద్యంలోని నాటకీయత. ఏకకాలంలో కాదగిన (యౌగపద్యం గల) అంశాలను కూర్చి చెప్పితే సముచ్చయాలంకారం. దానిని తిక్కన ఒక క్రమవిన్యాసంతో ప్రయోగించాడు. (అభినయ వ్యాఖ్యకు రాబోయే పద్య విశేషాంశాన్ని కూడా చూడండి). (సంపా.)

**వ. చనుచుండి, నీచహృదయుండగు కీచకుండు తనయెదుర నప్పుడాడిన కర్ణశూలంబులగు మాటల మీఁదం బిడుగుపడినవానిఁ గొఱవింజూఁడిన తెఱంగున సుదేష్ణ ద న్ననుచిత వ్యాపారంబునకు నియోగించుటకు నిర్వేదనంబునం బొంది. 103**

**ప్రతిపదార్థం:** చనుచున్+ఉండి= వెళ్ళుతూ; నీచ హృదయుండు+అగు= నీచమైన మనస్సు గల; కీచకుండు= కీచకుడు; తన+ఎదురన్= తనముందు; అప్పుడు+ఆడిన= మొదటిసారి కలిసినప్పుడు పలికిన; కర్ణశూలంబులు+అగు మాటలమీఁదన్= చెవికి శూలాలు గుచ్చుకుంటే కలిగే బాధవంటి బాధ కలిగించే మాటలపై; పిడుగుపడినవానిన్= పిడుగుపడ్డవానిని; కొఱవిన్+చూఁడిన తెఱంగునన్= కొఱవితో కాల్చినట్లుగా; చమైన మనస్సుగల; సుదేష్ణ; తన్నున్= తనను (సైరంధ్రిని); అనుచిత వ్యాపారంబునకున్= తగని పనికి; నియోగించుటకున్= పంపినందుకు; నిర్వేదనంబునన్+పొంది= దుఃఖించి.

**తాత్పర్యం:** సైరంధ్రి అట్లా వెళ్ళుతూ నీచుడైన కీచకుడు తనముందు చెవికి శూలాలు సోకినట్లు కఠినంగా మాట్లాడిన మాటల తరువాత సుదేష్ణ తనను తగనిపనికి పంపటం పిడుగు పడినవాడిని కొఱవితో కాల్చినట్లు కాగా, నిర్వేదన స్థితి పొందింది.

**విశేషం:** అలం: ఉపమ. తిక్కన నాటకీయ పరిభాషను, అభినయ ముద్రలకు సంబంధించిన నాట్యాంశాలను కావ్యరచనలో ప్రవేశపెట్టి ఉభయకావ్య ప్రౌఢి పాటించే శిల్పాన్ని ప్రదర్శిస్తా డనటానికి ఈ పద్యం ఒక తార్కాణం. 'నిర్వేదంబునం బొంది' అన్న

ప్రయోగం గమనించదగింది. నిర్వేదం అనే భావాన్ని పొంది అని కాదు. నిర్వేదం అనే భావంలో ఆ భావానికి తగిన అనుభావాలను ప్రదర్శిస్తున్న నాట్యముద్రను ముమ్మూర్తులా అలవరచుకొని అని అర్థం చెప్పాలి. నిర్వేదం సంచారిభావం. దాని అనుభవ, అభినయస్థితి నిర్వేదనం. "నిర్వేదో నామ దారిద్ర్య వ్యాధ్యవమానాధిక్షేపాకృష్ట క్రోధ తాడనేష్టజన వియోగ తత్త్వజ్ఞానాదిభిః విభావైః సముత్పద్యతే. స్త్రీ నీచకుత్సితసత్త్వానాం రుదిత నిశ్శ్వసితో చ్ఛ్వసిత సంప్రధారణాదిభిః అనుభావైః తమభినయేత్" అని భరత నాట్యశాస్త్రం (VII-28). దారిద్ర్యం, వ్యాధి, అవమానం, అధిక్షేపం, తిట్టు, క్రోధతాడనం, ఇష్టజనవియోగం, తత్త్వజ్ఞానం మొదలైన విభావాల వలన నిర్వేదం కలుగుతుంది. రోదనం, ఉచ్ఛ్వాసనిశ్వాసాలు, సంప్రధారణం మొదలైన అనుభావాలతో స్త్రీలు, నీచ ప్రవృత్తులు, కుత్సితులు నిర్వేదాన్ని అభినయించాలి. చెప్పగూడని పని చెప్పి మాట తప్పి సైరంధ్రిని వంచించి అవమానించింది సుదేష్ణ; నీచ హృదయుడై కర్ణశూలాల వంటి మాటలు మాట్లాడి అవమానాన్ని ఆకృష్ట (తిట్టు)ను ప్రదర్శించిన కీచకుడు ద్రౌపదికి కలిగిన నిర్వేదనానికి విభావాలు. వీటి వలన సైరంధ్రి ఆర్తమూర్తి అయిందని పై పద్యంలో చెప్పబడింది. అంటే రోదనం లేదా ఆర్తి అనే అనుభావం మూర్తమైనట్లు గోచరించిందన్నమాట! తెలుగులో చెప్పాలంటే తన నిస్సహాయస్థితికి బావురుమని ఏడ్చినట్లు ఆకారం పెట్టిందన్నమాట! భావానుభావాలను తిక్కన ఇట్లా అభినయ సుందరంగా ఆవిష్కరించాడు. దాన్ని ఉపమాలంకార గమ్యంగా కూడా చేశాడు. కీచకుడి మాటలవలన పిడుగుపడితే కలిగే బాధను, ఆ మీద కొరవిపెట్టి కాలిస్తే కలిగే వేదనను సుదేష్ణ నియోగం వలన పొందిందని భావం. ఒకటి ఒక్కసారిగా శిలాన్ని నిలువునా కూల్చేది, రెండోది మనసునంతా కోపంతో దహించి వేసేది. కావ్యాలంకార నాట్యాలంకారాల ఈ కమనీయ సంయోజనం కవిబ్రహ్మ సృష్టి. (సంపా.)

**చ. అలమటఁ బొంది మాయ విధియా! యని దైవము దూఱు, నిత్తఱిం**
**గలరొకొ నాకు దిక్కను, మొగంబున నశ్రులు వెల్లిగొల్పుఁ, దొ**
**ట్రిలఁబడు, జల్లనం జెదరు డెందముఁ గూడఁగఁ దెచ్చి నన్నుఁ గే**
**వలమున ముట్ట నెవ్వరికి వచ్చుననుం, గలఁగున్, వెనుంబడున్. 104**

**ప్రతిపదార్థం:** అలమటన్+పొంది= చింతపడి; దైవమున్= భగవంతుడిని; మాయవిధియా+అని= అయ్యో ఎంతటి క్రూర ప్రారబ్ధం కల్పించావయ్యా! అని; దూఱున్= తిట్టుతుంది; ఈ+తఱిన్= ఈ సమయంలో; నాకున్+దిక్కు= నాకు ఆధారం; శరణం; కలరు+ఒకొ అనున్= ఉన్నారా అని అంటుంది; మొగంబునన్= ముఖం మీద; అశ్రులు వెల్లి+కొల్పున్= కన్నీళ్ళను మిక్కుటంగా కారుస్తుంది; తొట్రిలన్+పడున్= తడబడుతుంది; జల్లు+అనన్= జల్లుమనేటట్లు; చెదరుడెందమున్= చలించే మనస్సును; కూడఁగన్+తెచ్చి= కూడదీసికొని; నన్నున్= సైరంధ్రిని; కేవలమున= కావాలని; ముట్టన్= తాకటానికి; ఎవ్వరికిన్+వచ్చున్= ఎవ్వరికి సాధ్యపడుతుంది; అనున్= అంటుంది; కలఁగున్= కలతపడుతుంది; వెనున్+పడున్= వెనుకకు తగ్గుతుంది.

**తాత్పర్యం:** బాధపడుతూ, మాయవిధీ! అని దైవాన్ని నిందిస్తూ, తనకు దిక్కెవ్వరూ లేరని కన్నీళ్ళు బాగా కారుస్తూ, తూలుతూ, సైరంధ్రి కొంతసేపటికి తన మనస్సు కుదుటపరచుకొని, తనను అన్యులు ఎవ్వరూ ముట్టజాలరని ధైర్యం తెచ్చుకొని కూడా కలతపడి వెనుకకు తగ్గింది.

**విశేషం:** నిర్వేదం అనే సంచారి భావంలో ప్రదర్శించే చేష్టాదికాలు (అనుభావాలు) ఇందులో సహజంగా వర్ణించటం అభినయ సౌందర్యాన్నీ, భావశబలతనూ వెలారుస్తున్నాయి. (సంపా.)

**క. అట్టియెడ. 105**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**సీ. దైన్యంబు తలపోఁత తలకొన్నఁ జెలువ కా। ననమున వెల్లఁదనంబు గదిరె;**
**భయరసవేగంబు పైకొని ముట్టినఁ। గాంతకుఁ దనులతఁ గంప మడరె;**
**బెగ డంతకంతకు మిగిలిన నింతికిఁ। బదముల నటఁ దొట్రుపాటు బెరసెఁ;**
**దల్లడం బొందినఁ దన్వికి నవయవం। బుల నెల్ల ఘర్మాంబు కళిక లెసఁగెఁ;**

**ఆ. దలఁకు పుట్టెఁ, గొంకు కొలఁదికి మీఱె, వె। న్బాటు దోఁచె, ముట్టుపాటు దొడరె**
**వెఱఁగుపాటు దనికె, నెఱ నాడె నొవ్వు నె। వ్వగలు వగల నీనె, దిగులు వొదివె.** 106

**ప్రతిపదార్థం:** చెలువకున్= సైరంధ్రికి; దైన్యంబు= తనకప్పుడు కలిగిన దీనత్వ సంబంధమైన; తలపోఁత= ఆలోచన; తలకొన్నన్= కలుగగా, ముసురుకోగా; ఆననమునన్= ముఖంమీద; వెల్లఁదనంబు= వెలవెలపాటు; కదిరెన్= ఆవహించింది; కాంతకున్= సైరంధ్రికి; భయరసవేగంబు= మిక్కుటమైన భయమనే రసం యొక్క తీవ్రత; పైకొని ముట్టినన్= ఆవహింపగా, క్రమ్ముకోగా; తనులతన్= శరీరంలో; కంపము+అడరెన్= వణుకు పుట్టింది; ఇంతికిన్= ఆమెకు; బెగడు= విహ్వలత్వం; అంతకున్+అంతకున్= క్షణక్షణానికి; మిగిలినన్= ఎక్కువకాగా; పదములన్= అడుగులలో; తొట్రుపాటు బెరసెన్= తడబాటు కలిగింది; తన్వికిన్= ఆమెకు; తల్లడంబు+ఒందినన్= కలతపాటు కలుగటంతో; అవయవంబులన్+ఎల్లన్= శరీరంలోని అంగాలనిండా; ఘర్మ+అంబుకళికలు= చెమట నీటి బిందువులు; తొడరెన్= వ్యాపించాయి; తలఁకు+పుట్టెన్= భయంపుట్టింది; కొంకు= సంకోచం; కొలఁదికి మీఱెన్= మోతాదుకు మించింది, అతిశయించింది; వెన్+పాటు+తోఁచెన్= దిగులు కలిగింది; ముట్టుపాటు+తొడరెన్= సంకటం కలిగింది; వెఱఁగుపాటు= భయం వలన నిశ్చేష్టత; తనికెన్= కలిగింది; నొవ్వు= బాధ; నెఱనాడెన్= పూర్ణంగా నాటుకొన్నది (జీవస్థానంలో తగిలింది); నెఱ+వగలు= పూర్తిచింత; వగలన్= దుఃఖాలను; ఈనెన్= నింపివేసింది; దిగులు+పొదివెన్= దిగులు చుట్టుకొన్నది.

**తాత్పర్యం:** ద్రౌపదికి మనస్సున దీనత్వం కలుగటంతో ముఖం తెల్లబోయింది. భయంతో శరీరం వణకసాగింది. శరీరం పరవశం కావటంతో అడుగులు తొట్రుపడసాగాయి. కలతపాటు కలగటంతో దేహమంతటా చెమటలు పట్టాయి. భయం, సంకోచం, నిశ్చేష్టత, సంకటపాటు, బాధ అతిశయించాయి. దిగులు పెనవేసికొన్నది.

**విశేషం:** 1. భావ సంఘర్షణలను చిత్రించేటప్పుడు తిక్కన ఆకృతుల కంటె అభినయాలను ఎక్కువగా వర్ణిస్తాడు. ముందు పద్యంలో ద్రౌపది అనుభావాలను చెప్పి ఈ పద్యంలో సాత్త్వికభావాలను చిత్రించాడు. రసాభ్యుదయోల్లాస శిల్పంలో ఈ పద్యం ఒక రత్నం. ఇందులోని శిల్పాన్ని నాలుగు రకాలుగా వివేచించవచ్చును. 1. భావోదయం.2.అనుభావ ప్రకటనం. 3. సాత్త్వికభావ ప్రదర్శనం. 4. వాటియొక్క అభ్యుదయ క్రమోల్లాసం. ఈ సీసపద్యంలో అనుభావ సాత్త్వికభావాలు వరుసగా సీసపద్య పాదాలలోనూ, భావోదయ క్రమం ఎత్తుగీతిలోనూ, వాటి అభ్యుదయాన్ని క్రమాలంకారంలో ఉల్లాసపరచటం అలంకార రచనలోనూ తిక్కన ఆవిష్కరించాడు. ఆ క్రమాన్ని ఈవిధంగా భావించవచ్చును.

| భావం | | అనుభావం | సాత్త్వికభావం |
|---|---|---|---|
| 1. తలఁకు పుట్టటం | - | 1. ధైర్యంబు తలపోత | 1. మొగమున వెల్లదనం. |
| 2. భయం మితిమీరటం | - | 2. భయరసవేగం పైకొనటం | 2. శరీరం వణకటం. |
| 3. వెన్‌బాటు తోచటం | - | 3. విహ్వలత అంతకంతకు పెరగటం | 3. నడకలో తడబాటు. |
| 4. ముట్టుపాటు (కలత) పుట్టటం | - | 4. తల్లడిల్లడం | 4. ఒడలెల్ల చెమటపట్టడం. |

ఎత్తుగీతి పూర్వార్ధంలో భయం అనే రసభావం యొక్క నాలుగు దశలను వికాసక్రమంలో పేర్కొనటం, ఆ భావదశలకు తగిన అనుభావసాత్త్విక భావాభివ్యక్తులను సీసపద్య పాదాల పూర్వోత్తరార్ధాలలో క్రమంగా వర్ణించటం క్రమాలంకార విన్యాసం. ఎత్తుగీతి ఉత్తరార్ధంలో భావోల్లాసాన్ని అవస్థాపరంగా పేర్కొనటం జరిగింది. తరువాతి వచనంలో 'ఇవ్విధంబున ద్రుపదపుత్రి దురవస్థం బొందుచు' అని తిక్కన తన రసభావ శిల్పరహస్యాన్ని సూచించాడు. దానిని అన్వయించుకొంటే ద్రౌపది పొందిన దురవస్థ (భరించటానికి శక్యంగాని మనోవేదన) నాలుగు ముఖాలుగా పరిణతి చెందింది. అవి- వెఱగుపాటు పొందటం, అదే ఒక దురవస్థ దశ. దాని కంటె దుర్భరమైనవి క్రమంగా - మర్మస్థానాలను బాధపెట్టే వేదన, నెవ్వగల వగలు, దిగులు. ఇంత క్రమబద్ధంగా ఒక పాత్రలోని భావానుభావాల కనుగుణమైన సాత్త్వికభావాలను వర్ణించి, అవి మానసిక అవస్థలుగా రూపొందిన పద్ధతిని ప్రదర్శించిన అభినయశిల్పాన్ని శ్రవ్యకావ్యంలో మొదట ప్రవేశపెట్టినవాడు కవిబ్రహ్మ తిక్కన. మహాకవిత్వంలో ఉండే అభినయ నిర్మాణ శిల్పానికి (Structural beauty) ఈ పద్యం తార్కాణం. (సంపా.)

2. విధి ఒక వ్యక్తిని ఎంత దయనీయ స్థితికి తీసికొనివస్తుందో ఈ పద్యం ఉదాహరణంగా చెప్పవచ్చును. సకలరాజన్యుల చేత పరిచర్యలు పొందవలసిన పాండవ పట్టమహిషి ఒక పరిచారికగా సుదేష్ణ కొలువులో చేరటం విధి వైపరీత్యం. ఆమెకు ఈ కష్టకాలంలో తోడ్పడేవారు ఎవ్వరూ లేరనే బాధ కలిగింది. ఆ నీచుడి ఇంటికి వెళ్ళక తప్పలేదు. అట్టి దయనీయ స్థితిని తిక్కన ఈ పద్యంలో వివరించాడు. భావం ఒకటే అయినా వేర్వేరు పదాలను వాడటం భావతీవ్రతకు, సమగ్రతకు దోహదం చేశాయి.

**వ. ఇవ్విధంబున ద్రుపదపుత్రి దురవస్థం బొందుచు 'మహాపదలకుం బరిహరణంబు హరి (చరణ) స్మరణంబ' యని తన హృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొని, సుదేష్ణ మందిరంబు వెలువడి దినకరుం గనుంగొని వినయవినమితోత్తమాంగయై నిజాంతర్గతంబున. 107**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; ద్రుపదపుత్రి= ద్రౌపది (సైరంధ్రి); దురవస్థన్+పొందుచున్= పడరాని మానసికవేదన పడుతూ; మహా+ఆపదలకున్= గొప్ప కష్టాలకు; పరిహరణంబు= నివారణోపాయం; హరి (చరణ) స్మరణంబు+అ= విష్ణు పాదాలను తలంచటమే; అని= అనుకొని; తన హృదయపుండరీకంబునన్= తన హృదయకమలంలో; పుండరీకాక్షున్= తెల్లని పద్మాలవంటి కన్నులు కలవాడైన విష్ణువును; నిక్షేపించుకొని= నిలుపుకొని; సుదేష్ణ మందిరంబు= సుదేష్ణ నివసించే భవనం నుండి; వెలువడి= బయటికి వచ్చి; దినకరున్= సూర్యుడిని; కనుంగొని= చూచి; వినయ వినమిత+ఉత్తమ+అంగ+ఐ= అణకువచే వంచిన శిరస్సుగలదై; నిజ+అంతర్గతంబునన్= తన మనస్సులో.

**తాత్పర్యం:** ద్రౌపది ఈ విధంగా దుఃఖిస్తూ, కష్టాలు గట్టెక్కటానికి భగవంతుడి స్మరణమాత్రమే మార్గమని తలచి, విష్ణువును ధ్యానించి, సుదేష్ణ మందిరం వెలువడి, సూర్యుడిని చూచి అణకువతో తలవంచుకొని నమస్కరించి, తన మనస్సులో, (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: రూపకం; పుండరీకాక్షుడు అన్నది సాభిప్రాయ విశేషణం, పుండరీకముల వంటి కనులుగల నారాయణుడిని స్మరించటం వలన ఆమెను కనుపాపవలె కాపాడవలసిన బాధ్యత విష్ణుమూర్తిపై పడింది. ద్రౌపది మందిరం నుండి బయటికి రాగానే సూర్యుడికి నమస్కరించింది. సూర్యుడు కమలాప్తుడు, ద్రౌపది హృదయపుండరీకానికి కూడా వికాసం కలిగించక తప్పదు. నారాయణుడి పుండరీకాక్షులను కూడా వికసింపజేయక తప్పదు. ద్రౌపది హృదయపద్మం వికసిస్తుందని ధ్వని.

**తే. 'పాండుపుత్రులకేను తప్పని మనంబు । గలుగుదాననయేని నో కమలమిత్ర!**
**కీచకుని దెస న న్నొక కీడు తెరువు । వొరయకుండఁగ రక్షింపు కరుణతోడ.' 108**

**ప్రతిపదార్థం:** ఓ కమలమిత్ర!= పద్మాలకు మిత్రుడవైన ఓ సూర్యభగవానుడా!; ఏను= నేను (సైరంధ్రి); పాండుపుత్రులకున్= పాండవులకు; తప్పనిమనంబు= తొలగనిమనస్సు; కలుగుదానను+అ+ఏనిన్= కలదానినైతే; కీచకునిదెసన్= కీచకుని వలన; నన్నున్= నన్ను; ఒక కీడు తెరువు= ఎటువంటి హాని జరిగేపద్ధతి; పొరయక+ఉండఁగన్= ఏర్పడకుండా; కరుణతోడన్= దయతో; రక్షింపు(ము)= రక్షించుము.

**తాత్పర్యం:** 'ఓ సూర్యభగవానుడా! నేను పాండవులను తప్ప ఇతరులను భర్తలుగా భావించని పతివ్రతనైతే నాకు కీచకుడి వలన ఎటువంటి అపాయం జరిగే దారు లేర్పడకుండా దయతో రక్షించుము.'

**విశేషం:** ద్రౌపది మహాభక్తురాలు. ఒకసారి భగవంతుడిని సమాహితచిత్తంతో స్మరిస్తే ఆయన వెంటనే ప్రసన్నుడౌతాడు. ఆమెకు శ్రీకృష్ణుడే శ్రీమన్నారాయణుడు. ఆమె హరినామస్మరణం ఆపదలనుండి కాపాడుతుందని గాఢమైన విశ్వాసం కలది. **"యద్భావం తద్భవతి."** ఆమె మనఃపద్మంలో పుండరీకాక్షుడిని స్థిరంగా నిలుపుకొన్నది. ఆమె మనసు పుండరీకం, ఆ దేవుడి చూపు పుండరీకం. ఆతడి కరుణ ఆమె పట్ల ఉండటం సహజసిద్ధం అని ధ్వని. మందిరం దాటి బయటికి వచ్చింది ద్రౌపది. ఆమెకు సూర్యనారాయణుడు ఎదుట మింట కనిపించాడు. **"సూర్యో నారాయణో హరిః"** అని సంప్రదాయం. హరి పద్మాక్షుడు, సూర్యుడు పద్మమిత్రుడు. పైపెచ్చు నారాయణ నామధేయుడు. సర్వవ్యాపకుడైన హరికి ప్రత్యక్ష సాక్షి సూర్యుడు. ఆయనకు నమస్కరించింది. సూర్యుడు మహాపదార్థాలలో ఒకడు. జగత్సాక్షి, ద్రౌపది పాతివ్రత్యానికి సాక్షిగా నిలువదగిన దైవం ఆతడే - అందువలన ఈ విధంగా ఆయనను ప్రార్థించింది. ఆమె పతులపట్ల చెదరని భక్తి గలదని చెప్పగలిగిన ఆ కర్మసాక్షియే, ఆ ధర్మానికి కీడు రాకుండా ఉండే మార్గాలను కల్పించి ఆమె శీలాన్ని రక్షించే బాధ్యత తీసికొనగల మహితాత్ముడు. నారాయణుడైనా, సూర్యనారాయణుడైనా తత్త్వతః ఒక్కడే. **"ఏకం సత్ విప్రాః బహుధా వదన్తి'** కదా! అటువంటి భేదం లేని భక్తితో ద్రౌపది సూర్యుడికి నమస్కరించింది. అనన్యచింతతో స్మరించిన ఆమెయొక్క యోగక్షేమం వహించవలసిన బాధ్యత ఆ భగవానుడిదే! (సంపా.)

**వ. అనుచుం గేలు మొగిచిన. 109**

**తాత్పర్యం:** అంటూ చేతులెత్తి నమస్కరించగా.

**క. తరణియు దుఃఖితయగు న । త్తరుణిం గాచుటకు నత్యుదగ్రభుజావి**
**స్ఫురణాఢ్యు నొక్క రక్కసుఁ । గరుణార్ద్రమనస్కుఁ డగుచు గ్రక్కునఁ బనిచెన్. 110**

**ప్రతిపదార్థం:** తరణియున్= సూర్యుడునూ; కరుణార్ద్ర మనస్కుఁడు+అగుచున్= దయారసంతో తడిపిన మనస్సుకలవాడై; దుఃఖిత+అగు+దుఖంతోఉన్న; ఆ+తరుణిన్= ఆ కాంతను; కాచుటకున్= రక్షించుట కొరకై; అతి+ఉదగ్ర భుజావిస్ఫురణ+ఆఢ్యున్= మిక్కిలి అధికమైన భుజపరాక్రమంచేత గొప్పవాడైన; ఒక్క రక్కసున్= ఒక రాక్షసుడిని; గ్రక్కునన్= వెంటనే; పనిచెన్= పంపాడు.

**తాత్పర్యం:** ద్రౌపది మొర విన్న సూర్యుడు దయాంతరంగంతో ఆమెను రక్షించటానికి బాహుబలాఢ్యుడైన ఒక రాక్షసుడిని పంపాడు.

**వ. వాఁడునుం బనిపూని యంబరతలంబున నదృశ్యాకారుండై వచ్చి నిలిచె. 111**

**ప్రతిపదార్థం:** వాఁడునున్= వాడు కూడా; పనిపూని= బాధ్యత స్వీకరించి; అంబరతలంబునన్= ఆకాశమార్గంలో; అదృశ్య+ఆకారుండు+ఐ= కనబడని రూపం కలవాడై; వచ్చి; నిలిచెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడు వెంటనే పనిపూని వచ్చి ఆకాశంలో ఎవరికీ కనబడకుండా ఆమెకు రక్షగా నిలబడ్డాడు.

**తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని। సింహబలు మందిరం బల్లఁ జేర నరిగి**
**యొల్లఁబోవుచు బెబ్బులి యున్న పొదరు। సొచ్చు లేడి చందంబునఁ జొచ్చుటయును. 112**

**ప్రతిపదార్థం:** ఇట్లు ప్రార్థించి= ఇట్లా వేడికొని; పాంచాలి= ద్రౌపది (సైరంధ్రి); ఎట్టకేనిన్= ఎట్లానో, ప్రయాసతో; సింహబలు మందిరంబు= కీచకుని నివాసభవనం; అల్లన్+చేరనరిగి= నెమ్మదిగా సమీపించి; ఒల్లన్+పోవుచున్= కలతపడుతూ; బెబ్బులి+ఉన్న పొదరు= బెబ్బులి ఉన్న పొదను; చొచ్చు లేడి చందంబునన్= ప్రవేశించే లేడివలె; చొచ్చుటయును= ప్రవేశించగా.

**తాత్పర్యం:** ఇట్లా ప్రార్థించి, ప్రయాసపడుతూ సైరంధ్రి ఎట్లాగో కీచకుడి గృహాన్ని చేరి కలతపడుతూ, పెద్దపులి ఉండే పొదలోపలికి వెళ్ళే లేడివలె ఆ మందిరంలో ప్రవేశించినంతనే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. 'బెబ్బులి యున్న పొదరు సొచ్చు లేడి చందంబున' అనేది జాతీయం. బలవంతులైన వారి ప్రయోజనాలకై నిస్సహాయులైనవారు బలి కావలసిన స్థితి ఏర్పడుతుంది. ఆ సందర్భంగా ఈ మాట వాడుతారు. ఈ ఉపమాలంకారం సందర్భోచితంగా సంతరించబడింది. తిక్కన ఉపమానాలన్నీ సామాన్య జనజీవన పరిధిలోనుండి ఎన్నుకొనబడటం గమనార్హం. 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లు' ఆయన చేసే రచనకు ఇది ఒక సహజాలంకారం.

**ఉ. అంబురుహాక్షి వచ్చు తెరు వారయఁ గీచకముఖ్యుఁ డప్పు తె**
**ల్లంబుగఁ జూచి యుల్లము కలంకయు వారక మేన వెమ్ముతా**
**పంబును డిగ్గఁ ద్రావి, గరుపాఱుచు నుత్కట సంభ్రమంబు హ**
**ర్షంబుఁ బెనంగొనంగ నతిచంచలభావ పరీతమూర్తియై. 113**

**ప్రతిపదార్థం:** కీచక ముఖ్యుఁడు= కీచకులలో మొదట లెక్కించదగినవాడు, సింహబలుడు; అప్డు= అప్పుడు; అంబురుహ+అక్షి= కమలాల వంటి కనులుగల సైరంధ్రి; వచ్చు తెరువు= వచ్చే దారిని; ఆరయన్= తేరిపారగా; తెల్లంబుగన్+చూచి= స్పష్టంగా చూచి, ఉల్లము కలంకయున్= మనస్సులోని కలతనూ; వారక= ఎడతెగక; మేనన్+వెమ్ము= శరీరాన్ని తపింపచేసే; తాపంబును= విరహబాధనూ; డిగ్గన్+తావి= దిగమ్రింగి; గరుపాఱుచున్= గగుర్పాటు నొందుతూ; ఉత్కట సంభ్రమంబు= మిక్కిలి తొట్రుపాటు; హర్షంబున్= సంతోషం; పెనంగొనంగన్= ముప్పిరికొనగా (పెనవేసికొనగా); అతి చంచలభావ పరీతమూర్తి+ఐ= మిక్కిలి చాపల్యంతో పెనగొన్న మనస్సు కలవాడై.

**తాత్పర్యం:** కీచకుడు సైరంధ్రి వచ్చే దారిని కనువిచ్చి స్పష్టంగా తేరిపార చూచాడు. మనసులోని కలతను శరీరంలోని ఆరని మదనతాపాన్ని దిగమ్రింగుకొన్నాడు. గగుర్పాటుతో కూడిన ఆశ్చర్యం, సంతోషం పెనవేసికొనగా చపల స్వభావంతో కూడినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. చిడిముడి పడుచు నెదురు చనఁ। గడఁగుచు హారములు సక్కఁగాఁ ద్రోచుచు మ**
**ల్లడి గొనుచు దుర్విలాసం। బొడలికి నొడఁ గూర్చుచుండ నుగ్మలి యంతన్. 114**

**ప్రతిపదార్థం:** చిడిముడి పడుచున్= తొట్రుపాటు పడుతూ; ఎదురుచనన్= ఎదురుగా పోవటానికి; కడఁగుచున్= ప్రయత్నిస్తూ; హారములు+చక్కఁగాన్+త్రోచుచున్= మెడలో హారాలు సరిచేసికొంటూ; మల్లడి గొనుచున్= సుడులు సుడులుగా తిరుగుతూ; ఒడలికిన్= శరీరానికి; దుర్విలాసంబు= దుష్టమైన విలాసం; ఒడన్+కూర్చుచున్+ఉండన్= ప్రదర్శిస్తూ ఉండగా; ఉగ్మలి= సైరంధ్రి; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** కీచకుడు తొట్రుపాటు పడుతూ, ఎదురుపోవటానికి సమకట్టి, హారాలు సవరించుకొంటూ, శరీరం మీద ఉదాత్తంగాని శృంగార చేష్టలు ప్రదర్శిస్తూ నిలుచున్నాడు. అప్పుడు సైరంధ్రి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'దుర్విలాసం' అనేది సాభిప్రాయమైన ప్రయోగం. కీచకుడు రూపాభిమాని. హారాలు సవరించుకొనడం వంటివి చేశాడు. దుర్విదగ్ధుడి హర్షం కాబట్టి దుర్విలాసం.

**వ. తత్ప్రదేశంబునకుం జని. 115**

**తాత్పర్యం:** ఆ ప్రదేశానికి వెళ్ళి.

**తే. 'దేవి తృష పుట్టి వారుణిదేరఁ బనుప। నరుగుదెంచితిఁ బోయింపుఁ' డనిన నింతి**
**నెమ్మొగంబున దృష్టులు నిలిపి, తమక। మడర నిట్లను నా కీచకాధముండు. 116**

**ప్రతిపదార్థం:** దేవి= సుదేష్ణాదేవి; తృష పుట్టి= మద్యపు దప్పికగొని; వారుణి+తేరన్= మద్యం తెమ్మని; పనుపన్+అరుగుదెంచితిన్= పంపగా వచ్చాను; పోయింపుఁడు+అనినన్= పోయించండి అని అనగా; ఇంతి నెఱ+మొగంబునన్= సైరంధ్రి అందమైన ముఖంమీద; దృష్టులు నిలిపి= చూపులు నిలిపి; తమకము+అడరన్= మోహం అతిశయించగా; ఆ కీచక+అధముండు= ఆ నీచుడైన కీచకుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'సుదేష్ణాదేవి దప్పికగొని మద్యం తీసికొని రమ్మని పంపగా వచ్చాను. పోయించం'డని సైరంధ్రి పలుకగా, మోహపరవశత్వంతో ఆమెను చూస్తూ ఆ నీచకీచకు డిట్లా అన్నాడు.

**విశేషం:** సైరంధ్రి (ద్రౌపది) తలవంచుకొని ముక్తసరిగా మాట్లాడటం ఆమె స్వభావానికి ఉచితం.

**క. 'దేవి తృష దీర్పఁ బూనితి;। వా వెలఁది సహోదరుండ నగు నా తృష లీ**
**లావతి! నీదు సరస సం। భావనమెయిఁ దీర్పకునికి పాడియె చెపుమా! 117**

**ప్రతిపదార్థం:** లీలావతి!= ఓ సౌందర్యవతీ!; దేవి= సుదేష్ణాదేవి యొక్క; తృష+తీర్పన్+పూనితివి= దప్పిక తీర్చటానికి పూనుకొన్నావు; (కాని); ఆ వెలఁది= ఆమె యొక్క; సహోదరుండన్+అగు= తమ్ముడనైన; నా తృషను= నా యొక్క దప్పికను; నీదు సరస సంభావనమెయిన్= నీ సరసమైన మన్నన చేత; తీర్పక+ఉనికి= తీర్చకుండా ఉండటం; పాడియె చెపుమా!= న్యాయమా చెప్పుము!

**తాత్పర్యం:** 'ఓ సుందరాంగీ! మీ దేవి దప్పిక తీర్చటానికి పూనుకొన్న నీవు, ఆమె తమ్ముడనైన నా దప్పిక కూడా నీ సరస సల్లాపాలతో తీర్చకుండటం న్యాయమా? చెప్పుము.

**విశేషం:** ఇక్కడ తృష= దప్పిక, కామము అనే అర్థాల మీద కవి ఇద్దరి చేతా మాట్లాడించి చమత్కరించాడు. ఒకరు కోరే అర్థం మరొకరికి తెలియజేశాడు. సుదేష్ణ దాహం మదిరతో తీరుతుంది. కీచకుడి దాహం ఆమె సరస సంభావనతో చల్లారుతుంది.

**సీ. కాంతి దళ్కొత్తు నీ కడగంటి చూడ్కితోఁ। బొందఁగానని మేను పొగులుటయును,**
**దీపారు నీ పల్కుఁ దెల్లంబుగా వినఁ। గానని వీనులు గందుటయును,**
**నింపగు నీ చెయ్వు లెలమిమైఁ గొనియాడఁ। గానని కోర్కులు గలఁగుటయును,**
**సొగయించు నీ కేళిఁ దగిలి యానందంబుఁ। బొందఁగానని మది గుందుటయును**

తే. బాయ, నాదగు జన్మంబు ఫలము నొంద। భావజన్ముని పూనిక పార మెయ్య
నన్ను బంటుగా నేలుము నలినవదన!। యింక నీ సిగ్గుదెర యోల మేల నీకు?' 118

**ప్రతిపదార్థం:** నలినవదన!= పద్మంవంటి ముఖం కలదానా! సైరంధ్రీ!; కాంతి= కాంతి అనే గుణం; తళ్కొత్తు= ప్రకాశించే; నీ కడగంటి చూడ్కితోన్= నీ క్రీగంటి చూపుతో; పొందన్+కానని మేను= కూడలేని శరీరం; పొగులుటయును= తపించటమున్నూ; తీపారు= తియ్యని; నీ పల్కున్= నీ మాటను; తెల్లంబుగాన్= స్పష్టంగా; వినన్+కానని= విననోచని; వీనులు= చెవులు; కందుటయును= తాపం చెందటమున్నూ; ఇంపు+అగు= అందమైన; నీ చెయ్వులు= నీ చేష్టలు; ఎలమిమైన్= సంతోషంగా; కొనియాడన్+కానని= ప్రశంసించలేని; కోర్కులు= కోరికలు; కలఁగుటయును= కలత చెందటమున్నూ; సొగయించు= సొక్కింపచేసే; నీ కేళిన్+తగిలి= నీ శృంగార చేష్టలలో చిక్కి; ఆనందంబు= సంతోషం; పొందన్+కానని= పొందలేని; మది= మనస్సు; కుందుటయును= తపించటం; పాయన్= పోయేటట్లుగా; నాది+అగు జన్మంబు= నాయొక్క పుట్టుక; ఫలమున్+ఒందన్= ఫలించేటట్లు; భావ జన్ముని= మన్మథుని; పూనిక= ప్రయత్నం; పారము+ఎయ్యన్= అంచులు ముట్టేటట్లు (పరిపూర్ణమయ్యేటట్లు); నన్నున్ బంటుగాన్+ఏలుము= నన్ను నీ సేవకుడిగా పాలించుకొనుము; ఇంకన్= ఇకమీద; ఈ సిగ్గు తెర+ఓలము= సిగ్గు అనే తెరమరుగు; నీకున్+ఏల?= నీ కెందుకు?

**తాత్పర్యం:** నీ కటాక్ష వీక్షణాలను పొందకపోవటంచేత కలిగిన దేహతాపాన్నీ, నీ తీయని పలుకులు వినలేకపోవటం చేత కలిగిన శ్రవణతాపాన్నీ, అందమైన నీ విలాస చేష్టలను ప్రీతితో మెచ్చలేని కోర్కెల వలన కలిగిన మదనతాపాన్నీ, నీతో రహస్య క్రీడలతో రమిస్తూ ఆనందం పొందకపోవటం వలన కలిగిన మనస్తాపాన్నీ పోగొట్టి నా జన్మ సఫలం చేసి నన్ను నీ బంటుగా స్వీకరించి పాలించుము. ఇక మీద కూడా ఈ సిగ్గు తెరల చాటుమాటుతనం ఎందుకు?'

**విశేషం:** 1.'అగ్ని దగ్గరుండి, ప్రియురాలు దూరంగా ఉండి తాపం కలిగిస్తారు. అగ్ని దూరంగా పోతే ప్రియురాలు దగ్గరైతే తాపం తగ్గుతుంది' అనే లోకోక్తి ప్రసిద్ధం. సైరంధ్రిపై వలపు పెంచుకొన్న కీచకుడు మదనతాపంతో వేగిపోతున్నాడు. దానికి నాలుగు కారణాలను సీస పద్యపాదాలలో వరుసగా చెప్పాడు. మెరుపులవలె మెరిసే కడగంటి చూపులు పొందలేని శరీరం విరహతాపాన్ని పొందింది. ఇప్పుడు అట్టి చూపులు ప్రసరింపచేయటానికి సమీపించింది కాబట్టి అది తగ్గిపోతుందని అతడి భావన. అట్లాగే వలపుమాటలు వినని చెవులు తాపాన్ని పొందాయి. ఇప్పు డా వలపుమాటలవలన ఆ తాపం తగ్గుతుంది. వలపు చేష్టలను పొగడి కోరికలు తీర్చుకొనలేదని తాపం ఉండేది. ఆమెను పొంది సుఖం అనుభవించలేదని మనోవేదన ఉండేది. అవన్నీ నీవు దరిచేరటం వలన తగ్గి (తొలగి) పోతాయి-అని అన్నాడు. సీస పద్యపాదాలు అంత్యానుప్రాసంతో అలంకరించబడటం గమనించతగింది. కీచకుడి విరహతాపంలోని మాధుర్యగుణం. సాతత్య స్వభావం దానివలన ధ్వనించబడుతున్నది.

2. సీస పద్య పాదాలలోని వాక్యాలు 'పాయన్' అనే క్రియతో అన్వయించే ఒక క్రమం ఇందులో ఉన్నది. తాపం క్రమంగా శరీరంలో, చెవులలో, కోర్కెలలో, హృదయంలో వ్యాపించగా అది మరల క్రమంగా ఉపశమిస్తుందని సూచించబడింది. అంతేకాక తాపం తగ్గిన తరువాత కలిగే ఫలితాంశాలను నాల్గింటిని ఎత్తుగీతిలో తిక్కన చెప్పాడు. అవి - ఆమె కటాక్షం వలన జన్మసఫలం కావటం; వలపు మాటలు వినటం వలన మన్మథభావం పరిపూర్ణం కావటం, అందమైన ఆమె వలపు చేష్టలతో పెల్లుబికే కోర్కెల వలన కలిగే తృప్తి వలన ఆమెకు బంటుగా వశుడై పోవటం, సుఖకేళితో ఆనందం పొంది సిగ్గుతెరలు లేకుండా చనువుతో మెలగటం కలుగుతుందట! ఇందులో అందమైన ఒక క్రమం ఉన్నది. నలినవదన అన్నప్పుడు ఉపమాస్ఫూహ, సిగ్గుతెర యోలము అన్నప్పుడు రూపకస్ఫూర్తి రాణించాయి. అలంకారాలు కాకపోయినా అలంకారాల అనుభూతిని కలిగించే సూక్తివైచిత్రి ఇది.

3. సంకల్పం అనే మదనావస్థకు తిక్కన క్రమవికాసాన్ని కలిగిస్తూ, ఈ పద్యంలో ఒక పరిణత స్థితిని చిత్రించాడు. రసాభ్యుదయ శిల్పంలో ఇది ప్రతిభావంతమైన ప్రయోగం. (సంపా.)

**వ. అనవుడు.** 119

**తాత్పర్యం:** అనగా.

**తే. చెలువ యప్పలుకులు పెడ చెవులఁ బెట్టి। ధీర గావున విగతవికార యగుచు**
**'మదిర వోయింపుఁ డద్దేవి యెదురుచూచు। నలుగుఁ దడవైన మగుడఁ బోవలయు'ననిన.** 120

**ప్రతిపదార్థం:** చెలువ= సైరంధ్రి; ఆ+పలుకులు= కీచకుని మాటలు; పెడచెవులన్+పెట్టి= పట్టించుకొనకుండా; ధీర+కావునన్= ధీరురాలు కాబట్టి; విగతవికార+అగుచున్= ఎటువంటి చాంచల్యం లేనిది ఔతూ; ఆ+దేవి= ఆ సుదేష్ణాదేవి; ఎదురుచూచున్= ఎదురుచూస్తుంటుంది; తడవు+ఐనన్= ఆలస్యమైతే; అలుగున్= కోపపడుతుంది; మగుడన్= మరల; పోవలయున్= వెళ్ళిపోవాలి; మదిర+పోయింపుఁడు= మద్యం పోయించండి; అనినన్= అనగా.

**తాత్పర్యం:** కీచకుడి మాటలను ద్రౌపది లక్ష్యపెట్టక, ధీరురాలుకాబట్టి ఎటువంటి వికారానికీ లోనుకాకుండా ఉండి, 'త్వరగా మద్యం పోయించండి. ఆలస్యమైతే దేవి కోపిస్తుంది. నేను శీఘ్రంగా వెనుకకు వెళ్ళాలి' అని అనగా - (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ద్రౌపది తన ముఖభావాలను కనబడనీయకుండా గంభీరంగా మాట్లాడింది.

**చ. 'మదిర సుదేష్ణపాలి కొకమాత్రన పుచ్చెద నొడ్ల చేత; నిం**
**పొదవెడు నట్టి దీని చవి యుల్లము సొక్కఁగ నాను మీవు; నీ**
**వదన సరోజ సౌరభమవారణ నన్నును గ్రోల నిమ్ము; బె**
**ట్టిదుఁ డగు కాము తూపులఁ దొడింబడకుండఁగఁ గావు మిత్తఱిన్.** 121

**ప్రతిపదార్థం:** మదిరన్= మద్యాన్ని; సుదేష్ణపాలికిన్= సుదేష్ణవద్దకు; ఒక మాత్రన్+అ= ఒక రెప్పపాటుకాలంలోనే; ఒడ్లచేతన్= ఇతరులచేత; పుచ్చెదన్= పంపుతాను; ఇంపు+ఒదవెడు+అట్టి= ఆనందాన్ని కలిగించే; దీని చవి= ఈ మద్యం రుచిని; ఉల్లము= మనస్సు; సొక్కఁగన్= పరవశమయ్యేటట్లు; ఈవు+ఆనుము= నీవు త్రాగుము; నీ వదన సరోజ సౌరభము= నీ ముఖకమలం యొక్క సుగంధం; అవారణన్= అడ్డులేకుండా; నన్నును= నన్నుకూడా; క్రోలనిమ్ము= త్రాగనిమ్ము; బెట్టిదుఁడు+అగు= క్రూరుడైన; కాముతూపులన్= మన్మథుడి యొక్క బాణాలకు; తొడిన్+పడక+ఉండఁగన్= తొట్రుపాటు; ఈ+తఱిన్+కావుము= ఇప్పుడు కాపాడుము.

**తాత్పర్యం:** 'నేను మద్యాన్ని అక్క సుదేష్ణకు ఇతరుల ద్వారా ఇప్పుడే పంపుతాను. నీవు ఈ మద్యం త్రాగి, ఈ వేళ నీ ముఖపద్మం లోని మంచి వాసనను నన్ను త్రాగనిచ్చి, నా మదనతాపాన్ని పోగొట్టి రక్షించుము.

**క. కరితురగ రథసమితిఁ బొం। పిరివోయెడు నాదు లక్ష్మి పెంపున కెల్లన్**
**సరసిరుహవదన! నీవ కు। దురుగా నొనరించెదం గుతూహల మెసఁగన్.** 122

**ప్రతిపదార్థం:** సరసిరుహ+వదన!= పద్మం వంటి ముఖంగల ఓ సైరంధ్రీ!; కరి, తురగ, రథసమితిన్= ఏనుగులు, గుర్రాలు, రథాల సమూహంతో; పొంపిరి+పోయెడు= అతిశయించే; నాదులక్ష్మి= నా సంపద యొక్క; పెంపునకున్= అతిశయానికి; ఎల్లన్= అంతటికి; నీవు+అ కుదురుగాన్= నీవే ఆధారంగా; కుతూహలము+ఎసఁగన్= ఆనందం నిండగా; ఒనరించెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** ఓ పద్మముఖీ! చతురంగబలాలతో పెంపారే నా సంపద కంతటికీ కుతూహలంతో నిన్నే కుదురుగా రాణిని చేస్తాను.

**క. రుచిర మణి భూషణంబులు। నుచిత విహారప్రకార యోగ్యాగార**
**ప్రచయము సుందరగణికా। నిచయము నొప్పించువాఁడ నీకుం దరుణీ! 123**

**ప్రతిపదార్థం:** తరుణీ!= ఓ వనితా!; నీకున్= (సైరంధ్రికి); రుచిరమణిభూషణంబులు= అందమైన మణులతో చెక్కబడిన ఆభరణాలు; ఉచిత= తగిన; విహార ప్రకార= క్రీడించటానికి; యోగ్య+అగార ప్రచయము= తగిన ఇళ్ల సముదాయం; సుందర గణికానిచయమున్= అందమైన వేశ్యల సమూహాన్ని; ఒప్పించువాడన్= సమకూర్చి ఇస్తాను.

**తాత్పర్యం:** ఓ సైరంధ్రీ! నీకు అందమైన మణిహారాలను, విలాస గృహాలను, పరిచారికలుగా వేశ్యాసమూహాలను పుష్కలంగా సమకూర్చి ఇస్తాను.

**విశేషం:** గణికా సంచారం మందిరానికి అందం. వారు అలంకరణలోనూ, తదితర పరిచర్యలలోనూ నేర్పరులు. నాట్య సంగీత విన్యాసాలతో రాణి మనస్సు రంజింపజేస్తారు.

**క. నా కులకాంతల నెల్లను। నీకుం బనిసేయఁ బనిచి నెయ్యంబున నే**
**నీ కనుసన్నన మెలఁగెద। నే కార్యంబైన నడుపు మీవ తగంగన్.' 124**

**ప్రతిపదార్థం:** నా కులకాంతలను= నా భార్యలను; ఎల్లను= అందరినీ; నీకున్= నీకు; పని+చేయన్+పనిచి= సేవలు చేసేందుకు ఆజ్ఞాపించి; నెయ్యంబునన్= ప్రేమతో; నేన్= నేను; నీ కనుసన్నన్+అ= నీ కనుసన్నలలోనే; మెలఁగెదన్= తిరుగుతాను; ఏ కార్యంబు+ఐనన్= ఏ పని అయినా; ఈవు+అ= నీవే; తగంగన్= సరిగా; నడుపుము= జరుపుము.

**తాత్పర్యం:** నా భార్యల నందరినీ నీ దాసీజనంగా చేసి, స్నేహంతో నేను నీ కనుసన్నలలో మెలగుతాను. అన్ని పనులు నీవే నడిపించుము. (సర్వాధికారాలు నీ కిస్తాను).'

**విశేషం:** సాధారణ స్త్రీలు కోరుకొనే ఆభరణాలు, రథగజతురగాది సంపదలు, విలాసవస్తువులు కల్పిస్తానని చెప్పి కీచకుడు సైరంధ్రిని తనవశం చేసికొనజూస్తున్నాడు. తన భార్యలను అందరినీ తనకు దాసీలనుగా చేస్తానంటే సైరంధ్రి లోబడుతుందని ఆ నీచుడి ఆలోచన. ఇవి మోహావేశపు పలుకులు.

**వ. అనుచు సింహబలుండు తన యంతరంగంబున నంతకంత కగ్గలించు తమకంబునఁ దన్నుఁదా నెఱుంగక పయింబడి పట్టుకొనిన. 125**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ సింహబలుండు= కీచకుడు; తన అంతరంగంబునన్= తన మనస్సులో; అంతకున్+అంతకున్= క్షణక్షణానికి; అగ్గలించు= అధికమవుతున్న; తమకంబునన్= మోహంతో; తన్నున్+తాను+ఎఱుంగక= ఒడలు మరచి; పయిన్+పడి= పైనబడి; పట్టుకొనినన్= ఒడిసి పట్టగా.

**తాత్పర్యం:** అంటూ కీచకుడు మోహావేశపరవశుడై తన ఒడలు మరచి సైరంధ్రిపైబడి ఒడిసి పట్టగా.

**క. తనుఁ గాచి వెనుక వచ్చిన। దనుజు మహాబలము తనదు తనువొందిన, నా**
**తని చే విదిల్చి రభసం। బునఁ దన్మందిరము ద్రుపదపుత్రిక వెడలెన్. 126**

**ప్రతిపదార్థం:** ద్రుపదపుత్రిక= ద్రౌపది; తనున్= (సైరంధ్రిని); కాచి= రక్షించి; వెనుకన్+వచ్చిన= వెంబడించి వస్తున్న; దనుజ మహాబలము= రాక్షసుడి యొక్క అధికశక్తి; తనదు తనువు= తన శరీరం; ఒందినన్= ప్రవేశించగా; ఆతని చే= కీచకుడి చేతిని; విదిల్చి= ఒక్కుమ్మడిగా విదిలించుకొని; రభసంబునన్= వేగంగా; తద్+మందిరము= ఆ ఇంటినుండి; వెడలెన్= బయటపడింది.

**తాత్పర్యం:** తనకు రక్షకుడుగా తన వెంబడి వస్తున్న రాక్షసుడి అధికశక్తి సైరంధ్రి నావహించగా ఆమె కీచకుడి చేతిని గట్టిగా విదిలించి, వేగంగా ఆ ఇంటినుండి బయటికి వచ్చింది.

**వ. ఇట్లు ద్రోచిపోయినం గీచకుండు వెనువెంటం దగిలిన నమ్మగువయు మరలి చూచి భయభ్రాంతయై 'యెవ్వలనికిం బోదునో' యని తలంచి, దైవయోగంబున విరాటుం డప్పుడు గొలువునికింజేసి తత్సభా భాగంబు దెసకు వెసం బాఱినం, గామాయత్తచిత్తుండును, గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు సరకుసేయక రహస్యప్రకాశవిభేదవిచారంబు దక్కి. 127**

**ప్రతిపదార్థం:** ఇట్లు+త్రోచిపోయినన్= ఈ విధంగా విదిలించి సైరంధ్రి వెళ్లగా; కీచకుండు; వెనువెంటన్= వెంబడించి; తగిలినన్= తరుమగా; ఆ+మగువయున్= ఆ సైరంధ్రియూ; మరలి చూచి= వెనుదిరిగి కనుగొని భయ(భ్రాంత+ఐ= భయపడి; ఏ+వలనికిన్+పోదునో అని= ఏ మూలకు వెళ్ళాలా? అని; తలంచి= ఆలోచించి; దైవయోగంబునన్= అదృష్టవశాత్తు; విరాటుండు; అప్పుడు; కొలువు= సభ తీర్చి; ఉనికిన్+చేసి= ఉండటం చేత; తద్+సభాభాగంబుదెసకున్= ఆ సభవైపునకు; వెసన్+పాఱినన్= వేగంగా పరువెత్తగా; కామ+ఆయత్తచిత్తుండును= స్త్రీవాంఛతో నిండిన మనస్సు కలవాడూ; గర్వ+ఉన్మత్తుండును= గర్వంచేత మత్తెక్కి పొగరుపట్టినవాడూ; కావునన్; జన సమూహంబున్ సరకు+చేయక= జనుల గుంపును లెక్కచేయక; రహస్యప్రకార విభేద విచారంబున్+తక్కి= గుట్టు రట్టు ఔతుందనే ఆలోచన కూడా లేకుండ.

**తాత్పర్యం:** ఈ విధంగా సైరంధ్రి తనను విదిలించి వెళ్ళిపోగా, కీచకుడు వదలక ఆమెను వెంబడించాడు. భయంతో పరుగు తీసి, ఎక్కడికి పోవాలో తెలియక, అదృష్టవశాత్తు విరాటమహారాజు అప్పుడు కొలువు తీర్చి ఉండటం చూచి ఆమె ఆ సభలోకి ప్రవేశించింది. కామంతో కళ్ళు మూసికొనిపోయిన ఆ గర్విష్ఠి కీచకుడు జనాలను లెక్కపెట్టక, గుట్టు రట్టు అవుతందనే సంగతి కూడా మరచిపోయి. (తరువాతి పద్యంతో అన్వయం.)

కీచకుఁడు ద్రౌపదిం బట్టుకొనుటకు వెంటఁదగులుట (సం.4-15-7)

**సీ. సమదవారణము జంగమలత వెనుకొని । సరభసంబునఁ బట్టఁ జనువిధమునఁ**
**గ్రూరదానవుఁడు భూచారి నిర్జరకాంతఁ । బొదువ రయమ్మునఁ బోవుభంగి**
**ఘోర గృధ్రము సుకుమార నాగాంగనఁ । బటుగతి నొడియంగఁ బాఱు కరణిఁ**
**బ్రబల బిడాలంబు బాలశారిక మీఁద । నడరి సత్వరముగ నరుగుమాడ్కి**

**తే. సింహబలుఁ డత్యుదగ్రతఁ జిగురుబోఁడి । పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు గదుర**
**నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తి । గొంకు కొసరించుకయు లేక కూలఁదాఁచె. 128**

**ప్రతిపదార్థం:** సమదవారణము= మదించిన ఏనుగు; జంగమలతన్= కదలి నడిచే తీగను; వెనుకొని= వెంబడించి; సరభసంబునన్= వేగంగా; పట్టన్+చనువిధమునన్= పట్టటానికి వెళ్ళినట్లు; క్రూరదానవుఁడు= భయంకర రాక్షసుడు; భూచారి= భూలోకంలో తిరిగే; నిర్జరకాంతన్= దేవతాస్త్రీని; పొదువన్= పట్టుకోవటానికి; రయమ్మునన్= వేగంగా; పోవుభంగిన్= వెళ్ళునట్లు; ఘోరగృధ్రము=

భయంకరమైన గ్రద్ద; సుకుమార నాగ+అంగనన్= సున్నితమైన నాగవనితను; పటుగతిన్= గట్టిగా; ఒడియంగన్= పట్టుకొనటానికి; పాఱుకరణిన్= పరుగెత్తేటట్లు; ప్రబల బిడాలంబు= బలమైన గండుపిల్లి; బాలశారికమీఁదన్= చిన్నగోరువంక మీదికి; అడరి= అతిశయించి; సత్వరముగన్= వేగంగా; అరుగుమాడ్కిన్= వెళ్ళునట్లు; సింహబలుఁడు= కీచకుడు; అతి+ఉదగ్రతన్= మిక్కిలి గర్వంతో; చిగురుబోఁడి పజ్జన్= సైరంధ్రి వెనుక; కడువడిన్= మిక్కిలి వేగంగా; తగిలి= వెంబడించి; కోపంబు కదురన్= కోపంరాగా; ఒడిచి తలపట్టి= ఎగసి నిపుణంగా సిగపట్టి; తిగిచి= లాగి; మహా+ఉగ్రవృత్తిన్= మిక్కిలి భయంకరంగా; కొంకుకొసరు+ఇంచుకయున్ లేక= వెనుకంజ కాస్త కూడా లేకుండా; కూలన్+తాఁచెన్= నేలపై పడేటట్లు తన్నాడు.(త్రోశాడు).

**తాత్పర్యం:** మదపుటేనుగు నడిచే తీగను వేగంగా పట్టబోయినట్లు. రాక్షసుడు భూలోకానికి వచ్చిన దేవకాంతను త్వరగా పట్టబోయినట్లు. పెద్ద గ్రద్ద యాడుపామును వేగంగా ఒడిసి పట్టబోయినట్లు, గండుపిల్లి గోరువంక పిల్ల మీదికి దురుసుగా దూకి, పట్టటానికి పరుగెత్తినట్లుగా కీచకుడు మిక్కిలి కోపంతో కోమలాంగి అయిన ద్రౌపది వెంటబడి పరుగిడి ఎగసి జుట్టుముడిపట్టి లాగి, ఏమాత్రం జంకుగొంకు లేకుండా నేల బడద్రోశాడు. (పడతన్నాడు.)

**విశేషం:** 1. అలం: మాలోపమ, ఉల్లేఖం. క్రమాలంకారం లేదా యథాసంఖ్యాలంకారం.

2. మూలంలో కంటె తిక్కన ఈ సన్నివేశాన్ని సహజసుందరంగా చిత్రించాడు. ఎట్లాగంటే - మూలంలో కీచకుడు మొదట ఆమెకుడిచేయి పట్టుకొన్నాడు. ఆమె విదిలించి కొట్టింది. అతడు అంతటితో ఆగక ఆమెను పట్టుకొనటానికి యత్నించి పైటను చిక్కించుకొన్నాడు. ఆమె నిట్టూర్పులు నిగుడిస్తూ వేగంగా విదిలించి కొట్టింది. అతడు మొదలు నరికిన చెట్టువలె నేలమీద పడ్డాడు. అప్పుడు ఆమె భయంతో పరుగెత్తి రాజూ, యుధిష్ఠిరుడూ ఉన్న సభలో ప్రవేశించి శరణువేడింది.

**"తాం కీచకః ప్రధావన్తీం కేశపాశే పరామృశత్**
**అథైనాం పశ్యతో రాజ్ఞః పాతయిత్వా పదావధీత్'** (సం.4.15.7)

వేగంగా పరుగెత్తుతున్న ద్రౌపదిని కీచకుడు వెన్నంటి జడపట్టుకొని, రాజు చూస్తూ ఉండగానే, నేలమీద పడవేసి కాలితో తన్నాడు. ఇది మూలకథనం. తిక్కన దీనిని మార్చి సహజత్వాన్నీ, ఔచిత్యాన్నీ పోషించాడు. తిక్కన తీర్చిన కీచకుడు ఆమె చేయిపట్టుకొనబోవలేదు. మదనావేశంతో ఆమెను కౌగిలించుకొనబోయాడు. (పైనబడి పట్టుకొన్నాడట). ఆమె (దనుజదత్తబలంతో) అతడిని త్రోసిందట. అతడు ఆమె కొంగుపట్టుకొనటం, ఆమె త్రోయటం, అతడు విరిగినచెట్టువలె నేలపై పడటం తిక్కన తీసివేశాడు. సైరంధ్రి అతడిని త్రోసి, త్వరగా పరుగెత్తింది. అతడు వెన్నంటాడు. ఈ సారి అతడు పట్టుకొంటే కీడుమూడుతుందని భావించి విరాటుడి సభవైపు పరుగెత్తటం మొదలుపెట్టింది. కాని, మూలంలో చెప్పబడినట్లు అప్పటికి రాజును శరణు వేడలేదు. రాజుముందే కీచకుడు సైరంధ్రిని కొప్పుపట్టి లాగి పడవేసి ఆమెను కాలితో తన్నినట్లు సంస్కృత భారతం. ధూర్తుడైన కీచకుడి కది సహజం. కాని, ద్రౌపది పాదహతి పొందినట్లు చెప్పటం తిక్కనకు ఉచిత మనిపించలేదు. అందుకే - నిపుణంగా 'కూలఁదాఁచెన్' - అని తెలుగులో చెప్పాడు. కూలబడేటట్లుగా తాచాడని దానికి అర్థం. కూలబడగా (కూలబడినతరువాత) తాఁచాడనే అర్థం దూరాన్వయం ఔతుంది. తెలుగులో 'తాఁచు' అనే క్రియకు విసరివేయు, కొట్టు, పాదంతోతన్ను, అదుము, అణగత్రొక్కు అనే అర్థాలున్నాయి. కాబట్టి ఒక చేత్తో జుట్టుముడిపట్టిలాగి, మరొక చేత్తో ఆమెను కొట్టి, నేలకు విసరివేసినట్లు అర్థం చెప్పే అవకాశం తిక్కన కల్పించాడు. 158వ పద్యంలో కీచకుడు 'వెనుకం గూడఁగ ముట్టి పట్టికొని తన్నెన్' అని ద్రౌపది (సైరంధ్రి) సుదేష్ణతో చెప్పింది. 'తన్నెన్' అనే క్రియకు కొట్టు, పాదంతో తాడించు అనే రెండర్థాలున్నాయి. తిక్కన తెలుగు క్రియలు వాడి ఔచిత్యం పోషిస్తాడన్నదానికి ఇదొక ఉదాహరణం. 'కూలఁదాఁచెన్' అన్నప్పుడు నేలమీద పడేటట్లు త్రోశాడనీ లేక తన్నాడనీ అర్థం చెప్పుకొనవచ్చును. పాదతాడనం తెలుగులో చెప్పబడలేదు. అది తిక్కన పాటించిన ఔచిత్యం. మరొక విశేషం. 257వ పద్యంలో కీచకుడే 'అట్లు ద్రోవన్' అని అన్నాడు. ఈ ప్రతిలో ఆ పాఠమే ఉన్నది. 'తాపన్', 'తన్నన్' అనే పాఠాంతరాలు కూడా ఉన్నాయి. దీనిని బట్టి తిక్కన తాను చేసిన ఔచిత్యాన్ని పరోక్షంగా పలుచోట్ల సమర్థించుకొన్నాడు కూడా. ఆమె శరీరంలో సూర్యవరంతో

రాక్షసబలం నిక్షిప్తమై ఉండటం చేత ఆమె వేగంగా పరుగెత్తింది. ఆమెను అందుకొనటం అతడికి అంత తేలిక కాలేదు. కసికొద్దీ ఆమెను వెన్నంటిన కీచకుడు ఎంతో ప్రయత్నం చేసి ఆమె కొప్పును పట్టుకొని వెనుకకు లాగాడు. వేగంగా ముందుకు పోతున్న మనిషిని ఒక్కసారి జుట్టుపట్టి లాగి కొట్టి త్రోస్తే కుప్పగూలటం సహజం. అటువంటి సహజ సన్నివేశాన్ని తిక్కన చిత్రించాడు.

3. పరుగెత్తే సన్నివేశాన్ని చలనచిత్రంగా వర్ణించటం తిక్కన వర్ణనాశిల్పం. ఉపమాలంకారాలను వరుసగా నాలుగింటిని వాడి అప్పటి ఆ పాత్రల స్వభావదశా విశేషాలను ధ్వనింపచేశాడు. 1. మదించిన ఏనుగు నడుస్తున్న తీగను వేగంగా తుండంతో పెనవేసి పట్టుకొనాలనుకొంటుంది. లత అబల, మదించిన ఏనుగు ధూర్తం. ద్రౌపదిని బాహువులతో కబళించాలని మదించినవాడి ప్రయత్నం. అందులో అతడి బలగర్వం విఫలమయింది. 2. ఆమె అతడి చేతికి చిక్కలేదు. బలగర్వితుడు రాక్షసుడివలె తయారయ్యాడు. విజాతిస్త్రీ అయిన నిర్జరకాంతను పొదివి (రెండు బాహువుల మధ్య ఇరికించి) కౌగిలించిపట్టుకొనాలని యత్నించాడు. అతడు కాముకుడు, వెనుకాడనివాడు. ఆమె విముఖురాలు, భీతురాలు. అదీ సఫలం కాలేదు. 3. ఆమె ఆడునాగువలె సూటిగా పరుగెత్తకుండా వంకర టింకరలుగా పరుగెత్తుతుండవచ్చును. వెంటాడే వారినుండి తప్పించుకొనే పద్ధతులలో అది ఒకటని ప్రసిద్ధం. పెద్ద గ్రద్ద పామును వీలునుబట్టి గట్టిగా ఒడిసిపట్టటానికి ప్రయత్నిస్తుంది. కీచకుడు ఆ పద్ధతిని వాడాడు. ఆమె కొప్పు చిక్కింది. 4. గండుపిల్లి వెనకనుండి ఎగిరిదూకి గోరువంక పిల్ల గొంతు పట్టుకుంటుంది. అట్లాగే కీచకుడు కుప్పించి ఎగసి (ఎడరి) ఆమె కొప్పును పట్టిలాగాడు, తన్నాడు. ఆ పట్టు యొక్క తీవ్రతకు ఆమె పడక తప్పలేదు. తిక్కన సీసపద్యపాదాలలో నాలుగంశాలు చెప్పాడంటే, ఎత్తుగీతిలో యథాసంఖ్యాలంకారాన్ని ప్రయోగిస్తా డన్నమాటే! కీచకుడు అత్యుగ్రతతో వెన్నాడటం మొదలుపెట్టి మహోగ్రవృత్తితో ఆమెను కూలత్రోశాడట! సైరంధ్రి తనను తిరస్కరించి త్రోసివేయటం వలన కలిగిన అవమానంతో అతడి యందు కలిగింది క్రోధం. అది తారస్థాయిలో ఉంటే ఉగ్రత. ఇది కలిగినప్పుడు మదించిన ఏనుగువలె వెన్నంటి పరుగెత్తాడు. ఆ తరువాత క్రోధం ద్విగుణీకృతమైంది. (కోపంబు గదుర) రాక్షసుడివలె వ్యవహరించాడు. ఆపైన గ్రద్దవలె ఆమెను ఒడిచి కొప్పును పట్టాడు. చివరి దశ అయిన మహోగ్రవృత్తితో జంకుగొంకు లేకుండా కూలదోశాడు. సీస చరణాలలోని మానసిక దశలకూ ఎత్తుగీతిలోని క్రియాదశలకూ క్రమాన్వయం కుదరటం అలంకార శిల్పం. అదే యథాసంఖ్యాలంకారం. ద్రౌపదిని వెన్నంటిన ఆ దృశ్యాన్ని అనేక విధాలుగా వర్ణించటం వలన ఉల్లేఖాలంకారం కూడా గమ్యమానం ఔతున్నది. భీము డీ దృశ్యాన్ని గమనించాడు. కీచకుడి మహోగ్రవృత్తికి ప్రతిక్రియగా భయంకరాకారతను ప్రదర్శించాడు. (134 పద్యం) తులనాత్మకపద్య రచనా శిల్పం తిక్కన నైజం. (సంపా.)

**వ. అట్టియెడఁ బాంచాలీ రక్షకుండైన రాక్షసుం డతని డొల్లవ్రేసిన. 129**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; పాంచాలీ రక్షకుండు+ఐన= ద్రౌపదిని రహస్యంగా రక్షించేవాడైన; రాక్షసుండు; అతనిన్= కీచకుడిని; డొల్లవ్రేసినన్= పడద్రోయగా.

**తాత్పర్యం:** ద్రౌపదిని కాపాడటానికి (సూర్యప్రేరితుడై) ఆమె వెంటనంటి తిరిగే రాక్షసుడు ఆ సమయంలో కీచకుడిని నేలపైపడతోశాడు. అప్పుడు.

**క. కీచకుఁడు వ్రేటుపడి తన । నీచపుదశ యొరు లెఱుంగ నేరకయుండన్**
**లేచి వెనుకఁ జని విస్మయ । గోచరుఁడై యసురకతనఁ గుంఠితుఁడగుచున్. 130**

**ప్రతిపదార్థం:** కీచకుఁడు; వ్రేటుపడి= దెబ్బతిని; తన నీచము+దశ= తన అథమస్థితిని, తనకు జరిగిన అవమానాన్ని; ఒరులు+ఎఱుంగ నేరక+ఉండన్= ఇతరులు తెలిసికొనకుండా ఉండాలని; లేచి= పైకి లేచి నిలబడి; వెనుకన్+చని= వెనుతిరిగి; విస్మయగోచరుఁడు+ఐ= ఆశ్చర్యానికి లోనై; అసురకతనన్= రాక్షసుడి వలన; కుంఠితుఁడు+అగుచున్= భయపడిన (మొక్కవోయిన) వాడౌతూ.

**తాత్పర్యం:** ద్రౌపదీసంరక్షకుడైన రాక్షసుడిచేత కీచకుడు కొట్టబడి తనదీనమైన స్థితిని ఇతరులు తెలిసికొనకుండా వెంటనే లేచి, రాక్షసుడి కారణంగా ద్రౌపదివెంటబడక వెనుతిరిగి మొక్కవోయినవాడౌతూ (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** జీవితంలో మొదటిసారి ఎదురుదెబ్బతిన్న గర్వోన్నతుడు పొందే చిన్నతనం మొక్కవోవటం - లేదా - కుంఠితుడు కావటం. ఆయుధం మొక్కవోవటం వంటి దిది. భావి మరణానికి మొదటి సూచన. (సంపా.)

**వ. ఒడుపు దప్పిన మహానాగంబునుం బోలె నిట్టూర్పు నిగుడ నిట్టలంబగు కోపంబు పెల్లున మల్లడిగొనుచుండె; నయ్యవసరంబున. 131**

**ప్రతిపదార్థం:** ఒడుపు+తప్పిన= పట్టు తప్పిన; మహానాగంబునున్+పోలెన్= పెద్ద పామువలె; నిడు+ఊర్పు నిగుడన్= దీర్ఘశ్వాసలు (బుసలు) కలుగగా; ఇట్టలంబు+అగు= గొప్పదైన; కోపంబు పెల్లునన్= కోపాతిశయంచేత; మల్లడిగొనుచుండెన్= లోలోన కుతకుతలాడుతూ ఉన్నాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** పట్టుదప్పిన పెద్దపామువలె బుసలు కొట్టుతూ, కోపం ఎక్కువగా కీచకుడు లోలోన ఉడికిపోతున్నాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తానును నన్నయు నయ్యా। స్థానమ్మున నుండి పవనతనయుఁ డసహ్యం**
**బైన మనోవల్లభ యవ। మానము, నా సింహబలుని మదజృంభణమున్. 132**

**ప్రతిపదార్థం:** పవనతనయుఁడు= భీముడు; తానును= తానూ; అన్నయున్= ధర్మజుడును; ఆ+ఆస్థానమునన్+ఉండి= ఆ విరాటుని కొలువులో ఉండి; అసహ్యంబు+ఐన= ఓర్చుకొనలేని; మనస్+వల్లభ= ద్రౌపదియొక్క; అవమానమున్= భంగపాటును; ఆ సింహబలుని= ఆ కీచకుడి; మదజృంభణమున్= గర్వాతిశయాన్నీ.

**తాత్పర్యం:** విరాటుడి కొలువులో అన్నతోగూడ కూర్చొని ఉన్న భీముడు ద్రౌపదికి జరిగిన అవమానాన్నీ, కీచకుడి పొగరుబోతుతనాన్నీ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. కనుఁగొని కోప వేగమునఁ గన్నుల నిప్పులు రాల, నంగము**
**ల్గనలఁగ, సాంద్ర ఘర్మ సలిలంబులు గ్రమ్మ, నితాంతదంతపీ**
**డనరట దాస్యరంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్త న**
**ర్తన ఘటనా ప్రకార భయదస్ఫురణా పరిణద్ధ మూర్తియై. 133**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; కోపవేగమునన్= కోపభావం యొక్క తీవ్రత చేత; కన్నులన్= కన్నుల నుండి; నిప్పులు రాలన్= నిప్పులు రాలినట్లు ఎర్రనికాంతులు కురియగా; అంగముల్+కనలఁగన్= అవయవాలు వేడెక్కగా; సాంద్ర ఘర్మ సలిలంబులు= దట్టంగా చెమట బిందువులు; క్రమ్మన్= పట్టగా; నితాంత= ఆగకుండా; దంతపీడన= పండ్లు కొరకటంచేత; రటత్= చప్పుడు చేస్తున్న; ఆస్యరంగ= ముఖమనే రంగస్థలంపై; వికట= వంకలు తిరిగిన; భ్రుకుటీ= బొమముడియొక్క; చటుల= కదలికవలన; ప్రవృత్త= ఏర్పడిన; నర్తన= నాట్యం యొక్క; ఘటనా= అమరిక యొక్క; ప్రకార= పద్ధతి చేత; భయద= భయాన్ని కలిగించే; స్ఫురణా= ప్రకాశం చేత; పరిణద్ధ= రూపొందిన; మూర్తి+ఐ= ఆకారం కలవాడై.

**తాత్పర్యం:** భీముడు కీచకుడి మద విజృంభణాన్ని చూచాడు. అతడి మనసులో కోపం తీవ్రంగా రేగటం వలన కన్నుల నుండి నిప్పులు రాలాయి. ఒడలంతా ఉడికిపోయింది. దట్టంగా చెమటబిందువులు క్రమ్మాయి. కోపంతో ఎడతెగకుండా పండ్లు పటపట కొరకటం వలన ధ్వనిస్తున్న ముఖమనే రంగస్థలం మీద వంపులు తిరిగే కనుబొమల కదలికల వలన ఏర్పడిన నాట్యప్రదర్శన వైఖరిచేత భయంకరంగా రూపుదాల్చిన ఆకారం కలవాడై.

**విశేషం:** 1. అలం: రూపకం, వృత్త్యనుప్రాసం.

2. భీముడి కోపభావాన్ని అభినయ బంధురంగా రూపుగట్టించిన మంచి పద్యమిది. కోపం ఒక్కసారిగా వేగంగా ప్రజ్వరిల్లింది. జ్వలనం కోపస్వభావం. మనసులోని కోపపు మంట కళ్ళలో నుండి నిప్పులు రాలుస్తున్నది. కళ్ళు ఎర్రబడటం కోపంయొక్క మొదటి అనుభావం. భార్య కవమానం చేసినవాడిమీద పగతో కూడిన క్రోధం భగ్గున మండింది. ప్రతీకారభావంతో ఒడలంతా వేడెక్కిపోయింది. తమ భార్యను అవమానిస్తుంటే చూడవలసివచ్చిందనే అప్పటి నిస్సహాయత వలన శరీరమంతా చెమటలు క్రమ్మాయి. అంతటి అవమానం చేసినవాడికి తగిన శాస్తి చేయాలి. అతడిపై ప్రతీకారం తీసికొనాలి-అనే రోషం అతడిచేత పళ్ళు పటపట లాడింపజేసింది. కనుబొమలను అల్లల్లాడ చేయించింది. అది క్రోధనర్తకి భయంకర నాట్యం చేస్తున్నట్లున్నది. పళ్ళ పటపటలు కాలి ఇనుపగజ్జెలు, కనుబొమల విన్యాసం నాట్యవైఖరులు, ముఖం నాట్యరంగం, కోపం భయంకరాకారంతో రూపుకట్టి తాండవించినట్లు భీముడు తన ఆకారాన్ని ప్రదర్శించాడు. దాన్ని తిక్కన రూపకంలో రూపొందించాడు. తకార, రకార, టకారాల పునరావృత్తి వలన వృత్త్యనుప్రాసం రూపొంది రుద్రనాట్య లయ నినదించింది. ఓజోగుణ భూయిష్ఠమైన ఈ రచన తిక్కన 'రసాభ్యుచితబంధం'. ఓజోగుణంలో శబ్దగుణ స్వభావం ఈ పద్యంలోనూ, అర్థగుణస్వభావం రాబోయే పద్యంలోనూ ప్రదర్శించి శబ్దార్థ గుణ ప్రధాన రచన చేయగల ఉభయగుణప్రౌఢిని నిరూపించాడు. కవిబ్రహ్మ.

3. ఛందశ్శిల్పం; "రతి, ఉత్సాహము, క్రోధము, శోకము, హర్షము, ఆవేగము, సంభ్రమము, ఔత్సుక్యము, భయము, ఉగ్రత - మున్నగు భావములు ఉత్కటావస్థయందు చిత్తద్రుతి హేతువులగును. కవిత్రయ మిట్టి భావముతోడనే చిత్తస్పందత్వరను వ్యంజింపవలసినపట్ల తరచు చంపకమాలావృత్తమును ప్రయోగించిరి. కీచకుడు రాజమార్గమున ద్రౌపదినిఁ బరాభవించుటఁ దిలకించిన భీముని క్రోధమును తిక్కన చంపకమునందే వర్ణించెను. ఇదియు క్రోధవేగముయొక్క సాత్త్వికాభినయమే. అజ్ఞాతవాసమున భీముడు తన క్రోధోద్రేకమును సంయమించుకొనక తప్పదు. ఎంత సంయమించుకొన్నను అది శరీరము నందగపడకమానదు. అజ్ఞాతవాస వ్రతమున క్రోధప్రకటనము కారాని కోపముయొక్క అనివార్యవ్యక్తిని తిక్కన వర్ణించెను."

"తిక్కన చంపకమున జగణములు ఇంచుమించుగా నన్నియు స్థగితములైనవి. శకలితములైన ఆ జగణముల యంగములు పూర్వోత్తర గణములకుఁ దగుల్కొని భగణ, సగణములు రూపొందినవి. 'కోపవేగమునఁ గన్నులు నిప్పులురాల'. 'సాంద్రఘర్మసలిలమ్ములు గ్రమ్మ' అను తీరున పద్యపూర్వార్థమున గల భగణరూపమున నవరోహణము స్ఫుటమై యుత్ ప్లుతమగుచున్న హృదయగతిని అణచి శాంతము చేయు భీముని యత్నమును సూచించుచున్నది. అణచరాని యుత్ప్లుతి 'నితాంత'. 'ప్రవృత్త'. 'ప్రకార' పదములందు తలయెత్తుచున్నది. అణఁచబడిన యుత్ప్లుతి యంతయు ఆరోహణరూపము ధరించి పద్యము నుత్తరార్ధము నందలి సగణావభాసమునకు గారణమైనది. 'వికట..మూర్తియై' అన్న వాక్యంబునందలి పదములు పెక్కు నగణరూపమున నున్నవి. అణఁచరాని కోపము యొక్క వేగము భీముని క్రమవర్ధమాన భయంకరాకారమున పర్యవసించుట పద్యమందలి క్రమవర్ధమాన వాక్యప్రమాణమునను గుర్తింపవచ్చును. "నితాంత..ప్రకారము' అక్షరఘటనా ప్రకారమున ప్రస్ఫుటమగుచున్నది. 'నితాంతదంతపీడనమున' బిందుపూర్వక దంత్యాక్షరములు మర్దలధణంధణలు మొరయించుట. వికటభ్రుకుటీచటుల ప్రవృత్తనర్తనమున మూర్ధన్య పరుషటకారవృత్తి శ్రుతికటువులైన పదఘట్టనములను దలపించుట యక్షరములచే వర్ణ్యవస్తుసాక్షాత్కారము చేయించు మహాశిల్పము."

-డాక్టర్ పాటిబండ మాధవశర్మ (ఆంధ్ర మహాభారతము; ఛందశ్శిల్పము. పు. 420-422)

**సీ. నేలయు నింగియుఁ దాళముల్గాఁ జేసి । యేపున రేఁగి వాయించి యాడఁ,**
**గులపర్వతంబులు గూల్చి యొండొంటితోఁ దాఁకంగ వీఁకమైఁ దన్ని యాడ,**
**నేడు సాగరములు నిక్కడక్కడఁ బెట్టి । పలుచని రొంపి మై నలఁదికొనఁగ,**
**దిక్కులు నాలుగు నొక్క చోటికిఁ దెచ్చి । పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ,**

**తే. మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ । నప్పళించుచుఁ బ్రళయకాలానలమున**
**గండరించిన రూపంబు కరణి భీముఁ । డతి భయంకరాకారత నతిశయిల్లె.** 134

**ప్రతిపదార్థం:** నేలయున్, నింగియున్= భూమి, ఆకాశమూ; తాళముల్+కాన్+చేసి= తాళాలుగాచేసి; ఏపునన్, రేఁగి= గర్వంతో పెట్రేగి; వాయించి+ఆడన్= వాయించి ఆడేటట్లుగా; కులపర్వతంబులు+కూల్చి= కులపర్వతాలను పడగొట్టి; ఒండు+ ఒంటితోన్+తాఁకంగన్= ఒకదానితో ఒకటి ఢీకొనేటట్లు; వీఁకమైన్= పరాక్రమంతో; తన్ని+ఆడన్= తన్ని ఆడేటట్లుగా; ఏడు సాగరములున్= ఏడు సముద్రాలను; ఇక్కడన్+అక్కడన్+పెట్టి= ఇటు నటుచేసి; పలుచని రొంపి= పలచటి బురద; మైన్+ అలఁదికొనఁగన్= ఒంటికి పూసికొనేట్టుగా; దిక్కులు నాలుగున్= నాలుగు దిక్కులను; ఒక్కచోటికిన్+తెచ్చి= ఒకటిగా జేసి; పిసికి పిండలి చేసి= పిసికి ముద్దజేసి; పిడుచకొనఁగన్= మ్రింగేటట్లుగా; మిగిలి= అతిశయించి; బ్రహ్మాండభాండంబు= బ్రహ్మాండమనే కుండను; పగులవ్రేయన్= పగలగొట్టడానికి; అప్పళించుచున్= ప్రయత్నిస్తూ; భీముడు; ప్రళయకాల+అనలమునన్= ప్రళయకాలంలోని అగ్నిలోనుండి; గండరించిన రూపంబు కరణిన్= రూపొందించిన ఆకారంవలె; అతిభయంకర+ఆకారతన్= మిక్కిలి భయం కలిగించే రూపంతో; అతిశయిల్లెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** నేలనూ, ఆకాశాన్నీ తాళాలుగా చేసికొని పేట్రేగి వాయించి ఆడినట్లుగానూ, కులపర్వతాలను పడగొట్టి ఒకటి మీద ఒకటి పడేటట్లు తన్ని ఆడినట్లుగానూ, ఏడు సముద్రాలను అటునిటు చేసి నీరు పోగా మిగిలిన పలుచని బురదను శరీరం నిండా పూసికొన్నట్లుగానూ, నాలుగు దిక్కులనూ కలిసి ఒకచోట చేర్చి ముద్దచేసి మ్రింగ బోతున్నట్లుగానూ అతిశయించి, బ్రహ్మాండమనే భాండాన్ని పగులగొట్టాలని, జబ్బలు చరుస్తూ ప్రళయకాలంలోని మహాగ్ని పుట్టి మానవరూపం తాల్చిందా అన్నట్లు భీముడు మిక్కిలి భయాన్ని కలిగించే ఆకారంతో ప్రకాశించాడు.

**విశేషం:** 1. అలం: సీసపాదాలలో - అత్యుక్తి; ఎత్తుగీతిలో - ఉత్ప్రేక్ష, క్రమాలంకారం.

**"అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యౌదార్యాది వర్ణనమ్."** అద్భుతాలూ, అసహజాలూ అయిన శౌర్యౌదార్యాదులను వర్ణించటం అత్యుక్తి. ఉపమాన తాదాత్మ్యాన్ని ఉపమేయంలో సంభావించటం ఉత్ప్రేక్ష. ఈ రెండలంకారాలను ఒకచోట కూర్చటం వలన తిక్కన భీముడి భయంకర రూపాన్ని అపూర్వంగా, భావనామయంగా, అద్భుతంగా ప్రత్యక్షీకరించగలిగాడు. పైపద్యంలో క్రోధోద్రేకం వలన కలిగిన ఆంగికాభినయాన్ని సమాసాడంబరంతో అక్షరరమ్యంగా రూపకాలంకారాన్ని ఆశ్రయించి రూపుకట్టించాడు. ఈ పద్యంలో తిక్కన భీముడి మనస్సులో రేకెత్తిన క్రోధ తీవ్రతను అలంకారికంగా పఠితల మనస్సులలో రూపొందేటట్లు చిత్రింపదలచుకొన్నాడు. రెండు పద్యాలలోనూ భీముడి భయంకరాకారమే వర్ణించబడింది. పైపద్యంలో భీముడి ముఖమే ఒక నర్తనశాల, అతడి కోపమే ఒక కరాళ నృత్యం. ఈ పద్యంలో బ్రహ్మాండభాండాన్ని పగలగొట్టటానికి రూపుతాల్చిన ప్రళయాగ్నివలె తోచటం సాత్త్వికాభినయం. భీముడి మనసులో పుట్టింది క్రోధం. అది ఉత్కటావస్థ పొంది రౌద్రరసరూపం తాల్చింది. ఆ రౌద్రరససముద్రలో ఉన్న భీముడి రూపం చూచేవారికి భయంకరంగా ఉన్నది. తిక్కన రసశిల్పం ఇక్కడ విశిష్టం. 'రసం సామాజిక నిష్ఠం కదా! భీముడు రౌద్రరసవిభావం; ఆయనను చూస్తే ప్రేక్షకులకు కలిగేది భయం. జనకజన్యరస విశిష్ట సమ్మేళనం భయాన్ని కలిగించే రౌద్రాకారం రసానుభవాన్ని కలిగించే రమణీయ విభావం. ఇది రసశిల్పం తెలిసిన కవి మాత్రమే చేయగలడు. విభావాన్ని

చూచిన సహృదయుడు విభావనం చేస్తాడు. భౌతిక విభావాన్ని పైపద్యంలో ప్రదర్శించిన తిక్కన సహృదయ పక్షంలో భీముడి రౌద్రాన్ని ఈ పద్యంలో భావనామయం చేశాడు. ఆలోచనామృతాన్ని అందించాడు. దానికి తోడ్పడే అర్థాలంకారాలు అత్యుక్తి, ఉత్ప్రేక్ష. అలంకారంతో రసధ్వనిని కల్పించటం ఇందులోని వర్ణనాశిల్పం.

2. తిక్కన కల్పించిన క్రమాలంకారం పై రెండు అలంకారాలకు అంతస్సూత్రం. ప్రళయాగ్ని రూపుడుగా కనబడుతున్న భీముడు కౌరవాంతకు డౌతాడని అలంకారధ్వని. భూమ్యాకాశాలను కలిపి తాళం వేస్తూ నాట్యం చేస్తున్నట్లున్నది అతడి హావం. ఇది జాతీయప్రయోగంతో సాధిస్తున్న ధ్వని. రెండు అసాధ్యమైన, విరుద్ధమైన అంశాలను కలిపి సాధించే ఒక సాహసాన్ని నేలానింగీ కలిపి తాళం వేసి ఆడటం వలె చెప్పటం తెలుగు జాతీయం. అజ్ఞాతవాసంలో ఉన్న వాస్తవాన్నీ, కీచకుడిని సంహరించటాన్నీ భీముడు అద్భుతంగా సాధించే భావికథార్థం. భూమ్యాకాశాలను తాళాలుగా మ్రోగిస్తే బ్రహ్మాండభాండం పగలటం. ఇదీ జాతీయమే, ఇందుట్లో వస్తుధ్వని, కులపర్వతాలను ఒకదానిపై ఒకటివేసి తన్ని ఆడినట్లుగా అతడి కోపం పెచ్చుపెరిగిందట. ఈ అత్యుక్తి ద్వంద్వయుద్ధంలో కీచకుడి సంహారాన్ని ప్రౌఢంగా ధ్వనింపజేస్తున్నది. ఆ పని చేయటానికి సిద్ధపడుతున్నట్లు కీచకుడు అప్పళించాడు. సప్తసాగరాలను ఇంకింపచేయటం తెలుగు జాతీయం. 'సముద్రా లింకినా, భూమి బ్రద్దలైనా, ప్రళయం వచ్చినా నేనీపని చేస్తా'ననే వాక్యాలు లోకంలో వింటాం. ఆ ప్రాగల్భ్యం భీముడి రౌద్రోద్రేకంలో ప్రత్యక్షమయింది. సముద్రజలాలను ఇట్టట్టు చేసేదీ, ఇంకింప చేసేదీ ప్రళయకాలాగ్ని. ఇది కవిసమయం కూడా. అందువలననే ఈ భావోద్రేకాన్ని ప్రదర్శిస్తున్న భీముడు ప్రళయకాలాగ్ని రూపం తాల్చినట్లుగా తోచాడు. ఇక నాల్గవపాదంలో నలుదిక్కులను ముద్దచేసి మ్రింగే భయంకర భావావిష్కారం జరిగింది. అందువలననే భీముడు 'భయంకరాకారత నతిశయిల్లె'నని తిక్కన వర్ణించాడు. సీసపద్యంలో క్రమాలంకారం పాటించటం తిక్కన సహజశిల్పం. దానిని భావనామయం చేయటం ఇక్కడ రసధ్వని శిల్పం. (సంపా.)

3. కులపర్వతాలు ఏడు: మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం, సప్తసముద్రాలు: లవణ, ఇక్షు, సురా, ఘృత, దధి, క్షీర, జల సముద్రాలు.

**వ. ఇట్లు పేర్చిన కోపాటోపంబున నవిచారిత సమయవర్తనుండయి వృకోదరుండు కీచకుని గీటడంగింపంజూచి తత్సంబంధబద్ధుండును నాజ్ఞాపరిపాలకుండును గావున మత్స్యపతిఁ దన యలుకలోని వానిన కాఁ దలంచుచు నచ్చేరువ నున్న యున్నతవృక్షంబు నిరీక్షించి, యాననంబు పల్లటిల్ల ధర్మతనయుం గనుంగొనిన నతండు తన నయనాకారంబున వారించి యిట్లనియె. 135**

**ప్రతిపదార్థం:** ఇట్లు పేర్చిన= ఈ విధంగా అధికమైన; కోప+ఆటోపంబునన్= కోపాతిశయంచేత; అవిచారిత సమయ వర్తనుండు+అయి= ఆలోచించబడని అజ్ఞాతవాస వ్రత ప్రవర్తన కలవాడై - అంటే - అజ్ఞాతవాస నియమాన్ని గురించి పట్టించుకొనని ఆచరణకు పూనుకొన్నవాడై ఉన్న; వృకోదరుండు= భీముడు; కీచకునిన్+గీటు+అడంగింపన్= కీచకుడిని మట్టుబెట్టాలని; చూచి= చూచి; తత్‌సంబంధబద్ధుండును= వానితో చుట్టరికం వలన కట్టబడ్డవాడూ; ఆజ్ఞాపరిపాలకుండును= ఆ కీచకుని ఆనతి పాటించేవాడూ; కావునన్= కనుక; మత్స్యపతిన్= మత్స్యదేశానికి రాజయిన విరాటరాజు; తన అలుకలోని వానిన్+అ= తనకోప పరిధిలోకి వచ్చేవాడినిగానే; తలంచుచున్= భావిస్తూ; ఆ+చేరువన్+ఉన్న= ఆ సమీపంలో ఉన్న; ఉన్నతవృక్షంబు= పెద్దచెట్టును; నిరీక్షించి= ఎగాదిగ చూచి; ఆననంబు పల్లటిల్లన్= ముఖము ఎఱ్ఱబారగా; ధర్మతనయున్= ధర్మరాజును; కనుంగొనినన్= చూడగా; అతండు= ధర్మరాజు; తన= తనయొక్క; నయన+ఆకారంబునన్+వారించి= కనుసైగలతో అడ్డుపెట్టి; ఇట్లు+అనియెన్; ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అధికమైన కోపంతో భీముడు తమ అజ్ఞాతవాస ప్రతిజ్ఞను మరచిపోయి కీచకుడిని మట్టుబెట్టాలని చూచి, కీచకుడితోడి చుట్టరికంవలన, అతడి ఆజ్ఞకు విరాటరాజు లోబడి ఉండటం వలన విరాటుడినీ

తనకోప పరిధిలోని వాడినిగా భావిస్తూ, దగ్గరలో ఉన్న పెద్దచెట్టును ఎగాదిగా చూచి మొగం ఎఱ్ఱబారగా ధర్మరాజు వైపు చూచాడు. భీముడి ఆకారాన్ని చూచి ధర్మరాజు కనుసైగలతో వారించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** తిక్కన నాటకీయత కిది మచ్చుతునక. భీముడు ఆవేశపరుడైనా ఆదేశంకొరకు అన్నవైపు చూడటం, అతడు వారించగానే ఆగిపోవటం భీముడిలోని సమయజ్ఞతను, క్రమశిక్షణను తెలియజేస్తాయి.

**మ. 'వలలుం డెక్కడఁ జూచె నొండెడ నసేవ్యక్ష్మాజముల్ పుట్టవే?**
**ఫలితంబై వరశాఖ లొప్పఁగ ననల్పప్రీతి సంధించుచున్**
**విలసచ్ఛాయ నుపాశ్రిత ప్రతతికిన్ విశ్రాంతి గావింపఁగాఁ**
**గల యీ భూజము వంటకట్టియలకై ఖండింపఁగా నేటికిన్?' 136**

**ప్రతిపదార్థం:** వలలుండు= వలలుడు అనే పేరుతో వ్యవహరిస్తున్న వంటవాడు (భీముడు); ఎక్కడన్+చూచెన్= ఎక్కడ చూచాడో; ఒండు+ఎడన్= మరొకచోట; అసేవ్యక్ష్మాజముల్= సేవింపదగని చెట్లు; పుట్టవే?= పుట్టవా?; ఫలితంబు+ఐ= పండ్లు పండినదై; వరశాఖలు+ఒప్పఁగన్= మంచి కొమ్మలు కలుగగా; అనల్పప్రీతిన్= ఎక్కువ సంతోషాన్ని; సంధించుచున్= కలిగిస్తూ; విలసత్+ఛాయన్= ప్రకాశిస్తున్న నీడతో; ఉప+ఆశ్రిత ప్రతతికిన్= దగ్గర చేరిన జనసమూహానికి; విశ్రాంతి+కావింపఁగాన్+కల= ఊఱట కలిగించగల; ఈ భూజమున్= ఈ చెట్టు; వంటకట్టియలకై= వంటకట్టెలకొరకు; ఖండింపఁగాన్+ఏటికిన్?= నరికి వెయ్యడం ఎందుకు?

**తాత్పర్యం:** 'వంటలవాడైన వలలుడు ఎక్కడ చూచాడో కాని ఇక్కడ కాక మరొకచోట పనికిమాలిన చెట్లు పుట్టవా? పండ్లు బాగా పండిన పెద్దకొమ్మలతోగూడి, విశాలమై నీడనిచ్చి ఆశ్రయించిన వారికి శ్రమను పోగొట్టే ఈ చెట్టును వంటకట్టెలకొరకు నరికివేయటం దేనికి?'

**విశేషం:** 1. అలం: గూఢోక్తి, ప్రస్తుతాంకురం. (అన్యాపదేశం).

2. భీముడు కోపవేగంతో పెచ్చుపెరిగి ఒక పెద్దవృక్షాన్ని పెరికి అటు కీచకుడినీ, ఇటు విరాటునీ వధించటానికి యత్నిస్తూ ఆ చెట్టువైపు చూచి గురి నిలిపాడు. కాని, ఆ పనికి ధర్మరాజుయొక్క అనుమతి కావాలి కాబట్టి అతడి వైపు చూచాడు. అతడు కనుసైగతో అతడి ప్రయత్నాన్ని మాన్పాడు. ఇది ఆంగికమైన అభినయాంశం. దానికి పోషకంగా వాచికాభినయాంశంగా ఈ పద్యాన్ని పలికాడు. భీముడితో ధర్మజుడు సూటిగా మాట్లాడకూడదు. దేనిమీదనో పెట్టి అన్యాపదేశంగా చెప్పాలి. ఆ చెప్పే పద్ధతి కూడా గూఢంగా ఉండాలి. భీముడితో చెప్పుతున్నా, అతడికి ఆ మాటలలోని అర్థం రహస్యభాషలో అర్థమౌతున్నా, చుట్టూ ఉన్నవారికి తెలియకూడదు. అట్లా మాట్లాడటం గూఢోక్త్యలంకారం. ధర్మరాజు మాటలు 'నిగూఢ భాషణలు' అని తిక్కన రాబోయే పద్యంలో పేర్కొన్నాడు. ప్రస్తుత వర్ణనం చేత ప్రస్తుత వృత్తాంతమే ద్యోతమానమైతే ప్రస్తుతాంకురాలంకారం. ధర్మరాజు వంటలవాడి చిత్తవృత్తి మీద చమత్కరించి అన్యాపదేశంగా గూఢోక్తులు పలికాడు. వలలుడు అని నామ నిర్దేశం చేయటం వలన వంటవాడి ప్రసక్తి ప్రకటంగా, భీముడి ప్రసక్తి గూఢంగా తెలియబడుతుంది. రెండూ ప్రస్తుతాలే కావటం చేత ప్రస్తుతాంకురం. వంటలవాడు కట్టెలకొరకు కూల్చటానికే చెట్టువైపు చూస్తాడు. భీముడు చూచిన వృక్షం కీచకుడినీ, విరాటుడినీ చంపటానికి ఉపయోగించదలచుకొన్న ఆయుధం. ధర్మరాజు ఆ చెట్టును కేంద్రంగా చేసి అన్యాపదేశంగా గూఢోక్తులు పలికాడు. ఆ చెట్టును విరాటుడికి అన్యాపదేశం చేశాడు. అది పండ్లు పండిన వరశాఖలున్న పచ్చని చెట్టు, విస్తారమైన నీడతో ఆశ్రయమిచ్చి సేద తీర్చగలిగిన చెట్టు. అంటే కుటుంబ పరివార సమేతంగా విస్తృత రాజ్యాన్ని పాలిస్తూ పాండవులకు వివిధ శాఖలలో ఆశ్రయమిచ్చి వారి అజ్ఞాతవాస వ్రతాన్ని ఫలవంతం చేస్తున్న విరాటుడు వరఫలవృక్షం. దానివైపు కట్టెల కొరకు చూస్తే, మరొకవైపు అసేవ్య వృక్షాలు (పనికిమాలిన చెట్లు) అంటే సేవలు కోల్పోయి, అజ్ఞాతవాసవ్రతం భంగమైన పాండవ వృక్షాలు కట్టెలకు సిద్ధమౌతాయి.

కాబట్టి ఆ చెట్టును పెరికితే తమ ఆశ్రయాన్ని తామే నాశనం చేసికొన్నట్లు పాండవులు రెంటికి చెడ్డ రేవడులు కాగలరని వ్యంగ్యమైన సూచన. భీముడికి మాత్రమే తెలిసే కనుసైగలు, గూఢోక్తులు ధర్మరాజు మాట్లాడతాడు. అవి చెడ్డ రేవడులు కాగలరని వ్యంగ్యమైన సూచన. భీముడికి మాత్రమే తెలిసే కనుసైగలు, గూఢోక్తులు ధర్మరాజు మాట్లాడతాడు. అవి ఆ సభలో ద్రౌపదికి మాత్రమే అర్థం కావటం విశేషం. తెలుగువారు అన్యాపదేశంగా మాట్లాడే మాటలకు 'వలలుం డెక్కడ చూచె' ననే ఈ పద్యాన్ని ఒక సంకేతంగా సంభాషణలలో ఉటంకించటం సాహిత్యమర్యాద. తెలుగునాట అంత ప్రచారం చెందిం దీ పద్యం. (సంపా.)

3. కీ.శే. పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు గారు విరాటపర్వ టిప్పణిలో భీముడికీ - ఇతరులకూ స్ఫురించే అర్థాలను వేరువేరుగా వింగడించి వివరించారు. అందులోని ముఖ్యాంశాలు -

భీమపరంగా - 'ఓ భీమసేనా! ఏల చెట్టువైపు చూచెదవు? ఈ చెట్టు పెఱికికొని యీ ఱేని నీతని బావమఱఁదినీ చంపఁజూచెదవు. ఈరాజు సేవ్యక్ష్మాజము - ఈ యజ్ఞాతవాసమునం దరణ్యావాస దుఃఖతప్తులమగు మనకు సేవనీయమైన వృక్షమువలె బసయిచ్చిన మహానుభావుడు. సంపన్నుడై బంధుగుల పోషించుచు, నాశ్రయించిన మనబోటి వారికి, నిలువ నీడ యిచ్చుచు ఛాయావృక్షమువలె నున్నవాడు. అట్టి మహాపురుషునిదెసపై నుపకారముల నేమియును దలంపక మనకు సమయభంగ మను భీతియు లేక కీచకుని మందలింపలే డాయె నను చిన్న నేరమెన్ని ద్రుంపవచ్చునే? అట్లు సేయుట యాశ్రిత్యాహనన న్యాయమగును. ఇతని యింటిలో మనము దలదాచుకొంటిమి కాన మనకు సమయభంగము కాకుండుటకుఁ గాని, యితని ప్రియము సేఁతకుఁగాని యేతద్బంధువగు కీచకునిఁ ద్రుంచుటయుఁ బ్రస్తుత ముచితముకాదు. అంతగా నీకుఁ ద్రుంపవలయునవియేయున్న హస్తినాపురములో భ్రాతృత్వాదుల నేనియు నెన్నక మనసర్వస్వము నపహరించి మనకు నిలువనీడ లేకుండ జేసిన నీరస తరువులనుబోలు దుర్యోధనాదులు లేరా? చంపెదనని ప్రతిజ్ఞను జేసితివే! వారిని సమయానంతరము చంపుము. అజ్ఞాతవాసానంతరము తన ముద్దుకూతురగు నుత్తరను మన యర్జునపుత్రుండగు నభిమన్యునకు నొసంగి, యిట్లే ముందును హితము గావించుచు వరశాఖలు విజృంభింపగా మనకుఁ బ్రీతిఁగావించు ఱేనిని ద్రుంపఁదగదు".

ఇతరులకుఁ దోచునర్థము; 'ఈ వంటలవాడికి ఈ చెట్టు ఎక్కడ కానుపించెను? ప్రొయ్యిలోనికి కావలయు నన్న వేఱొకచోట శుష్కవృక్షంబులు లేకపోయెనే? ఇయ్యది పండ్లతోను, మంచికొమ్మలతోను విస్తరించి, యాశ్రయించిన బాటసారులకు నుపయోగపడుచు, నిల్వనీడనిచ్చుచున్నది. దీనిని వంటకట్టియలకై కొట్టుట ఉచితము కాదు."

**తే. అని నిగూఢభాషణముల నయ్యజాత । శత్రుఁ డనిలజు కోపరసంబు పేర్మి**
**చెఱిచె, నయ్యన్నదమ్ముల చేష్టితములు । దెల్లముగ నప్డు సూచుచు నల్లలేచి. 137**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; నిగూఢభాషణములన్= రహస్య వాక్యాలచేత; ఆ+అజాతశత్రుఁడు= ఆ ధర్మరాజు; అనిలజు= భీముడియొక్క; కోపరసంబు పేర్మిన్+చెఱిచెన్= కోపావేశాన్ని తగ్గించాడు; ఆ+అన్నదమ్ముల చేష్టితములు= ధర్మజభీములచర్యలు; తెల్లముగన్= స్పష్టంగా; అప్డు= అప్పుడు; చూచుచున్= గమనిస్తూ; అల్లన్+లేచి= మెల్లగా లేచి.

**తాత్పర్యం:** ధర్మజుడు రహస్యవచనాలతో భీముడి కోపాతిశయాన్ని తగ్గించాడు. అన్నదమ్ముల చేష్టలను ద్రౌపది గమనిస్తూ మెల్లగా లేచింది.

**సీ. ఎలదీఁగఁ గప్పిన లలితపరాగంబు । క్రియ మేన మేదినీ రేణువొప్పఁ,**
**జంపకంబున నవసౌరభం బెసఁగెడు । కరణి నాసిక వేఁడి గాడ్పు నిగుడఁ,**
**దోయజ దళములతుది మంచు దొరఁగెడు । గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురుల,**
**నిందుబింబము మీఁది కందు చందంబునఁ । గురులు నెమ్మొగమున నెరసియుండ,**

**తే. సర్వజన వంద్య యైన పాంచాలి సింహ। బలునిచే నివ్విధంబున భంగపాటు**
**దనకు వచ్చిన నెంతయు దైన్యమొంది। యవ్విరాటుని సభఁ జేర నరిగి నిలిచి. 138**

**ప్రతిపదార్థం:** ఎలతీఁగన్= లేత తీగను; కప్పిన= చుట్టుకొన్న; లలిత పరాగంబుక్రియన్= మెత్తని పుప్పొడివలె; మేనన్= శరీరంపై; మేదినీరేణువు+ఒప్పన్= దుమ్ము నిలవగా; చంపకంబునన్= సంపెంగపువ్వునుండి; నవసౌరభంబు+ఎసఁగెడు= కొత్తవాసన కలిగినట్లు; కరణి= రీతి; నాసికన్= ముక్కున; వేడిగాడ్పు నిగుడన్= వేడి నిట్టూర్పు రాగా; తోయజదళముల తుదిన్= తామరరేకుల కొనలలో; మంచు తొరఁగెడుగతిన్= మంచుబిందువులు జారినట్లు; కన్ను+కవన్= కనుదోయినుండి; అశ్రుకణములు+ఉరులన్= కన్నీరు జారగా; ఇందుబింబము మీఁది= చంద్రబింబము మీదనున్న; కందుచందంబునన్= మచ్చవలె; కురులు= వెంట్రుకలు; నెఱ+మొగమునన్= అందమైన మొగంపై; నెరసి+ఉండన్= వ్యాపించి ఉండగా; సర్వజనవంద్య+ఐన= జనులందరిచేత మ్రొక్కులందే; పాంచాలి= ద్రౌపది; సింహబలునిచేన్= కీచకుడిచేత; ఈ విధంబునన్ భంగపాటు= ఇటువంటి అవమానం; తనకున్ వచ్చినన్= తనకు కలుగగా; ఎంతయున్+దైన్యము+ఒంది= ఎంతో దుఃఖపడి; ఆ విరాటుని సభన్, చేరన్+అరిగి నిలిచి= దగ్గరకు వెళ్ళి నిలిచింది.

**తాత్పర్యం:** లేతతీగమీద దట్టంగా పడిన మెత్తని పుప్పొడివలె ఆమె శరీరంమీద దుమ్ముధూళి క్రమ్ముకొన్నది. సంపెంగ పువ్వునుండి క్రొత్తసువాసన ప్రసరిస్తూ ఉన్నట్లు ఆమె ముక్కునుండి వేడి నిట్టూర్పులు వెలువడుతూ ఉన్నాయి. పద్మదళాల అంచులనుండి మంచుకణాలు పడుతున్నట్లు ఆమె కనుదోయినుండి కన్నీటి బొట్లు రాలుతున్నాయి. చంద్రబింబంమీద మచ్చలున్నట్లుగానే అందమైన నిండుమొగం మీద కురులు బాగా వ్యాపించి ఉన్నాయి. అందరిచేత గౌరవించబడే ద్రౌపది కీచకుడిచేత ఆవిధంగా అవమానాలపాలు కావటంతో ఎంతో దీనురాలై ఆ విరాటుడి సభను సమీపించి నిలిచింది.

**విశేషం:** అలం: ఉపమ. జనవంద్యురాలైన పాంచాలి భంగపాటు వలన దైన్యం పొందింది అనే భావాన్ని ఉపమాలంకార సుందరంగా తిక్కన ఈ సీసపద్య పాదాలలో ఆవిష్కరించాడు. తీగమీద పుప్పొడి పడి ఉండటం గౌరవం, మేని మీద దుమ్ముపడి ఉండటం దైన్యం. సంపెంగపూవు వాసనవంటి సుగంధ పరిమళ నిశ్వాసం కలిగి ఉండటం ఉత్తమజాతి స్త్రీ గౌరవలక్షణం, వేడి నిట్టూర్పులు దైన్య లక్షణం. పద్మదళాల అంచులపై మంచుబిందువులు స్రవించినట్లు ఆనందబాష్పాలు రాలటం గౌరవం, అంతటి అందమైన కన్నులనుండి కన్నీరుకారటం దైన్యం. చంద్రబింబానికి మచ్చవలె మొగంమీద ముంగురులు అందంగా ఉండటం గౌరవం, మొగంమీద కురులు క్రమ్ముకొనటం దైన్యం. పరోక్షంగా ఆ దైన్యరూపం ఆమెయొక్క అజ్ఞాతవాసవ్రత రక్షణకవచంగా ఉండటం ప్రకరణౌచిత్యం. ఉపమాలంకారంలోని ఉపమానాలన్నీ కవిసమయసిద్ధాలై ఉండటం గమనించదగిన అంశం. (సంపా.)

ద్రౌపది తన భంగపాటు విరాటునితోఁ జెప్పుట (సం.4-15-13)

**ఉ. పంబిన కోపమున్ సమయభంగ భయంబును నగ్గలించి యు**
**ల్లంబు పెనంగొనంగఁ బతులం దగ సభ్యులఁ జూచుమాడ్కి రూ**
**క్షంబగు చూడ్కి నా ద్రుపదుకన్నియ సూచి సభాజనప్రతా**
**నంబును మత్స్యనాథుఁడు వినంగ నెలుంగు చలింప నిట్లనున్. 139**

**ప్రతిపదార్థం:** పంబినకోపమున్= అతిశయించిన కోపమూ; సమయభంగభయంబును= ప్రతిన చెడిపోతుందనే భయమూ; అగ్గలించి= అధికమై; ఉల్లంబు= మనస్సు; పెనంగొనంగన్= కలవరపరచగా; పతులన్= భర్తలను; తగన్+సభ్యులన్+చూచుమాడ్కిన్=

తగినట్లు సభాజనులను చూచినట్లే; రూక్షంబు+అగుచూడ్కిన్= క్రూరమైన చూపుతో; ఆ+ద్రుపదుకన్నియ+చూచి= ఆ ద్రౌపది చూచి; సభాజన ప్రతానంబును= సభలోని జనసమూహమూ; మత్స్యనాథుఁడున్= విరాటరాజునూ; వినంగన్= వినేటట్లు; ఎలుంగు చలింపన్= స్వరం కంపింపగా (గద్గద స్వరంతో); ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఒకవైపు పెల్లుబికే కోపం, మరొకవైపు అజ్ఞాతవాస భంగభయం మిక్కుటమై కలవరపరచగా సైరంధ్రి (ద్రౌపది) సభాసదులను చూచినట్లుగా తన భర్తలను తీక్ష్ణంగా చూచి, విస్తారమైన ఆ సభలోని సభాసదులూ, విరాటుడూ వినేటట్లు గద్గదస్వరంతో ఇట్లా పలికింది.

**విశేషం:** ద్రౌపది సమయభంగ భయంతో మాట్లాడటం ఆమె సమయజ్ఞతకు సూచకం. ఇప్పు డామె పరిస్థితి దయాస్పదం; కౌరవసభలో భర్తలు ఉండీ రక్షించలేకపోయారు. అప్పుడు రాజు భంగపరిస్తే, ఇప్పుడు రాజు బావమరిది. సభ్యులపై రూక్షవీక్షణం తగునా? అంటే తర్వాతి పద్యాలలో సమాధానం కన్పిస్తుంది.

**సీ.** **'నిఖిల ధర్మాధర్మ నిపుణంబు లైన శు। ద్ధాంతరంగంబుల నతిశయిల్లి,**
**శిష్ట సంరక్షణ దుష్ట నిగ్రహముల। నీతి వాటింపంగ నేర్పు గల్గి,**
**సకల శస్త్రాస్త్ర సంచయములఁ బరమాద్భు। తంబు సేయు పరిశ్రమంబు దాల్చి,**
**దుర్దమ ప్రతిభట మర్దన క్రీడమైఁ జతురులు నా నెందు నుతికి నెక్కి,**

**తే.** **యున్న గంధర్వు లేవురు నన్ను నిట్టు। లొకఁడు వఱుపంగ నూరక యునికి సూడ**
**నచ్చెరువు గాదె! యెవ్వరి యాండ్రు రింకఁ। బరిభవంబునఁ బొందకఁ బ్రదుకువారు?** **140**

**ప్రతిపదార్థం:** నిఖిల ధర్మ+అధర్మనిపుణంబులు= అన్నిరకాలైన ధర్మాలలో, అధర్మాలలో నైపుణ్యం గలిగిన; శుద్ధ+ అంతరంగంబులన్= స్వచ్ఛమైన మనస్సులచేత; అతిశయిల్లి= వృద్ధిపొంది; శిష్టసంరక్షణ= సజ్జనులను రక్షించటంలోనూ; దుష్ట నిగ్రహములన్= దుష్టులను శిక్షించడంలోనూ; నీతి+పాటింపంగన్= ధర్మాన్ని పాటించటంలోను; నేర్పు+కల్గి= సామంపతులన్= భర్తలను; సామర్థ్యం వహించి; సకల శస్త్ర+అస్త్రసంచయములన్= అన్ని బాణాల, అస్త్రాల సముదాయాలలో; పరమ+ అద్భుతంబు+చేయు= మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగించే; పరిశ్రమలు తాల్చి= చక్కని అభ్యాసం, సామర్థ్యం కలిగి; దుర్దమ= అణచలేని; ప్రతిభట మర్దనక్రీడమైన్= అణచరాని శత్రువీరులను చంపటమనే ఆటలో; చతురులు నాన్= సమర్థులని; ఎందున్= అంతటా; నుతికిన్+ఎక్కి+ఉన్న= ప్రసిద్ధివహించిన; గంధర్వులు+ఏవురు= ఐదుగురు గంధర్వులు; నన్నున్= నన్ను (ద్రౌపదిని); ఇట్టులు+ఒకఁడు= ఈ విధంగా ఒకడు (ఒక నీచుడు); పఱుపంగన్= పాటుపడజేయగా, బాధపెట్టగా; ఊఱక+ఉనికి= అలక్ష్యంగా ఉండటం; చూడన్= చూస్తే; అచ్చెరువు కాదె?= ఆశ్చర్యంగా లేదూ?; ఇంకన్= ఇకమీద; ఎవ్వరి ఆండ్రురు= ఎవ్వరి భార్యలు; పరిభవంబునన్= అవమానాన్ని; పొందక బ్రదుకువారు?= పొందకుండా బ్రతకగలరు?

**తాత్పర్యం:** ఏది ధర్మమో, ఏది అధర్మమో క్షుణ్ణంగా తెలిసినవారూ, సాధుజనులను రక్షించి, దుష్టులను శిక్షించేవారూ, అస్త్రశస్త్రవిద్యలలో ఆరితేరినవారూ, శత్రువుల నవలీలగా చంపగల గంధర్వులైన నా భర్తలు ఐదుగురు కీచకుడీ విధంగా నన్ను అవమానించగా ఉదాసీనంగా ఊరకుండిపోయారు. ఇకపై లోకంలో ఇతరుల భార్యలకు ఇటువంటి అవమానం కలిగితే రక్షించే దిక్కు ఎవరుంటారు?

**విశేషం:** అలం: పరికరం. 'అలంకారః పరికర స్సాభిప్రాయ విశేషణై;' - విశేషణం సాభిప్రాయమైతే పరికరాలంకారం. ద్రౌపది తన భర్తలైన అయిదుగురు గంధర్వుల విశిష్ట గుణాలను సీసపద్య పాదాలలో పేర్కొన్నది. అవి మొత్తం నాలుగు. ఆ నాలుగూ

సామూహికంగా అయిదుగురికీ అన్వయిస్తాయి. పరిశీలించి చూస్తే ధర్మజ, భీమార్జునులకు మొదటిమాటా, చివరిది కవలైన నకుల సహదేవులకూ అన్వయిస్తాయి. ఇట్లు విశేషణాలను వాడటం సాభిప్రాయం. ధర్మాధర్మ నిర్ణయ నిపుణులైన ధర్మజ్ఞుల సభలలో ఉత్తముడుగా రాణించేవాడు ధర్మరాజు. శిష్టులను రక్షించాలనీ దుష్టులను శిక్షించాలనీ భావించే నీతి పాటించే నేర్పరి భీముడు. సమస్త శస్త్రాస్త్రాలను అద్భుతంగా ప్రయోగించే పరిశ్రమ కలవాడు అర్జునుడు. అసాధ్యులైన శత్రువులను చంపటం క్రీడగా భావించే చతురులు నకుల సహదేవులు. ఈ విధంగా విశేషణాలు సాభిప్రాయం కావటం చేత పరికరాలంకారం భూషించబడింది. ఈ విధంగా పతుల పరాక్రమ విశేషాలను పరోక్షంగా పొగడి, వారు మారుపలుకకుండా మిన్నకున్నందుకు నొచ్చుకొన్నది. ఇట్లా ఊరుకొంటే ఎవరి భార్యలు అవమానాలు పొందక బ్రతుకుతారు? అని హెచ్చరించి, తాను ఎవరికీ కానిదై అవమానం పొంది చనిపోవటం తప్పదు - అని వ్యంగ్యంగా వేదన వ్యక్తం చేసింది. (సంపా.)

**క. ఈ నరపతి యాస్థానము। లో నొక్కరుఁడైన ధర్మలోప భయమునన్**
**బూని తగవైన వెడ పలు। కైనను బలుకంగఁ జాలఁ డయ్యెను నకటా! 141**

**ప్రతిపదార్థం:** అకటా!= ఔరా! అయ్యో!; ఈ నరపతి+ఆస్థానములోన్= ఈ విరాటరాజు కొలువులో; ధర్మలోప భయమునన్= ధర్మానికి విఘ్నం కలుగుతుందనే భయంతో; ఒక్కరుఁడు+ఐనన్= ఒక్కడైనా; పూని= ప్రయత్నించి; తగవు+ఐన= న్యాయమైన వెడపలుకు+ఐనను= చిన్నమాట అయినా; పలుకంగన్+చాలఁడు+అయ్యెను= మాట్లాడలేకపోయాడు.

**తాత్పర్యం:** ఈ విరాట మహారాజు సభలో ఉన్న ఇంతమందిలో ఒక్కరైనా ధర్మానికి లోపం జరుగుతుందేమో నన్న భయం వలన ధర్మ రక్షణం కొరకు ముందుకు వచ్చి ఒక్క చిన్నమాటైనా న్యాయంగా పలికేవారు లేకపోయారు. అధర్మానికి భయపడేవారే లేకపోయారు.

**విశేషం:** అలం: గూఢోక్తి. ప్రక్కనున్న వారికి తెలియకుండా తనవారి నుద్దేశించి గూఢంగా పలుకటం గూఢోక్తి అలంకారం. ఈ పద్యంలో అందరికీ అర్థమయ్యే తాత్పర్యం పైన చెప్పుకొన్నది. ఇక రెండవ అర్థం గంధర్వులను ఉద్దేశించి - అంటే తన పతులైన ధర్మరాజాదులను ఉద్దేశించి చెప్పే తాత్పర్యం ఇది-ఈ రాజాస్థానంలో ఉన్న ఒక్కడైనా అజ్ఞాతవాస ధర్మం భగ్నమౌతుందేమోనన్న భయంతో, ఆ పూనికకే ప్రాధాన్యమిచ్చి, అనువైన ఒకమాటకూడా మాటాడలేనివాడైపోయాడు కదా! అయ్యో! ఎంతటి దీన పరిస్థితి ఏర్పడింది. గూఢోక్తి వలన ఈ సన్నివేశంలో నాటకీయ సంభాషణ శ్లేషవలె రాణిస్తూ జనాంతిక చమత్కారాన్ని ప్రదర్శించి, తిక్కన రచనా శిల్పాన్ని వెలార్చింది. (సంపా.)

**ఉ. ఇందఱుఁ జూడఁగా నిచట నిమ్మెయి నన్నుఁ బతివ్రతా గుణా**
**స్పందిత వర్తనం బరమ సాధ్వి ననిందితశీలఁ గీచకుం**
**డెందును నెట్టి యంగనల నెవ్వరుఁజేయనియట్లు సేయఁగాఁ**
**గొందఱకైన నిప్డు కృపకుం దఱిగాదటె? యేమి సెప్పుదున్? 142**

**ప్రతిపదార్థం:** ఇచటన్= ఈ విరాటుని కొలువులో; ఇందఱున్+చూడఁగాన్= ఇంతమంది సభాసదులు చూస్తూ ఉండగా; ఈ+మెయిన్= ఈ విధంగా; పతివ్రతా గుణ+అస్పందిత వర్తనన్= పాతివ్రత్య ధర్మాన్ని వీడని నడవడిక కలదానిని; పరమసాధ్విన్= ఉత్తమమైన సాధుస్వభావం కలిగినదానిని; అనిందిత శీలన్= నిందకు తావులేని చరితం (స్వభావం) కలదానిని; నన్నున్= (ద్రౌపదిని); కీచకుండు= కీచకుడు; ఎందునున్= ఎక్కడా; ఎట్టి+అంగనలన్= ఏ స్త్రీలను; ఎవ్వరున్ చేయని+అట్లు= ఎవ్వరూ చేయని విధంగా; చేయఁగాన్= చేస్తే; కొందఱకున్+ఐనన్= కొంతమందికైనా; ఇప్డు= ఇప్పుడు; కృపకున్= దయకు; తఱికాదటె?= సమయం కాదా? ఏమిచెప్పుదున్?= ఏమి చెప్పుకొనేది?

**తాత్పర్యం:** ఇంతమంది సభాసదులు చూస్తుండగా పతివ్రతాగుణ సంపన్నమైన ప్రవర్తన కలదానను, ఉత్తమ సాధుస్వభావం కలదానను, మచ్చలేని శీలంగలదానిని అయిన నన్ను ఈ కీచకుడు ఇంతకుముం దెన్నడు ఏ స్త్రీకీ జరగని విధంగా అవమానం చేస్తే, ఇంతమందిలో కొంతమందికైనా ఇప్పుడు కొద్దిపాటి దయనైనా చూపే తరుణం కాదా ఇది? ఇక ఏమనాలో నాకు ఏమీ తోచటం లేదు!

**విశేషం:** అలం: గూఢోక్తి. సభలో అందరినీ ఉద్దేశించి ద్రౌపది మాట్లాడుతున్నట్లుంటుంది. కాని, ఆమె తనపతులను ఉద్దేశించి గూఢంగా పలుకుతున్నట్లుంటుంది. ఆమె మాటలలోని మర్మం అది. సభాసదులందరినీ ఉద్దేశించి చెప్పిన సాధారణ తాత్పర్యం పైన పేర్కొన్నది. ఇక ఆమె గూఢంగా పాండవుల నుద్దేశించిన తాత్పర్య మిది. ఇంతమంది చూచేటట్లుగా ఈ సభాస్థలిలో ఈ విధంగా కీచకుడు నన్ను అవమానించాడు. అయినా పతులను మనసారా సేవించే వ్రతం నుండి తొలగని ప్రవర్తన కలదానినిగా ఉన్నాను. సాధ్వులలో శ్రేష్ఠురాలుగానే ఉన్నాను. నా శీలం కళంకితం కాలేదు. ఇంతవరకు నన్ను నేను రక్షించుకొన్నాను. నేను పడిన కష్టాలు మరే ఇల్లాలూ పడి ఉండదు. అయినా, నా పతులైన అయిదుగురిలో కొందరికైనా ఇప్పటికీ దయ చూపించదగిన సమయం వచ్చింది అనే భావం కలగలేదంటే - ఇక నే నేమి చెప్పేది? ఈ పద్యంలో ఇందరు చూడగా అనే మాట ప్రజలకూ వర్తిస్తుంది. పాండవులకూ వర్తిస్తుంది. 'కొందఱికైనన్'- అనే మాట అక్కడున్న ధర్మజభీములకైనా దయరాదా? అన్నట్లు స్పష్టమౌతుంది. గూఢోక్తిని (భార్యాభర్తల నడుమ) నిష్ఠురోక్తులకు మారుగా వాడిన తిక్కన వాక్యచాతుర్యం ప్రశంసనీయం. (సంపా.)

**ఉ.** **ఐనను మత్స్యదేశమున యాజ్ఞ కితం డొడయుండు గాన నా**
**కీ నరనాథు దూఱఁదగు; నెయ్యది యేని నధర్మ మెవ్వ రెం**
**దైన నొనర్చినం బ్రభువు లారసి దండన మాచరింతు; రి**
**చ్చో ననుఁ దన్ను కీచకునిఁ జూచియు నూరక యున్కి పాడియే?'** 143

**ప్రతిపదార్థం:** ఐనను= ఐనప్పటికీ; మత్స్యదేశమున+ఆజ్ఞకున్= ఈ మత్స్యదేశం యొక్క ప్రభుత్వానికి; ఇతండు= విరటుడు; ఒడయుండు+కానన్= రాజుగాబట్టి; నాకున్= (ద్రౌపదికి); ఈ నరనాథున్= ఈ విరాటరాజును; దూఱన్+తగున్= నిందించటం భావ్యం; ఏ+అది+ఏనిన్= ఏదైనా; అధర్మము= ధర్మము కానిదాన్ని; ఎవ్వరు+ఎందైనన్= ఎవరైనా, ఎక్కడైనా; ఒనర్చినన్= చేస్తే; ప్రభువులు= రాజులు; అరసి= గమనించి; దండనము+ఆచరింతురు= శిక్షిస్తారు; ఈ+చోన్= ఇక్కడ; ననున్= (ద్రౌపదిని); తన్ను= తన్నిన; కీచకునిన్+చూచియున్= కీచకుడిని చూచికూడా; ఊరక, ఉన్కి, పాడియే?= ఊరుకొనటం ధర్మమా?

**తాత్పర్యం:** ఇంత జరిగినందుకు ఈ మత్స్యదేశాధినేత అయిన ఈ విరాటరాజును నేను నిందించాలి. ఏదైనా ధర్మలోపం ఎక్కడైనా జరిగితే రాజు దానిని గమనించి శిక్షించాలి. ఈ సభలో ఈ విధంగా నన్ను తన్నిన కీచకుడిని చూస్తూ ఊరుకొనటం ధర్మమా?'

**విశేషం:** అలం: గూఢోక్తి. ఈ పద్యంలోకూడా గూఢోక్తి రమణీయంగా నిర్వహించబడింది. గూఢోక్తిలో అధిక్షేపోక్తిని కూడ తిక్కన మేళవించాడు. ఈ పద్యంలో 'ఇతండు ఒడయుండుగాన' 'నరనాథు దూఱఁదగు', ప్రభువు లారసి దండన మాచరింతురు 'మొదలైన మాటలు గమనించదగినవి. ఆమె మత్స్యదేశంలో ఉన్నది కాబట్టి, కీచకుడి వలని అవమానం మత్స్యదేశంలో జరిగింది కాబట్టి, ఆ రాజ్యానికి ఏలిక విరాటుడు కాబట్టి, అత డా విషయంలో తగిన ఆజ్ఞ ఈయదగినవాడు. కాబట్టి పాండవులు మారుపల్కక కూర్చున్నారని భావించినా, ఆజ్ఞ ఇవ్వకుండా ఆలస్యం చేస్తున్న విరాటుడు నిందించదగినవాడు కాబట్టి ద్రౌపది అతడిని అధిక్షేపించింది. ఒకవేళ విరాటుడు తగిన ఆజ్ఞ ఇవ్వలేకపోతే, అధర్మాన్ని అరికట్టలేకపోతే పాండవులు మారుపల్కకుండా ఉండటం న్యాయమా? వారు తగిన చర్యలు తీసికొనటానికి అవకాశం ఉన్నదని ద్రౌపది ధర్మమార్గాన్ని సూచించింది. లోకంలో

రాజు లుంటారు. ప్రభువు లుంటారు. రాజులు సామంతులు కావచ్చును, కాని ప్రభువులు ఒకరికి తలఒగ్గి ఉండరు. విరటుడు రాజు; ధర్మజుడు ప్రభువు. అతడి తమ్ములుకూడ ప్రభువులే. రాజు అసమర్థుడై అధర్మాన్ని అణచలేకపోతే, ధర్మాన్ని రక్షించలేకపోతే, ప్రభువులు మిన్నకుండరాదు. వారు పరిస్థితిని పరిశీలించి రంగంలోకి దిగి అధర్మపరులకు తగిన దండన విధించాలి. అది ధర్మం కాబట్టి 'ఇది మత్స్యదేశం, విరటుడే ఆజ్ఞ ఇవ్వాలి - అని కూర్చోకుండా, మీ ప్రభుత్వాన్ని ప్రదర్శించి నన్ను ఆపదనుండి రక్షించండి. ఊరక ఉండటం న్యాయం కాదు' అని ద్రౌపది గూఢంగా ధర్మజాదులను అధిక్షేపించింది. రహస్యంగా పాండవులను క్రియాశీలురు కమ్మని ప్రేరేపించింది. ఈ తాత్పర్యం సభలోనివారికి తెలియరాదు. పాండవులకే తెలిసివస్తుంది. పఠితలకు రెండర్థాలూ స్ఫురిస్తాయి. ఇది గూఢోక్తి రమ్యత. (సంపా.)

**చ. అనుడు విరాటుఁ డుల్లమున నక్కటికం బొలయంగ నంగనం**
**గనుఁగొని, కీచకుం గినియఁగాఁ దగు సత్త్వము లేమిఁ జేసి సాం**
**త్వనములు పల్కి రోషభరితస్థితిఁ గంపితమూర్తి యైన యా**
**తని మది కుందు వాపిన నతండును బోయె నివాసభూమికిన్. 144**

**ప్రతిపదార్థం:** అనుడున్= ఆ విధంగా ద్రౌపది పలుకగా; విరాటుఁడు= విరాటమహారాజు; ఉల్లమునన్= మనస్సులో; అక్కటికంబు+ ఒలయంగన్= దయకలుగగా; అంగనన్= ద్రౌపదిని; కనుఁగొని= చూచి; కీచకున్= కీచకుడిపై; కినియఁగాన్+తగు= కోపించటానికి తగిన; సత్త్వము లేమిన్+చేసి= శక్తిలేకపోవటం వలన; సాంత్వనములు పల్కి= ఓదార్పుమాటలాడి; రోషభరితస్థితిన్= కోపంతో నిండిన మానసిక స్థితి చేత; కంపితమూర్తి+ఐన= వణకే దేహంతో ఉన్న; ఆతని మది కుందు+పాపినన్= కీచకుడి మనస్సులోని పరితాపాన్ని పోగొట్టగా; అతండును= కీచకుడుకూడ; నివాసభూమికిన్+పోయెన్= ఇంటికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** ద్రౌపది మాట్లాడిన మాటలను విని విరాటుడు మనసులో దయబూని ద్రౌపదిని చూచాడు. కాని కీచకుడిని మందలించే ధైర్యం లేకపోవటం వలన ఆమెను ఊరడించాడు. నిండిన కోపంతో ఊగి (వణికి) పోతున్న ఆ కీచకుడి పరితాపాన్ని విరాటుడు అనునయంతో ఉపశమింపజేశాడు. అప్పుడు కీచకు డింటిముఖం పట్టాడు.

**వ. అట్టి యవసరంబున. 145**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**సీ. 'శుభలక్షణాంగి యీ సుందరి సైరంధ్రి। యగు టెట్లొకో!' యని వగచువారు,**
**'నిమ్మేని కక్కట యిట్టిది సేసెనే !। మాయ దైవం' బని మఱుఁగువారు,**
**'నింత కీ డొనరించెనే! రాజు సూడ నీ। దుష్టాత్మకుం' డని దూఱువారు,**
**'దేవి యుపేక్షయ చూవె! యీయమకు ని। ప్పాటు వచ్చుట' యని ప్రందువారు**

**తే. నగుచు సభవార లందఱు నంత నంత। నల్ల నల్లన గుజగుజ లాడుచుండి;**
**రుల్లమున నిండి ఖేదంబు వెల్లివిరిసె। నాఁగ మోముల విన్నఁదనంబు గదుర. 146**

**ప్రతిపదార్థం:** శుభలక్షణ+అంగి= మంచి అవయవాలు కలిగిన; ఈ సుందరి= ఈ సౌందర్యవతి; సైరంధ్రి అగుట+ఎట్లు+ఒకో= సైరంధ్రీ వేషంలో ఉండటం ఎందుకు జరిగిందో; అని వగచువారున్= అని దుఃఖించేవారూ; మాయ దైవంబు= దుష్టుడైన విధి; ఈ+మేనికిన్=ఈ (అందమైన) శరీరానికి; ఇట్టిది+చేసెనే= ఇటువంటి విపరీతమైన పని చేశాడే; అని= అని; మఱుఁగువారు=

బాధపడేవారూ; రాజు+చూడన్= రాజు చూడగా; ఈ దుష్టాత్మకుండు= ఈ చెడు స్వభావముగల కీచకుడు; ఇంతకీడు+ఒనరించెనే!= ఇట్టి చెడ్డపని చేశాడే; అని దూఱువారు= అని నిందించేవారూ; దేవి+ఉపేక్ష+అ చూవె= సుదేష్ణ అలసత్వమేగదా చూడగా; ఈయమకున్= ద్రౌపదికి; ఈ+పాటు= ఈ కష్టం; వచ్చుట అని వ్రందువారున్= పరితపించువారూ; అగుచున్= ఔతూ; సభవారలు+అందఱున్= సభాసదులంతా; ఉల్లమునన్= మనస్సులో; నిండి= నిండిన; ఖేదంబు= దుఃఖం; వెల్లివిరిసెన్+నాఁగన్= పైకి వచ్చిందా అన్నట్లు; మోములన్ విన్నఁదనంబు+కదురన్= మొగాలపై దైన్యం ఉట్టిపడగా; అంతన్+అంతన్= దూరదూరంగా; అల్లనన్+అల్లనన్= మెల్లమెల్లగా; గుజగుజలు+ఆడుచుండిరి= గుసగుసలాడసాగారు;

**తాత్పర్యం:** మంగళకరమైన లక్షణాలు గల ఈ సుందరాంగి సైరంధ్రిగా ఎందుకు మారిందో - అని కొందరు విచారించసాగారు. ఇంతటి లలితాంగికి ఇటువంటి కష్టాలు పెట్టాడు. దేవుడు నిజంగా నిర్దయుడు - అని కొందరు కుతకుతలాడసాగారు. దుర్మార్గుడైన కీచకుడు రాజు చూస్తుండగానే ఈమెకు ఇంతటి కీడు చేశాడే-అని కొందరు అతడిని నిందించసాగారు. ఈమెకు ఈ అవమానం కలగటానికి కారణం సుదేష్ణ ఉపేక్షయే - అని కొందరు పరితపించసాగారు. ఈ విధంగా సభాసదులందరూ మెల్లమెల్లగా, గుసగుసలాడుతూ, మనసులలోని దుఃఖం పొంగిపొరలగా ముఖాలు వెలవెలపోతూ కనిపించారు.

**విశేషం:** అలం: ఉల్లేఖం. **"బహుభిర్బహుధోల్లేఖా దేకస్యోల్లేఖ ఇష్యతే".** ఒకే వస్తువును అనేకులు అనేక విధంగా వర్ణించినట్లు చెప్పితే ఉల్లేఖం. సభ్యులలో కొన్ని వర్గాలవారు తమకు తోచిన వ్యాఖ్యలు చేశారు. అవన్నీ ద్రౌపదిపట్ల సానుభూతితో, గౌరవంతో సాగినవే. సభ్యుల నుద్దేశించి ద్రౌపది పెట్టుకొన్న మొరకు సభ్యుల మాటలు మౌనప్రతిస్పందన. 'యథారాజా తథా ప్రజా' అన్నట్లు ఆ సభాసదులు కూడా జాలిని ప్రదర్శించారే తప్ప ఆమెకు కలిగిన కష్టాన్ని తీర్చలేకపోయారు. ఉల్లేఖంలో కూడా తిక్కన ఒక క్రమాన్ని పాటించాడు. ఉత్తమజాతి స్త్రీగా నిరూపించేవి ఆమె శుభ లక్షణాంగకాలు. ఉదాత్తురాలికి అనుదాత్తమైన పరిస్థితి ప్రాప్తించింది. ఆమె శరీరం కోమలం. కాని, ఆమె చేసే సేవలు కఠినం. స్వభావానికి తగినటువంటి సేవావృత్తి లభించలేదని భావం. రాజు చూస్తుండగా దుర్మార్గుడు ఆమెకు కీడు చేశాడు. ఉత్తమురాలికి తగని అవమానం జరిగిందని జాలిపడి, అవమానించినవాడిని నిందించారు. దీనికంతా కారణం దేవి ఉపేక్షాభావ మని నిశ్చయించి విచారించారు. ద్రౌపది అమాయకత్వంపై వారు సానుభూతి ప్రకటించారు. పరిస్థితిని విశ్లేషించి వివేకాన్ని ప్రదర్శించగల ప్రవృత్తిని సభ్యులలో చిత్రించి తిక్కన రాజ సభాసదుల పాత్రకు న్యాయం చేశాడు. విరటుడి వలెనే ఆ సభ్యులు కూడా ధర్మాన్ని సమర్థిస్తారు. దానిని అభిమానిస్తారు. కాని, అధర్మాన్ని ఎదుర్కొనలేరు-అని తిక్కన తీర్పు. ఉల్లేఖాలంకారం సభాస్వభావ వ్యంజకం కావటం విశేషం. (సంపా.)

**ఉ. అప్పుడు ధర్మసూతి హృదయంబు గలంగ, లలాట భాగముం**
**గప్పఁగ ఘర్మవారి, యధికంబగు రోషము నొందియుండియుం**
**దప్పఁగఁ ద్రోచికొంచుఁ దనధైర్యము పెంపున నిర్వికారుఁడై**
**యెప్పుడుఁ దాను పల్కు నెలుఁ గేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్. 147**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ధర్మసూతి= ధర్మరాజు; హృదయంబు కలంగన్= మనస్సు కలతపడగా; ఘర్మవారి= చెమటనీరు; లలాటభాగమున్+కప్పఁగన్= నుదుటిపై వ్యాపించగా; అధికంబు+అగు రోషమున్= ఎక్కువైన కోపం; ఒంది+ఉండియున్= పొందికూడా; తప్పఁగన్+త్రోచికొంచున్= తొలగత్రోసికొంటూ; తన ధైర్యము పెంపునన్= తన స్థిరమైన మనస్సు యొక్క గొప్పతనంతో; నిర్వికారుఁడు+ఐ= మనోవికారాలు లేనివాడై, నిబ్బరం కలవాడై; ఎప్పుడున్+తాను; పల్కు+ఎలుఁగు+ఏర్పడన్= తాను మామూలుగా మాట్లాడే కంఠస్వరంతో; ద్రౌపదితోడన్+ఇట్లు+అనున్= ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు ధర్మరాజు మనస్సు కలతచెందింది. నెన్నుదురుమీద చెమట క్రమ్మింది. మిక్కుటమైన రోషం పెచ్చుపెరిగింది. అయినా, ఆ రోషాన్ని ధీరగుణంతో అణచుకొన్నాడు. వికారం లేని మనసుతో స్థైర్యాన్ని పొందాడు. ఎప్పుడూ మాట్లాడే కంఠస్వరంతో ఈ విధంగా ద్రౌపదితో అన్నాడు.

**విశేషం:** ద్రౌపది పలికిన గూఢోక్తులకు, అధిక్షేపోక్తులకు, కీచకుడి అనౌచిత్య వర్తనానికి ధర్మరాజు చిత్తం కలత చెందింది. అది స్వేదమనే సాత్త్వికభావంతో వ్యక్తమయింది. కీచకుడి దుష్టవర్తనం అతడిలో రోషాన్ని పెంచింది. ధీరుడు కాబట్టి ధర్మరాజు దానిని అదుపు చేసికొన్నాడు. ఎంతటి మానసిక సంక్షోభాన్నైనా సంయమించుకొనటంలో వశీకృతచిత్తుడు ధర్మరాజు. (సంపా.)

**సీ.** **'జననాయకుండు నీ సభవారు నీదగు। తెఱఁగెల్ల నెఱిఁగిరి తెఱవ! యింక**
**మానక యీ పలుమాట లాడఁగ నేల?। చనుము నీవు సుదేష్ణ సదనమునకు;**
**నీ పరాభవమునఁ గోపింప నేరరే। గంధర్వులకుఁ దఱిగాదుగాక;**
**సమయ మెయ్యది యేనిఁ దమకును నీకుఁ గ। ల్గిన యట్టులైనను గినియ రిచట**

**తే.** **గాన నాథుల దూఱంగఁ గాదు వినుము। సతికిఁ దానెంత వడియును సభలలోనఁ**
**దడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి। శంక సెడి ధిక్కరింపంగఁ జనునె చెపుమ!'** **148**

**ప్రతిపదార్థం:** తెఱవ!= ఓ వనితా! (ద్రౌపదీ!); జననాయకుండున్= రాజూ; ఈ సభవారున్= ఈ సభలో జనులూ; నీది+అగు= తెఱఁగు+ఎల్లన్= నీ భంగపాటునంతా; ఎఱిఁగిరి= తెలిసికొన్నారు; ఇంకన్+మానక= ఇంక చాలించక; ఈ పలుమాటలు= ఇట్లాంటి అనేక రకాలైన మాటలు; అడఁగన్+ఏల?= పలకటం ఎందుకు?; సుదేష్ణ సదనమునకున్= మహారాణి నివాసానికి; నీవు చనుము= నీవు వెళ్ళిపొమ్ము; గంధర్వులకున్= గంధర్వులకు; తఱి+కాదు+కాక= సమయం కాదు కానీ లేకపోతే; నీ పరాభవమునన్= నీ అవమానానికి; కోపింప నేరరే?= కోపపడలేరా?; సమయము+ఎయ్యది+ఏని= ఏదైనా ఒక నియమం; తమకును, నీకున్= వాళ్ళకూ నీకూ; కల్గిన అట్టులు+ఐనను= ఉన్నట్లయితే; ఇచటన్+కినియరు= ఇక్కడ కోపపడరు; కానన్= కావున; వినుము= తెలిసికొనుము; సతికిన్= భార్యకు; నాథులన్= భర్తలను; దూఱంగన్+కాదు= నిందించతగదు; తాను+ఎంత+వడియును= తాను ఎంతబాధ పడినా, సభలలోనన్= సభలలో; ఇట్టులు= ఈ విధంగా; తడవుగాన్ నిల్చి= ఎక్కువసేపు నిలబడి; ఉదగ్రవృత్తిన్= కోపంగా; శంక+చెడి= సంకోచం లేకుండా; ధిక్కరింపంగన్= ఎదిరించటం; చనునె చెపుమ= తగునా చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ సైరంధ్రీ! నీ సమాచారం రాజుగారికి, సభాసదులకు సవివరంగా తెలిసింది. ఇంక ఎక్కువ మాట్లాడకుండా రాణిగారి మందిరానికి వెళ్ళిపొమ్ము. నీకు జరిగిన అవమానానికి నీ భర్తలైన గంధర్వులు కోపించరా? కాని, ఇది తగిన సమయం కాదని ఊరకున్నారు. నీకూ వారికీ ఏదో నియమం ఉన్నట్లయితే, సమయం కాదని వా రిప్పుడు కోపగించరు. కాబట్టి దానిని గమనించక నీ భర్తలను నీవు నిందించటం ఉచితం కాదు. సతి తా నెన్ని పాట్లుపడినా నిండు సభలలో చాలాసేపు నిలబడి ఆవేశంతో సంకోచం లేకుండా ఎదిరించి మాట్లాడటం మంచిదా? నీవే చెప్పుము.'

**విశేషం:** అలం: గూఢోక్తి. ద్రౌపది గూఢోక్తులతో మాట్లాడింది. ధర్మరాజు కూడ గూఢోక్తులతోనే ఆమెకు సమాధానం చెప్పసాగాడు. ఆమె ఉద్వేగకరంగా మాట్లాడింది. ధర్మజుడు నిబ్బరంగా, నిర్వికారంగా మాట్లాడుతున్నాడు. ప్రజలు ధర్మజుడి మాటల తీరులో తేడా లేదు కాబట్టి సభలో ఆమెను మందలిస్తున్నాడనే భావించి ఊరుకుంటారు. ధర్మరాజు మాటలు సభ్యుల దృష్టిలో మందలింపు మాటలుగా, ద్రౌపది దృష్టిలో చేయవలసిన కర్తవ్యాన్ని బోధిస్తున్న విధివాక్యాలుగా స్ఫురించటం గూఢోక్తి అలంకార విశేషం. గంధర్వుల పేరు చెప్పి తన మనసులోని అభిప్రాయాన్ని చెప్పాడు ధర్మరాజు. ఈ మాటలు ఆమె కెంత సూచనలో, ఆ సభలో ఉన్న భీమునికి

కూడా అంత సూచనలే! వారికి తోచే తాత్పర్యం ఇట్లా ఉంటుంది. 'ఓ సైరంధ్రీ! నీకు జరిగిన అవమానాన్ని అటు రాజూ! ఇటు సభాసదులూ తెలిసికొన్నారు. ఇక దానిని గురించి వివరించటం మానటం మంచిది. అట్లా కాకుండా నీవు సభలో నిలువబడి పలుమాటలు మాట్లాడుతున్నావు. అది మంచిది కాదు. అందువలన నీవు వెంటనే సుదేష్ణాదేవి మందిరానికి వెళ్ళిపొమ్ము.' (భావి కార్యక్రమం అక్కడి నుండి సాగాలి కాని, సభలో కాదు. నీ పరాభవాన్ని చూచిన మాకు (గంధర్వులకు) కోపం రాదా? వచ్చింది. కాని, దానిని ప్రదర్శించే సమయం కాదిది. కోపం వలన నియమభంగం ఔతుంది. అంటే నీకూ మాకూ కూడా అజ్ఞాతవాసవ్రతం చెడుతుంది. కాబట్టి మేమిక్కడ మారుపల్కటానికి వీలులేదు. దీనిని గమనించి నీవు మమ్ములను (నీ భర్తలను) నిందించవద్దు. నేను చెప్పేమాటలు బాగా అర్థం చేసికొమ్ము, భార్యవైన నీవు ఎన్నోపాట్లు పడిన మాట నిజమే. సమయ నియమబద్ధులైన భర్తలు సభలో ఉండగా వారి నుద్దేశించి గూఢంగానైనా ఎక్కువసేపు మాట్లాడటమే దోషం. పైపెచ్చు నీవు జంకూ గొంకూ లేకుండా కోపోద్రేకంతో ధిక్కరించి మాట్లాడటంవలన ఏం ప్రయోజనం సాధించగలుగుతావు? నీ వెంత మాట్లాడినా మేము నిండుసభలో ఏమీ మారుమాట మాట్లాడలేం. ఇది సమయం కాదు; ఈ సభ స్థలం కాదు. రాణిమందిరంలోనే జరుగవలసిన పని జరగాలి. నీవు ఆవేశం మానాలి. మాకు నీకంటె ఎక్కువగానే కోపంగా ఉన్నది. నియమం చెడకుండా ఉపాయం ఆలోచించాలి. ప్రస్తుతానికి నీ విక్కడ ఉండటం శ్రేయస్కరం కాదు. ఎవరైనా నిన్ను ద్రౌపదిగా గుర్తిస్తే అజ్ఞాతవాస వ్రతం భంగం కాకతప్పదు') అని గూఢోక్తులకు గూఢోక్తులతోనే సమాధానం చెప్పించటం తిక్కన సంభాషణ శిల్పం. (సంపా.)

**వ. అనియిట్లు సెప్పిన ధర్మతనయుని పలుకులు విని వెండియు సైరంధ్రి యచ్చోటు గదలక నిలిచి యెద్దియేనియుం బలుకం దలంచినం జూచి యతండు మఱియు నిట్లనియె. 149**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు+చెప్పినన్= అని ఈ విధంగా పలికిన; ధర్మతనయుని= ధర్మరాజు యొక్క; పలుకులు విని= మాటలు విని; వెండియున్= తిరిగి; సైరంధ్రి; ఆ+చోటు కదలక నిలిచి= అక్కడి నుండి కదలకుండా నిలబడి; ఎద్ది+ఏనియున్= ఏదో; పలుకన్+తలంచినన్= మాట్లాడాలనే ఉద్దేశంతో ఉండటం; చూచి= గమనించి; అతండు= ధర్మరాజు; మఱియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఇట్లా మాట్లాడిన మాటలు వినికూడా ద్రౌపది అక్కడినుండి కదలకుండా నిలబడి, ఏదో మాట్లాడాలని అనుకొంటుండగా, ధర్మరాజు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధర్మరాజు ద్రౌపదిని సుదేష్ణ అంతఃపురానికి పొమ్మన్నాడు. ద్రౌపది పోవటానికి ఆలస్యం చేసింది. దాని వెనుక ఏదో కారణం ఉండాలి. దానిని వ్యంగ్యంగా పఠిత ఊహకు వదలిపెట్టటం ఇక్కడ విశేషం. అంతఃపురానికి వెళ్ళితే సమస్య తీరదు. కాగా, అది మరీ తీవ్రతరం కావచ్చును. కాబట్టి సమస్యను వేగంగా తీర్చవలసిన అవసరం ఉన్నదని ఆమె భావం. దానిని ఎట్లాగైనా ధర్మరాజుకు గుప్తంగానే చెప్పవలెనని యత్నించటం ద్రౌపది అప్పటి మసలటంలోని పరమ తాత్పర్యం. దానిని ధర్మరాజు గ్రహించి, ఆమె అక్కడ ఉండి, ఆ మాటలు చెప్పనవసరం లేదని, త్వరగా వెళ్ళుమని సూచించాడు. ఆమె దానిని గ్రహించలేదు. అందువలననే ఆమె ఆరాటపడసాగింది. ధర్మరాజుశాసనాన్ని కాదనటానికి వీలులేదు; అయినా తన మనసులోని మాట చెప్పకొనకుండా ఉండటానికి వీలులేదు. ఈ సంఘర్షణలో ద్రౌపది వెనుకముందాడుతున్నది. (సంపా.)

**క. 'పలుపోకలఁ బోవుచు వి। చ్చలవిడి నాట్యంబు సలుపు చాడ్పున నిచటన్**
**గులసతుల గఱువ చందము। దొలఁగఁగ నిట్లునికి దగునె తోయజవదనా!' 150**

**ప్రతిపదార్థం:** తోయజవదనా!= పద్మంవంటి ముఖం కలదానా!, ఓ సైరంధ్రీ; పలుపోకలన్+పోవుచున్= పెక్కు హొయలులు పోతూ; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; నాట్యంబు సలుపు చాడ్పునన్= నాట్యం చేస్తున్నట్లుగా; ఇచ్చటన్= ఈ కొలువులో; కులసతుల=

కులస్త్రీలయొక్క; గఱువ చందము తొలఁగఁగన్= గొప్పతనం తొలగిపోయేటట్లు; ఇట్లు+ఉనికి+తగునె?= ఇక్కడ ఇట్లా ఉండటం భావ్యమా?

**తాత్పర్యం:** 'ఓ సైరంధ్రీ! ఇట్లా స్వైరవిహారం చేస్తూ నాట్యం చేస్తున్నట్లుగా ఈ కొలువులో కులస్త్రీల ఔన్నత్యం తొలగిపోయేటట్లు నీవు నిలబడటం సంభావ్యం కాదు.'

**విశేషం:** అలం: ఉపమ. సమాజంలో ఉండే ఒక ఆచారానికి సంబంధించిన సాంస్కృతికమైన ఉపమానాన్ని తిక్కన సాభిప్రాయంగా ఇక్కడ వాడటం విశేషం. కులసతుల గౌరవ వర్తనం ఇందులో చెప్పబడింది. అది పలుపోకడలు పోవటం వలన, విచ్చలవిడిగా నాట్యం చేయటం వలన కులసతి గౌరవం తొలగిపోతుంది-అనే భావం సాంస్కృతికమైన ఒక విలువ. తెలుగులో 'పలుపోకలు పోవుట' - జాతీయం. దానికి- అనేక మార్గాలలో తిరగటం, పెక్కుహొయలు ప్రదర్శించటం, పలు కపటచేష్టలు చేయటం, పెక్కుమందితో విహరించటం (చరించటం), పలు రీతులలో అభినయించటం (వర్తించటం)-అని అర్థాలు చెప్పవచ్చును. ఇవన్నీ కులసతికి నిషేధాలే. 'విచ్చలవిడి నాట్య' మాడటం- అనేది కూడా తెలుగు జాతీయమే. ఇష్టం వచ్చినట్లు చేతులూపుతూ, కాళ్ళూపుతూ, అభినయిస్తూ మాట్లాడటం. అదుపూ ఆజ్ఞా లేకుండా వ్యవహరించటం. ప్రేలటం, స్వతంత్ర ధోరణితో ఆవేశంగా వ్యవహరించటం. కపటనాటకాలు ఆడటం, కపట నటనం చేయటం మొదలైన అర్థాలు చెప్పవచ్చును. భర్త మాట జవదాటని కులసతికి ఈ లక్షణాలు పనికిరానివి. కాబట్టి సభలో ఉండటం కులసతి లక్షణ విరుద్ధమని ధర్మజుడి అభిప్రాయం. అందులో సున్నితమైన మందలింపూ ఉన్నది. పరుషమైన అదలింపూ ఉన్నది. (సంపా.)

**వ. అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కిట్లనియె. 151**

**తాత్పర్యం:** ధర్మజుని మాటలు విని ద్రౌపది ఉద్దేశపూర్వకంగా ఆయనతో ఇట్లా అన్నది.

**తే. 'నాదు వల్లభుండు నటుఁ; డింత నిక్కంబు; । పెద్దవారి యట్ల పిన్నవారు**
**గానఁ బతుల విధమకాకయే శైలూషిఁ । గా ననంగరాదు కంకభట్ట! 152**

**ప్రతిపదార్థం:** కంకభట్ట!= కంకభట్టు వేషంలో ఉన్నవాడా! (ధర్మరాజా!); నాదు వల్లభుండు= నా భర్త; నటుడు= నటించేవాడు. నాట్యాచార్యుడు; ఇంతనిక్కంబు= అంతవరకు నిజమే; పెద్దవారి+అట్లు+అ= పెద్దవారివలెనే; పిన్నవారు= చిన్నవారు ప్రవర్తిస్తారు; కానన్= కాబట్టి; పతుల విధము+అ+కాక= భర్తల పద్ధతిలోగాక; ఏన్= నేను (ద్రౌపది); శైలూషిన్= నాట్యకత్తెను; కాను+అనంగరాదు= కాను అని అనటానికి వీలు లేదు.

**తాత్పర్యం:** 'ఓ కంకభట్టా! నా భర్త నటుడు. ఇది కాదనలేని వాస్తవం. పెద్దవారితోడి వారే చిన్నవారు. కాబట్టి, నేనూ నా భర్త వంటి దానినే. అందువలన నేను నర్తకిని కాను అనటానికి వీలులేదు.

**విశేషం:** 1. అలం: పరికరం. **"అలంకారః పరికర స్సాభిప్రాయ విశేషణైః".** విశేషణం సాభిప్రాయమైతే అది పరికరాలంకారం. ఈ పద్యంలో ద్రౌపది 'నాదు వల్లభుండు నటుఁడు' అని అన్నది. 'నటుడు' అనే విశేషణం సాభిప్రాయం. దానివలన బృహన్నల సూచితుడయ్యాడు. మత్స్యయంత్రాన్ని ఛేదించి స్వయంవర సభలో ఆమెను గ్రహించిన భర్త అర్జునుడు. అతడు నాట్యాచార్యుడై ఉత్తరాదులకు నాట్యం నేర్పుతున్నాడు. 'నటుడి భార్యను కాబట్టి నేను నర్తకినే. పెద్దలవలె పిన్నలుండటం న్యాయం. నన్ను నర్తకిని కాదనటానికి వీలులేదు, అని ధర్మజుడి మాటలకు ప్రత్యాఖ్యానం చేసింది. ధర్మరాజు మాటవరసకు జాతీయ ప్రయోగంగా 'నాట్యంబు సలుపు చాడ్పున' నిండు సభలో మెలగవద్దని హెచ్చరించాడు. అక్కడి అర్థం ఔపచారికం. దానిని వాచ్యంగా గ్రహించి

ద్రౌపది త్రిప్పికొట్టింది. ద్రౌపది అభిమానవతి. మాటపడదు. అందువలన మాటకు మాట వడ్డించింది. దానికి కారణం ఆమె చెప్పదలచుకొన్న మాటను ధర్మరాజు సభలో చెప్పనీయలేదనే రోషం.

2. 'నేను ఆటవెలది' నని ద్రౌపది చెప్పిన పలుకులను 'ఆటవెలది' లో రచించటం తిక్కన ప్రదర్శించిన వృత్తౌచిత్యం. (సంపా.)

**వ. అట్లగుటంజేసి నాకు నాట్యంబును పరిచితంబ; మత్పతి శైలూషుండ కాఁడు, కితవుండునుం గావున జూదరి యాలికి గఱువచందం బెక్కడిది?' యనుచు నచ్చోటు వాసి తన చిత్తంబున. 153**

**ప్రతిపదార్థం:** అట్లు+అగుటన్+చేసి= అట్లా కావటం వలన; నాకున్= (ద్రౌపదికి); నాట్యంబును పరిచితంబు+అ= నాట్యంకూడా తెలుసు; మత్పతి= నా భర్త; శైలూషుండు+అ-కాఁడు= ఆటకాడు మాత్రమే కాదు; కితవుండునున్+కావునన్= జూదరి కూడా కాబట్టి; జూదరి+ఆలికిన్= జూదరి యొక్క భార్యకు; గఱువచందంబు= పెద్దరికం, గౌరవం, ఔన్నత్యం; ఎక్కడిది?= ఎక్కడ ఉంటుంది?; అనుచున్= అనిపల్కుచు; ఆ+చోటువాసి= అంటూ ఆ ప్రదేశం వదలి; తన చిత్తంబునన్= తన మనస్సులో.

**తాత్పర్యం:** అట్లా కావటం వలన నాకు నాట్యం చేయటం అలవాటే. నా భర్త నాట్యకాడు మాత్రమే కాదు. జూదరి కూడా! జూదరి భార్యకు పెద్దరికం, గౌరవం ఎక్కడి నుండి వస్తుంది?' అంటూ ఆ ప్రదేశం వదలిపెట్టి, తన మనస్సులో, (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: పరికరాంకురం. **"సాభిప్రాయే విశేష్యే తు భవే త్పరికరాంకురః".** విశేష్యం సాభిప్రాయంగా ప్రయోగించబడితే పరికరాంకురాలంకార మౌతుంది. వెనుకటి పద్యంలో ద్రౌపది తాను నర్తకినే అని చెప్పుకొనటానికి తగిన హేతువును పేర్కొన్నది. నాట్యాచార్యుడైన అర్జునుడికి భార్య కావటం చేత తాను నర్తకినని చెప్పి, సాభిప్రాయంగా సమర్థించుకొన్నది. అందులో అధిక్షేపంతోపాటు ఒక అనౌచిత్యం కూడా స్ఫురించే అవకాశం ఉన్నది. ఎట్లాగంటే- 'నిజంగా నా భర్త అర్జునుడే. అతడు ఇప్పుడు నాట్యం చేస్తున్నాడు కాబట్టి నన్ను రక్షించుకొనే స్థితిలో లేడు. అందువలన నేనూ, నన్ను నేను రక్షించుకొనటానికి ఎన్నో నటనలు చేయవలసి వస్తున్నది. భర్త యొక్క వృత్తియే భార్యకు ప్రవృత్తిగా మారింది' - అని పలికి అర్జునుడు (బృహన్నల) సాకుగా భర్తల అసమర్థతను ఎత్తిపొడిచి అవహేళనం చేసింది. రోషంతో ఆ మాట అని ఆమె నాలుక కొరుక్కొని ఉంటుంది. వెంటనే ఆ అనౌచిత్యాన్ని పరిహరించే మరొక వాక్యాన్ని ఇప్పుడు పలికింది. 'నా భర్త నటుడే కాదు జూదరి కూడా' - అని. ఈ రెండు విశేష్యాలూ సాభిప్రాయాలు. నా భర్త నటుడైన అర్జునుడే కాడు. జూదరి అయిన ధర్మరాజు కూడా! అని ఒక అర్థం. నా భర్త నటుడూ, జూదరీ - రెండూ అయినవాడు అని - రెండో అర్థం. ధర్మరాజు వాడిన 'విచ్చలవిడి నాట్యంబు సూపు చాడ్పున' - అనే పోలికకు తగిన వడ్డింపు ఇక్కడ వచ్చింది. ధర్మరాజు కంకభట్టుగా వేషాన్ని ధరించి నటిస్తున్నాడు. కాబట్టి అతడూ నటుడే. ఆ నటనలోకూడా జూదరి పాత్రనే నిర్వహిస్తున్నాడు. నటనలోకూడా జూదరి అయిన విశేష లక్షణం ధర్మరాజుకే దక్కింది. దానిని ఎత్తి పొడిచింది ద్రౌపది. జూదరి భార్యను అమ్ముకొంటాడు. ఆమెకు కలిగే అవమానాన్ని లక్ష్యపెట్టడు. అతడికి ఇల్లాలైన వనితకు లోకంలో గౌరవం ఉండదు. గౌరవం పోయిన జూదరి భార్యకు 'విచ్చలవిడితనం' దోషం కాదని అధిక్షేపించింది. ద్రౌపది యందు ధర్మజుడు ఆరోపిస్తున్న అవలక్షణాలన్నీ ధర్మరాజు జూదరి కావటం వలన ఏర్పడినవే అని అధిక్షేపోక్తి. ధర్మరాజు తనను మాట్లడనీయకుండా అడ్డుపడ్డాడు. ఆమె కూడా ఆయన మాట్లాడలేనట్లు అడ్డుపలికి ఆయన సమాధానం కొరకు వేచి ఉండకుండానే వెనుదిరిగిపోయింది. ధర్మరాజు ఆదేశించినట్లే సుదేష్ణ యొక్క అంతఃపురానికి ఆమె వెళ్ళి ధర్మరాజు ఆనతిని పాటించింది. కాని, అధిక్షేపోక్తితో తన తీవ్ర పరితాపాన్ని వ్యక్తం చేసింది. తన కష్టాల కన్నిటికీ ధర్మజుడిని బాధ్యుడిని చేసింది. ఆ కష్టాలు తీర్చే బాధ్యత కూడా అతడిమీదనే పెట్టింది. ఇక మాటలతో పనిలే దన్నట్లు, కార్యాచరణమే ముఖ్యమన్నట్లు గిర్రున తిరిగి వెళ్ళిపోయింది. తిక్కన రచనలో పాత్రల ప్రతికదలికలో రసధ్వని రవళిస్తుంది. అందుకు ఈ సన్నివేశం సజీవోదాహరణం. (సంపా.)

సుదేష్ణ ద్రౌపది నూఱడించుట (సం.4-15-36)

ఉ. **'న న్నిటు లాదురాత్ము సదనంబునకుం జనుమన్నజంత కీ**
**బన్నములన్నియుం దెలిపి ప్ర య్యిడనే' యని పోయె నార్తయై**
**కన్నుల బాష్పపూరములు గ్రమ్మఁగ మోమున దైన్యమొందఁగా**
**నన్నలినాక్షి తొట్రిలుచు నంగము దూల సుదేష్ణపాలికిన్.** 154

**ప్రతిపదార్థం:** ఆ+నలిన+అక్షి= పద్మాలవంటి కన్నులు గల ఆ సైరంధ్రి (ద్రౌపది); నన్నున్+ఇటులు= నన్ను ఈ విధంగా; ఆ దురాత్మసదనంబునకున్= ఆ దుష్టుడైన కీచకుని ఇంటికి; చనుము+అన్న= వెళ్ళుమన్న; జంతకున్= ధూర్తురాలికి, (సుదేష్ణకు); ఈ బన్నములు+అన్నియున్= ఈ అవమానాలన్నీ; తెలిపి= తెలిసేటట్లు చెప్పి; ప్రయ్యి+ఇడను+ఏ= నిందించనా? (తిట్టిపోయనా?); అని ఆర్త+ఐ= అని అనుకొంటూ పెద్దగా ఏడుస్తూ; కన్నులన్ బాష్పపూరములు= కళ్ళలో కన్నీటి ధారలు; క్రమ్మఁగాన్= వ్యాపించగా; మోమునన్= ముఖంమీద; దైన్యము+ఒందఁగాన్= దీనత్వం కనిపించగా; తొట్రిలుచున్= తడబడతూ; అంగము+తూలన్= శరీరం తూలుతూ ఉండగా; సుదేష్ణపాలికిన్= సుదేష్ణవద్దకు; పోయెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** 'నన్ను ఆ దుష్టుడైన కీచకుడి ఇంటికి వెళ్ళుమన్న ఆ ధూర్తురాలికి నాకు జరిగిన అవమానాలన్నీ తెలియచెప్పి నిందించా'లని అనుకొంటూ కన్నీళ్ళు ధారాపాతంగా ప్రవహించగా, బావురుమని దుఃఖిస్తూ శరీరం కంపించగా, తూలుతూ, దీనవదనంతో ఆ సైరంధ్రి సుదేష్ణవద్దకు వెళ్ళింది.

**విశేషం:** తిక్కన రచించిన అభినయాత్మకమైన పద్యాలలో ఇది ఒకటి. మనసులోని భావపరిణామానికి అనువుగా ఆంగిక అభినయం ప్రవర్తిల్లినట్లు వర్ణించటం తిక్కన నాటకీయ రచనా శిల్పం. ఈ పద్యంలో ద్రౌపది మనస్సులో అనుకొన్న మాటలివి; 'నన్ను ఈ విధంగా - ఆ దురాత్ముడి ఇంటికి పొమ్మని - పంపిన - ఆ జంతకు - నా పడిన అవమానాలన్నీ - చెప్పి - నోరారా నిందిస్తాను' - ఈ మాట లనుకుంటూ సుదేష్ణ వద్దకు పోతున్న ద్రౌపది రోదించింది. నమ్మినవారు మోసం చేయగా, గత్యంతరం లేక మరలవారి వద్దకే వెళ్ళవలసిన దీనస్థితి వచ్చినప్పుడు ఉన్నతవంశసంజాతురాలు, ఉత్తమురాలు, అభిమానవతి అయిన సతి మొదట బావురుమన్నట్లు రోదించటం సహజ సాత్త్వికాభినయం. కీచకుడి ఇంటికి పంపిన సన్నివేశ స్మరణం చేత ద్రౌపదికి కన్నీటి ధారలు పొంగి వచ్చాయి. మాట తప్పిన యజమానురాలి దుర్నీతికి బలి అయిన ఒక ఇల్లాలు బలవంతంగా ఒక దుర్మార్గుడి ఇంటికి ఒంటరిగా వెళ్ళవలసి వచ్చినప్పుడు సంభవించే అపాయాన్ని తలచినప్పుడు కళ్ళనీళ్ళు పొంగి పొరలటం సహజాభినయం. అక్కడ కీచకుడు ఆమెపట్ల వర్తించిన వికార చేష్టలను, పలికిన వాక్యాలను, తాను పడిన అవమానాలను తలపునకు తెచ్చుకొన్నప్పుడు ఆమె కంపించిపోయింది. సుదేష్ణకు ఆ సంగతులు ఎట్లా చెప్పాలి? - అనే అభిమానం అడ్డం వచ్చి, చెప్పక తప్పని తన దయనీయ స్థితిని భావించి, ముందుకు వెళ్ళలేక వెళ్ళుతున్నప్పుడు ఆమె శరీరం తూలినట్లయింది. ఈ అభినయం భావప్రవాహ ప్రతిస్పందనం. తిక్కన అభినయ కళాప్రతిభకు అభినవ దర్పణం! (సంపా.)

తే. **చనిన, నయ్యేలనాఁగయు సంభ్రమంబుఁ। దెచ్చికొని తానెఱుంగని తెఱఁగు దాల్చి**
**శాఠ్యమున నుమ్మలించి పాంచాలితోడ। నెలుఁగువేఱొక భంగిగా నిట్టులనియె.** 155

**ప్రతిపదార్థం:** చనినన్= వెళ్లగా, ఆ+ఎలనాఁగయున్= ఆ మహారాణి సుదేష్ణ కూడా; సంభ్రమంబున్+తెచ్చుకొని= వేగిరపాటును తెచ్చిపెట్టుకొని; తాను+ఎఱుంగని తెఱఁగు+తాల్చి= తనకేమీ తెలియదన్న వైఖరిని ప్రదర్శిస్తూ; శాఠ్యమునన్= కపటంగా; ఉమ్మలించి= దుఃఖాన్ని తెచ్చిపెట్టుకొని; పాంచాలితోడన్= సైరంధ్రితో; ఎలుఁగు వేఱు+ఒక భంగిగాన్= డగ్గుత్తిక చెందినట్లుగా; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ద్రౌపది అట్లా వెళ్ళగా సుదేష్ణకూడా వేగిరపాటును తెచ్చిపెట్టుకొని, తన కేమీ తెలియనట్లుగా ప్రవర్తిస్తూ, కపటమైన దుఃఖాన్ని కొనితెచ్చుకొని, సైరంధ్రితో డగ్గుత్తిక చెందిన స్వరంతో ఈ విధంగా పలికింది.

**విశేషం:** సైరంధ్రిది సహజాభినయం, సుదేష్ణది కపటాభినయం. తులనాత్మక పరిశీలనలో ఈ వైరుద్ధ్యం తిక్కన రచనలో ప్రసన్నం. (సంపా.)

**సీ. 'ధరణీ పరాగంబు వొరసి ధూసరితమై । చేడియ! నీ మేను చెన్నుదఱిఁగెఁ;**
**జిత్తంబు తలపోఁతచే వాడు పొదవిన । చెలువ । నీ నెమ్మోము చిన్నఁబోయెఁ;**
**బ్రస్వేదమునఁ దోఁగి ఫాలంబుతో నంటి । యుగ్మలి ! నీ కురు లొప్పు కుందెఁ;**
**గన్నీరు వఱ్ఱొడ్డి కాంతి యెంతయుఁగొన్న । వెలఁది! నీ కనుఁగవ విన్ననయ్యెఁ;**

**ఆ. నేది కారణమున నెవ్వ రెచ్చోట నీ । కేమి కీ డొనర్చి రెట్టిపాటి**
**సాహసికులొ వారిఁ జంపుదు నొంపుదు । భంగపఱుతు నిడుమపఱుతుఁ జెఱుతు. 156**

**ప్రతిపదార్థం:** చేడియ= ఓ వనితా! (సైరంధ్రీ!); ధరణీ పరాగంబు= నేలమీది దుమ్మును; పొరసి= పొంది; ధూసరితము+ఐ= బూడిదరంగు కలదై; నీ మేను= నీ శరీరం; చెన్ను+తఱిఁగెన్= అందం కోల్పోయింది; చెలువ!= ఓ సైరంధ్రీ; చిత్తంబు తలపోఁతచేన్= మనసులోని చింతవలన; వాడు+పొదవినన్= వాడినందువలన; నీ నెఱ+మోము= నీ అందమైన ముఖం; చిన్నఁబోయెన్= కాంతిహీనమైనది; ఉగ్మలి!= ఓ సైరంధ్రీ!; ప్రస్వేదమునన్+తోఁగి= మిక్కిలి చెమటపోసి; ఫాలంబుతోన్+అంటి= నుదుటికి అంటుకొని; నీ కురులు= నీ కేశాలు; ఒప్పు కుందెన్= అందవిహీనాలైనవి; వెలఁది!= సైరంధ్రీ!; కన్నీరు= కన్నీరు; వఱ్ఱు+ఒడ్డి= ప్రవహించి; కాంతి+ఎంతయున్+కొన్న= కాంతి నంతటినీ తగ్గించటంచేత; నీ కనుఁగవ= నీ రెండు కళ్ళు; విన్నన్+అయ్యెన్= చిన్నబోయి ఉన్నాయి; ఏది కారణమున్= ఏ కారణంవలన; ఎవ్వరు, ఏ+చోటన్= ఎవరైనా, ఎక్కడైనా; నీకున్+ఏమి కీడు+ఒనర్చిరి?= నీ కేదైనా బాధ కలిగించారా?; ఎట్టిపాటి సాహసికులొ= వాళ్ళు ఎంతధైర్యవంతులో! ఐనప్పటికీ; వారిన్+చంపుదున్= వారిని నాశనం చేస్తాను; నొంపుదున్= బాధిస్తాను; భంగపఱతున్= అవమానం చేస్తాను; ఇడుమపఱుతున్= కష్టపెట్టుతాను; చెఱుతున్= నశింపచేస్తాను.

**తాత్పర్యం:** దుమ్ము అంటుకొని నీ శరీరం కాంతిహీనం అయింది. మనసులోని చింతచేత నీ ముఖం వాడి చిన్నవోయింది. చెమటకు తడిసి నీ ముంగురులు నుదురు కంటుకొనటంచేత అందంకోల్పోయి ఉన్నాయి. కన్నీరు కారి నీ కళ్ళు విలాసరహితంగా ఉన్నాయి. నీకు ఎవరైనా ఎక్కడైనా ఎప్పుడైనా అపకారం చేశారా? వారి కెంత ధైర్యం? వారిని చంపుతాను. అవమానాల పాలుచేస్తాను. కష్టాల పాలుచేస్తాను. రూపుమాపుతాను.

**వ. ఇత్తెఱంగు నాకుం జెప్పు 'మనిన 'నీ వెఱింగియు నెఱుంగమి భావించిన, నింక నే మని పలుకంగలదాన? నైనను విను' మని సైరంధ్రి యిట్లనియె. 157**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగు= ఈ సంగతి; నాకున్+చెప్పుము+అనినన్= నాకు చెప్పుమని అనగా; నీవు ఎఱింగియున్= నీకు తెలిసికూడా; ఎఱుంగమి భావించినన్= తెలియనట్లుగా భావిస్తే; ఇంకన్+ఏమని, పలుకన్+కలదానను?= ఇంక ఏమని చెప్పేది?; ఐనను వినుము+అని= ఐనా వినుమని; సైరంధ్రి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ఎట్లా జరిగిందో నాకు చెప్పు' మని అడుగగా సుదేష్ణను చూచి సైరంధ్రి ఇట్లా అన్నది. 'అన్నీ తెలిసీ, తెలియనిదానివలె నన్ను అడిగితే నే నింక ఏమని చెప్పగలను?

**మ. ' నను నీ వప్పుడు సూతమందిరమున న్మద్యంబుఁ దెమ్మన్నఁ బో**
**యిన నాతం డవినీతి సేసినను జేయీ కేను మత్స్యావనీ**
**శుని యాస్థానము దిక్కు వే చనిన నచ్చోఁ దీవ్రకోపంబున**
**న్వెనుకం గూడఁగ ముట్టి పట్టికొని తన్నెం బల్కు లింకేటికిన్?' 158**

**ప్రతిపదార్థం:** ననున్= (ద్రౌపదిని); ఈవు= నీవు సుదేష్ణ; అప్పుడు= ఆ సమయంలో; సూత మందిరమునన్= కీచకుడి ఇంటిలో; మద్యంబు తెమ్ము+అన్నన్= కల్లు తీసికొనిరమ్మని చెప్పగా; పోయినన్= వెళ్ళితే; ఆతండు= ఆ కీచకుడు; అవినీతి+చేసినను= దుర్మార్గపు పనిచేయగా; చేయి+ఈక= పట్టుకోనీక; ఏను= ద్రౌపదినైన నేను; మత్స్య+అవనీశుని+ఆస్థానము దిక్కు= విరాటరాజు కొలువువైపు; వే+చనినన్= త్వరగా వెళ్ళగా; అచ్చోన్= అక్కడ; తీవ్రకోపంబునన్= అధికమైన కోపంతో; వెనుకన్+కూడఁగన్+ముట్టి= వెంబడించి; పట్టికొని తన్నెన్= నన్ను పట్టుకొని తన్నాడు; పల్కులు+ఇంకన్+ఏటికిన్?= వేరే మాట లిం కెందుకులే.

**తాత్పర్యం:** 'అప్పుడు నీవు నన్ను సూతుడైన కీచకుడి ఇంటికి మద్యం తెమ్మని పంపగా నేను వెళ్ళాను. అప్పుడతడు అవినీతి పనిచేయబోగా, నే నతడికి అవకాశ మివ్వక విరాటరాజు కొలువువైపు పరుగుతీశాను. అతడు మిక్కిలి కోపంతో నా వెనుకనే వచ్చి నన్ను పట్టుకొని తన్నాడు. ఇంతకంటె నే నేమి చెప్పేది?'

**వ. అని యేర్పడం బలికిన. 159**

**తాత్పర్యం:** అని తెలిసేటట్లు చెప్పగా.

**ఉ. 'ఖేదము దక్కు మీ క్షణమ కీచకు దండితుఁ జేసి నీకు నా**
**హ్లాద మొనర్తు నే నని నయంబునఁ గేకయరాజపుత్రి య**
**త్యాదరవృత్తితో ననునయం బొనరించిన నయ్యసత్య సం**
**వాదిని పూన్కి పాండుసుతవల్లభ యాలము సేసి యిట్లనున్. 160**

**ప్రతిపదార్థం:** ఖేదము+తక్కుము= విచారించటం మానివేయి; ఈక్షణము+అ= ఇప్పుడే; నేను= నేను; కీచకున్ దండితున్+చేసి= కీచకుడిని దండించి; నీకున్+ఆహ్లాదము+ఒనర్తున్= నీకు (ద్రౌపదికి) సంతోషం కలిగిస్తాను; అని= అని పలికి; కేకయరాజపుత్రి= సుదేష్ణ; నయంబునన్= కోమలంగా, నెమ్మదిగా; అతి+ఆదరవృత్తితోన్= ఎంతో గౌరవంగా; అనునయంబు+ఒనరించినన్= ఓదార్చగా; ఆ+అసత్యసంవాదిని పూన్కి= ఆ అబద్ధాలకోరుప్రయత్నం; ఆలము+చేసి= లక్ష్యపెట్టకుండా; పాండుసుతవల్లభ= పాండవపత్ని ద్రౌపది; ఇట్లు+అనున్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** 'నీవు విచారం మానుము! ఆ కీచకుడిని దండించి నీకు సంతోషం కలిగిస్తానులే' అని సుదేష్ణ ఎంతో ఆదరంగా ఓదార్పు మాటలు పలికింది. ఆ అబద్ధాలకోరు మాటలను నిర్లక్ష్యం చేస్తూ ద్రౌపది ఇట్లా అన్నది.

**విశేషం:** సుదేష్ణ కావాలని కీచకుడి ఇంటికి సైరంధ్రిని పంపింది. కీచకుడు దుష్టుడు, నీచుడని తెలుసు. సైరంధ్రి పట్ల అగౌరవం ప్రదర్శించటం తన వంశానికే కళంకం అని సుదేష్ణకు తెలుసు. ఈ సందిగ్ధ పరిస్థితిని ఇక్కడ కవి చక్కగా వర్ణించాడు.

**క. 'నీ వింత యలుగ నేటికి? । నా వంతయుఁ బౌరజన మనఃఖేదము నొ**
**క్కావంత ద్రిక్కకుండఁ గ । లావంతులు మత్పతులు గలరు పగఁ దీర్పన్'. 161**

**ప్రతిపదార్థం:** నీవు= సుదేష్ణ; ఇంత+అలుగన్+ఏటికిన్= ఇంతగా కోపించట మెందుకు? (అవసరంలేదని భావం); నా వంతయున్= నా దుఃఖమూ; పౌరజనమనఃఖేదమున్= లోకుల మనస్సులోని దుఃఖమూ; ఒక్క+ఆవంత= కొంచెంకూడా; త్రిక్కకుండన్= విడవకుండా; కలావంతులు= సమర్థులు; మత్+పతులు= నా భర్తలు; పగన్+దీర్పన్+కలరు= పగ సాధించగలరు.

**తాత్పర్యం:** 'ఓ సుదేష్ణాదేవీ! నీవు అంతగా కోపపడవలసిన పనిలేదులే! నా కష్టాలను, లోకుల దుఃఖాన్నీ కించిత్తుకూడా మిగల్చకుండా పగదీర్చగల సమర్థులు నా భర్తలు ఉన్నారులే.'

**విశేషం:** ఇక్కడ వ్యంగ్యంగా కీచకుడిని మట్టుపెట్టటం త్వరలో జరగగలదని కవి సూచించాడు.

**క. అనిన సుదేష్ణయుఁ దత్పరి । జనములు వెఱఁబొంది యెన్ని సాంత్వనములు సె**
**ప్పినఁ దేఱద, మజ్జన భో । జనములకుం జొరద ద్రుపదసంభవ యెట్లున్. 162**

**ప్రతిపదార్థం:** అనినన్= ఆమె అట్లా అనగానే; సుదేష్ణయున్= సుదేష్ణయూ; తద్+పరిజనములున్= ఆమె పరిచారికలూ; వెఱన్+పొంది= భయపడి; ఎన్ని సాంత్వనములు= ఎన్ని రకాల ఓదార్పు మాటలు; చెప్పినన్= చెప్పినా; ద్రుపద సంభవ= ద్రౌపది; తేఱద= తేరుకోదు; ఎట్లున్= ఎన్నిరకాల యత్నించినా; మజ్జన= స్నానం చేయటానికీ; భోజనములకున్= అన్నం తినటానికీ; చొరదు= పూనుకొనదు.

**తాత్పర్యం:** ద్రౌపది మాటలకు సుదేష్ణ, ఆమె పరిచారికలూ భయభ్రాంతులయ్యారు. వారు ఎన్ని ఓదార్పు మాటలు చెప్పినా ద్రౌపది కోపం వదలలేదు. స్నానం చేయలేదు. అన్నపానాదులు ముట్టలేదు.

**విశేషం:** క్రియలమీద అవధారణార్థకం చేర్చి తేఱదు+అ, చొరదు+అ అని ప్రయోగించి తిక్కన ద్రౌపది దృఢ ప్రవృత్తిని, వేదన తీవ్రతను ధ్వనింపచేశాడు. (సంపా.)

**వ. అట్టియెడ సుదేష్ణసేయునది లేక నివ్వెఱఁగంది యుండెఁ; దక్కటి యంగనలును గీచకుని నీచత్వంబు దలంచి వాని చేటున కొడంబడిరి; పరిభవానల సంతప్తయైనపాంచాలి నిజశయనస్థానంబునకుం జని తల్పంబుపై మేను వైచి, యపాంగంబులం దొరంగు కన్నీరు చెవుల కొలంకులు నిండ నెవ్వగలు నివ్వటిలం దలపోయుచుండి. 163**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో సుదేష్ణ; చేయు+అదిలేక= చేసే దేమీ తోచక; నివ్వెఱఁగు+అంది+ఉండెన్= ఆశ్చర్యంతో చేష్టలుడిగి ఉండిపోయింది; తక్కటి అంగనలును= మిగతా స్త్రీలు కూడా; కీచకుని నీచత్వంబు+తలంచి= కీచకుడియొక్క అల్పత్వాన్ని మనసులో భావించి; వాని= అతడి యొక్క; చేటునకున్+ఒడంబడిరి= ముప్పునకు అంగీకరించారు; పరిభవ+అనలసంతప్త+ఐన= అవమానమనే అగ్నిచేత కాల్చబడిన; పాంచాలి= ద్రౌపది; నిజశయనస్థానంబునకున్= తన పడకటింటికి; చని= వెళ్ళి; తల్పంబుపైన్= పడకపై; మేను వైచి= నడుము వాల్చి; అపాంగంబులన్= కనుగొలకుల నుండి; తొరంగు కన్నీరు= వచ్చే కన్నీళ్ళు; చెవుల కొలంకులు, నిండన్= చెవులనే సరస్సులు నిండగా; నెఱ+వగలు= పెనుదుఃఖం; నివ్వటిలన్= కలుగగా; తలపోయుచున్+ఉండి= ఎన్నో ఆలోచనలు చేస్తూ.

**తాత్పర్యం:** అప్పుడు సుదేష్ణ చేసే దేమీ లేక అచ్చెరువుతో భయభ్రాంతురాలై ఊరక ఉండిపోయింది. మిగిలిన ఆడువారు కీచకుడి నీచస్వభావాన్ని తలచి, వాడికి తప్పక కీడు కలగటానికి మనసులలో అంగీకరించారు. ద్రౌపది అవమానాగ్నితో వేగిపోతూ పడకగదిలోకి పోయి పడకమీద నడుం వాల్చింది. అయినా, ఆమె కనుకొలకుల నుండి కన్నీరు ధారలుగా కారుతూ చెవులు అనే సరస్సులు నిండిపోతున్నాయి. హృదయం నుండి పెల్లుబుకుతున్న దుఃఖం అతిశయిస్తూ ఉండగా ఎన్నో ఆలోచనలు చేస్తూ ఉండింది.

**విశేషం:** 1. మేను వైచి- తెలుగు జాతీయం. శరీరాన్ని పక్కమీద పడేసి అని అర్థం. ఆ చర్య దుఃఖ వివశత్వాన్ని సూచిస్తుంది. కన్నీరు కనుకొలకుల నుండి జారి చెవులదొప్పలు నిండటం- అనే అవస్థ ఆమె ఆలోచనలో పడి ఒకే భంగిమలో చాలా సేపు ఉండిపోయిందని సూచన. భావి కార్య నిర్వహణకై ఆమె యోచించ నారంభించింది. (సంపా.)

2. కొన్ని ప్రతులలో ఈ క్రింది అధిక పాఠం కనపడుతున్నదని ఉ.వి. సంశోధిత మహాభారత ముద్రిత ప్రతిలో పాదసూచిగా ఇవ్వబడింది. "వాని చేటున కొడంబడిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె- అయ్యా! కీచకుం డేవంశంబునవాఁ డెవ్వం డనిన నమ్మునివరుం డా జనపతి కిట్లని చెప్పె - బ్రాహ్మణియందు క్షత్రియుని వలనం బుట్టినవాఁడు సూతుం డనంబరఁగుఁ; బ్రతిలోమజాతులలోన న(స)ద్విజుండనఁబరఁగి క్షత్రియునికంటె నించుక తక్కువయు, వైశ్యునికంటె నధికుండునై ప్రాతిలోమ్యంబున రాజసంబంధార్హుం డగునట్టి సూతువంశంబున సూతవిషయాధీశుండును రాజకన్యా సముద్భూతుండును నగు కీచకుం డనువాఁడు గలండు; వానికి మాళవియందు నూటయాఱ్వురు కీచకులు పుట్టి; రం దగ్రజుండు బలవంతుండై యుండి కేకయరాజపుత్రియగు తమ తల్లి చెలియలి కూఁతురైన సుదేష్ణకుం బరిచరించుచు విరాటనగరంబున నుండు; వాని తమ్ములు నూటయేవురును వానిన యనుసరించి యుండుదు రని యిట్లు సూతవంశ ప్రకారం బెఱింగించి యిట్లనియె; నంతం బరిభవానల..."

క. **'ప్రబలుం డారయ నా సిం। హబలుం; డాతని జయింప ననిలతనయు బా**
**హుబలంబ కూడఁ దగు; దై। వబలం బును నాతనికి నవశ్యముఁ గల్గున్.'** 164

**ప్రతిపదార్థం:** ఆరయన్= ఆలోచించి చూడగా; ఆ సింహబలుండు= ఆ కీచకుడు; ప్రబలుండు= చాల బలవంతుడు; ఆతనిన్= జయింపన్= వాడిని జయించడానికి; అనిలతనయు బాహుబలంబు+అ= భీముడి భుజబలమే; కూడన్+తగున్= సరితూగుతుంది; ఆతనికిన్= భీముడికి; దైవబలంబును= దైవశక్తికూడా; అవశ్యమున్+కల్గున్= తప్పక సిద్ధిస్తుంది.

**తాత్పర్యం:** 'ఆ కీచకుడు బలాఢ్యుడు. అతడిని జయించడానికి తగిన సమర్థుడు ఒక్క భీముడే. అతడి భుజబలశక్తికి తోడు దైవబలం కూడా తప్పక సమకూరుతుంది.'

**విశేషం:** 1. కీచకుడు సింహబల నామధేయుడు, ప్రబలుడు, అతడిది మృగరాజ బలమని ధ్వని. మరి భీముడు అనిలతనయుడు కావటంచేత దైవబలం, ప్రభంజనత్వం సహజసిద్ధం. విరోధులను సంహరించేటప్పు డతడిలో అతడి తండ్రి ఆవేశిస్తాడు. ఎన్ని శారీరక ఉపద్రవాలు వచ్చినా, రాక్షసులతో యుద్ధాలు వచ్చినా భీముడు ఎప్పుడూ విజయుడే - అని తర్కబద్ధంగా ప్రతివ్యూహాన్ని ఊహించింది ద్రౌపది. 2. ఈ పద్యానికి మారుగా ఈ క్రింది పద్యం ఒక ప్రతిలో కనపడుతున్నదని ఉ.వి. సంశోధిత మహాభారతం పేర్కొన్నది. **'తే. ప్రబలుఁ డారయ నా సింహబలుఁడు నతని, బరగ సమయింప ననిలజుబాహుబలము(ను), కాక యితరుల కలవియే ఘనుఁడ(డి)తండు, దైవబల మతనికి (క) నవశ్యంబు గలదు."** (ఈ పద్యంలోని నాల్గవ పాదంలో యతిమైత్రి లేదు.)

ద్రౌపది భీమసేనుతోఁ దన భంగపాటు సెప్పి పరితపించుట (సం.4-16-5)

**వ. ఇట్లూహించి రాత్రిసమయం బగుటయు, సమస్త జనంబులుఁ గ్రమంబున నిద్రింపం దొడంగినం దానును శయ్యాతలంబు విడిచి, మేని ధూళి గడిగి, ధౌత పరిధాన పరీతయై మహానస గృహంబున సుప్తుండైన వృకోదరు కడకుం జని. 165**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఊహించి= ఆలోచించి; రాత్రి సమయంబు= రాత్రివేళ; అగుటయున్= కావటం వలన; సమస్త జనంబులున్= అంతఃపురంలోని జనమంతా; క్రమంబునన్, నిద్రింపన్+తొడంగినన్= క్రమంగా నిద్ర కుపక్రమించగా; తానును= ద్రౌపది; శయ్యాతలంబు విడిచి= పడకనువదలి; మేని ధూళి+కడిగి= శీరరం పైనున్న దుమ్ము కడుగుకొని; ధౌతపరిధానపరీత+ఐ= ఉతికిన చీర కట్టుకొని; మహానస గృహంబునన్= వంటింటిలో; సుప్తుండు+ఐన= నిద్రిస్తున్న; వృకోదరుకడకున్+చని= భీముడి దగ్గరకు వెళ్ళి.

**తాత్పర్యం:** ఇట్లు ఆలోచించి, రాత్రి కావటం వలన జనులందరూ నిద్రలో మునుగగా ద్రౌపది పడకటిల్లు వదలి, శరీరంపై కమ్మిన దుమ్ము కడుగుకొని, ఉతికిన చీర కట్టుకొని, వంటింట్లో నిద్రపోతున్న భీముడి దగ్గరకు వెళ్ళింది.

**ఉ. 'నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము**
**న్నున్న తెఱంగు దప్పక సుఖోచిత శయ్యను నిద్ర సేయ నీ**
**కన్ను మొగుడ్చు నూఱటకుఁ గారణ మెయ్యది? భీమసేన! మీ**
**యన్న పరాక్రమంబు వలదన్న నొకో దయమాలి తక్కటా!' 166**

**ప్రతిపదార్థం:** భీమసేన!= ఓ భీమసేనా!; నన్నున్+పరాభవించి= నన్ను అవమానించి; సదనంబునకున్= ఇంటికి; చని= వెళ్ళి; కీచకుండు; మున్ను+ఉన్న తెఱంగు+తప్పక= ఇంతకు ముందున్న తీరు వదలక; సుఖ+ఉచితశయ్యను= మెత్తని పాన్పుపై; నిద్ర+చేయన్= హాయిగా నిద్రించగా; నీకన్నుమొగుడ్చు= నీవు నిద్రపోయే; ఊఱటకున్= నిశ్చింతకు; కారణము+ఏ+అది?= కారణమేమి?; అక్కటా!= ఔరా!; మీ+అన్న= ధర్మజుడు; పరాక్రమంబు= సాహసం; వలదు+అన్నన్+ఒకో= వద్దన్నందువలన కాబోలు; దయమాలితి(వి)?= నాపై దయచూపటం మానావు?

**తాత్పర్యం:** 'ఓ భీమసేనా! నన్ను అవమానించి కీచకుడు ఇంటికి వెళ్ళి హాయిగా ఇంతకుముందు వలె యథావిధిగా సుఖశయ్యపై నిద్రపోతుంటే, నీవు నిశ్చింతగా నిద్రపోవటానికి కారణ మేమిటి? అక్కటా! మీ అన్న ధర్మజుడు నీవు సాహసం చూపించటానికి ఇది తగిన సమయం కాదని చెప్పటం వలన కాబోలు, నీవు నాపై దయచూపటం లేదు'.

**విశేషం:** అలం: సంభావన. ప్రతిపదసార్థకమైన ధ్వనిమయ రచన ఇది. తనను అవమానించి కూడా కీచకుడు ఎటువంటి ప్రతిఘటననుగాని, కీడునుగాని పొందకుండా సుఖశయ్యమీద నిద్రపోవటం ద్రౌపది సహించలేకపోయింది. ఆమెకు పరాభవాగ్ని వలన రాత్రి నిద్రపట్టలేదు. ఆమెను రక్షించవలసిన, శత్రువును శిక్షించవలసిన భీముడు మాత్రం నిశ్చింతగా నిద్రపోతున్నాడు. శత్రువును నిద్రపోనిస్తున్నాడు. తనకొరకు మేల్కొని ఉండవలసిన భర్తలు నిశ్చింతగా నిద్రపోవటం, శత్రువు సుఖంగా ఉండటం అనే ఆ విపరీతస్థితిని చెప్పి అధిక్షేపిస్తూనే దానికి కారణాన్ని కూడా సంభావించింది. భీముడి నిశ్చింతకు కారణం ధర్మరాజు అతడి పరాక్రమాన్ని వారించటంగా ఊహించింది. ఇందులో భీముడిపై అధిక్షేపమూ ఉన్నది; దానికి తగిన కారణం ఉండటం వలన

సమర్థనీయమనే సాంత్వనమూ ఉన్నది. ద్రౌపది మాటలలో పృథక్పదత్వంతో కూడి శబ్దగుణ మాధుర్యమూ ఉన్నది. ఉక్తివైచిత్ర్యంతో కూడిన అర్థగుణమాధుర్యమూ ఉన్నది. పతిహృదయాన్ని తన కనుకూలంగా మార్చుకొనే నేర్పును మాధుర్య గుణ వ్యంజితం చేయటం సార్థకం. (సంపా.)

**వ. అనుచు మంద మంద సంభాషణంబుల సంబోధించు పాంచాలిపాణిస్పర్శంబున మేలుకని 'యిది యెవ్వ' రనవుడు? నే' నను నమ్మానిని యెలుంగెఱింగి భీమసేనుండు 'యాజ్ఞసేని కీచకు దురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించునదియై యరుగుదెంచెంగావలయు; నత్తెఱం గిత్తెఱవ దాన చెప్పవిందు' నని తలంచి. 167**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; మంద మంద సంభాషణంబులన్= మెల్లమెల్లని మాటలతో; సంబోధించు= పిలిచే; పాంచాలి= ద్రౌపది యొక్క; పాణిస్పర్శంబునన్= చేతి తాకుడుకు; మేలుకని= నిద్రలేచి; ఇది ఎవ్వరు= ఎవరది?; అనవుడున్= అనగా; నేను= నేను (ద్రౌపదిని); అను+అ+మానిని= అనే ద్రౌపది యొక్క; ఎలుంగు= గొంతు సవ్వడి; భీమసేనుండు= భీముడు; ఎఱింగి= గుర్తించి; యాజ్ఞసేని= ద్రౌపది; కీచకు దురాచరణంబు= కీచకుడు చేసిన అవినీతి; నాకున్+ప్రకటించి= భీమునికి తెలియజెప్పి; వానిన్ నిర్జింపన్= కీచకుడిని చంపటానికి; నియోగించునది+ఐ= ప్రేరేపించటానికై; అరుగుదెంచెన్+కావలయున్= వచ్చింది కాబోలు; ఆ+తెఱంగు= ఆ పద్ధతి; ఈ+తెఱవ= ఈ ద్రౌపది; తాన్+అ= తానే; చెప్పన్‌విందున్= చెప్పగా వింటాను; అని తలంచి= అని భావించి

**తాత్పర్యం:** అని మెల్లమెల్లగా మాట్లాడుతూ చేతితో తాకగా ద్రౌపది స్పర్శకు భీముడు మేల్కొని, ఎవరు? అని అనగా, నేనని ద్రౌపది బదులు పలికింది. కీచకుడి దుష్టకార్యాలను తెలిపి వాటిని మట్టుపెట్టటానికి తనను ప్రేరేపించటానికి వచ్చిందని భీముడు భావించాడు. ఆ సంగతి ఆమె నోటనే వినాలని అనుకొన్నాడు.

**విశేషం:** లోక సహజమైన విషయాన్ని ఇక్కడ తిక్కన చూపాడు. రాత్రిపూట సహజంగా భార్యాభర్తలు ఒకరి గొంతు ఒకరు పోల్చుకొనగలరు. 'నేను' అంటే చాలు. ఫలానా ద్రౌపదిని అని చెప్పనక్కరలేదు. అదే మాట అన్నది ద్రౌపది.

**తే. 'ఇంత ప్రొద్దేల యిచ్చోటి కేఁగుదేరఁ। గారణం బేమి? యెవ్వరుఁ గానకుండు**
**నట్లుగాఁ జనుదెంచితె యంబుజాక్షి !'। యనిన నయ్యింతి యిట్లను నతనితోడ. 168**

**ప్రతిపదార్థం:** అంబుజాక్షి!= ఓ ద్రౌపదీ!; ఇంతప్రొద్దు= ఇంత రాత్రివేళ; ఏల= ఎందుకు?; ఈ+చోటికిన్= ఇక్కడికి; ఏఁగు+తేరన్= రావటానికి; కారణంబు+ఏమి?= కారణమేమి?; ఎవ్వరున్+కానకుండునట్లుగాన్= ఎవరూ చూడకుండా; చను+తెంచితె?= వచ్చావా? అనినన్= అని భీముడనగా; ఆ+ఇంతి= ద్రౌపది; అతనితోడన్ ఇట్లు+అనున్= భీముడితో ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** 'ఓ ద్రౌపదీ! ఇంత ప్రొద్దుపోయిన తర్వాత ఇట్లా ఎందుకొచ్చావు? కారణమేమిటి? ఎవరూ చూడకుండా వచ్చావా?' అని భీము డనగా ద్రౌపది ఇట్లా పలికింది.

**విశేషం:** ద్రౌపది రాకకు కారణం భీము డిదివరకే ఊహించాడు. కాని, ఆమె నోటనే వినాలని ఈ ప్రశ్నలు వేశాడు. నడిరేయి రాకకూ, రహస్య భాషణకూ ఏదో రహస్యమైన కారణమే ఉండాలి. అయితే ఆమెరాకగానీ, ఆమెమాటలుగానీ మరెవ్వరికీ తెలియకుండా జాగ్రత్త వహించటం జరిగిందా? అని ప్రశ్నించి అజ్ఞాతవాస వ్రత స్పృహను ప్రకటించాడు భీముడు. (సంపా.)

**చ.** **'ఎఱిఁగి యెఱింగి నన్నడుగ నేమిటి? కప్పు డెఱింగి యింతకు**
**న్మఱచుట గల్గెనే, నది వినం బనిలే; దటుగాక యున్న రూ**
**పెఱిఁగియు నేన చెప్ప విన నిష్టము గల్గుట చాల లెస్స; య**
**త్తెఱఁ గెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటినుండియున్.** **169**

**ప్రతిపదార్థం:** ఎఱిఁగి+ఎఱింగి= తెలిసి తెలిసి; నన్నున్+అడుగన్+ఏమిటికిన్= నన్నడగటం దేనికి?; అప్పుడు= ఆ సమయంలో (కొలువు దగ్గర జరిగిన సంఘటన సందర్భంలో,); ఎఱింగి= తెలిసి; ఇంతకున్+మఱచుట= ఇంతలో మరచిపోవటం; కల్గెన్+ఏన్= జరిగివుంటే; అది వినన్+పనిలేదు= దానినిగూర్చి విన నవసరం లేదు; అటు+కాక= అట్లాకాక; ఉన్న రూపు+ఎఱిఁగియున్= ఉన్నదంతా తెలిసి కూడా; నేను+అ చెప్పన్+వినన్= నేనే చెప్పగా వినాలని; ఇష్టము+కల్గుట= ఇష్టపడటం; చాల లెస్స= చాలా బాగుంది; మొదలింటి నుండియున్= మొదటి నుండీ; ఆ తెఱఁగు= ఆ ప్రకారం; తెల్లముగాన్=సవిస్తరంగా; ఎఱిఁగించెదన్= వివరిస్తాను; వినుము= వినుము.

**తాత్పర్యం:** 'భీమసేనా! తెలిసి తెలిసీ నీవు నన్ను ఎందు కడుగుతావు? కొలువులో జరిగింది చూశావుకదా! ఇంతలోనే మరిచిపోతే నేను చెప్పపనిలేదు. నీవు విన నవసరం లేదు. అట్లాకాక ఉన్నదంతా నా నోటితో వినాలని ఉంటే సరే, తేటతెల్లంగా చెప్పుతాను విను.

**విశేషం:** 1. ద్రౌపది వివేకవతి - భీముడు తెలిసి తెలిసి కావాలని అడుగుతున్నాడని పసిగట్టింది. ఆమె గడుసరి. సూర్యోదయ సమయాన కొలువులో తెలిసికొన్న సంగతిని చంద్రోదయ సమయానికి మరచిపోయేవారికి జ్ఞాపకం చేసి కూడా ప్రయోజనం లేదులే అని ఎత్తిపొడిచింది. అది మరువరానిదని కూడా గూఢంగా హెచ్చరించింది. ద్రౌపది పరేంగితజ్ఞురాలు. ఎదుటివారి మనసును పసిగట్టగల సూక్ష్మబుద్ధి కలది. అందువలననే తన నోట స్వయంగా వినాలనే కోరికతో భీము డడుగుతున్నట్లుగా నిశ్చయించి విషయం తెల్లమయ్యేటట్లు చెప్పనారంభించింది.

2. తెల్లమయ్యేటట్లు చెప్పటమంటే - జరిగిన కథలోని వివరాల జోలికి పోకుండా తాత్పర్యం బోధనపడేటట్లు, ప్రధానాంశాలు వదలకుండా చెప్పటమన్నమాట. పునఃకథనంలో ఈ కథాకథన శిల్పాన్ని తిక్కన ప్రయోగిస్తున్నాడని సూచన.

3. విరాటుడి సభవద్ద ద్రౌపదికి కీచకుడివలన కలిగిన అవమానం భీముడికి తెలుసుకాని, దాని వివరాలు తెలియవు. ఆ సన్నివేశమే భీముడిలో రౌద్రాగ్నిని ప్రకోపింపచేసింది. దానిని ధర్మరాజు చల్లార్చాడు. ఆ కోపాగ్ని మరల ప్రజ్వలించబడాలి. అందుకు ద్రౌపదినోట కథనంతా భీముడు వినాలి. శత్రుకృత పరాభవ శ్రవణం- అందులోనూ అవమానిత అయిన అర్ధాంగి చెప్పగా వినటం, భీముడిలో శత్రుసంహార సమర్థమైన రౌద్రోద్రేకానికి సమర్థమైన కారణం కాగలదు. తిక్కన రసాభ్యుదయోల్లాస శిల్పంలో ఇదొక సంవిధానం. (సంపా.)

**చ.** **అధిపు మఱంది సింహబలుఁ డప్పకు మ్రొక్కఁగ వచ్చి నన్ను న**
**త్యధికమనోజ రాగ మతియై కనుఁగొంచుఁ గడంగి యెన్నియేన్**
**విధములఁ బల్కి నాకుఁ దన విన్నను వెల్లను జూపి చెప్పి మా**
**నధన విహీనతం జెనకినం గడునేవము పుట్టి యయ్యెడన్.** **170**

**ప్రతిపదార్థం:** అధిపుమఱంది= విరాటుని బావమరిది; సింహబలుఁడు= కీచకుడు; అప్పకున్ మ్రొక్కఁగన్+వచ్చి= అక్కకు నమస్కరించడానికి వచ్చి; నన్నున్= ద్రౌపదిని; అతి+అధికమనోజరాగమతి+ఐ= ఎక్కువైన మన్మథావేశంతో; కనుఁగొంచున్=

చూస్తూ; కడంగి= ప్రయత్నించి; ఎన్నియేన్ విధములన్+పల్కి= ఎన్నో రకాలుగా మాట్లాడి; నాకున్= ద్రౌపదికి; తన విన్ననువు= తన నేర్పరితనం; ఎల్లన్+చూపి= అంతా ప్రదర్శించి; చెప్పి= తననుగురించి తాను పొగడికొని; మానధనవిహీనతన్= సిగ్గులేకుండా; చెనకినన్= సమీపించగా; ఆ+ఎడన్= అక్కడ; కడున్+ఏవముపుట్టి= మిక్కిలి అసహ్యం కలిగి.

**తాత్పర్యం:** ఓ భీమసేనా! విరాటుడి బావమరిది కీచకుడు తన అక్క సుదేష్ణకు మ్రొక్కటానికి వచ్చి, నన్ను మదనావేశంతో చూస్తూ ఎన్నో రకాలుగా మాట్లాడి తన నేర్పరితనం చూపించి, పొగడికొని, సిగ్గులేకుండా నన్ను సమీపించాడు. అప్పుడు నాకు అసహ్యం కలిగింది.

**విశేషం:** 1. ఉ.వి. సం. ప్రతిలో "చూచి చెప్పి" అని ఉన్నది. దానికంటె "చూపి చెప్పి" అనే పాఠం పొసగుతుంది. కాబట్టి ఇక్కడ గ్రహించటమైనది. కీచక ప్రథమ సన్నివేశంలోని అంశాల నన్నింటిని బీరువోకుండా ఈ పద్యంలో సూచించింది. అవి- మదనాతిశయంతో చూడటం, ఎన్నో రకాలుగా విలాసంగా మాట్లాడటం, తన నేర్పరితనాన్ని చూపటం, పొగడుకొనటం. అంతటితో ఆగకుండా తాకటానికి దగ్గరికి రావటం-ఇవన్నీ మదనాతురుడు ప్రదర్శించే చేష్టలే. వాటన్నిటిలో సిగ్గులేనితనం కనబడింది ద్రౌపదికి. అందువలన ఆమెకు ఏవగింపు కలిగింది. కీచకుడు మదనాతురుడైనా, ద్రౌపది అతడిపట్ల ఏవగింపు ప్రదర్శించిందని తాత్పర్యం. భీముడికి కీచకుడి వర్తనం కోపాన్నీ, ద్రౌపది వర్తనం సానుభూతినీ కలిగిస్తాయి. (సంపా.)

**క. విడియం బలుకఁగ వెండియు । నుడుగక కీచకుఁడు మన్మథోన్మాదము ద**
**న్నడరిన న న్నడుగుటకుం । దొడరినఁ గోపించి వానితో నిట్లంటిన్. 171**

**ప్రతిపదార్థం:** విడియన్= నన్ను వదలిపోయేటట్లు; పలుకఁగన్= మాట్లాడగా; వెండియున్= మరల; ఉడుగక= వదలిపెట్టక; కీచకుఁడు; మన్మథ+ఉన్మాదము= మదనుని పిచ్చి; తన్నున్= కీచకుడిని; అడరినన్= అధికంగా ఆవహించగా; నన్నున్+ అడుగుటకున్= నన్ను కోరటానికి; తొడరినన్= ప్రయత్నించగా; కోపించి= కోపపడి; వానితోన్+ఇట్లు+అంటిన్= ఆ కీచకుడితో ఇట్లా అన్నాను.

**తాత్పర్యం:** అతడిని విదిలించినట్లు నేను మాట్లాడినా అతడు మత్తెక్కిన మదనావేశంతో నన్ను కామంతో కోరగా, వాడిమీద కోపించి నే నిట్లా అన్నాను.

**విశేషం:** వెనుక పద్యంలో ద్రౌపది కీచకుడు మనోజరాగమతితో వ్యవహరించిన తీరు చెప్పింది. ఈ పద్యంలో మదనోన్మాదావస్థను ప్రకటించిన విధం తెలిపింది. 'అడుగుట' అనే క్రియకు తెలుగులో కామకేళికి పిలవటం అనే అర్థం ఉంది. అది ఉన్మాదావస్థకు చిహ్నంగా చెప్పింది. (సంపా.)

**శా. దుర్వారోద్యమ బాహు విక్రమరసాస్తోక ప్రతాపస్ఫుర**
**ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతు**
**ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి గం**
**ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా! 172**

కీచకవధ ప్రయత్నం (ఈ పద్యానికి అర్థ తాత్పర్యాలు 55వ పద్యం వద్ద ఇవ్వబడ్డాయి.)

**విశేషం:** ఈ పద్యం కీచకుడిని బెదిరించటానికి అప్పుడు పలికింది. ఇప్పుడు కీచకుడి ముందు పాండవ ప్రతాపాన్ని కీర్తించిన పద్ధతిని భీముడికి తెలియజెప్పటమే కాక, 'ఇప్డు నిను దోర్లీలన్ వెసన్గిట్టి.. మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిన్' అని

తానన్న మాటలు నిజం చేయవలసిన అవసరం వచ్చిందని భీముడికి పరోక్షంగా సూచించటానికి అవే మాటలు తు-చ తప్పక పునరుక్తం చేయటం జరిగింది. ఇకముందు భీముడు కీచకవధప్రయత్నం చేస్తాడనీ, అందులో దుర్వార ఉద్యమం, బాహువిక్రమం, గర్వాంధ ప్రతివీరనిర్మథన విద్యా ప్రదర్శనం అనే దశలు స్ఫురిస్తాయని ధ్వని. (సంపా.)

**వ. అనిన విని వాఁడు గొన్ని ప్రల్లదంబులు పలికిన నేనునుం దత్కాలోచిత వచనంబులం ద్రోచిపుచ్చినం బోయెఁ; బదంపడి పాపాత్మయైన సుదేష్ణ తనకు మదిరారసంబు దేరం గీచక నివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక, యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద పెనంగ నొల్లక నా మనంబున నన్నెవ్వరికి నేమి సేయవచ్చు నని మీలావు నచ్చి సూతునింటికి సురకుం బోయిన. 173**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= అనగా విని; వాఁడు= కీచకుడు; కొన్ని ప్రల్లదంబులు= కొన్ని వదరుబోతుమాటలు; పలికినన్=పలుకగా; నేనునున్= నేనుకూడా; తద్+కాలోచిత వచనంబులన్= ఆ సమయానికి తగిన మాటలతో; త్రోచిపుచ్చినన్= త్రోసివేయగా; పోయెన్= పోయాడు; పదంపడి= మళ్ళీ; పాపాత్మ+ఐన= పాపిష్ఠిదైన; సుదేష్ణ తనకున్; మదిరారసంబు= కల్లు; తేరన్= తీసికొనిరమ్మని; కీచక నివాసంబునకున్= కీచకుడి ఇంటికి; నన్నున్+పనిచినన్= నన్ను పంపగా; పోవుటకున్+ఒడంబడక= పోవటానికి ఇష్టపడక; ఎన్ని చెప్పినన్= ఎన్ని కారణాలు చెప్పినా; అన్నింటికిన్+అన్ని+చెప్పి= అన్నిటికీ అన్ని విధాల అడ్డంకులు చెప్పి; నిర్బంధించినన్= బలవంతం చేయగా; పెద్ద పెనంగన్= చాలాసేపు ఘర్షణపడటం; ఒల్లక= ఇష్టం లేక; నా మనంబునన్= నా మనస్సులో; నన్నున్+ఎవ్వరికిన్+ ఏమిచేయవచ్చున్+అని= నన్ను ఎవరేమి చేయగలరనే ధైర్యంతో; మీలావు నచ్చి= మీ బలంపై నమ్మకంతో; సూతుని+ఇంటికిన్= కీచకుడి ఇంటికి; సురకున్= కల్లుతేవటానికి; పోయినన్= పోవగా.

**తాత్పర్యం:** కీచకుడు ఎన్నో రకాల వదరుబోతు మాటలు పలుకగా, నేను సమయోచితంగా మాట్లాడి త్రోసిపుచ్చాను. ఎట్టకేలకు అతడు మరలిపోయాడు. కాని, ఆ తరువాత పాపాత్మురాలైన ఆ సుదేష్ణ మాత్రం నన్ను కల్లు తెమ్మని కీచకుడి ఇంటికి పొమ్మని ఆజ్ఞాపించింది. నేను పోనని వాదించినా ఆమె వినలేదు. నే నెన్ని కారణాలు చెప్పినా, అన్నింటికీ ఆమె అడ్డంకులు చెప్పి బలవంతపెట్టింది. ఎక్కువగా ఘర్షణ పడటం బాగుండదని తలచి, నా మదిలో మీ బలసంపన్నతపై ఉన్న నమ్మకంతో, నన్ను ఎవ్వరూ ఏమీ చేయలేరని నిశ్చయించుకొని కీచకుడి ఇంటికి కల్లు తెద్దామని వెళ్ళాను.

**క. కొన్ని వెడమాట లాడుచు। నన్ను నతఁడు చెట్టవట్టినం ద్రోచి వెసం**
**జన్న వెనుకొనుటయును మీ। యున్నెడ కే నపుడు సంభ్రమోపేతగతిన్. 174**

**ప్రతిపదార్థం:** అతఁడు= కీచకుడు; కొన్ని వెడమాటలు+ఆడుచున్= కొన్ని అసందర్భపు మాటలు పలుకుతూ; నన్నున్= ద్రౌపదిని; చెట్ట+పట్టినన్= చేయిపట్టుకోగా; త్రోచి,వెసన్+చన్నన్= తొలగద్రోసి వెళ్లగా; వెనుకొనుటయును= వెంబడించగా; మీ+ఉన్న+ ఎడకున్= మీరున్నచోటికి; సంభ్రమ+ఉపేతగతిన్= వేగిరపాటుతో కూడిన నడకతో; ఏను+అపుడు= నేను (ద్రౌపది) అప్పుడు.

**తాత్పర్యం:** కీచకుడు కొన్ని అసందర్భపు మాటలాడుతూ నన్ను చేయిపట్టుకొనపోగా, నేను వాడిని తొలగద్రోసి పోసాగాను. వాడు నన్ను వెంబడించాడు. నే నప్పుడు వడివడిగా మీరున్న చోటికి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. పాఱుతెంచిన నక్కులపాంసనుండు। గోప మడరంగ వెనుకన కూడముట్టి;**
**నట యెఱుంగుదు వీవు; మీ యన్న పెద్ద। తనముఁ జూచితి; వేమందు ననిలతనయ! 175**

**ప్రతిపదార్థం:** పాఱుతెంచినన్= పరుగెత్తి రాగా; ఆ+కులపాంసనుండు= ఆ కులభ్రష్టుడు; కోపము+అడరంగన్= కోపం ఎక్కువకాగా; వెనుకన కూడముట్టెన్= వెంబడించి పట్టుకొన్నాడు; అట= అప్పటినుండి; అనిలతనయ!= భీమా!; నీవు+ఎఱుంగుదు(వు)= నీకు తెలుసు; మీ+అన్న= ధర్మజుడియొక్క; పెద్దతనము చూచితివి= గొప్పతనం చూచావు; ఏమందును?= ఇంక ఏమి చెప్పగలను?

**తాత్పర్యం:** నే నట్లా పరుగెత్తి రాగా ఆ కులభ్రష్టుడైన కీచకుడు నన్ను వెంబడించి వచ్చి పట్టుకొన్నాడు. ఆ సభలో ఏం జరిగిందో నీకు తెలుసు. మీ అన్న ధర్మజుడు చూపిన పెద్దతనం చూచావు. ఇంక అంతకన్నా ఎక్కువ ఏమి చెప్పగలను?

**విశేషం:** సభలో పెత్తనం నిర్వహించేవారు ఎట్లా ప్రవర్తిస్తారో, ధర్మానికి ఎట్లా విఘాతం కలుగుతుందో ద్రౌపది ఇక్కడ ఎత్తిపొడిచింది.

**ఉ.** **మీ సుభటత్వమున్ బలము మిన్నకపోవఁగ దుస్ససేనుఁ డ**
**ట్లా సభలోన నన్ బఱిచె; నంతియకాక జయద్రథుండు సం**
**త్రాసభరంబు లే కనుచితం బొనరించినఁ జెల్లిపోయె; నేఁ**
**డీ సభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్; వగ నాకు వింతయే!** **176**

**ప్రతిపదార్థం:** మీ సుభటత్వమున్= మీ పరాక్రమమూ; బలమున్= శక్తీ; మిన్నకపోవఁగన్= వమ్మయిపోగా; దుస్ససేనుఁడు= దుశ్శాసనుడు; అట్లు+ఆ సభలోనన్= ఆ విధంగా ఆ సభలో; నన్+పఱిచెన్= నన్ను అవమానించాడు; అంతియకాక= అంతేకాక; జయద్రథుండు= సైంధవుడు; సంత్రాసభరంబులేక= ఎట్టి భయం లేకుండా; అనుచితంబు+ఒనరించినన్= ఉచితంకాని పనిచేయగా; చెల్లిపోయెన్= చెల్లుబాటు అయింది; నేఁడు= ఈ రోజు; ఈ సభికుల్= విరాటుడి కొలువులో సభ్యులు(జూదరులని); కనుంగొనఁగన్= చూడగా; ఇట్లు+అయితిన్= ఈ విధంగా అయ్యాను; నాకున్= ద్రౌపదికి; వగ= దుఃఖం; వింతయే!= క్రొత్తగాదు కదా!

**తాత్పర్యం:** మీ బలపరాక్రమాలు వమ్మయిపోయాయా అన్నట్లు ధృతరాష్ట్రుడి కొలువులో దుశ్శాసనుడు నన్ను అవమానించాడు. అంతేకాక, సైంధవుడు నన్ను నిర్భయంగా అట్లా తీసికొని పోయి అనుచితం చేసినా చెల్లిపోయింది. ఈనాడు విరాటుడి కొలువులో సభాసదులందరూ చూస్తూ ఉండగా వీడు ఈ విధంగా చేశాడు. అయినా మిమ్ములను అనుకొని ప్రయోజనం లేదు. దుఃఖపడటం నాకీనాడు క్రొత్తగాదుగదా!.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ద్రౌపది జన్మించినదాది కష్టాల ననుభవిస్తున్నది. పాండవపత్ని అయినది మొదలు ఆమెకు కడగండ్లు చుట్టుముట్టాయి. దుశ్శాసనుడు నిండు కొలువులో వస్త్రాపహరణ ప్రయత్నం చేశాడు. భర్తలంతా చూస్తూ నిలుచుండిపోయారు. కృష్ణుడు రక్షించాడు. వనవాసకాలంలో సైంధవుడు ద్రౌపదిని నిర్భయంగా తీసికొని వెళ్ళాడు. పాండవులు విడిపించుకొని వచ్చారు. ఇన్ని అవమానాలకు తలదన్నేటట్లు ఈనాడు నీచకీచకుడు భర్తలూ, సభ్యులూ చూస్తుండగా తన్నాడు. కాని, పాండవులు అజ్ఞాతవాస భయంతో సభలో ఏమీ చేయలేకపోయారు. 'వగనాకు వింతయే' - అనే సామాన్యాంశంచేత విశేషాంశం సమర్థించబడింది. కాబట్టి అర్థాంతరన్యాసాలంకారం.

**ఆ.** **అకట! యాఁడుకూయు నాలకూయును లాఁతి। వారికైన నరయవలయు ననిన**
**నన్నుఁ గీచకుండు దన్నంగ నెట్టులు। సూడ నేర్చె ధర్మసూనుఁ డపుడు.'** **177**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; ఆఁడుకూయున్= ఆడదాని ఏడుపును; ఆలకూయును= ఆవుల అరుపును; లాఁతివారికైనన్= పరులకైనా; అరయన్+వలయు+అనినన్= గమనించి రక్షించాలి అని లోకంలో ప్రసిద్ధి ఉండగా; నన్నున్= ద్రౌపదిని; కీచకుండు+అపుడు= అప్పుడు కీచకుడు; తన్నంగన్= తన్నగా; ధర్మసూనుఁడు= ధర్మజుడు; ఎట్టులు+చూడన్‌నేర్చెన్?= ఎట్లా చూడగలిగాడు?

**తాత్పర్యం:** స్త్రీరోదనాన్నీ, గోమాత అరుపునూ విన్నప్పుడు పరాయివారైనా వారిని పట్టించుకొని రక్షించటం లోకపరిపాటి. అట్లాంటిది ఆ సభలో కీచకుడు నన్ను తన్నగా చూచి ధర్మజుడు చూస్తూ ఎట్లా ఉండిపోయాడు?'

**విశేషం:** భర్తల సమక్షంలో అవమానాన్ని పలుమార్లు పొందటం భరించరానిదిగా ఉన్నదని ద్రౌపది భావం.

**వ. అనిన విని యతం డిట్లనియె. 178**

**తాత్పర్యం:** ఆ మాటలు విని భీము డిట్లా అన్నాడు.

**ఉ. 'కీచకుఁడట్లు మీఁదు పరికింపక నిన్నుఁ బరాభవింపఁగాఁ**
**జూచి మహోగ్రకోప వివశుండగు నన్నును జూచి ధైర్య హే**
**మాచలుఁడైన ధర్మసుతుఁ డమ్మెయి వారణ సేయకున్న నే**
**నీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గు సేసినన్. 179**

**ప్రతిపదార్థం:** కీచకుఁడు; అట్లు మీఁదు పరికింపక= ఆ విధంగా క్రిందుమీదులు చూడక; నిన్ను పరాభవింపఁగాన్+చూచి= ద్రౌపది నవమానించటం చూచి; మహా+ఉగ్రకోపవివశుండు+అగు= అధికమైన కోపావేశంతో ఉన్న; నన్నును+చూచి= భీముడిని చూచి; ధైర్యహేమ+అచలుఁడు+ఐన= ధైర్యంలో మేరుపర్వత సమానుడైన; ధర్మసుతుఁడు= ధర్మరాజు; ఆ+మెయిన్= ఆ విధంగా; వారణచేయక+ఉన్నన్= నివారించనిచో; నేన్= భీముడు; నీచతన్= హీనంగా; వానిన్= కీచకుడినీ; మత్స్యవిభునిన్= విరాటుడినీ; పరివారమున్= సేనలనూ; నుగ్గుచేసినన్= మట్టుపెట్టినట్లయితే.

**తాత్పర్యం:** 'కీచకుడు క్రిందు మీదులు చూడకుండా ఆ విధంగా నిన్ను పరాభవించటం చూచి కోపావేశంతో ఒడలు తెలియని నన్ను చూచి, ధైర్యంలో మేరుపర్వత సమానుడైన ధర్మజుడు నన్ను అడ్డుపెట్టకపోతే కీచకుడిని, విరాటుడిని, అతని సేనలను నేను మట్టుపెట్టి ఉండేవాడిని.

**విశేషం:** ధర్మరాజును నిర్దయుడిగా చిత్రించింది ద్రౌపది. అది పరిభవ వేదన వలననే కావచ్చును. 'మీ అన్న పెద్దతనము' అని ఎత్తిపొడిచింది. దానికి భీము డిచ్చిన సమాధాన మిది. భార్యను పరిభవించిన కీచకుడిని ఒకవైపు చూచాడు ధర్మరాజు, ఆ దృశ్యాన్ని చూచి మహోగ్రకోపవివశుడైన భీముడిని మరొక వైపు చూచాడు. మొదటి దృశ్యం చూచి భీముడివలె ధర్మజుడూ కోపావేశంతో విజృంభించి ఉండాలి. భీముడి ఆవేశాన్ని చూచి అభినందించి ఉండాలి. కాని, అతడు మేరుపర్వతంవలె స్థిరచిత్తుడై ఉండిపోయాడు. స్థైర్యాన్ని పర్వతంతో పోల్చి చెప్పటం కవిసమయం. పర్వతాలలో శ్రేష్ఠమైనది మేరుపర్వతం కాబట్టి ధీరులలో అగ్రగణ్యుడు ధర్మజుడని భీముడి భావం. (సంపా.)

**వ. ఆ సంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల నెఱింగిరయేని. 180**

**ప్రతిపదార్థం:** ఆ సంరంభంబునన్= ఆ సంక్షోభంలో; సమయభంగంబు+కాన్= అజ్ఞాతవాస ప్రతిజ్ఞ చెడిపోగా; జనంబులు= లోకులు; మనలన్+ఎఱింగిరి+అ+ఏని= మనలను కనిపెడితే.

**తాత్పర్యం:** ఆ ఉద్రిక్త పరిస్థితిలో అజ్ఞాతవాస ప్రతిజ్ఞావాస ప్రతిజ్ఞాపాలన వమ్మయిపోయి, లోకులు మనలను గుర్తిస్తే, (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ముందటి భంగిన కానల। యందుఁ జరింపంగ వలదె? యది నీవును నే**
**నుం దెచ్చిన యాపదగా। నిందింపరె యెల్లవారు నీరజనయనా! 181**

**ప్రతిపదార్థం:** నీరజనయనా!= పద్మాక్షీ, ద్రౌపదీ!; ముందటిభంగిన్+అ= ఇంతకుముందువలెనే; కానల+అందున్= అరణ్యాలలో; చరింపంగవలదె!= తిరగాలికదా!; అది= ఆ స్థితి; నీవును నేనున్= నీవూ నేనూ; తెచ్చిన= తెచ్చిపెట్టిన; ఆపదకాన్= ఇబ్బందిగా; ఎల్లవారు= అందరూ; నిందింపరు+ఎ?= ఆడిపోసుకోరా?

**తాత్పర్యం:** ఓ ద్రౌపదీ! అట్లా చేసి ఉంటే ఇంతకు ముందువలె మళ్ళీ అరణ్యవాసం చేయవలసి వచ్చేది. అది నీవూ నేనూ కలిసి కల్పించిన ఆపదగా జనులందరూ నిందించరా?

**విశేషం:** పంచపాండవులలో భీముడు ఉద్ధతుడు. అతడి వలన ఏదో ఒక ఆపద వస్తుందని లోకులు అనుకొనటం పరిపాటి. మాటపడకుండా చూచుకొనాలని భీముడి తపన.

**వ. కావున సత్యవ్రత నిష్ఠుండగు యుధిష్ఠిరుండు పొగడ్తకుం దగువాఁడుగాని దూఱువడ నర్హుండుగాఁ' డని వెండియు నిట్లనియె. 182**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; సత్యవ్రత నిష్ఠుండు+అగు= ఆడిన మాటకు కట్టుబడి ఉండే; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; పొగడ్తకున్= ప్రశంసకు; తగువాఁడు+కాని= అర్హుడే కాని; దూఱు+పడన్= నింద పడటానికి; అర్హుండు+కాఁడు= తగడు; అని వెండియున్= అని మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆడిన మాటలకు లోబడి ఉండే స్వభావం గల ధర్మరాజు ప్రశంసాపాత్రుడేకాని, నిందార్హుడు కాడు' అని భీముడు మరల ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** ధర్మరాజు వర్తనానికి మూలకారణం అతడి సత్యవ్రత నిష్ఠయే అని భీముడి వ్యాఖ్య. (సంపా.)

**క. 'పరిభవకరుఁడగు కీచకుఁ। బరిమార్చుట యిపుడు గడవఁబడియెనె? యిమ్మై**
**దురపిల్ల నేల? వ్రేల్మిడిఁ । బొరిగొని నీ మనము కలఁక పుత్తు లతాంగీ! 183**

**ప్రతిపదార్థం:** లతాంగీ!= తీగవంటి కోమలమైన శరీరం కలదానా, ద్రౌపదీ!; పరిభవకరుఁడు+అగు= అవమానం కలిగించిన; కీచకున్= కీచకుడిని; పరిమార్చుట= చంపటం; ఇపుడు= ఇప్పుడు; కడవన్+పడియెనె?= దాటిపోయిందా?; ఈ+మెయిన్= ఈ విధంగా; దురపిల్లన్+ఏల?= బాధపడట మెందుకు?; వ్రేల్మిడిన్= వెంటనే; పొరిగొని= చంపి; నీ మనము= నీ మనస్సులోని; కలఁకపుత్తున్= దుఃఖాన్ని పోగొట్టుతాను.

**తాత్పర్యం:** 'ద్రౌపదీ! నిన్ను అవమానించిన కీచకుడిని మట్టుపెట్టటం ఇప్పటికైనా మించిపోలేదు. ఈ విధంగా నీవు బాధపడ నవసరం లేదు. నేను వెంటనే వాడిని చంపి నీ మనస్సులోని చింతను పోగొట్టుతాను.

**విశేషం:** ఓదార్పు మాటలు చెప్పటంలో ఇట్లా సహజంగా జరుగుతుంది. 'ఇప్పు డేం మించిపోయింది? రెండు నిమిషాలలో నీ పని పూర్తి చేస్తా'నంటే ఎదుటివారికి ఊరట కలుగుతుంది. భీము డదే చేశాడు.

**వ. మనల నెవ్వరు నెఱుఁగకుండునట్టి తెఱంగు తలపోయవలయుఁగాక, పగతుని భంజించుట యెంతపని?' యనిన విని యా మానిని యిట్లనియె. 184**

**ప్రతిపదార్థం:** మనలను= పాండవులను; ఎవ్వరున్+ఎఱుఁగక+ఉండు+అట్టి= ఎవ్వరూ గుర్తుపట్టని; తెఱంగు= ఉపాయం; తలపోయవలయున్+కాక= ఆలోచించాలిగాని; పగతునిన్= శత్రువును; భంజించుట= చంపటం; ఎంతపని?= సులభమే; అనినన్; విని; ఆ మానిని= ద్రౌపది.

**తాత్పర్యం:** మనలను లోకులు గుర్తించని రీతిలో ఉపాయం ఆలోచించాలికాని, శత్రువును మట్టుపెట్టటం ఒక లెక్కలోనిది కాదు' అని భీముడు పలుకగా ద్రౌపది ఇట్లా అన్నది.

**క. 'గొంతికి నంత వెఱవ, మీ । కంత వెఱవ, దైవమునకు నంత వెఱవ, న**
**త్యంత కలుషాత్మ విరటుని । కాంతకు నే వెఱతుఁ బనులు గావించునెడన్. 185**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; గొంతికిన్= కుంతికి, అత్తగారికి; అంత వెఱవన్= అంత భయపడను; మీకున్+అంత వెఱవన్= పతులైన మిమ్ములను చూచి భయపడను; దైవమునకున్+అంత వెఱవన్= దేవుడికి కూడా అంత భయపడను; అతి+అంతకలుషాత్మ= మిక్కిలి నీచస్వభావురాలైన; విరటుని కాంతకున్= సుదేష్ణకు; పనులు కావించు+ఎడన్= సేవలు చేసేటప్పుడు; వెఱతున్= నేను భయపడతాను.

**తాత్పర్యం:** 'నా జీవితంలో నేను అత్తగారైన కుంతికి భయపడలేదు. పతులైన మీకు భయపడలేదు. చివరకు ఆ దైవానికి కూడా భయపడలేదు. కాని, దురాత్మురాలైన సుదేష్ణకు సేవలు చేస్తూ అమితంగా భయపడుతున్నాను.

**విశేషం:** అత్తకు, పతులకు, దైవానికి కూడా భయపడవలసిన అవసరం రాలేదు. కాని, ఈనాడు సుదేష్ణ కొలువు భయంకరమని భావన.

**చ. కినుకకుఁ జాల కెంతయును గీడ్పడి నా పడుపాటులెల్ల వ**
**మ్మునఁ గలయంగ నిట్టు లొక మూర్ఖునిచేఁ దుదిఁబోయి కోలుపో**
**యెనె యభిమానమ న్వగపు నేడ్తెఱ డెందము కొందలంబుఁ బొం**
**దిన ధృతి మాలి యేఁ బలికితిం దగవెల్ల నెఱింగియుండియున్. 186**

**ప్రతిపదార్థం:** కినుకకున్+చాలక= కోపగించటానికి అవకాశం లేక; ఎంతయును+కీడ్పడి= ఎన్నో అవమానాలు భరించి; నా పడుపాటులు+ఎల్లన్= నేను అనుభవించిన కష్టాలన్నీ; వమ్మునన్+కలయంగన్= వ్యర్థమైపోగా; తుదిన్+పోయి= చివరకు పోయి పోయి; ఇట్టులు+ఒక= ఈ విధంగా ఒక; మూర్ఖునిచేన్= నీచుడైన కీచకుడిచేత; అభిమానము= పరువు; కోలుపోయెనె?= నశించిందా? అను, వగపు= అనే దుఃఖంయొక్క; ఏడ్తెఱన్= అతిశయంతో; డెందము= హృదయం; కొందలంబున్+పొందినన్= కలత చెందగా; ధృతిమాలి= ధైర్యాన్ని కోల్పోయి; తగవు+ఎల్లన్= న్యాయమంతా; ఎఱింగి+ఉండియున్= తెలిసికూడా; ఏన్+పలికితిన్= నేను మాట్లాడాను.

**తాత్పర్యం:** కోపతాపాలు తెలుపుకొనే వీలు లేక ఎన్నో అవమానాలను భరించి నేను పడే పాట్లన్నీ వ్యర్థమైపోగా, చివరకు మూర్ఖుడైన ఈ కీచకుడి వలన ఆత్మగౌరవం కోల్పోవలసి వచ్చిం దనే దుఃఖంతో మంచీ చెడూ తెలిసినదానినైనా మనసు కలత చెందటం చేత ఇట్లా అన్నానుగాని, ధర్మరాజు గొప్పతనం తెలియనిదానిని కాను.

**విశేషం:** ఆత్మగౌరవం కోల్పోయే అవమానం కలిగినప్పుడు ఎంతటి వివేకవంతులైనా విజ్ఞతను కోల్పోయి మాట్లాడటం సహజం. అయితే, ఉత్తములు తమ పొరపాటు తెలిసికొని వెంటనే తమను తాము సరిదిద్దుకొంటారు. ద్రౌపది దానికి ఉదాహరణం.(సంపా.)

ద్రౌపది భీమునితో ధర్మరాజు మహిమ చెప్పుట (సం.4-17-15)

**వ. ఇట్టిద కాని సమస్త జనస్తవనీయుండగు పాండవాగ్రజు నిక్కంబ నిందించినదానం గా 'నని పలికి మఱియును. 187**

**ప్రతిపదార్థం:** ఇట్టిది+అకాని= అంతేకాని; సమస్త జనస్తవనీయుండు+అగు= జనులందరిచేతా ప్రశంసించబడే; పాండవ+అగ్రజున్= ధర్మరాజును; నిక్కంబు+అ= నిజంగా; నిందించిన దానన్+కాను= నిందించలేదు; అని పలికి; మఱియును.

**తాత్పర్యం:** ఇంతేకాని, జనులందరి చేత కీర్తించబడే ధర్మరాజును నిజంగా నిందించేదానిని కాను' అని పలికి ఇంకా ఇట్లా అన్నది.

**క. 'ధర్మతనూభవు సంతత । ధర్మనిరతి మనము బ్రదుకఁ దలఁచుట యరుదే?**
**నిర్మలుఁ డగు నాతని స । త్కర్మంబునఁ గాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్. 188**

**ప్రతిపదార్థం:** ధర్మతనూభవు= ధర్మరాజు యొక్క; సంతతధర్మనిరతిన్= నిత్యధర్మదీక్షచేత; మనము= పాండవులు; బ్రదుకన్+తలఁచుట= బ్రతకాలనుకొనటం; అరుదే!= అబ్బురమా?; నిర్మలుఁడు+అగు= నిష్కల్మషుడైన; ఆతని సత్కర్మంబునన్+కాదె= ఆయన మంచి పనుల వలననేకదా; ధాత్రికిన్+ఎల్లన్= లోకానికంతా; బ్రతుకుకాదె?= మనుగడకదా!.

**తాత్పర్యం:** 'ఆ ధర్మరాజు ధర్మదీక్షవలన సమస్త జగత్తు రక్షించబడుతున్నది. ఆ ధర్మం వలనే పాండవులమైన మనం బ్రతకాలనుకొనటం సహజమే కదా!

**విశేషం:** విశ్వాన్ని ధరించేది ధర్మం. ఆ ధర్మమే మూర్తికట్టినవాడు ధర్మరాజు. ప్రపంచమే అతడి ధర్మనిరతితో బ్రతుకుతూ ఉంటే పాండవులు కూడా ఆ ధర్మ ప్రభావంతోనే బ్రతుకుతున్నా రనటంలో ఆశ్చర్య మేముంది? (సంపా.)

**సీ. చనునె వేఱొకని కజాతశత్రుండను । పేర దిగ్విజయంబు పెంపు దాల్ప?**
**రాజసూయ మహాధ్వరముఁ గోరి చేయంగఁ । దీరునే పెఱధరిత్రీపతులకు?**
**ధర్మైకనిరతుఁ డాతం డొక్కరుఁడ చూవె । యనఁ జన నొరులకు నలవి యగునె?**
**నిత్యవ్రతంబుగా సత్యంబు పాటింప । వచ్చునె యొరుల కెవ్వరికి నైన?**

**తే. నయ్యుధిష్ఠిరు గాంభీర్య మతనిధైర్య । మరయ నొండెడఁ గలుగునె? యతఁడు కీర్తి**
**ధరుఁడు కరుణోత్తరుఁడు మహీసుర సమృద్ధి । కరుఁడు నిజవంశకరుఁ డుపకారపరుఁడు. 189**

**ప్రతిపదార్థం:** అజాతశత్రుండు+అనుపేరన్= పుట్టని శత్రువులు కలవాడు అనే పేరుతో; దిగ్విజయంబు= అన్ని దిక్కులను జయించి; పెంపు+తాల్పన్= అతిశయించటం; వేఱు+ఒకనికిన్= మరొకరికి; చనునె?= సాధ్యమా?; రాజసూయ మహా+అధ్వరము= రాజసూయం అనే గొప్ప యజ్ఞాన్ని; పెఱ ధరిత్రీపతులకున్= ఇతర రాజులకు; కోరి చేయంగన్= కావాలని చేయటానికి; తీరునే?= వీలుపడుతుందా? ధర్మ+ఏకనిరతుండు= ధర్మదీక్షకలవాడు; ఆతండు+ఒక్కరుఁడు+అ చూవె= ఆయన ఒక్కడేకదా; అనన్+చనన్=

అనటానికి; ఒరులకున్= ఇతరులకు; అలవి+అగునె?= సాధ్యపడుతుందా?; నిత్యవ్రతంబుకాన్= అనుదినం దీక్షగా; సత్యంబు= సత్యాన్ని; ఎవ్వరికిన్+ఐనన్= ఎవరికైనా; ఒరులకున్= ఇతరులకు; పాటింపవచ్చునె?= పాలించసాధ్యమా; ఆ+యుధిష్ఠిరు గాంభీర్యము= ఆ ధర్మజుడి గంభీరస్వభావం; అతని ధైర్యము= ఆయన సాహసం; అరయన్= చూడగా; ఒండు+ఎడన్+కలుగునె?= మరొకచోట ఉంటుందా?; అతఁడు కీర్తిధరుఁడు= అతడు ఖ్యాతిని చక్కగా ధరించినవాడు; కరుణా+ఉత్తరుఁడు= దయాగుణంచేత శ్రేష్ఠుడు; మహీసుర సమృద్ధికరుఁడు= బ్రాహ్మణులకు సంపదను కలిగించేవాడు; నిజవంశకరుఁడు= తన వంశానికి కీర్తి తెచ్చేవాడు; ఉపకార పరుఁడు= ఉపకారం చేసేవాడు.

**తాత్పర్యం:** అజాతశత్రుడనే బిరుదం కలిగి ఉండి కూడా దిగ్విజయం చేసి కీర్తికెక్కటం ధర్మరాజుకు తప్ప వేరొకరికి సాధ్యమౌతుందా? రాజసూయ మహాయజ్ఞాన్ని కోరి నిర్విఘ్నంగా నిర్వహించటం మిగిలిన భూపతులకు శక్యమౌతుందా? ధర్మాచారపరాయణుడని కీర్తించటానికి అత డొక్కడే తగినవాడుకాని, ఇతరుల కది వీలవుతుందా? సత్యవ్రతాన్ని నిత్యంగా పాటించటం అతడివలె ఇతరుల కెవ్వరికైనా సాధ్యమౌతుందా? ఆ ధర్మరాజుకున్న గాంభీర్యం, ధైర్యం మరొకరిలో ఎక్కడైనా కానవస్తాయా? అతడు యశస్వి, కరుణామయుడు, బ్రాహ్మణ హితకరుడు, చంద్రవంశకీర్తికరుడు, ఉపకారపరుడు.

**విశేషం:** అలం: ఉదాత్తం. ఎత్తుగీతిలో ధీరోదాత్త నాయక లక్షణాలు పేర్కొనబడ్డాయి. సీసపద్య పాదాలలో ఉదాత్త నాయకులందరిలో శ్రేష్ఠుడైన మహానాయకుడి లక్షణాలు చెప్పబడ్డాయి. ధీరుడంటే కష్టాలను సహించేవాడు. ఉదాత్తుడంటే తనను తాను పొగడుకొనని వాడు. దయామయుడు. హర్షశోకాదులచేత అభిభూతుడు కానివాడు. అంతేకాక గంభీరుడు, మహాసత్త్వుడు, దృఢవ్రతుడు, గూఢమానము కలవాడని లాక్షణికులు చెప్పారు. ఈ లక్షణాలన్నీ ఎత్తుగీతిలో ప్రస్తావించబడ్డాయి. ఈ లక్షణాలన్నీ ధర్మరాజు చరిత్రలో సంభవిల్లిన నాలుగు విలక్షణాంశాలలో ధ్వనించబడుతున్నాయి. దిగ్విజయం చేసి కూడా అజాతశత్రు వనిపించుకొన్న మహాసత్త్వుడు. రాజసూయం చేయటం వలన వచ్చే ఫలితాలను గురించి తెలిసి కూడా పితృతృప్తి కొరకు సాహసంతో చేసిన ధీరుడు. ధర్మాచరణం వలన కలిగే కష్టనిష్ఠురాలను ఎదురొడ్డి నిలిచిన గంభీరుడు. సత్యవ్రతాన్ని నిత్యంగా పాటించటం వలన ఎన్ని ఆపదలు వచ్చినా ఆ వ్రతాన్ని వీడని దృఢవ్రతుడు - ఆయా గుణాలలో అతడికంటె ఘనుడు మరొక్కడు లేడని అతడి ఔదాత్త్యాన్ని ఉదాత్తాలంకారంలో చెప్పటం సార్థకం. (సంపా.)

**క. కలిమికి నొప్పగు నీఁగియు, । బలిమికిఁ దొడవైన యట్టి బలఁగమునై లో**
**కులచిత్తములకు వ్రేఁగగు । కొలఁది మన న్గొంతి పెద్దకొడుకున కమరున్. 190**

**ప్రతిపదార్థం:** కలిమికిన్= సంపదకు; ఒప్పు+అగు= తగిన; ఈఁగియున్= దానగుణమూ; బలిమికిన్= బలానికి; తొడవు+ఐన+ అట్టి= అలంకారప్రాయమయిన; బలఁగమున్+ఐ= పరివారం కలవాడై; లోకుల చిత్తములకున్= జనుల హృదయాలకు; వ్రేఁ గు+అగు కొలఁదిన్= అబ్బురమైన (పట్టనంత) పరిమితిచేత; మనన్= ప్రవర్తించటానికి; గొంతి పెద్దకొడుకునకున్= ధర్మరాజునకు; అమరున్= సాధ్యపడుతుంది.

**తాత్పర్యం:** తనకున్న సంపదకు తగినట్లుగా దానం చేస్తూ, శౌర్యానికి తగ్గట్లు సహాయ సంపత్తులూ బలగమూ కలిగి లోకుల హృదయాలు పట్టనంతగా ఆనందం కలిగించే ప్రవర్తన కొనసాగించటం ఆ ధర్మరాజుకే చెల్లింది.

**విశేషం:** ధనం దానం వలన ఫలిస్తుంది. శౌర్యం సహాయ సంపత్తులతో ప్రకాశిస్తుంది. ఆ రెండింటినీ సాధించిన రాజులు ప్రజల హృదయాలను చూరగొంటారు. ధర్మరాజు అటువంటివారిలో అగ్రగణ్యుడు. (సంపా.)

**సీ.** **ఎవ్వని వాకిట నిభమదపంకంబు । రాజభూషణ రజోరాజి నడఁగు;**
**నెవ్వని చారిత్ర మెల్ల లోకములకు । నొజ్జయై వినయంబు నొఱవుఁ గఱపు;**
**నెవ్వని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి । మానిత సంపద లీనుచుండు;**
**నెవ్వని గుణలత లేడు వారాసుల । కడపటి కొండపైఁ గలయఁబ్రాఁకు;**

**తే.** **నతఁడు భూరిప్రతాప మహాప్రదీప । దూర విఘటిత గర్వాంధకారవైరి**
**వీర కోటీరమణి ఘృణివేష్టితాంఘ్రి । తలుఁడు కేవల మర్త్యుఁడె ధర్మసుతుఁడు!** 191

**ప్రతిపదార్థం:** ఇభమద పంకంబు= ఏనుగుల మదజలం వలన నేల తడిసి ఏర్పడిన బురద; ఎవ్వని వాకిటన్= ఎవరి వాకిటి ముందు; రాజభూషణ= రాజులయొక్క అలంకారాల రాపిడివలన రాలిన; రజోరాజిన్= దుమ్ము సముదాయంచేత; అడఁగున్= అణగుతుందో; ఎల్లలోకములకున్= సమస్త లోకాలకు; ఎవ్వని చారిత్రము= ఎవని నడవడి; ఒజ్జ+ఐ= గురుత్వం వహించి; వినయంబున్+ఒఱవున్= వినయంయొక్క పద్ధతిని; కఱవున్= నేర్పుతుందో; ఎవ్వని కడకంటన్= ఎవరి కనుకొనలలో; నివ్వటిల్లెడుచూడ్కి= ప్రసరించే చూపు; మానితసంపదలు= అధిక సంపదలు; ఈనుచుండున్= కలిగిస్తూ ఉంటుందో; ఎవ్వని గుణలతలు= ఎవరి గుణాలనే తీగలు; ఏడువారాసుల= ఏడు సముద్రాల; కడపటికొండపైన్= చివరనున్న చక్రవాళ పర్వతంపై; కలయన్+ప్రాఁకున్= బాగా అల్లుకొంటుందో; అతఁడు= ఆయన; భూరిప్రతాప= గొప్ప పరాక్రమమనే; మహాప్రదీప= గొప్పదీపంచేత; దూరవిఘటిత= దూరంగా పారదోలబడిన; గర్వాంధకార= గర్వమనే చీకటి కల; వైరివీర= శత్రురాజుల; కోటీర= కిరీటాలలో; మణిఘృణి= రత్నకాంతులచేత; వేష్టిత= చుట్టబడిన; అంఘ్రితలుఁడు= పాదాలు (అడుగులు) కలవాడు; ధర్మసుతుఁడు= ధర్మజుడు; కేవల మర్త్యుఁడె?= సామాన్య మానవుడా? (కాదని భావం).

**తాత్పర్యం:** ఎవరి ముంగిట్లో మదపుటేనుగుల శరీరాలనుండి కారే మదజలధారలవలన ఏర్పడిన బురదను ఆయనను సేవించటానికి వచ్చే మహారాజుల అలంకారాల ఒరపిడివలన రాలిన ధూళి రాజిఅనే దుమ్ము అణచివేస్తుందో అట్టి ధర్మరాజు సామాన్య మానవుడా? ఎవరి ఉత్తమ ప్రవర్తన లోకాల కన్నింటికీ ఆదర్శమై (గురువై) వినయ వర్తనానికి ఒరవడి పెట్టుతుందో అట్టి ధర్మరాజు సామాన్య మానవుడా? ఎవరి కటాక్ష వీక్షణం గొప్ప సంపదలను కలుగజేస్తుందో, అటువంటి ధర్మరాజు సామాన్య మానవుడా? ఎవరి సుగుణాలనే తీవెలు సప్తసముద్రాలు దాటి చక్రవాళ పర్వతం మీదకు కలయప్రాకుతాయో అట్టి ధర్మరాజు సామాన్య నరుడా? ఎవరి మహాపరాక్రమమనే పెద్ద దీపం శత్రువుల గర్వమనే అంధకారాన్ని దూరంగా పారద్రోలుతుందో, ఎవరి పాదాలు శత్రువీరుల కిరీటాలలోని రత్నకాంతులతో సదా ఆవరింపబడి వెలిగిపోతూ ఉంటాయో అటువంటి ధర్మరాజు కేవలం మానవుడా? (కాడు-దివ్యమానవ సదృశుడని భావం.)

**విశేషం:** అలం: ఉదాత్తం. రాజభూషణ రజోరాజిన్ అనే సమాసానికి రాజులు ధరించే అలంకారాల రాపిడి వలన ఏర్పడిన రత్నాల పొడి సమూహమని అర్థం. ఆ రాజులు మహారాజులు. వారు ఎన్నో అభరణాలు ధరిస్తారు. వారు ధర్మరాజును ఒకరి నొకరు తోసుకుంటూ రావటం వలన రాపిడికి లోనై నుగ్గునుగ్గై ధూళిగా అయి ఆ పంకాన్ని అణచివేస్తాయి. దీనివలన ఆ రాజులయొక్క మహత్త్యమూ, వారి అపరిమిత సంఖ్యా, వారి అభరణాల విరివీ, ధర్మరాజుదర్శనం కొరకు వారు పడే తహతహా ఇవన్నీ వ్యజ్యమానమౌతాయి. 'ధర్మరాజు శాంతమూర్తి' అనే కీర్తి లోకంలో వ్యాప్తి చెందింది. అది అతడి వినయపద్ధతి. ఆ పద్ధతికి ఆయనే ఆదర్శంగా లోకం చెప్పుకొంటుంది. అతడు చక్రవర్తి. అర్థులు అతడిని ఆశ్రయించినప్పుడు కడకంటితో చూస్తే చాలు,

అర్థులకు మహనీయసంపద లభిస్తుంది. అత డంతటి దయామయుడైన దాత. అతడి సుగుణాలు సప్త సముద్రాలు దాటి లోకాంతరాలకు వ్యాపించాయి. అతడి ప్రతాపానికి రాజులందరూ తలలు వంచారు. వారు అతడికి నమస్కారాలు చేస్తున్నప్పుడు వారి కిరీటమణికాంతులతో అతడి పాదాలు వెలిగిపోతుంటాయి. **'నా విష్ణుః పృథివీపతిః'** అని న్యాయం, పృథివీపతు లెందరో తన పాదాలమీద పడి సేవించే ధర్మరాజు ఎవడు? అనే ప్రశ్న ఏర్పడుతుంది. అతడు కేవల మర్త్యుడు మాత్రం కాడు - అనే సమాధానం మాత్రం సత్యం. (సంపా.)

**ఉ. అట్టి మహాత్ముఁ డొక్కనికి నాశ్రితుఁడై వెడకూడుఁ జీరయుం**
**బెట్టఁగ నిల్చి వాని మది ప్రీతికి నీడగువృత్తిఁ బేరునుం**
**బుట్టును మాలి యిప్పు డిటు బ్రుంగుడుపాటునఁ బొందఁ జూచి నా**
**కెట్టు మనంబు వట్టు? ధృతి యెమ్మెయిఁ దూలక నిల్చుఁ? జెప్పుమా! 192**

**ప్రతిపదార్థం:** అట్టి మహాత్ముఁడు= ఆ విధమైన మహానుభావుడు (ధర్మజుడు); ఒక్కనికిన్= ఒక రాజునకు (అనామకునకు అనిర్వని) అందుకే పేరు చెప్పలేదు; ఆశ్రితుఁడు+ఐ= ఆశ్రయించినవాడై; వెడకూడు= అల్పమైన భోజనం; చీరయున్+పెట్టఁగన్= కట్టుబట్టలు ఇవ్వగా; నిల్చి= వాడివద్ద సేవకుడుగా కుదిరి; వానిమది ప్రీతికిన్= అతడి మనస్సుకు సంతోషం కలిగించటానికి; ఈఁడు+అగువృత్తిన్= తగినవర్తనం పాటిస్తూ; పేరునున్+పుట్టును మాలి= పేరూ, పుట్టుకా వదలి; ఇప్పుడు+ఇటు= ఇప్పు డిట్లా; బ్రుంగుడుపాటునన్+పొందన్= మరుగున పడిపోవటం; చూచి; నాకున్; మనంబు+ఎట్టు+పట్టున్?= ఎట్లా మనస్కరిస్తుంది; ధృతి= ధైర్యం; ఏ+మెయిన్= ఏ విధంగా; తూలక నిల్చున్?= చలించదో; చెప్పుమా!= నీవే చెప్పుము.

**తాత్పర్యం:** ఆ విధమైన మహితాత్ముడైన ధర్మజుడు సాధారణ వ్యక్తివలె ఒక రాజు వద్ద కూడూ అల్పమైన గుడ్డ కొరకు పరిచర్యలు చేయటం, పేరూ, వంశప్రతిష్ఠా, కులగౌరవం వదలి గోప్యంగా ఉండిపోవటం చూస్తే ధైర్యం చలించి, మనస్సు వికలమౌతున్నది. నాకు మిక్కిలి దుఃఖం కలుగుతున్నది.

**విశేషం:** రోజులు బాగా లేనపుడు తలవంచక తప్పదని ఈ కథ చెప్పుతున్నది.

**ఉ. నీ వలమూపులావు మును నేల వహించిన నాగకూర్మ గో**
**త్రావనిభృద్దిశాకరుల కారయ నూఱటపట్టు గాదె? సం**
**భావన భూజనంబులకుఁ బండువు గాదె? మహోగ్ర కోప రే**
**ఖావిభవంబు వైరులకుఁ గాలము చేరువ గాదె పావనీ! 193**

**ప్రతిపదార్థం:** పావనీ!= పవనపుత్రుడవైన ఓ భీమా!; ఆరయన్= పరిశీలించగా; నీ వలమూపులావు= నీ కుడిభుజబలం; మును= పూర్వం; నేలన్+వహించిన= భూభారాన్ని మోసిన; నాగ, కూర్మ, గోత్ర+అవనిభృత్= ఆదిశేషువు, తాబేలు, కులపర్వతాలకు; దిశాకరులకు= దిగ్గజాలకు; ఊఱటపట్టు+కాదె= ఊరటకు స్థానం కాదా?; సంభావన= నీవు గౌరవించటం; భూజనంబులకున్= లోకులకు; పండువు కాదె?= పండుగ కాదా?; మహా+ఉగ్రకోపరేఖావిభవంబు= మిక్కిలి భయాన్ని కొలిపే నీ కోప పరిపూర్ణత అనెడి సంపద; వైరులకున్= శత్రువులకు; కాలము చేరువు+అకాదె= కాలం మూడటమేకదా!

**తాత్పర్యం:** ఓ భీమసేనా! నీ కుడిభుజపు బలపరాక్రమం చూచి ఇంతకుముందు భూభారం మోపిన ఆదిశేషువు, ఆదికూర్మం, ఏడుకులపర్వతాలూ, ఎనిమిదిదిగ్గజాలూ ఊరటపొందాయి. నీవు గౌరవంగా చూడటం లోకానికి పండుగ ఔతుంది. నీవు కోపంతో మహోగ్రమైన స్వరూపాన్ని వహిస్తే శత్రువులకు కాలం మూడినట్లేకదా!

**విశేషం:** అలం: అతిశయోక్తి. ఇక్కడ భూభారాన్ని ఆదిశేషుడు మోస్తూ ఉండటమనే పురాణగాథ ప్రస్తావించబడింది. అట్లాగే దశావతారాలలో ఒకటైన కూర్మావతారరూపంలో శ్రీవిష్ణువు భూ భారాన్ని మోశాడని గాథ. భూమిని సప్తకుల పర్వతాలూ, ఎనిమిది దిక్కులలో అష్టదిగ్గజాలూ మోస్తాయని ప్రతీతి. ఇక్కడ ఆ పురాణ గాథలు ఆధారంగా ద్రౌపది భీముడి భుజబలాన్ని ప్రశంసిస్తున్నది. పొగడ్తలకు లొంగనివాడు లేడు. అందులో భీముడూ ఒక భాగమే.

**తే.** **బక హిడింబ కిమ్మీరుల బాహుబలము। నా జరాసంధు నుగ్రదర్పాతిశయము**
**లోకభీకరములు విజయాకరములు। నైన నీ కరములకు లోనయ్యెఁ గాదె !** **194**

**ప్రతిపదార్థం:** బక= బకాసురుడియొక్క; హిడింబ= హిడింబాసురుడియొక్క; కిమ్మీరుల= కిమ్మీరుడియొక్క; బాహుబలమున్= భుజశక్తి; ఆ జరాసంధు= జరాసంధుడియొక్క; ఉగ్రదర్ప+అతిశయము= భయంకరమైన గర్వాధిక్యమూ; లోకభీకరములు= జనానికి భయాన్ని కలిగించేవి; విజయ+ఆకరములున్= జయాన్ని చేకూర్చేవి; ఐన; నీ కరములకున్= నీ చేతులకు; లోనయ్యెన్+ కాదె!= లోకువయినవికదా!

**తాత్పర్యం:** లోకాలకు భయాన్నీ, విజయాలనూ కలిగించే నీ చేతులకు బక, హిడింబ, కిమ్మీరుల బాహుబలాలు, జరాసంధాదుల భయంకర గర్వాతిశయాలు లొంగిపోయాయి కదా!

**విశేషం:** భీముడు తన చేతి మీదుగా బకాసురుడిని చంపాడు. హిడింబుడిని మట్టుపెట్టాడు. కిమ్మీరుడిని అంతమొందించాడు. జరాసంధుడిని చీల్చి వేశాడు. ఇవి అన్నీ ఆయన భుజ పరాక్రమానికి సాక్షులు. వాటిని వరుసగా గుర్తు చేసింది ద్రౌపది.

**ఆ.** **అట్టి నీవు వంటకట్టియలకు లావు। సూపుచుండ నెపుడుఁ జూచి చూచి**
**వగతు; నదియుఁగాక తగవేది యమ్మత్స్య। మేదినీశ్వరుఁడు వినోదములకు** **195**

**ప్రతిపదార్థం:** అట్టి నీవు= అంతటి బలసంపన్నుడవైన నీవు; వంటకట్టియలకున్= వంటకట్టెల కొరకు; లావు+చూపుచున్+ఉండన్= బలప్రయోగం చేస్తుంటే; ఎపుడున్+చూచిచూచి, వగతున్= నిత్యం పెక్కుసార్లు చూస్తూ ఎంతో బాధపడుతుంటాను; అదియున్+కాక= అంతేకాక; తగవు+ఏది= న్యాయం తప్పి; ఆ మత్స్యమేదినీ+ఈశ్వరుఁడు= ఆ విరాటరాజు; వినోదములకున్= ఆహ్లాదం కొరకు.

**తాత్పర్యం:** అంతటి బలసమన్వితుడవైన నీవు నీ భుజబలాన్ని వంటకట్టెలు విరచటానికి వినియోగించటం నిత్యం చూచి దుఃఖపడుతూ ఉంటాను. అంతేకాక. ధర్మం తప్పి, ఆ విరాటరాజు తన వినోదాల కొరకు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** వలలుడు బలం కలవాడు కాబట్టి అతడిని ఇతరమృగాలపైకి మల్లురపైకి పంపుతాడు విరాటుడు. అది హింసాత్మక చర్య అని ద్రౌపది గర్హిస్తున్నది.

**మ.** **మహిష వ్యాఘ్ర గజాది సత్త్వ చయమున్, మల్లవ్రజంబుం గృపా**
**రహితుండై యెదు రొడ్డుచున్ వరుసఁ బోరంజూచు నిన్నెప్పుడున్;**
**మహనీయంబగు నీ శరీరము జగన్మాన్యంబు; నీచక్రియా**
**విహితం బైన కుజీవనంబు విధి గావించెం గటా దీనికిన్'.** **196**

**ప్రతిపదార్థం:** కృపారహితుండు+ఐ= (విరటుడు) దయమాలి; మహిష= దున్నపోతులు; వ్యాఘ్ర= పెద్దపులులు; గజ+ఆది= ఏనుగులు మొదలైన; సత్త్వచయమున్= జంతువుల సముదాయమునూ; మల్లవ్రజంబున్= జెట్టీల గుంపునూ; ఎదురు+ఒడ్డుచున్= నీకు ఎదురుగా నిలబెడుతూ; వరుసన్= వరుసగా; పోరన్= నీవు వారలతోపోరాటం చేస్తూ ఉండగా; ఎప్పుడున్+నిన్నున్= ఎప్పుడూ నిన్ను; చూచున్= (వినోదంగా) చూస్తూ ఉంటాడు; మహనీయంబు+అగు= గొప్పదైన; నీ శరీరము= నీ మేను; జగత్+మాన్యంబు= లోకం ప్రశంసించదగింది; విధి= దైవం; నీచక్రియా విహితంబు+ఐన= నీచమైన పనులు చేయటానికి అనువయిన; కుజీవనంబున్= చెడు ప్రవృత్తిని; దీనికిన్= నీదేహానికి; కావించెన్+కటా!= ఏర్పరచాడు కదా!

**తాత్పర్యం:** (విరాటుడు) దున్నపోతులు, పెద్దపులులు, ఏనుగులు మొదలైన జంతువులతోను, జెట్టీలతోను నిర్దయగా పోటీలు పెట్టి నీచేత ఎదుర్కొనేటట్లు చేసి ఆడిస్తుంటాడు. లోకులు మెచ్చుకొనే నీ శరీరం ఇట్లా నీచపుపనులకు తలొగ్గటం విధి కావించిన దుష్క్రియ కాక మరేమిటి?'

**విశేషం:** రాజుల వినోదాలు రకరకాలు. కొందరు జూదమాడుతారు. విరాటుడు ధర్మరాజుతో ఆడేవాడు. మరికొందరు నాట్యం చూస్తారు. అర్జునుడు ఆ విద్య చూపేవాడు. మల్లురతోను, క్రూరమృగాలతోను బలాఢ్యులకు పోటీలు పెట్టి రాజులు వినోదించేవారు. విరాటుడు వలలుడిని అందుకు వినియోగించుకొనటం విధి వైపరీత్యం. ద్రౌపది బాధ ఇదే. అయితే, భీముడి చేత అటువంటి వినోదాలు చేయించవచ్చునని సూచించింది ధర్మరాజే. అజ్ఞాతవాస వ్రతకాలంలో అతడు శరీర వ్యాయామంలో వెనుకపడకుండా ఉండటానికి ధర్మజుడి పన్నాగ మది. ఆ రహస్యం తెలియని ద్రౌపది బాధపడడంలో ఆశ్చర్యం లేదు.

**వ. అని మఱియు నిట్లనియె 'వివేకహీనుండగు విరాటుండు నిన్నుంబోరించునప్పుడు నిజాంతఃపురకాంతలకు వినోదంబు సేయ వారల రావించిన నేనును సుదేష్ణతో నరుగుదెంచి చూచుచుండుదు; నయ్యవసరంబున. 197**

**ప్రతిపదార్థం:** వివేకహీనుండు+అగు= తెలివిలేనివాడైన; విరాటుండు; నిన్నున్+పోరించునప్పుడు= నీచేత యుద్ధం చేయించేటప్పుడు; నిజ+అంతఃపురకాంతలకున్= తన అంతఃపురస్త్రీలకు; వినోదంబు+చేయన్= ఆహ్లాదం కలిగించటానికి; వారలన్= వారిని; రావించినన్= రప్పించగా; నేనును; సుదేష్ణతో; అరుగుదెంచి= వచ్చి; చూచుచుండుదున్= చూస్తూ ఉంటాను; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** తెలివిమాలినవాడైన ఆ విరాటుడు నీచేత జంతువులతో పోరాడింపచేసేటప్పుడు అంతఃపురకాంతలను కూడా వినోదం కొరకు పిలిపించేవాడు. సుదేష్ణాదులతో పాటు నేనూ వచ్చి నిన్ను చూస్తూ ఉండే దానిని. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** వివేకహీనుడని విరాటరాజును పేర్కొనటం సాభిప్రాయం. ఆనాడు మల్లయుద్ధాలు అంతఃపురస్త్రీలకు వినోదాన్ని కలిగించటానికి కూడా ఏర్పాటు చేసేవారు.

**క. భరమున నీ పోరెడు నెడఁ । బరమ విషాదంబు, నీవు బలిమి మెఱసి యు**
**ద్ధురవృత్తి జయము గొనినం । బరితోషముఁ బొందు నన్ను భావించి మదిన్. 198**

**ప్రతిపదార్థం:** భరమునన్= కష్టంతో; నీ పోరెడు+ఎడన్= నీవు పోరాడే సమయంలో; పరమవిషాదంబు= అధిక దుఃఖాన్నీ; నీవు బలిమి మెఱసి= నీవు పరాక్రమం అతిశయించగా; ఉద్దుర వృత్తిన్= దృఢమైన ప్రవర్తనతో; జయము+కొనినన్= విజయం సాధిస్తే; పరితోషమున్+పొందు= సంతోషించే; నన్నున్= నన్ను (ద్రౌపదిని); భావించి= తలంచి; మదిన్= మనస్సులో.

**తాత్పర్యం:** ఓ భీమసేనా! నీవు మల్లయుద్ధాలలో కష్టపడుతున్నప్పుడు నేను పొందే దుఃఖాన్నీ, నీవు బలాన్ని ప్రౌఢంగా ప్రదర్శించి జయం సాధించినపుడు నేను పొందే సంతోషాన్నీ గమనించి, నన్ను గురించి ఆలోచిస్తూ మనస్సులో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** భర్తపడుతున్న ఆవేదననూ, ఆవేశాన్నీ చూచి దుఃఖాన్నీ, హర్షాన్నీ పొందటం స్త్రీలకు సహజం. అవి ఇతరులకు తెలిసిపోయేవి.

**వ. ఊహించి సుదేష్ణయుఁ దత్పరిజనంబులుం దమలోన. 199**

**ప్రతిపదార్థం:** ఊహించి= ఊహచేసి; సుదేష్ణయున్; తత్+పరిజనంబులున్= అక్కడి పరిచారికలు కూడా; తమలోనన్=తమలోతాము.

**తాత్పర్యం:** అట్లా ఊహచేసి సుదేష్ణా, అక్కడి పరిజనాలూ తమలో తాము. (తరువాతి పద్యంతో సమన్వయం).

**క. 'వలలుని దెస మాలినిచూ। డ్కుల తెఱఁ గెడపొందుఁ దెలిపెడుం గంటిరె! వీ**
**రలు వచ్చిన సమయంబును। దలఁపఁగ నొక్కటియ యివ్విధం బెట్లొక్కో! 200**

**ప్రతిపదార్థం:** వలలునిదెసన్= భీముడివైపు; మాలినిచూడ్కు= సైరంధ్రి చూపులయొక్క; తెఱఁగు= పద్ధతి; ఎడపొందున్+తెలిపెడున్= ప్రేమను ప్రకటిస్తున్నాయి; కంటిరె?= చూచారా?; వీరలు= వీరిద్దరు (భీముడు-ద్రౌపది); వచ్చిన సమయంబును= కొలువులోకి వచ్చినవేళ; తలఁపఁగన్+ఒక్కటియ= ఆలోచిస్తే ఒకటే; ఈ+విధంబు+ఎట్లొక్కో!= ఇది ఎట్లా జరిగిందో గదా!

**తాత్పర్యం:** 'ఈ వలలుడిని సైరంధ్రి చూచే చూపుల తీరు మనసు కలిసిన జాడ తెలియజేసేదిగా ఉన్నది. మనకొలువులోకి వీరిద్దరూ ఒకే సమయంలో రావటం కూడా జరిగింది. ఈ తీ రేమిటో ఆశ్చర్యంగా ఉన్నది.'

**వ. అనుచుం గలదు లేదని పెక్కు విధంబులం దలపోసి గుజగుజలు పోవుచుండుదు రట్టియెడ. 201**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; కలదు, లేదు+అని= ఉందీ, లేదు అని; పెక్కువిధంబులన్= అనేక రకాలుగా; తలపోసి= ఆలోచించి; గుజగుజలు పోవుచుండుదురు= గుసగుసలు ఆడుతుంటారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని అంటూ తల కొక రకంగా ఆలోచిస్తూ, ఔను కాదని వాదించుకొంటూ, గుసగుసలాడుకొంటూ ఉంటారు. అప్పుడు.

**తే. మరగి నీమూర్తిపైఁ గన్ను మనముఁ దగిలి। యుండ నేమఱియుండి యొక్కొక్కమాటు**
**తలఁచికొని వారిదెస మది నిలుపు నప్పు। డెఱుఁగనగు వారు నా తెఱఁ గెఱుఁగుటెల్ల. 202**

**ప్రతిపదార్థం:** నీమూర్తిపైన్= నీ ఆకారంపై; మరగి= ఆసక్తికలిగి; కన్నున్= చూపూ; మనమున్= మనస్సూ; తగిలి+ఉండన్= లగ్నమై ఉండగా; ఏమఱి+ఉండి= మైమరచి ఉండి; ఒక్కొక్కమాటు= ఒక్కొక్కసారి; తలఁచికొని= ఆలోచించి; వారిదెసన్=

పరిచారికలవైపు; మది నిలుపునప్పుడు= చూపుత్రిప్పినపుడు; వారు= పరిచారికలు; నా తెఱఁగు+ఎఱుఁగుట+ఎల్లన్= నా ప్రవర్తన అంతా గమనించటం; ఎఱుఁగన్+అగున్= తెలుస్తుంది.

**తాత్పర్యం:** నా చూపులూ, మనస్సూ నీమీద ఆసక్తితో లగ్నమై ఉండగా ఒడలు మరచి ఉండేదానిని. మధ్య మధ్య ఒక్కొక్కసారి నా స్థితిని నేను తలచుకొంటూ వారివైపు చూచేదానిని. అప్పుడు వారు నన్ను గమనిస్తున్న తీరును తెలిసికొనేదానిని.

**విశేషం:** అప్రయత్నంగా భీముడి ఆకారాన్ని అనురాగపూరిత నయనాలతో ద్రౌపది చూడటం స్వభావం. ప్రేమలో పడ్డవారికి ఎదుటివారు తమను గమనిస్తారని అనుకోరు. లోక సహజమైన భావాన్ని కవి ఇట్లా ఎత్తి చూపాడు.

**వ. కావున మదీయ పరిభవాతిరేకంబునకు నీ వుద్రేకించిన జనంబులు మనల భేదింతురు; నీకుం బోలిన భంగి రహస్యభంగంబు గాకుండ నరిభంగంబు సేయు' మని వెండియు. 203**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; మదీయ పరిభవ+అతిరేకంబునకున్= నాకు కలిగిన అవమానాతిశయానికి; నీవు+ఉద్రేకించినన్= నీవు విజృంభిస్తే; జనంబులు= లోకులు; మనలన్ భేదింతురు= మనలను సులభంగా గుర్తు పట్టివేస్తారు. నీకున్+పోలినభంగిన్= నీకు అనువైన విధంగా; రహస్య భంగంబు+కాకుండన్= అజ్ఞాతవాస సమయం బయటపడకుండా; అరిభంగంబు= శత్రువును చంపటం; చేయుము= చేయుము; అని= అని చెప్పి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** నేను పొందిన అవమానభారానికి కోపపడి నీవు నిజంగా విక్రమిస్తే లోకులు మనలను ఇట్టే పోల్చుకొనగలరు. కాబట్టి, నీ కనువైనవిధంగా మన రహస్యవర్తనం బయటపడకుండా, శత్రువును చంపాలి' అని ద్రౌపది చెప్పి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. తొడరిన హరునైన దోర్బలంబునఁ దన్ను, మిగులంగనీఁడను మేటి మాట,**
**యమరేంద్రు నర్ధాసనమునకు నైన న, ర్హుం డెంతయును నను రూఢిమాట,**
**జము నిల్లు సొచ్చిన జంతువు నైనను, గాచు నెమ్మెయి నను రాచమాట,**
**తనుఁ గోరి యూర్వశి దాన వచ్చిన నైన, లోలుండు గాఁడను మేలిమాట.**

**తే. శౌర్యవైభవ ప్రాభవ శౌచములకు, నొరులకైనఁ గైవారమై యుల్లసిల్లు**
**నొక్కరుని కివి యెల్లను నిక్కమట్టె !, యెందుఁ గలుగునె యర్జును నీడువాఁడు ? 204**

**ప్రతిపదార్థం:** తొడరిన= ఎదుర్కొనిన; హరున్+ఐనన్= శివుడినైనా; దోస్+బలంబునన్= భుజశక్తితో; తన్నున్ మిగులంగన్+ఈఁడు= తనను మించిపోనీడు; అను మేటిమాట= అనే గొప్పమాట; అమరేంద్రు+అర్ధ+ఆసనమునకున్+ఐనన్= ఇంద్రుడి సగం సింహాసనానికైనా; ఎంతయునున్= ఎంతైనా; అర్హుండు= సమర్థుడు; అను రూఢిమాట= అనే గట్టిమాట; జము+ఇల్లు= యమలోకం; చొచ్చినజంతువున్+ఐనను= ప్రవేశించిన పశువునైనా; ఏ+మెయిన్+కాచున్= ఎట్లాగైనా కాపాడుతాడు; అను రాచమాట= అనే పౌరుషపు మాట; ఊర్వశి= ఊర్వశి; తనున్+కోరి= తనను వరించి; తాన్+అవచ్చినన్+ఐనన్= తనంతట తానే వచ్చినా; లోలుండు+కాఁడు= లోబడడు; అను మేలిమాట= అనే మంచిమాట; శౌర్య= పరాక్రమానికి; వైభవ= ఐశ్వర్యానికి; ప్రాభవ= ప్రభుత్వానికి; శౌచములకున్= శుచిత్వానికి; ఒరులకైనన్= ఇతరులకైనా; కైవారము+ఐ= పొగడదగినదై; ఉల్లసిల్లున్= (అర్జునుడు)

ప్రకాశిస్తుంటాడు; ఒక్కరునికిన్= అలా ప్రకాశించటం (అర్జునుడు తప్ప) మరో వ్యక్తి యెడల; ఒక్కరునికిన్= ఇవి+ఎల్లను= ఇవి అన్నీ; నిక్కము+అట్టె!= నిజాలౌతాయా!; అర్జును+ఈడువాఁడు= అర్జునుడితో సమానుడు; ఎందున్+కలుగునె?= ఎక్కడైనా ఉంటాడా?

**తాత్పర్యం:** పరమేశ్వరుడే ఎదిరించినా అతడిని భుజబలంలో తనను మించనీయడు అనే గొప్ప కీర్తి, ఇంద్రుడి సగం గద్దె మీద కూర్చుండ గలిగిన అర్హత ఎంతైనా కలవాడు అనే గట్టి కీర్తి, యమలోకంలో ప్రవేశించిన జంతువునైనా ఏదో విధంగా రక్షించగలడనే పౌరుషపు కీర్తి, ఊర్వశి తనను కోరి తనంతట తాను వచ్చినా స్త్రీలోలుడు కాని ఉత్తమ కీర్తి వరుసగా తన పరాక్రమానికీ, వైభవానికీ, మహిమకూ, నిర్మల వర్తనానికీ సాక్షులై శత్రువులచేత కూడా పొగడ్తలు పొందగలగటం ఒక్కరికి మాత్రమే చెల్లింది. ఆ ఒక్కడు ఆ అర్జునుడు. అతడితో దీటైనవాడు మరొకడు లేడు. ఇది సత్యం.

**విశేషం:** అలం: ఉదాత్తం, యథాసంఖ్యం. పాశుపతాస్త్ర సంపాదన ఘట్టంలో పరమేశ్వరుడితో దీటైనవాడని అనిపించుకొనటం అర్జునుడి పరాక్రమానికి ఒక ప్రశంసాపత్రం. ఇట్లాగే మిగిలిన సీసపద్య పాదాలను వైభవ, ప్రాభవ, శౌచాలనే గుణాలకు అన్వయించుకొనాలి. మాట అనే పదానికి పలుకు, కీర్తి, అపకీర్తి, సంభాషణ, రూఢి మొదలైన అర్థాలున్నాయి. తిక్కన ఈ పద్యంలో కీర్తి అనే అర్థంలో ప్రయోగించాడు. మేటి మాట- అంటే అంతకంటె మించి చెప్పదగిన మాట (కీర్తి) లేదని భావం. రూఢిమాట- అంటే లోకంలో బాగా స్థిరపడిన మాట (కీర్తి) అని అర్థం. రాచమాట- అంటే గర్వంగా చెప్పుకొనే మాట (కీర్తి) అని తాత్పర్యం. మేలిమాట- అంటే అంతకు మించి చెప్పలేని మంచిమాట (నిష్కల్మషమైన కీర్తి) అని భావం. కైవారం రాజగుణకీర్తనకు సంబంధించిన స్తుతి. అర్జునుడు నాలుగు గుణాలలో సాటిలేని మేటికీర్తిని పొందాడు. అట్లా పొందినవాడు సమకాలీన భారతంలో మరొకడు లేడు. అట్టి ఉదాత్తుడి వర్తనం ఉదాత్తాలంకార శోభితం కావటం సార్థకం. (సంపా.)

పాశుపతాస్త్ర గాథ, ఇంద్రసింహాసనం ఎక్కటం, గో సంరక్షణ, ఊర్వశీ పరాభవం, అర్జునుడి బలపరాక్రమాలకు నిదర్శనాలు. కడచిన భారతకథలో ఇవి వచ్చాయి. వాటిని గమనించగలరు.

**క. ఆ పార్థుఁడు భరతాన్వయ। దీపకుఁ డమరేంద్ర సుతుఁడు తేజోనిధి వి**
**ద్యాపారగుండు వినుత। వ్యాపారుం డాపదలకు నగ్గం బయ్యెన్. 205**

**ప్రతిపదార్థం:** ఆ పార్థుఁడు= ఆ అర్జునుడు; భరత+అన్వయదీపకుఁడు= భరతవంశాన్ని ప్రకాశింపజేసిన వాడు; అమర+ఇంద్ర సుతుండు= దేవేంద్రుడి కుమారుడు; తేజస్+నిధి= పరాక్రమానికి ఆటపట్టు; విద్యాపారగుండు= విద్యలను పారం ముట్టేటట్లు పూర్తిగా నేర్చినవాడు; వినుత వ్యాపారుండు= పేరెన్నికగన్న పనులు చేసేవాడు; ఆపదలకున్+అగ్గంబు+అయ్యెన్= కష్టాలపాలయ్యాడు.

**తాత్పర్యం:** ఆ అర్జునుడు భరతవంశానికే పేరు తెచ్చినవాడు, దేవేంద్రుడి కుమారుడు, పరాక్రమశాలి, అస్త్రశస్త్ర విద్యానిధి, ప్రశంసించదగిన ఆచరణ కలవాడు అయిన ఆ ఘనుడు ఈనాడు ఆపదలకు గురి అయ్యాడు.

**విశేషం:** బలహీనుడు కష్టాలకు లోనుకావటం సహజం. భుజబలపరాక్రమం కలిగిన అర్జునుడి అంతటివాడు అన్న మాటకు కట్టుపడి, అజ్ఞాతవాసానికి సిద్ధపడి, బృహన్నలా రూపంలో ఆడవాళ్ళతో కలసి మెలిసి నాట్యాచార్యుడుగా ప్రవర్తించటం ద్రౌపది మనస్సుకు కష్టం కలిగించింది. విధి బలీయం. ఎంతటివారైనా విధికి తలొగ్గక తప్పదు. ఈ విధంగా ద్రౌపది ఇక్కడ అర్జునుడి గుణగానం చేసింది.

**చ. అరయ నతండు మానధనుఁ డక్కట రంగమునందు నిల్చి సుం**
**దరులకు నాట సూపెడు విధం బతిదీనము; దానిఁ జూచి యేఁ**
**బురపురఁ బొక్కుదుం; గడుపుఁ బ్రోచికొనన్ లఘువృత్తి కిమ్మెయిం**
**జొరనగువాఁడె దేవపతిసూనుఁడు? దైవము చేఁత సూచితే? 206**

**ప్రతిపదార్థం:** అక్కట!= ఔరా!; మానధనుఁడు= అభిమానమే ధనంగా కలవాడైన; అతండు= ఆ అర్జునుడు; రంగమునందున్ నిల్చి= నాట్యరంగంమీద నిలబడి; సుందరులకున్= స్త్రీలకు; ఆట+చూపెడువిధంబు= నాట్యం చేసిచూపే తీరు; అరయన్= ఆలోచించగా; అతిదీనము= కడు జాలి కలిగించేది; దానిన్+చూచి= అది చూచి; ఏన్= నేను-(ద్రౌపది); పురపురన్ పొక్కుదున్= లోలోపల మిగుల దుఃఖిస్తాను; దేవపతిసూనుఁడు= ఇంద్రుడి కుమారుడు; కడుపున్+ప్రోచికొనన్= ఆకలి తీర్చుకొనటానికి; ఈ+మెయిన్= ఈ విధంగా; లఘువృత్తికిన్= నీచపు పనికి; చొరన్+అగువాఁడె?= పాల్పడదగినవాడా?; దైవము చేఁత= భగవంతుడి చేష్ట; చూచితే?= చూచావా?

**తాత్పర్యం:** అటువంటి అభిమానధనుడైన అర్జునుడు నాట్యరంగంలో నిలబడి రాచకన్నెలకు నాట్యం నేర్పవలసి వచ్చిన ఆ స్థితి ఎంతో దయనీయం. జాలి కలిగిస్తున్నది. దానిని చూచి నేను లోలోన దుఃఖంతో కుమిలిపోతూ ఉంటాను. దేవేంద్రుడి కుమారుడైన అర్జునుడు కడుపు నింపుకొనటానికి ఇంతటి నీచవృత్తికి పాల్పడటమా? విధి చేసే వింత చేష్టలు చూచావా?

**విశేషం:** ఊర్వశి శాపంవలన అర్జునుడికి ఈ స్థితి ఏర్పడింది. అది అతడికి అజ్ఞాతవాస సమయంలో బృహన్నలగా ఉండటానికి ఉపకరించింది.

**చ. 'మగలకు మేటియైన బలమర్దననందనుఁ బేడిఁ జేయఁగాఁ**
**దగునె విధాత నీకు?' నని దైవము దూఱుదు, నోర్వరాని నె**
**వ్వగ తలకొన్న నెంతయును వందుదు, నిద్దురవస్థ యెన్నఁడో**
**తెగుటని సంతతంబును మదిం దలపోయుదు నేమి సేయుదున్? 207**

**ప్రతిపదార్థం:** విధాత!= ఓ బ్రహ్మదేవా!; మగలకున్= పురుషులకు; మేటి+ఐన= శ్రేష్ఠుడైన; బలమర్దన నందనున్= ఇంద్రుడి కుమారుడైన అర్జునుడిని; పేడిన్+చేయఁగాన్= నపుంసకుడిని చేయగా; నీకున్; తగునె?= న్యాయమా?; అని దైవమున్ దూఱుదున్= అని విధిని నిందిస్తాను; ఓర్వరాని= భరించరాని; నెఱ+వగ తలకొన్నన్= అధిక దుఃఖం కలుగగా; ఎంతయును= ఎంతైనా; వందుదున్= చింతిస్తాను; ఈ+దురవస్థ= ఈ కష్టం; ఎన్నఁడో తెగుట+అని= ఎప్పుడు తొలగిపోతుందా? అని; సంతతంబును= ఎల్లప్పుడూ; మదిన్+తలపోయుదున్= మనసులో ఆలోచిస్తాను; ఏమి చేయుదున్?= ఇంతకంటె చేయగలిగింది ఏముంది?

**తాత్పర్యం:** 'ఓ బ్రహ్మదేవా! అంతటి ఇంద్రకుమారుడిని పేడివాడిగా చేసి ఆడిస్తున్న నీ చేష్టలు దూషితా'లని ఆ భగవంతుడిని నిందిస్తాను, భరించరాని దుఃఖం నన్ను ఆక్రమిస్తుంది. ఈ కష్టాలు ఎన్నడు గట్టెక్కుతాయా? అని ఆలోచిస్తాను. ఐనా చేసేది ఏముంది?

**విశేషం:** ఎంతటి బలవంతుడికైనా విధిని తప్పించుకొనటం సాధ్యం కాదు. పరాక్రమంచేత పరమశివుడి పాశుపతాస్త్రాన్ని ప్రసాదంగా పొందిన బలవంతుడైన అర్జునుడు బృహన్నలా రూపం దాల్చడం విచిత్రం. అజ్ఞాతవాస సమయంలో ఒక్కొక్కరు ఒక్కొక్క

రూపం దాల్చాలనుకొన్నారు. ఊర్వశి శాపం గుర్తుకు వచ్చింది అర్జునుడికి. అది అర్జునుడికి వరంగా మారింది. అది ఇంద్రుడిచ్చిన వరంప్రభావం.

**సీ.** **తనయొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరికైన । మలఁగి క్రమ్మఱఁ జూడవలయువాఁడు,**
**తన వర్తనము విన్న మునిజనంబులకైన । నలవరించికొనంగవలయువాఁడు,**
**తన బంటుతన మాజిఁ గనిన మార్తురకైన । బలుమాఱు నగ్గింపవలయువాఁడు,**
**తన వితరణ కేళి వినినఁ గల్పకతరు । వులకైనఁ దలయూఁపవలయువాడు.**

**తే.** **నకులుఁ డొరులకు నశ్వశిక్షకుఁడుగాఁగ । నగునె యాతని దుస్థితి యనుదినంబుఁ**
**గాంచి కన్నీ రడంచుచుఁ గడవరాని । దైవఘటనకు నొత్తుఁ జిత్తంబులోన.** 208

**ప్రతిపదార్థం:** తన+ఒప్పు= తన అందాన్ని; ఎదురన్+కన్నన్= ఎదుటపడి చూస్తే; తగిలి= ఆసక్తితో; ఎవ్వరికిన్+ఐనన్= ఎటువంటివారికైనా; మలఁగి= తిరిగి మరలా; క్రమ్మఱన్= మరొకమారు; చూడన్+వలయువాఁడు= చూడాలనిపించేవాడు; తన వర్తనము= తన నడవడి; విన్న= వినిన; మునిజనంబులకున్+ఐనన్= మునులకైనా; అలవరించికొనంగన్+వలయువాఁడు= అలవాటు చేసికొనవలెనని+అనిపింపచేసేవాడు; తన బంటుతనము= తన శూరత్వాన్ని; ఆజిన్+కనినన్= యుద్ధంలో చూస్తే; మార్తురకున్+ఐనన్= శత్రువులకైనా; పలుమాఱు= పెక్కుసార్లు; అగ్గింపన్+వలయువాఁడు= మెచ్చుకొనదగినవాడు; తన వితరణ+కేళి= తన దానగుణవిలాసాన్ని; వినినన్= విన్నట్లైతే; కల్పకతరువులకున్+ఐనన్= కల్పవృక్షాలకైనా, తల+ఊఁపన్+వలయువాఁడు= తలవూపి మెచ్చుకొన తగినవాడు; ఒరులకున్= ఇతరులకు; అశ్వశిక్షకుఁడు= గుర్రాలకు శిక్షణనిచ్చే కాపరిగా; నకులుఁడు= నకులుడు; కాఁగన్+అగునె?= కావటం న్యాయమా?; ఆతని దుస్+స్థితి= నకులుడి కష్టపరిస్థితి; అనుదినంబున్+కాంచి= రోజూ చూచి; కన్నీరు+అడంచుచున్= కన్నీళ్ళు క్రుక్కుకొంటూ; కడవన్+రాని= దాటరాని; దైవఘటనకున్= విధిచేష్టలకు; చిత్తంబులోనన్= మనస్సులో; నొత్తున్= బాధపడతాను.

**తాత్పర్యం:** తన అందాన్ని ఎదుటబడి చూస్తే మరల తిరిగి చూడాలని ఎవరికైన అనిపించే అందగాడు, తన ప్రవర్తనాన్ని గురించి వింటే మునులకైనా దానిని అనుసరించాలని అనిపించే ఆదర్శశీలుడు, యుద్ధంలో తన పరాక్రమాన్ని చూస్తే శత్రువులకు కూడా పెక్కుసార్లు కీర్తించవలెనని అనిపించే శూరుడు, తన దానవిశేషాలను వింటే కల్పవృక్షాలచేత కూడా తలలూపింప జేయగల దానశీలుడు అయిన నకులుడు ఇతరులసేవలో గుర్రాలకు శిక్షకుడుగా ఉండదగినవాడా? అతడి శోచనీయస్థితిని చూచి నిత్యం కన్నీరు పెట్టుతుంటాను. దాటరాని దైవ సంఘటనను మనస్సులో తలచుకొని నొచ్చుకొంటూ ఉంటాను.

**విశేషం:** 1.నకులుడిలో విరుద్ధ గుణాల విశిష్ట మేళనం కనబడుతుంది. ఆకర్షించే అందం ఒకవైపు, మునులకు కూడా ఆదర్శంగా ఉండే నియమ నిష్ఠలు మరొకవైపూ ప్రవృత్తి నివృత్తి లక్షణాల సంయోజనాన్ని వ్యక్తం చేస్తున్నాయి. యుద్ధం చేసే వీరకృత్యం ఒకవైపు ఉన్నదంతా దానం చేసే దానవృత్తం మరొకవైపు రాజస సాత్త్విక ప్రవృత్తులను తెలుపుతున్నాయి. అతడు అశ్వశిక్షకుడైనాడు. అశ్వాలు ఇంద్రియాలకు ప్రతీకలు. ఇంద్రియాలను భోగ, యోగ, యుద్ధ, దాన ప్రవృత్తులలో నియంత్రించగలగటం రాజయోగి లక్షణం. అంతటి ఉత్తమాధికారి భౌతికంగా గుర్రాలకు-అదీ ఇతరుల గుర్రాలకు నడవడి నేర్పేవాడయ్యా డన్నదే ద్రౌపది దుఃఖం. పూర్వవైభవ సంస్మరణం ప్రస్తుత నిరంతర దుఃఖానికి కారణం కావటం విశేషం. 2. ఈ పద్యంలో శబ్దార్థ మాధుర్య గుణాలు పోషించబడ్డాయి. పృథక్ పదత్వ రూపమైన శబ్దగుణమాధుర్యం సౌందర్యాన్ని పోషిస్తే, సౌశీల్యాన్నీ, పరాక్రమాన్నీ, దానగుణాన్నీ వ్యంజింపజేసే ఉక్తి వైచిత్ర్యం ఇందులోని అర్థగుణమాధుర్యాన్ని పోషించింది. ఉభయగుణ పోషకమైన ఈ రచన నకులుడి బాహిరమైన, ఆంతరమైన సౌందర్యాలను రూపుకట్టించింది. (సంపా.)

శా. ఆ రూపం బవికార, మా భుజబలం బత్యంత నిర్గర్వ, మా
శూరత్వంబు దయారసానుగత, మా శుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభ ప్రతికూల వాదరహితం, బా యీఁ గి సన్మాన వి
స్తారోదాత్తము మాద్రి పిన్నకొడు కేతన్మాత్రుఁడే చూడఁగన్? 209

**ప్రతిపదార్థం:** చూడఁగన్= పరిశీలించగా; ఆ రూపంబు= అంతటి సౌందర్యం; న+వికారము= మార్పులేనిది; ఆ భుజబలంబు= ఆ భుజబలం; అత్యంత నిర్గర్వము= మిక్కిలి గర్వం లేనట్టిది; ఆ శూరత్వంబు= ఆ సాహసం; దయా+రస+అనుగతము= దయారసాన్ని అనుసరించి ఉండేది, దయతో కూడినది; ఆ శుంభత్+క్రియాజ్ఞానము= ఆ ప్రకాశించే పనులలోని నేర్పరితనం; ఆర్య+ఆరంభ ప్రతికూల= పెద్దల నడవడికకు అడ్డు చెప్పే; వాదరహితంబు= వాదం లేనట్టిది; ఆ+ఈఁగి= ఆ దానగుణం; సత్+ మానవిస్తార+ ఉదాత్తము= గౌరవం యొక్క గొప్పతనంచేత ప్రకాశించేది; మాద్రి పిన్నకొడుకు= మాద్రి చిన్నకొడుకు సహదేవుడు; ఏతద్+మాత్రుఁడే?= సామాన్యుడా?

**తాత్పర్యం:** మాద్రి చిన్న కొడుకైన సహదేవుడు సామాన్యుడా? (అసామాన్యుడని భావం). అతడి ఆ రూపం నిర్వికారం. ఆ బాహుబలం గర్వం లేనిది. ఆ పరాక్రమం దయారసంతో కూడింది. ఆ కార్య నిర్వహణ పరిజ్ఞానం పెద్దల నడవడికకు వ్యతిరేకం కానిది, వివాదాలకు గురి కానిది. ఆ దానం గౌరవ ప్రపత్తిచేత ఉదాత్తమైనది. కనుక, అతడు వయసులో చిన్నవాడైనా గుణాలలో పెద్దవాడే.

**విశేషం:** 1. తెలుగులో 'ఆ' అనే నిర్దేశక వాచకము ధ్వనిమయం. అది అనంతత్వాన్నీ, అద్భుతాన్నీ, అసదృశత్వాన్నీ, అస్వాద మాధుర్యాన్నీ ధ్వనిమయంగా నిర్దేశిస్తుంది. ఈ పద్యంలో 'ఆ' అనే విశేషణం అసదృశత్వాన్ని (దాన్ని పోలింది మరొకటి లేదు అనే భావం) ధ్వనింపచేస్తున్నది. 'ఆ' గుణవాచకంగా పునరావృతం కావటం చేత పద్యంలో శ్లేష అనే గుణం రూపు కట్టింది. మసృణత్వం శబ్దగుణలక్షణం, ఘటన అర్థగుణశ్లేష లక్షణం. ఆ రెండూ పద్యంలో అందంగా అమరాయి. 2. శ్లేషలో కాకువు రాణించటం అలంకార లక్షణం. 'మాద్రిపిన్నకొడుకు+ఏతన్మాత్రుఁడే చూడఁగన్?' అనే వాక్యంలో కాకువు ఉన్నది. దాని వలన రెండు అర్థాలు స్ఫురిస్తాయి. మాద్రి చిన్నకొడుకు చిన్నకొడుకువలె ఉండడు, పెద్దకొడుకువలెనే ఉంటాడు. వయసుకు చిన్నవాడైనా గుణాలలో అన్నను పోలి ఉంటాడు-అని ఒక అర్థం. అందువలననే ద్రౌపది నకులుడి యందు ఏ గుణాలున్నాయని చెప్పిందో - వాటినీ సహదేవుడి యందు కూడా పేర్కొన్నది. నకులుడి వలెనే ఇతడు కూడా అందగాడు, బలవంతుడు, పరాక్రమవంతుడు, యుద్ధ కార్యకుశలుడు, దానపరుడు, అందువలన అన్నింటా అన్నను పోలినవాడనే తాత్పర్యం స్ఫురిస్తుంది. నకుల సహదేవులు కవలబిడ్డలు కాబట్టి ఒకరి పోలికలు మరొకరికి కొట్టవచ్చినట్లుగా ఉండటంలో ఆశ్చర్యం లేదు. కాని- ఇక్కడ రెండవ అర్థం ఇట్లా చెప్పుకొనాలి- అతడు 'ఏతన్మాత్రుఁడే' -అటువంటివాడే (నిశ్చితార్థం) కాని సామాన్యుడా? అనిపిస్తాడు. అంటే సమానగుణాలున్నా సహదేవుడిలో అవి విశిష్టంగా ఉంటాయని కాకువు. అది ఎట్లాగంటే - నకులుడియందు విరుద్ధ లక్షణ సమాహారం కనపడితే, సహదేవుడిలో అసామాన్యగుణ సమారోపణం కనబడుతుంది. సుందరరూపానికి చపలత్వం (విలాసత్వం) సామాన్య లక్షణంగా చెప్పబడుతుంది. కాని, సహదేవుడి సౌందర్యం అవికారం. ఇది అసామాన్య లక్షణం. అట్లాగే భుజబలం నిగర్వంగా, శౌర్యం దయారసంగా, క్రియాజ్ఞానం వివాదరహితంగా, దానం గౌరవోదాత్తంగా ఉండటం-అనేవి అసామాన్య లక్షణాలే ఔతాయి. దీనిని బట్టి చూస్తే 'ఏతన్మాత్రుఁడే?' -నకులుడి వంటివాడా సహదేవుడు? అతడి కంటె అన్నింటా ఘనుడు - అని చెప్పినట్లు స్ఫురిస్తుంది. తిక్కన శ్లేషగుణావిష్కార రచనకు ఈ పద్యం ప్రసిద్ధోదాహరణం. (సంపా.)

**క. సుకుమారుఁ డతఁడు గోపా। లకవృత్తి వహించి యడవులం గ్రుమ్మరుచు**
**న్కికి నాక కాదు పగవా। రికినైనను నకట! మన మెరియదే వగలన్? 210**

**ప్రతిపదార్థం:** అకట!= ఔరా!; అతఁడు= ఆ సహదేవుడు; సుకుమారుఁడు= కోమలుడు (నీడపట్టున సుఖపడవలసినవాడు); గోపాలకవృత్తిన్+వహించి= గొల్లవాడి పనిని అంగీకరించి; అడవులన్+క్రుమ్మరుచున్+ఉన్కికిన్= అడవులలో తిరుగుతుండటానికి; నాకు+అ కాదు= నాకేకాదు; పగవారికిన్+ఐనను= శత్రువులకైనా; వగలన్= దుఃఖాలతో; మనము+ఎరియదే?= మనస్సు పరితపించదా?

**తాత్పర్యం:** అతికోమలుడైన ఆ సహదేవుడు ఆవుల కాపరిగా ఉంటూ అడవులలో సంచరిస్తూ ఉండటం చూస్తే నాకే కాదు, శత్రువులకైనా దుఃఖంతో మనసు పరితపిస్తుంది.

**విశేషం:** 'ఇటువంటి కష్టాలు పగవారికి కూడా రాకూడదు' - వంటి లోకోక్తులు తెలుగు పలుకుబడిలో సహజం. దైన్యం యొక్క పరాకాష్ఠను తెలిపే అభివ్యక్తి అది. ఇక్కడ సహదేవుడి వంటి సుకుమారుడు అడవులలో పశువులను కాయటం అనే దీనావస్థను పొందాడని చూచేవారు అమితంగా బాధపడతారు-అనే అర్థాన్ని జాతీయంతో ధ్వనింపచేసింది ద్రౌపది. (సంపా.)

**ఉ. ఏనును మీరుఁ గానలకు నేగునెడ న్ననుఁ జేరి యెంతయున్**
**దీనత దోఁపఁ గుంతి సహదేవుని నిల్లడపెట్టి నాకు 'న**
**మ్మా! నిను నమ్మి చాల విషమంబగు నివ్వనవాస మీతఁడుం**
**బూనఁగ నియ్యకొంటి' నని బోరన నశ్రులు గ్రమ్ముచుండఁగన్. 211**

**ప్రతిపదార్థం:** ఏనును= నేనూ (ద్రౌపది); మీరున్= మీరున్నూ, (పాండవులున్నూ); కానలకున్+ఏగు+ఎడన్= అడవులకు వెళ్ళేటప్పుడు; కుంతి= అత్తగారైన కుంతీదేవి; ననున్+చేరి= నా దగ్గరకు వచ్చి; ఎంతయున్= ఎంతో; దీనత+తోఁపన్= దైన్యం ఉట్టిపడగా; సహదేవునిన్; నాకున్; ఇల్లు+అడ పెట్టి= అప్పగించి; అమ్మా!= ఓ ద్రౌపదీ; నినున్+నమ్మి= నిన్ను నమ్మి; చాల విషమంబు+అగు= ఎంతో కష్టమైన; ఈ+వనవాసము= ఈ అరణ్యవాసం; ఈతఁడున్= ఈ సహదేవుడు కూడ; పూనఁగన్= చేయటానికి; ఇయ్యకొంటిన్= ఒప్పుకొన్నాను; అని= అని పలికి; బోరనన్= ధారలు కట్టేటట్లు; అశ్రులు+క్రమ్ముచుండఁగన్= కన్నీరు నిండగా.

**తాత్పర్యం:** నేనూ మీరూ అరణ్యవాసానికి బయలుదేరేటప్పుడు కుంతి నన్ను దగ్గరకు తీసికొని నాకు సహదేవుడిని అప్పగిస్తూ 'కోడలా! నిన్ను నమ్మి అతికష్టమైన ఈ వనవాసాన్ని చేయటానికి సహదేవుడిని పంపటానికి ఒప్పుకొంటున్నాను' అని కన్నీరు ధారలు కట్టగా అన్నది.

**విశేషం:** భార్య తల్లితో సమానంగా ప్రవర్తిస్తుంది ఒక్కొక్కసారి. మరొకసారి దాసిగా నడుచుకొంటుంది. ఇక్కడ ద్రౌపదిపై చిన్న కొడుకు భారాన్ని మోపింది కుంతి. మాద్రి చనిపోయినా తన సొంతబిడ్డగా చూచుకొన్నది. తన కడగొట్టు బిడ్డగా భావించి గారాబం చేసింది. అందుకే అంత మమకారం. 2. ఇల్లడ పెట్టడం= మరల తిరిగి ఇచ్చే నియమంతో ఒకరి వద్ద ధనాన్ని దాచిపెట్టుకొనటం.

**వ. మఱియును. 212**

**తాత్పర్యం:** అంతేకాక.

**చ.** **'కడుఁ బసిబిడ్డ వీఁ; డొకటి కాదవునా నెఱుఁగండు; ముంద రె**
**య్యెడ నొకపా టెఱుంగఁ; డెద యెంతయుఁ గోమల; మెప్పుడైన నేఁ**
**గుడువఁగఁ బిల్తుఁగాని తనకుం గల యాఁకటిప్రొ ద్దెఱుంగఁ డీ**
**కొడు కిటు పోకకు న్మనము గుందెడు; ని న్గని యూఱడిల్లెడున్.** **213**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఈ సహదేవుడు; కడున్+పసిబిడ్డ= మిక్కిలి గారాల బిడ్డ; ఒకటి కాదు+అవున్+ననాన్= ఒకటి ఔను, ఒకటి కాదు అని; ఎఱుఁగండు= తెలియనివాడు, చెప్పలేడు; ముందర= ఇంతకుముందు; ఏ+ఎడన్= ఎక్కడా; ఒకపాటు= ఏ కష్టాన్నీ; ఎఱుంగఁడు= అనుభవించలేదు; ఎద+ఎంతయున్= మనసెంతో; కోమలము= సున్నితం; ఎప్పుడైనన్= ఎన్నడైనా; నేన్= నేను (కాంతి); కుడువఁగన్= అన్నం తినుమని; పిల్తున్+కాని= పిలుస్తానుగాని; తనకున్+కల= సహదేవుడికి గల; ఆఁకటిప్రొద్దు= ఆకలయ్యే వేళను; ఎఱుంగఁడు= తెలిసికొనలేడు; ఈ కొడుకు= అట్టి కొడుకు - ఈ సహదేవుడు; ఇటు పోకకున్= ఇట్లా అరణ్యాలకు వెళ్ళటానికి; మనము+కుందెడున్= నా మనస్సు విచారపడుతున్నది; నిన్+కని= నిన్ను చూచి; ఊఱడిల్లెడున్= ఊరట పొందుతున్నది.

**తాత్పర్యం:** 'ఓ కోడలా! ఈ సహదేవుడు మిక్కిలి పసిబిడ్డ. ఔను, కాదని చెప్పలేని చిరుతడు. ఇంతకుమునుపు ఎట్టి కష్టాలు తెలియనివాడు. మిక్కిలి సున్నిత స్వభావం కలవాడు. ఆకలి వేళ కూడా తెలిసికొనలేడు. నేను పిలిచి అన్నం పెట్టుతాను కాని, తనకు తానై అడగడు. అలాంటి కొడుకు ఇట్లా అడవులకు వెళుతుంటే మనస్సు విలవిలలాడుతున్నది. అయినా నిన్ను చూచి ఊరటపొందుతున్నది.

**విశేషం:** తల్లి మమకారంతో నిండిన పై ఆవేదన, చిన్నకొడుకు అమాయకత్వం లోకంలో ఆడపిల్లను అప్పగింతలు పెట్టే స్థితిని గుర్తుకు తెస్తున్నది.

**తే.** **ఎప్పు డెయ్యెడ నేమిట నెట్టు లరయ । వలసె నమ్మెయి నారయు మలసి డస్సి**
**నొచ్చియైనను నేమఱ కిచ్చఁ దలఁచి । తడవి నాచేత దీవన వడయు మమ్మ!'** **214**

**ప్రతిపదార్థం:** అమ్మ!= ద్రౌపదీ!; ఎప్పుడు= ఎప్పుడైనా; ఏ+ఎడన్= ఎక్కడైనా; ఏమిటన్= అన్నిటా; ఎట్టులు+అరయవలసెన్= ఎట్లా చూచుకొనాలో; ఆ+మెయిన్= ఆ విధంగా; ఆరయుము= చూచుకొమ్ము; అలసి= అలిసిపోయి; డస్సి= శ్రమపడి; నొచ్చి+ఐనను= కష్టమైనా; ఏమఱక= మరపులేక; ఇచ్చన్+తలఁచి= మనసు కనిపెట్టి; తడవి= కాపాడి; నాచేతన్= నా వలన, కుంతిచేత; దీవన+పడయుము= ఆశీస్సులు పొందుము.

**తాత్పర్యం:** ఓ ద్రౌపదీ! ఎక్కడైనా, ఎప్పుడైనా, అన్నిటా ఎట్లా చూచుకొనాలో అట్లా చూచుకొమ్ము. అలసి, సొలసి, కష్టపడి, మరపులేకుండా అతడి మనస్సు కనిపెట్టి కాపాడి నా దీవనలను పొందుము.'

**విశేషం:** 1. ఇక్కడ పసిపిల్లవాడి సంరక్షణ బాధ్యతను అప్పగించే ఒక తల్లి హృదయాన్ని కవి చక్కగా చిత్రించాడు. చిన్న చిన్న మాటలతో తల్లి ఆవేదనను వ్యక్తం చేశాడు. 2. కుంతి 211వ పద్యంలో ఇల్లడపెట్టినట్లు మాట్లాడింది. కాబట్టి అరణ్యాజ్ఞాతవాసాల తరువాత సహదేవుడిని తిరిగి తన కిచ్చి ఆశీస్సులను పొందుమని ద్రౌపది నడిగింది. రాబోయే వచనంలో అజ్ఞాతవాసంలో అతడిని స్వయంగా సేవించలేనందుకు ద్రౌపది విచారం వెలిపుచ్చింది.

**వ. అని యప్పగించె; నేనును వనవాసకాలంబున నానేర్చు విధంబున మీకు నెల్లను గారామైన తమ్ముని నమ్మెయిం బరికించికొని వచ్చితి; నిపు డజ్ఞాతవాసాయాసితుండగు నతని నాకు ననుసరింప వెరవు గామిం జేసి చేయునది లేక చింతిల్లుచున్నదాన; నా తెఱంగు వినుము. 215**

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; అప్పగించెన్= అప్పగించింది; నేనును= నేను కూడా (ద్రౌపది కూడా); వనవాస కాలంబునన్= అరణ్యావాస సమయంలో; నానేర్చువిధంబునన్= నా శక్తి కొద్దీ; మీకున్+ఎల్లను= మీకందరికీ; గారము+ఐన తమ్మునిన్= ముద్దుల తమ్ముడైన సహదేవుడిని; ఆ+మెయిన్= అట్లా; పరికించుకొని వచ్చితిన్= కాపాడుకొంటూ వచ్చాను; ఇపుడు; అజ్ఞాతవాస+ ఆయాసితుండు+అగు= అజ్ఞాతవాస నియమంచేత అలసినవాడైన; అతనిన్= సహదేవుడిని; నాకున్= నాకూ (ద్రౌపదికి); అనుసరింపన్= వెంబడించటానికి; వెరవుకామిన్+చేసి= సాధ్యపడకపోవడంవలన; చేయునదిలేక= చేసేదిలేక; చింతిల్లుచున్+ ఉన్నదానన్= బాధపడుతున్నాను; నాతెఱంగు వినుము= నా కథ వినుము.

**తాత్పర్యం:** అని చెప్పి నాకు అప్పగించింది. నేను అరణ్యావాస సమయంలో నా శక్తికొద్దీ మీ అందరికీ గారాబు తమ్ముడైన సహదేవుడిని ఆ విధంగా కంటికి రెప్పగా కాపాడాను. మరి ఇప్పుడు అజ్ఞాతంగా ఉన్న సమయంలో అతడి శ్రమ పోగొట్టటం నాకు చేతకావటం లేదు. అందుకు చేసే దేమీ లేక మనస్సులో బాధపడుతున్నాను. ఇక నా సంగతి వినుము.

**సీ. ద్రుపద భూవిభుఁడు పుత్త్రులకంటె నెంతయుఁ । బెంపు సేయుచు గారవింపఁ బెరిఁగి,**
**కుంతీమహాదేవి కోడండ్ర లోపల । నగ్గలంబుగఁ గొనియాడఁబరఁగి,**
**ప్రాణంబులకు నెల్లఁ బ్రాణంబుగా మీరు । నెయ్యంబు తియ్యంబు నెఱప నడచి,**
**మదిఁ దల్లిదండ్రుల మాఱుగాఁ గొని జను । లనిశంబు భక్తి సేయంగ నెగడి**

**తే. రూపగుణ విక్రమంబుల రూఢికెక్కు । నట్టి కొడుకులఁ గని భరతాన్వయంబు**
**నందు నా యిల్ల యిల్లుగా నతిశయిల్లి । తగవుమై బాంధవులచేతఁ బొగడు వడసి. 216**

**ప్రతిపదార్థం:** ద్రుపద భూవిభుఁడు= ద్రుపద మహారాజు; పుత్త్రులకంటెన్= కొడుకుల కంటె; ఎంతయున్+పెంపు+చేయుచున్= ఎంతో మిన్నగా చూస్తూ; గారవింపన్+పెరిఁగి= గౌరవించగా పెద్దదాననై; కుంతీమహాదేవి= మహారాణి అయిన కుంతీదేవి యొక్క; కోడండ్రలోపలన్= కోడళ్ళలో; అగ్గలంబుగన్= అధికంగా; కొనియాడన్+పరఁగి= పొగడగా వర్ధిల్లి; మీరు= పాండవులు; ప్రాణంబులకున్+ఎల్లన్+ప్రాణంబు+కాన్= ప్రాణాధికంగా; నెయ్యంబు= స్నేహం; తియ్యంబునెఱపన్= మాధుర్యపు వలపు ప్రసరింప చేసేటట్లు; నడచి= ప్రవర్తించి; జనులు= లోకులు; మదిన్= మనస్సులో; తల్లిదండ్రుల మాఱుగాన్+కొని= తల్లిదండ్రులకు బదులుగా లెక్కించి; అనిశంబున్= ఎప్పుడూ; భక్తి+చేయంగన్= భక్తితో చూడగా; నెగడి= వర్ధిల్లి; రూపగుణ విక్రమంబులన్= రూపంలోను, గుణంలోను, పరాక్రమంలోనూ; రూఢికిన్+ఎక్కు= ప్రసిద్ధులైన; అట్టి కొడుకులన్= అంతటి ఉపపాండవులను; కని= పొంది; భరత+అన్వయంబునందున్= భరతవంశంలో; నా+ఇల్లు+అ= నా కుటుంబమే; ఇల్లు+కాన్+అతిశయిల్లి= గొప్పదైన కుటుంబంగా వర్ధిల్లి; తగవుమైన్= న్యాయమైన రీతిలో; బాంధవులచేతన్+పొగడు+పడసి= చుట్టాల వలన పొగడ్తలు పొంది.

**తాత్పర్యం:** ద్రుపద మహారాజు తన కొడుకుల కంటె గారాబుగా పెంచి పెద్ద చేస్తే గౌరవంగా పెరిగాను. కుంతీదేవి తన కోడళ్ళందరిలో నన్ను అధికంగా పొగడగా వర్ధిల్లాను. మీరందరూ (భర్తలైదుగురూ) సమానంగా స్నేహానురాగాలు పంచగా ప్రవర్తిల్లాను. లోకులు తల్లిదండ్రులకు మారుగా భక్తితో నన్ను సేవించేటట్లు మసలాను. రూపగుణ బలపరాక్రమాలలో పేరొందిన కుమారులకు తల్లినయ్యాను. భరతవంశంలో నా కుటుంబమే గొప్ప కుటుంబంగా ప్రకాశించాను. అందరితో న్యాయంగా వర్తించటం చేత బంధువుల పొగడ్తలను పొంది.

**విశేషం:** ఉత్తమురాలైన ఇల్లాలికి ఉండవలసిన సప్తగుణాలు ఇందులో పేర్కొనబడ్డాయి. 1.పుట్టింటి గౌరవం ద్రుపదునింట వంశోద్ధారకుడైన పుత్రుడికంటె ద్రౌపది ఎక్కువగా గౌరవించబడటం విశేషం. 2. మెట్టినింటి మన్నన - పాండవులకు ద్రౌపదితో పాటు మరికొందరు భార్యలు కూడా ఉన్నారు. వారందరికంటె ఘనంగా చూడటమే కాకుండా, ఘనంగా అందరి ముందూ పొగడి చెప్పేది అత్తగారు. అది అందరికీ కలిగే అదృష్టం కంటె విశిష్టం. 3. భర్తల అనురాగం (వాల్లభ్యం) - అయిదుగురు భర్తలూ తమ పంచప్రాణాలకు ప్రాణమైనదానినిగా ద్రౌపదిని చూచుకొనేవారు. అంటే ఆమె లేకపోతే తాము బ్రదుకజాలమనే అనురాగాన్ని ప్రదర్శించేవారన్నమాట! అది సతి పొందే వాల్లభ్య విశేషం. 4. ప్రజానురాగం - ప్రజలకు ప్రత్యక్ష దేవతలు వారి తల్లిదండ్రులు. వారిని భక్తితో పూజించటం వారి ప్రథమ కర్తవ్యం. అయితే ద్రౌపది తల్లిదండ్రులను మరపింపజేసే వాత్సల్యాన్ని ప్రజల పట్ల ప్రదర్శించటం చేత మాతాపితరులకు బదులు ద్రౌపదినే భక్తితో చూచేవారట! ఇది ప్రజానురాగానికి పరాకాష్ఠ. 5. సంతానవతి కావటం- గుణవంతులై ప్రసిద్ధిపొందిన పుత్రులను పొంది ఉండటం పుత్రోత్సవాన్ని పొందటమే. 6. కుటుంబ గౌరవం - 'నా ఇల్లే ఇల్లుగ' (అనన్వయాలంకారం) చెప్పటం విశేషం. ద్రౌపది కుటుంబంతో పోల్చ దగిన కుటుంబం ద్రౌపది కుటుంబ మొక్కటే అని చెప్పుకొనగల గౌరవం ద్వారా భరతవంశ గౌరవం నిలిపింది. 7. బంధుప్రీతి - అన్నీ ఉన్నా బంధువులందరూ ఏకగ్రీవంగా మెచ్చుకొనటం ఇల్లాళ్ళకందరికీ అబ్బే అదృష్టం కాదు. అది ద్రౌపదికి కలిగింది. దానికి కారణం ఆమె న్యాయం తప్పకుండా నడుస్తుంది కాబట్టి. ఉత్తమ సాధ్వికి ఉత్తమోదాహరణం ద్రౌపది. (సంపా.)

**మ.** **వినుతింపందగు రాజసూయమునఁ బృథ్వీదేవతా కోటికె**
**ల్లను సంతృప్తి యొనర్చి, వారి దయఁ గళ్యాణాత్మనై, పుణ్యవ**
**ర్తన పాండుక్షితిపాలు కోడ లనఁగా రాజన్యమాన్యప్రియాం**
**గనలందెల్లఁ బొగడ్తఁగంటి నతిలోకంబైన మీ మన్ననన్.** **217**

**ప్రతిపదార్థం:** వినుతింపన్+తగు= పొగడదగిన; రాజసూయమునన్= రాజసూయయాగంలో; పృథ్వీదేవతాకోటికిన్+ఎల్లను= బ్రాహ్మణుల సముదాయానికంతటికీ; సంతృప్తి+ఒనర్చి= మంచి తృప్తి కలిగించి; వారి దయన్= వారి అనుగ్రహంతో; కళ్యాణ+ఆత్మన్+ఐ= శుభప్రదమైన మనసు కలదానినై; అతిలోకంబు+ఐన= అపూర్వమైన; మీ మన్ననన్= మీ అభిమానంచేత; రాజన్యమాన్య ప్రియ+ అంగనలందున్+ఎల్లన్= గౌరవించదగిన రాజుల పట్టపురాణులందరిలో; పాండుక్షితిపాలుకోడలు= పాండురాజు కోడలైన ద్రౌపది; పుణ్యవర్తన= పుణ్యాలు కలిగించే నడవడి కలది; అనఁగాన్= అనేటట్లు; పొగడ్తన్+కంటిన్= ప్రశంసలందుకొన్నాను.

**తాత్పర్యం:** లోకప్రసిద్ధమైన రాజసూయయాగంలో బ్రాహ్మణుల కందరికీ దక్షిణలిచ్చి తృప్తిపరచి వారి దయచేత నిర్మలమైన చిత్తం కలదాననయ్యాను. 'పాండురాజు కోడలైన ద్రౌపది పుణ్యాంగన' అని మహారాజుల పత్నులూ. మాన్యలూ అయిన రాణులందరూ ప్రశంసించే కీర్తి సంపాదించాను. వీటి నన్నింటినీ మీరిచ్చిన ఆదరాభిమానాలవలననే పొందగలిగాను.

**విశేషం:** పాండవుల చరిత్రలో రాజసూయం ప్రతిష్ఠాత్మక ఘట్టం. ఆ యజ్ఞాన్ని వారు ధర్మపత్నీ సమేతంగా చేశారు. ధర్మరాజాదులతో పాటు ద్రౌపది పొందిన లాభాలను ఈ పద్యం పేర్కొన్నది. బ్రాహ్మణాశీస్సులతో ఆమె కల్యాణాత్మకురాలైనది. రాజసూయయాగంలో ధర్మరాజును దర్శించటానికి వచ్చిన మహారాజుల పట్టమహిషులందరూ ద్రౌపదిని 'పాండురాజు కోడలు' 'పుణ్యాంగన' అనీ కీర్తించారట! స్వర్గస్థుడైన మామగారు నారదుడిద్వారా ధర్మరాజును రాజసూయం చేయుమని కోరగా దానిని నిష్ఠాపరురాలై భర్తతో కలిసి నిర్వహించిన గౌరవం ఆమెకు దిక్కింది. పైపద్యంలో అన్నీ ద్రౌపదికి స్వయంగా లభించిన లాభాలే. ఇవన్నీ భర్తల ప్రేమ వలన తనకు లభించినవి. ఈ విశ్లేషణాత్మక వివేచన ఆమె వివేకాన్ని తెలుపుతున్నది. (సంపా.)

**ఉ. ఏను మనంబు పెంపు సెడి యిప్పుడు నీచతరప్రకారముం**
**బూని నికృష్టనై యుదర పోషణకై తగవేది యెంతయున్**
**దీనతఁ బొంది యిమ్మెయి సుదేష్ణ పనుల్ గనుసన్నఁ జేయుచున్**
**హీనత నున్కి మీకు వగపేమియుఁ జేయద యేమి సేయుదున్? 218**

**ప్రతిపదార్థం:** ఏను= ద్రౌపది; మనంబు పెంపు+చెడి= మనస్సులోగల అభిమానాన్ని కోల్పోయి; ఇప్పుడు= ఈ అజ్ఞాతవాస సమయంలో; నీచతర ప్రకారమున్+పూని= అల్పమైన వృత్తిని చేపట్టి; నికృష్టను+ఐ= హీనురాలనై; ఉదర పోషణకై= పొట్టకూటి కొరకు; తగవు+ఏది= న్యాయం వీడి; ఎంతయున్ దీనతన్+పొంది= ఎంతో దైన్యం పొంది; ఈ+మెయిన్= ఈ విధంగా; సుదేష్ణ పనుల్= సుదేష్ణయొక్క పనులు; కనుసన్నన్+చేయుచున్= కనుసైగలమాత్రం చేతనే పనిచేస్తూ; హీనతన్+ఉన్కి= హీనంగా ఉండటం; మీకున్= పాండవులకు; వగపు= దుఃఖం; ఏమియున్+చేయదు+అ= కలిగించదా? ఏమి+చేయుదున్= ఇందుకు నేనేమి చేయగలను

**తాత్పర్యం:** నేను మానాభిమానాలు కోల్పోయి నీచంగా పొట్టకూటి కొరకు న్యాయం తప్పి దీనంగా ఈ విధమైన సుదేష్ణ పరిచర్యలకు పూనుకొని ఆమె కనుసన్నలలో హీనంగా చేస్తూండటం మీకు ఏ మాత్రం దుఃఖాన్ని కలిగించటం లేదు. నేనేం చేసేది? అది నా దురదృష్టం.

**విశేషం:** ఒకానొకప్పుడు రాజాధిరాజపరమేశ్వరుడైన ధర్మజుడి కొలువులో రాజుల భార్యలచేత నమస్కారాలు పొందిన పట్టమహిషి ద్రౌపది ఈనాడు ఒకరి కొలువులో పరిచారికగా పనిచేయటం విధి వైపరీత్యం. బండ్లు ఓడలు, ఓడలు బండ్లు కావటమనే సామెత గుర్తుకు తెస్తుంది. అయితే, ఇక్కడ విశేషమేమంటే-పాండవుల దైన్యస్థితిని చూచి ద్రౌపది ప్రతినిత్యమూ పరితపిస్తున్నది. కాని, ఆమె దీనస్థితిని చూచి పాండవు లెవ్వరూ పరితాపం చెందటం లేదని ఆమె నిష్ఠురమాడింది. పతి మనస్సును తనవైపు సానుభూతితో మరలించుకొనటానికి ఈ అధిక్షేపం సరసమైన ఆయుధం.

**క. పని పంపఁగాని యొకతకుఁ। బనిసేయ నెఱుంగ; నన్నుఁ బనిగొనునెడఁ బాం**
**డుని యగ్రమహిషి గొంకుచుఁ। బనిగఱపెడు చందమునన పనుచుటెఱుఁగవే? 219**

**ప్రతిపదార్థం:** పని పంపన్+కాని= పనులు చేయుమని ఒకరిని ఆజ్ఞాపించటమేకాని; ఒకతకున్= ఒక వనితకు; పనిచేయన్= సేవచేయుటం; ఎఱుంగన్= ఎరగను; నన్నున్+పనిగొను+ఎడన్= నాచేత పని చేయించుకొనేటప్పుడు; పాండుని అగ్రమహిషి= కుంతీదేవి; కొంకుచున్= సందేహిస్తూ; పనిగఱపెడు చందమునన్+అ= పనులు నేర్పే పద్ధతిగానే; పనుచుట= ఆజ్ఞాపించటం; ఎఱుఁగవు+ఏ?= ఎరుగవా? (నీకు బాగా తెలియునని భావం).

**తాత్పర్యం:** పట్టమహిషిగా సహస్రపరిజనులచేత పనులు చేయించుకొనటమేగాని, ఒకరి వద్ద పనిచేయటం నాకు తెలియదు. అత్తగారు కుంతీదేవి కూడా నాకేదైనా పని చెప్పదలచుకొన్నప్పుడు వెనుకాడుతూనే, ఆజ్ఞాపిస్తున్నట్లుకాక పని నేర్పటానికి పనిచెప్పిన విధంగానే పనులు చెప్పేది.

**విశేషం:** అత్తగారు కూడా మన్ననగా చూచేది ద్రౌపదిని. అజమాయిషీగా పనులు చేయించటం ఒక పద్ధతి. ఆదరంగా బుజ్జగించి కోడలికి పని చెప్పటం ఒక పద్ధతి. కుంతి లౌకిక మెరిగిన సాధ్వి. మనసు నొప్పించకుండా పనులు చేయించుకొనేది. అందుకే ద్రౌపది పొగడ్త లందుకొన్నది. అత్తా కోడళ్ళ అనుబంధానికి కుంతీ ద్రౌపదుల సంబంధం నిదర్శనం.

**ఉ. ఒల్లరు రాజుదేవులును నొడ్డులు రాచిన చందనంబు; మే**
**నెల్లఁ జెమర్పఁగా నలయ కేను శ్రమంపడి నిల్చి నిల్చి య**
**ల్లల్లన మార్దవం బొనరునట్లుగ నెట్టకునేని రాచి మీ**
**తల్లికి భక్తిఁ బెట్టెడు విధంబునఁ బెట్టుదు; బ్రహ్మఁ దిట్టుదున్. 220**

**ప్రతిపదార్థం:** రాజు= విరాటరాజుయొక్క; దేవులునున్= సుదేష్ణమొదలైన రాణులూ; ఒడ్డులు రాచిన= ఇతరులు తీసిన; చందనంబు= గంధాన్ని; ఒల్లరు= అంగీకరించరు; మేను+ఎల్లన్+చెమర్పఁగాన్= శరీరమంతా చెమట పట్టేటట్లు; అలయక= అలసిపోకుండా; ఏను= ద్రౌపది; శ్రమంపడి= కష్టపడి; నిల్చి నిల్చి, అల్లన్+అల్లన్= మెలమెల్లగా; మార్దవంబు+ఒనరునట్లుగన్= మెత్త దనం వచ్చేటట్లు; ఎట్టకున్+ఏనిన్= ఏదో విధంగా; రాచి= అరగదీసి; మీ తల్లికిన్= మీకు తల్లీ నాకు అత్తగారూ అయిన కుంతీదేవికి; భక్తిన్= భక్తితో; పెట్టెడు విధంబునన్= శరీరానికి అలదే రీతిగా; పెట్టుదున్= వారి శరీరాలకు అలదుతున్నాను; బ్రహ్మన్+తిట్టుదున్= (నాకిటువంటి దుస్థితిని కలిగించినందుకు) విధిని దూషిస్తాను.

**తాత్పర్యం:** ఇతరులు తీసిన గంధాన్ని సుదేష్ణ మొదలైన రాణులు ఒప్పుకోరు. నేనే శ్రమపడి చెమటలు పట్టేటట్లు అరగదీసి మెత్తటి చందనాన్ని, మీ తల్లికి భక్తితో అలదిన విధంగా వారికి అలదుతున్నాను. నాకీ స్థితిని కలిగించిన బ్రహ్మను లోలోన నిందిస్తాను.

**విశేషం:** ఇక్కడ గంధం అరగతీసే ఒక ప్రక్రియ చెప్పబడింది. చందనానులేపనం రాజుల కలవాటు. మనం ఈ రోజు స్నో, పౌడరు పూసికొన్నట్లు వారు చందనం పూసికొనేవారు. అది ఆరోగ్యానికి, ఆహ్లాదానికి, సువాసనకు పనికివస్తుంది. గంధం తీయడం ఒక కళ. మెత్తగా అరగదీసి శరీరానికి అలదాలి. అత్తగారి పరిచర్యలలో ఒక భాగంగా సేవాధృక్పథంతో చేసేది ద్రౌపది. ఇక్కడ పరిచారిక వలె చేయటం బ్రహ్మ వ్రాసిన తలరాత అని బాధపడుతున్నది.

**ఉ. నున్నఁదనంబుగా నలుఁగు నూఱియుఁ జందన మట్లు రాచియుం**
**బన్నుగఁ గ్రొత్తలైన కలపంబులు గూర్చియు నా సుదేష్ణకుం**
**గన్నుల సన్నలం బనులు గైకొని వారక చేయుచుండుటన్**
**ము న్నటులున్న పాణితలముల్ బలు కాయలు గాచెఁ జూచితే! 221**

**ప్రతిపదార్థం:** నున్నఁదనంబుగాన్= మెత్తగా; నలుఁగు నూరియున్= నలుగుపిండి నూరి; చందనము+అట్లు రాచియున్= గంధంవలె పూతపూసి; పన్నుగన్= చక్కగా; క్రొత్తలు+ఐన= క్రొత్త క్రొత్తవైన; కలపంబులు= కలపడాలు (వివిధ సుగంధ ద్రవ్యాల మిశ్రమాలు); కూర్చియున్= సమకూర్చి; ఆ సుదేష్ణకున్= ఆ పట్టమహిషికి; కన్నుల సన్నలన్= కనుసైగలతోనే; పనులు= పరిచర్యలు; కైకొని= అంగీకరించి; వారక చేయుచుండుటన్= ఎప్పుడూ కాదనక చేయటం వలన; మున్ను= ఇంతకుముందు; అటులు+ఉన్న= అట్లా మెత్తగా ఉన్న; పాణితలముల్= అరచేతులు; పలుకాయలు+కాచెన్= ఎన్నో కాయలు కాచాయి; చూచితే?= చూచావా?

**తాత్పర్యం:** మెత్తగా నలుగుపిండిని గంధంవలె నూరి, మైపూతలు పూసి, సువాసనల కలపములను ఏర్పరచి, ఎప్పుడూ రాణిగారి కనుసన్నలలో పరిచర్యలు చేస్తుంటాను. అందువలన సుకుమారమైన నా అరచేతులు ఎలా కాయలుగాచినాయో చూచితివా!

**విశేషం:** యజమానుల మెప్పు పొందడానికి పరిచారకులు ఎన్నో తంటాలు పడతారు. చందనాది అనులేపనాలు సమకూర్చి వారి మెప్పు పొందుతారు. అనురాగ ప్రేరకాలైన సువాసనలు వారి సౌభాగ్యానికి చిహ్నాలు. ఇవి ఏర్పరచిన పరిచారికలను రాజులు

బహుమానాలతో సన్మానిస్తారు. ఇక్కడ ద్రౌపది పరిచారికగా అట్లా చేయాల్సి వచ్చింది. చేతులు కాయలు కాయటం అనేది నానుడి. కష్టించి పనిచేసేవారి అరచేతులు కాయలు కాస్తాయి. అలవాటు లేని పనులు చేయటం వలన అట్లా ఔతుంది. ద్రౌపది పరిస్థితి అట్లాఉన్నది.

**క. అనుచుం దొరఁగెడు నశ్రుల। మునిఁగినమో మతని వక్షమునఁ జేర్చిన న**
**వ్వనిత యవస్థయ తాల్చుచు। ననిలసుతుం డడలె డెంద మలమటఁ బొందన్. 222**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; తొరఁగెడు అశ్రులన్= పొరలిపారే కన్నీటిచేత; మునిఁగిన మోము= తడిసిన ముఖం; అతని వక్షమునన్+చేర్చినన్= ఆయన ఎదురు రొమ్ముపై చేర్చగా; ఆ+వనిత= ద్రౌపది; అవస్థ+అ= కష్టాన్ని; తాల్చుచున్= తనదిగా భావించి తలచుకొంటూ; డెందము= మనస్సు; అలమటన్+పొందన్= కలత పడగా; అనిలసుతుండు= భీముడు, అడలెన్= దుఃఖించాడు.

**తాత్పర్యం:** అట్లా దుఃఖిస్తూ భీముడి గుండెలపై ముఖాన్ని చేర్చింది ద్రౌపది. ఆమె కష్టస్థితిని చూచి భీముడు కలతపడ్డ హృదయంతో దుఃఖించాడు.

**విశేషం:** మనస్సులో కష్టాన్ని ఇతరులకు చెప్పేటప్పుడు వరద వలె వచ్చే కన్నీరు బయటికి వచ్చేస్తే మనస్సులో తాపం తీరిపోతుంది. సన్నిహితుల ముందు కష్టాలు చెప్పుకొనటం, వారి ఆసరా తీసికొని గుండెలకు హత్తుకొనేటట్లు ఏడ్వడం సహజం. ఆపుకొనలేని దుఃఖం కలిగితే అది సహజం! ఇక్కడ కవి అది మన కళ్ళకు కట్టేటట్లు రవివర్మ చిత్రంవలె చూపించాడు.

**తే. అట్టి యెడఁ దన్నుఁ దాన యూరార్చి కొనుచు। నంబుజానన నెమ్మొగ మల్లఁ దుడిచి.**
**యనునయించి తత్కరములు దనమొగంబుఁ। గదియఁ జేర్చుచు నిట్టూర్పుగాడ్పునిగుడ. 223**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= అప్పుడు; తన్నున్+తాను+అ= తనను తానే; ఊరార్చికొనుచున్= ఓదార్చుకొని; అంబుజ+ఆనన= పద్మముఖి ద్రౌపదియొక్క; నెఱ+మొగము= అందమైన ముఖాన్ని; అల్లన్+తుడిచి= మెల్లగా తుడిచి; అనునయించి= ఓదార్చి; తద్+కరములు= ఆమె చేతులను; తన మొగంబున్= తన మొగంపై; కదియన్+ చేర్చుచున్= దగ్గరగా తీసికొని; నిడు+ఊర్పు గాడ్పు నిగుడన్= నిట్టూర్పు గాలి వ్యాపింపగా.

**తాత్పర్యం:** అప్పుడు భీముడు తనను తానే ఓదార్చుకొంటూ ద్రౌపది కన్నీరు తుడిచి, ఆమె చేతులు తన బుగ్గలపై సుతారంగా అదిమి దగ్గరగా తీసికొని నిట్టూర్పు పుచ్చుతూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇది అతి సహజమైన స్వభావం. చిన్న పిల్లలు చేతులు కాలాయని మన దగ్గరకు వస్తే ఆ చేతులు ముద్దాడుతూ మన బుగ్గలకు రాచుకొంటాం. అదే చేశాడు భీముడు. తిక్కన లోకజ్ఞత అది.

**వ. చింతాక్రాంతుండైన కౌంతేయునకు నయ్యింతి యిట్లనియె. 224**

**ప్రతిపదార్థం:** చింతా+ఆక్రాంతుండు+ఐన= విచారంచేత ఆక్రమించబడినవాడైన; కౌంతేయునకున్= భీముడికి; ఆ+ఇంతి= ద్రౌపది; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** భీముడు చింతపడుతుండగా ద్రౌపది ఇట్లా అన్నది.

**తే.** **'ఇందఱకు నిన్నిభంగుల నిడుమ గుడువ। వలసె ధర్మతనూభవువలనఁ జేసి,**
**దాయ లొడ్డిన మాయ జూదంపుటురులఁ। బడి కులంబున కాతఁ డిప్పాటు దెచ్చె.** **225**

**ప్రతిపదార్థం:** ధర్మతనూభవు వలనన్+చేసి= ధర్మరాజువలన; ఇందఱకున్= ఇంతమందికి; ఇన్నిభంగులన్= ఇన్ని రకాల; ఇడుమ కుడువవలసెన్= కష్టాలు అనుభవించవలసి వచ్చింది; దాయలు+ఒడ్డిన= దాయాదులు పన్నిన; మాయజూదము+ఉరులన్+పడి= మాయ జూదమనే వలలో పడి; కులంబునకున్= వంశానికంతటికీ; అతఁడు; ఈ+పాటు తెచ్చెన్= ఈ కష్టాన్ని కలిగించాడు.

**తాత్పర్యం:** 'దాయాదులు పన్నిన మాయజూదమనే వలలో చిక్కుకొన్న ధర్మరాజు జూదమాడి పణంగా ఒడ్డటం వలన మనమందరం ఈనాడు ఇన్ని రకాలుగా కష్టాలకు లోనయ్యాం. ధర్మజుడే మన వంశానికి వాటిల్లిన ఈ భంగపాటు కంతటికీ కారణం.

**ఉ.** **అక్కట! మోసపోయి యడియాసలఁ జావక యున్నదాన; ము**
**న్నొక్కెడ నే దురంతదురితోత్కట బాధలఁ బెట్టియున్న నా**
**కెక్కడి దుఃఖశాంతి గడయెయ్యుట యెమ్మెయిఁ గల్గ నేర్చు? మీ**
**ముక్కున నూర్పు గల్గ నొక మూర్ఖునిచేఁ బడితిన్ సభాస్థలిన్.** **226**

**ప్రతిపదార్థం:** అక్కట!= ఔరా!; మోసపోయి= వంచించబడి కూడా; అడియాసలన్+చావక+ఉన్నదానన్= చివరి ఆశలతో ఇంకా చావకుండా ఉన్నాను; మున్ను= పూర్వజన్మలో; ఒక్క+ఎడన్= ఒకప్పుడు; ఏన్= నేను; దురంత= అంతులేని; దురిత+ఉత్కట బాధలన్+పెట్టియున్న= అధికమైన పాపిష్ఠి బాధలను పెట్టి ఉన్న; నాకున్= నాకు; ఎక్కడి దుఃఖశాంతి= దుఃఖానికి శాంతి ఎక్కడిది?; కడ+ఎయ్యుట+ఏమెయిన్+కల్గనేర్చున్= గట్టెక్కుట ఏ విధంగా కలుగుతుంది?; మీ ముక్కునన్+ఊర్పుకల్గన్= మీరు ప్రాణాలతో ఉండగా; ఒక మూర్ఖునిచేన్= ఒక నీచుడిచేత; సభాస్థలిన్= సభలో; పడితిన్= భంగపడ్డాను.

**తాత్పర్యం:** ఔరా! నేను మోసపోయి చావకుండా ఆశాపాశంతో ఇంకా బ్రదికి ఉన్నాను. పూర్వజన్మలో నేను ఎవరినో నిరంతరం కష్టాలపాలు చేసి ఉంటాను. అందువలననే నాకు దుఃఖశాంతి లేదు. ఈ దుఃఖం నుండి బయటపడి గట్టెక్కటం ఏ విధంగా సాధ్యమౌతుంది? మీరు ప్రాణాలతో ఉండగానే ఒక మూర్ఖుడిచేత సభలో ఆ విధంగా భంగపడ్డాను కదా!

**విశేషం:** సజీవులుగా ఉండగా అనడానికి 'ముక్కున ఊర్పు కల్గన్' అనే జాతీయాన్ని కవి ప్రయోగించాడు. భర్తలు బ్రతికి ఉండగా, సభలో జనులు చూస్తుండగా అవమానంపాలు కావటం భరించరానిది. ఈ మాటలు భీముడి కోపాన్ని రెచ్చగొట్టగలవు.

**క.** **మీ రేమి సేయుదురు? దై। వారంభము గాక శుభము నశుభంబును సం**
**సారులకుం దమ తఱి నని। వారణఁ బొందంగ మాన్పవచ్చునె? దానిన్.** **227**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు- పాండవులు; ఏమి+చేయుదురు?= ఏం చేస్తారు?; దైవ+ఆరంభము+కాక= దైవఘటనమేగాని మరొకటికాదు; సంసారులకున్= జనులకు; శుభమున్+అశుభంబును= శుభాశుభాలు, మంచి చెడులు; తమ తఱిన్= వాటి సమయాలలో; అనివారణన్= తప్పించటానికి వీలులేని విధంగా; పొందంగన్= పొందుతూ ఉండగా; దానిన్= ఆ అనుభవాన్ని; మాన్పవచ్చునె?= ఆపగలమా?

**తాత్పర్యం:** అయినా మీరేం చేస్తారు? విధిఘటన దాటటానికి ఎవరికీ సాధ్యం కాదు. శుభాశుభాలను సంసారులు ఆయా సమయాలలో అనుభవించాల్సిందే. దానిని నివారించటం ఎవరికీ సాధ్యం కాదు గదా!

**విశేషం:** హరిశ్చంద్రుడు, నలుడు-ఇట్లా ఎందరో చక్రవర్తులు విధికి తలవంచారు. కర్మఫలరూపాలైన శుభాశుభాలు వాటి అంతట అవి ఆయా సమయాలలో వస్తూ ఉంటాయి. వాటిని అతిక్రమించటానికి ఎవరికీ సాధ్యం కాదు. ద్రౌపది ఈ విషయాన్ని భీముడి ముందు స్పష్టం చేయటంలో రెండు హేతువులున్నాయి. దైవసంకల్పం అనివార్యం అని చెప్పటం; పాండవుల పురుషకారంలో ఆనుకూల్యం లేకపోవటం వారి కర్మఫలమని ఓదార్చటం.

**ఉ.** **కావున మీర లభ్యుదయ గౌరవ మొందుట యాత్మ< గోరి యే**
**నే విధినైన నాపదల కెల్లను నోర్చెద; దాని కేమి! యీ**
**కావరమైన కీచకుఁడు కామనిపీడితుఁడై యలంతులం**
**బోవక యేచి పట్టుకొనఁ బోయినఁ దూలెదఁగాక యిమ్మెయిన్.** **228**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; మీరలు= పాండవులు; అభ్యుదయ గౌరవము+ఒందుట= ఉన్నతిని, గౌరవాన్ని పొందటం; ఆత్మన్+కోరి= మనస్సులో కోరుకొని; ఏను= నేను; ఏవిధిన్+ఐనన్= ఏ విధంగానైనా; ఆపదలకున్+ఎల్లనున్= కష్టాలన్నిటికీ; ఓర్చెదన్= ఓర్చుకొంటాను; దానికిన్+ఏమి= దానికేం గాని; ఈ కావరము+ఐన కీచకుఁడు= క్రొవ్వుపట్టిన ఈ కీచకుడు; కామనిపీడితుఁడు+ఐ= మన్మథావేశంతో; అలంతులన్+పోవక= చిన్న చిన్న ప్రయత్నాలతో ఆగక; ఏచి పట్టుకొనన్+పోయినన్= విజృంభించి పట్టుకొనబోవటం చేత; ఈ+మెయిన్= ఈ విధంగా; తూలెదన్+కాక= భయంతో వణికిపోతున్నాను.

**తాత్పర్యం:** కాబట్టి మీ గౌరవాన్నీ, ఔన్నత్యాన్నీ మనస్సులో కోరుకొని నేను ఎట్లాగైనా ఆపదలన్నిటినీ ఓర్చుకొంటాను. అది ఫర్వాలేదు. కాని, ఈ పొగరుబోతు కీచకుడు మదనపీడితుడై చిన్న చిన్న యత్నాలతో ఆగక, విజృంభించి నన్ను పట్టుకొనటానికి ప్రయత్నించటంతో ఇంతగా భయంతో వణికిపోతున్నాను.

**విశేషం:** ఆపదలు ఒకదాని వెంబడి ఒకటి ద్రౌపదిని చుట్టుముట్టాయి. కాని, పాండవుల అజ్ఞాతవాసం పూర్తి కావాలి. దానికి ద్రౌపది సహకారం అవసరం. అందుకే అవమానాలు భరిస్తున్నది. కాని, కీచకుడి కండకావరం ఆమెను దుఃఖాల పాలు చేసింది. అందుకే భీముడితో మదనాతురుడైన కీచకుడి ఆగడాలను చెప్పుకొని విలపించింది.

**తే.** **వానిఁ దెగఁ జూడవైతేని వాయుపుత్ర। నీవు గనుఁగొన నురినైన, నీరనైన,**
**నగ్నినైన, విషంబున నైన, నేను। మేను దొఱఁగుదు నెట్టు; నీ యాన సుమ్ము!'** **229**

**ప్రతిపదార్థం:** వాయుపుత్ర!= భీమసేనా!; వానిన్= ఆ కీచకుడిని; తెగన్+చూడనైతి+ఏనిన్= చంపప్రయత్నించనిచో; నీవు కనుఁగొనన్= నీవు (భీముడు) చూస్తూ ఉండగానే; ఉరిన్+ఐనన్= ఉరివేసికొని అయినా; నీరన్+ఐనన్= నీళ్ళలోపడి అయినా; అగ్నిన్+ఐనన్= అగ్నిలో దూకి అయినా; విషంబునన్+ఐనన్= విషం త్రాగి అయినా; నేను= (ద్రౌపది); ఎట్టున్= ఎట్లాగైనా; మేను దొఱఁగుదున్= శరీరం వదిలిపెట్టుతాను; నీ+ఆన సుమ్ము!= నీమీద ఒట్టు సుమా!

**తాత్పర్యం:** ఓ భీమసేనా! ఆ నీచ కీచకుడిని సంహరించకపోతే నేను నీ యెదుటనే ప్రాణత్యాగం చేస్తాను. ఉరి వేసికొనిగాని, నీళ్ళలో దూకిగాని, అగ్నిలో పడిగాని, విషం తినిగాని శరీరం విడిచిపెడతాను. నీమీద ఒట్టు.'

**విశేషం:** నీ ఆనసుమ్మ- అనేది జాతీయం. ఆత్మీయులతో మాట్లాడేటప్పుడు అట్లా అనటం సహజం. అది ఆత్మీయతకు నిదర్శనం.

**వ. అనిన వృకోదరుండు చిఱునవ్వు నవ్వుచు నిట్లనియె. 230**

**తాత్పర్యం:** ఆ మాటలు విని భీముడు చిరునగవు చిందిస్తూ ఇట్లా అన్నాడు.

**భీముఁడు కీచకునిఁ జంపుటకుఁ బ్రతిజ్ఞ చేయుట (సం.4-20-1)**

**చ. 'జలజదళాక్షి! కీచకునిఁ జంపుట కిమ్మెయి ముట్టఁబల్కఁగా**
**వలయునె? యేను జూడ ననివారణ నిన్నుఁ బరాభవించి వాఁ**
**డిల మన, నింక నాంధ్రకును నెవ్వరు భంగము నీఁగఁజాలువా?**
**రలఘు మదీయ బాహుబల మప్పుడు చూపనితప్పు చాలదే? 231**

**ప్రతిపదార్థం:** జలజదళ+అక్షి!= తామరపూరేకులవంటి కన్నులు కలదానా!; కీచకునిన్+చంపుటకున్= కీచకుడిని చంపటానికి; ఈ+మెయిన్= ఈవిధంగా; ముట్టన్+పల్కఁగాన్= మర్మాలు తగిలేటట్లు మాట్లాడటం; వలయునె?= అవసరమా?; ఏను+చూడన్= నేను చూడగా; అనివారణన్= అడ్డులేకుండా; నిన్నున్= ద్రౌపదిని; పరాభవించి= అవమానించి; వాఁడు= కీచకుడు; ఇలన్= భూమిపై; మనన్= జీవించగా; ఇంకన్= ఇకపై; ఆంధ్రకునున్= ఇల్లాంధ్రకు; ఎవ్వరు భంగమున్+ఈఁగఁన్+చాలువారు?= ఎవరు కష్టాలు గట్టెక్కించగలరు?; అలఘు= గొప్పదైన; మదీయ బాహుబలము= నా భుజశక్తి; అప్పుడు చూపని తప్పు= ఆ సమయంలో ప్రదర్శించని పొరబాటు; చాలదే?= చాలదా?

**తాత్పర్యం:** 'ఓ ద్రౌపదీ! కీచకుడిని చంపటం కొరకు ఈ విధంగా మర్మాలు తగిలేటట్లు ఇంతగా నచ్చచెప్పవలెనా? నేను చూస్తుండగా అడ్డూ ఆపూ లేకుండా నిన్ను పరాభవించిన ఆ కీచకుడు ఇంకా భూమిపై జీవించి ఉంటే ఇల్లాంధ్రను మానభంగాలనుండి గట్టెక్కించే మార్గ మేది? ఆనాడు విరాటుడి కొలువులో నా మహా భుజశక్తిని చూపకపోవటమే తప్పయింది. అది చాలు. (మరల ఆ తప్పు చేయను అని భావం.)

**విశేషం:** ఈ పద్యంలో 'ముట్టన్ పల్కు' అనే క్రియ సార్థకం. తిక్కన ద్రౌపదీ సంభాషణలోని శిల్పరహస్యాన్ని ఈ క్రియాపదంతో సూచించాడు. ముట్టఁబల్కుట-అంటే మర్మస్థానాలను తాకేటట్లు మాట్లాడటం అని శబ్దరత్నాకరం చెప్పింది. వక్త తాను ఏ ప్రయోజనాన్ని సాధింపదలచుకొన్నాడో అది సాధ్యమయ్యేటట్లు నిపుణంగా సప్రయోజనంగా మాట్లాడటం 'ముట్టఁబల్కటం'. నిర్లిప్తంగా ఉండి, నిద్రపోతున్న భీముడిలో రౌద్రాన్ని ప్రజ్వలింపజేయటం, అతిశీఘ్రంగా, రహస్యంగా కీచకుడిని సంహరింపజేయటం ద్రౌపది సాధింపదలచుకొన్న ప్రయోజనం. అది సఫలమయ్యేటట్లు ముట్టబలికిందని తాత్పర్యం. ఆ అంశాన్ని ఇట్లా భావించవచ్చును. 1.ధర్మరాజు మాయజూదపు ఉరులలో తాను చిక్కుకొని తనవారి కందరికీ కష్టాలు తెచ్చాడట! ధర్మరాజు మహిమను అంతకుముందే అంతగా ప్రశంసిస్తూ పలికిన ద్రౌపది మరల ఇట్లా అనటం ఆశ్చర్యం కలిగించే విషయం. ధర్మజుడి ఓటమివలన అరణ్యఅజ్ఞాతవాసాలు సంభవించాయి. దానికి తోడు ద్రౌపదికి అవమాన పరంపరలు కూడా ఆరంభమయ్యాయి. కులసతికి కలిగే ఇక్కట్టులే కులానికి పాటు కలిగిస్తాయని మొదటి హెచ్చరిక. అయిదుగురు భర్తలున్నా భార్యకు మానసంరక్షణం అనుమానస్థితిలో పడటం శోచనీయమని 225వ పద్యంలో ముట్టబలికింది. 2. పతుల ఎదుట సతులకు జరిగే అవమానాలు సతులకు ప్రాణాంతకాలు, పతులకు ఆత్మహత్యా సదృశాలు. పతులు మానధనులై తనను రక్షించగలరని ఆశపడ్డ ద్రౌపది మోసపోవటమే జరిగింది. నిజానికి ఆమె ప్రాణాలు వదలిపెట్టవలసింది. కాని, ఎప్పుడైనా భర్తలు బ్రతికి ఉండగా తనకు జరిగే అవమానాలకు ప్రతీకారం చేస్తారనే అడియాసలతో

ఆమె బ్రతుకు దుఃఖభారంతో సాగిస్తున్నది. ఆ దుఃఖం శాంతించేటట్లు లేదు. ఆమె కష్టాలు గట్టెక్కేటట్లు లేవు. ఎందుకంటే, భర్తలు బ్రతికి ఉండగానే నిండుసభలో ఒక మూర్ఖుడు (కీచకుడు) తనను అవమానించాడు. కాని, అప్పుడు కూడా వారు బ్రతికి ఉన్నట్లు నిరూపించుకొనలేకపోయారు. భార్యా మాన సంరక్షణం చేయలేని భర్తలు జీవన్మృతులవంటి వారని ఆమె ఉద్ధతుడైన భీముడు ఉలికిపడేటట్లు 226వ పద్యంలో ముట్ట బలికింది. 3. భర్తల అశక్తతకు విధివైపరీత్యం కారణమని సత్యం చెప్పినా ఎత్తి పొడుపుగా కాకువులో ముట్టబలికింది. పాండవులు కురుసభలో ధర్మబద్ధులు. విరాటసభలో సమయబద్ధులు. ద్రౌపది మాత్రం వారి వ్రతనిష్ఠవలన బాధితురాలు. పాండవుల వ్రతనిష్ఠ వలన వారికి అభ్యుదయ గౌరవాలు కలుగుతాయి. వారు ధర్మవీరు లనిపించుకొంటారు. కాని, ఆపదలన్నీ అనుభవించేది మాత్రం ద్రౌపదియే. భర్తలకు అభ్యుదయం కలిగేటట్లయితే ద్రౌపది ఎన్ని అవమానాలైనా పడటానికి సిద్ధమే అని చెప్పింది. ఆ మాటలు ఆమె దీనావస్థకు పరాకాష్ఠ. దానిని ముట్టబలికింది 227, 228 పద్యాలలో. 4. ఇప్పుడు ఆమె నిష్ఠురాలు ఎందుకు మాట్లాడుతున్నదో తెలుపుతున్నది. 'కీచకుడి చేష్టలు శ్రుతి మించుతున్నాయి. అతడు కామం చేత పీడింపబడుతున్నాడు. (మన్మథ బాధను పొందుతున్నాడు.) అంటే రతిక్రీడకు తొందరపడుతున్నాడని భావం. మొదట మాటలతో, చిన్న చిన్న చేష్టలతో పోతాడేమో అని అనుకొంటే ఇప్పుడు అంతటితో ఆగక విజృంభించి నన్ను పట్టుకొనటానికి సిద్ధమయ్యాడు భర్తలు చూస్తుండగానే. అతడెప్పుడైనా ఏ విధంగానైనా ఎక్కడైనా నాపై సాహసించగలడు. అప్పుడు నన్ను రక్షించే దెవరు? - 'ఒకవేళ రక్షించగలిగితే నీవొక్కడవే ప్రస్తుతం సమర్థుడవు'- అనే ఆశ తన మనసులో ఉన్నట్లు ముట్టబలికింది 228వ పద్యంలో. 5. ఇప్పుడు శీఘ్రంగా కీచకుడిని చంపటం తప్ప మరొక మార్గం లేదు. ఇది ఉపేక్షకు, విచికిత్సకు సమయం కాదు. ఒకవేళ దానిని భీముడు నిర్వహించకపోతే నేను ఉరిపోసుకునిగాని నీటిలో దూకిగాని, అగ్నిలో పడిగాని, విషం త్రాగిగాని చచ్చిపోతానన్నది. ఇది బెదిరింపు మాట కాదు. 'మీ మీద ఒట్టుపెట్టి చెపుతున్నాను. మీమీద నాకున్న భక్తి అటువంటిది. నమ్మకం అటువంటిది. నాకు మానభంగం కంటే ప్రాణభంగమే శ్రేష్ఠం'- అని ముట్టబలికింది.

ఆ మాటలకు ప్రతిస్పందన భీముడి ఈ మాటలు. భీముడు ద్రౌపది మాటలలోని ప్రయోగశక్తిని గుర్తించినట్లు పలికాడు. ద్రౌపదిని పరాభవించిన కీచకుడు తనచేత చావటం తప్పదని సంకల్పించాడు. ఆ పని అప్పటికే ఆలస్యమైనందుకు విచారించాడు. దుఃఖభావం నుండి భీముడిని ఉద్ధరించి, క్రోధభావ తీవ్రతను అతడిలో ప్రజ్వలింపచేసి, సత్వర కార్యోన్ముఖుడిగా మార్చిన ద్రౌపది వాక్ శిల్పం రసాభ్యుదయోల్లాసానికి రమణీయోదాహరణం. (సంపా.)

**తే.** **ఎల్లి యెల్ల విధంబుల నెందుఁజొచ్చె। నేని, నా ధర్మ తనయుండు దాన వచ్చి**
**యడ్డపడెనేని నీవ పెంపారు కరుణఁ। గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు.** **232**

**ప్రతిపదార్థం:** కీచకుండు= కీచకుడు; ఎల్లి= రేపు; ఎల్ల విధంబులన్= ఎన్నిరకాలుగానైనా; ఎందున్+చొచ్చెన్+ఏనిన్= ఎక్కడ దాగినా; ఆ ధర్మతనయుండు= ఆ ధర్మజుడే; తాను+అ,వచ్చి= తానే వచ్చి; అడ్డపడెనేనిన్= అడ్డుపడినా; నీవు+అ= ద్రౌపది కూడా; పెంపారు కరుణన్= పైకి పొంగివచ్చే దయతో; కాచితి(వి)+ఏనిన్= కాపాడినా; నాచేన్+పడున్= నా చేతిలో చస్తాడు.

**తాత్పర్యం:** రేపటి దినం ఆ కీచకుడు ఎక్కడ ఎట్లా దాగి ఉన్నా, స్వయంగా ధర్మజుడు వచ్చి అడ్డుపడినా, నీవు కూడా అధిక దయతో క్షమించినా, నా చేతిలో అతడికి చావు మూడింది.

**విశేషం:** భీముడి శపథం సూటిగా, ఘాటుగా ఉన్నది. ప్రతిపదసార్థకంగా సాగింది. కాల విలంబనం వలన కీడు మూడవచ్చునని ద్రౌపది చేసిన సూచనకు ప్రతిస్పందనగా 'రేపే కీచకుడు నా చేతిలో చస్తాడు' అని ప్రధానాంశాన్ని ప్రకటించాడు. చంపదగిన శత్రువును సత్వరమే చంపటం భీముడి స్వభావం. కాని, అతడి ప్రయత్నాన్ని ఆపు చేయగల శక్తులు రెండున్నాయి. ఒకడు ధర్మరాజు, మరొకరు ద్రౌపది. అలనాడు సైంధవుడి పట్ల అదే జరిగింది. ధర్మరాజు అతడిని చంపవద్దన్నాడు, అందువలన అతడికి పాండవదాసుడనే బిరుదాన్నిచ్చి వదలిపెట్టాడు భీముడు. ద్రౌపది సైంధవ వధను మొదట కోరింది. భీముడు దాని

కనుకూలంగా వ్యవహరించి చంపబోయాడు. అర్జునుడు ధర్మజునాజ్ఞను జ్ఞాపకం చేసి వారించాడు. చివరకు ద్రౌపది పట్టుపట్టి సైంధవుడిని చంపటానికి ధర్మరాజును ఒప్పిస్తుందేమో అని భీముడు ఆశపడ్డాడు. సైంధవుడిని బందీగా తెచ్చి అన్నముందు ఉంచాడు. అప్పుడు ద్రౌపది తన మనసు మార్చుకొని పాండవదాసుడైన వాడిపై ధర్మరాజువలెనే దయావర్షాన్ని కురిపించింది. ఈ ఉదంతాన్ని జ్ఞాపకం చేసి భీముడు రెండు విధాల గడుసరితనం ప్రకటించాడు. 'నే నెప్పుడూ కార్యశీలినే. ధర్మరాజా, నీవే సహనమూర్తులు, నా కార్యాలకు అడ్డుపడేవారు' అని ఎత్తిపొడిచి, తనయందు కీచకఘట్టంలో కూడా లోపం లేదని పరోక్షంగా సమర్థించుకొన్నాడు. 2. ధర్మజుడికి తెలిస్తే కీచకుడి మీద దయతో నన్ను వారిస్తాడు. నీవు నాతో చెప్పినట్లు ధర్మరాజుకు కూడా తెలిపావంటే అతడు నిన్ను కూడా మారుస్తాడు. అయినా నేను మారను. మీరిద్దరూ కలిసి వచ్చినా, ఎన్ని రకాలుగా వారించినా నా ప్రతిజ్ఞ ఆగదు అని హెచ్చరించాడు. కీచకవధ అనే కార్యనిర్వహణానికి భీముడు ప్రకృష్టమైన ప్రయత్నావస్థను ప్రకటించాడు. (సంపా.)

**వ. వానిదెసం జింత యావంత వలవ; దమ్మాటలు విడువు' మని యూఱడిల్లం బలికి, దుర్దశల నలందురు నవ్వెలంది డెందంబుకుందు వాపం దలంచి యిట్లనియె. 233**

**ప్రతిపదార్థం:** వానిదెసన్= కీచకుడిపట్ల; చింత= దుఃఖం; ఆవంత వలవదు= కొంచెం కూడా వద్దు; ఆ+మాటలు విడువుము= ఇక అతడి గురించి మాటలు మాట్లాడటం ఆపివేయుము; అని; ఊఱడిల్లన్+పలికి= మనసు తేరుకొనేటట్లు మాటలాడి; దుర్దశలన్+అలందురు= కష్టాలు కడగళ్ళతో దుఃఖించే; ఆ+వెలంది= ద్రౌపది యొక్క; డెందంబుకుందు= మనసులోని బాధను; పాపన్+తలంచి= పోగొట్టదలచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇక నీవు కీచకుడి పట్ల ఆవంత కూడా చింత పడవలసిన అవసరం లేదు. వాడి మాటలు ఇక మరచిపోమ్మ' అని ద్రౌపది మనస్సు ఊఱడిల్లేటట్లు పలికాడు. అంతేకాక, భీముడు కలసిరాని కష్టకాలంలో ఆమె పొందుతున్న తీవ్ర మనోవేదనను తగ్గించవలెననే భావంతో ఈ విధంగా పలికాడు.

**సీ. 'చ్యవనుని వాంఛకు సంయాతినందన। యిడుమలఁ గుడువదె యడవిలోన?**
**రాఘవుతోడ నరణ్యవాసము చేసి। సంతాప మందదె జనకతనయ?**
**కుంభసంభవునకై ఘోరదుర్గముల లో। పాముద్ర యలజడి పాలుగాదె?**
**నలునిపిఱుందఁ గానల కేఁగి దమయంతి। మనుజులు పడనియుమ్మలిక పడదె?**

**తే. వారు సైరణచేసి దుర్వారమైన। నిరతిశయ దుఃఖభారంబు నిస్తరించి**
**సౌఖ్యమొందరె? నీవు నా చందమునన। యాపదల కోర్చి సంపద లనుభవింపు. 234**

**ప్రతిపదార్థం:** చ్యవనుని వాంఛకున్= చ్యవనుడి కోర్కెకు; సంయాతినందన= సంయాతి కుమార్తె సుకన్య; అడవిలోనన్= అరణ్యంలో; ఇడుమలన్+కుడువదె?= కష్టాల ననుభవించలేదా?; రాఘవుతోడన్= రాముడితో; అరణ్యావాసము చేసి= అడవులలో కలిసి నివసించి; జనకతనయ= సీత; సంతాపము+అందదె?= కష్టపడలేదా? కుంభసంభవునకై= అగస్త్యుడి కొరకై; ఘోరదుర్గములన్= ఘోరారణ్యాలలో; లోపాముద్ర= అగస్త్యుడి భార్య; అలజడి పాలు కాదె= అవస్థల పాలుపడలేదా?; నలుని పిఱుందన్= నలుడి వెంట; కానలకున్+ఏఁగి= అడవులకు వెళ్ళి; దయయంతి; మనుజులు పడని= మనుష్యులు పడనటువంటి; ఉమ్మలిక, పడదె?= దుఃఖాన్ని అనుభవించలేదా?; వారు సైరణ+చేసి= వారంతా ఓర్చుకొని; దుర్వారము+ఐన= భరించరానిదైన; నిరతిశయ దుఃఖభారంబు= అధికమైన కష్టాలబరువును; విస్తరించి= దాటి, ఎట్లాగో మోసి; సౌఖ్యము+ఒందరె?= సుఖపడలేదా?; నీవున్= నీవుకూడా (ద్రౌపది కూడా); ఆ చందమునన్= ఆ విధంగానే; ఆపదలకున్+ఓర్చి= ఆపదలు భరించి; సంపదలు+అనుభవింపు= సౌఖ్యాన్ని పొందుము.

**తాత్పర్యం:** చ్యవనుడి కోర్కెను మన్నించి సుకన్య అడవిలోబడి కష్టాలను భరించలేదా? రఘురాముడితో అడవుల కేగి సీతమ్మ ఇడుముల పడలేదా? అగస్త్యుడి వెంట పర్వతాలు దాటి లోపాముద్ర అగచాట్లు పడలేదా? నలుడిని వెంబడించి అడవులకు వెళ్ళి దమయంతి మనుష్యులు పడలేని పాట్లు పడలేదా? వారందరూ ఎట్లాగో కష్టాల బరువు కోర్చుకొని సుఖాల తీరాన్ని చేరలేదా? అదే విధంగా నీవు కూడా కష్టాలను ఓర్చుకొని సంపదలను అనుభవించుము.

**విశేషం:** సుకన్య కథ: (సుకన్య శర్యాతి కుమార్తె అని మహాభారతారణ్యపర్వం చెప్పింది. సంయాతి శర్యాతి కొడుకు. తిక్కనసంయాతి కూతురుగా పేర్కొన్నాడు.) భృగుని కుమారుడు చ్యవనుడు. ఇతడు అనేక సంవత్సరాలు తపస్సు చేశాడు. శరీరమంతా పుట్టలు పోశాయి. ఒకనాడు శర్యాతి అనే రాజు తన కుమార్తె సుకన్యతో చ్యవనుడు తపస్సు చేసికొనే ప్రాంతానికి వచ్చాడు. సుకన్య చిలిపితనంతో పుట్టను గమనించక చ్యవనుడి పుట్టలోనుండి మెరుపులు రావటం చూచి త్రవ్వించింది. ఆ దోషానికి చ్యవనుడు కోపగించాడు. శర్యాతి యొక్క సైనికులను బాధించాడు. ఆ బాధను తొలగించటానికి సుకన్యను తనకిచ్చి వివాహం చేయుమని శర్యాతిని కోరాడు. తండ్రి ఇష్టపడకపోయినా, చ్యవనుడు వృద్ధుడైనా అతడిని వివాహం చేసికొన్నది సుకన్య. ఆ తరువాత చ్యవనుడు అశ్వినుల సహకారం వలన, తపశ్శక్తి వలన యువకుడై భార్యకు సుఖసౌఖ్యాలను అందజేశాడు. ఈ విధంగా సుకన్య వృద్ధుడిని వివాహం చేసికొని అనేక కష్టాలు పడి చివరకు సుఖసంతోషాలను పొందగలిగింది. సీతకథ: రామాయణంలోని ఈమె కథ ప్రసిద్ధం. పితృవాక్య పరిపాలకుడైన శ్రీరాముడి ననుసరించి సీత అరణ్యవాసం చేయవలసి వచ్చింది. రాముడితో కలిసి అడవులలో ఎన్నో కష్టాలు అనుభవించింది. రావణుడి చెరలో చిక్కి, అశోకవనంలో ఎన్నో కడగండ్లు భరించింది. మాయలేడిని తెమ్మన్న కారణంగా భర్తకు దూరమయింది. రావణ సంహారానంతరం మరల భర్తదరి చేరకలిగింది. రాజ్యసుఖాలను అనుభవించింది. 3. దమయంతి కథ: నలదమయంతులు ఆదర్శ ప్రేమ దంపతులు. నిషధ రాజును స్వయంవరంలో వివాహమాడింది దమయంతి. స్వయంవరానికి ఇంద్రాది దిక్పాలురు విచ్చేశారు. వారు కూడా దమయంతిని కోరి వచ్చారు. అయినా దమయంతి నలుడిని వరించింది. కలి ఆమెను పొందలేకపోయి పగబట్టాడు. ఫలితంగా కష్టాలపాలైంది. కలి పురుషుడు పెట్టిన కష్టాలు ఇంతంత కాదు. జూదంలో నలుడు సర్వస్వాన్నీ కోల్పోయాడు. అరణ్యాలలో దమయంతిని వదలి నలుడు వెళ్ళిపోయాడు. తక్షకుడి కాటువలన నలుడికి వికృతరూపం కలిగింది. కష్టాలు గట్టెక్కి ద్వితీయ స్వయంవరం నెపంతో దమయంతి మళ్ళీ నలుడిని నిజరూపంతో పొందగలిగింది. నలుడు రాజ్యాన్ని మరలా పొందాడు. దమయంతి రాజ్యభోగాల ననుభవించింది. లోపాముద్ర కథ: అగస్త్యుడు చాలా కాలం బ్రహ్మచర్య వ్రతం చేశాడు. తన తపఃప్రభావంతో విదర్భరాజుకు లోపాముద్ర జన్మించేటట్లు చేశాడు. ఆమెనే తన కిచ్చి వివాహం చేయుమని రాజు నడిగాడు. ఆమెకు వస్త్రాభరణాల కొరకు ఎందరినో ఆశ్రయించాడు. చివరకు అవి సంపాదించి పెట్టి ఆమె ద్వారా పుత్రులను పొందాడు. ఈ నాలుగు కథలలో ఆయా పతివ్రతలు కష్టాల పాలుగావటం, వాటిని ఓర్చుకొని కొన్నాళ్ళకు సుఖాన్ని పొందటం పురాణ ప్రసిద్ధం. అంతేకాదు. ఈ కథలన్నీ ఆరణ్యపర్వంలో మునుల వలన పాండవులు విన్నవే. వాటిని గుర్తుకు తెచ్చి భీముడు ద్రౌపది నోదారుస్తున్నాడు. అప్పుడు శ్రవణంలో నిలిచిన కథలు ఇప్పుడు మననంలోకి మారాయి. పురాణశ్రవణ ఫలితాలలో ఇది ఒకటి. తమతో సమానంగా కష్టా లనుభవించిన ఇతరులను తలచుకొంటే కొంత ఊరట కలుగుతుంది. అది మానవ స్వభావం. మనం చేసిన పని ఫలించకపోతే, ఎదుటివారిని చూచి వారూ కష్టాలలో ఉంటే చూచి ఊరట పొందుతాం. ఇదే తిక్కన కావ్యశిల్పం.

**వ.** **దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవ ప్రముఖంబగు దుష్ట లోకంబు నధోలోకంబున కనుచునంతకు మదీయాంతరంగంబు చింతాభర భుగ్నంబును, నవమాన పంకమగ్నంబును, గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్నయది; ధార్తరాష్ట్రులకుం గాలావసానం బైనయట్లు మనకు సమయ కాలావసానం బయ్యె; నజ్ఞాత వాసంబునకుం జొచ్చి పదునొండు నెలలు సని పండ్రెండవనెల వర్తిల్లుచున్నది. దీని కొఱంత దీఱిన నీదు వంతయుం దీఱు; నూఱడిల్లి యుండుము; సింహబలుండు నిన్నుఁ బరిభవించి మై మైతోన యునికింజేసి**

**యెల్లియుం జెనక వచ్చు; నీవునుం గ్రమంబున నొడంబడుట భావించికొని వానికి నర్తనశాల సంకేత ప్రదేశంబుగాఁ జెప్పి యొంటిమెయిం జనుదేర నియమింపుము; వాఁడు వచ్చిన నా సొబగునిం దెగఁజూచి, నీకుం జూపి నీ చిత్తంబు వడసెద; నిత్తెఱంగు దప్ప నొండు విధంబు గర్జంబుగా; దిదియె నిశ్చయం; బిట్ల చేయు వార; మిమ్మాటలవలనం దప్పవు గాని, వేగుచున్నయది; జనులు మేలుకాంచి మనలం గాంచి రేని వంచన బయలు పడినం గార్యంబు దప్పుఁ; గీచక వధంబునకుం బూనిన నా మనోరథంబు దుది ముట్టవలయు; నిజశయన స్థానంబునకుం బొ' మ్మని శయ్యాతలంబు విడిచి యత్తన్విం దఱిమి కొన్ని యడుగు లనిచి, మరలి మారుతాత్మజుండు కలుషితాత్ముండగుచు సెజ్జకు వచ్చె; నచ్చెలువయుం దన నిద్రించు నెడకుం బోయి పర్యంక భాగంబునం దనువు వైచి, యంకిలి దేఱని దెందంబునఁ గొందలంబుతోడి నిశ్చయంబున నిద్రంబొరయని కనుదోయి మొగిడ్చి యుండె; నంత.** **235**

**ప్రతిపదార్థం:** దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకుని, సైంధవ, ప్రముఖంబు+అగు= దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవాది యోధులతో కూడిన; దుష్టలోకంబున్= దుండగుల సమూహాన్ని; అధో+లోకంబునకున్, అనుచు+అంతకున్= నరకానికి పంపునంతవరకు; మదీయ+అంతరంగంబు= నా మనస్సు; చింతాభరభుగ్నంబును= దుఃఖభారంతో వంగినదీ; అవమాన పంకమగ్నంబును= అవమానమనే బురదలో మునిగినదీ; కోప+ఉద్విగ్నంబునున్+ఐ= కోపంతో కలవరపడినదీ అయి; వేగిర పడుచున్న+అది= తొందరపడుతున్నది; ధార్తరాష్ట్రులకున్= కౌరవులకు; కాల+అవసానంబు+ఐన+అట్లు= కాలం తీరినట్లు, మృత్యువు సమీపించినట్లు; మనకున్= పాండవులకు; సమయకాల+అవసానంబు+అయ్యెన్= ప్రతిజ్ఞ చేసిన కాలం ముగిసే రోజులు దగ్గరపడ్డాయి; అజ్ఞాతవాసంబునకున్+చొచ్చి= రహస్యంగా ఉండే నియమంతో ప్రవేశించి; పదునొకండునెలలు చని= పదకొండు నెలలు పూర్తి అయి; పంద్రెండవ నెల= పన్నెండో నెల; వర్తిల్లుచున్+ఉన్నది= జరుగుతున్నది; దీని కొఱంత తీఱినన్= ఈ ఉపద్రవం తప్పితే; నీదువంతయున్= నీదుఃఖం కూడా; తీఱున్= తొలగిపోతుంది; ఊరడిల్లి+ఉండుము= ఊరట పొంది ఉండుము; సింహబలుఁడు= కీచకుడు; నిన్నున్+పరిభవించి= నిన్ను (ద్రౌపదిని) అవమానించి; మైమైతోన్+అ= సశరీరంగా; ఉనికిన్+చేసి= ఉండటం చేత; ఎల్లియున్= రేపు కూడా; చెనక వచ్చున్= సమీపించవచ్చును; నీవునున్= నీవుకూడా (ద్రౌపది కూడా); క్రమంబునన్+ఒడంబడుట= నెమ్మదిగా అంగీకరించటం; భావించికొని= ఊహించుకొని; వానికిన్= కీచకుడికి; నర్తనశాల= నాట్యశాల; సంకేత ప్రదేశంబుగాన్+చెప్పి= గుర్తుగా (కలిసే స్థలంగా) చెప్పి; ఒంటిమెయిన్= ఒంటరిగా; జనుదేరన్= వచ్చుటకు; నియమింపుము= ఆజ్ఞాపించుము, ఏర్పాటు చేయుము; హాఁడు= అతడు; వచ్చినన్= రాగా; ఆ సొబగునిన్= ఆ సుందరుణ్ణి, చక్కనివాణ్ణి; తెగన్+చూచి= చంపి; నీకున్+చూపి= నీకు (ద్రౌపదికి) చూపి; నీ చిత్తంబు+పడసెదన్= నీ మనసు మెప్పిస్తాను; ఈ+తెఱంగు తప్పన్= ఈ పద్ధతి కాకుండా; ఒండు విధంబు= మరొక పద్ధతి; కర్జంబు+కాదు= ఫలించే పని కాదు; ఇది+ఎ+నిశ్చయంబు= ఇదే నిర్ణయం; ఇట్ల చేయువారము= ఇట్లాగే చేద్దాం; ఈ+మాటలవలనన్+తప్పవుకాని= ఇక ఈ మాటలవలన పనులు తీరేవి కావు; వేగుచున్న+అది= తెల్లవారబోతున్నది; జనులు,మేలుకాంచి= లోకులు మేల్కొని; మనలన్+కాంచిరి+ఏనిన్= మనలను (భీమద్రౌపదులను) చూస్తే; వంచన బయలుపడినన్= అజ్ఞాతవాసం బహిరంగమైతే; కార్యంబు+తప్పున్= అజ్ఞాతవాసకార్యానికి భంగం ఏర్పడుతుంది; కీచక వధంబునకున్+పూనిన= కీచకుడిని చంపటానికి పూనుకొన్న; నా మనోరథంబు= నా సంకల్పం, కోరిక; తుదిముట్టవలయున్= పూర్తికావాలి; నిజ శయన స్థానంబునకున్+పొమ్ము= నీవు పరుండే ప్రదేశానికి వెళ్ళిపొమ్ము; అని; తన శయ్యాతలంబు= తన పడక; విడిచి= వదలిపెట్టి; ఆ తన్విన్+తఱిమి= ద్రౌపదిని వెంబడించి; కొన్ని అడుగులు+అనిచి= కొంత దూరం వీడ్కొల్పి; మారుత+ఆత్మజుండు= గాడ్పుకొడుకు భీముడు; కలుషిత+ఆత్ముండు+అగుచున్= కలవరపడ్డ మనస్సుతో; సెజ్జకున్+వచ్చెన్= పడక మీదికి వచ్చాడు; ఆ+చెలువయున్= ద్రౌపది

కూడా; తన నిద్రించు+ఎడకున్+పోయి= తాను నిద్రించే ప్రదేశానికి పోయి; పర్యంక భాగంబునన్= పడకపై; తనువు వైచి= శరీరం పడవేసి; అంకిలి తేఱని డెందంబునన్= కలతవీడని మనస్సుతో; కొందలంబుతోడి= కలవరంతో కూడిన; నిశ్చయంబునన్= నిర్ణయంతో; నిద్రన్+పొరయని= నిద్రరాని; కనుదోయి మోడ్చి= కళ్ళు మూసికొని; ఉండెన్= ఉన్నది; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** దుర్యోధన దుశ్శాసన కర్ణ శకుని సైంధవాది దుష్టుల నందరినీ నరకలోకానికి పంపేటంత వరకు నా మనస్సు చింతా భారంతో వంగిపోయి, అవమానమనే బురదలో కుంగిపోయి, కోపతాపంతో కలత చెంది తొందరపడుతున్నది. దానికి తోడు కౌరవులకు కాలం మూడినట్లు మన అజ్ఞాతవాస సమయంకూడా పూర్తి కావస్తున్నది. పదకొండు నెలలు పూర్తి అయి, పన్నెండో నెల నడుస్తున్నది. ఇంక, ఈ గడువు కాస్తా తీరితే నీ దుఃఖం కూడా తీరుతుంది. కాబట్టి ఊరడిల్లి ఉండుము. కీచకుడు నిన్ను అవమానించి ఇంకా శరీరంతో బ్రతికి ఉన్నాడు. కాబట్టి రేపు వాడు వచ్చినపుడు మట్టుబెట్టవచ్చును. నీవు కూడా క్రమంగా అతడిని అంగీకరిస్తున్నట్లు ఊహించి (నటించి) నర్తనశాలను సంకేతంగా చెప్పి వాడిని అక్కడికి ఒంటరిగా రమ్మని చెప్పుము. అట్లా వస్తే ఆ సొగసుకాడిని మట్టుబెట్టి, నీకు కళ్ళారా చూపి, నీ మనస్సు రంజింపచేస్తాను. ఇది తప్ప మరొక ఉపాయం లేదు. ఇదే నిర్ణయం. ఇట్లాగే చేద్దాం. ఇక ఈ కార్యం మాటలతో తీరేది కాదు. చేష్టలకు దిగాలి. అదిగో తెల్లవారబోతున్నది. లోకం గుర్తిస్తే, అజ్ఞాతవాస వ్రతానికి భంగం వాటిల్లుతుంది. మన కార్యానికి భంగం కలుగుతుంది. కీచకుడిని చంపాలనుకొన్న నా కోరిక తీరాలి. నీవు వెళ్ళి నీప్రక్కపై పడుకొమ్మని చెప్పి ఆమెను తొందరపెట్టి కొంతదూరం కలసి వెళ్ళి వీడ్కోలు చెప్పి భీముడు కోపంతో కలతచెంది తన పడకపై నడుం వాల్చాడు. ఆమెకూడా పోయి తన పడకపై తనువు వాల్చింది. కాని, కంటికి నిద్ర రాలేదు. అయినా కనుదోయి మూసికొని కదలకుండా పడుకొని ఉండిపోయింది. అప్పుడు.

**విశేషం:** భీముడి వ్యూహకుశలత, కార్యదక్షత, ఉత్సాహస్ఫూర్తి, ఫలితాన్ని సాధించటంలో దృఢ నిశ్చయం, సమయోచితాలైన ఉపాయాలను సాధించే చాతుర్యం- మొదలైన నాయకలక్షణాలను ఇందులో ప్రదర్శించాడు. (సంపా.)

## ప్రభాతకాల వర్ణనము

(ఇది మూలమునందు లేదు)

**తే.** **ద్రుపద నందన పరిభవ దుఃఖమునకు। నుల్లమున దురపిల్లుచు నున్న సరసి**
**వేఁడి నిట్టూర్పులో యన వెడలెఁ గ్రొత్త। తావి మూతులు విచ్చు నెత్తమ్మివిరుల.** **236**

**ప్రతిపదార్థం:** ద్రుపదనందన= ద్రౌపది యొక్క; పరిభవ దుఃఖమునకున్= అవమానం వలన కలిగిన దుఃఖానికి; ఉల్లమునన్= మనసులో; దురపిల్లుచున్+ఉన్న= విలపిస్తున్న; సరసి= సరస్సు; వేఁడి నిట్టూర్పులో+అనన్= వేడి నిశ్వాసాలో అన్నట్లు; మూతులు విచ్చు= వికసించు; నెత్తమ్మి విరులన్= చక్కని తామరపూలనుండి; క్రొత్త, తావి= క్రొత్త వాసనలు; వెడలెన్= వెలుపలికి వ్యాపించాయి.

**తాత్పర్యం:** ద్రౌపది అవమాన దుఃఖాన్ని చూచి విలపిస్తున్న సరస్సు అనే స్నేహితురాలు విడిచిన వేడి నిట్టూర్పులో అన్నట్లుగా మూతులు విచ్చుకొంటున్న కమలాలనుండి వచ్చే కొంగ్రొత్త సువాసనలు వెలువడసాగాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ప్రకృతి కథానాయికపట్ల సానుభూతి చూపినట్లు కవి వర్ణించటం విశేషం. వర్ణనను కథలో మేళవింపజేయటం భాగం.

**క. విచ్చెం దిమిరము; కాఁపులు । వచ్చె మధుపకులము లబ్జవనముల; కురులం**
**జొచ్చె విరులు తరులతికల; । నిచ్చె రథాంగములు వంత యెల్లఁ దొగలకున్.** 237

**ప్రతిపదార్థం:** తిమిరము= చీకటి; విచ్చెన్= తొలగిపోయింది; మధుపకులములు= తుమ్మెదల సముదాయం; అబ్జవనములకున్= తామరపూవుల సముదాయానికి; కాఁపులు వచ్చెన్= కాపురం వచ్చాయి; విరులు= పూలు; తరులతికలన్= చెట్ల తీగల నుండి; ఉరులన్+చొచ్చెన్= రాల దొడిగాయి; రథాంగములు= చక్రవాకపక్షులు; వంతన్+ఎల్లన్= తమ బాధనంతా; తొగలకున్= కలువలకు; ఇచ్చెన్= ఇచ్చాయి.

**తాత్పర్యం:** చీకటి తొలగింది. తుమ్మెదలు తామరపూలపై వాలాయి. చెట్లనుండి, తీగలనుండి పూలు రాలాయి. చక్రవాకాలు తమ బాధనంతా కలువపూలకు ఇచ్చాయి.

**విశేషం:** చక్రవాక పక్షులకు రాత్రి పూట కళ్ళు కనబడవు కాబట్టి జంటలు వియోగావస్థ పొందుతాయి -అని కవిసమయం. కలువలు రాత్రంతా వికసించి సూర్యోదయంతో ముకుళిస్తాయి. తెల్లవారుతుండగా చక్రవాక పక్షులు వికసిస్తూ తమ రాత్రి బాధను ముకుళిస్తున్న కలువలకు అప్పగించినట్లున్నదట! తమ చుట్టమైన చంద్రుడు అస్తమించగా కలువలు ముకుళించాయి. వాటి ముకుళనాన్ని కవి వాటి బాధగా సంభావిస్తూ, అంతవరకూ తమ బాధను చక్రవాకాలు వాటి కందించినట్లు చమత్కరించాడు. (సంపా.)

**సీ. పెనఁకువఁ దనిసిన తనువు లొండొంటితోఁ । గీలించి నిద్రించి మేలుకాంచి,**
**తరుణులుఁ బతులు వాతాయనంబుల నల్లఁ । బొలయు వేఁబోకటి మలయపవను**
**నింపారు చోఁకున నిగురొత్తు చిత్తంబు । లెలసి యొండొరులపైఁ బొలయు చూడ్కు**
**లాదట నుపకరణావళి వెడ వెడ । యాదరించుచు రాగ మడరఁ దొడరి**

**తే. కేళి సలిపిరి భవన దీర్ఘికల తమ్మి । విరుల నెత్తావి నెనయంగ బెరసి చెమట**
**పొడము మేనుల తనికంపు ప్రోచి తఱచు । టూర్పుగాడ్పుల పరిమళ ముల్లసిల్ల.** 238

**ప్రతిపదార్థం:** పెనఁకువన్= కలయికచేత; తనిసిన తనువులు= తృప్తిపొందిన శరీరాలు; ఒండు+ఒంటితోన్= ఒకదానితో మరొకదానిని; కీలించి= చేర్చి; నిద్రించి మేలుకాంచి= నిద్రపోయి మేల్కొని; తరుణులున్, పతులున్= భార్యలూ భర్తలూ; వాతాయనంబులన్= కిటికీల నుండి; అల్లన్= మెల్లగా; పొలయు= వీచే; వేఁబోకటి= వేకువజామునందలి; మలయపవను= మందమారుతం యొక్క; ఇంపారు చోఁకునన్= సుఖమైన స్పర్శచే; ఇగురొత్తు= కోరికల వలన చిగురించే; చిత్తంబులు= మనస్సులు; ఎలసి= పొంది; ఒండొరులపైన్= ఒకళ్ళ మీద ఒకరు; పొలయు= వ్యాపించే; చూడ్కులు= చూపులు; ఆదటన్= ప్రేమతో; ఉపకరణ+ఆవళిన్= చందనాది ద్రవ్యాలతో; వెడవెడ= మిక్కిలి కొంచెంగా; ఆదరించుచున్= గౌరవిస్తూ; రాగమడరన్= ప్రేమ అతిశయించగా; తొడరి= పూనుకొని; భవనదీర్ఘికల= ఇళ్ళలోని బావులలోని; తమ్మివిరుల= తామరపూలయొక్క; నెత్తావిన్+ఎనయంగన్= వాసనలు నిండగా; బెరసి= వ్యాపించి; చెమటపొడము మేనులన్= చెమట పట్టే శరీరాలపై; తనికంపు= చిరువాసనను; తఱచు+ఊర్పుగాడ్పుల= మాటిమాటికి నిట్టూర్పుల; పరిమళము+ఉల్లసిల్లన్= వాసనలు వ్యాపించగా; కేళి సలిపిరి= రతిక్రీడలు చేశారు.

**తాత్పర్యం:** దంపతులు కలిసి రతి తృప్తి నొంది ఒకొళ్లనొకళ్లు కౌగిలించుకొని నిద్రపోయి తెల్లవారే సమయంలో లేచి, మందమారుతం కిటికీలలో నుండి వీస్తూ సోకగా మరల ఒకరిపై ఒకరికి మమకారం అధికమై భోగసాధనాలైన

ఉపకరణాలు కొద్దిగా తీసికొని ఇళ్ళనడబావులలోని తామరపూల సువాసనలు నిశ్శ్వాసాలతో కలిసి శరీరంపై చెమట సుగంధాన్ని అధికం చేయగా రతికేళి సలిపారు.

**విశేషం:** రాత్రి రతికేళిలో మైమరచి కౌగిలింతలలో పడుకొనటం దంపతులకు సహజం. తెల్లవారే వేళ మళ్ళీ రతిక్రియ కుపక్రమించటం పరిపాటి.

**తే.** **రాలియున్న పుష్పప్రకరము విదిర్చి। చెన్నుగా నున్న సేసిన సెజ్జ యనఁగ**
**వేగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద। భాతిఁ జెలువొందెఁ జూడ నంబరతలంబు.** **239**

**ప్రతిపదార్థం:** వేగుటయున్= తెల్లవారగా; రాలియున్న= రాలిపడిన; పుష్పప్రకరము, విదిర్చి= పూలరాసులను విదిల్చి; చెన్నుగాన్, నున్న చేసిన= అందంగా నునుపు చేసిన; సెజ్జ+అనఁగన్= పడక అనేటట్లు; అంబరతలంబు= ఆకాశం; చుక్కలు+అన్నియున్= నక్షత్రాలన్నీ; విరిసి= తొలగిపోయి; విశదభాతిన్= స్పష్టమైన ప్రకాశంతో; చూడన్= చూడగా; చెలువొందెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** తెల్లవారగానే నక్షత్రాలన్నీ పోయి నిర్మలమైన ఆకాశం రాలిపడిన పూలన్నీ విదిల్చి నునుపు చేసిన పాన్పా అన్నట్లు ఉన్నది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. వేకువజామున ఆకాశం నిర్మలంగా ఉంటుంది. అది పూలు విదిల్చి నునుపుచేసిన పాన్పువలె ఉన్నదని కవి చమత్కరించాడు. పాన్పుపై పూలు సువాసనకేగాక కమ్మగా నిద్రపట్టటానికి కూడా ఉపయోగపడతాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

**వ.** **తదనంతరంబ యల్ల నల్లన తెఱపి యిచ్చి యవులవులం జను నంధకారంబు దూరంబుల యందును లేకునికి వలనం గడళ్ళప్పళించి నెరసి విరసినం బోలుచు కలుకట్టలుంబోని దిక్తటంబులును, దమపాసిన కందువలు రోసి యెత్తిన మెడలను బచరించిన చూడ్కులు వేడ్కలం గ్రందైన డెందంబులుం దమము పాసినం గలిగి మెలంగుచు నొండొంటి బిట్టుగాంచి యొదవు సమ్మదంబునం బొదలు మేనులు బెరయించి పరమానందంబునం జొక్కుచు జక్కవకవలు గలసి పొలసి నలిరేఁగి చెలఁగుచు రేయింటి యాఁకటి పెల్లునం గొదగొని కమిచి చంచువులం దిగిచి త్రుంచి యానుచు నిక్కడక్కడఁ బఱచినం జిక్కువడి యున్న మృణాల శకలంబుల వలన బాల చంద్ర శతాభిరామంబులగు శంభు జలమూర్తి విశేషంబులంబోని సరోవరంబులును, జీఁకటి వాసినం బ్రభాతం బను వింత మానిసి మెలంగి ముసుంగు వుచ్చినట్లు మేలుకని యెఱకలు పొదల విదిర్చి కూర్చికొని కలగొనం బలుకు పులుఁగుల యెలుంగుల వలన నొండొంటిం దెలుపుకరణి నొప్పు ధరణీరుహంబులును, బరఁగు నరుణోదయ రాగపటలంబు నెనయు కెంజాయ రంజిల్ల వికసిల్లు రక్తారవిందంబుల దండడి నెగసి చరించు చంచరీకంబుల యెఱకల నెఱుల గిఱికొని క్రొత్తయగు కాంతి ప్రవాహంబులం గడలుకొల్పు పుప్పొళ్ళు డుల్చి రాల్చుచుం బోలయు మలయానిలంబునం గ్రాలు మవ్వంపుఁదీవలఁ గడివోయి తొరఁగిన విరుల వలన మీనకేతన పురాతన బాణశాలలం బోని లతా మండపంబులును, మొగిడియు జనంబు సంధ్యాంజలిపుటకరణంబుల ననుకరించు విధంబునం దర్శనీయంబులగు కుముద వనంబులును, నేమేని నెపంబున నొండొరుల మేలుకొలుపు రమణ రమణీ జనంబుల నర్మాలాపంబులం బెరయు దరహాసంబుల**

**కాంతిఁ దెలుపెక్కునట్లు వెలరారు దీపంబులును, మునుకడ వచ్చి యెఱుక సేయమికి వాతాయన పవనుని పయిం బుట్టిన యలుక విధంబున వేగుఁబోకట నంకురించు మదంబునఁ గెంపు గదురుట నిద్రలేమినని శంకింపక యింపునం గదియు విదగ్ధ విటజనంబుల మనంబులం దిగుచు లలనాలోచనంబులును, రేపకడ వనలక్ష్మి పురశ్రీ నలంకరించు వడువున నెడపడక యెల్లెడల నిగుడు విభాత కుసుమ కదంబ పరిమళంబును నై యున్నంత. 240**

1. తదనంతరంబ.................దిక్తటంబులును.

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= తెల్లవారుతున్నంతనే; అల్లన+అల్లన= మెల్ల మెల్లగా; తెఱపి+ఇచ్చి= సందిచ్చి-తొలగిపోయి; అవులన్+అవులన్+చను= దూరదూరంగా పోయే; అంధకారంబు= చీకటి; దూరంబుల+అందును లేక+ఉనికి వలనన్= దూరప్రదేశాలలో కూడ లేకపోవటం వలన; కడళ్ళు= దిక్కులు; అప్పళించి= తాకి; నెరసి= నిండి; విరిసినన్= విచ్చిపోగా; పొలుచు= ఒప్పే; కలు కట్టలున్+పోని= రాతి కట్టలను పోలిన; దిక్+తటంబులును= దిక్ప్రదేశాలూ;

**తాత్పర్యం:** తెల్లవారుతున్నది. చీకటి మెల్లమెల్లగా విచ్చుతూ దూరప్రదేశాలలో కూడా తొలగిపోవటంచేత, దిక్కులను స్పృశించి నిండి విచ్చిపోగా దిక్ప్రదేశాలు రాతికట్టలవలె ఒప్పుతున్నాయి. అలంకారం: ఉపమ.

2. తమ పాసిన.................సరోవరంబులును.

**ప్రతిపదార్థం:** తమ, పాసిన= తాము (జక్కవలు) వీడిన; కందువలు= చోట్లను; రోసి= వెదకి; ఎత్తిన, మెడలను; పచరించిన= ప్రసరింపజేసిన; చూడ్కులున్= చూపులూ; వేడ్కలన్= వేడుకలచే; క్రందు+ఐన= అధికమైన; దెందంబులున్= మనస్సులును; తమము= చీకటి పాసినన్= తొలగగా; కలిగి; మెలంగుచున్= వర్తిల్లుతూ; ఒండు+ఒంటిన్= ఒకదాని నొకటి; బిట్టు= శీఘ్రంగా; కాంచి= చూచి; ఒదవు= కలిగే; సమ్మదంబునన్= సంతోషంతో; పొదలు= ఒప్పే; మేనులు= శరీరాలు; బెరయించి= చేర్చి; పరమ+ఆనందంబునన్= అధిక సంతోషంతో; చొక్కుచున్= పరవశిస్తూ; జక్కవకవలు= చక్రవాక దంపతులు; కలసి= కూడి; పొలసి= చొక్కి; నలిరేఁగి= విజృంభించి; చెలంగుచున్= కూస్తూ; రేయింటి, ఆఁకటి, పెల్లునన్= రాత్రి ఏమీ తికనపోవటం వలన కలిగిన ఆకలి తీవ్రతచేత; గొదకొని= యత్నించి; కమిచి= గ్రహించి; చంచువులన్= ముక్కులతో; తిగిచి= లాగి; త్రుంచి= ముక్కలు చేసి; ఆనుచున్= తింటూ; ఇక్కడన్+అక్కడన్= ఇక్కడా, అక్కడా; పఱచినన్= పరవగా; చిక్కు+పడి+ఉన్న= చిక్కుపడిపోయిన; మృణాల, శకలంబులవలనన్= తామరతూటి ముక్కల వలన; బాల, చంద్ర, శత+అభిరామంబులు+అగు= నూరు బాలచంద్రబింబాల చేత మనోహరాలయిన; శంభు, జల, మూర్తి విశేషంబులన్+పోని= శివుడియొక్క జలరూప విశేషాలవంటి; సరోవరంబులును= సరస్సులును.

**తాత్పర్యం:** చక్రవాక మిథునాలకు రాత్రివేళ పరస్పర వియోగం, అవి కన్నులు కనిపించక తమ తమ చోట్లను విడిచిపెట్టుతాయి. తెల్లవారిన పిదప అవి రేయి తాము విడిచిన స్థానాలను వెదుకుతూ, మెడ ఎత్తుకుని, చూపులు ప్రసరింపజేస్తూ పరస్పరం కలిసికొనటం వలన వేడుక లధికమై మనస్సులు సంతోషపడుతూ ఉండగా ప్రవర్తిల్లుతాయి. అవి తమ శరీరాలను ఒకదానితోనొకటి చేర్చి, మిక్కిలి సంతోషంతో పరవశిస్తూ, విజృంభించి కూస్తూ, రాత్రి ఏమీ తినకపోవటం వలన కలిగిన ఆకటి తీవ్రతతో తామరతూండ్లను లాగి ముక్కలు చేసి చిందరవందరగా పడవేస్తాయి. ఆ ముక్కలు నూరు బాలచంద్రుల చేత మనోహరాలయిన ఈశ్వరుడి జలమూర్తి విశేషాలు అన్నట్లుగా సరస్సులుంటాయి.

అలం: స్వభావోక్తి.

3. చీఁకటివాసినం.................ధరణీరుహంబులును.

**ప్రతిపదార్థం:** చీఁకటి; పాసినన్= తొలగిపోగా; ప్రభాతంబు+అను, వింతమానిసి= ఉదయసమయ మనే వింత మనుష్యుడు; మెలంగి= వర్తిల్లి; ముసుంగు+పుచ్చిన+అట్లు= ముసుగు తొలగించిన విధంగా; మేలుకని= నిద్రలేచి; ఎఱకలు= రెక్కలు; పొదలన్= ఒప్పుగా; విదిర్చి= విదలించి; కూర్చికొని= సరిచేసికొని; కలగొనన్= కలతచెందగా; పలుకు= కూయునట్టి; పులుఁగుల+ఎలుంగుల వలనన్= పక్షుల రొదల మిషచేత; ఒండు+ఒంటిన్= ఒకదాని నొకటి; తెలుపు, కరణిన్= మేల్కొలిపే విధంగా; ఒప్పు; ధరణీరుహంబులును= చెట్లునూ.

**తాత్పర్యం:** చీకటి తొలగిపోగా ఉదయమనే వింత మనుష్యుడు, వచ్చి ముసుగుతొలగించినట్లు మేల్కొని రెక్కలు విదిలించుకొని, సరిచేసికొని, కలతపడినట్లు కూసే పక్షుల రొదల మిషచేత ఒకదాని నొకటి మేలుకొలిపే విధంగా ఒప్పే చెట్లునూ.

అలం: స్వభావోక్తి, రూపకం, ఉత్ప్రేక్ష.

4. పరఁగు నరుణోదయరాగ.................లతా మండపంబులును.

**ప్రతిపదార్థం:** పరఁగు= ఒప్పునట్టి, అరుణ+ఉదయ, రాగ, పటలంబున్= సూర్యోదయము యొక్క ఎరుపుకాంతుల సమూహాన్ని; ఎనయు= సరిపోలే; కెంజాయ (కెంపు+చాయ)= ఎర్రనికాంతి; రంజిల్లన్= ప్రకాశించగా; వికసిల్లు= విచ్చే; రక్త+అరవిందంబులన్= ఎర్రతామరల యందు; దందడిన్= దట్టంగా; ఎగసి= ఎగిరి; చరించు= తిరిగే; చంచరీకంబుల= తుమ్మెదలయొక్క; ఎఱకల, నెఱులన్= రెక్కల సందులందు; గిఱికొని= చిక్కుకొని; క్రొత్త+అగు, కాంతి, ప్రవాహంబులన్= నూతనకాంతుల ప్రవాహాలను; కడలుకొల్పు= అతిశయింపజేసే; పుప్పొళ్ళు, డుల్చి రాల్చుచున్= డుల్లగొట్టి రాలుస్తూ; పొలయు= వీచే; మలయ+అనిలంబునన్= మలయవాయువు చేత; క్రాలు= ఒప్పే; మవ్వము+తీవలన్= లేతతీగలనుండి; కడి+పోయి= వాసనపోయి; తొరఁగిన విరులవలన= రాలిపోయిన పువ్వులవలన; మీనకేతన, పురాతన, బాణ, శాలలన్+పోని= మన్మథుడి ప్రాత బాణగృహాలను పోలిన; లతా, మండపంబులును= పూలతీగలమంటపాలునూ.

**తాత్పర్యం:** ఉదయ సూర్యుడి ఎఱ్ఱని కాంతి ప్రసరించగా వికసించే ఎర్రతామరపూలయందు దట్టంగా ఎగురుతూ తిరిగే తుమ్మెదరెక్కల సందుల్లో చిక్కుకొని నూతనకాంతుల ప్రవాహాలను అతిశయింపజేసే పుప్పొళ్ళను డుల్లగొట్టి రాలుస్తూ వీచే మలయవాయువుచేత ఒప్పే లేతతీగలనుండి వాసనపోయి రాలిపోయిన పువ్వులు కలిగి మన్మథుడి ప్రాత బాణ గృహాలవలె ఉన్న లతామండపాలునూ.

అలం: స్వభావోక్తి, ఉపమ.

5. మొగిడియు.................కుముదవనంబులును.

**ప్రతిపదార్థం:** మొగిడియున్= ముడుచుకొని కూడా; జనంబు, సంధ్యా+అంజలిపుట, కరణంబులన్= సంధ్యావందన మాచరించేటప్పటి జనుల దొప్పలవంటి దోసిళ్లను; అనుకరించు విధంబునన్= అనుసరించేటట్లు; దర్శనీయంబులు+అగు= చూడదగిఉన్న; కుముద, వనంబులునున్= తెల్లకలువల తోపులును.

**తాత్పర్యం:** ప్రాతస్సంధ్యా సమయంలో ముడుచుకొని కూడా, సంధ్యావందనమాచరించే జనుల అంజలిపుటాలను అనుకరించే రీతిగా చూడదగిఉన్న తెల్లకలువల సమూహాలునూ.

అలం: ఉపమ.

6. ఏమేని నెపంబున.................వెలరారు దీపంబులును.

**ప్రతిపదార్థం:** ఏమి+ఏని, నెపంబునన్= ఏదో ఒక మిషచేత; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; మేలుకొలుపు= మేలుకొలిపే; రమణ, రమణీ జనంబుల= ప్రియుల, ప్రియురాండ్ర యొక్క; నర్మ+ఆలాపంబులన్= పరిహాస గర్భిత వాక్కులచేత; బెరయు= కలిగే; దరహాసంబుల, కాంతిన్= చిరునవ్వుల కాంతిచేత; తెలుపు+ఎక్కు+అట్లు= తెలుపెక్కే విధంగా; వెలరారు, దీపంబులును= తెల్లనైన దీపాలూ.

**తాత్పర్యం:** ఏదో ఒక నెపంతో ఒకరి నొకరు మేలుకొలిపే దంపతుల పరిహాస గర్భిత వాక్కుల చేత కలిగే చిరునవ్వుల కాంతుల చెంత తెలుపెక్కినవాయా అన్నట్లున్న దీపాలూ.

అలం: తద్గుణం, ఉత్ప్రేక్ష.

7. మునుకడ వచ్చి................లలనా లోచనంబులును.

**ప్రతిపదార్థం:** మునుకడ= ముందుగా; వచ్చి; ఎఱుక+చేయమికిన్= తెలుపకపోవటానికి; వాతాయన, పవనుని, పయిన్= కిటికీల గాలిమీద; పుట్టిన; అలుక, విధంబునన్= కోపం రీతిగా; వేగుఁబోకటన్= తెల్లవారుజామున; అంకురించు= పుట్టే; మదంబునన్= మదంచేత; కెంపు= ఎరుపు; కదురుట= కలగటం; నిద్ర, లేమిన్+అని= నిద్ర లేకపోవటంచేతనని; శంకింపక= సంశయించక; ఇంపునన్= సంతోషంతో; కదియు= కూడే; విదగ్ధ, విట, జనంబుల, మనంబులన్= నేర్పరులైన విట జనుల మనస్సులను; తిగుచు= ఆకర్షించే; లలనా; లోచనంబులును= స్త్రీల కన్నులూ.

**తాత్పర్యం:** ముందుగా వచ్చి తమను మేలుకొలుపకపోవటంచేత కిటికీల గాలిపై కలిగిన కోపం చేతనా అనేటట్లు ప్రియురాండ్ర కళ్ళు ఎఱ్ఱబడ్డాయి; కాని, తెల్లవారుజామున కలిగే మదం వలన అవి సహజంగానే ఎర్రనయ్యాయి. పైగా రాత్రి అంతా ప్రియులను కూడటంవలన నిద్రలేక కలిగిన ఎరుపు అని విదగ్ధులైన విటజనులు సంశయించక, తెల్లవారువేళ సంతోషంతో ప్రియురాండ్రను సమీపించినప్పుడు వారి మనస్సులను ఆకర్షిస్తూవున్న ఆ ప్రియురాండ్ర అందమైన నయనాలూ,

అలం: ఉత్ప్రేక్ష.

8. రేపకడ.................నై యున్నంత.

**ప్రతిపదార్థం:** రేపకడ= ప్రొద్దున; వనలక్ష్మి= వనమనే లక్ష్మి; పురశ్రీన్= నగరమనే లక్ష్మిని; అలంకరించు, వడువునన్= అలంకరించే విధంగా; ఎడపడక= ఎడతెగక; ఎల్ల+ఎడలన్= అన్నిచోట్లా; నిగుడు= వ్యాపించే; విభాత, కుసుమ, కదంబ, పరిమళంబును= వేకువజామునందలి పూల సమూహంయొక్క సువాసనలు!; ఐ= అయి; ఉన్న+అంతన్= ఉండగా.

**తాత్పర్యం:** ప్రొద్దుననే వనలక్ష్మి నగరలక్ష్మిని అలంకరిస్తున్నదా అనే విధంగా, ఎడతెగకుండా అన్నిచోట్లా వ్యాపించే ఉదయ సమయ పుష్పసౌగంధ్యమూ కలిగి ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

అలం: ఉత్ప్రేక్ష. వనలక్ష్మి - రూపకం.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష; ఎడనెడ - ఉపమ. రూపకం-ఉత్ప్రేక్షను అతిశయింప చేశాయి. ప్రభాత వేళ కనువిందు చేసే ప్రకృతి సౌందర్యాన్ని ఊహాసుందరంగా ఆవిష్కరించటం ఇక్కడి అలంకారశిల్పం. వెనుకటి పద్యంలో తెల్లవారుజామున నక్షత్రాలు మాయమై ఆకాశం నిర్మలంగా తేటపడింది. 1. ఆ తరువాత-చీకట్లు క్రమంగా విరిసి దూరదూరంగా పోయి దిక్తటాలు బయట పడటం మొదట వర్ణించబడింది. అవి ముగిసిన చీకట్లు వరిసిపోగా బయటపడిన రాతికట్టలవలె ఉన్నాయి. ఇక్కడ ఉత్ప్రేక్షా గర్భిత ఉపమాలంకారం భావనీయం. 2. ఆ తరువాత - చక్రవాక పక్షులు రాత్రంతా తామరతూండ్ల ముక్కలను చిమ్మటం వలన ఆ ముక్కలు మిలమిలలాడుతూ ఉండగా మెరుస్తున్న సరోవరాలు వెలుగు చూచాయి. ఆ సరోవరాలు చంద్రకళలతో వెలుగొందే శివుడి జలమూర్తులో అన్నట్లున్నాయట! ఈ వర్ణనలో ఉపమాలంకార రంజితమైన ఉత్ప్రేక్ష భాసిస్తున్నది. దిక్కులు తెల్లబడి ఆ కాంతులు నీళ్ళలో ప్రతిఫలించటం ప్రభాత ప్రకృతి సౌందర్య దర్శకులకు సహజంగా గోచరించే సుందర దృశ్యమే. 3. ఆ తరువాత - జనుల దృష్టి నాకర్షించేవి చెట్లమీద వినపడే పక్షుల కలకలారావాలు. ప్రభాతం అనే మనిషి చీకటి అనే (ముసుగు వేసికొని అందరినీ భయపెట్టి ఒక్కసారిగా పై) ముసుగు తీసి వేయగా అంతవరకూ సడీ సవ్వడీ లేకుడా ఉన్న చెట్లు ఒక్కసారి రెక్కలు విచ్చి ఎగురుతూ వ్రాలుతూ అరుస్తున్న పక్షుల కూతలనే మాటలతో చెలరేగి పరస్పరం యోగక్షేమాల పలకరింపులు మొదలుపెట్టినట్లున్నాయట! రూపకానుప్రాణిత ఉత్ప్రేక్ష ఇందులో ప్రకాశిస్తున్నది. 4. ఆ తరువాత అరుణోదయం- ఆ సమయంలో ఆకాశంలో కానవచ్చే అరుణకాంతితో దీటైన కాంతులు గలవి ఇలలో ఎర్రదామరలు. వాటి మీద తుమ్మెదలు విశృంఖలంగా తిరగటం వలన వాటి రెక్కలకు పుప్పొడు లంటాయి. వాటిని మలయపవనుడు దులిపి నేలకు రాలుస్తున్నాడు. అతడి వీరవిహారానికి పూలు రాలి లతామండపాల నిండా పడుతున్నాయి. అప్పుడవి మన్మథుడి పాత ఆయుధాగారాలా అన్నట్లు ఉన్నాయట! ఉపమానుప్రాణిత ఉత్ప్రేక్ష ఊహారమణీయం. రాత్రి ఎంత మన్మథోద్దీపకంగా ఉన్నదో అరుణోదయవేళ సైతం అంతటి మన్మథోద్దీపకంగా ఉన్నదని ధ్వని. మన్మథుడి పంచబాణాలు పూలే. (అరవిందం, అశోకం, చూతం, నవమల్లిక, నీలోత్పలం). 5. ఆ తరువాత నిష్ఠాగరిష్ఠుల ప్రాతఃకాల సంధ్యావందన దృశ్యాలు గోచరిస్తాయి. తెల్లవారేకొద్దీ కలువపూలు ముకుళిస్తాయి. ఆ ముకుళించిన కలువలు సూర్యుడికి అంజలి పట్టే భక్తుల కరపుటాలవలె ఉన్నాయట! ఉపమాలంకార మండిత మీ వర్ణనం. 6. ఆ తరువాత - ప్రభాత కాంతికి దీపాలు వెలవెలపోవటం సహజ రమణీయ దృశ్యం. ఆ దీపాలు మేలుకొలుపుల మిషతో నర్మ సంభాషణలు చేస్తున్న దంపతుల చిరునవ్వుల కాంతులచేత పరిహసించబడ్డాయట! అందువలన వెలవెలపోయాయేమో అన్నట్లు ఉన్నాయట. ఊహారమణీయమైన ఉత్ప్రేక్ష. 7. ఆ తరువాత - తెల్లవారే లోపల మరొకసారి విటులను ఆకర్షించి వినోదించాలనే వేడుకతో కొంటె చూపులు విసిరే వేశ్యల, విటకత్తెల పోకడలు గమనించదగినవి. రాత్రిళ్ళంతా నిద్రలేదు. అందువలన కన్నులు ఎర్రపడ్డాయి. కాని, ఆ కళ్ళు తొలిజాము కైపువలన అట్లా ఎర్రపడ్డాయని తలంచి, నేర్పరులైన విటులు తమను మరొకసారి కూడటానికి అనువుగా వారిని రెచ్చగొట్టుతున్నట్లున్నాయట విటకత్తెల చిలిపి చూపులు, ఊహారమ్యమైన ఉత్ప్రేక్ష. 8. ఆ తరువాత-ప్రభాత వాతావరణంలో గుబాళించే పూలవాసన అనుభవించ దగింది - అది వనలక్ష్మి పురలక్ష్మిని ప్రభాత సేవ కొరకు అలంకరిస్తున్నట్లు దర్శనీయంగా, పూజనీయంగా, పవిత్రంగా కనబడిందట! 9. హరిహరనాథ భక్తుడైన తిక్కన హరుని అష్ట విధ రూపాల ప్రసక్తి ఈ వచనంలో తెచ్చాడు. అష్టవిధ ప్రభాతకాల వైభవాలను ఇందులో వర్ణించాడు. (సంపా.)

**సీ.** **నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన। భవ్యతపంబుల ఫల మనంగ,**
**దివసముఖాభినందిత చక్రయుగ్మకం। బుల యనురాగంపుఁబ్రో వనంగ,**
**హరిహరబ్రహ్మ మహానుభావంబు లొ। క్కటి గాఁగఁ గరఁగిన గట్టి యనఁగ,**
**నతుల వేదత్రయ లతికాచయము పెను। పొందఁ బుట్టెడు మూలకంద మనఁగ**

తే. **నఖిల జగముల కందెఱ యగుచు జన స। మాజ కరపుట హృదయ సరోజములకు**
**ముకుళనంబును జృంభణంబును నొనర్చి। భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.** 241

**ప్రతిపదార్థం:** నీరజ+ఆకరములు= తామర కొలకులు; నిష్ఠమైన్+చేసిన= నియమంతో దీక్షగా చేసిన; భవ్యతపంబులఫలము+అనంగన్= చేసిన మంగళప్రదమైన తపస్సుల ఫలమో అన్నట్లుగా; దివసముఖ= ప్రాతఃకాలం చేత; అభినందిత= సంతోషింప జేయబడిన; చక్రయుగ్మకంబుల= చక్రవాక పక్షుల జంటల యొక్క; అనురాగము+ప్రోవు+అనంగన్= ప్రేమరాశి అనునట్లు; హరిహరబ్రహ్మ= త్రిమూర్తుల-విష్ణు మహేశ్వర బ్రహ్మల యొక్క; మహత్+అనుభావంబులు= గొప్ప ప్రభావాలు; ఒక్కటి+కాఁగన్= ఒకటిగా అయ్యేటట్లు; కరఁగిన= కరిగించి చేసిన; గట్టి= కణిక; అనఁగన్= అనునట్లు; అతుల= సాటిలేని; వేదత్రయ= మూడు వేదాలనే; లతికాచయము= తీగల సమూహం; పెనుపొందన్= అభివృద్ధి చెందేటట్లు; పుట్టెడు= పుట్టిన; మూలకందము+అనఁగన్= మొదటి దుంప అన్నట్లు; అఖిలజగముల= అన్ని లోకాలకు; కన్+తెఱ= కనురెప్ప; అగుచున్= ఔతూ; జనసమాజ= జనసమూహాల యొక్క; కరపుట= దొప్పలలాంటి చేతులకు; హృదయసరోజములకున్= హృదయాలు అనే కమలాలకు; ముకుళనంబును= ముడుచుకొనటమూ; జృంభణంబునున్= వికాసాన్ని; ఒనర్చి= కలిగించి; భానుబింబంబు= సూర్యబింబం; పూర్వాద్రిపైన్= తూర్పుకొండపై; వెలింగెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** తామర కొలకులు నిష్ఠతో చేసిన పవిత్ర తపస్సులకు ఫలితమో అన్నట్లు, తెల్లవారగానే కూడుకొన్న చక్రవాకపక్షుల జంటల అనురాగమంతా ఒక రాశిగా రూపొందిందా అన్నట్లు, త్రిమూర్తుల మహిమలను కరగించి చేసిన సిద్ధగుళికయా అన్నట్లు, వేదాలు అనే ఎగబ్రాకే తీగలు పుట్టిన దుంపా అన్నట్లు సకల లోకాలకు కనురెప్పగా ఉండే సూర్యుడి పూర్ణబింబ రూపం తూర్పుకొండమీద ప్రకాశించింది. లోకానికి కనురెప్ప అయిన సూర్యుడు క్రమంగా జనుల చేతి అంజలులకు ముకుళనాన్నీ, హృదయపద్మాలకు వికాసాన్నీ కలుగజేసి తూర్పుకొండపై ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, రూపకం, తుల్యయోగిత, యథాసంఖ్యం. ఈ పద్య రచనా మహత్త్వాన్ని కీ.శే.భూపతి లక్ష్మీనారాయణరావుగారిట్లా వ్యాఖ్యానించారు. 'భవ్యతపః ఫలంబగు పరంజ్యోతి స్వరూపము, విశుద్ధ ప్రేమ పరిణామమగు రసస్థితి, హరిహరబ్రహ్మైక్య జ్ఞానమూర్తి, వేదత్రయ జన్మకారణమగు పరబ్రహ్మ స్వరూపము నను నిట్టి యలౌకికోపమానములచే వర్ణన కుదాత్తత సిద్ధించినది. హృదయంగమములైన యీ యుత్ప్రేక్షలు రచనకు మనోహరత్వము నాపాదించుటయేగాక, సూర్యభగవానుని పరబ్రహ్మతత్త్వమును బ్రతిపాదించునవియై, పఠితృమానసములను భక్తిభావపూరితములుగా నొనర్చుచున్నవి. 'అఖిల జగముల కన్దెఱ యగుచు' ననుటలో, సూర్యభగవానుడు చైతన్యప్రదాతయు, జ్ఞానప్రదాతయు నగునను నర్థము సిద్ధించినది. అట్టి పరబ్రహ్మ స్వరూప సాక్షాత్కారముచే జనుల హృదయములు వికాసము నొందుటయు, వారు భక్తిచేఁ గరములు మోడ్చి, సూర్యభగవానునకుఁ బ్రణమిల్లుటయు, నొక్కుమ్మడి జరుగు కార్యములు. ఈ యుదాత్తార్థమును బ్రతిపాదించుచుఁ, దిక్కన, యథాసంఖ్య, రూపకోత్ప్రేక్షా తుల్యయోగితల నతి ప్రౌఢముగఁ బోషించి యున్నాడు. జగజ్జ్యోతియు, విష్ణుస్వరూపమును నగు సూర్యుని వర్ణించుచుఁ దిక్కన గ్రహించిన పవిత్రములగు నుపమానము లతని యుదాత్త కవితాతత్త్వమునకు నిదర్శనము లగును.'' (భారతము- తిక్కన రచన - రెండవ ముద్రణ: 1962 పు. 25-26). హరి హర బ్రహ్మ మహానుభావంబు లొక్కటి గాఁగఁ గరఁగిన గుటిక యనఁగ' - అనే పాఠాంతరం ఉన్నది.

### కీచకుఁడు ద్రౌపది నియ్యకొలుప యత్నించుట (సం.4-21-7)

వ. **ఇట్లు సూర్యోదయ మగుటయు సమయ సముచిత కరణీయంబులు వేగిరంబ నడపి వేగిరపాటుతో సింగారంబు సేసికొని సింహబలుండు.** 242

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సూర్య+ఉదయము+అగుటయున్= ప్రొద్దు పొడుపు కాగా; సింహబలుఁడు= కీచకుడు; సమయ సముచిత= సమయానికి తగిన; కరణీయంబులు= పనులు; వేగిరంబు+అ= త్వరగా; నడపి= జరిపి; వేగిరపాటుతోన్= తొందరపాటుతో; సింగారంబు+చేసికొని= అలంకరించుకొని.

**తాత్పర్యం:** ఇట్లు సూర్యోదయం కాగా, ప్రాతఃకాలంలో చేయదగిన కృత్యాలను త్వరగా పూర్తి చేసి, వడివడిగా అలంకరించుకొని కీచకుడు.

**విశేషం:** కీచకుడు 'నానాభరణధరణ శీలుఁడు' అని తిక్కన (2.32) చెప్పటం గమనించదగింది. అతడి వేగిరపాటు కామ భావోద్వేగాన్ని సూచిస్తున్నది. (సంపా.)

**క. తన మదిఁ గదిరిన తమకం। బునఁ జిడిముడిపడుచు ద్రుపదపుత్రికపై నూ**
**నిన వేడ్క దిగువ నొకటియుఁ। గనుఁగొన విన లేక మదనకంపితుఁ డగుచున్. 243**

**ప్రతిపదార్థం:** తన మదిన్= కీచకుడి మనస్సులో; కదిరిన తమకంబునన్= అధికమైన మోహంతో; చిడిముడి పడుచున్= తొట్రుపడుతూ; ద్రుపద పుత్రికపైన్= ద్రౌపదిపై; ఊనిన వేడ్క= కలిగిన కోరిక; తిగువన్= ఆకర్షించగా; ఒకటియున్+కనుఁగొనన్= ఏ ఒక్కటీ చూడటానికి; వినన్= వినడానికీ; లేక= మనస్సు నిలువక; మదనకంపితుఁడు+అగుచున్= మన్మథ చలితుడై.

**తాత్పర్యం:** కీచకుడు తన మనస్సులో పెరిగిన మోహంతో చిడుముడిపాటుతో తొట్రుపడుతూ ద్రౌపదిపై కలిగిన ఉత్కంఠతో ఏదీ చూడలేక, ఏదీ వినలేక మదనావేశంతో, (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'కామాతురాణాం న భయం న లజ్జా' అనే సూక్తికి ఇది నిదర్శనంగా కనబడుతున్నది. ఇక్కడ కీచకుడి కంటికి ఏదీ కనబడదు. చెవికి ఏదీ వినబడదు.

**వ. అతిత్వరితంబ సుదేష్ణ మందిరంబున కరుగుచు నంతరంగంబున. 244**

**ప్రతిపదార్థం:** అతిత్వరితంబు+అ= మిక్కిలి వేగంగా; సుదేష్ణ మందిరంబునకున్= సుదేష్ణ ఇంటికి; అరుగుచున్= వెళ్లుతూ; అంతరంగంబునన్= మనస్సులో.

**తాత్పర్యం:** అతి వేగంగా సుదేష్ణ అంతఃపురానికి వెళ్ళుతూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. 'చయ్యన నేఁగి యంబుజ విశాల విలోచనఁ గాంచి ప్రీతిమై**
**నయ్యెడ నేకతంబ హృదయం బలరం దఁగఁబల్కి యొక్కమై**
**నియ్యకొనంగఁ జేసి యెలయించెద, నిక్కకుఁ దార్చి, నేర్పునన్**
**శయ్యకుఁ దెచ్చెదం గుసుమసాయకు పూనికి నేఁడ తీర్చెదన్'. 245**

**ప్రతిపదార్థం:** చయ్యనన్+ఏఁగి= త్వరగా వెళ్లి; అంబుజ విశాల విలోచనన్= పద్మాలవలె విశాలమయిన కన్నులు గల ద్రౌపదిని; కాంచి= చూచి; ప్రీతిమైన్= ప్రేమతో; ఆ+ఎడన్= అక్కడే; ఏకతంబు+అ= ఒంటరిగా; హృదయంబు+అలరన్+తగన్+పల్కి= మనస్సు మెచ్చుకునేటట్లు తగినట్లు మాట్లాడి; ఒక్కమైన్= ఏదో ఒక విధంగా; ఇయ్యకొనంగన్+చేసి= అంగీకరించేటట్లు చేసి;

ఎలయించెదన్= అలరిస్తాను; ఇక్కకున్= ఏకాంత మందిరానికి; తార్చి= చేర్చి; నేర్పునన్= మెలకువతో; శయ్యకున్+తెచ్చెదన్= పడకపై చేరుస్తాను; నేఁడు+అ= ఈరోజే; కుసుమసాయకుపూనికిన్= మన్మథుడి ప్రయత్నాన్ని, రతిసౌఖ్యాన్ని; నేఁడు+అ= ఈ దినమే; తీర్చెదన్= పూర్తి చేస్తాను.

**తాత్పర్యం:** 'నేను త్వరగా పోయి, సైరంధ్రిని చూచి, ప్రీతితో అక్కడ ఏకాంతంలో కలిసి మనసు మురిసేటట్లు మాట్లాడి, ఏదో విధంగా ఆమెను ఒప్పించి ఇంటికి తీసికొని వచ్చి, నేడే నా మదనవాంఛను తీర్చుకొంటాను.'

**విశేషం:** మదనావేశంలో ఊగిసలాడుతున్నాడు కీచకుడు. సైరంధ్రి అంగీకరిస్తుందా? లేదా? అనేది అనుమానం. తార్చి= అనే మాట తార్పుడుగాండ్ర విషయంలో వాడుతారు. వ్యభిచార స్వభావం కలవారిపట్ల అది సరిపోతుంది. మాటి మాటికి మదనావేశంతో పరవశించిపోతున్నాడు కీచకుడు.

**క. అని యువ్విళ్లూరుచు వెసఁ। జని కేకయ రాజపుత్రి సదనంబున న**
**య్యనిమిషచారువిలోచన। యనురూప విధాన నిరతయై యుండంగన్. 246**

**ప్రతిపదార్థం:** అని, ఉవ్విళ్లూరుచున్= అని ఉబలాటపడుతూ; వెసన్+చని= త్వరగా వెళ్ళి; కేకయ రాజపుత్రి సదనంబునన్= సుదేష్ణ మందిరంలో; ఆ+అనిమిషచారువిలోచన= ఆ చేపలవంటి అందమైన కనులుగల సైరంధ్రి; అనురూప విధాన= ఆమె వృత్తికి తగిన పనిలో; నిరత+ఐ+ఉండంగన్= లగ్నమై ఉండగా.

**తాత్పర్యం:** కీచకుడు ఆ విధంగా ఉబలాటపడుతూ త్వరగా వెళ్ళి సుదేష్ణ మందిరంలో అందమైన కనులుగల సైరంధ్రి తన పనిలో నిమగ్నఅయి ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'అనిమిష చారు విలోచన' అనే విశేషణం ద్రౌపది తత్కాలంలో కీచకుడి వర్తనం పట్ల ప్రదర్శిస్తున్న జాగరూకతనూ, 'అనురూప విధాన' మనే ప్రయోగం భీమద్రౌపదులు క్రిందటి రాత్రి యోచించిన పథకానికి అనుగుణంగా - అనే అర్థాన్ని కూడా ధ్వనింప చేయటం విశేషం. (సంపా.)

**చ. కనుఁగొని యప్డు గ్రొత్తయగు కౌతుకవృత్తి మునింగి పల్లటి**
**ల్లిన ధృతితోఁ గ్రమం బరయలేని మనంబు చలింప నచ్చటన్**
**జను లెడ యౌటఁ గాంచు నెఱి సాలక గ్రక్కున నింతిఁ జేరఁగాఁ**
**జనియె విధాతృలుబ్ధకవశంబునఁ బోవు మృగంబు చాడ్పునన్. 247**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; అప్డు= ఆ సమయంలో; క్రొత్త+అగు కౌతుకవృత్తిన్= క్రొత్తదైన అనుభవం కొరకు పడే ఆశగల భావంతో; మునింగి= పడిపోయి; పల్లటిల్లిన= మిగుల చలించిన; ధృతితోన్= ధైర్యంతో; క్రమంబు+అరయలేని= ఉచితానుచితాలు తెలిసికొనలేని; మనంబు= మనస్సు; చలింపన్= స్పందించగా; అచ్చటన్= అక్కడ; జనులు ఎడ+ఔటన్= పరివారం దూరం కావటం కొరకు; కాంచు= నిరీక్షించి చూచే; నెఱి= ఓపిక, బుద్ధి; చాలక= సరిపోక; విధాతృ= బ్రహ్మ అనే; లుబ్ధక వశంబునన్= వేటగాని చేతిలో పడటానికి; పోవు= పోయే; మృగంబు చాడ్పునన్= జింకవలె; గ్రక్కునన్= త్వరగా; ఇంతిన్+చేరఁగాన్= ద్రౌపదిని సమీపించటానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** సైరంధ్రిని చూచి కీచకుడు క్రొత్త కోరికలు చిగురెత్తగా ఆసక్తిలో మునిగి, ధైర్యం కోల్పోయి, వివేకాన్ని వీడి, మనస్సు చలించగా, దగ్గరలో పరిజనం లేకుండా వేచిచూచే ఓపిక కూడా లేకుండా విధి అనే వేటగాడి ఉరిలోకి తనంతట తాను ఉరికే మగజింకవలె శీఘ్రంగా ఆమె సమీపానికి వెళ్ళాడు.

**విశేషం:** అలం: ఉపమ. జరగబోయే కథను వ్యంగ్యంగా చెప్పుతున్నాడు కవి. కీచకుడు మృగం వలె ప్రాణాలు కోల్పోతాడు. అయితే అది విధి నిర్ణయం. వాడు దానికి లోబడ్డాడు. మృగోపమానం ఇంద్రియలోలుపత్వాన్ని ధ్వనింపచేస్తున్నది.

**క. చనుటయు ద్రౌపది యతనిం। గనియుం గానని విధంబు గైకొని చిత్తం**
**బున బెదరక తనముందటి। పనివెరవున నుండె భీముపలుకుల యూఁతన్. 248**

**ప్రతిపదార్థం:** చనుటయున్= వెళ్ళగా; ద్రౌపది; అతనిన్+కనియున్= కీచకుడిని చూచి కూడా; కానని విధంబు+ కైకొని= చూడనట్లుగా భావించి; చిత్తంబునన్+బెదరక= మనస్సులో భీతిల్లక; భీముని పలుకుల+ఊఁతన్= భీముడిచ్చిన మాటల ధైర్యంతో; తన ముందటి= అతడు రాక మునుపు తన చేతిలో ఉన్న; పనివెరవునన్+ఉండె= పనిలో నిమగ్నఅయి ఉన్నది.

**తాత్పర్యం:** అట్లా కీచకుడు దగ్గరికి వెళ్ళగా, ద్రౌపది భీము డిచ్చిన మాటలను ఊతగా తీసికొని, అతడిని చూచినా చూడనట్లు నటిస్తూ, దూరంగా తొలగిపోకుండా, మనోధైర్యంతో తాను చేస్తూఉన్న పనిలో నిమగ్నురాలైనట్లు ఉండింది.

**వ. అట్టియెడ. 249**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**సీ. ఎవ్వరితోనైన నెలుఁగెత్తి యొక్కింత। పనిలేని వెంగలి పలుకు వలుకు;**
**మట్టియ లొండొంటి బిట్టుదాఁకఁగ నేల। నందంద మునిగాళ్ళ నప్పళించుఁ;**
**గడువికారంబుగా నొడలెల్ల విఱుచుచు। మలఁగి రిత్తకు రిత్త సెలఁగి నవ్వుఁ;**
**దాళంబుగాఁ గరతలమునఁ బెలుచఁ గం। బంబు వ్రేయుచు వెడపాట పాడు;**

**తే. మలయు, నంతంతఁ జేరువఁ బొలయు, నింతి। తన్ను చూడమి కెంతయుఁ దల్లడిల్లు;**
**నిక్కడక్కడఁబడుఁ, దగు లినుమడింపఁ। జూచు నత్తన్విఁ బొరిఁబొరిఁ గీచకుండు. 250**

**ప్రతిపదార్థం:** కీచకుండు= కీచకుడు; ఎవ్వరితోన్+ఐనన్= ఎవరితోనైనా; ఎలుఁగు+ఎత్తి= గొంతెత్తి; ఒక్కింత= కొంచెమైనా; పనిలేని= వ్యర్థమైన; వెంగలిపలుకు= తెలివిలేని మాటను; పలుకున్= మాట్లాడుతాడు; మట్టియలు= కాలి మట్టెలు; ఒండొంటిన్= ఒకదానికొకటి; బిట్టుదాఁకఁగన్= గట్టిగా తాకగా; నేలన్= నేలమీద; అందంద= అక్కడక్కడ; ముని+కాళ్ళన్= ముందు కాళ్ళతో, కొనగోళ్ళతో; అప్పళించున్= తట్టేవాడు; కడువికారంబు+కాన్= మిక్కిలి అసహ్యంగా; ఒడలు+ఎల్లన్= శరీరమంతా; విఱుచుచున్= విరుస్తూ; మలఁగి= మరలి; రిత్తకు రిత్త= వృథాగా; చెలఁగి నవ్వున్= పెద్దగా నవ్వేవాడు; కరతలమునన్= అరచేతితో; తాళంబుగాన్= తాళంగా; పెలుచన్= శబ్దం చేసేటట్లు; కంబంబు వ్రేయుచున్= స్తంభాన్ని తట్టుతూ; వెడపాట పాడున్= అల్పమైన పాట పాడేవాడు; అంతంతన్= అక్కడక్కడ; మలయున్= తిరుగుతాడు; చేరువన్= దగ్గరగా; పొలయున్= సంచరిస్తాడు; ఇంతి= ద్రౌపది; తన్నున్= (కీచకుడిని); చూడమికిన్= చూడకపోవటానికి; ఎంతయున్+తల్లడిల్లున్= ఎంతో బాధపడతాడు; ఇక్కడ+అక్కడ= ఇక్కడా అక్కడా; పడున్= పడతాడు; తగులు= మోహం; ఇనుమడింపన్= రెట్టింపు కాగా; ఆ తన్విన్= ద్రౌపదిని; పొరిన్+పొరిన్= మాటిమాటికీ; చూచున్= చూస్తాడు.

**తాత్పర్యం:** కీచకుడు కంటబడ్డవారితో వృథాగా మాటలు చెప్పుతూ, కాలిమట్టెలు శబ్దం చేసేటట్లు మునిగాళ్ళతో నేల మీద తడుతూ, వికారంగా ఒడలు విరుచుకొంటూ, అకారణంగా నవ్వుతూ, అరచేతితో స్తంభాన్ని తట్టి తాళం వేస్తూ,

వెడ పాట పాడుతూ, సైరంధ్రికి దగ్గరగా వెళ్ళి, ఆమె తనను చూడకపోవటంతో మిక్కిలి బాధపడుతూ, అధిక మోహంతో సైరంధ్రిని చూస్తూ ఉన్నాడు.

**విశేషం:** అలం: యథాసంఖ్యం. కీచకు డిక్కడ ప్రదర్శిస్తున్న చేష్టలు దుర్విలాసాలని తరువాతి వచనంలో తిక్కన పేర్కొన్నాడు. అవి కీచకుడి ఉన్మత్తావస్థను ధ్వనింపచేస్తున్నాయి. ఒక్కొక్క చేష్ట ఒక్కొక్క దుర్విలాసాన్ని తెలుపుతున్నట్లు క్రమంగా అన్వయించటం అలంకార సౌందర్యం. అక్కడక్కడే తిరుగుతూ అనవసరంగా, అర్థరహితంగా, ఎవ్వరితో పడితే వారితో పెద్దగా గొంతు పెంచి మాట్లాడటం- తాను వచ్చినట్ల సైరంధ్రి తెలిసికొని కన్నెత్తి చూడాలని! కాని, ఆమె దగ్గరలో ఉండి కూడా అతడిని చూడలేదు. అందుకని కాలి మట్టెలు నేలకు తాకేటట్లుగా శబ్దం చేస్తూ మునికాళ్ళను అప్పళించాడు. అయినా ఆమె చూడలేదు. (ఆరోజులలో మగవాళ్ళు కూడా మట్టెలు పెట్టుకొనేవారు కాబోలు! అందరూ కాకపోయినా కీచకుడి వంటి నానాభరణధరణశీలురు ధరించేవారేమో! అవి ధనవంతుల అలంకారాలలోనివి కావచ్చును.) అందుకు కలతపడ్డాడు. ఆమెను ఆకర్షించటానికీ, తన విరహవేదనను ఆమెకు తెలుపటానికీ ఒడలెల్లా విరుస్తూ, కారణం లేకుండానే కలకలా నవ్వుతూ క్రిందా మీదా పడ్డాడు (శతధా యత్నించాడని భావం). అయినా లాభం లేకపోయింది. మోహం అతిశయించగా ఆమె వైపు సూటిగా తేపతేపకు చూస్తూ స్తంభాల మీద చేతులు పెట్టి తాళం వేస్తూ కూనిరాగాలు తీయటం మొదలుపెట్టాడు. ఉన్మత్తుడి వింత వలపును అభినయ సుందరంగా చలనచిత్రంగా చిత్రించిన తిక్కన నాటకీయత కీపద్యం చక్కని ఉదాహరణం. (సంపా.)

**వ. ఇట్లు బహుప్రకారంబులగు దుర్విలాసంబులు సేయుచు నద్దురాత్ముండు ద్రుపదనందన డాయంబోయి. 251**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; బహుప్రకారంబులు+అగు= అనేకరకాలైన; దుర్విలాసంబులు= చెడుశృంగార చేష్టలు; చేయుచున్= చేస్తూ; ఆ దురాత్ముండు= ఆ కీచకుడు; ద్రుపదనందనన్= ద్రౌపదిని; డాయన్+పోయి= సమీపించి.

**తాత్పర్యం:** ఈ విధంగా అనేకరకాలుగా వికార శృంగార చేష్టలు చేస్తూ ఆ దుష్ట కీచకుడు ద్రౌపదిని సమీపించి.

**ఉ. 'భాగ్యము గాదె నీ చరణపద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా**
**యోగ్యత గల్గెనేని, నను నొక్కని నొల్లవొ? కామసౌఖ్యవై**
**రాగ్యము నీ మనంబునఁ దిరంబొ? నిజం బెఱుఁగంగఁ జెప్పు; సౌ**
**భాగ్యము గుందునే మగలపై నొక యించుక చూడ్కి నిల్పినన్. 252**

**ప్రతిపదార్థం:** నీ చరణపద్మములు= నీ (ద్రౌపది) పాదపద్మాలు; ఎప్పుడున్= నిరంతరం; చేరికొల్వఁగాన్= ఆశ్రయించి కొలవటానికి; యోగ్యత కల్గెన్+ఏని= అవకాశం కలిగితే; భాగ్యము+కాదె!= అదృష్టం కదా!; ననున్+ఒక్కనిన్+ఒల్లవొ?= ఈ కీచకుడిని ఒకడినే కోరుకొనవా?; నీ మనంబునన్= నీ మనస్సులో; కామసౌఖ్యవైరాగ్యము= మన్మథసుఖాలపై ఆశలేకపోవటం; తిరంబొ?= మారనిదా?, స్థిరమా?; నిజంబు+ఎఱుఁగంగఁన్+చెప్పు= ఉన్నమాట తెలిపేటట్లు చెప్పుము; మగలపైన్= పురుషుల మీద; ఒక+ ఇంచుక చూడ్కినిల్పినన్= కొంచెమైనా దృష్టి నిలిపితే; సౌభాగ్యము= నీ అందం; కుందునే?= తగ్గిపోతుందా?

**తాత్పర్యం:** 'నీ పాదపద్మాలను ఆశ్రయించి కొలిచే భాగ్యమబ్బితే అదృష్టవంతుడిని గదా! ఈ కీచకుడిని ఒక్కడినే మోహించటం ఇష్టం లేదా? లేక పురుషజాతిపైనే వైరాగ్యభావం కలిగిందా? ఉన్న విషయం స్పష్టంగా చెప్పుము. మగవారివైపు కాస్త కడకంటిచూపు ప్రసరింపజేస్తే నీ సౌమ్మేమైనా తరిగిపోతుందా?

**విశేషం:** క్షణక్షణానికి కీచకుడి వియోగవ్యథ అధికమవుతున్నది. మాటలు తూలుతున్నాడు. అడుగులకు మడుగులొత్తటానికి కూడా సిద్ధపడుతున్నాడు. 'సౌభాగ్యము కుందునే' - నీ సొమ్మేమైనా పోతుందా? అనే జాతీయానికి ప్రతిరూపం. స్త్రీకి సౌభాగ్యం అందం - కాబట్టి అందమైనా అ(త)రిగిపోతుందా? అన్నట్లు కూడా గ్రహించవచ్చును.

**ఉ. ఆలము సేసి నా తగుల మాఱడిపుచ్చఁగ నేల బేల! న**
**న్నేలి యనంత భోగముల నిచ్చమెయిన్ విహరింపు నిత్యల**
**క్ష్మీ లతికాలవాలమగు జీవనమంతయు నీ మొగంబకాఁ**
**బాలన సేయు మిప్పురము భామిను లెల్లను నిన్నుఁ గొల్వఁగన్. 253**

**ప్రతిపదార్థం:** ఆలము+చేసి= నిర్లక్ష్యం చేసి; నా తగులము= నా ఆశను; ఆఱడిపుచ్చఁగన్+ఏల?= వృథా చేయటం ఎందుకు?; బేల!= ఓ అమాయకురాలా!; నన్నున్+ఏలి= నన్ను (ఈ కీచకుడిని) వరించి; అనంతభోగములన్= అపారమైన సుఖాలతో; ఇచ్చమెయిన్= నీ ఇష్టం వచ్చినట్లు; విహరింపు(ము)= క్రీడించుము; నిత్యలక్ష్మీ= నిరంతర సంపద అనే; లతికా+ఆలవాలము+అగు= తీగకు పాదు అయిన; జీవనము+అంతయున్= నా బ్రతుకంతా; నీ మొగంబు+అకాన్= నీ పక్షం కాగా; ఈ+పురము= ఈ పట్టణంలోని; భామినులు+ఎల్లను= స్త్రీలంతా; నిన్నున్+కొల్వఁగన్= నిన్ను సేవించగా; పాలన చేయుము= ఏలుకొమ్ము.

**తాత్పర్యం:** ఓ అమాయకురాలా! ఈ విధంగా నన్ను లెక్కపెట్టకుండా చూచి నీపై నా ఆశను వమ్ము చేయకుము. నన్ను అనుగ్రహించి అంతు లేని సంపదలను, సుఖాలను స్వేచ్ఛగా అనుభవించుము. నా సంపదకు నీవే రాణివై ఈ పట్టణంలోని స్త్రీలు అందరూ నిన్ను కొలువగా రాణివాసంలో రాణించుము.

**విశేషం:** అలం: శ్లిష్టరూపకం. లక్ష్మీలతికలకు ఆలవాలం జీవనం - జీవనమంటే నీరని అర్థం. లతలకు నీరు, సంపదలకు బ్రతుకు అని శ్లేష మొత్తం మీద రూపకాలంకారం. కామాంధులైన రావణ కీచకులు ఒకే మాదిరి మాట్లాడారు. రావణుడు కూడా సీతమ్మను ఇట్లాగే ప్రలోభపెట్టాడు. ద్రౌపదితో కీచకుడు సంపదలను గూర్చిన ప్రలోభాన్ని కలిగించే మాటలు మాట్లాడటం వ్యర్థం. ఆమె మనస్సు చలించదు.

**ఉ. రాజుల నెల్ల నుగ్రసమరంబుల వ్రేల్మిడి నేర్చి పేర్చి యీ**
**భూజనకోటి నాదగు విభుత్వ సమగ్రత నాదరింప వి**
**భ్రాజిత రాజ్యతంత్రములు పాలన సేయుదు నేన; వీటికిన్**
**రా జనఁగా నెపం బిడి విరాటునకుం దగఁ గూడు వెట్టుదున్. 254**

**ప్రతిపదార్థం:** ఉగ్రసమరంబులన్= తీవ్రమైన యుద్ధాలలో; రాజులన్+ఎల్లన్= రాజులనందరినీ; వ్రేల్మిడిన్= క్షణకాలంలో; ఏర్చి= దహించి; పేర్చి= అతిశయించి; ఈ భూజనకోటి= ఈ ప్రజల సమూహం; నాదగు= నాయొక్క; విభుత్వ సమగ్రతన్= ఆధిపత్య పరిపూర్ణతను; ఆదరింపన్= గౌరవించగా; విభ్రాజిత= ప్రకాశించే; రాజ్యతంత్రములు= రాచరికపు కార్యకలాపాలు; నేను+అ= కీచకుడైన నేనే; పాలన+చేయుదున్= నిర్వహిస్తున్నాను; వీటికిన్= ఈ నగరానికి; రాజు+అనఁగాన్= రాజు అనే; నెపంబు+ఇడి= సాకు చెప్పి; విరాటునకున్+తగన్+కూడు పెట్టుదున్= విరాట మహారాజుకు తగినట్లుగా అన్నం పెట్టుతున్నాను.

**తాత్పర్యం:** నేను భయంకర యుద్ధాలలో రాజులనందరినీ యుద్ధభూమిలో క్షణంలో చంపి, మించి, ఈ దేశంలో జనులందరూ నా సమగ్ర ప్రభుత్వాన్ని ఆదరిస్తూ ఉండగా నేనే రాజునై రాజ్యాంగం నడుపుతున్నాను. నామమాత్రంగా విరాటరాజును రాజుగా పేరుపెట్టి అతడికి తగినట్లు తిండి పడవేస్తున్నాను.

**విశేషం:** కీచకుడి ఆత్మస్తుతి అతడి ఔద్ధత్యాన్ని ప్రదర్శిస్తున్నది. (సంపా.)

**వ. కావున.** **255**

**తాత్పర్యం:** కాబట్టి.

**క. నీ వొకత వేల? యిలఁ బది। వేవుర నే వలచి పట్ట వెదకిన నడ్డం**
**బై వచ్చి వలదు నా నిం। దేవాఁడు మగండు? దీని నెఱుఁగవు కంటే!** **256**

**ప్రతిపదార్థం:** నీవు ఒకతవు+ఏల?= నీవు ఒక్కదానివే కాదు; ఇలన్= భూమిపై; పదివేవురన్= పదివేల మందిని; నే వలచిపట్టన్= నేను కోరిపట్టుకొనదలచి; వెదకినన్= వెదికిచూస్తే; అడ్డంబు+ఐ+వచ్చి= అడ్డంగా వచ్చి; వలదునాన్= వద్దని అనడానికి; ఇందున్+ఏ+వాఁడు= ఇక్కడ ఎవ్వడు; మగండు= పురుషుడు (సమర్థుడు) కలడు?; దీనిన్+ఎఱుఁగవు, కంటే!= దీన్ని తెలిసికొనలేకున్నావుగదా!

**తాత్పర్యం:** ఓ సైరంధ్రీ! నీవు ఒక్కదానివే కాదు, భూమిపై పదివేలమందినైనా నేను కోరి పట్టుకొంటే కాదని వారించగల మగాడు ఇక్కడ లేడు. దీనిని నీవు తెలిసికొనలేకున్నావు కదా!

**విశేషం:** కన్ను మిన్ను తెలియని అహంకారం కీచకుడి కంటికి పొరగా నిలిచింది.

**చ. విరటుఁడు సూచుచుండ నిను వేవుర ముందట నట్లు ద్రోవ నొ**
**క్కరుఁడును గాదుగూడ దనఁగల్గెనె? పోటరులైన భర్త లే**
**వురు గలరంటి; వారి యలవుం జలముం గడగంటి; నింక నె**
**వ్వరు గల? రెట్లు దప్పె? దనివారణఁ బట్టెద నెందుఁ జొచ్చినన్.'** **257**

**ప్రతిపదార్థం:** విరటుఁడు= విరాటరాజు; చూచుచుండన్= చూస్తుండగా; నినున్= ద్రౌపదిని; వేవుర ముందటన్= వేలమంది ముందు; అట్లు ద్రోవన్= అట్లా త్రోసివేయగా; ఒక్కరుఁడును= ఒక్కడు కూడా; కాదు కూడదు+అనన్+కల్గెనె?= ఇది తగనిది, చేయరానిది అనగలిగాడా?; పోటరులు+ఐన= బలవంతులైన; భర్తలు= మగలు; ఏవురు= ఐదుగురు; కలరు+అంటి(వి)= ఉన్నారన్నావు; వారి+అలవున్= వారి బలసంపద; చలమున్= పట్టుదల; కడ+కంటిన్= అంతుచూచాను; ఇంకన్+ఎవ్వరు కలరు?= ఇంక ఎవరున్నారు?; ఎట్లు తప్పెదు?= ఎట్లా తప్పించుకొంటావు?; ఎందున్+చొచ్చినన్= ఎక్కడ చొరబడ్డా; అనివారణన్= అడ్డులేకుండా; పట్టెదన్= పట్టుకొంటాను, వశం చేసికొంటాను.

**తాత్పర్యం:** విరాటమహారాజు చూస్తుండగా సభలో వేలమంది ముందట నేను నిన్ను అట్లా త్రోసిపడవేసినా నన్ను అడ్డుకొన్నవారు ఎవరూ లేరు. నీకు బలవంతులైన ఐదుగురు భర్తలున్నారని పలికావు. వారి బలపరాక్రమాలు ఇప్పుడు తెలిసివచ్చాయి కదా! వారి అంతు చూస్తాను. నీవు ఎక్కడ చొరబడ్డా, అడ్డులేకుండా నిన్ను గ్రహిస్తాను.

**విశేషం:** ముందు వినయంగా, ఆ తర్వాత కఠినంగా మాట్లాడటం దుష్టుల లక్షణం. ఇక్కడ శ్రుతిమించి రాగాన పడుతున్నది కీచకుడి మాట తీరు. పట్టుకొంటాను - అనే క్రియ అతడి భావి క్రియకు సూచనగా చివర నిలపటం విశేషం. దానిని ద్రౌపది గ్రహించి కార్యాచరణకు దిగవలసి ఉన్నది. 'త్రోపన్' అనే పాఠానికి 'తాపన్', 'తన్నన్' అనే పాఠాంతరాలు ఉన్నాయి. (వివరాలకు ఈ ఆశ్వాసంలోని 128వ పద్యం విశేషవ్యాఖ్య చూడండి.)

**వ. అనిన నవ్వెలంది 'వీఁడు దమకించి యున్నవాడు; నా యంత్రించు మాటలకు మున్న కదియంబడినఁ గర్జంబు దప్పు' నని విచారించి. 258**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+వెలంది= ద్రౌపది; వీఁడు= కీచకుడు; తమకించి+ఉన్నవాఁడు= త్వరపడుతున్నాడు; నా యంత్రించు మాటలకున్+మున్ను+అ= నేను కట్టడి చేసే మాటలు చెప్పక పూర్వమే; కదియన్+పడిన= మీదపడితే; కర్జంబు+తప్పున్+అని= చేయవలసిన పని చెడుతుందని; విచారించి= ఆలోచించి.

**తాత్పర్యం:** 'కీచకుడు నన్ను పట్టుకొనటానికి త్వరపడుతున్నాడు. నేను కట్టడి చేయవలసిన మాటలు చెప్పకముందే వీడు నన్ను సమీపిస్తే అనుకొన్న పని చెడిపోతుం'దని ఆలోచించి, ద్రౌపది. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. బహువిధంబుల నమ్మెయిఁ బలుకు నతని। పలుకు లేర్పడ విని, మెత్తఁబడినయట్లు**
**సుభగ మెయివడి చూపుగాఁ జూచి తనదు। హృదయ మెఱిఁగించు తెఱఁగున నిట్టులనియె. 259**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ విధంగా; బహువిధంబులన్= అనేక ప్రకారాలుగా; పలుకు= మాట్లాడే; అతని పలుకులు= కీచకుడి మాటలు; ఏర్పడన్+విని= శ్రద్ధగా ఆలకించి; మెత్తన్+పడిన+అట్లు= అంగీకరించినట్లుగా, లోబడినట్లుగా; సుభగ= మంచి భాగ్యంగల ద్రౌపది; మెయివడి చూపుగాన్= ఒప్పుకొన్న చూపుగా చూచి; తనదు హృదయంబు+ఎఱిఁగించు తెఱఁగునన్= తన మనస్సు బయటపెట్టుతున్నట్లుగా; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికింది.

**తాత్పర్యం:** ఆ విధంగా అనేక రీతులుగా పలుకుతున్న కీచకుడి మాటలన్నీ ద్రౌపది శ్రద్ధగా విని, మనసు మెత్తపడి అంగీకరించినట్లు అతడి వైపు చూచింది. తన మనసులోని మాటను చెప్పుకొంటున్నట్లు ఇట్లా పలికింది.

**విశేషం:** మెత్తబడటం మనసుకు సంబంధించిన గుణం. మెయివడి చూపులు ఆంగికాభినయానికి సంబంధించినవి. ఇక వాచికాభినయం ప్రారంభం కానున్నది. అభినయభాషలో చెప్పిన అందమైన భావం. (సంపా.)

**చ. 'వలదని యెంత సెప్పినను వావిరివై కడు వేగపాటుమైఁ**
**బలుమఱు నెల్లెడం దొడరఁబాఱెదు; నీ హృదయంబు నట్లకాఁ**
**దలఁపు మనోజు తూపులకుఁ దక్కటి చిత్తములుం; గడంగి వి**
**చ్చలవిడిసేఁత గర్జమె? విచారము గోర్కికిఁ గాని వావియే? 260**

**ప్రతిపదార్థం:** వలదు+అని= వద్దని; ఎంత చెప్పినను= ఎంత చెప్పినా; వావిరివి+ఐ= వెంటబడివచ్చేవాడివై; కడువేగపాటుమైన్= మిక్కిలి తొందరపాటుతో; పలుమఱున్= పెక్కుసార్లు; ఎల్ల+ఎడన్= కనబడిన ప్రతిచోటా; తొడరన్+పాఱెదు= నాతో కూడటానికి తొందరపడతావు; మనోజు తూపులకున్= మన్మథుడి బాణాలకు; నీ హృదయంబున్+అట్ల= నీ మనస్సు వలెనే; తక్కటి చిత్తములున్= ఇతరుల మనసులు కూడా; కాన్= ఔతాయని; తలఁపు= అనుకొమ్ము; కడంగి= పూనుకొని, కావాలని; విచ్చలవిడిచేఁత= గుట్టుమట్టు లేకుండా బయటపడి వ్యవహరించటం; కర్జమె?= తగిన పనియా?; విచారము= ఆలోచన; కోర్కికిన్= కోరికకు; కాని వావియే?= కాని వరసయా? (అంటే - కోరికకూ ఆలోచనకూ పొత్తు లేదా? అని భావం.)

**తాత్పర్యం:** 'నేను వద్దని ఎంత వారించినా వినకుండా వెంబడించి మాటిమాటికి తొందరపాటుతో నామీదికి వస్తున్నావు. నీ మనస్సు మన్మథవశమైనట్లే, అందరి మనస్సులుగూడ మదనావేశానికి లోనౌతాయని గ్రహించుము. ఆలోచనకూ కోరికకూ పొంతన ఉండదా?

**విశేషం:** మెత్తబడిన మానవతి నేరం మగవాడిమీద వేయటం గడుసుదనం. వలదని చెప్పిందట? ఏమి వలదని? అన్నది ప్రశ్న, ఎక్కడబడితే అక్కడ వెంటబడి కూడబలకటం వలదని చెప్పినట్లు తేలుతుంది. అయితే ఆమె కిష్టం లేదా? అని అనుమానం కలుగుతుంది. మన్మథుడు మగవాళ్ళను ఎట్లా బాణాలతో కొట్టుతాడో ఆడవాళ్ళను కూడా అట్లాగే కొట్టుతాడని ఊహించాలట. ఆ సంగతి తెలిస్తే మన్మథ క్రియ గుట్టుగా సాగాలని తెలుస్తుందట! బట్టబయలు ప్రణయం పనికిరాదట! లోకంలో రసికులకు కోర్కె ఉంటే చాలదట! దానిని గుట్టుగా తీర్చుకొనే ఆలోచన కూడా ఉండాలట! ఈ పద్యంలో చివరి వాక్యం మలి మెరుపు, 'విచారము గోర్కికి కాని వావియే? ఇందులో కాకుధ్వని ఉంది. నిజంగా ఆలోచించి పనిచేయటం కోర్కెతీరటానికి విరుద్ధమైన పొంతన కాదు. ఆలోచించి పనిచేస్తే మన బంధుత్వం కుదిరేదే - అని, కాకువులో ఆలోచించటం కోర్కె తీరటానికి తగిన పొంతన కాదు అనిన్నీ అర్థాలు ఏర్పడతాయి. మొదటి అర్థం ప్రకృతం. రెండవ అర్థం అప్రకృతమైనా భావికథార్థ వ్యంజకం! ఈ కాకువు వలన ద్రౌపది అక్రమ సంబంధాన్ని సమర్థిస్తున్న అర్థచ్ఛాయ కూడా కలుగకుండా తిక్కన కల్పించాడు. (సంపా.)

**క. మగ లడఁకువ నుండక తమ। తగులమ పాటింతు; రెట్టి తగులం బైనన్**
**మగువల యెడలన యడఁగుం; దగవు విడిచి యడిచిపడరు ధైర్యము పేర్మిన్. 261**

**ప్రతిపదార్థం:** మగలు= పురుషులు; అడఁకువన్+ఉండక= అణగి మణగి ఉండక; తమ తగులము+అ= తమ మోహాన్నే; పాటింతురు= బహిర్గతం చేస్తారు; ఎట్టి తగులంబు+ఐనన్= ఎంత మోహమున్నా; మగువల+ఎడలన్+అ= స్త్రీల మనస్సులలోనే; అడఁగున్= అణగి ఉంటుంది; ధైర్యము పేర్మిన్= అధికమైన ధైర్యంతో; తగవు విడిచి= న్యాయం వదలి; అడిచిపడరు= బయటపడరు.

**తాత్పర్యం:** పురుషులు మోహావేశాన్ని రహస్యంగా ఉంచుకొనకుండా బయటకు వ్యక్తపరుస్తారు. స్త్రీలు తమ మోహాన్ని మనస్సులోనే ధైర్యంగా అణచుకొంటారుగాని, బయటపడరు.

**విశేషం:** ప్రణయ ప్రదర్శనలో స్త్రీ పురుషుల స్వభావాన్ని తెలిపే ఈ పద్యం సూక్తి, ఈ సూక్తిలో ధ్వనిగా స్ఫురించేది ద్రౌపది హృదయంలో ఉన్న గూఢమైన కోరిక. అది సూక్తిలో నిబద్ధం కావటం వలన ఆమె మాటలు దోషజుష్టాలు కావటం లేదు. ఇది తిక్కన ఆ పాత్రకు నేర్పిన వాక్య శిల్పం. (సంపా.)

**తే. ఇట్టు లగుట యెఱిఁగి యెల్లభంగుల రహ। స్యంబు గోలుపోనియట్లు గాఁగ**
**నడరు నీదు కోర్కి కనురూప మెట్టిది। యట్టి భోగభంగి ననుభవింపు.' 262**

**ప్రతిపదార్థం:** ఇట్టులు+అగుట, ఎఱిఁగి= ఇట్లా ఉండటం తెలిసికొని; ఎల్లభంగులన్= అన్ని విధాల; రహస్యంబు కోలుపోని+ అట్లుకాఁగన్= రహస్యం బయటపడనట్లుగా; అడరు= అతిశయించే; నీదు కోర్కికిన్= నీ అభిలాషకు; అనురూపము+ఎట్టిది= తగిన విధమేదో; అట్టి భోగభంగిన్= అటువంటి అనుభవ పద్ధతితో; అనుభవింపుము= పొందుము.

**తాత్పర్యం:** ఓ కీచకా! ఈ విషయాన్ని నీవు తెలిసికొని, అన్ని విధాలా రహస్యం బయటపడని విధంగా, అంటే గోప్యంగా, అతిశయించే నీ కోర్కెకు అనువైన పద్ధతి ఏదో అటువంటి భోగపద్ధతిలోనే నన్ను పొందుము.'

**విశేషం:** ఈ పద్యానికి మరొక విధంగా అర్థం చెప్పవచ్చును. ద్రౌపది సమయోచితంగా వ్యూహం ప్రకారం అభినయిస్తూ మాట్లాడుతున్న వైఖరి ప్రకృతార్థం. అయితే, తిక్కన ఆమె నోట పతివ్రత పలుకరాని పలుకులు రాకుండా రక్షించే రచనా శిల్పాన్ని పాటిస్తున్నాడు. ఆ వరుసలో ఈ పద్యం పరాకాష్ఠ. ఇందులో భోగ ప్రసక్తి వచ్చింది. కాని అది అశ్లీలం కాకూడదు, అనౌచిత్యం కాకూడదు. కాబట్టి ఈ పద్యాన్ని ఈ విధంగా చెప్పుకొనవచ్చును.

**ప్రతిపదార్థం:** ఇట్టులు+అగుట= స్త్రీలు బయటపడరు అనే విషయాన్ని - అంటే నా మనసులో ఉన్న గుట్టును నేను బయటపెట్టను అనే అంశాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; ఎల్లభంగులన్= అన్ని విధాలా; రహస్యంబు, కోలుపోని+అట్లు, కాఁగన్= భీముడు పన్నిన రహస్య వ్యూహం భగ్నంకాని విధంగా; అడరు= ఒప్పారు; నీదు కోర్కికిన్= నీవు నన్ను పొందాలి అనే అధర్మ వాంఛకు; అనురూపము+ఎట్టిది+అట్టి+భోగ, భంగిన్= తగిన ఫలం ఎటువంటిదో అటువంటి ఫలాన్ని (అంటే మృత్యువును); అనుభవింపుము= పొందుము.

**తాత్పర్యం:** నా గుట్టును నేను బయటపెట్టని పద్ధతిని తెలిసికొని, అన్నివిధాలా మా రహస్య వ్యూహం భగ్నం కాకుండా ఉండే విధంగానే సాగుతున్న నీ కోర్కెకు (నన్ను పొందాలన్న కోర్కెకు) ఎటువంటి ఫలాన్ని అనుభవించవలసి ఉంటుందో అటువంటి ఫలభోగాన్ని (మృత్యువును) పొందుము. కీచకుడికి కలిగిన పరసతీగమనవాంఛకు తగిన ఫలం మరణమని ద్రౌపది మాటలలోని గూఢార్థం. పరస్త్రీ గమనం వలన ఆయుస్సు క్షయమౌతుందని ఆర్యోక్తి, **"ఆయుః క్షతిర్వికలంతా వ్యపహాస్యతా చ । నిందార్థ హాని లఘుతా విగతిః పరత్ర । స్యాదేవ యద్యపి రతేన పరాంగనాయాః"**- ఇత్యాది సూక్తి లోకప్రసిద్ధం. ఈ తాత్పర్యం పఠితలు ఊహించగలిగింది; ద్రౌపదికి అవాచ్యదోషం కలిగించనిది, ఔచిత్యం పోషించేది, విజ్ఞులు మెచ్చేది, తిక్కన రచనా కళను తెలిపేది. కాని, కామి అయిన కీచకుడికి, కథాగతికి మొదటి అర్థమే ప్రస్తుతం. (సంపా.)

**చ. అనవుడుఁ గీచకుండు హృదయంబునఁ బొంగి లతాంగితోడ ని**
**ట్లను 'ధృతిఁ గోలుపుచ్చెఁ గుసుమాయుధుఁ; డేటి విచార; మిట్టు లేఁ**
**ప నగునె? యైన నీదయిన పం పెదఁ గైకొని చేయువాఁడ; నే**
**యనువున నెప్పు డెయ్యెడ నిజాభిమతం బొడఁగూర్తు చెప్పుమా!'** **263**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; కీచకుండు; హృదయంబునన్+పొంగి= మనస్సులో ఉప్పొంగి; లతాంగితోడన్= ద్రౌపదితో; ఇట్లు+అనున్; కుసుమ+ఆయుధుఁడు= మన్మథుడు; ధృతిన్+కోలుపుచ్చెన్= ధైర్యం సడలిపోయేటట్లు చేశాడు; ఏటి విచారము?= ఇంకా దిగులు ఎందుకు? ఇట్టులు= ఈ విధంగా; ఏఁపన్+అగునె?= బాధించ తగునా?; ఐనన్= అయినప్పటికీ; నీది+అయిన= నీయొక్క; పంపు= ఆజ్ఞను; ఎదన్+కైకొని= మనసారా; చేయువాఁడన్= చేస్తాను; ఏ+అనువునన్= ఏ ఉపాయంతో; ఎప్పుడు? ఏ+ఎడన్?= ఎక్కడ?; నిజ+అభిమతంబు= నా కోరిక; ఒడన్+కూర్తు(వు) చెప్పుమా?= తీరుస్తావో చెప్పుము.

**తాత్పర్యం:** ద్రౌపది చెప్పిన మాటలకు కీచకుడి హృదయం ఉప్పొంగిపోయింది. ఆమెతో ఇట్లా అన్నాడు; 'సరే! మన్మథుడు నా కొండంత ధైర్యాన్ని సడలించాడు. అయినా ఇంకా నన్ను బాధించటం ధర్మం కాదు. నీ ఆజ్ఞ మనసార పాటిస్తాను. నీ ఉపాయంతో నా కోరిక ఎప్పుడు ఎక్కడ తీరుస్తావో చెప్పుము.'

**విశేషం:** నిజ శబ్దాన్ని తిక్కన ఆత్మార్థంలోనూ, యుష్మదర్థంలోనూ, అస్మదర్థంలోనూ వాడాడు. ఇక్కడ అస్మదర్థంలో ప్రయోగించబడింది. (సంపా.)

**క. అని పలికినఁ బాంచాలియుఁ । దన యురులం గీచకుండు దగులుట భావం**
**బున నిశ్చయించి యిట్లను । ననురాగాయత్తచిత్త యైనది వోలెన్.** **264**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని కీచకుడు పలుకగా; పాంచాలియున్= ద్రౌపది కూడా; కీచకుండు; తన+ఉరులన్ +తగులుట= తన ఉచ్చులో చిక్కుకొనటం; భావంబునన్= మనస్సులో; నిశ్చయించి= నిర్ణయించుకొని; అనురాగ+ఆయత్తచిత్త+ఐన+అది+పోలెన్= ప్రేమ నిండిన హృదయం ఉన్నదానివలె; ఇట్లు+అనున్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** కీచకుడు అట్లా మాట్లాడగా ద్రౌపది అతడు తన ఉచ్చులో చిక్కకొన్నాడని భావించి ప్రేమ నిండిన మనసుగలదానివలె ఇట్లా పలికింది.

**విశేషం:** ఇక్కడ ఉచ్చులో చిక్కుకొన్న మృగంతో కీచకుడిని పోల్చటం విశేషం. ప్రాణాలు కోల్పోవటానికి ముందు గిజగిజలాడే విధంగా ఉన్నది కీచకుడి మనస్థితి.

**ఉ. 'ఉత్తర లోనుగాఁ గల పయోజముఖుల్ పగలెల్లఁ బ్రీతితో**
**నృత్తముఁ జేసి పోవ కమనీయరహస్యవిధిన్ నిశీథినీ**
**వృత్తముఁ గోరువారలకు వేడ్కకుఁ బట్టగుచుండు నా గృహం;**
**బుత్తమ మిత్తెఱంగునకు నొంటిమెయిం దగ నీవు వచ్చినన్.'** 265

**ప్రతిపదార్థం:** ఉత్తర లోనుగాన్+కల పయోజముఖుల్= ఉత్తర మొదలైన పద్మవదనలు; పగలు+ఎల్లన్= పగలంతా; ప్రీతితోన్= ఇష్టంతో; నృత్తమున్+చేసి, పోవన్= నాట్యంచేసి పోగా; కమనీయ రహస్య, విధిన్= మనోజ్ఞమైన రహస్య పద్ధతిలో; నిశీథినీ, వృత్తమున్= చీకటి తప్పును; కోరు, వారలకున్= కోరేవాళ్ళకు; ఆ+గృహంబు= ఆ నర్తనశాల; వేడ్కకున్= వేడుకకు; పట్టు+అగుచున్+ఉండున్= చోటు అవుతూ ఉంటుంది; ఈ+తెఱంగునకున్= ఈ విధానికి; ఒంటిమెయిన్= ఒంటరిగా; ఈవు; తగన్= ఒప్పునట్లుగా; వచ్చినన్= వస్తే; ఉత్తమము= శ్రేష్ఠం.

**తాత్పర్యం:** ఉత్తర మొదలైన కన్యలందరూ పగలంతా ప్రీతితో నాట్యం చేసిపోగా అతిరహస్యంగా చీకటితప్పు చేయగోరేవారికి ఆ నర్తనశాల వేడుక కలిగించే సంకేతప్రదేశం. అటువంటి రహస్యక్రీడకు నీవు ఒంటరిగా వస్తే మంచిది.

**విశేషం:** ద్రౌపది తమోఽభిసారికవలె మాట్లాడింది. తమోఽభిసారిక అంటే చీకట్లో నల్లని దుస్తులు ధరించి ఎవరికీ తెలియకుండా, ఎవరూ గుర్తు పట్టకుండా స్వయంగా ప్రియుడిని కూడటానికి సంకేత స్థలానికి పోయే వనిత. **'కమనీయ రహస్య విధిన్ నిశీథినీ వృత్తము గోరువారలకున్'** అని ఉదాత్త సంస్కృత సమాసాలను ప్రయోగించటం సాభిప్రాయం. తాను అత్యంతరహస్యంగా రాత్రి చరిత్రను కోరుతున్నదని భావం. అనగా, అతి గోప్యంగా రాత్రిళ్ళలో మాత్రమే రహస్యరతిని ఆమె కోరుతున్నట్లు ధ్వని. ఇక్కడ ఔచిత్య పోషకంగా ఉదారత అనే అర్థగుణాన్ని ప్రదర్శించింది. అంటే అగ్రామ్యత్వం (గ్రామ్యత్వం ప్రసంగంలో దొరలకుండా ఆ భావాన్నే అగ్రామ్యంగా చెప్పటం) ప్రదర్శించింది. పద్యాన్వయంలో- 'ఆ గృహంబు ఉత్తమము' అని చెప్పి 'ఇత్తెఱంగునకు నొంటి మెయిం దగ నీవు వచ్చినన్' అని అసంపూర్ణంగా వాక్యాన్ని ముగించటంలో ఆమె కోర్కె వ్యంగ్యంగా వ్యక్తమౌతుందని కొందరు వ్యాఖ్యానిస్తారు. ఆ అన్వయం అంత సమర్థనీయం కాదు. ఆ గృహం ఉత్తమమనటం కంటె, నీవు ఒంటరిగా వస్తే 'ఉత్తమము' అని నిర్దేశించిందనటం ఉత్తమం. ఆ మాటను ఊనికతో వాక్యారంభంలో ఉంచటం సార్థకం. అతడు ఒంటరిగా రావటమే భీమ వ్యూహాన్ని అనుసరించి కమనీయ రహస్య విధిన్ నిశీథినీ వృత్తము కోరువారలకు (భీమద్రౌపదులకు) (ఆ పద్ధతియే) శ్రేష్ఠమైనది. ఉత్తమమైనది అని ధ్వని. గృహం కాదు ముఖ్యం, ఒంటరిగా రావటమని గ్రహించాలి. రాబోయే పద్యంలో కీచకు డిచ్చే సమాధానం ఈ అంశాన్నే ధ్రువపరుస్తున్నది. (సంపా.)

**క. అనిన నతఁడు వికసిల్లుచు। 'నను నెమ్మెయి నేలుకొనిన నళినానన! నీ**
**యనుమతి సేయనె? యొక్కడఁ। జనుదెంచెద నేఁటి రాత్రి సమ్మదలీలన్.** 266

**ప్రతిపదార్థం:** అనినన్= ద్రౌపది అట్లా అనగా; అతఁడు= కీచకుడు; వికసిల్లుచున్= ఉల్లాసపడుతూ; నళిన+ఆనన!= పద్మముఖీ! ద్రౌపదీ!; ననున్= నన్ను (కీచకుడిని); ఏ+మెయిన్= ఏవిధంగా; ఏలుకొనినన్= పాలించినా (ఇది శృంగార స్ఫోరకమైన పదం); నీ

అనుమతి+చేయనె?= నీ ఆజ్ఞ పాటించనా?; నేఁటి రాత్రి= ఈనాటి రాత్రి; సమ్మదలీలన్= సంతోషంతో; ఒక్కఁడన్= ఒక్కడినే; చనుదెంచెదన్= వస్తాను.

**తాత్పర్యం:** ద్రౌపది ఆ మాటలు అనగా కీచకుడు ఉల్లాసపడ్డాడు. 'ఓ పద్మముఖీ! నన్ను ఏ విధంగా నీవు ఏలుకొంటే ఆ విధంగా నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. ఈ రాత్రికి నేను సంతోషంతో ఒంటరిగా వస్తాను.

**విశేషం:** తిక్కన పదప్రయోగ కౌశలం గమనించదగింది. అనుకొనని విధంగా సైరంధ్రి అంగీకారం తెలిపేసరికి కీచకుడికి సంతోషం కలిగింది. ఎట్లా? క్రమంగా ముఖం వికసించినట్లు, హృదయం విప్పారినట్లు అభినయంలో వ్యక్తమయ్యేటట్లు. 'వికసిల్లుచున్' అనే క్రియ ఆ భావాన్ని అభినయంలో గమ్యమానం చేస్తుంది. ఏలుకొనుట, అనుమతి - అనే మాటలు ప్రభుత్వంలోనూ, ప్రణయంలోనూ ఆయా అర్థాలలో ప్రయోగించే పదాలు. ద్రౌపదికి పూర్తిగా దాసుడైన కీచకుడు ఆమె ఆదేశాలను తు.చ. తప్పకుండా పాటించటానికి సిద్ధమయ్యాడు. ఆమె ప్రభుత్వాన్నీ, ప్రణయాన్నీ అంగీకరించాడు. దానితో భీమ ద్రౌపదుల వ్యూహం ఫలోన్ముఖం అయింది. 'ఒంటరిగా ఈ రాత్రి సంతోషంతో కూడిన విలాసంతో వస్తానని, 'ఒంటరిగా రమ్మన్న ఆజ్ఞను పాటిస్తా'నని హామీ ఇచ్చాడు. ఇదే ద్రౌపదికీ, కథాగతికీ కావలసింది. (సంపా.)

**తే. ఇదియ నిశ్చయ; మిమ్మాట వదలకుండు' । మనిన 'నీ వొక్కరుండవ యరుగుదేర**
**వలయు; లేకున్న నయ్యెడ నిలుచుదానఁ । గానుజూ నిక్కువం' బని పూని పలికి. 267**

**ప్రతిపదార్థం:** ఇది+అ= ఇదే, ఈ మాటే; నిశ్చయము= నిర్ణయం, ఖాయం; ఈ మాట= నీవు ఇచ్చిన వాగ్దానం; వదలక+ఉండుము= విడువకుండా కాపాడుకో; అనినన్= అని కీచకుడు పలుకగా; నీవు= నీవు (కీచకుడు); ఒక్కరుండవు+అ= ఒక్కడివే; అరుగు దేర వలయున్= రావాలి!; లేక+ఉన్నన్= అట్లా కాకపోతే; ఆ+ఎడన్= అక్కడ; నిలుచుదానన్+కాను+చూ= నిలబడను (ఉండను) సుమా!; నిక్కువంబు= ఈ మాట నిజం; అని= అంటూ; పూని పలికి= ఒత్తి చెప్పి, (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఇది నా నిర్ణయం. నీవన్న మాట నీవు తప్పకుండా పాటించుము!' అన్నాడు కీచకుడు. ఆ మాటలు విని ద్రౌపది - 'నీ వొక్కడివే రావాలి. లేకపోతే, నే నక్కడ నిలువకుండా వెళ్ళిపోతాను సుమా! నా మాట నిజం' అని గట్టిగా ఒత్తి చెప్పింది.

**విశేషం:** అతడు 'నిశ్చయం' అనటం, ఆమె 'నిక్కువం' అనటం- ఈ ఉభయ వాక్యాలలోని ఊనిక గల పదాలు, ఆమె అంగీకరించినా దానిని పూర్తిగా నమ్మలేని ఆశ్చర్యంలో ఉన్నాడు కీచకుడు. అందువలన అనుమానం తీర్చుకొనటానికి 'నీవిచ్చిన మాటను తప్పకుండా నిలుపుకొను' మన్నాడు. అతడు ధ్రువపరచుకొనటానికి ఆ మాట అన్నాడు. ద్రౌపదికి ఒక అవకాశం దొరికింది. కీచకుడు చంచలుడు. అతడు చెప్పిన మాటను చెప్పినట్లుగా చేస్తాడో లేదో అని ఆమెకు అనుమానం. అది తీరేటట్లుగా ఒంటరిగా కీచకుడు రావటాన్ని ధ్రువపరచుకొనేటట్లుగా మాట్లాడింది. 'ఒంటరిగా రాకపోతే నీకు నేను దక్క'నని భయపెట్టింది. అది నిజమని నొక్కి చెప్పింది. అదే భావికార్యఫలానికి బీజం. (సంపా.)

**క. 'మన మియ్యెడఁ బెద్దయుఁ బ్రొ । ద్దనుమానములేక మాటలాడుట దగ; దీ**
**వును బొ, మ్మేనును నాదగు । పనికేఁగెద' ననియెఁ గమలపత్రేక్షణయున్.' 268**

**ప్రతిపదార్థం:** కమలపత్ర+ఈక్షణయున్= పద్మదళాల వంటి కనులుగల ద్రౌపదియూ; మనము= మనం - ద్రౌపది, కీచకుడు; ఈ+ఎడన్= ఇక్కడ; పెద్దయున్+ప్రొద్దు= ఎక్కువసేపు; అనుమానములేక= సంకోచం లేకుండా; మాటలు+ఆడుట=

మాట్లాడుకొనటం; తగదు= భావ్యం కాదు; ఈవును= నీవుకూడా; పొమ్ము= వెళ్ళిపొమ్ము; ఏనును= నేను కూడా; నాదగు పనికిన్+ఏఁగెదన్= నా పని చేసికొనటానికి పోతాను; అనియెన్= అన్నది.

**తాత్పర్యం:** 'మన మిద్దరం ఇక్కడ ఎక్కువ సేపు సంకోచం లేకుండా మాట్లాడుకొనటం భావ్యం కాదు. నీవు వెళ్ళి పొమ్ము. నేనూ నా పని మీద పోతాను' అని ద్రౌపది కీచకుడిని నమ్మబలికింది.

**విశేషం:** 'ఈవును బొమ్ము; ఏనును నాదగుపని కేఁగెదన్' - నీవింక పొమ్ము, నేను భీముడి వద్ద కేగి నీవు పోవటానికి (చావటానికి) చేయవలసిన పని చేస్తాను - అనే గూడార్థం కూడా ధ్వనిస్తున్నది. (సంపా.)

**చ. సమయము నిర్ణయింప విని చంద్రనిభానన పల్కులప్డు చి**
**త్తమునకు నింపుఁబెంపఁగ ముదంబునఁ గీచకముఖ్యుఁ డాత్మగే**
**హమునకుఁ బోయె; నమ్ముదిత యచ్చట వెండియుఁ బ్రస్తుతక్రియా**
**సముచిత వర్తనంబుఁ దగఁ జల్పి మహానసశాలలోనికిన్.** **269**

**ప్రతిపదార్థం:** సమయము నిర్ణయింపన్= సంకేత స్థలంలో కలిసే కాలాన్ని నిశ్చయించగా; విని; చంద్రనిభ+ఆనన= చంద్రుడితో సమమైన ముఖం గల ద్రౌపదియొక్క; పల్కులు= మాటలు; అప్డు= అప్పుడు; చిత్తమునకున్= మనస్సుకు; ఇంపున్+పెంపఁగన్= ప్రీతిని అతిశయింపజేయగా; కీచక ముఖ్యుఁడు= కీచకులలో శ్రేష్ఠుడైన సింహబలుడు; ముదంబునన్= సంతోషంతో; ఆత్మగేహమునకున్= తన ఇంటికి; పోయెన్= వెళ్ళాడు; ఆ+ముదిత= ద్రౌపది; అచ్చటన్= ఆ స్థలంలో; వెండియున్= మళ్ళీ; ప్రస్తుత క్రియా సముచిత వర్తనంబున్= అప్పటి కవసరమైన పనిని; తగన్+చల్పి= పూర్తిచేసి; మహానసశాలలోనికిన్= వంట ఇంట్లోకి (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** సంకేత సమయాన్ని నిశ్చయించిన ద్రౌపది మాటలు విని, కీచకుడు సంతోషపడి తన యింటికి వెళ్ళాడు. ద్రౌపది కూడా అక్కడ తాను చేస్తున్న పనిని పూర్తి చేసి వంటశాలకు (వెళ్లిందని ముందరి పద్యంతో అన్వయం.)

### ద్రౌపది భీమునితోఁ గీచకుఁడు నర్తనశాలకు రాఁబోవుటం జెప్పుట (సం.4-21-25)

**క. చని వెడ వికసిల్లెడు నా। ననపద్మముతోడ ననిలనందనునకు ని**
**ట్లనియెఁ జతురోక్తిరీతి న। తని గూఢక్రోధవహ్ని దరికొల్పంగన్.** **270**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; వెడ వికసిల్లెడు= ఇంచుక వికసించిన; ఆననపద్మముతోడన్= పద్మంవంటి వదనంతో; అనిలనందనునకున్= భీముడితో; చతుర+ఉక్తిరీతిన్= మాటల నేర్పరితనంతో; అతని= భీముడియొక్క; గూఢక్రోధ వహ్నిన్= దాగిన కోపమనే నిప్పును; దరికొల్పంగన్= మంటను ఎగద్రోసి మండించటానికై; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ద్రౌపది వంటశాలలోనికి వెళ్ళి ఇంచుక సంతోషంతో వికసించిన ముఖంతో భీముడి మనసులో దాగిఉన్న కోపాగ్నిని తన మాట నేర్పరితనంతో ప్రజ్వరిల్లచేయటానికి ఇట్లా అన్నది.

**విశేషం:** అలం: రూపకం. గూఢకోపాగ్నిని ప్రజ్వలింపచేసేటట్లు చతురంగా మాట్లాబోతున్నదనటం విశేషం. గూఢకోపాగ్ని ప్రజ్వరిల్లి నా గూఢంగానే ఉండేటట్లు నిర్దేశించబోతున్నదని ధ్వని. (సంపా.)

**తే. 'నా కొలఁతఁ దీర్చివచ్చితి; । నీ కొలఁతయ యింక; సూతునిం దెగ జూడన్**
**లోకము వంచింపను దగు । చీఁకటి రే యొదవె; నేమి చేసెదొ చెపుమా?' 271**

**ప్రతిపదార్థం:** నా కొలఁతన్= నా వంతు పనిని; తీర్చి వచ్చితిన్= పూర్తి చేసి వచ్చాను; ఇంకన్= ఇకమీద; నీ కొలఁత+అ= నీ వంతు పని మాత్రమే ఉన్నది; సూతునిన్= కీచకుడిని; తెగన్+చూడన్= చంపడానికి; లోకమున్+వంచింపను= జమలను మోసపుచ్చటానికి; తగు= తగిన; చీఁకటిరేయి= చీకటి రాత్రి; ఒదవెన్= కలుగనున్నది; ఏమి+చేసెదొ చెపుమా!= ఏమి చేస్తావో చెప్పుము.

**తాత్పర్యం:** 'నా వంతు పని నేను పూర్తి చేసి వచ్చాను. నీ వంతు పనే ఇంక మిగిలి ఉన్నది. కీచక సంహారానికీ, లోకాన్ని మోసం చేయడానికీ తగిన చీకటిరాత్రి రానున్నది. ఇంక నీ ఇష్టం. ఏం చేస్తావో చెప్పుము.'

**విశేషం:** ఈ పద్యంలో చివరి పాదంలోని ప్రాసస్థానంలో 'చీఁకటి' శబ్దం ఉన్నది. అందులో ప్రాసస్థానంలో అరసున్నతో కూడిన కవర్ణం ఉండటం, మిగిలిన మూడు పాదాలలో అరసున్నలేని క వర్ణాలుండటం గమనించదగింది. దీనిని ఆనందరంగరాట్ఛందము సమర్థిస్తున్నది.

"ఒకటి కరసున్న గలిగి మూఁటి కవి లేక । ప్రాసములు లఘుపరములై పైని చెల్లుఁ;
గృతుల నొక్కొక్కచో నది యెట్టులనిన । నిఁకను నెఱిఁగింతుఁ జెప్పెఁడి సుకవులనఁగ"

ఈ విధమైన ప్రాసమును అప్పకవే చెప్పాడు. దాని కతడు పెట్టిన పేరు ఖండాఖండ ప్రాసం. దాని లక్షణం- 'క, నిడుపులు నరసున్నలు దమ, కెడమనుగల కచటతపల కిలఁ బ్రాసములై, తొడరును నిర్బిందువు లొ, క్కెడ ఖండాఖండ సంజ్ఞ నినశశినయన'' అప్పకవి. తృతీయాశ్వాసంలో అతడు ఖండాఖండప్రాసకు ఈ పద్యాన్నే లక్ష్యంగా ఇచ్చాడు. అయినా ఈ శబ్దాన్ని శ.ర. సబిందుకంగానూ, చి.ని. సూ.ని. నిర్బిందుకంగానూ పేర్కొన్నాయి. నిర్బిందుకమయితే విశేషమే లేదు. (సంపా.)

**వ. అనిన విని దరహసిత వదనుం డగుచు వృకోదరుం డిట్లనియె. 272**

**తాత్పర్యం:** ఆ మాట విని చిరునవ్వుతో కూడిన ముఖంతో భీము డిట్లా అన్నాడు.

**క. 'నన్నడుగ నేల? నీవును । నన్నీచుఁడు నేమి మాటలాడితి? రది నా**
**కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము । ని న్నే మెచ్చించువాఁడ నీరజవదనా!' 273**

**ప్రతిపదార్థం:** నీరజవదనా!= పద్మముఖీ! ఓ ద్రౌపదీ!; నన్నున్= (భీముడిని); అడుగన్+ఏల?= అడగటం ఎందుకు?; నీవునున్= నీవూ (ద్రౌపది); ఆ నీచుఁడున్= ఆ అల్పుడూ (కీచకుడూ); ఏమి మాటలు+ఆడితిరి?= ఏమి మాట్లాడుకొన్నారో?; అది; నాకు; ఉన్న+అట్టులు= ఉన్నది ఉన్నట్లుగా; ఎఱుఁగన్+చెప్పుము= తెలియజేయుము; నిన్నున్= ద్రౌపదిని; ఏన్= నేను (భీముడు); మెచ్చించువాఁడన్= మెప్పిస్తాను.

**తాత్పర్యం:** 'ఓ ద్రౌపదీ! నన్ను అడగటం దేనికీ? నీవూ, ఆ నీచుడూ ఏమేమి మాట్లాడుకొన్నారో నాకు ఉన్నది ఉన్నట్లుగా తెలుపుము. నిన్ను నేను మెప్పిస్తాను.'

**వ. అనినఁ బాంచాలి సుదేష్ణ మందిరంబునం దా నుచితాచరణంబున నునికియు, సింహబలుండు సింగారించుకొని వచ్చుటయు, రేయింటి మాటలవలనం దాను బెదరమియు, వాఁడు సామ దాన భేద**

**దండంబులు సూపి పలుకుటయు, దానికి మెయికోలు భావించికొని క్రమంబునం దగిన సంభాణంబు సేసి, నాట్యమండపంబు సంకేతస్థలంబుగాఁజెప్పి, యొక్కరుండవచ్చువాఁడవని నియమించుటయు, నద్దురా త్ముండు ప్రముదితాత్ముండగుచు రాత్రిసమయంబున నయ్యెడకు నొంటిమెయిం జనుదెంచువాఁడై చనుటయుఁ దెలియంజెప్పిన, నతండు పరమాహ్లాదంబునంబొంది.** **274**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; పాంచాలి= ద్రౌపది; సుదేష్ణ మందిరంబునన్= సుదేష్ణ యొక్క అంతపురంలో; తాను= (ద్రౌపది); ఉచిత+ఆచరణంబునన్+ఉనికియున్= తన పనిలో తాను ఉండటమున్నూ; సింహబలుండు= కీచకుడు; సింగారించుకొని= అలంకరించుకొని; వచ్చుటయున్= రావటమున్నూ; రేయింటి= రాత్రి; మాటలవలనన్= భీమసేనుడు పల్కిన ఓదార్పుమాటలవలన; తాను బెదరమియున్= ద్రౌపది భయపడక ఉండటమున్నూ; వాఁడు= కీచకుడు; సామదానభేద దండంబులు= చతుర్విధోపాయాలు (నెమ్మదిగా చెప్పటం, దానం చేయటం; తగవు పెట్టడం; దండించటం); చూపి; పలుకుటయున్= మాట్లాడటమున్నూ; దానికిన్= అందుకు; మెయికోలు= ఒప్పుకొనటంగా; భావించికొని= అనుకొని; క్రమంబునన్= వరుసగా; తగిన సంభాషణంబు+చేసి= తగిన మాటలు మాట్లాడి; నాట్యమండపంబు= నర్తనశాల; సంకేతస్థలంబుగాన్= కలిసికొనే రహస్య ప్రదేశంగా; చెప్పి, ఒక్కరుండు+అ= ఒకడే; వచ్చువాఁడవు= రావాలి; అని నియమించుటయున్= అని కట్టడి చేయటమున్నూ; ఆ+దురాత్ముండు= ఆ నీచుడు; ప్రముదిత+ఆత్ముండు+అగుచున్= సంతుష్టమనస్కుడై; రాత్రి సమయంబునన్= రాత్రిపూట; ఆ+ఎడకున్= అక్కడికి; ఒంటిమెయిన్= ఒంటరిగా; చనుదెంచువాఁడై= వస్తానని; చనుటయున్= వెళ్లటమున్నూ; తెలియన్+చెప్పినన్= స్పష్టమయ్యేటట్లు చెప్పగా; అతండు= భీముడు; పరమ+ఆహ్లాదంబునన్= మిక్కిలి సంతోషం; పొంది= అనుభవించి.

**తాత్పర్యం:** అని చెప్పగా ద్రౌపది-సుదేష్ణమందిరంలో తాను తన పనిలో నిమగ్నమై ఉండటం, అక్కడికి కీచకుడు సింగారించుకొని రావటం, రాత్రి భీముడు తనకు ధైర్యం చెప్పటం వలన తాను బెదరకపోవటం, కీచకుడు సామదాన భేద దండోపాయాలతో లోబరుచుకొనాలని ప్రయత్నించటం. ద్రౌపది లోబడినట్లుగా నటించి వాడిని నర్తనశాలకు ఒంటరిగా రాత్రిపూట రమ్మని చెప్పటం, వాడు మూర్ఖుడు కాబట్టి వస్తానని చెప్పి సంతోషంతో పొంగుతూ వెళ్ళటం తేటపడేటట్లు చెప్పింది. ఆ మాటలు విని భీముడు మిక్కుటమైన సంతోషంతో పొంగిపోయాడు.

**విశేషం:** 1. కీచకుడు సామదానభేద దండోపాయాలను ప్రదర్శించి మాట్లాడాడు - అనటం తెలుగు పలుకుబడి. యుద్ధంలో ప్రయోగించేవి ఆ చతురుపాయాలు. శత్రువును లొంగదీసికొనటానికి క్రమంగా సంధి మాటలతో, కొంత రాజ్యత్యాగంతో, శత్రువుల మధ్య కలతలు పెట్టటంతో, చివరకు యుద్ధం చేయటంతో సాధించటం యుద్ధప్రక్రియలో ప్రసిద్ధాలు. ఒక క్రమంలో ఏ రంగంలోనైనా కార్యాన్ని సాధించే పద్ధతికి కూడా తెలుగువారు ఈ పలుకుబడిని ప్రయోగిస్తారు. అందువలననే ద్రౌపది కామ వ్యవహారంలో చతురుపాయాలను ఉటంకించింది. తిక్కన కావ్యకళా శిల్పంలో ఇదొక నేర్పరితనం. వెనుక జరిగిన సంభాషణలో ఉన్న నిర్మాణ శిల్ప రహస్యాలను తరువాతి సంభాషణలలో సూచించి కావ్యార్థ పూర్వాపర సమన్వయ సమాలోచనను పఠితలలో రేకెత్తింప చేస్తాడు తిక్కన. ఇది మహా కవిత్వ దీక్షావిధిలోని ఒక లక్షణం. ఈ సమన్వయ సూత్రం ప్రకారం కీచకుడు పలికిన మాటలలో సామోపాయం 252వ పద్యంలో, భేదోపాయం 253లో, దానోపాయం 254లో, దండోపాయం 256. 257వ పద్యాలలో కనబడతాయి. యుద్ధానికి సన్నద్ధుడవుతున్న భీముడితో చతురుపాయాల ప్రసక్తి తెచ్చి మాట్లాడటం చతురవాక్య విన్యాసం - గుప్తక్రోధాగ్నిని ప్రజ్వలింపజేసే ఇంధనం. కీచకుడు చతురుపాయాలను మదన యుద్ధ సాధనం కొరకు వాడాడు. యుద్ధం సిద్ధించింది. మరి భీముడు? ద్రౌపదిచేత సామదాన భేదోపాయాలు ప్రయోగించాడు. ద్రౌపది సుముఖంగా మాట్లాడటం సామం, తనను రహస్యంగా ఇచ్చుకొంటాననటం దానం, ఒంటరిగా సంకేతస్థలానికి రమ్మని పిలవటం భేదం. ఈ మూడూ వంచనతో విఫలం కావటంతో యుద్ధం కంటె కీచకుడికి గత్యంతరం లేకపోవటం దండం. యుద్ధం సిద్ధించింది. కీచకుడు కోరుకొన్న

మన్మథయుద్ధం వంచనతో వీగిపోతుంది; భీముడు కోరుకొన్న రహస్య ద్వంద్వయుద్ధం ఫలిస్తుంది. భీముడి ప్రహ్లాదానికి ఆ భావమే ఆధారం. పతితలను భావనామయం చేయగల శిల్పకీలకాలు ఎక్కువగా ఇటువంటి పలుకుబళ్లు. 2. కథను చెప్పినట్లు తెలియజెప్పడానికి వచనం బాగా అనుకూలిస్తుంది. అందుకే తిక్కన చకచకా జరిగిన కథను పది వాక్యాలలో క్లుప్తంగా చెప్పించాడు. కథాకథనశైలిలో ఇది ఒక ఒడుపు. (సంపా.)

**శా. 'క్రోధం బప్రతికారమై హృదయముం గుందింప నత్యంత చిం**
**తాధూతాత్ముఁడనైన నాకుఁ బరమోత్సాహంబు సంధిల్ల దు**
**స్సాధం బైన విరుద్ధ కార్య మిటు లాసన్నంబుగా సంఘటిం**
**తే ధర్మాత్మజుఁ డిచ్చమెచ్చఁ బగ సాధింపంగఁ గాన్పల్పమే?'** 275

**ప్రతిపదార్థం:** క్రోధంబు= కోపం; అప్రతికారము+ఐ= తీర్చుకోలేనిదై; హృదయమున్= మనస్సును; కుందింపన్= బాధించగా; అత్యంత= మిక్కిలి; చింతాధూత+ఆత్ముఁడను+ఐన నాకున్= విచారంచేత చలించిన మనస్సు కలిగి ఉన్న నాకు (భీముడికి); పరమ+ ఉత్సాహంబు= మిక్కిలి సంతోషం; సంధిల్లన్= కలుగగా; దుస్+సాధంబు+ఐన= కష్టసాధ్యమైన; విరుద్ధ కార్యము= అజ్ఞాతవాసానికి వ్యతిరేకమైన పనిని; ఇటులు= ఈ విధంగా; ఆసన్నంబుగాన్= దగ్గరపడేటట్లు; సంఘటింతే?= కూర్చిపెట్టావుగదా!; ధర్మ+ఆత్మజుఁడు= ధర్మరాజు; ఇచ్చన్+మెచ్చన్= మనసులో మెచ్చుకొనేటట్లు; పగ సాధింపంగన్= శత్రువును జయించటాన్ని; కాన్పు (కాన్చుట)= చూడటం, సాధించటం; అల్పమే?= సులభమా?

**తాత్పర్యం:** 'ప్రతీకారం తీర్చుకొనలేని కోపం నా హృదయాన్ని క్రుంగదీయగా మిక్కిలి వ్యాకులచిత్తంతో ఉన్న నాకు అత్యంత ఉత్సాహాన్ని కలిగించేటట్లు, కష్టసాధ్యమైన పనీ, అజ్ఞాతవాస ప్రవర్తనకు పూర్తిగా విరుద్ధమైనదీ అయిన ఇటువంటి కార్యాన్ని వెంటనే చేసేటట్లు సంఘటించావు. ఇక ధర్మరాజు మనసులో మెచ్చుకొనేటట్లు పగ సాధించి చూపటం సామాన్యమా? (లేదా-తేలికే.)

**విశేషం:** 1. కీచకుడిని చంపటం (పగసాధించటం) ఎంత ముఖ్యమో - దానిని అజ్ఞాతవాస సమయం చెడకుండా సాధించటం అంతే ముఖ్యం. అప్పుడే ధర్మరాజు మెచ్చుకొంటాడు. ఆ విధంగా అతడు మెచ్చుకొనేటట్లు పగసాధించగలగటం అల్పం కాదు. కష్టం. దానిని నీవు నేర్పుతో చేశావని భీముడు ద్రౌపదిని మెచ్చుకొంటున్నాడు.

2. రసాభ్యుదయ రహస్యాలను ధ్వనిమయంగా సంభాషణలలోనూ, సాత్త్వికాభినయాలలోనూ సూచించటం తిక్కన నైజం. భీముడి మనస్సులో పగసాధించాలనే క్రోధం ఉన్నది. అది గూఢంగా ఉన్నది. ప్రతీకారానికి అవకాశం లేకపోవటం చేత గుండెలోని నిప్పువలె అది అతడి హృదయాన్ని చింతతో దహించి వేస్తున్నది. ఇప్పుడు ద్రౌపది ప్రతీకారానికి తగిన కార్య సంఘటన చేసింది. చింత తొలగిపోయి వీరరసోచితమైన ఉత్సాహమనే స్థాయిభావం ప్రబుద్ధమయింది. అసాధ్యమైన కార్యాన్ని అద్భుతంగా నిర్వహించే భావం ఉత్సాహం. ద్రౌపది సంఘటించిన కార్యానికి ఆ రెండు లక్షణాలూ ఉన్నాయి. సింహబలుడిని అజ్ఞాతవాసనియమ భంగం కాకుండా రహస్యంగా సంహరించాలి. ఇది వీరరసకార్యం. దాని నిర్వహణం వలన ధర్మరాజు హృదయంలో అద్భుతం జనిస్తుంది. జన్యజనకరసాభ్యుదయ భావస్థితి ఇందులో గమ్యం. కీచకవధ కార్యనిర్వహణంలో ఉన్న సంశ్లిష్టత వ్యంగ్యం.

3. "ధర్మాత్మజుఁ డిచ్చ మెచ్చఁ బగ సాధింపంగఁ గాన్పల్పమే?" అనే వాక్యంలో కాకుధ్వని ఉన్నది. ఆశ్చర్యార్థకంలో పలికితే= సామాన్యమా? కాదని భావం. ఏవార్థకంలో పలికితే - చాల తేలికే అని భావం. ఇది ఎంత తేలికో అంత కష్టం అన్నట్లుంటుంది. (సంపా.)

**వ. అని పలికి కొండొక విచారించి. 276**

**తాత్పర్యం:** అని మాట్లాడి కొంతసేపు ఆలోచించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'వెఱవక సంకేతించిన । తెఱఁగున నయ్యెడకు నరుగుదెంచునొకో! కొం**
**దఱఁ దెచ్చునొకో! వెడఁగై । యఱిముఱి వెలిపుచ్చునొకొ రహస్యం బెల్లన్! 277**

**ప్రతిపదార్థం:** వెఱవక= భయపడక; సంకేతించిన తెఱఁగునన్= గుర్తు చెప్పిన విధంగా; ఆ+ఎడకున్= అక్కడకు; అరుగుదెంచునొకో!= వస్తాడా?; కొందఱన్= కొందరిని; తెచ్చునొకో?= వెంటతీసికొని వస్తాడా?; వెడఁగు+ఐ= వెర్రివాడై; అఱిముఱిన్= తొందరపాటుతో; రహస్యంబు+ఎల్లన్= రహస్యమంతా; వెలిపుచ్చునొకొ!= బయటపెట్టుతాడా!.

**తాత్పర్యం:** భయపడకుండా (అనుమానం లేకుండా) నీవు గుర్తు చెప్పినచోటికి వస్తాడా? లేక మరికొందరిని సహాయంగా తీసికొని వస్తాడా? తొందరపాటువలన మూఢుడై రహస్యాన్నంతా బట్టబయలు చేస్తాడా?

**విశేషం:** కీచకుడు మోసపోయాడా? లేక తాము మోసపోయామా? అనేది భీముడి భయం, తనమీద అనవసరమైన నెపం వస్తుంది. అందుకే సంశయనివారణకొరకు అడుగుతున్నాడు.

**ఉ. అట్టిద యేల చేయు? ననయంబు నయం బొడఁగూడఁ బల్కి నీ**
**విట్టి తెఱంగు సేయుమని యేర్పడఁ జెప్పిన దాని కత్తఱిం**
**బుట్టిన సంతసంబు ననువుం బరికించితికాదె! యింక ని**
**ట్ట ట్టనఁ డెట్టులైన హృదయంబున నెక్కడి శంక వానికిన్. 278**

**ప్రతిపదార్థం:** అట్టిది+అ ఏల చేయున్?= అట్లా ఎందుకు చేస్తాడు? అనయంబున్= మిక్కిలి; నయంబు+ఒడన్+కూడన్= ప్రియం కలిగేటట్లు; పల్కి= మాట్లాడి; నీవు+ఇట్టి తెఱంగు+చేయుము+అని= నీవిటువంటిరీతి చేయుమని; ఏర్పడన్+చెప్పిన దానికిన్= తెలిసేటట్లు చెప్పినదాని వలన; ఆ+తఱిన్= అప్పుడు; పుట్టిన సంతసంబు= కలిగిన సంతోషం; అనువున్= రీతి, విధం; పరికించితి(వి)కాదె!= చూచావుగదా!; ఇంకన్+ఇట్టు+అట్టు+అనఁడు= ఇక ఇటనీ అటనీ ఊగిసలాడడు; ఎట్టులు+ఐనన్= ఎట్లాగైనా; హృదయంబునన్= మనస్సులో; వానికిన్= కీచకునకు; ఎక్కడి శంక?= అనుమాన మెక్కడిది?

**తాత్పర్యం:** అయినా కీచకు డట్లా ఎందుకు చేస్తాడులే! నీవు ప్రీతిగా మాట్లాడి, 'నీ వట్లా చేయు'మని స్పష్టంగా చెప్పినప్పుడు వాడికి కలిగిన సంతోషపు రీతి చూచావుగదా! ఇక ఎటూ పోలేడు, ఏమీ అనలేడు. వాడి మనసులో అనుమానానికి తావెక్కడ ఉంటుంది?

**విశేషం:** 1. ఆడది బొంకితే గోడపెట్టినట్లు ఉంటుంది. మాయాంధకారం వంటి మోహపు వాగురలో చిక్కిన మృగం కీచకుడు. వాడికి ఇంగితజ్ఞానం శూన్యం. అందుకే భీముడు ధైర్యంగా ఉన్నాడు. 2. పుట్టిన, సంతసంబు+అనువున్= కలిగిన సంతోషం యొక్క విధము- అని షష్ఠీసమాసం - ఉకారానికి అచ్చుపదం కాగా నుగాగమం అయి సంతసంబుననువు అయింది. సంతోషించిన విధము - అని అర్థం.

**ఉ. వచ్చు, మదాంధవృత్తి ననివారణ నొక్కఁడ నాట్యశాలకుం**
**జొచ్చు, నవశ్యమున్ వెదకి చూచి ననుం గని యప్డు సంగరం**

**బిచ్చు, మదీయ బాహుబల హీనబలుండయి నీకుఁబ్రీతిగాఁ**

**జచ్చు. నసంశయం బిది; విచారము లన్నియు నింక నేటికిన్?'** **279**

**ప్రతిపదార్థం:** వచ్చున్= తప్పకుండా వస్తాడు; మద+అంధవృత్తిన్= కన్నుగానని గర్వంతో; అనివారణన్= అడ్డు లేకుండా; నాట్యశాలకున్= నర్తనశాలకు; ఒక్కఁడు+అ= ఒంటరిగా; చొచ్చున్= ప్రవేశిస్తాడు; అవశ్యమున్= తప్పకుండా; వెదకి చూచి= వెదకిచూచి; ననున్+కని= నన్ను చూచి; అప్డు= అప్పుడే; సంగరంబు+ఇచ్చున్= యుద్ధం చేస్తాడు; మదీయబాహుబల= నా భుజబలంచేత; హీనలుండు+అయి= క్షీణించిన బలంకలవాడయి; నీకున్= నీకు (ద్రౌపదికి); ప్రీతికాన్+చచ్చున్= సంతోషం కలిగేటట్లు చస్తాడు; ఇది= ఇది; అసంశయంబు= అనుమానం లేనిమాట; విచారములు= ఆలోచనలు; అన్నియున్= అన్నీ; ఇంకన్+ఏటికిన్?= ఇంక దేనికి?

**తాత్పర్యం:** కీచకుడు తప్పక వస్తాడు. కన్నుగానని మోహాంధకారంతో నిరభ్యంతరంగా నర్తనశాలలో ఒంటరిగానే ప్రవేశిస్తాడు. తప్పకుండా వెదకి నన్ను చూచి యుద్ధం చేస్తాడు. నా బాహుబలంముందు తన బలాన్ని కోల్పోయి నీకు ప్రీతి కలిగేటట్లు చస్తాడు. ఇందుకు అనుమానం లేదు. ఇంకా నీవు పలురకాలుగా ఆలోచించి విచారించ నవసరం లేదు.'

**విశేషం:** జరగబోయేది యథాతథంగా భీము డూహిస్తున్నాడు.

**వ. అని నిశ్చయించి వృకోదరుండు వెండియు నిట్లనియె.** **280**

**తాత్పర్యం:** అని పలికి, తానన్న మాటలు తప్పక జరిగేవని నిర్ధారణ చేసి భీముడు మళ్ళీ ఇట్లా అన్నాడు.

**మ. 'బలియుం డా సొబగుండు భావభవదర్పభ్రాంతుఁడై వచ్చి ని**

**శ్చల సర్వాంగత నున్న న న్నరసి నీ చందంబు గాకున్న నా**

**కులతం బొందెడు, నప్డు మండపము సంక్షోభింపఁగా నేతుఁ గ**

**ట్టలుకన్ బెబ్బులిఁ గోలవ్రేచినటు లుగ్రాకార మేపారఁగన్.** **281**

**ప్రతిపదార్థం:** బలియుండు= బలిష్టుడైన; ఆ సొబగుండు= ఆ విటుడు; భావభవదర్ప భ్రాంతుఁడు+ఐ= మన్మథగర్వంతో చలితుడై; వచ్చి; నిశ్చల= చలనం లేని; సర్వాంగతన్+ఉన్న= అన్ని అంగాలు కలవాడనై ఉండగా; నన్నున్+అరసి= నన్ను (భీముడిని) చూచి; నీ చందంబు+కాక+ఉన్న= నీవలె ఉండకపోవటంతో; ఆకులతన్+పొందెడున్= కలతపడతాడు; అప్డు= అప్పుడు; మండపము= నర్తనశాల మండపం; సంక్షోభింపఁగాన్= చలించేటట్లు; కడు+అలుకన్= మిక్కిలి కోపంతో; కోలన్= పెద్ద కఱ్ఱతో; బెబ్బులిన్= పెద్దపులిని; వ్రేచిన+అటులు= కొట్టినట్లు; ఉగ్ర+ఆకారము= మిక్కిలి కోపంతోడి భయంకరమైన రూపం; ఏపారఁగన్= అతిశయించగా; ఏతున్= బాధిస్తాను.

**తాత్పర్యం:** ఆ కీచకుడు మదనావేశంతో వచ్చి నిశ్చలంగా ఉండే నన్ను తడవిచూచి, నీవు కాకపోవటం తెలిసికొని కలత చెందుతాడు. అపుడు నేను కఱ్ఱతో కొట్టిన పెద్దపులి వలె తీవ్ర కోపంతో కూడిన భయంకర రూపంతో ఆ మండపమంతా సంక్షోభించేటట్లు విజృంభించి బాధిస్తాను.

**విశేషం:** అలం: ఉపమ. కీచకుడు భీముడిని తాకటం కోలతో కొట్టటంతోను, భీముడు - దానికి ప్రతిక్రియగా పెనుకోపంతో లేస్తున్న బెబ్బులితోనూ పోల్చబడ్డారు. బలియుడు, సొబగుడు అనే మాటలు కీచకుడిని వెక్కిరిస్తూ భీము డుపయోగించినవి. మొనగాడు, సోగ్గాడు అనే గ్రామ్యాలకు సమానమైనవి. భావభవదర్పభ్రాంతుడై - అనే సమాసానికి శ్లేషార్థం చెప్పుకొనవచ్చును. భావమునుండి పుట్టిన గర్వం వలన కలిగిన మోహంతో - అని ఒక అర్థం. మన్మథ సంబంధమైన గర్వం వలన కలిగిన మోహంతో అని రెండో అర్థం చెప్పవచ్చును. (సంపా.)

**క. ఎఱిఁగి పిఱుసనిన వెసఁ బై। కుఱుకుదు సాళువము గాకి నొడిసిన భంగిన్**
**వెఱచఱవం బొదువుదుఁ బఱి। పఱిసేయుదు నీదు పూన్కి పారం బెయిదన్. 282**

**ప్రతిపదార్థం:** ఎఱిఁగి= (అసలు సంగతి) తెలిసికొని; పిఱు+చనినన్= వెనుకాడితే; వెసన్= వెంటనే; సాళువము= డేగ; కాకిన్= కాకిని; ఒడిసిన భంగిన్= ఒడుపుగా పట్టుకొన్నట్లు; పైకిన్+ఉఱుకుదున్= పైకి దూకుతాను; వెఱ, చఱవన్= భయం వ్యాపించేటట్లు; పొదువుదున్= ఆక్రమించి పట్టుకొంటాను; నీదుపూన్కి= ద్రౌపది ప్రయత్నం (కోర్కె); పారంబు+ఎయిదన్= తుదముట్టగా; పఱిపరి+చేయుదున్= పీడిస్తాను.

**తాత్పర్యం:** కీచకుడు నన్ను గుర్తించి వెనుకడుగు వేస్తే వాడిమీది కెగబడి డేగ కాకిని ఒడిచిపట్టుకొన్నట్లుగా వాడిని పట్టుకొంటాను. నీ కసి తీరేటట్లు వాడిని పీడించి నుగ్గునుగ్గు చేస్తాను.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. నాదు బాహుబలమునకు మాఱుకొనఁజాలు। భుజబలంబుగలిగి పోక చిక్కఁ**
**బెనఁగి నన్నుఁ గొంత కినియింప నోపెడు। చందమైన వినుము సరసిజాక్షి! 283**

**ప్రతిపదార్థం:** సరసిజ+అక్షి!= పద్మాక్షీ-ద్రౌపదీ!; నాదు బాహు బలమునకున్= నాయొక్క (భీముడి) భుజశక్తికి; మాఱుకొనన్+చాలు= ఎదుర్కొనే సమర్థమైన; భుజబలంబు+కలిగి= భుజశక్తి కలిగి; పోక= పారిపోవక; చిక్కన్+పెనఁగి= గట్టిగా పెనగులాడి; నన్నున్= నన్ను (భీముడిని); కొంత= కొంచెం; కినియింపన్+ఓపెడు= కోపింపజేసే; చందము+ఐనన్= విధమైతే; వినుము.

**తాత్పర్యం:** ద్రౌపదీ! కీచకుడు నాతో యుద్ధం చేయగల శక్తిగలవాడై, వెనుకాడక ఎదిరించి గట్టిగా పెనగులాడి నన్ను కోపింపజేస్తే ఏమవుతుందో వినుము.

**విశేషం:** జరుగబోయే ప్రతివ్యూహం ఎట్లా ఉంటుందో ముందుగా చెప్పుతున్నాడు. చదరంగంలో పావులు కదిలించి రాజుయొక్క ఆట కట్టించటంవంటిదే ఎదుటివాడి బలాన్ని అంచనా వేయటం. భీముడు ద్రౌపదికి నమ్మకం కలిగించటానికే ఈ మాటలు అంటున్నాడు.

**మ. అవనీచక్రము సంచలింపఁగ, దివం బల్లాడ, నాశాచయం**
**బవధూతంబుగ, గోత్రశైలనికరం బాకంపముం బొంద, న**
**ర్ణవముల్ ఘూర్ణనమొందఁ, గ్రోధము గృతార్థత్వంబు నొందించి, చి**
**త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపుదున్.' 284**

**ప్రతిపదార్థం:** అవనీచక్రము= చక్రమువంటి భూమి; సంచలింపఁగన్= మిగుల కదిలేటట్లు; దివంబు= ఆకాశం; అల్లాడన్= దద్దరిల్లగా; ఆశాచయంబు= దిక్కుల సముదాయం; అవధూతంబుగన్= కొట్టుకొనిపోయే రీతిగా; గోత్రశైల; నికరంబు= కులపర్వతాల

సమూహం; ఆకంపమున్+పొందన్= బాగా వణకగా; అర్ణవముల్= సముద్రాలు; ఘూర్ణనము+ఒందన్= తిరుగుడుపడి కలత చెందగా; క్రోధము= కోపం; కృతార్థత్వంబున్+ఒందించి= సఫలమయ్యేటట్లు; చిత్రవధ ప్రౌఢిన్= చిత్రహింస చేసే నేర్పరితనంతో; సూతునకున్= కీచకుడికి; రౌద్రంబు= రుద్రభావం, రౌద్ర రసస్ఫూర్తితో కూడిన క్రౌర్యం; ఏర్పడన్= స్పష్టంగా; చూపుదున్= చూపిస్తాను.

**తాత్పర్యం:** భూ మండలం కంపించగా, ఆకాశం అల్లల్లాడగా, దిక్కులు పిక్కటిల్లగా, కుల పర్వతాలు వణకగా; సముద్రాలు కల్లోలితం కాగా; నా క్రోధం సఫలమయ్యేటట్లు చిత్రవధ చేసే నేర్పరితనాన్ని ప్రదర్శించి, నా రౌద్రరూపాన్ని ఆ కీచకుడికి ప్రత్యక్షం చేస్తాను.

**విశేషం:** అలం: అతిశయోక్తి, క్రోధము కృతార్థత్వం పొందటమంటే రౌద్రంగా మారటం, ఎదుటివారికి ప్రాణహాని, కరుణం కలిగించటం. రౌద్రం అంటే రుద్రభావం, రుద్రుడు కోపిస్తే జగత్ప్రళయం సంభవించటం కవిసమయం. దానిని తాను తన రౌద్రం వలన కల్పించి కీచకుడికి ప్రళయాన్ని సృష్టిస్తానని రౌద్రోద్రేకంతో భీముడు పలికాడు. (సంపా.)

**వ. అనినం బాంచాలి సంచలితస్వాంతయై, నిజాంతర్గతంబున 'నితని తీవ్రక్రోధంబు గుప్తసాధనంబునకు బాధకంబగు' నని బోధింపం దలంచి యిట్లనియె. 285**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; పాంచాలి= ద్రౌపది; సంచలితస్వాంత+ఐ= చలించిన మనస్సు గలదై; నిజ+అంతర్గతంబునన్=తన మనస్సులో; ఇతని= భీముడియొక్క; తీవ్రక్రోధంబు= అధికమైన కోపం; గుప్తసాధనంబునకున్= అజ్ఞాతవాస రహస్యస్థితికి; బాధకంబు+అగున్+అని= భంగకరమవుతుందని; బోధింపన్+తలఁచి= చెప్పాలి అనుకొని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** భీము డిట్లా మాట్లాడేసరికి ద్రౌపది మనసులో ఉలిక్కిపడింది. భీముడి తీవ్రకోపావేశం తమ అజ్ఞాతవాసానికి భంగకరమవుతుందని ఆయనకు తెలిసేటట్లు చెప్పాలని ఇట్లా అన్నది.

**ఉ. 'ఒవ్వనివారు నవ్వ, మహిమోదధి ధర్మసుతుండు దీనికిన్**
**నెవ్వగఁబొంద, భూజనులు నింద యొనర్పఁగ నే నొనర్చు నీ**
**చివ్వకు నీవు నల్కమెయిఁ జేసెన యాపని గూఢవృత్తికిన్**
**దవ్వగునేని నా యభిమతం బొడఁ గూడియు నిష్ఫలంబగున్ 286**

**ప్రతిపదార్థం:** ఒవ్వనివారు= శత్రువులు; నవ్వన్= నవ్వేటట్లు; మహిమ+ఉదధి= గొప్పతనంలో సముద్రుడి వంటివాడు; ధర్మసుతుండు= ధర్మరాజు; దీనికిన్= ఈ పనికి; నెఱ+వగన్+పొందన్= ఎంతో బాధపడేటట్లు; భూజనులు= లోకులు; నింద+ఒనర్పఁగన్= తిట్టేటట్లు; నేను+ఒనర్చు= నేను చేసే; ఈ చివ్వకున్= ఈ తగాదాకు; నీవు అల్కమెయిన్+చేసిన= నీవు కోపంతో చేసినట్లైతే; ఆ పని= ఆ విధంగా రౌద్రాన్ని లోక ప్రళయంగా ప్రదర్శించడం; గూఢవృత్తికిన్= రహస్య వర్తనానికి; దవ్వు+అగునేని= దూరమైతే; నా అభిమతంబు= నా కోరిక; ఒడఁగూడియున్= నెరవేరికూడా; నిష్ఫలంబు+అగున్= నిష్ప్రయోజనం ఔతుంది.

**తాత్పర్యం:** 'మనమంటే పడనివారంతా నవ్వేటట్లు, ధర్మరాజుకు అధిక దుఃఖం కలిగేటట్లు, లోకనింద సంభవించేటట్లు, ఈ కలహంలో నీవు పెనుకోపంతో రహస్యం చెడగొడితే నా కోర్కె తీరినా చివరకు ఫలితం శూన్యమే ఔతుంది.

**విశేషం:** అజ్ఞాతవాసం భీముడి రౌద్రోద్రేకం వలన భగ్నం కాకూడదనీ, అంతటి రౌద్రంతో సాధించే కార్యం కూడా గుట్టుగా సాగాలనీ ద్రౌపది హెచ్చరించింది.

**క. కావున వంచన బాహిర। పోవక యుండంగ మన రిపుం బరిమార్పం**
**గావచ్చునేని నట్టిద। నా వల; పటుగాక తక్కినను వలదు సుమీ!' 287**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; వంచన= మోసం; బాహిరపోవక+ఉండంగన్= బయల్పడకుండా; మన రిపున్= మన శత్రువును; పరిమార్పంగాన్ వచ్చునేనిన్= చంపటానికి వీలైతే; అట్టిది+అ= అట్లాంటిదే; నా వలపు= నా అభిమతం; అటు+కాక తక్కినను= అట్లా కాకపోతే; వలదు సుమీ!= ఈ యత్నం వద్దు సుమా!

**తాత్పర్యం:** మన అజ్ఞాతవాసం బహిరంగం కాకుండా మన శత్రువును చంపగలగాలి. అదే నా అభిమతం, అట్లా కాకపోతే ఈ ప్రయత్నమే వద్దు.'

**వ. అనిన విని ద్రుపదనందనకుం బాండునందనుం డిట్లనియె. 288**

**తాత్పర్యం:** ఆ మాటలు విని ద్రౌపదితో భీము డిట్లా అన్నాడు.

**చ. 'మదమునఁ గీచకాగ్రజుఁడు మార్కొని నిల్చిన వీఁక మైమెయిం**
**గదిసితి మేని నప్పుడు ప్రకాశరహస్యవిభేదబుద్ధి నా**
**కొదవునె? యైన నేఁ దలఁచి యోపినభంగి నిగూఢవృత్తిమైఁ**
**బదిలము గల్గి తిన్నని యుపాయమునం దెగఁజూతు నాతనిన్.' 289**

**ప్రతిపదార్థం:** కీచక+అగ్రజుఁడు= కీచకుల అన్న అయిన సింహబలుడు; మదమునన్= గర్వంతో; మార్కొని నిల్చినన్= ఎదిరించి నిలబడితే; వీఁకన్= పరాక్రమంతో; మై మెయిన్= అనాయాసంగా; కదిసితిమి+ఏనిన్= కలియబడితే; అప్పుడు= ఆ సమయంలో; ప్రకాశ, రహస్య విభేదబుద్ధి= ప్రకాశానికీ, రహస్యానికీ కల తేడాను పాటించే తెలివి; నాకున్+ఒదవునె?= నాకు కలుగుతుందా?; ఐనన్= ఐనా; నేన్+తలఁచి= నేను ఆలోచించి; ఓపినభంగిన్= నా శక్తికొద్దీ; నిగూఢవృత్తిమైన్= రహస్యమైన పద్ధతిలో; పదిలము, కల్గి= జాగ్రత్తతో; తిన్నని+ఉపాయమునన్= సవ్యమైన ఉపాయంతో; అతనిన్= కీచకుడిని; తెగన్+చూతున్= చంప యత్నిస్తాను.

**తాత్పర్యం:** 'కీచకుడు మదించి ఎదిరించి నిలబడితే, అపుడు పరాక్రమించి అనాయాసంగా కలియబడితే, ఇది రహస్యంగా చేయాలి. ఇది ప్రకాశంగా చేయాలి - అనే విచక్షణ ఆ సమయంలో నా కెట్లా ఉంటుంది? అయినా, నీవు చెప్పిన విషయం మనసులో ఉంచుకొని ఓపినంతవరకు రహస్య పద్ధతిని భద్రంగా కాపాడుతూ తగిన ఉపాయంతో కీచకుడిని చంప యత్నిస్తాను.'

**విశేషం:** ద్రౌపది హెచ్చరిక భీముడి ఆవేశప్రవృత్తిలో కూడా మరచిపోలేని ఒక జాగ్రత్తను కలిగించింది. ఉపాయం సిద్ధించినా అపాయం కలుగకుండా వారించే ప్రయత్నం చేస్తేనే ఫలసిద్ధి కలిగేది. కార్యసాధనలో దేహశక్తి కంటె బుద్ధికుశలత ముఖ్యం.(సంపా.)

**క. అనవుడు 'జయలక్ష్మిం జే। కొను' మని దీవించి, 'యింతకుం గేకయ నం**
**దన నన్నుఁ దడవుఁ' దడయం। జన దియ్యెడ'నని లతాంగి చనియెం బ్రీతిన్. 290**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; జయలక్ష్మిన్= విజయమనే సంపదను; చేకొనుము+అని= పొందుమని; దీవించి= ఆశీర్వదించి; ఇంతకున్= ఇప్పటికే; కేకయనందన= సుదేష్ణ; నన్నున్= నన్ను; తడవున్= వెదకుతూ ఉంటుంది; ఈ+ఎడన్= ఇక్కడ;

తడయన్+చనదు= ఆలస్యం చేయడం మంచిది కాదు; అని= అని పలికి; లతాంగి= తీగవంటి శరీరంగల ద్రౌపది; ప్రీతిన్+చనియెన్= సంతృప్తితో వెళ్లింది.

**తాత్పర్యం:** ఆ మాటలు విని 'జయలక్ష్మిని పొందు' మని భీముడికి ద్రౌపది శుభాకాంక్షలు తెలిపింది. 'ఇప్పటికే సుదేష్ణ నాకొరకు వెదకుతూ ఉంటుంది. ఇక్కడ ఇంకా ఆలస్యం చేయటం మంచిది కాదు' అని అంటూ ద్రౌపది సంతృప్తితో వెళ్ళిపోయింది.

**విశేషం:** యుద్ధానికి వెళ్ళే భర్తలను వీరవనితలు 'విజయోఽస్తు' అని దీవిస్తారు కాని పాదాభివందనాలు చేయరు. అది యుద్ధ మర్యాద. విజయం తథ్యమని నిశ్చయం ఏర్పడిన తర్వాత ద్రౌపది హృదయంలో ఒక సంతృప్తి ఏర్పడింది. భార్య దీవెన భర్తకు విజయ సూచన! (సంపా.)

**వ. మారుతసుతుండును గృతనిశ్చయుండై యుండె; నటఁ గీచకుండు కందర్పదర్పగోచరుండై పరిజనంబుల వంచించి యేకాంతస్థలంబున. 291**

**ప్రతిపదార్థం:** మారుత సుతుండును= వాయుతనయుడు భీముడు కూడా; కృతనిశ్చయుండు+ఐ= కార్యం సాధించాలి అని చేయబడిన నిర్ణయంకలవాడై, (మనసులో గట్టిగా సంకల్పించుకొని అని భావం); ఉండెన్= ఉన్నాడు; అటన్= అక్కడ; కీచకుండు; కందర్ప, దర్ప, గోచరుండు+ఐ= మన్మథుడి గర్వానికి (మదనతాపానికి) గురి అయినవాడై; పరిజనంబులన్= పరివారాలను; వంచించి= కంటబడకుండా; ఏకాంత స్థలంబునన్= ఒంటరి ప్రదేశంలో.

**తాత్పర్యం:** ఇక్కడ భీముడు కూడా స్థిరనిశ్చయంతో ఉన్నాడు. అక్కడ కీచకుడు మదనతాపానికి గురిఅయి సేవకుల కళ్ళు గప్పి ఒంటరి ప్రదేశానికి చేరి (తరువాతి పద్యంతో అన్వయం.)

కీచకుఁడు ద్రౌపదియందలి మోహంబునఁ బరితాపంబు నొందుట

(ఇది మూలమునందు లేదు)

**సీ. వామాక్షి రుచిర లావణ్యంబు భావించుఁ। దన్వంగి రూపు చిత్తమున నిలుపుఁ,**
**గంబుకంధరచెన్నుకైవడి తలపోయు । నంగన సౌకుమార్యముఁ దలంచు,**
**భామిని సహజ విభ్రమ మెదఁ గీలించుఁ। బడఁతి చెయ్వులు మదిఁ బట్టుకొలుపు,**
**మానిని గరువంపు మాటపొం దూహించు। దళితాబ్జముఖి తిన్నఁదనము మెచ్చు,**

**తే. నడరి కోర్కులు చిఱ్ఱుముఱ్ఱాడ వెడఁగు। పడిన యుల్లంబు పట్టునఁ బఱుపఁ దనకు**
**వశముగాకున్న నెంతయు వంతఁబొందుఁ।, జింత యెసకంబు వడిగొని చిక్కువఱుప. 292**

**ప్రతిపదార్థం:** వామాక్షి= అందమైన కన్నులుగల ద్రౌపదియొక్క; రుచిరలావణ్యంబు= కాంతిమంతమైన మేని నిగనిగను; భావించున్= మరల మరల తలుస్తాడు; తన్వంగిరూపు= సన్నని మేనుగల ద్రౌపది ఆకారాన్ని; చిత్తమునన్+నిలుపు= మనస్సులో పదిల పరచుకొంటాడు; కంబుకంధర= శంఖంవంటి కంఠం కల ద్రౌపదియొక్క; చెన్నుకైవడి= అందాల తీరును; తలపోయున్= ఆలోచిస్తాడు; అంగన= అందమైన ద్రౌపది యొక్క; అంగన= ఆ స్త్రీయొక్క; సౌకుమార్యమున్= కోమలత్వమును; తలంచున్= భావిస్తాడు, స్మరిస్తాడు; భామిని= ఆ మగువయొక్క; సహజ విభ్రమము= సహజమైన విలాసాన్ని; ఎదన్+కీలించున్= మనస్సుతో హత్తుకొంటాడు; పడఁతి= యువతి అయిన ద్రౌపదియొక్క; చెయ్వులు= చేష్టలు; మదిన్= మనస్సులో; పట్టుకొలుపున్=

నిలుపుకొంటాడు; మానిని= అభిమానవతి అయిన ద్రౌపది యొక్క; గరువము+మాటపొందు= గడుసరి మాటల పొందిక; ఊహించున్= భావిస్తాడు; దళిత+అబ్జముఖి= వికసించిన పద్మంవంటి ముఖం కల ద్రౌపది యొక్క; తిన్నఁదనమున్= చక్కదనాన్ని; మెచ్చున్= మెచ్చుకొంటాడు; అడరి= అతిశయించి; కోర్కులు= ఆశలు; చిఱ్ఱుముఱ్ఱు+ఆడన్= తొందరపెట్టగా; వెడఁగు పడిన= కలత పడిన; ఉల్లంబు= మనస్సును; పట్టునన్+పఱుపన్= కుదుటపరచుకొనటానికి; తనకున్= కీచకుడికి; వశము+కాక+ఉన్నన్= సాధ్యపడకపోవటం వలన; ఎంతయున్= మిక్కిలి; చింత= విచారం; ఎసకంబు= అధికమై; వడిగొని= త్వరపడి; చిక్కు+పఱుపన్= చిరాకు పెట్టగా; వంతన్+పొందున్= బాధపడతాడు.

**తాత్పర్యం:** కీచకుడు అందమైన కన్నులుగల ద్రౌపది మేని నిగనిగలను మరీ మరీ తలంచేవాడు. సన్నని ఆమె అందమైన రూపాన్ని మనసులో నిలుపుకొనేవాడు. శంఖం వంటి కంఠం గల ఆమె అందాల తీరును మనసులో తలపోసేవాడు. అందమైన శరీరంగల ఆమె కోమలత్వాన్ని భావించేవాడు. ఒయ్యారి అయిన ఆమె శరీర విలాసాలను మనసుకు హత్తుకొనేవాడు. ప్రౌఢురాలైన ద్రౌపది చేష్టలను హృదయంలో గట్టిగా నిలుపుకొనేవాడు; అభిమానవతి అయిన ఆమె గడుసరి మాటల పొందికలోని (అంతరార్థాలను) ఊహించేవాడు. వికసించిన పద్మం వలె ఉన్న ఆమె ముఖంలోని చక్కదనాన్ని ప్రశంసించేవాడు. ఈ విధంగా కోర్కెలు అతిశయించి తొందరపెట్టగా (సందడించగా) కలతపడిన మనస్సును కుదుటపరచుకొనలేకపోవటంతో చింత పెచ్చుపెరగగా వ్యాకులపడుతూ ఎంతో విరహబాధ పొందాడు.

**విశేషం:** అమూలకంగా వర్ణించిన కీచకుడి విరహ వర్ణన తెలుగు సాహిత్యంలోనే ఒక శృంగార నాయకుడి దశవిధ కామావస్థల ఆలంకారిక వర్ణనకు దారులు వేసింది. నాయిక అంగీకారం తెలిపింది. 'అభిలాష' ఫలసిద్ధి కొరకు అఱ్ఱులు చాస్తున్నది. అభిలాష దశవిధ కామావస్థలలో మొదటిది. **"వ్యవసాయా త్సమారబ్ధః సంకల్పేచ్ఛా సముద్భవః। సమాగమో పాయకృతః సోఽభిలాషః ప్రకీర్తితః॥"** 'నాట్యశాస్త్రమ్. 12-173. తాను కామించిన యువతిని గురించిన పర్యాలోచనతో కూడిన జ్ఞానంతో ప్రారంభమై, సంకల్పపూర్వకమైన ఇచ్ఛచేత ఉద్రిక్తమై, సమాగమోపాయాన్ని అన్వేషించటం వరకు సాగే మానసికావస్థ అభిలాష. తిక్కన ఈ అవస్థను సమగ్రంగా వర్ణించాడు ఈ ఘట్టంలో.

ఈ పద్యంలో సైరంధ్రి రూపవైభవాన్ని కీచకుడు దర్శించి మనస్సులో పర్యాలోచనం చేస్తున్న దశ వ్యక్తమౌతున్నది. ఇవి మూడంచెలుగా చెప్పబడుతున్నాయి. అవి: రూపం-గుణం-పర్యాలోచన విధానం. వాటి వర్ణన విధానం.

1. రూపం - వామాక్షి ; గుణం - లావణ్యం ; పర్యాలోచనం - భావించడం.
2. రూపం - తన్వంగి ; గుణం - రూపు ; పర్యాలోచనం - చిత్తమున నిలపటం.
3. రూపం - కంబుకంధర ; గుణం - చెన్నుకైవడి ; పర్యాలోచనం - తలపోయటం.
4. రూపం - అంగన ; గుణం - సౌకుమార్యం ; పర్యాలోచనం - తలంచటం.
5. రూపం - భామిని ; గుణం - సహజవిభ్రమం ; పర్యాలోచనం - ఎదఁగీలించటం.
6. రూపం - పడతి ; గుణం - చెయ్వులు ; పర్యాలోచనం - మదిఁ బట్టుకొలుపటం.
7. రూపం - మానిని ; గుణం - గరువంపు మాటల పొందు ; పర్యాలోచనం - ఊహించటం.
8. రూపం - దళితాబ్జముఖి ; గుణం - తిన్నదనం ; పర్యాలోచనం - మెచ్చుకొనటం.

అష్టవిధ రూపగుణ పర్యాలోచనల వలన మనసులో సందడించే కోర్కెలను కీచకుఁడు నిలువరించుకొనలేకపోవటం అభిలాషలో ఇచ్ఛ అనే అంతర్దశ. చింత పెచ్చుపెరగటం వలన వ్యాకులపడటం ఉత్కంఠ అనే అంతర్దశ. ఎంతో వంత పొందటం సంకల్పదశలోని భాగం. తిక్కన కీచకుడి విరహవర్ణనం ఎంత రసోద్విగ్నమో, అంత శాస్త్రోక్తంగా ఉండటం విశేషం. (సంపా.)

చ. **తలరు, నలందురున్, నవయుఁ, దాపభరంబున వెచ్చనూర్చు, మే**
**నలయఁగ నొల్లఁబోవు, వెగడందుఁ, గలంగుఁ, బరిభ్రమించుఁ, గొం**
**దలపడుఁ, దల్లడం బడరి ధైర్యము దూలిన బెగ్గడిల్లు, వి**
**చ్చలవిడిఁ బేర్చు, నెవ్వగల సందడి డెందము గంది చేడ్పడున్.** 293

**ప్రతిపదార్థం:** తలరున్= తొందరపడతాడు; అలందురున్= దుఃఖిస్తాడు; నవయున్= కృశిస్తాడు; తాపభరంబునన్= మన్మథ సంబంధమైన తాపాధిక్యంతో; వెచ్చన్+ఊర్చున్= వేడినిట్టూర్పులు విడుస్తుంటాడు; మేన్+అలయఁగన్= శరీరం అలసిపోతే; ఒల్లన్+పోవున్= మూర్ఛపోతాడు; వెగడు+అందున్= భయపడతాడు; కలంగున్= కలత పడతాడు; పరిభ్రమించున్= తిరుగుతాడు; కొందలపడున్= సంక్షోభాన్ని ప్రకటిస్తాడు; తల్లడంబు= కలత; అడరి= ఎక్కువై; ధైర్యము+తూలినన్= ధైర్యం నశించగా; బెగ్గడిల్లున్= భయపడతాడు; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; పేర్చున్= రేగిపోతాడు; నెఱ+వగల సందడిన్= మదనతాపం వలని బాధలు ఎక్కువకాగా; డెందము, కంది= మనస్సు బాధపడి తపించి; చేడ్పడున్= బాధతో చలించిపోతాడు.

**తాత్పర్యం:** కీచకుడు సైరంధ్రితోడి విరహవేదనలో వివిధ మదన వికారాలను ప్రకటించాడు. త్వరపడతాడు, దుఃఖిస్తాడు, కృశిస్తాడు, మన్మథతాపంతో నిట్టూరుస్తాడు, శరీరం అలసిపోతే మూర్ఛపోతాడు, భయపడతాడు, కలతపడతాడు, అటూ ఇటూ తిరుగాడుతాడు, క్షోభిస్తాడు, గుండెదడ ఎక్కువై భయపడతాడు, కట్టడ లేకుండా రెచ్చిపోతాడు, విరహతాపం వలన మనస్సు బాధపడి కంపించిపోతాడు.

**విశేషం:** విరహ వేదన అధికమైనప్పుడు కాముకుడు ప్రదర్శించే చేష్ట లివి. ఇవి మానసిక వికారాలకు వ్యంజకాలు. ఇన్ని భావాలకు, అవస్థలకు సంబంధించిన పరిభాషాపదాలను చాలావరకు తెలుగు పదాలలో చెప్పి తిక్కన అర్థవ్యక్తిని ప్రదర్శించటం తెలుగు భాషాశక్తిని ప్రవచించటం. (సంపా.)

వ. **ఇవ్విధంబున మదనవేదనా దూయమాన మానసుం డగుచు నిట్లని వితర్కించు.** 294

**ప్రతిపదార్థం:** ఈ విధంగా మన్మథబాధచే తపిస్తున్న మనస్సుగల కీచకుడు తన మనస్సులో ఇట్లా ఆలోచించసాగాడు.

సీ. **'పడఁతి నన్నూఱడఁ బలికిన భంగిన। నిచ్చమై నిక్కకు వచ్చునొక్కొ!**
**వచ్చి తొల్లిటియట్ల వడిఁ ద్రోచిపోవక। పొలఁతి యింపెసలారఁ బొందునొక్కొ!**
**తలపోఁతఁ గలిగి యమ్మెలఁత వచ్చుటకు నొం। డొక వింత పుట్టకయుండునొక్కొ!**
**గంధర్వు లేవురు గలరని చెప్పె న। న్నెలఁతుక మాటలు నిక్కమొక్కొ!**

తే. **తెఱవ చిడిముడిపాటు సుదేష్ణ యెఱిఁగి। వేడ్కఁ బనిపంచు టుడిగి రా విడుచునొక్కొ!**
**మదనుఁ డింతికి నొజ్జయై మతకములును। నదను నెఱిఁగించి నాకడ కనుచునొక్కొ!** 295

**ప్రతిపదార్థం:** పడఁతి= ఆ వనిత; నన్నున్= (కీచకుడిని); ఊఱడన్+పలికిన భంగినన్= ఊరడిస్తూ మాట్లాడినట్లుగానే; ఇచ్ఛమైన్= ఇష్టపడి; ఇక్కకున్= సంకేతస్థలానికి; వచ్చును+ఒక్కొ!= వస్తుందా?; వచ్చి; తొల్లిటి+అట్లు+అ= ఇంతకుముందు వలెనే; వడిన్+త్రోచిపోవక= వేగంగా త్రోసివేసిపోక; పొలఁతి= ఆ స్త్రీ; ఇంపు+ఎసలారన్= ప్రీతి అతిశయించగా; పొందున్+ఒక్కొ= నన్ను కూడుతుందా?; తలపోఁత+కలిగి= మనసుపడి; ఆ+మెలఁతవచ్చుటకున్= ఆ వనిత రావటానికి; ఒండొకవింత= మరొక

ఆశ్చర్యకరమైన విషయం; పుట్టక+ఉండును+ఒక్కొ!= పుట్టకుండా ఉంటుందా!; గంధర్వులు+ఏవురు= ఐదుగురు గంధర్వులు భర్తలుగా; కలరు+అని చెప్పెన్= ఉన్నారని చెప్పింది; ఆ+నెలఁతుకమాటలు= ఆ వనిత మాటలు; నిక్కము+ఒక్కొ?= నిజమా?; తెఱవ= ఆ వనిత యొక్క; చిడిముడిపాటు= తొట్రుపాటు; సుదేష్ణ+ఎఱిఁగి= సుదేష్ణ తెలిసికొని; వేడ్కన్+పని+పంచుట+ఉడిగి= వేడుకగా పరిచర్యలకు పంపటం మాని; రాన్+విడుచున్+ఒక్కొ!= రావటానికి అంగీకరిస్తుందా?; మదనుఁడు= మన్మథుడు; ఇంతికిన్= ఆమెకు; ఒజ్జ+ఐ= గురువై; మతకములునున్= విలాసాలున్నూ, మాయలున్నూ; అదనున్= సమయం; ఎఱిఁగించి= తెలిపి; నా కడకున్= నా వద్దకు; అనుచున్+ఒక్కొ!= పంపుతాడా?

**తాత్పర్యం:** 'ఆ వనిత నన్ను అనునయిస్తూ మాట్లాడిన విధంగానే ఇష్టపడి సంకేతస్థలానికి నిజంగా వస్తుందా? వచ్చినా ఇంతకుముందు వలె విదిలించిపోకుండా ఆమె ఆసక్తితో నన్ను పొందుతుందా? నన్ను గురించి ఆలోచిస్తూ రావటానికి బయలుదేరేలోగా ఆమెకు ఏదో వింత తలపు పుట్టకుండా ఉంటుందా? గంధర్వు లైదుగురు తనకు భర్తలుగా ఉన్నారని చెప్పిన ఆమె మాటలు నిజమై ఉండవచ్చునా? వలపువలన కలిగిన ఆమె తొట్రుపాటును గమనించి సుదేష్ణ మరేదైనా పని చెప్పకుండా సంకేతస్థలానికి రావటానికి వీలు కలిగిస్తుందా? మన్మథుడే ఆమెకు గురువై ఇతరుల కన్నుగప్పే గుట్టుమట్టులూ, మాయమర్మాలూ, వాటిని ఆయా సమయాలలో ప్రయోగించే నేర్పులూ తెలియజెప్పి (స్ఫురింపజేసి) నా దగ్గరికి పంపుతాడా?

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం. దశవిధ కామావస్థలలో 'చింత' రెండవది. ఆ అవస్థను ఈ పద్యంలో తిక్కన క్రమంగా విస్తరించి రచించాడు. ఏ ఉపాయంతో ప్రియాసంగమం జరుగుతుందో అని స్వయంగాగానీ, నర్మసచివాదులతోగాని చేసే ఆలోచన చింత, కొందరు చింతను - చింత, చింతనం, విచింతనం అని మూడు రకాలుగా చెప్పుతారు. సైరంధ్రి అన్నమాట ప్రకారం తనకొరకు సంకేతస్థలానికి చెప్పిన సమయంలో చెప్పినట్లు వస్తుందా? - అని కీచకుడు శంకిస్తున్నాడు ఇక్కడ, అకస్మాత్తుగా ఆమెలో వచ్చిన పరిణామానికి తట్టుకొనలేని కీచకుడు చింతించటంలో శంకించటాన్ని మొదట వర్ణించటం ఔచిత్యం. ఇది విచింతనంలో ఒక భాగం. అన్నీ సవ్యంగా నడవాలనే ఆతురతలో అట్లా నడుస్తాయా? అనే అనుమానం ఈ శంకావస్థకు మూలం. అందులో కూడా ఒక క్రమాన్ని పాటించి భావించటం జరిగింది. ఆమె కోర్కెతో సుముఖత ప్రకటించింది - అది నిజమైన కోర్కెఅయి సంకేతస్థలానికి రావాలని కోరిక. వలపు నిజమైతే వస్తుంది. కాకపోతే రాదు. ఇది శంక. ఈ శంక విరహవేదనను తీవ్రతరం చేస్తుంది. వచ్చినా ఇదివరకువలె తనను త్రోసివేయక తన సామీప్యాన్ని, సంగమాన్ని అంగీకరిస్తుందో లేదో అని మరొక శంక. ఆమెకు కూడా వలపు చింత కలిగి, వేదనపడుతూ, తన వద్దకు రావాలని తొందరపడుతూ ఉంటే, ఏదైనా తెలియని ఒక అద్భుతం జరిగి రాలేకపోతుందేమో! అయిదుగురు భర్తలున్నారనీ. నా రామెను రక్షిస్తుంటారనీ చెప్పిన మాట నిజమా? అబద్ధమా? అని శంక కలిగింది. వస్తే వాళ్ళకు తెలిసేటట్లు వస్తుందా, రహస్యంగా వస్తుందా? అంతుపట్టని అనుమానం. ఒకవేళ ఆమె వలపుతీవ్రత వలన తొట్రుపాటు పడుతుంటే గుర్తించి సుదేష్ణ అడ్డుపని కల్పించి పంపదేమో! అని శంకించి, శంకించి, చివరకు అడ్డంకుల నన్నింటినీ అధిరోహించగలిగే నేర్పునూ, చేర్పునూ ఆమెకు మన్మథుడే స్వయంగా సమకూర్చాలని ఆశించాడు. ఈ పద్యంలో అయిదురకాల శంకలను కీచకుడు వ్యక్తం చేశాడు. అవి వరుసగా- ఆమె నిజంగా తనను కోరుతున్నదా? పొందుకు సిద్ధమవుతున్నదా? వేరే ఏవైనా ఆలోచనలున్నాయా? చింతకు, తరువాతి రెండూ చింతనకూ, అయిదవదీ, చివరిదీ అయిన ఆకాంక్ష విచింతనకూ సంబంధించి సాగటం - చింత అనే అవస్థను తిక్కన ఆవిష్కరించిన క్రమం. పద్యరచనలో అంత్యప్రాసాలంకారం చింతావస్థలో కీచకుడి దశావిస్ఫూర్తిని లయాత్మకంగా పఠితలకు స్ఫురింపజేసింది. (సంపా.)

**ఉ. నిక్కము పోలె నప్పుడొక నేరిమిమై ననుఁ ద్రోచిపుచ్చఁగా**
**నక్కమలాక్షి పొందు దగ నాడి, తుదిన్ నిజమేది, నేఁటి రే**
**యిక్కకు రాక తక్కిన, సహించునె నన్ మరుఁ? డట్టులైన నా**
**కెక్కడిప్రాణ, మేటితను, వెయ్యది నిల్కడ, యేమిసేయుదున్?** 296

**ప్రతిపదార్థం:** నిక్కమపోలెన్= నిజమా అన్నట్లు; అప్పుడు+ఒకనేరిమిమైన్= అప్పుడు ఏదో ఒక నేర్పుతో; ననున్+త్రోచిపుచ్చఁగాన్= నన్ను నెట్టివేయగా; ఆ+కమల+అక్షి= పద్మాలవంటి కన్నులుగల ఆ సైరంధ్రి; పొందున్= కలయికను; తగన్+ఆడి= అనువుగా మాట్లాడి; తుదిన్= చివరకు; నిజము+ఏది= ఆ వాస్తవాన్ని కాదని; నేఁటిరేయి= ఈనాటి రాత్రి; ఇక్కకున్= సంకేత స్థలానికి; రాకతక్కినన్= రాకపోతే; మరుఁడు= మదనుడు; నన్+సహించునె?= నన్ను ఓర్చుకొంటాడా?; అట్టులు+ఐనన్= అట్లాఐతే; నాకున్+ఎక్కడి ప్రాణము?= నా ప్రాణం నిలుస్తుందా?; ఏటి తనువు?= ఈ శరీరమెందుకు?; నిల్కడ ఏ+అది?= నిలుకడ ఎక్కడిది?; ఏమి+చేయుదున్= ఏమి చేసేది?

**తాత్పర్యం:** తనకు ఇష్టం లేకున్నా, నన్ను నేర్పుతో త్రోసిపుచ్చటానికై నిజంగా పొందుకోరుతున్నట్లే సమయానుకూలంగా మాట్లాడి, ఆ కమలాక్షి నాతో పొందుకోరి అంత సహజంగా అనువుగా మాట్లాడి కూడా చివరకు ఈ నిజాన్ని కల్లజేసి నేటి రాత్రికి సంకేతస్థలానికి రాకుండా మానివేస్తే మన్మథుడు నన్ను సహిస్తాడా? సహించకపోతే ఇక నా ప్రాణాలు నిలుస్తాయా? ఇక ఈ తను వెందుకు? ఇక నాకు శాంతి ఎక్కడిది? ఆ పరిస్థితులలో ఇక నేనేమి చేసేది?

**విశేషం:** ఇందులో 'అనుస్మృతి' అనే కామావస్థ వర్ణించబడింది. దేశ కాలాలను అనుసరించి పూర్వం అనుభూతాలైన విషయాలను మరల మరల తలచుకొనటం అనుస్మృతిగా సింగభూపాలుడు పేర్కొన్నాడు (చూడు: సాత్త్వికాభినయం: పి.యస్.ఆర్.అప్పారావు. పు.445). అప్పుడు త్రోచిపుచ్చింది ఇప్పుడు పొందు కోరుతున్నది సైరంధ్రి. ఇందులో రెండవది ప్రస్తుత వాస్తవం. ఒకవేళ ఇది కూడా నిజం కాకపోతే దిక్కేమిటి? అని కీచకుడి 'అనుస్మృతి'. ధీరుడైతే విరహాన్ని అతిక్రమిస్తాడు. కాముకుడైతే మరుని చేతిలో మరణంపాలౌతాడు. దశవిధ మన్మథావస్థలన్నీ అనుభవిస్తే చివరకు మిగిలేది మృత్యువే. దానిని కూడా స్మరిస్తూ కీచకుడు బెంబేలెత్తి పోతున్నాడు. ప్రియురాలు తనను వంచిస్తుందనే భావననే సహించలేకపోతున్నాడు. ఈ లక్షణమే దుష్టుడైన కీచకుడియందు కూడా శృంగారనాయక లక్షణాలను తలపింపచేస్తున్నది. (సంపా.)

**క. అట్టేల రాక తక్కుం? గట్టిఁడియే యా లతాంగి? కామాతురు నన్**
**బెట్టి యచట దానికి మన। సెట్టు నిలుచుఁ? దగవు విడువ నెట్టులు నేర్చున్? 297**

**ప్రతిపదార్థం:** అట్టు+ఏల= అట్లా ఎందుకు; రాకతక్కున్= రాకుండా మానుతుంది? ఆ లతాంగి= ఆ వనిత; కట్టిఁడి+ఏ= అంత కఠినాత్మురాలా? నన్= నన్ను (కీచకుడిని); కామాతురున్= మదనావేశపరుడిగా; పెట్టి= ఉంచి; అచటన్= అక్కడ; దానికిన్= ఆమెకు; మనసు+ఎట్టునిలుచున్?= మనసు ఎట్లా నిలుస్తుంది?; తగవు విడువన్= ధర్మం వదలటానికి; ఎట్టులు నేర్చున్?= ఎట్లా చాలుతుంది?

**తాత్పర్యం:** ఆ లతాంగి రాకుండా అట్లా ఎలా ఉంటుంది? అంత కఠినాత్మురాలా? న న్నిక్కడ ఇంత కామపరవశుడినిగా చేసి అక్కడ ఆమె నిబ్బరంగా ఉండటానికి మనసెట్లా వస్తుంది? ఎంతైనా న్యాయం తప్పి ఎట్లా నడుస్తుంది?

**విశేషం:** 'అనుస్మృతి' అనే కామావస్థలో 'వితర్కం' అనే భావం ఇందులో ఆవిష్కరించబడింది. తనవలెనే ఆమె కూడా విరహాన్ని పొందుతుందనీ, ఆమెలో కూడా అనుస్మృతి అనే అవస్థ కలుగుతుందనీ, అది విరహధర్మమనీ, ఆమె వచ్చి తీరుతుందనీ వితర్కించాడు కీచకుడు. (సంపా.)

**ఉ. దానికి నేటి నిక్కము? వృథా పరితాపముదక్కి, బాసమైఁ**
**బూనికి డిగ్గఁద్రావి, వెసఁబోయెద నిప్పుడ; పోయి ముట్టి య**
**బ్జాననఁ బట్టి తెచ్చి హృదయం బలరంగ ననంగతంత్రవి**
**ద్యా నిపుణత్వ మేర్పటిచెదం; బ్రమదాంబుధి నోలలార్చెదన్. 298**

**ప్రతిపదార్థం:** దానికిన్= ఆమెకు; ఏటి నిక్కము?= ఎక్కడి నిజాయితీ?; వృథా పరితాపము= ఫలితం లేని ఈ మనోవేదన; తక్కి= మాని; బాసమైన్= ఇచ్చినమాట మీది; పూనికి= ప్రయత్నం; డిగ్గన్+త్రావి= దిగమ్రింగి, వదిలిపెట్టి; ఇప్పుడు+అ= వెంటనే; వెసన్+పోయెదన్= వేగంగా వెళ్ళుతాను; పోయి= వెళ్ళి; ముట్టి= ఆక్రమించి; అబ్జ+ఆననన్= ఆ పద్మముఖిని; పట్టితెచ్చి= పట్టి తీసికొనివచ్చి; హృదయంబు+అలరంగన్= మనస్సు రంజిల్లేటట్లు; అనంగతంత్ర విద్యానిపుణత్వము= మన్మథ క్రియాకలాపంలో నేర్పరితనాన్ని; ఏర్పఱిచెదన్= ప్రదర్శిస్తాను; ప్రమద+అంబుధిన్= సంతోష సముద్రంలో; ఓలలార్చెదన్= తేలియాడేటట్లు చేస్తాను.

**తాత్పర్యం:** ఆమెకు నిజం పాటించాలన్న నియమం ఉన్నదా? అందుకే, ఈ వృథా విరహవేదనను వదలిపెట్టి, చేసిన బాసను దిగమ్రింగి, ఇప్పుడే వేగంగా నేను వెళ్ళుతాను. వెళ్ళి ఆమెను ముట్టడించి పట్టి తీసికొని వస్తాను. మనసు రంజిల్లేటట్లు రతిక్రీడలలో నాకున్న పాండిత్యాన్నీ, నేర్పరితనాన్నీ ప్రదర్శించి చూపిస్తాను, సంతోషసాగరంలో ఓలలాడిస్తాను.

**విశేషం:** 1. అలం: రూపకం. ప్రమదాంబుధిలో ఓలలాడటంలో ఆ అలంకారం ఉన్నది. 2. ఈ పద్యంలో 'ఉద్వేగం' అనేకామావస్థ వర్ణించబడింది. **"ఆసనే శయనే చాపి న తుష్యతి, న తిష్ఠతి । నిత్యమే వోత్సుకా చ స్యా దుద్వేగస్థానమాశ్రితా॥"** (నా.శా.12.181) ఆసన శయనాలలో సంతోషం కాని, నిలుకడకాని లేకపోవటం వలన ఉద్వేగంతో ప్రియురాలిని కలియాలనే ఉత్సుకత ప్రకటించటం ఉద్వేగం. సైరంధ్రిని వెంటనే పొందాలన్న ఉత్సుకత కీచకుడి కామభావోద్వేగాన్ని తెలుపుతున్నది. దాని కనుగుణంగా ఆలోచించటం ఇందులోని ప్రవృత్తి. సైరంధ్రి మాటమీద నిలబడుతుందని నమ్మితే ఉద్వేగానికి ఊపిరి లేదు. ఆ శంకతో మొదలై అనుకొన్న నియమాన్ని దిగమ్రింగి (రసాత్మకమైన క్రియ), ఆమెను శీఘ్రంగా పట్టి తెచ్చి రతిక్రీడలలో ముంచి తేల్చేంతవరకు ఊహించాడు కీచకుడు. అతడు దుర్విదగ్ధు డనటానికి ఇదొక ఉదాహరణ. అయినా, అతడి భావతీవ్రత శృంగారనాయకులకైతే ఒక అలంకారం కాకమానదు. అతడిని అట్లా ప్రదర్శించటం కూడా తిక్కన సంకల్పం. (సంపా.)

**ఆ.** **అనుచు సంచలించు, నడియాసఁ గ్రమ్మఱఁ । బాసఁ దలఁచి ధృతికిఁ బట్టువెట్టు**
**మరుని కోహటించి యురియాడుఁ, దుదిముట్టఁ । గాన నిశ్చయించుఁ గలఁగుఁ దేఱు.** **299**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; అడియాసన్= తీరని ఆశగా; సంచలించున్= కంపించిపోతాడు; క్రమ్మఱన్= మళ్ళీ; బాసన్+తలఁచి= ఆమె ఇచ్చిన మాట గుర్తుకు తెచ్చుకొని; ధృతికిన్= ధైర్యానికి; పట్టు+పెట్టు= ఆధారం కలిగిస్తాడు; మరునికిన్= మన్మథుడికి; ఓహటించి= వెనుదీసి; ఉరి యాడున్= ఊగిసలాడతాడు; తుదిముట్టన్+కానన్= చివరివరకు చూడటానికి లేదా చనిపోయే యత్నం చేయటానికీ; నిశ్చయించున్= నిర్ణయిస్తాడు. కలఁగున్= అంతలోనే కలత పడతాడు; తేఱున్= అంతలోనే తేరుకొంటాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అనుకొంటూ తన ఆశలన్నీ అడియాస లైపోతాయేమో అని భావించి నిలువునా కంపించిపోయేవాడు. మళ్ళీ ఆమె ఇచ్చిన మాటను తలచుకొని ధైర్యాన్ని కూడగట్టుకొనేవాడు. అయినా మన్మథుడు పెట్టే తొందరకు జంకి వెనుకకూ ముందుకూ ఊగిసలాడేవాడు. చివరివరకు ఏమి జరుగుతుందో చూద్దామనీ (చనిపోయే యత్నం చేద్దామనీ) నిశ్చయించుకొనేవాడు. అంతలోనే కలతపడేవాడు, వెంటనే తేరుకొనేవాడు.

**విశేషం:** ఉద్వేగంలోని చిత్తవైకల్యం ఈ పద్యంలో వర్ణితం. అనిశ్చిత చిత్తస్థితి వలన విరహదశలో కలిగే - సంచలించడం, ధైర్యం తెచ్చుకొనటం, ఊగిసలాడటం, తుదముట్ట చూడ నిశ్చయించటం, కలత పడటం, తేరుకొనటం - అనే మదన వికారాలను ఒక క్రమ విన్యాస పద్ధతిలో తిక్కన సంవిధానం చేయటం సులభంగా గమనించవచ్చును. (సంపా.)

**వ.** **మఱియు నక్కీమలివలని ప్రేముడిం దగిలి.** **300**

**తాత్పర్యం:** ఆ ద్రౌపదిపైని మోహంలో చిక్కుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **పొడసూపినట్లైన వడిఁబట్ట సమకట్టి। పరికించి కానక బమ్మరించు;**
**మెలఁగినయట్లైన బలికింపఁ దలఁచి,ని। రూపించి లేమి నశ్రులు వహించుఁ;**
**గదిసినయట్లైనఁ గౌఁగిలింపఁ గడంగి। యారసి బొంకైన నలఁత నొందు;**
**నొడఁబడ్డయట్లైన నడరి పైకొనఁజూచి। చెన్నఁటి యగుట నిశ్చేష్టఁ బొరయు;**

**తే.** **లలిత వివిధ విహారంబులకు లతాంగి। యెలసి సొలసిన యట్లైన నెలమిఁ గలిసి**
**యభిమతక్రీడ సలుపంగ నప్పళించి। వెదకి రిత్తబయల్ గని విహ్వలించు.** **301**

**ప్రతిపదార్థం:** పొడసూపినట్లు+ఐనన్= కనబడినట్లుగా అనిపిస్తే; వడిన్+పట్టన్ సమకట్టి= త్వరగా పట్టుకొనాలని ప్రయత్నించి; పరికించి= (ఆ తరువాత) పరిశీలించి చూచి; కానక= కనబడక; బమ్మరించున్= ఆశ్చర్యపోతాడు; మెలఁగిన+అట్లు+ఐనన్= దగ్గరగా తిరుగుతున్నట్లు తోస్తే; పలికింపన్+తలఁచి= మాట్లాడించాలని అనుకొని; నిరూపించి= పరీక్షగా చూచి; లేమిన్= లేకపోవటం వలన; అశ్రులు వహించున్= కన్నీరు పెట్టుకొంటాడు; కదిసిన+అట్లు+ఐనన్= మరీ దగ్గరకు వచ్చినట్లు అనిపిస్తే; కౌఁగిలింపన్+కడంగి= కౌగిట చేర్చటానికి పూనుకొని; అరసి= బాగా చూచి, పరిశీలించి; బొంకు+ఐనన్= అదంతా అబద్ధమని తేలితే; అలఁతన్+ఒందున్= బాధ (శ్రమ) పడతాడు; ఒడఁబడ్డ+అట్లు+ఐనన్= (తనతో కూడటానికి) ఒప్పుకొన్నట్లు తోస్తే; అడరి= అతిశయించి; పైకొనన్+చూచి= పైన పడి క్రమ్ముకొనటానికి ప్రయత్నించి; చెన్నఁటి+అగుటన్= ఉత్తదే కావటం చేత; నిశ్చేష్టన్+పొరయున్= చేష్టలుడుగుతాడు; లలిత వివిధ విహారంబులకున్= సుకుమారమైన అనేక క్రీడలకు; లతాంగి= వనిత (సైరంధ్రి); ఎలసిసొలసిన అట్లు+ఐనన్= వశమై దరిచేరినట్లు అనిపించగా; ఎలమిన్= ప్రీతితో; కలిసి= కూడి; అభిమతక్రీడ= తనకు ఇష్టమైన పని (రతికేళి); చలుపంగన్= చేయటానికి; అప్పళించి= ప్రయత్నించి; వెదకి= తేరిపార బాగా చూచి; రిత్తబయల్ కని= శూన్య ప్రదేశం చూచి; విహ్వలించున్= శరీరావయవాలు స్వాధీనం తప్పినట్లుగా వివశుడైపోతాడు.

**తాత్పర్యం:** సైరంధ్రి ఎదుట కనపడినట్లనిపించేది. కీచకు డామెను వెంటనే పట్టుకొనాలని పూనుకొనేవాడు. తీరా చూస్తే కనపడేది కాదు. అందుకు ఆశ్చర్యపోయేవాడు. ఆమె తన ప్రక్కన తిరుగుతున్నట్లు అనిపించేది. అతడు ఆమెను పలకరించాలని భావించి ముందుకు వెళ్ళేవాడు. పరిశీలించి చూస్తే ఏమీ ఉండేది కాదు. అందుకు కన్నీరు పెట్టుకొనేవాడు. ఆమె తనకు బాగా దగ్గరగా వచ్చినట్లనిపించేది. అత డామెకు కౌగిలించుకొనాలని ప్రయత్నించి, అదంతా అబద్ధమని తెలిసి మనసు నొచ్చుకొనేవాడు. ఆమె తనతో కూడటానికి సుముఖురాలైన ట్లనిపించేది. వెంటనే ఆమెపై బడి కౌగిలించుకొనాలని చూచేవాడు. అదంతా ఉత్తదే అని తెలిసి కొయ్యబారిపోయేవాడు. ఆమె అతి కోమలమైన వివిధ విలాసాలతో తనకు వశమై, దరిచేరినట్లు అన్పించగా, వెంటనే ప్రీతితో ఆమెను అభిమత రతిక్రీడలలో ముంచెత్తాలని ప్రయత్నించేవాడు. చివరకు అంతా చూస్తే శూన్యమైన ఆకాశమే అని తెలిసికొని శరీరమంతా స్వాధీనం తప్పినట్లు వివశుడయ్యేవాడు.

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం. ఈ పద్యంలో కీచకుడి కామావస్థలలోని ఉన్మాదావస్థ వర్ణితమైనది. అనుమానంతో మొదలైన విరహవేదన ఉన్మాదంతో పరిణతి చెందింది. ఇందులో నాయిక నాయకుడిని కూడేటప్పుడు సాధారణంగా కానవచ్చే దర్శన, స్పర్శన, సామీప్య, సల్లాప, స్నేహ, సంశ్లేష, సాముఖ్య, సమ్మోహ, విలాస, విహార దశలను భావించుకొని ఉన్మత్త దశలో అవియే నిజమని భావించి మోసపోయి చివరకు వివశుడయ్యాడని వర్ణించిన ఈ రచనలో ఒక క్రమంతో పాటు రసధ్వని కూడా రాణించింది.

కీచకుడి మదనోన్మాదం ఫలాన్ని పొందనున్నట్లు కనబడుతున్నా సైరంధ్రితో పొందు అనుమానాశ్రితమనీ, చివరకు అది అబద్ధమేననీ, పరిశీలించి చూస్తే అతడికి దక్కేది శూన్యమేననీ భావి కథారసార్థాలను తిక్కన ధ్వనింప చేస్తున్నాడు. రసభావ వ్యక్తీకరణం వలన ధ్వనించే రసార్థాలు రసధ్వని రసకందాలు. (సంపా.)

## కీచకుఁ డుద్యానవనంబున విహరించుట

(ఇది మూలమునందు లేదు)

**వ. ఇట్లు బహుప్రకారంబులగు మన్మథ వికారంబుల కగపడి వెగడంది యమందసంతాపభరితాంతఃకరణుం డగుచు సింహబలుండు పరిచారికాప్రార్థనం జేసి మజ్జన భోజనంబు లొకభంగి నడపినవాఁడై, తదనంతరంబ మనోజవేదనాపనోదనార్థంబు మందిరారామభూమికిం జని తత్ప్రదేశంబున. 302**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; బహుప్రకారంబులు+అగు= అనేకరకాలైన; మన్మథ వికారంబులకున్= శృంగారభావ చేష్టలకు; అగపడి= లోబడి; వెగడంది= భయపడి; అమంద సంతాపభరిత+అంతఃకరణుండు+అగుచున్= మిక్కిలి విచారంతో కూడిన మనస్సుకలవాడై; సింహబలుండు= కీచకుడు; పరిచారికా ప్రార్థనన్+చేసి= సేవికల కోరిక మేరకు; మజ్జన భోజనంబులు= స్నానభోజనాలు; ఒక భంగిన్ నడిపినవాఁడై= ఏదో విధంగా జరిపి; తద్+అనంతరంబు+అ= తర్వాత; మనోజవేదనా+అపనోదన+అర్థంబు= మన్మథ తాపం పోగొట్టుకొనటానికి; మందిర+ఆరామభూమికిన్+చని= ఇంటితోటలోనికి వెళ్ళి; తద్+ప్రదేశంబునన్= అక్కడ.

**తాత్పర్యం:** ఇట్లా అనేక విధాలైన మదనవికారాలకులోనై తడబాటుపడి మిక్కిలి దుఃఖంతో నిండిన హృదయంతో కీచకుడు పరిచారికల బలవంతం మీద స్నాన భోజనాదులు ఏదో విధంగా ముగించుకొని, ఆ తరువాత మదనతాపం చల్లార్చుకొనటానికై అంతఃపురంలోని ఉద్యానవనంలోకి ప్రవేశించి, అక్కడ.

**విశేషం:** మన్మథ దశావస్థలలో అరతి, గమనం అనే వాటిని కావ్యాలంకారసంగ్రహంవంటి లక్షణ గ్రంథాలు చెప్పాయి. విరహతాపం వలన స్నానపానాదులందు ప్రీతి లేకపోవటం- అరతి. మదనతాపానికి గృహంలో ఉండలేక శైత్యోపచారార్థమై ఉద్యానవనాదులలో విహరించటం, జలక్రీడలాడటం, చిగురుపాన్పుపై పవళించటం వంటి క్రియలు చేయటంలో తిరగటం (విహరించటం) గమనం. ఆ రెండు అవస్థలను తిక్కన కీచకుడిపట్ల ఈ వచనంలో పేర్కొన్నాడు. తరువాతి రెండు పద్యాలలో గమనావస్థను విస్తరించాడు. (సంపా.)

**చ. కమలవనంబుపొంత నునుగా డ్పొకయించుక యాదరించుఁ, జి**
**త్తమునకుఁ దానఁ దల్లడము దన్కుటయుం జని గారవంపుఁజూ**
**తముకడ నిల్చు, నిల్చి యది తాపముఁ బెంచిన లేఁత తీవ జొం**
**పముఁ జొరఁబాఱు నం దలఁత పైకొనినన్ వెడలున్ వెనుంబడున్. 303**

**ప్రతిపదార్థం:** కమలవనంబు పొంతన్= తామర వనం (కొలను) దగ్గర; ననుగాడ్పు= మెల్లని గాలిని; ఒక+ఇంచుక= కొద్దిగా; ఆదరించున్= మన్నిస్తాడు; దానన్= దానివలన; చిత్తమునకున్= మనస్సునకు; తల్లడము= బాధ; తన్కుటయున్= అతిశయించగా; చని= వెళ్ళి; గారవము+చూతముకడన్= ప్రియమైన మామిడిచెట్టువద్ద; నిల్చున్= నిలబడతాడు; నిల్చి= నిలబడి; అది తాపమున్+పెంచినన్= అది విరహవేదన పెంచగా; లేఁత తీవ= లేత తీగల యొక్క; జొంపమున్= గుబురులోకి, పొదరింట్లోకి;

చొఱన్+పాఱున్= ప్రవేశిస్తాడు; అందున్= అందులో; అలఁత= అలసత(ట); పైకొనినన్= ఎక్కువ కాగా; వెడలున్= బయటకు వెళ్ళేవాడు; వెనుంబడున్= ఉపాయం తోచక మనసులో చింతపడేవాడు.

**తాత్పర్యం:** కీచకుడు తామరపూల కొలను దగ్గర నిలబడి చల్లని పిల్లగాలిని కొంతసేపు సేవించేవాడు. కాని, దాని వలన మదన వేదన ఎక్కువయ్యేది. అక్కడినుండి కదలి తనకు ప్రీతికరమైన మామిడి చెట్టు వద్ద నిలబడేవాడు. అది తాపాన్ని తగ్గించటానికి బదులు మరింత పెంచేది. ఆపైన లేదీగల పొదరిండ్లలో దూరేవాడు. అక్కడ జడతతో కూడిన గ్లాని ఏర్పడేది. పొదరిళ్ళలో ఉండలేక బయటపడేవాడు. మరే ఉపాయం తోచక మనసులో చింతించేవాడు.

**విశేషం:** ఉద్యానవనంలో బహిస్తాపాన్ని తగ్గించగల వస్తువులను మదనతాపం తగ్గటానికి కీచకుడు ఆశ్రయించ నారంభించాడు. అవి విరహతాపాన్ని తగ్గించటానికి బదులు పెంచసాగాయి. ఒకదానిని విడిచి మరొకదానిని ఆశ్రయిస్తూ తిరుగుతున్నాడు. కొలను దగ్గరి మలయపవనం, మామిడి చెట్టునీడ, లేదీవల మంటపాలూ ఇవన్నీ సూర్యతాపాన్ని తగ్గిస్తాయి కాని, విరహతాపాన్ని పెంచుతాయి. అంతర్గతమైన మదనతాపం తగ్గించే ఉపాయాంతరం తోచక కీచకుడు చింతించాడు. "అలఁత పైకొనినన్" అని అనటంలో తిక్కన విరహతాపంలో గోచరించే జాడ్యం గ్లాని, ఆలస్యం అనే సంచారిభావాలను ధ్వనింపచేస్తున్నాడు. చేయవలసిన పనులలో ఏది చేయాలి? ఏది చేయగూడదు? అనే ఆలోచన తోచక చింతించటం జాడ్యం, బడలికపడటం గ్లాని, చేయవలసిన పనులలో చురుకుదనం చూపకపోవటం ఆలస్యం. పై మూడు చర్యలలో ఈ మూడు సంచారిభావాలూ స్పష్టమౌతున్నాయి. (సంపా.)

**ఆ. సుడియుగాలిఁ బువ్వుఁ బొడిఁ దన్నుఁ గప్పునో। యనుచు బెగ్గలించు నగ్గలముగఁ**
**గురియు తేనియలకుఁ గొంకు లతాగుల్మ। తరు సమీపములకు నరిగియరిగి. 304**

**ప్రతిపదార్థం:** లతా, గుల్మ, తరు సమీపములకున్= తీగల పొదల దగ్గరకూ, చెట్ల దగ్గరకూ; అరిగి+అరిగి= వెళ్ళి వెళ్ళి; సుడియుగాలిన్= చుట్టుకొని వీచే గాలి వలన; పువ్వు+పొడి= పుప్పొడి; తన్నున్= తనను (కీచకుడిని); కప్పునో= కప్పివేస్తుందేమో; అనుచున్= అని భావిస్తూ; అగ్గలముగన్= అధికంగా; బెగ్గలించున్= భయపడతాడు; కురియు తేనియలకున్= కురిసే పూలతేనెల జల్లులకు; కొంకున్= జంకేవాడు.

**తాత్పర్యం:** పూదీగల పొదరిండ్ల దగ్గరికీ, పూలచెట్ల దగ్గరికీ (సుగంధాన్ని సేవించి అలత పోగొట్టుకొనటానికి) కీచకుడు పోయేవాడు. పొదరిండ్ల దగ్గర సుడిగాలి వీచినప్పుడు పుప్పొడి తనను కప్పివేస్తుందేమో అని భయపడేవాడు. పూల చెట్లనీడలలో తిరుగుతున్నప్పుడు పూదేనెలు కురిసి ముంచివేస్తాయేమో అని లోలోన మిగుల జంకేవాడు.

**విశేషం:** గమనమనే మదనావస్థలో అలతను పోగొట్టుకొనటానికి చేసే రెండు యత్నాలు ఇందులో చెప్పబడ్డాయి. **"సుగంధం పుష్టివర్ధనమ్"** అని న్యాయం. సువాసనలు పీలిస్తే అలసత తీరి బలం చేకూరుతుందని పూల పొదరిళ్ల పొంతా, పూలచెట్ల పొంతా తిరిగాడు. కాని, పూల పుప్పొడులూ, మకరందాలూ మదనతాపాన్ని పెంచుతున్నాయి. దిక్కు తోచక తిరగటం సాగించాడు. (సంపా.)

**వ. ఇత్తెఱంగున నొక్కయెడనయినను గాలూనక లీలోద్యానంబు కలయం గ్రుమ్మరుచు. 305**

**తాత్పర్యం:** ఈ విధంగా ఒక్కచోట కూడా కాలు నిలుపకుండా విలాసోద్యానవనంలో కలయ తిరుగుతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

సీ. ఇంపైన ప్రియ కాననిచ్చి, నిల్చిన మధు। వాదట నాను మత్తాలివిభునిఁ,
జెట్టుపల్ పచరించి చుట్టుఁ గ్రుమ్మరి మనో। రమ నియ్యకొలుపు మరాళవిభుని,
ఫలరస మొండొంటి కెలమిఁ జంచుల నిచ్చు। మెయిన చొక్కెడు శుకమిథునములను,
గమిఁ బాసి తలిరుజొంపమునకు మెయిమెయిఁ। దాఁకంగఁ జను పికదంపతులను

తే. జూచి చూచి యుల్లంబున నేచి కోర్కు। లడర చిడిముడిపడు, మ్రానుపడు, వెడంగు
పడు, వెనుంబడుఁ దల్లడపడు, దురంత। చింతబారికి నగపడు సింహబలుఁడు. 306

**ప్రతిపదార్థం:** ఇంపైనప్రియకున్= ఇష్టమైన ప్రియురాలికి; ఆనన్+ఇచ్చి= త్రాగటాని కిచ్చిన పిమ్మట; నిల్చినమధువు= మిగిలిన తేనెను; ఆదటన్= ప్రీతితో; ఆను= త్రాగే; మత్త+అలివిభునిన్= మదించిన మగ తుమ్మెదను; చెట్టుపల్= రెక్కలు; పచరించి= విప్పార్చి; చుట్టున్+క్రుమ్మరి= చుట్టూ తిరిగి; మనోరమన్= ప్రియురాలిని; ఇయ్యకొలుపు= అంగీకరింపజేసే; మరాళవిభునిన్= రాజహంసను; ఫలరసము= పండ్లరసాన్ని; ఒండు+ఒంటిన్= ఒకదాని కొకటి; ఎలమిన్= ప్రేమతో; చంచులన్+ఇచ్చు= ముక్కుపుటాలతో అందించే; మెయిన్+అ= విధంగా; చొక్కెడు= సోలిపోవు; శుకమిథునములను= చిలుకల జంటలను; గమిన్+పాసి= గుంపును వదలి; తలిరు జొంపమునకున్= చిగురుపొదలకు; మెయిమెయిన్+తాఁకంగన్= శరీరాలు పరస్పరం రాచుకొనగా; చను= వెళ్ళే; పికదంపతులను= కోయిలల జంటలను; సింహబలుఁడు= కీచకుడు; చూచి చూచి= ఆసక్తితో చూచి; ఉల్లంబునన్= మనస్సులో; ఏచి= విజృంభించి; కోర్కులు+అడరన్= కోరికలు రేగగా; చిడిముడిపడున్= తొట్రుపడతాడు; మ్రానుపడున్= నిశ్చేష్టుడౌతాడు; వెడంగుపడున్= కలతపడతాడు; వెనుంబడున్= చింతిస్తాడు; తల్లడపడున్= కంపించిపోతాడు; దురంత చింత బారికిన్= అంతులేని బాధకు; అగపడున్= వశమౌతాడు.

**తాత్పర్యం:** ప్రియురాలికి ముందుగా పూదేనె పానీయాన్ని త్రాగనిచ్చి మిగిలిన పూదేనెను త్రాగుతున్న మగ తుమ్మెదను, రెక్కలను విప్పి ప్రేయసి చుట్టుతిరిగి దాని మనస్సు కరగించి లోబరుచుకొనే రాజహంసను, పండ్లరసాలను ఒకదాని కొకటి ముక్కులతో ముచ్చటగా పంచుకొంటూ మురిసిపోయే చిలుకజంటలను, గుంపును కనుగప్పి ఏకాంతంలో ఒకదాని శరీరానికి మరొకటి తాకేటట్లు సాగే కోయిల జంటలను సింహబలుడైన కీచకుడు ఆసక్తితో చూచి, చూచి మనస్సులో కోర్కెలు రేగగా తొట్రుపడేవాడు, నిశ్చేష్టుడయ్యేవాడు, కలత చేందేవాడు, తపించేవాడు, తల్లడిల్లేవాడు, మితిమీరిన చింతకు లొంగిపోయేవాడు.

**విశేషం:** 1. అలం: యథాసంఖ్యం. శృంగార రసపోషణలో ఆలంబన, ఉద్దీపన, తటస్థ విభావాలను యథావకాశంగా వర్ణించటం కావ్యసంప్రదాయం. నాయికానాయకుల యౌవనాదులు ఆలంబన విభావాలు, చేష్టాదులు ఉద్దీపన విభావాలు. ఉద్యానాదులు తటస్థ విభావాలు. అయితే తటస్థ విభావాలను ఉద్దీపన విభావాలుగా మార్చి చిత్రించటమే కవి ప్రతిభ. జడమైన ఉద్యానవనంలో చైతన్యస్ఫోరకమైన తిర్యక్కులు ఉద్దీపనకు తోడ్పడతాయి. ఉద్యానవనంలోని తుమ్మెదల జంటలు, హంస మిథునాలు, శుకపికాల దంపతులు సలిపే లలిత శృంగార చేష్టలు తటస్థ విభావంలోని ఉద్దీపన విభావ శక్తులు. కాళిదాసాది మహాకవులు నాయికానాయకుల రత్యుద్దీపనానికి వీటిని విభావాలుగా వాడారు. పశుపక్ష్యాదులందు మానవత్వారోపణం భావనామయం. ప్రియురాలికి మధువును ముందుగా ఇచ్చి మిగిలినది తాను త్రాగటం మనసిచ్చి పుచ్చుకొనటానికి సంకేతం; రెక్కలతో ప్రియురాలిని అనునయించి అంగీకరింప చేయటం సాంత్వన చాతుర్యం; ఫలరసాలను కలిపి అనుభవించటం మనసు లేకమైన మధుర భావనం. ఒంటరిగా జంటలు క్రీడించటం సంకేతస్థలాలలో స్వేచ్ఛగా రమించటం వంటివి. నాయిక పొందుగోరే సింహబలుడికి ఈ దృశ్యాలన్నీ ఉద్దీపకాలే ఔతాయి. వాటిలోకూడా ఒక క్రమవికాసదశ కనపడటం విశేషం. కావ్యంలో ఉద్దీపన విభావాలను చూచి ఉద్దీప్తమైన

పాత్ర కీచకుడు. పాఠకుడికి అతడు ప్రత్యక్ష విభావ మౌతాడు. అతడిలో పై నాలుగు దృశ్యాలను చూడటం వలన నాలుగు భావచేష్టలు అనుభవించాడు. వరుసగా అవి- చిడిముడి పడటం, మ్రానుపడటం, వెడంగు పడటం, వెనుబడటం. కోరికలు పెల్లుబుకగా అతడు తల్లడపడటం జరిగింది. ఇందులో తిక్కనకు ప్రీతిపాత్రమైన యథాసంఖ్యాలంకారం రాణిస్తున్నది.

2. తిర్యక్కుల శృంగారం రసాభాస మంటారు. నిజమే. అది పఠితకు ప్రత్యక్ష విభావమైనప్పుడు. మరి ఆ శృంగారం కావ్యనాయక రత్యుద్దీపక విభావంగా వర్ణించబడినప్పుడు రసాభాసం కాదు, రసపోషకం. పశుపక్ష్యాదుల శృంగారం భావశబలతను ప్రదర్శించలేదు. మానసికావస్థలనే చూపగలుగుతుంది. అయితే ఈ పద్యంలో తుమ్మెదల హంసల శుకపికాల వలన కలిగే మానసికావస్థలు కీచకుడిలో సంచారిభావాల పెంపుదలకు తోడ్పడుతున్నవి. 'చూచిచూచి యుల్లంబున వేచి కోర్కులడరన్' అని స్పష్టంగా తిక్కన పేర్కొనటం గమనార్హం. తిక్కన రసశిల్పి. (సంపా.)

3. ఈ పద్యం కాళిదాసు కుమారసంభవ కావ్యంలోని అకాల వసంతావిర్భావ వర్ణన సందర్భంగా చెప్పిన-

'మధు ద్విరేఫః కుసుమైకపాత్రే - పపౌ ప్రియాం స్వామనువర్తమానః।
శృఙ్గేణ సంస్పర్శనిమీలితాక్షీం - మృగీమకణ్డూయత కృష్ణసారః॥
దదౌ రసాత్ పఙ్కజరేణుగన్ధి - గజాయ గణ్డూషజలం కరేణుః।
అర్ధోపభుక్తేన బిసేన జాయాం - సంభావయామాస రథాఙ్గనామా॥' - అనే శ్లోకాలను స్ఫురింపజేస్తున్నది.

**వ. ఇట్టి వలవంత నిక్కడక్కడ వడిఁ దిరిగి తిరిగి. 307**

**తాత్పర్యం:** ఇట్లాంటి విరహబాధతో అటూ ఇటూ వేగంగా తిరిగి తిరిగి.

**క. వగ ముట్టికొనినఁ జిత్తము। వెగడొందఁగ మేను గలయ వెమ్మఁగ ధృతి పాఁ**
**తగల నొక తీవయింటికిఁ। దగియుండెడు చంద్రకాంతతల్పము సేరెన్. 308**

**ప్రతిపదార్థం:** వగ= బాధ; ముట్టికొనినన్= ఆవహించగా; చిత్తము= మనస్సు; వెగడు+ఒందఁగన్= తడబాటు కలుగగా; మేను= శరీరం; కలయన్= అంతా; వెమ్మఁగన్= తాపం పొందగా; ధృతిపాఁతు= ధైర్యము యొక్క మూలం; అగలన్= పగిలిపోగా; ఒక తీవ+ఇంటికిన్= ఒక లతాగృహానికి; తగియుండెడు= సరిపోయిన; చంద్రకాంత తల్పము= చలువరాతి తిన్నెను; చేరెన్= చేరాడు.

**తాత్పర్యం:** విరహతాపం విపరీతం కాగా అతడి మనసు కలత పొందింది; శరీరమంతా వేడెక్కింది; మనోధైర్యం మూలంతో సహా తెగింది. నెమ్మదిగా ఒక లతామండపంలో అమరిఉన్న చలువరాతి శయ్యమీదకు చేరాడు.

**విశేషం:** విరహుల పాలిటి వరాలు చంద్రకాంత శిలావేదికలు. మేనిలోని తాపాన్ని పోగొడతాయి. ఒకరకంగా అధికం చేస్తాయి. కీచకుడికి తాపాన్ని అధికం చేసింది ఆ ప్రదేశం.

**క. అం దొఱఁగి కీచకుం డా। యిందీవరనయన నాత్మ నిడి వేడ్కమెయిన్**
**డెందము చన విచ్చలవిడిఁ। గందర్పుఁడు వెట్టిఁ జేయఁగా నిట్లనియెన్. 309**

**ప్రతిపదార్థం:** అందున్= దానిపై; ఒఱగి= వ్రాలి; కీచకుండు; ఆ+ఇందీవరనయనన్= కలువలవంటి కన్నులు గల సైరంధ్రిని; ఆత్మన్+ఇడి= మనస్సులో ఉంచుకొని; వేడ్కమెయిన్= వేడుకతో; డెందము= మనస్సు; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; చనన్= పోగా -

ఊహలలో ఎగిరిపోతూ ఉంటే; కందర్పుఁడు= మన్మథుడు; వెఱ్ఱిన్+చేయఁగాన్= వెఱ్ఱివాడిని చేయగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ చంద్రకాంతశిలాతల్పంపై పరుండి కీచకు డా కలువలవంటి కన్నులు గల సైరంధ్రిని మనసులో నిలిపికొని, హృదయం ఆసక్తితో పరిపరివిధాల ఊహలలో తేలుతూ ఉండగా, మన్మథుడు అతడిని వెఱ్ఱివాడిని చేసి ఆడిస్తూ ఉంటే, ఇట్లా పలికాడు.

**విశేషం:** మనస్సు పరిపరివిధాలుగా పోవటం, మన్మథుడు వెఱ్ఱివాడిని చేయటం-అనే అంశాలు కీచకుడి ఉన్మత్తావస్థను సూచిస్తున్నాయి. "తత్సంశ్రితాం కథాం యుంక్తే సర్వావస్థాగతాపి హి । పుంసః ప్రద్వేష్టి చాప్యన్యా నున్మాదః సంప్రకీర్తితః॥ తిష్ఠ త్యనిమిషదృష్టి ర్దీర్ఘం నిఃశ్వసతి గచ్ఛతి ధ్యానమ్ । రోదితి విహారకాలే నాట్య మిదం స్యా త్తథోన్మాదే॥ (నా.శా. 12,185, 186). ఇది నాయికాపరంగా చెప్పిన లక్షణం. దీనిని ఇక్కడ పురుషపరంగా అన్వయించుకొనాలి. సర్వావస్థలలో నాయికాశ్రితమైన కథలనే ఎన్నుతూ, మిగిలినవాటిని ద్వేషించటం ఉన్మాద స్వభావం. కళ్ళార్పకుండా చూడటం, నిట్టూర్చటం, ఏదో ఏదో ఆలోచిస్తూ ఉండటం, విహార సమయంలో కూడా రోదించటం మొదలైనవి ఉన్మాద చేష్టలుగా భరతమహర్షి చెప్పాడు. ఆ అవస్థలోనే ఒక వస్తువును మరొక వస్తువుగా భావించటం ఉన్మాద మన్నాడు రసార్ణవ సుధాకరకర్త సింగభూపాలుడు. తిక్కన ఈ అవస్థను కీచకపాత్రోచితంగా నిర్వహించటం ప్రకరణౌచిత్యం. (సంపా.)

**సీ.** **'కెంగేలుఁ గేలితోఁ గీలించి నెయ్యంపు। మాటలఁ దగు మాఱుమాట లార్తుఁ**
**గుచము లురంబునఁ గుదియించి క్రమమున। నిఱిసిన కౌఁగిట నింపొనర్తు,**
**నంగుళంబుల నల్ల నలకలఁ గబళించి। కెమ్మోవి యాని యెక్కింతుఁ గాయ్పు,**
**మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి। సతిఁ దేల్తు సౌఖ్యరసంపునిట్టఁ,**

**తే.** **దనివు మొదలైనఁ జిగురొత్తు తమకమునకుఁ। బ్రాఁకు వెట్టుచు మగుడఁ బైఁబడుచు నింతి**
**వింత భంగుల కెలయించి వెకలిఁజేసి। యభిమత క్రీడనములకు నలవరింతు.'** **310**

**ప్రతిపదార్థం:** కెంపు+కేలున్= ఆమె ఎఱ్ఱని చేతిని; కేలితోన్= (కీచకుడు) తన చేతితో; కీలించి= పట్టుకొని; నెయ్యము+మాటలన్= ప్రియమైన పలుకులతో; తగు మాఱుమాటలు+ఆర్తున్= తగిన మారుమాటలు పలికిస్తాను, చెప్పుతాను; కుచములు= స్తనములు; ఉరంబునన్= రొమ్మున; కుదియించి= గ్రుచ్చి; క్రమమునన్= క్రమంగా; ఇఱిసిన కౌఁగిటన్= బిగి కౌగిలిలో; ఇంపు+ఒనర్తున్= సౌఖ్యం కలిగిస్తాను; అంగుళంబులన్= వేళ్ళతో; అల్లన్= మెల్లగా; అలకలన్= ముంగురులను; కబళించి= పట్టుకొని; కెంపు+మోవి= ఎఱ్ఱని పెదవిని; ఆని= త్రాగి; కాయ్పున్= కామాన్ని; ఎక్కింతున్= వ్యాపింప చేస్తాను; మనము= మనస్సు; మనంబునన్+ పెనఁచి= నా హృదయంతో పెనగజేసి; కేళికిన్+చొచ్చి= రతికేళికి ఉపక్రమించి; సౌఖ్యరసము+నిట్టన్= సంతోషరసప్రవాహంలో; సతిన్+తేల్తున్= ప్రియురాలిని అలరిస్తాను; తనివు= తృప్తి; మొదలైనన్= మొదలైతే; చిగురు+ఒత్తు= కలిగే; తమకమునకున్= మోహానికి; ప్రాఁకు+పెట్టుచున్= ఆశ్రయం కలిగిస్తూ; మగుడన్= మరల; పైన్+పడుచున్= ఆమెపై బడి కవ్విస్తూ; ఇంతిన్= సైరంధ్రిని; వింతభంగులకున్= అపూర్వమైన పద్ధతులకు; ఎలయించి= ఉన్ముఖురాలిగా చేసి; వెకలిన్+చేసి= వెఱ్ఱిగా నన్ను కోరేదాన్నిగా చేసి; అభిమతక్రీడనములకున్= ఇష్టమైన రతి వినోదాలకు; అలవరింతున్= అలవడేటట్లు చేస్తాను (నేర్పుతాను).

**తాత్పర్యం:** ఆమె లేత ఎఱ్ఱని చేతిని నా చేతితో పట్టుకొని వలపు మాటలాడి తగినట్లు ఆమెచేత కూడా పలికిస్తాను. ఆమె కుచాలను గుండెలకు హత్తుకొని బిగికౌగిట చేర్చి సంతోషం కలిగిస్తాను. ముంగురులను కొనవేళ్ళతో మెల్లగా

సవరించి ఆమె పెదవిని ముద్దాడి కామాన్ని పెంపు చేస్తాను. నా మనస్సు ఆమె మనస్సుతో పెనవేసికొనేటట్లు చేసి రతికేళికి ఉపక్రమించి ఆమెను సౌఖ్యరస ప్రవాహంలో ఓలలాడిస్తాను. సంతృప్తి మొదలైతే మోహం చిగురెత్తుతుంది. దానికి పందిరి పెట్టినట్లు మరల మరల ఆమెపై పడుతూ అపూర్వమైన పద్ధతులకు ఆమె అలవాటుపడేటట్లు చేసి, నన్ను వదలలేని వెర్రిదానినిగా చేసి వశపరచుకొని నాకిష్టమైన రతిక్రీడలన్నీ ఆమెకు నేర్పుతాను.

**విశేషం:** మదనపరవశుడైన కీచకుడు ద్రౌపది చేజిక్కినట్లుగా భ్రమలో ఈ విధంగా భావిస్తున్నాడు. ఉన్మాదం అనే కామావస్థలో కామోన్మాదం అనే సంచారి భావం సలక్షణంగా ఈ పద్యంలో ఆవిష్కరించబడింది. ఇది తిక్కన మాటలలో భావరతి. (చూడు తరువాతి వచనం). (సంపా.)

**వ. అనుచు వెండియు నిగుడు మనోరథంబులను, భావరతంబుల, శిశిరోపచారంబులఁ బ్రొద్దు గడపి (కడపి), కడగానక. 311**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; వెండియున్= మరల; నిగుడు= చెలరేగే; మనోరథంబులను= కోరికలతో; భావరతంబులన్= ఊహలలో సాగే, మానసిక రతులతో; శిశిర+ఉపచారంబులను= శైత్యోపచారాలతో; ప్రొద్దు+కడపి, కడపి= కాలక్షేపం చేసి చేసి; కడ+కానక= ఎంతకూ ప్రొద్దుబోక.

**తాత్పర్యం:** అంటూ మళ్ళీ చిగురించే కోర్కెలతో, సంకల్పరతులతో, శైత్యోపచారాలతో కాలక్షేపం చేసి దానికి అంతం కనిపించక. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'మాయరవి యేల క్రుంకఁడొ। కో?' యను, 'నిట్టేల తడసెనో?' యనుఁ; 'గ్రుంకం**
**బోయెడుఁ జూ యిప్పుడ' యను। 'దాయపటిచె' నను మనోజతాపము పేర్మిన్.' 312**

**ప్రతిపదార్థం:** మనోజతాపముపేర్మిన్= మదనవేదన యొక్క ఆధిక్యం చేత; మాయరవి= కపటి అయిన సూర్యుడు; ఏలక్రుంకడొకో!= ఎందుకు అస్తమించడో; అనున్; ఇట్టు+ఏల తడసెనో?= ఇట్లా ఎందుకు ఆలస్యం చేశాడో?; అనున్; ఇప్పుడు+అ= ఇప్పుడే; క్రుంకన్+పోయెడున్+చూ!= అస్తమించబోతున్నాడు గదా!; అనున్; దాయ+పటిచెన్= పగవాడై బాధపెట్టాడు; అనున్= అంటాడు.

**తాత్పర్యం:** మదనతాపం ఎక్కువ కావటంతో కీచకుడు- 'ఈ దుర్మార్గుడైన సూర్యుడు ఇంకా ఎందుకు అస్తమించడో?' అంటాడు. 'ఇంత ఆలస్యం ఎందుకు చేశాడో?' అంటాడు. 'అదుగో! అస్తమించబోతున్నాడు' అంటాడు. 'పగవాడై బాధపెట్టుతున్నాడు' అంటాడు.

**విశేషం:** విప్రలంభంలోని ఉన్మాదావస్థలో - రాణించే మరొక అంశం- ఉపాలంభనం. ఇక్కడ ప్రొద్దుక్రుంకితే రతి ఫలిస్తుందని ఉన్మత్తుడై ఊహిస్తున్న కీచకుడికి ఎంతసేపటికి అస్తమించని ఆదిత్యుడి మీద ఆగ్రహం వచ్చింది. 'మాయరవి' అని ఉపాలంభించాడు. తదేకదృష్టితో సూర్యగతిని గమనిస్తూ ఉండటం చేత- ఎందుకు క్రుంకడు? ఆలస్యం ఎందుకు చేస్తున్నాడు? ఇక ఇప్పుడు క్రుంకుతాడులే!-ఇటువంటి సమయోచిత వాక్య చాపల్యాన్ని ప్రదర్శించాడు. (సంపా.)

**తే. 'దినము కాని యింక భువనంబులం దిట। వట్టి రాత్రి లేని యట్టుగాఁగఁ**
**జేసెనొక్కొ విధి? విశేషించి నాకకా। నేఁడ దినము సాఁగి నిలిచె నొక్కొ!' 313**

**ప్రతిపదార్థం:** విధి= బ్రహ్మ; దినము+అ+కాని= పగలే కాని; ఇంకన్= ఇకపై; భువనంబులందున్= ప్రపంచంలో; ఇట+వట్టి= ఇకమీద; రాత్రి లేని+అట్టు+కాఁగన్= రాత్రి లేనట్లుగా; చేసె నొక్కొ!= చేశాడేమో!; విశేషించి= అధికంగా; నాకున్+అకాన్= నా కొరకే; నేఁడు+అ= ఈ రోజే; దివము= పగలు; సాఁగి= పొడవై; నిలిచెన్+ఒక్కొ!= నిలిచిపోయిందేమో!

**తాత్పర్యం:** 'బ్రహ్మ పగలేకాని, లోకంలో రాత్రి అసలే లేకుండా చేశాడా? నా కొరకు మాత్రమే ఈనాడు, పగలు దీర్ఘమై సాగిందా?'

**విశేషం:** అలం: వ్యాజనింద. నిందచేత నింద స్ఫురించేటట్లు వ్యాజనింద, ప్రియా విరహం వలన దీర్ఘంగా తోస్తున్న పగటిని నెపంగా చేసికొని బ్రహ్మను రాత్రిలేని పగలును కల్పించినందుకు ఉపాలంభనం చేశాడు. ఇప్పుడు కీచకుడికి కావలసింది రాత్రి. అందువలన ఈ పరోక్ష సూర్యోపాలంభనం ప్రకరణౌచిత్యం. (సంపా.)

**తే.** **అనుచుఁ గ్రుంకింపరానిప్రొ ద్దరసి యరసి. । శిశిర పర్యంకమున మేను చేర్చి చేర్చి,**
**వంతఁ దలపోసి తలపోసి వనరి వనరి । మిగుల వందురి వందురి, పొగిలి పొగిలి.** **314**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; క్రుంకింపరాని= అస్తమించేటట్లు చేయలేని; ప్రొద్దు= సూర్యుడిని; అరసి+అరసి= చూచి చూచి; శిశిరపర్యంకమునన్= చల్లని పాన్పుపై; మేను= శరీరం; చేర్చిచేర్చి= చాలాసేపు చేరవేసి; వంతన్= దిగులుతో; తలపోసి, తలపోసి= మరీ మరీ ఆలోచించి; వనరి వనరి= మరీ మరీ దుఃఖపడి; మిగులన్= ఎక్కువగా; వందురి వందురి= మరీ మరీ బాధపడి; పొగిలి పొగిలి= బాగా తపించి.

**తాత్పర్యం:** అని అంటూ, అస్తమింపచేయలేని ప్రొద్దును పదే పదే చూస్తూ, విరహతాపాన్ని చల్లార్చే పాన్పుపై శరీరాన్ని తేప తేపకూ చేరుస్తూ, వలపు దిగులుతో మరీ మరీ ఆలోచిస్తూ, దుఃఖపడుతూ, బాధపడుతూ, మిక్కిలి తపించాడు.

**విశేషం:** 1.అలం: వృత్త్యనుప్రాసం. ఇక్కడ అరసి అరసి, చేర్చి చేర్చి, వనరి వనరి, వందురి వందురి, పొగిలి పొగిలి అని ఆమ్రేడితంగా చెప్పడంలో కీచకుడి ఆవేదనలోని తీవ్రత వ్యక్తమవుతున్నది. 2. ఇందులో 'వ్యాధి' అనే మదనావస్థ వర్ణితం. 'కోరుకొన్న కలయిక సాధ్యం కాకపోవటంచేత కలిగే తాపం వ్యాధి' అవుతుంది. సంతాపం, నిశ్వాసం, చల్లని వస్తువులను ఆశ్రయించటం, సేవించటం, జీవితాన్ని లెక్కచేయకపోవటం, మరణించాలన్న తలంపు, ధైర్యం కోలుపోవటం, ఒక్కసారి (విరుచుకొని) పడిపోవటం, అవయవాలు వదులుగా ఉండటం మున్నగునవి ఇందలి చేష్టలు అని సింగభూపాలుడు (రసార్ణవసుధాకరం II. 194-195- డాక్టర్ పి.యస్.ఆర్.అప్పారావుగారి 'సాత్త్వికాభినయం' నుండి పు. 449). (సంపా.)

**సీ.** **తనికెడు నారటంబున నంతకంతకు । వెమ్ముచు నునికికి విడుమరయును,**
**గోలు మసంగెడు కోర్కుల వెనువెంటఁ । బాఱుచు నునికికి నూఱటయును,**
**వావిరిఁ బొదివెడు వగల సందడిఁబడి । యురియుచు నునికికి నుడుకువయును,**
**నందంద కదిరెడు కొందలపాటుచేఁ । దలఁకుచు నునికికి నిలుకడయును**

**ఆ.** **లేమిఁ దాల్మిగొనఁగలేక యలందురి । తనువు నింద్రియములు మనము ధృతియుఁ**
**దనవశంబుగాక తల్లడపడి సింహ । బలుఁడు విషమబాణుబారిఁ బాఱె.** **315**

**ప్రతిపదార్థం:** తనికెడు+ఆరటంబునన్= విస్తరించే ఆరాటంతో; అంతకున్+అంతకున్= మాటిమాటికి; వెమ్ముచున్= తాపం పొందుతూ; ఉనికికిన్= ఉండటానికి; విడుమరయును= విడుపున్నూ; కోలుమసంగెడు= మిక్కిలి అతిశయించే; కోర్కుల వెనువెంటన్=

కోర్కెల వెంబడి; పాఱుచున్+ఉనికికిన్= పరుగెత్తుతుండటానికి; ఊఱటయును= ఊరడింపున్నూ; వావిరిన్= వరసగా; పొదివెడు= క్రమ్ముకొనే; వగలసందడిన్= చింతల అలజడిలో; పడి= చిక్కుకొని; ఉరియుచున్= తపిస్తూ; ఉనికికిన్= ఉండటానికి; ఉడుకువయును= విరామమున్నూ; అందు+అందు+అ= అప్పటికప్పుడే; కదిరెడు= కలిగే; కొందలపాటుచేన్= సంక్షోభంతో; తలఁకుచున్= భయపడుతూ; ఉనికికిన్= ఉండటానికి; నిలుకడయును= స్తిమితమున్నూ; లేమిన్= లేకపోవటం వలన (ఇది నాలుగు సీసపు పాదాలలోని చివరి క్రియలకూ అన్వయిస్తుంది); తాల్మికొనఁగలేక= ఓర్పు వహించలేక; అలందురి= శ్రమపడి; తనువు= శరీరం; ఇంద్రియములు= ఐదు ఇంద్రియాలు; మనము= మనస్సు; ధృతియున్= ధైర్యం; తవవశంబు+కాక= తనవల్లగాక; తల్లడము+పడి= కలతచెంది; సింహబలుఁడు= కీచకుడు; విషమబాణుబారిన్= మన్మథుడి బారినపడి; పాఱెన్= పోయాడు.

**తాత్పర్యం:** అంతకంతకు పెరిగే ఆరాటంతో తాపం పెచ్చుపెరుగుతూ ఉంటే దానికి విడుదల లేకపోవటం వలన, చెలరేగే కోర్కెల వెంట పరుగెత్తుతూ ఉంటే విరామం లేకపోవటం వలన, విరివిగా క్రమ్ముకొనే వలపు కోరికల సందడిలో పడి తపిస్తూ ఉంటే దానికి విశ్రాంతి లేకపోవటం వలన, అప్పటికప్పుడు పుట్టుకొని వచ్చే కలతపాటుతో భయపడుతూ ఉంటే, దానికి నిలుపుదల లేకపోవటం వలన సహనం చూపలేక, వ్యథపొంది, శరీరం, ఇంద్రియాలూ, మనస్సూ, ధైర్యమూ తన వశం నుండి తప్పుకోగా సింహబలుడు తల్లడిల్లి మన్మథుడి బారినపడి పరుగులు తీశాడు.

**విశేషం:** 1. అలం: యథాసంఖ్యం. సీసపద్యపాదాలలోని వాక్యార్థాలకూ ఎత్తుగీతిలోని శబ్దాలకూ క్రమంగా అన్వయం కుదురుతుంది కాబట్టి యథాసంఖ్యాలంకారం. తాపానికి విడుదల లేకపోవటంతో శరీరం వశం తప్పింది. పరుగెత్తే కోర్కెలకు విరామం లేకపోవటంతో ఇంద్రియాలు వశం తప్పాయి. వలపు కోరికల సందడికి విశ్రాంతి లేకపోవటంతో మనస్సు వశం తప్పింది. కలతవలని భయం ఆగకపోవటంతో ధైర్యం వశం తప్పింది. ఈ నాలుగూ వశం తప్పటంతో సహనం కోల్పోయాడు. దానితో అయిదు బాణాల అనంగుడికి వశమైపోయాడు. అతడి వెంట పరుగెత్తసాగాడు. 2. వ్యాధి అనే మన్మథావస్థలో మన్మథతాపం వలన పడే బాధను వర్ణించటం పరాకాష్ఠ. ప్రియురాలి తోడి సమాగమం బాగా ఆలస్యం అవుతూ ఉండటంచేత కలిగే మన్మథ జ్వరం తాపమని విద్యానాథుడు ప్రతాపరుద్రీయంలో పేర్కొన్నాడు. ఆ తాపాన్ని నిగ్రహించుకోలేని స్థితి వలన శరీరాదులకు కలిగిన 'వ్యాధి' అవస్థను తిక్కన శాస్త్రోక్తంగా, ప్రకరణోచితంగా వర్ణించటం ప్రశంసనీయం. (సంపా.)

**క. ఇమ్మెయిని నధిక పరితా। పమ్మునఁ బడు సూతు హృదయపద్మం బలరం**
**దమ్మికొలంకులు మొగుడ, వ। నమ్ములు సోలంగ దివసనాథుఁడు గ్రుంకెన్. 316**

**ప్రతిపదార్థం:** ఈ మెయినిన్= ఈ విధంగా; అధిక పరితాపమ్మునన్+పడు= మిక్కిలి బాధపడే; సూతుహృదయపద్మంబు= సూతుడయిన కీచకుడి మనస్సు అనే పద్మం; అలరన్= విప్పారగా, సంతోషంగా; తమ్మి కొలంకులు= పద్మ సరోవరాలు; మొగుడన్= ముకుళించగా; వనమ్ములు= తోటలు; సోలంగన్= సొమ్మసిల్లగా; దివసనాథుఁడు= సూర్యుడు; క్రుంకెన్= అస్తమించాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా మిక్కిలి మదనబాధ పొందే కీచకుడి మనస్సు సంతోషించగా, కమల సరోవరాలు ముకుళించగా, వనాలు సోలిపోగా సూర్యుడు అస్తమించాడు.

**విశేషం:** సూర్యాస్తమయానికి పద్మాలు ముకుళించాయి. వనాలు వన్నె తప్పాయి. కాని, కీచకుడి హృదయపద్మం మాత్రం వికసించింది. అంటే ఒక కార్యానికి బాధకమైనది మరొక కార్యానికి సాధకమైనదన్నమాట. ఇది వ్యాఘాతం. హృదయపద్మం- రూపకం. సూర్యాస్తమయం కావటం కీచకుడి ప్రణయసిద్ధికి ప్రారంభంగా అనిపించినా చివర కది వ్యాఘాతానికి దారి తీయబోతున్నదని అలంకార ధ్వని. (సంపా.)

**వ. తదనంతరంబ.** 317

**తాత్పర్యం:** ఆ తరువాత.

## సూర్యాస్తమయ వర్ణనము

(ఇది మూలమునందు లేదు)

**క. ఇనుఁడు దనకడకు నేతెం । చిన రాగముఁ బొందు టిది యుచిత మనఁగాఁ గెం**
**పున మెఱసి పశ్చిమాశాం । గన జనసంభావనముల గౌరవ మందెన్.** 318

**ప్రతిపదార్థం:** ఇనుఁడు= సూర్యుడు (ప్రియుడు); తన కడకున్= తనవద్దకు; ఏతెంచినన్= వచ్చినచో; రాగమున్= ప్రేమను (ఎఱ్ఱదనాన్ని); పొందుట+ఇది= పొందటమనేది; ఉచితము+అనఁగాన్= న్యాయమన్నట్లు; పశ్చిమ+ఆశా+అంగన= పశ్చిమ దిక్కు అనే స్త్రీ; కెంపునన్ మెఱసి= ఎర్రదనంతో ప్రకాశించి; జనసంభావనముల= ప్రజల మన్ననల యొక్క; గౌరవము+అందెన్= గౌరవం పొందింది.

**తాత్పర్యం:** సూర్యుడు తనవద్దకు రాగా రాగం పొందటం (ఎర్రబడటం) అనేది న్యాయమే అన్నట్లు ఎర్రదనంతో వెలుగొందే పడమర దిక్కనే కాంత జనుల ప్రశంసలతో గౌరవం పొందింది.

**విశేషం:** 1. అలం: శ్లేష. ఉత్ప్రేక్ష, సమాసోక్తి, రూపకం. 2. ఇనుఁడు= (నానార్థాలు) సూర్యుడు, నాథుడు, రాజు; అంగన= వనిత, భార్య, రాగము+పొందుట= ఎర్రదనం వహించు, అనురాగం పొందుట; కెంపునన్= ఎర్రదనంతో, పద్మరాగమణితో; సంభావనములు= గౌరవాలు; నమస్సులు, ప్రశంసలు; గౌరవము= పెద్దరికం, మర్యాద, మన్నన. ఈ నానార్థస్ఫూర్తితో ఈ పద్యాన్ని అన్వయించవచ్చును. కాబట్టి శ్లేష. నాథుడైన సూర్యుడు కవయటానికి సమీపిస్తే పశ్చిమ దిక్కు అనే భార్య సహజంగా అనురాగాన్ని పొంది ఔచిత్యంతో శోభిల్లింది. అని లోకంలో ప్రజలంతా ఆమెను సంధ్యావందనాదులతో ప్రశంసిస్తూ ఉంటే - ఆమె గౌరవం పొందింది - అని అర్థమేర్పడి ఒక అనుకూలవతి యొక్క భర్తృ వాల్లభ్య గౌరవాన్ని భావించగలుగుతాం. ఈ అన్వయాన్నే - ఒక నాథుడికీ, భార్యకూ మధ్యా, ఒక రాజుకూ అభిసారికకూ మధ్య కూడా చేయవచ్చును. అందువలన శ్లేషాలంకారం. ఇందులో ప్రస్తుతాంశం వలన మరొక అప్రస్తుతాంశం స్ఫురిస్తున్నది కాబట్టి సమాసోక్తి. సూర్యుడు తన దరికి రాగానే పశ్చిమ దిశాంగన అనురాగం చెందిందేమో అన్నట్లు కెంజాయను వహించిందనటంలో ఉత్ప్రేక్ష. పశ్చిమాంగన అన్నప్పుడు రూపకం. 3. కవి ప్రకృతిని అలంకారికంగా వర్ణించటం ఒక యెత్తు; కావ్యంలోని ఒకపాత్రయొక్క చిత్తవృత్తి కనుగుణంగా సంభావనం చేయటం మరొక యెత్తు, తిక్కన చేసిన ఈ వర్ణనలో ఈ రెండెత్తులూ ఉండటం విశేషం. తత్కాల కీచక భావరతానికి అనుగుణమైన భావచిత్రం ఈ పద్యంలో అమరటం అలంకారశిల్పం. (సంపా.)

**ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁదొడంగె, మనోభవుండు వి**
**ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁజొచ్చె, నేల కెం**
**పెక్కుచు వచ్చె; దీవియల యేడ్తెఱ సోయగ మందె; సందడుల్**
**దక్కెఁ బురంబు వీథుల, మదం బొలసెన్ విట చిత్తవృత్తులన్.** 319

**ప్రతిపదార్థం:** చుక్కలు= నక్షత్రాలు; తోడుతోడన్= వెంటనే; తలచూపన్+తొడంగెన్= కనిపించటం మొదలుపెట్టాయి; మనోభవుండు= మన్మథుడు; విల్లు+ఎక్కు+ఇడి= వింటిని ఎక్కుపెట్టి; చక్రవాకముల= చక్రవాక పక్షుల; ఇక్కలు= నివాసాలను;

రోయఁగన్+చొచ్చెన్= వెదకసాగాడు; నేల= భూమి; కెంపు+ఎక్కుచున్ వచ్చెన్= ఎఱ్ఱబారసాగింది; దీవియల+ఏడ్తెఱ= దీపాల విజృంభణం; సోయగము+అందెన్= అందగించింది; సందడుల్= గొడవలు (శబ్దాలు); తక్కెన్= తగ్గాయి, పురంబు వీథులన్= నగర వీథులలో; విటచిత్తవృత్తులన్= విలాసకాంక్ష మనస్సులలో; మదంబు+ఒలసెన్= మద్యం సేవించటంవల్ల ఆనందం కలిగింది.

**తాత్పర్యం:** చుక్కలు ఒక్కొక్కటే మెరుస్తూ మొగాలు బైటపెడుతున్నాయి. మన్మథుడు విల్లు ఎక్కుపెట్టి చక్రవాకాలుండే చోట్లను వెదక నారంభించాడు. నేలంతా ఎరుపెక్కుతూ వచ్చింది. దీపాలకాంతి సోయగాన్ని సంతరించుకొన్నది. పురవీథులలో జనుల సందడి తగ్గింది. విటుల మనఃప్రవృత్తులలో మదభావం విరిసింది.

**విశేషం:** 1. అలం: స్వభావోక్తి, సూర్యు డస్తమించి చంద్రు డుదయించే లోపల ఉండే సంధ్యా సమయాన్ని సహజసుందరంగా, ధ్వని బంధురంగా తిక్కన వర్ణించాడు. చుక్కలు తోచటం, చక్రవాకాల జంటలు కళ్ళకనపడక, దగ్గరున్నా విరహావేదన పడటం (అందుకే మన్మథుడు వాటిని బాణాలతో కొట్టుండాలి), సంధ్యారుణ కాంతితో భూమి ఎఱ్ఱబడటం (అంటే ఇంకా చీకటితో నల్లబడలేదని భావం), దీపాల సోయగం, పురవీథులు నిశ్శబ్దం కావటం, క్రమంగా విటులు మదించి విజృంభించటం - అనేవి ఆ సంధ్యాసమయంలో జరుగుతున్న పరిణామాన్ని క్రమంగా సూచిస్తూ తిక్కనప్రకృతిపరిశీలనప్రజ్ఞను ప్రకటిస్తున్నాయి. 2. ఇందులో విటుల మదభావం పేర్కొనబడింది. ఇది సంచారి భావం. మద్యం సేవించటం వలన కలిగేది మదమని భరతుడు; మద్యం వలన కలిగిన ఆనంద సమ్మోహాల మిశ్రమం మదమని సింగభూపాలుడు; మద్య సేవనం వలననేకాక ఐశ్వర్యం, విద్య, ఆభిజాత్యం, ఉత్తమ స్త్రీ పరిష్వంగ సంభోగాలు మొదలైన వాటివలన కూడా ఏర్పడే భావం మదమని శారదాతనయుడు. ఇవి ఉత్తమ మధ్యమాధమ భేదాలతో మూడు రకాలు. తరుణ మదం (యౌవనం వలన ఏర్పడే మదం) ఉత్తమం; మధ్యమదం (మద్యం వలన ఏర్పడే మదం) మధ్యమం; అవకృష్టమదం (అల్పులమదం) అధమం అని భరత శాస్త్రం. కొన్ని మహాభారత ప్రతులలో 'మదంబు' అనే పాఠానికి బదులు 'ముదంబు' అనే పాఠం కనబడుతున్నది. 'మద'మనే పాఠమే సందర్భోచితం. విటులకు మదం సహజం కాని, ముదం కాదు. 3. ప్రకృతి వర్ణనాన్ని మానవ ప్రకృతి వ్యంజకంగా చేయటం తిక్కన నేర్పరితనం. కీచకుడు కూడా విటశేఖరుడు. అతడు వలపుమద్యం వలన మదభావాన్ని పొంది ఉన్నాడు. అతడు మనసులో కోరుకొనే సంధ్యాకాలం ఆతడి యెదుట ధ్వనిమయంగా తారసిల్లింది. మెరుస్తున్న క్రీగంటి చూపులు, కొనగోళ్ళు నక్షత్రాలుగా చెప్పటం కవిసమయం. అవి తలలెత్తి తోస్తున్నాయి. అట్లాగే చక్రవాకాల జంటలను వక్షోజాల జంటగానూ (వాటి మధ్య మన్మథ బాణం తాకేటట్లుగానూ) చెప్తుతారు. నేల (క్షేత్రం - భార్య - యోని) రాగరంజితం కావటం, దీపాల కాంతి వంటి నగల కాంతులు రంజిల్లటం, పురవీథులు - పురమంటే శరీరం, వీథులు అంటే కళామార్గాలు అలజడి లేకుండా అనుకూలంగా ఉండటం. ఇవన్నీ గమనిస్తే ఏ ఉత్తమ విటుడిలోనైనా తరుణమదం తురంగలిస్తుంది. కీచకుడి మనసులో శారదాతనయుడు చెప్పినట్లు ఉత్తమ స్త్రీ పరిష్వంగ సంభోగ భావజన్యమైన మదం ధ్వనిమయం. (సంపా.)

**వ. పదంపడి జారచోరజనంబుల మనంబు లలరం జంద్రాస్తమయం బగుటయు. 320**

**ప్రతిపదార్థం:** పదంపడి= తరువాత క్రమంగా; జారచోరజనంబుల= వ్యభిచారుల, దొంగల; మనంబుల= మనస్సులు; అలరన్= సంతోషించగా; చంద్ర+అస్తమయంబు+అగుటయున్= చంద్రుడు క్రుంకగా.

**తాత్పర్యం:** వెంటనే జారచోరుల మనస్సులకు ఆహ్లాదం కలిగేటట్లు చంద్రుడు క్రుంకగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. పెనుమి ట్టిది పల్లం బిది। యనకుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ**
**గనువిచ్చుటయును మోడ్చుట। యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్. 321**

**ప్రతిపదార్థం:** ఇది, పెనుమిఱ్ఱు= ఇది పెద్ద మిట్ట; ఇది పల్లంబు= ఇది గుంట; అనకుండఁగన్= అనటానికి వీలులేని విధంగా; ఓలమును= మరుగు ప్రదేశమూ; బయలున్= బయలూ; ఒక్కటిగాన్= ఒకేరకంగా; కనువిచ్చుటయును= వికసించటం; మోడ్చుటయును= ముడుచుకొనటం; సరి+కాన్= సమానం కాగా; ఉర్విన్= భూమిపై; తోడ్తోన్= వెంటవెంటనే; తమము= చీకటి; పర్వెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** ఇది ఎత్తు, ఇది పల్లం అని చెప్పలేనట్లుగా, లోపలా బయటా ఒకటే విధంగా, కళ్ళు తెరిచినా మూసినా ఒకటే విధంగా ఉండేటట్లు చీకటి క్రమంగా నేలను క్రమ్మేసింది.

**భీమకీచకులు నర్తనశాలలోఁ గలసికొనుట (సం. 4-21-38)**

**వ. అప్పు డా కృశోదరి వృకోదరుకడకుం జని సమయం బయ్యె ననవుడు.** 322

**ప్రతిపదార్థం:** ఆ కృశ+ఉదరి= చిక్కిన నడుము కలది (ఆ ద్రౌపది); వృక+ఉదరుకడకున్+చని= తోడేలు ఉదరంవంటి ఉదరం కలవాడు (తోడేలు ఆకలి కంటె ఆకలి గలవాడు) ఐన భీముడివద్దకు వెళ్ళి; సమయంబు+అయ్యెన్+అనవుడున్= సమయం అయిందని చెప్పగా.

**తాత్పర్యం:** అప్పుడు ద్రౌపది భీముడి వద్దకు వెళ్ళి సమయం అయిందని చెప్పగా.

**తే. అతఁడు పెండ్లికిఁ బిలిచినయట్లు వికచ। హృదయుఁడై తలచీర యాయితము సేసి**
**ద్రుపదనందనఁ జూచి 'నాతోన వెనుక। నల్ల నంతంత నరుగుదె' మ్మని కడంగి.** 323

**ప్రతిపదార్థం:** అతఁడు= భీముడు; పెండ్లికిన్+పిలిచిన+అట్లు= పెండ్లికి పిలిచినట్లు; వికచహృదయుఁడు+ఐ= వికసించిన మనస్సు కలవాడై; తలచీర= తలపాగా; ఆయితము+చేసి= సవరించుకొని; ద్రుపదనందనన్+చూచి= ద్రౌపదిని చూచి; నా తోన్+అ వెనుకన్= నా వెంట; అల్లన్+అంతన్+అంతన్= మెల్లగా దూరదూరంగా; అరుగు+తెమ్ము+అని= రమ్మని; కడంగి= పూని ముందుకు నడచి.

**తాత్పర్యం:** భీముడు పెళ్ళికి పిలిచినట్లు సంతోషించి, తలపాగా చుట్టుకొని ద్రౌపదిని తన వెనుక అనుసరిస్తూ కొంచెం దూరం దూరంగా మెల్లగా రమ్మని కోరి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: లోకోక్త్యలంకారం. పెళ్ళికి పిలిచినట్లు- అనేది జాతీయం. ఆనందంగా వెళ్ళటానికి సంకేతం. కీచకుడిని సంహరించటానికి భీము డెంత గాఢంగా ఉత్సాహపడుతున్నాడో ఒక్కసారి తన హృదయ వికాసం ప్రదర్శించటంలో ప్రకటితమౌతున్నది. 'తలచీర' అనేది ఆనాటి పురుషుల వస్త్రధారణను తెలియజేస్తున్నది. తలపాగాను చుట్టుకొనటం అలవాటు. 'చీర' అంటే కేవలం కోక అనే అర్థంలో కాక వస్త్రం అనే అర్థంలో తీసికొనాలి.

**చ. గమనమువీఁక వేఱొక వికారము పుట్టక సంగరోత్సవో**
**ద్యమరభసాతిరేకము బయల్పడు టించుకలేక రోషసం**
**భ్రమ మొకయింతయైనఁ బరభావనిరూప్యముగాక ద్రౌపదీ**
**రమణుఁడు వోయె విక్రమధురంధరతం దగ నాట్యశాలకున్.** 324

**ప్రతిపదార్థం:** గమనము వీఁకన్= పోవటంలోని ఉత్సాహంలో; వేఱొక వికారము= క్రొత్త మార్పు; పుట్టక= జనించక; సంగర+ఉత్సవ+ ఉద్యమరభస+అతిరేకము= యుద్ధానికి పోయే పండుగ జరుపుకొనే ప్రయత్నంలోని వేగాధిక్యం; బయల్పడుట= బయటపడుట; ఇంచుకలేక= కొద్దిగా కూడా లేకుండా; రోషసంభ్రమము= కోపంతో కూడిన తొట్రుపాటు; ఒక ఇంత+ఐనన్= కొంచెం కూడా; పరభావ నిరూప్యము+కాక= ఇతరుల మనస్సులచే తెలియదగినది గాక; ద్రౌపదీరమణుఁడు= భీముడు; విక్రమధురంధరతన్= పరాక్రమ నిర్వహణతో; నాట్యశాలకున్= వర్తనశాలకు; తగన్+పోయెన్= సముచితంగా వెళ్ళాడు.

**తాత్పర్యం:** ద్రౌపదీ రమణుడైన భీముడు తన నడకలో భేద మేమీ లేనట్లుగా, యుద్ధానికి పోయే ఉత్సాహం కొద్దిగా కూడా బయటపడకుండా, తన కోపావేశం బయటవారు తెలిసికొనలేకుండా గంభీర పరాక్రమమూర్తి వహించి నర్తనశాలకు వెళ్ళాడు.

**విశేషం:** ద్రౌపదీరమణుడనే విశేషణం భీముడి అంతరంగాన్ని ధ్వనిస్తున్నది. సరి అయిన కాలంలో శక్తిమంతంగా ప్రత్యర్థిని ఎదుర్కొనటానికి తగిన మానసిక సమాహిత సంకల్పాన్ని వికార విరహితమైన భీముడి గంభీర పరాక్రమమూర్తి వ్యక్తం చేస్తున్నది. అతడి మూర్తి తుఫానుకు ముందు కానవచ్చే ప్రకృతి ప్రశాంతతవలె కానవస్తున్నది.(సంపా.)

**వ. చని వివేకరహితు హృదయంబునుం బోలెఁ దమోదూషితంబును, విదగ్ధ వనితా ప్రేమంబునుం బోలె దుర్నిరూపంబును, ఘోరాటవీ భాగంబునుం బోలె నిర్మనుష్యంబును, గాపురుష లక్ష్మీ విలాసంబునుం బోలె ననుపయోగ్యంబును, ననభ్యస్త శాస్త్రంబునుం బోలె దుర్గమంబును, స్వప్నలబ్ధపదార్థంబునుం బోలె నదృష్టి గోచరంబును, విషమ కావ్యంబునుం బోలె నస్పష్టాలంకారంబును, బాలిశు రాజ్యంబునుం బోలె జారచోర హృద్యంబునునైన యా నర్తనాగారంబు ముఖభాగ స్థలంబుసేరి. 325**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; వివేకరహితు హృదయంబునున్+పోలెన్= తెలివితక్కువ వాడి మనస్సువలె; తమస్(ః)+దూషితంబును= చీకటిచేత నిందించబడినదీ, (తమోగుణంచేత, అజ్ఞానం చేత చెడినదీ); విదగ్ధ వనితా ప్రేమంబునున్+పోలెన్= ప్రౌఢనాయిక ప్రేమవలె; దుర్ నిరూపంబును= తెలియరానిదీ; ఘోర+అటవీ భాగంబునున్+పోలెన్= భయంకరమైన అరణ్యంవలె; నిర్+మనుష్యంబును= మనుష్యులు లేనిదీ; కాపురుష లక్ష్మీ విలాసంబునున్+పోలెన్= నీచపురుషుడి సంపద యొక్క అతిశయంవలె; న+ఉపయోగ్యంబునున్= ఉపయోగించటానికి వీలులేనిదీ; న+అభ్యస్తశాస్త్రంబునున్+పోలెన్= చదువబడని శాస్త్రంవలె; దుర్గమంబును= చొరబడరానిదీ; స్వప్నలబ్ధ పదార్థంబునున్+పోలెన్= కలలో లభించిన వస్తువువలె; అదృష్టిగోచరంబును= కంటికి కనిపించనిదీ; విషమ కావ్యంబునున్+పోలెన్= కష్టమైన గ్రంథంవలె; అస్పష్ట+అలంకారంబును= స్పష్టంగా తెలియని అలంకారాలు గలదీ; బాలిశురాజ్యంబును+పోలెన్= మూర్ఖుడి రాజ్యంవలె; జారచోరహృద్యంబును= విటులకు, దొంగలకు ఇష్టమైనదీ; ఐన ఇనటువంటె; ఆ నర్తన+అగారంబు= ఆ నాట్యశాలయొక్క; ముఖభాగస్థలంబు+చేరి= ముందరి ప్రదేశం చేరి.

**తాత్పర్యం:** తెలివితక్కువవాడి హృదయంవలె చీకటితో కలిషితమైనదీ, ప్రౌఢ నాయిక ప్రేమవలె నిరూపించలేనిదీ, భయంకరారణ్యంవలె మనుష్యులు లేనట్టిదీ, నీచపురుషుడి సంపద వలె ఉపయోగరహితమైనదీ, చదువబడని శాస్త్రం వలె చొరరానిదీ, కలలోని వస్తువు వలె కంటికి కనిపించనిదీ, కష్టమైన కావ్యంవలె అలంకారాలు స్పష్టం కానిదీ, దుష్టుడి రాజ్యం వలె జారులకూ, చోరులకూ సంతోషం కలిగించేదీ అయిన నర్తనశాల ముందరిభాగాన్ని చేరాడు.

**విశేషం:** 1. అలం: ఉపమ, శ్లేష. కన్ను పొడుచుకొన్నా కనబడని చీకటిలో నర్తనశాలను స్పష్టంగా చూచినట్లు వర్ణించటం సముచితం కాదు. కాని, ఆ ప్రదేశం ఒక మహాయుద్ధానికి రంగం కాబోతున్నది. అంతా చీకట్లో, ఆ భవనగర్భంలో జరుగబోతున్నది. అట్టి

భవనాన్ని గురించి భౌతికంగా కాక భావనామయంగా వర్ణించి చెప్పటం ప్రకరణౌచిత్యం. భావనామయచిత్రాన్ని ఆర్థీ ఉపమానాలతో రూపుకట్టించటం, శ్లేషతో కూడిన సమానధార్మాలతో ఉపమేయోపమానాలను సమర్థించటం ఇందులో శిల్పం. ఉపమేయ, ఉపమాన ధర్మాలు వరుసగా ఇట్లా ఉంటాయి. తమము (చీకటి, తమోగుణం), దుర్నిరూపం (రూపం తెలిసికోలేనిది, ఇదమిత్థంగా తెలిసికొన లేనిది), నిర్మనుష్యం (మనుష్యులు సంచరించనిది, మనుష్యులు నివసించనిది), అనుపయోగ్యం (ఉపయోగించనిది; ఉపయోగానికి పనికిరానిది), దుర్గమంబు (వెళ్ళటానికి కష్టమైనది, దాటటానికి సాధ్యం కానిది), అదృష్టిగోచరంబు (కంటికి కనబడనిది, దృష్టిగోచరం కానిది. అస్పష్టాలంకారంబుఁ అర్థంకాని శబ్దార్థాలంకారాలు కలది, స్పష్టంగా కనబడని భవనాలంకారాలు కలది), జారచోరహృద్యంబు (జారులకు చోరులకు ఆకర్షణీయమైనది. జారులచేతచోరులచేత అందమైనది). 2. ఇటువంటి శైలి కాదంబరి, దశకుమార చరితంవంటి సంస్కృత కావ్యాలలో బాగా కనబడుతుంది. తిక్కన మిత్రుడు మూలఘటిక కేతన దండి దశకుమార చరిత్రను తెలుగుచేసి మిత్రుడికి అంకితమిచ్చాడు. తిక్కనకు కూడా దండి రచన మీద కొంత అభిమానం ఉండటంలో ఆశ్చర్యం లేదు. మొత్తానికి ఇది తిక్కన సహజశైలి కాదు. ప్రాచీన కవుల శైలులను కూడా యథావకాశంగా ప్రయోగించటం మహాకవిత్వ లక్షణాలలో ఒకటి. దానిని తిక్కన అక్కడక్కడ అద్భుతంగా, అయినా ఔచిత్యవంతంగా, నిర్వహిస్తాడు. అట్టి విశేషరచనకు ఇది ఒక ఉదాహరణం. (సంపా.)

**క. కెలఁకులుఁ, బిఱింది దెసయుం, । గలయం బరికించి తన యఖండిత బాహా**
**బలగర్వమ యచ్చట ముం । గలిగా మదమత్తభద్రగజసదృశగతిన్. 326**

**ప్రతిపదార్థం:** కెలఁకులున్= పక్కప్రదేశాలూ; పిఱింది దెసయున్= వెనకదిక్కూ; కలయన్+పరికించి= చక్కగా చుట్టూ చూచి; తన= తనయొక్క (భీముడి యొక్క); అఖండిత బాహాబలగర్వము+అ= తక్కువకాని భుజబలసమృద్ధియే; అచ్చటన్= నర్తనశాలలో; ముంగలి+కాన్= ముందుకాగా; మదమత్తభద్రగజసదృశగతిన్= మదించిన పట్టపు ఏనుగువలె నడుస్తూ,

**తాత్పర్యం:** భీముడు నర్తనశాల నాలుగు ప్రక్కల కలయ చూచి మొక్కవోని తన భుజబలమే సహాయంగా కలవాడై మదించిన పట్టపుటేనుగువలె నడుస్తూ వెళ్లాడు.

**విశేషం:** అలం: ఉపమ. భీముడి నడకను భద్రగజగమనంతో పోల్చడంతో జయం తథ్యమని సూచించటమైనది. నర్తనశాల ప్రవేశ ఘట్టాన్ని మూలాతిశయంగా తిక్కన చిత్రించాడు. మదంచేత మత్తిల్లిన భద్రగజంవలె నిస్సంకోచంగా లోపలికి ప్రవేశించాడట భీముడు! మదించినా భద్రతయందు శ్రద్ధ వహించిన వివేకం ప్రకటించా డతడు. అందువలననే నలుదిక్కులా కలయజూచి ఎవ్వరూ తనను చూడటం లేదని నిశ్చయించుకొన్నాడు. లోనికి ప్రవేశిస్తే తన బలమే తనకు రక్ష. ఏకైకవీరుడై విజృంభించాలి. ఆ సంగతిని తనలో తెలివికి తెచ్చుకొన్నాడు. వివేచనతో కూడుకొన్న విశిష్ట ప్రయత్నం విజయకారకం అనే ధైర్యంతో భద్రగజంవలె ముందుకు సాగాడు. (సంపా.)

**శా. ధ్వాంతాకారితకుడ్యకుట్టిమ ఘనస్తంభావలీరూపముం,**
**బ్రాంతాది ప్రవిభాగ బోధ రహిత ప్రాగ్ద్వారముం, గాతర**
**స్వాంత త్రాసకరంబు నై, దురభివేశంబైన యా లోను ని**
**శ్చింతుండై సతికేలు వట్టికొని చొచ్చెన్ భీముఁ డత్యుగ్రతన్. 327**

**ప్రతిపదార్థం:** ధ్వాంత+ఆకారిత= చీకటి రూపుకట్టినట్లుగా ఉన్న; కుడ్య= గోడలయొక్క; కుట్టిమ= నేలయొక్క; ఘనస్తంభ+ఆవలీ= పెద్ద స్తంభాల వరుస యొక్క; రూపమున్= రూపం కలదానినీ; ప్రాంత+ఆది= తుదిమొదళ్ళు, దగ్గరా దూరం మొదలైన; ప్రవిభాగ=

భేదం యొక్క; బోధ రహిత= తెలివిడి లేని (తెలియని); ప్రాక్+ద్వారమున్= ముందరి (సింహ) ద్వారం కలదీ; కాతరస్వాంత= భయపడే మనస్సుకలవారికి; త్రాసకరంబున్+ఐ= భయం కలిగించేదై; దురభివేశంబు+ఐన= చొరరానిదైన; ఆ లోను= ఆ నర్తనశాల లోపలి భాగంలో; నిశ్చింతుండు+ఐ= ఏ దిగులూ (ఏ అనుమానమూ) లేనివాడై; సతి కేలు= ద్రౌపది యొక్క చేయి; పట్టుకొని= అందికొని; భీముఁడు= అతి+ఉగ్రతన్= మిక్కిలి కోపంగా; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** చీకటి రూపుకట్టినట్లుగా మారిన గోడలూ, నేలపైభాగం, స్తంభాల వరుసా కల రూపంతో ఉన్నదానినీ, (భవనాంగాలను విడివిడిగా తెలిసికొనలేనంతగా చీకటిలో మునిగిపోయిన రూపం కలిగినదని భావం). తుది మొదళ్ళు విడమరచి తెలిసికొనలేని సింహద్వారం కలిగిందీ, (ముందు ద్వారం కూడా చీకట్లో స్పష్టంగా కనబడనిదీ అని భావం), పిరికివారి హృదయాలను చెదరగొట్టేదీ, చొరటానికి సాధ్యం కానిదీ అయిన నర్తనశాల లోపలిభాగంలోకి నిశ్చింతగా భీముడు భార్యచేయి పట్టుకొని అమితకోపంతో ప్రవేశించాడు.

**విశేషం:** ఈ వర్ణనం అమూలకం. ముఖద్వారం ద్వారా భీముడు నర్తనశాల లోపలిభాగంలోనికి ప్రవేశించే ఘట్ట మిది. ద్రౌపది చేయిపట్టుకొని మిక్కిలి భయం కలిగించే కోపభావంతో లోనికి ప్రవేశించాడు. లోపలంతా కటిక చీకటి. భవనాంగాలను, తుది మొదళ్ళను గుర్తించలేని చీకటి. పిరికివాళ్ళకు భయంకరంగా ఉండి చొరటానికి చొరనివ్వని చీకటి. తిక్కన ప్రకృతి వర్ణనను వాచ్యార్థ స్ఫూర్తికొరకు ఎంత వాడతాడో వ్యంగ్యార్థ దీప్తికొరకు అంత వాడతాడు. ఇందులో భావించదగిన అంశాలు-

1. వెనుకటి పద్యంలో మదమత్తగతి చెప్పబడింది. అది ఈ పద్యగతిలో చూపించబడింది. నర్తనశాల లోపలి భాగాన్ని నాలుగు సమాసాలతో వర్ణించాడు తిక్కన. ఉత్తరోత్తరాలు క్రమంగా చిన్నవైపోవటం విశేషం. అందులో కూడా ఒక క్రమవిన్యాసం కనపడుతుంది. అందులోకి భీముడు నిశ్చింతుడై ప్రవేశించి నడిచిన వైఖరిని 'ధ్వాంతాకారిత.. రూపమున్' అనే దీర్ఘసమాసం ధ్వనింపచేస్తున్నది. సింహద్వారాన్ని దాటుతున్న గతిలో సతి కేలువట్టి నడచినవైఖరి వ్యంజితమౌతున్నది. పిరికివాళ్ళకు భయం కలిగించే చోటికి అతడు అత్యుగ్రతతో వెళ్లాడనీ, దురభివేశమైన ఆ ప్రాంతంలో అవలీలగా ప్రవేశించాడనీ ధ్వని. నాలుగడుగులు వేయటం తెలుగు జాతీయం. భీముడు నాలుగడుగులు వేసినట్లు నాలుగు సమాసాలు. మొదట వేగంగా సాగి, క్రమంగా నెమ్మదిగా నడచిన వైఖరి భద్రతకు ప్రతీక. దీర్ఘాక్షర బహుళమైన పద్యగతి మందగతిని సూచిస్తూ నర్తనశాల వైశాల్యాన్ని కూడా ధ్వనింపజేస్తున్నది. కీచకుడు తప్పక వస్తాడనీ, అతడిని తప్పక జయిస్తాననీ నిశ్చయించిన భీముడు నిశ్చింతగా ముందుకు సాగాడనీ వ్యంగ్యం. 2. భీముడు విక్రమ గంభీరుడుగా నర్తనశాలవరకూ నిబ్బరంగా నడచి వచ్చాడు. ఇక చీకటింటిలో ప్రవేశించేటప్పుడు కార్యనిర్వహణకు తగిన 'అత్యుగ్రత' ను మనస్సులో నింపుకొన్నాడు. ఉగ్రత రౌద్రరస అనుభావం. రౌద్రం వలన శత్రుసంహారమే కార్యఫలం. నిశ్శబ్దమైన, భయంకరమైన అంధకారం మృత్యుసదృశ్యం. శత్రుసంహారరూపమైన కార్యం చీకటిలో ధ్వని. కీచకవధ అపూర్వంగా జరుగబోతున్నది. దాని నిర్వహణ భావనను భీముడికి అందించింది ఆ చీకటిరూపంగా తోచిన నర్తనశాలయే. ఇది గోడ, ఇది నేల, ఇవి స్తంభాలు అనే తేడా తెలియని ఆ వింత రూపం కీచకుడిని చంపటంలో అనుసరించవలసిన పద్ధతిని సూచించింది. వాడి కాళ్లూ, చేతులు, తల మొదలైనవాటిని అతడి శరీరంలో గ్రుచ్చి మహామాంసపిండం చేసి వింత చావు కల్పిస్తాడు. ఆ భావన ఈ మొదటి సమాసం స్ఫురింపచేసింది. ఇది మొదలు, ఇది తుద అని తెలియని ముఖద్వారం భీముడి వింత మల్లయుద్ధ వైఖరిని స్ఫురింపచేసింది. లోకభయంకరంగా, మరొకరు ఆ పద్ధతిలో యుద్ధం చేయలేరన్నట్లుగా గూఢంగా యుద్ధం చేయాలన్న అజ్ఞాతవ్రత దీక్షా స్పృహ చివర భీముడి మనస్సులో మెరిసింది. ఈ విధంగా చీకటిలో చీకటిగా తోచిన నర్తనశాల శత్రుసంభార విధాన సూచికగా భీముడి అంతరంగంలో స్ఫురించింది. ఇది తిక్కన వస్తురసధ్వని శిల్పం! (సంపా.)

**వ. ఇట్లుసొచ్చి తతీయంజని మధ్యప్రదేశంబున విరాటనందన లీలాపర్యంకం బరసి కని, దాని కనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి, తా నా తల్పంబున నుండె; నంతం గీచకుండు. 328**

**ప్రతిపదార్థం:** ఇట్లు+చొచ్చి= ఈవిధంగా ప్రవేశించి; తడియన్+చని= లోపలికి వెళ్ళి; మధ్యప్రదేశంబునన్= నర్తనశాల నడిమిభాగంలో; విరాటనందన= ఉత్తరయొక్క; లీలాపర్యంకంబు= విలాసంగా పడుకొనే పాన్పును; అరసి కని= పరిశీలించి తెలిసికొని; దానికిన్+అనతి దూరంబునన్= దాని దగ్గరలో; పాంచాలిన్= ద్రౌపదిని; ఒసరిలన్+ఉనిచి= కనబడకుండా దాచి ఉంచి; తాను= భీముడు; ఆ తల్పంబునన్= ఆ పాన్పుపై; ఉండెన్= ఉన్నాడు; అంతన్= అప్పుడు; కీచకుడు.

**తాత్పర్యం:** భీము డా విధంగా ప్రవేశించి లోపలికి వెళ్ళి భవనంమధ్యలో ఉత్తర పవళించే మెత్తని పాన్పును పరిశీలించి, తెలిసికొని, దానికి సమీపాన ద్రౌపదిని కనబడకుండా దాచి వుంచి, ఆ పాన్పుపై కూర్చున్నాడు. అప్పుడు కీచకుడు.

**విశేషం:** లీలాపర్యంకం - విలాసశయ్య (మెత్తని పాన్పు). రాజకుమార్తె నాట్యాభ్యాసంలో అలసినప్పుడు విశ్రాంతి తీసికొనే మంచం. అది ఇప్పుడు లీలాపర్యంకం (విలాసశయ్య)గా పనికి వస్తుందని భీముడు ఆ స్థలాన్ని నిశ్చయించాడు. అది భవనమధ్యభాగంలో ఉన్నది కాబట్టి రహస్యం బాగా రక్షించబడుతుంది. ఈ రెండూ స్థలనిర్దేశంలో ముఖ్యమైన అంశాలు. (సంపా.)

**క.** **కైసేసి మద వికారో। ల్లాసంబున మేను వొంగ లఘుగతి నుత్కం**
**ఠాసవపానవిధాన। వ్యాసంగతరంగితాంతరంగుం డగుచున్.** **329**

**ప్రతిపదార్థం:** కైసేసి= అలంకరించుకొని; మదవికార+ఉల్లాసంబునన్= మదభావం వలన కలిగిన వింత సంతోషంతో; మేను= శరీరం; పొంగన్= పొంగిపోగా; లఘుగతిన్= వేగంగా కొద్దిగా సేవించే పద్ధతిలో; ఉత్కంఠా= మదనోత్సాహం కొరకు; ఆసవ, పాన, విధానవ్యాసంగ= మద్యాన్ని సేవించే పద్ధతిలోని ఆసక్తి చేత; తరంగిత+అంతరంగుండు= ఉప్పొంగుతున్న మనస్సు కలవాడు; అగుచున్= ఔతూ.

**తాత్పర్యం:** అలంకరించుకొని, మదభావంతో కలిగిన వింతగా శరీరం ఉప్పొంగుతూ ఉండగా; కొద్దిగా వేగంగా ఉత్కంఠాసవాన్ని (మదనోద్రేకానికి పనికి వచ్చే మద్యాన్ని) సేవించటం వలన కోర్కెతో తరగలెత్తిన మనస్సు కలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇందులోని మదభావం మద్యం వలన కలిగింది కాబట్టి కీచకుడు మధ్యమ ప్రవృత్తి కలవాడని ధ్వని. 'విధా+నవ్య+ఆసంగ= కొత్తదయిన మాలిని యొక్క సంగమము' అనే అర్థాన్ని జనహిత వ్యాఖ్య చెప్పింది. ఉత్కంఠా+ఆసవము= అనే సమాసాన్ని రూపకంగా శ్రీమున్నంగి శర్మ పరిష్కృత విరాటపర్వంలో చెప్పబడింది. (సంపా.)

**శా.** **సింగంబున్న గుహా నికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చు మా**
**తంగంబుం బురుడించుచుం బవనపుత్ర స్వీకృతంబైన యా**
**రంగాగారము సేరవచ్చి మదిలో రాగంబు ఘూర్ణిల్ల నిం**
**తిం గాముం డిఁటఁ దేఁడె యింత కని యుద్వృత్తాంగజోన్మాదుఁడై.** **330**

**ప్రతిపదార్థం:** సింగంబు= సింహం; ఉన్న గుహానికేతమునకున్= ఉన్న గుహానివాసంలోనికి; శీఘ్రంబునన్= త్వరగా; వచ్చు= వచ్చే; మాతంగంబున్= ఏనుగును; పురుడించుచున్= పోలుతూ; పవనపుత్ర స్వీకృతంబు+ఐన= భీముడు గ్రహించిన; ఆ రంగ+అగారము= ఆ నర్తనశాల; చేరన్+వచ్చి= లోపలికివచ్చి; మదిలోన్= మనస్సులో; రాగంబు= వలపు; ఘూర్ణిల్లన్= తిరుగాడగా (వేగిరపెట్టగా); ఇంతకున్= ఇప్పటికే; ఇంతిన్= సైరంధ్రిని; కాముండు= మన్మథుడు; ఇఁటన్+తేఁడె= ఇక్కడకు తీసికొనిరాడా?; అని= అని భావించి; ఉత్+వృత్త+అంగజ+ఉన్మాదుఁడు+ఐ= విజృంభించిన (పైకెగిసిన) వలపుపిచ్చి కలవాడై.

**తాత్పర్యం:** సింహం ఉన్న గుహానివాసానికి వేగంగా వచ్చే ఏనుగును అనుకరిస్తూ భీముడు అధిష్ఠించి ఉన్న ఆ నర్తనశాలను సమీపించి కీచకుడు మనస్సులో వలపు సుడులు తిరుగుతూ నినదిస్తూ ఉండగా 'ఇప్పటికే మన్మథుడు ఆ కాంతను ఇక్కడికి తెచ్చి ఉంటాడులే' అని భావించి, ఒడలు తెలియక విజృంభించే వలపుపిచ్చి రెచ్చినవాడై.

**విశేషం:** అలం: ఉపమానం. సింహం నివసిస్తున్న కొండగుహకు ఏనుగు వేగంగా వెళ్ళినట్లు భీముడున్న నర్తనశాలకు కీచకుడు వెళ్ళాడు. చక్కని ఉపమానం. అట్లా వేగంగా వెళ్ళటానికిగల కారణం? సింహం ఉన్నదని తెలిసా? తెలియకా? తెలియకే వెళ్ళుతున్నాడు. అక్కడ మన్మథుడు తెచ్చి ఉంచిన వనిత ఉంటుందని వెళ్ళుతున్నాడు. వలపులు మదిలో సుళ్ళు తిరిగి రాగాలు తీస్తున్నాయి. వలపు పిచ్చి (మోహోన్మాదం) మనసులో ఉవ్వెత్తున లేస్తున్నది. అంటే ఉత్తమ వనితను పొందబోతున్నానన్న మదభావం, ఇదివరకే అతడిలో జాగృతమై పొంగులు వారుతున్న తరుణమదం, మద్యమదాలకు ఉత్పోషకంగా ఉన్నది. అందువలనే మూడంచెల ఉన్మాదం ముయ్యెత్తుగా ఎగసింది. అది ఉన్మత్తావస్థయొక్క పరాకాష్ఠ. దానివలన వనితాసంభోగవాంఛతో అతడు శాలలో ప్రవేశించాడు. పై ఉపమానం రాబోయే గండాన్ని సూచిస్తున్నది. సింహం బారిన ఏనుగు పడి మరణిస్తుందని అలంకార ధ్వని. ఇది పఠితలు మాత్రమే ఊహించగలరు. మరి సింహబలుడికి ఈ సంగతి తెలియదు. అది విధివిలాసం. అతడు మదనోన్మాదంతో వనిత మాటను నమ్మి నర్తనశాలలో ప్రవేశించాడు. కీచకుడిపరంగా అది విటుడు సంకేతస్థలానికి సానురాగంగా వెళ్ళుతున్న శృంగార రసస్థితిని తెలుపుతుంది. అది ధర్మవిరుద్ధమని పఠితలు భావించటంవలన అది రసాభాసమౌతుంది. అయినా, అతడు వంచనకు గురి ఔతున్నాడన్న భావం కూడా పఠితలకు కలుగుతుంది. కావున అతడివైపు వారి సానుభూతి కలుగుతుంది. సామాజికుల హృదయాలలో అలంకారశిల్పంతో భీముడితో సహానుభూతినీ, కామావస్థ చిత్రణంలో కీచకుడియందు సానుభూతినీ చిత్రించి విరుద్ధభావాల విశిష్టశబలతతో రసోల్లాసాన్ని కలిగించే రచనాశిల్ప మిది. (సంపా.)

**ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధము గాఁగ శంక యొ**
**క్కంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలి గాఁగ మండపా**
**భ్యంతరభూమిఁ జొచ్చి తటియంజని యారసి సెజ్జఁ గాంచి య**
**త్యంత ముదావహం బగుడు నందు రయంబునఁ గేలు సాఁచినన్. 331**

**ప్రతిపదార్థం:** కీచకుఁడు= కీచకుడు; స్వాంతము= మనస్సు; బాహుగర్వ= భుజబలగర్వమనే; ఘనసంతమస+అంధము +కాఁగన్= చిమ్మచీకటివలన గ్రుడ్డిది కాగా; శంక+ఒక్క+అంతయున్ లేక= అనుమానం కొద్దిగా కూడా లేకుండా; అహంకృతి= అహంకారం; ముంగలి+కాఁగన్= ముందు నడవగా; మండప+అభ్యంతరభూమిన్= నాట్యశాల లోపలిభాగంలో; చొచ్చి= ప్రవేశించి; తటియన్+చని= సంకేతస్థలాన్ని సమీపించి; ఆరసి= పరిశీలించి; సెజ్జన్+కాంచి= పాన్పును చూచి; అతి+అంత ముద్+ ఆవహంబు+ అగుడున్= మిక్కిలి సంతోషం కలిగించేది కావటం చేత; అందున్= అందులో; రయంబునన్= త్వరగా; కేలు= చేయి; చాఁచినన్= చాచగా.

**తాత్పర్యం:** తన మనస్సు బాహుబలమనే చిమ్మచీకటిలో గ్రుడ్డిదైపోగా రవంతకూడా అనుమానం లేకుండా కీచకుడు అహంకారమే ముందు నడవగా నర్తనశాల మండపంలోని అంతర్భాగానికివెళ్ళి, సంకేతంగా ఏర్పరచుకొన్న చోటును సమీపించి, పరిశీలించి శయ్యను చూచి, మిక్కిలి సంతోషం కలుగగా వెంటనే తన చేతిని ఆ శయ్యమీదకు పోనిచ్చాడు (చాచాడు).

**విశేషం:** అలం: రూపకం, కావ్యలింగం. 'స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధము గాఁగన్' అన్న చోట రూపకం, కావ్యలింగం అలంకారాలుగా రాణిస్తున్నాయి. కీచకుడు నర్తనశాలలోకి ప్రవేశించిన తరువాత సైరంధ్రి వచ్చి ఉంటుందని నమ్మాడు. కాని,

వచ్చింది సైరంధ్రియేనా అని తేల్చుకొనే ప్రయత్నం ముందుగా చేయలేదు. దానికి కారణం లేకపోలేదు. తాను వస్తే, వచ్చింది కీచకుడేనా అని ఆమె కూడా అడగలేదు. ఆమెకు తనమీద అంత నమ్మకం. అందువలన తాను 'వచ్చింది నీవేనా?' అని చీకట్లో ఆమెను పలకరించి ధ్రువపరచుకొనలేదు. దీనికి అతడి బాహుబలగర్వమనే చీకటి కారణం. అందువలననే తనకు ఎదురయ్యే ప్రమాదాన్ని తెలిసికొనే వివేకం లేని గ్రుడ్డివాడయ్యాడు. తన అంతటివాడిని వలచి వచ్చిన మగువను గురించి భావించుకొంటూ తన గర్వమే మార్గదర్శిగా సాగిపోయి, సంకేతస్థలాన్ని గుర్తించి శయ్యను పసికట్టాడు. దానిపై ఆమె ఉన్న జాడలు లీలగా తోచాయి. మనస్సు సంతోషంతో పొంగిపోయింది. అప్పుడైనా పలకరించి ఎవరో తెలిసికొందామని అతడికి స్ఫురించలేదు. అతడి మనసు గ్రుడ్డిది కావటం చేత ఆమె కొరకు చేయి చాచాడు. (వస్తుజ్ఞానాన్ని చేతితో తెలిసికొనటం గ్రుడ్డివాడి లక్షణం) దీనికంతా కారణం బాహుగర్వఘన సంతమసత్వమే. ఇట్లా కీచకుడి చర్యలను సమర్థించటానికి తిక్కన కావ్యలింగాలంకారాన్ని ధ్వనిమయంగా వాడాడు. (సంపా.)

**చ. ఘనతర కోప వేగమునఁ గంపమునొందు నిజాంగకంబులం**
**దనధృతి పెంపు సొంపచలితంబులఁ జేయ సమీరుకూర్మినం**
**దనుఁడు తదీయ చేష్టలును దద్వచనంబుల చొప్పు నేర్పడం**
**గను మతి నూరకుండె నవికార నిగూఢ నిజ ప్రకారుఁడై. 332**

**ప్రతిపదార్థం:** ఘనతర= మిక్కిలి గొప్పదైన; కోపవేగమునన్= తీవ్రమైన కోపంతో, కంపమున్+ఒందు= వణుకుతున్న; నిజ+అంగకంబులన్= తన అవయవాలను; తన ధృతి పెంపు సొంపు= తన ధైర్యగుణం యొక్క అతిశయ వైభవం; అచలితంబులన్= కదలనివాటివిగా; చేయన్= చేయగా; సమీరు కూర్మినందనుఁడు= వాయుదేవుడి ప్రియపుత్రుడు- భీముడు; తదీయచేష్టలను= అతడి చర్యలూ; తత్+వచనంబుల చొప్పున్= అతని మాటలతీరూ; ఏర్పడంగన్= తేటపడేటట్లు; కను మతిన్= చూద్దాములే అనే ఆలోచనతో; అవికార= వికారంలేని (ఎటువంటి కలతపాటు లేని); నిగూఢ నిజప్రకారుఁడు+ఐ= కప్పబడిన తన పద్ధతి కలవాడై (లేదా రహస్యమైన తన పద్ధతి కలవాడై); ఊరక+ఉండెన్= ఊరకున్నాడు.

**తాత్పర్యం:** భీముడు తీవ్రమైన కోపంతో అదురుతున్న తన శరీర అవయవాలను ధైర్యశక్తి వైభవంతో చిక్కబట్టుకొని ఆ కీచకుడి చేష్టలను, మాటలతీరును పరికిద్దామని అనుకొని తన గుట్టు బయటపడకుండా (తన సహజమైన ఉద్ధత స్వభావాన్ని దాచుకొని) ఎటువంటి కోపతాపాలకు గురికాకుండా ఊరక ఉండిపోయాడు.

**విశేషం:** అంతటి భీముడు ఈ విధంగా తన పద్ధతి మార్చుకొని నడుచుకొనటం విచిత్రంగా ఉంటుంది. ఇందువలన ఉద్ధతుడైన భీముడు ధీరుడైనాడు. అతడిలో కోపం విజృంభించాలంటే కీచకుడు ద్రౌపది పట్ల పలికే పలుకులూ, చేసే చేష్టలూ అతడికి తెలియాలి. అవి క్రోధభావ విభావాలు కావాలి. అందుకై ఈ మౌనం. ఈ సౌమ్య నిర్వికార వర్తనం. (సంపా.)

**ఆ. కీచకాధముండు కిమ్మీర వైరిపైఁ। గేలు సాఁచి యా విశాలనయన**
**గాఁ దలంచి మేను గరుపాఱ నిట్లను। మదన ఘూర్ణమాన హృదయుఁ డగుచు. 333**

**ప్రతిపదార్థం:** కీచక+అధముండు= నీచుడైన కీచకుడు; కిమ్మీరవైరిపైన్= కిమ్మీరుడిని చంపిన భీముడిపై; కేలు+చాఁచి= చేయిసాచి; ఆ+విశాలనయన+కాన్= ఆ వనిత (సైరంధ్రి)గా; తలఁచి= తలపోసి; మేను గఱుపారన్= శరీరం పులకించగా; మదన ఘూర్ణమాన హృదయుఁడు+అగుచున్= మన్మథభావాలతో కలయబారిన మనస్సుగలవాడౌతూ; ఇట్లు+అనున్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కీచకుడు భీముడి శరీరంపై చేయి వేసి, మాలిని అనుకొని (స్పర్శను అనుభవించి) గగుర్పాటు చెందిన శరీరం కలవాడై, మన్మథభావాలు మనస్సులో ఉప్పతిల్లగా ఇట్లా అన్నాడు.

**చ. 'వనిత! మనోహరంబులగు వస్తువులెల్లను వేడ్క నేఱి నీ**
**కని నియమించి తెచ్చితిఁ బ్రియంబునఁ గైకొను; మెప్డు నంగనా**
**జనములు నన్నుఁజూచి మరు సాయకముల్ దమ చిత్తవృత్తు లేఁ**
**చినఁ గొనివచ్చి యిత్తురు విశిష్టధనంబులు నాకు లంచముల్. 334**

**ప్రతిపదార్థం:** వనిత!= ఓ మాలినీ!; మనోహరంబులు+అగు= అందమైన; వస్తువులు+ఎల్లను= వస్తువులన్నీ; వేడ్కన్+ఏఱి= వేడుకగా ఏర్పరిచి; నీకున్+అని, నియమించి తెచ్చితిన్= నీ కొరకై ప్రత్యేకంగా ఎన్నికచేసి తీసికొని వచ్చాను; ప్రియంబునన్= ప్రీతితో; కైకొనుము= తీసికొనుము; ఎప్డున్= ఎప్పుడూ; అంగనాజనములు= స్త్రీలందరూ; నన్నున్+చూచి= నన్ను (కీచకుడిని) చూచి; మరుసాయకముల్= మన్మథ బాణాలు; తమ చిత్తవృత్తులు= తమ మనఃప్రవృత్తులను; ఏఁచినన్= బాధించగా; విశిష్టధనంబులు= విశేష ధనాలను; నాకున్ లంచముల్= నాకు లంచాలుగా; కొనివచ్చి= తీసికొని వచ్చి; ఇత్తురు= ఇస్తారు.

**తాత్పర్యం:** 'ఓ మాలినీ! నీకుగా మేలి వస్తువులను ఏర్పరచి, ప్రీతితో తెచ్చాను. తీసికొనుము. ఇదివర కెప్పుడూ స్త్రీలు నన్ను చూచిన తరువాత మన్మథుడు తన బాణాలతో వారి మనస్సులలో మరులు రేపగా వారు నా పొందుకోరి విలువైన ధనాలను లంచాలుగా తెచ్చి ఇస్తారు.

**విశేషం:** విటులు తాముకోరినవారిని వలపింపజేసికొనటానికి లంచాలు ఇవ్వటం సహజం. ఇక్కడ స్త్రీలు తనను వలచివస్తారని లంచాలిస్తారని కీచకుడు సగర్వంగా చెప్పుకొంటున్నాడు. ఇందువల్ల అతడి స్వరూపాభిమానమూ, ఆత్మస్తుతీ తెలుస్తున్నాయి.

**సీ. నాదు రూపంబు మనంబునఁ జిక్కిన। తరుణి దక్కొరునేల సరకుసేయు?**
**నాదు లావణ్యంబునకు నిచ్చ మెచ్చిన। యెలనాఁగ పైఁబడ కేల నిలుచు?**
**నా విలాసంబులు భావింపఁ బడసిన। యింతి పుష్పాస్త్రుచే నెట్లు బ్రదుకు?**
**నా వివేకమున కానందింపఁ గనిన యం। గన యెట్లు విరహాగ్నిఁ గ్రాఁగకుండు?**

**తే. మెఱయ నా యాడుమాటలు దెఱవపిండు। నుల్లములకు నింపారెడు నురులు గావె?**
**యిట్లు నీ వొక్కతవె నన్ను నేలుకొంటి। గాక మాట లింకేటికిఁ గమలవదన !' 335**

**ప్రతిపదార్థం:** కమలవదన!= పద్మం వంటి ముఖం గల ఓ వనితా!; నాదు రూపంబు= నా సౌందర్యం; మనంబున్+చిక్కినన్= మనస్సులో లగ్నమైన; తరుణి= స్త్రీ; తక్కు+ఒరునిన్= మరొకరిని; ఏల= ఎందుకు; సరకుసేయున్?= లెక్కపెట్టుతుంది?; నాదు లావణ్యంబునకున్= నా మేని నిగనిగలకు; ఇచ్చన్+మెచ్చిన= మదిలో మెచ్చుకొన్న; ఎలనాఁగ= స్త్రీ; పైన్+పడక+ఏల నిలుచున్?= పైన వచ్చి పడకుండా ఎట్లా నిలువగలుగుతుంది?; నా విలాసంబులు= నా శృంగారపు హొయలును గురించి; భావింపన్+పడసిన= ఆలోచించే అదృష్టం పొందిన; ఇంతి= స్త్రీ; పుష్ప+అస్త్రుచేన్= మన్మథునిచేత; ఎట్లు బ్రదుకున్?= ఎట్లా బ్రదుకుతుంది?; నా వివేకమునకున్= నా తెలివి తేటలకు; ఆనందింపన్+కనిన= సంతోషించగలిగిన; అంగన= స్త్రీ; విరహ+అగ్నిన్= విరహమనే

నిప్పులో; ఎట్లు+క్రాఁగక+ఉండున్?= వేగకుండా ఎట్లా ఉండగలుగుతుంది?; మెఱయన్= ప్రకాశించగా; నా+ఆడు మాటలు= నేను మాట్లాడే మాటలు; తెఱవపిండు= స్త్రీ సమూహంయొక్క; ఉల్లములకున్= మనస్సులకు; ఇంపారెడు= ప్రీతి కలిగించే; ఉరులు కావె= ఉచ్చులు (బంధాలు) కావా?; ఇట్లు= ఈ విధంగా; నీవు+ఒక్కతవె= నీవు ఒక్కదానివే; నన్నున్= (కీచకుడిని); ఏలుకొంటి(వి)గాక!= ఏలుకొన్నావు సుమా!; మాటలు+ఇంకన్+ఏటికిన్= ఇక ఇంతకంటె మాటలు ఎందుకు? (ఇక మీద మాటలతో కాలక్షేపం చేయటం ఎందుకు? (రతికి ఉపక్రమిద్దామని భావం).

**తాత్పర్యం:** నా సౌందర్యం చూచిన స్త్రీ నన్ను తప్ప మరొకరిని ఎందుకు లెక్కిస్తుంది? నా లావణ్యాన్ని చూచిన అంగన నాపైన పడిపోకుండా ఎట్లా ఉండగలదు? నా విలాసాలను చూచిన స్త్రీ మదనబాణాలకు గురి అయి ఎట్లా బతుకగలదు? నా తెలివితేటలు చూచి ఆనందించిన స్త్రీ విరహాగ్నిలో పడి వేగిపోకుండా ఎట్లా ఉండగలదు? నా మాటలు మగువల మనసులకు అందమైన గాలాలు! ఈ విధంగా నేనింతవరకూ వనితలనందరినీ ఆకర్షిస్తూ ఉన్నాను. కాని, ఇప్పుడు నీ వొక్కతెవే నన్ను ఆకర్షించి ఏలుకొన్నావు. ఇంతకంటె నేను ఇంక ఏమి చెప్పేది?' (అయినా ఇంకా మాటలతో పనేమిటి? చేతల కుపక్రమిద్దాం).

**విశేషం:** 1. కీచకుడి రూప, లావణ్య, విలాస, వివేక, సంభాషణలను చూచిన వనితలు వరుసగా ఇతరులను సరకుచేయరు. ఇతరులను మెచ్చుకోరు. ఇతరులను భావించరు. ఇతరుల వివేకానికి ఆనందించరు. కాగా, కీచకుడికే చిక్కుతారు. అతడినే కోరుతారు. అతడు దొరకకపోతే మన్మథబాణాలకు గురియై, చనిపోవాలనుకొంటారు; మదనాగ్నిలో పడి మ్రగ్గిపోతారు. అతడి మాటలు ఇంపైన ఉరులు. అతడు దొరికితే ఇంపునిస్తాయి. దొరకకపోతే చంపుతాయి. ఇవన్నీ వనితలను తన సౌందర్య విలాసాలతో ఏలుకొనే పద్ధతులని కీచకుడు ఆత్మస్తుతి చేసికొన్నాడు. 2. అంతగా వనితలను ఏలుకొన్న నన్ను ఏలుకొన్నదానవు నీవు-అని సైరంధ్రిని ప్రశంసించాడు. కీచకుడు. ఇవి ప్రియురాలిని ప్రసన్నురాలిని చేసికొనటానికి పలికే ప్రశంసోక్తులు. 3. 'మాటలింకేటికి కమలవదన!' అనే మాటలకు రెండు రకాల అర్థాలున్నాయి. ఇంతకంటె అతిశయోక్తులు ఎందుకని ఒక అర్థం. ఇంక మాట లెందుకు చేతలకు ఉపక్రమిద్దామని మరొక అర్థం. ఈ రెండవ అర్థాన్ని కూడా భావించి భీముడు ఉలిక్కిపడి ఉంటాడు. ఇక మాటలు తానే సాగించాడు చేతలకు ఊతలుగా. (సంపా.)

**క. అనవుడు మనమున నిస్సీ! యని, యుచిత నిగూఢభంగు లగు భాషణముల్**
**తన ప్రియ వినిపించుట కి । ట్లనియెన్ మృదురీతి భీముఁ డాతనితోడన్.** 336

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా విని; భీముఁడు; మనమునన్= మనస్సులో; ఇస్సీ! అని= ఛీ! అనుకొని; ఉచిత= తగిన; నిగూఢ భంగులగు= రహస్య పద్ధతులలో; భాషణముల్= మాటలు; తన ప్రియన్= తన భార్య అయిన ద్రౌపదికి; వినిపించుటకున్= వినిపించటానికి; మృదురీతిన్= (స్త్రీవలె) కోమలమైన పద్ధతిలో; ఆతనితోడన్= కీచకుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు విని భీముడు మనస్సున ఛీత్కరించుకొని, అప్పటికి తగినట్లుగా తన రహస్య పద్ధతికి అనువైన మాటలను తన ప్రియభార్య అయిన ద్రౌపదికి వినిపించేటట్లు సంతోషపెట్టాలని తలచి, (స్త్రీవలె) కోమలంగా కీచకుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'ఇట్టివాఁడవు గావున నీవు నిన్నుఁ । బొగడికొనఁదగు; నకట! నా పోల్కి యాఁడు**
**దాని వెదకియు నెయ్యెడనైన నీకుఁ । బడయవచ్చునె యెఱుఁగక పలికితిట్లు.** 337

**ప్రతిపదార్థం:** ఇట్టివాఁడవు కావునన్= ఇటువంటివాడివి కాబట్టి; నీవు (కీచకుడు); నిన్నున్= నిన్నే; పొగడికొనన్+తగున్= పొగడుకొనటం సబబే; అకట!= ఔరా!; నా పోల్కి= నన్ను పోలిన; ఆఁడుదానిన్= స్త్రీని; వెదకియున్= వెదకినా కూడా; ఏ+ఎడన్+ఐనన్= ఎక్కడైనా; నీకున్+పడయవచ్చునె?= నీవు పొందగలవా?; ఎఱుఁగక= తెలియక; ఇట్లు పలికితి(వి)= ఇట్లా మాట్లాడావు.

**తాత్పర్యం:** 'ఇటువంటివాడివి కాబట్టి నిన్ను నీవే పొగడుకొనటం సమంజసమే. నావంటి స్త్రీ ఎక్కడ వెదకినా నీకు దొరకదు. తెలియక నీవు ఇట్లా మాట్లాడావు.

**విశేషం:** 1. అలం: వ్యాజోక్తి. ఇందులో మొదటి వాక్యం కాకువు వలన ఏర్పడే అధిక్షేపోక్తి. అందులోనూ వ్యాజోక్తి. పైకి స్తుతి చేస్తున్నట్లుగా ఉన్నా కాకువులో స్ఫురించేది నింద. ఇట్టివాడివి అన్నప్పుడు వ్యతిరేకధ్వని స్ఫురిస్తుంది. ఇంతటి అధికుడవని ప్రశంస, ఇంతటి అధముడవని నింద. ఆత్మప్రశంస ఉద్ధతుల లక్షణం. ఉదాత్తుల స్వభావం కాదని అధిక్షేపం. 2. అలం: వ్యతిరేకం. ఈ పద్యంలోని రెండవ వాక్యం హాస్యోక్తి. తనంతటివాడు లేడని చెప్పుకొన్న కీచకుడికి ప్రతిసమాధానం. 'నా పోల్కి ఆడుది' అనునప్పుడు ఉపమానం కంటె ఉపమేయం అధికంగా చెప్పే వ్యతిరేకాలంకార స్ఫూర్తి ఉన్నది. భీముడు సైరంధ్రి స్థానంలో కూర్చొని ఆడుదాని గొంతుతో మాట్లాడుతున్నాడు- ఇప్పటి 'మిమిక్రీ' (ధ్వన్యనుకరణం) వలె, చీకటిలో చూడలేక భీముడినే వలచినదానిగా భావించాడు కీచకుడు. అందువలన నావంటి వింతస్త్రీ నీ కెక్కడా దొరకదని హాస్యోక్తి. 'ఎఱుఁగక పలికి తిట్లు' అనే మాట జాతీయం. అమాయకంగా మాట్లాడావనీ. నా సంగతి తెలియక మాట్లాడావనీ అర్థాలు ఏర్పడతాయి. ఇదీ హాస్యోక్తియే. 3. ఈ అధిక్షేప హాస్యోక్తులు భీముడి పౌరుష ప్రవృత్తికి భిన్నంగా ఉండి వికృతిని స్ఫురింప చేస్తాయి. కాబట్టి ద్రౌపదికీ, పఠితలకూ హాస్యాన్ని కలిగిస్తాయి. ఈ హాస్యం శృంగార సంబంధమైన లలిత హాస్యం కాదు. శత్రువు మీద విసిరే అధిక్షేపరూప గంభీర హాస్యం. (Grim humour) ఈ హాస్యం ఒక్కసారి విరుచుకపడబోతున్న భీముడి రౌద్రాగ్నికి ధూమశిఖ వంటిది. (సంపా.)

**క. నా యొడలు సేర్చినప్పుడ। నీ యొడలెట్లగునొ? దాని నీవెఱిఁగెదు; న**
**న్నే యబలలతోడిదిగాఁ। జేయఁదలంచితివి తప్పు సేసితి కంటే! 338**

**ప్రతిపదార్థం:** నా ఒడలు+చేర్చిన+అప్పుడు+అ= నా శరీరంతో నీ శరీరం దగ్గర చేస్తే; నీ ఒడలు= నీ శరీరం; ఎట్లు+అగునొ?= ఎట్లా ఔతుందో; దానిన్= దానిని; నీవు+ఎఱిఁగెదు(వు)= నీవు తెలిసికొంటావు; నన్నున్+ఏ+అబలల తోడిదిగాన్= నన్ను మిగిలిన ఏ స్త్రీలతో సమానంగా; చేయన్+తలంచితివి= చేయాలనుకొన్నావో; తప్పు+చేసితి(వి)= తప్పుచేశావు; కంటే= చూచావా? (తెలుగులో తెలిసిందా? చూడు! అనే హెచ్చరికలకు సమానార్థకం).

**తాత్పర్యం:** నా శరీరంతో నీ శరీరం తగిలినప్పుడే నీ శరీరం ఏమవుతుందో అది నీవే తెలిసికొంటావు. నన్ను మిగిలిన సామాన్య స్త్రీలతో సమానంగా చేయదలచుకొన్నావో, తప్పు చేసినట్లే సుమా!

**విశేషం:** 1. ఇది శ్లేషగర్భితమైన వ్యంగ్యోక్తి. 'మాట లింకేటికిఁ గమలవదన!' అని 335వ పద్యంలో మదనకార్యోత్సాహాన్ని వ్యంగ్యంగా ప్రదర్శించిన కీచకుడి వాక్యానికి దీటుగా ప్రౌఢంగా భీముడు చెప్పిన మాట లివి. తెలుగు పలుకుబడుల వింత పోకడలు శృంగార రౌద్ర రసానుగుణంగా, శ్లేషమయంగా, వ్యంగ్యంగా ప్రయోగించే నేర్పు ఈ రచనలో రాణించింది. 'నా ఒడలు చేర్చునప్పుడు.' అనే వాక్యానికి నా శరీరంతో నీ శరీరం సంగమించేటప్పుడు-అని శృంగారపరమైన అర్థం. నా శరీరంతో ద్వంద్వయుద్ధం కొరకు నీ శరీరం తలపడ్డప్పుడు-అని రౌద్రరసపరమైన అర్థం. ఇది అర్థశ్లేష 2. 'నన్ను ఏ వనితల వంటిదానినిగానో భావించావా! తప్పు చేసిన వాడివే ఔతావు సుమా!' అన్నది వ్యంగ్యోక్తి (satire). నేను ఇతర సామాన్యవనితలవంటి దానను కాను. నీవు అట్లా భావిస్తే పొరపాటుపడ్డట్లే. ఈ వాక్యంలో తాను అసామాన్య వనిత నన్నట్లు ప్రకృతార్థం. కాని, నేను ఆడుదనం లేని ఆడుదానిని.

ఆడుదానిగా అభినయిస్తున్న పురుషుడిని. నన్ను స్త్రీగా భావించి అందరి స్త్రీలవలెనే భోగింపదలచుకొంటే నీవు పొరపాటుపడ్డట్లే. అది పొరపాటు కాదు పరదారాగమన దోషం కూడా! దానికి తగిన ఫలం అనుభవిస్తావు-అని ఎత్తిపొడుస్తూ అన్నమాట! 3. మొదటి వాక్యం రౌద్రగర్భితం: రెండవ వాక్యం శృంగార జల్పితం. రెండూ వెరసి ఈ పద్యం గంభీర హాస్యరస వ్యంజకం. ఇక్కడ స్త్రీకి పర్యాయంగా అబలా శబ్దం కావడం గమనించదగింది. నన్ను బలం లేని స్త్రీనిగా ఎంచుతున్నావేమో, నేను సబలుడైన పురుషుడిని సుమా! అనడం కూడా ధ్వనితం. (సంపా.)

**క. నను ముట్టి నీవు వెండియు। వనితల సంగతికిఁ బోవువాఁ డవె? యైనం**
**దను వేఁ బడసిన ఫలమే?। కనియెద విదె చిత్తభవవికారము లెల్లన్.' 339**

**ప్రతిపదార్థం:** నీవు (కీచకుడు); ననున్+ముట్టి= నన్ను తాకి; వెండియున్= మళ్ళీ; వనితల సంగతికిన్= స్త్రీల పొందుకు; పోవువాఁడవె?= పోగలవా? (పోలేవు); ఐనన్= ఐనా; తనువు= శరీరం; ఏన్= నేను; పడసిన ఫలమే?= పొందిన ఫలమే?; ఇదె= ఇప్పుడే; చిత్తభవవికారములు+ఎల్లన్= మన్మథుని వికారాలన్నీ (మనసులో కలిగిన భావాలన్నీ); కనియెదవు= చూస్తావు.

**తాత్పర్యం:** నన్నొకసారి ముట్టుకొన్న తరువాత మరింక ఆడువారి పొందుకు నీవు పోగలవా? మరింక ఏ ఆడువారి ముచ్చటలోనూ ఆసక్తిని చూపబోవు. (నీవు మరే స్త్రీలనూ కోరబోవు అని ఒక అర్థం. ఆడువారి పొందుకు పోలేని స్థితిని (చావును) పొందుతావని గూఢార్థం). కాగా, నే నీ శరీరాన్ని పడసిన (పుట్టినందుకు) ఫలమూ, నీ మనసులో కలిగే మన్మథ భావాల ఫలమూ ఇప్పుడే చూడగలవు (అనుభవించగలవు).

**విశేషం:** ఈ పద్యంలో శ్లేషానుప్రాణితమైన చమత్కారోక్తి గంభీర హాస్య వ్యంజకంగా నిబంధించబడింది. పద్యంలోని కొన్ని పదాలకు శ్లేషార్థాలివి. ముట్టి= తాకి, ఎదుర్కొని, ఆక్రమించి; వనితల సంగతి= స్త్రీలను గురించి మాట్లాడటం, స్త్రీల కథల ప్రస్తావనలు, స్త్రీల తోడి స్నేహం; పొందు, సంగమం; చిత్తభవ వికారములు= మన్మథ వికారాలు, మనసులో పుట్టిన భావాలు; కనియెదవు= చూస్తావు, అనుభవిస్తావు; తనువు పడసిన ఫలం= జన్మ ఎత్తిన దానికి ఫలం, ఈ (స్త్రీగా నటించే) రూపం తాల్చినందుకు ఫలం నిన్ను చంపకపోతే నేను శరీరం ధరించినందుకు ఫలమేముంది-అని భావం; ఇదే= ఇప్పుడే, ఇదిగో చూడు అని కార్యోన్ముఖుడు అయ్యే చర్యను సూచించే పదం.

**శ్లేష తాత్పర్యం:** నన్ను తాకి (ఎదుర్కొని) నీవు మళ్ళీ ఆడవాళ్ళ పొత్తుకు పోతావా? (నీవు-చనిపోతావు), అట్లా అయితే నేనీ శరీరాన్ని ధరించిన ఫలాన్నే నీవు నీ మనసులో పుట్టిన భావాల ఫలంగా పొందగలుగుతావు. (భీముడు పుట్టినందుకు ఫలం శత్రు సంహారం; కీచకుడి మనస్సులో కలిగిన పరసతీసమాగమవికారాలకు ఫలం మరణం). (సంపా.)

**మ. అనుచున్ గ్రక్కున లేచి రోషకఠినం బౌ హాస మా సూతు నె**
**మ్మన ముద్వేగముఁ బొందఁజేయ బలసామగ్రీసముజ్జృంభణం**
**బున వానిం దలవట్టి వంచుటయు నేపుం జేవయుం దోఁప వాఁ**
**డనుమానింపక బె ట్టదల్చికొని కోపాటోపదీప్తాంగుఁడై. 340**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; గ్రక్కునన్ లేచి= తటాలున లేచి; రోషకఠినంబు+ఔ= కోపంచేత భయంకరమైన; హాసము= నవ్వు; ఆ సూతు నెఱ+మనము= ఆ కీచకుడి నిండుమనస్సును; ఉద్వేగమున్+పొందన్+చేయన్= కలతపడేటట్లు చేయగా; బలసామగ్రీసముజ్జృంభణంబునన్= సమగ్రమైన బలాన్ని విజృంభింపజేసి; వానిన్= కీచకుడిని; తల+పట్టి వంచుటయున్= తలపట్టి

వంచగా; ఏపున్= గర్వం; చేవయున్= బలమున్నూ; తోఁపన్= తెలిసేటట్లు; వాఁడు= కీచకుడు; అనుమానింపక= వెనుకాడక, శంకించక; బెట్టు= గట్టిగా; అదల్చికొని= విడిపించుకొని; కోప+ఆటోపదీప్త+అంగుఁడు+ఐ= కోపంయొక్క తీవ్రత వలన మండిపడే శరీరం కలవాడై.

**తాత్పర్యం:** ఇట్లా అంటూనే తటాలున లేచి భీముడు కీచకుడి మనస్సు కలత చెందేటట్లు అట్టహాసం చేసి, తన భుజబలంచేత అతడి తలపట్టి వంచగా కీచకుడు బలపరాక్రమాలను కూడగట్టుకొని వెనుకాడకుండా గట్టిగా విడిపించుకొని తీవ్రమైన కోపంతో మండిపడుతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇది కీచకుడు ఊహించని పరిస్థితి. తలపట్టి వంచటంలో ఏదో ఘోరం జరగబోతున్నదనే అనుమానం కలిగింది. మదనవికారం గాలికి పోయింది. తన భుజ పరాక్రమంతో విజృంభించిన కోపం దాల్చాడు.

**భీమసేనుఁడు కీచకుని సంహరించుట (సం.4-21-50)**

**వ. గంధర్వుం డను తలంపున. 341**

**తాత్పర్యం:** గంధర్వుడనే ఆలోచనతో.

**చ. పవనతనూజు బాహువులు పాణియుగంబునఁ బట్టి వీఁకమై**
**నవనిపయిం బడం దిగిచి యంగము జానుల నూఁదినం గడున్**
**జవమున దండ తాడిత భుజంగము భంగి సముత్థితాంగుఁడై**
**యవయవముల్ ప్రకోపరభసాతిశయంబునఁ బొంగ నుద్ధతిన్. 342**

**ప్రతిపదార్థం:** పవన తనూజు బాహువులు= వాయు తనయుడైన భీముడియొక్క భుజాలు; పాణియుగంబునన్+పట్టి= రెండు చేతులతో పట్టుకొని; వీఁకమైన్= పరాక్రమంతో; అవనిపయిన్= నేలమీద; పడన్+తిగిచి= లాగి పడవేసి; అంగము= భీముడి శరీరం; జానులన్= మోకాళ్ళతో; ఊఁదినన్= అదమగా; కడున్+జవమునన్= అధికశక్తితో; దండతాడిత= కర్రతో కొట్టబడిన; భుజంగముభంగిన్= పామువలె; సముత్థిత+అంగుఁడు+ఐ= ఎగసిన శరీరం కలవాడై; ఉద్ధతిన్= గర్వంతో; అవయవముల్= అవయవాలు; ప్రకోపరభస+అతిశయంబునన్+పొంగన్= అధికమైన కోపవేగంతో ఉప్పొంగగా;

**తాత్పర్యం:** కీచకుడు భీముడి భుజాలను తన చేతులతో పట్టి బలిమితో లాగి నేలమీద పడవేసి అతడి శరీరాన్ని తన మోకాళ్ళతో అదుమగా, భీముడు కర్రదెబ్బతిన్న పామువలె చప్పున లేచి అధికమైన కోప సంరంభంవలన ఉప్పొంగిన సర్వశరీరావయవాలతో విజృంభించి గర్వంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ. మల్లయుద్ధంలోని భంగిమలను (పట్లు) మనోనేత్రాలకు చలనచిత్రంవలె గోచరించేటట్లు చేసిన వర్ణన మిది. భీముడు కీచకుడి తలపట్టి లాగి వంచాడు. అట్లా వంగిన కీచకుడికి భీముడి బాహువులు దగ్గరగా అందుతాయి. అందువలన కీచకుడు కూర్చున్న భీముడిని భుజాలు పట్టి బలంగా త్రోసి నేలమీదకు నెట్టి క్రింద పడవేసి, నడుముమీద మోకాళ్ళు పెట్టి అదిమాడు. ఇది కుస్తీలో మరొక పట్టు. అట్లా అదిమినప్పుడు నడుంమీద కర్రతో కొట్టితే తలతో తోకతో ఒక్కసారి విజృంభించి బుసకొట్టి ఎగిరే పామువలె భీముడు ఆ పట్టును అవలీలగా త్రోసి పైకి లేచాడు. భీముడికి కోపం రావాలంటే శత్రువు బలంగా అతడిని ఎదుర్కోనాలి. దానినిబట్టి అతడు శత్రువు బలాన్ని ఊహించి ప్రతిక్రియ మొదలుపెట్టుతాడు. ప్రస్తుతం కీచకుడి

దెబ్బకు భీముడి ఒడలంతా కోపాతిశయంతో ఉప్పొంగిపోయింది; గర్వం తలయెత్తింది. చర్య ప్రతిచర్యతోపాటు భావావస్థల పరిణామాన్ని కూడా చిత్రించటంతో యుద్ధం చైతన్యవంతంగా ఉంటుంది తిక్కన రచనలో. (సంపా.)

**మ. మగుడం గీచకుఁ బట్ట వాఁడును బలోన్మాదంబునన్ బాహు గ**
**ర్వ గరిష్ఠుండగు నా హిడింబరిపుఁ దీవ్రక్రోధుఁడై పట్టి బె**
**ట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱున్ భుజబలాటోపంబుమై నొండొరున్**
**మిగులం జాలక కొంతసేపు వడి మేమేఁ బోరి రుగ్రాకృతిన్. 343**

**ప్రతిపదార్థం:** మగుడన్= మళ్ళీ; కీచకున్+పట్టన్= కీచకుడిని పట్టుకోగా; వాఁడును= కీచకుడుకూడా; బల+ఉన్మాదంబునన్= పరాక్రమ గర్వంతో; బాహుగర్వగరిష్ఠుండు+అగు= భుజబలగర్వంతో గొప్పవాడైన; ఆ హిడింబ రిపున్= ఆ భీముడిని (హిడింబుడి శత్రువును); తీవ్రక్రోధుఁడు+ఐపట్టి= అధిక కోపంతో పట్టుకొని; బెట్టుగన్= మిక్కిలి; త్రోపాడఁగన్= తోయగా; ఇద్దఱున్= భీమకీచకులు; భుజబల+ఆటోపంబుమైన్= భుజాల బలం యొక్క ఆడంబరంతో; ఒండొరున్= ఒకరిని ఒకరు; మిగులన్+చాలక= మించిపోలేక; వడిన్= వేగంతో; మేమేన్= అనాయాసంగా; ఉగ్ర+ఆకృతిన్= భయంకరమైన ఆకారాలతో; కొంతసేపు= కొంచెంసేపు; పోరిరి= పోరాడారు.

**తాత్పర్యం:** భీముడు మరల కీచకుడిని బాహువులతో ఒకపట్టుపట్టాడు. బలోన్మాదంతో కూడిన ఆ కీచకుడు కూడా బాహుగర్వంగల వీరుల్లో శ్రేష్ఠుడైన భీముడిని తీవ్రమైన కోపంతో పట్టి గట్టిగా త్రోసినాడు. ఈ విధంగా వాళ్లు భుజబలాధిక్యంలో ఒకరినొకరు మించజాలక భయంకర స్వరూపులై త్రోపులాడుతూ అనాయాసంగా కొంతసేపు పోరాడినారు.

**విశేషం:** మల్లయుద్ధంలో వీరులు బాహువులలో పరస్పరం శరీరాలను బిగియబట్టి కలియబడుతూ పరస్పర భుజబలాలను ప్రదర్శించటం సర్వసామాన్యం. మేమే - మేమెయి - అనాయాసంగా (సూ.ని.) భుజబలంతో ఇద్దరూ సమానస్థాయిలో ఉన్నారు. కాబట్టి పోరు అనాయాసంగానూ, భయంకరంగానూ సాగింది. సమయుద్ధం సాగిన ఘట్టమిది. (సంపా.)

**వ. అట్టి యెడ. 344**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. తన యగపా టొరు లెఱుఁగుదు । రని సూతుఁడు సమయభంగ మగుటకు భీముం**
**డును గొంకుచుఁ జప్పుడు సే । యని గూఢ విమర్దనప్రహారములఁ దగన్. 345**

**ప్రతిపదార్థం:** తన+అగపాటు= అక్కడి తన ఉనికి; ఒరులు= ఇతరులు; ఎఱుఁగుదురు+అని= తెలిసికొంటారని; సూతుఁడున్= కీచకుడూ; సమయ భంగము+అగుటకున్= అజ్ఞాతవాసం చెడిపోతుందని; భీముండును; కొంకుచున్= జంకుతూ; చప్పుడు +చేయని= శబ్దం కాని; గూఢవిమర్దన ప్రహారములన్= రహస్యంగా పాడిచే పిడికిటి పోట్ల దెబ్బలతో; తగన్= ఒప్పునట్లుగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో తాను అటువంటి చోట ఉన్నానని ఇతరులు తెలిసికొంటారేమోనని కీచకుడూ, అజ్ఞాతవాస ప్రతిజ్ఞకు భంగం కలుతుందేమోనని భీముడూ లోలోన జంకుతూనే చప్పుడుకాని పిడికిటిపోట్ల దెబ్బలతో ఇద్దరికీ తగినట్లు (పోరసాగారు). (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** ఇది మల్లయుద్ధంలో మూడవ పద్ధతి. ఇందులో ఇద్దరూ పిడికిళ్ళ పోట్లతో ద్వంద్వయుద్ధం సాగించారు. అయితే ఇద్దరికీ కారణాలు వేరైనా భయం ఒకటే ఉంది. ఒకరిది పరువునష్టం కలిగే భయం. మరొకరిది వ్రతభంగభయం. ఇట్లా ఇద్దరికీ ఉపయోగపడిన ఒక భయం వర్ణించబడింది.

**వ. మల్లయుద్ధ నైపుణ్యంబు మెఱయం గడంగి. 346**

**తాత్పర్యం:** కుస్తీపట్ల పోరులో నేర్పరితనం ప్రదర్శించాలని పూనుకొని.

**సీ. తిగిచిన నడుగులు దెరలక యొండొరుఁ। గ్రమ్మఱఁ దిగుచుచుఁ గడిమి మెఱయఁ,**
**బొడిచిన వెస బీఱుపోవక యొండొరు। నందంద పొడుచుచు నవనిఁ బెట్టి,**
**యొత్తిన బెగ్గలం బొందక యొండొరు। బలువిడి నొత్తుచు నలవు మిగిలి,**
**యడఁగంగఁ బొదివిన నడిచిపా టించుక। యును లేక వీఁక నొండొరుల నడరి,**

**తే. యడఁగఁ బొదువుచు, నలుక యంతంత కగ్గ। లించి యాయముల్ నొంచి దోర్లీల నెఱపి**
**యుల్లసిల్లిన స్రుక్క కొండొరుల రౌద్ర। వృత్తి నొంచు చొండొరులకు వెక్కసముగ. 347**

**ప్రతిపదార్థం:** తిగిచినన్= ఒకరి నొకరు లాగుకొనగా; అడుగులు తెరలక= పదాలు కదలక; ఒండొరున్= ఒకరి నొకరు; కడిమి మెఱయన్= పరాక్రమం ప్రకాశించగా; క్రమ్మఱన్+తిగుచుచున్= మళ్ళీ లాగుతూ; పొడిచినన్= పిడికిలితో కుమ్మగా; వెసన్= వేగంగా; బీఱు+పోవక= వెనుకంజ వేయకుండా; ఒండొరున్= ఒకరినొకరు; అందు+అంద= అనేక చోట్లలో; పొడుచుచున్= గుద్దులాడుతూ; అవనిన్+పెట్టి= నేలమీద పడవేసి; ఒత్తినన్= అదిమినప్పటికీ; బెగ్గలంబు= భయంతోడి తత్తరపాటు; ఒందక= పొందకుండా; ఒండొరున్= ఒకరికొకరు; బలువు+ఇడిన్= పరాక్రమంతో; ఒత్తుచున్= అదుముతూ; అలవు మిగిలి= కోపం హెచ్చి; అడగంగన్+పొదివినన్= లోబడేటట్లు పట్టుకోగా; అడిచిపాటు= లొంగిపోవటం; ఇంచుకయును లేక= కొంచెం కూడా లేకుండా; వీఁకన్= పరాక్రమంతో ఒండొరులన్+అడరి= ఒకరినొకరు అతిశయించి; అడఁగన్+పొదువుచున్= లోబరచుకొనేటట్లు పట్టుకొని; అలుక= కోపం; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; అగ్గలించి= అధికమై; అయముల్+నొంచి= మర్మస్థానాలు నొప్పించి; దోస్+లీల, నెఱపి= భుజశక్తి ప్రదర్శించి; ఉల్లసిల్లినన్= ప్రకాశించగా; స్రుక్కక= వెనుదీయక; ఒండొరులు+అ= ఒకరి నొకరే; రౌద్రవృత్తిన్= రౌద్రరసప్రవృత్తులతో; నొంచుచున్= బాధిస్తూ; ఒండు+ఒరులకున్= ఒకరికొకరికి; వెక్కసముగన్= సహింపరానట్లుగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఒకరిని ఒకరు లాగగా అడుగులు కదలకుండా గట్టిగా నిలబడుతున్నా నేర్పుమీద పరస్పరం లాగుతూ ఉండేవారు; ఒకరిని ఒకరు గడుసుగా పిడికిళ్ళతో పొడిచినా వెనుకాడక పరస్పరం అవే చోట్ల తిరిగి పొడుచుకొంటూ ఉండేవారు; ఒకరిని మరొకరు నేలమీద పడవేసి గట్టిగా ఒత్తినా భయపడక ఒకరినొకరు బలప్రయోగంతో ఒత్తుతూ ఉండేవారు; కోపం పెరిగి ఒకరి నొకరు లోబడేటట్లు క్రమ్మి పట్టుకొన్నా లొంగుబాటు ఏమాత్రం లేకుండా పౌరుషంతో ఒకరినొకరు అణచుకొనటానికి యత్నించేవారు. కోపం అంతకంతకూ పెరుగుతూ ఉండగా విజృంభించి ఆయువు పట్టులను బాధించి భుజబలాన్ని ప్రదర్శించి పొంగిపోయేవారు; ఎన్ని విధాలైనా ఒకరి కొకరు తగ్గేవారు కాదు. ఒక్కొక్కరిలో ఆయా సమయాలలో కలిగే రౌద్రరస మనఃప్రవృత్తులచేత ఇరువురూ ఒకరికి మరొకరు అసాధ్యులై పోరేవారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి.

**క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు। నదలుచుచుం బడుచు లేచు చడఁగుచు వడిగొం**
**చొదవెడుకినుకం గడు బె। ట్టిదముగఁ బెనఁగిరి చలంబు డింపక కడిమిన్. 348**

**ప్రతిపదార్థం:** కదియుచున్= సమీపిస్తూ; పాయుచున్= తొలగుతూ; పట్టుచున్= పట్టుకొంటూ; అదలుచుచున్= అదిలించుకొంటూ; పడుచున్+లేచుచున్= పడుతూ లేస్తూ; అడఁగుచున్= లోబడుతూ; వడి+కొంచున్= వేగాన్ని చూపుతూ; ఒదవెడు కినుకన్= కలిగే కోపంతో; కడుబెట్టిదముగన్= మిక్కిలి భయంకరముగా; కడిమిన్= బలంతో; చలంబు డింపక= పట్టుదల వదలకుండా; పెనఁగిరి= పోరాడారు.

**తాత్పర్యం:** దగ్గరికి వస్తూ, దూరం పోతూ, పట్టుతూ, వదలుతూ, భయపెట్టుతూ, అదలిస్తూ, పడుతూ, లేస్తూ, తగ్గుతూ, వేగంగా విజృంభిస్తూ, పెరిగే కోపంతో పట్టుదలలు వీడకుండా పరాక్రమంతో మిక్కిలి భయంకరంగా పోరాడారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. తెలుగు పదాల పోహళింపుతో కుస్తీపట్ల మెలకువలన్నిటినీ దేశీయంగా వర్ణించాడు తిక్కన. శబ్దాల సహాయంతో పిడిగుద్దుల సవ్వడిని మన చెవులకు వినిపించేటట్లు చేశాడు. పద్యం చదివే తీరులో చదివితే మల్లయుద్ధంవలెనే ఉంటుంది.

**ఆ. ఇవ్విధమున నేచి యిరువురుఁ బెద్దయుఁ। బ్రొద్దు పోర వాయుపుత్రు బలము**
**దోడుతోడఁబెరుఁగఁదొడఁగె నాకీచకా। ధమునిలావు పిదపఁ దఱుఁగఁజొచ్చె. 349**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ రకంగా; ఏచి= విజృంభించి; ఇరువురున్= భీమకీచకులు; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; పోరన్= యుద్ధం చేయగా; వాయుపుత్రుబలము= భీముడిశక్తి; తోడుతోడన్= అంతకంతకు; పెరుఁగన్+తొడఁగెన్= అధికం కాసాగింది; ఆ కీచక+అధముని లావు= ఆ నీచుడైన కీచకుడి శక్తి; పిదపన్= పిమ్మట; తరుఁగన్+చొచ్చెన్= తగ్గిపోసాగింది.

**తాత్పర్యం:** ఈ విధంగా పరాక్రమంతో ఒకరితో నొకరు చాలాసేపు పోరాడగా భీముడి భుజశక్తి క్రమంగా పెరుగసాగింది. ఆ నీచుడైన కీచకుడి శక్తి క్రమంగా తగ్గసాగింది.

**ఉ. దాని నెఱింగి యెంతయు నుదగ్రత నా బకవైరి గ్రక్కునన్**
**వాని నడంగఁబట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బం**
**చానన మేణముం బొదువున, ట్లతఁ డూర్జితశక్తి నుద్భటుం**
**డై నెగసెన్ సమీరసుతు నల్కకుఁ బ్రాఁ కిడినట్లు వీఁకతోన్. 350**

**ప్రతిపదార్థం:** దానిన్+ఎఱింగి= అది తెలిసికొని; ఎంతయున్= ఎంతో; ఉదగ్రతన్= కోపంతో; ఆ బకవైరి= ఆ (బకాసురుడి శత్రువు) భీముడు; గ్రక్కునన్= వెంటనే; వానిన్= కీచకుడిని; అడంగన్+పట్టి= అణిగేటట్లు పట్టుకొని; పడన్+వైచి= పడద్రోచి; మహా+ఉగ్రతన్= మిక్కిలి పరాక్రమంతో; పంచాననము= సింహం; ఏణమున్= జింకను; పొదువు+అట్లు= పట్టుకొన్నట్లు; ఆక్రమించెన్= పట్టుకొన్నాడు; అట్లు= ఆవిధంగా; సమీరసుతు= భీముని యొక్క; అల్కకున్= కోపానికి; వీఁకతోన్= పరాక్రమంతో; ప్రాఁకు+ఇడినట్లు= ప్రాకటానికి ఆధారాన్ని అందించినట్లు; అతఁడు= కీచకుడు; ఊర్జితశక్తిన్= మిక్కిలిబలంతో; ఉద్భటుఁడు+ఐ= పరాక్రమవంతుడై; ఎగసెన్= పైకి ఎగిరాడు.

**తాత్పర్యం:** కీచకుడు బలహీనపడటం తెలిసికొని భీముడు సింహం జింకమీద పడి వెంటనే దానిని నేలమీద పడవేసి భయంకరంగా దానిని మొత్తం ఎట్లా ఆక్రమిస్తుందో అట్లా పరాక్రమంతో పొదివి పట్టాడు. భీముడి కోపలతకు ప్రాకు పెట్టినట్లుగా కీచకుడు తన శక్తినంతా పెంచి పరాక్రమాన్ని ప్రదర్శించి పెనగి పైకి లేచాడు.

**విశేషం:** అలం: ఉపమ. బలాబలాలను సూచించేవి సింహం జింకల ఉపమానాలు. కీచకుడు పట్టుతప్పించుకొని పైకి లేవటం భీముడి కోపానికి ఆధార స్తంభాన్ని నిలిపినట్లైనది. కోపాన్ని లతగా రూపించి ధ్వనిమయం చేశాడు తిక్కన.

**క. నెగయునెడ నగ్గమైనను। బిగియారుచుఁ బిఱుఁదుసనినఁ బిడికిటఁ గొఱసం**
**దిగడు బెడిదముగఁ బొడిచెం। బగతుఁడు గను మిడిసి నేలఁబడి తన్నికొనన్. 351**

**ప్రతిపదార్థం:** నెగయు+ఎడన్= పైకిలేచేటప్పుడు; అగ్గమైనను= లోబడినప్పటికీ; బిగి+ఆరుచున్= బిగువు కలవాడై; పిఱుఁదు+చనినన్= వెనుకకు పోగా; పగతుఁడు= శత్రువైన కీచకుడు; కనుమిడిసి= కనుగ్రుడ్లు బయటకివచ్చి; నేలన్+పడి= నేలమీదపడి; తన్నికొనన్= తన్నుకొనేటట్లు; పిడికిటన్= పిడికిలితో; కొఱసంది= ఆయువు పట్టును; కడుబెడిదముగన్= మిక్కిలి కఠినంగా; పొడిచెన్= పొడిచాడు.

**తాత్పర్యం:** కీచకుడు పైకెగసినప్పుడు లోబడినా కూడా, ఆ లోపల బిగువుగలవాడై వెనకకుబోయి తప్పించుకొనచూచినా భీముడు మిక్కిలి కోపంతో పిడికిలి పట్టి అతడి ఆయువుపట్టులో దారుణంగా పొడిచాడు. అంతటితో కీచకుడు కనుగ్రుడ్లు బయటికి వచ్చి నేలమీదపడి తన్నుకొన్నాడు.

**ఆ. పల్లవ ప్రసూన ఫలభరితంబగు। మ్రాను గూలఁద్రోచు మత్తగజము**
**పోలె వివిధ రత్నభూషణభూషితుం। డైన సూతుఁ గూల్చె ననిలసుతుఁడు. 352**

**ప్రతిపదార్థం:** పల్లవ ప్రసూన ఫలభరితంబు+అగు= చిగుళ్ళు, పూలు, పండ్లతో నిండినదైన; మ్రాను= చెట్టు; కూలన్+త్రోచు= కూలత్రోసే; మత్తగజము పోలెన్= మదించిన ఏనుగువలె; వివిధ రత్న, భూషణ భూషితుండు+ఐన= అనేక రత్నాభరణాలతో అలంకరించబడినవాడైన; సూతున్= కీచకుడిని; అనిలసుతుఁడు= భీముడు; కూల్చెన్= పడగొట్టాడు.

**తాత్పర్యం:** పల్లవపుష్పఫలభరితమైన వృక్షాన్ని అవలీలగా మదపుటేనుగు కూలద్రోసినట్లుగా, వివిధ రత్నాలంకార శోభితుడైన కీచకుడిని భీముడు పడగొట్టాడు (చంపాడు).

**విశేషం:** అలం: ఉపమ, ఉపమేయాలు- అనిలసుతుడు, వివిధ రత్న భూషణభూషితుడు అయిన సూతుడు; ఉపమానాలు-మత్తగజం, పల్లవ ప్రసూన ఫలభరితమైన మ్రాను, సమానధర్మం కూలద్రోయటం, కూలిపోయిన చెట్లకు పల్లవాదులు ఎట్లా శోభనీయవో పడిపోయిన (చనిపోయిన) కీచకుడికి ఆభరణాలు అలంకారాలు కావు. అయినా అతడు పడినా లేదా చచ్చినా వివిధ ఆభరణధారణశీలుడే. అనిలసుతుడు చెట్టును కూల్చినట్లు చెప్పటం ఔచిత్యం. కీచకు డంటే వెదురుబొంగు వంటివాడు. అనే అర్థం కూడా భావనారమణీయం. (సంపా.)

**చ. వికృతపుఁ జావు సంప మది వేడుక పుట్టినఁ గిట్టిపట్టిమ**
**స్తకమును బీన దీర్ఘ భుజశాఖలుఁ బాదయుగంబు మేనిలో**
**నికిఁ జొర నుగ్గుగాఁ దుఱిమి నించిన గ్రంతలతిత్తియైన కీ**
**చకు ధరణీస్థలిం జదిపి చక్కని ముద్దగఁ జేసెఁ దుష్టుఁ డై. 353**

**ప్రతిపదార్థం:** వికృతము+చావు= ఏవగింపు కలిగించే చావు; చంపన్= చంపటానికి; మదిన్ వేడుక పుట్టినన్= మనసులో కోరిక కలుగగా; కిట్టి= దగ్గరకు వెళ్ళి; పట్టి= పట్టుకొని; మస్తకమును= తలను; పీనదీర్ఘభుజశాఖలు= బలిసిన పొడవైన కొమ్మలవలె ఉండే చేతులును; పాదయుగంబు= రెండు పాదాలను; మేనిలోనికిన్+చొరఁగాన్= శరీరం లోపలికి చొచ్చుకొని పోయేటట్లు;

నుగ్గుగాన్+తుటిమి= చూర్ణంగా చేసి తురిమి; నించినన్= నింపగా; క్రంతల తిత్తి+ఐన= రంధ్రాలు ఉండే సంచిగా; కీచకున్= కీచకుడిని; ధరణీస్థలిన్= నేలమీద; చదిపి= నలిపి; తుష్టుఁడు+ఐ= సంతోషించినవాడై; చక్కని ముద్దగన్= గుండ్రటి ముద్దగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** కీచకుడిని వికారంగా చంపాలని కోరికపుట్టి భీముడు అతడిని సమీపించి అతడి కళేబరాన్ని పట్టుకొని, తల, చేతులు, పాదాలు మొండెంలోకి జొచ్చుకొనేటట్లు దూర్చి, చిల్లులుపడిన నిండు సంచీవలెఉన్న శవాన్ని నేలమీద పడవేసి నలిపి, మనసు(లోని కసి) తీర గుండ్రని మాంసపు ముద్దగా చేశాడు.

**విశేషం:** 1. పరసతీగతమైన మన్మథ వికారాలకు నెలవైన అతడికి వికారపు చావు సముచితమైన ఫలమని భీముడు భావించాడు. కీచకుడి శరీరాన్ని ఒక మాంసపు ముద్దగా మార్చదలచాడు. తలనూ, చేతులనూ, కాళ్ళనూ విరిచి మొండెంలో గుచ్చి సందుల తిత్తిగా మార్చాడు. దానిని భూమి మీద పెట్టి మర్దించి ముద్దగా చేశాడు. ఇది అసామాన్యమైన సంహారం. గంధర్వులెవ్వరో దివ్యశక్తులతో చేసినట్లు జనులు భావిస్తారు. భీముడి ప్రహారపు గుర్తులు దేహంమీద కనపడవు. చూచేవాళ్ళకు అసహ్యంగా ఉండి భయం వేస్తుంది. జుగుప్స కలుగుతుంది. ఆ వికారపు మృత్యువును కల్పించటంలో భీముడి ప్రతీకార వాంఛ. కసి, కోపం కూడా తోడ్పడ్డాయి. పైపెచ్చు ఎంత వికారంగా చంపితే ద్రౌపది అంత వినోదంగా హర్షిస్తుందనే గూఢవాంఛ కూడా హేతువు కావచ్చును. ఏమైనా, వీరకృత్యం అద్భుతంగా ముగిసింది. రౌద్రకర్మ బీభత్సాన్ని సృష్టించింది. భీమ యత్నం ఫలించింది. భీముడి ప్రకృతి, కీచకుడి వికృతి, ద్రౌపది సుకృతి చూచినవారు భీముడివలెనే తృప్తులౌతారు. 2. 'తుష్టుఁడై' అనే పదం సరళాదేశంతో 'దుష్టుఁడై' అని వినబడుతుంది. తిక్కన కావాలనే అట్లా చివర వాడడని చాలామంది పేర్కొంటారు. 'దుష్టుఁడై అనే పాఠాంతరం కూడా ఉన్నది. కాని, దాని నెవ్వరూ పరిగణించరు. 'తుష్టుఁడై' అన్నది వాచ్యం. 'దుష్టుఁడై' అనేది ధ్వని. భీముడు అట్లా చంపి ఆనందించాడు. అది దౌష్ట్యం అని భావించేటట్లు ఉన్నది. అట్లా భావించటానికి పఠితల మనసులలో కీచకుడి పట్ల కొంత సానుభూతి ఏర్పడాలి. తిక్కన అటువంటి సానుభూతిని కలిగించాడు. అయినా భీముడిలో అందరూ సహానుభూతిని పొందుతారు. ఈ రసచర్చను భీమ నాయకత్వ నిర్ణయంలో ద్రౌపదిచేత చేయించి తిక్కన వ్యాఖ్యానించాడు. (సంపా.)

**క.** **తన కడిమికలిమి నచ్చియు । మనమునఁ దలఁ కడర సూతు మరణంబు గనుం**
**గొనుటకుఁ దల్లడపడు ప్రియ । వనిత కతని చావు సెప్పి వడిఁ దన్మాత్రన్.** **354**

**ప్రతిపదార్థం:** తన కడిమి కలిమి= తన బలాధిక్యం; నచ్చియున్= నమ్మికూడా; మనమునన్= మనస్సులో; తలఁకు= భయం; అడరన్= అతిశయించగా; సూతుమరణంబు= కీచకుడి చావు; కనుఁగొనుటకున్= చూడటానికి; తల్లడపడు= చలించే; తన ప్రియవనితకున్= తన ప్రియురాలైన ద్రౌపదికి; అతని చావు+చెప్పి= అతడి మరణంగూర్చి చెప్పి; వడిన్= వేగంగా; తత్+మాత్రన్= ఆక్షణంలోనే.

**తాత్పర్యం:** భీముడి బలంమీద నమ్మకం కలిగినప్పటికీ, కీచకుడిని చంపగలడో, లేడో అనే భయంతో కీచకుడి చావు చూడటం ఎప్పుడా? అని తొందరపడుతున్న ద్రౌపదికి కీచకుడు చచ్చాడని చెప్పి వెంటనే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** తాము చేసిన ఘనకార్యం ఆత్మీయులు చూస్తే సంతోషం. అందుకే భీముడు ద్రౌపదిని పిలిచి చూపించాలనుకొన్నాడు.

**చ.** **అనలము గూఢ యత్నమున నయ్యెడకుం గొనివచ్చి దానిఁ జ**
**య్యన వెలుఁగొందఁజేయుటయు నచ్చెరువున్ భయముం బ్రియంబునున్**
**బెనఁగొనఁగాఁ గనుంగొనియె భీతమృగేక్షణ భీము డాయఁగాఁ**
**జని కడు నక్కజంబయిన చందమునం బడియున్న పీనుఁగున్.** **355**

**ప్రతిపదార్థం:** అనలము= నిప్పు; గూఢ యత్నమునన్= రహస్యమైన ప్రయత్నంతో; ఆ+ఎడకున్= అక్కడకు; కొనివచ్చి= తీసికొని వచ్చి; దానిన్+చయ్యనన్= దానిని వెంటనే; వెలుఁగొందన్+చేయుటయున్= వెలిగించగా; అచ్చెరువున్= ఆశ్చర్యం; భయమున్= భయమున్నూ; ప్రియంబునున్= ప్రీతియున్నూ; పెనఁగొనఁగాన్= ముప్పిరిగొనగా; భీతమృగ+ఈక్షణ= భయపడిన లేడి కన్నులవంటి కన్నులుగల ద్రౌపది; భీమున్= భీముడిని; డాయఁగాన్= సమీపించగా; చని= వెళ్ళి; కడున్+అక్కజంబు+అయిన= మిక్కిలి వింత అయిన; చందమునన్= పద్ధతిలో; పడి+ఉన్న= పడిఉన్న; పీనుఁగున్= శవాన్ని; కనుఁగొనియెన్= చూచింది.

**తాత్పర్యం:** రహస్యంగా భీముడు నిప్పును తీసికొని వచ్చి వెలిగించగా ద్రౌపది భయసంభ్రమాశ్చర్య ప్రియములు పెనగొనగా విచిత్రంగా పడిఉన్న శవాన్ని చూచింది.

**విశేషం:** భీతమృగేక్షణ - సార్థకమైన విశేషణం. మృతి చెందిన కీచకుడి శవాన్ని చూడటానికి ఆసక్తి, భయం, ఆనందం అనే మూడు భావాల లక్షణం ఆ విశేషణంలో వ్యంగ్యం. ఆమెకు కీచకుడు చనిపోయాడన్న వార్త ఆశ్చర్యాన్ని కలిగించింది. అతడి పీనుఁగును చూడవలసివచ్చినందుకు భయం కలిగింది. శత్రుపీడ వదిలిందన్న వాస్తవం తెలిసినందుకు ప్రియభావం ఆమె చూపులలో పెనగొన్నది. (సంపా.)

**ఉ. చూచుచుఁ జేరి వ్రేళ్ళిడుచుచుం దలయూఁచి విలక్షచిత్తయై**
**యా చపలాక్షి ముక్కుపయి నంగుళముం గదియించి 'దీనికై**
**కీచక! యింత సేసితి, సుఖిత్వముఁ బొందుదుగాక! యింక న**
**ట్లేచిన నిట్లు గా కుడుగునే?' యనుచున్ వెఱఁగందుచుండఁగన్. 356**

**ప్రతిపదార్థం:** ఆ చపల+అక్షి= ద్రౌపది; చూచుచున్= చూస్తూ; చేరి= దగ్గరగా వచ్చి; వ్రేల్+మిడుచుచున్= వ్రేళ్ళు విరుస్తూ; తల+ఊఁచి= తలూపి; విలక్షచిత్త+ఐ= అబ్బురపడిన మనస్సుతో; ముక్కుపయిన్= ముక్కుమీద; అంగుళమున్= వ్రేలు; కదియించి= వేసికొని; కీచక!= ఓ కీచకా!; దీనికై= ఇందు కొరకై; ఇంత+చేసితి(వి)= ఇంత చేశావు; సుఖిత్వము= శాంతిని; పొందుదుగాక!= పొందుతావుగాక!; ఇంకన్= ఇంకా; అట్లు+విజృభిస్తే; ఇట్లు= ఇట్లా; కాక= కాకుండా; ఉడుగునే?= మానుతుందా?; అనుచున్= అని అంటూ; వెఱఁగు+అందుచుండఁగన్= ఆశ్చర్యపడుతూ ఉండగా.

**తాత్పర్యం:** చూస్తూ దగ్గరకు వెళ్ళి మెటికలు విరుస్తూ, తల ఊపి, ఆశ్చర్యపడిన మనస్సుతో ద్రౌపది ముక్కుమీద వేలు వేసికొని ఇట్లా అన్నది- 'కీచకా! దీనికొరకేనా ఇంత చేశావు? ఇకనైనా శాంతంగా ఉండుము. అట్లా విజృంభిస్తే, (నన్ను బాధిస్తే) నీకు ఇట్లా జరుగకపోదు' అని అంటూ ఆశ్చర్యపడుతూ ఉండగా.

**విశేషం:** స్త్రీలు మెటికలు విరవటం గ్రామీణ వాతావరణంలో సహజం. 'విలక్ష చిత్తయై' అనే పాఠానికి 'విదగ్ధ చిత్తయై' 'విషణ్ణ చిత్తయై' అనే పాఠాంతరాలు ఉన్నాయి. ఆ రెండింటికంటె ప్రస్తుతపాఠమే ప్రకరణోచితం.

**క. 'పూనిక నెఱపితి సతి యవ। మానముఁ బరితాపభరము మాన్చితి నిపు డి**
**ట్లే' నని మదిఁ బొంగెడు పవ। మానసుతుం డిట్టులనియె మానినితోడన్. 357**

**ప్రతిపదార్థం:** పూనిక= నిశ్చయించిన ప్రయత్నం; నెఱపితిన్= నెరవేర్చాను; సతి+అవమానమున్= భార్యయొక్క అవమానాన్ని; పరితాపభరమున్= దుఃఖభారాన్ని; ఇపుడు+ఇట్లు+ఏను= ఇప్పుడు ఈ విధంగా నేను; మాన్చితిన్+అని= పోగొట్టానని; మదిన్=

మనస్సులో; పొంగెడు= సంతోషించే; పవమానసుతుఁడు= వాయుసుతుడైన భీముడు; మానినితోడన్= ద్రౌపదితో; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'నేను అనుకొన్న పని నెరవేర్చాను. భార్య అవమానాన్నీ, దుఃఖభారాన్నీ పోగొట్టాను' అనుకొంటూ మనస్సులో ఉప్పొంగే భీముడు ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇక్కడ ద్రౌపదికి మానిని-అనే మాట వాడటం అద్భుతం. ఆమె అభిమానధనురాలు. భారతం మొత్తం కథ ఆమె అభిమానానికి దెబ్బ తగలటంతో నడుస్తుంది. మొదట వస్త్రాపహరణం, ఆ తర్వాత ఆమెకు జరిగిన అనేకావమానాలు అభిమాన ధనురాలి మనస్సును గాయపరిచాయి. అందుకే ఇక్కడ తిక్కన్న 'మానిని' అని సాభిప్రాయంగా వాడాడు.

**శా. 'చింతాశల్యము వాసెనే? భుజబలోత్సేకంబు నీ కెక్కెనే?**
**శాంతిం బొందెనె రోషపావకుఁడు? దుశ్చారిత్రునిం జూచితే?**
**సంతోషించితె? యిట్లు గాక, బ్రదుకన్ శక్యంబె? దుర్వృత్తి నీ**
**చెంతం జేరినయట్టివీరులకు నాచేతం బయోజాననా!' 358**

**ప్రతిపదార్థం:** పయోజ+అననా!= పద్మంవంటి ముఖంగల ఓ ద్రౌపదీ!; చింతాశల్యము= దుఃఖము అనే ముల్లు; పాసెనే?= తొలగిపోయిందా?; భుజబల+ఉత్సేకంబు= (నా) బాహుబలంయొక్క ఆధిక్యం; నీకున్+ఎక్కెనే?= నీ మనసు కెక్కిందా? (నచ్చిందా?); రోషపావకుఁడు= రోషమనే అగ్ని; శాంతిన్+పొందెనె?= శాంతించాడా?; దుస్+చారిత్రునిన్= చెడు నడవడిగల కీచకుడిని; చూచితే?= చూచావా?; సంతోషించితె?= సంతోషించావా?; ఇట్లు+కాక= ఈ విధంగా కాకుండా; దుర్వృత్తిన్= చెడుప్రవర్తనతో; నీచెంతన్+చేరిన+అట్టి= నీదగ్గరకు చేరినటువంటి; వీరులకున్= యోధులకు; నాచేతన్= నా చేతిలో; బ్రదుకన్ శక్యంబె!= బ్రతకటం సాధ్యమా?

**తాత్పర్యం:** 'ఓ పద్మముఖీ! గుండెలో ములికి వంటి నీ దుఃఖం తీరిందా? నా బలోద్రేకం నీ మనసు మెచ్చిందా? నీ కోపాగ్ని శాంతించిందా? దుష్టుడైన కీచకుడి భంగపాటు చూచావుకదా? సంతోషం కలిగిందా? దుర్బుద్ధితో నీ పొందుకోరే వీరులకు నా చేతిలో చావు తప్పదు. అది అంతే!'

**విశేషం:** తిక్కన దృశ్యశ్రవ్య - ఉభయకావ్యశిల్ప ప్రౌఢిని ప్రదర్శించే పద్య మిది. తిక్కన నర్తనశాలలో 'విక్రమ ధురంధరతన్' ప్రవేశించే భీముడిని 'ద్రౌపదీరమణు'డని పేర్కొన్నాడు. ద్రౌపదిని రమింపచేసేవాడు (సంతోష పెట్టేవాడు) అనేది భీముడికి బిరుదంగా ఇచ్చాడు. కీచకుడిని సంహరించే సంరంభమంతా రమణి మనసును రంజింపజేయటానికే అని తాత్పర్యం. దానిని ఈ పద్యం రమణీయంగా ప్రదర్శిస్తున్నది. భీముడు ద్రౌపదిని ఐదు ప్రశ్నలు అడుగుతున్నాడు. అవి నాటకంలోని 'పంచావస్థలకు' సంబంధించినవి. కీచకుడు కామభావోద్ధతుడై తనకు మానభంగం చేస్తాడేమోననే చింత ద్రౌపది హృదయంలో గుచ్చుకొన్న బాణపు ముక్కవలె బాధపెట్టుతూ ఉండేది. దానికి అతడి మరణమే మందని ద్రౌపది నిశ్చయం. ఇప్పు డామెకు ఆ బాధ తొలగిపోయిందా? అని మొదటి ప్రశ్న. సమస్యకు బీజం వంటి అంశం ఆరంభమై ఫలించిందికదా? అని ఆ ప్రశ్న పరమార్థం. ఆ బీజం ఫలించాలంటే తీవ్ర ప్రయత్నం కావాలి. అది భీముడు ప్రదర్శించిన 'భుజబలోత్సేకం' నిర్వహించింది. అది ఆమె మనసు మెచ్చేటట్లు సాగిందా? అని అడిగాడు. ప్రయత్నావస్థ ప్రశంసాపాత్రంగా సాగిందని ధ్వని. కీచకుడు చేసిన అవమానానికి తగిన ప్రతీకారం తీసికొనాలని ద్రౌపది పగ, అది అగ్నివలె ఆమె హృదయాన్ని దహిస్తూ ఉండేది. అది ప్రాప్త్యాశ (ఫలం సిద్ధిస్తుందో లేదో అనే తీవ్ర సంశయంతో కూడిన అనిశ్చిత స్థితి) వంటిది. అది చల్లారిందా అని అడిగాడు. ఆ దుర్గార్గుడి స్థితి చూచావా? అన్న

ప్రశ్న 'నియతాప్తి'ని (కార్యావరోధాలైన అపాయాలన్నీ తీరి కోరిక సిద్ధించే దృఢనిశ్చయం) సూచిస్తున్నది. కీచక మరణం నియతాప్తికి నిండు ఫలం. చివరకు 'సంతోషించితె! అని అడిగాడు. ద్రౌపదీ రమణుడి వీరకార్యానికి ఫలం ప్రియురాలి హృదయప్రమోదం. భీముడి దృష్టిలో ద్రౌపది సంతోషమే కార్యఫలం. ఇవి ద్రౌపది నడుగుతున్న ప్రశ్నలే అయినా తిక్కన కీచకవధ ఘట్టాన్ని ఒక నాటకంగా నిర్వహించిన శిల్పప్రౌఢిని పఠితకు జ్ఞాపకం చేస్తూ, నాటకంలోని పంచసంధులలోనిని అర్థప్రకృతులవలన కలిగే పంచ విధావస్థలు సముదాత్తంగా పఠితల మనస్సులకు ఆహ్లాదం కలిగించేటట్లుగా నిర్వహించబడ్డాయని తెలిసికొన్నారా? అని అడుగుతున్న ప్రశ్నల వలె కనబడుతున్నాయి. ఆ ప్రశ్న లడుగుతున్నది కార్యనిర్వాహకుడైన నాయకుడు. ద్రౌపది సహృదయస్థానీయురాలుగా నిలిచింది. అందువలన ప్రశ్నలు కథాపరంగా, రసపరంగా కూడా ఉభయతారకంగా ఉన్నాయి.(ఈ అంశానికి సమాధానంగా ద్రౌపది నాయికవలె, సహృదయస్థానీయ వలె 360వ పద్యం చెప్పటం గమనించదగింది.) ఈ పద్యంలోని చివరి వాక్యం ద్రౌపదీరమణుడే అనగలడు. భార్యమీద ఈగవాలితే ఓర్చుకొనలేని ప్రణయప్రతాపమూర్తి భీముడు. ఆ మాటలు అంటున్నప్పుడు భీముడు 'ద్రౌపదీ రమణుడే' కాదు 'సింహబలమర్దనుడు'గా (359 పద్యం) కూడా ద్రౌపదికి తోచాడట! ఈ రెండూ తిక్కన భీమనాయకుడి కిచ్చిన సార్థకమైన బిరుదాలు. కీచకవధ ఘట్టంలోని నాటకీయ లక్షణాలను ధ్వనిమయం చేసే పంచప్రశ్నోపనిషత్తు వంటి దీ పద్యం ! (సంపా.)

**క. అనిన విని సింహబల మ। ర్దను నవలోకించి ద్రుపదరాజతనయ యి**
**ట్లనుఁ దన మనమున నిండా। రిన సమ్మోదంబు వెలివిరిసి బెరయంగన్. 359**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; ద్రుపదరాజ తనయ= ద్రౌపది; సింహబలమర్దనున్= కీచకుడిని చంపిన భీముడిని; అవలోకించి= చూచి; తన మనమునన్= తన మనస్సులో; నిండారిన= నిండిన; సమ్మోదంబు= సంతోషం; వెలివిరిసి= వెల్లివిరిసి; బెరయంగన్= వ్యాపించగా; ఇట్లు+అనున్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అతడి మాటలు విని కీచకుడిని మర్దించిన భీముడిని చూస్తూ ద్రౌపది మనస్సు సంతోషంతో వెల్లివిరియగా ఇట్లా అన్నది.

**విశేషం:** 'సింహబలమర్దనుడు' అనేది ఇప్పటినుండి భీముడికి సరిపోతుంది. సింహబలుడి వింత చావు మర్దనపరాక్రమానికి మహనీయమైన సాక్షి. అంతకు ముందు 'బకమర్దనుడు'. ఇప్పుడే కీచకుడిని చంపాడు. తగిన పదప్రయోగం చేశాడు తిక్కన.

**సీ. 'కొలువు లోపల నిన్న కోప మట్లెత్తినఁ। దలఁకక నిలిచిన ధైర్యమహిమ,**
**నేఁ డిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ। కన్నులు గప్పిన గౌరవంబు,**
**మనవారిలోన నొక్కని నైనఁ బిల్వ కు। త్సాహంబు సేసిన సాహసంబు,**
**లోకదుర్జయుఁ డగు నీ కీచకునిని వ్రే। ల్మిడి రూపుమాపిన కడిమిసొంపు**

**తే. సూడఁ, దలపోయ. మెచ్చ, సంస్తుతి యొనర్ప। నా తలంబె? నీ యుత్తమనాయకత్వ**
**మెఱిఁగి నినుఁ గొనియాడ నే నెంతదాన?। మహిత విస్మయానంద నిర్మగ్న నైతి'. 360**

**ప్రతిపదార్థం:** నిన్న= క్రిందటి రోజున; కొలువులోపలన్= సభలో; కోపము= కోపం; అట్లు+ఎత్తినన్= ఆవిధంగా కలిగినా (అంతప్రళయంగా పొంగివచ్చినా); తలఁకక= చలించకుండా; నిలిచిన= నిలబడిన; ధైర్యమహిమ= ధీరగుణం యొక్క ఆధిక్యం; నేఁడు= ఈరోజు; ఇందున్+చనుదెంచి= ఇక్కడికి వచ్చి; నిర్వికారతన్= ఏ విధమైన కలతపాటు లేకుండా; ప్రజ కన్నులు కప్పిన=

జనుల కళ్ళను గుడ్డతో కట్టినట్లుగా ఎవ్వరికీ తెలియకుండా కార్యం నిర్వహించిన; గౌరవంబు= కార్యభారం, గొప్పతనం; మనవారిలోనన్= పాండవులలో; ఒక్కనిన్+ఐనన్= ఒక్కరిని కూడా; పిల్వక= పిలవకుండా; ఉత్సాహంబు+చేసిన= పరాక్రమించిన; సాహసంబు= అసాధ్యమైన కార్యాలను సాధించే తెంపు; లోకదుర్జయుఁడు+అగు= లోకులకు జయించశక్యంకానివాడు అగు; కీచకునిన్= కీచకుడిని; వ్రేల్మిడిన్= చిటికెలో; రూపుమాపిన= (రూపం గుర్తించలేనంతగా వింతగా); చంపిన; కడిమి సొంపు= పరాక్రమ వైభవం; చూడన్= చూడటానికి, తలపోయన్= తలపోయటానికి; మెచ్చన్= మెచ్చటానికి; సంస్తుతి+ఒనర్పన్= పొగడటానికి; నా తలంబె?= నాకు శక్యమా?; నీ ఉత్తమనాయకత్వము= నీ శ్రేష్ఠమైన నాయకత్వాన్ని (ధీరోదాత్త నాయక స్వభావాన్ని); ఎఱిఁగి= తెలిసికొని; నినున్+కొనియాడన్= నిన్ను పొగడటానికి, ఏను+ఎంతదానన్?= నే నెంతదానిని?; మహిత= గొప్పదైన; విస్మయ+ఆనంద నిర్మగ్నన్+ఐతిన్= ఆశ్చర్యంతోకూడిన, ఆనందంలో మునిగిపోయిన దాని నైనాను.

**తాత్పర్యం:** 'నిన్న విరటుడి కొలువులో అంత ప్రళయంగా కోపోద్రేకం కలిగినా కలతపడకుండా నిగ్రహించుకొని నిలిచిన నీ ధీర స్వభావ మహిమ చూడ నా తరమా? (అపూర్వమని భావం.) ఈరోజు నర్తనశాలకు ప్రజల కన్నులు కప్పి (ఎవ్వరికీ తెలియకుండా) ఎటువంటి సంకోచం లేకుండా వచ్చిన నీ కార్యభార నిర్వహణ సామర్థ్యం (గొప్పతనం) తలపోయ నా తరమా? మనవారైన పాండవులలో ఒక్కరిని కూడా సహాయానికి పిలవకుండా ఒంటరిగా అపూర్వ కార్యసాధన కొరకు ఉత్సాహాన్ని ప్రకటించి చేసిన నీ సాహసం మెచ్చుకొనటం నా తరమా? లోకంలో ఎవ్వరికీ సాధ్యుడు కాని కీచకుడిని క్షణంలో రూపం గుర్తుపట్టలేనంత ఘోరంగా చంపిన నీ పరాక్రమ విలాసం కీర్తించటం నా తరమా? నీ ఉత్తమనాయకత్వలక్షణాల నన్నింటిని తెలిసికొని కీర్తించటానికి నేనెంతదానిని? అమితమైన ఆశ్చర్యంలో ఆనందంలో మునిగిపోయాను.

**విశేషం:** అలం: ఉదాత్తం, యథాసంఖ్యం. విరాటపర్వంలోని గొప్ప పద్యాలలో ఇది ఒకటి. అందుకు కారణాలు అనేకాలు. కొన్ని: 1. తిక్కన భారతం ప్రబంధమండలి. అందులో కీచకవధ ఒక ప్రబంధం. దృశ్య ప్రబంధ లక్షణాలను గర్భీకరించుకొన్న శ్రవ్య ప్రబంధం. కాబట్టి అందులో ఉభయ కావ్య ప్రౌఢి పాటించే శిల్పం ఉంటుంది. ఒక నాయకుడు, ఒక కార్యం. ఒక ప్రధానరసం అనేవి ప్రబంధ లక్షణాలు. అవన్నీ ఈ ఘట్టంలో నిర్వహించబడ్డాయని సూచించే ధ్వనిమయ రచన ఇది. 2. కార్యం నిర్వహించేది నాయకుడు. రసాన్ని అనుభవించేది సహృదయుడు. నాయకుడు భీముడు. కార్యం కీచక సంహారం. అద్భుతానుప్రాణితమైన వీరరసం రసం. ద్రౌపది శ్రోత్ర, ప్రేక్షక స్థానీయురాలై సహృదయ రసానంద స్థితిని వ్యక్తం చేస్తూ మన మహానుభూతికి పాత్రురాలైంది. అందువలన ఆమె మాటలు సహృదయ స్పందనలు. 3. కావ్య వస్తువులో కార్యసాధన దశలను సూచించే పంచసంధు లుంటాయి. అవి అయిదు అర్థప్రకృతులు- అయిదు అవస్థలు క్రమంగా కలియటం వలన రూపొందుతాయి. వాటిని తిక్కన ఈ పద్యంలో సూచించాడు. అముఖసంధి- బీజం+ఆరంభం. కొలువులో కీచకుడి చేత ద్రౌపది అవమానింపబడిన దృశ్యాన్ని భీముడు చూచి కోపించటం బీజం. వాడిని చంపాలని క్రోధావేశాన్ని ప్రకటించడం ఆరంభం. ఆరంభించిన కార్యాన్ని చివరివరకూ నిర్వహించే అసమాన ధైర్యం నాయకుడు ప్రదర్శించే మొదటి లక్షణం. ఇవి సీసపద్యం మొదటి పాదంలో సూచించబడ్డాయి. (ఆ) ప్రతిముఖసంధి-బిందువు+యత్నం, నీటి మీది నూనె బిందువువలె పలు రకాలుగా విస్తరించే కార్యం కీచకవధ వ్యూహం. అజ్ఞాతవాస నిలయం భంగం కాకుండా, ప్రజలకు తెలియకుండా, ద్రౌపదీ భీముల సంబంధం బహిర్గతం కాకుండా, ధర్మరాజుకు తెలియకుండా, కార్యం భగ్నం కాకుండా, ద్రౌపదిని ఇతరులు శంకించకుండా కార్యం జరిపే ఉపాయం నర్తనశాల సంకేత స్థల నిర్ణయం. దానిని రూపొందించి గుట్టుగా నిర్వహించే యత్నం చేయటం ప్రతిముఖ సంధి లక్షణం. దానిని నిర్వహించటంలో గౌరవం భీముడిదే. గౌరవం అంటే గురుభావం (నాయకత్వం) భారాన్ని వహించే భావం, మర్యాద కాపాడటం, గొప్పతనం, కీర్తి అనే అర్థాలు ఏర్పడతాయి. ఇవన్నీ నాయక కార్యనిర్వహణ దక్షతను తెలిపేవే. (ఇ) గర్భసంధి- పతాక+ప్రాప్త్యాశ. ద్రౌపది ఆడిన వలపు

నాటకం. దాని వలన కలిగిన కీచక విరహదశ ఉపకథాగౌరవాన్ని పొంది పతాకగా స్ఫురిస్తుంది. కీచక సంహారం ఎట్ల చెయ్యాలనే యోచన. కథ ఏ విధంగా మలుపు తిరుగుతుందో అనే ఉత్కంఠ కీచక ప్రవేశ ఘట్టంలో నాయక ప్రతినాయకు లిద్దరూ రెండు మార్గాలలో ప్రదర్శిస్తారు. దానితో గర్భసంధి నిబ్బరంగా సాగింది. దానివలన భీముడు ఏకవీరుడై, అసాధ్యమైన కార్యాన్ని సాధించే సాహస ప్రవృత్తిని ప్రదర్శించి నాయక లక్షణాన్ని నిరూపించుకొన్నాడు. (ఈ) విమర్శ సంధి- ప్రకరి+నియతాప్తి, భీముడు సంకేతస్థలంలో స్త్రీవలె శయ్యమీద కూర్చుండి. స్త్రీకంఠంతో విచిత్ర సంభాషణం చేయటం ప్రకరి వంటిది. కీచకుడు సంకేత స్థలానికి రాగా గూఢమర్దనక్రియతో అతడిని సంహరించటానికి పూనుకొని, వికృతపుచావు కలిగించిన భీమ పరాక్రమ సౌందర్యం కార్యనిర్వహణసమర్థంగా ప్రకాశించింది. ఇది నాయక శ్రేష్ఠ లక్షణం. (ఉ) నిర్వహణ సంధి- కార్యం+ఫలాగమం- కీచకవధను కళ్ళారా చూపించటం కార్యం. ప్రియురాలి మనస్సును ఆనందపరచటం ఫలాగమం. ఫలాగమం ఇందులో ఫలవంతంగా ప్రదర్శించబడింది. భీముడు 358వ పద్యంలో అడిగిన అయిదు ప్రశ్నలకు ద్రౌపది ఇచ్చిన అయిదంచెల సమాధాన మిది. (5) ఉత్తమ నాయకుడు. చతుర్విధనాయకులలో ఉత్తముడైన ధీరోదాత్తుడు, లేదా ఉత్తముడైన నాయకుడు అని అర్థం. (6) భీముడు సహజంగా ఉద్ధతుడే. అయినా ధర్మం చేత, ధర్మరాజు చేత అనుశాసితుడు కాబట్టి ఇక్కడ ధీరోదాత్తుడే. అతడు మొదట రౌద్రాన్ని ప్రదర్శించినా దానిని ధర్మరాజు నియంత్రించటం వలన వీరంగా నిర్వహించాడు. వీరం జనకరసం. అద్భుతం జన్యరసం. అద్భుత కార్యోత్సాహం భీముడిలో వీరరసాన్ని ఆవిష్కరించింది. దానిని చూచిన ద్రౌపదిలో తద్భావనం వలన, దర్శనం వలన అద్భుతరసాన్ని కలిగించింది. అది సహృదయులకు ఆలోచనామృతమై కావ్యరసమై అనుభూతిలో ముంచివేసింది. ఈ రససూత్ర వ్యాఖ్యానమే ఈ పద్యం. (సంపా.)

**క. అను పలుకులు కర్ణరసా। యనము లగుడు నయ్యుధిష్ఠిరానుజుఁడు ముదం**
**బునఁ దేలిఁ ' యింకఁ దడయం। జన'దని ద్రౌపదికిఁ జెప్పి చయ్యన నేఁగెన్. 361**

**ప్రతిపదార్థం:** అనుపలుకులు= అనే మాటలు; కర్ణరసాయనములు+అగుడున్= చెవికి ఇంపైనవి కాగా; ఆ+యుధిష్ఠిర+అనుజుఁడు = ధర్మజుడి తమ్ముడైన భీముడు; ముదంబునన్+తేలి= సంతోషంలో తేలియాడి; ఇంకన్+తడయన్+చనదు+అని= ఇకమీద ఆలస్యం చేయటం మంచిది కాదని; ద్రౌపదికిన్+చెప్పి= ద్రౌపదితో చెప్పి; చయ్యనన్+ఏఁగెన్= త్వరగా వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ మాటలు చెవి కింపుకాగా భీముడు సంతోషంతో ఉప్పొంగిపోయి 'ఇక ఇక్కడ ఆలస్యం చెయ్యటం మంచిది కాదు' అని ద్రౌపదిని హెచ్చరించి, వెంటనే వెళ్ళిపోయాడు.

**విశేషం:** కర్ణరసాయనములు అనే మాట శ్రవ్యకావ్యరస సూచన. యుధిష్ఠిరానుజుఁడు - అనే విశేషణం భీముడిని ధీరోదాత్తుడిగా చెప్పటమే కాకుండా, భీముడు ధర్మరాజుకు అనునాయకుడనీ, అతడి ప్రయత్నం వలన జరిగిన ఈ వీరకార్యం నాయకుడి ప్రధాన రసమైన ధర్మవీరానికి అంగమై, పోషకమై ఉంటుందనీ సహృదయులు భావించటానికి అనువుగా అమరింది. (సంపా.)

**క. అనిన విని 'కీచకుఁడు స। చ్చిన పిమ్మటఁ బుట్టినవ్విశేషము లెల్లన్**
**విను వేడుక మనమలరెడు। ననఘా! యేర్పడఁగఁ జెప్పు' మనుటయుఁ బ్రీతిన్. 362**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వైశంపాయనుడు చెప్పగా; విని= జనమేజయుడు విని; అనఘా!= ఓ పుణ్యలక్షణుడవైన మహానుభావా!; కీచకుఁడు+చచ్చిన పిమ్మటన్= కీచకుడి మరణానంతరం; పుట్టిన= కలిగిన; ఆ+విశేషములు+ఎల్లన్= ఆ విషయాలు అన్నీ; వినువేడుకన్= వినాలనే కోరికతో; మనము+అలరెడున్= మనస్సు ఒప్పారుతున్నది; ఏర్పడఁగన్= ఆ విషయాలు తేటపడేటట్లు; ప్రీతిన్= ఆసక్తికరంగా; చెప్పుము+అనుటయున్= చెప్పుమనగా.

**తాత్పర్యం:** జనమేజయుడికి వైశంపాయనుడు కీచకవధ ఘట్టం చెప్పగా విని, ఆ తరువాత జరిగిన వివరాలు ఆసక్తికరంగా చెప్పుమని జనమేజయమహారాజు అడుగగా, (తరువాతి ఆశ్వాసంలోని వచనం(2)తో అన్వయం.)

**విశేషం:** భారత కథ జనమేజయమహారాజుకు వైశంపాయనమహర్షి చెప్పాడు. ఆ విషయం ఇక్కడ స్మరించుకొనాలి.

**ఆశ్వాసాంతము**

**చ.** **పరమ కృపావిధేయ! నిరుపాధిక చిన్మయ కాయ ! గాఢ వి**
**స్తరనిగమైకవేద్య! గుణతత్త్వ వికార నియత్యభేద్య ! సం**
**స్మరణ నిరస్త తాప! ఘన సంస్సృతి సంతమస ప్రదీప! ని**
**ష్ఠుర భుజసార దానవ నిషూదన! భక్తజన ప్రమోదనా!** 363

**ప్రతిపదార్థం:** పరమ కృపావిధేయ!= గొప్ప దయతో భక్తులకులోనైనవాడా!; నిరుపాధిక చిన్మయకాయ!= ఉపాధిలేని జ్ఞాన రూపమైన+స్వరూపం కలవాడా!; గాఢ విస్తరనిగమ!+ఏకవేద్య= మిక్కిలి విస్తరమైన వేదాల వలననే తెలియదగినవాడా!; గుణతత్త్వవికారనియతి+అభేద్య!= సత్త్వ, రజస్, తమోగుణాల మాయచే, నియమంచేత భేదింపరానివాడా!; సంస్మరణ నిరస్తతాప!= స్మరించడం చేత అధికమైన తాపాన్ని పోగొట్టేవాడా!; ఘన సంసృతి సంతమసప్రదీప!= గొప్ప సంసారమనే చీకటిని పోగొట్టటంలో ఉత్తమ దీపమైనవాడా!; నిష్ఠుర భుజసారదానవ నిషూదన!= కఠినమైన బాహుబలంగల రాక్షసులను చంపినవాడా!; భక్తజన ప్రమోదనా!= భక్తులకు సంతోషం కలిగించేవాడా!

**తాత్పర్యం:** అపారమైన దయతో భక్తులకు విధేయుడవై ఉండేవాడా! నిర్గుణ జ్ఞానస్వరూపా! విస్తార వేదవిద్య చేత తెలియదగినవాడా! సత్త్వరజస్తమోగుణ నియమాలచేత భేదించరానివాడా! స్మరించినంతమాత్రాననే పాపాలు పోగొట్టేవాడా! సంసారమనే చీకటిని పోగొట్టే శ్రేష్ఠమైన దీపమా! బాహుబలంతో రాక్షసుల మట్టుపెట్టినవాడా! భక్తజనానందదాయకా! హరిహరనాథా!

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం, రూపకం.

**క.** **చతురానందమయా । దు । ర్గతిరో గోద్గమ చికిత్సకా! భువన భవ**
**స్థితి సంహారకరా! నిర్వృతి పణ్యాపణ పదారవిందవికాసా !** 364

**ప్రతిపదార్థం:** చతుర్+ఆనందమయా!= నాలుగు విధాలైన (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశాలతో కూడిన ఆనందమయ స్వరూపుడా! లేదా చతురమైన నేర్పుతోడి ఆనందంతో నిండినవాడా!; దుర్గతిరోగ+ఉద్గమ చికిత్సకా!= దారిద్ర్యం అనే రోగం యొక్క పుట్టుకకు వైద్యం చేసేవాడా!; భువనభవస్థితి సంహారకరా!= లోకాల యొక్క సృష్టి స్థితి లయ కారకుడా!; నిర్వృతి పణ్య+ఆపణ= మోక్షమనే అమ్మదగిన వస్తువునకు అంగడి అయిన; పద+అరవింద వికాసా!= పాదపద్మాలచేత శోభించేవాడా!)

**తాత్పర్యం:** పరమానంద స్వరూపా! దుర్గతి అనే రోగాన్ని పోగొట్టే వైద్యుడా! లోకంలో సృష్టి స్థితి లయాలను చేసేవాడా! నిశ్శ్రేయస మనే వస్తువునకు అంగడివంటి పాదపద్మాలచేత శోభించేవాడా!

**విశేషం:** అలం: రూపకం. ఉపమ. తిక్కన మోక్షగామి. ఆయనకు మోక్షప్రదాతగా హరిహరనాథుడు దర్శనమిచ్చాడు.

**మాలిని. సురపతి ధృతచూడా శోభిరత్నాంశు వీచి**
**స్ఫురణ సుభగపాదాంభోజ సంచారకేళీ**
**పరిచయ కలనాలబ్ధవ్యయాతీత సౌఖ్యో**
**త్తర మునిజన హృన్మా ద్యన్మరాళ ప్రతానా!** 365

**ప్రతిపదార్థం:** సురపతి= దేవేంద్రుడిచేత; ధృత= ధరించబడిన; చూడా= కిరీటంలో; శోభి= ప్రకాశించే; రత్న+అంశువీచిస్ఫురణ= మణుల కాంతుల కిరణాల ప్రకాశం చేత; సుభగ= మనోహరమైన; పాద+అంభోజ= పాదపద్మాలలో; సంచారకేళీ= తిరిగే క్రీడలో; పరిచయ కలనా= అభ్యాసం చేయటం చేత; లబ్ధ= పొందబడిన; వ్యయ+అతీత= నాశాన్ని అతిక్రమించిన; సౌఖ్య= సుఖంచేత; ఉత్తర= అధికములైన; మునిజనహృద్= మునుల హృదయాలనెడి; మాద్యత్+మరాళ ప్రతానా!= ఆనందించే ఉత్తర హంసల సమూహం కలవాడా!

**తాత్పర్యం:** దేవేంద్రుడు నమస్కరించడం చేత అతడి కిరీటంలోని రత్నకాంతులు తరంగాలవలె ఒప్పుతూ వున్న నీ పాదకమలాలను చేరి పరమసుఖాన్ని పొందిన మునుల హృదయాలనే రాజహంసలు కల దేవా! హరిహరనాథా!

**విశేషం:** అలం: రూపకం. ఈ వృత్తంలోని ప్రతి పాదంలోనూ న-న-మ-య-య అనే గణాలు వరుసగా ఉంటాయి. తొమ్మిదవ అక్షరం యతి మిత్రస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు ద్వితీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది శుభకరమైన ఉభయకవిమిత్ర బిరుదాంచితుడు, కొమ్మనామాత్యుడు పుత్రుడు, పండితులను గౌరవించేవాడు (పండితులచేత పూజించబడేవాడు) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారత విరాటపర్వంలో ద్వితీయాశ్వాసం.

విరాటపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము - తృతీయాశ్వాసము

**శ్రీత్వ శివాత్వాలంబన। తత్త్వాశ్లేషాత్త శబలతా సంగత క**

**ర్తృత్వాదికలీలాత్త మ। హత్త్వాహంకారభావ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీత్వ= లక్ష్మీభావానికీ; శివాత్వ= పార్వతీభావానికీ; ఆలంబన= ఆధారమైన; తత్త్వ= (హరిహరాత్మకమైన) బ్రహ్మతత్త్వంయొక్క; ఆశ్లేష= కలయికచేత; ఆత్త= పొందబడిన; శబలతా= అనేకత్వంతో; సంగత= కూడిన; కర్తృత్వ+ఆదిక= కర్తృత్వం, భోక్తృత్వం మొదలైన ధర్మాల; లీలా= విలాసంచేత; ఆత్త= పొందబడిన; మహత్త్వ+అహంకారభావ!= మహత్త్వం, అహంకారం అనే భావాలు కలవాడా!; హరిహరనాథా!

**తాత్పర్యం:** లక్ష్మీపార్వతుల భావాలకు ఆధారమైన హరిహరనాథ బ్రహ్మతత్త్వంతో ఏర్పడిన కూడికతో కలిగిన అనేకత్వంతో కూడిన కర్తృత్వం మొదలైన ధర్మాల విలాసం చేత పొందబడిన మహత్త్వాహంకారాలు కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: యథాసంఖ్యం. 1. **"ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ"** అని ఉపనిషత్తులు. హరిహరనాథుడు వస్తుతః ఏక పరబ్రహ్మతత్త్వమే, అద్వితీయుడే. అతడికి కర్తృత్వ భోక్తృత్వాలూ, మహత్త్వాహంకారాలూ ఉండవు. కాని, పరమాత్మ సృష్టి కున్ముఖుడైనప్పుడు తనలోనే సగభాగాన్ని స్త్రీత్వశక్తిగా మార్చి లోకాన్ని నిర్మిస్తాడు. ఇది అతడి విలాసం. హరిహరనాథుడే ద్వంద్వరూపుడైనాడు. అందువలన ఇచ్ఛాశక్తి అయిన లక్ష్మికీ, క్రియాశక్తి అయిన పార్వతికీ తానే ఆధారభూతుడై జ్ఞానశక్తిగా వెలుగుతున్నాడు. ఇట్లా పరబ్రహ్మతత్త్వమే బహురూపాలు తాల్చటానికి పూర్వకర్మలు కారణం కాదు. ఆయన కారణజన్ముడు కావటం చేత స్వేచ్ఛా ప్రవృత్తితో బహుత్వాన్ని భజిస్తాడు. దానితో లీలా విలాసరూపాలైన మహత్త్వాహంకారాలు ఆయనలో రాణిస్తాయి. పరమాత్మకు అవి లీలామాత్రాలే కాని కర్మబద్ధాలు కావని తాత్పర్యం.

2. "హరిహరనాథ తత్త్వాంతర్గతమగు హరితత్త్వము శ్రీత్వమునకును. హరతత్త్వము శివాత్వమునకును ఆలంబన మగుచున్నది. ఇట్టి హరిహరతత్త్వ సంబంధము చేతనే యేకరూపుడగు పరమేశునికి స్వగతభేదమగు శబలత్వము కల్గినదని చెప్పి తత్ప్రక్రియను "మహత్త్వాహంకారభావ!" అను పదముచే వివరించెను. లేదా- 'శబలత్వ' సంగతిచే గల్గిన కర్తృత్వాదికము గలవాఁడా! అని వేరు పదముగాఁ జెప్పి 'లీలా..భావా!'అనునది పృథక్పదముగానైనను గ్రహింప నొప్పును. విలాసముచేఁ బొందఁబడిన మహత్త్వాహంకారభావము గలవాడా! అని తదర్థము." (ఓరుగంటి నీలకంఠశాస్త్రి- హరిహరనాథతత్త్వము. పు.85)

3. "శ్రీత్వ= శ్రీశబ్ద ప్రవృత్తి నిమిత్త శ్రవణీయత్వరూప శ్రీదేవీ ధర్మము: శివాత్వ= మంగళప్రదత్వరూప శివాశబ్ద ప్రవృత్తి నిమిత్త పార్వతీధర్మము ఇవియే; ఆలంబన= పట్టుగాఁగల; తత్త్వ= స్త్రీ వ్యక్తులయొక్క; శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వయొక్క అని భావము; ఆశ్లేష= కౌఁగిలింతలచే; ఆత్త= పొందబడిన; శబలతా= చిత్రవర్ణముతో; సంగత!= కూడినవాఁడా!; కర్తృత్వ= (పాలన) కర్తృత్వము; ఆదిక= సంహార కర్తృత్వము మొదలగు; లీలా= విలాసములచే; ఆత్త= పొందబడిన; మహత్త్వ= మహిమయు; అహంకారభావ= అహంకార తత్త్వమును గలవాఁడా!; హరిహరనాథా!= హరిహర స్వరూపుడవగు ఓ దేవా! అని యీ సంబోధనల కర్థము" (పళ్ళెపూర్ణప్రజ్ఞాచార్యులు - విరాటపర్వము. తృతీయాశ్వాసము టిప్పణి.)

4. "ఈ పద్యములోని నాల్గవ పాదమునఁ బ్రాసలోఁ బడిన 'మహత్త్వా' అను చోటఁ గల తకారము ద్విత్వతకారము గనుక 'ప్రాసః సర్వేషాం చై వ స్యాత్' అను నియామానుసారము తక్కిన మూఁడు ప్రాసలను గూడా వస్తుతః అని ఏక తకారములే యైనను ఛందోనియమభంగ పరిహారార్థము 'అనచిచ' అను సూత్రము చేత 'త'కారమునకు వైకల్పికముగా ద్విత్వము చేసికొని ప్రాసవ్యత్యాసమును సవరించుకొనవలెను. (పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు).

5. ఉ.వి. సంశోధిత ముద్రిత ప్రతి 'మహత్త్వ'లో ద్విత్వతకారాన్ని మాని తకారాన్నే గ్రహించింది. (సంపా.)

**ఉపకీచకులు ద్రౌపదిం దమ యన్న శవంబుతోఁ గట్టి దహింపం గొనిపోవుట (సం.4-21-62)**

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ - బవనతనయుం డట్లు సని మహానసమందిరంబు పరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసికొని, యనులేపనంబున నసృగ్గంధం బుడిపికొని, కృతకృత్యుండై, శయ్యాతలంబునం గూర్చుండె; నిట యాజ్ఞసేనియుం భీమసేనుం డింతకు వంట యింటికిం బోయి నిశ్చింతంబున నుండునని నిశ్చయించి, నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్+ఇట్లు+అనియెన్= వైశంపాయన మహర్షి జనమేజయ చక్రవర్తితో ఈ విధంగా అన్నాడు; పవనతనయుండు= భీమసేనుడు; అట్లు= ఆ విధంగా; చని= వెళ్ళి; మహానస మందిరంబు పరిసరంబునన్= వంట ఇంటి సమీపంలో; శరీర ప్రక్షాళనంబు+చేసికొని= ఒడలు కడిగికొని; అనులేపనంబునన్= మైపూతతో; అసృక్+గంధంబు= నెత్తుటి వాసనను; ఉడిపికొని= పోజేసికొని; కృతకృత్యుండు+ఐ= తాను చేయదగినపని చేసిన వాడై; శయ్యాతలంబునన్= పడకమీద; కూర్చుండెన్= కూర్చున్నాడు; ఇట= ఇక్కడ, నాట్యమందిరంలో; యాజ్ఞసేనియున్= ద్రౌపదియు; భీమసేనుండు; ఇంతకున్= ఈసరికి; వంట+ఇంటికిన్+పోయి= వంటింటికి వెళ్ళి; నిశ్చింతంబునన్= ఏ చింతా లేకుండా; ఉండును+అని= ఉంటాడని; నిశ్చయించి= నిర్ణయించి; నర్తనశాల వెలువడి= నర్తనశాల నుండి బయటకు వచ్చి; కావలి వారలన్+ పిలిచి= కావలివారిని పిలిచి.

**తాత్పర్యం:** వైశంపాయన ఋషి జనమేజయుడితో ఇట్లా అన్నాడు. భీమసేను డా విధంగా వెళ్ళి (కీచక వధానంతరం) వంటింటిచేరువలో తన ఒడలి కంటుకొని ఉన్న నెత్తురు శుభ్రంగా కడిగికొని, మైపూతతో దాని వాసన రాకుండా చేసికొని, పని ముగించుకొన్నవాడై తన పడక మీద కూర్చున్నాడు. ఇక అక్కడ- నర్తనశాలనుండి ద్రౌపది వెల్వడి, ఈ సరికి భీమసేనుడు వంటయింటికి వెళ్ళి నిశ్చింతగా ఉంటాడనే నమ్మకంతో కావలివాండ్రను పిలిచి.

**విశేషం:** 1.వ్యాసభారతంలో ఈ వివరాలన్నీ లేవు. తిక్కన దీని నొక వ్యూహంగా చిత్రించాడు. ద్రౌపదీ భీముల చర్యలు ఫలానుమేయాలుగా (ఫలితాన్ని బట్టి ఊహించగలిగిన రహస్య చర్యలుగా) వర్ణించాడు. ఎట్లాగంటే- 1. ద్రౌపదిని వెంటబెట్టుకొని వచ్చిన భీముడు కీచక వధానంతరం అతడి వింత శవాన్ని ఆమెకు చూపి, సంతోషపెట్టి, ఆమెను వెంట బెట్టుకొని పోక ఒంటరిగా త్వరగా వెళ్ళిపోయాడు. ఎందుకు? అనే ప్రశ్న పఠిత కేర్పడుతుంది.

2. భీముడు వేగంగా స్నానం చేశాడు. అయినా రక్తపువాసన పూర్తిగా పోయి ఉండకపోవచ్చును. అందుకే మైపూత పూసికొన్నాడు. నిశ్చింతగా శయ్యమీద పడుకొని నిద్రించకుండా, కూర్చుండిపోయాడు. ఎందుకు? భీముడు తన కర్తవ్యం ముగించాడు. ఆ తరువాత ద్రౌపది కూడా మరొక కర్తవ్యాన్ని నిర్వహించవలసి ఉన్నది. అతడు కృతార్థు డయ్యాడు. ఆమె కూడా కృతార్థురాలు కావాలి. అందుకు ఆమె అక్కడ ఆగింది. భీముడు వంటయింటికి పోయి నిశ్చింతగా ఉండటానికి వీలైనంతసేపు కిమ్మనకుండా అక్కడే ఉన్నది. ఆ తరువాత తన చర్య ప్రారంభించింది. అంటే పఠితలకు తెలియని రహస్యవ్యూహం ఒకటి ఉన్నదన్న మాట.

3. నర్తనశాల వెలువడి కావలివారిని పిలిచింది. ఇది చాలా ప్రమాదంతో కూడిన సాహస చర్య. భీముడివలె తానూ రహస్యంగా అంతఃపురానికి పోయి ఉంటే కథ తెల్లవారేదాకా నిద్రపోయి ఉండేది. కాని తెల్లవారేసరికే కొన్ని పనులు పూర్తి కావాలని వారి వ్యూహం. ఈ చర్యవలన ద్రౌపది కొన్ని ఇబ్బందులకు గురికాక తప్పదు. కావలివారికి ఆమె చెప్పటం వలన కలిగే కథార్థాలు అనేకం. ఆమె ఆ సమయంలో నర్తనశాలకు ఎందుకు వచ్చింది? కీచకుడు అక్కడికే ఎందుకు వచ్చాడు? అది వారి సంకేతస్థలం అయి ఉండాలి. సైరంధ్రీ కీచకులు పరస్పరం కూడబలుక్కొనే అక్కడికి వచ్చి ఉండాలి. సైరంధ్రి పరపురుషుల పొత్తు కోరదు. అది ఆమె స్వభావం. కాని, దానికి విరుద్ధంగా ఆమె రంకుటాలు వలె వ్యవహరించింది. ఆమె రహస్య వర్తనానికి ఆమె భర్తలైన గంధర్వులు కోపించి మిండగాడైన సింహబలుడిని చంపి ఉంటారు. మరి, ఆమె నేమీ చేయలేదు. దానికి కారణ మేమిటి? ఆమెను కీచకుడు బలవంతంగా తెచ్చి బలాత్కారం చేయబోయాడేమో! అందువలన గంధర్వపతులు అతడిని చంపారేమో! ఇటువంటి వంద ప్రశ్నలు విన్నవారి మనసులలో తలెత్తుతాయి. అట్లా ఆశ్చర్యానుమానాలనూ, భయభ్రాంతులనూ, ఒక అసందిగ్ధ పరిస్థితినీ కల్పించటం ద్రౌపది వ్యూహంలోని అంతరార్థమై ఉండవచ్చును. ఇటువంటి కథార్థాలన్నింటినీ పఠితల ఊహలకు వదలి కథాగతిలో ఉత్కంఠను పోషించటం వస్తుధ్వనిలో భాగమైన కథాకథనశిల్పం. (సంపా.)

**క. 'నా పతులగు గంధర్వుల। చేపడి మృతిఁబొందె వీఁడె సింహబలుం; డీ**
**పాపాత్మునిఁ జూడుఁడు దు। ర్వ్యాపారఫలంబుఁగాంచె' నని పలుకుటయున్. 3**

**ప్రతిపదార్థం:** సింహబలుండు= కీచకుడు; వీఁడె= ఇతడే; నా పతులు+అగు గంధర్వుల= నా భర్తలయిన గంధర్వులకు; చేపడి= చిక్కి; మృతిన్+పొందెన్= చనిపోయాడు; దుర్వ్యాపార= చెడునడవడికి; ఫలంబున్= ఫలితాన్ని; కాంచెన్= పొందాడు; ఈ పాపాత్మునిన్= ఈ దుర్మార్గుడిని; చూడుఁడు= చూడండి; అని పలుకుటయున్= అని అనటమున్నూ.

**తాత్పర్యం:** 'నా భర్తలయిన గంధర్వుల చేత చిక్కి, తన చెడు నడవడిక ఫలితాన్ని పొందిన ఈ పాపాత్ముడైన సింహబలుడిని మీరు చూడండి' (అని సైరంధ్రి అనగానే.)

**విశేషం:** పరిపరివిధాలుగా సాగే ప్రజల ఆలోచనలను తన కనుకూలంగా మలచే కిటుకు ఈ పద్యంలో ప్రదర్శించింది. ఈ కందపద్యంలోని ప్రతి పలుకూ, ఆ మాటల కూర్పులోని వరుసా ఎంతో సార్థకమైనవి. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన. 'నన్ను అభిమానించే భర్తలు గంధర్వులు. వారికి నామీదనున్న ప్రేమ అపారం. వారి శక్తి అమోఘం. వారిచేతిలో పడ్డాడు కాబట్టే సింహబలుడు చచ్చాడు. చూడండి. ఎట్లా చచ్చాడో? అది గంధర్వుల చేతిలోని వింతచావు. అతడి చావు వాడు తెచ్చుకొన్నదే. వాడు పాపాత్ముడై పరదారను కోరి, వెంటనే ఆ పాపఫలాన్ని పొందాడు. అటువంటి చెడుపనులు చేస్తే చావుగాక మరే ఫలితం కలుగుతుంది?' అని దోషమంతా కీచకుడిదే అని చెప్పి, **'అత్యుత్కటైః పుణ్యపాపైః ఇహైవ ఫల మశ్నుతే'** అనే న్యాయాన్ని అనుసరించి, చేసిన మహాపాపానికి ఫలితం కీచకుడు ఇప్పుడే పొందాడనే కర్మసిద్ధాంతంతో వారికి నచ్చజెప్పింది. వాళ్ళలో గమనించదగిన అంశమేమంటే- కావలివారందరూ ద్రౌపది చెప్పినట్లే విన్నారు. ఆమెవలెనే ఆలోచించారు. దానికి ఈ మాటలు కారణం. కాగా, ఉపకీచకులు వచ్చిన తరువాత సన్నివేశం మారుతుంది. వారు ద్రౌపది దృక్పథంతో కాక కీచక పక్షంగా ఆలోచిస్తారు. ఈ ఘట్టంలో మూడు రకాల వారున్నారు. వ్యూహంతో మాట్లాడే ద్రౌపది, ద్రౌపదివలె ఆలోచించే కావలివారు, వారివలెనే ఆలోచించే బంధువులూ, విరాటాదులు, కీచకుడిని సమర్థిస్తూ పలికే ఉపకీచకులు. పఠితలకు ద్రౌపది వ్యూహం వాచ్యం కాలేదు. కాబట్టి ఆశ్చర్యంతో అందరి వెంటా నడుస్తుంటారు. ఉత్కంఠకు ఊపిరి పోసే సహజోక్తి చమత్కారం ఈ పద్య శిల్పం. (సంపా.)

**ఆ. వారు సంభ్రమించి వడిఁ గోల దివియలు। గొనుచు నులివు మిగులఁ గూడఁబాటి**
**నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నా కల। కల మెఱింగి కీచకవ్రజంబు. 4**

**ప్రతిపదార్థం:** వారు= ఆ కావలివారు; సంభ్రమించి= తొట్రుపడి; వడిన్= శీఘ్రంగా; కోల దివియలు= దివిటీలు; కొనుచున్= తీసికొని; ఉలివుమిగులన్= మ్రోత అతిశయించగా (కలకలము ఎక్కువకాగా); కూడన్+పాఱి= కలసి పరుగెత్తి; వృత్తశాలన్= నర్తనశాలలోనికి; చొచ్చిరి= ప్రవేశించారు; ఆ+తఱిన్= ఆ సమయాన; కీచక వ్రజంబు= కీచకుల గుంపు; ఆ కలకలము+ఎఱింగి= ఆ కోలాహలం విని.

**తాత్పర్యం:** కావలివా రా మాటలు విని వేగిరపడి త్వరత్వరగా కాగడాలు పట్టుకొని పెద్దగా అరుస్తూ అందరూ కలిసి నర్తనశాలలోనికి ప్రవేశించారు. అప్పుడు వాళ్ళు చేసిన కోలాహలాన్ని విని కీచకుల గుంపు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** సైరంధ్రి మాటలు విన్న కావలివారిలో మొదట సంభ్రమం కలిగింది. తమకు తెలియకుండా ఇంత ఘోరం ఇంత సమీపంలో జరిగిందంటే వారికి అనేకరకాలైన భయాలు కలిగాయి. అందుకే అంత తొట్రుపాటు. చీకటిలో జరిగిన ఆ దృశ్యాన్ని చూడటానికి దివిటీలు పట్టుకొని సాగారు. గంధర్వులో దయ్యాలో భూతాలో ఉన్న చోటికి నిశ్శబ్దంగా పోవటం భయం కాబట్టి పెద్ద పెద్దగా కేకలు పెట్టుతున్నారు. ఒంటరిగా పోవటం మంచిది కాదని అందరూ కలిసి గుంపుగా బయలుదేరి నర్తనశాలలో జాగ్రత్తగా ప్రవేశించారు. వాళ్ళు చేసిన కలకలం ఎంత దంటే- ఉపకీచకులు తెలిసికొని వచ్చేటంతటిది. ఉపకీచకులు ఎక్కడున్నారు? అనే ప్రశ్న మరొకటి. ఇది సింహబలుడి వ్యూహరచనకు సంబంధించిందిగా తోస్తుంది. అన్న ఎక్కడికి ఎప్పుడు వెళ్ళుతున్నా అంగరక్షకులుగా ఉపకీచకులు వెంట ఉంటారన్నమాట! సైరంధ్రి కిచ్చిన మాట ప్రకారం ఒంటరిగా సంకేతస్థలానికి సింహబలుడు వచ్చాడు. అతడి వెంట రహస్యంగా అనుసరిస్తూ తమ్ములు వచ్చారు. సందర్భోచితంగా చీకట్లో కొంత దూరంగా రహస్యంగా నిలిచిపోయారు. వారు మాటలు వినబడే దూరంలో లేరు; కేకలు వినబడే దూరంలో ఉన్నారు. అందుకే సైరంధ్రి మాటలు వారికి వినబడలేదు. కావలి వారి కేకలు వినబడి వచ్చారు. మూలంలో కావలివారందరూ ముందుగా నర్తనశాలలోకి వెళ్ళి ఆ వింతశవాన్ని చూచి అబ్బురపాటు చెందారు. వారు బహుశః కీచకుడి బంధువులకూ ఉపకీచకులకూ తెలియపరిచారేమో! వారందరూ ఆ క్రమంలో బిలబిలా పరుగెత్తికొని వచ్చారట! ఇది మూలంలో కూడా ఊహించుకొనదగిన అంశమే. అయితే ఇక్కడ కావలివారి కలకలం విని మొదట ఉపకీచకులు వెంటనే వచ్చారనీ, ఆ తరువాత (వారి వలన తెలిసికొని) బంధువులందరూ ఒక్కసారి గుంపుగా వచ్చారనీ తిక్కన చెప్పాడు. ఆ నడిరేయి కీచకమరణవార్త దావానలంవలె వ్యాపించిన తీరు భావనారమణీయం. (సంపా.)

**చ.** **కడు వెస వచ్చి రూపఱినకాయము నున్నతెఱంగుఁ జూచి బి**
**ట్టడలు మనంబులం గదిరి హా యనువారును, జోద్యమంది మ్రా**
**న్పడియెడువారు, నగ్రజునిపైఁ బడి మూర్ఛలఁ బొందువారు న**
**య్యెడ కరుగంగ నోర్వక మహిం బెఱచోఁ బలవించువారు నై.** **5**

**ప్రతిపదార్థం:** కడువెసన్+వచ్చి= మిక్కిలి వేగంగా వచ్చి; రూపు+అఱిన= ఆకారం (గుర్తించలేనంతగా) నశించిన; కాయము+ఉన్న తెఱంగున్= శరీరమున్న తీరును; చూచి= చూచినవారై; బిట్టు+అడలు మనంబులన్= మిక్కిలి చెదరిన మనసులతో; కదిరి= అతిశయించి; హా+అనువారును= భయంతో హా! అని అనేవారున్నూ; చోద్యము+అంది= ఆశ్చర్యపడి; మ్రాన్పడియెడువారును= (ఆశ్చర్యపడి) కదలకుండా ఉన్నవారున్నూ; అగ్రజునిపైన్+పడి= అన్న అయిన కీచకుడి మీద పడి; మూర్ఛలన్+పొందువారున్= మూర్ఛపోయేవారున్నూ; అ+ఎడకున్= ఆ చోటికి; అరుగంగన్+ఓర్వక= వెళ్లలేక; మహిన్= భూమిమీద; పెఱచోన్= వేఱొకచోట; పలవించువారున్+ఐ= దుఃఖించే వారున్నూ అయి.

**తాత్పర్యం:** (ఉపకీచకులు) చాలా వేగంగా వచ్చారు. గుర్తుపట్టలేనంతగా వింతచావు చచ్చిన తమ అన్న కీచకుడి శరీరం తీరు చూచారు. గుండెలు అదిరిపోయేట్లు ఎలుగెత్తి 'హో'అని ఆక్రోశించారు. ఆశ్చర్యంతో కొయ్యబారిపోయారు. అన్న శవంమీద పడి మూర్ఛ పోయారు. భయానకంగా ఉన్న ఆ శవప్రాంతానికి పోలేక దూరంగా ఉండి నేలమీదపడి పొర్లుతూ శోకాలు పెట్టారు.

**విశేషం:** అలం: అంత్యానుప్రాస. 1. కీచకుడంటే ఉపకీచకులకు ప్రాణం. వింతచావు చచ్చిన అతడిని చూచి వారు పొందిన శోకావస్థలను తిక్కన రసోద్విగ్నంగా వర్ణించాడు. వారు వేగంగా వచ్చారు. గుర్తుపట్టలేనంతగా రూపం కోల్పోయి మాంసపు ముద్దగా పడి ఉన్న ఆ తీరు చూచి మొదట బాగా భయపడ్డారు. వారి గుండెలు గుభేలుమన్నాయి. ఊహించని ఆ వింతచావును చూచి బావురుమన్నారు. ఇట్లా అయినవారు ఆత్మీయులూ కావచ్చును. కొంతమంది ఆశ్చర్యపోయి చేష్టలు దక్కి కొయ్యబారి నిలుచున్నారు. వీరు అధీరులై ఉండవచ్చును. కొందరు శవం మీద పడి ఏడ్చి మూర్ఛపోయారట! వీరు అవేశపరులు. ఉద్విగ్నులు కావచ్చును. కొందరు శవాన్ని సమీపించలేక దూరంగా నేలమీద పడి రోదిస్తున్నారట! వీరు భీరువులు కావచ్చును. సామాన్యంగా చనిపోయినవారిని చూడటానికి వచ్చే ఆత్మీయులలో కానవచ్చే నాలుగు రకాల వారి ప్రవృత్తులకు సమయోచితంగా ప్రకరణోచితంగా తిక్కన ఈ పద్యంలో ఆవిష్కరించాడు. అంత్యానుప్రాసను వారి శోకవృత్తికి అనుగుణంగా అనుసంధించి శబ్దాలంకారౌచిత్యాన్ని పోషించాడు.

2. బంధువులలోనే ఉపకీచకులు కూడా ఉన్నట్లు వ్యాసుడు కలిపి చెప్పాడు. తిక్కన విడమరచి క్రమంగా వివరించాడు. కథకు కావలసింది కావలివారి కన్నీరు కాదు. బంధువుల పలవరింపులు కావు. ఉపకీచకుల శోకావస్థలే. భావికార్యం వారివలననే సాగాలి. శవాన్ని చూడగానే ఆత్మీయులు బావురుమని దుఃఖించాలి. దానితో కొంత శోకపుపొంగు తగ్గి తేలికపడతారు. ఆ తరువాత ఓదార్పుమాటలతో తేరుకొంటారు. ఉపకీచకుల స్థితి కూడా అటువంటిదే.

3. మూలంలో. **"సర్వే సంహృష్టరోమాణః సంత్రస్తాః ప్రేక్ష్య కీచకమ్ । తథా సర్వాంగ సంభుగ్నం కూర్మం స్థల ఇవోద్ధృతమ్"** (సం.4-22-2) అని ఉన్నది. కీచకుడి శవాకారం అవయవాలన్నీ చూర్ణమై నేలమీదకు ఈడ్వబడిన తాబేలు వలె ఉన్నదట! మంచి ఉపమానం. తిక్కన దీనిని గ్రహించలేదు. ఎందువలన అంటే మూలంలో చూచేవారికి గగుర్పాటు కలిగింది. తిక్కన వర్ణించదలచుకొన్నది గగుర్పాటు కాదు. భయవిహ్వలమైన హాహాకారం (రోదనం), ఆశ్చర్యంతో కలిగే స్తంభం, ఆర్తివలన కలిగే మూర్ఛ, వియోగాన్ని భరించలేక నేలపైబడి తన్నుకొనటం వంటి శోక సాత్త్విక భావాలు. అందుకే ఈ పద్యం. తిక్కనది రసాభ్యుదయ దృష్టి. (సంపా.)

**వ. ఉన్నంత బంధుజనంబులు గూడంబాఱి కీచక శవంబు గనుంగొని. 6**

**ప్రతిపదార్థం:** ఉన్న+అంతన్= ఉపకీచకులు ఆ విధంగా ఉండగా; బంధుజనంబులు= బంధువులందరూ; కూడన్+పాఱి= కలసి పరుగెత్తి; కీచక శవంబున్+కనుంగొని= కీచకుడి శవాన్ని చూచి.

**తాత్పర్యం:** ఉపకీచకులు ఆ విధంగా ఉండగా బంధువులందరూ కలిసి పరుగెత్తికొని వచ్చి కీచకుడి శవాన్ని చూచారు.

**ఉ. 'మానవకోటి నిట్టి విసుమానపుఁ జీనుఁగు లైనవారి నెం**
**దైనను గంటిమే? యకట! యాఱడి వమ్మయిపోయె; దుర్జయం**
**బైన బలంబు గానితెరువై తన కిత్తఱిఁ దోడు గాద; యు**
**క్కీని మనంబు కీడు పరికించునె? క్రొవ్వినఁ జేటు తప్పునే?'. 7**

**ప్రతిపదార్థం:** మానవకోటిన్= మానవసమూహంలో; ఇట్టి= ఈ విధమైన; విసుమానము+పీనుఁగులు; వింత కలిగించే శవాలుగా; అయినవారిన్= మారినవారిని; ఎందున్+ఐనను= ఎక్కడనైనా; కంటిమే?= చూచామా?; అకట!= అయ్యో!; ఆఱడివమ్మ+ అయిపోయెన్= నిందతో కూడుకొన్న పనికిమాలిన చావైపోయింది; దుర్జయంబు+ఐన బలంబు= జయించరాని బలం; కానితెరువు+ఐ= చెడుదారినిబట్టి; ఇత్తఱిన్= ఈ సమయాన; తనకున్+తోడుకాదు+అ= తనకు సహాయపడకుండా పోయింది; ఉక్కిని మనంబు= మూర్ఖుడి మనస్సు; కీడున్= హానిని; పరికించునె?= గమనిస్తుందా?; క్రొవ్వినన్= గర్విస్తే; చేటుతప్పునే?= నాశనం తప్పుతుందా? (తప్పదనిభావం).

**తాత్పర్యం:** 'మానవ లోకంలో ఇంతటి వింతపీనుగులుగా మారిన వారిని ఎక్కడైనా చూచామా? (ఇంత వరకు చూడలేదు). అయ్యో! ఎంతటి అప్రతిష్ఠతో కూడుకొన్న పనికిమాలిన చావు వచ్చింది! ఎవ్వరూ జయించలేని ఈతడి అంతటి బలం కూడా చెడుదారిన పడి, సమయం వచ్చినప్పుడు తనకు తోడుపడకుండా పోయింది. మూర్ఖుడి మనస్సు రాబోయే కీడును పరికించదు. గర్వించిన మనసు చేటును తప్పించుకొనలేదు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. బంధువులు తమ్ములవలె దుఃఖించరు. విస్తుపోతారు. విచారిస్తారు. వివేచిస్తారు. విచక్షణను, విజ్ఞతను ప్రదర్శిస్తారు. ఇంత వింతపీనుగులైనవారిని మానవులలో ఎ్కడైనా చూచామా? అని తమ లోకజ్ఞానాన్ని నెమరు వేసికొంటూ కొందరు విస్తుపోయారు. చచ్చి కీర్తిశేషులౌతారు కొందరు. చచ్చి జాలిని సంపాదిస్తారు కొందరు. పాపం కీచకుడు పాపిష్ఠిచావు, పనికిమానిన చావు చచ్చాడే అని కొందరు విచారించారు. బలం ఎంత ఉన్నా చెడుదారిన పడటంతో అది అతడికి తోడు రాలేకపోయిందని ధర్మాధర్మ వివేచన చేశారు కొందరు. మూర్ఖుడి మనసు కీడును పరికించదని ఉచితానుచితవిచక్షణ కలవారన్నారు. గర్వించినవారికి చేటు తప్పదని విజ్ఞులు తీర్పు చెప్పారు. విచక్షణులు విజ్ఞులు అనుకొన్న మాటలు సాధారణ ధర్మాలుగా భాసించి అవి అర్థాంతరన్యాసాలంకార స్ఫూర్తిని ప్రకటించాయి. కీచకుడి మరణవార్త ప్రజలలో ఎన్ని విధాలుగా భావించబడుతుందో బంధువుల వ్యాఖ్యలచేత ధ్వనింప చేయటం కావ్య శిల్పం. తిక్కన లోకజ్ఞత. (సంపా).

**వ. అనుచు దాయం జని. 8**

**తాత్పర్యం:** అంటూ దగ్గరకు పోయి.

**తే. 'కరము లెయ్యవి? శిర మేది? గాళు లెచటఁ । జొచ్చె? గంధర్వవరులచేఁ జచ్చువార**
**లెల్ల నిట్టుల యగుదురో? యితనితోడి । యలుకఁ జేసిరో? యిది కడు నక్కజంబు'. 9**

**ప్రతిపదార్థం:** కరములు+ఏ+అవి?= చేతు లేవి?; శిరము+ఏది?= తల ఎక్కడ ఉన్నది?; కాళులు+ఎచటన్= కాళ్ళు ఎక్కడ; చొచ్చెన్= దూరాయి (కాళ్ళెక్కడికి పోయాయి?); గంధర్వవరులచేన్= గంధర్వ శ్రేష్ఠులచేత; చచ్చువారు+ఎల్లన్= చనిపోయేవారందరూ; ఇట్టుల+అగుదురో?= ఈ విధంగానే ఔతారా?; ఇతనితోడి= ఇతడి మీద; అలుకన్+చేసిరొ?= కోపంతో ఇట్లా చేశారేమో!; ఇది= ఈ చావు; కడు+అక్కజంబు= మిక్కిలి ఆశ్చర్యం కలిగించేదిగా ఉన్నది.

**తాత్పర్యం:** 'చేతు లేవి? తల ఏది? కాళ్ళెక్కడికి పోయాయి? (వీటిని విడిగా ఎక్కడా గుర్తించలేకపోతున్నాం). గంధర్వ వీరుల చేతులలో చచ్చేవాళ్ళంతా ఈ విధంగానే ఔతారేమో! లేక ఇతడిమీద ప్రత్యేకంగా బాగా కోపించి ఇట్లా చేశారేమో! కాకపోతే ఈ చావు ఇంత ఆశ్చర్యకరంగా ఉంటుందా?

**విశేషం:** గంధర్వపతులు చంపారని ద్రౌపది పలికిన మాటల ప్రభావంతో కీచకశవాన్ని చూస్తున్న ఏకగ్రీవంగా ఆశ్చర్యపోతూ అనుకొన్న మాట ఇది. మూలభారతంలో కాగడాలు పట్టుకొని వెళ్ళిన కావలివారు అనుకొన్న మాటలివి-

"పాణి పాద విహీనం తు దృష్ట్వా చ వ్యథితా భవన్
నిరీక్షన్తి తతః సర్వే పరం విస్మయ మాగతాః
అమానుషం కృతం కర్మ తం దృష్ట్వా వినిపాతితమ్
క్వాస్య గ్రీవా క్వ చరణౌ క్వ పాణీ క్వ శిర స్తథా

ఇతి స్మ తం పరీక్షన్తే గన్ధర్వేణ హతం తదా" (4-21-66-67) ఈ తాత్పర్యాన్ని అందరూ కలిసి అనుకొన్నట్లు సన్నివేశం చివర చెప్పటం తిక్కన కూర్పులోని నేర్పు. ఈ మాటలు భావికథకు బాటలు వేశాయి. ఎట్లాగంటే, గంధర్వులు చీకట్లో ఏకాంతంగా చంపారు. వా రట్లాగే చంపగలరు. వారి భార్యను కూడా అట్లాగే రక్షించుకొనగలరు. పది మంది కలిసి ఉన్నప్పుడు వారు రాలేదు. తెల్లవారితే ఏమౌతుందో? అని భావించారు. నలుగు రున్నప్పుడే కార్యం చక్కబెట్టుకొనాలనుకొన్నారు. అంతటి మహాబలుడి వింత శవాన్ని ప్రజలందరూ చూస్తే అతడి పరువుపోతుంది. నింద మిగులుతుంది. అందువలన ఉపకీచకులు సింహబలుడిని తెల్లవారేసరికి శ్మశానంలో దహనం చేయాలని అప్పుడే శవయాత్రకు సిద్ధం చేశారు. రాజమర్యాదలతో పోవలసిన కీచక శవం రహస్యంగా దొంగ యాత్ర చేయవలసి వచ్చింది. ఈ విధంగా కథ సాగటానికి కారణం ద్రౌపది అర్ధరాత్రే కీచకవధను కావలివారికి చెప్పటం అని గ్రహించి పఠితలూ ఆశ్చర్యపోతారు. (సంపా.)

**వ. అని వెండియు బహుప్రకారంబులం బలుకుచు శోకవిస్మయ పరీత చేతస్కులయి యున్నంత నొక యుపకీచకుండు నిజ సహోదరులం జూచి. 10**

**ప్రతిపదార్థం:** అని, వెండియున్= ఇంకా; బహుప్రకారంబులన్= అనేక విధాలుగా; పలుకుచున్= మాట్లాడుతూ; శోక విస్మయ పరీతచేతస్కులు+అయి= దుఃఖంతో, ఆశ్చర్యంతో నిండిన మనస్సు కలవారయి; ఉన్న+అంతన్= ఉన్న సమయంలో; ఒక ఉపకీచకుండు; (వారిలో) ఒకానొక ఉపకీచకుడు; (కీచకుడి తమ్ములలో ఒకడు); నిజసహోదరులన్+చూచి= తన తోబుట్టినవారిని చూచి.

**తాత్పర్యం:** అని, ఇంకా అనేకవిధాలుగా అనుకొంటూ శోకంతో, ఆశ్చర్యంతో నిండిన మనస్సులతో వారంతా ఉన్న సమయంలో ఒక ఉపకీచకుడు తన సోదరులనందరినీ చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'మన మెంత పనవి పిలిచిన। వినవేర్చునె సింహబలుఁడు? వేగమ యితనిం
గొని పోవఁగ వలయుంగా'। కని యందఱఁ దేర్చె ననునయా లాపములన్. 11**

**ప్రతిపదార్థం:** మనము= మనం (ఉపకీచకులం); ఎంత పనవి పిలిచినన్= ఎంతగా రోదిస్తూ పిలిచినప్పటికినీ; సింహబలుఁడు= కీచకుడు; వినన్+నేర్చునె?= వినగలడా?; వేగము+అ= శీఘ్రంగా; ఇతనిన్= కీచకుడిని; కొనిపోవఁగన్+వలయున్+కాక= తీసికొని పోవాలి, అంతే (అగ్ని సంస్కరణం కొరకు తీసికొని పోవాలని భావం); అని= అంటూ; అందఱన్= ఉపకీచకులనందరినీ; అనునయ+ఆలాపములన్= ఓదార్పు మాటలతో; తేర్చెన్= ఓదార్చాడు (దుఃఖం నుండి తేరుకొనేటట్లు చేశాడు.)

**తాత్పర్యం:** 'మనం శోకిస్తూ ఎంత పిలిచినా అవన్నీ సింహబలుడు వినగలుగుతాడా? (ప్రస్తుతం శోకించటం కాదు కర్తవ్యం. ఈ రహస్యపు చావు అందరికీ తెలియక ముందే) ఇతడిని వేగంగా శ్మశానానికి తీసికొని పోవాలి. (అది ప్రస్తుత కర్తవ్యం)' అని అంటూ అందరినీ తగిన ఊరడింపు మాటలతో శోకంనుండి తేరుకొనేటట్లు చేశాడు.

**విశేషం:** మూలంలో అక్కడున్న వారందరూ కలిసి తీసికొన్న నిర్ణయంగా చెప్పబడింది. తెలుగులో ధీరుడైన ఒక ఉపకీచకుడు పలికిన మాటలుగా చెప్పబడ్డాయి. ఇది లోకపు తీరుకు దగ్గరగా ఉన్నది. ఎవరింట్లో అయినా పెద్దవాడు పోతే అందరూ గుండెపగిలి, కుప్పగూలి రోదిస్తూ ఉంటారు. ఎవరో ఒకరు, లేదా కొందరు ధైర్యంతో ముందుకు వచ్చి, కర్తవ్యాన్ని జ్ఞాపకం చేసి, వారిని ఓదారుస్తారు. అట్లాగే, పేరు లేని ఉపకీచకుడిని తిక్కన పెద్దరికంతో నిలబెట్టి, లోకమర్యాదను కాపాడటంతోపాటు కీచక శవయాత్రకు మార్గం తెరచి కథకు గతి కల్పించాడు. (సంపా.)

**ఉ. సూతులు దాని కియ్యకొనుచుం దమ యన్నకు నగ్ని యేర్చు వా**
**రై తగ వాచరించునెడ నల్లన ద్రౌపది 'వీరి చందముల్**
**చూతముగాక' యంచు నొకచోఁ దమ చేరువ నున్నఁ గాంచి, సం**
**జాత మహోగ్రకోపులయి చారువిలోచనఁ బట్టి క్రూరతన్. 12**

**ప్రతిపదార్థం:** సూతులు= (సూత వంశానికి చెందిన) ఉపకీచకులు; దానికిన్= ఆ సలహాకు; ఇయ్యకొనుచున్= ఒప్పుకొంటూ; తమ+అన్నకున్= తమ అన్న అయిన కీచకుడికి; అగ్ని+ఏర్చువారు+ఐ= దహన సంస్కారం కొరకు అగ్గిని మండించే ఉద్దేశ్యంకలవారై; తగవున్= దానికి తగినట్లు; ఆచరించు+ఎడన్= చేసే సమయంలో; ద్రౌపది; అల్లనన్= నెమ్మదిగా; వీరి చందముల్= ఈ ఉపకీచకుల చేష్టలను; చూతము+కాక= చూద్దామని; అంచున్= అనుకొంటూ; ఒకచోన్= ఒకచోట; తమ చేరువన్= తమకు సమీపంలో; ఉన్నన్= ఉండగా; కాంచి= చూచినవారై; సంజాత= పుట్టుకొనివచ్చిన; మహా+ఉగ్రకోపులు+ఐ= మిక్కిలి భయంకరమైన కోపం కలవారై; చారువిలోచనన్= అందమైన చూపులుగలదానిని (ద్రౌపదిని); క్రూరతన్= కరకుతనంతో; పట్టి= పట్టుకొని.

**తాత్పర్యం:** ఆ ఉపకీచకుడు చెప్పిన దానికి మిగిలినవారంతా అంగీకరించారు. తమ అన్న అయిన సింహబలుడికి అగ్నిసంస్కారం చేయ తలపెట్టి, దానికి తగిన ప్రయత్నాలు చురుకుగా చేయ మొదలుపెట్టారు. ద్రౌపది ఆ ఉపకీచకుల చేష్టలను చప్పుడు లేకుండా గమనించి, ముందేమి జరుగుతుందో చూద్దామన్న ఆసక్తితో వారి దగ్గరగానే ఒకచోట నిలబడి ఉన్నది. ఆమెను ఉపకీచకులు చూచారు. ఒక్కసారిగా వారి మనసులో భయంకరమైన కోపం పెల్లుబికింది. ఆమెను కసితో, కరకుదనంతో పట్టుకొని. (తరవాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అంతమంది కూడినా, అంత జరుగుతున్నా ద్రౌపది అక్కడినుండి పోలేదు. అందులోని అంతరార్థం ఆలోచనామృతం. కీచకుడి చావుతో ఆమెకు తృప్తి లేదు. అతడి శవయాత్ర సాగేంతవరకూ చూచి పీడ వదిలిందని సంతోషించాలని అక్కడే ఒకచోట ఒదిగి నిలబడి ఉన్నది. ఆమె బాధితగా చెప్పుకొన్నది. కాబట్టి అందరూ జాలి చూపుతా రనుకొన్నది. ఆమె గంధర్వుల భార్యనని భయపెట్టింది కాబట్టి, ఎవ్వరూ ఆమె నేమీ చేయటానికి సాహసించరని భావించింది. అందుకే అందరితో కలిసి నిర్భయంగానే ఉపకీచకుల చర్యలు గమనిస్తూ నిలబడింది. ఆమెను ఉపకీచకులు చూచారు. అన్న చావుకు ఆమెయే కారకురాలని నిర్ణయించుకొని ఆగ్రహోదగ్రులయ్యారు. గంధర్వుల నేమీ చేయలేని ఆ ఉపకీచకులు తమ కోపాన్ని ఆ కోమలిపై తీర్చుకొందామనుకొన్నారు. అక్కడ జరుగుతున్న కార్యకలాపాలను కన్నారా చూస్తున్న ద్రౌపది నిజంగా అప్పుడు 'చారులోచన'యే. అయితే ఏం? క్రూరులైన ఉపకీచకులు ఆమెను నిర్దయులై ముట్టడించారు. బంధించారు. ప్రజలనుండి జాలి పొందుతాననుకొన్న ద్రౌపది ఉపకీచకులనుండి క్రోధాన్ని ఎదుర్కొన వలసి వచ్చింది. ఇది ఊహించని మలుపు.

2. సమీపంలోని ఒక స్తంభాన్ని కౌగిలించుకొని ఉండగా కీచకులు చూచి రెచ్చిపోయారని వ్యాసభారతం, అందులో కూడా ఆమె వేచి ఉండటానికి కారణం తెలియదు. తిక్కన ద్రౌపదికి మాత్రం అక్కడ జరుగుతున్న కథను కళ్ళారా చూచి, నోరారా తన భర్తలకు చెప్పి, మనసరారా సంతోషించాలనే కసితో కూడిన కోర్కె తప్ప మరొకటి కానరాదు. అది భీమ వ్యూహంలో

భాగమా? కాదా? అన్నది ఆలోచించదగింది. భీముడు శయ్యమీద కూర్చున్నాడే కాని నిద్రించలేదు. ద్రౌపది జరిగిన కథంతా తనకు వచ్చి చెప్పితే కాని నిద్ర పోగూడదని వ్యూహం కాబోలు! ఏమైనా భీముడి సాహసం సార్థకమైనది. ద్రౌపది సాహసం ప్రమాదానికి గురి అయింది. భీముడికి మరల పనిబడింది. ఈసారి నూటైదుగురు కీచకులను మట్టుపెట్టవలసిన సన్నివేశం ముంచుకొని రాబోతున్నది. కథ ఉత్కంఠతో ఊగిపోతున్నది. (సంపా.)

**క. పెడకేలు గట్టి 'పాపపుఁ। బొడవగు నిది గాదె యితనిఁ బొడ వడఁగించెన్!**
**గెడకూడఁ దీని నీతని। యొడలిపయిం బెట్టి కాల్చు టుచితం బరయన్.' 13**

**ప్రతిపదార్థం:** పెడకేలు+కట్టి= చేతులు వెనుకకు విఱిచికట్టి; పాపము+పొడవు+అగు= పాపిష్ఠిరూపంకల; ఇది= ఈ సైరంధ్రి; కాదె= కదా; ఇతనిన్= ఈ కీచకుడిని; పొడవు+అడఁగించెన్= చంపింది (రూపులేకుండా చేసింది); కెడగూడన్= ప్రక్కలో ఉండగా (అనగా కలిపి జతగా ఉండునట్లు); ఈతని ఒడలిపయిన్+పెట్టి= ఈతడి శరీరం మీదపెట్టి; దీనిన్= ఈ సైరంధ్రిని; కాల్చుట= తగులబెట్టటం; అరయన్= పరిశీలించగా; ఉచితంబు= తగును.

**తాత్పర్యం:** ద్రౌపది చేతులను వెనుకకు త్రిప్పి కట్టారు. 'పాపిష్ఠి రూపం కలిగిన ఇదేగా ఈతడిని మట్టుపెట్టింది! (ఈమె పాపపు అందానికి ఆకర్షితుడై అతడు ఈ చావు చచ్చాడు). కాబట్టి ఇతడితో ఈమెను కలిపి కట్టి, దహనం చేయటం యుక్తమైన పని.' (అని నిర్ణయించారు).

**విశేషం:** సింహబలుడు ఆ రూపవతిని పొందుదామని కోరుకొన్నాడు. కాని, ఈ శరీరంతో పొందలేకపోయాడు. ఇతడి ఆశ అడియాసగానే మిగిలిపోయింది. ఈ పాపిష్ఠిది సుఖాన్ని ఇవ్వకుండానే మోసగించి, భర్తలచేత చంపించింది కాబట్టి ఇతడి శవంమీద ఈమెను పెట్టి దహనం చేస్తే లోకాంతరంలోనైనా అతడు సంతోషిస్తాడని వారి ఊహ. బ్రతికి సాధించలేనిది చచ్చి సాధించగలడనే సామెత వలె ఉపకీచకులు భావించి ఆమెకు సహగమనంవంటి దురవస్థను కల్పించారు. ఇది ద్రౌపదికి ప్రబలమైన విపత్తు. (సంపా.)

**వ. అని విరాటున కెఱింగించి చేయువారై, యంతకుమున్న యీ వృత్తాంతం బంతయు విని సంక్షుభిత హృదయుండై యున్న యతనిపాలికిం బోయి. 14**

**ప్రతిపదార్థం:** అని విరాటునకు+ఎఱింగించి చేయువారై= ఆ విధంగా విరాటుడికి తెలిపి చేద్దామని నిశ్చయించి; అంతకుమున్ను+అ= అంతకు ముందే; ఈ వృత్తాంతంబు+అంతయున్ విని= ఈ విషయమంతా విని (అనగా కీచక వధనంతావిని); సంక్షుభిత హృదయుండు+ఐ; ఉన్న= కలత చెందిన మనసుతో ఉన్న; అతని పాలికిన్+పోయి= ఆ విరటుని వద్దకు వెళ్లి.

**తాత్పర్యం:** తమ నిర్ణయాన్ని రాజైన విరాటుడికి తెలిపి అమలు చేయాలని బయలుదేరారు. అంతకుముందే ఆ వృత్తాంతాన్ని (చారుల వలన) విని విరాటుడు కలతపడ్డ హృదయంతో బాధపడుతున్నాడు. అప్పుడు వారు అతడి దగ్గరికి పోయి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** కీచకవధ వృత్తాంతం కార్చిచ్చువలె రాజభవనమంతా చుట్టివేసింది. కావలివారు రాజుకు చెప్పారు. అయితే, విరాటుడు ఇతర బంధువుల వలె నర్తనశాలకు రాలేదు. సుదేష్ణ అన్నను చూడాలని వేగిరపడలేదు. కాని, జరిగినదానికి వారిరువురూ లోలోన కుమిలిపోతున్నారు. ఏమి చేయాలో తోచక కలతపడుతున్నారు. ఇంతలో ఉపకీచకులు తమ నిరంకుశ నిర్ణయాన్ని రాజుకు

మర్యాదగా తెలిపిపోదామని వచ్చారు. అనుమతిస్తే మర్యాదగా ఉంటుంది. లేదా రాజాజ్ఞను వారు పట్టించుకొనరు. సింహబలుడి ఉద్ధతి అతడి తమ్ముల రూపంలో బుసకొట్టుతున్నది. సన్నివేశం గంభీరంగా సాగుతున్నది. (సంపా.)

**తే.** **'ఎల్లభంగుల సైరంధ్రి నేము సింహ। బలునితోఁ జంపువారమై తలఁచి నీకు**
**నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి; మీవు నింత। వట్టు మన్నన మాకు నీ వలయు' ననిన.** 15

**ప్రతిపదార్థం:** ఏము= మేము; ఎల్లభంగులన్= అన్ని విధాలుగా, ఏ విధంగానైనా; సింహబలునితోన్= కీచకుడితో కలిపి; సైరంధ్రిన్= సైరంధ్రిని; చంపువారము+ఐ= చంపటానికి; తలఁచి= నిశ్చయించుకొని; నీకున్; ఎఱుఁగన్+చెప్పంగన్= తెలుపటానికి; వచ్చితిమి= వచ్చాము; ఈవున్= నీవు; మాకున్= మాకు; ఇంత+పట్టు= ఈ మాత్రం; మన్ననన్= గౌరవాన్ని (గౌరవప్రదంగా, కాదనకుండా అంగీకరించటాన్ని); ఈవలయున్= ఇవ్వాలి; అనినన్= అని అనగా.

**తాత్పర్యం:** 'ఏ విధంగానైనా సరే (అన్ని విధాలా ప్రయత్నం చేసి) సైరంధ్రిని సింహబలుడితో కలిపి దహనం చేసి చంపాలని ఆలోచించాం. దానిని నీకు తెలపటానికి వచ్చాం. నీవు ఈ మాత్రం మమ్మల్ని అనుమతించాలి' అని ఉపకీచకులు అడుగగా. (తరువాతి గద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇది సవినయంగా మనవి చేయటం కాదు. దబాయించి అనుమతి అడిగి పుచ్చుకొనటం. (సంపా.)

**వ.** **అతండును దన మనంబున 'నియ్యుపకీచకుల చందంబు సూడ నేను వారించితి నేనియు నుడుగం గలవారుగా రని (యు గంధర్వులు బలవంతులు గావునఁ దద్రక్షితయైన సైరంధ్రి కపాయంబు వొంద'దని) యు నూహించి, వారలం గలయం గనుంగొని 'యట్లకాక మీకుం బోలిన తెఱంగు సేయుం' డనిన నదియ యనుమతిగాఁ గైకొని సరభసంబునం జనుదెంచి.** 16

**ప్రతిపదార్థం:** అతండును= ఆ విరాటుడు కూడ; తన మనంబునన్= తన మనసులో; ఈ+ఉప కీచకుల చందంబు+చూడన్= ఈ ఉపకీచకుల పద్ధతి చూడగా; ఏను వారించితిన్+ఏనియున్= నేనడ్డుకొన్నప్పటికీ; ఉడుగన్+కలవారు+కారు= ఆగేవారు కారు; అనియున్= అనిన్నీ; గంధర్వులు బలవంతులు కావునన్= గంధర్వులు బలం కలవారు కాబట్టి; తద్+రక్షిత+ఐన= వారిచే కాపాడబడేదైన; సైరంధ్రికి; అపాయంబు+పొందదు= ప్రమాదం కలుగదు; అనియున్= అనుకొని; ఊహించి= తలచుకొని; వారలన్+కలయన్+కనుంగొని= వారి నందరినీ కలయచూచి; అట్లు+అ+కాక= అట్లే కానీయండి; మీకున్+పోలిన తెఱంగు= మీకు తోచిన విధంగా; చేయుండు+అనినన్= చేయండి అని అనగా; అది+అనుమతి కాన్+కైకొని= దానినే ఆమోదంగా తలచుకొని; సరభసంబునన్+చనుదెంచి= తొందరగా వచ్చి.

**తాత్పర్యం:** విరాటుడు కూడా తన మనసులో ఇట్లా ఊహించాడు; ' ఈ ఉపకీచకుల పద్ధతి చూస్తే నేను వద్దన్నా వీరు మానేటట్లు లేదు. గంధర్వులా- బలవంతులు కాబట్టి సైరంధ్రికి అపాయం కలుగకపోవచ్చును.' అనుకొన్నాడు. ఎదుట ఉన్న ఉపకీచకుల నందరినీ కలయచూచాడు. 'అట్లాగే, మీకు తోచినవిధంగా చేయండి' అన్నాడు. అదే ఆయన అనుమతిగా పరిగణించి వేగంగా బయలుదేరి వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** విరాటుడి హృదయంలోని ధర్మసంఘర్షణ సహజంగా అనిపిస్తుంది. కీచకులు ధూర్తులు. రాజశాసనాన్ని మన్నించరు. మన్నించనివారిని మందలింపజూస్తే మాట నిలవదు. అయితే, సైరంధ్రి అంతఃపుర వనిత. ఆమెను కీచకుడితో కలిపి దహించటానికి

అంగీకరించటం అంతఃపుర ధర్మం కాదు. అట్లని కీచకుడిని సమర్థించలేడు. అతడు అంతఃపురధర్మాన్ని ధిక్కరించి సైరంధ్రిని అవమానించినా వారించలేకపోయాడు. కీచకుడిని తాను దండించ లేకపోయినా గంధర్వులు దండించారు. ధర్మాన్ని గంధర్వులే నిలుపుతున్నారు. తనను కాపాడుతున్నారు. తనను కాదని కీచకుడు బాగుపడలేదు. ఉపకీచకులూ అంతే. అందువలన గంధర్వులమీద ధర్మరక్షణ భారముంచి ఉపకీచకులను వారి కర్మకు వారే బాధ్యులయ్యేటట్లు చేయటమే అప్పటికి అనువైన పని అని భావించి వారి చర్యలకు విరాటుడు తల ఊపాడు. విరాటుడు అంత బలవంతుడు కాకపోవచ్చును. కాని వివేకజ్ఞుడు. (సంపా.)

**ఉ. 'అంగజరాగమత్తుఁడగు నన్నకు నిమ్మెయినైనఁ బ్రీతిసే**
**యంగలవార, మీ జఱభి యాతనితోడన తీఱుఁగాక' యం**
**చుం గొనిపోయి దైన్యమున సూతునిపీనుఁగు మీఁదఁ బాండుపు**
**త్రాంగనఁ బెట్టి, కట్టిరి దయాపరివర్జితచిత్తవృత్తులై. 17**

**ప్రతిపదార్థం:** అంగజరాగమత్తుఁడు+అగు= మన్మథుడి వలన కల్గిన మోహంతో మదించిన; అన్నకున్= తమ అన్న అయిన కీచకుడికి; ఈ+మెయిన్+ఐనన్= ఈ విధంగానైనా; ప్రీతిచేయన్+కలవారము= ఇష్టమైన పని చేయగలం; ఈ జఱభి= ఈ కులట (లంజె); ఆతని తోడన్= ఆ కీచకుడితోనే; తీఱున్+కాక= చనిపోయితీరాలి; అంచున్+కొనిపోయి= అని చెప్పుతూ తీసికొనిపోయి; దయాపరివర్జిత చిత్తవృత్తులు+ఐ= దయచేత విడువబడిన మనస్సులు కలవారై-అంటే కఠినచిత్తులై; పాండుపుత్ర+అంగనన్= పాండవుల ఇల్లాలిని (ద్రౌపదిని); దైన్యమునన్= దీనంగా; సూతుని పీనుఁగుమీదన్= కీచకుడి శవం మీదనే; పెట్టికట్టిరి= పెట్టి కట్టారు.

**తాత్పర్యం:** 'మన్మథావేశంతో ఉన్మత్తుడైన మన అన్నకు ఈ విధంగానైనా సంతోషపెట్టుదాం. ఈ రంకుటాలు అతడితోపాటే అంతం కావాలి' అని అంటూ పాండవపత్ని అయిన ద్రౌపదిని కొనిపోయి దీనంగా కీచకుడి పీనుగుమీద ఉంచారు. నిర్దయచిత్తులై ఆమెను ఆ పీనుగుతో కలిపి కట్టారు.

**విశేషం:** సింహబలుడిది మదనోన్మాదమైతే, ఉపకీచకులది మదోన్మాదం. ప్రేతాత్మలను తృప్తిపరచే ప్రక్రియగా సైరంధ్రిని అతడితో కలిపి దహించటానికి పూనుకొన్నారు. ఉపకీచకులకు గంధర్వభయం ఉన్నట్లు లేదు. అంతమంది గుమికూడిన చోటికి వారు రారని వారి విశ్వాసం కావచ్చును. లేదా సింహబలుడిని సంహరించిన గంధర్వుల ఆట సైరంధ్రిని దహించటంతో కట్టుతుందని భావించవచ్చును. ఏది ఏమైనా తమతో కూడిన అన్నను చంపినదానిని అతడితో కలిపి చంపటమే ప్రతీకారం-ఇటువంటి భావాలు ఉపకీచకుల చర్యలకు ప్రేరకాలు. (సంపా.)

**చ. అశుచియుఁ గష్టుఁడున్ లఘువునైన నిజాగ్రజుమేనితోడ ని**
**త్య శుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాఁ జను నింతిఁ గొంచుఁ గ**
**ర్కశమతిఁ గీచకుల్ బహుముఖంబుల బాంధవ విప్రలాపముల్**
**దిశ లద్రువం జెలంగఁ గరదీపనికాయము ప్రజ్వరిల్లఁగన్ 18**

**ప్రతిపదార్థం:** అశుచియున్= అపవిత్రుడున్నూ; కష్టుఁడున్= పాపియున్నూ; లఘువున్= అల్పుడూ, చులుకనైనవాడున్నూ; ఐన= అయినటువంటి; నిజ+అగ్రజుమేనితోడన్= తమ అన్న శరీరంతో; నిత్యశుచియున్= ఎల్లప్పుడూ పవిత్రురాలుగా (పరిశుద్ధురాలుగా); పుణ్యశీలయున్= పాపమంటే ఎరుగని స్వభావం కలది; ఉదాత్తయున్+నాన్= ఉత్తమస్త్రీ అనగా; చను= ఒప్పారే; ఇంతిన్= స్త్రీని (ద్రౌపదిని); కొంచున్= తీసికొనిపోతూ; కర్కశమితిన్= కఠినమైన మనసుతో; కీచకుల్= ఉపకీచకులు; బహుముఖంబులన్=

అనేక విధాలుగా; బాంధవ= కీచకుడి బంధువుల; విప్రలాపముల్= రోదనలు; దిశలు+అద్రువన్= దిక్కులదిరేటట్లు; చెలంగన్= వ్యాపించగా; కరదీపనికాయము ప్రజ్వరిల్లఁగన్= చేదివ్వటీలు వెలుగుతూ ఉండగా.

**తాత్పర్యం:** కఠినాత్ములైన ఉపకీచకులు అపవిత్రుడూ, దుష్టుడూ, అల్పుడూ అయిన తమ అన్న శవంతో కలిపి, నిత్య పవిత్రురాలు, పుణ్యస్వభావురాలు, ఆదర్శవర్తనురాలు అని ప్రసిద్ధికెక్కిన ఆ యిల్లాలిని తీసికొనివెళ్ళి బంధువుల ఏడ్పులూ, పెడబొబ్బలూ అనేక విధాలుగా పెచ్చుపెరిగి దిక్కులు పిక్కటిల్లుతూ ఉండగా, కాగడాల గుంపులు ధగధగ వెలుగుతూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: పరికరం, విషమం. విశేషణం సాభిప్రాయమైతే పరికరాలంకారం. ఈ పద్యంలో కీచకుడికీ, ద్రౌపదికీ వాడిన మూడు విశేషణాలూ సాభిప్రాయాలు. అననురూపాలైన వాటికి సంబంధం చెప్పటం విషమం. అందులో యథాసంఖ్యం కూడా ఉన్నది. అతడు సదా అపవిత్రుడు, ఆమె నిత్య పవిత్రురాలు; అతడు కష్టుడు, ఆమె పుణ్యశీల; అతడు అల్పుడు, ఆమె ఉదాత్త; వారిద్దరూ విరుద్ధ గుణాల వారు. వారిని కలిపి కట్టటం విషమం. ఈ వ్యాఖ్య చేస్తున్నది కవి. ఉపకీచకులకు ఈ పరిజ్ఞానం లేదు. వారు చేస్తున్నపని అనౌచిత్యం. దానిని తిక్కన ఎత్తిచూపుతున్నాడు. ఉపకీచకులపట్ల పఠితలకు ఏవగింపు కలిగించే అలంకారాలను తిక్కన ప్రయోగించాడు. వారి వధార్హతను పరోక్షంగా ధ్వనింపజేశాడు. (సంపా.)

**క. పితృవణము దెసకుఁ జన న । య్యతివ భయభ్రాంతచిత్తయై బాష్పజలో**
**ద్గతి మొగముఁగప్ప నిట్లని । యతిరావముగా నొనర్చె నాక్రందనమున్. 19**

**ప్రతిపదార్థం:** పితృవణము= శ్మశానం- వల్లకాడు; దెసకున్= దిక్కుకు; చనన్= పోగా; ఆ+అతివ= ఆ స్త్రీ (సైరంధ్రి); భయభ్రాంతచిత్తఐ= భయంతో కలతపడిన మనసు కలదై; బాష్పజల+ఉద్గతి+మొగము కప్పన్= కన్నీటివేగం ముఖాన్ని కప్పగా; అతిరావముగాన్= పెద్ద కంఠస్వరంతో ఎలుగెత్తి పెద్దగా అరుస్తూ, ఆక్రందనమున్= రోదనాన్ని; ఇట్లు+అని= ఈ విధంగా (ముందు చెప్పే విధంగా); ఒనర్చెన్= చేసింది.

**తాత్పర్యం:** శ్మశానం వైపునకు వెళ్ళుతూ ఉండగా ఆమె భయంవలన కలతబారిన మనస్సుతో, కన్నీరు పొంగి ముఖాన్ని కప్పివేస్తూ ఉండగా బిగ్గరగా ఎలుగెత్తి ఇట్లా రోదనం చేసింది.

**విశేషం:** స్త్రీకి మానభంగ, ప్రాణభంగ భీతులు ఉండటం సహజం. అందులో మానభంగ భీతి తీరింది. ఇప్పుడు ప్రాణభంగ భీతి ఏర్పడింది. కీచకుడు మానభంగం చేయబోయి ప్రాణాలు కోల్పోయాడు. ఉపకీచకులు ప్రాణభంగం చేయబోతున్నారు. మానభంగం ప్రాణభంగం కంటె గొప్పదనటంలో అనుమానంలేదు. కాని, ప్రాణభంగం సర్వధర్మభంగం కలిగిస్తుంది. ఉపకీచకుల అవివేకం వలన ధీరురాలైన ద్రౌపది కూడా ప్రాణాలు కోల్పోతానేమోనని రోదించింది. అయినా పెద్దగా రోదించటం అనే ఆమె చేష్టకు రెండంచులున్నాయి. అది అసహాయతవలన ఏర్పడిన ఆర్తి కావచ్చును. తన దీనస్థితిని తన పతులకు వినిపించేటట్లు చేయాలని చేసే చివరిప్రయత్నం కావచ్చును. గ్రుడ్డిలో మెల్ల ఏమంటే- వారు ఆమె చేతులు కాళ్ళు కట్టివేశారే కాని నోరు కట్టివేయలేదు. అదొక్కటే ఆయుధం ఆమెకు మిగిలింది. గొంతెత్తితే వినిపించుకొనటానికి భీముడింకా మేల్కొనే ఉన్నాడు. ఆమె గొంతు అతడికి వినబడాలి. అందుకే అంత పెద్దగా ఆక్రందనం! ఇది ఒక అంచున అనాథ ఆర్తనాదం. మరొక అంచున భీమ పునర్విజృంభణానికి శంఖారావం. (సంపా.)

**ఆ. 'అనదనైతి నిచట; నాలి కుయ్యాలింపుఁ । డ కట! మీరు గలుగ నాక్రమించి**
**నన్నుఁ గట్టి సూతనందను లిమ్మెయి । వెఱపులేక భంగపఱుచువారు. 20**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో; ఇచటన్= ఇక్కడ; అనదన్+ఐతిన్= దిక్కులేనిదానినైనాను; ఆలి= ఇల్లాలియొక్క; కుయ్యి+ఆలింపుఁడు= మొరను వినండి; మీరు+కలుగన్= మీరుండగానే; సూతనందనులు= సూతుడి కొడుకులైన ఉపకీచకులు; నన్నున్+ఆక్రమించి= నన్ను చుట్టుముట్టి; కట్టి= కట్టివేసి; వెఱపు లేక= భయం లేకుండా; ఈ+మెయిన్= ఈ విధంగా; భంగము+పఱుచువారు= అవమానం చేస్తున్నారు.

**తాత్పర్యం:** 'దిక్కులేని దాననుగా నేను ఇప్పుడు చేసే ఆక్రందనాన్ని వినండి. మీరుండగానే ఉపకీచకులు నన్ను చుట్టుముట్టి, కట్టివేసి భయంలేకుండా అవమానం చేస్తున్నారు.

**విశేషం:** ఆక్రందనం చేసే ఆడుది చిన్న చిన్న వాక్యాలే మాట్లాడుతుంది. తన దీనస్థితిని చెప్పుకొంటుంది. ఆ దురవస్థను వర్ణిస్తుంది. దానికి సంబంధించిన కథలు బాధగా పేర్కొంటుంది. ఇది లోక స్వభావం. దానిని స్వభావోక్తిగా తిక్కన ప్రతిపదసార్థకంగా నిర్వహించాడు. ద్రౌపది మాటలు దీనోక్తులే కాదు. భీముడి కందించే సమాచారోక్తులు కూడా. 'ఇక్కడ నేను అనాథ నయ్యాను' అంటే- ఇప్పుడు నేను రక్షకులు లేని దాననయ్యాను. నాథుడు పోయిన ఆడదానిని సహగమనానికి తీసికొని పోయేటట్లుగా తీసికొని పోబడుతున్నాను. నా ప్రయత్నం ఇక్కడ విఫలమైపోయింది. నాకు రక్షకుడు (నాథుడు) కావాలి-అని మొదటి హెచ్చరిక. ఆలి కుయ్యి ఆలింపుడు; అబల అయిన ఇల్లాలి ఆక్రందనం వినండి. దయచూపండి మీ ఇల్లాలిని-అని సామాన్యార్థం. ఒంటరిగా చిక్కిన ఇల్లాలు సహాయం కొరకు చేసే దీనాలాపంగా దీనిని గ్రహించండి-అని భీమపరంగా అర్థం. అకట! అని నిరాశ ప్రకటించటంలో పరిస్థితియొక్క తీవ్రతను తెలుపటం పరమార్థం. మీరుండగా నన్ను చుట్టుముట్టి పట్టి పాడెకు కట్టి ఉపకీచకులు భయం లేకుండా నన్ను భంగపరుస్తున్నారు అనే మాటలు జరుగుతున్న కథను స్మరిస్తూ విలపిస్తున్నట్లుగా, భీముడికి వాస్తవ స్థితిని నివేదించుకొన్నట్లూ తెలుస్తుంది. అంతేకాదు. భీముడికి కోపం తెప్పించేటట్లు చెప్పే పద్ధతి కూడా ఇందులో ఇమిడి ఉన్నది. మీరు ఉన్నారని చెప్పినా లక్ష్యం చేయకుండా నన్ను పట్టి బంధించారు. అంటే, మీరంటే భయం లేకుండా నన్ను భంగపరుస్తున్నారు. ఈ శత్రు తిరస్కారాన్ని మీరు సహించగలరా? నేను భంగపడటం మీరు సహించగలరా? నేను భంగపడితే మీరు భంగపడ్డట్లు కాదా? ఇటువంటి అర్థాలు వచ్చి భీముడిలో రౌద్రోద్రేకం రేకెత్తించటం ఆ వాక్యాల ప్రయోజనం. ఇది వారి వ్యూహంలో భాగమని భావించినా ఆమె మాటలు సహజంగా ఉండి సానుభూతిని కలిగిస్తున్నాయి. ఇది తిక్కన రచనా శిల్పం! (సంపా.)

**ఉ. ఆనతవైరి యో జయ! మహాద్భుతవిక్రమ యో జయంత! దు**
**ర్మానవిఘూర్ణమానరిపుమర్దన యో విజయాభిధాన! తే**
**జోనిహతాహిత ప్రకటశూర గుణప్రతిభాస యో జయ**
**త్సేన! విరోధి బాహుబల జృంభణభంజన యో జయద్బలా!** **21**

**ప్రతిపదార్థం:** ఆనతవైరి= నమస్కరించిన శత్రువులు కలవాడా, శత్రువులను పాదాక్రాంతులను చేసినవాడా!; ఓ జయ!= జయుడనే పేరుగలవాడా!; మహా+అద్భుత విక్రమ= ఆశ్చర్యం కలిగించే శౌర్యం కల; ఓ జయంత!= ఓ జయంతుడనే పేరున్నవాడా!; దుర్మాన= దురభిమానంతో; విఘూర్ణమాన= ఊగులాడే; రిపు= శత్రువులను; మర్దన= చంపువాడా; ఓ విజయ+అభిధాన!= విజయుడనే పేరు కలవాడా!; తేజో నిహత= (నీ) తేజస్సుతో పడగొట్టబడిన; అహిత= శత్రువులకు; ప్రకట= స్పష్టం చేసిన; శూరగుణప్రతిభాస= శౌర్యగుణంతో వెలుగుతున్నవాడా!; ఓ జయత్సేన= ఓ జయత్సేనుడనే పేరున్నవాడా!; విరోధి= శత్రువుల; బాహుబల= భుజబలం యొక్క; జృంభణ= అతిశయాన్ని; భంజన!= నాశనం చేసేవాడా!; ఓ జయద్బలా!= ఓ జయద్బల నామధేయుడా! (అని సైరంధ్రి అరుస్తూ ఉండింది).

**తాత్పర్యం:** శత్రువులను పాదాక్రాంతులను చేసికొన్న జయుడా! మహాద్భుత విక్రమశాలివైన జయంతుడా! దురభిమానులైన శత్రువులను మర్దించిన విజయా! తేజోబలంతో శత్రువులను పడగొట్టిన ఓ జయత్సేనా! భుజబలంతో విజృంభిస్తున్న శత్రువులను నాశనం చేసిన ఓ జయద్బలా!

**విశేషం:** 1. గంధర్వ పతులను అయిదుగురిని ఎలుగెత్తి పిలుస్తున్నట్లు చిత్రించిన ఈ పద్యం మూల శ్లోకభావానికి ముచ్చటైన విస్తృతి. మూలంలోని శ్లోకం ఇది-

**"జయో! జయన్తో! విజయో! జయత్సేనో! జయద్బల!** (4-22-12) ఇందులో పేర్కొన్న అయిదుపేర్లూ పాండవులు అజ్ఞాతవాసంలో తమలో తాము పిలుచుకొనే రహస్య సంకేతాలు. వాటిని మొదటిసారీ, చివరిసారీ వాడింది ఈ ఘట్టంలోనే. ఇది అంత అత్యవసర పరిస్థితి అని ధ్వని. మూలశ్లోకంలో పిలుపే ముఖ్యం. తెలుగులో పిలుపే కాదు, వారి తలపు శత్రువులకు వెరపు కలిగించటం కూడా ముఖ్యం. అందువలన పేర్లెంత ముఖ్యమో వారి గుణవిశేషణాలు అంత ప్రధానం. జయుడు ధర్మరాజు- ఎంతటి శత్రువైనా అతడికి తలవంచి నమస్కరిస్తాడు. జయంతుడు భీముడు- మహాద్భుత పరాక్రమశాలి. విజయుడు అర్జునుడు- ఎంతటి దురహంకారులనైనా మర్దించే మహావీరుడు. జయత్సేనుడు నకులుడు- శత్రువులను చంపి శౌర్యగుణాన్ని ప్రదర్శించేవాడు. జయద్బలుడు సహదేవుడు- విరోధి బాహుబాలాల విజృంభణాన్ని భంజించేవాడు. ఇందులో నలుగురు శత్రువులను చంపేవారు. మొదటివాడు మాత్రం శత్రువుల నమస్కారాలు గ్రహిస్తూ ఉంటాడు. శత్రువులు తమ కపకారం తలిస్తే గంధర్వులు చంపుతారనీ, శంణు వేడితే అనుగ్రహిస్తారనీ నిగ్రహానుగ్రహ సమర్థులైన శూరులనీ శత్రువులకు హెచ్చరిక! భర్తలకు ప్రశంస. అది అప్పుడు అవసరం!

2. ద్రౌపది భర్తలందరినీ పేరుపేరున పిలిచినా పలికేది భీముడొక్కడే! అందువలన అయిదుగురి విశేషణాలూ భీమనాయకుడికి వర్తించేవిగా కూడా ఉండటం విశేషం.

3.భారత కావ్యనాయక నిరూపణంలోనూ, రససమన్వయంలోనూ ఉన్న ఒక శిల్ప రహస్యాన్ని ఈ పద్యం ధ్వనిస్తున్నది. ధర్మజుడు ధర్మవీరుడు. భీమాదులు యుద్ధవీరులు. అనునాయకులైన భీమాదుల వీర రౌద్రరసకార్యాలన్నీ ధర్మజుడి ధర్మవీరానికి అంగాలై పోషకాలుగా నిలుస్తాయనీ, ఆయా సందర్భాలలో కార్యసాధకులు భీమాదులైనా ఫలభోక్త ధర్మరాజనీ విశేషణాలు ధ్వనిస్తున్నాయి.

4.చిన్న సమాసంతో మొదలై క్రమంగా పొడుగైన విశేషణాలలో సాగిన ఈ పద్యగతి కాహళ సంధించిన విధంగా ద్రౌపది రోదించిన స్ఫూర్తిని కలిగించటం తిక్కన సహజ పద్యరచనా శిల్పం. (సంపా.)

**సీ. తొడఁగిన పని చలం బెడపక యతి దుష్క । రంబైనఁ గడతేర్చు ప్రభువులార!**
**పెనఁగిన వైవస్వతునినైనఁ గడిమిమై । వ్రేల్మిడిఁ బరిమార్చు వీరులార!**
**శరణార్థియగు దుష్ట శాత్రవునైనను । గరుణ రక్షించు సత్పురుషులార!**
**యర్థికిఁ బ్రాణంబు లైనను దాఁపక । తమకించి యిచ్చు నుదారులార!**

**తే. నాథులార! గంధర్వ రత్నంబులార । నన్ను నుపకీచకులు తమ యన్న శవము**
**నందు బంధించికొని వెస నరుగుచున్న । వారు; రక్షింప వేగ రావలయు మీరు.** 22

**ప్రతిపదార్థం:** తొడఁగినపని= మొదలుపెట్టిన పనిని; చలంబు+ఎడపక= పట్టుదల వదలకుండా; అతిదుష్కరంబు+ఐనన్= మిక్కిలి కష్టమైనప్పటికిని; కడతేర్చు= పూర్తిచేసే; ప్రభువులార!= రాజులారా!; పెనఁగినన్= పోరాడితే; వైవస్వతునిన్+ఐనన్=

యముడిని అయినా; కడిమిమైన్= పరాక్రమంతో; వ్రేల్మిడిన్= చిటికలో; పరిమార్చు= సంహరించే; వీరులార!= శూరులారా!; శరణ+అర్థి+అగు= శరణు వేడినవాడైన; దుష్టశాత్రవున్+ఐనన్= దుర్మార్గుడైన శత్రువునైనప్పటికిని; కరుణన్= దయతో; రక్షించు= కాపాడే; సత్పురుషులార!= మంచివారయిన పురుషులారా!; అర్థికిన్= దేహీ అన్నవాడికొరకు; ప్రాణంబులు+ఐనను= (మీ) ప్రాణాలైనా; దాఁపక= దాచుకొనకుండా; తమకించి= త్వరపడి; ఇచ్చు= ఇచ్చే; ఉదారులార!= దాతలారా!; నాథులార!= భర్తలారా!; గంధర్వరత్నంబులార!= గంధర్వశ్రేష్ఠులారా!; నన్నున్= నన్ను (సైరంధ్రిని); ఉపకీచకులు= ఉపకీచకులు; తమ+ అన్న శవమునందున్= తమ అన్న అయిన కీచకుని శవంతో; బంధించికొని= కట్టివేసికొని; వెసన్+అరుగుచున్నవారు= వేగంగా వెళ్ళుతున్నారు; రక్షింపన్= కాపాడటానికి; మీరు= (గంధర్వులైన) మీరు; వేగన్= త్వరగా; రావలయున్= రావాలి.

**తాత్పర్యం:** మిక్కిలి కష్టమైనప్పటికిని మొదలుపెట్టిన పనిని పట్టువదలకుండా పూర్తి చేసే ప్రభువులారా! పోరాటంలో యమధర్మరాజునైనా పరాక్రమంతో చిటికెలో చంపగల వీరులారా! దుర్మార్గుడయిన శత్రువునైనా శరణువేడితే చాలు దయతో కాపాడే దయామయులారా! దేహీ అన్న వానికి (మీ) ప్రాణాలైనా దాచుకొనకుండా ఇచ్చే దాతలైన నాథులారా! గంధర్వశ్రేష్ఠులారా! (ఈ) ఉపకీచకులు నన్ను తమ అన్న అయిన కీచకుడి శవంతో కట్టి వేగంగా తీసికొనిపోతున్నారు. మీరు త్వరగా వచ్చి నన్ను కాపాడాలి.

**విశేషం:** అలం: యథాసంఖ్యం. తిక్కన ఔచిత్య పోషణకు ఈ సీసపద్యం ఒక అమూల్యోదాహరణం. మూలంలో ద్రౌపది ఇట్లా పలికింది;

> 'యేషాం జ్యాతల నిర్ఘోషో విస్ఫూర్జిత మివాశనేః।
> వ్యశ్రూయత మహాయుద్ధే భీమఘోష స్తరస్వినామ్॥
> రథఘోషశ్చ బలవాన్ గన్ధర్వాణాం తపస్వినామ్।
> తే మే వాచం విజానన్తు సూతపుత్రా నయన్తి మామ్। (4-22-13,14)

ఈ శ్లోకాల్లో గంధర్వుల పిడుగుపాటుల వంటి అల్లెత్రాటి మ్రోతల, భయంకర రథఘోషల ప్రసక్తి ఉన్నది. ఉపకీచకులను చంపటానికి రథాలలో వచ్చి, కోదండాలతో యుద్ధం చేయాలనే సూచన అందులో గోచరిస్తుంది. దానిని తిక్కన వదిలాడు. అది అజ్ఞాతవాసంలో, అందులోనూ నగరంలో అర్ధరాత్రంలో సాధ్యం కాదు. అందువలన అన్యథా కల్పనతో ఒక గొప్ప పద్యం రచించాడు. అదే ఈ సీసం.

2. ఈ సీసపద్యంలో ఒక క్రమాలంకారం ఉన్నది. ఎత్తుగీతిలోని నాలుగు అంశాలకూ, సీసపద్యంలోని నాలుగు పాదాలకూ క్రమంగా అన్వయించే భావసాజాత్యం ఉన్నది. అదే ఇందులోని అందం.

3. ఆమె మొదట గంధర్వశ్రేష్ఠులుగా పిలువబడుతున్న భర్తలను ప్రస్తావించింది. ఆరంభించిన కార్యాన్ని ఎంత దుష్కరమైనా, చివరి వరకు సాగించి ఫలాన్ని సాధించే ప్రభువులు (నామీద అధికారం ఉన్నవారు. నన్ను పాలించేవారు)గా నిరూపించుకొనండని వారిని హెచ్చరించింది. ఆపైన ఉపకీచకుల దురంతాన్ని చెప్పింది. యుద్ధంలో మృత్యుదేవతనైనా పరాక్రమంతో పరిమార్చగల వీరులారా! ఉపకీచకులను చంపకుండా విడవబోకండి అని హెచ్చరించింది. మూడవ మాటగా-నన్ను రక్షించాలి అని కోరింది. అందుకే దుష్టులైన శత్రువులైనా రక్షించుమని కోరితే కరుణ చూపిస్తారు మీరు. నేను మీ భార్యను, పతివ్రతను- నేను కోరితే రక్షించరా? అని ప్రార్థించింది. నాలుగవ మాటగా- వేగంగా రమ్మని పిలిచింది. ఎందుకంటే, కోరేవారికి వారు ప్రాణాలను సైతం ఇవ్వటానికి తొందరపడతారట! ఆ తొందరనే తనపట్ల చూపించుమన్నది. పద్యమంతా చదివితే కార్యసాధనకు అనుగుణంగా భర్తల గుణగణాలను ఒక క్రమంలో ప్రశంసిస్తూ ప్రస్తుత కర్తవ్యాన్ని ప్రబోధించినట్లున్నది. ద్రౌపది విషాదంలో కూడా విజ్ఞతను కోల్పోని విదుషీమణి. (సంపా.)

భీముఁడు ఉపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట (సం.4-22-16)

చ. అని పలవించు నయ్యెలుఁగు లాపవమానతనూజుఁ డేర్పడన్
విని, మది 'నాదు వల్లభకు వీండ్రును గ్రమ్మఱ నింతసేసిరే!'
యనుచు సరోష సంభ్రమత నాయితమై వెసఁబాఱి వప్ర లం
ఘన మొనరించె గుప్తముగ గ్రక్కున ముట్టెడుదానికిం దగన్. 23

**ప్రతిపదార్థం:** అని= ఆవిధంగా అంటూ; పలవించు= పలవరించే; ఆ+ఎలుఁగులు= ఆ కూతలు; ఆ పవమానతనూజుఁడు= వాయునందనుడైన ఆ భీముడు; ఏర్పడన్ విని= స్పష్టంగా విని; మదిన్= తన మనసులో; నాదు వల్లభకున్= నా ప్రియురాలికి; వీండ్రును= ఈ ఉపకీచకులుకూడా; క్రమ్మఱన్= మరల; ఇంత+చేసిరే!= ఇంతపని చేశారా!; అనుచున్= అనుకొంటూ; సరోషసంభ్రమతన్= కోపంతో కూడిన తొందరతో; ఆయితము+ఐ= సిద్ధమై; వెసన్+పాఱి= శీఘ్రంగా పరుగెత్తి; గ్రక్కునన్= త్వరగా; ముట్టెడు దానికిన్= శత్రువులను ఎదుర్కొనటానికి; తగన్= తగునట్లుగా; గుప్తముగన్= రహస్యంగా; వప్రలంఘనము= కోట ప్రాకారాన్ని దూకటం; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా (వేర్వేర వరుసగా వెల్వడిన) ఆమె మొరలను భీమసేనుడు స్పష్టంగా విని, తన మనస్సులో(తన ప్రియురాలికి) 'వీరు (ఉపకీచకులు) మళ్ళీ ఇంతపని చేశారే' అని కోపోద్రేకంతో ఊగిపోతూ యుద్ధానికి సిద్ధమై శీఘ్రంగా పరుగెత్తి వారితో తలపడటానికి రహస్యంగా కోట ప్రాకారాన్ని దూకాడు.

**విశేషం:** 1. ద్రౌపది రోదనలు భీముడి చెవులబడ్డాయి. అతడికి రోషం పొంగుకొని వచ్చింది. 'నా భార్యయెడల వీళ్ళు కూడా ఇంత చేస్తారా? అని మనసులో మండిపడ్డాడు. నా భార్య అనటంలో అనురాగం. వీళ్ళు కూడా అనటంలో కీచకుడివలెనే వీళ్ళు కూడా అనే కోపభావం, నేను లెక్కచేయని అల్పులైన వీళ్ళు కూడా అనే తృణీకారభావం, వీరు మరలా ఇంత చేశారే అనటంలో వీరు కీచకుడివలెనే తమను చంపదగినంత పని చేశారే! అని ఆశ్చర్యభావం. వీరు మరల ద్రౌపదికి ఇంత భంగపాటు కలిగించారే! అని రోషభావం ప్రకటించాడు. 'ఇంత' అనే మాటలో అతడి కోపమంతా వ్యంగ్యం. శత్రుకృత అపకారం భీముడి మనస్సులో యుద్ధానికి పూనుకొనే క్రోధాన్ని రేకెత్తించింది. మరల పోరుకు సిద్ధమయ్యాడు. క్షణం వృథా కాకుండా వేగంగా పరుగెత్తాడు. వేగంగా, రహస్యంగా శ్మశాన ప్రాంతం చేరే అడ్డత్రోవ త్రొక్కాడు. అడ్డంగా ప్రాకారం వస్తే గుట్టుగా దూకి పరుగెత్తాడు. ఉపకీచకులు చేరవలసిన శ్మశానప్రాంతానికి వారి కంటె ముందే చేరి ఎదురుదాడి చేయాలని నిశ్చయించాడు. భీముడి కోపవేగంతో పాటు అతడి కార్యవేగం కూడా పెరిగింది. పద్యరచన కూడా దానికి తగినట్లు చిన్న చిన్న పదాలతో వేగంగా సాగింది.

2. 'వీండ్రును గ్రమ్మర నింత సేసిరే!' అనే మాట కథాపరంగా శిల్పరహస్యాన్ని ధ్వనింప చేస్తున్నది. కీచకుడే ఒక ఉత్కంఠ దశను (Climax)ను సృష్టించాడు. ఇప్పుడు ఉపకీచకులు కూడా ఆ ఉత్కంఠపై మరొక ఉత్కంఠను(Anti-climax) కలిగించారని భావం. తిక్కన రచనలో విరాటపర్వ తృతీయాశ్వాస ప్రబంధానికి ఇదొక ఉదాత్తారంభం. (వివరాలకు పీఠిక చూడండి). 'క్రమ్మఱన్' అన్నప్పుడు భీముడు ద్రౌపది వేసికొన్న రహస్య వ్యూహం తిరగబడేటట్లు ఇంత ప్రతిఘటన చేశారే! అని ఆశ్చర్యపడ్డాడని కూడా చెప్పవచ్చును.

3. 'గుప్తముగన్' (అంటే రహస్యంగా) భీముడు ఈ పని అంతా చేశాడని తిక్కన పేర్కొన్నాడు. ఇది అజ్ఞాతవాస నియమభంగం కాకుండా అని తాత్పర్యం. వ్యాసుడి రచనలో దీనికిభిన్నమైన సన్నివేశం ఉన్నది. ద్రౌపది రోదన వినగానే భీముడు పడకమీది నుండి ఎగిరి దూకాడు.

"అహం శృణోమి తే వాచం త్వయా సైరన్ధ్రి భాషితమ్

తస్మాత్ తే సూతపుత్రేభ్యో భయం భీరు న విద్యతే' (4-22-16) అని అతడు కూడా ఎలుగెత్తి సమాధానమిస్తూ ధైర్యం చెప్పినట్లున్నది. ఇది ఉచితం కాదు. అతడు అనుకొంటే బాగుంటుందే కాని అరిస్తే రసాభాసమౌతుంది. అందరూలేస్తారు. కార్యభంగమౌతుంది. అందువలన తిక్కన ఈ మాటలను గ్రహించక రహస్యాన్ని రక్షించాడు. ఔచిత్యాన్ని పోషించాడు. (సంపా.)

**తే. ఇట్లు లంఘించి పోయి పరేతభూమి। యొద్ద నలుదిక్కులును జూచి యొక్క యున్న**
**తావనీజంబు పెఱికి రౌద్రాతిరేక। మడర భుజశిఖరంబునయం దమర్చి. 24**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ చెప్పినట్లుగా; లంఘించిపోయి= కోటగోడ దూకిపోయి; పరేతభూమి+ఒద్దన్= శ్మశానం దగ్గర; నలుదిక్కులును+చూచి= నాలుగు దిక్కులు చూచి (అనగా కలయచూచి); ఒక్క+ఉన్నత+అవనీజంబు= ఒక పెద్ద చెట్టును; పెఱికి= త్వరగాపైకిలాగి; రౌద్ర+అతిరేకము+అడరన్= కోపాతిశయం కలుగగా; భుజశిఖరంబునన్+అందున్+అమర్చి= భుజంమీద పెట్టుకొని.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రాకారం మీదుగా దూకిపోయి శ్మశానం దగ్గరకు చేరి నాలుగు దిక్కులా కలయచూచి ఒక పెద్ద చెట్టును తొందరగా పెఱికి రౌద్రాతిశయంతో భుజంమీద పెట్టుకొని.

**విశేషం:** భీముడు నిరాయుధుడుగా ఉన్నప్పుడు శత్రువులపై దాడి చేయవలసివస్తే అతడెన్నుకొనే సహజమైన ఆయుధం ఒక ఎత్తైన చెట్టు, గద తరువాత ఆయనకు వృక్షమంటే అంత అభిమానం. దానినే గదగా త్రిప్పి ఫలితాలను సాధించగలడు. అలనాడు విరాటసభలో, ఈనాడు శ్మశాన ప్రాంతంలో శత్రు మర్దనం కొరకు చెట్లనే పెరకబూనటం విశేషం! అయితే ఇప్పుడు భీముడు వంటల వాడుగా ఉండటం కూడా ఈ అలవాటుకు తోడ్పడింది. శ్మశాన వృక్షాన్ని బుజాన పెట్టుకొని ఆ ప్రాంతంలో నిలవటం మరొక విశేషం! వల్లకాటిలో వెలసిన యమధర్మరాజు వలె ఉంటాడు. చీకట్లో చూచేవారికి గుండెలు గుభేలుమంటాయి. సందర్భానికి తగిన ఆంగికాభినయం నాటకీయతకు మెరుగుపెట్టుతుంది. (సంపా.)

**మ. వికట భ్రూకుటి ఘోర ఫాలకలిత స్వేదోద్భటుండుం, జల**
**ద్వికృతోష్ఠద్వయుఁడుం, బ్రవర్ధన దశావిర్భావ సంభావితాం**
**గకుఁడుం, జిత్త విదాహదోహల సమగ్రక్రోధ వేగుండు నై**
**బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభన్మూర్తి విస్ఫూర్తితోన్. 25**

**ప్రతిపదార్థం:** వికట భ్రూకుటి= వికారమయిన బొమముడి వలన; ఘోర= భయంకరమయిన; ఫాల= నుదుటి భాగాన; కలిత= కూడిన; స్వేద+ఉద్భటుండున్= మిక్కుటమైన చెమట చేత శూరుడైన వాడునూ; చలత్= కదలుతున్న (కోపంతో వణుకుతూ ఉన్న); వికృత+ఓష్ఠద్వయుఁడున్= వికారమయిన పెదవుల జంట కలవాడున్నూ; ప్రవర్ధన దశా+ఆవిర్భావ సంభావిత+అంగకుఁడున్= బాగా పెరుగుతున్న స్థితియొక్క పుట్టుకచేత చక్కగా తెలియబడిన శరీరం కలవాడున్ను; చిత్తవిదాహ= మనసును ఉడుకెక్కించే; దోహల= ఉత్సాహంతో; సమగ్ర= నిండైన; క్రోధవేగుండును+ఐ= కోపతీవ్రత కలవాడునూ అయి; ఆ+ఎడన్= అక్కడ; బక విధ్వంసకుఁడు= బకుడనే రాక్షసుడిని చంపినవాడైన భీముడు; శుంభత్+మూర్తి విస్ఫూర్తితోన్= భయంకరాకారంతో; నిలిచెన్= నిలిచాడు.

**తాత్పర్యం:** వంపులు తిరిగిన కనుబొమలతో భయంకరంగా మారిన నుదుటిమీద బాగా చెమటపట్టిన శూరుడూ, కంపిస్తూ విడ్డూరంగా కనబడుతున్న పెదవుల జంట కలవాడూ, కోపావేశంతో ఉప్పొంగే దశలను స్పష్టంగా ప్రదర్శిస్తున్న శరీరం కలవాడూ, మనస్సు మండే ఉత్సాహంతో నిండైన క్రోధోద్రేకాన్ని ప్రకటిస్తున్నవాడూ అయిన బకాసుర విధ్వంసకుడైన భీముడు ఆ సమయంలో అక్కడ చూడ భయంకరమైన ఆకారంతో నిలబడ్డాడు.

**విశేషం:** అలం: ఉదాత్తం. భీముడు ఉగ్రుడయ్యాడు. కోపతీవ్రత వలన అతడికి సాత్త్వికోదయమైనది. తిక్కన భీముడి కోపరూపాన్ని తన ముద్రతో నిలపటం పరిపాటి. 'వికటభ్రూకటి' అనే ఎత్తుగడ రౌద్రరసవిస్ఫూర్తిని ప్రకటించే ప్రారంభం. కనుబొమలు వంపులుగా తిరగటం వలన నుదురు ఘోరంగా (భయంకరంగా) కనబడటం మొదటి దశ. ఇది క్రోధావిర్భావాన్ని సూచిస్తుంది. నుదురు మీద దట్టంగా చెమట పట్టటం శత్రువులు చేస్తున్న ఆగడాన్ని సహించలేని ఉద్వేగాన్ని ప్రకటిస్తుంది. అప్పుడు అతడు ఉద్భటుడివలె (ఉద్ధతుడివలె) కనపడతాడు. అతడి రెండు పెదవులూ వింతగా చలిస్తాయి. ఈ సాత్త్వికభావం ప్రతీకారభావ తీవ్రతను ప్రకటిస్తుంది. వెంటనే అతడి శరీరం దశలవారీగా ఉప్పొంగుతుంది. అభినయరీత్యా భీముడిలోని కోపం అనే సంచారి భావం క్రోధం అనే స్థాయిగా మారే దశావిస్ఫూర్తిని అది ప్రదర్శిస్తుంది. హృదయం మండటం శత్రుసంహారం చేసే దమనశక్తియొక్క పరిపూర్ణావిష్కారం. దాని బకవిధ్వంసకు డనే విశేషం సార్థకం. బకుడనే రాక్షసుడిని చంపినప్పుడు ఎంత భీకరంగా ఉన్నాడో ఇప్పుడూ అట్లాగే ఉన్నాడని ఒక అర్థం. ఎదుటపడిన వారిని చంపిగాని వదలని ఉగ్రతతో ఉన్నాడని మరొక అర్థం. బకము అంటే కొంగ. ఆ అర్థం అట్లా ఉంచితే వ్యుత్పత్త్యర్థం ప్రకారం. "బకతి కుటిలో భవతీతి వా బకః. బక కౌటిల్యే; కుటిలమై ఉండేది" (గురుబాలప్రబోధిక) అని ఏర్పడి, కుటిలురైన ఉపకీచకులను పూర్తిగా ధ్వంసం చేయాలనే దృఢ సంకల్పంతో ఉన్నవాడని మరొక విశేషార్థం-ప్రస్తుతానికి పనికివచ్చే బలమైన అర్థం మనకు స్ఫురిస్తాయి. శుంభత్+మూర్తితో నిలిచాడనటం భీముడు పరిపూర్ణ క్రోధభావావతారంగా కనబడే రూపవిస్ఫూర్తితో నిలిచి ఉన్నాడని భావం. భీముడి రౌద్ర విభావ విస్ఫూర్తిని వికాస దశలతో చిత్రించిన భావచిత్ర మిది. ఉదాత్తాలంకారంతో ఉదాత్తమైనది. నాటకీయకతకు నాణ్యమైన ఉదాహరణమైనది.

2. క్రోధరసానుకూలంగా శబ్దార్థ గుణమైన ఓజస్సు ఇందులో పోషించబడింది. ఇందులో గాఢబంధరూపమైన శాబ్దికమైన ఓజస్సు అర్థప్రౌఢిని ప్రదర్శించే అర్థగుణమైన ఓజస్సుకు పోషకం కావటం తిక్కన రచనాశిల్పం. (సంపా.)

**వ. తదనంతరంబ. 26**

**తాత్పర్యం:** ఆ మీదట.

**ఆ. సూతుశవముతోడ నేతెంచు నెరవులు। దవ్వు దవ్వులన యుదగ్రరూప**
**కలితుఁడైన భీముఁ గనుఁగొని నడవక। నిలిచి దంత నంతఁ గలఁగఁబాఱి. 27**

**ప్రతిపదార్థం:** సూతుశవముతోడన్= కీచకుడి శవంతో; ఏతెంచు= వస్తూ ఉన్న; నెరవులు= అనుచరులు; దవ్వుదవ్వులను+అ= దూరదూరంగానే; ఉదగ్రరూప కలితుఁడు+ఐన= భయంకరమైన ఆకారం కలిగిన; భీమున్= భీముడిని; కనుఁగొని= చూచి; కలఁగన్+పాఱి= కలతచెంది; నడవక= నడవలేక, ముందుకు అడుగువేయలేక; అంతన్+అంతన్= అంతంత దూరాననే; నిలిచిరి= నిలిచిపోయారు.

**తాత్పర్యం:** కీచకుడి శవం వెంట అనుసరించి వస్తున్న ఉపకీచకులు ఎదుట భయంకరాకారంతో నిలబడి ఉన్న భీముడిని దూరదూరాలనుండే చూచి గుండె లవిసిపోగా అడుగులు ముందుకు సాగక ఎక్కడివారు అక్కడే ఆగిపోయారు.

**మ. 'ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని; రిం కెట్లొక్కొ! యంచున్ భయం**
**బొదవం బల్లములందు డాఁగియు, సమీపోర్వీజముల్ ప్రాఁకియుం,**
**జెదరం బాఱియు, నీరు సొచ్చియును, నిశ్చేష్టం బదద్వంద్వముల్**
**గుదివడ్డం బెగడొందియున్ భరిత సంక్షోభాత్ములై రత్తఱిన్'. 28**

**ప్రతిపదార్థం:** ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొనిరి= ఇదిగో గంధర్వులు వచ్చి చుట్టుముట్టారు; ఇంకన్+ఎట్లు+ఒక్కొ!= ఇక ఎట్లాగో, ఇకమీద ఏమవుతుందో; అంచున్= అని అంటూ; భయంబు+ఒదవన్= భయం కలుగగా, పల్లములందున్ +డాఁగియున్ = లోతట్లలో (గుంటలలో) దాగికొనీ; సమీప+ఉర్వీజముల్ ప్రాఁకియున్= దగ్గరనున్న చెట్ల మీదకు ప్రాకిపోయీ; చెదఱన్+పాఱియున్= అటూ ఇటూ చెల్లాచెదరుగా పరుగెత్తియూ; నీరుచొచ్చియును= నీళ్ళలో (మునిగి) దాగీ; నిశ్చేష్టన్= కదలికలు లేక కొయ్యబారి; పదద్వంద్వముల్= రెండు పాదాలూ; గుదివడ్డన్= కట్టువడగా, స్తంభించగా; బెగడొందియున్= భయపడియు; ఆ+తఱిన్= ఆసమయంలో; భరిత సంక్షోభ+ఆత్ములు+ఐరి= కలతతో నిండిన మనస్సులు కల వారైనారు.

**తాత్పర్యం:** 'అరుగో గంధర్వులు (సైరంధ్రి భర్తలు) వచ్చి మనలను చుట్టుముట్టారు. ఇక వారిబారి నుండి తప్పించుకొనటం ఎట్లాగో ఏమో!' అంటూ మనసులో భయం పెచ్చురేగగా, కలతపాటు క్రమ్ముకోగా ఉపకీచకులు పల్లపు ప్రాంతాలలో దాగుకొన్నారు. సమీపంలో ఉన్న చెట్లమీదకు ఎగబ్రాకారు. చెల్లాచెదురుగా పరుగెత్తారు. నీటిలో మునిగి కూర్చున్నారు. భయంతో నిశ్చేష్టులై కాళ్ళాడక స్తంభించిపోయారు.

**విశేషం:** భీముడి రూపం భయంకరం. అతడిని చూచిన ఉపకీచకులకు భయం ముంచుకొని వచ్చింది. చెట్టును భుజంమీద పెట్టుకొని నిలుచున్న భీముడు యముడివలె వారికి అనిపించాడు. రారనుకొన్న గంధర్వులు వచ్చారనుకొన్నారు. కనబడింది ముందున్న ఒక్కడే కాని మిగిలిన నలుగురూ తమను నాలుగువైపులా క్రమ్ముకొని ఉన్నారని గజగజలాడారు. ధీరులు కారు కాబట్టి ఎదురు నిలవలేకపోయారు. ప్రాణాలు కాపాడుకొనే పాట్లుపడ్డారు. చావంటే అన్న చావే జ్ఞాపకం వచ్చే ఉపకీచకులకు గంధర్వుల చేతిలో చావు మూడిందంటే ఎంత భయమో ఊహించవచ్చును. వీలైన రహస్య ప్రాంతాల్లో దాగి ఉండిపోయారు. కనీసం వారందరు కలిసి ఒక సంఘటిత ప్రయత్నం చేయలేదు. గొర్రెల మూకవంటి అనుచరులే వారు. నాయకులు కారు. వారి నాయకుడైన సింహబలుడు చనిపోవటంతో వారిలో సంఘటిత భావం లోపించింది. చెల్లాచెదరయ్యారు. అన్నను ఆ రాత్రే దహించాలనుకొనటం, రాజు అనుమతి పొందటం, సైరంధ్రిని కీచకశవానికి అంటగట్టి శ్మశానానికి తీసికొని రావటం మొదలైన అంశాలు అవివేకులూ గోలచేసే రౌడీమూకలూ చేసే చేష్టలే కాని వీరోచిత కార్యాలు కావు. ఇవి పఠితలకు హాస్యం కలిగించవచ్చును కాని, భీముడికి అవహేళనాత్మకమైన కోపావేశాన్ని కలిగిస్తాయి. ప్రతీకారం చేయలేని పగవారిని చెట్టుతో బాది చంపితే చాలు. ప్రతిఘటన లేని విజయాన్ని అవలీలగా సాధించవచ్చును. గంధర్వ భయం భీముడి పనిని తేలికచేసింది. (సంపా.)

**ఉ. సూతులు భీతులై ద్రుపదసూతి సమేతముగాఁగ నగ్రజ**
**ప్రేతమువైచి, వీటి దెసఁ బెల్లుగఁ బాఱఁ దొడంగినన్ వడిన్**
**వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ వ్రేసి యందఱం**
**జేతులతీఁట వో నుఱుము సేసె విశృంఖల విక్రమంబునన్. 29**

**ప్రతిపదార్థం:** సూతులు= ఉపకీచకులు; భీతులు+ఐ= భయపడినవారై; ద్రుపదసూతి సమేతముగాఁగన్= ద్రౌపదితో కూడా; అగ్రజప్రేతమున్= తమయన్న కీచకుడి శవాన్ని; వైచి= నేలమీద పడవేసి; వీటిదెసన్= ఊరివైపునకు; పెల్లుగన్= మిక్కిలిగా;

పాఱన్+తొడంగినన్= పరుగిడ సాగగా; వడిన్= వేగంగా; వాతసుతుండు= వాయుకుమారుడు భీమసేనుడు; ముట్టికొని= తాకి; వారిన్= ఆ ఉపకీచకులను; బడల్పడన్+వ్రేసి= చావగొట్టి; అందఱన్= వారందరిని; చేతుల తీఁట+పోన్= చేతి దురద పోయేటట్లుగా; విశృంఖల విక్రమంబునన్= అడ్డులేని పరాక్రమంతో; నుఱుము+చేసెన్= నుగ్గునుగ్గు చేశాడు.

**తాత్పర్యం:** ఉపకీచకులు భయపడి ద్రౌపదితో కూడా తమ అన్న శవాన్ని క్రింద జారవిడిచి ఊరిదిక్కుగా వేగంగా పరుగెత్తసాగారు. భీమసేనుడు మిక్కిలి వేగంగా వారిని వెన్నంటి తాకి చేతుల దురద తీరేటట్లుగా వారిని చావమోది అదుపులేని ఆవేశంతో వారినందరినీ నుగ్గునుగ్గు చేశాడు.

**విశేషం:** 1. పరుగెత్తే శత్రువులపై సుడిగాలివంటి దాడి చేసి వారిని చంపటం ఇందులోని విశేషం. తిక్కన భీముడిని వాయుసుతుడని పేర్కొన్నాడు. వాయుసుతుడు కాబట్టే క్రమ్ముకున్నాడు. ఉపకీచకులు ప్రాణాలను (ప్రాణవాయువులను) రక్షించుకొందామని శవాన్ని క్రింద పారవేసి పరుగెత్తారు. (వాయుతనయుడు వారి ప్రాణాలు తీశాడు) అంటే వారు ఆరంభించిన కార్యాన్ని వదలి పెట్టారన్నమాట. వారు పురం వైపు దారి పట్టారు. వెంటనే భీముడు వారిని చుట్టుముట్టాడు. దొరికిన వారిని దొరికనట్లు, వీలైన విధంగా చెట్టును తిప్పుతూ, దానితో చుట్టుతూ విశృంఖలంగా వీరవిహారం చేశాడు. ఉపకీచకులను చావమోదాడు. అంతటితో కసి తీరక చేతుల తీట తీరేటట్లు వారిని నుగ్గునుగ్గు చేశాడు. అంటే- భీముడు కీచకుడిని ముద్ద చేశాడు. ఉపకీచకులను నుగ్గు చేశాడు.

2. చేతుల తీట తీరేటట్లు-అని లోకోక్తి, యుద్ధంలో శత్రువులను చంపాలనే అభిలాష తీరేంత వరకు అని అర్థం. ఉపకీచకులను చంపి ఊరుకొనకుండా, వారిని వృక్షంతో బాది నుగ్గుచేసి, గంధర్వులు చంపే పద్ధతి విచిత్రమని లోకానికి చాటి చెప్పాడు. విరాటుడు కూడా కీచకోపకీచకులను గంధర్వులే రూపుమాపారని నమ్మింది ఇందువలననే. (చూడు 30వ వచనం) (సంపా.)

**వ. ఇవ్విధంబున నూటయేవు రుపకీచకులను సమయించి శమిత క్రోధుండై వచ్చి, పాంచాలికి బంధ మోక్షంబు గావించి, 'యింక నిశ్చింతంబున సుదేష్ణ మందిరంబునకుం జను'మని యవ్వెలందిని వీడుకొలిపి, తానును వేఱొక మార్గంబున మహానస గృహంబున కరుగుదెంచెఁ; దత్సమయంబున విరాటుండు కీచకానుజులు గంధర్వులచేత నిరవశేషంబుగా మృతిం బొందిరని విని, చకితచేతస్కుం డగుచు సహోదర మరణ శోకా యత్తచిత్త యయిన జీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించి యిట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; నూట+ఏవురు= నూటయిదుమంది; ఉపకీచకులను; సమయించి= చంపి; శమిత క్రోధుండు+ఐ= శాంతించిన కోపం కలవాడై; వచ్చి= దగ్గరకు వచ్చి; పాంచాలికిన్+బంధమోక్షంబు+కావించి= ద్రౌపది కట్లూడదీసి; ఇంకన్= ఇకమీద; నిశ్చింతంబునన్= ఏ చింత లేకుండా; సుదేష్ణ మందిరంబునకున్+చనుము= సుదేష్ణ అంతః పురానికి వెళ్ళుము; అని= అంటూ; ఆ+వెలందిన్= ఆమెను (ద్రౌపదిని); వీడుకొలిపి= పంపి; తానును= తాను (భీముడు)కూడా; వేఱు+ఒకమార్గంబునన్= ఇంకొకదారిలో; మహానస గృహంబునకున్= వంట యింటికి; అరుగుదెంచెన్= వచ్చాడు; తద్+సమయంబునన్= ఆ సమయంలో; విరాటుండు= విరాటుడు; కీచక+అనుజులు= కీచకుడి తమ్ములు; గంధర్వుల చేతన్= గంధర్వులచేత; నిరవ శేషంబుగాన్= శేషం లేకుండా; మృతిన్+పొందిరి+అని విని= చనిపోయారని విని; చకితచేతస్కుండు+ అగుచున్= భయపడిన మనస్సు కలవాడౌతూ; సహోదర మరణ= తోబుట్టువుల చావు వలన; శోక+ఆయత్తచిత్త+అయిన= దుఃఖానికి అధీనమైన మనస్సు కలిగి ఉన్న; జీవిత+ఈశ్వరిన్= తన భార్యను (సుదేష్ణను); ఉచిత+ఆలాపంబులన్= తగిన మాటలతో; అనునయించి= ఓదార్చి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఉపకీచకులను చంపి, కోపం శాంతించగా చల్లబడి, భీముడు ద్రౌపది కట్లూడదీసి, నిశ్చింతగా 'సుదేష్ణ మందిరానికి పో'మ్మని చెప్పి ఆమెను వీడుకొలిపాడు. తాను మరొకదారిలో వంటయింటికి చేరాడు. అపుడు విరాటుడు కీచకుడి తమ్ములు గంధర్వుల చేత నిశ్శేషంగా చనిపోయారని విని కంపించిన మనస్సుతో, తోబుట్టువుల చావుకు అమితంగా శోకిస్తున్న తన ఇల్లాలిని తగిన మాటలతో ఓదార్చి ఇట్లా అన్నాడు.

**ఆ. 'చంద్రవదన! యింక సైరంధ్రి నిచ్చోటు। వాపవలయు నేమిభంగినైనఁ;**
**గాన నాదు పలుకుఁగాఁ జెప్పు వెడలుట। కనుగుణముగ నమ్మృగాక్షితోడ. 31**

**ప్రతిపదార్థం:** చంద్రవదన!= ఓ చంద్రముఖీ!; ఇంకన్= వెంటనే; ఏమిభంగిన్+ఐనన్= ఏ ఉపాయంతోనైనాసరే; సైరంధ్రిన్; ఈ+చోటున్+పాపవలయున్= అంతఃపురంనుండి తొలగించాలి; కానన్= అందువలన; ఆ+మృగ+అక్షితోడన్= లేడి కన్నుల వంటి కన్నులుగల ఆ సైరంధ్రితో; వెడలుటకున్+అనుగుణముగన్= వెళ్ళుటకు తగినట్లుగా; నాదు పలుకుఁగాన్= నా మాటగా; చెప్పు= చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ చంద్రముఖీ! వెంటనే సైరంధ్రిని ఏదో ఒక సాకుతో ఈ చోటు నుండి పంపివేయాలి. అందుకు తగిన విధంగా ఆమెతో నా మాటలుగా చెప్పుము.

**విశేషం:** విరాటుడు సైరంధ్రి నేవిధంగానైనాసరే అంతఃపురం నుండి వెంటనే పంపివేయాలని నిర్ణయం తీసికొనటానికి రెండు కారణాలు కనబడుతున్నాయి. 1. అంతవరకు రాజ్యంలో కీచకుడు ఎదురులేనివాడుగా ఉండేవాడు. ఇప్పుడు అతడినీ, అతడి తమ్ములనూ తన భర్తలచేత అపూర్వంగా చంపించి సైరంధ్రి ఎదురులేని శక్తిగా రూపొందింది. ఇక ఆమె ఆడింది ఆట కాగలదు. ఆమె మాటను కాదనటానికి విరాటుడికి వీలులేకపోవచ్చును. 2. పోగా, నిన్న కీచకుడు సైరంధ్రిని తన యెదుటే అవమానించినప్పుడు ఆమె తనకు మొరపెట్టుకొన్నది. తా నేమీ చేయలేకపోయాడు. ఆమె తనను తానే రక్షించుకొన్నది. ఈనాడు మరల సభకు వచ్చి నలుగురిలో తనకు ఆమె నగుబాట్లు తెస్తుందేమో అని భయం. ఈ రెండింటినీ విరాటుడు బైటపెట్టడు. అంతే కాదు, సైరంధ్రితో ఎదుటపడి మాట్లాడే ధైర్యం అతడికి లేదు. అందువలన ఆమెను భార్య ద్వారా వదిలించుకొందామని యత్నించాడు. సుదేష్ణ సైరంధ్రికి యజమానురాలు కాబట్టి ఆమె ఆ పని చేయాలని కోరాడు. అయితే ఆమె సంవత్సరకాలం సైరంధ్రీ వృత్తితో ద్రౌపదిని ఉంచుకొంటానని మాట ఇచ్చింది. ఆ మాట తప్పుతుందేమో అని సుదేష్ణ అనుమానించవచ్చునని విరాటుడు- అది తన ఆజ్ఞగా చెప్పుమన్నాడు. అన్నిటి కంటె రాజాజ్ఞ దాటరానిది. దానిని వాడుకొంటున్నాడు విరాటుడు. దానిని సమర్థించుకొనటానికి మరి రెండు కారణాలు (రెండు పద్యాలలో) చెప్పవలసి వచ్చింది. ఇవి రాణిని ఒప్పించటానికి అనువైన కారణాలు. విరాటుడు కూడా తెల్లవారేసరికే భార్యను ఓదార్చటం, సైరంధ్రిని సాగనంపటం చేయాలని యత్నించటం అతడి భయాందోళనలను తెలుపుతున్నది. గంధర్వ భయం రాజ్యాన్ని ఎంత కుదిపివేసిందో తెలియటానికి విరాటుడే సాక్ష్యం. (సంపా.)

**ఆ. పురుషు లా లతాంగి పొరువునఁ బోయినఁ। జేటువచ్చుఁ గానఁ జెప్ప నేను**
**వెఱతు; నాఁడువారు వెరవుతో మృదువచో। రచనఁ జెప్పు టరయ నుచిత వృత్తి. 32**

**ప్రతిపదార్థం:** పురుషులు= మగవారు; ఆ లతా+అంగి పొరువునన్+పోయినన్= ఆ అందగత్తె ప్రక్కన నడిచినా; చేటువచ్చున్= అపాయం వస్తుంది; కానన్= కాబట్టి; ఏను= నేను; చెప్పన్+వెఱతున్= స్వయంగా చెప్పటానికి భయపడుతున్నాను; ఆఁడువారు= స్త్రీలు; వెరవుతోన్= ఉపాయంతో; మృదువచస్ (ః)+రచనన్= మెత్తని మాటల కూర్పుతో; చెప్పుట= చెప్పటం; అరయన్= చూడగా; ఉచిత వృత్తి= తగిన పద్ధతి.

**తాత్పర్యం:** ఆ అందగత్తెప్రక్కకు మగవారు పోతే ప్రమాదం వస్తుంది. కాబట్టి నేను చెప్పటానికి భయపడుతున్నాను. స్త్రీలయితే మెత్తని మాటల నేర్పుతో ఉపాయంగా చెప్పుతారు. అదే సరైన పద్ధతి. (సైరంధ్రిని వెడలనంపటానికి సుదేష్ణ తగినదని భావం.)

**విశేషం:** సుదేష్ణకు నచ్చచెప్పే యత్నంలో విరాటుడు పేర్కొన్న మొదటి హేతు విది. జరిగిన కథను సమీక్షిస్తే మగవారు ఆ మగువను సమీపిస్తే చాలు-ప్రమాదం వచ్చేటట్లున్నది. కాబట్టి తాను ఆమెకు ముఖాముఖి చెప్పనన్నాడు. ఇది భర్త ప్రాణాల మీద గౌరవమున్న సుదేష్ణకు తప్పక నచ్చుతుంది. పురుషుల పొత్తే ప్రమాదమైతే, పరుషంగా పలికితే మరెంత ప్రమాదమో! అందువలన విరాటుడు తాను ఆమెను వెళ్ళిపొమ్మని చెప్పలేనని తన భయాన్ని బయటపెట్టాడు. ఆమీద సుదేష్ణనే స్వయంగా చెప్పుమని నిర్దేశించకుండా నిపుణంగా ఆడువారందరిమీదా పెట్టి మాట్లాడాడు. ఆడువారికి ఆడువారే అనువుగా, మృదువుగా కోపం రాకుండా అంగీకరించేటట్లు నచ్చచెప్పకలుగుతారు. కాబట్టి ఆ నేర్పరితనాన్ని ప్రయోగించుమన్నాడు. అంటే-సుదేష్ణ స్వయంగాగానీ, మరొకరి ద్వారాగానీ, లేక సమష్టిగాగానీ ఆ కార్యాన్ని నిపుణంగా పూర్తి చేయాలని విరాటుడి సంకల్పం. ఈ హేతువు వలన కార్యభారం సుదేష్ణమీద ఉంచటం జరిగింది. (సంపా.)

**ఉ. ఆ కమలాక్షి రూప మహిమాతిశయంబు మనోహరంబు; భో**
**గైక పరాయణుల్ పురుషు; లంగజుఁ డప్రతికార చేష్టిత**
**స్వీకృత లోకుఁ; డట్లగుటఁ జేటు పురంబునవారి కెప్పుడుం**
**గా కెటు లుండు? నిట్టి యవగాఢపుఁ బొత్తు మనంగ వచ్చునే?' 33**

**ప్రతిపదార్థం:** ఆ కమల+అక్షి రూప మహిమ+అతిశయంబు మనోహరంబు= ఆ కలువకంటియొక్క రూప వైభవంయొక్క గొప్పతనం మనసులను హరించేది (చూచువారిని ఆకర్షించే అందమైనది); పురుషులు= మగవారు; భోగ+ఏకపరాయణుల్= విషయ సుఖాలను మరిగేవారు; అంగజుఁడు= మన్మథుడు; అప్రతికార చేష్టిత స్వీకృతలోకుఁడు= అడ్డులేనిచేష్టచేత లోకాన్ని (ప్రపంచాన్ని) లోగొన్నవాడు; అట్లు+అగుటన్= అందుచేత; పురంబున వారికిన్= ఈ నగరవాసులకు; ఎప్పుడున్= ఏ సమయంలోనైనా; చేటు+కాక+ఎటులు+ఉండున్?= కీడు కలుగకుండా ఎట్లా ఉంటుంది?; ఇట్టి= ఈవిధమైన; అవగాఢము+పొత్తున్= ప్రమాదంతో కూడిన స్త్రీయొక్క స్నేహంతో; మనంగవచ్చునే?= బ్రతుకవచ్చునా?

**తాత్పర్యం:** ఆ కలువకంటి రూపమా- చూచేవారిని ఆకర్షించేటంత అందమయింది. మగవారా- భావోద్రేకులు. మన్మథుడా- అడ్డం లేని చేష్టతో లోకాన్ని లోగొన్నవాడు. అందువలన ఈ నగరవాసులకు ఏ సమయంలోనైనా చేటు కలుగకుండా పోదు. ఇటువంటి ప్రమాదకరమైన స్త్రీ పొత్తుతో బ్రతుకగలమా?'

**విశేషం:** సైరంధ్రిని తత్క్షణం పంపివేయటానికి హేతువును ఈ పద్యంలో చెప్పాడు విరాటుడు. ఆమెది ప్రమాదకరమైన పొత్తు. అది ప్రాణాంతకం కాబట్టి వెంటనే పరిత్యాజ్యం అని చెప్పాడు. దానికి తర్కబద్ధమైన సమర్థనం చేయటం విశేషం. ఆమె పొత్తు వలన మూడు రకాల ప్రమాదాలను ఎదుర్కొనవలసివస్తుందని అతడి వాదన. (1) ఆమె అందం చూచినవారి మనస్సులను ఆకర్షిస్తుంది. (2) పురుషులు సామాన్యంగా భోగపరాయణులు కాబట్టి ఆమె అందం బారిన పడే ప్రమాదం ఉన్నది. (3) ఒకసారి ఆమె వలన ఆకర్షితులైతే చాలు-మన్మథుడు వారిమీద తిరుగులేని దాడి చేస్తాడు. వారు ఆమెకు దాసులు కాకమానరు. గంధర్వుల చేతులలో చావకమానరు. కాబట్టి ఆ చేటు మన నగరవాసుల కందరికీ తప్పదేమో! అందువలన సైరంధ్రితోడి ప్రమాదకరమైన పొత్తును కొనసాగిస్తే మరిన్ని చావులు చూడవలసి వస్తుంది. కాబట్టి వెంటనే ఆమెను సాగనంపటం మంచిదని తేల్చి చెప్పాడు. ఈ మాటలు విని సుదేష్ణ అనుమాన మేదీ లేకుండా విరటుడి ఆజ్ఞను పాటించక తప్పదు. అందుకే మారుమాటాడక ఆమె అంగీకరించబోతున్నది తరువాతి పద్యంలో. (సంపా.)

**క. అని నిశ్చయించి పలికిన। విని కేకయరాజపుత్రి విభు తలఁపు మనం**
**బునకుఁ బ్రియం బగుటయుఁ గై। కొని యాపని యట్లచేఁతకుం బూనెఁ దగన్. 34**

**ప్రతిపదార్థం:** అని నిశ్చయించి పలికినన్= అని నిర్ణయించి పలుకగా; కేకయ రాజపుత్రి= సుదేష్ణ; విని= విన్నదై; విభుతలంపు= తన భర్తయొక్క భావం; మనంబునకున్= తన మనసుకు; ప్రియంబు+అగుటయున్= ప్రీతి కల్గించేదికాగా; ఆ పని+కైకొని= ఆ పనిచేయబూని; అట్లు+అ చేఁతకున్= ఆ విధంగా చేయటానికి; తగన్= తగినట్లుగా; పూనెన్= పూనుకొన్నది.

**తాత్పర్యం:** (విరటుడు) ఆ విధంగా నిర్ణయించి చెప్పగా సుదేష్ణ విని, తన భర్త తలపు మనసుకు ప్రీతి కల్పించగా, సైరంధ్రిని పంపివేయటానికి తగిన పూనికను వహించింది.

**క. అంతం గుంతీనందన। కాంతా చింతా మహాంధకారముతో న**
**త్యంతంబు మచ్చరించెనొ। సంతమసం బనఁ బ్రభాత సమయం బయ్యెన్. 35**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ మీదట; కుంతీనందన కాంతా= పాండవుల పత్నియైన ఆ అందగత్తె యొక్క; చింతా= దుఃఖమనే; మహా+అంధకారముతోన్= పెనుచీకటితో; సంతమసంబు= నిండు చీకటి; అత్యంతంబు= మిక్కిలి; మచ్చరించెనొ= వైరముకొన్నదో, పోటీపడిందో; అనన్= అన్నట్లుగా; ప్రభాత సమయంబు+అయ్యెన్= తెల్లవారువేళ అయింది.

**తాత్పర్యం:** పాండవపత్ని అయిన ద్రౌపదికి కలిగిన దుఃఖమనే పెంజీకటితో గాఢాంధకారం మిక్కిలి వైరం పూనిందా అన్నట్లు తెల్లవారే సమయ మయింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ద్రౌపది చింత అనే మహాంధకారంతో రాత్రిచీకటి మాత్సర్యంతో పోటీపడిందా అన్నట్లు సాగింది. కీచక ఉపకీచకుల వలన ఏర్పడిన ఉపద్రవాల వలన కలిగిన చింత అంధకారం వంటిదైనా అది క్రమంగా తొలగిపోయింది. చీకటి కూడా రాత్రంతా తన ప్రతాపాన్ని చూపించినా చివరకు తెల్లవారింది. చింతతో చీకటి పోటీ పడి తానే ముందుగా తొలగిపోదామని పరుగెత్తుతున్నట్లున్నది. కాని, ఈ సందర్భంలో ఇది భావనారమణీయం. కీచకుడి శవంతో దహనం కాగలిగిన ప్రమాదం నుండి ద్రౌపది తప్పుకొన్నది. ఇంకా అంతఃపురానికి చేరలేదు. అంతకంటె ముందే చీకటి తొలగిపోయి తెల్లవారింది. ఈ సన్నివేశంలోని ఈ అర్థాన్ని ప్రకృతిపరంగా వ్యాఖ్యానించటం తిక్కన వర్ణనాశిల్పం. పాత్రల ప్రకృతిసహజ ప్రకృతితో పొందే కాలపరమైన సమన్వయం ఇందులో రమణీయం. (సంపా.)

**వ. పదంపడి పద్మినీ ప్రమోద సంపత్కరుం డగు నరుణకిరణుం డుదయించె; నట మున్న పాంచాలి సచేలస్నానంబుసేసి, రాగాది వికార నిరాసనంబునం బ్రసన్నయయిన బుద్ధియుంబోలె సింహబల ప్రభృతి కీచక విధ్వంసనంబునం దెలివొంది మంద మందయానంబునం బురంబు సొచ్చి రాజవీథి నరుగు దెంచునప్పుడు. 36**

**ప్రతిపదార్థం:** పదంపడి= ఆమీద; పద్మినీ= తామరలకు; ప్రమోద సంపత్కరుండు= సంతోషమనే సంపదను కలిగించేవాడు; అగు= అయిన; అరుణ కిరణుండు= సూర్యుడు (ఎర్రని కిరణాలు కలవాడు); ఉదయించెన్= ఉదయించాడు (సూర్యోదయమైనది); అటు+అ; మున్ను+అ= అంతకుముందుగానే (సూర్యు డుదయించటానికి ముందే); సచేల స్నానంబు +చేసి= కట్టుగుడ్డలతో స్నానంచేసి (శవాన్ని చూచినా తాకినా సచేలస్నానం చేయటం ఆచారం); రాగాది వికార= మోహం

మొదలైన వికార చేష్టలను; నిరాసనంబునన్= నిరసించటం చేత; ప్రసన్న+అయిన= నిర్మలమయిన; బుద్ధియున్+పోలెన్= బుద్ధివలె; సింహబల ప్రభృతి కీచక విధ్వంసనంబునన్= సింహబలుడు మొదలైన కీచకులను నాశనం చేయటం వలన; తెలివి+ఒంది= తేరుకొని; మందమందయానంబునన్= నెమ్మది నెమ్మదిగా సాగే నడకతో; పురంబు+చొచ్చి= నగరంలోనికి; రాజవీథిన్= రాచబాటలో; అరుగుదెంచు+అప్పుడు= వస్తున్నపుడు.

**తాత్పర్యం:** ఆ తరువాత- పద్మాలనే ఉత్తమ జాతి స్త్రీలకు పరమాహ్లాదాన్ని కలిగించే ఎర్రని కిరణాల సూర్యుడు తూర్పున ఉదయించాడు. అంతకుముందే ద్రౌపది శవాన్ని తాకిన దోషం పోవాలని సచేలస్నానం చేసింది. సింహబలుడు మొదలుకొని కీచకులందరూ చనిపోవటంతో రాగద్వేషాలు తొలగి నిర్మలమైన బుద్ధివలె ద్రౌపది తేరుకొన్నది. మెల్లమెల్లగా నడుస్తూ నగరంలోకి ప్రవేశించి రాజవీథిలో వస్తూ ఉండగా, (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. సింహబల ప్రభృతి కీచక విధ్వంసనం వలన తెలివొందిన ద్రౌపది-ఉపమేయం. రాగాది వికార నిరాసనంబునం బ్రసన్నమయిన బుద్ధి - ఉపమానం. పోలెన్= ఉపమావాచకం. భౌతికవస్తువులను భావద్రవ్యాలతో పోల్చటం విశేషం. ఉపమాలంకార సాదృశ్యం వలన కీచకుడు రాగదోషం వంటివాడనీ. ఉపకీచకులు వివిధ వికారాల వంటివారనీ ధ్వని. వాటిని నిగ్రహించగలిగేది బుద్ధి. రాగాదులు అణగిన తరువాత బుద్ధి నిర్మలంగా, ప్రసన్నంగా ఉంటుంది. ద్రౌపదిని ప్రసన్నబుద్ధితో పోల్చటం ఆమె హృదయప్రసన్నతను ధ్వనింపచేయటం. సచేల స్నానం అశౌచ నివారణకు చేస్తారు. ద్రౌపది చేసిన ఇప్పటి సచేల స్నానం అరణ్యాజ్ఞాతవాసక్లేశాల నుండి ఆమెకు కలిగిన విముక్తిని ధ్వనింపచేస్తున్నది. రాజవీథిలో నెమ్మదిగా నడవటం త్వరలో ఆమెకు కలిగే రాజయోగానికి ధ్వని. (సంపా.)

**సీ.** **'మన కీచకుల కెల్ల మారియై పుట్టిన । సుదతి పోయెడు' నని చూచువారు;**
**'నద్దిరా! నీకుఁ గ్రొ వ్వఱుగదేఁ జూతుగా' కని తలసూపక యడఁగువారు;**
**నలవోకఁ గనుఁగొని యంతరంగము బిట్టు । బెదర మాఱుమొగంబు పెట్టువారు;**
**నెదురుగా వచ్చిన నెంతయేనియు దవ్వు । గలుగ వేఱొక త్రోవఁ దొలఁగువారు**

**తే.** **ముట్టఁబడి మేనఁ గంపంబు పుట్ట నొదిగి । యుండువారుఁ, గరంబున నుదర మప్ప**
**ళించి 'యమ్మరో! రక్కసి' యంచు నుల్ల । ములుకువారునై పురజనంబులు తలంకి.** 37

**ప్రతిపదార్థం:** మనకీచకులకున్+ఎల్లన్= మన కీచకులందరికీ; మారి+ఐ పుట్టిన= మృత్యువుగా అవతరించిన; సుదతి= అందగత్తె అయిన స్త్రీ; పోయెడున్+అని చూచువారున్= పోతూ వున్నదని చూచేవారున్నూ; అద్దిరా!= అదేరా!; నీకున్+క్రొవ్వు+అఱుగదేన్= పొగరు అణగకపోతే; చూతు(వు)గాక= ఆమెను చూస్తావులే; అని= అంటూ; తల+చూపక= తలలెత్తి చూడక; అడఁగువారున్= ఒదిగి దాగి ఉండేవారున్నూ; అలవోకన్= నెమ్మదిగా; కనుఁగొని= చూచి; అంతరంగము= మనస్సున; బిట్టుబెదరన్= మిక్కిలి భయపడగా; మాఱుమొగంబు పెట్టువారున్= ప్రక్కకు మొగం త్రిప్పుకునేవారు; ఎదురుగా వచ్చినన్= ఎదురైతే; ఎంత+ఏనియున్= దవ్వు+కలుగన్= మిక్కిలి దూరం ఏర్పడేటట్లు; వేఱొకత్రోవన్= మరొక బాటలో; తొలఁగువారున్= తప్పుకొనిపోయేవారున్నూ; ముట్టన్+పడి= తాకబడి; మేనన్= ఒడలిలో; కంపంబు పుట్టన్= వణకు పుట్టగా; ఒదిగి+ఉండువారున్; అణిగి వుండేవారున్నూ; కరంబునన్= చేతితో; ఉదరము+అప్పళించి= పొట్టమీద చరచుకొని; అమ్మరో!= ఓ యమ్మో!; రక్కసి+అంచున్= రాక్షసి అంటూ; ఉల్లము+ఉలుకువారున్+ఐ= గుండెలు అదిరే వారై; పురజనంబులు= నగరంలోని జనులు; తలంకి= భయంతో వణికిపోయి.

**తాత్పర్యం:** (విరటుడి పట్టణంలోని జనులు సైరంధ్రిని చూచి పొందిన అదురుపాటు ఈ పద్యంలో వర్ణించబడింది). 'మన కీచకులందరికీ మృత్యువై పుట్టిన ఆ అందగత్తె ఈమె' అని చూచేవారు కొంతమంది; 'నీ కొవ్వు కరగకపోతే ఆమె దిక్కుచూడు' అని చూచేవాడిని వారిస్తూ మొగం తప్పించి దాగి ఉండిపోయేవారు కొందరు! అలవోకగా చూచి మనస్సులో మిక్కిలి బెదరి మారుమొగం పెట్టేవారు కొందరు; పొరపాటున ఆమె శరీరం తగులగా ఒడలిలో వణకు పుట్టి అణగి ఉండేవారు కొందరు; 'అమ్మో! ఈమె రాక్షసి' అని పొట్టబాదుకొని గుండెలదరి పోయేటట్లు భయపడేవారు కొందరు- ఈ విధంగా ఆ నగర ప్రజలు హడలిపోయి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 1. రాజవీథిలో ద్రౌపది దూరం నుండి దగ్గరౌతూ ఉండగా ఆయా దశలలో ఆయా సమీప ప్రజలు ఏవిధంగా భయపడి స్పందించారో, ప్రవర్తించారో చలనచిత్రంలోవలె ప్రదర్శించిన అందమైన పద్య మిది. కీచకోపకీచకుల వధ వృత్తాంతం, దానికి కారణమైన సైరంధ్రిని గురించిన వివరాలు ప్రజలలో తెల్లవారేసరికే గుప్పుమన్నాయి. అందువలన ఆమెను గురించి అనేక విధాలుగా వ్యాఖ్యానించారు. ఆమెను చూచి అనేక విధాలుగా భయాన్ని ప్రదర్శించారు. ద్రౌపది దూరంగా కనబడింది. 'అదుగోరా! మనకీచకులను చంపిన మారి వస్తున్నది' అని అంటూ ఆసక్తిగా చూచారు. ఇది మొదటిదశ. ద్రౌపది మరికొన్ని అడుగులు సమీపించింది. ఒకడు అట్లాగే ఆశ్చర్యంతో చూస్తూ నిలిచిపోగా 'ఏమిరా, పొగరుపోతుగా ఉన్నావు? అలాగే చూస్తూ ఎదురుగా ఉంటే నీ పరువు కూడా మిగలదు' అంటూ మరొకడు తల పైకెత్తకుండా చాటున దాక్కొన్నాడు. ఇది రెండవ దశ. ద్రౌపది మరికొంత దగ్గరగా వచ్చింది. అనుకోకుండా కొందరు చూచారు. అంత దగ్గరలో చూచేవారికి గుండెలు చెదిరిపోయాయి. అంతే, మొగం తప్పించి ప్రక్కకు పోయారు. ఇది మూడవ దశ. ద్రౌపది ఎదురుపడింది. మాటా పలుకూ లేకుండా ప్రక్కత్రోవలు పట్టి దూరదూరంగా తొలగిపోవటం మొదలుపెట్టారు. ఇది నాలుగవ దశ. ద్రౌపది శరీరం కొందరికి తగిలింది. ఇంకేముంది? మేను గజగజ వణకటంతో వారు కుదించుకొని కుప్పకూలిపోయారు. ఇది ఐదవ దశ. ద్రౌపదిని సవివరంగా చూచారు. (చచ్చాం రా! బాబూ! అన్నట్లు) కడుపు మీద చరచుకొని 'ఓయమ్మో! రాక్షసి'! అని గుండె లవిసేటట్లుగా అరుస్తూ తల్లడిల్లిపోయారు. ఇది ఆరవ దశ. 2. ఈ పద్యంలోని దీనస్థితి దర్శనీయం. నగరవాసులు భయంతో వింత చేష్టలు చేస్తున్నారు. నిజానికి వారి పక్షాన అవి భయభావ వ్యంజకాలు. కాని, ద్రౌపది అంత భయపడవలసిన వ్యక్తి కాదని పఠిత హృదయం చెప్పటంతో వారి చేష్టలన్నీ వికృతులుగా అనిపించి హాస్యాన్ని కలిగిస్తాయి. భయం పుట్టవలసిన చోట హాస్యం కలగటం రసాభాసం కావాలి. కాని, ఇక్కడ భయంలో హాస్యం లేదా (Grim Humour) ధ్వనిమయం. (సంపా.)

**చ. పులిఁ గనుఁగొన్న లేడులునుబోలె విభీతిఁ గలంగఁబాఱ న**
**న్నెలఁతుక యంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై**
**వెలి విరియంగనీక చని వేచి మహానసశాల వాకిటన్**
**నిలిచిన భీమసేనుఁ గని నెయ్య మెదం జిగురొత్తుచుండఁగన్. 38**

**ప్రతిపదార్థం:** పులిన్+కనుఁగొన్న లేడులును+పోలెన్= పులిని చూచిన లేళ్ళవలె; విభీతిన్+కలంగన్+పాఱన్= భయంతో పరుగెత్తగా; ఆ+నెలఁతుక= ఆమె (ద్రౌపది); అంతరంగమునన్= మనస్సులో; హాస్యరసంబు= వికారాలవలన కలిగిన నవ్వుయొక్క అనుభవాన్ని; మోముపైన్= ముఖంమీద; వెలి విరియంగన్+ఈక= బయటపడనీయకుండా; చని= వెళ్ళి; వేచి= కాచుకొని; మహా నసశాల వాకిటన్= వంట ఇంటి వాకిట; నిలిచిన భీమసేనున్+కని= నిలిచి ఉన్న భీముడిని చూచి; ఎదన్= మనస్సులో; నెయ్యము= స్నేహం, ఆత్మీయత; చిగురు+ఒత్తుచుండఁగన్= మొలకెత్తుతూ ఉండగా (కలుగుతుండగా).

**తాత్పర్యం:** పులిని చూచిన లేళ్ళవలె తనను చూచి భయంతో కలతపడి పరుగెత్తుతున్న విరటుడి పురప్రజలను చూచి ద్రౌపది మనసులో పరిహాసం నిండుకొనగా అది వెలికి తెలియనీయకుండా వెళ్ళి, వంటింటి వాకిట కాచు కొని నిలుచున్న భీమసేనుడిని చూచి మనసులో ప్రేమ చిగురొత్తుతూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. పులిని చూచిన లేళ్ళవలె ద్రౌపదిని చూచిన ప్రజలను పోల్చటం వలన వారి భయవిహ్వలత్వం వ్యంగ్యం. (సం.పా)

**క.** **తన యంతన యటువలుకుచుఁ । జను విధమున నతని దిక్కు చక్కని చూడ్కిం**
**గనుఁగొనక ద్రుపదనృప నం । దన యిట్లను నిజ కృతార్థతం దెలుపుటకున్.** **39**

**ప్రతిపదార్థం:** ద్రుపదనృపనందన= ద్రౌపది; తన+అంతన్+అ= తనలో తానే; అటు+పలుకుచున్= ఏదో గొణుగుతూ మాటాడుకొంటూ; చనువిధమునన్= పోతున్నట్లుగా; అతని దిక్కున్= భీముడి వైపు; చక్కని చూడ్కిన్+కనుఁగొనక= సూటిగా చూచే చూపుతో చూడక (సూటిగా చూడకుండా ప్రక్కకు చూస్తూ); నిజకృతార్థతన్+తెలుపుటకున్= తన ధన్యతను తెలియజేయటానికి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ద్రౌపది తన ధన్యతను (కృతార్థతాభావాన్ని) తెలపాలని భావించి అతడివైపు (భీమసేనుడి వైపు) సూటిగా చూడకుండా తనలో తాను ఏదో మాట్లాడుకొంటున్నట్లుగా అభినయిస్తూ ఇట్లా పలికింది.

**విశేషం:** 1. ద్రౌపది మాన ప్రాణ సంరక్షకుడు భీముడు. అతడు తన కర్తవ్యాన్ని అద్భుతంగా, రహస్యంగా నిర్వహించి, ఏమీ తెలియని వాడివలె వంటిఇంటి వాకిట్లో నిలబడి భార్య యోగక్షేమాలు ఇంకా విచారిస్తున్నాడు. భద్రంగా ఇంటికి చేరుతున్న వైఖరిని గమనిస్తున్నాడు. ఆమె ఆవైపు వచ్చింది. అతడిని చూచింది. ప్రేమతో, కృతజ్ఞతాభావంతో మనసు నిండిపోయింది. ఆ భావాలను బయటపడి చెప్పటానికి వీలు లేదు. అందువలన తనలో తాను ఏదో మాట్లాడుకొంటున్నట్లుగా అభినయిస్తూ, భీముడివైపు సూటిగా చూడకుండా మొగం ప్రక్కకు పెట్టి తన మనోభావాలను పైకి చెప్పింది. చూచేవారికీ, వినేవారికీ ఎటువంటి అనుమానం కలుగకుండా వ్యవహరించే జాగ్రత్త ఆమెలో కనబడుతున్నది.

2. ఇప్పుడు 'కృతజ్ఞత' చెప్పటం అనే అర్థంలో పూర్వం 'కృతార్థతను ప్రకటించటం' అనేవారు. (సంపా.)

**తే.** **'కీచకులదెసఁ బుట్టిన కిల్బిషంబు । పాచి నన్ను రక్షించిన పరమ ధర్మ**
**రతికి గంధర్వ పతికి నిరంతరంబు । భక్తి యుక్తిమైఁ బ్రణమిల్లి బ్రదుకుదాన.'** **40**

**ప్రతిపదార్థం:** కీచకుల దెసన్= కీచకుల వలన; పుట్టిన= కలిగిన; కిల్బిషంబు పాచి= ప్రమాదాన్ని తొలగించి; నన్ను రక్షించిన; పరమధర్మరతికిన్= ఉత్తమ ధర్మంలో ఆసక్తి కలవాడికి; గంధర్వపతికిన్= గంధర్వుడి రూపంలో ఉన్న భర్తకు (గంధర్వ శ్రేష్ఠుడికి అని పైకి తోచే అర్థం); నిరంతరంబు= ఎల్లప్పుడు; భక్తియుక్తిమైన్= భక్తితో కూడుకొన్న భావంతో; ప్రణమిల్లి= నమస్కారం చేసి; బ్రదుకుదానన్= బ్రతుకుతాను (జీవితాంతం భక్తితో సేవిస్తూ ఉంటాను అని భావం).

**తాత్పర్యం:** కీచకుల వలన కలిగిన ప్రమాదాన్ని తొలగించి నన్ను కాపాడిన పరమ ధర్మమూర్తికి గంధర్వపతికి (గంధర్వుడి రూపంలో ఉన్న నాథుడికి) జీవితాంతం సదా భక్తిభావంతో నమస్కరిస్తూ బ్రతుకుతాను.

**విశేషం:** భీముడు చేసిన ఉపకారం ద్రౌపది మానాన్ని కాపాడి గౌరవాన్నిచ్చింది. ప్రాణాన్ని కాపాడి జీవితాన్ని ఇచ్చింది. ఇట్లా యోగక్షేమాల నిచ్చిన గంధర్వపతికి (గంధర్వరూపంలో ఉన్న నాథుడికి) జీవితాంతం భక్తితో సేవలు చేస్తూ ఋణం తీర్చుకొంటాను అని ఆమె తనివితీర పలికి, తన మనసులోని మమకారాన్నీ, ప్రశంసాభావాన్నీ, భక్తిప్రపత్తులనూ ప్రదర్శించింది. ఈ మాటలు విన్న ప్రజలకు ఆమె గంధర్వపతితో చెప్పుకొంటున్నట్లుంటాయి. అన్యాపదేశంగా తన నుద్దేశించి చెప్పుతున్నదని భీముడు గ్రహించగలడు. పఠితలు రెండర్థాలనూ గ్రహించి ప్రమోదిస్తారు. (సంపా.)

**వ. అనిన విని యనిలనందనుండు నిగూఢవచన చాతుర్యధుర్యుండై యిట్లనియె. 41**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని ఆమె చెప్పగా విని; అనిలనందనుండు= వాయుదేవుడి పుత్రుడైన భీమసేనుడు; నిగూఢ వచన చాతుర్య ధుర్యుండు+ఐ= రహస్యమైన మాట నేర్పు భావాన్ని వహించినవాడై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ద్రౌపది మాటలు విని ఎదుటివారికి తెలియకుండా రహస్యంగా మాట్లాడే నేర్పుతో భీముడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీముడు గూఢోక్తి చాతుర్యాన్ని ప్రదర్శించబోతున్నాడు. పైకి సాధారణ సంభాషణగా తోస్తూ నిర్దిష్ట వ్యక్తికి ఉద్దిష్టమైన అర్థం తోచేటట్లు మాట్లాడటం గూఢోక్తి. (సంపా.)

**చ. 'అతివ! యపాయముం బొరయు నప్పుడు గావక తక్కనేని నా**
**పతి పతియే? తలంప మగ పాడియె? లోకము పాడియే? భవ**
**త్పతు లిటు లాచరించుట గదా భవదీయ మనోనువర్తన**
**స్థితి కుచితంబు; వారల నుతింపఁగ నేల నిసర్గవృత్తులన్?' 42**

**ప్రతిపదార్థం:** అతివ!= ఇంతీ!; అపాయమున్+పొరయు+అప్పుడు= ప్రమాదం కలిగేటప్పుడు; కావక తక్కెన్+ఏనిన్= కాపాడక వెనుకంజ వేస్తే; ఆ పతి పతియే?= ఆ మగడు మగడేనా? (కాదని భావం); తలంపన్= ఆలోచించగా; మగపాడియె?= అది పౌరుషమా?; లోకము పాడియే= (అది) లోకధర్మమా?; భవత్+పతులు= నీ భర్తలు; ఇటులు+ఆచరించుటగదా!= ఇట్లా చేయటమే కదా!; భవదీయ మనస్(ః)+అనువర్తన స్థితికిన్= నీ మనసునకు అనుగుణంగా నడచుకొనటానికి; ఉచితంబు= తగిన తీరు; నిసర్గ వృత్తులన్= సహజమైన నడవడి గల వారైన; వారలన్= ఆ భర్తలను; నుతింపఁగన్+ఏల?= (కాబట్టి ప్రత్యేకంగా వారిని) పొగడటం ఎందుకు?

**తాత్పర్యం:** 'ఇల్లాలు అపాయంలో చిక్కుకొన్నప్పుడు ఆదుకొనకుండా ఉండే మగడు మగ డనిపించుకొంటాడా? (కాదని భావం). ఆలోచిస్తే అది పౌరుషమేనా? లోకధర్మమేనా? (కాదని భావం). కాబట్టి నీ భర్తలు ఇట్లా చేయటం నీ మనోభీష్టానికి అనుగుణంగా నడుచుకొనటమే కదా! అది వారి కర్తవ్యం. వారు చేయవలసిన పని చేసి తమ సహజ ప్రవర్తనను ప్రదర్శించారు. దీనికి వారిని ఇంతగా పొగడటం ఎందుకు?'

**విశేషం:** 1. భారతదేశంలో భార్యాభర్తల మధ్య ఉండే నైతిక సంబంధాన్ని తెలియచెప్పే ఒక రుచిరార్థ సూక్తి ఇది. భరించేవాడు భర్త అని సంప్రదాయం. భార్యను రక్షించుకొనటం యజమానుడి ధర్మం, మానవధర్మం, వీరధర్మం, లోకధర్మం. భార్య ప్రమాదంలోపడితే గృహస్థుల ధర్మమే ఆపదలో చిక్కుకొన్నట్లు. ఆమెను ఏవిధంగానైనా రక్షించాలి. అది ఆత్మోద్ధరణమే ఔతుంది. ఈ తత్త్వంతెలిసి భార్యను ఆపదలో నుండి రక్షించినవాడు భర్త అనే పదానికి అర్హుడౌతాడనీ, లేకపోతే కాడనీ

మొదట అన్నాడు భీముడు. ఆతరువాత అది మగవాడుగా చేయవలసిన ధర్మం (పురుష ధర్మం); సాటి మనిషిగా చేయవలసిన ధర్మం (మానవధర్మం, లోకధర్మం) అని పేర్కొన్నాడు. ఇన్ని రకాలుగా బాధ్యులైన భర్తలకు భార్యలను రక్షించే పనులు అవశ్యకర్తవ్యాలౌతాయే కాని, లోకోద్ధరణకు చేసే పనులు కావు. కాబట్టి వారిని ప్రత్యేకంగా ప్రశంసించవలసిన అవసరంలేదని భీముడు పలికాడు. ఇది సాధారణంగా ఎవరు విన్నా అనుమానం కలగని మాటల తీరు.

2. భీముడు కీచక వధ చేయటం ద్రౌపది మానప్రాణసంరక్షణం చేసి, ఆమె మనసును కుదుటపరిచి రంజింప చేయటానికే అని గూఢంగా చెప్పటం ఇందులోని అంతరార్థం. అది అతడికి సహజంగా ఉన్న కర్తవ్యమని కూడా చెప్పటం విశేషం. ప్రత్యేకంగా తనను పొగడవద్దని వారించటం అతడి ధీరోదాత్త లక్షణం. అట్లా బహిర్గతంగా ప్రశంసలు చేస్తే వినేవారికి అనుమానం రావచ్చుననీ, అది అజ్ఞాతవాసవ్రతానికి భంగం కలిగించవచ్చుననీ గూఢమైన హెచ్చరిక!

3. భార్య అన్యాపదేశంగా మాట్లాడింది. భర్త గూఢంగా సమాధానం చెప్పాడు. ఆమె గంధర్వుల మీద పెట్టి ఏమైనా మాట్లాడే అవకాశం ఉన్నది. మరి భీముడి కా అవకాశం లేదు. అందువలన గూఢోక్తి అతడికి శరణ్యమైపోయింది. సతీ పతుల మాటలు ఒకరికొకరికి దీటుగా ఉన్నట్లు చిత్రించటం తిక్కన నేర్పరితనం.

4. ఆ పతి పతియే ఒకే మాట (పతి) ద్విరుక్తమైనా, తాత్పర్య భేదం ఉంటే అది లాటానుప్రాస మనబడుతుంది. ఇక్కడ రెండవ పతికి విశిష్టుడైన పతి అని తాత్పర్యం. (సంపా.)

### ద్రౌపది యర్జునునితో సల్లాపంబు సేయుట (సం. 4-23-17)

**తే. ఇట్లు దమ్ము నిరూపింప నితర జనము। లకు నశక్యంబుగాఁగ సల్లాపరసము**
**ననుభవించుచు నల్లనల్లన లతాంగి। యరిగె నర్తన మండపోపాంతమునకు. 43**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తమ్మున్= తమను (అనగా పాండవులను); నిరూపింపన్= గుర్తించటానికి; ఇతర జనములకున్= పెరవారికి; అశక్యంబు కాఁగన్= సాధ్యం కానట్లు; సల్లాపరసమున్= మాటల మాధుర్యాన్ని; అనుభవించుచున్= పొందుతూ; అల్లనన్+అల్లనన్= నెమ్మదినెమ్మదిగా; లతా+అంగి= తీగవలె సన్నని శరీరంగల సుందరాంగి (సైరంధ్రి); నర్తన మండప+ఉపాంతమునకున్= నాట్యశాలవద్దకు; అరిగెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** ఈ విధంగా తమ రహస్యం బయల్పడకుండా ఇతరులు గుర్తించటానికి సాధ్యం కాకుండా మాటాడే మాటల మాధుర్యాన్ని ఆనందంతో అనుభవిస్తూ (సైరంధ్రి) నర్తనశాల వద్దకు వెళ్ళింది.

**వ. చని విరాట కన్యకల యాటఁ జూచు చందంబున నందుఁ బురందరనందనుం గనుంగొను నప్పాంచాలి నాలోకించి, యతండునుం దారును దదభిముఖంబుగా వచ్చి యక్కన్నియ లిట్లనిరి. 44**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; విరాట కన్యకల ఆటన్+చూచు చందంబునన్= విరటుని కూతురుల నాట్యం చూచే విధంగా (చూచే మిషతో); అందున్= ఆ చోట; పురందరనందనున్+కనుంగొను+ఆ+పాంచాలిని= అర్జునుడిని చూస్తూ ఉన్న ఆ ద్రౌపదిని; ఆలోకించి= చూచి; అతండును= అర్జునుడూ; తారును= తామును (విరటుడి కన్యలును); తద్+అభిముఖంబుగన్ వచ్చి= ఆమె కెదురుగా వచ్చి; ఆ+కన్నియలు= ఆ కన్యలు; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** ఆ విధంగా వెళ్ళి నర్తనశాలలో విరాటుడి కన్యల ఆట చూచే నెపంతో అర్జునుడిని చూస్తున్న పాంచాలిని చూచి, ఆ కన్యలు అర్జునుడితో కలిసి ఆమె కెదురుగా వచ్చి ఇట్లా అన్నారు.

**ఉ. 'కీచకకోటిచేత నొక కీడును బొందక వచ్చితమ్మ? ని**
**న్వేచిన దుర్మదుండు జమునిం గొలువం జనెనమ్మ? యంతఁ బో**
**కేచిన సూతు లీయొడలి కింత యపాయ మొనర్తురమ్మ? వే**
**కాచి విరోధులం దునుమఁగా నిటు ముట్టుదురమ్మ నీ పతుల్?' 45**

**ప్రతిపదార్థం:** కీచక కోటిచేతన్= కీచకుల సమూహం వలన; ఒక కీడును పొందక= ఒక ప్రమాదం కూడా లేకుండా; వచ్చితి(వి)+అమ్మ?= వచ్చినావా తల్లీ!; నిన్+వేచిన= నిన్ను బాధపెట్టిన; దుర్మదుండు= దురహంకారి అయిన కీచకుడు; జమునిన్+కొలువన్+చనెనమ్మ?= యముడిని సేవించటానికి (యమలోకానికి) వెళ్లాడా? (చనిపోయాడా అని భావం); అంతన్+పోక= అంతటితో ఆగకుండా, ఆ తరువాత; ఏచిన సూతులు= విజృంభించిన ఉపకీచకులు; ఈ+ఒడలికిన్= (ఇంత సుకుమారమైన) నీ శరీరానికి; ఇంత+అపాయము= ఇంతటి (సహించరాని) కీడును; ఒనర్తురు+అమ్మ?= చేస్తారా?; నీ పతుల్= నీ భర్తలు; వేకాచి= వెంటనే కాపాడి; తునుమఁగాన్= చంపటం కొరకు; ఇటు ముట్టుదురమ్మ?= ఈ విధంగా (ఇంత అద్భుతంగా) వారిని ముట్టడిస్తారా?

**తాత్పర్యం:** 'కీచకుల సమూహం వలన ఏ కీడూ పొందకుండా తిరిగి వచ్చావా తల్లీ! నిన్నావిధంగా బాధించిన ఆ దురహంకారి అయిన కీచకుడు యమలోకానికి చేరాడా? అంతటితో ఆగక ఉపకీచకులందరూ కలిసి సుకుమారమైన ఇటువంటి నీ శరీరానికి అంతటి దారుణమైన అపాయాన్ని కలిగించటానికి చూస్తారా? నీ భర్తలు వెంటనే శత్రువులను క్రమ్ముకొని చంపి ఇంత త్వరగా నిన్ను రక్షించుకొంటారా?'

**విశేషం:** 1. ఇది ఆశ్చర్యమనే భావాన్ని అచ్చంగా ఆవిష్కరించిన పద్యం. అంతఃపురకన్యలకు అప్పటికే అన్ని విషయాలు తెలిసిపోయాయి. రాత్రి నర్తనశాలలో అంత గొడవ జరిగినా సూర్యోదయానికల్లా మరల నాట్యాభ్యాస కార్యక్రమాలు మొదలయ్యాయి. కవి చెప్పినట్లు సూర్యోదయానికే ప్రకృతి అంతా ప్రసన్నమయిపోయింది. కీచకుల బారినపడిన వనిత క్షేమంగా తిరిగి వస్తుందనే నమ్మకం ఎవవరికీ లేదు. అట్లాగే ఆ కన్యలూ అనుకొన్నారు. కాని, సైరంధ్రి బయటపడి వచ్చింది. అదీ ఆశ్యర్యం, వారు వార్తలు విన్న క్రమం తోచేటట్లు తిక్కన ప్రశ్నల క్రమం అమర్చటం పద్యరచనా శిల్పం. దీనిని తరువాతి వచనంలో తిక్కన సూచించాడు. మొదట విన్న వార్త కీచకులందరూ సైరంధ్రి కారణంగా సామూహిక మరణం చెందారు అని. దానిమీద మొదటి ప్రశ్న వేశారు. ఆ తరువాత సింహబలుడి చావునూ, ఆ తరువాత ఉపకీచకుల చావునూ వివరంగా విన్నారు. రెండు ప్రశ్నలూ ఆ వరుసలోనే వేశారు. చివరకు గంధర్వపతులు ప్రదర్శించిన అద్భుత పరాక్రమాన్ని గురించీ, భార్యను రక్షించుకొన్న విధానాన్ని గురించీ విన్నారు. ఆ విషయమే అడిగారు. విశేష మేమంటే, ఈ ప్రశ్నలు విషయం తెలిసి, జరిగినదానికి ఆశ్చర్యపడుతూ అడిగిన ప్రశ్నలేకాని, వాటిని వివరించుమని అడిగినవి కావు. ఆ వీథిలో భయపడి దూరంగా పరుగెత్తిన నగర ప్రజలనూ చూచాం. నాట్యశాలలో దగ్గరికి వచ్చి, అప్యాయంగా గుమిగూడి గౌరవంగా ప్రశ్నలు వేస్తున్న రాచకన్నెలనూ చూస్తున్నాం. సమతౌల్యాన్ని దర్శిస్తున్నాం. పద్యరచనలోని సమత అనే గుణం సందర్భశుద్ధిని పోషిస్తున్నది.

2. 'వచ్చితమ్మ, జనెనమ్మ, ఒనర్తు రమ్మ, ముట్టుదురమ్మ'- వీటిలోని 'అమ్మ' మాతృవాచకం కాదు. సూ. తద్ధర్మ భూతక్రియ లార్యార్థ పరకంబులయి ప్రశ్నార్థకంబు లగు, (ప్రౌఢ, క్రియ). వచ్చితమ్మ - వచ్చితి(వి)+అమ్మ= వచ్చితి(వి) భూతక్రియ. దీనికి 'అమ్మ' పరముకాఁగా ప్రశ్నార్థకమైనది. వచ్చితమ్మ - వచ్చావా? అని అర్థం. (సంపా.)

**వ. అని తారు మున్ను విన్న కీచక వృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు పలుకుచుండ నా బృహన్నల సైరంధ్రి కిట్లనియె. 46**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; తారు= తాము; మున్ను విన్న= ఇది వరకు విన్నట్టి; కీచక వృత్తాంతంబునకున్= కీచకుల కథకు; అనుగుణంబు+కాన్= తగినట్లుగా; ఉపచారంబులు= ఓదార్పు మాటలు; పలుకుచున్+ఉండన్= మాటాడుతుండగా; ఆ బృహన్నల; సైరంధ్రికిన్+ఇట్లు+అనియెన్= సైరంధ్రితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ కన్యలు తాము విన్న కీచకుల వృత్తాంతానికి తగినట్లు సైరంధ్రికి ఓదార్పు మాటలు చెప్పుతూండగా బృహన్నల సైరంధ్రితో ఇట్లా అన్నాడు.

**క. 'ఆ పాపాత్ముల నీచ । వ్యాపార క్రమము, వార లందఱు మృత్యు**
**ప్రాపితులైన తెఱంగును । నీ పలుకుల నెఱుఁగవలయు నెలఁతుక చెపుమా!' 47**

**ప్రతిపదార్థం:** నెలఁతుక!= ఓ వనితా!; ఆ పాప+ఆత్ములు= ఆ దుర్మార్గుల; వ్యాపార క్రమము= చేష్టల వరుస; వారలు+అందఱున్= వారందరూ; మృత్యుప్రాపితులు+ఐన తెఱంగును= మృత్యువును పొందించబడిన పద్ధతియు; నీ పలుకులన్= నీ మాటల వలన; ఎఱుఁగవలయున్= తెలిసికొనవలెను; చెపుమా!= చెప్పవలయును సుమా!

**తాత్పర్యం:** ఆ దుర్మార్గుల చేష్టలను, వరుసగా వారందరూ చంపబడిన తీరునూ నీ నోట విని తెలిసి కొనగోరుతున్నాను. నీ వా వివరాలు చెప్పుతావా?

**విశేషం:** కీచకోపకీచకుల సంహారం కొన్ని క్షణాల క్రితమే జరిగింది. లోకానికి వార్తలు తెలిసాయి కాని, వివరాలు తెలియవు. అందుకు ఆర్జునుడు ఆమెనే స్వయంగా అడిగాడు. ఇదివరలో భీముడు కూడా అట్లాగే అడిగాడు. ఈ ప్రశ్న వినగానే శ్రోతలకు మరొక అంశం స్ఫురిస్తుంది. ద్రౌపది తన కథను మిగిలిన భర్తలకు కూడా చెప్పుకొందామని బయలుదేరిన ట్లనిపిస్తుంది. అటువంటి ప్రయత్నాన్ని మానుమని భీముడు సూచించాడు. మరి శ్మశానం నుండి అంతఃపురానికి చేరవలసిన ద్రౌపది నర్తనశాలకు ఎందుకు వచ్చినట్లు? నిన్నటి రాత్రి సంకేతస్థలాన్ని ఆ ఉదయం సంతోషస్థలంగా పునర్దర్శించి పోవటానికా? తిక్కన ఆ సంగతిని కప్పిపుచ్చి కళాశిల్పాన్ని ప్రదర్శించాడు. (సంపా.)

**వ. అనిన విని సైరంధ్రి సాభిప్రాయంబుగా బృహన్నల కిట్లనియె. 48**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విన్నదై; సైరంధ్రి; స+అభిప్రాయంబుగాన్= అభిప్రాయ గర్భితంగా; బృహన్నలకున్= బృహన్నలతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పింది.

**తాత్పర్యం:** అనగా విని సైరంధ్రి సాభిప్రాయంగా బృహన్నలతో ఇట్లా అన్నది.

**విశేషం:** సాభిప్రాయంగా మాట్లాడటమంటే మాటలలో మనసులోని మర్మాన్ని పొదివి గోప్యంగా చెప్పటం. (సంపా.)

**తే. 'కన్నియల కాట గఱపుచు నున్న నీకు । నకట! సైరంధ్రి యిప్పు డేమయ్యెనేని**
**ఖేద మెద నించుకయు లేమిఁగాదె సస్మి । తాననంబుతో నన్నిటు లడుగుటెల్ల.' 49**

**ప్రతిపదార్థం:** కన్నియలకున్= కన్యలకు; ఆట+కఱపుచున్= నాట్యాలు నేర్పుతూ; ఉన్న నీకున్= ఉన్నటువంటి నీకు; అకట!= అయ్యో!; సైరంధ్రి, ఇప్పుడు+ఏమి+అయ్యెన్+ఏనిన్= సైరంధ్రి ఇపు డేమైపోయినా; ఖేదము= దుఃఖం; ఎదన్= మనసులో; ఇంచుకయున్= ఒకింత అయినా; లేమిన్+కాదె= లేనందువలన కదా; సస్మిత+ఆననంబుతోన్= చిరునవ్వుతో కూడిన

మొగంతో; నన్నున్= నన్ను; ఇటులు+అడుగుట+ఎల్లన్= ఈ విధంగా అడగటమంతా (అని వ్యంగ్యంగా సైరంధ్రి అర్జునుడితో అన్నది).

**తాత్పర్యం:** 'కన్యలకు నాట్యం నేర్పుతూ కాలం గడిపే నీకు సైరంధ్రి యేమైపోయినా చీమకుట్టినంత బాధ కూడా లేకపోబట్టే కదా ఇట్లా నవ్వుమొగంతో విషయాలన్నీ నన్నడుగుతున్నావు. అయ్యో! ఏమనాలి నిన్ను?'

**విశేషం:** బృహన్నల పరంగా ఒక అర్థం అర్జునుడిపరంగా మరొక అర్థం స్ఫురిస్తూనే, అందులో ద్రౌపది మనోగతమైన ఒక అభిప్రాయం తొంగి చూస్తూ ఉండటం ఈ పద్య రచనలోని శిల్పం. రసధ్వనికి రమణీయోదాహరణం! (1) బృహన్నలపరంగా తోచే భావం- 'నీవు బృహన్నలవు. కన్నెలకు ఆటపాటలు చెప్పటం తప్ప నీకు ప్రపంచం పట్టుతుందా? సైరంధ్రి ఏమైపోతే ఏం? నీ కేమి దిగులు? నే నే మౌతానని? నీ కెవ్వరి కష్టసుఖాలూ పట్టవు. అందుకే నవ్వుతూ నన్నిట్లా అడుగుతున్నావు. అయ్యో! ని స్నేమనేది?-అని అధిక్షేపంగా పలికినట్లు స్ఫురిస్తుంది. (2) అర్జునపరంగా తోచేభావం- 'ఎంత ఆశ్చర్యం! కన్యలకు ఆటపాటలు నేర్పుతూ ఉన్నావు నిశ్చింతగా. సైరంధ్రిగా ఉన్న నాకు ఏమైతే ఏమయిందిలే? ఇప్పుడు అంతా కుదుటపడిందని మనసులో దిగులు ఆవంత కూడా లేకుండా ఉన్నావు. అందుకే నవ్వుతూ తీరికగా అన్ని విషయాలూ చెప్పుమని తేరగా అడుగుతున్నావు. ఇప్పుడు దిగులు పడేది ఏమీ లేదు కాబట్టి నీవు నవ్వుతూనే ఉండుము. కన్యలకు నాట్యాలు నేర్పుతూనే నిశ్చింతగా ఉండుము. ఇంతకంటె నే నేమి చెప్పాలి?' అని వ్యంగ్యోక్తిగా పలికినట్లు స్ఫురిస్తుంది.

3. ద్రౌపది మనసులోని మాట; 'దురదృష్టవశాత్తూ జగదేకవీరుడైన అర్జునుడు పేడివాడై కన్యాజనుల నడుమ ఉండిపోయాడు. ఆ మాట అనుకొంటేనే విచారం వేస్తుంది. సైరంధ్రిగా ఉన్న నాకు ఏ కష్టం వచ్చినా అర్జునుడికి ఏర్పడిన ఈ అనుపపత్తి జ్ఞాపకానికి వచ్చి నన్ను బాధించేది. కాని, ఇప్పుడు ఆ బాధ ఆవంత కూడా లేదు. ఆ లోపాన్ని భీమసేనుడు తీర్చాడు. అన్నదమ్ములలో ఎవరు నన్ను కాపాడినా అందరూ ఆనందిస్తారు. తామే ఆ పని చేసినట్లు మురిసిపోతారు. అందుకే అర్జునుడు నగుమోముతో నాతో మాట్లాడుతూ విశేషాలన్నీ వినాలని కోరుకొంటున్నాడు. పాపం! నా మీద ఎంత ప్రేమ!' అని నర్మోక్తిగా పలికినట్లు తోస్తుంది. (సంపా.)

**వ. అనిన బృహన్నల యిట్లనియె. 50**

**తాత్పర్యం:** ఆమె మాటలు విని బృహన్నల ఇట్లా బదులు పలికాడు.

**క. 'నీ వలుగులఁ బడుటకు దుః । ఖా వేశము నొందెనే నిరర్థక మగు ని**
**య్యేవపుఁ బుట్టువు పుట్టిన । నా వగ పెవ్వరికి నెక్కు నలినదళాక్షీ! 51**

**ప్రతిపదార్థం:** నలినదళ+అక్షీ!= తామర రేకుల వంటి కన్నులు కలదానా!; నీవు+అలుగులన్+పడుటకున్= నీవు చీకాకులో చిక్కుకొన్నందుకు; దుఃఖ+ఆవేశమున్= దుఃఖముతో కూడిన ఉద్వేగాన్ని; ఒందెన్+ఏన్= పొందినప్పటికీ; నిరర్థకము+అగున్= పనికిరానిది ఔతుంది; ఈ ఏవము+పుట్టువు+పుట్టిన= ఈ అసహ్యకరమైన పేడి రూపాన్ని (పుట్టుకను) పొందిన; నా వగపు= నా దుఃఖం; ఎవ్వరికిన్= ఎవ్వరికి; ఎక్కున్?= పట్టుతుంది?

**తాత్పర్యం:** 'పద్మదళాక్షీ! నీవు చీకాకులలో చిక్కుకొన్నావని తెలిసి దుఃఖావేశాన్ని పొందినా ప్రయోజనం లేని ఈ పనికిమాలిన పుట్టుక పుట్టినందుకు నేను మనసులో పడే వేదన ఎవరికి పట్టుతుంది?

**విశేషం:** ద్రౌపది సాభిప్రాయంగా మాట్లాడితే, అర్జునుడు 'గుప్త సాభిజ్ఞానంగా' (చూడు 53వ వచనం) పలుకుతున్నాడు. పైకి కనబడే అర్థం కంటే వక్త చెప్పదలచుకొన్న రహస్య సందేశం సంకేతంగా సాగే సంభాషణ గుప్తసాభిజ్ఞాన సంభాషణ. ఈ పద్యంలో దానిని వివేచించటం కవితాశిల్ప సమీక్ష. (1) పైకి తోచే భావం- బృహన్నలపరంగా- 'సైరంధ్రీ! నే నెప్పుడూ కన్యలకు ఆటపాటలు నేర్పటంతోనే ప్రొద్దులు పుచ్చుతానన్నావు నిజమే. నేను పుట్టిన పేడి పుట్టుక అటువంటిది. ఎవరూ నన్ను పిలువరు, గౌరవించరు. నేను స్త్రీగా పరిగణింపబడతాను కాబట్టి యుద్ధాదులకు పనికిరాను. అందువలన తగుదునమ్మా అని నీకు కలిగిన కష్టాలను గట్టెక్కించటానికి వచ్చే వీలు లేదు. అది నా దురదృష్టం. నీ కెంత సహాయపడాలని లోన ఉన్నా, నా అసమర్థత నన్ను నాట్యశాలలోనే కట్టి పడ వేస్తున్నది. నా మనసులోని ఈ బాధ ఎవరికి పట్టింది? నీవుకూడా ఆ విషయం పట్టించుకొనక అధిక్షేపిస్తున్నావు. నే నేమి చేసేది?' అని తన పేడితనాన్ని నిందించుకొంటూ సైరంధ్రిపట్ల సానుభూతి ప్రకటించినట్లు మాట్లాడాడు.

(2) అర్జునపరంగా - 'ద్రౌపదీ నీవు కష్టాలు పడుతుంటే నాకు దుఃఖావేశం కలుగుతుంది. కాని, శత్రువుల మీద ప్రతీకారం తీసికొనటానికి నా ఆకారం అడ్డం వస్తుంది. నా ప్రయత్నం ఈ అజ్ఞాతవాసంలో నిరర్థకం. ఈ పేడి రూపంతో మెలసినందుకు లోలోన కుములుతూ, ఆ బాధ మరచిపోవటానికి నర్తనశాలలోనే కాలం గడుపుతూ ఉంటాను. నేను సదా మనసులో పడే ఈ మూగబాధ ఎవరికి పట్టింది? నీకూ పట్టినట్లు లేదు. నా నవ్వు వెనుక ఎంత దిగులుందో, అయినా దానిని బైటపెట్టకుండా ఎట్లా నవ్వుతూ తిరుగుతున్నానో నీవూ గ్రహించినట్లు లేదు' అని ద్రౌపది చేసిన అధిక్షేపానికి బదులుగా లలితమైన అధిక్షేపంతో సమాధానం చెప్పాడు.

(3) అర్జునుడి మనసులోని బాధ- ఊర్వశి శాపం వలన కలిగిన నపుంసకత్వం సంవత్సరం ముగిస్తే కాని వీడదు. ధర్మజాదుల వేషాలు మారాయికాని శరీర స్వభావాలు, బలపరాక్రమాదులు మారలేదు. అర్జునుడి స్థితివేరు. అందువలన పేడి రూపంలో అతడు పౌరుష కార్యాలను నిర్వహించలేడు. ఈ లోపం వలన ద్రౌపదికి తగిన రక్షను కలిగించలేకపోయినందుకు అర్జునుడు మనసులో కుమిలిపోతూ ఉంటాడు. దానిని గుప్తంగా తన మాటలలో పొదివి చెప్పాడు. ద్రౌపది మాటలలోని మొదటి భాగానికి సమాధానం చెప్పి, రెండవ భాగానికి రాబోయే పద్యంలో అర్జునుడు చెప్పబోతున్నాడు. (సంపా.)

**క. నీతోడి పరిచయము లే । దే? తలపోయఁగ ననింద్య వెందును; నీ వి**
**ట్లాతుర వగుటకు నా మది । నే తాపము లేదు? నైజ మెఱుఁగవు కంటే!' 52**

**ప్రతిపదార్థం:** నీతోడి పరిచయము లేదే?= నీతో పరిచయము నాకు లేదా? తలపోయఁగన్= యోచించగా; ఎందున్= ఎక్కడ చూచినా; నీవు అనింద్యవు= నీవు దోషం లేనిదానవు; ఇట్లు= ఈ తీరున; ఆతురవు+అగుటకున్= బాధపడటానికి; నా మదిన్= నా మనసులో; ఏ తాపము లేదు?= ఎటువంటి బాధ లేకున్నది? (అనగా బాధ ఉన్నది); నైజము+ఎఱుఁగవు= నిజం తెలియలేవు; కంటే= గుర్తించావా? (అనగా గుర్తింపలేకున్నావని భావం).

**తాత్పర్యం:** నీతో (నాకు) పరిచయం లేదా? యోచించగా నీవెట్టి దోషం లేనిదానవు; ఇట్లా నీవు బాధపడుతున్నందుకు నా మనసులో బాధ లేదనుకొన్నావా? నీవు నిజాన్ని గుర్తించటం లేదు.'

**విశేషం:** ఈ పద్యంలో కాకువు వలన గుప్తసాభిజ్ఞానార్థాన్ని తిక్కన సాధించటం విశేషం.

(1) బృహన్నలపరంగా: 'ఓ సైరంధ్రీ! నీతో నాకు పరిచయం లేదు. అందువలననే నీ గురించి అంతగా ఆలోచించను (పట్టించుకోను). అయినా నీవు ఏతప్పూ చేయనిదానివి. అందువలన నీవు పరిస్థితుల ప్రభావం వలన ఎన్ని తిప్పలు పడుతున్నా నాకు పరితాపం కలగదు. ఈ సత్యం నీవు తెలియకుండా మాట్లాడుతున్నావు సుమా!' ఇది లౌకికోక్తి.

(2) అర్జునపరంగా- 'ఓ ద్రౌపదీ! నాకు నీతో పరిచయం ఇప్పటిదా? ఎన్ని విధాల ఆలోచించినా నీవు నిందించదగినదానివి కావు. అందువలన నీవు ఈ విధంగా బాధలు పడుతుంటే నా మనస్సు ఎన్ని రకాల బాధల ననుభవించటం లేదు? అయినా ఈ వాస్తవాన్ని నీవు గుర్తించవు గదా!' ఇది లలితమైన అధిక్షేపోక్తి.

(3) మనసులోని మాట: 'నీతో నా కున్న దీర్ఘకాల పరిచయం వలన నీ కెన్ని ఇబ్బందులు ఎదురైనా చివరకు అనింద్యవుగా నీవు బయటపడతావని తెలుసు. నీవు ఎన్ని రకాల బాధలు పడితే నేనూ అన్ని రకాలుగా మనసులో వేదన పడతాను. నీమీద ఉన్న నా ప్రేమ అటువంటిది. ఇది సహజం. తెచ్చిపెట్టుకొన్నది కాదు.' ఇది గూఢాభిజ్ఞానోక్తి, ద్రౌపది మాటలకు దీటైన సమాధానం చెప్పాడు. అర్జునుడు. (సంపా.)

**వ. అని తాను నిజసహోదరుల యట్లపోలె వేషాంతరంబు దాల్చిన యంతియకాక యూర్వశి యిచ్చిన శాపం బనుభవించుటకు శరీరాంతర పరిగ్రహంబు చేయుటం జేసి రిపుమర్దనంబు తనకు వెరవు గాకునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన బలసూదనసూను పలుకులు విని పాంచాలి యంతస్స్మిత కమనీయ కపోల యగుచు నిట్లనియె. 53**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; తాను; నిజ సహోదరుల+అట్లపోలెన్= తన సోదరుల వలె; వేష+అంతరంబున్= మారువేషాలను; తాల్చిన+అంతియకాక= తాల్చినంతమాత్రమే కాకుండా; ఊర్వశి+ఇచ్చిన శాపంబు+అనుభవించుటకున్= ఊర్వశి ఇచ్చిన శాపాన్ని అనుభవించటానికై; శరీర+అంతర పరిగ్రహంబు చేయుటన్+చేసి= రూపాంతరాన్ని స్వీకరించటం వలన (అనగా పేడిరూపాన్ని పొందటం చేత); రిపుమర్దనంబు= శత్రుసంహారం; తనకున్; వెరవు+కాక+ఉనికిన్= తగిన పద్ధతి కాకపోవటం చేత; గుప్త స+అభిజ్ఞానంబుగాన్= రహస్యంగా చెప్పబడిన సంకేతంతో కూడుకొన్నదిగా; తెలిపినన్= తెలుపగా; బలసూదనసూను పలుకులు విని= ఇంద్రసుతుడైన అర్జునుడి మాటలు విని; పాంచాలి= ద్రౌపది(సైరంధ్రి); అంతస్+స్మిత= పైకి కనపడని ముసిముసినవ్వుతో; కమనీయ కపోల+అగుచున్= చూడముచ్చటయిన చెక్కిళ్ళు కలది ఔతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** అర్జునుడు తన తోబుట్టువుల మాదిరిగా మారువేషం మాత్రమే కాకుండా ఊర్వశీ శాపం వలన మారు శరీరాన్ని పొందినందున (పురుషుడు పేడివాడిగా మారటం వలన) శత్రువులను చంపటం పరిపాటి కాదని గోప్యంగా తన మనోగతాన్ని సాంకేతికంగా తెలుపగా అతడి మాటలకు లోనవ్వులతో వెలుగొందే చెక్కిళ్ళతో ద్రౌపది ఇట్లా పలికింది.

**ఆ. 'అట్లకాక యింత యననేల? నీ మది । తెఱఁగుఁ గొంత యేను నెఱుఁగకున్న**
**దానఁగాను; నగరఁ దగవుమై నీవు వ । ర్తించుటయ కరంబు ప్రియము నాకు.' 54**

**ప్రతిపదార్థం:** అట్లకాక= అది సరే!; ఇంత+అనన్+ఏల?= ఇంతగా చెప్పటం ఎందుకు?; నీ మది తెఱఁగున్= నీ మనస్తత్వం; కొంత= కొద్దిగా; ఏనున్= నేనునూ; ఎఱుఁగక+ఉన్నదానన్+కాను= తెలియని దానను గాను; నగరన్= నగరిలో; తగవుమైన్= ఉచితరీతిలో (బృహన్నలా స్థితికి తగిన విధంగా); నీవు వర్తించుట+అ= నీవు మసలటమే; నాకు; కరంబు ప్రియము= మిక్కిలి ఇష్టం.

**తాత్పర్యం:** 'అది సరే, నీ గురించి ఇంతగా చెప్పటం ఎందుకు? నీ మనసు నాకు తెలియదా? నగరిలో (అంతఃపురంలో) సముచితంగా నీవు నడచుకొనటమే. నాకు చాలా ఇష్టం.'

**విశేషం:** ద్రౌపది అర్జునుడితో ఔపచారికంగా మాట్లాడింది. ఇందులో పైకి సైరంధ్రి మాటలతీరులో, లోన ద్రౌపది పలికిన తీరు స్ఫురించటం గమనార్హం. సైరంధ్రిపరంగా- 'ఓ బృహన్నలా! నీ వన్నమాట నిజమే. అందువలన నీ వింతగా చెప్పవలసిన పని లేదు. నీ మనసు నాకు కొంత తెలియకుండా లేదు. అయినా నీ వెప్పుడూ రాచనగరిలో నీ ఉద్యోగధర్మంలో మసలుతూ ఉండటమే నాకు సంతోషం కలిగిస్తుంది.'

2. ద్రౌపది పరంగా'. 'నాథా! నీవన్నది కాదనలేనిది. దానిని ఇంతగా విస్తరించి చెప్పాలా? నీమనసుతీరు నేను కొంతైనా తెలియనిదాననుకాను కదా! నీవు కోపోద్రేకంతో నా కొరకు బయటపడకుండా అంతఃపురాలలోనే వర్తిస్తూ ఉండటం నాకు అనుకూలం. కోరినప్పుడెల్లా చూచుకొనవచ్చును. ఇట్లా ఉండటమే నాకు చాలాఇష్టం.'

3. అర్జునుడు చెప్పుమన్న విషయాల ప్రసక్తే రాలేదు. ఆమె దాటవేసింది. దానికి కారణాలు రెండుగా భావించవచ్చును. ఆమె అర్జునుడికొరకు వచ్చినట్లులేదు. రాజకన్యలకొరకు వచ్చింది. వారందరి ఆదరాభిమానాలను పొందింది. తాను ఒంటరిగా అంతఃపురంలోనికి పోకుండా వారిని వెంటపెట్టుకొని పోదలచింది. ఎందువలన? సుదేష్ణ సైరంధ్రిని నలుగురిలో ఏమీ నిందించలేదు. నిందిస్తే సమర్థించేవారి అండఉంటుంది. ఇదీ ఆమె వ్యూహం. అయితే నర్తనశాలలో అర్జునుడిని చూడటం కూడా ఆమెకు అనుషంగిక ఫలమే. అతడికి వివరాలు చెప్పితే ఆమె ఉద్విగ్నురాలౌతుంది. అతడు కూడా ఆవేశం పొందవచ్చును. ఆవేశంలో వారి సంబంధాలు బయటపడవచ్చును. అందువలన జరిగిన కథ చెప్పటంలేదు. అందువలన ఆమె మాటల తీరే మార్చి సందర్భాన్ని ఉక్తిచమత్కారాలతో రక్తికట్టించింది. మరొక అంశం. భీముడు అడిగితే జరిగిన కథే చెప్పింది ద్రౌపది. అది భీముడిలో కార్యోత్సాహం పొంగించటానికి ప్రత్యక్ష కారణమైనది. ఇప్పుడటువంటిది అర్జునుడిపట్ల అవసరంలేదు. అందుకే నగరిలో నడయాడటమే ప్రస్తుతానికి మంచిదని హితవు చెప్పి ముసిముసినవ్వుల చెక్కిళ్ళతో ముందుకు సాగిపోయింది. (సంపా.)

**వ.** **అనుచుం గన్యకాజన పరివృతయై యరిగి యంతఃపురంబు సొచ్చి సహోదర మరణ శోకాతురయగు కైకేయి కడకుం జనునప్పుడు.** **55**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; కన్యకాజనపరివృత+ఐ= కన్యల సమూహంతో కమ్ముకోబడినదై; అరిగి= వెళ్ళి; అంతఃపురంబు+చొచ్చి= రాణి అంతఃపురంలో ప్రవేశించి; సహోదర మరణ= తోబుట్టువుల చావుకు; శోక+అతుర+అగు= దుఃఖంతో బాధపడుతున్న; కైకేయి కడకున్= (కేకయ వంశానికి చెందిన) సుదేష్ణ వద్దకు; చను+అప్పుడు= పోయేటప్పుడు.

**తాత్పర్యం:** అంటూ, కన్నియలందరూ తనను చుట్టి వెంటరాగా అంతఃపురములోనికి ప్రవేశించింది. తన తోబుట్టువుల చావుకు బాగా శోకిస్తున్న సుదేష్ణవద్దకు వెళ్ళేటప్పుడు.

**సీ.** **ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమునఁ । దోఁపంగ వచ్చినఁ ద్రోచి త్రోచి,**
**లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు। లడర నుంకించిన నాఁగి యాఁగి,**
**సంతసంబున బాలిశము లగు చెయ్వులు। దొడరఁ జూచినఁ జేయ కుడిగి యుడిగి,**
**మనమున నుబ్బుమై మాట నాలుకకు రాఁ। గడఁగిన నాడక కడపి కడపి.**

**తే.** **ధీరయై యిట్లు సమ్మదపూరమునకు। గఱువతన మను బలితంపుఁ గట్ట వెట్టి**
**వెలఁది యెఱుఁగనియదివోలె వికృతిలేక। యల్ల నెప్పటియట్టుల యరుగుటయును.** **56**

**ప్రతిపదార్థం:** ముదమునన్= సంతోషముతో; ఎలమి సొంపు+ఒదవి= ప్రీతి అధికమై; నెఱ+మొగమునన్= నిండైన ముఖమునందు; త్రోపంగన్+వచ్చినన్= కానుపించరాగా; త్రోచి త్రోచి= తప్పించి తప్పించి, ప్రక్కకు నెట్టి, మరింత నెట్టి; లలిన్= విలాసంతో; ఉల్లసిల్లుచున్= ఉప్పొంగిపోతూ; లలిత= అందమైన; లోచనదీప్తులు= కంటివెలుగులు; అడరన్= అతిశయించటానికి; ఉంకించినన్=ప్రయత్నించగా; ఆఁగి+ఆఁగి= ఆపుకొని; సంతసంబునన్= సంతోషంతో; బాలిశములు+అగు చెయ్వులు= బాల్యచేష్టలు; తొడరన్+చూచినన్= తలయెత్తబోగా; చేయక= వాటిని ప్రదర్శించక; ఉడిగి+ఉడిగి= మానుకొని, గట్టిగా నిగ్రహించుకొని; మనమునన్+ఉబ్బుమైన్= మనసులోని సంతోషాతిశయంతో; మాట= ఉల్లాసపు మాట; నాలుకకు రాన్ +కడఁగినన్= నాలుక మీదకు రాబోగా; ఆడక= పలుకక; కడపి కడపి= తప్పించి, తప్పించి; ధీర+ఐ= ధైర్యవతి అయి; ఇట్లు= ఈ ప్రకారంగా; సమ్మద పూరమునకున్= సంతోష ప్రవాహానికి; గఱువతనము+అను= గాంభీర్యమనే; బలితము+కట్ట= బలమైన అడ్డుకట్టను (నిగ్రహాన్ని); పెట్టి= నిలిపి; వెలఁది= సైరంధ్రి; ఎఱుఁగని+అది+పోలెన్= ఏమీ తెలియనిదానివలె; వికృతి లేక= ఎటువంటి మార్పు లేకుండా; ఎప్పటి+అట్టులు+అ= ఎప్పటి మాదిరిగానే; అల్లన్= మెల్లగా; అరుగుటయును= వెళ్ళుతుండగా.

**తాత్పర్యం:** సంతోషంవలన కలిగిన ప్రీతి ఒక అందాన్ని కలిగించి నిండుముఖంలో కనబడేటట్లు పైకి త్రోసికొని వస్తుంటే ద్రౌపది దాన్ని ప్రక్కకు ప్రయత్నపూర్వకంగా నెట్టింది. విలాసాలతో విలసిల్లే అందమైన కన్నుల కాంతులు ఉల్లాసంతో ముందుకు రాగా వాటిని యత్నించి ఆపుకొన్నది. వెర్రి సంతోషంతో పసిపిల్లవలె ఎగురుదామని చేష్టలు చెలరేగబోగా వాటిని బలవంతాన మానుకొన్నది. మనసులో పొంగేసంతోషంతో వేడుకమాటలు నాలుక మీద నాట్యం చేయటానికి రాబోగా వాటిని ప్రయత్నించి దాటవేసింది. ఈవిధంగా ధీరురాలై సంతోష ప్రవాహానికి గాంభీర్యమనే అడ్డుకట్టవేసి, అప్పటి సంతోషాతిశయ భావ వికారా లేవీ తోచకుండా, ఏమీ తెలియని అమాయకురాలివలె ఎప్పటి మాదిరిగా అంతఃపురంలోకి పోయింది.

**విశేషం:** అలం: రూపకం. సుదేష్ణ శోకంతో క్రుంగుతున్నది. సైరంధ్రి హర్షంతో పొంగుతున్నది. రాణి ఎదుట హర్షాన్ని ప్రదర్శించటం ఉచితం కాదు. ఇద్దరికీ విభావం ఒక్కటే- కీచకుల మరణం. సైరంధ్రి ధీరురాలు కాబట్టి నిగ్రహశక్తి ప్రదర్శించింది. సంతోషం మనసులో పుట్టి ముఖంలో, కళ్ళలో, చేష్టలలో, మాటలలో వ్యక్తం ఔతుంది. ఆ నాలుగింటికీ నాలుగు స్థాయిలలో ఉన్న హర్షాతిశయం కారణమవుతుంది. ఆ నాలుగు దశలను నాలుగు విశిష్ట యత్నాలలో నిగ్రహించుకొనవలసివస్తుంది. ఆ ప్రయత్నకృత నిగ్రహ ప్రవృత్తిని తిక్కన ద్విరుక్తితో ధ్వనింపచేశాడు. సంతోష ప్రవాహానికి అడ్డుకట్ట వేయటంలో రూపకాన్ని రూపొందించాడు. ఆమె భావనిగ్రహశక్తితో వికారరహితమైన ధీరస్థితిని ప్రదర్శించింది. సుదేష్ణ అధీరురాలుగానూ, సైరంధ్రి ధీరురాలుగానూ నిలవటం కథాగతిలో వంచనపై సాధించిన విజయస్ఫూర్తిని ప్రదర్శిస్తున్నది. (సంపా.)

**క. భయశోకంబులు తనదు హృ। దయమునఁ బిరిగొన విరాట ధరణీనాథ**
**ప్రియ సంభావనసేసి వి। నయపూర్వము గాఁగ ద్రుపదనందనకుఁ దగన్. 57**

**ప్రతిపదార్థం:** విరాట ధరణీనాథప్రియ= విరాటరాజు యొక్క అనుంగు భార్య; భయశోకంబులు= భయం, దుఃఖం; తనదు హృదయమునన్= తన మనస్సులో; పిరిగొనన్= పెనవేసికోగా; ద్రుపదనందనకున్= ద్రౌపదికి; తగన్= తగునట్లుగా; వినయపూర్వముగాఁగన్= అణకువతో; సంభావన+చేసెన్= గౌరవం చేసింది.

**తాత్పర్యం:** సైరంధ్రిని చూడగానే సుదేష్ణ భయ శోకభావాలు తన హృదయంలో పెనగొనగా ఆమెను వినయపూర్వకంగా పలుకరించింది.

**విశేషం:** సైరంధ్రి గంధర్వపతుల సతి. వారిచేత కీచకుల నందరినీ ఒక్కరాత్రిలో చంపించింది. అందువలన భయం కలిగింది. ఆమెను చూడగానే సోదరులైన కీచకుల మృతి జ్ఞాపకంవచ్చి శోకంకలిగింది. సైరంధ్రి అంటే భయం పెరిగింది. ఆమెకు కోపంరాకుండా పనిసాగించాలి. విరటుడి ఆనతి ఆమెకువినిపించాలి. బైటకుపంపించాలి. అందువలన వినయంగా, గౌరవంగా ఆమెను పిలిచింది. భయపెట్టేవాళ్ళకు అందరూ అడుగులకు మడుగులొత్తటం లోకసహజమే. సుదేష్ణ ఆతీరునే నడిచింది. (సంపా.)

**వ. ఇట్లు సంభావించి యత్తరుణిం దన పరిసరంబున నునిచికొని తదీయ వదనం బవలోకించి. 58**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; సంభావించి= గౌరవించి; ఆ+తరుణిన్= ఆమెను (సైరంధ్రిని); తన పరిసరంబునన్= తన ప్రక్కనే; ఉనిచికొని= నిలుపుకొని; తదీయ వదనంబు+అవలోకించి= ఆమె యొక్క ముఖంవైపు చూచి.

**తాత్పర్యం:** సుదేష్ణ ఆ విధంగా గౌరవించి సైరంధ్రిని తన ప్రక్కనే కూర్చుండజేసి ఆమె ముఖం వైపు చూచి (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** సుదేష్ణ చెప్పబోయే విషయం పరుషమైనది. దాన్ని పరుషంగా చెప్పటం అప్పుడు ఉచితం కాదు. బలవంతులైన మిత్రులనైనా, శత్రువులనైనా నయవినయాలతోనే జయించాలి. అందువలన ఆమెను అప్యాయంగా ప్రక్కనబెట్టుకొని మాట్లాడబోతున్నది. విప్రుల మనస్సు నవ్యనవనీత సమానం. మాట దారుణాఖండల శస్త్రతుల్యం. క్షత్రియులలో అది విపరీతం అని నన్నయ్య చెప్పినట్లు సుదేష్ణ మాట మెత్తన, చేత కఠినం. (సంపా.)

**తే. 'నీవు చక్కనిదానవు నెలఁత! ధైర్య । రహితచిత్తులు మగవారు; రాజు దీనిఁ**
**దలఁచి భయమంది నిన్ను నీ వలచు నెడకు । నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపు మనియె.' 59**

**ప్రతిపదార్థం:** నెలఁత!= ఓ వనితా!; నీవు చక్కనిదానవు= నీవా-అందగత్తెవు; మగవారు ధైర్యరహితచిత్తులు= పురుషులా-ధైర్యం (నిగ్రహం) లేని మనసు కలవారు (నిన్ను చూచి మనసు చలించేవారు); రాజు= రాజుగారు (విరటుడు) దీనిన్ +తలఁచి= దీనిని ఆలోచించి; భయము+అంది= భయపడి; నిన్నున్= నిన్ను; నీవలచు+ఎడకున్= నీకిష్టం వచ్చినచోటికి; అరుగునట్లుగన్= వెళ్ళే విధంగా; ప్రార్థించి= వేడుకొని-బ్రతిమిలాడి; అనుపుము+అనియెన్= పంపివేయుమన్నాడు.

**తాత్పర్యం:** 'సైరంధ్రీ! నీవా- అందగత్తెవు. మగవారా- చిత్తస్థైర్యం లేనివారు. రాజైన విరటుడు ఈ అంశాన్ని బాగా ఆలోచించి భయపడి, నిన్ను నీకు నచ్చిన చోటికి వెళ్ళుమని ప్రార్థనాపూర్వకంగా చెప్పి పంపుమన్నాడు.'

**విశేషం:** సుదేష్ణ చెప్పిన తీరు సునిశితంగా ఉన్నది. సూటిగా ఘాటుగా ఉన్నా సున్నితంగా కూడా ఉన్నది. 'భార్యా రూపవతీ శత్రుః' అని ఒక సూక్తి ఉన్నది. ఇక్కడ 'దాసీ రూపవతీ శత్రుః' అన్నట్లయింది. సైరంధ్రి అందగత్తె అట! అది ఒకప్పుడు గుణం. ఇప్పుడు మహాదోషమయింది. ఎందువలన? మగవారు చిత్తచాంచల్యం కలవారు కాబట్టి. మగవారిని శాసించలేని రాణి సైరంధ్రినే శాసించగలదు. కాగా, ఆమె అందాన్ని ఆశించి కీచకులందరూ చనిపోయారు. ఆ సంగతి సుదేష్ణ చెప్పదు. అది గతార్థం. వ్యంగ్యం. ఇకముందు మరెందరో మగవారు ఆ త్రోవన పోయే అవకాశం ఉన్నదని రాజుగారు బాగా ఆలోచించి సైరంధ్రిని పంపివేయటమే ఉపాయమని నిశ్చయించారు. ఇది రాజాజ్ఞ. అంతఃపురం దానికి దాసోహం అనవలసిందే. ద్రౌపదిని ఒక సంవత్సరంపాటు సైరంధ్రీ వృత్తిలో ఉంచుకొంటామని మాట ఇచ్చిన మాట నిజమే. కాని, జనహితాన్ని కోరి మధ్యలోనే పంపవలసి వస్తున్నది. వ్యక్తి ధర్మం కంటె సంఘ ధర్మం గొప్పది. కాబట్టి నీవు నీ అంతట నీవే వెళ్ళిపోయేటట్లు ప్రార్థించుమన్నాడు.

ఇది వెళ్ళగొట్టటం కాదు. నీ అంతట నీవే వెళ్ళిపోవటంగా గ్రహించుమని నిపుణంగా, మృదువుగా సుదేష్ణ చెప్పింది. సమయానికి తగినట్లు మాట నేర్పరితనం ప్రదర్శించటం ఆమెకు సహజ గుణమే. (సంపా.)

**వ. అని తన మనంబునం గదిరిన యనుజ వియోగతాపం బుత్కటం బగుటయు వెండియు నిట్లనియె. 60**

**ప్రతిపదార్థం:** అని; తన మనంబునన్= తన మనసులో; కదిరిన= కలిగిన; అనుజవియోగతాపంబు= తోబుట్టువుల మరణ వియోగం వలన కలిగిన బాధ; ఉత్కటంబు+అగుటయున్= ఎక్కువ కాగా; వెండియున్= ఇంకను; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** అని తన హృదయంలో సోదరవియోగబాధ అధికంకాగా సుదేష్ణ మరల ఇట్లా అన్నది.

**క. 'బిరుదు గల మగలు గలరని । తరమిడి చంపింపఁ జూచెదవు; జనములు నీ**
**పొరువునఁ బో వెఱతురు, మా । పురమును రాష్ట్రంబు వెడలి పొమ్మెందైనన్.' 61**

**ప్రతిపదార్థం:** బిరుదు+కల= పేరున్న; మగలు= భర్తలు; కలరు+అని= ఉన్నారని; తరమిడి= వరుస పెట్టి; చంపింపన్+చూచెదవు= చంపించటానికి ప్రయత్నిస్తున్నావు; జనములు= మనుష్యులు; నీ పొరువునన్= నీ ప్రక్కన; పోన్= నడవటానికి; వెఱతురు= భయపడతారు; మా పురమును= మా నగరాన్ని; రాష్ట్రంబును= (మా) దేశాన్ని; వెడలి= గడచి; ఎందు+ఐనన్+పొమ్ము= ఎక్కడికైనా వెళ్ళుము.

**తాత్పర్యం:** 'బిరుదున్న భర్త లున్నారని వరుసపెట్టి అందరినీ చంపించటానికి ప్రయత్నిస్తున్నావు. మనుష్యులు నీ జాడలో నడవటానికే భయపడుతున్నారు. మా నగరాన్నీ, మా దేశాన్నీ వదిలి ఎక్కడికైనా వెళ్ళిపొమ్ము.'

**విశేషం:** విరటుడు తెలుపుమన్న మాటలు చెప్పిన తరువాత తనమాటలుగా సుదేష్ణ పలుకుతున్నదిది. ఇందులో రెండు అభియోగాలున్నాయి. ఒక ఆజ్ఞ ఉన్నది. బలవంతులైన భర్తలతో వరుసబెట్టి పురుషులను చంపించటం హత్యానేరం. ప్రజలు ఆమెను సమీపించటానికే భయపడటం - ప్రజాక్షేమంలేని అశాంతి పరిస్థితిని దేశంలో కలిగించిన నేరం. కాబట్టి మొదటి నేరంవలన నగరాన్నీ, రెండో అభియోగంవలన దేశాన్నీ వదలిపోవాలని రాణి ఆజ్ఞాపించింది. ఇది పరోక్షంగా దేశబహిష్కారం వంటిది. సైరంధ్రిచేసిన నేరానికి మరణదండనమే వేయవచ్చును. కాని, దయదలచినట్లు మాట్లాడింది. కాని, లోపల అటువంటి దండనంవలన రాజుకే ముప్పుకలుగవచ్చునని భయపడింది. ఏమైనా సాహసించివెళ్ళుమని అనగలిగింది. బలవంతాన పంపించే ధైర్యంమాత్రం సుదేష్ణకులేదు. సైరంధ్రి ఆమె ఆజ్ఞను మన్నిస్తుందా? అన్నది ప్రశ్న. (సంపా.)

**వ. అనిన విని విరాటవల్లభకు సైరంధ్రి యిట్లనియె. 62**

**తాత్పర్యం:** అట్లనగా విని, విరటుడి భార్యఅయిన సుదేష్ణతో సైరంధ్రి ఈవిధంగా అన్నది.

**ఉ. 'ముందటియట్ల యింకఁ బదుమూఁడు దినంబుల మాత్రకున్ భవ**
**న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ; యం**
**తం దగఁ దోఁచి మత్పతు లుదాత్తమతిన్ భవదీయ వాంఛితం**
**బుం దలకొల్పఁ జాలుదు; రపూర్వ మనఃప్రమదంబు సేకుఱున్. 63**

**ప్రతిపదార్థం:** ముందటి+అట్లు+అ= ఇంతకు ముందువలెనే; ఇంకన్= ఇక మీద; పదుమూఁడు దినంబుల మాత్రకున్= పదమూడురోజులు మాత్రమే; భవత్+మందిరవాసము= మీ భవనంలో ఉండటానికి; ఇయ్యకొనినన్= అంగీకరిస్తే; మదీయవాంఛ= నా కోరిక; కడతేఱున్= తీరుతుంది; అంతన్= ఆ మీద; మత్పతుల్= నా భర్తలు; తగన్+తోఁచి= తగినట్లుగా కనిపించి; ఉదాత్తమతిన్= ఉదారమైన మనస్సుతో; భవదీయ వాంఛితంబున్= నీ కోరికను; తలకొల్పన్+చాలుదురు= చేయగలరు; (అందు వలన) అపూర్వమనస్+ప్రమదంబు= ఇదివరకెన్నడూ పొందని విశేష సంతోషం; చేకుఱున్= మీకు కలుగుతుంది.

**తాత్పర్యం:** 'ఇంతవరకున్న విధంగానే ఇంకొక్క పదమూడు రోజులు మాత్రం నీ మందిరంలో ఉండటానికి ఒప్పుకొంటే చాలు, నా కోరిక తీరుతుంది. ఆ మీద నా భర్తలు సముచితంగా కనిపించి, ఉదారబుద్ధితో మీ కోర్కెను తీర్చగలరు. దానివలన ఇదివర కెన్నడూ కలుగని సంతోషం మీకు కలుగుతుంది.

**విశేషం:** 1. సుదేష్ణ చేసిన అభియోగాలకూ, ఆజ్ఞకూ తగిన సమాధానం చెప్పి ఆమెచేతనే ఔననిపించుకొనేటట్లు చేసే మాట నేర్పరితనం ద్రౌపది (సైరంధ్రి) ప్రదర్శిస్తున్నది. మొదటిదీ, తీవ్రమైనదీ అయిన అభియోగం - బలవంతులైన భర్తలతో లోకులను చంపించటం. పదమూడు రోజులు ఆమెను పూర్వం వలెనే అంతఃపురంలో ఉంచుకొంటే ఆమె కోరిక పూర్తిగా సఫలమౌతుందట! అట్లా చేస్తే గంధర్వులు తమ తమ రూపాలతో వారికి కనపడతారట. వారు ఉదారంగా వరా లిస్తారట. సుదేష్ణా విరాటుల కోర్కెలు తీరుతాయట! అపూర్వమైన మనఃప్రీతి కలుగుతుందట! భయంతో వణికిపోతున్న రాజకుటుంబానికి గంధర్వుల దర్శనం, రక్షణ వరప్రదానంగా లభిస్తాయట! పదమూడు రోజులు ఓపిక పడితే వారి కన్నీ శుభాలే కలుగుతాయట! ఇది సుముఖమైన సూచన. ఈ మాటల వెనుక పైకి మెత్తని బెదరింపు కూడా ఉన్నది. 'నన్ను మీ రిప్పుడే బహిష్కరిస్తే నాకు బాధ కలుగుతుంది. నా గంధర్వ భర్తలకు ఆగ్రహం వస్తుంది. వారు మీ కంటికి కనపడకుండానే మారణహోమం సృష్టించవచ్చును. వారు ఉగ్రమతులైతే మీ కోరిక తీరకపోగా మీకు అపూర్వమైన అపాయం కూడా సిద్ధించవచ్చును'- అని ఆ వ్యతిరేకవ్యంగ్యంలోని గూఢార్థం. సైరంధ్రి కోర్కెను మన్నిస్తే గంధర్వులు రాజ్ఞీ రాజుల కోర్కెలను తీర్చి వరాలిస్తారు, లేదా వరుసపెట్టి చంపుతారు. మీరు హితం కోరుకొంటారో, హతం కావాలనుకొంటారో తేల్చుకొనండి!-అని గూఢమైన బెదరింపు చేసింది సైరంధ్రి.

2. సైరంధ్రి మాటలను అర్థవంతంగా ప్రయోగించింది. 1. మందిరవాసం పదమూడు రోజులూ ఎక్కడికి పోకుండా నీ అంతఃపురంలోనే నీ పర్యవేక్షణలోనే ఉండటానికి అంగీకరిస్తే అని భావం. 2. కడతేఱున్= చివరిదాకా ముగుస్తుంది, ఫలిస్తుంది అని అజ్ఞాతవాస నియమ ప్రసక్తిని స్ఫురింపజేసింది. 3. తగన్+తోఁచి= అనే మాటలు ఎంతో సముచితాలు. గంధర్వులుగా చెప్పబడుతున్న తన భర్తలు అజ్ఞాతవాస నియమానంతరం తమకు సహజమైన పాండవుల ఆకారాలతో మీ ముందు బయలు మెరసి కనబడతారనీ, మీముందు ప్రత్యక్షమౌతారనీ ధ్వని. 4. భవదీయ వాంఛితంబు దలకొల్పజాలటం-సుదేష్ణ కోరికను నెరవేరుస్తారట. ఇది ఇప్పుడు కోరిన కోరికా? లేక అప్పుడు కోరే కోరికా? 'వాంఛితం' తగిన మాట! అప్పుడు కూడా నన్ను బహిష్కరిస్తే అట్లాగే చేస్తారు. లేదా మీరు మాటమార్చి మంచి కోరికలు కోరుకుంటే వరాలుగా ఇస్తారు అని భావం. 5. అపూర్వ మనః ప్రమదం- గంధర్వ దర్శన స్పర్శన సంభాషణ అనుగ్రహాలు పొందటం వలన కలిగే అద్భుతమైన ఆనందం మీకు కలుగుతుందని ప్రస్తుతార్థం. ఉత్తరా వివాహం వలన మీకు అపూర్వ సంతోషం కలుగుతుందని భావి కథార్థం స్ఫురిస్తున్నాయి. వస్తుధ్వనికి విలువైన ఉదాహరణం ఈ పద్యం, (సంపా.)

**క. కృత మెఱుఁగుదు, రుపకార । వ్రతమున వర్తింతు, రెపుడు వదలరు, కరుణా**
**న్వితు, లీ నరపతికి శుభ । ప్రతిపాదకు లగుదు రేమిభంగుల నైనన్. 64**

**ప్రతిపదార్థం:** కృతము+ఎఱుఁగుదురు= చేసిన మేలును గుర్తిస్తారు (కృతజ్ఞులు); ఉపకార వ్రతమునన్= (ఇతరులకు) మేలు చేసే నియమంతో; వర్తింతురు= ప్రవర్తిస్తారు; ఎపుడున్= ఏ సమయంలోనూ; వదలరు= ఉపకారగుణాన్ని వదిలిపెట్టరు

(మానరు); కరుణా;+అన్వితులు= దయగలవారు; ఏమిభంగులనైనన్= ఏవిధంగానైనా; ఈ నరపతికిన్= ఈ రాజుకు (విరటుడికి); శుభప్రతిపాదకలు+అగుదురు= మంచి చేసే వారౌతారు.

**తాత్పర్యం:** ఎవరైనా మేలు చేస్తే దానిని నా భర్తలు కృతజ్ఞతతో గుర్తిస్తారు. పరులకు ఉపకారం చేయాలనే దీక్షతోనే ప్రవర్తిస్తారు. ఆ నియమాన్ని ఎప్పుడూ వదలరు. స్వభావరీత్యా వారు దయామయులు. ఏవిధంగానైనా సరే ఈ విరాటుడికి వారు మేలు చేసేవారే ఔతారు.

**విశేషం:** ఇందులో పాండవులను గురించి చెప్పిన ప్రతి వాక్యమూ సుదేష్ణా విరాటుల హృదయాలలో ఉండే అనుమానాలను సమూలంగా తీసివేసేదే. 1. రాజదంపతులు తమకు చేసిన ఉపకారాన్ని గుర్తుంచుకొని కృతజ్ఞత ప్రకటిస్తారు. అందువలన రాజకుటుంబానికి వారు కృతజ్ఞతాబద్ధులు కాబట్టి అపకారం చేయరు. 2. పరులకు ఉపకారం చేయటం వారి జన్మవ్రతం. అది వారువద్దన్నా వదలరు. కాబట్టి మీరుకాదన్నా వారు మీకు ఉపకారం చేస్తారు. 3. వారికి ఎవరిమీదా కోపంలేదు. పగలేదు. పైపెచ్చు దయను చూపటమే వారి నైజం. కాబట్టి మీకు వచ్చే అపాయ మేమీ లేదు. 4. ఈ పదమూడు రోజులూ మీరు నన్నూ వారినీ మన్నిస్తే మీకు ఎన్నిరకాలుగా మేలుచేయడానికి వీలుందో అన్ని రకాలుగా చేసి, శుభాలు కలిగిస్తారు. కృతజ్ఞత, ఉపకారగుణం, పట్టుదల, దయామయత్వం, పరహిత భావం - అనేవి పాండవ గుణాలుగా ద్రౌపది పరోక్షంగా పేర్కొన్నది. ఇవన్నీ రాబోయే కథలో దక్షిణ, ఉత్తర గోగ్రహణ ఘట్టాలలో, ఉత్తరా వివాహ ఘట్టంలో పాండవులు ప్రదర్శించబోయే ఉదాత్త గుణాలే. కాబట్టి ద్రౌపది మాటలలో భావికథార్థధ్వని ఉన్నది. సుదేష్ణను సుముఖురాలుగా చేసికొనే సూక్తి నైపుణ్యం ఉన్నది. ఆమె చేసిన అభియోగాలను త్రిప్పికొట్టే తీర్పరితనం ఉన్నది. (సంపా.)

**వ. కావున. 65**

**తాత్పర్యం:** కనుక.

**క. సైరంధ్రి యిట్టు లనుటకుఁ। గారణము దలంప నేమిగా నోపునొ? యం**
**చారసి బహుప్రకార వి। చారములకుఁ జొచ్చు టుడుగు సరసిజవదనా! 66**

**ప్రతిపదార్థం:** సరసిజవదనా!= పద్మంవంటి ముఖంకలదానా! సుదేష్ణా!; సైరంధ్రి+ఇట్టులు+అనుటకున్= సైరంధ్రి ఈ విధంగా అనటానికి; తలంపన్= ఆలోచించగా; కారణము= హేతువు; ఏమి+కాన్+ఓపునొ?= ఏమై ఉంటుందో?; అంచున్= అంటూ; ఆరసి= విచారించి; బహుప్రకార= అనేక విధాలైన; విచారములకున్= యోచనలకు; చొచ్చుట= లోనుకావటం; ఉడుగు= మానుము.

**తాత్పర్యం:** ఓ సుదేష్ణా! సైరంధ్రి ఇట్లా అనటానికి కారణ మేమై ఉంటుందా? అని అనుమానించి అనేక రకాలుగా ఆలోచించటం మానుకొమ్మ.

**విశేషం:** సుదేష్ణ మనిషికాదు. లోగుట్టు మనిషి, లోతు మనిషి, అందువలన సైరంధ్రిమాటలను నమ్మకపోవచ్చును. అనుమానం కలగటం ఆ సమయంలో సహజం కూడా. సైరంధ్రి తన కనుకూలంగా జిత్తులమారి ఎత్తులు వేస్తున్నదేమో అని అనుమానించవచ్చును. అందువలన విశ్వాసాన్ని కలిగించేటట్లు ఈ మాటలన్నది. సుదేష్ణ మనస్తత్త్వం తెలిసినదానివలె కీలెరిగి వాతపెట్టినట్లు ద్రౌపది మాట్లాడింది. (సంపా.)

**క. ఇది యేమియైన నేమగు?। మది నా కీ చింతయేల? మన్నన యెల్లం**
**దుదిఁ జెఱుపక ప్రార్థన సే। యుదుఁగా కని నిశ్చయించు టుచితమె నీకున్?' 67**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ సైరంధ్రి; ఏమి+ఐనన్+ఏమి+అగున్?= ఏమయిపోతే నాకేమి?; మదిన్= మనసులో; నాకున్= నాకు (సుదేష్ణకు); ఈచింత= సైరంధ్రిని గూర్చిన ఈ విచారం; ఏల?= ఎందుకు?; తుదిన్= ఈ చివరి దశలో; మన్నన+ఎల్లన్= ఇంత వరకూ చూపిన గౌరవమంతా; చెఱుపక= ఉన్నట్లుండి చెడగొట్టక; ప్రార్థన+చేయుదున్+కాక= (ఇక్కడ నుండి వెడలి పొమ్మని మెత్తగా) వేడుకొందునుగాక; అని= అనుకొని; నిశ్చయించుట= నిర్ణయం గైకొనడం; నీకున్+ఉచితము+ఎ?= నీకు తగునా? (తగదని భావం).

**తాత్పర్యం:** ఈ సైరంధ్రి ఏమైపోతే నాకేమి? ఈమెను గురించిన విచారం నాకెందుకు? ఇంతకాలం ఈమెను గౌరవంగా చూచాను. ఈ చివరి దశలో ఆ గౌరవానికి భంగం కల్గించకుండా ఈమెను ఇక్కడ నుండి వెళ్ళిపొమ్మని నెమ్మదిగా వేడుకొందును గాక' అని నీలో నీవే నిర్ణయించుకొన్నావే! అమ్మా! ఇది నీకు తగునా?'

**విశేషం:** అంతగా అభిమానించి ఆదరించిన సైరంధ్రిని అంత త్వరగా వదిలించుకొనాలని భావించడం న్యాయమా? అని ప్రశ్నించింది. స్నేహపురస్సరంగా తన మాటను మన్నించుమని సైరంధ్రి సుదేష్ణను కోరింది. (సంపా.)

**చ.** **అనిన సుదేష్ణ యిట్లనియె 'నంతవునంతకు మద్గృహంబునం**
**దునికికి సమ్మతించితి; నిజోచితవృత్తిఁ జరింపు; నాదు నం**
**దనుల మదీయ వల్లభు నుదాత్తమతిం బరికించికొమ్ము; నీ**
**మనమున కెట్టు లూఱట సమస్తము నట్టుల చేసెదం దగన్.'** **68**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (సైరంధ్రి) అనగా; సుదేష్ణ ఇట్లు+అనియెన్= సుదేష్ణ ఈ విధంగా అన్నది; అంత+అవు+అంతకున్= నీవు కోరిన గడువు అయ్యేంత వరకూ (పదమూడు రోజులు ముగిసేంత వరకు మాత్రమే); మత్+గృహంబునందున్= నా భవనంలో; ఉనికికిన్= ఉండటానికి; సమ్మతించితిన్= ఒప్పుకొన్నాను; నిజ+ఉచితవృత్తిన్= నీకు తగిన ప్రవర్తనతో; చరింపు= నడుచుకొమ్ము; నాదు నందనులన్= నా కుమారులను; మదీయ వల్లభున్= నా భర్తను; ఉదాత్తమతిన్= పెద్ద మనసుతో; పరికించికొమ్ము= చూచుకొమ్ము (రక్షించుమనే అర్థంలో గౌరవంగా వాడిన క్రియ); నీ మనమునకున్= నీ మనసుకు; ఎట్టులు= ఏవిధంగా; ఊఱట= తృప్తియో; సమస్తము= అన్నింటిని; అట్టులన్= ఆ విధంగానే; తగన్= తగునట్లుగా; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** సైరంధ్రి మాటలు విని సుదేష్ణ ఇట్లా పలికింది. 'నీవన్న గడువు ముగిసేంతవరకు నా మందిరంలో నీవుండటానికి సమ్మతిస్తున్నాను. నీవు నీ వృత్తికి తగిన పనులలో వ్యవహరిస్తూ ఉండిపొమ్ము. నా కొడుకులనూ, నా భర్తనూ పెద్ద మనసుతో కనిపెట్టి రక్షిస్తూ ఉండుము. నీ మనస్సు ఊరట కలగటానికి ఏవేవి అవసరమో అన్నిటినీ నీవు కోరినట్లు తగినట్లు అమరుస్తాను.'

**విశేషం:** సైరంధ్రి మాటలకు సుదేష్ణ మెత్తబడి మాట్లాడింది. గడువుకు ఒప్పుకొన్నది. సైరంధ్రీవృత్తిలో తన ఇంట్లో మామూలుగా ఉంటూ స్వేచ్ఛగా తిరుగుమన్నది. అంతేగాక తన కొడుకులనూ, భర్తనూ చల్లగా చూచుకొనే భారం కూడా ఆమెదే అని బాధ్యత ఒప్పగించింది. అంటే, గంధర్వులు వారి మీద చేయి చేసికొనకుండా చూచుకునే భారం ఆమెకే వదిలిపెట్టింది. ఆమె మనసుకు నచ్చిన తీరుగా అన్నీ అమరుస్తానన్నది. దానితో ద్రౌపది లక్ష్యం సమగ్రంగా సాధించబడింది. ఇవి అమాయకంగా, అలవోకగా, సుదేష్ణ పలికిన మాటలైనా, పలికించింది తిక్కన. అందువలన ప్రతివాక్యంలోనూ అర్థగౌరవం ధ్వనిమయంగా

ప్రకాశిస్తున్నది. 'అంటే - నీ గడువు పూర్తయ్యేంతవరకు? పదమూడు రోజులా? అజ్ఞాత వాసవత్సరమా? ఆలోచిస్తే రెండూ. పదమూడు రోజులలో అజ్ఞాతవాస నియమం పూర్తి కానున్నదని కాలసూచన వ్యంగ్యం. ఉత్తరుడినీ, విరాటుడినీ రక్షించే బాధ్యత సైరంధ్రి చేతిలో పెట్టటంలో భావి కథార్థ ధ్వని ఉన్నది. ఉత్తరుడు ఉత్తర గోగ్రహణ సందర్భంగా సారథిని కోరినప్పుడు బృహన్నలను ఒప్పించి సారథిగా పంపిన గౌరవం సైరంధ్రిదే. ఉత్తరుడిని అర్జునుడి ద్వారా రక్షించి విజయాన్ని విరటుడికి సాధించిపెట్టిన చొరవ సైరంధ్రిదే. ధర్మరాజును పాచికతో విరాటుడు కొట్టినప్పుడు అతడి రక్తం నేలమీద పడకుండా ఆదుకొని విరాటరాజ్యం కరువు కాటకాలలో పడకుండా రక్షించింది సైరంధ్రియే. భావికథను ఇంతగా గర్భీకరించుకొన్న వాక్యాలు సుదేష్ణ తెలిసి పలికినవి కావు. తిక్కన తెలివితో పలికించినవి. (సంపా.)

**క. అని యూఱడిల్లఁ బలికిన । విని తొల్లిటియట్ల యుచితవృత్తి ద్రుపద నం**
**దన యుండె; నట్టియెడ ని । ట్లని మ్రోసిరి జనులు పురమునందును భూమిన్. 69**

**ప్రతిపదార్థం:** అని+ఊఱడిల్లన్= అని ఉపశమించేటట్లు; పలికినన్= మాట్లాడగా; విని= విని; తొల్లిటిన్+అట్లు+అ= వెనుకటి మాదిరిగానే; ఉచితవృత్తిన్= తగిన పద్ధతితో; ద్రుపదనందన= ద్రౌపది; ఉండెన్= ఉన్నది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; జనులు= ప్రజలు; పురమునందును= నగరంలోనూ; భూమిన్= దేశమంతటా; ఇట్లు+అని= ఈ విధంగా; మ్రోసిరి= టమటమా వేసినట్లు మాట్లాడుకోసాగారు.

**తాత్పర్యం:** అని సైరంధ్రి మనసు కుదుటపడేటట్లు సుదేష్ణ పలికింది. ద్రౌపది ఎప్పటివలెనే తన వృత్తిలో తాను సముచితంగా మసలుతున్నది. ఆ సమయంలో జనులందరూ పట్టణమంతా, ప్రపంచమంతా వ్యాపించేటట్లు ఈ విధంగా అనుకొనసాగారు.

**చ. 'విరటు మఱంది కీచకుఁడు విక్రమ దుర్దముఁ, డన్యసైన్య భీ**
**కర మహనీయమూర్తి, బలగర్వ సముద్ధత చిత్తుఁ, డెందు నె**
**వ్వరు సరిలేరు వీని కన వాలిన దండి మగండు; సూడ న**
**చ్చెరు వగు చావు చచ్చె; నటుసేసిన వారట యెట్టి వీరులో! 70**

**ప్రతిపదార్థం:** విరటు మఱంది= విరటుడి బావమరది; కీచకుఁడు= కీచకుడనేవాడు; విక్రమ దుర్దముఁడు= శౌర్యంతో అణచటానికి వీలులేనివాడు; అన్యసైన్య= శత్రువుల సేనలకు; భీకరమహనీయమూర్తి= భయంకరమైన గొప్ప ఆకారం కలవాడు; బలగర్వ సముద్ధతచిత్తుఁడు= బలగర్వాలతో విర్రవీగే మనసుకలవాడు; ఎందున్= ఎక్కడగాని; వీనికిన్+ఎవ్వరు సరిలేరు= వీడికి దీటైనవారు ఎవ్వరూ లేరు; అనన్= అనగా; వాలిన= ప్రసిద్ధికెక్కిన; దండిమగండు= మేటివీరుడు; చూడన్= పరికించగా; అచ్చెరువు+అగు= ఆశ్చర్యకరమైన; చావు చచ్చెన్= చావు చచ్చాడు; అటు+చేసినవారు+అట!= ఆ విధంగా చేసిన (చంపిన) వారట!; ఎట్టివీరులో!= ఎంతటి వీరులో కదా!

**తాత్పర్యం:** 'విరాటుడి బావమరది కీచకు డనేవాడు ఇతరులకు జయించరాని పరాక్రమం కలవాడు. శత్రుసేనలకు భయం కలిగించే బలం కలవాడు. వీడికెక్కడా ఎవ్వరూ దీటైనవారులేరనే పేరుపొందిన మేటివీరుడు. అటువంటివాడు చూపరులకు ఆశ్చర్యం కలిగించే వింతచావు చచ్చాడు. మరి అతడిని అట్లా చంపినవారు ఎవరో? ఎటువంటి జగజెట్టులో!

తే. **సింహబలుఁడు గంధర్వులచేత నొక్క। సతికిఁగా నిట్లు ఘోరంపుఁ జావు చచ్చె;**
**నకట! రిత్తకు రిత్త మత్స్యావనీశు। లావు గోల్పోయె; సూతకులంబు పొలిసె.'** 71

**ప్రతిపదార్థం:** సింహబలుఁడు= కీచకుడు; గంధర్వులచేతన్= గంధర్వులచేత; ఒక్క సతికిన్+కాన్= ఒక స్త్రీ కొరకై; ఇట్లు= ఈ విధంగా; ఘోరము+చావు చచ్చెన్= భయంకరమైన చావు చచ్చాడు; అకట!= అయ్యో!; రిత్తకురిత్త= వ్యర్థంగా; మత్స్య+అవనీశు= మత్స్యదేశపు రాజయిన విరటుడియొక్క; లావు= బలం; కోల్పోయెన్= పోయింది; సూతకులము= సూతుల వంశం; పొలిసెన్= నశించింది.

**తాత్పర్యం:** సింహబలుడైన కీచకుడు ఒక ఆడుదాని కొరకై గంధర్వుల చేతిలో పడి భయంకరమైన చావు చచ్చాడు. అయ్యో! దానితో మత్స్యరాజు బలం కోల్పోయాడు. సూతవంశం నశించింది.'

వ. **ఇవ్విధంబునం బ్రవర్తిల్లు జనవాదంబు గ్రమక్రమంబున సమస్తదేశంబుల నెరసి చెల్లుచుండె; నట్టియెడ.** 72

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ప్రవర్తిల్లు= వ్యాపించే; జనవాదంబు= లోకుల మాటలు; క్రమక్రమంబునన్= వరుసగా; సమస్త దేశంబులన్= అన్ని దేశాలలో; నెరసి= వ్యాపించి; చెల్లుచున్+ఉండెన్= చెలామణిలో ఉండింది; అట్టి+ఎడన్=ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా జనుల మాటలు క్రమక్రమంగా అన్ని దేశాలలోను వ్యాపించి చెలామణి ఔతున్నాయి. అప్పుడు.

దుర్యోధనుని వేగులవారు పాండవుల వెదకి కానక వచ్చుట. (సం.4-24-5)

ఉ. **పాతకియై సుయోధనుఁడు పాండుతనూజులు సల్పుచున్న య**
**జ్ఞాత విధి వ్రతంబు కలుషంబుగఁ జేయఁదలంచి పంచినన్**
**భూతలమెల్లఁ జూచి మును వోయెడు నప్పుడు చెప్పుకొన్న సం**
**కేతపుఁ జోటఁ గూడఁబడి ఖేదముఁ బొందుచుఁ జారు లందఱున్.** 73

**ప్రతిపదార్థం:** సుయోధనుఁడు= దుర్యోధనుడు; పాతకి+ఐ= పాపాత్ముడై; పాండు తనూజులు= పాండురాజు కుమారులు; సల్పుచున్న= చేస్తున్న; అజ్ఞాతవిధివ్రతంబు= తమ్ము ఇతరులు గుర్తింపరానట్లు జరుపుతున్న దీక్షను; కలుషంబుగన్+చేయన్+తలంచి= చెడిపోయేటట్లు చేయబూని; పంచినన్= పంపగా; భూతలము+ఎల్లన్+చూచి= ప్రపంచమంతా వెదకి; చారులు+అందరున్= వేగులందరూ; మును= ముందు; పోయెడు+అప్పుడు= బయలుదేరి వెళ్ళేటప్పుడు; చెప్పుకొన్న= ఏర్పాటు చేసికొన్న; సంకేతము+చోటన్= గుర్తుగా అనుకొన్న ప్రదేశంలో; కూడన్+పడి= కలసికొని; ఖేదమున్+పొందుచున్= దుఃఖపడుతూ.

**తాత్పర్యం:** దుర్మార్గుడగు సుయోధనుడు పాండవుల అజ్ఞాతవాసనియమాన్ని భంగపరిచేటట్లు చేయదలచి వేగులను పంపాడు. వారు ప్రపంచమంతా చుట్టివచ్చి తమ మొదటి సంకేతస్థలానికి చేరికొని తమ వైఫల్యానికి దుఃఖపడుతూ.

వ. **మగుడి వచ్చి హస్తిపురంబు చొత్తెంచి.** 74

**తాత్పర్యం:** (వేగులు) తిరిగి వచ్చి, హస్తినాపురి ప్రవేశించి.

**సీ. వరుస నేనుంగులు గురిసిన దాన ధా । రావలి దగు కలయంపి గాఁగ,**
**రాజులసందడి రాసిన తొడవులు । మురిసి రాలిన పొడి ముగ్గుగాఁగఁ,**
**గాంతల సంకుల గతిఁ ద్రెస్సి తొరఁగిన । హారముల్ పుష్పోపహారములుగ,**
**నేమేమ యని యొలినెత్తిన పరదేశి । దొరల పావడములు తోరణముగ,**

**తే. సహజమైన యలంకార మహిమ నతిశ । యిల్లి మహనీయ వైభవ మెసక మెసఁగ**
**వఱలు నరపతి మందిర ద్వారభూమి । సేర నరిగి యా వేగులవారు ప్రీతి. 75**

**ప్రతిపదార్థం:** వరుసన్= వరుసగా; ఏనుంగులు= ఏనుగులు; కురిసిన= కార్చిన; దానధారా+ఆవలి= మదజలధారలు; తగు కలయంపి కాఁగన్= తగునట్లు చల్లిన కల్లాపి కాగా (కల్లాపిచల్లినట్లుకాగా); రాజుల సందడిన్ రాసిన తొడవులు= రాజుల గుంపుల రాకపోకలలో ఒరసికొన్న నగలు; మురిసి= చిట్లి; రాలినపొడి= క్రింద రాలినపొడి; ముగ్గుకాఁగన్= ముగ్గులు కాగా (రంగవల్లులు తీర్చినట్లు కాగా); కాంతల సంకులగతిన్+త్రెస్సి= అందగత్తెలగు ఆడువారి ఒత్తిళ్ళ నడకలకు తెగి; తొరఁగిన హారముల్= పడినదండలు; పుష్ప+ఉపహారములుగన్= పూలమాలలుకాగా; ఏము+ఏము+అ+అని= మేము మేము అని (మేం ముందు పోవాలి మీకంటె మేం ముందు పోవాలి అనే పోటీలతో); ఒలిన్= వరుసగా; ఎత్తిన= పైకెత్తి పట్టిన; పరదేశిదొరల= విదేశరాజులయొక్క; పావడములు= వస్త్రాలు, కానుకలు; తోరణముగన్= (మంగళప్రదమైన) తోరణాలు కాగా; సహజము+ఐన= స్వభావసిద్ధమైన; అలంకార మహిమన్= అలంకారాల శోభతో; అతిశయిల్లి= మించి; మహనీయ వైభవము= గొప్పదైన సంపద; ఎసకము+ఎసఁగన్= ఎక్కువకాగా; వఱలు= ఒప్పుతున్న; నరపతి= రాజుయొక్క (దుర్యోధనుడి యొక్క); మందిరద్వారభూమి= నగరి వాకిటి చోటు; ఆ వేగులవారు= ఆ వేగులు; ప్రీతిన్= ఆసక్తితో; చేరన్+అరిగి= చేరుకొని,

**తాత్పర్యం:** దుర్యోధనుడి మందిర సింహద్వార ప్రాంతం - ముంగిలి - చూడముచ్చటగా శోభిల్లుతున్నది. వరుసగా నిలిచిఉన్న మదించిన ఏనుగుల శరీరాలనుండి స్రవించిన మదజల ధారలు ఇంటిముందు కల్లాపి చల్లారా అన్నట్లుగా రాణించాయి. గుంపులు గుంపులుగా వస్తున్న రాజుల ఆభరణాలు రాచుకొనటంవలన నేలమీద రాలిన పొడులు కల్లాపిచల్లిన నేలమీద ముగ్గుపెట్టారా అన్నట్లుగా శోభించాయి. మరొకవైపు ఆడువారు కూడా దొమ్మిగా త్రోసికొని రావటంతో వారి హారాలు తెగి నేలమీద రాలాయి. అవి పూలచెండ్ల అలంకారాలు అమర్చారా అన్నట్లు రాణించాయి. విదేశ ప్రభువులు మేమంటే మేమంటూ త్రోసికొంటూ పైకెత్తుకొని తెస్తున్న వస్త్రాలూ, కానుకలూ మొదలైనవి ద్వారానికి కట్టిన మంగళతోరణాలా అన్నట్లు అమరాయి. ఈ విధంగా సహజమైన అలంకార శోభతో మించి ప్రకాశించే గొప్పదైన రాజవైభవం అతిశయించగా హంగుగా ఒప్పారుతున్న ఆ రాజమందిర ద్వార ప్రాంగణానికి వేగులవారు వేడుకతో చేరారు.

**విశేషం:** 1. అలం: ఉత్ప్రేక్ష. ఉపమాన తాదాత్మ్యాన్ని ఉపమేయంలో సంభావించటం ఉత్ప్రేక్ష. ఈ పద్యంలో వర్ణించింది రాజారాజ మందిర ప్రాంగణం. అది సామాన్యుల ప్రాంగణాల కంటె విశిష్టంగా ఉన్నది. మహనీయ వైభవ ద్యోతకంగా ఉన్నది. దీనిని తిక్కన ఉత్ప్రేక్షాలంకారంలో వర్ణించి వస్తువును ఉజ్జ్వలం చేశాడు. గృహస్థుల ముంగిట్లో ఉదయం కల్లాపి చల్లుతారు. ఇది గృహస్థులు కల్పిస్తే కలిగే అలంకారం. మరి దుర్యోధనుడి సింహద్వారం ఎదుట ఏనుగుల మదజలం కలిగిన తడి ఆయన

కావాలని చేసికొన్నది కాదు. ఆయన వైభవమే ఆయన ప్రాంగణానికి ఆ సహజాలంకారాన్ని సమకూర్చింది. ఉపమేయమైన మదజలంలో ఉపమానమైన కలయంపి స్వభావం సంభావించబడింది. ఇట్లాగే మిగిలిన అంశాలకు కూడా అన్వయం చెప్పుకొనాలి. రాజుల నగల రత్నాల పొడి ముగ్గుగానూ, కాంతల హారాలు పూలగుత్తులుగానూ, పరదేశరాజుల కానుకలు ద్వారతోరణాలుగానూ సంభావించటం ఇందులోని అలంకార వైభవం.

2. దుర్యోధనుడికి సహజంగా ఏర్పడిన అలంకారాలవలన మహనీయ రాజ్య వైభవం ప్రకాశిస్తున్నదని ధ్వని. తిక్కన దుర్యోధన సార్వభౌముడి భవన ముఖద్వార వైభవాన్ని వర్ణించి ప్రబంధోచిత వర్ణనం చేశాడని చెప్పటం కావ్యలక్షణం. దానివలన సాధించిన వ్యంగ్య వైభవాన్ని సమాలోచించటం శిల్ప లక్షణం. ఇందులో అలంకార ధ్వని వస్తు ధ్వనిని పోషిస్తున్నది. ఆ మహనీయ వైభవం గల ముంగిట్లో నిలిచినవారు వేగులవారు. పాండవులను గుర్తించలేక ఖిన్నులై తిరిగి వచ్చిన దుర్యోధనుని గూఢచారులు. ఈ సన్నివేశం చూచిన భావుకుడు ఆ మహనీయ వైభవమంతా పాండవులనుండి దుర్యోధనుడు దోచుకున్నదే అన్న ఊహ కలుగుతుంది. అజ్ఞాతవాసవ్రతం పూర్తయితే ఈ వైభవం ఎవరి దౌతుంది? అనే ప్రశ్న కలుగుతుంది. కథ క్రొత్త మలుపు తిరిగే తరుణంలో ఈ వర్ణనం ముఖద్వారంగా తోస్తుంది. ఇది వస్తుధ్వని.

3. తెలుగువారి ముంగిట్లో మెరిసే హంగులను రారాజు ముంగిట్లో జ్ఞాపకం చేయించాడు తిక్కన. కలయంపి, ముగ్గు, పూలగుత్తులు, తోరణాలు తెలుగు ముంగిళ్ళ వెలుగు దివ్వెలు. తిక్కన భారతానికి కల్పించే తెలుగుదనంలో ఇదొక జిలుగు మాత్రమే. కురిసిన, మురిసి రాలిన, త్రెస్సి తొరగిన, ఓలినెత్తిన, పరదేశి దొరలు మొదలైన తెలుగు పదాల పొందిక తెలుగు దేశీయతకు దిక్కు. (సంపా.)

**వ.** **సముచితంబుగాఁ బ్రవేశించి.** **76**

**తాత్పర్యం:** (వేగులు) తగు విధంగా (నగరిలో) ప్రవేశించి.

**తే.** **ద్రోణ గాంగేయ భానుమత్సూను కృప సు। శర్మ దుశ్శాసనులు సర్వ సైన్యపతులు**
**నార్య జనములుఁ గొలువ మహార్హకాంచ। నోన్నతాసనమునఁ గొలువున్నవాని.** **77**

**ప్రతిపదార్థం:** ద్రోణ= ద్రోణాచార్యుడూ; గాంగేయ= భీష్ముడూ; భానుమత్సూను= సూర్యపుత్రుడు కర్ణుడూ; కృప= కృపాచార్యుడూ; సుశర్మ= సుశర్మా; దుశ్శాసనులు= దుశ్శాసనుడూ; సర్వసైన్యపతులు= సేనాపతులందరూ; ఆర్యజనములు= పెద్దలూ; కొలువన్= సేవించగా; మహార్హ= మిక్కిలి విలువగల; కాంచన= బంగారపు; ఉన్నత+ఆసనమునన్= గొప్ప ఆసనం మీద; కొలువు+ఉన్నవానిన్= సభతీరి ఉన్నవాడిని.

**తాత్పర్యం:** ద్రోణ, భీష్మ, కర్ణ, కృప, సుశర్మ, దుశ్శాసనాదులూ, సేనాపతులూ, పెద్దలూ సేవించగా బంగారపు ఉన్నతాసనం మీద కూర్చుండి సభ తీరి ఉన్నవాడిని.

**స్రగ్ధర.**

**మౌళిస్రక్సంగ రంగ న్మధుకరపటలీ మానసా కృష్టి విద్యా**
**శాలి స్ఫారాబ్జరేఖాంజలి పుట ఘటనాచారు ఫాలస్థల క్ష్మా**
**పాలశ్రేణీ విశా లాంబక కుముదవనీ బాంధవాయత్తచంద్ర**
**శ్రీలీలాగాఢ కాంతి స్మితవదనరుచి స్పీతు నాగేంద్ర కేతున్.** **78**

**ప్రతిపదార్థం:** మౌళిస్రక్= తల యందలి పైనున్న పూలమాలల; సంగ= ఆసక్తి చేత; రంగత్= క్రీడిస్తున్న; మధుకరపటలీ మానస= తుమ్మెదల పిండు యొక్క మనస్సులను; ఆకృష్టి= ఆకర్షించుట అనెడి; విద్యాశాలి= నేర్పరితనంతో ప్రకాశించే; స్ఫార= ప్రకాశవంతమగు; అబ్జరేఖా= పద్మములనెడి; అంజలిపుట= దొప్పలవంటి దోసిళ్ళను; ఘటనా= కూర్చుటచేత; చారు= అందమైన; ఫాలస్థల= నుదురుభాగంకల; క్ష్మాపాలశ్రేణీ= (సామంత) రాజుల వరుసల యొక్క; విశాల= వెడల్పయిన; అంబక= నేత్రాలనెడి; కుముదవనీ= కలువల సమూహానికి; బాంధవ= బంధుత్వమునకు; ఆయత్త= సిద్ధపడిన; చంద్రశ్రీ లీలా= చంద్రుడివలె శోభావిలాసముచేత; గాఢ= దట్టమైన; కాంతి= వెలుగుగల; స్మిత= చిరునవ్వుతోడి; వదనరుచిస్ఫీతున్= ముఖకాంతితో శోభిల్లేవాడిని; నాగేంద్రకేతున్= సర్పరాజధ్వజుడైన దుర్యోధనుడిని.

**తాత్పర్యం:** శిరస్సులందు ధరించిన పూల సరులలోని పూదేనెకై తిరుగాడుతున్న తుమ్మెదలను భ్రమపెట్టజాలినట్లున్న కేల్మోడ్పులను నెన్నుదుట కీలించిన సామంతరాజులు విశాలనేత్రా లనెడు కలువ మొత్తాలకు వెన్నెలను పోలు చిరునగవుగల చంద్రుడివంటి ముఖంతో ప్రకాశించే వాడిని, నాగేంద్రుడి గుర్తుగల కేతనం కలవాడిని దుర్యోధనుడిని. (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** అలం: భ్రాంతిమంతం, రూపకం. మూలాతిరిక్తమైన ఈ రాజరాజు వైభవ వర్ణనం ఓజోగుణంతో, ఉదాత్తాలంకారంలో భాసిస్తూ దుర్యోధనుడి రాజ్యగర్వాన్ని ప్రదర్శిస్తున్నది. తిక్కనగారి దీర్ఘ సంస్కృత సమాస ఘటితమైన ధారామధురమైన రచనాశక్తిని ప్రకటిస్తున్నది. ఎప్పుడో కాని తిక్కన ఇటువంటి పద్యాలు రచించడు. స్రగ్ధరావృత్తానికి ప్రతిపాదంలోనూ వరుసగా - మ,ర,భ, న, య, య, య గణాలుంటాయి. ఎనిమిదో అక్షరం, పదునైదవ అక్షరం యతిస్థానాలు. ప్రాసం విధాయకం. (సంపా.)

**వ. కని జయజయశబ్దపూర్వంబుగా సాష్టాంగ దండ ప్రణామంబు సేసి. 79**

**ప్రతిపదార్థం:** కని= చూచి; జయజయశబ్దపూర్వంబుగాన్= జయజయశబ్దాలతో; సాష్టాంగ దండ ప్రణామంబు+చేసి= సాగిలపడి నమస్కారాలు చేసి.

**తాత్పర్యం:** చూచి జయజయ శబ్దాలతో సాగిలబడి నమస్కారాలు చేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మొగిచిన చేతులు ముందల । నిగిడించి నితాంత వినయ నిరతిం జారుల్**
**తగ విన్నవించి రిట్లని । జగతీశ్వరునకు నిజ ప్రచారం బెల్లన్. 80**

**ప్రతిపదార్థం:** మొగిచిన= జోడించిన; చేతులు= హస్తాలు; మున్+తలన్= తలకు ముందు భాగమైన నెన్నుదురుపై; నిగిడించి= జోడించి నిలిపి; చారుల్= వేగులు; ఇట్లు+అని= చెప్పబోవునట్లుగా; నిజప్రచారంబు+ఎల్లన్= తాము సాగించిన సంచారమంతటిని; జగతీ+ఈశ్వరునకున్= ప్రభువైన సుయోధనుడికి; నితాంత వినయ నియతిన్= మిక్కిలి వినయశీలంతో; ఇట్లు+అని= ఈ విధంగా; తగన్+విన్నవించిరి= తగునట్లు మనవి చేశారు.

**తాత్పర్యం:** వేగులు చేతులెత్తి నుదుట ఉంచి నమస్కరించి తాము సాగించిన సంచార విశేషాలనన్నిటినీ మిక్కిలి వినయభావంతో సుయోధనుడికి ఈ విధంగా విన్నవించారు.

**క. 'దేవర యానతిఁ బాండవు । లేవురు ద్రౌపదియు నున్న యెడ యే మరయం**
**గా వెదలి వారు సనిన మ । హావిపినంబులకుఁ దొలుత నరిగితిమి వెసన్. 81**

**ప్రతిపదార్థం:** దేవర+ఆనతిన్= రాజుగారి ఉత్తరువు ప్రకారం; పాండవులు+ఏవురున్= అయిదుగురు పాండవులూ; ద్రౌపదియున్= ద్రౌపదీ; ఉన్న+ఎడన్= ఉన్నచోటును; అరయంగాన్= తెలిసికొనటానికి; ఏము= మేము; వెడలి= వెళ్ళి; తొలుతన్= ముందుగా; వారు+చనిన= వారు వెళ్ళిన; మహావిపినంబులకున్= కీకారణ్యాలకు; వెసన్= వేగంగా; అరిగితిమి= వెళ్ళాం.

**తాత్పర్యం:** 'దేవరవారి ఆదేశంతో పాండవు లైదుగురు ద్రౌపదితో కలిసి వెళ్ళిన కారడవులను మేము గుర్తించి ముందుగా వాటిలో వెదకటానికి వేగంగా వెళ్ళాం.

**వ. అందు. 82**

**తాత్పర్యం:** ఆ అరణ్యాలలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. పరఁగు పొదరు పొదరు, పల్లంబు పల్లంబు । మ్రాను మ్రాను, దుర్గమంపుఁ జోటు**
**దుర్గమంపుఁ జోటు, దొన దొన, గుహ గుహ । యాదిగాఁగ నెందు నరసి యరసి. 83**

**ప్రతిపదార్థం:** పరఁగు= అక్కడ ఉన్న; పొదరు పొదరు= అన్ని పొదలూ; పల్లంబు పల్లంబు= అన్ని పల్లపు ప్రాంతాలు; మ్రాను మ్రాను= అన్ని చెట్లూ (చెట్టు చెట్టును); దుర్గమము+చోటు= అడుగిడరాని చోటులు; దొనదొనన్= కొండల మీది నీటి దొరువులూ; గుహ గుహ= అన్ని కొండ గుహలును; ఆది+కాఁగన్= మొదలైన; ఎందున్= ఎక్కడెక్కడో ఉన్న చోట్లలో; అరసి అరసి= వెదకి వెదకి, బాగా వెదకి.

**తాత్పర్యం:** కనబడిన పొదరిళ్ళన్నీ ఒక్కొక్క దానిగా గాలించాం. పల్లపుప్రాంతాలన్నింటినీ దిగి చూచాం. చెట్టు చెట్టుకూ తిరిగి ఎక్కి చూచాం. చొరటానికి వీలులేని చోట్లలో కూడా చొరబడి వెదికాం. నీటి పడియలన్నింటినీ పరిశీలించాం. కొండ గుహలలో దూరి గాలించాం. ఇటువంటి వెన్నో చోట్లలో తిరిగి తిరిగి, వెదకి వెదకి ప్రయత్నించాం.

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం. పొదరు పొదరు, మ్రాను మ్రాను వంటి చోట్ల ప్రయోగించిన ఆమ్రేడితాలు వేగుల వేగాన్నీ వెదకిన చోటునే మరల మరల వెదకి ధ్రువపరచుకొన్న వైనాన్నీ ధ్వనింపచేస్తున్నవి. అరసి యరసి- ఇక్కడ ద్విరుక్తి అత్యంతార్థమున నైనది- ప్రౌఢ; శబ్ద - 112 సూ. (సంపా.)

**వ. ఒక్క యెడ నరదంబు లరిగిన చొప్పు గాంచి దాని వెంబడిం జని చని. 84**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఎడన్= ఒకచోట; అరదంబులు= తేరులు; అరిగిన= పోయిన; చొప్పు= జాడను; కాంచి= చూచి (గుర్తించి); దాని వెంబడిన్= దాని వెంట; చని చని= చాలా దూరం పోయి.

**తాత్పర్యం:** ఒకచోట రథాలు పోయిన జాడ గమనించి, దాని వెంట మేము కూడా చాలా దూరం వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. కేవలసూతుల తోడన । పోవుట గని వానిఁ జేరఁ బోవక యవి యిం**
**కే వంకఁ బోవునొకో! యను । భావనఁ బోయితిమి వానిపజ్జన యేమున్. 85**

**ప్రతిపదార్థం:** కేవల సూతులతోడన్= కేవలం సారథులతో మాత్రమే; పోవుటన్+కని= (ఆ తేరులు) వెళ్ళటం చూచి; వానిన్+చేరన్+పోవక= వాటిని సమీపించకుండా; అవి= ఆ తేరులు; ఇంకన్+ఏవంకన్= ఇక నీ దిక్కునకు; పోవునొకొ! అను భావనన్= వెళ్ళునో అనే తలపుతో; వానిపజ్జన్+అ= వాని ప్రక్కనే; ఏమున్= మేముకూడా; పోయితిమి= వెళ్ళాము.

**తాత్పర్యం:** సారథులతో మాత్రమే పోతున్న ఆ రథాలను చూచాం. వాటి దగ్గరికి పోకుండా అవి ఎటువైపు పోతాయో గమనిస్తూ వాటి వెంట రహస్యంగా అనుసరించాం.

**వ. అవియును ద్వారకా నగరంబున కరిగిన. 86**

**తాత్పర్యం:** ఆ రథాలు ద్వారకా నగరానికి చేరగా.

**క. అందుల నుండుదు రను నా। సం దెల్లముగాఁగఁ బెక్కు చందంబుల ము**
**ట్టం దిరిగి తడవి కుంతీ। నందనులం గాన లేక నానా భంగిన్. 87**

**ప్రతిపదార్థం:** అందులన్= ఆచోట (ద్వారకలో); ఉండుదురు+అను+ఆసన్= ఉంటారనే ఆశతో; తెల్లముకాఁగన్= స్పష్టమయ్యేటట్లుగా; పెక్కుచందంబులన్= అనేక రకాలుగా; ముట్టన్+తిరిగి= కడముట్ట తిరిగి; తడవి= వెదకి; నానాభంగిన్= అనేక విధాలుగా; కుంతీనందనులన్+కానన్‌లేక= కుంతీకుమారులైన పాండవులను గుర్తించలేక.

**తాత్పర్యం:** ఆ ద్వారకలో ఉంటారనే ఆశతో అనేక విధాలుగా కడముట్ట తిరిగి వెదకి పాండవులను గుర్తించలేకపోయాం. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. విచ్చి పోయి సమస్త దేశంబులుం గలయం గ్రుమ్మరి, కొండొకయు నుపేక్షలేక వెరవుతోడిదకాఁ బరికించుచు. బయలలనునాలస్యంబు దక్కియోలంబునట్ల శోధించుచుఁ గీడయిన నుదాసీనత యుడిగి మేలి చందంబునం భావించుచు, వివిధ ప్రకారంబు లయిన బహు ప్రదేశంబులు రోసి, కౌంతేయులం గానక సంకేత స్థలంబునం గూడికొని, మా వర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి, యట దివ్యచిత్తంబున నవధరించిన భంగి సేయువారమై చనుదెంచితిమి; మాకుం జూడఁ బాండవులు పొడ వడంగి లేకపోయిరిగాని యీ లోకంబున నునికి గలిగిన నగపడకుండ నేర; రిది యిక్కార్యంబు నున్నరూపు; మఱియొక్క విశేషంబునం బ్రియం బంది వచ్చితిమి; చిత్తగింపుము. 88**

**ప్రతిపదార్థం:** (నానాభంగిన్= అనేక విధాలుగా); విచ్చిపోయి= విడిపోయి; సమస్త దేశంబులున్ కలయన్+క్రుమ్మరి= అన్ని దేశాలలో కలయ తిరిగి; కొండొకయున్= ఒక్కింతకూడా; ఉపేక్షలేక= అశ్రద్ధ చేయకుండా; వెరవుతోడిద కాన్= ఉపాయంతో; పరికించుచున్= పరిశీలిస్తూ; బయలను= బహిరంగప్రదేశాలలోనూ; ఆలస్యంబు+తక్కి= ఆలస్యం లేకుండా; ఓలంబు అట్లు+అ= రహస్య ప్రదేశాలలో వెదకినట్లుగానే; శోధించుచున్= వెదకుతూ; కీడు+అయినన్= ఇబ్బంది కలిగినా; ఉదాసీనత= అలసత; ఉడిగి= వదిలి (సోమరితనం వదిలి); మేలిచందంబునన్+భావించుచున్= మంచి పద్ధతులను తలపోస్తూ; వివిధ ప్రకారంబులు+అయిన బహు ప్రదేశంబులు రోసి= అనేక విధాలుగా అనేక స్థలములలో వెదకి; కౌంతేయులన్+కానక= పాండవులను చూడలేక; (గుర్తించలేక) సంకేతస్థలంబునన్= రహస్యస్థలంలో; కూడికొని= కలిసికొని; మా వర్తించిన తెఱంగు=

మేము తిరిగిన పద్ధతిని; దేవరకున్= ప్రభువులకు; ఎఱింగించి= తెలిపి; అట= తరువాత; దివ్యచిత్తంబునన్= దేవరవారి మనసులో; అవధరించిన భంగిన్= తోచినరీతిగా; చేయువారము+ఐ= నడుచుకొనటానికి; చనుదెంచితిమి= వచ్చిచేరాం; మాకున్+చూడన్= మేము పరిశీలింపగా; పాండవులు పొడవు+అడంగి లేకపోయిరి= పాండవులు రూపుమాసిపోయినట్లున్నారు; కాని= కాకుండా; ఈ లోకంబునన్+ఉనికి కలిగినన్= ఈ లోకంలో బ్రతికి ఉన్నట్లయితే; అగపడకుండనేరరు= కనబడకపోరు; ఇది ఈ+కార్యంబు+ఉన్న రూపు= ఇది ఈ ప్రయత్నంలో తేలిన ఫలితాంశం (యథార్థం); మఱియొక్క విశేషంబునన్+ప్రియంబు+అంది వచ్చితిమి= ఇంకొక్క విశేషంతో సంతోషపడి వచ్చాం; చిత్తగింపుము= దానిని వినుము.

**తాత్పర్యం:** (మేము) అనేక రకాలుగా విడిపోయి అనేక దేశాలలో తిరిగి ఒకింత కూడా అలసత్వం లేకుండా ఉపాయాలతో మార్గాంతరాలతో ఆలస్యం లేక రహస్యంగా వెదకుతూ కష్టనష్టా లెదురైనా సోమరితనం లేక మేలుగా తగిన ఆలోచనలు చేసికొంటూ అనేక స్థలాలలో అనేక విధాలుగా వెదకి పాండవులను చూడలేక తిరిగి సంకేత స్థలానికి చేరుకొన్నాం. మేము చేసిన ప్రయత్నాల నన్నింటిని ప్రభువులకు తెలిపి ఆమీద మీ ఆనతి ప్రకారం వర్తించుకొందామని వచ్చాం. మాకు చూడ - పాండవులు రూపు మాసిపోయి ఉంటారు. బ్రతికి ఉంటే కనబడకుండా పోరు. ఇది ఇందులో ఉన్న యథార్థం. అయితే ప్రియమైన మఱొక విశేషం విని సంతోషంతో వచ్చాం. దానిని చిత్తగించండి.

**సీ.** **మత్స్యదేశాధీశు మఱఁదిఁ గీచకునిఁ బు। ణ్యోజ్జ్వలాకృతి యగు నొక్క వనిత**
**కతమున నడురేయి గంధర్వు లతిరహ। స్య ప్రకారంబునఁ జంపి; రదియు**
**నక్కజం బాయుధవ్యవహార మేమియు। లేదు, శిరంబు కా ల్గేలు డొక్క**
**లోనికిఁ జొరఁద్రోచి పీనుంగు ముద్దగాఁ। జేసివైచిరి దుష్టచిత్తులైన**

**తే.** **యతని తమ్ముల నొక్కరినైనఁ దప్పి। పోవనీక యా రాత్రియ పొదివి చిత్ర**
**నిహతిఁ దెగఁజూచి యనిరూపణీయ దుర్ని। వారవృత్తిమై నరిగిరి కౌరవేంద్ర!** **89**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర= ఓ కురురాజా! (దుర్యోధనా!); మత్స్యదేశ+అధీశుమఱఁదిన్+కీచకునిన్= మత్స్యదేశానికి రాజయిన విరటుని బావమరది కీచకుడిని; పుణ్య+ఉజ్జ్వల+ఆకృతి+అగు= పుణ్యం చేత వెలుగొందే అందమైన ఆకారం కలిగినదైన; ఒక్క వనిత= ఒక యింతి; కతమునన్= కారణంగా; నడురేయి= అర్ధరాత్రివేళ; గంధర్వులు= గంధర్వులు; అతిరహస్య ప్రకారంబునన్= మిక్కిలి రహస్యమైన రీతిలో; చంపిరి= చంపారు; అదియున్+అక్కజము= అదికూడా ఆశ్చర్యకరం; ఆయుధవ్యవహారము+ఏమియున్ లేదు= ఆయుధాల వినియోగం ఏమాత్రమూ లేదు; శిరంబు కాల్+కేలు= తల, కాళ్ళూ చేతులు; డొక్కలోనికిన్= కడుపులోనికి; చొరన్+త్రోచి= చొచ్చుకొనేటట్లుగా కుక్కి; పీనుంగున్= శవాన్ని; ముద్దగాన్= ముద్దగా; చేసివైచిరి= చేసివేశారు; దుష్టచిత్తులు+ఐన= దురాత్ములైన; అతని తమ్ములన్= వాని తమ్ముళ్ళను; ఒక్కరిన్+ఐనన్+తప్పిపోనీక= ఒకరిని కూడా తప్పించుకొని పోనీయకుండా; ఆ రాత్రి+అ= ఆ రాత్రిలోనే; పొదివి= క్రమ్ముకొని; చిత్రనిహతిన్= వింతగా చంపటంతో; తెగన్= చావగా; చూచి= చూచి; అనిరూపణీయ= ఇదమిత్థమని, నిరూపించటానికి సాధ్యం కాని; దుర్నివారవృత్తిమైన్= అడ్డుకొన సాధ్యంకానట్లు; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ఓ కౌరవేంద్రా! మత్స్యదేశపురాజైన విరటుడి బావమరది కీచకుడిని, పవిత్రమూర్తి అయిన ఒక సుందరాంగి కారణంగా అర్ధరాత్రి వేళ గంధర్వులు అతి రహస్య పద్ధతిలో చంపారు. ఆ చంపటం కూడా

ఆశ్చర్యకరంగా చంపారు. ఆయుధాలతో పనిలేకుండా చేసిన ఆ యుద్ధంలో తల, కాళ్ళు, చేతులు డొక్కలోనికి చొప్పించి పీనుగును ముద్దగా చేసివేశారు. దుర్మార్గులయిన కీచకుడి తమ్ముళ్ళను కూడా వదలకుండా క్రమ్ముకొని ఒక్కడు కూడా మిగలకుండా వింత చావులు చచ్చేటట్లు చంపారు. వా రెట్లా చంపారో ఇదమిత్థమని నిరూపించటానికి సాధ్యం కానిరీతిలో చంపి, నివారింప వీలుకొని విధంగా ఆ గంధర్వులు వెడలిపోయారు.

**వ. విరాటుండు పగతుండు గావునఁ దదీయవ్యసనం బెఱిఁగింపవలయు నని విన్నవించితి; మది యట్లుండె; బాండవులనన్వేషించుపని యిటమీఁదంజిత్తగించు తెఱంగానతిచ్చునది, యనిన విని 'యట్ల చేయుదము గాక!' యని వారలఁ బోవం బనిచి, కొంతసేపు చింతాక్రాంతుండై, య మ్మహీకాంతుండు మంత్రులం జూచి యిట్లనియె. 90**

**ప్రతిపదార్థం:** విరాటుండు= విరాటరాజు; పగతుండు+కావునన్= విరోధి కనుక; తదీయ= అతడియొక్క; వ్యసనంబు= కష్టం; ఎఱిఁగింపవలయున్+అని= తెలియచేయవలెనని; విన్నవించితిమి= విన్నపం చేశాము; అది అట్లు+ఉండెన్= అది ఆ విధంగా ఉండగా; పాండవులన్+అన్వేషించుపని= పాండవులను వెదకుపని; ఇటమీఁదన్= ఇకపై; చిత్తగించు తెఱంగు= తెలిపే పద్ధతి; ఆనతి+ఇచ్చునది= ఉత్తర్వు చేయవలసింది; అనినన్+విని= అనగా విని; అట్లు+అ చేయుదము+కాక= ఆ విధంగానే చేద్దాము గాక; అని= అంటూ; వారలన్= వేగులను; పోవన్+పనిచి= వెళ్ళుటకు ఉత్తర్వుచేసి; కొంతసేపు= ఒకింతకాలం; చింతాక్రాంతుండు+ఐ= ఆలోచనలో మునిగినవాడై; ఆ+మహీకాంతుండు= ఆ రాజు (దుర్యోధనుడు); మంత్రులన్+చూచి= తన మంత్రులను చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** విరాటుడు శత్రువు కనుక అతడికి ఏర్పడిన బాధను (మీకు) తెలుపవలెనని విన్నవించాము. అది అట్లా ఉండగా, ఇకముందు పాండవులను గూర్చి వెదికే విషయంలో తగిన ఉత్తరువు లివ్వవలసింది' అని అనగా 'అట్లే చేస్తాములే' అని వేగులను పంపి దుర్యోధనుడు కొంతసేపు గాఢంగా ఆలోచనలో మునిగి, ఆ తరువాత, తన మంత్రులతో ఈ విధంగా అన్నాడు.

**తే. 'సమయ సముచిత కృత్యంబు చక్కఁ జేసి । పాండవులు రాజ్యమున కాసపడకమున్న**
**యరసి యెఱిఁగి యరణ్యంబు నందుఁ దొంటి । యట్ల యిడుమలఁ గుడువఁ బో నడుపవలయు. 91**

**ప్రతిపదార్థం:** పాండవులు= పాండవులు; సమయ సముచిత కృత్యంబు= (అరణ్య అజ్ఞాతవాస) ప్రతిజ్ఞకు ఉచితమైన పనులు; చక్కన్+చేసి= నెరవేర్చి; రాజ్యమునకున్+ఆసపడకమున్ను+అ= రాజ్యానికై ఆశింపకముందే; అరసి= వెదకి; ఎఱిఁగి= తెలిసికొని; అరణ్యంబునందున్= అడవులలో; తొంటి+అట్లు+అ= వెనుకటి మాదిరిగానే; ఇడుమలన్= కష్టాలను; కుడువన్= అనుభవించగా; పోన్+అడుపన్‌వలయున్= పోయేటట్లు చేయాలి.

**తాత్పర్యం:** 'పాండవులు తాము చేసిన ప్రతిజ్ఞ ప్రకారం అరణ్య అజ్ఞాతవాసాలను ముగించుకొని మరల రాజ్యం కొరకు ఆశపడకముందే, వారిని వెదకి గుర్తించి, పూర్వంవలె అరణ్యాజ్ఞాతవాసరూపకష్టా లనుభవింప చేయవలసిందే.

**క. ఎఱుఁగుట దుర్ఘటు; మెవ్విధి । నెఱుఁగంగా వచ్చు? మీర లెల్లను మీమీ**
**యెఱిఁగిన చందంబున నా । కెఱిఁగింపుఁడు వారి వెదకి యెఱుఁగు తెఱంగుల్.' 92**

**ప్రతిపదార్థం:** ఎఱుఁగుట దుర్ఘటము= తెలిసికొనుట కష్టం; ఏ+విధిన్+ఎఱుఁగంగాన్ వచ్చున్?= ఏ విధంగా తెలిసికొనవచ్చునో; మీరలు+ఎల్లను= మీరందరూ; మీమీ+ఎఱిఁగిన చందంబునన్= మీకు మీకు తెలిసిన పద్ధతితో; వారిన్= పాండవులను; వెదకి; ఎఱుఁగు= గుర్తించే; తెఱంగుల్= ఉపాయాలను; నాకున్+ఎఱిఁగింపుఁడు= నాకు తెలియజేయండి.

**తాత్పర్యం:** పాండవులను తెలిసికొనటం అశక్యం. ఏ విధంగా వారిని వెదకి తెలిసికొనవచ్చునో మీరందరూ మీకు తోచిన ఉపాయాలను నాకు తెలియజేయండి.'

**విశేషం:** ఈ పద్యంలో 'ఎఱుఁగు' అనే పదాన్ని అయిదుసార్లు వాడటంవలన పాండవులను గుర్తించాలన్న తహతహ దుర్యోధనుడి కెంతగా ఉన్నదో వ్యక్తమవుతున్నది. పంచపాండవులనూ గుర్తించి తిరిగి అరణ్యాలకు పంపాలనే కసి కూడా ఆ అయిదు శబ్దాలలో ధ్వనిస్తున్నది. (సంపా.)

**వ. అనిన రాధేయుం డిట్లనియె. 93**

**తాత్పర్యం:** అని అనగా కర్ణు డీ విధంగా అన్నాడు.

**ఆ. 'వివిధ దుర్నిరూప వేషముల్ గైకొని । నిఖిల దిశలయందు నిపుణవృత్తి**
**నెఱుఁగునట్లుగా ననేకులఁ బుచ్చిన । నెల్లి నేఁటిలోన నెఱుఁగఁబడరె?' 94**

**ప్రతిపదార్థం:** వివిధ దుర్నిరూపవేషముల్= గుర్తించటానికి వీలుకాని అనేక వేషాలను వేసికొని; నిఖిల దిశల+అందున్= అన్ని దిక్కులలోనూ; నిపుణవృత్తిన్= నేర్పరితనంతో; ఎఱుఁగునట్లుగాన్= తెలిసేటట్లుగా; అనేకులన్+పుచ్చినన్= అనేకులను పంపితే; ఎల్లి నేఁటిలోనన్= రేపో నేడో; ఎఱుఁగన్+పడరు+ఎ?= గుర్తింపబడరా?

**తాత్పర్యం:** 'ఇతరు లెవ్వరూ గుర్తించ వీలులేని వేషాలు వేసికొని నేర్పుగా పాండవులను గుర్తించగల వేల మంది వేగుల వేషగాండ్రను దేశం నలుమూలలా పంపితే రేపో నేడో వారిని గుర్తించలేరా?'

**క. అను పలుకులు విని దుశ్శా । సనుఁ డేమియు సరకుగొనక సమదవిలాసా**
**ననుఁడై నిజాగ్రజన్మునిఁ । గనుఁగొని యిట్లనియె గాఢ గర్వ స్ఫూర్తిన్. 95**

**ప్రతిపదార్థం:** అను పలుకులు= అనే మాటలు; విని= విని; దుశ్శాసనుఁడు= దుశ్శాసనుడు; ఏమియున్ సరకు కొనక= ఏమాత్రంలెక్కచేయక; సమదవిలాస= గర్వంతో, సంతోషంతో (కూడుకొన్న); ఆననుఁడు+ఐ= ముఖం కలవాడై; నిజ+ అగ్రజన్మునిన్+కనుఁగొని= తన అన్నునుచూచి; గాఢగర్వస్ఫూర్తిన్= దట్టమైన గర్వం ఉట్టిపడగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** (కర్ణుడు) అన్న మాటలను విన్న దుశ్శాసనుడు ఏమాత్రమూ లెక్కచేయక నిర్లక్ష్య భావంతో గల ముఖంతో తన అన్న మొగం చూచి దట్టమైన అహంకారం ఉట్టిపడగా ఇట్లా అన్నాడు.

**చ. 'వలవదు రోయఁ బాండవుల; వా రొక యూఱట లేని త్రిమ్మటన్**
**బల మఱి వన్య సత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియు**

**న్మొలవదె యింత! కిం కిట మనోముద మస్ఖలితంబు గాఁగ వి**

**చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగు చందమునం గొనియాడు మున్నతిన్.'** 96

**ప్రతిపదార్థం:** పాండవులన్= పాండవులను; రోయన్= వెదుక; వలవదు= పనిలేదు; వారు= పాండవులు; ఒక+ఊరట లేని= ఏమాత్రమూ విరామం లేని; త్రిమ్మటన్= తిరుగుట వలన; బలము+అఱి= శక్తి ఉడిగి; వన్యసత్త్వముల పాల్పడి= అడవిలోని క్రూరమృగాలకు చిక్కి; చచ్చిన చోటన్= చనిపోయినచోట; ఇంతకున్= ఈపాటికి; పూరియున్= గడ్డి కూడా; మొలవదె?= మొలకెత్తి ఉండదా?; ఇంకన్+ఇటన్= ఇక ఇక్కడ; మనస్(ః)+ముదము= మనస్సంతోషం; అస్ఖలితంబు+కాఁగన్= దృఢం కాగా; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; రాజ్యలక్ష్మిన్= రాజ్యసంపదను; తగు చందమునన్= తగిన విధంగా; ఉన్నతిన్= గొప్పగా; కొనియాడుము= కీర్తించుము.

**తాత్పర్యం:** 'పాండవులను వెదకవలసిన పనే లేదు. వారు విరామమంటూ లేకుండా తిరిగి తిరిగి, బలం తరిగి, క్రూరమృగాల పాలబడి చచ్చి ఉంటారు. వారు చచ్చినచోట ఇప్పటికి గడ్డి కూడా మొలిచి ఉంటుంది. కాబట్టి ఇకమీద హృదయాహ్లాదం తరగకుండా స్వేచ్ఛగా తగినరీతిలో రాజ్యసంపదను అనుభవించుము.'

**విశేషం:** పాండవులు చనిపోయి ఉంటారని భావించిన దుశ్శాసనుడు అపరిణతబుద్ధి కలవాడని తనంతట తానే ప్రకటించుకొన్నాడు. అతడు గర్వాంధుడు. అన్నను మెప్పించటమే అతడి ధ్యేయం. వాస్తవం కంటె అతడి మనసులోని కోర్కెను పరోక్షంగా బయటపెట్టుకొన్నాడు. అతడి మాటలు విజ్ఞులైన ద్రోణాదులకు నవ్వు తెప్పించాయంటే ఆశ్చర్యం లేదు. (సంపా.)

**వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ గుంభసంభవుం డిట్లనియె.** 97

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; దరహసితవదనుండు= చిరునవ్వుతోడి మొగం కలవాడు; అగుచున్= ఔతూ; కుంభసంభవుండు= ద్రోణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని చిరునవ్వు మొగంతో ద్రోణుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఈ దరహాసం పరిహాస సూచకం. (సంపా.)

**ఉ. క్షాత్రసమగ్రు, లార్యనుత గౌరవదీప్తులు, వర్ణనీయ సౌ**

**భ్రాత్రు, లుదాత్త దైవబలభవ్యులు, దివ్యసమాను, లా పృథా**

**పుత్రులు; వారి నాపదలు వొందునె? యోపిన నింకనైన నీ**

**ధాత్రిఁ గడంగి యారయు విధంబులు సెప్పఁడు నేర్పు లేర్పడన్.'** 98

**ప్రతిపదార్థం:** ఆ పృథాపుత్రులు= కుంతీ కుమారులైన ఆ పాండవులు; క్షాత్రసమగ్రులు= క్షత్రియగుణమైన శౌర్యంతో నిండినవారు; ఆర్యనుతగౌరవదీప్తులు= పెద్దలచేత పొగడబడిన గౌరవం, తేజస్సు కలవారు, గౌరవం చేత ప్రకాశించేవారు; వర్ణనీయ= కీర్తించదగిన; సౌభ్రాత్రులు= ఉత్తమమైన సోదరభావం కలవారు; ఉదాత్త దైవబల భవ్యులు= గొప్ప దైవబలంచేత క్షేమం కలవారు; దివ్యసమానులు= దేవతలతో సమానమైనవారు; వారిన్= పాండవులను; ఆపదలు+పొందునె?= ప్రమాదాలు పొందుతాయా? ఓపినన్= సామర్థ్యం ఉంటే; ఇంకన్+ఐనన్= ఇకముందైనా; ఈ ధాత్రిన్= ఈ లోకంలో; కడంగి= ప్రయత్నించి;

ఆరయువిధంబులు= గుర్తించే మార్గాలను (ఉపాయాలను); నేర్పులు+ఏర్పడన్= మీ నైపుణ్యాలు తెలిసేటట్లు; చెప్పుఁడు= చెప్పండి.

**తాత్పర్యం:** 'పాండవులు క్షత్రియుల కుండవలసిన ఉత్తమగుణాలన్నీ దండిగా ఉన్నవారు. పెద్దలు కీర్తించే గౌరవంతో వెలుగొందేవారు. నోరారా పొగడదగిన సోదరప్రేమ కలవారు. మేలైన దైవబలంతో ప్రకాశించే పుణ్యాత్ములు. దేవతలతో తులతూగేవారు. వారికా ఆపదలు కలిగేది? అది అసంభవం. మీకు చేతనైతే ఇకమీదనైనా ఈ లోకంలో వారున్న చోటును వెదకి గుర్తించే ఉపాయాలను మీ నేర్పులు ఏర్పడేటట్లు చెప్పండి.'

**విశేషం:** 1. అలం: కావ్యలింగం, పరికరం. కుంతీ కుమారులంటే ధర్మజ, భీమార్జునులే అయినా ఆ మాట పాండవుల కందరికీ ఛత్రిన్యాయంతో వర్తిస్తుంది. ఆ అర్థాన్ని ఈ పద్యం సమర్థిస్తున్నది కూడా. ఇందులో పాండవులకు వాడిన విశేషణాలు అయిదు. పంచ పాండవులకు సామాన్య గుణాలుగా పంచ లక్షణాలుంటాయన్నది సార్థకోక్తి. అవి వారికి ఆపదలు కలుగవని ధ్రువీకరించటానికి హేతువు లవుతున్నాయి. అందువలన కావ్యలింగాలంకారం. విశేషణాలు సాభిప్రాయాలు కాబట్టి పరికరాలంకారం. క్షత్రియగుణం క్షాత్రం "క్షతాత్ త్రాయతే ఇతి క్షత్రః, తస్యాపత్యం క్షత్రియః- క్షత్రము వలన రక్షించువాడు కనుక క్షత్త్రుడు, వాని యపత్యము గనుక క్షత్రియుడు"అని గురుబాల ప్రభోధిక. ఎదుటివారిని నాశనం నుండి రక్షించే క్షత్రియుడు తాను నాశనం కాడు. ఆత్మహత్య చేసికొనడు. పైపెచ్చు క్షత్రియగుణాలన్నీ పూర్తిగా కలవారైన పాండవులు చావటం కల్ల. వారు పెద్దలచేత కీర్తించబడే గౌరవం, తేజస్సు కలవారు కాబట్టి మేధావులు వారిని లోకంలో పెట్టుకొని రక్షిస్తారు. వారి సోదర ప్రేమ భేదాలకు అతీతం కాబట్టి వారిలో వారు పోట్లాడుకొని చావకపోగా, ఒకరి కొకరు తోడుగా ఉండి స్వీయ రక్షణ చేసికొనగలరు. వారికి పురుషయత్నంతోపాటు దైవబలం కూడా దండిగా ఉన్నది. కాబట్టి వారికి దేవుడే యోగక్షేమాలు చూస్తాడు. ఇక పోగా, చివరకు వారే దేవతల వంటివారు. వారు మానవుల వలె చావరు. దైవశక్తులతోఅడ్డంకులను అధిరోహించ గలుగుతారు- అని ద్రోణుడు అన్నాడు. పాండవులు ఎట్టిపరిస్థితులలోనూ కష్టాలుపడలేక చనిపోయే బలహీనులుకారని తర్కసహంగా చెప్పాడు. వారిని కనుగొనలేని అసమర్థులు కౌరవులే అని వ్యంగ్యంగా అధిక్షేపించాడు. తెలివితేట లుంటే ఉపాయాలు చెప్పండని అవహేళన చేశాడు. వస్తుతత్త్వం తెలిసి వివేచించే వివేకం కౌరవులకు, విశేషించి దుశ్శాసనుడికి లేదని ద్రోణుడి ఆక్షేపణ. దుశ్శాసనుడి ప్రతిభ కౌరవులకు ప్రతినిధిగా నిలవటం శోచనీయం. ద్రోణుడీమాటలనటంలో పాండవ పక్షపాతంకంటె వాస్తవనిరూపణమే ముఖ్యం. (సంపా).

భీష్ముఁడు దుర్యోధనునితో ధర్మరాజు సుగుణంబులఁ జెప్పుట (సం. 4-27-1)

**వ. అనిన నాతని మాట లాదరించి భీష్ముం డిట్లనియె. 99**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా (ద్రోణుడు అట్లనగా); ఆతనిమాటలు+ఆదరించి= ద్రోణుడి మాటలను గౌరవించి; భీష్ముండు= భీష్ముడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ ద్రోణుడి మాటలను గౌరవించి భీష్ము డిట్లా అన్నాడు.

**ఉ. 'నల్లవొ! నిక్క మాడె నృపనందను ముందట ద్రోణుఁ డొక్కఁడుం;**
**దెల్లము; వారు బాహుబల ధీబల దైవబలంబు లొప్ప వ**
**ర్తిల్లుదు; రమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందు నేల పా**
**టిల్లెడు? వారిఁ గాన్పను గడింది తదీయ మహానుభావతన్. 100**

**ప్రతిపదార్థం:** నల్లవొ!= ఆహా! (ప్రశంసనీయం); ద్రోణుఁడు+ఒక్కఁడున్= ద్రోణుడొక్కడే; నృపనందనుముందటన్= రాజకుమారుడి ముందు (దుర్యోధనుడి ముందు); నిక్కము+ఆడెన్= నిజం చెప్పాడు; తెల్లము= ఇది నిజం; వారు= పాండవులు; బాహుబల, ధీబల, దైవబలంబులు= భుజబలం, బుద్ధిబలం, దైవబలం; ఒప్పన్= ప్రకాశించగా; వర్తిల్లుదురు= నడచుకొనేవారు; ఆ+మహాత్ములకున్= ఆ గొప్పవారికి; అరిష్టములు= అపాయాలు; ఏమిటన్= వేటి వలన; ఎందున్= ఎక్కడనైనా; ఏల= ఎందువలన; పాటిల్లెడున్?= కలుగుతాయి?; తదీయ= వారియొక్క; మహానుభావతన్= గొప్పతనము వలన; వారిన్= పాండవులను; కాన్పను= కనుగొనటం (గుర్తించటం); కడిందె= కష్టం (సాధ్యంకాదు).

**తాత్పర్యం:** 'ఆహా! రాజుముందు ద్రోణు డొక్కడే నిజం చెప్పాడు. అది స్పష్టం. పాండవులు బాహుబలం, బుద్ధిబలం, దైవబలం కలిగి వ్యవహరిస్తారు. అటువంటి మహాత్ములకు ఆపదలు ఎక్కడినుండి, ఎందుకు, ఎట్లా వస్తాయి? వారు మహానుభావులు కాబట్టి వారిని గుర్తించడం అసాధ్యమే ఔతుంది.

**విశేషం:** అరిష్టమంటే రిష్టము (శుభం) కానిది. అశుభం; కీడు; కష్టం. అది మానవులకు స్వేచ్ఛవలనగాని, పరేచ్ఛవలనగాని, అనిచ్ఛవలనగాని ఏర్పడవచ్చును. స్వయంకృత దోషాల వలన కలిగిన అశుభాలను, కష్టాలను అధిగమించటానికి దేహబలం కావాలి. పాండవులు మాయాద్యూత ఫలంగా అరణ్యాజ్ఞాతవాసాలు నిర్వహించారు. వారికి అటువంటి దేహబలం ఉన్నది. శత్రువుల వలన కాని, ఇతర కారణాల వలనగాని, సైంధవ, కీచకుల వలనగాని ఏర్పడే కష్టాలను దేహబలంతోపాటు బుద్ధిబలాన్ని కూడా ఉపయోగించి తరించారు. ఇక ఎవరి ప్రేరణ లేకుండా దైవికంగా కలిగే కష్టాలు అనిచ్ఛారిష్టాలు. పాండవులకు యక్షప్రశ్నల ఘట్టం వంటివి. వాటిని బుద్ధిబలంతో, దైవబలంతో తరించ గలిగారు. అందువలన పాండవులు అరిష్టత్రయాన్ని అధిగమించగలవారు. అటువంటివారిని మహాత్ములంటారు. త్రివిధ బలాలను తమ శక్తియుక్తులుగా మార్చుకొని ప్రవర్తనలో ప్రదర్శించగలిగినవారిని మహానుభావు లంటారు. మహానుభావులు తమ మహిమతో ఎదుటివారిచేత గుర్తించబడక గుప్తంగా ఉండగలరు. అందువలన వారిని అజ్ఞాతవాసంలో గుర్తించటం అసాధ్యం అని భీష్ముడు తర్కబద్ధంగా వివరించాడు. ద్రోణుడు పాండవులను మహావ్యక్తులుగా చెప్పగా, భీష్ముడు వారిని మహాత్ములుగా, మహానుభావులుగా అభివర్ణించాడు. వారికి ఆపదలు రావనీ, వారిని గుర్తించటం సాధ్యం కాదనీ స్పష్టంగా ఇద్దరూ చెప్పారు. వీరిద్దరూ విజ్ఞులు. (సంపా.)

**క. వారలును వీరలును నా । కారయఁగా నొక్కరూప యైనను గార్యం**
**బీ రెఱిఁగింప వలయునని । కౌరవపతి నన్ను నడిగెఁ గాన యితనికిన్. 101**

**ప్రతిపదార్థం:** వారలును= పాండవులున్నూ; వీరలును= కౌరవులున్నూ; అరయఁగాన్= చూడగా; నాకున్= నాకు; ఒక్కరూపు+అ= ఒక్కమాదిరివారే, సమానులే; ఐనను= అయినప్పటికిని; కార్యంబు= చేయవలసినపని; ఈరు+ఎఱిఁగింపన్, వలయున్= మీరు తెలియజేయాలి; అని= అంటూ; కౌరవపతి= దుర్యోధనుడు; నన్నున్+అడిగెన్= నన్నడిగాడు; కాన= కనుక; ఇతనికిన్= ఇతడికి (దుర్యోధనుడికి).

**తాత్పర్యం:** పాండవులూ కౌరవులూ నాకు సమానులే. అయినప్పటికి చేయవలసిన పనిని గూర్చి నన్నడిగినాడు కాబట్టి దుర్యోధనుడికి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఈ పద్యంలో భీష్ముడి అంతస్సంఘర్షణ వ్యక్తమౌతున్నది. పాండవులను గుర్తించటానికి ఉపాయం అడుగుతున్నాడు దుర్యోధనుడు. ఉపాయం చెప్పితే పాండవులకు అపాయం. భీష్ముడికి కౌరవ, పాండవు లిద్దరూ పౌత్రులే కాబట్టి బంధుత్వంలో సమానులే. ఇద్దరి మేలు కోరేవాడు పితామహుడు. కాని, ఒకరి మేలు మరొకరికి కీడు కాకూడదని భావించేవాడు. కాగా ఇన్నాళ్ళకు దుర్యోధనుడు ఈ దుష్టయత్నం చేస్తున్నట్లు పెద్దల ముందు పెట్టాడు. వేగులు విఫలులైనా ప్రయత్నాలను

ముందుకు సాగించాలని సంకల్పించి హితుల సలహాలు అడిగాడు. తెలిసిన విషయం చెప్పకపోతే నరకం వస్తుందని పెద్దల సూక్తి (చూడు ఆది. 1.136). అందువలన చెప్పదలచుకొన్నాడు. అయినా మహానుభావులైన పాండవులను గుర్తించటం అసాధ్యం అనే వాస్తవాన్ని అతడు కాదనటం లేదు. (సంపా.)

**క. కలరూ పెఱిఁగింపంగా । వలయుం; జెప్పెద మదీయ వచనములు హితం**
**బులు గాఁగ నిశ్చయ స్థితిఁ। దలఁచి యనుష్ఠింప బుద్ధి దలకొను నేనిన్. 102**

**ప్రతిపదార్థం:** కలరూపు= ఉన్నస్థితిని, వాస్తవాన్ని; ఎఱిఁగింపంగాన్+వలయున్= తెలియజెప్పవలసి ఉన్నది; మదీయ వచనంబులు= నా మాటలు; హితంబులు+కాఁగన్= మేలు కలిగించేవిగా; నిశ్చయస్థితిన్+తలఁచి= నమ్మకంగా భావించి; అనుష్ఠింపన్= ఆచరింపగా; బుద్ధి= మనసు; తలకొనునేనిన్= పుట్టినట్లయితే (ఆచరించాలని బుద్ధిపుట్టితే); చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** అడిగాడు కాబట్టి తెలిసిన వాస్తవాన్ని తెలియచెప్పాలి. నా మాటలు హితం చేకూర్చేవిగా భావించి తప్పక ఆచరిస్తే నేను చెప్పగలను.

**విశేషం:** హితుడుగా, పితామహుడుగా ఉన్నమాట ఉన్నట్లుగా చెప్పటం కర్తవ్యం. అది దుర్యోధనుడికి హితంగా తోస్తుందనే నమ్మకం లేదు. అయినా దుర్యోధనుడు నిశ్చయబుద్ధితో తన సలహాలను పాటిస్తాడనే భీష్ముడు చెప్పటం ఆరంభించాడు. నిజానికి భీష్ముడి ఉపాయమే భావికథాగతికి దోహదం కాబోతున్నదని ధ్వని. (సంపా.)

**సీ. బ్రాహ్మణభక్తియుఁ, బరహిత శక్తియు । నిర్మల మతియును, నీతి రతియు,**
**సత్యభాషణమును, సాధుపోషణమును । జిరవితరణమును, సేవ్యగుణము,**
**సన్మార్గరక్షయు, నున్మత్తశిక్షయు । నంచితోదయముఁ, గృపాతిశయము,**
**బంధు సంప్రీతియు, భవ్య విభూతియు । శాస్త్రోపగమము, నస్ఖలితదమము**

**తే. సజ్జన స్తవనీయ సౌజన్యములును । ధర్మసంచిత బహు ధన ధాన్యములును**
**గలుగు నక్షీణ పుణ్యదోహలుఁడు ధర్మ । సూనుఁ డున్న దేశంబున మానవులకు. 103**

**ప్రతిపదార్థం:** అక్షీణ పుణ్యదోహలుఁడు= అక్షయమైన పుణ్యాన్ని సాధించటంలో ఉత్సాహం కలవాడైన; ధర్మసూనుఁడు= ధర్మజుడు; ఉన్న దేశంబునన్= ఉండే ప్రాంతంలో (దేశంలో); మానవులకున్= ప్రజలకు; బ్రాహ్మణభక్తియున్= బ్రాహ్మణుల మీద భక్తీ; పరహితశక్తియున్= ఇతరులకు మంచిచేసే శక్తీ; నిర్మల మతియును= స్వచ్ఛమైన బుద్ధీ; నీతిరతియున్= నీతియందాసక్తీ; సత్యభాషణమును= నిజం మాట్లాడటమూ; సాధుపోషణమును= మంచివారిని (పండితులను) ఆదరించటమూ; చిరవితరణమును= చాలాకాలం నిలిచే దానమూ; సేవ్యగుణము= సేవించదగిన గుణమూ; సత్+మార్గరక్షయున్= మంచి నడవడికను కాపాడుటయూ; ఉన్మత్త శిక్షయున్= మదించిన దుర్మార్గులను శిక్షించుటయూ; అంచిత+ఉదయమున్= ఒప్పిదమైన అభ్యుదయమూ? కృపా+అతిశయమున్= మిక్కిలి దయగలిగి ఉండటమున్నూ; బంధుసంప్రీతియున్= బాంధవుల మీద అభిమానమూ; భవ్యవిభూతియున్= శుభకరమైన ఐశ్వర్యమూ; శాస్త్ర+ఉపగమమున్= శాస్త్రానుగుణమైన నడవడీ; అస్ఖలితదమము= జారిపోని ఇంద్రియ నిగ్రహమూ; సజ్జన స్తవనీయ= మంచివారిచేత కీర్తింపదగిన; సౌజన్యములును= మంచితనమున్నూ; ధర్మసంచిత= న్యాయంగా సమకూర్చబడిన; బహుధనధాన్యములును= పెక్కు ధనాలు, ధాన్యాలున్నూ; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** ధర్మరాజు నశించని పుణ్యాలను సాధించిన మహానుభావుడు. అత డే దేశంలో ఉంటే ఆ దేశ ప్రజలు పుణ్యవ్రతులుగానే ఉంటారు. వారు బ్రాహ్మణులయందు భక్తీ, ఇతరుల సేవ చేసే శక్తీ, నిష్కల్మషమైన బుద్ధీ, నీతివర్తనంలో అనురక్తీ, నిజం పలకటం, మంచివారిని గౌరవించటం, చాలా కాలం నిలిచే దానాలు చేయటం, సద్గుణశీలం, సన్మార్గ రక్షణం, దుష్టశిక్షణం, న్యాయమైన అభ్యుదయం, దయావేశం, బంధుజనాభిమానం, మాననీయ వైభవం, శాస్త్ర విజ్ఞానం, జారిపోని ఇంద్రియ నిగ్రహం, మంచివారు మెచ్చుకొనే మంచితనం, న్యాయార్జితాలైన బహువిధ ధనధాన్యాల సంభారం కలిగి ఉంటారు.

**విశేషం:** 1. మహాత్ముడైన ధర్మరాజు మహానుభావుడు. అతడిని భౌతికంగా గుర్తించటం అసాధ్యం. అతడి ఆత్మనిష్ఠమైన మహా గుణాలు అనుభావాలుగా అభివ్యక్తమై ప్రజలలో ప్రవహిస్తాయి. మహానుభావుల ఆత్మవిభూతి ప్రజలలో గుణవిభూతిగా ప్రసరిస్తుంది. మహాపురుషుడి ప్రభావం ప్రకృతిమీద ప్రతిఫలిస్తుంది. ఆ ప్రతిభవలన చైతన్యాన్ని గుర్తించగలిగితే దాని మూలమైన ధర్మరాజు ఉనికిని పసికట్టవచ్చునని భీష్ముడి ప్రబోధం. ఏ దేశంలో ధర్మరాజు ఉన్నా దానికి అతడు ఆత్మ. అతడి ప్రభావం ఆ దేశ శరీరమైన ప్రజల మీద తప్పకుండా కనబడుతుంది. దేహగుణాన్ని బట్టి దేహితత్త్వాన్ని తెలిపే ప్రస్థానం చెప్పాడు భీష్ముడు. 2. మహానుభావుడి ప్రభావం వలన మానవులు అష్టాదశ గుణాలను పొందుతారు. ఈ సీసపద్యంలో మొత్తం పదునెనిమిది గుణాలు చెప్పబడ్డాయి. బ్రహ్మసంఖ్యలో ఉన్న ఈ మహనీయ గుణాలు ధర్మజుడి యొక్క అక్షీణపుణ్యఫలాలు. విశేష మేమంటే- ఒక మహానుభావుడి వ్యక్తిత్వం మానవ ప్రకృతుల మీద వేసే ప్రభావాన్ని ఈ పద్యంలో వర్ణించి, పశు పక్ష్యాది జంతు జీవజాలం మీద పడే ప్రభావాన్ని రాబోయే పద్యంలో చెప్పుతున్నాడు. (సంపా.)

**క. మఱియును నొక్క విశేషం। బెఱిఁగించెద; నతని యున్న యెడ గోధనముల్**
**మెఱుఁగెక్కి పాఁడి నేమిం। గొఱఁతవడక యుండఁజేపి కురియుచు నుండున్ 104**

**ప్రతిపదార్థం:** మఱియునున్= ఇంకను; ఒక్క విశేషంబు+ఎఱిఁగించెదన్= ఒక విశేషాన్ని తెలుపుతాను; అతని+ఉన్న+ ఎడన్= ఆ ధర్మజుడున్నచోట; గోధనముల్= ఆవులనెడి సంపదలు; మెఱుఁగు+ఎక్కి= వన్నె గలిగిఅధికమై; పాఁడిన్= పాడిలో; ఏమిన్+కొఱతపడక= ఏ విధంగానూ తక్కువకాకుండా; ఉండన్= ఉండగా; చేపి= పొదుగున చేపువచ్చి; కురియుచున్+ఉండున్= (పాలధారలను) వర్షిస్తూ ఉంటాయి (అనగా పొదుగుల నుండి ధారాపాతంగా పాలు కురిపిస్తూ ఉంటాయని భావం.)

**తాత్పర్యం:** మరొక విశేషం చెప్పుతాను వినుము. ధర్మరాజు ఉన్నచోట ఆవులనెడి సంపదలు ఎప్పుడూ అభివృద్ధి చెందుతుంటాయి. ఆవులు పొదుగులు చేపి పాలు ధారలుగా కురుస్తాయి. పాడి ఎప్పుడూ తరగకుండా ఉంటుంది.

**విశేషం:** 1. ధర్మరాజు ఎక్కడ ఉంటే ఆ ప్రాంతంలో గోసంపద పెరుగుతుంది. పాడిపంటలు పరవళ్ళు త్రొక్కుతుంటాయి. మనుష్యుల ప్రవర్తనను పరిశీలించి తెలిసికొనేదానికంటె ఇటువంటి పశువుల ప్రవర్తనను చూచి తెలిసికొనటం సులభం. దుర్యోధనుడు సద్గుణధనుడు కాడు. అందువలన పశువుల గుణాలను గుర్తించి అయినా ధర్మజుడి జాడను పసిగట్టగలడని భావించి, అధమపక్షంగా భీష్ముడు దీనిని చివర చెప్పాడు. దుర్యోధనుడి తలకెక్కే దిదే. ఈ సూచనే గోగ్రహణ యుద్ధాలకు తరువాత కథలో దారితీసింది. భావి కథాగతికి బీజాన్ని నాటాడు భీష్ముడు.

2. భారతీయులకు గోవు వేదధర్మప్రతీక. పొదుగు సంస్కృతి ప్రతీక. నాలుగు పాలపీకల ద్వారా కురిసే క్షీరధారలు చతుర్విధ పురుషార్థ సాధన ప్రవృత్తులు. పాలు భారతీయ జీవన విధానం. దానిని వేడి చేయటం ఆధ్యాత్మిక చింతనతో జీవితాన్ని ఆముష్మికపరం చేయటం. మీగడ ఆధ్యాత్మిక ప్రవృత్తి, పెరుగు లౌకికాధ్యాత్మిక ప్రవృత్తుల అభేదరూపమైన ఘనః

ప్రవృత్తి, దానిని చిలకటం సాధన చతుష్టయం. పైకి తేరే వెన్న - నవనీతం - జీవన వేదాంత ఫలమైన మోక్షజ్ఞానం. వెన్నను తినటం మోక్షానుభవం - అని శ్రీకృష్ణుడి దివ్యచరితం చెప్పే ప్రతీకాత్మక ప్రబోధం. భాగవతంలో కృష్ణు డెక్కడుంటే అక్కడ గోసంపద అభివృద్ధి చెందుతుంది. ఇది యాదవదేశ లక్షణం. అట్లాగే భారతంలో ధర్మరా జెక్కడ ఉంటే ఆ లక్షణాలే కనబడతాయి. ఇది అతడిని కనుగొనడానికి కీలకం- అని భీష్ముడు విశేషాన్ని చెప్పాడు. ఆ మాట వెనుక, గోసంపద వెనుక భారతీయ సంస్కృతిపరమైన వేదాంత స్పృహ అవసరం. తాత్పర్యమేమంటే- మహానుభావత్వంలో ధర్మజుడు శ్రీకృష్ణుడివంటివాడని భీష్ముని ప్రతిపాదనలోని ధ్వని. (సంపా.)

**వ. కావున నిట్టి దేశం బిప్పు డెయ్యది యగు నందుఁ గుంతీ తనయుల నరయం బనుపవలయు' ననినఁ గృపాచార్యుం డిట్లనియె. 105**

**ప్రతిపదార్థం:** కావునన్= అందువలన; ఇట్టిదేశంబు+ఇప్పుడు+ఏ+అది+అగున్= ఈ విధమైన గుణాలు కలిగిఉన్న దేశం ఇప్పుడేది అయి ఉంటుందో; అందున్= ఆ దేశంలో; కుంతీ తనయులన్= కుంతీకుమారులను (పాండవులను); అరయన్= చూడగా; పనుపన్+వలయున్= పంపవలెను; అనినన్= అనగా; కృపాచార్యుండు+ఇట్లు+అనియెన్= కృపాచార్యు డిట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కాబట్టి, అటువంటి లక్షణాలున్న దేశం ఇప్పు డేదో ముందు గుర్తించి, అందులో పాండవులను వెదికించాలి' అని భీష్ముడు పలికిన తరువాత కృపాచార్యుడు ఇట్లా అన్నాడు.

**క. 'అరయఁగ నయ్యెడు తెఱఁగుల । నరయుట కార్యంబు; వారి నాలస్యము లే**
**కరయునది; పెక్కు భంగుల । నరసినఁ దోఁచెదరుగాక! యది యట్లుండెన్. 106**

**ప్రతిపదార్థం:** అరయఁగన్= గుర్తింపగా; అయ్యెడు= అగునట్టి; తెఱఁగులన్= పద్ధతులతో; అరయుట= వెదకటం; కార్యంబు= చేయదగినపని; వారిన్= పాండవులను; ఆలస్యము లేక= జాగు చేయకుండా; అరయునది= వెదకవలసింది; పెక్కుభంగులన్= అనేక విధములుగా; అరసినన్= వెదకినచో; తోఁచెదరు+కాక= కనుపిస్తారులే; అది+అట్లు+ఉండెన్= దానిని ఆ విధంగా ఉండనిండు.

**తాత్పర్యం:** 'పాండవులను వెదకే పద్ధతులను పరిశీలించటం ప్రస్తుత కర్తవ్యం. ఆలస్యం కాకుండా ఆ పని జరగాలి. పెక్కు రకాలుగా వెదకింప చేస్తే తప్పక దొరికి తీరుతారు. ఆ సంగతి అట్లా ఉంచుదాం.

**విశేషం:** కృపాచార్యుడు పాండవులను వెదకటానికి వేయివిధాలుగా మెరుగులుదిద్ది వేగంగా కావాలని నొక్కి చెప్పుతున్నాడు. (సైరంధ్రి పదమూడు రోజుల గడువు ప్రసక్తి చేసి ఉన్నది కాబట్టి) అజ్ఞాతవాసం ముగియటానికి కాలం సమీపించిందని అతడి అభిప్రాయంగా గ్రహించవచ్చును. ఆలస్యమైతే అమృతం కూడా విష మౌతుందని అతడి హెచ్చరిక! (సంపా.)

**ఉ. వారలు పూనినట్ల వనవాసము సల్పిరి, వీరు వేచి త**
**మ్మారయఁగా బయల్పడని యట్లుగ నుండెడు వత్సరంబునుం**
**జేరువ చేరువల్ గడచెఁ; జిత్తములుం గలుషంబు లమ్మహా**
**వీరుల కీ నృపాలునెడ, వీరికి నూరక యున్కి గర్జమే? 107**

**ప్రతిపదార్థం:** వారలు= పాండవులు; పూనిన+అట్లు+అ= పూనుకొన్న విధంగా (శుభం ప్రకారం); వనవాసము= అరణ్యావాసం; సల్పిరి= చేశారు; వీరు= కౌరవులు; వేచి= ఆగి ఉండి; తమ్మున్= తమను; ఆరయఁగాన్= గుర్తించగా; బయల్పడని+అట్లు= బయటపడని విధంగా (తెలియరాని విధంగా); ఉండెడు= ఉండవలసిన; వత్సరంబునున్= సంవత్సరం కూడా; చేరువ చేరువల్= దరిదాపుగా; కడచెన్= అయిపోవచ్చింది; ఆ+మహావీరులకున్= ఆ గొప్పవీరులకు; ఈ నృపాలు+ఎడన్= ఈ రాజుమీద; చిత్తములున్= మనసులు కూడా; కలుషంబులు= కోపంతోకూడి ఉన్నవి; వీరికిన్= ఈ కౌరవులకు; ఊరక+ఉన్కి= ఊరకుండటం; కర్జమే?= కార్యమేనా? (అనగా ఊరుకోరాదని).

**తాత్పర్యం:** పాండవులు మాట ప్రకారం వనవాసం చేశారు. అజ్ఞాతవాసవత్సరం కూడా దాదాపుగా అయిపోయింది. ఆ మహావీరులకు మనసున రాజుమీద కోపం బాగా ఉన్నది. కనుక వీరు ఊరకుండటం కార్యం కాదు.

**క. అలుచైనను బగతుని దెసఁ। దలఁపు గలుగవలయుననిన, దర్పోజ్జ్వల దో**
**ర్బలు లగు కౌంతేయుల మన। మెలమి కలిమి నచ్చి యిట్టు లేమఱ నగునే? 108**

**ప్రతిపదార్థం:** అలుచు+ఐనను= సామాన్యుడైనా; పగతునిదెసన్= శత్రువుని గూర్చి; తలఁపు= యోచన; కలుగన్+వలయున్= ఉండాలి; అనినన్= అనగా (అని పెద్దలు చెప్పగా); దర్ప+ఉజ్జ్వల దోర్బలులు= గర్వంతో వెలుగొందే భుజబలమున్నవారు; అగు= అయిన; కౌంతేయులన్= కుంతీకుమారులైన పాండవులను; మనము= మనం; ఎలమిన్= సంతోషంతో; కలిమి= సంపదను; నచ్చి= నమ్మి; ఇట్టులు+ఏమఱన్+అగునే?= ఈ విధంగా ఉపేక్షించవచ్చునా?

**తాత్పర్యం:** పగవాడు అల్పుడైనా అతడిపట్ల జాగరూగత కలిగి ఉండాలి అంటారు. కాగా, పాండవులు గర్వంతో కూడిన భుజబలం కలవారు. మనం మన సంపదల పెంపు మీది నమ్మకంతో వారిని గురించి ఆలోచించక ఉపేక్షించటం తగునా? (తగదని భావం).

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. కృపాచార్యుడు పాండవాన్వేషణ ప్రసక్తితోపాటు, పాండవులు బయలువెడలిన తరువాత ఎదుర్కొనవలసిన అంశాలపై దృష్టిసారించి సలహా లివ్వటం గమనించదగింది. అజ్ఞాతవాసకాలం దాదాపు ముగిసింది. కాబట్టి అన్వేషణ ప్రయత్నంతో పాటు అనంతర కార్యక్రమాన్ని గురించి ఆలోచించటం అవశ్యమని సలహా చెప్పాడు. (సంపా.)

**చ. మన బలమెంత యంతయు సమగ్ర సముద్యమ దుర్ధరంబుగా**
**మును మును గూర్చి, తోడుపడు మూఁకలకుం దగుమైఁ గ్రమ క్రమం**
**బున నెఱిఁగించి రాఁబనిచి, భూరి సముజ్జ్వల సైన్య జృంభణం**
**బున వెరవొంది యున్కి కురుభూపతి కిప్పటికార్య మారయన్. 109**

**ప్రతిపదార్థం:** మన బలము+ఎంత= మన సైన్యమెంత ఉన్నదో; అంతయున్= ఆ సైన్యమంతా; సమగ్ర= నిండైన; సముద్యమ= ప్రయత్నంతో; దుర్ధరంబుగాన్= అణచటానికి వీలులేనట్లుగా; మునుమునుకూర్చి= ముందుగానే సమకూర్చుకొని; తోడుపడు= (మనకు) సహాయంగా వచ్చే; మూఁకలకున్= సేనలకు; తగుమైన్= తగినరీతిగా; క్రమక్రమంబునన్= వరుసగా; ఎఱిఁగించి= తెలిపి; రాన్+పనిచి= రమ్మని ఉత్తరువుచేసి; భూరి= విస్తారమైన; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; సైన్య జృంభణంబునన్= సేనల మోహరింపుతో; వెరవు+ఒంది= ఉపాయము గలిగి; ఉన్కి= ఉండటం; కురుభూపతికిన్= దుర్యోధనుడికి; ఆరయన్= పరిశీలించగా; ఇప్పటి కార్యము= ఇపుడు చేయదగిన పని.

**తాత్పర్యం:** మన సైన్యమునంతటిని విరోధుల కసాధ్యంగా సిద్ధం చేసి, సహాయంగా వచ్చే సైన్యాలకు క్రమక్రమంగా తగిన విధంగా తెలిపి, వారు వచ్చేటట్లుగా ఉత్తర్వులిచ్చి విస్తారమైన సైన్య సమీకరణం చేసి, అతిశయించి అప్రమత్తంగా ఉండటమే ఇప్పుడు కురురాజు చేయవలసిన పని.

**విశేషం:** ఒకవేళ పాండవులు అజ్ఞాతవాస వ్రతానంతరం హస్తినాపురంమీద దాడి చేస్తే వచ్చే విపత్తును ముందుగానే ఊహించి సైన్య సమీకరణం తత్క్షణ కర్తవ్యమని రాజనీతిని సూచించాడు కృపాచార్యుడు. (సంపా.)

**ఆ. పాండురాజసుతులు బాసమై నడవడి । గడచి కయ్యమునకుఁ గాలుద్రవ్వ**
**కున్న యట్టులైన నన్నరనాథుతో । సంధిసేయు టొప్పు సముచితముగ. 110**

**ప్రతిపదార్థం:** పాండురాజసుతులు= పాండవులు; బాసమైన్= మాటప్రకారం; నడవడి= నడతను (అనగా అజ్ఞాతవాసపు నియమమును అని భావం); కడచి= దాటి; (పూర్తిచేసి); కయ్యమునకున్= యుద్ధానికి; కాలుద్రవ్వకున్న+అట్టులు+ఐనన్= యుద్ధానికి సిద్ధపడకపోతే; ఆ+నరనాథుతోన్= ఆ రాజుతో (ధర్మజుడితో); సముచితముగన్= తగినవిధంగా; సంధిచేయుటన్= సంధిచేసికొనటం; ఒప్పున్= తగును.

**తాత్పర్యం:** పాండవులు చేసిన బాసల ననుసరించి నడుచుకొని గడువును పూర్తిచేసికొన్న తరువాత యుద్ధానికి సిద్ధం కాకుండా ఉంటే ధర్మరాజుతో దుర్యోధనుడు శాంతితో సంధిచేసికొనటం ఉచితం.

**విశేషం:** పాండవులు అజ్ఞాతవాసం పూర్తిచేసి యుద్ధ ప్రయత్నాలు చేయకపోతే సంధి చేసికొనటం మేలని కృపాచార్యుడి సూచన. అజ్ఞాతవాసంలో ఉన్న పాండవులను గుర్తించటం సాధ్యం కాని పని అని చెప్పక చెప్పుతూనే తరువాతి ప్రయత్నాలను గురించి సలహా లివ్వటం ఇతడి మాటలలోని మర్మం. (సంపా.)

**క. ఏచి చలంబున నొంటికిఁ । జూచిన, నప్పటికి మనకుఁ జూడం గార్యం**
**బే చందంబునఁ దెఱఁగగు । నా చాలుట కోర్వవలయు; నది యట్లుండెన్. 111**

**ప్రతిపదార్థం:** ఏచి= విజృంభించి; చలంబునన్= అసూయతో (పట్టుదలతో); ఒంటికిన్+చూచినన్= ఒకే పక్షానికి మ్రొగ్గితే (ఏకపక్షంగా ఆలోచించి యుద్ధానికి సిద్ధమైతే); అప్పటికిన్= ఆ సమయానికి; మనకున్= మనకు; చూడన్= చూడగా; కార్యంబు= జరుగవలసిన పని; ఏ చందంబునన్= ఏవిధంగా; తెఱఁగు+అగున్= అనువుగా ఉంటుందో (సంధికి వీలుగా ఉంటుందో); ఆ చాలుటకున్= ఆ తీరుకు; ఓర్వవలయున్= సిద్ధపడాలి; అది అట్లు+ఉండెన్= అది అట్లా ఉండనీ.

**తాత్పర్యం:** పాండవులు సంధిని కాదని పట్టుదలతో ఒంటికాలిమీద లేవాలని చూస్తే (యుద్ధం చేయాలని పూనుకొంటే), అప్పటికి మన దృష్టిలో ఏ పద్ధతి మంచిదని తోస్తే ఆ విధంగా సిద్ధపడాలి. అది అట్లా ఉండనీ.

**విశేషం:** పాండవులు సంధికి అంగీకరించకుండా ఏకపక్షంగా యుద్ధాన్ని ప్రకటిస్తే అప్పటి వ్యూహం అప్పుడు చేసికొనవచ్చునని కృపాచార్యుడు చెప్పాడు. అటువంటి పరిస్థితి రాగూడదనీ, రాదనీ అతడు భావించినట్లున్నాడు. అయినా కీడెంచి మేలెంచుమన్నట్లు మాట్లాడాడు. 'అది అట్లా ఉండనీ' - అనేది కృపాచార్యుడి పాత్రోచిత పదవిన్యాసంగా తిక్కన కూర్చాడు. అనేక ప్రతిపాదనలు ఒకేసారి చేసేటప్పుడు ఈ మాటలు తరుచుగా అనటం లోకసామాన్యం. (సంపా.)

**క. వారలు లేరట పో, పెఱ । వారలఁ దగు భంగి మనకు వశ్యులఁ జేయన్**
**భూరి బలయుతుల మగుటయుఁ । గారణమను టనుమతంబు గాదే మనకున్.' 112**

**ప్రతిపదార్థం:** వారలు= పాండవులు; లేరు+అటపో= అక్కడ లేరనే అనుకో; పెఱవారలన్= ఇతర శత్రువులను; తగు భంగిన్= తగిన విధంగా; మనకున్+వశ్యులన్+చేయన్= మనకు లొంగేటట్లు చేయటానికి; భూరిబలయుతులము+అగుటయున్ కారణము= విస్తారమైన సైన్యబలం కలవారం కావటం కూడా ఒక కారణం; అనుట= అనటం; మనకున్= మనకు; అనుమతంబు కాదే?= అంగీకారం కాదా? (అంగీకారమే అని భావం.)

**తాత్పర్యం:** ఒకవేళ పాండవులు లేరనే అనుకొందాం. (చనిపోయారని భావిద్దాం). అప్పుడు (వారిని సమర్థించే) శత్రురాజులను తగినవిధంగా వశం చేసికొనాలన్నా మనకు అపార బలసంపద ఉన్నదనే కారణాన్ని లోకానికి చాటవలసిన అవసరం ఉంటుం దనుకొనటం అందరికీ ఆమోదయోగ్యమే ఔతుంది.'

**విశేషం:** కృపాచార్యుడు పాండవుల అన్వేషణ యత్నంలో తలయెత్తే పూర్వాపరాలను చర్చించి, తగిన వ్యూహాలను సూచించాడు. ఇతడి మాటలలో ప్రస్తుతానికి పనికివచ్చే ఉపాయాలకంటె భవిష్యత్తుకు పనికివచ్చే సూచనలే ఎక్కువగా ఉన్నాయి. (సంపా.)

**తే. ఇవ్విధంబునఁ దమ తమ యెఱుఁగు తెఱఁగు । లందఱును జెప్ప విని కురునందనుండు**
**దగ విచారించి కార్యంబు తెగువ గాంచి । యెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె. 113**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లాగు; అందఱును= అక్కడున్న వారందరూ; తమ తమ ఎఱుఁగు తెఱఁగులు= తమకు తెలిసిన పద్ధతులను; చెప్పన్+విని= చెప్పగా విని; కురునందనుండు= దుర్యోధనుడు; తగన్ విచారించి= బాగా యోచించి; కార్యంబు తెగువన్+కాంచి= ముందు చేయవలసిన పని తీరును నిశ్చయించి; ఎలమిన్= ప్రీతితో; వారలన్= కొలువులోనివారిని; కనుఁగొని= చూచి; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడివలెనే సభలోనివారు తమకు తోచిన పద్ధతులన్నిటిని చెప్పగా విన్నాడు దుర్యోధనుడు. బాగా యోచించి చేయవలసిన కార్యాన్ని నిశ్చయించి సభలోని వారందరినీ ఉద్దేశించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** సూచన లివ్వటం మంత్రుల, హితుల కర్తవ్యం. దానిని కూలంకషంగా ఆలోచించి తగిన నిర్ణయం తీసికొనటం రాజు కర్తవ్యం. ఆ రాజు చేసే నిర్ణయానికి తిరుగుండదు. (సంపా.)

**ఆ. 'సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు । హలధరుఁడు సమాన బలమువార,**
**లొండొరులను గెలుచు నుత్సాహమును గల । రుద్ధతులును బాహుయుద్ధపరులు. 114**

**ప్రతిపదార్థం:** సింహబలుఁడు= కీచకుడు; భీమసేనుండు= భీముడు; శల్యుండు= శల్యుడు; హలధరుఁడు= బలరాముడు; సమానబలము వారలు= సమానమైన బలం ఉన్నవారు; ఒండొరులను గెలుచు= ఒకరినొకరు గెలవాలి అనే; ఉత్సాహమును +కలరు= పూనికకూడా కలవారు; ఉద్ధతులును= గర్వితులు కూడా; బాహుయుద్ధపరులు= భుజయుద్ధంలో ఆసక్తి కలవారు.

**తాత్పర్యం:** 'కీచకుడు, భీమసేనుడు, శల్యుడు, బలరాముడు - ఈ నలుగురూ సమాన బలం కలవారు. ఒకరినొకరు జయించుకొనవలెనని ఉత్సాహపడే గర్విష్ఠులు, మల్లయుద్ధప్రియులు.

**విశేషం:** ఈ పద్యపు ఎత్తుగడలోనే దుర్యోధనుడి నిశ్చయం ధ్వనిస్తున్నది. 'సింహబలుడు' చనిపోయిన వృత్తాంతం చారులు చెప్పిన చివరి విశేషం. మిగతావారు అసలు దానిని పట్టించుకొనలేదు. దుర్యోధనుడు స్వయంగా గదాయుద్ధ, మల్లయుద్ధ నిపుణుడు. అందువలన సమస్యలోని ఆయువును పట్టుకొన్నాడు. తన నిర్ణయాన్ని తొందరపడకుండా, తర్కసహంగా, సభాసదులు అంగీకరించేటట్లు ప్రతిపాదిస్తున్నాడు. అందులో మొదటి అంశం ప్రసిద్ధ - జగదేక మల్లుల ప్రసక్తి. అందులో మొదట సింహబలుడిని పేర్కొన్నాడు. ఆ తరువాత భీముడిని చెప్పాడు. మూలంలో కూడా అధికపాఠంగా ఒక శ్లోకం దీనికి ఆలంబనగా కనబడుతున్నది.

"బలదేవశ్చ భీమశ్చ మద్రరాజశ్చ వీర్యవాన్
చతుర్థః కీచక స్తేషాం పంచమం నానుశుశ్రుమః"

ఇందులోని వరుస వేరు. బలరాముడు, భీముడు, శల్యుడు, ఆ తరువాత నాలుగవ వాడు కీచకుడు. చతుర్థుడు అంటే నాల్గవ వాడనీ, నాల్గవ కులం వాడనీ చెప్పవచ్చును. అందువలన కాబోలు అతడిని మూలంలో చివర చెప్పాడు. తెలుగులో అతడే మొదట నిలిచాడు. ఈ నలుగురూ తప్ప అయిదోవాడు లేడట! వారు ఉద్ధతులట! ఒకరి నొకరు గెలవాలని ఉత్సాహపడుతూ ఉంటారట! దీనిని బట్టి చూస్తే కీచకుడి వింతచావుకు భీముడు హేతువని ఊహించటం సహజం. ఒక ప్రతిపాదనలో హేతువు, వివరణ, వితర్కం, అనుమానం, నిశ్చయం అనే అయిదు దశలుంటాయి. దుర్యోధను డందులో హేతువు నీ పద్యంలో చూపించాడు. (సంపా.)

**క. ఈ నలువుర భుజశక్తుల । తో నెనయఁగఁజాలునట్టి దోర్బల మెందుం**
**గానము కావున వీరల । లోనన యొండొరుల కని గెలుపు సమకూరున్. 115**

**ప్రతిపదార్థం:** ఈ నలువుర భుజశక్తులతోన్= ఈ నలుగురి భుజబలాలతో; ఎనయఁగన్+చాలు+అట్టి= సరిపోలతగినట్టి; దోర్బలము= భుజబలం; ఎందున్= ఎక్కడాకూడా; కానము= చూడం; వీరలలోనన= ఈ నలుగురిలోనే; ఒండొరులకున్= ఒకరికొకరికి; అనిన్= యుద్ధంలో; గెలుపు సమకూరున్= జయం కలుగుతుంది.

**తాత్పర్యం:** ఈ నలుగురి భుజబలాలతో సరితూగజాలే భుజబలం మరెక్కడా కనబడలేదు కాబట్టి యుద్ధంలో ఈ నల్గురిలోనే ఒకరిమీద ఒకరు గెలవటం సాధ్యమౌతుంది.

**విశేషం:** ఆ నలుగురిలోనే ఒకరిమీద ఒకరికి విజయం సాధ్యం అనే కీలకమైన వివరణం హేతువును బలపరుస్తున్నది. ఇది దుర్యోధనుడి నిశ్చయ ప్రతిపాదనలో రెండవ దశ. (సంపా.)

**ఉ. తక్కినవార లాతనికి దవ్వుల చోటులవారు; వాయుజుం**
**డొక్కఁడ యింక సింహబలు నుద్ధతి మాన్చిన మాన్చువాఁ; డతం**
**డక్కడ నిల్చెఁ గావలయు; నాసతి ద్రౌపది గాఁగ నోపు; వే**
**ఱొక్కరుఁ డాజిఁ గీచకుల నోర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే? 116**

**ప్రతిపదార్థం:** తక్కినవారలు= మిగిలినవారు (శల్యుడు, బలరాముడు); ఆతనికిన్= ఆ సింహబలుడికి; దవ్వులచోటులవారు= దూరప్రదేశాలలో ఉన్నారు; ఇంకన్= ఇకపోగా; వాయుజుండు+ఒక్కఁడు+అ= వాయునందనుడు (భీముడు) ఒక్కడే; సింహబలు +ఉద్ధతిన్= కీచకుడి గర్వాన్ని; మాన్చినన్ మాన్చువాఁడు= అణచవలసి వస్తే అణచగలిగినవాడు; అతండు= ఆ భీముడు;

అక్కడన్= ఆ నగరంలో; నిల్చెన్+కావలయున్= ఉండి ఉండవచ్చును; ఆ సతి= ఆ ఇల్లాలు; ద్రౌపది కాఁగన్+ఓపున్= ద్రౌపదియై ఉండవచ్చును; వేఱు+ఒక్కరుఁడు= (భీముడు కాక) మరొకడు; ఆజిన్= యుద్ధంలో; కీచకులన్= కీచకుల నందరినీ; ఓర్వఁగన్+చాలమిన్= ఓడించలేకపోవటాన్ని; మీరు+ఎఱుంగరే?= మీకు తెలియదా?

**తాత్పర్యం:** శల్య బలరాములు ఆ సింహబలుడికి సుదూరప్రాంతాలలో ఉన్నారు. భీమసేను డొక్కడే ఆ సింహబలుడి గర్వాన్ని అవసరం వస్తే అణచగలవాడు. అతడు ఆ విరటుడి పట్టణంలో ఉండి ఉంటాడు. ఆ ఇల్లాలు ద్రౌపది అయి ఉంటుంది. భీముడు కాక మరొక్కడు యుద్ధంలో కీచకులనందరినీ ఒక్కసారిగా మట్టుపెట్టలేడన్న సంగతి మీకూ తెలుసు.

**విశేషం:** ఇందులో సహేతుకమైన వితర్కం ఉన్నది. బలరాముడు, శల్యుడు అక్కడ ఉండటానికి వీలు లేదు. పరిశేషన్యాయంతో భీముడే అక్కడ ఉండి ఉండాలి. ఒక ఇల్లాలు కారణంగా కీచకుడు, ఉపకీచకులు వింతచావు చచ్చారన్న వార్త. ఆ ఇల్లాలు పాండపత్నియే అయి ఉండాలి. ఆమె జగదేకసుందరి కావటం దాన్ని బలపరుస్తున్నది. ఆమెను రక్షించటం కొరకు భీముడు కీచకులనందరినీ ఒక్కసారిగా చంపి ఉండాలి. అట్లా చంపగలగటం అతడికే సాధ్యం కాబట్టి, అక్కడ ఉన్నవాడు భీముడే అని వితర్కించి అందరినీ ఒప్పించాడు రారాజు. (సంపా.)

**క.** **గంధర్వు లను నెపంబున । నంధతమసగూఢవృత్తి ననిలసుతుఁడు గ**
**ర్వాంధమతియైన సూతు స । బాంధవముగఁ జంపెఁ గాక, పరులకు వశమే?** **117**

**ప్రతిపదార్థం:** అనిలసుతుఁడు= వాయుపుత్రుడైన భీముడు; గంధర్వులు+అను నెపంబునన్= గంధర్వులనే మిషతో; అంధ తమస= కన్నుపొడుచుకున్నా కనబడని చీకటిలో; గూఢవృత్తిన్= తెలియరాని రహస్య ప్రవర్తనతో; గర్వ+అంధమతి+ఐన సూతున్= పొగరుతో కన్నుగానని కీచకుడిని; సబాంధవముగన్= బంధువులతో సహా; చంపెన్+కాక= చంపి ఉంటాడు; పరులకున్= ఇతరులకు; వశమే?= అది సాధ్యమా? (కాదని భావం).

**తాత్పర్యం:** భీముడే గంధర్వుల మిషతో చిమ్మచీకట్లో రహస్య పద్ధతిలో గర్వాంధుడైన కీచకుడిని బంధువులతో సహా చంపి ఉంటాడు. అతడికిగాక ఇతరులకు ఆ పని సాధ్యమా?

**విశేషం:** ఇందులో భీముడే గంధర్వుల పేరుతో కీచకులను సంహరించి ఉంటాడనీ, అది అతడికే సాధ్యమనీ తార్కిక అనుమానాన్ని ప్రతిపాదించాడు. ఇది నిశ్చయానికి ముందున్న నాల్గవ దశ. (సంపా.)

**వ.** **పితామహుం డుపదేశించిన లక్షణంబు లద్దేశంబున గలిగి యుండునని విందుము; పాండవులు ప్రచ్ఛన్న వేషంబున విరటు ప్రోల వసియించినవారు గావలయు; నతండును బ్రతిభటుం డయి భంగించుచుండుం; గావున నతని పయి నెత్తిపోయి తదీయ గోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు; రయ్యవసరంబున మనము సమయ భంగంబు చెప్పి వారలం గ్రమ్మఱఁ బండ్రెండు వత్సరంబులు వనవాసంబు సలుపంబుత్తు; మట్లైన నప్రతిహతంబుగాఁ జతురంతభూచక్రం బాక్రమించి కీర్తనీయులమై వర్తిల్లుదుము; కుంతీనందను లందులేక తక్కిన మత్స్యపతి సమస్త వస్తువులను జూఱగొంద; మదియును లాభంబ; యెల్లభంగుల నిప్పటి కిదియె కార్యంబు; మీకు నందఱకుం జూడఁబోలునేని దీని కనురూపం బగు**

**నుద్యోగంబు సేయుం 'డనినఁద్రిగర్తాధీశ్వరుండగు సుశర్మ తొలుతఁ గర్ణ దుశ్శాసనులతోఁ గొండొక ప్రసంగించి వారల యనుమతి నవనీపతితో నిట్లనియె. 118**

**ప్రతిపదార్థం:** పితామహుండు= తాత (భీష్ముడు); ఉపదేశించిన లక్షణములు= తెలియజెప్పిన గుర్తులు; ఆ+దేశంబునన్+కల్గి ఉండున్+అని= ఆ విరటుడిదేశంలో ఉన్నాయని; విందుము= వింటున్నాము; పాండవులు; ప్రచ్ఛన్న వేషంబునన్= రహస్యమగు వేషంతో; విరటుప్రోలన్= విరటుని నగరంలో; వసియించిన వారు కావలయున్= నివసిస్తూ ఉండి ఉంటారు; అతండును= ఆ విరాటుడు కూడా; ప్రతిభటుండు+ఐ= మనకు విరోధి అయి; భంగించుచున్+ఉండున్= అవమానిస్తూ ఉంటాడు; కావునన్= కనుక; అతని పయిన్= అతడి మీదకు; ఎత్తిపోయి= దండెత్తిపోయి; తదీయ గోధనంబులన్ గ్రహించినన్= అతడి పశుసంపదలను లోబరుచుకొంటే; ధర్మతనయుండును+తమ్ములున్= ధర్మరాజూ, అతని తమ్ములూ; అడ్డపడన్= అడ్డగించటానికి; పఱతెంతురు= వస్తారు; ఆ+అవసరంబునన్= ఆసమయంలో; మనము; సమయభంగంబుచెప్పి= అజ్ఞాతవాస నియమం మధ్యలోనే భంగమై పోయిందని నిరూపించి; వారలన్= పాండవులను; క్రమ్మఱన్= మరల; పంద్రెండు వత్సరంబులు= పంద్రెండేండ్లు; వనవాసంబు +చలుపన్= అరణ్యావాసం చేయడానికి; పుత్తము= పంపుదాము; అట్లు+ఐనన్= ఆవిధంగా అయితే; అప్రతిహతంబుగాన్= అడ్డులేకుండా; చతుః+అంతభూచక్రంబు+ఆక్రమించి= నాలుగు దిక్కుల భూమివలయాన్ని ఆక్రమించుకొని; కీర్తనీయులము+ఐ= పొగడదగిన వారంగా; వర్తిల్లుదుము= ఉంటాము; కుంతీనందనులు= పాండవులు; అందున్+లేక= అక్కడలేకుండా; తక్కినన్= తొలగిపోయినచో; మత్స్యపతి= మత్స్యదేశపు రాజుయొక్క; సమస్త వస్తువులను= అన్ని వస్తువులను (సంపదనంతటిని); చూఱగొందము= కొల్లగొట్టుదాము; అదియును= అదికూడా; లాభంబు+అ= లాభమే; ఎల్లభంగులన్= అన్ని విధాలుగా; ఇప్పటికిన్= ఈ సమయానికి; ఇదియె= ఇదే; కార్యంబు= చేయదగినపని; మీకున్+అందఱకున్+చూడన్+పోలున్+ఏని= మీరందరూ పరిశీలించగా ఇది తగిన కార్యమని అనిపిస్తే; దీనికిన్+అనురూపంబు+అగు= దీనికి తగిన; ఉద్యోగంబు= ప్రయత్నం; చేయుండు= చేయండి; అనినన్= అని అనగా; త్రిగర్త+అధీశ్వరుండు+అగు= త్రిగర్త దేశపురాజు అయిన; సుశర్మ= సుశర్మ అనేవాడు; తొలుతన్= ముందుగా; కర్ణదుశ్శాసనులతోన్= కర్ణుడితోను, దుశ్శాసనుడితోను; కొండొక ప్రసంగించి= కొంత మాటలాడి; వారల అనుమతిన్= వారి ఆమోదంతో; అవనీపతితోన్= రాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** తాతగారైన భీష్ముడు తెల్పిన గుర్తులు అన్నీ విరటుడి దేశంలో ఉన్నవని వింటున్నాము. మారువేషాలతో పాండవులు విరాటనగరంలో నివసిస్తూ ఉన్నారేమో! విరాటుడు కూడా మనకు విరోధివలె నడచుకొంటూ మనలను ధిక్కరిస్తూ ఉంటాడు. కాబట్టి అతడి మీదికి దండెత్తిపోయి, అతడి గోసంపదను గ్రహిస్తే ధర్మరాజు, అతడి తమ్ములూ మనలను అడ్డగించటానికి వస్తారు. అపుడు వారి అజ్ఞాతవాస నియమం భంగమైపోయిందని తెలియచెప్పి పాండవులను మరల పన్నెండేండ్లు వనవాసంచేయటానికి పంపుదాము. అట్లయితే అడ్డులేకుండా ఈ భూవలయాన్నంతా ఆక్రమించుకొని అపారకీర్తిని అందుకొందాము. వా రక్కడ లేకుంటే విరాటుడి సంపదనంతా కొల్లగొట్టుదాము. అది కూడా మనకు లాభమే. అన్ని విధాలుగా మన మిప్పటికి చేయదగిన పని ఇదే. మీరందఱు దీని నంగీకరిస్తే దీని కనుగుణంగా ప్రయత్నం చేయండి' అని దుర్యోధనుడు పలుకగా త్రిగర్తదేశాధీశ్వరుడైన సుశర్మ లేచి కర్ణదుశ్శాసనులతో ముందుగా మంతనాలాడి వారి అనుమతి పొంది దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఇందులో దుర్యోధనుడు తీర్పువంటి నిశ్చయాన్ని ప్రకటించాడు. దానికి అనువుగా చారుల వార్తను, భీష్ముడి సూచనలను ఉపపత్తులుగా పేర్కొన్నాడు. తన వ్యూహం సఫలమైనా, విఫలమైనా లాభదాయకంగా ఉంటుందని నిరూపించాడు. పాండవులు నియమం పూర్తి కాకుండానే బయటపడే బలమైన కారణాన్ని కల్పించి చూపాడు. పాండవులను వధించకుండా

మరల అరణ్యాజ్ఞాత వాసాలు చేయించేటట్లు చెప్పి, పెద్దలు కాదనకుండా చేశాడు. అజ్ఞాతవాసం జనపదంలోనే సాగుతుంది. కాబట్టి విరాటనగరం వారున్న స్థలంగా నిర్ణయించాడు. అజ్ఞాతవాసం భగ్నం చేయటం ధర్మవిరుద్ధం కాదని సూచించాడు. మత్స్యపతి మీద దాడికి సహజ శత్రుత్వాన్ని సహజ కారణంగా చెప్పాడు. ఫలితంగా నిశ్చింతగా విశాల రాజ్యాన్ని పాలించటాన్ని నిర్ధారించాడు. సమర్థమైన వ్యూహాన్ని పన్ని సభలో అంగీకారానికి ఉంచాడు. నిజానికి అతడి నిర్ణయం ఎవ్వరూ కాదనటానికి వీలులేనంత పటిష్ఠంగా ఉన్నది. అతడి వాద నైపుణ్యం అంత బలంగా ఉన్నది. ఇక ఎవరైనా మాట్లాడితే దానికి అనుకూలంగా పలుకవలసిందే కాని ప్రతికూలత పనికిరాదు. అట్లా పలికినా దుర్యోధనుడు వినడు. అది అందరికీ తెలుసు. అందువలననే స్వార్థంతో పాటు ప్రభువు పరమార్థాన్ని కూడా సాధింపదలచుకొన్న సుశర్మ లేచాడు. రాజుతో సూటిగా మాట్లాడే సాన్నిహిత్యం లేనివాడైన సుశర్మ కర్ణ దుశ్శాసనులతో తన మనసులో మాట చెప్పి, వారి అనుమతితో రాజుతో చెప్పటానికి పూనుకొన్నాడు. అట్లా చేయటం సేవాధర్మం కూడా (విరా.1.127). (సంపా.)

**క. 'కేకయ సాల్వులు తోడుగ । నా కీచకుఁ డాజి నన్ను నపజితుఁ జేసెం;**
**జాకుండమున్న యొకపరి । నా కాతని తోడ భండనము లేదయ్యెన్. 119**

**ప్రతిపదార్థం:** కేకయ సాల్వులు తోడుగన్= కేకయులు సాల్వులు సాయంరాగా; ఆ కీచకుఁడు; ఆజిన్= యుద్ధంలో; నన్నున్= నన్ను; అపజితున్+చేసెన్= ఓడించాడు; చాకుండమున్న+అ= వాడు చావటానికి ముందే; ఒకపరి= ఒక్కమారు; నాకున్= నాకు; ఆతనితోడన్= అతడితో (కీచకుడితో); భండనము= యుద్ధం; లేదు+అయ్యెన్= కలుగలేదు.

**తాత్పర్యం:** 'కేకయ సాళ్వుల సహాయంతో కీచకుడు యుద్ధంలో న న్నోడించాడు. కాని, అతడు చచ్చేలోగా వాడితో ఒకమారు కూడా యుద్ధం చేసే అవకాశం నాకు కలుగలేదు.

**ఉ. భంగముతోడ నున్న ననుఁ బంపు విరాటునిమీఁద; భూమికిం**
**జెంగట నుండు నా దయిన జీతపు టూళ్ళను; సంతతంబు వా**
**నిం గడు గాసిసేయు నతనిం జెఱుపం దఱి యయ్యెఁ; ముట్టి స**
**ప్తాంగముఁ జూఱఁదెచ్చెద నహంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. 120**

**ప్రతిపదార్థం:** భంగముతోడన్+ఉన్న= ఓటమి వలన కలిగిన అవమానంతో ఉన్న; ననున్= నన్ను; విరాటునిమీఁదన్= విరాటుడిపైకి; పంపు= యుద్ధానికి పొమ్మని ఆజ్ఞాపించుము; భూమికిన్+చెంగటన్= దేశానికి దగ్గరగా; నాదయిన జీతము+ఊళ్లను= నా జీతగాళ్ళున్న (మాన్యాలకిచ్చిన) ఊళ్ళు; ఉండున్= ఉన్నాయి; సతతంబున్= ఎల్లప్పుడు; వానిన్= ఆ గ్రామాలను; కడున్ గాసి+చేయున్= మిక్కిలి కష్టపెట్టుతాడు; అతనిన్= ఆ విరటుడిని; చెఱుపన్= నశింప చేయటానికి; తఱి= సమయం; అయ్యెన్= అయింది, వచ్చింది; ముట్టి= దాడిచేసి; సప్తాంగమున్= స్వామి, అమాత్యుడు, మిత్రుడు, కోశం, రాష్ట్రం, దుర్గం, సైన్యం అనే ఏడు అంగాలతో ఉండే రాజ్యాన్ని; చూఱన్+తెచ్చెదన్= కొల్లగొట్టి తెస్తాను; అహంకృతి+ఎల్లన్= అతడి గర్వమంతటినీ; అడంచి= పోగొట్టి; వచ్చెదన్= వస్తాను.

**తాత్పర్యం:** ఓటమితో క్రుంగిపోయే నన్ను విరాటుడి మీదికి పంపుము. విరాట దేశానికి సమీపంలో నా రాజ్యపు పొలిమేరలలో ఉండే వాళ్ళకు ఇచ్చిన జీతాల గ్రామాలున్నాయి. విరాటుడు ఆ ఊళ్ళపైబడి పీడిస్తూ ఉంటాడు. ఇప్పు డతడిని మట్టుపెట్టే సమయం వచ్చింది. నేను విరాటనగరాన్ని ముట్టడిస్తాను. ఆ రాజ్యంలోని సప్తాంగాలనూ కొల్లగొట్టి తీసికొని వస్తాను. అతడి గర్వాన్ని అణచి తిరిగివస్తాను.

**ఆ. ఉద్దవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు। నతఁడు వెనుకవచ్చి యడ్డుపడిన**
**చోటఁ బాండురాజు సూనుల నరయుదు। నెల్ల భంగి దీని కేన తగుదు.' 121**

**ప్రతిపదార్థం:** ఉద్దవిడిన్+అ= వెంటనే; పసులన్= పశువులను; ఊఁచముట్టుగన్+తెత్తున్= నిశ్శేషంగా తీసికొనివస్తాను; అతఁడు= ఆ విరాటుడు; వెనుకన్+వచ్చి= ఆవులను వెన్నంటి వచ్చి; అడ్డుపడినచోటన్= అడ్డగించిన చోట; పాండురాజుసూనులన్+అరయుదున్= పాండురాజు కుమారులను గుర్తిస్తాను; ఎల్లభంగిన్= అన్ని విధాలా; దీనికిన్= ఈ పనికి; ఏను+అ తగుదున్= నేనే తగుదును.

**తాత్పర్యం:** వెంటనే గోవులను నిశ్శేషంగా మరలించి తెస్తాను. విరటుడు వెనుబాటున వచ్చి అడ్డుపడినప్పుడు పాండవులను గుర్తిస్తాను. దీనికి నేనే తగిన వాడను.'

**వ. అనవుడుఁ గర్ణుం డిట్లనియె. 122**

**తాత్పర్యం:** (సుశర్మ) అట్లా అనగానే కర్ణుడు ఈ విధంగా పలికాడు.

**క. 'బరవసముమైఁ ద్రిగర్తే। శ్వరుఁ డిట్లను టుచిత; మింక జననాయకుఁ డె**
**ప్పరుసున నానతి యిచ్చెను। దొర లేమని రట్లచేయఁ దుదిఁ గార్య మగున్.' 123**

**ప్రతిపదార్థం:** బరవసముమైన్= ధైర్యంతో; త్రిగర్త+ఈశ్వరుఁడు= త్రిగర్తరాజగు సుశర్మ; ఇట్లు+అనుట= ఈ విధంగా మాట్లాడటం; ఉచితము= న్యాయంగా ఉన్నది; ఇంకన్= ఇక; జననాయకుఁడు= రాజు; ఏ+పరుసునన్= ఏ రీతిగా; ఆనతి+ఇచ్చెన్= ఉత్తరువిస్తాడో; దొరలు+ఏమనిరి= పెద్దలు ఏమాంటారో; అట్లు+అ= ఆ మాదిరిగానే; చేయన్= చేసినట్లయితే; తుదిన్= తుదకు (ఆఖరుకు); కార్యము+అగున్= పని ఔతుంది.

**తాత్పర్యం:** 'త్రిగర్తరాజు ధైర్యంతో ఈ విధంగా పలుకటం ఉచితంగా ఉన్నది. రాజు ఎట్లా ఆజ్ఞాపిస్తే, పెద్దలు ఎట్లా అంటే ఆ విధంగా చేయటమే చివరకు కర్తవ్యం అవుతుంది.'

**విశేషం:** సుశర్మ అభ్యర్థనను కర్ణుడు బలపరిచాడు. కాని, తుదినిర్ణయాన్ని రాజుకూ, పెద్దలకూ వదలిపెట్టాడు.

**చ. అను నినసూనుమాట విని యందఱఁ గన్గొని పెద్దలెల్ల ని**
**న్ననుమతిసేయ సైన్యముల నన్నిటిఁ బన్నఁగఁ బంపు; రెండుమై**
**ల నడత; మీ త్రిగర్తుల బలంబుల ముందటఁ బంచి, వానిపో**
**యిన మఱునాఁడు పోద' మనియెం గురునాథుఁడు దుస్ససేనుతోన్. 124**

**ప్రతిపదార్థం:** అను+ఇనసూనుమాట విని= అని చెప్పుతున్న సూర్యపుత్రుడి (కర్ణుడి) మాట విని; అందఱన్+కన్గొని= అందరను చూచి; పెద్దలు+ఎల్లన్= (సభలోని) పెద్దవారందరూ; నిన్నున్+అనుమతిచేయన్= నీకు తమ అంగీకారాన్ని తెలుపగా; సైన్యములన్+అన్నిటిన్= సైన్యాలన్నిటిని (చతురంగబలాలను); పన్నఁగన్+పంపు= సిద్ధం చేయటానికి ఆజ్ఞాపించుము; రెండుమైలన్+నడతము= రెండు విధాలుగా సైన్యాలను నడుపుకుంటూ వెళ్ళుదాము; ఈ త్రిగర్తుల బలంబులన్= ఈ త్రిగర్తదేశ

సైన్యాలను; ముందటన్= ముందుగా; పంచి= పంపి; వానిపోయిన మఱునాఁడు= అవి వెళ్ళినరెండవరోజున; పోదము= మనం సైన్యాలతో పోదాము అని; కురునాథుఁడు= దుర్యోధనుడు; దుస్ససేనుతోన్= దుశ్శాసనుడితో; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడి మాటలు విని దుర్యోధనుడు అందరిని కలయచూచాడు. ఆ తరువాత దుశ్శాసనుడితో ఇట్లా అన్నాడు. 'సభలోని పెద్దలందరూ నీ కనుమతి ఇచ్చారు. చతురంగ బలాలను సన్నద్ధం చేసి రెండు విధాలుగా నడపాలి. ఈ త్రిగర్త దేశపు సైన్యాలు ముందుగా బయలుదేరి పోవాలి. మఱునాడు మనం సైన్యాలతో పోదాము.'

**విశేషం:** కర్ణుడు సుశర్మకోర్కెను మన్నించుమని దుర్యోధనుడితో అన్నాడు. పెద్దల అనుమతిని కూడా పరిగణనలోకి తీసికొనుమన్నాడు. కర్ణుడి సలహా రారాజుకు నచ్చింది. సభలో ఉన్నవారందరినీ కలయచూచాడు. మరెవ్వరూ మాట్లాడలేదు. అది వారి అనుమతిగా లెక్కగట్టాడు. అతడి చూపులే అతడి మాటలు. కర్ణుడి మాటలే అతడి మాటలు. వారిద్దరి స్నేహం అటువంటిది. ఆజ్ఞ సుశర్మకు కాదిచ్చింది, దుశ్శాసనుడికి. అతడు దుర్యోధనుడి సైన్యాధిపతి. సుశర్మ సామంతుడు. అందువలన సామంతుడితో సూటిగా మాట్లాడలేదు- అది రారాజు రాజదర్పం. రారాజు చురుకుగా ఆలోచించాడు. సైన్యాల దాడి ద్విముఖంగా సాగాలని నిర్ణయించాడు. ఒకటి సుశర్మ రాజ్యం వైపు నుండి, రెండవది కురురాజ్యం వైపు నుండి, మొదటి దాడి జరిగిన రెండవ రోజు రెండవ దాడి. (సంపా.)

**చ. అనుటయు ఫాలభాగ కలితాంజలియై యతఁ 'డట్ల చేయువాఁ**
**డ' ననిన, మేదినీశుఁడు దృఢం బగు నిశ్చయ మెల్లవారుఁ గై**
**కొనుటకుఁ గార్య బోధమునకుం దగఁ జుట్టుల నున్న వారలం**
**గనుఁగొని యాదరాధిక సగౌరవ భావనతోడ నిట్లనున్.** **125**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఫాలభాగ= నుదుటిపై; కలిత= చేర్చబడిన; అంజలి+ఐ= చేతులు జోడించి దండంపెట్టినవాడై; అతఁడు= ఆ దుశ్శాసనుడు; అట్లు+అ చేయువాఁడన్= ఆ విధంగానే చేస్తాను; అనినన్= అని అనగా; మేదినీ+ఈశుఁడు= రాజయిన దుర్యోధనుడు; దృఢంబు+అగునిశ్చయము= గట్టి నిర్ణయాన్ని; ఎల్లవారున్+కైకొనుటకున్= అందరూ తీసికొనటానికి; కార్యబోధమునకున్= చేయవలసినపనికి సంబంధించిన తెలివిడికి; తగన్= తగునట్లుగా; చుట్టులన్= తన చుట్టుప్రక్కల; ఉన్నవారలన్= ఉన్నవారిని; కనుఁగొని= చూచి; ఆదర+అధిక సగౌరవ భావనతోడన్= మిక్కిలి మర్యాదతో గౌరవంతో కూడిన భావనతో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని దుర్యోధను డనగానే దుశ్శాసనుడు నుదుటిమీద చేతులు జోడించి వినయంతో 'అట్లాగే చేస్తాను' అని అన్నాడు. ఆ తరువాత దుర్యోధనుడు తన గట్టి నిర్ణయం అందరికీ అర్థం కావాలనీ, చేయవలసిన కార్యక్రమం స్పష్టంగా కావాలనీ భావించాడు. తన చుట్టూ ఉన్న ముఖ్యులందరినీ మిక్కిలి ఆదరగౌరవాలతో చూస్తూ ఇట్లా అన్నాడు.

**విశేషం:** వెనుకటి పద్యంలో దుర్యోధనుడు సైన్యాలు రెండుగా నడవాలని, రెండు రోజులలో సాగాలని స్థూలమైన ఆదేశం ఇచ్చాడు. దాన్ని కార్యాచరణలో పెట్టే పద్ధతిని ఇందులో వివరిస్తున్నాడు. వెనుకటిది ఆజ్ఞ, ఇప్పటిది ఆచరణ సూచకమైన వివరణ (Action Plan). ఇవి వ్యూహ నిర్వాహకులకు తెలియాలని చెప్పాడు. పఠితలకు కూడా అవసరమే. రాజు యుద్ధాలు చేసేటప్పుడు ఇచ్చే ఆజ్ఞల, వివరణల విశేషాలు తిక్కనకు కొట్టినపిండి. (సంపా.)

ఉ. 'మున్ను సుశర్మ దాను బలముం జని గోవులఁ బట్టుఁ; బట్టినన్
వెన్నడి వచ్చు మత్స్య పృథివీపతి సేనల నెల్లఁ గొంచు శౌ
ర్యోన్నతి సూపువాఁడయి; సముద్ధతిమై నిట వేఱ కౌరవుల్
కొన్నిటిఁ బట్టఁ గయ్యమునకుం బఱతెంతురు పాండునందనుల్. 126

**ప్రతిపదార్థం:** మున్ను= ముందుగా; సుశర్మ= సుశర్మ; తాను= తానూ; బలమున్+చని= సైన్యమునూ వెళ్లి; గోవులన్+పట్టున్= ఆవులను ముట్టడిస్తాడు; పట్టినన్= ఆవులను పట్టుకొంటే; వెన్నడి= వెన్వెంటి; మత్స్యపృథివీపతి= విరాటుడు; సేనలన్+ఎల్లన్= సైన్యాలనన్నింటిని; కొంచున్= వెంటబెట్టుకొని; శౌర్య+ఉన్నతిన్= తన పరాక్రమాతిశయాన్ని; చూపువాఁడు+అయి= ప్రదర్శించే వాడుగా; వెన్నడి= వెంబడించి; వచ్చున్= వస్తాడు; సముద్ధతిమైన్= పటాటోపంతో; ఇటన్= ఇక్కడా; వేఱ= వేఱుగా; కౌరవుల్= కౌరవులు; కొన్నిటిన్+పట్టన్= కొన్నిటిని (ఆవులను) పట్టుకొనగా; పాండునందనుల్= పాండవులు; కయ్యమునకున్= యుద్ధానికి; పఱతెంతురు= వస్తారు.

**తాత్పర్యం:** ముందుగా సుశర్మ తన బలంతో వెళ్ళి గోవులను పట్టుకొంటే విరాటుడు (తన) సైన్యమంతటిని తీసికొని తన పరాక్రమాతిశయాన్ని ప్రకటించాలని వెనువెంటనే కయ్యానికి వస్తాడు. అపుడు మన కౌరవులు ఆర్భాటంగా వేరుగా ఇక్కడ కొన్ని గోవులను ముట్టడిచేస్తే (గత్యంతరం లేక) పాండవులే యుద్ధానికి తరలివస్తారు.

**విశేషం:** సుశర్మను ఎదుర్కొనటానికి తన సైన్యాన్నంతా తీసికొని విరాటుడు పోయిన తరువాత నగరంలో కౌరవసైన్యాన్ని ఎదుర్కొనే వీరులు లేకపోవచ్చును. అప్పుడు కౌరవులు వేరొకప్రక్క గోవులను ముట్టడిస్తే పాండవులు అజ్ఞాతవాసంలో ఉన్నా కృతజ్ఞతాబద్ధులై, ధర్మరక్షావేశంతో కౌరవులతో యుద్ధానికి తలపడవచ్చునని దుర్యోధనుడి వ్యూహం. ఇందు ఎంత కుటిలత్వం ఉందో, అంత నేర్పరితనం ఉంది. పాండవులను బైటపెట్టే ఉపాయం వారు చేయగల యుద్ధమే అని దుర్యోధనుడి నిశ్చయం. అది సత్యం కూడా. (సంపా.)

ఉ. కందువ సెప్పి యొక్కెడఁ ద్రిగర్తులు దాడికిఁ గూడువారు; మీ
రందఱు వేఱ యొక్కయెడ నాజికి సేనల గూర్పుఁ; డెల్ల వాఁ
డుం దనవారిఁ దోకొని కడున్ రభసంబునఁ గూడి వార్తకున్
ముందఱఁబోయి గోధనము ముట్టుకొనన్ వలయున్ మహోగ్రతన్.' 127

**ప్రతిపదార్థం:** కందువ+చెప్పి= జాడతెల్పి; ఒక్క+ఎడన్= ఒకానొక చోట; త్రిగర్తులు=త్రిగర్త దేశీయులు; దాడికిన్+కూడువారు= యుద్ధం చేయటానికి చేరతారు; మీరు+అందఱున్= మీరంతా; వేఱయొక్కయెడన్= వేరొకచోట; సేనలన్= సైన్యములను; ఆజికిన్+కూర్పుఁడు= యుద్ధానికి సన్నద్ధం చేయండి; ఎల్లవాఁడున్= ప్రతివాడూ; తనవారిన్+తోకొని= తనవాళ్ళను వెంటబెట్టుకొని; కడున్ రభసంబునన్= మిక్కిలి తొందరగా; కూడి= చేరి; వార్తకున్ ముందఱన్+పోయి= మాటకంటె (వర్తమానం చేరిన దానికంటె) ముందుగా పోయి; మహా+ఉగ్రతన్= మిక్కిలి భయంకరంగా; గోధనమున్= పశుసంపదను; ముట్టుకొనన్ వలయున్= చుట్టుముట్టాలి.

**తాత్పర్యం:** దాడికి పూనుకొని త్రిగర్తసేనలు ఒక సంకేతస్థలంలో గుమికూడుతాయి. మీరందరూ వేరొక చోట యుద్ధానికి సిద్ధంగా సేనలను సమీకరించండి. అందరూ ఎవరి సైన్యాలను వారు వెంట పెట్టుకొని మిక్కిలి వేగంగా, వార్త అందేదానికంటె ముందుగానే అక్కడికి పోయి గోధనాన్ని మిక్కిలి భయంకరంగా చుట్టుముట్టాలి.'

**విశేషం:** గోగ్రహణ యుద్ధవ్యూహం నిశ్చయమైంది. చారులవలన ఈ వార్తలు విరటుడికి చేరకపూర్వమే గోగ్రహణం సాగాలని దుర్యోధనుడి ఆజ్ఞ. సన్నద్ధంగా లేని శత్రువును రహస్యంగా, వేగంగా చుట్టుముట్టే గూఢవ్యూహంగా సాగాలని రారాజు కోర్కె 'వార్తకంటె పూర్వం దండెత్తిపోయి గోధనాన్ని చుట్టుముట్టాలి' అన్న ఆజ్ఞలోని అంతరార్థం అదే. (సంపా.)

**వ. అని చెప్పి వెండియు సుశర్మం జూపి. 128**

**తాత్పర్యం:** అని పలికి సుశర్మవైపు చూపి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'బహుళాష్టమి నీతఁడు స । న్నహనముతోఁ బసులఁ బట్టు, నవమిని మన గో**
**గ్రహణ'మని నిశ్చయించిన । నహికేతను పలుకులకు మహాహ్లాదమునన్. 129**

**ప్రతిపదార్థం:** బహుళ+అష్టమిన్= కృష్ణపక్షంలోని ఎనిమిదవ రోజున (అష్టమీ తిథినాడు); ఈతఁడు= ఈ సుశర్మ; సన్నహనముతోన్= సంసిద్ధతతో; పసులన్+పట్టున్= ఆవులను పట్టుకొంటాడు; నవమిని= నవమినాడు; మన గోగ్రహణము= మనం చేసే గోవుల ముట్టడి; అని నిశ్చయించినన్= అని నిశ్చయించగా; అహికేతను పలుకులకున్= సర్పధ్వజుడి (దుర్యోధనుడి) మాటలకు; మహా+ఆహ్లాదమునన్= మిక్కిలి సంతోషంతో.

**తాత్పర్యం:** 'ఈ కృష్ణపక్షంలోని అష్టమినాడు సుశర్మ సన్నాహంతో గోవులను పట్టుకొంటాడు. మనం నవమినాడు పట్టుకొందాం' అని దుర్యోధనుడు నిర్ణయించాడు. ఆ మాటలకు ఉప్పొంగిపోయి. (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** భండార్కర్ సంస్థ ప్రచురించిన సంస్కృత భారతంలో సుశర్మ, దుర్యోధనుల గోగ్రహణం సప్తమి, అష్టమిలలో జరగాలని చెప్పినట్లున్నది. మరికొన్ని ప్రతులలో అష్టమి, నవమిలలో జరుగవలెనని ఉన్నది. తిక్కన దక్షిణాదిప్రతిని అనుసరించినట్లున్నాడు. విజయదశమినాటికి విజయుడు విజయాన్ని సాధించవలసి ఉండటం చేత, ఉత్తర గోగ్రహణ యుద్ధం ఒక రోజు యుద్ధం మాత్రమే కావటం చేత, అష్టమి, నవమిలు విజయతిథులు కాకపోవటంచేత తిక్కన ఈ పాఠాన్ని గ్రహించి, సుశర్మ, దుర్యోధనులకు భావియుద్ధంలో జరుగబోయే పరాజయాన్ని ధ్వనింపచేశాడు. (సంపా.)

**వ. సమస్త పరిజనంబులును సముద్యుక్తులై; రట్టి సమయంబున. 130**

**ప్రతిపదార్థం:** సమస్త పరిజనంబులును= సేవకులందఱును; సముద్యుక్తులైరి= సన్నద్ధులైరి; అట్టి సమయంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** (దుర్యోధనుడి) పరివారమంతా యుద్ధానికి సిద్ధమయ్యారు. ఆ సమయంలో.

**ఆ. పాండురాజసుతులుఁ బాంచాలియును దమ్ము । నొరు లెఱుంగకుండఁ దిరుగవలయు**
**దుష్కరంపుటేఁడు దుదిసేరఁబాఱె, నె । వ్వరును దీనిఁ దలఁప వలను లేర. 131**

**ప్రతిపదార్థం:** పాండురాజ సుతులున్= పాండురాజు కుమారులున్నూ; పాంచాలియును= ద్రౌపదియున్నూ; తమ్మున్+ ఒరులు+ఎఱుఁగకుండన్= ఇతరులు తమను గుర్తించకుండగా; తిరుగన్‌వలయున్= తిరుగవలసిన; దుష్కరము+ఏఁడు= కష్టమయిన సంవత్సరకాలం; తుది చేరన్+పాఱెన్= పూర్తికావచ్చింది; ఎవ్వరును= ఎవరుకూడా; దీనిన్= ఈ విషయాన్ని; తలఁపన్= ఆలోచించేందుకు; వలనులేరు+అ= పూనుకొనలేకపోయారు.

**తాత్పర్యం:** పాండవులూ ద్రౌపదీ తమను ఇతరులు గుర్తించకుండా జరిపే అజ్ఞాతవాసమనే గడ్డుకాలం పూర్తి కావచ్చింది. ఆ విషయాన్ని ఎవ్వరూ ఆలోచించనే లేదు.

## సుశర్మ దక్షిణ గోగ్రహణంబు చేయుట (సం.4-20-27)

**వ.** **సుశర్మయు నేలినవాని పనిఁ బూని జోడు పక్కెర కైదువు బిరుదు రవణంబు మొదలైన సవరణంబులం జూడ నక్కజంబుగాఁ గూడి, పరదేశం బాపోశనంబు గొనం దమకించు తన బలంబుల గజిబిజి యుడిపికొని, గోగణంబుల యగపా టూహించి, జతనంబుతో నడచుచుండియు వెసఁ గుందక వేగిరంపుఁ బయనంబు లయ్యును బ్రజల నోలాకుపడనీక, యెత్తెడుచోట్లను విడిదలల యందును లోనుగా నిస్సాణాదులైన యుద్భట చిహ్నంబులు ప్రకటింపక దాడిమెయిం జని, వేగులవారివలన విరాటు తొఱ్ఱులున్న యెడ యెఱింగి, గ్రద్దనం గదుపులఁ గార్చిచ్చు చందంబునం బొదివి వెలిచిన.** **132**

**ప్రతిపదార్థం:** సుశర్మయున్= సుశర్మకూడా; ఏలినవానిపనిన్= రాజుగారి పనిని (దుర్యోధనుడిపనిని); పూని= అంగీకరించి; జోడుపక్కెర కైదువు= రెండు ప్రక్కల పదును గల కత్తిని; బిరుదు రవణంబు= పరాక్రమ ప్రశంసను తెలిపే సూచికలైన పతకాలు మొదలైన; సవరణంబులన్= పరికరాలతో; చూడన్= చూడగా; అక్కజంబు+కాన్= ఆశ్చర్యకరంగా; కూడి= కూడుకొన్నవాడై; పరదేశంబు= శత్రువులదేశాన్ని; ఆపోశనంబు+కొనన్= అపోశనం పట్టగా, తమకించు= ముందుకు దూకే; తన బలంబులన్= తన సైన్యాలయొక్క; గజిబిజి= తొందరపాటును; ఉడిపికొని= నిలుపుకొంటూ; గోగణంబుల= పశువులయొక్క; అగపాటు+ఊహించి= కనిపించటాన్ని తలచుకొని; జతనంబుతోన్= ప్రయత్నంతో; నడచుచున్+ఉండియున్= నడుస్తున్నప్పటికీ; వెసన్+కుందక= వేగంతో వెనుకపడకుండా; వేగిరము+పయనంబులయ్యునున్= వడివడిగా సాగే ప్రయాణాలు అయినను; ప్రజలను= జనాలను; ఓలాకు పడనీక= శ్రమపడనీక; ఎత్తెడు చోట్లను= దండెత్తే స్థలాలలోనూ, విడిదలల+అందును= విడిదిచేసే స్థలాలలోను (విశ్రాంతి తీసికొనేచోట్ల); లోనుగాన్= రహస్యంగా; నిస్సాణాదులు+ఐన= భేరులు, డప్పులు వంటి చర్మవాద్య విశేషాలు మొదలైన; ఉద్భట చిహ్నంబులు= పెద్ద పెద్ద యుద్ధాల గుర్తులు; ప్రకటింపక= బయలుపడనీక; దాడిమెయిన్+చని= దబ్బాటున దండెత్తే పద్ధతి (మెరుపు దాడి)గా వెళ్ళి; వేగులవారివలనన్= గూఢచారుల వలన; విరాటు తొఱ్ఱులు+ఉన్నయెడ= విరాటుడి ఆవులున్న చోటు; ఎఱింగి= తెలిసికొని; గ్రద్దనన్= శీఘ్రంగా; కదుపులన్= పసులను; కార్చిచ్చు చందంబునన్= దావానలం మాదిరిగా; (అడవిలో నాలుగు దిక్కులా అలముకొన్న మంటవలె); పొదివి= క్రమ్ముకొని; వెలిచినన్= తోలగా.

**తాత్పర్యం:** సుశర్మ కూడా దుర్యోధన మహారాజు చెప్పిన పని చేయాలని పూనుకొన్నాడు. ఇరుప్రక్కల పదనూ, రెక్కలూ ఉన్న బిరుదుగల కత్తినీ రవళిస్తున్న అలంకారాలు మొదలైన పరికరాలతో కూడుకొని ఆశ్చర్యాన్ని కల్గించే విధంగా శత్రు దేశాన్ని ఒక్కసారే పుడికిటి నీరు త్రాగినట్లుగా ఆక్రమిద్దామని (మ్రింగివేద్దామని) ముందుకు దూకుతున్న తన సైన్యం దుందుడుకుతనాన్ని అదుపులో పెట్టుతూ, ఆవుల దర్శనం తలచుకొంటూ, ప్రయత్నంతో నడుస్తున్నప్పటికీ వెనుకడుగు వేయకుండా, వడివడిగా ప్రయాణాలు సాగిస్తున్నా ప్రజలకు అలజడి కలుగనీయకుండా దండెత్తే స్థలాలలోను, విశ్రాంతికై విడిది చేసే చోటులలోను డప్పులూ, డమరుకాలు వంటి చర్మవాద్యాల ధ్వనుల ఆర్భాటాల వలన దాడి గుర్తులు బయటపడకుండా జాగ్రత్తపడుతూ, మెరుపుదాడి పద్ధతిలో వెళ్ళి, వేగుల వలన విరాటుడి గోవులుండే చోటు తెలిసికొని, త్వరగా పసులను సమీపించి దావానలం మాదిరిగా పొదువుకొని, తోలాడు.

**విశేషం:** జోడు, పక్కెర, కైదువు, బిరుదు రవణంబు మొదలైన సవరణంబులన్= అనే సమాసానికి జోడు= కవచం; పక్కెర= గుఱ్ఱాలకు, ఏనుగులకు పైనవేసే రక్షాకవచాలు; కైదువు= కత్తి మొదలైన ఆయుధాలు; బిరుదు రవణంబు= వీరుల సామర్థ్యాన్ని తెలిపే గుర్తుల వంటి ఆభరణాలు; మొదలు+ఐన= మొదలుగాగల; సవరణంబులన్= వాహనాల అలంకారాలను అని అర్థం కూడా చెప్పవచ్చును. ఆపోశనం (ఆపః+అశనం) విప్రులు భోజనం చేసే ముందు మంత్రపూర్వకంగా చేసే జలపానం. (సంపా.)

**శా. కూడంబాఱి సముద్ధతిం గడఁగి తద్గోపాలకుల్ మూఁక ల**
**ల్లాడం దాఁకి, నిశాతసాయక పటు వ్యాపార ఘోరంబుగా**
**నీడం బోక పెనంగినం గని, త్రిగర్తేశుండు చే వీచుడుం**
**గ్రీడాఘాత నిరూఢి నాశ్వికులు వారిం దున్మి తూఁటాడినన్. 133**

**ప్రతిపదార్థం:** తద్+గోపాలకుల్= ఆ గోవులను రక్షించేవారు; కూడన్+పాఱి= కలిసి ముందుకు సాగి; సముద్ధతిన్= దర్పంతో; కడఁగి= పూనుకొని; మూఁకలు= సైనికులు; అల్లాడన్=చీకాకు పడేటట్లు; తాఁకి= ఎదుర్కొని; నిశాత= వాడి అయిన; సాయక= బాణాల; పటు= దృఢమైన; వ్యాపార= ప్రయోగాలచేత; ఘోరంబుగాన్= భయంకరంగా; ఈడన్+పోక= వెనుకంజవేయక; పెనంగినన్+కని= యుద్ధం చేయగా చూచి; త్రిగర్త+ఈశుండు= త్రిగర్తదేశానికి రాజైన సుశర్మ; చేయి+వీచుడున్= చేయెత్తి (యుద్ధం చేయండి అన్నట్లు) ఊపగా; అశ్వికులు= గుఱ్ఱాల సైనికులు; క్రీడాఘాత నిరూఢిన్= ఆట ఆడినట్లు విలాసంగా శత్రువులను దెబ్బతీసే నేర్పరితనంతో; వారిన్= ఆ పసుల కాపరులను; తున్మి తూఁటాడినన్= ఖండించి బాధించగా.

**తాత్పర్యం:** ఆ ఆవుల కాపరులందరూ ఏకమై సాగి దర్పంతో పూనుకొని సైనికు లల్లాడగా ఎదుర్కొన్నారు. వాడి బాణములను భయంకరంగా ప్రయోగిస్తూ వెనుకకు అడుగిడకుండా యుద్ధం చేయసాగారు. (అపుడు) త్రిగర్తరాజయిన సుశర్మ చేయి వీచగా, గుఱ్ఱపు సైనికు లా పసుల కాపరులను ఆటలలో చెండాడిన నేర్పరితనంతో తునాతునకలు చేసి బాధించగా, (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** విరాటుడి గోపాలకులు వీరులు కూడా. కలిసికట్టుగా ఎదుర్కొనటంలో సంఘీభావంతో కూడిన ధైర్యం, గర్వంతో పోరి సైనికులను గగ్గోలు పెట్టించే పరాక్రమం కలవారు. కాని, వారు అశ్వారూఢులు కాకపోవటంచేత సుశిక్షితులైన ఆశ్వికుల ధాటికి ఆగలేకపోయారు. కాని, వారి ధర్మం వారు యథాశక్తి నిర్వహించారు. (సంపా.)

**వ. వారలలోన. 134**

**తాత్పర్యం:** ఆ గోపాలకులలో.

**చ. అసదుగఁ దాఁకి మేనఁ దఱచైై పొరి నెత్తురు గ్రమ్ము పోటులన్**
**వస మఱి తూలుచుండియును వారని భీతిఁ బదంబులం గడున్**
**వెస కలిమిం బురంబునకు వేగమె కొందఱు పాఱి, మత్స్యనా**
**థు సభకు నేఁగి, దీనదశతోఁ బ్రణమిల్లుచు నార్తమూర్తులై. 135**

**ప్రతిపదార్థం:** కొందఱు= కొంతమంది (గోపాలురు); అసదుగన్= ఘోరంగా (తీవ్రంగా); తాఁకి= ఎదిరించి; మేనన్= ఒంటిమీద; తఱచు+ఐ= ఎక్కువగా; పొరిన్= ఎక్కువగా; నెత్తురు క్రమ్ముపోటులన్= నెత్తురు చిమ్మే దెబ్బల (గాయాల)తో; వసము+అఱి= వశం తప్పి; తూలుచుండియును= తూలిపడుతున్నా; వారని భీతిన్= వదలని భయంతో; పదంబులన్= కాళ్ళయందు; కడున్= మిక్కిలి; వెసకలిమిన్= వేగం కలుగగా; పురంబునకున్= విరాటుడి రాజధానికి; వేగమె= వడివడిగా; పాఱి= పరుగెత్తి; మత్స్యనాథు సభకున్+ఏఁగి= విరటుడి ఆస్థానానికి వెళ్ళి; దీనదశతోన్= దీనావస్థతో; ప్రణమిల్లుచున్= వంగి వంగి నమస్కారాలు చేస్తూ; ఆర్తమూర్తులు+ఐ= దుఃఖించే ఆకారాలు కలవారై (ఆకారం తాల్చిన దుఃఖం వంటివారై).

**తాత్పర్యం:** కొందరు గోపాలురు ఎంతకైనా తెగించి ఎదిరించి పోరాడారు. వారి శరీరాల మీద నెత్తురు ధారలుగా చిమ్మే పెద్ద పెద్ద గాయాలు తగిలాయి. వారి మేనులు పట్టుతప్పి తూలుతున్నప్పటికీ, అడుగులు తడబడుతున్నప్పటికీ, ఆగని భయంతో వేగం తెచ్చుకొని నగరానికి వడివడిగా పారిపోయి, మత్స్యమహారాజు సభకు చేరి, వినయంగా వంగి దండాలు పెట్టుతూ, రూపుకట్టిన దుఃఖభావాలవలె దీనంగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **కారణ మెయ్యది యగు నొకొ! వీరల దురవస్థ కనుచు వెఱఁగందెడు నా**
**భూరమణుఁడు సభయును విన। నీరెలుఁగు దలంకఁ బల్కి రిట్లని గోపుల్.** **136**

**ప్రతిపదార్థం:** వీరల= ఈ పసుల కాపరులయొక్క; దురవస్థకున్= దుఃస్థితికి; కారణము= హేతువు; ఏ+అది; అగున్+ఒకొ!= ఏమై ఉంటుందో; అనుచున్= అనుకొంటూ; వెఱఁగు+అందెడు= ఆశ్చర్యపడుతున్న; ఆ భూరమణుఁడు= ఆ రాజున్నూ (విరటుడు); సభయును= సభలోనివారూ; వినన్= వినేటట్లు; గోపుల్= గోపాలకులు; ఈరు+ఎలుఁగు= హీనస్వరం; తలంకన్= వణకుతూ ఉండగా; ఇట్లు+అని= ఈ విధంగా; పల్కిరి= పలికారు.

**తాత్పర్యం:** ఈ పసుల కాపరులు ఏ కారణంగా ఈ దురవస్థపాలైనారో అంటూ ఆశ్చర్యపడుతున్న విరాటుడూ, సభలోనివారూ వినేటట్లుగా వణుకుతున్న సన్నని గొంతులతో ఆ గోపాలకులు ఈ విధంగా అన్నారు.

**చ.** **'హయ రథ దంతి సంతతి నిరంతర దుర్దమలీలఁ బేర్చి నే**
**ల యవిసి మూఁగినట్లగుబలంబులతోడఁ ద్రిగర్తు లెంతయున్**
**రయమున గోవులం బొదివి, రక్షకు లొక్కట నార్చి తాఁకినన్**
**భయదమహాస్త్ర శస్త్ర పటుపాత పరంపరఁ దున్మి యుద్ధతిన్.** **137**

**ప్రతిపదార్థం:** హయరథదంతి సంతతి= గుఱ్ఱాల, తేరుల, ఏనుగుల సమూహాలు; నిరంతర దుర్దమలీలన్= అడ్డగించటానికి వీలులేని విధంగా; పేర్చి= విజృంభించి; నేల+అవిసి మూఁగినట్లు+అగు= భూమిని చీల్చుకొని గుంపులు కట్టి బయటికి వచ్చినట్లుగా తోచిన; బలంబులతోడన్= సైన్యంతో; త్రిగర్తులు= త్రిగర్తదేశంవారు; ఎంతయున్ రయమునన్= ఎంతో వేగంగా; గోవులన్+పొదివి= ఆవులను క్రమ్ముకొని; రక్షకులు= గోరక్షకులు; ఒక్కటన్= ఒక్కుమ్మడిగా; ఆర్చి= బొబ్బలుపెట్టి; తాఁకినన్= ఎదిరించగా; భయద= భయం పుట్టించే; మహా+అస్త్ర= గొప్పవైన మంత్రబాణాలతో; శస్త్ర= బాణాలతో, కత్తులతో; పటుపాత= కొట్టిన గట్టిదెబ్బలయొక్క; పరంపరన్= వరుసలతో; తున్మి= చంపి; ఉద్ధతిన్= దూకుడుతనంతో.

**తాత్పర్యం:** 'గుఱ్ఱాలతో, రథాలతో, ఏనుగులతో కూడిన సేనతో ఎదురులేని విధంగా విజృంభించి నేల ఈనినట్లు సుశర్మ బలాలు వేగంగా వచ్చి, పసులను క్రమ్ముకొనగా, గోపాలురందరూ కలసి ఒక్కపెట్టున బొబ్బలు పెట్టుతూ

ఎదురుదాడి చేశారు. త్రిగర్తులు గర్వాతిశయంతో వారిమీద పుంఖానుపుంఖాలుగా అస్త్రశస్త్రాలు ప్రయోగించి చంపి (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం.

**క. గోవులకు వెనుక యై వెసఁ । బోవుచునున్నారు; కడవఁబోవక యుండం**
**బోవలయు నడ్డపడియెడు । దీవసమెదఁ గలిగెనేని దేవర! కడఁకన్.' 138**

**ప్రతిపదార్థం:** దేవర!= ఓ ప్రభువా!; గోవులకున్ వెనుక+ఐ= పసులకు వెనుక భాగాన; వెసన్= వేగంగా; పోవుచున్+ఉన్నారు= పోతూ ఉన్నారు; అడ్డపడియెడు దీవసము= అడ్డగించే దమ్ము; ఎదన్+కలిగెన్+ఏనిన్= మనసులో ఉంటే; కడఁకన్= పూనికతో, పౌరుషంతో; కడవన్+పోవక+ఉండన్= మన పొలిమేరలు దాటిపోక పూర్వమే; పోవలయున్= పోవాలి.

**తాత్పర్యం:** ప్రభూ! త్రిగర్తులు గోవులను తరలించుకొని వాటి వెనుక భాగంలో తరుముకొంటూ వేగంగా వెళ్ళిపోతున్నారు. వారిని అడ్డుకొనవలెననే ధైర్యం మనకుంటే, వారు మన పొలిమేరలు దాటిపోక పూర్వమే, ప్రయత్నపూర్వకంగా పౌరుషంతో ఎదుర్కొనాలి.'

**వ. అనిన విని విరాటుం డదరిపడి. 139**

**తాత్పర్యం:** అనగా విని విరాటుడు (ఆశ్చర్యంతో, భయంతో) అదిరిపడి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**శా. 'ఏమీ నిక్కమె! మున్నెఱుంగఁడె త్రిగర్తేశుండు? మద్గోధన**
**స్తోమంబుం గొనిపోవు తెంపునకు నుద్యోగించెనే? మేలుమేల్;**
**లామైె తోడనె పోవుఁగాక!' యని వీరాలాపముల్ వల్కి యు**
**ద్దామ క్రోధ శిఖాకలాప వికటోద్యద్భ్రూకుటి స్ఫూర్తియై. 140**

**ప్రతిపదార్థం:** ఏమీ! నిక్కమె?= ఏమీ! ఇది నిజమా?; త్రిగర్త+ఈశుండు= త్రిగర్త దేశానికి రాజైన సుశర్మ; మున్ను+ఎఱుంగఁడె?= ఇదివఱకు తెలియడా?; మత్+గోధనంబున్= నా గోసంపదను; కొనిపోవు తెంపునకున్= తీసికొనిపోయే సాహసానికి; ఉద్యోగించెనే?= ప్రయత్నించాడా; మేలు మేలు= మంచిది మంచిది; ఆ+మైతోడనె= ఆవిధంగానే; పోవున్+కాక= పోతాడులే (చస్తాడులే); అని= అంటూ; వీర+ఆలాపముల్= పౌరుష వాక్యాలు; పల్కి= మాటలాడి; ఉద్దామ= తీవ్రమయిన; క్రోధశిఖాకలాప= కోపాగ్ని జ్వాలల సమూహాల చేత; వికట= వంపులుగా; ఉద్యత్= పైకెత్తబడిన; భ్రూకుటి స్ఫూర్తి+ఐ= బొమముడి ఆకారం కలవాడై.

**తాత్పర్యం:** 'ఏమిటి! మీరు చెప్పుతున్నది నిజమేనా? ఆ త్రిగర్తపతి ఇదివరలో మనచేత తిన్న దెబ్బ గుర్తుంచుకొనలేదా? (ఎరుగడా?). ఇప్పుడు నా గోధనాన్ని దొంగిలించే సాహసానికి పూనుకొన్నాడా? మంచిది మంచిది. అత డట్లాగే పోతాడులే! (వాడికి కాలం మూడింది)' అని పౌరుష వాక్యాలు పలుకుతూ మనసులో అణచుకోలేని కోపాగ్ని చెలరేగి జ్వాలలు చిమ్ముతూ ఉండగా వంపులుగా భయంకరంగా లేస్తున్న కనుబొమల కదలికను ప్రకటిస్తూ, (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: రూపకం. కనుబొమల వికార విచలనం క్రోధభావ ప్రకటనం. (సంపా.)

విరటుఁడు సుశర్మమీఁద యుద్ధం చేయఁబోవుట (సం.4-30-8.)

**చ. సచివులఁ జూచి 'యిప్పుడ వెసన్ మన మెయ్యక తక్కినం బశు**
**ప్రచయము తప్పిపోవుఁ; దుది భంగము సేఁగియు వచ్చుఁగాక మీ**
**రుచిత విధాన సత్వరత నుద్ధతయోధ సమగ్రవాహినీ**
**ప్రచలిత భూమి భాగముగఁ బన్నఁగఁ బంపుఁడు దండనాథులన్.' 141**

**ప్రతిపదార్థం:** సచివులన్+చూచి= మంత్రులవైపు చూచి; ఇప్పుడు+అ= ఇప్పుడే; వెసన్= వెంటనే; మనము+ఎయ్యక= మనము వెంబడించక; తక్కినన్= మానితే; పశుప్రచయము= గోసమూహం; తప్పిపోవున్= మనసుండి దూరమైపోతుంది; తుదిన్= చివరకు; భంగము= అవమానం; సేఁగియున్ వచ్చున్= ఆపద కూడా వస్తుంది; కానన్= అందువలన; మీరు+ఉచిత విధానన్= మీరు తగినట్లుగా; దండనాథులన్= సేనాపతులను; సత్వరతన్= త్వరగా; ఉద్ధత+యోధ+సమగ్రవాహినీ+ప్రచలిత భూమి భాగముగన్= గర్వితులైన వీరులతో నిండిన సైన్యము వలన కంపించే భూభాగం కలుగునట్లుగా చేసి; పన్నఁగన్= యుద్ధానికి సిద్ధమయ్యేటట్లు; పంపుఁడు= ఆజ్ఞాపించండి.

**తాత్పర్యం:** విరాటుడు మంత్రులను చూచి ఇట్లా అన్నాడు: 'మన మిప్పుడే ఆ సేనలను వెంబడించకపోతే మన పశువుల మందలు మనకు దక్కవు. చివరకు అవమానం, ఆపద కూడా రావచ్చును. కాబట్టి, మన సేనాపతులను పిలిపించండి. తగిన పద్ధతులతో వెంటనే బలగర్వంతో కూడుకొన్న వీరులతో నిండిన సైన్యాలను మోహరించి, భూభాగం దద్దరిల్లేటట్లు యుద్ధానికి సిద్ధమయ్యేటట్లు ఆజ్ఞాపించండి.'

**వ. అని నియోగించి. 142**

**తాత్పర్యం:** అంటూ ఆజ్ఞాపించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**శా. యాన ప్రక్రమ సూచకంబు లగు తూర్యంబుల్ దిశాపాటన**
**ధ్వానస్వైరవిహార కల్పిత సముద్ర క్షోభముల్గా ధరి**
**త్రీ నాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ శస్త్రాస్త్రవ**
**ర్మానీతిక్రమ దక్షులం బనిచె నయ్యై వారికిం గ్రక్కునన్. 143**

**ప్రతిపదార్థం:** యాన= యుద్ధ ప్రయాణపు; ప్రక్రమ సూచకంబులు= ప్రారంభాన్ని సూచించేటట్లు; తూర్యంబుల్= వాద్యాల మ్రోతలు; దిశాపాటన= దిక్కులను చీల్చునట్టి; ధ్వాన= శబ్దం యొక్క; స్వైర, విహార కల్పిత= స్వేచ్ఛావిహారంచేత కల్గించబడిన; సముద్రక్షోభముల్+కాన్= సముద్రపు అల్లకల్లోల శబ్దంగా; ధరిత్రీనాథుండు= రాజగు విరాటుడు; రణ+ఉచిత= యుద్ధానికి తగిన; ఉద్యమము= ప్రయత్నం; సంధిల్లంగన్= చేకూరగా; ఆ+ఐవారికిన్=ఆయా వీరులకు; శస్త్ర+అస్త్ర వర్మ= శస్త్రముల అస్త్రముల, కవచాల; ఆనీతిక్రమదక్షులన్= తెచ్చే పద్ధతులలో నేర్పుకలవారిని; గ్రక్కునన్= వెంటనే; పనిచెన్= ఆయా పనుల మీద పంపాడు.

**తాత్పర్యం:** ప్రయాణ సూచనలయిన తూర్యనాదాలు దిక్కులు పిక్కటిల్లేటట్లు విచ్చలవిడిగా మ్రోగాయి. స్వేచ్ఛా విహారంతో ఆ నాదం అల్లకల్లోలమయిన సముద్ర ఘోషగా అనిపించింది. విరాటుడు యుద్ధోచిత ప్రయత్నాలు సమకూర్చుకొంటూ ఆయాయోధులకు శస్త్రాస్త్రాలను, కవచాలను తేవటంలో నేర్పరులయినవారిని వెంటనే ఆయా పనులమీద పంపాడు.

**ఉ.** **సారథిఁ జూచి 'నీవు రభసంబునఁ బూన్పుము ఘోటకంబులం**
**దేరఁ; దదీయ వర్మము లతిస్ఫుట బంధముగాఁగ బెట్టు; నీ**
**వీరవచోవిలాసములు విందుము ము; న్ని దె వచ్చెఁ గయ్య; మే**
**పారఁగఁ జూపు నీ దగు నహంకృతికిం దగు ధైర్య మియ్యెడన్.'** **144**

**ప్రతిపదార్థం:** సారథిన్+చూచి= రథసారథివైపు చూచి; నీవు రభసంబునన్= నీవు తొందరగా; తేరన్= రథమందు; ఘోటకంబులన్+పూన్పుము= గుర్రాలను కట్టి సిద్ధం చేయుము; తదీయ= వాటియొక్క; వర్మములు= కవచాలను (అనగా వాటి అలంకారాలను); అతి స్ఫుటబంధము కాఁగన్= మిక్కిలి దృఢంగా కట్టబడినవిగా; పెట్టు= ఉంచుము; మున్ను= ఇదివరలో; నీ వీరవచోవిలాసములు విందుము= నీ పౌరుష వచనాలు ఎప్పుడూ వింటూ ఉంటాం; కయ్యము= యుద్ధం; ఇదె వచ్చెన్= ఇదిగో వచ్చింది; ఈ+ఎడన్= ఇపుడు; నీదగు అహంకృతికిన్= నీ గర్వానికి; ధైర్యము= తగిన మగటిమిని; ఏపారఁగన్= అతిశయించగా; చూపు= చూపించుము.

**తాత్పర్యం:** (విరటుడు) రథసారథిని చూచి ఇట్లా అన్నాడు; 'నీవు త్వరగా గుర్రాలకు కవచాలంకారాలు గట్టిగా తొడిగి వాటిని రథానికి కట్టి సిద్ధం చేయుము. నీ వెప్పుడూ పౌరుషాలు పలుకుతూ ఉండగా వింటూ ఉంటాము. ఇదిగో యుద్ధం వచ్చింది. నీ గర్వానికీ ధైర్యానికీ తగిన మగటిమిని చూపే సమయం వచ్చింది.'

**ఉ.** **అని పనిచి తానును యోధవీరోచిత ప్రకారంబున సింగారంబు సత్వరంబుగాఁ జేసికొని ఖచిత కాంచన బిందు సందోహంబగు సన్నాహంబు వెట్టికొని, విరచితాలంకార చక్రంబును బద్ధపరికర కూబరాక్షయుగాద్యవయవంబును బ్రతికల్పిత తురంగంబును సన్నివేశిత వివిధాయుధంబును సన్నద్ధ సారథికంబును నైన రథంబెక్కి గోగణ హరణ ప్రదేశంబు పశు పాలకులం దెలియ నడుగుచు వెడలునప్పు డమ్మత్స్యపతి యనుజన్ముండు.** **145**

**ప్రతిపదార్థం:** అనిపనిచి= అంటూ పంపి (ఆజ్ఞాపించి); తానును= తానుకూడ; యోధవీర+ఉచిత ప్రకారంబునన్= యుద్ధవీరుడికి తగిన విధంగా; సింగారంబు= అలంకారం; సత్వరంబుగాన్+చేసికొని= వడిగా చేసికొని; ఖచిత+కాంచన+బిందు సందోహంబు= చెక్కిన బంగారు చుక్కల సమూహం కల; సన్నాహంబు= కవచం;పెట్టికొని= ధరించి; విరచిత= విశేషంగా చేసిన; అలంకార చక్రంబును= అలంకారాలు గల చక్రాలు కలదీ; బద్ధ= సిద్ధంగా చేసి కట్టబడిన; పరికర= (యుద్ధానికి అవసరమయ్యే) వస్తువులు; కూబర= బండినొగలును; అక్ష= ఇరుసు; యుగ= కాడి; ఆది= మొదలగు; అవయవంబును= భాగాలుకలదీ; ప్రతికల్పిత= చక్కగా కూర్చబడిన; తురంగంబును= గుర్రాలుకలదీ; సన్నివేశిత= సిద్ధంగా ఉంచబడిన; వివిధ+ఆయుధంబును= అనేక ఆయుధాలు కలదీ; సన్నద్ధసారథికంబును= సిద్ధమైఉన్న సారథి కలదీ; ఐన= అయినట్టి; రథంబున్= తేరు; ఎక్కి; గోగణహరణ= ఆలమందలను దొంగిలించిన; ప్రదేశంబు= చోటును; పశుపాలకులన్= అలకాపరులను; తెలియన్+అడుగుచున్= అడిగి తెలిసికొంటూ; వెడలు+అప్పుడు= బయలుదేరేటప్పుడు; ఆ+మత్స్యపతి= ఆ విరటుడి యొక్క; అనుజన్ముండు= తమ్ముడు.

**తాత్పర్యం:** విరాటుడు ఆ విధంగా అందరినీ ఆజ్ఞాపించి తాను కూడా యుద్ధవీరుడికి ఉచితమైన విధంగా అలంకారాన్ని వెంటనే చేసికొన్నాడు. బంగారు చుక్కలు చెక్కిన కవచాన్ని ధరించాడు. అలంకరించిన రథం సిద్ధం చేయబడింది. దానికి పలురకాల అలంకారాల వన్నెలతో చక్రాలు ఒప్పారుతున్నాయి. యుద్ధానికి కావలసిన పరికరాలు కూర్చబడ్డాయి. నొగలు, ఇరుసు, కాడి మొదలైన అంగాలు అమర్చబడ్డాయి. గుర్రాలు కట్టబడ్డాయి. వివిధాయుధాలు సమకూర్చబడ్డాయి. సారథి నొగలెక్కి సిద్ధంగా ఉన్నాడు. విరాటుడు సిద్ధమైన రథాన్ని ఎక్కాడు. గోగ్రహణం జరిగిన ప్రదేశాన్ని పశుపాలకులను అడిగితెలిసికొంటూ ఆవైపు విరాటుడు పయనం సాగించాడు. అప్పుడు అతడి తమ్ముడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**శ్లా.** **లోకస్తుత్య విభూతి నన్యపృతనాలుంటాక బాహా బల**
**శ్రీకల్మిన్ రథ దంతి ఘోటక భటశ్రేణీ సముద్దాంత సే**
**నా కల్పధ్వజ విభ్రమంబున సుహృద్య ప్రోద్యముండై శతా**
**నీకుం దుద్ధతి నేఁగుదెంచె నఖిలానీకంబు నుప్పొంగఁగన్.** **146**

**ప్రతిపదార్థం:** శతానీకుండు= శతానీకుడు; లోకస్తుత్య విభూతిన్= లోకం చేత కీర్తించదగిన వైభవంతో; అన్యపృతనాలుంటాక= శత్రు సైన్యాలను దోచుకొనే; బాహాబల శ్రీకల్మిన్= భుజబల సంపద కలిగి ఉండటం చేత; రథ దంతి ఘోటక భట శ్రేణీ సముద్దాంత= రథాలూ; ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలాలూ అనే చతురంగబలాల వరుసలచేత అణచటానికి వీలుకాని; సేనా= సేనలకు; ఆకల్ప= అలంకారమైన; ధ్వజ విభ్రమంబునన్= పతాకవిజృంభణంతో; సుహృద్యప్రోద్యముండు+ఐ= మిక్కిలి మదికింపైన ప్రయత్నం కలవాడై; ఉద్ధతిన్= గర్వంతో; అఖిల+అనీకంబున్= సేనాసమూహమంతా; ఉప్పొంగఁగన్= ఉత్సాహపడగా; ఏఁగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ప్రపంచమంతటా పొగడ్తనందుకొన్న శక్తితో శత్రుసేనలకుత్తుకలను ఉత్తరించగల భుజబల సంపదతో చతురంగ బలాలతో సాటిలేని మేటి సేనకు అలంకారప్రాయంగా ఉండే ఉన్నతకేతనాల విలాసంతో, ఆకర్షణీయంగా కనబడే యుద్ధ ప్రయత్నాల శోభతో సేనలన్నీ ఉప్పొంగగా శతానీకుడు గర్వరేఖతో రంగప్రవేశం చేశాడు.

**విశేషం:** విరాటుడి తమ్ములలో పెద్దవాడు శతానీకుడు. పేరులోనే సైన్యవిస్ఫూర్తి కలవాడు. అతడి సైన్యంలో చతురంగబలానికి సమప్రాధాన్యం కనబడుతుంది. అతడు ఓజోగుణ విశిష్టుడైనట్లు ఈ పద్యంలో పోషించబడిన ఓజోగుణం ధ్వనింపజేస్తున్నది. గాఢబంధత్వం అనే శబ్దగుణమైన ఓజస్సును, అర్థప్రౌఢి అనే అర్థగుణమైన ఓజస్సును సమదృష్టితో ఈ పద్య రచనలో తిక్కన రాణింపజేశాడు. (సంపా.)

**ఉ.** **ఆతని తమ్ముఁడైన మదిరాశ్వుడు కర్ణ ఝుళంఝుళా సము**
**ద్ధూత బలోత్థరేణు పరిధూసరితాంబరమైన వారణ**
**వ్రాతము గొల్చి రాఁ గడఁగి వచ్చె సముజ్జ్వల హేమవర్మని**
**ర్యాత రుచిచ్ఛటా పటల రంజిత హేతి మహోగ్ర సైన్యుఁడై.** **147**

**ప్రతిపదార్థం:** ఆతని తమ్ముఁడు+ఐన= ఆ శతానీకుడి తమ్ముడైన మదిరాశ్వుడనేవాడు; కర్ణఝుళంఝుళాసముద్ధూత= చెవుల యొక్క ఘల్లు ఘల్లుమనే శబ్దాల చేత విసరికొట్టబడిన; బల+ఉత్థ= సైన్యంచేత పైకి లేచిన; రేణుపరిధూసరిత= ధూళితో

బూడిదరంగు కలదిగా చేయబడిన; అంబరము+ఐన= ఆకాశప్రాంతం కల; వారణవ్రాతము= ఏనుగుల సమూహం; కొల్చిరాన్= సేవిస్తూ రాగా; సముజ్జ్వల= ప్రకాశిస్తున్న; హేమవర్మ= బంగారు కవచం నుండి; నిర్యాత= వెలికివచ్చే; రుచి+ఛటా= కాంతుల కిరణాల; పటల= సమూహాలచేత; రంజిత= పూయబడిన; హేతి= ఆయుధాల చేత; మహా+ఉగ్రసైన్యుఁడు+ఐ= భయంకరమైన సేనకలవాడై; కడఁగి+వచ్చెన్= పూనికతో వచ్చాడు.

**తాత్పర్యం:** శతానీకుడి తమ్ముడు మదిరాశ్వుడు. అతడికి గజసేన మెండు. ఏనుగులు చెవులాడిస్తుంటే కలిగే ఝుళంఝుళనాదాలు పిక్కటిల్లాయి. ఆ గజబలం నడుస్తూ ఉంటే రేగిన దుమ్ము ఆకాశాన్ని బూడిదరంగుగా మార్చివేస్తూ ఉండింది. అంతటి గజబలం వెంటరాగా, తన బంగారు కవచంనుండి వెలువడే కాంతి కిరణాల గుంపులు కత్తులమీద పడి వాటిని పసిడివన్నెలతో వెలిగించివేస్తున్నాయి. అటువంటి సైనికవీరులు వెంట రాగా యుద్ధం చేసే పూనికతో మదిరాశ్వుడు వచ్చాడు.

**విశేషం:** అలం: అతిశయోక్తి. మూలంలో మదిరాశ్వుడి పేరు మదిరాక్షుడుగా ఉన్నది. ఇతడి సైన్యంలో గజదళం ఎక్కువ. అది అతడి ప్రత్యేకత. దానిని అర్థవ్యక్తి అనే గుణంతో తిక్కన స్ఫుటీకరించాడు. అర్థవ్యక్తిత్వం శబ్దగుణమైన అర్థవ్యక్తి. "కర్ణఝుళంఝుళాసముద్ధూత బలోత్థరేణు పరిధూసరితాంబరమైన" మొదలైనచోట్ల శబ్దార్థవ్యక్తి స్పష్టం. ఈ పద్యరచనలో గజసేనా బల ప్రత్యేకతను "వస్తుస్వభావస్ఫుటత్వం" అనే అర్థగుణంతో తిక్కన వ్యక్తీకరించాడు. (సంపా.)

**తే.** **అతని యనుజుండు సూర్యదత్తాహ్వయుండు। సమద సైనిక నానాస్త్ర శస్త్ర బహుళ**
**దీప్తిజాలక ప్రతిహత దినకరాంశు। రాజియై చనుదెంచె సంరంభ మెసఁగ.** **148**

**ప్రతిపదార్థం:** అతని+అనుజుండు= మదిరాశ్వుడి తమ్ముడు; సూర్యదత్త+ఆహ్వయుండు= సూర్యదత్తుడనే పేరు కలవాడు; సమద= మదించిన; సైనిక= సైనికుల యొక్క; నానా+అస్త్రశస్త్ర= పెక్కురకాలైన అస్త్రశస్త్రాల యొక్క; బహుళదీప్తిజాలక= పెక్కు వెలుగుల గుంపుల చేత; ప్రతిహత= నిరోధించబడిన; దినకర+అంశురాజి+ఐ= సూర్యకిరణాల సమూహం కలవాడై; సంరంభము+ఎసఁగన్= ఆటోపం అతిశయించగా; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** మదిరాశ్వుడి తమ్ముడి పేరు సూర్యదత్తుడు. మదించిన సైనికుల అనేక రకాల అస్త్రశస్త్రాల విస్తారమైన వెలుగులు సూర్యకిరణాల ప్రకాశాన్ని తలదన్నుతున్నట్లుండగా ససైన్యుడై త్వరత్వరగా అట్టహాసంగా యుద్ధరంగానికి వచ్చాడు.

**విశేషం:** అలం: అతిశయోక్తి. సూర్యదత్తుడనే పేరులోనే కాంతిగుణం ఉన్నది. అతడి సైన్యాల శస్త్రాస్త్రాల కాంతులు సూర్యకాంతిని కూడా తలదన్నేటట్లున్నాయన్న అతిశయోక్తి కాంతిని కాంతిమంతం చేస్తున్నది. దానికి తగినట్లు తిక్కన బంధౌజ్జ్వల్యం, దీప్తరసత్వం అనే లక్షణాలు గల శబ్దార్థగుణరూపమైన కాంతిగుణాన్ని పోషించటం ఔచిత్యం. (సంపా.)

**ఉ.** **తెల్లని జోడు పెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్య భూ**
**వల్లభు నగ్ర నందనుఁడు వైరి మదాపహ విక్రమ ప్రకా**
**రోల్లసితుండు వన్యబల ముద్ధతిఁ గొల్చు మృగేంద్రరేఖ శో**
**భిల్లుచు నుండ శంఖుఁడు విభీషణ శంఖనినాద మొప్పఁగన్.** **149**

**ప్రతిపదార్థం:** వైరిమద= శత్రువుల గర్వమును; అపహ= పడగొట్టు; విక్రమప్రకార= శౌర్యగతితో; ఉల్లసితుండు= శోభించేవాడు; మత్స్యభూవల్లభు= విరటుని యొక్క; అగ్రనందనుఁడు= పెద్దకుమారుడు; శంఖుఁడు= శంఖుడనేవాడు; తెల్లనిజోడు పెట్టుకొని= తెల్లని కవచం తొడుగుకొని; వన్యబలము= అరణ్యంలోని మృగాల సమూహం; ఉద్ధతిన్+కొల్వు= దర్పముతో సేవించే; మృగేంద్రురేఖ= మృగరాజైన సింహం యొక్క స్థితి; శోభిల్లుచున్+ఉండన్= ప్రకాశిస్తూఉండగా; విభీషణ శంఖనినాదము= మిక్కిలి భయంకరమైన శంఖధ్వని; ఒప్పఁగన్= తగిన విధంగా; తీవ్రగతిన్= మిక్కిలి వేగంగా; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** విరాటుడి పెద్ద కుమారుడు శంఖుడనేవాడు తెల్లని కవచం ధరించి భయంకరమైన శంఖ నినాదం చేస్తూ, వన్యమృగాలు కొలువగా వచ్చే మృగరాజైన సింహంయొక్క ఠీవితో, శత్రువుల గర్వాన్ని హతమార్చే శౌర్యంతో ప్రకాశిస్తూవున్నవాడై, తెల్లని తీవ్రమైన గమనంతో వచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ. విరాటరాజు పెద్ద కొడుకు శంఖుడు. సైన్యబలం విరటుడిది కావటంతో ఇతడికి స్వీయబలమే ఆధారం. మృగాల మీదకు లంఘించే సింహంవలె శత్రుసైన్యాలమీద దాడి చేసేపరాక్రమం అతడి ప్రత్యేకత. అతడి శంఖారావం విభీషణం. అది సింహగర్జనవంటిది. అర్థవ్యక్తి అనే శబ్దార్థగుణాలు పాత్రోచిత స్వభావ వ్యక్తిత్వం ధ్వనించేటట్లు రచించడం తిక్కన గుణవద్రచనా శిల్పం. (సంపా.)

**వ. మఱియు ననేక యోధవీరులు వివిధ వాహనారూఢులై గాఢసన్నాహంబులగు నిజవ్యూహంబులతో నేతెంచుచుండిరి; విరాటుండు బలంబులం గూర్చికొను తలంపునం బురబహిరంగణంబునం గొండొకసేపు నిలిచె; నట్టి సమయంబున ధర్మతనయుం డనిలతనయ మాద్రీతనయుల 'నంతంతం బొడసూపి నిలువుం'డని నిపుణంబుగా నియోగించి, తాను మత్స్యమహీవల్లభు నల్లనఁజేరి యిట్లనియె. 150**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకనూ; అనేక యోధవీరులు= పెక్కురు యుద్ధవీరులు; వివిధ వాహన+ఆరూఢులు+ఐ= అనేకవిధములైన వాహనాలెక్కివచ్చినవారై; గాఢసన్నాహంబులు+అగు= గట్టి యుద్ధపుటేర్పాట్లు కలిగిన; నిజవ్యూహంబులతోన్= తమ తమ సేనల పన్నాగాలతో; ఏతెంచుచున్+ఉండిరి= వస్తూఉన్నారు; విరాటుఁడు= విరటుడు; బలంబులన్= సైన్యాలను; కూర్చుకొను తలంపునన్= సిద్ధం చేసికొనే యోచనతో; పురబహిరంగణంబునన్= ఊరిబయట; కొండొకసేపునిలిచెన్= కొంతకాలం నిలిచాడు; అట్టిసమయంబునన్= అటువంటి వేళలో; ధర్మతనయుండు= ధర్మరాజు; అనిల తనయు= భీమసేనుడిని; మాద్రీతనయులన్= నకుల సహదేవులను; అంతంతన్+పొడ+చూపి= అక్కడక్కడ కనబరచుకొని; నిలువుండు+అని= అగుడని; నిపుణంబుగాన్= నేర్పరితనంతో; నియోగించి= ఉండుటకు ఉత్తర్వు చేసి; తాను= తానుకూడా; మత్స్యమహీవల్లభున్= విరాటరాజును; అల్లనన్= మెల్లగా; చేరి= దగ్గరై; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనేక యుద్ధవీరులు నానా వాహనాలను ఎక్కి, దృఢసన్నాహాలతో తమ తమ ఎత్తుగడలతో వస్తున్నారు. విరాటుడు సేనలను కూర్చుకొనే యోచనలతో ఊరి బయట కొంతసేపు నిలిచాడు. ఆ సమయంలో ధర్మరాజు; భీమ నకుల సహదేవులను అక్కడక్కడ తమ్ము 'కనబరచుకొని నిలువు'డని నేర్పుగా ఉత్తర్వు చేసి, తాను కూడా విరటుడి యొద్దకు తిన్నగా చేరి ఇట్లా అన్నాడు.

**చ. 'ఒక ఋషిచేత నాయుధ సముత్కర మెల్లను సప్రయోగమం**
**త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱయైనవాఁడ; గో**

**ప్రకరములన్ మరల్చుటకు బంధులు నీవును బోవ నాకు నిం**

**టికడన యున్కిపాడియె? ఘటింపఁగఁ బంపు రథంబు సయ్యనన్.'** **151**

**ప్రతిపదార్థం:** ఒక ఋషిచేతన్= ఒకానొకఋషి వలన; ఆయుధ సముత్కరము+ఎల్లను= అస్త్రాల, శస్త్రాల సమూహమంతటినీ; ప్రయోగసహిత మంత్రకముగన్= మంత్రపూర్వకంగా ప్రయోగించేందుకు; అభ్యసించి= నేర్చుకొని; సమరంబునకున్= యుద్ధానికి; కొఱ+ఐనవాఁడన్= ఉపయోగపడేవాడిని; గోప్రకరములన్= ఆలమందలను; మరల్చుటకున్= తిరుగదోలుకొనివచ్చుటకు; బంధులు= బంధువులు; నీవును= (రాజయిన) నీవును; పోవన్= పోగా; నాకున్= నాకు; ఇంటికడన= ఇంటివద్దనే; ఉన్కి= ఉండటం; పాడియె?= ధర్మమా?; చయ్యనన్= వెంటనే; రథంబు= తేరును; ఘటింపఁగన్= సిద్ధంచేయగా; పంపు= ఆజ్ఞాపించుము.

**తాత్పర్యం:** ఓ రాజా! ఒకానొక ఋషి మూలాన శస్త్రాస్త్ర ఆయుధ ప్రయోగాదులను మంత్ర సహితంగా అభ్యసించాను. యుద్ధానికి సమర్థుడనైన వాడను. ఆలమందలను మరల్చుటకు బంధువులతో నీవు వెళ్ళగా నే నిచ్చటనే ఉండటం న్యాయమా? కనుక వేగమే నాకొరకు రథాన్ని సన్నద్ధం చేయించుము.

**విశేషం:** కంకుడు సన్యాసివేషంలో ఉన్నాడు. కాబట్టి ఋషి వలన అస్త్రశస్త్రాలను సమంత్రకంగా అభ్యసించినట్లు చెప్పటం బాగా అతికింది. అస్త్రాలు మంత్ర సహితమైన బాణాలు, మంత్రాలకు ఋషులు, ఛందస్సులు, దేవతలు, ప్రయోగ, ఉపసంహరణ విధానాలు మొదలైనవి ఉంటాయి. సైన్య సమీకరణ కొరకు ఊరిబయట నిలువబడిన విరాటుడికి కంకుభట్టు తనంతట తాను అస్త్ర విద్యా కోవిదుడనని పరిచయం చేసికొనటం, రాజు యుద్ధానికి పోతున్నప్పుడు అతడి సేవలో ఉన్న తాను కూడా రాజుకు సేవ చేయటం ధర్మమని చెప్పటం విరాటుడికి నచ్చాయి. అంతేకాక కంకుభట్టును చూచిననాటినుండి అపారగౌరవం కలవాడు విరాటుడు. అతడు చక్రవర్తి కాదగినవాడనే అభిప్రాయం కలిగి ఉన్నవాడు. తగిన సమయానికి తగిన విధంగా ధర్మజుడు పలుకటం ప్రకరణోచిత్యం, శత్రువీరుల చేతిలో విరాటుడు ఓడిపోతే పాండవాజ్ఞాతవాసం భగ్నమౌతుంది. కాబట్టి తమను రక్షించే ప్రభువును రక్షించుకొనటం ధర్మరాజు ధర్మనీతి. అందులో కృతజ్ఞతాది లక్షణాలు బయటకు కనబడే ఉత్తమ సేవాగుణాలు. (సంపా.)

**క. అనిన విని యియ్యకొను న । మ్మనుజాధీశ్వరునితోడ మఱియు నతం డి**

**ట్లనుఁ, బవనతనయుఁ గవలం । గొని సమరంబునకుఁ బోవఁ గోరెడు మదితోన్.** **152**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; ఇయ్యకొను= ఒప్పికొనినట్టి; ఆ+మనుజ+అధీశ్వరునితోడన్= ఆ విరాటరాజుతో; మఱియున్= ఇంకను; అతండు= ఆ ధర్మజుడు; పవనతనయున్= వాయునందనుడైన భీముడిని; కవలన్+కొని= అమడలయిన నకుల సహదేవులను పిలుచుకొని; సమరంబునకున్= యుద్ధానికి; పోవన్+కోరెడు= వెళ్ళటానికైకోరే; మదితోన్= మనస్సుతో; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు.

**తాత్పర్యం:** అనగా విని ఇష్టపడిన ఆ రాజుతో ధర్మజుడు ఇంకా భీమసేనుడిని నకుల సహదేవులను తీసికొని యుద్ధానికి వెళ్ళవలెననే అభిప్రాయంతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** యుద్ధంలో పాల్గొనటానికి వీలున్న వాళ్ళందరినీ విరాటుడు పిలుస్తున్నాడు. దండులో చేర్చుకొనటానికి ఊరిబయట నిలుచున్నాడు. పాండవులలో యుద్ధం చేయగలవారు ప్రస్తుతం కంకుడు, వలలుడు, దామగ్రంథి, తంత్రీపాలుడు అనే పేర్లతో విరాటుడికి పరిచయమైన ధర్మజ, భీమ, నకుల, సహదేవులు. వీరు సేవలలో ప్రవేశించేటప్పుడు సమయం వస్తే యుద్ధాలలో

పాల్గొంటామని చెప్పారు కూడా. దానిని తగిన సమయంలో జ్ఞాపకం చేసి, వారికి కూడా యుద్ధంలో సహాయం చేసే అవకాశం కలిగించాలని సంకల్పించటం ధర్మరాజు వ్యూహం. చిన్నపామునైనా పెద్ద కర్రతో కొట్టాలన్న నీతిని ధర్మరాజు పాటించాడు. (సంపా.)

**సీ.** **'మన వలలుండు లావున బంటుతనమున । జను లెఱుంగఁగ సడిసన్నవాఁడు;**
**మంచిమగండు దామగ్రంథి యసమసం । గ్రామకేళీ గాఢ కౌతుకుండు,**
**వినుము, తంత్రీపాలుఁడును దుర్దమారాతి । మర్దనచాతుర్య మహిత భుజుఁడు;**
**మున్నును వీరలు మువ్వుర కడఁకల । కొలఁదు లే నెఱుఁగుదుఁ గొంతకొంత;**

**తే.** **యెక్కఁదగునట్టి యరదంబు లిచ్చి వీరి । ననికిఁ దోకొనిపోక కార్యంబు నాకుఁ**
**జూడ!' ననవుడు మేదినీశుండు హర్ష । నిర్భరాత్మకుఁ డై శతానీకుఁ జూచి.** **153**

**ప్రతిపదార్థం:** మన వలలుండు= మనవాడయిన ఈ వలలుడు (భీముడు); లావునన్= బలంలో; బంటుతనమునన్= పరాక్రమంలో; జనులు+ఎఱుంగఁగన్= ప్రజలు తెలిసేటట్లుగా; సడి+చన్నవాఁడు= పొగడ్తగన్నవాడు (అనింద్యుడు); మంచిమగండు= మేటి వీరుడైన; దామగ్రంథి= దామగ్రంథి అనే పేరుతో పిలువబడేవాడు (నకులుడు); అసమ= సాటిలేని; సంగ్రామకేళీ= యుద్ధక్రీడలో; గాఢకౌతుకుండు= దృఢమయిన ఆసక్తి ఉన్నవాడు; వినుము= ఇంకను వినుము; తంత్రీపాలుఁడును= తంత్రీపాలుడు కూడా (సహదేవుడును); దుర్దమ= గెలువరాని; అరాతిమర్దన= శత్రుసంహారంలో; చాతుర్య= నేర్పుగల; మహితభుజుఁడు= గొప్ప భుజబలమున్నవాడు; మున్నును= ఇదివరకుకూడా; వీరలు మువ్వుర= వీరి ముగ్గురి యొక్క; కడఁకల= పరాక్రమాలయొక్క; కొలఁదులు= శక్తులు; కొంతకొంత= ఒక్కింత ఒక్కింత; ఏన్+ఎఱుఁగుదున్= నాకు తెలియును; ఎక్కన్+తగునట్టి= ఎక్కటానికి తగిన; అరదంబులు+ఇచ్చి= తేరులనిచ్చి; వీరిన్= ఈ మువ్వురను; (అనగా వలలుడిని దామగ్రంథి, తంత్రీపాలురను); అనికిన్= యుద్ధానికి; తోకొనిపోక= పిలుచుకొనిపోవటం; నాకున్+చూడన్= నాకు చూడగా; కార్యంబు= చేయవలసినపని; అనవుడున్= అనగా; మేదినీ+ఈశుండు= రాజు విరాటుడు; హర్షనిర్భర+ఆత్మకుఁడు+ఐ= సంతోషంతో నిండిన మనసు కలవాడై; శతానీకున్+చూచి= శతానీకుడిని చూచి.

**తాత్పర్యం:** 'ఓ రాజా! మన వలలుడు బలంలోనూ, పరాక్రమంలోనూ మహావీరుడు, ప్రజల పొగడ్తలందినవాడు. మేటివీరుడైన దామగ్రంథి సాటిలేని యుద్ధక్రీడలో ఆసక్తికలవాడు. వినుము. తంత్రీపాలుడు శత్రు సంహార చాతుర్యంగల భుజబలం కలవాడు. ఇదివరకు ఈ మువ్వురకున్న శక్తులను ఇంచించుక నే నెఱుగుదును. వీ రధిష్ఠించదగిన రథాలను ఒసగి యుద్ధానికి వీరిని పిలిచికొనిపోవటం తగినపనిగా నాకు తోస్తున్నది' అని కంకుడు (ధర్మజుడు) అనగా విరాటుడు సంతసం నిండిన మనస్సుతో శతానీకుడిని చూచి. (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** భీమ నకుల సహదేవులను (వలల, దామగ్రంథి, తంత్రీపాలురను) పరిచయం చేసేతీరు ధర్మరాజు అర్థవ్యక్తి గుణసామర్థ్యాన్ని ప్రదర్శిస్తున్నది. 'మన వలలుడు' అన్న మాట చనువును, అభిమానాన్నీ తెలిపే పలుకు. కంకుడి తరువాత విరాటుడికి బాగా పరిచయమైనవాడు వలలుడు. అతడు బలంలో పౌరుషంలో ప్రజలలో బాగా పేరుమోసి ఉన్నాడు. అతడిని వెంట తీసికొని పోవటం విరాటుడి బలానికే బలంగా ఉంటుందన్నట్లు చెప్పాడు. అతడు రక్షగా ఉండదగిన శక్తి. ఇక దామగ్రంథి అశ్వశిక్షకుడు. సహజంగా మేటి వీరుడు. యుద్ధాలంటే సంబరపడేవాడు. అశ్వసేనకు తరిఫీదునిచ్చే ఆ ప్రధానోద్యోగిని

మరచిపోతే ఒక అశ్వయుద్ధనిపుణుడిని విస్మరించినట్లే. అందువలన అతడి సాయం అవసరం. ఇక తంత్రీపాలుడు గోరక్షకుడు. అతడూ శత్రువులను మర్దించటంలో అనుభవమున్న భుజబలుడు. పైపెచ్చు శత్రువులు ఆక్రమించింది గోగణాన్ని. దాని కధిపతి తంత్రీపాలుడు. తన అధీనంలో ఉన్న గోవులను ఆక్రమించిన శత్రువులను మర్దించగల అతడికి అవకాశం కలిగించటం అవసరం అని చెప్పినట్లయింది. ఆ ముగ్గురిని గురించి కంకుడికి స్వయంగా తెలుసు. వారు రథికులుగా యుద్ధంలో పాల్గొనదగినవారని కంకుడి హితవు. ఈ ముగ్గురి సహాయం అప్పట్లో విరాటుడికి ఎంతో అవసరం. పెరట్లో ఉన్న కల్పవృక్షాలను జ్ఞాపకం చేసినట్లు ఉన్నవి కంకుడి మాటలు. అందుకే విరాటుడు 'హర్షనిర్భరాత్ము'డైనాడు. తన తమ్ముడైన శతానీకుడిని చూచి అభిమానంతో, రాజగౌరవంతో వారి వారి యోగ్యతలకు తగిన రథాల నిప్పించుమని ప్రత్యేకంగా పేర్కొన్నాడు. కంకుభట్టు సలహాతో విరాటుడు కృతార్థుడైనట్లున్నాడు. ఆ తరువాత సైనికుల సమీకరణకు అతడు ప్రయత్నించినట్లు కూడా లేదు. అవసరం కూడా లేదు. చేరవలసిన ఈ రథికులు ముగ్గురూ సహాయకులుగా చేరటానికే విరాటుడు ఊరి బయట నిలిచినట్లున్నది కథ. ఊరి బయటనే ఈ ముగ్గురూ ఒకచోట కనబడటానికి వీలున్నది కూడా. వారు ఉద్యోగాలలో చేరిందీ, యుద్ధోద్యోగంలో చేరిందీ అదే రంగం కావటం నాటకీయమైన రామణీయకం. (సంపా.)

**వ. కంక వలల దామగ్రంథి తంత్రీపాలురం జూపి యిట్లనియె. 154**

**తాత్పర్యం:** కంక, వలల, దామగ్రంథి, తంత్రీపాలురను చూపి ఇట్లా అన్నాడు.

**మ. 'రథముల్ మంచివి గాఁగ నాలు గతిశీఘ్రవ్యాప్తి సత్త్వంబులం**
**బ్రథితంబైన తురంగమోత్కరము సంగ్రామర్హచాపంబు ల**
**శ్లథవర్మంబులు వీరికిమ్ము; రణలీలాదక్షతన్ మన్మనో**
**రథముం దీర్పఁగ వీర లోపుదురు దోర్గర్వం బఖర్వంబుగన్.' 155**

**ప్రతిపదార్థం:** రథముల్= తేరులు; మంచివి+కాఁగన్= శ్రేష్ఠమైనవిగా (ఎన్నికచేసి); నాలుగు= నాలుగింటిని; అతి శీఘ్రవ్యాప్తి సత్త్వంబులన్= మిక్కిలి వేగంగా పోవటంలోను, బలంలోనూ; ప్రథితంబు+ఐన తురంగమ+ఉత్కరము= ప్రసిద్ధి కెక్కిన గుర్రాల సముదాయాన్నీ; సంగ్రామ+అర్హచాపంబులు= యుద్ధానికి తగిన విండ్లను; అశ్లథవర్మంబులు= చీల్చటానికి వీలులేని గట్టి కవచాలను; వీరికిన్+ఇమ్ము= కంక, వలల, దామగ్రంథి, తంత్రీపాలురనే వీరి కీయవలసింది; రణలీలాదక్షతన్= యుద్ధంచేసే నేర్పుతో; దోర్గర్వంబు= భుజగర్వం; అఖర్వంబుగన్= మొక్కపోకుండా; మత్+మనోరథమున్+తీర్పఁగన్= నా కోరిక నెరవేర్చటానికి; వీరలు+ఓపుదురు= వీరు సమర్థులు.

**తాత్పర్యం:** నాలుగు మంచి రథాలను ఎన్నిక చేయండి; వేగమూ శక్తీ కలిగిన మేలి గుర్రాలను ఆ రథాలకు పూన్చవలసింది; యుద్ధానికి తగిన ధనుస్సులను, చీల్చుటకు వీలులేని గట్టి కవచాలను కంక, వలల, దామగ్రంథి, తంత్రీపాలురనే వీరికి ఈయవలసింది. యుద్ధక్రీడా దక్షులుగా నా కోరికను నెరవేర్చగల శక్తి, మొక్కవోని భుజబలం కళ వీరికున్నది.

**విశేషం:** కంక, వలల, దామగ్రంథి, తంత్రీపాలుర బలపరాక్రమాల మీద విరటుడి కేర్పడిన నమ్మకం ఈ పద్యంలో ధ్వనించింది. ఇది భావి కథార్థధ్వని కూడా. (సంపా.)

**వ. అనిన నతం'డట్ల చేయుదు'నని వారలం దోడ్కొని చని సమస్తంబును సన్నద్ధంబు గావించి, యంగరాగ మాల్యాంబరాభరణంబుల నలంకృతులం జేసినం గైకొని, తమయంతవట్టునుం గూడుకొని సూతకృత్యంబులకుం దార చాలి, రథంబులు దోలికొని చనుదెంచిరి; తదనంతరంబ. 156**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అతండు= ఆ శతానీకుడు; అట్లు+అ చేయుదున్+అని= ఆ విధంగానే చేస్తానని; సమస్తంబును= అన్నిటిని; సన్నద్ధంబు+కావించి= సిద్ధంచేసి; అంగరాగమాల్య+అంబర+ఆభరణంబులన్= శరీరాలంకారానికి అవసరమైన మైపూతలు, దండలు, దుస్తులు, నగలు మొదలగువాటితో; అలంకృతులన్+చేసినన్= అలంకరించబడినవారినిగా చేయగా; కైకొని= తీసికొని (స్వీకరించి); తమ అంత+పట్టున్+కూడుకొని= తామందరూ కలసి; సూతకృత్యంబులకున్= సారథులు చేసే పనికి కూడా; తారు+అ చాలి= తామే తగినవారై; రథంబులు= రథాలను; తోలికొని= తోలికొంటూ; చనుదెంచిరి= వెళ్ళారు; తదనంతరంబు+అ= ఆమీదట.

**తాత్పర్యం:** ఆ శతానీకు డట్లే చేస్తానని వారిని తీసికొనిపోయి, అన్నిటిని సిద్ధంచేసి అంగరాగాదులచేత అలంకరించబడినవారినిగా చేయించగా వారు స్వీకరించారు. తామంతా కలిసి సారథి పనులు తామే చూచుకొంటూ కంక, వలల, దామగ్రంథి, తంత్రీపాలురు వెళ్ళారు. ఆ తరువాత.

**విశేషం:** సారథులను సమకూర్చుమని విరటు డనలేదు. ధర్మరాజాదులు కోరలేదు. అప్పటికే సారథుల కొరత ఏర్పడిందేమో! ఏమైనా రథిక సారథ్య ధర్మాలను స్వయంగా నిర్వహించుకొనే మేటి వీరులు పాండవులు. (సంపా.)

**సీ. గంధ దంతావళ కర్ణమారుతహతిఁ। గాంతారములు చాఁపకట్టువడఁగ,**
**రథ ఘోషమునఁ బ్రతిరవమిచ్చునద్రులు। భయమున వాపోవు భంగి నుండఁ,**
**దురగ ఖురోద్ధూత ధూళి దన్బెరసిన। వననిధి పిండలివండు గాఁగ,**
**బహుళపదాతి దుర్భరభార మడరిన। నురగకూర్మంబు లొండొదంటిఁ బొంద**

**తే. సైన్యముల నడిపించె నుత్సాహలీల। యతిశయిల్లంగ సంరంభ మగ్గలింప**
**బరవసము మిక్కుటంబుగఁ బసులు సన్న। జాడఁ గై కొని యమ్మత్స్యజనవిభుండు. 157**

**ప్రతిపదార్థం:** గంధ దంతావళ కర్ణమారుతహతిన్= మదపుటేనుగుల యొక్క చెవులు విసరుటచే కలిగిన గాలి తాకిడికి; కాంతారములు= అడవులు; చాపకట్టు+పడఁగన్= చాపచుట్టవలె పడిపోగా, రథఘోషమునన్= తేరుల శబ్దానికి, ప్రతిరవము+ఇచ్చు= బదులుపలుకే (పలుకురాయివలె ప్రతిధ్వనించే); అద్రులు= కొండలు; భయమునన్= భయంచేత; వాపోవుభంగిన్+ఉండన్= దుఃఖిస్తు బిగ్గరగా అరుస్తూవున్నట్లుండగా; తురగ= గుర్రాలయొక్క; ఖుర= గొరిజలచేత; ఉద్ధూత= రేగగొట్టబడిన; ధూళి= దుమ్ము; తన్+బెరసినన్= తన్ను కప్పగా; వననిధి= సముద్రం; పిండలివండుకాఁగన్= చిక్కని బురదకాగా, బురదముద్దకాగా; బహుళ= విస్తారమైన; పదాతి= కాల్బలాల యొక్క; దుర్భర= భరించరాని; భారము= బరువు; అడరినన్= ఎక్కువ కాగా; ఉరగకూర్మంబులు= భూమిబరువును మోస్తున్న ఆదిశేషువూ (పాము), ఆది కూర్మం (తాబేలూ); ఒండొంటిన్+పొందన్= ఒకదానికొకటి చేరగా; ఆ+మత్స్య జనవిభుండు= ఆ విరాటరాజు; ఉత్సాహలీల అతిశయిల్లంగన్= సంతసం ఎక్కువకాగా; సంరంభము+అగ్గలింపన్= ఆటోపం అతిశయించగా; బరవసము= ధైర్యం; మిక్కుటంబుగన్= అతిశయంకాగా; పసులు= ఆవులు; చన్నజాడన్= వెళ్ళిన బాటను; కైకొని= పొంది; సైన్యములన్= సేనలను; నడిపించెన్= ముందుకు సాగేటట్లు నడిపించాడు.

**తాత్పర్యం:** మదపుటేనుగుల చెవిగాలుల దెబ్బచేత అరణ్యాలు చాపకట్టగా పడ్డాయి. రథఘోషల చేత ప్రతిశబ్దమిచ్చే కొండలు భయంచేత అరుస్తూ దుఃఖించేటట్లుగా ఉండినవి. గుఱ్ఱాల కాలిగిట్టలచేత ఎగదన్నబడిన దుమ్ము కప్పుకొనగా సముద్రం బురదముద్ద అయింది. గొప్ప కాల్బలం యొక్క భరించరాని బరువుచేత అతిశయింపగా ఆదిశేషుడూ, ఆదికూర్మమూ ఒకదానినొకటి తాకినవి. ఇట్లా విరాటరాజు ఉత్సాహం ఎక్కువకాగా, ఆటోపం అతిశయించగా, ధైర్యంతో, ఆవులు వెళ్ళిన మార్గాన్ని గుర్తించి సైన్యాలను నడిపించాడు.

**విశేషం:** అలం: అతిశయోక్తి, యథాసంఖ్యం. సీసపద్య పాదాలు నాలుగింటిలో వర్ణించిన గజ, రథ, తురగ, పదాతుల (చతురంగబలాల) విజృంభణం అతిశయంగా చెప్పి, ఎత్తుగీతిలో నాలుగు రకాలుగా నడిపించిన పద్ధతులతో క్రమంగా అన్వయింపచేయటం అతిశయోక్తి యథాసంఖ్యాలంకారాల సార్థక ప్రయోగం. ఏనుగుల చెవులగాలికి అడవులు చాపకట్టుగా పడేటట్లు నడపటం ఉత్సాహం అతిశయించటం వలన సాధ్యపడింది. రథఘోషకు కొండలు మారుమ్రోగి, దుఃఖిస్తున్నట్లుండటం సైన్యసంరంభం అతిశయించటం వలన ఏర్పడింది. గుఱ్ఱాల గిట్టల తాకిడి వలన రేగిన దుమ్ము సముద్రాన్ని బురదముద్ద చేయటం పరాక్రమ పారవశ్యంతో అశ్వసేనలను నడపటం వలన ఏర్పడింది. పశువులు పోయిన బాట కనబడటంతో బహుళ పదాతి సేన వేగంగా నడిచింది. ఆ నడక వేగానికి ఏర్పడిన భూభారాన్ని ఆదిశేషుడూ, ఆదికూర్మమూ కలిసి మోయవలసి వచ్చింది. చతురంగబల ప్రభావాన్ని వర్ణించే ఈ పద్యంలో బలాలగతుల వలన ఏర్పడిన సైన్యోత్సాహాన్ని క్రమదశలలో వర్ణించటం ఈ పద్య శిల్ప విశేషం. విరాటుడి నాయకత్వం విజయసూచకమని ధ్వని. చతురంగబల మర్దనంలో పాండవ వీరచతుష్టయ పరాక్రమం పరోక్షంగా ధ్వనింపజేయటం ఆలోచనామృతం.(సంపా.)

**వ. ఇట్లు చని కూడముట్టిన.** **158**

**తాత్పర్యం:** ఈ విధంగా వెళ్ళి వెన్నంటి తాకగా, (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. విరటు బలంబుఁ ద్రిగర్తే । శ్వరు బలముం జెలఁగ నార్చి వడిఁ దాఁకె భయం**
**కరనాద మేదురములగు । శరనిధు లొండొంటిఁ దాఁకుచందం బమరన్.** **159**

**ప్రతిపదార్థం:** విరటుబలంబున్= విరటుడి సైన్యమూ; త్రిగర్త+ఈశ్వరుబలమున్= త్రిగర్తరాజైన సుశర్మయొక్క సైన్యమూ; చెలఁగన్= ఉత్సాహంతో; ఆర్చి= సింహనాదాలు చేసి; వడిన్= తొందరగా; భయంకరనాదమేదురములు+అగు= గొప్పశబ్దాలతో దట్టమయిన; శర నిధులు= సముద్రాలు; ఒండొంటిన్= ఒకదానినొకటి; తాఁకుచందంబు= ఢీకొన్న విధంగా; అమరన్= ఒప్పగా; తాఁకెన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** విరటుడి సైన్యం, సుశర్మ సైన్యం పెచ్చుపెరిగి సింహనాదాలతో శీఘ్రంగా ఎదుర్కొన్నాయి. ఆ తాకిడి - సముద్రాలు ఒకదానితో మరొకటి భయంకర శబ్దాలతో ఘర్షణ పడ్డట్లుగా ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**మ. గుణరావంబుఁ గృపాణ ఘట్టన రవక్షోభంబునుం, గింకిణీ**
**క్వణన వ్యావృత హేషితస్వనములున్, ఘంటా నినాదాత్త పో**
**షణ నానాపటు బృంహిత ధ్వనియు, శశ్వద్గాఢమై పేర్చినన్**
**రణనం బించుక దోఁప లేద బహుతూర్యశ్రేణి నా సేనలన్.** **160**

**ప్రతిపదార్థం:** గుణరావంబు= అల్లెత్రాటిశబ్దమూ; కృపాణ= కత్తుల యొక్క; ఘట్టనరవ= రాపిడి వలన కలిగిన శబ్దం వలని; క్షోభంబునున్= కలతయూ; కింకిణీక్వణన= మువ్వల శబ్దాలచేత; వ్యావృత= వ్యాపించిన; హేషిత స్వనములున్= గుఱ్ఱాల సకిలింత చప్పుడులున్నూ; ఘంటానినాద= ఘంటల శబ్దాలతో; ఆత్త= పొందబడిన; పోషణ= పెంపుగల; నానాపటు బృంహితధ్వనియున్= అనేకములయిన ఏనుగుల ఘీంకారశబ్దాలున్నూ; శశ్వత్+గాఢమై పేర్చినన్= స్థిరమై దట్టమై విజృంభించగా; ఆ సేనలన్= ఆ సైన్యాలలో; బహుతూర్యశ్రేణిన్= అనేకాలైన వాద్యాల (నాదాల) వరుసలలోని; రణనంబు= ధ్వని; ఇంచుక= కొద్దిగా కూడా; తోఁపలేదు+అ= వినిపించనేలేదు.

**తాత్పర్యం:** జ్యానాదాలు, కత్తుల ఘట్టనంచే కలత చెందించే శబ్దాలు, మువ్వల సవ్వడులతో వ్యాపించే గుఱ్ఱాల సకిలింతలు, ఘంటా నినాదాలతో గూడిన అనేక విధాలైన ఏనుగుల ఘీంకారశబ్దాలు కలిసి కోలాహలంగా విస్తరించే సరికి, ఆ సేనలో పెక్కువరుసలలో మ్రోగుతున్న తూర్యధ్వనులు కొద్దిగాకూడా వినిపించలేదు.

**విశేషం:** చతురంగ బలాలు చేసే సవ్వడి తూర్యనాదాల ధ్వని కంటె మించిందని చెప్పే ఈ వర్ణనం విశిష్టం. తూర్యనాదాలు సైన్యాలకు ఉత్సాహ ప్రేరకాలు. వాటి పని లేకుండానే సహజమైన ఉత్సాహాన్ని సేనలు ప్రదర్శిస్తున్నాయని ధ్వని. (సంపా.)

## విరాట సుశర్మల సైన్యంబు సంకులంబుగాఁ బోరుట (సం.4-31-1)

**వ అట్టి సమయంబున. 161**

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

**సీ. ఒండొంటితోఁ దాఁకి మండెడునవియును, । జిందముల్ పొడిపొడి సేయు నవియు.**
**గట్టి మైమఱువులు దట్టముల్ గావించు । నవియును, నెఱను నోనాడునవియు,**
**నెట్టుపైఁ బడి మేని నెగయించునవియును । దల నేల డొల్లంగఁ దాఁకు నవియు,**
**నిరుమెయిఁ దొలిచి బె ట్టిలఁ దూఱు నవియును, । నలువుర నేవుర నాఁటు నవియు.**

**తే. నైన శరములు గనుఁగొని యాడి యాడి । నారదుఁడు పిచ్చలింపంగ వీరకేళి**
**సలిపె నుద్ధతిమై ధనుర్బలము లడరి । లావు వెరవును నెఱయఁ జలంబు మెఱయ. 162**

**ప్రతిపదార్థం:** ఒండొంటితోన్+తాఁకి= ఒకదానితో ఇంకొకటి డీకొని (ఒరసికొని); మండెడు+అవియును= మండుతున్నవీ; చిందముల్ పొడిపొడి+ చేయునవియున్= శంఖాలను పొడిపొడిగా చేసేవీ; గట్టిమైమఱువులు= దృఢమైన కవచాలను; దట్టముల్ కావించు నవియును= సళ్లుపడేటట్లు చేసేవీ; నెఱను నోనాడునవియున్= మర్మస్థానాలను బాధించేవీ; నెట్టుపైన్+పడి= మిక్కిలిగా మీదపడి; మేనికిన్= శరీరాన్ని; ఎగయించునవియును= ఎగురగొట్టేవీ; నెఱచు నోనాడునవియును= మర్మస్థానాలను బాధించేవీ; నెట్టుపైన్+పడి= మిక్కిలిగా మీదపడి; మేనిన్= శరీరాన్ని; ఎగయించునవియును= ఎగురగొట్టేవీ; తలనేలడొల్లంగన్+తాఁకునవియున్= తల భూమిమీద దొర్లేటట్లుగా గ్రుచ్చుకొనేవీ; ఇరుమెయిన్+తొలిచి= రెండు శరీరాలను చీల్చుకొని; బెట్టు= తీవ్రంగా; ఇలన్+తూఱు+అవియును= నేలమీద దూసుకు పడేవీ; నలువురన్+ నల్గురిని; ఏవురన్= అయిదుగురను; నాటు+అవియున్+ఐన= గ్రుచ్చుకొనేవిగా అయిన; శరములు= అమ్ములను; కనుఁగొని= చూచి; నారదుఁడు= నారద మహర్షి; అడి ఆడి= ఆనందంతో

నాట్యం చేసి చేసి; పిచ్చలింపంగన్= అతిశయిచేటట్లు; ఉద్ధతిమైన్= దర్పంతో; ధనుర్బలములు= ధనుస్సును పట్టిన సైనికులు; అడరి= అతిశయించి; లావు= బలం; వెరవును= ఉపాయాన్ని; నెఱయన్= ప్రకటించేటట్లు; చలంబు= మాత్సర్యం; మెఱయన్= అతిశయించగా; వీరకేళి= వీరవిహారం; సలిపెన్= చేశాయి.

**తాత్పర్యం:** (యుద్ధరంగంలో) ఒకదానినొకటి ఒరసికొని మండుతున్నవీ, శంఖాలను పొడిపొడి చేసేవీ, గట్టి కవచాలను చీల్చేవీ, మర్మస్థానాలను బాధించేవీ, తలలు నేలమీద పడి దొర్లేటట్లు చేసేవీ, మేని రెండు వైపులా తొలిచి చీల్చేవీ, నలుగురినీ, అయిదుగురినీ ఒకేసారి గ్రుచ్చి చంపేవీ అయిన బాణాల భంగిమలను చూచి నారదుడు ఆనందంతో నాట్యం చేయగా విలుకాండ్రు గర్వంతోకూడిన వింటి నేర్పుతో బలాన్నీ, ఉపాయాన్నీ, మాత్సర్యాన్నీ ప్రదర్శిస్తూ వీరవిహారం చేశారు.

**విశేషం:** అలం: ఉల్లేఖం, యథాసంఖ్యం, అంత్యానుప్రాసం. ఇందులో విలుకాండ్రు బాణప్రయోగ విద్యాతో రణరంగంలో వీరవిహారం చేసిన తీరును ఉల్లేఖంగా వర్ణించాడు తిక్కన. వీరకేళిలో నాలుగు రకాలైన అంశాలున్నాయి. 1. ఉద్ధతితో అడరటం. 2. లావు మెరయటం, 3. వెరపు మెరయటం. 4.చలం మెరయటం. ఉద్ధతితో ప్రయోగించే వీరకేళిలో బాణాలు పరస్పరం రాపిడిపడి మంటలు క్రక్కుతాయి. శంఖాలను నుగ్గు నుగ్గు చేస్తాయి. బలంతో కొట్టే బాణాలు కవచాలను చీలుస్తాయి. శరీర మర్మావయవాలను ఛేదిస్తాయి. ఉపాయంతో వేసే బాణాలు మీదబడి శరీరాలను బంతులవలె ఎగురవేస్తాయి; తలలను నేలకు పడవేస్తాయి. మాత్సర్యంతో వేసే బాణాలు శరీరాలను తొలుచుకుంటూ పోయి నలుగురినీ, అయిదుగురినీ ఒకేసారి చంపివేస్తాయి. ఉత్తరోత్తరాలు బలీయాలుగా చెప్పబడే ఈ బాణాల ప్రయోగ విధానాలు సారాలంకారస్ఫూర్తిని కలిగిస్తూ యథాసంఖ్యాలంకారాన్ని బలపరుస్తున్నాయి. ఉల్లేఖాలంకారం బాణ ప్రయోగ నైపుణ్యాన్ని పలురకాలుగా శ్లాఘించేది. అట్లా శ్లాఘిస్తున్నట్లు నైపుణ్యాన్ని చూచి నారదుడు నాట్యం చేసినట్లు చెప్పటం విశేషం. నారదుడు కలహప్రియుడు. ఊరక కలహం ఏర్పడితే ఆయన నాట్యం చేయడు. వీరకేళిలో కలహతీవ్రత గోచరిస్తేనే ఆనందనాట్యం చేస్తాడు. వీరకేళి తారస్థాయిని చేరితే దానిని వర్ణించగల కవిసమయం నారదనాట్యమే. అది దాని ఉత్కృష్టతకు చిహ్నం. విలుకాండ్ర వీరకేళిని విస్తృతవృత్తమైన సీసంలో వర్ణించటం ఛందశ్శిల్పం. అందులో అంత్యానుప్రాసాలంకారంతో బాణ ప్రయోగ ధ్వని పౌనఃపున్యాన్ని తిక్కన ధ్వనింపజేశాడు. (సంపా.)

**వ. అప్పుడు సుభటులు గడంగి. 163**

**తాత్పర్యం:** ఆ సమయంలో సుశిక్షితులయిన సైనికులు పూనుకొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. ఏటుల మ్రొగ్గువారిఁగని యించుక కొంకక యర్మ్ము పెంపునం**
**బోటుల వాతఁ బోవు భటపుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్**
**వ్రేటులఁ గ్రీడ సల్పి, పృథివిం బడు వీరులఁ ద్రొక్కి కొంచు నె**
**చ్చోటులనైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱు సేయుచున్. 164**

**ప్రతిపదార్థం:** ఏటుల= బాణాలదెబ్బలతో; మ్రొగ్గువారిన్= కూలేవారిని; కని= చూచి; ఇంచుక= కొద్దిగా కూడా; కొంకక= జంకకుండా; అర్మ్ముపెంపునన్= ఎదుటివారిని ఆక్రమించాలనే ఉత్సాహంతో; పోటుల= దెబ్బల; వాతన్= బారికి; పోవు= ఎదురయ్యే; భటపుంగవులన్= మేటి సైనికులను; మదిన్మెచ్చుచున్= మనసులో మెచ్చుకొంటూ; వడిన్= త్వరగా; వ్రేటులన్+క్రీడ= దెబ్బలతోఆట; సల్పి= చేసి; పృథివిన్+పడువీరులన్= భూమి మీద పడే వీరులను; త్రొక్కికొంచున్= తొక్కుకొంటూ; నెత్తురువఱ్ఱు చేయుచున్= రక్తాన్ని ప్రవాహంగా చేస్తూ; ఏ+చోటులన్+అయినన్= ఎక్కడైనా; అగ్గలికన్+చొత్తురు= శౌర్యంతో ప్రవేశిస్తారు.

**తాత్పర్యం:** సుశిక్షితులైన భటులు తమ ఆయుధాల దెబ్బలతో నేలకు ఒరిగిపోయేవారిపట్ల కొంచెంకూడా జాలి చూపించరు. అయితే ఎదుటివారిని ఎదుర్కొనాలని విజృంభించి తమ పోట్లకు గురియైన మేటి సైనికులను చూచి మెచ్చుకొంటారు. వడివడిగా యుద్ధంచేసి తమ ఆయుధాల దెబ్బలకు నేలమీద పడిపోయిన వీరులను త్రొక్కుకుంటూ, నెత్తురు ఏరులు పారేటట్లు చేస్తూ ఉత్సాహంతో ఏచోటికైనా వారు ముందుకు సాగిపోతారు.

**సీ. ఒక్కఁడు పెక్కండ్ర కెక్కిన విచ్చియుఁ । బొదివి చెటిఒకపోటు వొడుచు నెడలుఁ,**
**బలువు రొక్కనిమీఁదఁ బఱపిన సైరించి । నళికి పైఁ బెట్టక నిలుచు నెడలు,**
**దళము దళంబుతోఁ దాఁకి యగ్గలికమై । నీడఁబోవక వ్రేటులాడునెడలు,**
**నోహరి సాహరి నుయ్యాలచేరుగా । వెనుకొంచుఁ దెరలుచుఁ బెనఁగునెడలు**

**ఆ. నై యనేకభంగి నాశ్విక సేనలు । బొమ్మ లాడినట్లు పోరుచుండె**
**నమరగణము సిద్ధ సమితియు వేడుకఁ । జదల నిలిచి చూచి సంస్తుతింప. 165**

**ప్రతిపదార్థం:** ఒక్కఁడు= ఒకడు; పెక్కం(డ్రకున్= అనేకులను; ఎక్కినన్= ఎదుర్కొనగా; విచ్చియున్= (వారు) చీలిపోయి కూడ; పొదివి= (మరల) క్రమ్ముకొని; చెటి+ఒకపోటు= ఒకరొకరూ ఒక్కొక్క పోటు; పొడుచు= పొడుచునట్టి; ఎడలున్= ప్రదేశాలూ; పలువురు= చాలామంది; ఒక్కనిమీఁదన్= ఒకడిపై; పఱపినన్= వేగంతో వచ్చిపడగా; సైరించి= ఓర్చుకొని; అళికి= జంకి; పైన్+పెట్టక నిలుచునెడలు= పైకిపోక నిలిచే చోటులు; దళము దళంబుతోన్+తాఁకి= గుర్రాల సైన్య విభాగం మరొక గుర్రాల సైన్య విభాగంతో తలపడి; అగ్గలికమైన్= ఎక్కువగా; ఈడన్+పోవక= వెనుకంజవేయక; వ్రేటులాడు+ఎడలున్= దెబ్బలాడే తావులు; ఓహరిసాహరిన్= నేనంటే నేనంటూ (అహమహమికతో); ఉయ్యాలచేరుగాన్= ఊయలతాడువలె (తాడు ఉయ్యాలవలె); వెనుకొంచున్= వెనుకకు ఒరుగుతూ; తెరలుచున్= ముందుకు దూసుకొని వస్తూ; పెనఁగు+ఎడలున్= పెనగులాడే ప్రదేశాలు; ఐ= అగుచు; అనేక భంగిన్= నానా విధాలుగా; ఆశ్వికసేనలు= గుర్రపు రౌతుల సేనలు; అమరగణమున్= దేవతల సమూహాలూ; సిద్ధ సమితియున్= సిద్ధుల సమూహాలూ; చదలన్= ఆకసంలో; నిలిచి= నిలబడి; వేడుకన్= కుతూహలంతో; చూచి= చూచి; సంస్తుతింపన్= కీర్తించగా; బొమ్మలు+ఆడినట్లు= బొమ్మలు ఆడినట్లుగా; పోరుచున్+ఉండెన్= యుద్ధం చేస్తున్నాయి.

**తాత్పర్యం:** ఒక అశ్వికుడు పలువురు అశ్వికుల మీదకు దూసుకొని వస్తే ఆ గుంపు చీలిపోయి ఆ అశ్వికుడి పోటు నుండి రక్షించుకొని, అంతలో ఆ చీలిపోయిన గుంపులు ఒక్కటై ఆ అశ్వికుడిని రెండు వైపుల నుండి దాడి చేసి పోట్లాడే ఘట్టాలూ, పలువురు అశ్వికులు ఒకడి మీదకు దాడి చేయగా అతడు దానికి ఒర్చుకొని, జంకి దూరంగా పోకుండా, అక్కడే స్థిరంగా నిలిచి అందరితో పోరు చేసే ఘట్టాలూ, ఒక అశ్వసైన్య విభాగం మరొక అశ్వసైన్య విభాగంమీద దాడి చేసి పోరు తీవ్రంగా సాగించినా ఏ విభాగమూ వెనుదీయకుండా పరస్పరం క్రుమ్ము లాడుకొనే ఘట్టాలూ, అశ్వసేనలు పరస్పరం ఢీకొని, మేమంటే మేము అనే పెనుగులాటలో ఉయ్యాలత్రాడువలె ఒకసారి వెనుకకు ఒదుగుతూ, మరొకసారి ముందుకు పొడుచుకొని వస్తూ పోట్లాడే ఘట్టాలూ ఏర్పడి రకరకాలుగా బొమ్మలాట లాడినట్లు అశ్వికసేనలు యుద్ధం చేశాయి. ఆ యుద్ధాన్ని ఆకాశంలో దేవతలు, సిద్ధులు గుంపులు గుంపులుగా కూడి నిలిచి ఆసక్తికరంగా చూస్తూ ప్రశంసించారు.

**విశేషం:** అలం: ఉపమ. అశ్వసేనలు యుద్ధం చేసే తీరును కళ్ళకు కట్టేట్లు వర్ణించాడు తిక్కన. మిట్టమీద నిలబడి మైదానంలో జరుగుతున్న గుర్రాల రౌతుల పోరును చూస్తే ఆకాశంలో నిలబడిన దేవతలకు వలెనే మనకూ కనపడేటట్లు విహంగవీక్షణంగా

(Areal view) దర్శింప చేశాడు కవి. ఇందులో ప్రధాన లక్షణం- అశ్వసేనలు మేము గొప్పంటే మేము గొప్ప అని నిరూపించుకొనటానికి యుద్ధం చేయటం! అందువలన ఒకసారి ఒకవైపు సేన వెనుకాడినట్లు కనబడుతుంది. మరొకసారి మరొకవైపు సైన్యం వెనకాడిన ట్లౌతుంది. వెనుకబడిన సేనను మరొక సేన పోటెత్తుతున్నట్లుగా ఉంటుంది. దూరం నుండి చూస్తే గుర్రాల దండుల కదలిక ఊయల ముందుకూ వెనక్కూ ఊగుతున్నట్లు అందంగా కనపడుతుంది. ఇది మూడు రకాలుగా ఉంటుంది. ఒక రౌతు పలువురితో ఢీకొన్నప్పుడు పలువురు ఒక రౌతును చుట్టుముట్టినప్పుడు. ఒక సేనలోని విభాగం మరొక సేనలోని విభాగంతో ముఖాముఖి తలపడ్డప్పుడు. ఈ మూడూ ప్రత్యేకంగా చూచినా, సామూహికంగా చూచినా ఊయల ఊగినట్లుండటమే కాకుండా బొమ్మలాడినట్లుంటాయట! బొమ్మలాడటం అంటే పిల్లలు గుర్రాల బొమ్మలు పెట్టుకొని పోట్లాటల ఆట ఆడినట్లు కదలిక లున్నాయని ఒక అర్థం. బొమ్మలాట లాడేవారు బొమ్మలను ఆడించినట్లు ఉన్నాయని మరొక అర్థం ఏర్పడుతుంది. ఎక్కుట, విచ్చుట, పొదువుట, పోటు పొడుచుట, ఎడలుట, పఱచుట, పైఁబెట్టుట, తాకుట, వీడఁబోవుట, వ్రేటులాడుట, ఉయ్యాల చేరుగా వెనుకొనుట, తెరలుట, పెనఁగుట మొదలైనవన్నీ యుద్ధభంగులను తెలుగులో చెప్పగల దేశిపదసంపద, తిక్కన కాలం నాటి యుద్ధ పదజాలం, పరిభాష ఇందులో తొణకిసలాడుతున్నది. (సంపా.)

**వ. ఒక్కయెడ.** **16**

**తాత్పర్యం:** ఒకచోట.

**ఉ. ఒండొరు మీఱు కోర్కిమెయి నొక్కట బాసలవారు సొచ్చినన్**
**రెండయి పాయ యిచ్చిన యరిప్రకరంబులు వేఱువేఱ యు**
**ద్దండ భుజాబలం బలరఁ దాఁకిన సంగడిఁ బాఱుచుండఁగా**
**గం డమరంగ నిల్చి చెలికాండ్రయి క్రమ్మఱ వత్తు రిద్దఱున్.** **167**

**ప్రతిపదార్థం:** బాసలవారు= 'నన్ను గెలిచేవారెవరైనా ఉంటే నాతో ద్వంద్వ యుద్ధానికి రండి, ఇదే నా సవాలు!' అని ప్రతిజ్ఞలు చేసే వీరులు; ఒక్కటన్= ఒకచోట; ఒండొరున్= ఒకరిపై మరొకరు; మీఱుకోర్కి మెయిన్= మించాలనే కోర్కెతో; చొచ్చినన్= ఒకరి మీదకు ఒకరు సూటిగా బాణం వలె చొచ్చుకొని పోతూ ఉండగా; అరి ప్రకరంబులు= శత్రువులసమూహాలు; రెండు+అయి= రెండుగా చీలి; పాయ+ఇచ్చినన్= దారినివ్వగా; ఉద్దండ, భుజా, బలంబు= మేటి బాహువుల బలం; అలరన్= ఒప్పారగా; వేఱు వేఱ= విడివిడిగా; తాఁకినన్= ఎదుర్కొనగా; సంగడిన్= సమీపంలో ఉన్నవారు; పాఱుచున్+ఉండఁగాన్= భయంతో పరుగెత్తుతూ ఉంటే; గండు+అమరంగన్= పౌరుషం ప్రకాశించేటట్లు; నిల్చి= రణరంగంలో యుద్ధంమాని నిలువబడి; ఇద్దఱున్= ఇరువురూ; చెలికాండ్రు+అయి= స్నేహితులై; క్రమ్మఱన్= తిరిగి; వత్తురు= వస్తారు.

**తాత్పర్యం:** ఆ రణరంగలో ఒకచోట ఒకరిమీద ఒకరు గెలుపు సాధిద్దామని వీరు లిద్దరు ద్వంద్వయుద్ధం చేసే వైఖరి గోచరిస్తుంది. ప్రతిజ్ఞలు చేసిన ఇద్దరు వీరులు ఒకరిమీదికి మరొకరు కాలుదువ్వి పోరుకు సిద్ధం కాగా రెండు వైపులా ఉన్న శత్రుసేనలు రెండుగా చీలి వారికి బాసటనిలిచి పోరుకు వీలు కల్పించాయి. వారిద్దరూ ఎవరికి వారు తమ మేటి భుజబలం ప్రకాశించేటట్లు డీకొని పోరాడసాగారు. అప్పుడు ప్రక్కన ఉన్న సేనలు భయపడి దూరంగా తొలగిపోయాయి. దానిని చూచి తమ పరాక్రమం ప్రకటితమయ్యేటట్లు ఠీవిగా నిలబడి, ఆ తరువాత స్నేహితుల వలె ఇద్దరూ కలిసి తిరిగి వచ్చేవారు.

సీ. కరశీకరంబులుఁ గరట గళద్దాన । తోయంబులును ధరాధూళి మ్రింగఁ,
బొడవుల సడిసన్న యొడలులడెక్కియ । మ్ముల పెంపు గగనంబు గొలఁదివెట్ట
బృంహిత ధ్వనులును బృథుల ఘంటావలీ । రవములు దిక్కుల నవులఁద్రోవ
రోషారుణాక్షుల రుచులును సిందూర । కాంతియు రవి దీప్తిఁ గ్రమ్మఱింప

తే. జోదు లొక్కట వా లంపసోన గురియ । రౌద్ర రస మాకృతులఁ దాల్చి రణ మొనర్చు
కరణి నత్యుగ్రముగఁ గరి ఘటలు గడఁగి । కలను పీనుంగు పెంటగాఁ గలయ బెరసె. 168

**ప్రతిపదార్థం:** కరశీకరంబులున్= ఏనుగుల తొండాల నుండి పుట్టే మదజలపు తుంపరలును; కరటగళత్+దానతోయంబులును= ఏనుగుల చెక్కిళ్ళ నుండి జారే మదజలాల జల్లులును; ధరాధూళిన్= భూమి మీది దుమ్మును; మ్రింగన్= మింగివేయుగా (అనగా నేలమీది దుమ్మును అణచివేయగా); పొడవులన్= ఔన్నత్యంలో, ఎత్తులో; సడి+చన్న= అపకీర్తిలేని, కీర్తిగాంచిన; ఒడళుల= శరీరాల; డెక్కియమ్ముల పెంపు= టెక్కెముల యొక్క ఆధిక్యము; గగనంబున్+కొలఁది+పెట్టన్= ఆకాశాన్ని పరిమితంచేయగా; బృంహితధ్వనులును= ఘీంకార శబ్దాలూ; పృథుల ఘంటావలీరవములు= (ఏనుగుల ఉభయ పార్శ్వాలలో వ్రేలాడదీసే గంటలు) పెద్దపెద్ద గంటల వరుసల చప్పుడులూ; దిక్కులన్= దిక్కులను; అవులన్ త్రోవన్= ఆవలికి నెట్టివేయగా; రోష= కోపంతో; అరుణ= ఎర్రనయిన; అక్షుల= చూపుల యొక్క; రుచులును= కాంతులూ; సిందూరకాంతియున్= ఏనుగుల నెన్నుదుట దిద్దే సిందూరం యొక్క చెంగావిరంగూ; రవిదీప్తిన్= సూర్యకాంతిని; క్రమ్మఱింపన్= వెనుకకు మరలించగా (ఓడించగా); జోదులు= వీరులు; ఒక్కటన్= ఒక్కుమ్మడిగా; వాలు+అమ్ము+సోన= వాడి అయిన బాణాల వాన; కురియన్= కురిపించగా; రౌద్రరసము; ఆకృతులన్+తాల్చి= వివిధ ఆకారాలుగా రూపొంది; రణము+ఒనర్చు= యుద్ధం చేస్తున్న; కరణిన్= విధంగా; అతి+ఉగ్రముగన్= మిక్కిలి భయంకరంగా; కరిఘటలు= ఏనుగుల గుంపులు; కడఁగి= పూనుకొని; కలను= యుద్ధభూమి; పీనుంగు పెంట+కాన్= పీనుగుల కుప్పగా మారేటట్లు; కలయన్+బెరసెన్= కలియబడ్డాయి (డీకొన్నాయి, పోట్లాడాయి).

**తాత్పర్యం:** ఏనుగుల తొండాల నుండి పుట్టే మదజలాల తుంపరలూ, చెక్కిళ్ళ నుండి జారే మదజలాల వానలూ భూమి మీది దుమ్మును అణచివేయగా, ఎత్తయిన ఏనుగుల శరీరాలూ, పొడవైన టెక్కెముల ఔన్నత్యము ఆకాశాన్ని కించపరచగా, ఆ ఏనుగుల ఘీంకారాలూ, వాటి ఉభయ పార్శ్వాలలో వ్రేలాడే పెద్ద పెద్ద గంటల నినాదాలూ దిక్కులను ఆవలకు నెట్టివేయగా, కోపంతో ఎర్రబడిన కన్నుల కాంతులూ, సిందూరపు చెంగావి కాంతులూ సూర్యుడి వెలుగును వెలవెలపోయేటట్లు చేయగా, యుద్ధవీరులు వాడి అయిన బాణాల వాన కురియించగా రౌద్రరసమే రూపాలు ధరించి, యుద్ధం చేస్తున్నట్లుగా ఏనుగుల గుంపులు విజృంభించి రణరంగాన్ని పీనుగుల కుప్పగా మార్చి కలియబడ్డాయి.

**విశేషం:** అలం: అతిశయోక్తి. రౌద్రరసం ఆకృతి తాల్చినట్లున్న ఏనుగులను నాట్య పరిభాష కనుగుణంగా వర్ణించటం తిక్కన ప్రదర్శించిన నాటకీయత, నటులలో వలెనే జంతువులలో కూడా రసభావముద్రలు ఉంటాయని తిక్కన ఈ పద్యంలో ప్రపంచించాడు. ఉత్సాహభావాన్ని ప్రదర్శించే సాత్త్వికభావం మదజలస్రావం. అది దుమ్మును అణచేంతగా కురిసిందనటం అతిశయోక్తి. ఏనుగులు రౌద్రభావంతో మేనులు పెంచి గర్వంగా నిలబడతాయి. వాటి ఆకారాలు ఆకాశాన్ని కొలుస్తున్నట్లున్నా యనటం అతిశయోక్తి. రౌద్రభావాలు మానవులలో వీరాలాపాలతో ప్రకటితమైనట్లు ఏనుగులలో ఘీంకారాలతో, ఘంటాధ్వనులతో ప్రకటితమౌతాయి. రౌద్రభావం వలన కన్నులూ, నెన్నుదురులూ ఎర్రబడటం సహజం. అట్లాగే ఏనుగుల కళ్ళూ, సిందూరకాంతితో

నొసళ్ళూ ఎర్రని కాంతులు వెదచల్లాయి.సైనికులు బాణాలు గుప్పించగా రౌద్రం మూర్తికట్టినట్లు ఉగ్రంగా ప్రలయతాండవం చేసి ఏనుగుల గుంపులు రణరంగాన్ని పీనుగుల కుప్పలతో నింపివేశాయి. ఇది రుద్రకర్మ, ఈ విధంగా గజసైన్యాన్ని రౌద్రవీరులుగా వర్ణించి రసశిల్పాన్ని చిత్రించిన కళా ఖండం ఈ పద్యం. (సంపా.) పద్యంలోని 'దెంచెనముల' అనే పాఠం కంటె 'డెక్కియముల' అనే పాఠం మేల్తరం.

**ఉ. అక్కజమైన శౌర్యమును నద్భుత సంపద నొందు శక్తులుం**
**జిక్కని మేనులున్ మొనకుఁ జెల్వగు కైదువులుం దగంగ ను**
**క్కెక్కిన యట్టి మేటి మగ లించుక వారణలేక ఖేచరు**
**ల్వెక్కస మంద నొచ్చియుఁ జలింపక పోరిరి పెక్కుభంగులన్. 169**

**ప్రతిపదార్థం:** అక్కజము+ఐన శౌర్యమునున్= ఆశ్చర్యం కలిగించే పరాక్రమాన్ని; అద్భుత సంపదన్+ఒందుశక్తులున్= ఆశ్చర్యకరమైన వైభవాన్ని పొందే సామర్థ్యాలూ; చిక్కని మేనులున్= దృఢమైన శరీరాలున్నూ; మొనకున్= సేనకు; చెల్వు+అగు= అందాన్ని చేకూర్చే; కైదువులున్= ఆయుధాలున్నూ; తగంగన్= తగినట్లుగా; ఉక్కు+ఎక్కిన+అట్టి= మదం అతిశయించిన; మేటిమగలు= గొప్పవీరులు; ఇంచుక= ఒకింత; వారణలేక= అడ్డులేకుండా; ఖేచరుల్= ఆకాశాన విహరించే దేవతలు; వెక్కసము+అందన్= అబ్బురపడేటట్లు; నొచ్చియున్= యుద్ధంలో గాయాలు ఏర్పడి బాధలు పడుతూ కూడా; చలింపక= జంకకుండా; పెక్కుభంగులన్= అనేక విధాలుగా; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** మదించిన మేటి వీరులు అబ్బురమైన పరాక్రమాన్నీ, అద్భుతశక్తి సంపదనూ, దిట్టమైన శరీరాలనూ, సేనకే అందాన్ని చేకూర్చే ఆయుధాలనూ కలిగి, దేవతలు కూడా చూచి ఆశ్చర్యపడేటట్లు, శరీరాలకు దెబ్బలు తగిలి బాధ కలిగిస్తున్నా లెక్కచేయకుండా అనేక విధాలుగా యుద్ధం చేశారు.

**సీ. నొగనొగతోఁ దాఁకి పగులంగ నరదంబుఁ। బఱపి యా తేరిపై కుఱుకువారు.**
**రథ్యముల్ పడ్డ విరథులయ్యు నసి ముద్గ। రాదుల నడరి పోరాడువారు,**
**సారథి నొచ్చినఁ దేరును గడపుచు। నేయుచుఁ గయ్యంబు సేయువారు,**
**నరదంబుపైవ్రాలి యాలోన దెలిసి త। న్నేసినాతనిఁ బడ నేయువారు**

**తే. నగుచు రథికనికాయంబు లడరి యప్ర। మత్త నిజచిత్తవృత్తులై మగతనంబు**
**ఘోరమూర్తులు గైకొని పోరునట్లు। సలిపె సంగ్రామకేళి సంకులముగాఁగ 170**

**ప్రతిపదార్థం:** రథిక నికాయంబులు= రథికుల సమూహాలు; అడరి= విజృంభించి; నొగ= తమ తేరి కాడి (ముందుభాగం); నొగతోన్= మరొక తేరు కాడితో; తాఁకి= డీకొని; పగులంగన్= పగిలిపోయేటట్లుగా, విరిగిపోగా; అరదంబున్= ఆ రథాన్ని; పఱపి= వేగంగా తోలి; ఆ తేరిపైకిన్= ఎదుటివారి రథం మీదికి; ఉఱుకు వారున్= పరుగెత్తి దూకే వారున్నూ; రథ్యముల్= రథానికి పూన్చిన గుర్రాలు; పడ్డన్= చనిపోగా; విరథులు+అయ్యున్= రథంలేనివారు ఐనప్పటికీ; అసి, ముద్గర+ఆదులన్= కత్తి, గుదియ మొదలైన ఆయుధాలతో; అడరి= విజృంభించి; పోరాడువారున్= యుద్ధం చేసేవారున్నూ; సారథి= రథం నడిపే సూతుడు; నొచ్చినన్= చనిపోగా; తేరును= రథాన్ని; కడపుచున్= తామే తోలుకొంటూ; కయ్యంబు+చేయువారున్= యుద్ధం చేసేవారున్నూ;

అరదంబుపైన్= రథంమీద; వ్రాలి= మూర్ఛపోయి; ఆలోనన్= అంతలోనే; తెలిసి= తేరుకొని, ఒడలు తెలిసి; తన్నున్+ఏసిన+ఆతనిన్= తనను బాణంతో కొట్టినవాడిని; పడన్+ఏయువారున్= పడగొట్టేవారున్నూ; అగుచున్= ఔతూ; అప్రమత్త= ప్రమాదపడని; నిజచిత్తవృత్తులు+ఐ= తమ మనప్రవత్తులు కలవారై; మగతనంబు= పౌరుషమే; ఘోరమూర్తులు= భయంకరమైన ఆకారాలను; కైకొని= తాల్చి; పోరు+అట్లు= యుద్ధం చేస్తున్నట్లు; సంకులము+కాఁగన్= చీకాకు పడేటట్లు; సంగ్రామకేళి= యుద్ధ క్రీడ; చలిపెన్= చేశారు.

**తాత్పర్యం:** రథికులు యుద్ధక్రీడ ప్రదర్శిస్తూ సంకులయుద్ధం చేశారు. ఒకరిపై ఒకరు దాడిచేసినప్పుడు తమరథం నొగలు ఎదుటి రథం నొగలకు గట్టిగాతాకి విఱిగిపోయేటట్లుగా వేగంగా తోలి, ఎదుటి రథం మీదికి దూకేవారు. రథాలకు కట్టిన గుర్రాలు కూలిపోతే విరథులైనా యుద్ధం మానకుండా కత్తులూ కటారులూ తీసికొని పోరాడేవారు. రథసారథి చనిపోతే తామే సారథ్యం చేసికొంటూ పోరును ఆపకుండా కొనసాగించేవారు. శత్రువులు కొట్టే బాణాల దెబ్బలకు రథంమీద స్పృహతప్పి పడిపోయినా, అంతలోనే తేరుకొని లేచి తనపై దాడి చేసిన వారిని తిప్పికొట్టి పడగొట్టేవారు-ఈ విధంగా ఏమరుపాటులేని చిత్తవృత్తులతో జాగరూకులై, పౌరుషమే భయంకరాకారాలు ధరించి పోరు చేస్తున్నదా అన్నట్లు ఆ రథికులు యుద్ధక్రీడలతో సంకుల సమరం చేశారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, అంత్యానుప్రాసం. ఏ యుద్ధాన్ని వర్ణించినా తిక్కన ఒక క్రమాన్ని, ప్రణాళికను పాటించటం మనం గమనిస్తాం. ఇందులో రథికుల సంకులసమరం వర్ణ్యవస్తువు. రథాలు ముందుగా నొగలతో ఢీకొంటాయి. నొగలు విరిగిపోతే గుర్రాలు పట్టుకోల్పోయి విరోధుల చేతిలో చనిపోతాయి. నొగలూ, గుర్రాలూ కూలిపోతే సారథి కుప్పకూలుతాడు. శత్రువుల చేతిలోపడి చనిపోతాడు. ఆ తరువాత చలనం లేని రథాలమీది రథికుడు దెబ్బతింటాడు. మూర్ఛపోతాడు. అయినా తేరుకొని వేరు రథాలమీదకైనా పోయి పోరు సాగిస్తాడు. ఇందులో రథాలూ, రథాంగాలూ శిథిలమైపోయినట్లు వర్ణించిన తిక్కన రథికులు ప్రాణాలు కోల్పోయినట్లు వర్ణించలేదు. అది విశేషం. ఆ వర్ణన పాండవుల యుద్ధఘట్టంలో చేస్తాడు. అదీ రహస్యం. అంత్యానుప్రాసం రథికుల సమబల సంకులత్వాన్ని సూచిస్తున్నది. (సంపా.)

**వ. ఇ ట్లిరువాఁగును నరవాయి గొనక పెనంగుచుండ. 171**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఇరువాఁగును= ఈ విధంగా రెండు పక్షాల వారును; అరవాయి+కొనక= జంకకుండా (సందేహించకుండా); పెనంగుచుండన్= యుద్ధం చేస్తూ ఉండగా.

**తాత్పర్యం:** పై విధంగా రెండు వైపుల సైన్యాలూ వెనుకాడకుండా పోరు సాగిస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. భీకరబాణ వర్షముల పెల్లున వైరులు పెల్లగిల్ల మౌ**
**ర్వీకృత గర్జితంబు పృథివీ వియదంతరమెల్ల నిండ ను**
**గ్రాకృతి కల్ప సంక్షయ మహాభ్రముచందము నొందుచున్ శతా**
**నీకుఁడు దాఁకెఁ గంకటమణిద్యుతి విద్యుదుపాంతకాంతియై. 172**

**ప్రతిపదార్థం:** భీకరబాణవర్షముల పెల్లునన్= భయంకరమైన బాణాల వానలయొక్క ఆధిక్యం చేత; వైరులు= శత్రువులు; పెల్లగిల్లన్= చెల్లాచెదరైపోగా; మౌర్వీకృతగర్జితంబు= అల్లెతాటిని మీటటం వలన గలిగే గర్జన వంటి శబ్దం; పృథివీ, వియత్+అంతరము+ఎల్లన్= భూమ్యాకాశాల మధ్యలో ఉన్న ప్రాంతమంతా; నిండన్= నిండగా; ఉగ్ర+ఆకృతిన్= భయమును

కల్గించే ఆకారంతో; కల్ప సంక్షయ= ప్రళయకాలంలోని; మహా+అభ్రము= పెనుమేఘం; చందమున్= విధమును; ఒందుచున్= పొందుతూ; శతానీకుఁడు= విరటుడి తమ్ముడయిన శతానీకుడు; కంకట+మణిద్యుతి= కవచం యొక్క మణుల కాంతులనెడి; విద్యుత్+ఉపాంతకాంతి+ఐ= మెరుపుతీగలకాంతికి దగ్గరైన కాంతి కలవాడయి; తాఁకెన్= ముట్టడించాడు.

**తాత్పర్యం:** విరటుడి తమ్ముడైన శతానీకుడు భయంకరమైన బాణవర్షంతో శత్రువులు పెల్లగిలిపోగా, ధనుష్టంకార శబ్దం భూమ్యాకాశాల నడిమిభాగం నిండగా, ప్రళయకాల భయంకర మేఘం వలె తన కవచానికి పొదిగిన రత్నాల కాంతులు మెరుపు తీగల కాంతివలె మిరుమిట్లు గొలుపుతూ ఉండగా (శత్రువులను) ఎదుర్కొని ముట్టడించాడు.

**విశేషం:** అలం: రూపకానుప్రాణితమైన ఉపమ. శతానీకుడు ప్రళయకాలమేఘంతో పోల్చబడ్డాడు. అతడి అల్లెత్రాటిమ్రోత మేఘ గర్జగానూ, కవచ మణికాంతి మెరుపుల కాంతిగానూ శోభిల్లగా, అతడు బాణాలవర్షం కురిపించాడు. ప్రళయకాల మేఘస్వభావాన్ని తలపించాడు. ఉపమ రూపకానుప్రాణితం కావటం అలంకారశిల్పం. (సంపా.)

**తే. అతఁడు నానాప్రకార శస్త్రాస్త్ర నిహతి। నతుల విక్రమ విభవ మనర్గళముగ**
**యోధసారథి యుగ్యసంయుతము గాఁగ। నూఱు రథములు వ్రేల్మిడి నుగ్గుచేసె.** 173

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ శతానీకుడు; నానాప్రకార= పలు రకాలైన; శస్త్ర+అస్త్రనిహతిన్= బాణాల, మంత్రసహిత బాణాల దెబ్బలతో; అతుల= సాటిలేని; విక్రమ= పరాక్రమం యొక్క; విభవము= ఐశ్వర్యం; అనర్గళముగన్= అడ్డులేని రీతిగా; యోధ= వీరులతో; సారథి= సారథులతో; యుగ్యసంయుతముకాఁగన్= గుర్రాలతో కూడా; నూఱు రథములున్= నూరు తేరులను; వ్రేల్మిడిన్= చిటికె వేసినంతకాలంలోగా; నుగ్గుచేసెన్= పొడిచేశాడు.

**తాత్పర్యం:** ఆ శతానీకుడు అనేక శస్త్రాస్త్రాలను ప్రయోగించి, సాటిలేని పరాక్రమ సంపదతో అడ్డులేని రీతిగా పోరి వీర రథికులతో, సారథులతో, గుర్రాలతో కూడిన నూఱు రథాలను క్షణకాలంలో పొడి పొడి చేసివేశాడు.

**విశేషం:** శతానీకుడు శత్రుసేనలోని రథికులను, రథాలను నుగ్గు చేశాడు. చతురంగ సేనలలో ఒక్కొక్కరు ఒక్కొక్క అంగాన్ని చంపి ధ్వంసం చేయటం ఈ యుద్ధంలోని విశేషం. (సంపా.)

**మ. మదిరాశ్వుండు కడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప స**
**ప్రదర జ్యా లతికాక్రియా సమభిహారక్రీడనం బప్పు డొ**
**ప్పిదమై యోగ వియోగ సంధులు నిరూపింపంగరాకుండఁ గ**
**ర్ణ దళోపాంతము వింతసేయ నడరెన్ రౌద్రంబు శోభిల్లఁగన్.** 174

**ప్రతిపదార్థం:** మదిరాశ్వుండు= మదిరాశ్వుడు; కడంగి= పూనుకొని; అన్నకున్= శతానీకుడికి; బల+ఉన్మాదంబు రెట్టింపన్= బలగర్వం ఇబ్బడి అయ్యేటట్లుగా; సప్రదర= బాణంతో కూడిన; జ్యాలతికా= లతవంటి నారియొక్క; క్రియా= బాణం తొడగటం, విడవటం అనే కార్యం యొక్క; సమభిహార+క్రీడనంబు= ఎడతెరిపిలేని చేష్టల ఆట; అప్పుడు= ఆ సమయంలో; ఒప్పిదము+ఐ= తగు విధంగా; యోగ వియోగసంధులు= బాణాలను ఎక్కుపెట్టడం, విడవటం అనే వాటి మధ్య ఉండే విరామాలు; నిరూపింపఁగన్= వేరుపరచి చెప్పటానికి; రాకుండన్= వీలుకాకుండగా; కర్ణదళ+ఉపాంతము= చెవి సమీప ప్రదేశం; వింత+చేయన్= ఆశ్చర్యం కలిగించగా; రౌద్రంబు= రౌద్రరసం; శోభిల్లఁగన్= ప్రకాశించగా; అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** మదిరాశ్వుడు తన అన్న శతానీకుడు ప్రదర్శించిన బలోన్మాదాన్ని ఇనుమడింప జేసేటట్లు మనోజ్ఞంగా ధనుర్విద్యా ప్రదర్శనం చేశాడు. అల్లెత్రాడు ఆకర్ణాంతంగా లాగి బాణాలు తొడుగుతూ, ప్రయోగిస్తూ ఉన్నా, ఆ రెండు క్రియలకూ మధ్య ఉండే విరామం ఎవరికీ తోచకుండా చెవిదగ్గరే నిరంతరాయంగా జ్యాలతను అద్భుతంగా నిలుపుతూ రౌద్రరసం రాణించేటట్లు బాణవిద్యను ప్రదర్శించాడు.

**క. అడరివడి రథచతుశ్శతి । పొడిసేసి, పరాక్రమం బపూర్వంబై యే**
**ర్పడఁ గరిహయ నరనికరము । బడలుపడం దఱిమె నలి నభశ్చరు లార్వన్. 175**

**ప్రతిపదార్థం:** అడరి= అతిశయించి; వడిన్= త్వరగా; రథచతుశ్శతి= నన్నూరుతేరులను; పొడి+చేసి= నుగ్గుగాచేసి; పరాక్రమంబు= ప్రతాపం; అపూర్వంబు+ఐ= అబ్బురపాటు కలిగించేదై; ఏర్పడన్= వెల్లడికాగా; కరి= ఏనుగుల; హయ= గుర్రాల; నరనికరము= కాల్బలాల సమూహాలు; బడలుపడన్= శ్రమనందగా; నభశ్చరులు= దేవతలు; ఆర్వన్= బిగ్గరగా కీర్తించగా; తఱిమెన్= తరిమి కొట్టాడు.

**తాత్పర్యం:** ఆ మదిరాశ్వుడు విజృంభించి వేగంగా నాలుగువందల రథాలను నుగ్గునుగ్గు చేశాడు. అబ్బురపాటు కలిగించే ప్రతాపం ప్రకటించి ఆకాశాన దేవతలు గొప్పగా మెచ్చుకొనేటట్లు ఏనుగుల, గుర్రాల, పదాతుల సమూహాలను బాధించి తరిమికొట్టాడు.

**విశేషం:** చతురంగ బలాలను క్రమంగా మర్దించటం ఇందులో విశేషం.

**ఉ. మండలచారియై రథ మమానుషవిక్రమలీల నొప్ప ను**
**ద్దండ భుజాబలంబు ప్రథితంబుగ నత్తఱిఁ దాఁకి సూర్యద**
**త్తుం డనివార్య శౌర్యగుణ ధుర్యుఁడు వీఁడ యనంగఁ బేర్చి వే**
**దండ ఘటావిపాటనవిదగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్. 176**

**ప్రతిపదార్థం:** సూర్యదత్తుండు= సూర్యదత్తుడు; రథము= తేరును; మండలచారి+ఐ= గుండ్రంగా తిరిగే దానిగా చేసి; అమానుష విక్రమలీలన్= మానవాతీతమయిన శౌర్యంతో; ఒప్పన్= తగిఉండగా; ఉద్దండ భుజాబలంబు= భయంకరమైన భుజబలం; ప్రథితంబుగన్= ప్రఖ్యాతితో; ఆ+తఱిన్= ఆ సమయంలో; తాఁకి= ముట్టి; అనివార్య= అడ్డుకొన వీలుకాని; శౌర్యగుణధుర్యుఁడు= వీరగుణంలో నేర్పరియైనవాడు; వీఁడు+అనంగన్+పేర్చి= వీడే సుమా అనగా విజృంభించి; వేదండ ఘటా= ఏనుగుల సైన్యాన్ని; విపాటన= నాశనం చేయటంలో; విదగ్ధతన్= నేర్పుతో; రణ+అంగణంబునన్+పొల్చెన్= యుద్ధరంగంలో ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో సూర్యదత్తుడు రథాన్ని మండలచారిగా తిప్పుతూ సాటిలేని పరాక్రమంతో తాకి ఎదురులేని శౌర్యంలో మేటి వీరుడు వీడే సుమా అన్నట్లు మదపుటేనుగుల సైన్యాన్ని నాశనం చేసే నేర్పరితనంతో యుద్ధరంగంలో వెలుగొందాడు.

**ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ బ్రియంబునఁ బెండ్లికిఁ బోవునట్లు మో**
**మొప్పఁగ నస్త్రశస్త్రముల యుల్లసనంబున శత్రునేత్రముల్**
**కప్పఁగఁ జీఁకటుల్ రణముఖంబు సమస్తముఁ దానయై రథం**
**బుప్పర వీథిఁ దోలికొని యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్. 177**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; శంఖుఁడు; ఎంతయున్= మిక్కిలి; ప్రియంబునన్= ప్రీతితో; పెండ్లికిన్+పోవునట్లు= పెండ్లికి పోతున్నట్లుగా; మోము+ఒప్పఁగన్= ముఖం ప్రకాశించగా; అస్త్రశస్త్రముల= బాణాలయొక్క, మంత్రసహిత బాణాలయొక్క, ఉల్లసనంబునన్= ఉల్లాసంతో; శత్రునేత్రముల్= విరోధుల కన్నులు; చీఁకటుల్+కప్పఁగన్= మిరుమిట్లు కొలుపగా; రణముఖంబు= యుద్ధభూమి ముందుభాగం; సమస్తమున్= అంతా; తాను+అ+ఐ= తానే అయి; రథంబు= తేరును; ఉప్పరవీథిన్= ఆకాశమార్గంలో; తోలికొని= తోలుకొంటూ; ఉగ్రగతిన్= భయంకరరీతిలో; పఱతెంచి= వచ్చి; తాఁకినన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** అప్పుడు విరటుడి కొడుకు శంఖుడు పెండ్లికి వెళ్ళుతున్నట్లు ముఖం వెలుగొందగా అస్త్రశస్త్రాల కాంతులు ఎదుటి వైరుల కన్నులను మిరుమిట్లు కొలిపి చీకట్లు క్రమ్మేటట్లు చేయగా యుద్ధరంగమంతా తానే అయి, తన తేరును ఆకాశమార్గంలో వేగంగా తోలికొని వచ్చి భయంకరంగా ఎదుర్కొనగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: అతిశయోక్తి.

**తే. మందరాచల చటుల విమర్దనమున । ఘూర్ణమానమై గాఢ సంక్షోభ మెసఁగఁ**
**దలఁకు జలనిధి నాఁ ద్రిగర్తక్షితీశు । బలము తిరుగుడువడియె సంకులముగాఁగ. 178**

**ప్రతిపదార్థం:** మందర+అచల= మందర పర్వతం యొక్క; చటుల= తీవ్రమైన; విమర్దనమునన్= చిలకటం వలన; ఘూర్ణమానము+ఐ=సుళ్ళు తిరుగునట్లయిన; గాఢ= మిక్కిలి; సంక్షోభము++ఎసఁగన్= కల్లోలమొప్పగా; తలఁకు= చలించే; జలనిధి నాన్= సముద్రమో అన్నట్లు; త్రిగర్తక్షితి+ఈశుబలము= సుశర్మసేన; సంకులము+కాఁగన్= తికమకపడి; తిరుగుడు పడియెన్= కలతపడింది.

**తాత్పర్యం:** మందరపర్వతం చేత మథించబడటం వలన సుళ్ళు తిరుగుతూ అల్లకల్లోలమయిన సముద్రమా అన్నట్లు సుశర్మ సైన్యం తికమకచెంది కలతపడింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అయ్యవసరంబునం దక్కిన దొరలును దలపడి యతిభీమంబుగా సంగ్రామంబు సేయం దొడంగిన. 179**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= అట్టి సమయంలో; తక్కిన దొరలును= మిగిలిన సామంతులు కూడా; తలపడి= ఎదుర్కొని; అతిభీమంబుగాన్= మిక్కిలి భయంకరంగా; సంగ్రామంబు చేయన్+తొడంగినన్= యుద్ధం చేయ మొదలిడగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో మిగిలిన సామంతులు కూడా ఎదుర్కొని మిక్కిలి భయంకరంగా యుద్ధం చేయటానికి మొదలుపెట్టగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. అనుజ తనూజ మంత్రి సుభటాప్తజనంబుల పోరు చూచి నె**
**మ్మనమునఁ బొంగి మై పెనిచి మత్స్యమహీరమణుండు సారథిం**
**గనుఁగొని 'యల్ల కంటె మొనఁ గ్రాలుచునున్న త్రిగర్తనాథు కే**
**తనమున చక్కటిన్ మన రథంబు వెసం జన నిమ్ము' నావుడున్. 180**

**ప్రతిపదార్థం:** మత్స్యమహీరమణుండు= మత్స్యదేశ ప్రభువైన విరాటుడు; అనుజ= తమ్ముల యొక్కయు; తనూజ= కుమారుడి యొక్కయు; మంత్రి= మంత్రుల యొక్కయు; సుభట= సుశిక్షితులయిన సైనికులయు; ఆప్తజనంబుల= ఆత్మీయులయు; పోరు= యుద్ధాన్ని; చూచి; నెఱ+మనమునన్= తన నిండు మనసులో; పొంగి= ఉప్పొంగి; మైన్+పెనిచి= తన శరీరాన్ని పెంచి (ఉత్సాహపడి); సారథిన్+కనుఁగొని= తన సారథిని చూచి; అల్లకంటె?= అదిగో చూచావా?; మొనన్= సేన మొదట్లో; గ్రాలుచున్+ఉన్న= ప్రకాశిస్తున్న; త్రిగర్తనాథున్= సుశర్మయొక్క; కేతనమున చక్కటిన్= ధ్వజం ఉన్న చోటికి; మన రథంబు= మన తేరును; వెసన్= త్వరగా; చనన్+ఇమ్ము= పోనిమ్ము; నావుడున్= అనగా.

**తాత్పర్యం:** విరాటుడు తన తమ్ముల, కుమారుడి, మంత్రుల, సుశిక్షితులైన సైనికుల, ఆప్తుల యుద్ధాన్ని చూచి, అంతరంగంలో ఉప్పొంగి, ఉత్సాహంతో మేను పెంచి, సారథిని చూచి, 'ఆ సేన మొదట్లో వెలుగొందుతున్న సుశర్మ కేతనాన్ని చూచావా? దాని దగ్గరికి మన తేరును పోనిమ్ము' అనగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అగ్గలిక నతఁడు హయముల । పగ్గంబులు సడల విడిచి పటురయమున నా**
**మొగ్గరము దఱియఁ బఱపిన మ్రగ్గెను రథపంచశతము మత్స్యాధిపుచేన్.** 181

**ప్రతిపదార్థం:** అతఁడు= విరటుడి సారథి; అగ్గలికన్= ఉత్సాహంతో; హయముల పగ్గంబులు= గుర్రాల పగ్గాలు; సడలన్+విడిచి= వదులుగా విడిచి; పటురయమునన్= మిక్కిలి వేగంతో; ఆ మొగ్గరము= ఆ వ్యూహమును (సేనను); తఱియన్= సమీపించేటట్లు; పఱపినన్= పరువెత్తించగా; మత్స్య+అధిపుచేన్= విరాటుడిచేత; రథపంచశతము= అయిదువందల రథాలు; మ్రగ్గెను= కూలిపోయాయి.

**తాత్పర్యం:** విరటుడి సారథి గుఱ్ఱాల పగ్గాలను వదలి మిక్కిలి వేగంతో ఆ సైన్యాన్ని చేరేటట్లు వాటిని పరుగెత్తించగా విరాటుడు ఐదునూర్ల రథాలను కూల్చివేశాడు.

**మ. అవనీనాయకుఁ జూచి యేచి నలి వీరావేశ దుర్దాంతమై**
**కవిసెం గుంత భుశుండి తోమర గదా ఖడ్గాది శస్త్రాస్త్ర తీ**
**వ్ర విహారంబు విరోధి దుర్విషహ సంరంభంబుగా నొక్కపె**
**ట్ట వడిం దద్బల మెల్ల నారదుఁడు వేడ్కం గుంచె సారింపఁగన్.** 182

**ప్రతిపదార్థం:** అవనీనాయకున్+చూచి= రాజును చూచి; (విరటుడిని చూచి); తద్బలము+ఎల్లన్= ఆ సైన్యమంతా; ఏచి= విజృంభించి; నలిన్= మిక్కిలి; వీర+ఆవేశ= వీరోద్వేగంతో; దుర్దాంతము+ఐ= అణచటానికి వీలుకానిదై; కుంత, భుశుండి, తోమర, గదా, ఖడ్గ+ఆది= ఈటెలు, తోమరాలు, గదలు, కత్తులు మొదలైన; శస్త్ర+అస్త్ర= బాణములతోను, మంత్ర సహిత బాణాలతోను, తీవ్రవిహారంబు= వేగంగా చేసే సంచారం; విరోధి= శత్రువులకు; దుర్విషహ= సహించటానికి శక్యంకాని; సంరంభంబు+కాన్= అట్టహాసం కాగా; నారదుఁడు= నారదమహర్షి; కుంచె= తన కుంచెను; వేడ్కన్= కుతూహలంతో; సారింపఁగన్= ఆడించగా; ఒక్కపెట్టు+అ= ఒక్కుమ్మడిగా; వడిన్= వేగంగా; కవిసెన్= ఎదిరించింది.

**తాత్పర్యం:** తమ రాజైన విరాటుడి ఉత్సాహాన్ని చూచి సైన్యమంతా విజృంభించి, తిరుగులేని ఉత్సాహాతిశయంతో కుంతాలు, భుశుండులు, తోమరాలు, గదలు, ఖడ్గాలు మొదలైన శస్త్రాస్త్రాలతో తీవ్రవిహారం చేస్తూ, శత్రువులకు సాధ్యంకాని అట్టహాసంతో ఎదుర్కొన్నది. ఆ సన్నివేశాన్ని చూచి కలహప్రియుడైన నారదుడు చేతితో కుంచె ఆడిస్తూ నాట్యంచేశాడు.

**విశేషం:** భుశుండి=ఊలను చిమ్ము చర్మమయమగు ఆయుధము. సూ.రా.ని.

**వ. ఇవ్విధంబున విరాటుండు తానును సేనయుం జేయం గలవారును, బరవసంబు సేసి యొక్కుమ్మడి నడరుటయుం, దెరలి మరలిన నిజసైన్యంబు దైన్యంబు గలయం గనుంగొని, కోపాటోపంబునం గెంపుగదురు లోచనంబులుం బెంపొలయు భుజశిఖరంబులుం గలిగి తానుం దమ్ముండును సంగడంబుగాఁ గోల్తలసేసి రథసమూహంబుతో విరాటవ్యూహంబు నెదురుకొని. 183**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; విరాటుండు= విరాటరాజు; తానును; సేనయున్+చేయన్+కలవారును= తానూ, సేనా, యుద్ధం చేయగలవారున్నూ; బరవసంబు+చేసి= ధైర్యంచేసి (సాహసించి); ఒక్క+ఉమ్మడిన్= ఒక్కసారిగా; అడరుటయున్= విజృంభించగా; తెరలి=కలగి; మరలిన= వెనుతిరిగిన; నిజసైన్యంబు= తన సేన; దైన్యంబు= దీనత్వాన్ని; కలయన్+కనుంగొని= సమీక్షించి; కోప+ఆటోపంబునన్= ఎక్కువ అయిన కోపంతో; కెంపు+కదురులోచనంబులు= ఎర్రనైన కన్నులు; పెంపు+ఒలయు= గొప్పవిఅగు; భుజశిఖరంబులున్+కలిగి= ఎత్తయిన భుజాలు కలిగి; సుశర్మ తానున్+తమ్ముండును= సుశర్మ తానూ తన తమ్ముడూ; సంగడంబు+కాన్= ఉమ్మడిగా; కోల్తల+చేసి= సన్నాహం చేసి; రథసమూహంబుతోన్= రథాల గుంపుతో; విరాట వ్యూహంబున్= విరాటుడు పన్నిన యుద్ధవ్యూహాన్ని; ఎదురుకొని= ఎదుర్కొని.

**తాత్పర్యం:** ఈ విధంగా విరటుడూ తానూ, తన సైన్యమూ, యుద్ధం చేయుగల యోధులూ ధైర్యంతో ఒక్కుమ్మడిగా విజృంభించారు. ఆ ధాటికి ఆగలేక వెనుతిరిగి పరుగెత్తే తమ సైన్యాల దీనావస్థను తెలిసికొని, కోపాతిశయంతో ఎరుపెక్కిన కన్నులతో, బలమైన భుజాలను కలిగి ఉన్న సుశర్మ తమ్ముడితో కలిసి ఉమ్మడిగా సన్నాహం చేసి రథాలతో వచ్చి విరాటుడి యుద్ధవ్యూహాన్ని ఎదుర్కొని.

**క. బలవిక్రమములు మెఱయఁగఁ। దలపడి రథ దంతి హయ పదాతి చయంబుల్**
**కలను సుడివడఁగఁ దామర। కొల నేనుఁగు సొచ్చినట్లు గురువుగఁ జొచ్చెన్. 184**

**ప్రతిపదార్థం:** బలవిక్రమములు మెఱయఁగన్= బలం శౌర్యం ప్రకాశించగా; తలపడి= ఎదుర్కొని; రథ, దంతి,హయ, పదాతి చయంబుల్= రథ గజ తురగాలూ కాల్బలాలూ; కలను= యుద్ధంలో; సుడి+పడఁగన్= సుళ్ళు తిరుగగా; తామర కొలను= తామరలున్న సరస్సులను; ఏనుఁగు+చొచ్చినట్లు= ఏనుగు ప్రవేశించిన విధంగా; గురువుగన్= దర్పంతో; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** ఏనుగు తామరపూలున్న సరోవరంలో దర్పంతో ప్రవేశించి దానిని కలచివేసినట్లు సుశర్మ యొక్క చతరంగబలం బలపరాక్రమాలు ప్రకాశించగా తలపడి యుద్ధరంగాన్ని సంక్షోభపరచింది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. ఏలినవానిఁ గాంచి, మొనలెల్లను నెంతయు దర్ప మెక్కి యా**
**భీల నిశాత హేతిరుచి భీకరలీల నెదిర్చి, మత్స్య భూ**
**పాలక సైన్యరాజిఁ దలపడ్డ మహోగ్రతఁ బేర్చి, యా సమి**
**త్కేళి వియచ్చర ప్రతతికిన్ వెఱఁగందఁగఁ జేసె నెంతయున్. 185**

**ప్రతిపదార్థం:** ఏలినవానిన్+కాంచి= రాజును చూచి; మొనలు+ఎల్లను= సైన్యాలన్నీ; దర్పము+ఎక్కి= గర్వం ఎక్కువై; ఆభీల= భయంకరంగా; నిశాతహేతి రుచిన్= వాడి అయిన కత్తియొక్క కాంతితో; భీకరలీలన్= భయంకరంగా; ఎదిర్చి= ఎదుర్కొని; మత్స్య భూపాలక= విరటుడి యొక్క; సైన్యరాజిన్= సేనాసమూహాన్ని; తలపడ్డన్= ఎదుర్కొనగా; మహా+ఉగ్రతన్+పేర్చి= భయంకరంగా విజృంభించి; ఆ సమిత్+కేళి= ఆ యుద్ధక్రీడ; వియత్+చరప్రతతికిన్= దేవతల సమూహానికి; ఎంతయున్= ఎంతగానో; వెఱఁగు= ఆశ్చర్యాన్ని; అందఁగన్+ చేసెన్=పొందేట్లు చేసింది.

**తాత్పర్యం:** తమ రాజును చూచి త్రిగర్త సైన్యాలన్నీ గర్వంతో విజృంభించి వాడికత్తుల కాంతితో భయంకరంగా విరటుడి సేనాసమూహాన్ని ఎదిరించాయి. మహత్తర విజృంభణంతో కూడిన ఆ యుద్ధక్రీడ దేవతలు కూడా ఎంతో ఆశ్చర్యపడుతూ చూచేటట్లు చేసింది.

**తే.** **కడిమి మెఱయంగఁ బోరు త్రిగర్తనాథు । రథముఁ గనుఁగొని కడఁగి విరాటవిభుఁడు**
**వరవునకు నల్గినట్టుల సరకుగొనక । యతుల రభసాతిరేకత నతనిఁ దాఁకె.** **186**

**ప్రతిపదార్థం:** కడిమి= పరాక్రమం; మెఱయంగన్= ప్రకాశించగా; పోరు= యుద్ధం చేసే; త్రిగర్తనాథురథమున్= సుశర్మయొక్క తేరును; విరాటవిభుఁడు= విరాటరాజు; కనుఁగొని= చూచి; కడఁగి= పూనుకొని; వరవునకున్= సేవకుని మీద; అల్గినట్టుల= కోపగించినట్లు; సరకుగొనక= లెక్కచేయక; అతుల= సాటిలేని; రభస+అతిరేకతన్= వేగాతిశయంతో; అతనిన్= ఆ సుశర్మను; తాఁకెన్= ఎదిరించాడు.

**తాత్పర్యం:** పరాక్రమంతో యుద్ధం చేస్తున్న సుశర్మ ఎక్కివస్తున్న తేరును చూచిన విరాటుడు పూనికతో సేవకుడి మీద అలిగిన విధంగా అతడిని లెక్కసేయక మిక్కిలి వేగంగా ముట్టడించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

విరాటుఁడు సుశర్మమీఁదఁ దన రథంబు తోలించి పోరుట (సం.4-31-17)

**వ.** **ఇట్లు దలపడి.** **187**

**తాత్పర్యం:** ఈ విధంగా ఎదుర్కొని.

**మ.** **పటువేగంబగు శాతభల్లచయ సంపాతంబునన్ మింట మి**
**క్కుటమై మంట ధగద్ధగద్ధగ యనం గోపంబు రూపంబులై**
**చటులక్రీడఁ జరించు న ట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరి రు**
**త్కట దర్పోద్ధతులై పరస్పర జయాకాంక్షం బ్రచండంబుగన్.** **188**

**ప్రతిపదార్థం:** పటువేగంబు+అగు= మిక్కిలి వేగంతో కూడినదైన; శాత= వాడి అయిన; భల్లచయ= బల్లెముల సమూహంయొక్క; సంపాతంబునన్= పడటంవలన; మింటన్= ఆకాశంలో; మంట= అగ్నిజ్వాల; మిక్కుటము+ఐ= అధికమై; ధగద్ధగద్ధగ+అనన్= ధగధగమండుతుండగా; కోపంబు రూపంబులు+ఐ= కోపం ఆకారాలను ధరించి; చటులక్రీడన్= తీవ్రమైన ఆటలో; చరించునట్లు= తిరిగే విధంగా; ఇరువురున్= ఇద్దరున్నూ (విరాట సుశర్మలు); శౌర్య+ఉన్నతిన్= వీరాధిక్యంతో; ప్రచండంబుగన్= భయంకరంగా; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** విరాట సుశర్మలు ఒకరిపై ఒకరు మిక్కిలి వేగంగా వాడి అయిన బల్లెములను వేయగా, అవి ఆకాశంలో ధగధగమండుతూ ఉండగా, వారిరువురూ మూర్తీభవించిన కోపాలా అన్నట్లు తీవ్రమయిన యుద్ధక్రీడలో విహరిస్తూ పరాక్రమాతిశయంతో గర్వాహంకారాలతో ఒకరిని ఒకరు జయించాలన్న కోరికతో భయంకరంగా పోరాడారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. తదవసరంబున నొక్కటఁ । బది యమ్ములు తొడి త్రిగర్తపతి వక్షంబున్**
**వదనంబు నేసి విరటుఁడు । మదమునఁ దురగములనేసి మఱియుఁ బదింటన్. 189**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; విరటుఁడు= విరాటరాజు; ఒక్కటన్= ఒకమారుగా; పది+అమ్ములు= పదిబాణాలను; తొడి= తొడిగి; త్రిగర్తపతి వక్షంబున్= సుశర్మ యొక్క రొమ్మునూ; వదనంబున్= మొగాన్నీ; ఏసి= కొట్టి; మదమునన్= పొగరుతో; మఱియున్= ఇంకను; పదింటన్= పది బాణాలతో; తురగములన్= గుర్రాలను; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో విరటుడు ఒకేమారు పది బాణాలను తొడిగి త్రిగర్తరాజైన సుశర్మ రొమ్మమీదా, మొగంమీదా ప్రయోగించాడు. అంతేకాకుండా గర్వంతో ఇంకా పదిబాణాలతో అతడి గుర్రాలను కొట్టాడు.

**క. ఇంచుకయు నీడఁబోవక । కాంచన పుంఖప్రకాండ కాంతి స్ఫాయ**
**త్పంచాశద్బాణంబులు । నించె నతఁడు మత్స్య మేదినీపతి మేనన్. 190**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ సుశర్మ; ఇంచుకయున్= కొంచెం కూడా; ఈడన్+పోవక= వెనుకాడకుండా; కాంచన= బంగారు; పుంఖప్రకాండ= తోకలుగల బాణాల సమూహంయొక్క; కాంతి= కాంతులచేత; స్ఫాయత్= ప్రకాశిస్తున్న; పంచాశత్+బాణంబులు= ఏబదిబాణాలు; మత్స్యమేదినీపతిమీఁదన్= విరటుడిమీద; నించెన్= నింపాడు.

**తాత్పర్యం:** ఆ సుశర్మ ఏమాత్రం జంకకుండా బంగారు తోకల బాణాల సమూహాలు కాంతులు విరజిమ్ముతుండగా విరటుడిమీద ఏబది బాణాలను ప్రయోగించాడు.

**తే. దొరలు తలపడ్డ నాహవదోహలమున । నుభయ బలములుఁ దమకించి యోర్వలేక**
**కలయబెరసి భూ రేణువు కతన రాత్రి । గాకమున్న యొండొరువులఁ గానరైరి. 191**

**ప్రతిపదార్థం:** దొరలు= రాజులు; తలపడ్డ= ఎదుర్కొనగా; ఆహవ= యుద్ధంమీది; దోహలమునన్= ఉత్సాహంతో; ఉభయ బలములున్= రెండు (వైపుల) సేనలు; తమకించి= త్వరపడి; ఓర్వలేక= నిగ్రహించుకొనలేక; కలయన్+బెరసి= కలయబడి; భూరేణువు కతనన్= నేలదుమ్ము లేవటం వలన; రాత్రి కాకమున్న+అ= రాత్రి కాకముందే (చీకటి పడకముందే); ఒండు+ ఒరువులన్= ఒకరినొకరు; కానరు+ఐరి= గుర్తించలేకపోయారు.

**తాత్పర్యం:** తమ రాజులు ఎదుర్కొనగా, సమధికోత్సాహంతో యుద్ధంలో ఇరువైపు సేనలు ఆగబట్టలేక ఎదుర్కొనగా రేగిన మట్టి, దుమ్ము వలన రాత్రికాకముందే చీకటి పడ్డట్లయి ఒకరిని మరొకరు చూడలేకపోయారు.

క. **క్షతములఁ బెల్లు తొరఁగు శో । ణితము రజఃపటల మడఁచి నెఱపిన నరుణ**
**ద్యుతిఁ దమము వాపు వేకువ । గతిఁ దత్సమయం బతి ప్రకాశత నొప్పెన్.** 192

**ప్రతిపదార్థం:** క్షతములన్= గాయాలనుండి; పెల్లు= ఎక్కువగా; తొరఁగు= కారే; శోణితము= నెత్తురు; రజపటలమున్= దుమ్ము సమూహాలను; అడఁచి= అణగించివేసి; నెఱపినన్= ప్రసరింపజేసిన; అరుణద్యుతిన్= ఎర్రని కాంతితో; తమము= చీకటిని; పాపు= పోజేయు; వేకువ గతిన్= వేగుజామువలె; తద్+సమయంబు= ఆ సమయం; అతి ప్రకాశతన్+ఒప్పెన్= మిక్కిలి వెలుగుతో విలసిల్లింది.

**తాత్పర్యం:** సైనికుల గాయాల నుండి విస్తారంగా కారిన నెత్తురు మట్టి దుమ్మును అణచివేసి నెరపివేయగా కానవచ్చిన ఎర్రని వెలుగు కల ఆ సమయం చీకటిని పోగొట్టే వేగుజామువలె మిక్కిలి వెలుగుతో ఒప్పారింది.

**విశేషం:** అలం: ఉపమ.

ఉ. **దానికిఁ జిత్తవృత్తులు ముదంబునఁ బొందఁగ, మేను లుబ్బఁగా**
**సేనలు రెండు నుద్భట విజృంభణతన్ వివిధాస్త్ర ఘట్టన**
**ధ్వానము దిక్కులం బరఁగఁ దాఁకి రణం బొనరించె; నత్తఱిన్**
**భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చిన మావిమో కనన్.** 193

**ప్రతిపదార్థం:** దానికిన్= ఆ ప్రకృతికి (వెలుగునకు); చిత్తవృత్తులు= మనోవ్యాపారాలు; ముదంబునన్+పొందఁగన్= సంతోషం అనుభవించగా; మేనులు+ఉబ్బఁగాన్= ఒడళ్ళు ఉప్పొంగగా; సేనలు రెండున్= ఇరువైపుల సేనలూ; ఉద్భట విజృంభణతన్= అధికమైన పూనికతో; వివిధ= అనేకములైన; అస్త్ర ఘట్టన ధ్వానము= మంత్ర సహిత బాణాలు ఘర్షణపడటం వలన కలిగే చప్పుడు; దిక్కులన్+పరఁగన్= దిక్కులలో వ్యాపించగా; తాఁకి= ఎదుర్కొని; రణంబు+ఒనరించెన్= యుద్ధం చేశాయి, ఆ+తఱిన్= ఆ సమయంలో; భానుఁడు= సూర్యుడు; పశ్చిమ+అద్రిన్= పడమటి కొండపై; తలిర్చిన= చిగిర్చిన; మావిమోక+అనన్= మామిడి మొక్కేమో అన్నట్లుగా; కనుపట్టెన్= కనిపించాడు.

**తాత్పర్యం:** ఆ ప్రకృతికి (వెలుగునకు) మనసులు రంజిల్లి శరీరాలు ఉప్పొంగగా ఇరువైపుల సేనలు విజృంభించి అనేక అస్త్రాల రాపిడివల్ల కలిగిన చప్పుళ్ళు దిక్కులు పిక్కటిల్లచేయగా ఎదురు యుద్ధాలకు పూనుకొని పరస్పరం ఆర్భాటంతో పోరు చేశారు. ఆ సమయంలో పడమటి కొండమీద సూర్యుడు ఒక మామిడి మొక్క చిగిర్చిందా అన్నట్లు కనిపించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. అస్తమిస్తున్న సూర్యుడిని కెంజాయ మామిడి మొక్కగా ఉత్ప్రేక్షించటం కమనీయం. (సంపా.)

క. **సమరంబున భటులు కడున్ । శ్రమమొందిరి, తమము గవిసినంగాని సము**
**ద్యమ సంరంభ ముడుగ, రిది । సమయం బని తొలఁగినట్లు సవితృఁడు గ్రుంకెన్.** 194

**ప్రతిపదార్థం:** సమరంబునన్= యుద్ధంలో; భటులు= సైనికులు; కడున్= మిక్కిలి; శ్రమము+ఒందిరి= అలసట చెందారు; తమము కవిసినన్+కాని= చీకటి క్రమ్మితేకాని; సముద్యమ సంరంభము= ప్రారంభించిన యుద్ధ ప్రయత్నపు ఆర్భాటాన్ని; ఉడుగరు=

మానరు; ఇది సమయంబు+అని= ఇదే తగిన వేళయని; తొలఁగినట్లు= తొలగిపోయినట్లుగా; సవిత్రుఁడు= సూర్యుడు; క్రుంకెన్= అస్తమించాడు.

**తాత్పర్యం:** సైనికులు యుద్ధంలో బాగా అలసిపోయారు. చీకటి పడితేకాని వీరు తమ యుద్ధోత్సాహాన్ని మానరు. కాబట్టి ఇదే తగిన సమయం అని తొలగిపోయినట్లు సూర్యుడు అస్తమించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. తదనంతరంబ. 195**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**క. ముఱిముఱి చీఁకటియప్పుడు । నఱిముఱి భటు లుడుగ కడరి యని సేయంగా**
**నెఱసి తమ మెల్లయెడఁ గ్రి। క్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను నంతన్. 196**

**ప్రతిపదార్థం:** భటులు= సైనికులు; ముఱిముఱి చీఁకటి+ అప్పుడున్= మసక మసక చీకటిగా ఉన్నప్పుడు కూడా; అఱిముఱి= కొద్దిగా కూడా; ఉడుగక= వెనుకాడక; అడరి= పెచ్చుపెరిగి; అనిన్+చేయంగాన్= యుద్ధం చేస్తుండగా; నెఱసి= కమ్ముకొన్న; తమము= చీకటి; ఎల్ల+ఎడన్= అంతటను; క్రిక్కిఱిసినన్= దట్టంకాగా; మఱి= అప్పుడు; పాసి= తొలగి; ఇంతనున్+అంతన్= ఇక్కడా అక్కడా; నిలిచిరి= నిలిచిపోయారు.

**తాత్పర్యం:** మసకచీకట్లు క్రమ్మినవేళలోకూడా భటులు వెనుకాడకుండా యుద్ధం చేశారు. క్రమంగా చిమ్మచీకట్లు క్రమ్మటంతో ఇక గత్యంతరంలేక యుద్ధం మాని అక్కడక్కడా (ఎక్కడివారక్కడ) నిలిచిపోయారు.

**వ. ఇట్లుభయ సైనికులు సాంద్ర సంతమసంబునం జేయునది లేక సంగ్రామంబు దక్కి తమకం బెక్క నొక్కింత సే పూరకున్నంత. 197**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఉభయ సైనికులు= రెండు పక్షాల సైనికులు; సాంద్ర సంతమసంబునన్= దట్టమయిన చీకటిలో; చేయునది లేక= చేసే దేమీ లేక; సంగ్రామంబు+తక్కి= యుద్ధం ఆపివేసి; తమకంబు+ఎక్కన్= ఉత్కంఠ ఎక్కువకాగా; ఒక్కింత సేపు= కొద్దిసేపు; ఊరక+ఉన్న+అంతన్= ఊరకుండగా.

**తాత్పర్యం:** దట్టమయిన చీకటిలో ఇరువర్గాల సేనలు చేసే దేమీ లేక యుద్ధం మాని కొంతసేపు ఊరకుండవలసిరాగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తన మనుమలు పాండుతనయు । లనిసేఁతకు వేడ్కసేయు టాత్మఁ గని తమం**
**బున వారు మెఱయ రని వ। చ్చిన క్రియ శశి పూర్వశైలశిఖరం బెక్కెన్. 198**

**ప్రతిపదార్థం:** తనమనుమలు= తన మనుమలు; పాండుతనయులు= పాండుకుమారులు (పాండవులు); అని+చేఁతకున్= యుద్ధం చేయటానికి; వేడ్క+చేయుట= ఆస పడటం; ఆత్మన్+కని= మనసులో గ్రహించి; తమంబునన్= చీకటిలో; వారు=

పాండవులు; మెఱయరు+అని= ప్రకాశించరని; వచ్చిన క్రియన్= తాను వచ్చినట్లుగా; శశి= చంద్రుడు; పూర్వశైలశిఖరంబు= ఉదయాచల శిఖరాన్ని; ఎక్కెన్= ఎక్కాడు (ఉదయించాడు).

**తాత్పర్యం:** తన మనుమలైన పాండవులు యుద్ధం చేయాలనే ఉత్సాహంతో ఉన్నారని మనసులో గ్రహించి, చీకట్లో వారు ప్రకాశించరని తనంతట తాను వచ్చాడా అన్నట్లు చంద్రుడు తూర్పుకొండమీద ఉదయించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. పాండవులు చంద్రవంశరాజులు. చంద్రుడు వారి వంశ పురుషుడు కాబట్టి వారి యోగక్షేమం కోరటం అతడి ధర్మం. పాండవు లింకా యుద్ధం చేయటం మొదలుపెట్టలేదు. కాబట్టి వారి కోర్కెను తీర్చటానికై కాంతిని ప్రసాదించే ఉద్దేశంతో చంద్రుడు ఉదయించాడు. తిక్కన సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనలను కాలసూచకాలుగా, కథాసూచకాలుగా నిర్వహించాడు. ఇది భావి కథా సూచకమైన వర్ణనం. ఇకపై పాండవులు యుద్ధంలో పాల్గొంటారని ధ్వని. (సంపా.)

**క. వెలుఁగు గని కడఁగి యిరువాఁ । గులుఁ బోరికిఁ జొచ్చె; మత్స్య కుంజరుఁడును న**
**గ్గలమగు మగఁటిమి సొంపునఁ । దలపడియె సుశర్మతోడఁ దదనుజు తోడన్. 199**

**ప్రతిపదార్థం:** వెలుఁగు+కని= వెలుతురును (వెన్నెలను) చూచి; కడఁగి= ప్రయత్నంతో; ఇరువాఁగులు= రెండు ప్రక్కల సేనలు; పోరికిన్+చొచ్చెన్= యుద్ధానికి ప్రారంభించారు; మత్స్యకుంజరుఁడును= మత్స్యదేశపు రాజు (విరాటుడు); అగ్గలము+అగు= అతిశయించిన; మగఁటిమిసొంపునన్= పరాక్రమ సంపదతో; సుశర్మతోడన్; తద్+అనుజు తోడన్= అతడి తమ్ముడితోనూ; తలపడియెన్= యుద్ధానికి పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** వెలుగు కానరాగా ఇరువాగులవారు యుద్ధానికి తలపడ్డారు. విరటుడు అతిశయించిన శౌర్యంతో సుశర్మనూ, అతడి తమ్ముడినీ ఎదుర్కొని యుద్ధానికి తలపడ్డాడు.

**చ. తలపడి పోర వారి యరదంబు లనేకము లొక్క పెట్ట యి**
**ట్టలపు రయంబునం బొదివి డాసెఁ గడంగి వడిం ద్రిగర్తనా**
**థులు నిరుతేరుఁ దద్రథముతోఁ గదియించి తదీయ సారథిన్**
**బలువిడిఁ గూల్చి రథ్యముల ప్రాణములుం గొని రుగ్రమూర్తులై. 200**

**ప్రతిపదార్థం:** తలపడి పోరన్= ఎదుర్కొని యుద్ధం చేయగా; వారి+అరదంబులు+అనేకములు= వారి తేరులు పెక్కులు; ఒక్క పెట్ట= ఒక్కుమ్మడిగా; ఇట్టలము+రయంబునన్= మిక్కిలి వేగంగా; పొదివి= క్రమ్ముకొని; డాసెన్= సమీపించాయి; కడంగి వడిన్= ప్రయత్నంతో వేగంగా; త్రిగర్తనాథులు= త్రిగర్తదేశపు రాజులు (సుశర్మ, అతడి తమ్ముడు); ఇరుతేరున్= (తమ) రెండు తేరులను; తద్+రథముతోన్= ఆ విరాటుడి తేరుతో; కదియించి= తాకించి (తగిలించి); తదీయ సారథిన్= అతడి సారథిని; బలువిడిన్+కూల్చి= శౌర్యంతో చంపి; ఉగ్రమూర్తులు+ఐ= భయంకరాకారులై; రథ్యముల= గుర్రాల; ప్రాణములన్= ప్రాణాలను; కొనిరి= తీసికొన్నారు.

**తాత్పర్యం:** ఆ విధంగా విరాటుడు ససైన్యంగా యుద్ధం చేస్తూ ఉండగా సుశర్మ, అతడి తమ్ముడూ అనేక రథికులతో కలిసి, ఒక్కపెట్టున వేగంగా విరాటుడిని క్రమ్ముకొని ఎదుర్కొని ఇరుప్రక్కల తమ రథాలను అతడి తేరుతో తగిల్చి భయంకరంగా సారథిని హతమార్చి, గుర్రాలను చంపారు.

**వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు.** 201

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; విరాటుండు= విరాటుడు; విరథుండు+అగుటయున్= తేరులేనివాడుకాగా,

**తాత్పర్యం:** విరాటుడు ఇట్లా తేరు లేనివాడు కాగా, (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. అతిరభసంబుమై నడరి యాతనిఁబట్టి, సుశర్మ పెల్చ నా**
**ర్చి తన రథంబుపై నిడి, యశేష బలంబులు నల్దెసన్ భయ**
**ద్రుతగతిఁ బాఱినన్ విజయదుందుభు లొక్కట మ్రోయ విక్రమో**
**ద్ధతి విభవంబునన్ మది ముదం బొలయన్ మరలెన్ మహోద్ధతిన్.** 202

**ప్రతిపదార్థం:** అతిరభసంబుమైన్= మిక్కిలి వేగంతో; అడరి= విజృంభించి; ఆతనిన్+పట్టి= ఆ విరటుడిని పట్టుకొని; సుశర్మ; పెల్చన్+ఆర్చి= పెద్దగా సింహనాదం చేసి; తన రథంబుపైన్+ఇడి= తన తేరుమీద పెట్టుకొని; అశేషబలంబులు= విస్తారమగు సైన్యాలు; నల్దెసన్= నాలుగు దిక్కులకు; భయద్రుతగతిన్+పాఱినన్= భయం వలన కలిగిన వేగమైన గమనంతో పర్వెత్తగా; విజయదుందుభులు= విజాయాన్ని సూచించే నగారాలు; ఒక్కటన్ మ్రోయన్= ఏకధాటిగా శబ్దం చేయగా; విక్రమ+ఉద్ధతి, విభవంబునన్= శౌర్యదర్పాధిక్యంతో; మదిన్= మనసులో; ముదంబు+ఒలయన్= సంతోషమొప్పగా; మహా+ఉద్ధతిన్= మిక్కిలి దూకుడుతో; మరలెన్= తిరిగి వెళ్ళనారంభించాడు.

**తాత్పర్యం:** సుశర్మ మిక్కిలి వేగంతో విజృంభించి విరాటుడిని పట్టుకొన్నాడు. బిగ్గరగా సింహనాదం చేసి అతడిని తన రథం మీదికి తెచ్చి ఉంచాడు. ఆ దృశ్యం చూచి అధిక సంఖ్యలో ఉన్న బలాలన్నీ భయంతో నలుదిక్కులా త్వరితగతిని పరుగెత్తాయి. విజయం కలిగినందుకు గుర్తుగా దుందుభులు ఒక్కసారిగా మ్రోసినాయి. పరాక్రమ గర్వవైభవంతో మనస్సు ఉప్పొంగగా సుశర్మ విశేషదర్పంతో తిరిగి వెళ్ళనారంభించాడు.

**వ. అట్టియెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరంబగు చిత్తంబుతో మత్స్యవిభుని వలను చూపుచు నిట్లనియె.** 203

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; ధర్మతనయుండు= ధర్మజుడు; అనిలనందనున్= భీముడిని; అవలోకించి= చూచి; సత్వరంబు+అగు చిత్తంబుతోన్= తొందరతో గూడిన మనసుతో; మత్స్యవిభుని వలను చూపుచున్= విరటుని దిక్కుచూపుతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ సమయాన తొందరపడే మనసుతో భీమసేనుడిని చూచి విరాటుడి వైపు చూపుతూ ఇట్లా అన్నాడు.

**తే. 'ఇతని యాశ్రయమున మనమెల్ల బ్రదికి । యున్నవారము గావున నుగ్ర రిపుల**
**పాలువడకుండ విడిపింపఁ బాడి యితని । నెయిదు మెయిదుము రథరయ మెసకమెసఁగ.** 204

**ప్రతిపదార్థం:** ఇతని+ఆశ్రయమునన్= ఇతడి రక్షణలో; మనము+ఎల్లన్ బ్రదికి+ఉన్నవారము= మనమందరం బ్రతికి ఉన్నాము; కావునన్= అందువలన; ఉగ్రరిపుల= భయంకర శత్రువుల యొక్క; పాలన్+పడకుండన్= బారిన పడకుండా; విడిపింపన్+పాడి=

విడిపించటం ధర్మం; రథరయం= రథవేగం; ఎసకము+ఎసఁగన్= అతిశయించగా; ఇతనిన్= ఇతడిని (విరటుడిని); ఎయిదుము+ ఎయిదుము= తొందరగా వెంబడించుము.

**తాత్పర్యం:** 'ఈ విరటుడు ఆధారంగా మనమంతా బ్రదికి ఉన్నాము. కాబట్టి భయంకరులయిన శత్రువుల పాలబడకుండా ఇతడిని విడిపించటం ధర్మం. నీ రథవేగం అతిశయించేటట్లు వెంబడించుము. వడివడిగా వెంబడించుము'.

**విశేషం:** అవసరం వచ్చేదాక ధర్మరాజు నోరు విప్పలేదు. ఇప్పుడు తమ కాశ్రయ మిచ్చిన రాజు శత్రువుల పాలబడ్డాడు. అతడిని రక్షించుకొనకపోతే తమ ఇంటిని తామే కూల్చుకొన్నట్లవుతుంది. రాజరక్షణే ఆత్మరక్షణ. అది అవశ్య కర్తవ్యం. కాబట్టి అంత తొందర. 'నీ రథవేగాన్ని హెచ్చించి శత్రువుల వెంటపడు' మని భీముడిని తొందరపెట్టాడు. ద్విరుక్తి ఆదుర్దాను, కృతజ్ఞతను, ధర్మానురక్తిని వ్యక్తం చేస్తుంది. (సంపా.)

**చ.** **అనవుడు మేను పెంచుచు మహాబలనందనుఁ డప్పు డన్న కి**
**ట్లను 'నిదె సాలవృక్షము; రయంబున దీన నరాతిసేన డొ**
**ల్ల నడిచి, యీ సుశర్ముని బలంబుఁ జలంబును మాన్పి, యవ్విరా**
**టుని విడిపించెదన్ రణపటుత్వము వైరులు పిచ్చలింపఁగన్.** **205**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా విని; మహాబల నందనుఁడు= వాయుపుత్రుడైన భీముడు; మేను పెంచుచున్= (వీరావేశంతో) శరీరాన్ని పెంచుతూ; అప్డు= ఆ సమయంలో; అన్నకున్+ఇట్లు+అనున్= అన్నతో (ధర్మజుడితో) ఈ విధంగా అంటున్నాడు; ఇదె= ఇదిగో, ఆ కనపడేదే; సాలవృక్షము= మద్దిచెట్టు; దీనన్= ఈ చెట్టుతో; రయంబునన్= వేగంగా; అరాతిసేనన్= వైరిసేనను; డొల్లన్+అడిచి= చావమోది; ఈ సుశర్ముని బలంబున్= ఈ సుశర్మయొక్క సైన్యాన్ని; చలంబును= మాత్సర్యాన్నీ; మాన్పి= పోగొట్టి; రణపటుత్వము= నా యుద్ధశక్తిని; వైరులు= శత్రువులు; పిచ్చలింపఁగన్= కొనియాడగా; ఆ+విరాటుని= ఆ విరాటుడిని; విడిపించెదన్= విడిపిస్తాను.

**తాత్పర్యం:** అనగా విని భీముడు వీరావేశంతో శరీరాన్ని ఉబ్బిస్తూ అన్నతో అప్పు డిట్లా అన్నాడు; 'అదుగో! ఆ కనపడేదే మద్దిచెట్టు (అని చూపించి చెప్పి), దానిని పెరికి వేగంగా త్రిప్పుతూ శత్రుసేనలను చావమోది, ఆ సుశర్మ బలాన్ని అణగించి, నా యుద్ధ పరాక్రమాన్ని విరోధులు కూడా మెచ్చుకొనేటట్లు విరాటుడిని విడిపిస్తాను.

**తే.** **నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు । చుండుఁ 'డని పల్కుటయుఁ బుయిలోట తోడఁ**
**గీచకారాతిఁ దప్పకచూచి నగుచు । నతని కిట్లని చెప్పె ధర్మాత్మజుండు.** **206**

**ప్రతిపదార్థం:** నీవున్, తమ్ములున్= ఓ ధర్మజా! నీవూ, తమ్ములు నకుల సహదేవులూ; ఒక్క+ఎడన్= ఒకప్రక్క; నిలిచి చూచుచున్+ఉండుఁడు= నిలిచి చూస్తూ ఉండండి; అని పల్కుటయున్= అనగానే; ధర్మ+ఆత్మజుండు= ధర్మరాజు; పుయిలోటతోడన్= సంశయంతో; కీచక+అరాతిన్= కీచకుల శత్రువైన భీముడిని; తప్పక చూచి= సూటిగా చూచి; నగుచున్= నవ్వుతూ; అతనికిన్= ఆ భీముడితో; ఇట్లు+అని చెప్పెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీవూ తమ్ముళ్ళూ ఒక ప్రక్కగా నిలిచి చూస్తూ ఉండండి' అని భీము డనగానే ధర్మరాజు సందేహంతో కీచకవైరి అయిన భీముడిని సూటిగా చూచి నవ్వుతూ ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** భీముడి ఆవేశం చూడగానే ధర్మరాజుకు అనుమానం వేసింది అతడు అన్నంత పనీ చేస్తాడని. అందుకే భీముడిని చూపులతో ఆపాడు. అట్లా సూటిగా కళ్ళలోకి చూస్తే ఎంతటి మహాబలనందనుడైనా ఆగిపోవలసిందే. చూపులతో వారించి పెదవులతో నవ్వాడు ధర్మరాజు. ఆ నవ్వులో ఆప్యాయత, అధిక్షేపం, అనునయం, వివేకం, సౌజన్యం తొణికిసలాడాయి. భీముడు ఆవేశంతో అజ్ఞాతవాస నియమాన్ని మరచిపోయి మాట్లాడుతున్న పొరపాటును ధర్మరాజు సరిచేయబోతున్నాడు. చేదుమాట కూడా తియ్యనినవ్వులో పొదివి చెప్పగల నిపుణుడు ధర్మరాజు. (సంపా.)

**క. 'తరువు వెసఁ బెఱికికొని నీ। వురవడిమైఁ గవిసితేని నుభయబలము న**
**చ్చెరువందుచుఁ జూచి వృకో। దరుఁడ వగుట యెఱుఁగకున్నె! తద్విధ మేలా? 207**

**ప్రతిపదార్థం:** తరువు= చెట్టును; వెసన్= శీఘ్రంగా; పెరికికొని= పెళ్లగించి తీసికొని; నీవు+ఉరవడిమైన్+కవిసితి(వి)+ఏనిన్= నీవు తొందరగా కప్పుకొన్నట్లయితే; ఉభయబలమున్= రెండు వైపులనున్న సైన్యం; అచ్చెరువు+అందుచున్+చూచి= అబ్బురపాటుతో చూచి; వృకోదరుఁడవు+అగుట= భీముడవగుట; ఎఱుఁగక+ఉన్నె?= తెలియకుంటుందా?; తద్+విధము+ఏలా!= అట్టి పద్ధతి ఎందుకు?

**తాత్పర్యం:** 'ఓ భీమసేనా! నీవు చెట్టును పెరికికొని శీఘ్రంగా కప్పుకొంటే ఇరువాగుల సైన్యం ఆశ్చర్యంగా చూచి నీవు భీమసేనుడ వని గుర్తించకుండా ఉంటుందా? అందువలన ఆ పద్ధతి వద్దు.

**విశేషం:** మద్దిచెట్టుతో శత్రువుల పీచమణచటం భీముడి ప్రత్యేకశైలి. ఎప్పుడు కోపం వచ్చినా ప్రక్కనున్న చెట్టువైపు చూడటమో, చూపించటమో అతడి ధోరణి. దానిని అప్పుడనుసరిస్తే భీమసేనుడని అందరూ తేలికగా గుర్తిస్తారు కాబట్టి మరొక పద్ధతిని అనుసరించుమని ధర్మరాజు హితవు. దూరదృష్టి గల దర్శకుడు ధర్మరాజు. (సంపా.)

**వ. కవలు నీకుఁ జక్రరక్షకులుగా లోకసామాన్యంబులైన చాప కృపాణ గదాదులగు నాయుధంబుల విరోధివధం బాపాదించి వేవేగ విరాటు విడిపింపుము.' 208**

**ప్రతిపదార్థం:** కవలు= నకుల సహదేవులు; నీకున్= నీకు; చక్రరక్షకులు+కాన్= నీ తేరునకు కాపుదల వారుగా; లోకసామాన్యంబులు+అయిన= లోకంలో సాధారణాలయిన; చాప, కృపాణ, గదా+ఆదులు+అగు= విండ్లు, కత్తులు, గదలు మొదలయిన; ఆయుధంబులన్= ఆయుధాలతో; విరోధి= శత్రువులయొక్క; వధంబు+ఆపాదించి= చంపుటను చేసి; విరాటున్= విరాటుడిని; వేవేగన్= మిక్కిలి శీఘ్రంగా; విడిపింపుము= వదలింపుము.

**తాత్పర్యం:** నకుల సహదేవులను నీ రథచక్ర రక్షకులుగా చేసికొని, అందరికీ అందుబాటులో ఉండే విండ్లు, కత్తులు, గదలు మొదలైన సాధనాలతో విరోధి వధ చేసి త్వరగా విరాటుడిని విడిపించుము.

**చ. అను పలు కంకుశంబున క్రియం గుదియించిన నిల్చి, భూరుహం**
**బున దెస వోక, మత్తగజపుంగవు చందమునన్ సమీరనం**
**దనుఁడు శరీర దోలన విధా పరిశోభిత విక్రమోద్యమం**
**బున విలసిల్లి యిట్టు లను భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 209**

**ప్రతిపదార్థం:** అనుపలుకు= అన్నమాట; అంకుశంబున క్రియన్= (మదపుటేనుగునకు) అంకుశంవలె; కుదియించినన్= క్రుంగదీయగా; నిల్చి= నిలిచిపోయి; సమీరనందనుఁడు= వాయుపుత్రుడైన భీముడు; భూరుహంబున దెస+పోక= చెట్టుదిక్కుకు (వైపుకు) పోకుండా; మత్తగజ పుంగవు చందమునన్= మదపుటేనుగు మాదిరి; శరీర దోలన విధా= శరీరాన్ని విదిలించే విధానం చేత; పరిశోభిత= ప్రకాశించిన; విక్రమ+ఉద్యమంబునన్= పరాక్రమ ప్రయత్నంతో; విలసిల్లి= ఒప్పారి; భ్రూకుటి= బొమముడి; ఫాలము+అలంకరింపఁగన్= నుదురును అలంకరించగా; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మజుడి మాట అంకుశపుపోటు మాదిరిగా తనను క్రుంగదీయగా ఆగి, భీమసేనుడు చెట్టు దిక్కుకు పోకుండా నిలిచి, మదించిన మగఏనుగువలె శరీరాన్ని విదిలించుకొని, పరాక్రమోత్సాహంతో విలసిల్లుతూ కోపంతో ముడివడిన కనుబొమలు నెన్నుదురు భాగానికి వన్నె తేగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. మదించిన మగ ఏనుగుతో భీముడిని పోల్చటం, ధర్మరాజు మాట అంకుశంగా చెప్పటం, ఏనుగు పోరుకు విజృంభించేముందు ఒడలు విదిల్చినట్లుగా భీముడు శరీరాన్ని కదల్చటం, చెట్టువైపు పోకుండా శత్రువులవైపు పోవటం ఉపమాలంకార వైభవం. భీముడికి కోపోద్రేకం కలిగిందంటే కనుబొమలు ముడిపడతాయి. అది అతడి ముఖానికే ఒక అందం. (సంపా.)

**క. 'మీ పనిచినట్ల చేసెద । నేపారిన వైరిబలము నెల్లను బాహా**
**టోపమున నోర్చి మత్స్యమ । హీపతి విడిపించి తెచ్చి యిచ్చెద మీకున్'. 210**

**ప్రతిపదార్థం:** నీ పనిచిన+అట్ల చేసెదన్= మీ ఉత్తరువు ప్రకారం చేస్తాను; ఏపారిన= విజృంభించిన; వైరిబలమున్= శత్రుసేనను; ఎల్లను= అంతటిని; బాహా+ఆటోపమునన్= భుజబలంతో; ఓర్చి= ఓడించి; మత్స్యమహీపతిన్= విరాటరాజును; విడిపించి; మీకున్= మీకు; తెచ్చి+ఇచ్చెదన్= తీసికొనివచ్చి ఇస్తాను.

**తాత్పర్యం:** 'మీ ఉత్తరువు మేరకు చేస్తాను. విజృంభించిన వైరిసేనను నా భుజబలంతో ఓడిస్తాను. విరాటుడిని విడిపించి తెచ్చి మీకు అప్పగిస్తాను'.

**వ. అనిన విని కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమయంతపట్టునుం గూడుకొని. 211**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతి కుమారులలో పెద్దవాడగు ధర్మరాజు; సంతసిల్లి= సంతోషపడి; తమ+అంత పట్టునున్+కూడుకొని= తమవారినందరినీ కలుపుకొని.

**తాత్పర్యం:** ఆ మాటలు విని ధర్మరాజు సంతోషించి తమవారినందరిని కలుపుకొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** చిత్ర మేమంటే- విరాటుడు ఓడిపోగా అతడి తమ్ముళ్ళూ, కొడుకూ, బంధువులూ ప్రభువును రక్షించుకొనే బాధ్యతను స్వీకరించలేదు. ధర్మరాజు స్వయంగా తీసికొన్నాడు. ఇది ఎవరూ కోరింది కాదు. రాజును విడిపించే బాధ్యత భీముడిమీద పెట్టి తాను ముందుగా రథ మెక్కి, తన తమ్ములనూ, సేనలనూ తన వెంట కూర్చుకొని ముందుకు సాగాడు ధర్మరాజు. శ్రేయోభిలాషిగా చైతన్యవంతుడైన ధర్మరాజు ఆ సేనలో రాజు తరువాత రాజంతటివాడుగానూ, రాజును విముక్తి చేయగల ఆపద్బాంధవుడుగానూ తన పాత్రను ఉదాత్తంగా నిర్వహించాడు. (సంపా.)

పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట (సం. 4-32-26)

**తే. తాను మున్నుగ శాత్రవసేనమీఁద । రథము లొక్కటఁ బఱపిరి పృథివి యద్రువ;**
**నుఱక యేచి త్రిగర్తులు నుద్ధతముగఁ । జెలఁగి మార్కొని పొదివి సంకులముగాఁగ. 212**

**ప్రతిపదార్థం:** మున్నుగన్= ముందుగా; తాను= తాను (ధర్మరాజు) ఉండి; శాత్రవసేనమీఁదన్= విరోధి సైన్యం మీదకు; పృథివి= భూమి; అద్రువన్= అదరగా; రథములు= తేరులు; ఒక్కటన్+ పఱపిరి= ఒక్కసారిగా (మూకుమ్మడిగా) నడిపించారు; ఏచి= విజృంభించి; త్రిగర్తులు= త్రిగర్త దేశీయులు; ఉఱక= జంకకుండా; ఉద్ధతముగన్= గర్వంతో; చెలఁగి= పెచ్చుపెరిగి; మార్కొని= ఎదుర్కొని; సంకులము+ కాఁగన్= దొమ్మిపోరు అయ్యేటట్లు; పొదివి= క్రమ్ముకొని;

**తాత్పర్యం:** ధర్మరాజు తాను ముందుండి రథాలన్నీ ఒక్కసారిగా శత్రుసేనలమీద భూమి కంపించేటట్లు దాడి చేశాడు. త్రిగర్త దేశీయులు కూడా గర్వంతో విజృంభించి ఎదురుతిరిగి ధర్మరాజు సైన్యాన్ని చుట్టుముట్టి దొమ్మియుద్ధం సాగించారు.

**క. ఏయుచుఁ బొడుచుచు వ్రేయుచు । డాయుచు నుద్వృత్తిఁ దఱుముటయుఁ బొడిసేసెన్**
**వాయుసుతుఁడు రథముల నిరు । వేయిటి రథి రథ్య సూత వితథంబులుగన్. 213**

**ప్రతిపదార్థం:** ఏయుచున్= బాణాలు వేస్తూ; పొడుచుచున్= శూలాలతో పొడుస్తూ; వ్రేయుచున్= కత్తులతో, గదలతో కొట్టుతూ; డాయుచున్= దగ్గరకు చేరుతూ; ఉద్వృత్తిన్+తఱుముటయున్= గర్వాతిశయంతో తరుముతూ ఉండగా; వాయుసుతుఁడు= భీముడు; రథి= రథంలో ఉన్న వీరులు; రథ్య= గుర్రాలు; సూత= సారథులు; వితథంబులుగన్= వ్యర్థములయ్యేటట్లు; రథములన్+ఇరువేయిటిన్= రెండు వేల రథాలను; పొడి+చేసెన్= నుగ్గు నుగ్గు చేశాడు.

**తాత్పర్యం:** త్రిగర్త రథికులు బాణాలు ప్రయోగిస్తూ, శూలాలతో పొడుస్తూ, కత్తులతో నరుకుతూ, గదలతో బాదుతూ ధర్మరాజాదులను సమీపిస్తూ మదాతిశయంతో సేనలను తరుముతూ వస్తున్నారు. భీముడు ఆ శత్రువీరులలోని రథికులూ, గుర్రాలూ, సారథులూ నేలకూలేటట్లు రెండు వేల రథాలను నుగ్గు నుగ్గు చేశాడు.

**విశేషం:** మద్దిచెట్టును మాని రథంమీద సాగివచ్చిన భీముడు రథికుడుగా తన పరాక్రమాన్ని ప్రదర్శించి చూపాడు. (సంపా.)

**తే. ఏడు నూఱు రథంబులనేపు మాపె । నకులుఁ; డప్పుడు మున్నూటి నామ మడఁచె**
**నతని యనుజుండు; గుంతీసుతాగ్రజుండు । రథిక ముఖ్యుల వేవురఁ బృథివిఁ గూల్చె. 214**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; నకులుఁడు= నకులుడు; ఏడునూఱురథంబులన్= ఏడువందల తేరులను; ఏపుమాపెన్= ధ్వంసం చేశాడు; అతని+అనుజుండు= అతడి తమ్ముడు సహదేవుడు; మూఁడు+నూటిన్= మూడు వందల రథాలను; నామము+అడఁచెన్= పేరు లేకుండా చేశాడు; కుంతీసుత+అగ్రజుండు= కుంతికుమారులలో పెద్దవాడయిన ధర్మరాజు; రథికముఖ్యులన్= రథికులలో ముఖ్యులను; వేవురన్= వేయిమందిని; పృథివిన్+కూల్చెన్= నేలకూల్చాడు. (అనగా చంపెను).

**తాత్పర్యం:** అప్పుడు నకులుడు ఏడునూర్ల తేరులను నాశనం చేశాడు. అతడి తమ్ముడైన సహదేవుడు మూడు వందల రథాలను ధ్వంసం చేశాడు. ధర్మరాజు రథిక శ్రేష్ఠులను వేయిమందిని చంపాడు.

**విశేషం:** తమ్ములు రథాలను విరుగగొట్టుతుంటే ధర్మరాజు రథికులను చంపుతున్నా డనటం విశేషం. తాత్పర్యంలో రెండూ ఒకటే. భీముడు రెండువేల రథాలను, ధర్మరాజు ఒకవేయి రథాలను, నకులుడు ఏడువందల రథాలనూ, సహదేవుడు మూడువందల రథాలనూ ధ్వంసం చేశారు. ఆ రథసంఖ్యలు వారి బలాల కొలమానాలు. (సంపా.)

**వ. అతండు మఱియును. 215**

**తాత్పర్యం:** ఆ ధర్మరాజు అంతటితో ఆగక. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతి దారుణ భంగి రణంబు సేయ, వాఁ**
**డుఱక నిశాత సాయకము లొక్కమొగిం బది మేనియందుఁ గ్రి**
**క్కిఱియఁగఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్; యుధిష్ఠిరుం**
**డఱిముఱిఁ జంపె సారథిఁ దదశ్వములన్ వరబాణపాణియై. 216**

**ప్రతిపదార్థం:** తఱిమి= తరుముకొనిపోయి; సుశర్మన్= సుశర్మను; కిట్టి= సమీపించి; అతి దారుణభంగిన్= మిక్కిలి భయంకరమైన రీతిలో; రణంబు+చేయన్= యుద్ధం చేయగా; వాఁడు= సుశర్మ; ఉఱక= జంకక; నిశాత సాయకములు= వాడి అయిన బాణాలు; ఒక్కమొగిన్= ఒక్కసారిగా; పది= పదింటిని; మేని+అందున్= (ధర్మరాజు యొక్క) శరీరంలో; క్రిక్కిఱియఁగన్+చేసి= దట్టంగా గ్రుచ్చుకొనేటట్లు నాటి; నాలుగిటన్= నాలుగు బాణాలతో; తురంగములన్= తేరి గుఱ్ఱాలను; ఏసెన్= కొట్టాడు; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అఱిముఱిన్= వెంటనే; వరబాణపాణి+ఐ= శ్రేష్ఠమైన బాణాలు చేతియందు కలవాడై; సారథిన్= సుశర్మ రథసారథిని; తద్+అశ్వములన్= అతడి తేరి గుఱ్ఱాలను; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు సుశర్మను వెంటాడి తరిమి, ఎదుర్కొని భయంకర పద్ధతిలో యుద్ధం చేస్తూ ఉండగా, సుశర్మ వెనుకాడక పది వాడి బాణాలను ఒక్కసారిగా ఒక్కచోటే క్రిక్కిరిసి గ్రుచ్చుకొనేటట్లు ధర్మరాజు యొక్క శరీరంలో నాటాడు. నాలుగు బాణాలతో అతడి తేరి గుఱ్ఱాలను కొట్టాడు. ధర్మరాజు ఊరుకోక వెంటనే బలమైన బాణాలను సంధించి సుశర్మ రథసారథినీ, గుఱ్ఱాలనూ చంపాడు.

**వ. అయ్యవసరంబున మత్స్య మహీనాథుండు జనితోత్సాహుండై. 217**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; మత్స్య మహీనాథుండు= మత్స్యదేశరాజయిన విరాటుడు; జనిత+ఉత్సాహుండు+ఐ= పుట్టిన ఉత్సాహం కలవాడై.

**తాత్పర్యం:** ఆ సమయంలో విరాటుడు లేని ఉత్సాహం తెచ్చుకొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. ఆ సుశర్మ తేరియందున్న ఘనగదా । దండ మెత్తికొని యుదగ్రవృత్తి**
**జరఠదేహుఁ డయ్యుఁ దరుణ వయస్కున । ట్లవని కుఱికి పోయి యతని వ్రేసె. 218**

**ప్రతిపదార్థం:** ఆ సుశర్మ= ఆ సుశర్మయొక్క; తేరి+అందున్+ఉన్న= తేరులోఉన్నట్టి; ఘన= పెద్దదయిన; గదాదండము+ఎత్తికొని= దండం వంటి పెద్ద గదను తీసికొని; ఉదగ్రవృత్తిన్= గర్వంతో; జరఠదేహుఁడు+అయ్యున్= ముసలివాడైనా; తరుణవయస్కునట్లు= పడుచు వయస్సుగల వాడివలె; అవనికిన్+ఉఱికి= భూమిమీదకు దూకి; పోయి= వెళ్ళి; అతనిన్+వ్రేసెన్= సుశర్మను కొట్టాడు.

**తాత్పర్యం:** ఆ సుశర్మ యొక్క రథంలో ఉన్న ఒక గదాదండాన్ని తీసికొని, ముసలివాడైనా యువకుడివలె ముందుకు నిర్భయంగా నేలమీదికి దూకి, సుశర్మను సమీపించి అతడిని ఆ గదతో మోదాడు.

**క. అట్టి సమయమునఁ గరువలి । పట్టి త్రిగర్తేశు రథముపై కుఱికి వెసం**
**బట్టికొని, యతనిఁ బెడగే । ల్గట్టి పెలుచ నార్చెఁ దద్బలము పెల్లగిలన్. 219**

**ప్రతిపదార్థం:** అట్టిసమయమునన్= ఆ సమయంలో; కరువలిపట్టి= వాయుసూనుడయిన భీముడు; త్రిగర్త+ఈశు రథముపైకిన్+ఉఱికి= సుశర్మయొక్క తేరి మీదకు దూకి; వెసన్+పట్టికొని= శీఘ్రంగా పట్టుకొని; అతనిన్+పెడకేల్+కట్టి= అతడి చేతులు విరిచి వెనుకకు కట్టి; తద్+బలము= ఆ సుశర్మసేనలు; పెల్లగిలన్= త్రుళ్ళిపడగా; పెలుచన్= పెద్దగా; ఆర్చెన్= అరచాడు.

**తాత్పర్యం:** అప్పుడు భీముడు సుశర్మతేరిమీదకు దూకి, శీఘ్రంగా పట్టుకొని, అతడి చేతులు వెనుకకు విరిచి కట్టి పెద్దగా సింహనాదం చేశాడు. అందు కా సుశర్మ సేనలు త్రుళ్ళిపడ్డాయి.

**వ. ఇట్లు సుశర్మంబరాజితుం జేసినఁ జక్రరక్షకుండైన శోణాశ్వుండు మొదలుగా నాప్త భృత్య వర్గంబు, ననుజుండైన సుశర్మ లోనైన బంధు జనంబులు నాదిగాఁ గల పరివారంబు పలాయన పరాయణం బగుటయు, వెనుకొని యెయిది గోధనవర్గంబు మరల్చి, కరి తురగ రథంబులం దలమీఱి పొదివి తెచ్చి, యన్నపాలికి వచ్చి తాను మున్ను త్రిగర్తేశు రథంబు కడ నిలువ నియోగించియున్న తమ్ములం గూర్చుకొని, తమ యంతవట్టును నొక్కట విరాటునకుం బొడసూపిన. 220**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సుశర్మన్= సుశర్మను; పరాజితున్+చేసినన్= ఓడించగా; చక్రరక్షకుండు+అయిన శోణాశ్వుండు= అతడి చక్రరక్షకుడైన శోణాశ్వుడనేవాడు; మొదలుగాన్= మొదలుకొని; ఆప్తభృత్యవర్గంబు= ఆప్తులయిన సేవకుల సముదాయం; అనుజుండు+ఐన= తమ్ముడైన; సుశర్మలోనైన బంధుజనంబులున్= సుశర్మ మొదలగు బంధువులు; ఆదిగాన్+కల పరివారంబు= మొదలయిన సేవక బృందం; పలాయన పరాయణంబు+అగుటయున్= పరిగెత్తిపోవటంలో ఆసక్తికలది కాగా; వెనుకొని= వెన్నంటి తఱిమి; ఎయిది= అందుకొని; గోధనవర్గంబు= పశుసంపద సముదాయాన్ని; మరల్చి= త్రిప్పి; కరి, తురగ, రథంబులన్+తలమీఱి= ఏనుగులనూ, గుర్రాలనూ, తేరులనూ దాటి ముందుకు వచ్చి; పొదివి తెచ్చి= చుట్టుముట్టి తీసికొని వచ్చి; అన్న పాలికిన్ వచ్చి= ధర్మజుడి ఒద్దకు వచ్చి; తాను మున్ను= ఇదివరకు తాను; త్రిగర్తేశురథంబుకడన్= సుశర్మ తేరు దగ్గర; నిలువన్+నియోగించి ఉన్న= ఉండండని ఉత్తర్వు చేసి ఉన్న; తమ్ములన్+కూర్చుకొని= తమ్ములను కలుపుకొని; తమ +అంత+పట్టును= తమవారందరూ; ఒక్కటన్= ఒకచోట ఒక్కటిగా నిలిచి; విరాటునకున్+పొడచూపినన్= విరటునకు కనిపించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడు సుశర్మను ఓడించగా, అతడి చక్రరక్షకుడయిన శోణాశ్వుడూ మొదలైన ఆప్త సేవకులూ, తోబుట్టువయిన సుశర్మ మొదలైన బంధువులూ పలాయనం చిత్తగించగా వారిని వెన్నంటి తరిమి పట్టుకొని వచ్చి, పశుసంపదను మరల్చి చతురంగబలాలను అతిక్రమించి ముందుకు పోయి వాటిని చుట్టుముట్టి తీసికొని తమ అన్న వద్దకు వచ్చి, తా నిదివరలో త్రిగర్తేశుడి తేరివద్ద ఉండండని నియోగించిన తమ్ములను వెంట తీసికొని వచ్చి ఒక్కటిగా గుమికూడి విరాటుడికి కనపడ్డాడు.

**క. ఆదరము సంభ్రమంబును । మోదంబును దన మనమున ముప్పిరిగొన నా**
**భూదయితుఁడు వివిధప్రియ । వాదంబుల గారవించె వారల నెల్లన్. 221**

**ప్రతిపదార్థం:** ఆ, భూ, దయితుఁడు= ఆ రాజు విరాటుడు; తన మనమునన్= తన హృదయంలో; ఆదరము= గౌరవం; సంభ్రమంబును= తొట్రుపాటూ; మోదంబును= సంతోషమూ; ముప్పిరిగొనన్= ముప్పేటగా ముంచుకొనిరాగా; వివిధ ప్రియ వాదంబులన్= పలురకాల ప్రియ సంభాషణలతో (మేలి మాటలతో); వారలన్+ఎల్లన్= వారందరిని; గౌరవించెన్= ఆదరించాడు.

**తాత్పర్యం:** గౌరవం, తొట్రుపాటూ, సంతోషం తన మనసులో ముప్పేటగా పెనవేసికొని పైకి పొంగగా విరటుడు అనేకవిధాల ప్రీతిగొల్పే మాటలతో వారి నందరిని ఆదరించాడు.

**వ. ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. 222**

**ప్రతిపదార్థం:** ఇట్లు సంభావించి= ఈ విధంగా గౌరవించి; పాండవ+అగ్రజున్+అవలోకించి= పాండుకుమారులలో పెద్దవాడైన ధర్మరాజును చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా గౌరవించి, విరాటుడు ధర్మరాజును చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'మానముఁ బ్రాణముఁ గాచితి। దీనికి సరిగాఁగ నీ మదికిఁ బ్రియ మెసఁగం**
**గా నాకుఁ జేయనయ్యెడు। దాని నెఱుఁగఁగాన మత్పదము గైకొనవే! 223**

**ప్రతిపదార్థం:** మానమున్= అభిమానాన్నీ; ప్రాణమున్= ప్రాణాన్నీ; కాచితి(వి) కాపాడావు; దీనికిన్+సరికాఁగన్= దీనికి సరిపోయేటట్లు (దీటుగా); నీ మదికిన్= నీ మనస్సుకు; ప్రియము+ఎసఁగన్= ప్రీతి కలిగేటట్లు; నాకున్+చేయన్+అయ్యెడుదానిన్= నేనుచేయదగిన దానిని; ఎఱుఁగన్= తెలిసికొనలేకపోతున్నాను; కానన్= కావున; మత్+పదము+కైకొనవే= నా పదవిని (రాజపదవిని) స్వీకరించుము.

**తాత్పర్యం:** 'నీవు నా మాన ప్రాణాలను కాపాడావు. దానికి సరితూగేటట్లు, నీ మనస్సుకు ప్రీతి కలిగించేటట్లు ఏమి చేయాలో దానిని నేను నిర్ణయించుకొనలేకపోతున్నాను. కాబట్టి నా రాజపదవినే నీకు సమర్పించుకొంటాను. స్వీకరించుము.

**విశేషం:** 'నాకుఁ జేయనయ్యెడు దాని నెఱుఁగఁగానన్' అనే వాక్యం కృతజ్ఞతాబద్ధమైన హృదయంతో, వినయంతో మెలికలు తిరుగుతూ విరాటుడు పలికిన తీరును తెలుపుతున్నది. 'నేను నీవు చేసిన మేలుకు తగిన మేలు చేయలేను. అది నా ఎరుకలో లేదు' అన్నట్లు చెప్పాడు. విరాటుడు సరళ హృదయుడు. కోపం వచ్చినా, సంతోషం వచ్చినా, కృతజ్ఞత పొంగివచ్చినా అరమరికలు లేకుండా పలుకుతాడు. మానాన్నీ, ప్రాణాన్నీ ఇచ్చినవాడు గురుతుల్యుడు, దైవతుల్యుడు. అతడికి సర్వస్వం సమర్పించుకొనటమే సమంజసం. విరాటుడు రాజపదవి నిస్తే అతడి స్థితి ఏమిటి? (పాండవ) దాసుడే కావాలి. కంకుడు ధర్మరాజని తెలియకపోయినా అతడికి సర్వస్వం దానం చేయదలచిన విరాటుడు అచ్చమైన వినయశీలి. (సంపా.)

**తే. ఒడలు సిరియును నాకు నీయొసఁగినవియ। కానఁ దగ సమర్పించెదఁ; గరుణ నీవు**
**సమ్మతించి యిమ్మత్స్య దేశంబుఁ గావు। పంచి పనిగొని నన్ను రక్షించికొనుము.' 224**

**ప్రతిపదార్థం:** ఒడలున్= శరీరమూ; సిరియును= సంపదా; నాకున్+ఈవు+ఒసఁగినవి+అ= నాకు నీవిచ్చినవే; కాన= కనుక; తగన్= తగునట్లుగా; సమర్పించెదన్= ఇస్తాను; కరుణన్= దయతో; నీవు సమ్మతించి= నీ విష్టపడి; ఈ+మత్స్యదేశంబున్+కావు(ము)= ఈ మత్స్యదేశాన్ని కాపాడుము; పంచి= ఆజ్ఞాపించి; పనిగొని= సేవలందికొని; నన్ను రక్షించికొనుము= నన్ను కాపాడుకొనుము.

**తాత్పర్యం:** ఈ నా శరీరము, సంపదా నీ విచ్చినవే కనుక నీకే సమర్పిస్తాను. నీవు సమ్మతితో ఈ మత్స్యరాజ్యాన్ని స్వీకరించి, రక్షించుము. నన్ను నీ వాడిగా మన్నించి ఆజ్ఞాపించి కాపాడుము'.

**విశేషం:** ఇది శరణాగతివంటి మాట. (సంపా.)

**వ. అనిన విని యజాతశత్రుం డతని కిట్లనియె. 225**

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు ఆ విరాటుడితో ఇట్లా అన్నాడు.

**చ. 'మనుజవరేణ్య! నావలని మన్నన యట్టిదకాదె; శత్రు మ**
**ర్దన మొనరించి మత్స్య నగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ**
**చనుటయు నాకుఁ దేజమును సంపదయుం గరిమంబుఁగాక, యి**
**ట్లనఁ దగునయ్య? యే నిచట నైనది యేటిది? యింత యేటికిన్?' 226**

**ప్రతిపదార్థం:** మనుజవరేణ్య!= ఓ పురుష శ్రేష్ఠుడా, రాజా!; నావలని మన్నన= నాయందలి గౌరవం; అట్టిది+కాదె!= అట్టిదేకదా; శత్రుమర్దనము+ఒనరించి= శత్రుసంహారం చేసి; మత్స్యనగరంబునకున్= మత్స్యభూపాలుడి రాజధానికి; ఉత్సవము+ఉల్లసిల్లన్= సంతోషం కలుగగా; నీ చనుటయు= నీవు వెళ్ళుటయే; నాకున్= నాకు; తేజమును= శక్తినీ; సంపదయున్= ఐశ్వర్యం; గరిమంబున్+కాక= గొప్పదనంగానీ; ఇట్లు+అనన్+తగునఅయ్య!= ఈ విధంగా అనవచ్చునా?; ఏన్+ఇచటన్+ఐనది+ఏటిది?= నేను ఇక్కడ చేసింది ఏముంది?; ఇంత+ఏటికిన్?= ఇంత ఎందుకు?

**తాత్పర్యం:** 'ఓ విరాటరాజా! నామీద మీకున్న గౌరవం అటువంటిది సుమా! శత్రుసంహారం చేసి విజయోత్సాహంతో మత్స్యదేశ రాజధానికి నీవు తిరిగి పోవటంకంటే వేరే తేజస్సూ, సంపదా, గొప్పదనం మరేమి ఉంటుంది? నీవు ఇట్లా అనవచ్చునా? నే నిక్కడ నీకు చేసింది ఏమున్నది? ఇంత చిన్నపనికి ఇంతగా నీవు చెప్పవలెనా?'

**విశేషం:** 'ఏ నిచట నైనది యేటిది? యింత యేటికిన్?' అనే గ్రాంథిక భాషలోని వాక్యాలు వ్యావహారికతను ముద్రించుకొన్నవి. తిక్కన వాక్యాలలో ఇట్టివి కోకొల్లలు. (సంపా.)

**క. అను పలుకులకును విస్మయ । మును సంతోషమును జిత్తమునఁ బెనఁగొన నా**
**జనపతి ధర్మతనూభవుఁ । గనుఁగొని యిట్లనియె మఱియు గౌరవ మెసఁగన్. 227**

**ప్రతిపదార్థం:** అను పలుకులకును= ధర్మరా జనే మాటలకు; విస్మయమును= ఆశ్చర్యాన్నీ; సంతోషమును= ఆనందాన్నీ; చిత్తమునన్+పెనఁగొనన్= మనసులో పెనవేసికొనగా; ఆ జనపతి= ఆ రాజు (విరాటుడు); ధర్మతనూభవున్+కనుఁగొని= ధర్మరాజును చూచి; గౌరవము+ఎసఁగన్= గౌరవం అతిశయించగా; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మజుడి మాటలకు ఆశ్చర్యం. సంతోషం పెనగొనగా విరాటరాజు ధర్మరాజును చూచి గౌరవంతో మరల ఈ విధంగా అన్నాడు.

**క. 'ఉపకారమొ, బంటుతనమొ । కృపయో, పెంపో. సమగ్ర కీర్తి ప్రియమో,**
**రిపుదుస్సహమగు నీ రణ । నిపుణతకుం గారణంబు నెయ్యమొ, యెఱుఁగన్. 228**

**ప్రతిపదార్థం:** రిపు= వైరులకు; దుస్సహము+అగు= భరించరానిదైన; నీ నిపుణతకున్= నీ నేర్పరితనానికి; కారణంబు= కారణం; ఉపకారమొ?= సాయమో?; బంటుతనమొ= వీరత్వమో?; కృపయో?= దయయో?; పెంపో?= గొప్పదనమో?; సమగ్రకీర్తి ప్రియమో?=నిండయిన కీర్తిమీది ప్రీతియో?; నెయ్యెమొ?= స్నేహమో?; ఎఱుఁగన్= ఏదో తెలిసికొనలేకున్నాను.

**తాత్పర్యం:** 'శత్రువులకు అసాధ్యమైన నీ నైపుణ్యాన్ని ఇప్పుడు ప్రదర్శించటానికి కారణం ఏమై ఉంటుందా? అని ఆలోచిస్తున్నాను. నాకు ఉపకారం చేయాలనే ఉదారభావమా? వీరాన్ని ప్రదర్శించుకొందామనే పౌరుషభావమా? దయను చూపిద్దామనే మెత్తని హృదయమా? లేక అది నీ సహజమైన గొప్పతనమేనా? లేదా మనిద్దరి నడుమ ఉన్న స్నేహమా? వీటిల్లో కారణ మేదై ఉంటుందో తెలిసికొనలేకపోతున్నాను.

**విశేషం:** విరాటుడి వితర్కం సహజంగా ఉన్నది. కాని, ధర్మరాజు ఇతమిత్థమని చెప్పలేని అజ్ఞాతవాస నియమం గూఢంగా పఠితల హృదయాలలో స్ఫురించి తృప్తిని కలిగిస్తుంది. కథలో ఉత్కంఠను రేకెత్తిస్తుంది. (సంపా.)

**ఉ. మంటయుఁ బోని శాత్రవసమాజము నించుక యేని శంకలే**
**కంటఁగఁ దాఁకి, వెండి తెగటార్చె మహాద్భుతశక్తిశాలి యీ**
**వంటలవాని చేసిన యవార్య పరాక్రమ మొండుచోటులం**
**గంటిమె? వింటిమే? యితఁడ కాఁడె వెసన్ గెలిపించె న న్ననిన్. 229**

**ప్రతిపదార్థం:** మంటయున్+పోని= మంటవంటి; శాత్రవ సమాజమున్= వైరిసమూహాన్ని; ఇంచుక ఏని శంకలేక= ఒకింతకూడా జంకు లేకుండా; అంటఁగన్‌తాఁకి= ముట్టడివేసి; వెండి= మఱియు; తెగటార్చెన్= చంపివేశాడు; మహా+అద్భుత శక్తిశాలి= మిక్కిలి ఆశ్చర్యం కలిగించే బలశాలి; ఈ వంటలవాని చేసిన= ఈ వంట వాడు చేసిన; అవార్య పరాక్రమము= అడ్డుకొనరాని పరాక్రమం; ఒండుచోటులన్+కంటిమో?= వేఱొకచోట చూచామా?; వింటిమే?= విన్నామా?; ఇతఁడు+అ కాఁడె= ఇతడేకదా; వెసన్= త్వరగా; అనిన్= యుద్ధంలో; గెలిపించెన్= (నన్ను) గెలిపించాడు.

**తాత్పర్యం:** మంటను తలపించే శత్రుసమూహాన్ని ఏమాత్రం జంకులేకుండా వెంటనంటి నాశనం చేశాడు. మహాశ్చర్యాన్ని కలిగించే ఈ వంటవాడి అవార్యమయిన పరాక్రమాన్ని మరెక్కడా చూచి, విని ఎరుగం. యుద్ధంలో ఇతడే కదా నన్ను ఇంత త్వరగా గెలిపించగలిగాడు.

**విశేషం:** అలం: ఉపమ. శత్రువులను మంటలతో పోల్చటం వలలుడి పట్ల సార్థకం. వంటలవాడు మంటలను నియంత్రించగలడు. మూలంలోకంటె భీమప్రశంస తిక్కన రచనలో విశిష్టం. భీమనాయక మీ ఘట్టం అనిపించేటట్లు ఉన్నాయి ఈ మాటలు. (సంపా.)

**క. కంధరములు దెగి తలలు వ। సుంధర నతిపక్వ తాల సుభగఫలాళి**
**బంధురత రాలు దామ। గ్రంథి పగఱమీఁదఁ గినిసి కవిసిన యెడలన్. 230**

**ప్రతిపదార్థం:** దామగ్రంథి= దామగ్రంథి పేర మెలగుతున్న నకులుడు; పగఱమీఁదన్= శత్రువులమీద; కినిసి= కోపించి; కవిసిన+ఎడలన్= యుద్ధానికి పూనుకొన్నప్పుడు; కంధరములు= శత్రువుల కంఠాలు; తెగి= (అతడి ఆయుధం వలన) తెగి; తలలు= వారి తలలు; అతిపక్వ= బాగాపండిన; తాలసుభగఫల+ఆళీ= అందమైన తాటిపండ్ల సమూహాల; బంధురతన్= సాంద్రతతో; వసుంధరన్= నేలపై; రాలున్= రాలుతాయి.

**తాత్పర్యం:** దామగ్రంథి కోపించి శత్రువులమీద దాడిచేస్తే, వారి కంఠాలు తెగి తలలు అందంగా పండిన తాటిపండ్ల వరుసల వలె విరివిగా నేలమీద రాలుతాయి.

**విశేషం:** అలం: ఉపమ. తలలను తాటికాయలతో పోల్చటం కవిసమయం. జాతీయం. (సంపా.)

**క. ఎక్కడఁ జూచినఁ దానై । యక్కజమగు కడిమికలిమి నరిసేనఁ గరం**
**బుక్కఱఁ దంత్రీపాలుం । డొక్కఁడ పొలియించె నీ రణోత్సాహమునన్. 231**

**ప్రతిపదార్థం:** తంత్రీపాలుండు= తంత్రీపాలుడనే పేరనున్న సహదేవుడు; ఈ రణ+ఉత్సాహమునన్= ఈ యుద్ధ ప్రయత్నంలో; ఎక్కడన్+చూచినన్= ఎటుచూచినప్పటికిని; తాను+ఐ= తానుగా; అక్కజము+అగు కడిమి కలిమిన్= ఆశ్చర్యకమైన పరాక్రమమనే ఐశ్వర్యంతో (శక్తి సంపదతో); అరిసేనన్= వైరిసేనను; కరంబు+ఉక్కు+అఱన్= మిక్కిలి పొగరు అణగేటట్లు; ఒక్కఁడు+అ= ఒకడే; పొలియించెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** యుద్ధోత్సాహంతో తంత్రీపాలు డొక్కడే ఎటుచూచినా తానుగా కనబడి ఆశ్చర్యం కల్గించేటట్లు శత్రుసేనలను ఈ యుద్ధంలో సంహరించాడు.

**క. ఈ నలువురు తక్కఁగ మన । సేనల నొక్కరునినైనఁ జేడ్పడని భటుం**
**గానం జెలి కెడరైనం । బూని తగులు నతఁడచూవె పురుషుం డెందున్. 232**

**ప్రతిపదార్థం:** ఈ నలువురు తక్కఁగన్= ఈ నల్గురు తప్ప; మన సేనలన్= మన సేనలలో; ఒక్కరున్+ఐనన్= ఒక్కడనైనను; చేడ్పడని= దెబ్బలు తినని (గాయాలులేని); భటున్+కానము= సైనికుడిని చూడము; చెలికిన్= మిత్రుడికి; ఎడరు+ఐనన్= ఆపదకలిగితే; పూని= పూనుకొని; తగులు+అతండు+అ= ఆదుకొనేవాడే; ఎందున్= ఎక్కడైనా; పురుషుండు= మగవాడు, మానవుడు; చూవె= సుమా!

**తాత్పర్యం:** ఈ నలుగురు తప్ప మన సేనలలో ఒక్కరైనా గాయం తగలని భటుడిని మనం చూడం. మిత్రుడికి ఆపద కలిగినప్పుడు తనంతట తాను పూనుకొని అతడిని ఆదుకొనేవాడే నిజమైన మానవుడు సుమా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. విరాటుడికి అడగకుండానే తమంతట తామే కష్టంలో ఆదుకొన్న ధర్మజ. భీమ, నకుల, సహదేవులే ఇక్కడ ఉత్తమ పురుషులు. (సంపా.)

**ఉ. కావున మీకు దంతి హయ కాంచన రత్న విభూషణంబులున్,**
**దేవనితంబినీజన సదృక్ష మృగాక్షులు నాదిగాఁగ నా**
**నావిధ వైభవంబులు మనంబుల వాంఛలకుం దగంగ నీ**
**కే విధి నీఁగువాఁడ ఋణ? మెయ్యది యేనియు వేఁడుఁ డిచ్చెదన్.' 233**

**ప్రతిపదార్థం:** కావునన్= అందువలన; మీకున్= మీకు; దంతి, హయ, కాంచన రత్న, విభూషణంబులున్= ఏనుగులు, గుర్రాలు, బంగారం, నవరత్నాలు, నగలు; దేవ నితంబినీజన= దేవతా స్త్రీలకు, అప్సరఃకాంతలకు; సదృక్ష= తుల్యాలయిన; మృగ+అక్షులున్= లేడి కన్నుల వంటి కన్నులుగల స్త్రీలు; ఆది కాఁగన్= మొదలుగా; నానావిధవైభవంబులు= వివిధ సౌఖ్యాలూ; మనంబుల వాంఛలకున్ తగంగన్= మనస్సులలోని కోరికలకు అనుగుణంగా; ఈక= ఇవ్వకుండా; ఋణము= అప్పు; ఏ విధిన్+ఈఁగు వాఁడన్= ఏ ప్రకారం తీర్చుకోగలను; ఏ+అది+ఏనియున్, వేఁడుఁడు+ఇచ్చెదన్= ఏదైనా కోరుకొనండి ఇస్తాను.

**తాత్పర్యం:** అందువలన మీకు ఏనుగులు, గుర్రాలు, నవరత్నాలు, ఆభరణాలు, దేవతాస్త్రీలను పోలిన అందగత్తెలు మొదలైన వివిధ భోగాలను మీ మనసుల్లోని కోరికల కనుగుణంగా ఇవ్వకుండా ఏ ప్రకారంగా మీ ఋణం తీర్చుకొనగలను? మీ రేదైనా కోరుకొనండి ఇస్తాను'.

**క. అనవుడుఁ బాండుతనూభవు । 'లనఘా! యి ట్లెంతయుం బ్రియంబున సంభా**
**వన సేసితి; మా కిది యా । ధనము వడయుదానికంటెఁ దక్కువె? చెపుమా! 234**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; పాండు తనూభవులు= పాండురాజు కుమారులు (ధర్మజ, భీమ, నకుల సహదేవులు); అనఘా!= ఓ పుణ్యమూర్తీ!; ఇట్లు+ఎంతయున్+ప్రియంబునన్= ఈ విధంగా ఎంతో ప్రియంగా; సంభావన చేసితి(వి)= గౌరవించావు; మాకున్= మాకు; ఇది= ఈ గౌరవం; ఆ ధనము= ఆ ఐశ్వర్యం; పడయుదానికంటెన్= పొందేదానికన్నను; తక్కువె చెపుమా= తక్కువా? చెప్పుము.

**తాత్పర్యం:** విరాటుడు అట్లా అనగానే పాండవులు ఇట్లా బదులు పలికారు. 'ఓ పుణ్యాత్ముడా! మమ్ములను ఈ రీతిగా ఎంతో ప్రీతిగా పలికి గౌరవించావు. నీవు మా కివ్వదలచుకొన్న ఆ ధనంకంటె ఇది తక్కువా? చెప్పుము.

**విశేషం:** ఉపకారం ప్రతిఫలాన్ని కోరదు. పాండవులు మాటలే మూటల కంటె విలువైనవని ఉత్తమ సంస్కారాన్ని ప్రదర్శించారు. (సంపా.)

ధర్మరాజు సుశర్మను సపరివారంబుగా విడిపించుట (సం.4-32-46)

**క. మ మ్మెరవుగాఁ దలంచి యియ్యెడ నిట్టట్టన వలవదు; పురంబున కరిగి యయ్యెడ నీ కెట్లు ప్రియం బట్లు**
**మన్నింపు' మని; రందుఁ గంకుండు మఱియు నిట్లనియె. 235**

**ప్రతిపదార్థం:** మమ్ముమ్న్+ఎరవుగాన్+తలంచి= మమ్మ వేరుగా భావించి; ఈ+ఎడన్= ఇక్కడ; ఇట్టు+అట్టు+అనవలవదు= ఇట్లనీ అట్లనీ అనవద్దు; పురంబునకున్+అరిగి= నగరానికి వెళ్ళి; ఆ+ఎడన్= అక్కడ; నీకున్+ఎట్లు ప్రియంబు= నీ కే విధంగా ప్రీతియో; అట్లు= ఆ ప్రకారంగా; మన్నింపుము= గౌరవించుము; అనిరి= అన్నారు; అందున్= వారిలో; కంకుండు= కంకుభట్టు (ధర్మజుడు); మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** మమ్ములను పరాయివారిగా పరిగణించి ఇక్కడ ఇది ఇట్లా, అది అట్లా అనీ ఔననీ కాదనీ పలకవద్దు. నగరానికి చేరిన తరువాత అక్కడ నీ కెట్లా ఇష్టమైతే అట్లా గౌరవించుము' అన్నారు. వారిలో కంకుడు ఇంకా ఈ విధంగా అన్నాడు.

**క. 'తగ నొక్కటి వేఁడెద నిను । జగతీశ్వర! యిచ్చు టొప్పు; సరథగజాశ్వం**
**బుగ విడిచిపుచ్చు మిప్పుడ । త్రిగర్తపతి; నిదియ నాకుఁ బ్రియ మెబ్బంగిన్. 236**

**ప్రతిపదార్థం:** జగతీ+ఈశ్వర!= మహారాజా!; తగన్= సముచితంగా; నినున్= నిన్ను; ఒక్కటి వేఁడెదన్= ఒకటి కోరుతాను; సరథ గజ+అశ్వంబుగన్= రథాలతోను, ఏనుగులతోను, గుర్రాలతోను; ఇప్పుడు+అ= ఇపుడే; త్రిగర్త పతిన్= సుశర్మను; విడిచిపుచ్చుము= వదిలివేయుము; ఇది+అ= ఈ పనియే;నాకున్, (ధర్మరాజుకు); ఏ+భంగిన్= ఏవిధంగా చూచినా; ప్రియము= ప్రీతిని (ఇష్టమును); ఇచ్చుట+ఒప్పున్= ఇచ్చినట్లౌతుంది.

**తాత్పర్యం:** 'ఓ విరాటరాజా! నేను ఒకటి సముచితంగా కోరుతున్నాను, వినుము. దానిని నెరవేర్చటం మంచిది. సుశర్మను చతురంగబలాలతో సహా ఇప్పుడే విడుదల చేయుము. ఇదే నాకు అన్ని విధాలా ప్రీతిని కలిగిస్తుంది.

**విశేషం:** ధర్మరాజు శాసించగల స్థానంలో ఉన్నా అర్థిస్తున్నాడు. అజ్ఞాతవాసవ్రత ప్రభావం. అతడు వేషంలో అజ్ఞాతంగా ఉన్నా గుణంలో అజ్ఞాతంగా లేడు. (సంపా.)

**వ.** **మన నగరంబునకు జంఘాలురం బంపుము; పురంబున వారలువోయి భవద్విజయ ఘోషం బాచరించి, శోభనధ్వజోన్నయనంబును, మంగళతూర్యనాదంబులును, బరస్పర గంధ సలిల సేచనంబులును, గీతవాద్య నృత్తంబులును నాదిగాఁగల వివిధ శుభాచారంబులం బ్రవర్తింప నియోగింప వలయు' ననిన, విరాటుండును బనిచినం గాలరులు వేగునంతకు వీటికిం జని గెలుపు ప్రకటించి, పట్టణాలంకరణ ప్రముఖ నిఖిలభద్ర విధానంబులు చేయించి; రిట పాండవులును మత్స్య మహీవల్లభుండును సమస్త సేనాసమేతులై విభవం బెసఁగ విలసిల్లుచు, లజ్జావనతాననుం డగు సుశర్మ సపరిచ్ఛదంబుగా విడిచి పుచ్చి, గుత్తులకొలందికిఁ గృత్తంబులయి పడియున్న పాదంబుల వలనం గెందలిరుల సెజ్జల చందంబులగు చోట్లును, దునిసి చిక్కువడియున్న యూరు కాండంబుల వలన మదగజంబులు సొచ్చిన కదలీ వనంబులుం బోని యెడలును, బ్రోవులు గొనియున్న ప్రేవుల వలన లావుగల యంచపిండు పేరాఁకలి నఱిముఱిం బెఱికినఁ గుఱుకులు గట్టిన మృణాళ నాళంబుల నొప్పు కమలాకరోద్దేశంబులఁ గ్రేణిసేయు ప్రదేశంబులును, నంగుళీయకరుచు లడర నెఱిం జాఁగి పడియున్న బాహుదండంబుల వలన నురగ నివాసంబుల ననుకరించు తలంబులును, గీలాలజాలంబులపయిందేలుచు నవ్వినట్లున్న శిరంబులవలన వికచారవింద దీర్ఘికల విడంబించు తావులును, నవయవ భేదంబు లడంగునట్లుగాఁ దుత్తునియలై పడియున్న గాత్రంబుల వలనం గృతాంత మహానసశాలలపగిది నొప్పునట్లును గల పాలికలను గలయం గనుంగొనుచు వెడలి, చంద్రికాసుందరం బగు నొక్క సైకతస్థలంబున నారాత్రి పుచ్చిరని చెప్పిన విని, 'మఱునాఁటి వృత్తాంతం బె ట్లయ్యెనో!' యని సాదరంబుగా నవలోకించిన.** **237**

**ప్రతిపదార్థం:** మన నగరంబునకున్= మన ముఖ్యపట్టణానికి; జంఘాలురన్+పంపుము= వేగంగా నడచేవారిని పంపుము; వారలు+పోయి= వారువెళ్లి; పురంబునన్= నగరంలో; భవత్+విజయఘోషంబున్= నీ విజయవార్తను చాటింపుచేసే పనిని; ఆచరించి= చేసి; శోభనధ్వజ+ఉన్నయనంబును= విజయధ్వజాలను నిలువబెట్టటం; మంగళతూర్యనాదంబులును= మంగళవాద్యాలను మ్రోయించటం; పరస్పర= ఒకరినొకరు; గంధసలిల సేచనంబులును= శ్రీగంధం కలిపిన నీటిని చల్లుకొనటం; గీతవాద్యనృత్తంబులును= పాటలు పాడుతూ, వాద్యాలను వాయిస్తూ, నాట్యములు చేయటం; ఆదిగాన్+కల= మొదలయిన; వివిధ శుభ+ఆచారంబులన్= ప్రవర్తింపన్+నియోగింపవలయున్= అనేక శుభకార్యాలను చేసేటట్లు ఉత్తరువు చేయాలి; అనన్= అనగా; విరాటుండును= విరాటుడుకూడా, పనిచినన్= అట్లాగే ఆజ్ఞలు జారీ చేయగా; కాలరులు= పదాతిదళాలు; వేగునంతకున్= తెల్లవారేసరికి; వీటికిన్+చని= నగరానికి వెళ్ళి; గెలుపు ప్రకటించి= జయవార్తను చాటి; పట్టణ+అలంకరణ ప్రముఖ= నగరాన్ని సింగారించటం మొదలైన; నిఖిలభద్ర విధానంబులు= మంగళ కార్యాలన్నింటినీ; చేయించిరి= చేయించారు; ఇట= ఇక ఇక్కడ; పాండవులును= పాండవులూ; మత్స్య మహీవల్లభుండును= మత్స్యదేశపురాజయిన విరాటుడూ; సమస్త సేనా సమేతులై= సేనలన్నిటితో కూడి; విభవంబు+ఎసఁగన్= సంపద అతిశయించగా; విలసిల్లుచున్= ప్రకాశిస్తూ; లజ్జ= సిగ్గుతో; అవనత+అననుండు+అగు= తలవంచిన వాడయిన; సుశర్మ= సుశర్మను; సపరిచ్ఛదంబుకాన్= సేవకులతో సహా; విడిచిపుచ్చి= వదలిపెట్టి; గుత్తులకొలందికిన్= చీలమండలం వరకు; కృత్తంబులు+ అయి= నరకబడి; పడి ఉన్న= నేలపై పడివున్న; పాదంబులవలనన్= పాదాల వలన; కెంపు+తలిరుల= ఎర్ర చిగుళ్ల; సెజ్జల చందంబులు+ అగుచోట్లును= శయ్యలతీరు వలె ఉన్న స్థలాలున్నూ; తునిసి= తునిగిపోయిన; చిక్కు+పడి+ఉన్న= చిందరవందరగా చిక్కుపడి ఉన్నట్టి; ఊరుకాండంబులవలనన్=

తొడల సమూహాల వలన; మదగజంబులు+చొచ్చిన= మదపు టేనుగులు ప్రవేశించిన; కదలీవనంబులున్+పోని+ఎడలును= అరటితోటలను పోలిన చోటులున్నూ; ప్రోవులు+కొని+ఉన్న= కుప్పలు కుప్పలుగా పడి ఉన్న; ప్రేవుల వలనన్= పేగులతో; లావుకల అంచపిండు= బలిసిన హంసల సమూహం; పేరు+ఆఁకలిన్= మిక్కిలి ఆకలితో; అఱిముఱిన్+పెరికినన్= తొట్రుపాటుతో లాగగా; కుఱుకులు+కట్టిన= కుప్పలు కుప్పలుగా పడిన; మృణాళనాళంబులన్= తామరతూడులతో; ఒప్పు=ఒప్పారే; కమలాకర+ఉద్దేశంబులన్= తామరకొలనులున్న చోటులను; క్రేణిచేయు= పరిహసించే; ప్రదేశంబులును= చోటులున్నూ; అంగుళీయక రుచులు+అడరన్= చేతి ఉంగరాల కాంతులు అతిశయించగా; నెఱిన్+చాఁగిపడిఉన్న= వరుసగా సాగిలపడి ఉన్నట్టి; బాహుదండంబుల వలనన్= కర్రలవంటి చేతుల వలన; ఉరగనివాసంబులన్= పాముల ఉనికిపట్టుఐన పాతాళలోకాన్ని; అనుకరించు= అనుసరించే; తలంబులును= చోటులును; కీలాల జలంబుల పయిన్+తేలుచున్= నెత్తురనెడి నీళ్లపైన తేలియాడుతూ; నవ్వినట్లు+ఉన్న= నవ్వినట్లుతోస్తున్న శిరంబులవలనన్= తలలవలన; వికచ+అరవింద= విరిసిన తామరలున్న; దీర్ఘికలన్ విడంబించు= దిగుడుబావులను అనుకరించే; తావులును= చోటులున్నూ; అవయవభేదంబులు+అడంగునట్లుగాన్= ఈశరీరావయవాలు ఇవి అని తేడా తెలిసికొనలేనంతగా; తునియలు+తునియలు+ఐ పడి+ఉన్న= ముక్కలు ముక్కలుగా పడివున్న; గాత్రంబులవలనన్= శరీరాలవలన; కృతాంతమహానసశాలలపగిదిన్= యముడి వంటసాలల వలె; ఒప్పు+అట్లును= అందగిస్తూ; కల= ఉన్నట్టి; పొలికలను= యుద్ధభూమిని; కలయన్+కనుంగొనుచున్=అంతటా తిరిగి చూస్తూ; వెడలి= వెళ్ళి; చంద్రికా సుందరంబున్+అగు= వెన్నెల కాయటం వలన అందమయిన; ఒక్క సైకతస్థలంబునన్= ఒకానొక ఇసుకతిన్నెమీద; ఆ రాత్రి పుచ్చిరి= ఆ రాత్రి+గడిపారు; అని చెప్పినన్= అని చెప్పగా; విని= విన్నవాడై; మఱునాఁటి వృత్తాంతంబు+ఎట్లు+అయ్యెనో= మఱునాటికథ ఏమైనదో; అని= అంటూ; సాదరంబుగాన్ అవలోకించినన్= ఆసక్తిగా చూడగా.

**తాత్పర్యం:** మన నగరానికి వేగంగా పోగలవారిని పంపుము. వారు నగరానికి చేరి నీ విజయవార్తను చాటింపు చేయించాలి. విజయధ్వజాలను ఎత్తించాలి. మంగళవాద్యాలను మ్రోయింపచేయాలి. సుగంధజలాలను ప్రజలు ఒకరిపై మరొకరు చల్లుకొనేటట్లు వేడుకలు జరిపించాలి' అని కంకుడు కోరాడు. విరాటుడు దాని కంగీకరించి దూతలను నగరానికి పంపాడు. వారు తెల్లవారేసరికి విజయవార్తను చాటించారు. పట్టణాన్ని అలంకరించటం మొదలుగా గల అనేక శుభాలంకారాలు చేయించారు.

ఇక ఇక్కడ పాండవులూ, విరాటుడూ కలిసి సేనలన్నిటితో కూడి, వైభవంగా విలసిల్లుతున్నారు. లజ్జతో తలవంచుకొని ఉన్న సుశర్మను సపరివారంగా విడుదల చేశారు. యుద్ధభూమిని నలువైపులా తిరిగి చూచారు. అనేక ప్రాంతాలు వారికి బీభత్స రమణీయంగా కనిపించాయి.

గిలకల వరకు తెగిపడి ఉన్న సైనికుల పాదాల వలన కొన్ని చోట్లు చిగురాకు పాన్పుల వలె కనిపించాయి. తెగి చిందరవందరగా పడి ఉన్న సైనికుల తొడల గుంపుల వలన, మదించిన ఏనుగులు ప్రవేశించి పాడు చేసిన అరటి తోటలవలె కొన్ని చోట్లు గోచరించాయి. కుప్పలు కుప్పలుగా పడి ఉన్న సైనికుల ప్రేగులను చూస్తే పెద్ద పెద్ద హంసల గుంపులు పేరాకలితో గబగబా తామరతూండ్లను పెరికి కొరికి కుప్పలు పోసిన సరోవరప్రదేశాలవలె కొన్ని చోట్లు కనుపట్టాయి. వ్రేలి ఉంగరాల రత్నకాంతులు వెదచిమ్ముతుండగా పొడుగ్గా పడి ఉన్న బాహుదండాల వలన సర్పాలు నివసించే పాతాళలోకం వలె కొన్ని ప్రాంతాలు చూపట్టాయి. నెత్తురనే నీటిమీద తేలుతూ నవ్వుతున్నట్లున్న సైనికుల తలలవలన వికసించిన తామరలున్న దిగుడుబావులవలె కొన్ని ప్రాంతాలు కనిపించాయి. ఇవి ఈ అవయవాలు అని గుర్తించ లేనంతగా తునాతునకలై ఉన్న సైనికుల శరీరాలు పడి ఉన్న దృశ్యం యముడి వంట శాల వలె ఒప్పారుతూ కంటబడింది. అటువంటి దృశ్యాల నన్నింటినీ చూస్తూ కొంత దూరం పోయి, వెన్నెల కాయటం వలన మనోహరంగా ఉన్న ఇసుక తిన్నెల ప్రాంతంలో వారందరూ ఆ రాత్రి గడిపారు.

ఈ కథను వైశంపాయనుడు జనమేజయుడితో చెప్పగా, జనమేజయుడు ఆసక్తికరంగా ఆ కథకుడివైపు చూస్తూ 'ఆ మరునాటి కథ ఎట్లా సాగిందో? చెప్పు' మని అడిగాడు.

**విశేషం:** అలం: ఉపమ, వృత్త్యనుప్రాసం. భయానక బీభత్స రసదృశ్యాలను శబ్దార్థాలంకారాలతో రమణీయభావనామయం చేసి రమ్యతరం చేయటం తిక్కన కావ్యకళాశిల్పం. (సంపా.)

## ఆశ్వాసాంతము

**చ.** **అపరిమిత ప్రకార! వినిరస్త సమస్త వికార! షట్ప్రమా**
**ణపరమదూర! గాఢ భజనక్రమ గత్యనుభావ్య పార! దే**
**వ పితృపథప్రవర్తన వివర్జన నిర్మలచిత్త చోర! శాం**
**తిపరమహాత్మ! సంసరణ తీర! నిరంజన భక్తరంజనా!** **238**

**ప్రతిపదార్థం:** అపరిమితప్రకార!= (ఆయన జగత్స్వరూపుడు కాబట్టి) పరిమితి (హద్దు) లేని భేదాలున్నవాడా!; వినిరస్త, సమస్త, వికార!= నిరసించిన అన్ని వికారాలున్నవాడా!; షట్+ప్రమాణపరమదూర!= ఆరు రకాలైన ప్రమాణాలకు అందనివాడా!; గాఢ భజన క్రమ గత్యనుభావ్యపార!= దృఢమైన భక్తి భజన విధానం వలన కలిగిన జ్ఞానం వలన పొందగల్గిన గమ్యం కలవాడా!; దేవపితృపథప్రవర్తన!= దేవతలకు, పితరులకు దారి చూపేవాడా! (హరి దేవతలకు, హరుడు పితరులకు దారిచూపేవారు); వివర్జన నిర్మలచిత్తచోర!= త్యాగం వలన స్వచ్ఛమైన వారి మనసులను హరించేవాడా!; శాంతిపరమహాత్మ!= శాంతితో కూడిన గొప్పదైన ఆత్మ(హృదయం) కలవాడా!; సంసరణతీర!= సంసార (సాగరానికి) ఆవలి ఒడ్డువంటివాడా!; నిరంజన భక్తరంజనా!= సుఖదుఃఖాలకు అతీతులైన భక్తులకు సంతోషం కలిగించేవాడా! (లేదా - నిరంజన! = సంగరహితుడా!; భక్తరంజనా!= భక్తులకు ఆనందం కలిగించేవాడా!).

**తాత్పర్యం:** అనేక రూపభేదాలు కలవాడా!; సర్వవికార విరహితుడా! షట్ప్రమాణాలకు అతీతుడవైనవాడా! దృఢమైన భక్తితో క్రమంగా తెలియదగిన అనుభవానికి గమ్యమైనవాడా! దేవమార్గాలనూ, పితృమార్గాలనూ ప్రవర్తింపజేసేవాడా! త్యాగశీలం వలన పవిత్రమైన చిత్తాలను దోచుకొనేవాడా! శాంతిరూపమైన గొప్ప ఆత్మ కలవాడా! సంసార సాగర తీరం వంటివాడా! విరక్తులైన భక్తులకు ఆనందాన్ని అందించేవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం. 1. ఈ ఆశ్వాసాంత సంబుద్ధులన్నీ హరిహరనాథుడికి అన్వయించుకొనే బహువ్రీహి సమాసాలే. 2. శాంతి పర మహాత్మ సంసరణ తీర! అని సంబోధించవచ్చును కూడా. అంటే - శాంతిపరమైన మహాత్ములకు సంసార సముద్రతీరంవంటి వాడా! అని భావం. 3. షట్ ప్రమాణాలు: 1. ప్రత్యక్షం 2. అనుమానం 3. ఉపమానం 4. శబ్దం 5. అర్థాపత్తి 6. అనుపలబ్ధి.

**క.** **విజ్ఞానానంద రసా। భిజ్ఞ హృదయ కమల హంస! భీమ దురిత మ**
**ర్మజ్ఞ! వివిధాభిధానా! యజ్ఞాత్మకరూప! నిశ్చ లావ్యయ దీపా!** **239**

**ప్రతిపదార్థం:** విజ్ఞాన+ఆనందరస= పరమేశ్వరుడి విజ్ఞానరూపమైన ఆనందరసమును; అభిజ్ఞ= తెలిసిన పండితుల యొక్క; హృదయ= హృదయాలనే; కమల= పద్మాలకు; హంస!= రాజహంసవంటివాడా!; (హంసస్సోహం సోహంహంసః అని పరాత్పరుడిని అద్వైతులు అహం+స; అనీ, సః+అహం అనీ వర్ణిస్తారు); భీమ దురిత= భయంకరమైన పాపాల యొక్క; మర్మజ్ఞ= రహస్యం తెలిసినవాడా! (అనగా భయంకరమైన పాపాలను పోగొట్టే రహస్యం తెలిసినవాడని భావం); వివిధ+అభిధానా!= పెక్కు పేర్లు కలవాడా!; యజ్ఞాత్మకరూప!= యజ్ఞమే స్వరూపంగా కలవాడా!; నిశ్చల+అవ్యయదీపా!= కదలిక లేని తరుగని వెలుగైన ఆకారం కలవాడా!

**తాత్పర్యం:** పరమేశ్వరుడి విజ్ఞాన రూపమగు ఆత్మానందరసమును తెలిసిన పండితుల మనఃపద్మాకరంలో విహరించే హంసవంటివాడా! భయంకరమైన పాపాలను తొలగించే రహస్యం తెలిసినవాడా! పెక్కు పేర్లతో పిలువబడేవాడా! యజ్ఞస్వరూపా! చలనం, నాశనం లేని ప్రకాశస్వరూపం కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: రూపకం, ఉపమ, అంత్యానుప్రాసం.

**మాలిని.**

**త్రిజగదవననిత్యక్రీడనోద్యత్ప్రమోదా!**
**రజనిచర విఘాతారంభ లీలా వినోదా!**
**భజన నిరత సౌఖ్యప్రాప్తి జాగ్రత్ప్రసాదా!**
**నిజతను విభవత్వోన్మీల నాచ్ఛిన్న నాదా!** **240**

**ప్రతిపదార్థం:** త్రిజగత్+అవన= ముల్లోకాలను కాపాడటమనే; నిత్యక్రీడన+ఉద్యత్+ప్రమోదా!= నిరంతరకేళి వలన కలుగుతున్న ఆనందం కలవాడా!; రజనిచర= రాక్షసులను; విఘాత= చంపటాన్ని; ఆరంభలీలా వినోదా!= ప్రారంభించటం అనే ఆట వలన కలిగే సంతోషం కలవాడా!; భజన= ప్రార్థనచేయటం వలన కలిగే; నిరత= ఎడతెగని (శాశ్వతమైన); సౌఖ్యప్రాప్తి= సుఖమును భక్తులకు పొందించటంలో; జాగ్రత్+ప్రసాదా!= ఎల్లప్పుడు మేల్కొని సిద్ధంగా ఉంటూ అనుగ్రహాన్ని అందించే వాడా!; నిజతను తన శరీరం యొక్క; విభవత్వ= మహిమను; ఉన్మీలన= వికసింపచేసే; అచ్ఛిన్న= భిన్నంకాని, అఖండమైన; నాదా!= శబ్దం కలవాడా? (ఓంకారరూపా!).

**తాత్పర్యం:** మూడు లోకాలను రక్షించే నిత్యక్రీడవలన ఉదయిస్తున్న ఆనందం కలవాడా! రాక్షససంహారాన్ని ఆరంభించే లీలలతో సంతోషించేవాడా! సేవించి కీర్తించేవారికి సదా సౌఖ్యాన్ని కలిగించే ఫలాన్ని అందించటంలో ఏమరుపాటులేని అనుగ్రహబుద్ధి కలవాడా! హరిహరాత్మకమైన నిజ రూప వైభవాన్ని వికసింపజేసే అఖండనాదరూపమైన ఓంకారం కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: అంత్యానుప్రాస. మాలినీ వృత్తంలోని ప్రతిపాదంలోనూ న,న,మ,య,య అనే గణాలు వరుసగా ఉంటాయి. తొమ్మిదవ అక్షరం యతిమైత్రి. ప్రాసనియమం ఉన్నది. (సంపా.)

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున విరాట పర్వంబునందుఁ దృతీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది శ్రీమంతులైన ఉభయ కవులకు మిత్రుడు, కొమ్మనామాత్యుడి పుత్రుడు, పండితులను ఆరాధించి ప్రకాశించేవాడు (పండితులు చేసే ఆరాధనం వలన వెలుగొందేవాడు) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలోని విరాటపర్వంలో మూడవ ఆశ్వాసం.

విరాటపర్వంలో తృతీయాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వం - చతుర్థాశ్వాసము

**శ్రీమద రేఖ విషాద వి । రామాహిత గాఢ శమధురా నిర్భర ని**
**ష్ఠా మర్దిత వివిధ వికా । రామల చేతో నివాస! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీ= సంపదవలన కలిగిన; మదరేఖ= మదగర్వంయొక్క; విషాద= దుఃఖంయొక్క; విరామ= విశ్రాంతిచేత (లేకపోటంవలన); ఆహిత= కలిగిన; గాఢ= దట్టమైన (అధికమైన); శమ= శాంతియొక్క; ధురా= భారంతో; నిర్భర= నిండిన; నిష్ఠా= స్థితిచేత; మర్దిత= మర్దించబడిన, (పోగొట్టబడిన); వివిధ= పెక్కురకాలైన; వికార= వికారాలు కలిగి ఉండటం చేత; అమల= మలినంలేని (నిర్మలం అయిన); చేతస్= మనస్సులో; నివాస!= నివసిస్తూ ఉండేవాడా!; హరిహరనాథా!= హరి+హరుడు అనేపేరుగల ఓ స్వామీ!

**తాత్పర్యం:** సంపదవలన సహజంగా కలిగే గర్వంగానీ, ఆపదలవలన వచ్చే దుఃఖంగానీ లేకుండా, పరమశాంతభావంతో కూడిన స్థితిచేత ఎన్నో రకాల వికారాలను నశింపజేసికొన్నవాడి మనస్సులో నివసించే ఓ హరిహరనాథా!

**విశేషం:** ఈ పద్యం శ్రీకారంతో ఆరంభించబడింది. అది తెలుగుకవుల అలవాటు (సంప్రదాయం). ప్రతి ఆశ్వాసం మొదటి పద్యం శ్రీకారంతో మొదలవుతుంది. అది మంగళకరం అని మనవారి భావం. ఈ పద్యంలో తిక్కన మహాకవి కొన్ని పదాలను ప్రయోగించి, ప్రస్తుత కథకు అన్వయాన్ని సూచించాడు. ఇది మహాకవుల మార్గం. దీనినే 'వస్తునిర్దేశం' అంటారు. 'శ్రీమదరేఖ' అనే ప్రయోగం దుర్యోధనుడి ఐశ్వర్యగర్వాన్నీ, 'విషాదవిరామ' అనే ప్రయోగం ఆపదలలో కూడా దుఃఖాన్ని పొందని అర్జునుడి ధీరస్వభావాన్నీ, 'శమధురా' ప్రయోగం ఆతడి శాంతస్వభావాన్నీ, 'నిష్ఠామర్దిత' ప్రయోగం అర్జునుడి నిష్ఠనూ, ఆతడు కురుసేనలను మర్దించేవిధానాన్నీ సూచిస్తాయి.

### ఉత్తర గోగ్రహణము (సం. 4-33-1)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.** 2

**తాత్పర్యం:** హరిహరనాథ దేవా! వైశంపాయన మహర్షి జనమేజయ మహారాజుతో ఇట్లా అన్నాడు.

**క. సూర్యోదయావసరమున । దుర్యోధనుబలము ప్రబల దోర్బల లీలా**
**ధుర్యగతి నడచె భీష్మా । చార్య రవి సుతాది యోధ సంఘోద్భటమై.** 3

**ప్రతిపదార్థం:** సూర్య= సూర్యుడియొక్క; ఉదయ= పొడుపుయొక్క; అవసరమునన్= సమయంలో (ప్రొద్దుపొడుపుతోనే); దుర్యోధను= రారాజైన దుర్యోధనుడి యొక్క; బలము= సైన్యం; భీష్మ= భీష్ముడు; ఆచార్య= ద్రోణుడు; రవిసుత= కర్ణుడు; ఆది= మొదలైన; యోధ= వీరులయొక్క; సంఘ= సమూహంతో; ఉద్భటము+ఐ= అతిశయించినదై; ప్రబల= అధికమైన; దోస్+బల= భుజబలంయొక్క; లీలా= విలాసంయొక్క; ధుర్య= భారం వహించిన; గతిన్= విధంగా; నడచెన్= నడిచింది.

**తాత్పర్యం:** ప్రొద్దుపొడుపుతోనే దుర్యోధనుడి సేన భీష్ముడూ, ద్రోణుడూ, కర్ణుడూ మొదలైన మహావీరులతో కలిసి, పరాక్రమంతో విరాటరాజు నగరం వైపుగా సాగింది.

**విశేషం:** భీష్ముడు కురుపితామహుడు. ద్రోణుడు కురుపాండవులకు గురువు. 'కర్ణుడు అర్జునుడికి దీటు' అని దుర్యోధనుడి నమ్మకం. పైగా 'కర్ణుడు లేని భారతమా' అని ప్రసిద్ధి. అందుకే భీష్మ, ద్రోణ, కర్ణులను ప్రధానంగా చెప్పి, మిగిలిన వీరులను 'ఆది' పదంతో తిక్కన సూచించాడు.

**వ. ఇట్లు నడచి మత్స్యనగరంబున కనతి దూరంబున విరాటు పశుగణంబులం బొదివె; నట్టియెడ మ్రుక్కడి మూఁకలు సని యెక్కడెక్కడ యని తలపడినం గృపాశ్వత్థామ శకుని దుశ్శాసన కర్ణ వికర్ణ దుర్ముఖ ప్రముఖ రథిక జనంబులు గోపాల వర్గంబు ననర్గళ ప్రసారంబగు శరాసారంబునం గప్పినం గని కౌరవబలం బగుట యెఱింగి, బెగ్గలించి గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగుదెంచి రాజ మందిర ద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి యంతఃపురంబున నున్న భూమింజయుం గాంచి ససంభ్రమంబుగా నిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నడచి= పోయి; మత్స్యనగరంబునకున్= మత్స్యరాజధానికి; అనతి దూరంబునన్= సమీపంలో; విరాటు పశుగణంబులన్= విరాటరాజుయొక్క ఆవులమందను; పొదివెన్= పట్టుకొన్నది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; మ్రుక్కడిమూఁకలు= చిన్నవయిన సేనలు; చని= వెళ్ళి; ఎక్కడ+ఎక్కడ+అని; తలపడినన్= ఎదిరించగా; కృప= కృపాచార్యుడు; అశ్వత్థామ; శకుని; దుశ్శాసన; కర్ణ; వికర్ణ; దుర్ముఖ; ప్రముఖ= మొదలైన; రథికజనంబులు= రథాలపై నిలిచి యుద్ధంచేసే (వీరుల) సమూహాలు; గోపాల= ఆవులనుకాసేవారియొక్క; వర్గంబున్= గుంపును; అనర్గళ= ఎదురులేని; ప్రసారంబు+అగు= వ్యాపించటం కలదైన; శర= బాణాలు అనే; ఆసారంబునన్= వర్షంతో; కప్పినన్= కప్పగా; కని= చూచి; కౌరవబలంబు+అగుట= కౌరవుల సైన్యమని; ఎఱింగి= తెలిసికొని; బెగ్గలించి= భయపడి; గవాధ్యక్షుండు= (గో+అధ్యక్షుండు) గోపాలకులకు పెద్ద అయినవాడు; రథంబు; తోలికొని; ఆక్రోశించుచున్= పెద్దగా అరుస్తూ; పురంబునకున్= నగరానికి; అరుగుదెంచి= వచ్చి; రాజమందిర ద్వారంబు+చొచ్చి= రాజభవనంయొక్క ముఖద్వారంగుండా లోనికివెళ్ళి; రథ+అవతరణంబు+ చేసి= రథాన్ని దిగి; భూమింజయున్= ఉత్తరుడిని; కాంచి= దర్శించి; స, సంభ్రమంబుగాన్= తొందరతో, భయంతో, తొట్రుపాటుతో కూడినవాడై; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా సాగిన కురుసైన్యం విరాటనగరానికి దగ్గరలో, ఆ రాజు ఆవులమందను పట్టుకొన్నది. ఆ సమయానికి అక్కడ ఉన్న స్వల్పమైన సైన్యం కౌరవసైన్యాన్ని ఎదిరించింది. కృపుడు మొదలైన మహావీరులంతా బాణవర్షంతో ఆవుల కాపరులను ముంచెత్తారు. గవాధ్యక్షుడు దానిని కురుసేనగా గమనించి, వెంటనే రథమెక్కి, కేకలు వేస్తూ నగరానికి పోయి రాజుగారి మందిరం ముందు రథాన్ని దిగి, అంతఃపురంలో ఉన్న ఉత్తరుడిని చూచి భయంతో, తొట్రుపాటుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** మత్స్యదేశం పశుసమృద్ధికి పేరు. రాజయిన విరటుడికి ప్రత్యేకించి చాలా ఆవులమందలు ఉండేవి. ఆ మందలను కాపాడటానికి ఎంతోమంది కాపరులూ, వారికి అండగా కొంతసేనా ఉండేది. ఈ అల్పసేన తొలుత కౌరవసేనను ఎదిరించింది. ఆవులకాపరులకు ఒక పెద్ద ఉండేవాడు. ఆతడే గవాధ్యక్షుడు. ఇది సగౌరవమయిన పదవి. అందుకే ఆతడు రథం మీద ఉత్తరుడి దగ్గరికి వచ్చాడు. అతని మాటతీరులోనూ ఒక పెద్దరికం కనిపిస్తుంది.

**మ. 'ధరణీచక్రము సంచలింపఁగ సముద్దాంతంబులై గ్రక్కునం**
**గురుసైన్యంబులు వచ్చి ముట్టికొనియెన్ గోవర్గమున్; వేగమై**
**మరలం దెచ్చుటకుం గడంగుము; రిపుక్ష్మాపాలలోకంబు నీ**
**శరజాలంబులపాలు సేయుము భుజోత్సాహంబు శోభిల్లఁగన్. 5**

**ప్రతిపదార్థం:** ధరణీచక్రము= భూమండలం; సంచలింపఁగన్= ఎక్కువగా కంపించేటట్లుగా; సముద్దాంతంబులు+ఐ= బాగా నియమించబడ్డవై; గ్రక్కునన్= ఉన్నట్టుగా ఉండి; కురుసైన్యంబులు వచ్చి= కౌరవసేనలు వచ్చి; గోవర్గమున్= ఆవులమందలను; ముట్టికొనియెన్= చుట్టుముట్టాయి; మరలన్+తెచ్చుటకున్= (ఆలమందలను) మరలించి తోలుకొని రావటానికి; వేగము+ఐ= త్వరగా (వెంటనే); కడంగుము= ప్రయత్నించుము; భుజ= భుజాలయొక్క; ఉత్సాహంబు= పరాక్రమం; శోభిల్లఁగన్= ప్రకాశించేటట్లుగా; రిపు= శత్రువులైన; క్ష్మాపాల= రాజులయొక్క; లోకంబున్= సమూహాన్ని; నీ= నీయొక్క; శర= బాణాలయొక్క; జాలంబుల= సమూహాల యొక్క; పాలు+చేయుము (పాలుసేయుము)= వశంచేయుము.

**తాత్పర్యం:** భూమి దద్దరిల్లిపోయేట్లుగా కురుసేనలు వచ్చి అకస్మాత్తుగా విరుచుకుపడి మన ఆవులమందలను ముట్టడించాయి. నీవు వెంటనే మందను మళ్ళించటానికి ప్రయత్నించాలి. నీ భుజబలంతో శత్రువులను బాణసమూహానికి గురిచేయుము.

**ఆ. తేరుఁ బూన్పఁ బంపు; తెప్పింపు దృఢ తను । త్రాణ, ముగ్రచాప బాణ పూర్ణ**
**తూణ ఘనగదాసి తోమర చక్రాదు । లనువుగా నొనర్పు మతి రయమున. 6**

**ప్రతిపదార్థం:** తేరున్= రథాన్ని; పూన్పన్= గుర్రాలను కట్టటానికి; పంపు= ఆజ్ఞాపించుము; దృఢ= గట్టిదైన; తనుత్రాణము= కవచాన్ని; తెప్పింపు= తెప్పించుము; ఉగ్రచాప= (భయంకరమైన) చేపగల విండ్లు; బాణ= బాణాలతో; పూర్ణ= నిండిన; తూణ= అమ్ములపొదులూ; ఘన= గొప్పవైన; గదా= గదలూ; అసి= చిన్నకత్తులూ; తోమర= తోమరాలూ; చక్ర= చక్రాలూ; ఆదులు= మొదలైనవాటిని; అనువుగాన్= తగినట్లుగా; అతిరయమునన్= మిక్కిలి వేగంగా; ఒనర్పుము= సమకూర్చుము.

**తాత్పర్యం:** వెంటనే రథాన్ని సిద్ధం చేయించుము. మంచికవచాన్ని తెప్పించుము. బలమైన విండ్లూ, అమ్ములపొదులూ, పెనుగదలూ, కత్తులూ, తోమరాలూ, చక్రాలూ మొదలైన ఆయుధాలూ త్వరగా సిద్ధం చేయించుము.

**విశేషం:** పద్యం ఎత్తుగడే, అప్పటి పరిస్థితినీ, తొందరనూ సూచిస్తూ ఉన్నది. అట్లాగే, 'ఉగ్రచాపబాణ పూర్ణ తూణ ఘనగదాసి తోమరచక్రాదులు' అనే ప్రయోగం కూడా ఆ సమయానికి కావలసిన వస్తుసామగ్రినీ, పరిస్థితి తీవ్రతనూ సూచిస్తూ ఉన్నది. పద్యంనడకలో పరిస్థితి ఎట్లాంటిదో సూచించటం మహాకవుల లక్షణం.

**చ. విరటుఁడు నిన్ను నెప్డుఁ బదివేవురముందటఁ జెప్పుఁ బాహువి**
**స్ఫురితుఁడు, శౌర్యశాలి, కులభూతి విశేష విధాయకుండు, భూ**
**భరణ విశారదుండు, జనభవ్యతపఃఫలసంభవుండు, కా**
**తర పరిరక్షకుం డనుచు; దానికి నీడుగఁ జేయు మిత్తఱిన్'. 7**

**ప్రతిపదార్థం:** విరటుఁడు= (నీ తండ్రి అయిన) విరాటరాజు; ఎప్డు= ఎల్లప్పుడూ; బాహు విస్ఫురితుఁడు= భుజబలంతో ప్రకాశించేవాడు; శౌర్యశాలి= పరాక్రమంతో ఒప్పేవాడూ; కుల= వంశానికి; భూతి= ఐశ్వర్యాన్ని; విశేష= ఎక్కువగా; విధాయకుండు=

కలిగించేవాడు (కులానికి అన్ని విధాలా పేరు ప్రతిష్ఠలను తెచ్చేవాడు అని భావం); భూ= భూమియొక్క (రాజ్యాన్ని); భరణ= భరించటంలో; విశారదుండు= నేర్పుకలవాడు (రాజ్యభారాన్ని మోయడంలో సమర్థుడు అని భావం); జన= ప్రజలయొక్క; భవ్య= శ్రేష్ఠమైన; తపస్= తపస్సుకు; ఫల= ఫలితంగా; సంభవుండు= పుట్టినవాడు; కాతర= భయపడ్డవారిని; పరిరక్షకుండు= బాగా కాపాడేవాడు; అనుచున్= పై విధంగా అంటూ; నిన్నున్= నిన్నుగురించి; పదివేవురముందటన్= పదివేలమంది ఎదుట (కొలువులో); చెప్పున్= చెప్పేవాడు; దానికిన్+ఈడుగన్= (మీ తండ్రి చెప్పే) దానికి తగ్గట్లుగా; ఈ+తఱిన్= ఈ (ఆపద) సమయంలో; చేయుము= చేయవలసింది.

**తాత్పర్యం:** నీ తండ్రి అయిన విరాటరాజు- నీవు భుజబలం ఉన్నవాడివనీ, పరాక్రమశాలివనీ, వంశానికి వన్నె తెస్తావనీ, రాజ్యపాలనలో సమర్థుడివనీ, మత్స్యదేశ ప్రజల తపస్సుకు ఫలితంగా నీవు పుట్టావనీ, దీనులను రక్షించేవాడివనీ పదివేలమందిలో చెప్పుతుంటాడు. ఈ కష్టసమయంలో నీవు దానికి తగినట్లుగా ప్రవర్తించుము'.

**విశేషం:** ఉత్తరుడిని పొగడి, ఆతడి గొప్పతనాన్ని గుర్తుచేసి, ఆవులమందను మళ్ళించేందుకు పూనుకొనేటట్లు చేయటమే గోపాలకుల పెద్దయొక్క లక్ష్యం. అందుకే ఆతడు ఉత్తరుడిని గూర్చి విరటుడు చెప్పుకొన్నట్లు పొగడింది.

**క. అని కాంతాజనములలోఁ। దను నగ్గించుటయుఁ బొంగి దర్పోద్ధతి ని**
**ట్లను నుత్తరుండు దన మన। మున సంగర కౌతుకంబు ముడివడుచుండన్. 8**

**ప్రతిపదార్థం:** అని; కాంతాజనములలోన్= (అంతఃపురంలో ఉండే) స్త్రీ జనంలో; తనున్= తనను; అగ్గించుటయున్= పొగడగా; ఉత్తరుండు= ఉత్తరుడు; పొంగి= ఉప్పొంగి; దర్ప+ఉద్ధతిన్= గర్వంయొక్క అతిశయంతో; తన= తనయొక్క; మనమునన్= మనసులో; సంగర= యుద్ధసంబంధమైన; కౌతుకంబు= ఉత్సాహం; ముడి+పడుచుండన్= పొడసూపుతూ ఉండగా (క్రమంగా అతిశయించి); ఇట్లు= ఇట్లా; అనున్= అంటున్నాడు.

**తాత్పర్యం:** అంతఃపురంలో ఆడవాళ్ళ నడుమ ఉన్న తనను, గోపాలకులపెద్ద పెద్దగా పొగిడేసరికి ఉత్తరుడు ఉప్పొంగిపోయి, మనసులో రణసంబంధమైన ఉత్సాహం పుట్టగా, గర్వంతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఉత్తరకుమారుడు పెద్ద వీరుడు కాడు. అట్లని పిరికివాడూ కాడు. మామూలు మనిషికన్నా కొంతనయం. గోపాలకులపెద్ద ఆడవాళ్ళ ఎదుట పొగడటంతో ఉత్తరుడిలో కొంత రణకుతూహలం పుట్టింది. నిజానికి ఈ కౌతుకం తాత్కాలికమే! సహజమైనది కాదు. కనుక ఉత్తరుడి ఉత్సాహం పొగడ్త ప్రభావంతో కలిగింది.

**భూమింజయుండు గోవుల విడిపింపఁ గౌరవులతోఁ బోరుటకుఁ బోనెన్నుట. (సం. 4-34-1)**

**ఉ. 'ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మార్కొనిరేని; గోవులం**
**దెత్తు ముహూర్త మాత్రమునఁ; దేరికి సారథి లేమిఁ జేసి నా**
**చిత్తమునన్ విచారదశ చెందెదు; నెవ్వఁడు గల్గనొక్కొ నా**
**కిత్తఱి 'నేఁ గదా కడప నెంతయు నేర్తు రథం' బనం బురిన్. 9**

**ప్రతిపదార్థం:** మార్కొనిరి+ఏని= ఎదిరిస్తే; కౌరవులన్+ఎల్లన్= కౌరవుల నందర్నీ; ఎత్తునన్+కొందున్= ఒకే ఎత్తులో జయిస్తాను; ముహూర్తమాత్రమునన్= ఒకే ఒక ముహూర్తకాలంలో (పన్నెండు క్షణాలకాలంలో లేక రెండు గడియల కాలంలో); గోవులన్= ఆవులను; తెత్తున్= తోలుకొని తెస్తాను; తేరికిన్= రథానికి; సారథి= నడిపేవాడు; లేమిన్+చేసి= లేకపోవటం చేత; నా=

నాయొక్క; చిత్తమునన్= మనస్సులో; విచారదశ= దిగులుతో కూడిన పరిస్థితి; చెందెడున్= కలుగుతూ ఉన్నది; రథంబు= రథాన్ని; కడపన్= తోలటానికి; నేన్+కదా= నేనుకదా; ఎంతయున్= మిక్కిలి; నేర్తున్= ఓపుదును; అనన్= అనటానికి; పురిన్= పట్టణంలో; నాకున్= నాకు; ఈ+తఱిన్= ఇప్పుడు; ఎవ్వఁడు= ఏ మనిషి; కల్గును+ఒక్కొ!= దొరకుతాడో కదా!

**తాత్పర్యం:** 'కౌరవులు ఎదిరిస్తే చిటికెలో జయిస్తాను. క్షణాలలోనే ఆవులను మళ్ళిస్తాను. అయితే రథసారథి లేకపోవటంతో మనస్సు కలత పడుతూ ఉన్నది. 'నేను రథాన్ని సమర్థంగా నడుపుతాను' అనేవాడు ఇప్పుడు నాకు ఎవడు దొరకుతాడో!

**విశేషం:** 'ఎత్తునఁగొందు' మంచిప్రయోగం. తిక్కన తెలుగు నుడికారానికి ఇది గుర్తు. ఎత్తు-పై ఎత్తు మొదలైన మాటలు యుద్ధంలో 'ఎత్తులు' వేయటాన్నీ, చదరంగం ఆటనూ సూచిస్తాయి. తిక్కన రాజ్యతంత్రం, యుద్ధతంత్రంపై ప్రయోగం వలన సూచించబడింది. 'ఎత్తు' అంటే ఉపాయం అనీ అర్థమే. కాగా ఒకే ఉపాయంతో ఎదుటివాడి ఆటను కట్టించటం, యుద్ధంలో ఓడించటం అన్నమాట.

**క. తగు సారథి దొరకొనినం । బగతుర భంజించు టెంతపని? కదుపుల ద**
**వ్వుగఁ గొని పోదురొకో! యి । ట్లగునె? కలండేని సూతు నరయుం డెందున్. 10**

**ప్రతిపదార్థం:** తగు= తగినటువంటి; సారథి= రథాన్ని నడిపేవాడు; దొరకొనినన్= (దొరకు+కొను)= దొరికితే; పగతురన్= పగవాళ్ళను (శత్రువులను); భంజించుట= చంపటం; ఎంతపని= అదేమంత పెద్దపనికాదు; కదుపులన్= ఆవులమందలను; దవ్వుగన్= దూరంగా; కొనిపోదురు+ఒకో!= తోలుకొనిపోతారేమో!; ఇట్లు= ఇట్లాఉంటే; అగునె?= పని జరుగుతుందా? ఎందున్= పట్టణంలో ఎక్కడైనా; కలండు+ఏని= ఉంటే; సూతున్= సారథిని; అరయుండు= వెదకండి.

**తాత్పర్యం:** తగిన సారథి దొరికితే శత్రువులను జయించటం ఎంతపని? ఆవులమందలను దూరంగా తోలుకొనిపోతారో ఏమో! అట్లాగే అయితే, పని ఎట్లా జరుగుతుంది? నగరంలో ఎక్కడైనా సారథి దొరకుతాడేమో చూడండి.

**చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్యులు మత్సముద్యమ**
**స్ఫురణము చూచి పార్థుఁడను బుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టి సం**
**గరమున నోర్చి యేఁ బసుల గ్రమ్మఱఁ దేరకయున్న నన్ను భూ**
**వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు మెత్తురే?' 11**

**ప్రతిపదార్థం:** కురుపతి= దుర్యోధనుడు; భీష్మ= భీష్ముడు; కర్ణ= కర్ణుడు; కృప= కృపాచార్యుడు; కుంభజ= ద్రోణాచార్యుడు; ముఖ్యులు= మొదలుగా గలవారు; మత్= నాయొక్క; సముద్యమ= ప్రయత్నంయొక్క; స్ఫురణము= విజృంభణాన్ని; చూచి; పార్థుఁడు= అర్జునుడు; అను= అనెడి; బుద్ధిన్= భావంతో; కలంగఁగన్= కలతపడిపోయేటట్లు; బెట్టు= ఎక్కువగా; కిట్టి= ఎదిరించి; సంగరమునన్= యుద్ధంలో; ఓర్చి= ఓడించి; ఏన్= నేను; పసులన్= ఆవులను; క్రమ్మఱన్= మరలా; తేరక+ఉన్నన్= తోలుకొనిరాకపోతే; నన్నున్= నన్ను; భూవరుఁడు= రాజైన విరాటుడూ; సుహృద్+జనంబున్= స్నేహితులూ; పరివారమున్= సేవకులూ; చిత్తములందున్= మనస్సులలో; మెత్తురే?= మెచ్చుకుంటారా?

**తాత్పర్యం:** దుర్యోధనుడూ, భీష్ముడూ, కర్ణుడూ, కృపాచార్యుడూ, ద్రోణాచార్యుడూ మొదలైనవారంతా యుద్ధంలో నా పరాక్రమాన్ని చూచి, అర్జునుడే అని భ్రమించి, బెదిరిపోయేట్లు ఎదిరించి, వాళ్ళందరినీ జయించి మందలను మళ్ళించుకొని రాకపోతే నన్ను రాజూ, స్నేహితులూ, పరివారమూ మెచ్చుతారా?'

**వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి. 12**

**తాత్పర్యం:** (ఉత్తరుడు పై విధంగా) అనేటప్పుడు అక్కడ ఉండటంవలన.

**క. విని, ద్రుపద ధరణిపతినం । దన సామర్షాపహాస తరళ హృదయ యై**
**చని, తద్వృత్తాంతము మె । త్తని పలుకులఁ జెప్పె నింద్రతనయునితోడన్. 13**

**ప్రతిపదార్థం:** ద్రుపద ధరణిపతి= ద్రుపదమహారాజుయొక్క; నందన= కూతురు; (ద్రౌపది); విని= ఉత్తరుడి మాటలు ఆలకించి; స+అమర్ష= కోపంతోనూ; అపహాస= ఎగతాళితోనూ; తరళ= చలిస్తున్న; హృదయ+ఐ= మనస్సు కలదై; చని= వెళ్ళి; ఇంద్రతనయునితోడన్= ఇంద్రుడి కుమారుడైన అర్జునుడితో; తద్+వృత్తాంతము= ఆ విషయం (ఉత్తరుడు అనుకొన్న విషయం); మెత్తని పలుకులన్= మృదువైన మాటలతో; చెప్పెన్= చెప్పింది.

**తాత్పర్యం:** ఉత్తరుడు తనను అర్జునుడితో పోల్చుకొనేసరికి, ద్రౌపదికి అమర్షం, అపహాసం కలిగాయి. అందుకే ఆమె ఆ విషయాన్ని అర్జునుడితో చెప్పింది.

**విశేషం:** మూలభారతంలో వ్యాసుడు ఒక్క అమర్షభావాన్నే చెప్పాడు. కాని తిక్కన అమర్షానికితోడు అపహాసం కూడా ద్రౌపదికి కలిగినట్లు చెప్పాడు. ఇదే తిక్కన ప్రత్యేకత. పైగా ఈ సమయంలో అర్జునుడిని ప్రవేశపెట్టాలి. అందుకే వ్యాసుడూ, తిక్కనా ఇట్లా ద్రౌపది అర్జునుడికి చెప్పడం ద్వారా (సంభాషణతో) నిర్వహించారు. ఇది ఒక రచనా శిల్పం.

**వ. అతండు నజ్ఞాతవాస వత్సరం బతీతంబగుట నిరూపించి, పాంచాలి కిట్లనియె. 'నీవు పోయి వారలతో నిట్లనుము 'మన బృహన్నలకు సారథ్యంబుసేయు సామర్థ్యంబు గలదు; దొల్లి ఖాండవ దహనంబునం బాండవ మధ్యమునకు సారథియై యతని చిత్తంబు వడసె; మఱియుఁ బెక్కెడలం దదీయంబగు రథంబు గడపఁ దానయై యుండు; నేను నెఱుంగుదుం, దత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయింప వచ్చుటకు సంశయంబు వల దనుము. వా రేమనిరేని మఱియుం దగనాడి నన్నుం బిలిపించునట్టి తెఱంగు గావింపు' మన 'నట్లచేయుదు' నని సైరంధ్రి యుత్తరయున్న యెడకుం బోయి. 14**

**ప్రతిపదార్థం:** అతండున్= ఆ అర్జునుడున్నూ; అజ్ఞాతవాస, వత్సరంబు= అజ్ఞాతవాసపు సంవత్సరం; అతీతంబు= దాటినది; అగుటన్= అవటం; నిరూపించి= నిర్ధారించి; పాంచాలికిన్= ద్రౌపదికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; నీవు; పోయి; వారలతోన్; ఇట్లు+అనుము; మన బృహన్నలకున్; సారథ్యంబు+చేయు= రథంనడిపే; సామర్థ్యంబు+కలదు= శక్తి ఉన్నది; తొల్లి= పూర్వం; ఖాండవ, దహనంబునన్= ఖాండవమనే అడవిని కాల్చటంలో; పాండవ మధ్యమునకున్= పాండుపుత్రులలో నడిమివాడైన అర్జునుడికి; తాను+అ+ఐ= తానే సారథియై; అతని, చిత్తంబు+పడసెన్= అతడి మనస్సును ఆకట్టుకొన్నాడు; మఱియున్; పెక్కు+ఎడలన్= అనేక సమయాలలో; తదీయంబు+అగు= అతడిదైన; రథంబు; కడపన్= నడపటానికి; సారథి+ఐ; ఉండున్; ఏనున్= నేను కూడా; ఎఱుంగుదున్= ఎరుగుదును; తద్+సాహాయ్యంబునన్= అతడి సహాయంతో;

కురుసైన్యంబులన్= కౌరవ సేనలను; జయింపన్+వచ్చుటకున్= గెలవటానికి; సంశయంబు= సందేహం; వలదు= వద్దు; అనుము; వారు= ఉత్తరాదులు; ఏమి+అనిరి+ఏని= ఏమన్నా అంటే; మఱియున్+తగన్+ఆడి= తగినట్లు మాటాడి; నన్నున్; పిలిపించునట్టి; తెఱంగు= విధం; కావింపుము= చేయుము; అనన్= అనగా; అట్లు+అ= ఆ విధంగానే; చేయుదున్; అని; సైరంధ్రి; ఉత్తర; ఉన్న; ఎడకున్= చోటికి; పోయి.

**తాత్పర్యం:** అర్జునుడు ద్రౌపదితో అజ్ఞాతవాస సంవత్సరం ముగిసినట్లు నిర్ణయించి ఇట్లా అన్నాడు. 'మన బృహన్నలకు సారథ్యం చేసే నేర్పు ఉన్నదనీ, ఇంతకుముందు ఖాండవవనాన్ని దహించటంలో అర్జునుడికి సారథియై ఆతడి మెప్పు పొందాడనీ, ఇంకా ఎన్నో సమయాలలో కూడా ఆతడి రథానికి సారథిగా ఇతడే ఉండిఉంటాడనీ, నాకు తెలుసనీ అతడి సహకారం ఉంటే కురుసైన్యాన్ని గెలవడంలో అనుమానం లేదనీ, నీవు వెళ్ళి వాళ్ళతో చెప్పుము. ఇంకా వాళ్ళేమైనా అంటే, తగినట్లు మాట్లాడి, ఎట్లాగైనా నన్ను పిలిపించేటట్లు చేయుము' అని చెప్పగానే అట్లాగే చేస్తానంటూ సైరంధ్రి ఉత్తరదగ్గరకు వెళ్ళి.

**చ. 'జనపతినందనుండు తగు సారథి నారయుచున్నవాఁ డెఱిం**
**గిన పని సెప్పఁగా వలయుఁ, గ్రీడి మనంబున మెచ్చునట్టి నే**
**ర్పును భుజశక్తియుం గలిగి రూఢికి నెక్కిన సూతవృత్తి మై**
**నని సడిసన్న యేడ్తెఱ బృహన్నలకుం గల దంబుజాననా! 15**

**ప్రతిపదార్థం:** అంబుజ+ఆననా!= పద్మంవంటి ముఖాన్ని కలిగిన ఉత్తరా!; జనపతినందనుండు= రాజకుమారుడైన ఉత్తరుడు; తగుసారథిన్= తనకు తగిన సారథికొరకు; ఆరయుచున్నవాఁడు= వెదకుతున్నాడు; ఎఱింగిన పని= తెలిసిన విషయం; చెప్పఁగా వలయున్= చెప్పాలి; క్రీడి= అర్జునుడు; మనంబునన్= మనస్సులో; మెచ్చునట్టి= మెచ్చుకొనే; నేర్పును= నైపుణ్యాన్నీ; భుజశక్తియున్= బాహుబలాన్నీ; కలిగి; రూఢికిన్+ఎక్కిన= పేరు కెక్కిన; సూతవృత్తిమైన్= సారథ్యంతోపాటు; (సూతకులంవాళ్ళే రథసారథులుగా ఉండేవాళ్ళు); అనిన్= యుద్ధంలో; సడి+చన్న= మచ్చలేని; ఏడ్తెఱ= చాతుర్యం; బృహన్నలకున్; కలదు= ఉన్నది.

**తాత్పర్యం:** 'తామరపూవువంటి అందమైన ముఖం కలిగిన ఉత్తరా! ఇప్పుడు రాకుమారుడైన ఉత్తరుడు తగిన సారథికొరకు వెదకుతున్నాడు. తెలిసిన విషయాన్ని చెప్పాలి కనుక చెప్పుతున్నాను. అర్జునుడు మెచ్చుకొనే నేర్పూ, బాహుబలంతోపాటు సారథ్యంలో ప్రావీణ్యమూ, యుద్ధంలో మచ్చలేని పరాక్రమమూ మన బృహన్నల కున్నాయి.

**విశేషం:** బృహన్నలను తనకు రథసారథిగా చేసికొనుమని చెప్పి ఉత్తరుడిని ఒప్పించటానికి ద్రౌపది ఉత్తర ద్వారా ప్రయత్నించడం చాలా ఉచితంగా ఉన్నది. ఉత్తరుడు రాకుమారుడు. నేరుగా ఆతడికి చెప్పటంకన్న, అతడికి ముద్దులచెల్లె లయిన ఉత్తరతో చెప్పించటం, పని నెరవేరటానికి సులువైన మార్గం. అందుకే ద్రౌపది ఉత్తరను పిలుచుకొని, ఉత్తరుడి దగ్గరకు వెళ్ళింది. ఇది ద్రౌపది బుద్ధికుశలతనే కాక, ఆమె ఉదాత్త మనస్తత్వాన్నీ, కార్యకరణ నైపుణ్యాన్నీ తెలుపుతుంది.

**తే. అర్జునునకు ఖాండవ దహనాదులైన । విక్రమము లా బృహన్నల వెరవు లావు**
**గాదె! జయ మొనరించె లోకంబు లెఱుఁగ । నువిద! దీని నెఱింగింత ముత్తరునకు'. 16**

**ప్రతిపదార్థం:** అర్జునునకున్= అర్జునుడికి; ఖాండవ= ఖాండవం అనే పేరున్నవనాన్ని; దహన= కాల్చివేయటం; ఆదులు+ఐన= మొదలైన; (ఖాండవవనాన్ని దహించడం ఒక గొప్పపని. అందువలన దీనినే ముందు చెప్పటం జరిగింది); విక్రమములు= పరాక్రమాలు; లోకంబులు= అన్నిలోకాలు; ఎఱుఁగన్= తెలిసికొనేటట్లు; ఆ బృహన్నల= ఆ బృహన్నలయొక్క; వెరవు= ఉపాయమూ; లావు= బలమూ; కాదు+ఎ= కదా!; జయము+ఒనరించెన్= జయాన్ని కలిగించాయి; ఉవిద!= వనితా! (ఉత్తరా!); దీనిన్= ఈ సంగతిని; ఉత్తరునకున్= ఉత్తరకుమారుడికి; ఎఱింగింతము= తెలుపుదాం.

**తాత్పర్యం:** ఓ ఉత్తరా! ఖాండవవనాన్ని కాల్చటం మొదలైన సమయాలలో బృహన్నల ఉపాయమూ, బలమూ మాత్రమే అర్జునుడికి జగత్ప్రసిద్ధమైన విజయాన్ని కలిగించాయి. దీనిని ఉత్తరుడికి చెప్పుదాము.'

**విశేషం:** అగ్నిహోత్రుడి అభ్యర్థనతో అర్జునుడు ఖాండవవనాన్ని దహించాడు. అది ఇంద్ర రక్షితం. అందుకే ఇంద్రాది దేవతలు అర్జునుడితో పోరాడి విజితులయ్యారు. కృష్ణుడు అర్జునుడికి బాసటగా ఉన్నాడు. 'లోకంబు లెఱుఁగ' అనే ప్రయోగంవలన, ఖాండవాన్ని దహించి విజయాన్ని పొందిన అర్జునుడి కీర్తి, ముల్లోకాలలో ప్రాకింది అని తెలుస్తుంది. అందుకే తిక్కన 'లోకంబులు' అనే బహువచనాన్ని ప్రయోగించాడు.

**క. అని యమ్ముదితయుఁ దానును । జని యతనికి నత్తెఱంగు సముచితముగఁ జె**
**ప్పిన నక్కుమారవరుఁ డి । ట్లనియెం బాంచాలితోడ నల్లన నగుచున్. 17**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా ద్రౌపది చెప్పి; ఆ+ముదితయున్= సంతోషించినది అయిన ఆ ఉత్తరా; తానును= తాను (ద్రౌపది); చని= వెళ్ళి; అతనికిన్= ఉత్తరుడికి; ఆ+తెఱంగు= ఆ సంగతి; సముచితముగన్= తగినరీతిగా; చెప్పినన్= తెలియజెప్పగా; ఆ+కుమారవరుఁడు= కుమారులలో శ్రేష్ఠుడైన ఆ ఉత్తరుడు; పాంచాలితోడన్= ద్రౌపదితో; అల్లనన్= సన్నగా; నగుచున్= నవ్వుతూ; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ద్రౌపది పై విధంగా ఉత్తరకు బృహన్నల సంగతిని చెప్పి, తానూ ఉత్తరా వెళ్ళి ఉత్తరుడితో చెప్పగా, ఆతడు చిరునవ్వు నవ్వి ద్రౌపదితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'అల్లన నగుచున్' అనే ప్రయోగంవలన, ఉత్తరుడి మనోభావం తెలుస్తుంది. పేడిని చూస్తేనే నవ్వు వస్తుంది. అట్లాంటప్పుడు 'ఇట్లాంటివాడినా సైరంధ్రి సారథిగా సూచించింది' అన్న ఒక ఎగతాళి, తక్కువ భావం, ఒక లెక్కలేనితనం, మొదలైన భావాలేకాక, ఆఖరుకు తనకు పట్టిన గతి ఇదా! అన్న విచారం కూడా తెలుస్తుంది. తరువాతి పద్యంలో ఇది మరింత స్పష్టంగా తెలుస్తుంది. నవ్వు మనస్సులో ఉన్న భావానికి ప్రతీక. అందులో తిక్కన నవ్వులు ఎన్నో భావాలను స్ఫురింపచేస్తాయి. ఇదీ తిక్కన ప్రత్యేకత.

పాంచాల దేశపు రాజైన ద్రుపదుడి కూతురు కనుక, ద్రౌపదికి 'పాంచాలి' అనే పేరు వచ్చింది.

ఈ మాటలను, సైరంధ్రిచేత అర్జునుడు ఉత్తరుడికి చెప్పించినట్లు మూలంలో లేదు. సైరంధ్రి తానే ఉత్తరుడితో చెప్పినట్లున్నది. ఈ సన్నివేశ కల్పన తిక్కనగారిది.

**తే. 'అకట సైరంధ్రి! నన్ను నిట్లాలి గొనఁగ । నేల? చక్కఁగఁ గనువిచ్చి యేను బేడిఁ**
**జూడరోయుదు; రణమున సూతకృత్య । భరముఁ దాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ? 18**

**ప్రతిపదార్థం:** అకట సైరంధ్రి!= అయ్యో సైరంధ్రీ!; నన్నున్= నన్ను; ఇట్లు= ఇట్లా; ఆలిగొనఁగన్+ఏల?= ఎగతాళి చేయటం ఎందుకు?; ఏను= నేను; పేడిన్= పేడివాడిని; చక్కఁగన్+కనువిచ్చి= బాగా కండ్లు తెరిచి; చూడన్= చూడటానికే; రోయుదున్= ఏవగించుకొంటాను; (అట్లాంటప్పుడు) రణమునన్= యుద్ధంలో; సూతకృత్యభరమున్= రథాన్ని తోలే బరువును; తాల్పుటకున్= మోయటానికి; ఏ+మెయిన్= ఏ విధంగా; పనుచువాఁడన్?= నియమిస్తాను?

**తాత్పర్యం:** 'సైరంధ్రీ! నన్ను ఎందుకు ఇట్లా హేళన చేస్తావు? బాగా కండ్లు తెరిచి పేడిని చూడటానికే అసహ్యించుకొంటానే! అట్లాంటప్పుడు యుద్ధంలో తేరు నడపటానికి పేడిని నేను ఎట్లా నియమిస్తాను?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. కైముత్యం చేత అర్థసంసిద్ధి అయితే కావ్యార్థాపత్తి. కైముత్యం అంటే- కిముత అనే దాని భావం. పేడిని చూడటానికే అసహ్యించుకునేటప్పుడు రథసారథిగా చేసికొనటం గూర్చి చెప్పే దేముంది? (సంపా.)

**వ. అదియునుంగాక. 19**

**తాత్పర్యం:** అదీకాక.

**చ. కురుబల మేఁగుదెంచెనట గోవుల బిట్టఱఁబట్ట; దానిపైఁ**
**బరిగొని శౌర్యసంపదయు బాహుబలంబును జూపఁబూని యే**
**నరిగెద నట్టె; తేరికి బృహన్నల సారథియైన దీని న**
**వ్వరె? పురిలోన నింత కఱవా? రథచోదకు లింత యేటికిన్.' 20**

**ప్రతిపదార్థం:** గోవులన్= ఆవులను; బిట్టు+అఱన్= ఉద్ధతి పోయేటట్లు; పట్టన్= పట్టుకొనటానికి; కురుబలము= కౌరవుల సైన్యం; ఏఁగుదెంచెన్+అట= వచ్చిందట; దానిపైన్= ఆ కురుసేనమీద; పరిగొని= చుట్టుముట్టి; శౌర్య= పరాక్రమం అనే; సంపదయున్= సంపదను; బాహు= భుజములయొక్క; బలంబున్= బలాన్ని; చూపన్+పూని= చూపించటానికి; ఏను= నేను; అరిగెదనట్టె= పోతున్నానట; (ఇటువంటి ముఖ్యమైన సమయంలో) తేరికిన్= నా రథానికి; బృహన్నల (పరోక్షంగా-ఒక పేడివాడు); సారథి+ఐనన్= సారథి అయితే; దీనిన్= ఈ చిత్రమైన విషయానికి; నవ్వరె?= నవ్విపోరా?; ఇంత+ఏటికిన్= ఇంత ఎందుకు? రథచోదకులు= రథం నడిపేవాళ్ళు; పురిలోనన్= పట్టణంలో; ఇంత కఱవా?= ఇంత అరుదా?

**తాత్పర్యం:** ఆవులను పట్టుకొనటానికి కురుబలం వచ్చిందట! అందుచేత పట్టుదలతో దానిపై పరాక్రమాన్ని చూపటానికి పోతున్నానట! ఈ సమయంలో నా రథానికి బృహన్నల సారథి అయితే అందరూ నవ్వుతారు. ఇంతదాకా ఎందుకు? నగరంలో సారథులే ఇంత కరువయ్యారా!'

**విశేషం:** బృహన్నలను సారథిగా చేసికొనుమని సైరంధ్రి చెప్పటం ఉత్తరుడికి అవమానంగా తోచింది. ఆవులను ముట్టడించింది కురుసైన్యంగాని, సామాన్యమైన సైన్యం కాదు. అంతటి సైన్యాన్ని ఎదిరించటానికి తనంతటివాడు వెళ్ళుతున్నాడు. ఇట్లాంటి సమయంలో బృహన్నల సారథ్యం వహిస్తే, లోకం అంతా నవ్విపోదా? అని ఉత్తరుడి భావం. దీన్నే 'అట' అనే శబ్దంతో మహాకవి తిక్కన ఉత్తరుడి మనోభావానికి అద్దం పట్టినట్లు స్ఫురింపచేశాడు.

**వ. అనిన విని సైరంధ్రి యతని కిట్లనియె. 21**

**తాత్పర్యం:** ఆ మాటలను వినిన సైరంధ్రి ఉత్తరుడితో ఇట్లా అన్నది.

ఉ. 'కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట నెత్తి వచ్చినం
దేరు బృహన్నలా వశగతిం జరియించిన గెల్వ వచ్చుఁ; ద
ద్వీరగుణంబు సొంపు పృథివీవరనందన! ము న్నెఱుంగుదుం;
గారణజన్మమై తను వికారము వచ్చినఁ బెంపు దప్పునే?' 22

**ప్రతిపదార్థం:** పృథివీ= భూమికి; వర= భర్తయైన రాజు యొక్క; నందన!= కుమారా!, రాజకుమారా!; కౌరవసేన+కాదు= ఒక్క కురుసేనయే కాదు; త్రిజగంబులున్= ముల్లోకాలూ (స్వర్గ, మర్త్య, పాతాళాలు); ఒక్కటన్= ఒకేసారిగా; ఎత్తి వచ్చినన్= దండెత్తి వచ్చినాకానీ; తేరు= రథం; బృహన్నలా వశగతిన్= బృహన్నలకు స్వాధీనమైన నడకతో; చరియించినన్= నడిస్తే; గెల్వవచ్చున్= జయించవచ్చు; తత్= ఆ బృహన్నలయొక్క; వీరగుణంబు= పరాక్రమంయొక్క విధం; సొంపు= ఆధిక్యం (అందం అనీ); మున్ను= ఇంతకుముందు; ఎఱుంగుదున్= (నేను) ఎరుగుదును; కారణ= ఏదో ఒక కారణంవలన; జన్మము+ఐ= పుట్టిన (కలిగిన); తను= శరీరంలో; వికారము వచ్చినన్= మార్పురాగానే; పెంపు= ఆధిక్యత; తప్పునే?= లేకుండా పోతుందా?

**తాత్పర్యం:** 'రాజకుమారా! కురుసైన్యమే కాదు, ముల్లోకాలూ ఒకే మారు మీద పడ్డా సరే, రథం బృహన్నలకు వశమై సాగితే చాలు, గెలుపు తప్పదు. ఆతడి పరాక్రమం, నాకు ఇంతకుముందే బాగా తెలుసు. ఏ కారణం వలననో దేహంలో ఏదో కొద్దిమార్పు కనిపించగానే సహజంగా ఉన్న పరాక్రమం తగ్గిపోతుందా?'

**విశేషం:** 'బృహన్నలా వశగతిన్'- బృహన్నల సంస్కృతంలో పుంలింగంగానూ, తెలుగులో స్త్రీలింగ శబ్దంగానూ ప్రయోగించబడింది. అందుకు 'బృహన్నలా వశగతిన్' - ఉదాహరణం. ఈ ప్రయోగంతో తిక్కన భావ్యర్థ (ముందు రాబోయే కథను) సూచన చేశాడని పండితుల భావన. తేరు బృహన్నలకు వశమై నడిస్తే - అని పై ప్రయోగానికి అర్థం. దీనినిబట్టి బృహన్నల సారథే కావాల్సిన పని లేదనీ, రథికుడైనా కావచ్చనీ, ముందు కథలో బృహన్నలే అర్జునుడై రథికుడైనాడనీ, 'జనహిత' వ్యాఖ్యా పండితుల అభిప్రాయం ఉచితంగానే ఉన్నది. మూల భారతంలో మాత్రం 'సారథి అయితే' - (యదివై సారథిస్సస్యాత్) అనే ఉన్నది. కనుక పై పండితుల అభిప్రాయానికి తిక్కన ప్రయోగమే ఆధారం.

వ. అనవుడు. 23

**తాత్పర్యం:** అనగానే (ద్రౌపది పైవిధంగా చెప్పగానే).

క. మన మురియాడుచు నుండఁగఁ । దన కొరు లప్పటికి లేమి ధరణీశ్వరనం
దనుఁడు బృహన్నలఁ బిలువం । బనుచుట కొడఁబడిన పలుకు వలుకుటయుఁ దగన్. 24

**ప్రతిపదార్థం:** మనము= మనస్సు; ఉరియాడుచున్+ఉండఁగన్= ఊగిసలాడుతూ (సందేహిస్తూ) ఉండగా; తనకున్= తనకుకూడా; ఒరులు= (బృహన్నల కాక) వేరేవారు; అప్పటికిన్= ఆ సమయానికి; లేమిన్= లేకపోవటంతో; ధరణీశ్వర= రాజుయొక్క; నందనుఁడు= కుమారుడు (ఉత్తరుడు); బృహన్నలన్= బృహన్నలనే; పిలువన్= పిలవటానికి; పనుచుటకున్= ఆజ్ఞాపించటానికి; ఒడఁబడిన= ఒప్పుకొన్న; పలుకు= మాట; తగన్+పలుకుటయున్= తగినట్లు పలుకగా.

**తాత్పర్యం:** బృహన్నలను సారథిగా చేసికొనేందుకు మనస్సు ఒకపక్క అనుమానిస్తున్నా, అప్పటికి వేరేవాళ్ళు లేకపోవడంతో ఉత్తరుడు ఆతడినే పిలవటానికి విధిలేక ఒప్పుకొన్నట్లు చెప్పాడు.

**వ. సైరంధ్రి దెసఁ గనుంగొని 'యేను బోయి తోడ్కొని వచ్చెద' నని పూని. 25**

**తాత్పర్యం:** ఉత్తరుడు అట్లా అన్నప్పుడు, ఉత్తర సైరంధ్రి వైపు చూచి, 'నేను పోయి బృహన్నలను పిలుచుకొని వస్తాను' అని బయలుదేరింది.

**సీ. అడుగుల నునుఁగాంతి నయ్యెడఁ బద్మరా । గంబుల నెలకట్టు కరణినొప్పఁ,**
**బాలిండ్లు దను వెడ వ్రాలింపఁ జెన్నొందు । నసదుఁ గౌఁదీఁగె యల్లాడుచుండఁ,**
**దఱి వేచి వెనువెంటఁ దగులు కామాంధ కా । రములీలఁ గ్రొవ్వెద కొమరుమిగులఁ,**
**గర్ణభూషణ మౌక్తిక ప్రభాడోలన । మీక్షణ దీప్తుల నినుమడింప'**

**తే. నందియల మొరపంబున కరుగుదెంచి । ప్రోది రాయంచ రయమునఁ బోవు నవ్వి**
**ధంబు దగ నభ్యసించు చందమునఁ దోన । చనఁగ నుత్తర నర్తనశాల కరిగె. 26**

**ప్రతిపదార్థం:** (బృహన్నల ఉండే నర్తనశాలలోకి ఉత్తర పోయే విధాన్ని ఈ పద్యంలో తిక్కన మహాకవి వర్ణించాడు.) అడుగుల= పాదాలయొక్క; నును= నిగనిగలాడే; కాంతిన్= కాంతితో; ఆ+ఎడన్= ఆచోట; పద్మరాగంబుల= పద్మరాగాలు అనే మణులయొక్క; నెలకట్టు= కట్టడపునేల (భూమి) (గోడ); కరణిన్= వలె; ఒప్పన్= అందగించగా (ప్రకాశించగా); పాలిండ్లు= స్తనాలు; తనున్= తనను (ఉత్తరను); వెడ= అల్పంగా; వ్రాలింపన్= ముందుకు వంగేటట్లు చేయగా; చెన్ను+ఒందు= అందగించే; అసదు= సన్నమైన; కౌను+తీఁగె= తీగవంటి నడుము; అల్లాడుచుండన్= ఊగిసలాడుతూ ఉండగా; తఱి వేచి= సమయం చూచి; వెనువెంటన్+తగులు= వెంబడించే; కామ+అంధకారము= కామం అనే చీకటి; లీలన్= వలె; క్రొత్త+వెద= కొప్పు; కొమరు మిగులన్= అందాన్ని అతిశయింపచేయగా; కర్ణభూషణ= చెవి కమ్మల్లో ఉండే; మౌక్తిక= ముత్యాలయొక్క; ప్రభా= కాంతుల యొక్క; డోలనము= ఊగిసలాటలు; ఈక్షణ= చూపులయొక్క; దీప్తులన్= వెలుగులను; ఇనుమడింపన్= రెట్టింపు చేస్తుండగా; అందియల= కాలి అందెలయొక్క; మొరపంబునకున్= సవ్వడికి; అరుగుదెంచి= వచ్చి; ప్రోది రాయంచ= పెంపుడు రాజహంస; రయమునన్= వేగంగా; పోవు= వెళ్ళే; ఆ+విధంబు= ఆ తీరును; తగన్= తగినరీతిగా; అభ్యసించు చందమునన్= నేర్చుకొంటున్నట్లుగా; తోన్+అ= వెంబడే; చనఁగన్= వెళ్ళగా; ఉత్తర= రాకుమారి ఉత్తర; నర్తనశాలకున్= నాట్యశాలకు; అరిగెన్= పోయింది.

**తాత్పర్యం:** రాకుమారి ఉత్తర అడుగుల ఎర్రటికాంతివలన ఆమె అడుగువేసిన నేల పద్మరాగమణులు పొదిగినట్లు ప్రకాశించింది. (పద్మరాగమణులు ఎరుపురంగులో ఉంటాయి). చనుకట్టు బరువుకు ఆమె దేహం ముందుకు వాలుతూ ఉన్నది. ఆ బరువుకు ఆమె సన్ననైన నడుము ఊగిసలాడుతూ ఉన్నది. సందుచూసికొని వెంటాడిన కామాంధకారంవలె, ఆమెకొప్పు నల్లటికాంతితో నిగనిగలాడుతూ ఉన్నది. ఒయ్యారపునడకవలన ఆమె చెవుల కమ్మలు వెనక్కూ ముందుకూ ఊగులాడుతూ కన్నులయొక్క కాంతులను ఇనుమడింపచేస్తూ ఉన్నాయి. కాలి అందెల సవ్వడికి ఆమె పెంపుడు రాయంచ ఆమె నడకలో ఉండే ఒయ్యారాన్నీ, వేగాన్నీ నేర్చుకొనాలని వచ్చినట్లుగా వెంట నడిచింది. ఆ రీతిగా ఉత్తర నర్తనశాలకు వెళ్లింది.

**విశేషం:** 1. అలం: ఉత్ప్రేక్ష, తద్గుణం, అనుగుణం. 'అడుగుల నునుఁగాంతి... నెలకట్టు కరణినొప్ప' అనే సీసపద్య చరణంలో తద్గుణం, ఉత్ప్రేక్ష. ఆ ఎడ స్వగుణమైన తెలుపును (?) విడిచిపెట్టి అడుగుల నునుఁగాంతిని (ఎరుపును) స్వీకరించింది కాబట్టి తద్గుణాలంకారమని చెప్పవచ్చును. అంతటిలో ఊరుకొనక అది పద్మరాగాల నెలకట్టా అన్నట్లు ఉన్న దనటంచేత

ఉత్ప్రేక్ష కూడా. ఉత్ప్రేక్ష తద్గుణం చేత అనుప్రాణితమవుతున్నది. 'తటివేచి... కొమరు మిగుల' అనే పాదంలో ఉత్ప్రేక్ష 'కర్ణ మౌక్తిక .... ఇనుమడింప' అనే చరణంలో అనుగుణం, 'అందియ... చనఁగ' - అనే చోట ఉత్ప్రేక్ష. రాయంచకు గమనవేగం ఉండదు. ఉత్తర బృహన్నల కడకు ఉత్సాహంతో, వేగంగా వెళ్ళుతున్నది. అందుచేత రాయంచ ఆ వేగాన్ని నేర్చుకొనాలని ఆమె వెనుకనే వెళ్ళుతున్నది అనే చోట ఉత్ప్రేక్ష- అనే అలంకారాలు ఉన్నాయి. ద్రౌపది సైరంధ్రిగా సుదేష్ణ మందిరంలో ప్రవేశించినప్పుడు ఆమెను వర్ణించిన సీసపద్యం (1.308) వంటిదే ఈ పద్యం. ఇది దాని సమాంతర రచనాశిల్పం. తిక్కనకు ఇటువంటి వర్ణనలంటే ఇష్టం. కథ వేగంగా నడువవలసిన చోటకూడా తిక్కన ఇటువంటి వర్ణనలతో ఒక్కొక్కసారి అందంగా నడిపిస్తాడు. (సంపా.)

2. అందమైన సన్నివేశాన్ని కవులు తప్పక వర్ణిస్తారు. అందులోనూ సమర్థులైన తిక్కనవంటి మహాకవుల సంగతి సరేసరి. ఉత్తర నర్తనశాలకు వెళ్ళటం ఒక ప్రధానమైన సన్నివేశం. బృహన్నలగా ఉన్న అర్జునుడు అజ్ఞాతవాసం నుంచి బయటపడటానికి ఇది చక్కటి అవకాశం. కాబట్టి ఇది ముఖ్యమైన సందర్భం. దీనికి ఉత్తర ఒక కారణం. అందుకే తిక్కన ఉత్తరను వర్ణించింది. అసలు వర్ణించేవాడే కవి. (వర్ణయతి కవయతీతి కవిః) ఈ పద్యంలో తిక్కన, ఉత్తర బాహ్యసౌందర్యాన్నీ- అంటే శారీరక సౌందర్యాన్నీ, తరువాతి పద్యంలో ఆమె ఆంతర సౌందర్యాన్నీ, అంటే మానసిక సౌందర్యాన్నీ వర్ణించాడు. సామాన్యంగా కవులు బాహ్యాన్నే వర్ణిస్తారు. కాని తిక్కన బాహ్యాన్నీ, ఆంతరాన్నీ కూడా వర్ణిస్తాడు.

**ఆ. మెఱుఁగు మొగిలు సొచ్చు తెఱఁగున నాట్యమం। దిరము సొచ్చి తనదు గురువు కడకు**
**నరిగి నెమ్మి నిట్టు లను నింతి ప్రార్థనా । వినయ సంభ్రమములు పెనఁగొనంగ. 27**

**ప్రతిపదార్థం:** మెఱుఁగు= మెఱుపుతీగ; మొగిలు+చొచ్చు తెఱఁగునన్= మబ్బులోకి చొచ్చుకొని పోయేరీతిగా; ఇంతి= ఉత్తర; నాట్యమందిరము+చొచ్చి= నాట్యాన్ని నేర్పించేశాలలో ప్రవేశించి; తనదు= తనయొక్క; గురువు= గురువైన బృహన్నల; కడకున్= సమీపానికి; అరిగి= వెళ్ళి; ప్రార్థనా= వేడుకోవటం; వినయ= వినయం (అణకువ); సంభ్రమములు= తత్తరపాటు (అనే భావాలు); పెనఁగొనంగన్= పెనవేసికోగా; నెమ్మిన్= ప్రీతితో, నెమ్మదిగా (గురుభావంతో); ఇట్టులు= ఇట్లా; అనున్= అన్నది.

**తాత్పర్యం:** మెఱుపుతీగ మబ్బులో దూరినట్లుగా రాకుమారి ఉత్తర నాట్యమందిరం ప్రవేశించి, గురువుగారైన బృహన్నల వద్దకు వెళ్ళి, వేడుకోలు, అణకువ, తత్తరం ముప్పేటగా పెనవేసికోగా ఈ విధంగా అన్నది.

**విశేషం:** అలం: ఉపమ. నర్తనశాలను మేఘంవలె, అందులోకి ప్రవేశించిన ఉత్తరను మెఱుపుతీగగా తిక్కన వర్ణించాడు. మెరుపు ఎక్కడున్నా మెరుపే. మెరుపు ఉండే తావు మేఘం. మెరుపువంటి ఉత్తర నాట్యం నేర్చుకొనే మందిరం అది. అందులో ప్రవేశించే ఆమె నడకలోని హొయలు ఎంత నాట్యసుందరంగా ఉంటాయో తిక్కన వెనుకటి సీసపద్యంలో చెప్పాడు. మెరుపువలె బయట మెరసిన ఉత్తర లోనికి వెళ్ళికూడా మెరుస్తుంది. ఆ మెరుపు ఆమె పలికే ప్రతిభావంతమైన మాటల తీరు. పైమెరుపు లోమెరుపుగా చిత్రించటంలో ఉపమాలంకారాన్ని ఊతగా తీసికొని తిక్కన ధ్వనింపచేశాడు. (సంపా).

గురువుగారిని సమీపించి, మాట్లాడటానికి ముందు ఆమెలో పెనవేసికొన్న 'ప్రార్థన' మొదలైన భావాలు ఆమె మానసిక సౌందర్యానికి సంబంధించినట్టివి. ప్రార్థనా వినయాలు గురుభక్తి వలన, సంభ్రమం తత్క్షణ కార్యస్థితి వలన. ఈ మహార్థాన్ని 'అంతటిసీ మెఱుగు మొగిలు సొచ్చు' - ప్రయోగంలో మహాకవి భావింపచేశాడు. ఇది సార్థకం అయిన పోలిక. పైకి మామూలు పోలికవలెనే కనిపించినా, నిదానంగా చూస్తే ఎంతో లోతైన అర్థంతో నిండి ఉన్నది. అంధకార బంధురంగా మబ్బువలె నల్లగా ఉండే నాట్య మందిరంలోకి మెరుగు వంటి మేనిఛాయగల ఉత్తర ప్రవేశించినదనటం సముచితం, సుందరం అయిన భావం.

**క. 'ఇచ్చట నొకకయ్యంబునఁ । జచ్చె మదీయాగ్రజన్ముసారథి; తగువాఁ**
**డెచ్చోట లేమి నాతం । డచ్చు పఱుపఁడయ్యె నీ క్రియకు నొండొకనిన్. 28**

**ప్రతిపదార్థం:** ఇచ్చటన్= ఇక్కడ; ఒక కయ్యంబునన్= ఒక యుద్ధంలో; మదీయ= నాయొక్క; అగ్రజన్మ= అన్నగారైన ఉత్తరుడియొక్క; సారథి= రథసారథి; చచ్చెన్= మరణించాడు; తగువాఁడు= (తిరిగి) తగిన సారథి; ఎచ్చోటన్+లేమిన్= ఎక్కడా లేకపోవటంతో; ఆతండు= మా అన్న; ఈ క్రియకున్= ఈ పనికి (రథాన్ని తోలే పనికి); ఒండు+ఒకనిన్= వేరేవాడిని; అచ్చుపఱుపఁడు+అయ్యెన్= ఏర్పాటు చేయలేదు.

**తాత్పర్యం:** 'మా అన్నగారి సారథి ఒక యుద్ధంలో చచ్చిపోయాడు. తనకు సరిపోయేవాడు దొరక్కపోవటంతో మళ్ళీ ఎవడినీ నియమించలేదు.

**విశేషం:** ఉత్తర తెలివితేటలూ, చురుకుదనం, ముందుచూపూ ఇందులో బాగా తెలుస్తాయి. తాను బృహన్నలతో చెప్పదలచుకొన్న విషయాన్ని ఆరంభించటంలోనే ఉత్తర తెలివిని చూపింది. సారథి విషయంగా తాను వచ్చినట్లు మొదట్లోనే ఉత్తర గురువుకు సూచించింది. తన అన్న సారథి చచ్చిన సంగతి బృహన్నలకు ఎందుకు? ఆతడితోనే ముందు పని ఉన్నది కనుకనే చెప్పింది. ఒక సారథి పోతే మరొకడిని నియమించుకొనటం సామాన్యమైనపని. తగినవాడు దొరకలేదనీ, అందుకే మరొకడిని నియమించలేదనీ, ఉత్తర బృహన్నలకు ముందుగానే చెప్పింది. ఒక సారథి పోతే మరొకడిని నియమించుకొనటం సామాన్యమైనపని. తగినవాడు దొరకలేదనీ, అందుకే మరొకడిని నియమించలేదనీ, ఉత్తర బృహన్నలకు ముందుగానే చెప్పింది. సారథి లేని కారణాన్నీ (చావటం), వేరేవాడిని పెట్టుకొనకపోవటానికీ (తగువాడు లేకపోవటంవలన) హేతువును ఉత్తర జాగ్రత్తగా, బృహన్నల అడుగకుండానే చెప్పింది. దీని తరువాతి వచనంలో ఉత్తర అసలు సంగతిని బయటపెట్టింది. కనుక, అసలు విషయాన్ని చెప్పటానికి ముందు, ఆ విషయానికి సంబంధించిన దానిని సూచనగా ఉత్తర చెప్పింది. ఇది కార్యసాధకుల లక్షణం. దీనిని ఉత్తర ద్వారా మహాకవి ప్రదర్శించాడు.

**వ. అది యట్లుండె; నేఁడు కౌరవులు పసులం బట్టిరని కూయి వచ్చిన, నన్న సన్నద్ధుఁడై వెనుకం దగుల సమకట్టి, సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన, నీ కందువ సైరంధ్రి సెప్పినం బ్రియంబంది నిన్నుఁ దోడ్తేర నన్నుఁ బనిచిన, నేనును నీ పాల నాకుఁ జనవు గలుగుటంజేసి,'యెల్ల విధంబులం దెత్తు' నని పూని వచ్చితి; నీవును నా పలుకులు కుఱుచసేయక, నీ పెంపునుం బ్రకటంబుగా నయ్యుత్తరకుమారునకు రథంబు గడప నియ్యకొని, యి య్యాపదఁ దలఁగ వలయు, నిట్లొడంబడక తక్కుట నా వలని వాత్సల్యంబు గొఱంతపఱుచుట' యనిన నమ్ముద్దియ పలుకులు ముద్దు సేసి. 29**

**ప్రతిపదార్థం:** అది, అట్లు+ఉండెన్= అది అట్లా ఉండగా; నేఁడు= ఇవ్వేళ; కౌరవులు; పసులన్+పట్టిరి+అని= ఆవులను బందీచేశారని; కూయి= మొరపెట్టుకొంటూ వచ్చిన వార్త; వచ్చినన్= రాగా; అన్న= అన్న అయిన ఉత్తరుడు; సన్నద్ధుఁడు+ఐ= యుద్ధానికి సిద్ధపడి; వెనుకన్+తగులన్= కౌరవసేనలను వెన్నంటి తరమటానికి; సమకట్టి= పూనుకొని; సారథ్యంబు, చేయువాఁడు= రథాన్ని నడిపేవాడు; లేమికి= లేకపోవటంచేత; విషాదంబున్+ఒందినన్= విచారాన్ని పొందగా; నీ కందువ= నీ యొక్క నేర్పరితనం గురించి; సైరంధ్రి, చెప్పినన్; ప్రియంబు+అంది= సంతోషించి; నిన్నున్= (బృహన్నలను); తోడు+తేరన్= వెంటతీసికొనిరావటానికి; నన్నున్+పనిచినన్= నన్ను పంపగా; ఏనును= నేను కూడా; నీ పాల= నీ చెంత; నాకు; చనవు; కలుగుటన్+చేసి= దగ్గరి పరిచయం ఉండటంచేత; ఎల్ల విధంబులన్= అన్ని విధాలా (తప్పకుండా); తెత్తున్= తీసికొని వస్తాను;

అని, పూని, వచ్చితిన్= అని మాట ఇచ్చి వచ్చాను; ఈవును= నీవుకూడా; నా పలుకులు= నా మాటలు; కుఱుచ+చేయక= తక్కువ పరచక (లెక్కచేయక); నీ పెంపునున్= నీ గొప్పతనం కూడా; ప్రకటంబుగాన్= బయటపడేటట్లు; ఆ+ఉత్తర కుమారునకున్; రథంబు, కడపన్+ఇయ్యకొని= రథం నడపటానికి అంగీకరించి; ఈ+ఆపదన్= ఈ కష్టాన్ని; తలఁగన్+వలయున్= తప్పించాలి; ఇట్లు+ఒడంబడక= ఈ విధంగా అంగీకరించకుండా; తక్కుట= మానుకొనటం; నా వలని, వాత్సల్యంబు+ కొఱంత పఱుచుట= నాపట్ల అనురాగం (వత్సలభావం) తక్కువ చేయటమే; అనినన్= అని అనగా; ఆ+ముద్దియ= ఆ ముద్దరాలు-ఉత్తరయొక్క; పలుకులు= మాటలకు; ముద్దు+చేసి= ముచ్చటపడి ఆదరించి.

**తాత్పర్యం:** ఆ విషయం అట్లా ఉండగానే, ఇప్పుడు కౌరవులు ఆలమందలను పట్టుకొన్నారనే వార్త వచ్చింది. మా అన్న ఉత్తరుడు పోరాడటానికి తయారై సారథి చిక్కకపోవటంతో దిగులుపడి ఉండగా, సైరంధ్రి నీ నేర్పును తెలిపింది. అందుకు సంతోషించి, అన్న నిన్ను తీసికొని రావటానికి నన్ను పంపాడు. నాకూ నీ వద్ద చనవు ఉండటంవలన 'ఎట్లాగైనా తీసికొని వస్తా' నని చెప్పి వచ్చాను. నా మాటలను నిర్లక్ష్యం చేయకుండా, నీ గొప్పతనం బయటపడేటట్లు ఉత్తరుడికి సారథి కావటానికి అంగీకరించి, ఈ ఆపదనుంచి కాపాడాలి. నీవు దీనికి ఒప్పుకొనకపోతే నా మీద నీకు వాత్సల్యం కొరవడినట్లే' అని అన్నది. అర్జునుడికి ఉత్తర మాటలు ముద్దుగా అనిపించాయి.

**విశేషం:** ఉత్తర సారథివిషయాన్ని వెనుక పద్యంలో కొంతచెప్పి, ఈ వచనంలో బృహన్నలతో మరికొంత చెపుతుంది. ఉత్తర మాటలలో పొందిక, వినయం, ఎదుటివాడిని ఒప్పించే నేర్పు కనిపిస్తాయి. బృహన్నల కాదని చెప్పలేని పరిస్థితిని ఆమె 'చనువు' కారణంగా కల్పించింది. దానికితోడు గురుశిష్యులమధ్య నున్న వాత్సల్యాన్ని సాధనంగా చేసికొన్నది. ఇందులో ఉత్తరలో వయసుకు మించిన మానసిక పరిణతి కనిపించింది. తిక్కన పాత్రపోషణలో ఇది ఒక శిల్పరీతి.

**క. నగుచు బృహన్నల యిట్లను। 'జగతీశ్వర పుత్రి! నాకు సారథ్యము నే**
**ర్పు గలదె? నీ మాటకు నే। మిగులంగా వెఱతుఁ; బోదము మీఁ దట్లుండెన్. 30**

**ప్రతిపదార్థం:** బృహన్నల; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు; జగతీ+ఈశ్వర= రాజుయొక్క; పుత్రి!= కుమారీ! (ఉత్తరా!); నాకున్= నాకు; సారథ్యము నేర్పు= రథాన్ని తోలటంలో నేర్పు; కలదె?= ఉన్నదా?; నీ మాటకున్= నీవు చెప్పిన మాటకు; నేన్= నేను; మిగులంగాన్= దాటటానికి; వెఱతున్= భయపడుతున్నాను; పోదము= పోమ్ము, పద; మీఁదు= భవిష్యత్తు; అట్లు+ఉండెన్= అట్లా ఉన్నదేమో!

**తాత్పర్యం:** నవ్వుతూ బృహన్నల ఉత్తరతో ఇట్లా అన్నాడు- 'ఓ రాకుమారీ! సారథ్యం చేసే నేర్పు నా కున్నదా? నీ మాట దాటటానికి నాకు భయంగా ఉన్నది. సరే, పద, అట్లా జరగాలని ఉందేమో?'

**విశేషం:** బృహన్నల నిజానికి తనను సారథిగా ఎప్పుడు పిలుస్తారా? అని ఎదురుచూస్తూ ఉన్నాడు. ఉత్తర తనను ఆమె అన్న పిలువమన్నట్లు వచ్చి పిలిచింది. ఇది ఆతడికి లోపల సంతోషమే. కాని, పైకి మాత్రం 'నాకు సారథ్యంలో నేర్పు ఉందా? నీ మాట కాదనటానికి భయపడుతున్నాను. భవిష్యత్తు అట్లా ఉందేమో?' అనే మాటలు పలుకటం, ఆతడి సందర్భశుద్ధిని తెలుపుతుంది. సారథిగా వెళ్ళటం బృహన్నలకూ అవసరమే! ఆతడు దీనిని ఒక అవకాశంగా తీసికొన్నాడు.అందుకే, దేవుడిమీద బరువువేసినట్లు 'మీఁదట్లుండెన్' అని అంటూ ఒప్పుకొన్నాడు. 'నీ మాటకు నే మిగులంగా వెఱతు' అనటంలో ఉత్తరపై ఉన్న వాత్సల్యం కూడా స్పష్టపడుతుంది. ఉత్తర అభ్యర్థన కారణంగా, బృహన్నల ఆమెతో తరువాత పద్యంలో 'నీ కొరకు ఏ పనైనా చేసి, నీకు సంతోషాన్ని కలిగిస్తా' నని అంటాడు. 'మీదెట్లుండెన్' అనే పాఠాంతరం కొన్ని ప్రతులలో ఉన్నది.

**క. భవదీయ ప్రార్థనచేఁ । దివిరి పరమ దుష్కరములు దీర్చియయిన ను**
**త్సవ మొనరించెద సార । థ్య విధం బొకఁ డనఁగ నేల యంబుజవదనా!' 31**

**ప్రతిపదార్థం:** అంబుజవదనా!= పద్మంవంటి ముఖం గల ఉత్తరా!; భవదీయ= నీయొక్క; ప్రార్థనచేన్= అభ్యర్థనతో; సారథ్య విధంబు= సారథ్యం అనే పని; ఒకఁడు= ఒకటే; అనఁగన్+ఏల?= అనటం ఎందుకు?; తివిరి= ప్రయత్నంతో; పరమదుష్కరములు= మిక్కిలి కష్టంతో సాధించే పనులు; తీర్చి+అయినన్= నెరవేర్చి అయినా; ఉత్సవము+ఒనరించెదన్= సంతోషాన్ని కలిగిస్తాను.

**తాత్పర్యం:** ఓ ఉత్తరా! నీవు నన్ను వేడుకొన్నావు గనుక రథసారథ్యం ఒకటే ఏమిటి? ఎంత కష్టమైనా, ఏ పనైనా చేసి నీకు సంతోషాన్ని కలిగిస్తాను.'

**విశేషం:** బృహన్నల మాటలలో (సారథ్యవిధంబొకఁ డనఁగ నేల?) తాను సారథిగానే కాక, రథికుడిని అవుతాననే భావం కూడా తోస్తుంది. 'భవదీయ ప్రార్థనచే' అన్న ప్రయోగంవలన ఉత్తర మీద ఆతడికున్న అభిమానం ఎట్లాంటిదో తెలుస్తుంది. 'తివిరి పరమ దుష్కరములు తీర్చి అయిన నుత్సవ మొనరించెద' అనే మాటలలో కూడా ఆతడి శిష్యవాత్సల్యం ప్రత్యేకంగా తెలుస్తూ ఉన్నది.

**వ. అనుచు సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్త మెత్తన నడతెంచు మత్తశుండాలంబునుం బోలె. 32**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; సంగీత నిలయంబున్= ఆ నర్తనశాలనుండి; వెలువడి= బయటకు వచ్చి; సలీలంబుగాన్= విలాసంతో; మెత్త మెత్తన= మెల్ల మెల్లగా; నడతెంచు= నడచివచ్చే; మత్తశుండాలంబునున్+పోలె= మదించిన ఏనుగువలె.

**తాత్పర్యం:** పై విధంగా అంటూ, నాట్యశాల నుండి విలాసంతో మదించిన ఏనుగువలె నడుస్తూ. (ముందు పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిగాఁ జేసికొనుట (సం. 4-35-10)

**తే. అరుగుదెంచు బృహన్నల నంత నంతఁ । గని నృపాలసుతుం డను గారవమునఁ**
**'గౌరవులతోడఁ గయ్యంబు గలిగె నాకుఁ । గడఁగి నేఁడు రథ మ్మీవు గడపవలయు. 33**

**ప్రతిపదార్థం:** అరుగుదెంచు= వస్తూఉన్న; బృహన్నలన్; అంతన్+అంతన్= అల్లంతదూరంలోనే; కని= చూచి; నృపాలసుతుండు= రాజకుమారుడైన ఉత్తరుడు; గారవమునన్= ఆదరభావంతో; అనున్= అంటాడు; నాకున్= నాకు; కౌరవులతోడన్= కౌరవులతో; కయ్యంబు= యుద్ధము; కలిగెన్= వచ్చింది; కడఁగి= పూని; నేఁడు= ఇప్పుడు; రథమ్ము= రథాన్ని; ఈవు= నీవు; కడపవలయున్= నడపవలసింది.

**తాత్పర్యం:** అల్లంత దూరాననే బృహన్నలను చూచి ఉత్తరుడు గారవంతో 'కౌరవులతో నాకు కయ్యం వచ్చింది. నీవు నాకు రథాన్ని తోలాలి' అన్నాడు.

**విశేషం:** బృహన్నలను అల్లంతదూరాన్నించే చూచి, తన అవసరాన్ని తెలపటం, ఉత్తరుడి ఆత్రాన్ని తెలుపుతుంది. కౌరవులతో ఎందుకు యుద్ధం వచ్చిందో తానుగా ఉత్తరుడు బృహన్నలకు చెప్పలేదు. ఇది ఉత్తరుడి రాచరికపు గాంభీర్యాన్నీ, ఆతడి ఆరంభశూరత్వాన్నీ సూచిస్తుంది.

**క. వే రమ్ము; మై మఱువుఁ దొడి । తే రెక్కుము; దప్పఁ గ్రుంకఁ దీఱదు నీకున్;**
**సైరంధ్రి సెప్పె నీదగు । బీరమ్మును బెంపులావు వెరవును మాకున్.' 34**

**ప్రతిపదార్థం:** వే= వేగంగా; రమ్ము= రా; మై మఱువున్= కవచాన్ని (శరీరాన్ని మఱుగుపరిచేది); తొడి= తొడిగి; తేరు= రథం; ఎక్కుము; నీకున్= నీకు; తప్పన్+క్రుంకన్= తప్పించుకొనటానికి, మానటానికి; తీఱదు= కుదురదు; నీది+అగు= నీయొక్క; బీరమ్మును= వీరత్వాన్నీ (పరాక్రమాన్నీ); పెంపు= గొప్పతనాన్నీ (ఘనతనూ); లావున్= బలాన్నీ; వెరవును= ఉపాయాన్నీ (నేర్పునూ, చాతుర్యాన్నీ); మాకున్= మాకు; సైరంధ్రి; చెప్పెన్= (ఇదివరకే) చెప్పింది.

**తాత్పర్యం:** 'త్వరగా రావాలి. కవచాన్ని ధరించి రథాన్ని ఎక్కాలి. తప్పించుకొనాలనుకుంటే నీకు వీలుపడదు. నీ పరాక్రమాన్నీ, గొప్పతనాన్నీ, బాహుబలాన్నీ, సారథ్యంలో చాతుర్యాన్నీ గురించి మాకు సైరంధ్రి ముందే చెప్పింది.'

**విశేషం:** ఉత్తరుడు 'మాకు' అని అనడంలో, రాచరికపు మర్యాద, గౌరవం తెలుస్తాయి. ఉత్తరుడి విషయంలో ఈ పదం ముందుకథలో ఎగతాళికి భాజనం అయింది. 'బీరము, పెంపు, లావు వెరపు' - ఈ గుణాలు వీరులకు అవసరం. రథికుడికే కాక సారథికీ అవసరమే. సారథి తెలివితేటల మీద కొంతవరకు రథికుడి విజయం ఆధారపడుతుంది. సమర్థులైన సారథులు కొందరు రథికుల మాన ప్రాణాలను కాపాడారు. కనుక యుద్ధంలో సారథి చాలా ప్రధానం అయినవాడు. ఆతడు కేవలం రథాన్ని మాత్రమే నడపడు. క్లిష్టసమయంలో రథికుడికి 'ఉపాయాన్ని' సూచించి,ఆతడి విజయానికి సహకరిస్తాడు. అందుకే తిక్కన మహాకవి బృహన్నలకు పైలక్షణాలు ఉన్నాయని సైరంధ్రి ద్వారా ఉత్తరుడికి చెప్పించాడు.

**చ. అనుటయు, 'నాట పాట గల యప్పటికిన్ ననుఁ గోరి పిల్వఁబం**
**చినఁ దగుఁగాక; సంగరము సేఁతకు సారథి గమ్ము, రమ్ము, నీ**
**వను టుచితంబె? యెల్లెడల నారసి బాహుబలాఢ్యుఁడైన యొ**
**క్కని రథ మేడ్తెఱం గడపఁగా నియమింపుము రాజనందనా!' 35**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (పైవిధంగా ఉత్తరుడు) అన్న వెంటనే; రాజనందనా!= ఓ రాకుమారా!; ఆటపాట= నాట్యం, సంగీతం; కల+అప్పటికిన్= ఉండినప్పుడు (నాట్యసంగీత సంబంధంగా); ననున్= నన్ను కూడా; కోరి= కోరుకొని; పిల్వన్= పిల్వటానికి; పంచినన్= ఆజ్ఞాపించగా; తగున్+కాక= సరిపోతుందిగాని; సంగరము+చేఁతకున్= యుద్ధపుపనికి (యుద్ధాన్ని చేసేందుకు); సారథి+కమ్ము= సారథిగా ఉండుము; రమ్ము= రమ్మని; నీవు= నీవు; అనుట= అనటం; ఉచితంబు+ఎ?= న్యాయమేనా?, తగునా?; ఎల్ల+ఎడలన్= అన్నిచోట్లా; ఆరసి= బాగా వెదకి; బాహుబల+ఆఢ్యుఁడు+ఐన= భుజబలంలో గొప్పవాడైన; ఒక్కనిన్= ఒక సమర్థుడిని; రథము= రథాన్ని; ఏడ్తెఱన్= నేర్పుతో; కడపఁగాన్= నడపటానికి; నియమింపుము= ఆజ్ఞాపించుము.

**తాత్పర్యం:** 'రాకుమారా! ఏదైనా ఆటపాట విషయమైతే నన్ను రమ్మంటే సరిపోతుంది కానీ, యుద్ధానికి పోతూ సారథి కావాలి, రా! అని పిలవడం బాగుందా? (పట్టణంలో) అంతా వెదకి, బలవంతుడూ, సమర్థుడూ అయిన ఒకడిని సారథిగా ఏర్పాటు చేసికొనుము'.

**విశేషం:** ఉత్తరుడు విధిలేక, తనకు ఇష్టంలేకపోయినా, సైరంధ్రి మాటమీద, బృహన్నలను సారథిగా చేసికొనటానికి ఒప్పుకొన్నట్లు, బృహన్నలకు తెలుసు. అది మనసులో పెట్టుకొని, బృహన్నల ఇప్పుడు ఉత్తరుడిని కొంచెం ఉడికించటానికి పైపద్యంలో చెప్పినట్లు అంటాడు. ఇంకా ఎక్కువగా అడిగించుకొనటానికీ, పిలుస్తూనే పోయి ఒప్పుకొనటం వలన లోకువ అవుతుందనీ, తన అవసరం బాగా తెలియాలనీ కూడా బృహన్నల అట్లా అంటాడు. నాట్యాచార్యుడిగా తన పరిస్థితిని తెలిపి, బలవంతం చేయించుకొని ఒప్పుకొనాలని కూడా ఆత డట్లా అంటాడు. ఇది సంభాషణలో ఒక గొప్ప ఔచిత్యం.

**వ. అనిన విని వైరాటి కిరీటి కిట్లనియె. 36**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; వైరాటి= విరాటరాజు కుమారుడు (ఉత్తరుడు); కిరీటికిన్= అర్జునుడితో (కిరీటం గలవాడు కిరీటి); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** (బృహన్నల యొక్క) ఆ మాటలను విని ఉత్తరుడు ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఖాండవ మేర్చునప్పుడు తగన్ రథచోదక వృత్తి సల్పి; యా**
**ఖండలసూతికిన్ జయము గల్గ నొనర్చిన యట్టి బుద్ధియున్**
**దండితనంబు నీ యెడన తక్కెనె? నా దెస మైత్రి పెన్పు; మిం**
**కొండొక మాట దక్కుము, రణోత్సహనం బొనరింపు గ్రక్కునన్.' 37**

**ప్రతిపదార్థం:** ఖాండవము+ఏర్చునప్పుడు= ఖాండవం అనే వనాన్ని కాల్చేటప్పుడు; తగన్= తగినవిధంగా; రథ= రథంయొక్క; చోదకవృత్తి= తోలేపనిని; సల్పి= నెరవేర్చి; ఆఖండల సూతికిన్= దేవేంద్రుడి కుమారుడైన అర్జునుడికి; జయము+కల్గన్= విజయం చేకూరేటట్లు; ఒనర్చిన+అట్టి= చేసిన సమయంలోఉన్న; బుద్ధియున్= తెలివీ; దండి తనంబున్= పరాక్రమమూ; నీ+ఎడన్+అ (నీ యెడన)= నీ యందే; తక్కెనె?= పోయాయా?; నా దెసన్= నాపై; మైత్రి= స్నేహాన్ని; పెన్పుము= ఎక్కువ చేసికొనుము; ఇంకన్= ఇంకా (ఇప్పుడుకూడా); ఒండు+ఒక మాట= వేరేమాట (బదులుమాట); తక్కుము= విడిచిపెట్టుము; గ్రక్కునన్= వెంటనే; రణ+ఉత్సహనంబు+ఒనరింపు= యుద్ధానికి ఉత్సహించుము (యుద్ధానికి సంసిద్ధం కమ్మ అని అర్థం).

**తాత్పర్యం:** 'ఖాండవ దహనంలో అర్జునుడికి సారథిగా ఉండి, ఆతడికి విజయాన్ని కల్గించినప్పటి తెలివితేటలూ, పరాక్రమం ఇప్పుడు మాత్రమే తగ్గాయా? నా మీద స్నేహాన్ని పెంచుకొమ్ము. యుద్ధానికి తయారుగా ఉండుము. నాకు మరోమాట చెప్పవద్దు'.

**విశేషం:** బృహన్నలకు సారథ్యంలో మంచి సామర్థ్యం ఉన్నట్లు మొదట సైరంధ్రి ఉత్తరకూ, తరువాత ఉత్తరుడికీ చెప్పింది. దాన్ని నమ్మిన ఉత్తరుడు, బృహన్నలను, ఖాండవదహనంలో అర్జునుడికి నీవల్లనే విజయం కలిగిందని ఇందులో అంటాడు. అదీ తనకు బాగా తెలిసినదానివలె; పైగా ప్రశంసించాడు కూడా. విధిలేక ఒప్పుకొన్న సంగతి బయటకు రానీక, ఉత్తరుడు అనటం ఉచితమే!

**తే. అనిన, నాతని మాటకు నడ్డమాడ । వెఱచినట్టి తెఱంగు భావించి యల్ల**
**నియ్యకొనుటయు; నమ్మనుజేంద్రసుతుఁడు । దృఢ తను త్రాణ మతనికిఁ దేరఁ బనిచె. 38**

**ప్రతిపదార్థం:** అనినన్= ఉత్తరుడు పైవిధంగా అన్నప్పుడు; అడ్డము+ఆడన్+వెఱచినట్టి= ఎదురుచెప్పటానికి భయపడ్డ; తెఱంగు= విధానాన్ని; భావించి= నటించి; అల్లన్= మెల్లగా; ఇయ్యకొనుటయున్= ఒప్పుకొనగా; ఆ+మనుజ+ఇంద్ర సుతుఁడు= ఆ రాజకుమారుడైన ఉత్తరుడు; అతనికిన్= బృహన్నలకు; దృఢ= గట్టిదైన; తను త్రాణము= కవచాన్ని; తేరన్= తీసికొనిరావటానికి; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** ఉత్తరకుమారుడి మాటలకు ఎదురు చెప్పటానికి జంకినట్లు జంకి, బృహన్నల తిన్నగా ఒప్పుకొన్నాడు. వెంటనే ఉత్తరుడు బృహన్నలకు గట్టి కవచాన్ని తీసికొనిరమ్మని ఆజ్ఞాపించాడు.

**క. తెప్పించి తొడుగు మీ వని । యొప్పించిన, నిట్టునట్టు నొఱవలుగా మైఁ**
**గప్పికొని, యా బృహన్నల । యప్పుడు నగుపించె నచటి యబలాజనమున్. 39**

**ప్రతిపదార్థం:** తెప్పించి= (కవచాన్ని) తెప్పించి; ఈవు= నీవు; తొడుగుము= తొడుగుకో; అని= అని చెప్పి; ఒప్పించినన్= అంగీకరించేటట్లు చేయగా; ఆ బృహన్నల; ఇట్టున్+అట్టున్= ఇటూ అటూ; ఒఱవలుగాన్= తార్మారుగా, తలక్రిందులుగా; మైన్= ఒంటిపైన; కప్పికొని= వేసికొని; అప్పుడు= ఆ సమయంలో; అచటి= అక్కడ ఉన్న; అబలాజనమున్= ఆడవాళ్ళను; నగుపించెన్= నవ్వించాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడు గట్టి కవచాన్ని తెప్పించి తొడుక్కోమని బృహన్నలకు ఇస్తే దాన్ని ఆతడు క్రింది భాగం పైకీ, పైభాగం క్రిందికీ వచ్చేటట్లు తలక్రిందుగా ఒంటిపైన కప్పుకొని, అక్కడి ఆడవాళ్ళను నవ్వించాడు.

**విశేషం:** తాను అమాయికుడను - అని నిరూపించేందుకు బృహన్నల ఇట్లా చేశాడు. పైగా ఇంతకుముందు, 'ఆటపాట విషయంగా పిలిపిస్తే బాగుంటుంది గాని, యుద్ధం చేయటానికి సారథిగా ఉండమంటే ఏం బాగుటుంది' అనీ బృహన్నల ఉత్తరుడితో (35ప॥) అనిఉన్నాడు. దానికి తగినట్లు, ఇప్పుడు కవచాన్ని తొడుక్కొనేటప్పుడు కూడా ఏమీ తెలియనట్లు తలక్రిందులుగా బృహన్నల తొడుక్కొన్నాడు.

**క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ । దత్తనువున మఱువు దొడిగి తానును హృద్యో**
**దాత్తంబగు కంకట మిడి । చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ జిడిముడిపడఁగన్. 40**

**ప్రతిపదార్థం:** ఉత్తరుఁడు= ఉత్తరకుమారుడు; సత్వరంబుగన్= తొందరగా; తద్+తనువునన్= ఆ బృహన్నల దేహానికి; మఱువు= కవచాన్ని; తొడిగి= తానే తొడిగి; తానును= తానూ; హృద్య+ఉదాత్తంబు+అగు= మనోహరం, గొప్పదీ అయిన; కంకటము+ఇడి= కవచాన్ని తొడిగి; చిత్తము= ఆలోచన (మనసు); పసిన్= పశువులను (ఆవులను); క్రమ్మఱింపన్= వెనక్కు మళ్ళించటానికి; చిడిముడిపడఁగన్= త్వరపడగా (ముందు వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** (బృహన్నల, కవచాన్ని తలక్రిందులుగా తొడుక్కొంటే) ఉత్తరుడు వెంటనే బృహన్నల శరీరానికి ఆ కవచాన్ని సరిగా తొడిగి, రమణీయమూ, ఉదాత్తమూ అయిన మరొక కవచాన్ని తానూ తొడుక్కొని, ఆవులను మళ్ళించటానికి మనసు తొందరించగా.

**విశేషం:** బృహన్నల కవచాన్ని తలక్రిందులుగా తొడుగుకొంటే, ఉత్తరుడే దానిని స్వయంగా ఆతడికి తొడిగాడు. రాకుమారుడై ఉండి కూడా సారథికి కవచాన్ని తొడగటం ఏమిటి? అనే సందేహానికి - 'ఉత్తరుడి అవసరం అటువంటిదిలే' అని

సర్దుకొనవచ్చును. కాని, కవచాన్నే తొడుక్కొనటం తెలియని బృహన్నల ఎట్లా సారథ్యం చేస్తాడనే అనుమానం కూడా ఉత్తరుడికి రాలేదు. పైగా బృహన్నల, కవచాన్ని తొడుక్కొనే తీరుతో ఆడవాళ్ళని నవ్వించాడు. అందరితోపాటు ఉత్తరుడూ నవ్వుకొనే ఉంటాడు. ఉత్తరుడి మనసంతా 'పసిఁగ్రమ్మఱింప చిడిముడి' (ఆవులను మళ్ళించటానికి తొందర) పడుతూ ఉన్నది. ఆ తొందరలో ఆతడికి ఆ అనుమానం వచ్చిఉండదు. మరి ఈ సన్నివేశాన్ని కవి ఎందుకు చిత్రించినట్లు? దీనికి ఇట్లా సమాధానం చెప్పుకొనవచ్చును?

వికృతమైన ఆకారంవలనా, చేష్టలవలనా హాస్యం పుట్టుతుంది. అర్జునుడు వికృతాకారుడైన బృహన్నలగా ఉన్నాడు. ఆ వికృతత్వానికి తోడు, కవచాన్ని 'ఒఱవలుగా' (తలక్రిందులుగా) తొడుక్కొనడం జరిగింది. అందుకే అక్కడ హాస్యం పుట్టింది. కనుకనే అట్లా జనం నవ్వింది. హాస్యాన్ని పుట్టించటానికే కవి ఇట్లా వర్ణించాడు.

**వ. బృహన్నల నవలోకించి.** **41**

**తాత్పర్యం:** బృహన్నలను చూచి (ఉత్తరుడు ఇట్లా అన్నాడు.)

**క. 'హయములఁ బూన్పుము రథమున, । రయమున సిడమెత్తు; మిపుడ రావలయును గో**
**చయము గొని, యస్మదీయ వి । జయ మభినందింపఁ బురముజను లెదురుకొనన్.'** **42**

**ప్రతిపదార్థం:** హయములన్= గుర్రాలను; రథమునన్= రథానికి; పూన్పుము= కట్టుము; రయమునన్= తొందరగా (వెంటనే); సిడము+ఎత్తుము= జెండాను కట్టుము; అస్మదీయ= మాదైన; విజయము= విజయాన్ని; అభినందింపన్= పొగడటానికి; పురము జనులు= పట్టణంలో ఉన్న ప్రజలు; ఎదురుకొనన్= ఎదురువచ్చేటట్లు; గోచయము= ఆవులమందను; కొని= తోలుకొని; ఇపుడు+అ= ఇప్పుడే (ఏమాత్రం ఆలస్యం లేకుండా); రావలయును= తిరిగిరావాలి.

**తాత్పర్యం:** 'రథానికి గుర్రాలను కట్టుము. తొందరగా ధ్వజాన్ని నిలుపుము. పౌరులందరూ నా విజయాన్ని పొగడి స్వాగతం చెప్పేవిధంగా వెంటనే ఆవులను తోలుకొని రావాలి'.

**విశేషం:** పురజనులంతా తన విజయాన్ని ప్రశంసిస్తూ, మందను మళ్ళించుకొని వచ్చినందుకు స్వాగతం చెప్పాలని అనుకొనటం ఉత్తరుడి శక్తికి మించిన పనే అయినా, అప్పటికి అది ఆతడికి తెలియదు కనుక, అట్లా అనుకొనటమే ఉచితం. అట్లా అనుకొనటంలో, ఆతడి పనితొందరా, ఆసక్తి, ఆశయం తెలుస్తాయి. అంతే కాదు, అది భావిశుభసూచనం, శుభశకునం కూడా.

**తే. అనిన 'నీ వేమి పనిచిన నట్ల చేయ । వలయు; నీ వున్నయెడ నుండవలయు; నీవు**
**సన్న దెసఁ జనవలయు; నా శక్తి యెఱిఁగి । పంచి పనిగొని కడిమిమైఁ బగఱ గెలుము.'** **43**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా (పైవిధంగా ఉత్తరుడు అనగా దానికి బృహన్నల); నీవు= నీవు; ఏమి= దేనిని; పనిచినన్= నియమిస్తే; అట్లు+అ= అట్లాగే; చేయవలయున్= చెయ్యాలి; నీవు+ఉన్న+ఎడన్= నీవు ఉండేచోటనే (నీవు ఎక్కడుంటే అక్కడ); ఉండవలయున్= ఉండాలి; నీవు= నీవు; చన్నదెసన్= పోయిన పక్కకు; చనవలయున్= (నేనూ) పోవాలి; నా= నా యొక్క; శక్తి= సామర్థ్యాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; పంచి= ఆజ్ఞాపించి; పనిగొని= పనిచేయించుకొని; కడిమిమైన్= పరాక్రమంతో; పగఱన్= పగవాళ్ళను; గెలుము= గెలవవలసింది.

**తాత్పర్యం:** ఉత్తరుడి మాటలకు బృహన్నల ఇట్లా అన్నాడు: 'నీ వేమి చెప్పితే అదే చేయాలి; నీ ఉండేచోటనే ఉండాలి. నీవు పోయిన చోటికే పోవాలి. నా శక్తి ఎంతో తెలిసికొని నన్ను నియమించి నాతో పనిచేయించుకొని పగవాళ్ళను జయించుము.'

**విశేషం:** నీ వేమి పనిచిన-చనవలయు-అనే మాటలలో, సారథిగా తాను ఎట్లా ఉండాలో బృహన్నల చెప్పుకొన్నాడు. పైకి వినయంగా చెప్పుకొన్నట్లున్నా, లోతుగా చూస్తే బృహన్నల మాటలలో హేళన కూడా ఉన్నట్లు తోస్తుంది. నీవు ఒంటిగా యుద్ధానికి పోలేవనీ, నే నుంటేనే నీకు విజయం కలుగుతుందని కూడా బృహన్నల మాటలలో ధ్వనిస్తుంది. 'నా శక్తి యెఱిఁగి', అనటంలో, తనశక్తికి మించకుండా ఏవైనా పనులు చేయడానికి ఆజ్ఞాపించుమని, మామూలుగా పైకి కనిపించే అర్థం. ఇందులో నిగూఢం అయిన అర్థం కూడా ఉన్నది. నా శక్తిని గమనించి, నేను ఎంతటివాడినో తెలిసికొనగలిగితే, నీకు విజయం తప్పక కలుగుతుందనీ అర్థమే! నా విషయంలో జాగ్రత్త అని కూడా ధ్వని.

**వ. అని పలుకుచు మనంబున ముదం బొదవ నా ధనంజయుండు. 44**

**ప్రతిపదార్థం:** అని పలుకుచున్= అని అంటూ; మనంబునన్= హృదయంలో; ముదంబు+ఒదవన్= సంతోషం కూడగా; ఆ ధనంజయుండు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** పై విధంగా అంటూ, మనస్సులో సంతోషం కలుగగా ఆ అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇన్నాళ్ళుగా కౌరవులమీద నున్న కసి తీర్చుకొనటానికి కొంతవరకైనా అవకాశం చిక్కింది కదా అని అర్జునుడికి సంతోషం కలిగింది. అదీ మనసులోనే; పైకి కనిపించదు.

**క. కాంచనమాలాలంకృత । చంచత్తను లీల మెఱయ జవనాశ్వములం**
**బూంచి రథంబున మణిమయ । పంచాననకేతు వెత్తె బంధుర భంగిన్. 45**

**ప్రతిపదార్థం:** కాంచన= బంగారంతో చేయబడ్డ; మాలా= దండలతో; అలంకృత= అలంకరించబడ్డ; చంచత్= ప్రకాశించే; తను= శరీరంయొక్క; లీల= విలాసం; మెఱయన్= శోభిల్లుతున్న; జవన+అశ్వములన్= వేగంగా పోయే గుర్రాలను; రథంబునన్= రథానికి; పూంచి= కట్టి; బంధుర= దట్టమైన; భంగిన్= పద్ధతిలో; మణిమయ= మణులతో నిండిన (మణులను పొదిగిన); పంచానన= సింహం ఆకారంలోఉన్న; (వెడల్పుగల మొగం ఉండేది కనుక, సింహానికి పంచాననం అనే పేరు వచ్చింది); కేతువు= జెండాను; ఎత్తెన్= పైకెత్తి కట్టాడు (ఎగురవేశాడు).

**తాత్పర్యం:** బంగారు దండలు వేయటంవలన మెరిసిపోయే వేగవంతాలైన జాతిగుర్రాలను రథానికి కట్టి, నవరత్నాలు పొదిగిన సింహకేతనాన్ని రథానికి కట్టాడు.

**విశేషం:** వీరులకు యుద్ధానికి పోవటమంటే పెళ్ళికి పోవటమే. అందుకే అలంకరించుకొంటారు. అట్లాగే రథాన్నీ, గుర్రాలనూ, ఏనుగులనూ రకరకాలైన మణులు పొదిగిన ఆభరణాలతో అలంకరిస్తారు. ఆ పద్ధతే ఇప్పుడు ఆవులనూ, ఎద్దులనూ పట్టెడలతో అలంకరించటంలో ఉన్నది.

**వ. ఇట్లు సన్నాహంబు మెఱసిన సారథిం జూచి యుత్తరయుం జెలులు నిట్లనిరి. 46**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సన్నాహంబు మెఱసిన= యుద్ధానికి సిద్ధంగాఉన్న; సారథిన్+చూచి; ఉత్తరయున్, చెలులున్= ఉత్తరా, ఆమె చెలికత్తెలూ; ఇట్లు+అనిరి= ఇట్లా పలికారు.

**తాత్పర్యం:** ఈ రకంగా యుద్ధానికి వెళ్ళటానికి సిద్ధంగా ఉన్న సారథి అయిన బృహన్నలను చూచి ఉత్తరా, ఆమె చెలికత్తెలూ ఇట్లా అన్నారు.

**క. 'కురువీరుల గెలిచి తదం । బరములలోఁ జిత్రవర్ణ భాసురములుగాఁ**
**దర మెఱిఁగి లోచనోత్సవ । కరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ.' 47**

**ప్రతిపదార్థం:** కురువీరులన్= కౌరవవీరులను; గెలిచి= జయించి; తద్+అంబరములలోన్= వారు ధరించిన గుడ్డలలో (తలపాగాలలో); చిత్రవర్ణభాసురములు+కాన్= రంగురంగులు వెలుగొందేవిగా; తరము+ఎఱిఁగి= వాసిని తెలిసికొని (నాణ్యతను గుర్తించి); లోచన+ఉత్సవకరములుగాన్= కంటికింపుగా ఉండే (వస్త్రాలను); బొమ్మపొత్తికలకున్= బొమ్మలకు కట్టే గుడ్డలకొరకు; తెండీ= తీసుకొనిరండి.

**తాత్పర్యం:** 'కురువీరులను జయించి, వాళ్ళ తలపాగాలలో రంగురంగులతో వెలుగొందేవాటినీ, కన్నులపండుగగా ఉండేవాటినీ, వాసి తెలిసి, బొమ్మపొత్తికలకు తీసికొని రండి.'

**విశేషం:** చిన్న పిల్లలు ఆడుకొనే తాటాకు, కొయ్య, లక్క మొ॥ బొమ్మలకు కట్టే రంగురంగు గుడ్డలను బొమ్మపొత్తికలు అంటారు. ఇవి పట్టు. ఉన్ని, నూలు మొదలైన రకరకాల గుడ్డలు. ఘనమైన కురువీరుల తలపాగాలు విలువైనవిగా, అందమైనవిగా ఉంటాయి. కనుకనే ఉత్తర మొదలైన బాలికలు వాటిని అపురూపమైనవిగా అనుకొనటంవలన వాటిని తెమ్మని చెప్పారు. లోకోత్తర వీరులైన కౌరవుల తలపాగాలను కేవలం బొమ్మపొత్తికలకై తెమ్మనటం ఎంతో గొప్ప అనీ, అదీ తన అన్నచేత తెప్పించుకొనటం ఆతడి పరాక్రమానికి ఒక గుర్తుగా ఉంటుందనీ ఉత్తర భావించింది.

**క. అనుడు బృహన్నల యిట్లను, । 'జనపాలకనందనుండు జయలక్ష్మిం జే**
**కొనునటె! చీరలు దెచ్చుట । పనియే! యటు సూడుఁ, డెల్ల భంగులఁ దెత్తున్.' 48**

**ప్రతిపదార్థం:** అనుడున్= (ఉత్తరా, చెలికత్తెలూ పైవిధంగా) చెప్పగానే; బృహన్నల; ఇట్లు+అను= ఇట్లా అన్నాడు; జనపాలక నందనుండు= రాకుమారుడు అయిన ఉత్తరుడు; జయలక్ష్మిన్= విజయం అనే లక్ష్మిని; చేకొనును+అటె!= చేపడతాడట!; చీరలు= వస్త్రాలు (బొమ్మపొత్తికలు); తెచ్చుట= తీసికొనిరావటం; పనియే?= అదొక పెద్దపనా?; అటు+చూడుఁడు= అట్లే చూస్తూఉండండి (క్షణంలో); ఎల్లభంగులన్= ఎట్లాగైనా; తెత్తున్= తెస్తాను.

**తాత్పర్యం:** ఉత్తరా, చెలికత్తెలూ పైవిధంగా అన్నదానికి బృహన్నల ఇట్లా అన్నాడు- 'రాకుమారుడు విజయలక్ష్మిని చేపడతాడట! బొమ్మపొత్తికలు తేవటం అంత పెద్దపనా? అట్లాగే చూస్తూ ఉండండి, చిటికెలో వాటిని తప్పక తీసికొని వస్తాను'.

**విశేషం:** తలపాగాలను కోసి తీసికొనిరావటం అంటే వాళ్ళతలలను తెచ్చినట్లే! వీరుడికి తలపాగా చాలా విలువైనది. అట్లాగే, రథానికి కేతనం (జెండా) కూడా అట్లాంటిదే. జెండా కూలడమంటే ఆ వీరుడు కూలడమే! అందుకే ఉత్తర కురువీరుల తలపాగాలను తెమ్మన్నది. 'రాకుమారుడైన ఉత్తరుడు జయలక్ష్మిని చేపడతాడట. నేను చీరలను తేవటం ఎంత?' అని

అనటంలో బృహన్నలలోని పరిహాసకుశలత కనబడుతుంది. ఇందులో రాకుమారుడు జయం పొందేమాట ఎట్లా ఉన్నా (యుద్ధం చేసే విషయం), తాను కౌరవుల వస్త్రాలను తెస్తాననే సూచన కూడా ఉన్నది.

**వ. అనుచు ధనుస్తూణీర కృపాణ ముద్గరాది వివిధ సాధనంబులు రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగలెక్కి పగ్గంబుల స్రుక్కుసక్కంజేయ, నుత్తరుండును బసులం బట్టిన దెస గోపాలకు నడిగిన, వాఁడు పితృవణంబువలనని చెప్పిన వినుచు, రథారోహణంబు సేసి, వెడలి, పౌరవృద్ధ పుణ్యాంగనా భూసుర సమూహంబులు బృహన్నలం జూచి 'తొల్లి ఖాండవ దహనంబున నర్జునునకు నీ కతంబున నయిన మాంగల్యం బెట్టి దట్టిద భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడు' మని దీవించి సేసలు సల్లం బురంబు నిర్గమించి, నిరర్గళపరాక్రముం డయిన యా ఫల్గును నైపుణంబున వల్గ దశ్వంబగు రథంబు రయంబునకు మెచ్చుచుం బరేతనిలయ ప్రాంత ప్రదేశంబు సేరం జని. 49**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; ధనుస్+తూణీర కృపాణ ముద్గర+ఆది= విల్లు, అమ్ములపొది, కత్తి, ఇనుపగుదియ మొదలైన; వివిధ= అనేకరకాలైన; సాధనంబులు= యుద్ధానికి అవసరమైన పరికరాలు; రథంబుపైన్= రథంమీద; పదిలంబుగాన్= భద్రంగా; ఇడి= ఉంచి; నొగలు= సారథి కూర్చుండే తొట్టివలె ఉండేచోటు; ఎక్కి; పగ్గంబుల= పగ్గాల; స్రుక్కు= చిక్కుముడి; చక్కన్+చేయన్= సరిజేయగా(విప్పగా); ఉత్తరుండును; పసులన్+పట్టిన దెస= గోగ్రహణం జరిగిన దిక్కుఏది అని; గోపాలకున్+అడిగినన్= ఆవుల కాపరిని (అధికారిని) ప్రశ్నించగా; పితృవణంబు, వలను+అని= శ్మశానం ఉండే దిక్కు-అంటే ఉత్తర దిక్కు అని; చెప్పినన్= చెప్పగా; వినుచున్= వింటూ; రథ+ఆరోహణంబు+చేసి= రథాన్ని ఎక్కటంచేసి; వెడలి= బయలుదేరి; పౌర= పురజనులు (పౌరులు); వృద్ధ= వృద్ధులు; పుణ్య+అంగనా= ముత్తైదువులు; భూసుర= బ్రాహ్మణులయొక్క; సమూహంబులు= గుంపులు (మొత్తాలు); బృహన్నలన్+చూచి= బృహన్నలను చూచి; తొల్లి= పూర్వం; నీకతంబునన్= నీవు కారణంగా; ఖాండవదహనంబునన్= ఖాండవవనాన్ని కాల్చినప్పుడు; అర్జుననకున్; అయినన్= కలిగిన; మాంగల్యంబు= శుభం; ఎట్టిది+అట్టిది+అ= ఎట్లాంటిదో అట్లాంటిదే; భవత్+సాహాయ్యంబునన్= నీ యొక్క సహాయంతో; భూమింజయునకున్= ఉత్తరుడికి; అయ్యెడు+అని= అవుతుంది అని; దీవించి= ఆశీర్వదించి; సేసలు= అక్షతలు; చల్లన్= చల్లగా; పురంబు= నగరం; నిర్గమించి= దాటి బయటికివచ్చి; నిరర్గళ= అడ్డులేని; పరాక్రముండు+అయిన= పరాక్రమం కలవాడయిన; ఆ, ఫల్గును, నైపుణంబునన్= ఆ అర్జునుడి నేర్పరితనం వలన; వల్గత్+అశ్వంబు= ముందుకు ఉరికే గుర్రాలతో కూడింది; అయిన; రథంబు, రయంబునకున్= రథంయొక్కవేగానికి; మెచ్చుచున్= పొగడుతూ; పరేతనిలయ= శ్మశానంయొక్క; ప్రాంత= సమీపంలోఉన్న; ప్రదేశంబు= చోటు (తావు); చేరన్+చని= సమీపించి.

**తాత్పర్యం:** పై విధంగా ఉత్తరతో, చెలికత్తెలతో చెప్పుతూ, బృహన్నల విండ్లను, అమ్ములపొదులనూ, కత్తులనూ, ఇనుపగుదియలు మొదలైన ఎన్నో ఆయుధాలను రథంలో పెట్టి, నొగలపై కూర్చొని, పగ్గాల చిక్కుముడులను విడదీశాడు. ఆ లోపల ఉత్తరుడు పశువులను కౌరవులు ఏ దిక్కులో పట్టుకొన్నారని గోపాలకులపెద్ద ద్వారా తెలిసికొని, శ్మశానంవైపుగా బయలుదేరాడు. పురజనులు, పెద్దలు, ముత్తైదువలు, బ్రాహ్మణులు బృహన్నలను చూస్తూ 'ఇంతకు ముందు ఖాండవాన్ని దహించేటప్పుడు నీ వలన అర్జునుడికి ఏ శుభం కలిగిందో, అట్లాంటి శుభమే ఇప్పుడు కూడా నీవలన ఉత్తరుడికి కలగాలి' అని దీవిస్తూ, అక్షతలు చల్లారు. ఉత్తరుడు నగరాన్ని దాటి, బృహన్నల సారథ్యనైపుణ్యంతో కూడిన రథవేగాన్ని పొగడుతూ, శ్మశానానికి సమీపంగాఉన్న చోటుకు చేరి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **అభినవ జలధర శ్యామంబు లగునెడ । లాకు జొంపంబుల ననుకరింప,**
**సాంధ్యరాగోపమచ్ఛాయంబులగు పట్లు । కిసలయోత్కరములఁ గ్రేణి సేయ,**
**రాజమరాళ గౌరములగు చోటులు । తఱచుఁ బూఁ బొదల చందంబు నొంద,**
**హారిద్రరుచి సమానాకృతులగు రావు । లడరెడు పుప్పొడులట్లు మెఱయఁ,**

**తే.** **గలయ నెగసి ధరాధూళి లలితవనము । దివికి నలిఁగాఁపు వోయెడు తెఱఁగు దాల్ప**
**గోగణము ముంగలిగ నేల గోడివడఁగ । నడచు కౌరవరాజు సైన్యంబుఁ గనియె.** 50

**ప్రతిపదార్థం:** (ముందుకు సాగిపోతున్న కౌరవుల మహాసైన్యాన్ని ఒక ఉద్యానవనంతో పోల్చి తిక్కన మహాకవి ఈ పద్యంలో రమణీయంగా వర్ణించాడు.) అభినవ= క్రొత్తదైన; జలధర= మేఘంవలె (జలాన్ని ధరించింది కనుక మేఘం అని భావం); శ్యామంబులు+అగు= నల్లనైన; ఎడలు= తావులు; ఆకుజొంపంబులన్= ఆకుల గుబురులను; అనుకరింపన్= అనుసరించగా (పోలినాయి అని భావం); సాంధ్యరాగ+ఉపమచ్ఛాయంబులు+అగుపట్లు= సాయంకాలపు ఎరుపురంగుతో పోల్చదగిన కాంతిగల తావులు; కిసలయ+ఉత్కరములన్= చిగుళ్ళ మొత్తములను; క్రేణి+చేయన్= గేలిచేయగా; రాజమరాళ= రాజహంసలవలె; గౌరములు+అగు= తలుపైన; చోటులు= స్థలాలు; తఱచు= దట్టమైన (అరుదైన); పూ+పొదలచందంబున్+ఒందన్= పూలపొదరిళ్ళవలె ఉండగా; హారిద్ర= పసుపుపచ్చరంగుయొక్క; రుచి= కాంతితో; సమాన+ఆకృతులు+అగు= సమానమైన ఆకారం ఉన్న; రావులు= ప్రదేశాలు: అడరెడు= వ్యాపించే; పుప్పొడులట్లు= పుప్పొళ్ళవలె; మెఱయన్= శోభిల్లగా; కలయన్+ఎగసి= కలిసి పైకి ఎగిరి; ధరా= నేలపైఉన్న; ధూళి= దుమ్ము (అనే పుప్పొడి); లలితవనము= రమణీయం అయిన ఒక ఉద్యానవనం; దివికిన్= స్వర్గలోకానికి; నలిన్= మెల్ల మెల్లగా (క్రమంగా); కాఁపు+పోయెడు= వలసపోతున్న; తెఱఁగు+తాల్పన్= రీతిగా ఉండగా; గోగణము= ఆవులమందకు; ముంగలిగన్= ముందర ఉన్న; నేల= భూమి; గోడి+పడఁగన్= క్రుంగిపోగా; నడచు= నడుస్తున్న; కౌరవరాజ= కురురాజైన దుర్యోధనుడియొక్క; సైన్యంబున్= సేనను; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** ఆవులమంద వెనకాల వెళుతున్న కురుసైన్యాన్ని ఉత్తరుడు కనుగొన్నాడు. ఆ మహాసైన్యం నడుస్తూవుండగా లేచిన రంగురంగుల ధూళి అందమైన ఉద్యానవనంవలె ఉండి స్వర్గలోకానికి వలసపోతున్నదేమో అనేటట్లు అలరారింది. సైన్యం పోతూ ఉన్నప్పుడు రేగిన దుమ్ము రంగురంగుల ప్రదేశాలమీదుగా పైకిలేస్తూ ఉన్నది. మేఘంవలె ఉన్న నల్లటి ప్రదేశాలనుండి లేచిన దుమ్ము ఆకుగుబుర్లవలె ఉన్నది. సాయంకాలపు ఎఱుపువలె ఎర్రగా ఉండే తావులనుంచి లేచిన దుమ్ము చిగుళ్ళ గుంపులవలె ఉన్నది. రాయంచలవలె ఉన్న తెల్లటి తావులమీదుగా లేచిన ధూళి, గుబురైన పూలపొదరిళ్ళవలె ఉన్నది. పసుపుపచ్చని తావులలో లేచిన దుమ్ము అలా కలిసి పైకెగసిన ఆ ధూళియొక్క దృశ్యం వెరసి పుప్పొడివలె ఉన్నది. ఒక ఉద్యానవనం స్వర్గలోకానికి వలసపోతూ ఉన్నట్లుంది. ఆ సైన్యం నడుస్తూ ఉంటే ముందున్న నేల కుంగిపోతున్నట్లుగా ఉన్నది. అట్లా ఉన్న మహాసైన్యాన్ని ఉత్తరుడు చూచాడు.

**విశేషం:** 1. 'నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వ' మనే ప్రశంసకు దోహదకారి అయిన సన్నివేశాలలో ఇది ఒకటి. ఉత్తరుడిలో ఉత్సాహం ఉరకలెత్తుతున్నది. ఆ స్థానంలో భయం పరవళ్ళుత్రొక్కే సన్నివేశం ఇక్కడ మొదలు కావాలి. అందుకు ఉత్సాహప్రేరకమైన విభావం భయానకంగా భావించబడాలి. ఈ ఘట్టంలో ఒక యుద్ధవీరుడు సైన్యాన్ని వీరదృష్టితో చూడాలి. అతడు వీరుడు కాకపోతే భీరదృష్టితో చూస్తాడు. కాని, ఆ రెండు దృష్టులకూ ఎదుట నిలిచే విభావం ఒకటిగానే ఉండాలి.ఇది రసశిల్పం. ఇక్కడ మూలచిత్రణం ఒక తీరుగా ఉన్నది. తిక్కన తీర్చిన తీరు మరొక రకంగా ఉన్నది. మూలంలో సైన్యం, దానివలన రేగిన దుమ్ము-అనే రెండంశాలు విడిగా వర్ణించబడ్డాయి.

శ్లో. "తదనీకం మహత్ తేషాం విబభౌ సాగరోపమమ్,
సర్పమాణ మివాకాశే వనం బహులపాదపమ్.
దదృశే పార్థివో రేణుర్జనితస్తేన సర్వతా,
దృష్టిప్రణాశో భూతానాం దివస్పృక్ కురుసత్తమ॥ (4-36-18)

ఆ మహాసైన్యం మొదట సముద్రంవలె కనపడింది. ఆ తరువాత దట్టమైన చెట్లతో కూడుకొన్న అడవి ఆకాశం వైపు ప్రాకుతున్నట్లు తోచింది. ఇది అత్యంత సుందరమైన ఉపమానం. అలలతో కదులుతున్నా అనంతంగా కనపడేది సముద్రం. ఇది సేనయొక్క బాహుళ్యాన్ని చెప్పేది. అయితే అది ముందుకు సాగుతున్నది. ఉత్తరుడు వెనుకనుండి చూచాడు. అనంతమైన సముద్రం ఆకాశాన్ని ముద్దుపెట్టుకొన్నట్లే ఉంటుంది. అయితే చతురంగసేన ఎత్తుపల్లాలుగా ఉండటంచేత పరిశీలించి చూస్తే అది సముద్రంగానే కాక, నడుస్తున్న అరణ్యంవలె ఉన్నది. అది ఆకాశంవైపు ప్రాకుతూ వెళ్ళుతున్నట్లుండటం సహజం. ఈ ఉపమానం సేనకు సంబంధించింది. మూలంలో దుమ్ముకూడా వర్ణించబడింది. ఆ దుమ్ము చూచేవారి దృష్టిని క్రమ్మివేస్తున్నది (నాశనం చేస్తున్నది). ఆకాశందాకా వ్యాపిస్తున్నది. మూలంలో దుమ్మును చూచి సైన్యాన్ని భావనం చేసిన తీరులేదు. సైన్యం కలిగించినంతగా దుమ్ము ఒక భావనను రేకెత్తించలేదు. మూలంలో సైన్యదర్శనానికున్న ప్రాముఖ్యం దుమ్ముకు లేదు. మూలంలో తిక్కన గమనించిన అంశం ఒకటి ఉన్నది. దృష్టినాశం చేయగలిగినంతటి దుమ్ము నిజంగా భూమ్యాకాశాలు వ్యాపించి ఉంటే సైన్యం కనపడుతుందా? దుమ్మే కనపడుతుందా? దుమ్మును చూచి సైన్యాన్ని ఊహించుకొనాలా? లేక, సైన్యాన్నీ దుమ్మునూ చూచినట్లు వర్ణించాలా? అన్న ప్రశ్న ఏర్పడుతుంది. తిక్కన దుమ్మును చూచి భయపడి, అంతభయానకమైన దుమ్మును రేపిన మహాసైన్య మహత్త్వాన్ని ధ్వనిమయంగా భావించి, ఆ తరువాత దర్శించి ఉత్తరుడు భయపడినట్లు చిత్రించి సహజశిల్పాన్ని ప్రదర్శించాడు. మూలంకంటే తన రచనను శిల్పసుందరం చేశాడు. అందువలన తెలుగులో సేన ముందు కనపడదు. సముద్రోపమానం వినపడదు. చెట్లతో కూడుకొన్న అడవి మూలంలో సైన్యం. తెలుగు దుమ్మే ఆ అడవిగా ఉత్ప్రేక్షించబడింది. ఆకాశానికి ఎగురుతున్న దుమ్మే తిక్కనలో వర్ణ్యవస్తువై నిలిచింది. దుమ్ము సైన్యానికి వ్యంజకమైన ద్రవ్యం. దుమ్ము వెనుక ఉన్న సైన్యం కనపడినా అది అలంకార ధ్వనిచే మరింత ఆస్వాదయోగ్యమౌతున్నది. దుమ్ము సైన్యగర్వచిహ్నం. తెలుగులో దివికి పోయేది దుమ్మే. సైన్యం కాదు. ఇది వస్తుధ్వని. మూలంకంటె ఇది సూక్ష్మతరం.

2. అలం: సీసపద్యపాదాలలో సర్వవస్తుమయ- ఉపమ; ఎత్తుగీతిలో-ఉత్ప్రేక్ష. క్రొక్కారు మేఘాలవలె నల్లగా ఉన్న దుమ్ము వనంలోని చెట్ల ఆకుల గుంపులను అనుకరిస్తున్నదట! సాంధ్యారుణచ్ఛాయలలో ఉన్న దుమ్ము చిగురాకులతో పోలి ఉన్నదట! రాజహంసలవలె తెల్లగా ఉన్న ధూళి పూపొదరిళ్ళవలె ఉన్నదట! పసుపురంగువన్నెతో ఉన్న దుమ్ము పుప్పొడివలె మెరిసిపోయిందట! ఇవన్నీ కలిసి ఎగిరితే నేలదుమ్ము అనే ఉద్యానవనం ఆకాశానికి వలసపోతున్నదా అన్నట్లు ఉన్నదట! ఉత్సాహం నుండి భయపరిణామానికి అనువైన అలంకారధ్వనిని కలిగిస్తుంది. ఈ విధంగా అలంకార ధ్వనిని రసధ్వనికి పోషకంగా నిబంధించటం రసాభ్యుదయ శిల్పం.

3. రంగంమీద ఇరువురు వీరులున్నారు, 1. అర్జునుడు, 2. ఉత్తరుడు. ఆ దృశ్యాన్ని అర్జునుడు వీరుడివలె దర్శించి ఉత్సాహాన్ని పొందుతాడు. అర్జునుడి పరాక్రమ ప్రభావంచేత ఆ సేన నిజంగా స్వర్గానికి పోయేటట్లు ఉన్నదని ధ్వని. ఉత్తరుడు భీరునివలె చూచాడు. అతడి కది భయానక విభావంవలె గోచరిస్తుంది. విభిన్న రసాల విశిష్ట వివేచనాన్ని అందించే అందమైన విభావచిత్రణ. ఇందులోని సేనను తిక్కనభాషలో చెప్పాలంటే భీకర రమణీయం. ఉత్తరుడికి భీకరం. అర్జునుడికి రమణీయం. సహృదయులకు భీకర రమణీయం.

4. తిక్కన అలంకార శిల్పం భావనాగంభీరం. లలితవనం దివికి వలసపోతున్నదో అన్నట్లున్నది. దివికి పోయే వనం కొమ్మలపైకి ఉండి వేళ్ళు క్రిందకు ఉండేటట్లు వెళ్ళుతుందా? కొమ్మలు క్రిందకు ఉండి వేళ్ళు పైకి ఉన్నట్లుగా వెళ్ళుతుందా?

అనే మీ మాంస వస్తుంది. తిక్కన కల్పవృక్షం వలెనే ఈ వనాన్ని భావనం చేశాడు. తలక్రిందులై మూలాలు దివివైపు ఉన్నాయి. చెట్ల కొమ్మలు భువివైపు ఉన్నాయి. అందుకే మనకు కనపడేవి క్రమంగా ఆకులూ, చిగుళ్ళూ, పూలూ, పుప్పొడులూ మాత్రమే. కొమ్మలూ, మొదలూ, వేళ్ళూ కనపడవు. దివికి వలసపోయే వనాన్ని సర్వవస్తు విషయ సమగ్రంగా ఉపమించటం కవిబ్రహ్మకే సాధ్యం. తిక్కన శిల్పపు తెనుగుతోటలో మెరిసే దివ్య లలితవనం ఈ పద్యం!

5. 'దివికి నరిగాఁపు వోయెడు' - అనే పాఠం కొన్ని ప్రతులలో ఉన్నది. (సంపా.)

## ఉత్తరుఁడు కురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట (సం. 4-36-8)

**క. కని యుత్తరుండు గరుపా । టీన మేనును, దలఁకు మనము, టెచ్చవడిన చూ**
**పును నై, తొట్రుపడుచు, ని । ట్లనియె, దిగులు సొచ్చి యా బృహన్నలతోడన్. 51**

**ప్రతిపదార్థం:** కని= (ఉద్యానవనంవలె నడుస్తున్న) కురుసేనను చూచి; ఉత్తరుండు; గరుపాటీన= గగుర్పాటుచెందిన; మేనును= శరీరమూ; తలఁకు మనమున్= (భయంతో) చలించే మనస్సూ; టెచ్చవడిన= తెల్లబోయిన; చూపును= చూపూ; ఐ= అయి; తొట్రు+పడుచున్= తడబడుతూ; దిగులు+చొచ్చి= దిగులుపడి; ఆ బృహన్నలతోడన్= సారథిగా ఉన్న ఆ బృహన్నలతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడు కురుసేనను చూచి, గగుర్పాటుతోకూడిన దేహంతో, చలించిపోయే మనస్సుతో, నిలిచిపోయిన చూపుతో, తొట్రుపాటుతో, దిగులుతో తన సారథి అయిన బృహన్నలతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఉత్తరుడికి మొదట మనస్సులో కలిగిన భయంవలన చూపులలో, దేహంలో వికారం కలిగింది. పైన చెప్పిన మానసిక, శారీరక సంబంధాలైన వికారాలు, భయానకరసాన్ని స్పష్టంచేశాయి. ఇందులో, ఉత్తరుడికి కలిగిన, మానసిక, శారీరకమైన భయభ్రాంతభావాన్ని తిక్కన చిత్రించాడు. ఈ భయానికి కారణాలను ఉత్తరుడు తరువాతి పద్యాలలో చెప్పాడు.

**శా. 'భీష్మద్రోణ కృపాది ధన్వినికరాభీలంబు, దుర్యోధన**
**గ్రీష్మాదిత్య పటుప్రతాప విసరాకీర్ణంబు, శస్త్రాస్త్ర జా**
**లోష్మస్ఫార చతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రం బుదగ్రధ్వజా**
**ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ జేరంగ శక్తుండనే? 52**

**ప్రతిపదార్థం:** భీష్మ= భీష్ముడూ; ద్రోణ= ద్రోణాచార్యుడూ; కృప= కృపాచార్యుడూ; ఆది= మొదలుగాగల; ధన్వి= విలుకాండ్ర యొక్క; నికర= సమూహంతో; ఆభీలంబు= భయాన్ని కలిగించేది; దుర్యోధన= దుర్యోధనుడు అనే; గ్రీష్మ+ఆదిత్య= ఎండాకాలపు సూర్యుడియొక్క; పటు= తీవ్రమైన; ప్రతాప= తేజస్సుయొక్క; విసర= ప్రసారంతో; ఆకీర్ణంబు= విస్తరించిందీ; శస్త్ర= శస్త్రాలయొక్క (మానవులు తయారుచేసినవి); అస్త్ర= అస్త్రాలయొక్క (మంత్రాలతో ప్రయోగించేవి); జాల= మొత్తం (అనే); ఊష్మ= తాపంయొక్క; స్ఫార= విస్తరించటం ఉన్న; చతుర్విధ= నాలుగు రకాలైన; ఉజ్జ్వల= కాంతిమంతమైన; బల= సైన్యంతో; అతి+ఉగ్రంబు= ఎక్కువ భయాన్ని కలిగించేదీ; ఉదగ్ర= పైకి ఎత్తబడ్డ; ధ్వజ= జెండాలు అనే; అర్చిష్మత్త్వ= అగ్నిశిఖలతో; ఆకలితంబు= బాగా కూడుకొన్నట్టిదీ (అయిన); సైన్యము+ఇది= ఈ సైన్యం; ఏన్= నేను; చేరంగన్= చేరటానికి (దాని దగ్గరికి పోవటానికి); శక్తుండనే?= శక్తి ఉన్నవాడినా? (తగినవాడినా?).

**తాత్పర్యం:** 'భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ మొదలైన మహావీరులతో ఈ సైన్యం చాలా భయంకరంగా ఉన్నది. దుర్యోధనుడు అనే వేసవికాలపు సూర్యుడి తాపంతో తీవ్రంగానూ, శస్త్రాస్త్రాలు అనే వేడిమి వ్యాపించింది గానూ, రథ, గజ, తురగ, పదాతులు అనే చతురంగ బలాలతో ఉగ్రంగానూ ఉన్నది. రథాలకు పైన కట్టిన జెండాల రెపరెపలు అగ్నిదేవుడు తన నాలుకలను అల్లార్చుతున్నట్లున్నాయి. అంత భయంకరమైన సైన్యాన్ని నేను చేరగలనా? (అంటే చేరలేనని భావం).

**విశేషం:** 1. అలం: రూపకం. తిక్కన విరాటపర్వంలో రచించిన గొప్ప పద్యాలలో ఇది ఒకటి.

2. ఈ పద్య రచనా శిల్పాన్ని గురించి, సందర్భోచిత్యాన్ని గురించి, రసనిర్వహణ ప్రౌఢిని గురించి, నాటకీయతను గురించి డాక్టర్ పాటిబండ మాధవశర్మగారి వ్యాఖ్య గమనించదగింది.

"రూపక దిదృక్షువై ప్రేక్షాగృహమునం దాసీనుడై చిత్రవర్ణ రమణీయమైన యవనికను దిలకించుచు తద్రామణీయక పరవశుడై వినోదించుచున్న సామాజికుడు ఆకస్మిక యవనికా తిరస్కరణమున ప్రత్యక్షమైన భయంకర దృశ్యమును దిలకించి యెట్టి యనుభవములు పొందునో ఈ సన్నివేశము నిరూపించుచున్నది. లలిత వనరూపమైన యవనిక ప్రదర్శింపబడనున్న రూపకము శృంగారరస ప్రధానమన్న సూచన చేయును. తీవ్ర రసాస్వాదనానుకూల సుకుమార మధురచిత్తవృత్తిని సామాజికునియందు ఉన్నిద్రము చేయును. యవనికాపసర్పణమున శృంగార వ్యంజక దృశ్యము సామాజికునకు ఇష్టము. భయానకదృశ్య ప్రత్యక్షముచే రసభంగమై సామాజికుని చిత్తము ఉద్విగ్నమగును.

ఈ ఘట్టమున ఉత్తరుడు తనకు దాను సామాజిక స్థానీయుడు. సామాజికునకు నటస్థానీయుడు. ప్రకృతిభీరువయ్యు కృతక ధీరతతో బయలుదేరిన ఉత్తరునకు తానేదో చూడబోవుచున్నట్లు లేదు. ఆ చూడబోవునదియు వినోదప్రాయమే యని యాతని భావన. ధూళితెర తొలగినప్పటికి వాని భ్రాంతి తొలగినది. అచింతితోపనతమైన భయంకర దృశ్యము అతని చిత్తమందలి సుకుమార మధురవృత్తిని భంజించి పరుషదీప్తవృత్తిని ప్రవేశపెట్టినది. ఆకస్మికమైన అతని భయావేశము చిత్తమున వర్తించి సూటిగా గాత్రమున ప్రవర్తించినది. అటుపిమ్మటగాని వాగ్రూపమున ప్రవర్తింపలేదు.

ఆకస్మిక కురుసేనా దర్శనమున భయావిష్టుడైన ఉత్తరుడు బృహన్నలతో పలికిన వాక్యాలే ఈ పద్యము. ధూళీపటలమున చిత్రవర్ణ కిసలయకుసుమాది సుందర వస్తూత్ప్రేక్షచే వసంతర్తు భావన చేయుచున్న యుత్తరునకు తదపసర్పణమున ఆకస్మిక గ్రీష్మర్తు దర్శనమగుట పద్యార్థమున సులక్ష్యమగుచున్నది. దుర్యోధనుడు గ్రీష్మాదిత్యుడుగా శస్త్రాస్త్రజాలము ఊష్మస్ఫూర్తిగా, ఉదగ్రధ్వజములు అర్చిష్మత్త్వముగా రూపొంది, కురుసేన ఉత్తరునకు దావాగ్ని విజృంభణముగా భాసించెను. ఆతని భావన యందలి లలితవనము ఆ దావాగ్నియందు దగ్ధమైపోయెను. భీష్మ, గ్రీష్మ, ఊష్మ, అర్చిష్మత్ శబ్దములు భయంకరమైన గ్రీష్మమున ఊష్మలమైన అర్చిష్మద్విజృంభణమును సువ్యక్తము చేయుచున్నవి. పద్యమంతతటను నిండారి ప్రాసస్థానమున ప్రతిష్ఠపొందిన ఊష్మాక్షరములు కురుసేనయందు ఆరోపింపబడిన అర్చిష్మదూష్మలతను సుష్ఠుగా వ్యంజించుచున్నవి. రషణవర్ణములు మూర్ధన్యములు, మూర్ధమునకు అధిదేవత అగ్ని గనుక ఈ వర్ణములు ఆగ్నేయములు. శ్రోతృచిత్త సంతాపజనకములు.

ఉత్తరుని చిత్తస్థాయియైన భీతి పద్యారంభాక్షరమైన 'భీ' చేతను, వడియం దావృత్తమైన 'భీ' చేతను చమత్కారముగా వ్యంజింపబడుచున్నది. ఇదియొకవిధమైన భావముద్రాలంకార మనదగును.

"రౌద్ర దర్శనాదిభి రనర్థాశంకనం భయమ్". ఆత్మవినాశహేతువగు రౌద్రవస్తు సాక్షాత్కారమున జీవుడు ఆత్మరక్షాతత్పరుడై యుపాయాన్వేషణ చేయును. "త్రస్త చిత్త విక్షోభో భీరోర్ఘోరేక్షణాదినా." భయము నీచప్రకృతి. ఘోరవస్తు దర్శనమున భీరువు చిత్తమున గలుగు భయము త్రాసము. అది క్షోభాత్మకము. ఆత్మరక్షణార్థము ఉపాయాన్వేషణ చేసి, అది లభించనప్పుడు భీరువునకు గల్గు వికారము విషాదము.

**"ఉపాయాభావజన్మా తు విషాదస్సత్త్వసంక్షయః,**
**నిశ్వాసోచ్ఛ్వాసహృత్తాప సహాయాన్వేషణాదికృత్."**

సత్త్వసంక్షయమువలన మనస్సు వివిధముగా ప్రకంపితమగును. మనోదార్ఢ్యము సడలుటచే సర్వాంగములు శిథిలమగును. హృదయము తప్తమగును. ఉచ్ఛ్వాసనిశ్వాసములు ఉష్ణముగా ధారాళముగా వెడలును. ఈ లక్షణములన్నియు ఉత్తరుని వాక్యమున సులక్ష్యములగుచున్నవి.

ఇ ఈలు ఉదాత్త స్వరములు. పాదత్రయప్రారంభములందును యతిస్థానములందును నివిష్టములైన ఇ, ఈ, ఏలు ఉత్తరుడు ఈ వాక్యమును ఉచ్చైస్స్వరమున ఉచ్చరించెనని వ్యక్తము చేయుచున్నవి.

భయానకస్థాయియైన భయము జన్మించుటకు 'వికృతరవసత్త్వాది దర్శనము' ఒక కారణముగా భరతముని పేర్కొనెను. ఈ యభిప్రాయమునే జగన్నాథ పండితరాయలు "వ్యాఘ్రాది దర్శనజన్మా" అని మరింత స్పష్టము చేసెను. శత్రుసేనా దర్శన జన్మమైన ఉత్తరుని భయము శార్దూల విక్రీడిత వృత్తరూపమును ధరించి, సహృదయుని హృదయమున భయభావముయొక్క ఝటిత్యుద్బోధకు సహకరించుట గుర్తింపదగియున్నది.

తిక్కనగారు ఉత్తరునినోట పలికించిన ఈ పద్యము వర్ణ్యవస్తు స్వరూప స్వభావవ్యంజకమై అర్థానురూపముగను, వక్తృచిత్తవృత్తి వ్యంజకమై రసానుసారముగను నిర్మింపబడి పరమోత్తమమైన శిల్పమునకు ఆశ్రయమగుచున్నది." (తిక్కన కవితా వైభవము: యువభారతి ప్రచురణ: (1974) పు.21-23) - (సంపా.)

**క. అకృతాస్త్రుఁడ, బాలుఁడఁ గా । ర్ముక విద్యా ప్రౌఢిమై నిరూఢులయిన యీ**
**శకుని జయద్రథ దుర్ముఖ । వికర్ణ కర్ణాది యోధ వీరుల కెదురే! 53**

**ప్రతిపదార్థం:** అకృత+అస్త్రుఁడన్= అస్త్రవిద్యలో నేర్పులేనివాడిని; బాలుఁడన్= బాలుడిని; కార్ముక విద్యా= వింటి సంబంధమైన (బాణ) విద్యతో; ప్రౌఢిమైన్= నైపుణ్యంలో; నిరూఢులు= పేరుకెక్కినవారు; అయిన= అయినటువంటి; ఈ= ఈ కనబడుతున్న; శకుని= శకునీ; జయద్రథ= సైంధవుడూ; దుర్ముఖ= దుర్ముఖుడూ; వికర్ణ= వికర్ణుడూ (దుర్యోధనుడికి వీళ్ళు తమ్ముళ్ళు); కర్ణ= కర్ణుడూ; ఆది= మొదలైన; యోధ వీరులకున్= వీరులైన యోధులకు; ఎదురే= సమానమా? (ఎదిరించేవాడినా?).

**తాత్పర్యం:** విలువిద్యలో నైపుణ్యం లేనివాడిని, బాలుడిని బాణవిద్యలో ఎంతో గట్టివారైన ఈ శకునీ, సైంధవుడూ, దుర్ముఖుడూ, వికర్ణుడూ, కర్ణుడూ మొదలైన మహావీరులకు సమానంగా నేను ఎదురు నిలుస్తానా? (నేను వాళ్ళను ఎదిరించలేనని తాత్పర్యం.)

**క. ఇట్టగు టెఱుఁగక వచ్చితి । మెట్టొకొ! మనభంగి; వీర లిందఱును గడున్**
**బెట్టిదులు; మనకు మార్కొను । నట్టి కొలఁది గాదు; భీతి యడరెడుఁ దోడ్తోన్. 54**

**ప్రతిపదార్థం:** ఇట్టు+అగుట= ఇట్లా అవుతుంది అని; ఎఱుఁగక= తెలియక; వచ్చితిమి= ఇక్కడికి వచ్చాము; మనభంగి= మనపరిస్థితి; ఎట్టు+ఒకొ?= ఎట్లా ఉందో, ఏమో?; వీరలు= ముందు చెప్పిన వీరులు; ఇందఱును= ఇంతమందీ కూడా; కడున్= మిక్కిలి; బెట్టిదులు= గొప్పశూరులు; మనకున్= మనకు; మార్కొనునట్టి= (వాళ్ళను) ఎదిరించే; కొలఁది+కాదు= శక్తి చాలదు; తోడ్తోన్= వెనువెంటనే; భీతి= భయం; అడరెడున్= కలుగుతూ ఉన్నది.

**తాత్పర్యం:** ఇక్కడ ఈ రకంగా ఉంటుందని తెలియకవచ్చాము. ఇంక మనకు ఏ గతి పడుతుందో? వీళ్ళంతా వీరాధివీరులు. మనం వాళ్ళను ఎదిరించలేము. అంతేకాక భయం కలుగుతూ ఉన్నది.

**ఉ. కౌరవసేనఁ జూచి వడఁకం దొడఁగెన్ మదితోన మేను; నీ**
**వూరక పోవుచున్కి యిది యొప్పునె? యిప్పటి భంగిఁ జూచిన**
**న్వీరల నేను మార్కొనమి నిశ్చయ, మట్లగుటన్ రయంబునన్**
**దేరు మరల్పు, ప్రాణములు దీపన మున్ వినవే బృహన్నలా!'. 55**

**ప్రతిపదార్థం:** కౌరవసేనన్= కౌరవులయొక్క సైన్యాన్ని; చూచి= చూచినవెంటనే; మదితోన= మనస్సుతోపాటు; మేను= శరీరంకూడా; వడఁకన్+తొడఁగెన్= వణికిపోతూ ఉన్నది; నీవు= నీవు (నీవేమో); ఊరక పోవుచున్+ఉన్కి= ఊరకనే రథాన్ని తోలుకుపోతుండటం (నా సంగతి పట్టించుకోకుండా నీ పాటికి నీవు అదేపనిగా రథాన్ని తోలుకొని పోతూ ఉండటం- అని భావం); ఇది= ఇట్లా చేయటం (రథాన్ని తోలుకొనిపోవటం); ఒప్పునె?= సరిపోతుందా?; ఇప్పటి భంగిన్= ఇప్పటి ఈ పరిస్థితిని; చూచినన్= చూచినట్లైతే; వీరలన్= కౌరవవీరులను; నేను= నేను; మార్కొనమి= ఎదిరించకపోవటం; నిశ్చయము= నిజమైన విషయం; అట్లు+అగుటన్= అట్లా కావటంవలన (ఎదిరించకపోవటంవలన); రయంబునన్= శీఘ్రంగా (వెంటనే); తేరు= రథం; మరల్పు= వెనక్కు తిప్పు; బృహన్నలా!= ఓ బృహన్నలా!; ప్రాణములు= ప్రాణాలు; తీపు+అనన్= తియ్యగా ఉంటాయని; మున్= ముందునుండి; వినవే?= వినలేదా?

**తాత్పర్యం:** కురుసేనను చూస్తూనే మనస్సూ దాంతోపాటు శరీరమూ వణికిపోతూ ఉన్నాయి. నీ వేమో నీ పాటికి హద్దూపద్దూ లేకుండా రథాన్ని తోలుకుపోతూనే ఉన్నావు. ఇది బాగుందా? ఈ పరిస్థితిలో నేను, వీళ్ళను ఎదిరించటం జరగనిపని. కనుక బృహన్నలా! రథాన్ని వెంటనే వెనక్కు తిప్పు. ప్రాణం అంటే తీపి అన్న విషయాన్ని నీవు ఇంతకుముందు వినలేదా?'

**వ. అనిన దరహసిత వదనుం డగుచు శతమఖతనయుం డతని కిట్లనియె. 56**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; దరహసితవదనుండు= చిరునవ్వుముఖం కలిగినవాడు; శత= నూరు; మఖ= యాగాలను చేసినవాడు-ఇంద్రుడియొక్క; తనయుండు= కుమారుడు; (ఇంద్రుడి కుమారుడు అర్జునుడు- ప్రస్తుతం బృహన్నల-అని నామధేయం). అతనికిన్= ఉత్తరుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కురుసేనను చూచి భయంతో వణికిపోతూ ఉన్న ఉత్తరుడు అన్న మాటలకు చిరునవ్వుతో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఉత్తరుడు ఎంత అమాయకుడో ఈ పద్యంలో తెలుస్తుంది. అందుకే అర్జునుడికి చిరునవ్వు. ఆ నవ్వులో ఉన్న రహస్యం ఉత్తరుడికి అర్థం కాదు. కారణం- ఆతడు భయభ్రాంతుడు కావటమే!

చ. 'అసదృశలీలఁ బొల్చు రథికావలి మీఁదఁ జనంగ వెఱ్ఱినే
మసలక యామిషంబు గొని మార్గము వట్టిన తుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టి గోధనము వేగ మరల్తము గాక; యిమ్మెయిం
బసు లటు వోవఁగా మరలఁ బాడియె నీకు నరేంద్రనందనా! 57

ప్రతిపదార్థం: నరేంద్ర!= రాజుయొక్క; నందనా!= కుమారా! (రాజకుమారా!); అసదృశ= సాటిలేని; లీలన్= విధంగా; పొల్చు= ఒప్పారు; రథిక+ఆవలి= వీరుల మొత్తం; మీఁదన్= పైకి; చనంగన్= పోవటానికి; వెఱ్ఱినే?= పిచ్చివాడినా?; మసలక= ఆలస్యంలేకుండా; ఆమిషంబున్+కొని= ఆహారాన్ని (ఆవులమందను) తీసికొని; మార్గము+పట్టిన= (తిరుగు) దారిబట్టిన; తుచ్ఛ= అల్పమైన; సైన్యమున్= సేనను; వెసన్+చని= వేగంగా పోయి; ముట్టి= చుట్టుముట్టి; గోధనమున్= ఆవులు అనే ధనాన్ని; వేగన్= వెంటనే (త్వరగా); మరల్తముకాక!= మళ్ళిద్దాం సుమా!; ఈ+మెయిన్= ఇట్లా; పసులు= ఆవులు; అటుపోవఁ గాన్= ఆ రకంగా వెళ్ళిపోతూ ఉంటే, (పరాయివారు అట్లా తోలుకొని పోతూ ఉంటే); మరలన్= వెనక్కు తిరిగిపోవటం; నీకున్= నీకు; పాడియె?= న్యాయమేనా?.

తాత్పర్యం: 'సాటిలేని ఆ కురుసైన్యంపైకి పోవటానికి నేను ఏమైనా పిచ్చివాడినా? కాకుంటే ఆవులమందలను తోలుకుపోయే ఆ కొద్దిపాటి సైన్యాన్ని ఎదిరించి, పశువులను మళ్ళిద్దాం. ఆవులను ఇట్లా వాటిపాటికి వాటిని వదలిపెట్టి, వెనక్కు వెళ్ళుదాం- అని అనటం నీకు ధర్మం కాదు. (కనుక ముందుకే పోదామని భావం).

ఉ. అంతిపురంబులోనఁ గల యంగన లెల్లను నెమ్మనంబులన్
సంతసమందఁగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని, నీ
వెంతయు మేటివై, యరదమెక్కి రయంబున వచ్చి, యిచ్చటన్
దంతితురంగ సద్భటకదంబముఁ జూచి కలంగు టొప్పునే!' 58

ప్రతిపదార్థం: అంతిపురంబులోనన్= అంతఃపురంలో; కల= ఉన్నట్టి; అంగనలు+ఎల్లను= ఆడవాళ్ళంతా; నెమ్మనంబులన్= నిండుమనస్సులతో; సంతసము+అందఁగాన్= సంతోషపడే విధంగా; పసులన్= ఆవులను; చయ్యనన్= వెంటనే; తెచ్చెదన్= తెస్తాను; అంచున్= అని చెప్పి; పూని= పూనుకొని; నీవు= నీవు; ఎంతయున్ మేటివి+ఐ= పెద్దవీరుడవై; అరదము+ఎక్కి= రథమెక్కి; రయంబునన్= వేగిరంగా; వచ్చి= ఇక్కడికి వచ్చి; ఇచ్చటన్= (ఇప్పుడు) ఇక్కడ; దంతి= ఏనుగులయొక్క; తురంగ= గుర్రాలయొక్క; సత్+భట= శ్రేష్ఠమైన కాల్బలంయొక్క; కదంబమున్= మొత్తాన్ని; చూచి= చూచిన తర్వాత; కలంగుట= కలతచెందటం (భయపడడం); ఒప్పునే?= సరిపోతుందా?

తాత్పర్యం: అంతఃపురంలో ఉన్న ఆడవాళ్ళంతా ఉబ్బిపోయేటట్లు, ఇప్పుడే మందలను మళ్ళించుకొని వస్తానంటూ మహావీరుడివలె నీవు రథాన్నెక్కి వచ్చి, ఏనుగులనూ, గుర్రాలనూ, బంటులనూ చూసి బెదిరి, వెనక్కు పోతానంటావా? ఇట్లా బెదరటం నీకు తగుతుందా?'

విశేషం: ఉత్తరుడికి రోషం కలిగించటానికి బృహన్నల ఇట్లా ఎత్తిపొడుపు, ఎగతాళి మాటలతో ఉడికించాడు.

ఆ. అనిన పలుకులకు బృహన్నలఁ గనుఁగొని । యెలుఁగు వడఁక నాతఁ డిట్టు లనియెఁ
'బసుల దయ్య మెఱుఁగుఁ బడఁతుల సంతోష । మేల నాకు? ననికిఁ జాల నేను.' 59

**ప్రతిపదార్థం:** అనిన పలుకులకున్= (ఉత్తరుడు) అనిన మాటలకు; బృహన్నలన్= బృహన్నలను; కనుఁగొని= చూచి; ఎలుఁగు వడఁకన్= కంఠస్వరం వణుకుతుండగా; ఆతఁడు= ఉత్తరుడు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; పసులన్= పశువులసంగతి; దయ్యము+ఎఱుఁగున్= దేవు డెరుగు; పడఁతుల= ఆడవాళ్ళయొక్క; సంతోషము= ఆనందం; ఏల నాకు?= నా కెందుకు?; నేను= నేనుమాత్రం; అనికిన్= యుద్ధానికి; చాలన్= సరిపోను (సమర్థుడను కాను).

**తాత్పర్యం:** బృహన్నల అన్న మాటలకు, ఉత్తరుడు గొంతు వణుకుతూ ఉండగా, 'పశువుల మాట దేవు డెరుగు, ఆడవాళ్ళ సంతోషం నా కెందుకు? నేను మాత్రం యుద్ధం చేయలేను' అని అన్నాడు.

**విశేషం:** ఒక పనిని సాధించాలని పోయినప్పుడు, అనుకోని ఒక ఆపద ఎదురైతే అసలుపనిని విడిచిపెట్టిపోవటం సామాన్యుల లక్షణం. ఉత్తరుడూ సామాన్యుడే! ఆతడికీ, పై పరిస్థితే ఎదురైంది. అందుకే, ఆతడు పసులను మళ్ళించుకొని వస్తానని ఆడవాళ్ళముందు చెప్పి వచ్చినా, కౌరవసేనను చూచాక పుట్టిన భయంవలన 'పసుల సంగతి దేవు డెరుగు' అని అంటాడు. అంటే ప్రాణాలతో ఉంటే చాలు, అని భావం. అసామాన్యుడైన అర్జునుడు ముందు పద్యంలో ఉత్తరుడిని ఎంత ఎగదోసినా, ఆతడు క్రిందికే పడతాడు. 'పసుల దయ్య మెఱుఁగు' అన్నది మంచి లోకోక్తి.

**వ. అనవుడు.** **60**

**తాత్పర్యం:** పై విధంగా ఉత్తరుడు అనగానే.

**చ. 'తన భుజశక్తియున్ రిపుల దర్పము నేర్పడఁ జూచి చూచి యె**
**ట్లును దెగకున్నఁబోక యిది లోకము చక్కటి; శూరులైన దీ**
**నిని మది మెచ్చ; రీ బలము నీదెస దేఱియుఁ జూడ; దింతకున్**
**మును భయహేతువైన విధముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్.** **61**

**ప్రతిపదార్థం:** తన= తనయొక్క; భుజశక్తియున్= బాహుబలాన్నీ; రిపుల= శత్రువులయొక్క; దర్పమున్= శక్తినీ; ఏర్పడన్= వేరువేరుగా (ప్రత్యేకంగా); చూచి చూచి= బాగా పరిశీలించి; ఎట్లును= ఏ రకంగానూ; తెగక+ఉన్నన్= వీలుకాకపోతే; పోక= (తిరిగి) వెళ్ళిపోవటం; ఇది= వెళ్ళటం అనే ఇది; లోకము= లోకం (ప్రపంచం)యొక్క; చక్కటి= తీరు; శూరులు+ఐనన్= వీరులైతే; దీనిన్= (పైన చెప్పిన) దీనినికూడా; మది మెచ్చరు= ఒప్పుకోరు; ఈ బలము= ఈ కురుసేన; నీ దెస= నీ పక్క; తేఱియున్+చూడదు= తేరిపారచూడటం కూడా లేదు. (నీ తట్టు అసలు సరిగ్గా కన్నెత్తి చూడలేదని భావం); ఇంతకున్= అసలు ఇంతకూ; మును= ఏమీకాకముందే; భయ= భయానికి; హేతువు+ఐన= కారణం అయిన; విధమున్= విధాన్ని; తగన్= తగినట్లు (నిజంగా); నాకున్= నాకు; ఈ+తఱిన్= ఈ సమయంలో; చెప్పుము= తెలియచెప్పుము.

**తాత్పర్యం:** 'తనబలాన్నీ, ఎదుటివాడి బలాన్నీ గమనించి చూచి, కొంతసేపైనా పోరాడి, ఎటూ వీలుకాకపోతే, తిరిగివెళ్ళటం లోకంలో మామూలు. వీరులైనవాళ్ళు దీన్ని ఒప్పుకోరు. ఇంతదాకా, కురుసేన నిన్ను సరిగ్గా కూడా చూడనే లేదు. ఇంతకూ నీకు ఇంత భయం కలిగే దానికి ఏమిటి కారణం? చెప్పుము.

**సీ. దెసలు బీఁటలు వాఱఁ దివురు చిందంబుల । కోలాహలఁములకుఁ గుదియఁ బడక,**
**యురవడి సేనలు దెరలఁ బైఁ దోఁతెంచు । ధూళి పెల్లడరినఁ దూల పోక,**
**చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన । యగ్గలికమునకు బెగ్గడిలక,**
**శస్త్రాస్త్రములు రథ్య సారథి వర్మాంగ । తతి నాటు తఱచునఁ దల్లడిలక,**

**తే.** **బహువిధంబులఁ బగతుర బరవసమున । నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్ల నోర్చి**
**నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁ గాక । దవ్వు దవ్వుల నిట్లైన నవ్వరెట్లు?'** **62**

**ప్రతిపదార్థం:** దెసలు= దిక్కులు; బీఁటలు+పాఱన్= పగుళ్ళు వారేటట్లు; తివురు= మారుమ్రోగే; చిందంబుల= శంఖాలయొక్క; కోలాహలములకున్= పెద్ద పెద్ద శబ్దాలకు; కుదియన్+పడక= కూలబడిపోకుండా; ఉరవడిన్= వేగంతో (ఒత్తిడి, ఆర్భాటంతో); సేనలు= సైన్యాలు; తెరలన్= విజృంభించగా; పైన్= పైకి; తోఁతెంచు= రేగుతున్న; ధూళి= దుమ్ము; పెల్లు+అడరినన్= మిక్కిలిగా వ్యాపిస్తే; తూలపోక= తూలిపడిపోకుండా; చతురంగబలము= నాలుగు రకాలుగా ఉన్న సైన్యం, (రథ, గజ, తురగ, పదాతులు); అతి= అధికమైన; సాంద్రతన్= దట్టంగా (నిబిడంగా); కవిసినన్= చుట్టూ మూగగా; అగ్గలికమునకున్= (సైన్యంయొక్క) ఆర్భాటానికి (విజృంభణకు); బెగ్గడిలక= భయపడక; రథ్య= గుర్రాలయొక్క; సారథి= సారథియొక్క; వర్మ= కవచాల యొక్క; అంగతతిన్= దేహంలో ఉన్న అవయవాల సముదాయంలో; శస్త్ర+అస్త్ర= మానవులు నిర్మించిన బాణాలు మొదలైన శస్త్రాలూ, మంత్రాలతో ప్రయోగించే ఆగ్నేయాస్త్రం మొదలైన అస్త్రాలూ; నాటు= (శరీరంలో) గుచ్చుకొనటం యొక్క; తఱచునన్= ఆధిక్యానికి; తల్లడిలక= బెదిరిపోక; బహు= అనేకమైన; విధంబులన్= విధాలుగా; ఈ+తెఱంగునన్= ఈ రకంగా; కలుగు= (యుద్ధ సమయంలో) ఎదురయ్యే; క్రందు+ఎల్లన్= ఉపద్రవం అంతా; ఓర్చి= ఓర్చుకొని, (సహించి); బరవసమునన్= పరాక్రమంతో; నిల్చి= (యుద్ధభూమిలో గట్టిగా) నిలబడి; పగతురన్= పగవాళ్ళను; గెల్చినన్= జయిస్తేనే; సత్కీర్తి= మంచిపేరు; నెగడున్= కలుగుతుంది (వస్తుంది; నిలబడుతుంది); కాక= పై రీతిగా కాక; దవ్వుదవ్వులన్= దూరదూరంగానే ఉండి (సైన్యానికి); ఇట్లు+ఐనన్= ఇట్లా బెదిరి పారిపోదామంటే; నవ్వరు+ఎట్లు?= ఎట్లా నవ్వకుండా ఉంటారు? (లోకులు).

**తాత్పర్యం:** దిక్కులు పగుళ్ళువారేటట్లు మారుమ్రోగే శంఖాల ధ్వనులకు బెదిరిపోకుండా, ఆర్భాటంతో సైన్యాలు విజృంభించినప్పుడు రేగిన దుమ్ముకు తూలిపడకుండా, చతురంగబలాలు ముమ్మరంగా కమ్మినప్పుడు భయపడకుండా, శత్రువీరులు ప్రయోగించిన రకరకాలైన శస్త్రాలతో, అస్త్రాలతో, గుర్రాలూ, సారథీ కూలిపోయినా, కవచం బద్దలుబద్దలుగా చీలిపోయినా, బాణాలు శరీరావయవాలలో లోతుగా గుచ్చుకొన్నా, తల్లడిల్లకుండా, యుద్ధరంగంలో ఎదురయ్యే ఉపద్రవాన్నంతా తట్టుకొని, ధైర్యంతో నిలిచి శత్రువులను జయిస్తేనే, మంచి పేరు ప్రతిష్ఠలు వస్తాయికానీ, సైన్యం నీ పక్క చూడకుండా, ఇంకా దూరదూరంగానే ఉండగా, ఇట్లా పరుగెత్తి పోతానంటే (తిరిగిపోతే) నవ్వరా?'

**చ.** **అను దివిజేంద్ర నందనున కమ్మనుజేంద్ర తనూజుఁ డిట్లనున్**
**'వినుము! త్రిగర్తవాహినులు విక్రమసంపద సొంపు మీఱ, గో**
**ధనములఁ బట్టినం, బతి యుదగ్రత సైన్యము లెన్ని యన్నియుం**
**గొని యటు వోయెఁ, గాన మనకుం బురి బాసట లేర యెవ్వరున్.** **63**

**ప్రతిపదార్థం:** అను= పై విధంగా అనే; దివిజ+ఇంద్రనందనునకున్= ఇంద్రుడి కుమారుడైన అర్జునునకు (బృహన్నలకు); ఆ+మనుజేంద్ర= ఆ రాజు (విరటుడి) యొక్క; తనూజుఁడు= కుమారుడు (ఉత్తరుడు); ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు; వినుము= బృహన్నలా! వినవలసింది; త్రిగర్త= త్రిగర్తదేశపు రాజైన సుశర్మయొక్క; వాహినులు= సేనలు; విక్రమసంపద= పరాక్రమంయొక్క సంపద; సొంపుమీఱన్= అధికమయ్యేటట్లు; గోధనములన్= ఆవులు అనే ధనాన్ని; పట్టినన్= పట్టుకోగా; పతి= రాజు (విరాటుడు); ఉదగ్రతన్= విజృంభణంతో; సైన్యములు= సేనలు; ఎన్ని+అన్నియున్= ఎన్ని ఉన్నాయో అన్నిటికీ; కొని= తీసికొని; అటు+పోయెన్= అక్కడికే పోయాడు; కానన్= అందువలన; మనకున్= మనకు; పురిన్= నగరంలో; ఎవ్వరున్= ఎవ్వరుకానీ; బాసట= సహాయానికి; లేరు+అ= లేనేలేరు.

**తాత్పర్యం:** ఆ రకంగా పలికిన అర్జునుడితో ఉత్తరుడు ఇట్లా అన్నాడు 'త్రిగర్తదేశానికి రాజైన సుశర్మ సైన్యాలు మన గోధనాన్ని దక్షిణంవైపున ముట్టడించాయి. అందుకు మా తండ్రి విరాటరాజు నగరంలో ఉండే అన్ని సైన్యాలనూ తీసికొని ఆతడిపైకి దండెత్తిపోయాడు. కనుక, నగరంలో మనకు సహాయంగా రావడానికి ఎవరూ లేరు.

**తే. ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ । నే? యిదేటికి వెడమాట లిట్టు లాడ?**
**వారు గానక ముందఱఁ దేరు దోలు । కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి.' 64**

**ప్రతిపదార్థం:** ఒంటిన్= ఒంటరిగా; తలపడి= ఎదిరించి; కురుసేనన్= కౌరవసైన్యాన్ని; ఓర్చువాఁడనే?= జయించగలవాడినా?; వెడమాటలు= పనికిమాలిన మాటలు; ఇట్టులు+ఆడన్= ఇట్లా మాట్లాడటం; ఇది; ఏటికి?= ఎందుకు?; వారు= ఆ కురువీరులు; కానక ముందఱన్= చూడకమునుపే; తేరు= రథాన్ని; తోలుకొని= నడుపుకొని; రయంబునన్= శీఘ్రంగా (వెంటనే); పురికిన్= నగరానికి; అరుగుట+అ= పోవటమే; నీతి= యుద్ధంలో నీతి.

**తాత్పర్యం:** నేను ఒంటిగా కౌరవసైన్యాన్ని ఎదిరించి జయించగలనా? ఎందుకీ తెలివిమాలిన మాటలు? వాళ్ళు మనలను చూడటానికి ముందే రథాన్ని తిప్పుకొని వెనక్కు వెళ్ళిపోవటమే నీతిమార్గం.'

**విశేషం:** చేతనైతే పోరాడటమో, లేకపోతే సంధిచేసికొనటమో యుద్ధంలో నీతి. కాని ఉత్తరుడి దృష్టిలో, సైన్యాన్ని చూస్తూనే పారిపోవటం నీతి. తన భయాన్ని కప్పిపుచ్చుకొని సమర్థించుకొనాలని, ఆతడు నీతి విషయాన్ని బృహన్నలతో ప్రస్తావించాడు.

**వ. అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; పార్థుండు= పృథ (కుంతి) కుమారుడు అర్జునుడు; పార్థివ నందనునకున్= రాకుమారుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడు పై విధంగా అనగా, అర్జునుడు ఆ రాకుమారుడితో ఇట్లా అన్నాడు.

**క. 'వెగడొంది యిట్లు పలుకఁగ । నగునే? పగతురు ప్రమోద మందఁగఁ బసులన్**
**దిగవిడిచి, పురజనంబులు । తెగడంగా మగిడిపోక దీనత గాదే! 66**

**ప్రతిపదార్థం:** పగతురు= పగవారు; ప్రమోదము+అందఁగన్= సంబరపడేటట్లు; వెగడు+ఒంది= భయపడి; ఇట్లు= ఇట్లా; పలుకఁగన్= మాట్లాడటానికి; అగునే?= అగునా (సరిపోతుందా?); పురజనంబులు= పట్టణంలో ఉన్న జనాలు; తెగడంగాన్= దూషించేటట్లు; పసులన్= పశువులను; దిగవిడిచి= వదలిపెట్టి; మగిడిపోక= తిరిగిపోవటం; దీనత కాదే!= పిరికితనం కాదా?

**తాత్పర్యం:** 'శత్రువులు పొంగిపోయేటట్లు బెదిరిపోయి, ఈ విధంగా మాట్లాడవచ్చా? పురంలో అంతమందీ తిట్టేవిధంగా, ఆవులను వాటిపాటికి వాటిని వదలివేసి, వెనక్కు పోవటం పిరికితనం కాదా!

**వ. అట్లుంగాక. 67**

**తాత్పర్యం:** అంతేకాక, (ఇంకా అర్జునుడు చెప్పుతున్నాడు)

**మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె, దానం బెంపుమైఁ బిల్చి, తో**
**డని తోడ్తెచ్చితి వీవు, బంటుతన మ ట్లగ్గించి పౌరాలి దీ**
**వన లిచ్చెం, దుదిఁ బోయి కౌరవులు గోవర్గంబు గొంపోవఁగాఁ**
**గని యేఁ గ్రమ్మఱి రిత్తవోదునె? భయోత్కంపంబు నీ కేటికిన్? 68**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; సైరంధ్రి; కడంగి= పూనుకొని (అదే పనిగా ప్రత్యేకించి); పేర్కొనియెన్= పేరెత్తిచెప్పింది; దానన్= అందువలన; పెంపుమైన్= పెద్దగా, గొప్పగా; పిల్చి= రమ్మని పిల్చి; ఈవు= నీవు; తోడు+అని= జతగా ఉంటానని; తోడ్తెచ్చితివి= తీసికొనివచ్చావు; పౌర+ఆలి= పురజనుల సమూహం; బంటుతనము= (నీయొక్క) వీరత్వాన్ని (పరాక్రమాన్ని); అట్లు= ఆ విధంగా (ఎక్కువగా); అగ్గించి= పొగడి; దీవనలు+ఇచ్చెన్= ఆశీస్సులు అందించింది; తుదిన్+పోయి= చివరకు వచ్చి; కౌరవులు; గో= ఆవులయొక్క; వర్గంబున్= సమూహాన్ని; కొంపోవఁగాన్= తోలుకొనిపోగా; కని= చూచి; ఏన్= నేను; క్రమ్మఱి+రిత్త+పోదునె?= వెనక్కు మళ్ళి, వ్యర్థంగా వెళ్ళిపోతానా?; భయ+ఉత్కంపంబు= భయంతో పుట్టిన వణుకు; నీకున్+ఏటికిన్?= నీకు ఎందుకు?

**తాత్పర్యం:** (సారథి లేడని నీవు బాధపడుతూ ఉంటే) నా విషయాన్ని సైరంధ్రి నీకు వివరంగా చెప్పింది. ఆమె చెప్పిన దానిని విని, నీవు నన్ను చాలా మర్యాదగా పిలిచి తోడుగా తెచ్చుకొన్నావు. మనం బయలుదేరేవేళ, పురజనులంతా నీ (మన) పరాక్రమాన్ని పొగడి, దీవించి పంపారు. ఇంతదాకా వచ్చి, ఇప్పుడు శత్రువులైన కౌరవులకు మందలను వదలివేసి, ఊరకనే వెనక్కుపోతానా? నీకు భయం వద్దు. (నేనుండగా నీవు భయపడవద్దని తాత్పర్యం).

**విశేషం:** ఊరకనే నేను తిరిగిపోతానా? నీకు భయం వద్దు- అన్నభావం, ముందు కథలో జరగబోయే అర్జునుడి విషయాన్ని సూచిస్తుంది.

**తే. చిత్తవృత్తి యొక్కించుక చిక్కఁ బట్టు, । మిపుడ కౌరవ సైనికు లెల్లఁ జూచి**
**వెఱఁగు పడ వేగమును లావు వెరవు మెఱయఁ । గదుపుఁ బెట్టించి పోదము క్రమ్మఱంగ.' 69**

**ప్రతిపదార్థం:** చిత్తవృత్తి= మనస్సుయొక్క చంచలమైన పోకడను; ఒక్క+ఇంచుక= కొద్దిగా; చిక్కఁబట్టుము= అణచుకొమ్ము, (నిగ్రహించుకొమ్ము); కౌరవసైనికులు+ఎల్లన్= కురుసేనమొత్తం; చూచి= మనలనుచూసి; వెఱఁగుపడన్= ఆశ్చర్యంతో భయపడేటట్లు; వేగమును= (పనిలో) వేగం; లావు= బలాన్ని; వెరవు= ఉపాయాన్ని; మెఱయన్= బయటపడే విధంగా; కదుపున్= ఆవులమందను; పెట్టించి= విడిపించి; ఇపుడు+అ= ఇప్పుడే; క్రమ్మఱంగన్= తిరిగి; పోదము= వెళ్ళిపోదాం.

**తాత్పర్యం:** మనస్సును కొద్దిగా అదుపులో పెట్టుకొమ్ము. కౌరవసైన్యం అంతా ఆశ్చర్యంతో బెదిరిపోయేవిధంగా, కార్యంలో వేగాన్నీ, బలాన్నీ, ఉపాయాన్నీ చూపి, మందను విడిపించుకొని వెంటనే తిరిగి పోదాం.'

**వ. అనుచు వివ్వచ్చుండు గడంగి తేరు వోవనిచ్చుటయు, నాననంబు పల్లటిల్ల, మానసంబు దల్లడిల్ల నా భూవల్లభు కుమారుండు. 70**

**ప్రతిపదార్థం:** వివ్వచ్చుండు= అర్జునుడు; కడంగి= పూనుకొని; తేరు= రథం; పోవనిచ్చుటయున్= ముందుకు నడపుకొనిపోగా; భూవల్లభు కుమారుండు= రాజకుమారుడైన ఉత్తరుడు; ఆననంబు= ముఖం; పల్లటిల్లన్= (దైన్యంతో) వెలవెలబోగా; మానసంబు= మనస్సు; తల్లడిల్లన్= అల్లల్లాడగా (చలించగా).

**తాత్పర్యం:** పై విధంగా అంటూ అర్జునుడు రథాన్ని తోలుకొనిపోతూంటే, ముఖం వెలవెలబోగా, మనస్సు తల్లడిల్లగా ఉత్తరుడు (ఇట్లా అన్నాడు).

**క. 'దవ్వుల విఱిగినఁ బౌరులు । నవ్వుదురటె! మేలు మేలు! నను నాఁగకు, నీ**
**క్రొవ్వుఱుగదేనిఁ దలపడు । మెవ్విధిఁ జనితేని' యనుచు నెత్తిన భీతిన్. 71**

**ప్రతిపదార్థం:** దవ్వులన్= దూరంనుండి; విఱిగినన్= పారిపోతే; పౌరులు= పురజనులు; నవ్వుదురు+అటె!= నవ్వుతారట!; మేలు మేలు!= బాగు బాగు; ననున్= నన్ను; ఆఁగకు= ఆపవద్దు; నీ= నీయొక్క; క్రొవ్వు+అఱుగదేనిన్= కొవ్వు అణగకపోతే; తలపడుము= ఎదిరించుము; ఏ+విధిన్+చనితి(వి)+ఏని= నీవు ఏ విధంగా పోతే నాకేం? (నీతో నాకు సంబంధం లేదని భావం); అనుచున్= అని అంటూ; ఎత్తిన= పొంగివచ్చే (ఎక్కువైన); భీతితోన్= భయంతో.

**తాత్పర్యం:** 'దూరాన్నుండి వెనక్కు తిరిగిపోతే పౌరులు నవ్వుతారట! (నవ్వితే నవ్వనీ అని భావం). బాగుంది. నన్ను మాత్రం ఆపకు. నీ పొగరు అణగకపోతే నీవే ఎదిరించుము. నీవు ఎట్లా పోయినా నాకేం ఫరవాలేదు' అని అంటూ భయంతో (తరువాతి పద్యంతో అన్వయం).

**క. శరములు శరాసనము న । య్యరదముపై డిగ్గవిడిచి యతి రభసమునన్**
**ధరణికి లంఘించి వెసం । బురిదెసకును లజ్జ వీటఁ బోవం బాఱెన్. 72**

**ప్రతిపదార్థం:** శరములు= బాణాలూ; శర+ఆసనమున్= ధనుస్సూ; ఆ+అరదముపైన్= ఆ రథంపైనే; డిగ్గవిడిచి= వదలివేసి; అతి రభసమునన్= ఎక్కువైన కంగారువలన; ధరణికిన్= నేలమీదికి; లంఘించి= వేగంగా దూకి; లజ్జ= సిగ్గు; వీటిన్+పోవన్= నష్టపోగా; పురిదెసకును= పట్టణం దిశగా; పాఱెన్= పరుగుదీశాడు.

**తాత్పర్యం:** బాణాలనూ, వింటినీ తేరుమీదనే పడవేసి, ఉత్తరుడు కంగారుతో బెంబేలుపడి నేలపైకి దూకి, సిగ్గువిడిచి, పట్టణం వైపు పరుగుదీశాడు.

**వ. ఇట్లు పాఱినం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబుల పగ్గంబుల నొగల ముడిచి రథంబు డిగ్గనుఱికి లంబకేశభారుండును, నాందోళిత రక్తాంబర యుగళాంచలుండును నగుచు వెనుకంబఱచు సమయంబున, నిలిచి కనుంగొను కౌరవబలంబునందు. 73**

**ప్రతిపదార్థం:** ఇట్లు+పాఱినన్= ఇట్లా పారిపోగా; కుత్సించుచున్= ఏవగించుకొంటూ; బీభత్సుండు= అర్జునుడు; యుగ్యంబుల= గుర్రాలయొక్క; పగ్గంబులన్= పగ్గాలను; నొగలన్= నొగకట్టెకు; ముడిచి= ముడివేసికట్టి (దూముడివేసి); రథంబు డిగ్గన్+ఉఱికి= రథంమీదినుండి క్రిందికి దూకి; లంబ= వ్రేలాడుతున్న (పొడవైన); కేశ= వెంట్రుకలయొక్క; భారుండును= బరువుకలిగినవాడూ, (వ్రేలాడేపొడవైనకేశపాశం ఉన్నవాడు); ఆందోళిత= ఊగులాడుతున్న; రక్త+అంబర= ఎర్రటి వస్త్రాలయొక్క; యుగళ+అంచలుండును= జంటయొక్క అంచులున్నవాడూ; (ఎర్రటి రెండు పంచెల అంచులు రెపరెపలాడుతున్నాయి అని భావం); అగుచున్= ఔతూ; అతని వెనుకన్= ఉత్తరుడి వెంట; పఱచు సమయంబునన్= పరుగెత్తేటప్పుడు; నిలిచి= నిలువబడి; కనుంగొను= చూచే; కౌరవబలంబునందున్= కౌరవులసేనలో.

**తాత్పర్యం:** ఉత్తరుడు ఆ విధంగా పరుగుదీయగా, అర్జునుడు తన మనస్సులో ఏవగించుకొంటూ గుర్రాల పగ్గాలను నొగలకు కట్టి, దిగి, ఉత్తరుడి వెనువెంట పరుగుదీశాడు. అప్పుడు పొడవైన కేశభారాన్నీ ఎర్రటి పంచెల అంచుల రెపరెపలనూ గమనించిన కురుసేనలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ.** **అజ్ఞులు కొంద అప్పుడపహాసము సేయుచు గూఢరూప రే**
**ఖాజ్ఞత లేమిఁ దద్వికృత కాయము మీఁదను దృష్టులు నిల్పఁగాఁ;**
**బ్రాజ్ఞులు మూర్తి సౌమ్యతయు, బాహుల దీర్ఘతయున్, భటత్వ త**
**త్త్వజ్ఞతయున్, గతిస్ఫురదుదాత్తతయుం గని సంశయంబుతోన్.** **74**

**ప్రతిపదార్థం:** అజ్ఞులు= అజ్ఞానులు (తెలియనివాళ్ళు); కొందఱు= కొద్దిమంది; అప్పుడు; గూఢ= నిగూఢమైన (రహస్యమైన); రూపరేఖాజ్ఞత= రూపురేఖలను తెలిసికొనగలిగిన తెలివి; లేమిన్= లేకపోవటంవలన; అపహాసము+చేయుచున్= ఎగతాళిచేస్తూ; తద్+వికృత= ఆ బృహన్నలయొక్క వికారమైన; కాయముమీఁదను= శరీరంపైన; దృష్టు= చూపులు; నిల్పఁగాన్= నిలిపిచూడగా; ప్రాజ్ఞులు= బాగా తెలిసినవారు; మూర్తి= ఆ ఆకారంలోని; సౌమ్యతయున్= సత్త్వగుణం వలన కలిగిన శాంతభావాన్నీ; బాహుల= చేతులయొక్క; దీర్ఘతయున్= పొడుగుదనాన్నీ (ఆజానుబాహువులు అనుట); భటత్వ= పరాక్రమంయొక్క; తత్త్వజ్ఞతయున్= తత్త్వాన్ని తెలిసికొనటాన్నీ; (వీరుల స్వభావాన్ని తెలిసికొనగలగడం); గతి= నడకలో; స్ఫురత్+ఉదాత్తతయున్= కనిపించే గాంభీర్యాన్నీ (హుందాతనం); కని= చూచి; (గమనించి); సంశయంబుతోన్= అనుమానంతో.

**తాత్పర్యం:** తెలియనివాళ్ళు కొంతమంది ఆ బృహన్నలయొక్క నిగూఢంగా ఉన్న రూపురేఖలను సరిగ్గా తెలిసికొనలేక అవహేళన చేస్తూ ఆతడి వికారరూపంపై చూపులు నిలిపారు. తెలిసిన వాళ్ళు మాత్రం ఆ రూపంలో ఉండే అందాన్నీ, ఆజానుబాహువుల లక్షణాన్నీ, వీరుల మనస్సులను తెలిసికొనే సామర్థ్యాన్నీ, నడకలో ఒక గాంభీర్యాన్నీ చూచి అనుమానిస్తూ (ఈవిధంగా అనుకొంటున్నారు). అర్జునుడిని ముందుచూచినవాళ్ళకు ఈతడు అర్జునుడేనా అనే సందేహం వచ్చిందన్నమాట.

**తే.** **'ఆఁడు చందంబుఁ బురుష సమాకృతియును । గలిగియున్నవి' యొప్పు నూష్మలత సొంపు**
**వికృత వేషావృతంబులై వెలయ కితఁడు । నివుఱు గవిసిన మెఱయని నిప్పువోలె.** **75**

**ప్రతిపదార్థం:** ఆఁడు చందంబున్= ఆడమనిషితీరూ; పురుష= మగవాడియొక్క; సమాకృతియును= ఆకారమూ; కలిగి+ ఉన్నవి= కలిగి ఉన్నవి; ఊష్మలత= పరాక్రమం; సొంపు= అందం; వికృతవేష+ఆవృతంబులు+ఐ= వికారమైన వేషంతో కప్పిపుచ్చబడ్డవై; ఇతఁడు= ఈ వ్యక్తి; నివుఱు= బూడిద; కవిసినన్= కప్పగా; మెఱయని= ప్రకాశించని; నిప్పు+పోలె= నిప్పువలె; వెలయక= బయటపడక; ఒప్పున్= ఉన్నాడు.

**తాత్పర్యం:** 'ఆడా, మగా రూపాలు రెండూ కనపడుతున్నాయి. తీవ్రతా, శౌర్యమూ, కోమలత్వం, వికారమైన ఆకారంవలన బయటికి తెలియక, ఇతడు బూడిద గప్పిన నిప్పువలె మరుగులో ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. 'నివుఱు గవిసిన మెఱయని నిప్పు' లోకోక్తి. ఏదో కారణంవలన సహజమైన శక్తి మరుగుపడ్డప్పుడు, ఇట్లాంటి లోకోక్తిని వాడుతారు. తిక్కన లోకోక్తులు చాలా ప్రసిద్ధాలు. తగిన సమయంలో తగిన లోకోక్తిని వాడటం మహాకవుల లక్షణం. అందులోనూ తిక్కన లోకోక్తులు దేశీయతకు మారు పేరు. 'వెలయు నితఁడు' అనే పాఠాంతరం కొన్ని ప్రతులలో ఉన్నది.

**ఉ. బాహుల చాయయున్, గమన భంగియు, నర్జుననట్లు; దీన సం**
**దేహము లే దితండు తన తేజము డాఁపఁగ మత్స్యభూమి భృ**
**ద్గేహమునందుఁ బేడి యనఁ గీడ్పడి యుండెనొ? కాక యీ కురు**
**వ్యూహముతోడి కయ్యమున కొండొకరుం డిటు లొంటి వచ్చునే? 76**

**ప్రతిపదార్థం:** బాహుల చాయయున్= (పొడుగైన) ఆ చేతుల తీరూ; గమన= నడకయొక్క; భంగియున్= తీరూ; అర్జునున్+అట్ల= అర్జునుడివి మాదిరిగానే ఉన్నాయి; దీనన్= ఈ విషయంలో; సందేహము లేదు= అనుమానం లేదు; ఇతండు= (ఈ పరుగెత్తే) వ్యక్తి; తన తేజము= తన తేజస్సును (పరాక్రమాన్ని); డాఁపఁగన్= దాచుకొనటానికి; మత్స్యభూమిభృత్= మత్స్యరాజ్యాన్ని భరించేవాడైన (మత్స్యదేశానికి రాజైన) విరాటుడియొక్క; గేహమునందున్= ఇంటిలో (కొలువులో); పేడి+అనన్= పేడివాడిగా; కీడ్పడి+ఉండెనొ?= అణగిమణగిఉన్నాడేమో?; కాక= కాకుంటే; ఈ కురువ్యూహముతోడి= ఈ కురుసైన్యంతో; కయ్యమునకున్= యుద్ధానికి; ఒండు+ఒకరుండు= వేరొకడు; ఇటులు= ఇట్లా; ఒంటి= ఒంటరివాడుగా; వచ్చునే?= వస్తాడా? (రాలేడు అని భావం).

**తాత్పర్యం:** ఆ చేతుల తీరూ (ఆజానుబాహులు అని భావం), నడక పద్ధతీ, అర్జునుడివలెనే ఉన్నాయి. ఏమీ సందేహం లేదు. తన తేజాన్ని మరుగుపరచటానికి విరాటరాజు కొలువులో పేడివాడిగా అణగి ఉన్నట్లున్నాడు. కాకుంటే, ఈ కౌరవసైన్యంతో పోరాడటానికి వేరే వా డెవడైనా అయితే ఈ రకంగా ఒంటరిగా వస్తాడా! (రాలేడని తాత్పర్యం.)

**విశేషం:** అర్జును+అట్లు+అ= అర్జును+న్+అట్లు+అ= ఇది షష్ఠీ సమాసం. షష్ఠీ సమాసంబునం దుకార ఋకారంబుల కచ్చు పరమగునపుడు నుగాగమంబగు. (బాలవ్యాకరణం - సంధిపరిచ్ఛేదం - సూత్రం 34).

**చ. విరటుఁడు దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాజికై**
**పురిఁ గల వారినెల్లఁ గొనిపోయిన, నొండులు లేమిఁ జేసి యు**
**త్తరుఁడిట వచ్చుచుండి, యరదంబు దగం గడపంగ నెవ్వరుం**
**దొరకొనకున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్. 77**

**ప్రతిపదార్థం:** చూడఁగన్= చూడగా; విరటుఁడు= విరాటరాజు; నిజ+ఆజికిన్+ఐ= తన యుద్ధానికి; దక్షిణంబునకున్= దక్షిణదిశకు; వీరులన్= వీరులనూ; సారథులన్= రథసారథులనూ; పురిన్+కలవారిని= పట్టణంలో ఉండే వాళ్ళను; ఎల్లన్= అందరినీ; కొనిపోయినన్= తీసికొనిపోగా; ఒండులు= వేరేవారు; లేమిన్+చేసి= లేనందువలన; ఉత్తరుఁడు; ఇటవచ్చుచున్+ఉండి= ఇక్కడికి వస్తూ; అరదంబున్= రథాన్ని; తగన్= తగినట్లు (బాగా); కడపంగన్= తోలటానికి; ఎవ్వరున్= ఎవరూ కానీ; దొరకొనకున్నన్= చిక్కకపోతే (లభించకపోతే); తాను= ఉత్తరుడు; ఇతనిన్= ఈ వ్యక్తిని; తోడ్కొని వచ్చినవాఁడు= తీసికొనివచ్చాడు.

**తాత్పర్యం:** ఆలోచించగా దక్షిణంపక్క యుద్ధానికి పోతూ విరాటరాజు నగరంలో ఉన్న వీరులనూ, సారథులనూ మొత్తంగా తీసికొనిపోగా, ఇంకెవ్వరూ లేకపోవటంతో ఉత్తరుడు ఇక్కడికి వస్తూ, సారథిగా ఎవరూ దొరక్కపోవటంతో ఇతడిని తీసికొనివచ్చా డనిపిస్తుంది.

**చ. పరి సనుదెంచి గోగణముఁ బట్టె ననన్ విని, పిన్నగాన మీఁ**
**దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ బఱతెంచి, సైన్య వి**
**స్ఫురణముఁ జూచి, భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చెఁ; ని**
**ప్పురుషుని శౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ డేమియున్.' 78**

**ప్రతిపదార్థం:** పరి+చనుదెంచి=(కురు) సేన వచ్చి; గోగణమున్= ఆవులమందను; పట్టెన్+అనన్+విని= పట్టుకొన్నదని విని; పిన్న+కాన= పసివాడు కనుక (అజ్ఞాని అని భావం); మీఁదు+అరయక= ముందు ఆలోచన లేకుండా; రాజనందనుఁడు= రాజకుమారుడైన ఉత్తరుడు; అహంకృతిమైన్= అహంకారంతో; పఱతెంచి= వచ్చి; సైన్య= సైన్యంయొక్క; విస్ఫురణమున్= ఆర్భాటాన్ని (విజృంభణాన్ని); చూచి= గమనించి; భీతిన్= భయంతో; తన= తనదైన; బుద్ధి= మనస్సు; కలంగినన్= కలతపడగా (చెదిరిపోగా); పాఱన్+చొచ్చెన్= పరుగెత్తుతున్నాడు; ఈ+పురుషుని= (తాను వెంబడితెచ్చుకొన్న) ఈ వ్యక్తి యొక్క; శౌర్యసంపదయున్= పరాక్రమం అనే ధనమూ (అధికమైన పరాక్రమం అని భావం); భూరి= గొప్పదైన; బలంబున్= బలమూ; ఏమియున్+ఎఱుంగఁడు= ఏ కొంచెంగూడా ఎరుగడు.

**తాత్పర్యం:** సైన్యం ఆవులను పట్టుకొన్నదని విని, పసివాడు గనుక, వెనకా ముందూ ఆలోచించకుండా, కేవలం గర్వంతో ఉత్తరుడు తానేమో వచ్చాడు కాని, ఈ సైన్యంయొక్క విజృంభణాన్ని చూచి మనసు చెదరి, బెదరి పరుగుతీస్తున్నాడు. ఈ పురుషుడి పరాక్రమం, శక్తీ, ఇతడికి ఏమీ తెలియవు.'

**వ. అనుచు నిశ్చయరహిత హృదయులగుచుండ శుండాలరయ లీలాసమరేఖంబగు గమనంబునం బురుహూత పుత్త్రుండు పదశత మాత్ర ప్రదేశ పలాయితుండైన భూమింజయు నెయిది పట్టికొనిన నతండు. 79**

**ప్రతిపదార్థం:** నిశ్చయరహిత హృదయులు= ఇది ఫలానా అనే నిర్ణయం లేని మనస్సులు కలవాళ్ళు; అగుచున్+ఉండన్= ఔతూ ఉండగా; శుండాల= ఏనుగుయొక్క; రయ= వేగంయొక్క; లీలా= విలాసంతో; సమరేఖంబు+అగు= సమమైన; గమనంబునన్= నడకతో; పురుహూత= దేవేంద్రుడియొక్క; పుత్త్రుండు= కుమారుడైన అర్జునుడు; పదశతమాత్ర ప్రదేశ= నూరు అడుగుల దూరం మాత్రమే; పలాయితుండు+ఐన= పరుగెత్తినవాడయిన; భూమింజయున్= ఉత్తరకుమారుడిని; ఎయిది= వెంబడించి; పట్టికొనినన్= పట్టుకోగా; అతండు= ఉత్తరుడు.

**తాత్పర్యం:** (కురుసేనలో) పైవిధంగా అనుకొంటూ, ఎటూ నిశ్చయించుకొనలేకున్నారు. ఆలోపల అర్జునుడు గజగమనంతో నూరు అడుగులదూరంలోనే ఉత్తరుడిని వెంబడించి పట్టుకోగా, ఆ ఉత్తరుడు (ఇట్లా అంటాడు).

**విశేషం:** మూలభారతంలో ఈ సన్నివేశంలో అర్జునుడు ఉత్తరుడి జుట్టు పట్టుకొన్నట్లున్నది. కాని, తెలుగులో తిక్కన, 'ఎయిది'- అంటే 'వెంబడించి' పట్టుకొన్నట్లు మార్పుచేశాడు. బహుశః 'జుట్టు పట్టుకొనటం' అంత ఉచితంగా ఉండదని తిక్కన భావమై ఉంటుంది.

**సీ. వెల వెలఁ బాఱుచు వెగడొందుఁ, బెదవుల । తడియాఱ నెంతయుఁ దల్లడిల్లుఁ,**
**జల్లన నంగంబు లెల్ల నిండఁ జెమర్చుఁ, । బదములుఁ గరములుఁ గుదియ వడఁకు,**
**హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు, । దీన దృష్టుల మోముఁ దేఱి చూచు,**
**నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు, విడుమని । ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప,**

**తే. 'నిష్కశతశుద్ధ హేమంబు నిర్మలోజ్జ్వ। లాష్ట వైడూర్యములుఁ దురగాఢ్య రథముఁ**
**గరటి దశకంబు నొకయూరుఁ బురము సొచ్చి। నపుడ యిచ్చెద నీ' కను నార్తుఁ డగుచు. 80**

**ప్రతిపదార్థం:** వెల వెలన్+పాఱుచున్= వెలవెలబోతూ (ముఖంలో వికాసంలేకుండా); వెగడు+ఒందున్= భయపడతాడు; పెదవుల= పెదవుల యొక్క; తడి+ఆఱన్= తేమ ఆరిపోగా (నోరు ఎండిందని భావం); ఎంతయున్= ఎక్కువగా; తల్లడిల్లున్= అల్లల్లాడిపోతాడు (భయంతో); చల్లనన్= (శరీరం) చల్లబడగా; అంగంబులు+ఎల్లన్= అవయవాలన్నీ; నిండన్= నిండగా; చెమర్చున్= చెమటలు కక్కుతాడు; పదములున్= కాళ్ళూ; కరములున్= చేతులూ; కుదియన్+వడఁకున్= కూలబడగా వణికిపోతాడు; హృదయంబు= గుండె; తటతటన్+అదరంగన్= దడదడమంటూ అదిరిపోగా (కొట్టుకొంటుండగా); పెలుకుఱున్= భయపడతాడు; దీన= దిగులుతో కూడిన; దృష్టులన్= చూపులతో; మోమున్= (ఎదురుగా ఉన్న అర్జునుడి) మొగాన్ని; తేఱిచూచున్= (పిచ్చిగా) ఎగాదిగా చూస్తాడు; ఎలుఁగు= గొంతు (కంఠస్వరం); గద్గదికన్= బొంగురుపోయిన స్వరంతో; తొట్రిలన్= తడబడేటట్లు; ఏడ్చున్= ఏడుస్తాడు; మాటన్= మాటలో; కీడ్పాటు= సన్ననిస్వరంతో కూడిన తడబాటు; తోఁపన్= కనిపించేటట్లు; విడుము+అని= వదలిపెట్టుమని; ప్రార్థించున్= వేడుకొంటాడు; ఆర్తుఁడు+అగుచున్= దీనుడై; పురము= నగరాన్ని; చొచ్చినపుడు+అ= చేరగానే; నీకున్= నీకు; నిష్కశతశుద్ధ హేమంబు= నూరు బంగారునాణాల రూపంలోఉన్న శుద్ధమైన బంగారాన్ని; నిర్మల+అష్ట వైడూర్యములున్= స్వచ్ఛమై, ప్రకాశవంతమైన ఎనిమిది వైడూర్యమణులూ; తురగ+ఆఢ్య= గుఱ్ఱాలతోకూడిన; రథమున్= రథమూ; కరటి దశకంబున్= పది ఏనుగులూ; ఒక+ఊరున్= ఒక గ్రామాన్ని; ఇచ్చెదన్= ఇస్తాను; అనున్= అంటాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడి మొగం తెల్లబోయింది. భయంతో నోట్లో తేమ ఆరిపోతూ ఉన్నది. ఒళ్ళంతా చల్లబడి ముచ్చెమటలు పోస్తున్నవి. కాళ్ళూ చేతులూ గడగడ వణికిపోతున్నాయి. గుండె దడదడమంటూ కొట్టుకొంటున్నది. దిగులుపడ్డ చూపులతో ఎదురుగాఉన్న అర్జునుడి మొగాన్ని తేరిపారచూచాడు. గొంతు బొంగురుపోయి తడబడుతూ ఉన్నది. ఏడుస్తూ కూడా ఉన్నాడు. విడిచిపెట్టుమని అర్జునుడిని దీనంగా వేడుకొంటున్నాడు. మాటలో దిగులు బాగా కనబడుతూ ఉన్నది. ఈ పరిస్థితిలో ఉత్తరుడు అర్జునుడితో 'నగరానికి వెళ్ళుతూనే నీకు నూరు బంగారు నాణాల చొక్కమైన బంగారాన్నీ, మంచివి ఎనిమిది వైడూర్యాలనూ, గుఱ్ఱాలు కట్టి సిద్ధంగా ఉన్న రథాన్నీ, పది ఏనుగులనూ, ఒక ఊరినీ ఇస్తాను, నన్ను వదిలిపెట్టుము' అని అంటూ వేడుకొంటున్నాడు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. ఎక్కువగా భయపడ్డ మనిషి, శారీరకంగా, మానసికంగా ఎట్లాంటి మార్పుకు గురి ఔతాడో, ఇందులో తిక్కన మహాకవి చాల సహజంగా చిత్రించాడు. మనోభావాన్నిబట్టి, శారీరకంగా మార్పు కనిపిస్తుంది. ఇక్కడ ఉత్తరుడి మనస్సులో నిండిన భావం భయం. దాని ప్రభావమే, ఆతడి శరీరంలో వచ్చిన మార్పు. ఈ సందర్భంలో, మూలభారతంలో, తేటగీతి పద్యంలోని విషయం మాత్రమే చెప్పబడ్డది - అదీ సూచనగా. అట్లాంటి దాన్ని తిక్కన సీసపాదాలలో పెంచి, సహజంగా చిత్రించి, భయభ్రాంతుడైన ఉత్తరుడి ఆకారాన్ని పాఠకుల మనో నేత్రాలకు కనిపింపజేశాడు. సమయానికి తగిన వర్ణన, అప్పటి దృశ్యాన్ని సహృదయులకు కన్నులకు కట్టినట్లు చేస్తుంది. ఇది అందరు కవులకూ వీలుకాదు. కేవలం మహాకవులకే సాధ్యం అవుతుంది.

**క. 'నాతోడి ప్రేముడిం గడు। నాతురయై యెదురుచూచు నంబకుఁ జేతః**
**ప్రీతిగఁ జని యాయమఁ బొడ। సూతుం బోనీఁ గదే విశుద్ధచరిత్రా!' 81**

**ప్రతిపదార్థం:** నాతోడి ప్రేముడిన్= నాపై ప్రేమతో; కడున్ ఆతుర+ఐ= ఎక్కువ దిగులు కలదై; ఎదురుచూచు= ఎదురుచూస్తూ ఉండే; అంబకున్= మా అమ్మకు; చేతస్= మనస్సుకు; ప్రీతిగన్= సంతోషం కలిగేటట్లు; చని= వెళ్ళి; ఆయమన్= ఆమెను; పొడసూతున్= చూస్తాను; వి+శుద్ధ= మిక్కిలి స్వచ్ఛమైన; చరిత్రా!= వంశం కలవాడా! (ప్రవర్తన కలవాడా); పోనీఁగదే?= నన్ను పోనీయవా?

**తాత్పర్యం:** 'విశుద్ధమైన చరిత్ర కలిగిన ఓ బృహన్నలా! నా మీద ప్రేమతో, దిగులు కలదై నా కొరకు ఎదురుచూచే మా అమ్మ మనస్సుకు సంతోషం కలిగేటట్లు నేను వెళ్ళి ఆమెను చూస్తాను. నన్ను పోనీ!'

**విశేషం:** తనకు భయంగా ఉన్నదని చెప్పినంత మాత్రాన, బృహన్నల పోనీయడని, తన మీద ప్రేమతో తనకొరకు దిగులుతో ఎదురుచూచే తల్లికి సంతోషాన్ని కలిగించటానికైనా తనను వదిలిపెట్టుతాడని ఉత్తరుడి నమ్మకం, ఆతడి అమాయికత్వం. తనపై కాకున్నా, తన తల్లిపై ఉన్న గౌరవంతోనో, భయంతోనో వదులుతాడని ఆశ. ఉత్తరుడి తల్లి రాణికదా! ఇది మనోభావ వేత్తలైన మహాకవులకే సాధ్యం.

### అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిఁగాఁ జేసికొనుట : (సం. 4-36-41)

**వ. అని మఱియు నానావిధ దీనాలాపంబులం బ్రార్థించుచుండం బార్థుండు నగుచు నతనిం దేరు సేరం దెచ్చి. 82**

**ప్రతిపదార్థం:** అని= అంటూ; మఱియున్= ఇంకా; నానావిధ= పలురకాలైన; దీన+ఆలాపంబులన్= దీనమైన పలుకులతో; ప్రార్థించుచున్+ఉండన్= వేడుకొంటూ ఉండగా; పార్థుండు= అర్జునుడు (పృథకుమారుడు); నగుచున్= నవ్వుతూ; అతనిన్ = ఆ ఉత్తరుని; తేరు+చేరన్+తెచ్చి= రథం దగ్గరికి (బలవంతంగా) తీసికొనివచ్చి.

**తాత్పర్యం:** ఆ విధంగా ప్రార్థించి ఇంకా ఎన్నో రకాల దీనమైన మాటలతో వేడుకొంటూ ఉండగా, అర్జునుడు ఉత్తరుడిని, రథం దగ్గరికి బలవంతంగా తీసికొని వచ్చి.

**విశేషం:** ఉత్తరుడు ఎంత ప్రార్థించినా వినకుండా, బృహన్నల అతడిని బలవంతంగా ఎట్లాగో రథం దగ్గరికి తీసికొనివచ్చి తరువాత పద్యంలో ధైర్యాన్ని నూరిపోసి, ఆతడి భయాన్ని పోగొట్టుతాడు.

**చ. 'వెఱవకు మన్న! పోటు కురువీరులతోడ నశక్యమేని, న**
**తెఱఁగది యేల నీ? కుడుగు; తేరికి సారథి గమ్ము నాకుఁ జి**
**చ్చుఱ పిడుగెట్టులట్టడరి శూరుల మొత్తము నుగ్గు సేసెదం;**
**బఱపెద సేన, రాజు ధృతిఁ బాపెద, గోవులఁ గ్రమ్మఱించెదన్.' 83**

**ప్రతిపదార్థం:** వెఱవకుము+అన్న!= అన్నా! భయపడవద్దు; ('అన్న అన్నది ప్రేమపూర్వకంగా పెద్దలు, చిన్నవాళ్ళను పిలవటం. ఇది తెలుగుదేశీయమైన సంబోధనం); నీకున్= నీకు; కురువీరుల తోడన్= కౌరవ వీరులతో; పోటు= యుద్ధం; అశక్యము+ఏని= సాధ్యం కాకపోతే; ఆ+తెఱఁగు+ఏల+నీకు?= ఈ విషయం నీకు ఎందుకు? (నీకు వద్దు అనిభావం); ఉడుగు= విడిచిపెట్టుము; నాకున్= నాకు; తేరికి= రథానికి; సారథి+కమ్ము= సారథిగా ఉండుము; చిచ్చుఱపిడుగు+ఎట్టులు+అట్టు+అడరి= చిచ్చరపిడుగువలె (భయంకరంగా) చెలరేగి (విజృంభించి); శూరులమొత్తమున్= వీరుల సమూహాన్ని (అందరినీ); నుగ్గు+చేసెదన్= పొడి పొడిగా

చేస్తాను; సేనన్= సైన్యాన్ని; పఱపెదన్= పారతోలుతాను; రాజు= రాజైన దుర్యోధనుడి యొక్క; ధృతిన్+పాపెదన్= ధైర్యాన్ని (నమ్మకాన్ని) పోగొడతాను; గోవులన్= ఆవులను; క్రమ్మఱించెదన్= మళ్ళిస్తాను.

**తాత్పర్యం:** 'నాయనా! ఉత్తరకుమారా! నీవు భయపడకుము, నీకు కురువీరులతో యుద్ధం చెయ్యటం చేతకాకపోతే, వద్దులే ఊరుకో! నా రథానికి సారథిగా మాత్రం ఉండుము. అగ్గిపిడుగువలె కురువీరులందరినీ పిండిపిండి చేసి, సైన్యాన్ని తరిమి, రాజు ధైర్యాన్ని నాశనం చేసి, ఆవులను మళ్ళిస్తాను.'

**క. అనుచు నొడఁబాటు లేకు । న్నను, నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి, తా**
**నును రథ మెక్కి రథికుఁ డయి । చనియె నరుఁడు జమ్మి సేర సమ్మదలీలన్. 84**

**ప్రతిపదార్థం:** అనుచున్= పైన చెప్పిన విధంగా అంటూ; ఒడఁబాటు= ఇష్టం; లేక+ఉన్నను= లేకపోయినప్పటికీ; ఆ+ఉత్తరునిన్= భయపడిన ఆ ఉత్తరుడిని; నొగలన్= నొగలమీద (రథం ముందుప్రక్క); నడుకొనన్+ఇడి= కంపిస్తూ ఉండగా కూర్చొనబెట్టి; తానును= తానూ; రథము+ఎక్కి= రథాన్ని ఎక్కి; నరుఁడు= అర్జునుడు; రథిఁకుడు+అయి= రథాన్ని ఎక్కి యుద్ధాన్ని చేసేవాడయి (ప్రధానుడయి); సమ్మదలీలన్= సంతోషంతో కూడిన విలాసంతో; జమ్మి చేరన్= జమ్మిచెట్టు దగ్గరికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అని అంటూ, అతడికి ఇష్టంలేకపోయినా ఉత్తరుడిని నొగలమీద కుప్పకూలవేసి, అర్జునుడు తానుకూడా రథాన్ని ఎక్కి, రథికుడై సంతోషంతో జమ్మిచెట్టువద్దకు వెళ్ళాడు.

**వ. ఇట్లు సవ్యసాచి నిక్షిప్తాయుధంబయిన శమీవృక్ష సమీపంబున కరుగు నవసరంబునం గ్లీబరూపచ్ఛన్నుండయ్యును బ్రస్ఫురణ విశేష భీషణుం డగు నతనిం గనుంగొని కౌరవసైనికులు గలంగిన మనంబులతోడ నివ్వెఱపడి యుండ, వారలం గనుంగొని, తోఁచు నుత్పాతంబుల నాలోకించి, గురుం డిట్లనియె. 85**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; సవ్యసాచి= అర్జునుడు; నిక్షిప్త= నిక్షేపించబడ్డ (ఉంచబడ్డ); ఆయుధంబు+అయిన= ఆయుధాలను కలిగినది అయిన; శమీవృక్ష సమీపంబునకున్= జమ్మిచెట్టు దాపునకు; అరుగు= పోయే; అవసరంబునన్= సమయంలో; క్లీబరూప= నపుంసక రూపంతో; ఛన్నుండు+అయ్యును= ఆవరించబడ్డ (కప్పబడ్డ) వాడైనా; ప్రస్ఫురణ= మంచి రూపంయొక్క; విశేష= ఆధిక్యంతో (ప్రత్యేకతతో); భీషణుండు= భయాన్ని కలిగించేవాడు; అగు= అయిన; అతనిన్= బృహన్నలను (అర్జునుడిని); కౌరవసైనికులు; కనుంగొని= చూచి; కలంగిన= కలతపడిన; మనంబులతోడన్= హృదయాలతో; నివ్వెఱపడి= ఆశ్చర్యాన్ని పొంది; ఉండన్= ఉండగా; వారలన్+కనుంగొని= ఆ సైనికులను చూచి; తోఁచు= కనపడునట్టి; ఉత్పాతంబులన్= అపశకునాలను (ఉపద్రవాలను); ఆలోకించి= చూచి; గురుండు= ద్రోణుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు ఆయుధాలు దాచిఉంచిన శమీవృక్షం వద్దకుపోయే సమయంలో, నపుంసకరూపంలో ఉన్నా ఆకారవైభవంతో ఇతరులకు భయంకలిగిస్తున్న అతడిని చూచి కౌరవసైనికులు మనస్సులలో కలతపడ్డారు. అపశకునాలు తోచాయి. వాటిని చూచి ఆ సైనికులనుద్దేశించి ద్రోణుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అపశకునాలు అపజయానికీ, కార్యహానికీ, ఆపదలకూ సూచన అని నమ్మకం. వీటిని గూర్చి శకునశాస్త్రం విపులంగా వివరించింది. ఏదైనా ముఖ్యమయిన పనిమీద వెళ్ళేటప్పుడూ, ప్రయాణాలలోనూ, యుద్ధాలకు బయలుదేరిపోయేటప్పుడూ, ఇంకా ఎక్కడికైనా వెళ్ళేటప్పుడూ, సంప్రదాయాలను పాటించేవాళ్ళు శకునం చూచుకోనిదే కాలు కదపరు. వీటిపై నమ్మకం లేని వాళ్ళ సంగతి ఇక్కడ ప్రస్తావనకు రాదు. శకునాన్ని పాటించటం ముందుకాలం నుండి ఉన్నదే!

**క. 'మాసె నభోమణి; నక్కలు । కూసెం; గలయంగ దెసలకుం బలుచాయల్**
**సేసెం బఱమొయిళు లడరి; । మ్రోసెం దమయంతఁ దూర్యము లపధ్వనులై. 86**

**ప్రతిపదార్థం:** నభోమణి= ఆకాశానికి మణి అయినవాడు (సూర్యుడు); మాసెన్= మాసిపోయి కాంతి తగ్గినవాడయ్యాడు; నక్కలు= నక్కలు; కూసెన్= హీనం, వికృతం అయిన గొంతులతో అరిచాయి (కూశాయి); దెసలకున్= దిక్కులకు (నాలుగు పక్కలా); కలయంగన్= నిండగా (వ్యాపించగా); పఱమొయిళులు= పెనుమబ్బులు; అడరి= విజృంభించి; పలు= పలురకాలైన; చాయల్+సేసెన్= రంగులను కలిగించాయి; తూర్యములు= యుద్ధ సంబంధాలైన భేరి మొదలైన వాద్యాలు; అపధ్వనులు+ఐ= అపస్వరాలు కలిగినవై; తమ+అంతన్ మ్రోసెన్= వాటి కవే మ్రోగాయి.

**తాత్పర్యం:** 'సూర్యుడు సహజంగా ప్రకాశించకుండా మందగించిన కాంతితో ఉన్నాడు. నక్కలు దీనంగా కూశాయి. పెను మబ్బులు దిక్కులలో వ్యాపించి వింత వింత రంగులను నింపాయి. తూర్యాలు మొదలైన వాద్యాలు ఎవరూ తాకకుండానే వాటి కవే వికారంగా అపస్వరాలతో మ్రోగాయి.

**విశేషం:** గురువైన ద్రోణాచార్యుడు కనిపించే ఉపద్రవాలను చెప్పుతున్నాడు. తూర్యం మొదలైన వాద్యాలు 'తమయంత' మ్రోగడమే కాక, నిష్కారణంగా బద్దలైపోవడం కూడా ఉన్నది. దాన్నీ ఇందులో భావించుకొనాలి. గురుడు తరువాతి పద్యంలో కూడా, ఉపద్రవాలనే చెప్పుతున్నాడు.

**క. ఇగ్గజములు మిన్నకయును । మ్రొగ్గెడు; నుత్తమ తురంగములు బాష్పజలం**
**బగ్గలము విడుచుచున్నవి; । తగ్గెడుఁ గారణము లేక తడఁబడి పడగల్. 87**

**ప్రతిపదార్థం:** ఈ+గజములు= ఈ ఏనుగులు; మిన్నకయును= ఊరకనే; మ్రొగ్గెడున్= వాలిపోతున్నాయి (సత్తువలేక నీరసించి కూలబడిపోవడం); ఉత్తమ= ఉత్తమజాతికి చెందిన; తురంగములు= గుర్రాలు; బాష్పజలంబు= కన్నీటిని; అగ్గలము= ఎక్కువగా (ఎడతెగక); విడుచుచున్నవి= వదలుతున్నాయి; పడగల్= (రథాలకు పైనగట్టిన) ధ్వజాలు; తడఁబడి= చిందరవందరై; కారణము లేక= ఏకారణం లేకుండా (గాలికి జెండాలు కదలవచ్చు, 'కారణం లేక' అనడం వలన ఏ కొంచెం గాలితాకు లేకుండానే తడబడుతూ ఉన్నవై); తగ్గెడున్= క్రిందికి దిగుతున్నాయి (కట్టిన చోటునుండి దిగజారటం అని భావం).

**తాత్పర్యం:** బలమైన ఏనుగులు నీరసంగా అకారణంగా ముందుకు తూలిపోతున్నాయి. జాత్యశ్వాలు నిరంతరం కన్నీటిని కారుస్తున్నాయి. కేతనాలు చిందరవందరై క్రిందికి వాలిపోతున్నాయి.

**విశేషం:** ద్రోణాచార్యుడు ఈ పద్యంలో ఏనుగుల, గుర్రాల, జెండాల విషయాలను మూడింటిని చెప్పాడు. 'ఏ కారణం లేక' - అన్నది పైవాటికి మూలం. అదే ముందు పద్యంలో చెప్పబోయే ఉపద్రవాలకు కూడా ఆధారం.

**క. దగ్ధము లైనట్టులు స । మ్యగ్ధైర్యము లెడలె; మండె నాయుధ చయముల్;**
**దిగ్ధూమం బెసఁగె; నసం । దిగ్ధము మనకాజి యగుట; దీనికిఁ దగఁగన్. 88**

**ప్రతిపదార్థం:** దగ్ధములు+ఐన+అట్టులు= తగులబడ్డట్లుగా; సమ్యక్+ధైర్యములు= గట్టి ధైర్యాలు; ఎడలెన్= లేకుండా పోయాయి; ఆయుధ= రకరకాల ఆయుధాలయొక్క; చయముల్= సమూహాలు; మండెన్= భగభగ మండిపోయాయి; దిగ్ధూమంబు (దిక్+ధూమంబు)= నాలుగుదిక్కులనిండా పొగ; ఎసఁగెన్= వ్యాపించి కమ్ముకొన్నది; మనకున్= మనకు; ఆజి+అగుట= యుద్ధం జరగటం; అసందిగ్ధము= అనుమానం లేదు (తప్పదు - అనటం); దీనికిన్= ఈ పరిస్థితికి; తగఁగన్= తగిన రీతిగా. (ముందుకు అన్వయం).

**తాత్పర్యం:** ధైర్యం తగలబడ్డట్లు నశించింది. ఆయుధాలు ఊరకనే మండిపోతున్నాయి. (సూర్యుడి వేడికి కాదు). దిక్కులలో పొగ కమ్ముకొన్నది. ఇంక మనకు యుద్ధం తప్పదు. కనుక దీనికి తగ్గట్లు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఆయుధాలు వాటికవే మండటం యుద్ధానికి సూచన. గురుడు అనుభవజ్ఞుడు. కనుకనే దీన్ని గమనించి, తన వీరులను యుద్ధానికి సంసిద్ధంగా ఉండండని హెచ్చరించాడు. పెద్దలూ, విజ్ఞులూ అయినవాళ్ళు రాబోయే ప్రమాదకరమైన పరిస్థితి గమనించి హెచ్చరించటం పరిపాటి. ఈ విషయాలను గురువుగారి ద్వారా చెప్పించటంలో మహాకవి ఎంతో ఔచిత్యాన్ని పాటించాడు.

**క. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు; । దనతన వాహనము లాయుధము లెల్ల జనం**
**బును నను వు సేసికొనుఁ; డో । పిన యంతయుఁ గాచికొనుఁడు బెదరక పసులన్.' 89**

**ప్రతిపదార్థం:** మొనలు= సేనలు; ఒఱపుగన్= నేర్పరితనంతో; తీర్చికొనుఁడు= అమరించుకొనండి; ఎల్ల జనంబును= అన్ని రకాలవాళ్ళు; తనతన= వాళ్ళవాళ్ళయొక్క; వాహనములు= గుర్రాలు, ఏనుగులు, రథాలు మొదలైన వాహనాలు; ఆయుధములు= యుద్ధానికి కావలసిన రకరకాల ఆయుధాలను; అనువు+చేసికొనుఁడు= అనుకూలంగా సిద్ధం చేసికొనండి; బెదరక= భయపడక; ఓపిన+అంతయున్= చేతనైనంతవరకు; పసులన్= ఆవులను; కాచికొనుఁడు= కాపాడుకొనండి.

**తాత్పర్యం:** సేనలను తగినరీతిగా తీర్చుకొనుడు. మీ మీ వాహనాలను, ఆయుధాలను అందరూ సిద్ధంగా ఉంచుకొనండి. చేతనైనంతవరకు భయం లేకుండా ఆవులను కాపాడుకొనండి.'

**వ. అని చెప్పి తానప్పు డర్జును నెఱింగినవాఁడు గావున నతనికి నజ్ఞాతవాస సమయభంగం బగునో యను భయంబున సురనదీసూను వదనంబు వీక్షించి సన్నవాఱ నిట్లనియె. 90**

**ప్రతిపదార్థం:** అని, చెప్పి; తాను= ద్రోణుడు; అప్పుడు; అర్జునున్; ఎఱింగినవాఁడు= తెలిసినవాడు; కావునన్= కాబట్టి; అతనికిన్= అర్జునుడికి; అజ్ఞాతవాస= అజ్ఞాతవాసంయొక్క; సమయ= ప్రతిజ్ఞ; భంగంబు+అగున్+ఓ= భంగం అవుతుందేమో; అను, భయంబునన్= అనే భయంతో; సురనదీ= దేవనది అయిన గంగానదియొక్క; సూను= కుమారుడైన భీష్ముడియొక్క; వదనంబు= ముఖాన్ని; వీక్షించి= చూచి; సన్నవాఱన్= మెల్లగా (ఎవరికీ వినబడకుండా); ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు పైవిధంగా సైనికులను హెచ్చరిక చేసి, అర్జునుడిని బాగా తెలిసినవాడు కావటంవలన, ఆతడి ఒక ఏడు అజ్ఞాతవాస ప్రతిజ్ఞకు ఎక్కడ భంగం కలుగుతుందో అనే భయంతో, భీష్ముడి మొగంవైపు చూచి మెల్లగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** గురువైన ద్రోణాచార్యులకు ప్రియశిష్యుడైన అర్జునుడిమీద ఉన్న వాత్సల్యం ఇందులో తెలుస్తుంది. ఇది మామూలు విషయమే. ఇంతకన్నా లోతైన విశేషం కూడా ఇందులో ఉన్నది. గురు పితామహాదులు ధర్మనిష్ఠులు. పాండవులు ధర్మాభిరతులు; ధర్మ స్వరూపులు. గురువైన ద్రోణుడికీ, పితామహుడైన భీష్ముడికీ ధర్మంపై పక్షపాతం. అదే పాండవులపైనా ఉన్నది. ధర్మాత్ములైన పాండవులు ఎక్కడ అర్జునుడి తొందరపాటువలన అజ్ఞాతవాస ప్రతిజ్ఞకు భంగం కలిగితే, మరలా అరణ్య అజ్ఞాతవాస క్లేశాన్ని పొందవలసి వస్తుందో అనే భయంతో, ద్రోణుడు భీష్ముడితో మెల్లగా ఆ విషయాన్ని ముందుపద్యంలో అంటున్నాడు.

**చ. 'వెరవరి గాక వీఁడు కురువీరులకుం బొడ సూపువాఁడె? య**
**చ్చెరు, వొక భ్రూనిపేర నిట సేరఁగ వచ్చుచునున్నవాఁ; డహం**
**కరణము కాని యొండొకటి గానఁడు; మూర్తివిశేష మారయన్**
**సురపతి యట్ల; వీని మదిచొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడున్.' 91**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఆ వస్తున్నవాడు; వెరవరి+కాక= ఉపాయం తెలిసిన వాడు కాకుండా; కురువీరులకున్= కౌరవ వీరులకు; పొడచూపు వాఁడె?= కనిపించవచ్చునా?; అచ్చెరువు= వింతగా ఉన్నది; ఒక ద్రూని పేరన్= ఒకానొక చెట్టు పేరుతో (అర్జునవృక్షం); ఇట= ఇక్కడికి; చేరఁగన్= చేరేటట్లు; వచ్చుచున్+ఉన్న వాఁడు= వస్తూ ఉన్నాడు; అహంకరణము+అ+కాని= అహంకారం ఒక్కటే గాని; ఒండు+ఒకటి= వేరే ఏదీ; కానఁడు= గమనించడు; మూర్తి= ఆకారంయొక్క; విశేషము+ఆరయన్= అతిశయాన్ని చూస్తే; సురపతి+అట్లు+అ= ఇంద్రుడివలెనే! (ఉన్నాడు); వీని= వీడియొక్క; మది= మనస్సుయొక్క; చొప్పు= తీరు (ఇతడి ఆలోచనా విధం); అది ఎట్లు+ఒ= అదేమో? (ఎలా ఉన్నదో); ఎఱుంగనయ్యెడున్= తెలిసికొనాలి.

**తాత్పర్యం:** 'వీ డెవడో ఉపాయం లేకుండా కౌరవులకు కనపడవచ్చా? గర్వం ఒక్కటే కనపడుతూ ఉంటుంది. చాలా వింతగా ఉన్నది. చెట్టు పేరుతో ఇక్కడికి వస్తున్నాడు. ఆకారం మాత్రం ఇంద్రుడివలెనే ఉన్నది. కాని వీడి మనసులో ఏముందో తెలిసికొనాలి.'

**విశేషం:** ఈ పద్యానికి పైది సామాన్యభావం. ద్రోణుడు భీష్ముడితో అనదలుచుకొన్న భావం ఇది. తన అహంకారం ఒక్కటే కారణంగా, అర్జునుడు ఆలోచన లేకుండా కౌరవుల ఎదుటికి వస్తున్నాడే! అజ్ఞాతవాస ప్రతిజ్ఞ భంగం కాదా? ఇతడు కారణంగా పాండవులు అందరు మళ్ళీ చిక్కులలో పడతారేమో? ఇంద్రుడి ప్రసక్తితో ఇతడు అర్జునుడే అన్నది నిజం అని ద్రోణుడి భావం. దానినే భీష్ముడికి తెలుసునో తెలియదో అని గురుడు సూచించాడు.

**క. అనిన విని యెఱిఁగికొని యా । తని మది సందియము మాన్పఁదలఁచి నరేంద్రుం**
**గనుఁగొనుచు నతనితోఁ జె । ప్పిన భంగి నిగూఢ వృత్తి భీష్ముఁడు వలికెన్. 92**

**ప్రతిపదార్థం:** అనినన్= ద్రోణుడు పైవిధంగా చెప్పగా; విని= భీష్ముడు విని; ఎఱిఁగికొని= ద్రోణుడి మాటలలో ఉన్న నిగూఢమైన విషయాన్ని గ్రహించి; ఆతని= ఆ గురువైన ద్రోణాచార్యుడియొక్క; మది= మనస్సులో ఉన్న; సందియము=

అనుమానం; మాన్పన్+తలఁచి= పోగొట్టాలని ఎంచి; నర+ఇంద్రున్= రాజైన దుర్యోధనుడిని; కనుఁగొనుచున్= చూస్తూ; అతనితోన్= ఆ రాజుతో; చెప్పిన భంగిన్= చెప్పిన విధంగా (నెపంతో); నిగూఢ వృత్తిన్= గుట్టుగా; పలికెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు చెప్పిన దానిని విని, భీష్ముడు దానిలో ఉన్న రహస్యమైన అర్థాన్ని గమనించి, ద్రోణుడి మనస్సులో ఉన్న అనుమానాన్ని పోగొట్టాలని దుర్యోధనుడి వైపు చూస్తూ ఆతడితో చెప్పినట్లుగా నిగూఢంగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ద్రోణుడు తన సందేహాన్ని వెలిబుచ్చింది భీష్ముడితో; కాని భీష్ముడు చెప్పింది దుర్యోధనుడికి. అదే ఇందులోని విశేషం. ఇందులో భీష్ముడి సమయస్ఫూర్తి, ఉచితజ్ఞత బాగా తెలుస్తాయి. ద్రోణుడు భీష్ముడితో అర్జునుడి విషయాన్ని, నిగూఢంగా (చెట్టుపేర మనిషి) అన్నప్పుడు అక్కడ దుర్యోధనుడు ఉన్నాడు. ఆతడు రాజు. పక్కన ఉన్న రాజును కాదని ద్రోణుడికి నేరుగా చెప్పటం బాగుండదు. అందువలన భీష్ముడు, దుర్యోధనుడిని అడ్డుపెట్టుకొని ద్రోణుడికి బదులిచ్చాడు. అదీ అటు రాజుకూ, ఇటు గురువుకూ ఇద్దరికి సమాధానంగా ఉండేటట్లు చెప్పాడు. రాజుకు కావలసిన విషయం గురుడి సందేహాన్ని తీర్చే విషయం, రెండూ భీష్ముడి సమాధానంలోనే ఉన్నాయి. అదీ భీష్ముడి సామర్థ్యం!

సమర్థులైన, అనుభవజ్ఞులైన, ఎంతో లోతైన ఇద్దరు పెద్దల మధ్య ఎందరున్నా, వారికి తెలియని అంతరార్థం, అందవలసిన వాళ్ళకు అందుతుంది. ఇది తిక్కన సంభాషణ ప్రతిభా విశేషం. తెలుగు పలుకులకు ఎంత నిగూఢత, పదునూ ఉన్నదో అది అంతా తిక్కన సంభాషణలలో ఉన్నది. ఇది అందరి కవులకూ అందదు. క్రింది పద్యంలో ఇది ఎక్కువగా వివరించబడుతుంది.

**క. 'తలఁపఁగ రిపులకు నిమ్మగు । కొలఁది గడచి వచ్చితిమి; యకుంఠిత బాహా**
**బలము నెఱపఁ దఱియయ్యెను । జలింపవల దింక మనకు శత్రులవలనన్.' 93**

**ప్రతిపదార్థం:** తలఁపఁగన్= నిదానంగా ఆలోచిస్తే; రిపులకున్= శత్రువులకు; ఇమ్ము+అగు= అనుకూలమైన; కొలఁది= హద్దును; (చోటును); కడచి= దాటి; వచ్చితిమి= వచ్చాము; అకుంఠిత= మొక్కవోని; బాహాబలము= భుజబలం; నెఱపన్= చూపుటకు; తఱి= సమయం (అవకాశం); అయ్యెను= వచ్చింది; శత్రులవలనన్= శత్రువుల వలన; మనకున్= మనకు; ఇంకన్= ఇక; చలింపవలదు= బెదిరిపోవలసిన అవసరం లేదు; (ఇది రాజుకు సంబంధించిన అర్థం).

**తాత్పర్యం:** 'శత్రువులకు అనుకూలమైన చోటును దాటాం. (మనకు అనుకూలం కాని చోటును దాటాం అని). ఇంక మన బాహుబలాన్ని చూపవలసిన సమయం వచ్చింది. శత్రువులకు ఇంక మనం భయపడవలసిన పనిలేదు.'

(ద్రోణుడికి అందవలసిన అర్థం కిందివిధంగా ఉన్నది.)

**ప్రతిపదార్థం:** తలఁపఁగన్= బాగా పరిశీలిస్తే (లెక్కవేసి చూస్తే); రిపులకున్= శత్రువులైన కౌరవులకు, ఇమ్ము+అగు= అనుకూలమైన; కొలఁది= గడువును (కాల పరిమితిని); కడచి వచ్చితిమి= దాటి వచ్చాం. (అజ్ఞాతవాస సమయం దాటింది అని భావం); (కనుక); అకుంఠిత బాహాబలము= మొక్కవోని పరాక్రమాన్ని; నెఱపన్= ప్రదర్శించటానికి; తఱి+అయ్యెను= సమయం వచ్చింది; శత్రులవలనన్= శత్రువులైన కౌరవుల వలన; మనకున్= మనకు; (భీష్మద్రోణులు పాండవ పక్షపాతులు గనుక); ఇంకన్= ఇక; చలింపన్ వలదు= భయపడవలసిన పనిలేదు.

**తాత్పర్యం:** 'శత్రువులకు అనుకూలంగా ఉన్న అజ్ఞాతవాస సమయం కడచిపోయింది. అఖండమైన తన బాహుబలాన్ని ప్రదర్శించటానికి (అర్జునుడికి - ప్రకృత - అర్థాన్ని బట్టి) ఇదే సమయం. ఆతడు అజ్ఞాతవాస సంబంధమైన విషయంగా శత్రువులకు జంకవలసిన అవసరం లేదు.'

**విశేషం:** ఎంతమంది చుట్టూ ఉన్నా, ఎవరికి అందవలసిన అర్థాన్ని వాళ్ళకు అందేటట్లు చేయడం, సంభాషణ శిల్పంలో ఒక అంశం. నాటకంలో ఈ ప్రక్రియ బాగా రక్తి కట్టుతుంది. ఇద్దరు నటులకు మధ్య ఎందరున్నా, వాళ్ళు చెప్పుకొనదలచుకొన్న విషయం వాళ్ళకు మాత్రమే అర్థమయ్యేట్లు వాళ్ళు చెప్పుకుంటారు. ఇటు శ్రవ్యంలోను, అటు దృశ్యంలోను ఈ విధానం ఉన్నది. నిత్యజీవితంలోనూ ఎప్పుడూ ఇది ఎదురౌతూనే ఉంటుంది.

**వ. అనవుడు నాచార్యుం డయ్యర్థంబు గనికొని పార్థునకు సమయ భంగంబు వలని సంకటంబు లేకునికి మనంబునం బ్రియంబంది మొగంబునం దోఁపనీక పుయిలోట దక్కి యిట్లనియె. 94**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; (భీష్ముడు చెప్పగానే); ఆచార్యుండు= ద్రోణుడు; ఆ+అర్థంబున్= ఆ అర్థంలో ఉన్న రహస్యాన్ని; కనికొని= గమనించి (కనిపెట్టి); పార్థునకున్= అర్జునుడికి; సమయ భంగంబువలని= నియమం భగ్నమయ్యేదానిపట్ల; సంకటంబు= ఇబ్బంది, అనుమానం; లేక+ఉనికిన్= లేకపోవటంతో; మనంబునన్= హృదయంలో; ప్రియంబు+అంది= సంతోషించి; మొగంబునన్+తోఁపనీక= (ఆ సంతోషాన్ని) ముఖంమీద కనపడనీయకుండా; పుయిలోట= సంకోచం; తక్కి= విడిచిపెట్టి; ఇట్లు+అనియెన్= ఇట్లు అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడి మాటలలోని అంతరార్థాన్ని గమనించి, అర్జునుడికి అజ్ఞాతవాసం భంగం కాలేదని మనస్సులో సంతోషించి, దానిని పైకి కనపడనీయకుండా అనుమానాన్ని విడిచి ద్రోణుడు ఇట్లా అన్నాడు.

**శా. 'సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా**
**తంగ స్ఫూర్జిత యూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో**
**జం గాంతార నివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ**
**చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్. 95**

**ప్రతిపదార్థం:** సింగంబు= సింహం; ఆఁకటితోన్= ఆకలితో; గుహా+అంతరమునన్= గుహలోపల; చేడ్పాటుమైన్+ఉండి= దిగులుతో ఉండి (కష్టపరిస్థితిలో ఉండి); మాతంగ= ఏనుగులయొక్క; స్ఫూర్జిత= ప్రకాశిస్తూ ఉన్న; యూథ= సమూహం యొక్క; దర్శన= చూడటం చేత; సముద్యత్= పైకి వస్తున్న (విజృంభిస్తున్న); క్రోధము+ఐ= కోపం గలిగినట్టిదై; వచ్చు+ఓజన్= వచ్చేరీతిగా; కాంతార= అడవియందు; నివాస= నివాసం ఉండడం చేత; ఖిన్నమతిన్= దుఃఖాన్ని పొందిన మనస్సుతో; అస్మద్= మనయొక్క; సేనపైన్= సైన్యం పైకి; వీఁడె= ఆ వచ్చేవాడే; కుంతీసుత మధ్యముండు= కుంతీదేవి కొడుకులలో (పాండవులలో) నడిమివాడైన అర్జునుడు; సమరస్థేమ+అభిరామ+ఆకృతిన్= యుద్ధంలో స్థిరం, మనోహరం అయిన ఆకారంతో; వచ్చెన్= (దగ్గరికి) వచ్చాడు.

**తాత్పర్యం:** సింహం ఆకలిగొని గుహలో చాలాకాలం నివాసం ఉండి, ఉన్నట్టుండి బయటికి వస్తూ, ఏనుగుల గుంపును చూస్తే మితిమీరిన కోపంతో ఎట్లా మీదికి దూకుతుందో, అట్లాగే అర్జునుడు అరణ్యవాసం వలన ఎంతో బాధపడి, మన సేనమీదికి, యుద్ధంలో స్థిరంగా నిలిచే ఆకారంతో ఇప్పుడే వచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ. అర్జునుడు పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం చేసి అలిసిపోయాడు. ఇన్నేండ్లు కౌరవులతో ఆతడికి యుద్ధం లేదు. వీరుడికి యుద్ధం లేకపోవటం ఒక ఆకలి వంటిది. ఆకలితో ఉన్నవాళ్ళకు కోపం ఎక్కువ. అట్లాంటి అర్జునుడిని, ఎంతో కాలం ఆకలితో అలమటిస్తూ, గుహలో దిగులుగా ఉన్న సింహంతో కవి పోల్చాడు. ఆ సింహం బయటపడింది. వెంటనే దానికి ఎదురుగా మదించిన ఏనుగుల గుంపు కనబడింది. అదే కురుసైన్యం. ఏనుగులకూ సింహానికీ సహజవైరం. సింహం కలలో వస్తేనే ఏనుగు చస్తుంది. కౌరవులకూ, పాండవులకూ ఉండే వైరం కూడా అట్లాంటిదే!

అర్జునుడంటే ద్రోణుడికి ప్రాణం. ఎంతో కాలానికి తన ప్రియశిష్యుడైన అర్జునుడు ఆచార్యుడికి వీరమూర్తిగా కనిపించాడు. దీనితో ద్రోణుడి సంతోషం, ఉత్సాహం కట్టలు తెంచుకొన్నాయి. అందుకే 'వీఁడె వచ్చెన్' - అని అన్నది. ఆ వచ్చేవాడు, 'కుంతీసుత మధ్యముండు'- అట. కుంతి కొడుకులు నిజానికి ముగ్గురే. వాళ్ళలో నడిమివాడు భీముడు. కాని కుంతి అట్లా అనుకొనలేదు. మాద్రీపుత్రులైన నకుల, సహదేవులనూ తన సొంతకొడుకులు అనే అనుకొన్నది. అందుచేత కౌంతేయులన్నా పాండవులన్నా ఒక్కటే! కాగా, ఐదుమందిలో మధ్యవాడూ అర్జునుడే. ఇట్లా అని వ్యాసుడే అన్నాడు. దాన్నే తిక్కన పాటించాడు.

'కుంతీసుత మధ్యముండు'- అయిన అర్జునుడు, 'సమర స్థేముడట; అభిరామమైన ఆకారం గలవాడట.' ఇది గురువైన ద్రోణుడు అర్జునుడి యుద్ధనైపుణ్యాన్ని మెచ్చుకొనటమే! విద్య నేర్పిన గురువుకు, విద్యాపారంగతుడైన శిష్యుడు ఎంతో కాలానికి కనిపిస్తే, కలిగే ఆనందమే ఇక్కడ ద్రోణుడికీ కలిగింది. అందుకే 'వీఁడె'- అని గురువు అన్నాడు. అంటే, 'మావాడే'- అని భావం. ఈపదం గురువుకు, అర్జునుడి మీద ఉండే వాత్సల్యాన్నీ, మమకారాన్నీ సూచిస్తుంది.

అర్జునుడి పరాక్రమంమీద ద్రోణుడికి ఎనలేని నమ్మకం, అంతకు మించిన అభిమానం ఉన్నది. ఇతడిని ఎవరూ జయించలేరు అనే భావాన్ని తరువాతి పద్యంలో గురువు వెలిపుచ్చాడు. ఇదీ గురువుకు శిష్యుడి మీద ఉన్న వాత్సల్యాన్నే తెలుపుతుంది. 'వీఁడె వచ్చెం గుంతీసుత మధ్యముండు' - ఈ వాక్యం సరిగా నాలుగోపాదం ప్రాసస్థానంలో ముగిసింది. ఆ వాక్యంలో వచ్చినవా డెవడో ముందు చెప్పక, శ్రోతల ఆసక్తిని రేపుతూ ఒక్కసారిగా 'కుంతీసుత మధ్యముండు' అన్నాడు. అతడి కొక విశేషణం చేర్చాడు. అది వినగానే శ్రోతల గుండెలలో దడ పుట్టుతుంది. ఇది ఒక రచనా శిల్పం.

**ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనందగు వార లస్మదీ**
**యాతత సేనలోఁ గలుగు టారయ సంశయ; మెల్లభంగి గో**
**వ్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి; కితండు రుద్రునిం**
**బ్రీతునిఁ జేసె నా వినమె! పెంపెసలారెడు బాహుసంపదన్.' 96**

**ప్రతిపదార్థం:** ఈతనితోడి కయ్యమునకున్= వస్తూ ఉన్న ఆ అర్జునుడితో పోరాటానికి; ఇయ్యకొనన్+తగువారలు= ఒప్పుకొనగలవాళ్ళు (వచ్చేవాళ్ళు); ఆరయన్= ఎంత బాగా వెదికిచూచినా; అస్మదీయ= మనదైన; ఆతతసేనలోన్= ఇంత పెద్ద సైన్యంలో (కూడా); కలుగుట= ఉండటం; సంశయము= అనుమానమే! (లేరు అని భావం); ఎల్లభంగిన్= అన్ని విధాలా; కిరీటికిన్= అర్జునుడికి; గోవ్రాత= ఆవులమందయొక్క; నివర్తనంబు= మళ్ళించటం; సుకరంబు+అ= చాలా సులువే!; ఇతండు= ఈ అర్జునుడు; పెంపు+ఎసలారెడు= పేరుకెక్కిన; బాహుసంపదన్= భుజబలపరాక్రమంతో; రుద్రునిన్= శివుడిని; ప్రీతునిన్+చేసెన్= సంతోషపెట్టాడు; నాన్= అనగా; వినమె!= విని ఉన్నాము గదా!

**తాత్పర్యం:** ఈతడితో యుద్ధానికి పూనుకొనేవాళ్ళు, మన సేనలో ఎవరైనా ఉన్నారా?- అన్నది అనుమానమే! ఏ విధంగా చూచినా, అర్జునుడికి ఆవులమందను మలుపుకోవటం సులువే. ఆతడు తన పరాక్రమంతో ఆ రుద్రుడిని కూడా మెప్పించాడని విన్నాం కదా!'

**విశేషం:** దీనికి ముందు పద్యంలో ద్రోణుడు అర్జునుడిపై చూపిన వాత్సల్యమే, ఇందులో మరింత కనిపిస్తుంది. ఇది గురువు శిష్యుడి విక్రమాన్ని స్తుతించటమే! గురుశిష్యుల అనుబంధం ఇట్లాంటిది. అరణ్యావాససమయంలో అర్జునుడు ఇంద్రకీల పర్వతంమీద శివుడిని గూర్చి ఘోరతపస్సు చేసి, మల్లయుద్ధంలో ఆ మహాదేవుడిని జయించి, మెప్పుగా పాశుపతాస్త్రాన్ని పొందాడు. ఈ కథ ఆధారంగా, సంస్కృతంలో భారవి మహాకవి కిరాతార్జునీయం అనే కావ్యాన్ని వ్రాశాడు. అట్లాగే ఈ కథా సన్నివేశాన్ని గ్రహించి, ఒక కావ్యంగా కాక, శ్రీనాథుడు హరవిలాసంలోనూ, ధూర్జటికవి శ్రీకాళహస్తీశ్వరమాహాత్మ్యంలోనూ రసవంతమైన కావ్యఖండాలుగా మలిచారు.

**వ. అను పలుకు లాకర్ణించి కర్ణుండు కటకటంబడి కుంభసంభవున కిట్లనియె. 97**

**ప్రతిపదార్థం:** అను, పలుకులు= అని అన్నమాటలు; ఆకర్ణించి= విని; కటకటంబడి (కటకటన్+పడి)= బాధతో కోపించి; కర్ణుండు; కుంభసంభవునకున్= కడవనుంచి పుట్టినవాడైన ద్రోణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'మన పెద్ద సేనలో అర్జునుడితో పోరాడేవాళ్ళున్నారా! ఇది సందేహమే!' అని ద్రోణుడు అన్న మాటలను విని, బాధతో, కోపంతో కర్ణుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అర్జునుడి పేరు అంటేనే అసలు సరిపోని కర్ణుడికి ద్రోణుడు తన శిష్యుడిని గురించి చేసిన పరాక్రమం ప్రశంసలు, ఎంతో బాధనూ, కోపాన్నీ కలిగించాయి. దాని ఫలితంగా, అంతగొప్పవాడైన అస్త్రవిద్యా గురువైన ద్రోణుడిని ముందు పద్యంలో కర్ణుడు ఆక్షేపిస్తాడు. అంతేకాక, ద్రోణుడు చేసిన 'ప్రశంస' కురువీరులలో పెద్ద చర్చకు హేతువైనది.

**ఉ. 'పాండవ పక్షపాతమునఁ బల్కుదు నోరికి వచ్చినట్లు, ని**
**న్నొండన రామిఁ జేసి; యిది యొప్పునె? కౌరవసేన కెల్ల నొ**
**క్కండవ మేటి; వీ బలము గర్వముఁ గుందఁగ నిట్లు శత్రుదో**
**శ్చండిమ కోహటించితి; నిజంబునకున్ నరుఁ డింత యెక్కుడే? 98**

**ప్రతిపదార్థం:** నిన్నున్+ఒండు+అనరామిన్+చేసి= ఎవరూ నిన్ను ఏమీ అనకూడదు గనుక; పాండవ= పాండవులపై; పక్షపాతమునన్= అభిమానంతో (ఒక పక్షంమీదనే అభిమానాన్ని చూపటం); నోరికి వచ్చినట్లు= నోటికి ఏ మాటవస్తే ఆ మాట (ఇష్టం వచ్చినట్లు, ఇది జాతీయం); పల్కుదు(వు)= మాట్లాడుతున్నావు; ఇది= ఇట్లా మాట్లాడడం; ఒప్పునె?= సరిపోతుందా? (తగునా?); కౌరవసేనకున్+ఎల్లన్= కురుసైన్యానికంతటికీ; ఒక్కండవు+అ= నీవు ఒక్కడివే; మేటివి= అధికుడివి; ఈ బలము= ఈ బలమూ; గర్వమున్= పొగరూ; కుందఁగన్= కుంగిపోగా; ఇట్లు= ఈ రకంగా; శత్రుదోస్+చండిమకున్= శత్రువుయొక్క బాహుబలంయొక్క తీవ్రతకు; ఓహటించితి(వి)= భయపడి మాట్లాడావు; నిజంబునకున్= నిజానికి; నరుఁడు= అర్జునుడు; ఇంత+ఎక్కుడే?= (నీవు చెప్పినంత) గొప్పవాడా?

**తాత్పర్యం:** 'నిన్ను ఎవరూ ఏమీ అనకూడదు. అందుకే నీవు పాండవులమీద పక్షపాతంతో, నోటికి ఏమివస్తే అదంతా వాగుతూ ఉన్నావు. ఇది సరి కాదు. కురుసేన మొత్తానికీ నీవే మొనగాడివా? బలమూ, గర్వమూ కుంగిపోయేటట్లు (నిరుత్సాహంగా) శత్రువుల పరాక్రమానికి భయపడుతూ నీవు అంటున్నావు. అసలు అర్జునుడు నీవనుకొన్నంత గొప్పవీరుడా? (కాదు అని సారాంశం.)

**విశేషం:** శత్రువైనా సరే, అతడు పరాక్రమశాలి అయితే పొగడటం అసలైన వీరుడి లక్షణం. అందుకే ద్రోణుడు అర్జునుడిని ప్రశంసించాడు. అందులో అర్జునుడు తనకు ప్రియశిష్యుడు, ధర్మబద్ధుడు. ఈ వీరధర్మాన్ని కర్ణుడు అపార్థం చేసికొన్నాడు. దానికి కారణం కర్ణుడిలో ఉన్న ఈర్ష్య. తాను అర్జునుడికి సమానమైన ఉజ్జీ అని ఆతడి భావన. దుర్యోధనుడి భావమూ అదే! అందుకే గురువు అంతటివాడిని అంతలంతలు మాటలను కర్ణుడు అనగలిగాడు. అదే ఆతడి వ్యక్తిత్వం. కర్ణుడూ మహావీరుడేకాని, ఆతడిని అసూయ ఆవరించబట్టి, అర్జునుడి విషయంలో గురుడు చేసిన పొగడ్తను ఓర్చుకొనలేకపోయాడు. అందుకే ముందు పద్యంలో కర్ణుడు తన పరాక్రమాన్ని గూర్చి చెప్పుకొన్నాడు.

**ఆ. అతఁడు వచ్చెనేని, నస్మచ్ఛిలీముఖ । పాతచలిత హృదయపద్మ్ముఁ జేసి,**
**వెగడు పఱిచి, యోధవీరుల కెల్ల ను । త్సవ మొనర్తు బాహుదర్ప మొప్ప.' 99**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ అర్జునుడు; వచ్చెన్+ఏనిన్= వచ్చినట్లయితే (ఒకవేళ వస్తే); బాహు= భుజాలయొక్క; దర్పము+ఒప్పన్= గర్వం అతిశయించేటట్లుగా; అస్మత్= నా యొక్క; శిలీముఖ= బాణాలయొక్క; పాత= పడటంవలన; చలిత= కదలిపోయిన (అదిరిన); హృదయ పద్మ్మన్= పద్మం వంటి హృదయం కలిగినవాడినిగా; చేసి= చేసి; వెగడుపఱిచి= బెదరగొట్టి; యోధవీరులకున్+ఎల్లన్= మహావీరులందరికీ; ఉత్సవము+ఒనర్తున్= సంతోషాన్ని చేస్తాను (కలిగిస్తాను).

**తాత్పర్యం:** నిజంగా అర్జునుడే ఒకవేళ ఇక్కడికి వస్తే, పరాక్రమంతో నా బాణాలను ఆతడిపై గుప్పించి, హృదయం చెదిరిపోయేటట్లు ఆతడిని భయపెట్టి, మన కురువీరులందరికీ ఆనందాన్ని కలిగిస్తాను.'

**వ. అనిన విని సుయోధనుండు రాధేయున కిట్లనియె. 100**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; సుయోధనుండు= దుర్యోధనుడు (సుఖంగా యుద్ధం చేసేవాడు. మంచి ఉపాయంతో గదాయుద్ధం చేస్తాడు); రాధేయునకున్= రాధయొక్క కుమారుడైన కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడి మాటలను విన్న దుర్యోధనుడు కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'తప్పఁ బలికి తీవు; చెప్పెద విను; మితఁ । డర్జునుండ యేని నడవి కేఁగి**
**భ్రాతృయుతము గాఁగఁ బండ్రెండు వత్సర । ములును నంద నిలువ వలయు మగుడ. 101**

**ప్రతిపదార్థం:** ఈవు= నీవు; తప్పన్+పలికితి(వి)= పొరపాటుగా అన్నావు; చెప్పెదన్= నేను చెప్పుతాను; విను= వినుము; ఇతఁడు= ఈ వచ్చేవాడు; అర్జునుండు+అ+ఏనిన్= అర్జునుడే అయితే; భ్రాతృయుతము+కాఁగన్= తన సోదరులతో కూడా; మగుడన్= తిరిగి; అడవికిన్+ఏఁగి= అడవికి పోయి; పండ్రెండు వత్సరములును= పన్నెండేండ్లు; అందున్+అ= ఆ అడవిలోనే; నిలువవలయున్= ఉండాలి.

**తాత్పర్యం:** 'ఓ కర్ణా! నీవు మాట్లాడింది సరిగాదు. నేను చెప్పుతాను వినుము. వచ్చేది అర్జునుడే అయితే అన్నదమ్ముళ్ళతో మళ్ళీ అడవికి వెళ్ళి పన్నెండేండ్లు అక్కడే ఉండాలి.

**విశేషం:** కర్ణుడు, తన బాణపాతంతో అర్జునుడిని చెదరగొట్టి, వీరులను ఆనందపరుస్తానని ముందు పద్యంలో అన్నదానికి దుర్యోధనుడు ఏదో సులువైన ఉపాయం చెప్పినట్లుగా పై విధంగా అంటాడు. దీనినిబట్టి ఆతడికి అజ్ఞాతవాసం లెక్క

తెలియదని అనిపిస్తుంది. దుర్యోధనుడి లెక్కప్రకారం అజ్ఞాతవాసం పూర్తికాలేదని అనుకొనాలి. కాని, పూర్తి అయింది. దీని చర్చ (232వ పద్యంలో) భీష్ముడి ద్వారా జరుగుతుంది.

**క. ఒరుఁడయ్యేనేని మామక । శరాసన క్షిప్త దీప్తసాయక పంక్తిం**
**బరిమార్చెద వ్రేల్మిడి న । చ్చెరువుఁ బ్రమోదంబు నొంది సేనలు వొగడన్.' 102**

**ప్రతిపదార్థం:** ఒరుఁడు+అయ్యేనేనిన్= అర్జునుడు కాక వేరేవాడు అయితే; సేనలు= సైన్యాలు (నాలుగురకాల సేనలు); అచ్చెరువున్= ఆశ్చర్యమూ; ప్రమోదంబున్= సంతోషమూ; ఒంది= పొంది; పొగడన్= అగ్గించేటట్లు; మామక= నా యొక్క; శర+అసన= వింటినుంచి (బాణాలను త్రోసేది); క్షిప్త= విసిరివేయబడ్డ; దీప్త= ప్రకాశించిన; సాయక= బాణాలయొక్క; పంక్తిన్= వరుసతో (ఎడతెగకుండా అని భావం); వ్రేల్మిడిన్= ఒక్కచిటికెలో; పరిమార్చెదన్= చంపుతాను.

**తాత్పర్యం:** ఆ వచ్చేది అర్జునుడు కాక వేరేవాడైతే మన సేన అంతా ఆశ్చర్యంతో, సంతోషంతో ప్రశంసించేరీతిగా నా బాణాలతో ఒక్క చిటికెలో రూపు మాపుతాను'.

**విశేషం:** దుర్యోధనుడు పై రెండు పద్యాలలో చెప్పిన దానినిబట్టి అర్జునుడైతే అన్నదమ్ముళ్ళతో అడవికి పోతాడు. వేరే వాడైతే తన బాణ పరంపరతో చంపుతానని అనటం కనిపిస్తుంది. ఇంతకూ ఆ వచ్చేవాడు ఎవడైనా ఫరవాలేదనీ, ఆతడివలన సమస్యే లేదని దుర్యోధనుడి అభిప్రాయం.

**క. అనుపలుకులకును భీష్ముం । డును ద్రోణుఁడు ద్రోణసూనుఁడును గృపుఁడును మే**
**లని యియ్యకొనిరి హృదయా । ననురూపములైన తెలివు లాస్యముఁ బొందన్. 103**

**ప్రతిపదార్థం:** అనుపలుకులకును= దుర్యోధనుడు కర్ణుడితో చెప్పిన మాటలకు; భీష్ముండును; ద్రోణుఁడును; ద్రోణసూనుఁడును= ద్రోణుడి కుమారుడైన అశ్వత్థామా; కృపుఁడును= కృపాచార్యుడూ (ద్రోణుడి బావమరది); హృదయ= మనస్సుకు; అనను రూపములు+ఐన= సరిపడని (ఇష్టంలేని); తెలివులు= వికాసాలు (కాంతులు); ఆస్యమున్+పొందన్= ముఖంపైకి రాగా; మేలు+అని= మంచిది అని; ఇయ్యకొనిరి= ఒప్పుకొన్నారు.

**తాత్పర్యం:** పై విధంగా మాట్లాడిన దుర్యోధనుడి మాటలకు భీష్ముడూ, ద్రోణుడూ, అశ్వత్థామా, కృపాచార్యుడూ మంచిది - అని ఒప్పుకొన్నారు. కాని, వాళ్ళ మొగాలలో మాత్రం మనస్సులకు ఇష్టంగాని ఒక వెల్లదనం కనబడింది.

**విశేషం:** పై నలుగురు విశిష్ట వ్యక్తులు, పెద్దలు. వయస్సునూ, గుణాన్నిబట్టి భీష్ముడూ; పై రెంటికితోడు గురుత్వ లక్షణాన్నిబట్టి ద్రోణుడూ; కులాన్నీ, విద్యనూబట్టి అశ్వత్థామా; కురుపాండవులకు ప్రాథమిక విద్యా గురుత్వాన్నిబట్టి, కులాన్నిబట్టి కృపాచార్యుడూ- పెద్దలు. దుర్యోధనుడి మాటలు నిజానికి వాళ్ళకు సరిపోలేదు. పైగా వెగటుగా కూడా ఉన్నాయి. కాని, ఆతడు రారాజు. మొగమోటానికి పైకి బాగుంది - అని అన్నారు అంతే. అందుకే వాళ్ళ అనిష్టత వాళ్ళ మొగాలలో కనబడింది.

సంస్కృత మూలభారతంలో పై నలుగురూ దుర్యోధనుడి పరాక్రమాన్ని ప్రశంసించినట్లు మాత్రమే ఉన్నది. అయితే తిక్కన ఆ ప్రశంస వెనుక ఉన్న నిగూఢమైన అర్థాన్ని, 'హృదయాననురూపములైన తెలివు లాస్యముఁ బొందన్' అని వివరించాడు.

మనస్తత్త్వాలను చిత్రించడంలో తిక్కన తరువాతే తక్కిన కవులు. మూలానికి మెరుగుపెట్టటంలో ఇది ఒక పద్ధతి.

## అర్జునుఁడు శమీవృక్ష నిక్షిప్తంబైన గాండివంబు గొనుట (సం. 4-38-1)

**వ. అట్టియెడ శమీవృక్ష సమీపంబున నరదంబు నిలుపంబంచి పార్థుం డుత్తరున కిట్లనియె. 104**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; శమీవృక్ష= జమ్మిచెట్టుయొక్క; సమీపంబునన్= దాపులో; అరదంబు= రథం; నిలుపన్= నిలుపటానికి; పంచి= ఆజ్ఞాపించి; పార్థుండు= అర్జునుడు; ఉత్తరునకున్+ఇట్లు+అనియెన్= ఉత్తరునితో ఈవిధంగా పల్కినాడు.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు, జమ్మిచెట్టు దగ్గర రథాన్ని ఆపుమని ఉత్తరుడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** రెండు వైపుల వాళ్ళ విషయాలను మార్చి మార్చి ఒక దాని తర్వాత మరొకదానిని నడపటం నాటకీయశైలి. తిక్కనలో ఉన్న ప్రధాన లక్షణం ఇదే! ఇంతసేపూ పాఠకుడి మనస్సు కౌరవులమీదనే తిరుగుతూ ఉన్నది. ఇప్పుడు అర్జునుడూ, ఉత్తరుడి మీదికి మళ్ళింది. కథాంశాలను సమదృష్టితో నడపడం మహాకవుల లక్షణం. దానిని నాటకీయంగా కండ్లకు కట్టినట్లు చిత్రించటం తిక్కన ప్రత్యేకత. సన్నివేశం మళ్ళీ మారేదాకా, పాఠకుడి దృష్టి అర్జునుడిమీదా, ఉత్తరుడి మీదనే పారాడుతుంది.

**క. 'ఇన్నగమునందు గాండివ । మున్నది; యదిగాని మద్భుజోద్రేక విలా**
**సోన్నతి కోర్వవు పెద్దయు । నన్నువ లీవిండ్లు కుఱుచ లలఁతి బలంబుల్. 105**

**ప్రతిపదార్థం:** ఈ+నగము నందున్= ఈ చెట్టు మీద; గాండివము= గాండీవం అనే పేరున్న విల్లు; ఉన్నది= ఉంది; అదికాని= అదైతే గాని; మత్+భుజ+ఉద్రేక= నాయొక్క భుజాల ఉద్రేకానికీ; విలాస+ఉన్నతికిన్= విలాసంయొక్క ఔన్నత్యానికీ, (ధనుస్సును పట్టటంలో ఉన్న ఠీవికీ); పెద్దయున్+అన్నువలు= చాలా స్వల్పాలైనవీ; కుఱుచలు= పొట్టివీ; అలఁతిబలంబుల్= ఎక్కువ గట్టివి కానివీ; (అయిన) ఈ విండ్లు= (నీవు తెచ్చిన) ఈ ధనుస్సులు; ఓర్వవు= తట్టుకోలేవు.

**తాత్పర్యం:** 'ఈ జమ్మిచెట్టుమీద గాండీవం ఉన్నది. కురుచవీ, అల్పబలం గలవీ, తక్కువకానివీ అయిన ఈ ధనుస్సులు నా భుజబల పరాక్రమంయొక్క ఆర్భాటానికి తట్టుకోలేవు. అందువలన గాండీవమే నాకు తగిన విల్లు.

**క. ఇవి నీ తెగకొలఁదివి; వీ । రవినోదము నప్పు డధిక రభసము లగు మ**
**ద్వివిధాటోపములకుఁ జా । లవు; విల్లది నూఱువేల లావరయంగన్. 106**

**ప్రతిపదార్థం:** ఇవి= నీవు తెచ్చిన ఈ విండ్లు; నీ తెగకొలఁదివి= నీ బలానికి తగినవి, (తెగ అంటే, అల్లెత్రాటిని ఎక్కుపెట్టటం); వీరవినోదము+అప్పుడు= వీరవినోదం చేసేటప్పుడు (వీరుడి వినోదం యుద్ధం. కనుక యుద్ధం చేసేటప్పుడు అని భావం); అధిక= మిక్కిలి ఎక్కువైన; రభసములు+అగు= అత్యధికమైన వేగంతో తిరిగే; మత్+వివిధ+ఆటోపములకున్= నాయొక్క అనేక విధాలైన విన్యాసాలకు; చాలవు= నిలువలేవు; అరయంగన్= బాగా చూస్తే; విల్లు+అది= ఆ విల్లు (గాండీవం); నూఱువేల లావు= లక్షవిండ్ల బలం కలిగింది.

**తాత్పర్యం:** ఈ విండ్లు నీబలానికి సరిపోతాయి. వీరవినోద సమయంలో అతి రభసంగా తిరిగే నా భుజాలు చేసే రకరకాలైన విన్యాసాలకు తట్టుకోలేవు. ఆ గాండీవం లక్ష ధనుస్సులతో సమానం. (అది తనకు కావాలనీ, కనుక తెమ్మనీ అర్జునుడి భావం).

**క. వీనిఁ గొని గట్టి మైమఱు । వేనుంగును మఱియు నెట్టి వేనియుఁ దునియం**
**గా నేయ నగునె? కైదువు । లేని యలవు కలిమి పోర లెస్సై యున్నే? 107**

**ప్రతిపదార్థం:** వీనిన్+కొని= బలంలేని ఈ విండ్లను తీసికొని; గట్టి= దృఢమైన; మైమఱువు= కవచాన్ని గానీ; ఏనుంగును= ఏనుగును గానీ; మఱియున్= ఇంకా; ఎట్టివి+ఏనియున్= ఎట్లాంటి వాటినిగానీ; తునియంగాన్+ఏయన్+అగునె= ముక్కలు చేయటానికి వీలవుతుందా?; పోరన్= యుద్ధంలో; కైదువు లేని= ఆయుధం లేనట్టి; అలవు కలిమి= బలసంపద; లెస్స+ఐ+ఉన్నే?= బాగై ఉంటుందా? (ఉండదని భావం).

**తాత్పర్యం:** ఈ విండ్లతో గానీ, ఆయుధాలతో గానీ, గట్టిదైన కవచాన్ని గానీ, ఏనుగును గానీ, ఇంకా ఇతరమైన వాటిని గానీ చీల్చివేయలేము. యుద్ధంలో ఆయుధం లేకుండా శక్తి నైపుణ్యాన్ని చూపటం లెస్సగా ఉండదు కదా!

**వ. కావున నిమ్మహీరుహం బెక్కి యమ్మహనీయ చాపంబు దెచ్చి యిమ్ము; ధర్మజ భీమార్జున నకుల సహదేవులు దమ దమ సమస్తాయుధంబులుఁ గూడంగట్టి యిందుఁ బెట్టిన వా; రాకట్ట విడిచి యందు గాండీవంబు వుచ్చికొని తక్కటియవి యెప్పటియట్ల బంధింపు, 'మని చెప్పి శవాకారంబున నున్న శస్త్రాస్త్ర సంచయంబు సూపిన భూమింజయుం డతని కిట్లనియె. 108**

**ప్రతిపదార్థం:** ఈ+మహీరుహంబు= ఈ చెట్టు; ఎక్కి; ఆ+మహనీయ చాపంబు= ఆ గొప్పదైన ధనుస్సు; తెచ్చి+ఇమ్ము; ధర్మజ, భీమ+అర్జున, నకుల, సహదేవులు; తమ, తమ; సమస్త+ఆయుధంబులున్= అన్ని ఆయుధాలను; కూడన్+కట్టి= ఒకటిగా కలిపికట్టి; ఇందున్+పెట్టినవారు= ఈ చెట్టుమీద భద్రంగా ఉంచారు; ఆ కట్ట= ఆ మూట; విడిచి= విప్పి; అందున్= దానిలోనుండి; గాండీవంబు; పుచ్చికొని= పైకి తీసికొని; తక్కటి+అవి= మిగిలినవి; ఎప్పటి+అట్లు+అ= మునుపు ఉన్నట్లుగానే; బంధింపుము= కట్టుము; అని, చెప్పి; శవ+ఆకారంబునన్+ఉన్న= పీనుగు రూపంలో ఉన్న; శస్త్ర+అస్త్ర+సంచయంబు= శస్త్రాలయొక్క, అస్త్రాలయొక్క సమూహాన్ని; చూపినన్= చూపగా; భూమింజయుండు= ఉత్తరుడు; అతనిన్= అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కనుక ఈ జమ్మిచెట్టెక్కి మహిమోపేతమైన ఆ గాండీవాన్ని తెచ్చి ఇమ్ము. ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకుల సహదేవులు వారివారి ఆయుధాలను కలిపి కట్టగట్టి ఈ చెట్టుమీద పెట్టారు. ఆ కట్ట విప్పి, గాండీవాన్ని మాత్రం తీసికొని, తక్కినవాటిని అట్లాగే కట్టగా కట్టుము' అని శవంవలె ఉన్న ఆయుధాల మోపును చూపాడు. అప్పుడు ఉత్తరుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. 'పీనుఁగు నంటఁగఁ దగునే । భూనాథ తనూజుఁ డనక, పుయిలోడక, న**
**న్నీ నీచపుఁ బనిఁ బనుపం । గా నీకుం దగునె? పాపకర్మము గాదే!' 109**

**ప్రతిపదార్థం:** పీనుఁగున్= శవాన్ని; అంటఁగన్+తగునే= తాకవచ్చా?; భూనాథ తనూజుఁడు+అనక= రాజుయొక్క కుమారుడు అని అనుకొనకుండా; పుయిలోడక= అనుమానం లేక (వెనుకాడక); నన్నున్= రాజకుమారుడను అయిన నన్ను; ఈ నీచపు పనిన్= తుచ్ఛమైన ఈ పని చేసేదానికి; పనుపన్+కాన్= నియమించేదానికి; నీకున్= నీకు; తగునె?= న్యాయమేనా?; పాపకర్మముకాదు+ఏ?= పాపపు పని కాదా?

**తాత్పర్యం:** 'శవాన్ని తాకమంటావా? నేను రాజుకుమారుడను అని అయినా సంకోచించకుండా, నన్ను ఇటువంటి నీచమైన పనికి ఆజ్ఞాపించటం బాగుందా? ఇది పాపం కాదా?'

**వ. అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున. 110**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ఉత్తరుడు పలుకగా; విని; ధర్మనందన= ధర్మరాజుయొక్క; అనుజుండు= తమ్ముడు (అనుసరించి పుట్టినవాడు - తమ్ముడు); అతి+ఆదరంబునన్= మిక్కిలి మర్యాదతో.

**తాత్పర్యం:** ఉత్తరుడి మాటలను విని అర్జునుడు మిక్కిలి ఆదరంతో (ఇట్లా అన్నాడు).

**విశేషం:** ధర్మనందనానుజుండు - అనే మాటను అర్జునుడికి వాడడం వలన, అర్జునుడు, ఉత్తరుడిని అధర్మకార్యాన్ని చెయ్యమనలేదు అని అనుకొనాలి.

**ఆ. 'మనుజు లంటకుండ మఱువడఁ జేసిన । యస్త్ర శస్త్ర సంచయంబు గాని,**
**శవము గాదు, మత్స్య జనపాలతనయ! యే । నట్టి దైనఁ బనుతునయ్య నిన్ను? 111**

**ప్రతిపదార్థం:** మత్స్య= మత్స్యదేశానికి; జనపాల= రాజైన విరాటుడి యొక్క; తనయ!= కుమారుడా!; మనుజులు= పాండవులు కాక ఇతరులైన మానవులు; అంటకుండన్= తాకకుండా ఉండేదానికి; మఱువడన్+చేసిన= దాచిపెట్టిన; అస్త్రశస్త్ర= అస్త్రాలయొక్క, శస్త్రాలయొక్క; సంచయంబు కాని= మోపుమాత్రమే కాని; శవము కాదు= పీనుగు కాదు; అట్టిది+అయినన్= అటువంటి (అది) శవమే అయితే; నిన్ను= రాజకుమారుడివైన నిన్ను; ఏను= నేను; పనుతున్+అయ్య?= నియమిస్తానా? (నియమించను అని భావం).

**తాత్పర్యం:** 'అది పాండవులు కాక, ఇతరులు తాకకుండా మరుగుపరిచిన ఆయుధాల మోపుమాత్రమే కాని, అది శవం కాదు. అట్లాంటిదే అయితే ఆ పనికి నిన్ను ఆజ్ఞాపిస్తానా?'

**విశేషం:** ఉత్తరుడు తనను రాకుమారుడిగా చెప్పుకొన్నదానికి తగినట్లుగా, అర్జునుడు కూడా ఉత్తరుడిని 'మత్స్యజనపాల తనయ!', అని అనటం గమనించదగ్గది. ఇక్కడి 'మనుజులు' అన్న మాటకు, సామాన్యులు అనికూడా చెప్పుకొనవచ్చును. సామాన్యమానవులు ఆయుధాలకట్టను తాకకుండా ఉండటానికి, దాన్ని పాండవులు శవంవలె తయారుచేశారు. ఇక్కడ ఉత్తరుడు పరాయివాడు గదా! అన్న సందేహం రావచ్చును. బృహన్నల రూపంలో ఉన్న అర్జునుడే ఆయుధాలకట్టను విప్పుమన్నాడు గనుక, ఆ సందేహానికి తావు లేదు. పనుతునయ్య - "ఒక్కొకచోఁ దద్ధర్మక్రియ యార్యార్థపరకంబయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబగు" - ప్రౌఢవ్యాకరణం. క్రియాపరిచ్ఛేదం. సూ. 4. పనుతునయ్య - పనుతునా? పనుప నని భావం.

**క. నమ్ముము కైదువు మోపగు, । జమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నాకం**
**ది' మ్మనుఁడుఁ జేయునది లే । కమ్మొగ్గం దమ్మహీజ మలసత నెక్కెన్. 112**

**ప్రతిపదార్థం:** కైదువు= ఆయుధాలయొక్క; మోపు+అగున్= కట్టయే కాని; (శవం కాదనుట); నమ్ముము= నా మాట నమ్ము; జమ్మి= జమ్మిచెట్టును; వెసన్+ప్రాఁకి= వెంటనే ప్రాకి; విడిచి= ఆ ఆయుధాల మోపును విప్పి; చాపము= గాండీవం; నాకున్=

నా చేతికి; అంది+ఇమ్ము= అందించుము; అనుడున్= అని చెప్పగానే; ఆ+ముగ్ధుండు= ఆ అమాయకుడైన ఉత్తరుడు; చేయునది లేక= విధి లేక; (ఏమీ ఎదురు చెప్పలేక); ఆ+మహీజము= ఆ జమ్మిచెట్టు; అలసతన్= మెల్లమెల్లగా; ఎక్కెన్= ఎక్కాడు.

**తాత్పర్యం:** ఉత్తరకుమారా! నా మాట నమ్ముము. అది ఆయుధాల మోపే. (శవం కాదు). వెంటనే జమ్మిచెట్టునెక్కి, మోపు విప్పి, ఆ గాండీవాన్ని నాకు అందించుము' అనగానే ఆతడు చేసేది లేక మెల్లగా జమ్మిచెట్టు ఎక్కాడు.

**విశేషం:** ఈ పద్యంలో తిక్కన మహాకవి ఉత్తరుడి నిగూఢమైన మనోభావాన్ని చిత్రించాడు. ఉత్తరుడికి తాను రాజకుమారుడిని అనే ఆత్మాభిమానం ఉన్నది. అందుకే ఆతడు శవాకారంగా ఉన్న ఆయుధాల కట్టను విప్పడానికి వెనుకాడాడు. అంతేగాక, తనను రాజకుమారుడు అని కూడా చూడకుండా ఆ నీచపు పని చేయుమంటావా? అని అర్జునుడితో అన్నాడు. కనుకనే అర్జునుడు, ఆ కట్ట శవం కాదనీ, ఆయుధాల మోపే అనీ, తనమాట నమ్ముమనీ అంటాడు. అయినా ఉత్తరుడి మనస్సులో ఏదో అనుమానం ఉన్నది. కనుకనే అర్జునుడు 'జమ్మి వెసం బ్రాకి' - అంటే, ఉత్తరుడు, 'అలసత'తో (నిదానంగా) చెట్టు ఎక్కాడు. దీనివలన, అర్జునుడు చెప్పినపని చేయటం ఉత్తరుడికి ఇష్టంలేదని తేలింది. కాని, ఆతడికి వేరేదారి లేదు. నిస్సహాయస్థితిలో ఆతడు చెట్టెక్కాడు. ఈ పరిస్థితిలో ఇది చాలా సూక్ష్మమైన మనోభావం. దీనిని మహాకవి తిక్కన 'అలసత నెక్కెన్' అనే ప్రయోగంలో సూచించాడు.

2. అందిమ్ము- అంది+ఇమ్ము; క్త్వార్థ కేకార సంధి కొందరికి సమ్మతం కాదు (బాలవ్యాకరణం). కాని ప్రౌఢవ్యాకరణం ఇప్రత్యయాంతావ్యయానికి సంధి కనపడుతున్నదని ఈ భారత ప్రయోగాన్నే ఉదాహరించింది. కవిసంశయకర్త అయిన అడిదము సూరకవి ఇటువంటి ప్రయోగాలను మరికొన్నింటిని చూపించాడు. కొందరు 'అందించు' అనే ధాతులపల్లవంమీద అందిమ్ము అనే రూపం ఏర్పడుతుందని చెప్పారు.

**వ. ఇ ట్లుత్తరుండు సమారూఢ శమీవృక్షుం డగుటయు, నరదంబు పయి నిలుచుండి పాండవమధ్యముండు 'వేవేగ విడువు' మనవుడు నతండు నాయుధ సంచయ బంధం బెడలించిన. 113**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఉత్తరుండు; సమారూఢ= ఎక్కబడిన; శమీవృక్షుండు= జమ్మిచెట్టు కలవాడు; అగుటయున్; పాండవ మధ్యముండు= అర్జునుడు; అరదంబు పయిన్= రథంమీద; నిలుచుండి= నిలువబడి; వేవేగన్= త్వరగా; విడువుము= విడదీయుము; అనవుడున్= అనగా; అతండున్= ఉత్తరుడు; ఆయుధ= ఆయుధాల యొక్క; సంచయంబు= సమూహం యొక్క (కట్టయొక్క); బంధంబు= తాడుముడిని; ఎడలించినన్= విప్పగా.

**తాత్పర్యం:** ఉత్తరుడు పై విధంగా జమ్మిచెట్టు ఎక్కాడు. అర్జునుడు రథం మీద నిలుచుండి, 'త్వరత్వరగా కట్ట విప్పుము' అని అన్నాడు. ఉత్తరుడు ఆ మోపు విప్పగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మెఱసి యుదయించు గ్రహముల । తఱచు ప్రభలఁ గ్రేణిసేసి దశదిశలం గ్రి**
**క్కిఱిసి వెడలె నా, విండ్లన్ । మెఱుఁగులు, నృపతనయు దృష్టులు మిఱుమిట్లు గొనన్. 114**

**ప్రతిపదార్థం:** మెఱసి= మెరుస్తూ; ఉదయించు గ్రహముల= ఉదయించే గ్రహాలయొక్క; తఱచు= దట్టమైన; ప్రభలన్= వెలుగులను; క్రేణి+చేసి= తిరస్కరించి; దశదిశలన్= పది దిక్కులలో; క్రిక్కిఱిసి= పిక్కటిల్లి; నృపతనయు= ఉత్తరుడి యొక్క; దృష్టులు= చూపులు; మిఱుమిట్లు+కొనన్= కన్నులు మిక్కిలి చెదిరేటట్లు; ఆ విండ్లన్= ఆ ధనుస్సుల నుండి; మెఱుఁగులు వెడలెన్= కాంతులు వచ్చాయి.

**తాత్పర్యం:** ఉదయించేటప్పటి గ్రహాల నిబిడమైన కాంతులను మించిన కాంతులు పదిదిక్కులలో వ్యాపించి, ఉత్తరుడి చూపులను చెదరగొట్టుతూ ఆ విండ్లనుండి వెలువడ్డాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టియెడ నయ్యాయుధంబులు. 115**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో (ఉత్తరుడికి మిరుమిట్లు గొలుపుతూ); ఆ+ఆయుధంబులు= కట్ట విప్పగా కనపడిన ఆ ఆయుధాలు.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆ ఆయుధాలు.

**క. పెనుబాముల చందంబున । నునికికి భయమంది వడఁకు నుర్వీశసుతుం**
**గని తగుమాటలఁ గుంతీ । తనయుఁడు వెఱ వాపుటయు, నతం డచలితుఁడై. 116**

**ప్రతిపదార్థం:** పెను+పాముల చందంబునన్= పెద్దపెద్ద పాముల వలె; ఉనికికిన్= ఉండేదానికి (ఉండడం వలన); భయము+అంది= భయపడి; వడఁకు= వణకిపోతూ ఉన్న; ఉర్వీశసుతున్= రాకుమారుడైన ఉత్తరుడిని; కని= చూచి; కుంతీ తనయుఁడు= అర్జునుడు; తగు మాటలన్= భయాన్ని పోగొట్టేదానికి తగిన మాటలతో; వెఱ= భయాన్ని; పాపుటయున్= పోగొట్టగా; అతండు= ఉత్తరుడు; అచలితుఁడు+ఐ= చలించనివాడై (ధైర్యం గలవాడై).

**తాత్పర్యం:** ఉత్తరుడి చూపులకు ఆయుధాలు పెద్దపెద్ద పాములవలె కనపడటంతో, ఆతడు భయంతో వణికిపోయాడు. దానిని గమనించిన అర్జునుడు తగిన మాటలతో ఆతడి భయం పోగొట్టాడు. దానితో ఆతడు ధైర్యంతో. (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**వ. పొదుపు విరియందట్టి కనుంగొని నిరూపించి, 'సారథీ!' యని సవ్యసాచిం బిలిచి యిట్లనియె. 117**

**ప్రతిపదార్థం:** పొదుపు= మోపు; విరియన్+తట్టి= కట్ట సళ్ళు పోయేదానికి తట్టుతూ విప్పి; కనుంగొని= చూచి; నిరూపించి= ఏర్పరచి; సారథీ!= రథాన్ని నడిపేవాడా!; అని; సవ్యసాచిన్= అర్జునుడిని; పిలిచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆయుధాల కట్టను విప్పి, చూచి, ఏర్పరచి తెలిసికొని, 'సారథీ!' అని బృహన్నలను పిలిచి ఉత్తరుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** చెట్టు ఎక్కినా, తాను రథికుడను-అనే ఉత్తరుడు అనుకొంటున్నాడు. అందుకే బృహన్నలను, 'సారథీ!' అని పిలిచింది. అంటే ఉత్తరుడిలో రాజసభావం తగ్గలేదన్నమాట. 'సారథీ!' అన్న సంబోధనతోనే కవి హాస్యాన్ని చిందించాడు.

**క. 'ఇది యొక చాపము విస్మయ । మొదవించుచుఁ గొండచిలువయొకొ నాఁ దగి యు**
**న్నది, ఖచిత కనక కమల స । ముదయద్యుతి సముపగూహనోజ్జ్వల మగుచున్. 118**

**ప్రతిపదార్థం:** ఇది= ఇది (ఉత్తరుడికి, మిగిలిన ధనుస్సులలో ప్రత్యేకంగా కనపడినట్టిది); ఒక చాపము= (అన్నిటివలె ఉండనట్టి) ఒక ధనుస్సు; విస్మయము+ఒదవించుచున్= ఆశ్చర్యాన్ని గొలుపుతూ; కొండచిలువ+ఒకొ నాన్= కొండచిలువేమో అనే విధంగా; ఖచిత= పొదగబడ్డ; కనక కమల= బంగారు పద్మాలయొక్క; సముదయ= గుంపుయొక్క; ద్యుతి= కాంతియొక్క; సమ్+ఉపగూహన= ఎక్కువైన ఆవరణంతో; ఉజ్జ్వలము+అగుచున్= మిక్కిలి ప్రకాశిస్తూ; తగి+ఉన్నది= గొప్పగా ఉన్నది.

**తాత్పర్యం:** 'ఈ విల్లు (మిగిలిన విండ్లలో ప్రత్యేకంగా ఉన్నది) ఆశ్చర్యాన్ని కలిగిస్తూ, కొండచిలువవలె ఉన్నది. దీనిమీద బంగారు పద్మాలు పొదగబడ్డాయి. ఆ విల్లు కాంతి అంతటా క్రమ్ముతూ ఉన్నది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతు?' రని మఱియు బహు విధంబులగు నాయుధంబు లుపలక్షించి వేఱు వేఱ వాని చందంబు లుపన్యసించి, 'యివి యెవ్వ రెవ్వరి' వని యడిగిన నర్జునుం డిట్లనియె.119**

**ప్రతిపదార్థం:** పాండవులయందున్= పాండవులలో; దీనిన్= ఈ చాపాన్ని; ఏ+వారు= ఎవరు; ధరియింతురు?= తాలుస్తారు; అని= అని అడిగి; మఱియు; బహువిధంబులు+అగు= పెక్కురకాలైన; ఆయుధంబులు= ఆయుధాలను; ఉపలక్షించి= బాగా పరిశీలించి చూచి; వేఱువేఱన్= విడివిడిగా; వాని= ఆ ఆయుధాల యొక్క; చందంబులు= విధములు; ఉపన్యసించి= వర్ణించిచెప్పి; ఇవి= ఈ ఆయుధాలు; ఎవ్వరివి+ఎవ్వరివి+అని= ఎవ్వరెవ్వరివని; అడిగినన్= అడుగగా; అర్జునుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** (కొండచిలువవలె ఉండే) ఈ వింటిని పాండవులలో ఎవరు ఉపయోగిస్తారు?' అని ఉత్తరుడు అడిగాడు. ఇంకా ఆ చెట్టుమీద ఉన్న ఎన్నో ఇతర ఆయుధాలను చూచి, వేరువేరుగా ఆ ఆయుధాలను గూర్చి వివరించి, వీటి నన్నిటినీ ఎవరెవరు ధరిస్తారో చెప్పుమని ఉత్తరుడు అడుగగా, దానికి అర్జునుడు ఇట్లా చెప్పాడు.

**తే. 'తొలుత నీవు న న్నడిగిన దొడ్డ విల్లు । గాండివము, ఫల్గునున కేడుగడయు నదియ;**
**సమరమున దేవదానవ సమితినైన । గెలుచు నశ్రమమున దానివలన నతఁడు. 120**

**ప్రతిపదార్థం:** తొలుతన్= మొట్టమొదట; ఈవు= నీవు; నన్నున్= నన్ను; అడిగిన= అడిగినట్టి; దొడ్డవిల్లు= పెద్దవిల్లు; గాండివము= గాండీవం అనే పేరుగల ధనుస్సు; అది+అ= అదే; ఫల్గునునకున్= అర్జునుడికి; ఏడుగడయున్= ఆధారం (రక్షణ); దానివలనన్= ఆ ధనుస్సు వలననే; అతఁడు= అర్జునుడు; సమరమునన్= యుద్ధంలో; దేవ= దేవతలయొక్క; దానవ= రాక్షసులయొక్క; సమితిన్+ఐనన్= సమూహాన్ని అయినా; అశ్రమమునన్= శ్రమలేకుండా (తేలికగా); గెలుచున్= గెలుస్తాడు.

**తాత్పర్యం:** 'మొట్టమొదట నీవు నన్ను అడిగిన ఆ ధనుస్సు గాండీవం. అదే అర్జునుడికి ఆధారం. అతడు దాని ప్రభావంతోనే దేవ, దానవ సమూహాలను కూడా అలవోకగా జయిస్తాడు.

**విశేషం:** ఏడుగడ= (ఏడు, కడ) ఏడు విధాలైన దిక్కు. 1. గురువు, 2. తల్లి, 3. తండ్రి, 4. పురుషుడు, 5. విద్య, 6. దైవం, 7. దాత.

**క. ఆద్యపురుషోపలాలిత । ముద్ద్యోతిత రోచిరుద్గమోగ్రం బరి ని**
**ర్భేద్యము దివ్యజనన మన । వద్యం బిది కార్ముకైక వరము గుమారా! 121**

**ప్రతిపదార్థం:** కుమారా!= ఓ ఉత్తరకుమారా!; ఇది= ఈ గాండీవం అనే పేరుగల విల్లు; ఆద్యపురుష+ఉపలాలితము= పూర్వులచేత (బ్రహ్మ మొదలైన వారిచేత) ధరించబడిందీ; ఉద్ద్యోతిత రోచిస్+ఉద్గమ+ఉగ్రంబు= మిక్కిలి ప్రకాశించే కాంతుల యొక్క ప్రసారంతో భయాన్ని కలిగించేదీ; అరి= శత్రువులకు; నిర్భేద్యము= విరుగగొట్టటానికి వీలుకానిదీ; దివ్యజననము= దివ్యమైన (మహిమతో కూడిన) పుట్టుక కలదీ (అగ్నిలో పుట్టింది); న+అవద్యంబు= నిందించరానిది (దోషం లేనిది); కార్ముక+ఏకవరము= ధనుస్సులలో సాటిలేని మేటి.

**తాత్పర్యం:** ఉత్తరకుమారా! ఈ గాండీవాన్ని పూర్వమహాపురుషులైన బ్రహ్మ మొదలైన వాళ్ళు ధరించారు. ఆ వింటి కాంతులు ఎంతో భయంకరమయినవి. ఎంతటి శత్రువులైనా, దానిని విరుగగొట్టలేరు. దివ్యమైన పుట్టుక కలది, ఏ లోపం లేనట్టిది. ధనుస్సులన్నింటిలో ఇది ఎంతో శ్రేష్ఠమైనది.

**వ. ఇమ్మహనీయ చాపంబు బ్రహ్మ శతసహస్ర వర్షంబులు, ప్రజాపతి చతుష్షష్టి సహస్ర వర్షంబులు, నింద్రుండు పంచాశీతి హాయనంబులు, సోముండు పంచశతాబ్దంబులు, వరుణుండు శతశరత్సమితియుఁ గ్రమంబున ధరియించిరి; వరుణుచేత నగ్నిదేవుండు వేడుకపడి పుచ్చుకొని పదంపడి ఖాండవ దహనంబున నద్భుత కర్మంబునకు మెచ్చి వివ్వచ్చున కిచ్చె; నతండును నఱువదేనేండ్లు ధరియింపంగలవా; డిట్లిది త్రిలోక పూజ్యమహిమ నొప్పుచుండు. 122**

**ప్రతిపదార్థం:** ఈ+మహనీయ చాపంబు= ఈ గొప్పదైన ధనుస్సు; బ్రహ్మ; శతసహస్రవర్షంబులు= లక్షయేండ్లు; ప్రజాపతి; చతుష్షష్టి= అరవైనాలుగు; సహస్ర వర్షంబులున్= వేల యేండ్లున్నూ; ఇంద్రుండు= ఇంద్రుడు; పంచాశీతిహాయనంబులు= ఎనభైఐదు ఏండ్లు; సోముండు= చంద్రుడు; పంచశతాబ్దంబులు= ఐదువందల యేండ్లు; వరుణుండు; శతశరత్= నూరు సంవత్సరాల యొక్క; సమితియున్= సమూహం; క్రమంబునన్= వరుసగా; ధరియించిరి= ధరించారు; అగ్నిదేవుండు= అగ్ని; వేడుకపడి= ముచ్చటపడి; వరుణుచేతన్= వరుణదేవుడి నుండి; పుచ్చుకొని= తీసికొని; పదంపడి= తరువాత; ఖాండవ దహనంబునన్= ఖాండవవనాన్ని కాల్చటంలో (చూపిన); అద్భుత కర్మంబునకున్= ఆశ్చర్యాన్ని కలిగించిన పనికి; మెచ్చి= ప్రశంసించి; వివ్వచ్చునకున్+ఇచ్చెన్= అర్జునుడికి ఇచ్చాడు; అతండును= ఆ అర్జునుడు కూడా; అఱువది+ఏను+ఏండ్లు= అరవై అయిదేండ్లు; ధరియింపన్+కలవాఁడు= తాల్చగలుగుతాడు; ఇట్లు= ఈ విధంగా; ఇది= గాండీవం; త్రిలోక పూజ్యమహిమన్= మూడులోకాల్లో పూజించదగిన మహిమతో; ఒప్పుచున్+ఉండున్= ప్రకాశిస్తూ ఉంటుంది.

**తాత్పర్యం:** ఉత్తరకుమారా! ఈ గాండీవాన్ని బ్రహ్మ లక్షసంవత్సరాలు ధరించాడు. ఆ తరువాత ప్రజాపతి అరవైనాలుగు వేల సంవత్సరాలూ, ఇంద్రుడూ ఎనభైఐదేండ్లు, చంద్రుడు ఐదువందల సంవత్సరాలు, వరుణుడు నూరేండ్లు చేపట్టారు. గాండీవం యొక్క మహిమకు ఎంతో ఇష్టపడి, అగ్నిదేవుడు వరుణదేవుడి దగ్గర నుండి దానిని తీసికొన్నాడు. ఖాండవవనాన్ని కాల్చే సమయంలో అర్జునుడి శౌర్యానికి మెచ్చి, అగ్ని ఆ వింటిని అతడికి కానుకగా ఇచ్చాడు. అట్లాంటి ఈ గాండీవాన్ని అర్జునుడు అరవైఐదేండ్లు ధరిస్తాడు. ఈవిధంగా, ఈ గాండీవం ముల్లోకాలలో పూజింపదగిన మహిమతో ప్రకాశిస్తూ ఉన్నది.

**విశేషం:** చివరకు అర్జునుడు అగ్నిదేవుడి ఆజ్ఞతో గాండీవాన్ని సముద్రంలో విడుస్తాడు.

సీ. **నీలోత్పలచ్ఛాయ నెరసి సౌవర్ణ వృ। షావళి నొప్పు బాణాసనంబుఁ,**
**దాళప్రమాణ సుందరమునై భర్మశా। ఖామృగాంచితమగు కార్ముకంబుఁ,**
**దీవ్రకృశాను సందీప్తాకృతియుఁ గన। త్కనక మత్స్యంబులుఁ గలుగు ధనువుఁ,**
**మెఱుఁగారు సారంబు మెఱయు కాంచనమయూ। రముల శోభిల్లు చాపమును వరుసఁ**

ఆ. **బాండవాగ్రజుండుఁ, బవనపుత్త్రుఁడు, నకు। లుండుఁ దదనుసంభవుండుఁ బట్టు**
**నవి కుమార! య గ్గవాజిన కోశమ। హాశరంబు పార్థునదియ చూవె!** 123

**ప్రతిపదార్థం:** నీల+ఉత్పల+ఛాయ= నల్ల కలువల యొక్క కాంతితో; నెరసి= ఒప్పి; సౌవర్ణవృష+ఆవళిన్+ఒప్పు= బంగారుతో చేయబడ్డ ఎద్దుల సమూహంతో ప్రకాశించే; బాణ+ఆసనంబున్= విల్లును (ధర్మజుడిది); తాళప్రమాణ= తాటిచెట్టంత పొడుగ్గా ఉండి; సుందరమున్+ఐ= సుందరంగా ఉన్న; భర్మ, శాఖామృగ+అంచితము+అగు= బంగారు కోతులతో ప్రకాశించే; కార్ముకంబున్= ధనుస్సు (భీముడిది); తీవ్ర= తీవ్రమైన (మండుతూ ఉండే); కృశాను= అగ్నివలె; సందీప్త+ఆకృతియున్= ప్రకాశించే ఆకారమూ; కనత్= శోభిల్లుతున్న; కనకమత్స్యంబులున్ కలుగు ధనువున్= బంగారు చేపలు చెక్కిన విల్లు (నకులుడిది); మెఱుఁగారు, సారంబు= వన్నెకెక్కిన గట్టితనం; మెఱయు= మెరుస్తూఉన్న; కాంచన= బంగారుతో చేసిన; మయూరములన్= నెమళ్ళతోనూ; శోభిల్లు= వెలుగొందే; చాపమును= విల్లు (సహదేవుడిది); వరుసన్= క్రమంగా; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజూ; పవనపుత్రుఁడు= వాయుకుమారుడైన భీముడూ; నకులుండు= నకులుడు; తద్= ఆ నకులుడి యొక్క; అను= అనుసరించి; సంభవుండు= పుట్టినవాడైన (తమ్ముడు) సహదేవుడూ; పట్టునవి= ధరించేవి; కుమార!= ఓ ఉత్తరకుమారా!; ఆ+గో+అజినకోశ= (ఆ+గవాజినకోశ) ఆ ఎద్దుయొక్క తోలు ఒరలోనున్న; మహాశరంబు= గొప్పదైన బాణం; పార్థ+అది+అ చూవె= అర్జునుడిదే చూడు!

**తాత్పర్యం:** బంగారు ఎద్దులను అందంగా చెక్కిన, నల్లకలువల కాంతులతో ప్రకాశించే ధనుస్సును ధర్మరాజు ధరిస్తాడు. తాటిచెట్టంత పొడుగ్గా ఉండి, బంగారు కోతులు చెక్కబడిన వింటిని భీమసేనుడు ఉపయోగిస్తాడు. అగ్నివలె వెలుగుతూ, బంగారు చేపలు పొదిగిన వింటిని నకులుడు చేపడతాడు. బంగారు నెమళ్ళతో చాలా గట్టిగా ఉన్న ధనుస్సును సహదేవుడు ధరిస్తాడు.ఎద్దుతోలు ఒరలో ఉన్న ఆ పెద్దబాణం అర్జునుడిది!

**విశేషం:** వీరులు వారివారి ధనుస్సుల మీద తమ ఇష్టాలను బట్టి (మనస్తత్త్వాన్ని బట్టి) కొన్ని గుర్తులను నిలుపుకొంటారు. అంతేకాక ధనుస్సులమీద, బాణాలమీద వీరుల పేర్లుకూడా చెక్కుతారు. వృషభం ధర్మానికి గుర్తు. ధర్మానికి మారుపేరైన ధర్మరాజు అందుకే తన ధనుస్సుమీద వృషభాలను చిత్రించుకొన్నాడు. భీముడు ఉద్రేకస్వభావం కలవాడు. పైగా ఉన్నతమైన ఆకారం కలవాడు. అవసరాన్నిబట్టి చెట్లతోనే యుద్ధం చేస్తాడు. అందుకే ఆతడి ధనుస్సు తాటిచెట్టంత ఉన్నది. ఆంజనేయుడు, భీముడూ-ఇద్దరూ వాయుపుత్రులే. అందుకే కోతులను మమకారంతో తన ధనుస్సు మీద నిలుపుకొన్నాడు. నకులుడు చాలా చురుకైనవాడు. ఎక్కువ చలనశీలం కలవాడు. కనుకనే సంపత్కరాలైన చేపల్ని తన ధనుస్సుమీద చిత్రించుకొన్నాడు. సహదేవుడు చాలా కోమలమైన వాడు. అందమైనవాడు. అందుకే నెమళ్ళను ఇష్టంగా తన వింటిపైన అలంకరించాడు. అర్జునుడి గాండీవం మీద బంగారు పద్మాలు చెక్కబడ్డాయి. పద్మం సౌభాగ్యానికీ, దైవత్వానికీ చిహ్నం. కృష్ణ భక్తుడైన అర్జునుడికి పద్మాలు చెక్కిన గాండీవం తగింది. పద్మం లక్ష్మికి, విష్ణువుకు సంబంధించింది. అందుకే మహావీరులు, ధర్మ స్వరూపులు అయిన పాండవులు తమతమ విండ్లను వారి మనఃప్రవృత్తులను బట్టి అలంకరించుకొన్నారు.

**క. ఎద్దెసలం దనరుచులు స। ముద్దీప్తము లగుచునుండ, నుజ్జ్వల మగు న**
**య్యుద్దండ గదాదండము। పెద్దయు నెడ మెచ్చి పట్టు భీముఁడు పోరన్.' 124**

**ప్రతిపదార్థం:** ఏ+దెసలన్= అన్ని దిక్కులలో; తన= తనయొక్క; రుచులు= వెలుగులు; సమ్+ఉత్+ దీప్తములు+అగుచున్+ ఉండన్= బాగా ప్రకాశిస్తూ ఉండగా; ఉజ్జ్వలము+అగు= కాంతిమంతమైన; ఆ+ఉద్దండ గదాదండము= ఆ గొప్పదైన గద; భీముఁడు= భీమసేనుడు; పెద్దయున్= ఎక్కువగా; ఎడ= మనస్సులో; మెచ్చి= ఇష్టపడి; పోరన్= యుద్ధంలో; పట్టున్= ధరిస్తాడు.

**తాత్పర్యం:** తన కాంతులు అన్నిదిక్కులలో వ్యాపిస్తూ ఉండగా, అమితంగా ప్రకాశించే ఆ గదాదండాన్ని భీముడు ఎంతో ఇష్టపడి చేపట్టుతాడు.'

## అర్జునుఁ డుత్తరునకుఁ ద న్నెఱింగించుట (సం. 4-39-1)

**వ. అనిచెప్పి మఱియు బాణ కృపాణ తనుత్రాణాదు లగు వివిధ సాధనంబులు వేఱువేఱ నిరూపించి గ్రక్కున నెఱింగించె; నప్పుడు మూఢాత్ముండగు నయ్యుత్తరుండు పాండవోత్తము నెఱుంగమి నిట్లనియె. 125**

**ప్రతిపదార్థం:** అని, చెప్పి; మఱియున్= ఇంకా; బాణ= బాణాలు; కృపాణ= కత్తులు; తనుత్రాణ= కవచాలు (శరీరాన్ని రక్షించేవి); ఆదులు+అగు= మొదలైనవి; వివిధ సాధనంబులు= పలురకాలైన యుద్ధ పరికరాలను; వేఱు, వేఱు+అ= విడివిడిగా; నిరూపించి= ఏర్పరచి (తెలిసేటట్లు చేసి); గ్రక్కునన్= తొందరగా; ఎఱింగించెన్= పరిచయం చేశాడు; అప్పుడు= ఆ సమయంలో; మూఢ+ఆత్ముండు+అగు= మూర్ఖుడైన; ఆ+ఉత్తరుండు= ఆ ఉత్తరకుమారుడు; పాండవ+ఉత్తమున్= పాండవులలో శ్రేష్ఠుడైన అర్జునుడిని; ఎఱుంగమిన్= తెలియకపోవటం చేత; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** పాండవుల ఆయుధాల విషయాన్ని అర్జునుడు ఉత్తరుడికి చెప్పి, ఇంకా అమ్ములు, కత్తులు, కవచాలు మొదలైన వాటిని విడివిడిగా తొందర తొందరగా వివరించాడు. ఇంత చెప్పినా కానీ, మూర్ఖుడైన ఆ ఉత్తరుడు అర్జునుడిని తెలిసికొనలేక, అతడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఈ యెడ ని ట్లిమ్మహనీ। యాయుధములు పెట్టి యెచటి కరిగిరి మన కౌం**
**తేయులు బృహన్నలా! తగ। నీ యెఱిఁగిన యంతవట్టు నిక్కము సెపుమా!' 126**

**ప్రతిపదార్థం:** బృహన్నలా!= ఓ బృహన్నలా!; మన కౌంతేయులు= కుంతీ కుమారులైన మన పాండవులు; ఈ+ఎడన్= ఈ చోట (ఈ జమ్మిచెట్టు మీద); ఇట్లు= ఈవిధంగా; ఈ+మహనీయ+ఆయుధములు= మహిమతో కూడిన ఈ ఆయుధాలు; పెట్టి= దాచిపెట్టి; ఎచటికిన్= ఎక్కడికి; అరిగిరి= వెళ్ళారు; తగన్= తగినట్లు; నీ+ఎఱిఁగిన+అంత వట్టు= నీకు తెలిసినంత వరకు; నిక్కము= నిజాన్ని; చెప్పుమా!= చెప్పుము.

**తాత్పర్యం:** 'బృహన్నలా! మహిమోపేతమైన ఈ ఆయుధాలను ఈచెట్టుమీద భద్రంగా దాచిపెట్టి మనపాండవులందరూ ఎక్కడికి పోయారో నీకు తెలిసినంతవరకు నిజం చెప్పవా?'

**విశేషం:** మన కౌంతేయులు- అనే మాటలో ఒక ఆత్మీయత ఉన్నది. అది ఎట్లా ఉన్నదో తరువాతి వచనంలో తెలుస్తుంది.

**వ. అని సస్నేహంబును, సగౌరవంబును, సవిషాదంబునుంగా మఱియును.** 127

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; సస్నేహంబును= స్నేహంతో కూడింది; సగౌరవంబును= గౌరవంతో కూడింది; సవిషాదంబునున్+కాన్= దుఃఖంతో కూడినదిగా; మఱియును= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడు పైవిధంగా చెప్పి, పాండవులపై స్నేహంతో, గౌరవంతో, దుఃఖంతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** స్నేహం, గౌరవం, విచారం అనేవి ఉత్తరుడి మనస్సులో కలిగాయి. ఈ విషయం ఇంకా వివరంగా ముందు పద్యాలలో కనిపిస్తుంది.

**క. 'ఏ నమ్మహానుభావుల । మేనల్లుఁడ; వార లార్యమిత్రులు, శత్రు**
**క్ష్మా నాయక గర్వ తమో । భానులు, బంధుహిత కార్య పరతంత్రాత్ముల్.** 128

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఆ+మహానుభావుల= ఆ మహాత్ములయొక్క; మేన+అల్లుఁడన్= మేనల్లుడిని; వారలు= గొప్పవారైన ఆ పాండవులు; ఆర్య= పూజ్యులైన; మిత్రులు= స్నేహితులు; శత్రు= శత్రువులైన; క్ష్మానాయక= రాజులయొక్క; గర్వ= అహంకారం అనే; తమోభానులు= కారుచీకటికి సూర్యులు (అహంకారం నల్లటిది అనీ, కనుక చీకటితో పోల్చి, దాన్ని పోగొట్టే సూర్యులు పాండవులు అని భావం); బంధు= చుట్టాలకు; హిత= మేలుచేసే; కార్య= పనులలో; పరతంత్ర= నిమగ్నమైన; ఆత్ముల్= మనస్సులు గలవాళ్లు.

**తాత్పర్యం:** 'మహానుభావులైన పాండవులకు నేను మేనల్లుడిని. వాళ్ళు నాకు పూజ్యులైన మిత్రులు. శత్రురాజుల గర్వం అనే చీకటిని పోగొట్టే సూర్యులవంటివారైన ఆ పాండవులు బంధువులకు మేలు చేసేవారు.

**విశేషం:** ఉత్తరుడు పాండవులకు తాను మేనల్లుడిని అని చెప్పుకొనటంలో చుట్టరికపు సంబంధమైన స్నేహం, ఆర్యమిత్రులు- అని చెప్పుకొనటంలో వారిపై ఆతడికి ఉన్న అపారమైన గౌరవభావం కనిపిస్తాయి. ఉత్తరుడికి పాండవులను గురించిన విషాదభావం ముందు పద్యాలలో స్పష్టమవుతుంది.

**తే. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగి యున్న । వాఁడొ? భీముని పార్థుని వర్తనంబు**
**లెయ్యెడల నేమి చందంబులయ్యె? నక్క । టా విధాతృండ! కవ లెందు దాఁగి రొక్కొ?** 129

**ప్రతిపదార్థం:** ఆ+యుధిష్ఠిరుఁడు= ఆ ధర్మరాజు; ఎచ్చటన్= ఎక్కడ; అఁడగి+ఉన్నవాఁడొ= అణగిఉన్నాడో (దాగినాడో); భీముని= భీమునియొక్క; పార్థుని= అర్జునుడియొక్క; వర్తనంబులు= నడవడికలు; ఏ+ఎడలన్= ఎక్కడ; ఏమి చందంబులు+అయ్యెన్= ఎట్లా ఉన్నాయో; అక్కటా!= అయ్యో!; విధాతృండ!= హతవిధీ!; కవలు= నకులుడు, సహదేవుడు; ఎందున్= ఎక్కడ; దాఁగిరి+ఒక్కొ?= దాగినారో కదా?

**తాత్పర్యం:** ధర్మరాజు ఎక్కడ ఒదిగినాడో, భీముడు, అర్జునుడు ఎట్లా ఉన్నారో, అయ్యో దైవమా! నకులుడూ, సహదేవుడూ ఎక్కడ మరుగుపడి ఉన్నారో కదా!

**క. భూపాల వల్లభాజన । దీపిక యనఁ జాలు ద్రౌపదికి నెయ్యెడలం**
**దేపాటులు వాటిల్లెనొ? । కాపురుషులవలన నిట్టి కాఱియ పుట్టెన్.** 130

**ప్రతిపదార్థం:** భూపాల= రాజులయొక్క; వల్లభాజన= భార్యల (రాణుల) సమూహానికి; దీపిక= దీపంవంటిది; అనన్+చాలు= అని చెప్పదగినట్టి; ద్రౌపదికిన్= ద్రుపదరాజు కూతురైన ద్రౌపదీదేవికి; ఏ+ఎడల+అందున్= ఏ చోట్లలో; ఏ పాటులు= ఏ చిక్కులు (కష్టాలు); పాటిల్లెనొ?= కలిగినాయో?; కాపురుషుల వలనన్= దుష్టులైన కౌరవులవలన; ఇట్టి= ఇటువంటి; కాఱియ పుట్టెన్= కష్టం వచ్చింది.

**తాత్పర్యం:** లోకంలో మహారాణులందరికీ దీపం వంటి ద్రౌపదికి ఎక్కడ ఎటువంటి చిక్కులు వచ్చాయో? ఆమెకు దుష్టులైన ఆ కౌరవుల వలననే ఇటువంటి ఆపద వచ్చింది.

**క.** **కపట ద్యూత మొనర్చిన । నృపతియు దుర్యోధనాది నీచుల వలఁ బా**
**ఱి పడియెఁ గడుఁ బెక్కిడుమల । రిపుమర్దన వీర్యభుజ గరిష్ఠుం డయ్యున్.** 131

**ప్రతిపదార్థం:** కపట= మోసంతో కూడిన; ద్యూతము+ఒనర్చినన్= జూదాన్ని ఆడటం వలన; నృపతియున్= రాజైన ధర్మరాజు కూడా; రిపు= శత్రువులయొక్క; మర్దన= మర్దనంగల; వీర్య= పరాక్రమంచేత; భుజ= భుజబలంచేత; గరిష్ఠుండు+అయ్యున్= గొప్పవాడైనా (సమర్థుడైనా); దుర్యోధన+ఆది= దుర్యోధనుడు మొదలైన; నీచుల= నీచులయొక్క; వలన్= వలలో; పాఱి= చిక్కుకొని; కడున్= మిక్కిలి; పెక్కు= అనేకరకాలైన; ఇడుమలన్+పడియెన్= కష్టాలు పడ్డాడు.

**తాత్పర్యం:** శత్రువులను నాశనం చేసే సామర్థ్యం ఉండీ కూడా రాజైన ధర్మరాజు, దుర్యోధనుడు మొదలైన నీచుల వలలో పడి, మాయాద్యూతాన్ని ఆడి, ఓడి, ఇన్ని కష్టాలు పడ్డాడు.

**క.** **వినఁబడ రెచ్చోటను దమ । వినుత మహీరాజ్య మహిమ విడిచి చనుట, నే**
**మని వినియెదనో నీచే?' ననుడు నతం డిట్టులనియె నాతని తోడన్.** 132

**ప్రతిపదార్థం:** (పాండవులు-అని అనుకోవాలి) తమ= తమయొక్క; వినుత= నుతించబడిన (పేరుకెక్కిన); మహీరాజ్య= పృథివీసామ్రాజ్యంయొక్క; మహిమ= వైభవాన్ని; విడిచి= త్యజించి; (వదలిపెట్టి); చనుటన్= (అడవులకు) వెళ్ళటం వలన; ఏ+చోటను= ఏచోట్లో కూడా (ఎక్కడా గానీ); వినఁబడరు= వినబడటం లేదు. (తెలియటం లేదు); నీచేన్= (ఇప్పుడు) నీవలన; ఏమి+అని= వారిని గూర్చి ఏ మాటను; వినియెదనో= వింటానో కదా!; (అని) అనుడున్= ఉత్తరుడు అనగా; అతండు= ఆ బృహన్నల రూపంలో ఉండే అర్జునుడు; ఆతనితోడన్= ఆ ఉత్తరుడితో; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సుప్రసిద్ధమయిన తమరాజ్య వైభవాన్ని వదలేసి, వెళ్ళిపోవడంతో, పాండవుల మాటే ఎక్కడా వినబడటం లేదు. ఇప్పుడు నీవలన వాళ్లను గురించి ఏమాట వింటానో?' అని ఉత్తరుడు అన్నదానికి, అర్జునుడు ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** పై పద్యాలలో ఉత్తరుడికి పాండవులమీదా, ద్రౌపదిమీదా ఉన్న నిజమైన ఆవేదనా, ఆదుర్దా కనిపిస్తాయి.

**వ.** **'వారలకు వగవ వలవదు; విధివశంబున వచ్చిన యాపదకు నోర్చి బాసతప్పక తారును బాంచాలియు నొక్కటఁ బండ్రెండేండ్లు వనంబున వసియించి పదుమూఁడగునేఁ డజ్ఞాతవాసంబు సలుప వలయుట నిట వచ్చి మనవీట నవ్యాపన్నులై యున్నవారు. వినుము వారి నెఱింగించెద.** 133

**ప్రతిపదార్థం:** వారలకున్= పాండవులను గురించి; వగవ వలవదు= దుఃఖపడవద్దు; విధివశంబునన్= విధి (తలరాత) కారణంగా; వచ్చిన, ఆపదకున్= కలిగిన కష్టానికి; ఓర్చి= సహించి; బాస, తప్పక= చేసికొన్న ఒప్పందం పొల్లుపోకుండ; తారును= ఆ పాండవులున్నూ; పాంచాలియున్= ద్రౌపదికూడా; ఒక్కటన్= కలిసి; పం(డ్రెండు+ఏండ్లు= పన్నెండేళ్ళు; వనంబున వసియించి= అడవులలో ఉండి; పదుమూఁడు+అగు+ఏఁడు= పదమూడవ ఏడు; అజ్ఞాతవాసంబు= రహస్యంగా నివసించటం; చలుపవలయుటన్= చేయాలి కనుక; ఇట వచ్చి= ఇక్కడకు వచ్చి; మన వీటన్= మన నగరంలో; అవ్యాపన్నులు+ఐ= ఆపద లేనివారై; ఉన్నవారు= ఉన్నారు; వారిని= పాండవులను; ఎఱింగించెదన్= తెలుపుతాను; వినుము.

**తాత్పర్యం:** (ఉత్తరకుమారా!) వాళ్ళను గురించి నీవు ఆలోచించవలసిన పనిలేదు. విధివశాత్తు కలిగిన కష్టాలను ఓర్చుకొని, తమ బాసను తప్పకుండా పాండవులూ, పాంచాలీ అడవులలో పన్నెండు సంవత్సరాలుండి, పదమూడో ఏడు అజ్ఞాతవాసాన్ని పూర్తి చేసికొనేందుకు ఇక్కడికే వచ్చి, మన నగరంలోనే ఏ అపాయం లేకుండా ఉన్నారు. వారెవరెవరో నీకు చెప్పుతాను; వినుము.

**క.** **కంకుఁడు ధర్మసుతుఁడు; వల । లాంకుఁడు భీముండు; కవలు హయశిక్షక గో**
**కింకరులు; సెప్పఁ దొడఁగితి । నింకఁ గొఱఁత వెట్ట నేల? యే నర్జునుఁడన్.** **134**

**ప్రతిపదార్థం:** కంకుఁడు= కంకుభట్టు అనే పేరుతో ఉన్నవాడు; ధర్మసుతుఁడు= ధర్మరాజు; వలల+అంకుఁడు= వలలుడు అనే పేర ఉన్నవాడు; భీముండు= భీమసేనుడు; కవలు= నకులసహదేవులు; హయశిక్షక, గోకింకరులు= అశ్వాలను శిక్షించేవాడూ, గోవులను పాలించేవాడూ; చెప్పన్+తొడఁగితిన్= చెప్పటానికి పూనుకొన్నాను (కనుక); ఇంకన్= ఇంకా (దీని తర్వాత); కొఱఁత పెట్టన్= మిగిలించేది; ఏల?= ఎందుకు?; (ఇంత చెప్పాక దాచేది ఎందుకు అని అర్థం); ఏను= నేను; అర్జునుఁడన్= అర్జునుడిని.

**తాత్పర్యం:** కంకుభట్టు అనే పేరుతో ఉన్నవాడే ధర్మరాజు. వలలుడు అనే పేరుతో వంటలవాడుగా ఉన్నవాడే భీముడు. గుఱ్ఱాలను శిక్షిస్తూ, వాటిని కాపాడుతూ ఉన్నవాడే నకులుడు. గోవులను పాలించేవాడే సహదేవుడు. ఇంతెందుకు? నేనే అర్జునుడిని.

**తే.** **అధిపనందన! మాలిని యనఁగఁ బరఁగు । కాంత ద్రౌపది; దానికై కాదె సింహ**
**బలునిఁ దమ్ముల గంధర్వపతులు సంపి । రనఁగఁ జంపె మహోగ్రత ననిలసుతుఁడు.'** **135**

**ప్రతిపదార్థం:** అధిపనందన!= రాకుమారుడవైన ఉత్తరకుమారా!; మాలిని+అనఁగన్= మాలిని అనబడుతూ; పరఁగుకాంత= ఉండే స్త్రీ; ద్రౌపది= ద్రుపదరాజు కూతురైన ద్రౌపది; దానికిన్+ఐ+కాదె= దానికొరకే కదా; (ఆమె కారణంగా); గంధర్వపతులు= ఆమె భర్తలైన గంధర్వులు; సింహబలునిన్= సింహంయొక్క బలంతో సమానం అయిన బలండున్న కీచకుడిని; తమ్ములన్= ఆ కీచకుడి తమ్ములను (ఉపకీచకులను); చంపిరి+అనఁగన్= చంపినారనే నెపంతో; అనిలసుతుఁడు= వాయువు కుమారుడైన భీముడు; మహా+ఉగ్రతన్= మహాఘోరంగా; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** ఉత్తరకుమారా! మాలిని అనబడే ఆమె ద్రౌపది. ఆమె కారణంగానే భీమసేనుడు కీచకుడినీ, ఉపకీచకులనూ, మాలిని భర్తలైన గంధర్వులు చంపారనే మిషతో భయంకరంగా చంపాడు.'

**వ. అనిన విని భూమింజయుండు సంభ్రమాశ్చర్య సంశయంబులు మనంబున ముప్పిరి గొనం దప్పక చూచి, సవ్యసాచికి వెండియు నిట్లనియె. 136**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= అనగా విని; భూమింజయుండు= ఉత్తరుడు; సంభ్రమ+ఆశ్చర్య+సంశయంబులు= తొట్రుపాటూ, అబ్బురం, సందేహాలూ; మనంబునన్= మనస్సులో; ముప్పిరి+కొనన్= పైమూడు భావాలూ పెనవేసికొని పోగా; తప్పకచూచి= అదే పనిగా కన్నులార్పకుండా చూచి; సవ్యసాచికిన్= అర్జునుడికి (రెండుచేతులతో బాణాలను వేసేవాడు); వెండియున్= మరలా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు పాండవులనూ, ద్రౌపదినీ గురించి వివరించి చెప్పగా ఆ మాటలను విని ఉత్తరుడు తొట్రుపాటు, ఆశ్చర్యం, సందేహం- అనే ఈ మూడు మనోభావాలూ ముప్పేటగా తనలో పెనవేసికొనగా తదేకంగా చూచి ఆతడు తిరిగి అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఊహించని ఒక విషయాన్ని హఠాత్తుగా విన్నప్పుడు సామాన్యులకు తొట్రుపాటు కలుగుతుంది. దానితోపాటు ఆశ్చర్యం కలుగుతుంది. ఇది నిజమా? అనే సందేహం ఆ తర్వాత కలుగుతుంది. ధీరులు దానిని నిగ్రహించుకొంటారు. అధీరులైన ఉత్తరుడివంటివాళ్ళు దానిని ఆంగికంగా చూపిస్తారు.

**క. 'చిరకీర్తి ప్రియుఁడగు న । న్నరునకుఁ బది గలవు భవ్యనామములు మనో**
**హరముగ నవి సెపుమా యొం । డరయక యే నమ్మెదను బృహన్నల! నిన్నున్.' 137**

**ప్రతిపదార్థం:** బృహన్నల!= ఓ బృహన్నలా!; చిర= శాశ్వతమైన; కీర్తి= కీర్తియందు; ప్రియుఁడు+అగు= ఆసక్తిగలవాడైన; ఆ+నరునకున్= ఆ అర్జునుడికి; భవ్య= శుభకరాలైన; నామములు= పేర్లు; పది+కలవు= పది ఉన్నాయి; ఒండు+అరయక= దేనినీ చూడకుండా (వెంటనే అని భావం); మనోహరముగన్= మనస్సును ఆకర్షించేటట్లు (అభిమానంతో, గౌరవంతో కూడిన భావం); అవి+ చెపుమా= వాటిని చెప్పుము; నిన్నున్= నిన్ను; ఏన్= నేను; నమ్మెదను= (అప్పుడు అర్జునుడివి అని) నమ్ముతాను.

**తాత్పర్యం:** శాశ్వతమైన కీర్తిని ఆశించే ఆ అర్జునుడికి పది పేర్లున్నాయి. ఆ పేర్లు మంగళకరాలైనట్టివి. నీవు వెంటనే వాటిని చెప్పితే అప్పుడు నేను దేన్నీ అనుమానించకుండా, నీవే అర్జునుడివి అని నమ్ముతాను. కనుక వాటిని చెప్పుము.

**విశేషం:** నలుగురు పాండవులనూ, ద్రౌపదినీ గురించి బృహన్నల వివరించి చెప్పినప్పటికీ ఎదుట ఉన్నవాడే అర్జునుడు అని ఉత్తరుడు గ్రహించుకోలేకపోయాడు. ఇది కేవలం ఉత్తరుడి అజ్ఞానమే. అందుకే, అర్జునుడికి ఉన్న పదిపేర్లనూ చెప్పుమని అడిగాడు. ఉత్తరుడికి బృహన్నలపై నమ్మకం కుదరలేదు. కారణం వికృతమైన ఆతడి రూపం.

**వ. అనుటయు నతండు సస్మితాననుం డగుచు, 'నర్జునుండు, ఫల్గునుండు, పార్థుండు, కిరీటి, శ్వేతవాహనుండు, బీభత్సుండు, విజయుండు, జిష్ణుండు, సవ్యసాచి, ధనంజయుండు నను నివి పదియును నా పేళ్ళనవుడు, నుత్తరుండు పాండవమధ్యమున కిట్లనియె. 138**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (ఉత్తరుడు పదిపేర్లను చెప్పుమని) అని అడుగగా; అతండు= అర్జునుడు; స+స్మిత= చిఱునవ్వుతో కూడిన; ఆననుండు+అగుచున్= ముఖం గలవాడై; అర్జునుండు; ఫల్గునుండు; పార్థుండు; కిరీటి; శ్వేతవాహనుండు; బీభత్సుండు; విజయుండు; జిష్ణుండు; సవ్యసాచి; ధనంజయుండు - అను ఇవి; పదియును= పదికూడా; నా పేళ్ళు= నా పేర్లు; అనవుడున్= అనగా విని; ఉత్తరుండు= ఉత్తరకుమారుడు; పాండవమధ్యమునకున్= అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడు అర్జునుడి పదిపేర్లనూ చెప్పుమనగానే, ఆతడు, చిరునవ్వుతో 'అర్జునుడూ, ఫల్గునుడూ, పార్థుడూ, కిరీటి, శ్వేతవాహనుడూ, బీభత్సుడూ, విజయుడూ, జిష్ణుడూ, సవ్యసాచి, ధనంజయుడూ అనే ఈ పదీ నా పేర్లు' అని చెప్పాడు. అప్పుడు ఉత్తరుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఏమి కతంబున నిట్టీ । నామంబులు సంభవిల్లె నరునకు? నవి చే**
**తో మోదంబుగఁ జెప్పుము । నీమది తత్తద్విధంబు నిశ్చితమేనిన్.' 139**

**ప్రతిపదార్థం:** ఇట్టు= (నీవు చెప్పినట్లుగా); ఈ నామంబులు= ఈ పేర్లు; నరునకున్= అర్జునుడికి; ఏమి కతంబునన్= ఏమి కారణంగా; సంభవిల్లెన్?= వచ్చాయి?; నీ మదిన్= నీ మనస్సులో; తద్+తద్+విధంబు= ఆయా రీతి అంతా; నిశ్చితము+ఏనిన్= స్పష్టంగా (ఖచ్చితంగా) తెలిస్తే; అవి= ఆ విశేషాలు; చేతస్+మోదంబుగన్= మనస్సుకు సంతోషాన్ని కలగజేసేటట్లుగా; చెప్పుము= చెప్పవలసింది.

**తాత్పర్యం:** నీవు ఇంతకుముందు చెప్పిన పదిపేర్లూ అర్జునుడికి ఏకారణం వలన వచ్చాయో, నీకు ఖచ్చితంగా తెలిస్తే నాకు సంతోషాన్నిచ్చేటట్లుగా చెప్పుము.

**విశేషం:** ఇంతకుముందు, అర్జునుడికి పదిపేర్లు ఉన్నాయనీ, వాటిని చెప్పితే, నీవే అర్జునుడివి అని నమ్ముతానని ఉత్తరుడు అర్జునుడితో అన్నాడు. అందుకు ఆతడు తనకున్న పది పేళ్ళనూ చెప్పాడు. అయినా ఉత్తరుడికి నమ్మకం కలగలేదు. కనుకనే, ఆ పది పేర్లూ రావటానికి కారణం ఏమిటి? అని అర్జునుడిని అడిగాడు. ఇంకా అర్జునుడిని గుర్తించలేకపోవటం, కేవలం ఉత్తరుడి అమాయకత్వమే.

**వ. అనుటయు 'నట్ల చేయుదు' నని యతం డిట్లనియె. 140**

**తాత్పర్యం:** పదిపేళ్ళకూ కారణాన్ని అడిగిన ఉత్తరుడికి 'అట్లాగే చేస్తాను (చెప్పుతాను)' అని ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఈ క్రింది పద్యం నుండి వరుసగా 8 పద్యాలలో, ఉత్తరుడికి తన పదిపేర్లనూ, అవి వచ్చిన కారణాలనూ వివరిస్తాడు.

**ఆ. 'ధరణి యెల్ల గెలిచి తగ ధనంబులు గొని । యునికి నే ధనంజయుండ నైతి;**
**నెట్టివారినైన నెదిరినఁ బోర జ । యంబు గొనుట విజయుఁ డండ్రు నన్ను. 141**

**ప్రతిపదార్థం:** ధరణి+ఎల్లన్= భూమినంతటినీ; గెలిచి= జయించి; తగన్= తగిన విధంగా; (ఆయా రాజుల సంపదను బట్టి); ధనంబులు+కొని+ఉనికిన్= అన్ని రకాలైన ధనాలను గ్రహించి ఉండటంచేత; నేన్= నేను; ధనంజయుండన్+ఐతిన్=

ధనంజయుడు అనే పేరు కలవాడిని అయ్యాను; ఎట్టివారిన్+ఐనన్= ఎంత బలవంతులనైనా; ఎదిరినన్= పోరాడితే; పోరన్= యుద్ధంలో; జయంబు+కొనుటన్= జయాన్ని సాధించటం వలన; నన్నున్= నన్ను; విజయుఁడు= విజయుడు; అని; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** భూమినంతటినీ జయించి, ధనాన్ని పొందటంవలన నేను ధనంజయుడిని అయ్యాను. ఎంత బలవంతులు నన్ను ఎదిరించినా నేను యుద్ధంలో జయాన్ని సాధించటంతో, నన్ను అందరూ విజయుడు అని అంటారు.

**తే.** **తెలుపులగు వాహనములు నాతేర సమర । భూములం దెప్డు నియతిమైఁ బూన్కిఁ జేసి**
**శ్వేతవాహన నామవిఖ్యాతి నాకు । సకలజన సమ్మతంబుగ సంభవించె.** **142**

**ప్రతిపదార్థం:** సమర భూములందున్= యుద్ధంచేసే ప్రదేశాల్లో; ఎప్డున్= ఎల్లప్పుడూ; నా= నాయొక్క; తేరన్= తేరుకు (రథానికి); తెలుపులు+అగు= తెల్లనైన; వాహనములు= గుర్రాలు; నియతిమైన్= తప్పకుండా (నియమంగా); పూన్కిన్+చేసి= పూన్చటం వలన (కట్టటం వలన); నాకున్= నాకు; శ్వేతవాహన నామ విఖ్యాతి= శ్వేతవాహనుడు అనే పేరు గలవాడనే కీర్తి; సకలజన= సమస్త జనానికీ; సమ్మతంబుగన్= ఇష్టం అయ్యేటట్లు (ఒప్పుకోలుతో); సంభవించెన్= వచ్చింది.

**తాత్పర్యం:** యుద్ధరంగంలో నేను ఎల్లప్పుడూ నా రథానికి ఒక నియమంగా తెల్లటిగుర్రాలనే కట్టుతాను కనుక, అందరికీ సమ్మతంగా నాకు శ్వేతవాహనుడు అనేపేరు కలిగింది.

**చ.** **రవి యుదయించు నట్లు సమరంబున నా తలమీఁదఁ గాంతి మూ**
**ర్తి వెలుఁగు నింద్రుఁ డిచ్చిన కిరీట మభేద్యమహోగ్ర సుస్థిర**
**త్వ విభవ రూఢిమై; జనులు దానన నన్నుఁ గిరీటి నామ సం**
**స్తవన విశేష పాత్రముగ సమ్మతిఁ జేసిరి మాత్స్యనందనా!** **143**

**ప్రతిపదార్థం:** మాత్స్య= మత్స్యదేశానికి చెందిన రాజుయొక్క; నందనా!= కుమారా! (ఉత్తరకుమారా!); సమరంబునన్= యుద్ధంలో; నా= నాయొక్క; తలమీఁదన్= తలపైన; రవి= సూర్యుడు; ఉదయించునట్లు= పుట్టినట్లుగా; కాంతిమూర్తిన్= వెలుగురూపుతో; (సూర్యుడు ఉదయించేటప్పుడు పుట్టే అందమైన, ఆకర్షణీయమైన మంచి కాంతిరూపంతో అన్నమాట); ఇంద్రుఁడు= దేవేంద్రుడు; ఇచ్చిన కిరీటము= బహుమానంగా ఇచ్చిన కిరీటం; అభేద్య= భేదించరానిది (యుద్ధాల్లో శత్రువులచేత విరుగగొట్టరానిది); మహా+ఉగ్ర= ఎక్కువ భయంకరం అయిందీ; (ఆ కిరీట కాంతుల తీవ్రతకే కొందరు శత్రువులు మూర్ఛపోయి, మృతిచెందుతారు. అందుకే అది మహోగ్రం అయింది). సుస్థిరత్వ= మిక్కిలి దృఢమైనది (ఎట్లాంటి బాణాల తాకిడికీ అది కట్టుకదలదు - అని భావం); విభవ= పైన చెప్పిన అభేద్యం, ఉగ్రం, సుస్థిరం - అనే మూడురకాలైన వైభవంతో; రూఢిమైన్= పేరుకెక్కి; వెలుఁగున్= ప్రకాశిస్తుంది; జనులు= లోకంలో ఉన్న జనులు అందరూ; దానన్+అ= అందుకే; నన్నున్= నన్ను; కిరీటి= కిరీటి అనే; నామ= పేరుతో; సంస్తవన= స్తుతించేదానికి; విశేష= ఎక్కువైన; పాత్రముగన్= యోగ్యత ఉన్నవాడిగా (ప్రశంసకు అర్హుడినిగా); సమ్మతిన్+చేసిరి= అంగీకరించారు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు (నా పరాక్రమానికి మెచ్చి) ఇచ్చిన కిరీటం యుద్ధంలో నా శిరస్సుమీద ప్రకాశిస్తూ ఉంటుంది. అది ఉదయించే సూర్యకాంతులతో నా తలమీద విరాజిల్లుతూ ఉంటుంది. ఆ కిరీటం అభేద్యం, భయంకరం, సుస్థిరం అయినట్టిది. అందుకే నన్ను లోకమంతా 'కిరీటి' అని కీర్తిస్తుంది.

**తే. వీరులకుఁ జూడ బీభత్స విధము గలుగు । నట్టి కార్యంబు సేఁతకు నెట్టి సమర**
**భంగులను దడఁబడక బీభత్స సేయ; । దాన బీభత్సుఁ డను నభిధాన మయ్యె. 144**

**ప్రతిపదార్థం:** ఎట్టి= ఎలాంటి చిక్కులతో కూడిన; సమరభంగులను= యుద్ధరీతులలో కూడా; వీరులకున్= వీరులైన వాళ్ళకు; చూడన్= చూడటానికి; బీభత్సవిధము= అసహ్యకరమైన పద్ధతి; కలుగునట్టి= కలిగేటటువంటి; కార్యంబు= పనిని; చేఁతకున్= చేసేదానికి; తడఁబడక= తత్తరపాటులేక; బీభత్స+చేయన్= బీభత్సాన్ని పుట్టించను; దానన్= దానివల్ల (నాకు); బీభత్సుఁడు+అను= బీభత్సుడు అనే; అభిధానము+అయ్యెన్= పేరు కలిగింది.

**తాత్పర్యం:** ఎటువంటి చిక్కు సమస్యలతో కూడిన యుద్ధ సమయాలలోనూ తడబడకుండా, శత్రువీరులు ఏవగించుకొనే పనిని చేయను. కనుకనే బీభత్సుడు అనే పేరు నాకు వచ్చింది.

**విశేషం:** బీభత్సం చేయవలసినప్పుడు కూడా బీభత్సాన్ని సృష్టించకుండా, తత్తరపాటు లేకుండా యుద్ధం చేస్తాడు కనుక అర్జునుడికి బీభత్సుడు అనే పేరు వచ్చింది. ఈ పేరు దేవతలలో, మనుషులలో ప్రసిద్ధమైనది అని మూలం. తిక్కన 'దేవ మనుష్యేషు' అన్నదాన్ని తీసికొనలేదు.

**క. భండనమున నిరుగేలను । గాండీవముఁ దివియ నేర్పు గలిగిన నందు**
**ద్దండ మగు సవ్యకరము ప్ర । చండతఁ బరఁగుదును సవ్యసాచి యనంగన్. 145**

**ప్రతిపదార్థం:** భండనమునన్= యుద్ధంలో; ఇరు కేలను= రెండుచేతులతో; గాండీవమున్= గాండీవం అనే ధనుస్సును (అల్లె త్రాటిని); తివియన్= లాగేదానికి; నేర్పు+కలిగినన్= నైపుణ్యం ఉన్నా; అందున్= ఆ రెండు చేతులలోనూ; ఉద్దండమగు= మిక్కిలి బలంతో కూడిన (దృఢమైన); సవ్యకరము= ఎడమచేతి యొక్క; ప్రచండతన్= తీవ్రతవలన; సవ్యసాచి+అనంగన్+పరఁగుదును= సవ్యసాచి అనే పేరుతో పిలవబడతాను.

**తాత్పర్యం:** యుద్ధంలో ఏ చేతితోనైనా అల్లెత్రాటిని లాగుతాను. కానీ ఆ లాగడంలో ఎడమచేయి వాటం తీవ్రంగా ఉంటుంది. కనుక నన్ను సవ్యసాచి అని అంటారు.

**విశేషం:** లోకంలో మామూలుగా కుడిచేతికే బలం ఎక్కువ. ఏపని చేసేదానికైనా కుడిచేతి వాటం సులువుగా, దృఢంగా ఉంటుంది. కాని, అర్జునుడి విషయంలో, ఎడంచేతికే వాటం ఎక్కువ. నిజానికి కుదురుకుంటే, కుడిచేతికన్న ఎడంచేతికి బలం ఎక్కువ. అయితే పట్టు కుదరాలి. అర్జునుడికి ఆ వాటం కుదిరింది. అందుకే తిక్కన 'సవ్యకరము ప్రచండత' అని అన్నాడు. కాని, మూలంలో సవ్యసాచి అనేపేరు కలగటానికి కారణం ఇట్లా ఉన్నది. **"ఉభౌ మే దక్షిణౌ పాణీ గాణ్డీవస్య వికర్షణే తేన దేవమనుష్యేషు సవ్యసాచీతి మాం విదుః"** (సం. 4-39-17) నా చేతులు రెండూ గాండీవాన్ని లాగటంలో దక్షిణములు (సమర్థములు) కాబట్టి నన్ను దేవమనుష్యులలో సవ్యసాచి అంటారు.

**తే. ధరణి దుర్లభమగు నవదాతవర్ణ । మారఁ గలుగుట నర్జునుఁ డంద్రు నన్ను;**
**ఫల్గునాహ్వయ ముత్తర ఫల్గునీ వి । శిష్టకాల సంజననతఁ జేసి గలిగె. 146**

**ప్రతిపదార్థం:** ధరణిన్= భూమిమీద; దుర్లభము+అగు= లభించని (అరుదైన); అవదాత వర్ణము= నిర్మలం అయిన వర్ణం (తెలుపు); ఆరన్+కలుగుటన్= నిండా ఉండటం వలన; నన్నున్= నన్ను; అర్జునుఁడు= అర్జునుడు (అని); అంద్రు=

అంటారు; ఉత్తరఫల్గునీ= ఉత్తరఫల్గునీ నక్షత్రంతో కూడిన; విశిష్టకాల= విశేషమైన కాలంలో (సంధికాలంలో); సంజననతన్+చేసి= పుట్టటం చేత; ఫల్గున+ఆహ్వాయము= ఫల్గునుడు అనే నామం; కలిగెన్= కలిగింది.

**తాత్పర్యం:** సామాన్యంగా ఎవ్వరికీ కలుగని అవదాత వర్ణం నా శరీరానికి ఉండటం వలన నన్ను అర్జునుడు అని అంటారు. ఉత్తరఫల్గునీ విశిష్టకాలంలో పుట్టటంతో నాకు ఫల్గునుడు అనే పేరు వచ్చింది.

**విశేషం:** 1. అర్జునుడనే పేరు రావటానికి కారణం మూలంలో ఇట్లా చెప్పబడింది - **"పృథివ్యాం చతురన్తాయాం వర్ణో మే దుర్లభః సమః। కరోమి కర్మశుక్లం చ తేన మామర్జునం విదుః"** (సం. 4-39-18) మొత్తం భూమిలో నావర్ణంతో సమానమైన వర్ణం దుర్లభం. నేను పరిశుద్ధమైన పనిని చేస్తాను. కాబట్టి నన్ను అర్జునుడంటారు' - అని. ఉత్తరఫల్గునీ విశిష్టకాలం అంటే, పూర్వఫల్గునీ, ఉత్తరఫల్గునీ నక్షత్రాల నడిమి కాలం.

2. **"ఉత్తరాభ్యాం చ పూర్వాభ్యాం ఫల్గునీభ్యాం మహం దివా, జాతో హిమవతః పృష్ఠే తేన మాం ఫల్గునం విదుః" (సం. 4-39-14)** అని మూలం. నేను ఫల్గునీనక్షత్రకాలంలో హిమవంతుడి పృష్ఠభాగంలో పగలు పుట్టాను కాబట్టి నన్ను ఫల్గును డంటారు.

**క. అని మొన మార్కొని వ్రణ మేఁ । గనుఁగొన ధర్మజుని మేనఁ గావింపఁగ న**
**య్యనిమిషులుఁ జాల రెవ్వరుఁ । జెనకినఁ బరిమార్తుఁ గాన జిష్ణుఁడ నైతిన్. 147**

**ప్రతిపదార్థం:** అనిమొనన్= యుద్ధాగ్రమునందు; మార్కొని= ఎదిరించి; ఏన్= నేను; కనుఁగొనన్= చూస్తూఉండగా (నాకంటి ఎదురుగా అని భావం); ధర్మజుని= ధర్మరాజు యొక్క; మేనన్= శరీరంమీద; వ్రణము= గాయాన్ని; కావింపఁగన్= చేసినట్లైతే; ఎవ్వరున్+చెనకినన్= ఎవరు ఎదిరించినా; పరిమార్తున్= (వాళ్ళను) చంపుతాను; ఆ+అనిమిషులున్+చాలరు= (ఆ పరిస్థితిలో నన్ను ఎదిరించటానికి) దేవతలు కూడా సమర్థులు కాలేరు; కానన్= అందువలన; జిష్ణుఁడన్+ఐతిన్= జిష్ణుడిని అయ్యాను.

**తాత్పర్యం:** నాకంటి ముందర ఎవరైనా కానీ యుద్ధంలో ధర్మరాజు శరీరానికి గాయం కలిగిస్తే, వాళ్ళను చంపుతాను. ఆ సమయంలో దేవతలు కూడా నాకు అడ్డు తగలలేరు. దీనివలనే నాకు జిష్ణుడు అనే పేరు వచ్చింది.

**క. పృథ యను పేరు మదంబకుఁ । బ్రథితంబై యునికిఁ జేసి పార్థుఁడ నైతిన్;**
**వృథయుఁగఁ బలుకుదునే? యవి । తథవచనుండైన ధర్మతనయు ననుజుఁడన్. 148**

**ప్రతిపదార్థం:** పృథ+అను= పృథ అనే; పేరు= నామం; మత్+అంబకున్= మా అమ్మకు (కుంతీదేవికి); ప్రథితంబు+ఐ= ప్రసిద్ధమై; ఉనికిన్+చేసి= ఉండటంచేత; పార్థుఁడను+ఐతిన్= పార్థుడిని అయినాను; అవితథ= వ్యర్థంకాని, సత్యసమ్మతమైన; వచనుండు+ఐన= పలుకులు కలవాడైన; ధర్మతనయు= ధర్మరాజుయొక్క; అనుజుఁడన్= తమ్ముడిని; వృథయుఁగన్= వ్యర్థంగా (అసత్యంగా); పలుకుదునే?= చెప్పుతానా?

**తాత్పర్యం:** మా అమ్మ కుంతీదేవికి పృథ అనే పేరు లోకంలో ప్రసిద్ధికెక్కింది. పృథయొక్క కొడుకును కాబట్టి పార్థుడిని అయ్యాను. సత్యశీలుడైన ధర్మరాజు తమ్ముడిని అబద్ధం చెప్పుతానా?

**వ. ఈ పది పేళ్ళును నివి కారణంబులుగాఁ బ్రకాశంబులయ్యెః సకలసుర నికరంబు లడ్డపడినం బుండరీకాక్ష సహాయుండనై ఖాండవం బేర్చి నప్పుడు మెచ్చి భద్రమూర్తులైన రుద్ర విరించులు సన్నిధి సేసినం బెన్నిధిఁ గన్న**

**పేద చందంబున సంభ్రమించు నాకుం గరుణించి కృష్ణుండను నేకాదశ నామంబును, నప్రతిహత బాణంబులు నొసంగిరి. వారల యనుమతి నింద్రాదులయిన విబుధులును వివిధంబులగు దివ్యాస్త్రంబు లిచ్చిరి; పదంపడి గీర్వాణులకు నోర్వరాని యట్టివారి, వరదాన గర్వితుల నివాతకవచు లనియెడు దైతేయుల మాతలి సారథికంబగు నైంద్రస్యందనం బెక్కి యొక్కండన మూఁడు కోట్ల నిర్జించితి. దుర్జయులగు హిరణ్యపుర నివాసుల నఱువది వేవుర దేవారాతుల వారాశి తీరంబునం బరిమార్చితి; నప్పుడు ప్రీతుండై గిరిభేది కిరీటం బొసంగె; దేవసంఘంబు శంఖంబిచ్చె; నది కతంబుగా నచ్చిందంబు దేవదత్తం బనంబరఁగె. మఱియు నెయ్యెడల నెవ్వరు దొడరినం బొలివోని బలిమి కలిమి వెలుంగుదు. గాంధారీ నందనుండు గంధర్వరాజు చేతం బట్టువడిన యప్పుడు పదునాలుగువేల గంధర్వుల జయించి యతని విడిపించితి, నీ వోడకు; మీ కూడిన కురుబలంబుల గెలిచి, కర్ణ, గాంగేయ, కృప, ద్రోణ, ద్రౌణి, దుర్యోధనులు కనుంగొనుచుండఁ గదుపులం గ్రమ్మఱించెద' నని సత్వరంబుగాఁ జెప్పిన, విని యుత్తరుండు చిత్తంబున నద్భుత హర్షంబులు వొదువ వ్రాను డిగ్గనుఱికి, సర్వాంగ సంగతోర్వీ తలంబగు దండప్రణామం బాచరించి, చేతులు మొగిచి నిలిచి యిట్లనియె. 149**

**ప్రతిపదార్థం:** ఇవి, కారణంబులు, కాన్= ఈ కారణాలుగా; ఈ పది పేళ్ళును= ఈ పది పేర్లున్నూ; ప్రకాశంబులు+అయ్యెన్= ప్రసిద్ధికెక్కాయి; సకల= సమస్తమైన; సుర= దేవతలయొక్క; నికరంబులు= సమూహాలు. (దేవతలలో 16 జాతి భేదాలు - మొత్తం 33 కోట్లమంది); అడ్డపడినన్= ఎదురు నిలిచినప్పటికీ; పుండరీక+అక్ష= (తెల్ల తామరల వంటి కన్నులు గలిగినవాడు) కృష్ణుడియొక్క; సహాయుండను+ఐ= సహాయం కలవాడినై; ఖాండవంబు+ఏర్చినప్పుడు= ఖాండవమనే వనాన్ని కాల్చినపుడు; మెచ్చి= మెచ్చుకొని; భద్రమూర్తులు+ఐన= మంగళకరమైన ఆకారాలు కలవారైన; రుద్ర+విరించులు= శివుడూ, బ్రహ్మదేవుడూ; సన్నిధి+చేసినన్= ప్రత్యక్షంకాగా; పెన్నిధిన్= గొప్పనిధిని; కన్న= చూచిన; పేద, చందంబునన్= పేదవాడివిధంగా; సంభ్రమించు= వేగిరపడుతున్న; నాకున్+కరుణించి= నన్ను దయచూచి; కృష్ణుండు+అను= కృష్ణుడు అనే; ఏకాదశనామంబును= పదకొండో పేరు; అప్రతిహత= తిరుగులేని; బాణంబులు= బాణాలను; ఒసంగిరి= ఇచ్చారు; వారల= వారియొక్క; అనుమతిన్= ఆజ్ఞచేత; ఇంద్ర+ఆదులు+అయిన= ఇంద్రుడూ మొదలైన; విబుధులును= దేవతలుకూడా; వివిధంబులు+అగు= పలురకాలైన; దివ్య+అస్త్రంబులు= మహిమతో ప్రకాశించే అస్త్రాలు; ఇచ్చిరి= ఇచ్చారు; పదంపడి= ఆ తర్వాత; గీర్వాణులకున్= దేవతలకు కూడా; ఓర్వరాని+అట్టివారిన్= ఓడించటానికి సాధ్యం కానట్టివారిని; వరదాన= వరం ఇవ్వటంవలన; గర్వితులన్= గర్వించినవారిని; నివాతకవచులు అనియెడు; దైతేయులన్= రాక్షసులను; మాతలిసారథికంబు+అగు= మాతలి సారథిగా ఉన్న; (మాతలి దేవేంద్రుడి సారథి. ఇది దేవకార్యం గనుక, ఇంద్రుడు తన రథాన్నీ, సారథినీ అర్జునుడికి ఇచ్చాడన్న మాట); ఐంద్ర= ఇంద్ర సంబంధం అయిన; స్యందనంబు+ఎక్కి= రథాన్ని ఎక్కి; ఒక్కండను+అ= ఒక్కడినే; మూఁడుకోట్ల= మూడుకోట్లమందిని; నిర్జించితిన్= జయించాను; దుర్జయులు+అగు= జయించటానికి వీలుకానివారైన; హిరణ్యపుర నివాసులన్= హిరణ్యపురంలో నివసించేవారిని; అఱువది వేవురన్= అరవైవేలమందిని; దేవ+అరాతులన్= దేవతలకు శత్రువులైనవారిని- రాక్షసులను; వారాశి తీరంబునన్= సముద్రం గట్టున; పరిమార్చితిన్= చంపాను; అప్పుడు= ఆ సమయంలో; గిరిభేది= ఇంద్రుడు; (ఒకప్పుడు కొండలకు రెక్కలుండేవి. దానితో అవి గర్వించి, పట్టణాలపై వాలి నాశనం చేసేవి. అందువలన వాటి రెక్కలను ఇంద్రుడు తన వజ్రాయుధంతో విరుగగొట్టాడు. అందువలన ఆతడికి 'గిరిభేది' అనే పేరు వచ్చింది); ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; కిరీటంబు+ఒసంగెన్= కిరీటాన్ని ఇచ్చాడు; దేవసంఘంబు= దేవతల సమూహం; శంఖంబు+ఇచ్చెన్= శంఖాన్ని ఇచ్చింది; అది కతంబుగాన్= అది కారణంగా; ఆ+చిందంబు= ఆ శంఖం; దేవదత్తంబు+అనన్+పరఁగెన్= దేవదత్తమని పిలువబడింది; మఱియున్= అంతేకాక; ఏ+ఎడలన్= ఎక్కడగానీ; ఎవ్వరు+తొడరినన్= ఎవరు ఎదిరించినా; పొలివోని= తరగని; బలిమి= బలంయొక్క; కలిమిన్= సంపదచేత; వెలుంగుదున్= ప్రకాశిస్తాను; గాంధారీ నందనుండు= గాంధారి కుమారుడైన దుర్యోధనుడు;

గంధర్వరాజు చేతన్= గంధర్వులకు రాజైన చిత్రసేనుడిచేత; పట్టు+పడిన+అప్పుడు= బందీ అయినప్పుడు; పదునాలుగు వేల గంధర్వులన్= పద్నాలుగు వేలమంది గంధర్వులను; జయించి= గెలిచి; అతనిన్= దుర్యోధనుడిని; విడిపించితిన్= బంధంనుండి విముక్తుడిని చేయించాను; నీవు+ఓడకుము= నీవు భయపడవద్దు; ఈ కూడిన= ఇక్కడ చేరిన; కురుబలంబులన్= కురుసేనలను; గెలిచి; కర్ణ= కర్ణుడు; గాంగేయ= భీష్ముడు (గంగ కొడుకు); కృప= కృపాచార్యుడు; ద్రోణ= ద్రోణుడు; ద్రౌణి= ద్రోణుడి కుమారుడైన అశ్వత్థామ; దుర్యోధనులు; కనుంగొనుచున్+ఉండన్= చూస్తూ ఉండగా; కదుపులన్= ఆవులమందలను; క్రమ్మఱించెదన్= మరలిస్తాను; అని; సత్వరంబుగాన్+చెప్పినన్= తొందర తొందరగా చెప్పగా; ఉత్తరుండు; విని; చిత్తంబునన్= మనస్సునందు; అద్భుత+హర్షంబులు= ఆశ్చర్యం, సంతోషం; పొదువన్= పొదివికొనగా (చుట్టగా); మ్రాను= జమ్మిచెట్టు; డిగ్గన్+ఉఱికి= త్వరగా దిగి; సర్వ+అంగ+సంగత+ఉర్వీతలంబు+అగు= అన్ని అంగాలు నేలకు తాకేటట్లు; దండప్రణామంబు= కర్రవలె చేసిన నమస్కారం- (చక్కటి కర్రను నేలమీద పెట్టినప్పుడు, అది సమంగా నేలకు తాకుతుంది. అట్లాగే మనిషి నేలపై ఎనిమిది అవయవాలూ తాకేటట్లుగా చేసే నమస్కారం, సాష్టాంగ దండప్రణామం); ఆచరించి= చేసి; చేతులు మొగిచి= చేతులు జోడించి; నిలిచి= నిలువబడి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఈ కారణాలతో పదిపేర్లూ నాకు వచ్చాయి. కృష్ణుడి సహాయంతో, దేవతలంతా ఎదిరించినా, ఖాండవ వనాన్ని దహించేటప్పుడు, మెచ్చుకొని, మంగళ రూపాలుగల శివుడూ, బ్రహ్మదేవుడూ ప్రత్యక్షమయ్యారు. అప్పుడు పెద్ద నిధి చిక్కిన పేదవాడివలె నేను సంతోషించాను. వారు దయతో 'కృష్ణుడు' అనే పదకొండో పేరుతోపాటు, దివ్యాలైన బాణాలను కూడా ఇచ్చారు. వారి ఆజ్ఞతో, దేవేంద్రుడూ మొదలైన దేవతలంతా ఎన్నెన్నో దివ్యాస్త్రాలను అనుగ్రహించారు. ఆ తరువాత దేవతలకే జయించటానికి వీలుకాని నివాత కవచులు అనే రాక్షసులను, ఇంద్రుడి రథంమీద, మాతలిని సారథిగా చేసికొని వెళ్ళి, ఒంటరిగా మూడుకోట్లమందిని చంపాను. అట్లాగే, హిరణ్యపురంలో ఉండే అరవైవేలమంది రాక్షసులను కూడా, సముద్రం గట్టున చంపాను. దానికి ఇంద్రుడు మెచ్చుకొని కిరీటాన్ని ఇచ్చాడు. దేవతలంతా కలిసి శంఖాన్ని బహూకరించారు. కనుకనే ఆ శంఖానికి దేవదత్తం అనే పేరు వచ్చింది. ఎక్కడ ఎవరు నన్ను ఎదిరించినా, తరగని బలంతో వెలుగుతాను. గాంధారి కుమారుడైన దుర్యోధనుడు గంధర్వరాజు చిత్రసేనుడి చేతిలో చిక్కి బందీ అయినప్పుడు, పద్నాలుగువేలమంది గంధర్వులను జయించి, ఆతడిని విడిపించాను. నీవు భయపడవద్దు. ఇక్కడ చేరిన కౌరవసైన్యాన్ని గెలిచి, కర్ణుడూ, భీష్ముడూ, ద్రోణుడూ, కృపాచార్యుడూ, అశ్వత్థామా, దుర్యోధనుడూ చూస్తూఉండగానే, ఆవుల మందలను మళ్ళిస్తాను' అని అర్జునుడు అన్నాడు. ఆ మాటలను విన్న ఉత్తరుడు ఆశ్చర్యాన్నీ, సంతోషాన్నీ పొందాడు. గబగబా చెట్టు దిగి ఆతడు అర్జునుడికి సాష్టాంగ దండప్రణామం చేసి, చేతులు జోడించి నిలబడి ఈ విధంగా పలికాడు.

**విశేషం:** అర్జునుడు ఇన్ని విధాల వివరించాక, ఉత్తరుడికి బృహన్నలపై ఆతడే అర్జునుడు అనే నమ్మకం కలిగింది. ఇది తరువాతి పద్యంలో, 'సమ్మోహము పాసె' అనే మాట వలన తెలుస్తుంది.

### ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁగా నెఱుంగుట (సం. 4-39-21)

**ఉ. 'బాహు సమగ్ర శత్రు మదభంజన శౌర్య! సమస్తలోక చే**
**తోహర మూర్తి! నీ విటులు దోఁచుట నాకుఁ బ్రసన్న విస్ఫుర**
**ద్దేహముతోడ భాగ్యమయ దేవత సన్నిధిసేఁత గాదె; స**
**మ్మోహము పాసెఁ; జిత్తము ప్రమోద రసత్వముఁ బొంది పొంగెడున్. 150**

**ప్రతిపదార్థం:** బాహు= బాహువులయొక్క బలంతో; సమగ్ర= నిండిన; శత్రు= శత్రువులయొక్క; మద= మదాన్ని (గర్వాన్ని); భంజన= నాశనంచేసే; శౌర్య!= పరాక్రమం కలవాడా!; సమస్తలోక= లోకంలో ఉన్న అందరియొక్క; చేతస్= మనస్సులను; హర= హరించివేసే (ఆకర్షించే); మూర్తి!= ఆకారం (రూపం) కలవాడా!; నీవు= (అంతటి) నీవు; ఇటులు= ఇట్లా; తోఁచుట= కనపడటం; నాకున్= నాకు; ప్రసన్న= ప్రశాంతమైన (స్వచ్ఛమైన); వి+స్ఫురత్= ఎక్కువగా ప్రకాశించే; దేహముతోడన్= శరీరంతో; భాగ్యమయదేవత= అదృష్టరూపం అయిన దేవత; సన్నిధి+చేఁతన్+కాదె!= ఎదుట నిలవడమే కదా! (ప్రత్యక్షం కావటమే కదా!); చిత్తము= నాయొక్క మనస్సు; సమ్మోహము+పాసెన్= మోహాన్ని వదిలింది (మనస్సు వ్యామోహ రహితం అయింది అన్నమాట); చిత్తము; ప్రమోదరసత్వమున్= ఆనందమనే రసాన్ని; పొంది= అనుభవించి; పొంగెడున్= ఉప్పొంగుతూఉన్నది. (మనస్సులో వ్యామోహం ఎప్పుడైతే నశించిందో, అప్పుడే ఆనందరసాన్ని అనుభవించటం జరిగింది. దాని ఫలితంగా మనస్సు ఉప్పొంగింది- అని).

**తాత్పర్యం:** 'సమగ్రమైన బాహుబలంతో ఉన్న శత్రువులయొక్క మదాన్ని అణిచివేసే పరాక్రమం కలవాడా! లోకులకు మనోహరంగా కనిపించే ఆకారం కలవాడా! అర్జునా! నాకు నీవు ఈ రకంగా ప్రత్యక్షం కావటం ఎట్లా ఉన్నదంటే, నా భాగ్యదేవతే ప్రసన్నమైన రూపంతో నా యెదుట నిలిచినట్లే ఉన్నది. నా మనస్సులో ఉన్న వ్యామోహం నశించటం వలన నాకు పరమానందంగా ఉన్నది.

**విశేషం:** ఇది- ఉత్తరుడు అర్జునుడిని స్తుతించటమే! ఉత్తరుడి దృష్టిలో అర్జునుడు ఒక దైవమే! ఆతడికి అర్జునుడిపై ఉన్న భక్తిప్రపత్తులు, గౌరవం అటువంటివి. అర్జునుడు పాండవుల విషయాన్ని సమగ్రంగా వివరించాక, ఉత్తరుడికి మనస్సు నిర్మలం అయింది. దానితో, పాండవులను గూర్చిన విచారం ఉత్తరుడికి తొలగిపోయింది. మనస్సుకు స్తిమితం చిక్కింది. అందుకే ఆతడి భ్రాంతి తొలగింది. దాని ఫలితమే, ఆతడికి కలిగిన ఆనంద రసస్థితి. ఈ విషయాన్ని తిక్కన రసానుకూలంగా వర్ణించి, ఉత్తరుడి మనోభావాన్ని సముచితంగా చిత్రించాడు.

**క. ని న్నెఱుఁగక యే నే మే । నన్న పలుకులెల్ల మఱచి యాశ్రిత రక్షా**
**సన్నద్ధ భావ మేర్పడ । నన్నుం గృపఁ జూడవే సనాథుఁడ నగుదున్.' 151**

**ప్రతిపదార్థం:** నిన్నున్+ఎఱుఁగక= నీవుఅని తెలిసికొనలేక; ఏను= నేను; ఏమి+ఏని= ఏమయినా; అన్న= అన్నట్టి; పలుకులు= మాటలు; ఎల్లన్= అన్నిటినీ; మఱచి= మనసులో గుర్తుంచుకొనక; ఆశ్రితరక్షాసన్నద్ధ భావము= ఆశ్రయించినవాళ్ళను కాపాడటానికి పూనుకొనే మనస్తత్త్వం; ఏర్పడన్= స్పష్టమయ్యే విధంగా; నన్నున్= నన్ను; కృపన్= దయతో; చూడవే= చూడవా!; సనాథుఁడన్+అగుదున్= (నేను) రక్షించేవాడొకడు ఉన్నవాడిని అవుతాను (అనాథుడను కాను).

**తాత్పర్యం:** (మొదట్లో) నిన్ను తెలిసికొనలేక; ఎవరో అనుకొని, అన్నమాటలను (అహంకారంగా తేలిగ్గా అన్న మాటలను) మనసులో పెట్టుకోక, మరిచిపోయి, నిన్ను ఆశ్రయించిన దీనులైన వాళ్ళను కాపాడటానికి ఎట్లా పూనుకొంటావో, అట్లాంటి భావంతో, దయతో నన్ను కూడా చూడుము. దానితో నేను దిక్కున్నవాడిని ఔతాను.'

**విశేషం:** దీనికి ముందు పద్యంలో, అర్జునుడిని తెలిసికొన్న ఉత్తరుడు ఆతడి పరాక్రమాదికాన్ని స్తుతించి, ఈ పద్యంలో తాను అర్జునుడిని ఆశ్రయించినట్లూ, తనను రక్షించుమంటూ క్షమించుమని ప్రార్థించాడు. దీనితో అర్జునుడు ఉత్తరుడికి ప్రసన్నుడయ్యాడు.

**క. అన వినుచుఁ దేరు డిగి గ్ర। క్కునఁ గౌఁగిటఁ జేర్చె విరటుకొడుకును గుంతీ**
**తనయుఁడు సమ్మదమునఁ దన। కనుఁగవఁ గడు నశ్రువారి కడలుకొనంగన్. 152**

**ప్రతిపదార్థం:** అనన్+వినుచున్= ఉత్తరుడు అన్న మాటలను వింటూ; కుంతీ తనయుఁడు= కుంతీదేవి కుమారుడైన అర్జునుడు; తేరు డిగి= రథం దిగి; సమ్మదమునన్= ఆనందంతో; తన= తనయొక్క; కను+కవన్= రెండుకండ్లలో; కడున్= మిక్కిలి; అశ్రువారి= కన్నీరు; కడలుకొనంగన్= రాగా (స్రవించగా); విరటుకొడుకును= విరాటరాజు కుమారుడైన ఉత్తరుడిని; గ్రక్కునన్= వెంటనే; కౌఁగిటన్+చేర్చెన్= కౌగిట్లోకి తీసికొన్నాడు (కౌగిలించుకొన్నాడు అని భావం).

**తాత్పర్యం:** ఆశ్రితభావంతో ఉత్తరుడు అన్న మాటలను విన్న అర్జునుడు, రథంమీద ఉన్నవాడల్లా క్రిందికి దిగి, కండ్లవెంట ఆనందబాష్పాలు కారుతూ ఉండగా, ఉత్తరుడిని ప్రియమార కౌగిలించుకొన్నాడు.

**విశేషం:** ఇక్కడ తిక్కన ఉత్తరుడియొక్క, అర్జునుడియొక్క మనోభావాలను చిత్రించాడు. ముందుపద్యంలో ఉత్తరుడు అర్జునుడిని క్షమాపణ కోరుతూ సంప్రార్థనను చేశాడు. దానికి ఇందులో అర్జునుడు ఆతడికి ప్రసన్నుడై ఆశ్లేష (కౌగిలింత) రూపమైన ఆత్మీయతను ప్రదర్శించాడు. ఆ భావానికి 'అశ్రువారి కడలుకొనటం' సూచన.

**వ. ఇట్లు సమాలింగితుండై. 153**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సమాలింగితుండు+ఐ= బాగుగా (మనసారా) కౌగిలించుకొనబడినవాడై.

**తాత్పర్యం:** ఉత్తరుడు అర్జునుడిచేత కౌగిలించుకొనబడినవాడై.

**చ. 'మనము కలంకదేఱె రిపుమర్దన విక్రమ! యెక్కు తేరు; నీ**
**ఘనభుజశక్తి ప్రాపున నఖండిత శౌర్య మహోన్నతుండనై**
**యనిమొన సారథిత్వము మహత్త్వము వైరులు మెచ్చఁ జూపెదన్**
**ననుఁ బనిగొమ్ము, లెమ్ము, కురునాథు నదల్పు, మరల్పు గోవులన్. 154**

**ప్రతిపదార్థం:** రిపు మర్దన విక్రమ!= శత్రువులను మర్దించే (చంపే) పరాక్రమంఉన్న అర్జునా!; మనము= నాయొక్క మనస్సు; కలంక+తేఱెన్= స్వచ్ఛం అయింది (మలినం లేకుండా నిర్మలంగా ఉన్నదని భావం); తేరు= రథం; ఎక్కు= ఎక్కవలసింది; నీ= నీయొక్క; ఘన= గొప్పదైన; భుజశక్తి= భుజబల పరాక్రమం యొక్క; ప్రాపునన్= ఆశ్రయంతో; అఖండిత (న+ఖండిత)= భంగంలేని, తరిగిపోని; శౌర్య= పరాక్రమంతో; మహా+ఉన్నతుండను+ఐ= ఎంతో గొప్పవాడినై; వైరులు మెచ్చన్= శత్రువులు కూడా మెచ్చేటట్లుగా; అనిమొనన్= యుద్ధ ముఖంలో; సారథిత్వము= రథాన్ని తోలటంయొక్క; మహత్త్వము= ఘనత, (చాతుర్యం); చూపెదన్= చూపిస్తాను; ననున్= నన్ను; పని+కొమ్ము= ఆజ్ఞాపించుము; లెమ్ము= బయలుదేరుము; కురునాథున్= దుర్యోధనుడిని; అదల్పు= అదలించుము (పారదోలుము); గోవులన్= ఆవులను; మరల్పు= మళ్ళించవలసింది.

**తాత్పర్యం:** 'అర్జునా! (నీ దర్శనంతో) నా మనస్సు ప్రసన్నంగా ఉన్నది. నీ భుజాల రక్షణలో నేను గొప్పవాడినై, శత్రువులు కూడా పొగిడే రీతిగా రథాన్ని తోలుతాను. ఇంక (ఆలస్యం లేకుండా) లెమ్ము! నేను ఏమిచేయాలో ఆజ్ఞాపించుము! దుర్యోధనుడిని తరిమివేసి, ఆలమందలను మళ్ళించుము!

**విశేషం:** 'ఎక్కు తేరు', 'పనిగొమ్ము', 'లెమ్ము', 'అదల్పు', 'మరల్పు' పదాలలో ఉత్తరుడి మహోత్సాహం కనిపిస్తుంది. ఆవులను మళ్ళింపజేయాలనే తొందరా కనిపిస్తుంది. బృహన్నలే అర్జునుడు అనే నిశ్చయం కలగటమే ఈ ఉత్సాహానికి మూలం.

**క. మనమునఁ గోరుదు నే న । ర్జునునకు సమరమున రథ్యచోదక భావం**
**బునఁ బని సేయవలయు నని । యనిశము; విధికరుణ నాకు నది సిద్ధించెన్.' 155**

**ప్రతిపదార్థం:** నేను= నేను; అర్జుననకున్= అర్జునుడికి; సమరమునన్= యుద్ధంలో; రథ్య= గుర్రాల యొక్క; చోదకభావంబునన్= తోలటంలో (సారథ్యంలో); పని+చేయవలయున్+అని= పనిచేయాలని; అనిశమున్= ఎల్లప్పుడూ; మనమునన్= నా మనస్సులో; కోరుదును= కోరుకొంటాను; విధి కరుణన్= విధియొక్క దయతో (దేవుడి దయతో); నాకున్= నాకు (ఉత్తరుడికి); అది= రథాన్ని తోలటం అనే కోరిక; సిద్ధించెన్= ప్రాప్తించింది.

**తాత్పర్యం:** యుద్ధంలో అర్జునుడికి రథసారథిగా ఉండాలని నేను ఎప్పుడూ మనసులో కోరుకొంటూ ఉంటాను. దేవుడి దయవలన ఇప్పుడు నాకు అది ప్రాప్తించింది.'

**విశేషం:** మొదట రథికుడుగా బయలుదేరి వచ్చిన ఉత్తరుడు పరిస్థితి మారిన దానివలన సారథిగా మారాడు. దానికి ఆతడు ఎంతో సంతోషపడ్డాడు; పైగా అది (సారథి కృత్యం) తన చిరకాల వాంఛ అనీ, దేవుడి దయవలన అది సిద్ధించిందనీ ఉత్తరుడు అన్నాడు. దీనివలన ఉత్తరుడు మానసికంగా ఎంతో ఎదిగినట్లు తెలుస్తుంది. ఈ విషయం ముందు ఇంకా స్పష్టమవుతుంది.

**వ. అని పలుకు నుత్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కిట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** అని పలుకు= పైవిధంగా పలుకుతూఉన్న; ఉత్తరున్= ఉత్తరకుమారుడిని; అతి+ఆదరంబునన్= ఎక్కువ మన్ననతో; చూచి; సవ్యసాచి= అర్జునుడు; అతనికిన్= ఉత్తరుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** పై రీతిగా చెప్పే ఉత్తరుడిని అర్జునుడు ఎంతో ఆదరంతో చూచి ఆతడితో ఈ రకంగా అన్నాడు.

**మ. 'ప్రియ మక్షీణము నాకు నీ దెస; మదిన్ భీతిప్రదోద్వేగ సం**
**శయముల్ సేరఁగ నీను నీకు; ఘనరక్షా కల్పనా బుద్ధి ని**
**శ్చయ సంపాదిని నాదు దృష్టి; నిను నశ్వవ్రాతముం జోఁక గా**
**లియు రానీను; దృణీకరింపు రిపుదోర్లీలాసముల్లాసమున్.' 157**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; నీదెసన్= నీవైపు (నీమీద); ప్రియము= ప్రేమ, ఇష్టం; అక్షీణము (న+క్షీణము)= క్షీణించిపోనిది (ఎక్కువైనది); మదిన్= మనసులో; నీకున్= నీకు; భీతిప్రద+ఉద్వేగ= భయాన్ని కలిగించే ఆవేశమూ; సంశయముల్= అనుమానమూ; చేరఁగన్+ఈను= చేరనీయను; నాదు= నాయొక్క; దృష్టి= చూపు; ఘన= ఎక్కువయిన; రక్షా= రక్షణను; కల్పనా= కల్పించే; బుద్ధిన్= ఆలోచనలో; నిశ్చయ= నిశ్చయాన్ని (దృఢనిర్ణయాన్ని); సంపాదిని= కలిగించేది; నినున్= నిన్నూ; అశ్వ= గుర్రాలయొక్క; వ్రాతమున్= సమూహాన్ని; చోఁకన్= సోకటానికి (తాకటానికి); గాలియున్ రాన్+ఈను= గాలిని గూడా దగ్గరికి చేరనీయను. (మీద ఈగ వాలనీయను వంటిదే ఇదీ కూడా); రిపుదోస్(ః)+లీలా+సం+ఉల్లాసమున్= శత్రువుల భుజాలయొక్క విలాసంయొక్క ఉద్రేకాన్ని (శత్రువుల బలాధిక్యమును); తృణీకరింపు= చులకన చేయుము (లెక్క చేయవద్దు).

**తాత్పర్యం:** '(ఉత్తరకుమారా!) నాకు నీమీద ఉన్న ప్రేమ తరగనట్టిది. భయమూ, ఆవేశమూ, సందేహమూ నీకు రానివ్వను. నా దృష్టి అంతా నీకు రక్షణ కల్పించటంలోనే లగ్నమయి ఉంటుంది. నిన్నూ, గుర్రాలనూ తాకటానికి గాలిని కూడా సోకనివ్వను. (కనుక) నీవు శత్రువులయొక్క పరాక్రమాన్ని ఏమాత్రం లెక్కచేయ నవసరం లేదు.'

**విశేషం:** ఉత్తరుడు తనపై చూపిన భక్తి గౌరవాలకు అర్జునుడు ఆతడిని కౌగిలించుకొని, పైవిధంగా ధైర్యాన్ని చెప్పాడు. అందులో, సారథి అయిన ఉత్తరుడినీ, గుర్రాలనూ, గాలిని కూడా తాకనీయనని అంటాడు. దానివలన, రథికుడైనవాడికి రథ్యాలనూ (గుర్రాలనూ); సారథినీ రక్షించుకొనవలసిన బాధ్యత ఉందనీ సూచించబడింది. సమర్థుడైన రథికుడే సారథినీ, గుర్రాలనూ రక్షించుకొనగలుగుతాడు.

**వ. అనిన విని భూమింజయుండు సవినయంబుగా నిట్లనియె. 158**

**తాత్పర్యం:** అర్జునుడు పైవిధంగా మాట్లాడిన తరువాత, ఉత్తరుడు, వినయంతో కూడినవాడై ఈవిధంగా అన్నాడు.

**క. 'నిను నర్జునుండని యెఱిం । గిన యంతన పాసె నెల్ల కిల్బిషములు; నీ**
**తను వేల షండభావం । బునఁ బొందెనొ యెఱుఁగవలయుఁ బుంస్త్వాభరణా! 159**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; అర్జునుండు+అని= అర్జునుడు అని; ఎఱింగిన+అంతన్+అ= తెలిసికొన్న వెంటనే; ఎల్ల= అన్ని రకాలైన; కిల్బిషములున్= దోషాలు (మానసికాలైన); పాసెన్= పోయాయి; పుంస్త్వ+ఆభరణా!= పురుషత్వానికి అలంకారమైన వాడా! (ఓ అర్జునా!); నీతనువు= నీ ఈశరీరం; ఏల= ఎందుకు; షండభావంబునన్+పొందెనొ?= పేడితనాన్ని పొందిందో? (నపుంసకుడివిగా ఎందుకు ఉన్నావు? - అని); ఎఱుఁగవలయున్= నాకు తెలియాలి.

**తాత్పర్యం:** 'అర్జునుడివి అని నీవు నాకు తెలిసినప్పుడే, (మానసికాలైన) నా వ్యథలు, పాపాలు అన్నీ పోయాయి. పురుష శ్రేష్ఠుడా! నీకు ఈ పేడిరూపం ఎట్లా కలిగిందో తెలిసికొనాలని ఉన్నది.

**విశేషం:** అలం: పరికరం. పేడిరూపం ఎందుకు వచ్చిందో చెప్పవలసింది అని అనకుండా ఉత్తరుడు, 'ఎఱుంగవలయున్' అని అన్నాడు. ఇది చాలా సున్నితమైన విషయం. అందుకే ఉత్తరుడు 'నీవు చెప్పుము' అని నేరుగా అడగలేదు. 'ఎఱుంగవలయున్' అనడంలో తాను అడగకుండా, అర్జునుడే చెప్పాలి అని ఉత్తరుడి భావం. తిక్కన ప్రయోగించిన 'పుంస్త్వాభరణా!' అనే విశేషణం సాభిప్రాయం. 'ఏదో కారణంగా ఇట్లా ఉన్నావనీ' ధ్వని. భయాలు మొదలైనవి మానసిక రోగాలు. సహజంగా అంత శూరుడు కాని ఉత్తరుడు కురుసేనను చూచి బెదిరాడు. ఇప్పుడు అర్జునుడు అని నిశ్చయం అయ్యాక ఉత్తరుడి మనస్సులో ఉన్న భయం, ఆందోళన, సంకోచం మొదలైన 'కిల్బిషాలు' పోయినాయని భావం. కాబట్టి అలంకారం పరికరం.

**చ. అనవుడు నాతఁ డిట్లను, 'మదగ్రజుపంపున బ్రహ్మచర్య వ**
**ర్తనకయి పూర్వశాపవిహితంబగు రూపముఁ దాల్చి యేకహా**
**యన పరిపాలనీయ మగునట్టి వ్రతంబు సమాప్తిఁ బొందఁ జ**
**ల్పిన జతనంబు లోకులకుఁ బేడితనంబయి తోఁచె నిమ్మెయిన్. 160**

**ప్రతిపదార్థం:** అనవుడున్= పైవిధంగా ఉత్తరుడు అనగానే; ఆతఁడు+ఇట్లు+అనున్= అర్జునుడు ఇట్లా అంటున్నాడు; మత్= నాయొక్క; అగ్రజు= అన్న అయిన ధర్మరాజుయొక్క; పంపునన్= ఆజ్ఞతో; బ్రహ్మచర్య వర్తనకయి= బ్రహ్మచర్యాన్ని

నడపటానికి; పూర్వ= పూర్వం; శాప= శాపంచేత (ఊర్వశి వలన వచ్చిన శాపం); విహితంబు+అగు= విధించబడ్డ; రూపమున్= ఆకారాన్ని; తాల్చి= ధరించి; ఏక= ఒకటైన; హాయన= సంవత్సరంపాటు; పరిపాలనీయము= ఆచరించదగింది; అగునట్టి= అయినటువంటి; వ్రతంబు= నియమం; సమాప్తిన్+పొందన్= ముగించటానికి; చల్పిన= చేసినట్టి; జతనంబు= ప్రయత్నం; లోకులకున్= లోకానికి; ఈ+మెయిన్= ఈ రీతిగా; పేడితనంబు+అయితోఁచెన్= నపుంసకత్వంగా వ్యక్తమయింది.

**తాత్పర్యం:** అర్జునుడు ఉత్తరుడితో తనకు పేడిరూపం ఎట్లా వచ్చిందో చెప్పుతున్నాడు. 'మా అన్న ధర్మరాజు యొక్క ఆజ్ఞ మేరకు బ్రహ్మచర్యవ్రతాన్ని పూని, ఇంతకుముందు ఊర్వశి కారణంగా వచ్చిన శాప సంబంధమైన రూపాన్ని తాల్చి, సంవత్సరం పాటు ఆచరించాల్సిన వ్రతాన్ని పూర్తిచేసే ప్రయత్నమే లోకానికి ఇలా పేడిరూపంగా తోస్తూ ఉన్నది.

**విశేషం:** అర్జునుడు, తన అన్న ధర్మరాజు ఆనతో, పాశుపత మహాస్త్రాన్ని సంపాదించటానికి ఇంద్రకీలపర్వతం మీద ఇంద్రుడిని గురించి తపస్సు చేశాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై, శివుడిని గూర్చి తపస్సు చేయుమని ఆదేశించాడు. అర్జునుడు అట్లాగే చేశాడు. శివుడు మాయా కిరాతవేషంలో వచ్చి, అర్జునుడితో పందికొరకు పోరాడి, మెచ్చి, ప్రత్యక్షమై, పాశుపతాన్ని అనుగ్రహించాడు. ఆ సందర్భంలో ఇంద్రుడు దేవగణాలతో వచ్చి అర్జునుడిని మెచ్చి, అమరావతికి తీసికొనిపోయాడు. అక్కడ అర్జునుడిని పరీక్షించటానికి ఇంద్రుడు ఊర్వశిని సాలంకృతగా ఆతడి వద్దకు పొమ్మంటాడు. ఆమె అర్జునుడి వద్దకు వచ్చి, తన కోరికను తెలిపింది. దానికి ఆతడు 'తల్లీ!' అని పిలిచి, తమ వంశకర్త అయిన పురూరవుడికి ఆమె భార్య అనీ, కనుక తనకు తల్లి అనీ, నిరాకరించాడు. పైగా అప్సరసలందరూ ఇంద్రుడి కాంతలు కనుక, ఇట్లా కూడా 'నీవు నాకు తల్లివే!' అని అర్జునుడు ఆమెకు బుద్ధి చెప్పాడు. దానికి ఆమె నపుంసకుడివి కమ్మని శపించింది. అర్జునుడు విచారించగా తండ్రి అయిన ఇంద్రుడు ఇది భయపడవలసిన విషయంకాదనీ, ముందు అజ్ఞాతవాసంలో ఈ శాపమే వరంగా ఉంటుందనీ ఓదార్చి, వరాలిచ్చి కొడుకు నిగ్రహాన్ని ప్రశంసించి పంపాడు. ఈ కథ ఆంధ్ర మహాభారతం ఆరణ్యపర్వం ప్రథమాశ్వాసంలో ఉన్నది.

**వ. అదియును నిటమీఁద లేదనినఁ బ్రమోదమాన మానసుండయి, మత్స్యపతిసూనుండు పాండుసూనున కిట్లనియె. 161**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ పేడిరూపం కూడా; ఇటమీఁదన్= ఇకమీద; లేదు+అనినన్= ఉండదు అనగానే; ప్రమోద మాన= సంతోషిస్తున్న; మానసుండు= మనస్సు కలవాడు; అయి; మత్స్య= మత్స్యదేశానికి; పతి= రాజు అయిన విరాటుడి యొక్క; సూనుండు= కుమారుడైన ఉత్తరుడు; పాండుసూనునకున్= పాండురాజు కుమారుడైన అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇంక ఆ పేడిరూపం (తనకు) లేదు' అని చెప్పగా,ఉత్తరుడు ఆనందంతో అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'ఇట్లు తెలియఁ జెప్పుటెల్ల నాదెస దయ । పెంపుతోడి కూర్మి పేర్మిఁ గాదె!**
**యింక సురలకైన శంకింతునే? భవ । ద్బాహువప్రగుప్తి బలుపు గలుగ. 162**

**ప్రతిపదార్థం:** ఇట్లు= పైవిధంగా; తెలియన్+చెప్పుట+ఎల్లన్= బాగా తెలిసేటట్లు చెప్పటం అంతా (ఎందుకంటే); నాదెసన్= నాపై; దయ=దయయొక్క; పెంపుతోడి= ఆధిక్యంతో కూడిన (ఎక్కువైన); కూర్మి పేర్మిన్= ప్రేమయొక్క అతిశయంతో; కాదె!= కాదా!; ఇంకన్= ఇప్పటినుండి; భవత్= నీయొక్క; బాహు= బాహువులు అనే; వప్ర= ప్రహరి (ప్రాకారం) యొక్క;

గుప్తిన్= రక్షణతో; బలుపు కలుగన్= బలం రాగా; సురలకున్+అయినన్= దేవతలకు అయినా; శంకింతునే?= అనుమానిస్తానా? (జంకుతానా?).

**తాత్పర్యం:** 'ఈ విధంగా నీవు నాకు స్పష్టంగా చెప్పటం, నాపైన దయాతిశయంతో కూడిన అభిమానంతోనే కదా! ఇక ముందు నీ బాహువులు అనే ప్రాకారం రక్షిస్తూ ఉండగా, బలాన్ని పొంది, దేవతలకైనా భయపడకుండా ఉంటాను. (అంటే కౌరవసేన సంగతి చెప్పనక్కరలేదని భావం).

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. 'భవద్బాహు వప్రగుప్తి బలుపుగలుగ', అనే రూపక ప్రయోగం వలన ఉత్తరుడిలో సమాశ్రిత భావం అర్జునుడి బల ప్రశంస, అభ్యర్థన, ఆత్మవిశ్వాసం, క్రొత్త ఉత్సాహం వంటి భావాలు కలిగినట్లు తెలుస్తున్నది.

**వ. నాకుం బని యెయ్యది పనుపు 'మనిన నతండును' గాండీవంబును, గాంచన పుంఖంబులగు బాణంబులు గల తూణీర యుగళంబును, మదీయ తను త్రాణ కృపాణంబులును బుచ్చికొని తక్కిన వాని నెప్పటి భంగిన కట్టి పెట్టి ర' మ్మని నియోగించిన, నాతండు నట్ల చేయుటయు, నమ్మహాత్ముండు నియాతాత్ముండయి యధి దేవతలకుం బ్రాణమిల్లి, భక్తితోడ దివ్యకోదండాదులగు సాధనంబులు గైకొని, సవిశేషస్ఫూర్తి యగు మూర్తి నత్యంత దర్శనీయత్వంబు నొంది. 163**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; పని+ఎయ్యది?= పని ఏమి? (ఏ పనిచేయాలి); పనుపుము+అనినన్= ఆజ్ఞాపించుము అని అనగా; అతండును= అర్జునుడు కూడ; గాండీవంబును= గాండీవం అనే పేరున్న వింటినీ; కాంచన= బంగారుతో కూడిన; పుంఖంబులు+అగు= పింజలు కలవైన (బాణాల పిడిభాగం బంగారంతో అలంకరిస్తారు. పేర్లు కూడా చెక్కుతారు); బాణంబులు కల= బాణాలు ఉన్న; తూణీర= అమ్ముల పొదులయొక్క; యుగళంబును= జంటను; మదీయ= నాయొక్క; తను= శరీరాన్ని; త్రాణ= రక్షించేది (కవచాన్ని); కృపాణంబులును= కత్తులునూ; పుచ్చికొని= తీసికొని; (చెట్టుపైన ఉన్న ఆయుధాల మొత్తంలో పైవి మాత్రం తీసికొని); తక్కినవానిన్= మిగిలిన వాటిని; ఎప్పటి భంగిన్+అ= ముందున్న విధంగానే; కట్టిపెట్టి= కట్టగా కట్టి; రమ్ము+అని నియోగించినన్= రావలసింది అని ఆజ్ఞాపించగా; ఆతండు= ఉత్తరుడు; అట్లు+అ చేయుటయున్= అర్జునుడు చెప్పినట్లే చేయగా; ఆ+మహాత్ముండు= ఆ అర్జునుడు; నియత+ఆత్ముండు+అయి= నియమించిన మనస్సు కలవాడై (మనోనిగ్రహంతో); అధిదేవతలకున్= ఆయా ఆయుధాలకు అధిపతులైన దేవతలకు; (ఆయుధాల్ని ప్రయోగించాలంటే, ఆయా ఆయుధాల అధిదేవతల అనుగ్రహం కావాలి. అవి అన్నీ మంత్ర మహితాలు); ప్రణమిల్లి= నమస్కరించి; భక్తితోడ= భక్తిభావంతో; దివ్య= ప్రకాశిస్తూ, మహిమతో కూడిన; కోదండ+ఆదులు+అగు= ధనుస్సు మొదలైనవగు; సాధనంబులు= యుద్ధానికి సంబంధించినవాటిని (ఆయుధాలను); కైకొని= స్వీకరించి; స+విశేషస్ఫూర్తి= ఏదో విశేషం (ప్రత్యేకతతో) కూడిన కాంతి ఉన్నట్టిది; అగు=ఐన; మూర్తిన్= రూపంతో; అతి+అంత= మిక్కిలి; దర్శనీయత్వంబున్= చూడతగిన లక్షణం; ఒంది= పొంది.

**తాత్పర్యం:** ఇప్పుడు నేను ఏం పనిచేయాలో నన్ను ఆజ్ఞాపించుము' అని ఉత్తరుడు అనగానే, అర్జునుడు 'గాండీవాన్నీ, బంగారుతో అలంకరించిన పిడులున్న బాణాలతో నిండిన రెండు అమ్ములపొదులనూ, కవచాన్నీ, కత్తినీ తీసికొని, తక్కినవాటిని అట్లాగే కట్టిపెట్టి రావలసింది' అని అంటే ఉత్తరుడు అట్లాగే చేశాడు. మహాత్ముడైన ఆ అర్జునుడు ఆయా ఆయుధాలకు సంబంధించిన దేవతలకు భక్తితో మ్రొక్కి, ఆయుధాలను గ్రహించి, ఎంతో కాంతిమంతమైన దివ్యరూపంతో దర్శనీయంగా ఉండి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. బలరిపుఁ డిచ్చిన కుండల । ములు నుష్ణీషంబుఁ జిత్తమున భక్తి మెయిం**
**దలఁప నవి వచ్చె; వెండ్రుక । లలవడగాఁ బాచి ముడిచె నమర దృఢముగన్. 164**

**ప్రతిపదార్థం:** బల= బలుడు అనే పేరుగల రాక్షసుడియొక్క; రిపుఁడు= శత్రువైనవాడు ఇంద్రుడు; ఇచ్చిన= ఇచ్చినటువంటి; కుండలములన్= చెవులకు పెట్టుకొనే ఆభరణాలు (వలయాలు); ఉష్ణీషంబున్= తలపాగా; చిత్తమునన్= మనస్సులో; భక్తిమెయిన్= భక్తితో; తలఁపన్= తలచుకొనగానే; అవి= ఆ కుండలాలూ, తలపాగా; వచ్చెన్= వచ్చాయి; వెండ్రుకలు= జుట్టును; అలవడఁ గాన్= తగినట్లుగా; పాచి= పాయలు పాయలుగా చిక్కుదీసి; దృఢముగన్= గట్టిగా; అమరన్= కుదురుకొనే రీతిగా; ముడిచెన్= ముడివేసికొన్నాడు (అర్జునుడు).

**తాత్పర్యం:** దేవేంద్రుడు ప్రసాదించిన కుండలాలనూ, తలపాగానూ అర్జునుడు తన మనస్సులో అనుకొనగానే వచ్చాయి. అప్పుడు ఆతడు తన జుట్టును సవరించుకొని, వాటిని అమరించుకొన్నాడు.

**విశేషం:** కుండలాలూ, ఉష్ణీషం మొదలైన అర్జునుడి వస్తువులన్నీ దివ్యాలు కనుక, అవి అవసరం అయినప్పుడు తలచుకొనగానే ఆతడికి స్వాధీనాలౌతాయి. ఉష్ణీషం అంటే శిరోవేష్టనం (తలగుడ్డ) లేదా కిరీటం. ఉష్ణాన్ని పోగొట్టేది ఉష్ణీషం.

**క. తలచుట్టు చుట్టెఁ; గుండల । ములు వెట్టెను; ద్రిండు గాఢముగఁ గట్టెఁ; గరం**
**బుల వలయంబులు గనుఁగొని । యెల నవ్వొలయంగ నెక్కె నేడ్తెఱ రథమున్. 165**

**ప్రతిపదార్థం:** తలచుట్టు= తలపాగాను; చుట్టెన్= చుట్టుకొన్నాడు (అర్జునుడు); కుండలములు= కుండలాలను; పెట్టెను= పెట్టుకొన్నాడు; ద్రిండు= దట్టీని; గాఢముగన్= గట్టిగా బిగించి; కట్టెన్= కట్టుకొన్నాడు; కరంబుల= చేతులయొక్క; వలయంబులు= కటకాలు (గాజులు); కనుఁగొని= చూచి; ఎల+నవ్వు+ఒలయంగన్= చిరునవ్వుతో; ఏడ్తెఱన్= అతిశయంతో; రథమున్= రథాన్ని; ఎక్కెన్= ఎక్కాడు.

**తాత్పర్యం:** తలపాగా బాగా అమరించి చుట్టుకొని కుండలాల్ని ధరించి, దట్టి బిగించి, చేతులకు ఇంకా అలాగే వున్న గాజుల్ని చూచుకొని అర్జునుడు చిరునవ్వుతో, రథాన్ని ఎక్కాడు.

**విశేషం:** అర్జునుడికి 'ఎలనవ్వు' (చిరునవ్వు) కలిగింది. దానికి కారణం ఆతడి చేతులకున్న శంఖవలయాలు. అంటే శంఖాల వలె ఉన్న గాజులు. వాటిని స్త్రీలు వేసికొంటారు. బృహన్నలకు తగినట్లు ఆతడు అప్పటికి వాటిని వేసికొన్నాడు. కాని, ఇంకా ఉన్నాయే - అని తన చేతులను తాను చూచికొని అర్జునుడు నవ్వుకొన్నాడు.

**వ. అట్టి యెడ వరదాన మహానుభావంబునం జేసి. 166**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; వర= వరాన్ని; దాన= ఇవ్వటం వలన కలిగిన; మహా+అనుభావంబునన్+చేసి= గొప్ప మహిమతో.

**తాత్పర్యం:** ఇంద్రుడు వరాన్ని ఇవ్వటం వలన కలిగిన ప్రభావంతో ఆ సమయంలో.

**క. పెట్టక కట్టక మౌళిం । బుట్టిన క్రియ దీధితులు నభోభాగంబున్**
**ముట్టి వెలుంగఁగ నింద్రుని । పట్టి కిరీటంబు పొలిచెఁ బ్రస్ఫురితంబై. 167**

**ప్రతిపదార్థం:** పెట్టక= తనకు తానై పెట్టుకొనకుండా; కట్టక= తానై తలపై కట్టుకొనకుండా; మౌళిన్= శిరస్సుపైన; పుట్టిన క్రియన్= మొలిచిన రీతిగా; దీధితులు= వెలుగులు; నభస్(ః)+భాగంబున్= ఆకాశాన్ని; ముట్టి= తాకి (ఆకాశం అంతా నిండి); వెలుంగఁగన్= ప్రకాశించగా; ఇంద్రుని= దేవేంద్రుడి యొక్క; పట్టి= కుమారుడైన అర్జునుడియొక్క; కిరీటంబు= కిరీటం; ప్రస్ఫురితంబు+ఐ= మిక్కిలి కాంతితో నిండి; పొలిచెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** తానై తలమీద పెట్టక, తనకు తానుగా తలకు కట్టక, తలమీదే మొలిచినట్లు తన కాంతులను ఆకాశం అంతా విరజిమ్ముతూ అర్జునుడి కిరీటం ప్రస్ఫుటంగా ప్రకాశించింది.

**విశేషం:** అర్జునుడి కిరీట కాంతులకే కొందరు సైనికులు మూర్ఛపోతారు. అది అంత ప్రభావంతో కూడింది. అట్లాగే, అల్లెత్రాటి ధ్వనితో కొందరూ, దేవదత్త శంఖధ్వానంతో కొందరూ, కపిధ్వజం సింహనాదానికి కొందరూ, ఇట్లా చాలా సైన్యం మూర్ఛపోతుంది. ఇది అంతా అర్జునుడు యుద్ధం చేయకముందే జరుగుతుంది. అర్జునుడి యుద్ధ పరికరాలు అన్నీ వరప్రసాదాలు.

**వ.** **ఇవ్విధంబున సన్నద్ధుండై యతిరథశ్రేష్ఠుండు రథం బెక్కి యం దాయుధంబులు పదిలంబుగా నిడి, తనుత్రాణ తలత్రాణంబులు తాల్చి, కవదొనలం బూని, గాండీవంబుఁ బుచ్చికొని యెక్కువెట్టి, ముష్టి నలవరించి గుణధ్వని సేసిన.** **168**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= పైన చెప్పినట్లు; సన్నద్ధుండు+ఐ= సంసిద్ధం అయినవాడై; అతిరథ= అతిరథులలో; శ్రేష్ఠుండు= శ్రేష్ఠమైనవాడు అయిన అర్జునుడు; రథంబు+ఎక్కి; అందు=ఆ రథంలో; ఆయుధంబులు=ఆయా ఆయుధాలను; పదిలంబుగాన్+ఇడి= జాగ్రత్తగా ఉంచి; తనుత్రాణ= కవచాన్ని (తనువును-అంటే-శరీరాన్ని కాపాడేదాన్ని); తల= కరతలాన్ని (అరచేతిని); త్రాణంబులు= రక్షించేది (అరచేతి కవచం); తాల్చి= ధరించి; కవ= రెండైన; దొనలన్= అమ్ములపొదుల (జంటను); పూని= తాల్చి; గాండీవంబున్+పుచ్చికొని= గాండీవాన్ని తీసికొని; ఎక్కు+పెట్టి= అల్లెత్రాడు బిగించి; ముష్టిన్+అలవరించి= పిడికిటితో గట్టిగా పట్టి; గుణధ్వని= అల్లెత్రాటి ధ్వని (ధనుష్టంకారం); చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** అర్జునుడు పైవిధంగా యుద్ధానికి సంసిద్ధమై, రథాన్ని అధిరోహించి, ఆయుధాలను భద్రంగా రథంలో పెట్టుకొని, కవచాలనూ, అమ్ములపొదులనూ ధరించి గాండీవాన్ని ఎక్కుపెట్టి, అల్లెత్రాటిని మోగించగా.

**తే.** **పక్షి మృగజాతు లెల్లను బ్రమసి యిట్టు । నట్టుఁ గలగొనఁ జెదరె; వృక్షాళి యదరెఁ;**
**గురుబలంబును బెదరె; నంబరము దిశలు । బూరటిల్లంగఁ దొడఁగెఁ దదారవమున.** **169**

**ప్రతిపదార్థం:** తద్+ఆరవమునన్= ఆ అల్లెత్రాటి ధ్వని వలన; పక్షి= పక్షులయొక్క; మృగ= మృగాలయొక్క; జాతులు+ఎల్లను= జాతులు అన్నీ; (నానారకాల పక్షులూ, మృగాలూ); బ్రమసి= భ్రమించి (దిక్కు తెలియక); ఇట్టున్+అట్టున్= ఇటు అటూ; కలగొనన్= కలతచెందేటట్లు; చెదరెన్= చెదిరిపోయాయి; వృక్ష+ఆళి= చెట్ల గుంపు; అదరెన్= అదిరింది (ఊగింది); కురుబలంబును= కౌరవసేన కూడా; బెదరెన్= బెదిరిపోయింది; అంబరము= ఆకాశం; దిశలు= దిక్కులూ; బూరటిల్లంగన్+తొడఁగెన్= (ఆ శబ్దంతో) నిండి మారుమ్రోగసాగాయి.

**తాత్పర్యం:** అర్జునుడు చేసిన ఆ ధనుష్టంకారం వలన అన్నిరకాల పక్షులూ, మృగాలూ కలత చెంది చెల్లాచెదరయ్యాయి. చెట్లు అన్నీ కుదుళ్ళతో ఊగిపోయాయి. కౌరవసేన కూడ బెదిరిపోయింది. అల్లెత్రాటి ధ్వనితో ఆకాశం, దిక్కులూ నిండి మారుమ్రోగిపోయాయి.

**వ. తదనంతరంబ యగ్నిదేవుం దలంచిన, నతండును దన వరంబున మున్న కలిగి విశ్వకర్మ నిర్మితంబును, మాయామయంబును, వానరాకారంబును నగు మహోగ్ర కేతనంబును, తదాశ్రితంబులైన వికృతాభీల నానావిధ భూతంబులఁ బుత్తెంచిన, నుదాత్త చిత్తుండయి యుత్తరు సింహపతాక శమీవృక్షంబునం బెట్టించి, నిజ ధ్వజంబు రథంబునం గట్టించి, దివ్యంబు గావున దేవదత్తంబు చిత్తజ్ఞత్వంబున సన్నిధి సేసిన సవినయంబుగాఁ గైకొనియె; నక్కుమారుండును నాయితంబై నొగలెక్కి పగ్గంబు లమర్చికొని యగ్గలిక తోడం దురంగంబుల యంగంబులు తొడయుచు వాని జవసత్త్వంబులు వేఱు వేఱ వర్ణించిన. 170**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; అగ్నిదేవున్+తలంచినన్; అతండును= అగ్నిదేవుడు కూడా; తన వరంబునన్= తన వరంచేత; మున్ను+అ= అంతకు మునుపే; కలిగి= సిద్ధంగా ఉండి; విశ్వకర్మ= విశ్వకర్మ అనే దేవశిల్పి చేత; నిర్మితంబును= నిర్మించబడిందీ; మాయామయంబును= మాయతో కూడిందీ; వానర+ఆకారంబును= కోతివంటి రూపం కలిగిందీ; అగు= ఐన; మహా= గొప్పదైన; ఉగ్ర= భయంకరమైన; కేతనంబును= ధ్వజం ఉన్నట్టిదీ; తద్+ఆశ్రితంబులు+ఐన= దాని నాశ్రయించిన; వికృత= వికారంబులయిన; ఆభీల= భయంకరాలైన; నానావిధ= అనేక రకాలైన; భూతంబులన్= భూతాలను; పుత్తెంచినన్= పంపగా; ఉదాత్త చిత్తుండు+అయి= ఉప్పొంగిన మనస్సు కలవాడై; ఉత్తరు= ఉత్తరకుమారునియొక్క; సింహపతాకన్= సింహం గుర్తుగల జెండాను; శమీ వృక్షంబునన్+పెట్టించి= జమ్మిచెట్టుమీద పెట్టించి; నిజ= తనయొక్క; ధ్వజంబున్= కేతనాన్ని (కపిధ్వజాన్ని); రథంబునన్= రథానికి; కట్టించి; దివ్యంబు+కావునన్= దేవతామహిమ కలది కాబట్టి; దేవదత్తంబు= దేవదత్తమనే శంఖం; చిత్తజ్ఞత్వంబునన్= మనసులో ఉన్నదాన్ని తెలిసికొన్నట్లు (సంకల్పమాత్రం చేతనే); సన్నిధి+చేసినన్= ఎదుటికి రాగా; సవినయంబుగాన్= వినయంతో కూడి; కైకొనియెన్= తీసికొన్నాడు; ఆ+కుమారుండును= ఆ ఉత్తరకుమారుడు కూడా; ఆయితంబు+ఐ= సిద్ధమై; నొగలు+ఎక్కి; పగ్గంబులు+అమర్చికొని; అగ్గలిక తోడన్= ఆధిక్యంతో; తురంగంబుల= గుర్రాలయొక్క; అంగంబులు= అవయవాలు; తొడయుచున్= నిమురుతూ; వాని= ఆ గుర్రాలయొక్క; జవసత్త్వంబులు= వేగాన్నీ, బలాన్నీ; వేఱువేఱ= వేరువేరుగా; వర్ణించినన్= వివరించగా.

**తాత్పర్యం:** ఆ తరువాత అర్జునుడు అగ్నిని మనసులో ధ్యానించాడు. అప్పుడు అగ్నిదేవుడు అర్జునుడికి మునుపే వరంగా ఇచ్చినట్టిదీ, దేవశిల్పి అయిన విశ్వకర్మ నిర్మించిందీ, మాయతో కూడిందీ, కోతి ఆకారంగా ఉండేదీ అయిన ధ్వజాన్ని పంపించాడు. దాన్ని ఆధారం చేసికొని ఉన్న భయంకరాలైన ఎన్నో భూతాలను కూడా పంపించాడు. అర్జునుడు ఉత్తరుడి సింహపతాకాన్ని జమ్మిచెట్టు మీద పెట్టించాడు. తన కపికేతనాన్ని రథానికి కట్టించాడు. అర్జునుడి మనస్సంకల్పాన్ని గ్రహించి, దేవదత్తం ఎదుటికి వచ్చింది. అర్జునుడు వినయంతో ఆ దివ్యమైన శంఖాన్ని గ్రహించాడు. అప్పుడు ఉత్తరకుమారుడు తయారై నొగలెక్కి పగ్గాలను చేత పట్టుకొని గుర్రాలను నిమురుతూ వాటి వేగాన్నీ, బలాన్నీ వేరువేరుగా వివరించాడు.

### అర్జునుఁ డుత్తరసారథికంబైన రథంబెక్కి దేవదత్తంబు పూరించుట (సం. 4-41-1)

**చ. 'తడవగుదెంచె; జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోవని;**
**మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు; లిప్పుడ కూడుద' మన్న నాతఁడున్**
**నడపఁ దొడంగుడున్ మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ**
**బిడుగుల పిండు బిట్టులియు పెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్. 171**

**ప్రతిపదార్థం:** తడవు+అగుదెంచెన్= (ఇప్పటికే) ఆలస్యం అయింది; జమ్మికిన్= జమ్మిచెట్టుకు; ప్రదక్షిణ వృత్తిగన్= కుడివైపుచుట్టూ తిరిగే విధంగా (ప్రదక్షిణం చేసిన రీతిగా); తేరు= రథాన్ని; పోవనిమ్ము= పోనిమ్ము; పసులు= పశువులు (ఆవులు); ఎడ+ కలుగంగన్= దూరంగా; పోయెన్= వెళ్ళిపోయాయి; ఇప్పుడు+అ= వెంటనే; కూడుదము= (పసువులను) కలిసికొనాలి; అన్నన్= అనగానే; ఆతఁడున్= ఆ ఉత్తరకుమారుడు కూడా; నడపన్+తొడంగుడున్= నడపటానికి మొదలు పెట్టగానే; పార్థుఁడు= అర్జునుడు; మనమునన్= మనస్సునందు; రణ= యుద్ధ సంబంధం అయిన; కౌతుకము= ఉత్సాహం; ఉల్లసిల్లఁగాన్= ఎక్కువగా కలుగగా; పిడుగుల= పిడుగుల యొక్క; పిండు= సమూహం; బిట్టు+ఉలియు పెల్లునన్= ఎక్కువైన ధ్వనియొక్క ఆధిక్యంతో; శంఖము= దేవదత్తం అనే తన శంఖాన్ని; ఒత్తినన్= ఊదగా (పూరించగా).

**తాత్పర్యం:** అర్జునుడు ఉత్తరుడితో 'ఇప్పటికే ఆలస్యం అయింది. రథాన్ని జమ్మిచెట్టుకు ప్రదక్షిణంగా నడుపుము. పసులు దూరం వెళ్లాయి. మనం వెంటనే వాటిని చేరుకొనాలి' అని అనగానే ఆతడు రథాన్ని నడపటం మొదలుపెట్టాడు. ఆ సమయంలో అర్జునుడు రణ సంబంధం అయిన మహోత్సాహంతో పిడుగుల గుంపు తీవ్రంగా ధ్వనించినట్లు, గొప్పగా దేవదత్తాన్ని పూరించాడు.

**విశేషం:** అర్జునుడు దేవదత్తాన్ని పూరిస్తే, సమస్త ప్రకృతిలో వచ్చిన మార్పును మహాకవి తరువాతి పద్యంలో అభివర్ణిస్తున్నాడు.

**మ. కలఁగెం దోయధి సప్తకంబు; గిరివర్గం బెల్ల నూటాడె, సం**
**చలతం బొందె వసుంధరావలయ; మాశాచక్ర మల్లాడెఁ; గొం**
**దల మందెం ద్రిదశేంద్రు పట్టణము; పాతాళంబు ఘూర్ణిల్లె; నా**
**కులమయ్యెన్ గ్రహతారకాకులము; సంక్షోభించె నవ్వేధయున్. 172**

**ప్రతిపదార్థం:** తోయధి సప్తకంబు= ఏడు సముద్రాలూ; కలఁగెన్= కలత చెందాయి (కల్లోలం చెందాయి); గిరివర్గంబు+ఎల్లన్= కులపర్వతాల సమూహం అంతా; ఊటాడెన్= ఊగిసలాడింది; వసుంధరావలయము= భూమండలం; సంచలతన్+పొందెన్= కదలాడింది (సంచలించింది); ఆశాచక్రము= దిక్కులు అనే చక్రం; అల్లాడెన్= అల్లల్లాడిపోయింది; త్రిదశ+ఇంద్రుపట్టణము= దేవతలకు రాజైన దేవేంద్రుడి పట్టణం అయిన అమరావతి; కొందలము+అందెన్= కలత చెందింది (దిగులుపడింది); పాతాళంబు= భూమికి క్రిందనున్న లోకం (రసాతలం); ఘూర్ణిల్లెన్= క్షోభించింది; గ్రహతారకాకులము= గ్రహాలయొక్క, నక్షత్రాలయొక్క మొత్తం; ఆకులము+అయ్యెన్= కలత చెందింది; ఆ+వేధయున్= ఆ బ్రహ్మదేవుడు కూడా; సంక్షోభించెన్= మిక్కిలి క్షోభించిపోయాడు.

**తాత్పర్యం:** అర్జునుడు దేవదత్తాన్ని పూరించగా ఏడు సముద్రాలూ అల్లకల్లోలం అయ్యాయి. ఏడు కులపర్వతాలూ ఊగిపోయాయి. భూచక్రం అంతా కంపించింది. దిక్కుల సమూహం అల్లల్లాడింది. అమరావతి దిగులుపడింది. పాతాళం క్షోభించింది. గ్రహ నక్షత్రాలు తల్లడిల్లి వాటి వాటి గతులు తప్పాయి. ఆఖరికి ఆ బ్రహ్మకూడా కదిలిపోయాడు.

**విశేషం:** ప్రకృతిని అంతా ముందు చెప్పి, చివరలో దానికి కారకుడైన వేధ పరిస్థితిని కవి వర్ణించడం వలన, అర్జునుడు పూరించిన దేవదత్తం ధ్వని సమస్త బ్రహ్మాండం వ్యాపించింది - అని భావించాలి. అందుకే, భూలోకం, పాతాళం, అమరావతి (స్వర్గలోకం) అల్లకల్లోలం అయినట్లు వర్ణించబడింది.

**తే.** **అపుడు నిశ్చేష్టితంబులై హయము లవనిఁ । జాఁపకట్టుగఁ బడియెఁ; మత్స్యక్షితీశ**
**నందనుండును నొగలపై ధ్రుందినట్లు । మ్రొగ్గతిలఁ జాఁగి బలితంపు మూర్ఛఁ బొందె.** **173**

**ప్రతిపదార్థం:** అపుడు= అర్జునుడు దేవదత్తాన్ని పూరించినప్పుడు; హయములు= గుర్రాలు; నిశ్చేష్టితంబులు+ఐ= కదలిక లేనివై; (కొయ్యబారినవై); అవనిన్= నేలమీద; చాఁపకట్టుగన్+పడియెన్= చాపచుట్టవలె పడ్డాయి; మత్స్యక్షితి+ఈశ= మత్స్యదేశం రాజైన విరాటుడి యొక్క; నందనుండును= కుమారుడైన ఉత్తరుడు కూడా; నొగలపైన్= సారథి కూర్చుండే చోటులో (రథానికి ముందుప్రక్క); ధ్రుందినట్లు= చనిపోయినట్లు; మ్రొగ్గతిలన్+చాఁగి= బోరగిలబడి సాగినట్లు; బలితము+మూర్ఛన్= గాఢమైన మూర్ఛను; పొందెన్= పొందాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో రథానికి కట్టిన గుర్రాలు చాపకట్టుగా కుప్పకూలాయి. ఉత్తరుడు రథం నొగలపైన ముందుకు బోర్లాపడి తెలివిదప్పి పడిపోయాడు.

**చ.** **కనుఁగొని ఫల్గునుండు తురగంబుల వాగెలు వట్టి యెత్తి, త**
**త్తనువులు నూల్కొనన్ నివిరి, తత్పరతం దగ మత్స్యభూమిభృ**
**త్తనయుని నూఁదిపట్టి, వికృతంబగు రూపము చక్కఁజేసి, నె**
**మ్మన మొకభంగిఁ దేర్చి, గరిమంబుగఁ గౌఁగిటఁ జేర్చి, యిట్లనున్.** **174**

**ప్రతిపదార్థం:** ఫల్గునుండు= అర్జునుడు; కనుఁగొని= చూచి (అప్పటి స్థితిని); తురగంబుల= గుర్రాలయొక్క; వాగెలు= పగ్గాలు (కళ్ళెపు త్రాళ్ళు); పట్టి+ఎత్తి= పట్టుకొని గుర్రాలను పైకెత్తి; తద్= ఆ బెదరిన గుర్రాలయొక్క; తనువులు= దేహాలను; నూల్కొనన్= సర్దుబాటు అయ్యేటట్లు; నివిరి= చేతితో మెల్లగా నిమిరి; తత్పరతన్= ఆసక్తితో; తగన్= తగురీతిగా; మత్స్యభూమి భృత్= మత్స్యదేశాన్ని భరించినవాడైన విరాటుడియొక్క; తనయునిన్= ఉత్తరుడిని; ఊఁది పట్టి= పడిపోకుండా పట్టుకొని; వికృతంబు+అగు= వికారాన్ని పొందిన; రూపము= ఆకారాన్ని; చక్కన్+చేసి= సరిచేసి; నెమ్మనము= (ఉత్తరుడియొక్క) మనస్సును; ఒక భంగిన్= ఒక రకంగా; తేర్చి= ఓదార్చి; గరిమంబుగన్= గొప్పగా (ప్రగాఢంగా); కౌఁగిటన్+చేర్చి= కౌగిలించుకొని; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ పరిస్థితిని గమనించిన అర్జునుడు, గుర్రాల కళ్ళెపు త్రాళ్ళను పట్టి పైకెత్తి, వాటికి కొంత కదలికను కలిగించి, ఒళ్ళు నిమిరి, ఉత్తరుడిని కూడా పైకెత్తి, ఆతడి భయవికారరూపాన్ని పోగొట్టి, మనస్సులో ఉన్న కలతను, భయాన్ని తీర్చి, చేతికొలది కౌగిలించుకుంటూ, ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అర్జునుడు గుర్రాలకూ, ఉత్తరుడికీ చైతన్యాన్ని కలిగించి, భయాన్ని పోగొట్టాడు. ఉత్తరుడికి ఇంకా ధైర్యం చెప్పటానికి ఇట్లా అన్నాడు.

**తే.** **'శంఖ భేరీ రవంబులు, సామజముల । బృంహితంబులు వింతలే పృథుల సైన్య**
**పరిచయోదాత్తులగు నరపాల సుతుల? । కెలమిఁ బొందుము దీనికి నింత యేల?'** **175**

**ప్రతిపదార్థం:** పృథుల= పెద్దవైన; సైన్య= సేనలయొక్క; పరిచయ= పరిచయంతో; ఉదాత్తులు= గొప్పవారు; అగు= అయిన; నరపాలసుతులకున్= రాకుమారులకు; శంఖ= శంఖాలయొక్క; భేరీ= నగారాలయొక్క; రవంబులు= పెద్ద పెద్ద ధ్వనులు; సామజముల= ఏనుగులయొక్క; బృంహితంబులు= ఘీంకారధ్వనులు; వింతలే?= కొత్తవా? (కావు); దీనికిన్+ఇంత+ఏల?= ఈ కొంచెమునకే ఇంత చేయాలా?; ఎలమిన్= సంతోషాన్ని; పొందుము= పొందుము.

**తాత్పర్యం:** 'ఎంతో పెద్ద పెద్ద సేనలను చూచి, వాటితో బాగా పరిచయం ఉన్న రాజకుమారులకు ఇటువంటి శంఖనాదాలూ, భేరుల భాంకారాలూ, ఏనుగుల ఘీంకారాలూ కొత్తవా? ఏమి? ఇది చాలా సామాన్య విషయం. దీని కింతగా భయపడాలా? మనస్సును చిక్కబట్టుకొని సంతోషంతో ఉండుము.'

**విశేషం:** ఉత్తరుడు రాకుమారుడే. ఆతడూ ఇదివరలో శంఖధ్వానాలనూ, గజఘీంకృతులనూ, భేరీ భాంకారాలనూ వినని వాడేమీ కాదు. అవి అన్నీ సాధారణమైనవి. ఆతడు ఇప్పుడు విన్న అర్జునుడి శంఖధ్వని సమస్త ప్రకృతినే మూర్ఛపడేటట్లు చేసింది. అందుకే తాను భరించలేనని ఆతడు తరువాతి పద్యంలో అంటున్నాడు.

**చ.** **అనవుడు మత్స్యరాజసుతుఁ డాతని కిట్లనుఁ 'దొల్లి శంఖ ని**
**స్వనములు విందు, భేరుల రవంబులు విందుఁ, గరీంద్ర బృంహిత**
**ధ్వనులును విందు, నద్భుత విధంబుగ ని ట్లవి యెల్లఁ జిత్తమో**
**హన మొనరింపఁ జాలునె! మహానినదం బిది యోర్వవచ్చునే?** **176**

**ప్రతిపదార్థం:** అనవుడున్= పైవిధంగా అర్జునుడు అనగానే; మత్స్యరాజ సుతుఁడు= ఉత్తరుడు; ఆతనికిన్= అర్జునుడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; తొల్లి= ఇంతకుముందు; శంఖ= శంఖాలయొక్క; నిస్వనములు= ధ్వనులు; విందున్= విని ఉన్నాను; భేరుల= నగారాలయొక్క; రవంబులు= మ్రోతలు; విందున్= విని ఉన్నాను; కరి+ఇంద్ర= శ్రేష్ఠమైన ఏనుగులయొక్క; బృంహిత= ఘీంకారాల; ధ్వనులును= శబ్దాలను; విందున్= విన్నాను; అవి+ఎల్లన్= అవి అన్నీ; ఇట్లు= ఇప్పటి శంఖ ధ్వనివలె; అద్భుత విధంబుగన్= అబ్బురాన్ని గలిగించేటట్లుగా; చిత్త= మనస్సును; మోహనము= మూర్ఛపోయేటట్లు; ఒనరింపన్+చాలునె!= చేయ కలిగినాయా!; ఇది= ఇప్పటి నీ శంఖారవం; మహా= చాలా గొప్పదైన; నినదంబు= ధ్వని; ఓర్వన్+వచ్చునే= (దీన్ని) ఓర్చుకొనవచ్చునా? (సహించటానికి సాధ్యం కాదని భావం).

**తాత్పర్యం:** ఉత్తరుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు : 'నేను ఇంతకు ముందు శంఖ నాదాలను విన్నాను. భేరీ భాంకృతులనూ విన్నాను. గజాల ఘీంకారాలనూ విన్నాను. అయితే ఇదివరకు నేను విన్న ఆ శబ్దాలన్నీ ఇప్పటి ఈ శంఖ ధ్వానంవలె ఆశ్చర్యాన్ని కలిగిస్తూ, మనస్సును మూర్ఛిల్లజేయలేదు. ఇది ఒక మహారవం. సహించటానికి సాధ్యం కానిది.

**చ.** **చెవు లవిసెన్, దిశల్ దిరిగెఁ, జిత్తము నీరయిపోయె నాకు నీ**
**రవమున; నిమ్మహోగ్ర కపిరాజు పతాకయుఁ జూడ్కిఁ జీఁకటుల్**
**గవియఁగఁ గ్రాలెడున్, భవదఖండిత తేజము పర్వి యాత్మకున్**
**వివశతఁ జేయుచున్నయది, విహ్వల భావము మాననేర్చునే?'** **177**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; ఈ రవమునన్= ఈ శంఖ ధ్వనివలన; చెవులు+అవిసెన్= చెవులు పగిలిపోయాయి (చిల్లులు పడ్డాయి); దిశల్+తిరిగెన్= దిక్కులు తిరిగిపోయాయి (మతి తప్పటం వలన దిక్కులు తారుమారయ్యాయి అని భావం); చిత్తము= మనస్సు; నీరయిపోయెన్= నీరుగారిపోయింది (దిగజారింది); ఈ మహా+ఉగ్ర కపిరాజు పతాకయున్= మిక్కిలి భయంకరం అయిన వానరాకారంలో ఉన్న ఈ జెండా; చూడ్కిన్= నా చూపులో; చీఁకటుల్+కవియఁగన్= చీకట్లు క్రమ్మే విధంగా; క్రాలెడున్= వెలుగుతూ ఉన్నది; భవత్+అఖండిత= నీదైన యెడతెగని; తేజము= తేజస్సు; (కాంతి); పర్వి= బాగా

వ్యాపించి; ఆత్మకున్= నా మనస్సుకు; వివశతన్= పరవశత్వాన్ని (మూర్ఛను); చేయుచున్+ఉన్న+అది= కలిగిస్తూ ఉన్నది; విహ్వల భావము= నాయొక్క భయంతో కూడిన భావం; మానన్+నేర్చునే?= పోతుందా?

**తాత్పర్యం:** నీవు పూరించిన ఈ శంఖ నినాదంతో చెవులు తూట్లుపడి అవిసిపోయాయి. దిక్కులు గిరగిర తిరిగి, ఏది ఏ దిక్కు - అని తెలియకుండా మతిభ్రమ కలుగుతూ ఉన్నది. మనస్సు నీరుగారిపోయింది. నీ కపికేతన కాంతులు నా చూపులలో చీకట్లను నింపుతూ ఉన్నవి. చూడటానికి వీలుకాని (దుర్నిరీక్ష్యమైన) నీ తేజం నాకు పరవశత్వాన్ని కలిగిస్తూ ఉన్నది. ఇంక నా భయం ఎట్లా పోతుంది?' (ఒంటినిండా భయం పట్టుకొన్నదని భావం).

**క. అన విని తగు మాటల నా । తని కొందలపాటు పాండుతనయుండు క్రమం**
**బున డిందుపఱిచి యరదము । సనఁగా నెఱిఁగించి పట్టె శంఖము మఱియున్. 178**

**ప్రతిపదార్థం:** అనన్= ఉత్తరుడు పైవిధంగా అనగా; పాండుతనయుండు= అర్జునుడు; విని= విని; తగుమాటలన్= అప్పటి పరిస్థితికి తగిన మాటలతో; ఆతని= ఉత్తరుడియొక్క; కొందలపాటు= దుఃఖం; (కలత, భయం); క్రమంబునన్= క్రమక్రమంగా; డిందు పఱిచి= పోగొట్టి; అరదము= రథం; చనఁగాన్= పోయేటట్లు; ఎఱిఁగించి= తెలియజేసి; మఱియున్= తిరిగీ; శంఖము పట్టెన్= శంఖాన్ని పూరించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఉత్తరుడి మాటలు విని, తగిన మాటలతో ఆతడిలో నిండిన భయాన్ని క్రమంగా పోగొట్టి, రథాన్ని నడపుమని చెప్పి, మరల శంఖాన్ని పూరించాడు.

**విశేషం:** భయంతో ఉన్న మనిషికి భయాన్ని పోగొట్టటానికి తగిన మాటలను చెప్పటం, ఓదార్చటం లోక సహజం. పైగా ఆ భయాన్ని ఒకేసారిగాక, క్రమంగా పోగొట్టటం కూడా సహజమే! అందుకే కవి, ఉత్తరుడి 'కొందలపాటును', 'క్రమంబున డిందుపఱిచి' అని అన్నాడు. మొదటిసారి శంఖాన్ని పూరించినపుడు అర్జునుడు ఉత్తరుడికి చెప్పలేదు. కాని, ఉత్తరుడి పరిస్థితిని గమనించిన అర్జునుడు చెప్పి మళ్ళీ శంఖాన్ని పూరించాడు. అంటే ఉత్తరుడు దేవదత్తధ్వానానికి అలవాటుపడ్డాడు. ఇక ఉత్తరుడికి శంఖధ్వానం వలన భయంలేదు; అది అలవాటైంది. అందుకే కవి 'పట్టె శంఖము మఱియున్' అని అన్నది.

**వ. ఇత్తెఱంగున నయ్యుత్తర కుమారు ధీరుంగావించుకొని పాండవవీరుండు రథనేమి నిస్వన జ్యానాద మేదురం బగు శంఖారవంబు సెలంగ నడచు సమయంబున నాచార్యుండు దుర్యోధనున కిట్లనియె. 179**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఆ+ఉత్తరకుమారున్= ఆ ఉత్తరకుమారుడిని; ధీరున్+కావించుకొని= ధీరుడిని చేసికొని; పాండవవీరుఁడు= శూరుడైన అర్జునుడు; రథ= రథంయొక్క (చక్రాలయొక్క); నేమి= అంచుయొక్క (చక్రానికి చుట్టూ ఉండే ఇనుప పట్టా); నిస్వన= శబ్దంతోనూ; జ్యా= అల్లెత్రాటి యొక్క; నాద= ధ్వనితోనూ; మేదురంబు+అగు= దట్టమైన (పోషించబడ్డ); శంఖారవంబు= శంఖనాదం; చెలంగన్= ధ్వనించగా; నడచు= ముందుకువెళ్ళే; సమయంబునన్= వేళలో; ఆచార్యుండు= ద్రోణుడు; దుర్యోధనునకున్= దుర్యోధనునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** పై విధంగా అర్జునుడు ఉత్తరుడికి ధైర్యాన్ని కలిగించి, అతడిని బాగా తయారు చేసికొని, రథచక్రాల ధ్వనినీ, అల్లెత్రాటి ధ్వనినీ, శంఖధ్వనినీ పెంపు చేసికొంటూ ముందుకు పోయే సమయంలో, ద్రోణుడు దుర్యోధనుడితో (అనుమానంతో) ఇట్లా అన్నాడు.

**విశేషం:** రథనేమి నిస్వనం, జ్యానాదం - వీటితో దట్టమైన శంఖధ్వనిని విన్న ద్రోణుడికి ఆతడు అర్జునుడు అనే అనుమానం స్పష్టమైంది. అందుకే ఆచార్యుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**సీ.** **'శ్రవణ పుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సం । క్షోభంబు గావించె గుణము మ్రోఁత;**
**బ్రహ్మాండ భాండంబు పగిలించి భూత ని । శ్చైతన్య మొనరించె శంఖ రవము;**
**గగనభాగం బెల్లఁ గప్పి క్రాలుచు బెగ । డడరించె నుగ్రంపుఁ బడగపఱపు;**
**మిఱుమిట్లు గొని చూడ్కి పఱివోవ వెలిఁగి ప । రి భ్రాంతి సేసెఁ గిరీట కాంతి;**

**తే.** **తెల్ల మిది గాండివంబును దేవదత్త । మును గపిధ్వజమును వాసవుని వరమునఁ**
**గన్న మకుటంబు నగు; వేఱ కొన్ని యైన । నుజ్జ్వలాద్భుత భంగులై యున్నె యిట్లు!** **180**

**ప్రతిపదార్థం:** గుణము= అల్లెత్రాటియొక్క; మ్రోఁత= ధ్వని; (దీన్నే ధనుష్టంకారం అనీ అంటారు); శ్రవణ పుటంబులు= దొప్పలవంటి చెవులు; వ్రయ్యంగన్= బద్దలయ్యేటట్లు; తాఁకి= ఆ అల్లెత్రాటి శబ్దం తాకి (సోకి); సంక్షోభంబు+కావించెన్= కలత పెట్టింది; శంఖరవము= శంఖనాదం; బ్రహ్మాండ= ఈ బ్రహ్మాండం అనే; భాండంబు= కుండను; పగిలించి= పగులగొట్టి; భూత= ప్రాణులను; నిశ్చైతన్యము= కదలిక లేనివాటినిగా (ప్రాణరహితంగా); ఒనరించెన్= చేసింది; ఉగ్రము+పడగ (ఉగ్రంపుఁ బడగ)= భయంకరం అయిన ఆ కపిధ్వజంయొక్క; పఱపు= వ్యాప్తి (పరచుకొనటం); గగనభాగంబు+ఎల్లన్= ఆకాశం అంతటా; కప్పి= చుట్టుకొని (వ్యాపించి); క్రాలుచున్= వెలుగుతూ; బెగడు+అడరించెన్= ఎక్కువ భయాన్ని కలిగించింది; కిరీట= దేవేంద్రుడు ఇచ్చిన మణికిరీటం యొక్క; కాంతి= దివ్యమైన వెలుగు; మిఱుమిట్లు+కొని= మిఱుమిట్లు గొలిపి; చూడ్కి పఱివోవన్= చూపులు వెనుదిరిగేటట్లు; (చూపులు ముందుకు పోవాలి. కానీ చూపులు తట్టుకోలేనంత వెలుగు ముందువైపు ఎదురైంది గనుక, అవి వెనక్కే మళ్ళినాయి); వెలిఁగి= ప్రకాశించి; పరిభ్రాంతి+చేసెన్= మిక్కిలి భ్రమను కలిగించింది. (దిక్కు తెలియకుండా చేసింది అని భావం); గాండివంబును= గాండీవమూ; దేవదత్తమును= దేవదత్తమూ; కపిధ్వజమును= వానరాకారంలో ఉన్న కేతనమూ; వాసవుని= ఇంద్రుడియొక్క; వరమునన్+కన్న= వరంతో పొందిన; మకుటంబును+అగు= కిరీటమూ అయి ఉంటాయి; ఇది= ఈ విషయం; తెల్లము= స్పష్టం; వేఱ+కొన్ని+ఐనన్= పైన చెప్పిన గాండీవం మొదలైనవికాక, వేరేవి అయితే; ఇట్లు= ఈ రకంగా; ఉజ్జ్వల+అద్భుతభంగులు+ఐ= ఇంత తేజస్సుతో కూడిన ఆశ్చర్యకరాలైన విధానాలతో; ఉన్నె!= ఉంటాయా!

**తాత్పర్యం:** 'ధనుష్టంకారం, చెవుల గూబలను పగులగొట్టుతూ ఉంది. శంఖనాదం బ్రహ్మాండాన్ని బదాబదలుగా బ్రద్దలుగొట్టి జీవకోటికి కదలిక లేకుండా చేస్తూఉన్నది. కపికేతనం వ్యాపించి, ఆకాశాన్ని అంతా కాంతులతో నింపి, భయాన్ని కలిగిస్తున్నది. అనుమానం లేదు. ఇవి గాండీవమూ, దేవదత్తమూ, కపికేతనమూ, ఇంద్రుడు ప్రసాదించిన కిరీటమూ అయి ఉంటాయి. ఇది స్పష్టం. అవికాక, వేరేవి అయితే, ఇట్లాంటి ఆశ్చర్యకరాలైన తేజోరీతులై ఉండవు.

**విశేషం:** రెండవసారి అర్జునుడు దేవదత్తాన్ని పూరించాడు. అప్పుడే అది కౌరవసైన్యం దాకా ప్రాకటం, ద్రోణుడు గుర్తు పట్టటం జరిగింది. తన ప్రియ శిష్యుడైన అర్జునుడి ఆధిక్యాన్ని సూచించటానికే గురువు దుర్యోధనుడితో తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. దీని తర్వాతి పద్యంలో కూడా, 'వచ్చేది అర్జునుడు, తగిన వీరులను సిద్ధం చేయు' మని గురుడు దుర్యోధనుడితో అంటాడు. ఇది గమనించ తగ్గది.

**ఉ. అచ్చెరువైన విక్రమము నగ్గలికన్ సమరంబు గోరి యీ**
**వచ్చుచునున్నవాఁడు బలవద్రిపుభీషణబాహుఁ డైన వి**
**వ్వచ్చుఁడ; యింక మిన్నక వివాదము సేసినఁ బోవ; దియ్యెడం**
**బొచ్చెము లేని బల్మగలఁ బోరి కమర్పుము దర్పమేర్పడన్.' 181**

**ప్రతిపదార్థం:** అచ్చెరువు+ఐన= ఆశ్చర్యాన్ని కలిగించే; విక్రమము+అగ్గలికన్= ప్రతాపాతిశయంతో (అత్యధికమైన పరాక్రమంతో); సమరంబు+కోరి= యుద్ధాన్ని కోరుకొని; ఈవచ్చుచున్+ఉన్నవాఁడు= ఈ వస్తున్నవాడు; బలవత్= బలవంతులైన; రిపు= శత్రువులకు; భీషణ= భయంకరం అయిన; బాహుఁడు+ఐన= బాహువులు కలవాడైన (భుజ పరాక్రమం గలవాడైన); వివ్వచ్చుఁడు+అ= అర్జునుడే! (అనుమానం లేదన్నమాట); ఇంకన్= అర్జునుడు వస్తూ ఉన్నాగానీ; మిన్నక= ఊరకనే (వ్యర్థంగా); వివాదము+చేసినన్= వాదులాడుకొంటూ ఉంటే; ఈ+ఎడన్= ఈ సమయంలో; పోవదు= కుదరదు (పని తీరిపోదు); దర్పము+ఏర్పడన్= (పౌరుషం) గర్వం బయటపడేట్లుగా; పొచ్చెములేని= తక్కువగాని (మనస్సులలో మచ్చలేని); బల్+మగలన్= మేటి వీరులను; పోరికిన్= యుద్ధానికి; అమర్పుము= (ఆలోచించి) అమరించు (ఏర్పాటు చేయుము). (అమరించటం అంటే, బాగా ఏరి, కోరి, తగినవాళ్ళను తయారుచేయటం అని భావం).

**తాత్పర్యం:** ఆశ్చర్యాన్ని కలిగించే అత్యధికమైన బాహుబల పరాక్రమంతో యుద్ధాన్ని కోరుకొంటూ ఆ వచ్చేది అర్జునుడే కాని, వేరేవాడు కాడు. ఆతడి పరాక్రమం శత్రువులకు చాలా భయంకరం అయింది. ఈ సమయంలో ఊరకనే వాదులాడుకొంటూ ఉంటే కుదురదు. అర్జునుడిని ఎదిరించటానికి మంచి బలవంతులైన వీరులను ఏర్పాటు చేయవలసింది'.

**వ. అని కృపాశ్వత్థామాది యోధముఖ్యుల నవలోకించి. 182**

**ప్రతిపదార్థం:** అని= పైవిధంగా ద్రోణుడు దుర్యోధనుడితో చెప్పి; కృప= కృపాచార్యుడూ; అశ్వత్థామ= తన కుమారుడైన అశ్వత్థామా; ఆది= మొదలైన; యోధ= వీరులలో; ముఖ్యులన్= ప్రధానులైనవాళ్ళను; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు పైవిధంగా దుర్యోధనుడితో చెప్పి, కృపాచార్యుడూ, అశ్వత్థామా, మొదలైన మహావీరులను చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'మనమొనల దుర్నిమిత్తము । లనేకములు పుట్టఁ దొడఁగె; నట్లగుట జయం**
**బనుమానం; బొక కార్యము । వినుఁడా! మీకెల్లఁ జూడ వెరవగు నేనిన్. 183**

**ప్రతిపదార్థం:** మన= మనయొక్క; మొనలన్= సేనలలో; దుర్నిమిత్తములు= దుశ్శకునాలు (అపశకునాలు); అనేకములు= ఎన్నో; పుట్టన్+తొడఁగెన్= పుట్టుతూ ఉన్నాయి (కనిపిస్తున్నాయి); అట్లు+అగుటన్= ఆ రకంగా జరగటం వలన, (అపశకునాలు పుట్టటం వలన); జయంబు= విజయం; అనుమానంబు= సందేహమే! (అపశకునాలు పుట్టటం వలన జయం కలగటం అనుమానం అని భావం); మీకున్+ఎల్లన్= మీ అందరికీ; చూడన్= చూడటానికి; వెరవు+అగునేనిన్= తగిందిగా ఉంటే (బాగుంటే); ఒక కార్యము= ఒక ఆలోచన లేక ఒక పని (ఉపాయం); వినుఁడా= అందరూ వినండి!

**తాత్పర్యం:** మన వైపున ఉన్న సైన్యంలో రకరకాల అపశకునాలు తోస్తూఉన్నాయి. కనుక మనకు విజయం కలగడం అనుమానమే. కానీ, మీకందరికీ సమ్మతమయితే మనం చేయవలసిన పనిని ఒకదాన్ని చెప్పుతాను, వినండి.

**విశేషం:** సైన్యంలో అపశకునాలు తోచడం అరిష్ట సూచకం. దానివలన జయం కలుగదు. దీన్నే ద్రోణుడు, 'జయం బనుమానంబు' అని అన్నాడు. కనుక కురుసేనకు ఇది కష్ట పరిస్థితి. ఈ పరిస్థితిలో రాజునూ, సేననూ, మందలనూ కాపాడుకొనాలి. ఎలా? అందుకే ద్రోణుడు, గురువుగా, అనుభవజ్ఞుడుగా, తనకు తోచిన ఆలోచనను నలుగురికీ చెప్పాలి. అది ఆయన బాధ్యత. అందుకే ద్రోణుడు తన ఉపాయాన్ని ముందు పద్యంలో చెప్పబోతాడు. దానికి ముందుగా, ఈ పద్యంలో ఉన్న పరిస్థితిని వివరించి, తన ఆలోచన 'అందరికీ సరిపోతేనే వినండి' అని గురుడు అన్నాడు.

**ఉ. ముందర రాజుఁ బుచ్చి, బలముల్ గలయంబడి గోవ్రజంబులన్**
**దందడి పెట్టకుండఁ బిఱుఁదన్ నడిపింపఁగఁ బంచి, గట్టిమై**
**నందఱు నింతకున్ వెనుకయై మొనలేర్చి చనంగ, నెప్డు సం**
**క్రందనసూతి డగ్గఱియెఁ, గయ్యము సేయుట కప్పు డిమ్మగున్.' 184**

**ప్రతిపదార్థం:** ముందరన్= ముందు దిక్కులో; రాజున్= రాజైన దుర్యోధనుడిని; పుచ్చి= పంపి; బలముల్= సైన్యాలు; కలయన్+పడి= కూడా వెళ్ళి (కలిసి వెళ్ళి); గో= ఆవులయొక్క; వ్రజంబులన్= సమూహాలను (మందలను); దందడి+పెట్టకుండన్= తొందర పెట్టకుండా (ఒత్తిడి చేయకుండా); పిఱుఁదన్= వెనుకభాగంలో; నడిపింపఁగన్= నడిపించటానికి; పంచి= నియమించి; అందఱున్= వీరులందరూ; గట్టిమైన్= దిట్టతనంతో (పటిష్ఠంగా); ఇంతకున్= ముందు చెప్పినవాటికి (రాజుకూ, ఆవులకూ, సేనకూ); వెనుక+ఐ= వెనుకభాగంలో ఉండి; మొనలు+ఏర్చి= సేనలను తీర్చికొని; చనంగన్= పోతే; ఎప్డు= ఏ సమయంలో; సంక్రందన సూతి= దేవేంద్రుడి కుమారుడైన అర్జునుడు; డగ్గఱియెన్= దాపునకు వచ్చాడో (ఆ సమయంలోనే); అప్పుడు; కయ్యము+ చేయుటకున్= యుద్ధం చేయటానికి; ఇమ్ము+అగున్= వీలు చిక్కుతుంది.

**తాత్పర్యం:** మొట్టమొదట రాజైన దుర్యోధనుడిని పంపించి, తరువాత సైన్యాలు ఆతడి వెంట కలిసిపోయి, మందలను ఆర్భాటంతో భయపెట్టక, చెదరిపోనీక, వెనుక నడిపించే విధంగా నియమించి, ఆ తరువాత, మనం అంతా సైన్యాలను తీర్చుకొని పోతూఉంటే, అప్పుడు అర్జునుడు మనమీదికి వస్తే, వెనక్కు మళ్ళుకొని ఆతడితో యుద్ధం చేయవచ్చును.'

**విశేషం:** ద్రోణాచార్యుడు సూచించిన ఈ ఏర్పాటులో ఎంతో నైపుణ్యం కనిపిస్తుంది. దీనివలన ఆచార్యుడి వ్యూహరచనా కౌశలం తేటతెల్లమవుతుంది. ముందుగా రాజును పంపాలి - అని గురుడి ఉపాయం. దీనివలన రాజుకు ప్రమాదం ఉండదు. ఆతడిని వెన్నంటి సేనలుంటాయి. అవి రాజుకు రక్షణ. తరువాత గోగణం ఉంటుంది. రాజూ, సేనా, మందా - ఇట్లా సాగుతుంది. ముందు సేనపోతూఉంటే, ఆవులను వెనుక గోపాలకులు తోలుకొని వస్తారు. చివరగా, అపారసైన్యంతో భీష్మద్రోణాది మహావీరులంతా మందకు వెనుక కాపుగా వెళ్ళుతుంటారు. ఒకవేళ అప్పుడు అర్జునుడు వస్తే, భీష్మ ద్రోణాదులు తదితరులు వెనక్కు మళ్ళి యుద్ధం చేస్తారు. దానివలన ఎంతో ఆలస్యం అవుతుంది. ముందు పోయే మందా, సేనా, రాజూ పోతూనే ఉంటారు. అంటే ఒకపక్క యుద్ధం జరుగుతూ ఉన్నా, మందపాటికి మంద, హస్తినాపురం వైపు పోతూనే ఉంటుంది. దీనివలన ఎటుతిరిగీ, రాజూ, ఆవులమందా సులువుగా, నిరపాయంగా పట్టణం చేరుతుంది - అని ఆచార్యుడి ఉపాయం. కానీ, ఈ ఏర్పాటును అర్జునుడు మొదట్లోనే గ్రహించి, గురుడి ఉపాయాన్ని భగ్నం చేశాడు. కనుకనే మంద పట్టుబడుతుంది.

**వ. అనిన విని సుయోధనుండు భీష్మ కృప కర్ణ వికర్ణుల దెసం గనుంగొని 'మున్నునుం జెప్పితిన కాదె! జూదంబునం బరాజయం బొంది, పాండునందనులు పండ్రెండు వత్సరంబులు వనంబున వసియింపను, బదుమూఁడగు నేఁడు జనపదంబున మన మెఱుంగకుండఁ జరియింపనుం బూని కాదె భూమి వెలువడిరి; యీ పదుమూఁ**

**డవ యేఁటి కొఱంత గలుగం బార్థుండు దన్నెఱింగించి కొనియె నేని నెప్పటియట్ల వనవాసంబునకుం జనవలయు; నిది మనము మోహంబునం గానమి నొండె; వారు లోభంబున వచ్చుట నొండె నగుం గావున నెక్కువ దక్కువలు నిరూపించి భీష్ములు దీని నిశ్చయింప నర్హులు; రిత్త యుత్తరుండ కాక గాండీవియు నగుట మన కార్యంబు సఫలంబు; సుశర్మ నక్కడ గోవులం బట్టం బనిచి యిక్కడ మనమును బట్టుట మత్స్యనగరంబునం గౌంతేయులున్నవారని శంకించి వారలు కూయి వచ్చినం గనుటకుం గాదె? యిట్లు నిశ్చయించి చేసిన పనికి నిపుడు విచారం బేల?' యని పలికి వెండియు నిట్లనియె. 185**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= ద్రోణుడు చెప్పగా విని; సుయోధనుండు= దుర్యోధనుడు; భీష్మ, కృప, కర్ణ, వికర్ణులదెసన్+కనుంగొని= భీష్మ కృప కర్ణ వికర్ణుల వైపు చూచి; మున్నునున్= ఇంతకు ముందు కూడా; చెప్పితిని+అ కాదె!= చెప్పాను కదా!; పాండు నందనులు= పాండవులు; జూదంబునన్= జూదంలో; పరాజయంబు+ఒంది= ఓడిపోయి; పండ్రెండు వత్సరములు= పన్నెండేండ్లు; వనంబునన్= అడవిలో; వసియింపను= నివసించటానికి; పదుమూఁడగునేఁడు= పదమూడో ఏడు; జనపదంబునన్= జనులు నివసించే ప్రాంతంలోనే; మనము= కౌరవులు; ఎఱుంగకుండన్= తెలిసికొనకుండా; చరియింపనున్= వర్తించటానికి; పూనికాదె= ప్రతిన చేసే కదా!; భూమి వెలువడిరి= రాజ్యానికి దూరమయ్యారు; ఆ, పదుమూఁడవ ఏఁటి కొఱంత= ఆ పదమూడో సంవత్సరంలో ఇంకా మిగిలి ఉన్న ఆ కాలం; కలుగన్= ఉండగా; పార్థుండు= అర్జునుడు; తన్ను= తనను; ఎఱింగించికొనియె నేనిన్= తనంతట తానే బయటపెట్టుకొన్నట్లయితే (ఇతరులు గుర్తించేటట్లు బైటపడినట్లయితే); ఎప్పటి అట్లు+అ= ఎప్పటి వలెనే; వనవాసంబునకున్= అడవులలో నివసించటానికి; చనన్+వలయున్= వెళ్ళాలి; ఇది= ఈవిషయం; మనము= కౌరవులపక్షంలోనివారలం; మోహంబునన్= వ్యామోహంతో; కానమిన్+ఒండె= గమనించకపోవటంచేతనైనా కావాలి లేదా; వారు= పాండవులు; లోభంబునన్= అత్యాశతో; వచ్చుటన్+ఒండెన్+అగున్= రావటంచేతనైనా కావాలి; కావునన్= కాబట్టి; భీష్ములు= భీష్ములవారు; ఎక్కువ, తక్కువలు= తేడాలు; నిరూపించి= తేల్చిచెప్పి; నిశ్చయింపన్= నిర్ణయం చేయటానికి; అర్హులు= తగినవారు; రిత్త+ఉత్తరుండు+అ, కాక= కేవలం ఉత్తరుడే కాకుండా; గాండీవియున్= అర్జునుడు కూడా; అగుట= కావటం వలన; మన కార్యంబు= మన ప్రయత్నం; సఫలంబు= ఫలవంతమైనది; సుశర్మను; అక్కడ= దక్షిణ దిక్కున; గోవులన్+పట్టన్+పనిచి= ఆవులను పట్టుకొనటానికి పంపి; ఇక్కడ= ఉత్తర దిక్కున; మనమును= మనం కూడా; పట్టుట= ఆవులను మళ్ళించటం; మత్స్యనగరంబునన్= మత్స్యరాజు రాజధానిలో; కౌంతేయులు= పాండవులు; ఉన్న, వారు+అని= ఉంటారని; శంకించి= అనుమానించి; వారలు= పాండవులు; కూయి వచ్చినన్= రక్షణగా వస్తే; కనుటకున్+కాదె!= కనుక్కొనాలనే కదా!; ఇట్లు= ఈ విధంగా; నిశ్చయించి= నిర్ణయించి; చేసిన పనికిన్= కావాలని చేసిన ఈ పనికి; ఇపుడు= ఈ సమయంలో; విచారంబు+ఏల?= దిగులుపడటం ఎందుకు?; అని, పలికి; వెండియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు చెప్పిన మాటలను విని దుర్యోధనుడు భీష్ముడిని, కృపుడిని, కర్ణుడిని, వికర్ణుడిని చూచి ఇట్లా అన్నాడు- 'నేను ఇంతకు మునుపే చెప్పాను కదా! పాండవులు జూదంలో పరాజయాన్ని పొంది, పన్నెండు ఏండ్లు అడవులలో ఉండటానికీ, పదమూడవ సంవత్సరం వేరే రాజ్యంలో ఎక్కడైనా మన కంటబడకుండా ఉండటానికీ ప్రతిన చేసి, దాని ప్రకారమే కదా రాజ్యాన్ని వదలివెళ్ళారు? పదమూడో ఏడు ఇంకా ముగియకుండానే, అర్జునుడు బయటపడ్డాడు. కనుక అనుకొన్నమాట ప్రకారం తిరిగి అడవులకు పోవాలి. ఇది మోహం వలన మనం చూడకపోవటమో, లేక లోభంతో వాళ్ళే బయటపడటమో అయి ఉంటుంది. ఇందులోని వ్యత్యాసాలను నిర్ణయించి వివరించటానికి భీష్ములవారే తగినవారు. కేవలం ఉత్తరుడే కాకుండా, ఆతడి వెంట అర్జునుడు కూడా రావటం వలన మన పని నెరవేరినట్లే. దక్షిణంవైపు గోవులను పట్టటానికి సుశర్మను పంపి, ఈ ఉత్తరదిక్కులో ఉన్న విరాటనగరంలో పాండవులు ఉన్నారనే సందేహంతోనే కదా మనం ఇక్కడికి వచ్చాం. పైగా, ఆవులను కాపాడటానికి

పాండవులు ఒకవేళ వస్తే, కనిపెట్టాలనే కదా మన ప్రయత్నం! ఇంత ఆలోచించి చేసిన కార్యానికి తిరిగి విచారించటం దేనికి?' అని ఇంకా ఈవిధంగా అంటున్నాడు.

**విశేషం:** దీనివలన దుర్యోధనుడి మనసులోని అభిప్రాయం తెలుస్తున్నది.

**ఉ. 'అర్జునుఁడైన నేమి? సురలైనను నేమగు? విద్విషచ్ఛిదో**
**పార్జితమైన గోగణముఁ బట్టితి; మెవ్వరు వచ్చిరేని వి**
**స్ఫూర్జిత బాహుసంపదలు సూపుద మొండొరు మీఱి నిర్మలా**
**త్యూర్జిత కీర్తికారణ రణోద్ధతి; వెల్వెలఁ బాఱ నేటికిన్? 186**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు+ఐనన్+ఏమి?= అర్జునుడు అయితే మాత్రం ఏమి?; సురలు+ఐనను+ఏమి+అగున్= దేవతలైతే మాత్రం ఏమవుతుంది?; విద్విషత్+ఛిదా+ఉపార్జితము+ఐన= శత్రువులను చీల్చటానికి (ఛేదించటానికి) సంపాదించిన; గో= ఆవులయొక్క; గణమున్= మందను; పట్టితిమి= పట్టుకొంటిమి; ఎవ్వరు వచ్చిరి+ఏనిన్= ఎవ్వరు వచ్చినప్పటికీ; నిర్మల+అతి+ఊర్జిత కీర్తికారణ రణ+ఉద్ధతిన్= స్వచ్ఛమూ, మిక్కిలిదృఢమూ అయిన కీర్తికి హేతువైన యుద్ధంయొక్క ఔద్ధత్యంతో; ఒండు+ఒరున్ (ఒండొరున్)= ఒకరినొకరు; మీఱి= అతిశయించి; విస్ఫూర్జిత= ప్రకాశించే (పేరుకెక్కిన); బాహుసంపదలు= భుజ పరాక్రమాలు (బాహువుల సంపద అంటే, బాహువులయొక్క బలం); చూపుదము= ప్రదర్శిద్దాం; వెల్వెలన్+పాఱన్= వెలవెలపోవటం; ఏటికిన్= ఎందుకు? (అవసరం లేదు అని భావం).

**తాత్పర్యం:** 'అర్జునుడే అయితే ఏం? దేవతలైతే నేం? ఏమవుతుంది? శత్రువులను చీల్చటానికి సంపాదించిన పసువుల మందలను పట్టినాము. కీర్తికి కారణం అయిన యుద్ధంలో ఒకర్ని మించి మరొకరం భుజపరాక్రమాన్ని ప్రదర్శిద్దాం. ఎవరు వచ్చినా సరే, మనం వెలవెలబోవాల్సిన పని లేదు.

**విశేషం:** 'విద్విషచ్ఛిదోపార్జితమైన గోగణముఁ బట్టితిమి' అని దుర్యోధనుడు అంటాడు. ఇక్కడ శత్రువులను 'ఛేదించటానికి', అనే అర్థాన్ని, 'ఛిదా' శబ్దానికి చెప్పుకొన్నా, 'శత్రువుల రహస్యాన్ని ఛేదించడం' అని కూడా గ్రహించవచ్చును. 'విద్విషత్+ఛిదా+ఉపార్జితము' అనే పాఠాంతరం కూడా ఉన్నది. శత్రువులను ఛేదించి సంపాదించుకొనబడింది - అని అర్థం.

**చ. మనసుల నూలుకొల్పి, యనుమానము లెల్లను బాచి, యేచి వా**
**హనములు నాయుధంబులును నాయిత మయ్యెడు భంగిఁ జేయుచున్**
**మొనలకు హెచ్చుగా మనము మున్న గడంగినఁ గాక శత్రులం**
**గనుఁగొని యిట్టు లొండొరు మొగంబులు సూచుచునున్నఁ బోవునే? 187**

**ప్రతిపదార్థం:** మనసులన్= అందరూ వారివారి మనస్సులను; నూలుకొల్పి= కుదురుపరుచుకొని; అనుమానములు+ఎల్లను= సందేహాలను అన్నిటినీ; పాచి= వదలిపెట్టి; ఏచి= అతిశయించి (విజృంభించి); వాహనములున్= ఎన్నో రకాలైన వాహనాలూ; ఆయుధంబులును= రకరకాల ఆయుధాలూ; ఆయితము+అయ్యెడు భంగిన్= సమకూర్చే పద్ధతిలో; చేయుచున్= చేస్తూ (ప్రోత్సహిస్తూ); మొనలకున్= సేనలకు; హెచ్చుగాన్= అధికంగా; (ఉన్నతంగా); మనము= మనమందరం; మున్న= ముందుగానే; కడంగినన్+కాక= పూనుకుంటేనే కాని (సరిపోతుంది కాని); శత్రులన్= శత్రువులను; కనుఁగొని= చూచి; ఇట్టులు= ఈ విధంగా; ఒండు+ఒరు+మొగంబులు= ఒకరి మొగాలను మరొకరు; చూచుచున్+ఉన్నన్+పోవునే= చూస్తుంటే సరిపోతుందా?

**తాత్పర్యం:** మనసులలో కోపతాపాలు లేకుండా, అందరూ భయాలూ, సందేహాలూ విడిచి, వాహనాలూ, ఆయుధాలూ సిద్ధం చేసికొని, సేనలకు ముందుండి ముందుగా మనమే ఎదిరిస్తే మంచిది. అంతేకాని శత్రువును చూసి ఈ విధంగా ఒకరి ముఖం మరొకరు చూచుకొంటూ ఉంటే బాగుంటుందా?

### దుర్యోధనుఁడు ద్రోణాచార్యుల నధిక్షేపించుట (సం. 4-42-20)

**ఆ. హరుల హేషితములు ననుకూల వాయు సం । చారములును మనకు జయము కలిమిఁ**
**దెలుపుచున్నయవి; యుధిష్ఠిరానుజుఁ డొక్కఁ । డీ బలంబు గెలువ నెట్లు నేర్చు? 188**

**ప్రతిపదార్థం:** హరుల= గుఱ్ఱాలయొక్క; హేషితములున్= సకిలింపులూ; అనుకూల= అనుకూలమైన దిశనుంచి; వాయు= గాలియొక్క; సంచారములును= వీచటములునూ; మనకున్= మనకు; జయము కలిమిన్= జయం కలగటాన్ని; తెలుపుచున్నయవి= తెలుపుతూ (సూచిస్తూ) ఉన్నాయి; యుధిష్ఠిర+అనుజుఁడు= ధర్మరాజు తమ్ముడైన అర్జునుడు; ఒక్కఁడు= ఒక్కడే; ఈ బలంబున్= ఇంత పెద్ద కురుసేనను; ఎట్లు= ఏ విధంగా; గెలువన్ నేర్చున్?= గెలువగలుగుతాడు?

**తాత్పర్యం:** గుఱ్ఱాలు సకిలించడం, గాలి అనుకూలంగా ప్రసరించడం వలన మనకు జయం కలుగుతుందని తెలుస్తున్నది. అర్జునుడు ఒక్కడే ఇంత పెద్ద కురుసైన్యాన్ని ఎట్లా గెలుస్తాడు?

**విశేషం:** దుర్యోధనుడు తనకే జయం కలుగుతుందని నిశ్చయంగా అంటున్నాడు. దానికి ఆతడు చూపిన కారణాలు రెండు: హయహేషలూ, అనుకూల వాయుప్రసారం- మొదటిది; అర్జునుడు ఒక్కడే ఇంత పెద్ద కురుసేనను గెలవలేడు అనటం రెండోది. కానీ, దుర్యోధనుడి ఊహ సరికాదు. కారణం, కురుసేనలో ఇదివరకే ఎన్నో ఉత్పాతాలు పుట్టినట్లు ద్రోణుడు ముందే చెప్పాడు. అట్లాగే, అర్జునుడు ఉత్తరుడికి తన పేళ్ళను తెలిపేటప్పుడు, ఆతడు ఒక్కడే కాలకేయ నివాతకవచులనూ, హిరణ్యపుర రాక్షసులనూ, వేల లక్షల సంఖ్యల్లో ఉన్న వాళ్ళను పరిమార్చానన్నాడు. ఇది దుర్యోధనుడికీ తెలుసు. కానీ, అహంకారాదులు అడ్డువచ్చాయి. అందుకే ఆతడు అర్జునుడి శక్తిని అనుమానించాడు; తక్కువ చేశాడు.

**క. ఎవ్వరు వినినను దీనికి । నవ్వుదురని యెఱుఁగఁ డకట! నా యెదురెదురన్**
**వివ్వచ్చుఁ జూపి సేనలు । క్రొవ్వఱఁ బలుపలుకులిట్లు ద్రోణుఁడు పలికెన్. 189**

**ప్రతిపదార్థం:** ఎవ్వరు= ఎవ్వరైనా; వినినను= వింటే (తన మాటలను); దీనికిన్= తాను మాట్లాడే మాటలకు; నవ్వుదురు+అని= నవ్వుతారని; ఎఱుఁగఁడు= తెలియలేదు; అకట!= అయ్యో!; నా= నాయొక్క; ఎదురు+ఎదురన్= ఎట్టఎదుట (నేరుగానే); వివ్వచ్చున్+చూపి= (నా శత్రువైన) అర్జునుడిని చూపించి (గొప్పగా); సేనలు= నా సైన్యాలు; క్రొవ్వు+అఱన్= నీరసపడేటట్లుగా (నిరుత్సాహపడేట్లుగా); ద్రోణుఁడు= ఈ ద్రోణుడు (ఏకవచనం, నిందార్థకం); పలు పలుకులు= అనవసరమైన మాటలు (పనికిరాని మాటలు); ఇట్లు= ఇట్లా; పలికెన్= మాట్లాడాడు.

**తాత్పర్యం:** ఈ ద్రోణుడు తన మాటలను ఎవరైనా వింటే నవ్వుతారని కూడా తెలిసికొనలేడు. నా ఎదుటనే అర్జునుడిని చూపించి, నా సేనలు నీరుగారేటట్లు ఇట్లా పనికిరాని మాటలు చాలా పలికాడు.

**తే. రోష మొండెను రాజ్యాభిలాష మొండెఁ । గాక యీతని రాకకుఁ గారణంబు**
**పెఱ యెఱుంగము; యెదిరిని బెద్దఁ జేసి । పూని వంది విధంబునఁ బొగడ నేల? 190**

**ప్రతిపదార్థం:** రోషము+ఒండెను= రోషం కానీ; రాజ్య+అభిలాషము+ఒండెన్= రాజ్యం కోరిక గానీ; కాక= కాకపోతే; ఈతని= ఈ అర్జునుడియొక్క; రాకకున్= ఇక్కడికి ఇట్లా రావటానికి; కారణంబు= హేతువు; పెఱ= వేరొకటి; ఎఱుంగము+అ= తెలియలేము కదా! (ఏది ఎలా అయినా); ఎదిరిని= ఎదుటివాడిని (శత్రువును); పెద్దన్+చేసి= గొప్పవాడిగా చేసి (గొప్పవాడు కాకపోయినా); పూని= అదే పనిగా పూనుకొని; వందివిధంబునన్= వైతాళికుడివలె; పొగడన్+ఏల?= ప్రశంసించటం (స్తోత్రం చేయటం) ఎందుకు?

**తాత్పర్యం:** అర్జునుడు ఇట్లా రావటానికి, ఆతడిలో ఉన్న రోషంగానీ, రాజ్యకాంక్షగానీ కారణం అయి ఉంటుంది. కాకుంటే వేరే కారణం ఏదీ కనిపించదు. ఏది ఏమైనా, పగవాడిని గొప్పవాడిని చేసి, భట్రాజువలె ఈరీతిగా ఇంతగా పొగడటం ఎందుకు?

**వ. ఆచార్యులైన వారలు కార్యంబు దవ్వులం గనియెడు వారు గాన కయ్యంబు తెఱంగు వారల నడుగ వలవదు; బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనావసరంబుల, నాయుధ శ్రమ సమయంబుల, నీతిశాస్త్ర గోష్ఠీకాలంబుల నుచితాలాపంబులు పలుకుదురు గాని పోట్లాడెడువారు గారు; వారిం గలనం గలసి నిలువనీక పిఱిందిదెస నిలిపిన మనకు వారు విజయంబు గోరుచుండుదు; రది లెస్స' యనిన విని యశ్వత్థామ యతని కిట్లనియె.** **191**

**ప్రతిపదార్థం:** ఆచార్యులు+ఐన వారలు= గురువులైనవారు; కార్యంబు= పనిని; దవ్వులన్+కనియెడు వారు= పనిలోనికి దిగకుండా ఎడంగా ఉండి చూచేవారు (పనిచేయకుండా పైకి మాటలు చెప్పేవారు); కాన= కాబట్టి; కయ్యంబు తెఱంగు= యుద్ధంయొక్క తీరు; వారలన్= వారిని; అడుగవలవదు= అడుగవద్దు; బుద్ధిమంతులు= తెలివికలవారు; ఇండ్లకడన్+ఉండి= ఇంటివద్దే ఉండి; భోజన+అవసరంబులన్= భుజించే సమయాలలో; ఆయుధ శ్రమ సమయంబులన్= రకరకాల ఆయుధాలకు సంబంధించిన విద్యను అభ్యసించేటప్పుడు; నీతిశాస్త్ర= నీతిశాస్త్రానికి సంబంధించిన; గోష్ఠీకాలంబులన్= చర్చ జరిగేటప్పుడు; ఉచిత+ఆలాపములు= తగిన మాటలు; పలుకుదురు కాని; పోట్లాడెడువారు కారు= యుద్ధం చేసేవాళ్ళు కారు; వారిన్= వారిని; కలనన్= యుద్ధంలో; కలసి నిలువనీక= కలిసి ఉండనీయకుండా; పిఱిందిదెసన్= వెనుక పక్క; నిలిపినన్= ఉంచితే; వారు= ఆచార్యులు; మనకున్= మనకు (దుర్యోధనాదులకు); విజయంబు= జయం; కోరుచున్+ఉండుదురు= కోరుతూ ఉంటారు; అది లెస్స= అదియే మంచిది; అనినన్, విని= అనగా విని; అశ్వత్థామ; అతనికిన్= దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆచార్యులైన ద్రోణులవారు పనిని దూరంగా ఉండి చూస్తారు. అందువలన యుద్ధానికి సంబంధించిన విషయాన్ని వారిని అడుగరాదు. ఇంట్లో భోజనం చేసేటప్పుడూ, ఆయుధవిద్యను అభ్యసించేటప్పుడూ, నీతిశాస్త్ర చర్చలలోనూ మాట్లాడమంటే చాలా బాగా మాట్లాడుతారు. అంతేకాని, వారు యుద్ధం చేసేవారు కాదు. కనుక ఆచార్యులను మనతోపాటు యుద్ధంలో కలవనీయకుండా, మనకు వెనకభాగంలో ఉంచితే మన విజయాన్ని కోరుతూ ఉంటారు. అదే మంచిది' అన్న దుర్యోధనుడి మాటలకు అశ్వత్థామ అతడితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'కావలివారిఁ దోలి, యెసకంబున గోవులఁ బట్టికొంటి నం**
**చీ వెడమాట లేల ధరణీశ్వర! యింతకుమున్న వీటికిం**
**బోవవు, శత్రునే పుడిపి పోయెడు వాఁడవు గావు నీవు; సై**
**న్యావలి యైనఁ జేడ్పడక యాతల కెయ్యుట లేదు నేనియున్.** **192**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= ఓ రాజా!; కావలివారిన్+తోలి= కేవలం ఆవులను కావలిగాచేవాళ్ళను పారదోలి; ఎసకంబునన్= ఎంతో గొప్పగా (అతిశయంతో); గోవులన్= ఆవులను; పట్టికొంటిని+అంచున్= పట్టుకొన్నానంటూ; ఈ= ఈ విధమైన; వెడ= పనికిరాని; మాటలు+ఏల= మాట లెందుకు?; ఇంతకున్+మున్ను+అ= ఇంతకుముందే (ఇంకా); వీటికిన్+పోవవు= నీ ఊరు చేరుకోలేదు (ఇల్లు చేరలేదు); శత్రు+ఏపు= శత్రువుయొక్క ఆధిక్యాన్ని (విజృంభణాన్ని); ఉడిపి= పోగొట్టి; పోయెడువాఁడవు+కావు నీవు= పోతున్నవాడివీ కావు నీవు; సైన్య+ఆవలి+ఐనన్= సేనా సమూహం అయినా; చేడ్పడక= దెబ్బతినకుండా; ఆతలకున్= ప్రక్కకు (అవతలికి- దూరంగా); ఎయ్యుట లేదు నేనియున్= తొలగి అయినా పోలేదు (ప్రమాదస్థలాన్ని అయినా కనీసం దాటిపోలేదు).

**తాత్పర్యం:** 'కేవలం ఆవులను కాచేవాళ్ళను బెదిరించి తరిమి, మందలను పట్టుకొన్నానని ఏమో గొప్పగా పనికిరాని మాటలు మాట్లాడుతున్నావు. రాజా! ఇంకా నీవు ఇల్లు చేరలేదు. దానికి తోడు, శత్రువుల ఆర్భాటాన్ని అణచిన వాడివీ కావు. కనీసం, నీ సేనలైనా దెబ్బతినకుండా ప్రమాదస్థలాన్నుండి దూరంగానైనా పోలేదు.

**క. సమరమున గెల్చి, యొరు రా । జ్యము గొనియును సుజనుఁ డిట్టు లాడఁడు; సిరి జూ**
**దమునఁ గొని రజ్జు లేటికి? । సమయం బరుదెంచెఁ దొంటిచందము గలదే!** 193

**ప్రతిపదార్థం:** సమరమునన్+గెల్చి= యుద్ధంలో గెలుపొంది; ఒరు= ఇతరులయొక్క; రాజ్యమున్= రాజ్యాన్ని; కొనియును= గ్రహించి కూడా; సుజనుఁడు= సజ్జనుడైనవాడు; ఇట్టులు= ఈ రీతిగా; ఆడఁడు= మాట్లాడడు; సిరిన్= రాజ్యాన్ని (సంపదను); జూదమునన్+కొని= జూదంలో (మోసంతో) తీసికొని; రజ్జులు+ఏటికిన్?= గొప్పలు (నిందా వాక్యాలు) ఎందుకు?; సమయంబు+అరుదెంచెన్= ఇప్పుడు సమయం వచ్చింది; తొంటి= పూర్వపు; చందము కలదే!= విధానం వీలు కాదు (మోసం చేయటానికి ఇది జూదం కాదు; యుద్ధం అని భావం).

**తాత్పర్యం:** ఎంతో గొప్పగా యుద్ధంలో జయించి, రాజ్యాన్ని పొందినవాడు కూడా నీవలె మాట్లాడడు. మోసపు జూదంలో రాజ్యాన్ని సంగ్రహించి, నోటికి వచ్చిన దుర్భాషలను మాట్లాడుతావా? ఇప్పుడు సమయం వచ్చింది. ముందువలె జూదం ఆడాలంటే కుదరదు.

**ఉ. పాండవవీరులం గలన బాహుబలంబున నోర్చియే సము**
**ద్దండత నీవు దొల్లి ద్రుపదక్షితిపాత్మజఁ గొల్వులోనికిం**
**దెండని పుచ్చి? తద్దెసకుఁ దెచ్చుట సౌబలు నీతిఁ గాదె? యా**
**తండ మరల్చుఁ గాక సముదగ్రత వచ్చు విరోధి నిప్పుడున్.** 194

**ప్రతిపదార్థం:** పాండవ వీరులన్= మహావీరులు అయిన పాండవులను; కలనన్= యుద్ధంలో; బాహు= భుజములయొక్క; బలంబునన్= పరాక్రమంతో; ఓర్చియే!= జయించేనా! (కాదు-అని); తొల్లి= ఇదివరలో; నీవు= నీవు; సముద్దండతన్= కాఠిన్యంతో (క్రౌర్యంతో); ద్రుపదక్షితిప= ద్రుపద మహారాజుయొక్క; ఆత్మజన్= కూతురైన ద్రౌపదిని; కొల్వులోనికిన్= సభలోకి; తెండు+అని పుచ్చితి= తీసికొని రమ్మని పంపావు; తద్+దెసకున్= ఆ స్థితికి; తెచ్చుట= తీసికొని రావటం; సౌబలు= శకునియొక్క; నీతిన్+కాదె!= కుటిలనీతిచేత కదా!; ఇప్పుడున్= ఇప్పుడునూ; సముదగ్రతన్= ఎంతో విజృంభణంతో; వచ్చు విరోధిన్= పైకి వస్తున్న శత్రువును; ఆతండు+అ= ఆ శకునే; మరల్చున్+కాక!= వెనక్కు మళ్ళిస్తాడులే!.

**తాత్పర్యం:** ఎంతో దుర్మార్గంతో, క్రూరుడివై నీవు ఇదివరలో ద్రౌపదిని నిండుసభలోకి తీసికొనిరమ్మని నీ తమ్ముడిని పంపింది పాండవు లందరినీ జయించేనా? ఆ శకుని కుటిలనీతితో కాదూ! కనుక మీదికి దూసికొనివచ్చే ఆ శత్రువును కూడా ఇప్పుడు ఆ శకునే వెనక్కు మళ్ళిస్తాడులే!

**వ. అబ్భంగి నవమానింపం బడినవాఁడు గావున ధార్తరాష్ట్రకుల ధూమకేతు వగు కపికేతనుండు దోఁచె; నీకు దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింపవచ్చు నంతియకాక దేవదానవుల కయినను దుర్జయుండగు నర్జునునకుం దలసూప వచ్చునే! నయ విక్రమంబుల నతిలోకుండగు నతని నెవ్వరికేనియుం బొగడవలయు ననినం బుత్రనిర్విశేషుండగు నిజ ప్రియ శిష్యుని నగ్గించుట గురునకుం గొఱంతయె? యింక సిగ్గుమాలి రణంబు సేసెనేనియు ద్రోణుండు సేయుంగాని యే నిట్టి దాని కోర్వ; నదియునుం గాక. 195**

**ప్రతిపదార్థం:** ఆ+భంగిన్= ఆరీతిగా; అవమానింపఁబడినవాఁడు కావునన్= అవమానించబడ్డాడు కాబట్టి; ధార్తరాష్ట్ర= ధృతరాష్ట్రుడి కొడుకులయొక్క; కుల= వంశానికి (నూరుమందికి); ధూమకేతువు= తోకచుక్క; కపి కేతనుఁడు= వానరాన్ని జెండామీద నిలుపుకొన్నవాడు (హనుమంతుడిని తన ధ్వజంమీద అర్జునుడు నిలుపుకొన్నాడు); తోఁచెన్= తటస్థించాడు; నీకు= దుర్యోధనుడికి; దుర్మదంబునన్= బాగా కొవ్వుబట్టి మదించటంచేత; ద్రోణ+ఆచార్యులన్= ద్రోణుడిని; అధిక్షేపించవచ్చున్= ఎద్దేవ చేయవచ్చును; అంతియకాక= అంతేకాని; దేవదానవులకున్+ఐనను= దేవతలకు, దానవులకు అయినా; దుర్జయుండు+ అగు+అర్జుననకున్= జయించటానికి శక్యముకాని వీరుడైన అర్జునుడికి; తల+చూపవచ్చునే?= ఎదురుపడవచ్చునా? నయ విక్రమంబులన్= నీతిలోనూ, పరాక్రమంలోనూ; అతిలోకుండు+అగు= లోకాతీతుడైన; అతనిన్= అర్జునుని; ఎవ్వరికిన్+ ఏనియున్= ఎవ్వరికైనా; పొగడవలయున్+అనినన్= పొగడక తప్పదనగా; పుత్ర నిర్విశేషుండు+అగు= కొడుకుతో సమానుడైనవాడైన; నిజప్రియ శిష్యునిన్= తన ప్రియమైన శిష్యుని; అగ్గించుట= పొగడటం; గురునకున్= ఆచార్యుడికి, ద్రోణుడికి; కొఱంతయె?= తక్కువా? (తప్పా?); ఇంకన్= ఇన్నిమాటలన్నతరువాత; సిగ్గుమాలి= సిగ్గులేక; ద్రోణుండు; రణంబు= యుద్ధం; చేసెన్+ఏనియున్= చేస్తే; చేయున్+కాని= చేస్తాడేమో కాని; ఏను= నేను; ఇట్టి దానికిన్= ఇటువంటి దానికి; ఓర్వన్= సహించలేను; అదియునున్+కాక= అంతేకాక.

**తాత్పర్యం:** అట్లా అవమానించబడినవాడు కనుకనే, కౌరవుల కులానికి తోకచుక్క అయిన కపికేతనుడు వచ్చాడు. నీవు మదించి గురువైన ద్రోణుడిని నిందించావు కానీ, దేవతలకూ, దానవులకూ కూడా జయించరాని అర్జునుడి ఎదుటికైనా పోగలవా? రాజనీతిలోనూ, బాహుబల విక్రమంలోనూ అతిలోకుడైన అర్జునుడిని ఎవరైనా పొగడాల్సిందే! అట్లాంటప్పుడు, తనకు పుత్రుడితో సమానుడైన ప్రియశిష్యుడైన అర్జునుడిని పొగడటం గురువైన ద్రోణుడి తప్పా? ఇంత జరిగాక కూడా, ఒకవేళ సిగ్గు విడిచి ఆ ద్రోణుడే యుద్ధంచేస్తే చేయనీ కాని, నేను మాత్రం దీన్ని ఓర్చుకొనలేను. అంతేకాక... (ముందరికి అన్వయం).

**విశేషం:** 'ధార్తరాష్ట్రకుల ధూమకేతువు'- రూపకాలంకారం. ధూమకేతువు అంటే తోకచుక్క. అది రాజుకూ, దేశానికీ అరిష్టసూచకం. అంటే, నీకు వినాశం తప్పదని అశ్వత్థామ మాటలలో ధ్వని.

**క. ప్రళయాంతకుండు బడబా । నలమును మృత్యువును నెదిరినం గొఱఁతవడన్
నిలిపినను నిలుపు; మార్కొని । చెలఁగిన నరుశరము లనవశేషము సేయున్. 196**

**ప్రతిపదార్థం:** ప్రళయ+అంతకుండు= ప్రళయకాలంలో ఉన్న యముడూ; బడబానలమును= సముద్రంలో పుట్టిన బడబ అనే పేరుగల అగ్ని (చాలా భయంకరం అయింది); మృత్యువును= మృత్యుదేవతనూ; ఎదిరినన్= ఎదిరించితే; కొంఱంత+పడన్= కొంత తక్కువగా మిగిలించి; నిలిపినను నిలుపున్= నిలుపవచ్చును. (ఒకవేళ నిలిపితే నిలపవచ్చును); (కాని) మార్కొని= ఎదిరించి; చెలఁగినన్= విజృంభిస్తే; నరు= అర్జునుడియొక్క; శరములు= బాణాలు; అనవశేషము+చేయున్= ఏమాత్రం మిగిలించకుండా సర్వనాశనం చేస్తాయి.

**తాత్పర్యం:** యముడూ, బడబాగ్ని, మృత్యువూ చెలరేగితే, ఎదిరించిన వారలను అంతా నాశనం చేయకుండా, కొంతైనా మిగిలిస్తే మిగిలించవచ్చును. కానీ అర్జునుడి అమోఘాలైన బాణాలు మాత్రం, ఏమీ మిగలనీయకుండా సర్వనాశనం చేస్తాయి.

**విశేషం:** యముడూ, బడబాగ్నీ, మృత్యువూ మూడూ ఏమాత్రం తప్పనివి, నిశ్శేషంగా నాశనం చేసేవే! అయినా అవి కొంత మిగిలిస్తాయేమో కానీ, అర్జునుడి బాణాలు ఏమాత్రం మిగిలించక సర్వనాశనం చేస్తాయి - అని అనటంలో, అర్జునుడి బాణాలు పైవాటికన్నా భయంకరం అయినవని భావం.

**ఆ. కుటిలబుద్ధు లిచటఁ గొనవు; నెట్టన ఘన । దోర్బలంబు మెఱసి తొడర వలయు;**
**నతఁడు గాండివమున నడ్డసాళులు వైవఁ; । డురుల నంపవాన గురియుఁ గాని. 197**

**ప్రతిపదార్థం:** ఇచటన్=ఇక్కడ (యుద్ధభూమిలో); కుటిల బుద్ధులు= కపటమైన ఆలోచనలు (మోసాలు); కొనవు= పనికిరావు; నెట్టన= తప్పక; ఘన= గొప్పదైన; దోస్(ః)= బాహువులయొక్క; బలంబు= బలాన్ని; మెఱసి= ప్రకాశింపచేసి (చూపి); తొడర వలయున్= ఎదిరించాలి; అతఁడు= ఆ అర్జునుడు; గాండివమునన్= గాండీవంతో; ఉరులన్= ఉర్లిపోయేట్లు, నేల కూలేటట్లు; అమ్ము+వాన= బాణాలవాన; కురియున్+కాని= కురిపిస్తాడు కాని; అడ్డసాళులు= పాచికలు; వైవఁడు= వేయడు.

**తాత్పర్యం:** ఇక్కడ నీ కపటబుద్ధులు పనికిరావు. నిజమైన భుజబలాన్ని చూపి, ఎదిరించి నిలబడాలి. ఆ వచ్చే అర్జునుడు గాండీవంతో తనను తాకినవాళ్ళపై నేల కూలేటట్లు ఎడతెగక బాణవర్షాన్ని కురిపిస్తాడే కానీ, మోసంతో పాచికలను విసరడు.

**విశేషం:** అలం: ప్రతిషేధం. తన తండ్రి అయిన ద్రోణుడిని దుర్యోధనుడు నిందించాడని రోషించిన అశ్వత్థామ, ఆతడిని ఎత్తిపొడుపుతో, హేళనగా మాట్లాడుతూ, అర్జునుడి పరాక్రమాన్ని ప్రశంసిస్తూ, తనదైన వ్యక్తిత్వాన్ని నిలుపుకొన్నాడు.

'డరులనంపవాన' - ఈ పాఠాంతరం పెక్కు ప్రతులలో ఉన్నది.

**క. విను మట్టులు గాకున్నం । దన గోవుల వెనుక మత్స్యధరణీశుఁడు వ**
**చ్చిన మార్కొందుము; నరుఁ డే । పున ముట్టిన నతని పొంతఁ బోదుమె? యధిపా!' 198**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; వినుము= (నా అభిప్రాయం) వినవలసింది; అట్టులు= అట్లా; కాక+ఉన్నన్= కాకుండా పోతే; తన= తనవైన; గోవుల వెనుకన్= ఆవుల వెంట; మత్స్యధరణీశుఁడు= విరాటరాజు; వచ్చినన్= వస్తే; మార్కొందుము= ఎదిరిస్తాం; (అలా కాక); నరుఁడు= అర్జునుడే; ఏపునన్+ముట్టినన్= విజృంభించి పైకి వస్తే; అతని పొంతన్= ఆ నరుడి సమీపానికి అయినా; పోదుమె?= పోతామా? (పోము అని భావం).

**తాత్పర్యం:** ఓ రాజా! నా అభిప్రాయాన్ని వినుము. అట్లా కాక ఆవులవెంట విరాటరాజే వస్తే మేము ఎదిరిస్తాం. అర్జునుడైతే మాత్రం మేము ఆ ప్రక్కకు కూడా పోము.'

**విశేషం:** అర్జునుడి ఆధిక్యాన్ని అశ్వత్థామ బాహాటంగా అంగీకరించి, తన అభిప్రాయాన్ని రాజైన దుర్యోధనుడికి చెప్పాడు. ఇది ఒకరకంగా రాజుపై తిరగబడటమే కాక బెదిరింపు కూడ. యోధులలో ప్రధానుడైన అశ్వత్థామే ఇట్లా అంటే, రాజుకు దిగులు పట్టుకొంటుంది. అశ్వత్థామ మాటలు కర్ణుడికి కోపాన్ని కలిగించాయి. అందుకే ఆతడు యోధులందరితో తరువాత ఇట్లా అంటాడు. ఈ విధంగా విభిన్న మనస్తత్త్వాలను ఒకేమారు నిర్వహించటంలో తిక్కన అద్వితీయుడు.

**వ. అనిన విని, రాధేయుండు సక్రోధుండై యోధవీర లోకంబు నాలోకించి. 199**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అశ్వత్థామ దుర్యోధనుడితో చెప్పగా విని; రాధేయుండు= కర్ణుడు (రాధ పెంచుకొన్నవాడు); సక్రోధుండు+ఐ= కోపంతో కూడినవాడై; యోధ= యోధులయొక్క; వీర= వీరులయొక్క; లోకంబున్= సమూహాన్ని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అశ్వత్థామ మాటలను విన్న కర్ణుడు (దుర్యోధనుడిని నిందించాడు అనే) కోపంతో, యోధులనూ, వీరులనూ అందరినీ చూచి (ఇట్లా అన్నాడు).

**చ. 'వడిగొని గోగణంబుఁ బొదువం బఱతెంచితి రెల్లవారు ము**
**న్నొడఁబడి పాండునందనుల యున్నెడ యిమ్మెయిగాన వేఁడి; యి**
**ప్పుడు నరుఁ గాంచి మీ రతని పోటు నుతించుచు భీతి నిట్లు వా**
**విడిచి యనేక భంగిఁ బృథివీపతి వీఱిఁడిఁ జేయు టొప్పునే? 200**

**ప్రతిపదార్థం:** పాండు నందనుల= పాండురాజు కుమారులైన పాండవులయొక్క; ఉన్న+ఎడ= ఉండే చోటును; ఈ+మెయిన్= ఈరీతిగా; కానన్+వేఁడి= చూడాలని కోరి; ఎల్లవారు= అందరూ; మున్ను+ఒడఁబడి= ముందే ఒప్పుకొని; వడిగొని= తొందరగా; గోగణంబున్= ఆవులమందను; పొదువన్= పట్టుకొనేందుకు; పఱతెంచితిరి= అందరూ వచ్చినారు; ఇప్పుడు= ఇంత జరిగాక ఇప్పుడు; నరున్+కాంచి= అర్జునుడిని చూచి; మీరు= మీరందరూ; అతని పోటు= అర్జునుడి పరాక్రమాన్ని; నుతించుచున్= పొగడుతూ; భీతిన్= బెదరుతో; ఇట్లు= ఇట్లా; వాయి+విడిచి= నోరు విప్పి (గట్టిగా); అనేక భంగిన్= ఎన్నో రకాలుగా; పృథివీపతిన్= రాజును; వీఱిఁడిన్+చేయుట= పిచ్చివాడిని చేయటం; ఒప్పునే?= బాగుందా?

**తాత్పర్యం:** 'పాండవులు ఉండే చోటును తెలిసికొనటానికి, ఈ విధానాన్ని అందరూ ఒప్పుకొని, త్వరత్వరగా ఆవులమందను గ్రహించేందుకు వచ్చి, తీరా ఇప్పుడు అర్జునుడిని చూచి బెదురుతో, గొంతెత్తి ఆతడి ప్రతాపాన్ని పొగడుతూ రాజైన దుర్యోధనుడిని ఆఖరికి వెర్రివాడిని చేయటం బాగాలేదు.

**చ. వెఱచితిరేని నిల్వుఁ; డొకవీరున కొక్కఁడ చాలుఁ గాక యెం**
**దఱు వలయుం? గపిధ్వజము దవ్వుల వ్రేల్మిడిఁ ద్రుంచి వైచెదం;**
**బఱపెదఁ దత్పిశాచములఁ; భగ్నము సేసెదఁ దేరు; సారథిన్**
**నెఱఁకులు నొంచెదం; బొదులు నించెద నర్జును గాత్రశాలలోన్. 201**

**ప్రతిపదార్థం:** వెఱచితిరి+ఏనిన్= ఒకవేళ భయపడినట్లు అయితే; నిల్వుఁడు= మీరు రాకుండా నిలవండి; ఒక వీరునకున్+ ఒక్కఁడు+అ= ఒక్క వీరుడికి ఒక్క వీరుడే; చాలున్+కాక= సరిపోతాడు గానీ; ఎందఱు వలయున్?= ఎంతమంది కావాలి? దవ్వులన్= దూరం నుండే; వ్రేల్మిడిన్= త్రుటిలో (చిటికె లోపల); కపి ధ్వజమున్= అర్జునుడియొక్క కపికేతనాన్ని; త్రుంచి వైచెదన్= క్రింద పడగొట్టుతాను; తత్= ఆ జెండాను చుట్టి ఉన్న; పిశాచములన్= భూతాలను; పఱపెదన్= తరిమివేస్తాను; తేరు= రథం; భగ్నము+చేసెదన్= విరిచి వేస్తాను (విరుగకొట్టుతాను); సారథిన్= సారథిని; నెఱఁకులు నొంచెదన్= మర్మస్థానాలను (ఆయువుపట్లను) నొప్పిస్తాను; అర్జును= అర్జునుడియొక్క; గాత్ర= శరీరం అనే; శాలలోన్= ప్రదేశంలో; పొదులు= అమ్ములు పెట్టే పొదుల్నే (బాణ సమూహాలను); నించెదన్= నింపుతాను. (కొన్ని పొదుల బాణాలు అని భావం).

**తాత్పర్యం:** మీకు భయంగా ఉంటే మీరు రావద్దు, నిలిచి పొండి. ఒక వీరుడికి ఒక్కడు కాక ఎంతమంది కావాలి? అర్జునుడి కపికేతనాన్ని దూరంనుండే చిటికెలో నేల పడగొడతాను. దానిని ఆశ్రయించుకొని ఉన్న భూతాల సమూహాలను తరిమివేస్తాను. అర్జునుడి రథాన్ని విరుగగొట్టుతాను. సారథి ఆయువుపట్లను నొప్పిస్తాను. అర్జునుడి దేహం అనే శాలలో బాణాల సమూహాలను నింపుతాను.

**విశేషం:** 'ముందుపద్యంలో అందరూ చేరి, రాజును వెర్రివాడిని చేస్తున్నారా? ఇది సమంజసమా?' అని కర్ణుడు అశ్వత్థామ మొదలైన వాళ్ళను ఆక్షేపించి, ప్రస్తుత పద్యం నుండి, 205వ పద్యం దాకా తన ప్రతాపాన్నీ, అర్జునుడితో సమానత్వాన్నీ చెప్పుకొంటూ, దుర్యోధనుడికీ తనకూ ఉన్న సంబంధాన్ని కూడా వ్యక్తం చేస్తాడు. పైమాటలలో కర్ణుడి వ్యక్తిత్వం స్పష్టపడుతుంది. పాత్రల మాటలద్వారా వాళ్ల వ్యక్తిత్వాన్ని సూచించడం తిక్కన లక్షణం.

2. అలం: రూపకం - గాత్రశాలలోన్ - గాత్రమనెడిశాలలో. 'సారథిన్ నెఱఁకుల నొంచెదన్' - సారథియొక్క నెఱఁకులు - అని షష్ఠిరావలసి ఉండగా, సారథిన్ నెఱఁకులు - అని ద్వితీయ అయింది. "క్రియాన్వయంబున రెండు పదంబులకు స్వస్వామి సంబంధంబు గలచో సంబంధిపదంబు షష్ఠికి ద్వితీయయునగు" - ప్రౌఢవ్యాకరణం, కారకపరిచ్ఛేదం. సూ.23.

**చ. జ్యాఘోషం బతిభీషణం బయి, దిశాచక్రంబు నిండన్, శర**
**వ్యాఘాతంబున శాత్రవుండు వికలస్వాంతుండుగా, నారద**
**శ్లాఘాపాత్రమునై; యనర్గళ భుజాసంరంభతన్ రౌద్రరే**
**ఖా ఘోరాకృతి యేన చూపెద; నశంకం జూడుఁడీ యేర్పడన్. 202**

**ప్రతిపదార్థం:** జ్యా= అల్లెత్రాటియొక్క; ఘోషంబు= ధ్వని; అతి= మిక్కిలి; భీషణంబు+అయి= మిక్కిలి భయంకరమై; దిశాచక్రంబు= దిగ్వలయం, దిక్కుల సమూహం అంతా; నిండన్= నిండిపోగా (వ్యాపించగా); శర= బాణాలయొక్క; వి+ఆఘాతంబునన్ వ్యాఘాతంబునన్= ఎక్కువైన దెబ్బలతో (పెద్ద పెద్ద దెబ్బలతో); శాత్రవుండు= శత్రువైన అర్జునుడు; వికల= చెదిరిన (కలత చెందిన); స్వాంతుండు+కాన్= మనసుగలవాడు కాగా; నారద= నారదమహర్షియొక్క; శ్లాఘా= ప్రశంసకు; పాత్రమును+ఐ= అర్హమై (నారదుడికి కలహమే భోజనం. కనుక కలహం వస్తే ఆతడికి భోజనం దొరికినట్లే); అనర్గళ= అడ్డులేనట్టి; భుజా= బాహువులయొక్క; సంరంభతన్= సంరంభంతో (ఉద్రేకంతో); రౌద్రరేఖా= రౌద్రరసాన్ని సూచించే; ఘోర= భయంకరమైన; ఆకృతి= స్వరూపాన్ని; ఏను+అ= నేనే; చూపెదన్= చూపిస్తాను; అశంకన్= అనుమానం లేకుండా; ఏర్పడన్+చూడుఁడీ= బాగా చూస్తూ ఉండండి.

**తాత్పర్యం:** నా యొక్క అల్లెత్రాటి ధ్వని భీకరమై దిగ్వలయంలో వ్యాపించే రీతిగా, నా బాణాల దెబ్బలతో శత్రువైన అర్జునుడు కలతపడేటట్లుగా, నారదుడు ఆనందించేటట్లుగా, ఎదురులేని నా బాహుపరాక్రమంతో, రౌద్రరసం రూపాన్ని పొందినట్లు నేను చూపుతాను. అందరూ అనుమానం లేకుండా నన్ను చూస్తూ ఉండండి.

**విశేషం:** తనకు సమానులనూ, తనకంటె ఎక్కువైన వాళ్ళనూ కూడా లెక్కించక, కేవలం తాను ఒక్కడే వీరుడైనట్లు కర్ణుడు పైవిధంగా వీరులందరితో చెప్పాడు. ఇందులో, స్వోత్కర్ష, పరనిందా, ఒక లెక్కలేనితనం కనిపిస్తాయి. ఇవి కర్ణుడి మనస్తత్వాన్ని బాగా ప్రతిఫలింపచేస్తున్నవి. పైమాటలలో ఒకరకంగా, కర్ణుడి ఆత్మాభిమానమూ కనిపిస్తుంది.

**క. క్రోధజ్వాలలు నిగుడ, వి । రోధి బలేంధనముఁ బొదువు క్రూరతమై దు**
**స్సాధమగు నర్జునాగ్నిని । సాధించెద నేన పూని శరవర్షమునన్. 203**

**ప్రతిపదార్థం:** క్రోధ= కోపం అనే; జ్వాలలు= మంటలు; నిగుడన్= వ్యాపించగా; విరోధి= శత్రువుయొక్క; బల+ఇంధనమున్= సేన అనెడు కట్టెలను; పొదువు= చుట్టుకొనే; క్రూరతమైన్= క్రౌర్యంతో; దుస్సాధము+అగు= సాధించటానికి వీలుకానట్టి; అర్జున+అగ్నిని= అర్జునుడు అనే అగ్నిని; నేను+అ= నేనే (నేను ఒక్కడినే); పూని= (ఎంత కష్టమైనా) ప్రయత్నించి; శర= బాణాలు అనే; వర్షమునన్= వానతో; సాధించెదన్= సాధిస్తాను (చల్లారుస్తాను).

**తాత్పర్యం:** కోపం అనే మంటలతో చుట్టూ అలుముకొంటూ, శత్రువుయొక్క బలం అనే ఇంధనాన్ని (మండటానికి అవసరమైన పదార్థాన్ని), చుట్టుముట్టే క్రౌర్యంతో, సాధించటానికి వీలుపడనట్టి అర్జునుడు అనే భయంకరమైన అగ్నిని, నా బాణాలవర్షంతో నేనే చల్లార్చివేస్తాను. (అగ్నిని రూపుమాపుతాను - నాశనం చేస్తాను అని భావం).

**విశేషం:** అలం: రూపకం. ఇందులో అర్జునుడికీ అగ్నికీ అభేదం చెప్పబడింది. ఆ పోలిక చెప్పింది కూడా కర్ణుడే! క్రోధం ఎర్రటిది - దానిని కవులు మంటలతో పోలుస్తారు. వ్యాపించటం మంటల లక్షణం. పరాక్రమాన్ని అగ్నితో కవులు ఉపమిస్తారు. అర్జునుడు అనే అగ్నిని చల్లార్చటానికి ఎవ్వరూ వద్దనీ, తన బాణవర్షంతో తా నొక్కడే దానిని చల్లార్చుతాననీ, అది కష్టసాధ్యమే అనీ కర్ణుడు అంటాడు. తనకు శత్రువైన అర్జునుడి పరాక్రమాన్ని కర్ణుడు ప్రశంసించాడు. ఇందులో ఒక రహస్యం ఉన్నది. శత్రుబలాన్ని పొగిడి, అంత గొప్పవాడిని జయిస్తాను అని అనటం కర్ణుడి ఆధిక్యం తెలియటానికే! ఇది కూడా, కర్ణుడు తనను తాను పొగడుకొన్నట్లే అవుతుంది.

కవులు ఇటువంటి పద్ధతిని పాటించటం సహజమే. రామాయణంలో కూడా వాల్మీకి రావణ పరాక్రమాన్ని వర్ణింపజేసి, అట్లాంటివాడిని సంహరించిన రాముడి పరాక్రమాన్ని వర్ణించకనే వర్ణించినట్లు చిత్రించాడు. ఇది ఒక శిల్పం.

**వ. పాండవమధ్యముండు పదుమూఁడు వత్సరంబులు పూఁచి పట్టి కయ్యంబునకు వచ్చె; నతని లావును బీరంబును లోకంబునకు నెక్కియున్న యవి; యేనును గురుసేనయందు శక్తి శౌర్యంబులు గలవాఁడన పోలె వర్తించెదం, గావున నే మిరువురము నొండొరులకు బాహుబల విలాసంబును, విక్రమ క్రీడా కౌశలంబును బ్రకటించుట యుచితంబు గాదె' యని వెండియు నిట్లనియె. 204**

**ప్రతిపదార్థం:** పాండవమధ్యముండు= అర్జునుడు; పదుమూఁడువత్సరంబులు= పదమూడేండ్లు; పూఁచిపట్టి= ఎంతో ఉద్యమించి; కయ్యంబునకున్= యుద్ధానికి; వచ్చెన్= వచ్చాడు; అతని= అర్జునుని యొక్క; లావును= బలమూ; బీరంబును= పరాక్రమమున్నూ;

లోకంబునకున్= జనానికి; ఎక్కియున్న+అవి= నచ్చి ఉన్నాయి (ప్రశస్తమైనవి); ఏనును= నేనూ; కురుసేన+అందున్= కౌరవసేనలో; శక్తిశౌర్యంబులు= బలపరాక్రమాలు; కలవాఁడన్+అపోలెన్= కలిగినవాడివలెనే; వర్తించెదన్= నడుచుకొంటాను; కావునన్= కాబట్టి; ఏము+ఇరువురమున్= మేమిద్దరమూ (అర్జునుడూ+కర్ణుడూ); ఒండొరులకున్= ఒకరికొకరు; బాహుబల= భుజబలంయొక్క; విలాసంబును= విలాసాన్నీ; విక్రమ= పరాక్రమం అనే; క్రీడా= ఆటలోని; కౌశలంబును= నైపుణ్యాన్నీ; ప్రకటించుట= ప్రదర్శించుట; ఉచితంబు+కాదె= తగినది కాదా?; అని; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పదమూడేండ్లు అర్జునుడు ఎంతో ప్రయత్నం చేసి ఈనాడు కయ్యానికి వచ్చాడు. ఆతడి బలం, పరాక్రమం లోకంలో పేరుకెక్కినట్టివే! నేను కూడా కురుసేనలో బలపరాక్రమాలు కలిగినట్లే నడుచుకొంటున్నాను. కనుక మేమిద్దరం, ఒకరికొకరు భుజబలాన్నీ, పరాక్రమాన్నీ ప్రదర్శించుకొనటం ఉచితంగా ఉంటుంది' అని ఇంకా కర్ణుడు ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** ఈ క్రింది పద్యంలో కర్ణుడు అర్జునుడితో పోరాడటంలో ఉన్న కారణాలను వివరిస్తున్నాడు. ఈ కారణాలను గమనిస్తే కర్ణుడి వ్యక్తిత్వం బాగా తెలుస్తుంది.

**సీ.** **'అనుదినంబును నంతకంతకుఁ బెరిఁగెడి । యధిపతి మన్నన యప్పుఁ దీర్పఁ,**
**నర్జును నోర్చెద ననిలోన నే నని । యతనితోఁ బలికిన ప్రతిన నెఱపఁ,**
**గర్ణార్జునులయందు ఘనుఁ డెవ్వఁడగు నొక్కొ । యను జనంబుల సందియంబు మాన్ప,**
**జమదగ్నిసుత కృపాశ్రయమునఁ బడసిన । విలువిద్య కలరూపు వెలయఁ జేయఁ**

**ఆ.** **గనుట నేఁడు పుణ్యదిన మయ్యె నాకు; మీ । కెల్లఁ బోరు సూడ నిష్టమేనిఁ**
**జూడుఁ; డట్లు గాక వేడుక లేదేని, । సంతసమునఁ బసుల జాడఁ బొండు.'** **205**

**ప్రతిపదార్థం:** అనుదినంబునున్= రోజురోజూ; అంతకు+అంతకున్= ఉండేకొద్దీ; పెరిఁగెడి= పెరిగిపోతున్న; అధిపతి= రాజైన సుయోధనుడియొక్క; మన్నన= ఆదరణ అనే; అప్పున్= ఋణాన్ని; తీర్పన్= తీర్చటానికీ; నేను= నేను; అనిలోనన్= యుద్ధంలో; అర్జునున్= అర్జునుడిని; ఓర్చెదన్= ఓడిస్తాను; అని= అంటూ; అతనితోన్= ఆ దుర్యోధనుడితో; పలికిన= మాట్లాడిన; ప్రతిన= ప్రతిజ్ఞ; నెఱపన్= నెరవేర్చటానికీ; కర్ణ+అర్జునులయందున్= కర్ణుడు, అర్జునుడు - అనే మా ఇద్దరిలో; ఘనుఁడు= అధికుడు; ఎవ్వఁడు= ఎవడు; అగును+ఒక్కొ= అవుతాడో; అను= అనేటటువంటి; జనుల= జనుల (లోకుల) యొక్క; సందియంబు= అనుమానం; మాన్పన్= పోగొట్టటానికీ; జమదగ్ని= జమదగ్ని అనే మహర్షియొక్క; సుత= కుమారుడైన పరశురాముడియొక్క; కృపా+ఆశ్రయమునన్= కరుణయొక్క ఆశ్రయంతో (దయవలన లభించిన ఆదరణతో); పడసిన= సంపాదించిన (పొందిన); విలువిద్య= ధనుర్విద్యయొక్క; కలరూపు= నిజమైన రూపాన్ని; వెలయన్+చేయన్+కనుటన్= ప్రకటించకలగటం వలన; నాకున్= నాకు; నేఁడు= ఈదినం; పుణ్యదినము= పవిత్రమైన దినం (పండుగ దినం); అయ్యెన్= అయింది; మీకున్= మీకు; ఎల్లన్= అంతమందికీ; పోరు= యుద్ధాన్ని (మా ఇద్దరి యుద్ధాన్ని); చూడన్= చూడటం; ఇష్టము+ఏనిన్= ఇష్టమయితే; చూడుఁడు= చూడండి; అట్లు+కాక= చూడటం ఇష్టంలేకపోతే; వేడుక= ఉత్సాహం; లేదు+ఏనిన్= లేనట్లైతే; సంతసమునన్= సంతోషంతో; పసుల= పసులయొక్క; జాడన్= దారిని (ఆవులు వెళ్ళిన దారిన); పొండు= పోండి.

**తాత్పర్యం:** 'దినదినానికీ అంతకంతకూ పెరిగిపోయే ప్రభువైన దుర్యోధనుడి ఆదరణ అనే అప్పు తీర్చుకొనటానికీ; నేను అర్జునుడిని యుద్ధంలో జయిస్తానని రాజుతో చేసిన ప్రతిన నెరవేర్చుకొనటానికీ, మా ఇద్దరిలో (కర్ణార్జునులలో)

అధికుడు ఎవడో అను సందేహంతో ఉండే లోకుల అనుమానాన్ని పోగొట్టటానికీ, జమదగ్ని కుమారుడైన పరశురాముడి దయవలన కలిగిన ఆశ్రయంతో పొందిన విలువిద్యయొక్క నిజరూపం ఏమిటో తెలపటానికీ, తగిన అవకాశం నాకు చిక్కింది. కనుక ఈ దినం నాకు చాల పవిత్రమైన దినం. మా ఇద్దరి పోరాటాన్ని మీరందరూ చూడాలని ఇష్టపడితే చూడవచ్చును, అట్లాకాక, చూడాలనిపించకపోతే, ఆవులు పోయినదారినే పోండి.'

**విశేషం:** కర్ణుడు పైన చెప్పిన కారణాలలో మొదటిది- ఆతడి కృతజ్ఞతాభావానికి నిదర్శనం. కేవలం అర్జునుడికి పోటీగానే కర్ణుడిని దుర్యోధనుడు గౌరవించాడు. దానిని నిరూపించుకొనటానికి ప్రయత్నించవలసిన బాధ్యత కర్ణుడికి ఉన్నది. అందుకే ఆతడు దానిని గొప్పగా చెప్పుకొన్నాడు. తాను చేసిన ప్రతిజ్ఞను నిలబెట్టుకొనగలగటం రెండవ కారణం- మూడో కారణం, ఆతడి విశ్వాసాన్ని తెలుపుతుంది. నాలుగోది- ఆతడి పరాక్రమాన్ని సూచిస్తుంది. ఇవన్నీ తరువాత కేవలం ప్రగల్భాలుగానే మిగిలిపోతాయి.

**వ. అనిన నమ్మాటలు విని కృపాచార్యుం డతని కిట్లనియె. 206**

**ప్రతిపదార్థం:** అనినన్= ఆ విధంగా పలుకగా; ఆ+మాటలు= కర్ణుడియొక్క ఆ మాటలు; విని; కృపాచార్యుఁడు; అతనికిన్+ఇట్లు+ అనియెన్= ఆ కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడు మాట్లాడిన మాటలను విన్న కృపాచార్యుడు ఆతడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'కయ్యమునక యెపుడుఁ గాలు ద్రవ్వుదు, కార్య । గతికిఁ జొరవు; నీతియుతులు సమర**
**మధమ సాధనముగ నాడుదు రర్థ సం । సిద్ధిఁ బొందు తెఱఁగు సేయు నెడల. 207**

**ప్రతిపదార్థం:** కయ్యమునకున్+అ= పోట్లాటకే; ఎపుడున్= ఎల్లప్పుడూ; కాలు+త్రవ్వుదు(వు)= తయారౌతావు; (ఆబోతు మరొకదాన్ని చూచి, కాలితో నేలను తవ్వుతుంది. దానివలన రెండోదానికి రోషం వస్తుంది. కనుక కాలుత్రవ్వు అంటే, ప్రేరేపించుట అనీ అర్థమే); కార్యగతికిన్+చొరవు= పనితీరు ఎట్లా ఉందో గమనించి దాన్ని సాధించేదానికి ప్రయత్నించవు అని భావం; అర్థ= ప్రయోజనంయొక్క; సంసిద్ధి పొందు= సిద్ధిని (చివరి ఫలితాన్ని) పొందే; తెఱఁగు= విధానాన్ని (పద్ధతిని); చేయు+ఎడలన్= ఆచరించే సమయాలలో; నీతియుతులు= రాజనీతి తెలిసినవారు; సమరము= యుద్ధాన్ని; అధమసాధనముగన్= నీచమైన ఉపాయంగా; ఆడుదురు= చెప్తారు.

**తాత్పర్యం:** 'నీవు ఎప్పుడు చూచినా పోట్లాటకే కాలుదువ్వుతూ ఉంటావు. అంతకుమించి కార్యం తీరును గమనించి, దాన్ని సాధించటానికి నీ బుద్ధి పనిచేయదు. ప్రయోజనాన్ని సాధించుకొనే కార్యనిర్వహణలో యుద్ధం ఒక నీచమైన సాధనం అని రాజనీతి తెలిసిన పెద్దలు చెప్పుతారు.

**విశేషం:** సామం, దానం, భేదం, దండోపాయం - అని రాజులకు నాలుగు సాధనాలుంటాయి. మొదటి మూడు ఫలించనప్పుడు, చివరిదైన దండోపాయం (యుద్ధం) తప్పదు. ఆ స్థితిలోనే దాన్ని ఉపయోగించాలి. కాని, కర్ణుడు, అట్లాకాక, అయినదానికీ, కానిదానికీ కయ్యానికే కాలుదువ్వుతాడు. దానినే కృపాచార్యుడు చెప్పింది.

**క. అగు దేశకాల బల యుత । ముగఁ జేసిన పోర నర్థములు; మోఱకులై**
**తెగఁ బాఱి తమ్ము నెదిరిని । వగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁ దుదిన్. 208**

**ప్రతిపదార్థం:** దేశ= దేశమూ; (ప్రాంతం); కాల= సమయం; బల= బలం (సైన్యం-శక్తిసామర్థ్యాలు); యుతముగన్= కూడుకొన్నట్లు (పై మూటినీ కుదిరించుకొని); చేసిన పోరన్= చేసిన పోరాటంలో (యుద్ధంలో); అర్థములు+అగున్= ప్రయోజనాలు కలుగుతాయి; (దేశ, కాల, బలాలను గమనించక); మోఱకులు+ఐ= మంచిచెడ్డలు తెలియని మూర్ఖులై; తెగన్+పాఱి= మోటుగా సాహసించి; తమ్మున్= తమనూ; ఎదిరిని= పగవాడిని (శత్రువును); వగవక= అంచనా వేసికొనక; తొడరుటలన్= ఎదుర్కొనటంచేత; తుదిన్= కడకు; కీడు= అపాయం (చేటు); వర్తిల్లున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** దేశాన్నీ, కాలాన్నీ, బలాన్నీ సమకూర్చుకొని చేసిన యుద్ధంలో విజయం సిద్ధిస్తుంది. అట్లాకాక, మూర్ఖత్వంతో, సాహసంతో తననూ, శత్రువునూ అంచనా వేసికొనక, పోరాడితే చివరకు చేటు మూడుతుంది.

**విశేషం:** యుద్ధానికీ, దాని విజయానికీ; దేశ, కాల, బలాలకు సంబంధించిన ఆనుకూల్యం అవసరం. దేశం అంటే తనదికాక వేరే దేశం కావచ్చును, లేదా ప్రాంతం కావచ్చును. ఆ ప్రాంతం రాజుతో యుద్ధానికి తలపడేటప్పుడు, ఆ ప్రాంతం (దేశం) తనకు ఎప్పుడు అనుకూలమో (శీతోష్ణస్థితులవలన) గ్రహించుకొనాలి. అంతేకాక, ఇంకా అక్కడ తన అవసరాలకు సరిపడే వస్తు సౌకర్యాలున్నాయా లేవా చూసికొనాలి. ఇది దేశీయమైన గమనిక.

తరువాత కాలసంబంధం అయిన ఆనుకూల్యాన్ని చూడాలి. కాలం అంటే సమయం. ఇది చాలా ప్రధానం. ఏ పనికీ కాలం అనుకూలించాలి. యుద్ధం అనేది చాలా పెద్ద కార్యం. ఏ కాలంలోని యుద్ధం తనకు అనుకూలం, ఏసమయం శత్రువుకు అనుకూలం అన్నదానిని గమనించటం కాలగమనిక.

బలం అంటే సైన్యం. తన బలం ఎంతో, ఎదిరి బలం ఎంతో తెలిసికొనాలి. దీనినే బాగా అంచనా వేసికొనాలి. అప్పుడే విజయం లభిస్తుంది.

**వ. అక్కిరీటి యొక్కరుండ కాఁడె యని తలంతు మేని. 209**

**ప్రతిపదార్థం:** ఆ+కిరీటి= ఆ అర్జునుడు; ఒక్కరుండ కాఁడె= ఒక్కడే కదా; అని తలంతుము+ఏనిన్= అని అనుకొందామంటే.

**తాత్పర్యం:** ఆ అర్జునుడు ఒంటరివాడే కదా అని మనం అనుకొన్నామంటే, (ముందుకు అన్వయం).

**విశేషం:** అర్జునుడు ఒంటరిగా ప్రదర్శించిన ఆతడి పరాక్రమ సన్నివేశాలను కృపాచార్యుడు కర్ణుడితో వివరిస్తున్నాడు.

**సీ. శక్రాది సురలతో సంగ్రామ మొనరించి । ఖాండవం బేర్చె నొక్కరుఁడ కాఁడె!**
**యాదవ బలమెల్ల నాఁగఁ ద్రోచి సుభద్రఁ । గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడ కాఁడె!**
**దిగ్విజయంబునఁ దేజంబు చేసె ని । క్కురువంశమునకు నొక్కరుఁడ కాఁడె!**
**బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ । గౌరవేశ్వరుని నొక్కరుఁడ కాఁడె!**

**ఆ. అని నివాత కవచులను దానవుల నాతఁ । డొక్కరుండ కాఁడె యుక్కు మడఁచె;**
**నమరులకు నజేయులగు కాలకేయుల । నొక్కరుండ కాఁడె యొడిచెఁ గర్ణ! 210**

**ప్రతిపదార్థం:** కర్ణ!= ఓ కర్ణా!; శక్ర+ఆది= ఇంద్రుడు మొదలైన; సురలతోన్= దేవతలతో; సంగ్రామము+ఒనరించి= యుద్ధాన్ని చేసి; ఖాండవంబు+ఏర్చెన్= ఖాండవవనాన్ని కాల్చింది; ఒక్కరుఁడ+కాఁడె!= ఒక్కడే కదా!; యాదవబలము+ఎల్లన్= యాదవులయొక్క సైన్యాన్ని అంతా; ఆఁగన్+త్రోచి= ఆగిపోయేటట్లు వెనక్కు తోసేసి (కమ్ముకొని); సుభద్రన్= బలరామకృష్ణుల

చెల్లెలైన సుభద్రను; కడిమిమైన్= పరాక్రమంతో; తెచ్చెన్= తెచ్చింది; ఒక్కరుఁడ కాఁడె?= ఒక్కడే కదా?; దిగ్విజయంబునన్= అన్ని దిక్కులను జయించటంతో; ఈ= ఈయొక్క; కురువంశమునకున్= కురువంశానికి; తేజంబుచేసెన్= తేజస్సు కలిగించాడు. (కులాన్ని వెలిగించాడు- కీర్తి తెచ్చాడు అన్నమాట); ఒక్కరుఁడ కాఁడె?= ఒక్కడే కదా!; బలముతోన్= సైన్యంతో ఉన్న; గంధర్వపతిన్= గంధర్వరాజైన చిత్రసేనుని; ఓర్చి= ఓడించి; కౌరవ+ఈశ్వరునిన్= కౌరవరాజైన దుర్యోధనుడిని; విడిపించెన్= విడిపించింది; ఒక్కరుఁడ కాఁడె?= ఒక్కడే కదా!; అనిన్= యుద్ధంలో; నివాతకవచులు+అను దానవులను= నివాతకవచులు అనే పేరున్న రాక్షసులను; ఆతఁడు= ఆ అర్జునుడు; ఒక్కరుండ కాఁడె!= ఒక్కడే కదా!; ఉక్కుమడఁచెన్= చంపివేశాడు; అమరులకున్= దేవతలకు; అజేయులు+అగు= జయించటానికి సాధ్యంకానట్టి; కాలకేయులన్= కాలకేయులనే రాక్షసులను; ఒక్కరుండ కాఁడె= ఒక్కడే కదా; ఒడిచెన్= ఓడించాడు.

**తాత్పర్యం:** ఓ కర్ణా! అర్జునుడు ఒంటరివాడు కదా అని అనుకొంటున్నావేమో! ఇంద్రుడు మొదలైన దేవతలందరితో యుద్ధం చేసి ఖాండవాన్ని అర్జునుడు ఒక్కడే గదా దహించింది? సాటిలేని పరాక్రమంతో యాదవసైన్యాన్ని అంతా ఆపి, సుభద్రను తీసికొని వచ్చింది ఒక్కడే కదా? నాలుగు దిక్కులూ జయించి ఈ కురువంశానికి పేరు తెచ్చింది ఆతడు ఒక్కడే కదా? అమితమైన సైన్యంతో వచ్చిన గంధర్వరాజైన చిత్రసేనుడిని జయించి, కురుపతి అయిన దుర్యోధనుడిని విడిపించింది అర్జునుడు ఒక్కడే కదా? భయంకరమైన యుద్ధం చేసి, నివాతకవచులను నాశనం చేసింది అర్జునుడు ఒక్కడే కదా? అట్లాగే దేవతలకే సాధ్యపడని కాలకేయులు అనే దానవులను సంహరించింది ఆ అర్జునుడు ఒక్కడే కదా?

**విశేషం:** అలం: ఉదాత్తం, అంత్యానుప్రాసం. అర్జునుడి పరాక్రమాన్ని నిరూపించే ఆరు సన్నివేశాలను కృపాచార్యుడు కర్ణుడికి వివరించాడు. అర్జునుడి పరాక్రమ నిరూపణకు ఈ ఆరు సన్నివేశాలూ చాలా ప్రధానం అయినవి. అందుకే కృపాచార్యుడు కర్ణుడికి వీటినే చెప్పింది. పైవాటిని గమనించి అయినా కర్ణుడు తగ్గుతాడేమోనని కృపుడి భావం. ఇన్ని సన్నివేశాలలో ఒంటరిగా గెలిచిన విజయుడు, ఇప్పుడు కూడా గెలుస్తాడని సూచన! 'అజేయులు' అనే పదం 'అజయ్యులు' అనే అర్థంలో వాడబడింది. (అజేయులు= జయింపదగనివారు; అజయ్యులు= జయింపశక్యం కానివారు)

ఈ క్రింది పద్యంలోనూ ద్రౌపది స్వయంవర సందర్భాన్ని పురస్కరించుకొని, కృపాచార్యుడు కర్ణుడికి, అర్జునుడి ఒంటరి పరాక్రమాన్ని గురించే వివరిస్తున్నాడు.

ఉద్యోగపర్వం ప్రథమాశ్వాసంలోని 299వ పద్యంలోకూడా తిక్కన 'అజయ్యులు' అనటానికి బదులుగా 'అజేయులు' అని ప్రయోగించాడు. '...నిజానుజన్మ లక్షీణ పరాక్రముల్, సుతు లజేయులు'- ఇతి యతిస్థానం కూడా.

**క. భూవరులెల్లను నొక్కట । ద్రోవదికై తొడరి యతనితోఁ బెనఁగి కడుం**
**జేవ సెడి పోవు నప్పుడు, । నీ వచ్చట గలవొ లేవొ నిక్కము చెపుమా! 211**

**ప్రతిపదార్థం:** భూవరులు+ఎల్లనున్= రాజులందరూ; ఒక్కటన్= ఒకేమారు; (ఒక పర్యాయం అనే అర్థాన్ని కూడా కొందరు చెప్పారు. ఇది నిస్సారమైన అర్థం. కనుక, 'ఒకేమారు; ఒక్కుమ్మడి' అనే అర్థమే గ్రహించబడింది); ద్రోపదికై= ద్రౌపదికొరకు; తొడరి= పూనుకొని (ప్రయత్నించి); అతనితోన్= అర్జునుడితో; పెనఁగి= యుద్ధం చేసి; కడున్+చేవ+చెడి= ధైర్యాన్ని, శక్తిని కోల్పోయి; పోవునప్పుడు= పరాజితులై పరుగెత్తి పోయేటప్పుడు; నీవు= నీవు; అచ్చటన్= ఆ చోట; కలవొ?లేవొ?= ఉంటివా? లేవా?; నిక్కము+అ= నిజాన్నే; చెపుమా!= చెప్పాలి సుమా!

**తాత్పర్యం:** రాజులందరూ ఒకేసారి ద్రౌపదికొరకు పూనుకొని, అర్జునుడితో పోరాడి, చివరకు ధైర్యాన్ని కోల్పోయి పారిపోయేటప్పుడు కర్ణా! నీవు అక్కడ ఉన్నావా? లేవా? నిజం చెప్పుము.

**విశేషం:** పాండవులలో ఒక్కరొక్కరే, ఒక్కొక్క దిక్కును ఎదురులేని పరాక్రమంతో జయించారనీ, పనికిరాని గర్వం నీ కెందుకు అనీ, కృపుడు కర్ణుడిని ఈ క్రింది పద్యంలో అధిక్షేపిస్తూ ఉన్నాడు.

**చ.** **కుంతీనందను లొక్కఁ డొక్కఁడ రిపుక్షోభంబు సంధిల్ల దు**
**ర్దాంత స్వైర పరాక్రమంబులు మహోత్సాహంబునం జేసి; ర**
**త్యంతోదగ్రతఁ బల్కె దీ విచట బాహాశక్తి యిమ్మేదినీ**
**కాంతుం డియ్యకొనంగఁ బూనితి వృథా గర్వంబు నీ కేటికిన్?** **212**

**ప్రతిపదార్థం:** కుంతీనందనులు= కుంతీదేవి కుమారులైన పాండవులు; ఒక్కఁడు+ఒక్కఁడు+అ= ఎవడికి వాడే (విడివిడిగా); రిపు= శత్రువులకు; క్షోభంబు= కలత; సంధిల్లన్= కలిగేటట్లు; మహా+ఉత్సాహంబునన్= అధికమైన ఉత్సాహంతో; దుర్దాంత= అణచటానికి వీలులేని (ఎదురులేని); స్వైర= స్వేచ్ఛతో కూడిన (స్వతంత్రమైన- ఎవరికీ స్వాధీనం కానట్టి); పరాక్రమంబులు= పౌరుషాలు (ప్రతాపాలు); చేసిరి= చూపారు; ఈవు= నీవు; ఇచటన్= ఇక్కడ; బాహాశక్తి= భుజబలాన్ని గురించి; అతి+అంత= మిక్కిలి; ఉగ్రతన్= తీవ్రంగా (గొప్పగా); పల్కెదు= చెప్పుతున్నావు; ఈ+మేదినీ కాంతుండు= రాజైన ఈ దుర్యోధనుడు; ఇయ్యకొనంగన్= మెచ్చుకోగా; పూనితి= యుద్ధం చేయటానికి పూనుకొన్నావు; వృథా= అనవసరమైన (పనికిరాని); గర్వంబు= అహంకారం; నీకున్= నీకు; ఏటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** పాండవులలో ఎవరికి వారే ఒక్కరొక్కరుగా ఎంతో ఉత్సాహంతో శత్రువులకు సంక్షోభాన్ని కలిగించి, ప్రతాపాన్ని చూపి, దిగ్విజయం చేశారు. ఇక్కడ నీవేమో భుజ విక్రమాన్ని గురించి ఎంతో గొప్పగా చెప్పుకొంటున్నావు. ఈ రాజు నిన్ను మెచ్చుకొని నీవు చెప్పేది వింటున్నాడు. కర్ణా! నీకు పనికిరాని గర్వం ఎందుకు?

**తే.** **ఏచి మున్నీరు చేయీఁత నీఁద, నగ్ని । నుఱుక, వాసుకి కోఱలు పెఱుకఁ గడఁగి**
**నట్లు గాదె రాధేయ! నీ వర్జుననకుఁ । బోర నెక్కటి మార్కొనఁ బూను టరయ!.** **213**

**ప్రతిపదార్థం:** రాధేయ!= ఓ కర్ణా! (రాధ పెంపుడు కొడుక!); నీవు= నీవు; అర్జుననకున్= అర్జునుడిని; పోరన్= పోరాటంలో (యుద్ధంలో); ఎక్కటి= ఒంటరిగా; మార్కొనన్= ఎదిరించటానికి; పూనుట= పూనుకొనటం; అరయన్= చూడగా; ఏచి= విజృంభించి (చెలరేగి); మున్నీరు= సముద్రం; చేయీఁతన్= చేతి ఈతతో (వేరే ఆధారం ఏదీ లేకుండా); ఈఁదన్= ఈదటానికీ; అగ్నిన్= నిప్పులో; ఉఱుకన్= దూకటానికీ; వాసుకి= సర్పరాజైన వాసుకియొక్క; కోఱలు పెఱుకన్= కోరలు పీకివేయటానికి; కడఁగిన+అట్లుకాదె?= ప్రయత్నించినట్లే కదా?

**తాత్పర్యం:** ఓ కర్ణా! నీవు ఒక్కడవే అర్జునుడిని ఎదిరిస్తాను - అని అనటం ఎట్లా ఉన్నదంటే- చేతి ఈతతో సముద్రాన్ని ఈదుదామని అనుకొనటంవలె, నిప్పులలో దూకటంవలె, సర్పరాజైన వాసుకి కోరలను పెరకాలని అనుకొనటంవలె ఉన్నది.

**విశేషం:** అలం: మాలోపమ. పైన చెప్పిన మూడు పనులు అసాధ్యాలు అయినట్టివి. ఎవ్వడు కానీ కేవలం చేయాతతో, అంతు తెలియని సముద్రాన్ని దాటటంగానీ, నిప్పులలో నేరుగా దూకటంగానీ, మహా భయంకరుడైన వాసుకి అనే సర్పరాజు కోరలను పీకటంగానీ చేయలేడు. అటువంటి అసాధ్యమైన పనులను చేయగలిగితే, అర్జునుడిని ఎదిరించవచ్చును అని భావం. ఆ పనులను చేయటం సాధ్యం కాదు కనుక, అర్జునుడిని జయించటం వీలుకాదని ధ్వని.

పైమాటలలో, కృపాచార్యుడికి అర్జునుడిపై ఉన్న వాత్సల్యం, ప్రేమ, విశ్వాసం, ఆదరాలే కాక, కర్ణుడిపై ఉన్న నిరాదరణా, అనిష్టతా, రాజును పెడదారి పట్టించకుండా యుక్తియుక్తంగా హితం చెప్పే తీరూ మొదలైన భావాలు కూడా తెలుస్తాయి.

**క.** **బలుగాలిఁ బేర్చు దావా । నల మొక్కరుఁ డార్పఁ బోయినను దీఱునె? నీ**
**చల ముడుగు; సాహసమునం । గలదే మేలెట్లు? నధిపుఁ గావఁగ వలదే?** **214**

**ప్రతిపదార్థం:** బలు= బలమైన (పెద్దదైన); గాలిన్= గాలితో (ఝంఝూమారుతంతో); పేర్చు= అతిశయించిన (చెలరేగిన); దావ= అడవి సంబంధమైన; అనలము= అగ్నిని; (దావాగ్నిని); ఒక్కరుఁడు= ఒంటరిగా ఒక్కడే; ఆర్పన్+పోయినను= చల్లార్చటానికి పోతే; తీఱునె?= సరిపోతుందా? (ఆరిపోతుందా?); నీ= నీయొక్క; చలం= పట్టుదల; ఉడుగు(ము)= విడిచిపెట్టుము; సాహసమునన్= దుస్సాహసంతో; మేలు కలదు+ఏ= మంచి కలుగుతుందా?; ఎట్లు= ఏ రకంగానైనా; అధిపున్= రాజైన దుర్యోధనుడిని; కావఁగన్ వలదే?= కాపాడుకొనాలి కదా!

**తాత్పర్యం:** కర్ణా! పెనుగాలితో పెచ్చుపెరిగి చెలరేగే దావానలాన్ని ఒక్కడు ఎంత ప్రయత్నించినా ఆర్పగలుగుతాడా? నీ పట్టుదల విడిచిపెట్టుము. (ఆలోచన లేని) నీ సాహసంతో మంచి జరుగదు. ఎట్లాగైనా ముందు రాజును కాపాడుకొనాలి కదా!

**విశేషం:** అలం: దృష్టాంతం. అర్జునుడిని ఝంఝామారుతంతో కూడిన దావానలంతో కృపాచార్యుడు పోల్చాడు. ఝంఝూమారుతంతో అగ్ని ఎక్కువగా వ్యాపిస్తుంది. అగ్నికి వ్యాపించే గుణం సహజం. దానికితోడు దానికి మిత్రమైన గాలి కూడా చేరింది. అందులో అది మామూలు గాలి కాదు; ఝంఝూమారుతం. ఇంక చెప్పాల్సిందేముంది? అగ్ని చెలరేగి, అడవినంతా కాలుస్తుంది. అట్లాగే అర్జునుడు, గాలితో కూడిన అగ్నివలె చెలరేగి వస్తున్నాడు. ఇంక ఏమీ మిగలదు. కనుక రాజునైనా కాపాడుకొనాలి అని - అందుకే కృపుడు అన్నది.

**తే.** **కురువిభుండును భీష్ముండు గురుఁడు గురుత । నూభవుండును నీవు నేనును గడంగి**
**కూడుకొని తాఁకుదము, గాక క్రీడితోడ । నొంటి మార్కొనవశమె ముక్కంటికైన?'** **215**

**ప్రతిపదార్థం:** కురువిభుండును= కౌరవరాజైన దుర్యోధనుడూ; భీష్ముండు= కురుపితామహుడైన భీష్ముడూ; గురుఁడు= గురువైన ద్రోణాచార్యుడూ; గురుతనూభవుండును= గురువు కుమారుడైన అశ్వత్థామా; నీవున్= నీవూ (కర్ణుడు); నేనును= నేనూ (కృపాచార్యుడిని); కడంగి= బాగా ప్రయత్నించి (సులువుగా కాదనుట); కూడుకొని= కలసి; తాఁకుదము= (అందరం కలిసి) ఎదిరిద్దాం; కాక= మనం అందరం ఒకటిగా కలిసి కాక, ఎవడికి వాడుగా ఎదిరిస్తే; ముక్కంటికిన్+ఐనన్= ఆ పరమేశ్వరుడికైనా; క్రీడితోడన్= అర్జునుడితో; ఒంటిన్= ఒంటరిగా; మార్కొనన్+వశమె?= పోరాడటం సాధ్యం అవుతుందా?

**తాత్పర్యం:** కురుపతి అయిన దుర్యోధనుడూ, పితామహుడు అయిన భీష్ముడూ, ఆచార్యుడైన ద్రోణుడూ, అశ్వత్థామా, నీవూ, నేనూ అందరం కలిసి అర్జునుడిని ఎదిరించుదాం. మనమంతా కలిసి కాక, విడివిడిగా ఆతడిని ఎదిరించాలంటే, ఆ ముక్కంటికే శక్యం కాదు, ఇంక మన కెట్లా వీలవుతుంది?'

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. కిరాతార్జునీయ కథను ఈ సందర్భంలో అన్వయించుకొనాలి. అర్జునుడి బలానికి మెచ్చిన శివుడు పాశుపతాస్త్రాన్ని అనుగ్రహించాడు.

### కర్ణుఁడు కృపాచార్యు నధిక్షేపించి పలుకుట (సం. 4-46-1)

**క. అని పలికిన సంరంభం। బున నినసుతుఁ డిట్టులను 'రిపులయెడఁ జిత్తం**
**బున నీవు ప్రియము గలుగుటఁ। గనికని నినుఁ దోడు పిలువఁగాఁ బతి బేలే! 216**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= కృపాచార్యుడు పైవిధంగా చెప్పగా; ఇనసుతుఁడు= సూర్యుడి కుమారుడైన కర్ణుడు; సంరంభంబునన్= ఆర్భాటంతో (సరభసంగా); ఇట్టులు+అనున్= (కృపుడితో) ఇట్లా అంటాడు; రిపుల యెడన్= శత్రువుల పైన; చిత్తంబునన్= (నీ) మనస్సులో; నీవు= నీవు; ప్రియము+కలుగుటన్= అభిమానం (ప్రేమ) కలిగి ఉన్నావని; కనికని= బాగా చూచి(తెలిసి) కూడా; నినున్= శత్రువులపై ప్రేమ ఉన్న నిన్ను; తోడు= తోడుగా (కూడా); పిలువఁగాన్= రమ్మని పిలిచినదానికి; పతి= రాజైన ఈ దుర్యోధనుడు; బేల+ఏ!= అమాయికుడే!

**తాత్పర్యం:** కృపాచార్యుడు పైవిధంగా కర్ణుడిని మందలిస్తే దానికి కర్ణుడు సంరంభంతో ఇట్లా అంటున్నాడు. 'నీవు మనస్సులో శత్రువులమీద అభిమానం ఉండేవాడివని బాగా తెలిసికూడా, నిన్ను తోడుదెచ్చుకొన్న రాజైన దుర్యోధనుడు, ఏమైనా అమాయికుడే!

**విశేషం:** కర్ణుడు, కృపాచార్యుడిని ఆక్షేపిస్తూనే, దుర్యోధనుడి అమాయకత్వాన్నీ సూచించాడు. అమాయకత్వం మంచితనంలో ఒక భాగం. అందువలన కర్ణుడు దుర్యోధనుడి మంచితనాన్ని కూడా ప్రశంసించాడు. రాజు మంచివాడు, అమాయకుడు కాబట్టే నీవంటి వాళ్ళ (శత్రు పక్షపాతం ఉండేవాళ్ళ) ఆటలు సాగుతున్నాయనీ ధ్వని. అసలు కర్ణుడి మాటలలో ప్రధానంగా, పెద్దలను నిరసించటం, నిందించటం వంటి భావాలు చాలా వ్యక్తమవుతాయి. ఇవన్నీ, కర్ణుడి అహంకారాన్నే సూచిస్తాయి. అంతేకాక, తానొక్కడే నిజంగా రాజుక్షేమాన్ని కోరేవాడు - అనే అభిప్రాయం గోచరించేటట్లు చేస్తాయి. ఇది ఆతడి మనస్తత్త్వం. తిక్కన మహాకవి. కర్ణపాత్రను ఎంతో సూక్ష్మంగా పరిష్కరించాడు.

**క. ఏలిన వాని ధనంబులు। బాలురు బంధువులుఁ దారు బ్రదికిన దినముల్**
**వేలారిచి తిం; డ్రాతని। యోలముగని పిదప భీతి నొదుఁగుదు రాజిన్. 217**

**ప్రతిపదార్థం:** ఏలినవాని= పాలించే రాజుయొక్క; ధనంబులు= సొమ్ములూ; బాలురు= పిల్లలూ; బంధువులున్= చుట్టాలూ; తారు= తమరూ; బ్రదికినదినముల్= బ్రదికున్నంతదాకా (చచ్చేవరకూ); వేలారిచి= సమృద్ధిగా; తిండ్రు= తింటారు; ఆతని= ఆ రాజుయొక్క; ఓలము+కని= కష్టాన్ని చూసి; పిదపన్= తరువాత; ఆజిన్= యుద్ధంలో; భీతిన్= భయంతో; ఒదుఁగుదురు= (దొంగగా) ముడుచుకొంటారు (తప్పించుకొంటారు);

**తాత్పర్యం:** పిల్లలూ, చుట్టాలూ, తామూ బ్రదికినంతవరకూ రాజుగారి ధనాన్ని కావలసినంతగా తింటారు. ఆ రాజుకే ఆపద వస్తే యుద్ధంలో భయంతో వెనక్కు ఒదిగి తప్పుకొంటారు.

**విశేషం:** ఇందులో కర్ణుడు, పరోక్షంగా కృపాచార్యుడినే కాక, ద్రోణుడు మొదలైన వాళ్ళను కూడా ఆక్షేపిస్తున్నాడు. సమయం వచ్చినప్పుడు చల్లగా జారుకొంటారనీ, శత్రువులపై మనసులో అభిమానాన్ని నిలుపుకొంటారనీ, చాలా నీచంగా కర్ణుడు కృపాదులను ఆక్షేపించాడు. ఈ తరువాతి పద్యంలో కూడా, ప్రత్యేకించి కృపాచార్యుడిని ఇంకా నిందించాడు.

**క. జన్నములు సేయునెడఁ బ । క్వాన్నంబులు గుడుచుచుండు; మధిపతి నిన్నున్**
**జన్నియ విడిచె రణముతఱి; । మిన్నక కినువడక పొమ్ము మీగృహమునకున్. 218**

**ప్రతిపదార్థం:** జన్నములు+చేయు+ఎడన్= యాగాలు చేసేచోట; పక్వ+అన్నంబులు= వండిన అన్నాలు; కుడుచుచున్+ఉండుము= తింటూ ఉండుము; రణముతఱిన్= యుద్ధంవచ్చిన సమయంలో; అధిపతి= రాజు (దుర్యోధనుడు); నిన్నున్= నిన్ను; జన్నియవిడిచెన్= ఆబోతువలె వదిలాడు; మిన్నక= ఊరికే; కినువు+పడక= కోపగించుకొనక; మీ= మీయొక్క; గృహమునకున్+పొమ్ము= ఇంటికి వెళ్ళుము.

**తాత్పర్యం:** యజ్ఞాలు జరిగే చోటికి వెళ్ళి, తృప్తిగా బాగా వండిన భోజనాలను తింటూ ఊరకనే కూర్చో. రాజు, నిన్ను యుద్ధంలో ఆబోతును విడిచినట్లు విడిచిపెట్టాడు. అనవసరంగా కోపపడక, ఇంటికి వెళ్ళుము.

**విశేషం:** గ్రామాలలో ఆబోతును విడుస్తారు. దానిని ఎవరూ ఏమీ అనరు. అది ఎవరి పొలాలలో పైర్లు మేసినా కొట్టరు. అంటే దానికి అడ్డు లేదు. దానిని పవిత్రంగా చూస్తారు. కర్ణుడి దృష్టిలో కృపాచార్యుడు ఆబోతు. రాజు యుద్ధంలో ఆతడిని విచ్చలవిడిగా విడిచాడని కర్ణుడి నింద. రాజే నిన్ను అట్లా వదిలేశాడు కనుక ని న్నేమీ అనరాదు అని కర్ణుడు మరోచోట అంటాడు. ఇది కర్ణుడి మాన్య తిరస్కారానికీ, ఆతడి అహంకారానికీ నిదర్శనం.

**తే. ఏను విల్లందుకొనిన నీరేడు భువన । ములును వడవడ వ డఁకు; నా యలఘు బాహు**
**బలముఁ దలఁపక పలికితి; పార్థుఁ డనఁగ । నెంతవాఁ డొక్కరథికున కింత యేల?' 219**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; విల్లు= ధనుస్సు; అందుకొనినన్= చేతికి తీసికొనగానే; ఈరు+ఏడు(ఈరేడు)= రెండేడులు (7+7); పద్నాలుగు అయిన; భువనములును= లోకాలు కూడా; వడవడ వడఁకున్= గడగడలాడుతూ వణికిపోతాయి; నా= నా యొక్క; అలఘు= లఘువుకాని (అధికమైన); బాహుబలమున్= భుజశక్తి; తలఁపక= ఆలోచించక; పలికితివి= అట్లా అన్నావు; పార్థుఁడు= అర్జునుడు; అనఁగన్+ఎంతవాఁడు= అంటే ఎంతవాడు?; ఒక్క= ఒక్కడైన; రథికునకున్= రథంపైనుండి యుద్ధంచేసే వీరుడికి; ఇంత+ఏల?= ఇంతగా అనుకొనాలా? (భయపడాలా? ఏమి?)

**తాత్పర్యం:** నేను విల్లును చేపట్టితే ఈ పదునాలుగు భువనాలూ గడగడ వణకిపోతాయి. నా భుజబలాన్ని లెక్కించకుండా అట్లా పలికావు. అర్జును డంటే ఎంత? ఒక రథికుడు. అంతేకదా! అతడిని గురించి ఇంతగా ఎందుకు భయపడాలి?'

**వ. అనియె; నిత్తెఱంగున నందఱుఁ బలుకు పలుకులెల్ల వినుచు గాంగేయుండు కౌరవేశ్వరు నుద్దేశించి ధర్మార్థ సంగతంబును సువిహితంబుగా నిట్లను; 'ద్రోణాచార్యుండు నీతి పథంబునం బలికె, నాచార్యతనయు వచనంబు లుచితంబులు; కృపాచార్యుం డాడిన చందంబును దెఱంగువడియున్నయది; మన్ననగల మానిసియగుట నంగ రాజునకు సంగరపాటవంబు మాటలు దగుంగాక; మాన్యుల నధఃకరింపనగునే?' యని వెండియు. 220**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; ఈ+తెఱంగునన్= ఈవిధంగా; అందఱున్= అందరూ; పలుకు పలుకులు+ఎల్లన్= పలికే మాటలను అన్నింటినీ; వినుచున్= వింటూ; గాంగేయుండు= గంగ కుమారుడైన భీష్ముడు; కౌరవ+ఈశ్వరున్= కురురాజైన దుర్యోధనుడిని; ఉద్దేశించి= గురించి; ధర్మ+అర్థ+సంగతంబును= ధర్మప్రయోజనంతో కూడింది; సువిహితంబుగాన్= బాగా స్పష్టమయ్యేటట్లు; (కూడుకొనేట్లు); ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; ద్రోణ+ఆచార్యుండు= ఆచార్యుడైన ద్రోణుడు; నీతి పథంబునన్= నీతి మార్గంలోనే; పలికెన్= మాట్లాడాడు; ఆచార్యతనయు వచనంబులు= ద్రోణాచార్యుడి కొడుకైన అశ్వత్థామ మాటలు; ఉచితంబులు= యోగ్యమైనవి; కృపాచార్యుఁడు= ఆచార్యుడైన కృపుడు; ఆడిన చందంబును= పలికిన పద్ధతి; తెఱంగు+పడి, ఉన్న+అది= మంచి పద్ధతిలో సాగి ఉన్నది; మన్నన గల మానిసి+అగుటన్= రాజుయొక్క ఆదరం పడసిన మనిషి కావటంచేత; అంగరాజునకున్= కర్ణుడికి; సంగరపాటవంబు, మాటలు= యుద్ధప్రగల్భాలు; తగున్+కాక= తగినవి కావచ్చు; మాన్యులన్= గౌరవించదగినవారిని; అధఃకరింపన్+అగునే?= తక్కువ చేయవచ్చునా?; అని= అనిపలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** పైవిధంగా కర్ణుడు అన్నాడు. ఇట్లా అందరూ అన్ని రకాలుగా మాట్లాడిన మాటలన్నీ భీష్ముడు వింటూ, దుర్యోధనుడితో ధర్మప్రయోజనం కలిసివచ్చేటట్లుగా ఇట్లా అన్నాడు. 'ఆచార్యుడైన ద్రోణుడు నీతి పద్ధతిలో మాట్లాడాడు. అశ్వత్థామ పలుకులూ ఉచితమైనవే! కృపాచార్యుడు పలికిన పద్ధతీ సవ్యంగానే ఉన్నది. కర్ణుడు, రారాజుమన్ననకు పాత్రుడైన మనిషి కాబట్టి యుద్ధ చాతుర్యంతో కూడిన మాటలను మాట్లాడటం తగివుంది. కాని, గౌరవించదగిన వాళ్ళను తక్కువచేసి మాట్లాడవచ్చా?' అని అంతటితో ఆగక ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ద్రోణుడూ, అశ్వత్థామా, కృపాచార్యుడూ, కర్ణుడూ మాట్లాడిన మాటలలో వారివారి మనస్తత్త్వాలు తెలిశాయి. పైవారి మాటలలోని అసలు సారాన్ని భీష్ముడు విశ్లేషణాత్మకంగా విమర్శనాదృష్టితో రాజుకు వివరించాడు. ఇది భీష్ముడి వ్యక్తిత్వాన్ని నిరూపిస్తుంది. కురుపితామహుడిగా, రాజనీతిజ్ఞుడుగా భీష్ముడు పైవారి సంభాషణలను పరామర్శించి, ఎవరితప్పూ లేదని అంటూ, కర్ణుడు మాత్రం, మాన్యులను తక్కువచేసి, అవమానించి మాట్లాడటం సమంజసమౌతుందా? అని దుర్యోధనుడితో అన్నాడు. దీనివలన, ధర్మపరమైన భీష్ముడి సూక్ష్మదృష్టి అవగతం అవుతుంది.

తరువాతి పద్యంలో కూడా భీష్ముడు, కర్ణుడి మాటలనే విమర్శిస్తాడు. అట్లాగే తరువాతి రెండు పద్యాలలోనూ భీష్ముడు కర్ణుడి మనస్తత్త్వాన్ని రాజుతో విమర్శిస్తాడు. ద్రోణుడూ, అశ్వత్థామా, కృపుడూ ముగ్గురూ అర్జునుడిని ప్రశంసిస్తారు. ఆ ముగ్గురినీ కర్ణుడు ఆక్షేపిస్తాడు. వీళ్ళలో వీళ్ళు మనస్పర్థలతో వాదించుకొంటూ ఉంటే చివరలో భీష్ముడు, పై ముగ్గురినీ మెచ్చుకొని, కర్ణుడిని తీవ్రంగా విమర్శించటం (అదీ రాజుతో) జరిగింది. ఇన్నిరకాల మనోభావాలను తిక్కన సూక్ష్మంగా చిత్రించి, వారి వ్యక్తిత్వాలను తీర్చిదిద్దాడు. ఇదే ఆయన ప్రత్యేకత.

**ఆ. 'నేల ప్రొద్దెఱింగి చాలుమానిసి రణో। ద్యమ మొనర్చి కాక, తగినవారి**
**చెవికిఁ జేదుగాఁగ నవమాన వాక్యంబు। లుడుగ కిట్లు పలుకు టొప్పు నెట్లు? 221**

**ప్రతిపదార్థం:** నేల= దేశమూ; ప్రొద్దు= కాలమూ; ఎఱింగి= తెలిసికొని; చాలు మానిసి= సమర్థుడైన మనిషి; రణ+ఉద్యమము= యుద్ధానికి సంబంధించిన ప్రయత్నం; ఒనర్చి+కాక= చేస్తే కాని; తగినవారి చెవికిన్= యోగ్యులైనవాళ్ళ చెవులకు; చేఁదు+కాఁగన్= వెగటుగా (కటువుగా); ఉడుగక= వెనుకాడక; ఇట్లు= ఈ రకంగా; అవమాన వాక్యంబులు= అగౌరవమైన మాటలు; పలుకులు= మాట్లాడటం; ఎట్లు+ఒప్పున్?= ఎట్లా కుదురుతుంది? (ఏం బాగుంటుంది?).

**తాత్పర్యం:** 'దేశాన్నీ, కాలాన్నీ గమనించిన సమర్థుడైనవాడు యుద్ధం చేయటానికి తగినట్లు ప్రయత్నం చేస్తే సరిపోతుంది, కాని, యోగ్యులైనవారి చెవికి కటువుగా, అమర్యాదగా మాట్లాడటం మాత్రం తగదు.

**విశేషం:** ఇందులో కర్ణుడు దేశ, కాలాల్ని తెలియనివాడనీ, యోగ్యులైన ద్రోణుడు మొదలైన మాన్యులను అవమానంగా మాట్లాడటం తగదనీ భీష్ముడు దుర్యోధనుడికి చెప్పుతున్నాడు.

**క. బీరము లావును మిగులఁగ । వైరులు తతియైనఁ దొడర వచ్చినచోటన్**
**దూరమున నెరవుతోడి వి । చారము గలుగు టిది దగదె సద్బుద్ధులకున్. 222**

**ప్రతిపదార్థం:** బీరము= పరాక్రమమూ; లావును= బలమూ; మిగులఁగన్= అధికం కాగా; వైరులు= శత్రువులు; తతి+ఐనన్= సమయం వస్తే; తొడరవచ్చిన= ముట్టడించటానికి వచ్చినట్టి; చోటన్= తావులో; దూరమునన్= దూరంలో ఉండగానే; నెరవుతోడి= ఉపాయంతో కూడిన; విచారము= ఆలోచన; కలుగుట= కలగటం; సత్+బుద్ధులకున్= జ్ఞానం కలిగినవాళ్ళకు (తెలివైనవాళ్ళకు); ఇది= ఈ కలగటం; తగదె!= తగిందే కదా!

**తాత్పర్యం:** బలం, ప్రతాపం అతిశయించేటట్లు శత్రువులు చుట్టుముట్టినప్పుడు తెలివిగలవాళ్ళు, దూరంగా ఉండగానే, ఉపాయంతో, ఆ శత్రువులను గూర్చి ఆలోచించటం మంచిదే కదా!

**విశేషం:** ఈ పద్యంలో కూడా భీష్ముడు ద్రోణాదుల మాటలను సమర్థిస్తూ, కర్ణుడి పద్ధతిని విమర్శిస్తున్నాడు. అంతేగాక, కర్ణుడికి తుదిమొదలు తెలీదనీ అంటున్నాడు. ఇందులో ద్రోణాదుల రాజనీతి కౌశలం కూడా సూచించబడింది. తెలివైన ద్రోణాదులు శత్రువును గూర్చి దూరాన్నించే ఆలోచించారనీ, వారు మహాత్ములనీ భీష్ముడి అభిప్రాయం.

**ఆ. అరుల గుణములైన నగ్గింతు రెప్పుడుఁ; । గలయ బెరసినపుడు కలితనంబు**
**మెఱయుదురు మహాత్ము; లెఱుఁగఁడు తుదిమొద । లెట్టివారి నితఁడు బెట్టు పలుకు. 223**

**ప్రతిపదార్థం:** మహాత్ములు= మహిమగలవారు (గొప్పవారు); అరుల= శత్రువులయొక్క; గుణములు+ఐనన్= గుణాలను అయినా; ఎప్పుడున్= ఎల్లప్పుడూ; అగ్గింతురు= పొగడుతారు; కలయ బెరసినపుడు= కలియబడినప్పుడు (పోట్లాడినప్పుడు); కలితనంబు= సామర్థ్యాన్ని; మెఱయుదురు= ప్రకాశింపజేస్తారు; ఇతఁడు= ఈ కర్ణుడు; తుది+మొదలు= ఒకవిషయం యొక్క మంచిచెడ్డలు; (ఆద్యంతాలు); ఎఱుఁగఁడు= తెలిసికొనడు (తెలియదు); ఎట్టివారిన్= ఎంతటి వాళ్ళనైనా (ఎంత గొప్పవాళ్ళనైనా); బెట్టు పలుకున్= కఠినంగా మాట్లాడతాడు.

**తాత్పర్యం:** మహాత్ములైన వాళ్ళు ఉదారంగా, శత్రువుల గుణాలను కూడా పొగడుతారు. పోరాటంలో పరాక్రమాన్ని చూపుతారు. ఈ కర్ణుడు తుదిమొదలు ఎరుగడు. ఎంత గొప్పవాళ్ళను గురించి అయినా దురుసుగా మాట్లాడతాడు.

**విశేషం:** ఇందులో పితామహుడైన భీష్ముడు కర్ణుడిని కేవలం ఒక అహంకారిగా, అజ్ఞానిగా భావించి మాట్లాడాడు.

**వ. ఆచార్యులైన వారలు పూజా వాక్యంబుల కర్హులు గాక గర్హించుటకు విషయంబె?' యనుచుఁ గృపాశ్వత్థామల కరంబులకు నిజపాణి పుటంబులు సాఁచి యిట్లనుఁ 'బని చాలినంత గలదు; వివ్వచ్చుండు వచ్చుచున్నవాఁడు; విరోధంబునకు సమయంబు గాదు; మనమందఱముం గూడికొని కయ్యంబు సేయుదము; బలవద్వ్యసనంబు నందు భేదంబు గలుగు టొప్పదని బుధులు సెప్పుదురు; వేదంబు లొక్కవలనను, ధనుర్వేదం బొక్కవలనను, గల మీయట్టి మహానుభావు లెందునుం గలరె? కురుబలంబున కొకటి పుట్టినం బ్రసిద్ధులరు గావున నది మీతలన నిలుచు; నట్లగుటం జేసి. 224**

**ప్రతిపదార్థం:** ఆచార్యులైనవారలు= పూజించదగిన గురువులు; పూజావాక్యంబులకున్+అర్హులు= పూజించటానికి తగిన మాటలకు; అర్హులు+కాక= యోగ్యులుకాక; గర్హించుటకున్= నిందించటానికి; విషయంబె?= ఆధారం అయిన వారా? (కాదు); అనుచున్= అంటూ; కృప+అశ్వత్థామల, కరంబులకున్= కృపాచార్యుడియొక్క, అశ్వత్థామయొక్క చేతులకు; నిజపాణి పుటంబులు= తన చేతి ముందు భాగాలను; చాఁచి= ముందుకు చాచి (స్నేహాదరచిహ్నంగా చేయికలిపి); ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; పని, చాలిన అంత= చేయవలసిన పని కావలసినంతగా (ఎంతో); కలదు= ఉన్నది; విివ్వచ్చుండు= అర్జునుడు; వచ్చుచున్+ఉన్నవాఁడు= వస్తున్నాడు; విరోధంబునకున్= మనస్పర్థలకు; సమయంబు కాదు= తగిన కాలం కాదు; మనము+అందఱమున్+కూడికొని= మనందరం ఏకమై; కయ్యంబు+చేయుదము= యుద్ధం చేద్దాం; బలవత్+ వ్యసనంబునందున్= బలవంతులైనవాళ్ళతో విరోధంవలన కలిగిన సమస్యలో (కష్టంలో); భేదంబు= విభేదం (అంతఃకలహం); కలుగుట= ఏర్పడటం; ఒప్పదు+అని= మంచిదికాదని; బుధులు= పండితులు; చెప్పుదురు= చెప్తుతారు; వేదంబులు= వేదాలు; ఒక్కవలనను= ఒక ప్రక్కనూ; ధనుర్వేదంబు= విలువిద్యకు సంబంధించిన వేదం; ఒక్కవలనను= మరొకవైపునను; గల= ఉన్న (అంటే ఉభయ వేదమార్గాలలో పండితులని భావం); మీ+అట్టి; మహానుభావులు= మీవంటి గొప్పవారు; ఎందునున్+కలరె?= ఎక్కడైనా ఉన్నారా? (లేరని భావం); కురుబలంబునన్= కౌరవసైన్యంలో; ఒకటి, పుట్టినన్= ఏదైనా ఒకటి (కీడు) కలిగితే; ప్రసిద్ధులరు, కావునన్= కీర్తి కెక్కినవారు కాబట్టి; అది= ఆ బాధ్యత; మీ తలన్+అ= మీ మీదే; నిలుచున్= పడుతుంది; అట్లు+అగుటన్+చేసి= కాబట్టి.

**తాత్పర్యం:** ఆచార్యులైన పెద్దలు గౌరవవాక్యాలకే అర్హులు కాని, నిందకు కాదు' అని అంటూ భీష్ముడు కృప, అశ్వత్థామల చేతులను తన అరచేతులను చాపి తాకుతూ, ఇట్లా అన్నాడు. 'ఎంతో పని ఉన్నది, అదుగో అర్జునుడు వస్తున్నాడు. ఇది విరోధానికి సమయం కాదు, మనం అందరం కలిసి పోరాడుదాం. బలవంతుడైన శత్రువుతో పోరాడవలసినప్పుడు అంతఃకలహం మంచిది కాదు - అని పెద్దలైన పండితులు అంటారు. వేదాన్నీ, ధనుర్వేదాన్నీ అభ్యసించిన మీవంటి మహానుభావులు ఎక్కడైనా ఉన్నారా? కురుసైన్యంలో ఏదైనా సంభవిస్తే, మీరు ప్రధానులు కనుక, అది పరిష్కరించే బాధ్యత మీదే కనుక. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** పెద్దలైన ద్రోణాదులు కర్ణుడి మాటలకు ఎక్కడ నొప్పిపడి కోపిస్తారో అనే జంకుతో, భీష్ముడు అంతటివాడు, వాళ్ళను వినయపూర్వకంగా ప్రార్థించటం ఇందులో ప్రధాన విషయం. 'కురుసైన్యంలో ఏదైనా జరగరానిది జరిగితే, అది మీమీదికే వస్తుంది' అని భీష్ముడు ద్రోణాదులను హెచ్చరించినట్లు, బ్రతిమిలాడినట్లు కూడా అనిపిస్తుంది. బ్రహ్మజ్ఞాన సంపన్నుడైన భీష్ముడు పూజ్యులైన ఆచార్యులను క్షమించండని తరువాతి పద్యంలో ప్రార్థిస్తాడు. ఇది భీష్ముడి వినయానికీ, విధేయతకూ, పూజ్యులపై ఉన్న భక్తిగౌరవాలకూ నిదర్శనం. అంతేగాక, 'బలవద్వ్యసనంబునందు భేదంబు గలుగు టొప్పదని బుధులు సెప్పుదురు' అనే మాటలలో ఆయన రాజనీతి, తత్త్వజ్ఞత వ్యక్తం అవుతాయి. ఈ వచనంలోనే కాక, తరువాతి కందపద్యంలో కూడా భీష్ముడు ద్రోణాదులను బ్రతిమాలటం ఉన్నది. ఈ సందర్భంలో భీష్ముడు చొరవ తీసికొనకపోతే పరిస్థితి వేరుగా ఉండేదే. అందుకే మంచి అదనులో ఆయన దిగాడు. పరిస్థితి సర్దుబాటు అయింది.

**క. క్షమియింప వలయు, నొకఁ డెఱుఁ । గమి నేమే నన్న నంతఁ గటకటఁ బడి భూ**
**రమణుని కార్యస్థితి చి । త్త ములం దెడ సేయునట్టి తరమే మీరల్?' 225**

**ప్రతిపదార్థం:** క్షమియింప వలయున్= క్షమించాలి (అభ్యర్థన); ఒకఁడు= ఒకానొక; మనిషి (అజ్ఞాని); ఎఱుఁగమిన్= తెలియనితనంతో; ఏమి+ఏన్+అన్నన్= ఏమైనా అన్నట్లు అయితే; అంతన్= అంతలోనే; (అప్పుడే-వెంటనే); కటకటన్+పడి= బాధపడి కోపగించి; భూరమణుని= రాజైన దుర్యోధనుడి యొక్క; కార్యస్థితి= పని తీరును; చిత్తములందున్= మనస్సులలో; ఎడ+చేయు+అట్టి= దూరం చేసేటి (వదలి పెట్టేటి); తరమేమీరల్?= తరహా వారా మీరు? (కాదని భావం).

**తాత్పర్యం:** క్షమించాలి. తెలియక ఒకడు ఏదో అంటే, అప్పుడే మీరు కోపించి, రాజు పని నిర్వహించే బాధ్యతను విడిచిపెట్టేటంతటి వారా?' (అంటే- అంత తక్కువవారా?- కారు అని భావం).

**విశేషం:** ఈ పద్యంలోనూ భీష్ముడు ద్రోణాదులను క్షమించండని ప్రార్థించి, మహోన్నతమైన ఆయన వ్యక్తిత్వాన్ని చూపుతున్నాడు. భీష్ముడి దృష్టిలో కర్ణుడు ఒక అనామకుడు, అజ్ఞాని. అందుకే అటువంటి వాడి మాటలను పట్టించుకొనవద్దని, రాజుపనిని చెడగొట్టవద్దని అనటం.

**వ. అనిన విని వార లిట్లనిరి. 226**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= పైవిధంగా భీష్ముడు ప్రార్థించగా విని; వారలు= కృపాదులు; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** భీష్ముడు, కర్ణుడి తరపున క్షమించుమని కృపాదులను ప్రార్థించగా, అందుకు వారు ఇట్లా బదులు పలుకుతున్నారు.

**క. 'క్షమియింప నెవ్వరము? భూ । రమణుని కార్యమున కెవ్వరము? ద్రోణుల చి**
**త్తము శాంతి వొందఁ జేయుట । మముఁ దెలచుట; యిట్టు లేల మాకొలఁదులకున్?' 227**

**ప్రతిపదార్థం:** క్షమియింపన్+ఎవ్వరము?= క్షమించటానికి మేము ఎవ్వరం?; భూరమణుని= రాజైన దుర్యోధనుడి యొక్క; కార్యమునకున్= పనికి; ఎవ్వరము= మే మెవ్వరము? (మాకేమి సంబంధం)?; ద్రోణుల= ద్రోణులవారియొక్క; చిత్తము= మనస్సు; శాంతి+పొందన్+చేయుట= శాంతింపచేయటం; మమున్= మమ్ములనుకూడా; తెలచుట= మన్నించుటయే; మాకొలఁదులకున్= మాఅంత చిన్నవాళ్ళకు; ఇట్టులు+ఏల?= ఇంత (మర్యాద) ఎందుకు?

**తాత్పర్యం:** 'క్షమించటానికి మే మెవరం? రాజకార్యాన్ని నెరవేర్చటానికి మే మెంతవారం? ద్రోణులవారి మనస్సు శాంతిస్తే చాలు. మేమూ శాంతించినట్లే! మాబోటివాళ్ళకు ఇంత పెద్ద మర్యాద ఎందుకు?

**విశేషం:** కర్ణుడి నోటి దురుసుతనానికి, ఎక్కడ రాజకార్యం చెడిపోతుందో అనే అనుమానంతో, భీష్ముడంతటివాడు, కృపాశ్వత్థామలను క్షమించుమని వేడుకొంటాడు. పైఇద్దరికన్నా, భీష్ముడు జ్ఞానవయోవృద్ధుడు, తపస్వి, పైగా కురుపితామహుడు. అట్లా వేడుకొన్న భీష్ముడితో వారు క్షమించేందుకు మే మెవరం?' అని అంటూ ద్రోణుడితో ముడిపెడతారు. అంటే ద్రోణుడు ముందుగా శాంతించాలనీ, ఆతడు ప్రసన్నుడైతే, తమది ఏమీ లేదనీ అంటారు. పైగా తమంత చిన్నవాళ్ళకు అంత మర్యాద ఎందుకు?- అని కూడా వారు భీష్ముడితోనే అంటారు. ఇందులో ఒకవైపు ఎత్తిపొడుపు కనిపించినా, మరోప్రక్క, 'మీఅంత పెద్దలు మాఅంత చిన్నవాళ్ళను ఇంత బ్రతిమిలాడాలా? ద్రోణులను శాంతపరచండి. చాలు' అనే ధ్వని కూడా ఉన్నది.

'ద్రోణులు' అనే బహువచన ప్రయోగంతో ద్రోణులపై పూజ్యభావం సూచితం. అంతేగాక, ఆతడి ఆచార్యకత్వాన్నీ, దాని ప్రాధాన్యాన్నీ కూడా సూచించినట్లే అయింది. ఇది అంతా మనస్తత్త్వాలకు సంబంధించింది. తిక్కన వంటి మనస్తత్త్వవేత్త తెలుగులో అరుదు. ఆయన ప్రతిపాదించిన ప్రతి భావం పాత్రయొక్క మనస్సును తెలిపేదిగానే ఉంటుంది.

**వ. అనిన విని, గాంగేయ కర్ణులం గూర్చికొని కురుపతి గురునిం బ్రార్థించి యశ్వత్థామను వేఁడికొని కృపాచార్యులం దేర్చినం, బ్రసన్నుండయి యోధవీరులం గలయం గనుంగొని ద్రోణాచార్యుం డిట్లనియె. 228**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= కృపుడూ, అశ్వత్థామా భీష్ముడితో పైవిధంగా చెప్పగా విని; గాంగేయ= గంగానందనుడైన భీష్ముడినీ; కర్ణులన్= కర్ణుడినీ; కూర్చికొని= కలుపుకొని; కురుపతి= కురురాజైన దుర్యోధనుడు; గురునిన్= ద్రోణుడిని; ప్రార్థించి= వేడికొని; అశ్వత్థామను; వేఁడికొని= బ్రతిమిలాడి; కృపాచార్యులన్; తేర్చినన్= ప్రసన్నుడిని చేసికొనగా; ప్రసన్నుండు+అయి= సుముఖుడై; ద్రోణ+ఆచార్యుండు; యోధవీరులన్= పరాక్రమవంతులైన వీరులను; కలయన్+కనుంగొని= కలయచూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలను విని దుర్యోధనుడు భీష్ముడినీ, కర్ణుడినీ కూడ దీసికొని గురువైన ద్రోణుడిని ప్రార్థించాడు. అశ్వత్థామను బ్రతిమిలాడి వేడుకొన్నాడు. కృపుడిని శాంతింపచేశాడు. అప్పుడు ఆచార్యుడైన ద్రోణుడు సంతృప్తిచెంది, ప్రసన్నుడై, వీరులను అందరినీ కలయచూచి ఈ రకంగా అన్నాడు.

**తే.** **'అలుక భీష్ముని పలుకుల యపుడ పోయె; । మీఁది కార్యంబు నడపుఁడు మీర; లింక**
**మోహ సాహసములఁ గురుముఖ్యు దెసకుఁ । గీడు రాకుండఁ దగఁ బరికింప వలయు.** **229**

**ప్రతిపదార్థం:** అలుక= (నా) కోపం; భీష్ముని= భీష్ముడియొక్క; పలుకులన్= మాటలతోనే; అపుడు+అ= అప్పుడే; పోయెన్= పోయింది; మీరలు= మీరు; ఇంకన్= ఇకముందు; మీది కార్యంబు= ముందుపని; నడపుఁడు= నడిపించండి; మోహసాహసములన్= వ్యామోహంతోకానీ, సాహసంతోకానీ; కురుముఖ్యు దెసకున్= దుర్యోధనుడికి; కీడు రాకుండన్= అపాయం రాకుండా; తగన్= తగునట్లు; పరికింపవలయున్= బాగా చూడాలి.

**తాత్పర్యం:** 'నా కోపం భీష్ముడి మాటలతోనే తొలగిపోయింది. మీరు ఇంక కావలసిన ముందు పని నడపండి. వ్యామోహంతో, సాహసంతో రాజైన దుర్యోధనుడికి అపాయం రాకుండా చూడాలి.

**విశేషం:** భీష్ముడి మాటలతోనే నా కోపం పోయింది - అని ద్రోణుడు అనడంలో, బ్రాహ్మణుల కోపం క్షణికం అని, అది తాటాకు మంటవంటిది అని తెలుస్తుంది. 'ఆచార్యుండు నీతి పథంబునం బలికె' అన్నది భీష్ముడి మొదటి మాట. ఆ మాటతోనే ద్రోణుడు తన కోపం పోయింది - అని అన్నాడు. ఇది మూలభారతంలో ఉన్నది. కానీ తిక్కన భీష్ముడి మొదటి మాట అని అనకుండా, భీష్ముడి పలుకులతోటే తన అలుక తీరిందని ద్రోణుడు అన్నట్లు చెప్పాడు. సంస్కృతంలో సూక్ష్మంగా చెప్పబడిన భావాన్ని, తిక్కన తెలుగుతనానికి తగినట్లు సామాన్యదృష్టితో చెప్పాడు. తెలుగువారికి ఇదే సహజమైన విధానం.

**క.** **వాసవనందనుఁ డెంతయు । గాసిలి యున్నాఁడు, మనలఁ గని యించుకయుం**
**దా సైరణ సేయఁడు, గను । మోసము లే కొక్క మొగిన ముసరఁగ వలయున్.** **230**

**ప్రతిపదార్థం:** వాసవ= ఇంద్రుడియొక్క; నందనుఁడు= కుమారుడైన అర్జునుడు; ఎంతయున్= ఎక్కువగా; గాసిలి+ఉన్నాఁడు= బాధతో ఉన్నాడు; మనలన్+కని= మనలను చూచి; తాన్= తాను; ఇంచుకయున్= ఏ కొంచెం అయినా; సైరణ+చేయఁడు= ఓర్చుకోడు (సహించడు); కను మోసము లేక= ఏమరుపాటు లేకుండా (ప్రమత్తత లేకుండా); ఒక్క మొగిన్+అ= ఒక్కటేసారి (అందరూ ఒక్కుమ్మడిగా); ముసరఁగన్+వలయున్= ఏమాత్రం సందు లేకుండా చుట్టుకోవాలి.

**తాత్పర్యం:** అర్జునుడు చాలా గాసిచెంది మనమీదికి వస్తున్నాడు. ఆతడు మనలను ఏమాత్రం ఓర్చుకోడు. కనుక, ఏమాత్రం ఏమరుపాటు లేకుండా మనం అందరం, ఒకేసారి అర్జునుడిని చుట్టుముట్టాలి.

**విశేషం:** పైమాటలలో అర్జునుడిపై ద్రోణుడికి ఉన్న అభిప్రాయం ఎటువంటిదో వ్యక్తం అవుతుంది. ఒకవైపు వాత్సల్యం, మరోవైపు లోకోత్తరవీరుడనే అభిమానం కూడా తోస్తున్నాయి.

**వ. అప్పుడు కురుపతి సమయకాల విషయంబుగా నాడిన మాటయుం గలదు; దాని నిరూపించియున్నరూపు గాంగేయుండు సెప్ప నర్హుఁ' డనిన నతండు దుర్యోధనున కిట్లనియె. 231**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కురుపతి= దుర్యోధనుడు; సమయ= ప్రతిజ్ఞకు (అజ్ఞాతవాస ప్రతిజ్ఞకు) (సంబంధించి); కాల విషయంబుగాన్= వ్యవధియొక్క పరిసమాప్తిని గురించి; ఆడినమాటయున్= పలికిన పలుకు కూడా ఉన్నది; దానిన్, నిరూపించి= దానిని తేటపరిచి; ఉన్న రూపు= ఆ అజ్ఞాతవాసంయొక్క కాలనిర్ణయాన్నిగురించిన వాస్తవాన్ని; గాంగేయుండు= భీష్ముడు; చెప్పన్= తేల్చి చెప్పటానికి; అర్హుఁడు= యోగ్యుడు; అనినన్= అనగా; అతండు= భీష్ముడు; దుర్యోధనునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఇంతకుముందు అజ్ఞాతవాససమయాన్ని గురించి ఒకమాట చెప్పాడు. దాన్ని సరిగ్గా నిర్ణయించి, యథార్థాన్ని వివరించటానికి భీష్ముడే అర్హుడు' అని ద్రోణుడు అనగా దానికి భీష్ముడు, దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** తన లెక్కప్రకారం పదమూడు సంవత్సరాలూ పూర్తికాకనే, అంటే అజ్ఞాతవాసం ముగియకుండానే, అర్జునుడు తమ ఎదుటికి వస్తున్నాడని దుర్యోధనుడు భావించాడు. అందుకే ద్రోణుడు, ఈ విషయాన్ని భీష్ముడిద్వారా చెప్పిస్తున్నాడు. భీష్మ ద్రోణాదులకు అజ్ఞాతవాసం ముగిసింది అని తెలుసు. కాని, దుర్యోధనాదులకు లెక్క కుదరనందున, లెక్కించే పద్ధతిలో తేడావలన, అజ్ఞాతవాసం పూర్తి కాలేదనిపించింది. ఆ సందేహాన్ని ద్రోణుడు భీష్ముడిద్వారా తీరుస్తున్నాడు.

### భీష్ముఁ డర్జును నజ్ఞాతవాస వత్సరవ్యాప్తి నిష్కర్షించుట (సం. 4.47.1)

**సీ. 'రెండవ యేఁట నొక్కం డధిమాస; మి । ట్లెక్కిన యన్నెల లెల్లఁ గూర్చి**
**కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక । నిన్నటి తోడన నిండె; నంత**
**యెఱిఁగియ తమపూన్కి యెల్లను దీర్చితి । మని పొడసూపె నర్జునుఁడు నేఁడు;**
**పాండుపుత్త్రులు ధర్మపరులు; ధర్మాత్మజుం । డేరి కథిష్ఠాత వారు ధర్మ**

**తే. పథము దప్పుదురే?; యన్నిపాటులట్లు । పడిన వారలు దఱియంగఁ బాఱనేర్తు**
**రెట్లు? తమకించి నీతి విహీన వృత్తిఁ । దమకు నొకకీడు వచ్చు విధంబుఁ గాఁగ. 232**

**ప్రతిపదార్థం:** రెండవ+ఏఁటన్= రెండో ఏడాదిలో; ఒక్కండు= ఒక్కటి; అధిమాసము= అధికమాసం, (ఎక్కువమాసం); ఇట్లు= ఈ రకంగా (రెండేండ్లకు ఒకటి లెక్కన); ఎక్కిన= పెరగగా (ఎక్కువ కాగా); ఆ+నెలలు= ఆ అధికమాసాలు; ఎల్లన్+ కూర్చికొనన్= అన్నిటినీ కలుపుకొంటే; పదుమూఁడు= పదమూడైన; హాయనములు= సంవత్సరాలు; తప్పక= నిశ్చయంగా; నిన్నటితోడన్+అ= నిన్నటితోనే; నిండెన్= పూర్తి అయ్యాయి; అంత= దీనిని అంతా; ఎఱిఁగి+అ= తెలిసికొనియే; తమపూన్కి= తమదైన ప్రతిజ్ఞ; ఎల్లను= అంతా (పూర్తిగా); తీర్చితిమి+అని= నెరవేర్చామని; అర్జునుఁడు= అర్జునుడు; నేఁడు= ఈనాడు; పొడసూపెన్= కనపడ్డాడు; పాండుపుత్త్రులు= పాండురాజు కుమారులైన పాండవులు; ధర్మపరులు= ధర్మమే ప్రధానంగా కలిగినవాళ్ళు (ధర్మంవైపే ఉండేవాళ్ళు); ధర్మ+ఆత్మజుండు= యమధర్మరాజు కుమారుడైన ధర్మరాజు; ఏరికిన్= ఎవ్వరికీ;

అధిష్ఠాత= నాయకుడో (నియమించేవాడో); వారు= ఆ ధర్మరాజు అధీనంలో ఉండే పాండవులు; ధర్మపథము= ధర్మమార్గాన్ని; తప్పుదురే?= తప్పుతారా?; అన్ని పాటులు= అన్ని అగచాట్లు (కష్టాలు); అట్లు= ఆ రకంగా; పడినవారలు= అనుభవించినవాళ్ళు; తమకున్= తమకే; ఒక కీడు= ఒక అపాయం; వచ్చు విధంబుగాఁగన్= వచ్చేరకంగా; తమకించి= మత్సరించి (తొందరపడి అని); నీతివిహీన వృత్తిన్= నీతిమాలిన నడవడికతో; ఎట్లు= ఎట్లా; తఱియంగన్+పాఱన్+నేర్తురు?= సమీపించగలుగుతారు?

**తాత్పర్యం:** రెండేండ్లకు ఒకమారు అధికమాసం వస్తుంది. పదమూడేళ్ళలోగా ఇలా వచ్చిన అధిక మాసాలన్నిటినీ లెక్కించి కలుపుకుంటే, నిన్నటితోనే గడువు పూర్తి అవుతుంది. దీనిని బాగా తెలిసే, అర్జునుడు తమ ప్రతిన పూర్తిగా నెరవేర్చామని ఇప్పుడు కనిపించాడు. పాండవులు ధర్మపరులు. ధర్మరాజు ఎవరికి పెద్దగా ఉంటాడో వాళ్ళు ధర్మమార్గాన్ని తప్పరు. అన్ని పాట్లు పడ్డ పాండవులు తమకు అపాయం కలిగే రీతిలో తొందరపడి నీతిని విడిచి ఎట్లా మనమీదికి వస్తారు? రారు అని తాత్పర్యం.

**విశేషం:** ధర్మాచరణ విషయంలో పాండవులపై, ప్రత్యేకించి ధర్మరాజుపై భీష్ముడికి ఉన్న నమ్మకం ఇందులో తెలుస్తుంది. పాండవులు ధర్మాన్ని తప్పరనీ, ఇలా ధర్మాన్ని అతిక్రమించే వారైతే జూదం రోజుననే తెగించి ధర్మాన్ని వదిలేసి పోరాడేవారనీ భీష్ముడు ముందు పద్యంలో వివరించాడు.

**ఉ.** **అట్టిద యైన నాఁడ తఱియంబడి మూర్ఖతనంబు సేయరే?**
**నెట్టన ధర్మపాశముల నిల్చిరి; కాలము వేచియుండి; రిం**
**కెట్టును వారు గొంత తమ యేడ్తెఱ సూపక మాననేర్తురే?**
**ముట్టఁగ వచ్చిరేని మనముం దగ నోర్తముగాక దానికిన్.** **233**

**ప్రతిపదార్థం:** అట్టిది+అ+ఐనన్= అటువంటిదే అయితే (ధర్మాన్ని అట్లా దాటాలనుకుంటే); నాఁడు+అ= ఆ రోజే (జూదం ఆడిననాడే); తఱియంబడి= తెగించి; మూర్ఖతనంబు+చేయరే?= మూర్ఖత్వంతో ఎదురు తిరిగి యుద్ధం చేసేవారే గదా!; నెట్టన= గట్టిగా (పూర్తిగా); ధర్మపాశములన్= ధర్మం అనే త్రాళ్ళతో; నిల్చిరి= కట్టుబడి నిలబడ్డారు; కాలము వేచి+ఉండిరి= అనుకూలమైన కాలం (సమయం) కొరకు ఎదురుచూచారు; ఇంకన్+ఎట్టును= ఇంక ఏరకంగా అయినా; వారు= పాండవులు; తమ= తమయొక్క; ఏడ్తెఱ= పరాక్రమం; కొంత= కొద్దిగానైనా; చూపక= ప్రదర్శించక; మాననేర్తురే?= మానగలరా?; ముట్టగ వచ్చిరి+ఏని= చుట్టుముట్టటానికి వస్తే; దానికిన్+తగన్= అందుకు తగినట్లుగా; మనమున్= మనము కూడా; ఓర్తము+కాక!= ఎదిరిస్తాంగాక!

**తాత్పర్యం:** పాండవులు ధర్మాన్ని అట్లా అతిక్రమించాలనుకొంటే, జూదం ఆడిన రోజుననే తెగించి మూర్ఖత్వంతో యుద్ధం చేసి ఉండేవారు. పాండవులు ధర్మపాశాలకు పూర్తిగా కట్టుబడి నిలిచారు. అనుకూలమైన కాలంకొరకు ఎదురుచూచారు. ఇంక వారు ఏ రకంగానైనా పరాక్రమాన్ని కొంతైనా చూపకపోరు. మనలను వారు ముట్టడిస్తే అందుకు తగినట్లు మనమూ ఎదిరిద్దాం.

**విశేషం:** ఈ పద్యంలో కూడా భీష్ముడు పాండవుల ధర్మనిరతినీ, ధర్మదీక్షనూ గురించే చెప్పాడు. సమయంకొరకు ఎదురుచూచిన పాండవులకు, ప్రస్తుతం వారి ప్రతిజ్ఞ ముగిసిందనీ, ఇప్పుడు సమయం వచ్చిందనీ, కనుక, వీలైనంతవరకూ పరాక్రమాన్ని ప్రదర్శించకపోరనీ, వారు ముట్టడిస్తే మనం తగినట్లు ఎదిరించాలనీ భీష్ముడు దుర్యోధనుడికి హితం చెప్పాడు.

**ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు; రా**
**లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే?**
**హెచ్చగుఁ గుందగుం దొడరు టెల్ల విధంబుల కోర్చు; టట్లుగా**
**కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొందగు చేఁతయుం దగున్.' 234**

**ప్రతిపదార్థం:** వచ్చినవాఁడు= (ఇప్పుడు మనమీదికి దండెత్తి) వచ్చినట్టివాడు; ఫల్గునుఁడు= అర్జునుడు; అవశ్యము= తప్పకుండా; గెల్తుము+అనంగన్+రాదు= గెలుస్తాము అని చెప్పలేము; రాలచ్చికిన్+ఐ= రాజ్యలక్ష్మికొరకై; పెనంగినన్= పోరాడితే; బలంబులు= సైన్యాలు; రెండును= ఇరువైపులు; గెల్వన్+నేర్చునే?= గెలువగలవా?; హెచ్చు+అగున్+కుందు+అగున్= ఎక్కువ కావచ్చును (గెల్వవచ్చును), తక్కువ కావచ్చును (ఓడవచ్చును); (కనుక); తొడరుట= ఎదిరించటం; ఎల్లవిధంబులకున్= జయాపజయాలలో దేనికయినా; ఓర్చుట= ఓర్చుకొనటమే (కర్తవ్యం); అట్లుగాక= ఆ రకంగా కాక; ఇచ్చన్+తలంచి= మనసులో ఆలోచించి; ఒకమెయిన్= ఒక విధంగా; ఈ+తఱిన్= ఈ సమయంలో; పొందు+అగు చేఁతయున్= సంధి కుదిరే కార్యం కూడా; తగున్= తగిందే.

**తాత్పర్యం:** ఇప్పుడు మనపైకి దండెత్తి వచ్చినవాడు అర్జునుడు. మనమే తప్పక జయిస్తామని చెప్పలేము. రాజ్యలక్ష్మికొరకు పెనుగులాడితే రెండు బలాలూ గెలువలేవు కదా! జయం కలుగవచ్చును, కలుగకపోవచ్చును. ఇప్పుడు మనం చేయగలిగిందల్లా ఏమి వచ్చినా ఓర్చుకొనటమే. అంతేకాక ఒకరకంగా ఇప్పుడు సంధి చేసికొనటం కూడా మంచిపనే!'

**విశేషం:** ఈ పద్యం తెలుగునాట బాగా ప్రచారంలో ఉన్నది. 'వచ్చినవాఁడు ఫల్గునుఁడు' అనడం ఒక లోకోక్తి. అంటే వచ్చినవాడు సామాన్యుడు కాడు - అని భావం. భీష్ముడి మనోభావం దీనివలన తెలుస్తుంది. ఈ పరిస్థితిలో కూడా 'సంధి మంచిది' అని భీష్ముడి అభిప్రాయం. అంతేగాక, దుర్యోధనుడికి సూచన కూడ. 'వచ్చినవాడు ఫల్గునుఁడు' అనడంలో ఒక బెదరింపు. జాగ్రత్త- అని సూచన ఉన్నది. పోరాడితే గెలుస్తామో లేదో అనే సందేహాన్ని వెలిపుచ్చడంలో భీష్ముడి రాజనీతి తెలుస్తుంది. అందుకే ఏమివచ్చినా ఓర్చుకొనాలి - అని హితం కూడా ఆయన చెప్పాడు. గెలుపు నిశ్చయం కానప్పుడు అన్ని విధాలా సంధి మేలు అని సలహా. ఇన్ని భావాలకు సమాశ్రయం అయిన ఈ పద్యం తిక్కన ప్రతిభావిశేషజన్యమే. అసలు పద్యం ఎత్తుగడే ఉదాత్తంగా ఉన్నది. 'సంప్రాప్తోహి ధనంజయః' అన్న భావాన్ని తిక్కన, తెలుగుతనానికి అనుకూలంగా తీర్చాడు. ఇది మూలంకన్నా ఎక్కువ అర్థస్ఫూర్తిని కలిగిస్తున్నది. భీష్ముడంతటివాడి అనుభవపూర్వకమైన ఇటువంటి సూచనను కూడా దుర్యోధనుడు గమనించలేదు. ఇది తరువాతి వచనంలో, పద్యంలో స్పష్టపడుతుంది. ఈ పద్యమే యథాతథంగా ఉద్యోగపర్వ తృతీయాశ్వాసంలో 85వదిగా పునరుక్తం కావటం గమనార్హం.

**వ. అనిన విని కురుపతి దరహసిత వదనుం డగుచు నిట్లనియె. 235**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= (భీష్ముడు చెప్పిన మాటలను) విని; కురుపతి= దుర్యోధనుడు; దర= కొంచెమైన; హసిత= నవ్వుతో కూడిన; వదనుండు+అగుచున్= ముఖం కలిగినవాడై (చిఱునవ్వుతో కూడిన మొగం గలవాడై); ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్మపితామహుడి మాటలను విన్న దుర్యోధనుడు చిఱునవ్వుతో కూడిన ముఖంతో ఇట్లా అన్నాడు.

**ఆ. 'మనకుఁ బాండురాజ తనయ వర్గమునకు। నెట్లు పొందు గలుగు? నేను రాజ్య**
**భాగ మీను; సమరభంగిక విక్రమ। నిరతిఁ బూను; టిదియ నిశ్చయంబు.' 236**

**ప్రతిపదార్థం:** మనకున్= మనకు (భీష్ముడిని కలుపుకొని); పాండురాజ= పాండురాజుయొక్క; తనయ= కుమారులయొక్క; వర్గమునకున్= సమూహానికీ (పాండవులకూ); ఎట్లు= ఏ రకంగా; పొందు+కలుగున్?= సంధి కుదురుతుంది?; ఏను= నేను (అహంకారపూర్వకమైన శబ్దం); రాజ్యభాగము= రాజ్యంలో భాగాన్ని; ఈను= ఇవ్వను (నిశ్చయార్థకం); విక్రమ= పరాక్రమంయొక్క; నిరతిన్= ఎక్కువ ఆసక్తితో (పరాయణత్వంతో); సమరభంగికిన్+అ= యుద్ధ పద్ధతికే; పూనుట= పూనుకొనటమే; ఇది+అ= ఇదే; నిశ్చయంబు= నా నిర్ణయం.

**తాత్పర్యం:** మనకూ పాండవులకూ సంధి ఏరకంగా ఏర్పడుతుంది? నేను వాళ్ళకు రాజ్యంలో భాగాన్ని ఇవ్వను. అంతేకాక యుద్ధంలో పరాక్రమాన్ని చూపటానికే నిర్ణయించాను.

**విశేషం:** దుర్యోధనుడు తన నిర్ణయాన్ని కచ్చితంగా భీష్ముడికి చెప్పాడు. భీష్ముడు సంధిని సూచించాడు. దాన్ని దుర్యోధనుడు చిరునవ్వుతో నిరాదరించాడు. తిక్కన ఇక్కడ దుర్యోధనుడి వ్యక్తిత్వాన్ని సూచించాడు.

**వ. అనిన నయ్యిరువుర వచనంబు లాకర్ణించి గురుం డిట్లనుఁ, 'గార్యగతియును గయ్యంబు భంగియు భూపతి కంటె మిగులం గనియెడు వారులే, రయినను నా యెఱింగిన యంత నొక్క తెఱంగు సెప్పెద; నీ బలంబున నాలవ పాలుగొని మహీపాలుండు సత్వరంబుగా ముందర పోవలయు; నంతియసేన తదనంతరంబ కదుపులం బొదివికొని చనవలయుఁ; దక్కటి సగంబుతో మనము నిలిచి మోహరించి యల్లనల్ల నరుగవలయుఁ; గవ్వడి యెయ్యెడం గవిసె నయ్యెడన తలపడ వలయు; నిట్లైన మానవేశ్వరుండు సురక్షితంబుగా సందడింబడక నడచు; గోవులు నిన్నేలం గడచు; మనమును ధనంజయునకుం జాలిన యప్పుడ యటఁ దోడుపడ నెవ్వరు గలిగినను వారికిం జాలి నిలుత' మనిన, విని, సురనదీసూనుండు దాని కియ్యకొని రాజన్యునకు సైన్యంబుఁ బంచి యిచ్చి, పుచ్చి, పసులకుం దోడగు భాగంబునుం బంచి, యున్నంత వట్టు చతురంగంబుల నియతి సేసికొని, యాచార్యుండు నడుమను, గృపాచార్యుండు వలపటను, నాచార్యపుత్త్రుండు దాపటం, గర్ణుండు ముందట, వికర్ణ దుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లిక భూరిశ్రవః ప్రభృతి యోధ వీరులెల్ల నెడనెడం గలయ నిలుచునట్లుగా మోహరించి, మహోత్సాహంబున సన్నాహ సౌందర్యంబు నొంది, తాలధ్వజం బెత్తించి, మెఱసి తాను వెనుకయయి నడిపించుచుండె; నట్టి సమయంబున. 237**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+ఇరువుర= ఆ ఇద్దరియొక్క; వచనంబులు= మాటలు; ఆకర్ణించి= విని; గురుండు= గురువైన ద్రోణాచార్యుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; కార్యగతియును= పనితీరూ; కయ్యంబు భంగియున్= యుద్ధవిధానం; భూపతికంటెన్= రాజుకంటె; మిగులన్+కనియెడువారు= ఎక్కువగా చూడగలవాళ్ళు; లేరు; అయినను= అయినా; నా+ఎఱింగిన+అంతన్= నాకు తెలిసినంతవరకూ; ఒక్కతెఱంగు= ఒక పద్ధతి; చెప్పెదన్= చెప్పుతాను; ఈ బలంబునన్= ఈ సైన్యంలో; నాలవపాలు, కొని= నాలుగవభాగం తీసికొని; మహీపాలుండు= రాజు, దుర్యోధనుడు; సత్వరంబుగాన్=

వెంటనే, వేగంగా; ముందర పోవలయున్= ముందుభాగంలో వెళ్లాలి; అంతియసేన= అంతేసేన; తద్+అనంతరంబు+అ= దాని తరువాత; కదుపులన్= ఆలమందలను; పొదివికొని= క్రమ్ముకొని; చనవలయున్= వెళ్ళాలి; తక్కటి సగంబుతోన్= మిగిలిన సగంపాలు సైన్యంతో; మనము= మనమందరం; నిలిచి= రంగంలో నిలువబడి; మోహరించి= ఒక వ్యూహంగా మారి; అల్లన్+అల్లన్= మెల్లమెల్లగా; అరుగవలయున్= కదలిపోతుండాలి; కవ్వడి= అర్జునుడు; ఏ+ఎడన్= ఏ ప్రదేశంలో; కవిసెన్= ఢీకొంటాడో; ఆ+ఎడన్+అ= ఆ ప్రదేశంలోనే; తలపడన్+వలయున్= ఎదిరించాలి; ఇట్లు+ఐనన్= ఈ విధంగా జరిగితే; మావన+ఈశ్వరుండు= రాజు, దుర్యోధనుడు; సురక్షితంబుగాన్= లెస్సగా కాపాడబడినవాడై; సందడిన్+పడక= అలజడి పడకుండా; నడచున్= సాగిపోగలడు; గోవులు= ఆవులు కూడా; ఈ+నేలన్= ఈ దేశపు పొలిమేరలు; కడచున్= దాటిపోతాయి; మనమును= మనంకూడా; ధనంజయునకున్= అర్జునుడికి; చాలిన+అప్పుడు+అ= ఎవ్వరైనా ఎదురు నిల్వగానే; అటన్= ఆ చోట; తోడుపడన్+ఎవ్వరు+కలిగినన్= సహాయపడటానికి ఎవరు ఉన్నా; వారికిన్= ఆ విధంగా ఎదిరించినవారికి; చాలి= సామర్థ్యంతో; నిలుతము= నిలుద్దాం; అనినన్; విని; సురనదీ సూనుండు= గంగాపుత్రుడు- భీష్ముడు; దానికిన్= ద్రోణుడి ప్రతిపాదనకు; ఇయ్యకొని= అంగీకరించి; రాజన్యునకున్= రాజుకు; సైన్యంబు, పంచి+ఇచ్చి= సైన్యాన్ని పంచి ఇచ్చి; పుచ్చి= పంపించి; పసులకున్= ఆవులకు; తోడు+అగు, భాగంబున్= తోడుగా ఉండే సైన్యభాగాన్ని కూడా పంచి; ఉన్నంత+పట్టు= ఉన్నంతలో; చతురంగంబులన్= సైన్యంలోని నాలుగు అంగాలను (రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలం); నియతి+చేసికొని= తగినట్లుగా నియమించుకొని; ఆచార్యుండు= ద్రోణుడు; నడుమను= మధ్యభాగంలోనూ; కృపాచార్యుండు; వలపటను= కుడిప్రక్కను; ఆచార్యపుత్త్రుండు= ద్రోణుని కొడుకైన అశ్వత్థామ; దాపటన్= ఎడమ ప్రక్కను; కర్ణుండు; ముందటన్= ముందుభాగంలో; వికర్ణ, దుశ్శాసన, శకుని, సైంధవ, సోమదత్త, బాహ్లీక, భూరిశ్రవస్, ప్రభృతి= వికర్ణుడు, దుశ్శాసనుడు, శకుని, సైంధవుడు, సోమదత్తుడు, బాహ్లీకుడు, భూరిశ్రవసుడు మొదలైన; యోధవీరులు+ఎల్లన్= పరాక్రమంగల వీరులందరూ; ఎడన్+ఎడన్= అక్కడక్కడ (తగినంత దూరంలో); కలయన్ నిలుచునట్లుగాన్= కొంచెం దూరంగా ఉన్నా కలిసి యుద్ధం చేసేటట్లుగా; మోహరించి= వ్యూహంపన్ని; మహా+ఉత్సాహంబునన్= యుద్ధం చేయాలన్న తీవ్రమైన ఉత్సాహంతో; సన్నాహ, సౌందర్యంబున్= యుద్ధానికి సిద్ధపడటంలో గోచరించే అందాన్ని; ఒంది= పొంది (వీర సౌందర్యంతో); తాలధ్వజంబు+ఎత్తించి= తాటిచెట్టు గుర్తుగల జెండాను రథంమీద ఎగిరేటట్లుచేసి; మెఱసి= ప్రకాశించి; తాను= భీష్ముడు; వెనుక+అయి= సైన్యానికి చివరగా (వెనుకగా); అయి= ఉండేటట్లుగా ఉంటూ; నడపించుచున్+ఉండెన్= ముందుకు సాగిస్తూ ఉన్నాడు; అట్టి, సమయంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** భీష్మదుర్యోధనుల మాటలను విన్న ద్రోణుడు ఇట్లా అన్నాడు: 'పనితీరూ, యుద్ధవిధానం రాజుకంటె ఎక్కువగా తెలిసినవాళ్ళు లేరు. కాని, నాకు తోచినంతలో ఒక మార్గాన్ని చెప్తుతాను. మనసైన్యంలో నాలుగో భాగాన్ని తీసికొని రాజు ముందు నడవాలి. అంతే సేన (అంటే నాలుగోవంతు) ఆవులను చుట్టి తరువాత నడవాలి. తక్కిన సగంతో, మనం ఒకవ్యూహంగా ఏర్పడి మెల్లగాపోతూ ఉందాం. ఎక్కడ అర్జునుడు ఎదిరిస్తే అక్కడే మనమూ ఎదిరిద్దాం. ఇట్లాగైతే, రాజు ఇబ్బందిపడకుండా ముందుకు పోతాడు. ఆవులూ ఈ నెలవు దాటిపోతాయి. అర్జునుడిని ఎదిరించటానికి మనం సమర్థుల మయినప్పుడే, అతడికి తోడుపడటానికి ఎవరు ఉన్నా, వారిని కూడా ఎదుర్కొనటానికి సామర్థ్యం ఉన్నప్పుడే మనం అందరం కలిసి నిలబడాలి' అని అనగా, భీష్ముడు విని అంగీకరించి, గురుడు చెప్పినట్లు, రాజైన దుర్యోధనుడికి నాలుగోవంతు సైన్యాన్నిచ్చి పంపించి, ఆవులవెంట రక్షణగా ఉండవలసిన నాలుగోవంతు సైన్యాన్నీ పంచి, తక్కిన అర్ధభాగం సైన్యాన్ని, చతురంగ బలాలతో ఉన్నదానిని, ఎక్కడెక్కడ ఉండాలో నియమించి, ఏర్పరచి, మధ్యలో గురుడూ, కుడివైపు కృపుడూ, ఎడంవైపు గురుసుతుడైన అశ్వత్థామా,

ముందర కర్ణుడూ ఉండగా వికర్ణుడూ, దుశ్శాసనుడూ, శకునీ, సైంధవుడూ, సోమదత్తుడూ, బాహ్లికుడూ, భూరిశ్రవుడూ మొదలైన యోధవీరులందరూ అక్కడక్కడ నిలబడేట్లుగా వ్యూహాన్ని నిర్మించి, నిలిచి, ఉత్సాహంతో అంతా సిద్ధం చేసి, తనయొక్క తాలధ్వజాన్ని నిలిపి, వీరసౌందర్యమూర్తిగా భీష్ముడు వెనుక ఉండి సైన్యాన్ని నడుపుతూ వుండే సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** భీష్ముడూ, ద్రోణుడూ వంటి అనుభవజ్ఞులు అర్జునుడిని ఎదిరించటానికి పన్నిన వ్యూహ విశేషం ఇందులో వివరించబడింది. అర్జునుడు అంటే వీళ్ళందరూ ఎంత జాగరూకతతో ఉన్నారో ఈ వచనం వలన అర్థం అవుతుంది.

**చ. అరుదుగ నిట్టు లొక్కనికి నంతబలంబునకున్ మహోగ్ర సం**
**గర మగుడున్ మనం బతుల కౌతుక మొంది కనుంగొనన్ సురే**
**శ్వరుఁడు సుదర్శనంబనఁ బ్రశంసకు నెక్కు విమానమెక్కి యం**
**బరగతి వచ్చె దేవముని పంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁగన్. 238**

**ప్రతిపదార్థం:** అరుదుగన్= ఆశ్చర్యాన్ని కలిగించేట్లు; ఇట్టులు= ఇట్లా; ఒక్కనికిన్= ఒక్క వీరుడికి; అంత బలంబునకున్= అంత ఎక్కువైన సైన్యానికీ; మహా+ఉగ్రసంగరము+అగుడున్= మిక్కిలి భయంకరం అయిన యుద్ధం జరుగుతూంటే; మనంబు= మనస్సులో; అతుల= సాటిలేని; కౌతుకము+ఒంది= కుతూహలాన్ని పొంది; కనుంగొనన్= చూడటానికి; సుర+ఈశ్వరుండున్= దేవేంద్రుడూ; దేవముని పంక్తులున్= దేవతలూ, మునుల సమూహాలూ; సిద్ధగణంబున్= సిద్ధుల సమూహమూ; కొల్వఁగన్= సేవిస్తూ ఉండగా; సుదర్శనంబు+అనన్= సుదర్శనం అనే పేరుతో; ప్రశంసకున్+ఎక్కు= పేరుకెక్కిన; విమానమున్+ఎక్కి= విమానాన్ని అధిరోహించి; అంబరగతిన్= ఆకాశమార్గంలో; వచ్చెన్= వచ్చి నిలిచాడు.

**తాత్పర్యం:** అపూర్వంగా ఆశ్చర్యకరంగా ఒక్క వ్యక్తికీ, అంతులేని బలానికీ మధ్య ఘోరసంగ్రామం జరుగుతుందని ఎంతో కుతూహలంతో చూడటానికి, దేవతలూ, ఋషులూ, సిద్ధులూ సేవిస్తుండగా, దేవేంద్రుడు సుదర్శనం అనే విమానం ఎక్కి ఆకాశమార్గంలో వచ్చి నిలిచాడు.

**విశేషం:** అర్జునుడు ఒంటరివాడు. అనంతమైన కురుబలంతో ఆతడు పోరాడబోతాడు. ఇది ఆశ్చర్యకరమైన విషయం. అంతేగాక, ఇంద్రుడికి తన కుమారుడైన అర్జునుడి పరాక్రమాన్ని కనులారా చూడాలనీ కుతూహలం ఉన్నట్లు సూచన.

**వ. అ ద్దివ్యయానరత్నంబునందు. 239**

**ప్రతిపదార్థం:** ఆ+దివ్య= ఆ దివ్యమైన; యాన= వాహనాలలో; రత్నంబు+అందున్= శ్రేష్ఠమైనదానిలో.

**తాత్పర్యం:** ఆ దివ్యమైన శ్రేష్ఠమైన విమానంలో.

**తే. స్వర్గమున నున్న రాజులుఁ జక్రవర్తు । లును యథోచిత చ్ఛత్రంబులును నిజార్హ**
**చామరంబులుఁ జెలువొందఁ జారులీలఁ । గొలిచియుండిరి వేడ్కలు కొనలు నిగుడ. 240**

**ప్రతిపదార్థం:** స్వర్గమునన్+ఉన్న= స్వర్గంలో ఉన్న; రాజులున్= రాజులూ; చక్రవర్తులును= సార్వభౌములును; యథా+ఉచిత= వారికి తగిన; ఛత్రంబులును= గొడుగులూ; నిజ+అర్హచామరంబులున్= తమకు ఉచితమైన వింజామరలూ; చెలువు+ఒందన్= అందగించగా; చారులీలన్= మనోహరమైన విలాసంతో; వేడ్కలు= కోర్కెలు; కొనలు నిగుడన్= కొనలు సాగేటట్లు; కొలిచి+ఉండిరి= సేవిస్తూ ఉన్నారు.

**తాత్పర్యం:** స్వర్గలోకంలో ఉన్న రాజులూ చక్రవర్తులూ ఉచితమైన ఛత్రాలూ చామరాలూ ప్రకాశించగా, విలాసంతో, కోర్కెలు తీగె సాగుతుండగా దేవేంద్రుడిని సేవించి ఉన్నారు.

**క. పాండుమహీపాలుం డా । ఖండలు చేరువన పెద్దగద్దియ నమరీ**
**మండలి వీచోపు లిడఁగ । నుండి కనుంగొనుచు నుండె నుజ్జ్వల భంగిన్. 241**

**ప్రతిపదార్థం:** పాండు మహీపాలుండు= పాండురాజు; అమరీ= దేవతాస్త్రీలయొక్క; మండలి= సమూహం; వీచోపులు+ఇడఁగన్= వింజామరలు వీచుతూ ఉండగా; ఆఖండలు= దేవేంద్రుడియొక్క; చేరువన= ప్రక్కనే; పెద్దగద్దియన్= పెద్దదైన సింహాసనంపైన; ఉజ్జ్వలభంగిన్+ఉండి= ప్రకాశమానమైన రీతిలో కూర్చొని; కనుంగొనుచున్+ఉండెన్= చూస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** పాండురాజు, అప్సరసలు వింజామరలు వీస్తుండగా, ఇంద్రుడి ప్రక్కనే మరో పెద్ద సింహాసనం మీద కూర్చొని ఉజ్జ్వలరీతిలో చూస్తున్నాడు.

**విశేషం:** మూలభారతంలో ఇంద్రుడు ఒక్కడే ఉన్నట్లుంది కాని, ప్రక్కన పాండురాజున్నట్లు లేదు. ఇది తిక్కన కల్పన.

**వ. అంత. 242**

**తాత్పర్యం:** దివ్య విమానంలో ఇంద్రుడి ప్రక్కన పాండురాజు ఉండి చూస్తుండే సమయంలో.

**సీ. దేవదత్తాభీలరావంబు వెసఁ గర్ణ । ముల దీటుకొన, లేట మొగము పడుచు,**
**రథనేమి దళిత ధరాధూళి యంగంబు । లెల్లఁ గప్పఁగ వెలువెల్ల నగుచు,**
**బహుళ కపిధ్వజ ప్రభలు లోచనములు । మిఱుమిట్లు గొనఁ బర్వ మేడుపడుచు,**
**నుద్భటాకార సముద్ధతి మనము లు । త్తలపాటు దోఁపఁగఁ దల్లడిలుచు**

**తే. నడచు కౌరవరాజు సైన్యంబుఁ గదిసెఁ । దీఁగ దిగిచినగతిఁ దనతేరు మెఱయ**
**రయముమైఁ జని ప్రళయ భైరవ సహస్ర । గర్జనోదగ్ర తర్జనుఁ డర్జునుండు. 243**

**ప్రతిపదార్థం:** దేవదత్త+ఆభీల రావంబు= దేవదత్తం (శంఖం) యొక్క భీకరమైన శబ్దం; వెసన్= వెంటనే (శబ్దం పుట్టిన వెంటనే); కర్ణములన్= చెవులలో; దీటుకొనన్= నిండిపోయినప్పుడు; లేట మొగము పడుచున్= పెడమొగాన్ని పెడుతూ (మొగం ప్రక్కకు త్రిప్పుకుంటూ); రథ= రథంయొక్క; నేమి= చక్రం అంచుతో (పట్టాతో); దళిత= చీల్చబడిన (రేగిన); ధరా= భూమియొక్క; ధూళి= సన్నటి దుమ్ము; అంగంబులు+ఎల్లన్= శరీరంయొక్క అన్ని అవయవాలను; కప్పఁగన్= కప్పివేయగా;

వెలు వెల్లన్+అగుచున్= వెలవెలబోతూ (కాంతివిహీనమై); బహుళ= అధికమైన; కపిధ్వజ= కపి కేతనంయొక్క; ప్రభలు= కాంతులు; లోచనములు= కండ్లు; మిఱుమిట్లు+కొనన్= చీకట్లు కమ్మేటట్లుగా; పర్వన్= వ్యాపించగా; మేడుపడుచున్= భ్రమపడుతూ (మోసపోతూ- కనపడనందున); ఉద్భట+ఆకార+సముద్ధతిన్= భయంకరమైన (శత్రువులకు); (ఉదాత్త గంభీరం అయిన) రూపం యొక్క ఆర్భాటానికి; మనములు= (సైనికుల) మనస్సులు; ఉత్తలపాటు+తోఁపంగన్= దిగులు కలుగగా; తల్లడిలుచున్= బెదురుతో వణికిపోతూ; నడచు= నడిచే (సాగిపోతున్న); కౌరవరాజు సైన్యంబున్= కురురాజైన దుర్యోధనుడియొక్క సేనను; ప్రళయ= ప్రళయకాలంలోని; భైరవ= రుద్రులయొక్క; సహస్ర= వేయిమందియొక్క; గర్జన= గర్జనంవలె; ఉదగ్ర= భయంకరమైన; తర్జనుఁడు= బెదరింపుకలవాడు; (అయిన) అర్జునుండు; తన= తనయొక్క; తేరు= రథం; తీఁగ తిగిచిన గతిన్=మెఱపుతీగ సాగినట్లుగా (మెఱుపు మెరసినట్లు); మెఱయన్= మెరుస్తూండగా; రయము మైన్+చని= మిక్కిలి వేగంగా పోయి; కదిసెన్= దగ్గరికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో అర్జునుడి దేవదత్త శంఖం యొక్క భయంకరమైన రావం ప్రళయకాలంలో వెయ్యిమంది భైరవులు ఒకేమారు ఘోరంగా గర్జించినట్లు - మార్మోగుతుండగా, ఆయన రథం మెరుపుతీగలాగా ప్రకాశిస్తూ మహావేగంతో దూసుకొని వచ్చి కౌరవసేనను సమీపించింది.

ఆ భయంకర శంఖధ్వనికి కురుసైన్యం అంతా పెడమొగం పెట్టింది. ఆ రథచక్రాల అంచులనుండి పైకెగసిన ధూళి సైనికుల దేహాలను పూర్తిగా ఆవరించింది. అందువల్ల ఆ సైన్యం వెలవెలపోతూ ఉన్నది. ఆ కపికేతనం యొక్క కాంతులు మిఱుమిట్లు గొల్పుతుండగా చూడజాలక సైనికులు చీకట్లు క్రమ్మినట్లుగా భ్రమపడి అలాగే నిలిచారు. ఉదాత్త గంభీరమై శత్రుభీకరమైన అర్జునుడి ఆకారంయొక్క ఆటోపానికి కౌరవసేనలు మనస్సుల్లో తల్లడిల్లిపోయారు.

**విశేషం:** శబ్దంద్వారా, అర్థంద్వారా వర్ణించవలసిన వస్తువును కన్నులకు కట్టినట్లు ఉదాత్తంగా చిత్రించటం మహాకవుల లక్షణం. 'తీఁగ తిగిచినరీతి' - ప్రయోగం ఈ పద్యానికి ఆయువు. ఇందులో అర్జునుడి కాంతిమత్త్వలక్షణం నిరూపితం.

**వ. ఇవ్విధంబునఁ గురుబలంబులఁ గ్రోశద్వయంబునం గూడముట్టి క్రీడి తలయెత్తి చూచి యుత్తరున కిట్లనియె. 244**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; కురుబలంబులన్= కౌరవ సైన్యాలను; క్రోశద్వయంబునన్= రెండు క్రోసుల దూరంలోనే; కూడముట్టి= సమీపించి; క్రీడి= అర్జునుడు; తల+ఎత్తి, చూచి= తలపైకెత్తి చూచి; ఉత్తరునకున్+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా కౌరవసైన్యాన్ని రెండుకోసుల దూరంలోనే చేరి, అర్జునుడు తలపైకెత్తి చూచి, ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**చ. 'ఇది యొక పెద్ద గట్టిమొన; యీ మొనముందట గోగణంబుతో**
**నది యొక యల్పసైన్య; మట యాతల వేఱొక కొంతసేన య**
**ల్లదె; యిటు పంచిపెట్టఁ జను నంతటిలోన వృథాభిమాన దు**
**ర్మద బహుభాషియైన కురురా జెచటం జనుచున్నవాఁడొకో! 245**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ కనిపించే సేన; ఒక పెద్దగట్టి మొన= ఎక్కువ సంఖ్యతో కూడిన బలమైన సైన్యం; ఈ మొనముందటన్= ఈ సైన్యానికి ముందుభాగంలో (అగ్రభాగంలో); గో= ఆవులయొక్క; గణంబుతోన్= సమూహంతో; అది+ఒక+అల్ప సైన్యము= అది ఒక చిన్నసేన; అట= అక్కడ; ఆతల= ఆపైన (అవతల); అల్లదె= ఆ కనిపించేదే; వేఱు+ఒక= వేరైన; కొంతసేన= మరికొంత సైన్యం; ఇటు= ఈ రకంగా; పంచిపెట్టన్= భాగాలుగా చేయబడి; చను= వెళ్లుతున్న; అంతటిలోనన్= ఈ సేనా విభాగాలు అన్నిటిలోనూ; వృథా+అభిమాన+దుర్మద= పనికిమాలిన అభిమానంతో (దురభిమానంతో), చెడ్డ గర్వంతో; బహుభాషి+ఐన= అధిక ప్రసంగి అయిన (అతివాగుడుకాడైన); కురురాజు= దుర్యోధనుడు; ఎచటన్= ఎక్కడ; చనుచున్నవాఁడు+ఒకో!= పోతున్నాడో కదా!

**తాత్పర్యం:** '(ఓ ఉత్తరకుమారా!) ఇది ఒక పెద్దబలమైన సైన్యం. దానికి ముందు ఆవులమందతో కొద్దిపాటి సేన నడుస్తున్నది. దానికి అవతల తట్టు ఇంకా కొంతసైన్యం ఉన్నది. ఈ రకంగా భాగాలుగా చేయబడి సాగుతూ ఉండే సేనలలో, మిక్కిలి దురభిమానీ, అధిక ప్రసంగీ (బహుభాషి) అయిన ఆ సుయోధనుడు ఎక్కడ ఉన్నాడో!

**విశేషం:** భీష్మద్రోణాదులైన పెద్దలు ఎంతో ఆలోచించి, రాజును రక్షించటానికి, సైన్యాన్ని వ్యూహంగా నిర్మించారు. వ్యూహాన్ని నిర్మించగలిగినవాడే అందులో ప్రవేశించగలుగుతాడు. ఇది యుద్ధవిద్యలో ఉండే రహస్యం. ద్రోణుడు పన్నిన ఈ వ్యూహాన్ని, అర్జునుడు రెండుక్రోసుల దూరాన్నించే చూచి గమనించి, ఉత్తరుడికి వివరించాడు. శత్రువుల సైనిక ప్రణాళికను, అర్జునుడు చూస్తూనే గ్రహించి, రాజును పట్టుకొనాలని, ఆతడిని కనిపెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు. ఇది అర్జునుడి బుద్ధిసూక్ష్మతకూ, సామర్థ్యానికీ నిదర్శనం.

**క. అరయుదముగాని యిమ్మో । హరమునకును డాపలించి యరదముఁ బోని**
**మ్మురవడి; నతనిక యుఱికెద । నరుదుగ నెబ్బంగి నెవ్వ రడ్డం బైనన్. 246**

**ప్రతిపదార్థం:** అరయుదము గాని= చూద్దాం కానీ; ఈ+మోహరమునకును= వ్యూహాత్మకమైన ఈ సైన్యానికి; డాపలించి= ఎడమప్రక్కగా, అనగా వాళ్ళకు ఎడమవైపున ప్రదక్షిణంగా; ఉరవడిన్= ఒరవడితో (శీఘ్రంగా); అరదము= రథం; పోనిమ్ము; ఏ+భంగిన్= ఏవిధంగానైనా; ఎవ్వరు+అడ్డంబు+ఐనన్= ఎవరు అడ్డుపడ్డా; అరుదుగన్= ఆశ్చర్యాన్ని కలిగించేటట్లు; అతనికిన్+అ= అతడికొరకే (రాజైన దుర్యోధనుడి కొరకే); ఉఱికెదన్= దూకుతాను.

**తాత్పర్యం:** రాజు ఎక్కడున్నాడో చూద్దాం. రథాన్ని, ఈ సేనకు ఎడమవైపుగా పోనీ! ఎవరు అడ్డుపడ్డా, నేను, రాజుమీదికే దూకుతాను.

**విశేషం:** భీష్ముడు, ద్రోణుడు రాజును రక్షించటానికి వ్యూహాన్ని పన్నగా, వారి ఉద్దేశాన్ని భగ్నం చేయటానికి అర్జునుడు రాజునే పట్టుకొనాలని అంటున్నాడు. ఇది రాజనీతి. సైన్యంతో పనిలేదు. రాజుతోనే పని. ఎంతో సైన్యాన్ని నాశనం చేసే బదులు, రాజును ఒక్కడిని బంధిస్తే, విజయం కలిగినట్లే. అందుకే అర్జునుడు రాజు ఎక్కడున్నాడో చూడాలని అన్నదీ; అందుకే రథాన్ని సేనకు ఎడంప్రక్క పొమ్మన్నదీ.

**ఉ. ఆతఁడు సిక్కెనేని బలమంతయు విచ్చు; మరల్పవచ్చు గో**
**వ్రాతము; నట్లయైన సుకరంబుగ నంతట నెల్లఁ దీఱు; నీ**
**యాతత సేనయం దతని నారసి కానకయున్న వీరి ని**
**ట్లీతల డించి యా కదుపు నెయ్యడఁగఁ బోదము గాక వ్రేల్మిడిన్. 247**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ దుర్యోధనుడు; చిక్కెనేని= దొరికినట్లైతే; బలము+అంతయున్= సేన అంతా; విచ్చున్= చెదిరిపోతుంది; గో(వ్రాతమున్= ఆవులమందనూ; మరల్పవచ్చున్= మళ్ళించవచ్చును; అట్లు+అ+ఐనన్= అట్లాగైతే; అంతటన్= అంతతో; సుకరంబుగన్= సులువుగా; ఎల్లన్+తీఱున్= అంతా తీరిపోతుంది (కార్యం అంతా తీరుతుంది); ఈ+ఆతత= ఈ విశాలమైన; సేనయందున్= సైన్యంలో; అతనిన్= ఆ రాజైన దుర్యోధనుడిని; ఆరసి= బాగా పరిశీలించి చూచి; కానక+ఉన్నన్= (ఒకవేళ) కనుక్కోలేకపోతే; వీరిన్= ఈ పెద్దసేనలోని వాళ్ళను; ఇట్లు= ఈ విధంగా (ఇట్లాగే-ఉన్నదాన్ని ఉన్నట్లుగానే); ఈతలన్= ఈచోటనే; (ఇక్కడనే); డించి= వదలివేసి; (వ్రేల్మిడిన్= వేగంగా (వెంటనే); ఆ కదుపున్= ఆ మందను; ఎయ్దఁగన్= చేరేందుకు (సమీపించటానికి); పోదము+కాక!= వెళ్ళుదాం సుమా!

**తాత్పర్యం:** ఒకవేళ రాజైన దుర్యోధనుడు చిక్కితే సైన్యం అంతా విచ్చిపోతుంది. ఆవులను మళ్ళించవచ్చును. అట్లాగైతే, మనం చేయాల్సిన పని సులువుగా ముగిసిపోతుంది. ఇంత పెద్దసైన్యంలో రాజును కనుగొనలేకపోతే, ఈ సైన్యాన్ని ఇక్కడే వదలివేసి, మందను చేరటానికి పోదాం.

**విశేషం:** రాజును పట్టుకొనటం మొదటి పని. దానివలన సైన్యం భయంతో చెదిరిపోతుంది. అందువలన ఆవులమందను సులువుగా పట్టుకొనవచ్చును. ఒకవేళ ఇది జరగకపోతే (రాజు దొరక్కపోతే) రాజును వెతికే ప్రయత్నం మాని, నేరుగా మందవైపే వెళ్ళి ముట్టడించటం రెండో పని. దీనివలన ఆవులమందను పట్టుకొనవచ్చును. ఇంతకూ గోవులను మళ్ళించటం ఇక్కడ ప్రధానం. అది పై రెండువిధాలా జరుగుతుంది. అయితే, మొదటిపనివలన కార్యం కొంత సులువు అవుతుంది; రెండోపనివలన కొంత పనిభారం. ఏమైనా ఆవులను మళ్ళించాలి. ఇది అర్జునుడి సంకల్పం.

**క. విచ్చి చనకుండఁ బసులం । దెచ్చుట మునుమున్న వలయు తెఱఁగు గా పనికిం**
**జొచ్చి యది చక్కఁ బెట్టఁగ, । నచ్చోటన దాయ మనకు నగపడెడు బలే!** 248

**ప్రతిపదార్థం:** విచ్చి= చెదిరిపోయి; చనకుండన్= పరుగెత్తకుండా; పసులన్+తెచ్చుట= ఆవులను మళ్ళించటం; మునుమున్న= మొట్టమొదట; వలయు తెఱఁగు= చేయవలసిన విధం (చేయదగిన పని); ఆ పనికిన్+చొచ్చి= ఆ పనికి పూనుకొని; అది చక్కఁబెట్టఁగన్= ఆ పని చేయగా; ఆ+చోటన్+అ= ఆ చోటులోనే (అక్కడే); దాయ= శత్రువైన దుర్యోధనుడు; మనకున్+అగపడెడున్= మనకు కనబడతాడు; బలే!= ఇది చాలా బాగుంది!

**తాత్పర్యం:** మొట్టమొదట, ఆవులు చెదిరిపోయి పారిపోకుండా మళ్ళించాలి. ఆ పని చేస్తూ ఉంటే రాజైన సుయోధనుడు మనకు అక్కడే కనపడవచ్చును. ఈ ఆలోచన చాలా బాగుంది.'

**విశేషం:** రాజును వెదకుతూ ఉండిపోతే, ఆతడు దొరక్కపోగా వృథా కాలయాపన అవుతుంది. కనుక ఆవులమందనే ముట్టడిస్తే, అక్కడే రాజుంటే కనిపిస్తాడు. (అట్లాగైతే అటు రాజునూ, ఇటు మందనూ పట్టుకోవచ్చును) ఇది బలేగా ఉంటుంది అని అర్జునుడి ఆలోచన.

**క. అనిన విని, యుత్తరుం డ । మ్మొన వలపటఁ బెట్టి యరదమును బోవఁగ ని**
**చ్చిన సరస కరిగి కవ్వడి । కనువిచ్చి బలంబునెల్లఁ గలయఁగఁ జూచెన్.** 249

**ప్రతిపదార్థం:** అనినన్= అర్జునుడు పైవిధంగా చెప్పగా; విని= విని; ఉత్తరుండు= సారథి అయిన ఉత్తరుడు; ఆ+మొనన్= ఆ సేనను; వలపటన్+పెట్టి= కుడివైపున ఉంచి; అరదమును= రథాన్ని; పోవఁగనిచ్చినన్= పోనివ్వగా; సరసకున్+అరిగి=

సమీపానికి పోయి; కవ్వడి= అర్జునుడు; కనువిచ్చి= కండ్లు తెరిచి (బాగా); బలంబున్+ఎల్లన్= సేననంతటినీ; కలయఁగన్+చూచెన్= కలయ చూచాడు.

**తాత్పర్యం:** అర్జునుడు అనిన మాటలను విని ఉత్తరుడు ఆ కౌరవసైన్యాన్ని కుడివైపు ఉంచి, అంటే దానికి ఎడమ ప్రక్కగా రథాన్ని తోలాడు. అపుడు అర్జునుడు సమీపానికి పోయి, సేనను అంతటినీ బాగా కలయ చూచాడు.

**వ. ఇట్లు గనుంగొని, మధ్య దక్షిణ వామాగ్ర పశ్చిమోత్తర భాగంబుల నిట్టిట్టి వారలు నడచుచున్న వారని సారథితో నేర్పడం బలికి, 'వీరలలో నురగకేతనుండు లేఁడతఁడు గోవులం గొనిపోవ నోపు; నిరామిషంబైన యీ సేనతో నని సేయం బని లేదు; వీర లెయిది యడ్డపడి తడవు సేయకుండునట్లుగా; ముట్టికొని పసులన్ బెట్టించి, దొరయును నేల గడవం బోవక యుండఁ బొదువవలయు' నని చెప్పి యతని నద్దెసకుఁ దేరు వఱుపం బనిచి, గురుకృప గాంగేయులకుఁ జరణ సమీప స్థలంబుల నిలువ రెండును, కర్ణాభ్యర్ణ ప్రదేశంబులం జన రెండునుగా నాలుగేసి యమ్ము లేసిన, నా సవ్యసాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తులగు నాప్తజనంబులతో నల్లన 'యర్జునుం డింత యొప్పియుండునే!' యని యగ్గించి వెండియు. 250**

**ప్రతిపదార్థం:** ఇట్లు+కనుంగొని= ఈవిధంగా సైన్యాన్ని బాగా పరిశీలించి చూచి; మధ్య= నడిమిభాగంలో; దక్షిణ= దక్షిణంవైపున; వామ= ఎడంపక్క; అగ్ర= ముందువైపు; పశ్చిమ= పడమటిదిక్కున; ఉత్తర భాగంబులన్= ఉత్తరంవైపులలో; ఇట్టి+ఇట్టివారలు= ఇట్లాంటిట్లాంటివారు; నడుచుచు+ఉన్నవారు+అని= నడుస్తున్నారని; సారథితోన్= సారథి అయిన ఉత్తరుడితో; ఏర్పడన్+పలికి= స్పష్టంగా తెలిపి; వీరలలో= ఈ వీరులలో; ఉరగ కేతనుండు= పాముగుర్తు జెండాగా కలవాడు (దుర్యోధనుడు); లేఁడు; అతఁడు; గోవులన్= ఆవులను; కొనిపోవన్+ఓపు= తీసికొని (తోలుకొని) పోతూ ఉండవచ్చును; నిరామిషంబు+ఐన= లాభములేని; ఈ+సేనతోన్; అని= యుద్ధం; చేయన్+పని, లేదు= చేయవలసిన అవసరంలేదు; వీరలు+ఎయిది= వీళ్ళు సమీపించి; అడ్డపడి= అడ్డువచ్చి; తడవు+చేయక+ఉండునట్లుగాన్= ఆలస్యం కలిగేటట్లు చేయకుండా ఉండేటట్లుగా; ముట్టికొని= చుట్టుముట్టి; పసులన్+పెట్టించి= ఆవులను వెనుకకు మళ్ళించి; దొరయును= రాజైన దుర్యోధనుడు కూడా; నేల+కడవన్+పోవక, ఉండన్= ఈ రాజ్యపు పొలిమేర దాటిపోకుండా; పొదువ వలయున్= చుట్టుముట్టాలి; అని, చెప్పి; అతనిన్= ఉత్తరుడిని; ఆ+దెసకున్= ఆ దిక్కుకు; తేరు, పఱుపన్+పనిచి= రథం పోనిమ్మని చెప్పి; గురు, కృప, గాంగేయులకున్= ద్రోణుడికీ, కృపాచార్యుడికీ, భీష్ముడికీ; చరణ, సమీప, స్థలంబులన్= పాదాల దగ్గరి తావులలో; నిలువన్= నిలబడేటట్లు (నాటుకొని నిలబడేటట్లు); రెండును= రెండు (బాణాలను); కర్ణ+అభ్యర్ణ ప్రదేశంబులన్= చెవులకు దగ్గరగా (సోకీసోకనట్లుగా); చనన్= పోయేటట్లుగా; రెండునుగాన్= రెండు (బాణాలు)గా; నాలుగు+ఏసి, అమ్ములు+ఏసినన్= నాలుగేసి బాణాలు వేయగా; ఆచార్యుండు= ద్రోణుడు; ఆ+సవ్యసాచిన్= ఆ అర్జునుడిని; చూచి= గమనించి; పరిసరవర్తులు+అగు= చుట్టువారైన; ఆప్తజనంబులతోన్= దగ్గరివారితో; అల్లనన్= మెల్లగా; అర్జునుఁడు+ఇంత+ఒప్పి+ఉండునే?= అర్జునుడు ఎంత ఉచితంగా వ్యవహరించాడు? లేదా - అర్జునుడు ఇంత ఉచితజ్ఞుడై ఉంటాడా? (ఎంత ఉచితజ్ఞుడో అని భావం); అని, అగ్గించి= అని పొగడి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** సైన్యాన్ని అంతా అర్జునుడు కలయజూచి, నడుమా, దక్షిణానా, ఎడంవైపూ, ముందూ, పడమటా, ఉత్తరానా, ఫలానావాళ్ళు పోతున్నారని ఉత్తరుడికి వివరించి, 'వీరందరిలో దుర్యోధనుడు కనిపించటంలేదు, ఒకవేళ, ఆతడు ఆవులను తోలుకుపోతూ ఉండి ఉంటాడు. రాజు లేని ఈ సేనతో మనకు యుద్ధం అనవసరం. ఈ

సైనికులంతా మనకు అడ్డుపడి ఆలస్యం కలిగించకుండా శీఘ్రంగా మందలను మళ్ళించి, రాజు ఈ నేల సరిహద్దు దాటకుండా ఆతడిని మనం పట్టుకొనాలి' అని అంటూ, ఉత్తరుడికి ఆ దిశగా రథాన్ని నడపుమని చెప్పి, గురువైన ద్రోణుడికీ, కృపుడికీ, భీష్ముడికీ పాదాల ముందరి ప్రదేశంలో నాటుకొనేటట్టుగా రెండేసి అమ్ములూ, చెవులను సోకీసోకనట్లుగా రెండేసి బాణాలూ వేశాడు. అప్పుడు ఆ అర్జునుడిని చూచి, ద్రోణాచార్యుడు, తన ప్రక్కన ఉన్న సన్నిహితులతో 'అర్జునుడు ఎంత ఉచితంగా నడుచుకొన్నాడు!' అని పొగడి, మరీ ఇట్లా ప్రశంసించాడు.

### ద్రోణాచార్యుఁ డర్జునుం జూచి ప్రశంసించుట (సం. 4-48-3)

**మ.** **'విలసద్గాండివ చాలనోద్ధతి కనద్విద్యుల్లతాలీలగా**
**నలఘుస్ఫార కపిధ్వజ ధ్వని సముద్యద్గర్జ చందంబుగా;**
**జలదాకారతనొందెఁ దే రితఁడు పర్జన్యాకృతిం బొల్చెఁ; దో**
**ర్బలతీవ్రారి నిదాఘ దుర్విషహ గర్వస్ఫూర్తి నిర్మూర్తిగాన్.** **251**

**ప్రతిపదార్థం:** విలసత్= ప్రకాశిస్తున్న (అతిశయిస్తున్న); గాండివ= గాండీవంయొక్క; చాలన= కదలికలో (త్రిప్పటంలో); ఉద్ధతి= తీవ్రత; కనత్= ప్రకాశించే; విద్యుత్+లతాలీలగాన్= మెఱపుతీగవలె కాగా; అలఘు= ఎక్కువైన; స్ఫార= కాంతిమంతమైన; కపిధ్వజ= కపికేతనంయొక్క; ధ్వని= నాదం (పటపటధ్వని); సముద్యత్+గర్జ చందంబుగాన్= వెలువడే ఉరుములా కాగా; తేరు= రథం; జలద+ఆకారతన్+ఒందెన్= మేఘంయొక్క రూపాన్ని పొందింది; ఇతఁడు= ఈ అర్జునుడు; దోర్బల= బాహువులబలంతో; తీవ్ర= భయంకరం అయిన (దట్టమైన); అరి= శత్రువులనే; నిదాఘ= ఎండాకాలంయొక్క; దుర్విషహ= సహించటానికి వీలుకానట్టి; గర్వస్ఫూర్తి= గర్వంయొక్క స్ఫురణ (విలాసం); నిర్మూర్తి+కాన్= రూపంలేనట్లు (నశించేటట్లుగా); పర్జన్య+ఆకృతిన్= వర్షాధిదేవతగు దేవేంద్రుడి వలె; పొల్చెన్= వెలిగాడు.

**తాత్పర్యం:** 'అర్జునుడి గాండీవంయొక్క కదలిక మెఱుపుతీగెవలె, కపికేతనంయొక్క ధ్వని మేఘంయొక్క ఉరుమువలె ఉండగా, అర్జునుడి రథం మేఘంవలె ఉంది. అర్జునుడు ఇంద్రుడివలె ఉన్నాడు. కనుక, శత్రువు లనే వేసవి గర్వం పూర్తిగా నశించింది. శత్రువుల బాహుబలం వేసవివలె ఉందనీ, అర్జునుడు వర్షాధిపతి అయిన దేవేంద్రుడివలె ఉన్నాడనీ భావం.

**విశేషం:** అలం: ఉపమ. శత్రువు ఎంత తీవ్రమైన వేసవివలె ఉన్నా, అర్జునుడి పరాక్రమం అనే వానవలన అది చల్లబడుతుందని విశేషభావం. వర్షాధిపతి ఇంద్రుడు. ఆతడి కుమారుడు అర్జునుడు. కనుక అర్జునుడు వర్షరూపాన్ని ధరించాడు. ఆతడి రథమే మేఘాకారంలో ఉంది.

**వ.** **ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబుల మొదలంబడ రెండమ్ములేసి, పెద్దకాలంబేనిఁ బాసియున్నవాఁడు గావునఁ గుశల ప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియు సోఁకములుగా రెండమ్ములేసె' నని పలికి వెండియు నిట్లనియె.** **252**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు= ఈ సమయంలో; నాకున్+ప్రణామంబులు+కాన్= నాకు నమస్కారములు చేస్తున్నట్లుగా; రెండు+అమ్ములు= రెండు బాణాలు; పాదంబుల, మొదలన్+పడన్= పాదాలముందర పడేటట్లు; ఏసి= ప్రయోగించి; పెద్దకాలంబు+ఏనిన్=

ఎంతోకాలంగా; పాసి+ఉన్నవాఁడు, కావునన్= నన్ను వదలి దూరంగా ఉన్నాడు కాబట్టి; కుశల ప్రశ్నంబుగాన్= క్షేమంగా ఉన్నారా? అని అడుగుతున్నట్లుగా; రెండు+అమ్ములు= రెండు బాణాలు; చెవులు, సోఁకియున్, సోఁకములు+కాన్= చెవులకు తాకీ తాకనట్లు; ఏసెన్= ప్రయోగించాడు; అని, పలికి= అని మాట్లాడి; వెండియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు నాకు నమస్కరించినట్లుగా ఇప్పుడు రెండు బాణాలను నా పాదాల ముందరవేసి, ఎంతోకాలం విడిచి దూరంగా ఉన్నాడు కనుక, కుశలాదికాన్ని అడిగినట్లుగా, చెవులకు తాకీ తాకనట్లు రెండు బాణాలు వేశాడు' అని ద్రోణుడు ఇంకా ఈ విధంగా అన్నాడు.

**క.** **'ఇడుమలఁ బదుమూఁడేండ్లుం । బడి, కడుఁ గోపించి వచ్చె బలువిడి నీ క**
**వ్వడి దఱియ నుఱికి వడి ని । ప్పుడ యిమ్ముఖ ప్రోవు నెల్లఁ బొరిగొనెడు బలే!** **253**

**ప్రతిపదార్థం:** పదుమూఁడు+ఏండ్లన్= పదమూడు సంవత్సరాలూ; ఇడుమలన్+పడి= కష్టాలను అనుభవించి; కడున్= మిక్కిలి; కోపించి= (కోపంపొంది) కోపంతో; ఈ కవ్వడి= ఈ అర్జునుడు; బలువిడిన్+వచ్చెన్= ఆవేశంతో వచ్చాడు; తఱియన్+ఉఱికి= దగ్గరికి పోయి; వడిన్= శీఘ్రంగా; ఇప్పుడు+అ= ఇప్పుడే; ఈ+ముఖప్రోవున్+ఎల్లన్= ఈ స్వల్పమైన ఈ సేననంతా, ఈ పెంటకుప్పనంతా; పొరిగొనెడున్= నాశనం చేస్తాడు; బలే! (ప్రశంసార్థకం).

**తాత్పర్యం:** 'అడవులలో పదమూడు సంవత్సరాలు కష్టాలు అనుభవించి, కోపంతో అర్జునుడు ఎంతో ఆవేశంతో వచ్చాడు. ఇప్పుడే సమీపించి ఈ అల్పసేనలమీదికి దూకి వాటిని నాశనం చేసేటట్లున్నాడు.

**తే.** **విపినవాసంబు, నజ్ఞాత విధము వర్త । నంబు, గడపి నవాభ్యుదయంబు నొంది**
**రాత్రిఁ బుచ్చి తోఁతెంచు మార్తాండు మాడ్కిఁ । జూడ నుజ్జ్వలుండగుచు నర్జునుఁడు పొలిచె.'** **254**

**ప్రతిపదార్థం:** విపినవాసంబున్= అరణ్యవాసమూ; అజ్ఞాత= అజ్ఞాతవాసంయొక్క; విధము= విధానానికి తగిన; వర్తనంబు= ప్రవర్తన; కడపి= పూర్తిచేసి; నవ= క్రొత్తదైన; అభ్యుదయంబున్+ఒంది= ఉదయాన్ని (అభివృద్ధిని) పొంది; రాత్రిన్+పుచ్చి= రాత్రికాలాన్ని గడిపి; తోఁతెంచు= ఉదయించేటటువంటి; మార్తాండు మాడ్కిన్= సూర్యుడి వలె; చూడన్= చూడటానికి; ఉజ్జ్వలుండు+అగుచున్= ప్రకాశంతో నిండినవాడై; అర్జునుఁడు; పొలిచెన్= వెలుగుతున్నాడు.

**తాత్పర్యం:** అరణ్య, అజ్ఞాతవాసాలను రెంటినీ ముగించి, ఎంతో అభివృద్ధి చెంది, అర్జునుడు, రాత్రిని గడిపి నూతనంగా ఉదయించే సూర్యుడివలె తేజోమూర్తిగా కనిపిస్తున్నాడు.'

**విశేషం:** అలం: ఉపమ. అర్జునుడు, అరణ్య, అజ్ఞాతవాసాల వలన కష్టాలుపడి, తరువాత అభ్యుదయాన్ని పొంది, ఉదయించే సూర్యుడివలె ఉన్నాడని ద్రోణుడి ప్రశంస. ఎంతోకాలం ఒక వ్యక్తి ఎన్నో కష్టాలుపడి, గట్టిపడి, కష్టాల తరువాత క్రొత్త ఉత్సాహంతో, సరిక్రొత్త శక్తితో ఉంటాడనే విషయాన్ని, తిక్కన ఈ పద్యంలో సూచించాడు. కష్టాల తర్వాత వ్యక్తికి క్రొత్త తేజస్సు వస్తుందనీ, ఆతడు ఉదయ సూర్యుడివలె ఉంటాడనీ కవి భావన. ఇది జీవితంలో సహజం. దీనిని కవి అర్జునుడి ద్వారా తెలిపాడు.

**వ. అనియెఁ; గృపాచార్య భీష్ములు పార్థుబాణపాత ప్రకారంబులు ప్రణామ కుశల ప్రశ్నంబులుగ నంతరంగంబులం గనికొని సంతసిల్లిరి; ధనంజయుండును దక్కినవారికి దుర్నిరీక్షుండగుచు నమ్మోహరంబు దెస ననాదరంబు సేసి గోవుల పజ్జం బోవుచుండె; నతనిం జూచి సురనదీసూనుండు కురువీరులతో నిట్లనియె. 255**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని ద్రోణు డన్నాడు; కృపాచార్య, భీష్ములు= కృపాచార్యుడూ, భీష్ముడూ; పార్థు, బాణపాత, ప్రకారంబులు= అర్జునుడియొక్క బాణాలు పడిన పద్ధతులు; ప్రణామ, కుశల, ప్రశ్నంబులుగన్= నమస్కారం చేయటంగా, క్షేమ సమాచారాలు అడుగటంగా; అంతరంగంబులన్= హృదయాలలో; కనికొని= గమనించి; సంతసిల్లిరి= ఆనందించారు; ధనంజయుండును= అర్జునుడుకూడా; తక్కినవారికిన్= మిగిలినవారికి; దుర్నిరీక్షుండు+అగుచున్= తేరిపార చూచేందుకు వీలుకానివాడు ఔతూ; ఆ+మోహరంబు, దెసన్= ఆ సైన్యంవైపు; అనాదరంబు+చేసి= నిరాదరణచూపించి; గోవుల పజ్జన్= ఆవులవైపు; పోవుచున్+ఉండెన్= పోతూ ఉన్నాడు; అతనిన్+చూచి= అర్జునుడిని చూచి; సురనదీసూనుండు= గంగానదీ పుత్రుడు, భీష్ముడు; కురువీరులతోన్= కౌరవసేనలోని వీరులతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని ద్రోణుడు అన్నాడు. కృపాచార్యుడూ, భీష్ముడూ అర్జునుడు ప్రయోగించిన బాణాలతీరులలో ఉన్న నమస్కార, కుశలప్రశ్నలు అనేవాటిని మనస్సులలోనే గమనించి సంతోషించారు. మిగిలినవాళ్ళకు అర్జునుడు తేరిపార చూడరానివాడై, ఆ సైన్యాన్ని అనాదరం చేసి (రాజు లేడు కనుక), ఆవులను సమీపించటానికి పోతున్నాడు. ఆ అర్జునుడిని చూచి, పితామహుడైన భీష్ముడు ఈ రకంగా అన్నాడు.

**క. 'చిరకాలమునకుఁ గంటిమి । నరు; నక్కట! వీఁడు సజ్జనప్రియుఁడు సుహృ**
**త్పరతంత్రుఁడు బాంధవహితుఁ । డరిభీకరుఁ డిట్టి వార లవనిం గలరే! 256**

**ప్రతిపదార్థం:** చిరకాలమునకున్= ఎంతో కాలానికి; నరున్= అర్జునుడిని; కంటిమి= చూచాము; అక్కట!= ఆహా! (ఆశ్చర్యార్థకం); వీఁడు= ఈ అర్జునుడు (మనుమడు కనుక ప్రేమపూర్వక పదం - వీడు); సజ్జనప్రియుఁడు= సుజనులకు ఇష్టమైనవాడు; సుహృద్+పరతంత్రుఁడు= స్నేహితులకు స్వాధీనం అయినవాడు (స్నేహ ప్రధానుడు); బాంధవ= చుట్టాలకు; హితుఁడు= మేలు కూర్చేవాడు; అరి= శత్రువులకు; భీకరుఁడు= భయంకరుడు; ఇట్టివారలు= ఇట్లాంటి (అరుదైన) వాళ్ళు; అవనిన్= భూమిలో (లోకంలో); కలరే!= ఉన్నారా!

**తాత్పర్యం:** 'ఎంతో కాలానికి అర్జునుడిని చూచాం. వీడు సజ్జనులకు ప్రియుడు, మిత్రులకు స్నేహశీలి, బంధువులకు హితుడు, శత్రువులకు భీకరుడు. ఇట్లాంటివాళ్ళు భూమిపై ఉన్నారా! (లేరని భావం).

**విశేషం:** ఇందులో భీష్ముడు అర్జునుడి గుణగుణాలను కొనియాడుతూ, ఆతడి వ్యక్తిత్వానికి మురిసిపోయి, 'ఇట్లాంటివాళ్ళు భూమిలో ఉంటారా!' అని ఆశ్చర్యపడుతూ, గర్విస్తున్నాడు. అర్జునుడిపై పితామహుడికి ఉన్న వాత్సల్యం ఎట్లాంటిదో వ్యక్తమవుతుంది.

**క. మనచూడ్కికి వ్రేఁగయి యీ । తని యతులిత మూర్తి యత్యుదాత్తతఁ గడు నొ**
**ప్పిన యది గంటిరె! జగమె । ల్లను నేలఁగఁ దగు సముజ్జ్వలత యూహింపన్. 257**

**ప్రతిపదార్థం:** మన= మనయొక్క; చూడ్కికిన్= చూపునకు; వ్రేఁగు+అయి= బరువై (దుర్భరమై); ఈతని= ఈ అర్జునుడి యొక్క; అతులిత= సాటిలేని; మూర్తి= ఆకారం; అతి+ఉదాత్తతన్= మిక్కిలి ఉదాత్తతతో (గొప్పతనంతో); కడున్= ఎక్కువగా; ఒప్పిన+అది= విలసిల్లుతూ ఉన్నది; ఊహింపన్= ఆలోచిస్తే; జగము+ఎల్లను= లోకాన్ని అంతటినీ; ఏలఁగన్+తగున్= పాలించతగిన; సముజ్జ్వలత= తేజస్సు (సామర్థ్యం); కంటిరె!= చూచారా!

**తాత్పర్యం:** అర్జునుడి కాంతిమంతమైన రూపం, మన చూపులకు బరువై, చూడరానిదై ఎంత ఉదాత్తంగా ఉన్నదో చూచారా! ఆ తేజస్సు లోకాలనే ఏలదగింది.

**విశేషం:** ఈ పద్యంలో భీష్ముడు, కురుకులాలంకారుడైన అర్జునుడి తేజస్సును ప్రశంసిస్తున్నాడు. అంటే రూపాన్నీ, సామర్థ్యాన్నీ అగ్గిస్తున్నాడు. ముందు పద్యంలో గుణాలను నుతించాడు. భీష్ముడంతటి వాడినే అర్జునుడి తేజశ్శాలిత అచ్చెరువుపరిచింది!

**క. వెనుక దెస వచ్చి కదిసియుఁ । దనరథముఁ దొలంగ నిచ్చి, తఱియఁబడుట కొ**
**ల్లని తలఁపు కలిగి, క్రేఁగం । టన మనలం జూచుచుం గడచి యట నడచెన్. 258**

**ప్రతిపదార్థం:** వెనుక దెసన్ వచ్చి= వెనక పక్కగా వచ్చి; కదిసియున్= సమీపించికూడా; తన రథమున్= తన రథాన్ని; తొలంగనిచ్చి= తొలగిపోనిచ్చి (తప్పించి); తఱియన్+పడుటకున్= ఎదుర్కొనటానికి (సమీపించేందుకు); ఒల్లని= ఇష్టంలేని; తలఁపు= ఆలోచన (భావం); కలిగి; క్రేఁగంటన్+అ= కడ కంటితోనే; మనలన్= మనలను; చూచుచున్= చూస్తూ; కడచి= దాటి; అట నడచెన్= ముందుకు పోతున్నాడు.

**తాత్పర్యం:** వెనక నుండి వచ్చినా, తన రథాన్ని తప్పించి తొలగ తోలించి, మనలను ఎదిరించటానికి మనసులేక కేవలం ఓరచూపులతోనే మనవైపు చూస్తూ, దాటిపోతూ ఉన్నాడు.

**విశేషం:** ఇందులో భీష్ముడు అర్జునుడి రాజనీతి, యుద్ధనీతులనూ, పెద్దల యెడ ఆతడికి గల గౌరవభావాన్నీ ప్రశంసిస్తున్నాడు. ఇందులో అర్జునుడి ఉదాత్తభావం కూడా వ్యక్తం అవుతుంది. ఇట్లాంటి సూక్ష్మమైన మనోధర్మాలను తిక్కన చాల గొప్పగా చిత్రిస్తాడు.

**క. మొనఁ గలయఁ జూచి యూరక । చను టధిపతి నరసి తా నిచటఁ గానక యా**
**తని పజ్జ నరుగు తెఱఁగగు; । ననుమానము లేదు, క్రోధ మగ్గలము మదిన్. 259**

**ప్రతిపదార్థం:** మొనన్= సైన్యాన్ని; కలయన్+చూచి= అంతా పరికించి; ఊరక చనుట= (యుద్ధం చేయకుండా) ఊరకనే వెళ్ళిపోవటం; అధిపతిన్+అరసి= రాజైన దుర్యోధనుడిని వెదకి; తాన్= అర్జునుడు; ఇచటన్= ఇక్కడ; కానక= చూడక; ఆతని పజ్జన్= ఆ దుర్యోధనుడి వైపుగా; అరుగు తెఱఁగు+అగున్= పోయే తీరు అయి ఉంటుంది; అనుమానము లేదు= సందేహం లేదు; మదిన్= అర్జునుడి మనస్సులో; (దుర్యోధనుడిపై), క్రోధము= కోపం (ద్వేషం); అగ్గలము= అధికం.

**తాత్పర్యం:** (అర్జునుడు) సైన్యాన్ని అంతా పరిశీలించి కలయ చూచి, యుద్ధం చేయకుండా ఊరకనే పోవటం చూస్తే, రాజును వెదికి ఆతడు కనిపించకపోగా, ఆతడికొరకు ఆ వైపుగా పోవటమే అయి ఉంటుంది. అనుమానం లేదు. వీడికి (అర్జునుడికి) దుర్యోధనుడంటే చాలా కోపం.

**విశేషం:** రాజును పట్టుకొనాలన్న అర్జునుడి మనస్సులో ఉన్న రహస్యాన్ని, ఆతడి పితామహుడైన భీష్ముడు ఊహించి, నిర్ణయించాడు. పైగా, దుర్యోధనుడిపై అర్జునుడికి కోపం ఎక్కువ అని అర్జునుడి మనస్సును పితామహుడు తెల్పటం విశేషం.

**చ. మనకును గౌరవేంద్రునకు మధ్యముఁ జొచ్చిన యేని నాతఁ డ**
**ర్జుననకు నొంటి సాలఁ; డని రుద్రుఁడు నెక్కటి మార్కొనంగ లేఁ**
**డనిన నొరుండు శక్తుఁడె? రయంబు మెయిన్ మన మెల్ల నిప్పుడా**
**తనికడ సేరఁగాఁ జనుట దప్పినఁ గార్యము దప్పు నెంతయున్. 260**

**ప్రతిపదార్థం:** (భీష్ముడు అంటున్నాడు); మనకును= మనకూ; కౌరవ+ఇంద్రునకున్= దుర్యోధనుడికీ; మధ్యమున్+చొచ్చిన+ఏనిన్= నడుమ ప్రవేశిస్తే; ఆతఁడు= ఆ దుర్యోధనుడు; అర్జుననకున్= అర్జునుడికి; ఒంటిన్= ఒంటరిగా; చాలఁడు= సరిపోడు (సమర్థుడు కాడు); అనిన్= యుద్ధంలో; రుద్రుఁడున్= శివుడు కూడా; ఎక్కటిన్= ఒంటిగా; మార్కొనంగన్+లేఁడు= ఎదిరించలేడు; అనినన్= అంటే; ఒరుండు= ఇతరుడు (శివుడికంటే వేరైనవాడు- సామాన్యుడు); శక్తుఁడె?= శక్తి గలవాడా? (సమర్థుడా); రయంబు మెయిన్= శీఘ్రంగా; మనము+ఎల్లన్= మనం అందరం (సైన్యంతో కూడా); ఇప్పుడు= ఈ సమయంలో; ఆతనికడన్= ఆ దుర్యోధనుడి దగ్గరికి; చేరఁగాన్+చనుట= చేరబోవటం; తప్పినన్= తప్పిపోతే; ఎంతయున్= ఎంతైనా; కార్యము= పని (రాజరక్షణ, +గో గ్రహణం); తప్పున్= తప్పిపోతుంది (చెడిపోతుంది).

**తాత్పర్యం:** మనకూ, రాజైన దుర్యోధనుడికీ నడుమ అర్జునుడు ప్రవేశిస్తే, ప్రమాదం. దుర్యోధనుడు ఒక్కడూ అర్జునుడిని ఎదిరించేందుకు చాలడు. ఆ రుద్రుడు కూడా యుద్ధంలో ఒంటిగా ఎదిరించలేడంటే వేరేవాళ్ళు ఎదిరించగలరా? వెంటనే మనం అంతా ఇప్పుడే దుర్యోధనుడి దగ్గరికి వెళ్ళకపోతే మొత్తం పనే భంగం అయిపోతుంది. పని చెడిపోతుంది.

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. 'జొచ్చెనయేని' - అనే పాఠాంతరం కొన్ని ప్రతులలో ఉన్నది.

**ఆ. వాసవాత్మజుండు వసుధేశనందను । ముట్టికొనిన నొకటి పుట్టెనేని**
**మన ప్రయోజనంబు మఱి యేమి? పసులవి । యేటి? కొండు ధనము లెల్ల నేల?' 261**

**ప్రతిపదార్థం:** వాసవ+ఆత్మజుండు= దేవేంద్రుడి కుమారుడైన అర్జునుడు; వసుధ+ఈశ= రాజైన ధృతరాష్ట్రుడియొక్క; నందనున్= కుమారుడైన దుర్యోధనుడిని; ముట్టికొనినన్= ముట్టడిస్తే (పట్టుకొంటే); ఒకటి పుట్టెనేని= ఏమైనా వస్తే (జరగరానిది ఏదైనా జరిగితే); మన= మనయొక్క; ప్రయోజనంబు= ఉపయోగం; మఱి+ఏమి?= ఏముంది? (ఇంతమందిమి మనం ఉండి లాభమేమి? వ్యర్థం అనుట); (ఏదైనా జరగరానిది జరిగిన తరువాత); పసులు అవి+ఏటికిన్?= ఆవు లెందుకు?; ఒండు= ఇతరమైన; ధనములు= సంపదలు; ఎల్లన్= సమస్తం; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** వాసవనందనుడైన అర్జునుడు దుర్యోధనుడిని పట్టుకొంటే, ఏదైనా జరిగితే, ఇంతమందిమి మనం అంతా ఉండీ ఏమి లాభం? ఆ పరిస్థితిలో ఆవు లెందుకు? తక్కిన సంపదలు అన్నీ ఎందుకు?' (వ్యర్థం అని సారాంశం.)

**విశేషం:** అర్జునుడి చూపంతా రాజుపైనే ఉన్నదనీ, కనుక మనం అందరం ఎట్లాగైనా రాజును కాపాడుకొనాలనీ, అట్లా జరగక, ఒకవేళ జరగరానిదే జరిగితే మనం ఉండి నిరుపయోగమే అనీ, ఆ తరువాత, ఆవు లెందుకు? ఇతర సంపద లెందుకు?- అని భీష్మ పితామహుడి ప్రబోధం. అందుకే ఆయన అందరినీ రాజుకు దగ్గరగా వెళ్ళాలని అంటున్నాడు. అనుభవశాలి కనుక రాగల హానిని పసిగట్టి భీష్ముడు హెచ్చరించాడు. ఇది చాలా ఉచితంగా ఉన్నది.

**వ. అని పలికి, బలంబుఁ బురికొల్పికొని యతండు రాజరక్షణ తత్పరత్వంబున నరదంబు సత్వరంబు సేసిన, సేనాపతిం గని సైనికనికాయంబులుం గడంగి చనందొడంగె; నిప్పాట నమ్మేటిమొనయును వెసం బోవ గోవుల కావలి మూఁకయు వానిం దఱిమికొని యతిరయంబున నరుగం దానును గెలనఁ గ్రోశద్వయ మాత్రంబు నడచి పురుహూతపుత్త్రుం డుత్తరున కిట్లనియె. 262**

**ప్రతిపదార్థం:** అని పలికి; బలంబున్= సేనను; పురికొల్పికొని= ప్రోత్సాహపరిచి; అతండు= భీష్ముడు; రాజ= రాజుయొక్క; రక్షణ తత్పరత్వంబునన్= కాపాడాలనే ఆసక్తితో; అరదంబు= రథాన్ని; సత్వరంబు= వేగవంతం; చేసినన్= చేయుగా; సేనాపతిన్+కని= సేనాధికారి అయిన భీష్ముడిని చూచి; సైనిక= సేనలయొక్క; నికాయంబులు= సమూహాలు; కడఁగి= పూని; చనన్+తొడంగెన్= పో సాగాయి; ఈ+పాటన్= ఈ విధంగా; ఆ+మేటి= ఆ పెద్దదైన; మొనయును= సైన్యంకూడా; వెసన్= వేగంగా; పోవన్= సాగుతూ ఉంటే; కావలి మూఁకయున్= రక్షక సైన్యంకూడా; వానిన్= ఆవులను; తఱిమికొని= తరుముకొంటూ; అతిరయంబునన్= మిక్కిలివేగంగా; అరుగన్= వెళ్ళగా; పురుహూత= ఇంద్రుడియొక్క; పుత్త్రుండు= కుమారుడైన అర్జునుడు; తానును= తాను కూడా; కెలనన్= దాని ప్రక్కనే; క్రోశద్వయ మాత్రంబు= రెండుకోసుల దూరం; నడచి= వెళ్ళి; ఉత్తరునకున్= ఉత్తరకుమారుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** పై విధంగా పలికి భీష్ముడు, సైన్యాన్ని ప్రోత్సాహించి, రాజును కాపాడాలనే ఆసక్తితో రథాన్ని సమాయత్తం చేసి తొందరిస్తే, సేనాపతిని చూచి సైన్యం అంతా శీఘ్రంగా సాగుతూ ఉన్నది. ఆవిధంగా ఆ పెద్దసైన్యం పోతూవుండగా అపుడు ఆవులరక్షణకున్న సైన్యంకూడా ఆవులను తరుముకొని పోవసాగింది. అపుడు అర్జునుడు వాటి ప్రక్కనే రెండు కోసుల దూరం వెళ్ళి, ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** తమ వ్యూహరహస్యాన్ని ప్రతివీరుడైన అర్జునుడు గ్రహించి, రాజును పట్టుకొనాలని ప్రయత్నిస్తున్నాడని భీష్ముడు గ్రహించి, ఆత్రంతో సైన్యాన్ని అంతా రాజరక్షణకే మళ్ళించాడు. ఇందులో పలువురి ఆలోచనాశక్తిని ఒక్కడే గమనించి, దానికి ప్రతిక్రియ చేసేందుకు పూనుకొనటం కనిపిస్తుంది. కనుక దీనివలన అర్జునుడి బుద్ధికుశలత ఎట్లాంటిదో తెలుస్తుంది.

**మ. 'ఇదె గోవర్గము సేర వచ్చితిమి, పోనింకేల? సైన్యంబులుం**
**గదియన్ వే చనుదెంచె; రెంటినడుమంగాఁ జొచ్చి యీ వచ్చు ను**
**న్మద వీరావలికిన్ భుజావిభవ విన్యాసంబు గాన్పించి మా**
**న్పెద గర్వంబు, మరల్చెదం బసుల; నాచేఁ జిక్కు రా జెమ్మెయిన్.' 263**

**ప్రతిపదార్థం:** ఇదె= ఇదుగో; గోవర్గము= ఆవులమందను; చేరన్+వచ్చితిమి= సమీపించటానికి వచ్చాం; పోన్+ఇంకన్+ఏల?= ఇంకా ముందుకు పోవటం ఎందుకు? (అనవసరం అని భావం); సైన్యంబులున్= సేనలుకూడా; కదియన్ వే, చనుదెంచెన్=

వేగంగా దగ్గరికి వచ్చాయి (మనతో పోరాడటానికి); రెంటి= రెండింటియొక్క; నడుమంగాన్= మధ్యలో; చొచ్చి= ప్రవేశించి; ఈ వచ్చు= ఈ వస్తూ ఉన్న; ఉన్మద= మదించిన; వీర+ఆవలికిన్= వీరసమూహానికి; భుజావిభవ= భుజ పరాక్రమంయొక్క; విన్యాసంబు= విలాసం (యుద్ధ విన్యాసం); కాన్పించి= ప్రదర్శించి; గర్వంబు= పొగరును; మాన్పెదన్= మాపుతాను; పసులన్= ఆవులను; మరల్చెదన్= మళ్ళిస్తాను; ఏ+మెయిన్= ఏ రకంగానైనా; రాజు= రాజైన దుర్యోధనుడు; నాచేన్= నా చేతికి; చిక్కున్= చిక్కుతాడు.

**తాత్పర్యం:** '(ఉత్తరకుమారా!) ఇదుగో మంద దగ్గరికి వచ్చేశాం. మనం ఇంకా ముందుకు పోవలసిన పని లేదు. సైన్యాలు మనలను ఎదిరించటానికి దగ్గరగా వచ్చేస్తున్నాయి. రెంటికీ నడుమ దూరి, గర్వంతో నిండిన ఈ వీరులకు నా పరాక్రమాన్ని చూపించి, వాళ్ళ గర్వాన్ని అణిచివేస్తాను, మందను మళ్ళిస్తాను. ఎట్లాగైనా రాజైన దుర్యోధనుడు నాచేతికి చిక్కుతాడు.

### యుద్ధారంభము (సం. 4-48-12)

క. **అనుటయు, విరాటతనయుఁడు । మొన కడ్డము గాఁగఁ దూర్పుమొగమై రథముం**
**గొని కట్టెదిరికిఁ బోయినఁ । దన మూఁపులు రెండు నపుడు దలకుం గడవన్.** 264

**ప్రతిపదార్థం:** అనుటయున్= అర్జునుడు అట్లా అనగానే; విరాటతనయుఁడు= ఉత్తరుడు; మొనకున్+అడ్డముగాఁగన్= సైన్యానికి అడ్డంగా; తూర్పుమొగము+ఐ= తూరుపుదిశగా మొగంచూపి; రథమున్+కొని= రథాన్ని నడుపుకొని; కడు+ఎదిరికిన్+పోయినన్= సేనలకు ఎదురుగా వెళ్ళగా; (విజయుడు); తన మూఁపులు= తనయొక్క బుజాల మొదళ్ళు (గూడలు); రెండును= రెండూ; అపుడు= ఆ సమయంలో; తలకున్+కడవన్= తలను దాటిపోగా. (ముందుకు అన్వయం).

**తాత్పర్యం:** అర్జునుడు అట్లా అనగానే, ఉత్తరుడు సేనకు అడ్డంగా, తూర్పుదిశగా రథాన్ని పోనిచ్చాడు. రథం, సేన ఎట్ట ఎదుటికి వచ్చి నిలిచింది. అప్పుడు అర్జునుడికి రణోత్సాహంతో ఒళ్ళు ఉప్పొంగి, బుజాల మొదళ్ళు తలను తగిలాయి. ('బుజాలు మూడుకావడం' అంటే ఇదే!)

వ. **తేరు సమ్ముఖంబు సేయించి పేరు వాడి క్రీడి కరతలం బెత్తి 'నిలు నిలు' మని యదల్చిన ఘోషంబు తోడన వెడలు నిశిత శర పరంపరల దట్టంపుఁ బఱపున నంబరంబు నీరంధ్రం బగుటయుఁ దదంధకారంబును భయతిమిరంబునుం గలసి గుండియ లవిసి కురుబలంబు లెదురు నడవను మఱలం బఱవను మఱచి, వెఱచఱచి హరితనయ హస్తలాఘవప్రశస్తి దక్కందక్కిన చేష్టలు దక్కియుండె; నతండు గోవుల వెనుకం బోవు నల్పబలంబు బెదరి తూర్పు దెసకుం జెదరునట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపి సూపి వెలిచీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం, దదీయ భూతంబు లార్వ, మౌర్వీ రవంబును, రథనినదంబును, బ్రతిపతాకినీ తుములంబును, గగనంబునం బొగడు నమరుల యెలుంగులును నొక్కటఁ జెలంగ సముదిత సాంద్ర సంరావంబు రోదసీ కుహరంబు నిండిన, నొండొండ తోఁకమట్ట లెత్తుకొని నేలమట్టవియుచు నద్రువం బసులు వెసం దిరిగి మున్ను విచ్చుండు వచ్చిన జాడ గైకొని దక్షిణదిశకుఁ గెరలు వొడుచుచుం దెరలం బాఱిన.** 265

**ప్రతిపదార్థం:** తేరు= రథాన్ని; సమ్ముఖంబు+చేయించి= ఎదురుగా నిలబెట్టించి; పేరు వాడి= తన పేరును గట్టిగా చెప్పుకొని; క్రీడి= అర్జునుడు; కరతలంబు+ఎత్తి= అరచేతిని పైకెత్తి; నిలు నిలుము+అని= నిలబడు, నిలబడు మని; అదల్చినన్= అదిలించిన; ఘోషంబు= గొప్పశబ్దం; తోడన్+అ= వెంబడే; వెడలు= బయలుదేరు; నిశితశర పరంపరలు= వాడి అయిన బాణాలయొక్క సమూహాలు; దట్టము+పఱపునన్= దట్టంగా వ్యాపించటంతో; అంబరంబు= ఆకాశం; నీరంధ్రంబు= సందు లేనట్టిది; అగుటయున్= కాగా; తద్+అంధకారంబును= ఆ చీకటీ; భయతిమిరంబును= భయం అనే చీకటీ; కలసి= ఒకటై; గుండియలు+అవిసి= గుండెలు పగిలిపోయి; కురుబలంబులు= కౌరవ సేనలు; ఎదురు నడవను= ఎదురు పోవటం; మఱలన్+పఱవను= తిరిగి పరుగెత్తటం; మఱచి= మరచిపోయి; వెఱచఱచి= భీతిల్లి; హరి= దేవేంద్రుడియొక్క; తనయ= కుమారుడైన అర్జునుడియొక్క; హస్తలాఘవ= చేతిని త్రిప్పటంలోని (బాణప్రయోగంలోని) నేర్పుయొక్క; ప్రశస్తి తక్కన్= పొగడటం తప్ప; తక్కిన చేష్టలు= మిగిలిన చేష్టలు; తక్కి+ఉండెన్= లేకుండా నిలిచి ఉండిపోయినవి; అతండు= అర్జునుడు; గోవుల, వెనుకన్+పోవు= ఆవుల వెంట పోయే; అల్పబలంబు= స్వల్పమైన సైన్యం; బెదరి= భయపడి; తూర్పు దెసకున్= తూరుపు దిక్కుకు; చెదరునట్లుగాన్= పారిపోయేటట్లు; అరదంబున్= రథాన్ని; పఱపించి= తోలించి; తెఱపి+చూపి= కొంత సందు చూపి; వెలిచీర= తెల్లటిగుడ్డను; సారించి= ఊపి; దేవదత్తంబు, పూరించినన్= దేవదత్తమనే శంఖాన్ని పూరించగా; కేతుకపి= జెండాపైన ఉన్న కపిరాజు; గర్జిల్లన్= సింహనాదం చేయగా; తదీయ భూతంబులు= ఆ ధ్వజానికి సంబంధించిన ఇతర భూతాలు; ఆర్వన్= అరవగా; మౌర్వీ= అల్లెత్రాటి యొక్క; రవంబును= ధ్వనీ; రథ నినదంబును= రథంయొక్క చప్పుడున్నూ; ప్రతి= శత్రువులయొక్క; పతాకినీ= సేనయొక్క; తుములంబును= సందడీ; గగనంబునన్= ఆకాశంలో; పొగడు= కీర్తించే; అమరుల= దేవతల; ఎలుంగులును= గొంతులు (కంఠనాదాలు); ఒక్కటన్= ఒక్కటిగానేర్పడి; చెలంగన్= వ్యాపించగా; సముదిత+సాంద్ర+సంరావంబు= పుట్టిన దట్టమైన కోలాహలం; రోదసీ కుహరంబు= భూమి ఆకాశం - ఈ రెండింటి నడిమి భాగం అనే గుహ అంతటా; నిండినన్= నిండగా; ఒండు+ఒండ= క్రమక్రమంగా; తోఁకమట్టలు= తోకల మొదళ్ళను; ఎత్తుకొని= పైకెత్తుకొని; నేలమట్టు= నేలయొక్క కుదురు; అవియుచున్= పగులుతూ; అద్రువన్= కంపించగా; పసులు= ఆవులు; వెసన్= వెంటనే; తిరిగి= వెనుకకు తిరిగి; మున్ను= అంతకుముందు; వివ్వచ్చుండు= అర్జునుడు; వచ్చిన జాడ= వచ్చిన దిక్కు; కైకొని= తీసికొని, అనుసరించి; దక్షిణ దిశకున్= దక్షిణదిక్కుకు; కెరలు+పొడుచుచున్= విజృంభిస్తూ; తెరలన్+పాఱినన్= వడిగా పరుగెత్తగా.

**తాత్పర్యం:** అర్జునుడు రథాన్ని ఎదురుగా నిలబెట్టించి, తన పేరును గట్టిగా చెప్పుకొంటూ, అరచేతిని పైకెత్తి నిలునిలుమని అరిచాడు. అలా బిగ్గరగా ఘోషిస్తూ పదునైన బాణాలను విడిచాడు. ఆకాశమంతా బాణాలు వ్యాపించి, చీకటి నిండిందా! అని అనిపించింది. అంతేగాక, బాణాల చీకటికి తోడు, భయం అనే చీకటీ వ్యాపించి, కౌరవసేనకు గుండె పగిలింది. ముందుకు పోవాలో, వెనక్కు వెళ్ళాలో తెలియలేదు. సేనలు భయంతో భ్రాంతి చెందాయి. ఆ స్థితిలో సైనికులు అర్జునుడి హస్తలాఘవాన్ని మాత్రం పొగడుతూ నిలిచిపోయారు. వాళ్ళు తక్కిన చేతలను విస్మరించారు. ఆ సమయంలో అర్జునుడు ఆవుల వెనుక పోయే కొద్దిపాటి సైన్యం చెదిరి తూర్పుదిశగా పరుగెత్తేటట్లు రథాన్ని తోలుమని, కొంత ఎడం చూపి తెల్లగుడ్డను ఊపి దేవదత్తాన్ని పూరించాడు. వెంటనే ఆ అల్పసైన్యం భీతితో చెదరి తూర్పుదిశగా పోయింది. అప్పుడే జెండాపై కపిరాజు గర్జించాడు. పతాకాన్ని ఆశ్రయించి ఉన్న భూతగణాలు అన్నీ ఒక్కమారు అరిచాయి. గాండీవంయొక్క అల్లెత్రాటి మ్రోతా, రథచక్రాల ఘోషా, శత్రు సైన్యాల సందడీ, ఆకసంలో పొగడుతూ ఉండే దేవతల కంఠరావం, అన్నీ ఒకేమారు విజృంభించాయి. ఆ ధ్వని భూమ్యాకాశ మధ్యభాగమంతటా నిండిపోయింది. ఆవులు తోకలను పైకెత్తుకొని, నేల బీటలువారేటట్లు వెనక్కు మళ్ళి, అర్జునుడు వచ్చిన దారి పట్టి దక్షిణంగా పరుగెత్తాయి.

**క. గోవులతోఁ బొదువం బడి । పోవుచునున్నట్టి గోపపుంజంబు తదీ**
**యావసరంబున సరభస । మై వాని పిఱుందఁ దిరిగి యమ్మెయిఁ బఱచెన్. 266**

**ప్రతిపదార్థం:** గోవులతోన్= ఆవులతో కూడా; పొదువన్+పడి= జతకూర్చబడి, అనుబంధించబడి; పోవుచున్+ఉన్నట్టి= పోతూ ఉన్న; గోపపుంజంబు= గోపాలుర మొత్తం; తదీయ+అవసరంబునన్= ఆ సమయంలో; సరభసమై= తొట్రుపాటుతో; వాని= ఆవులయొక్క; పిఱుందన్+తిరిగి= వెనుకకే మళ్ళుకొని; ఆ+మెయిన్= అట్లాగే (ఆవులు పోయిన వైపునకే); పఱచెన్= పరుగెత్తింది.

**తాత్పర్యం:** ఆవులతో అనుబంధించబడి సాగిపోతూ ఉన్న గోపాలకుల గుంపు కూడా అప్పుడు ఆవుల వెంటబడి, తొందరగా పరుగులు తీసింది.

**ఆ. అప్పు డర్జునుండు దప్పక చూచి 'యీ । బలము పసుల కడ్డపడక యుండ**
**నెడ సొరంగ వలయు నిట యెయ్యిడుకొను' మని । పనిచె మత్స్యభూమిపాలసుతుని. 267**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; అర్జునుండు= అర్జునుడు; తప్పక చూచి= (సైన్యాన్ని) బాగా పరిశీలించి కనుక్కొని; ఈ బలము= ఈ సేన; పసులకున్= ఆవులకు; అడ్డపడక+ఉండన్= అడ్డు రాకుండా (పసువులను మళ్ళించకుండా); ఎడ+చొరంగ వలయున్= నడుమకు చేరాలి; ఇట= ఈ వైపునకు; ఎయ్యికొనుము+అని= తరుముకొని వెళ్ళుమని; మత్స్యభూమి పాల= విరాటరాజుయొక్క; సుతునిన్= కుమారుడైన ఉత్తరుడిని; పనిచెన్= నియమించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో అర్జునుడు సైన్యాన్ని అంతా చక్కగా శోధించి, 'ఈ సేన మన ఆవులకు అడ్డురాకుండా మధ్యగా మనం పోవాలి. కనుక ఈ వైపునకు తరుము' మని ఉత్తరుడిని ఆజ్ఞాపించాడు.

**క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ । జన నిచ్చె రథంబు; గోపసంఘముఁ 'దిరమై**
**కొనిపొండు పసుల నోడక' । యని తా నెలుఁ గిచ్చి వీటికై నూల్కొలిపెన్. 268**

**ప్రతిపదార్థం:** పనిచినన్= పైవిధంగా ఆజ్ఞాపించగా; ఆతఁడున్= ఆ ఉత్తరుడు కూడా; ఆ+మెయిన్= అదే విధంగా; రథంబు= రథాన్ని; చనన్+ఇచ్చెన్= పోనిచ్చాడు; ఓడక= భయపడక; పసులన్= గోవులను; తిరము+ఐ= గట్టిగా (ధైర్యంగా); కొనిపొండు= తోలుకొని పొండి- అని; తాను= అర్జునుడు; గోపసంఘమున్= గోపకుల గుంపును; ఎలుఁగు+ఇచ్చి= గొంతిచ్చి (కేకవేసి); వీటికై= నగరానికి; నూల్కొలిపెన్= ప్రేరేపించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు చెప్పినట్లుగా ఉత్తరుడు రథాన్ని పోనిచ్చాడు. 'ఏ భయం లేకుండా, ధైర్యంగా ఆవులను తోలుకొని పొండి' అని గోపకులను కేకవేసి, అర్జునుడు పట్టణం వైపుగా పొమ్మని వారికి చెప్పాడు.

**వ. అట్టి సమయంబున. 269**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (ముందుకు అన్వయం).

**క. కరితురగ సమితిఁ గార్కొని । కురువీరుల మొనలు మొగులు కొమరునఁ గవియన్**
**శరవేగంబున నరుఁ డు । ద్ధుర మారుత చండభంగి దోఁపఁ దెరల్చెన్. 270**

**ప్రతిపదార్థం:** కరి= ఏనుగులయొక్క; తురగ= గుర్రాలయొక్క; సమితిన్= సమూహంతో; కార్కొని= నల్లబారి; కురువీరుల= కౌరవవీరులయొక్క; మొనలు= సైన్యాలు; మొగులు= మేఘంయొక్క; కొమరునన్= విధంగా (మేఘంవలె); కవియన్= చుట్టుముట్టగా; నరుఁడు= అర్జునుడు; శర వేగంబునన్= బాణ వేగంతో (రివ్వున బాణం పోయినట్లు); ఉద్ధుర= తీవ్రమైన; మారుత= గాలియొక్క (ఝంఝామారుతంయొక్క); చండభంగి= భయంకరమైన రీతి; తోఁపన్= అనిపించేటట్లు; తెరల్చెన్= చెదరగొట్టాడు.

**తాత్పర్యం:** ఏనుగులతో, గుర్రాలతో నల్లబారిన కురుసేనలు చెలరేగి అర్జునుడిని మేఘాలవలె కమ్ముకొన్నాయి. అప్పుడు అర్జునుడు, శరవేగంతో, తీవ్రమైన సుడిగాలివలె ఆ మబ్బులను చెదరగొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కదిసిన బలములు విచ్చినఁ । గదుపులఁ జెదరంగ నీక గాండీవి వెసం**
**బొదివి యట కడపె; నవియును । గొదగొని తమపొలము సొచ్చె గోపాలురతోన్. 271**

**ప్రతిపదార్థం:** కదిసిన= మీదికి వచ్చిన (చుట్టుముట్టిన); బలములు= సేనలు; విచ్చినన్= చెదిరిపోగా; గాండీవి= అర్జునుడు; కదుపులన్= ఆవులను; చెదరంగనీక= చెదిరిపోనీయకుండా; వెసన్+పొదివి= వేగంగా మందగా చేర్చి; అట= అటు; కడపెన్= తోలాడు; అవియున్= ఆ ఆవులుకూడా; గొదగొని= ఉత్సహించి (విజృంభించి); గోపాలురతోన్= ఆలకాపరులతో; తమ= తమదైన (విరాటరాజ్యంయొక్క); పొలము+చొచ్చెన్= పొలిమేరలో అడుగుపెట్టాయి.

**తాత్పర్యం:** ఆ రకంగా తనపైకి చుట్టుముట్టిన సైన్యాలు చెదిరిపోగా, వెంబడే అర్జునుడు ఆవులగుంపును కకావికలు కానీయక, ఆ వైపునకు మళ్ళించాడు. ఆ ఆవులు కూడా చెలరేగి, ఆలకాపరులతో తమ పొలిమేరలో ప్రవేశించాయి.

**వ. అని చెప్పిన విస్మయంబు నొంది. 272**

**తాత్పర్యం:** పై విధంగా చెప్పగా, వినిన జనమేజయుడు ఆశ్చర్యంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'పసులు పట్టువడిన పదపడి నరుఁ డెద్ది । యాచరించెఁ ? గౌరవాధినాథుఁ**
**డేమి సేసె? బలము లెట్లయ్యె? భీష్మాది । వీరు లెవ్విధంబు వార లైరి?' 273**

**ప్రతిపదార్థం:** పసులు= గోవులు; పట్టు+పడిన= పట్టుబడిన; పదపడి= తర్వాత; నరుఁడు= అర్జునుడు; ఎద్ది+ఆచరించెన్= ఏం చేశాడు?; కౌరవ+అధినాథుఁడు= దుర్యోధనుడు; ఏమి+చేసెన్= ఏం చేశాడు?; బలములు= సేనలు; ఎట్లు+అయ్యెన్?= ఏమయ్యాయి?; భీష్మ+ఆదివీరులు= భీష్ముడు మొదలైన వీరులు; ఏ+విధంబువారలు+ఐరి?= ఏం చేశారు?

**తాత్పర్యం:** 'అర్జునుడు ఆవులను పట్టుకొన్నతరువాత ఏం చేశాడు? దుర్యోధనుడు ఏం చేశాడు? సేనల సంగతి ఏమయింది? భీష్ముడు మొదలైన మహావీరులంతా ఎట్లా ఉన్నారు?'

**వ. అనవుడు.** 274

**తాత్పర్యం:** అని అనగానే.

**విశేషం:** ఇంతటితో నాలుగో ఆశ్వాసం కథ ముగిసింది. తరువాత ఆశ్వాసాంత పద్యాలు మూడున్నాయి. వీటిలో తిక్కన ఇష్టదైవమైన హరిహరనాథుడి వర్ణనే ఉంటుంది. తిక్కన భారతభాగాన్ని ఆ దేవుడికే అంకితం ఇచ్చాడు.

## ఆశ్వాసాంతం

**మ. నవతాదూర! పురాణతానుపగతా! నానాత్వ సంశోభితా!**
**వివిధత్వాపగమోజ్జ్వలా! బహుకళావిర్భావశాలీ! సము**
**ద్భవ రాహిత్య నిరూఢ! సూక్ష్మతర సంభాసా! మహాస్థూల మూ**
**ర్తి విశేషా! నిరుపాధికా! గుణమయా! ధీవర్తకా! నిష్క్రియా!** 275

**ప్రతిపదార్థం:** నవతాదూర!= కొత్తదనానికి దూరమైన వాడా! (కొత్తదనం లేనివాడా); పురాణతా+అనుపగతా!= పాతదనం లేనివాడా! (కొత్త, పాతలకు అతీతమైనవాడా); నానాత్వ సంశోభితా!= ఎన్నో రూపాలతో వెలిగేవాడా!; వివిధత్వ+అపగమ+ఉజ్జ్వలా!= అనేకత్వం నశించి వెలిగేవాడా! (ఏకరూపంతో ప్రకాశించేవాడా! - అని భావం); బహుకళా+ఆవిర్భావశాలీ!= అనేకములైన కళలయొక్క పుట్టుకతో శోభిల్లేవాడా!; సముద్భవ= పుట్టుకయొక్క; రాహిత్య నిరూఢ!= లేకపోవటం వలన, పేరు కెక్కిన వాడా!; సూక్ష్మతరసంభాసా!= మిక్కిలి సూక్ష్మమైన రూపంతో ప్రకాశించేవాడా!; మహా= గొప్పదైన; స్థూల= పెద్దదైన; మూర్తి= ఆకారంతో; విశేషా!= విశేషమైన వాడా! (అంతటా వ్యాపించిన రూపం కలవాడా!); నిరుపాధికా!= ఉపాధి లేనివాడా! (నిర్గుణుడు అని); గుణమయా!= త్రిగుణాలు కలవాడా! (సగుణుడు); ధీ= బుద్ధిని; వర్తకా!= ప్రవర్తింప చేసేవాడా!; నిష్క్రియా!= క్రియలేని వాడా!.

**తాత్పర్యం:** కొత్తపాతలు రెండూ లేనివాడా! వివిధ నామరూపాలతో వెలుగొందేవాడా! ఏకత్వంతో భాసిల్లేవాడా! జన్మరహితుడా! అనేక కళలయొక్క ఆవిర్భావంతో శోభిల్లేవాడా! సూక్ష్మ, స్థూల రూపాలను ధరించినవాడా! నిర్గుణ, సగుణాత్మకా! సమస్త బుద్ధులను ప్రవర్తింపజేసేవాడా! ప్రవృత్తి, నివృత్తి రూపా!

**విశేషం:** అలం: విరోధాభాసం. ఇందులో పరస్పర విరుద్ధాలైన విషయాలు భగవంతుడైన హరిహరనాథుడిలో ఉన్నట్లు తిక్కనమహాకవి వర్ణించాడు. ద్వంద్వాత్మకమైన సమస్తం భగవద్రూపమే - అనే పరమసత్యాన్ని నిరూపించటానికే మహాకవి ఇట్లా అభివర్ణించాడు. ఇది ఒక విలక్షణత్వాన్ని సంతరించుకొన్న వర్ణనావిధానం.

**క. అంతఃకరణ చతుష్టయ । శాంతి సముద్యద్వివేక సంపద్వేద్యా!**
**చింతాతంతు త్రుటనా । త్యంత విగదద్గైక భజన తత్పర హృద్యా!** 276

**ప్రతిపదార్థం:** అంతఃకరణ చతుష్టయ= నాలుగు రకాలైన అంతఃకరణాలయొక్క; శాంతి= శాంతితో; సముద్యత్= పుట్టిన; వివేక= విజ్ఞానం అనే; సంపద్= సంపదతో; వేద్యా!= తెలిసికొనదగినవాడా!; చింతా= చింత అనే; తంతు= దారాన్ని; త్రుటనా=

తెంచివేయడంలో; అతి+అంత= మిక్కిలి; విదగ్ధ= నేర్పుకలవాళ్ళకీ; ఏకభజనతత్పర= పరమాత్మను సంసేవించడంలోనే రక్తులైన వాళ్ళకూ; హృద్యా!= హృదయంగమం అయినవాడా!

**తాత్పర్యం:** నాలుగురకాలైన అంతఃకరణాలయొక్క శాంతతతో పుట్టిన విజ్ఞానంతో తెలిసికొనదగినవాడా! చింత అనే త్రాటిని తెంచడంలో చాతుర్యం ఉన్న జ్ఞానులకూ, పరమాత్మను నిరంతరం సేవించే భక్తులకూ మనోహరుడవయిన హరిహరనాథదేవా!

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం. మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం - అనేవి నాలుగు అంతఃకరణాలు. కార్యభేదాలను అనుసరించి, ఒక్కటే అయిన అంతరింద్రియం నాలుగురకాలుగా మారింది. ఇవి (వీటి ధర్మాలు) నశిస్తేనే కాని, శాంతి కలుగదు. దానివలన జ్ఞానం ఉద్భవిస్తుంది. అది నిజమైన జ్ఞానం. అంటే జ్ఞానులకు భగవంతుడు తెలుస్తాడు. ఇది జ్ఞాన మార్గం. నిరంతర సేవవలన భక్తులకు భగవంతుడు గోచరిస్తాడు. ఇది భక్తిమార్గం. అధికారి భేదాన్ని బట్టి భగవంతుడు గోచరం అవుతాడు. ఇక్కడ తిక్కన మహాకవి జ్ఞాన, భక్తి మార్గాలను నిరూపించాడు. అంతేకాక, 'చింత' అనే తాటిని త్రెంచాలి- అనటంలో వైరాగ్యభావం వ్యక్తం. అందువలన భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను మహాకవి సూచించాడు.

**మాలిని:**

**ప్రణమదవన విద్యాప్రౌఢ! సంరూఢ కాంతి । ప్రణుత చరణ పద్మా! పద్మజాదిత్య సత్పో**
**షణ చతుర! దయావిస్ఫారితాలోక! లోకాపణ నిపుణ జనాంచద్భక్తి విక్రీతమూర్తీ! 277**

**ప్రతిపదార్థం:** ప్రణమత్= నమస్కారం చేసేవాళ్ళను; అవన= కాపాడటం అనే; విద్యా= విద్యలో; ప్రౌఢా!= సమర్థుడా! (పటిష్ఠమైన వాడా!); సంరూఢ= మిక్కిలి స్ఫుటమైన; కాంతి= తేజంతో; ప్రణుత= స్తుతించబడ్డ; చరణపద్మా!;= పద్మాలవంటి పాదాలు కలిగినవాడా! పద్మజ= పద్మంలో పుట్టిన బ్రహ్మనూ; ఆదిత్య= సూర్యుడినీ; సత్పోషణచతుర!= బాగా పోషించటంలో నేర్పు కలవాడా! (బ్రహ్మదేవుడు సృష్టికీ, సూర్యుడు కాలానికీ ప్రతీకలు. హరిహరనాథదేవుడు ఆ రెంటికీ అధినాయకుడు. సృష్టి-మిగతా స్థితిలయాలకూ సూచకమే. అంటే ఆ దేవుడు త్రికార్యాలకు నాథుడని భావం. అట్లాగే కాలస్వరూపుడు - అనీ ధ్వని); దయా= కరుణతో; విస్ఫారిత+ఆలోక!= మిక్కిలి వికసించిన కండ్లు (చూపులు) కలిగినవాడా!; లోక= ప్రపంచం అనే; ఆపణ= అంగడిలో; నిపుణజన= నేర్పరులైన భక్తజనులయొక్క; అంచత్= అలరారుతున్న; భక్తి= భక్తిచేత; విక్రీత= అమ్ముడుపోయిన; మూర్తీ!= ఆకృతి కలిగినవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథ దేవా! నీకు నమస్కారం చేసేవాళ్ళను కాపాడేవాడా! అత్యధికమైన కాంతితో వెలిగే పాదపద్మాలు కలవాడా! సృష్టికర్త అయిన బ్రహ్మనూ, కాలస్వరూపుడైన ఆదిత్యుడినీ కూడా పోషించేవాడా! దయతో వికసించిన చూపులు కలవాడా! ప్రపంచం అనే అంగట్లో భక్తుల భక్తిభావానికి అమ్ముడుపోయినవాడా! మీకు నమస్కారం.

**విశేషం:** అలం: ముక్తపదగ్రస్తం.

**గద్యము:**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబున విరాటపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది ఉభయకవి మిత్రుడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, పండితుల సేవతో రాణించేవాడూ అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలోని విరాటపర్వంలో నాల్గవ ఆశ్వాసం.

**విరాటపర్వంలో చతుర్థాశ్వాసం సమాప్తం**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## విరాటపర్వము - పంచమాశ్వాసము

**శ్రీ సంపాదన చాతు । ర్యా! సేవ్య పదారవింద! యౌగిక విద్యో**
**ద్భాసిత మూర్తి మయాత్మ! వ్యాస సమాసైక రూప! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ సంపాదన చాతుర్యా!= లక్ష్మీదేవిని సంపాదించుకొనటంలో నేర్పరితనం కలవాడా! (హరి); శ్రీ= విషాన్ని; సంపాదన= పొందటంలో; చాతుర్యా!= చాతుర్యం కలవాడా!; (హర); (దేవతలు రాక్షసులు పాలసముద్రాన్ని చిలికే సందర్భంలో పుట్టిన లక్ష్మీదేవిని విష్ణువు, విషాన్ని శివుడు పొందినట్లు పురాణగాథ; మరొక అర్థంలో - భక్తులకు ఐశ్వర్యాన్ని ఇవ్వటంలో నేర్పు కలవాడా! అనీ, శ్రీశబ్దం మోక్ష వాచకం కావటంచేత భక్తులకు మోక్షాన్ని సంపాదించటంలో చాతుర్యం కలవాడా! అనికూడా చెప్పవచ్చు); సేవ్యపద+అరవింద!= సేవించ దగిన పద్మాల వంటి పాదాలు కలవాడా!; యౌగిక విద్యా= సాంఖ్య కర్మ యోగాదుల వలన కలిగిన జ్ఞానం చేత; ఉత్+భాసిత= మిక్కిలి ప్రకాశింప జేయబడిన; మూర్తిమయ+ఆత్మ!= ఆకారమే స్వరూపంగా కలిగినవాడా!; వ్యాస= వ్యష్టిగాను; సమాస+ఏకరూప= సమష్టిగానూ ఉండి ఒకేరూపు కలిగినవాడా! (హరిహరులు ఇద్దరూ భిన్నరూపం కలిగిన వారైనప్పటికీ ఒకే రూపాన్ని పొంది హరిహరనాథుడుగా ఐనవారని భావం); హరిహరనాథా!= హరిహరనాథుడవైన స్వామీ!

**తాత్పర్యం:** లక్ష్మీదేవిని లేదా విషాన్ని పొందటంలో నేర్పరితనం కలవాడా! (భక్తులకు సంపదను, లేదా మోక్షాన్ని సంపాదించి ఇవ్వటంలో చాతుర్యం కలవాడా! అని కూడా అర్థం); సేవించదగిన పాద పద్మాలు కలిగినవాడా! సాంఖ్య కర్మ యోగాదుల చేత కలిగిన జ్ఞానంతో ప్రకాశింపజేయబడిన ఆకారం కలవాడా! భిన్నరూపుడ వయ్యు ఏకరూపాన వెలసినవాడా! హరిహరనాథా! - చిత్తగించవలసింది.

**విశేషం:** ఇది ఆశ్వాసారంభ పద్యం. కృతిపతి అయిన హరిహరనాథుడిని సంబోధిస్తూ చెప్పినట్టిది. ఇందులోని ప్రతి విశేషణం అటు హరికీ, ఇటు హరుడికీ, ఇరువురూ కలిసిన హరిహరనాథుడికీ అన్వయించటం విశేషం. అలం: శ్లేష.

అర్జునుఁ డుత్తరునకుఁ గౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పుట (సం. 4-49-1)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: నివ్విధంబున విరోధివర్గం బుక్కు దక్కి వెక్కసపడి చూచుచుండ నిరర్గళ భుజార్గళ సంరంభ విజృంభణంబు శోభిల్లఁ బసులం బెట్టించి యనతిదూరవర్తియగు కౌరవచక్రవర్తిదెసం గనుంగొని ధనంజయుండు భూమింజయు నక్కడఁ దేరు వఱుపం బనుప నప్పళించు నప్పుడు కురువీరులు గూడుకొని మూఁడువేల రథంబులతోడను గాంగేయకర్ణు లొక్కొక్కరుండు వేయింటి తోడను దలకడచి రాజున కడ్డపడి కవ్వడిదిక్కు మొగంబుగాఁ దిరిగి; రట్టియెడఁ గదుపులు పట్టువడుటకు నిట్టూర్పు నిగిడించుచు మగిడి మనుజపతియు ననుజసహితుండై సహస్రస్యందనములతోడ వెన్ను దన్ని నిలిచె; నంతఁ దక్కటి బలంబులు నెయిదికొని యమ్మేయిన దళంబుగాఁ గవిసిన. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథదేవా!; వైశంపాయనుండు; జనమేజయునకున్= జనమేజయ మహారాజుకు; ఇట్లు+ అనియెన్= ఈ రీతిగా అన్నాడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; విరోధివర్గంబు= శత్రువుల సమూహం; ఉక్కు+తక్కి= చేవచెడి; వెక్కసము+పడి= బాధపడి; చూచుచున్+ఉండన్= చూస్తూ ఉండగా; నిరర్గళ= అడ్డులేని; భుజా+అర్గళ= గడియల వంటి భుజాలయొక్క; సంరంభ విజృంభణంబు= ఆటోపము యొక్క వికాసం విజృంభించటం; శోభిల్లన్= ప్రకాశించగా; పసులన్= ఆవులను; పెట్టించి= వెనుకకు మరలించుమని ఆజ్ఞాపించి; అనతి దూరవర్తి+అగు= కొంచెం దూరంలో ఉన్న; కౌరవ చక్రవర్తి దెసన్= దుర్యోధనుడి వైపు; కనుంగొని= చూచి; ధనంజయుండు= అర్జునుడు; భూమింజయున్= ఉత్తరుని; అక్కడన్= ఆ ప్రదేశానికి; తేరు+పఱుపన్= రథం తోలటానికి; పనుపన్= ఆజ్ఞాపించగా; అప్పళించు+అప్పుడు= చరిచినప్పుడు; కురువీరులు= కురుసైన్యములోని వీరులు; కూడుకొని= కలిసికొని; మూడువేల రథంబుల తోడను= మూడువేల రథాలతో; గాంగేయ కర్ణులు= భీష్ముడూ, కర్ణుడునూ; ఒక్కొక్కరుండు= ఒక్కొక్కరును; వేయింటి తోడను= వేయిరథాలతోనూ; తల కడచి= ముందుకు వచ్చి; రాజునకున్= దుర్యోధనునకు; అడ్డుపడి= అడ్డంగా నిలిచి; కవ్వడి దిక్కు మొగంబుగాన్= అర్జునుడి వైపు ముఖ ముండేటట్లుగా; తిరిగిరి= వెనుకకు తిరిగి నిలిచారు; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో; కదుపులు= ఆవులమందలు; పట్టు+పడుటకున్= అర్జునునకు వశమైపోవటానికి; నిట్టూర్పు నిగిడించుచున్= నిట్టూరుస్తూ; మగిడి= వెనుకకు మరలి; మనుజపతియున్= దుర్యోధనుడును; అనుజ సహితుండు+ఐ= తమ్ములతో కూడినవాడై; సహస్ర స్యందనంబులతోడన్= వేయిరథాలతో; వెన్నుదన్ని= వెనుక; నిలిచెన్= నిలిచాడు; అంతన్= అంతట; తక్కటి బలంబులున్= తక్కిన సేనలు కూడా; ఎయిదికొని= దగ్గరకు చేరి; ఆ+మెయిన్+అ= ఆవిధంగానే; దళంబుగాన్= సేనగా; కవిసినన్= తాకగా.

**తాత్పర్యం:** హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయున కిట్లని చెప్పాడు. ఇట్లా శత్రువులు బలం తగ్గిపోయి, ఆశ్చర్యంతో చూస్తూండగా, తన బాహు పరాక్రమం అడ్డులేకుండా విజృంభించగా, అర్జునుడు పశువులను తోలుకొనిపొమ్మని వెనుకకు మళ్ళించి, కొద్దిదూరంలో ఉన్న దుర్యోధనుడివైపు చూచి, ఉత్తరుడితో అక్కడికి రథాన్ని నడపుమని చప్పట్లు కొట్టి చెప్పగా, కౌరవవీరులందరూ కలిసి మూడువేల రథాలతోనూ, భీష్మకర్ణులు చెరొక వెయ్యిరథాలతోనూ, సేనముందు నిలిచిన దుర్యోధనుడికి దగ్గరగా వెళ్ళి అతడికీ అర్జునుడికీ మధ్య ఆగి, అర్జునుడి వైపు తిరిగారు. అప్పుడు, గోగణాన్ని గోపాలురు వశం చేసికొని తోలుకొని పోవటం చూచి నిట్టూరుస్తూ, దుర్యోధనుడు తమ్ములతో కలిసి వెయ్యిరథాలతో అర్జునుడిని ఎదిరిస్తున్నట్లు ఎదురుగా నిలువబడ్డాడు. అంతటిలో తక్కిన సేనలన్నీ చేరుకొని ఒక పెద్దసేనగా మోహరించగా.

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం.

**క.** **కనుఁగొని యెలనవ్వొలయు వ । దనమున గరువంపుఁ జెన్ను దలకొనఁగా న**
**ర్జునుఁడు విరాటసుతున కి । ట్లనుఁ గేవల వీరరసమయాత్మకుఁ డగుచున్.** **3**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; ఎలనవ్వు+ఒలయు= చిరునవ్వు కల; వదనమునన్= ముఖమందు; గరువము+చెన్ను= గర్వరేఖ; తలకొనఁగాన్= కలుగగా; అర్జునుఁడు; కేవల+వీర రసమయ+ఆత్మకుఁడు+అగుచున్= అచ్చమైన వీర రసమయమైన హృదయం కలవాడై; విరాట సుతునకున్= ఉత్తరుడితో; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మోహరించిన సేనను చూచి అర్జునుడు చిరునవ్వు నవ్వుతూ, ముఖంలో గర్వరేఖ వెలుగగా, వీర రసమయుడై ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అర్జునుడు 'కేవల వీర రసమయాత్మకు'డయ్యాడనటం సాభిప్రాయం. ఉత్తర గోగ్రహణం ఒక ప్రబంధం వంటిది. అందులో నాయకుడు అర్జునుడు. అతడి నాశ్రయించిన స్థాయి ఈ ప్రబంధంలో అంగిరసం. ఏకైకవీరుడైన అర్జును నాశ్రయించి వర్తించేది కేవల వీరరసమని కావ్య రసపరమైన అర్థం. అచ్చమైన వీరరసం మనస్సులో నిండగా, ఆ రసమే ఆకారంగా నిలిచిందా అన్నట్లు, వీరరసముద్రలో నిలువబడి, చూచేవారికి వీరరస విభావం వలె ప్రకాశిస్తూ, శత్రువిజయోత్సాహాన్ని ప్రదర్శించే ప్రసంగం చేయబోతున్నాడని నాట్య రసపరమైన అర్థం. తిక్కన నాటకీయతలో ఇట్టి వర్ణన ఒక కళారేఖ. (సంపా.)

**సీ.** **'కాంచనమయ వేదికా కనత్కేతనో। జ్జ్వల విభ్రమమువాఁడు కలశజుండు;**
**సింహ లాంగూల భూషిత నభోభాగ కే। తు ప్రేంఖణమువాఁడు ద్రోణసుతుఁడు;**
**కనక గోవృష సాంద్రకాంతి పరిస్ఫుట। ధ్వజ సముల్లాసంబువాఁడు కృపుఁడు;**
**లలితకంబుప్రభాకలిత పతాకా వి। హారంబువాఁడు రాధాత్మజుండు;**

**తే.** **మణిమయోరగ రుచిజాల మహితమైన। పడగవాఁడు కురుక్షితిపతి; మహోగ్ర**
**శిఖరఘన తాళతరువగు సిడమువాఁడు। సురనదీసూనుఁ; డేర్పడఁ జూచికొనుము.** 4

**ప్రతిపదార్థం:** కాంచన మయ= బంగారంతో చేయబడిన; వేదికా= అరుగుతో; కనత్+కేతన= ప్రకాశించే జెండాతో; ఉజ్జ్వల= ప్రకాశించే; విభ్రమమువాఁడు= విలాసం కలవాడు; కలశజుండు= ద్రోణుడు; సింహలాంగూల= సింహముయొక్క తోకతో; భూషిత= అలంకరించబడిన; నభస్(ః)+భాగ= ఆకాశప్రదేశం కల; కేతు= జెండాయొక్క; ప్రేంఖణమువాఁడు= కదలికలు కలవాడు; ద్రోణసుతుఁడు= అశ్వత్థామ; కనక= బంగారుతో చేసిన; గోవృష= ఆబోతుయొక్క; సాంద్రకాంతి= దట్టమైన కాంతితో; పరిస్ఫుట= మిక్కిలి స్పష్టమైన; ధ్వజ= జెండాయొక్క; సముల్లాసంబువాఁడు= రెపరెపలు కలవాడు; కృపుఁడు= కృపాచార్యుడు; లలిత= అందమైన; కంబు= శంఖముయొక్క; ప్రభా= కాంతితో; కలిత= కూడిన; పతాకా= జెండాయొక్క; విహారంబువాఁడు= విహారం కలవాడు; రాధా+ఆత్మజుండు= కర్ణుడు; మణిమయ= మాణిక్యమయమైన; ఉరగ= పాముయొక్క; రుచిజాల= కాంతి పుంజంచేత; మహితము+ఐన= గొప్పదైన; పడగవాఁడు= జెండా కలవాడు; కురుక్షితిపతి= దుర్యోధనుడు; మహా+ఉగ్ర= చాలా భయంకరమైన; శిఖరఘన= శిఖరం గలిగిన గొప్పదైన; తాళతరువు+అగు= తాడిచెట్టు ఐన; సిడమువాఁడు= జెండా కలవాడు; సురనదీ సూనుఁడు= దేవనది కొడుకు భీష్ముడు; ఏర్పడన్= విశదంగా; చూచికొనుము= చూచి గుర్తుంచుకొనుము.

**తాత్పర్యం:** 'ఉత్తరకుమారా! చూడుము. బంగారు వేదిక గుర్తుగా ఎగిరే జెండా రథంమీద ఉన్నవాడు ద్రోణుడు. ఎగురుతున్న జెండాపై సింహముతోక ఉన్నవాడు అశ్వత్థామ. కృపాచార్యుడు బంగారు ఆబోతు జెండా కల రథం మీద ఉన్నాడు. తెల్లని శంఖకాంతులు వెదజల్లుతున్న జెండా గల రథంమీద ఉన్నవాడు కర్ణుడు. మణులు పొదిగిన పాము జెండా కలవాడు దుర్యోధనుడు. పెద్ద భయంకరమయిన తాటిచెట్టు జెండా కలవాడు భీష్ముడు. వీరిని వేర్వేరుగా చూచి గుర్తుంచుకొమ్ము.

**విశేషం:** 1. యుద్ధరంగంతో ప్రత్యక్ష పరిచయమున్న తిక్కన తీర్చిదిద్దే యుద్ధఘట్టాలు మూలంలోకంటె సుశిక్షితంగా, సహజంగా రాణిస్తూ ఉంటాయి. యుద్ధారంభంలో సారథికి ప్రతివీరుల కేతనాలను పరిచయం చేస్తూ, ఆయా కేతనాలు గల రథాలలో ఆయా వీరులుంటారనీ, ఆ అంశాన్ని జాగ్రత్తగా గుర్తుంచుకొనుమని చెప్పటం ఆచారం కాబట్టి అర్జునుడు ఉత్తరకుమారుడిని హెచ్చరిస్తాడు. భావియుద్ధంలో ఫలాని వీరుడిపై రథం పోనిమ్మని ఆజ్ఞాపించగానే, సారథి తడవుకొనకుండా టెక్కెపు గుర్తును చూచి ఆవైపు రథం సాగించాలి. ఇది రణవ్యూహంలో ప్రాథమిక సూత్రం. దీనిని తిక్కన విడువకుండా వర్ణించాడు.

2. మూలంలో **"తేషామనీకాని బహూని గాఢం । వ్యూఢాని దృష్ట్వా బహుళధ్వజాని"** (సం. 4-49-3) అనే పాదాన్ని ఆధారంగా చేసికొని ఈ సీసాన్ని నిర్మించాడు తిక్కన. అందులోకూడా ద్రోణుడితో మొదలుపెట్టి భీష్ముడితో ముగించాడు. దుర్యోధనుడి సేనకు ఇద్దరు పెద్దలూ రెండు పెద్ద దిక్కులు, అసాధ్యులు. వారిరువురిచేత రక్షితుడైన దుర్యోధనుడు సురక్షితుడని ధ్వని. అట్టి వ్యూహభేదనోత్సాహం అర్జునుడిని వీరరసమయాత్ముడిగా చేసింది.

3. ప్రాచీనకాలంలో వీరులు రథాలకు ధ్వజాల నుంచుకొనేవారు. ఒక్కొక్కరికి ఒక్కొక గుర్తు ఉండేది. ఆయా వీరులకు ధ్వజ చిహ్నంతో కలిపిన బిరుదం కూడా ఉండేది- భీష్ముడు తాళధ్వజుడు. అర్జునుడు కపిధ్వజుడు-ఇట్లా. రణరంగంలో రథికులను రథ ధ్వజాలతోనే గుర్తించాలి. అందువలన ఈ పద్యం సందర్భోచితం.

4. వీర రసానికి స్థాయి ఉత్సాహం. అర్జునుడు తన ముందున్న మహావీరులను గుర్తించి, అంతటివారిని జయించే మహోత్సాహాన్ని హృదయంలో పొంగించుకొంటున్నాడు. ఇది తిక్కన రసాభ్యుదయ పోషణ శిల్పంలో భాగం.

5. వీరుల పరిచయంలో ఉదాత్తాలంకారం ఉన్మీలించింది. ఈ పద్యంలో పేర్కొనబడిన ఆరుగురు- కౌరవసైన్యంలో ప్రసిద్ధ రథికులు. వారిని 'షడ్రథికులు' అని అంటారు. రథికులను ధ్వజకేతనాల గుర్తులతో పరిచయం చేయటం రథికసంప్రదాయాన్ని రక్షించిన సాహిత్య సంప్రదాయం. (సంపా.)

**క. గురునకుఁ బ్రదక్షిణంబుగ । నరదముఁ బోనిత్త; మిమ్మహాపురుషు నెడం**
**బరిభవము వలవ; దీతఁడు । కురుకుల నృపతనయ శిక్షకుఁడు సు మ్మనఘా! 5**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపము లేనివాడా! (మంచివాడా!); అరదమున్= రథమును; గురునకున్= ద్రోణాచార్యుడికి; ప్రదక్షిణంబుగన్= మన కుడిచేతి వైపున అతడుండేటట్లుగా; పోనిత్తము= వెళ్ళునట్లు చేద్దాము; ఈ+మహాపురుషు+ఎడన్= ఈ గొప్పవాడి విషయంలో; పరిభవము= తిరస్కారం (అవమానం); వలవదు= వద్దు; ఈతఁడు= ఈ ద్రోణాచార్యుడు; కురుకుల= కౌరవకులంలోని; నృపతనయ= రాజకుమారులకు; శిక్షకుఁడు సుమ్ము= విద్య నేర్పిన గురువు సుమా!

**తాత్పర్యం:** ఉత్తరకుమారా! మన రథాన్ని గురువుగారి రథానికి కుడివైపు నుండి పోనిమ్ము. గొప్పవారికి మనం కుడివైపు నుండి దారి ఇవ్వాలి. అది మర్యాద. అది ప్రదక్షిణ మౌతుంది. దానికి విపరీతమైతే అది వారి నవమానించినట్లు అవుతుంది. ఈ ద్రోణాచార్యుడు కౌరవకులంలోని రాజకుమారులందరికి ధనుర్విద్యలో శిక్షణ నిచ్చినవాడు.

**క. శస్త్ర ప్రకార నిపుణుం, । డస్త్ర విదుఁడు, దూరపాతనాభీలుఁడు, వ**
**ర్చస్త్రాసిత రిపుఁడు, ధను । శ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసదృశుఁడు శక్తిన్. 6**

**ప్రతిపదార్థం:** శస్త్రప్రకార= ఆయుధ విధానంలో; నిపుణుండు= నేర్పరి; అస్త్రవిదుఁడు= అస్త్రవిద్య నెరిగినవాడు; (శస్త్రములనగా కత్తి, బాణం మొదలైన ఆయుధాలు; అస్త్రములంటే వారుణాస్త్రం, పర్జన్యాస్త్రం మొదలైన అస్త్రాలు); దూరపాతన= దూరంగా కొట్టటంచేత; ఆభీలుఁడు= భయంకరమైన వాడు; వర్చస్+త్రాసిత= వర్చస్సుచేత (చూచేసరికి భయం గొల్పు తేజస్సు చేత) భయపెట్టబడిన; రిపుఁడు= శత్రువులున్న వాడు; ధనుస్+శాస్త్ర పరిజ్ఞాన+ఘనుఁడు= ధనుర్విద్యలోని మెలకువ లెరిగిన గొప్పవాడు; శక్తిన్= బలంలో; అసదృశుఁడు= సాటిలేనివాడు.

**తాత్పర్యం:** ఆయుధాలు వాడటంలో నేర్పరి. అస్త్రాలు తెలిసినవాడు. దూరంగా ఉన్న లక్ష్యాన్ని కొట్టగలవాడు. అతడి ముఖ వర్చస్సు చూడగానే శత్రువులు హడలిపోతారు. ధనుర్విద్యా విజ్ఞానంలో గట్టివాడు. శక్తిలో అతడికి సాటి ఎవ్వరూ లేరు.

ఉ. **ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగ; దేను దుష్పథ**
**ద్యూత జయోద్ధతుండగు సుయోధనునిం బరిమార్పఁ బోవుచో**
**శాతశరోత్కరం బితఁడు చక్కఁగ నేయునొ? నన్ను నేయఁడో?**
**చూతము; తాన ము న్ననికిఁ జొచ్చినఁ జొత్తముగాక పిమ్మటన్.** 7

**ప్రతిపదార్థం:** ఈతని తోడి+కయ్యమునకున్= ఇతడితో యుద్ధానికి; ఇయ్యకొనన్+తగదు= అంగీకరించ రాదు; ఏను= నేను; దుష్పథ= అన్యాయమైన; ద్యూత= జూదంలో; జయ+ఉద్ధతుండు+అగు= జయంచేత పొగరెక్కిన వాడైన; సుయోధనునిన్= దుర్యోధనుడిని; పరిమార్పన్= చంపటానికి; పోవుచోన్= వెళ్ళునపుడు; ఇతఁడు= ద్రోణుడు; శాత= వాడియైన; శర+ఉత్కరంబు= బాణాల సముదాయాన్ని; చక్కఁగన్= బాగుగా; ఏయును+ఒ= వేస్తాడో; నన్నున్= నన్ను; ఏయఁడో= కొట్టడో; చూతము= చూద్దాం; తాను+అ= తానే; మున్ను= ముందుగా; అనికిన్= యుద్ధానికి; చొచ్చినన్= దిగితే; పిమ్మటన్= ఆ తరువాత; చొత్తము+కాక!= మనం కూడా దిగుదాం.

**తాత్పర్యం:** ఈ ద్రోణుడితో యుద్ధం ముందుగానే చేయకూడదు. మాయాద్యూతంలో నెగ్గి విర్రవీగే దుర్యోధనుడిని చంపటానికి వెళ్ళుతాను. అప్పు డితడు బాణాలతో నన్ను కొడతాడో, కొట్టడో చూద్దాం. తానే ముందు యుద్ధానికి దిగితే తరువాత మనమూ దిగుదాం.

**విశేషం:** తిక్కన సీసపద్యంలో ఎడనెడ క్రమాలంకారం ప్రయోగించటం కనబడుతుంది. కురువీరుల కేతనాలను వర్ణించిన 4వ సీసపద్యంలో తిక్కన క్రమం పాటించాడుకాని, క్రమాలంకారాన్ని ప్రయోగించలేదు. అయితే, తిక్కన ఒక పద్యంలో ఎంత శిల్పదృష్టి ప్రదర్శిస్తాడో, ఒక సన్నివేశంలో కూడా అంత క్రమశిక్షణతో కూడుకొన్న నిర్మాణ ప్రౌఢి ప్రదర్శిస్తాడు. పై సీసపద్యంలో చెప్పిన వీరుల వరుసలోనే వారి బలపరాక్రమ విశేషాలను వర్ణించటం, వారితో యుద్ధం చేసేటప్పుడు పాటించే వ్యూహాన్ని నిర్ణయించటం ఈ సన్నివేశంలో అర్జునుడు నిర్వహించినట్లు తిక్కన రచించాడు. ఆ వరుసలో ద్రోణుడిని గురించి మూడు పద్యాలు పలికించాడు. విలువిద్యకు ఆచార్యుడు బ్రహ్మస్థానం. అతడికి ప్రదక్షిణం చేయటం గురుపూజకు చిహ్నం. గురుగౌరవం వలన గురుప్రసాదం లభిస్తుంది. శత్రు సైన్యాధ్యక్షుడి నుండి దానిని పొందటం విజయానికి శుభారంభం. ద్రోణుడు శక్తిలో అసదృశుడు కాబట్టి అతడిని మొదటనే రెచ్చకొట్టకూడదు. శస్త్రాస్త్ర ప్రయోగ నిపుణుడు, దూర ప్రాంత లక్ష్యాలను సైతం అవలీలగా ఛేదించగలడు, చూస్తేనే భయం కలిగించే తేజస్సు కలవాడు, మూర్తీభవించిన ధనుర్వేదం వంటివాడు - అటువంటి శక్తిమంతుడితో అవినయంగా ప్రవర్తించటం వీరలక్షణం కాదు. అధర్మవర్తనుడైన దుర్యోధనుడిని ఓడించటం కార్యం. ఆ కార్యాన్ని ధర్మోత్సాహంతో అర్జునుడు నిర్వహించటానికి పూనుకొంటే ద్రోణుడు మిన్నకుంటాడో, ఎదుర్కొంటాడో తెలిసికొనకుండానే అతడితో యుద్ధానికి పూనుకొనటం ప్రమాదం. ద్రోణుడే యుద్ధం ప్రారంభిస్తే అర్జునుడు తిప్పికొట్టక తప్పదు. గురువుపట్ల అప్పు డది అవినయం కాదు. కేవల వీరరసమయాత్ముడు యుద్ధోత్సాహాన్ని ధర్మబద్ధంగా ప్రదర్శించాలి. దానికి ధర్మవ్యూహ విచికిత్స రసాభ్యుదయ హేతువుగా నిబంధించటం తిక్కన రచనా శిల్పం! వీరరసం అర్జునుడి భావనిష్ఠం. అది కార్యరూపంగా ప్రవహించటం రసాభ్యుదయ చిహ్నం. (సంపా.)

క. **గురుపుత్త్రుఁడు తేజోనిధి; । సురాసురులకైనఁ దేఱి చూడ నరిది సం**
**గరమున నీతని; నీశ్వర । వరజనితుఁడు; మేటి కౌరవవ్యూహమునన్.** 8

**ప్రతిపదార్థం:** గురుపుత్త్రుఁడు= అశ్వత్థామ; తేజోనిధి= తేజస్సునకు నిధియైనవాడు; సంగరమునన్= యుద్ధంలో; సుర+అసురులకున్+ఐనన్= దేవదానవులకైనా; ఈతనిన్= ఇతడిని; తేఱిచూడన్= తేరిపార చూడటానికి; అరిది= వీలుకాదు (కష్టం); ఈశ్వర వర= శివుని వరంచేత; జనితుఁడు= పుట్టినవాడు; కౌరవవ్యూహమునన్= కౌరవసేనలో; మేటి= గొప్పవాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ మా గురువుగారి పుత్రుడు, తేజశ్శాలి; ఈతడిని యుద్ధంలో దేవతలు రాక్షసులు సైతం కన్నెత్తి చూడలేరు. అంత భీకరంగా యుద్ధం చేయగలవాడు. శివుడి వరంవలన పుట్టాడు. కౌరవసేనలోని వీరులలో ఇతడే గొప్పవాడు.

**క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా । చార్యుల కెనవచ్చు దివ్యశరవిదుఁడు కృపా**
**చార్యుఁడు; మత్పితృసఖుఁ డా । చార్యక మొనరించె మాకు శైశవముతఱిన్.** 9

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ కృపాచార్యుడు; ధైర్యధనుఁడు= ధైర్యమే ధనంగా కలవాడు; ద్రోణాచార్యులకున్= ద్రోణునికి; ఎనవచ్చు= సాటి వచ్చునట్టి; దివ్యశరవిదుఁడు= దివ్యాస్త్రవేత్త; కృపాచార్యుఁడు; మత్+పితృసఖుఁడు= నా తండ్రికి స్నేహితుడు; మాకున్= మా అందరికిని; శైశవము తఱిన్= చిన్నతనంలో; ఆచార్యకము= గురుత్వం; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఈ కృపుడు ధైర్యశాలి. అస్త్రవిద్యలో ద్రోణుడికి సాటి అయిన వాడు. ఈతడు మా తండ్రికి స్నేహితుడు; మా కందరికి చిన్నతనంలో విద్య నేర్పిన మహానుభావుడు.

**విశేషం:** ద్రోణుడిమీద భక్తి, కృపుడిమీద గౌరవం ప్రదర్శించాడు అర్జునుడు. విలువిద్యలో కృపుడు ద్రోణాచార్యుడి వంటివాడైనా, అతడు తన తండ్రికి మిత్రుడు కావటం విశేష గుణం. (సంపా.)

**తే. వీర లిరువురు మాన్యులు; వీరి తోడి । కయ్యమున కిప్డు మన మంత గాలుద్రవ్వ**
**వలవ; దెచ్చోట నెదురుగా మెలఁగి రచట । మన రథం బల్లనల్లన చనఁగ నిమ్ము.** 10

**ప్రతిపదార్థం:** వీరలు+ఇరువురు= ఈ అశ్వత్థామ, కృపాచార్యులు ఇద్దరున్నూ; మాన్యులు= గౌరవించ దగినవారు; ఇప్డు= ఇప్పుడు; వీరితోడి కయ్యమునకున్= వీరితో యుద్ధానికి; మనమంత= మనమే ముందుగా (మనమంత మనంగా); కాలు+త్రవ్వ వలవదు= ప్రారంభించవద్దు; (కయ్యానికి కాలుద్రవ్వుట= ముందుగా యుద్ధానికి దిగుట); ఎచ్చోటన్= ఎక్కడ; ఎదురుగాన్= ప్రతిద్వంద్విగా; మెలఁగిరి= ఉంటారో; అచటన్= ఆ సమయంలో; మన రథంబు= మన రథాన్ని; అల్లన+అల్లన= మెల్లమెల్లగా (ప్రక్కలనుండి); చనఁగన్+ఇమ్ము= పోనిమ్ము.

**తాత్పర్యం:** వీరిద్దరు గౌరవించ దగినవారు. ముందుగా యుద్ధానికి వీరితో మనంత మనం దిగరాదు. వారెక్కడైనా యుద్ధానికి వస్తున్నారంటే ఆ ప్రక్కనుండి మన రథాన్ని పోనిమ్ము. (మనకు కావలసింది దుర్యోధనుడు కాని, వీరితో యుద్ధం కాదని భావం.)

**విశేషం:** 'వీర లిరువురు మాన్యులు'- అనే వాక్యంలో అర్జునుడు నిర్దేశించిన ఆ ఇద్ద రెవ్వరనే అంశంలో వ్యాఖ్యాతలు భిన్నాభిప్రాయాలను వెలిపుచ్చారు. వారు ద్రోణ కృపాచార్యు లన్నారు కొందరు (గురువులిద్దరు). ద్రోణాశ్వత్థామలన్నారు కొందరు (గురువు, గురుపుత్రుడు). అవన్నీ సందర్భానికి కుదరవు. ఇక్కడ అశ్వత్థామ కృపాచార్యులనే గ్రహించాలి. ద్రోణుడు గురువు. అతడిమీది అపారమైన గౌరవంతో ముందుగా దాడి చేయకూడదని అర్జునుడు భావించాడు. ఆ తరువాత గౌరవార్హులైన ఇద్దరుగా అశ్వత్థామ కృపాచార్యులను పేర్కొన్నాడు. వారిమీద కూడా ముందుగా దాడిచేయకూడ దన్నాడు. మరొక విశేషం ఏమంటే - ద్రోణుడు యుద్ధానికి దిగితే అర్జునుడు ఆ తరువాత దిగుతాడు. కాని, అశ్వత్థామ కృపులు ఒకవేళ యుద్ధానికి సిద్ధమైనా వారినుండి తొలగిపోవాలని సారథికి (ఉత్తరుడికి) చెప్పటం గమనార్హం. తలపడితే గురువుతో తలపడతాడు. వీరిరువురిని ఉపేక్షిస్తాడు. అది అర్జును డా యా వీరులపట్ల చూపే ప్రతిస్పందన. దీనినిబట్టి ఆ యిరువురు అశ్వత్థామ కృపాచార్యులే కావాలి. మరొక రకమైన అన్వయం కుదురదు. (సంపా.)

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు, రణోద్యోగానురక్తుండు, దు
స్సాధ ప్రక్రమ బాహు వీర్యుఁడు, కురుక్ష్మాపాల వాల్లభ్య ల
క్ష్మీ ధామాత్ముఁడు, జామదగ్న్య కలిత శ్రేష్ఠాస్త్ర విద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొక చీరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్. 11

**ప్రతిపదార్థం:** యోధ+అగ్రేసరుఁడు= యుద్ధంచేసే వీరులలో శ్రేష్ఠుడు; ఇద్ధ తేజుఁడు= ప్రజ్వలించే తేజస్సు కలవాడు; రణ+ ఉద్యోగ= యుద్ధ ప్రయత్నంలో; అనురక్తుఁడు= ఇష్టం కలవాడు; దుస్సాధ= సాధించటానికి వీలులేని; ప్రక్రమ= ప్రారంభంకల; బాహువీర్యుఁడు= భుజ పరాక్రమం కలవాడు; కురుక్ష్మాపాల= దుర్యోధనుడియొక్క; వాల్లభ్యలక్ష్మీ= ప్రేమ సంపదకు; ధామ+ ఆత్ముఁడు= స్థానమైనవాడు; జామదగ్న్య= పరశురాముడి వలన; కలిత= పొందబడిన; శ్రేష్ఠ= గొప్పదైన; అస్త్రవిద్యా+ ఆఢ్యుఁడు= అస్త్రవిద్యా సంపన్నుడు; ఈ రాధేయుండు= ఈ కర్ణుడు; పోరులన్= యుద్ధాలలో; వీరవ్రాతమున్= వీరుల సముదాయాన్ని; ఒక చీరికిన్+కొనఁడు= ఏ మాత్రమూ లెక్కచేయడు.

**తాత్పర్యం:** వీరాగ్రేసరుడు, యుద్ధప్రీతి కలిగినవాడు, అసాధ్యమైన భుజబలం కలవాడు. దుర్యోధనుడికి ప్రేమపాత్రుడు, పరశురాముడి వద్ద సకలాస్త్రాలను నేర్చినవాడు కర్ణుడు. ఇతడు యుద్ధంలో ఎటువంటి వీరులనైనా లెక్కచేయడు.

**విశేషం:** ద్రోణాది కురువీరులను కీర్తించే పద్ధతికీ, కర్ణ దుర్యోధనులను పరిచయం చేసే పద్ధతికీ భేదాన్ని పాటించటం తిక్కన రచనా శిల్పం. ఓజో మిశ్రితమైన ప్రసాద గుణం గల ఈ పద్యం కర్ణవీరగుణ కీర్తనం. అయితే, అర్జునుడికి కర్ణుడి పట్ల గల సహజ వైషమ్యం వలన అతడి స్తుతి అధిక్షేపాత్మకంగా భాసించవచ్చునని కొందరు వ్యాఖ్యానించారు. కాని, అది పొసగదేమో! (సంపా.)

క. శౌర్యాటోపంబున దో । ర్వీర్యంబున, నస్త్ర శస్త్ర విత్త్వమునను మా
త్సర్యంబు సేయు నాకును । దుర్యోధనుఁ డెపుడుఁ ద న్నెదురు సేయంగన్. 12

**ప్రతిపదార్థం:** దుర్యోధనుఁడు; శౌర్య+ఆటోపంబునన్= పరాక్రమాతిశయంలో; దోస్(ః)+వీర్యంబునన్= భుజ బలంలోను; అస్త్ర శస్త్ర విత్త్వమునను= అస్త్రాలను, శస్త్రాలను ఎరుగుటలోను; తన్నున్= కర్ణుడిని; నాకును= నాకు (అర్జునుడికి); ఎదురు+చేయంగన్= ప్రతిద్వంద్విని (పోటీ) చేయటంలో; ఎపుడున్= ఎల్లవేళలా; మాత్సర్యంబు= కిట్టనితనమును; చేయున్= చేయును.

**తాత్పర్యం:** శౌర్యం వలన కలిగే ఆటోపంలోకాని, భుజపరాక్రమంలోకాని, అస్త్రాలు, శస్త్రాలు తెలియటంలోకానీ, కర్ణుడిని నాకు పోటీదారుడిగా తయారుచేయటంలో దుర్యోధనుడు ఎల్లవేళలా మాత్సర్యం చూపుతూ ఉంటాడు.

**విశేషం:** పరాక్రమాతిశయంలో, భుజబలంలో, అస్త్రశస్త్ర పాండిత్యంలో అర్జునుడితో పోటీపడేవాడు కర్ణుడని దుర్యోధనుడి ధైర్యం. అది కారణంగా అతడు పాండవులతో మాత్సర్యం పెంచుకొన్నాడు. ఇది వాస్తవ కథనం. (సంపా.)

చ. అతిదృఢవేధి పేరుగలయట్టి మగండు రణంబు గల్గె నేఁ
డితనికి నాకుఁ దెల్లముగ నిట్టియెడం బరికించి చూడుమీ!
మతి గలఁగంగనీక యనుమానము వాయఁగ నీవు సాయకో
ద్ధతిఁ బ్రకటించుచో బహువిధంబుల నిద్దఱ తారతమ్యముల్. 13

**ప్రతిపదార్థం:** అతిదృఢవేధి= గట్టిగా లక్ష్యాన్ని కొట్టేవాడు; పేరుగల+అట్టి మగండు= కీర్తికల వీరుడు; నేఁడు= ఈరోజున; ఇతనికిన్+నాకున్= ఇతనికి నాకు; రణంబు= యుద్ధము; కల్గెన్= సంభవించినది; ఇట్టి+ఎడన్= ఇటువంటి సమయంలో; తెల్లముగన్= బాగా; పరికించి= పరీక్షించి; మతి= బుద్ధిని; కలఁగంగనీక= కలత చెందనియ్యక; అనుమానము= సంశయం; పాయఁగన్= పోయేటట్లుగా; సాయక+ఉద్ధతిన్= బాణాలు వేసే గర్వాన్ని; ప్రకటించుచోన్= ప్రకటించేటప్పుడు; బహువిధంబులన్= అనేకరీతుల; ఇద్దఱ తారతమ్యముల్= మా ఇద్దరిలోని భేదాన్ని; నీవు= నీవు (ఉత్తరుడా!); చూడుమీ!= గమనించుమా!

**తాత్పర్యం:** ఈ కర్ణుడు బాణాలతో లక్ష్యాలను గట్టిగా ఛేదించటం తెలిసినవాడు. గొప్ప వీరుడు, కీర్తి కలవాడు; ఇతడితో యుద్ధం నాకు నేటికి లభించింది. నీ విప్పుడు మనస్సు చెదరనీయక, అనుమాన మేమీ లేకుండా బాణ ప్రయోగంలో ఎవరు నేర్పరులో చూడుము. ఇంతేకాకుండా ఇంకా అన్ని విషయాలలోనూ ఎవ్వరు నేర్పరులో చూడుము. హెచ్చుతగ్గులు పరికించుము.

**విశేషం:** ఈ పద్యంలో అర్జునుడు ఉదాత్తుడైన వీరుడుగా చిత్రించబడ్డాడు. పరవీరనింద చేయని ఔదార్యం, స్వీయోత్కర్ష చేసికొనని ఔదాత్త్యం అర్జునుడిలో గోచరిస్తాయి. కలతపాటు లేకుండా, అనుమానం లేకుండా కర్ణార్జున యుద్ధ పరాక్రమాల తారతమ్యాన్ని అనేక విధాలుగా పరిశీలించి నిర్ణయించుమని ఉత్తరకుమారుడికి చెప్పాడు అర్జునుడు. అక్కడ తన పరాక్రమాతిశయాన్ని చెప్పుకొనలేదు. అది ధీరోదాత్తుడైన వీరుడి లక్షణం. (సంపా.)

**క. ఈయన ననుఁ గని సైరణ । సేయం డితఁ డగ్గమైనఁ జిచ్చఱపిడుగై**
**పోయి పయిఁబడుదు; నీ వర । వా యించుక లేక పఱపవలయు రథంబున్.** **14**

**ప్రతిపదార్థం:** ఈయన= ఇతడు; ననున్+కని= నన్ను చూచి; సైరణ+చేయండు= సహించలేడు; ఇతఁడు= ఈ కర్ణుడు; అగ్గము+ఐనన్= అందుబాటైనచో; చిచ్చఱపిడుగు+ఐ= నిప్పులు చిమ్ము పిడుగై; పోయి= వెళ్ళి; పయిన్+పడుదున్= మీద పడతాను; నీవు= (ఉత్తరకుమారా!)నీవు; అరవాయి= సంకోచం; ఇంచుక లేక= కొద్దిగాకూడా లేకుండా; రథంబున్= రథాన్ని; పఱపవలయున్= తోలాలి.

**తాత్పర్యం:** ఇతడు నన్ను చూచి ఊరుకోడు. ఒకవేళ ఇతడు అందుబాటుగా వచ్చెనా, నిప్పుల పిడుగువలె ఇతడిపై పడతాను. నీ వేమాత్రం సంశయించక రథాన్ని నడపాలి సుమా!

**విశేషం:** కర్ణుడు అర్జునుడిని చూస్తే సహించలేడు. అతడు దూసుకొని వచ్చి దాడి చేస్తాడు. అతడిని అర్జునుడు కూడ సహించడు. అందువలన నిప్పుల పిడుగువలె ఒక్కసారి విరుచుకొని పడతాడట! ఊహించనివిధంగా ఒక్కసారి మీద పడి నుగ్గు నుగ్గు చేసే మెరుపు దాడి చేసేవాడిని 'చిచ్చఱ పిడుగు' అని అంటారు. ఇది తెలుగు జాతీయం. (సంపా.)

**ఉ. ఉగ్రుఁ, డనూన మాన మహిమోన్నత చిత్తుఁ, డజయ్యు విక్రమో**
**దగ్రుఁడు, హస్తలాఘవ సమన్వితుఁ డేయునెడన్, సమగ్ర కో**
**పాగ్రహబుద్ధి మా దెస, ననార్యుఁడు గార్యమునందు ధార్తరా**
**ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసినప్పుడు పండువు నాకు నుత్తరా!** **15**

**ప్రతిపదార్థం:** ధార్తరాష్ట్ర+అగ్రజుఁడు= ధృతరాష్ట్రుడి కొడుకులలో పెద్దవాడు (దుర్యోధనుడు); ఉగ్రుఁడు= భీకరమైనవాడు; అనూన= తక్కువకాని; మానమహిమ= అభిమానాతిశయంలో; ఉన్నతచిత్తుఁడు= గొప్పదైన మనస్సు కలవాడు; అజయ్య= జయింప శక్యముకాని; విక్రమ= పరాక్రమంతో; ఉదగ్రుఁడు= గొప్పవాడు; ఏయు+ఎడన్= బాణములు వేయుట యందు;

హస్తలాఘవ సమన్వితుఁడు= చేతిసులువు కలవాడు; మా దెసన్= మా పట్ల; సమగ్ర= పూర్తియైన; కోప+ఆగ్రహ= కోపం, పట్టుదలకల; బుద్ధి= మనస్సు కలవాడు; కార్యమునందున్= పనిపట్ల; అనార్యుఁడు= దుష్టుడు; ఉత్తరా!= ఉత్తరకుమారా!; ఈతనిన్= ఈ దుర్యోధనుడిని; కదిసిన+అప్పుడు= ఎదిర్చినప్పుడు; నాకున్= నాకు (అర్జునునకు); పండువు= ఉత్సవం (వేడుకగా ఉంటుంది).

**తాత్పర్యం:** ధార్తరాష్ట్రులలో పెద్దవాడైన ఈ దుర్యోధనుడు ఎక్కువ అభిమానం కలవాడు. ఉన్నతమైన మనస్సు కలవాడు. జయించ శక్యంకాని పరాక్రమం కలిగిన గొప్పవాడు. బాణాలు వేయటంలో చేతిసులువు కలవాడు. కాని, మాపట్ల కోపబుద్ధి కలిగినవాడు. కార్యములందు దుష్టుడు. ఉత్తరకుమారా ఈ దుర్యోధనుడిని ఎదిర్చినపుడు నాకు పండుగే!

**విశేషం:** దుర్యోధనుడిని పరిచయం చేయటంలో అర్జునుడు ఒక ప్రత్యేకతను ప్రదర్శించాడు. సాధారణ ధర్మాలతోపాటు సాపేక్ష లక్షణాలను కూడ పేర్కొన్నాడు. అవి తెలుపు నలుపుల చిత్రాన్ని అందించాయి. అతడు స్వయంగా ఉగ్రుడు. పాండవులపట్ల కోపాగ్రబుద్ధి. సహజంగా అనూనమాన మహితోన్నత చిత్తుడు. కాని, కార్యములందు అనార్యుడు. బాణాలు వేసేటప్పుడు నేర్పుతో కూడిన హస్తలాఘవం కలవాడు. అయితే అర్జునుడి ఎదుట నిలువలేనివాడు. ఈ వైరుధ్య గుణచిత్రణ మిందులోని వైచిత్రి. (సంపా.)

**తే.** **అరసికొని యెన్నిభంగులనైన నితని, । తేరు మనబారి కగపడు తెఱఁగు గాంచి**
**యడరి బాసటయై యెవ్వ రడ్డపడిన । మెఱపు మెఱసిన చాడ్పునఁ దఱియఁ జొరుము.** **16**

**ప్రతిపదార్థం:** అరసికొని= తెలిసికొని; ఎన్ని భంగులన్+ఐనన్= ఎన్ని రీతులుగా నైనా; ఇతని తేరు= ఈ దుర్యోధనుడి రథం; మన బారికిన్= మనకు లక్ష్యమైన పరిధిలోనికి; అగపడు తెఱఁగు= కనిపించే విధం; కాంచి= చూచి; అడరి= విజృంభించి; బాసట+ఐ= సహాయమై; ఎవ్వరు= ఏ వీరులు; అడ్డ పడినన్= అడ్డం వచ్చినా; మెరపు మెరసిన చాడ్పునన్= తళుక్కున మెరపు మెరసినట్లు; తరియన్+చొరుము= దగ్గరకు సమీపించుము.

**తాత్పర్యం:** వెదకి చూచి యేరీతిగానైనా ఆ దుర్యోధనుడి రథాన్ని మనం కొట్టటానికి వీలుకలిగే పరిస్థితిని చూచి, విజృంభించి ఎవ్వరైనా సరే అడ్డువచ్చినప్పటికీ, కను మూసి తెరచినంతలో మెరుపు మెరిసినట్లుగా దుర్యోధనుడిని సమీపించుము.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **అస్మత్పితామహుండ దతి । విస్మయ జనన ప్రతాప విభవాగ్ని శిఖా**
**భస్మీభూత ప్రతిప । క్షస్మయ కాననుఁడు, ప్రథమగణ్యుఁడు బుద్ధిన్.** **17**

**ప్రతిపదార్థం:** అస్మద్+పితామహుండు= మా తాతగారు (భీష్ములవారు); అతి విస్మయజనన= మిక్కిలి ఆశ్చర్యం కల్గించే; ప్రతాపవిభవ= ప్రతాప వైభవమనే (ప్రతాపమంటే పేరు చెప్పిన వెంటనే ఎదుటివారు హడలిపోయేట్లు ఉండటం); అగ్నిశిఖా= అగ్నిజ్వాలచేత; భస్మీభూత= భస్మం అయిన; ప్రతిపక్ష= ఎదుటి పక్షంయొక్క; స్మయ= గర్వం అనే; కాననుఁడు= వనం కలవాడు; బుద్ధిన్= బుద్ధిలో; ప్రథమగణ్యుఁడు= ముందుగా లెక్కింపదగ్గవాడు.

**తాత్పర్యం:** మా తాత అయిన భీష్ముడు గొప్ప ప్రతాపం కలవాడు. శత్రుపక్షుల గర్వమనే అరణ్యాన్ని తన ప్రతాపమనే అగ్నిజ్వాలచేత భస్మీభూతం చేయగలవాడు. బుద్ధిలో మొదటివానిగా లెక్కించదగ్గవాడు.

**క. బహు మహితాయుధ విద్యా । రహస్య సంవేది, ధార్తరాష్ట్రులకును మా**
**కు హితంబ కోరు సముఁడై, । సహాయ మగు వారలకు నచటఁ దా నునికిన్. 18**

**ప్రతిపదార్థం:** బహు= ఎక్కువ; మహిత= గొప్పవైన; ఆయుధ= ఆయుధాల; విద్యా రహస్య= విద్యా రహస్యాలను; సంవేది= బాగా ఎరిగినవాడు; ధార్తరాష్ట్రులకును= కౌరవులకు; మాకున్= మాకును (పాండవులకు); సముఁడు+ఐ= ఇరువురి యెడల సమానమైన అనురాగం కలవాడై; హితంబు+అ= హితమే; కోరున్= కోరతాడు; తాన్= ఆ భీష్ముడు; అచటన్= అచటనే (కౌరవుల వద్దనే); ఉనికిన్= ఉండటంచేత; వారలకున్= కౌరవులకు; సహాయము+అగున్= సహాయపడుతున్నాడు.

**తాత్పర్యం:** చాలా గొప్పవైన ఆయుధ విద్యా రహస్యాలు బాగా తెలిసినవాడు, కౌరవులకూ మాకూ సమంగా హితం కోరేవాడు. అక్కడ కౌరవుల వద్దనే ఉంటున్నందువలన వారికి సహాయపడతాడు.

**క. వివిధము లగు లక్ష్యంబుల । నవలీలం దునియ నాట నవియఁగ నేయున్;**
**భువనైక ధన్వి నత్యు । గ్ర విచేష్టితు నోర్చెఁ బరశురాముం బోరన్. 19**

**ప్రతిపదార్థం:** వివిధములు+అగు= పలురకాలైన; లక్ష్యంబులన్= కొట్టవలసిన లక్ష్యాలను; అవలీలన్= తేలికగా; తునియఁగన్= విరగ గొట్టేటట్లుగా; నాటన్= నాటేటట్లుగా; అవియఁగన్= పగిలేటట్లుగా; ఏయున్= బాణాలు వేస్తాడు; పోరన్= యుద్ధంలో; భువన+ఏక, ధన్విన్= లోకంలో శ్రేష్ఠుడైన విలుకాడైనవాడిని; అతి+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; విచేష్టితున్= క్రియగలవాడిని; పరశురామున్= పరశురాముడిని; ఓర్చెన్= ఓడించాడు.

**తాత్పర్యం:** అనేక రకాలైన లక్ష్యాలను మధ్యకు విరిగేటట్లుగా, నాటేటట్లుగా, పగిలేటట్లుగా సులువుగా బాణాలు వేయగలడు. ప్రపంచంలో శ్రేష్ఠుడైన విలుకాడూ, యుద్ధంలో అతిభయంకరుడూ అయిన పరశురాముడిని ఓడించిన మహావీరుడు.

**క. శంతనునందను నరదము । పొంతం బోవలవ; దలుక పుట్టి యతఁడు భూ**
**కాంతునకు సైన్యమునకుం । జెంతలఁ జేరంగనీక సిలుగులఁ బెట్టున్.' 20**

**ప్రతిపదార్థం:** శంతను నందను+అరదము= భీష్ముడి రథంయొక్క; పొంతన్= దరిదాపులకు; పోవలవదు= పోవద్దు; అతఁడు= ఆ భీష్ముడు; అలుక పుట్టి= కోపం వచ్చి; భూకాంతునకున్= దుర్యోధనుడికి; సైన్యమునకున్= సైన్యానికి; చెంతలన్+చేరంగనీక= దరిదాపులకు (మనలను) రానీయకుండా; సిలుగులన్+పెట్టున్= ఇబ్బందులు పెట్టగలడు.

**తాత్పర్యం:** భీష్ముడి రథం ఉన్న ప్రాంతానికి మన రథం పోనీయకుము. అతడికి కోపం వచ్చిందా- మనలను దుర్యోధనుడికి గాని, అతడి సైన్యానికి గాని దరిదాపులకు చేరనియ్యడు.'

**విశేషం:** భీష్ముడు పితామహుడు (తాత). ఆయనను గురించి నాలుగు కందపద్యాలు చెప్పాడు అర్జునుడు. భీష్ముడు ఆలోచనలో అగ్రగణ్యుడు. ఎంతటి శత్రువులనైనా భస్మం చేసికాని వదలనివాడు. అస్త్రవిద్యా రహస్యవేది. మనసు పాండవులమీద ఉన్నా కౌరవులలో ఉండి వారికి చేదోడుగా ఉండేవాడు. వివిధ లక్ష్యాలను తేలికగా భేదించగల గొప్ప విలుకాడు. పరశురామ శిష్యుడు. అతడివైపుపోతే అసలుకే మోసం వస్తుంది. అతడికి కోపం వచ్చిందా రాజువైపు అడుగు సాగనివ్వడు. అడ్డగించి ఇబ్బందులపాలు చేస్తాడు. కాబట్టి అతడికి దూరంగానే రథాన్ని సాగిస్తూ దుర్యోధనుడిని సమీపించాలని అర్జునుడి వ్యూహం. ఉత్తరోత్తరం బలీయం - అనే న్యాయాన్ని అనుసరించి కురువీరులందరిలో అజేయుడు భీష్ముడని ధ్వని. (సంపా.)

**వ. అని యిట్లు వేఱు వేఱం జూపి, క్రమంబున నేర్పడం జెప్పి సవ్యసాచి సమరోన్ముఖుం డగు సమయంబున సస్మితుం డగుచు నశ్వత్థామ రవితనయు నవలోకించి యిట్లనియె. 21**

**ప్రతిపదార్థం:** అని= పలికి; ఇట్లు= ఈరీతిగా; వేఱువేఱన్= వేర్వేరుగా (విడివిడిగా); చూపి= వీరులను కనబరచి; క్రమంబునన్= వరుసగా; ఏర్పడన్+చెప్పి= స్పష్టంగా తెలిసేటట్లు చెప్పి; సవ్యసాచి= అర్జునుడు; సమర+ఉన్ముఖుండు= యుద్ధానికి సిద్ధమైనవాడు; అగు సమయంబునన్= అయ్యే సమయంలో; అశ్వత్థామ; సస్మితుండు+అగుచున్= చిరునవ్వు కలవాడవుతూ; రవితనయున్= కర్ణుడిని; అవలోకించి= చూచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వీరులను విడివిడిగా చూపించి, ఇక యుద్ధానికి దిగేసమయంలో, అశ్వత్థామ కర్ణుడిని చూచి చిరునవ్వు నవ్వుతూ ఈ విధంగా అన్నాడు.

**క. 'నిను నీవ పొగడికొని పలి । కిన పలుకులు పెక్కు గలవు; క్రీడి యనికి వ**
**చ్చినవాఁ డిదె పులివలె; మా । ర్కొన రాదే కర్ణ! సేనకుం బ్రియ మెసఁగన్. 22**

**ప్రతిపదార్థం:** కర్ణ!= ఓ కర్ణా!; నినున్= నిన్ను; నీవు+అ= నీవే; పొగడికొని= స్తుతించుకొని; పలికిన= అన్న; పలుకులు= మాటలు; పెక్కు= ఎన్నో; కలవు= ఉన్నవి; క్రీడి= అర్జునుడు; అనికిన్= యుద్ధానికి; పులివలెన్= పులివలె భయం కొలిపేవిధంగా; ఇదె= ఇదిగో; వచ్చినవాఁడు= వచ్చాడు; సేనకున్= సైన్యానికి; ప్రియము= ప్రీతి; ఎసఁగన్= ఎక్కువయ్యేటట్లు; మార్కొనరాదే?= ఎదుర్కొన రాదా?

**తాత్పర్యం:** 'ఓ కర్ణా! ఇంతకు ముందు ఎన్నోసార్లు నిన్ను నీవు పొగడుకొన్నావు. అర్జునుడు పులివలె అడుగో వచ్చాడు. అతడిని ఎదుర్కొనుము. సైన్యం సంతోషిస్తుంది.

**విశేషం:** అలం: ఉపమ. కర్ణుడు తనను తానే ఎన్నోసార్లు పొగడుకొన్నాడు. మరొకరు పొగడటం ఉచితం. ఎవ్వరూ పొగడేవారు లేకపోవడం చేత తనను తానే పొగడుకొనవలసి వచ్చిందని అశ్వత్థామ చెప్పుతున్నాడు. కర్ణుడు తనను తాను పొగడుకొనే సందర్భంలో అర్జునుడిని మట్టుపెడతాను అని కొన్ని క్షణాలముందే కురువీరుల ముందు ప్రగల్భాలాడాడు (చూడండి. 4 ఆశ్వా. 200-205 ప.) అందుకే అశ్వత్థామ కర్ణుడిని చూచి, అడుగో అర్జునుడు పులివలె యుద్ధంలోకి ధైర్యంగా వచ్చాడు. పిల్లివలె కాదు- అని ఎత్తిపొడుస్తున్నాడు.

**క. తలఁకు గలదేని శకునిం, । బిలిచి విచారింపఁ బొమ్ము; పృథివీపతి నీ**
**తలన తన కార్యఖడ్గం । బుల మోపెక్కించె; రిత్తవోవునె నీకున్? 23**

**ప్రతిపదార్థం:** తలఁకు= భయం; కలదు+ఏని(న్)= ఉంటే; శకునిన్= శకునిని; పిలిచి= పిలిచికొని; విచారింపన్= ఆలోచించటానికి; పొమ్ము= వెళ్ళుము; పృథివీపతి= దుర్యోధనుడు; తన కార్య ఖడ్గంబుల= తన రాజకార్యాలయొక్క, యుద్ధాలయొక్క; మోపున్= భారాన్ని; నీ తలన్+అ= నీ మీదనే; ఎక్కించెన్= (విశ్వాసంతో) ఉంచాడు; నీకున్= నీకు; రిత్త+పోవునె?= (ఆ బాధ్యత) వృథా పోతుందా?

**తాత్పర్యం:** ఒకవేళ అర్జునుడి వలన నీకు భయం వేస్తే, శకునితో వెళ్ళి ఆలోచించుము. వెళ్ళుము. మన రాజు తన రాజకార్యాల, యుద్ధాల భారం నీ తలపై మోపాడు కదా! మరి నీకు తప్పుతుందా?'

**విశేషం:** అశ్వత్థామ మాటలు అక్షరాలా అధిక్షేపోక్తులే. కర్ణుడు ద్రోణాది వృద్ధులను కొన్ని క్షణాల క్రితం నిందించి పలికాడు. దుర్యోధనుడి యోగక్షేమం కోరే వీరుడు తానేనని చెప్పుకొన్నాడు. ఆ మాటలవలన కురువీరులలో రెండు పక్షాలు ఉన్నాయని స్పష్టమయ్యాయి. ఆ విభజనమనస్తత్వానికి మూలకారకుడు కర్ణుడని అశ్వత్థామ అభిప్రాయం. శిష్టచతుష్టయం (భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామలు) ఒక పక్షం. వీరు పాండవ పక్షపాతులుగా కర్ణుడు వ్యాఖ్యానించాడు. ఇక మిగిలినది దుష్ట చతుష్టయం (దుర్యోధన కర్ణ శకుని దుశ్శాసనులు). దుష్టచతుష్టయం దృష్టిలో పై శిష్ట చతుష్టయమే దుష్టచతుష్టయం. అందువలన బాహాటంగా వారిని నిందించటంలో కర్ణుడు ప్రధానపాత్ర నిర్వహిస్తుంటాడు. ఈ భూమికతో చూస్తే - అశ్వత్థామ అధిక్షేపోక్తులు అర్థవంతంగా ఉంటాయి. అర్జునుడు యుద్ధానికి వచ్చాడు. కాని, శిష్టచతుష్టయాన్ని వినయ గౌరవాలతో సంభావించి, కర్ణుడిని నిరాదరించి, దుర్యోధనుడిపై సూటిగా దాడి చేయబోతున్నాడు. అర్జునుడు తమపై బాణాలు గుప్పితే కాని శిష్టచతుష్టయం యుద్ధం ప్రారంభించేటట్లు లేదు. అది వారి ఆంతర్యం. దానిని భీష్మాదులు చెప్పరు. కాని, అశ్వత్థామ ఆవేశపరు డయినా, దానిని కప్పిపుచ్చి, తాము యుద్ధం ప్రారంభించక పూర్వమే నీవొక్కడివే అర్జునుడికి అడ్డు తగిలి - 'ఒక వీరున కొక్కఁడ చాలు గాక! యొందఱు వలయున్?' (4-201) అని పలికిన పౌరుష వాక్యాలను నిజం చేసికొనుమని హెచ్చరించాడు. అంతేకాదు- 'యుద్ధం బాణాల ఆటకాని, జూదపు పావుల ఆట కాదు. బాణాలతో గెలువలేని మీరు శకుని జూదాల ఆటతోనే గెలవటం అలవాటు. నీకు భయంగా ఉంటే ఆ శకుని సలహా పాటించుము'-అని అధిక్షేపించాడు. నిజమైన వీరుడికి ఈ మాటలు నిప్పులు మీద క్రుమ్మరించినట్లుంటాయి. కర్ణుడు అందుకే మండిపడ్డాడు. (సంపా.)

**వ. అనిన విని యతండు క్రోధ ఘూర్ణమాన తారకుం డగుచు నిట్లనియె. 24**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పల్కగా; విని= విని; అతఁడు= ఆ కర్ణుడు; క్రోధ= కోపంతో; ఘూర్ణమాన= తిరుగుడుపడుతున్న; తారకుండు+అగుచున్= కనుపాపలు కలవాడౌతూ; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ పైవిధంగా దెప్పిపొడవటంతో, కర్ణుడు కోపంతో కనుపాపలు కదులుతూ ఉండగా ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** 'అనిన విని యతం డిట్లనియె'-అంటే చాలు. కాని, తిక్కన 'క్రోధ ఘూర్ణమాన తారకుం' డగుచు - అని అభినయాంశను విడవకుండా వర్ణించాడు. అది నాటకీయతలో భాగం. భరతనాట్యశాస్త్రంలో అన్ని రసాల వలెనే రౌద్రరసం కూడా ఆంగికం, నైపథ్యం, వాచికం అని మూడు విధాలుగా చెప్పబడింది. క్రోధం రౌద్రరసానికి స్థాయి భావం. దానికి ఆక్షేప వచనం విభావాలలో ఒకటి. కర్ణుడు ద్రోణాదుల పట్ల అవజ్ఞగా మాట్లాడాడు. ఉత్తములయందు అవజ్ఞ మానసికంగా ఉంటుంది. మిగిలినవారియందు వాచికమైన అవజ్ఞ నిందారూపంగా ఉంటుంది. కర్ణుడు వాచికమైన అవజ్ఞ చేశాడు. దానికి ప్రతిగా అశ్వత్థామ వాచికమైన ఆక్షేపం చేశాడు. దానికి కర్ణుడికి క్రోధం వచ్చింది. క్రోధాన్ని మూడు రకాలుగా శారదాతనయుడు భావప్రకాశంలో వివరించాడు - క్రోధం, కోపం, రోషం అని. అందులో క్రోధం- శత్రు, మిత్ర, ప్రియా, భృత్య, పూజ్యాదులను బట్టి అయిదు విధాలు. వాటిలో భృత్యులమీద కలిగే క్రోధంలో శిరఃకంపం, అక్షి విక్షేపం, వ్రేలితో బెదిరించటం, మరలిమరలి చూడటం అనేవి ఆంగికాభినయాలు. (వివరాలకు చూడండి : సాత్త్వికాభినయం - డాక్టర్ పి.ఎస్.ఆర్.అప్పారావు, ప. 484-485). కర్ణుడు క్రోధంతో కనుగ్రుడ్లు త్రిప్పాడని తిక్కన వర్ణన. ఇది క్రోధాభినయం. అందులోనూ అశ్వత్థామ పట్ల కర్ణుడికి గల అలక్ష్య (అగౌరవ) భావాన్ని వ్యంజింప చేయుటానికి తిక్కన భృత్యులమీద కలిగే క్రోధభావ చేష్టను ఎన్నుకొనటం గమనించదగిన అంశం. అభినయం కూడా తిక్కన రచనలో రస వ్యంజకమే. (సంపా.)

**చ. 'తలఁకెడు వానికిన్ మగఁడ తానటె నన్నడఁకించు వాఁ? డిసీ**
**పలుకకు; భీతున ట్లొదుఁగఁ బాఱునె శూరుఁడు? నిన్ను నచ్చి యే**
**కలనికి వచ్చితిన్; నరుఁడ కాఁ డట వాసవుఁడైన నేమి నా**
**బలముఁ జలంబు నేరిమియు బంటుతనంబును నీవ చూడుమీ!' 25**

**ప్రతిపదార్థం:** తలఁకెడు వానికిన్, మగఁడు+అ= భయపడేవాడికి మగడైనవాడే! (మగడు - తెలుగు జాతీయం. భయపడే వాడికి కొమ్ముకాసేవాడు అని భావం); తాన్= తానే (భయపడేవాడే); నన్నున్= (కర్ణుడిని); అడఁకించువాఁడు+అటె?= ఎగతాళి చేసేవాడా?; ఇసీ= ఛీ; పలుకకు= ఎక్కువగా మాట్లాడకుము (నోరు మూసుకొమ్మని భావం); శూరుఁడు= వీరుడు; భీతు+అట్లు= భయపడిన వాడివలె; ఒదుఁగన్+పాఱునె?= ప్రక్కకు ఒదిగి వేగంగా పరుగెత్తుతాడా?; నిన్నున్= అశ్వత్థామను; నచ్చి= నమ్మి; ఏన్= కర్ణుడు; కలనికిన్= యుద్ధానికి; వచ్చితిన్= వచ్చానా? (రాలేదని భావం); నరుఁడు+అ, కాఁడు= అర్జునుడే కాదు; వాసవుఁడు+ఐనన్+ఏమి?= ఇంద్రుడైనా లెక్కేమిటి; నీవు+అ= నీవే స్వయంగా; నా బలమున్+చలంబున్= నా బలాన్నీ, పట్టుదలనూ; నేరిమియున్= నేర్పరితనాన్నీ; బంటుతనంబును= పరాక్రమాన్నీ; చూడుమీ!= కళ్ళారా చూడు.

**తాత్పర్యం:** 'భయపడేవాడికి కొమ్ముకాసేవాడు తన సంగతి తెలిసికొనలేక నన్ను ఎగతాళి చేసేవాడా? (నీ మాటలు నాపట్ల అట్లా ఉన్నాయి). ఛీ! నీవు నాతో ఎక్కువగా మాట్లాడకుము. పరాక్రమవంతుడు ఎక్కడైనా పిరికివాడివలె ప్రక్కకు తప్పుకొంటూ పరుగెత్తుతాడా? నిన్ను నమ్మి నేను యుద్ధానికి వచ్చానా? (నా పరాక్రమం మీద నాకు గట్టి నమ్మకం ఉన్నది). అర్జునుడే కాదు (అతడి బాబు అయిన) ఇంద్రుడు వచ్చినా నాకేమి? నా బలాన్నీ, పౌరుషాన్నీ, నేర్పరితనాన్నీ, పరాక్రమాన్నీ నీవే కళ్ళారా చూద్దువు గాని.'

**విశేషం:** కర్ణుడు కోపంతో పల్కిన మాట లివి. అందుకే - ఈ పద్యంలోని వాక్యాలమధ్య వాచికాభినయగతమైన విరామాలు కనబడతాయి. ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క సంచారి భావానికి వ్యంజకం. 'తలఁకు గలదేని'.... అని అశ్వత్థామ ఆక్షేపించాడు. దానికి ప్రతిగా 'తలఁకెడు వానికిన్ మగఁడ...' అని కర్ణుడు అధిక్షేపించాడు. సూటిగా అశ్వత్థామను సంబోధించకుండా ప్రథమ పురుషలో మొదటి వాక్యం పలికాడు. ఇది గర్వం అనే సంచారి భావ వ్యంజకం. ఛీ! నాతో మాట్లాడకు - అని చీదరించుకొనటం మధ్యమ పురుషలో సాగింది. ఇది అమర్ష చిహ్నం. శూరుడు భీరువు వలె ప్రక్కకొదిగిపోతాడా?- అన్న వాక్యం అశ్వత్థామ పరంగానే కాక అర్జునుడిపరంగా కూడా చేసిన అధిక్షేపం. ఇది గర్వభావ వ్యంజకం. 'నిన్ను నమ్మి నేను యుద్ధానికి రాలేదు' మదభావ సూచకం. నరుడినే కాదని, ఇంద్రుడినైనా ఎదురిస్తా ననటం అతని ఔద్ధత్య, ఉగ్రత, ఉత్సాహ భావ వ్యంజకం. ఈ పద్యంలో ఇటు అశ్వత్థామను ప్రత్యక్షంగానూ, అటు అర్జునుడిని పరోక్షంగానూ కర్ణుడు పరిహసించాడు. తలఁకెడువాడు కర్ణుడని అశ్వత్థామ అంటే.. తలఁకెడువాడైన అర్జునుడి కొమ్ము గాసేవాడు అశ్వత్థామ అని కర్ణుడన్నాడు. అర్జునుడు సైన్యం మీదకు సూటిగా రాకుండా ప్రక్కకు ఒదిగి వ్యూహం ప్రకారం దుర్యోధనుడిని పట్టుకొనటానికి పోతున్నాడు. కాని, అతడు 'భీతు నట్లొదుఁగఁ బాఱు శూరు' డని కర్ణుడి అధిక్షేపం. నిజానికి భయపడుతున్నవాడు అర్జునుడని, వాడిని తలదన్నినవాడు అశ్వత్థామ అనీ కర్ణుడి అవహేళన. అశ్వత్థామకు దీటైన ప్రతిసమాధాన మిది. అంతేకాదు, ఎంతటి వీరులనైనా చులకనగా మాట్లాడే కర్ణుడి స్వభావం మరొకసారి బయటపడింది. (సంపా.)

**క. అని కడఁగు నినసుతునకు । న్మును ద్రోణుఁడు ద్రోణనందనుఁడుఁ గృపుఁడును శాం**
**తనవుఁడుఁ గడఁగుట దుర్యో । ధనుఁ డవలోకించి యత్యుదగ్రతఁ గడఁగెన్. 26**

**ప్రతిపదార్థం:** అని= పలికి; కడఁగు+ఇనసుతునకున్= (యుద్ధానికి) పూనుకొనే కర్ణునకు; మును= ముందుగా; ద్రోణుఁడున్= ద్రోణుడును; ద్రోణనందనుఁడున్= అశ్వత్థామయును; కృపుఁడును= కృపాచార్యుడూ; శాంతనవుఁడున్= భీష్ముడును; కడఁగుట= యుద్ధానికి పూనుకొనటం; దుర్యోధనుఁడు; అవలోకించి= చూచి; అతి+ఉదగ్రతన్= మిక్కిలి భయంకరంగా; కడఁగెన్= సిద్ధమయ్యాడు.

**తాత్పర్యం:** అట్లా పలికి యుద్ధానికి కర్ణుడు పూనుకొనటానికి ముందే ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు, భీష్ముడు సన్నద్ధమయ్యారు. అది చూచి దుర్యోధనుడు కూడా అత్యంతావేశంతో యుద్ధానికి సిద్ధమయ్యాడు.

**విశేషం:** ఈ పద్యంలో కదులుతున్న సైన్య వ్యూహాన్ని కన్నులకు కట్టేటట్టు చలనచిత్రంగా తిక్కన పరిచయం చేస్తున్నాడు. అర్జునుడు ఎవరిని కదిలించకుండా ముందుకు సాగాలనుకొన్నాడో ఆ నలుగురూ స్వీయ ప్రేరణతో దుర్యోధన రక్షణార్థం అర్జునుడిని అడ్డగించాలని సంకల్పించారు. అంతలో అశ్వత్థామ కర్ణుడిని అధిక్షేపించాడు. అతడిచేత ప్రేరితుడై కర్ణుడు తానే ముందు యుద్ధానికి సిద్ధమౌతున్నట్లు ముందుకు సాగాడు. కాని, అంతకంటే ముందే 'శిష్టచతుష్టయం' ముందుకు నడుస్తూ కనపడింది. కర్ణుడు వారి వెనుకవాడయ్యాడు. వారందరిని చూచి దుర్యోధనుడు రంగప్రవేశం చేశాడు. అర్జునుడు అనుకొన్నంత పనీ జరిగింది. గోవులు మరలిన ప్రదేశం ప్రస్తుత యుద్ధ రంగస్థలమయింది. కౌరవసేన నడిమి భాగాన్ని అర్జునుడు ఢీకొన్నాడు. అందువలన కౌరవసేన అతడి చుట్టూమూగి యుద్ధం చేసే అవకాశం కలిగింది. (సంపా.)

**వ. ఇవ్విధంబున నయ్యేవురు దొరలును ధరణీశుండును సరభసంబుగా బరవసంబు సేసిన దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ ప్రముఖ నిఖిల కురుకుమార నికాయంబును శకుని సైంధవ ప్రభృతి బంధు నివహంబును బాహ్లిక సోమదత్తాది సామంత నికురుంబంబును మఱియునుంగల వివిధ యోధ వీర నిచయంబును నొక్కటఁ గరటిఘటా ఘోటకధట్ట రథయూధ పదాతి వితతి సంరంభ శుంభత్సేనా సమూహ సహితంబుగాఁ ద్రోచి నడచిన. 27**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈరీతిగా; ఆ+ఏవురు= ఆ అయిదుగురు; దొరలునున్= వీరులును; ధరణీశుండును= రాజైన దుర్యోధనుడును; సరభసంబుగాన్= తొందర తొందరగా; బరవసంబు+చేసినన్= ధైర్యం చేయగా, సాహసం చేయగా; దుశ్శాసన, దుష్ప్రహ, దుర్ముఖ ప్రముఖ= దుశ్శాసనుడు, దుష్ప్రహుడు, దుర్ముఖుడు మొదలైన; నిఖిల= సమస్తమైన; కురుకుమార= ధృతరాష్ట్రుని కుమారులయొక్క; నికాయంబునున్= సముదాయమున్నూ; శకుని, సైంధవ ప్రభృతి= శకుని, సైంధవుడు మొదలైన; బంధు నివహంబునున్= బంధువుల సముదాయమున్నూ; బాహ్లిక సోమదత్త+ఆది= బాహ్లికుడు, సోమదత్తుడు మొదలైన; సామంత= సామంతుల; నికురుంబంబును= సముదాయమున్నూ; మరియునున్+కల= ఇంకా ఉన్న; వివిధయోధ= పలురకాల యోధుల; వీరనిచయంబును= వీరుల సముదాయమున్నూ; ఒక్కటన్= ఒక్కటిగా; కరటి ఘటా= ఏనుగు గుంపులు; ఘోటకధట్ట= గుర్రాల గుంపును; రథ= రథముల; యూధ= సమూహం; పదాతివితతి= కాల్బలము సముదాయముల; సంరంభ= హడావిడితో; శుంభత్= శోభిల్లు; సేనాసమూహ= సేనల సముదాయంతో; సహితంబుగాన్= కూడుకొని; త్రోచి= వేగంగా; నడచినన్= ముందుకు సాగగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా ఆ అయిదుగురు వీరులు, రారాజు తొందరగా ధైర్యం చేసి ముందుకు పోయిన వెంటనే, దుశ్శాసనాది కౌరవకుమారులు, శకుని సైంధవాది బంధువులు, బాహ్లిక సోమదత్తాది సామంతులు, ఇంకా ఉన్న సేనాయోధులు, రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలం - అందరూ తొందరగా ఒక్కసారిగా ముందుకు త్రోసికొని వెళ్ళగా.

**విశేషం:** రారాజు యుద్ధానికి సాగగానే అతడి వెంట అతడి తమ్ములు, బంధువులైన శకుని సైంధవాదులూ, బాహ్లిక సోమదత్తాది సామంతులూ, వారి వెంట ఇతర వీరులూ చతురంగ బలాలతో దొమ్మిగా, వేగంగా తరుముకొంటూ నడిచారు. భీష్మాదులనుండి దుర్యోధనుడి వరకూ సాగిన వరుస ఒక క్రమశిక్షణతో సాగినట్లు పద్యాలలో చెప్పటం విశేషం. పద్యచరణ గణక్రమబద్ధత వారి సేనల గతిని సూచించింది. దుర్యోధనుడి సోదర బంధు సామంత మిత్రుల సన్నాహాలను వచనంలో చెప్పి, వారు 'త్రోసికొంటూ' నడిచిన వైఖరిని ధ్వనింప చేశాడు తిక్కన. ఈ త్రోపుడు నడకను సైన్యాలలో విరివిగా వర్ణించటం ఈ ఘట్టంలో గోచరిస్తుంది. (సంపా.)

**చ. ధరణి వడంకె, ధూళి దివిఁ దన్నిన భానుని గానరాద, బం**
**ధుర వివిధప్రకార పటు తూర్యరవంబులఁ బొంగె దిక్కు లా**
**స్ఫురిత మహాయుధోగ్ర రుచిపుంజ విజృంభణ ఘోర మయ్యె నం**
**తరము సహస్రనేత్ర ముఖదైవత మండల దుర్నిరీక్షమై. 28**

**ప్రతిపదార్థం:** ధరణి= భూమి; వడంకెన్= కంపించింది; ధూళి= పరాగం; దివిన్= ఆకాశంలో; తన్నినన్= ఎగయగా; భానునిన్= సూర్యుడిని; కానరాదు+అ= చూడటానికి వీలులేక పోయింది; బంధుర= ఒప్పిదమైన; వివిధప్రకార= నానారీతుల; పటు= గొప్పదైన; తూర్యరవంబులన్= వాద్యాల ధ్వనులతో; దిక్కులు= దిశలు; పొంగెన్= నిండినవి; ఆస్ఫురిత= ప్రకాశించే; మహాయుధ= గొప్ప ఆయుధాల; ఉగ్ర= భయంకరమైన; రుచిపుంజ= కాంతి సమూహాల; విజృంభణన్= చెలరేగటంతో; అంతరము= భూమ్యాకాశాల నడిమి చోటు; సహస్రనేత్రముఖ= దేవేంద్రుడు మొదలైన; దైవత= దేవతల; మండల= సముదాయానికి; దుర్నిరీక్షము+ఐ= చూడశక్యం కానిదై; ఘోరము+అయ్యెన్= (యుద్ధభూమి) భయంకరంగా తయారైనది.

**తాత్పర్యం:** భూమి కంపించింది. పైకి లేచిన దుమ్మువలన సూర్యుడు కానరాలేదు. అనేక రకాల వాద్యాలు మ్రోగించగా వచ్చిన ధ్వని దిక్కులు నిండింది. ఆయుధాల కాంతులతో ఆకాశం ఇంద్రాది దేవతలకే చూడశక్యం కాకుండా భయంకరంగా మారింది.

**విశేషం:** అలం: అతిశయోక్తి, పరికరాంకురం. పెద్ద సేన సందడిగా బయలుదేరితే ఎట్లా ఉంటుందో వర్ణించే ఈ వైఖరిలో అతిశయోక్తి అలంకారం ఉన్నది. భూమి వణకటం, రేగిన దుమ్మువలన సూర్యబింబం కానరాకుండా ఉండటం, తూర్యరవాలతో దిక్కులు దద్దరిల్లటం, వేయికళ్ళ వేలుపైన ఇంద్రుడు మొదలైన దేవతలకు అది చూడ శక్యం కానిది కావటం - అనే అంశాలు కౌరవసేన గొప్పతనాన్ని ధ్వనింప చేసే లక్షణాలుగా ఒకవైపు పైకి కనపడుతున్నా, అవన్నీ ఉత్పాతాలవంటివిగా తోస్తూ ఉండటం ఇక్కడ విశేషం. ఆ ఆర్భాటంలో విజయచిహ్నాలుగా ఉండేవి అశుభసూచకాలుగా కౌరవులకు తారసిల్లినట్లు చిత్రించబడ్డాయి. వేయికన్నులున్న ఇంద్రుడికి సైతం, దివ్యదృష్టిగల దేవతలకు సైతం చూడశక్యం కాలేదని వర్ణించటంలో విశేష్యాలు సాభిప్రాయాలు కావటం చేత పరికరాంకురాలంకారం వర్తిల్లింది. కౌరవసేనా విజృంభణంపై ఇంద్రాదుల అనుగ్రహం గాని, ప్రసన్న వీక్షణం గాని లేదనీ, వీరరసాధి దేవత అయిన ఇంద్రుడు చూడలేని ఆ సేన అపజయం పాలౌతుందనీ వ్యంగ్యం. సైన్య వీరోచిత వర్ణనం వలె కనబడే దీనిలో భావి కౌరవసేనా పరాభవం అలంకారధ్వని. (సంపా.)

### అర్జునుఁడు కౌరవసైన్యంబుల నుఱుమాడుట.

**వ. అట్టియెడ నుద్భటహాసోల్లాస భాసురముఖుం డగుచు శతమఖ తనయుండు. 29**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఉద్భట= పెద్దదైన; హాస= నవ్వుతో; ఉల్లాస= సంతోషంతో; భాసుర= ప్రకాశించే; ముఖుండు+అగుచున్= ముఖం కలవాడై; శతమఖ తనయుండు= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు పెద్దగా నవ్వుతూ ఉల్లాసంతో కూడిన ముఖంతో.

**విశేషం:** 'ఉద్భట హాసోల్లాస భాసురమైన' అర్జునుడి ముఖం వీరరసోల్లాసాన్ని వ్యక్తీకరించే అనుభావం కల విభావం. ఉద్భటహాసం అంటే అట్టహాసం వంటిది. అర్జునుడిలో వికాసదశ పొందుతున్న వీరరస స్థాయి సూచక మిది. కౌరవసైన్యం మీద స్వీయ వ్యూహం ప్రకారం అర్జునుడు దాడి చేస్తున్నాడు. కౌరవుల చక్రవ్యూహాన్ని అవలీలగా భగ్నం చేశాడు. ఆలమందలను విడిపించాడు. వారికి క్రొత్త వ్యూహం కావలసి వచ్చింది. వజ్రవ్యూహం పన్నటానికి అనువుగా (చూడు. పద్యం 39) సైన్యాలను

మోహరిస్తున్నారు. పెక్కురు కలిసి ఒక్కడిని చుట్టుముట్టి ఓడించటం వజ్రవ్యూహ స్వభావం. కౌరవవీరు లందరుండి ఏ ప్రయత్నం చేయకుండానే గోధనాన్ని కోల్పోయి మొదటి అపజయాన్ని చవిచూచారు. ఇప్పు డందరూ ఏకమై రాజును రక్షించుకొనటానికి ఆర్భాటంగా ప్రయత్నించబోతున్నారు. దానిని గమనించిన అర్జునుడు శత్రువులను ప్రత్యక్షంగా ఎదుర్కొనే యుద్ధ క్రియావీరాన్ని ప్రయోగించబోతున్నాడు. ప్రతిఘటనపై ప్రతిక్రియ అర్జునుడి వీరరస వికాసంలో రెండవ దశ. దేవతలకు కూడా దుర్నిరీక్షమైన సేనాటోపం అర్జునుడిలోని గర్వం అనే వీరరస అనుభవాన్ని నిద్రలేపింది. ఎదుటి వీరులను లెక్కచేయని భావం గర్వం. అందుకే అంతటి సైన్యాటోపాన్ని నిర్లక్ష్యంగా చూచాడు. వారందరికంటె తానే నేర్పరి అన్నట్లు ఒక పెద్ద నవ్వు నవ్వాడు. యుద్ధవీరంలో హర్ష, గర్వ, మోహాదులు సంచారి భావాలుగా రాణిస్తాయని రసార్ణవ సుధాకరం చెప్పింది (III. 237, 238). ఇక్కడ ఉద్భటహాసం - గర్వభావ వ్యంజకం, ఉల్లాసం - హర్షభావ సూచకం. ఈ రెండూ ముఖంమీద ప్రతిఫలిస్తే అది యుద్ధ వీరరస ముద్ర అవుతుంది. ఇది నాట్యాంశ పరిజ్ఞానానికి సంబంధించింది. దానిని సందర్భ సహితంగా తిక్కన చెప్పాడు. అంగాలన్నింటిలో ముఖం ముఖ్యమైనది. దానిని ఈ వచనంలో పరిచయం చేసి, అతడి కార్యశీలాన్ని తరువాతి పద్యంలో వర్ణించాడు తిక్కన. తిక్కన ఏ పాత్రలోనైనా నవ్వును-ఏ రకంగానైనా-వర్ణించాడంటే అది ఒక రసభావ వ్యంజకమైన అనుభావంగా ఉండటం ఆ మహాకవి రచనలో కానవచ్చే నాటకీయ రచనా శిల్పం. (సంపా.)

**చ.** **గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దార భీ**
**షణముగ నుప్పతిల్లి రభసంబున రేఁగిన మాడ్కిఁ దీవ్ర మా**
**ర్గణనికరంబు లొక్కట నరాతి బలంబులఁ గప్పు, గాండివ**
**క్వణనము రోదసీకుహర కర్పరముం బగిలింప, నుగ్రతన్.** **30**

**ప్రతిపదార్థం:** గుణమునన్= నారియందును; లస్తకంబునను= ధనుర్మధ్యంలోను; కోటి యుగంబునన్= వింటి చివరల రెంటియందును; కేలన్= చేతులందు; తారు+అ= అవే (తామే అయి); భీషణముగన్= భయంకరంగా; ఉప్పతిల్లి= పుట్టి; రభసంబునన్= తొందరగా; రేఁగిన మాడ్కిన్= వ్యాపించినట్లుగా; తీవ్ర= వాడియైన; మార్గణ= బాణాలయొక్క; నికరంబులు= సముదాయాలు; ఒక్కటన్= ఒక్కసారిగా; అరాతి బలంబులన్= శత్రుసేనలను; కప్పన్= కప్పివేయగా; గాండివ= గాండివమనే ధనువుయొక్క; క్వణనము= ధ్వని; రోదసీకుహర= భూమ్యాకాశ మధ్యభాగ మనెడి; కర్పరమున్= కుండను; పగిలింపన్= బ్రద్దలయ్యేటట్లు చేయగా; ఉగ్రతన్= భయంకరంగా.

**తాత్పర్యం:** బాణాలు నారిలోనుండి, ధనుస్సుకు మధ్యభాగంలోనుండి, వింటికోపులలోనుండి, చేతులలోనుండి పుట్టుతున్నట్లుగా వచ్చి శత్రు సైన్యాన్ని కప్పివేశాయి. గాండీవ ధ్వనులు భూమ్యాకాశాల మధ్యభాగమనే భాండాన్ని పగులగొట్టగా, భయంకరత్వంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం :** అలం: అతిశయోక్తి, ఉత్ప్రేక్ష. అర్జునుడు గాండీవధారి కావటం చేత గాండీవి అని పేరు వచ్చింది. దేవదత్తమైన ఆ గాండీవ ప్రయోగం ఒక అద్భుత వీరక్రీడ. దానిని తిక్కన ఈ పద్యంలో అలంకార సుందరంగా వర్ణించాడు. ఆకర్ణాంతం నారిని లాగితే గాండీవం గుండ్రని ఆకారంలో ప్రత్యక్షమౌతుంది. ఆ లాగటం నిరంతరాయంగా సాగటం చేత గాండీవ పరిధిరూప దర్శనం అవిచ్ఛిన్నంగా కలుగుతున్నది. అంటే వింటి వంగిన జాడలు గుర్తించలేనంత వేగంగా ఉన్నాయన్నమాట. కోదండమే ఆ స్థితిలో ఉంటే బాణాల ప్రయోగ క్రమం ఎట్లా ఉండాలి? తిక్కన దానిని అతిశయోక్తిగా వర్ణించాడు. వింటిని ఎడంచేత్తో మధ్యభాగంలో పట్టుకొన్నాడు అర్జునుడు. కుడిచేతితో వింటిని ఆకర్ణాంతం లాగాడు. చేతితో బాణాలు వదలుతున్నాడు. అతడు వీలును బట్టి రెండు చేతులా ప్రయోగించగలడు. అవిరామంగా సాగే ఆ క్రియలో బాణాలైతే వెలువడుతున్నాయి. కాని, అవి ఎక్కడినుండి వెలువడుతున్నాయో తెలిసికొన లేనంత అద్భుతంగా బయటపడుతున్నాయి. నారిలోనుండా? వింటి

నడుమ భాగంలోనుండా? వింటి కోపులనుండా? చేతులనుండా? - తెలిసికొనలేనంత వేగం. అన్నిచోట్ల నుండి బాణాలు పుట్టుతున్నట్లు ఊహ కలిగిస్తున్నాయి. (అతిశయోక్తి). ఆ గాండీవంనారి నిరంతరం చేసే ధ్వని బ్రహ్మాండ భాండాన్ని బ్రద్దలు చేస్తున్నదా అన్నట్లు ఉన్నది. (ఉత్ప్రేక్ష). గమనించదగిన మరొక విశేషమేమంటే - అంతటి కౌరవసైన్యం చేసే తూర్యనాదం దిక్కులను పొంగించింది. అర్జునుడు ఒక్కడు చేసే గాండీవ నారీనాదం బ్రహ్మాండ భాండాన్ని బ్రద్దలు చేసింది - అన్నట్లు చెప్పి ఉభయపక్ష బల తారతమ్యాన్ని అలంకారధ్వనితో ఆలోచనామృతం చేశాడు తిక్కన. (సంపా.)

**క. తలపడి తలమీఱిన కా । ల్బలములఁ బొడిసేయు; మఱియుఁ బైపైఁ బీనుం**
**గులఁ ద్రొక్కికొనుచు వెస ముం । గలిమొనఁ గవియుటకు వేడ్క గడలుకొనంగన్. 31**

**ప్రతిపదార్థం:** తలపడి= కలియబడి; తలమీఱిన= ఎదురుమీరి వచ్చిన; కాల్బలములన్= బంట్లసేనను; పొడి+చేయున్= నుగ్గు చేస్తాడు; మఱియున్= ఇంకా; పీనుంగులన్= శవాలను; త్రొక్కికొనుచున్= త్రొక్కుకొంటూ; పైపైన్= మీది మీదికి; వెసన్= వేగంగా; ముంగలిమొనన్= ముందున్న సేనను; కవియుటకున్= ఎదిరించటానికి; వేడ్క= ఉత్సాహం; కడలుకొనంగన్= ఎక్కువకాగా.

**తాత్పర్యం:** అర్జునుడు తన నెదిరించి వచ్చిన ఎదుటిసేనతో కలియబడి మీదికి వచ్చిన కాల్బలాన్ని నుగ్గు చేశాడు. చేసి, పీనుగులమీది నుండి ముందుకు పోయి ఇంకా సేన నెదిరించే ప్రయత్న మెక్కువ చేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం :** యుద్ధవీరంలో వీరుని లక్షణాలను వివరిస్తూ శారదాతనయుడు తన భావప్రకాశంలో ఇట్లా పేర్కొన్నాడు- "యుద్ధంలో తాను ఒక్కడే అయినా, నిరాయుధు డయినా, యుద్ధోచిత పరికరాలు సరిగా లేకపోయినా, అనేకులతో యుద్ధ మొనరించవలసినా - భయం లేకపోవటం, యుద్ధ నిశ్చయంలో అహంభావంతో ఉండటం, శస్త్ర - అస్త్ర ఘాతాలు తగిలినా హర్షం వీడకుండా ఉండటం, యుద్ధం నుండి పలాయనం చేయకపోవటం, భీతులకు అభయమివ్వటం, శరణు పొందినవారి ఆర్తిని పోగొట్టటం - ఇట్టిది ఉదాత్తుల యుద్ధాత్మకమైన వీరం (సాత్త్వికాభినయం. పు. 493). యుద్ధవీర రసాభ్యుదయోల్లాస వర్ణనంలో నిష్ణాతుడైన తిక్కన దాని క్రమ వికాసదశలను ఈ ఘట్టంలో తీర్చిదిద్దిన శిల్పం గమనార్హం. కాల్బలాలను నుగ్గు చేసి, వారి శవాలమీదుగా రథాన్ని నడిపించి విరోధి వర్గాలను మట్టుపెట్టాలన్న ఉత్కటోత్సాహం ఇందులో ధ్వని. సహాయం లేకపోయినా యుద్ధం చేయాలన్న కోరిక అర్జునుడి వీరరసోల్లాస చిహ్నంగా తిక్కన తీర్చిదిద్దాడు. (సంపా.)

**క. తన దృష్టియు ముష్టియుఁ దగు, । ననువున మున్నెత్తి యేయు; నతఁ డప్పుడు డిం**
**చినఁ గాయముల సపాటం । బునఁ బదియుఁ బదేను నుచ్చి పోయెం గోలల్. 32**

**ప్రతిపదార్థం:** తన దృష్టియున్= తన చూపూ; ముష్టియున్= తన పిడికిలీ; తగు+అనువునన్= తగిన వీలుగా; మున్ను+ఎత్తి+ఏయున్= ముందుగానే పూని బాణాలను ప్రయోగించాడు; అప్పుడు= ఆ సమయంలో; అతఁడు= అర్జునుడు; కోలల్= బాణాలు; డించినన్= దిగపడేటట్లు వేయగా; సపాటంబునన్= ఒక్కుమ్మడిగా; పదియున్+పది+ఏనున్= పది కాని, పదైదు కాని; కాయములన్= సైనికుల శరీరాలను; ఉచ్చిపోయెన్= (ఒకేసారి) దూసికొని పోయాయి.

**తాత్పర్యం:** అప్పుడర్జునుడు కంటితో లక్ష్యాన్ని చూస్తూ, బాణాలను పిడికిలితో సంధించి వేస్తూంటే (అవి) ఎదురుగా ఉన్న సైనికుల శరీరాలను పది పదేనింటిని ఒకే మట్టంలో దూసుకొని పోతూ ఉండేవి.

**విశేషం :** 1. ఒక వీరుడు పలువురు సైనికులతో యుద్ధం చేసేటప్పుడు మూకుమ్మడిగా వారిని చంపితే తప్ప విజయం సాధించటం సాధ్యం కాదు. ఇది యుద్ధక్రీడా రహస్యాలలో ఒకటి. అట్టి మూకుమ్మడి లక్ష్యభేదనం కొందరు వీరులకే సాధ్యం. ఒకే బాణంతో

అనేక మందిని ఒకేసారి చంపటం ఆ పద్ధతులలో ఒకటి. రామాయణంలో సప్తతాళాలను ఒకే అమ్ముతో కొట్టి రాముడు వాలి సంహార సామర్థ్యాన్ని సుగ్రీవుడి ముందు నిరూపించుకొన్నాడు. ఇక్కడ అర్జునుడు అటువంటి ప్రజ్ఞనే ప్రదర్శించాడు. ఒక లక్ష్యం (సైనికుని) మీద వేసిన బాణం సమాంతరంగా ఉన్న అనేక లక్ష్యాలను (సైనికులను) భేదించింది. ఒకేసారి అనేక సైనికులు కూలటానికి ఇది కీలకం. విరామం లేకుండా బాణాలు ప్రయోగించే అర్జునుడి పరాక్రమానికి సైనికులు మందలు మందలుగా హతులైపోయారు. యుద్ధరహస్యాలు తెలిసిన తిక్కన ఇటువంటి సూక్ష్మాంశాలను సైతం వివరించి చెప్పగల దిట్ట.

2. అన్ని ప్రతులలోను - 'ఏయునతఁ డప్పు డుడించిన కాయముల' అనియే కలదు. అతఁ డప్పుడు - డించినఁ గాయముల - అనునది లేదు. కాని ఉడించు' అనునది యే నిఘంటువులోను కానరాదు. ఉడిపుచ్చు ఉడివోవు మున్నగు వాని వలె గుగాగమమునకు లోపము విభాషగాన, - ఉడిగించు - ఉడించు అయిన దనుకొన వలయును. అప్పాదులకు, గగాగమలోపము విభాష కావున అప్పగించు - అప్పించు అయినట్లు - ఉడిగించు - ఉడించు అయియుండవచ్చును. ఉడించు= ఉడిగించు= ఉడుగఁజేయు. (సంపా.)

**చ.** **ఉడుగక వెండియున్ సుభటు లొక్క మొగిన్ వెస నంటఁ దాఁకి క**
**వ్వడి పటుబాణ భాస్వదనివార్య సముద్ధతిఁ జేసి మంటలో**
**మిడుతలు సొచ్చిన ట్లయిన మేటిమగల్ గని యీడఁబోక బ**
**ల్విడి మఱియున్ వడిం బొదువ వ్రేల్మిడిఁ ద్రుంచె నతండు దోడుతోన్.** **33**

**ప్రతిపదార్థం:** ఉడుగక= మానక; వెండియున్= మరల; సుభటులు= యోధులు; ఒక్కమొగిన్= ఒక్కసారిగా; వెసన్= త్వరగా; అంటన్+తాఁకి= దగ్గరగా వచ్చి ఎదుర్కొని; కవ+వడి= అర్జునుడియొక్క; పటు= గట్టిదైన; బాణ= బాణాలయొక్క; భాస్వత్= ప్రకాశించే; అనివార్య= మరల్పలేని; సముద్ధతిన్+చేసి= విసురుచేత; మంటలోన్= మంటలో; మిడుతలు= మిడుతలు; చొచ్చినట్లు+అయినన్= ప్రవేశించినట్లుకాగా; కని= చూచి; మేటి మగల్= మహావీరులు; ఈడన్+పోక= వెనుదియ్యక; బల్విడిన్= పరాక్రమంతో; మఱియున్ వడిన్= మరింత వేగముతో; పొదువన్= క్రమ్మగా; అతండు= అర్జునుడు; తోడుతోన్= వెనువెంటనే; వ్రేల్మిడిన్= చిటికెలో; త్రుంచెన్= తెగగొట్టాడు (చంపాడు).

**తాత్పర్యం:** అయినా మానక, కొందరు వీరులు ఒక్కపెట్టున అర్జునుడి మీదికి తాకి, అతని బాణాగ్నికి మంటలో పడిన మిడుతలవలె చచ్చిపోయారు. అది చూచి, మహావీరులు వెనుదీయక మరింత మీదికి వచ్చి చుట్టుముట్టారు. వారిని కూడా అర్జునుడు వెన్వెంటనే త్రుంచివేశాడు.

**విశేషం :** అలం: ఉపమ. అర్జునుడు సాగిస్తున్న యుద్ధాన్ని తిక్కన ఒక క్రమంలో తీర్చిదిద్దాడని చెప్పటానికి ఈ పద్యం మరొక సాక్ష్యం. కురుసేనలో మొదట అర్జునుడిపై దాడి చేసినవారు 'కాల్బలములు' (పద్యం. 31), సామాన్య వీరులైన వీళ్లను ఒక్కొక బాణానికి పది పదునేనుమంది చొప్పున మట్టుపెట్టాడు. వారి తరువాత 'సుభటులు' (బాగా బలం కలిగి తరిఫీదయినవారు) ఎదుర్కొన్నారు. వారు కాల్బలాల వలె దూరంగా ఉండి యుద్ధం చేయలేదు. మెరుపుదాడిలో అర్జునుడిని సమీపించి అతడిమీద మూకుమ్మడిగా తలపడ్డారు. వారి మధ్య బాణాల కాంతితో వెలిగిపోతూ అనివార్యమైన విజృంభణంతో ఆ సుభటుల నందరిని అంతమొందించాడు. ఆ దృశ్యం అగ్నిలో మిడుతలు పడి కాలిపోతున్నట్లున్నదట! ఎంతటి చక్కని ఉపమానం! సుభటులు సోదిలోకి కూడా రాకుండా పోయారు. వారి తరువాత రంగంలోకి వచ్చినవారు మేటిమగలు! సైనికులలో మేటి వీరులు. నేటి కాలంలోని 'రిజర్వుడ్ ఫోర్సు' వంటివారు. వారు వెనకాడకుండా అర్జునుడిని చుట్టుముట్టారు. కాని, వారినీ క్షణంలో అతడు చంపాడు. కాల్బలంలోకూడా ఎన్ని తెగలుంటాయో, అవి శత్రువుమీద ఎట్లా తలపడతాయో కంటికి కట్టినట్లు స్వీయానుభవంతో తిక్కన చెప్పగలగటం ఆంధ్రమహాభారత రచన చేసికొన్న అదృష్టం. (సంపా.)

**తే.** **అంతకంతకుఁ గదిసి సైన్యములు సుట్టు। ముట్టి శస్త్రాస్త్ర సంచయమున నభంబు**
**దీటు కొనునట్లు సేయఁ గిరీటి గాండి। వంబు పరిచాలనంబు దీవ్రంబు గాఁగ.** **34**

**ప్రతిపదార్థం:** సైన్యములు= సేనలు; అంతకున్+అంతకున్= అంతకంతకు; కదిసి= సమీపించి; చుట్టుముట్టి= చుట్టూరా వ్యాపించి; శస్త్ర+అస్త్ర సంచయమునన్= శస్త్రాల, అస్త్రాల సమూహంతో; నభంబు= ఆకాశం; దీటుకొనునట్లు= వ్యాపించేటట్లు; చేయన్= చేయగా; కిరీటి= అర్జునుడు; గాండివంబు= గాండీవంయొక్క; పరిచాలనంబు= అంతటా కదిలించటం; తీవ్రంబుకాఁగన్= ఎక్కువ కాగా.

**తాత్పర్యం:** సేన లింకా ఇంకా దగ్గరకువచ్చి చుట్టుముట్టి శస్త్రాలతో, అస్త్రాలతో ఆకాశం నిండేటట్లు చేశాయి. అప్పుడు అర్జునుడు గాండీవచాలనాన్ని తీవ్రం చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం :** అలం: అతిశయోక్తి. ఈ పద్యంలో వర్ణించబడినవి సైన్యాల సమూహాలు. అవి శస్త్రాస్త్రాలను ప్రయోగించగలవి. సామూహికంగా సమన్వయంతో సమరం చేయగలిగినవి. వారందరూ కలిసి తమ బాణాలతో ఆకాశాన్ని నింపారు. అర్జునుడిని బాణపంజరంలో బంధించాలని యత్నించారు. ఇది సంఘటితమైన, తీవ్రతరమైన, ప్రమాదకరమైన ఎత్తుగడ. దీనిని విధ్వంసం చేయాలంటే గాండీవ పరిచాలనం మరింత తీవ్రతరం కావలసిందే. అది సహజ ప్రతిక్రియ. ఈ ప్రతిక్రియ ప్రవర్తిల్లిన తీరును రాబోయే సీసపద్యం చలత్చిత్రంగా ప్రత్యక్షీకరిస్తున్నది. (సంపా.)

**సీ.** **గోరఁ బోఁజిన మాడ్కిఁ గొన్నింటిఁ జక్కసాఁ। బాలుగా వ్రయ్యలు వాపి పాపి,**
**బాడిస నఱకిన భంగిఁ గొన్నింటిఁ దు। త్తునియలుగా బిట్టు త్రుంచి త్రుంచి,**
**వెస అంపమున నిడ్డవసిగఁ గొన్నిటి నిసు। మంతలుగా నుఱుమాడి యాడి,**
**పనివడి ఱోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ। జిఱునుగ్గుగాఁ బొడి సేసి చేసి,**

**తే.** **యడరి పొదివిన బలము నానాయుధములఁ। బ్రతిహతంబులఁ గావించె నతిరయమున**
**నక్షత ధ్వజ సూత హయత్వ లస ద।ఫల్గురథవల్గనుం డగు ఫల్గునుండు.** **35**

**ప్రతిపదార్థం:** అడరి= అతిశయించి; పొదివిన= చుట్టుముట్టిన; బలము= సేన యొక్క; నానాయుధములన్= అనేకమైన ఆయుధాలను; అక్షత= దెబ్బతగులని; ధ్వజ= జెండా; సూత= సారథి; హయత్వ= గుర్రాలు కలుగుటచేత; లసత్= ప్రకాశించే; అఫల్గు= వ్యర్థంకాని; రథ= రథము యొక్క; వల్గనుండు+అగు= గమనం కలవాడైన; ఫల్గునుండు= అర్జునుడు; గోరన్= గోటితో; పోఁజిన మాడ్కిన్= చిక్కును తీసి నున్నగా సవర చేసినట్లుగా; కొన్నింటిన్= కొన్నిటిని; చక్క= చక్కగా; సాఁబాలుగాన్= నిలువున సగభాగంగా; నడిమికి; వ్రయ్యలు= ముక్కలుగా; పాపిపాపి= విడదీసి; బాడిసన్= బాడిసతో; నఱకినభంగిన్= చెక్కినట్లుగా; కొన్నింటిన్= కొన్నింటిని; తుత్తునియలుగాన్= ముక్కలుముక్కలుగా; బిట్టు= శీఘ్రంగా; త్రుంచి త్రుంచి= తెగగొట్టి; అంపమునన్= రంపంక్రింద; ఇడ్డ= ఉంచిన; వసిగన్= కొన చెక్కిన కొయ్యవలె; కొన్నిటిన్= కొన్నింటిని; ఇసుమంత(తు)లు గాన్= చిన్నచిన్న ఇసుక రేణువులుగా; వెసన్= వేగంగా; నుఱుమాడి+ఆడి= చీల్చి చీల్చి; పనివడి= అవసరము కలిగి; ఱోలన్= రోటిలో; కొట్టినలీలన్= దంచినట్లుగా; కొన్నింటిన్= కొన్నింటిని; చిఱునుగ్గుగాన్= చిన్న రవ్వవలె; పొడి చేసి చేసి= పిండివలె చేసి; అతిరయమునన్= చాలా వేగంగా; ప్రతిహతంబులన్= కొట్టబడిన వాటినిగా, ధ్వంసం చేయబడిన వాటినిగా; కావించెన్= చేసెను.

**తాత్పర్యం:** కౌరవసైన్యాలు అర్జునుడిని చుట్టుముట్టి నానాయుధాలతో అతడి ధ్వజాన్ని, సారథిని, గుర్రాలను, అక్షయ రథాన్నీ ధ్వంసం చేయటానికి పూనుకొన్నాయి. అప్పుడు అర్జునుడు ప్రతీకారంగా వారు ప్రయోగించిన ఆయుధాలలో

కొన్నింటిని గోటితో చిక్కును చీల్చినట్లుగా నిట్టనిలువుగా నడిమికి ముక్కలుగా చేసివేశాడు. కొన్నింటిని బాడిసతో నరికినట్లుగా తునకలు తునకలుగా మిక్కిలి చిన్న ముక్కలుగా నరికివేశాడు. కొన్నిటిని రంపపు పదును క్రిందపెట్టిన కొయ్యముక్కలవలె ఇసుక రేణువులంతగా మారేటట్లు మిక్కుటంగా నురుమాడాడు; కొన్నిటిని కావాలని రోట్లోపెట్టి దంచినట్లుగా నుగ్గునుగ్గయ్యే విధంగా పొడిచేసి వేశాడు. ఆ విధంగా వారి ఆయుధాల నన్నింటిని ధ్వంసం చేసి అర్జునుడు తన ధ్వజ, సూత, హయ, రథాలను మొక్కవోకుండ కాపాడుకొన్నాడు.

**విశేషం :** అలం: ఉపమ. మూకుమ్మడిగా దాడిచేసిన కౌరవసైనికులు అర్జునుడిని విరథుడిని చేయాలని యత్నించారు. ఆ ప్రయత్నంలో అనేకాయుధాలను వాడారు. వారికి లక్ష్యాలు నాలుగు- కేతనం, సారథి, గుఱ్ఱాలు, రథం. వాటిని ధ్వంసం చేయటానికి అనువైన నాలుగు రకాల ఆయుధాలనైనా వారు వాడి ఉంటారు. అర్జునుడు ఆయా తెగల ఆయుధాలను తన బాణ ప్రయోగంలోని ఆయా పద్ధతులను ప్రయోగించి నామరూపాలు లేకుండా చేశాడు. అందువలననే కాబోలు తిక్కన ఆయుధాల పేర్లను పద్యంలో చెప్పలేదు.

తిక్కన తన సీసాలలో పాదాలకూ ఎత్తుగీతికీ ఏదోరకమైన క్రమాన్వయాన్ని కల్పిస్తూ ఉండటం పరిపాటి. ఈ పద్యంలో కూడా దానిని అనుసంధించుకొనాలి. టెక్కాన్ని విరుగగొట్టాలని, జెండాను చింపాలని సైనికులు కొన్ని ఆయుధాలను ప్రత్యేకంగా ఉపయోగించి ఉంటారు. వారి ప్రయత్నానికి ప్రతీకారంగా వారి ఆయుధాలను గోళ్ళతో గోగునారను చీల్చినట్లుగానూ, నడిమికి విరిగేటట్లుగానూ ముక్కలు చేశాడు. సూతుడుతో సహా జెండా, గుఱ్ఱాలు, రథం క్షేమంగా నిలిచాయి. వారి ఆయుధాలు ప్రతిహతాలయ్యాయి.

సారథిని చంపటానికి నిలువునా నరకటానికి సైనికులు కొన్ని ఆయుధా లుపయోగించి ఉంటారు. వా రే పద్ధతిలో సారథిని చంపదలచారో ఆ పద్ధతిలోనే అర్జునుడు వారి ఆయుధాలను విరిచాడు. బాడిసతో నరికినట్లు వాటిని ముక్కలుముక్కలుగా త్రుంచి పారవేశాడు.

గుఱ్ఱాలను కత్తుల వంటి ఆయుధాలతో ముక్కలుగా చేయాలని సైనికులు పూనుకొన్నట్లున్నారు. వారికి తగిన ప్రతిక్రియ చేశాడు. రంపాలతో కొయ్యలను కోసి, ఇసుక రేణువుల వలె మారేటట్లు నురుమాడినట్లుగా ధ్వంసం చేశాడు.

రథాన్ని మోది నుగ్గు చేయాలని చూచిన సైనికుల ఆయుధాలను వారి యత్నానికి తగినట్లు రోట్లో పెట్టి దంచినట్లుగా ఇసుక రవ్వవలె మారేటట్లు పొడి పొడి చేసివేశాడు.

అర్జునుడు తనమీద దాడిచేసిన సైనికుల నేమీ చేయక, వారి ఆయుధాలను మాత్రమే ధ్వంసం చేసి, వారిని నిరాయుధులను చేశాడు. పాపి, పాపి; త్రుంచి, త్రుంచి; నురుమాడి ఆడి; పొడిచేసి చేసి- అని తెలుగు క్రియల నామ్రేడితంతో కలిపి వాడటంలో వేగంగా ఎన్నోసార్లు ఆ విధంగా చేశాడనే అర్థాన్ని కవి ధ్వనింప చేశాడు. విరిగిన ఆయుధాలను గురించి చెప్పిన సీసపద్య పాదాలలో అలతి అలతి తెలుగు పదాల జిలుగు రచన సార్థకంగా ఉన్నది. అక్షతమైన రథాన్ని 'అక్షత ధ్వజ సూత హయత్వ లసదఫల్గు రథ వల్గనుండు'- అనే అఖండ సమాసంలో వర్ణించటం ఉచితంగా ఉన్నది. సీసపద్యంలో అర్జునుడి వీరరసాభ్యుదయోల్లాసం గోచరిస్తుంది. మొదట ఆయుధాలను నడిమికి నరికాడు. ఆపైన తునియలు చేశాడు. అటుపైన ఇసుమంతలుగా నురుమాడాడు, ఆమీద చిరు నుగ్గునుగ్గుగా పొడిచేశాడు. ఉత్తరోత్తరాలు బలీయాలన్న న్యాయంతో మొదలుపెట్టినప్పటికంటె క్రమంగా కోపం పెరిగి, ఆయుధాలను విరవటంనుండి పొడిచేయటంగా విస్తరించింది. ఈ క్రమంలో వీరరస అభ్యుదయాన్ని భావంలోనూ, ఉల్లాసాన్ని చర్యలలోనూ తిక్కన ధ్వనింప చేశాడు. (సంపా.)

**క. ఆ మెయిన వివిధ వర్మ। స్తోమం బఱువుళ్ళు సేసి సునిశిత బాణో**
**ద్దామ ప్రసార విభవ। శ్రీ మార్తుర కద్భుతంబు సేసెం గడిమిన్. 36**

**ప్రతిపదార్థం:** ఆమెయిన్+అ= ఆ రీతిగానే; వివిధ= అనేకమైన; వర్మస్తోమంబు= కవచాల సముదాయాన్ని; అఱువుళ్ళు+చేసి= చిన్నచిన్న ముక్కలుగా చేసి; సునిశిత= వాడియైన; బాణ= బాణాల; ఉద్దామ= అతిశయించిన; ప్రసార= వ్యాపించుట యొక్క; విభవశ్రీ(న్)= వైభవ సంపదను; కడిమిన్= పరాక్రమ ప్రదర్శనతో; మార్తురకున్= శత్రువులకు; అద్భుతంబుగన్= ఆశ్చర్యం కల్గించేటట్లుగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆ రీతిగా అర్జునుడు సైనికులు ధరించిన పలురకాలైన కవచాలను చిన్న చిన్న ముక్కలుగా చేసి శత్రువులకు తన అతిశయించిన బాణప్రయోగసంపదను ప్రదర్శించి ఆశ్చర్యం కలిగేటట్లు చేశాడు.

**విశేషం :** కౌరవసైనికుల ఆయుధాలను నుగ్గుచేసి, వారి శరీరాలమీద ఉండే కవచాలను, వారి కెటువంటి గాయాలు కాకుండా చీల్చి, అర్జునుడు బాణప్రయోగ విద్యను ప్రదర్శించాడు. అంతకు పూర్వం పదిపదేను మంది సైనికులను ఒకే బాణంతో చంపగలిగిన ప్రజ్ఞను చూపిన అర్జునుడు ఇప్పుడు దానికి విరుద్ధమైన నేర్పును ప్రదర్శించాడు. శరీరానికి తగలకుండా కవచాలను మాత్రమే ఛేదించే ఆ కౌశలం సైనికులకు అద్భుతాన్ని కలిగించింది. అపూర్వ కార్యసాధనం చేసినప్పుడు నాయకుడిలో వీరరస స్ఫూర్తి కలుగుతుంది. దానిని చూచిన చూపరులకు అద్భుతం కలుగుతుంది. వీరం జనకరసం, అద్భుతం జన్యరసం. ఆ రసమర్యాద తెలిసిన తిక్కన జన్యజనకరసోల్లాసాన్ని ఇక్కడ సందర్భోచితంగా సంధించాడు. (సంపా.)

**క. గర్జద్గుణుఁడై పగతుర । జర్జరితాంగులుగఁ జేసె సాయకజాల**
**స్ఫూర్జన చూపఱు వొగడఁగ । నిర్జరవరనందనుండు నిమిషార్ధమునన్. 37**

**ప్రతిపదార్థం:** నిర్జర వర నందనుండు= దేవేంద్రుడి కొడుకు - అర్జునుడు; గర్జత్+గుణుఁడు+ఐ= ఉరుముతున్న నారి కలవాడై; సాయక+జాల+స్ఫూర్జన= బాణాల సమూహం యొక్క ప్రేలుడు; చూపఱు= చూచేవారు; పొగడఁగన్= పొగడగా; పగతురన్= శత్రువులను; నిమిష+అర్ధమునన్= అరనిమిషంలో; జర్జరిత+అంగులు+కాన్= తూట్లుపడిన శరీరాలు కలవారినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు నారిని గర్జింపచేస్తూ బాణ సమూహాల ప్రేలుటను ప్రేక్షకులు పొగడుతుండగా, శత్రువులను అరనిమిషంలో తూట్లు పడిన దేహాలు కలవారినిగా చేశాడు.

**విశేషం :** గాండీవి నిరంతర బాణాలతో ఒక అర నిమిషంలోనే ఆ సైనికుల శరీరాలను శిథిలం చేశాడు. అంటే - చంపకుండా గాయాలు చేసి ఒడలు గుల్ల చేశాడు. దీనిని ఒక వర్షాకాలంగా తిక్కన చిత్రించాడు. నిరవయవ రూపక స్ఫూర్తిని ప్రదర్శించాడు. అర్జునుడు నిర్జరపతి కుమారుడు కాబట్టి మేఘాధిపత్యం సహజ గుణం. అతడి గాండీవ గుణనాదం గర్జ. అంటే గాండీవమనే మేఘం చేసే ఉరుము. నారి మ్రోగినప్పుడెల్లా బాణాలు పిడుగులవలె పడుతున్నాయి. ఉరుములు ఉరమటం, పిడుగులు పడటం, పిడుగుపాటుతో శరీరం శిథిలం కావటం వర్షాకాలంలో ఒక క్షణంలోనే జరుగుతాయి. అట్లాగే అర్జునుడి బాణపాతం కూడా- అనే రమణీయ భావన తిక్కన కలిగించాడు. రకారజకార సంయుక్త వర్ణం ప్రాసస్థానంలో నిలిచి గాండీవ గర్జను స్ఫురింప చేస్తున్నది. ముందు పద్యంలో కవచాలు కోల్పోయిన వారు ఆశ్చర్యపడ్డారు. అప్పుడు వారి నోట మాటలు రాలేదు. ఇప్పుడు కూడా జర్జరిత శరీరులైన సైనికులు పలుకలేదు కాని, చూచేవారు మాత్రం ఆ అద్భుత కార్యాన్ని వేనోళ్ళ పొగిడారు. ఇది జన్యరసోల్లాసంలో మరొక సూక్ష్మ శిల్పం. (సంపా.)

**శా. శక్తిస్ఫార ధనంజయాయత భుజా సంరంభ గాండీవ ని**
**ర్ముక్త క్రూర శరావళీ దళిత శత్రువ్రాతముల్ శోణితా**
**సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీ వికాసోల్లస**
**ద్రక్తాశోక తరువ్రజంబుల క్రియన్ రంజిల్లి యొప్పెం గడున్. 38**

**ప్రతిపదార్థం:** శక్తి= శక్తిచేత; స్ఫార= అతిశయించిన; ధనంజయ= అర్జునుడి; ఆయత= పొడవైన; భుజా= భుజాల; సంరంభ= హడావిడితో; గాండీవ= గాండీవం నుండి; నిర్ముక్త= విడువబడిన; క్రూర= భీకరమైన; శర+ఆవలీ= బాణ పంక్తిచేత; దళిత= చీల్చబడిన; శత్రు= శత్రువుల; వ్రాతముల్= సముదాయాలు; శోణిత= రక్తంతో; ఆసిక్త= పూర్తిగా తడుపబడ్డ; ఆకారతన్= శరీరం కలగటాన్ని; పొంది= పొంది; సాంద్ర= దట్టమైన; కుసుమ= పూల; శ్రేణీ= పంక్తుల; విలాస= విలాసంతో; ఉల్లసత్= ప్రకాశించే; రక్త+అశోక= ఎర్ర అశోకా లనెడి; తరు= చెట్లయొక్క; వ్రజంబులక్రియన్= గుంపులవలె; రంజిల్లి= ఎర్రనై; కడున్= మిక్కిలి; ఒప్పెన్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** గొప్పశక్తి ఉన్న అర్జునుడి బాహువుల వేగంతో అతడి గాండీవం నుండి వెలువడిన భీకర బాణాల దెబ్బలకు శత్రువుల శరీరాలన్నీ రక్తమయమై ఎర్రగా మారిపోయాయి. అవి దట్టమైన పూలపంక్తులతో ఉల్లాసంగా ప్రకాశించే ఎర్ర అశోకవృక్షాల గుంపులవలె ఉన్నాయి.

**విశేషం :** అలం: ఉపమ. 1. అర్జునుడు తన గాండీవం నుండి ప్రయోగించిన వాడి బాణాలతో శత్రుసమూహాల శరీరాలను గాయపరిచి, వాటిని రక్తంతో తడిసిన వాటినిగా చేశాడు. గాయాలు తిన్న సైనిక శరీరాలు కూలిపోలేదు. అంటే సైనికులు చావలేదు. కాని, యుద్ధం చేయలేక వివశులై నిలిచిపోయారు. ఇది ఒక చిత్రమైన స్థిరచిత్రం. నిలబడి ఉన్న ఆ రక్తసిక్త సైనిక శరీరాలను చూస్తే ఆమూలాగ్రం ఎర్రని పూలతో ఒప్పారే రక్తాశోక వృక్షాల వలె ఉన్నారట. అపూర్వమైన ఉపమాలంకారం! భయానక బీభత్స రస విభావాలను ఆస్వాద యోగ్యంగా మార్చటానికి రమణీయోపమానాలను వాడటం తిక్కన యుద్ధవర్ణన శిల్పం. దాని కీ పద్యం హృద్యమైన ఉదాహరణం.తెలుగునాట బహుళ ప్రచారంలో ఉన్న పద్యం.

2. అశోక వృక్షాలలో బంగారు రంగులోనూ, రక్త వర్ణంలోనూ, కాటుకరంగులోనూ పూలుపూసే జాతులున్నాయి. అందులో రక్తాశోకాలను ఉపమానాలుగా తీసికొనటం ఔచిత్యం.

3. **"శౌర్యస్తవే నృపాదీనాం శార్దూలవిక్రీడితం మతమ్"** - అని క్షేమేంద్రుడు సువృత్త తిలకంలో చెప్పినట్లు, ఈ వృత్తం తనలోని వర్ణ్యవస్తువైన అర్జునుడి శౌర్యాన్ని తన రచన ద్వారా వ్యంజింప చేస్తున్నది. విసర్జనీయ, ఉపధ్మానీయ శషరేఫాది పరక పూర్వగుర్వక్షర బాహుళ్యం చేత ఈ పద్యం ఓజోగుణంతో రాణించింది. జర్జరిత శరీరుల దైన్యం కాదు ఇందులో గమ్యమానమయింది. ఆ క్రియను సాధించిన వీరుడి వీరకృత్యాన్ని భావింపజేసే అలంకార ధ్వని. 36వ పద్యంలో వీరులే ఆశ్చర్యపడ్డారు. 37వ పద్యంలో చూపరు లాశ్చర్యపడ్డారు. ఇక ఈ పద్యం చదివి కావ్యపఠితలు ఆశ్చర్యపడతారు. ఈ మూడు పద్యాలలో సహృదయ రసవ్యంజక శిల్పాన్ని అశోక వృక్షంవలె విరగబూచిన పద్యం ఇది. రసోల్లాస శిల్పంలో ఇది ఉత్తమమని తిక్కన తీర్పు. (సంపా.)

**చ. తదవసరంబునన్ దొర లుదగ్రతఁ ద్రోచిన వజ్రఘట్టముల్**
**మదమున నొక్కపెట్ట బలమర్దనుసూను రథంబు గ్రక్కునం**
**బొదివెఁ దురంగ కింకిణుల భూరిరవంబుఁ గరీంద్ర ఘంటికా**
**భ్యుదిత నినాదమున్ రథవరోత్థిత ఘోషము నుత్కటంబుగన్. 39**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ తరువాత; దొరలు= గొప్పరాజులు; ఉదగ్రతన్= గర్వంతో, భయంకరంగా; త్రోచిన= కవిసిన, త్రోసికొంటూ ఏర్పడిన; వజ్రఘట్టముల్= వజ్రమనే సైనికవ్యూహంగా ఏర్పడిన సమూహాలు; మదమునన్= గర్వంతో; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; బలమర్దను సూను= ఇంద్రుడి కుమారుడైన అర్జునుడి; రథంబు= రథాన్ని; తురంగ= గుర్రముల; కింకిణుల= చిరుగంటల; భూరిరవంబున్= పెద్ద ధ్వనియూ; కరి+ఇంద్ర= శ్రేష్ఠములైన ఏనుగుల; ఘంటికా= గంటలనుండి; అభ్యుదిత= బయలుదేరిన; నినాదమున్= మ్రోతయు; రథవర= పెద్ద (శ్రేష్ఠమైన) రథాలనుండి; ఉత్థిత= బయల్దేరిన; ఘోషమున్= చప్పుడును; ఉత్కటంబుగన్= అతిశయించగా; గ్రక్కునన్= వెంటనే; పొదివెన్= చుట్టుముట్టాయి.

**తాత్పర్యం:** అనంతరం గొప్ప గొప్ప యోధులందరూ గర్వాటోపంతో ఒకరినొకరు త్రోసికొంటూ వజ్రవ్యూహంగా ఏర్పడిన సమూహాలై గుర్రాల చిరుగంటల సవ్వడి, ఏనుగుల ఘంటల చప్పుడు, రథాల చక్ర ధ్వని ఎక్కువ కాగా ఒక్కసారిగా అర్జునుడి రథాన్ని చుట్టుముట్టారు.

**విశేషం :** కాల్బలాలలో చాలమంది గాయాలతో కదలలేని పరిస్థితి ఏర్పడగా సామంత ప్రభువులవంటి దొరలు రథ గజ తురగ దళాలతో వజ్రవ్యూహాలు నిర్మించుకొని అర్జునుడిని చుట్టుముట్టటానికి యత్నించారు. **"త్రిధా వ్యవస్థిత బలో వజ్ర ఇత్యభిధీయతే। సూచ్యా అల్పాన్ వజ్రేణ బహూన్ యోధయేత్".** వజ్రం - భేదించటానికి వీలులేని వ్యూహాలలో ఒకటి. త్రివిధ దళాలతో పన్నేది. కాబట్టి గుర్రాల కదలికలో వాటి చిరుగంటల చప్పుడు, ఏనుగుల సందడిలో వాటి గంటల నాదాలూ, రథాల పరుగులలో వాటి చక్రధ్వనులూ కలిగి ఒక మహాశబ్దం ఏర్పడింది. గమనించ తగిన అందమైన అంశమేమంటే - అర్జునుడి గుణం గర్జనం చేస్తుందట. అంగత్రయం చేసే నాదం ఉత్కట ఘోషంగా ఉన్నదట. ఈ శబ్ద తారతమ్యంతో బల తారతమ్యాన్ని రసికులు గుర్తించగలిగేటట్లు సన్నివేశాన్ని చిత్రించటం ఇక్కడి రామణీయకం. (సంపా.)

**తే.** **అట్టియెడ వేల్పు వచ్చినయట్ల మేను। పొంగ నలి రేఁగి పాండవ పుంగవుండు**
**మత్స్యనృపనందనుని బలుమాట తోడి। యేపు సెవికిని జూడ్కికి నింపు నొసఁగ.** **40**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= అప్పుడు; పాండవపుంగవుండు= పాండురాజు కుమారులలో శ్రేష్ఠుడైన అర్జునుడు; వేల్పు వచ్చినయట్ల= దేవత ఆవేశించినట్లుగా (పూనకం వచ్చిందా అన్నట్లు); మేను= శరీరం; పొంగన్= ఉబ్బగా; నలిరేఁగి= కోపంతో అతిశయించి; మత్స్యనృపనందనుని= ఉత్తరుడి యొక్క; బలుమాటతోడి= పొగడ్తతో; ఏపు= విజృంభణం; చెవికినిన్= చెవికినీ; చూడ్కికిన్= దృష్టికినీ; ఇంపు= సంతోషాన్ని; ఒసఁగన్= కలిగించగా.

**తాత్పర్యం:** అర్జునుడు దేవత ఆవేశించినట్లు శరీరం ఉప్పొంగగా విజృంభించి, ఉత్తరుడి పొగడ్త మాటలు వినటానికీ, చూడటానికీ ఇంపు కలిగించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం :** అలం: ఉత్ప్రేక్ష. దొరలందరు ఒక్కుమ్మడిగా వజ్రవ్యూహాలతో తనను చుట్టుముట్టటానికి రావటం చూశాడు అర్జునుడు. బలవంతులైన శత్రువులను చూచినప్పుడు వీరుడికి మేను పొంగుతుంది. ఇది వీరోచిత సాత్త్విక భావం. అది దేవత ఆవేశించినప్పుడు కలిగే పూనకమా అన్నట్లు ఉన్నదట! అందువలన అది ఉత్ప్రేక్ష. వజ్రం - ఇంద్రాయుధం పేరు. ఆ పేరుగల వ్యూహం చూసినప్పుడు దేవతలే అర్జునుడిని ఆవేశించినట్లుండటం ఔచిత్యం. ఆ పూనకం చూచేసరికి ఉత్తర కుమారుడు దేవుడిని ప్రశంసించినట్లు అర్జునుడిని పొగిడాడట. ఆ మాటలు చెవులకు, చూపులకు సంతోషాన్ని కలిగించి రసోల్లాసాన్ని పెంచాయి. (సంపా.)

**క.** **మేదుర దీర్ఘతరం బగు। నాదం బెడతెగక గుణమునను వడి నిగుడం**
**గోదండము సంతతవల। యోదాత్తస్ఫురణ వెలుఁగుచుండఁగ నేసెన్.** **41**

**ప్రతిపదార్థం:** మేదుర= దట్టమైన; దీర్ఘతరంబు+అగు= ఎక్కువ పొడవైన; నాదంబు= ధ్వని; ఎడతెగక= మధ్యన ఆపులేక; గుణమునను= నారియందు; వడిన్= వేగంగా; నిగుడన్= వ్యాపించగా; కోదండము= విల్లు; సంతత= ఎల్లప్పుడును; వలయ= గుండ్రనిదై; ఉదాత్త స్ఫురణన్= గొప్ప ప్రకాశంతో; వెలుఁగుచుండఁగన్= వెలుగుతూ ఉండగా; ఏసెన్= బాణాలు వేసెను.

**తాత్పర్యం:** అర్జునుడి నారినుండి దట్టమైన పొడవైన నాదాలు ఎడతెగకుండా వస్తూ ఉండగా, విల్లు ఎప్పుడూ వలయాకారంతో ప్రకాశిస్తూ ఉండగా బాణాలను ప్రయోగించాడు.

**విశేషం :** అర్జునుడు గాండీవంతో నిరంతరంగా బాణాలు వేయటంచేత నిరంతరాయంగా గుణధ్వని దీర్ఘంగా వినిపిస్తున్నది. గాండీవం వలయంగానే (బాణం ఎక్కు పెట్టిన రూపంలోకి) ఉండిపోయింది. అది అతడికి పరివేషంగా భాసించిందని; అది అతడిలోని దేవతల పూనకానికి చిహ్నంగా ఉన్నదని చమత్కారం. రాబోయే పద్యంలో సూర్యుడివలె వర్ణించటానికి ఇది ప్రాతిపదిక. (సంపా.)

**మ.** **ఒక మాత్రన్ వితతప్రసార నిబిడాత్యుగ్రాస్త్ర సంతానముల్**
**సకలానీకములందుఁ బర్వ నరు భాస్వన్మూర్తి శోభిల్లె దీ**
**ప్తికలాపంబులు లోక మంతటను విస్తీర్ణంబులై యౌగప**
**ద్యకృత వ్యాప్తి వెలుంగ నొప్పెసఁగు మార్తాండున్ విడంబించుచున్.** **42**

**ప్రతిపదార్థం:** ఒకమాత్రన్= రెప్పపాటుకాలంలో; వితత= ఎక్కువయిన; ప్రసార= వ్యాప్తిగల; నిబిడ= దట్టమైన; అతి+ఉగ్ర= మిక్కిలి భీకరాలైన; అస్త్ర సంతానముల్= అస్త్ర (మంత్ర సహిత బాణ) సముదాయాలు; సకల+అనీకములందున్= అన్నిసేనల పైనను; పర్వన్= వ్యాపించగా; నరు= అర్జునుడి యొక్క; భాస్వత్+మూర్తి= ప్రకాశించే శరీరం; దీప్తికలాపంబులు= కిరణ సముదాయాలు; లోకము+అంతటన్= లోకమంతా; విస్తీర్ణంబులు+ఐ= వ్యాపించినవై; యౌగపద్యకృత= ఒక్కసారిగా చేయబడిన; వ్యాప్తిన్= వ్యాపించటంచేత; వెలుంగన్= ప్రకాశించగా; ఒప్పు+ఎసఁగు= ఎక్కువగా అందగించే; మార్తాండున్= సూర్యుడిని; విడంబించుచున్= అనుకరిస్తూ; శోభిల్లెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ఒక్కసారిగా అన్ని సైన్యాలపైనా దట్టమైన భయంకరమైన అస్త్రసముదాయాలను ప్రయోగిస్తూ తేజోమూర్తిగా కనబడుతున్న అర్జునుడు ఒక్కసారిగా కిరణాలన్నింటినీ లోకాలలో వ్యాపింపజేసి వెలిగే సూర్యుడి వలె ప్రకాశిస్తున్నాడు.

**విశేషం :** అలం: ఉపమ. అర్జునుడు మధ్యాహ్నసూర్యుడివలె ప్రకాశించాడు. సూర్యుడు ఒక్కసారిగా తన కిరణాలను లోకంమీద నలుదిక్కులా ప్రసరింపచేసి ప్రకాశించగలడు. అర్జునుడు గాండీవంనుండి ఒక్కసారిగా అస్త్రసముదాయాన్ని సైన్యాలన్నింటిమీదా ప్రయోగించి పరాక్రమంతో ప్రకాశించగలడు. ఇద్దరూ భాస్వన్మూర్తులే. అందువలన ఉపమానం సహజ రమణీయం. (సంపా.)

**క.** **నరు లొరులు దృశ్యములపైఁ। బరఁగింపఁగఁ జూడ్కు లెట్లు వడుఁ దప్పక య**
**ప్పరుసున నరుఁ డేయు నిశిత। శరములు లక్ష్యములు దప్పి చన వించుకయున్.** **43**

**ప్రతిపదార్థం:** ఒరులు= ఇతరులయిన; నరులు= మనుష్యులు; దృశ్యములపైన్= చూడదగిన వస్తువులపై; పరఁగింపఁగన్= ప్రసరింపజేయగా; చూడ్కులు= దృష్టులు; తప్పక= తప్పకుండా; ఎట్లు= ఏరీతిగా; పడున్= పడునో; ఆ+పరుసునన్= ఆ రీతిగా; నరుఁడు= అర్జునుడు; ఏయు= వేయునట్టి; నిశితశరములు= వాడి అయిన బాణాలు; ఇంచుకయున్= కొద్దిగాకూడా; లక్ష్యములు తప్పి= గురిని తప్పి; చనవు= పోవు.

**తాత్పర్యం:** చూడదగిన వస్తువులపై సాధారణ మానవులు తమ చూపులను ప్రక్కకు తిప్పకుండా ప్రసరింప జేసినప్పుడు ఎట్లాగైతే గురితప్పవో, అట్లాగే అర్జునుడి బాణాలు కొద్దిగా కూడా లక్ష్య భేదనంలో గురితప్పవు.

**విశేషం :** అలం: ఉపమ. చూపులు లక్ష్యాలను ఎట్లా గురిగా చూస్తాయో, అర్జునుడి బాణాలు లక్ష్యాలను అట్లా భేదిస్తాయి అని భావం. ఇది గాండీవి లక్ష్యశుద్ధిని తెలుపుతున్నది. అనేక లక్ష్యాలమీద ఒకేసారి బాణాలు ప్రయోగించే అర్జునుడు ఎప్పుడూ లక్ష్యాన్ని తప్పలేదని చెప్పటం కవి హృదయం. మూలంలో ఈ భావమే వ్యతిరేక వ్యంగ్యస్ఫూర్తితో చెప్పబడింది.

**"పతంత్యరూపేషు యథా చక్షూంషి న కదాచన, నాలక్ష్యేషు శరాః పేతుస్తథా గాండీవధన్వినః!" (సం.4-55-26)** అమూర్తాలైన లక్ష్యాలమీద మానవదృక్కులు ఎట్లా ఎప్పుడూ పడవో అట్లాగే అర్జునుడి బాణాలు లక్ష్యాలు కాని వాటిమీద పడవు అని మూలం. మూలంలో కంటె తిక్కన రచనలో స్పష్టత ఎక్కువ. (సంపా.)

**క. గజ ఘోటక రథ సూత। ధ్వజకంకట యోధగాత్ర తతియందెచటన్**
**విజయ ధనుర్ముక్త శర। వ్రజములు దవులంగఁ, బడ కవారణ నిగుడున్. 44**

**ప్రతిపదార్థం:** గజ= ఏనుగులు; ఘోటక= గుర్రాలు; రథ= రథాలు; సూత= సారథులు; ధ్వజ= జెండాలు; కంకట= కవచాలు; యోధ= యుద్ధవీరుల; గాత్ర తతియందున్= అవయవాలందు; ఎచ్చటన్= ఎక్కడైనా; విజయ= అర్జునుడియొక్క; ధనుస్+ముక్త= వింటినుండి విడువబడిన; శరవ్రజములు= బాణ సముదాయాలు; తవులంగన్= తగులగా; పడక= పడిపోక; అవారణన్= అడ్డులేనివై; నిగుడున్= గుచ్చుకొని అలాగే వుంటాయి.

**తాత్పర్యం:** అర్జునుడు వేసే బాణాలు ఏనుగులు, గుర్రాలు, రథాలు, సారథులు, జెండాలు, కవచాలు, యోధుల శరీరాలు మొదలైన వాటిపై ప్రయోగించినప్పుడు వాటిమీద తప్పనిసరిగా గుచ్చుకొని పడిపోక అలాగే ఉంటాయి.

**చ. కవదొన లేల పూనునొకొ కవ్వడి నా వల; దుగ్రసంగరో**
**త్సవమున సవ్యపాణి నపసవ్యకరంబున మార్చి, మార్చి గాం**
**డివము ధరింపఁగా శర పటిష్ఠతయుం బొరిఁ జేయి మార్చి చూ**
**పు వెరవుతోన వీడ్వడక పొం దొడఁగూడెడు నెప్డు సూచినన్. 45**

**ప్రతిపదార్థం:** కవ్వడి= అర్జునుడు; కవదొనలు= రెండమ్ములపొదులను; ఏల పూనునొకొ= ఎందుకు ధరిస్తాడో; నాన్, వలదు= అనవలదు; ఉగ్ర= భీకరమైన; సంగర= యుద్ధమందలి; ఉత్సవమునన్= వేడుకతో; సవ్యపాణిన్= ఎడమచేతిలోనికి; అపసవ్యకరంబునన్= కుడిచేతిలోకి; మార్చి మార్చి= పదే పదే మార్చుకొంటూ; గాండివము= విల్లును; ధరింపఁగాన్= ధరించటానికి; శర= బాణాలయొక్క; పటిష్ఠతన్= గట్టిగా ఉండటం; పొరిన్= మాటి మాటికి; చేయిమార్చి= చేతిని మార్చి; చూపు= దృష్టిని; వెరవుతోను+అ= సులువుతో; పొందు= కలయిక; ఎప్డు+చూచినన్= ఎప్పుడు చూచినా; వీడ్వడక= విడిపోక; ఒడఁగూడెడున్= కలిసి ఉంటుంది.

**తాత్పర్యం:** అర్జునుడు రెండమ్ముల పొదులను ఎందుకు ధరిస్తాడంటే, భీకరమైన యుద్ధం అతడికి వేడుక. అందులో కుడి ఎడమచేతులు మార్చి మార్చి గాండీవాన్ని ధరించేటప్పుడు, అందుకు అనువుగా బాణాలను ప్రయోగిస్తూ ఉన్న ఆయన ఎడమకుడి చేతుల ప్రయోగనైపుణ్యంసైతం ఏ మాత్రం తగ్గనిదై, ఎప్పుడు చూచినా మిక్కిలి పొందిక గలదిగా గోచరిస్తూ ఉంటుంది.

**విశేషం :** అర్జునుడు నిర్విరామంగా గాండీవాన్ని చాలనం చేయగలగటానికి కారణం అతడు కవ్వడి కావటం. కవ+వడి= రెండు చేతుల వడి కలవాడు. సవ్యసాచి అని కూడా పిలుస్తారు. కుడి ఎడమ చేతులలో దేనితో బాణం వేసినా ఒకే వేగాన్ని, సామర్థ్యాన్ని ప్రదర్శించగలగటం అతడి ప్రత్యేకత. అటువంటి విలుకాడు భారతకాలంలో మరొకడు లేడు. చుట్టూ మూగిన రాజులనందరినీ క్షణాలలో బాణాలతో కొట్టగలుగుతున్నాడంటే అతడు కవ్వడి కావటమే కారణం. కవ్వడికి కవదొన లుండటం అవసరం. సవ్యాపసవ్యకరాలతో బాణాలు వేసేటప్పుడు భుజాల ఇరువైపులా అమ్ములపొదు లుండకపోతే బాణప్రయోగం సుకరం కాదు. అంతేకాదు, అవి అక్షయ తూణీరాలు. ఎన్ని బాణాలు వేసినా అందులో బాణాలు తరగవు. అందుకే, అన్ని దిక్కులా అసంఖ్యాకాలైన బాణాలను ఒక్కొక్కసారి గుప్పుతాడు. కారణం ఆ కవదొనలు ఎప్పుడూ నిండుగా ఉంటాయి కాబట్టి. (సంపా.)

**క. సమ విషమ వినిమ్నోన్నత। సమీప దూర స్థలములు సదృశములుగఁ జి**
**త్తము క్రియ నవిహత గతులను। సమరమహిం గ్రీడిరథము సను నవితథమై. 46**

**ప్రతిపదార్థం:** సమ= సమమైనవి; విషమ= సమముగాలేనివి; వినిమ్న= పల్లములైనవి; ఉన్నత= మెరకైనవి; సమీప= దగ్గరివి; దూర స్థలములు= దూరముగా ఉన్న ప్రదేశాలు; సదృశములుగన్= సమానంగా; చిత్తముక్రియన్= మనస్సువలె, మనస్సుకు నచ్చినవిధంగా; సమరమహిన్= యుద్ధభూమిలో; క్రీడిరథము= అర్జునుడి రథం; అవిహతగతులను= అడ్డులేని గమనాలలో; అవితథము+ఐ= వ్యర్థముకాక, కుంటుపడకుండా; చనున్= వెళ్ళును.

**తాత్పర్యం:** అర్జునుడి రథం సమం, విషమం, పల్లం, మెరక, దగ్గర, దూరం అనే వ్యత్యాసం లేకుండా మనస్సువలె (అర్జునుడి మనస్సుకు అనుకూలంగా) యుద్ధరంగంలో ఏమీ అడ్డులేకుండా వివిధ గతులలో కుంటుపడకుండా సాగుతుంది.

**విశేషం :** అలం: ఉపమ, అతిశయోక్తి. ఇందులో 'చిత్తముక్రియన్' అనే పదానికి మనస్సువలె అనీ, మనోగతికి అనుకూలంగా అనీ అర్థాలు చెప్పవచ్చును. మనస్సును రథంతో పోల్చటం కవిసమయం. ఇక్కడ ఉపమాలంకారం ఉన్నది. మనస్సుకు ఎట్లా ఎత్తు పల్లాలు అడ్డం రావో రథానికి కూడా అట్లాగే రావు. మనోవేగం వంటి వేగమే రథానికి ఉన్నదని చెప్పటం కూడా విశేషమే. అందులో అతిశయోక్తి ఉన్నది. అయితే 'చిత్తముక్రియ చనున్' - అన్నప్పుడు సంకల్పానికి అనుగుణంగా పయనిస్తుందని కూడా అర్థం చెప్పవచ్చును. దివ్యరథాలకు అది సహజలక్షణం. వాటికి ఎత్తుపల్లాల తారతమ్యం కూడా ఉండదు. (సంపా.)

**వ. వెండియు నతండు. 47**

**తాత్పర్యం:** అంతేకాక, అర్జునుడు.

**మ. బలమెల్లన్ వెఱ రెండుపాయలుగ శుంభద్వేగుఁడై చొచ్చి యా**
**వలగా నడ్డము వచ్చి నాలువుగ దుర్వారోద్ధతిం బోయి మూ**
**లల నానాశకలాకృతిం బొరయ లీలాయానదుర్దాంతుఁడై**
**వలయంబుల్ సని చించి చిక్కుపఱుచున్ వైకల్య సంపాది యై. 48**

**ప్రతిపదార్థం:** బలము+ఎల్లన్= సేన అంతా; వెఱన్= భయంతో; రెండు పాయలుగన్= రెండు భాగాలయ్యేటట్లు; శుంభత్+వేగుఁడు+ఐ= మెరయు వేగం కలవాడై; చొచ్చి= ప్రవేశించి; ఆవలగాన్= అవతల వైపునుండి; అడ్డమువచ్చి= అడ్డంగావచ్చి; నాలువుగన్= నాల్గు భాగాలుకాగా; దుర్వార= మరల్పరాని; ఉద్ధతిన్= ఆటోపంతో; పోయి= వెళ్ళి; మూలలన్= మూలలందు; నానా శకల+ఆకృతిన్= అనేక ముక్కల ఆకారాన్ని; పొరయన్= పొందగా; లీలాయాన= విలాసంగా వెళ్ళే నడకతో; దుర్దాంతుఁడు+ఐ= అణచ శక్యం కానివాడై; వలయంబుల్= గుండ్రంగా నడిచే గతులచేత; చని= వెళ్ళి; వైకల్యసంపాది+ఐ= వికలంగా చేసేవాడై; చించి= సైన్యాన్ని చీల్చి; చిక్కు+పఱుచున్= చిక్కుపెట్టాడు.

**తాత్పర్యం:** అర్జునుడు రథాన్ని అమితవేగంతో కౌరవసైన్య వ్యూహంలో చొచ్చుకొని పోయేటట్లు చేశాడు. ఆ సైన్యం రెండుగా చీలింది. ఆవలివైపు చేరి తిరిగి అడ్డంగా తిరిగి సాగి సైన్యవ్యూహాన్ని నాలుగు భాగాలుగా విడగొట్టాడు. మూలలలో ప్రవేశించి నాలుగు దిక్కుల రథాన్ని నడిపాడు. దానితో సైనికవ్యూహం ముక్కలు ముక్కలయింది. ఆ తరువాత రథాన్ని మండలాకారంగా గిరగిరా తిరిగించి శత్రు వ్యూహాలను చిక్కులకు గురిచేసి చెల్లాచెదరు చేశాడు.

**విశేషం :** "వజ్రం వజ్రేన భిద్యతే" - అని న్యాయం. వజ్రవ్యూహాలతో చుట్టుముట్టిన సేనలను వజ్రసంకల్పంతో చేసిన దాడితో అర్జునుడు చిన్నాభిన్నం చేశాడు. సాహసంతో నిలువునా, అడ్డంగా, మూలనుండి మూలలకు, వలయాకారంగా నిరాఘాటంగా తిరిగి వజ్రవ్యూహాన్ని చెల్లాచెదరు చేశాడు. అంతగా మూగిన రాజలోకం, అంతగా సన్నద్ధమైన గజాశ్వరథ సైన్యాలూ, అర్జునుడి రథధాటికి ఓర్చుకోలేక ప్రక్కకు ఒదిగి బాట లిచ్చి ఊరుకొన్నాయి. ఒక్కవీరుడు అడ్డులేకుండా విస్తృత సైన్యంలో విహరించటం విచిత్రంగా అందరూ చూస్తూ ఉండిపోయారు. అర్జునుడి వీరకృత్యానికి సైన్యం ఆశ్చర్యముద్రతో నిలిచిపోయినట్లయింది. (సంపా.)

**వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించు చందంబునఁ దదీయ రథంబు కౌరవసైన్యంబునందు సంచరించు నయ్యవసరంబున. 49**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; అంబుధిలోనన్= సముద్రంలో; మహామత్స్యంబు= పెద్దచేప (తిమింగలము); విహరించు చందంబునన్= తిరిగే రీతిగా; తదీయరథంబు= అర్జునుడి రథం; కౌరవసైన్యంబునందున్= కౌరవుల సేనలో; సంచరించు+ఆ+అవసరంబునన్= సంచరించే ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా ఒక పెద్దచేప సముద్రంలో విహరించే విధంగా అర్జునుడు తన రథంలో కౌరవసేనా మధ్యంలో సంచరిస్తూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం :** అలం: ఉపమ. సముద్రం వంటి కౌరవసేనలో తిమింగలం వంటి అర్జునుడి రథం అడ్డూ ఆపూ లేకుండా స్వేచ్ఛగా విహరించింది అని భావం. మత్స్య విహారంలో అడ్డులేనితనం, అవలీలగా విహరించే స్వభావం, చిత్ర విచిత్ర గతుల విన్యాసం సహజంగా ఉంటాయి. విజయుడి రథం కూడా అటువంటి విలాసాలను ప్రదర్శించటం గమనార్హం. సందర్భోచిత సార్థకోపమాలంకారం. (సంపా.)

**ఆ. రత్నకేతనములు రాజిత శేఖరం। బులును రుచిరఘంటికలును బార్థు**
**బాణ నిహతిఁ దునిసి పడుఁ గౌరవులచేటు। దెలుప డుల్లు నుల్కములను బోలె. 50**

**ప్రతిపదార్థం:** రత్నకేతనములు= రత్నాలు పొదిగిన జెండాకొయ్యలు; రాజిత= ప్రకాశించే; శేఖరంబులును= శిరోభూషణాలూ; రుచిర= అందమైన; ఘంటికలును= చిరుగంటలూ; పార్థు= అర్జునునియొక్క; బాణనిహతిన్= బాణాల దెబ్బలచేత; కౌరవుల చేటు= కౌరవుల కీడును; తెలుపన్= తెలుపటానికై; డుల్లు= రాలునట్టి; ఉల్కములను+పోలెన్= ఉల్కలవలె; తునిసిపడున్= తెగిపడుతున్నాయి.

**తాత్పర్యం:** రత్నకేతనాలు, ప్రకాశించే రాజుల శిరోభూషణాలు, అందమైన చిరుగంటలు అర్జునుడి బాణాల దెబ్బలకు - కౌరవులకు కీడును సూచించే ఉల్కాపాతాలవలె రాలిపడుతూ ఉన్నాయి.

**విశేషం :** అలం: ఉపమ. ఉల్కాపాతం అశుభ సూచనం. రత్నకేతనాలు పడటం రాజ్య పతనానికీ, శిరోభూషణాలు దొల్లటం రాజ పతనానికీ, చిరుగంటలు తెగిపడటం అశుభానికీ సూచనలు. వీటన్నింటిని ఉల్కాపాతాలుగా పోల్చటం వస్తు ధ్వని. (సంసా.)

**క. నరు భల్లంబుల నగ్రిమ। చరణంబులుఁ ద్రెస్సి మ్రొగ్గ జవనాశ్వంబుల్**
**కరుణమెయి రాహుతులకున్। శరణం బగు మనుచు మ్రొక్కు చందం బొందెన్. 51**

**ప్రతిపదార్థం:** నరు భల్లంబులన్= అర్జునుడి బల్లెములతో; అగ్రిమ చరణంబులున్= ముందుకాళ్ళు; త్రెస్సి= తెగి; మ్రొగ్గ= ముందుకు ఒరిగే; జవన+అశ్వంబుల్= మేలుజాతి గుర్రాలు; కరుణమెయిన్= దయతో; రాహుతులకున్= తమ రౌతులకు; శరణంబు+అగుము= రక్షకుడవు కమ్ము; అనుచున్= అంటూ; మ్రొక్కు చందంబు= (అర్జునుడికి) మ్రొక్కెడి రీతిని; పొందెన్= పొందాయి.

**తాత్పర్యం:** అర్జునుడి బల్లెముల తాకిడికి ముంగాళ్ళు తెగిపోగా జాతిగుర్రాలు ముందుకు మొగ్గాయి. అది ఎట్లా ఉన్నదంటే - 'ఓ అర్జునా! మా రౌతులకు దయతో శరణునిచ్చి కాపాడు' మని మ్రొక్కుతున్నవో అన్నట్లుగా ఉన్నది.

**విశేషం :** అలం: ఉత్ప్రేక్ష.

**క.** **దంతి ఘటాసంతానము। కుంతీసుతు నారసములఁ గూలినతఱి న**
**త్యంతనిబిడాభ్రముల దివి। యెంతయు సొంపారు భంగి నిల సెలువొందెన్.** **52**

**ప్రతిపదార్థం:** దంతి= ఏనుగుల; ఘటాసంతానము= గుంపుల సముదాయం; కుంతీసుతు= అర్జునుడి యొక్క; నారసములన్= బాణాలతో; కూలిన తఱిన్= నేలపై పడిపోయినప్పుడు; దివి= ఆకాశం; అత్యంత నిబిడ= మిక్కిలి దట్టమైన; అభ్రములన్= మేఘాలతో; ఎంతయున్= మిక్కిలి; సొంపారు భంగిన్= అందగించునట్లు; ఇల= భూమి; చెలువు+ఒందెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** ఏనుగుల గుంపుల సముదాయాలు అర్జునుడి వాడి బాణాలవలన నేలగూలినప్పుడు ఆ నేల దట్టమైన మబ్బులతో నిండి ఉన్న ఆకాశం వలె ఒప్పారింది.

**విశేషం :** అలం: ఉపమ. తిక్కన భయానక బీభత్స దృశ్యాలను రమణీయంగా ఆస్వాదయోగ్యం చేయటానికి సముచిత సుందరాలంకారాలను ఎన్నుకొంటాడు. అతడి ఆ కవితా శిల్పానికి ఈ అలంకారం ఒక ఉదాహరణం. (సంపా.)

**క.** **పలుపులుఁ గాండ్లుం బగ్గం। బులుఁ దన యస్త్రంబు లడరి పొడిచేసిన వి**
**చ్చలవిడిఁ బాఱెడు రథ్యం। బుల నేయఁడు దివిజరాజపుత్త్రుఁడు కృపతోన్.** **53**

**ప్రతిపదార్థం:** తన, అస్త్రంబులు= అర్జునుడి బాణాలు; పలుపులున్= తాళ్ళనూ; కాండ్లున్= కాడులను (కాడెలనూ); పగ్గంబులున్= గుర్రాల కళ్ళాలకు కట్టే తాళ్ళనూ; అడరి= విజృంభించి; పొడి+చేసినన్= నుగ్గుచేయగా; విచ్చలవిడిన్= ఇష్టంవచ్చినట్లు; పారెడు= పరుగెత్తే; రథ్యంబులన్= గుర్రాలను; దివిజరాజపుత్త్రుఁడు= అర్జునుడు; కృపతోన్= దయతో; ఏయఁడు= కొట్టడు.

**తాత్పర్యం:** అర్జునుడు తన బాణాలతో తాళ్ళు, కాడులు, పగ్గాలను నుగ్గుచేయగా రథాలను విడిచి పరుగెత్తే గుర్రాలను కొట్టకుండా దయతో విడిచిపెట్టివేశాడు.

**విశేషం :** వెన్నిచ్చి పరుగెత్తే వీరులనుగాని, జంతువులనుగాని యుద్ధంలో చంపకూడదు. ఆ విధిని అర్జునుడు పాటించి ఉదాత్తుడని పించుకొన్నాడు. (సంపా.)

**ఆ.** **అర్జునాస్త్ర ఖండితాతపత్ర ధ్వజ। చామరములు గాలిఁ జదలఁ దూలఁ**
**జిహ్నముల విభూతిఁ జెందంగఁ గడు నొప్పె। నప్పు డాడుచున్న యట్టు లచట.** **54**

**ప్రతిపదార్థం:** అర్జున= అర్జునుడి యొక్క; అస్త్ర= అస్త్రములచేత; ఖండిత= తెగగొట్టబడిన; ఆతపత్ర= గొడుగులు; ధ్వజ= జెండాలు; చామరములు= వింజామరములును; గాలిన్= గాలిచేత; చదలన్= ఆకాశంలో; తూలన్= కదలగా; చిహ్నముల= రాజ చిహ్నాల; విభూతిన్= సంపదను; చెందంగన్= పొందగా; ఆడుచున్న యట్టులన్= ఆడుతున్నట్లు; అప్పుడు; అచటన్= ఆ ప్రదేశంలో; కడున్= మిక్కిలి; ఒప్పెన్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** అర్జునుడి అస్త్రాలతో ఖండించబడ్డ గొడుగులు, జెండాలు, చామరాలు గాలిలో కదులుతూ రాజచిహ్నాల సంపద గాలిలో ఆడుతున్నట్లుగా చూచేవారికి కనిపిస్తూ ప్రకాశిస్తున్నాయి.

**క. ఒకమఱి కిరీటి కట్టెది। రికి నఱిముఱిఁ బోయి రేని రెండవమాఱి**
**య్యకొనుట కోర్వఁగ లేరై। రొకళ్ళుఁ గురురాజ సేన యోధులలోనన్. 55**

**ప్రతిపదార్థం:** కిరీటి= అర్జునుడి; కడు+ఎదిరికిన్= ఎదుటికి; ఒకమఱి= ఒకసారి; అఱిముఱిన్= తొందరపాటుతో; పోయిరి+ఏనిన్= వెళ్ళినప్పటికీ; రెండవమాఱు= రెండవసారి; ఇయ్యకొనుటకున్= ఒప్పుకొనటానికి; కురురాజుసేన= దుర్యోధనుని సేనలోని; యోధులలోనన్= వీరులలో; ఒకళ్ళున్= ఒక్కరైనా; ఓర్వఁగ లేరు+ఐరి= తట్టుకొనలేకపోతున్నారు.

**తాత్పర్యం:** కౌరవసేనలోని వీరులు ఎవ్వరైనా ఒక్కసారి అర్జునుడి మీదికి తొందరపడి యుద్ధానికి వెళ్ళారా, అంతే. ఇక రెండవసారి వెళ్ళటానికి ఎవ్వరూ సాహసించటం లేదు.

**విశేషం :** కురువీరులకు అర్జునుడు సింహస్వప్నమయ్యాడు. ఇందులో అర్జునుడి పరాక్రమం వస్తుధ్వని. (సంపా.)

**సీ. మండితధ్వజదండమండలంబులఁ గిట్టి। విటతాటనంబుగా విఱిచి విఱిచి,**
**చటులఖురోద్భటాశ్వ శ్రేణిఁ బొదివి ర। యంబునఁ దునిమి తూఁటాడి యాడి,**
**రాజిత బహువిధ రథ సమూహముఁ జొచ్చి। గలిబిలి యగునట్లు గలఁచి కలఁచి,**
**మదభర భీషణ మాతంగముల ముట్టి। చిందఱ వందఱ చేసి చేసి,**

**ఆ. పటు పదాతి చయముపై రౌద్రరస మహో। గ్రముగ నడరి నేలఁ జమరి చమరి**
**సవ్యసాచి బాణ సంఘంబు మత్తశుం। డాల ఘోరలీలఁ గేలి సలిపె. 56**

**ప్రతిపదార్థం:** సవ్యసాచి బాణ సంఘంబు= అర్జునుడి బాణ సమూహం; మత్తశుండాల= మదించిన ఏనుగు యొక్క; ఘోరలీలన్= భయంకరమైన విలాసంతో; మండిత= అలంకరించిన; ధ్వజ= జెండాలయొక్క; దండమండలంబులన్= కర్రల సమూహాలను; విటతాటనంబుగాన్= తారుమారయ్యేటట్లుగా; విఱిచి, విఱిచి= బాగా విరిచివేసి; చటుల= చంచలమైన; ఖుర= గిట్టలతో; ఉద్భట= గొప్పవైన; అశ్వశ్రేణిన్= గుర్రాల వరుసలను; పొదివి= పట్టి; రయంబునన్= వేగంగా; తునిమి= నరికి; తూఁటాడి+ఆడి= ముక్కలుముక్కలుగా చేసి; రాజిత= ప్రకాశించే; బహువిధ= అనేక రకాలైన; రథ సమూహమున్= రథాల సమూహాన్ని; చొచ్చి= ప్రవేశించి; గలిబిలి+అగునట్లు= గజిబిజిగా; కలఁచికలఁచి= చిందరవందర చేసి; మద= మదంతో; భర= నిండిన; భీషణ= భీకరమైన; మాతంగములన్= ఏనుగులను; ముట్టి= చుట్టుముట్టి; చిందఱవందఱ= అస్తవ్యస్తం; చేసి చేసి; పటు= సమర్థమైన; పదాతి= కాల్బలముయొక్క; చయముపైన్= సముదాయంపై; రౌద్రరస= రౌద్రరసంచేత; మహా+ఉగ్రముగన్= ఎక్కువ భయంకరంగా; అడరి= అతిశయించి; నేలన్= భూమిపై; చమరి చమరి= రాచి రాచి; బాణ సంఘంబు= బాణాల సమూహం; కేలి= ఆట (యుద్ధక్రీడ); సలిపెన్= చేసింది.

**తాత్పర్యం:** జెండా కర్రలను తారుమారుగా చేసి విరుగగొట్టి, గొప్పవైన గుర్రాలను ముక్కలు ముక్కలుగా చేసి, రథాలను చిందరవందరగా చేసి, మదంతో నిండిన ఏనుగులను చుట్టుముట్టి అస్తవ్యస్తం చేసి, మహోగ్రమైన పదాతి దళాన్ని నేల రాచి, మదించిన ఏనుగు భయంకరంగా విహరించినట్లు అర్జునుడి బాణసముదాయం విలాసంగా ఆట ఆడుకొన్నట్లుగా యుద్ధ క్రీడ చేసింది.

**విశేషం :** అలం: ఉపమ. అర్జునుడు కురువీరసేనల నడుమ మదించిన ఏనుగు ఏ విధంగా దారుణంగా విధ్వంసకరంగా భయంకరంగా విహరిస్తుందో అట్లా విహరించి యుద్ధక్రీడ చేశాడు. శుండాలం అంటే తొండంతో నీటిని గ్రహించేది అని అర్థం. మదించిన ఏనుగు తన తొండాన్ని ఉపయోగించి ఎట్లా ధ్వంసకాండను నిర్వహిస్తుందో అట్లా అర్జునుడు గాండీవ వినిర్ముక్త బాణ సంఘాన్ని ఉపయోగించి కురువీరుల చతురంగ బలాలను నుగ్గు చేశాడు. ఇది చక్కని సామ్యం. ఇందులో అయిదు రకాలైన క్రియలు చెప్పబడ్డాయి. విరవటం, తూటాడటం, కలచటం, చిందరవందర చేయటం, చమరటం. ఈ క్రియలు ఏనుగు చేసే ధ్వంసక్రీడలు. అర్జునుడు చేసిన యుద్ధక్రీడలు. మదించిన శుండాలం తొండంతో ధ్వజ దండాలను విరుస్తుంది. అట్లాగే అర్జునుడు కేతనాలను విరుగగొట్టాడు. శుండాలం గుర్రాలను చుట్టుముట్టి తొండంతో ఎట్లా దానిని కలచివేస్తుందో అట్లాగే అర్జునుడు రథసైన్యం మధ్యలో ప్రవేశించి వలయాకారంగా తిరిగి వాటిని కలచి వేశాడు. మత్త శుండాలం మదించిన మాతంగాలను చుట్టుముట్టి తొండంతో కొట్టి చిందరవందర చేసినట్లుగానే అర్జునుడు కూడా బాణాలతో కొట్టి మదేభాలను కలతపరిచాడు. మతంగ మహర్షివలన పుట్టింది మాతంగం. ఆ శబ్దం ఉత్తమ వంశజులైన వీరులను, మేలిజాతి ఏనుగులను స్ఫురింపచేయటం విశేషం. శుండాలం రుద్ర సంబంధమైన రసావేశంతో (అంటే రుద్రుడివలె సంహారం చేసే భావావేశంతో) మహా భయంకరమైన తొండంతో మనుషులను పట్టి నేలకు కొట్టి రాచి చంపినట్లు అర్జునుడు మహా కోపావేశంతో గాండీవ పాండిత్యం ప్రదర్శించి పదాతులను బాణాలతో కొట్టి నేలపై పడి చనిపోయేటట్లు రాచిరంపాన పెట్టాడు. మదించిన శుండాలం ఎంత ఘోరమైన పద్ధతిలో విలయం చేస్తుందో అట్లాగే అర్జునుడు రౌద్రరస మహోగ్ర ప్రవృత్తితో శత్రుసేనలను చెండాడుతూ యుద్ధకేళిని అవలీలగా, విలాసంగా చేశాడని భావం. సవ్యసాచి శుండాలం వంటివాడనీ, అతడి బాణసంఘం తొండంవంటిదనీ ఇక్కడ గ్రహించాలి. ఏనుగు తిరిగిన తోట ఎట్లా ధ్వంసమౌతుందో అక్కడి సైన్య వ్యూహం అట్లా ధ్వంసమైన ఒక దృశ్యాన్ని భావుక మనోవీథిలో తిక్కన దర్శనీయంగా ప్రదర్శించాడు. (సంపా.)

**ఉ. శిక్షిత చిత్రసంగర విశేషములం బ్రతిహేతి ఖండనా**
**దక్షత పెంపుసొంపునను దైవబలంబున నత్తఱిన్ సహ**
**స్రాక్షతనూజు సారథి రథాశ్వచయ ధ్వజముల్ పరాస్త్ర శ**
**స్త్రక్షతి లేక యొప్పెఁ గురుసైన్యము వెక్కస మంది బెగ్గిలన్.** 57

**ప్రతిపదార్థం:** శిక్షిత= నేర్వబడిన; చిత్ర= రకరకాలైన; సంగర= యుద్ధంలోని; విశేషములన్= విశేషక్రియలచేత; ప్రతిహేతి= శత్రువుల ఖడ్గాలయొక్క; ఖండనా= ఖండించటంలోని; దక్షత= సామర్థ్యంయొక్క; పెంపు సొంపునను= అభివృద్ధి వైభవంచేతను; దైవబలంబునన్= దైవబలంచేతను; ఆ+తఱిన్= అప్పుడు; సహస్ర+అక్షతనూజు= ఇంద్రుడి కొడుకైన అర్జునుడి యొక్క; సారథి= సారథియు; రథ= రథమున్నూ; అశ్వచయ= అశ్వముల సముదాయమున్నూ; ధ్వజముల్= జెండాలున్నూ; పర= శత్రువులయొక్క; అస్త్ర= మంత్రసహితమైన బాణాలయొక్క; శస్త్ర= బాణాలయొక్క; క్షతి= దెబ్బ; లేక= లేకుండా; కురుసైన్యము= కౌరవసేన; వెక్కసము+అంది= సహించలేక; బెగ్గిలన్= భయపడగా; ఒప్పెన్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** అర్జునుడు క్రమబద్ధంగా నేర్చిన విచిత్ర యుద్ధ శిక్షణ విశేషాలతో, శత్రువుల బాణాలను ఖండించే నేర్పుతో యుద్ధం చేస్తున్నాడు. ముఖ్యంగా దైవబలం ఉన్నందువలన శత్రువులు ప్రయోగించే అస్త్రాలవలన, శస్త్రాలవలన అతడి సారథికి, రథానికి, గుర్రానికి, జెండాలకు ఏరకమైన దెబ్బ తగలకుండా ఉండటం చూచి కౌరవసేనలోని వారు సహించలేక అసూయపడ్డారు, బాధపడ్డారు.

**విశేషం :** అలం: కావ్యలింగం. ఈ పద్యం వెనుకటి (56వ) పద్యానికి ప్రతిరూప (Contrast) శిల్పం. అందులో శత్రువీరుల విరిగిన రథాల వర్ణనం. ఇందులో చెక్కుచెదరని అర్జునుడి రథ వర్ణనం - భావుకుల మనస్సులలో వస్తుధ్వని నాశ్రయించి ఏకైక వీరుడైన అర్జునుడి పరాక్రమం ధ్వన్యమానం కావటం విశేషం. శత్రువులు చుట్టూ మూగి అస్త్రాలనూ, శస్త్రాలనూ ప్రయోగించి అర్జునుడిని విరథుడిని చేయటానికి వేయి విధాల యత్నించారట! కాని, అతడి రథం క్షేమంగా ఉండి, వారి రథాలే కూలిపోయాయి. వారు దానికి సహించలేకపోయారు. అసూయపడ్డారు. బాధకూడా పడ్డారు. శత్రువుల కా అవస్థలను కల్పించటమే విజయుడి వీరలక్షణం. అర్జునుడు తన రథాశ్వ ధ్వజసారథులను రక్షించుకొనటానికి కవి రెండు హేతువులను చెప్పాడు. 1. దక్షత 2. దైవబలం. దక్షత శిక్షణవలన పెంపొందుతుంది. శత్రువులు ప్రయోగించే ఆయుధాలను నేర్పుతో ధ్వంసం చేసినప్పుడు సొంపు మీరుతుంది. అర్జునుడి దక్షత సొంపుపెంపులను ప్రదర్శించింది. అది పురుష యత్నంయొక్క సామర్థ్యాన్ని తెలిపింది. పురుషయత్నం దైవానుకూల్యం వలన కాని సిద్ధించదు. అర్జునుడి రథం దేవ నిర్మితం, దైవరక్షితం. కపిధ్వజం మహిమాన్వితం. అందువలన మానవులకు దుర్భేద్యం. ఇవి అర్జునుడి రథం భగ్నం కాకుండా ఉండటానికి అమరిన హేతువులు. **"సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనం"** అనే లక్షణం ప్రకారం విజయుని రథక్షేమాన్ని సమర్థిస్తున్న ఈ పద్యంలో కావ్యలింగాలంకారం శోభిస్తున్నది. (సంపా.)

**క. తేజోధనుఁ డగు నరుఁడు। ద్భ్రాజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దళం**
**బై జలనిధిఁ ద్రెక్కొనియెడు। నోజం గురుబలము పేర్మి యుడిపెం దోడ్తోన్. 58**

**ప్రతిపదార్థం:** తేజస్(ః)+ధనుఁడు+అగు= తేజస్సే ధనంగా కలవాడైన; నరుఁడు= అర్జునుడు; ఉద్భ్రాజిత= ప్రకాశించే; గతిన్= రీతిగా; నడుమన్= కౌరవసేన మధ్య; మెరసి= ప్రకాశించి; బడబా+అగ్ని= సముద్రంలో ఆడుగుర్రం ముఖాకారంలో ఆరకుండా మండే అగ్ని; దళంబు+ఐ= మిక్కుటమై; జలనిధిన్= సముద్రాన్ని; త్రెక్కొనియెడు+ఓజన్= త్రాగేవిధంగా; తోడ్తోన్= వెన్వెంటనే; కురుబలము= కౌరవసైన్యముయొక్క; పేర్మి= అతిశయాన్ని; ఉడిపెన్= పోగొట్టాడు.

**తాత్పర్యం:** తేజస్వి అయిన అర్జునుడు కౌరవసేన మధ్య ప్రకాశిస్తూ ఉంటూ, సముద్రంలో ఉండే బడబాగ్ని సముద్రజలాన్ని త్రాగేసినట్లుగా కౌరవసేన పెంపును తగ్గిస్తూ, వారి ఉత్సాహాన్ని, అతిశయాన్ని మాన్పేశాడు.

**విశేషం :** అలం: ఉపమ. శత్రుసేనల మధ్య చేరి అర్జునుడు వాటి బలుపును క్రమంగా తగ్గిస్తున్నాడు. ఈ అంశాన్ని తిక్కన అలంకార సుందరంగా చెప్పాడు. సముద్ర జలం పొంగి ప్రళయం రాకుండా దాని గర్భంలో ఆడు గుర్రపు ముఖాకృతిలో బడబాగ్ని నిరంతరం ప్రజ్వలిస్తూ సముద్రజలాలను త్రాగుతూ ఉంటుందని పురాణగాథ. అర్జునుడు కౌరవసేన అనే సముద్రం పెచ్చు పెరగకుండా చతుర్విధ సైన్యాలను మట్టుపెట్టుతున్నాడని ఉపమాన స్వారస్యం. బడబాగ్నివలె అర్జునుడు తేజస్వి కావటం (తేజోధనుడు), పైకి బాగా ప్రకాశంగా వెలుగుతూ కనబడటం (ఉద్భ్రాజిత గతి), నడుమ ఉండటం - అనే సామ్యగుణాలు కలిగిఉన్నాడు. లోకంలో అగ్ని చతుష్టయం ప్రసిద్ధం. అవి బడబాగ్ని, జఠరాగ్ని, గృహాగ్ని, వైద్యుతాగ్ని లేదా దావాగ్ని. (సంపా.)

**తే. కాలపక్వంబులైన లోకముల జముఁడు। బారిసమరెడు చాడ్పున మారిమసఁగి**
**యుగ్రరూపుఁడై శౌర్యసమగ్ర బాహు। సంపదుద్దాముఁడగు క్రీడి చంపె రిపుల. 59**

**ప్రతిపదార్థం:** కాల= కాలంచేత; పక్వంబులు+ఐన= మరణానికి సిద్ధమైన; లోకములన్= జనులను; జముఁడు= యముడు; బారిసమరెడు చాడ్పునన్= చంపేటట్లుగా; శౌర్య= బలముతో; సమగ్ర= పూర్ణమైన; బాహు సంపద్= భుజబల సంపదతో; ఉద్దాముఁడు= అతిశయించినవాడైన; క్రీడి= అర్జునుడు; మారిమసఁగి= మిక్కిలి చెలరేగి; ఉగ్రరూపుఁడు+ఐ= భయంకరమైన రూపం కలవాడై; రిపులన్= శత్రువులను; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** చనిపోయే కాలం దాపురించిన (కాలం పండిన, కాలం తీరిన) జనులను యముడు నిర్దయగా చంపునట్లుగా, పరాక్రమంతో నిండిన బాహుసంపదతో అతిశయించిన అర్జునుడు బాగా చెలరేగి భయంకరుడై శత్రురాజులను చంపాడు.

**విశేషం :** అలం: ఉపమ. అర్జునుడిని యముడితోనూ, సైనికులను కాలం తీరిన జీవులతోనూ పోల్చటం అర్థవంతంగా ఉన్నది. జీవులను యముడు ఎక్కడ ఉండి ఎప్పుడు ఎట్లా చంపుతాడో తెలియనట్లుగానే, అర్జునుడి చేతిలో సైనికులు ఎప్పుడు ఎట్లా చనిపోతున్నారో తెలిసికొనటం దుర్లభంగా ఉన్నదని అలంకార ధ్వని. అర్జునుడి శరవేగ పాండిత్యం గమ్యమానం. (సంపా.)

**వ.** **అట్టియెడ మున్ను తురంగమఖురాదులం దూలిన కెంధూళియుం, బైపయి నెగయఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు నుచ్చి చను వివ్వచ్చు నిశితశర పరంపరలు సైనిక శరీరంబులపై సుడిసి తడిసి రుధిర శీకర నికర వికీర్ణ రవికిరణ పరిణతం బగు సమీరణంబును, ధారాళ కరాళ రక్తపరిషిక్త విశ్వంభరా భాగంబునుం గలయం గెంపు సంపాదించి యకాలసంధ్య నావహించినం దదుచిత వ్యాపార పారంగతంబులై పొడసూపిన యుడుగణంబులుంబోలెఁ బొలుచు ధనంజయసాయక దళిత కుంజర కుంభ వికీర్ణ మౌక్తిక విసరంబుల వలనను, సముదీర్ణ మద వేగ దుర్నివార వారణ విదారణంబు లగు నర్జునాస్త్ర పాతంబుల బెదరి తేం ట్లెగయుట పొగలెగయుటయుం, బ్రతిభట బాణఘట్టనంబునం బాండవమధ్యము కాండ ప్రకాండంబుల నిబిడ జ్వాలలు నిగుడుట మంటయునుగా, మూర్తం బగు తదీయ క్రోధ దవానలంబు చటచ్ఛటాశబ్దంబుల చాడ్పునం జెలంగుచున్న యుధిష్ఠిరానుజు నతినిష్ఠుర భల్లభజ్యమాన బలవదరాతి ఖురాస్థి నిస్వనంబుల వలనను, దొట్టి తొట్టి యెడనెడ మడువులు గట్టు శోణితంబు నీళ్ళునందుఁబడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును, వింజామరలు మరాళ పుంజంబునునై కొలంకుల చందంబు నొంద వాని కెఱఁగెడు కొదమతుమ్మెదల పదువుల పగిదిఁ దొరఁగు నాఖండలతనయ ఖండిత పరవీరకాలాయస నారాచ శకలంబులవలనను, గిరీటి శర పాటవ పరిస్ఫోటిత రిపు కపాల గళిత మస్తిష్క పలల పంకంబునను, నలుదెసల నంతంతఁ గదియం జాఁగి పడియున్న కృత్తకరచరణంబులను, వెదపదనికి రొంపిఁ గలంచి వరుజులు పదిలంబుగా నమర్చిన కేదారంబు తెఱంగు దోఁచుటకు నీడై చతురహలికుండు సల్లు పరువంపు మొలకల చెలువునఁ బెల్లు డుల్లు ఫల్గునాశుగ సంతాడన వికీర్ణ శత్రుశేఖర వజ్రవ్రజంబుల వలనను, సంగ్రామం బభిరామం బయ్యును ఘోరప్రకారం బయ్యెఁ; నమ్మహాభయంకర సంకుల సమరంబున.** **60**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= అప్పుడు; మున్ను= ముందుగా; తురంగమ= గుర్రాల; ఖురాదులన్= డెక్కలు మున్నగు వాటిచేత; తూలిన= ఎగిరిన; కెంపు+ధూళియున్= ఎర్రని పరాగం; పైపయిన్= పైపైకి; ఎగయన్= ఎగురగా; పరబలంబు= శత్రువులయొక్క సేన; నెత్తుటన్= నెత్తురులో; జొత్తిల్లుచున్= తడిసి ఎర్రపడుతూ; ఉచ్చి= శరీరములో దూరి; చను= వెళ్లెడి; వివ్వచ్చు= అర్జునుడియొక్క;

నిశిత= వాడియైన; శర= బాణాలయొక్క; పరంపరలును= వరుసలున్నూ; సైనిక= భటులయొక్క; శరీరంబులపైన్= శరీరాలమీద; సుడిసి= చుట్టుకొని; తడిసి; రుధిర= రక్త; శీకర= బిందువులయొక్క; నికర= సముదాయంతోనూ; రవికిరణ= సూర్యకిరణాలతోనూ; పరిణతంబు+అగు= పక్వమైన; సమీరణంబును= గాలియున్నూ; ధారాళ= హెచ్చైన; కరాళ= భీకరమైన; రక్త= రక్తంతో; పరిషిక్త= తడుపబడిన; విశ్వంభరా భాగంబునున్= భూమిభాగమున్నూ; కలయన్= అంతటను; కెంపు= ఎఱ్ఱనిరంగు; సంపాదించి= కలిగి; అకాల= కానికాలాన; సంధ్యన్= సంధ్యా సమయాన్ని; ఆవహించినన్= కల్గజేయగా; తద్+ఉచిత= దానికి తగిన; వ్యాపార= పనిలో; పారంగతంబులు+ఐ= ఎగిరినవై; పొడచూపిన= కన్పట్టిన; ఉడుగణంబులున్+పోలెన్= నక్షత్ర సముదాయాల వలె; పొలుచు= ప్రకాశించెడి; ధనంజయ= అర్జునుడియొక్క; సాయక= బాణాలచేత; దళిత= చీల్చబడిన; కుంజరకుంభ= ఏనుగుల కుంభస్థలాల నుండి; వికీర్ణ= వెదచల్లబడిన; మౌక్తిక= ముత్యాలయొక్క; విసరంబువలనను= సముదాయము వల్లను; సముదీర్ణ= అతిశయించు; మదవేగ= మదముయొక్క వేగంచేత; దుర్నివార= నివారించరాని; వారణ= ఏనుగులను; విదారణంబులగు= బ్రద్దలుచేసే; అర్జున+అస్త్ర= అర్జునుడి అస్త్రాలయొక్క; పాతంబులన్= పడటానికి; బెదరి= భయపడి; తేంట్లు= తుమ్మెదలు; ఎగయుట= ఎగురుట; పొగలు; ఎగయుటయున్= ఎగురుటయున్నూ; ప్రతిభట= శత్రు భటులయొక్క; బాణ ఘట్టనంబునన్= బాణాలు ఒరసికొనటంచేత; పాండవమధ్యము= అర్జునుడియొక్క; కాండ= బాణాల; ప్రకాండంబుల= సముదాయాల; నిబిడజ్వాలలు= దట్టమైన మంటలు; నిగుడుట= ఎగయుట; మంటయును+కాన్= జ్వాలగాను; మూర్తంబు+అగు= మూర్తీభవించిన; తదీయ= అర్జునుడి సంబంధమైన; క్రోధ= కోపమనెడి; దవానలంబు= దావాగ్ని యొక్క; చటచ్చటా శబ్దంబుల చాడ్పునన్= చిటచిటమనే చప్పుడుల వలె; చెలంగుచున్+ఉన్న= వ్యాపిస్తున్న; యుధిష్ఠిర+అనుజు= ధర్మజుడి తమ్ముడైన అర్జునుడి యొక్క; అతి నిష్ఠుర= మిక్కిలి కఠినమైన; భల్ల= బల్లెములచేత; భజ్యమాన= పగులగొట్టబడుతున్న; బలవత్= బలవంతులైన; అరాతి= శత్రువులయొక్క; ఖర+అస్థి= గట్టివైన ఎముకల; నిస్వనంబుల వలనను= ధ్వనుల వలనను; తొట్టి తొట్టి= ప్రవహించి; ఎడన్+ఎడన్= అక్కడక్కడ; మడువులుకట్టు= చెరువులుగా తయారైన; శోణితంబు= రక్తము; నీళ్ళన్= నీళ్ళను; అందున్+పడి, తేలాడు= అందుపడి తేలియాడుతున్న; వెలిగొడుగులు= తెల్లని గొడుగులు; పుండరీకంబులును= తెల్లతామర పువ్వులును; వింజామరలు= చామరాలు; మరాళ పుంజంబున్= హంసల గుంపులును; అయి= మారి; కొలఁకుల చందంబునన్= సరస్సుల పోలికను; ఒందన్= పొందగా; వానికిన్= వాటిలోనికి; ఎఱఁగెడు= దిగునట్టి; కొదమ తుమ్మెదల= పడుచు తుమ్మెదలయొక్క; పదువులపగిదిన్= సముదాయాలవలె; తొరఁగు= పడునట్టి; ఆఖండల తనయ= ఇంద్ర సుతుడైన అర్జునుడిచేత; ఖండిత= తెగగొట్టబడిన; పరవీర= శత్రువీరులయొక్క; కాల+అయస= నల్లని ఇనుపవైన; నారాచశకలంబుల వలనను= బాణాల ముక్కల వలన; కిరీటి= అర్జునుడియొక్క; శర= బాణాల; పాటవ= బలంచేత; పరిస్ఫోటిత= పగులగొట్టబడిన; రిపు= శత్రువుల; కపాల= తలపుర్రెలనుండి; గళిత= జారిన; మస్తిష్క= మెదడు; పలల= మాంసమనెడు; పంకంబునను= బురదవలనను; నలుదెసలన్= నాలుగు మూలలందును; అంతంతన్= మరింత; కదియన్= సమీపించగా; చాఁగిపడి+ఉన్న= సాగిలపడిఉన్న; కృత్త= నరుకబడిన; కరచరణంబులను= చేతులు, కాళ్ళచేతను; వెదపదనికిన్= ఎదకు పదనైన సమయానికి; రొంపి= బురద; కలంచి= కలియగొట్టి; వరుజులు= మడికి ఆయా చోట్ల ఏర్పరచిన చిన్న కట్టలు; పదిలంబుగాన్= జాగ్రత్తగా; అమర్చిన= కట్టియున్న; కేదారంబు తెరంగు= మాగాణి భూమిరీతి; తోఁచుటకున్= తోచుటకు; ఈడై= తగియుండి; చతురహాలికుండు= నేర్పుకల రైతు; చల్లు= చల్లునట్టి; పరువంపు మొలకల చెలువునన్= మంచిగా పైకి వచ్చే అంకురాల రీతి; పెల్లుడుల్లు= ఎక్కువగా రాలెడి; ఫల్గున+ఆశుగ= అర్జునుడి బాణాలయొక్క; సంతాడన= దెబ్బలచేత; వికీర్ణ= విరజిమ్మబడిన; శత్రు= శత్రువులయొక్క; శేఖర= కిరీటములందలి; వజ్రవ్రజంబులవలనను= వజ్రాల సముదాయాల వలనను; సంగ్రామంబు= యుద్ధం; అభిరామంబు+అయ్యున్= అందంగా ఉన్నను; ఘోరప్రకారంబు= భయంకరమైనది; అయ్యెన్= ఐనది; ఆ+మహాభయంకర= మిక్కిలి భయముగొల్పునట్టి; సంకుల= రద్దీగా ఉన్న; సమరంబునన్= యుద్ధంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో మొదట గుర్రాల డెక్కలవలన పైకెగిరిన ధూళి ఎఱ్ఱగా ఉన్నది. అది తిరిగి నెత్తురులో కలిసిపోతుంది. అర్జునుడు వేసిన వాడి బాణాలు ఎదుటివాళ్ళను చీల్చుకొని వెళ్ళిపోతున్నాయి. వాళ్ళమీద తిరిగి రక్తబిందువులతో కలిసిన గాలి, రక్తంతో తడిసిన భూమి భాగమంతా కాలంకాని కాలంలో వచ్చిన సంధ్యవలె ఉండగా,

దానికి తగినట్లుగా నక్షత్రాలు వచ్చాయా అన్నట్లు అర్జునుడి బాణాలవలన పగిలిన ఏనుగుల కుంభస్థలాల నుండి జారిపడిన ముత్యాలు ప్రకాశిస్తున్నాయి. అదివరలో ఏనుగుల మీద వాలి ఉన్న తుమ్మెదలు బాణ ధ్వనికి పైకెగిరిపోగా అది పొగవలె, అర్జునుడి బాణాలు శత్రువుల బాణాలను రాచినప్పుడు పుట్టే మంటలు మంటలవలె కన్పడి, అర్జునుడి కోపం మూర్తీభవించి వచ్చినదా అన్నట్లు అనిపిస్తున్నవి. ఆ క్రోధాగ్ని చిటపటలవలె శత్రువుల బలమైన ఎముకలను చీల్చేటప్పుడు వచ్చిన చప్పుడా అనిపిస్తున్నది. అది అట్లా ఉండగా - రక్తం అక్కడక్కడ మడుగులు కట్టింది. దానిలో పడి తేలియాడే వెల్లగొడుగులు తెల్ల తామరపువ్వులవలెనూ, వింజామరలు హంసలవలెనూ ఉన్నందున ఆ మడుగులు సరస్సులవలె ఉన్నాయి. ఆ సరస్సుల్లోని ఆ పద్మాలమీదికి దూకే తుమ్మెదలవలె ఉన్నాయి నరికిన నల్లని బాణాల ముక్కలు. అర్జునుడి బాణాలతో తెగిన పుర్రెలలో నుండి మెదడు మాంసం జారిపడి అంతా బురద బురద కాగా, దాని కంతకూ మడిచుట్టూ గట్లువేసి మంచి రైతు విత్తగా మొలిచిన మొలకల వలె శత్రువుల కిరీటాలనుండి రాలిన వజ్రాలు కనిపిస్తున్నాయి. ఇదంతా చూడటానికి ముచ్చటగానే ఉన్నా అతి భయంకరంగా, ఎవరెవరిని ఏం చేస్తున్నారో తెలియనంత సమ్మర్దంగా సమరం సాగుతున్నది.

**విశేషం :** 1. అలం: ఉత్ప్రేక్ష, ఉపమ, వృత్త్యనుప్రాసం. భయానక బీభత్స దృశ్యాలను అలంకారంతో రమణీయం చేసి పఠితలకు ఆస్వాదయోగ్యం చేసే రసవిద్య తిక్కన సొంతం. దానిని శబ్దార్థాలంకారాల సాయంతో ఇక్కడ సాధించాడు.

2. ఈ ఘట్టంలో రణరంగంలో కనబడుతున్న నాలుగంశాలను తిక్కన వర్ణించాడు. మొదటిది - రక్తసిక్తమైన రణభూమి. అది సమయం గాని సమయంలో ఏర్పడిన సాయంసంధ్యాకాలంలోని ఆకాశమా అన్నట్లు రాణించింది. (ఉత్ప్రేక్ష). గుర్రాల గిట్టలతో రేగిన ఎర్రని దుమ్ము సంధ్యారుణ కాంతిగా, శత్రువుల శరీరాలనుండి పైకి చిమ్ముకొని వస్తున్న రక్తధారలలో తడుస్తూ కిరీటి బాణాలు సైనికులను చంపి వాటిమీద పడుతూ ఉంటే, రక్తపు బొట్ల కాంతులతో మెరుస్తున్న దృశ్యం సంధ్యాకాల సూర్యకిరణ కాంతిని తలపిస్తున్నది. బాణవేగం గాలిగా రాణిస్తున్నది. రక్తంతో బాగా తడిసిన నేలంతా సంధ్యాకాలంలో నల్లబారిన ఎర్రని రంగుతో నిండిన ఆకాశభాగం వలె ఉన్నది. అది పట్టపగలే అయినా రణభూమి సంధ్యాకాలమో అన్నట్లు రాణించింది. దానికితోడు ఏనుగుల కుంభస్థలాలు పగిలి వెలువడిన ముత్యాలు ఆ సంధ్యాకాలంలో నక్షత్రాలు మొలిచాయా అన్నట్లున్నాయట! బీభత్సంలో రమణీయ దర్శనం.

**రెండవది:** అర్జునుడు ఏనుగులను బాణాలతో ఖండిస్తున్నాడు. మదగజాల శరీరాలనుండి కారే మదజలాన్ని త్రాగుతూ ఉన్న తుమ్మెదలు బాణాల దెబ్బలకు పైకి ఎగిరాయి. అవన్నీ పొగవలె తోచాయి. అర్జునుడి బాణాలు వైరివీరుల బాణాలతో రాపిడి పొందటం వలన మంటలు రేగాయి. ఆ దృశ్యం అగ్నికీలలుగా తోచింది. బాణాల దెబ్బలకు శత్రువుల ఎముకలు పెటపెటా విరుగుతుంటే అవి కార్చిచ్చు వ్యాపించేటప్పుడు కలిగే చిటపట ధ్వనులవలె ఉన్నాయి. మొత్తంమీద రణరంగమనే అరణ్యంలో కార్చిచ్చు రేగిన దృశ్యం ఊహించటానికి అనువుగా ఉన్నది. భయానకంలో రమణీయ దర్శనం.

**మూడవది:** ఆ రణరంగం ఒక సరోవరమో అన్నట్లు కూడా ఉన్నదట. నెత్తురు మడుగులు నీళ్ళుగా, వాటిమీద తేలియాడే తెల్లని గొడుగులు తెల్లతామర పూలుగా, వింజామరలు హంసలుగా, బాణాల నల్లని ఇనుపముక్కలు సరోవరంలోని పద్మాలపై వాలుతూవున్న తుమ్మెదలలాగా తోచాయట! బీభత్సంలో రమణీయ దర్శనం.

**నాల్గవది:** రణభూమి రైతు వరినాట్లు వేసిన మాగాణిచేనుగా ఊహారమ్యంగా ఉన్నదట. అర్జునుడి బాణాలతో వీరుల పుర్రెలు పగిలి మెదడు మాంసం నేలమీద పడ్డదట! అది నీటికి తడిసి పదునైన మెత్తని మన్నువలె ఉన్నదట. తెగిపడిన సైనికుల కరచరణాదులు ఆ తడిచేలకు వేసిన కట్టలవలె ఉన్నాయట. శత్రు కిరీటాల నుండి రాలిన మణులు వరినాట్లా అన్నట్లు రాణించాయట. ఉత్ప్రేక్షాలంకారమే ఊహారమణీయత్వానికి ఉత్తమ ఉపకరణమని తిక్కన భావించాడు. బీభత్సంలో రమణీయ దర్శనం. (సంపా.)

**చ. ఉఱక విరోధిసైన్యముల నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం**
**బఱప రథద్విపాశ్వములు పాండవమధ్యము తేరి వీథియం**
**దఱవఱలై పడం గని భయంపడి యిద్దెస వచ్చెనేని న**
**త్తెఱఁ గయి పోమె యంచు నెడతెంపిగఁ గొందఱు పాయ వాఱఁగన్. 61**

**ప్రతిపదార్థం:** ఉఱక= లెక్కచేయక; విరోధి= శత్రువులయొక్క; సైన్యములన్= సేనలను; ఉక్కు= చేవ; మడంగఁగన్= చెడునట్లుగా; ఉల్లసత్+గతిన్= తేజస్వంతమైన గమనంతో; పఱపన్= తోలగా; రథ= రథాలు; ద్విప= ఏనుగులు; అశ్వములు= గుఱ్ఱాలున్నూ; పాండవమధ్యము= అర్జునుడిని; తేరి వీథియందున్= రథ మార్గమందు; అఱవఱలు+ఐ= చిందరవందరై; పడన్= పడుటను; కని= చూచి; భయంపడి= భయపడి; ఈ దెసన్= ఈ వైపునకు; వచ్చెన్+ఏనిన్= వచ్చినచో; ఆ+తెఱఁగు= అదేరీతి (చచ్చుట); అయిపోమె= కామా?; అంచున్= అనుకొని; ఎడతెంపిగన్= దూరంగా; కొందఱు= కొంతమంది; పాయ+పాఱఁగన్= యుద్ధరంగాన్ని వదలి పరుగున పోగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా అర్జునుడు విరోధి సైన్యాలను చిందర వందర చేస్తూ ఉండగా అతడి రథాన్ని అడ్డగించటానికి వెళ్ళిన వీరులు, ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు పడిపోవటాన్ని చూచిన కొందరు 'అటు వెళ్ళితిమా మనగతీ అంతే' అనుకొని యుద్ధం చేయటం మాని దూరంగా పారిపోగా, (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వాలమ్ములు దాఁక ధరన్। వ్రాలు భటులఁ జూచి యెదలు వడఁకఁగ మేనుల్**
**దూలఁగఁ దముఁ దాఁకకయును। నాలము సాలించి కొంద ఱవలఁ జనంగన్. 62**

**ప్రతిపదార్థం:** వాలు+అమ్ములు= వాడియైన బాణాలు; తాఁకన్= తగిలి; ధరన్= భూమియందు; వ్రాలు= పడిపోయే; భటులన్= బంటులను; చూచి= కనుగొని; ఎదలు= హృదయాలు; వడఁకఁగన్= వణకగా; మేనుల్= శరీరాలు; తూలఁగన్= తూలిపడగా; తమున్= తమ్ము; తాఁకకయునున్= ఎదిరించకయే; కొందఱు= కొంతమంది భటులు; ఆలము= యుద్ధం; చాలించి= మాని; ఆవలన్= మరొక వైపు; చనంగన్= పోగా.

**తాత్పర్యం:** వాడిబాణాలు తగిలి భటులు నేలమీద పడిపోవటం చూచి, గుండె దడదడలాడి శరీరాలు తూలిపడగా కొందరు భటులు అసలు ఎదురుపడటమే మాని దూరంగా పోగా, (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'ప్రొద్దు గ్రుంకిన మఱి కాని పోవఁ డొక్కొ। క్రీడి' యని కొంద ఱాజికి నీడఁబోవ**
**'బలమునెల్లను దెగటాఱఁ బఱపికాని। తక్కఁ డెట్టులు' ననుచుఁ గొందఱు చలింప. 63**

**ప్రతిపదార్థం:** కొందఱు; క్రీడి= అర్జునుడు; ప్రొద్దు= సూర్యుడు; గ్రుంకిన మఱికాని= అస్తమించిన తర్వాత కాని; పోవఁడు+ఒక్కొ= పోవడేమో; అని= అనుకొని; ఆజికిన్= యుద్ధానికి; ఈడన్+పోవన్= వెనుదీయగా; కొందఱు; బలమున్= సేనను; ఎల్లన్= అంతటిని; తెగటాఱన్= చనిపోవునట్లుగా; పఱపికాని= చేసికాని; ఎట్టులున్= ఎట్లైనను; తక్కఁడు= మానడు; అనుచున్= అనుకొంటూ; చలింపన్= హడలిపోగా.

**తాత్పర్యం:** కొందరేమో 'ఈ అర్జునుడు ప్రొద్దు క్రుంకితే కాని విడిచిపోడేమోరా' అనుకొంటున్నారు. మరికొందరు 'సేనలన్నింటిని చంపికాని వదల' డనుకొంటూ హడలిపోగా, (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తరతరమ ప్రజలఁ దునిమెడు । నరు నప్పటి యెత్తికోలునకు సురవిద్యా**
**ధర ఖేచరులును భీతిం । బొరసిరి తమదెసకు నేమి పుట్టునొ యనుచున్. 64**

**ప్రతిపదార్థం:** తరతరము+అ= స్థాయీలవారీగా; ప్రజలన్= సేనలను; తునిమెడు= చంపునట్టి; నరు= అర్జునునియొక్క; అప్పటి= ఆ సమయంలోని; ఎత్తి కోలునకున్= ప్రయత్నానికి; సుర= దేవతలు; విద్యాధర= విద్యాధరులు; ఖేచరులును= ఆకసంలో సంచరించే మరికొందరు దివ్యులు; తమదెసకున్= తమవైపునకు; ఏమి+పుట్టునొ= ఏ బాధ కల్గునో; అనుచున్= అని అనుకొంటూ; భీతిన్= భయంతో; పొరసిరి= ప్రవర్తించారు.

**తాత్పర్యం:** అర్జును డా రీతిగా వివిధ స్థాయిలలోని సైన్యాన్ని తునాతునకలుగా నరికివేస్తుంటే చూడటానికి వచ్చిన విద్యాధరాది దేవతలెల్లరు తమకు కూడా ఏమైనా ముప్పు వస్తుందేమో అని భయపడిపోయారు.

**విశేషం :** ఉత్తర గో గ్రహణంలో ఇంతవరకు అర్జునుడు చతుర్విధ సేనాబలాన్ని నురుమాడటమే గమనించాం. ఇంతవరకు భీష్మాదికురువీరులు కదలిరాలేదు. చతుర్విధ బలాలు చాలవరకు అర్జునుడితో చేసిన యుద్ధంలో చనిపోయాయి. ప్రతిఘటనం చెప్పుకో తగినంత లేని దొమ్మి యుద్ధం ఇంతవరకు సాగింది. దానిని సమయానుగుణంగా పార్థుడు ఎదుర్కొని విజయం సాధించాడు. గోవులను మరల్చాడు. (సంపా.)

**క. తమ తమ యొద్ది బలంబులు । క్రమ విరళములైన దొరలు గాండివిపై ను**
**గ్రముగఁ దఱుముటయు నాతఁడు । సమరోల్లాసమున దివ్యశరతత్పరుఁడై. 65**

**ప్రతిపదార్థం:** తమ తమ+ఒద్దిబలంబులు= తమవద్దనున్న సేనలు; క్రమ విరళములు+ఐనన్= క్రమంగా తగ్గగా; దొరలు= వీరులైన రాజులు; గాండివిపైన్= అర్జునుడి మీదికి; ఉగ్రముగన్= భయంకరంగా; తఱుముటయున్= తరుమగా; అతఁడు= ఆ అర్జునుడు; సమర+ఉల్లాసమునన్= యుద్ధం మీది వేడ్కతో; దివ్య= దివ్యమైన; శర= బాణ ప్రయోగంలో; తత్పరుఁడు+ఐ= ఆసక్తి కలవాడై.

**తాత్పర్యం:** వీరులు తమవద్ద నున్న సేనలు క్రమక్రమంగా తరిగిపోవటం చూచి, అర్జునుడి మీదికి భీకరంగా తమ సైన్యాలను ముందుకు తోస్తూ రాసాగారు. అప్పుడు అర్జునుడు కూడా యుద్ధంమీది వేడుకతో దివ్యశరాలను ఏయదలచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం :** పలచబారిన సేనలతో మేటివీరులు రంగంలోకి దిగుతున్న దృశ్యం ఇక్కడ మొదలౌతున్నది. ఇకపై భీష్మాదులతో యుద్ధం చేయవలసివస్తుంది. అందుకే శస్త్రాలు చాలవు. అస్త్రాలను ప్రయోగించే ఆసక్తిని ప్రదర్శించాడు అర్జునుడు. (సంపా.)

**సీ. ఆచార్యు డెబ్బది యమ్ముల, నాచార్య । పుత్త్రు నేడింటఁ, గృపునిఁ బదింట,**
**దుష్షహుఁ బండ్రెంట, దుశ్శాసనునిఁ బది । యేనింట, సౌబలు నెనిమిదింట,**
**నమరనదీసూను నఱువదింటను నేసి, । రవిసుతు రథ్యసారథుల నొంచి,**
**వర్మమంతయుఁ ద్రుంచివైచి మర్మాస్థి బం । ధములు భేదించి విక్రమము నెఱపి.**

**ఆ. యిట్లు దొరలు నొవ్వ నేడ్తెఱఁ దనచేతి । కొలఁది సూపి క్రీడి సెలఁగి దేవ**
**దత్త మొత్తుటయును దత్సైన్యములు సెడ । విఱిగి పాఱె భీష్మమఱువు సొచ్చె. 66**

**ప్రతిపదార్థం:** ఆచార్యున్= ద్రోణాచార్యుడిని; డెబ్బది+అమ్ములన్= డెబ్భై బాణాలతోనూ; ఆచార్యపుత్త్రున్= ద్రోణపుత్రుడైన అశ్వత్థామను; ఏడింటన్= ఏడు బాణాలతోను; కృపుని= కృపాచార్యుడిని; పదింటన్= పది బాణాలతోనూ; దుష్ప్రహున్= దుష్ప్రహుని; పండ్రెంటన్= పండ్రెండు బాణములతోనూ; దుశ్శాసనునిన్= దుశ్శాసనుణ్ణి; పది+ఏనింటన్= పదిహేను బాణాలతోనూ; సౌబలున్= శకునిని; ఎనిమిదింటన్= ఎనిమిది బాణములతోనూ; అమరనదీసూనున్= గంగాపుత్రుడైన భీష్ముడిని; అరువదింటన్= అరువది బాణాలతోనూ; ఏసి= కొట్టి; రవిసుతు= సూర్యుని కుమారుడైన కర్ణుడి యొక్క; రథ్య= గుఱ్ఱాలను; సారథులన్= సారథిని; నొంచి= నొవ్వకొట్టి; వర్మము= కవచం; అంతయున్= అంతా; త్రుంచివైచి= ముక్కలు చేసి; మర్మ= ఆయువుపట్టులు; అస్థిబంధములు= బొమికలను అతుక్కునేటట్లు చేసేవి (కీళ్ళు); భేదించి= పగులగొట్టి; విక్రమము= పరాక్రమం; నెరపి= కనబరచి; ఇట్లు= ఈ రీతిగా; దొరలు= వీరులు; నొవ్వన్= బాధపడగా; ఏడ్తెఱన్= పరాక్రమంతో; తనచేతికొలఁది= తన భుజశక్తిని; చూపి= కనబరచి; క్రీడి= అర్జునుడు; చెలఁగి= సంతోషించి; దేవదత్తము= తన శంఖమును; ఒత్తుటయును= ఊదగా; తత్+సైన్యములు= ఆ కౌరవసేనలు; చెడవిరిగి= వికావికలై; పారి= పరుగెత్తి; భీష్ముమఱువు= భీష్ముడి చాటునకు; చొచ్చెన్= చేరాయి.

**తాత్పర్యం:** అర్జునుడు ద్రోణుడిని డెబ్భై బాణాలతోనూ, అశ్వత్థామను ఏడు బాణాలతోనూ, కృపుడిని పది బాణాలతోనూ, దుష్ప్రహుడిని పండ్రెండు బాణాలతోనూ, దుశ్శాసనుడిని పదేను బాణాలతోనూ, శకునిని ఎనిమిది బాణాలతోనూ, భీష్ముడిని అరవై బాణాలతోనూ కొట్టి, ఆపైన కర్ణుడి గుఱ్ఱాలను, సారథిని బాధపడేటట్లు కొట్టి, సారథి కవచాన్ని తునాతునకలు చేసి, కీళ్ళు తొలగేటట్లుగా కొట్టాడు. ఇట్లా తన బలాన్ని చూపి దేవదత్తమనే శంఖం పూరించాడు. ఆ శబ్దానికి హడలిపోయిన సేనలన్నీ భీష్ముడి చాటుకు పారిపోయి తలదాచుకొన్నాయి.

**విశేషం :** 1.కురువీరులలో శిష్టచతుష్టయంలోని ముగ్గురిపై అర్జునుడు బాణాలు గుప్పించి ఊరుకొన్నాడు. దుష్టచతుష్టయంలో అతడి ప్రత్యర్థి కర్ణుడు. అందువలన అతడి రథ సారథులను బాణాలతో బాధించి రథాన్ని రక్షించుకొనలేని అతడి పరాక్రమాన్ని పరిహాసంపాలు చేశాడు. తన కడ్డు చెప్పలేని కర్ణుడిపై సవాలు విసిరినట్లుగా దేవదత్తాన్ని పూరించాడు. ఆ శబ్దానికి సైనికులందరూ బెదరి పరుగెత్తి భీష్ముడి మరుగున నిలిచారు. ఇది కర్ణుడికి మరొక అవమానం. కురుసేనను రక్షించ గలిగిన సామర్థ్యం భీష్ముడికే ఉన్నదని సైనికులే చెప్పారు. అర్జునుడు వారిచేత చెప్పించాడు. ప్రగల్భాలాడిన కర్ణుడి రథసారథిని, గుఱ్ఱాలను పార్థుడు బాధిస్తుంటే అందరూ ఊరకుండిపోయారు. కురువీరులలో కర్ణుడంటే ఎంతటి నిర్లిప్తభావం ఉన్నదో ప్రదర్శింప చేశాడు అర్జునుడు.

2.యుద్ధం ప్రారంభించేటప్పుడు, పెద్దలమీద బాధించని బాణాలు వేసినప్పుడు కూడా ఒక గౌరవభావాన్ని, ఒక మర్యాదక్రమాన్ని అర్జునుడు పాటించాడు. ఆచార్యుడు, అశ్వత్థామ, కృపుడు, ఈ వరుస తప్పలేదు. భీష్ముడిని కదిలించ దలచుకొనలేదు. ద్రోణాదులు కర్ణుడి పరాక్రమం తేలేంతవరకు ముందుకు వచ్చేటట్లు లేరు. మొదటి దెబ్బ అర్జునుడు కర్ణుడిపై కొట్టాడు. పౌరుషవంతుడైతే అతడు త్రిప్పికొట్టాలి. ద్వంద్వయుద్ధాన్ని కోరుతున్నట్లు కర్ణుడిని కొట్టి శంఖం పూరించాడు. దుశ్శాసనాదులు దుర్బలులు. కర్ణుడి వెనుక ఉండేవారు. అందుకే ఆ దొరలందరిని బాధించి తన బాణలాఘవాన్ని ప్రదర్శించి ఊరుకొన్నాడు. (సంపా.)

**క. గాంగేయుఁ డవష్టంభో । త్తుంగతనుం డగుచు నిట్లు దూలిన కురు సే**
**నాంగంబులఁ బురికొలిపి సు । సంగతములు సేసె సమరసమ్ముఖములు గాన్. 67**

**ప్రతిపదార్థం:** గాంగేయుఁడు= భీష్ముడు; అవష్టంభ= గర్వంచేత; ఉత్తుంగ= ఎత్తయిన; తనుండు+అగుచున్= శరీరం కలవాడై; ఇట్లు= ఈ రీతిగా; తూలిన= చెదరిన; కురుసేనా+అంగములన్= కౌరవసేనలోని రథ, గజ, అశ్వ, పదాతులను; పురికొలిపి= ప్రోత్సహించి; సుసంగతములు= బాగా చేరిక కలిగినవిగానూ; సమర సమ్ముఖములుగాన్= యుద్ధం చేయటానికి సంసిద్ధములైనవిగానూ; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** భీష్ముడు వారందరికి అండగా నిలబడి, వారందరిని ప్రోత్సాహపరచి, కలిపి, ఏకం చేసి, యుద్ధానికి సిద్ధమయ్యేటట్లు చేశాడు.

**విశేషం :** యుద్ధనిర్వహణలో భీష్ముడు సామర్థ్యాన్ని ప్రదర్శిస్తా డనటానికి- శిథిలమైన సైన్యాలను సమీకరించటం, వారిని యుద్ధానికి సిద్ధం చేయటం సాక్ష్యాలు. ఆయన క్షణాలలో తీసికొన్న చర్యలు ఆశ్చర్యజనకాలు. కురుసైన్యాలకు ఆయనమీద అంత నమ్మకం ఉండటం ధ్వని. (సంపా.)

**వ. ఇట్లు భగ్నబల సమాశ్వాసనోద్భాసి యగు భీష్ము భుజబలంబు ప్రాపున నేచి మాతంగ తురంగ స్యందన సందోహంబులతోఁ గుంభసంభవ కృపాశ్వత్థామ కర్ణ వికర్ణ ప్రముఖ నిఖిల యోధజనంబులు సుయోధను ముందటఁ బన్ని నిలిచినం జూచి, సవ్యసాచి ప్రత్యేక ప్రధన కుతూహలాయత్త చిత్తుం డగుచు నుత్తరున కిట్లనియె. 68**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; భగ్న= చెల్లాచెదరైన; బల= సేనను; సమాశ్వాసన= ఓదార్చటంతో; ఉద్భాసి+అగు= ప్రకాశించే; భీష్ము= భీష్ముడి యొక్క; భుజబలంబు ప్రాపునన్= భుజాలయొక్క బలాల అసరాతో; మాతంగ= ఏనుగుల; తురంగ= గుర్రాల; స్యందన= రథాలయొక్క; సందోహంబులతోన్= సముదాయాలతో; కుంభ సంభవ= ద్రోణాచార్యుడు; కృప= కృపుడు; అశ్వత్థామ; కర్ణ, వికర్ణ ప్రముఖ= కర్ణుడు, వికర్ణుడు మొదలుగా గల; నిఖిల= సమస్తమైన; యోధజనంబులు= వీరులు; సుయోధను ముందటన్= దుర్యోధనుడి ముందు భాగాన; పన్ని= వ్యూహంగా ఏర్పడి; నిలిచినన్= నిలబడగా; సవ్యసాచి= అర్జునుడు; చూచి; ప్రత్యేక= ఒక్కొక్కరితో విడివిడిగా; ప్రధన= యుద్ధం చేయటంలో; కుతూహల+ఆయత్త= వేడుకకు వశమైన; చిత్తుండు+ఐ= మనస్సు కలవాడై; ఉత్తరునకున్= ఉత్తరుడితో; ఇట్లు= చెప్పబోయే రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** చెల్లాచెదరైన సేనను ఓదార్చి భీష్ముడు తన భుజబలంతోనూ, ఏనుగులు, రథాలు, గుర్రాల సందోహంతోనూ, ద్రోణ, కృప, వికర్ణాదులైన ప్రముఖ యోధజనంతోనూ దుర్యోధనుడి ముందుభాగంలో వ్యూహంగా పన్ని నిలబడగా, అది చూచిన అర్జునుడు వారిలో ఒక్కొక్కరితో యుద్ధం చేయటానికి కుతూహలం కలిగినవాడై ఉత్తరుడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'కందము లప్పళించి తురగంబుల నించుక నిల్పు; వైరి సే**
**నం దెలియంగఁ జూడుము ఘనప్రకరంబును బోలెఁ గాఱు కొం**
**చుం దఱచైన దంతి భట సుందరకేతన రాజి గ్రాలఁగా**
**ముందర గట్టిమై నిలిచి మోహర మున్నవిధంబు గాంచితే? 69**

**ప్రతిపదార్థం:** కందములు= గుర్రాల మూపులను; అప్పళించి= అరచేతితో కొట్టి; తురగంబులన్= గుర్రాలను; ఇంచుక= కొద్దిగా; నిల్పు= నిల్పుము; వైరిసేనన్= శత్రువుల సేనను; తెలియంగన్= బాగా తెలిసేటట్లుగా; చూడుము; ఘన= మేఘాలయొక్క; ప్రకరంబును+పోలెన్= సముదాయం వలె; కాఱుకొంచున్= ఎక్కువగా కమ్ముకొని; తఱచు+ఐన= దట్టమైన; దంతి= ఏనుగులు; భట= భటులతోను; సుందర= అందమైన; కేతనరాజి= జెండాల వరస; క్రాలఁగాన్= ప్రకాశించగా; ముందరన్= ఎదుటి భాగాన; గట్టిమైన్= ధైర్యంతో; నిలిచి= ఎదిరించి నిలిచి; మోహరము+ఉన్న విధంబు= వ్యూహంగా ఏర్పడిన తీరును; కాంచితే?= గమనించావా?

**తాత్పర్యం:** 'ఉత్తరకుమారా! గుఱ్ఱాల మూపులను అరచేతితో తట్టి, కొంచెం ఆపు చేసి, ఎదుటి సేనను పరికించి చూడుము. వానకాలంలో మేఘాలు కారుకమ్మినట్లుగా ఏనుగులు, గుఱ్ఱాలు, భటుల జెండాలు ఎంతో అందంగా గుమికూడి, వ్యూహాన్ని పన్నినట్లుగా ఉన్నాయి.

**విశేషం :** అలం: ఉపమ.

**ఆ.** **కర్ణు కేతనంబు గ్రాలెడు నల్లదె। యాతఁ డాజికేళి కౌతుకమునఁ**
**గడఁగి వచ్చుటయును గలిగియున్నది మున్న। తొడరవలయు నతనితోడ మనము.'** **70**

**ప్రతిపదార్థం:** అల్లదె= అదిగో; కర్ణు= కర్ణుడియొక్క; కేతనంబు= జెండా; గ్రాలెడున్= ప్రకాశిస్తున్నది; అతఁడు= ఆ కర్ణుడు; ఆజి= యుద్ధమనెడు; కేళి= క్రీడ అందలి; కౌతుకమునన్= వేడుకతో; కడఁగి= ప్రయత్నించి; వచ్చుటయును= రాకను; కలిగి+ఉన్నది= కనబడుతున్నది; మున్ను+అ= ముందుగానే; మనము; అతనితోడన్= ఆ కర్ణుడితో; తొడరవలయున్= ఎదిరించవలెను.

**తాత్పర్యం:** 'అదిగో కర్ణుడి జెండా ప్రకాశిస్తున్నది. అతడు యుద్ధమంటే ఆటగా ఉవ్విళ్ళూరిపోతున్నట్లు కనిపిస్తున్నది. మనం అంతకంటె ముందుగానే అతడిని ఎదిరించాలి.'

**విశేషం :** కౌరవసైన్యంలో కర్ణుడే ముందుగా అర్జునుడిని ఎదుర్కొనవలసిన ఒక చిత్రమైన సన్నివేశాన్ని అర్జునుడు కల్పించాడు. కురువీరులు కూడా అతడి పరాక్రమాన్ని పరిశీలించాలని ఎదురుచూస్తున్నారు. అందుకే అర్జునుడు ఉత్తరకుమారుడితో - అతడు రావటమే ఇంక మిగిలి ఉన్నదని అన్నాడు. వచ్చేలోగానే అతడిమీద దాడిచేయాలని అర్జునుడు సంకల్పించటం ఇక్కడ విశేషం. ఇది ముందు దాడి. (సంపా.)

**వ.** **అని మఱియును.** **71**

**తాత్పర్యం:** అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం)

**చ.** **'రయమునఁ గిట్టి యీతని పరాక్రమలీల యడంచి నొంచి దు**
**ర్జయుఁ డని నమ్మియున్న కురురాజునకున్ వగ పుట్టఁ జేసెదన్**
**హయములఁ బోవని' మ్మనుఁడు నాతఁడు నాతని లావు నచ్చి ని**
**ర్భయమునఁ దేరు వే నడపె భాస్కరసూతికి సమ్ముఖమ్ముగన్.** **72**

**ప్రతిపదార్థం:** రయమునన్= వేగముగా; కిట్టి= సమీపించి; ఈతని= ఇతడియొక్క; పరాక్రమలీల= పౌరుష విలాసం; అడంచి= అణచి; నొంచి= నొప్పించి; దుర్జయుఁడు= (కర్ణుడు) జయింపశక్యం కానివాడు; అని= అనుకొని; నమ్మి+ఉన్న= నమ్ముకొనిఉన్న; కురురాజునకున్= దుర్యోధనుడికి; వగ= బాధ; పుట్టన్= పుట్టేటట్లు; చేసెదన్= చేస్తాను; హయములన్= గుఱ్ఱాలను; పోవనిమ్ము= పోనిమ్ము; అనుడున్= అనిన వెంటనే; ఆతఁడున్= ఉత్తరుడు కూడ; ఆతనిలావు= అర్జునుడి బలం; నచ్చి= తన మనస్సుకు నచ్చి; నిర్భయమునన్= భయం లేకుండా; తేరు= రథాన్ని; భాస్కరసూతికిన్= కర్ణుడికి; సమ్ముఖంబుగాన్= ఎదురుగా; వే= వేగంగా; నడపెన్= తోలాడు.

**తాత్పర్యం:** 'ముందుగా ఆ కర్ణుడిని సమీపించి బాణాలతో కొట్టి, యుద్ధం అంటే ఉన్న సరదా పోగొట్టి, కర్ణుడిని ఎవ్వరూ గెలవలేరని నమ్ముకొని ఉన్న దుర్యోధనుడికి బాధ పుట్టేటట్లు చేస్తాను. గుఱ్ఱాలను పోనిమ్ము' అన్నాడు అర్జునుడు.

ఉత్తరుడికి అర్జునుడి బలంమీద నమ్మకం కుదరటంతో తన కేమీ బాధ కలగదనే ధైర్యంతో నిర్భయంగా కర్ణుడి రథాని కెదురుగా తమ రథాన్ని పోనిచ్చాడు.

**విశేషం :** అర్జునుడు కర్ణుడిపై దాడి చేసే విధానాన్నీ, దానివలన సాధించదలచిన ప్రయోజనాన్నీ సారథికి వివరించటం యుద్ధ వీరోల్లాసం. అర్జునుడు ముందుగా కర్ణుడిని ద్వంద్వయుద్ధంలో ఎదుర్కొంటాడు. కర్ణుడు తన పరాక్రమాన్నంతా ప్రదర్శించి అర్జునుడిని ఓడించ ప్రయత్నించటం సహజం. అయినా, అర్జునుడు అతడి పరాక్రమాన్ని అణచి చూపించాలి. ఆపైన అతడి అసమర్థత బయటపడేటట్లు బాధించి వేధించాలి. కాని, చంపకూడదు. ఈ వ్యూహం ఎందుకంటే - కర్ణుడు దుర్జయుడు అని నమ్మే దుర్యోధనుడు - కర్ణుడి బండారం బయటపడటంతో - నిరాశా నిస్పృహలతో లోలోన దుఃఖించాలి. ఆ లక్ష్యాన్ని సాధించటం ఆ యుద్ధంలో మొదటి ప్రయోజనం. దుర్యోధన గర్వానికి ఆశామూలం కర్ణుడు. దానిని త్రెంచాలని అర్జునుడి వ్యూహం. అర్జునుడు అన్నంత పని చేయగలడని ఉత్తరుడికి నమ్మకం కుదిరింది. నిర్భయంగా రథాన్ని కర్ణుడిమీదికి కదను త్రొక్కించాడు. విజయం ఉత్తరుడి దృఢ సంకల్పంలో ధ్వనింపచేయబడింది. (సంపా.)

### అర్జునుండు చిత్రాంగదప్రభృతి కురుకుమారుల నిర్జించుట (సం.4-49-7)

**వ. ఇవ్విధంబున వృషభంబున కాదికొను బెబ్బులియునుం బోలె రాధేయుదెస నడచు కవ్వడిం గని చిత్రాంగదుండును చిత్రరథుండును సంగ్రామజిత్తును దుష్ప్రహుండును జిత్రసేనుండును వివింశతియును దుర్ముఖుండును దుర్జయుండును వికర్ణుండును శత్రుంతపుండును దుశ్శాసనుండును లోనుగాఁ గల కురుకుమార వర్గంబు నిరర్గళ ప్రకారంబులగు రథ చిత్ర ప్రచారంబులు మెఱయ మొనకుం దలకడచి చటుల పటు బాణ వేణికా పరంపరలు నిగుడ నొక్క పెట్ట కవిసిన నతండును గుణధ్వని తంత్రీనాదంబుగా నావిండ్ల వారొత్తుకాఱుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె; నట్టియెడ వికర్ణుండు. 73**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; వృషభంబునకున్= ఎద్దునకు; ఆదికొను= ఎదురుపోయే; బెబ్బులియునున్+పోలెన్= పెద్దపులి వలె; రాధేయుదెసన్= కర్ణుడివైపు; నడచు= వెళ్ళేడి; కవ్వడిన్= అర్జునుడిని; కని= చూచి; చిత్రాంగదుండును; చిత్రరథుండును; సంగ్రామజిత్తును; దుష్ప్రహుండును; చిత్రసేనుండును; వివింశతియును; దుర్ముఖుండును; దుర్జయుండును; వికర్ణుండును; శత్రుంతపుండును; దుశ్శాసనుండును; లోనుకాన్+కల= మొదలైన; కురుకుమార వర్గంబు= కౌరవరాజ కుమారుల సమూహం; నిరర్గళ= అడ్డులేని; ప్రకారంబులు+అగు= రీతులుకల; రథ= రథాలయొక్క; చిత్ర= రకరకములైన; ప్రచారంబులు= గతులు; మెఱయన్= ఒప్పగా; మొనకున్= యుద్ధానికి; తలకడచి= ఎదుటి ప్రదేశము దాటి; చటుల= చంచలమైన; పటు= సమర్థమైన; బాణ వేణికా= ప్రవాహం వంటి బాణాలయొక్క; పరంపరలు= వరుసలు; నిగుడన్= ఎక్కువకాగా; ఒక్కపెట్టు+అ= ఒక్కసారిగా; కవిసినన్= కలియబడగా; అతండును= అర్జునుడు కూడా; గుణధ్వని= నారియొక్క మ్రోత; తంత్రీ నాదంబుగాన్= తీగెల ధ్వనిగాను; ఆ విండ్లవారు= ఆ ధనుర్ధారులు; ఒత్తుకాఱుకాన్= సుతిపోయువారుగా; గాండీవంబు= గాండీవమనే ధనుస్సు; వీణగాన్= వీణగాను; వినోదంబు= ఆహ్లాదకర కృత్యమును; సలిపెన్= చేశాడు; అట్టి యెడన్= ఆ సమయంలో; వికర్ణుండు= వికర్ణ డనేవాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా ఎద్దుమీదికి పోయే బెబ్బులివలె కర్ణుడి వైపునకు వెళ్ళే అర్జునుడిని చూచి చిత్రాంగదుడు, చిత్రరథుడు, సంగ్రామజిత్తు, దుష్ప్రహుడు, చిత్రసేనుడు, వివింశతి, దుర్ముఖుడు, దుర్జయుడు, వికర్ణుడు, శత్రుంతపుడు, దుశ్శాసనుడు మొదలైన కురుకుమారులందరూ అడ్డులేని రీతిలో రకరకాలుగా రథాలను నడుపుకొంటూ యుద్ధభూమి

మొదటికి వచ్చి, బాణాలు వేయటం ప్రారంభించి గుప్పిస్తూ ఒక్కసారిగా మీదికి వచ్చేసరికి, అర్జునుడు నారి మ్రోత వీణాతంత్రుల నాదంగానూ, ధనుర్ధారులు శ్రుతివాద్య సహకారులుగానూ, గాండీవమే వీణగానూ, వినోద కాలక్షేపం చేస్తున్నట్లుగా యుద్ధం చేశాడు. అప్పుడు వికర్ణుడు.

**విశేషం :** అలం: ఉపమ, రూపకం. 1. ఈ రెండు అలంకారాలూ రెండు ప్రయోజనాల కొరకు తిక్కన వాడాడు. అర్జునుడు కర్ణుడి మీదకు పోవటం బెబ్బులి ఎద్దుమీదకు దూకటం వలె ఉన్నదన్నాడు. బెబ్బులి వేటకోసం ఎద్దుమీదికి పోయినట్లే, అర్జునుడు కసితో కర్ణుడిని వేటాడాలనే ముందుకు దూకాడు. అర్జునుడి దూకుడు, క్రౌర్యం, బాధ కలిగించాలన్న పగ - ఇవన్నీ ఈ ఉపమానంలో ధ్వనిస్తున్నాయి. అర్జునుడిని బెబ్బులితో పోల్చి, కర్ణుడిని వృషభరాజమని కూడా అనకపోవటం విశేషం. వారిరువురి పరాక్రమాలలో ఈ తారతమ్య పరిశీలనం అర్జునుడి చిత్తవృత్తిని వ్యంజింపచేస్తుంది.

2. చిత్రాంగదాది కురుకుమారులు అల్లెత్రాళ్ళు మ్రోగిస్తూ గాండీవికి అడ్డం పడ్డారు. అల్లెత్రాటి మ్రోత బాణప్రయోగాన్ని ధ్వనింప చేస్తుంది. పలువురు ఒక్కసారిగా గుమికూడి అర్జునుడిని ఎదిరించి బాణాలు వేస్తున్నారు. వారందరికీ ఒక్క గాండీవంతో అర్జునుడు సమాధానం చెప్పుతున్నాడు. కురుకుమారులందరూ చిన్నవాళ్ళు. వాళ్ళను దండించటం కాని, బాధించటం కాని, చంపటం కాని అర్జునుడి అభిమతం కాదు. అందువలన వినోదంగా, విలాసంగా వాళ్ళతో యుద్ధం చేసిన తీరును - వింటి నారీనాదం జంత్రవాద్య సమ్మేళనంగా ఉన్నదని తిక్కన రూపకాలంకారంలో వర్ణించాడు. అందులో ప్రధాన వాద్యం వీణ. అది గాండీవం. మిగిలిన వారి నారుల మ్రోతలు సహకార వాద్యాలుగా ఉన్నాయట. ఈ రూపకంలో అందరి బాణపాండిత్యం కంటె పార్థుడి బాణ చాతుర్యమే మిన్న అని అలంకారధ్వని. కర్ణుడిపై యుద్ధం విరోధ మూలమైన వీరం. కురుకుమారులపై యుద్ధం వినోద జనకమైన విలాసం. ఒకటి వీర రసాభ్యుదయ చిహ్నం. మరొకటి వీర రసోల్లాసానికి ఉదాహరణం. (సంపా.)

**క. తల మీఱి నిశిత శరమం। డలిఁ గప్పెం బార్థు నుత్కట క్రోధమునన్**
**విలు విఱుగ నేసి యతనిం । దొలఁగంగాఁ జేసె నరుఁడు దోర్బలలీలన్. 74**

**ప్రతిపదార్థం:** తలమీఱి= హద్దుమీరి; నిశిత= వాడియైన; శరమండలిన్= బాణ సముదాయం చేత; పార్థున్= అర్జునుడిని; ఉత్కట= ఎక్కువైన; క్రోధమునన్= కోపంతో; కప్పెన్= కప్పినట్లు చేశాడు. నరుఁడు= అర్జునుడు; దోర్బలలీలన్= బాహు పరాక్రమం యొక్క విలాసంతో; విలు= విల్లు; విఱుగన్= విరిగేటట్లుగా; ఏసి= కొట్టి; అతనిన్= వికర్ణుడిని; తొలఁగంగాన్= తొలగేటట్లు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ముందుకు వచ్చి వికర్ణుడు వాడియైన బాణాలతో అర్జునుడిని కప్పివేసేటట్లుగా కొట్టాడు. అర్జునుడు దానికి ప్రతిగా అతడి విల్లు విరుగగొట్టి, అతడిని యుద్ధభూమి నుండి దూరంగా పోయేటట్లు చేశాడు.

**క. ఇంతయుఁ గనుఁగొనియును శ। త్రుంతపుఁ డోసరిల కాజిదోహల మలరం**
**గౌంతేయుతోడఁ దలపడి। వింత లయిన కూర్మ నఖర విశిఖము లేసెన్. 75**

**ప్రతిపదార్థం:** ఇంతయున్= వికర్ణుడు యుద్ధంనుండి తొలగుటను; కనుఁగొనియును= చూచికూడా; శత్రుంతపుఁడు; ఓసరిలక= తొలగక; ఆజిదోహలము= యుద్ధముపై వేడుక; అలరన్= హెచ్చు కాగా; కౌంతేయుతోడన్= అర్జునుడితో; తలపడి= కలియబడి; వింతలు+అయిన= చిత్రములైన; కూర్మనఖర= తాబేటి గోళ్ళను పోలిన; విశిఖములు= బాణాలు; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** యుద్ధం చేయలేక వికర్ణుడు పారిపోవటం చూచికూడా శత్రుంతపుడనే వీరుడు అర్జునుడితో యుద్ధానికి సిద్ధపడి, తాబేటి గోళ్లను పోలిన వాడి బాణాలను వేశాడు.

**వ. అర్జునుండును.** 76

**తాత్పర్యం:** అర్జునుడు కూడా.

**క. సూతుఁ బదింటను నైదిట। నాతని యంగంబు నొంచి యంత నిలువమిన్**
**శాతఘనశరము వే కొని। యాతల వెడలంగ నేసి యసువులఁ బాపెన్.** 77

**ప్రతిపదార్థం:** సూతున్= సారథిని; పదింటన్= పది బాణములతోనూ; ఆతని+అంగంబున్= శత్రుంతపుని శరీరమును; ఐదిటన్= అయిదు బాణాలతో; నొంచి= నొచ్చునట్లు వేసి; అంతన్= అంతటితో; నిలువమిన్= అతడు నిలువనందున; శాత= వాడియైన; ఘన= గొప్పదైన; శరమున్= బాణమును; వే= వేగంగా; కొని= తీసికొని; ఆతల= ఆవలి ప్రదేశానికి; వెడలంగన్= వెడలేటట్లుగా; ఏసి= వేసి; అసువులన్= ప్రాణాలను; పాపెన్= పోగొట్టాడు.

**తాత్పర్యం:** పది బాణాలతో సారథిని, అయిదు బాణాలతో అతని శరీరాన్ని నాటేటట్లు కొట్టి, అతడు అంతటితో నిలువనందున, వాడి అయిన బాణం తీసికొని అవతలికి దూసుకొని పోయేటట్లు వేసి శత్రుంతపుడి ప్రాణాలు పోగొట్టాడు.

**తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి యివ్విధమున। నొక్కఁ డొక్కఁడ తలపడు టుడుపఁ దలఁచి**
**వివిధ బాణపరంపర వెల్లిఁ గొలిపె। భయరసము వఱ్ఱు పెట్టునఁ బగఱు పాఱ.** 78

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; శత్రుంతపునిన్= శత్రుంతపుడనే వీరుడిని; త్రుంచి= తెగగొట్టి, చంపి; ఈ+విధమునన్= ఈ ప్రకారంగా; ఒక్కఁడు+ఒక్కఁడు+అ= ఒక్కడొక్కడే; తలపడుట= తనతో యుద్ధం చేయటాన్ని; ఉడుపన్= మాన్పటను; తలఁచి= అనుకొని; భయరసము= భయమనెడి రసముయొక్క; వఱ్ఱు పెట్టునన్= ప్రవాహపు దెబ్బచేత; పగఱు= శత్రువులు; పాఱన్= పారిపోయేటట్లుగా; వివిధ= పలురకాలైన; బాణ పరంపరన్= బాణాల వరుసలను; వెల్లి= ప్రవాహంగా; కొలిపెన్= వేశాడు.

**తాత్పర్యం:** ఇట్లా శత్రుంతపుడిని తెగగొట్టి, ఈ రీతిగా ఒక్కొక్కడే తనమీదికి రాకుండా ఎన్నో బాణాలు వరుసగా పేర్చివేశాడు. భయరసం తాకిడికి శత్రువులు పారిపోయేటట్లు బాణాలను ప్రవాహం కట్టించాడు.

**క. 'అందఱు రథికులు పఱవఁగ। నిం దేటికి మున్ను వచ్చి రిస్సీ' యని సం**
**క్రందనసుతు మార్కొనియెఁ ద। గం దెగి సంగ్రామజిత్తు గర్వోద్ధతుఁడై.** 79

**ప్రతిపదార్థం:** రథికులు= రథం పైనుండి యుద్ధం చేసే మహావీరులు; అందఱున్= అందరూ; పఱవఁగన్= పారిపోగా; మున్ను= ముందుగా; ఇందున్= ఇక్కడికి; ఏటికి= ఎందులకు; వచ్చిరి= వచ్చారు; ఇస్సీ= ఛీ ఛీ; అని= అనుకొని; సంగ్రామజిత్తు= సంగ్రామజిత్తనే వీరుడు; గర్వ+ఉద్ధతుఁడు+ఐ= గర్వంచేత పొగరు కలవాడై; తగన్= తగునట్లు; తెగి= సాహసించి; సంక్రందన సుతున్= అర్జునుడిని; మార్కొనియెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** 'రథికులందరూ పారిపోగా, ఇక్కడి కస లెందుకు వచ్చారు? ఛాఛా!' అంటూ సంగ్రామజిత్తనే వీరుడు (కర్ణుడి తమ్ముడు) సాహసించి అర్జునుడిని ఎదుర్కొన్నాడు.

**విశేషం :** 'వచ్చి రిస్సీ! యని' ఉన్న పాఠమే మేలు, ఏలన, 'వచ్చితిస్సీ' అనే దానిలో 'వచ్చితి' ఉత్తమ పురుషక్రియ కాజాలదు. ఉత్తమ పురుషక్రియ అగుచో, వచ్చితినిస్సీ అని యుండవలసిందే! వచ్చితిస్సీ అనేదానికి వచ్చితివి+ఇస్సీ - అని మధ్యమ పురుష క్రియగా అర్థం చెప్పవలసి ఉంటుంది. ఆ అర్థ మిక్కడ పొసగదు కదా! అందుచేత వచ్చితిస్సీ - అని ప్రథమ పురుషగానే ఉండాలి.

వాళ్ళందరూ పారిపోవటానికా ముందుగా వచ్చారు! ఛీ! అని తాను గర్వంతో అర్జునుడిని తాకాడని భావం. తాను వాళ్ళందరికంటె గొప్పవాడిని అని అహంభావం. అందుచేతనే గర్వోద్ధతుఁడు. (సంపా.)

**క. తలపడి వాలమ్ములు పై। నల వేర్పడ నినుచుటయును నలుక వొడమినం**
**దలఁ దునిమివైచె నాతని। బలసూదనసూనుఁ డొక్క పటుభల్లమునన్. 80**

**ప్రతిపదార్థం:** తలపడి= కలియబడి; వాలు+అమ్ములు= వాడియైన బాణాలు; పైన్= అర్జునుడిపై; అలవు= ఉపాయం; ఏర్పడన్= ఏర్పడేటట్లుగా; నినుచుటయును= నింపినట్లు వేయగా; అలుక+పొడమినన్= కోపంరాగా; బలసూదన సూనుఁడు= అర్జునుడు; ఒక్క పటుభల్లమునన్= ఒక్క గట్టి బల్లెముతో; ఆతని తలన్= అతడి తలను; తనిమివైచెన్= తెగగొట్టాడు.

**తాత్పర్యం:** సంగ్రామజిత్తు అర్జునుడితో తలపడి వాడి అయిన బాణా లేయగా, అర్జును డీ చేతకానివాడా యుద్ధానికి రావటం? అన్నట్లు కోపించి ఒకే ఒక బల్లెంతో అతడి తల తెగగొట్టి వేశాడు.

**విశేషం :** ఈ వీరునిపేరు సంగ్రామజిత్తు. అంటే యుద్ధాలలో విజయం సాధించేవాడని అర్థం. అతడు అనేక బాణాలు అర్జునుడిపై గుప్పించాడు. ఏదో పొడిచేస్తాడనే దృశ్యం కల్పించాడు. అంతటి సంగ్రామజిత్తును ఒక్క బల్లెంతో అర్జునుడు తల తెగగొట్టి చంపాడు. ఆ చనిపోయినవాడు కర్ణుడి తమ్ముడు కావటం మరొక విశేషం. అర్జునుడి యుద్ధవీరం ఇందులో ధ్వని. (సంపా.)

**తే. అపుడు రాధేయుఁ డిమ్మెయి ననుజుపాటుఁ। జూచి యేనుంగునకు సిళ్ళు సూపినట్లు**
**కవిసి హయముల మత్స్యభూకాంతు తనయు। నేసి, పంద్రెండు శరముల నేసె నరుని. 81**

**ప్రతిపదార్థం:** అపుడు; రాధేయుఁడు= కర్ణుడు; ఈ+మెయిన్= ఈ రీతిగా; అనుజు పాటున్= తమ్ముడు చనిపోవటం; చూచి= కళ్ళారా చూచి; ఏనుంగునకున్= ఏనుగునకు; సిళ్ళు= అంకుశం; చూపిన+అట్లు= చూపిన రీతిగా; కవిసి= అర్జునుడిని ఎదుర్కొని; హయములన్= గుర్రాలను; మత్స్యభూకాంతు తనయున్= ఉత్తరుడిని; ఏసి= కొట్టి; నరునిన్= అర్జునుడిని; పంద్రెండు శరములన్= పన్నెండు బాణాలతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** అప్పుడు కర్ణుడు ఆ రీతిగా తన తమ్ముడు పడిపోవటం చూచి ఏనుగుకు అంకుశం చూపినట్లుగా కోపం వచ్చి అర్జునుడితో తలపడి గుర్రాలను, ఉత్తరుడిని బాణాలతో కొట్టి, అర్జునుడి మీదికి పన్నెండు బాణాలు వేశాడు.

**విశేషం :** అలం: ఉపమ. 'ఏనుగుకు సిళ్ళు చూపినట్లు' అనే ఉపమానం చక్కని తెలుగు జాతీయం. (సంపా.)

**ఉ. కేసరివిక్రముండు కపికేతనుఁ డత్తఱి వైరివీరసం**
**త్రాసకర ప్రకార మగు దర్ప మెలర్పఁగ బాణజాల వి**
**న్యాసమునన్ వెసం బొదివె నర్కసుతున్ గరుడుండు పాము ను**
**ద్భాసితపక్షుఁడై పొదువు భంగి సురావలి పిచ్చలింపఁగన్. 82**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= అప్పుడు; కేసరి విక్రముండు= సింహం వంటి పరాక్రమం కల; కపికేతనుండు= వానరం జెండాగా గల అర్జునుడు; వైరివీర= శత్రువులకు; సంత్రాసకర= భయం కలుగజేసే; ప్రకారము+అగు= విధానంకల; దర్పము= గర్వం; ఎలర్పఁగన్= వృద్ధికాగా; బాణజాల= బాణ పరంపరయొక్క; విన్యాసమునన్= వేయుటతో; వెసన్= వేగంగా; అర్కసుతున్= కర్ణుడిని; గరుడుండు= గరుత్మంతుడు; పామున్= పామును; ఉద్భాసిత పక్షుఁడు+ఐ= ప్రకాశించే రెక్కలు కలవాడై; పొదువు భంగిన్= ఆవరించినట్లుగా; సురావలి= దేవతల వరుస; పిచ్చలింపఁగన్= ఆశ్చర్యంతో ప్రశంసింపగా; పొదివెన్= ఆక్రమించాడు.

**తాత్పర్యం:** సింహపరాక్రముడైన అర్జునుడు శత్రువులకు భయంకలిగే విధంగా దర్పం కలిగి బాణాల పరంపర వేస్తూ కర్ణుడిని, గరుత్మంతుడు రెక్కలు విప్పి ఎగురుతూ పామును తన్ని ఆక్రమించినట్లే ఆక్రమించాడు. అది చూచి దేవతలు ఆశ్చర్యంతో ప్రశంసించారు.

**విశేషం :** అలం: ఉపమ. దీనిలో సింహపరాక్రముడని అర్జునుడిని చెప్పటం, వెనుకటి పద్యంలో కర్ణుని ఏనుగునకు సిళ్ళు చూపినట్లు చెప్పటం, ఇందులో గరుడుడు పామును పొదివినట్లు చెప్పటం వంటి ఉపమేయ ఉపమానాలస్వారస్యం ద్వారా అర్జునుడు గెలుస్తాడని కర్ణుడు ఓడిపోతాడని సూచించబడుతున్నది.

**క.** **ఇరువురు వీరులు ని ట్లొం। డొరువులఁ దలపడుట సూచి యుత్కట మగు న**
**చ్చెరువాటుఁ గౌతుకంబు న। డర నూరక యుండె నయ్యెడం గురుసేనల్.** **83**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ఇరువురు వీరులున్= కర్ణార్జును లిద్దరు వీరులున్నూ; ఒండొరువులన్= ఒకళ్ళతో ఒకళ్ళు; తలపడుట= కలియబడటం; చూచి; ఉత్కటము+అగు= ఎక్కువైన; అచ్చెరు+పాటున్= ఆశ్చర్యం; కౌతుకంబును= వేడుకయున్నూ; అడరన్= కలుగగా; కురుసేనల్= కౌరవసేనలు; ఆ+ఎడన్= అప్పుడు; ఊరక+ఉండెన్= ఊరకున్నాయి.

**తాత్పర్యం:** ఆ రీతిగా కర్ణార్జును లిద్దరు మహావీరులు తలపడేసరికి ఆశ్చర్యం, వేడుక కలిగి కౌరవసేనలోని వారందరూ యుద్ధం చేయకుండా చూస్తూ ఊరుకొన్నారు.

**విశేషం :** కర్ణార్జునులు అపూర్వంగా ద్వంద్వయుద్ధం చేస్తున్నారు. వారి యుద్ధవీర విభావాల వీరరసం వలన చూచేవారిలో అద్భుతరసం పుట్టినట్లు తిక్కన చిత్రించాడు. 'ఉత్కట మగు నచ్చెరువాటు'- అనే మాటలు ప్రేక్షకులలోని ఆశ్చర్యం ఉత్కటావస్థను - అంటే స్థాయి భావ స్థాయికి - చేరిందని తిక్కన ధ్వనింపచేశాడు. అద్భుతరసాన్ని 'స్తంభం' (కొయ్యబారిపోవటం) అనే సాత్త్వికభావంతో సైనికులు ప్రదర్శించారు. ఈ వర్ణనం రసధ్వనికి ఉదాహరణం. (సంపా.)

**మ.** **ప్రళయాంభోధరముక్త సాంద్ర విసరత్పాషాణ వర్షంబు మి**
**క్కిలియై శైలముఁ గప్పునట్లు నరు నక్షీణాస్త్ర సంతాన మి**
**ట్టల మై కప్పినఁ దీవ్రమారుతము గాఢవ్యాప్తి జీమూత మం**
**డలిఁ బోలెన్ విరియించె భానుజుఁ డవష్టంభోజ్జ్వలాకారుఁడై.** **84**

**ప్రతిపదార్థం:** ప్రళయ= ప్రళయ కాలమందలి; అంభోధర= మేఘములచేత; ముక్త= విడువబడిన; సాంద్ర= దట్టంగా; విసరత్= ప్రసరించెడి; పాషాణ= రాళ్ళతోడి; వర్షంబు= వాన; మిక్కిలి+ఐ= ఎక్కువగా; శైలమున్= పర్వతమును; కప్పునట్లు= కప్పివేసేటట్లుగా; నరు= అర్జునుడియొక్క; అక్షీణ= క్షీణముకాని; అస్త్రసంతానము= బాణ సముదాయం; ఇట్టలము+ఐ= ఎక్కువై; కప్పినన్= కప్పగా; తీవ్రమారుతము= ఎక్కువైన గాలి; గాఢవ్యాప్తి= ఎక్కువగా వ్యాపించిన; జీమూత మండలిన్+పోలెన్= మేఘ సముదాయాన్నివలె; భానుజుఁడు= కర్ణుడు; అవష్టంభ= గర్వంతో; ఉజ్జ్వల= ప్రకాశించే; ఆకారుఁడు+ఐ= మూర్తి కలవాడై; విరియించెన్= విడిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** ప్రళయకాల మేఘాలు దట్టంగా పాషాణ వర్షం కురిపించి కొండను కప్పివేసినట్లుగా అర్జునుడు అక్షయ బాణాల వర్షంతో కర్ణుడిని కప్పివేశాడు. కర్ణుడు గర్వంతో ప్రకాశించే రూపం కలవాడై, బాగా ఆకాశాన్ని కప్పివేసిన మబ్బులను పెనుగాలితో పటాపంచలు చేసినట్లుగా ఆ బాణవర్షాన్ని ఏమీ లేకుండా చేశాడు.

**విశేషం :** అలం: ఉపమ.

**క. విల్లును దానును శిఖ రా। జిల్లఁగ వెలుఁగొందు వహ్ని చెలువంబున శో**
**భిల్లుటఁ గని కురుసైన్యము। లెల్లను దూర్యములు మ్రోయ నేడ్తెఱఁ జెలఁగెన్. 85**

**ప్రతిపదార్థం:** విల్లును= ధనువును; తానును= కర్ణుడును; శిఖ= జ్వాల; రాజిల్లఁగన్= ప్రకాశించగా; వెలుఁగొందు= వెలుగునట్టి; వహ్నిచెలువంబునన్= అగ్ని మాదిరిగా; శోభిల్లుటన్= ప్రకాశించటాన్ని; కని= చూచి; కురుసైన్యములు= కౌరవసేనలు; ఎల్లను= అన్నియును; తూర్యములు= వాద్యాలు; మ్రోయన్= మ్రోయగా; ఏడ్తెఱన్= పరాక్రమంతో; చెలఁగెన్= ధ్వనిచేశాయి, అరిచాయి.

**తాత్పర్యం:** విల్లుతో కూడిన కర్ణుడు జ్వాలతో వెలుగొందే అగ్నివలె అందంగా వెలుగొందగా చూచి, కౌరవసేనలు వాద్యాలు మ్రోయించి అరిచాయి.

**విశేషం :** అలం: ఉపమ.

**క. రవితనయు బాణములు వా। సవనందనుఁ బొదివినపుడు సంతోషముఁ,ద**
**ద్వివిధాస్త్రము లాతనిపైఁ। గవియ విషాదంబు నొందుఁ గౌరవసేనల్. 86**

**ప్రతిపదార్థం:** రవితనయు బాణములు= కర్ణుని బాణాలు; వాసవ నందనున్= అర్జునుడిని; పొదివినప్పుడు= కప్పినప్పుడు; సంతోషమున్= ప్రీతినీ; తద్+వివిధ+అస్త్రములు= ఆ అర్జునుడి రకరకాల బాణాలు; ఆతనిపైన్= ఆ కర్ణుడిపైన; కవియన్= కప్పగా; విషాదంబున్= విచారాన్ని; కౌరవసేనల్= కౌరవసేనలు; ఒందున్= పొందుతాయి.

**తాత్పర్యం:** కర్ణుడి బాణాలతో అర్జునుడు కప్పబడితే సంతోషం, అర్జునుడి బాణాలతో కర్ణుడు కప్పబడితే విచారాన్ని పొందుతున్నారు కౌరవసైనికులు.

**విశేషం :** అలం: పర్యాయం.

**వ. ఇవ్విధంబున నేట్లాడుచుం గదిసి గాండీవి కర్ణున కిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఏట్లాడుచున్= యుద్ధం చేస్తూ; కదిసి= సమీపించి; గాండీవి= అర్జునుడు; కర్ణునకున్= కర్ణుడితో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా యుద్ధం చేస్తునే సమీపించి అర్జునుడు కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'సభలఁ బలుకు దీవు సరిలేరు నా కని;। యిదె రణంబు వచ్చె; నెల్లవారి**
**కెఱుఁగవచ్చు దీనఁ; బెఱచోట రజ్జైన। యట్లు పూరగింప నగునె యిచట? 88**

**ప్రతిపదార్థం:** ఈవు= నీవు; నాకున్= నాతో; సరి= సమమైనవారు; లేరు+అని= లేరు అని; సభలన్= సభలయందు; పలుకుదు(వు)= పలుకుతావు; ఇదె= ఇదిగో; రణంబు= యుద్ధం; వచ్చెన్= సంభవించింది; దీనన్= దీనితో; ఎల్లవారికిన్= అందరికి; ఎఱుఁగవచ్చున్= తెలిసివస్తుంది; పెఱచోటన్= వేరొకచోట; రజ్జు+ఐన+అట్లు= బింకాలు పలికినట్లుగా; ఇచ్చటన్= ఇక్కడ యుద్ధంలో; పూరగింపన్+అగునె?= అట్లాగే ప్రేలవచ్చునా?

**తాత్పర్యం:** 'సభలలో నాకు సమమైన వారు లేరని బీరాలు పలుకుతూ ఉంటావు. ఇదిగో, మన ఇద్దరికి యుద్ధం వచ్చింది కదా! ఇప్పుడు చూపవచ్చును. దీనిలో ఎవరు గొప్పవారో అందరికి తెలుస్తుంది. అక్కడ వ్యర్థాలాపాలాడినట్లు ఇక్కడ కుదురుతుందా?

**విశేషం :** కర్ణుడు శక్తికి మించిన ప్రగల్భాలాడతాడని అశ్వత్థామ వంటి కురువీరులే కాక, అర్జునుడివంటి పాండవ వీరులు గూడా పరిహసించటం గమనించదగింది. (సంపా.)

**క. మాటలు పె క్కాడితి వీ। పోటుమగలు వినఁగ నింకఁ బోవుట దగ దె**
**ప్పాట; నదిగాక తమ్ముని। పాటును గన్నారఁ గంటి పాఱకు మింకన్. 89**

**ప్రతిపదార్థం:** ఈ పోటుమగలు= ఈ యుద్ధవీరులు; వినఁగన్= వినుచుండగా; మాటలు= పలుకులు; పెక్కు= చాలా; ఆడితివి= అన్నావు; ఇంకన్= ఇక్కడిదాకా వచ్చాక; పోవుట= పారిపోవటం; ఎప్పాటన్= ఏరీతిగాను; తగదు= పనికిరాదు; అదిగాక= ఇంకా; తమ్ముని పాటును= తమ్ముడి చావును; కన్నారన్= కన్నులతో స్వయంగా; కంటి(వి)= చూచితివి; ఇంకన్= ఇకనైనా; పాఱకుము= పారిపోకుము.

**తాత్పర్యం:** కర్ణా! ఈ యుద్ధవీరులు వింటూ ఉండగా అనేక మాటలు మాట్లాడావు. ఇక్కడివరకూ వచ్చాక, ఇక పారిపోవటం ఏరీతిగానూ మంచిది కాదు. అంతే కాకుండా తమ్ముడి చావును స్వయంగా చూచావు. ఇకనైనా పారిపోవద్దు.

**విశేషం :** పోరు భారమైనప్పుడు రణరంగాన్ని వదలి పారిపోవటానికి కర్ణుడు వెనుకాడడు. అదే గుణం దుర్యోధనాదులకు కూడా ఉన్నది. ఇది ఉత్తమ వీరుల లక్షణం కాదు. దానిని పేర్కొని అర్జునుడు అధిక్షేపించాడు. ఇది భావికథార్థ సూచకం కావటం మరొక శిల్ప విశేషం. (సంపా.)

**ఆ. పలుకవచ్చుఁగాక పలికిన యట్టుల। చేయ వచ్చు నెట్లు? దాయ! యెందుఁ**
**బోయె దట్లు ద్రుపదపుత్త్రికఁ బఱుపంగఁ। గాంచి నగిన ఫలముఁ గందు గాక! 90**

**ప్రతిపదార్థం:** పలుకవచ్చున్+కాక= మాటలెన్నైనా చెప్పవచ్చును కాని; పలికిన+అట్టులు+అ= పలికినట్లే; చేయవచ్చున్+ఎట్లు?= ఎట్లా చేయ వీలౌతుంది?; దాయ!= శత్రువా!; ఎందున్= ఎక్కడికి; పోయెదు= పోతావు; అట్లు= ఆ రీతిగా; ద్రుపద పుత్త్రికన్= ద్రౌపదిని; పఱుపంగన్= చేయగా; కాంచి= చూచి; నగిన ఫలమున్= నవ్వినదానికి ఫలాన్ని; కందు+కాక= చూస్తావు (అనుభవిస్తావు) గాక!

**తాత్పర్యం:** ఎన్ని మాటలైనా చెప్పవచ్చును కాని చెప్పినట్లుగా చేయ వీలవుతుందా? ఎక్కడికి పోతావు? ఆ నాడు ద్రౌపదిని భంగపరిచినప్పుడు చూచి నవ్వినదానికి ఫలం పొందుతావుగాక!

**విశేషం :** అర్జునుడిలో రౌద్రం ప్రజ్వలించటానికి కారణాన్ని ఇందులో పేర్కొన్నాడు. అలనాడు కౌరవసభలో ద్రౌపదిని చూచి అవహేళనం చేసి పలికిన పలుకులు అర్జునుడి మనసులో ములుకుల వలె గ్రుచ్చుకొంటూ ఉండేవి. వాటిని ఇప్పుడు స్మరించుకొనటం వలన ప్రతీకార రూపమైన క్రోధోద్రేకం అతడిలో పెచ్చు పెరిగినట్లు ధ్వని. (సంపా.)

**క. ఏ నపుడు ధర్మపాశా,। ధీనుఁడనై కోపమునకు దీకొనరింపం**
**గా నేరకున్న మెయిమెయిఁ। బో నయ్యెం గాక యింకఁ బొమ్మా యిచటన్.' 91**

**ప్రతిపదార్థం:** అపుడు= ద్రౌపది భంగపాటును చూచి నీవు నవ్వినపుడు; ఏన్= నేను; ధర్మపాశ= ధర్మమనెడి (ధర్మరాజనెడి) త్రాటికి; అధీనుఁడను+ఐ= కట్టువడినవాడనై; కోపమునకున్= నాకు వచ్చిన కోపానికి; దీకు= ప్రేరణ; ఒనరింపంగాన్= చేయుటకు; నేరక+ఉన్నన్= వీలులేకపోయినందున; మెయిమెయిన్= ఏ బాధా లేకుండా; పోన్+అయ్యెన్+కాక= పోవటానికి వీలైంది కాక; ఇంకన్= ఇక ఇప్పుడు; ఇచటన్= ఈ యుద్ధంలో; పొమ్మా= పొమ్ము (చూద్దాము).

**తాత్పర్యం:** అప్పుడు ధర్మానికి కట్టుబడి వచ్చిన కోపానికి తగినట్లుగా చేయలేదు కనుక నీవు ఏ బాధా పొందకుండా తప్పించుకొనగలిగావు. కాని, ఇప్పుడు పో చూస్తాను.

**విశేషం :** అర్జునుడు ధర్మబద్ధుడై అనంతమైన క్రోధాన్ని నిగ్రహించుకొనగలడు. అవసరం వచ్చినప్పుడు దానిని ప్రదర్శించగలడు. అర్జునుడు రౌద్ర ప్రదర్శనం చేసినప్పుడు కర్ణుడు పారిపోయి ప్రాణం రక్షించుకొనటం ఒక పరిపాటిగా సాగుతూ వస్తున్నది. దానిని పేర్కొని అర్జునుడు అవహేళనం చేశాడు. శత్రువులను అవహేళనం చేయటం వీరరౌద్రరసాలలో వాచికాభినయవిశేషంగా ఒప్పారుతుంది. (సంపా.)

**వ. అనిన విని రాధేయుం డిట్లనియె. 92**

**తాత్పర్యం:** అనగా విని కర్ణుడు ఇట్లా అన్నాడు.

**ఉ. 'అప్పుడు ధర్మహానికి భయంపడి నిల్చితివో? కడంకతో**
**నిప్పుడు వచ్చినాఁడ; విట యెల్లను జేయుదు గాక; యన్నపైఁ**
**దప్పు ఘటించి నీవు నొక తాలిమి గల్గినవాఁడవై నెపం**
**బొప్పినఁ జెల్లె; నీదు నిలుపోపును జూతము గాక యిచ్చటన్. 93**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ధర్మహానికిన్= ధర్మానికి హాని కల్గుతుందని; భయము+పడి= భయము చెంది; నిల్చితివో?= ఆగినావా?; ఇప్పుడు; కడంకతోన్= పూనికతో; వచ్చినాఁడవు= వచ్చావు కదా; ఇట= ఇక్కడ; ఎల్లను= అంతయు; చేయుదు(వు)గాక= చేయుదువుగాని; అన్నపైన్= అన్నగారిమీద; తప్పు= దోషం; ఘటించి= కూర్చి; నీవును= నీవు కూడ; ఒక తాలిమి కల్గినవాఁడవు+ఐ= ఓర్పు కలవాడివలె; నెపంబు= మిష; ఒప్పినన్= కుదర్చగా; చెల్లెన్= సరిపోయింది; నీదు= నీ యొక్క; నిలుపు+ఓపును= నిలుచు సామర్థ్యమును; ఇచ్చటన్= ఈ యుద్ధంలో; చూతము+కాక= చూస్తాంగాక.

**తాత్పర్యం:** 'అప్పుడు ధర్మహాని వస్తుందని భయపడి ఆగిపోయావా? ఇప్పుడు బాగా పూనికతో వచ్చావా? ఇప్పుడంతా చేసేద్దువు గాని, అన్నగారి మీద తప్పు పెట్టి, నీవు బాగా ఓర్పు కలవాడవైనట్లు చెప్పుతున్నావు. సరే, నాతోడి యుద్ధంలో నీ వేపాటి నిలుస్తావో ఇక్కడ చూద్దాం.

**విశేషం :** అర్జునుడి ధర్మనీతి అతడి అసమర్థతను సమర్థించుకొనే ఒక సాకుగా కర్ణుడు భావించాడు. తప్పు అన్నగారిమీద పెట్టి అర్జునుడు తప్పుకొంటున్నట్లు తలచాడు. నిజానికి అట్లా భావించటం కర్ణుడి శీలానికే చెల్లింది. (సంపా.)

**క. సమయంబు నడపినను రా। జ్యము భాగం బీరె యెట్లు నను నాస నర**
**ణ్యమున వసించితి గాక ని। జమునకు నీయందు ధైర్యసారము గలదే? 94**

**ప్రతిపదార్థం:** సమయంబు= ప్రతిజ్ఞ; నడపినను= నిర్వహించినచో; ఎట్లున్= ఏ విధంగానైనా; రాజ్యము భాగంబు= రాజ్యంలోని వాటాను; ఈరె?= ఇయ్యరా?; అను+ఆసన్= అనెడి ఆశతో; అరణ్యమునన్= అడవిలో; వసించితి+కాక= ఉన్నావుగాని; నిజమునకున్= యథార్థానికి; నీయందున్= నీకు; ధైర్యసారము= ధైర్యంలోని గట్టితనం; కలదే?= కలదా?

**తాత్పర్యం:** ఎట్లాగో ఒకవిధాన అన్నమాట ప్రకారం అరణ్యవాస, అజ్ఞాతవాసాలు చేస్తే వారే రాజ్యంలో భాగం ఇస్తారులే- అని అడవిలో ఉన్నావు కాని, నిజంగానే నీ కసలు ధైర్యం ఉన్నదా?

**విశేషం :** నియమం ప్రకారం అరణ్య అజ్ఞాతవాసాలు చేయటానికి కారణం శత్రువులను ఎదిరించలేని పాండవుల-లేదా-పార్థుడి అధైర్యమని కర్ణుడు ఆరోపించటం అతడి దుర్విదగ్ధత్వానికి నిదర్శనం. (సంపా.)

**క. మును నీ వచట నచటఁ జే। సిన బంటుతనంబు లెల్లఁ జెప్పఁగ విందుం**
**గనినఁ గదా నమ్ముదు; నవి। యనుమానము నాకు నీ భయస్థితిఁ గనుటన్.' 95**

**ప్రతిపదార్థం:** మును= మునుపు; నీవు; అచటన్+అచటన్= అక్కడక్కడ; చేసిన బంటుతనంబులు= చేసిన వీరకృత్యాలు; ఎల్లన్= అన్నియును; చెప్పఁగన్= జనులు చెప్పగా; విందున్= విన్నాను; అవి= వాటిని; కనినన్+కదా!= చూచినప్పుడు కదా!; నమ్మెదున్= నమ్మగలను; నీ భయస్థితిన్= భయపడే నీ స్థితిని; కనుటన్= చూడగా; నాకున్; అనుమానము= సందేహంగా ఉన్నది.

**తాత్పర్యం:** నీ విదివరలో ఏవో కొన్ని వీరోచిత కృత్యాలు చేశావని జనులు చెప్పికొంటుండగా విన్నాను. చూస్తే కాని నమ్మలేను. నీ కిప్పుడున్న ఈ భయస్థితిని చూస్తే నాకు నీవు చేశావని చెప్పేవన్నీ సందేహంగానే ఉన్నాయి.'

**విశేషం :** ఎంతటి వీరులనైనా లెక్కచేయని కర్ణుడి దురహంకారం ఈ మాటలలో గుబాళిస్తున్నది. అర్జునుడు అధిక్షేపోక్తులు పలకటం యుద్ధానికి భయపడి మాటాలాడటంగా కర్ణుడు భావించటం శోచనీయం. (సంపా.)

### కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము (సం. 4-55-14)

**వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును గుపితుండై గాండీవవిక్షేప క్షోభిత నభోభాగుండగుచుం గానీను పై నానానిశిత విశిఖంబులు నినిచె; న ట్లయ్యిరువురును దేవాసుర సంగ్రామ సాదృశ్య విక్రమ ప్రక్రియం బొలిచి రట్టి సమయంబున. 96**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని పలుకుతూనే; వాలు+అమ్ములు= వాడిబాణాలు; కురిసినన్= కురిపించగా; అర్జునుండును= అర్జునుడు కూడా; కుపితుండు+ఐ= కోపించినవాడై; గాండీవ= గాండీవంయొక్క; విక్షేప= కదలికచేత; క్షోభిత= క్షోభపెట్టబడిన; నభోభాగుండు+అగుచున్= ఆకాశప్రదేశం కలవాడై; కానీనుపైన్= కర్ణుడిపై; నానా= అనేక రకాలైన; నిశిత= వాడియైన; విశిఖంబులు= బాణములు; నినిచెన్= నింపాడు; అట్లు= ఆ రీతిగా; ఆ+ఇరువురును= ఆ ఇద్దరును; దేవ+అసుర= దేవతలయొక్క, రాక్షసులయొక్క; సంగ్రామ= యుద్ధంతో; సాదృశ్య= పోలికగల; విక్రమ= పరాక్రమంయొక్క; ప్రక్రియన్= రీతిని; పొలిచిరి= ప్రకాశించారు; అట్టి సమయంబునన్= అప్పుడు.

**తాత్పర్యం:** అని కర్ణుడు పై విధంగా పలుకుతూనే వాడి బాణాలను కురిపించసాగాడు. అర్జునుడు కూడా యుద్ధప్రీతితో ఆకాశం దద్దరిల్లే విధంగా పెక్కురకాల వాడిబాణాలు ప్రయోగించాడు. దేవాసుర యుద్ధం వలె వారిరువురి యుద్ధం ప్రకాశిస్తున్నది. ఆ సమయంలో.

**విశేషం:** అలం: ఉపమ. దేవాసురులయుద్ధం పురాణప్రసిద్ధం. అందులో అంతిమ విజయం దేవతలదని రూఢం. కాబట్టి విజయుడి విజయం తథ్యమని ధ్వని. (సంపా.)

**క. రవిదీప్తులు సొర నేరమిఁ । గవిసెం జీఁకట్లు, పవనుగమనం బడఁగెన్,**
**వివిధాస్త్రంబుల నంబర । మవిరళముగఁ బొదువఁబడుట నద్భుతభంగిన్. 97**

**ప్రతిపదార్థం:** రవి= సూర్యుని; దీప్తులు= కాంతులు; చొరనేరమిన్= ప్రవేశించలేకపోవుటచేత; చీఁకట్లు= చీకటులు; కవిసెన్= వ్యాపించాయి; వివిధ+అస్త్రంబులన్= అనేక రకాలైన అస్త్రాలతో; అంబరము= ఆకాశం; అవిరళముగన్= సందులేకుండా; పొదువన్+పడుటన్= వ్యాపింపజేయబడటంచేత; అద్భుతభంగిన్= ఆశ్చర్యకరమైన రీతిలో; పవను+గమనంబు= వాయు సంచారం; అడఁగెన్= అణగిపోయింది.

**తాత్పర్యం:** అనేకాస్త్రాలు ఆకాశంనిండా వ్యాపింపచేయటంతో సూర్యకాంతులు ప్రవేశించలేనందున చీకట్లు వ్యాపించాయి. గాలిసంచార మాగిపోయింది.

**ఉ. అప్పుడు కర్ణసైన్య మమరాధిపనందనుఁ జుట్టుముట్టఁ దే**
**రుప్పరవీథిమై వలయ మొప్ప వెసం బఱపించి క్రీడి పెం**
**గుప్పలుగా రథావలిని ఘోటతతిం గరిరాజిఁ గూల్చుచుం**
**దప్పక భానుసూను మెయిఁ దాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్. 98**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కర్ణసైన్యము= కర్ణుడిసేన; అమరాధిపునందనున్= అర్జునుడిని; చుట్టుముట్టన్= చుట్టూరా ముట్టడించగా; తేరు= రథం; ఉప్పరవీథిమైన్= ఆకాశమార్గంలో; వలయము+ఒప్పన్= గుండ్రంగా; వెసన్= వెంటనే; పఱపించి= నడిపించి; క్రీడి= అర్జునుడు; రథావలిని= రథాల పంక్తిని; ఘోటతతిన్= గుర్రాల సమూహాన్ని; కరిరాజిన్= ఏనుగుల పంక్తిని; కుప్పలుగాన్= రాసులు పడేటట్లుగా; కూల్చుచున్= చంపుతూ; తప్పక= మానక; భానుసూను మెయిన్= కర్ణుడి శరీరాన్ని; తాఁకఁగన్= తగిలేటట్లు; ఏయుచున్= కొట్టుతూ; ఉల్లసిల్లినన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** అప్పుడు కర్ణుడిసేన అర్జునుడిని చుట్టుముట్టింది. అర్జునుడు తన రథాన్ని ఆకాశంపై గుండ్రంగా నడిపిస్తూ, గుర్రాలను, ఏనుగులను, రథాలను కుప్పలు కుప్పలుగా చంపి పడవేస్తూ, కర్ణుడి శరీరానికి నాటుకొనేటట్లు బాణాలను వేస్తూ ప్రకాశించగా.

**వ. రాధేయుండును. 99**

**తాత్పర్యం:** కర్ణుడు కూడా.

**క. తఱిమి పయి నడరుటయు విలు । విఱుగంగా నేసె నరుఁడు విక్రమలీలం**
**గొఱఁతవడనీక కర్ణుఁడు । మెఱుఁగు లడరుశక్తి సురలు మెచ్చఁగ వైచెన్. 100**

**ప్రతిపదార్థం:** తఱిమి= తరుముకొని వచ్చి; పయిన్= మీదికి; అడరుటయును= అతిశయించి రాగా; నరుఁడు= అర్జునుడు; విలు= విల్లు; విఱుగంగాన్+ఏసెన్= విరిగేటట్లుగా బాణమేశాడు; కర్ణుఁడు; విక్రమలీలన్= పరాక్రమ విలాసంతో; కొఱఁతవడన్+ఈక= లోటు రానియ్యక; మెఱుఁగులు+అడరు= ఎక్కువగా ప్రకాశించే; శక్తిన్= శక్తి అనే ఆయుధాన్ని; సురలు= దేవతలు; మెచ్చఁగ(న్)= మెచ్చేటట్లుగా; వైచెన్= విసిరాడు.

**తాత్పర్యం:** కర్ణుడు మీది మీదికి రాగా అర్జునుడు అతడి విల్లు విరిగేటట్లు కొట్టాడు. కర్ణుడు పరాక్రమానికి లోటు రాకుండా మెరిసే శక్తిని అర్జునుడి మీదికి విసిరాడు.

**ఆ. వైచుటయును సవ్యసాచియుఁ గౌరవుల్ । విస్మయంబుతోడి వెఱపు వొంద**
**నధికరయము మెఱయ నది పెక్కుదునియలు, । చేసె నంతరమున శితశరముల. 101**

**ప్రతిపదార్థం:** వైచుటయును= వేయగా; సవ్యసాచియున్= అర్జునుడు కూడా; కౌరవుల్= కౌరవసేన; విస్మయంబుతోడి= ఆశ్చర్యంతోపాటు; వెరపు= భయమును; పొందన్= పొందగా; అధికరయము= మిక్కిలి వేగం; మెఱయన్= మెరయగా; అది= ఆ శక్తిని; శిత శరములన్= వాడిఅయిన బాణాలతో; అంతరమునన్= మధ్యలో; పెక్కు+తునియలు= చాలా ముక్కలు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** కర్ణుడు శక్తిని వేయగా, అర్జునుడు వాడిబాణాలతో కౌరవసేనలు ఆశ్చర్యంతో భయపడేటట్లు ఆ శక్తిని మధ్యలోనే ముక్కలు ముక్కలుగా చేశాడు.

**వ. అట్టియెడ నినతనయు మన్నించు జోదులు దెగి పయిం బడినఁ గ్రోధారుణ నయన పల్లవితంబును దంత కాంతిస్తబకితంబును గుంభస్థల ఫలితంబును నగు తదీయ కరటి ఘటావికట విటపి పటలంబును నాత్మీయ విశిఖ వ్యాపార మహావాతంబునన్ బడలువడం గూల్చి చండమూర్తి దాల్చి శోభిల్లు బీభత్సుంగని యతండు బొమముడివడ నెక్కొని వేఱొక్క విల్లెత్తికొని. 102**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= అప్పుడు; ఇనతనయు(న్)= కర్ణుని; మన్నించు= ఆజ్ఞ పాటించే; జోదులు= వీరులు; తెగి= సాహసించి; పయిన్+పడినన్= మీదపడగా; క్రోధ= కోపంచేత; అరుణ= ఎఱ్ఱనైన; నయన= కళ్ళచే; పల్లవితంబును= చిగురు పుట్టినట్లున్నదియు; దంతకాంతి= పళ్ళకాంతిచేత; స్తబకితంబును= పూలగుత్తికలదిగా ఉన్నదియును; కుంభస్థల= కుంభస్థలంచేత; ఫలితంబును= పండ్లు కలిగినట్లున్నట్టియు; అగు= అయిన; తదీయ= ఆ వీరుల; కరటి ఘటా= ఏనుగుల యొక్క గుంపులనెడి; వికట= వంకరలైన; విటపిపటలంబున్= చెట్ల సముదాయమును; ఆత్మీయ= తనయొక్క; విశిఖవ్యాపార= బాణాలు వేయుట అనెడి; మహావాతంబునన్= పెనుగాలిచే; బడలు పడన్= క్రిందపడేటట్లు; కూల్చి= పడవేసి; చండమూర్తి+తాల్చి= తీవ్రమైన ఆకారం గలిగి; శోభిల్లు= ప్రకాశించెడి; బీభత్సున్= అర్జునుడిని; కని= చూచి; అతండు= కర్ణుడు; బొమముడివడన్= కోపముచేత కనుబొమలు చిట్లించి; నెక్కొని= సన్నద్ధుడై; వేఱు+ఒక్క= మరియొక; విల్లు+ఎత్తికొని= ధనువును తీసుకొని.

**తాత్పర్యం:** కర్ణుడి ఆజ్ఞపై నడిచే యోధులు సాహసించి అర్జునుడిమీద పడ్డారు. ఎఱ్ఱనికళ్ళు అనే చిగుళ్ళతో, కాంతిమంతములైన దంతాలనే పూలగుత్తులతో, కుంభస్థలాలనే పండ్లతో ఏనుగులు అనే పెద్దపెద్ద చెట్లుగా ఉన్న గజసేనను బాణాలనే పెనుగాలితో పడవేసి, అంత పని చేసినందుకు తీవ్రమైన ఆకారంతో ప్రకాశిస్తూ ఉన్న అర్జునుడి మీదికి కర్ణుడు మొగం చిట్లించుకొంటూ మరొక విల్లు తీసికొని.

**విశేషం:** అలం: రూపకం, వృత్త్యనుప్రాసం.

**క. తురగముల నాలుగిట ను । త్తరు నాఱిట నెనిమిదిట రథముఁ బదిటను వా**
**నరు నఱువది శరముల న । న్నరు నంగంబులను బెలుచ నాఁటఁగ నేసెన్. 103**

**ప్రతిపదార్థం:** తురగములన్= గుర్రాలను; నాలుగిటన్= నాల్గు బాణాలతోను; ఉత్తరున్= ఉత్తరుని; ఆఱిటన్= ఆరు బాణాలతోనూ; రథమున్= రథాన్ని; ఎనిమిదిటన్= ఎనిమిది బాణాలతోనూ; వానరున్= హనుమంతుడుగల జెండాను; పదిటను= పది బాణాలతోనూ; ఆ+నరు+అంగంబులను= ఆ అర్జునుడి అవయవాలను; అఱువది శరములన్= అరవై బాణాలతోనూ; పెలుచన్= అధికంగా; నాఁటఁగన్= నాటేటట్లు; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** కర్ణుడు మరొకవిల్లు తీసికొని గుర్రాలను నాల్గు బాణాలతోనూ, సారథియైన ఉత్తరుని ఆరు బాణాలతోనూ, రథాన్ని ఎనిమిది బాణాలతోనూ, హనుమంతుని గుర్తుగల జెండాను పది బాణాలతోనూ, అర్జునుడి అవయవాలపై నాటేటట్లుగా అరవై బాణాలతోనూ కొట్టాడు.

**వ. ఇత్తెఱంగున. 104**

**తాత్పర్యం:** ఈ రీతిగా.

**సీ. రోషంబు భీషణరూపమై చెలువొంద । నతులకేతువు శిఖయై వెలుంగ,**
**శరజాలములు పటుజ్వాలలై నిగుడ న । ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్ల,**
**నుద్ధతి సైఁపక యుజ్జ్వలదివ్యప । తాక మెఱుంగుగా దళిత ధరణి**
**రథనేమిరవము గర్జనముగ శరపరం । పరలు ధారలుగాఁగఁ బరఁగి యడరె,**

**ఆ. నర్జునాంబుదం బనన్యసామాన్య స । ముద్యమమున ముఖపయోరుహముల**
**కాంతి దఱిఁగి యపుడు కౌరవసేనా స । రోవరంబు దీనభావ మొంద. 105**

**ప్రతిపదార్థం:** రోషంబు= కోపం; భీషణరూపము+ఐ= భయంకరమై; చెలువు+ఒందన్= ప్రకాశించగా; అతుల= సాటిలేని; కేతువు= జెండా; శిఖ+ఐ= జ్వాలయై; వెలుంగన్= వెలుగగా; శరజాలములు= బాణ సముదాయాలు; పటు= గొప్పవైన; జ్వాలలు+ఐ= మంటలై; నిగుడన్= వ్యాపించగా; అర్కతనూభవ= కర్ణుడనెడి; ఉగ్ర+అగ్ని= తీక్ష్ణమైన అగ్ని; ప్రజ్వరిల్లన్= ప్రజ్వలించగా; ఉద్ధతి= గర్వం; సైఁపక= సహించక; ఉజ్జ్వల= ప్రకాశించే; దివ్యపతాక= దివ్యమైన జెండా; మెఱుంగుగా(న్)= మెరుపుగానూ; దళితధరణి= చీల్చబడిన భూమి కల; రథనేమి= రథముయొక్క చక్రపు టంచులయొక్క; రవము= ధ్వని; గర్జనముగన్= ఉరుములుగానూ; శరపరంపరలు= బాణాల వరుసలు; ధారలుగాఁగన్= వానధారలుగానూ; పరఁగి= బయల్దేరి; అర్జున+అంబుదంబు= అర్జునుడనే మేఘం; అనన్యసామాన్య= ఇతరులకు చేయశక్యంకాని; సముద్యమమునన్= గొప్ప ప్రయత్నంతో; అపుడు= ఆ సమయాన; కౌరవసేనా సరోవరంబు= కౌరవులసేన యనెడి సరస్సు; ముఖ పయోరుహముల కాంతి= ముఖములనెడి పద్మాల కాంతి; తఱిఁగి= తగ్గి; దీనభావము= దైన్యాన్ని; పొందన్= పొందగా; అడరెన్= అతిశయించింది.

**తాత్పర్యం:** కర్ణుడు కోపంతో భయంకరుడై జెండాలు శిఖలవలె, బాణాలు మంటలవలె, ఉగ్రమైన అగ్ని అయి ప్రజ్వరిల్లగా, అతడి అతిశయాన్ని సహించలేక అర్జునుడు పతాకమే మెరుపు కాగా, రథచక్రాలధ్వని ఉరుములు కాగా, బాణపరంపరలే వానధారలు కాగా, తానే మేఘమై అనన్యసామాన్యంగా ఇతరులకు శక్యంకాని విధంగా కౌరవసేన అనే సరస్సు నందలి ముఖాలనే పద్మాలు వాడిపోయేటట్లుగా బాణధారలు కురిపించాడు.

**విశేషం:** అలం: సావయవ రూపకం. సూర్యుడి కుమారుడు అగ్నితోనూ, ఇంద్రుడి కుమారుడు మేఘుడితోనూ రూపించబడటం సార్థకం. (సంపా.)

**క. వెండియు నుడుగక రవిసుతుఁ । డొండొండ నిశాతసాయకోత్కరము సము**
**ద్దండతఁ బై నించిన నా । ఖండల నందనుఁడు కెంపు కనుఁగవఁ గదురన్. 106**

**ప్రతిపదార్థం:** వెండియున్= మరియు; రవిసుతుఁడు= కర్ణుడు; ఉడుగక= మానక; ఒండు+ఒండు+అ= క్రమక్రమంగా; నిశాత= వాడియైన; సాయక+ఉత్కరము= బాణ సముదాయాన్ని; సముద్దండతన్= తీవ్రంగా; పై నించినన్= అర్జునుడిపై వేయగా; ఆఖండల నందనుఁడు= అర్జునుడు; కనుఁగవన్= రెండు కన్నులందును; కెంపు= ఎరుపు; కదురన్= వ్యాపించగా.

**తాత్పర్యం:** కర్ణుడు అంతటితో మానక వాడి బాణాలను అర్జునుడి మీద నింపివేశాడు. అర్జునుడు కూడా కన్నులు ఎఱ్ఱబడగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. శిరము లలాటంబును గం । ధరమును బాహువులు నురము దందడి వ్రయ్యన్**
**గిరిపైఁ బిడుగులు దొరఁగెడు, । పరుసున దృఢదీప్త శాత భల్లము లేసెన్. 107**

**ప్రతిపదార్థం:** శిరము= తల; లలాటంబును= నుదురును; కంధరమును= కంఠమును; బాహువులున్= చేతులును; ఉరము= రొమ్ము; దందడిన్= దొమ్మిగా; వ్రయ్యన్= నరుకుడుపడగా; గిరిపైన్= కొండమీద; పిడుగులు; తొరఁగెడు పరుసునన్= పడునట్లుగా; దృఢదీప్త= గట్టిగా ప్రకాశించే; శాత= వాడియైన; భల్లములు= బల్లెములు; ఏసెన్= వేశాడు.

**తాత్పర్యం:** తల, నొసలు, మెడ, చేతులు, రొమ్ము- ఇవిఅన్నీ ఒక్కసారిగా తెగిపోయేటట్లుగా కొండమీద పిడుగులు పడ్డట్లుగా గట్టి బల్లేలు అర్జునుడు వేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అఱిముఱి నంగము లెల్లను । నుఱుముగ నిట్లడరు నర్జునుని యమ్ములకున్**
**వెఱచఱచి సూతపుత్త్రుఁడు । పఱచెఁ బుడమియద్రువ మత్స్యపతిసుతుఁ డార్వన్. 108**

**ప్రతిపదార్థం:** అఱిముఱిన్= సంభ్రమంతో; అంగములు= అవయవాలు; ఎల్లను= అన్నియును; నుఱుముగన్= నుగ్గుగా; ఇట్లు+అడరు= ఈ రీతిగా విజృంభించే; అర్జునుని= అర్జునుడియొక్క; అమ్ములకున్= బాణాలకు; వెఱచఱచి= భయపడి; సూతపుత్రుఁడు= కర్ణుడు; పుడమి= భూమి; అద్రువన్= అదరగా; మత్స్యపతిసుతుఁడు= ఉత్తరుడు; ఆర్వన్= కేకలు పెట్టగా; పఱచెన్= (కర్ణుడు) పారిపోయాడు.

**తాత్పర్యం:** ఇట్లా వేగంగా తన అవయవాలన్నిటినీ అర్జునుడి బాణాలు నుగ్గుచేసేటప్పటికి భయపడిపోయి కర్ణుడు పారిపోయాడు. ఆ హడావిడికి భూమి అదిరింది. అది చూచి సంతోషంతో ఉత్తరుడు కేకలు పెట్టాడు.

**విశేషం:** మూలభారతంలో కర్ణు డీ సందర్భంలో రెండుసార్లు ఓడినట్లు చెప్పబడింది. అది కర్ణుడి ప్రయత్న విశేషాన్ని సూచిస్తుంది. కాని, తిక్కన కర్ణు డొక్కసారి ఓడినట్లే ఇక్కడ చిత్రించి సహజత్వాన్ని పోషించటమే కాక అర్జునుడి పరాక్రమాన్ని ధ్వనింపచేశాడు. (సంపా.)

**వ. ఇట్లు కర్ణుండు గయ్యంబు విడిచి పాఱినఁ బార్థుండు దేవదత్తంబు పూరించి యుత్తరున కిట్లనియె.109**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; కర్ణుండు; కయ్యంబున్= యుద్ధమును; విడిచి= విడిచిపెట్టి; పాఱినన్= పారిపోగా; పార్థుండు= అర్జునుడు; దేవదత్తంబు= దేవదత్తమనే పేరుగల తన శంఖాన్ని; పూరించి= ఊది; ఉత్తరునకున్= ఉత్తరుడితో; ఇట్లు= చెప్పబోయేరీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడు యుద్ధరంగాన్ని విడిచిపెట్టి పారిపోగా, పార్థుడు దేవదత్తమనే శంఖాన్ని పూరించి ఉత్తరుడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** రణోత్సాహం కలిగినప్పుడు, రణంలో విజయం సాధించినప్పుడు అర్జునుడు స్వీయ యుద్ధ వీరోల్లాసానికి చిహ్నంగా దేవదత్తం పూరించటం ఈ ఘట్టంలో గమనించగలం. (సంపా.)

**క.** **'వీఁ డొకఁడు కురుబలంబున । వాఁడిమగం డనఁగఁ జాలువాఁ డిబ్భంగిం**
**బోఁడిమి సెడియెను ద్రోణుల । వేఁడిమి యిట మనకు మునుము విక్రమమునకున్.'** **110**

**ప్రతిపదార్థం:** కురుబలంబునన్= కౌరవసేనలో; వాఁడిమగండు= గొప్పవీరుడు; అనఁగన్+చాలువాఁడు= అనదగినవాడు; వీఁడు+ఒకఁడు= వీడొకడు; ఈ+భంగిన్= ఈ రీతిగా; పోఁడిమి= పరాక్రం; చెడియెను= చెడెను; ఇటన్= ఇక్కడ; మనకున్= మనకు; ద్రోణులవేఁడిమి= ద్రోణాచార్యుల వారి పరాక్రమం; విక్రమమునకున్= బలానికి; మునుము= అడ్డు, ఎదురు.

**తాత్పర్యం:** 'కౌరవసేనలో మహావీరుడని చెప్పుకొనదగిన వాళ్ళలో ఈ కర్ణు డొకడు. ఇత డిట్లా పారిపోయాడు కదా! ఇక ద్రోణాచార్యులవారి పరాక్రమం మనకున్న అడ్డు - ఎదురు'.

**వ.** **అనుచు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించునప్పు డుత్తరుండు.** **111**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని పల్కుతూ; వీర+ఆవేశంబునన్= వీరులకుండే ఆవేశంతో; కౌరవ+అనీకంబున్= కౌరవుల సేనను; ఆలోకించునప్పుడు= చూచే సమయాన; ఉత్తరుండు.

**తాత్పర్యం:** అంటూ వీరావేశంతో కౌరవసేనను చూస్తున్నా డర్జునుడు. అప్పుడు ఉత్తరుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ.** **'వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లను**
**'న్మిక్కిలి యైన శౌర్యమును నిర్భరతేజము నంత కంత కి**
**ట్లెక్కెడులావుఁ జూచి మది యెంతయు బెగ్గిలె, మేను చేష్టలం**
**దక్కెఁ నశక్య మిం కిట రథవ్యవహారము నిర్వహింపఁగన్.** **112**

**ప్రతిపదార్థం:** వెక్కసపాటున్= ఆశ్చర్యమూ; భీతియును= భయమూ; విహ్వల భావమున్= వివశత్వమును; ఒంది= పొంది; ఇట్లు= చెప్పబోవు రీతిగా; అనున్= అన్నాడు; మిక్కిలి+ఐన= గొప్పదైన; శౌర్యమును= పరాక్రమమున్నూ; నిర్భరతేజమున్= నిండు తేజస్సున్నూ; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; ఇట్లు= ఈ రీతిగా; ఎక్కెడు లావున్= హెచ్చుతున్న బలమున్నూ; చూచి; మది= మనస్సు; ఎంతయున్= మిక్కిలి; బెగ్గిలెన్= భయంతో చెదరిపోవుతున్నది; మేను= శరీరం; చేష్టలన్= కదలికలను; తక్కెన్= మానింది; ఇంకన్= ఇటుపై; ఇటన్= ఈ యుద్ధంలో; రథవ్యవహారము= రథ సారథ్యం; నిర్వహింపఁగన్= నిర్వహించటానికి; అశక్యము= శక్యం కాదు.

**తాత్పర్యం:** ఆశ్చర్యం, భయం, ఒడలు వివశం కావటం కలిగి ఉత్తరు డిట్లా అన్నాడు- 'మీ పరాక్రమం, తేజస్సు యుద్ధ మవుతున్నకొద్దీ పెరుగుతున్నాయి. మీ బలం చూసేసరికి నా మనస్సు చెదరిపోతున్నది. నా శరీరం చెప్పినట్లు వినటం లేదు. ఇక రథసారథ్యం నిర్వహించటం నాకు అశక్యం.

**ఆ. పుట్టినంతనుండి యిట్టివి యెన్నఁడుఁ। గాన నెందు; నట్లు గాన చోద్య**
**మంది యంతరంగ మవశతఁ బొందిన। కతన నింద్రియముల కడఁక దక్కె.' 113**

**ప్రతిపదార్థం:** పుట్టిన+అంతనుండి= పుట్టినప్పటి నుండి; ఇట్టివి= ఇట్టి యుద్ధాలు; ఎన్నఁడున్= ఎప్పుడును; కానన్= చూడలేదు; అట్లుగానన్= అందువలన; చోద్యము+అంది= ఆశ్చర్యం కలిగి; అంతరంగము= మనస్సు; అవశతన్= వశము లేకపోవుటను; పొందినకతనన్= పొందటంవలన; ఇంద్రియముల కడఁక= ఇంద్రియాల పూనిక; తక్కె(న్)= తగ్గింది.

**తాత్పర్యం:** నేను పుట్టింది మొదలు ఇటువంటి యుద్ధాలు ఎప్పుడూ చూడలేదు. కనుక ఆశ్చర్యం వేసి నా మనస్సు పరవశమై, ఇంద్రియాలు చెప్పినట్లు చేయటం మానివేశాయి.'

**విశేషం:** అర్జునుడి అపూర్వ పరాక్రమ ప్రదర్శనం చూచిన ఉత్తరుడు ఆశ్చర్యాన్నీ, వివశత్వాన్నీ ప్రదర్శించాడు. జన్యజనక రస సంయోజన శిల్పరచన ఇది. ఉత్తరుడి భయం అర్జునుడి యుద్ధవీరాన్ని ధ్వనింపజేస్తున్నది. కాబట్టి ఇక్కడ రసధ్వని గమ్యమానం. (సంపా.)

**తే. అనినఁ గొండొక న వ్వొలయంగఁ జూచి। యింద్రనందనుఁ డాతని కిట్టు లనియె**
**'నేను గలుగంగ నీకేమి యెలమి వాహ,। నముల కుబ్బగ సంచోదనంబు సేయు.' 114**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పల్కగా; కొండొకనవ్వు= చిరునవ్వు; ఒలయంగన్= కలుగునట్లుగా; చూచి; ఇంద్రనందనుఁడు= అర్జునుడు; ఆతనికిన్= ఉత్తరుడితో; ఇట్టులు= ఈ రీతిగా; అనియెన్= పల్కాడు; నేను కలుగంగన్= నేనుండగా; నీకున్+ఏమి?= నీకేమి భయము?; ఎలమిన్= సంతోషంగా; వాహనములకున్= గుర్రాలకు; ఉబ్బగన్= ఉత్సాహం కలిగేట్లు; సంచోదనంబు= రథం తోలటం; చేయు(ము)= సాగించుము.

**తాత్పర్యం:** అనగా, చిరునవ్వుతో అర్జును డన్నాడు- 'ఉత్తరకుమారా! నే నుండగా నీ కేమి భయం? హుషారుగా గుర్రాలను తోలుము.'

**క. అనుటయు నాతఁడు దగ నూ। ల్కొనినం, దా నుదిత నినద కోదండుం డై**
**యనితర సులభోద్యమముగ। ధనంజయుం డిట్టులను నతనితో మఱియున్. 115**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పల్కగా; ఆతఁడు= ఉత్తరుడు; తగన్= తగునట్లు; నూల్కొనినన్= అంగీకరించగా; తాన్= అర్జునుడు; ఉదితనినద= ధ్వనిపుట్టిన; కోదండుండు+ఐ= ధనువు కలవాడై; అనితరసులభ= ఇతరులకు సులభంకాని; ఉద్యమమునన్= ప్రయత్నంతో; ధనంజయుండు= అర్జునుడు; అతనితోన్= ఉత్తరుడితో; మరియున్= ఇంకా; ఇట్టులు= ఈ రీతిగా; అనున్= పలికాడు.

**తాత్పర్యం:** అనగా, ఉత్తరుడు తగినట్లుగా అంగీకరించాడు. ఇక అర్జునుడు వింటి నారి మ్రోయించి, ఇతరు లెవ్వరూ చేయలేని పూనిక కలవాడై ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**క. 'అరుణాశ్వంబులఁ బూనిన । యరదంబున వీఁడె నిడుపులగు చేతులు బం**
**ధుర కంధరంబు వెడలుపు । టురమును నై ద్రోణుఁ డొప్పె నుత్తర కంటే?' 116**

**ప్రతిపదార్థం:** అరుణ+అశ్వంబులన్= ఎఱ్ఱని గుఱ్ఱాలను; పూనిన= కట్టిన; అరదంబునన్= రథమందు; వీఁడె= ఇదుగో; నిడుపులు+అగు చేతులు= పొడవైన చేతులు; బంధుర కంధరంబు= బలిష్ఠమైన మెడ; వెడలుపు+ఉరమునున్= వెడల్పైన రొమ్ము; ఐ= కలవాడై; ద్రోణుఁడు; ఒప్పెన్= ప్రకాశిస్తున్నాడు; కంటే?= చూచావా?

**తాత్పర్యం:** 'ఎఱ్ఱని గుఱ్ఱాలు కట్టిన ఆ రథంమీద పొడుగాటి చేతులు, బలమైన మెడ, వెడల్పైన రొమ్ము కలిగిన ద్రోణు డెట్లా ఉన్నాడో చూచావా?'

**వ. అని చూపి వెండియు నిట్లనియె. 117**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు పలికి; చూపి= ద్రోణుడిని చూపి; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** అని చూపించి మరల ఇట్లా అన్నాడు.

**ఆ. 'సకల కురుకుమార చాప శిక్షాచార్యుఁ, । డాజి దుస్సహుండు, సాంగవేద**
**వేది, నీతిశాస్త్ర విదుఁడు దివ్యాస్త్ర కో । విదుఁడు, సుజన హితుఁడు, విమల బుద్ధి.' 118**

**ప్రతిపదార్థం:** సకల= సమస్తమైన; కురుకుమార= కురువంశ కుమారులకు (కౌరవ పాండవులకు); చాపశిక్షా= ధనుర్విద్య నేర్పటంలో; ఆచార్యుఁడు= గురువు; ఆజిన్= యుద్ధంలో; దుస్సహుండు= సహించ శక్యం కానివాడు; సాంగవేదవేది= షడంగాలతో కూడిన వేదాలను ఎరిగినవాడు; నీతిశాస్త్ర విదుఁడు= నీతిశాస్త్రం ఎరిగినవాడు; దివ్య+అస్త్ర కోవిదుఁడు= దివ్యాస్త్రాలను చక్కగా ఎరిగినవాడు; సుజనహితుఁడు= మంచివారికి హితుడైనవాడు; విమలబుద్ధి= నిష్కల్మషమైన బుద్ధి కలవాడు.

**తాత్పర్యం:** 'ద్రోణుడు కౌరవవంశ రాజకుమారులందరికి ధనుర్విద్య నేర్పిన గురువు; యుద్ధంలో సహించటానికి అశక్యమైనవాడు. వేదవేదాంగాలను నేర్చినవాడు, నీతిశాస్త్రజ్ఞుడు, దివ్యాస్త్రాలు తెలిసినవాడు, మంచివారికి హితం చేసేవాడు, నిష్కల్మషమైన బుద్ధి కలవాడు.'

**విశేషం:** ధనుర్విద్య నేర్పే గురువు కుండవలసిన లక్షణాలన్నీ ద్రోణుడి కున్నట్లు అర్జునుడు చెప్పటం విశేషం. వేదాలు నాలుగు: ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం. షడంగాలు : (ఆరు వేదాంగాలు) : శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం.

**వ. అని యగ్గించి. 119**

**తాత్పర్యం:** అని పొగడి.

**క. 'తన తనయుకంటె నెమ్మన । మున నాకుం గూర్చు భావమున, గురులకు మా**
**ర్కొనియెదము; రాచధర్మం । బున కీడునఁ జేసి యింత పుట్టఁగ వలసెన్. 120**

**ప్రతిపదార్థం:** తన తనయుకంటెన్= తన కొడుకు అయిన అశ్వత్థామ కన్నను; నెమ్మనమునన్= మంచి మనస్సునందు; నాకున్= నాకు; భావమునన్= మనస్సునందు; కూర్చున్= ఇష్టపడతాడు; గురులకున్= గురువులకు; మార్కొనియెదము= ఎదుర్కొంటాము; రాచధర్మంబున కీడునన్+చేసి= రాజధర్మంలో ఉన్న చెడువలన; ఇంత పుట్టఁగ వలసెన్= ఇంత జరుగవలసి వచ్చింది.

**తాత్పర్యం:** 'తన కొడుకైన అశ్వత్థామ కన్నా మిన్నగా నన్నాదరించి చదువు చెప్పాడు. అటువంటి గురువుగారినే ఎదుర్కొనవలసి వస్తున్నది. ఇది రాజధర్మంలోని కీడు. దాని మూలాన ఇట్లా చేయవలసి వస్తున్నది.

**విశేషం:** ద్రోణుడు తన కుమారుడైన అశ్వత్థామకంటె శిష్యుడైన తన పట్ల అభిమానాన్ని అధికంగా చూపేవాడని అర్జునుడు పేర్కొనటంవలన ఆ గురుశిష్యుల ఆత్మీయ సంబంధం సూచించబడింది. ద్రోణుడు బ్రహ్మశిరోనామక మహాస్త్రాన్ని అర్జునాశ్వత్థామల కిరువురి కిచ్చినా, అశ్వత్థామకు ఉపసంహారం చెప్పలేదు. శిష్యుడికి మాత్రమే చెప్పాడు. అటువంటి వాత్సల్యమూర్తి అయిన గురుమూర్తిపై కోదండం ఎత్తవలసి వచ్చినందుకు అర్జునుడు విచారించాడు. కాని, రాజధర్మాన్ని అనుసరించి యుద్ధం చేయక తప్పటం లేదని పేర్కొన్నాడు. అర్జునుడి అంతస్సంఘర్షణను చిత్రించిన పద్య మిది. 'రాచధర్మము' అనే పాఠం కంటె 'రాజధర్మము' అనే పాఠం ఉచితమని కొందరంటారు. రాచధర్మము- వైరి సమాసం కాదు. సిరివల్లభుఁడు వంటి మిశ్ర సమాసం. ఉభయంబులు గూడినవి మిశ్రము. కేవల సంస్కృత శబ్దం (విభక్తి ప్రత్యయం చేరని సంస్కృత శబ్దం, వికృతి శబ్దంతో సమసించినచో - అది దుష్ట(వైరి) సమాసం. అనేక మాఱులు - అల్పదండు వంటిది. 'రాచగుణంబు పోవిడిచి రాజ్యము గోల్పడి'... రా.యు.కాం. ప్రయోగం. అక్కడ రాజ- అని మారిస్తే ప్రాసమైత్రి చెడుతుంది. (సంపా.)

**చ. ఎదురుగఁ బోవ నిమ్ము రథ మీతని తేరికి' నన్న నాతఁడుం**
**బదిలముతోడ రథ్యముల పగ్గము లేడ్తెఱ నూలుకొల్పి యు**
**న్మదగతి నట్ల చేసిన నమానుషవిక్రముఁ డైన ద్రోణుఁడుం**
**గదిసి యిభం బిభంబుఁ జెనకం జనుదెంచిన లీల వచ్చినన్. 121**

**ప్రతిపదార్థం:** రథము= మన రథాన్ని; ఈతని తేరికిన్= ఈయన రథానికి; ఎదురుగన్= ఎదురుగా; పోవనిమ్ము= పోనిమ్ము; అన్నన్= అనగా; ఆతఁడున్= ఆ ఉత్తరుడును; పదిలముతోడన్= జాగ్రత్తగా; రథ్యముల= గుర్రాలయొక్క; పగ్గములు= త్రాళ్ళు (కళ్ళెములు); ఏడ్తెఱన్= పరాక్రమంతో; నూలుకొల్పి= అంగీకరింప జేసి; ఉన్మదగతిన్= గర్వంతో కూడిన రీతితో; అట్లు+అ చేసినన్= అర్జునుడు చెప్పినట్లు చేయగా; అమానుష విక్రముఁడు+ఐన= మనుష్యులకు మించిన పరాక్రమం కలవాడైన; ద్రోణుఁడున్= ద్రోణుడు కూడా; కదిసి= సమీపించి; ఇభంబు+ఇభంబున్= ఏనుగు ఏనుగును; చెనకన్= ఎదుర్కొనటానికి; చనుదెంచినలీలన్= వచ్చినట్లుగా; వచ్చినన్= రాగా.

**తాత్పర్యం:** మన రథాన్ని అతడి కెదురుగా పోనిమ్ము' - అనగానే ఉత్తరుడు మెల్లగా గుర్రాల పగ్గాలను లాగి చెప్పినట్లు చేశాడు. ద్రోణుడు మనుష్యులకు మించిన పరాక్రమం కలవాడు. అతడు కూడా తన రథాన్ని ఎదురుగా తోలించి ఏనుగు ఏనుగును తలపడటాని కొక్కచోటికి చేరినట్లు రాగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**వ. నరుఁడు నమస్కరించి గురున కిట్లనియె. 122**

**తాత్పర్యం:** అర్జునుడు తన గురువైన ద్రోణాచార్యులకు నమస్కరించి ఇట్లా అన్నాడు.

**క. 'అడవులఁ బెద్దయుఁ గాలం । బిడుమలఁ గుడిచితిమి; మాకు నిది దఱి యని యి**
**ప్పుడు వచ్చితిమి; విపన్నుల । యెడఁ గృప సేయుటయ లెస్స; యీ రలుగకుఁడీ! 123**

**ప్రతిపదార్థం:** అడవులన్= అడవులందు; పెద్దయున్+కాలంబు= చాలా కాలం; ఇడుమలన్= బాధలను; కుడిచితిమి= అనుభవించాము; మాకున్= మాకు; ఇది; తఱి= సమయం; అని; ఇప్పుడు= ఈ సమయంలో; వచ్చితిమి= వచ్చాము; విపన్నుల+ఎడన్= విపత్తును పొందినవారి పట్ల; కృప+చేయుట+అ= దయ చూపుటే; లెస్స= మంచిది; ఈరు= మీరు; అలుగకుఁడీ! = కోపించకండి.

**తాత్పర్యం:** 'ఆచార్యా! అడవులలో పెక్కు కష్టాలను అనుభవించి, ఇది తగిన సమయమని భావించి వచ్చాం. విపత్తు పొందినవారిపట్ల దయచూపుటే మంచిది. మీరు నాపట్ల కోపం ప్రదర్శించవద్దు.

**అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధంబు సేయుట (సం. 4-53-1)**

**క. మును వెఱతు నేయ మీరలు । నను నేసినఁ గాని' యనుడు నాకేశసుతున్**
**ధనురాచార్యుం డిరువది । సునిశిత బాణముల నేసెఁ జూపఱు వొగడన్. 124**

**ప్రతిపదార్థం:** మీరలు= మీరు; ననున్= నన్ను; మును= ముందుగా; ఏసినన్+కాని= బాణాలతో కొట్టినగాని; ఏయన్= వేయుటకు; వెఱతున్= జంకుతాను; అనుడున్= అనగా; ధనుస్+ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; నాకేశసుతున్= అర్జునుడిని; ఇరువది సునిశితబాణములన్= ఇరవై వాడి బాణాలతో; చూపఱు= చూచేవారు; పొగడన్= కీర్తించగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** మీరు ముందుగా నన్ను బాణాలతో కొట్టితేనే కాని మీమీద బాణాలు వేయటానికి జంకుతున్నాను' అని అర్జునుడు అనగానే ద్రోణుడు చూచేవాళ్ళు పొగడే విధంగా అతడిపై ఇరవై వాడిబాణాలను వేశాడు.

**ఆ. అర్జునుండు వాని నన్నింటి నడుమన । తునియ నేయుటయును ద్రోణుఁ డడరి**
**శతసహస్ర సంఖ్య శరములు గప్పిన । నతఁడు నతనిఁ గప్పెఁ బ్రతిశరముల. 125**

**ప్రతిపదార్థం:** అర్జునుండు= అర్జునుడు; వానిన్+అన్నిటిన్= ఆ బాణాలనన్నింటిని; నడుమన్+అ= మధ్యలోనే; తునియన్= ముక్కలయ్యేటట్లు; ఏయుటయును= వేయగా; ద్రోణుఁడు; అడరి= అతిశయించి, విజృంభించి; శతసహస్రసంఖ్య శరములు= వందలు వేలుగా బాణాలు; కప్పినన్= కప్పగా; అతఁడున్= అర్జునుడును; అతనిన్= ద్రోణుడిని; ప్రతిశరములన్= ఎదురు బాణాలతో; కప్పెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ద్రోణుడి బాణాలను మధ్యలోనే త్రుంచి వేశాడు. దాంతో ద్రోణుడు విజృంభించి వందలు వేల బాణాలతో అర్జునుడిని కప్పివేశాడు. అర్జునుడు కూడా అట్లే ద్రోణుడిని ఎదురు బాణాలతో కప్పివేశాడు.

**చ. అతిరథు లస్త్రశస్త్రవిదు లద్భుతబాహుబలుల్ పరాక్రమో**
**ర్జితయశు లిట్లు దాఁకి గురుశిష్యులు కౌరవసేనలోని భూ**
**పతిసుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి బాణజాల సం**
**వృత గగనాంగణంబగు నవీన మహాహవ విక్రమంబునన్. 126**

**ప్రతిపదార్థం:** అతిరథులు= రథారూఢులైన అనేకమంది రథికులైన, ధానుష్కులతో ఒకేసారి యుద్ధం చేయగలవారు; అస్త్రశస్త్రవిదులు= మంత్రసహిత బాణాలను, సామాన్య బాణాలను ప్రయోగించటం తెలిసినవారు; అద్భుత= ఆశ్చర్యకరమైన; బాహుబలుల్= బాహుబలం కలవారు; పరాక్రమ= పౌరుషంచేత కలిగిన; ఊర్జిత= గొప్పదైన; యశులు= కీర్తి కలవారు; గురుశిష్యులు= గురువును శిష్యుడును; ఇట్లు= ఈ రీతిగా; తాఁకి= ఎదుర్కొని; కౌరవసేనలోని= కౌరవుల సేనలో ఉన్న; భూపతిసుతకోటికిన్= రాజపుత్ర సముదాయానికి; బాణజాల= బాణాల సమూహమనెడి వలచేత; సంవృత= కప్పబడిన; గగన+ అంగణంబు+అగు= ఆకాశమనేదానికి కలిగిన; నవీన= క్రొత్తరకపు; మహా+ఆహవ= ఘోరయుద్ధ మనెడి; క్రమంబునన్= పరాక్రమంతో; వెఱఁగుపాటు= ఆశ్చర్యాన్ని; ఒనరించిరి= కల్గజేశారు.

**తాత్పర్యం:** అతిరథులు, శస్త్రాస్త్రవేత్తలు, గొప్ప బాహుబలం కలవారు, కేవలం పరాక్రమంతోనే కీర్తిని సంపాదించిన వారూ అయిన ఆ గురుశిష్యులు ఒకరి నొక రెదుర్కొని శస్త్రాస్త్రాల సమూహంతో ఆకాశాన్నే కప్పివేయగా కౌరవసేనలోని కురుకుమారులందరూ ఆ ఇరువురి కొంగ్రొత్త పరాక్రమ స్ఫూర్తికి ఆశ్చర్యచకితులైపోయి నిలబడి చూడసాగారు.

**విశేషం:** జనకజన్యరసాలైన వీరాద్భుతాలను వరుసగా వీరుల నాశ్రయించి, ప్రేక్షకుల నాశ్రయించి జనించినట్లు వర్ణించి, రెండింటి అనుభవాలను పఠితలు పొందేటట్లు వర్ణించే పద్ధతి తిక్కన యుద్ధవర్ణనలలో సర్వసామాన్యం. (సంపా.)

**వ. అట్టి యెడం గురుసైన్యంబు జనంబులు. 127**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో; కురుసైన్యంబు= కౌరవసేనలోని; జనంబులు= జనులు.

**తాత్పర్యం:** ఆ సమయంలో కౌరవసేనలో ఉన్న జనులు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'గురుఁ డొక్కరుండు దక్కఁగ । నరుఁడు గడఁగినపుడు మార్కొనం జాపధరుం**
**డొరుఁడు గలఁడె! మఱి వెదకిన । హరుఁడు గలం; డింకఁ గలుగు ననరా దెందున్. 128**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; కడఁగిన+అపుడు= తాకినపుడు; మార్కొనన్= ఎదుర్కొనటానికి; గురుఁడు= ద్రోణుడు; ఒక్కరుండు తక్కఁగన్= ఒక్కడు తప్పి; ఒరుఁడు= మరొక; చాపధరుండు= విల్లు పట్టినవాడు; కలఁడె= ఉన్నాడా?; మఱి= ఇంకన్; వెదకినన్= వెదుకగా; హరుఁడు= శివుడు; కలండు= ఉన్నాడు; ఎందున్= ఎక్కడైనా; ఇంకన్= ఇంక; కలుగున్+అనరాదు= ఉండుననటానికి వీలులేదు.

**తాత్పర్యం:** 'అర్జునుడు యుద్ధం చేయటానికి పూనుకొంటే అతడిని ఎదుర్కొనటానికి ద్రోణుడు తప్ప సమర్థుడైన ధనుర్ధారి మరెవ్వడు లేడు. బాగా వెదికితే శివు డుండ వచ్చును. అంతేకాని మరెక్కడా మరొక'రున్నారనటానికి వీలు లేదు.

**క. ద్రోణుఁడు రయమున నేసిన । బాణము లెడతెగక యొక్క బాణమ పోలెన్**
**శ్రేణి యయి వోవఁ బార్థుఁడు । రేణువు గావించుఁ గంటిరే చిత్రగతిన్? 129**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యులు; రయమునన్= వేగంగా; ఏసిన= వేసిన; బాణములు= బాణాలు; ఎడతెగక= మధ్యలో విచ్ఛిత్తిలేక; ఒక్కబాణము+అ+పోలెన్= ఒకేబాణం వలెనే; శ్రేణి+అయి= పంక్తిగా; పోవన్= పోవగా; పార్థుఁడు= అర్జునుడు; చిత్రగతిన్= విచిత్రమైన పద్ధతిని; రేణువు= నుగ్గుగా; కావించున్= చేస్తున్నాడు; కంటిరే?= చూచారా?

**తాత్పర్యం:** ద్రోణుడు వేగంగా వేసే బాణాలు ఒకే బాణమా అన్నట్లు పంక్తిగా వెళ్ళుతూ ఉంటే అర్జునుడు వాటిని పొడిపొడి చేస్తున్నాడు. చూచారా ఈ విచిత్రాన్ని!

**విశేషం:** అలం: అతిశయోక్తి.

**క. గురుశరములు సితపక్ష। స్ఫురణంబున నంచపిండు పొలుపు వహించెన్;**
**నరుబాణతతి ఘనావలి। కరణి మిగుల నొప్పె నల్లగఱుల చెలువునన్.'** 130

**ప్రతిపదార్థం:** గురుశరములు= ద్రోణాచార్యుడి బాణాలు; సితపక్ష= తెల్లని రెక్కలయొక్క; స్ఫురణంబునన్= ప్రకాశంతో; అంచపిండు పొలుపు= హంసల సముదాయం వంటి అందాన్ని; వహించెన్= పొందాయి; నరు బాణతతి= అర్జునుడి బాణ సముదాయాలు; నల్లగఱుల= నల్లని రెక్కలయొక్క; చెలువునన్= ప్రకాశంతో; ఘన+ఆవలికరణిన్= మబ్బుల సముదాయం వలె; మిగులన్= మిక్కిలి; ఒప్పెన్= ప్రకాశించాయి.

**తాత్పర్యం:** తెల్లని రెక్కలు కట్టిఉన్న ద్రోణాచార్యుడి బాణాలు హంసల గుంపుల వలె ప్రకాశిస్తే, నల్లనిరెక్కలు కట్టి ఉన్న అర్జునుడి బాణాలు మేఘాల సముదాయంవలె ప్రకాశించాయి.'

**విశేషం:** అలం: ఉపమ. బాణాలకు వెనుక భాగంలో పక్షుల రెక్కలు కట్టటం పరిపాటి. అవి గాలికి ఎదురుగా దూసుకొనిపోవటానికి తోడ్పడతాయి. ద్రోణుడి బాణాలు తెల్లని పక్షుల రెక్కలతో రాణించటంతో అవి హంసలవలె భాసించాయి. అర్జునుడి బాణాలు నల్లని పక్షుల రెక్కలతో కూడి ఉండటంతో అవి మేఘాలవలె కనపడ్డాయి. హంసలు వర్షాకాలంలో విహరించలేవు. విహరించినా మనలేవు. అందువలన ద్రోణుడి బాణాలు వృథా కానున్నాయని అలంకారధ్వని. (సంపా.)

**వ. అనుచుం గనుం గొనుచుండ.** 131

**ప్రతిపదార్థం:** అనుచున్= అని పలుకుతూ; కనుంగొనుచున్+ఉండన్= చూస్తూ ఉండగా.

**తాత్పర్యం:** అట్లా పలుకుతూ చూస్తూ ఉండగా.

**శా. శ్రావ్యంబై చెలఁగన్ గభీర మధుర జ్యానాద ముద్దామ వీ**
**రవ్యాపార నిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్**
**సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్**
**దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్.** 132

**ప్రతిపదార్థం:** గభీర= గంభీరమైన; మధుర= వినసొంపైన; జ్యానాదము= అల్లెత్రాడుల ధ్వని; శ్రావ్యంబు+ఐ= వినటానికింపైనదై; చెలఁగన్= ధ్వనించగా; ఉద్దామ= గొప్పదైన; వీర= వీరులయొక్క; వ్యాపార= క్రియలయందలి; నిరూఢతన్= నేర్పుతో; ప్రతిశర= ఎదుటివారి బాణాల యొక్క; ఆరంభంబు= పనిని; మర్దించుచున్= నాశనం చేస్తూ; సవ్యప్రౌఢిన్= ఎడమచేతి ప్రౌఢిమతోను; దృఢ+అపసవ్య= గట్టిదైన కుడిచేతియొక్క; గతిన్= గమనంతో; ఆశ్చర్యంబుగాన్= చూచేవారికి ఆశ్చర్యం కలిగేటట్లుగా; ఏయుచున్= కొట్టుతూ; ఇద్దఱును= ద్రోణార్జును లిరువురును; దివ్య+అస్త్రంబులన్= దివ్యమైన మంత్రావిష్ట బాణాలతో; సాదృశ్యంబు= పోలిక; అదృశ్యంబుగన్= కనబడకుండేటట్లుగా; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** ఆ ద్రోణార్జును లిరువురును వారి అల్లెత్రాడుల చప్పుడు శ్రావ్యంగా ఉండేటట్లు సవ్యాపసవ్యాలుగా బాణాలు ప్రయోగిస్తూ, ఇద్దరూ సమంగా ఉన్నారో, లేక, వారి నడుమ తేడా ఉన్నదో అనే తారతమ్యం తెలిసికొనటానికి వీలు లేనంతగా దివ్యాస్త్రాలతో యుద్ధం చేశారు.

**విశేషం:** అలం: అసంభవోపమ. 1. ఈ పద్యం తిక్కన శిల్పరమణీయ సృష్టికి ఒక చక్కని ఉదాహరణం. ఇందులో శ్రావ్యంగా మ్రోగింది గంభీర మధుర జ్యానాదం. ముద్రాలంకార సుందరంగా స్వీయ కవితాలక్షణాలను తిక్కన వ్యంజింప చేశాడు. తిక్కనది అర్థగుణ ప్రధానరచన. అది శ్రావ్యంగా, గంభీరంగా, మధురంగా మ్రోగిన గుణశబ్దాల వర్ణనం ద్వారా సూచించాడు. పృథక్పదత్వం శబ్దగుణ మాధుర్యం, ఉక్తివైచిత్ర్యం అర్థగుణ మాధుర్యం. మధురగుణానికి గాంభీర్యగుణం తోడుకావటంచేత అర్థప్రౌఢిని ప్రదర్శించే అర్థగుణమైన ఓజస్సు మాధుర్యానికి పోషకంగా నిలుపబడిందని సూచన. శ్రావ్యత ప్రసాద లక్షణం. బంధ శైథిల్యం అటు మాధుర్యాన్నీ, అర్థ వైమల్యం ఇటు ఓజోగుణాన్నీ పోషించే ఒక ప్రౌఢ గుణ సంవిధానం ఈ పద్యరచనకు జీవం.

2. ఈ పద్యం పరుషరసమైన వీరరస ప్రధానమైనా, బాణ ప్రయోగం గుణశబ్ద మాధుర్యం చేత శ్రావ్యమై చెలగటం చేత రచన సమాసభూయిష్ఠం కాక పృథక్పదత్వాన్నే వరించింది. ఇద్దరూ దివ్యాస్త్రాలను ప్రయోగించారు. ఒకరు దివ్యాస్త్రాన్ని ప్రయోగించగానే అది విజృంభించక పూర్వమే మరొకరు దానిని మర్దిస్తున్నారు. అందువలన అస్త్రాల ఆర్భాటంకంటె అల్లెత్రాటి శ్రావ్యనాదం నిరంతరంగా వినిపిస్తున్నది. అపూర్వంగా ఇద్దరు వీరులూ సవ్యాపసవ్యాలుగా బాణాలను సమబలంతో వేస్తున్నారు. అది నిజంగా అపూర్వం, ఆశ్చర్యకరం. వారిద్దరిని గానీ, వారిద్దరూ చేస్తున్న యుద్ధాన్నిగాని మరే ఉపమానంతో పోల్చాలని కవి భావించినా, ఆ ఉపమానమే అదృశ్యమై పోయిందని ఉక్తి వైచిత్ర్యం ప్రదర్శించాడు తిక్కన.

3. 'ఉద్దామ వీర వ్యాపార నిరూఢత'ను 'ప్రతిశరారంభంబు మర్దించటం'గా వర్ణించి అర్థవైమల్యాన్ని (అర్థగుణమైన ప్రసాదాన్ని) పోషించటం సవ్యప్రౌఢి, దృఢాపసవ్యగతి - అనటంలో సవ్యప్రయోగంలో ఎంత ప్రౌఢి ఉంటుందో, అపసవ్య ప్రయోగంలో కూడా అంత దృఢత్వం ఉండటం చూచేవారికి ఆశ్చర్యజనకంగా కనపడిన గుణమని - అర్థగుణమైన ఓజస్సును నిబంధించటం తిక్కన శిల్పం. గుణవద్రచనలో గుణధ్వనిని రసవ్యంజకంగా చిత్రించిన పద్యశిల్ప మిది. (సంపా.)

**వ. ఇంద్రాగ్ని వాయు వరుణ దైవత్యంబులగు శరంబులు గురుం డేసిన, నరుండును దత్తద్దేవతాకంబు లగునంబకంబులఁ బ్రతిహతంబులు సేయుచు వచ్చె; నయ్యిరువురుఁ బెల్లేయు సాయకంబు లంతరిక్షంబున దళంబై సంతమసంబు గలిగి యునికి నేబాణం బెక్కడఁ బాఱుటయుం దోఁప కుండె; నట్టియెడఁ గుంభసంభవు బలంబు సరభసంబుగా నతని కడ్డంబు సొచ్చిన నివ్వచ్చుండు వ్రేల్మిడిం బొడిసేసి సకేయూరంబు లగు బాహుదండంబులను సకుండలంబు లగు కర్ణపాశంబులను సకిరీటంబులగు శిరోభాగంబులను భూభాగం బలంకరించి యప్పు డావహిల్లిన రుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె; నిట్లు దుర్జయుండగు నర్జునుండు సైన్యంబు దైన్యంబు నొందించుచు నాచార్యునకు భరంబుగ నేట్లాడుచున్నం జూచి గురుండు విస్మితుండై.** **133**

**ప్రతిపదార్థం:** ఇంద్ర+అగ్ని, వాయు, వరుణ, దైవత్యంబులు+అగు= ఇంద్రుడు, అగ్ని, వాయువు, వరుణుడు దేవతలుగా కలిగిన; శరంబులు= అస్త్రాలు; గురుండు= ద్రోణాచార్యుడు; ఏసినన్= వేయగా; నరుండును= అర్జునుడు కూడా; తద్+తద్+దేవతాకంబులు+అగు= ఆయా దేవతలుకల; అంబకంబులన్= బాణాలతో; ప్రతిహితంబులు= త్రిప్పికొట్టబడినవిగా; చేయుచున్+వచ్చెన్= చేస్తూ ఉన్నాడు; ఆ+ఇరువురున్= ఆ ద్రోణార్జును లిరువురున్నూ; పెల్లు+ఏయు= ఎక్కువగా ప్రయోగిస్తున్న;

సాయకంబులు= బాణాలు; అంతరిక్షంబునన్= ఆకాశంలో; దళంబు+ఐ= ఒత్తుగా ఉండి; సంతమసంబు= కారుచీకటి; కలిగియునికిన్= కలిగిఉన్నందున; ఏ బాణంబు= ఏ బాణము; ఎక్కడన్= ఎక్కడికి; పాఱుటయున్= వెళ్ళుతున్నదీ; తోఁపకుండెన్= తెలియకున్నది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; కుంభసంభవు= ద్రోణుడియొక్క; బలంబు= సేన; సరభసంబుగాన్= తొందరగా; అతనికిన్= ద్రోణుడికి; అడ్డంబు= అడ్డంగా (రక్షగా); చొచ్చినన్= ప్రవేశించగా; విప్వచ్చుండు= అర్జునుడు; వ్రేల్మిడిన్= వెంటనే; పొడి+చేసి= నుగ్గుచేసి; సకేయూరంబులు+అగు= భుజకీర్తులతో కూడిన; బాహు దండంబులను= కర్రలవంటి బాహువుల చేతను; సకుండలంబులు+అగు= కుండలాలతో కూడిన; కర్ణపాశంబులను= (పాశశబ్దము కర్ణపూర్వక మయినప్పుడు శోభార్థకము. కర్ణపాశః= సుకర్ణః) అందమైన చెవులచేతను; సకిరీటంబులు+అగు= కిరీటాలతో కూడిన; శిరోభాగంబులను= శిరస్సుల చేతను; భూభాగంబు= భూమిని; అలంకరించి= అలంకరించి; అప్పుడు= ఆ సమయంలో; ఆవహిల్లిన= ఏర్పడిన; రుధిరసాగరంబునకున్= రక్తమనెడి సముద్రానికి; రత్నాకరత్వంబు= రత్నాలకు నిధి అగుటను; అలవరించెన్= కల్గజేశాడు; ఇట్లు= ఈ రీతిగా; దుర్జయుండు+అగు= జయింప శక్యంకాని; అర్జునుండు= అర్జునుడు; సైన్యంబున్= సేనను; దైన్యంబున్+ ఒందించుచున్= దీనదశ కలదిగాచేస్తూ; ఆచార్యునకున్= గురువైన ద్రోణునకు; భరంబుగన్= బరువుగా; ఏట్లాడుచున్నన్= యుద్ధం చేస్తూఉండగా; చూచి= కన్గొని; గురుండు= ద్రోణుడు; విస్మితుండు+ఐ= ఆశ్చర్యం కలవాడై.

**తాత్పర్యం:** ద్రోణుడు ఇంద్ర, వరుణ, అగ్ని, వాయు దేవతాకములైన అస్త్రాలు ప్రయోగించగా, అర్జునుడు అవే దేవతాకములైన అస్త్రాలతో వాటిని త్రిప్పికొట్టాడు. వారిద్దరూ వేసే బాణాలు దట్టంగా ఉండటం మూలాన ఆకాశంలో కారుచీకట్లు క్రమ్ముకొని పోయి ఏ బాణం ఎటు వస్తున్నదో, ఎటు పోతున్నదో తెలియకుండా అయిపోయింది. అంతలో ద్రోణుడి సేనలు ద్రోణుడికి సాయంగా అడ్డంగా వచ్చాయి. అర్జునుడు వెంటనే ఆ సేనలను పీనుగు పెంటలు చేశాడు. భుజకీర్తులతో బాహువులు, కుండలాలతో చెవులు, కిరీటాలతో తలలు పడిపోయి అది రక్తసముద్రమైతే వీటితో రత్నాకరం కూడా అయింది. ద్రోణుడు అర్జునుడి యుద్ధం చూశాడు. తన సేన దైన్యం పొందింది. తనకా యుద్ధం బరువౌతున్నది. అర్జునుడు దుర్జయు డనిపించింది. ఆశ్చర్యపోయాడు.

**విశేషం:** అలం: పర్యాయం. **"పర్యాయో యది పర్యాయేణైక స్యానేక సంశ్రయః"**. ఒక వస్తువుకే ఒకదాని తరువాత మరొకటిగా అనేకాశ్రయాలను వర్ణిస్తే పర్యాయాలంకారం. ఇందులో అర్జునుడు సైనికులను బాణాలతో ఖండించగా వారి శరీరాంగాలు రక్తపుమడుగులలో పడి కేయూరాలు, కుండలాలు, కిరీటాలూ మొదలైన ఆభరణాలలో రాణిస్తున్నాయి. రక్తపుమడుగే సముద్రంగా ఉంటే, ఈ రత్నాభరణాలు ఆ సముద్రానికి రత్నాకరత్వాన్ని కలిగిస్తున్నాయని చమత్కారం. రుధిర సాగరం, మహాసాగరం, రత్నాకరం - అనే భావచిత్రాల చలనచిత్రాన్ని ఒకే స్థిరచిత్రంమీద దర్శింప చేసిన ఈ రచనాశిల్పం పర్యాయమనే అలంకారం వలన సాధించబడింది. జుగుప్సాకరమైన సన్నివేశాన్ని అలంకరించి ఆస్వాద సుందరంగా మార్చే శిల్ప మిది. తిక్కన 'అలంకరించి' అనే క్రియలో తన ముద్ర వేసికొన్నాడు. (సంపా.)

**క. 'అర్జునుని నాహవంబున । నిర్జింపఁగ నగునె ఫాలనేత్రున కైనం?**
**బర్జన్యసుతుఁడు శరవ । ర్షోర్జితమూర్తి యగు టరయ నుచితము కాదే!' 134**

**ప్రతిపదార్థం:** అర్జునునిన్= అర్జునుడిని; ఆహవంబునన్= యుద్ధంలో; నిర్జింపఁగన్= జయించటానికి; ఫాలనేత్రునకున్+ఐనన్= శివుడికైనా; అగునె?= వీలగునా?; పర్జన్యసుతుఁడు= ఇంద్రుని కొడుకైన అర్జునుడు; శరవర్ష= బాణ వర్షంతో; ఊర్జితమూర్తి= దృఢమైన (సమృద్ధమైన) మూర్తికలవాడు; అగుట= అయి ఉండటం; అరయన్= చూడగా; ఉచితము+అ కాదే!= తగినదే కదా!.

**తాత్పర్యం:** 'అర్జునుడిని యుద్ధంలో శివుడైనా గెలువగలడా? అతడు పర్జన్యుని సుతుడు కనుక ఊర్జితమూర్తి అయి శరవర్షం కురిపించటం తగినట్లుంటున్నది కదా!'

**విశేషం:** అలం: పరికరాంకురం. ఇందులోని విశేష్యాలన్నీ సార్థకాలే. అర్జునుడు పర్జన్యసుతుడు. అంటే- మేఘాధిపతి అయిన ఇంద్రుడి కుమారుడు, అందువలననే అతడు 'శరవర్షోర్జితమూర్తి'. వర్షం అగ్నిని ఆర్పగలగటం సహజం. అందువలన అగ్నినే ఫాలనేత్రంగా కల ఈశ్వరుడు సైతం అర్జునుడితో యుద్ధం చేయడానికి భయపడతాడు. శివుడి తిరుగులేని ఆయుధం మూడవకంటి మంట. దానిని కూడా చల్లార్పగలిగిన పౌరుషం కలవా డర్జునుడని అలంకారధ్వని. పరికరాంకురం ఆ ధ్వనికి మూలమైనది ఈ పద్యంలో. (సంపా.)

**వ. అని మఱియును దగిన పలుకుల నగ్గింప, నిలింపనికరంబు.** **135**

**ప్రతిపదార్థం:** అని= పలికి; మఱియును= ఇంకా; తగినపలుకులన్= తగిన మాటలతో; అగ్గింపన్= పొగడగా; నిలింప నికరంబు= దేవతల సమూహం.

**తాత్పర్యం:** ద్రోణు డింకా తగినట్లు పొగడుతూ ఉన్నాడు. అంతలో పైనున్న దేవతలు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'ఇంతప్రొద్దు కిరీటి కట్టెదుర నిలువ । వెఱవ కున్నప్డు ద్రోణుండ వింటివాఁడు**
**నల్లవో తన యున్న సేనకు నొకండ । బలిమిఁ దలమీఁఱునే? యిట్లు నిలువ వలదె!'** **136**

**ప్రతిపదార్థం:** ఇంతప్రొద్దు= ఇంతసేపు; కిరీటికట్టెదురన్= అర్జునుడి ఎదుట; నిలువన్= నిల్చుటకు; వెఱవక+ఉన్నప్డు= భయపడనప్పుడే; ద్రోణుండు+అ= ద్రోణుడే; వింటివాఁడు= ధనుర్ధారి; తన+ఉన్న సేనకున్= తన సేనకు; ఒకండు+అ= ఒక్కడే; బలిమిన్= బలంతో; తలమీఁఱునే?= తలకు మించునా?; ఇట్లు= ఈ రీతిగా; నిలువవలదె?= ఎదురు నిలువద్దా?; అల్లవో= అదే, ఆశ్చర్యం!.

**తాత్పర్యం:** 'ఇంతసేపు అర్జునుడి ఎదుట నిలిచి పోరాటానికి భయపడకుండా ఉండటంచేత ద్రోణుడే విలుకాడు!. తన సేనకు తా నొక్కడే ముందు మీరుతాడు. ఇట్లా నిలువగలగాలి. ఇది ఆశ్చర్యం కలిగిస్తున్నది!.'

**మ. అనుచుండం ద్రిదశేంద్రసూనుఁడు రయం బత్యంత ఘోరంబుగా**
**ఘనశాతోజ్జ్వల దుర్నివార విలసత్కాండంబులన్ ద్రోణు వా**
**హన సూతధ్వజ దేహముల్ వొదివె; ని ట్లస్త్రాబ్ధి నిర్మగ్నుఁ జే**
**సిన హాహా నినదంబు లొక్క మొగిఁ బేర్చెన్ సర్వసైన్యంబులన్.** **137**

**ప్రతిపదార్థం:** అనుచున్+ఉండన్= దేవతలు ఇట్లా అనుకొంటూ ఉండగా; త్రిదశ+ఇంద్ర సూనుఁడు= అర్జునుడు; రయంబు= వేగం; అత్యంత= మిక్కిలి; ఘోరంబుగాన్= తీవ్రం కాగా; ఘన= గొప్పవైన; శాత= వాడియైన; ఉజ్జ్వల= ప్రకాశించే; దుర్నివార= నివారించరాని; విలసత్= ప్రకాశించే; కాండంబులన్= బాణాలతో; ద్రోణు= ద్రోణుడియొక్క; వాహన= గుర్రాలను; సూత= సారథిని; ధ్వజ= జెండాను; దేహముల్= దేహమును; పొదివెన్= కప్పివేశాడు; ఇట్లు= ఈ రీతిగా; అస్త్ర+అబ్ధి= అస్త్రములనెడి సముద్రంలో; నిర్మగ్నున్= మునిగినవాడినిగా; చేసినన్= చేయగా; సర్వసైన్యంబులన్= అందరి సైన్యాలలోనూ; హాహా నినదంబులు= హాహాకారాలు, భయంతో నిండిన అరుపులు; ఒక్కమొగిన్= ఒక్కసారిగా; పేర్చెన్= అతిశయించాయి.

**తాత్పర్యం:** దేవత లట్లా అంటూండగానే అర్జునుడు మహావేగంగా, ఘోరంగా పెద్దవి, వాడివి, మరల్పలేనివి అయిన బాణాలతో ద్రోణుడి శరీరాన్ని, వాహనాలను, సారథిని, జెండాను అన్నిటిని కప్పివేశాడు. అది చూచి సేనలన్నీ ఒక్కసారిగా హాహాకారాలు చేశాయి.

**విశేషం:** అలం: రూపకం.

**క. ఈమెయి నిజజనకు భుజో । ద్దామబలము దోడుతోడఁ దఱుఁగుటయు రథ**
**స్తోమంబుఁ దాను నశ్వ । త్థామ వెసం దాఁకె బాండుతనయుని తోడన్. 138**

**ప్రతిపదార్థం:** ఈమెయిన్= ఈ రీతిగా; నిజజనకు= తన తండ్రియొక్క; భుజ= భుజాల; ఉద్దామ= గొప్పదైన; బలము= పరాక్రమం; తోడుతోడన్= వెంబడిని; తఱుఁగుటయున్= తగ్గగా; రథస్తోమంబున్= రథాల సముదాయం; తానును= స్వయంగాను; అశ్వత్థామ; పాండుతనయుని తోడన్= అర్జునుడితో; వెసన్= వేగంగా; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా తన తండ్రి ద్రోణుడి భుజబలం వెంటవెంటనే తగ్గిపోవటం చూచిన అశ్వత్థామ తానే రథబలంతో కలిసి అర్జునుడిని ఎదుర్కొన్నాడు.

**అర్జునుఁ డశ్వత్థామతో యుద్ధము సేయుట (సం. 4-53-65)**

**చ. అతఁడును దీవ్రబాణముల నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా**
**శతమఖవృత్ర సంగరము చందము దోఁచె వడిం జటచ్ఛటా**
**యిత రవ మప్డు వేణువుల నేర్చు దవానలు మ్రోఁత భంగి ది**
**క్తతిఁ బరఁగెన్ మహాద్భుతము కౌరవసేనకు నావహిల్లఁగన్. 139**

**ప్రతిపదార్థం:** అతఁడును= అశ్వత్థామ కూడా; తీవ్రబాణములన్= బలమైన బాణాలతో; ఆతనిన్= అర్జునుడిని; కప్పుచున్= కప్పివేస్తూ; మాఱుకొన్నన్= ఎదుర్కొనగా; ఆ శతమఖ వృత్ర సంగరము చందము= ఆ ఇంద్ర వృత్రాసురుల యుద్ధంరీతి; తోఁచెన్= స్ఫురించింది; అప్డు= అప్పుడు; వేణువులన్= బొంగు వెదుళ్ళను; ఏర్చు= దహించే; దవ+అనలు మ్రోఁత భంగిన్= దావాగ్ని ధ్వనివలె; దిక్తతిన్= దిక్కుల సమూహంలో; ఛటచ్ఛటా+ఆయిత రవము= చటచటమనే చప్పుడు; కౌరవసేనకున్= కౌరవుల సేనకు; మహత్+అద్భుతము= గొప్ప ఆశ్చర్యం; ఆవహిల్లఁగన్= కలుగునట్లుగా; పరఁగెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** ఎదుర్కొని అశ్వత్థామ తీవ్ర బాణాలతో అర్జునుడిని కప్పివేశాడు. వారి యుద్ధం ఇంద్ర వృత్రాసురుల యుద్ధాన్ని తలపించింది. ఆ యుద్ధంలో వచ్చిన చటచటమనే చప్పుడు దావాగ్నికి బొంగువెదుళ్ళు తగులబడుతుంటే వచ్చిన చప్పుడు వలె కౌరవసేనకు ఆశ్చర్యం కలిగే విధంగా దిక్కులంతటా వ్యాపించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టి యెడ. 140**

**తాత్పర్యం:** అప్పుడు.

**చ. ఉఱక నరుండు ద్రోణసుతు యుగ్యములన్ వెస నొంచె; నాతఁడుం**
**దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి, క**
**న్గిఱిపిన మాత్రలోన నతనిం బటుబాణ చతుష్కయుగ్మ మే**
**డ్తెఱఁ దొడి మౌర్విఁ గ్రమ్మఱ ఘటించునెడన్ వడి నేసి యార్చినన్. 141**

**ప్రతిపదార్థం:** నరుండు= అర్జునుడు; ద్రోణసుతు= అశ్వత్థామయొక్క; యుగ్యములన్= గుర్రాలను; వెసన్= వెంటనే; ఉఱక= లెక్కచేయక; నొంచెన్= నొప్పించాడు; ఆతఁడున్= అశ్వత్థామయును; ఒక+ఇంత= కొద్దిగా; తెఱపి= వ్యవధానం; కాంచి= చూచి; ఘన= గొప్పదైన; తీవ్ర= తీక్ష్ణమైన; శరంబునన్= బాణంతో; నారిన్= నారిని; త్రుంచి= తెంపి; కన్గిఱిపిన మాత్రలోనన్= కన్ను గీటినంతలోనే; అతనిన్= అర్జునుడిని; పటు= సమర్థమైన; బాణచతుష్కయుగ్మము= ఎన్మిది బాణములు; ఏడ్తెఱన్= విజృంభణంతో; తొడి= తొడిగి; మౌర్వి= నారి; క్రమ్మఱన్= మరల; ఘటించు+ఎడన్= కూర్చేటప్పుడు; వడిన్= వేగంగా; ఏసి= కొట్టి; ఆర్చినన్= కేకలుపెట్టగా.

**తాత్పర్యం:** అర్జునుడు వెంటనే అశ్వత్థామ గుర్రాలను నొప్పించాడు. అతడు కొంచెం సందు చూచుకొని వాడి బాణాలతో అర్జునుడి ధనుస్సు నారిని త్రుంచాడు. అర్జునుడు మరల నారిని బిగించుకొంటుండగా కనుగీటునంతలో ఎన్మిది బాణాలు సంధించి అతడిని వడిగా కొట్టి ఆర్వగా.

**క. 'కురుసేనలోన ని ట్లె। వ్వరుఁ జేసినవారు లే; రవార్య భుజా వి**
**స్ఫురణోదగ్రుండు గదే। గురుపుత్రుం' డనుచు నమరకోటి నుతించెన్. 142**

**ప్రతిపదార్థం:** కురుసేనలోనన్= కౌరవసేనలో; ఇట్లు= ఈ రీతిగా; చేసినవారు= చేసినవారు; ఎవ్వరున్= ఎవరును; లేరు; గురుపుత్రుండు= అశ్వత్థామ; అవార్య= వారింపరాని; భుజా= భుజములయొక్క; విస్ఫురణ+ఉదగ్రుండు= ప్రకాశంచేత గొప్పవాడు; కదే= కదా; అనుచున్= అని పల్కుతూ; అమరకోటి= దేవతల సమూహం; నుతించెన్= పొగడింది.

**తాత్పర్యం:** 'ఈ రీతిగా చేసినవారు కౌరవసేనలో ఎవరూ లేరు. అడ్డులేని భుజపరాక్రమం కలవాడు కదా ఈ అశ్వత్థామ' అని దేవతలు పొగడారు.

**చ. చిఱునగ వొప్ప గాండివము చెచ్చెర సజ్యము సేసి సేన లు**
**క్కఱ రభసంబుమై నడరెఁ గవ్వడి ద్రౌణియు నీడఁబోక య**
**త్తఱిఁ దఱుమంగ నస్త్రములు దందడి మార్కొని మండుచుండెఁ జి**
**చ్చఱపిడుగుల్ వడిం దొరఁగు చాడ్పున నంబరవీథి నుగ్రమై. 143**

**ప్రతిపదార్థం:** కవ్వడి= అర్జునుడు; చిఱునగవు= చిరునవ్వు; ఒప్పన్= ప్రకాశించగా; గాండివము= గాండీవాన్ని; చెచ్చెరన్= వేగంగా; సజ్యము= నారితో కూడినదానిగా; చేసి; సేనలు= కౌరవసేనలు; ఉక్కు+అఱన్= బలం కోల్పోయేటట్లుగా; రభసంబుమైన్= తొందరగా; అడరెన్= విజృంభించాడు; ద్రౌణియున్= అశ్వత్థామకూడా; ఈడన్+పోక= వెనుదీయక; ఆ+తఱిన్= అప్పుడు; తఱుమంగన్= త్వరత్వరగా ప్రయోగింపగా; అస్త్రములు= బాణములు; దందడిన్= దొమ్మిగా; మార్కొని= ఎదుర్కొని; చిచ్చఱపిడుగులు= మంటలువెదజల్లే పిడుగులు; వడిన్= వేగంగా; తొరఁగు చాడ్పునన్= పడుతూవున్నట్లుగా; అంబరవీథిన్= ఆకాశంలో; ఉగ్రము+ఐ= భయంకరమై; మండుచున్+ఉండెన్= మంటలు మండుతున్నాయి.

**తాత్పర్యం:** అర్జునుడు వెంటనే చిరునవ్వుతో గాండీవపునారి బిగించగా సేనలశక్తి సన్నగిల్లింది. అశ్వత్థామ కూడా వెనుదియ్యక అస్త్రాలు వేయసాగాడు. అప్పుడు అవి మంటల పిడుగుల వలె ఆకాశవీథిలో ఒకదానితో ఒకటి ఎదుర్కొని మండుతూ ఉండినాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **ఇవ్విధంబున ధనంజయుండు రయంబున నేయ వేగంబున నేయు ద్రోణతనయు తూణీరంబులు శరశూన్యంబు లయ్యెఁ; దన తూణీరంబు లక్షయ బాణంబు లగుటం జేసి యంతకంతకు నతిశయిల్లు పెల్లున నేయుచు నధికుండగు నప్పాండవమధ్యముం గనుంగొని కృపాచార్యుండు సెంగటం దలమీఁటిన. 144**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ధనంజయుండు= అర్జునుడు; ఏయన్= బాణాలు ప్రయోగించగా; వేగంబునన్= వేగంతో; ఏయు= బాణాలు సంధించే; ద్రోణతనయు తూణీరంబులు= అశ్వత్థామయొక్క అమ్ములపొదులు; శరశూన్యంబులు= బాణాలు లేనివి; అయ్యెన్= అయ్యాయి; తన తూణీరంబులు= అర్జునుడి అమ్ములపొదులు; అక్షయబాణములు= క్షీణించని బాణాలు కలవి; అగుటన్+చేసి= అగుటవలన; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; అతిశయిల్లు పెల్లునన్= అతిశయించెడి ఉద్రేకంతో; ఏయుచున్= బాణాలు వేస్తూ; అధికుండు+అగు= మించినవాడైన; ఆ+పాండవ మధ్యమున్= ఆ అర్జునుడిని; కనుంగొని= చూచి; కృపాచార్యుండు= కృపుడు; చెంగటన్= ఎదురుగా; తలమీటినన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా అర్జునుడు బాణాలు ప్రయోగించే వేగంతో అశ్వత్థామ కూడా బాణాలు వేస్తూ ఉంటే అతడి అమ్ములపొదిలోని బాణాలు ఖాళీ అయ్యాయి; అర్జునుడి అమ్ములపొదులు బాణాలు క్షీణించేవి కావు కనుక అత డంత కంతకు పెచ్చుపెరిగి బాణాలు వేస్తూ అశ్వత్థామను మించిపోయాడు. అది గమనించిన కృపుడు ఎదురుగా వచ్చి ఎదుర్కొనగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

### అర్జునుఁడు కృపాచార్యునితో యుద్ధము సేయుట (సం. 4-52-1)

**క.** **గురుపుత్రుని రథము విడిచి । సరభసముగ నందు సవ్యసాచి గవియుడుం**
**దిరమై యాతఁడు శితశర । పరంపరలు గురిసె నుగ్రబంధురగతులన్. 145**

**ప్రతిపదార్థం:** సవ్యసాచి= అర్జునుడు; గురుపుత్రుని రథము= అశ్వత్థామ రథాన్ని; విడిచి= విడిచిపెట్టి; అందున్= ఆ యుద్ధభూమిలో; సరభసముగన్= తొందరగా; కవియుడున్= ఎదుర్కొనగా; ఆతఁడు= కృపుడు; తిరమై= స్థిరంగా నిల్చి; శిత= వాడియైన; శర పరంపరలు= బాణాల వరుసలు; ఉగ్రబంధుర= భయంకరమైన; గతులన్= రీతులలో; కురిసెన్= కురిపించాడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడు రాగా అర్జునుడు అశ్వత్థామ రథాన్ని విడిచిపెట్టి కృపుడిమీదికి పోగా, కృపుడు వాడి బాణాల పరంపరలు భయంకరంగా వివిధ రీతులలో కురిపించాడు.

**వ.** **పాండుపుత్రుండును జిత్రసంచారంబుల మెఱయుచు. 146**

**ప్రతిపదార్థం:** పాండుపుత్రుండును= అర్జునుడు కూడా; చిత్రసంచారంబులన్= విచిత్రమైన రథగతులతో; మెఱయుచు(న్)= ప్రకాశిస్తూ.

**తాత్పర్యం:** పాండుపుత్రుడు కూడా విచిత్రమైన రథగతులతో ప్రకాశిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. పటు విశిఖపంక్తి యత్యు। త్కట రయమున నిగుడఁజేయఁగా నవ్విధ మూఁ**
**దుటయైన మండె దీప్తో। ద్భట భంగిఁ గృపానలంబు బలములు వొంగన్. 147**

**ప్రతిపదార్థం:** పటు= గట్టివైన; విశిఖపంక్తి= బాణ పరంపర; అతి+ఉత్కట= మిక్కిలి ఎక్కువైన; రయమునన్= వేగంతో; నిగుడన్= వెడలేటట్లు; చేయఁగాన్= చేయగా; ఆ+విధము= ఆ రీతి; ఊఁదుట+ఐనన్= ఊదటం కాగా; కృపానలంబు= కృపుడనెడి అగ్ని; దీప్త= ప్రజ్వలించినదయి; బలములు= సేనలు; పొంగన్= సంతోషించగా; ఉద్భటభంగిన్= భయంకరమైన రీతిగా; మండెన్= రగిలింది.

**తాత్పర్యం:** అర్జునుడు బాణాలు నింపగా, అది ఊదరకొట్టినట్లయి సేనలు సంతోషించగా కృపుడనెడి అగ్ని మిక్కుటంగా రగిలింది.

**విశేషం:** అలం: రూపకం.

**వ. ఇట్లు మండి శిఖిఁబోలెడి కనకలిప్త ఘనబాణంబు వనచర కేతువుం దాఁకించి వేఁడిమి సూపి వివిధాస్త్ర జ్వాలలు గవియించి దిక్కులు సెలంగ నార్చినం గోపంబున నాటోపంబు మిగిలి బలసూదనసూనుం డతని కేతనంబు దునిమి తరణి కిరణానుకార పారంగతంబు లగు నారాచంబులు దదీయాంగంబుల నినుపం దొడంగిన రథచక్రరక్షకు లగు చంద్రకేతుండును జిత్రాశ్వుండును మణిమంతుండును మంజుమౌళియు హేమవర్మయును సురథుండును సుషేణుండును నరిష్టుండును సుకేతుండును నుక్కు మెఱయ నొక్కటం దాఁకిన. 148**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; మండి= ప్రజ్వరిల్లి; శిఖిన్+పోలెడి= అగ్నివంటి; కనకలిప్త= బంగారుతో పూయబడిన; ఘన బాణంబు= గట్టిబాణం; వనచర కేతువున్= హనుమంతుడి గుర్తుగల జెండాను; తాఁకించి= తగిలేటట్లు కొట్టి; వేఁడిమి= తాపం; చూపి= చూపించి; వివిధ= పలు రకాలైన; అస్త్రజ్వాలలు= అస్త్రాలయొక్క మంటలు; కవియించి= కమ్ముకొని తగిలేటట్లు చేసి; దిక్కులు+చెలంగన్= దిక్కులు ధ్వనించేటట్లు; ఆర్చినన్= గట్టిగా అరవగా; కోపంబునన్= కోపంతో; ఆటోపంబు= పరాక్రమం; మిగిలి= ఎక్కువకాగా; బలసూదన సూనుండు= ఇంద్రుడి కొడుకు అర్జునుడు; అతని కేతనంబు= కృపుని జెండాను; తునిమి= విరుగగొట్టి; తరణి కిరణ= సూర్యకిరణాలను; అనుకార= అనుకరించటంలో; పారంగతంబులు+ అగు= ఒడ్డును తాకిన (ఆరితేరినవగు); నారాచంబులు= బాణాలు; తదీయ+అంగంబులన్= అతడి అవయవాలందు; నినుపన్= నాటించటానికి; తొడంగినన్= పూనుకొనగా; రథచక్రరక్షకులు+అగు= కృపుడి రథాన్ని రక్షించునట్టి; చంద్రకేతుండును; చిత్రాశ్వుండును; మణిమంతుండును; మంజుమౌళియు; హేమవర్మయును; సురథుండును; సుషేణుండును; అరిష్టుండును; సుకేతుండును; ఉక్కు= చేవ; మెఱయన్= ప్రకాశించేటట్లు; ఒక్కటన్= ఒక్కసారిగా; తాఁకినన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** కృపాచార్యుడను మండుతూ, అగ్నిలాగా ప్రకాశిస్తూవున్న బంగారు పూసిన బాణాలతో హనుమద్ధ్వజాన్ని కొట్టి ప్రతాపం ప్రదర్శించి, అనేక విధాల అస్త్రాల మంటలు రేగేటట్లు చేసి, దిక్కులు ప్రతిధ్వనించేటట్లుగా కేకవేశాడు. దానితో కోపంగా హడావిడిగా అర్జునుడు కృపుడి జెండాను విరుగగొట్టి సూర్యకిరణాలవంటి నారసాలను అతడి శరీరంలో వేయడానికి ప్రయత్నించేసరికి అతడి రథ చక్రరక్షకులుగా ఉన్న చంద్రకేతుడు, చిత్రాశ్వుడు,

మణిమంతుడు, మంజుమౌళి, హేమవర్మ, సురథుడు, సుషేణుడు, అరిష్టుడు, సుకేతుడు అనేవారు ఒక్కసారిగా అర్జునుడి నెదుర్కొన్నారు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. అన్ని వెడఁద వాతియమ్ము లద్భుతముగ । నొక్క ముష్టిఁ దొడిగి గ్రక్కనంగ**
**నతఁడు లీలఁ దునిమె నందఱ తలలును । ఘోరభంగి రక్తధార లెగయ. 149**

**ప్రతిపదార్థం:** అన్ని= అన్ని; వెడఁదవాతియమ్ములు= వెడలుపైన ముఖాలు కల బాణాలు; అద్భుతముగన్= ఆశ్చర్యకరంగా; ఒక్కముష్టిన్= ఒక్క పిడికిలితోనే; తొడిగి= సంధించి; గ్రక్కనంగన్= శీఘ్రంగా; అతఁడు= ఆ అర్జునుడు; అందఱ తలలును= తనను ఎదుర్కొనిన వారందరి తలలను; ఘోర భంగిన్= ఘోరమైన రీతిలో; రక్తధారలు= రక్తముయొక్క ధారలు; ఎగయన్= పైకెగజిమ్మగా; లీలన్= హేలగా; తునిమెన్= నరికాడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడి రథచక్రరక్షకు లెందరు వీరులు తనపై దాడి చేశారో అన్ని వెడలుపైన మొనలు గల పదునైన బాణాలను ఒకేసారి సంధించి అర్జునుడు ఆశ్చర్యకరంగా వారందరి తలలను రక్తధారలు పైకెగజిమ్మేటట్లుగా ఒక్కసారిగా నరికివేశాడు.

**సీ. తునిమి, తోడన యొక్క సునిశిత శరమునఁ । గాఁడియు, రెంట నక్షములఁ ద్రుంచి,**
**హరుల నాల్గిటఁ జంపి, యాలంపు టెలుఁగుతో । నొగలు మూఁడమ్ముల నుగ్గుసేసి,**
**ధనువును సూతుని తలయుఁ జెఱొక్క ట । నఱకి, లోచనముల నవ్వు మెఱయఁ**
**గృపుని నాలోకించి క్రీడి తద్వక్షః స్థ । లంబునఁ గ్రూరభల్లంబు నాఁట**

**ఆ. హతరథుండు నిపతితాశ్వుండు సంఛిన్న । చాపుఁడును నికృత్త సారథియును**
**నయ్యు, నొచ్చియును, భుజార్గళ సంరంభ । మతిశయిల్ల శక్తి నతఁడు వైచె. 150**

**ప్రతిపదార్థం:** తునిమి= విరుగగొట్టి; తోడన= వెంటనే; ఒక్క సునిశిత శరమునన్= వాడియైన ఒక్క బాణంతో; కాఁడియున్= కాడిని; రెంటన్= రెండు బాణాలతో; అక్షములన్= రథచక్రాల ఇరుసులను; త్రుంచి= నరికి; నాల్గిటన్= నాల్గు బాణాలతో; హరులన్= గుర్రాలను; చంపి= చంపి; ఆలంపు+ఎలుఁగుతోన్= సింహనాదంతో; నొగలున్= సారథి కూర్చుండే చోటును; మూఁడు+అమ్ములన్= మూడు బాణాలతో; నుగ్గుచేసి= పొడిచేసి; ధనువును= వింటిని; సూతుని తలయున్= సారథి తలను; చెఱి+ఒక్కటన్= చెరొక బాణంతో; నఱకి= తెగగొట్టి; లోచనములన్= కన్నులందు; నవ్వు మెఱయన్= నవ్వు ప్రకాశించగా; కృపునిన్= కృపాచార్యుడిని; ఆలోకించి= చూచి; క్రీడి= అర్జునుడు; తద్= అతడియొక్క; వక్షస్(ః)స్థలంబునన్= రొమ్ముమీద; క్రూరభల్లంబు= వాడి బాణం; నాఁటన్= నాటేటట్లు వేయగా; హతరథుండు= కొట్టబడిన రథం కలవాడు; నిపతిత+అశ్వుండున్= గుర్రాలు పడినవాడు; సంఛిన్న చాపుఁడును= ధనువు తెగగొట్టబడినవాడును; నికృత్త సారథియును= సారథి చంపబడినవాడును; అయ్యున్= అయినప్పటికీ; నొచ్చియును= బాధపడికూడ; భుజా+అర్గళ= గడియలవంటి భుజాలయొక్క; సంరంభము= గర్వం; అతిశయిల్లన్= ఎక్కువకాగా; అతఁడు= కృపుడు; శక్తిన్= శక్తి అనే ఆయుధాన్ని; వైచెన్= విసరివేశాడు.

**తాత్పర్యం:** అర్జును డందరి తలలు తెగగొట్టి, వెంటనే ఒక వాడిబాణంతో కాడిని, రెండు బాణాలతో బండి ఇరుసులను విరుగగొట్టి, గుర్రాలను నాలుగు బాణాలతో చంపి, మూడు బాణాలతో నొగలు నుగ్గుచేసి, ధనుస్సు

నొక బాణంతోను, సూతుడి తల నొక బాణంతోనూ నరికి, కళ్ళలో నవ్వు కనబడేటట్లుగా చూచి, కృపుడి రొమ్ముమీద తీక్ష్ణమైన బాణాన్ని నాటగా, రథం పోయి, గుఱ్ఱాలు పోయి, విల్లు విరిగిపోయి, సారథి చచ్చిపోయినా కూడా కృపుడు భుజబలంతో శక్తి అనే ఆయుధాన్ని అర్జునుడిమీదికి విసిరాడు.

**ఉ. మండుచు వచ్చుదానిఁ బదిమార్గణముల్ గొని వేగ మొప్ప నా**
**ఖండల నందనుండు గడికండలు సేసినఁ జూచి యప్పు డా**
**తం డుడివోక లేక సమదంబున ఖడ్గము ఖేటకంబు ను**
**ద్దండతఁ గొంచుఁ దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. 151**

**ప్రతిపదార్థం:** మండుచున్= మంటలు కక్కుతూ; వచ్చుదానిన్= వచ్చే శక్తిని; పది మార్గణముల్= పది బాణాలు; కొని= తీసికొని; వేగము+ఒప్పన్= వేగం కలిగేటట్లుగా; ఆఖండల నందనుండు= ఆ అర్జునుడు; కడికండలు= ముక్కలు ముక్కలు; చేసినన్= చేయగా; చూచి; అప్పుడు; ఆతండు= కృపుడు; ఉడివోక= మానటం; లేక= చేయక; సమదంబునన్= మదంతో; ఖడ్గమున్= కత్తినీ; ఖేటకంబున్= డాలునూ; ఉద్దండతన్= గొప్పగా; కొంచున్= తీసికొంటూ; తేరు= రథం; డిగి= దిగి; తాన్= అతడు; రయము= వేగం; ఉల్లసిల్లఁగన్= ఒప్పగా; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** మండుతూ వచ్చే శక్తిని అర్జునుడు పది బాణాలు తీసికొని అర్జునుడు ముక్కలు ముక్కలు చేశాడు. దానితో కృపుడు ఊరుకొనక గర్వంతో కత్తి, డాలు పుచ్చుకొని రథం దిగి అర్జునుడిని ఎదిరించాడు.

**వ. ఇట్లు గవిసిన. 152**

**తాత్పర్యం:** ఈ రీతిగా ఎదిరించగా.

**క. పలకయు వాలును నింతిం । తలు దునియలు సేసె బాణతతిఁ బాండవుఁ డి**
**ట్టల మైన వెఱఁగుపాటున । నిలిచి కృపుఁడు ద్రోణపుత్రుని రథం బెక్కెన్. 153**

**ప్రతిపదార్థం:** పాండవుఁడు= అర్జునుడు; బాణతతిన్= బాణముల సముదాయంతో; పలకయున్= డాలును; వాలునున్= కత్తియును; ఇంతింతలు= చిన్న చిన్న; తునియలు= ముక్కలుగా; చేసెన్= చేశాడు; కృపుఁడు; ఇట్టలము+ఐన= అధికమైన; వెఱఁగుపాటునన్= ఆశ్చర్యంతో; నిలిచి= ఉండి; ద్రోణపుత్రుని రథంబు= అశ్వత్థామ యొక్క రథాన్ని; ఎక్కెన్= ఎక్కాడు.

**తాత్పర్యం:** అర్జునుడు బాణాలతో కృపుడి కత్తిని, డాలును చిన్న చిన్న ముక్కలుగా ఖండించాడు. అధికమైన ఆశ్చర్యంతో కృపుడు అశ్వత్థామ రథమెక్కాడు.

**ఆ. అప్పు డే పడంగి యన్ని సేనలు భీష్ము । రథము పొంత కొదిఁగె రౌద్రరస వి**
**నోది యైన యర్జునుఁడు ధనుశ్చాలన । దీప్తమూర్తి యగుచుఁ దిట్ట కుఱికె. 154**

**ప్రతిపదార్థం:** అన్ని సేనలు= సేనలన్నియు; అప్పుడు= ఆ సమయంలో; ఏపు+అడంగి= విజృంభణం తగ్గి; భీష్ము రథము పొంతకున్= భీష్ముడి రథం వద్దకు; ఒదిఁగెన్= ఒదిగినవి; రౌద్రరస= రౌద్ర రసంతో; వినోది ఐన= వినోదము చేస్తున్న; అర్జునుఁడు; ధనుస్+చాలన= ధనుస్సు కదుపులో; దీప్తమూర్తి అగుచున్= ప్రకాశించే విగ్రహం కలవాడై; తిట్టకున్= సైన్యపు గుంపుమీదికి; ఉఱికెన్= ఉరికెను.

**తాత్పర్యం:** అప్పుడు కౌరవ సేనలన్నీ భీష్ముడి రథం సమీపానికి పోయి ఒదిగి ఉండినాయి. రౌద్రరసంతో వినోదిస్తూవున్న అర్జునుడు అప్పుడు ధనుస్సు కదుపుతూ ఒక్క ఉదుటున ఆ సైన్యంమీది కురికాడు.

**వ. ఇత్తెఱంగున నుఱక తఱియ నుఱికిన. 155**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ రీతిగా; ఉఱక= లక్ష్యపెట్టక; తఱియన్+ఉఱికినన్= సమీపించేటట్లు పరువెత్తగా.

**తాత్పర్యం:** ఆ విధంగా సైన్యం మీదికి లక్ష్యపెట్టకుండా పర్వెత్తగా.

**క. బలములు దొరలుఁ బొదివి సం । కుల యుద్ధము సేయఁ గ్రోధ ఘోరాకృతి యై**
**యిలఁ బ్రోవుగఁ జతురంగం । బుల వ్రేల్మిడిఁ బాండురాజపుత్త్రుఁడు గూల్చెన్. 156**

**ప్రతిపదార్థం:** బలములు= సేనలు; దొరలున్= రథికులును; పొదివి= చుట్టుముట్టి; సంకుల యుద్ధము= దొమ్మి యుద్ధం; చేయన్= చేయగా; క్రోధ= కోపంతో; ఘోర+ఆకృతి+ఐ= భయంకరమైన ఆకారం కలవాడై; ఇలన్= భూమిపై; చతురంగంబులన్= నాలుగు రకాల సేనాంగాలను; పాండురాజపుత్త్రుఁడు= అర్జునుడు; వ్రేల్మిడిన్= వెంటనే; ప్రోవుగన్= రాశిగా; కూల్చెన్= కూల్చాడు.

**తాత్పర్యం:** అప్పుడు సేనలు, రథికులు కలిసి ఒక్కసారిగా మీదబడి దొమ్మిగా యుద్ధం చేయగా అర్జునుడు క్రోధంతో భయంకరాకృతి కలవాడై ఆ చతురంగబలాలను ఒక్క క్షణకాలంలోనే కుప్పగా పడేటట్లు కూల్చాడు.

**ఉ. చేతులతీఁట వో నిటు లశేషబలంబుల నుగ్గు సేసి మాం**
**సాతతపంక యై బహువిధాయుధమీనము లొప్పఁ జామర**
**వ్రాతము ఫేన భంగిగ నిరంతర వీరశిరస్సరోరుహ**
**స్ఫీత విభూతిఁ బొల్చు నది సేసె రణస్థలియందు నెత్తుటన్. 157**

**ప్రతిపదార్థం:** చేతుల తీఁట= చేతుల దురద; పోన్= తీరేటట్లు; ఇటులు= ఈ రీతిగా; అశేష బలంబులన్= అపార సేనల నన్నింటిని; నుగ్గు+చేసి= పొడిచేసి; రణస్థలి+అందున్= యుద్ధభూమిలో; నెత్తుటన్= నెత్తుటి మడుగులో; మాంస+ఆతత పంక+ఐ= మాంసమనెడి అధికమైన బురద కలదై; బహువిధ= పలురకాలైన; ఆయుధ మీనములు= ఆయుధములనెడి చేపలు; ఒప్పన్= ప్రకాశించగా; చామర వ్రాతము= వింజామరల సముదాయం; ఫేన భంగిగన్= నురుగుగాను; నిరంతర= ఎడతెగని; వీర= వీరులయొక్క; శిరస్సరోరుహ= తలలనెడి పద్మాలయొక్క; స్ఫీత విభూతిన్= విస్తారమైన వైభవంతో; పొల్చునది= ప్రకాశించునట్టి నదిని; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** అర్జును డీ రీతిగా చేతుల దురద తీరేటట్లు సేనలన్నింటిని నుగ్గు నుగ్గు చేసి, మాంసమే బురదగా, ఆయుధాలే చేపలుగా, వింజామరలే నురుగుగా, వీరుల తలలే పద్మాలుగా ఒప్పే నదిని, యుద్ధభూమిలో నెత్తుటితో చేశాడు.

**విశేషం:** అలం: సావయవరూపకం, ఉపమ. చేతుల తీఁట - ఇది జాతీయం. శత్రువులను కొట్టాలి, హింసించాలి అనే తీవ్రమైన కోర్కె అని భావం. (లోకంలో చేతికి గజ్జివలన కలిగే దురద అని అర్థం.) (సంపా.)

**తే.** **ఇట్లు కౌరవానీకంబు నెల్లఁ గలఁచి । యాడి భీష్ముని దెసఁ బోవు క్రీడిఁ దాఁకెఁ**
**గొండతోఁ దాఁకు తగరు నుద్దండ వృత్తి । దోఁప వృషసేనుఁ డాహవదోహలమున.** **158**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; కౌరవ+అనీకంబున్+ఎల్లన్= కౌరవసేనల నన్నిటిని; కలఁచి= కలత చెందించి; ఆడి= ఆట ఆడినట్లుగా యుద్ధం చేసి; భీష్ముని దెసన్= భీష్ముడి వైపునకు; పోవు క్రీడిన్= పోవునట్టి అర్జునుడిని; వృషసేనుఁడు; ఆహవ దోహలమునన్= యుద్ధం చేసే వేడుకతో; కొండతోన్+తాఁకు= కొండతో ఢీకొనునట్టి; తగరు+ఉద్దండ వృత్తి= పొట్టేలు యొక్క గర్వ ప్రవృత్తి; తోఁపన్= తోచేటట్లుగా; తాఁకెన్= ఢీకొన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా కౌరవ సేనలన్నింటిని కలవరపరచి ఆటలాడినట్లుగా యుద్ధం చేసి, ఇక భీష్ముడివైపు పోదామనుకొనే అర్జునుడితో వృషసేనుడు యుద్ధం చేసే వేడుకతో కొండతో ఢీకొనే పొట్టేలువలె ఢీకొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. కొండతో ఢీకొన్న తగరు పరిస్థితియే (వినాశమే) వృషసేనుడికి కూడ లభిస్తుందని అలంకార ధ్వని. (సంపా)

**వ.** **విజయుండును.** **159**

**తాత్పర్యం:** అర్జునుడు కూడ.

**తే.** **భల్ల మొక్కట నాతని విల్లు దునిమి । యైదు నారసములు వక్ష మాడ నేసె;**
**నతఁడు సైరింపరాని నొ వ్వడరుటయును । బెగ్గలంబున నరదంబు డిగ్గి పాఱె.** **160**

**ప్రతిపదార్థం:** భల్లము+ఒక్కటన్= ఒక బల్లెంతో; ఆతని విల్లు= వృషసేనుడి వింటిని; తునిమి= తెగగొట్టి; ఐదు నారసములు= ఐదు బాణాలు; వక్షము+ఆడన్= రొమ్మునకు నాటేటట్లు; ఏసెన్= కొట్టాడు; అతఁడు= వృషసేనుడు; సైరింపరాని నొవ్వు= సహించలేని బాధ; అడరుటయును= అతిశయించగా; బెగ్గలంబునన్= భయంతో; అరదంబున్+డిగ్గి= రథం దిగి; పాఱెన్= పరుగెత్తాడు.

**తాత్పర్యం:** ఒక్క బాణంతో అతడి వింటిని తెగగొట్టి, అయిదు బాణాలతో రొమ్ము నాటేటట్లు కొట్టగా, ఆ బాధ సహించలేక అతడు రథం దిగి పారిపోయాడు.

**వ.** **అట్టియెడ దుశ్శాసన శకుని దుర్ముఖ వివింశతి వికర్ణులు దన్నుం బొదివికొనిన వారల రథరథ్య కేతు వర్మంబులు జర్జరితంబులుగా నేసి గాసిచేసిన నందఱుం గనుకనిఁ బఱవం దొడంగినఁ బార్థుండును బ్రహాసోల్లాస భాసుర ముఖుండగుచు నుత్తరుం గనుంగొని.** **161**

**ప్రతిపదార్థం:** అట్టిఎడన్= అటువంటి సమయంలో; దుశ్శాసన, శకుని, దుర్ముఖ, వివింశతి, వికర్ణులు= దుశ్శాసనుడు, శకుని, దుర్ముఖుడు, వివింశతి, వికర్ణుడు; తన్నున్= అర్జునుడిని; పొదివికొనినన్= చుట్టుముట్టగా; వారల= వారియొక్క; రథ= రథాలను; రథ్య= గుర్రాలను; కేతు= జెండాలను; వర్మంబులు= కవచాలను; జర్జరితంబులుగాన్= తూట్లు పడేటట్లుగా; ఏసి= కొట్టి; గాసి చేసినన్= బాధ కల్గించగా; అందఱున్= అందరును; కనుకనిన్= సంభ్రమంతో; పరవన్+తొడంగినన్= పారిపోవ ప్రారంభించగా; పార్థుండును= అర్జునుడును; ప్రహాస+ఉల్లాస= నవ్వుతో గూడిన ఉల్లాసంతో; భాసుర ముఖుండు+అగుచున్= ప్రకాశించే ముఖం కలవాడై; ఉత్తరున్= ఉత్తరుడిని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** అప్పుడు దుశ్శాసనుడు, శకుని, దుర్ముఖుడు, వివింశతి, వికర్ణుడు అర్జునుడిని చుట్టుముట్టారు. పార్థుడు వారి రథాలనూ, గుఱ్ఱాలనూ, టెక్కాలనూ, కవచాలనూ ముక్కలయ్యేట్లుచేసి బాధ కలిగించాడు. దానితో వారందరూ భయంతో పారిపోవనారంభించారు. అర్జునుడు నవ్వుతో, ఆహ్లాదంతో నిండిన మొగంతో ఉత్తరుడిని చూచి.

**తే.** **'కనకమయ తాల కేతువు క్రాలఁ జిర త । టిల్లతాలీలఁ గలిగి శోభిల్లు నంబు**
**దంబుచాడ్పున సురనదీ తనయుఁ డున్న । వాఁడు చూచితె మత్స్యభూవరతనూజ!** 162

**ప్రతిపదార్థం:** కనకమయ= బంగారు మయమైన; తాలకేతువు= తాటిచెట్టు జెండా; క్రాలన్= ప్రకాశించగా; చిర= చిర కాలమున్న; తటిత్+లతా లీలన్= మెరుపు యొక్క విలాసం; కలిగి శోభిల్లు= ఉండి ప్రకాశించెడి; అంబుదంబు చాడ్పునన్= మేఘంవలె; సురనదీ తనయుఁడు= భీష్ముడు; ఉన్నవాఁడు= ఉన్నాడు; మత్స్యభూవర తనూజ!= ఉత్తరా!; చూచితె?= చూచావా?

**తాత్పర్యం:** 'ఉత్తరా! బంగారు తాటిచెట్టు జెండాతో భీష్ముడు స్థిరమైన మెరుపుతో కూడి ఉన్న మేఘంవలె ప్రకాశిస్తున్నాడు చూచావా!

**విశేషం:** అలం: ఉపమ.

### అర్జునుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట (సం. 4-56-1)

**క.** **బలువిడి మన దివ్యాస్త్రం । బుల చవి చూపంగ వలయుఁ బోనిమ్ము రథం**
**బలసగతి నతనిదెస' కని, । పలికిన నతఁ డట్లు చేసెఁ బరమ ప్రీతిన్.** 163

**ప్రతిపదార్థం:** బలువిడి= శీఘ్రంగా; మన= మనయొక్క; దివ్యాస్త్రంబుల చవి= దివ్యమైన అస్త్రాల రుచి; చూపంగ వలయున్= చూపించవలెను; రథంబు= రథాన్ని; అతడి దెసకున్= అతని వైపునకు; అలసగతిన్= మెల్లని నడకలతో; పోనిమ్ము= తోలుము; అని పలికినన్= అని పలుకగా; పరమ ప్రీతిన్= మిక్కిలి ప్రీతితో; అట్లు= ఆ రీతిగానే; అతఁడు= ఉత్తరుడు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** మన దివ్యాస్త్రాల నతడికి రుచి చూపాలి; మెల్లగా అతడి రథంవైపు మన రథాన్ని తోలు'మనగా ఉత్తరుడు మిగుల ప్రీతితో అట్లే చేశాడు.

**విశేషం:** తాతగారైన భీష్ముడివైపు పోవటానికి అర్జునుడు చెప్పిన కారణం ఆయనకు 'దివ్యాస్త్రాల చవి' చూపించాలని. 'రుచి చూపించటం' జాతీయం. అరణ్య అజ్ఞాతవాసకాలాలలో అర్జునుడు పాశుపతాస్త్రాది దివ్యాస్త్రాలను ఎన్నో సంపాదించాడు. ఇన్నేళ్ళ తరువాత మరల తాతగారిని మనుమడు కలుస్తున్నాడు. తాను సాధించిన అస్త్రాలను ఆయనకు (రుచి) చూపించి ఆయన మెప్పు పొందాలని అర్జునుడు ఆశపడ్డాడు. 'రుచి చూపించటం' అనే జాతీయం వీరవాచకంగా వాడబడింది కావున ఇక్కడ గౌరవవాచకం కాదు. భీష్ముడిపై బాణవిద్యలో తన ఆధిక్యాన్ని ప్రదర్శించటానికే అర్జునుడు ఢీకొనాలనుకొంటున్నది సత్యం. అది సందర్భోచితం కూడా. అయితే, ఆ సంకల్పంలో అహంకారం లేదన్న సంగతిని 'రథాన్ని అలసగతిలో పోని'మ్మని పలకటంలో ధ్వనిస్తున్నది. వీరవిక్రమ వినయగుణ సమన్వితుడిగా విజయుడిని చిత్రించిన పద్యరత్న మిది. (సంపా.)

**ఉ. శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవరాజసైన్యముల్**
**సంతస మంద నొత్తుచు ససంభ్రమలీల నెదుర్కొనంగ దు**
**ర్దాంత భుజాబల ప్రకటదర్ప మెలర్ప నరుండు నొత్తె ది**
**గ్దంతినికాయ కర్ణపుట దారణ వృత్తము దేవదత్తమున్. 164**

**ప్రతిపదార్థం:** అప్డు= అప్పుడు; శాంతనవుండున్= భీష్ముడు కూడా; నిజశంఖమున్= తన శంఖమును; కౌరవరాజ సైన్యముల్= దుర్యోధనుని సేనలు; సంతసమందదన్= సంతోషం పొందగా; ఒత్తుచున్= ఊదుతూ; ససంభ్రమలీలన్= సంతోషముతోడి విలాసంతో; ఎదుర్కొనంగన్= ఎదిరించగా; దుర్దాంత= సహింపరాని; భుజాబల= భుజ పరాక్రమముయొక్క; ప్రకట= స్పష్టమైన; దర్పము= గర్వం; ఎలర్పన్= అతిశయించగా; నరుండున్= అర్జునుడును; దిగ్దంతి= దిగ్గజముల; నికాయ= సముదాయముయొక్క; కర్ణపుట= పుటముల వంటి చెవుల యొక్క; దారణ= బ్రద్దలు కొట్టటం అనెడి; వృత్తమున్= స్వభావం కలదైన; దేవదత్తమున్= దేవదత్తమనెడు తన శంఖమును; ఒత్తెన్= ఊదాడు.

**తాత్పర్యం:** అప్పుడు భీష్ముడు కురురాజ సేనల కానందం కలిగేటట్లుగా తన శంఖాన్ని పూరించి సంతోషంగా ఎదుర్కొనగా, అర్జునుడు సహించరాని భుజబలం ప్రకటించే గర్వంతో దిగ్గజాల చెవులు బ్రద్దలయ్యే ధ్వని గల దేవదత్తాన్ని ఊదాడు.

**విశేషం:** అలం: అతిశయోక్తి.

**తే. మలసి ఱంకెలు వైచుచు మాఱుకొనిన । వృషభముల భంగి నక్కురువృషభు లిట్లు**
**సమదగతిఁ జేరునెడఁ జూచి రమరు లర్థి । ననిమిషత్వంబు దమ కప్పు డచ్చుపడఁగ. 165**

**ప్రతిపదార్థం:** మలసి= ఉద్యమించి; ఱంకెలు వైచుచున్= రంకెలు వేస్తూ; మాఱుకొనిన= ఢీకొన్న; వృషభముల భంగిన్= ఆంబోతుల వలె; ఆ+కురు వృషభులు= ఆ కౌరవశ్రేష్ఠులు; ఇట్లు= ఈ రీతిగా; సమదగతిన్= మదంతో కూడిన గతితో; చేరు+ఎడన్= చేరునప్పుడు; అమరులు= దేవతలు; అనిమిషత్వంబు= రెప్పపాటు లేకపోవటం; అప్పుడు= ఆ ఇరువురి యుద్ధ కాలంలో; తమకున్= దేవతలకు; అర్థిన్= బాగుగా; అచ్చు పడఁగన్= కలిసిరాగా; చూచిరి= చూచారు.

**తాత్పర్యం:** ఆబోతులు రంకెలు వేస్తూ తిరుగుతూ ఒకదానితో ఒకటి ఢీకొన్నట్లుగా ఆ భీష్మార్జును లిరువురూ యుద్ధం చేయటానికి చేరగానే దేవతలు తమకు రెప్పపాటు లేకపోవటం ఆ సమయంలో చక్కగా కలిసివచ్చినట్లు అభిప్రాయపడుతూ ప్రీతితో చూచారు.

**విశేషం:** అలం: ఉపమ, విధి.

**వ. ఇవ్విధంబునం గనుంగొనుచు వారలు దమలోన. 166**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; కనుంగొనుచున్= చూస్తూ; వారలు= దేవతలు; తమలోనన్= తమలో.

**తాత్పర్యం:** దేవతలు ఆ విధంగా చూస్తూ తమలో తాము (ఇట్లా అనుకొన్నారు).

**క. 'మనలను దానవులను గడ । చినయవి భుజ బలము లస్త్రశిక్షా విధముల్**
**గొనియాడఁ గొలఁది గా దీ । తని నాతఁడ యతని నితఁడ తగుఁ జెనయంగన్'. 167**

**ప్రతిపదార్థం:** భుజ బలములు= భుజాల పరాక్రమాలు; అస్త్రశిక్షా విధముల్= అస్త్రములను నేర్చిన విధాలు; మనలను= దేవతలను; దానవులను= రాక్షసులను; కడచిన+అవి= మించినవి; కొనియాడన్= పొగడుటకు; కొలఁది+కాదు= వీలుగాదు; ఈతనిన్= అర్జునుడిని; ఆతఁడు+అ= ఆ భీష్ముడే; అతనిన్= భీష్ముడిని; ఇతఁడు+అ= ఈ అర్జునుడే; చెనయంగన్= ఎదిరించటానికి; తగున్= తగి ఉన్నారు.

**తాత్పర్యం:** వీరిద్దరి పరాక్రమాలూ, అస్త్రాలు నేర్చిన రీతులూ మనలను, రాక్షసులను మించిపోయాయి. వీరిని ఇంతని కొనియాడలేము. ఇతని నతడే ఎదుర్కొనాలి, అతని నితడే ఎదుర్కొనాలి. ఈరీతిగా ఎదుర్కొనటానికి ఈఇద్దరే తగినవారు.

**విశేషం:** అర్జునుడూ భీష్ముడూ దేవదానవులకంటె అస్త్రశిక్షణలో మించారని ఉభయబలాలను అంచనా వేయగల దేవగణాలు నిర్ణయించటం విశేషం. తిక్కన వాడిన ఇతడు - అతడు అనే సర్వనామాలు సార్థకాలు. వారు నామాలతో వేరుగా కనపడ్డా-బలంలో సమంగా ఉన్నారని సర్వనామాలు ధ్వనిస్తున్నాయి. అందులో ఇతడు అర్జునుడు, అతఁడు భీష్ముడు. రాబోయే సీసపద్యంలో అతడు - భీష్ముడి పరంగా వాడటం గమనార్హం. ఇతఁడుగా పేర్కొన్న అర్జునుడు దేవతల అభిమానం చూరగొనటంచేత వారికి సన్నిహితుడని ధ్వని. (సంపా.)

**సీ.** **అనుచుండ సైన్యంబు లార్పులుఁ బెడ బొబ్బ । లును దూర్యనాదంబులును జెలంగఁ**
**బేర్చి యొక్కుమ్మడి భీష్ము నగ్గింపంగ । నతఁడు నిశాత బాణాష్టకమునఁ**
**బడగపై హనుమంతు నొడలను బహుశరం । బుల నందుఁ జెలఁగెడు భూతములను**
**దశవిశిఖముల రథ్యములను సారథి । నేసె; వాసవియును నెసక మెసఁగు**

**తే.** **నగ్గలిక గాండివంబు చక్రాకృతి ప్ర । కాశవహ్ని స్వరూపత గలిగి విడుపు**
**తెఱపి గానంగ రాకుండ మెఱసి యొప్పు । సాంద్ర సాయకతతి నాకసంబు గప్పె.** **168**

**ప్రతిపదార్థం:** అనుచున్+ఉండన్= అని పల్కుతుండగా; సైన్యంబులు= సేనలు; ఆర్పులు= కేకలు; పెడ బొబ్బలును= పెద్ద పెద్ద కేకలును; తూర్య నాదంబులును= దుందుభి మున్నగు వాద్యముల చప్పుళ్ళు; చెలంగన్= చెలరేగగా; పేర్చి= అతిశయించి; ఒక్క+ఉమ్మడిన్= ఒక్కసారిగా; భీష్మున్= భీష్ముడిని; అగ్గింపంగన్= కీర్తించగా; అతఁడు= భీష్ముడు; నిశాత= వాడిఅయిన; బాణ+అష్టకమునన్= ఎనిమిది బాణాలతో; పడగపైన్= జెండాపైనున్న; హనుమంతు+ఒడలను= హనుమంతుడి శరీరాన్ని; బహు శరంబులను= ఎన్నో బాణాలతోను; అందున్= ఆ జెండాపై; చెలఁగెడు= విజృంభించే; భూతములను= పిశాచాలను; దశ విశిఖములన్= పది బాణాలతో; రథ్యములను= గుఱ్ఱాలను; సారథిన్= ఉత్తరుని; ఏసెన్= కొట్టాడు; వాసవియును= అర్జునుడు కూడ; ఎసకమెసఁగు+అగ్గలికన్= పెచ్చుపెరిగే కోపంతో; గాండివంబు= గాండీవం; చక్రాకృతి= చక్రాకారంలో; ప్రకాశ వహ్ని స్వరూపతకలిగి= ప్రకాశంగల అగ్నిరూపం కలిగి; విడుపు తెఱపి= విడవటం, తెరపిగానుండటం; కానంగరాకుండన్= తెలియకుండా; మెరసి+ఒప్పు= మెరుస్తూ ఉండే; సాంద్ర= దట్టమైన; సాయక తతిన్= బాణ సముదాయంతో; ఆకసంబున్= ఆకాశాన్ని; కప్పెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** దేవతలట్లా అంటుండగానే, సేనల ఆర్పులు, పెడబొబ్బలు ఒక ప్రక్క, దుందుభి మున్నగు వాద్యాల చప్పుళ్లు హెచ్చిపోయేటట్లు చేయగా, భీష్ముడు వాడియైన ఎనిమిది బాణాలతో జెండామీదనున్న హనుమంతుడిని, చాల బాణాలతో అందున్న భూతాలను, పది బాణాలతో గుఱ్ఱాలను, సారథిని కొట్టగా, అర్జునుడు హెచ్చిన కోపంతో గాండీవాన్ని చక్రాకృతిగా పెట్టి, అది అగ్నివలె ప్రకాశిస్తుండగా, విడవటం, పయనించటం, తాకటం తెలియరానంత వేగంగా బాణాలు వేసి ఆకాశం కప్పేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **అర్జునుఁడు గవియించిన యంపమూడ । మంచు దళముగఁ గప్పిన మార్గణాంశు**
**జాలముల వెస విరియించె శాంతనవ ప । తంగుఁ డుద్ద్యోతమాన ప్రతాప లీల.** **169**

**ప్రతిపదార్థం:** శాంతనవ పతంగుఁడు= భీష్ముడనే సూర్యుడు; ఉద్ద్యోతమాన= ప్రకాశించే; ప్రతాపలీలన్= ప్రతాపముయొక్క విలాసంతో; అర్జునుఁడు; కవియించిన= కమ్ముకొనజేసిన; అంపమూడమంచు= బాణాలు అనెడి దట్టమైన మంచు; దళముగన్= దళసరిగా-ఎక్కువగా; కప్పినన్= కప్పివేయగా; మార్గణ+అంశు జాలములన్= బాణాలనెడి కిరణాల సముదాయంతో; వెసన్= వేగంగా; విరియించెన్= విడిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆకాశం నిండా కప్పిన బాణాలనే దట్టమైన మంచును భీష్ముడనే సూర్యుడు తన ప్రతాపమనే విలాసంతో ప్రసరింపజేసిన బాణాలనే కిరణాలతో విరిసిపోయేటట్లు చేశాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క.** **అమరేంద్రతనయుఁ డుగ్రా । స్త్రములు వడిం గురియఁ గురియఁ దరమిడి వానిం**
**దుమురుగఁ జేయుచు వచ్చెను । సమరోల్లాసంబు మెఱయ శంతనుసుతుఁడున్.** **170**

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్ర తనయుఁడు= అర్జునుడు; ఉగ్ర+అస్త్రములు= భయంకరమైన అస్త్రాలు; వడిన్= వేగంగా; కురియన్+కురియన్= కురిపించగా కురిపించగా; శంతను సుతుఁడున్= భీష్ముడును; వానిన్= ఆ బాణాలను; తరమిడి= వరుసగా; తుమురుగన్= తునియలుగా; చేయుచు వచ్చెను= చేస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వేసే భీకరాస్త్రాలను వాటి వరుస ప్రకారం భీష్ముడు వాటిని ముక్కలు ముక్కలు చేస్తూ వచ్చాడు.

**క.** **అర్జునుఁడు దివ్యబాణ । స్ఫూర్జిత దోశ్శక్తి తనకుఁ జూపిన నతఁ డ**
**త్యూర్జిత బలుఁడై నియమో । పార్జిత ఘోరాస్త్రవితతిఁ బ్రతిహతిఁ జేసెన్.** **171**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు; దివ్య= దేవతా సంబంధమైన; బాణ= అస్త్రాలయొక్క; స్ఫూర్జిత= గొప్పదైన; దోస్+శక్తిన్= బాహుబలాన్ని; తనకున్= భీష్ముడికి; చూపినన్= చూపగా; అతఁడు= భీష్ముడు; అతి+ఊర్జిత= మిక్కిలి గొప్పదైన; బలుఁడు+ఐ= బలం కలవాడై; నియమ= నియమంగా; ఉపార్జిత= సంపాదించబడిన; ఘోర= భయంకరమైన; అస్త్ర= అస్త్రాలయొక్క; వితతిన్= సముదాయంచేత; ప్రతిహతిన్= ఎదురుదెబ్బ తీయటంద్వారా పనిచేయని వాటినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు భీష్మునిపై దివ్యాస్త్రాలను వేయగా - ఆ వేయటం తనకా దివ్యాస్త్రాలు వచ్చునని చూపటం కాబట్టి - భీష్ముడు తాను కూడా నియమ నిష్ఠలతో సంపాదించిన శక్తి కలవాడు కనుక- వాటిని వ్యర్థములయ్యేటట్లు చేశాడు.

**విశేషం:** అర్జునుడి దివ్యాస్త్రాలు దేవతలు మెచ్చి ఇచ్చినవి. భీష్ముడి దివ్యాస్త్రాలు వ్రతనియమాలతో సాధించినవి. ఒకరిది దైవదత్తమైన శక్తి, మరొకరిది మానుషమైన శక్తి. ఈ పద్యంలో ఈ వివేచన ధ్వని. (సంపా.)

**క. కవ్వడి యెమ్మెయి నేసిన । నవ్విధమున నాశరంబు లన్నియు దౌ దౌ**
**దవ్వులన నిలువరింపఁగ । వివ్వచ్చుఁడు కినిసి యేసె విలు విఱుగంగన్. 172**

**ప్రతిపదార్థం:** కవ్వడి= అర్జునుడు; ఏ+మెయిన్= ఏ రీతిగా; ఏసినన్= వేసినను; ఆ+విధమునన్= ఆ రీతిగా; ఆ శరంబులన్నియును= ఆ అస్త్రము లన్నింటిని; తాన్= తాను; దౌ దౌ దవ్వులన్+అ= దూర దూరాననే; నిలువరింపఁగన్= (ముందుకు రాకుండా) నిల్చునట్లు చేయగా; వివ్వచ్చుఁడు= అర్జునుడు; కినిసి= కోపించి; విలు= విల్లు; విఱుగంగన్= విరిగేటట్లు; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** అర్జును డేరీతిగా వేసినా భీష్ము డదే రీతిగా వాటినన్నిటిని దూరాననే నిల్చేటట్లు చేయడంతో కోపించి అర్జునుడు భీష్ముడి విల్లు విరుగగొట్టాడు.

**విశేషం:** అలం: సమం.

**మ. తన కోదండము ఖండితం బగుడుఁ గ్రోధంబార మందాకినీ**
**తనయుం డప్డు సటా విలుంచన సముద్యత్క్రోధ సింహాకృతిన్**
**ధను వొం డుద్ధత లీల నెత్తికొని యస్త్రశ్రేణిఁ బర్వించె న**
**ర్జునుపైఁ దాఁకిరి చక్రరక్షకులు నార్పుల్ నింగి ముట్టన్ వడిన్. 173**

**ప్రతిపదార్థం:** తన కోదండము= తన ధనుస్సు; ఖండితంబు+అగుడున్= తెగగొట్టబడింది కాగా; మందాకినీ తనయుండు= భీష్ముడు; అప్డు= ఆ సమయంలో; క్రోధంబున్= కోపం నిండగా; సటావిలుంచన= జూలు గట్టిగా లాగటం చేత; సముద్యత్= ఉద్యమించుతున్న; క్రోధ= కోపంగల; సింహ= సింహంయొక్క; ఆకృతిన్= ఆకారంతో; ఒండు ధనువు= మరొక విల్లు; ఉద్ధతలీలన్= ఔద్ధత్యంతో; ఎత్తికొని= తీసికొని; అర్జునుపైన్= అర్జునుడి మీద; అస్త్రశ్రేణిన్= బాణాల పరంపరను; పర్వించెన్= వ్యాపించేటట్లు వేశాడు; చక్రరక్షకులు= వ్యూహరక్షకులు; ఆర్పుల్= కేకలు; నింగి ముట్టన్= ఆకాశాన్ని అంటగా; వడిన్= వేగంగా; తాఁకిరి= దాడిచేశారు.

**తాత్పర్యం:** తన ధనుస్సు విరిగిపోయేటప్పటికి భీష్ముడు జూలు ఊడబెరికితే విజృంభించే సింహంవలె మహాకోపంతో మరోవిల్లు పుచ్చుకొని బాణాలు పరంపరగా అర్జునుడిపై వేశాడు. ఆయన వ్యూహరక్షకులు ఆర్పులు పెట్టుతూ అర్జునుడి మీదికి పోయి దాడి చేశారు.

**విశేషం:** అలం: ఉపమ. విలుంఠన పాఠం కంటె విలుంచన పాఠం మేలు. విలుంఠన= దొరలటం, విలుంచన= ఒలువటం.

**చ. విజయుఁడు వారి నెల్ల నొక వ్రేల్మిడిఁ ద్రుంచియు, భీష్ము సాయక**
**వ్రజము నడంచియున్ రథము వాజుల నొంచియు, నాజికేళియం**
**దజిత విలాసముల్ మెఱయ నప్పుడు విస్మయ మందుచుండెఁ గుం**
**భజముఖ యోధ వీరతతి; ప్రస్తుతి సేసిరి సిద్ధఖేచరుల్. 174**

**ప్రతిపదార్థం:** విజయుఁడు= అర్జునుడు; వారిన్+ఎల్లన్= వారందరిని; ఒక వ్రేల్మిడిన్= ఒక్క చిటికలో; త్రుంచియున్= చంపియు; భీష్ము= భీష్ముడి యొక్క; సాయక వ్రజమున్= బాణ సముదాయాన్ని; అడంచియున్= అణచివేసియు; రథమున్= భీష్ముడి రథమును; వాజులన్= గుఱ్ఱాలను; నొంచియున్= బాధించియు; ఆజి కేళియందున్= యుద్ధమనెడి క్రీడలో; అజిత=

జయించబడని; విలాసముల్= లీలలు; మెఱయన్= ప్రకాశించగా; అప్పుడు= ఆ సమయంలో; కుంభజముఖ= ద్రోణుడు మొదలైన; యోధవీర తతి= యోధులైన వీరుల సముదాయం; విస్మయము= ఆశ్చర్యాన్ని; అందుచున్+ఉండెన్= పొందుతున్నారు; సిద్ధఖేచరుల్= ఆకాశంలో సంచరించే సిద్ధులు మొదలైన దేవజాతులును; ప్రస్తుతి చేసిరి= పొగడారు.

**తాత్పర్యం:** అప్పు డర్జునుడు ఆ చక్రరక్షకుల నందరిని చంపి, భీష్ముడు వేసిన బాణాలను త్రుంచివేసి, ఆపైన భీష్ముడి రథాన్ని, గుర్రాలను ధ్వంసం చేసి ఎదుటివారికి జయించరానివాడై తనకు యుద్ధ మొక ఆటగా మెరయగా ద్రోణాది మహావీరులాశ్చర్యపోయారు. సిద్ధాది దేవతలు పొగడారు.

**క. కొండొకయెడఁ గని శాంతన । వుం డాఖండల తనూభవుని డా మూఁ పు**
**ద్దండ భుజబలము మెఱయఁ బ్ర । చండాస్త్రక్షతము సేసె సరభసవృత్తిన్. 175**

**ప్రతిపదార్థం:** కొండొక= కొద్ది; ఎడన్= సందును; కని= చూచి; శాంతనవుండు= భీష్ముడు; ఆఖండల తనూభవుని= అర్జునుడి యొక్క; డామూఁపు= ఎడమ భుజంపై భాగాన్ని; ఉద్దండ భుజబలము= గొప్పదైన పరాక్రమం; మెఱయన్= ప్రకాశించగా; సరభసవృత్తిన్= శీఘ్రమైన రీతిని; ప్రచండ+అస్త్ర= తీవ్రమైన బాణంతో; క్షతము= గాయపడినదానినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** భీష్ము డీ మధ్యలో కాస్త సందు చూచుకొని అర్జునుడి యెడను మూపును తన బలం ప్రకాశించేటట్లుగా బాణంతో కొట్టాడు.

**చ. కినుక మనంబునం గదిరి క్రీడి పితామహువిల్లు వ్రేల్మిడిం**
**దునిమి, నితాంత గాఢరయ దోర్విభవంబున నొండు విల్లు గై**
**కొనియెడు సందునన్ నినిచెఁ గ్రూరశరంబు లురంబునందు గ్ర**
**క్కున నతఁ డొల్లఁ బోయి రథకూబర మూఁతగ నిల్చె సోలుచున్. 176**

**ప్రతిపదార్థం:** క్రీడి= అర్జునుడు; కినుక= కోపం; మనంబునన్= మనస్సున; కదిరి= వ్యాపించి; పితామహు విల్లు= భీష్ముడి విల్లు; వ్రేల్మిడిన్= చిటికలో; తునిమి= ఖండించి; నితాంత= మిక్కిలి; గాఢ= గొప్పదైన; రయ= వేగం కల; దోస్+విభవంబునన్= బాహుబలసంపదతో; ఒండు విల్లు= మరొక ధనువును; కైకొనియెడు సందునన్= తీసికొనే మధ్యలో; క్రూరశరంబులు= ఘోరమైన బాణాలు; ఉరంబునందున్= రొమ్ముపై; నినిచెన్= నింపాడు; గ్రక్కునన్= వెంటనే; అతఁడు= భీష్ముడు; ఒల్లఁ బోయి= మూర్ఛపోయి; రథ కూబరము= రథమునొగ; ఊఁతగన్= ఆధారంగా; సోలుచున్= తూలుతూ; నిల్చెన్= ఆగాడు.

**తాత్పర్యం:** అర్జునుడికి మళ్ళీ కోపం రాగా భీష్ముడి ధనువు త్రుంచి, వేగంగా అతడు మరొక విల్లు పుచ్చుకొనే లోపల సందు చూచుకొని, తీవ్రమైన బాణాలను అతని రొమ్ముమీద కొట్టేసరికి, అతడు దిమ్మ తిరిగిపోయి, సోలిపోతూ రథమునొగ పట్టుకొని ఆగాడు.

**క. కనుఁగొని సూతుం డరదముఁ । గొనిపోయెం దొలఁగ నపుడు కుంతీతనయుం**
**డనిఁ దనివి సనక గుంపులు । గొని యున్నెడ లరసెఁ గలయఁ గురుసైన్యములన్. 177**

**ప్రతిపదార్థం:** సూతుండు= సారథి; కనుఁగొని= భీష్ముడు సోలిపోవటం చూచి; అరదమున్= రథాన్ని; తొలఁగన్+కొనిపోయెన్= అక్కడి నుండి మరొక చోటికి తోలుకొని పోయాడు; అపుడు; కుంతీ తనయుండు= అర్జునుడు; అనిన్= యుద్ధంలో; తనివి+చనక= తృప్తిపొందక; కురుసైన్యములన్= కౌరవసేనలలో; గుంపులుకొని= గుమిగూడి; ఉన్న+ఎడలు= ఉన్న చోటులను; కలయన్+అరసెన్= అంతటా వెదికాడు.

**తాత్పర్యం:** భీష్ముడి రథసారథి అతడి పరిస్థితి చూచి మరొక చోటికి రథం తోలుకొని పోయాడు. అప్పుడు అర్జునుడు కౌరవసేనలలో ఎక్కువమంది ఎక్కడ గుంపులు గూడి ఉన్నారా అని కలయ చూచాడు.

**వ. ఇ ట్ల ట్టెత్తి చూచి గాండీవంబు దొడసి గుణంబు సారించి కవదొనలు బిగియించి. 178**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; అట్టు+ఎత్తి= మెడ పైకెత్తి; చూచి= పరికించి; గాండీవంబు= గాండీవమును; తొడసి= నిమిరి; గుణంబు= నారి; సారించి= బిగించి; కవదొనలు= రెండు అమ్ముల పొదులను; బిగియించి= గట్టిగా బిగించుకొని.

**తాత్పర్యం:** ఈ రీతిగా మెడ ఎత్తి నాల్గుప్రక్కలా పరికించి, గాండీవాన్ని సిద్ధంచేసి, నారి బిగించి, అంప పొదులను రెంటిని బిగించుకొని.

**క. ఆచార్య సూర్యతనయ కృ । పాచార్య ప్రభృతి రథికు లందఱుఁ బ్రోవై**
**జూచుచు నుండఁగ నద్దెస । కేచి భుజాబలము మెఱయ నింద్రజుఁ డరిగెన్. 179**

**ప్రతిపదార్థం:** ఆచార్య= ద్రోణుడు; సూర్యతనయ= కర్ణుడు; కృపాచార్య ప్రభృతి= కృపాచార్యుడు మొదలైన; రథికులు+అందఱున్= రథికులంతా; ప్రోవు+ఐ= గుమికూడి; చూచుచున్+ఉండఁగన్= చూస్తూ ఉండగా; ఆ+దెసకున్= ఆ వైపునకు; ఏచి= విజృంభించి; భుజాబలము= పరాక్రమం; మెఱయన్= ప్రకాశించగా; ఇంద్రజుఁడు= అర్జునుడు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు, కర్ణుడు, కృపుడు మున్నగు రథికులు గుమికూడి, ఇంకా ఎవరు మిగిలారని చూస్తున్నాడో, ఎవరిమీద పడతాడో అన్నట్లుగా నిలిచి చూస్తుండగా అర్జునుడు తన భుజబలం మెరయగా వారున్న వైపుకే వెళ్ళాడు.

**వ. అప్పు డశ్వత్థామ కర్ణున కిట్లనియె. 180**

**తాత్పర్యం:** అప్పుడు అశ్వత్థామ కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు; మన । మేమి సేయువార? మీవు దక్క**
**నొరులు నిలువరింప నోపెడువారు లే; । రోట లేక తాఁకి యోర్వవలయు.' 181**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు= అర్జునుడు; వీఁడె= ఇదుగో; వచ్చుచున్+ఉన్నవాఁడు= మనవైపు వస్తున్నాడు; మనము= మనందరం; ఏమి+చేయువారము?= ఏమి చేయగలం?; ఈవు+తక్కన్= నీవు తప్ప; ఒరులు= ఇతరులు; నిలువరింపన్= అర్జునుడిని ఆపటానికి; ఓపెడువారు= సమర్థులైనవారు; లేరు; ఓట లేక= వెనుదియ్యక; తాఁకి= ఎదిరించి; ఓర్వవలయున్= ఓడించవలెను.

**తాత్పర్యం:** 'అదుగో అర్జునుడు మనవైపే వస్తున్నాడు. ఎవరి నేమి చేస్తాడో తెలియదు. నీవు తప్ప అతడిని నిలుపగలిగేవారు లేరు. నీవే వెనుబాటు లేక ఎదుర్కొని ఓడించాలి?'

**విశేషం:** అలం: వ్యాజస్తుతి

**క.** **అని తను నుల్లసమాడినఁ । గినిసి యినతనూజుఁ 'డేను గ్రీడి నిచట మా**
**ర్కొను వీఁకఁ గన్నులారం । గనుఁగొనుమీ నిలిచి' యనుచుఁ గవిసెం బెలుచన్.** **182**

**ప్రతిపదార్థం:** అని= ఈ రీతిగా; తనున్= తనను (కర్ణుని); ఉల్లసమాడినన్= పరిహాసం చేయగా; కినిసి= కోపించి; ఇనతనూజుఁడు= సూర్యసుతుడైన కర్ణుడు; ఏను= నేను; క్రీడిన్= అర్జునుడిని; ఇచటన్= ఈ యుద్ధంలో; మార్కొనువీఁకన్= ఎదిరించే పరాక్రమాన్ని; నిలిచి= నిలువబడి; కన్నులారన్= కన్నులనిండా; కనుఁగొనుమీ= చూడుమా; అనుచున్= అని పల్కుతూ; పెలుచన్= మిక్కిలి; కవిసెన్= ఎదిరించాడు.

**తాత్పర్యం:** అని తనను పరిహసించినందు కెంతో కోపించి, కర్ణుడు - 'నే నర్జునుడి నెదిరించటాన్ని కన్నులారా చూడు' మంటూ కోపంతో ఎదిరించాడు.

**క.** **దొరలును సుభటులుఁ గర్ణుని । యరదమునకు మున్న పొదివి; రర్జును నచటం**
**గరి సొచ్చిన తుంగ మడువు । పరుసున మొన చాఁపకట్టు వడియె నతనిచేన్.** **183**

**ప్రతిపదార్థం:** దొరలును= రథికులును; సుభటులున్= యోధులును; కర్ణుని+అరదమునకున్= కర్ణుడియొక్క రథానికి; మున్ను+అ= ముందుగా; అర్జునున్= అర్జునుడిని; పొదివిరి= చుట్టుముట్టారు; అచటన్= ఆ యుద్ధరంగంలో; కరి= ఏనుగు; చొచ్చిన= ప్రవేశించిన; తుంగ మడువు పరుసునన్= తుంగగడ్డి పెరిగి ఉన్న సరస్సువలె; మొన= ఎదుర్కొన్న సైన్యమంతా; అతనిచేన్= అర్జునుడిచేత; చాఁపకట్టు= చాపచుట్టగా, అందరూ ఒక్కసారిగా; పడియెన్= పడింది.

**తాత్పర్యం:** రథికులు, యోధులు కర్ణుడి రథానికి ముందుగానే అర్జునుడి నెదుర్కొన్నారు. అర్జునుడు వారినందరిని తుంగ బలిసిన మడుగులో ప్రవేశించిన ఏనుగు ఆ గడ్డినంతటిని త్రొక్కి పడవేసినట్లుగా వాళ్ళందరినీ లుంగ లుంగలుగా చాపచుట్టగా పడేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **ఇవ్విధంబునఁ బోరెడు నింద్రతనయు । నుక్కులావును నంతంత కెక్కుడయ్యె**
**నలసి మేనులు తూలాడ నిలిచి రంత । నంత నయ్యోధముఖ్యు లాహవము దక్కి.** **184**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; పోరెడు= యుద్ధం చేస్తున్న; ఇంద్ర తనయు= అర్జునుడియొక్క; ఉక్కు= చేవయు; లావును= బలమును; అంతంతకున్= క్రమక్రమంగా; ఎక్కుడు= ఎక్కువ; అయ్యెన్= అయింది; ఆ+యోధముఖ్యులు= కౌరవసేనలోని ఆ యోధశ్రేష్ఠులు; అలసి= బడలిక చెంది; మేనులు= శరీరాలు; తూలాడన్= తూలిపోతూ ఉండగా; ఆహవము= యుద్ధం; తక్కి= మాని; అంతన్+అంతన్= దూర దూరంగా; నిలిచిరి= ఆగి ఉన్నారు.

**తాత్పర్యం:** ఇన్ని రకాలుగా యుద్ధంచేస్తున్న అర్జునుడికి ఉత్సాహం, బలం అంతకంతకు పెరుగుతున్నాయి. కౌరవవీరులు అలసిపోయి, శరీరాలు తూలిపోయి, యుద్ధం మానివేసి ఆ ప్రక్కకు, ఈ ప్రక్కకు దూరదూరంగా పోయి నిలిచారు.

**వ. అట్టియెడ నుత్తరుండు నరున కిట్లనియె. 185**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయాన; ఉత్తరుండు; నరునకున్= అర్జునునితో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అప్పుడు సారథి అయిన ఉత్తరుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**చ. 'ఉడుకువ లేని కయ్యమున కోర్వఁగ వచ్చునె? నాకు డప్పి పు**
**ట్టెడు; నొకమాటు నాగ్రహము డింపవు నీవును; జక్కుసేసి ప**
**చ్చడి గలపంగ వెండియును జండితనంబున వచ్చి వచ్చి పో**
**రెడు మొన, లింకఁ జాల నొనరింప భవద్రథసూతకృత్యమున్.' 186**

**ప్రతిపదార్థం:** ఉడుకువ లేని= విశ్రాంతి లేని; కయ్యమునకున్= యుద్ధానికి; ఓర్వఁగన్+వచ్చునె?= ఓర్చుకొనవచ్చునా?; నాకున్= నాకు; డప్పి= దాహము; పుట్టెడున్= పుట్టుతున్నది; నీవును; ఒక మాటున్= ఒక్కసారి కూడా; ఆగ్రహము= కోపం-ఆవేశం; డింపవు= తగ్గించుకొనవు; చక్కు+చేసి= ముక్కలుచేసి; పచ్చడి కలపంగన్= పచ్చడివలె చేసినను; వెండియును= మరల; మొనలు= సేనలు; చండితనంబునన్= క్రూరత్వంతో; వచ్చి వచ్చి= మీదికి వచ్చి; పోరెడున్= పోరుతున్నవి; ఇంకన్= ఇటుపై; భవత్= నీయొక్క; రథ= రథానికి; సూత కృత్యమున్= సారథ్యమును; ఒనరింపన్+చాలను= చేయలేను.

**తాత్పర్యం:** 'విరామం లేకుండా యుద్ధం చేస్తుంటే ఎట్లా సహించేది? నాకు దాహం వేస్తున్నది. నీవు ఒక్కసారైనా ఆగ్రహావేశం మానకున్నావు. సైనికులా - నీవు వారిని ముక్క ముక్కలు చేసి, పచ్చడి చేసినా, మొండితనంగా ఇంకా మీదమీదకు వస్తూనే ఉన్నారు. నేను మాత్రం ఇంక నీకు సారథ్యం చేయలేను.'

**వ. అనిన విని కవ్వడి నవ్వుచు 'నేను గలుగ నీకు నోహటింప నేల? యంతియ; వలసినం దురంగంబులఁ దోడు గడపెద; నించుక సైరించి నిలువ వలయు; నెల్లపనులును జక్కనయ్యెః; రా జొక్కరుండు కొఱంత; యాతం డభిమాని; మనలం గని సరకుగొనఁ; డిప్పుడున్న చందంబు మనతోడం దలపడం గడంగుట దోఁచుచున్న యది; తమ్ములు నాప్తభృత్యులు నిరుగెలంకుల నగ్గలిక మెఱసి డగ్గఱి యున్న వా'రని కౌరవేశ్వరుని గట్టి మోహరంబు సూపి యతనిం బురికొల్పి యద్దిక్కు తేరు పోవనిమ్మనుటయు నతండును దలకొని యట్ల చేయ నడరి యెడనెడ నడ్డుపడు కురుబలములఁ జిఱునగవు నిగుడ మెఱుంగు వాలమ్ములఁ దొలంగ జడియుచుం గదిసిన, నమ్మేదినీవల్లభుండు. 187**

**ప్రతిపదార్థం:** అనినన్= ఉత్తరు డట్లా పలుకగా; విని; కవ్వడి= అర్జునుడు; నవ్వుచున్= నవ్వుతూ; నేను కలుగన్= నేనుండగా; నీకున్= నీకు; ఓహటింపన్+ఏల?= వెనుదీయనేల?; అంతియ= అంతే; వలసినన్= కావలసినచో; తురంగంబులన్= గుర్రాలను; తోడు గడపెదన్= నీకు సహాయంగా నేను నడుపుతాను; ఇంచుక= కొద్దిగా; సైరించి= సహించి; నిలువ వలయున్= ఆగవలెను; ఎల్ల పనులును= యుద్ధపు పనులన్నియును; చక్కన్+అయ్యెన్= అనుకూలంగానే అయినవి; రాజు+ఒక్కరుండు= దుర్యోధను డొక్కడే; కొఱంత= మిగిలి ఉన్నాడు; ఆతండు= అతడు; అభిమాని= అభిమానం కలవాడు; మనలన్= మనలను; కని= చూచి; సరకు+కొనఁడు= లెక్కచేయడు; ఇప్పుడున్న చందంబు= ఇప్పుడాతడున్న తీరు; మనతోడన్= నాతో; తలపడన్= యుద్ధానికి పూనుకొనటానికి; కడంగుట= ప్రయత్నించటంగా; తోఁచుచున్న+అది= తోస్తున్నది; తమ్ములున్= తన తమ్ములైన

దుశ్శాసనాదులును; ఆప్తభృత్యులున్= ఆప్తులైన సేవకులును; ఇరు కెలంకులన్= రెండు ప్రక్కలందును; అగ్గలిక మెఱసి= ఎక్కువగా మెరసి; డగ్గఱి+ఉన్నవారు= దగ్గరగా ఉన్నారు; అని= పలికి; కౌరవేశ్వరుని= దుర్యోధనుడియొక్క; గట్టి మోహరంబు= గట్టిదైన వ్యూహాన్ని; చూపి= కనపరచి; అతనిన్= ఉత్తరుడిని; పురికొల్పి= ప్రేరేపించి; ఆ+దిక్కు= ఆ వైపునకు; తేరు= రథాన్ని; పోవనిమ్ము= పోనిమ్ము; అనుటయున్= అనగా; అతండును= ఉత్తరుడు కూడ; తలకొని= అంగీకరించి; అట్లు+అ చేయన్= అట్లే చేయగా; అడరి= అతిశయించి; ఎడనెడన్= మధ్యమధ్యలో; అడ్డపడు= అడ్డం వచ్చే; కురువీరులన్= కౌరవవీరులను కూడ; చిఱునగవు= చిరునవ్వు; నిగుడన్= వ్యాపించగా; మెఱుంగు వాలమ్ములన్= మెరసెడి వాడి బాణాలతో; తొలంగన్= తొలగేటట్లు; జడియుచున్= జడిపిస్తూ; కదిసినన్= సమీపించగా; ఆ+మేదినీ వల్లభుండు= ఆ రాజు దుర్యోధనుడు.

**తాత్పర్యం:** ఉత్తరుడి మాటలు విని అర్జునుడు నవ్వుతూ - 'నే నుండగా నీకు భయమెందుకు? నా మాట నిజం. నమ్మము. కావలసివస్తే రథసారథ్యంలో నేనూ కొంత సహాయం చేస్తాను. మరింక కొద్దిసేపు ఓపిక పట్టి నీవు ధైర్యంగా నిలబడాలి. అన్ని పనులు అనుకొన్నట్లుగానే సవ్యంగా జరిగాయి. ఇక ఆ దుర్యోధను డొక్కడే మిగిలి ఉన్నాడు. అతడు మిక్కిలి ఆత్మాభిమానం కలవాడు. మనలను చూచి లెక్కచేయడు. ఇపు డత డున్న తీరు గమనిస్తే మనతో యుద్ధానికి సిద్ధమౌతున్నట్లు తోస్తున్నది. అతడి తమ్ములు, ఆత్మీయులు, సేవకులు (సామంతులు) అతడికి రెండువైపులా (కుడిఎడమల) నిలిచి ఉత్సాహంతో ఉరకలెత్తుతున్నారు. చూడు' మని వాళ్ళనూ, కురురాజునూ, వారి గట్టి యుద్ధవ్యూహాన్ని చూపి, ఉత్తరుడిని ఉత్సాహపరచి, ఆ దిక్కుకు రథాన్ని పోనిమ్మన్నాడు అర్జునుడు. అతడు అట్లాగే చేశాడు. దుర్యోధనుడి వైపు వెళ్ళుతున్న అర్జునుడికి కురుబలాలు కొన్ని అడ్డువచ్చాయి. వాళ్ళను అతడు చిరునవ్వులు చిందిస్తూ అవలీలగా వాడిబాణాలతో బాది భయంతో ప్రక్కకు తొలగేటట్లు చేసి, హుటాహుటిగా రారాజును సమీపించాడు.

### అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధంబు సేయుట (సం. 4-60-1)

**క. పులిఁ గోల వేసిన ట్టి । ట్టలపు రయంబునఁ గడంగుటయుఁ దద్వక్షః**
**స్థలమునఁ గిరీటి రెండ । మ్ముల నాఁటఁగ నేసి బొమలు ముడివడుచుండన్. 188**

**ప్రతిపదార్థం:** పులిన్= పులిని; కోలన్= బాణంతో; వేసిన+అట్టు= వేసిన రీతిగా; ఇట్టలము+రయంబునన్= అధికమైన వేగంతో; కడంగుటయున్= సిద్ధంకాగా; కిరీటి= అర్జునుడు; తద్+వక్షస్+స్థలమునన్= ఆతడి రొమ్ముపై; రెండు+అమ్ములన్= రెండు బాణాలను; బొమలు= కనుబొమలు; ముడి+పడుచుండన్= కోపంతో ముడుచుకొనగా; నాఁటఁగన్= నాటేటట్లు; ఏసెన్= బాణాలతో కొట్టాడు.

**తాత్పర్యం:** బాణపు దెబ్బతిన్న పెద్దపులివలె అధికమైన వేగంతో యుద్ధానికి సిద్ధపడిన దుర్యోధనుడి రొమ్ముమీద మిక్కిలి కోపంతో కనుబొమలు ముడివడిన అర్జునుడు రెండు బాణాలు నాటేటట్లు వేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. క్షతములఁ బెల్లు దొరఁగు శో । ణిత ధారలు మదముగా వినిర్గళకరి యా**
**కృతిఁ గవిసి యతం డేసెను । శతమఖసుతు ఫాలతలము శాతశరమునన్. 189**

**ప్రతిపదార్థం:** క్షతములన్= బాణపు దెబ్బలనుండి; పెల్లు= ఎక్కువగా; తొరఁగు= ప్రవహించే; శోణిత ధారలు= రక్తధారలు; మదముగాన్= మదజలం కాగా; వినిర్గళ= బయటికి వచ్చే; కరి+ఆకృతిన్= ఏనుగు వలె; కవిసి= ఎదుర్కొని; అతండు= ఆ దుర్యోధనుడు; శతమఖసుతు= అర్జునునియొక్క; ఫాలతలమున్= నెన్నుదురును; శాత శరమునన్= వాడి అయిన బాణంతో; ఏసెను= కొట్టాడు.

**తాత్పర్యం:** బాణపు దెబ్బలనుండి కారే రక్తం మదజలమా అన్నట్లు వెలువడి వచ్చే ఏనుగువలె దుర్యోధనుడు వచ్చి, అర్జునుడి నెదిరించి, అతడి నుదుటిమీద వాడిబాణంతో కొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ-రూపకానుప్రాణితం - శోణితధారలకునూ మదజలానికీ అభేదం.

**తే.** **రక్తధారలు వెడలంగ రశ్మి వెలుఁగఁ। బొలుచు బాలార్కు చాడ్పునఁ జెలువు మిగిలి**
**ఫల్గునుండు ప్రతాప సంభరిత మూర్తి। యగుచు శరకిరణంబులు నిగుడఁ జేసె.** **190**

**ప్రతిపదార్థం:** రక్తధారలు= రక్తముయొక్క ధారలు; వెడలంగన్= బయటికి రాగా; రశ్మి= కాంతి; వెలుఁగన్= ప్రకాశించగా; పొలుచు= ఒప్పారే; బాల+అర్కుచాడ్పునన్= లేతసూర్యుడి వలె; చెలువు మిగిలి= ఎక్కువగా అందగించి; ఫల్గునుండు= అర్జునుడు; ప్రతాప= ప్రతాపంతో; సంభరిత= నిండిన; మూర్తి, అగుచున్= శరీరం కలవాడై; శరకిరణంబులు= బాణాలనెడి కిరణాలు; నిగుడన్= వ్యాపించేటట్లు; చేసెను= చేశాడు.

**తాత్పర్యం:** మొగంనుండి రక్తధారలు కారుతూ ఉండగా కిరణాలతో ప్రకాశించే లేతసూర్యుని వలె అర్జునుడు ప్రతాపంతో వెలుగుతూ ఉన్నవాడై బాణాలనే కిరణాలను చక్కగా ప్రసరింపజేశాడు.

**విశేషం:** అలం: ఉపమ, రూపకానుప్రాణితం.

**శా.** **వానిం దీవ్రశరంబులం దునిమి గర్వం బెక్క నానాస్త్ర సం**
**తానంబుల్ గురిసెన్ సుయోధనుఁడు దుర్దాంతాకృతిన్ గోత్రభి**
**త్సూనుండుం బటు సాయకోత్కరమునం జూపెన్ భుజాటోప మి**
**ట్లేనుం గేనుఁగుఁ దాఁకునట్లు సమరం బేపారఁగా నయ్యెడన్.** **191**

**ప్రతిపదార్థం:** వానిన్= ఆ వచ్చు బాణములను; తీవ్ర శరంబులన్= వాడియైన బాణాలతో; తునిమి= ఖండించి; గర్వంబు+ ఎక్కన్= గర్వం అతిశయించి; నానా+అస్త్ర సంతానంబుల్= పలురకాలైన బాణ సముదాయాలను; సుయోధనుఁడు= దుర్యోధనుడు; కురిసెన్= కురిపించాడు; గోత్రభిత్సూనుండున్= అర్జునుడు కూడా; దుర్దాంత+ఆకృతిన్= సహించజాలని ఆకారంతో; పటు= గట్టివైన; సాయక= బాణాలయొక్క; ఉత్కరమునన్= సముదాయంతో; భుజ+ఆటోపము= భుజ విక్రమాన్ని; చూపెన్= ప్రదర్శించాడు; ఇట్లు= ఈ రీతిగా; ఏనుంగు; ఏనుంగున్= మరొక ఏనుగును; తాఁకు+అట్లు= ఎదిరించినట్లుగా; సమరంబు= యుద్ధం; ఏపారఁగాన్= హెచ్చు కాగా; ఆ+ఎడన్= అప్పుడు.

**తాత్పర్యం:** అర్జునుడు వేసిన బాణాలను దుర్యోధనుడు వాడి బాణాలతో మధ్యలోనే ఖండించి, గర్వంతో రకరకాల బాణాలు అర్జునుడిమీద వేశాడు. అప్పు డర్జునుడు భీకరాకారంతో తన పరాక్రమాన్ని చూపించాడు. ఇట్లా ఏనుగును ఏనుగు తాకినట్లుగా యుద్ధం ఘోరంగా సాగుతున్నది. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ.

**తే. హస్తిపురిఁ బేరు గల మదహస్తి నెక్కి। క్రాలు కావలి రథములు గవియుఁదేర**
**నభ్రగజముపైఁ బర్జన్యుఁ డనఁగ నంప। వాన పరఁగ వికర్ణుండు వచ్చి తాఁకె. 192**

**ప్రతిపదార్థం:** హస్తిపురిన్= హస్తినాపురి పట్టణంలో; పేరుకల= ప్రసిద్ధికెక్కిన; మదహస్తిన్= మదపుటేనుగును; ఎక్కి; క్రాలు= ప్రకాశించే; కావలి రథములు= కాపలా ఉన్న రథాలు; కవియుఁదేరన్= సమీపించగా; అభ్రగజముపైన్= ఆకాశమందలి ఏనుగుపై (ఐరావతంమీద); పర్జన్యుఁడు+అనఁగన్= ఇంద్రుడా అన్నట్లుగా; అమ్ము+వాన= బాణవర్షం; పరఁగన్= వ్యాపించగా; వికర్ణుండు= వికర్ణుడు; వచ్చి తాఁకెన్= అర్జునుడిని ఎదిరించాడు.

**తాత్పర్యం:** హస్తినాపురంలో పేరు మోసిన మదపుటేనుగు నెక్కి, కావలిగా రథాలపై రథికులు రాగా - ఐరావతం మీద ఇంద్రుడు వచ్చాడా అన్నట్లు వికర్ణుడు వచ్చి బాణవర్షం కురిపిస్తూ అర్జునుడి నెదిరించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**ఉ. వీఁక నెదిర్చి యిట్లు కురువీరులకుం బ్రమదం బొనర్చుచుం**
**దాఁకినఁ గ్రోధవేగ సముదగ్రత నెఱ్ఱని చూడ్కిఁ జూచి పే**
**రాఁకలితోడ నున్న జమునాకృతి భీషణరేఖ యొప్పఁగా**
**వ్రేఁకని నారసంబుఁ దొడి క్రీడి కరిన్ దృఢముష్టి నేసినన్. 193**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; వీఁకన్= పరాక్రమంతో; ఎదిర్చి= ఎదిరించి; కురు వీరులకున్= కౌరవసేనలోని వీరులకు; ప్రమదంబు= సంతోషమును; ఒనర్చుచున్= కలిగిస్తూ; తాఁకినన్= ఎదిరించగా; క్రీడి= అర్జునుడు; క్రోధవేగ= కోపముయొక్క, వేగముయొక్క; సముదగ్రతన్= అతిశయంతో; ఎఱ్ఱని చూడ్కిన్= ఎర్రని చూపుతో; చూచి; పేరు+ఆఁకలి తోడన్= ఎక్కువ ఆకలితో; ఉన్న= ఉన్న; జము+ఆకృతిన్= యముడి ఆకారంతో; భీషణ రేఖ= భయంకరమైన వైఖరి; ఒప్పఁగాన్= ప్రకాశించగా; వ్రేఁకని= దుస్సహమైన; నారసంబున్= గొప్పగా శబ్దంచేసే నారసమనే పేరుగల బాణాన్ని; తొడి= తొడిగి; కరిన్= ఏనుగును; దృఢముష్టిన్= గట్టి పిడికిటితో పట్టి; ఏసినన్= వేయగా.

**తాత్పర్యం:** వికర్ణు డెదిరించే సరికి కౌరవవీరులందరు సంతోషించారు. అర్జునుడికి కోపం హెచ్చిపోయింది. అందువలన కన్ను లెర్రబడగా భయంకరంగా చూచాడు. ఆకలితో మీదపడే యముడివలె గొప్ప నారసాన్ని ఎక్కుపెట్టి లాగి వికర్ణుడి ఏనుగును తీవ్రంగా కొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. ఫాలకుంభ సంధిఁ బడి వాలమున వెస। నుచ్చి పోవుటయును నుర్వి యద్రువఁ**
**గూలె నగ్గజంబు కులిశ చండాహతిఁ। బడు మహానగంబు భంగి దోఁప. 194**

**ప్రతిపదార్థం:** ఫాలకుంభ సంధిన్= ఫాలానికీ కుంభస్థలానికి మధ్యభాగంలో; పడి= గ్రుచ్చుకొని; వెసన్= శీఘ్రంగా; వాలమునన్= తోకగుండా; ఉచ్చి పోవుటయునున్= దూసికొని పోగా; ఉర్వి= భూమి; అద్రువన్= అదరగా; ఆ+గజంబు= ఆ ఏనుగు; కులిశ= వజ్రముయొక్క; చండ+ఆహతిన్= తీవ్రమైన దెబ్బతో; పడు= పడునట్టి; మహీనగంబు భంగిన్= పెద్ద కొండరీతి; తోఁపన్= తోచగా; కూలెన్= చచ్చిపడింది.

**తాత్పర్యం:** అర్జునుడు ప్రయోగించిన ఆ బాణం నుదుటికీ కుంభస్థలానికీ మధ్యభాగంలో గ్రుచ్చుకొని తోకవరకు వేగంగా దూసికొని పోగా, ఆ యేనుగు వజ్రపుదెబ్బకు పడిపోయిన పెద్ద కొండవలె నేల అదిరేటట్లు పడిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అరుణ మణి మాలికా వి। స్ఫురణంబున దంతితనువు చూడఁగ నొప్పెన్**
**ధరణిఁ బడియున్న బహుముఖ। పరిగత దావాగ్నిఁ బొల్చు పర్వతము క్రియన్. 195**

**ప్రతిపదార్థం:** దంతి తనువు= ఏనుగు శరీరం; అరుణమణి= కెంపులయొక్క; మాలికా= మాలయొక్క; విస్ఫురణంబునన్= ప్రకాశంతో; ధరణిన్= భూమిపై; పడి+ఉన్న= పడిపోయి ఉన్న; బహుముఖ= అనేక ముఖాలుగా; పరిగత= వ్యాపించిన; దావ+ అగ్నిన్= దావాగ్నితో; పొల్చు= ఒప్పే; పర్వతము క్రియన్= కొండవలె; చూడఁగన్= చూడటానికి; ఒప్పెన్= అమరింది.

**తాత్పర్యం:** ఎర్రని కెంపుల మాలతో ప్రకాశిస్తూ, పడివున్న ఆ ఏనుగు శరీరం పలుచోట్ల మంటలు మండే దావాగ్నితో వెలుగొందే పర్వతమో అన్నట్లు ఒప్పారింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగైన వికర్ణుండు వెఱ చఱచి పఱచి వివింశతిరథం బెక్కె; నాలోనన యట్టి నారాచంబున రారాజు నురంబు నోనాట నేసినఁ గరీంద్రుండు వడుటయు నరేంద్రుండు నొచ్చుటయుం గని ఱిచ్చపడు రథికుల వివ్వచ్చుం డనర్గళ ప్రసారం బగు మార్గణాసారంబున ముంచిన వెగడుపడి విఱిగి పాఱి; రిత్తెఱంగునఁ దనచుట్టును బయలైన నయ్యురగకేతనుండును మరలె; నిట్లు దొరయును విఱిగి కలను వాసి కాలు ద్రోసిపోవుటయు, నతిరథ మహారథు లెల్లం జెల్లాచెద రగుటయుం జూచి సైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి కనుకనిం బఱవం దొడంగిన. 196**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఏనుంగు పీనుంగు+ఐనన్= ఏనుగు చచ్చిపోగా; వికర్ణుండు= వికర్ణుడు; వెఱచఱచి= భయపడి; వివింశతి రథంబు= వివింశతియొక్క రథాన్ని; ఎక్కెన్= ఎక్కాడు; ఆలోనన్+అ= అంతలోనే; అట్టి నారాచంబునన్= అటువంటి బాణంతోనే; రాజరాజు+ఉరంబు= రాజరాజు దుర్యోధనుని రొమ్మును; నోన్= నొచ్చునట్లు; నాటన్= నాటునట్లు; ఏసినన్= వేయగా; కరీంద్రుండు= పెద్ద ఏనుగు; పడుటయున్= చావటము; నరేంద్రుండు= దుర్యోధనుడు; నొచ్చుటయున్= బాధపడటమున్నూ; కని= చూచి; ఱిచ్చపడు= ఆశ్చర్యపడెడి; రథికులన్= రథముపైనుండి యుద్ధం చేసేవారిని; వివ్వచ్చుండు= అర్జునుడు; అనర్గళ= అడ్డులేని; ప్రసారంబు+అగు= ప్రసారంకల; మార్గణ= బాణాలయొక్క; ఆసారంబునన్= జడివానలో; ముంచినన్= ముంచెత్తగా; వెగడుపడి= భయపడి; విఱిగి= బలం చెడి; పాఱిరి= పరుగెత్తారు; ఈ+తెఱంగునన్= ఈ రీతిగా; తనచుట్టును= తనకు చుట్టూ ఉన్న ప్రదేశం; బయలు+ఐనన్= ఎవ్వరును లేని ప్రదేశం కాగా; ఆ+ఉరగ కేతనుండును= ఆ దుర్యోధనుడును; మరలెన్= వెనుకకు తిరిగిపోయాడు; ఇట్లు= ఈ విధముగా; దొరయును= ప్రభువు కూడా; విఱిగి= బలం చెడి; కలను= యుద్ధరంగం; పాసి= వదలి; కాలుద్రోసి= నిలువక; పోవుటయున్= పారిపోగా; అతిరథ మహారథులు= గొప్ప గొప్ప రథికులు; ఎల్లన్= అందరును; చెల్లాచెదరు+అగుటయున్= అంతటా చెదరిపోవటమున్నూ; చూచి; సైన్యంబులు= సేనలు; ఉన్నవి ఉన్నచోటన్+అ= ఉన్నవి ఉన్నచోటనే; తెరలి= చెదరిపోయి; కనుకనిన్= సంభ్రమంతో; పఱవన్+తొడంగినన్= పారిపోవటానికి ప్రారంభించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ఏనుగు పీనుగై పోయేసరికి హడలిపోయి వికర్ణుడు పరుగెత్తి వివింశతి రథమెక్కాడు. అంతలో అర్జునుడు, అటువంటి బాణమే ఇంకొకటి దుర్యోధనుడి రొమ్ముమీద నాటేటట్లు వేయగా అతడు దెబ్బతిన్నాడు. అట్లా ఏనుగు చావటం, దుర్యోధనుడు దెబ్బతినటం చూసి తెల్లబోయారు రథికులు. అర్జునుడు వారిని అడ్డులేని బాణవర్షంలో ముంచెత్తాడు. వారు హడలిపోయి పారిపోయారు. ఆ రీతిగా తనచుట్టూ ఎవ్వరూ లేకపోయేసరికి దుర్యోధనుడు కూడా వెనుకకు తిరిగాడు. ఈవిధంగా ప్రభువు కూడా వెనుకకు మరలి, అతిరథ మహారథులందరూ చెల్లాచెదరయ్యేసరికి సేనలు ఉన్నవి ఉన్నచోటే చెదరిపోయి భయంతో పారిపోవటం ప్రారంభించాయి.

**తే.** **యూథపతితోడి దంతిసముత్కరంబు । వెనుకఁ దగిలెడు సింగంబు విధము దోఁప**
**నార్పు నాదంబుగా నరుఁ డంటఁ దాఁకె । రాజుఁ దారును బాఱెడు రథిక వరుల.** 197

**ప్రతిపదార్థం:** యూథపతితోడి= ఏనుగుల గుంపుకు నాయకుడైన పెద్దఏనుగుతో కలిసి వెళ్ళుతున్న; దంతి సముత్కరంబు= ఏనుగుల మందయొక్క; వెనుకన్= వెనుక; తగిలెడు= తరిమి వెంబడించే; సింగంబు విధము= సింహముయొక్క రీతి; తోఁపన్= తోచగా; రాజున్= దుర్యోధనుడిని; తారును= తామును; పారెడు= పారిపోయే; రథిక వరులన్= రథిక శ్రేష్ఠులను; అంటన్= అంటేటట్లుగా; ఆర్పునాదంబుగాన్= ఆర్పులే సింహనాదంగా; నరుఁడు= అర్జునుడు; తాఁకెన్= దాడి చేశాడు.

**తాత్పర్యం:** యూధనాయకుడితో సహా ఏనుగుల మందను వెంబడించే సింహం వలె దుర్యోధనుడిని, అతడిని వెంబడించి పారిపోయే రథికవరులను అర్జునుడు ఆర్పులు పెట్టుతూ తరిమి వెంబడించి దాడి చేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **వెనుకొని కర్ణుని పెడతల । యును దుశ్శాసనుని వీఁపు నొక్కొక్క శరం**
**బున నేసె నప్పు డయ్యిన । తనయుం డిట్లనియె నతిరథశ్రేష్ఠులతోన్.** 198

**ప్రతిపదార్థం:** వెనుకొని= వెనుకనే వెంబడించి; కర్ణుని పెడతలయును= కర్ణుడియొక్క తలప్రక్క భాగాన్ని; దుశ్శాసనుని వీపును= దుశ్శాసనుడి యొక్క వీపును; ఒక్కొక్క శరంబునన్= ఒక్కొక్క బాణంతో; ఏసెన్= కొట్టాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+ఇన తనయుండు= ఆ కర్ణుడు; అతిరథ శ్రేష్ఠులతోన్= అతిరథ శ్రేష్ఠులైన భీష్మ ద్రోణాదులతో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** వెనుకనే వెంబడించి అర్జునుడు కర్ణుడి పెడతలను, దుశ్శాసనుడి వీపును ఒక్కొక్క బాణంతో కొట్టాడు. అప్పుడు కర్ణుడు భీష్మద్రోణాదులతో ఇట్లా అన్నాడు.

**ఆ.** **'కూడముట్టెఁ గ్రీడి కురువంశమున కెల్ల । మూలకంద మీ నృపాలుఁ డితని**
**నిచటఁ గాచికొనుట యెల్ల పౌరుషములు । జేఁత; నిలిచి లావు సేయవలయు.** 199

**ప్రతిపదార్థం:** క్రీడి= అర్జునుడు; కూడన్= వెనుకవచ్చి కలిసికొని; ముట్టెన్= ముట్టడించాడు; ఈ నృపాలుఁడు= ఈ దుర్యోధనుడు; కురువంశమునకున్= కౌరవవంశానికి; ఎల్లన్= అంతకును; మూలకందము= మూలమైనవాడు; ఇచటన్= ఈ యుద్ధంలో; ఇతనిన్= ఈ దుర్యోధనుడిని; కాచికొనుట= రక్షించుకొనటం; ఎల్ల పౌరుషములున్= సకల పురుష ప్రయత్నాలూ; చేఁత= చేయటం; నిలిచి= ఆగి; లావు= బలం; చేయవలయున్= చూపాలి.

**తాత్పర్యం:** అర్జునుడు వెనుకనుండి మనలను వెంటాడి కొట్టుతున్నాడు. ఈ దుర్యోధనుడే కురువంశానికి మూలమైనవాడు. ఇక్కడ మనమందరం మన బలపౌరుషాలను ప్రదర్శించి ఇతడిని రక్షించుకొనాలి. ఇది మన కర్తవ్యం.

**విశేషం:** ఘోషయాత్రాఘట్టంలో చిత్రరథుడు దుర్యోధనుడిని సపరివారంగా బంధించి తీసికొనిపోయినట్లుగా అర్జునుడు కూడా చేస్తాడేమోనని భయపడిన కర్ణుడు అందరి సహాయాన్ని కోరుతున్నాడు. ప్రభురక్షణం సేవాధర్మమని ప్రబోధిస్తున్నాడు. ఇవి కర్ణుడి ప్రవృత్తికి తగిన మాటలు. (సంపా.)

**క.** **అన వినుచుఁ గురుపితామహుఁ। డును ద్రోణుఁడు ద్రోణపుత్త్రుఁడును గృపుఁడును గ**
**ర్ణుని మాట సరకుసేయక। చనుచుండఁగ దీనవృత్తి జనపతి పలికెన్.** **200**

**ప్రతిపదార్థం:** అనన్= అని పలుకగా; వినుచున్= వింటూ; కురుపితామహుఁడును= భీష్ముడును; ద్రోణుఁడున్; ద్రోణపుత్త్రుఁడును= అశ్వత్థామయు; కృపుఁడును= కృపాచార్యుడును; కర్ణునిమాట= కర్ణుడు చెప్పిన మాటను; సరకుచేయక= లెక్కసేయక; చనుచున్+ఉండఁగన్= వెళ్ళుతూ ఉండగా; జనపతి= దుర్యోధనుడు; దీనవృత్తిన్= దైన్యంగా; పలికెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ పల్కులను వింటూ కూడా భీష్ముడు, ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు ఆతని మాటలను లెక్కచేయకుండా వెళ్ళిపోతూంటే, దుర్యోధనుడు దీనంగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీష్మద్రోణాదులు కర్ణుడి మాటలను లక్ష్యం చేయకపోవటానికి మూడు కారణాలు కానవస్తున్నాయి. 1. వీరులలో భీష్మాదుల వలె అతడు ఉన్నత పదాధికారి కాడు. అందువలన ఆజ్ఞలు భీష్మాదులు పాటించరు. 2. కర్ణుడికి భీష్మాదులమీద గౌరవం లేదు. అతడిని ఆసరాగా చేసికొని దుర్యోధనుడు కూడా భీష్మాదులను లెక్కచేయడు. రారాజే స్వయంగా కర్ణుడి అసమర్థతను గుర్తించి స్వయంగా తమను కోరినప్పుడే సాయపడాలనే భావం వారి మనస్సులలో ఉండటం. 3. తానే అర్జునుడిని ఓడిస్తానని ప్రగల్భాలాడి, ఇప్పుడు అందరి సాయం కోరుతున్న కర్ణుడి బడాయిని, బండారాన్ని బయటపెట్టాలని భీష్మాదులు భావించటం. దుర్యోధనుడు ఆ సన్నివేశంలోని గాంభీర్యాన్ని గుర్తించాడు. 'అందితే జుట్టు, అందకపోతే కాళ్ళు'- అనే సామెత నిజమైనట్లు దుర్యోధనుడు తానే వారిని ప్రార్థించటానికి పూనుకొన్నాడు. అసమర్థుల అహంకారం అవమానాలకు ఆలవాలమౌతుందని దుర్యోధనుడు నిరూపించాడు. అయితే ఈ వినయం అతడి చిత్తశుద్ధితో కూడింది కాదు, చిత్త పరిపాకం అసలే కాదు. గండం గట్టెక్కటానికి అనుసరించే జిత్తులమారి ఎత్తుగడ మాత్రమే. (సంపా.)

**క.** **'లోకంబు తోడివారుగ। మీకుం జనునయ్య? మగఁటిమికి గుఱిగాదే**
**నా కెడరైన యెడం దగఁ। జేకొని యది మీరు చక్కఁ జేయుట యరయన్.'** **201**

**ప్రతిపదార్థం:** లోకంబు తోడి వారుగన్= లోకంలోని సామాన్యుల వలె; మీకున్= మీకు కూడా; చనునయ్య?= తగునా?; నాకున్= నాకు; ఎడరు+ఐన ఎడన్= బాధ కల్గినపుడు; తగన్= తగినట్లుగా; చేకొని= తీసికొని; అది= దానిని; మీరు; చక్కఁజేయుట= బాధ కల్గకుండా చేయటం; అరయన్= ఆలోచించగా; మగఁటిమికిన్= పరాక్రమానికి; గుఱి కాదే?= లక్ష్యం కాదా?

**తాత్పర్యం:** 'ఎవరో బయటి లోకులవలె ఏమీ పట్టనట్లు వినకుండా వెళ్ళిపోవటం మీకు బాగుందా? రాజైన నాకు బాధ కలిగినపుడు దానిని మీ బాధ్యతగా స్వీకరించి, ఆ బాధను తొలగించటం మీ పరాక్రమానికి లక్ష్యం కాదా?'

**విశేషం:** దుర్యోధనుడి వేడికోలు పెద్దలను వేడుకొంటున్నట్లుగా లేదు. భీష్మాదుల ప్రవర్తనం సామాన్యులవలె (లోకుల తీరువలె) ఉన్నదట! కర్ణుడి తీరు రాజును రక్షించే సేవాధర్మాన్ని నిర్వహించే వీరుడివలె ఉన్నదట! భీష్మాదులు కర్ణుడివలె కాక అన్యులవలె వ్యవహరించటం న్యాయమా? అని అన్నాడు. ఇవి అధిక్షేపోక్తులవలె ఉన్న అభ్యర్థన వాక్యాలు. గూఢాభిమానులైన భీష్మాదులు ఆ మాటలకు విలువ నివ్వలేదు. రాజైన దుర్యోధనుడిని ఓదార్చినట్లుగా మొగమోటపు మాటలు పలికి తమదారిన తాము పోయారు. కర్ణుడు తనను ఉద్ధరించేది లేక, దుర్యోధనుడు చేసేది లేక వారి వెంటపడి పోసాగాడు. ఈ రీతిగా దుర్యోధనుడు కర్ణుడివలన రెంటికి చెడ్డ రేవడి అయినాడు. (సంపా.)

**వ. అనిన విని వారలు వెనుకయై యాశ్వాస వచనంబులు పలుకుచుం బోవం బోవుచున్న యన్నరేంద్రు నెలుంగెత్తి పిలిచి పార్థుం డిట్లనియె. 202**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; వారలు= భీష్మ, ద్రోణ, అశ్వత్థామ, కృపులు; వెనుక+ఐ= వెనుకకు ఆగి దుర్యోధనునితో కలిసి; ఆశ్వాస వచనంబులు= ఓదార్పు మాటలు; పలుకుచున్= చెప్పుతూ; పోవన్= పోగా; పోవుచున్+ఉన్న= తాను పోతున్న; ఆ+నరేంద్రున్= ఆ దుర్యోధనుడిని; ఎలుంగు+ఎత్తి= పెద్ద కంఠస్వరంతో కేకపెట్టి; పిలిచి= కేకవేసి; పార్థుండు= అర్జునుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** దుర్యోధను డట్లా అనేసరికి భీష్మాదులు కాస్త వెనుకకు ఆగి దుర్యోధనుడితో కలిసికొని, అతడితో ఓదార్పు మాటలాడుతూ పోతుండగా దుర్యోధనుడూ పోతున్నాడు. అప్పు డర్జునుడు దుర్యోధనుడిని గట్టిగా కేకపెట్టి పిలిచి ఇట్లా అన్నాడు.

### అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట (సం. 4-60-15)

**ఉ. 'క్షత్రియుఁ డోడునే? తగదు కౌరవరాజ! యొకండ నేఁ బృథా**
**పుత్రులలోనఁ బిన్న; నినుఁ బోరికిఁ బిల్వఁగ, మాని నాఁగ ని**
**ద్ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కి బలదర్పసమగ్రుఁడవైన నీవు నీ**
**మిత్రులుఁ గూడ నిట్లయిన మెత్తురె? వత్తురె కొల్వ భూభుజుల్? 203**

**ప్రతిపదార్థం:** క్షత్రియుఁడు= రాజవంశంలో పుట్టినవాడు; ఓడునే?= యుద్ధంలో ఓడిపోయి వెళ్లుతాడా?; తగదు= పారిపోవటం ఉచితం కాదు; కౌరవరాజ!= దుర్యోధనా!; నేన్= నేను; ఒకండన్= ఒక్కడను; పృథా పుత్రులలోనన్= కుంతియొక్క పుత్రులలో; పిన్న= చిన్నవాడను; నినున్= నిన్ను; పోరికిన్= యుద్ధానికి; పిల్వఁగన్= ఆహ్వానించగా; మాని= అభిమానవంతుడు; నాఁగన్= అనగా; ఈ+ధాత్రిన్= ఈ భూమిలో; ప్రసిద్ధికిన్+ఎక్కి= పేరుకెక్కి; బల= బలంతోను; దర్ప= గర్వముతోను; సమగ్రుఁడవు+ఐన= పరిపూర్ణుడవైన; నీవున్= నీవును; నీ మిత్రులున్+కూడన్= నీ మిత్రులైన కర్ణాదులును; ఇట్లు= ఈ రీతిగా ఓడిపోయి పారిపోయినవారు; అయినన్= అయితే; భూ భుజుల్= రాజులు; మెత్తురె?= మెచ్చుకొంటారా?; కొల్వన్= నిన్ను సేవించటానికి; వత్తురె?= వస్తారా?

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! నీవు కౌరవరాజువు. క్షత్రియుడైనవా డెవడైనా ఓడిపోయి పారిపోతాడా? ఇట్లా పారిపోవటం ఉచితం కాదు. నే నొక్కడను. అనగా నిస్సహాయుడను, నీవా పెద్ద సైన్యంతో మిత్రులతో ఉన్నావు. పైగా నేను కౌంతేయులలో చిన్నవాడను. నీవు కౌరవులలో అగ్రజుడవు. నాకన్న పెద్దవాడవు కూడా. నిన్ను యుద్ధానికి పిలుస్తూంటే రావటంలేదు. నీవా లోకంలో అభిమానధనుడవని చాల పేరు పొందావు. బలం గర్వం దండిగా ఉన్నవాడివైన నీవు,

నీ మిత్రులూ ఇట్లా (రణరంగం వదలి పారిపోయేటట్లు) అయితే రాజులు నిన్ను మెచ్చుకొంటారా? నిన్ను సేవించటానికి (నీ కొలువు చేయటానికి) ఇక వస్తారా?

**విశేషం:** 1. అలం: విషమం. "విషమం వర్ణ్యతే యత్ర ఘటనాననురూపయోః". అనురూపాలు కానివాటికి సంబంధం ఉన్నట్లు వర్ణించటం విషమాలంకారం. ఇది అధిక్షేపంలో అందంగా రాణిస్తుంది. కర్ణసహాయ మున్నదని అహంకరించే దుర్యోధనుడు వెన్నిచ్చి పారిపోతున్న తరుణంలో ఆతడి బండారాన్ని బట్టబయలు చేస్తూ వెక్కిరిస్తూ, గేలిచేస్తూ, అధిక్షేపిస్తూ మాట్లాడిన మాట లివి. ఈ పద్యం ప్రతిపద సార్థకం. ప్రతిపదం దుర్యోధన హృదయాన్ని బాధపెట్టేదే.

2. క్షత్రియుఁ డోడునే? - యుద్ధానికి వచ్చే క్షత్రియుడు విజయమో, వీరస్వర్గమో చేపట్టటానికి వస్తాడుకాని, వీరులు మెచ్చని పారిపోవటానికి రాడు. మానభంగం కంటె ప్రాణభంగం మేలనుకొంటాడు. దుర్యోధనుడు పేరుకు 'రారాజు' కాని, ఓడి తిరిగిపోవటానికి వెనుకాడని అధముడు అని భావం. పారిపోయినదానికంటె ప్రాణాలు వదలటం వీరలక్షణం అని ఎత్తిపొడుపు. (ఓడటం అంటే భయపడటం, ఓడిపోవటం, పారిపోవటం- అనే అర్థాలు ఇక్కడ చెప్పవచ్చును).

3. తగదు కౌరవరాజ! - కౌరవులకందరికీ రాజైన ఓ దుర్యోధనుడా! నీ పిరికిపందలక్షణం వలన వంశానికే అపకీర్తి వస్తుంది. కాబట్టి పారిపోబోకుము. వెనుదిరిగి ధీరుడివలె యుద్ధం చేసి వంశగౌరవం నిలువబెట్టుమని హెచ్చరిక. నీ తీరు వంశానికే కళంకం అని తిట్టు.

4. ఒకండన్= నేను ఒంటిగాడిని - అని ఒక అర్థం. నే నొకడినే ఇక్కడ వీరుడిని అని అధిక్షేపం. ఒకండన్= శ్రేష్ఠుడవని అర్థం. మహాసైన్యంతో ఉన్నవాడు దుర్యోధనుడు. అయినా ఒక్క రథికుడితో పోరలేని అసమర్థుడని ఎగతాళి.

5. 'పృథా పుత్రులలో నేను చిన్న' - కుంతీపుత్రులలో నేను చిన్నవాడిని - ఇది అధిక్షేపోక్తి. గాంధారేయులలో నీవు పెద్దవాడివి, కుంతీపుత్రులలో నేను చిన్నవాడిని. చిన్నవాడికి బెదరి పెద్దవాడు పారిపోవటం నవ్వులపాలయ్యే లక్షణం - అని ఒక అర్థం. పెద్దరికం వయసులో లేదు, పరాక్రమంలో ఉన్నది. 'కౌంతేయులలో చిన్నవాడు వస్తేనే నీవింతగా పారిపోతున్నావు; మరి మేమందరం కలిసివస్తే నీవేమౌతావు?' - అని ఎద్దేవ.

6. 'మాని నాఁగ నిద్ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కి బలదర్ప సమగ్రుఁడవైన నీవు' - ఇది దుర్యోధనుడి కున్న ప్రశస్తి. ఇంత ప్రసిద్ధి కెక్కినవాడు ఆయా గుణాలను నిలువబెట్టుకొనాలి. మానం కలవాడు ప్రాణంకంటె మానమే శ్రేష్ఠమని భావించాలి. కాని, దుర్యోధనుడి కున్నంత ప్రాణభీతి మరొకడికి లేదు. అతడికి బలం కావాలి, దర్పం సాగాలి. ఆ రెండూ నిండుగా ఉంటే చాలు. ఆ రెంటినీ స్వయంగా రక్షించుకొనే శక్తిలేనివాడు. కర్ణాదిహితులూ, భీష్మాదివీరులూ పోషిస్తే రక్షిస్తే, అతడి మానం, బలం, దర్పం నిలుస్తాయి. అతడు ఇతరులమీద ఆధారపడిన వీరుడు. పరాశ్రిత పరాక్రమం వీరలక్షణం కాదు, మాని లక్షణం కాదు. అతడి మిత్రులైన కర్ణాదులు కూడా అటువంటి స్వభావం కలవారే.

7. 'నినుఁ బోరికిఁ బిల్వఁగ - నీవు, నీ మిత్రులుఁ గూడ నిట్లయిన మెత్తురె? వత్తురె? కొల్వ భూభుజుల్?'- యుద్ధానికి పిలిస్తే పారిపోయే నీకూ, నీ మిత్రులకూ లోకంలో కీర్తి ఎట్లా నిలుస్తుంది? కీర్తిలేని వీరుడు జీవచ్ఛవం - అని అధిక్షేపం.

8. 'మెత్తురె? వత్తురె? భూభుజుల్' - నిన్ను రాజులు, పరాక్రమవంతులు మెచ్చుతారా? నీతో చెలిమి చేస్తారా? నిన్ను సేవిస్తారా? అని అధిక్షేపించాడు. యుద్ధంలో విజయాన్ని సాధించలేని రాజు కీర్తిని కోల్పోతాడు. దానితో స్నేహితులు దూరమౌతారు. సామంతులు, ఆశ్రితులు స్వతంత్రులై రాజును త్యజిస్తారు. ఈ చివరిమాట ప్రత్యక్షసాక్ష్యంగా కనబడింది. భీష్మాదులు తొలగిపోతున్నారు. మరి కర్ణుడు దుర్యోధనుడి కొరకు కావలసివస్తే ప్రాణత్యాగం చేయటానికైనా సిద్ధపడ్డాడా? లేదు. అతడు రారాజును వదలి పారిపోవటానికి సిద్ధమైనాడు. పారిపోయే వీరులను ఆశ్రయించే పరాశ్రయ దీనస్థితి దుర్యోధనుడిదని అవహేళన చేశాడు విజయుడు.

9. అర్జునుడు వాడి బాణాలే కాక వాడి అయిన వాఙ్మయాస్త్రాలు కూడా ప్రయోగించగలడని ఈ పద్యం నిరూపిస్తున్నది. (సంపా.)

**సీ. ఏనుంగు నెక్కి పె క్కేనుంగు లిరుగడ। రాఁ బురవీథులఁ గ్రాలఁ గలదె?**
**మణిమయంబైన భూషణ జాలముల నొప్పి। యొడ్డోలగంబున నుండఁ గలదె?**
**కర్పూర చందన కస్తూరికాదుల। నింపు సొంపార భోగింపఁ గలదె?**
**యతిమనోహర లగు చతురాంగనలతోడి। సంగతి వేడ్కలు సలుపఁ గలదె?**

**తే. కయ్యమున నోడి పాఱినఁ గౌరవేంద్ర। వినుము నా బుద్ధి; మరలి యీ తనువు విడిచి**
**సుగతి వడయుము తొల్లింటిచూఱ గలదె?। జూద మిచ్చట నాడంగరాదు సుమ్ము! 204**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= దుర్యోధనా!; కయ్యమునన్= యుద్ధంలో; ఓడి పారినన్= ఓడిపోయి పారిపోతే; ఏనుంగును+ ఎక్కి= ఒక యేనుగు మీదనెక్కి; పెక్కు+ఏనుంగులు= చాల ఏనుగులు; ఇరుగడన్= రెండు ప్రక్కలందును; రాన్= రాగా; పురవీథులన్= హస్తినాపుర వీథులందు; క్రాలన్+కలదె?= ప్రకాశించటానికి వీలుంటుందా?; మణిమయంబు+ఐన= మణులతో చేసిన; భూషణ జాలములన్= అలంకారాల సముదాయాలతో; ఒప్పి= ప్రకాశిస్తూ; ఒడ్డోలగంబునన్= నిండుకొలువులో; ఉండన్+కలదె?= ఉండటానికి వీలున్నదా?; కర్పూర= పచ్చకర్పూరం; చందన= మంచి గంధం; కస్తూరికా+ఆదులన్= కస్తూరి మొదలైనవాటితో; ఇంపు సొంపారన్= ఇష్టంగా, సొంపుగా; భోగింపన్+కలదె?= అనుభవించటానికి అవకాశం ఉన్నదా?; అతిమనోహరలు+అగు= మిక్కిలి సుందరులైన; చతుర= నేర్పరులైన; అంగనలతోడి= స్త్రీలతోడి; సంగతిన్= కూటమితో; వేడ్కలు= వేడుకలు; చలుపన్+కలదె?= చేయటానికి వీలుంటుందా?; నా బుద్ధి= నా సలహా; వినుము= చెవిని పెట్టుము; మరలి= వెనుకకు మరలి; ఈ తనువు= ఈ శరీరం; విడిచి= విడిచిపెట్టి; సుగతి= పుణ్యలోకం; పడయుము= పొందుము; తొల్లింటిచూఱ= వెనుకటి దోపిడీ; కలదె?= ఇప్పటికీ అలవాటులో ఉన్నదా?; ఇచ్చటన్= ఈ యుద్ధరంగంలో; జూదము+ ఆడంగన్ రాదు సుమ్ము!= జూదం ఆడటానికి వీలులేదు సుమా! (ఇక్కడ కపట ద్యూతంలో వలె మోసం చేయటానికి వీలులేదని భావం.)

**తాత్పర్యం:** ఓ కౌరవరాజా! యుద్ధంలో ఓడిపోతే, ఏనుగునెక్కి ప్రకాశిస్తూ రెండువైపులా ఎన్నో ఏనుగులు రాగా పురవీథులలో వెళ్ళగలవా? మణులు తాపిన భూషణాలు పెట్టుకొని నిండు సభలో కూర్చుండగలవా? కర్పూర, చందన, కస్తూరికాదులతో ఇష్టంగా భోగా లనుభవించగలవా? అందమైన సుందరులతో వేడుకగా కులుకగలవా? నేను చెప్పేది వినుము; వెనుకకు తిరిగి యుద్ధం చేసి, చెయ్యలేకపోతే శరీరం విడిచిపెట్టి అయినా పుణ్యలోకాలు పొందుము. ఇతరుల సొమ్ములను దోపిడీ చేసే నీ పూర్వపు అలవాటు (అవకాశం) ఇంకా ఉన్నదా? మునుపటి ఆటలు ఇప్పుడు సాగవు. ఇక్కడ యుద్ధరంగంలో జూదం మాత్రం ఆడే వీలు లేదు సుమా!'

**విశేషం:** 1. నలుగురిలో రారాజును నవ్వులపాలు చేస్తూ పలికిన అధిక్షేపోక్తుల రెండవభాగం ఈ పద్యం. యుద్ధరంగంలో పారిపోవటంవలన కలిగే ఫలితాలను వెనుకటి పద్యంలో వర్ణించి, హస్తినాపురం చేరిన తరువాత దుర్యోధనుడి బ్రదుకు ఎన్ని అవమానాలపాలై జీవచ్ఛవంగా తయారౌతుందో భావచిత్రాలతో ఒక చలనచిత్రాన్ని కల్పించి, అతడి మనస్సు చురచురమని రగిలి మండేటట్లు మాట్లాడాడు.

2. పట్టపు టేనుగు నెక్కి అనేక రాజులు వెంటరాగా హస్తినాపురి వీథులలో ఊరేగేటప్పుడు - దుర్యోధనుడు తానే కౌరవేంద్రు డనుకొనగలడా? అతడిని ఓడించిన పాండవుల అగ్రజుడే కౌరవేంద్రుడని ప్రజలు భావించరా? కాబట్టి ఓటమి వలన రాజధానిలో దుర్యోధనుడి రాచరికం ఒక నవ్వులాట కాగలదని భావం.

3. మణిమయ భూషణాలతో అలంకరించుకొని నిండుకొలువులో కూర్చున్నప్పుడు ఆ సంపదను భోగించే శరీరం శత్రువుల నుండి పారిపోయివచ్చినదనీ, ఆ సంపద శత్రువుల దయవలన తాను అనుభవిస్తున్నదనీ తాననుకొన్నా, సభ్యులనుకొన్నా అతడి ప్రభుత్వం దిష్టిబొమ్మ కాగలదని భావం.

4. సుగంధ ద్రవ్యాలతో భోగమయ జీవితం నడుపుతున్నప్పుడు శత్రువీరుల పరాక్రమం గుర్తుకు వస్తే దానిని మనసార భోగించగలడా? సుఖంలేని భోగం హస్తినాపురం వైభవం - అని ఎత్తిపొడుపు.

5. చతురాంగనలతో వేడ్కలు అనుభవించేటప్పుడు శత్రుకృతావమానం మనస్సులో మెదలి మన్మథ భోగానికి దూరం చేస్తుంది. సుఖంతోపాటు శాంతికూడా నశిస్తుందని భావం.

6. కయ్యంలో ఓడి పారిపోతే - నగరం, కొలువుకూటం, పురం, అంతఃపురం - అనే నాలుగు భాగాలలో కౌరవేంద్రుడు హస్తినాపురంలో అనుభవించే రాజభోగాలు సుఖాల నివ్వకపోగా - గుండెలో నిప్పులు చెరుగుతాయి. జీవితాన్ని దుర్భరం చేస్తాయి.

7. యుద్ధరంగంలో, రాజ్యభోగంలో గౌరవాన్ని పోగొట్టుకొని కూడా సిగ్గులేక కౌరవేంద్రుడనే పదవితో తిరిగిపోతున్న దుర్యోధనుడికి తగిన హితవు చెప్పాడు అర్జునుడు. అది విజయుడైన వీరుడు చెప్పే సలహా.

8. ఓడి తిరిగిపోయి రాజుగా చెలామణి కావటంకంటె చచ్చి వీరస్వర్గంలో గొప్పగా బ్రతకటం శ్రేష్ఠమని ఆ హితము. లేదా ఓడిన బ్రతుకు చావుకంటె హీనం - అని హెచ్చరిక.

9. దుర్యోధనుడు నైతికంగా కోల్పోయిన కౌరవేంద్ర లక్షణాలన్నీ అర్జునుడి విజయం ద్వారా పాండవులు పొందారు. ఇప్పుడు పాండవులది పరాక్రమ ధనం. ఇది కొల్లగొట్టలేని ధనం. పరాక్రమంతో కాకుండా వంచనతో పరుల సంపదలను హరించి, కౌరవేంద్రుడైన దుర్యోధనుడు కుటిలుడు. ఆతడి కౌటిల్యాన్ని ఎత్తిపొడిచాడు అర్జునుడు - అని. 'తొల్లింటి చూఱఁ గలదె?' అప్పటి దోపిడీగుణం - ఇంకా ఉన్నదా?

10. ఉంటే - 'జూద మిచ్చట ఆడంగరాదు సుమ్ము' - రణరంగంలో మాయాద్యూతం ఆడటం కుదరదు. ఇది చదరంగం కాదు- పావులు నడపటానికి, ఇది రణరంగం - ప్రాణాలతో చెలగాటం - అని హెచ్చరించాడు.

11. తాత్పర్యంగా సుయోధనుడు బ్రతకటం కంటె చావటం మేలనీ, అది యుద్ధంలో అయితే మంచిదనీ, లేదా ప్రాయోపవేశమైనా సముచితమనీ సూచించి దుర్యోధనుడిని మానసికంగా చంపినంత పని చేశాడు. జూదమాడటం దుర్యోధనుడి కళ అనీ, దోచుకొనటం అతడి స్వభావమనీ హెచ్చరించి అవి కౌరవేంద్రుడి లక్షణాలు కావనీ, యుద్ధం చేయటం, పరాక్రమార్జితాన్ని పరువంతో గ్రహించటం కౌరవేంద్ర లక్షణాలనీ, ఆ లక్షణాలు రారాజులో అంతరించాయనీ, పాండవులకవి దక్కాయనీ, ఉత్తర గోగ్రహణం పరోక్షంగా కౌరవులపై పాండవ విజయమనీ అధిక్షేపిస్తూ వ్యంగ్యంగా విజయుడు ప్రకటించాడు. (సంపా.)

**వ. అని వెండియు. 205**

**తాత్పర్యం:** అని ఇంకా (ఇట్లా అన్నాడు.)

**క. 'నీ యట్టివాఁడు నిస్సీ! । పోయెడిదే యిట్లు? వోకు పోకు' మనుడు భూ**
**నాయకుఁడు మరలి పటుకో । పాయత్తతఁ ద్రొక్కఁబడ్డయహిగతిఁ గవిసెన్. 206**

**ప్రతిపదార్థం:** నీ+అట్టివాఁడున్= నీవంటివాడు-రారాజు; ఇట్లు పోయెడిదే?= ఈ రీతిగా పారిపోవుటయేనా?; ఇస్సీ= ఛా, ఛా; పోకుము+పోకుము= పోవద్దు, పోవద్దు; అనుడున్= అనగా; భూనాయకుఁడు= దుర్యోధనుడు; మరలి= వెనుకకు మరలి; పటు= ఎక్కువైన; కోప+ఆయత్తతన్= కోపం వచ్చినవాడై; త్రొక్కఁబడ్డ= కాలితో త్రొక్కబడిన; అహిగతిన్= పామువలె; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** 'నీవంటి రారాజు కూడా పారిపోయేదేనా? ఛీ ఛీ, పారిపోకు'-అనటంతో దుర్యోధనుడు తోక త్రొక్కిన త్రాచువలె కోపోద్రేకం వచ్చి వెనుకకు మళ్ళి అర్జునుడి నెదుర్కొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు కవిసి రథంబులం గడచి కవ్వడిం దలపడియె; భీష్మ ద్రోణాది యోధవీరులు నొక్కుమ్మడి మగిడి యధిపతి తోడన నిగిడి క్రీడియరదంబుఁ బొదివిరి; తక్కిన బలంబులు నంతకుమున్న కౌంతేయు దెస మరలి చూచుచుం బాఱుచునికిం జేసి యేలినవాఁ డఱుముటయును దొరలు తెగువకుం జొచ్చి తిరుగుటయుం గని తెంపుసేసి కూడికొని రభసంబునం జుట్టుముట్టి యతనిపైఁ గ్రందుకొన నడరె; నవ్విధంబున వివిధ వ్యూహంబు లగు బహుయోధయూధంబులు గురిసిన యనేకాస్త్ర శస్త్రంబులు నానాప్రకారంబులఁ గుప్పంగూరలుగాఁదొరఁగినం బెరిఁగిన శౌర్యసంరంభంబున విజృంభించి విజయుం డాశ్చర్య ధుర్య నిరతిశయ రయభరిత(భుజ)కరయుగళుం డయి రథరథ్య సారథి స్వాంగంబులు కాచికొని తన తోడంబుట్టువుల ప్రతిన లూహించి యొండుసేయ నొల్లక, సపరివారంబుగా ధార్తరాష్ట్రుల భంగపెట్టం దలంచి, యింద్రదైవత్యంబును సత్యసంపాతంబును నరాతిసైన్య దైన్య సంపాదనంబును నగు సమ్మోహనాస్త్రంబుం బ్రయోగించిన. 207**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కవిసి= ఎదుర్కొని; రథంబులన్= తక్కినవారి రథములను; కడచి= దాటి; కవ్వడిన్= అర్జునునితో; తలపడియెన్= యుద్ధాన్ని ప్రారంభించాడు; భీష్మ ద్రోణ+ఆది= భీష్ముడు, ద్రోణుడు మొదలైన; యోధవీరులున్= వీరులైన యోధులుకూడ; ఒక్క+ఉమ్మడిన్= ఒక్కసారిగా; మగిడి= మరలి; అధిపతితోడన్+అ= దుర్యోధనుడితోనే; నిగిడి= నిలబడి; క్రీడి+అరదంబున్= అర్జునుడి రథాన్ని; పొదివిరి= చుట్టుముట్టారు; తక్కిన బలంబులు= తక్కిన సేనలు; అంతకున్+మున్న= అంతకు ముందుగానే; కౌంతేయుదెసన్= అర్జునుడివైపు; మరలి చూచుచున్= మళ్ళిచూస్తూ; పాఱుచున్+ఉనికిన్+చేసి= పరుగెత్తుతున్నందున; ఏలినవాఁడు= రాజు; అఱుముటయును= ఎదుర్కొనుటయు; దొరలు= రథికులు; తెగువకున్+చొచ్చి= సాహసించి; తిరుగుటయున్= వెనుకకు తిరుగుటయును; కని= చూచి; తెంపు+చేసి= సాహసించి; కూడికొని= కలిసికొని; రభసంబునన్= వేగంగా; చుట్టుముట్టి= చుట్టున ఉండి; అతనిపైన్= అర్జునుడిమీద; క్రందుకొనన్= వ్యాపించుటకు; అడరెన్= విజృంభించాయి; ఆ+విధంబునన్= ఆ రీతిగా; వివిధ= పలురకాలైన; వ్యూహంబులు+అగు= వేర్వేరుగుంపులుగా తీర్చబడియున్న; బహుయోధ యూధములు= చాలమంది యోధులు కల సేనలు; కురిసిన= వర్షంగా వేసిన; అనేక+అస్త్రశస్త్రంబులు= అనేకమైన అస్త్రములు, శస్త్రములును; నానా ప్రకారంబులన్= అనేక రీతులుగా; కుప్పం గూరలుగాన్= రాసులు రాసులుగా; తొరఁగినన్= పడిపోగా; పెరిఁగిన= వృద్ధి అయిన; శౌర్య సంరంభంబునన్= పరాక్రమముయొక్క ఉద్ధతితో; విజృంభించి= పెచ్చుపెరిగి; విజయుండు= అర్జునుడు; ఆశ్చర్యధుర్య= ఆశ్చర్యంతో నిండిన; నిరతిశయ= ఎక్కువగా అతిశయించిన; రయ= వేగముతో; భరిత= నిండిన; కరయుగళుండు+అయి= రెండుచేతులు కలవాడై; రథ= రథమును; రథ్య= గుఱ్ఱములును; సారథి= సారథిని; స్వాంగంబులు= తన అవయవాలు; కాచికొని= రక్షించుకొని; తన తోడంబుట్టువుల= తన సోదరులయొక్క; ప్రతినలు= ప్రతిజ్ఞలు; ఊహించి= స్మరించి; ఒండు= మరొక రీతిగా; చేయన్+ఒల్లక= చేయ నిచ్చగింపక; సపరివారంబుగాన్= పరివారంతో సహా; ధార్తరాష్ట్రులను= ధృతరాష్ట్ర కుమారులను; భంగము+పెట్టన్= అవమానించటానికి; తలంచి= తలచికొని; ఇంద్రదైవత్యంబును= ఇంద్రుడు దేవతగా కలది; సత్య సంపాతంబునున్= సత్యమైన ఫలితం కలది; అరాతి= శత్రువులయొక్క; సైన్య= సైన్యమునకు; దైన్య= దైన్యమును; సంపాదనంబునున్+అగు= చేకూర్చునదియు అయిన; సమ్మోహనాస్త్రంబును= సమ్మోహనమనే అస్త్రమును; ప్రయోగించినన్= వేయగా.

**తాత్పర్యం:** అట్లా ఎదుర్కొని మధ్యలోని రథాలను దాటి అర్జునుడితో తలపడ్డాడు దుర్యోధనుడు. దానితో భీష్మద్రోణాదులు ఒక్కసారిగా వెనుదిరిగి రాజుతోపాటుగా అర్జునుడి రథాన్ని చుట్టుముట్టారు. తక్కిన సేనలు అంత క్రితమే అర్జునుడివైపు చూస్తూ పరిగెత్తుతున్నాయి కనుక దుర్యోధనుడు తలపడటం, తక్కిన రథికులందరూ ఏదో ఒకటి అవుతుందని తెగించి వెనుకకు తిరగటం చూచి, తెగించి, కూడుకొని, చుట్టుముట్టాయి. ఇట్లా అనేక సేనలు ఒక్కసారిగా మీదికి వచ్చి అనేక అస్త్రశస్త్రాలు ప్రయోగిస్తూంటే అర్జునుడు విజృంభించి, ముందు తన రథాన్ని, గుర్రాలను, సారథిని, తనను రక్షించుకొంటూ, వారందరిని ఏమి చేయాలా? అనే ఆలోచనలో భీముని ప్రతిజ్ఞ జ్ఞాపకం వచ్చి దుర్యోధనుడిని అప్పుడు ఏమీ చేయకపోయినా, సపరివారంగా కౌరవులను అవమానపరచాలని అనుకొని, సమ్మోహనాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రానికి ఇంద్రుడు దేవత. ప్రయోగిస్తే విఫలం కాని దివ్యాస్త్రమది.

**ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోలంగఁ। దలలు మెడలుఁ జక్క నిలువ కొఱగ**
**నెల్లవారు నెఱుక లెడలి చొక్కెక్కిని। ద్రాతిశయము గూరినట్టు లైరి. 208**

**ప్రతిపదార్థం:** ఆయుధములు= చేతిలోని శస్త్రాలు; విడిచి= విడిచిపెట్టి; అంగముల్= శరీరాలు; సోలంగన్= తూలిపోగా; తలలు; మెడలున్= మెడలును; చక్కన్= బాగుగా; నిలువక= నిలబడక; ఒఱగన్= ప్రక్కకు ఒరిగిపోగా; ఎల్లవారున్= అందరును; ఎఱుకలు= జాగ్రదవస్థలో ఉండే తెలువులు; ఎడలి= తొలగిపోయి; చొక్కు+ఎక్కి= మత్తెక్కి; నిద్రా+అతిశయము= ఎక్కువనిద్ర; కూరినట్టుల= కూరుకొని వచ్చినట్లు; ఐరి= అయినారు.

**తాత్పర్యం:** ఆయుధాలు విడిచిపెట్టేశారు. శరీరాలు సోలిపోతున్నాయి; తలలు, మెడలు నిలవకుండా ఒరిగిపోయాయి. అందరూ స్పృహ తప్పి ఎక్కువ నిద్ర కూరుకొని వచ్చినట్లుగా అయిపోయారు.

**విశేషం:** అర్జునుడు దుర్యోధనాదులను చంపటానికి భీమాదులు చేసిన ప్రతిజ్ఞలు అడ్డం వచ్చాయి. కర్ణుడు వెన్నిచ్చి పారిపోవటం చేత అతడిని చంపటం రణధర్మం కాదు. ఇక మిగిలిన చర్య వారి తలపాగలను హరించటం. తలపాగలను తలలకే ప్రతీకలుగా భావించటం రణమర్యాద. దానికి అనుగుణంగా సమ్మోహనాస్త్రాన్ని ప్రయోగించాడు అర్జునుడు. ఆ అస్త్రాన్ని అర్జునుడికి కుబేరుడిచ్చాడు. అది శత్రువుల ఓజస్సును, తేజస్సును హరించి నిద్రవంటి మైకంలో ముంచివేస్తుంది. దీనిని గాంధర్వాస్త్రమనీ, ప్రస్వాపనాస్త్రమనీ, మోహనాస్త్రమనీ కూడా పిలుస్తారు. సమ్మోహనాస్త్ర ప్రభావంవలన కౌరవవీరులందరూ శరీర ప్రజ్ఞను కోల్పోయారు. మొదట ఆయుధాలు చేతులలో నుండి జారాయి. దేహాలు తూలాయి. తలలు మెడలు ఒరిగాయి. ప్రజ్ఞ పోయింది, మత్తెక్కింది. గాఢనిద్ర (మత్తు) కూరుకొన్నది. అందరూ వివశులైనారు. దీనికి విరుగుడు ప్రజ్ఞాస్త్రం. అది ద్రోణ భీష్ములకు తెలుసు. వారిరువురూ ప్రయోగించలేదు. సమ్మోహనాస్త్రాన్ని మన్మథుడు ప్రయోగిస్తాడనే ప్రతీతి ఉన్నది. అది వేరు. యుద్ధరంగాలలో ప్రయోగించే సమ్మోహనాస్త్రం వేరు. మూలంలో సమ్మోహనాస్త్రం ప్రయోగించిన తరువాత అర్జునుడు బాణాలను ఆకాశంనిండా కప్పి, గాండీవజ్యారావంతో, దేవదత్త ధ్వానంతో వారి మనస్సులనూ దేహాలనూ సంక్షోభపరచినట్లు చెప్పబడింది. చచ్చిన పామును కర్రతో కొట్టినట్లున్న ఈ అంశాన్ని తిక్కన వదలిపెట్టినట్లున్నాడు. (సంపా.)

**వ. అప్పుడు పాండవోత్తముం డుత్తర మాటలు దలంచి యుత్తరుం గనుంగొని. 209**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయాన; పాండవ+ఉత్తముండు= పాండవులలో ఉత్తముడైన అర్జునుడు; ఉత్తరమాటలు= తాము వచ్చేటప్పుడు ఉత్తర చెప్పిన మాటలు; తలంచి= జ్ఞప్తికి తెచ్చుకొని; ఉత్తరున్= ఉత్తరుని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు ఉత్తర తనతో చెప్పిన మాటలను తలచుకొని, ఉత్తరకుమారుడిని చూచి.

**సీ. 'ఇక్కురుసైన్యంబు సొక్కు దక్కకమున్న । గ్రక్కునఁ జనుము; రారాజు ద్రోణ**
**తనయుండుఁ జుట్టిన తలచుట్లు నల్లని । యవి; సూతపుత్రు శిరోంబరంబు**
**పచ్చనియది; కుంభభవ కృపాచార్యుల । యుష్ణీషములు వెల్ల; లుఱక నీవు**
**దె మ్మింతవట్టును; దేవనదీసూనుఁ । డియ్యస్త్రమునకు మా ఱెఱుఁగుఁ గాన**

**ఆ. నతఁడు దెలిసియుండు; నాతని దెస వోకు' । మనిన మత్స్యరాజతనయుఁ డెలమి**
**దొలఁక నొగలఁ బగ్గములు గట్టి చని వాని । నెల్లఁ దెచ్చి యరద మెక్కుటయును. 210**

**ప్రతిపదార్థం:** ఈ+కురుసైన్యంబు= ఈ కౌరవసేన; చొక్కు తక్కకమున్న+అ= మత్తు వదలకముందే; గ్రక్కునన్= వెంటనే; చనుము= వెళ్ళుము; రారాజు= దుర్యోధనుడు; ద్రోణతనయుండున్= అశ్వత్థామ; చుట్టిన తలచుట్లు= చుట్టుకొన్న తలపాగలు; నల్లని అవి= నల్లనివి; సూతపుత్రు= కర్ణుడియొక్క; శిరస్+అంబరంబు= తలపాగల; పచ్చని+అది; కుంభభవ= ద్రోణుడియొక్క; కృపాచార్యుల= కృపాచార్యుడియొక్క; ఉష్ణీషములు= తలపాగలు; వెల్లలు= తెల్లనివి; నీవు; ఉఱక= లక్ష్యపెట్టక; ఇంతవట్టును= ఇంతవరకు; తెమ్ము= తీసికొనిరమ్ము; దేవనదీసూనుఁడు= భీష్ముడు; ఈ+అస్త్రమునకున్= ఈ మంత్రబాణానికి; మాఱు= విరుగుడు; ఎఱుఁగున్= ఎరుగును; కానన్= అందుచేత; అతఁడు= భీష్ముడు; తెలిసి+ ఉండున్= తెలివి కలిగి ఉంటాడు; ఆతని దెస= ఆతని దిక్కునకు; పోకుము= పోవద్దు; అనినన్= అనగా; మత్స్యరాజతనయుఁడు= ఉత్తరుడు; ఎలమి తొలఁకన్= సంతోషం హెచ్చుకాగా; నొగలన్= సారథి కూర్చుండే చోట; పగ్గములు= గుర్రాల పగ్గాలను; కట్టి; చని= వెళ్ళి; వానిన్+ఎల్లన్= వాటినన్నింటిని; తెచ్చి= తీసికొని వచ్చి; అరదము= రథం; ఎక్కుటయును= ఎక్కగా.

**తాత్పర్యం:** 'ఈ కౌరవసేనకు మత్తు వదలక పూర్వమే వెంటనే నీవు వెళ్ళి వారి తలపాగలు తీసికొనిరమ్ము. దుర్యోధన, అశ్వత్థామల తలపాగలు నల్లనివి. కర్ణునిది పచ్చనిది. ద్రోణ, కృపాచార్యులవి తెల్లనివి. అంతవరకే తెమ్ము. భీష్ముడికి ఈ అస్త్రానికి విరుగుడు తెలుసు. కనుక తెలివిగానే ఉంటాడు. ఆయనవైపు పోవద్దు' అనగానే మహాసంతోషంతో ఉత్తరుడు గుర్రాలపగ్గాలు నొగలకు కట్టి, దిగి వెళ్ళి అవి తీసికొని వచ్చి రథం ఎక్కాడు.

**విశేషం:** కురువీరుల వస్త్రాలను బొమ్మపొత్తిళ్ళకుగా తెచ్చి యిమ్మని ఉత్తర బృహన్నలను ముద్దుగా కోరింది. 'చీరలు తేవటం ఏమంత పనిలే?' అని బృహన్నల (అర్జునుడు) మాట ఇచ్చాడు. ఆ వస్త్రా లేవి? అనే మీమాంస ఉన్నది. అర్జునుడు తలచుట్లు, శిరోంబరాలు, ఉష్ణీషాలు తెమ్మని ఉత్తరుడికి చెప్పాడు. యుద్ధాలలో తలపాగలు చుట్టుకొంటారా? శిరః కవచాలనో, కిరీటాలనో ధరిస్తారా? అని అనుమానం కలుగకమానదు. తిరిగివెళ్ళేటప్పుడు అర్జునుడు దుర్యోధనుడి కిరీటంలోని రత్నాలను డులిచి వెళ్ళివస్తున్నానని చెప్పాడట! తెలుగులో తలపాగలని చెప్పబడుతున్నప్పుడు కిరీటాలతోపాటు తలకట్లు కూడా ఉండి ఉండాలి. అవి ఉత్తమవీరులకే ఉంటాయి. వారి వారి అధికారాలను బట్టి, అభిమతాలను బట్టి ఆ వస్త్రాలకు వర్ణాలుకూడా ఉంటాయి. మహావీరులు ఉజ్జ్వలకిరీటాలు ధరించేటప్పుడు కుదుళ్ళలో గట్టిగా ఒత్తుకొనకుండా ఉండటానికీ, కుదుపులకు ఆగి నిలవటానికీ శిరస్త్రాణాలకు తోడుగా శిరోంబరాలను కూడా ధరించేవారు. ఇవి వీరులకు తప్ప సామాన్యులకు ఉండకపోవచ్చును. అందువలననే అయిదుగురి ఉష్ణీషాలనే తెమ్మని చెప్పాడు అర్జునుడు. భీష్ముడుకూడా ఉష్ణీషధారియే. కాని అవసరం లేదు కాబట్టి అతడి తలపాగా రంగు చెప్పలేదు. పాత్రల ప్రవృత్తులకు తగిన రంగులే తలపాగలకు ఉండటం విశేషం. తలపాగలు తీయాలంటే కిరీటాలు కూడా తీయాలి. అట్లా తీయటం శృంగభంగానికి గుర్తు. (సంపా.)

**వ. 'ఈ రథబృందంబుల యిఱుకటంబు వెడలి నిలుత' మని కదలినం గిరీటిం దాఁకి గురుపితామహుండు శరవర్షంబులు గురిసిన. 211**

**ప్రతిపదార్థం:** ఈ రథబృందంబులు= ఈ రథ సముదాయాలయొక్క; ఇఱుకటంబు= ఇరుకుచోటును (దాటి); వెడలి= బయటికి వెళ్ళి; నిలుతము+అని= నిలుద్దామని; కదలినన్= కదలగా; కురుపితామహుండు= భీష్ముడు; కిరీటిన్= అర్జునుని; తాఁకి= ఎదిరించి; శరవర్షంబులు= బాణాల వానలు; కురిసినన్= కురిపించగా.

**తాత్పర్యం:** 'ఇక్కడ రథాలతో ఇరకాటంగా ఉన్నది. బయటపడి నిలుద్దా' మని అర్జునుడు కదలగానే భీష్ముడు అతడిపై బాణవర్షం కురిపించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఆతని రథ్యంబులఁ డ । త్సూతుని నొప్పించి సాంద్ర సునిశిత బాణ**
**వ్రాతంబు మేన నించి పృ । థాతనయుఁడు నిలిపి వెడలె దర్పోజ్జ్వలుఁడై. 212**

**ప్రతిపదార్థం:** ఆతని= భీష్ముడియొక్క; రథ్యంబులన్= గుఱ్ఱాలను; తద్+సూతునిన్= అతడి సారథిని; నొప్పించి= నొవ్వగొట్టి; సాంద్ర= దట్టమైన; సునిశిత= వాడియైన; బాణవ్రాతంబు= బాణ సముదాయాన్ని; మేనన్= శరీరాన; నించి= నింపి; పృథాతనయుఁడు= అర్జునుడు; నిలిపి= ఆతడిని ఆపి; దర్ప+ఉజ్జ్వలుఁడు+ఐ= దర్పంతో ప్రకాశించేవాడై; వెడలెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ భీష్ముడి గుఱ్ఱాలను, సారథిని నొచ్చేటట్లు కొట్టి, ఆతడి శరీరాన మరికొన్ని వాడిబాణాలు నాటటంతో అతడు ఆగిపోయాడు. అప్పుడు దర్పంతో అర్జునుడు ప్రకాశిస్తూ వెళ్ళాడు.

**వ. ఇవ్విధంబున నరదంబుల యిఱుకటంబు గడచి యెడఁ గలుగ నిలిచి రాహు నిగ్రహ నిరాస భాసురుం డగు భానుండునుం బోలె వెలుంగుచున్నంత బలంబులు దెలిసిన. 213**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; అరదంబుల= రథాలయొక్క; ఇఱుకటంబు= ఇరుకుగా ఉండేచోటును; కడచి= దాటి; ఎడ+కలుగన్= వ్యవధానం ఉండేటట్లుగా; నిలిచి= ఆగి; రాహు నిగ్రహ= రాహువుయొక్క బాధ; నిరాస= తొలగటం వలన; భాసురుండు+అగు= ప్రకాశించే; భానుండునున్+పోలెన్= సూర్యుడివలె; వెలుంగుచున్+ఉన్న+అంతన్= ప్రకాశిస్తూ ఉండగా; బలంబులు= సేనలు; తెలిసినన్= తెలివి రాగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా రథాల సందులో నుండి బయటికి వెళ్ళి కొంచెం దూరంగా నిలబడి, గ్రహణకాలంలో ఏర్పడిన రాహు నిగ్రహం నుండి తొలగి ప్రకాశిస్తున్న సూర్యుడివలె అర్జునుడు ప్రకాశింపసాగాడు. అంతలో సేనలకు తెలివి వచ్చింది.

**ఆ. కౌరవేశ్వరుండు గనువిచ్చి దిక్కులు । గలయఁ జూచి పార్థుఁ గాంచి కడఁగి**
**యడరఁ జూచుటయును నమరనదీసూనుఁ । డతని కిట్లు లనియె నల్ల నగుచు. 214**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరుండు= దుర్యోధనుడు; కనువిచ్చి= కన్నులు తెరచి; దిక్కులు= చుట్టుప్రక్కలు; కలయన్= అంతటా; చూచి= పరికించి; పార్థున్= అర్జునుడిని; కాంచి= చూచి; కడఁగి= యుద్ధానికి పూని; అడరన్= విశదమయ్యేటట్లు; చూచుటయును= అనుకోగా; అమరనదీ సూనుఁడు= భీష్ముడు; అల్ల నగుచున్= ఇంచుకనవ్వుతూ; అతనికిన్= దుర్యోధనుడితో; ఇట్టులు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తెలివివచ్చి కన్నులు తెరచి నలువైపులా చూచి, అర్జునుడు కనబడగా, అతడిపై యుద్ధం చేయటానికి సిద్ధపడుతూ ఉండగా భీష్ముడు మెల్లగా నవ్వుతూ అతడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఇంత యెఱుంగవు సైన్యము । లింతవడిం దలల చీర లెఱుఁగక మోహా**
**క్రాంతంబులయ్యెఁ బని దెగుఁ । గౌంతేయుఁడు సొరఁడుగాని క్రౌర్యంబునకున్. 215**

**ప్రతిపదార్థం:** ఇంత= జరిగినదంతా; ఎఱుంగవు= నీవు ఎరుగవు; సైన్యములు= సేనలు; ఇంతవడిన్= ఇంతసేపును; తలల చీరలు= తలపాగాలు; ఎఱుఁగక= ఎట్లా ఉన్నాయో! తెలియక; మోహ+ఆక్రాంతంబులు= మోహంచేత ఆక్రమించబడినవి; అయ్యెన్= అయ్యాయి; కౌంతేయుఁడు= అర్జునుడు; క్రౌర్యంబునకున్= క్రూరకర్మకు; చొరఁడు+కాని= పూనుకొనలేదు తప్ప; (పూనుకొన్నచో); పని= యుద్ధకర్మ; తెగున్= పూర్తి అయి ఉండేది. (అందరూ చనిపోయి ఉండేవారు.)

**తాత్పర్యం:** 'రాజా! నీవు జరిగినదంతా ఎరుగవుకాని, సైనికులు తలలు, తలగుడ్డలు తెలియకుండా మోహంతో పడిపోయారు. అర్జునుడు క్రూరంగా ప్రవర్తించలేదు. అట్లా ప్రవర్తించి ఉంటే మనపని అయిపోయి ఉండేది. అనగా మనలనందరిని చంపి ఉండేవాడు అని తాత్పర్యం.

**విశేషం:** 1. ఇందులో భీష్ముడు పలికిన వాక్యాలు రాచకొలువు మర్యాదకు అద్దం పట్టుతున్నాయి. సామాన్యంగా రాచకొలువులో రాజుకు అవమానం కలిగే మాటలు ఆయనను ఉద్దేశించి అనకూడదు. రాజుకు అస్వస్థత ఏర్పడితే పలుకరించటానికి పోయినవారు 'శత్రువులకు ఆరోగ్యం బాగాలేదని విన్నాను' అని అనటం మర్యాద. అట్లాగే భీష్ముడు అభిమానధనుడైన రారాజుకు అతడి దీనస్థితిని తెల్పటానికి బదులు 'ఇంత యెఱుంగవు సైన్యము లింతవడిం దలలచీర లెఱుఁగక మోహాక్రాంతంబులయ్యె' - అన్నాడు. నీవు అనటానికి బదులు సైన్యము లనటం మర్యాద. సైన్యాలన్నీ ఏ స్థితిలో ఉన్నాయో నీవూ ఆ స్థితిలోనే ఉన్నావు- అని ధ్వని. సమ్మోహనాస్త్ర ప్రభావానికి లొంగని భీష్ముడు ఈ విధంగా హెచ్చరించటం గమనార్హం.

2. మూర్ఛపోయిన వారిని చంపకుండా విడవటం ఉత్తమ యుద్ధవీరుడి లక్షణం. దానిని అర్జునుడు పాటిస్తాడా? లేదా? అని భీష్ముడు వేచిచూచినట్లున్నాడు. అర్జునుడు తలపాగలు తొలగించటంవరకే పరిమితమై, తలలు తీయకుండా ఉండటం అతడి దయాగుణానికి నిదర్శ'నమని భీష్ముడు వ్యాఖ్యానించటం దుర్యోధనుడికి కీలెరిగి వాతపెట్టిన వైఖరిగా తోస్తుంది.

3. పని+తెగున్= అనేది 'మన పని సరి' అనే జాతీయానికి ప్రతిరూపం. (సంపా.)

**క. మెడ యొఱగఁ జేతికైదువు । వడ నిను నీ వెఱుఁగకున్న భంగి గనియుఁ గ**
**వ్వడి యూరకుండు నటె చె । ప్పెడు కొలఁదియె వాని కరుణపెంపు కుమారా! 216**

**ప్రతిపదార్థం:** మెడ+ఒఱగన్= మెడ ఒరిగిపోగా; చేతికైదువు= చేతిలోని ఆయుధం; పడన్= పడిపోగా; నినున్= నిన్ను; నీవు+ఎఱుఁగక+ఉన్న భంగిన్= నీవు తెలియని పరిస్థితిని; కనియున్= చూచికూడా; కవ్వడి= అర్జునుడు; ఊరకుండున్+అటె= ఏమీ చేయక ఊరకున్నాడట; కుమారా!= దుర్యోధనా!; వాని కరుణపెంపు= వాడి దయాతిశయం; చెప్పెడు కొలఁదియె= చెప్పనంతటిదా! (చెప్పలేనంతటిది.)

**తాత్పర్యం:** మెడ ఒరిగిపోయి, చేతిలో ఆయుధం జారిపోయి, నిన్ను నీవు తెలియని స్థితిలో ఉండటం చూచి కూడ అతడు ఏమీ చేయక వదలి వేశాడంటే అతడు ఎంత దయాఘనుడో వేరే చెప్పవలెనా దుర్యోధనా!

**వ. అతండు మన ప్రాణంబులపై రా నొల్లక నిలిచిన మన మింతతట నిలుచుట కార్యంబు. 217**

**ప్రతిపదార్థం:** అతండు= అర్జునుడు; మన ప్రాణంబులపైన్= మన ప్రాణాలమీదికి; రాన్+ఒల్లక= వచ్చుట కిష్టపడక; నిలిచినన్= ఆగగా; మనము; ఇంతతటన్= ఇంతటితో; నిలుచుట= ఆగుట; కార్యంబు= చేయదగిన పని.

**తాత్పర్యం:** అర్జునుడు మన ప్రాణాలు తీయకుండా వదలివేశాడు కనుక, మనంకూడా ఇంతటితో యుద్ధంమాట తలపెట్టకుండా ఉండటం మంచిది.

**ఉ. మోహనబాణపాతమున ముందలచీర లెఱుంగ కున్న యీ**
**బాహుబలంబుతోఁ గడఁగి పార్థునిఁ దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్**
**సాహసవృత్తిఁ జేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ**
**ర్ణాహుతి సేయఁడే మనల నందఱ నొక్కట మార్గణాగ్నికిన్? 218**

**ప్రతిపదార్థం:** మోహన బాణపాతమునన్= సమ్మోహనాస్త్రం వేయటంతో; ముందలచీరలు= ముందరి తలమీదనున్న గుడ్డలు; ఎఱుంగక+ఉన్నన్= తెలియక ఉండగా; ఈ బాహు బలంబుతోన్= కేవలం ఇటువంటి బాహుపరాక్రమంతోనే; కడఁగి= పూనుకొని; పార్థునిన్= అర్జునుడిని; తాఁకెడుబుద్ధిన్= ఎదుర్కొను తలంపుతో; క్రమ్మఱన్= మరల; సాహసవృత్తిన్+చేసి= తెగించే చిత్తవృత్తితో; అవిచారతన్= ఆలోచనలేకుండా; పోయితిమి+ఏనిన్= వెళ్ళితిమా; వాఁడు= ఆ అర్జునుడు; మార్గణ+అగ్నికిన్= బాణాలనే అగ్నికి; మనలన్= మనలను; అందఱన్= అందరిని; ఒక్కటన్= ఒక్కసారిగా; పూర్ణ+ఆహుతి= పూర్ణాహుతిని; చేయఁడే?= చేయడా?; (పూర్ణాహుతి అనగా హోమాలు చేసినప్పుడు చివరన మిగిలి ఉన్న నేతినంతను ఒక్కసారిగా హోమం చేయటం.)

**తాత్పర్యం:** అర్జునుని సమ్మోహనాస్త్ర ప్రయోగం వలన మనం తలగుడ్డ లెరుగకుండా ఉండే స్థితిలో పడి ఉండినాము. అలాంటప్పుడు మనకున్న కేవల బాహుబలాన్నే నమ్ముకొని, ఇంకా అతడిని అనాలోచితంగా చొరవగా ఎదిరిస్తే, ఇప్పుడు అతడు తన బాణాగ్నితో మనలనందరిని ఒక్కసారిగా, పూర్ణాహుతి చేసే విధంగా ఏమీ మిగలకుండా చంపి వేయడా?

**విశేషం:** 1. అలం: రూపకం, లోకోక్తి.

2. దుర్యోధనాదులు అంతటితో యుద్ధం ఆపితే ఉచితంగా ఉంటుంది - అనే తన అభిప్రాయానికి తగిన హేతువును భీష్ముడు చెప్పుతున్నాడు. సమ్మోహనాస్త్ర ప్రభావానికి లొంగి ఓజస్సును, తేజస్సును కోల్పోయి, తలగుడ్డలు పోయాయన్న సంగతిని కూడా గ్రహించలేని మైకంలో ఇంకా ఉండి, చేతులలోనుండి ఆయుధాలు జారి నేలమీద పడ్డాయన్న స్పృహకూడా లేకుండా మరల యుద్ధానికి పూనుకొనటం సాహసమౌతుంది. (జయించటం వీలుకాని దాని కొరకు చేసే మూర్ఖప్రయత్న మౌతుంది). అవిచార మూలకమైన అవివేక క్రియ అవుతుంది. ప్రాణాలతో వదలిపెట్టినా వదలిపోక, అవివేకంతో, అహంకారంతో మరల తనమీదకు దండెత్తితే కౌరవులను చంపటం తప్ప మరొక మార్గంలేదని భావించే స్థితిని మనమే కల్పించుకొంటాం- అన్నాడు. ఇది యజ్ఞంలో యజమానుడు సంపూర్ణ ఫలసిద్ధి కొరకు ఆత్మార్పణానికి ప్రతిగా పూర్ణాహుతిని అగ్నికి అర్పించటం వంటిది. దానితో యజ్ఞం సఫలం కావటం జరుగుతుంది. ఇది లోక న్యాయం. దీనిని ఆధారంగా చేసికొని తెలుగులో 'పూర్ణాహుతి చేయటం' అనే ఒక జాతీయం పుట్టింది. ఉన్నదంతా అగ్నిపాలు కావటం కాని, వృథా చేసికొనటం గాని, ఎవరైనా తనంతట తాను సర్వనాశనానికి పాల్పడటం కాని జరిగేటప్పుడు ఈ జాతీయాన్ని వాడతారు. దానిని ఉటంకిస్తూ, మనం మరలా దాడి చేస్తే బాణాగ్నిలో మనలనందరినీ, ఎవ్వరూ మిగలకుండా, మారణహోమం చేయడా?- అని భీష్ముడు హెచ్చరించాడు.

3. యజ్ఞం ముగిసేటప్పుడు చేసే పూర్ణాహుతిలో నేతితో తడిపిన కొబ్బరికాయ, పూలు, తాంబూలం వంటి మంగళ ద్రవ్యాలూ, నవరత్నాలవంటి విలువైన లోహాలూ మొదలైనవి పట్టుబట్టలో మూటకట్టి అన్నీ ఒక్కసారిగా అగ్నిలో మంత్రపూతంగా

సమర్పించటం పరిపాటి. దుర్యోధనుడి పునర్యుద్ధయత్నం అటువంటిదని భావం. ఒకవేళ అదే జరిగితే కౌరవుల జీవితాలే అంతటితో సమాప్తం కాగలవని హెచ్చరిక! అంత ఘాటుగా చెప్పితే తప్ప ఆ దురభిమాని మెదడు కెక్కదని భీష్ముడి తలంపు. (సంపా.)

**వ. కావున.** **219**

**తాత్పర్యం:** అందుచేత.

**క. మనదేశమునకుఁ బోదము । మన మల్లన తెరువు వట్టి; మత్స్యవిభుని గో**
**ధనముఁ గొని యతఁడు ప్రీతిం । జనుఁగా; కటు మనకు నంతచల మేమిటికిన్?'** **220**

**ప్రతిపదార్థం:** మనదేశమునకున్= మనదేశానికి; మనము; అల్లనన్= మెల్లగా; తెరువు+పట్టి= దారిపట్టి; పోదము= పోదాం; అతఁడు= అర్జునుడు; మత్స్యవిభుని= విరాటునియొక్క; గోధనమున్= గోవులనెడి ధనాన్ని; కొని= తీసికొని; ప్రీతిన్= సంతోషంతో; అటు= ఆ దారిన; చనున్+కాక= వెళ్ళుగాక; మనకున్= మనకుకూడ; అంత చలము= మిక్కిలి పట్టుదల; ఏమిటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** మనదేశపు మార్గం పట్టి మెల్లగా మనం మనదేశానికి పోదాం. అర్జునుడు విరాటుడి గోవులను తోలుకుని అటుపోతాడు. కాకపోతే, మనకు మాత్రం అంత పట్టుదల ఎందుకు?'

### దుర్యోధనుఁడు పరాజితుఁడై మరలి తన పురంబునకుఁ బోవుట (సం. 4-61-24)

**వ. అని చెప్పిన పితామహు హితవచనంబు లాకర్ణించి సంగ్రామాతికామియుం గోపాటోపఘూర్ణమాన మానసుండు నగు నమ్మానవేశ్వరుండు నిట్టూర్పు నిగిడించి, యుద్రేకంబు దక్కి నిలిచెం; దక్కటివారలు నూర్జితంబగు నర్జునానలంబు నాలోకించి ధార్తరాష్ట్ర రక్షణ తాత్పర్యంబున శౌర్యంబు సాలించి, భీష్మవాక్య ప్రకారంబు సేసి; రిట్లుందఱు ముందర దమవచ్చిన వంకన తిరిగి యరుగుచున్నం గని కిరీటి శంఖరవ జ్యానాదంబులు సెలంగఁ గొండొకదవ్వు వెన్నడిం దఱిమి బిరుదులతోడి గొడుగులును, నడియాలంబులతోడి సిడంబులును వైపించుకొని తృప్తిం బొంది మరలువాఁడై యెల్లవారును వినం బెద్దయెలుంగునం బోయి వచ్చెద నని చెప్పి, గాంగేయ ద్రోణ కృపాచార్యులకుఁ బ్రణామబాణంబు లేసి వారి వీడ్కొనినవాఁడై, మిట్టకోలల రారాజుమకుటంబు మణులు డులిచి యతనికిం జెప్పినవాఁడై, యఖర్వబాహా గర్వ నిర్వహణంబు మెఱయ నప్పుడు మధ్యందినమార్తాండప్రచండుం డగుచుండఁ, గౌరవవీరు లతనిం దేఱి చూడనుం జాలక చని; రతండును జూపఱం దోలి నిలిచిన మదపుటేనుంగు చందంబున నిలిచి విరాటతనయున కిట్లనియె.** **221**

**ప్రతిపదార్థం:** అని చెప్పిన= అట్లు చెప్పిన; పితామహు వచనంబులు= భీష్ముడి మాటలను; ఆకర్ణించి= విని; సంగ్రామ+అతికామియున్= యుద్ధము నెక్కువగా కోరేవాడును; కోప+ఆటోప= కోపంయొక్క ఆధిక్యంచేత; ఘూర్ణమాన= తిరుగుడు పడుతున్న; మానసుండున్+అగు= మనస్సు కలవాడునైన; ఆ+మానవ+ఈశ్వరుండు= ఆ దుర్యోధనుడు; నిట్టూర్పు= పెద్ద ఊర్పును; నిగిడించి= విడిచి; ఉద్రేకంబు= ఆవేశం; తక్కి= మాని; నిలిచెన్= ఉన్నాడు; తక్కటివారలు= మిగిలినవారు; ఊర్జితంబు+అగు= పెరిగిన; అర్జున+అనలంబున్= అర్జునుడనెడి అగ్నిని; ఆలోకించి= చూచి; ధార్తరాష్ట్ర= దుర్యోధనుడి

యొక్క; రక్షణ= రక్షించుట యందలి; తాత్పర్యంబునన్= ఆసక్తితో; శౌర్యంబు= పరాక్రమాన్ని; చాలించి= మాని; భీష్ము= భీష్ముడి యొక్క; వాక్యప్రకారంబు= మాటప్రకారం; చేసిరి; ఇట్లు= ఈ రీతిగా; అందఱున్= అందరును; మున్దర= ఇదివరకు; తమ వచ్చిన= తాము వచ్చిన; వంకన్+అ= వైపునకే; తిరిగి అరుగుచున్+ఉన్నన్= మరలి వెళ్ళుతూ ఉండగా; కని= చూచి; కిరీటి= అర్జునుడు; శంఖరవ= శంఖధ్వని; జ్యానాదంబులు= నారియొక్క ధ్వనులు; చెలంగన్= ధ్వనించగా; కొండొక దవ్వు= కొద్ది దూరం; వెన్నడిన్= వెన్నంటి; తఱిమి= తరుముకొని వెళ్ళి; బిరుదులతోడి= బిరుదులతో సహా; గొడుగులును= వెల్ల గొడుగులును; అడియాలంబులతోడి= ఆనవాళ్ళతోడి; సిడంబులును= జెండాలును; వైపించుకొని= పడవేసేటట్లు చేసి; తృప్తిన్= తృప్తిని; పొంది; మరలువాఁడు+ఐ= వెనుకకు మరలెడివాడై; ఎల్లవారును= అందరును; వినన్= వినునట్లుగా; పెద్ద+ఎలుంగునన్= పెద్ద కంఠధ్వనితో; పోయి వచ్చెదను+అని= పోయి వస్తానని; చెప్పి; గాంగేయ= భీష్ముడు; ద్రోణ= ద్రోణుడు; కృపాచార్యులకున్= కృపాచార్యునకును; ప్రణామ బాణంబులు= నమస్కారాన్ని తెలిపే బాణాలు; ఏసి= వేసి; వారిన్= వారిని; వీడ్కొనిన వాఁడై= సాగనంపినవాడై; మిట్టకోలలన్= తీక్ష్ణ బాణాలతో; రారాజు= దుర్యోధనుడి యొక్క; మకుటంబు మణులు= కిరీటమందలి మణులు; డులిచి= రాలేటట్లు చేసి; అతనికిన్= దుర్యోధనుడితో; చెప్పినవాఁడై= వెళ్ళివస్తానని చెప్పి; అఖర్వ= అడ్డులేని; బాహాగర్వ= బాహువులయొక్క గర్వముయొక్క; నిర్వహణంబు= నెరవేర్చటం; మెఱయన్= ప్రకాశించగా; అప్పుడు= ఆ సమయాన; మధ్యందిన= మధ్యాహ్నపు వేళయందలి; మార్తాండ= సూర్యుడివలె; ప్రచండుండు= మిక్కిలి తీక్ష్ణమైనవాడు; అగుచున్+ఉండన్= అగుచుండగా; కౌరవవీరులు= కౌరవసేనలోని వీరులు; అతనిన్= ఆ అర్జునుడిని; తేఱిచూడనున్+చాలక= తేరిపార చూడనైనా చూడలేక; చనిరి= వెళ్ళారు; అతండును= అర్జునుడును; చూపఱన్= చూచేవారిని; తోలి= పారద్రోలి; నిలిచిన= ఆగిన; మదము+ఏనుంగు చందంబునన్= మదించిన ఏనుగువలె; నిలిచి= ఆగి; విరాటతనయునకున్= ఉత్తరుడితో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పల్కినాడు.

**తాత్పర్యం:** అట్లా చెప్పిన భీష్ముడి హితవాక్యాలు విని, ఇంకా యుద్ధమే చెయ్యాలని ఉన్నా, కోపావేశంతో మనస్సుడికి పోతున్నా అంతకూ ఒక నిట్టూర్పు వదిలి నిలిచాడు. ఆవేశం తగ్గించుకొన్నాడు. తక్కిన వీరులు కూడా అర్జును డంతకంతకు పెచ్చుపెరిగిపోవటం చూచారు. ఎట్లాగైనా దుర్యోధనుడిని రక్షించటమే ముఖ్యం అనుకొన్నారు. పరాక్రమాన్ని, ఆవేశాన్ని ఒకప్రక్కకు నెట్టారు. భీష్ముడి మాటల ప్రకారం వచ్చిన దారినే పోవటం ప్రారంభించారు. అర్జునుడు వారిని చూచాడు. కొంతమేర తరిమాడు. వారి గొడుగులు ఊడగొట్టించాడు. జెండాలమీది ఆనవాళ్ళు తీయించాడు. అంతటితో తృప్తిపడి వారిని వదలివేసి మరలివెళ్ళుతూ తానింక పోయివస్తానని గట్టిగా ఒక కేకపెట్టి, భీష్మద్రోణ కృపాచార్యులకు నమస్కార బాణాలు వేసి వారికి వీడ్కోలు చెప్పి, వాడి బాణాలతో దుర్యోధనుడి కిరీటంమీద ఉన్న మణులను రాల్చి, అతడికి వెళ్ళి వస్తానని చెప్పి, సాటిలేని పరాక్రమంచేత మధ్యాహ్న సూర్యుడివలె చూడ శక్యం కాకుండా ఉండగా కౌరవసేనలు ఆతడి కేసి చూడలేకపోయారు. తమదారిన తాము పోవసాగారు. చూచేవారిని తరిమి నిలువబడి ఉన్న మదపుటేనుగువలె అర్జునుడు ఆగి ఉత్తరుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: రూపకం, ఉపమ. రణమర్యాదలలో ఉండే కొన్ని సాంకేతికాంశాలు ఇందులో తిక్కన నిపుణంగా పేర్కొన్నాడు. ఇష్టం లేకపోయినా, కష్టంగా ఉన్నా, పరిస్థితుల ప్రభావానికి లొంగి, ప్రాణాలతో వదలిపెట్టిన శత్రువు కల్పించిన ఒక మంచి అవకాశంగా భావించి, తనవారి ముఖాలనన్నింటినీ చూచి, మార్గాంతరం లేదని వారు ప్రకటించే హావభావాలను జీర్ణించు కొనలేకపోయినా, బలవంతాన మన్నించి, కటకటపడుతూ ఓడి తిరిగివెళ్ళే అభిమానధనుడైన ఆడంబరవీరుడి అంతరంగ చిత్రణాన్ని దుర్యోధనుడి చర్యలలో నాటకీయంగా తిక్కన రూపు కట్టించాడు. శత్రువు ఓడి తిరిగిపోతుంటే విజేత ఊరకుండలేడు. తన విజయాన్ని చాటుకొని, ఎదుటివారిని అవహేళనం చేసే చర్యలకు పాల్పడటం యుద్ధాలలో సహజం. అర్జునుడు యుద్ధనీతి తెలిసినవాడు, వివేకవంతుడు కావటంచేత ఉచితాలైన అవహేళన చర్యలు మాత్రమే చేశాడు. అవి - శంఖం, అల్లెత్రాడు

మొదలైన వాటిని మ్రోగించి, మరలా ఎదిరిస్తారా? అని కవ్వించాడు. ఆ కవ్వింపులకు స్పందించక దుర్యోధనాదులు తిరిగి వెళ్ళుతున్నారు. కొంత దవ్వు వారిని వెంటనంటి తరిమాడు. అప్పటికీ చడీచప్పుడు లేదు. అంత పౌరుష రహితంగా వెళ్ళిపోతున్న కౌరవవీరుల గొడుగులు, ధ్వజాలు నేలపై వేయించాడు. అంటే బిరుదులు లేని పిరికిపందలని వారిని క్రియాత్మకంగా హేళనం చేశాడు. దానికి తల ఒగ్గి కౌరవులు కిమ్మనకుండా పోసాగారు. ఇక, వారు చచ్చిన పాములతో సమానం. అందువలన తృప్తిపడి తానూ తిరుగుమొగం పట్టాడు. అయితే, తాను వెళ్ళివస్తా నని చెప్పటం వీరధర్మం. కౌరవులు ఓడిపోయినవారు కాబట్టి, చెప్పాపెట్టకుండా పోవటం వారి నైజం. అర్జునుడు తాను యుద్ధాన్ని ముగిస్తున్నానని చెప్పే సూచనలు కొన్ని చేశాడు. భీష్మద్రోణాది శిష్టచతుష్టయానికి బాణాలతో నమస్కరించాడు. రారాజు ధరించే మణికిరీటంలోని కొన్ని మణులు రాలిపడేటట్లు బాణాలతో కొట్టి 'ఈ ఓటమి నీ తేజస్సుకే ఒక గ్రహణం' అన్నట్లు అవహేళనం చేస్తూ పంపాడు. పరిపూర్ణ విజయం సాధించిన విజయుడు మధ్యాహ్న సూర్యుడివలె ప్రచండుడుగా ప్రకాశించాడు. చూపరులను తోలి నిలిచిన మదపుటేనుగువలె ఏకైకవీరుడై నిలిచాడు. ఉగ్రుడైన అర్జునుడు ప్రచండసూర్యుడు; కోపాన్ని చల్లార్చుకొని విజయోత్సాహంతో నిలిచిన విజయుడు మదపుటేనుగు. ఇది అలంకార శిల్పం. (సంపా.)

**ఆ. 'పసులు మరలె శత్రుబలములు పీనుంగు । పెంట లయ్యె; రాజుఁ బెద్దదొరలుఁ**
**జీర లొలువఁ బడిరి; సిగ్గఱి బిరుదులు । వైచి; రింక మగుడవలదె మనకు. 222**

**ప్రతిపదార్థం:** పసులు= ఆవులు; మరలెన్= మన ఊరికి మళ్ళాయి; శత్రుబలములు= శత్రువుల సేనలు; పీనుంగు పెంటలు= చచ్చిన శవాల ప్రోవులు; అయ్యెన్= అయ్యాయి; రాజున్= దుర్యోధనుడును; పెద్దదొరలున్= గొప్ప వీరులైన రథికులును; చీరలు= వస్త్రాలు; ఒలువఁబడిరి= తీసివేయబడ్డారు; సిగ్గఱి= సిగ్గువదలి; బిరుదులు= పరాక్రమ చిహ్నాలను; వైచిరి= పడవేశారు; మనకున్= మనం; ఇంకన్= ఇటుపై; మగుడవలదె?= మరలవద్దా?

**తాత్పర్యం:** 'గోవులను మరల్చాం, శత్రుసేనలను పీనుగు పెంటలు చేశాం. దుర్యోధనుడివి, పెద్ద రాజులవి, వీరులవి తలగుడ్డలు లాగేశాం. వారి పరాక్రమ బిరుదాలను పడవేయించాం. ఇంక మనం కూడా వెళ్ళుదాం.

**క. హయముల మరల్పు; మీ త । ల్లియు బంధులు నెడలు సంచలింప గుమురు గ**
**ట్టి యెదురుసూతురు; వారికిఁ । బ్రియముగ శీఘ్రమ్మునం బురికిఁ బోవలయున్.' 223**

**ప్రతిపదార్థం:** హయములన్= గుర్రాలను; మరల్పు= మరలించు; మీ తల్లియున్= మీ తల్లియును; బంధులున్= బంధువులును; ఎడలు= మనస్సులు; సంచలింపన్= కదలిపోయేటట్లు; గుమురు గట్టి= ప్రోవై; ఎదురు చూతురు= నీకై యెదురు చూస్తూ ఉంటారు; వారికిన్= వారందరికిని; ప్రియముగన్= ప్రీతికలిగేటట్లుగా; శీఘ్రమ్మునన్= వేగంగా; పురికిన్= నగరానికి; పోవలయున్= పోవాలి.

**తాత్పర్యం:** ఇంక గుర్రాలను మరల్చుము. మీ తల్లి, బంధువులు దడదడలాడే గుండెలతో నీకొరకు గుమిగూడి ఎదురు చూస్తుంటారు. వారికి ప్రీతి కలిగేటట్లుగా ఇంక మనం నగరానికి పోవాలి.'

**వ. అనిన నతండును రథంబు మగిడించినం జని చని. 224**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అతండును= ఉత్తరుడు కూడ; రథంబు= రథాన్ని; మగిడించినన్= మరల్చగా; చనిచని= కొంతదూరం ప్రయాణించి.

**తాత్పర్యం:** అని అర్జునుడు పలుకగా ఉత్తరుడు విని రథాన్ని మరల్చి కొంతదూరం ప్రయాణం చేసి.

**తే. కాలు తక్కువ వారలు గలయఁ జెదరి। వెనుకఁ బడిపోవునెడఁ దన్నుఁ గని భయమున**
**బ్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ। హస్త మిచ్చుచు దయ పెనుపారఁ బలుకు. 225**

**ప్రతిపదార్థం:** కాలుతక్కువ వారలు= పరుగెత్తలేనివారు; కలయన్= మిక్కిలి; చెదరి= అటొకడు ఇటొకడు చెదరిపోయి; వెనుకన్+ పడి పోవు+ఎడన్= వెనుకబడిపోయేటప్పుడు; తన్నున్= అర్జునుని; కని= చూచి; భయమునన్= భయంతో; ప్రాణదానంబు= ప్రాణదానం చేయుమని; వేఁడినన్= ప్రార్థించగా; పార్థుఁడు= అర్జునుడు; అభయహస్తము= భయం లేదని తెల్పే హస్తాన్ని; ఇచ్చుచున్= చూపుతూ; దయ పెనుపారన్= దయ వృద్ధిపొందగా; పలుకున్= మాట్లాడాడు.

**తాత్పర్యం:** వేగంగా వెళ్ళలేని కొందరు సేనతోపాటు పారిపోలేక అటు ఇటు చెదరి వెనుకపడగా, వారు అర్జునుడిని చూచి భయపడి ప్రాణదానం చేయుమని కోరగా అభయహస్త మిచ్చి దయతో వారిని పలుకరించాడు.

**వ. ఇట్లు నానావిధ దీనదశా దందహ్యమాను లగు కృపణులం దన కృపామృతంబునం దడిపినం దేఱి వారు దీవించుచుం బ్రణమిల్లుచుం బొగడుచుం బోవుచుండ ధనంజయుండు భూమింజయుం జూచి. 226**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; నానావిధ= పలురకాలైన; దీనదశా= దీనావస్థలతో; దందహ్యమానులు+అగు= దహింప బడుతున్న; కృపణులన్= దీనులను; తన= తనయొక్క; కృపా+అమృతంబునన్= దయ అనెడి అమృతంతో; తడిపినన్= తడుపగా; తేరి= తేరుకొని; వారు= ప్రాణాలతో వదలబడినవారు; దీవించుచున్= అర్జునుడిని ఆశీర్వదిస్తూ; ప్రణమిల్లుచున్= నమస్కరిస్తూ; పొగడుచున్= స్తుతిస్తూ; పోవుచున్+ఉండన్= వెళుతూ ఉండగా; ధనంజయుండు= అర్జునుడు; భూమింజయున్= ఉత్తరుని; చూచి.

**తాత్పర్యం:** ఈ రీతిగా పలురకాలైన దీనదశలతో దహించబడే దీనులను అర్జునుడు తన దయామృతంతో తడిపాడు. దానితో వారు తేరుకొని, అతడిని దీవించారు, నమస్కారాలు చేశారు, పొగిడారు. వారి దారిన వారు వెళ్ళారు. అప్పుడు అర్జునుడు ఉత్తరుడితో (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: రూపకం. ఉదాత్తుడైన అర్జునుడు ఎంతటి ధీరుడో, వీరుడో అంతటి కరుణామయుడు. (సంపా.)

**ఆ. 'కురుబలంబు గెలిచి గోవులఁ గ్రమ్మఱఁ। దెచ్చు టెల్ల నీ యుదీర్ణ బాహు**
**బలమకాఁగ నీవు పలుకుము; వెలిఁబుచ్చు। టుడుగు మధిపుపాల నొండు దెఱఁగు.' 227**

**ప్రతిపదార్థం:** కురుబలంబున్= కౌరవసేనను; గెలిచి= జయించి; గోవులన్= ఆవులను; క్రమ్మఱన్= మరలించి; తెచ్చుట= తీసికొని రావటం; ఎల్లన్= అంతయును; నీ= నీయొక్క; ఉదీర్ణ= గొప్పదైన; బాహుబలము+అ= పరాక్రమమే; కాఁగన్= అగునట్లు; నీవు; పలుకుము= చెప్పుము; అధిపుపాలన్= రాజుముందర; ఒండు+తెఱఁగు= మరొకవిధంగా; వెలిన్+పుచ్చుట= వెల్లడించటం; ఉడుగుము= మానుకొనుము.

**తాత్పర్యం:** 'కౌరవసేనను జయించి గోవులను మరలించటం నీ పరాక్రమంవలననే జరిగిందని చెప్పుము. రాజుముందు వేరొక రీతిగా ప్రకటించవద్దు.'

**క. అనవుడు 'నీచేసిన యీ। పని నాచేఁ గాకయునికి పతి యెఱుఁగఁడొకో!**
**జనులు నిజము సేయుదురే। నిను నెఱిఁగింపకయ చెప్ప నేర్తునె పొసఁగన్.' 228**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; నీ చేసిన+ఈ పని= నీవు చేసిన ఈ విజయం; నాచేన్= నా చేత; కాక+ఉనికి= కాకుండటం; పతి= రాజు-విరాటుడు; ఎఱుఁగఁడొకో!= ఎరుగడా?; జనులు= ప్రజలు; నిజము= యథార్థమని; చేయుదురే= చేయుదురా? (నమ్ముతారా?); నినున్= నిన్ను; ఎఱిఁగింపక+అ= తెలియజేయకయే; పొసఁగన్= పొసగునట్లు; చెప్పన్ నేర్తునె= చెప్పగలనా?

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పగా ఉత్తరుడు 'కౌరవబలాన్ని జయించటం నాచేత కాదని రాజు ఎరుగడా? జనులు నిజాన్ని తెలిసికొనరా? నిన్నుగూర్చి చెప్పకుండా పొసగేటట్లు ఎట్లా చెప్పగలను?'

**వ. అని యుత్తరుండు మఱియును. 229**

**తాత్పర్యం:** అట్లా చెప్పి ఉత్తరుడు ఇంకా.

**క. 'నీ వలచిన యప్పుడ ధా । త్రీవల్లభుఁ డెఱుఁగునట్టి తెఱఁగు నడపెదన్**
**దేవేంద్రపుత్ర! యే ననఁ । గా వేఱొక పేరు గలదె కార్యము నడపన్.' 230**

**ప్రతిపదార్థం:** నీ వలచిన అప్పుడు+అ= నీవు కోరినప్పుడే; ధాత్రీవల్లభుఁడు= విరాటరాజు; ఎఱుఁగునట్టి= తెలియునట్టి; తెఱఁగు= విధం; నడపెదన్= నడిపిస్తాను; దేవేంద్రపుత్ర!= అర్జునా!; ఏననఁగాన్= నేననగా; కార్యము= చేయవలసిన పని; నడపన్= నడపటానికి; వేఱొకపేరు= మరొకపేరు; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** 'నీయిష్టం వచ్చినప్పుడే రాజునకు తెలిపే విధానం అనుసరిస్తాను. అర్జునా! కార్యం సరిగా నడపటానికి 'నేను' అనటం కన్న వేరే పేరుందా?'

**వ. అను వచనంబు లియ్యకొనుచుం జని, శమీవృక్ష సమీపంబున నిల్చి, గాండీవాది సాధనంబులు పూర్వ ప్రకారంబున నిక్షేపింప నియోగించి, కపిధ్వజ దేవదత్త కిరీటాది దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంతర్ధానంబు సేయించి యెప్పటి సింహపతాక రథంబున బంధింపం బనిచి విరాటతనయుండు నిజాయుధంబులు గైకొని రథికుండయి వచ్చునట్లుగాఁజేసి, తొంటిచందంబునం దలచీర యలవరించికొని సారథియై సవ్యసాచి నొగ లెక్కె; నట్టి సమయంబునఁ బురందరాది బృందారకులును దేవముని సిద్ధగంధర్వాదులును బాండుప్రముఖ రాజలోకంబును నాశ్చర్యహర్షాయత్తచిత్తులయి సమర విషయంబు లయిన మాటలాడుచు నిజనివాసంబుల కరిగి; రిట నరుండు నుత్తరు నాలోకించి 'నీ విజయంబు పురంబున ఘోషింప గోపాలురం బుచ్చు' మనిన నతం డది దెఱంగుగాఁ గైకొని యట్ల చేయ, నిట్లు నిగూఢంబుగాఁ బట్టణంబునకుం జనుచుండ; నంతకు మున్న మత్స్యమహీవల్లభుం డాహవజయదర్పిత వాహినీ పరివృతుండై నగరంబు సొత్తెంచి. 231**

**ప్రతిపదార్థం:** అను వచనంబులు= అనెడి మాటలు; ఇయ్యకొనుచున్= ఒప్పుకొనుచు; చని= వెళ్ళి; శమీవృక్షసమీపంబునన్= జమ్మిచెట్టు దగ్గర; నిల్చి= ఆగి; గాండీవ+ఆది= గాండీవం మున్నగు; సాధనంబులు= పరికరాలు; పూర్వప్రకారంబునన్= మునుపటి వలెనే; నిక్షేపింపన్= పెట్టుటకు; నియోగించి= పురమాయించి; కపిధ్వజ= హనుమంతుడి గుర్తు జెండాను; దేవదత్త= దేవత లిచ్చిన శంఖం; కిరీట+ఆది= కిరీటం మొదలైన; దివ్య= దేవతా సంబంధమైన; పరికరంబులన్= సాధనాలను;

సవినయంబుగాన్= వినయంతో కూడునట్లుగా; ప్రార్థించి= ప్రార్థనచేసి; అంతర్ధానంబు+చేయించి= కన్పడకుండేటట్లుచేసి; ఎప్పటి సింహపతాక= మునుపటి సింహధ్వజం; రథంబునన్= రథంపై; బంధింపన్= కట్టుటకు; పనిచి= పంపి; విరాట తనయుండు= ఉత్తరుడు; నిజ+ఆయుధంబులు= తన ఆయుధాలను; కైకొని= తీసికొని; రథికుండు+అయి= రథాన్ని ఎక్కిన వీరుడై; వచ్చునట్లుగాన్= పురానికి వచ్చేవాడినిగా; చేసి= ఆజ్ఞాపించి; తొంటి చందంబునన్= మునుపటి రీతిగా; తలచీర= తలగుడ్డ; అలవరించికొని= కట్టుకొని; సారథి+ఐ= రథం తోలేవాడుగా అయి; సవ్యసాచి= అర్జునుడు; నొగలు= సారథి కూర్చుండే ప్రదేశం; ఎక్కెన్= ఎక్కాడు; అట్టి సమయంబునన్= అటువంటి సమయంలో; పురందర+ఆది= దేవేంద్రుడు మొదలైన; బృందారకులును= దేవతలును; దేవముని= దేవర్షులు; సిద్ధ= సిద్ధులు; గంధర్వ+ఆదులును= గంధర్వులు మున్నగువారు; పాండుప్రముఖ= పాండురాజు మున్నగు; రాజలోకంబును= రాజసమూహమున్నూ; ఆశ్చర్య= వింతకూ; హర్ష+ఆయత్త= సంతోషానికీ అధీనమైన; చిత్తులు+అయి= మనస్సులు కలవారై; సమర విషయంబులు+అయిన+మాటలు+ ఆడుచున్= యుద్ధసంబంధమయిన మాటలు మాట్లాడుకొంటూ; నిజ నివాసంబులకున్= తమ తమ నివాస ప్రదేశాలకు; అరిగిరి= వెళ్ళారు; ఇటన్= ఇక్కడ; నరుండు= అర్జునుడు; ఉత్తరున్= ఉత్తరుడిని; ఆలోకించి= చూచి; నీ విజయంబు= నీ యొక్క విజయవార్తను; పురంబునన్= పట్టణంలో; ఘోషింపన్= చాటటానికి; గోపాలురన్= పసుల కాపరులను; పుచ్చుము+అనినన్= పంపు మనగా; అతండు= ఉత్తరుడు; అది= ఆ చెప్పటం; తెఱంగుగాన్= రీతిగా; కైకొని= స్వీకరించి; అట్లు+అ= అట్లే; చేయన్= చేయగా; ఇట్లు= ఈ విధంగా; నిగూఢంబుగాన్= ఎవరికిని తెలియకుండా; పట్టణంబునకున్= విరాట నగరానికి; చనుచున్+ఉండన్= వెళ్ళుచుండగా; అంతకున్+మున్ను+అ= అంతకంటె ముందుగా; మత్స్యమహీవల్లభుండు= విరాటరాజు; ఆహవజయ= యుద్ధ విజయంచేత; దర్పిత= గర్వించిన; వాహినీ= సేనతో; పరివృతుఁడు+ఐ= చుట్టబడినవాడై; నగరంబు= పట్టణంలో; చొత్తెంచి= ప్రవేశించి.

**తాత్పర్యం:** ఆ మాట లంగీకరించి వెళ్ళి జమ్మిచెట్టు దగ్గర ఆగి, గాండీవం మున్నగు పరికరాలను ఇదివరకటివలెనే దాచుమని ఆజ్ఞాపించి, కపిధ్వజం, దేవదత్తం, కిరీటం మొదలైన దివ్యపరికరాలను వినయంతో ప్రార్థించి అంతర్ధానం చేసి, మామూలుగా సింహధ్వజాన్ని రథానికి కట్టించి, ఉత్తరుడు తన ఆయుధాలను పుచ్చుకొని రథికుడుగా రథమెక్కి కూర్చునేటట్లుగా చేసి, తాను మునుపటివలె తలకు గుడ్డ కట్టుకొని సారథిగా నొగలపైకి ఎక్కాడు అర్జునుడు. అప్పు డీ యుద్ధం చూడటానికి వచ్చిన దేవేంద్రాదులు, దేవర్షులు, సిద్ధులు, గంధర్వాదులు, పాండురాజు మొదలైన రాజులు, అందరూ ఆశ్చర్యంతోను, సంతోషంతోను ఆ యుద్ధపు కబుర్లు చెప్పుకొంటూ తమ తమ నివాసాలకు వెళ్ళారు. ఇక్కడ అర్జునుడు 'నీ విజయం పట్టణంలో చాటింపుమని గోపాలురకు చెప్పి పంపు'మనగా అతడు అందుకు అంగీకరించి ముందుగా గోపాలురను పంపించాడు. ఈ రీతిగా నిగూఢంగా పట్టణానికి వెళ్ళుతూ ఉన్నారు. అక్కడ విరాటరాజు (దక్షిణ గోగ్రహణ యుద్ధంలో) గెలుపు వచ్చినందున గర్వించిన సేనతో నగరానికి వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. మందిరాభ్యంతరమున కానందలీలలఁ । బాండుపుత్రులుఁ దక్కటి బంధుజనులుఁ**
**దానుఁ జని విప్రులును వనితాజనంబు । సేస లొలుక సింహాసనాసీనుఁ డయ్యె. 232**

**ప్రతిపదార్థం:** మందిర+అభ్యంతరమునన్= రాచనగరులో; ఆనందలీలలన్= ఆనంద విలాసాలతో; పాండుపుత్రులున్= పాండవులును; తక్కటి బంధుజనులున్= మిగిలిన బంధువులును; తానున్= విరాటుడు; చని= వెళ్ళి; విప్రులును= బ్రాహ్మణులూ; వనితాజనంబున్= స్త్రీలూ; సేసలు= దీవనప్రాలు; ఒలుకన్= వేయగా; సింహాసన= సింహాసనంలో; ఆసీనుఁ డు= కూర్చున్నవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** రాజప్రాసాదంలోనికి పాండవులూ, తక్కిన బంధువులూ, తానూ ప్రవేశించారు. బ్రాహ్మణులూ, స్త్రీలూ దీవిస్తూ అక్షతలు చల్లుతూ ఉండగా విరాటరాజు సింహాసనంమీద కూర్చున్నాడు.

**వ. ఇవ్విధంబునం దన విజయంబుఁ గొనియాడ వచ్చిన వారి నెల్ల నభినందించి 'యుత్తరుం డెచ్చట నున్న వాఁ?' డని యడిగి వారల వలనం గురునాథుండు భీష్మద్రోణ కర్ణ కృపాశ్వత్థామాది యోధవీరులు బెరసిన బలంబులతోడ నడచి యుత్తరంబునఁ బసులం బట్టిన నతండు బృహన్నల సారథింగాఁ గైకొని యొక్కరుండ కుయివోవుట విని విషాద వేదనా దోదూయమాన మానసుం డగుచు మంత్రుల మొగంబు సూచి యిట్లనియె. 233**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; తన విజయంబున్= తన జయమును; కొనియాడన్= పొగడటానికి; వచ్చిన వారిన్+ఎల్లన్= వచ్చిన అందరిని; అభినందించి= అభినందనం చేసి; ఉత్తరుండు= ఉత్తరుడు; ఎచ్చటన్= ఎక్కడ; ఉన్నవాఁడు?= ఉన్నాడు?; అని+అడిగి= అని ప్రశ్నించి; వారల వలనన్= వారు చెప్పగా; కురునాథుండు= దుర్యోధనుడు; భీష్మ= భీష్ముడు; ద్రోణ= ద్రోణుడు; కర్ణ= కర్ణుడు; కృప= కృపాచార్యుడు; అశ్వత్థామ+ఆది= అశ్వత్థామ మొదలైన; యోధవీరులు= వీరులైన యోధులు; బెరసిన= కూడిన; బలంబుల తోడన్; నడచి వచ్చి; ఉత్తరంబునన్= నగరానికి ఉత్తరంగా; పసులన్= గోధనాలను; పట్టినన్= ఆక్రమించగా-తోలికొని పోగా; అతండు= ఉత్తరుడు; బృహన్నల= బృహన్నలను; సారథిన్+కాన్= రథం తోలువాడిగా; కైకొని= స్వీకరించి; ఒక్కరుండు+అ= ఒక్కడే; కుయి+పోవుట= రక్షకు పోవటం; విని; విషాద= విచారంతో; వేదనా= బాధతో; దోదూయమాన= బాధపడుతున్న; మానసుండు+అగుచున్= మనస్సు కలవాడై; మంత్రుల= మంత్రులయొక్క; మొగంబు= ముఖాన్ని చూచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తన విజయాన్ని పొగడటానికి వచ్చిన వారిని అభినందించాడు విరాటరాజు. ఇక 'ఉత్తరుడు ఎక్కడ ఉన్నా'డని ప్రశ్నించాడు. 'దుర్యోధనుడు - భీష్మ, ద్రోణ, కర్ణ, కృపాశ్వత్థామాది యోధ వీరులున్న సేనతో వచ్చి ఉత్తరాన ఉన్న గోవులను తోలుకొని పోతూ ఉంటే వాటిని మరల్చటానికని బృహన్నలను సారథిగా చేసికొని ఒక్కడే వెళ్ళా' డని చెప్పారు. అది వినేటప్పటికి విషాదం, వేదన కలిగాయి. విరాటుడు మంత్రుల ముఖాలు చూచి ఇట్లా అన్నాడు.

**విరాటుఁ డుత్తరుఁడు గురుసైన్యంబు గెలువఁబోవుట విని చింతించుట (సం. 4-63-9)**

**చ. 'అసమున మీఁ దెఱుంగక మహోగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం**
**బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు; కౌరవసేన యేడ? యొం**
**టి సనుట యేడ? నా కిది కడింది విచారము వుట్టె; సైన్యముల్**
**వెసఁ జని తోడు గావలయు వేగమ పంపుఁడు చాలునట్లుగన్.' 234**

**ప్రతిపదార్థం:** పాపఁడు= చిన్నవాడు; అసమునన్= దర్పంతో; మీఁదు= పైన వచ్చేడిది; ఎఱుంగక= తెలియక; మహా+ఆగ్రహవృత్తిన్= ఎక్కువ కోప వర్తనంతో; కడంగి= పూనుకొని; చెచ్చెరన్= వెంటనే; పసులకున్= గోవులకు; కూయిగాన్= రక్షకుడుగా; చనియెన్= వెళ్ళాడు; కౌరవసేన= కౌరవుల సైన్యం; ఏడ?= ఎక్కడ; ఒంటి+చనుట= ఒంటరిగా వెళ్ళటం; ఏడ?= ఎక్కడ?; ఇది= ఇట్లా వెళ్ళటం; నాకున్= నాకు; కడింది= మిక్కిలి; విచారము= దుఃఖం; పుట్టెను= కల్గించింది; సైన్యముల్= సేనలు; వెసన్= వెంటనే; చని= వెళ్ళి; తోడు= సాయం; కావలయున్= కావలెను; చాలునట్లుగాన్= సరిపోవునంతగా; వేగము+అ= వేగమే; పంపుఁడు= పంపించండి.

**తాత్పర్యం:** 'పసివాడు గర్వంతో తర్వాత ఏమి జరుగుతుందో తెలియకుండా దురాగ్రహంతో గోవులకు బాధ కలిగిందని రక్షిద్దామని వెళ్ళాడు. కౌరవసేన ఎక్కడ? ఇతడు ఒంటరిగా వెళ్ళట మెక్కడ? ఇది నాకు చాలా బాధాకరంగా ఉన్నది. వెంటనే అతడికి సహాయం కావాలి. సరిపోవునంతగా సేనలను పంపించండి.'

**చ. అనుటయుఁ గంకుఁ డిట్లనియె 'నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా**
**వున నిట వీరికిన్ జయ మవున్; వెఱ పేటికి నీకు? నుత్తరుం**
**డని నొకరుండు నాకుము బృహన్నల సారథి గాన గెల్చు న**
**య్యనిమిషకోటినైన నతఁ డద్భుతవిక్రమజృంభణంబునన్.' 235**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; కంకుఁడు= కంకుభట్టు పేరుతో ఉన్న ధర్మరాజు; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు; సుశర్మ= సుశర్మ అను రాజు; అక్కడన్= దక్షిణపు వైపున; వచ్చి= యుద్ధానికి వచ్చి; ఓడెన్= ఓడిపోయాడు; కావునన్= కనుక; ఇటన్= ఇక్కడను; వీరికిన్= వీరికికూడా; జయము= గెలుపు; అవున్= కలుగుతుంది; నీకున్= నీకు; వెఱపు= భయం; ఏటికిన్?= ఎందుకు?; అనిన్= యుద్ధంలో; ఉత్తరుండు= ఉత్తరుడు; ఒకరుండు= ఒక్కడే; నాకుము= అనకుము; సారథి= రథం తోలువాడు; బృహన్నల కానన్= బృహన్నల కనుక; అతఁడు= ఆ బృహన్నల; అద్భుత= ఆశ్చర్యకరమైన; విక్రమ= పరాక్రమంయొక్క; జృంభణంబునన్= విజృంభించటంతో; ఆ+అనిమిష కోటిన్+ఐనన్= ఆ దేవతా సముదాయాన్నైనాసరే; గెల్చున్= గెలుస్తాడు.

**తాత్పర్యం:** విరాటుడు అట్లా సందేహంతో పలుకగా కంకుభట్టు 'అటు దక్షిణపు వైపున దండెత్తి వచ్చి సుశర్మ ఓడిపోయాడు కదా! మనకు విజయం కలిగింది. ఇటు ఉత్తర గోగ్రహణ యుద్ధంలో కూడా మనవారికే విజయం కలుగుతుంది. నీ కెందుకు భయం? యుద్ధం చేసేవాడు ఒక్క ఉత్తరుడే అనుకొనకుము. సారథిగా బృహన్నల ఉన్నాడు గదా! అతడు అద్భుతమైన పరాక్రమం కలవాడు. విజృంభించెనా దేవతలను కూడ గెలువగలడు' అన్నాడు.

**విశేషం:** ధర్మరాజు మాటనేర్పరితనం ఇందులో మెరుస్తున్నది. అక్కడ, ఇట-శబ్దాలు దక్షిణ ఉత్తర దిశలు చూపిస్తూ చెప్పిన వాచికాభినయ విశేషాలు. అక్కడ సుశర్మ ఓడాడు. అతడు ఓడటానికి భీమాదుల సమష్టికృషి హేతువు. అందువలన విజయసాధకుల పేర్లు చెప్పటం అక్కడ రాజసభా మర్యాద కాదు కాబట్టి చెప్పలేదు. ఇట (ఉత్తర గోగ్రహణ ఘట్టంలో) వీరికి (బృహన్నలకు, ఉత్తరుడికి) విజయం తథ్యం అన్నాడు. ఇక్కడ ఓడిన వారి సంఖ్య అధికం, గెలిచినవారి సంఖ్య పరిమితం. అందువలన గెలిచే సంగతి చెప్పాడు. 'వీరికిన్' - అనే సర్వనామం సార్థకమని పేర్కొని, సారథితో కూడిన ఉత్తరుడిని పేర్కొన్నాడు. సామాన్యంగా యుద్ధంలో సారథిని రథికుడితో సాటిగా లెక్కించరు. ఇక్కడ ధర్మరాజు సారథిని రెండవవాడిగా గుర్తించటమే కాక, అతడు సారథి కాబట్టే రథికుడు గెలవగలుగుతాడని చెప్పాడు. అంతేకాక, సారథి అయినా రథికుడివలె అతడికి తోడ్పడతాడని సూచించాడు. 'ఉత్తరుండు అనిన్ ఒక్కరుండు అనకుము' అనటం ఉక్తి విశేషం. ఉత్తరుడు ఎప్పుడూ ఉత్తరస్థానంలోనే ఉంటాడు. పూర్వ (ప్రథమ) స్థానంలో అర్జునుడు ఉంటాడని ధ్వని. అర్జునుడు ప్రక్కన ఉండగా ఒక్కరుడుగా అంటే - ఏకైకవీరుడిగా ఉత్తరుడిని పరిగణించరాదని గూఢమైన అర్థం. చివరివాక్యంలో అతఁడు-అనే సర్వనామం అటు అర్జునుడికీ, ఇటు ఉత్తరుడికీ అన్వయించేటట్లు పలకటం ధర్మజుడి (కంకుడి) మాటనేర్పరితనం. దేవతలందరూ కలిసి వచ్చినా ఆశ్చర్యం కలిగించే పరాక్రమంతో ఓడించగలగటం అతడికే సాధ్యం అంటాడు. 'వారికిన్ జయమవున్' - అని మొదలుపెట్టిన ధర్మజుడు 'అతఁడు గెల్చున్' అని ముగించాడు. అది ఒక ముడి. విరాటునికి మాటల ముడి అర్థం కాదు. అందుకు కలత చెందుతాడు. మనసులో తపిస్తాడు తరువాతి పద్యంలో. (సంపా.)

**చ. అన వినుచుం గలంగు హృదయంబునఁ దాపము నివ్వటిల్ల ని**
**ట్లను మఱియున్ విరాటుఁడు 'రణావనియందుఁ ద్రిగర్త సేనచే**
**ననయము నొచ్చినట్టి జనులందఱుఁ దక్కఁగ నేటుఁ బోటుఁ దాఁ**
**కని ఘనయోధకోటి సనఁగావలయున్ బలుపై రయంబునన్. 236**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; వినుచున్= వింటూనే; కలంగు హృదయంబునన్= కలతచెందే హృదయంలో; తాపము= విచారం; నివ్వటిల్లన్= అతిశయించగా; మఱియున్= ఇంకా; ఇట్లు= ఈ రీతిగా; విరాటుఁడు= రాజు; అనున్= అన్నాడు; రణ+ అవనిఅందున్= యుద్ధభూమిలో; త్రిగర్త సేనచేన్= త్రిగర్తదేశపు సైన్యంచేత; అనయమున్= మిక్కిలి; నొచ్చినట్టి= బాధపడిన; జనులు= సైనిక జనం; అందరున్= అందరున్నూ; తక్కఁగన్= తప్ప, మిగిలిన; ఏటున్= చావు దెబ్బలను; పోటున్= కత్తిపోటులను; తాఁకని= తగలని; ఘన= గొప్పవారైన; యోధకోటి= యుద్ధవీరుల సముదాయం; బలుపు+ఐ= బలంకలదై; రయంబునన్= వేగంగా; చనఁగావలయున్= వెళ్ళవలెను.

**తాత్పర్యం:** కంకుభట్టు మాటలు వింటూనే మనస్సు కలతచెందగా, తాపం పెరిగిపోగా విరాటుడు ఇట్లా అన్నాడు: 'యుద్ధంలో దక్షిణాన త్రిగర్తుల సైన్యంచేత బాగా బాధపడిన సైనికులు కాక, బాణాల కత్తుల బాధలను పొందని మిగిలిన యోధ సముదాయమంతా బలంగా, వేగంగా, వెనుదీయక వెంటనే యుద్ధానికి వెళ్ళాలి.

**క. చని యక్కుమారుఁ డే మ। య్యెనొ? యత్తెఱఁ గెఱిఁగి మనకు నెయిదించుట పు**
**ట్టిన కార్యమునకుఁ దగియెడు। పని; యట విధి గెలువ వశమె బ్రహ్మకునైనన్. 237**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; ఆ+కుమారుఁడు= ఆ ఉత్తరకుమారుడు; ఏమి+అయ్యెనొ?= యుద్ధంలో ఏమైనాడో?; ఆ+ తెఱఁగు= ఆ విధం; ఎఱిఁగి= తెలిసికొని; మనకున్= మనకు; ఎయిదించుట= అందించుట; పుట్టిన కార్యమునకున్= జరిగిన పనికి; తగియెడు= తగిన; పని= కర్తవ్యం; అటన్= అక్కడ; విధిన్= దైవాన్ని; బ్రహ్మకున్+ఐనన్= బ్రహ్మకైనా; గెలువన్= గెలుచుటకు; వశమె?= వశమా?

**తాత్పర్యం:** సేనలు అక్కడికి వెళ్ళి, అక్కడ ఉత్తరకుమారుడి పరిస్థితి ఎట్లా ఉన్నదో తెలిసికొని మనకు తెలపటం జరిగిపోయినదానికి ప్రస్తుత కర్తవ్యం. విధిని తప్పించుకొనటం బ్రహ్మకైనా వశం కాదు కదా!'

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ఉత్తరుడు రణరంగంలో ఏమైనాడో - అనటంలోనే అతడిమీద విరాటుడు అన్ని ఆశలూ వదలుకొన్నట్లు ధ్వనిస్తున్నది. అందుకే కాబోలు - 'ఘనయోధ కోటి' - కొడుకేమైనాడో తెలిసికొని చెప్పటానికే పంప తలపెట్టాడు. అంటే- వీరు రణభూమికి చేరేసరికి ఉత్తరుడు చచ్చిపడి ఉండవచ్చునన్న శంక ధ్వనిస్తున్నది. యోధులు యుద్ధం చేసే అవసరం ఉండదనే అతని ఊహ! బ్రహ్మకైనా విధిని తప్పించుకొనటం సాధ్యం కాదన్న అర్థాంతరన్యాసం ఆ ఊహను బలపరుస్తున్నది. (సంపా.)

**వ. అనుచు నుత్తలపడు నయ్యవసరంబున నుత్తరుఁడు పుత్తెంచిన గోపాలురు పఱతెంచి యతనిం గాంచి. 238**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని పలుకుతూ; ఉత్తలపడు= బాధపడెడి; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఉత్తరుఁడు పుత్తెంచిన= ఉత్తరుడు పంపిన; గోపాలురు= పశుపాలకులు; పఱతెంచి= వచ్చి; అతనిన్= విరాటుని; కాంచి= చూచి.

**తాత్పర్యం:** అని బాధపడే సమయంలో ఉత్తరుడు పంపిన గోపాలురు పరుగెత్తుకొంటూ వచ్చి విరాటరాజును దర్శించుకొని.

**చ. 'కురుబలమున్ జయించి మనగోవుల నెల్లను గ్రమ్మఱించి యు**
**త్తరుఁ డిదె తాను సూతుఁడు నుదగ్రత వచ్చుచు నున్నవాఁడు; త**
**త్తురగరథధ్వజాలి నొక త్రుప్పుడు రాలదు; మమ్ముఁ బిల్చి వే**
**పురి నెఱిఁగింపుఁ డన్న నృపపుంగవ! వచ్చితి మేము' నావుడున్. 239**

**ప్రతిపదార్థం:** నృపపుంగవ!= రాజా!; ఉత్తరుఁడు= ఉత్తర కుమారుడు; కురుబలమున్= కౌరవసేనను; జయించి= గెల్చి; మనగోవులన్= మన ఆవులను; ఎల్లను= అన్నింటిని; క్రమ్మఱించి= మరల్చి; ఇదె= ఇదిగో; తాను= ఆ ఉత్తరుడును; సూతుఁడున్= సారథియును; ఉదగ్రతన్= గర్వంతో; వచ్చుచున్+ఉన్నవాఁడు= వస్తున్నాడు; తద్= అతడియొక్క; తురగ= గుర్రాలు; రథ= రథం; ధ్వజ+ఆలిన్= జెండా వగైరాలకు; ఒక త్రుప్పుడున్= త్రుప్పుపట్టిన ముక్కకూడా; రాలదు= ఊడదు; మమ్మున్= మమ్ములన్; పిల్చి= పిలిచి; వే= వెంటనే; పురిన్= పట్టణమందు; ఎఱిఁగింపుఁడు+అన్నన్= తెలుపండనగా; ఏము= మేము; వచ్చితిమి= వచ్చాం; నావుడున్= అనగా.

**తాత్పర్యం:** 'ఉత్తరుడు కౌరవసేనలను జయించి, మన గోవులను మళ్ళించి తాను, సూతుడితో కలిసి మహోత్సాహంతో వస్తున్నాడు. మమ్ములను పిలిచి వెంటనే వెళ్ళి పట్టణంలో తెలుపుమంటే వచ్చాము రాజా!' అని చెప్పారు.

**తే. అంతరంగంబు నిండి రెండలువులందు । వెడలు సంతోష పూరంబు విధము దోఁపఁ**
**గన్నుఁగవ సమ్మదాశ్రులు గడలుకొనుచు । గండపులకాంకురములతోఁ గ్రమ్ముదేర. 240**

**ప్రతిపదార్థం:** అంతరంగంబు= మనస్సు; నిండి= నిండిపోయి; రెండు+అలువులందున్= రెండు తూములవెంట; వెడలు= వెళ్ళునట్టి; సంతోష పూరంబు= సంతోష ప్రవాహంయొక్క; విధము= రీతి; తోఁపన్= తోచేటట్లుగా; కన్నుఁగవన్= రెండు కన్నులవెంట; సమ్మద+ఆశ్రులు= ఆనందబాష్పాలు; కడలుకొనుచున్= వ్యాపిస్తూ; గండ= చెక్కిళ్ళయందు; పులక+అంకురములతోన్= పులకలతో; క్రమ్ముతేరన్= కలసి వ్యాపించగా.

**తాత్పర్యం:** ఆనందబాష్పాలు మనసంతా నిండిపోయి రెండు వరవల ద్వారా పైకి ప్రవహిస్తున్నాయా అన్నట్లుగా రెండుకన్నుల వెంట పొంగిపొర్లుతూ, చెక్కిళ్ళయందు పులకలతో కలిసి వ్యాపించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. అనుకోని విధంగా విన్న వింతవార్త వలన విరాటుడు హర్షాతిశయాన్ని పొందాడు. 'అశ్రువు' (కన్నీరు కారటం) అనే సాత్త్వికభావం ఇందులో వర్ణించబడింది. అది ఎట్లా భావించటానికి వీలుగా ఉన్నదంటే - నీటితో చెరువంతా కట్టలు పట్టేంతవరకు నిండగా, ఎక్కువైన నీరు కట్టలను త్రెంచకుండా బయటకు వెళ్ళటానికి మార్గాలు (వరవలు, తూములు, అలుగులు) అమరుస్తారు. వాటివెంట నీరు పారుతున్నదంటే చెరువు పొంగి పొర్లుతున్నదన్న మాట! అటువంటి చెరువును తలపించే విధంగా విరాటుడి హృదయం నిండి ఆనందబాష్పాలు, కన్నులనే తూములద్వారా పొంగిపొరలిపోతున్నాయని చక్కని దేశీయమైన ఉత్ప్రేక్ష. అద్భుతంతో సంతోషం ఉప్పొంగిన చిత్ర మిది. (సంపా.)

**క. 'ఏమేమీ!' యని గోప । స్తోమముఁ బలుమాఱు నడుగుచున్ మెయి వొదలన్**
**భూమీశుఁ డపుడు మంత్రుల । మోములు గనుఁగొని సగర్వమున నిట్లనియెన్. 241**

**ప్రతిపదార్థం:** భూమీశుఁడు= విరాటరాజు; ఏమీ+ఏమీ!= ఏమిటేమిటి!; అని; గోపస్తోమమున్= గోపాలుర సమూహాన్ని; పలుమాఱున్= పెక్కు సార్లు; అడుగుచున్= ప్రశ్నిస్తూ; మెయి= శరీరం; పొదలన్= పొంగగా; అపుడు; మంత్రుల= మంత్రులయొక్క; మోములు= ముఖాలు; కనుఁగొని= చూచి; సగర్వమునన్= గర్వంతో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** విరాటరాజు 'ఏమి టేమిటి! ఉత్తరుడు గెల్చాడా?' అని గోపాలురను పదేపదే అడుగుతూ, శరీరం ఉప్పొంగగా మంత్రులకేసి చూచి గర్వంగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** నమ్మలేని విషయాన్ని విని ఆశ్చర్యపడి, దానిని నమ్మటానికి పడే తాపత్రయం ఇందులో వర్ణించబడింది. 'ఏమి టేమిటి?' అని మళ్ళీ మళ్ళీ అడిగి ఉత్తరుడి విజయవార్తను విరాటుడు విని, ధ్రువీకరించుకొన్నాడు. అసాధ్యమనుకొన్న యుద్ధాన్ని నిర్వహించి విజయాన్ని సాధించిన కొడుకు గొప్పతనాన్ని పరులు కొలువులో ప్రశంసిస్తూంటే 'పుత్రోత్సాహం' పొంగిన విరాటుడు వీరపుత్రుడిని కన్న ఒక తండ్రి పొందే సహజ గర్వాన్ని ప్రదర్శించాడు. తిక్కన నాటకీయ రచన కిది మచ్చుతునక. (సంపా.)

**శా. 'వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై విస్ఫార ఘంటా ధ్వనిం**
**జాటం బంపుఁడు పేర్మి నుత్తరుజయాశ్చర్యంబుఁ; బుణ్యాంగనా**
**కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహిత క్షోణీసుర వ్రాతమున్**
**ఘోటస్యందన వారణప్రతతులం గూడన్ సతూర్యంబుగన్. 242**

**ప్రతిపదార్థం:** వీటన్= నగరంలో; వీథులన్= వీథులవెంట; ఎల్లన్= అన్ని చోట్లను; ఏనుఁగులపైన్= ఏనుగులమీద; విస్ఫార= వ్యాపించెడి; ఘంటాధ్వనిన్= గంట చప్పుడుతో; ఉత్తరు= ఉత్తరుడియొక్క; జయ+ఆశ్చర్యంబున్= జయమనెడి అద్భుతాన్ని; పేర్మిన్= సంతోషంతో; చాటన్= చాటి చెప్పటానికి; పంపుఁడు= పంపించండి; పుణ్యాంగనా కోటిన్= సువాసినీ బృందాన్ని; మహిత= గొప్పవారైన; క్షోణీసుర= బ్రాహ్మణులయొక్క; వ్రాతమున్= సముదాయాన్ని; ఎదుర్కొనంగన్= ఎదురుపోయి స్వాగతం చెప్పటానికి; ఘోట= గుర్రాలను; స్యందన= రథాలను; వారణ= ఏనుగులయొక్క; ప్రతతులన్= సముదాయాలను; సతూర్యంబుగన్= మంగళ వాద్యములతో కూడా; కూడన్ పుచ్చుఁడు= వెంట పంపించండి.

**తాత్పర్యం:** 'నగరమంతా వీథులన్నిటిలో అన్నిచోట్లా ఏనుగులమీద పెద్దగా వినిపించే గంటల చప్పుడుతో ఉత్తరుడి జయమనే అద్భుతాన్ని సంతోషంతో చాటటానికి పంపండి. సువాసినీ బృందాన్ని గొప్పవారైన బ్రాహ్మణులయొక్క సముదాయాన్నీ గుర్రాల, రథాల, ఏనుగుల సముదాయాలతో మంగళ వాద్యాలతో కూడి ఎదురు వెళ్ళి ఆహ్వానించటానికి పంపండి.

**విశేషం:** విరాటుడు దక్షిణ గోగ్రహణ యుద్ధంలో గెలుపొంది తిరిగివచ్చినప్పుడు విప్రులు, వనితలు అక్షతలు చల్లుతూ ఉండగా నగరంలో ప్రవేశించి, సింహాసనంమీద కూర్చుండి, అందరితో కలిసి ఆనందం పంచుకొని విజయోత్సవం చేసికొన్నాడు. ఇప్పుడు తన కొడుకైన ఉత్తరుడి విజయోత్సవాన్ని స్వయంగా నిర్వహించటానికి ఆజ్ఞాపించాడు. ఏనుగులమీద ఎక్కి గంటలు మ్రోగిస్తూ విజయఘోష చేయించాడు. ముత్తైదువులనూ, విప్రులనూ, చతురంగ సైన్యాలనూ మంగళవాద్యాలతో ఆహ్వానానికి ఎదురుకోలు పంపాడు. ఇవి విజయోత్సవాచారాలు. ఈ వేడుక నగరపు పొలిమేరల వరకు సాగిపోతుంది. అక్కడ ఆహ్వానం పలుకుతుంది. (సంపా.)

**క. ఉత్తమ కన్యాజనములు । నుత్తరయును గంధమాల్యయుక్తముగఁ గుమా**
**రోత్తము నెదుర్కొనం దగు; । నత్తెఱఁగున సంఘటింపుఁ డభిరామముగన్.' 243**

**ప్రతిపదార్థం:** ఉత్తమ కన్యాజనములు= శీలవతులైన కన్యలూ; ఉత్తరయును= ఉత్తర కూడా; గంధ= మంచి గంధంతో; మాల్య= పూలమాలలతో; యుక్తముగన్= కూడునట్లుగా; కుమార+ఉత్తమున్= ఉత్తముడైన ఉత్తరుడిని; ఎదుర్కొనన్= ఎదురుగా వెళ్ళి ఆహ్వానించటం; తగున్= ఉచితమైనది; ఆ+తెఱఁగునన్= ఆ రీతిగా; అభిరామముగన్= మనోహరంగా; సంఘటింపుఁడు= సమకూర్చండి.

**తాత్పర్యం:** ఉత్తములైన కన్యలూ, ఉత్తరా కలిసి గంధం, పూలమాలలు తీసికొని ఉత్తరకుమారుడికి ఎదురుగా పోయి ఆహ్వానించాలి. అట్లే ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు మంగళవాద్యాలవారితో కూడా పంపండి.'

**విశేషం:** ఉన్న ఆచారాలతోపాటు విరాటుడు మరొక క్రొత్త ఆచారాన్ని ప్రవేశపెట్టాడు. ఉత్తమ లక్షణాలు గల కన్యకలను ఎన్నికచేసి, వారిని రాజకుమారి అయిన ఉత్తరయొక్క నేతృత్వంలో నిలిపి, గంధమాల్యాదులైన మంగళద్రవ్యాలను తీసికొని వారందరూ ఎదురుపోయి ఆహ్వానించాలని ఆజ్ఞాపించాడు. 'అత్తెఱఁగున సంఘటింపుఁ డభిరామముగన్' - అన్న ఆదేశం - అపూర్వంగా అభిరామంగా వేడుక కొరకు సంఘటించబడుతున్న ఆచారమని స్పష్టం చేస్తున్నది. ఇందులో అంతఃపురకన్యలు పాల్గొనటం గమనార్హం. ఉత్తరుడిపట్ల ప్రత్యేకమైన అభిమానం అందులో ధ్వని. ఈ వేడుక నగరి వాకిటిదాకా సాగుతుంది. (సంపా.)

**వ. అని నియోగించి గోపాలురకుం గట్ట నిప్పించి పుచ్చి, కంకు నాలోకించి 'నెత్తం బొక పలక యాడుదమే?' యని యుబ్బుమై మాటగాఁ బలికిన నతండు 'నీవు సుమాళంబున నున్నవాఁడవు; నేఁడు నీతోడ నాడి జయింప రాదు వెఱతు' ననిన విరాటుండు నగుచుఁ దత్ప్రదేశంబున మెలంగు సైరంధ్రిం గనుంగొని, సారెలు దెమ్మని పనిచి పలక ముందటికిఁ దిగిచికొనుచు 'నిందు ర'మ్మనవుడుఁ బాండవాగ్రజుండు 'జూదం బాడుట యెంత లెస్స!' యనుచుం జేరి యాడందొడంగునప్పుడు మఱియు నిట్లనియె. 244**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; నియోగించి= ఆజ్ఞాపించి; గోపాలురకున్= శుభవార్త చెప్పిన గోపాలురకు; కట్టన్+ఇప్పించి= వస్త్రాలు కట్టుకొనటానికి బహూకరించి; పుచ్చి= పంపి; కంకున్= కంకుభట్టును; ఆలోకించి= చూచి; నెత్తంబు= జూదం; ఒక పలక= ఒక ఆట; ఆడుదమే?= ఆడుదామా; అని= ఇట్లు; ఉబ్బుమై మాటగాన్= సంతోషంతో కూడిన మాటగా; పలికినన్= పల్కగా; అతండు= కంకుభట్టు; నీవు= రాజైననీవు; సుమాళంబునన్= హుషారుగా; ఉన్నవాఁడవు= ఉన్నావు; నేఁడు= ఈ రోజు; నీతోడన్= నీతో; ఆడి= జూదమాడి; జయింపన్‌రాదు= గెలువలేను; వెఱతును= జంకుతాను; అనినన్= అనగా; విరాటుండు= విరాటరాజు; నగుచున్= నవ్వుతూ; తత్ప్రదేశంబునన్= ఆ ప్రాంతంలో; మెలంగు= సంచరించెడి; సైరంధ్రిన్= సైరంధ్రిని; కనుంగొని= చూచి, సారెలు= పాచికలు; తెమ్ము+అని= తీసికొని రమ్మని; పనిచి= పంపి; పలక= పాచికలు వేయు బల్లను; ముందటికిన్= తన ముందరికి; తిగిచికొనుచున్= లాగికొంటూ; ఇందున్= ఇక్కడికి; రమ్ము= రా!; అనవుడున్= అనగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; జూదంబు+ఆడుట= జూదమాడటం; ఎంత లెస్స= ఎంత బాగు; అనుచున్= అని పలుకుతూ; చేరి= దగ్గరకు వచ్చి; ఆడన్= ఆడటానికి; తొడంగు+అప్పుడు= ప్రారంభించేటప్పుడు; మఱియున్= తిరిగి; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** విరాటరాజు మంత్రులను ఆ రీతిగా పురమాయించి, జయవార్త చెప్పినందుకు గోపాలురకు వస్త్రాలు బహూకరించి పంపి, కంకుభట్టును చూచి, 'ఒక్క పలక జూద మాడుదామా?' అనేసరికి అతడు 'నీవు ఈనాడు

మహా సంతోషంగా ఉన్నావు. ఇపుడు నీతో ఆడితే గెలవటం కష్టం. అది నా భయం' అన్నాడు. అయినా విరాటుడు అక్కడే తిరుగుతూ ఉన్న సైరంధ్రిని చూచి పాచికలు తెమ్మని ఆజ్ఞాపించాడు. ఈ లోగా జూదపు బల్లను దగ్గరగా తీసికొని ఇక్కడికి రమ్మని అనేసరికి కంకుభట్టు - 'జూదమాడటం అంటే ఇప్పుడు ఎంత బాగుంటుంది?' (బాగుంటుందా!- అని కాకువు) అంటూ చేరి ఆటను ప్రారంభిస్తూ ఇట్లా అన్నాడు.

**విశేషం:** రాజు యుద్ధంలో విజయం సాధిస్తే అధికారికమైన వేడుకలు జరుగుతాయి. అందులో ప్రజలు పాల్గొంటారు. ఇది ప్రజలకొరకు జరిపే వేడుక. ఇక రాజు తన సంతోషం కొరకు జరుపుకొనే వేడుకలు మరొక రకం. ఆ విధాన్ని ఈ వచనంలో కవి పేర్కొన్నాడు. శుభవార్తలు అందించినవారికి బహుమతు లివ్వటం ఒక వేడుక. అంతటితో ఆగలేదు. విరాటుడు ద్యూతప్రియుడు. మూలంలో -

"స్త్రియో గావో హిరణ్యం చ యచ్చాన్యద్వస్తు కించన ।
న మే కించిత్ త్వయా రక్ష్య మంతరేణాపి దేవితుమ్॥" **(4-63-32)**

అని ఉన్నది. విరాటుడికి స్త్రీలు, ఆవులు, బంగారం వంటి విలువైన ద్రవ్యాల కంటె జూదమంటే ఎంతో ఇష్టమట! ధర్మరాజు కంటె ద్యూతరతిలో విరాటుడు పది ఆకులు ఎక్కువ చదివాడు, కాబట్టే విజయోత్సవాన్ని స్నేహద్యూత క్రీడతో జరుపుకొనాలని కోరుకొన్నాడు. విరాటు డంతటితో ఆగలేదు. బలవంతాన కంకుభట్టును ఆటకు పిలిచాడు. సైరంధ్రి నడిగి సారెలు తెప్పించాడు. తానే స్వయంగా జూదపు పలకను ముందుకు లాగాడు. కంకుభట్టును తనకు ఎదురుగా ఆటకు కూర్చొనుమన్నాడు. ఈ దృశ్యమంతా ధర్మరాజుకు పూర్వం కౌరవసభలో సుహృద్ద్యూత రూపంలో సాగిన మాయాద్యూతాన్ని తలపునకు తెచ్చింది. అందువలననే - ఇటువంటి సమయంలో జూదం ఆడటం ఎంత బాగుంటుంది? - అని అంటూనే, కాకువుతో ఏం బాగుంటుంది? - అనే అర్థం ధ్వనింప చేశాడు. జూదంవలన ధర్మజుడు తాను పొందిన అవమానాలను గురించి మనస్సున భావిస్తూ ఒక స్నేహితుడు చెప్పినట్లుగా చెప్పి తన పూర్వస్మృతులను నెమరువేసికొన్నాడు. ఇది కౌరవులపై రణోత్సాహాన్ని ప్రదర్శించటానికి నాంది కాబోతున్న చిత్రమైన సన్నివేశం. ఆనాడు చేసిన శపథాలు కార్యరూపం తాల్చబోతున్న సంకేతం. (సంపా.)

**ఆ. జూదమాడి ధర్మసూనుండు రాజ్యంబు । ననుజులను బ్రియాంగనను బణంబు**
**గాఁగ నొడ్డి యాడి కాఱియ పడఁడె? య । ట్లగుట దీనితోడి యర్థి కీడు. 245**

**ప్రతిపదార్థం:** ధర్మసూనుండు= ధర్మరాజు; జూదము+ఆడి= ఈ జూదమాడియే; రాజ్యంబున్= రాజ్యాన్నీ; అనుజులను= తమ్ములనూ; ప్రియ+అంగనను= ప్రియమైన భార్యను; పణంబుగాఁగన్= పందెంగా; ఒడ్డి= కాసి; ఆడి= జూదమాడి; కాఱియన్= బాధను; పడఁడె!= పడలేదా?; అట్లు+అగుటన్= అట్టిది అయినందున; దీనితోడి+అర్థి= దీనితో మైత్రి (సంబంధం); కీడు= బాధ కల్గిస్తుంది.

**తాత్పర్యం:** ధర్మరాజు జూదమాడి రాజ్యాన్నీ, తమ్ములనూ, భార్యనూ పందెంకాసి బాధలు పడ్డాడు. కనుక ఈ జూదంమీద ఎక్కువ ఇష్టం చూపటం కీడుకే దారి తీస్తుంది.

**విశేషం:** ధర్మరాజు జూదంవలన తాను పొందిన కీడును పేర్కొంటూ, తన జీవితంలో తాను చేసిన తప్పును ఎవరూ చేయవద్దని హితవును ప్రథమపురుషలో మిత్రసమ్మితంగా చెప్పాడు. ప్రమాదాన్ని పరితాపంతో ప్రక్షాళనం చేసికొంటున్న ఒక నిర్వేద ప్రవృత్తి ధర్మజుడి చిత్తంలో తళుక్కున మెరిసింది. విరాటుడితో స్నేహద్యూతం కొనసాగిస్తున్న ధర్మజుడు ఆ ఆటలో ఆసక్తి లేని ఆణిముత్యం వలె పఠితలకు ప్రత్యక్షమౌతున్నాడు ఈ మాట లన్నప్పుడు. (సంపా.)

**వ. అని పలికి యాడుచుండు సమయంబున.** **246**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఇట్లు అని; ఆడుచుండు= జూదమాడునట్టి; సమయంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా పలికి ధర్మరాజు జూదమాడుతున్న సమయంలో.

**మ. నరనాథుండు ప్రమోదసంపదుదితోన్మాదంబుమై నిట్లనుం**
**'గురు సైన్యంబుల ముట్టి గెల్చి యెలమిన్ గోవర్గముం దెచ్చె; ను**
**త్తరు బాహాబల శౌర్యసారము లుదాత్తంబుల్ గదే! యెందు నె**
**వ్వరు నెక్కాలము నిట్టు సేసిరె కులైశ్వర్యం బవార్యంబుగన్?'** **247**

**ప్రతిపదార్థం:** నరనాథుండు= విరాటరాజు; ప్రమోద సంపద్= సంతోష సంపదతో; ఉదిత+ఉన్మాదంబుమైన్= కలిగిన ఒడలు తెలియనితనంతో; ఇట్లు= ఈ రీతిగా; అనున్= అన్నాడు; కురుసైన్యంబులన్= కౌరవసేనలను; ముట్టి= ముట్టడించి; గెల్చి= జయించి; ఎలమిన్= సంతోషంతో; గోవర్గమున్= ఆలమందలను; తెచ్చెన్= మరల్చి వచ్చాడు; ఉత్తరు= ఉత్తరకుమారుడి యొక్క; బాహాబల= బాహుబలం; శౌర్యసారములు= శ్రేష్ఠమైన వీర పరాక్రమాలు; ఉదాత్తంబుల్ కదే!= గొప్పవిగదా!; ఎందున్= ఎక్కడైనా; ఎవ్వరున్= ఎవరైనా; ఏ+కాలమున్= ఎప్పుడైనా; కుల+ఐశ్వర్యంబు= కులధనం, వంశమహిమ, వంశప్రతిష్ఠ; అవార్యంబుగన్= మరల్చరానిదిగా, ఇక ఎప్పటికీ కాదనటానికి వీలులేనట్లుగా; ఇట్టు= ఈ రీతిగా; చేసిరె?= చేశారా?

**తాత్పర్యం:** అప్పుడు విరాటుడి సంతోషం పెల్లుబికిన ఆవేశంతో ఒడలు తెలియక ఇట్లా అన్నాడు - 'కౌరవ సేనలను ముట్టడించి, జయించి, ఆవులను మళ్ళించుకొని వచ్చాడంటే మా ఉత్తరుడి బాహుబలం, పరాక్రమం ఎంత గొప్పవి? ఏ ప్రదేశంలోనైనా ఏ వ్యక్తి అయినా ఏ కాలంలోనైనా ఇట్లా కులధనాన్ని అవార్యంగా రక్షించారా? వంశప్రతిష్ఠను అప్రతిహతంగా నిలిపారా?' అని.

**విశేషం:** విరాటుడు అధికమైన సంతోషంవలన కలిగిన ఉన్మాదం అనే మానసికావస్థలో ఉండి మాట్లాడుతున్నట్లు తిక్కన సూచించాడు. మదం సంచారిభావం. ఉన్మాదం దశవిధ మన్మథావస్థలలో అందరూ అంగీకరించిన ఒక అవస్థ. శృంగారంలో నాయికాపరంగా చెప్పే లక్షణాన్ని ఇక్కడ విరాటుని పరంగా చెప్పుకొనాలి. భరత నాట్యశాస్త్రంలో ఉన్మాదమంటే -

**"తత్సంశ్రితాం కథాం యుక్తే సర్వావస్థాగతాఽపి హి ।**
**పుంసః ప్రద్వేష్టి చాప్యన్యానున్మాదః సంప్రకీర్తితః ॥**
**తిష్ఠత్యనిమిష దృష్టి ర్దీర్ఘం నిఃశ్వసతి గచ్ఛతి ధ్యానమ్ ।**
**రోదితి విహారకాలే నాట్య మిదం స్యా త్తథోన్మాదే ॥** **(నా.శా. 12.185-186)**

నాయిక సర్వావస్థలయందూ నాయకుడికి సంబంధించిన కథలనే స్మరిస్తూ, ఇతరాలను ద్వేషించటం ఉన్మాదలక్షణం. ఇక్కడ విరాటుడు తన పుత్రుడైన ఉత్తరుడికి సంబంధించిన విజయోదంతాలనే స్మరిస్తూ ఉండటం ఉన్మాదావస్థ. దానికి వ్యతిరేకంగా కంకుభట్టు పలికినా అతడిని ద్వేషించటం ఆ అవస్థలోని విరాటుని ప్రవర్తనం. కనురెప్పపాటు లేకుండా నిలబడి ఉండటం, నిట్టూర్పులు నిగుడించటం, రోదించటంవంటి ఉన్మాద క్రియలు విరహంలో రాణిస్తాయి. మరి విరాటుడు ప్రదర్శించే ప్రమోదపరమైన ఉన్మాదంలో ఏదో ఆలోచిస్తూ ఉండటం సహజంగా ఉంటుంది. అందుకే ఉన్మాదావస్థలో ఉన్న విరాటుడు వ్యసనోన్మాదంతో జూదాన్ని ఆడుతున్నా ఆట ఆడుతున్నంతసేపూ కొడుకు ప్రదర్శించిన ప్రతాపాన్ని గురించే ఆలోచిస్తూ,

ప్రలాపిస్తున్నాడు. కాబట్టి విరాటుడి మాటలు, చేష్టలు ఉన్మాదావస్థను తెలిపేవిగా ఉండటం రసధ్వని. మత్తేభవృత్తం అతడి చిత్తవృత్తికి అనుగుణంగా అమరి ఛందశ్శిల్పాన్ని సంతరించి పెట్టింది. (సంపా.)

**వ. అనిన విని కంకుం డతని కిట్లనియె. 248**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; కంకుండు= కంకుభట్టు; అతనికిన్= విరాటుడితో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అనగా విని కంకుభట్టు విరాటుడితో ఈ విధంగా అన్నాడు.

**చ. 'కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్య మహోగ్ర యోధ వి**
**స్ఫురణము నోర్వఁజాలి రణభూమి భుజాబల ముల్లసిల్ల ను**
**త్తరుఁడ జయించెనేని వసుధావర! యింతటికంటె నింక న**
**చ్చెరువును గల్గునే? ధరఁ బ్రసిద్ధికి నెక్కఁడె యాతఁ డొక్కఁడున్?' 249**

**ప్రతిపదార్థం:** వసుధావర!= రాజా!; కురుపతి= దుర్యోధనుడు; భీష్మ= భీష్ముడు; కర్ణ= కర్ణుడు; కృప= కృపాచార్యుడు; కుంభజ= ద్రోణుడు; ముఖ్య= మొదలైన; మహా+ఉగ్ర= మిక్కిలి భయంకరమైన; యోధ= యోధులయొక్క; విస్ఫురణమున్= పరాక్రమాన్ని; ఓర్వన్+చాలి= సహించటానికి సరిపడి; రణభూమిన్= యుద్ధభూమిలో; భుజాబలము= పరాక్రమం; ఉల్లసిల్లన్= ప్రకాశింపగా; ఉత్తరుఁడు+అ= ఉత్తరుడే; జయించెనేనిన్= జయించినచో; ఇంతటికంటెన్= దీనికన్న; ఇంకన్= వేరుగా; అచ్చెరువును= ఆశ్చర్యమైన విషయం; ధరన్= భూమిలో; కల్గునే?= ఉంటుందా?; ఆతఁడు= ఉత్తరుడు; ఒక్కఁడున్= ఒక్కడే; ప్రసిద్ధికిన్= కీర్తికి; ఎక్కఁడె?= పొందడా?

**తాత్పర్యం:** 'విరాటరాజా! దుర్యోధన, భీష్మ, ద్రోణ, కర్ణ, కృపాది మహావీరుల పరాక్రమాన్ని ఎదిరించి వారినందరినీ ఓడించగలిగిన భుజబలాన్ని యుద్ధభూమిలో ఉత్తరకుమారుడే చూపినట్లయితే, ఇంతకన్నా గొప్ప ఆశ్చర్యం వేరే ఉంటుందా? లోకంలో అత డొక్కడే మహావీరుడుగా ప్రసిద్ధి కెక్కడా?'

**విశేషం:** కాకువుగా మాట్లాడిన ధర్మజుడి ఉక్తి వైచిత్రికి ఈ పద్యం రమణీయోదాహరణం. కురువీరులను ఉత్తరు డొక్కడే జయించాడా? జయిస్తే అది అద్భుతంగా చెప్పాలి. ఎందుకంటే ఉత్తరుడే ఏకైకవీరు డౌతాడు. ఈ భావాలనే విరాటుడు 241, 242వ పద్యాలలో నమ్మశక్యంగాని అద్భుతంగా ప్రకటించి ఉన్నాడు. కాని, క్రమంగా నమ్మి ఇప్పు డున్మాదావస్థకు చేరాడు ధర్మజుడు. 'ఉత్తరుడే నిజంగా జయించి ఉంటే!' - అని అనుమానంగా కాకువుతో అనేసరికి సత్యాన్ని గ్రహించే వివేకం ఉన్మాదంలో ఉండదు కాబట్టి అది తప్పక విపరీత ప్రభావం కలిగిస్తుంది. ధర్మరాజు నిపుణంగా కాకువును ప్రయోగించాడు. వ్యాజస్తుతి వంటి ప్రశంస చేశాడు. ధర్మజపరంగా ఇది స్తుతిచేత నింద. విరాటుని కది నిందచేత స్తుతి. (సంపా.)

**తే. అనినఁ గటకటఁ బడి 'యిట్టులాడు టెల్ల । నతని విజయము సందియ మనుట గాదె?**
**యింతవట్టును సైరించి తీవు గాన; । యింక నీమాట లుడుగుము కంకభట్ట! 250**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; కటకటన్+పడి= బాధపడి; కంకభట్ట!= ఓ కంకభట్టా!; ఇట్టులు+ఆడుట= ఇట్లా మాట్లాడటం; ఎల్లన్= అంతయును; అతని విజయము= ఉత్తరుడి గెలుపు; సందియము+అనుట కాదె?= సందేహమనటమే కదా!;

ఈవుకాన= నీవు కాబట్టి; ఇంతవట్టును= ఇంతవరకు; సైరించితిన్= సహించాను; ఇంకన్= ఇటుపై; ఈ మాటలు= ఇట్టి మాటలు; ఉడుగుము= మానుము.

**తాత్పర్యం:** అనగా విరాటుడు బాధపడి, 'కంకభట్టా! నీ విట్లా మాట్లాడటం చూస్తే ఉత్తరుడు విజయాన్ని పొందటం సందేహమనే కదా నీ భావం? నీవు కాబట్టి ఇంతవరకూ ఇటువంటి మాటలన్నా సహించాను. ఇక మీదట ఇట్లా మాట్లాడకుము' అన్నాడు.

**వ. అనుచు విరాటుండు గటంబు లదరఁ గన్నులఁ గెంపు గదురఁ బలుక చప్పు డగ్గలంబుగా నాడుచున్న సరకు సేయక యుధిష్ఠిరుండు వెండియు నిట్లనియె. 251**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని పలుకుతూ; విరాటుండు= విరాటుడు; కటంబులు= చెక్కిళ్ళు; అదరన్= వణకగా; కన్నులన్= కన్నులందు; కెంపు= ఎరుపు; కదురన్= వ్యాపించగా; పలుకచప్పుడు= జూదమాడేపలకయొక్క శబ్దం; అగ్గలంబుగాన్= అధికం కాగా; ఆడుచున్నన్= ఆట ఆడుతూ ఉండగా; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; సరకు+చేయక= లెక్కచేయక; వెండియున్= మరల; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా అంటూ ఉన్నపుడు విరాటుడి చెక్కిళ్ళు అదిరిపోతున్నాయి, కళ్ళు ఎరుపెక్కిపోతున్నాయి. నెత్తమాడే పలక చప్పుడు అధికమయ్యేటట్లు ఆడుతున్నాడు. అయినా లెక్కచేయకుండా ధర్మరాజు మరలా ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఉన్మాదావస్థలో వచ్చే కోపంకూడా ఉద్ధృతంగా ఉంటుంది. అందుకే విరాటుడు నెత్తమాడే పలకచప్పుడు అమితంగా చేస్తున్నాడు. చెక్కిళ్ళు కదిలిస్తున్నాడు, కళ్ళు ఎరుపు చేస్తున్నాడు. ధర్మజుడు ధీరుడు, సత్యవ్రతుడు కాబట్టి దానిని లెక్కచేయలేదు. 'పలక'కు 'పలుక' అని రూపాంతరం ఉన్నది. అందువలన రెండు రూపాలూ సాధువులే. (సంపా.)

**చ. 'కురుబల మేల దైత్యసురకోటులు వచ్చిన గెల్వరాదె యు**
**త్తరునకు నా బృహన్నల రథంబుపయిం బరవాహినీ భయం**
**కర భుజసారమున్ మెఱయఁగాఁ దఱి గాంచితి నంచు విక్రమో**
**ద్ధురగతి నాజికేలినిరతుం డయి దుర్దమలీల నుండఁగన్.' 252**

**ప్రతిపదార్థం:** కురుబలము+ఏల?= కౌరవసేనయే ఎందుకు?; దైత్య= రాక్షసులయొక్క; సుర= దేవతలయొక్క; కోటులు= సమూహాలు; వచ్చినన్= వచ్చినప్పటికిని; ఉత్తరునకున్= ఉత్తరుడికి; ఆ బృహన్నల= ప్రసిద్ధుడైన బృహన్నల; రథంబుపయిన్= రథం మీద; పరవాహినీ= శత్రుసేనకు; భయంకర= భయంకరమైన; భుజసారమున్= పరాక్రమసారం; మెఱయఁగాన్= ప్రకాశించగా; తఱిన్= తగిన సందర్భాన్ని; కాంచితిన్+అంచున్= పొందానని; విక్రమ= పరాక్రమంయొక్క; ఉద్ధురగతిన్= అతిశయమైన రీతిలో; ఆజికేలిన్= యుద్ధమనే క్రీడలో; నిరతుండు+అయి= ఆసక్తి కలవాడై; దుర్దమలీలన్= అణచలేని విధంగా; ఉండఁగన్= ఉండగా; గెల్వ రాదె?= గెలవటం ఒక విశేషమా?

**తాత్పర్యం:** 'కౌరవసేన అన్న మాటేమిటి? కొన్ని కోట్ల దేవతలు, రాక్షసులు వచ్చినా, రథంమీద ఆ బృహన్నల శత్రుసేనాభీకరమైన పరాక్రమంతో ప్రకాశిస్తూ, సమయం దొరికిందని విజృంభించి యుద్ధాన్ని ఒక ఆటగా ఆడుతూ ఎవ్వరూ అణచలేని విధంగా ఉంటే ఉత్తరుడికి గెలుపు వీలుపడక ఏం చేస్తుంది.'

**విశేషం:** అలం: సమాధి. "సమాధిః కార్యసౌకర్యం కారణాంతర సన్నిధేః". కారణాంతరం వలన కార్యసౌకర్యం కలిగినట్లు వర్ణిస్తే సమాధి. ఉత్తరకుమారుడు కురువీరులే కాదు, దేవదానవకోటులు ఎదిరించినా జయాన్ని పొందక ఏంచేస్తాడు? - అని చెప్పి, దానికి కారణం జగదేకవీరుడైన బృహన్నల సారథ్యమని పేర్కొన్నాడు. కారణాంతరం వలన అందులోనూ పేడివాడైన రథసారథి వలన కార్యం సిద్ధించిందన్న ఈ వాక్యం విరాటుడికి కోపం కలిగించింది. నవ్వు తెప్పించింది. అసహనం పెంచింది. "హితం మనోహారి చ దుర్లభం వచః" - అని కదా కవిసూక్తి. (సంపా.)

**వ. అనిన విని సక్రోధహాసోల్లాస వికృతాననుండై మత్స్యమహీనాథుండు. 253**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; మత్స్య మహీనాథుండు= విరాటరాజు; సక్రోధ= కోపముతో కూడిన; హాస+ఉల్లాస= నవ్వుయొక్క ఉల్లాసంతో; వికృత= వికారం కల్గిన; ఆననుండు+ఐ= ముఖం కలవాడై.

**తాత్పర్యం:** ఆ మాటలు వినేసరికి కోపం, కోపంతో నవ్వు, దాని ఉల్లాసం అన్నీ వచ్చి కలిశాయి. వాటితో ముఖం వికారంగా అయింది.

**విశేషం:** ఉత్తరుడి విజయానికి సారథి కారణమని చెప్పి కంకుడు తన కుమారుడిని కించపరచినందుకు విరాటుడికి తీవ్రమైన కోపం, తనకు విరుద్ధంగా మాట్లాడుతూ తనను సమర్థించుకొంటున్న కంకుభట్టు మీద అవజ్ఞతో కూడిన ఆగ్రహాన్ని తెలియజరిచే అట్టహాసం, క్రోధభావం వికసించటం చేత ఆ హావభావాల ఉల్లాసం, వాటివలన క్షణాని కొక విధంగా మార్పులు (వికారాలు) చెందుతున్న ముఖవైఖరులు - అన్నీ కలిసి విరాటుడిని రోషభీషణ క్రోధభావానికి విభావంగా నిలిపి, తిక్కన ఆంగికాభినయోల్లాసాన్ని చిత్రించాడు. (సంపా.)

**ఉ. 'వింతలు సాల నీవలన వింటిమి; గాని, ధరిత్రి నెందు నే**
**మింతకు మున్ను సారథుల నెవ్వరిఁ జూడమె? వైరివీర దు**
**ర్దాంత భుజావిలాస మలరం దెగి పోరుల నస్త్ర శస్త్ర వి**
**క్రాంతిఁ గడంగు వారి?' నని కన్నుల నిప్పులు రాలుచుండఁగన్. 254**

**ప్రతిపదార్థం:** నీ వలనన్= నీవు చెప్పగా; వింతలు= అద్భుతాలు; చాలన్= ఎక్కువగా; వింటిమి= విన్నాము; కాని= అయినా; ధరిత్రిన్= భూమి మీద; ఎందున్= ఎక్కడనూ; ఏము= మేము; ఇంతకున్+మున్ను= ఇంతకు పూర్వం; సారథులన్= రథం తోలేవారిని; ఎవ్వరిన్= ఎవ్వరిని; వైరివీర= శత్రువీరులయొక్క; దుర్దాంత= అణచలేని; భుజావిలాసము= భుజ పరాక్రమం; అలరన్= ఒప్పగా; తెగి= సాహసించి; పోరులన్= యుద్ధాలలో; అస్త్ర= మంత్రబాణాలయొక్క; శస్త్ర= బాణాద్యాయుధాల యొక్క; విక్రాంతిన్= పరాక్రమంతో; కడంగువారిన్= ప్రయత్నించేవారిని; చూడమె= చూడలేదా; అని; కన్నులన్= కన్నులనుండి; నిప్పులు రాలుచున్+ఉండఁగన్= నిప్పులు రాలుతూ ఉండగా.

**తాత్పర్యం:** 'నీవు చెప్పగా ఎన్నో ఆశ్చర్యకరమైనవి విన్నాను కాని, ఎక్కడైనా సారథులు శత్రువీరుల నణచే పరాక్రమం చూపి యుద్ధంలో అస్త్ర శస్త్ర విద్యా నైపుణ్యం కలిగినట్లు వినలేదే!' అంటూ కళ్ళ వెంట నిప్పులు రాలుతూ ఉండగా.

**క. 'నా కొడుకు పోటుమాటలు। నీకేటికిఁ బొసఁగ నాడ నేరవు మౌర్ఖ్యో**
**ద్రేకమునఁ బలుకుచుండుట। మాకు సహింపంగరాదు మానుము విప్రా!' 255**

**ప్రతిపదార్థం:** నా కొడుకు= నా కుమారుడి యొక్క; పోటుమాటలు= యుద్ధపుమాటలు; పొసఁగన్= పొసగేటట్లుగా; నీకున్= నీకు; ఏటికిన్= ఎందుకు; ఆడనేరవు= చెప్పలేవు; మౌర్ఖ్య= మూర్ఖత్వంవలని; ఉద్రేకమునన్= ఉద్రేకంతో; పలుకుచుండుట= మాట్లాడటం; మాకున్= నాకు; సహింపంగన్‌రాదు= ఓర్చుకొనటానికి వీలుపడదు; విప్రా!= ఓ బ్రాహ్మణుడా!; మానుము= మానవలసింది.

**తాత్పర్యం:** 'నా కొడుకు చేసిన యుద్ధానికి సంబంధించిన మాటలు నీ వెందుకు సముచితంగా మాట్లాడలేవు? మూర్ఖతవలని ఉద్రేకంతో నీ విట్లా మాట్లాడుతుంటే మేం సహించం. ఓ బ్రాహ్మణుడా! ఇక నీ మాటలు కట్టి పెట్టుము.'

**క.** **అనినం జలమునఁ గుంతీ । తనయాగ్రజుఁ డిట్టు లనియె దరహాసం బా**
**ననమున ముసుఁగువడఁగ న । జ్జననాయకుతోడ ని ట్లశంకిత భంగిన్.** **256**

**ప్రతిపదార్థం:** అనినన్= విరాటుడు ఇట్లా పలుకగా; చలమునన్= పట్టుదలతో; కుంతీతనయ+అగ్రజుఁడు= ధర్మరాజు; దరహాసంబు= చిరునవ్వు; ఆననమునన్= ముఖమందు; ముసుఁగుపడఁగన్= ఆవరించగా; ఆ+జననాయకుతోడన్= ఆ విరాటరాజుతో; ఇట్లు= ఈ రీతిగా; అశంకిత భంగిన్= సంశయం లేని రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** విరాటుడు ఇట్లా పలుకగా ధర్మరాజు చిరునవ్వుతో విరాటుడితో నిస్సంశయంగా ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** ధర్మజుడి మాటలు మూర్ఖత్వంతోనూ, ఉద్రేకంతోనూ పలికేవని విరాటుడు పేర్కొన్నాడు. అతడు స్వయంగా ప్రమోదోన్మాదంలో ఉండి మాట్లాడుతున్నాడు. నిజానికి అతడిదే మౌర్ఖ్యం, ఉద్రేకం. అది తెలిసికొనలేక మాట్లాడుతున్న అతడి అవివేకాన్ని గమనించి ధర్మరాజు చిరునవ్వు నవ్వాడు. అది ఎట్లా ఉన్నదంటే - ముఖానికి నవ్వు ముసుగు వేసికొన్నట్లు ఉన్నది. అది సాత్త్వికభావం. ఎదుటివారి అజ్ఞానాన్ని చూచి అవహేళనం చేస్తూ, అది పైకి కనపడకుండా నిగ్రహించుకొంటూ చేసే ఒక రకమైన గుంఫనమైన నవ్వు - ఆ దరహాసం. గంభీర స్వభావులు మాత్రమే ఇటువంటి నవ్వు నవ్వగలరు. (సంపా.)

**ఉ.** **'ఆహవకేళి వేడుక బృహన్నల చిత్తమునం దెలర్చినన్**
**సాహసవృత్తి నుత్తరుని సారథిఁగాఁ గొనిపోయి కౌరవ**
**వ్యూహము నోర్చి నీపసుల నొక్కఁడు దక్కక యుండ సత్వరో**
**త్సాహతఁ దెచ్చెఁ గావలయుఁ; దప్పదు నా పలు కట్లు చూడుమీ!'** **257**

**ప్రతిపదార్థం:** ఆహవకేళిన్= యుద్ధమనే ఆటలో; వేడుక= కోరిక; బృహన్నల చిత్తమునందున్= బృహన్నలయొక్క మనస్సులో; ఎలర్చినన్= కలుగగా; సాహసవృత్తిన్= చొరవగా; ఉత్తరునిన్= ఉత్తరకుమారుడిని; సారథిఁగాన్= రథం తోలేవాడిగా; కొనిపోయి= తీసికొని వెళ్ళి; కౌరవ వ్యూహమున్= కౌరవ సేనను; ఓర్చి= ఓడించి; నీ పసులన్= నీ గోవులలో; ఒక్కఁడు= ఒక్కటి కూడ; తక్కక+ఉండన్= మిగులకుండా (అన్నిటిని); సత్వర= త్వరతోడి; ఉత్సాహతన్= ఉత్సాహంతో; తెచ్చెన్= తీసికొని వచ్చాడు; కావలయున్= ఇదే జరిగి ఉంటుంది; నా పలుకు= నేను చెప్పిన మాట; తప్పదు= తప్పిపోదు, అబద్ధం కాదు; అట్లు= ఆ రీతిగా; చూడుమీ!= చూడుము.

**తాత్పర్యం:** 'బృహన్నల మనస్సులో యుద్ధమనే ఆట ఆడుకొనాలని వేడుక కలిగి ఉండాలి. అందుకు వీలుగా ఉత్తరుడిని సారథిగా చేసికొని వెళ్ళి కౌరవసేన నోడించి, ఒక్కటి కూడా చెదరిపోకుండా ఆవుల నన్నిటినీ మరలించుకొని వచ్చాడు. నా మాట పొల్లు పోదు. నీవే చూడుము!'

**విశేషం:** ధర్మరాజు ఈ మాటలు 'అశంకితభంగిన్' పలికాడు. నిస్సంశయంగా, నిర్భయంగా, నిశ్చయాత్మకంగా పలికాడని అర్థం. అర్జునుడే రథికుడై, ఉత్తరుడిని సారథిగా చేసికొని యుద్ధం సాగించి ఉండవచ్చునని ఊహించి చెప్పాడు. ధర్మజుడి మాట అబద్ధం కావటానికి వీల్లేదని బల్లగుద్ది చెప్పాడు. ఇక ముందు దానిని విరాటుడే తెలిసికొనగలడని సూచించి - మూర్ఖత్వం విరాటుడిదే అని గూఢంగా అధిక్షేపించాడు. అంత చెప్పినా సత్యాన్ని దర్శించలేని విరాటుడితో మరింత వాచ్యంగా చెప్పవలసివచ్చింది. (సంపా.)

**క. అని యంతట నిలువక య । మ్మనుజేశ్వరు మొగముఁ జూచి మఱియును నతఁ డి**
**ట్లనుఁ 'బురములోనఁ జాటం । బనుపు బృహన్నల జయంబు భవ్యవిచారా!'** 258

**ప్రతిపదార్థం:** అని= అట్లు పలికి; అంతటన్= అంతటితో; నిలువక= ఆగక; ఆ+మనుజేశ్వరు= ఆ విరాటరాజుయొక్క; మొగమున్= ముఖాన్ని; చూచి= పరికించి; అతఁడు= కంకుభట్టు; మఱియును= ఇంకా; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; భవ్యవిచారా!= మంగళకరమైన ఆలోచన కలవాడా!; బృహన్నల జయంబు= బృహన్నలయొక్క విజయాన్ని; పురములోనన్= పట్టణంలో; చాటన్= చాటుటకు; పనుపు= ఆజ్ఞాపించుము.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా పలికి, అంతటితో ఆగకుండా విరాటుడి ముఖంకేసి చూస్తూ ఇట్లా అన్నాడు - 'నీకు మంచి ఆలోచన ఉంటే బృహన్నల విజయం సాధించాడని పట్టణంలో చాటించుము.'

**విశేషం:** 'నా కొడుకు పౌరుషాన్ని నీవెందుకు పొగడలేవు?' అని విరాటు డడిగిన ప్రశ్నకు అసలు సంగతి పైపద్యంలో సమాధానంగా చెప్పాడు. అయినా సత్యం గ్రహించలేని విరాటుడికి - విజయం సాధించింది ఉత్తరుడు కాదు, బృహన్నల అని చాటించుమని చెప్పాడు. బృహన్నలను పేడివాడిగానే తెలిసిన విరాటుడి కది అంగీకారం కాలేదు. విరాటుడు ధర్మరాజు వాక్యాలపై మోహావేశంతో ప్రామాణికత్వాన్ని కోల్పోయాడు. ఉన్మాదావస్థలో అత డింకా ఉండిపోయాడు. 'భవ్యవిచారా!' అన్న సంబోధనలోని అంతరార్థాన్ని గ్రహించలేకపోయాడు. (సంపా.)

### విరాటుండు కంకుని సారెఁగొని వ్రేయుట (సం. 4-63-44)

**ఆ. అనిన రౌద్రరసము మనమున నడరంగఁ । బడగ యెత్తు నురగపాలు రేఖ**
**నెనయు చేతిసారెఁ గొని వ్రేసెఁ బతి 'పేడి । గడన యుడుగు మన్న నుడుగ' వనుచు.** 259

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; రౌద్రరసము= రౌద్రమనెడి రసం (మహా కోపం); మనమునన్= మనస్సులో; అడరంగన్= వ్యాపించగా; పడఁగ+ఎత్తు= పడగ విప్పునట్టి; ఉరగపాలు రేఖన్= సర్పరాజు రీతి; ఎనయు= పొందిన; చేతి= చేతిలోని; సారెన్+కొని= పాచిక తీసికొని; పతి= విరాటరాజు; పేడిగడన= పేడియైన బృహన్నలను పొగడిక చేయటం, కీర్తించటం; ఉడుగుము+అన్నన్= మానుమనగా; ఉడుగవు+అనుచున్= మానవనుచు; వ్రేసెన్= విసరికొట్టెను.

**తాత్పర్యం:** అనటంతో రౌద్రరస ముప్పొంగగా పడగ నెత్తిన సర్పరాజువలె చేయెత్తి చేతిలోని పాచికతో విరాటుడు 'ఆ పేడిగాడిని పొగడవద్దంటే మానవేం?' అని విసరికొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **ఇవ్విధంబున వ్రేటువడి యజాతశత్రుం డలుక గదురని హృదయంబుతోడం బాంచాలి దెసం జూడ్కిమలఁగ నూరకుండె; నన్నారీరత్నంబును రయంబునం జేరి వ్రేటుగంటిం దొరఁగు రుధిరంబుఁ దన యుత్తరీయంబున మెత్తన యొత్తి యచ్చేరువ నున్న కనకకలశంబు జలంబులం గరతలంబు దడిపికొని తుడుచున్నప్పుడు మత్స్య మహీవల్లభుం 'డీశోణితంబు పైచీరం బట్టుటకుఁ గతం బేమి?' యని తన్నడిగిన నతని కిట్లనియె.** **260**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; వ్రేటు+పడి= దెబ్బతిని; అజాతశత్రుండు= ధర్మరాజు; అలుక+కదురని= కోపంరాని; హృదయంబుతోడన్= మనస్సుతో; పాంచాలిదెసన్= ద్రౌపదివైపు; చూడ్కి= చూపు; మలఁగన్= ప్రసరించగా; ఊరకుండెన్= ఊరకున్నాడు; ఆ+నారీరత్నంబును= ఆ ద్రౌపదియూ; రయంబునన్= వేగంగా; చేరి= దగ్గరకు వచ్చి; వ్రేటుగంటిన్= దెబ్బతగిలిన గాయం వెంట; తొరఁగు= కారెడి; రుధిరంబున్= రక్తమును; తన ఉత్తరీయంబునన్= తన పైటతో; మెత్తన= మెల్లగా; ఒత్తి= అద్ది; ఆ+చేరువన్+ఉన్న= ఆ దగ్గరలో ఉన్న; కనక కలశంబు= బంగారు చెంబులోని; జలంబులన్= నీతితో; కరతలంబు= చేతిని; తడిపికొని= తడిపి; తుడుచు+అప్పుడు= గాయాన్ని తుడిచే సమయంలో; మత్స్యమహీవల్లభుండు= విరాటుడు; ఈ శోణితంబు= ఈతడి రక్తం; పైచీరన్= నీ పైటతో; పట్టుటకున్= అద్దటానికి; కతంబు+ఏమి?= కారణం ఏమిటి?; అని= ఇట్లు; తన్నున్= సైరంధ్రిని; అడిగినన్= అడుగగా; అతనికిన్= విరాటుడితో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికింది.

**తాత్పర్యం:** ఈ విధంగా పాచికతో దెబ్బతిని అజాతశత్రువు కనుక ధర్మజుడు మనస్సులో కూడా కోపగించుకొనక, సైరంధ్రి కేసి చూశాడు. ఆమె వెంటనే వెళ్ళి పైటతో ఆ రక్తం కారే గాయాన్ని ఒత్తింది. దగ్గరలో బంగారు చెంబులో ఉన్న నీటితో చేయి తడుపుకొని అతడి గాయం తుడిచింది. అప్పుడా పైటకంటిన రక్తం చూచి విరాటుడు 'ఈ రక్తం నీ పైటతో ఎందుకు అద్దావు?' అని ప్రశ్నించగా ఆమె ఇట్లా అన్నది.

**విశేషం:** 1. దెబ్బతిన్న ధర్మరాజు కోపగించలేదు. అజాతశత్రు వనిపించుకొన్నాడు. అతడి చిత్తవృత్తిని వ్యంజింపచేసే ఆ బిరుదాన్ని ఇక్కడ వాడటం సార్థకం. 2. రక్తం కారుతూ ఉంటే కంకుభట్టు సైరంధ్రివైపు చూచాడు. అది సన్యాసి చేసేపని కాదు. విరాటుడికి అదొక అనుమానం కలిగించింది. 3. సైరంధ్రి వెంటనే వెళ్ళి తన పైటతో అతడి గాయంనుండి కారుతున్న రక్తాన్ని తుడిచింది. నీటితో కడిగింది. సామాన్యంగా సైరంధ్రులు అన్యపురుషుల సేవ చేయరు. అది మరొక అనుమానానికి దారితీసింది. 4. వారిరువురికీ ఏదైనా సంబంధం ఉన్నదా? అనే అనుమానంతో విరాటుడు 'అతడి రక్తాన్ని నీ పైటతో ఎందుకు అద్దావు?' అని అడిగాడు. 5. ఈ సన్నివేశంలో సైరంధ్రి సుదేష్ణయొక్క అంతఃపురంలో ఉండవలసింది - మహారాజు మసలేచోట ఉండటం ఒక విశేషం. ధర్మరాజును ఒక కంట కనిపెట్టి ఉండటం మరొక విశేషం. ధర్మరాజు నిర్భయంగా రాజుతో మాట్లాడటం మరింత విశేషం. ఇవన్నీ అజ్ఞాతవాసకాలం తీరిందని పాండవులు భావించి బయటపడటానికి సిద్ధపడుతున్న వైఖరిని స్పష్టపరుస్తున్నాయి. 6. విరాటుడి ప్రశ్నకు ద్రౌపది చెప్పే సమాధానం ఎట్లా ఉంటుందో? అనే ఉత్కంఠ పఠితలలో తలెత్తుతుంది. (సంపా.)

**తే.** **'విమల వంశంబునను బుణ్యవృత్తమునను। వఱలు నీతని రక్తంబు వసుమతీశ!**
**ధరణిపై నెన్ని బిందువుల్ దొరఁగె నన్ని। వర్షములు గల్గు నిం దనావర్షభయము.'** **261**

**ప్రతిపదార్థం:** వసుమతీశ!= విరాటరాజా!; విమల వంశంబునను= కల్మషంలేని వంశంలోను; పుణ్యవృత్తమునను= మంచి నడవడితోనూ; వఱలు= ఒప్పే; ఈతని రక్తంబు= ఈతని రక్తం; ధరణిపైన్= భూమి మీద; ఎన్ని బిందువుల్= ఎన్ని చుక్కలు; తొరఁగెన్= కారునో; అన్ని వర్షములు= అన్ని సంవత్సరాలు; ఇందున్= ఈ దేశంలో; అనావర్షభయము= అనావృష్టి వలని భయం; కల్గున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** 'ఓ రాజా! స్వచ్ఛమైన వంశంలో పుట్టి ధర్మంగా జీవించే ఇతడి రక్తపు బిందువు లెన్ని చుక్కలు భూమిమీద పడితే అన్నేళ్ళు ఈ దేశంలో అనావృష్టి కలుగుతుంది.'

**విశేషం:** ఇది ఒక చక్కని సూక్తివంటి పద్యం. స్వీయవర్తనానికి ఒక ధార్మికన్యాయాన్ని చూపుతున్న ద్రౌపది ప్రజ్ఞ ఇందులో ప్రదర్శితమయింది. ఇందులో ధర్మజుడి వంశం, శీలం చెప్పబడ్డాయి. నిర్మలత్వం చంద్రవంశ సూచకం, పుణ్యవృత్తం అతడి సార్థకనామ సూచకం. అటువంటివారిని బాధిస్తే భూమి బాధపడుతుందని హెచ్చరిక! అనావృష్టి రాజుల అధర్మవర్తనకు ఫలితంగా కలిగే ప్రకృతి సంక్షోభమని ఆమె వ్యాఖ్యానించింది. (సంపా.)

**వ. అని చెప్పి యుత్తమ ద్విజలోహితపాతం బెట్లునుం గీడు గావున నీకు నొకహాని పుట్టుటకుఁ జాలక యిబ్బంగిం జేసితి' నని వెండియుఁ గొండొక కీలాలంబు దొరఁగం దొరఁగం దుడుచుచుండె; నంత నట యుత్తరు నెదుర్కొనం బోయి. 262**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని పలికి; ఉత్తమ= ఉత్తముడైన; ద్విజ= బ్రాహ్మణుడి యొక్క లేదా క్షత్రియుడి యొక్క; లోహిత= రక్తముయొక్క; పాతంబు= పడటం; ఎట్లునున్= ఎట్లైనా; కీడు= చెరుపు కలిగిస్తుంది; కావునన్= కాబట్టి; ఒక హాని= ఒక చెడుపు; పుట్టుటకున్= కలుగుటకు; చాలక= సహించక; ఈ+భంగిన్= ఈ రీతిగా; చేసితిన్+అని= చేశానని పలికి; వెండియున్= ఇంకను; కొండొక= ఇంచుక; కీలాలంబు= రక్తం; తొరఁగన్+తొరఁగన్= బాగా కారుతుండగా; తుడుచుచున్+ ఉండెన్= తుడుస్తూ ఉండిపోయింది; అంతన్= అంతలో; అట= అక్కడ; ఉత్తరున్= (వస్తున్న) ఉత్తరుడిని; ఎదుర్కొనన్= ఎదురుగా వెళ్ళితేవటానికి; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** అని చెప్పింది. ఇంకా 'ఉత్తముడైన ద్విజుడి నెత్తురు పడటం కీడు కాబట్టి, ఈ దేశంలో ఏదైనా కీడు కల్గటం నాకిష్టం లేక ఇట్లా చేశాను' అన్నది. ఇంకా రక్తం చుక్కలుగా కారుతున్నది. అవి క్రింద పడకుండా తుడుస్తూనే ఉన్నది సైరంధ్రి. అంతలో ఉత్తరుడి కెదురుగా వెళ్ళినవారు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇక్కడ మరొక అనుమానం విరాటుడికి కలుగకుండా మాట నేర్పరితనం ప్రకటించింది సైరంధ్రిగా ఉన్న ద్రౌపది. కంకుభట్టు విమలవంశం వాడనీ, పుణ్యవృత్తం కలవాడనీ సైరంధ్రి కెట్లా తెలుసు? అనే ప్రశ్న రావచ్చును. ఆమె ద్రౌపదీదేవికి సైరంధ్రిగా సేవలందించిన విషయం చెప్పుకొనవలసి వస్తుంది. ఇప్పు డామాటలు అవసరం లేదు. అయితే లోకంలో ఒక సాధారణ ధర్మాన్ని అనుసరించి ఆ పని చేశానని సైరంధ్రి తన చర్యను సమర్థించుకొన్నది. సన్యాసి వేషంలో ఉన్న ధర్మజుడు (కంకుభట్టు) ద్విజుడు. పుట్టుక, ఉపనయనం - అనే రెండు జన్మ లెత్తగల అధికారం బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు ఉన్నది కాబట్టి ద్విజశబ్దం ధర్మరాజుకు కూడా వర్తిస్తుంది. వారి రక్తం నేలమీద పడితే రాజుకు కీడు కలుగుతుందని ధర్మశాస్త్రాలు చెప్పుతున్నాయి కాబట్టి కంకుభట్టు మీది ప్రేమకంటె, ప్రభువుమీద ఉండే ఆదరాభిమానాలతో ఆ పని చేశానని గడుసుగా ద్రౌపది సమాధానం చెప్పింది. అనుమానానికి తావు లేకుండా చేసింది. రక్తం కారటం తగ్గేంతవరకు ధర్మజుడి సేవ చేసికొనే అవకాశం కలిగించుకొన్నది. (సంపా.)

క. మంగళ తూర్యరవములు సె । లంగఁగ మౌక్తిక విమిశ్ర లలితాక్షత వృ
ష్టిం గురిసిరి విప్రులుఁ బు । ణ్యాంగనలును భద్రవాక్చయంబులతోడన్. 263

**ప్రతిపదార్థం:** మంగళ= మంగళకరాలైన; తూర్యరవములు= వాద్యధ్వనులు; చెలంగఁగన్= ధ్వనించగా; మౌక్తిక విమిశ్ర= ముత్యాలతో కూడిన; లలిత+అక్షత వృష్టిన్= మంచి అక్షతలనెడి వానను; విప్రులు= బ్రాహ్మణులు; పుణ్య+అంగనలును= పవిత్రురాండ్రైన ముత్తైదువలు; భద్ర, వాక్+చయంబులతోడన్= మంగళకరమైన వాక్కుల మొత్తాలతో; కురిసిరి= కురిపించారు.

**తాత్పర్యం:** మంగళవాద్యాలు మ్రోగుతుండగా బ్రాహ్మణులు, సువాసినులు వేదాశీస్సులు, మంగళ గీతాలతో ముత్యాలు కలిపిన అక్షతలను వర్షంవలె కురిపించారు.

**విశేషం:** అలం: రూపకం.

ఉ. అత్తఱిఁ గన్యకాజన సహస్రముఁ దానును జేరి వేడ్కమై
నుత్తర చందనార్ద్ర కుసుమోత్కరమున్ నవరత్న సంచయో
దాత్త సువర్ణ పుష్పములు దండడి చల్లెఁ గిరీటిమీఁద న
య్యుత్తరుపైఁ బ్రమోదకలనోత్కట సంభ్రమ సంభృతంబుగన్. 264

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= అప్పుడు; కన్యకా, జన, సహస్రమున్= వేయిమంది (పెక్కుమంది) కన్యకల సమూహమున్నూ; తానును= ఉత్తరయును; చేరి= దగ్గరకు వచ్చి; వేడ్కమైన్= వేడుకతో; ఉత్తర= ఉత్తరాకుమారి; చందన+ఆర్ద్ర= మంచి గంధంతో తడిపిన; కుసుమ+ఉత్కరమున్= పూల సముదాయాన్నీ; నవరత్న సంచయ= నవరత్నాల సముదాయాన్నీ; ఉదాత్త= గొప్పవైన; సువర్ణ పుష్పములు= బంగారు పువ్వులను; దండడిన్= విరివిగా; కిరీటిమీఁదన్= అర్జునుడి మీదను; ఆ+ఉత్తరుపైన్= ఆ ఉత్తరుడి మీదను; ప్రమోద కలనా= సంతోషంతో కూడిన; ఉత్కట= ఎక్కువైన; సంభ్రమ= వేగిరపాటుతో; సంభృతంబుగన్= నిండినట్లుగా; చల్లెన్= చల్లింది.

**తాత్పర్యం:** అప్పుడు ఉత్తర వేలమంది కన్యకాజనులు వెంటరాగా వేడుకతో మంచి గంధం కలిపిన పువ్వులున్నూ, నవరత్నాలు, బంగారు పువ్వులున్నూ, అర్జునుడిమీద, ఉత్తరుడిమీద సంతోషంతో కలిగిన సంబరంతో చల్లింది.

**విశేషం:** 1. రాజమందిరం వరకు బ్రాహ్మణులూ, పుణ్యాంగనలూ స్వాగతం పలికారు. ఆపైన ఉత్తర చెలికత్తెలతో కలిసి స్వాగతం పలికింది. ఒక రాచమర్యాద, మరొకటి గృహమర్యాద. వారందరిలో బృహన్నల మహిమ తెలిసిన వ్యక్తి ఉత్తర ఒక్కతే. అందువలన ఉత్తరుడి విజయానికి కారకుడైన బృహన్నలపై ముందుగా మంగళద్రవ్యాల నుంచింది. ఆపైన ఉత్తరుడిమీద చల్లింది. ఆమె ఉచితజ్ఞతకూ, సూక్ష్మబుద్ధికీ ఆ చర్య నిదర్శనం. బ్రాహ్మణులూ, ముత్తైదువులూ ముత్యాలు కలిపిన అక్షతలు చల్లితే, ఉత్తరా, చెలికత్తెలూ నవరత్నాలతో కూడికొన్న బంగారు పూలను చల్లారు. ఒకరు ఆదరంతో, మరొకరు అనురాగంతో చల్లారు. సత్కారం కూడా శక్తియుక్తులను బట్టి ఉంటుందని తిక్కన తన వర్ణనలో చిత్రించాడు.

2. నవరత్నాలు: ముత్యం, మాణిక్యం, వైడూర్యం, గోమేధికం, వజ్రం, పవడం, పుష్యరాగం, మరకతం, నీలం. (సంపా.)

ఉ. **తక్కటి వారలుం గని ముదం బలరారఁగఁ గౌఁగిలించుచున్**
**మ్రొక్కుచు నాదటం దనదు మోముపయిం దనివోని చూడ్కులం**
**గ్రిక్కిఱియించుచుం బొదివి గెల్పు నుతింపఁగ రాజపుత్త్రుఁ డ**
**య్యెక్కుడుమాట కోరువక యిట్లను నర్హజనంబుతోఁ దగన్.** 265

**ప్రతిపదార్థం:** తక్కటి వారలున్= మిగిలిన వారును; కని= చూచి; ముదంబు= సంతోషంతో; అలరారఁగన్= ఒప్పగా; కౌఁగిలించుచున్= కౌగిలించుకొంటూ; మ్రొక్కుచున్= నమస్కరిస్తూ; ఆదటన్= తనివితీర; తనదు= తనయొక్క; మోముపయిన్= ముఖంమీద; తనివోని= తనివి తీరని; చూడ్కులన్= చూపులను; క్రిక్కిఱియించుచున్= ఎక్కువగా ప్రసరింపచేస్తూ; పొదివి= చుట్టుకొని; గెల్పు నుతింపఁగన్= విజయాన్ని స్తుతించగా; రాజపుత్రుఁడు= ఉత్తరుడు; ఆ+ఎక్కుడు మాటకున్= ఆ ఎక్కువైన మాటకు; ఓరువక= సహించక; అర్హజనంబుతోన్= తగినవారితో; తగన్= తగునట్లుగా; ఇట్లు= ఈ రీతిగా; అనున్= పల్కాడు.

**తాత్పర్యం:** మిగతా వచ్చినవారు కూడా ఉత్తరుడిని చూచి సంతోషంతో కౌగిలించుకొనేవారు, మ్రొక్కేవారు, తన ముఖాన్ని తనివి తీరనట్లుగా అదే పనిగా తెగచూస్తూ చుట్టుముట్టి జయమును కొనియాడుతూ ఉంటే, అది తనది కాదు కనుక ఆ ఎక్కువైన ప్రశంసలకు సహించలేక తగినవారితో తగినట్లుగా ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** ఉత్తరుడిని అభినందించేవారు మూడు రకాలుగా ఉన్నట్లు తిక్కన చిత్రించాడు. 1. కౌగిలించుకొనేవారు-వీరు ఆత్మీయులు, బంధువులు. 2.ప్రీతితో మ్రొక్కేవారు - సామంతులు, చిన్నవారు, సేవకులు; 3. తనివితీరకుండా ముఖంవైపు చూస్తూ ప్రశంసించేవారు - పౌరులు, అభిమానులు. వారందరూ విజయుడు ఉత్తరుడని భావించి అభినందిస్తున్నారు. ఉత్తరుడు వాటిని స్వీకరించలేడు. కాదనలేడు. చిక్కులో పడ్డాడు. మనసులోని మథనను ఆగబట్టుకొనలేక తగినవారితో తగినరీతిగా ఈ విధంగా పలికాడు. అంటే దగ్గరివారితో జనాంతికంగా అన్న మాటల వంటివన్నమాట! ఇందులో ఉత్తరుడి చిత్తశుద్ధి వ్యక్తమౌతున్నది. (సంపా.)

చ. **'కురుబలమున్ జయించుటయు గోవులఁ దెచ్చుటయున్ బృహన్నలా**
**స్ఫురిత భుజాబలంబునన చూవె; నిజం బిది; నాక యేల? యె**
**వ్వరికిని నెవ్వరిం గెలువ వచ్చున యిట్టి సహాయ సంపదం**
**బొరయక యున్న? మీ కెఱుఁగఁ బోలునె నాబ్రదు కెట్టి భంగియో?'** 266

**ప్రతిపదార్థం:** కురుబలమున్= కౌరవుల సేనను; జయించుటయున్= గెలవటమున్నూ; గోవులన్= ఆవులను; తెచ్చుటయున్= తీసికొని రావటమున్నూ; బృహన్నలా= బృహన్నలయొక్క; స్ఫురిత= ప్రకాశించు; భుజా= భుజములయొక్క; బలంబునన్+అ= బలం చేతనే; చూవె= సుమా!; ఇది= నేను చెప్పినది; నిజంబు= సత్యం; నాకున్+అ= నాకే; ఏల?= ఏమిటి?; ఎవ్వరికినిన్= ఎవరికైనా; ఎవ్వరిన్= ఎవ్వరినైనా; ఇట్టి= ఇటువంటి; సహాయసంపదన్= సహాయసంపత్తిని; పొరయకఉన్నన్= పొందనిచో; గెలువవచ్చున్+అ= గెలువ వీలగునా?; నా బ్రదుకు= నా జీవితం, నా బలం; ఎట్టిభంగియో= ఎటువంటిదయ్యేదో; మీకున్= మీకు; ఎఱుఁగన్+పోలునె?= తెలియ వీలగునా?

**తాత్పర్యం:** ఈ బృహన్నలయొక్క భుజబలం మూలాననే కౌరవసేనను గెల్వటం, ఆవులను మరలించి తీసికొని రావటం జరిగింది. నిజం. నా ఒక్కడి మాటేమిటి? ఎవరికైనా ఎవరినైనా ఇటువంటి సహాయ సంపత్తి లేకపోతే గెలువవీలవుతుందా? నా కా సహాయం లేకపోతే నా బ్రదు కేమయ్యేదో మీ కేమి తెలుసు?

**విశేషం:** ఉత్తరుడి కృతజ్ఞతాభావానికీ, నిజాయితీకి ఈ పద్యం తార్కాణం.

1. కురుబలాన్ని జయించటానికీ గోవులను మరలించటానికీ కారణం - 'బృహన్నలా స్ఫురిత భుజాబలము'-అంటే- బృహన్నల ప్రదర్శించిన భుజాబలమనీ, బృహన్నల రూపంలో తోచిన భుజాబలమనీ అర్థాలు. ఒక అర్థం సారథియొక్క నైపుణ్యాన్ని కీర్తించినట్లున్నది. రెండవది గూఢమైన విజయుడి పరాక్రమ ప్రశంస. ఈ రెండు అర్థాలు వచ్చేటట్లు పలికిన కాకువు ఆ వాక్య రచనా శిల్పం. ఇది కృతజ్ఞతాభావ సూచకం.

2. 'మీ కెఱుఁగఁ బోలునె నా బ్రదు కెట్టి భంగియో' - అనే పాఠానికి - 'మీ కెఱుఁగఁ బోలదె నా బ్రదు కెట్టి భంగియో' - అనే పాఠాంతరం ఉన్నది. 'నా బ్రదుకు ఎటువంటిదో మీకు తెలియదా?' అనే అర్థం పాఠాంతరంవలన ఏర్పడుతుంది. ఆ వాక్యం కంటె ఇప్పటి పాఠమే ప్రౌఢంగా ఉన్నది. 'ఆయన సహాయం లేకపోతే నా బ్రదు కేమయ్యేదో మీ కేమి తెలుసు?'- అనే వాక్యం తెలుగు జాతీయమైన అభివ్యక్తితో శక్తిమంతమైనది. మీ రెవ్వరూ ఊహించలేనంత సహాయం లభించటంవలననే నే నిట్లు బట్టకట్టి మీముందు నిలిచి ఉన్నానని భావనా రమణీయంగా ఉత్తరుడు ప్రౌఢంగా పలికాడు. ఇది అతడి నిజాయితీకి ఉదాహరణం. (సంపా.)

**వ. అని సారథ్య ప్రశంసా ప్రకారంబుగా నక్కుమారుం డత్యుపచార వచనంబుల చందంబున సంక్రందననందను నుతించుచుం జనుదెంచి రాజమందిర ద్వారంబుఁ జేరు నవసరంబునఁ బ్రతిహారి ససంభ్రమగతిం జని భూవల్లభునకుం బ్రణమిల్లి భూమింజయ ప్రవేశంబు తెఱంగు విన్నవించిన, 'నా రథికసారథులం జూచు వేడ్క మనంబు వేగిర పెట్టెడు, నయ్యిరువుర నియ్యెడకుం జయ్యనఁ దోడితె'మ్మను విభుని పలుకులు విని ధర్మ తనయుండు పణిహారితో నల్లన యిట్లనియె. 267**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; సారథ్య= సారథ్యముయొక్క; ప్రశంసా ప్రకారంబుగాన్= ప్రశంస చేసినట్లుగా; ఆ+కుమారుండు= ఆ ఉత్తరకుమారుడు; అతి+ఉపచార= మిక్కిలి గౌరవాన్ని తెలిపే; వచనంబుల చందంబునన్= వాక్యాల రీతిలో; సంక్రందన నందనున్= అర్జునుడిని; నుతించుచున్= పొగడుతూ; చనుదెంచి= వచ్చి; రాజమందిర ద్వారంబున్= రాజమందిరం యొక్క ద్వారాన్ని; చేరు+అవసరంబునన్= చేరునప్పుడు; ప్రతిహారి= ద్వారపాలుడు; ససంభ్రమ గతిన్= తొందర కలిగిన నడకతో; చని= లోనికి పోయి; భూ వల్లభునకున్= విరాటరాజునకు; ప్రణమిల్లి= నమస్కరించి; భూమింజయ= ఉత్తరుడియొక్క; ప్రవేశంబు తెఱంగు= ప్రవేశించే విధానాన్ని; విన్నవించినన్= మనవి చేయగా; ఆ రథిక= రథికుడైన ఉత్తరుని; సారథులన్= సారథియైన బృహన్నలను; చూచువేడ్క= చూడవలెననే వేడుక; మనంబున్= మనస్సును; వేగిర పెట్టెడున్= తొందర పెట్టుతున్నది; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరినీ; ఈ+ఎడకున్= ఇక్కడకు; చయ్యనన్= తొందరగా; తోడితెమ్ము+అను= కూడా ఉండి తీసికొనిరమ్ము అనెడి; విభుని= రాజుయొక్క; పలుకులు= మాటలు; విని; ధర్మనతయుండు= ధర్మరాజు; పణిహారితో= ద్వారపాలకుడితో; అల్లన= మెల్లగా; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** సారథి సారథ్యాన్ని ప్రశంసించినట్లుగా ఎక్కువ ఉపచార వచనాలతో అర్జునుడిని పొగడుతూ రాజమందిర ద్వారానికి చేరేసరికి ద్వారపాలకుడు లోనికి వెళ్ళి విరాటుడికి నమస్కరించి, ఉత్తరుడు ప్రవేశం చేస్తున్నాడని చెప్పగానే, విరాటుడు ఉత్తరుడినీ, బృహన్నలనూ చూడాలనే వేడుకలో ఉన్నాడు కనుక వారిద్దరిని వెంటనే ప్రవేశపెట్టుమన్నాడు. ధర్మరాజు ఆ మాటలు విని ఆ భటుడితో మెల్లగా ఇట్లా అన్నాడు.

**క. 'ఇన్నెత్తురు గనుఁగొనిన బృ । హన్నల కోపించు నన్ను నతిభక్తిమెయిన్**
**మన్నించుఁ గాన; రాజుం । దన్ను విచారింప కేమి తప్పు దలఁచునో? 268**

**ప్రతిపదార్థం:** ఈ+నెత్తురు= ఈ రక్తం; కనుఁగొనినన్= చూస్తే; బృహన్నల= బృహన్నల; కోపించున్= కోపపడతాడు; నన్నున్= నన్ను; అతిభక్తి మెయిన్= ఎక్కువ భక్తితో; మన్నించున్= గౌరవిస్తాడు; కానన్= కాబట్టి; రాజున్= రాజును; తన్నున్= తనను; విచారింపక= ఆలోచించక; ఏమి తప్పు= ఏమి దోషం; తలఁచునో?= చేయాలని అనుకొంటాడో?

**తాత్పర్యం:** 'బృహన్నల ఈ నెత్తురు చూస్తే కోపగించుకొంటాడు. అతడు నన్ను ఎక్కువగా గౌరవిస్తాడు. కనుక రాజుస్థాయి తనస్థాయి ఆలోచించకుండా ఏదైనా అపకారం చేయ తలపెట్టుతాడేమో!

**విశేషం:** మూలంలో కంకుభట్టు అన్నమాటలు ఇంతకంటె కొంత భిన్నంగా ఉన్నాయి. వ్యాసుడు ధర్మజుడిని సత్యవ్రతుడుగా పలికించాడు.

> **"ఏతస్య హి మహాబాహో వ్రతమేతత్ సమాహితమ్**
> **యో మమాంగే వ్రణం కుర్యా చ్ఛోణితం వాపి దర్శయేత్**
> **అన్యత్ర సంగ్రామగతా న్న స జీవేదసంశయమ్ ॥**
> **న మృష్యాద్ భృశసంక్రుద్ధో మాం దృష్ట్వా తు సశోణితమ్,**
> **విరాటమిహ సామాత్యం హన్యాత్ సబలవాహనమ్॥"** **(4-63-53-54)**

"ఓ మహాబాహూ! బృహన్నల కొక వ్రతం ఉన్నది. ఎవడైనా నా శరీరంమీద గాయం చేసినవాడూ, రక్తం కారేటట్లు చేసినవాడూ, యుద్ధంలో తప్ప తక్కినచోట్ల బ్రతుకడు. కాబట్టి నెత్తురు కారుతున్న నా స్థితిని ఇప్పుడు చూచాడా కోపించి ఆవేశంతో విరాటుడిని మంత్రులతో సేనతో వాహనాలతో సహా చంపివేస్తాడు'' - ఈ మాటలు ద్వారపాలకుడికి చెప్పేవి కావు. వీటి వలన ఎన్నో ప్రశ్నలు రేకెత్తుతాయి. బృహన్నల ఆ వ్రతం పట్టటానికి కంకుభట్టు అతడి కేమౌతాడు? ఆ వ్రతం సంగతి కంకుభట్టు కెట్లా తెలుసు? అనే ప్రశ్నలు ముందు తలెత్తుతాయి. కంకుభట్టు వేషంలో ధర్మరాజు నిజం పలుకుతున్నాడనే సంతృప్తి మనకు కలిగినా అందులో సందర్భశుద్ధి కొరవైనదని కావ్యకళా శిల్ప మర్మజ్ఞులు భావిస్తారు. తిక్కన మార్చిన కంకుభట్టు మాటలు సముచితంగా ఉన్నాయి. 'అతిభక్తితో నన్ను బృహన్నల గౌరవిస్తాడు కాబట్టి నన్ను గాయపరచిన విరాటుడిని అతడు సహించక పోవచ్చును. ఆవేశంతో ఏదైనా అపచారం కూడా చేయవచ్చును'- అనే సంభాషణ చాలు. ఇది సందర్భోచిత్యానికి ఉదాహరణం. (సంపా.)

**వ. ఇది లెస్సగాఁ దుడుచునంతకుఁ దదీయ ప్రవేశం బించుకవడి వారింపుము; పదంపడి రానిత్తు గాని; యంతకు నుత్తరుం డొక్కరుండ వచ్చునట్లుగాఁ జేయుము.' 269**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ నెత్తురు; లెస్సగాన్= బాగా; తుడుచునంతకున్= తుడిచేవరకు; తదీయ ప్రవేశంబు= బృహన్నల ప్రవేశం; ఇంచుకవడి= కొంచెం సేపు; వారింపుము= ఆపుము; పదంపడి= తర్వాత; రానిత్తుగాని= రానిచ్చెదవుగాక; అంతకున్= అంతవరకు; ఉత్తరుండు= ఉత్తరుడు; ఒక్కరుండు+అ= ఒక్కడే; వచ్చునట్లుగాన్= ప్రవేశించేటట్లుగా; చేయుము= చేయవలసింది.

**తాత్పర్యం:** ఈ నెత్తురు కారటం తగ్గేవరకు బృహన్నలను రానియ్యకుము. తర్వాత రప్పించవచ్చును. ముందుగా ఉత్తరుడిని లోపలికి ప్రవేశపెట్టుము.'

**క. అని చెప్పి హర్ష సంభ్రమ । మున నజ్జననాయకుండు మునుఁగుట నదియే**
**మని యడుగఁ దలంపమిఁ దన । కనువై కార్యము ఘటించి యతనిం బుచ్చెన్. 270**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఇట్లు చెప్పి; ఆ+జననాయకుండు= ఆ విరాటరాజు; హర్షసంభ్రమమునన్= సంతోషంయొక్క సంబరంతో; మునుఁగుటన్= మునిగి ఉన్నందున; అది= ఆ మాట్లాడేది; ఏమని= ఏమిటని; అడుగన్+తలంపమిన్= అడుగదలచుకొనకపోవటంచేత; తనకున్= ధర్మరాజునకు; అనువు+ఐ= వీలై; కార్యము= పని; ఘటించి= సమకూర్చి; అతనిన్= ద్వారపాలకుడిని; పుచ్చెన్= పంపించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా చెప్పి, విరాటుడు సంతోష సంబరాలలో మునిగిపోయి ఉన్నందున, ఆ మాట్లాడుకొనేది ఏమిటని అడగదలచుకొనకపోవటం తనకు అనుకూలం కాగా ద్వారపాలకుడిని పంపించాడు.

**విశేషం:** ఈ వివరణ మూలంలో లేదు. రాజు ఒక ఆజ్ఞ ఇచ్చాడు. రథినీ, సారథినీ ప్రవేశపెట్టుమన్నాడు. ప్రక్కనున్న కంకుభట్టు సారథిని తప్పించి ఉత్తరకుమారుడినే ముందు ప్రవేశపెట్టుమన్నాడు. రాజు తరువాత అంతటి గౌరవం పొందుతున్న కంకుభట్టును శంకించలేదు ద్వారపాలకుడు. కాని, ప్రభువు అనుమతి లేనిది అతడి ఆజ్ఞ పాటించలేడు. విరాటుడు ప్రమోదోన్మాదంలో ఉండటంచేత కంకుభట్టు మాటను కాదనలేదు. అదే అతడి అనుమతిగా భావించి ద్వారపాలకుడు వ్యవహరించాడు. ఆశ్చర్యమేమంటే - ఉత్తరుడి వెంట సారథి రాలేదేమి? అని కూడా ప్రభువు ప్రశ్నించలేదు. అదికూడా ఉన్మాదావస్థలోని భాగమే. రాజుయొక్క ఉన్మాదావస్థను ఉపాయంగా వాడుకొన్న ధర్మజుడు నిపుణుడని ధ్వని. (సంపా.)

**చ. అతఁడును బార్థు నిల్పి, వినయంబున నుత్తరుఁ దోడి తెచ్చినం**
**బితృచరణాంబుజంబులకుఁ బ్రీతి మెయిం బ్రణమిల్లె నాతఁ; డా**
**పతియును జక్కఁ జేర్చె గరుపాటెడు మేనును హర్ష బాష్ప సం**
**ప్లుత మగు నాననంబు నయి పుత్రునిఁ బెద్దయుఁ బ్రొద్దు కౌఁగిటన్. 271**

**ప్రతిపదార్థం:** అతఁడును= ద్వారపాలకుడు కూడ; పార్థున్= అర్జునుడిని; నిల్పి= ఆపి; వినయంబునన్= వినయంతో; ఉత్తరున్= ఉత్తరకుమారుడిని; తోడి తెచ్చినన్= తోడ్కొనిరాగా; ఆతఁడు= ఉత్తరుడు; పితృచరణ+అంబుజంబులకున్= తండ్రిగారి పాదపద్మాలకు; ప్రీతిమెయిన్= సంతోషంతో; ప్రణమిల్లెన్= నమస్కరించాడు; ఆ పతియును= ఆ విరాటరాజు కూడ; గరుపాటెడు= పులకించెడి; మేనును= శరీరం కలవాడునూ; హర్షబాష్ప= ఆనందాశ్రువులతో; సంప్లుతము+అగు= తడిసిన; ఆననంబున్+అయి= ముఖం కలవాడు అయి; పుత్రునిన్= కుమారుడిని; పెద్దయున్= చాల; ప్రొద్దు= కాలం; కౌఁగిటన్= కౌగిట్లో; చక్కన్= చక్కగా; చేర్చెన్= చేర్చాడు.

**తాత్పర్యం:** ద్వారపాలకుడు ధర్మరాజు చెప్పినట్లే అర్జునుడిని ఆపి, ఉత్తరుడిని లోపలికి తీసికొనిరాగా, ఉత్తరుడు తండ్రి పాదాలకు ప్రీతితో ప్రణామం చేశాడు. విరాటుడు సంతోషంతో ఒడలు పులకించగా, ఆనందాశ్రువులతో ముఖం తడుస్తుండగా అతడిని ఎంతోసేపు కౌగిట్లో చేర్చుకొన్నాడు.

**వ. ఇవ్విధంబున నాలింగితుండయి భూమింజయుండు పునః పునః ప్రణామంబు సేసి, కంకునిం గనుంగొని సగౌరవంబుగా నమస్కరించి, మొగంబుగంటి సూచి 'యిది యేమి?' యని యడిగిన. 272**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఆలింగితుండు+అయి= ఆలింగనం చేసికొనబడినవాడై; భూమింజయుండు= ఉత్తరుడు; పునఃపునః= మరలమరల; ప్రణామంబు= నమస్కారం; చేసి; కంకునిన్= ధర్మరాజును; కనుంగొని= చూచి; సగౌరవంబుగాన్= గౌరవంతో కూడినట్లుగా; నమస్కరించి= దండంపెట్టి; మొగంబుగంటి= మొగంమీద గాయాన్ని; చూచి; ఇది+ఏమి అని= ఇదేమిటని; అడిగినన్= అడుగగా.

**తాత్పర్యం:** అట్లా మరల మరల కౌగిలించుకొన్న తరువాత ఉత్తరుడు తండ్రికి తిరిగి తిరిగి నమస్కారాలు చేశాడు. కంకుడివైపు చూచి సగౌరవంగా నమస్కరించాడు. ముఖంమీద గాయం కనిపించింది. 'ఇ దేమిట'ని అడిగాడు.

**విశేషం:** 'ఇదేమిటి?' -అని ఉత్తరుడు వేసిన ప్రశ్న కీలకమైనది. తీగ కదిపితే డొంక కదులుతుందన్న సామెత ఇక్కడ ఋజువవుతుంది. విరాటుడు విజయ వృత్తాంతాన్ని గురించి ఇంకా అడుగనే లేదు. కంకుభట్టు స్థితిని చూచి ఉత్తరుడు ఆతురతతో ప్రశ్నించాడు. ఆ ప్రశ్న కంకుభట్టును ధర్మరాజుగా గుర్తించాడా? లేదా అన్నదానికి సంకేతం. గుర్తించినట్లూ, ఆ గుర్తింపును గోప్యంగా ఉంచుతున్నట్లూ ధర్మజుడు గ్రహించాడు. ఎందువల్లనంటే - అజ్ఞాతవాస వ్రతకాలం ముగిసింది కాబట్టి అర్జునుడు నిజవేషంతో బయటపడి యుద్ధం చేసి ఉండాలి; కాని, పేడివేషంతోనే తిరిగి వచ్చాడు. పేడివాడు అర్జునుడని ఉత్తరుడికి తెలిస్తే, కంకుభట్టు ధర్మరాజని తెలిసిపోయి ఉంటుంది. అది జరిగిందా? లేదా? అని తెలిసికొనటానికే ఉత్తరుడి ఏకాంత ప్రవేశం. ధర్మజుడు ఆవులిస్తే ప్రేవులు లెక్కపెట్టగలడు. కంకుభట్టును ధర్మజు డని పేర్కొంటే కథ నొక విధంగా నడపాలి. లేదా, మరొకవిధంగా నడపాలి. అందుకొరకు ధర్మజుడు పన్నిన వ్యూహ మిది. అతడి లోతులు సాధారణంగా అంతుపట్టవు. (సంపా.)

**క.** **'ఏ నీ విజయము వొగడఁగఁ। దా నప్పుడు పేడిఁ బొగడె; దానం గోపం**
**బూనిన సైరింపక నా। చే నడిచితి సారెఁ గొని విశృంఖలవృత్తిన్'.** 273

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; నీ విజయము= నీయొక్క గెలుపును; పొగడఁగన్= పొగడగా; అప్పుడు; తాన్= కంకుభట్టు; పేడిన్= బృహన్నలను; పొగడెన్= పొగడాడు; దానన్= దానితో; కోపంబు= కోపం; ఊనినన్= పొందగా; సైరింపక= సహించలేక; నాచేన్= నా చేతితో; సారెన్= పాచికను; కొని= తీసికొని; విశృంఖల వృత్తిన్= అడ్డులేని రీతిగా; అడిచితిన్= కొట్టాను.

**తాత్పర్యం:** విరాటు డన్నాడు - 'నాయనా! నేను నీ విజయాన్ని పొగడుతూంటే, ఇతడు ఆ పేడి గెలిచాడని పొగడాడు. దానితో కోపం వచ్చి సహించలేక వెనుకాముందూ చూడకుండా నేనే పాచికతో కొట్టాను.

**క.** **అని పతి పలికిన విని నె। మ్మనమున భయ సంభ్రమములు మల్లడిగొన న**
**మ్మనుజేంద్రనందనుం డి। ట్లను నత్యాదరము మెఱయ నాతనితోడన్.** 274

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; పతి= విరాటుడు; పలికినన్= పలుకగా; నెమ్మనమునన్= మనస్సులో; భయ సంభ్రమములు= భయం, తొందరయును; మల్లడిగొనన్= పెనవేసికొనగా; ఆ+మనుజ+ఇంద్ర నందనుండు= ఆ ఉత్తరుడు; అతి+ఆదరము= మిక్కిలి గౌరవం; మెఱయన్= కనపడగా; ఆతనితోడన్= తండ్రితో; ఇట్లు= చెప్పబోయే రీతిగా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** అని విరాటరాజు పలుకగా భయం, కంగారు మనస్సులో కలిగి ఉత్తరుడు మిక్కిలి గౌరవంతో తండ్రితో ఇట్లా అన్నాడు.

**తే.** **'తప్పు చేసితి రీ; రిట్లు దగునె? వీర। లేమిగతిఁ బల్కినను నది యెల్ల మనము**
**గైకొనవలయుఁగా; కిట్లు గాదు కూడ। దని నిషేధించు టొప్పునె మనుజనాథ!** 275

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; ఈరు= మీరు; తప్పు= దోషము; చేసితిరి= చేసినారు; ఇట్లు= ఇట్లా కొట్టటం; తగునె?= ఉచితమా?; వీరలు= వీరు; ఏమిగతిన్= ఏ రీతిగా; పల్కినను= మాట్లాడినా; అది+ఎల్లన్= అదంతా; మనము= మనము; కైకొనవలయున్= అంగీకరించవలసిందే; కాక= అట్లుకాక; ఇట్లు= మీరు చెప్పినది; కాదు కూడదు= అవును కాదు; అని; నిషేధించుట= కాదనటం; ఒప్పునె?= తగునా?

**తాత్పర్యం:** 'ఎంత తప్పు చేశారు? వీరు ఏమి మాట్లాడినా మనం అంగీకరించవలసిందే కాని, కాదు కూడదు- అని నిషేధించటం ఉచితమా?'

**వ. అని మఱియును. 276**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా.

**క. 'సవినయముగఁ బ్రార్థింపుఁడు । పవిత్ర చారిత్రులైన పరమ ద్విజు లి**
**ట్లవమతులై కోపించిన । నవనీశుల కేల కల్గు నాయువు సిరియున్?' 277**

**ప్రతిపదార్థం:** సవినయముగన్= వినయంతో కూడినట్లుగా; ప్రార్థింపుఁడు= ప్రార్థించండి; పవిత్ర చారిత్రులు+ఐన= పవిత్రమైన నడవడిక కల; పరమద్విజులు= ఉత్తమ బ్రాహ్మణులు (ఇక్కడ బ్రాహ్మణులని అసత్యం చెప్పకుండా ద్విజులని క్షత్రియ సాధారణ పదం వాడడం గమనించ దగింది); ఇట్లు= ఈ రీతిగా; అవమతులు+ఐ= అవమానించబడినవారై; కోపించినన్= కోపిస్తే; అవనీ+ఈశులకున్= రాజులకు; ఆయువు= ఆయుస్సు; సిరియున్= సంపదయున్నూ; ఏల= ఏ రీతిగా; కల్గున్?= కలుగుతాయి?

**తాత్పర్యం:** 'వినయంతో వారిని ప్రార్థించండి. ఇటువంటి పవిత్రమైన చరిత్రకలవారు కోపిస్తే రాజులకు ఆయుస్సు, సిరిసంపదలు ఎట్లా కలుగుతాయి?'

**వ. అనిన విని యమ్మాటలు పాటిగాఁ బట్టి విరాటుండు భయ భక్తియుక్తంబుగా వేఁడికొనినఁ బాండవాగ్రజుండు నగుచు 'నాకు నలుక యెక్కడిది? యితండును గీడుతెరువువాఁడు గాఁ; డిదియొక్క కీడుప్రొద్దున నయ్యెం గాని' యని తాను రాజుదెసఁ బ్రసన్నుం డగుట తెలియునట్లుగా నుత్తరుతోడం బలికిన, నమ్మహీవల్లభుండు సంతసిల్లి, తదవసరంబునఁ బ్రవేశించి కాంచిన యా బృహన్నల నాదరించి నిజనందను నాలోకించి యిట్లనియె. 278**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= వినిపించుకొన్నవాడై; ఆ+మాటలు= ఆ మాటలు; పాటిగాన్+పట్టి= పాటించవలసినవిగా తీసికొని; విరాటుండు= విరాటరాజు; భయభక్తి= భయంతో, భక్తితో; యుక్తంబుగాన్= కూడినట్లుగా; వేఁడికొనినన్= ప్రార్థించగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; నగుచున్= నవ్వుతూ; నాకున్= నాకు; అలుక= కోపం; ఎక్కడిది?= ఎక్కడ వచ్చింది?; ఇతండును= ఈ విరాటుడు కూడా; కీడు తెరువువాఁడు= చెడు మార్గంలో నడిచేవాడు; కాఁడు; ఇది+ఒక్క కీడుప్రొద్దునన్= ఇది ఒక చెడుగడియలో; అయ్యెన్+కాని= అయినది కాని; అని= అని పలికి; తాను= ఆ ధర్మరాజు; రాజుదెసన్= విరాటుడిపట్ల; ప్రసన్నుండు+అగుట= అనుగ్రహించినట్లుగా; తెలియునట్లుగాన్= స్పష్టమయ్యేటట్లు; ఉత్తరుతోడన్= ఉత్తరుడితో; పలికినన్= పలుకగా; ఆ+మహీవల్లభుండు= ఆ విరాటుడు; సంతసిల్లి= సంతోషించి; తద్+అవసరంబునన్= ఆ సమయంలో; ప్రవేశించి= లోనికివచ్చి; కాంచిన= తనను దర్శించినట్టి; ఆ బృహన్నలను= ఆ అర్జునుడిని; ఆదరించి= గౌరవించి; నిజనందనున్= తన కుమారుడిని; ఆలోకించి= చూచి; ఇట్లు= ఈ ప్రకారంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడు అట్లా అనేసరికి ఆ మాటలు పాటించి విరాటుడు భయభక్తులతో ప్రార్థించగా, ధర్మరాజు 'నాకు అసలు కోపమే రాలేదే. ఇతడు కూడా చెడు త్రోవను పోయేవాడు కాడు. ఇవ్వేళే ఎందుకో ఒక చెడు గడియలో

ఇట్లా చేశాడు' అని అంటూ రాజుమీద అనుగ్రహించినట్లు ఉత్తరునకు తెలిసేటట్లుగా పలికాడు. అప్పుడు రాజు సంతోషించాడు. అప్పుడే లోనికి వచ్చి బృహన్నల రాజుగారిని దర్శించగా విరాటుడు అతడిని ఆదరించాడు. కొడుకువైపు చూచి ఇట్లా అన్నాడు.

**విరాటుఁ డుత్తరుని సమరప్రకారం బడుగుట (సం. 4-64-12)**

**ఉ. 'ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుఁడుం బశు**
**త్రాణ పరాయణత్వమున దర్ప సముజ్జ్వల భంగి నుల్లస**
**ద్బాణ పరంపరల్ గురియఁ బార్థివుఁడున్ వెనుదన్ని చూడ న**
**క్షీణ జవంబునం గవియు సేనకు మార్కొన నగ్గలించితే? 279**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణుడును; భీష్ముఁడున్= భీష్ముడును; కృపుఁడున్= కృపాచార్యుడును; ద్రోణసుతుండును= అశ్వత్థామయును; కర్ణుఁడున్= కర్ణుడును; పశుత్రాణ= గోవులను రక్షించటంలో; పరాయణత్వమునన్= ఆసక్తితో; దర్ప= గర్వముయొక్క; సముజ్జ్వల భంగిన్= హెచ్చిన రీతిలో; ఉల్లసత్= ప్రకాశించే; బాణ పరంపరల్= బాణాల పంక్తులను; కురియన్= కురిపించగా; పార్థివుఁడున్= దుర్యోధనుడు కూడా; వెన్ను+తన్ని= వెనువెంట నిలిచి; చూడన్= చూస్తూ ఉండగా; అక్షీణ= క్షీణించని; జవంబునన్= వేగంతో; కవియు= మీదికి వచ్చే; సేనకున్= సైన్యానికి; మార్కొనన్= ఎదుర్కొనుటకు; అగ్గలించితే= అతిశయంగా ముందుకుపోగల్గితివా?

**తాత్పర్యం:** 'ద్రోణుడు, భీష్ముడు, కృపుడు, అశ్వత్థామ, కర్ణుడు - వీరందరూ పశువులను రక్షించాలనే పట్టుదలతో బాణాలవర్షం కురిపించగా, దుర్యోధనుడు వెంటనుండి చూస్తుండగా, మీదికి మహావేగంతో వచ్చే సేనలను ఎదుర్కొనటానికి ఉత్సహించావా?

**ఉ. బాసట లేదు క్రొవ్వడర బంటుతనంబునఁ దాఁకితేనియుం**
**బాసినచోట వాయుఁ బెఱ పట్టుల వీరు లుదగ్రవృత్తిమై**
**మూసికొనంగ వత్తు రొక మోహర మమ్ముల ముగ్గెనేని నా**
**సాసల నొక్కరుండ యను నాగ్రహవృత్తి బలంబు పైఁబడున్. 280**

**ప్రతిపదార్థం:** బాసట లేదు= సహాయం లేదు; క్రొవ్వు+అడరన్= మదం వ్యాపించగా; బంటుతనంబునన్= పౌరుషంతో; తాఁకితి+ఏనియున్= ఎదుర్కొన్నప్పటికీ; పాసిన చోటన్= వదిలిన చోట; పాయున్= విడిపోవుట; పెఱ పట్టులన్= తక్కిన చోట్ల; వీరులు= యోధులు; ఉదగ్ర వృత్తిమైన్= విసురుగా; మూసికొనంగన్= ముట్టడించటానికి; వత్తురు= దగ్గరకు వస్తారు; ఒక మోహరము= ఒకరు చేసిన వ్యూహం; అమ్ములన్= బాణాలతో; మ్రగ్గెనేనిన్= చనిపోతే; ఒక్కరుండు+అ= ఒక్కడే!; అను+ ఆగ్రహవృత్తిన్= అనెడి ఆగ్రహంతో; బలంబు= సేన; ఆస+ఆసలన్= అధికాశతో; పైఁబడున్= మీదపడుతుంది.

**తాత్పర్యం:** నీకు సహాయుడు లేడు. క్రొవ్వెక్కి తాకితే విడిచినచోట విడిచినట్లే ఉంటుంది. తక్కిన చోట్ల ఉన్న వీరులు కూడా వచ్చి అమాంతంగా మీద పడతారు. వాళ్ళను ఒకవేళ కొట్టగలిగితే ఒక్కడే అనే ఆగ్రహంతో తక్కిన సేనలు వచ్చి అధికాశతో మీద పడతాయి.

**ఆ. ఒకఁడు పరశురాము నోర్చినవాఁ; డొక్క। రుండు ధనువునకు గురుండు దాన;**
**హరువరమునఁ బుట్టి యక్షీణ బల విక్ర। మముల నొక్కఁ డొప్పు మాఱు లేక. 281**

**ప్రతిపదార్థం:** ఒకఁడు= ఒక వీరుడు-భీష్ముడు; పరశురామున్= పరశురాముడిని; ఓర్చినవాఁడు= ఓడించినవాడు; ఒక్కరుండు= మరొక్కడు-ద్రోణాచార్యుడు; ధనువునకున్= ధనుర్విద్యకు; తాను+అ= తానే; గురుండు= గురువు; హరువరమునన్= శివుడి వరమున; పుట్టి; అక్షీణ= క్షీణించని; బల విక్రమములన్= బల పరాక్రమాలతో; ఒక్కఁడు= మరొకడు-అశ్వత్థామ; మాఱులేక= తన కెదురు లేక; ఒప్పున్= ప్రకాశిస్తాడు.

**తాత్పర్యం:** కౌరవసేన లోని వీరులలో ఒకడు పరశురాముడిని ఓడించినవాడు, ఒకడు స్వయంగా ధనుర్విద్యా గురువు. మరొకడు శివుడి వరాన పుట్టి క్షీణించని బలపరాక్రమాలతో ఎదురులేనివాడు.

**విశేషం:** పరశురాముడిని గెలిచినవాడు భీష్ముడు. (చూడు. ఉద్యోగ. 4-273-360). కురుపాండవులకు ధనుర్విద్యాచార్యుడు ద్రోణుడు. ద్రోణుడు సంతానం కొరకు శివుడిని గూర్చి తపస్సుచేసి, ఆ మహాదేవుడి వరం వలన రుద్రాంశ సంభూతుడైన అశ్వత్థామను పుత్రుడిగా పొందాడు. (చూడు. శివపురాణం శతరుద్రీయ సంహిత. సంహిత. 3. అధ్యా. 36. శ్లో. 6-14).

**ఉ. తక్కటి వారలున్ సురల దైత్యులనైనను బోర గెల్చువా**
**రక్కురుసేన మేటిమగ లా ధృతరాష్ట్ర తనూజు లాజి నొ**
**క్కొక్కఁడ ధాత్రి యంతయును నోర్వఁగఁ జాలుదు రట్టివారి నీ**
**వెక్కటి దాఁకి నొవ్వకయు నెమ్మెయి గెల్చితి నాకుఁ జెప్పుమా! 282**

**ప్రతిపదార్థం:** తక్కటి వారలున్= మిగిలిన వారుకూడ; సురలన్= దేవతలను; దైత్యులన్+ఐనను= రాక్షసులనైనా; పోరన్= యుద్ధంలో; గెల్చువారు= గెల్వగల్గినవారు; ఆ+కురుసేనన్= ఆ కౌరవసేనలోని; మేటిమగలు= గొప్ప వీరులు; ఆ ధృతరాష్ట్ర తనూజులు= ఆ ధృతరాష్ట్రుడి పుత్రులు-కౌరవులు; ఆజిన్= యుద్ధంలో; ఒక్కొక్కఁడ= ఒక్కడొక్కడే; ధాత్రి= భూమిని; అంతయును= సమస్తాన్ని; ఓర్వఁగన్= ఓడించటానికి; చాలుదురు= సమర్థులు; అట్టివారిన్= అటువంటివారిని; నీవు; ఎక్కటిన్= ఒంటరిగా; తాఁకి= ఎదుర్కొని; నొవ్వకయున్= ఏమీ దెబ్బతగులకుండా; ఏ+మెయిన్= ఏ రీతిగా; గెల్చితి(వి)= జయించావు; నాకున్= నాకు; చెప్పుమా!= చెప్పుము!

**తాత్పర్యం:** మిగిలిన వారుకూడా దేవతలనైనా, రాక్షసులనైనా యుద్ధంలో గెలువగల మహావీరులు. ఆ ధృతరాష్ట్రుడి కొడుకులున్నారే వారు ఒక్కొక్కరు పృథివిని గెలువగల వీరులు. అటువంటి వారి సేనను నీ వొక్కడవు ఎదిరించి, శరీరం ఏమీ కందకుండా ఎట్లా గెల్చావో నాకు చెప్పుము.

**ఉ. గోవుల నెట్టు లాఁగితి? వకుంఠితవిక్రముఁడైన రాజరా**
**జేవిధి మానభంగమున కెల్లను నోర్చి పలాయమానుఁడై**
**నీ విజయంబు సైఁచి ఘననిందకు నియ్యకొనంగఁ జాలెఁ? బు**
**త్రా! వెఱఁ గయ్యెడున్ రణవిధం బఖిలంబు నెఱుంగఁ జెప్పుమా!' 283**

**ప్రతిపదార్థం:** పుత్రా!= కుమారా!; గోవులన్= ఆవులను; ఎట్టులు= ఏ రీతిగా; ఆఁగితివి= ఆపితివి; అకుంఠిత= మొక్కవోని; విక్రముఁడు+ఐన= పరాక్రమం కలిగిన; రాజరాజు= దుర్యోధనుడు; ఏ విధిన్= ఎట్లు; మానభంగమునకున్= అభిమానం

పోవటానికి; ఎల్లను= పూర్తిగా; ఓర్చి= సహించి; పలాయమానుఁడు+ఐ= పారిపోతున్నవాడై; నీ విజయంబు= నీ గెలుపును; సైఁచి= సహించి; ఘన నిందకున్= గొప్పదైన నిందకు; ఇయ్యకొనంగన్= ఒప్పుకొనుటకు; చాలెన్= సమర్థుడయ్యాడు; వెఱఁగు= ఆశ్చర్యం; అయ్యెడున్= ఔతున్నది; రణవిధంబు= యుద్ధం జరిగిన విధం; అఖిలంబున్= సమస్తాన్ని; ఎఱుంగన్= నాకు తెలిసేటట్లు; చెప్పుమా!= చెప్పుము.

**తాత్పర్యం:** కుమారా! ఆవులను ఎట్లా మరలించగలిగావు? గొప్ప పరాక్రమం కల రాజరాజు మానభంగానికి సహించి పలాయనం చిత్తగించి, నీ గెలుపు అంగీకరించి, నిందకు ఎట్లా ఒప్పుకొనగలిగాడు? నా కాశ్చర్యం వేస్తున్నది. యుద్ధం ఎట్లా జరిగిందో వివరంగా చెప్పుము.'

**విశేషం:** యుద్ధం జరిగిన విధానాన్ని ఊహించుకొంటేనే విరాటుడికి భయంతో నిండిన ఆశ్చర్యం కలిగింది. ఆ యుద్ధం రాజరాజుతో. అతడు అకుంఠిత పరాక్రముడు. అభిమాన ధనుడు. ఓటమిని అంగీకరించనివాడు. అటువంటి వాడి అపార సైన్యాన్ని ఓడించి, ఆవులను మళ్ళించి, అతడిని పలాయనం చిత్తగించేటట్లు చేసిన ఆ యుద్ధం భయంకరంగా జరిగి ఉండాలి. అంతటి యుద్ధాన్ని గురించి, అందులో ఉత్తరుడు సాధించిన విజయాన్ని గురించి తెలిసికొనాలనే ఉత్కంఠ మూర్తి కట్టినట్లున్నది ఈ పద్యం. 'పుత్రా! వెఱఁగయ్యెడున్ । రణవిధం బఖిలంబు నెఱుంగఁ జెపుమా!' - అన్న వాక్యం కొసమెరుపుగా మెరిసిన పాత్రోచిత సందర్భోచిత వాక్య విన్యాస శిల్పానికి మచ్చుతునక. (సంపా.)

**చ. అనవుడు నాతఁ డిట్లనియె 'నక్కురుసేనల నేను గెల్వ; గో**
**ధనమును నే మరల్ప; మన దైవబలంబునఁ జేసి దేవసం**
**జనితుఁడు నాఁగ నర్హమగు చందమువాఁడు మహాత్ముఁ డొక్కరుం**
**డని ననుఁ గాచెఁ; గౌరవుల నందఱ గెల్చి మరల్చె గోవులన్. 284**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆతఁడు= ఉత్తరుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; ఆ+కురుసేనలన్= ఆ కౌరవసేనలను; నేను; గెల్వన్= గెలవలేదు; గోధనమును= ఆవుల మందలనే సంపదను; నేన్= నేను; మరల్పన్= మరలించలేదు; మన దైవబలంబునన్+చేసి= మనయొక్క దైవబలం వలన; దేవ సంజనితుఁడునాఁగన్= దేవతలకు పుట్టిన వాడువలె; అర్హము+అగు= తగిన; చందమువాఁడు= విధంకలవాడు; మహాత్ముఁడు= మహానుభావుడు; ఒక్కరుండు= ఒకడు; అనిన్= యుద్ధమందు; ననున్= నన్ను; కాచెన్= రక్షించాడు; కౌరవులన్= కౌరవులను; అందఱన్= అందరిని; గెల్చి= జయించి; గోవులన్= ఆవులను; మరల్చెన్= మరలించాడు.

**తాత్పర్యం:** అనగా ఉత్తరు డిట్లా అన్నాడు - 'ఆ కౌరవసేనలను నేను గెలవలేదు, ఆవులను మరల్చలేదు. మనకు దైవబలం ఉన్నది కనుక ఒక మహాత్ముడు, దేవాంశ సంభూతుడు వచ్చి యుద్ధంలో నన్ను కాపాడి, కౌరవుల నోడించి, ఆవులను మరలించాడు.

**విశేషం:** 228వ పద్యంలో 'నీ చేసిన యీ పని నాచేఁ గాక యునికి పతి యెఱుఁగఁడొకో! । జనులు నిజము సేయుదురే! నిను నెఱిఁగింపకయ చెప్ప నేర్తునె పొగడన్' - అని అన్నాడు అర్జునుడితో ఉత్తరుడు. తాను విజయం సాధించినట్లు చెప్పితే ఎవ్వరూ నమ్మరని తెలిసిన ఉత్తరుడు అర్జునుడని ఎవరూ గుర్తించకుండా గుప్తంగా అర్జునుడే విజయాన్ని సాధించినట్లు చెప్పాడు. దేవ సంజనితుడు - అనేమాట సార్థకం. దేవకులంలో పుట్టినవాడు, దేవతలకు లేదా దేవుడికి లేదా ఇంద్రుడికి పుట్టినవాడు అనే అర్థం వచ్చేటట్లు అర్జునుడిని సూచించాడు. అసత్యదోషం నుండి, కృతఘ్నతా పాపంనుండి తప్పించుకొన్నాడు.

మాటనేర్పరితనాన్ని ప్రకటించాడు. దేవసంజనితుడో అన్నట్లు ఉత్ప్రేక్షాలంకారంలో చెప్పటం ఔచిత్యం. 'అర్హమగు చందమువాఁడు'- అనే విశేషణంలో ఇప్పటి పేడిరూపంలో కాక సహజమైన ఉజ్జ్వల రూపంలో ఉన్నవాడని భావం. 'మహాత్ముఁడు' - ఇది తెలుగు జాతీయం. అద్భుత ప్రభావం కలవాడిని మహాత్ముడని పిలవటం తెలుగువారి నుడికారం. 'ఒక్కరుండు'- అనే మాట ఏకైకవీరుడై అనే అర్థాన్ని ప్రకటించింది. అత డొక్కడే మూడు పనులు చేశాడు. 1. ఉత్తరుడిని రక్షించాడు, 2. కౌరవులనందరిని గెలిచాడు, 3. ఆవులను మళ్ళించాడు. ఉత్తరుడు అద్భుతయుద్ధక్రీడను భావచిత్రంగా అందించాడు. (సంపా.)

**వ. అత్తెఱంగు వివరించి విన్నవించెద నవధరింపుము. 285**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱంగు= ఆ విధానాన్ని; వివరించి= వివరంగా చెప్పి; విన్నవించెదన్= తమకు మనవి చేస్తాను; అవధరింపుము= వినవలసింది.

**తాత్పర్యం:** ఆ విధానాన్నంతా వివరంగా చెప్పి నీకు మనవి చేస్తాను. వినుము.

**తే. ధూళి పెల్లుగ నెగయంగ నేల గోడి । వడఁగఁ జనుమూఁకఁ గని వడవడ వడంకి**
**పాఱు తేరంగ నమ్మహాభాగుఁ డప్పు । డోడ కోడకు మని నన్నుఁ గూడ వచ్చి. 286**

**ప్రతిపదార్థం:** ధూళి= దుమ్ము; పెల్లుగన్= ఎక్కువగా; ఎగయంగన్= పైకి ఎగురగా; నేల= భూమి; గోడి+పడఁగన్= ఏటవాలుగా ఒక ప్రక్కకు వంగగా; చను= వెళ్ళేడి; మూఁకన్= సేనను; కని= చూచి; వడవడ వడంకి= గజగజ వణికి; పాఱు తేరంగన్= పరుగెత్తగా; ఆ+మహాభాగుఁడు= ఆ మహానుభావుడు; అప్పుడు= ఆ సమయాన; నన్నున్= నన్ను; ఓడకు+ఓడకుము+అని= భయపడకుమని; కూడన్+వచ్చి= కలిసి వచ్చి.

**తాత్పర్యం:** దుమ్ము హెచ్చుగా పైకి లేవగా నేల బరువుకి ఒక ప్రక్క కిందికి దిగిపోయేటట్లుగా వచ్చే సేనలను చూచి నేను గజగజ వణికి పారిపోతూంటే ఆ మహానుభావుడు వచ్చి, భయపడకు మని ధైర్యం చెప్పి, నన్ను కలిసికొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. పట్టుకొని మగుడం గొనిపోయి రథంబుపైఁ బెట్టిన నే నతని యాజ్ఞకు మిగులకుండితి. 287**

**ప్రతిపదార్థం:** పట్టుకొని= నన్ను పట్టుకొని; మగుడన్= మరల; కొనిపోయి= తీసికొనివెళ్ళి; రథంబుపైన్= రథంమీద; పెట్టినన్= పెట్టగా; నేన్= నేను; అతని+ఆజ్ఞకున్= ఆతడు చెప్పిన దానికి; మిగులక+ఉండితిన్= అతిక్రమించకున్నాను.

**తాత్పర్యం:** నన్ను పట్టుకొని తీసికొనివెళ్ళి రథంమీద కూర్చుండపెట్టాడు. అతని ఆజ్ఞ కాదనలేకపోయాను.

**ఉ. కౌరవసేన గోగణముఁ గైకొని పోవ నతండు ముట్టి యం**
**దారసి రాజుఁ గానక యుపాంతమునం దొలఁగించి వేగ నా**
**తే రట దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబు దు**
**ర్వారరయంబు మాన్చి పశువర్గము నిద్దెస వెల్చె నార్చుచున్. 288**

**ప్రతిపదార్థం:** కౌరవసేన= కౌరవులసైన్యం; గోగణమున్= ఆలమందను; కైకొనిపోవన్= తోలుకొనిపోగా; అతండు= ఆ దివ్యపురుషుడు; ముట్టి= ముట్టడించి; అందున్= అందులో; ఆరసి= వెదకి; రాజున్= రాజును-దుర్యోధనుడిని; కానక=

చూడక-కనబడనందున; ఉపాంతమునన్= సమీపమందు; తొలఁగించి= మరలించి; వేగన్= వేగంగా; నా తేరు= నా రథాన్ని; అటన్= అక్కడికి; తోలి= తోలినవాడై; అడ్డపడి= వారికి అడ్డంవెళ్ళి; తీవ్రశరంబులన్= వాడియైన బాణాలతో; ఆ+బలంబు= ఆ సేనయొక్క; దుర్వార= వారింపరాని; రయంబు= వేగం; మాన్చి= మాన్పి; పశువర్గమున్= ఆవుల మందను; ఈ+దెసన్= ఈ వైపునకు; ఆర్చుచున్= కేకలు వేస్తూ; వెల్చెన్= తోలాడు, మరలించాడు.

**తాత్పర్యం:** మన ఆవులమందను కౌరవసేన తోలుకొనిపోతూ ఉంటే అతడు అడ్డంవెళ్ళి అక్కడ దుర్యోధనుడు లేకపోగా రథాన్ని మరొకవైపు మళ్ళించి ఆ సేనకు అడ్డుపడి వాడిఅయిన బాణాలతో ఆ సేన వేగాన్ని ఆపి కేకలువేస్తూ ఆవుల మందలను ఇటు మరలించాడు.

**ఆ. చెదరకుండఁ బసులఁ బొదివి యించుకమేర । యిక్క డరుఁగుదెంచి యెలమి మగిడి**
**కడచి పోవుచున్న కౌరవపతి ముట్ట । నడరినంత సేన లతనిఁ గూడె. 289**

**ప్రతిపదార్థం:** చెదరక+ఉండన్= చెదిరిపోకుండా; పసులన్= ఆవులను; పొదివి= కమ్ముకొని; ఇంచుక మేర= కొద్దిమేర; ఇక్కడన్= ఇటువైపు; అరుగుదెంచి= వచ్చి; ఎలమిన్= ఉత్సాహంతో; మగిడి= తిరిగి; కడచిపోవుచున్+ఉన్న= దాటుకొనిపోతున్న; కౌరవపతిన్= దుర్యోధనుడిని; ముట్టన్= ఆక్రమించుటకు; అడరిన+అంతన్= ప్రయత్నించునంతలో; సేనలు= కౌరవసేనలు; అతనిన్= ఆ దివ్యపురుషుడిని; కూడెన్= చుట్టుముట్టాయి.

**తాత్పర్యం:** గోవులు చెదరిపోకుండా చుట్టు కావలికాసి కొంచెంసేపు ఇక్కడ ఉండి, మరల అక్కడికి వెళ్ళి ఉత్సాహంగా దాటుకొనిపోయే దుర్యోధనుడిని అడ్డగించేటంతలో సేనలు ఆ దివ్యపురుషుడిని చుట్టుముట్టాయి.

**మ. కురురాజున్ సబలంబుగాఁ గవిసినన్ ఘోరాహవం బయ్యెఁ; నం**
**దరదంబుల్ నుఱుమయ్యె, నశ్వములు నుగ్గయ్యెం, గరివ్రాతముల్**
**ధర దంతంబుల యూఁతగా నొఱగె, నుద్యద్బాహుదృప్యద్భటో**
**త్కరముల్ తిట్టినయట్లు గూలెఁ గలయం దద్బాణపాతంబులన్. 290**

**ప్రతిపదార్థం:** కురురాజున్= దుర్యోధనుడును; సబలంబుగాన్= సేనతోకూడి; కవిసినన్= ఎదుర్కొనగా; ఘోర= భయంకరమైన; ఆహవంబు= యుద్ధం; అయ్యెన్= అయింది; అందున్= ఆ కౌరవసేనలో; అరదంబుల్= రథాలు; నుఱుము+అయ్యెన్= ముక్కలు ముక్కలు అయ్యాయి; అశ్వములు= గుర్రాలు; నుగ్గు+అయ్యెన్= పిండి అయ్యాయి; కరివ్రాతముల్= ఏనుగుల గుంపులు; ధరన్= భూమిపై; దంతంబుల= దంతములే; ఊఁతగాన్= ఆధారంగా; ఒఱగెన్= వాలిపోయాయి; ఉద్యత్= ఉద్యమిస్తున్న; బాహు= భుజాలతో; దృప్యత్= గర్విస్తున్న; భట= సైనికుల యొక్క; ఉత్కరముల్= సమూహాలు; తద్+బాణ= ఆ దివ్యపురుషుడి బాణాల యొక్క; పాతంబులన్= దెబ్బలతో; కలయన్= నాల్గువైపులందు; తిట్టిన+అట్లున్= శపించినట్లుగా; కూలెన్= నేలకొరిగాయి, చనిపోయాయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కూడా సేనతో సహా ఎదురు తిరిగాడు. దానితో యుద్ధం ఘోరంగా జరిగింది. దానిలో రథాలు పిండి అయిపోయాయి. గుర్రాల నుగ్గు అయిపోయాయి. ఏనుగులు దంతాలు ఆధారంగా నేలమీదికి ఒరిగిపోయాయి. భుజబలంతో గర్వించిన సైనికులు ఆయన బాణాల దెబ్బలకు శపించినట్లుగా నాలుగు మూలలా పడిపోయారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**క. శత్రుంతపాదు లగు నృప । పుత్రులుఁ బేరు గల యోధపుంగవులును ద**
**చ్చిత్ర శరనిహతి సంగర । ధాత్రిఁ బడిరి వారి నెన్నఁ దడవై యుండున్. 291**

**ప్రతిపదార్థం:** శత్రుంతప+ఆదులగు= శత్రుంతపుడు మున్నగు; నృపపుత్రులున్= రాజకుమారులును; పేరుగల= కీర్తిగల; యోధపుంగవులును= వీరశ్రేష్ఠులును; తద్= ఆ దివ్యపురుషుడి యొక్క; చిత్ర= విచిత్రమైన; శరనిహతిన్= బాణాల దెబ్బతో; సంగరధాత్రిన్= యుద్ధభూమిలో; పడిరి= పడిచచ్చారు; వారిన్= వారినందరిని; ఎన్నన్= లెక్కపెట్టటానికి; తడవు+ఐ= ఆలస్యమై; ఉండున్= ఉంటుంది. (అంటే - ఆలస్యమౌతుందని భావం).

**తాత్పర్యం:** శత్రుంతపుడు మున్నగు రాజకుమారులు, ఇంకా పేరెక్కిన యోధశ్రేష్ఠులు ఆ దివ్యపురుషుడు వేసిన విచిత్రమైన బాణపు దెబ్బలకు యుద్ధభూమిలో పడిపోయారు. వారందరినీ లెక్కపెట్టి చెప్పాలంటే చాలా ఆలస్యం అవుతుంది.

**తే. మొనలు దెరలినఁ గర్ణుండు ముంచి తాఁక । నమ్మహావీరుఁ డాతనితమ్ముఁ జంపి**
**హరుల నొప్పించి సూతు నో నాడ నేసి । యంగముల బాణములు నించి యతనిఁ బఱపె. 292**

**ప్రతిపదార్థం:** మొనలు= సేనలు; తెరలినన్= పారిపోగా; కర్ణుండు= కర్ణుడు; ముంచి= అతిశయించి; తాఁకన్= ఎదుర్కొనగా; ఆ+మహావీరుఁడు= ఆ దివ్యవీరుడు; ఆతని తమ్మున్= ఆ కర్ణుడి తమ్ముడిని; చంపి= చంపేసి; హరులన్= గుర్రాలను; నొప్పించి= బాధకల్గేటట్లు కొట్టి; సూతున్= సారథిన్; నోనాడన్= నొచ్చేటట్లుగా; ఏసి= వేసి; అంగములన్= అవయవాలందు; బాణములు; నించి= నింపి; అతనిన్= కర్ణుడిని; పఱపెన్= పారిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** సేనలు పారిపోయేసరికి కర్ణుడు అతిశయించి ఎదుర్కొన్నాడు. ఆ మహావీరుడు అప్పుడు అతని తమ్ముడిని చంపి, అతడి గుర్రాలను కొట్టి, సారథికి బాధ కలిగేటట్లు కొట్టి, అతడి శరీరంమీద బాణాలు వేసేసరికి అతడు పారిపోయాడు.

**క. గురుఁడు తలపడిన నతఁ డ । చ్చెరువుగ దివ్యాస్త్రవితతిఁ జిక్కువఱిచి త**
**ద్వరసుతుఁడుఁ గృపుఁడుఁ దాఁకినఁ । దెరలిచి భీష్మునకుఁ గవిసె దృఢరభసమునన్. 293**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; తలపడినన్= ఎదుర్కొనగా; అతఁడు= ఆ మహావీరుడు; అచ్చెరువుగన్= ఆశ్చర్యంగా; దివ్య+అస్త్రవితతిన్= దివ్యమైన అస్త్రాల సముదాయంతో; చిక్కువఱిచి= బాధకల్గించి; తద్+వరసుతుఁడున్= ఆయన కుమారుడు- అశ్వత్థామయు; కృపుఁడున్= కృపాచార్యుడును; తాఁకినన్= ఎదుర్కొనగా; తెరలిచి= పరుగెత్తించి; భీష్మునకున్= భీష్ముడిని; దృఢ= గట్టి; రభసమునన్= వేగంతో; కవిసెన్= ఎదిరించాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు ఎదిరించగా ఆశ్చర్యం కలిగేటట్లు ఎన్నో దివ్యాస్త్రాలు వేసి అతడినే చిక్కులలో పడేశాడు. ఆపైన అశ్వత్థామ, కృపుడు ఎదిరించారు. ఆ దివ్యపురుషుడు దెబ్బకు వారిని పారిపోయేటట్లు చేసి, మహావేగంతో భీష్ముడిని ఎదిరించాడు.

**మ.** **అతనిం దీవ్రశరంబులం బొదివి నానాస్త్రంబు లేసెన్ నదీ**
**సుతుఁడుం దత్సమయంబునం గినియ నా శూరుండు చాపంబు ద్రుం**
**చి తదీయాంగము నొంచినన్ వివశుఁడై చేడ్పడ్డచో సూతుఁ డు**
**ద్గత భీతిం దొలఁగంగఁ దోలె రథముం దత్ప్రాణరక్షార్థియై.** **294**

**ప్రతిపదార్థం:** నదీసుతుఁడున్= భీష్ముడుకూడా; అతనిన్= ఆ దివ్యపురుషుడిని; తీవ్రశరంబులన్= తీవ్రమైన బాణాలతో; పొదివి= చుట్టుముట్టి; నానా+అస్త్రంబులు= అనేక రకాలైన అస్త్రాలను; ఏసెన్= వేశాడు; తద్+సమయంబునన్= ఆ సమయంలో; కినియన్= కోపించగా; ఆ శూరుండు= ఆ దివ్యపురుషుడు; చాపంబు= ధనుస్సును; త్రుంచి= తెగగొట్టి; తదీయ+అంగము= అతడి శరీరం; నొంచినన్= నొప్పి కలిగేటట్లుచేయగా; వివశుఁడు+ఐ= వశం తప్పి; చేడ్పడ్డచోన్= బాధను పొందగా; సూతుఁడు= సారథి; ఉద్గత= బయలుదేరిన; భీతిన్= భయంతో; రథమున్= రథాన్ని; తద్= ఆ భీష్ముడియొక్క; ప్రాణ= ప్రాణాలయొక్క; రక్షా+అర్థి+ఐ= రక్షణను కోరినవాడై; తొలఁగంగన్= తొలగేటట్లు; తోలెన్= తోలాడు.

**తాత్పర్యం:** భీష్ముడిపై బాణాలు వేయగా భీష్ముడు ఆ సమయంలో కోపంతో దివ్యాస్త్రా లెన్నో వేశాడు. అపుడు ఆ దివ్యపురుషుడు భీష్ముడి ధనుస్సు విరిచి, అతడి శరీరానికి నొప్పికలిగేటట్లు కొట్టగా, భీష్ముడు వశం తప్పినవాడై బాధపడగా సారథి అతడి ప్రాణరక్షణకై రథాన్ని మరొకచోటికి తప్పించాడు.

**క.** **తమ తమ బలములతో ని । ట్లమిత భుజావీర్యులైన యా రథికవరుల్**
**గ్రమమునఁ దలపడి యోడిన । సమరవిహారమునఁ దనివి సనక యతండున్.** **295**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అమిత= మితంలేని; భుజా వీర్యులు+ఐన= భుజపరాక్రమం కల; ఆ రథికవరుల్= ఆ రథిక శ్రేష్ఠులు; తమతమ బలములతోన్= వారి వారి సేనలతో; క్రమమునన్= వరుసగా; తలపడి= ఎదిరించి; ఓడినన్= ఓడిపోగా; అతండున్= ఆ దివ్యవీరుడుకూడ; సమరవిహారమునన్= యుద్ధమందు విహరించటంలో; తనివి+చనక= తృప్తిపొందక.

**తాత్పర్యం:** అమితమైన పరాక్రమం కల ఆ రథికశ్రేష్ఠులు వారివారి సేనలతో వరుసగా ఎదుర్కొని ఓడిపోగా, ఆ దివ్యపురుషుడు యుద్ధవిహారంలో ఇంకా తనివితీరక.

**మ.** **ధరణీనాథుఁడు దానుఁ దమ్ములును దుర్దాంతోద్ధతిం గూడి మో**
**హర మత్యూర్జితభంగి నేర్చికొని యుద్యద్విక్రమం బొప్ప బం**
**ధుర సంరంభత నున్నఁ జూచి బలవద్దోఃస్తంభలీలా భయం**
**కర రేఖా వలమానచాపుఁ డయి వీఁకం దాఁకె నాసేనతోన్.** **296**

**ప్రతిపదార్థం:** ధరణీనాథుఁడు= రాజు - దుర్యోధనుడు; తాను= అతడును; తమ్ములును= అతడి తమ్ములును; కూడి= కలిసికొని; దుర్దాంత= అణచలేని; ఉద్ధతిన్= గర్వంతో; అతి+ఊర్జిత భంగిన్= బాగా బలంకలిగినరీతిలో; మోహరము= వ్యూహమును; ఏర్చికొని= తయారుచేసి; ఉద్యత్+విక్రమంబు= అతిశయిస్తున్న పరాక్రమం; ఒప్పన్= ప్రకాశించగా; బంధుర= రమ్యమైన; సంరంభతన్= హడావిడితో; ఉన్నన్= ఉండగా; చూచి= కలయజూచి; బలవత్= బలంకల; దోఃస్తంభ= స్తంభాలవంటి బాహువులయొక్క; లీలా= విలాసంతో; భయంకర రేఖా= భీతిగొల్పేరీతిగా; వలమాన= త్రిప్పునట్టి; చాపుఁడు+అయి= ధనుస్సుకలవాడై; ఆ సేనతోన్= ఆ కౌరవసేనతో; వీఁకన్= ఉత్సాహంతో; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడూ, అతని తమ్ముళ్లూ కలిసి చాలా గొప్పగా ఎవ్వరూ జయించలేని రీతిలో ఒక వ్యూహం మోహరించుకొనగా ఇతడు తన భుజబల విలాసంతో ధనుస్సును చిత్రంగా త్రిప్పుతూ ఆ సేనతో ఢీకొన్నాడు.

**క. కౌరవపతి యనుజన్ముల । దూరమునన్ విశిఖనిహతిఁ దొలఁగ జడియుచుం**
**జేరి వికర్ణునికరి నొక । నారసమునఁ గూల్చి కదిసి నరపతి నేసెన్. 297**

**ప్రతిపదార్థం:** కౌరవపతి= దుర్యోధనుడి యొక్క; అనుజన్ములన్= తమ్ముళ్లను; దూరమునన్= దూరంగా; విశిఖ నిహతిన్= బాణపు దెబ్బతో; తొలఁగన్= తొలగేటట్లుగా; జడియుచున్= త్రోయుచు; చేరి= సమీపించి; వికర్ణుని కరిన్= వికర్ణుడి ఏనుగును; ఒక నారసమునన్= ఒక బాణంతో; కూల్చి= చంపి; కదిసి= సమీపించి; నరపతిన్= దుర్యోధనుడిని; ఏసెన్= బాణాలతో నొప్పించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడి తమ్ముళ్లను దూరంనుండే బాణపుదెబ్బలకు హడలిపోయి పారిపోయేటట్లుగా కొట్టి, వికర్ణుడి ఏనుగును ఒక బాణంతో చంపి, దుర్యోధనుడు నొచ్చేటట్లుగా బాణాలు వేశాడు.

**తే. రాజు నొచ్చిన విఱిగిరి రథికవరులు । విభుఁడు దోడన తిరిగె, నవ్వీరుఁ డపుడు**
**దోలి యా చిక్కుమూఁకలతోడఁ గూడ । నతని దవ్వుల నడవికి నడిచి మగిడె. 298**

**ప్రతిపదార్థం:** రాజు= దుర్యోధనుడు; నొచ్చినన్= బాధపడగా; రథికవరులు= రథిక శ్రేష్ఠులు; విఱిగిరి= వెనుదిరిగిరి; విభుఁడు= దుర్యోధనుడు; తోడన్+అ= వెంటనే; తిరిగెన్= వెనుదిరిగాడు; ఆ+వీరుఁడు= ఆ దివ్యపురుషుడు; అపుడు= ఆ సమయంలో; తోలి= పారద్రోలి; ఆ చిక్కుమూఁకలతోడన్+కూడన్= ఆ మిగిలిన సేనలతో కూడా; అతనిన్= ఆ దుర్యోధనుడిని; దవ్వులన్= దూరంగా; అడవికిన్= అడవిలోనికి; అడిచి= పంపించి; మగిడెన్= మరలాడు.

**తాత్పర్యం:** రాజుకు దెబ్బతగలటంతో రథికులందరూ వెనుదిరిగారు. వెంటనే రాజు వెనుదిరిగాడు. ఆ దివ్యపురుషుడు అప్పుడు మిగిలిన సేనతో సహా అతడిని చాలదూరం తరిమి అడవిలోనికి పంపించి తిరిగివచ్చాడు.

**వ. ఇది యమ్మహాపురుషు చేసిన విధం' బనిన విని యచ్చెరువంది విరాటుండు. 299**

**ప్రతిపదార్థం:** ఆ+మహాపురుషు= ఆ దివ్యపురుషునియొక్క; చేసిన విధంబు= చేసినరీతి; ఇది= ఈ విధమైనది; అనినన్= అనగా; విని; అచ్చెరువు= ఆశ్చర్యం; అంది= పొంది; విరాటుండు= విరాటరాజు.

**తాత్పర్యం:** ఆ దివ్యపురుషుడు ఈ విధంగా చేశాడు' అనటంతో విని విరాటరాజు ఆశ్చర్యంపొంది.

**ఆ. 'ఆతఁ డెవ్వఁ డొక్కో! యమ్మహాత్మునిఁ గనుం । గొనఁగఁ గౌఁగిలింప వినయ మొప్ప**
**నర్ఘ్యపాద్యవిధుల నర్చింప భక్తిసం । యుక్తి నెపుడుఁ గొలిచి యుండవలయు. 300**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ దివ్యపురుషుడు; ఎవ్వఁడు+ఒక్కొ= ఎవడోకదా; ఆ+మహాత్మునిన్= ఆ మహాత్ముని; కనుంగొనఁగన్= చూడగా; కౌఁగిలింపన్= కౌగిలించుకొనగా; వినయము+ఒప్పన్= వినయం ఒప్పారేటట్లుగా; అర్ఘ్య= చేతులు కడిగికొనే నీరు; పాద్య= పాదాలు కడిగికొనే నీరు; విధులన్= ఇట్టి విధులతో; అర్చింపన్= పూజించగా; భక్తి సంయుక్తిన్= భక్తితో కూడి; ఎపుడున్= ఎప్పుడును; కొలిచి+ఉండన్+వలయున్= సేవిస్తూ ఉండవలెను.

**తాత్పర్యం:** 'అతడు ఎవడోకాని ఆ మహాత్ముడు కనిపిస్తే కౌగిలించుకొనాలి, వినయంగా అర్ఘ్యపాద్యాదు లిచ్చి పూజించాలి. భక్తితో ఎప్పుడూ ఆయనను కొలవాలి.

**క. ఎచ్చోట నున్నవాఁ డతఁ? డిచ్చోటికి నేల రాఁడొ! యిప్పు?' డనుడుఁ దా**
**నచ్చట నంతర్హితుఁడై । యిచ్చఁ జనియెఁ; దోఁచు నేఁటి యెల్లిటిలోనన్. 301**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ దివ్యపురుషుడు; ఏ+చోటన్+ఉన్నవాఁడు?= ఎక్కడ ఉన్నాడు?; ఈ+చోటికిన్= ఇక్కడికి; ఇప్పుడు; ఏల రాఁడొ= ఎందుకు రాడో!; అనుడున్= అనగా; తాన్= అతడు; అచ్చటన్= ఆ యుద్ధభూమిఅందే; అంతర్హితుఁడు+ఐ= అంతర్ధానమైనవాడై; ఇచ్చన్= తన ఇష్టం వచ్చినట్లు; చనియెన్= వెళ్ళాడు; నేఁటి యెల్లిటిలోనన్= ఈ రోజు, రేపటిలో; తోఁచున్= కనిపిస్తాడు.

**తాత్పర్యం:** అతడు ఎక్కడ ఉన్నాడు? ఇప్పుడు ఇక్కడికి ఎందుకు రాడు?' అని విరాటుడు అనగా ఉత్తరుడు 'అతడు అక్కడనే అంతర్ధానమై తన ఇష్టం వచ్చిన చోటికి వెళ్ళాడు. ఈ రోజుకాని, రేపుకాని ఇక్కడ కనిపించవచ్చును.

**ఉ. దేవకుమారకుండ యగుఁ దేజము చందము చూడ; నాతఁ డీ**
**గోవులఁ గ్రమ్మఱించుటకుఁ గూడినయంతియ కాదు; నాకు సం**
**భావన సేయు వత్సలతభంగులఁ దా మనవంశ మంతయుం**
**గావను బ్రోవనుం దలఁపు గల్గుట దెల్లము సేసె నెంతయున్'. 302**

**ప్రతిపదార్థం:** తేజము చందము= తేజస్సుయొక్క రీతి; చూడన్= చూడగా; దేవకుమారకుండు+అ= దేవతల కుమారుడే; అగున్= అగును; ఆతఁడు= ఆ దివ్యపురుషుడు; ఈ గోవులన్= వారు తోలుకొనిపోయే గోవులను; క్రమ్మఱించుటకున్= మరల్చటానికి; కూడిన+అంతియ కాదు= నాతో చేరినవాడు మాత్రమే కాదు; నాకున్= ఉత్తరునకు; సంభావన+చేయు= గౌరవించు; వత్సలత= వాత్సల్యం యొక్క; భంగులన్= రీతులతో; తాన్= తాను; మన వంశము= మన వంశమును; అంతయున్= అంతను; కావనున్+ప్రోవనున్= రక్షించి పాలించటానికి; తలఁపు= అభిప్రాయం; కల్గుట= ఉండటం; ఎంతయున్= మిక్కిలిగా; తెల్లము+చేసెన్= స్పష్టం చేశాడు.

**తాత్పర్యం:** అతని తేజస్సుయొక్క రీతి చూస్తే దేవతల కుమారుడే అనిపిస్తుంది. అతడు ఈ గోవులను మరల్చటం కొరకేకాదు వచ్చింది, నా మీద ఎంతో ఆదరం, వాత్సల్యం చూసి, మన వంశాన్ని అంతటిని రక్షించే తలంపు తనకు ఉన్నదని ఎంతగానో స్పష్టంచేశాడు.'

**వ. అని చెప్పి యుత్తరుం డతనిం బ్రమోదాయత్తచిత్తుం జేసె; నట్టి సమయంబునఁ గౌంతేయాగ్రజుండు ముఖప్రాంతంబు పై చీర చెఱంగునం బొదివికొని ధనంజయునిఁ జక్కం జూడక యుండె; విరాటుండు కిరీటి పరాక్రమంబు క్రమంబున నిట్లు దనతనయునివలన వినియునుం దెలియక యెప్పటి నపుంసకత్వ బుద్ధితోడన సంభావించి పోవం బనిచిన, బృహన్నలయును 'జతురంబుగాఁ బలికి; తిఱియ తెలుపు తెఱంగు; ధర్మనందనునకు నింతకు మిక్కిలి యెఱింగింపకుండునది' యని వైరాటితో నల్లన చెప్పచుం జనియె; నజ్జననాయకుండును గంకునిం బొమ్మని, యుచితపరివారపరివృతుండయి భూమింజయు**

**నంతిపురంబునకుం దోడ్కొని యరిగి సుదేష్ణాసందర్శన సమాచరణంబు నడపి, యతం డడుగఁ ద్రిగర్తపతి**
**నోర్చిన తెఱం గెఱింగించె; నట నరుండు నాట్యశాలకుం బోయి. 303**

**ప్రతిపదార్థం:** అనిచెప్పి= ఈ విధంగా చెప్పి; ఉత్తరుండు= ఉత్తరుడు; అతనిన్= విరాటుని; ప్రమోద+ఆయత్త= సంతోషానికి అధీనమైన; చిత్తున్= మనస్సు కలవాడినిగా; చేసెన్= చేశాడు; అట్టి సమయంబునన్= అటువంటి సమయంలో; కౌంతేయ+ అగ్రజుండు= ధర్మరాజు; ముఖప్రాంతంబుపైన్= ముఖం దాపులను; చీర చెఱంగునన్= గుడ్డ చివరతో; పొదివికొని= కప్పుకొని; ధనంజయునిన్= అర్జునుడిని; చక్కన్= సూటిగా; చూడక+ఉండెన్= చూడకుండా ఉండిపోయాడు; విరాటుండు= విరాటరాజు; కిరీటి పరాక్రమంబు= అర్జునుడి పరాక్రమాన్ని; క్రమంబునన్= వరుసగా; ఇట్లు= ఈ రీతిగా; తన తనయునివలనన్= తన కొడుకు ద్వారా; వినియున్= వినికూడా; తెలియక= తెలిసికొనలేక; ఎప్పటి= మునుపటి; నపుంసకత్వ బుద్ధితోడన్+అ= పేడియనే జ్ఞానంతోనే; సంభావించి= గౌరవించి; పోవన్+పనిచినన్= వెళ్ళుటకు అనుమతి ఇయ్యగా; బృహన్నలయును= బృహన్నలకూడా; చతురంబుగాన్= నేర్పుగా; పలికితి(వి)= చెప్పితివి; ఇది+అ తెలుపు తెఱంగు= ఇదే తెలుపటానికి తగినరీతి; ధర్మనందనునకున్= ధర్మరాజునకు కూడా; ఇంతకున్ మిక్కిలి= ఇంతకంటె ఎక్కువగా; ఎఱింగింపక+ఉండునది= చెప్పకూడదు; అని; వైరాటితోన్= ఉత్తరుడితో; అల్లనన్= మెల్లగా; చెప్పుచున్= పలుకుతూ; చనియెన్= వెళ్ళాడు; ఆ+జన నాయకుండును= ఆ విరాటరాజుకూడా; కంకునిన్= కంకుభట్టును; పొమ్ము+అని= వెళ్ళుమని; ఉచిత= తగిన; పరివార= భటులతో; పరివృతుండు+అయి= కూడినవాడై; భూమింజయున్= ఉత్తరుడిని; అంతిపురంబునకున్= అంతఃపురానికి; తోడ్కొని అరిగి= వెంటబెట్టుకొనివెళ్ళి; సుదేష్ణా= సుదేష్ణయొక్క; సందర్శన సమాచరణంబున్= దర్శనం చేసే క్రియను; నడపి= నిర్వర్తించి; అతండు= ఉత్తరుడు; అడుగన్= అడుగగా; త్రిగర్తపతిన్= త్రిగర్తదేశ రాజును; ఓర్చినతెఱంగు= ఓడించిన విధమును; ఎఱింగించెన్= తెలిపాడు; అటన్= అక్కడ; నరుండు= అర్జునుడు; నాట్యశాలకున్= నాట్యశాలకు; పోయి= వెళ్ళి.

**తాత్పర్యం:** విరాటరాజు అడిగిన దానికి ఉత్తరుడు ఆ విధంగా చెప్పి సంతోషాన్ని కలిగించాడు. అప్పుడు ధర్మరాజు ముఖాన్ని గుడ్డతో కప్పుకొని, అర్జునుడిని సూటిగా చూడకుండానే ఉండిపోయాడు. విరాటరాజు అర్జునుడి పరాక్రమం ఉత్తరుడు ఎంత చెప్పినా (అది అక్కడి బృహన్నల పరాక్రమమని) తెలిసికొనలేకపోయాడు. బృహన్నల మునుపటి 'పేడి' వలెనే భావించి వెళ్ళుమని అనుమతించాడు. వెళ్ళుతూ అర్జునుడు ఉత్తరుడితో మెల్లగా ఇట్లా అన్నాడు - 'నీవు చాలా నిపుణంగా మాట్లాడావు. నీవు చెప్పవలసిన పద్ధతి ఇదే. ధర్మరాజుతో కూడా ఇంతకన్న ఎక్కువగా చెప్పకూడదు'- అని మెల్లగా మాట్లాడుతూ వెళ్ళాడు. విరాటుడు ఉత్తరుడిని తీసికొని, కొద్ది పరివారంతో సుదేష్ణ అంతఃపురానికి వెళ్ళి ఆవిడను చూచి, ఉత్తరుడు అడుగగా త్రిగర్త దేశాధిపతిని ఎట్లా జయించాడో చెప్పాడు. అక్కడ బృహన్నల నాట్యశాలకు వెళ్ళి.

### అర్జునుఁ డుత్తరకు బొమ్మపొత్తికలుగాఁ గురువీరుల శిరోంబరంబు లిచ్చుట

**తే.** **చెలులుఁ దానును నుత్తర యెలమిఁ దన్నుఁ । గాంచుటయుఁ బ్రీతి యెసలార గారవించి**
**'బొమ్మపొత్తిక లడిగితి కొమ్మ! యింద' । మనుచు నిచ్చెఁ దాఁ దెచ్చిన యంబరములు. 304**

**ప్రతిపదార్థం:** ఉత్తర= ఉత్తరాకుమారి; చెలులున్= చెలికత్తెలును; తానును= తానుకూడా; ఎలమిన్= సంతోషంతో; తన్నున్= బృహన్నలను; కాంచుటయున్= చూడగా; ప్రీతి= ఇష్టం; ఎసలారన్= అతిశయించగా; గారవించి= గౌరవించి; బొమ్మపొత్తికలు= బొమ్మలకు అలంకరించే వస్త్రాలు; అడిగితి(వి)= అడిగావు; ఇందము= ఇదిగో; కొమ్మ!= తీసికొనుమా!; అనుచున్= అని పలుకుతూ; తాన్= బృహన్నల; తెచ్చిన అంబరములు= తెచ్చిన వస్త్రాలను; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** ఉత్తర చెలికత్తెలూ తానూ కలిసి బృహన్నలను చూడటానికి రాగా, అతడు ప్రీతితో గౌరవించి, 'నేను యుద్ధానికి వెళ్ళేటప్పుడు బొమ్మపొత్తికలు తెమ్మన్నావు కదా! తెచ్చాను. ఇంద ఇవిగో, తీసికొమ్ము' అని తాను తెచ్చిన తలపాగ గుడ్డలు ఆమెకు ఇచ్చాడు.

**విశేషం:** ఇంద, ఇందము-అనే దేశిపదాలు ఇదిగో తీసికొమ్ము అనే అర్థంలో అప్యాయంగా అనేవి. ఇంద అనే పదం తమిళంలో కూడా ఇదే అర్థంలో ఉన్నది. కాబట్టి కొమ్మ! ఇంద= అంటే ఓ యువతీ! ఇదిగో తీసికో! అని కూడా అర్థం చెప్పవచ్చును. మూలంలో బృహన్నల విరాటుడి అనుమతితో బొమ్మపొత్తికలను ఉత్తరకు బహూకరించినట్లు ఉన్నది. ఆ కథనానికి ఒక ప్రయోజనం ఉన్నది. శత్రువీరుల తలపాగలు విజయ చిహ్నాలు. వాటిని విరాటునికి తెలిసేటట్లు ప్రకటించటం అందులోని గడుసుదనం. తిక్కన ఈ చర్యను మార్చాడు. బృహన్నలకూ ఉత్తరకూ నడుమ ఉన్న గురుశిష్యవాత్సల్య సంబంధానికి చిహ్నంగా మాత్రమే భావించాడు. మూలంలోనిది రాజకీయం; తిక్కన రచనలోనిది ఆత్మీయం. (సంపా.)

**వ. ఇవ్విధంబునఁ గృతకృత్యుం డయి యథాపూర్వంబుగా మజ్జన భోజనంబులు సలిపి, ధర్మతనయు నివాసంబునం దేకాంత స్థలంబునఁ దా రేవురును ద్రౌపదియును గూడఁబడునట్టి తెఱంగు సంఘటించి, సమాగమ సముచిత ప్రకారంబు నడపి, గోగణ నివర్తనంబును రణప్రవర్తనంబును నన్యోన్య విదితంబులైన యనంతరంబ యగ్రజు నుద్దేశించి బీభత్సుండు భీమసేనున కిట్లనియె. 305**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; కృత్యకృత్యుండు+అయి= అర్జునుడు చేయవలసిన పని చేసినవాడై; యథాపూర్వంబుగాన్= పూర్వంవలెనే; మజ్జన= స్నానం; భోజనంబులు= భోజనం చేయటం; చలిపి= చేసి; ధర్మతనయు నివాసంబునందున్= ధర్మరాజు నివాసంలో; ఏకాంత స్థలంబునన్= రహస్య స్థలంలో; తారు= తాము-పాండవులు; ఏవురును= అయిదుగురును; ద్రౌపదియునున్= ద్రౌపదికూడ; కూడఁబడునట్టి తెఱంగు= కలిసికొనే విధం; సంఘటించి= సమకూర్చి; సమాగమ= సమావేశానికి; సముచిత ప్రకారంబు= తగిన రీతి; నడపి= చేసి; గోగణ= గోవుల మందలయొక్క; నివర్తనంబును= మరలింపున్నూ; రణప్రవర్తనంబును= యుద్ధంచేసిన ప్రకారమున్నూ; అన్యోన్య విదితంబులు+ఐన= పరస్పరం ఒకరి కొకరికి తెలుపుకొనిన; అనంతరంబు+అ= తర్వాతే; అగ్రజున్+ఉద్దేశించి= ధర్మరాజు విషయమై; బీభత్సుండు= అర్జునుడు; భీమసేనునకున్= భీముడితో; ఇట్లు= చెప్పబోయే ప్రకారంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా చేయవలసిన పనినంతా అర్జునుడు చేసేసినవాడై, పూర్వంవలె స్నానం, భోజనం చేసి, ధర్మరాజు నివాసంలోని ఒక రహస్యస్థలంలో తాము, పాండవులు ఐదుగురునూ, ద్రౌపదీ కలిసికొనే విధానాన్ని సమకూర్చి, సమావేశ మర్యాదలు పాటించి, ఉత్తర గోగ్రహణంలో ఆవులను మరల్చిన విధానాన్నీ, దక్షిణ గోగ్రహణంలో యుద్ధం జరిగిన పద్ధతినీ పరస్పరం చెప్పుకొన్నారు. ఆ తరువాత అర్జునుడు ధర్మరాజును గురించి భీముడితో ఇట్లా అడిగాడు.

**విశేషం:** 305 నుండి 313వ పద్యం వరకు ఉన్న కథాభాగం అమూలకం.

**క. 'మొగ మొప్పదు నా దెస నీ। జగతీనాథునకు; నే విచారించియునుం**
**దగ దీనికిఁ గారణ మిది। యగు నని యేర్పఱుపనేరనయ్యెద నెట్లున్.' 306**

**ప్రతిపదార్థం:** ఈ జగతీనాథునకున్= ఈ ధర్మరాజునకు; నా దెసన్= నా వైపు; మొగము= ముఖం కనపరచటం; ఒప్పదు= ఇష్టంగా లేదు; ఏన్= నేను; విచారించియునున్= ఆలోచించికూడా; దీనికిన్= ఇట్లా చేయటానికి; తగన్= తగినటువంటి; కారణం= హేతువు; ఇది అగును+అని= ఇది కాగలదని; ఎట్లున్= ఏ రీతిగాను; ఏర్పఱుప నేరన్+అయ్యెదన్= నిర్ణయించలేకపోతున్నాను.

**తాత్పర్యం:** 'ఈ మన అన్నగారు నా వైపు సరిగా మొగమెత్తి చూడనే లేదు. దీనికి కారణం ఏమి అయి ఉంటుందా? అని ఎంత ఆలోచించినా దీనికి కారణ మిది అని నిర్ణయించలేకపోతున్నాను.'

**వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె. 307**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అతనికిన్= అర్జునుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఒం డేమియు లేదు; విరా । టుం డాత్మతనూజుఁ బొగడుడును దుర్దమ దో**
**ర్దండత గల్గు బృహన్నల । యుండఁ గొఱఁత యేమి పగఱ నోర్చుట కంటిన్. 308**

**ప్రతిపదార్థం:** ఒండు= వేరు కారణం; ఏమియున్= ఏదియును; లేదు; విరాటుండు= విరాటరాజు; ఆత్మతనూజున్= తన కొడుకును; పొగడుడును= పొగడగా; దుర్దమ= అణచలేని; దోర్దండత= భుజబలం; కల్గు= కల్గిన; బృహన్నల ఉండన్= బృహన్నల ఉండగా; పగఱన్= శత్రువులను; ఓర్చుటకున్= ఓడించటానికి; కొఱఁత= లోటు; ఏమి= ఏమిటి; అంటిన్= అన్నాను.

**తాత్పర్యం:** 'ఆఁ మరేమీ లేదు. ఆ విరాటుడు తన కొడుకును పొగడుతూ ఉంటే, మహాబలశాలి బృహన్నల ఉండగా శత్రువులను జయించటానికి లోటేమిటి? అన్నాను.

**ఆ. అనినఁ బేడిఁ బొగడె దని యవివేకి యై । కోప మడర సారెగొని యతండు**
**వ్రేసె నెత్తు రపుడు వెడలఁబోయినఁ జీరఁ । గప్పికొంటి నీవు గానకుండ.' 309**

**ప్రతిపదార్థం:** అనినన్= నేను అట్లనగా; పేడిన్= నపుంసకుని; పొగడెదు= పొగడుతున్నావు; అని= పలికి; అవివేకి+ఐ= వివేకం లేనివాడై; అతండు= విరాటుడు; కోపము+అడరన్= కోపం ఎక్కువకాగా; సారెన్= పాచికను; కొని= తీసికొని; వ్రేసెన్= కొట్టాడు; అపుడు= ఆ సమయంలో; నెత్తురు; వెడలన్+పోయినన్= కారబోగా; చీరన్= గుడ్డతో; నీవు; కానకుండన్= చూడకుండుటకై; కప్పికొంటిని= కప్పుకొన్నాను.

**తాత్పర్యం:** అనేసరికి 'పేడిని పొగడుతావా?' అని చేతిలో పాచిక తీసికొని కోపంతో నన్ను కొట్టాడు. దానితో నెత్తురు కారితేను, అది నీ కంటపడకుండా ఉండాలని గుడ్డతో కప్పుకొన్నాను. అంతే.'

**క. అని చెప్పి గంటి సూపిన । ననిలతనూభవుఁడు కనలి 'యా దుష్టాత్మ్ముం**
**దనయాది బంధుయుతముగ । ననిచెద జముప్రోలి' కనియె నంగము వొంగన్. 310**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఇట్లా పలికి; గంటి= గాయం; చూపినన్= చూపగా; అనిల తనూభవుఁడు= భీముడు; కనలి= కోపించి; ఆ దుష్టాత్మున్= ఆ దుర్మార్గుడిని; తనయ+ఆది= సుతులు మొదలుకొని; బంధుయుతముగన్= బంధువులతో కూడా; జముప్రోలికిన్= యముడి నగరానికి; అనిచెదన్= పంపుతాను అని; అంగము= శరీరం; పొంగన్= కోపంతో ఉబ్బగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని పలికి గాయం చూపించాడు ధర్మరాజు. అది చూచి భీముడు కోపించి, శరీరం పొంగగా 'ఆ దుర్మార్గుడిని తనయులతో బంధువులతో సహా యమలోకానికి పంపించివేస్తాను' అన్నాడు.

**వ. కిరీటియుం గోపించి. 311**

**తాత్పర్యం:** అర్జునుడు కూడ కోపగించుకొని.

**క. 'తన కొలఁది యెఱుంగని యి । మ్మనుజాధము నిపుడ పట్టి మర్దింపక త**
**క్కినఁ గాదు; వీని రాజ్యము । నిను నంతయుఁ జేరుఁగా!' కనియె ధర్మజుతోన్. 312**

**ప్రతిపదార్థం:** ధర్మజుతోన్= ధర్మరాజుతో; తనకొలఁది= తన శక్తి; ఎఱుంగని= తెలియని; ఈ+మనుజాధమున్= ఆ మానవాధముడిని; ఇపుడు+అ= ఇప్పుడే; పట్టి= పట్టుకొని; మర్దింపక= చంపకుండా; తక్కినన్= మానినచో; కాదు= కుదురదు; వీని రాజ్యము= ఈ విరాటుని రాజ్యం; అంతయున్= సమస్తమున్నూ; నినున్= నిన్ను; చేరున్+కాక!= చెందుగాక!; అనియెన్= అని పలికాడు.

**తాత్పర్యం:** అప్పుడు కోపించి అర్జునుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు - 'తన శక్తి ఎంతో తెలియని అధముడు విరాటుడు. వీడిని పట్టి చంపితే కాని రోగం కుదురదు. వీడి రాజ్యం అంతా నీకే చేరుతుంది' అన్నాడు.

**చ. అనవుడు నాతఁ డిట్టులను 'నక్కట! యింతకు ముంద రేమియున్**
**మనల నెఱుంగఁ; డవ్విభుని మాటునఁ బూనిక దీర్చికొంటి; మా**
**తని కొక యెగ్గు సేఁత యుచితంబె? యెఱింగెడునట్లు గాఁగఁ బో**
**యినఁ గనియున్ దురుద్ధతి వహించినఁ జూతముగాక పిమ్మటన్.' 313**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనిన తర్వాత; ఆతఁడు= ధర్మరాజు; ఇట్టులు= ఈ రీతిగా; అనున్= అన్నాడు; అక్కట!= అయ్యో!; ఇంతకున్+ముందర= ఇంతకు పూర్వం; మనలన్= మనలను; ఏమియున్= ఏమీకూడా; ఎఱుంగఁడు= తెలియడు; ఆ+విభుని= ఆ రాజుయొక్క; మాటునన్= చాటున; పూనిక= ప్రతిజ్ఞ; తీర్చికొంటిమి= పూర్తిచేసికొన్నాం; ఆతనికిన్= ఆ రాజుకు; ఒక+ఎగ్గు+చేత= ఒక కీడుచేయటం; ఉచితంబె?= తగునా?; ఎఱింగెడున్+అట్లుగాఁగన్= తెలిసే విధంగా; పోయినన్= మనం వెళ్ళినచో; కనియున్= చూచికూడా; దురుద్ధతి= చెడు గర్వం; వహించినన్= పూని ఉన్నట్లయితే; పిమ్మటన్= తరువాత; చూతముగాక!= చూద్దాంలే!

**తాత్పర్యం:** అనటంతో ధర్మరాజు అన్నాడు- 'అయ్యో! అతడు మనం ఎవరమో ఎరుగడు కదా! కాక, అతడి దగ్గర చేరి మన ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నాం. అంటే మనం కృతజ్ఞత చూపవలసినవాడు అతడు. అటువంటివాడికి కీడు తలపెట్టటం ఉచితం కాదు. అతడికి మనం ఎవరమో తెలిసేటట్లు వెళ్ళుదాం. అప్పుడు కూడా గర్వానికి పోయాడా అప్పుడు చూద్దాం.

**వ. అని పలికి వారల కుందు మాన్పి 'యిది యట్లు కాక యొండు దగునే?' యనుచుఁ దక్కినవారి దెసయుం గనుంగొనిన నెల్లవారు నుపశమించిరి; తదనంతరంబ తమ్ము నెఱింగించు తెఱంగు దలపోసి వారందఱు విరాటు కొలువు కూటంబునకుం బోయి బయలు మెఱసి యుండువారుగా నిశ్చయించి, యా రాత్రి గడపి వేగుటయుం గృతస్నాను లయి పాండుసూనులు సమయ విహితాచారంబులు నడపి యుచిత ప్రకారంబున. 314**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; వారలకుందు= వారల బాధను; మాన్పి= తగ్గించి; ఇది= ఈ పని; అట్ల= అట్లే చేయటం మంచిది; కాక= అట్లాకాకుండా; ఒండు= మరొకరీతిగా - ఆతడిని చంపటం; తగునే?= ఉచితమా?; అనుచున్= అని పలుకుతూ; తక్కిన వారి దెసయున్= మిగతా వారివైపు కూడా; కనుంగొనినన్= చూడగా; ఎల్లవారున్= అందరును; ఉపశమించిరి= శాంతించారు; తదనంతరంబు+అ= అటు తర్వాత; తమ్మున్= తమను; ఎఱింగించు తెఱంగు= తెలియజేసే విధం; తలపోసి= ఆలోచించి; వారు= పాండవులు; అందరున్= అందరును; విరాటు= విరాటుడియొక్క; కొలువుకూటంబునకున్= సభాస్థలికి; పోయి= వెళ్ళి; బయలు మెఱసి= ప్రకటమై; ఉండు వారుగాన్= ఉండేటట్లుగా; నిశ్చయించి= నిశ్చయం చేసికొని; ఆ రాత్రి+కడపి= ఆ రాత్రి గడిపి; వేగుటయున్= తెల్లవారగా; కృతస్నానులు+అయి= స్నానం చేసినవారై; పాండు సూనులు= పాండవులు; సమయ విహిత= ఆ కాలానికి తగిన; ఆచారంబులు= సంధ్యావందనాది నిత్యకృత్యాలు; నడపి= నిర్వర్తించి; ఉచిత ప్రకారంబునన్= తగిన రీతిగా.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా చెప్పి వారి కోపం, తాపం తగ్గించాడు. ఈ పని ఇట్లాగే చెయ్యాలి. అంటే 'ప్రస్తుతానికి క్షమించి, మనం ఎవరమో తెలిశాక కూడా గర్వం చూపితే అప్పుడు చూడవచ్చు'- అన్నదే బాగుంది అని అందరూ అంగీకరించారు. శాంతించారు. ఇక తాము ఎట్లా బయటపడాలి? తాము పాండవుల మని యే రీతిగా తెల్పితే బాగుంటుంది? అని ఆలోచించారు. విరాటుడి కొలువుకూటంలోనికి వెళ్ళి బయటపడటమే మార్గం అని నిశ్చయించుకొన్నారు. రాత్రి గడిచింది. తెల్లవారుజాముననే లేచారు. స్నానాలు సంధ్యావందనాది నిత్యకృత్యాలు సముచితంగా తీర్చికొన్నారు.

**క. తెలుపులగు చీరలను బూఁ। తలఁ బువ్వుల నొప్పి రాజతనయానుగుణో**
**జ్జ్వల మాననీయ వేషము। లలవడఁ గూడుకొని నగరి కరిగిరి ప్రీతిన్. 315**

**ప్రతిపదార్థం:** తెలుపులు+అగు చీరలను= తెల్లని బట్టలతోను; పూఁతలన్= మై పూతలతోను; పువ్వులన్= పువ్వులతోను; ఒప్పి= అందంగా; రాజతనయ= రాజకుమారులకు; అనుగుణ= తగినట్టి; ఉజ్జ్వల= ప్రకాశించే; మాననీయ= గౌరవించదగిన; వేషములు= వస్త్రాది వేషాలు; అలవడన్= సరిపడగా; కూడుకొని= ఆరుగురును కలిసి; ప్రీతిన్= సంతోషంతో; నగరికిన్= రాచనగరుకు; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** తెల్లని వస్త్రాలు, గంధపు పూతలు, పూలమాలలు ధరించారు. రాజకుమారు లనుకొనటానికి తగిన గౌరవాస్పదమైన వేషాలతో ఆరుగురూ కలిసికట్టుగా రాచనగరికి సంతోషంగా వెళ్ళారు.

**విశేషం:** పాండవులు మూడు రోజుల తరువాత బయలు మెరసినట్లు మూలభారతం చెప్పింది (4.70.1). అజ్ఞాతవాసం పూర్తి అయిన తరువాత, పాండవుల వివరాలు ఉత్తరుడికి తెలిసిన తరువాత, అర్జునుడు తన పేడిరూపాన్ని ఒకసారి ఉపసంహరించుకొన్న తరువాత, వ్రతకాలం పూర్తి అయినదని భీష్మాదులు నిశ్చయించిన తరువాత కాలహరణం వలన సాధించే ప్రయోజన మేమీ లేదని తిక్కన ఈ మార్పు చేసి ఉంటాడు. (సంపా.)

**క. చని ధర్మసుతుఁడు సింహా । సనమున భీమాదు లాత్మసముచిత రుచిరా**
**సనముల సభాస్థలిం గయి । కొని పంచాగ్నులును బోలెఁ గూర్చున్నంతన్. 316**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; ధర్మసుతుఁడు= ధర్మరాజు; సింహాసనమునన్= సింహాసనం పైన; భీమాదులు= భీముడు మొదలైన తక్కిన నలుగురు అన్నదమ్ములును; ఆత్మసముచిత= తమకు తగిన; రుచిర= ప్రకాశించే; ఆసనములన్= ఆసనములందు; సభాస్థలిన్= కొలువు కూటంలో; కయికొని= అంగీకరించి; పంచ+అగ్నులును పోలెన్= అయిదు అగ్నిహోత్రాల వలె; కూర్చున్నంతన్= కూర్చున్నంతలో.

**తాత్పర్యం:** ఆ విధంగా వెళ్ళి ధర్మరాజు సింహాసనం మీద కూర్చున్నాడు. తక్కినవారు వారికి తగిన మంచి ఆసనాల మీద కూర్చున్నారు. అలాగ అయిదుగురు అయిదు అగ్నిహోత్రాలవలె కూర్చొనియుండగా, అంతలో.

**విశేషం:** అలం: ఉపమ. పాండవులు తేజోదీప్తులతో శత్రుభయంకరంగా వెలిగిపోతున్న స్ఫూర్తి పంచాగ్నుల ఉపమానంతో స్ఫురిస్తున్నది. అరణ్య అజ్ఞాతవాసాలు ఒక మహాయజ్ఞం వంటివి. యజ్ఞంలో చెప్పబడే పంచాగ్నులు ఇవి. 1.దక్షిణాగ్ని, 2.గార్హపత్యాగ్ని, 3.ఆహవనీయాగ్ని, 4.సభ్యాగ్ని, 5.ఆవసథాగ్ని, తపస్సులలో పంచాగ్నుల నడుమ నిలిచి చేసే తపస్సు ప్రసిద్ధం. నాలుగు దిక్కులలో నాలుగు అగ్నులు, పైన సూర్యుడు కలిగి పంచాగ్ను లనబడతాయి. ధర్మరాజు సూర్యకల్పుడు. మిగిలినవారు అగ్నితుల్యులని భావించవచ్చును. (సంపా.)

**తే. వేడ్కఁ దొడి పూసి కట్టి యవ్విరటుఁ డుత్త । రుండు దోఁ జనుదేరఁ గొల్వుండు బుద్ధి**
**నచటి కేతెంచి కని విస్మయంబు నొంది । యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్లు లనియె. 317**

**ప్రతిపదార్థం:** ఆ+విరటుఁడు= ఆ విరాటరాజు; వేడ్కన్= వేడుకతో; తొడి= భూషణాలు తొడుగుకొని; పూసి= గంధపుపూత పూసికొని; కట్టి= వస్త్రాలు కట్టుకొని; ఉత్తరుండు= ఉత్తరుడు; తోన్= కూడా; చనుదేరన్= రాగా; కొల్వు+ఉండుబుద్ధిన్= కొలువుతీరుద్దామని; అచటికిన్= కొలువుకూటానికి; ఏతెంచి= వచ్చి; కని= అక్కడి దృశ్యం చూచి; విస్మయంబున్= ఆశ్చర్యాన్ని; ఒంది= పొంది; ఎల్లిదంబుగన్= చులకనగా; తలఁచుచున్= అనుకొంటూ; ఇట్టులు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ విరాటరాజు వేడుకగా ఆభరణాలతో అలంకరించుకొని, గంధపుపూతలు పూసికొని, విలువైన వస్త్రాలు కట్టుకొని, ఉత్తరుడు కలసిరాగా కొలువు తీరుద్దామని కొలువుకు వచ్చాడు. అక్కడి దృశ్యం చూసేసరికి ఆశ్చర్యపడ్డాడు. వారిని చులకనగా తలుస్తూ ఇట్లా అన్నాడు.

**క. 'ఇది యేమి కంక! నీ వు । న్మదవృత్తిని శంక దక్కి మా గద్దియపైఁ**
**బదిలంబుగఁ గూర్చుండితి । వదియునుగా కిపుడు డిగ వహంకారమునన్.' 318**

**ప్రతిపదార్థం:** కంక!= ఓ కంకుభట్టూ!; ఇది+ఏమి?= ఇదేమిటి?; నీవు; ఉన్మదవృత్తినిన్= ఎక్కువ గర్వం కల్గిన రీతితో; శంక తక్కి= జంకులేకుండా; నా గద్దియపైన్= నా సింహాసనంపై; పదిలంబుగన్= భద్రంగా; కూర్చుండితివి= కూర్చున్నావు; అదియునున్+కాక= అట్లు కూర్చుండటమే కాక; ఇపుడున్= నేను వచ్చిన తరువాత కూడా; అహంకారమునన్= గర్వంతో; డిగవు= పీఠంనుండి దిగవు.

**తాత్పర్యం:** 'ఇదేమిటి కంకుభట్టూ! సాధువృత్తి కలవాడవు, గర్వంతో నా సింహాసనంపై కూర్చున్నావు. నేను వచ్చినా దిగకుండా అహంకారంతో అట్లాగే కూర్చున్నా వేమిటి?'

**వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రంద ననందనుం డతని కిట్లనియె. 319**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; సంక్రందన నందనుండు= అర్జునుడు; మందహాసంబు+చేసి= చిరునవ్వునవ్వి; అతనికిన్= విరటుడితో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అనగా విని చిరునవ్వు నవ్వుతూ అర్జునుడు ఇట్లా అన్నాడు.

**సీ. 'నడదీవియలు సేసె నగరికి మాణిక్య । మకుటముల్ పూనిన మనుజపతులఁ,**
**దగునాజ్ఞ సూయాణముగ నొనరించె మం । చిగ నేల నాలుగు చెఱఁగులకును,**
**బ్రీతార్థిజనుల సచేతన త్యాగ ధ్వ । జములుగా నన్ని దేశముల నిలిపె,**
**దిక్కులన్నింటను దెలుపారు పూఁత గా । వించె నుజ్జ్వల యశోవిభ్రమంబు,**

**తే. రాజసూయాధ్వర ప్రవర్తకుఁడు, నిత్య । సత్యభాషా మహావ్రతశాలి, పాండు**
**రాజ దుగ్ధ పయోనిధిరాజు ధర్మ । రాజు సుమ్ము మత్స్యావనీరమణ! యితఁడు. 320**

**ప్రతిపదార్థం:** మత్స్య+అవనీరమణ!= మత్స్యదేశరాజా-విరాటా!; మకుటముల్= కిరీటములు; పూనిన= ధరించిన; మనుజపతులన్= రాజులను; నగరికిన్= పట్టణానికి; నడదీవియలు= నడుస్తున్న దివ్విటీలుగా; చేసెను= చేశాడు; నేల= భూమిని; నాలుగు చెఱఁగులకును= నాల్గు చివరలకును; తగు+ఆజ్ఞ= తగిన ఆజ్ఞ; సూయాణముగన్= శత్రుభయంకరమైన దండయాత్రగా; మంచిగన్= బాగుగా; ఒనరించెన్= చేశాడు; ప్రీత= ప్రీతిపొందిన; అర్థిజనులన్= యాచకులను; సచేతన= సజీవమైన; త్యాగధ్వజములుగాన్= త్యాగానికి జెండాలుగా-చిహ్నాలుగా; అన్ని దేశములన్= దేశాలన్నింటియందు; నిలిపెన్= నిలిపాడు; ఉజ్జ్వల= ప్రకాశించే; యశోవిభ్రమంబు= కీర్తి విలాసాన్ని; దిక్కులు+అన్నింటను= అన్నిదిక్కులందును; తెలుపారు= తెల్లని; పూఁతన్= పూతగా; కావించెన్= చేశాడు; రాజసూయ+అధ్వర= రాజసూయమనే యజ్ఞాన్ని; ప్రవర్తకుఁడు= చేసినవాడు; నిత్య= ఎల్లపుడు; సత్యభాషా= నిజం మాట్లాడటం అనే; మహావ్రతశాలి= గొప్పవ్రతంతో ప్రకాశించేవాడు; పాండురాజు= పాండురాజనెడి; దుగ్ధపయోనిధి= పాలసముద్రానికి; రాజు= చంద్రుడివంటివాడు; ఇతఁడు= ఈ నీ సింహాసనంపై కూర్చున్న ఇతడు; ధర్మరాజు సుమ్ము!= ధర్మరాజు సుమా!.

**తాత్పర్యం:** 'విరాటరాజా! ఈ నీ సింహాసనం మీద కూర్చునవాడు ధర్మరాజు సుమా! అత డెట్టివా డంటే-ఆయన నగరంలో కిరీటాలు ధరించిన మహారాజులే నడిచే దివ్వెలు; ఆయన ఇచ్చే ఆజ్ఞలే నేల నాలుగు దిక్కులా చేసే దండయాత్రలు; కోరిన కోర్కెలు తీర్చినందున ప్రీతిపొందిన యాచకులే అన్ని దేశాలలోనూ ఆయన యొక్క త్యాగాన్ని తెలిపే జెండాలు; ఆయన కీర్తితో దిక్కులన్నీ తెల్లగా పూతపూసినట్లు ఉన్నాయి. రాజసూయయాగం చేసినవాడు, నిత్య సత్యవ్రతం కలవాడు, పాండురాజవంశమనే పాలసముద్రంలో ఉదయించిన చంద్రుడు.

**విశేషం:** 1. అలం: రూపకం, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, యథాసంఖ్యం (క్రమాలంకారం), పరికరాంకురం.

2. అజ్ఞాతవాస వ్రతానంతరం బయలు మెరసిన ధర్మరాజు వర్ణన మిది. తిక్కన సీసపద్యంలో వర్ణించాడు. సామాన్యంగా సీసపద్యంలో మొదటి నాలుగు పాదాలకూ ఎత్తుగీతిలో చెప్పే విశేషాలకూ క్రమాలంకార బంధురంగా అన్వయాన్ని అనుసంధించటం తిక్కన సహజస్వభావం. ఆ విధంగా ఈ పద్యాన్ని అన్వయించుకొనాలి. 'విరాటరాజా! ఇతడు ధర్మరాజు సుమా!' అని నిర్దేశిస్తూ చెప్పిన ఫలితాంశం ఈ పద్య తాత్పర్యం. దానిని చివర చెప్పి కథనంలో, వర్ణనంలో ఉత్కంఠను పోషించటం రచనాశిల్పం.

3. సీస పద్యపాదాలు నాలుగూ ఒక మహాపురుషుడిని పరిచయం చేస్తున్నట్లు అలంకార బంధురంగా, ధ్వని సుందరంగా సాగాయి. నగరితో మొదలై దిక్కుల నన్నింటనూ వ్యాపించిన కీర్తిమూర్తిని వికాసవిస్ఫూర్తితో అర్జునుడు పరిచయం చేస్తున్నాడు. అన్నీ ధ్వనిమయమైన భావ చిత్రాలే. వాటిని రూపొందించటానికి రూపక, ఉత్ప్రేక్ష, అతిశయోక్తులనే అర్థాలంకారాలను ప్రయోగించాడు.

4. మొదటి చరణంలో రూపకోత్ప్రేక్షా స్ఫూర్తి. అతడు - మాణిక్యాలు పొదిగిన మకుటాలు ధరించిన మహారాజులను తన ముంగిట్లో తిరుగుతున్న దివ్వెలుగా చేసినవాడట! వర్ణిస్తున్న అర్జునుడి భావనలో అది రూపకాలంకారం. వినే విరటుడికి అది ఉత్ప్రేక్ష. మహారాజుల చేత సేవలు చేయించుకొనేవాడు చక్రవర్తి. అటువంటివారు షట్చక్రవర్తులున్నారు. వారిలో ఎవరు? వారితో తూలతూగే 'రాజసూయాధ్వర ప్రవర్తకుడు' అతడు. ఎత్తుగీతిలోని మొదటి విశేషణం మొదటి పాదతాత్పర్యంలోని ధ్వని సంకేతం. అయినా అతడు ధర్మరాజు - అనే నిశ్చితజ్ఞానం ఏర్పడదు. విరాటుడు అద్భుతరసమగ్నుడై ఉంటాడు.

5. రెండవ చరణంలో కూడా అదే అలంకార వైభవం. అతడు ఇచ్చే ఆజ్ఞ ఔచిత్యంతో కూడి ఉంటుందట. అది నేల నాలుగు చెరగులకు హితాన్ని చేకూరుస్తుందట. ఆతడి మాట ఎంతమంచిగా ఉన్నా దాని ప్రభావం దండయాత్ర చేసినట్లుగా దడపుట్టిస్తుందట! దానికి కారణం - ధర్మజుడన్నమాట అయి తీరుతుంది కాబట్టి, ఆ మహిమ, అతడికి 'నిత్య సత్య భాషామహావ్రత' శీలం వలన ఏర్పడింది. ఎత్తుగీతిలో రెండవ విశేషణం ఈ సత్యం చెప్పింది. అటువంటి మహిమ గలవారు హరిశ్చంద్రాది మహారాజులున్నారు. వారిలో ఎవరైనా అయి ఉండవచ్చునన్న భావం ఏర్పడే అవకాశం ఉన్నది. ఉత్కంఠ విరాటుడిలో పోషించబడుతూనే ఉన్నది.

6. సీసపద్యపు మూడవపాదంలో కూడా రూపకోత్ప్రేక్షల విన్యాసం అలంకార సౌందర్యం. అర్థించేవారి కోరికలు తీర్చటం ధర్మజుడి జీవితవ్రతం. దానివలన లాభపడిన వారు అన్ని దేశాలలోనూ నిండి ఉన్నారు. వారు అతడి కీర్తికి నడుస్తున్న త్యాగధ్వజాలుగా గోచరిస్తున్నారు. మహాదాత అయిన అతడు శిబిచక్రవర్తి వంటి వారిలో ఎవరై ఉంటారు? అనే అనుమానం ఏర్పడవచ్చును. ఎత్తుగీతిలో పాండుమహారాజనే పాలసముద్రానికి చంద్రుడివంటి వాడని అర్జునుడు పరిచయం చేశాడు. అంతటి కీర్తి ఉన్న పాండురాజును తలదన్నిన కీర్తి కలవాడు పాండురాజుపుత్రుడు అని తెలిసిందే కాని, పాండవులలో ఎవరో బోధపడలేదు. ఉత్కంఠ ఇంకా ఊపిరి పోసుకొంటూనే ఉన్నది.

7. నాలుగవ పాదంలో రూపకాతిశయోక్తి రమణీయంగా అమరింది. అతడి నిర్మలమైన కీర్తి వైభవం దిక్కుల కన్నింటికీ పూసిన తెల్లని పూతగా అమరిందట! దిగంత విశ్రాంత కీర్తి. అతడెవరో ప్రాచీనవ్యక్తి కాడు, పురాణపురుషుడు కాడు, సమకాలీన సమ్రాట్టు. సార్థక నామధేయుడు 'ధర్మరాజు' ఇతడు - అని స్థిరీకరించటమైనది.

8. 'ధర్మరాజు' - అనే పదంలో ఉండే శ్లేషచమత్కారాన్నంతా పద్యంలో పరచి చెప్పిన ఈ వర్ణనం అర్థవ్యక్తి అనే శబ్దార్థ గుణ స్వభావం సుందరం. ఇందులో అర్థవ్యక్తి హేతుత్వం ఉన్నది. వస్తు స్వభావ స్ఫుటత్వం ఉన్నది. అతడు రాజు. రాజైనవాడి మహత్త్వం రాజసూయాధ్వర నిర్వహణంలో నిగ్గుతేలుతుంది. అతడి ఆజ్ఞను రాజులందరూ భయభక్తులతో పాటించినపుడు సార్థకమౌతుంది. చంద్రుడైన రాజుకు అమృత ప్రదానం స్వభావం. అందుకే ఈ ధర్మరాజుకు త్యాగరూపమైన దానం సహజ లక్షణం. 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' - అన్న సూక్తి ధర్మరాజుపట్ల సార్థకం. రాజు అంటే ప్రకాశించేవాడు. ధర్మరాజు కీర్తితో ప్రకాశించి నలుదిక్కులా కాంతులు నింపేవాడు. అతడు ధర్ముడు. ధర్ముడంటే యముడనీ ధర్మరూపుడనీ అర్థం. ధర్మమంటే దానగుణమని కూడా విశేషం. అందువలననే ధర్మరాజంటే భూతలంలోని రాజులకందరికీ ప్రాణభయం. అర్థులకందరికీ ప్రాణదానం. అందరూ అతడిని కీర్తించేవారే. ఈ విధంగా నామసార్థక్యాన్ని వ్యాఖ్యానించే పద్యమిది. పరికరాంకురాలంకార ప్రకాశం కూడా ప్రస్తుతమౌతున్నది. (సంపా.)

9. ఈ పద్యంలోని రసశిల్పాన్ని గురించి డాక్టర్ పాటిబండ మాధవశర్మగారి మాటలివి- "క్రమక్రమముగా నెక్కి శిఖరము ముట్టిన విరాటుని ఆశ్చర్యము పద్యాంతమందలి 'ఇతఁడు' అన్నమాటను విని, అర్జునుడు వ్రేలుపెట్టి చూపినచోట

సింహపీఠమున ధర్మరాజును దర్శించినంత పరమాద్భుత రసముగా పరిణమించినది. ప్రతిచరణోపాంత విరామముచే గీత పాదములు ఎదురునడక నడచి యాశ్చర్యమును పోషించుచున్నవి. యతిప్రాసములందు వైచిత్రి లవమేనియు లేని యీ పద్యము శబ్దచ్ఛందో౾లంకార రహితమయ్యు నిర్మాణ సౌష్ఠవముచే పద్య మెట్టి ఫలము నిర్వహింపగలదో నిరూపించుచున్నది. తిక్కనగారి రసవత్కావ్య నిర్మాణ ప్రక్రియకు ఇట్టి నాటకీయ పద్యరచన ఒక ప్రాణము." (తిక్కన కవితావైభవం; యువభారతి ప్రచురణ. పుట. 30)

**ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మహిం దగ దిగ్విజయంబు సేసె, వి**
**ద్యాతిశయార్థి వాసవుమహాసన మైనను నెక్క నర్హుఁ డు**
**ద్ద్యోతితమూర్తి కౌరవకులోద్వహుఁ, డార్యనికాయ సంతత**
**ఖ్యాతచరిత్రుఁ డీచిఱుత గద్దియకుం దగఁడే నరేశ్వరా!' 321**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వరా!= విరాటరాజా!; ఈతఁడు= ఈ కూర్చున్నవాడు; అజాతశత్రుఁడు= ధర్మరాజు; మహిన్= భూమండలమున; తగన్= తగినట్లుగా; దిక్+విజయంబు= దిక్కులన్నిటిని జయించుటను; చేసెన్= చేశాడు; విద్యా+అతిశయ+అర్థి= విద్యయొక్క వికాసాన్ని కోరేవాడు; వాసవు= దేవేంద్రుడి యొక్క; మహా+ఆసనము+ఐనను= సింహాసనమునైనను; ఎక్కన్= అధిష్ఠించుటకు; అర్హుఁడు= తగినవాడు; ఉద్ద్యోతితమూర్తి= ప్రకాశించెడి స్వరూపం కలవాడు; కౌరవకుల= కురు చక్రవర్తియొక్క కులమును; ఉద్వహుఁడు= ఉద్ధరించినవాడు; ఆర్యనికాయ= సజ్జనుల సముదాయంలో; సంతత= ఎల్లప్పుడును; ఖ్యాత= ప్రఖ్యాతికల; చరిత్రుఁడు= నడవడి కలవాడు; ఈ చిఱుత గద్దియకున్= ఈ చిన్న సింహాసనానికి; తగఁడే?= కూర్చుండ తగడా?

**తాత్పర్యం:** ఓ విరాటరాజా! ఇత డెవ రనుకొన్నావు? అజాతశత్రువు! భూమండలం అంతా దిగ్విజయం చేశాడు. విద్యావంతుడు, దేవేంద్రుడి సింహాసనమైనా అధిష్ఠించటానికి అర్హుడు. ప్రకాశమానమైన రూపం కలవాడు, కౌరవకుల శ్రేష్ఠుడు, సజ్జనులలో ఖ్యాతిగన్నవాడు ఈ చిన్నసింహాసనం ఎక్కటానికి తగడా?'

**విశేషం:** 1. అలం: ఉదాత్తం, కావ్యలింగం. "ఉదాత్త మృద్ధిశ్చరితం శ్లాఘ్యం వాన్యోపలక్షణమ్". శ్లాఘనీయమైన సమృద్ధిని గాని, మహాపురుషుని చరితం గాని ఉపలక్షణంగా వర్ణిస్తే ఉదాత్తాలంకారం. "సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్". ఈ పద్యంలో వర్ణ్యవస్తువు ధర్మజుడి ఉద్దాత శీలం. ఇందులో సమర్థనీయాంశం - అంతటి 'ఖ్యాత చరిత్రుడు ఈ చిఱుత గద్దియకు తగడా?'

2. ఈ పద్యంలో ప్రతిపదం, వాక్యం సార్థకం. (1) ఈతడు అజాతశత్రుడు. అంటే ఎవరి యందూ శత్రుభావం లేనివాడని భావం. ఆ గద్దెమీద కూర్చున్నవాడు మిత్రుడే కాని, శత్రువు కాడని అర్థం. (2) అతడు భూమిపై దిగ్విజయం చేసినవాడు- అందువలన రాజులందరి నమస్సు లందుకొనినవాడు. వారి సింహాసనాల మీద కూర్చుండే అధికారమున్నవాడు. రాజులకే రాజు అయినవాడు సామంతరాజు కూర్చుండే గద్దెపై కూర్చుండటానికి అభ్యంతరం ఉండదు. (3) ఉన్మదవృత్తి, అహంకారం- అనే గుణాలవలన కంకుడు తన గద్దెనెక్కి కూర్చున్నాడని విరాటుడి అభియోగం. ఆ కూర్చున్నవాడు విద్యాతిశయం చేత వినయగుణ సంపన్నుడు, ఉచితజ్ఞుడు, వివేకధనుడు కాబట్టి సంస్కారవంతుడనీ, విజ్ఞత వలననే తెలిసికొనగలిగిన విద్వాంసుడనీ పలికి, విరాటుడికంటె విజ్ఞుడైన ధర్మరాజు ఆ చిరుగద్దెకు మించిన పండితుడని పార్థుడు పలికాడు. (4) అతడు త్రిలోకాధిపతి అయిన ఇంద్రుడి సింహాసనం ఎక్కగలవాడట! అర్జునుడు ఇంద్రుడి అర్ధ సింహాసనం ఎక్కాడు. ధర్మజుడు నిండు సింహాసనం ఎక్కగలిగిన వాడని ధ్వని. అటువంటి ధర్మరాజుకు మత్స్యరాజ్య సింహాసనం చిరుగద్దెయే ఔతుందనటంలో ఆశ్చర్యం లేదు. (5) ప్రకాశంలో, వంశగౌరవంలో, ఉత్తమ చరిత్రంలో-సమకాలీన ప్రభువులలో

ఆదర్శప్రాయుడని మిగిలిన మూడు విశేషణాలూ చెప్పుతున్నాయి. మరి ఈ చిరుతగద్దెపై కూర్చున్నవాడు ఒకప్పుడు సామ్రాజ్య సింహాసనంపై కూర్చున్నవాడు. ఇకముందు కూర్చొనదగినవాడు. ఆ అర్హతను తన యోగ్యతతో పొందినవాడు. దాని నెరిగినవాడెవడైనా ధర్మజుడు ఈ గద్దెమీద కూర్చొనటాన్ని అంగీకరిస్తాడని భావం.

3. ధర్మజుడే ఈ సింహాసనం మీద కూర్చుండ దగినవాడని విరాటుడికి వ్యంగ్యమైన హెచ్చరిక! ఒకప్పటి ధర్మజుడి హితుడు, సామంతుడు విరాటుడు. ధర్మజుడు బయలుమెరసిన తరువాత ఆ గద్దెకంటె పెద్దగద్దె ఆ నగరంలో లేదు. అందువలన దానిమీద కూర్చున్నాడు. ఒకవేళ ఆ సత్యాన్ని గుర్తించకపోతే ఆ గద్దెను తనదే చేసికొనగలడు. అయినా, అది ఆయనకు చిన్నగద్దెయే. అతడు దిగ్విజయ సార్వభౌముడైనా విద్యావంతుడు. అజాతశత్రువు- ఈ సంగతి గమనించు మనే వ్యంగ్యధిక్కారం కూడా ఈ ప్రశంసలో అంతర్వాహినిగా గోచరిస్తుంది.

4. 'విద్యాతిశయార్థి' - అనే పాఠానికి 'వీర్యాతిశయార్థి' - అనే పాఠాంతరం ఉన్నది. ఈ సందర్భంలో దిగ్విజయం చేసినవాడు సహజంగా వీర్యాతిశయార్థి అయి ఉంటాడు. అయితే అతడు ఉన్మదవృత్తిని, అహంకారాన్ని ప్రదర్శించవచ్చును. విరాటుడి అభియోగంలో ఆ రెండు గుణాలూ ఉన్నాయి. ఆ దుర్గుణాలను అధిగమించగల గుణం విద్యాతిశయమే. జ్ఞానార్థిత్వం ముముక్షు లక్షణం. ఆ తాత్పర్యాన్ని ధ్వనింపజేసే ప్రస్తుత పాఠమే ఉత్తమం. (సంపా.)

### అర్జునుఁడు విరాటునకుఁ దమ్మెఱింగించుట (సం. 4-65-1)

**వ. అనిన విని యతండు విస్మయ సంశయంబులు మనంబునం బెనంగొన 'నితండు ధర్మతనయుండయేని భీమార్జున నకుల సహదేవులుం బాంచాలియు నేరి?' యని యడిగినఁ గవ్వడి యిట్లనియె. 322**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; అతండు= విరాటుడు; విస్మయ= ఆశ్చర్యమూ; సంశయంబులు= సంశయమునూ; మనంబునన్= మనస్సులో; పెనంగొనన్= పెనవేసికొనగా-కలుగగా; ఇతండు= ఈ కూర్చున్నవాడు; ధర్మతనయుండ+ఏనిన్= ధర్మరాజే అయినచో; భీమ= భీముడు; అర్జున= అర్జునుడు; నకుల= నకులుడును; సహదేవులున్= సహదేవుడును; పాంచాలియున్= ద్రౌపదియును; ఏరి?= ఏరి వారు?; అని అడిగినన్= అని ప్రశ్నించగా; కవ్వడి= అర్జునుడు; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని విరాటుడు ఆశ్చర్యం, సంశయం కలుగగా, 'ఇతడు ధర్మరాజైతే మరి భీమార్జున నకుల సహదేవులు, ద్రౌపది ఏరి?' అని అడిగాడు. అప్పుడు అర్జునుడు ఇట్లా అన్నాడు.

**చ. 'వలలుఁ డనంగ నీ నగర వంటలవాఁ డయి నిల్చి, వేడ్కకుం**
**బులిఁ గరిఁ గేసరిం దొడరి పోరఁగఁ బంచినఁ బోరు, జెట్టి మ**
**ల్లుల విఱుచుం గడంగి ప్రబలుం డనఁగాఁ జరియించుచుండు వి**
**చ్చలవిడి; భీముఁ డీతఁ డవిషహ్య పరాక్రమదుర్దముం డనిన్. 323**

**ప్రతిపదార్థం:** వలలుఁడు+అనంగన్= వలలుడనే పేరుతో పిలువబడుతూ; నీ నగరన్= నీ రాచనగరిలో; వంటలవాఁడు+ అయి= వంటచేసేవాడై; నిల్చి= ఉండి; వేడ్కకున్= వేడుకకై; పులిన్= పులిని; కరిన్= ఏనుగును; కేసరిన్= సింహమును; తొడరి= ధిక్కరించి; పోరఁగన్= యుద్ధం చేయటానికి; పంచినన్= పంపగా; పోరు= యుద్ధం చేస్తాడు; కడంగి= పూనుకొని; జెట్టి మల్లులన్= శూరులయిన కుస్తీపట్టేవారిని; విఱుచున్= ఓడిస్తాడు; ప్రబలుండు+అనఁగాన్= గొప్పబలం కలవాడని చెప్పుకొనగా; విచ్చలవిడిన్= యథేచ్ఛగా; చరియించుచున్+ఉండున్= సంచరించేవాడు; ఈతఁడు భీముఁడు= ఇతడు భీముడు; అనిన్= యుద్ధమున; అవిషహ్య= సహించరాని; పరాక్రమ= బలం కలుగుటచేత; దుర్దముండు= అణచుటకు శక్యం కానివాడు.

**తాత్పర్యం:** 'మీ నగరిలో వలలుడు అనే పేరుతో వంటలవాడుగా ఉండి, మీ వేడుక కోసం పెద్దపులిని, ఏనుగును, సింహాన్ని ఎదుర్కొని ఓడించి, మల్లులు వస్తే వారిని గెల్చి మహాబలశాలిగా పేరు పొందినవాడే భీముడు. ఇతడు మహాపరాక్రమశాలి కనుక ఎవ్వరూ ఇతడిని యుద్ధంలో జయించలేరు.

**తే. బక మహాసురు నిర్జించి బ్రాహ్మణులకు । బ్రీతిఁ గావించెఁ, గిమ్మీరు పే రడంచి**
**వనము నిష్కంటకము సేసె; ఘను హిడింబుఁ । గూల్చి యాతని చెలియలిఁ గొనియె నితఁడు. 324**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ భీముడు; బకమహాసురున్= బకుడనే గొప్ప రాక్షసుడిని; నిర్జించి= గెలిచి; బ్రాహ్మణులకున్= బ్రాహ్మణులకు; ప్రీతిన్= సంతోషాన్ని; కావించెన్= చేశాడు; కిమ్మీరున్= కిమ్మీరుడనే రాక్షసుడిని; పేరు+అడంచి= చంపి; వనమున్= అడవిని; నిష్కంటకము= బాధలేనిదానిగా; చేసెన్= చేశాడు; ఘనున్= గొప్పవాడైన; హిడింబున్= హిడింబాసురుడిని; కూల్చి= చంపి; ఆతని చెలియలిన్= అతడి చెల్లెలైన హిడింబిని; కొనియెన్= పెండ్లాడాడు.

**తాత్పర్యం:** ఇతడు బకాసురుడిని చంపి బ్రాహ్మణులకు ప్రీతి చేశాడు. కిమ్మీరుడిని చంపి వనంలో బాధలేకుండా చేశాడు. హిడింబాసురుడిని చంపి, అతడి చెల్లెలిని పెండ్లాడాడు.

**విశేషం:** భీముడు చంపిన ముగ్గురురాక్షసులు లోకప్రసిద్ధులు. వారిలో తరతమ భేదాన్ని బట్టి వారిని చంపినవాడుగా భీముడికి పేరు వచ్చింది. ఆ రాక్షసులలో బల ప్రాచుర్యాన్ని బట్టి బకుడు, కిమ్మీరుడు, హిడింబుడు అనే వరుసలో పేర్కొన తగినవారు. అర్జునుడు బలగౌరవాన్ని పరిగణించి ఆ వరుసలోనే చెప్పటం విశేషం. బకాసురవధ ఆదిపర్వంలో (6.298-305), కిమ్మీరవధ ఆరణ్యపర్వంలో (1.107-121), హిడింబాసుర వధ ఆదిపర్వంలో (6.203-218) చెప్పబడి ఉన్నాయి. (సంపా.)

**క. నీ మెచ్చువారువంబులఁ । దా మచ్చిగ నరయు నిత్యతాత్పర్యమునన్**
**దామగ్రంథి యనఁగ నొక । నామము ధరియించె నితఁడు నకులుం డధిపా! 325**

**ప్రతిపదార్థం:** అధిపా!= విరాటరాజా!; ఇతఁడు= ఈ కూర్చున్నవాడు; నీ మెచ్చు= నీవు మెచ్చునట్టి; వారువంబులన్= గుర్రాలను; తాన్= తాను; మచ్చిగన్= మచ్చికతో; నిత్య= ఎల్లపుడును; తాత్పర్యమునన్= ఆసక్తితో; అరయున్= రక్షిస్తాడు; దామగ్రంథి+అనఁగన్= దామగ్రంథి అనే; ఒక నామము= ఒక పేరు; ధరియించెన్= పెట్టుకొన్నాడు; ఇతఁడు= ఈయన; నకులుండు= నకులుడు.

**తాత్పర్యం:** ఓ విరాటరాజా! ఇతడు - నీవు మెచ్చిన గుర్రాలను ఎక్కువ ఆసక్తిగా రక్షిస్తూ దామగ్రంథి అనే పేరుతో ఉన్నటువంటి వాడు- నకులుడు.

**క. శత్రునృప కాలకూటము । మిత్రామృతవృష్టి బుధసమీహిత సిద్ధి**
**క్షేత్రము సజ్జన సంస్తుతి । పాత్ర మితఁడు మాద్రి తొలుతపట్టి నరేంద్రా! 326**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= విరాటరాజా!; శత్రునృప= శత్రువులైన రాజులకు; కాలకూటము= కాలకూట విషం వంటివాడు; మిత్ర= మిత్రులకు; అమృత వృష్టి= అమృతవర్షం వంటివాడు; బుధ= పండితులకు; సమీహిత= కోరికలయొక్క; సిద్ధిక్షేత్రము= సిద్ధిని పొందే ప్రదేశం; సజ్జన= మంచివారికి; సంస్తుతి= పొగడ్తకు; పాత్రము= తగినవాడు; ఇతఁడు= ఈ కూర్చున్నవాడు; మాద్రి తొలుతపట్టి= మాద్రికి పెద్దకొడుకు - నకులుడు.

**తాత్పర్యం:** ఓ రాజా! ఈతడు శత్రువులకు కాలకూటం వంటివాడు. మిత్రులకు అమృతవర్షం వంటివాడు. పండితులకు కోరికలు సిద్ధిపొందే ప్రదేశం, సజ్జనులకు స్తుతిపాత్రమైనవాడు, మాద్రి పెద్దకొడుకు - నకులుడు.

**విశేషం:** అలం: ఉల్లేఖం.

**క.** **నీ పాలికి వచ్చి నిఖిల । గోపాలక ముఖ్యవృత్తిఁ గొలువు వడసి తం**
**త్రీపాలుఁ డనఁగ మత్స్య । క్ష్మా పాలక! మెలఁగు వీఁడె సహదేవుండున్.** **327**

**ప్రతిపదార్థం:** మత్స్యక్ష్మాపాలక= విరాటరాజా!; నీ పాలికిన్= నీ వద్దకు; వచ్చి= చేరి; నిఖిల= సమస్తమైన; గోపాలక= గోవులను పాలించేవారిలో; ముఖ్య వృత్తిన్= ముఖ్యుడైన ఉద్యోగంలో; కొలువు= సేవ; పడసి= పొంది; తంత్రీపాలుఁడు+అనఁగన్= తంత్రీపాలుడనే పేరుతో; మెలఁగు= ఉన్నట్టి; వీఁడె= ఇదుగో ఇతడే; సహదేవుండున్= సహదేవుడు.

**తాత్పర్యం:** రాజా! నీ వద్దకు వచ్చి, గోపాలురలో ముఖ్యుడుగా ఉద్యోగం పొంది, తంత్రీపాలుడనే పేరుతో ఉన్నవాడు ఇతడే సహదేవుడు.

**క.** **సుకుమార మానసుఁడు, గొం । తికిఁ బ్రాణము ప్రాణ మితఁడు, తేజో గణ్యుం**
**డకుటిలుఁడు రాజనీతి । ప్రకారసంవేది వంశపావనుఁడు నృపా!'** **328**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ విరాటరాజా!; సుకుమార మానసుఁడు= సున్నితమైన మనస్సు కలవాడు; గొంతికిన్= కుంతీదేవికి; ప్రాణము ప్రాణము= ప్రాణానికి ప్రాణమైనవాడు; ఇతఁడు; తేజస్+గణ్యుండు= గొప్ప తేజస్సుచే గణింపదగినవాడు; అకుటిలుఁడు= మోసం లేనివాడు; రాజనీతి ప్రకార= రాజనీతి విధాలను; సంవేది= ఎరిగినవాడు; వంశపావనుఁడు= వంశమును పవిత్రం చేసినవాడు.

**తాత్పర్యం:** రాజా! ఇతడు చాలా సున్నితమైన మనస్సు కలవాడు; కుంతికి ప్రాణ సమానుడు, గొప్ప తేజస్సు కలవాడు, రాజనీతిజ్ఞుడు, వంశమును పవిత్రం చేసినవాడు.'

**వ.** **అని యిట్లు ధర్మజ భీమ నకుల సహదేవులం గ్రమంబునం జూపి చెప్పి మఱియు నిట్లనియె.** **329**

**ప్రతిపదార్థం:** అని= పలికి; ఇట్లు= ఈ రీతిగా; ధర్మజ= ధర్మరాజును; భీమ= భీముడిని; నకుల= నకులుడిని; సహదేవులన్= సహదేవుడిని; క్రమంబునన్= క్రమంగా; చూపి= కూర్చున్నవారిని చూపి; చెప్పి= వారి విషయం చెప్పి; మఱియున్= ఇంకా; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఇట్లు ధర్మరాజ, భీమ, నకుల, సహదేవులను, కూర్చున్నవారిని చూపించి చెప్పాడు. ఇంకా ఇట్లా అన్నాడు.

**క.** **'విను సైరంధ్రీ వేషం । బున మాలిని యనఁగఁ బరఁగి పూతచరిత్రం**
**బునఁ గేకయ భూవరనం । దనకడ మెలఁగు సతి ద్రుపదతనయ మహీశా!** **330**

**ప్రతిపదార్థం:** మహీశా!= రాజా!; విను= వినుము; సైరంధ్రీ వేషంబునన్= ఇతరుల ఇంటిలో కారణాంతరమున ఉండే పతివ్రత వేషంలో; మాలిని+అనఁగన్= మాలిని అనే పేరుతో; పరఁగి= ఒప్పి; పూత= పవిత్రమైన; చరిత్రంబునన్= నడవడితో; కేకయ భూవర నందనకడన్= సుదేష్ణ వద్ద; మెలఁగుసతి= ఉండెడి పతివ్రత; ద్రుపద తనయ= ద్రౌపది.

**తాత్పర్యం:** 'రాజా! సైరంధ్రీ వేషంలో మాలిని అనే పేరుతో కళంకం లేని నడవడికతో సుదేష్ణ వద్ద ఉండే ఆమె ద్రౌపది.

**క. ఆ చపలాక్షికిఁ గా మన । కీచకు లందఱను రాత్రి గీటడఁచె రహ**
**స్యోచిత విధమున గంధ । ర్వాచరణము పేర భీముఁ డతి భీమముగాన్.' 331**

**ప్రతిపదార్థం:** ఆ చపలాక్షికిన్+కాన్= ఆ వనితకై; మన కీచకులు+అందఱను= మన కీచకుల నందరిని; రాత్రి= రాత్రివేళ; రహస్య= రహస్యానికి; ఉచిత= తగిన; విధంబునన్= రీతిగా; గంధర్వ= గంధర్వులయొక్క; ఆచరణము పేరన్= చర్య అనే పేరుతో; భీముఁడు= ఈ భీమసేనుడు; అతి భీమముగాన్= మిక్కిలి భయంకరంగా; గీటు+అడఁచెన్= చంపాడు.

**తాత్పర్యం:** ఈమె నిమిత్తంగానే మన కీచకులందరినీ రహస్యంగా ఈ భీముడే - గంధర్వులు చేశారనే పేరుతో - అతి భయంకరంగా చంపేశాడు.'

### విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట (సం. 4-66-1)

**వ. అనియె; నప్పుడు వృకోదరుండు. 332**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని పలికాడు; అప్పుడు= అంతట; వృకోదరుండు= భీముడు.

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పగా భీముడు అందుకొని.

**సీ. 'షండరూపమునఁ బ్రచ్ఛన్నుఁడై వచ్చి, క । న్నియలకు నెల్లను నృత్తగీత**
**వాద్యనైపుణ మనవద్య శిక్షావిధి । నలవరించుచు బృహన్నల యనంగఁ**
**బరఁగు నీతండు బీభత్సుండు సుమ్మని । చూపి, యమ్మత్స్యరాజునకుఁ జెప్పి**
**వెండియుఁ బలుకు 'నాఖండలు నోడించి । ఖాండవ మేర్చె, నాతండు దన్ను**

**తే. గారవించిన నెక్కటి కాలకేయ । వర్గములఁ బరిమార్చె, నివాత కవచ**
**సంఘముల నోర్చె, గంధర్వసమితి గెలిచి । ధార్తరాష్ట్రాగ్రజుని చెఱఁ దలఁగె నితఁడు.' 333**

**ప్రతిపదార్థం:** షండరూపమునన్= పేడిరూపంలో; ప్రచ్ఛన్నుఁడు+ఐ= గూఢంగా ఉండి; వచ్చి= ఇక్కడికి వచ్చి; కన్నియలకున్= కన్యలకు; ఎల్లను= అందరికిని; నృత్త= నృత్యం; గీత= పాటలు; వాద్య= వాద్యముల యందలి; నైపుణము= నేర్పు; అనవద్య= దోషరహితమైన; శిక్షావిధిన్= నేర్పే విధానంలో; అలవరించుచున్= నేర్పుతూ; బృహన్నల+అనంగన్= బృహన్నల అనే పేరుతో; పరఁగు+ఈతండు= ఒప్పునట్టి ఇతడు; బీభత్సుండు సుమ్ము= అర్జునుడు సుమా; అని చూపి= అని అతడిని చూపించి; ఆ+మత్స్య రాజునకున్= ఆ విరాటరాజుకు; చెప్పి; వెండియున్= మరల; పలుకున్= ఇట్లా అన్నాడు; ఆఖండలున్= ఇంద్రుడిని; ఓడించి= గెలిచి; ఖాండవము= ఖాండవ వనమును; ఏర్చెను= కాల్చాడు; ఆతండు= ఇంద్రుడు; తన్నున్= అర్జునుడిని; గారవించినన్= గౌరవించగా; ఎక్కటి= ఒంటరిగా; కాలకేయ వర్గములన్= కాలకేయులనే రాక్షసుల సమూహాన్ని; పరిమార్చెన్= చంపాడు; నివాత కవచ సంఘములన్= నివాత కవచులు అనే రాక్షస సముదాయాన్ని; ఓర్చెన్= ఓడించాడు; గంధర్వ సమితిన్= గంధర్వుల సంఘాన్ని; గెలిచి= జయించి; ధార్తరాష్ట్ర+అగ్రజుని= దుర్యోధనుడియొక్క; చెఱన్= బందీతనాన్ని; ఇతఁడు= ఈ అర్జునుడు; తలఁగెను= తొలగించాడు.

**తాత్పర్యం:** 'పేడిరూపంలో ఎవరికీ తెలియకుండా ఇక్కడికి వచ్చి, కన్యలకు నాట్యం, పాటలు, వాద్యాలలోని నేర్పును దోషం లేకుండా నేర్పుతూ, 'బృహన్నల' అనే పేరుతో ఉన్నటువంటి ఇతడు అర్జునుడు సుమా!' అని విరాటుడికి అతడిని చూపించాడు. ఇంకా ఇట్లా అన్నాడు - 'ఇతడు ఇంద్రుడిని ఓడించి ఖాండవవనాన్ని అగ్నికి అప్పగించాడు. ఇంద్రుడు గౌరవించగా అసహాయశూరుడుగా ఒక్కడే కాలకేయులను చంపాడు. నివాతకవచులను ఓడించాడు. గంధర్వులను ఓడించి, దుర్యోధనుడిని విడిపించాడు.'

**విశేషం:** తిక్కన నాటకీయ రచనా శిల్పానికి ఈ పద్యం ఒక మంచి ఉదాహరణం. దానికి కారణాలు అయిదు. 1.మూలంలో అర్జునుడే తననుగూడ విరాటుడికి పరిచయం చేసికొంటాడు. అందులో వినయం మాత్రమే వెలుగు చూపుతుంది. ఆ తరువాత ఉత్తరుడు అతడిని ప్రశంసిస్తాడు. అర్జునుడు ధీరోదాత్తుడు, స్వాభిమాని. అతడు స్వయంగా పరిచయం చేసికొనటం రాజమర్యాద కాదు, వీరమర్యాద కాదు. కాబట్టి, భీముడు పరిచయం చేసినట్లు చేసిన తిక్కనకల్పన ప్రకరణౌచిత్యపోషకంగా ఉన్నది. 2.పాండవులు బయలు మెరసిన ఈ రంగంలో ప్రధానపాత్రలన్నీ మాట్లాడితే సన్నివేశం చైతన్యవంతంగా ఉంటుంది. అందువలన భీమపాత్రకు సంభాషణ కల్పించాడు తిక్కన. 3.అర్జునుడు ధర్మజాదులను పరిచయం చేయటంలో కొన్ని మర్యాదలు పాటించాడు. ధర్మజుడిని ఒక సీసపద్యంలో, ఉత్పలంలోనూ, భీముడిని ఒక వృత్తంలో, ఒక తేటగీతిలోనూ, నకుల సహదేవులనూ, ద్రౌపదినీ - ఒక్కొక్కరినీ రెండు కంద పద్యాలలోనూ పరిచయం చేశాడు. అందరిలో భీముడిని-అతడి వీరకృత్యాలను ప్రత్యేకించి చెప్పుతూ వర్ణించాడు. భీముడు అర్జునుడిని పరిచయం చేయటంలో అతడు తన పరిచయంలో వాడిన పద్ధతినే ఉపయోగించాడు. ఒక సీసపద్యాన్ని సమవిభక్తం చేసి అజ్ఞాతవ్రత వేషాన్నీ, అర్జున పరాక్రమ విశేషాలనూ సమంగా పంచి వర్ణించాడు. ఒక పద్యం రెండు పద్యాలవలె పలికాడు. విజయ వీరకార్యాలను ప్రధాన వివక్షాదృష్టితో వరుసగా చెప్పాడు. అది భీమ పరిచయంలో అర్జునుడు పాటించిన పద్ధతికి ప్రతిబింబం. 4.అర్జునుడి వీర గాథలలో మొదట పేర్కొనదగింది - ఇంద్రుడిని జయించిన గాథ - ఖాండవ దహనం (ఆది.8.232-331); ఆ తరువాత వరుసగా-ఇంద్ర శత్రుసంహారం - కాలకేయులను చంపిన విజయగాథ (ఆరణ్య.4.78-87) నివాత కవచుల వధ - (ఆరణ్య.4.53-77). చివర చెప్పదగింది ఘోషయాత్రలో గంధర్వ విజయం, దుర్యోధనుడి బంధవిముక్తి (ఆరణ్య.5.415-427). 5.విరాటపర్వంలో మహాయుద్ధవీరులు - భీముడు, అర్జునుడు. వీరిరువురు ఒకరినొకరు పరిచయం చేసికొనటం కథార్థ సంవిధానంలో ఒక నాటకీయ రచనా శిల్పం. 6.తిక్కన నృత్త గీత వాద్య శబ్దాలను వాడడం. నృత్తం - నృత్య నాట్య విభాగానికీ, గీతం-గాత్ర సంగీత విభాగానికీ, వాద్యం-జంత్రవాద్య విభాగానికీ ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. అంగవిన్యాస ప్రధానమైనది నృత్తమని, భావ ప్రధానమైనది నృత్యమని, రస ప్రధానమైనది నాట్యమనీ నాట్య సంప్రదాయం చెప్పుతున్నది. అయితే పూర్వకాలంలో దశరూపకాల నన్నంటిని రూపకశబ్దంతో, నాటక శబ్దంతో సాధారణంగా పేర్కొన్నట్లే, నృత్య, నాట్యశబ్దాల వలన స్ఫురించే అంశాలను కూడా మొదట్లో నృత్తంగానే పేర్కొనే పరిపాటి ఉన్నది. డా.పి.యస్.అప్పారావుగారి ఈ పరిశీలన గమనించదగినది- "నృత్త-నాట్య-నృత్యములను గూర్చి ప్రాచీనాధునిక విమర్శకులు అనేక విధములుగా వ్రాసినారు. నేడు నాట్య శబ్దము 'నృత్య' మునకు 'నృత్య' (dance) మనియే అర్థము. నాట్య శాస్త్రమునందు 'నృత్య'మను పదము లేదు. అభినవగుప్తుడు కూడ దీనిని వాడినట్లు కన్పట్టదు. (మూలమునందు కన్పట్టు 'నృత్య' మనెడి పాఠములు సరికావు. అట్లు కన్పట్టు ప్రతిపదమునకును క్రింద 'నృత్త' మను పాఠాంతరములుండుట గమనించవలెను). ఇంక నాట్యశాస్త్రము నందు నృత్త, నాట్య పదములే కలవు. ఈ నృత్తము నాట్యము కంటె చాల ప్రాచీనమైనది.' (నాట్యశాస్త్రము- పు. 19.20). తిక్కన కాలం వాడైన జాయపసేనాని 'నృత్త రత్నావళి' అనే పేర నాట్యశాస్త్రగ్రంథం వ్రాయటం గమనార్హం. కాబట్టి తిక్కన వాడిన 'నృత్త' మనే పదం నృత్యశాఖకు ప్రాతినిధ్యం వహించే ప్రాచీన పారిభాషిక పదమని గ్రహించాలి. (సంపా.)

**వ. అనిన విని యద్భుతరసాక్రాంతం బగు నంతరంగంబునం గలుగు సందేహావేశంబు వినయ సంభ్రమంబుల నిగుడనీకునికిం జేసి చిక్కువడి యున్న నిజజనకునకు నర్జునుం జూపి యుత్తరుం డిట్లనియె. 334**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; అద్భుతరస= ఆశ్చర్యంతో; ఆక్రాంతంబు+అగు= ఆక్రమించబడిన; అంతరంగంబునన్= భావోద్రేకంగల మనస్సులో; కలుగు= పుట్టునట్టి; సందేహ+ఆవేశంబు= సందేహం వలని ఆవేశం; వినయ= వినయాన్ని; సంభ్రమంబులన్= తొట్రుపాటును; నిగుడనీక+ఉనికిన్+చేసి= కలుగనియ్యకుండటంచేత; చిక్కువడి+ఉన్న= కలతచెంది ఉన్న; నిజ జనకునకున్= తన తండ్రికి; అర్జునున్= అర్జునుడిని; చూపి= చూపించి; ఉత్తరుండు= ఉత్తరుడు; ఇట్లు= చెప్పబోయే రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విరటుడు విన్నాడు. ఆశ్చర్యం మనస్సు నావరించింది. మనస్సులో కలిగే సందేహావేశం వినయాన్నీ, తొట్రుపాటునూ కలగనీయకపోవటంతో చిక్కుపడుతున్న తండ్రితో ఉత్తరుడు అప్పుడు అర్జునుడిని చూపిస్తూ ఇట్లా చెప్పాడు.

**తే.** **'ఈతఁ డింతకు మీకుఁ దన్నెఱుఁగఁ జెప్ప। వలవదని నియమించినఁ దెలియఁ బలుక**
**నలికి; యొక దేవసన్నిభుం డంటిఁ గాని। నిన్న యంతయుఁ దాఁ గదా నిర్వహించె!** **335**

**ప్రతిపదార్థం:** ఈతఁడు= ఈ ముందున్న అర్జునుడు; ఇంతకున్= ఇంతవరకు; మీకున్= తమకు; తన్నున్= తనను; ఎఱుఁగన్= తెలిసేటట్లు; చెప్పవలదు+అని= చెప్పవద్దని; నియమించినన్= నన్ను ఆపుచేసిన మూలాన; తెలియన్= తెలిసేటట్లుగా; పలుకన్= చెప్పటానికి; అలికి= జంకి; ఒక దేవసన్నిభుండు= ఒకానొక దేవతా సమానుడు; అంటిన్= అన్నాను; కాని= కాక; నిన్న= నిన్నటి యుద్ధం; అంతయున్= అంతా; తాన్+కదా= తానేకదా; నిర్వహించెన్!= నిర్వహించాడు!

**తాత్పర్యం:** 'ఇతడు నీకు చెప్పవద్దని నన్ను నియమించిన మూలాన చెప్పటానికి జంకి, ఎవరో ఒక దేవసమానుడని చెప్పాను గాని, నిన్నటి యుద్ధంలో అంతా నిర్వహించింది ఈయనే కదా!

**చ.** **ఒకరుఁడ తాను భీతి వెగడొందెడు రెండవ యేను నెట్టకే**
**లకుఁ ననుఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు సూడ దా**
**నికి మది శంక లేమి మహనీయ పరాక్రముఁడైన యీ కిరీ**
**టికిఁ జనుఁ గాక యివ్విధము డెప్పర మన్యుల కోర్వ వచ్చునే?** **336**

**ప్రతిపదార్థం:** తాను= అర్జునుడు; ఒకరుఁడు+అ= ఒక్కడే; భీతిన్= భయంచేత; వెగడు+ఒందెడు= భయపడే; రెండవ+ఏనున్= రెండవ వాడనైన నేను; ఎట్టకేలకున్= అతి కష్టంతో; ననున్= నన్ను; తేర్చునప్పుడు= ఓదార్చునపుడు; బలంబులతోన్= సైన్యాలతో; కురురాజు= దుర్యోధనుడు; చూడన్= చూడగా; దానికిన్= ఆ చూచినదానికి; మదిన్= మనస్సులో; శంకలేమి= సంశయం లేకపోవటం చేత; మహనీయ పరాక్రముఁడు+ఐన= గొప్ప పరాక్రమం కలవాడైన; ఈ కిరీటికిన్= ఈ అర్జునుడికే; చనున్+కాక= తగును గాని; ఈ+విధము= ఈ రకమైన; డెప్పరము= ఆపద; అన్యులకున్= ఇతరులకు; ఓర్వవచ్చునే?= సహించదగునా?

**తాత్పర్యం:** తాను ఒక్కడే. భయంతో నేను వణకుతూ ఉంటే, చిట్టచివరకు ఎట్లాగో నన్ను అతిశ్రమతో ఓదార్చేటప్పుడు సేనలతో సహా దుర్యోధనుడు చూస్తుంటే, తనకు ఏమీ మనస్సులోనైనా సందేహం లేకుండా ఉండటం గొప్ప పరాక్రమం కల ఈ అర్జునుడికే చెల్లింది కాని, అంతటి ఆపదను ఎవరు ఓర్చుకొనగలరు?

**చ. తము నెఱిఁగించి యల్ల నుచిత ప్రియభాషల నన్ను సూత కృ**
**త్యమునకుఁ జొన్ప, నేను బ్రమదంబున నప్పటి కియ్యకొంటి లో**
**కము సమరంబులట్ల యని; కయ్యము తీవ్రతకుం దగంగ ర**
**థ్యములఁ జరింపఁ జేఁత భరమై తుదిఁ బల్మఱు నోహటించితిన్. 337**

**ప్రతిపదార్థం:** తమున్= తమను; ఎఱిఁగించి= తెలియజెప్పి; అల్లన్= మెల్లగా; ఉచిత= తగిన; ప్రియ= ఇష్టమైన; భాషలన్= మాటలతో; నన్నున్= నన్ను; సూత కృత్యమునకున్= సారథ్యానికి; చొన్పన్= ప్రవేశపెట్టగా; నేను; ప్రమదంబునన్= సంతోషంతో; లోకము సమరంబులు+అట్ల+అని= లోకంలో జరిగే యుద్ధాల వంటిదే అని; అప్పటికిన్= ఆ సమయాన; ఇయ్యకొంటిన్= ఒప్పుకొన్నాను; కయ్యము= యుద్ధం యొక్క; తీవ్రతకున్= ముమ్మరానికి; తగంగన్= తగునట్లుగా; రథ్యములన్= గుర్రాలను; చరింపన్= నడిచేటట్లు; చేఁత= చేయటం; భరము+ఐ= బరువై, దుస్సహమై; తుదిన్= చివరలో; పల్మఱున్= చాలాసార్లు; ఓహటించితిన్= వెనుదీశాను.

**తాత్పర్యం:** తా మెవరో నాకు చెప్పి, తగినట్లు ప్రియోక్తులాడి నన్ను సారథిగా ఉండుమన్నాడు. లోకంలో జరిగే అన్ని యుద్ధాలవంటిదే అని అప్పటికి ఒప్పుకొన్నాను కాని, యుద్ధం తీవ్రమైన కొలదీ, దానికి తగినట్లు గుర్రాలను నడపటం నా శక్తికి మించిపోయి చివరకు చాలాసార్లు వెనుదీశాను.

**క. మొగ మోడఁ డితఁడు కౌరవ । జగతీశుఁడు విఱిగినపుడు జవమున వెనుకం**
**దగిలి 'యిది జూద మాడఁగ । నగునెడఁగా దఱుమ వలయు' ననియె నతనితోన్.' 338**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ అర్జునుడు; మొగమోడఁడు= ఎదురుగా మాట్లాడటానికి జంకడు; కౌరవ జగతీ+ఈశుఁడు= దుర్యోధనుడు; విఱిగినపుడు= పారిపోయేటప్పుడు; జవమునన్= వేగంగా; వెనుకన్+తగిలి= వెంటబడి తరిమి; ఇది= ఈ సమయం; జూదమాడఁగన్= జూదము ఆడటానికి; అగు+ఎడ= తగిన సమయం; కాదు; అఱుమ వలయున్= ఎదిరించవలెను అని; అతనితోన్= దుర్యోధనుడితో; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ అర్జునుడు ఎంతటి మాటనైన ముఖాన్నే అనటానికి జంకడు. ఎందుచేతనంటే, దుర్యోధనుడు పారిపోతూ ఉంటే వెంటబడి తరుముతూ 'రాజా! ఇది జూదమాడే సమయం కాదు, ఎదుర్కొనాలి' అని దెప్పి పొడుస్తూ అన్నాడు.'

**ఆ. అనిన నతఁడు వెఱపు నత్యాదరంబును । సంతసంబు మానసమున బెరయ**
**నవయవముల సంభ్రమావేశ మేర్పడ । గారవమున విజయుఁ గౌఁగిలించె. 339**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అతఁడు= విరాటుడు; వెఱపును= భయమును; అతి+ఆదరంబును= మిక్కిలి గౌరవమును; సంతసంబున్= సంతోషమును; మానసమునన్= మనస్సులో; బెరయన్= వ్యాపించగా; అవయవములన్= అవయవాలలో; సంభ్రమ+ఆవేశము= సంతోషాతిశయం; ఏర్పడన్= కలుగగా; గారవమునన్= గౌరవంతో; విజయున్= అర్జునుడిని; కౌఁగిలించెన్= కౌగిలించుకొన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పటంతో విరాటుడికి భయం, మిక్కిలి గౌరవం, సంతోషం మనస్సులో వ్యాపించాయి. అవయవాలలో సంబరంతో ఆవేశం కలిగింది. గౌరవంతో అర్జునుడిని కౌగిలించుకొన్నాడు.

**క. వినయంబు మిగులఁ గుంతీ । తనయాగ్రజు పాదపీఠతలమున ఫాలం**
**బును బొందఁ జాఁగి మ్రొక్కి య । తని కౌఁగిలి వడసె సమ్మదము దళుకొత్తన్. 340**

**ప్రతిపదార్థం:** వినయంబు= వినయము; మిగులన్= ఎక్కువకాగా; కుంతీతనయాగ్రజు= ధర్మరాజుయొక్క; పాదపీఠతలమునన్= పాదపీఠ ప్రదేశంలో; ఫాలంబును= నుదురు; పొందన్= ఉండేటట్లుగా; చాఁగి= సాష్టాంగపడి; మ్రొక్కి= ప్రణామం చేసి; సమ్మదము= సంతోషం; తళుకు+ఒత్తన్= మెఱయఁగా; అతని కౌఁగిలి= ధర్మరాజు కౌగిలిని; పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** విరాటుడు ఎక్కువ వినయంతో ధర్మరాజు పాదపీఠానికి నుదురుభాగం తాకేటట్లు సాగిలపడి మ్రొక్కాడు. ధర్మరాజు అతడిని లేవదీసి కౌగిలించుకొన్నాడు.

**ఆ. ప్రీతి నలుమడింప భీమునిఁ గవల నా । లింగనంబు సేసి యంగకములఁ**
**బులక లెగయఁ గేలు దల మోడ్చి ధర్మజు । నాననమున దృష్టి యడర నిలిపె. 341**

**ప్రతిపదార్థం:** ప్రీతి= సంతోషం; నలుమడింపన్= నాల్గురెట్లు కాగా; భీమునిన్= భీముడిని; కవలన్= నకుల సహదేవులను; ఆలింగనంబు+చేసి= కౌగిలించుకొని; అంగకములన్= అవయవములందు; పులకలు= రోమాంచములు; ఎగయన్= పైకిరాగా; కేలు= చేతులు; తలన్= తలపై; మోడ్చి= జోడించి; ధర్మజు ఆననమునన్= ధర్మరాజుయొక్క ముఖంపై; దృష్టి అడరన్= దృష్టి వ్యాపించేటట్లుగా; నిలిపెన్= నిలిపాడు.

**తాత్పర్యం:** సంతోషం నాలుగురెట్లు కాగా భీముడిని, నకుల సహదేవులను విరాటుడు కౌగిలించుకొన్నాడు. చేతులు తలపై జోడించి, ధర్మరాజుముఖంమీద దృష్టి నిలిపాడు.

**ఉ. అత్తఱి లేచి వచ్చి తన యన్నలఁ దమ్ములఁ గానిపించె న**
**య్యుత్తరు నర్జునుండు; దగ వొందఁగ నప్పడ పిల్వఁ బంచె మా**
**త్స్యోత్తముఁ డార్యమిత్ర సచివోత్కర సోదరవర్గపుత్రకో**
**దాత్త భటాదియోగ్యుల ముదంబునఁ బాండవ దర్శనార్థమై. 342**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ సమయంలో; అర్జునుండు= అర్జునుడు; లేచివచ్చి= ఆసనం నుండి లేచివచ్చి; తన అన్నలన్= తన అన్నలైన ధర్మరాజు, భీములను; తమ్ములన్= తమ్ములైన నకుల సహదేవులను; ఉత్తరున్= ఉత్తరుడికి; కానిపించెన్= చూపించాడు; తగవు+ఒందఁగన్= మర్యాదప్రకారం; మాత్స్య+ఉత్తముఁడు= విరాటుడు; అప్పుడు+అ= అప్పుడే; ఆర్య= పెద్దలు; మిత్ర= మిత్రులు; సచివ+ఉత్కర= మంత్రుల సముదాయం; సోదర వర్గ= సోదరుల సముదాయం; పుత్రక= పుత్రులు; ఉదాత్త= గొప్పవారైన; భట+ఆది= భటులు మున్నగు; యోగ్యులన్= యోగ్యత కలవారిని; పాండవదర్శన+అర్థము+ఐ= పాండవుల దర్శనం నిమిత్తమై; ముదంబునన్= ప్రీతితో; పిల్వన్= పిల్చుటకు; పంపెన్= పంపాడు.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు లేచివచ్చి తన అన్నలను, తమ్ములను ఉత్తరునకు చూపాడు. విరాటుడు మర్యాద ప్రకారం అప్పుడే మిత్రులను, మంత్రులను, సోదరులను, పుత్రులను, ఉన్నత భటులను- ఇంకా యోగ్యులైన వారందరిని పాండవులను దర్శించటంకొరకు పిలిపించాడు.

**వ. ఇట్లు సమస్తజన సమేతంబుగా ధర్మతనయ సేవా తత్పరుండై తదనుమతి సముచిత రుచిరాసనంబున నుండి విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుదేష్ణ కెఱింగింపం బనిచి, పాంచాలిం దగిన తెఱంగున గారవించునట్లు గావించె; నట్టియెడ ధనంజయుం డతని కిట్లనియె. 343**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సమస్తజన= ప్రజలందరితో; సమేతంబుగాన్= కూడుకొని; ధర్మతనయ= ధర్మరాజుయొక్క; సేవా= సేవించుటలో; తత్పరుండు+ఐ= ఆసక్తి కలవాడై; తద్+అనుమతిన్= ఆ ధర్మరాజుయొక్క అనుమతితో; సముచిత= తగిన; రుచిర= ప్రకాశించే; ఆసనంబునన్= ఆసనంపై; ఉండి= కూర్చుండి; విరాటుండు= విరాటుడు; అంతఃపుర= అంతఃపురంలో; వర్తులన్= ఉన్నవారిని; పిలిచి; అంతయున్= జరిగిందంతయు; సుదేష్ణకున్= దేవిఅగు సుదేష్ణకు; ఎఱింగింపన్= తెలియజేయటానికి; పనిచి= ఆజ్ఞాపించి; పాంచాలిన్= ద్రౌపదిని; తగిన తెఱంగునన్= తగిన విధంగా; గారవించునట్లు= గౌరవించే విధంగా; కావించెన్= చేశాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ధనంజయుండు= అర్జునుడు; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తన పరిజనులందరితో సహా ధర్మరాజును సేవించదలచి, ధర్మరాజు అనుమతిమీద తగిన ఆసనంపై కూర్చుండి, విరాటుడు రాణివాసంలో ఉండేవారిని పిలిచి, జరిగిందంతా సుదేష్ణకు తెలియచెప్పుమని చెప్పి, ద్రౌపదిని తగినరీతిగా గౌరవించే ఏర్పాట్లు చేశాడు. అప్పుడు అర్జునుడు ఇట్లా అన్నాడు.

**తే. 'చాల దుస్తరమైన యజ్ఞాతవాస। వత్సరంబు భగద్గర్భవాస గుప్తి**
**వలనఁ గడపితి మతి సుఖావాప్త చిత్త। వృత్తి నేము నిర్భయులమై విందులట్ల.' 344**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; చాలన్= మిక్కిలి; దుస్తరము+ఐన= దాటలేని; అజ్ఞాతవాస వత్సరంబు= అజ్ఞాతవాసం చేయవలసిన సంవత్సరం; భవత్= మీయొక్క; గర్భవాస= కడుపులో ఉన్నట్లుగా; గుప్తివలనన్= రహస్యంగా ఉండటం వలన; అతిసుఖ= మిక్కిలి సుఖాన్ని; ఆవాప్త= పొందబడిన; చిత్తవృత్తిన్= మనోవృత్తితో; నిర్భయులము+ఐ= భయంలేనివారమై; విందులు+అట్లు+అ= బంధువులవలెనే, అతిథులవలెనే; కడపితిమి= గడిపాము.

**తాత్పర్యం:** 'ఏ విధంగా గడుపుతామా అనుకొన్న ఈ అజ్ఞాతవాస సంవత్సరాన్ని మీ ఇంట్లో గర్భంలో ఉన్నట్లే సుఖంగా ఉండి ఎవరికీ తెలియకుండా బంధువులవలె గడిపాము.'

**విశేషం:** అలం: ఉపమ. 1. తిక్కన రచనలో తెలుగు జాతీయాలను సంస్కృతీకరించటం, సంస్కృత పదబంధాలను తెలుగుచేయటం తరచుగా కనబడుతుంది. 'నీ కడుపులో పెట్టుకొని రక్షించావు' - అన్న తెలుగు జాతీయానికి సంస్కృతీకరణం 'భవద్గర్భవాసగుప్తి' అనే సమాసం. గర్భవాసం అంటే మూలగృహమనీ, అంతఃపురమనీ, రాజమందిరమనీ భావం. పాండవుల అజ్ఞాతవాస ఉద్యోగాలన్నీ రాజమందిరానికే పరిమితమై ఉండటం చేత గర్భగుడి వంటి గర్భగృహంలోనే ఉన్నారు. కాబట్టి రహస్యం రక్షించబడిందని భావం. ఈ జాతీయం కృతజ్ఞతాభావాన్ని తెలుపుతుంది. ఈ సందర్భంలో మూలశ్లోకం ఇది- **"ఉషితాః స్మ మహారాజ! సుఖం తవ నివేశనే, అజ్ఞాతవాసముషితా గర్భవాస ఇవ ప్రజాః"** (4.66.10) గర్భవాసంలోని బిడ్డలవలె గుప్తంగా, రక్షణతో జీవించామని చెప్పినట్లు మూలంలో ఉండగా తిక్కన బిడ్డలవలె అనే ఉపమానం తీసివేసి జాతీయాన్ని ఉంచాడు. దానివలన మీరు కడుపులో పెట్టుకొని రక్షించగా రహస్యంగా రక్షణతో ఉండగలిగాం - అనే భావం ఏర్పడింది. అది కారణంగా పాండవులు నిర్భయంగా విందువలె అత్యంత సుఖావాసచిత్తవృత్తితో కాలం గడిపారట. గోప్యతకు గర్భవాసం

పోలిక. జీవించటానికి విందులు ఉపమానం. విందు - అంటే అతిథి, బంధువు. పాండవులు విరటుడి కొలువులో అతిథులుగా ఉండి, బంధువులుగా బయటపడతారు. తెలియనివారైనా దేవుళ్ళవలె గౌరవింపబడేవారు అతిథులు, అభ్యాగతులు. 'అతిథి దేవోభవ' అని న్యాయం. మూలంలో గుప్తికి మాత్రమే ఉపమ. తెలుగులో గుప్తికి, తృప్తికి కూడా ఉపమ అలంకరించబడింది. (సంపా.)

**వ. అనిన విని విరాటుం డతని కిట్లనియె. 345**

**ప్రతిపదార్థం:** అనినన్= అని; విని; విరాటుండు= విరాటరాజు; అతనికిన్= అర్జునుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అనగా విని విరాటుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఏనన వేఱ యొక్కఁడనె? యిట్లనఁగాఁ దగునయ్య? యిమ్మెయిం**
**గానన దేశవాసములఁ గాఱియ కోర్చి యడంగి యుండి మీ**
**పూనిక దీర్చి మీ రెలమిఁ బొందుట యెల్లను బుణ్యదేవతా**
**నూన దయాసమృద్ధి నను నొందుట గాదె సురేంద్రనందనా!' 346**

**ప్రతిపదార్థం:** సురేంద్రనందనా!= అర్జునా?; ఏన్+అనన్= నేననగా; వేఱ= వేరుగా; ఒక్కఁడనె= పైవాడనా?; ఇట్లు= ఈ రీతిగా; అనఁగాన్= పలుకగా; తగునయ్య?= తగునా?; ఈ+మెయిన్= ఈ విధంగా; కాననదేశ= అడవి ప్రదేశంలో; వాసములన్= నివాసాలతో; కాఱియకున్= బాధకు; ఓర్చి= సహించి; అడంగి+ఉండి= ఎవ్వరికీ తెలియకుండా అణగిఉండి; మీ పూనిక= మీ ప్రతిజ్ఞను; తీర్చి= చెల్లించి; మీరు; ఎలమిన్= సంతోషము; పొందుట= పొందగల్గుట; ఎల్లను= అంతయును; పుణ్య= పుణ్యంవల్ల సమకూడినట్టి; దేవతా= దేవతలయొక్క; అనూన= తక్కువకాని; దయా= దయయొక్క; సమృద్ధి= అతిశయం; ననున్= నన్ను; ఒందుట కాదె= పొందటమే కదా!

**తాత్పర్యం:** 'అర్జునా! నే నంటే వేరే పైవాడనా? అట్లా మాట్లాడటం నీకు ఉచితంగా ఉన్నదా? మీరు అడవిలో బాధలుపడి, అజ్ఞాతంగా ఇక్కడుండి అన్నమాట చెల్లించుకొని సంతోషంతో ఉన్నారంటే అదంతా నా పుణ్యం, దేవతల అనుగ్రహం మూలాననే కదా!'

**వ. అని పలికి ధర్మనందనుం జూచి. 347**

**తాత్పర్యం:** అని చెప్పి, ధర్మరాజును చూచి.

**చ. 'ధరణియుఁ బట్టణంబు హయదంతి రథంబులు గోవులున్ భటో**
**త్కరము నమాత్యవర్గమును గాఁ గలరాజ్య మితండ యేలు; ని**
**ర్భరమున నేనుఁ బుత్రులును బంధులుఁ దమ్ములుఁ గొల్చి యుండెదం**
**గలిపురి కెత్తునట్టిపని గల్గిన నోపిన యంత సేసెదన్.' 348**

**ప్రతిపదార్థం:** ధరణియున్= భూమియు; పట్టణంబు= పట్టణం; హయ= గుర్రాలు; దంతి= ఏనుగులు; రథంబులు= రథాలు; గోవులున్= ఆవులును; భట+ఉత్కరమున్= సైనికుల సముదాయం; అమాత్యవర్గమును+కాన్= మంత్రుల సముదాయంగా; కల= ఉన్న; రాజ్యము= నా రాజ్యాన్ని; ఇతండు+అ= ఈ ధర్మరాజే; ఏలున్= పరిపాలిస్తాడు; నేనున్= నేనును; పుత్రులును= నా కొడుకులును; బంధులున్= నా బంధువులును; తమ్ములున్= నా తమ్ములును; నిర్భరమునన్= నిబ్బరంగా; కొల్చి= సేవించి; ఉండెదన్= ఉంటాను; కరిపురికిన్= హస్తినాపురి పట్టణం మీదకు; ఎత్తు+అట్టిపని= దండెత్తవలసిన అవసరం; కల్గినన్= కల్గితే; ఓపిన+అంత= నాకు శక్తి ఉన్నంతవరకు; చేసెదన్= (సహాయం) చేస్తాను.

**తాత్పర్యం:** 'ఈ రాజ్యం, పట్టణం, ఏనుగులు, గుర్రాలు, రథాలు, గోవులు, భటులు, మంత్రులు - ఈ రాజ్యాన్నంతా ధర్మరాజే పరిపాలిస్తాడు. నేను, నా పుత్రులు, బంధువులు, తమ్ములు - అందరమూ నెమ్మదితో ఇతడిని కొలిచి ఉంటాం. హస్తినాపురం మీదికి దండెత్తవలసివస్తే నా శక్తికొలది ఉన్నంతవరకు నేను సాయం చేస్తాను.'

**చ. అన విని యుత్తరుండు తగ నజ్జనపాలకుతోడ నిట్లను**
**'మ్మన కొక రాజ్యముం గలదె? నన్నును నిన్నును నిన్న మొన్న వీ**
**రనితరసాధ్య శత్రు విజయంబునఁ గాచినయప్డు గల్గఁ జే**
**సినయది దక్క; దాని మఱి సెప్పఁగ నేటికి నింత వింతగన్? 349**

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; విని; ఉత్తరుండు= ఉత్తరుడు; తగన్= తగినట్లుగా; ఆ+జనపాలకుతోడన్= ఆ విరాటుడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= చెప్పాడు; మనకున్= నీకు-నాకు; ఒక రాజ్యమున్= ఇది అని ఒక రాజ్యం కూడ; కలదె?= ఉన్నదా?; నన్నునున్= నన్ను; నిన్నును= నిన్ను; నిన్న మొన్న= నిన్న మొన్న జరిగిన యుద్ధంలో; వీరు= ఈ పాండవులు; అనితరసాధ్య= ఇతరులకు సాధ్యంకాని; శత్రు= శత్రువులను; విజయంబునన్= విజయంతో; కాచిన+అప్డు= రక్షించినప్పుడు; కల్గన్+చేసిన అది+తక్క= మనకు ఉండేటట్లు చేసిందే తప్ప; దానిన్= ఆ రాజ్యాన్ని గూర్చి; ఇంత వింతగన్= ఇంత క్రొత్తగా; చెప్పఁగన్= చెప్పటం; ఏటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** ఆ మాటలు విని ఉత్తరుడు రాజుతో ఇట్లా అన్నాడు: 'మనకంటూ ఇప్పుడు ఒక రాజ్యం ఉన్నదా? నిన్నటి మొన్నటి యుద్ధంలో ఇతరులు సాధించలేని శత్రువులను జయించి నిన్నూ నన్నూ రక్షించి నిలబెట్టింది వీరే! ఈ రాజ్యమంతా మనకు దక్కించింది వీరే కదా! మరి వీరిచ్చిన దానినే మరల వీరికిస్తానని ఇంతగా వింత కలిగేటట్లు క్రొత్తగా చెప్పట మెందుకు?

**విశేషం:** మూలంలో ఈ మాటలు విరాటుడే అన్నట్లు ఉన్నది. తిక్కన ఉత్తరుడి నోట పలికించి ఔచిత్యాన్ని పాటించాడు. మాటలలో, వాక్యాల విన్యాసంలో తెలుగువారి పలుకుబడి బాగా వినబడుతున్నది. 'మన కొక రాజ్యముంగలదె?' - ఇది వ్యావహారిక వాక్యానికి ఛందోమయ గ్రాంథిక రూపం. తిక్కన తెలుగు వాక్య శిల్పి. (సంపా.)

**వ. అది సిద్ధం బట్ల చెల్లుం గాక! యించుక విశేషంబు గలదు; వినుము. 350**

**ప్రతిపదార్థం:** అది= రాజ్యం వారిదే అన్నది; సిద్ధంబు= ఇదివరకే ఏర్పడి ఉన్నది; అట్లు+అ= అది అట్లే; చెల్లున్+కాక!= చెల్లుగాక; ఇంచుక= కొద్దిగా; విశేషంబు= విశేషం; కలదు= ఉన్నది; వినుము.

**తాత్పర్యం:** రాజ్యం వారిదే అన్నది సిద్ధమే. అది అట్లే చెల్లుతుంది. ఇంకో విశేషం ఉన్నది, వినుము.

**చ. సవినయ వృత్తిఁ గొల్వ మిట చన్న దినంబుల వీరు నీఱుపైఁ**
**గవిసిన నిప్పులట్ల యధికంబగు తేజము దోఁప కున్కి; న**
**ట్టి విధము సాపరాధతను డెందము లూఱటఁ బొంది యుండ నే**
**రవు మన; కట్లు గానఁ దగఁ బ్రార్థన సేయుట యుక్త మిత్తఱిన్. 351**

**ప్రతిపదార్థం:** చన్న దినంబులన్= కడచిన రోజులలో; ఇట= ఇక్కడ; వీరు= ఈ పాండవులు; నీఱు= భస్మము; పైన్= పైన; కవిసిన= కప్పిన; నిప్పులు+అట్లు= నిప్పులవలె; అధికంబు+అగు= ఎక్కువైన; తేజము= తేజస్సు; తోఁపక+ఉన్కిన్= కనిపించకుండా ఉండటంచేత; సవినయవృత్తిన్= వినయంతో కూడిన నడతతో; కొల్వము= సేవించము; అట్టి విధము= అట్టి రీతి; సాపరాధతను= అపరాధంతో కూడి ఉండటంచేత; మనకున్= మనకు; డెందములు= హృదయాలు; ఊఱటన్= బాధనుండి తేరుకొనటం; పొంది+ఉండనేరవు= పొందిఉండలేవు; అట్లుకాన= ఆ కారణంతో; తగన్= తగినట్లు; ఈ+తఱిన్= ఈ సమయంలో; ప్రార్థన+చేయుట= ప్రార్థించటం; యుక్తము= తగినది.

**తాత్పర్యం:** వీరు జరిగిపోయిన రోజులలో 'నివురు గప్పిన నిప్పుల' వలె తమ తేజస్సు కప్పిపుచ్చుకొని ఉన్నందున మనం వినయగుణంతో వీరిని సేవించలేకపోయాం; మనకు వీరి గొప్పతనం తెలియక అపరాధం చేసి ఉన్నాము. దాని వలన మన మనస్సులు బాధపడుతున్నాయి. మనకు ఊరట కలిగేటట్లు ఇప్పుడు మనం వీరిని ఆ తప్పులన్నీ క్షమించండని ప్రార్థన చేయటం సమంజసం.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అదియునుం గాక. 352**

**తాత్పర్యం:** అంతేకాక.

**క. ధనవర్గంబులు వీరి । చ్చినయవి; యట్లగుట వేడ్క సేయవు; తగ నూ**
**తన మగు కానిక యీవల । యును వే తోడ్తేరఁ బనుపు ముత్తరఁ బ్రీతిన్.' 353**

**ప్రతిపదార్థం:** ధన వర్గంబులు= ధన సముదాయాలు; వీరు= ఈ పాండవులు; ఇచ్చినవి; అట్లు= ఆ రీతిగా; అగుటన్= కావటంచేత; వేడ్క+చేయవు= ఇష్టం కలుగజేయవు; తగన్= తగినట్లు; నూతనము+అగు= క్రొత్తదైన; కానిక= కానుక; ఈవలయును= ఇయ్యవలెను; ప్రీతిన్= ప్రీతితో; ఉత్తరన్= ఉత్తరను; వే= వేగంగా; తోడ్తేరన్= తోడు తెచ్చుటకు; పనుపుము= ఆజ్ఞాపించుము.

**తాత్పర్యం:** ధనములన్నీ వీరిచ్చినవే కనుక వాటిని వారి కిస్తే వారికి ఇష్టంగా ఉండదు. కనుక క్రొత్త కానుక ఏదైనా ఇవ్వాలి. వెంటనే సంతోషంగా ఉత్తరను తోడు తీసికొని రమ్మని ఆజ్ఞాపించవలసింది.'

**వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనంబలర మంత్రుల మొగంబు సూచి 'కుమారికనలంకరించుకొని తెం' డని నియోగించిన, వారును బ్రియంబునం జని తత్కార్యశ్రవణ సంప్రీతయగు సుదేష్ణ యనుమతంబున. 354**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; మత్స్యమహీవల్లభుండు= విరాటరాజు; మనంబు= మనస్సు; అలరన్= సంతోషించగా; మంత్రుల మొగంబు= మంత్రులయొక్క ముఖాలను; చూచి= చూచి; కుమారికను= ఉత్తరను; అలంకరించుకొని= అలంకరించి; తెండు+అని= తీసికొనిరమ్మని; నియోగించినన్= ఆజ్ఞాపించగా; వారునున్= వారు కూడ; ప్రియంబునన్= ఇష్టంతో; చని= వెళ్ళి; తద్+కార్య= ఆ శుభకార్యముయొక్క; శ్రవణ= వినటంచేత; సంప్రీత+అగు= ప్రీతిపొందిన; సుదేష్ణ= సుదేష్ణయొక్క; అనుమతంబునన్= అనుమతితో.

**తాత్పర్యం:** ఉత్తరుడు అట్లా అనగానే విని విరాటుడు మనస్సులో సంతోషించి మంత్రుల ముఖాలను చూచి, ఉత్తరను అలంకరించి తీసికొని రమ్మని ఆజ్ఞాపించాడు. వారు సంతోషంతో లోపలికి వెళ్ళి, ఆ విషయం చెప్పగా విని సంతోషించిన సుదేష్ణ అనుమతితో.

**క. పదనికి రాఁ బులు గడిగిన । మదనాస్త్రము రేఖ గలిగి మానినిమెయి సె**
**న్నొదవఁ గయిసేసి రప్పుడు । ముదితా జనములు ప్రమోదమున లలితముగన్. 355**

**ప్రతిపదార్థం:** పదనికిరాన్= పదును వచ్చేటట్లుగా; పులు+కడిగిన= మాలిన్యం కడిగివేసిన; మదన+అస్త్రము= మన్మథుడి బాణంయొక్క; రేఖ= అందం; కలిగి= ఉండి; మానిని= ఉత్తరయొక్క; మెయి= శరీరం; చెన్ను+ఒదవన్= అతిశయించిన అందం కలిగేటట్లుగా; అప్పుడు= ఆ సమయంలో; ముదితా జనములు= స్త్రీ జనాలు; ప్రమోదమునన్= సంతోషంతో; లలితముగన్= సుందరంగా; కయిసేసిరి= అలంకరించారు.

**తాత్పర్యం:** పదను వచ్చేటట్లుగా మాలిన్యం కడిగివైచిన మన్మథుడి అస్త్రంవలె అందగించియున్న ఉత్తరయొక్క శరీరానికి ఇంకా అందం వచ్చేటట్లుగా స్త్రీలు సంతోషంతో అలంకరించారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

### విరాటుని మంత్రు లుత్తరను బాండవుల యొద్దకుఁ దోడ్తెచ్చుట (సం. 4-66-27)

**వ. ఇట్లు శృంగారంబు సేసిన యమ్ముద్దియకు ముక్తాఫల ప్రాలంబ మాలికలతోడి గొడుగు వట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు తోడ్తేర ధారాధర నికర మనోహరయగు పర్జన్యలక్ష్మియుంబోలె వచ్చుచున్నం గని విరాటుం డెదురు వోయి పురోహితులును బంధుజనంబులుం దానునుం బొదివికొని పాండవాగ్రజు నగ్రభాగంబునకుం దెచ్చి యచ్చెలువ నిలిపి, సపరివారంబుగా దండప్రణామంబు సేసి, చేతులు మొగిడ్చి యిట్లనియె. 356**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; శృంగారంబు+చేసిన= అలంకరించిన; ఆ+ముద్దియకున్= ఆ ఉత్తరకు; ముక్తాఫల= ముత్యాలయొక్క; ప్రాలంబ మాలికలతోడి= వ్రేలాడే మాలలు కల; గొడుగు= గొడుగు; పట్టించి= పట్టేటట్లు చేసి; అతి+ ఆదరంబునన్= మిక్కిలి ప్రేమతో; ఆ+అమాత్యులు= ఆ మంత్రులు; తోడ్తేరన్= తోడుకొనిరాగా; ధారాధరనికర= మబ్బుల సముదాయంతో; మనోహర+అగు= అందమైన; పర్జన్యలక్ష్మియున్+పోలెన్= వానకాలపు లక్ష్మివలె; వచ్చుచున్నన్= వస్తూ ఉంటే; కని= చూచి; విరాటుండు= విరాటరాజు; ఎదురు+పోయి= ఎదురుగా వెళ్ళి; పురోహితులును= బ్రాహ్మణ పురోహితులును; బంధు జనంబులున్= బంధువులును; తానునున్= (విరాటుడును); పొదివికొని= చుట్టుముట్టి; పాండవ+అగ్రజు= ధర్మరాజుయొక్క; అగ్రభాగంబునకున్= సమక్షమునకు; తెచ్చి= తీసికొనివచ్చి; ఆ+చెలువన్= ఆమెను; నిలిపి= ఉంచి; సపరివారంబుగాన్= పరివారంతో సహా; దండప్రణామంబు+చేసి= దండము వలె చాగిలి పడి నమస్కారం చేసి; చేతులు= చేతులను; మొగిడ్చి= దగ్గరగా మొగ్గవలె పెట్టి; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా సింగారించి, ముత్యాల దండలు వ్రేలాడే మాలికలుగా కట్టిన గొడుగు పట్టించి, ఎక్కువ ప్రేమతో ఆ మంత్రులు తోడుతో తీసికొని రాగా, మబ్బులతో మనోహరమైన వర్షాకాల లక్ష్మివలె వస్తూ ఉన్న ఉత్తరను చూచి విరాటుడు ఎదురుగా వెళ్ళి, పురోహిత బ్రాహ్మణులు, బంధువులు, తాను చుట్టుకొని ధర్మరాజు ఎదుటికి తీసికొని వచ్చి ఆపి, పరివారమూ తానూ సాష్టాంగ దండప్రణామాలు చేసి చేతులు జోడించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'ఎఱుఁగమి చీఁకటి నీ పె । ద్దఱికంబు దలంప; నేమి తప్పు గలిగినన్**
**మఱచి దయఁ జూడు; మిట్లం । దఱు నీకుం బనులు సేయఁ దగుదురు వీరల్.' 357**

**ప్రతిపదార్థం:** ఎఱుఁగమి= అజ్ఞానమనే; చీఁకటిన్= అంధకారంచేత; నీ పెద్దఱికంబు= నీ గొప్పతనాన్ని; తలంపను= తలపలేదు; ఏమి తప్పు= ఏ దోషం; కలిగినన్= చేసినను; మఱచి= మరచిపోయి; దయన్= దయతో; చూడుము= కటాక్షించుము; ఇట్లు= ఈ విధంగా; వీరల్= వీరు; అందఱున్= అందరును; నీకున్= నీకు; పనులు= చెప్పిన పనులు; చేయన్+తగుదురు= చేయటానికి తగినవారు, (అంటే చేస్తారని భావం.)

**తాత్పర్యం:** 'అజ్ఞానమనే చీకటిలో నీ గొప్పతనం తెలియలేక ఏ తప్పులు చేసినా క్షమించి, అవి మరచిపోయి మమ్ము కటాక్షించుము. వీరందరు ఇకమీద నీ సేవలు చేస్తారు.'

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని నిజానుజ తనూజులం జూపి, మఱియును. 358**

**ప్రతిపదార్థం:** అని= పలికి; నిజ= తనయొక్క; అనుజ= తమ్ములను; తనూజులన్= కొడుకులను; చూపి= చూపించి; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** అట్లని తన తమ్ములను, కొడుకులను చూపాడు. ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'ఇమ్ముద్దియ నర్జునునకు । ని మ్మీపని బంధుజనుల కిందఱకుఁ గడున్**
**సమ్మత; మెల్ల ప్రజకు నే । నిమ్మెయి నినుఁ జేరి బ్రతుకు టిష్టం బధిపా!' 359**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధర్మరాజా!; ఈ+ముద్దియన్= ఈ కన్యను; అర్జుననకున్= అర్జునుడికి; ఇమ్ము= ఇయ్యవలసింది; ఈ పని= ఇట్లా ఇవ్వటం; బంధు జనులకున్= బంధువులకు; ఇందఱకున్= ఈ అందరికి; కడున్= మిక్కిలి; సమ్మతము= ఇష్టం; ఎల్ల ప్రజకున్= ప్రజలందరికిని; నేను; ఈ+మెయిన్= ఈ రీతిగా; నినున్= నిన్ను; చేరి= ఆశ్రయించి; బ్రతుకుట= జీవించటం; ఇష్టంబు= ఇష్టం.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఈ కన్యను అర్జునుడికి ఇమ్ము. అట్లా ఇవ్వటం బంధుజను లందరికి సమ్మతమైనదే. నేను నిన్ను చేరి బ్రతకటం మా ప్రజలందరికీ ఇష్టం.'

**క. అని పలికిన విని కుంతీ । తనయాగ్రజుఁ డింద్రసుతువదన మాలోకిం**
**చిన నాతఁ డిట్టులను న । మ్మనుజేంద్రుఁడు వినుచునుండ మత్స్యాధిపుతోన్. 360**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని చెప్పగా; విని; కుంతీ తనయ+అగ్రజుఁడు= ధర్మరాజు; ఇంద్రసుతు= అర్జునుడి యొక్క; వదనము= ముఖాన్ని; ఆలోకించినన్= చూడగా; ఆతఁడు= అర్జునుడు; ఆ+మనుజ+ఇంద్రుఁడు= ఆ ధర్మరాజు; వినుచున్+ ఉండన్= వినుచుండగా; మత్స్య+అధిపుతోన్= విరాటుడితో; ఇట్టులు= ఈ రీతిగా; అనున్= పలికాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని ధర్మరాజు అర్జునుడి ముఖంవైపు చూచాడు. అర్జునుడు ధర్మరాజు వింటూ ఉండగా విరాటుడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఈ కన్నియఁ గోడలిఁగా । గైకొనియెదఁ గాని యిది దగ దుచితవృత్తిన్**
**నాకడన యబల మెలఁగుట । లోకము శంకించు నన్ను లోలాత్మునిఁగన్. 361**

**ప్రతిపదార్థం:** ఈ కన్నియన్= ఈ ఉత్తరను; కోడలిన్+కాన్= నాకు కోడలుగా; కైకొనియెదన్= స్వీకరిస్తాను; కాని= అంతేకాని; ఇది= నేనే స్వీకరించటం; తగదు= పనికిరాదు; ఉచిత వృత్తిన్= తగిన రీతిలో; అబల= ఉత్తర; నాకడన= నా వద్దనే; మెలఁగుటన్= మెలగినందున; లోకము= లోకులు; నన్నున్= నన్ను; లోల+ఆత్మునిగన్= చంచలమైన మనస్సు కలవాడినిగా; శంకించున్= సందేహిస్తారు.

**తాత్పర్యం:** 'ఈ ఉత్తరను నేను కోడలుగా స్వీకరిస్తాను కాని భార్యగా చేసికొనను. ఈమె నావద్ద తగినరీతిగా మెలగింది. అందుచే లోకులు నన్ను చంచలమైన స్వభావం కలవాడినిగా సందేహిస్తారు.

**వ. అదియునుం గాక నృత్తగీతాదులయెడ ని క్కోమలికి గురుండనైన నాకు నివ్విధంబు ధర్మంబు గాదు కావున. 362**

**ప్రతిపదార్థం:** అదియునున్+కాక= అదీకాక; నృత్త గీత+ఆదులయెడన్= నాట్యం-పాటలు మొదలైన వాటిపట్ల; ఈ+కోమలి= ఈ కన్యకకు; గురుండను+ఐన నాకున్= గురువునైన నాకు; ఈ+విధంబు= ఈమెను పెండ్లాడటం; ధర్మంబు+కాదు= ధర్మం కాదు; కావునన్= కాబట్టి.

**తాత్పర్యం:** అదీకాక ఈమెకు నాట్యం, పాటలు మొదలగువాటికి నేను గురువును. కావున ఈమెను పెండ్లాడటం ధర్మం కాదు. కాబట్టి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. హరి మేనల్లుఁడు, బాహువీర్య పటు శౌర్యస్ఫూర్తి త్రైలోక్య సుం**
**దరుఁ, డాచార పవిత్రుఁ, డంచిత కళాదక్షుం, డుదారుండు, కా**
**తర సంరక్షకుఁ, డార్య సమ్మతుఁడు, విద్యా వైభవోల్లాసి, య**
**త్యురుతేజుండు వరించుఁ గాక యభిమన్యుం డీ సరోజాననన్.' 363**

**ప్రతిపదార్థం:** హరి మేనల్లుఁడు= కృష్ణుడికి చెల్లెలి కొడుకు; బాహువీర్య= భుజబలంతోను; పటు= గొప్పదైన; శౌర్యస్ఫూర్తి= శౌర్యంతోను ప్రకాశించేవాడు; త్రైలోక్య సుందరుఁడు= మూడు లోకాలలోను సుందరుడైనవాడు; ఆచార= నడవడిలో; పవిత్రుఁడు= పవిత్రమైనవాడు; అంచిత= గొప్పవైన; కళా= కళలలో; దక్షుండు= సమర్థుడు; ఉదారుండు= ఔదార్యం కలవాడు;

కాతర= భయం కలవారిని; సంరక్షకుఁడు= సంరక్షించేవాడు; ఆర్యసమ్మతుఁడు= పెద్దలకు ఇష్టమైనవాడు; విద్యావైభవ= విద్యలయొక్క వైభవంతో; ఉల్లాసి= ప్రకాశించేవాడు; అతి+ఉరు= చాల విశాలమైన; తేజుండు= తేజస్సు కలవాడు; అభిమన్యుండు= అభిమన్యుడు; ఈ సరోజ+ఆననన్= పద్మం వంటి ముఖంకల ఈ ఉత్తరను; వరించున్ కాక!= వివాహం చేసికొంటాడు గాక!

**తాత్పర్యం:** మా అభిమన్యుడు ఈమెను వివాహం చేసికొంటాడు. అతడు ఎట్టివాడు అనగా - శ్రీకృష్ణుడికి సాక్షాత్తు మేనల్లుడు. సుభద్ర కొడుకు. బాహు పరాక్రమం, శౌర్యం కలవాడు. మూడు లోకాలలోనూ సుందరమైనవాడు. పవిత్రమైన ప్రవర్తన కలవాడు. కళాకౌశలం కలవాడు. ఉదారుడు. భయం కలవారిని రక్షిస్తాడు. పెద్దలకు ఇష్టంగా ఉంటాడు. విద్యావైభవం కలవాడు. గొప్ప తేజస్సు కలవాడు.'

**విశేషం:** 1. అలం: ఉదాత్తం, రూపకం. అభిమన్యుడు ఉత్తమ నాయకుడనీ, ఉత్తమ వరుడనీ పరిచయం చేసే విశిష్ట పద్యమిది. అర్జునుడి కొడుకు అతడికంటె ఘనుడన్నంతగా చెప్పటం ఇందులో ధ్వని.

**"త్యాగీ, కృతీ, కులీనః, సుశ్రీకో రూపయౌవనోత్సాహీ**

**దక్షోఽనురక్తలోక స్తేజో వైదగ్ధ్య శీలవాన్ నేతా"** - అని సాహిత్య దర్పణం నాయక లక్షణాలను పేర్కొన్నది. వారికి మేనల్లుడు కావటం ఆయన కబ్బిన కులీనత్వం. సుశ్రీకత్వం (మహాభాగ్యం. ఇది గుణప్రధానమైన మహాభాగ్యం); బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి - దక్షత్వ సూచకం. త్రైలోక్య సుందరుడు కావటం రూపవత్త్వ లక్షణం. ఆచార పవిత్రుడు కావటం శీల లక్షణం. అంచిత కళాదక్షత్వం వైదగ్ధ్య లక్షణం. ఉదారత్వం త్యాగి లక్షణం. కాతర సంరక్షణ స్వభావం ఉత్సాహలక్షణం. ఆర్య సమ్మతుడు కావటం లోకానురక్తుడైనవాడి లక్షణం. విద్యావైభవోల్లాసిత్వం - 'విద్యా దదాతి వినయం' అనే న్యాయంలో సుకృతి యొక్క లక్షణం. అత్యురుతేజుడు అనే విశేషణం అతడి తేజస్వితకు సూచకం. అతడి తేజస్విత అతడిని సూర్యుడివలె భాసింప చేస్తున్నది. రూపకాలంకార స్ఫూర్తితో అతడు సూర్యుడు కాబట్టే సరోజానన అయిన ఉత్తరను గ్రహించటానికి అర్హుడని ధ్వని. వారిరువురికీ ఈడూజోడూ, ఆనుకూల్యం అనురాగం కుదిరినవని అర్జునుడి నిర్ణయం. ఉదాత్త వర్ణనం. ఉదాత్తాలంకారంలో ఉండటం, అనురూప దాంపత్యాన్ని రూపకంలో ధ్వనింపజేయటం అలంకార శిల్పం.

2. అభిమన్యుడిలో ఉత్తమ వరుడి లక్షణాలు సూచించబడ్డాయని కొందరు విమర్శకులు భావించారు. "కన్యా వరయతే రూపం, మాతా విత్తం, పితా శ్రుతమ్, బాంధవాః కుల మిచ్ఛన్తి, మృష్టాన్న మితరే జనాః" అని లోకోక్తి. అందరూ మెచ్చుకొనే అన్ని గుణాలూ ఉండటం చేత అభిమన్యుడు ఆదర్శ వరుడని ధ్వని. అయితే ఈ వర లక్షణాలు సామాన్య లక్షణాలే. అభిమన్యుడి లక్షణాలు వీరోచిత లక్షణాలనీ, జగదేకవీరుడైన అర్జునుడు ఎన్నిక చేసిన లక్షణాలనీ గ్రహించటం ఉచితం. అన్నింటికంటె గొప్ప అదృష్టం ఆతడు 'హరిమేనల్లుడు' కావటం. శ్రీకృష్ణుడి పరిపూర్ణ కటాక్షం అతడి మీద ఉన్నది. ఆ విశేషణంలో తిక్కన సుభద్రా వివాహంలోనూ, పాండవ వంశాంకుర రక్షణంలోనూ శ్రీకృష్ణుడు నిర్వహించిన, నిర్వహించబోయే దివ్యపాత్రను పఠితల చేత భావింప చేసే ధ్వని గమ్యమానం! (సంపా.)

**వ. అనిన విని మత్స్యమహీకాంతుం డత్యంత సంతుష్టాంతరంగుండై. 364**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; మత్స్యమహీకాంతుండు= విరాటరాజు; అత్యంత= మిక్కిలి; సంతుష్ట= సంతోషించిన; అంతరంగుండు+ఐ= మనస్సు కలవాడై.

**తాత్పర్యం:** అనేటప్పటికి విని విరాటుడు మహా సంతోషంతో.

**తే. 'అర్జునుని వియ్య మనియెడు నంతకంటెఁ । గడవఁ బెంపు నా కెయ్యది? కార్యనిశ్చ**

**యంబు ధర్మతనూభవుం డానతిచ్చు । వాఁడు; మనమెల్లఁ గావించు వార మదియు.' 365**

**ప్రతిపదార్థం:** అర్జునుని= అర్జునుడితో; వియ్యము+అనియెడు అంతకంటెన్= వియ్యం పొందటం అనేదానికంటె; కడవన్= కడచుటకు; పెంపు= అభివృద్ధి; నాకున్= నాకు; ఎయ్యది= ఏముంటుంది? ధర్మతనూభవుండు= ధర్మరాజు; కార్యనిశ్చయంబు= కార్యంయొక్క నిశ్చయాన్ని; ఆనతి+ఇచ్చువాఁడు= ఆజ్ఞాపించేవాడు; అదియున్= దానిని; మనము+ఎల్లన్= మనం అందరం; కావించు వారము= చేసేవాళ్ళం.

**తాత్పర్యం:** 'అర్జునుడితో వియ్యమందటం కంటె కావలసింది ఏమున్నది? ధర్మరాజు కార్యనిశ్చయం చేస్తే, మనమంతా దానిని ఆచరణలో పెట్టుదాం.'

**ఆ. అనుడు నతని కిట్టు లనుఁ బాండవాగ్రజుం । 'డింద్రతనయుఁ డుచిత మెఱిఁగి పలికె;**
**నిట్లు సేయువార; మిప్పుడు చుట్టాల । కెల్లఁ జెప్పిపుచ్చుఁ డీశుభంబు.' 366**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనిన వెంటనే; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; అతనికిన్= విరాటునకు; ఇట్టులు= ఈ రీతిగా; అనున్= అన్నాడు; ఇంద్రతనయుఁడు= అర్జునుడు; ఉచితము= ధర్మమును; ఎఱిఁగి= తెలిసి; పలికెన్= మాట్లాడాడు; ఇట్లు= అర్జునుడు చెప్పినట్లే; చేయువారము= చేద్దాం; ఇప్పుడు= ఇప్పుడే; ఈ శుభంబు= ఈ శుభవార్తను; చుట్టాలకున్= బంధువులకు; ఎల్లన్= అందరికి; చెప్పి పుచ్చుఁడు= చెప్పి పంపండి.

**తాత్పర్యం:** అట్లనగా ధర్మరాజు ఆ విరాటుడితో ఈ విధంగా అన్నాడు- 'అర్జునుడు ధర్మం తెలిసి మాట్లాడాడు. అతడు చెప్పినట్లే చేద్దాం. ఇప్పుడే ఈ శుభవార్తను చుట్టాలకందరికి తెలిసేట్టు చెప్పి పంపండి.'

**వ. అని నిశ్చయించి పలికిన విరాటుండును 'గౌరవాన్వయ సంబంధంబున మాత్స్యవంశంబు పావనం బయ్యె' నని పలుకుచు ధర్మజ భీమార్జున నకుల సహదేవులకుఁ గ్రమంబున నుత్తరఁ బ్రణామంబు చేయించిన, వారు దీవించి యంతఃపుర గమనంబునకు ననుజ్ఞసేయ, నచ్చెలువ నెచ్చెలులుం దానును దత్సమయసముచితపరివార పరివృతయై యరిగిన యనంతరంబ, మౌహూర్తికుల రావించి లగ్న నిరూపణంబు సేసి యాదవ పాంచాలాది బంధుజనంబుల నెల్లఁ బెండ్లికిం బిలువ రెండు దెఱంగుల వారును గాలరులం బనిచి; రజాతశత్రుండును విరటు గారవించి తా రతనిపాల నజ్ఞాతవాసంబు సుఖవృత్తి నడపికొనుట వాక్రుచ్చి పలికి, యతని గుణంబులు గొనియాడి 'నీవు మాకు వాసుదేవునట్ల కాక సామాన్య బంధుండవే?' యని సంభావించి, వినయ నిభృతుం డగు నతనిం దిగిచి పునఃపున రాలింగనంబు సేసిన, నతండును ససంభ్రమ పరిజన సముపనీయ మానంబు లగు నానా విధోపకరణంబులం గౌంతేయుల వివిధోపచారంబు లాచరించి, మహార్హ మజ్జన భోజనంబులు నడపె; నంత, నక్కడ దుర్యోధనుండు నిజపురంబునకుం జనిచని నడుమ విడిసిన యెడం గర్ణశకుని దుశ్శాసనుల దుర్మంత్రంబుఁ బట్టి గాంగేయుని వచనంబు లప్రమాణంబులు సేసి, ధర్మతనయుం డసత్యంబున కియ్యకొనమి యెఱింగి యాతనిపాలికి దూతం బుత్తెంచిన, వాఁడు నేతెంచి కాంచి యిట్లనియె. 367**

**ప్రతిపదార్థం:** అని= అట్లు; నిశ్చయించి= నిశ్చయం చేసి; పలికినన్= చెప్పగా; విరాటుండును= విరాటరాజు కూడ; కౌరవ+ అన్వయ= కౌరవ వంశంతో; సంబంధంబునన్= ఇచ్చి పుచ్చుకొనే సంబంధంతో; మాత్స్యవంశంబు= తమ మత్స్యరాజ వంశం; పావనంబు= పవిత్రమైనది; అయ్యెను+అని= అయిందని; పలుకుచున్= చెప్పుతూ, ధర్మజ= ధర్మరాజుకు; భీమ= భీముడికి;

అర్జున= అర్జునుడికి, నకుల= నకులుడికి; సహదేవులకున్= సహదేవుడికి; క్రమంబునన్= జ్యేష్ఠానుక్రమంగా; ఉత్తరన్= ఉత్తరచేత; ప్రణామంబు= నమస్కారం; చేయించినన్= చేయించగా; వారు= ఆ పాండవులు; దీవించి= ఆశీర్వదించి; అంతఃపుర గమనంబునకున్= అంతఃపురంలోకి వెళ్ళటానికి; అనుజ్ఞచేయన్= అనుమతించగా; ఆ+చెలువ= ఆ ఉత్తర; నెఱి+చెలులున్= చెలికత్తెలును; తానును= (ఉత్తరయు); తత్సమయ= ఆ సమయానికి; సముచిత= తగిన; పరివార= పరివారంతో; పరివృత+ఐ= చుట్టుకొనబడినదై; అరిగిన అనంతరంబు+అ= వెళ్ళిన తర్వాత; మౌహూర్తికులన్= ముహూర్తం నిర్ణయించే దైవజ్ఞులను; రావించి= రప్పించి; లగ్న నిరూపణంబు= లగ్నం ఎప్పుడో నిరూపించుటను; చేసి; యాదవ= యాదవులు; పాంచాల+ఆది= పాంచాలురు మొదలైన; బంధు జనంబులను= బంధువులను; ఎల్లన్= అందరిని; పెండ్లికిన్= పెళ్ళికి; పిలువన్= పిలువటానికి; రెండు తెఱంగులవారును= ఆడపెళ్ళివారు, మగపెళ్ళివారును; కాలరులన్= కాలి బంట్లను; పనిచిరి= పంపారు; అజాత శత్రుండును= ధర్మరాజు కూడ; విరటున్= విరాటరాజును; గారవించి= గౌరవించి; తారు= తాము; అతని పాలన్= అతనివద్ద; అజ్ఞాతవాసంబు= అజ్ఞాతవాసాన్ని; సుఖవృత్తిన్= సుఖమైన వృత్తితో; నడపికొనుట= వెళ్ళించుటను; వాక్రుచ్చి పలికి= ఉద్దేశించి చెప్పి; అతని గుణంబులు= విరాటుడి మంచి గుణాలు; కొనియాడి= పొగడి; నీవు= (విరాటుడు); మాకున్= (పాండవులకు); వాసుదేవు+అట్లు+అ= శ్రీకృష్ణుడివలె; కాక= అట్లుగాక; సామాన్య బంధుండవే?= సామాన్యమైన బంధువువా?; అని సంభావించి= అని గౌరవించి; వినయ= వినయంతో; నిభృతుండు+అగు+అతనిన్= నిండిన అతడిని; తిగిచి= దగ్గరకు లాగికొని; పునఃపునః+ఆలింగనంబు= మళ్ళీ మళ్ళీ కౌగలించుకొనుట; చేసినన్= చేయగా; అతండును= విరాటుడు కూడా; ససంభ్రమ= సంబరంతో, త్వరతో కూడిన; పరిజన= పరిజనులచేత; సముపనీయ మానంబులు+అగు= తీసికొని రాబడుతున్న; నానావిధ= అనేక విధాలైన; ఉపకరణంబులన్= పరికరాలతో; కౌంతేయులకున్= పాండవులకు; వివిధ+ ఉపచారంబులు= పలురకాల ఉపచారాలు; ఆచరించి= చేసి; మహా+అర్హ= గొప్పవారికి తగిన; మజ్జన= స్నానం; భోజనంబులు= భోజనాలు; నడపెన్= చేయించాడు; అంతన్= అంతట; అక్కడన్= దుర్యోధనుడి వైపున; దుర్యోధనుండు= సుయోధనుడు; నిజపురంబునకున్= తన పట్టణానికి; చనిచని= వెళ్ళుతూ; నడుమన్= మధ్యలో; విడిసిన+ఎడన్= విడిదిచేసిన చోటున; కర్ణ= కర్ణుడియొక్క; శకుని= శకునియొక్క; దుశ్శాసనుల= దుశ్శాసనుడియొక్క; దుర్మంత్రంబున్+పట్టి= చెడు ఆలోచనల ననుసరించి; గాంగేయుని= భీష్ముడి యొక్క; వచనంబులు= మాటలు; అప్రమాణంబులు= ప్రమాణం కానివాటినిగా; చేసి= లెక్కించి; ధర్మతనయుండు= ధర్మరాజు; అసత్యంబునకున్= అబద్ధం ఆడటానికి; ఇయ్యకొనమి= ఒప్పుకొనకపోవటం; ఎఱింగి= తెలిసి; ఆతనిపాలికిన్= అతడివద్దకు; దూతన్= దూతను; పుత్తెంచినన్= పంపగా; వాఁడును= వాడుకూడ; ఏతెంచి= వెళ్లి; కాంచి= చూచి; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు ఇట్లా నిశ్చయం చేసి చెప్పగా, విరాటుడు 'కౌరవవంశంతో సంబంధం వలన మా మత్స్యవంశం పవిత్రమైన'దని అంటూ ఉత్తరచేత ధర్మరాజ భీమ అర్జున నకుల సహదేవులకు క్రమంగా ప్రణామం చేయించాడు. వారు దీవించి అంతఃపురంలోనికి వెళ్ళు మని అనుమతించారు. ఆమె చెలికత్తెలతో అప్పటికి తగిన పరివారంతో లోనికి వెళ్ళింది. అప్పుడు దైవజ్ఞులను రప్పించారు. లగ్న నిర్ణయం చేయించారు. యాదవులు, పాంచాలురు మొదలైన బంధువులను అందరినీ పెళ్ళికి పిలవటం కొరకు ఉభయవర్గాలవారును బంటులను పంపారు. ధర్మరాజు విరాటరాజును గౌరవించి, 'మేము మీవద్ద సుఖంగా అజ్ఞాతవాసం నడపికొన్నాం' అని అతని సుగుణాలు పొగడి, 'మాకు శ్రీకృష్ణుడెంతో నీవును అంతే కాని సామాన్య బంధుడవు కావు' అని, వినయంతో నిండిన అతడిని ఎత్తి మళ్ళీ మళ్ళీ కౌగిలించుకొన్నాడు. అతడు పరిజనంచేత ఉపచారాలు చేయించటానికి పరికరాలు తెప్పించి వారికి ఎన్నో ఉపచారాలు చేశాడు. మహారాజులకు ఉచితమైన దివ్యస్నాన భోజనాలు ఏర్పాటు చేయించాడు. ఇక అక్కడ దుర్యోధనుడు అంచెలంచెలుగా ప్రయాణించి నగరం చేరుకొంటూ దారిలో విడుదలలో కర్ణ, శకుని, దుశ్శాసనుల దురాలోచనల ననుసరించి, భీష్ముడి మాటలను ప్రమాణాలుగా మన్నించక, ధర్మరాజు అసత్యం ఆడడు కనుక, అతడి దగ్గరికి దూతను పంపాడు. ఆ దూత వెళ్ళి ధర్మరాజును దర్శించి ఇట్లా అన్నాడు.

**తే. 'వాలి యజ్ఞాత వాస సంవత్సరంబు । నిండకుండంగ మున్న పార్థుండు బయలు**
**మెఱసి సమయంబు దప్పె; నీ వెఱిఁగి దీని । కేది తగు నది సేయుము మేదినీశ!'** 368

**ప్రతిపదార్థం:** మేదినీ+ఈశ!= ధర్మరాజా!; వాలి= అతిశయించి (పూని); అజ్ఞాతవాస సంవత్సరంబు= అజ్ఞాతవాసం చేయవలసిన సంవత్సరం; నిండక+ఉండంగన్= పూర్తికావటానికి; మున్న+అ= ముందుగానే; పార్థుండు= అర్జునుడు; బయలు మెఱసి= బయటికి స్పష్టంగా వచ్చి; సమయంబు= శపథమును; తప్పెన్= తప్పాడు; నీవు; ఎఱిఁగి= తెలిసికొని; దీనికిన్= ఈ వచ్చినదానికి; ఏది తగును= ఏది చేస్తే తగినపనో; అది+చేయుము= దానిని చేయుము.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! మీ అజ్ఞాతవాస సంవత్సరం పూర్తికాక మునుపే అర్జునుడు బయటపడ్డాడు. నీవు లెక్కచూచి తెలిసికొని, ఏది ఉచితమో దానిని చేయవలసింది.'

**వ. అని పునర్వనవాసకరణంబు దోఁప నాడిన నవ్వి, యధిష్ఠిత సత్యవ్రతుం డయిన యుధిష్ఠిరుం డతని కిట్లనియె.** 369

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; పునర్వనవాస= తిరిగి వనవాసం; కరణంబు= చేయటం; తోఁపన్= తోచేటట్లుగా; ఆడినన్= పలుకగా; నవ్వి= పరిహాసం చేసి; అధిష్ఠిత సత్యవ్రతుండు+అయిన= సత్యవ్రతం పట్టిన; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అతనికిన్= ఆ దూతతో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అని తిరిగి వనవాసం చేయాలని తోచేటట్లు దూత పలుకగా సత్యవ్రతనిష్ఠుడైన ధర్మరాజు నవ్వి ఆ దూతతో ఇట్లా అన్నాడు.

**క. 'నిండె సమయాబ్దములు; నిం । కొం డనలే; దిపుడ చని సుయోధనుతో భీ**
**ష్మండును గురుఁడును వినఁగా । నిండె; ననుము నిండె నిండె నిక్కంబునకున్.'** 370

**ప్రతిపదార్థం:** సమయ= పందెం కాచి శపథం చేసిన; అబ్దములున్= సంవత్సరాలు; నిండెన్= పూర్తి అయ్యాయి; ఇంకన్= ఇక; ఒండు= మరొకటి; అనన్= అనటానికి; లేదు= ఏమీ లేదు; ఇపుడు+అ= ఇప్పుడే; చని= వెళ్ళి; సుయోధనుతోన్= దుర్యోధనుడితో; భీష్ముండును= భీష్ముడును; గురుఁడును= ద్రోణుడును; వినఁగాన్= వింటూ ఉండగా; నిండెను= నిండినవి; అనుము= అని చెప్పుము; నిక్కంబునకున్= నిజానికి; నిండెన్+నిండెన్= ముమ్మారు నిండినవి.

**తాత్పర్యం:** 'శపథం చేసినట్లుగా పదమూడేళ్ళు నిండాయి. ఇంకొకటి చెప్పటానికి ఏమీ లేదు. ఇప్పుడే వెళ్ళి నీవు దుర్యోధనుడితో భీష్ముడు, ద్రోణుడు వింటుండగా నిండాయని చెప్పుము. నిజానికి నిండాయి, నిండాయి; ముమ్మాటికి నిండాయి.'

**చ. అని తగఁ జెప్పి పుచ్చఁ జని యాతఁడు తప్పక చెప్పె; నంతయున్**
**విని ధృతరాష్ట్రసూనుఁడు వివేకవిహీనత నాఁటి రాత్రి కొ**
**ల్వున గురు భీష్మ కర్ణ కృపులుం దనతమ్ములు నుండ ధర్మనం**
**దనునకు దూతఁ బుచ్చిన విధంబు ప్రకాశము సేయ కిట్లనున్.** 371

**ప్రతిపదార్థం:** అని= ఇట్లు; తగన్= తగినట్లు; చెప్పి పుచ్చన్= చెప్పిపంపగా; ఆతఁడు= ఆ దూత; చని= వెళ్ళి; అంతయున్= జరిగిందంతా; తప్పక= విడువక; చెప్పెన్= చెప్పాడు; విని; ధృతరాష్ట్ర సూనుఁడు= దుర్యోధనుడు; వివేక విహీనతన్= వివేకం లేకపోవటంచేత; నాఁటిరాత్రి= ఆ రాత్రి; కొల్వునన్= సభలో; గురు= ద్రోణుడు; భీష్మ= భీష్ముడు; కర్ణ= కర్ణుడు; కృపులున్= కృపుడును; తన తమ్ములున్= తనయొక్క తమ్ములును; ఉండన్= ఉండగా; ధర్మనందనునకున్= ధర్మరాజువద్దకు; దూతన్= దూతను; పుచ్చిన విధంబు= పంపిన రీతిని; ప్రకాశము+చేయక= స్పష్టపరచక; ఇట్లు= ఈ రీతిగా; అనున్= పలికాడు.

**తాత్పర్యం:** అని తగినట్లుగా చెప్పి పంపగా దూత వచ్చి దుర్యోధనుడికంతా చెప్పాడు. అది విని దుర్యోధనుడు ఆ రాత్రి కొలువులో భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, కృపుడు, తన తమ్ములు ఉండగా, ధర్మరాజు వద్దకు దూతను పంపిన విషయం చెప్పకుండా ఇట్లా అన్నాడు.

**ఆ. 'మనము మోసపోయి యనిమిషపతి సూతి । తోడఁ బొడిచితిమి యదోషవృత్తి;**
**నతఁడు సమయకాల మంతయుఁ గడచిన । వచ్చెనో యెఱుంగ వలయు నిజము.' 372**

**ప్రతిపదార్థం:** మనము= కౌరవులము; మోసపోయి= మోసగించబడి; అనిమిషపతి సూతితోడన్= అర్జునుడితో; అదోషవృత్తిన్= దోషంలేని విధంగా; పొడిచితిమి= యుద్ధం చేశాం; అతఁడు= ఆ అర్జునుడు; సమయకాలము= పందెంలో శపథం పట్టిన కాలం; అంతయున్= పూర్తిగా; కడచినన్= కడిచిన తర్వాత; వచ్చెనో= వచ్చాడా; నిజము= సత్యం; ఎఱుంగవలయున్= తెలిసికొనవలయును.

**తాత్పర్యం:** 'మనం మోసపోయి, నిర్దోషంగా ఆ అర్జునుడితో యుద్ధం చేశాం. అసలు అతడు పదమూడేళ్ళు అయ్యాక వచ్చాడా? అన్నది నిజం తెలిసికొనాలి.'

**క. అనిన విని 'యేటి మాటలు । వినువారలు నగరె? యేను వివ్వచ్చుఁడు న**
**చ్చినయపుడ తెలుపనే? వల । దనుమానము; సమయకాల మట మును కడచెన్.' 373**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ఏటి మాటలు?= ఇవేమి మాటలు? వినువారలు= వినెడివారు; నగరె?= నవ్వరా?; ఏను= నేను; వివ్వచ్చుఁడు= అర్జునుడు; వచ్చినఅపుడు+అ= వచ్చినపుడే; తెలుపనే?= తెలుపలేదా?; అనుమానము= సందేహం; వలదు= వద్దు; సమయకాలము= నియమితమైన కాలం; ఆట మును= అప్పటికి పూర్వమే; కడచెన్= కడచిపోయింది.

**తాత్పర్యం:** అనగా విని 'ఇవేం మాటలు? వినేవారు నవ్వరా? నేను అర్జునుడు వచ్చినప్పుడే చెప్పాను. అనుమానం అక్కర్లేదు. అప్పటికి ముందే నియమితకాలం గడచిపోయింది' అని భీష్ముడు పలికాడు.

**క. అనవుడు భీష్ముని పలుకులు । విని యందఱు సమ్మతించి 'వెరవిఁడియే ఫ**
**ల్గునుఁ?' డనిరి; పతియుఁ బురికిం । జనియెను మఱునాఁడు విరళ సైన్యంబులతోన్. 374**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనిన తర్వాత; భీష్ముని పలుకులు= భీష్ముడు చెప్పిన మాటలు; విని; అందఱున్= కొలువులోని వారందరు; సమ్మతించి= అంగీకరించి; ఫల్గునుఁడు= అర్జునుడు; వెరవిఁడియే?= తెలివి తక్కువవాడా?; అనిరి= అన్నారు; మఱునాఁడు= ఆ తరువాతిరోజున; పతియున్= దుర్యోధనుడును; విరళ సైన్యంబులతోన్= తక్కువ సేనతో; పురికిన్= నగరానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా పలికిన ఆ భీష్ముడి మాటలను అందరూ సమ్మతించారు. 'అర్జునుడు అంత తెలివితక్కువ వాడా-సమయం నిండకుండా రావటానికి?' అన్నారు. ఆ మరునాడు దుర్యోధనుడు పరిమిత సేనతో హస్తినాపురికి వెళ్ళాడు.

శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ బాండవులఁ జూడవచ్చుట (సం.4-67-19)

**వ. ఇవ్విధంబునం బ్రకాశులై పాండునందనులు శమీవృక్ష నిక్షిప్త సమస్త సాధనంబులుఁ బూజాపూర్వకంబుగాఁ దెచ్చుకొని, యుపప్లావ్యంబున వసియించి, మత్స్యమహీనాథుండు పంపుసేయం బెంపు మిగిలి పౌర జానపద సమానీత నానావిధోపహారంబులు గైకొనుచు, బహురత్నంబులకు భాజనంబులై మహనీయ విభూతి శోభిల్లుచున్నంత, వాసుదేవుండు బలభద్ర పురస్సరంబుగా సాత్యకి సమేతుండై సుభద్రాభిమన్యులం దోడ్కొని, కృతవర్మయుఁ బ్రద్యుమ్నుండును సాంబుండును యుయుధానుండును రుక్మిండును నక్రూరుండును నింద్రసేనాది పాండవ సారథులును రథారూఢులై కొల్చిరా, మఱియు ననేక యాదవ కుమారులును గరితురగ స్యందన నిబిడంబు లగు బలంబులతోడ నిరుగెలంకుల నడవం జనుదెంచి. 375**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ప్రకాశులు+ఐ= బయటపడి; పాండునందనులు= పాండవులు; శమీవృక్ష= జమ్మిచెట్టుపై; నిక్షిప్త= దాచబడిన; సమస్త= సకలమైన; సాధనంబులున్= పరికరాలను; పూజాపూర్వకంబుగాన్= ముందు పూజచేసి; తెచ్చుకొని= తాముండేచోటికి తెచ్చుకొని; ఉపప్లావ్యంబునన్= ఉపప్లావ్యమనే చోట; వసియించి= నివాసముండి; మత్స్యమహీనాథుండు= విరాటరాజు; పంపు+చేయన్= ఆజ్ఞాపించగా; పెంపు మిగిలి= మిక్కలి అభివృద్ధిగా ఉండి; పౌర= పట్టణ ప్రజలచే; జానపద= పల్లెటూరివారిచే; సమానీత= తీసుకురాబడిన; నానావిధ= పలురకాలైన; ఉపహారంబులు= కానుకలు; కైకొనుచున్= స్వీకరిస్తూ; బహు రత్నంబులకున్= అనేకవిధాలైన రత్నాలకు; భాజనంబులు+ఐ= పాత్రములై; మహనీయ= గొప్పదైన; విభూతిన్= ఐశ్వర్యంతో; శోభిల్లుచున్+ఉన్నంతన్= శోభిస్తున్న సమయంలో; వాసుదేవుండును= శ్రీకృష్ణుడు కూడా; బలభద్ర పురస్సరంబుగాన్= బలరాముడు ముందుగా; సాత్యకి సమేతుండు+ఐ= సాత్యకితో కూడినవాడై; సుభద్రా+అభిమన్యులన్= సుభద్రను, అభిమన్యుడిని; తోడ్కొని= కూడా తీసికొని; కృతవర్మయున్= కృతవర్మ; ప్రద్యుమ్నుండును= ప్రద్యుమ్న కుమారుడును; సాంబుండును= సాంబుడును; యుయుధానుండును= యుయుధానుడును; రుక్మిండును= రుక్మిడును; అక్రూరుండును= అక్రూరుడును; ఇంద్రసేన+ఆది= ఇంద్రసేనుడు మొదలైన; పాండవ సారథులును= పాండవులయొక్క సారథులును; రథ+ఆరూఢులు+ఐ= రథాలను ఎక్కినవారై; కొల్చిరాన్= సేవిస్తూ రాగా; మఱియును= ఇంకను; అనేక= చాలమంది; యాదవ కుమారులును= యాదవులలో యువకులును; కరి= ఏనుగులతో; తురగ= గుర్రాలతో; స్యందన= రథాలతోను; నిబిడంబులు+అగు= దట్టమైన; బలంబులతోడన్= సేనలతో; ఇరుకెలంకులన్= రెండు ప్రక్కలందును; నడవన్= నడవగా; చనుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** ఈ రీతిగా పాండవులు బయటపడి, జమ్మిచెట్టుమీద దాచిన సమస్త సాధనాలను పూజచేసి తెచ్చుకొని ఉపప్లావ్యంలో నివాసం పెట్టారు. విరాటుడు ఆజ్ఞాపించగా ఎక్కువ అభివృద్ధితో నాగరకులు, జానపదులు తెచ్చిన కానుకలు పుచ్చుకొని బహురత్నాలు కలిగి గొప్ప ఐశ్వర్యంతో శోభిల్లుతున్నారు. శ్రీకృష్ణుడు, బలరాముడు, సాత్యక్యాదులతో కలిసి, సుభద్రను, అభిమన్యుడిని తోడుకొని కృతవర్మ, ప్రద్యుమ్నుడు, సాంబుడు, యుయుధానుడు, రుక్మిడు, అక్రూరుడు, ఇంద్రసేనాది పాండవ సారథులు - వీరందరు రథారూఢులై రాగా, ఇంకా అనేక యాదవ కుమారులూ ఏనుగులు, గుర్రాలు, రథాలతో నిండిన సేనలూ ఇరుప్రక్కలా సేవిస్తూ రాగా వచ్చి, (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఉపప్లవ్యం అని మూలం. (సం.4-67-14) విరాటనగర సమీపంలో ఉండే ఉపనగరం, పాండవులకు విడిదిగా విరాటుడు కల్పించిన పట్టణం. ఇక్కడినుండి- పాండవుల తాత్కాలిక యుద్ధరాజధానిగా ఉపప్లావ్యం భారతకథలో ప్రసిద్ధికెక్కింది. (సంపా.)

**తే. భవ్యవిభవంబుతో నుపప్లావ్యపురము । చొచ్చి సంభ్రమమునఁ బాండుసుతులు తనకు**
**నెదురు వచ్చిన నాహ్లాద మెసక మెసఁగఁ । దత్సమాగమ యోగ్య విధంబు నడపె. 376**

**ప్రతిపదార్థం:** భవ్య= గొప్పదైన; విభవంబుతోన్= వైభవంతో; ఉపప్లావ్యపురము= ఉపప్లావ్యం అనే పురం: చొచ్చి= ప్రవేశించి; సంభ్రమమునన్= సంతోషంతో; పాండుసుతులు= పాండవులు; తనకున్= శ్రీకృష్ణుడికి; ఎదురు వచ్చినన్= ఎదురుగా రాగా; ఆహ్లాదము= సంతోషం; ఎసకము+ఎసఁగన్= హెచ్చుకాగా; తత్సమాగమ= వారితో కలియుటకు; యోగ్య= యోగ్యమైన విధంబు= రీతిని; నడపెన్= చేశాడు.

**తాత్పర్యం:** మహావైభవంగా ఉపప్లావ్యపురం ప్రవేశించగా, పాండవులు సంబరంతో ఎదురు రాగా సంతోషం అతిశయించగా వారితో కలయికకు యోగ్యమైన పద్ధతిగా మర్యాదలు నడిపాడు.

**వ. బలదేవ ప్రముఖులకును దదీయ సందర్శన సముచిత సమాచారంబు లొనర్చి సుభద్రాభిమన్యులం బాంచాలి పాలికిం గొనిపోవ నభ్యంతర జనంబుల నియోగించి. 377**

**ప్రతిపదార్థం:** బలదేవ ప్రముఖులకును= బలరాముడు మొదలైన వారికి; తదీయ= వారిని; సందర్శన= దర్శించినపుడు; సముచిత= తగినటువంటి; సమాచారంబులన్= సదాచారాలను; ఒనర్చి= చేసి; సుభద్రా+అభిమన్యులన్= సుభద్రను, అభిమన్యుని; పాంచాలి పాలికిన్= ద్రౌపది వద్దకు; కొనిపోవన్= తీసికొని వెళ్ళటానికి; అభ్యంతర జనంబులన్= రాణివాసం వారిని; నియోగించి= అజ్ఞాపించి.

**తాత్పర్యం:** బలరాముడు మొదలైనవారికి, వారి వారిని మొదటిసారి కలిసి ఆహ్వానించే సందర్భాలలో జరుపవలసిన ఉచిత మర్యాదలను సక్రమంగా జరిపించి, సుభద్రను, అభిమన్యుడిని పాంచాలి వద్దకు తీసికొనిపోవటానికి అంతఃపుర పరివారానికి తగిన ఆజ్ఞల నిచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. లలిత మణిమయ విభూషణ । ములు రుచిరాంబరములును బ్రమోద మెదల ని**
**ట్టలముగ హరి కుంతీపు । త్రుల కెల్లను నిచ్చి పిదప ద్రోవది కిచ్చెన్. 378**

**ప్రతిపదార్థం:** లలిత= అందమైన; మణిమయ= మాణిక్యమయమైన; విభూషణములు= నగలు; రుచిర= ప్రకాశించెడి; అంబరములును= వస్త్రాలను; ప్రమోదము= సంతోషం; ఎదలన్= హృదయాలలో; ఇట్టలముగన్= ఎక్కువ కాగా; హరి= కృష్ణుడు; కుంతీ పుత్రులకున్= పాండవులకు; ఎల్లను= అందరికి; ఇచ్చి; పిదపన్= తరువాత; ద్రోవదికిన్= ద్రౌపదికి; ఇచ్చెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** అందమైన మాణిక్యమయమైన అలంకారాలు, వస్త్రాలు, సంతోషం హృదయాలలో అతిశయించగా పాండవుల కందరికీ ఇచ్చి, తర్వాత ద్రౌపదికి ఇచ్చాడు.

**వ. ఇట్లు కట్టనిచ్చి వేఱు వేఱ రథకరితురగ దాసదాసీ జనంబుల నొసంగి పద్మనాభుండు పాండవులుం దానునుం గలసి సంతసంబున నలరారుచుండెఁ; దదనంతరంబ. 379**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; కట్టన్+ఇచ్చి= కట్టుటకు వస్త్రాదికములు ఇచ్చి; వేఱువేఱన్= వేరువేరుగా; రథ= రథాలను; కరి= ఏనుగులను; తురగ= గుర్రాలను; దాసదాసీ జనంబులను= దాసులను, దాసీల సమూహాలను; ఒసంగి= ఇచ్చి; పద్మనాభుండు= శ్రీకృష్ణుడు; పాండవులున్= పాండవులును; తానునున్= స్వయంగాను; కలసి= కూడికొని; సంతసంబునన్= సంతోషంతో; అలరారుచుండెన్= ఒప్పారుతూ ఉన్నాడు; తదనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు వారికి వస్త్రాదికములు ఇచ్చి, ప్రత్యేకంగా రథాలు, ఏనుగులు, గుర్రాలు, దాసదాసీ జనాలను ఇచ్చి, పాండవులు, తాను కలిసి సంతోషంతో హాయిగా ఉన్నారు. ఆ తరువాత.

**సీ. ద్రుపదభూవిభుఁడు పుత్రులుఁదానుఁ జతురంగ। బలములతో వచ్చి పాండుసుతులఁ**
**గాంచి వారలు తన్నుఁ గరము సంప్రీతిమై। గారవింపఁగ నుండెఁ, గాశిరాజు**
**శైబ్యుండుఁ బదపడి సైన్య సమేతులై। చనుదెంచి ధర్మనందనుని చేయు**
**సత్కారముల గాఢ సమ్మదంబునఁ బొంది। రవ్విరాటుండును నంతవట్టు**

**తే. వారలకు; దత్తదుచిత ప్రకారములఁ బ్రి। యంబుఁ దలకొన సంవిధానంబు సేసె**
**మఱియు బహుదేశముల బంధు మాన్య మిత్ర। వర్గములు వేడ్కఁ బెండ్లికి వచ్చెఁ గలయ. 380**

**ప్రతిపదార్థం:** ద్రుపద భూవిభుఁడు= ద్రుపదరాజు; పుత్రులున్= పుత్రులును; తానున్= తను స్వయంగాను; చతురంగ బలములతోన్= రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలములతో; వచ్చి= ఉపప్లావ్యం చేరి; పాండుసుతులన్= పాండవులను; కాంచి= చూచి; వారలు= ఆ పాండవులు; తన్నున్= ద్రుపదుడిని; కరము= మిక్కిలి; సంప్రీతిమైన్= ప్రీతితో; గారవింపఁగన్= గౌరవించగా; ఉండెన్= ఉన్నాడు; కాశిరాజు; శైబ్యుండున్= శైబ్యుడును; పదపడి= తర్వాత; సైన్య సమేతులై= సేనలతో కూడినవారై; చనుదెంచి= వచ్చి; ధర్మనందనుని చేయు= ధర్మరాజు చేయునట్టి; సత్కారములన్= సన్మానాల చేత; గాఢ= ఎక్కువైన; సమ్మదంబునన్= ప్రీతితో; పొందిరి= అనుభవించారు; ఆ+విరాటుండును= ఆ విరాటరాజు కూడ; అంత+పట్టు= అంతవరకు; వారలకున్= వారందరికి; తత్తదుచిత ప్రకారములన్= వారికి వారికి తగిన రీతులలో; ప్రియంబు= ఇష్టం; తలకొనన్= కలుగగా; సంవిధానంబు= సమకూర్చటం; చేసెన్= చేశాడు; మఱియున్= ఇంకా; బహు దేశముల= అనేక దేశములకు సంబంధించిన; బంధు= బంధువుల; మాన్య= పూజ్యులైన; మిత్ర= మిత్రుల; వర్గములు= సముదాయాలు; వేడ్కన్= వేడుకతో; పెండ్లికిన్= అభిమన్యుడి పెళ్లికని; కలయన్= కలియకూడుటకు; వచ్చెన్= వచ్చాయి.

**తాత్పర్యం:** ద్రుపదరాజు అతడి పుత్రులతో రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలాలతో ఉపప్లావ్యం చేరి పాండవులను చూచాడు. ఆ పాండవులు ద్రుపదుడిని మిక్కిలి ప్రీతితో గౌరవించారు. తరువాత కాశిరాజు, శైబ్యుడూ సైన్యంతో వచ్చి, ధర్మరాజు చేసిన సన్మానాలను ఎక్కువ ప్రీతితో పొందారు. ఆ విరాటరాజు కూడ అంతవరకు వారందరికి, వారికి వారికి తగిన రీతులలో, ఇష్టం కలిగేటట్లుగా సమకూర్చాడు. ఇంకా అనేక దేశాలకు సంబంధించిన చుట్టాలు, పూజ్యులు, స్నేహితుల సముదాయాలు వేడుకతో అభిమన్యుడి పెళ్ళికి వచ్చారు.

**వ. ఇవ్విధంబున రెండు దెఱంగుల చుట్టంబులు నైన భూపతులు తమ తమ విభవంబులు మెఱసి వచ్చియుండ విరాటుండు పురంబున నుత్సవంబు సాటించిన. 381**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; రెండు+తెఱంగుల= ఇరుప్రక్కల; చుట్టంబులున్+ఐన= బంధువులయిన; భూపతులు= రాజులు; తమ తమ విభవంబులు= తమ తమ సంపదలు; మెఱసి= ప్రకాశించగా; వచ్చి+ఉండన్= వచ్చి విడుదులలో ఉండగా; విరాటుండు= విరాటరాజు; పురంబునన్= తన పట్టణంలో; ఉత్సవంబు= వివాహోత్సవాన్ని; చాటించినన్= చాటింపు వేయగా.

**తాత్పర్యం:** ఈ విధంగా రెండు పక్షాల చుట్టాలయిన మహారాజులు తమ తమ వైభవం ప్రదర్శిస్తూ వచ్చి విడిది ఇండ్లలో ఉన్నారు. విరాటరాజు నగరంలో వివాహమహోత్సవం చాటింపు వేయించాడు.

**క.** **కలువడములు మణితోరణ । ములుఁ గట్టిరి, క్రముక కాండ మోచా స్తంభం**
**బులు నాటిరి, కుంకుమమునఁ । గలయ నలికి మ్రుగ్గులిడిరి కర్పూరమునన్.** **382**

**ప్రతిపదార్థం:** కలువడములు= కలువల దండలు; మణితోరణములు= మణులతో తోరణములు; కట్టిరి= కట్టినారు; క్రముక కాండ= పోకస్తంభములు; మోచాస్తంభంబులు= అరటిస్తంభాలు; నాటిరి= పాతారు; కుంకుమమునన్= కుంకుమతో; కలయన్+అలికి= అంతటా బాగుగా అలికి; కర్పూరమునన్= కర్పూరపు పొడితో; మ్రుగ్గులు= ముగ్గులు; ఇడిరి= పెట్టారు.

**తాత్పర్యం:** కలువ పూలదండలు, మణితోరణాలు కట్టారు. పోకచెట్ల స్తంభాలు, అరటి స్తంభాలు పాతారు. కుంకుమతో కలయ నలికి, కర్పూరంతో ముగ్గులు పెట్టారు.

**క.** **వివిధాలంకరణంబుల । నవకాంతి వహించి పట్టణంబు వివాహో**
**త్సవ మాధవలక్ష్మికి లలి । త వనంబై యెలమి కలిమి తావల మయ్యెన్.** **383**

**ప్రతిపదార్థం:** వివిధ= అనేక విధాలైన; అలంకరణంబులన్= అలంకారాలతో; నవకాంతిన్= కొత్తవైన కాంతిని; వహించి= పూని; పట్టణంబు= విరాటుడి పట్టణం; వివాహ+ఉత్సవ మాధవ లక్ష్మికిన్= వివాహ సంబంధమైన ఉత్సవమనే మాధవ లక్ష్మికి; లలిత వనంబు+ఐ= ఉద్యానవనమై; ఎలమి కలిమి= సంతోష సంపదకు; తావలము= స్థానం; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** అనేక విధాల అలంకారాలతో ఒక క్రొత్త శోభ కలిగి ఆ పట్టణం వివాహ మహోత్సవమనే వసంత లక్ష్మికి ఉద్యానవనమై ఉండి సంతోషానికి స్థానమైనది.

**విశేషం:** అలం: రూపకం.

**ఉ.** **తాను సుదేష్ణయున్ సుతులుఁ దమ్ములు బంధులు గంధమాల్య నా**
**నా నవరత్న భూషణమనః ప్రియ మాంగలిక ప్రసాధనా**
**నూన విభూతి మత్స్యవిభుఁ డుజ్జ్వలలీల వహించి భూమిదే**
**వానయనాది కృత్యపరులైన జనంబుల గారవించుచున్.** **384**

**ప్రతిపదార్థం:** మత్స్యవిభుఁడు= విరాటుడు; తాను; సుదేష్ణయున్= దేవియైన సుదేష్ణయును; సుతులున్= కుమారులును; తమ్ములు= తమ్ములును; బంధులు= బంధువులును; గంధ= గంధములు, మాల్య= పూలమాలలు; నానా= అనేకరీతులా; నవరత్న= నవరత్నాలు పొదిగిన; భూషణ= అలంకారాలు; మనఃప్రియ= మనోహరమైన; మాంగలిక= మంగళకరమైన; ప్రసాధన= అలంకారాలయొక్క; అనూన= సంపూర్ణమైన; విభూతిన్= వైభవంతో; ఉజ్జ్వల లీలన్= ప్రకాశించే విలాసాన్ని;

వహించి= కలిగి; భూమిదేవ= బ్రాహ్మణుల యొక్క; ఆనయన+ఆది= తీసికొని వచ్చుట మున్నగు; కృత్యపరులైన= పనులందు ఆసక్తి కలవారైన; జనంబులన్= జనులను; గారవించుచున్= గౌరవిస్తూ.

**తాత్పర్యం:** విరాటుడు తన దేవిఅయిన సుదేష్ణతో కలిసి, కుమారులు, తమ్ములు, బంధువులు, వెంటరాగా గంధములు, పూలమాలలు, అనేక రకాల నవరత్నాలు పొదిగిన ఆభరణాలు, మనోహరమైన, మంగళకరమైన అలంకారాలయొక్క సంపూర్ణమైన వైభవంతో ప్రకాశించే విలాసాలను ప్రదర్శిస్తూ, బ్రాహ్మణులను తీసికొని రావటం మొదలగు పనులందు ఆసక్తికల జనులను గౌరవిస్తూ.

**వ. గరువంపు సంభ్రమంబులతోడ నిజమందిరంబునందు. 385**

**ప్రతిపదార్థం:** గరువంపు= గర్వంతో కూడిన; సంభ్రమంబులతోడన్= వేగిరపాటులతో; నిజమందిరంబునందున్= తన రాజ మందిరంలో.

**తాత్పర్యం:** దర్పంతో, ఆనందంతో కూడిన సంబరాలతో తన మందిరంలో.

**సీ. అమల రత్న ప్రదీపావలి మెఱుఁ గిడఁ । బనిచి మణిస్తంభ పంక్తిఁ గ్రొత్త**
**జిగి దళు కొత్తునట్లుగఁ దొడయించి వి । చిత్ర వితానముల్ చెలువు మిగులఁ**
**గట్టించి నూత్న ముక్తాదామములతోడఁ । గుసుమ మాలిక లెడఁ గ్రుచ్చి వ్రేలఁ**
**గీలింప నియమించి కేవల మంగళ । భూరుహపల్లవ తోరణములు**

**తే. సంఘటింప నియోగించి చందనమునఁ । బరిణయాగార మలుకంగఁ బాణియాణి**
**గలుగు ముత్తియముల మ్రుగ్గుగా నొనర్పఁ । జతుర పుణ్యాంగనా జనతతిఁ బొనర్చె. 386**

**ప్రతిపదార్థం:** అమల= స్వచ్ఛమైన; రత్న= రత్నాలనెడి; ప్రదీప+ఆవలిన్= దీప పంక్తికి; మెఱుఁగు+ఇడన్= మెరుగుపెట్టుటకు; పనిచి= ఆజ్ఞాపించి; మణిస్తంభ= మణిమయమైన స్తంభాలయొక్క; పంక్తిన్= పంక్తికి; క్రొత్త జిగి= క్రొత్తకాంతి; తళుకొత్తునట్లుగన్= కలిగేటట్లుగా; తొడయించి= చేయించి; విచిత్ర= రంగురంగుల; వితానముల్= చాందినీలు; చెలువు మిగులన్= ఎక్కువ అందం కల్గునట్లుగా; కట్టించి= వ్రేలగట్టేటట్లుచేసి; నూత్న= క్రొత్తవైన; ముక్తాదామములతోడన్= ముత్యాల దండలతో; కుసుమ మాలికలు= పూలమాలలు; ఎడన్+గ్రుచ్చి= మధ్యమధ్యన గ్రుచ్చి; వ్రేలన్= వ్రేలాడేటట్లు; కీలింపన్= కట్టుటకు; నియమించి= పురమాయించి; కేవల= కేవలం; మంగళ భూరుహ= మంగళకరమైన చెట్లయొక్క; పల్లవ తోరణములు= చిగుళ్ళ తోరణాలు; సంఘటింపన్= సమకూర్చుటకు; నియోగించి= ఆజ్ఞాపించి; చందనమునన్= మంచి గంధంతో; పరిణయ+ఆగారము= పెళ్ళియిల్లు; అలుకంగన్= అలికేటట్లుగా; పాణి+ఆణి= ముత్తెపునీరును, వట్రువయును; కలుగు ముత్తియములన్= కలిగిన ముత్యాలను; మ్రుగ్గుగాన్= ముగ్గుగాను; ఒనర్పన్= అమర్చటానికి; చతుర= నేర్పరులైన; పుణ్యాంగనా= పుణ్యస్త్రీ; జనతతిన్= జనుల సముదాయాన్ని; పొనర్చెన్= పురమాయించాడు.

**తాత్పర్యం:** స్వచ్ఛమైన రత్న దీపాలకు మెరుగు పెట్టించాడు. మణిస్తంభాలకు క్రొత్త కాంతి వచ్చేటట్లు చేయుమన్నాడు. రంగు రంగుల చాందినీలు అందంగా కట్టించాడు. క్రొత్త ముత్యాల దండలు, పూలదండలు కలిపి మధ్య మధ్య అవీ ఇవీ ఉండేటట్లు వ్రేలాడ దీయించాడు. కేవలం మంగళకరమైన మామిడి మున్నగు చెట్ల చిగురుటాకుల తోరణాలు కట్టించాడు. మంచి గంధంతో పెళ్ళి యిల్లు అలికి, ఆణిముత్యాలతో ముగ్గులు పెట్టటానికి సువాసినులను పురమాయించాడు.

**విశేషం:** ఉత్తరాభిమన్యుల వివాహం శాస్త్రోక్తంగా జరిగిందని మూలం. **"తతో వివాహో విధివద్ వవృధే మత్స్యపార్థయోః"** "(4-72-27) మత్స్యపార్థుల యింట వివాహమైనదని స్థూలంగా చెప్పిన అంశాన్ని తిక్కన తనకాలం నాటి రాజమర్యాదలతో జరిగిన వివాహంగా వర్ణించాడు. అష్టవిధ వివాహాలలో (బ్రాహ్మం, ప్రాజాపత్యం, ఆర్షం, దైవం, గాంధర్వం, ఆసురం, రాక్షసం, పైశాచం) ఈ వివాహం ప్రాజాపత్యం, వధువును వస్త్రాదులచే ఆచ్ఛాదించి సాలంకృతకన్యగా చేసి, ఈమెతో సహధర్మచారిత్వాన్ని నిర్వహించుమని వరునకు చెప్పి ఇచ్చే (కన్యాదానం చేసే) వివాహం ప్రాజాపత్యం. ఈ వివాహంలో కన్యాదాత ఇంట్లో అలంకృత కల్యాణమంటపంలో అలంకృత కన్యాదానం జరుగుతుంది. దానికి నాందిగా కల్యాణమంటపాలంకార శోభ ఈ పద్యంలో వర్ణించబడింది. రత్నదీపాలు, మణిస్తంభాలు, చిత్రవిచిత్రాలైన చాందినీలు, ముత్యాలతో నిండిన పూలమాలల అలంకరణలు, మామిడి మొదలైన చెట్ల పల్లవాల తోరణాలు, మంచిగంధంతో అలకటాలూ, ముత్యాల ముగ్గులూ విరాటరాజు వైభవ చిహ్నాలు, పుణ్యాంగనలు అలంకరించటం శుభసూచన. వివాహవేదికను సీసపద్యంలో వర్ణించి దాని ఔన్నత్యాన్నీ, వైశాల్యాన్నీ కూడా తిక్కన ధ్వనింపజేశాడు. (సంపా.)

**క.** **వైదిక లౌకిక విధి సం । పాదిత వివిధార్హ వస్తుభరితత్వమునన్**
**వేదిక పాలు పగునట్లుగ । మోదమునఁ బురోహితుండు మునుకొని చేయన్.** **387**

**ప్రతిపదార్థం:** పురోహితుండు= పురోహితుడు; వైదిక= వేదోక్తమైన; లౌకిక= లోకరీతికి సరిపోయే; విధి= నియమాల ప్రకారం; సంపాదిత= సేకరించబడిన; వివిధ= పలురకాలైన; అర్హ= తగిన; వస్తు= వస్తువులతో; భరితత్వమునన్= నిండి ఉండటంతో; వేదిక= కళ్యాణవేదిక; పాలుపు+అగునట్లుగన్= అందంగా ఉండేటట్లుగా; మునుకొని= ప్రయత్నించి; మోదమునన్= సంతోషంతో; చేయన్= చేయగా.

**తాత్పర్యం:** పురోహితుడు వైదికమైన లౌకికమైన విధి విధానాల ప్రకారం కావలసిన వస్తువులన్నీ సేకరించి నింపి, పెళ్ళి వేదికను అందంగా అమర్చాడు.

**క.** **ఉత్తర నలంకరింప ను । దాత్తాభరణాది వస్తుతతి యొసఁగి నరేం**
**ద్రోత్తముఁడు నేర్పు గల చెలి । కత్తియలం బుచ్చెఁ బ్రీతి కడలుకొనంగన్.** **388**

**ప్రతిపదార్థం:** నరేంద్ర+ఉత్తముఁడు= విరాటుడు; ఉత్తరన్= ఉత్తరను; అలంకరింపన్= అలంకరించటానికి; ఉదాత్త= గొప్పదైన; ఆభరణ+ఆది= అలంకారాలు మొదలైన; వస్తుతతి= వస్తు సముదాయము; ఒసఁగి= ఇచ్చి; నేర్పుకల= నైపుణ్యంకల; చెలి= కత్తియలన్= చెలికత్తెలను; ప్రీతి= సంతోషం; కడలు కొనంగన్= వృద్ధి పొందగా; పుచ్చెన్= పంపాడు.

**తాత్పర్యం:** విరాటరాజు ఉత్తరను అలంకరించటానికి మంచి ఆభరణాలు, ఇంకా తగిన సామగ్రి ప్రీతితో ఇచ్చి, నేర్పుకల చెలికత్తెలను పంపాడు.

**విశేషం:** విరాటుడు సాలంకృత కన్యాదానం శాస్త్ర సమ్మతంగా చేయవలె కాబట్టి కన్యను అలంకరించండని నిపుణలైన చెలికత్తెలను నియోగించాడు. కల్యాణం కొరకు చేయించిన క్రొత్త నగలతో అలంకరించి, **"కన్యాం కనక పంపన్నాం కనకాభరణైర్యుతాం । దాస్యామి విష్ణవే తుభ్యం బ్రహ్మలోక జిగీషయా"** - అని కన్యాదానం చేయటానికి రంగం సిద్ధం చేయించాడు. (సంపా.)

అభిమన్యుని వివాహ మహోత్సవము (సం.4-67-31)

**వ. ఇట్లు వైవాహిక వర్తన సంవిధాన సావధానుం డగు మత్స్యమహీనాథుండు మౌహూర్తికాది శిష్టజనులు పరివేష్టింప నుండి 'లగ్నం బాసన్నం బగుచు వచ్చె' నని ధర్మతనయున కెఱింగింపం బనిచిన, నతండు ననుజతనుజసహితంబుగా నలంకృతుండై, వివిధ ప్రసాధన శోభితులగు సమస్తబంధు జనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబు సేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరుగలవారువంబులను మట్టపుదట్టంబు సేసికొని పుణ్యాంగనా జనంబులతోడం గూడి, మణిగణంబులు నంబర నికరంబులు పుష్పపుంజంబులు ఫలప్రచయంబులు లోనుగాఁ గల యోగ్యవస్తువుల విస్తరిల్లిన క్రంత నడవ మంగళతూర్య నాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధ గానంబులు వందిజన వాక్య సంతానంబులుఁ జెలంగ వాసుదేవ పురస్సరంబుగా విరాటుమందిరంబున కేతెంచి శంఖజయ ఘంటా పణవాది నిక్వణంబులతోడ నెదుర్కొని చల్లుసేసలు గైకొనుచుం జొత్తెంచిన. 389**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వైవాహిక= వివాహ సంబంధమైన వర్తన= ప్రవర్తనలను; సంవిధాన= సమకూర్చుకొనటంలో; సావధానుండు+అగు= శ్రద్ధ కల్గిన; మత్స్యమహీనాథుండు= విరాటుడు; మౌహూర్తిక+ఆది= జ్యోతిష్కులు మొదలైన; శిష్టజనులు= శిష్టులైన జనులు; పరివేష్టింపన్= చుట్టూఉండగా; ఉండి; లగ్నంబు= పెండ్లిసుముహూర్తం; ఆసన్నంబు+అగుచున్= దగ్గరౌతూ; వచ్చెనని= వస్తున్నదని; ధర్మ తనయునకున్= ధర్మరాజుకు; ఎఱిఁగింపన్= తెలియజేయటానికి; పనిచినన్= పంపగా; అతండునున్= ధర్మరాజు కూడ; అనుజ తనుజ సహితంబుగాన్= తమ్ములతో కొడుకులతో కూడా; అలంకృతుండు+ఐ= అలంకరించబడినవాడై; వివిధ= పలురకాలైన; ప్రసాధన= అలంకారాలతో; శోభితులు+అగు= శోభిస్తున్న; సమస్త= సకలమైన; బంధుజనంబులన్= బంధువులను; గూర్చికొని= సమకూర్చికొని; అభిమన్యునకున్= పెండ్లికొడుకైన అభిమన్యుడికి; శృంగారంబు+చేయించి= అలంకారం చేయించి; భద్రగజ= మేలుజాతి ఏనుగుపై; ఆరూఢున్= అధిష్ఠించిన వాడినిగా; చేసికొని= చేసి; ఏనుంగులన్= ఏనుగులను; పేరుగల= వాసికెక్కిన; వారువంబులను= గుర్రాలను; మట్టపుదట్టంబు= సమంగా గట్టిగా; చేసికొని; పుణ్య+అంగనా జనంబులతోడన్+కూడి= ముత్తైదువుల సమూహాలతో కూడికొని; మణి గణంబులు= మణుల సముదాయాలు; అంబర నికరంబులున్= వస్త్రాల సముదాయాలును; పుష్ప పుంజంబులున్= పూలరాశులు; ఫలప్రచయంబులు= పండ్ల గుంపులు; లోనుగాన్+కల= మొదలైన; యోగ్యవస్తువులన్= తగిన వస్తువులతో; విస్తరిల్లిన= విస్తారంగా ఉన్న; క్రంత= సారె; నడవన్= నడిపించుచు; మంగళతూర్య నాదంబులు= మంగళవాద్యాల ధ్వనులు; విప్ర= బ్రాహ్మణులయొక్క; ఆశీర్వాదంబులు= దీవెనలు; మాగధగానంబులు= మాగధులయొక్క పాటలు; వందిజన= స్తుతి పాఠకులయొక్క; వాక్య సంతానంబులున్= వాక్య సముదాయాలును; చెలంగన్= ధ్వనింపగా; వాసుదేవ పురస్సరంబుగాన్= వాసుదేవుడు ముందు నడుస్తూ ఉండగా; విరాటు మందిరంబునకున్= విరాటుడి ఇంటికి; ఏతెంచి= వచ్చి; శంఖ= శంఖాలయొక్క; జయ ఘంటా= జయకరమైన గంటలయొక్క; పణవ+ఆది= పణవం మొదలుగా గల వాద్యాలయొక్క; నిక్వణంబులతోడన్= శబ్దాలతో; ఎదుర్కొని= ఎదురుగా వచ్చి; చల్లు సేసలు= చల్లెడి అక్షతలు; కైకొనుచున్= స్వీకరిస్తూ; చొత్తెంచినన్= ప్రవేశించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా విరాటరాజు వివాహానికి కావలసిన వస్తువులను సేకరించటం మొదలైన పనులలో శ్రద్ధగా ఉండి జ్యోతిష్కులు మొదలైన శిష్ట జనులు చుట్టూరా ఉండగా, లగ్నం సమీపిస్తున్నది రమ్మని కబురంపగా ధర్మరాజు, తమ్ములు అలంకరించుకొని, అభిమన్యుడిని అలంకరింపజేసి, బంధువులందరూ అలంకరించుకొని కలిసి రాగా, అభిమన్యుడిని భద్రగజంపై కూర్చోబెట్టి, ఏనుగులను, గుర్రాలను పరిమితంగా వెంటనిడికొని, పుణ్యాంగనల సమూహం వెంటరాగా, మణులు, వస్త్రాలు, పండ్లు మొదలైన కావలసిన వస్తువులన్నీ వెంటపెట్టుకొని, శ్రీకృష్ణుడు

ముందు నడుస్తూ ఉండగా మంగళవాద్య ధ్వనులు, బ్రాహ్మణులయొక్క ఆశీర్వాదాలు, వందిమాగధుల జయ జయధ్వనులు, స్తుతి పాఠాలు హోరెత్తగా విరాటుడి మందిరానికి వచ్చారు. ఇక్కడ శంఖాలు, జయ గంటలు, పణవం మొదలైనవి మ్రోగిస్తూ సేసలు అక్షతలు చల్లుతూ పెళ్ళివారు ఎదురు వచ్చారు. ఆ రీతిగా వారు పెండ్లిమందిరాన్ని ప్రవేశించగా; (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** తెలుగునాట కానవచ్చే కొన్ని వివాహ మర్యాదలు ఈ వచనంలో వర్ణించబడ్డాయి. మగపెళ్ళివారు విడిదిలో ఉంటారు. ప్రస్తుతం ఉపప్లావ్యంలో పాండవులున్నారు. ముహూర్త పత్రికను లేదా లగ్నపత్రికను కన్యాదాత పెళ్ళికొడుకు తండ్రికి లేదా వారి ఇంటి పెద్దకు సవినయంగా పంపుతాడు. ఆ మర్యాద ననుసరించి విరాటుడు ధర్మరాజుకు లగ్నపత్రికను (లగ్నవార్తను) పంపాడు. దానిని గ్రహించి ధర్మరాజు బంధువు లందరితో కూడి, పెళ్ళికొడుకును మంగళకరమైన ఆభరణాలతో అలంకరించి, భద్రగజం మీద ఎక్కించుకొని, వివాహ సామగ్రిని వెంటబెట్టుకొని, మంగళవాద్యాలూ, బ్రహ్మణాశీస్సులు మొదలైన మంగళనాదాలను వింటూ భగవంతుడైన శ్రీకృష్ణుడిని ముందుపెట్టుకొని ఊరేగుతూ కన్యాదాత ఇంటికి కదలివచ్చాడు. ఇది పెండ్లికొడుకు పెళ్ళికి పోయే ఊరేగింపు. ఇందులో మగపెళ్లివారి వైభవం ప్రదర్శితమౌతుంది. ధర్మరాజు వైపు వివాహ వైభవం సాత్త్వికం. భగవద్విభూతి ప్రధానంగా ప్రకాశించింది. మగపెళ్ళివారిని కన్యాదాత ఎదురుపోయి సగౌరవంగా తన ఇంటికి తీసికొని రావాలి. **"సాలంకారాం మమ సుతాం కన్యాం దాస్యామి తే (ద్విజ) పాణిం గృహ్ణీష్వ, సాగ్నిస్త్వం గచ్ఛస్వ, ఆగచ్ఛ మద్గృహమ్'-** (ఇది స్నాతకవ్రతం చివర ద్విజవరుడిని ఆహ్వానించే శ్లోకం), క్షత్రియులు కూడ ద్విజులేకాబట్టి, తరలివచ్చిన పెండ్లికొడుకును ఈ విధమైన ఆహ్వానంతో గౌరవిస్తారు. తన కన్యను పాణిగ్రహణం చేయుమని వరుడిని కోరటం ఈ వివాహాంగ పరమతాత్పర్యం. తిక్కన పాణిగ్రహణోత్సవాన్ని పదిలంగా వర్ణించదలచాడు కాబట్టి ఈ మర్యాదను శాస్త్రోక్తంగా నిర్వహించాడు. (సంపా.)

**క. విరటుఁడు సంభ్రమమును నా। దరమును భక్తియును నాత్మఁ దలకొనఁ బూజా**
**పరుఁడై సమయ సముచితా। చరణంబులు నిర్వహించె సమ్మదలీలన్. 390**

**ప్రతిపదార్థం:** విరటుఁడు= విరాటరాజు; సంభ్రమమును= సంతోషం, తొందర; ఆదరమును= గౌరవమును; భక్తియును= భక్తికూడ; ఆత్మన్= మనస్సులో; తలకొనన్= కలుగగా; పూజాపరుఁడు+ఐ= పూజచేసేవాడై; సమయ= వేళకు; సముచిత= తగిన; ఆచరణంబులు= పనులు; సమ్మద లీలన్= సంతోషంతో; నిర్వహించెన్= నిర్వహించాడు.

**తాత్పర్యం:** విరాటరాజు సంతోషం, ఆదరం, భక్తి - ఇవన్నీ మనస్సులో కలిసిపోగా పూజచేసేవాడై సమయానికి తగిన పనులన్నింటినీ సంతోషంతో నిర్వహించాడు.

**విశేషం:** కన్యాదానం జరిగేంతవరకు వేదికమీద కన్యాదాతకు ప్రాధాన్యముంటుంది. అతడే అక్కడ కర్త, వివాహయజ్ఞానికి ఏ లోపం లేకుండ, రాకుండ నిర్వహించాలి. అందుకే విరాటుడికి ఆ సంభ్రమం, ఆ ఆదరం, ఆ భక్తి. అతడు వరపూజా పరుడైనాడు. సముచిత విధులను సంతోషంతో నిర్వహించాడు. ఆ విధులు మధుపర్కం, మహాసంకల్పం, చూర్ణిక మొదలైనవి, వరుడికి, పెద్దలకు మధుపర్కం- తేనె బెల్లంతో కూడిన పదార్థాన్ని పెట్టి నూతన వస్త్రాదులను సమర్పించాలి. దానిని మధుపర్కం అంటారు. ఆ తరువాత మహాసంకల్పం చేస్తాడు. కన్యాదాత, సమస్త పుణ్య నదీనద సహితమైన బ్రహ్మాండంలో అంతవరకూ తెలిసికానీ, తెలియకగానీ చేసిన మహాపర్వతాల వంటి పాపాలు నశించి, తనకు శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తి కలగాలని కన్యాదానం చేస్తున్నానని సంకల్పం చేయటం మహాసంకల్పం. సమస్త గురు, దేవతా, మహర్షి పతివ్రతానదీ సుగంధ వృక్ష పర్వత శాస్త్ర జ్యోతిషాదులన్నీ కలిసి అనుకూల ఫలాల నివ్వాలని గ్రహాలను ప్రార్థించటం చూర్ణిక, కన్యాదానం చేయటానికి పూర్వం కన్యాదాత నిర్వహించే శాస్త్రోక్త కార్యకలాపమిది. ఇటువంటివాటిని 'సమయ సముచితాచరణము' లని తిక్కన సూచించాడు. (సంపా.)

**తే. విహిత పరిపాటితో విప్రవృద్ధ జనులు । పుణ్యకర్మ పరంపరఁ బూని నడుప**
**నర్థిఁ గృష్ణ యుధిష్ఠిర పార్థ మత్స్య । వరులు దెరయొద్ద న వ్వధూవరుల నిలిపి. 391**

**ప్రతిపదార్థం:** విహిత= తమకు విహితమైన; పరిపాటితోన్= సంప్రదాయం ప్రకారం; విప్ర= బ్రాహ్మణులు; వృద్ధ జనులు= పెద్దలును; పుణ్య= మంగళకరమైన; కర్మ పరంపరన్= క్రియా కలాపాలను; పూని= పూనుకొని, నడుపన్= జరిపించగా; అర్థిన్= ప్రేమతో; కృష్ణ= శ్రీకృష్ణుడు; యుధిష్ఠిర= ధర్మరాజు; పార్థ= అర్జునుడు; మత్స్యవరులు= విరాటుడును; తెర ఒద్దన్= తెర దగ్గర; ఆ+వధూ వరులన్= ఆ వధూవరులను; నిలిపి= ఉంచి.

**తాత్పర్యం:** రాజోచిత సంప్రదాయంతో విప్రులూ వృద్ధులూ పుణ్యక్రియా కలాపం నిర్వర్తించగా, కృష్ణుడు, ధర్మరాజు, అర్జునుడు, విరాటుడు తెర దగ్గర వధూవరులను నిలిపి.

**విశేషం:** తెలుగు వారిళ్ళలో జరిగే పెళ్ళిళ్ళలో తెరపట్టటం ఒక విశిష్ట ఆచారం. ఇది వేదంలో చెప్పబడి ఉండకపోవచ్చును. తిక్కన గారు అందుకే అన్నారు. విప్రులు, వృద్ధులు కొన్ని విహితమైన పరిపాటులు (ఆచారాలు) పుణ్యకర్మ పరంపరలుగా పెళ్ళిళ్ళలో పాటిస్తుంటారట! వాటిల్లో తెరపట్టటం, జీలకర్ర బెల్లం పెట్టటం తెలుగునాట ముఖ్యమైనవి. వాటి తాత్పర్యం ఆచార నిష్ఠం కావటం విశేషం. వధూవరులు వివాహంలో మొదట స్పర్శనం, ఆ తరువాత దర్శనం చేయాలని ఆచారం. వారిరువురి బ్రహ్మరంధ్ర స్థానాలను జీలకర్ర బెల్లంతో కలిపిన మంగళద్రవ్యంతో స్పృశిస్తారు. అది సజాతీయ స్పర్శగా వారి తనువులకు జీవితాంతం సుఖాన్ని కలిగించే ఉత్తేజాన్నీ, ఉత్సాహాన్నీ కలిగిస్తుంది. ఈ కార్యం జరిగేటప్పుడు తెర అడ్డంగా ఉంటుంది. ఆ తెర పట్టేవారు పెద్దవారు. ఈ ఘట్టంలో ఒకవైపు కృష్ణుడు, యుధిష్ఠిరుడు, అర్జునుడు నిలిచి పట్టుకొన్నారు. మరొకవైపు మత్స్యవంశశ్రేష్ఠులు పట్టుకొన్నారు. చూపులు చూపులు కలిసెడి శుభవేళ సుముహూర్తం. కొందరు ప్రథమ స్పర్శనం ముహూర్త మంటారు. తిక్కన జీలకర్ర బెల్లాన్ని పెట్టించినట్లు లేదు. తెరపట్టించి తీయించాడు. అంటే స్పర్శనం కంటె దర్శనమే శుభముహూర్తమని అతడి నిశ్చయం. విశేషమేమంటే- ఉత్తరాభిమన్యులు అంతవరకు ఒకరిని గురించి మరొకరు విన్నారే కాని, చూచుకొనలేదు. అది వారి జీవితంలో ప్రథమ దర్శన శుభవేళ. ప్రథమ దర్శనం కావ్యరసపరంగా రతిభావోద్దీపకమైన రసకేతనం. దానిని ఎగురవేయించి, దాని విలాసాలను వర్ణించి వైశిష్ట్యాన్ని ప్రదర్శించాడు తిక్కన సోమయాజి. (సంపా.)

**వ. సాంవత్సరిక దత్త కాల కళావిశేషంబుల మంగళతూర్యంబులు చెలంగ నత్తెర యెత్తించిన. 392**

**ప్రతిపదార్థం:** సాంవత్సరిక= దైవజ్ఞుడిచే; దత్త= ఇయ్యబడిన; కాలకళా= కాలంలోని భాగంయొక్క; విశేషంబులన్= విశేషమందు, శుభ లగ్నమున; మంగళతూర్యంబులు= మంగళవాద్యాలు; చెలంగన్= మ్రోగగా; ఆ+తెర= ఆ తెరను; ఎత్తించినన్= ఎత్తించగా.

**తాత్పర్యం:** అప్పుడు జ్యోతిష్కుడు దగ్గరుండి గుణించి శుభలగ్న సమయాన్ని సరిగా తెల్పగా మంగళవాద్యాలు మ్రోగగా, ఆ తెరను ఎత్తించారు.

**విశేషం:** చూర్ణికాదులు ముగిసిన తరువాత జ్యోతిష్కులు ముహూర్తం ఆసన్నమైనదని నిశ్చయించి. **"అయం ముహూర్త స్సుముహూర్తోఽ స్తు"** అని ప్రకటిస్తూ **"తత స్సుముహూర్తే కన్యాం దృష్ట్వా"** - అని నిర్దేశించి తెరను తొలగిస్తారు. అప్పుడు వరుడు **"అఘోరచక్షుః"**- అనే మంత్రంతో కన్యను చూడాలి. ఆ మంత్రానికి తాత్పర్యమిది - "ఓ వధువా! భయంకరమగు కన్నులు లేని దానివై, భర్తను చంపని దానివై, భర్తకు, మఱదులకు శుభము కూర్చుము. ప్రసన్నమైన మనస్సు గలదానవై సువర్చస్సు గలదానివగుము. జీవించిన సంతానమును గనుచు, దైవపూజ చేయుచు, ప్రశస్తురాలవై, నా బంధువులకు, నా

పశుసంపదకు సుఖము గూర్చుదానవై యుండుము." (అడ్డుగా వైచిన తెరను తీసివైచి) వధూవరు లిట్లు సంకల్పింతురు. (తిరిగి ప్రాణాయామం చేసి) ఈ శుభతిథియందు దంపతులమైన మన ఇద్దఱకు ఆయువు, వర్చస్సు, యశస్సు, బలము, అభివృద్ధి పొందుటకొఱకు మనమిద్దఱము కర్మలు చేయవలయును. సంతానం గూడ గనవలయును." (వివరాలకు చూడండి; చర్ల గణపతిశాస్త్రి గారి - 'ఉపనయన వివాహవిధి'). ఇటువంటివి తెరయెత్తించిన క్రియలో ధ్వనిస్తున్నాయి. తిక్కన వైదిక వివాహ కర్మలలో, ఆచారాలలో కావ్యకళకు ఉపకరించినవాటినే వివరించి రచించటం గమనార్హం. (సంపా.)

**ఉ. వీనులఁ దియ్య మెక్క మును విన్కిఁ బరస్పర రాగవృత్తి లో**
**నూనినఁ జూచు వేడుకల నువ్విళు లూరెడు నెమ్మనంబు ల**
**చ్చో నొక యింత సేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్న య**
**మ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్. 393**

**ప్రతిపదార్థం:** మును= ముందుగా; విన్కిన్= వినటంచేత; వీనులన్= చెవులకు; తియ్యము= ఇష్టం; ఎక్కన్= కలుగగా; పరస్పర= అన్యోన్యమైన; రాగ వృత్తిన్= అనురాగ ప్రవృత్తితో; లోన్+ఊనిన= లోపల ఉన్న; చూచు వేడుకలన్= చూడాలనే వేడుకలతో; ఉవ్విళులూరెడు= ఉవ్విళ్లూరుతున్న; నెమ్మనంబులు= నిండు మనసులు; అచ్చోన్= అప్పుడు; ఒక+ఇంతసేపు= కొంచెంసేపు కూడ; ఎడ+చొచ్చుటకున్= ఎడమగుటకు; ఓర్వకుండన్+ఉన్న= సహించలేకున్న; ఆ+మానినియున్= ఆ ఉత్తరయు; కుమారుఁడును= అభిమన్యుడును; మార వికారములు= మన్మథుడి వలన కలిగే వికారాలు; అంకురింపఁగన్= పుట్టగా.

**తాత్పర్యం:** ముందుగా ఒకరిని గురించి మరొకరు వినటంతో చెవుల ద్వారా (వినుకలి) ప్రేమ కలిగింది. లోలోపల పరస్పరం అనురాగంతో చూడాలనే కోరికలు కలిగాయి. దానితో కొంచెంసేపు ఆలస్యానికి కూడా తట్టుకోలేని మనస్సులతో వధూవరు లున్నారు. వారి మనస్సులలో మన్మథభావాలు పుట్టాయి.

**వ. అన్యోన్యావలోకనంబు చేయునప్పుడు. 394**

**ప్రతిపదార్థం:** అన్యోన్య= ఒకరినొకరు; అవలోకనంబు= చూచుకొనటం; చేయునప్పుడు= చేసే సమయంలో.

**తాత్పర్యం:** వధూవరులు ఒకరినొకరు చూచుకొనే సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. వరుచూడ్కి ముద్దియ వదనంబుపైఁ బాఱి । తివుటమై నునుఁగాంతితీపు గ్రోలు,**
**సుందరీ రత్నంబు చూపు మనోహరు । నడుగుల యొప్పుపై నల్ల నడరుఁ,**
**బతివిలోకనములు పడఁతుకమైఁదీవఁ । గలయంగఁ బలుమఱు మెలఁగుచుండు,**
**వెలఁది కటాక్షముల్ విభునిపైఁ గ్రమమున । నెగసి మోమున సోఁకి మగుడ వచ్చు.**

**తే. నొండొరువుల లేఁ జెమటల నూని, వ్రేఁగు । పడిన చాడ్పున నవయవ భంగులందుఁ**
**దగిలి మఱుపునఁ దడయు నిద్దఱ విశాల । నయన దీప్తులు నెఱుకువ బయలుపడఁగ. 395**

**ప్రతిపదార్థం:** వరుచూడ్కి= వరుడి దృష్టి; ముద్దియ= పెండ్లికూతురియొక్క; వదనంబుపైన్= ముఖంమీద; పాఱి= ప్రసరించి; తివుటమైన్= కోరికతో; నునుఁ గాంతి తీపు= నునుపైన కాంతిలోని మాధుర్యాన్ని; క్రోలున్= త్రాగుతుంది; సుందరీరత్నంబుచూపు= ఉత్తర చూపు; మనోహరున్= భర్తయొక్క; అడుగుల+ఒప్పుపైన్= పాదాల అందంపై; అల్లన్=

మెల్లగా; అడరున్= వ్యాపిస్తుంది; పతివిలోకనములు= అభిమన్యుడి చూపులు; పడఁతుక= ఉత్తరయొక్క; మ్రైఁదీవన్= తీగెవంటి శరీరంమీద; కలయంగన్= అంతటా; పలుమఱు= చాలసార్లు; మెలఁగుచున్+ఉండున్= తిరుగుతున్నాయి; వెలఁది కటాక్షముల్= ఉత్తర క్రీగంటి చూపులు; విభునిపైన్= భర్తపై; క్రమమునన్= క్రమంగా; ఎగసి= పైకి ప్రసరించి; మోమునన్= ముఖమందు; సోఁకి= తాకి; మగుడ+వచ్చున్= మరలివస్తాయి; ఒండొరువుల= పరస్పరం; లేఁత+చెమటలన్= చిరు చెమటలను; ఊని= వహించి; వ్రేఁగుపడిన చాడ్పునన్= బరువెక్కినవా అన్నట్లు; అవయవ భంగులందున్= అవయవాల సొగసు తీరులలో; తగిలి= తగుల్కొని; మఱుపునన్= పరవశభావంలో; ఇద్దఱ= ఇద్దరియొక్క; విశాల= విశాలమైన; నయన దీప్తులున్= నేత్ర కాంతులును; ఎఱుకువ= అనురాగం; బయలుపడఁగన్= పైకి తెలిసిపోగా; తడయున్= ఆలసిస్తున్నవి, సంకోచిస్తున్నవి.

**తాత్పర్యం:** వరుడి దృష్టి పెండ్లికూతురి ముఖంమీద వ్రాలి కోరికతో మనుపైన కాంతిలోని మాధుర్యాన్ని తాగుతున్నది. ఉత్తర చూపు భర్తయొక్క అందమైన పాదాలపై మెల్లగా వ్యాపిస్తున్నది. అభిమన్యుడి చూపులు ఉత్తరయొక్క తీగవంటి శరీరం మీద చాలాసార్లు కలయ తిరుగుతూ ఉన్నాయి. ఉత్తర క్రీగంటి చూపులు భర్తపై క్రమంగా పైకి ప్రసరించి ముఖాన్ని తాకి తిరిగి, వస్తూ ఉన్నాయి. ఉభయుల మనోగతమైన వలపులు వారిచేష్టల వలన ఒకరికొకరికి తెలిసిపోయేటట్లు బయటపడగా ఆ వధూవరుల శరీరాలపై లేతచెమటలు పుట్టాయి. వారి విశాలమైన కన్నుల కాంతులు బరువెక్కినట్లయి ఉభయుల శరీరావయవాల సొగసుల తీరులలో ఆసక్తిపడి వేగంగా ముందుకు సాగలేక పారవశ్యంలో నెమ్మదిగా నిలుస్తూ కదులుతున్నాయి.

**విశేషం:** అలం: రూపకం, ఉత్ప్రేక్ష, స్వభావోక్తి, "భరతాన్వయుడైన పరీక్షిత్తు జన్మకు హేతువైన ఉత్తరాభిమన్యుల కల్యాణమునకు భారత కథయందు గల ప్రాముఖ్యమును గుర్తించిన తిక్కనగారు ఈ ఘట్టమును అత్యంతాభినివేశముతో నిర్వహించిరి. మూలభారతమున రెండు శ్లోకములలో సంగ్రహింపబడిన యీ కల్యాణఘట్టమును తిక్కనగారు ఇరువది పద్యముల వరకు విస్తరించి వ్రాసినారు. తెలుగునాట జరుగు పెండ్లి తంతు సాంగముగా వర్ణించినారు. తెర యెత్తించి ఉత్తరాభిమన్యులు పరస్పరావలోకనము చేసిన తెరగు ఈ పద్యమున పరమ సుందరముగా వర్ణింపబడినది. ఈ పద్యము వస్తురసాలంకార ధ్వనులకు గని.

వరుడైన యభిమన్యుని చూపు ముగ్ధయగు ఉత్తరముఖముపై వ్యాపించి లావణ్య మాధుర్యము క్రోలును - అనుటవలన అభిమన్యుని చూపునందు భ్రమరత్వము, ఉత్తర ముఖమునందు పద్మత్వము, లావణ్యమునందు మకరందత్వము వ్యంగ్యములై రూపకాలంకారము ధ్వనించుచున్నది. సుందరియగు ఉత్తర చూపు మనోహరుడగు నభిమన్యుని పాదముల యందముపై మెల్లమెల్లగా వ్యాపించును - అనుటవలన ఉత్తర చూపులందు భ్రమరీత్వము. అభిమన్యుని పాదములందు పద్మత్వము వ్యంగ్యములై మరియొక రూపకాలంకారము ధ్వనించుచున్నది. ఉత్తర తలవంచుకొని పాదములనే చూచినది. అందువలన ఆమె లజ్జ, పతిభక్తి యను సంచారిభావములు ధ్వనించుచున్నవి. 'చూపు' అను ఏకవచనము వలన నూత్నవధూవరుల సంకోచము వ్యక్తమగుచున్నది. అభిమన్యుని చూపులు ఉత్తర మ్రైఁదీవయం దంతటను పలుమారు సంచరించును - అనుటవలన మ్రైఁదీవయను రూపకబలముచే ఉత్తర సర్వాంగములందును పుష్పత్వారోపము వ్యంగ్యము. ఉత్తర కడకంటి చూపులు అభిమన్యుని మీద క్రమముగా ప్రాకి మొగమును స్పృశించి మరలివచ్చును - అనుటవలన ఉత్తర పతిదేవతాత్వము, దర్శన కుతూహలము, లజ్జా సంకోచములు వ్యంగ్యములు. 'చూపులు' అను బహువచన ప్రయోగము వలన వధూవరుల పరస్పర పునఃపునర్దర్శనాభిలాష. ఈషల్లజ్జా శైథిల్యము వ్యంగ్యములు. ఒండొరుల శరీరములందలి చిరుచెమట వలన బరువెక్కినవా యన్నట్లు ఆయా అవయవముల సొగసు తీరులందు తగిలి పరవశములై నిలిచి ఇరువురి విశాలనయన దీప్తులు వారి మనస్సులందలి ప్రేమ రహస్యమును బట్టబయలు చేయును - అనుటవలన, పునఃపునరవలోకనములు కారణముగా ఇరువురి మేనులందు స్వేదము అను సాత్త్వికభావోదయమైన దనియు, రతిపారవశ్యమున సంకోచ అజ్ఞాభావములు మరచిరనియు భావము. బెదురుచూపులు నిలుకడ చూపులైనవి. బెదురు చూపులు తరచు చూపులైనవి. నవ వధూవరుల గుట్టు బట్టబయలైనది.

శ్రవణమువలన నుదయించిన రతి దర్శనమువలన ఉద్దీపితమై, అనుభావ సాత్త్విక సంచారి భావములచే పుష్టమై రసనీయస్థితి చేరుకొనుచున్నది. చాటుచూపుల వర్ణనయందలి రూపకములు ధ్వని రూపకములు. బాహాటపు చూపుల వర్ణనమందలి ఉత్ప్రేక్ష వాచ్యము అగుటయు ఒక సున్నితమైన శిల్పమే. "(డాక్టర్ పాటిబండ మాధవశర్మ - తిక్కన కవితా వైభవము - యువభారతి ప్రచురణ) (సంపా.)

**వ. తదనంతరంబ. 396**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**తే. ఒండొరుల దోయిళుల నినుపొందఁ జేయు । నక్షత ప్రకరంబు లన్యోన్యమస్త**
**కములఁ బోసిరి మందార కల్పలతలు । విరులగముల నొండొంటిపైఁ గురియునట్లు. 397**

**ప్రతిపదార్థం:** ఒండొరుల= ఒకరొకరియొక్క; దోయిళులన్= దోసిళ్ళలో; ఇనుపొందన్+చేయు= అందగించెడి; అక్షత ప్రకరంబులు= తలంబ్రాలు; అన్యోన్య మస్తకములన్= పరస్పరం తలలపై; మందార కల్పలతలు= మందారవృక్షం, కల్పలతయు; విరుల= పూల యొక్క; గములన్= సమూహాన్ని; ఒండొంటిపైన్= ఒకదానిపైఒకటి; కురియునట్లు= వర్షించుకొన్నట్లుగా; పోసిరి= పోసికొన్నారు.

**తాత్పర్యం:** తలంబ్రాలు ఒకరి దోసిలినుండి ఇంకొకరి దోసిలిలో పోసి అందగించే వాటిని పరస్పరము తలపై పోసికొన్నారు. అది మందార వృక్షమూ, కల్పలతా పూలు వికసించగా ఒకదానిపై నొకటి కుప్పలు కుప్పలుగా పూలవాన కురిపించుకొన్నట్లున్నది.

**విశేషం:** 1. అలం: ఉపమ. మందారం వృక్షం (పుంలింగంకాబట్టి) వరుడికీ, కల్పలత (స్త్రీలింగం కాబట్టి) వధువుకూ తగిన ఉపమానాలు. తలచిన కోర్కెలన్నీ తీర్చే కల్పవృక్ష లతలే తమ మీద పరస్పరం పూలను క్రుమ్మరించుకొన్నట్లు తలంబ్రాలు వరుడూ, వధువూ పోసికొన్నారు. కామపురుషార్థ సాధన సమర్థమైన ఈ వివాహకాండకు, ఆయా మంత్ర తాత్పర్యాలను ఈ ఉపమాలంకారం వ్యంగ్యంగా సూచిస్తున్నది.

2. పెండ్లిలో తలంబ్రాలు పోసుకొనటాన్ని ఆర్ద్రాక్షతారోపణం అంటారు. అంటే తడిసిన అక్షతలను తలపై ఉంచటం అన్నమాట! ఆ ప్రక్రియను వివరిస్తూ చర్ల గణపతిశాస్త్రిగా రిట్లా పేర్కొన్నారు. "ఆర్ద్రాక్షతలను ముందు వధువు, పిదప వరుడు ఉంచవలెను. వరుడు, పాలను వధువు దోసిలి యందు తుడిచి రెండుసార్లు బియ్యముంచి, రెండు సార్లు అభిఘారము చేయవలెను. ఆ వరుని దోసిలిని వధువు దోసిలిపైన ఉంచి నీరుగల కలశము తీసికొని బ్రాహ్మణులతో గూడ కపిలగోవును స్మరింప జేయవలయును. కలిగించెడి శక్తిని ప్రసాదించు అగ్ని, వరుణాది దేవతలను గ్రహములను ప్రార్థించవలెను. ఆపై వరుడు వధువు శిరస్సున అక్షతలు పోయవలెను. రెండవసారి వరుని శిరస్సున ముందుగా పోయవలెను. మూడవసారి మొదట వధువు శిరస్సున పోయవలెను. నాలుగవసారి పరస్పరము ఒక్కసారిగా పోసికొనవలయును." (ఉపనయన వివాహవిధి). (సంపా.)

**చ. లలితతనూ విలాసముల లజ్జకతంబునఁ జేసి మున్ను వి**
**చ్చలవిడిఁ బట్టఁగా వెరవు సాలక యోరలువాఱుచూపులన్**
**లలిఁ దలఁబ్రాలు పోయునెడలం దగ వొందిన నూలుకొల్పి యి**
**మ్ములఁ బచరింతు రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్. 398**

**ప్రతిపదార్థం:** లలిత= కోమలమైన, సుందరమైన; తనూ విలాసములన్= శరీరాల హొయలను; లజ్జ కతంబునన్ చేసి= సిగ్గు కారణంగా; మున్ను= ఇంతకు ముందు; విచ్చలవిడి= యథేచ్ఛగా; పట్టఁగాన్= చూడటానికి; వెరవు+చాలక= అవకాశం చాలక; ఓరలు+పాఱు= ప్రక్కలకు వెళ్ళేడి; చూపులన్= చూపులను; లలిన్= తనివితీర; తలఁబ్రాలు పోయుఎడలన్= తలంబ్రాలు పోసికొనేటప్పుడు; తగ ఒందినన్= వీలు కలుగగా; నూలుకొల్పి= నిలిపి; ఇమ్ములన్= విరివిగా; ఒండొరుల= ఒకరినొకరి; మోహనమూర్తులపైన్= మోహము కలిగే అందమైన శరీరాలపై; వధూవరుల్= ఆ పెండ్లికూతురు, పెండ్లికొడుకును; పచరింతురు= ప్రసరింపజేస్తున్నారు.

**తాత్పర్యం:** ఆ వధూవరులు సహజమైన సిగ్గుకారణంగా కోమలములూ, సుందరములూ అయిన తమ శరీరాల అందమైన హొయలను ఓరచూపులతోనే తప్ప విచ్చలవిడిగా చూచుకొనలేకపోయారు. అయితే, తలంబ్రాలు పోసికొనే సమయంలో మాత్రం ఒకరు మరొకరి మోహనమూర్తిని ప్రీతితో చూచే అవకాశం దొరకటం చేత తనివిదీర విరివిగా చూచుకొన్నారు.

**విశేషం:** అలం: ప్రహర్షణం.

**తే.** **చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు । తెఱఁగు దోఁపఁ గెంపారెడు తీఁగబోఁ డి**
**మృదులపాణిఁ గుమారుండు మెలపుమై గ్ర । హించెఁ బల్లవాలంబి మత్తేభలీల.** **399**

**ప్రతిపదార్థం:** చిత్తమునన్= మనస్సులోని; గాఢ రాగంబు= గాఢమైన అనురాగాన్ని; చేతన్= చేతితో; చూపు తెఱఁగు= చూచే రీతి; తోఁపన్= తోచేటట్లు; కెంపారెడు= ఎర్రగా ఉన్న; తీఁగబోఁడి= తీగవంటి శరీరంగల ఉత్తరయొక్క; మృదులపాణిన్= మృదువైన హస్తమును; కుమారుండు= అభిమన్యుడు; మెలపుమైన్= మృదువుగా; పల్లవ+ఆలంబి= చిగురును పట్టిన; మత్తేభలీలన్= మదగజం విలాసంతో; గ్రహించెన్= పట్టుకొన్నాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు మనస్సులో ఉన్న గాఢమైన అనురాగాన్ని చేతితో ప్రదర్శిస్తున్నాడా అన్నట్లు ఎర్రగా ఉన్న ఉత్తరయొక్క మృదువైన హస్తమును మదగజము చిగురును పట్టినట్లుగ మృదువుగా గ్రహించాడు.

**విశేషం:** అలం: ఉపమ, ఉత్ప్రేక్ష. ఇచట మృదులపాణి - గ్రహించె - అని పాణిగ్రహణం జరిగిందని చక్కగా సూచన జరిగింది.

**వ.** **ఇట్లు పాణిగ్రహణం బాచరించి.** **400**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాణిగ్రహణంబు= హస్తమును పట్టుకొనుటను; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** ఈ విధంగా వారు పాణిగ్రహణం చేసికొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** తలంబ్రాలు పోసికొన్న తరువాత వరుడు వధువు యొక్క చేతిని గ్రహించి "గృహ్ణామి తే" మొదలైన మంత్రాలు చదువుతాడు. కొందరీపాణిగ్రహమే ముహూర్తమని భావిస్తారు. తెలుగునాట మంగళసూత్ర ధారణం వివాహంలో ముఖ్యవిధి. అది ఈ ఘట్టంలో పేర్కొనలేదు. మూలానికి విరుద్ధం కాని తెలుగుదనమే తిక్కన చొప్పించినట్లున్నది. (సంపా.)

**క.** **పెనుఁగుదుట నిడిన చూతం । బును నవమాలికయుఁ బోలెఁ బొలుపొంది రతం**
**డును నమ్ముగ్ధయు నేకా । సనమున నున్నపుడు నూత్న సౌభాగ్యమునన్.** **401**

**ప్రతిపదార్థం:** పెనుఁగుదుటన్= పెద్దపాదులో; ఇడిన= ఉంచిన; చూతంబును= మామిడి మొక్కయును; నవమాలికయున్+పోలెన్= నవమల్లికగా లతవలె; అతండును= అభిమన్యుడును; ఆ+ముగ్ధయున్= ఆ ఉత్తరయును; ఏకాసనమునన్= ఒకే ఆసనంపై; ఉన్నపుడు= కూర్చున్నపుడు; నూత్న= కొత్తదైన; సౌభాగ్యమునన్= అందంతో; పొలుపొందిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** పెద్ద కుదుటిలో పెట్టిన మామిడియొక్క నవమల్లికాలత వలె ఒకే ఆసనం మీద కూర్చున్నపుడు ఆ అభిమన్యుడూ, ఉత్తరా క్రొత్త శోభతో ప్రకాశించారు.

**సీ.** **కోర్కులు గెడఁ గూడుకొని పార మేదిన । చిత్తంబు లూఱటఁ జిగురులొత్తఁ**
**బులకాంకురములకుఁ దలతాఁకుడై యిరు । మేనను మవ్వంబు మిగిలి పొదలఁ**
**దఱి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి । వడిచూపు లాదట బయలుపఱుపఁ**
**జెమటల తావులు తమలోనఁ గలసి వే । ఱొక్క సౌరభమయి చొక్కుసేయ.**

**తే.** **గాఢ సంస్పర్శ భంగులు గలుగునట్టి । హోమ సమయ కృత్యంబుల నొదవి సౌఖ్య**
**రసము వెన్నిట్ట పొరింబొరి గ్రమ్ముదేర । సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు.** **402**

**ప్రతిపదార్థం:** కోర్కులు= కోరికలు; కెడన్= ప్రక్కను; కూడుకొని= కలిసి; పారము= అంతమున; ఏదిన= చేరిన; చిత్తంబులు= మనస్సులు; ఊఱటన్= ఉపశమించటంతో; చిగురులు+ఒత్తన్= చిగిర్చగా; పులక+అంకురములకున్= గగుర్పాటులకు; తలతాఁకుడు+ఐ= పట్టక; ఇరుమేనను= రెండు శరీరాలందును; మవ్వంబు= ఉత్సాహం; మిగిలి= ఎక్కువై; పొదలన్= వ్యాపించగా; తఱి= తగిన సమయం; వేచి= ప్రతీక్షించి; చనన్+పోయి= వెళ్ళబోయి; తడఁబడి= తడబాటు చెంది; మార్గతి= మరొక మార్గం; వడి= పొంది; చూపులు= దృష్టులు; ఆదటన్= ఆసక్తిని; బయలుపడఁగ= వ్యక్తం చేయుగా; చెమటల తావులు= చెమటల వాసనలు; తమలోనన్= వాటిలో అవి; కలసి= కలిసి; వేఱొక్క సౌరభము+అయి= మరొక పరిమళమై; చొక్కు+చేయన్= పారవశ్యము కల్గించగా; గాఢ= దృఢమైన; సంస్పర్శ= స్పర్శయొక్క; భంగులు= రీతులు; కలుగునట్టి= కల్గిన; హోమ= హోమంచేసే; సమయ= వేళ అందలి; కృత్యంబులన్= పనులందు; సౌఖ్యరసము= సుఖానుభూతి; ఒదవి= కలిగి; పెన్నిట్ట (పెను+నిట్ట) పెద్ద ప్రవాహమై; పొరిన్+పొరిన్= మాటిమాటికి; క్రమ్ముదేరన్= ఆక్రమించగా; సతియున్= ఉత్తరయును; పతియున్= అభిమన్యుడును; సమ్మద+అంబుధిన్= సంతోషమనెడి సముద్రంలో; తేలిరి= మునిగి తేలారు.

**తాత్పర్యం:** కోరికలన్నీ దగ్గరకు చేరుకొని తీరం చేరి విశ్రాంతిగా పుట్టుకొస్తున్నాయి. మేని పులకింతలు ఒక శరీరంలో పట్టక రెండు శరీరాలలో కూడా విస్తరించటంతో ఉత్సాహం పెరిగిపోయింది. చూపులు సమయం చూచుకొని వెళ్ళబోయి, తడబడిపోయి మరొక దారిపట్టి ఆసక్తిని వ్యక్తం చేస్తున్నాయి. చెమటలు కలిసిపోయి హోమద్రవ్యవాసనలతో కలిసి ఒకానొక సుగంధాన్ని వెదజల్లుతున్నాయి. హోమాలు చేసేటప్పుడు దగ్గరగా గాఢంగా స్పర్శ కలిగి వచ్చిన సౌఖ్యం ప్రవాహంగా పెరిగి మాటిమాటికి వ్యాపించగా ఆ దంపతులు ఇరువురు సంతోష సముద్రంలో మునిగి తేలారు.

**విశేషం:** అలం: స్వభావోక్తి, రూపకం. 1. పాణిగ్రహణానంతరం ప్రధానహోమం, లాజహోమం, జయాదిహోమాదులు వధూవరుల చేత చేయిస్తారు. అందులో గార్హస్థ్య ధర్మంలో ఆలుమగలు చేయవలసిన ధర్మాల నన్నింటిని అగ్నిసాక్షిగా మంత్రసహితంగా

ప్రతీకాత్మకంగా చేయిస్తారు. అందువలన ప్రక్కప్రక్క నుండే వధూవరుల శరీరాలు అంగాలు పరస్పరం గాఢ స్పర్శకు లోనౌతూ ఉంటాయి. ప్రప్రథమంగా లభించే ఆ గాఢ సంస్పర్శ భంగులు కలిగించే అనుభావ, సాత్త్విక విభావాలను తిక్కన ఒక క్రమ విన్యాసంలో ఈ సీసపద్యంలో వర్ణించాడు. ఒకొక్కసారి మనసులో కోరికలు మోసులెత్తగా కావాలని ఇద్దరూ దగ్గరగా ఒత్తుకొని కూర్చుండగా కోరికలు తీరినట్లు ఏదో తృప్తి మనసులలో మొలకెత్తితే వారి మనసులలో సౌఖ్యరసం ప్రవాహంగా ఉదయించినట్లు సంతోషించారు. నిరంతర స్పర్శవలన వారి శరీరాలపై పులకలు మరల మరల మొలిచి తబ్బిబ్బు చేయగా మేనులు మెత్తపడి మరింత కలుసుకొనటానికి పూనుకోగా సౌఖ్యరసం మాటిమాటికీ పెల్లుబికింది. ఇరువురూ సమయం చూచి చూపులు కలుపుకొనటానికి ప్రయత్నించి కూడా లజ్జచేత తడబాటుపడి పక్కచూపులు సారించి మనసులోని అనురాగాన్ని బయటపెట్టుకొంటూండగా వారి సౌఖ్యరస ప్రవాహం విస్తరించింది. తమ లోగుట్టులు తమంతట తామే బయట పెట్టుకొనటం వలన స్వేదం సాత్త్వికభావంగా అంకురించింది. ఇరువురి చెమటల తావులూ కలిసి ఒక వింత సుగంధాన్ని కలిగిస్తూ ఉంటే స్వేదగంధసంగమం వారిని సౌఖ్యరసాంబుధిలో ఓలలాడింపజేసింది. నాలుగురకాల స్పర్శభంగుల నాశ్రయించి వారి సౌఖ్యరసం పుట్టి, క్రమంగా ఏర్పై, మాటిమాటికీ పొంగి, వరదగా వ్యాపించి, సముద్రంవలె సమృద్ధమైనదని ధ్వని.

2. ఉత్తమజాతి దంపతుల రతి భావజన్యస్వేదం కూడా పరిమళవంతంగా ఉంటుందని కామశాస్త్రకారుల అభిప్రాయం. అగ్నికార్యం చేసేటప్పుడు కలిగే వేడివలన కూడా స్వేదం కలుగవచ్చును. అది శ్రమవలని స్వేదం. తిక్కన స్పర్శసౌఖ్యంవలన కలిగే సాత్త్వికభావమైన స్వేదాన్నే వర్ణించాడు. (సంపా.)

**వ.** **ఇవ్విధంబున వివాహంబు నిర్వహించి మత్స్యమహీనాథుండు మణిభూషణంబులు రుచిరాంబరంబులుఁ గర్పూరాది సుగంధ ద్రవ్యంబులుఁ దాంబూలంబుల తోడి పళ్లెరంబులఁ బచరించి పాండవులకు వాసుదేవ పూర్వకంబుగాఁ గట్టనిచ్చి, పురోహిత ప్రకరంబునకు నిప్పించి, యాజ్ఞసేనీ సుభద్రలకు సనురూపాభరణ పరిధానంబు లంతఃపురవర్తు లైన యర్హ జనంబులచేతం బుచ్చి, సౌభద్రునకు భద్రసామజసప్తశతియును, లోకోత్తర తురంగ దశ సహస్రంబును, సలక్షణ గోపంచలక్షయు, రథంబులు రెండు వేలును, దాసదాసీ జనంబు లక్షయు, మఱియు నానా ప్రకారంబు లగు ధనంబులు నరణం బిచ్చె; నమ్మహనీయ మహోత్సవంబు మంగళ సంవిధాన సావధాన పుణ్యాంగనలవలనను, నృత్త గీతాది వైచిత్ర్య మనోహర వారనారీజనంబుల వలనను, వినూత్న రత్నమయ భూషణాది దీప్తవేష విరాజమాను లగు కుమారుల చతుర పరిహాసాది విలాసంబుల వలనను, బ్రభూత విభవ విభ్రాజితు లగు రాజసూనుల మాననీయ గరిమలలిత విహార విశేషంబులవలనను. బాంచాలయాదవ కేకయాది బాంధవ మహిత మహిమాంచిత సంచరణంబుల వలనను, నానంద నిష్యంది పాండునందన సౌహార్దంబు వలనను మత్స్యమనుజపతి మందిరంబు పరమ సంపద్భరితంబై యుండె' నని చెప్పిన విని వైశంపాయనునితో జనమేజయుండు.** **403**

**ప్రతిపదార్థం:** మత్స్యమహీనాథుండు= విరాటుడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; వివాహంబు= పెళ్ళిని; నిర్వహించి= జరిపి; మణిభూషణంబులు= మణులు పొదివిన అలంకారాలను; రుచిర+అంబరంబులున్= ప్రకాశించే వస్త్రాలను; కర్పూర+ఆది= కర్పూరం మొదలైన; సుగంధ ద్రవ్యంబులున్= పరిమళ ద్రవ్యాలను; తాంబూలంబుల తోడి= తాంబూలాలున్న; పళ్లెరంబులన్= పళ్ళెములందు; పచరించి= ఉంచి; పాండవులకున్= పాండవులకు; వాసుదేవ పూర్వకంబుగాన్= శ్రీకృష్ణునకు ముందుగాను;

కట్టన్+ఇచ్చి= కట్టుకొనటానికి కానుకలుగా ఇచ్చి; పురోహిత ప్రకరంబునకున్= బ్రాహ్మణుల సముదాయానికి; ఇప్పించి= బహుమతు లిప్పించి; యాజ్ఞసేనీ= ద్రౌపదికి; సుభద్రలకున్= సుభద్రకును; అనురూప= తగిన; ఆభరణ= నగలను; పరిధానంబులు= వస్త్రాలను; అంతఃపుర వర్తులు+ఐన= రాణివాసంలో ఉండునట్టి; అర్హజనంబులచేతన్= తగిన జనులచేత; పుచ్చి= పంపించి; సౌభద్రునకున్= అభిమన్యుడికి; భద్రసామజ= భద్రగజములు; సప్తశతియును= ఏడువందలున్నూ; లోకోత్తర= మేలుజాతివైన; తురంగ= గుర్రాలు; దశ సహస్రంబును= పదివేలును; సలక్షణ= మంచి లక్షణాలు గల; గోపంచలక్షయున్= అయిదులక్షల గోవులను; రథంబులు= రథాలు; రెండువేలును; దాసదాసీ జనంబు= దాసులు, దాసీలు; లక్షయున్= ఒక్క లక్షమందిని; మఱియున్= ఇంకా; నానా ప్రకారంబులు+అగు= అనేక రకాలైన; ధనంబులును= ధనములను; అరణంబు= అల్లుడి కిచ్చే ద్రవ్యం; ఇచ్చెన్= ఇచ్చాడు; ఆ+మహనీయ= ఆ గొప్పదైన; మహా+ఉత్సవంబు= గొప్ప ఉత్సవం; మంగళ సంవిధానం= మంగళకర ద్రవ్యాలను సమకూర్చటంలో; సావధాన= శ్రద్ధకల; పుణ్యాంగనల వలనను= సువాసినుల చేతను; నృత్తగీత+ఆది= నాట్యం, గానం మొదలైన; వైచిత్ర్య= అద్భుతమైన; మనోహర= అందమైన వారనారీ= వేశ్యాస్త్రీల; జనంబులవలనను= సముదాయం వలన; వినూత్న= క్రొత్తదైన; రత్నమయ= రత్నాలతో చేసిన; భూషణ+ఆది= నగలు మొదలైన వాటిచేత; దీప్త= ప్రకాశించిన; వేష= వేషంతో; విరాజమానులు+అగు= ధగధగలాడే; కుమారుల= రాజయువకులయొక్క; చతుర= నేర్పుగల; పరిహాస+ఆది= వేళాకోళాలు మున్నగు; విలాసంబుల వలనను= సరదాలతోను; ప్రభూత= ఎక్కువైన; విభవ= సంపదతో; విభ్రాజితులు+అగు= ప్రకాశించే; రాజసూనుల= రాజకుమారులయొక్క; మాననీయ= గౌరవించదగిన; గరిమ= గొప్పవయిన; లలిత= అందమైన; విహార విశేషంబుల వలనను= రకరకాల విహారాల వలన; పాంచాల= పాంచాల దేశీయులు; యాదవ= యాదవ వంశీయులు; కేకయ+ఆది= కేకయ దేశీయులు మున్నగు; బాంధవ= బంధువులతో; మహిత= గొప్పదైన; మహిమ+అంచిత= మహిమచేత గొప్పది అగు; సంచరణంబుల వలనను= విహారాలచేతను; ఆనందనిష్యంది= ఆనందం స్రవించే; పాండునందన= పాండవులయొక్క; సౌహార్దంబువలనను= మంచిమనస్సు కలిగి ఉండటం వలన; మత్స్యమనుజపతి మందిరంబు= విరాటుడి గృహం; పరమ= గొప్పదైన; సంపద్+భరితంబు+ఐ= సంపదతో నిండినదై; ఉండెనున్= ఉండింది; అని చెప్పినన్= అని చెప్పగా; విని; వైశంపాయనునితోన్= వైశంపాయన మహర్షితో; జనమేజయుండు= జనమేజయమహారాజు.

**తాత్పర్యం:** విరాటరాజు ఈ రీతిగా ఉత్తరాభిమన్యుల వివాహం నిర్వహించాడు. మణిభూషణాలు, మంచివస్త్రాలు, కర్పూరం మొదలైన పరిమళ ద్రవ్యాలు, తాంబూలాలు పెట్టిన పళ్ళెంలో పెట్టి ముందుగా శ్రీకృష్ణుడి కిచ్చి. తరువాత పాండవుల కిచ్చాడు. పురోహితులందరికీ ఇచ్చాడు. ద్రౌపదికి, సుభద్రకు తగిన ఆభరణాలు, వస్త్రాలు అంతఃపుర జనులచేత ఇప్పించాడు. ఇక అభిమన్యుడికి భద్రగజాలు ఏడువందలు, జాతిగుర్రాలు పదివేలు, సలక్షణమైన గోవులు అయిదులక్షలు, రథాలు రెండువేలు, దాసదాసీ జనం లక్ష - ఇవిగాక ఇంకా రకరకాల ధనాలు అరణంగా ఇచ్చాడు. ఆ కల్యాణ మహోత్సవం అంత గొప్పగా జరిగిందంటే కారణం - ఎక్కడ ఏవి సమకూర్చాలో అట్లా శ్రద్ధగా చేసిన సువాసినులు, ఆట పాటలతో అందరినీ అలరించే వేశ్యాజనం, రత్నాభరణాలు పెట్టుకొని మంచివేషంతో నేర్పుగా పరిహాస విలాసాలు చేసిన రాజకుమారుల విహారాలు, పాంచాల, యాదవ, కేకయాది బంధువుల సంచారాలు, పాండవుల ఆనందం వెల్లివిరిసే సౌహార్దం-వీటి అన్నిటితో విరాటుడి మందిరం సర్వసంపత్సమృద్ధం అయింది. అనగా విని జనమేజయుడు వైశంపాయనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: అంత్యానుప్రాస.

**క. 'కుంతీనందను లట్ల । త్యంత విభవ మెసఁగఁ బరిణయము చేసి సుహృ**
**త్సంతోషోజ్జ్వలులై తద । నంతర మెబ్భంగి నడచి?' రనవుడుఁ బ్రీతిన్. 404**

**ప్రతిపదార్థం:** కుంతీనందునులు= పాండవులు; అట్లు= ఆ రీతిగా; అత్యంత విభవము= ఎక్కువ వైభవం; ఎసఁగన్= ఎక్కువ కాగా; పరిణయము= వివాహం; చేసి= జరిపి; సుహృత్= స్నేహితులయొక్క; సంతోష+ఉజ్జ్వలులు+ఐ= సంతోషంతో ప్రకాశించేవారై; తదనంతరము= ఆ పిమ్మట; ఏ+భంగిన్= ఏ రీతిగా; నడచిరి?= ప్రవర్తించారు?; అనవుడున్= అని ప్రశ్నించిన తరువాత; ప్రీతిన్= ప్రీతితో.

**తాత్పర్యం:** 'పాండవులు ఆ విధంగా వివాహం అత్యంత వైభవంగా జరిపించి, మిత్రులకు సంతోషం కలిగించి, తరువాత ఏ రీతిగా ప్రవర్తించారు?' అని అడుగగా అతడు ప్రీతితో. (ఇట్లా అన్నాడని తరువాతి ఉద్యోగపర్వం ప్రథమాశ్వాసంలోని పద్యంతో అన్వయం).

ఆశ్వాసాంతము

**చ. అమృతమయాత్మ! భక్తిసుగమానుభవోజ్జ్వల దివ్యవర్త్మ! ష**
**ట్సమయ గతానుభావ! పురుష త్రయతా వివృత స్వభావ! ని**
**ర్మమ హృదయైకవాస! మునిరంజన నిత్యవిలాస! దోష సం**
**గమ వినికర్తనా! పరమ గౌరవ ధుర్య పద ప్రవర్తనా! 405**

**ప్రతిపదార్థం:** అమృతమయ= అమృతమయమైన; ఆత్మ!= ఆత్మకలవాడా!; భక్తిసుగమ= భక్తిచేత సులభమైన; అనుభవ= అనుభవంతో; ఉజ్జ్వల= ప్రకాశించే; దివ్యవర్త్మ!= దివ్యమైన మార్గం కలవాడా!; షట్సమయ= ఆరు మతాలను-ఆరు సమయాలను; గత= పొందిన; అనుభావ!= ఆశయం కలవాడా! (షట్సమయగతానుభావ-శైవ, వైష్ణవ, శాక్త, సౌర, వైదిక, సౌగతము లనెడి ఆరు సిద్ధాంతాలయందును తెలియబడే ప్రభావం కలవాఁడా! లేదా- సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక పూర్వోత్తర మీమాంసలనెడి దర్శనషట్కంచేత తెలియబడే ప్రభావం కలవాఁడా! లేదా షట్సమయ- షట్కాలములయందును - అరుణోదయ, సూర్యోదయ, సంగవ, మధ్యాహ్న, సాయం, అర్ధరాత్రములందలి ఆరాధనంచేత భక్తులచే పొందబడు అనుభవం కలవాడా!); పురుష త్రయతా= బ్రహ్మవిష్ణుమహేశ్వరులనెడి ముగ్గురు పురుషులగుటతో; వివృత= వివరించబడిన; స్వభావ!= సృష్టి, స్థితిలయముల స్వభావం కలవాడా!; నిర్మమ= మమకారంలేని; హృదయ= హృదయమే; ఏకవాస= ముఖ్యమైన నివాసంగా కలవాడా!; మునిరంజన= మునులను రంజింపజేసే; నిత్యవిలాస!= నిత్యమైన విలాసాలు కలవాడా!; దోష= దోషాలతోడి; సంగమ= సంబంధాన్ని; వినికర్తనా!= కత్తిరింపజేసేవాడా!; పరమ= మిక్కిలి; గౌరవధుర్య= గౌరవభావంకల; పద= పదవియందు; ప్రవర్తనా!= ప్రవర్తించేవాడా!

**తాత్పర్యం:** అమృతమయమైన ఆత్మ కలవాడా! భక్తి సులభమైన అనుభవం కల దివ్యమార్గం కలవాడా! ఆరు మతములందున్న అభిప్రాయం కలవాడా! ముగ్గురు పురుషులుగా వివరించబడిన స్వభావం కలవాడా! మమకారం లేని హృదయమే నివాసంగా కలవాడా! మునులను రంజింపజేసే నిత్య విలాసాలు కలవాడా! దోష సంబంధాన్ని ఛేదించేవాడా! గొప్ప గౌరవం కల పదవియందు ప్రవర్తించేవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: అంత్యానుప్రాస. ఈ పద్యంలో హరిహరనాథస్వామిని పరతత్త్వంగా తిక్కన దర్శించి కీర్తిస్తున్నాడు. షట్సమయాలు= ఆరు సిద్ధాంతాలు- శైవ, వైష్ణవ, శాక్త, సౌర, వైదిక, సౌగత సిద్ధాంతాలు; ఆరు దర్శనాలు- సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, పూర్వోత్తర మీమాంస దర్శనాలు; పురుషత్రయం= బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు.

**క. దుర్వహ పటుతాపత్రయ । నిర్వాపణ కరణ, బోధ నిర్మలజన హృ**
**త్పర్వాచరణ, మహాసుర । గర్వహరణ! తత్త్వ సంప్రకాశనకరణా! 406**

**ప్రతిపదార్థం:** దుర్వహ= వహింపరాని; పటు= గొప్పదైన; తాపత్రయ= మూడు తాపములను; నిర్వాపణకరణ= పోగొట్టటంలో పనికలవాడా!; బోధ= జ్ఞానంతో; నిర్మల= స్వచ్ఛమైన; జన= జనులయొక్క; హృద్= మనస్సులకు; పర్వ+ఆచరణ= పండుగ చేసేవాడా!; మహా+అసుర= గొప్ప రాక్షసుల; గర్వ+హరణ!= గర్వాన్ని పోగొట్టేవాడా!; తత్త్వ= పరబ్రహ్మతత్త్వాన్ని; సంప్రకాశన= ప్రకాశింపచేయటంలో; కరణా!= ముఖ్యసాధనమైనవాడా!

**తాత్పర్యం:** వహించలేని తాపత్రయాలను అణచే పనిగలవాడా! జ్ఞానంతో నిర్మలమైన జనుల హృదయాలకు ఆనందం కలిగించేవాడా! గొప్ప రాక్షసుల గర్వం పోగొట్టేవాడా! పరబ్రహ్మతత్త్వాన్ని ప్రకాశింపజేసే ప్రయోజనం కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: అంత్యానుప్రాస. ఇందులో హరిహరనాథుడిని సగుణుడిగా భావించి తిక్కన కీర్తించాడు. 1. తాపత్రయం; ఆధ్యాత్మిక. ఆధిదైవిక. ఆధిభౌతిక రూపాలైన తాపాలు. 'నిర్వాపణ నిపుణ' అనే పాఠానికి బదులు 'నిర్వాపణ కరణ' అనే పాఠం గ్రహించబడింది. అయినను 'నిర్వాపణ నిపుణ' - అనే పాఠమే కవి హృదయసమ్మతంగా గోచరిస్తూవుంది.

**మాలిని:**

**నిగమ కుసుమ గంధోన్మేష భూతాభిధానా!**
**సగుణ విగుణ లీలా! సౌమ్య సాక్షిత్వ నానా**
**జగదవన పిధాన స్థైర్య దత్తావధానా!**
**నగశరధి నివాసా నంద సంస్తూయమానా! 407**

**ప్రతిపదార్థం:** నిగమ= వేదాలనెడి; కుసుమ= పుష్పాలయొక్క; గంధ= సువాసనయొక్క; ఉన్మేషభూత= వికాస రూపమయిన; అభిధానా!= పేరు కలవాడా!; సగుణ= ఉత్తమ గుణాల యొక్కయు; విగుణ= విరుద్ధ గుణాలయొక్కయు; లీలా!= విలాసాలు కలవాడా!; సౌమ్య= శాంతమనే గుణంతో; సాక్షిత్వ= సాక్షీభావం అనే గుణంతో; నానాజగత్= అనేక లోకాలయొక్క; అవన= రక్షించటం; పిధాన= లయం చేయటం; స్థైర్య= స్థిరభావంతో ఉంచటం (పాలనం) అనే మూడు పనులలో; దత్త+అవధానా!= నెలకొల్పబడిన శ్రద్ధ కలవాడా!; నగ= పర్వతం మీదను (హరపక్షాన); శరధి= సముద్రంలోనూ (హరిపక్షాన); నివాస= నివసించటం చేత; ఆనంద= సంతోషం కలవాడవని; సంస్తూయమానా!= (భక్తుల చేత) బాగా కీర్తించబడేవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! వేదాలనే పూలకు సువాసనవంటి వేదాంతతత్త్వమే పేరుగా కలవాడా! సద్గుణాలనూ, దుర్గుణాలనూ విలాసాలుగా కలవాడా! సృష్టి స్థితి లయాలవంటి జగద్వ్యాపారాలను శాంతుడవై, సాక్షీభూతుడవై శ్రద్ధతో గమనిస్తూ ఉండేవాడా! హరుడవై పర్వతంమీదా, హరివై సముద్రంలోనూ నివసించటం చేత ఆనందిస్తూ ఉంటావని భక్తులచేత విశేషంగా కీర్తించబడేవాడా!

**విశేషం:** అలం: రూపకం, అంత్యానుప్రాసం. ఇందులో హరిహరనాథమూర్తిని కీర్తించాడు. ఆనందశబ్ద ముద్రితంగా ఈ పద్యాన్ని రచించాడు. మాలినీవృత్తానికి ప్రతిపాదంలో వరుసగా న, న, మ, య, య అనే గణాలుంటాయి. తొమ్మిదవ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము:**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర, కొమ్మనామాత్యపుత్ర, బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు సర్వంబును పంచమాశ్వాసము.**

**విరాటపర్వము సమాప్తము.**

**తాత్పర్యం:** ఇది మంగళకరమైన ఉభయకవిమిత్రుడనే బిరుదం కలవాడూ, కొమ్మనామాత్యుడి పుత్రుడూ, పండితులను ఆరాధిస్తూ (పండితులచేత ఆరాధింపబడుతూ) ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలో అయిదవ ఆశ్వాసంతో పూర్తయిన విరాటపర్వం.

విరాటపర్వంలో అయిదవ ఆశ్వాసం సమాప్తం.

విరాటపర్వం సర్వం ముగిసింది.

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

సంపుటము - 7

## ఉద్యోగపర్వము

కృతికర్త

## తిక్కన సోమయాజి

వ్యాఖ్యాతలు

డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు
శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం




ప్రచురణ

## తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

2013

**KAVITRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATAM**

With Commentary
Udyogaparvamu of Tikkana Somayaji
Vol.VII.

Commentary by
**Dr. Jonnalagadda Mrityunjaya Rao- 1,2 Cantos**
**Sri Mudivarthi Kondamacharyulu- 3,4 Cantos**

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Series No.606
First Edition : August 2000
First Re-print : 2006

Second Edition: 2013
Copies : 5,000



Published by
**Sri. M.G. Gopal, I.A.S.**
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507

D.T.P. Type Setting
**Editor-In-Chief Office**
T.T.D. Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వై.యస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

# సరళవ్యాఖ్యాన సహిత
# కవిత్రయ భారతం ద్వితీయ ముద్రణ
# పూర్వాపరాలు

భారతీయ సనాతన సంస్కృతి మణి కిరీటంలో జాజ్వల్యమానంగా మెరుస్తున్న ముచ్చటైన మూడు అమూల్యరత్నాలు రామాయణ, భారత, భాగవత గ్రంథాలు. అనాదిగా ఆసేతుహిమాచలం ధర్మప్రచారంలోను, ధర్మపరిరక్షణలోను ఈ అమూల్యగ్రంథాలు అద్భుతమైన ఎనలేని పాత్రను పోషిస్తున్నాయి. అందులోను త్రిలింగాలమధ్య నెలకొన్న ఆంధ్రులకు అత్యంత ఆదరణీయమైనవి, ప్రీతిపాత్రమైనవి ఈ మూడు గ్రంథాలు. అందువల్లే తిరుమల తిరుపతి దేవస్థానం 'ధర్మో రక్షతి రక్షితః' అన్న నినాదంతో ధర్మపరిరక్షణకోసం ఈ మహాగ్రంథాల ప్రచురణ పెద్దఎత్తున చేపట్టింది.

మహోన్నతమైన ఈ బృహత్సాహితీయజ్ఞంలో తొట్టతొలిగా సవ్యాఖ్యానంగా కవిత్రయ భారత గ్రంథ ప్రచురణను చేపట్టింది తిరుమల తిరుపతి దేవస్థానం. ఈ మహా అధ్వర్యవానికి అధిదైవతం శ్రీ వేంకటేశ్వరుడు కాగా, ఎందరో పండితవరేణ్యులైన వ్యాఖ్యాతలు ఋత్విక్కుల పాత్రను పోషించారు. సుమారు 30 ఏండ్లపాటు సాగిన ఈ సాహితీక్రతు నిర్వహణకుగాను నాటి శ్రీకార్యనిర్వహణాధికారి శ్రీ కుమారస్వామి రెడ్డిగారి కార్యనిర్వహణలో ప్రజాసంబంధాల అధికారిగా కొనసాగిన శ్రీ రావుల సూర్యనారాయణమూర్తిగారు విశేషకృషి చేసినారు. అలాగే ఆనాడు ప్రధాన సంపాదకులుగా వ్యవహరించిన ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, సంపాదకులుగా వ్యవహరించిన డా॥ నండూరి రామకృష్ణమాచార్యులుగారు, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్యగారు భారత ముద్రణలో ప్రత్యేకమైన పాత్రను పోషించారు. తరువాత కవిత్రయ మహాభారత వ్యాఖ్యాన రచనాకార్యక్రమానికి పూర్తిగా ప్రధాన సంపాదకత్వ బాధ్యత వహించిన ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు ఈ కార్యక్రమాన్ని సమర్థంగా నిర్వహించి పద్దెనిమిది పర్వాల భారతాన్ని పదిహేను సంపుటాలుగా వెలుగులోనికి తీసుకురావటంలో కీలకపాత్రను వహించారు. ఇదే పరంపరలో 'సప్తగిరి' సంపాదకులు శ్రీ కాట్రపాటి సుబ్బారావు గారు, ఆ తర్వాత 'సప్తగిరి' సంపాదకులు డా॥ ఎన్.ఎస్.రామమూర్తి గారు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. పిదప 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు, డా॥ సి.శైలకుమార్ గారు మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారల పర్యవేక్షణ కాలంలో 'కవిత్రయ భారతం' ప్రచురణ పూర్తి అయింది. ఆ తరువాత అనతికాలంలోనే ఆ గ్రంథ ప్రతులు అన్నీ పూర్తిగా చెల్లిపోయి ద్వితీయముద్రణకు ఆవశ్యకత ఏర్పడింది.

డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు గారి సలహా మేరకు నాటి శ్రీకార్యనిర్వహణాధికారి డా॥ కె.వి.రమణాచార్యులుగారు భారత తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సరిచేయుటకుగాను **1) డా॥ పొత్తూరి వేంకటేశ్వరరావు 2) ఆచార్య రవ్వా శ్రీహరి 3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు 4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య 5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య 6) ఆచార్య కె. సర్వోత్తమరావు 7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు** – ఈ ఏడుగురు పండితులతోకూడిన ఒక పండిత పరిషత్తును ఏర్పాటు చేయడం జరిగింది. తదుపరి శ్రీకార్యనిర్వహణాధికారిగా బాధ్యతలను స్వీకరించిన శ్రీ ఐ.వై.ఆర్.కృష్ణారావుగారు ప్రత్యేక శ్రద్ధతో ఈ కార్యక్రమాన్ని వేగవంతం చేసారు. పండిత పరిషత్తు వివిధ పండితులు వ్రాసిన వ్యాఖ్యాన భాగాలను పరిశీలించి అన్వయ దోషాలను, ముద్రారాక్షసాలను, శైలీ భేదాలను వీలైనంతవరకు గుర్తించి సవరించి శైలిలో ఏకరూపత సాధించేందుకు తగిన కృషి చేసింది. ఆ పండిత పరిషత్తులో నన్ను కూడా ఒక సభ్యుడిగా దేవస్థానం స్వీకరించడం శ్రీనివాసుని నిర్హేతుకమైన అనుగ్రహానికి తార్కాణం! అంతేగాక 2011 ఫిబ్రవరిలో దేవస్థానం గ్రంథ ప్రచురణ విభాగానికి ఎడిటర్–ఇన్–చీఫ్‌గా నన్ను నియమించడమే గాక, 'కవిత్రయ భారత పునర్ముద్రణ'ను పర్యవేక్షించే బాధ్యతను కూడా దేవస్థానం నాకు అప్పగించింది. ఆనందనిలయుని అపారకృపవల్ల 'కవిత్రయ భారతం' పునర్ముద్రణకార్యంకూడ పూర్తి అయింది.

మలిముద్రణ ఈ రూపంలో రావడానికి అన్నివిధాలా సహాయసహకారాలందించిన తి.తి.దే. పాలకమండలి అధ్యక్షులు శ్రీ కనుమూరి బాపిరాజుగారికి మరియు పాలకమండలి సభ్యులకు నా కృతజ్ఞతలు.

సవ్యాఖ్యాన మహాభారత ద్వితీయ ముద్రణను వేగవంతం చేసి ప్రజాబాహుళ్యానికి అందించడంలో విశేషకృషి చేసిన శ్రీకార్యనిర్వహణాధికారులు శ్రీ ఎల్.వి.సుబ్రహ్మణ్యం, ఐ.ఏ.ఎస్. గారికి, సంయుక్త కార్యనిర్వహణాధికారులు శ్రీ పి.వెంకటరామిరెడ్డి, ఐ.ఏ.ఎస్; శ్రీ కె.యస్.శ్రీనివాసరాజు, ఐ.ఏ.ఎస్. గారలకు నా కృతజ్ఞతలు.

సరళ వ్యాఖ్యాన సహిత కవిత్రయ మహాభారత ముద్రణల్లో నాటి నుండి నేటివరకు తమ అమూల్య సహాయ సహకారాలు అందించిన తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారులకు, సంయుక్త కార్యనిర్వహణాధికారులకు, ప్రజాసంబంధాల అధికారులకు, ముద్రణాలయ అధికారులకు అందరికీ నా కృతజ్ఞతలు.

వృత్తిరీత్యా ఇంజనీర్ అయినప్పటికి సాహిత్యాభిలాషతో తి.తి.దే. మహాభారతంలోని కొన్ని సవరణలను గుర్తించి తెలియజేసిన శ్రీ పుత్తా పుల్లారెడ్డి గారికి ధన్యవాదాలు.

కవిత్రయభారత పునర్ముద్రణకార్యక్రమంలో అవసరమైన సహకారమందించిన సహృదయులు 'సప్తగిరి' ప్రధాన సంపాదకులు డా॥ సి.శైలకుమార్ మరియు సంపాదకులు డా॥ కోటపాటి రాధారమణ గారలకు కృతజ్ఞతలు. అలాగే పునర్ముద్రణ విషయంలో అడుగడుగునా, చేదోడు వాదోడుగా వుంటూ పూర్తి సహాయ సహకారాలందించిన పండితులు మహాకవి విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు, ఉపసంపాదకులు డా॥ కంపల్లె రవిచంద్రన్, డా॥ నొస్సం నరసింహాచార్య, శ్రీమతి మొలకా ఉత్తర ఫల్గుణి, పరిశోధక సహాయకులు, డా॥ డి.భారతి, డా॥ టి.సావిత్రి, డా॥ వి.గోపాలకృష్ణమూర్తి, ప్రచురణ సలహాదారులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, శ్రీ జల్లి శ్రీరఘుపతిరావుగార్లకు మరియు కార్యాలయ సిబ్బందికి, డి.టి.పి. ఆపరేటర్లకు కృతజ్ఞతలు.

ఈ బృహద్గ్రంథముద్రణలో ఎంతగానో సహకరించిన దేవస్థానం ప్రజాసంబంధాల అధికారి శ్రీ టి.రవిగారికి, ముద్రణాలయాధికారి శ్రీ సాంబశివరావుగారికి, మరియ వారి సిబ్బందికి నా కృతజ్ఞతలు.

**మరోమాట!**

'ఆంధ్రత్వమాంధ్రభాషా చ నాల్పస్య తపసః ఫలమ్' అని అప్పయదీక్షితులు చెప్పినట్లుగా ఆంధ్రుడుగా పుట్టడం, ఆంధ్రభాష మాట్లాడటం ఎంతో గొప్ప తపస్సు చేస్తేకానీ లభించని అదృష్టాలు. అలాంటి భాషలో కవిత్రయంవారు పంచమవేదమైన వ్యాసభారతాన్ని ఆంధ్రులకు అందించటం ఆంధ్రుల పుణ్యవిశేషం ! ఆంధ్రమహాభారతం తెలుగువారికి లభించిన అమృతఫలం ! ఆ అమృతఫలరసాన్ని పాఠకులు ఈ వ్యాఖ్యానం ద్వారా ఆస్వాదిస్తారనీ, మహాభారత సందేశాన్ని సుగమం చేసుకొంటారనీ ఆశిస్తున్నాము.

కవిత్రయ మహాభారత ద్వితీయముద్రణకార్యం నాచేతుల మీదుగా జరిపించిన దేవదేవుడైన ఆ శ్రీనివాసుని ప్రార్థిస్తూ....

*సదా శ్రీవారిసేవలో*

**ఆచార్య రవ్వా శ్రీహరి**

ఎడిటర్–ఇన్–చీఫ్

తిరుమల తిరుపతి దేవస్థానములు

# ముందుమాట

*నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,*
*దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.*

ఉద్యోగ పర్వం ధర్మానికి జయం అనే నానుడిని సార్థకం చేసే భారతంలో ఉద్యోగానికి ఆరంభ ఘట్టమని చెప్పవచ్చు. సామాన్యంగా విరాట, ఉద్యోగ పర్వాలనుకలిపి పారాయణం చేయడం, వ్యాఖ్యానించడం ఆనవాయితీగా ఉన్నప్పటికి తిరుమల తిరుపతి దేవస్థానాలు తిక్కన విరాట పర్వాన్ని సవ్యాఖ్యానంగా గోదావరి పుష్కరాలలో విడుదల చేయడం జరిగింది. ఇప్పుడు కృష్ణా పుష్కరాలకు ముందు ఉద్యోగ పర్వాన్ని విడుదల చేయడం జరుగుతున్నది.

ఉద్యోగ పర్వం ఒక విధంగా మహా భారత పాత్రల అంతరంగాల వివరణ పర్వం. ఇక్కడ సమరమో, సంధానమో అనే చర్చ జరిగింది. ధర్మరాజు, భీముడు మున్నగు వారి మనస్తు ములాన్ని ప్రకటించే ఘట్టం. దానికి తోడు ద్రౌపది మున్నగువారి మనసును కూడ తెరిచిపెట్టేందుకు అవకాశం. ఈ మధ్యలో ఆవలిగట్టుపైన దుర్యోధనాది దుష్ట చతుష్టయం, కుంతి, విదురుడు, ధృతరాష్ట్రుడు, గాంధారి, భీష్మద్రోణుల అంతరంగం కూడ స్పష్టమౌతోంది. మరొకవైపు కర్ణ భేదనము, కుంతీ కర్ణ సంవాదము మొదలైనవి ముఖ్య ఘట్టాలిందున్నాయి. అన్నిటికంటే ముఖ్యమైంది పరమాత్ముని అతి మానుషలీలాచేష్టితాలైన పరస్పర విరుద్ధ విపరీత శక్తులను శ్రీ కృష్ణుడు తన కార్యంలో అనగా ధర్మసంస్థాపనలో వినియోగించుటకు పన్నే పన్నాగం అంటే ఆయన సర్వ శ్రేష్ఠ రాజ కార్య దురంధరత్వం గురు లఘు విన్యాసాలతో ఇందు నిరూపించబడింది. అందువలననే ఉద్యోగపర్వం పాఠకుల మనస్సులను లెస్సగా ఆకట్టుకుంటుంది.

ముఖ్యంగా ధృతరాష్ట్రుడి సభలో సంధిసమకూర్చడానికి వచ్చిన పరమాత్మను పట్టి బంధించడానికి దుర్యోధనాదులు ప్రయత్నించినపుడు ఆయన విశ్వరూపాన్ని ప్రకటించడం, దాన్ని ధృతరాష్ట్రుడు విశేష జ్ఞాన దృష్టితో చూడడం జరుగుతుంది. మరల తాను అంధుడు కావాలను కోవడం అతడి మానసిక పరిస్థితిని విస్ఫుటంగా తెలియజేస్తుంది. తిక్కన సోమయాజి వ్యాసులవారిని అనుసరించి అనువదించినా తెలుగులో స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన మహాకృతిని వ్రాసి ఆంధ్రులకు మహోపకారం చేశారు. దానికి వ్యాఖ్యానాన్ని డా. జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు, మహాకవి ముదివర్తి కొండమాచార్యులవారు రచించి భారతార్థాన్ని ఆంధ్రులకు సుగమం చేశారు. వారికి ధన్యవాదములు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు వ్యాఖ్యాన సహిత మహాభారతానికి ప్రధాన సంపాదకులుగా శ్లాఘ్యమైన కృషి చేస్తున్నారు. ఆయన సంతరించిన విశేషవివరణలు, పీఠికలు, కథాసంగ్రహాలు ఆంధ్రమహాభారత పరమార్థాన్ని, స్పష్టంగా, సరళంగా తెలియజేస్తున్నాయి. అందుకు వారికి నమోవాకాలు.

అనతి కాలంలోనే ప్రతులన్నీ చెల్లిపోయిన కారణంగా పుస్తకాన్ని పునర్ముద్రిస్తున్నాము (2006). ఎప్పటిలాగే చదువరులు ఉద్యోగపర్వాన్ని ఆదరాభిమానాలతో స్వాగతిస్తారని ఆశిస్తున్నాము.

**కార్యనిర్వహణాధికారి,**
తి.తి. దేవస్థానములు,తిరుపతి.

# కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు : పుట్టు పూర్వోత్తరాలు

శ్రీవేంకటేశ్వరస్వామి వారి దివ్యానుగ్రహంతో తిరమల తిరుపతి దేవస్థానం ఆదినుండీ ఆర్షధర్మప్రబోధం నిమిత్తం అనేక కార్యక్రమాలను చేపట్టి నిర్వహిస్తూవుంది. అలాంటి కార్యక్రమాల్లో ధార్మిక సాంస్కృతిక గ్రంథాల ప్రచురణ అత్యంత ప్రధానమైంది. ఆర్షధర్మానికి, భారతీయసంస్కృతికి, మూలాధారాలైన వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలు, కావ్యాలు మొదలైనవాటిని, తత్సంబంధి రచనలను పలుభాషల్లో, పలురీతుల్లో అసంఖ్యాకంగా ప్రచురిస్తూ, తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఆర్షసంస్కృతి సముద్ధరణలో తమవంతు కృషిని విజయవంతంగా కొనసాగించటం జరుగుతూ వుంది.

**పూర్వరంగం:**

ఇటీవల 1982 మార్చినెలలో మహాకవి పోతనపంచశతాబ్ది జయంతి ఉత్సవాలు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆధిపత్యంలో ఏకశిలా (వరంగల్లు) నగరంలో వైభవోపేతంగా జరుపబడినాయి. ప్రభుత్వసూచన ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం ఆ ఉత్సవాల్లో సముత్సాహంతో పాల్గొన్నది. వరంగల్లు పట్టణంలో ప్రతిష్ఠించే నిమిత్తంగా పోతన విగ్రహనిర్మాణం, పోతన భాగవత ప్రథమ స్కంధాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించటం, 'శ్రీనివాస బాలభారతి' పక్షాన "పోతన" పుస్తకాన్ని ప్రకటించడం, పోతన కవితామహత్త్వాన్ని చాటే స్మారక సంచికను ముద్రించటం - ఇత్యాదికార్యక్రమాలను నిర్వహించడంద్వారా దేవస్థానం ఆ ఉత్సవాల వైభవానికి ఎంతగానో తోడ్పడింది! పోతనపంచశతాబ్ది జయంత్యుత్సవాలు ఆంధ్రభాగవత ప్రచురణకు దోహదకారులైనట్లే, అటు తర్వాత 1983లో జరిగిన నన్నయ సహస్రాబ్ది జయంత్యుత్సవాలు "వ్యాఖ్యానసహిత ఆంధ్రమహాభారత" గ్రంథప్రచురణకు అంకురార్పణ గావించాయి.

**నన్నయ భారత ప్రాజెక్టు :**

ఆంధ్రమహాభారతం ఆంధ్రజాతి వెయ్యేండ్ల తపఃఫలం! ఇది తెలుగులో ఆదికావ్యం. ఈ కావ్యరచయిత నన్నయభట్టారకుడు. క్రీ.శ.1053 ప్రాంతంలో - అనగా దాదాపు వెయ్యివత్సరాల క్రిందట, గోదావరీ తీరమందలి రాజమహేంద్రవరంలో, చాళుక్యరాజగు - రాజరాజనరేంద్రుని కోరికననుసరించి, ఆ మహాకవి ఈ ఉత్తమ కావ్యరచనకు శ్రీకారం చుట్టినాడు. ఆంధ్రసాహిత్య చరిత్రలో అపూర్వమైన ఆ మహనీయసన్నివేశాన్ని పురస్కరించుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1982 -' 83 విద్యావత్సరాన్ని "నన్నయ సంవత్సరం" గా ప్రకటించింది. అప్పట్లో నన్నయ సహస్ర వార్షిక జయంతి - ఉత్సవాలు ఆంధ్రావనిలో వాడవాడలా వైభవోపేతంగా నిర్వహింపబడ్డాయి.

ఆ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, అంతకు మునుపటి పోతన జయంత్యుత్సవాల్లో తిరుమల తిరుపతి దేవస్థానం నిర్వహించిన విశిష్టపాత్రను ప్రశంసాత్మకంగా ప్రస్తావిస్తూ, అదే విధంగా నన్నయ జయంత్యుత్సవాల్లో పాల్గొని చరితార్థం చేయవలసిందిగా కోరుతూ, దేవస్థానంవారికి కొన్ని ముఖ్య సూచనలు చేసింది. ఆ సూచనల ననుసరించి తిరుమల తిరుపతి దేవస్థానం రాజమహేంద్రవరంలో ప్రతిష్ఠించే నిమిత్తం నన్నయ విగ్రహాన్ని నిర్మించింది; 'భారతావతరణము' (రూపకం) 'నన్నయ భట్టారకుడు' (వచనం) - అనే పుస్తకాలను, 'నన్నయ వ్యాస పీఠము' - అనే ప్రశస్త సంచికను ప్రచురించింది.

తిరుమల తిరుపతి దేవస్థాన యాజమాన్యానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సూచించిన సూచనలలో అత్యంత ప్రధానమైనది నన్నయభారతానికి (తొలి మూడు పర్వాలకు) వ్యాఖ్య వ్రాయించి ప్రకటించటం. ఈ బృహత్తరవ్యాఖ్యా గ్రంథప్రచురణ బాధ్యతను దేవస్థానంవారు ఇటీవల పదవీవిరమణ చేసిన అప్పటి పౌరసంబంధాధికారి డా॥ రావుల సూర్యనారాయణమూర్తికి అప్పగించారు. అనంతరం నన్నయ భారత వ్యాఖ్యా రచనా ప్రణాళికను రూపొందించటానికి ప్రసిద్ధ విద్వన్మణులతో ఈ క్రింది సంపాదకమండలి ఏర్పాటయింది.

**కళాప్రపూర్ణ డా॥ దివాకర్ల వేంకటావధాని**

**డా॥ నండూరి రామకృష్ణమాచార్య**

**డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**డా॥ రావుల సూర్యనారాయణమూర్తి (సమావేశకర్త)**

ఈ సంపాదకమండలి **1983** జులై11 తేదీన హైదరాబాదు బాలాజి భవనంలో తొలిసారిగా సమావేశమై, నన్నయభారత వ్యాఖ్యారచనకు ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రాలను రూపొందించింది.

**ఆ సూత్రాల సారాంశం :**

“ఇది మహాభారతము. ఆంధ్రవాఙ్మయములో పరమప్రామాణికమైన ఆది గ్రంథము. ఆరణ్య పర్వములో శేషభాగము ఎఱ్ఱన వ్రాసినను, నన్నయ పేరుమీదనే వ్రాసియున్నాడు గనుక, ఆ పర్వము పూర్తిగ ప్రచురించవలెనని నిర్ణయము గైకొనబడినది. టీకా తాత్పర్యసహితముగా ప్రచురించుటలో గల ఉద్దేశము సామాన్యులకు గూడ అర్థమగుట. కనుక, వ్యావహారికభాషకు సన్నిహితమైన సరళగ్రాంథికములో వ్రాయవలెనని నిర్ణయము జరిగినది. పదాలు ప్రయోగించుటలో సామాన్యులకు అర్థమగునట్లు, భారతముయొక్క ప్రామాణికత చెడకుండ - భాషను సాధ్యమైనంతమేరకు సులభముగా నుండునట్లు వ్రాయవలెను. అరసున్నలు, శకటరేఫములు పాటింప నక్కరలేదు. విసంధులు అంగీకరింపబడినవి. సరళాదేశము అనవసరము. మూలములో ఉన్న కఠినపదములు పరిహరించి, సుబోధములైన పదాలు వాడవలెను.

మూలపదాలు యథాతథముగ వ్రాయవలెను. అర సున్నతోగాని, సున్నతోగాని పదము ముగియునపుడు దానిని ద్రుతాంతముగా వ్రాయవలెను. సరళాదేశము వచ్చినపుడు పరుషములే గ్రహించవలెను. మొదట మూలపద్యము, దానిక్రింద ప్రతిపదార్థము, తరువాత తాత్పర్యము, పిమ్మట- ఉన్నచో విశేషాలు, అతిముఖ్యములైన వ్యాకరణవిశేషాలు, అలంకార విశేషాలు పొందుపరచవలెను. వచనమునకుగూడ పద్యాలకు వ్రాసినట్లే అర్థతాత్పర్యాలు వ్రాయదగును.

ఉస్మానియా విశ్వవిద్యాలయమువారు ప్రచురించిన సంశోధితప్రతిని ఆధారముగా స్వీకరింపవలెను. అందలి శీర్షికలను యథాతథముగా ఉంచవలెను. సంస్కృతమూలములోని అధ్యాయ సంఖ్యగూడ వేయవలెను. మూలవిభిన్నత పీఠికలో సూచించవచ్చు; లేదా విశేషాంశములలో చేర్చవచ్చు. పాఠాంతరాలలో - సంశోధితప్రతిలో ఉన్నదానికంటె ఇతర పాఠము మేల్తరముగా తోచినచో రచయిత దానినికూడ స్వీకరించి అర్థము వ్రాయవలెను. దానిని విశేషములలో చేర్చునది.

రచన కొనసాగిన పిమ్మట రెండుమూడు నెలలకు ఒకసారి రచయితల సమావేశాలు ఏర్పాటుచేసి అన్యోన్య సమీక్షలు జరుపవలెను. ఇది రచనలో సామరస్యము ఏర్పడుటకు సదవకాశము కలిగించును. (మూడుపర్వముల) రచనలో

ఏకరూపత కలుగునట్లు చూచుటకు ఒక ప్రధాన సంపాదకుడు కావలసి యున్నది. ఈ బాధ్యత ఆచార్య దివాకర్లవేంకటావధానిగారికి అప్పగించుటకు ఏకగ్రీవముగా తీర్మానింపబడినది. ప్రధాన సంపాదకుడు వ్రాతప్రతిని సాధ్యమగునంత త్వరలో అచ్చుకు (Finalise) సంసిద్ధముచేయగానే, ఒక సమష్టి సమీక్షా సమావేశము ఏర్పాటుచేసి, అనంతరము వ్రాతప్రతిని ముద్రణకు ఇయ్యవలెను. ప్రతి సంపుటికి పీఠిక, విషయసూచిక, చివర పద్యానుక్రమణిక ఉండవలెను."

పై ఆదేశిక సూత్రాల ననుసరించి ఆచార్య దివాకర్ల వేంకటావధాని ఆదిపర్వానికి, డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య సభాపర్వానికి, డా॥ నండూరి రామకృష్ణమాచార్య ఆరణ్యపర్వానికి- వ్యాఖ్యలను రచించే కార్యక్రమం చేపట్టారు. ఇలా వ్యాఖ్యను సమకూర్చే పని ఒకవైపు కొనసాగుతూ ఉండగా, దేవస్థానం ఇంచుమించు ఆరేసి మాసాల కొక పర్యాయం, అంతదనుక జరిగిన కృషినిగూర్చి సమీక్షించేందుకు, పై ముప్వురు రచయితలతో కూడిన సంపాదకవర్గ సమావేశాలను నిర్వహిస్తూ వచ్చింది.

ప్రధాన సంపాదకుడు ఆచార్య దివాకర్లవేంకటావధానిగారు తక్కిన ఇరువురి రచనలను పునఃపరిశీలన చేస్తూ, తుదిమెఱుగులు దిద్ది వ్రాతప్రతులను అచ్చుకు సిద్ధంచేస్తున్న దశలో - 1986 అక్టోబరులో పరమపదించారు. ఈ ఆకస్మికసంఘటనవల్ల "వ్యాఖ్యాసహిత నన్నయభారత ప్రచురణ" కార్యక్రమ పురోగతికి విఘాతం ఏర్పడింది.! ప్రణాళిక ఈ ఆటంకాన్ని అధిగమించటానికి, తిరుమల తిరుపతి దేవస్థానంవారు తగినపెద్దలతో విస్తృతంగా సమాలోచించారు. తదుపరి, కళాప్రపూర్ణ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు కీ.శే. దివాకర్లవారి స్థానంలో ముఖ్య సంపాదకులుగా 1987 మే నెలలో నియుక్తులయ్యారు.

అప్పటినుండి, మళ్ళీ వ్యాఖ్యారచయితల పరస్పరసమీక్షా సమావేశాలు యథారీతిగా నిర్వహింపబడుతూ వచ్చాయి. వీటితోపాటు, ప్రధాన సంపాదకుడు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు మూడుపర్వాల వ్రాతప్రతులను క్రమంగాపర్యవేక్షిస్తూ, వాటిని ముద్రించవలసినదిగా తీర్మానించారు.

ఆ యా పర్వాల ముద్రణకార్యం ఒకప్రక్క జరుగుతూవుంటే, మరోవైపున ఆ యా సంపుటాల సంపాదకులు పీఠిక, ఉపోద్ఘాతము - మున్నగు అంశాలను సమకూర్చాలని ఒకానొకసమావేశంలో నిర్ణయింపబడింది. అవసరాన్నిబట్టి పీఠికలకు తుదిరూపం ఇవ్వటానికి సంపాదకవర్గం మరొకసారి సమావేశం కావడానికి కూడ అందులోనే నిశ్చయింపబడింది. అయితే, ఈ నిర్ణయాలు చోటుచేసికొన్న సమావేశమే నన్నయ భారత ప్రణాళికకు సంబంధించిన సమావేశాల్లో చిట్టచివరిదయింది! ఈ సమావేశం రాజమహేంద్రవరంలో శ్రీమధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి గృహంలో 1991 జులై3వ తేదిన జరిగింది. అనంతరం ఈ గ్రంథాన్ని ముద్రించే ప్రయత్నాలు కొనసాగాయి.

**తిక్కన భారత సంయోజన :**

ఇటువంటి పరిస్థితుల్లో, తిరుమల తిరుపతి దేవస్థాన సప్తగిరి సంపాదకుల కార్యాలయమందలి ప్రచురణల విభాగంలో 'పబ్లికేషన్సు ఎడిటర్'గా పనిచేస్తూ వుండిన విద్వాన్ డి. నాగసిద్దారెడ్డి గారు (రిటైర్డు ప్రిన్సిపాల్, యస్.వి.ఓరియంటల్‌కళాశాల, తిరుపతి) తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారిగారికి "తిక్కన భారత వ్యాఖ్యారచనాప్రణాళిక"ను గూర్చి 1992 ఆగష్టు ఆరంభంలో ఒక నివేదికను సమర్పించారు.

**ఆ నివేదిక సారాంశం :**

"తిరుమల తిరుపతి దేవస్థానంవారు నన్నయ భారతం మూడు పర్వాలకు ప్రసిద్ధ విద్వాంసులచేత వ్యాఖ్య వ్రాయించిన విధంగానే, తిక్కన భారతం పదునైదు పర్వాలకు రాష్ట్రంలోని ప్రముఖపండితులచేత వ్యాఖ్య వ్రాయించి ప్రచురించటం సముచితంగానూ, సమగ్రంగానూ ఉంటుంది. తాము అనుమతిస్తే ఈ ప్రణాళికకు నేను సమన్వయ సంపాదకుడనుగా, సమావేశకర్తగా (కో ఆర్డినేటింగ్ ఎడిటర్ అండ్ కన్వీనర్) బాధ్యతవహించి నిర్వర్తించగలను".

తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి అధ్యక్షతన సమావేశమైన గ్రంథనిపుణుల సంఘం (Experts Committee) పై ప్రతిపాదనను ఆమోదించింది. తదనుసారంగా తిక్కన భారతవ్యాఖ్యా రచనా ప్రణాళికకు సంబంధించిన తొలిసమావేశం తిరుమల తిరుపతి దేవస్థాన పరిపాలనా భవనం (తిరుపతి)లో కార్యనిర్వహణాధికారిగారి ఆధ్వర్యవంలో 1992 నవంబరు 5వ తేదిన జరిగింది. ఈ ప్రణాళికా నిర్వహణకు తొలుత ఒక సలహాసంఘం ఏర్పాటయింది. అనంతరం ఈ సలహాసంఘం 1) సంపాదకవర్గం 2) సలహాసంఘం- అని ఈ క్రింది రెండు సంఘాలుగా విభజింపబడింది.

**సంపాదక వర్గం**

| | |
|---|---|
| **శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు** | **ప్రొ॥ ఎస్.బి. రఘునాథాచార్య** |
| **ప్రొ॥కె. సర్వోత్తమరావు** | **శ్రీడి. నాగసిద్దారెడ్డి (కన్వీనర్** |

**సలహాసంఘం**

| | |
|---|---|
| **ఆచార్య తూమాటిదొణప్ప** | **ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం** |
| **ఆచార్య బిరుదురాజు రామరాజు** | **ఆచార్య మడుపు కులశేఖరరావు** |
| **ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు** | **డా॥రావుల సూర్యనారాయణమూర్తి** |
| **ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి** | **శ్రీకాట్రపాటి సుబ్బారావు** |
| **ఆచార్య నండూరి రామకృష్ణమాచార్య** | **శ్రీములుకుట్ల రామకృష్ణశాస్త్రి** |

పై సమావేశంలో చర్చింపబడిన అంశాల్లో అత్యంతప్రధానమైనది వ్యాఖ్యాన విధానానికి సంబంధించినది. సభ్యులందరి సలహాలు, సూచనలమేరకు - వ్యాఖ్యానరచనకు మార్గదర్శకాలైన - కొన్ని ముఖ్య నియమాలు క్రోడీకరింపబడ్డాయి.

**ఆ నియమాల సారాంశం :**

"రచనావిషయంలో ప్రధానంగా సామాన్య ప్రజానీకాన్ని దృష్టియందుంచుకొనవలెను. భాష వ్యావహారికంగానే ఉండాలి. మాండలికాలు ఉండరాదు. సాధ్యమైనంతవరకు విసంధుల్ని పాటించాలి. సంధి విడదీసిన తర్వాత పదస్వరూపం తెలిసేటట్లుగా పదాదిని అచ్చుల్ని వాడాలి. దుస్సంధులు తగదు. శకటరేఫలు, అరసున్నలు ఉండరాదు. కథాభాగాన్ని అతికేసమయంలో పూర్వాపర సందర్భాలను అనుసంధానంచేస్తూ అవసరమైనచోట స్థూలంగా ఐదారు పంక్తులు అవతారిక (పరిచయం) వ్రాయాలి. ప్రతిపద్యానికి అక్కరలేదు.

విశేషాంశాల్లో అలంకారాలు, వర్ణనలు కథా సందర్భానికి ఏవిధంగా అతికాయో చెప్తూ, పద్యంలో గుర్తించిన ముఖ్యమైన విశేషాంశాలు విస్తారంగా కాకుండా, సంగ్రహంగా చెప్పాలి. (రచయితలు వ్రాయని విశేషాంశాదులను 'సంపాదకులు' 'ఎడిటోరియల్ నోటు' వ్రాసి నమోదుచేయవలసినది.) అవసరమైన చోట్ల రచనలో మార్పులు, చేర్పులు చేయడానికీ, సంతృప్తికరం కాకపోతే తిరస్కరించి మరొకర్ని ఎంపిక చేసుకొనడానికీ సంపాదకవర్గానికి అధికారం ఉంది. (రచయితలు) ఉస్మానియా యూనివర్సిటీవారి భారతప్రతిని రచనకు ప్రమాణంగా స్వీకరించాలి. ఇతర ప్రతులలో సొబగైన పాఠములున్నచో వాటిని రచనలో ఉటంకించవచ్చు."

పై సూచనల ప్రకారం, తిక్కన భారతం పదునైదు పర్వాల్లోని 46 ఆశ్వాసాలకు సరళవ్యాఖ్య సమకూర్చటానికి మొత్తం ముప్పదిముగ్గురు పండితులు ఎంపిక చేయబడ్డారు. వీరిలో చాలమంది తమవంతు వ్యాఖ్యారచనను సకాలంలో పూర్తిచేసి దేవస్థానానికి సమర్పించారు. 'తిక్కనభారత ప్రణాళిక' యొక్క చివరి సమావేశం 1994 జులై 15వ తేదిన కార్యనిర్వహణాధికారిగారి అధ్యక్షతన తిరుమల తిరుపతి దేవస్థానపరిపాలనాభవనం (తిరుపతి)లో జరిగింది.

1995 జూన్‌లో శ్రీడి. నాగసిద్దారెడ్డి పదవినుండి విరమించేనాటికి, తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలకు వ్యాఖ్య - ఆ యా రచయితలు వ్రాసి పంపనందున - దేవస్థానానికి అందలేదు. అలా, వ్యాఖ్యానింపబడక శేషించి ఉన్న తిక్కన భారతంలోని కొన్ని ఆశ్వాసాలను స్థానికులగు మరికొందరు విద్వాంసులచేత వ్రాయించి, ఈ వ్యాఖ్యాన క్రతువును సమాప్తి నొందించడం జరిగింది. ఈ విధంగా తొలుత 'నన్నయభారత ప్రణాళిక'గా ఆరంభమైన ఈ వ్యాఖ్యారచన, తరువాత తిక్కన భారతంలోకి విస్తరించి, సమగ్రతను సంతరించుకొని, చివరకు "కవిత్రయ మహాభారత ప్రణాళికగా" సార్థకమయింది.

**కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు :**

మొదటి మూడు పర్వాలు సరళగ్రాంథికంలోను, తక్కిన భాగమంతా భిన్న భిన్నశైలుల వ్యావహారికంలోనూ రచింపబడిన ఈ మొత్తం పదునెనిమిది పర్వాల వ్యాఖ్యాన స్వరూపానికి ప్రామాణికమైన ఏకరూపతను, నవ్యతను సముచితంగా సంతరింపజేయగల సంపాదకుణ్ణి సూచించవలసిందని తిరుమల తిరుపతి దేవస్థానం, స్థానికులైన నిపుణులను కోరింది.

అనుభవజ్ఞులగు నిపుణుల అభిప్రాయానుసారం దేవస్థానం - సుగృహీతనామధేయులైన సాహితీవేత్తలు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారిని "కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు"కు సంపాదకత్వం నిర్వహింపవలసిందిగా 1996 అక్టోబరులో ఆహ్వానించింది. తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆహ్వానాన్ని శ్రీస్వామివారి ఆదేశంగా స్వీకరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తిరుపతికి వచ్చి 'ఎడిటరు' కార్యాలయంలో ని ప్రచురణల విభాగం (Publications Wing)లో భద్రపరుపబడియున్న భారతం వ్రాతప్రతిని విశదంగా పరిశీలించి, ఇచ్చటి ఉద్యోగుల సహకారంతో వారు ఈ బృహద్ గ్రంథ పరిష్కరణకు అవలంబించవలసిన కొన్ని ముఖ్యపద్ధతులను, విధానాలను ప్రతిపాదించారు.

**ఆ ప్రతిపాదనల సారాంశం :**

"మహాభారత కథార్థాలు సామాన్యజనానికి అందుబాటులో ఉండేటట్లు చేయటానికీ, మహాభారతంలోని ధర్మసందేశం అందరికీ అవగాహనకావడానికీ ఈ వ్యాఖ్యానం లక్షింపబడింది కాబట్టి, వ్యాఖ్యానమంతా ప్రామాణిక

వ్యావహారిక భాషలో ఒకేరీతిగా ఉండేటట్లు చూడాలి. అవసరమైన చోట్ల వ్యాఖ్యాతలు వ్రాసిన వివిధశైలులను ప్రామాణిక వ్యావహారిక శైలిలోనికి మార్చి, ఒకే గ్రంథకర్త రచించిన రచనను చదువుతున్న స్ఫూర్తిని పఠితలకు కల్పింపచేయాలని నిర్ణయించడమైనది. భాషాశైలులు మార్చవలసి వచ్చినపుడు ఇపుడున్న 'ఒరిజినల్' వ్రాతప్రతిని చెడగొట్టకుండా 'ప్రెస్‌కాపీ'ని లేఖకులచే వ్యావహారిక భాషలో మరల వ్రాయించవలసివుంటుంది.

వ్యాఖ్యానరచనకు ఒకస్థూలమైన ప్రణాళికను ఇదివరలో రూపొందించి వ్యాఖ్యాతలకు తెలియపరచటమయింది. కాని, అందరూ ఆ అంశాలను తు.చ. తప్పకుండా పాటించినట్లు కనబడదు. అందువలన వ్యాఖ్యానరచనలో ఏకరూపత (Uniformity) ఒక్కొక్కచోట లోపించినట్లు కనబడుతోంది. కాబట్టి, వ్యాఖ్యానం అవసరానికి మించి ఉన్నచోట్ల తగ్గించటానికీ, అవసరం ఉన్నచోట్లకొన్ని అంశాలను చేర్చటానికీ సంపాదకునికి స్వేచ్ఛ ఇవ్వాలని నిర్ణయించడమైనది.

వ్యాఖ్యానం వ్రాయడానికి ఉస్మానియా విశ్వవిద్యాలయంవారి ఆంధ్రమహాభారత సంశోధితప్రతిని ఆధారం చేసికోవాలని ఇదివరలోనే నిర్ణయించడమైనది. ఆ నిర్ణయాన్ని వ్యాఖ్యానరచయితలకు తెలుపడం కూడా జరిగింది. కాని, కొందరు రచయితలు నిర్దేశించిన ప్రతిని కాకుండా, వేరే ప్రతులను ప్రామాణికంగా తీసికొని వ్యాఖ్యానం వ్రాశారు. అటువంటి ఘట్టాలలో దేవస్థానంవారు ఎన్నుకొన్న ప్రతిని దృష్టిలో ఉంచుకొని వ్రాతప్రతులను తగినవిధంగా మార్చవలెనని నిర్ణయించటం జరిగింది.

మహాభారత వ్యాఖ్యానాన్ని **1/4** 'డెమ్మీసైజు'లో పండ్రెండు సంపుటాల్లో ప్రచురించాలని నిర్ణయించడమైనది. పుస్తకం 'సైజు'ను నిర్ణయించడంలో పాఠకుణ్ణి, విషయాన్ని, ప్రచురణకర్త సౌకర్యాన్ని సాధారణంగా దృష్టిలో ఉంచుకొంటారు. పాఠకుణ్ణి దృష్టిలో పెట్టుకొంటే, అతడు భారతంలో ఒక్కొక్క పర్వాన్ని ఒక్కొక్క సంపుటంగా భద్రపరచుకోవాలని భావిస్తుంటాడు. అందువల్ల, 'వాల్యూమ్'కు పర్వాన్ని ప్రమాణంగా తీసికోవటం సౌకర్యంగా ఉంటుంది. విషయాన్ని బట్టిచూచినా పర్వవిభాగమే అందరికీ సౌకర్యం. ప్రచురించేసంపుటికి 'క్లాసిక్' (Classic) గౌరవం ఆకృతిలో కల్పించాలన్నా **1/4** 'డెమ్మీసైజు' బాగుంటుందని తీర్మానించటమైనది. అయితే ఆదిపర్వం, ఆరణ్యపర్వం, శాంతిపర్వంలాంటి పెద్దపర్వాలు, మహాప్రస్థానిక పర్వంలాంటి చిన్నపర్వాలు ప్రచురిస్తున్నప్పుడు 'వాల్యూమ్' విభాగంలో కొంత వెసులబాటు కల్పించుకోవచ్చు.

ఒక్కొక్క సంపుటానికి మొదట తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగారి ముందుమాట, 'ఎడిటరు' గారి ఉపోద్ఘాతం తప్పకుండా ఉండాలి, విషయసూచిక తయారుచేయాలి. ప్రతి పర్వం చివర అకారాది పద్యానుక్రమణిక తప్పనిసరిగా ఉండాలి''.

పై పద్ధతుల ననుసరించి ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు పరిష్కరించి ఇస్తున్న భారత సంపుటాలను తిరుమల తిరుపతి దేవస్థానం వరుసగా ప్రచురింప బూనుకొన్నది. ఈ సంపుటుల ప్రచురణకార్యం త్వరితగతిని పూర్తి చేయించాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం **1999** నవంబరు **3,4** తేదీల్లో శ్రీ పద్మావతి అతిథి గృహంలో తి.తి.దే. కార్యనిర్వహణాధికారి డా॥ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన కీలకమైన సమావేశాన్ని నిర్వహించింది. ఈ సమావేశంలో ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు తయారు చేయించిన ఆదిపర్వ, సభాపర్వాల డి.టి.పి. 'మాష్టరు కాపీ'లను సభ్యులు సమీక్షించారు. తదనంతర పర్వాల ప్రకటన ఇతోధికమగు వేగం అందుకోవటానికి వీలుగా ఈ సమావేశంలో కవిత్రయ భారతానికి సంబంధించిన సంపాదక మండలి (Editorial Board), సలహామండలి (Advisory Board) - అనే రెండు సంఘాలను ఈ దిగువ పేర్కొన్న విధంగా పునర్వ్యవస్థీకరించటం జరిగింది.

**సంపాదకమండలి సభ్యులు**

డా॥ నండూరి రామకృష్ణమాచార్యులు — శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు
డా॥ ఎస్.బి. రఘునాథాచార్య — డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య
డా॥ కె.జె. కృష్ణమూర్తి — డా॥ కె. సర్వోత్తమరావు

**సలహామండలి సభ్యులు**

పౌరసంబంధాధికారి, తి.తి.దే. — డా॥ బిరుదురాజు రామరాజు
అన్నమాచార్య ప్రాజెక్ట్‌డైరెక్టర్, తి.తి.దే. — డా॥ ఎం. కులశేఖరరావు
ధర్మప్రచారపరిషత్ కార్యదర్శి, తి.తి.దే. — డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావు
డా॥ ఎం. బుద్ధన్న

తరువాత 2000 సంవత్సరం ఫిబ్రవరి 25 వ తేదిన తిరుమలలో అప్పటి కార్యనిర్వహణాధికారి డా॥ ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారి అధ్యక్షతన 'క్యాంప్ ఆఫీస్'లో పై రెండు మండలుల లోని సభ్యులయొక్క సంయుక్త సమావేశం నిర్వహింపబడింది. ఈ సమావేశంలో 2000 సంవత్సరాంతానికి కవిత్రయ భారత సంపుటా లన్నింటినీ వెలువరించాలనే ముఖ్యతీర్మానం కావింపబడింది. ఇందులకు అనువుగా ఆ యా పర్వాల వ్యాఖ్యాతలతో కూడిన ఒకటి, రెండు 'వర్క్‌షాప్'లను కూడ నిర్వహించడానికి నిర్ణయం గైకొనబడింది.

కవిత్రయ భారతాన్ని వ్యాఖ్యతో ముద్రించటంద్వారా తిరుమల తిరుపతి దేవస్థానంవారు 'పంచమవేద' మందలి ధర్మప్రబోధాన్ని యావదాంధ్రులకు అందించే ఉదాత్త పాత్రను నిర్వహిస్తున్నారు. ఆ క్రమంలో ఇప్పుడు ప్రథమ సంపుటం - ఆదిపర్వం (రెండు భాగాలు), ద్వితీయ సంపుటం - సభాపర్వం వెలువడినాయి. డాక్టర్ ఐ.వి. సుబ్బారావుగారి తరువాతి కార్యనిర్వహణాధికారి అయిన డా॥ పి.కృష్ణయ్య, ఐ.ఏ.ఎస్. గారు వచ్చిన తక్షణమే ఆంధ్ర మహాభారత ప్రచురణను గూర్చి ఆసక్తితో గమనిస్తూ అన్ని విధాల సహకరించి ఆది సభా పర్వాల విడుదలకు ఏర్పాటు చేయడమే కాకుండ తరువాతి సంపుటాలు వెలుగుచూడడానికి ఒక కాల నిర్ణయంతో పని జరగాలని త్వరపరిచినారు. 2002 సంవత్సరానికి ఈ బృహత్ ప్రణాళిక వ్యాఖ్యా సహిత మహాభారతం తుదిమెరుగులు దిద్దుకోవాలని వేంకటేశ్వరస్వామి అనుగ్రహంతో పండిత మండలిని పురమాయించినారు. తరువాతి సంపుటాలు సైతం త్వరలోనే వెలుగుచూడ నున్నాయి. అక్షరాస్యులైన ఆంధ్రులు భారతాన్ని స్వయంగా చదివి అర్థం చేసికోవటానికి ఈ సరళవ్యాఖ్య 'కరదీపిక' కావాలని తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆశయం. తిరుమల తిరుపతి దేవస్థానం తొలుదొలుత ప్రచురిస్తూవున్న ఈ 'వ్యాఖ్యానసహిత కవిత్రయ భారతం' ముద్రణలో ఏవైనా నూత్నాంశాలు చేర్చవలసివున్నట్లు అభిప్రాయపడితే సహృదయ సాహితీవేత్తలు వాటిని మాకు తెలియజేయగలరని మనవి.

**కృతజ్ఞతలు:**

ఈ ప్రణాళిక ఫలప్రదం కావటానికి ఆధికారికమైన తమ ఆమోదాన్ని అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థాన ధర్మకర్తలమండలి అధ్యక్షులకు, పాలకమండలి సభ్యులెల్లరకు కృతజ్ఞతాభివాదములు. ఈ మహాగ్రంథం వెలుగు చూడటంలో ముఖ్యకారకులైన సహృదయులు డా॥ ఐ.వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., గారికి అనేక ధన్యవాదాలు. తిరుమల

తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారి శ్రీ అజేయ కల్లం, ఐ.ఏ.ఎస్., గారి ప్రోత్సాహక పర్యవేక్షణకు కైమోడ్పులు. సాహిత్య ప్రీతి కలవారైన తి.తి.దేవస్థానం సంయుక్తకార్యనిర్వహణాధికారి శ్రీ ఆర్. అప్పారావు, ఐ.ఏ.ఎస్., గారికి వందనములు.

సంబంధిత విభాగాధిపతిగా నూతనముగా వచ్చి సలహామండలి ఎక్స్ అఫిషియో సభ్యులైన డా॥ పి. రంగారావు, పౌరసంబంధాధికారి, తి.తి.దేవస్థానం, తిరుపతి వారికి మరియు ఈ ప్రాజెక్టుకు ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహాయ సహకారలందించిన తదితర అధికార గణానికి నమస్సులు. ఈ ప్రణాళిక ద్వారా "వ్యాఖ్యాన సహిత కవిత్రయ భారతము"ను ఆంధ్రావళికి అందజేయటంలో ప్రధాన పాత్ర వహించిన - వ్యాఖ్యాతలు, పై ఉభయ మండలుల (సంపాదక మండలి, సలహా మండలి) యందలి విద్యావేత్తలు ప్రధాన సంపాదకుడు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు - ఈ విద్వాంసులందరికి నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు. తి.తి.దేవస్థానముల సవ్యాఖ్యాన మహాభారతాన్ని ప్రకటించడం వేగాన్ని పుంజుకోవడానికై తీర్మానించినప్పుడు ఎడిటోరియల్‌కమిటీ వారు దాని కొరకై ప్రధాన సంపాదకునికి సహాయంగా స్థానికపండితవర్యుల ఒక ఉప సంఘం (ఎడిటోరియల్‌సెల్) నిర్మాణానికి సిఫారసు చేస్తే దేవస్థానం ఆమేరకు ఎడిటోరియల్ కమిటీలో ఉన్న **డా॥ కె. సర్వోత్తమరావు, స్థానికులైన విద్వాంసులు, పండితవరేణ్యులు శ్రీ సముద్రాల లక్ష్మణయ్య, మహాకవి శ్రీముదివర్తి కొండమాచార్యులు** గారలతో ఎడిటోరియల్ సెల్‌ను ఏర్పరచడం జరిగింది. ఈ మేరకు ఆరణ్యపర్వంలోని ద్వితీయభాగంతో ఆరంభమైన ఈ సెల్ ఉపకారం మరువరానిది. వీరు వర్క్‌షాపువలె నిర్వహింపబడుతున్న కవిత్రయ మహాభారత యజ్ఞంలో పాలుపంచుకుంటున్నారు. ఆ కారణంగానే ఆరణ్యపర్వం మొదలుకొని తక్కినపర్వాలు త్వరితంగా వెలువరించగలుగుతున్నాం.

"సప్తగిరి" సంపాదకులుగా ఉండి, ఈ ప్రణాళిక కొనసాగటంలో ఆదినుండి ప్రముఖ పాత్ర వహించిన కీ.శే. కాట్రపాటి సుబ్బారావుగారికి హార్దిక కృతజ్ఞతలు. ఈ కార్యక్రమంలో చేదోడువాదోడుగా ఉంటూ, అన్ని విధాలా సహాయ సహకారాలందించిన ప్రచురణల విభాగమందలి సహోద్యోగులు రీసెర్చ్ అసిస్టెంటు డా॥కోరాడ రామకృష్ణ, తెలుగు సబ్-ఎడిటర్లు డాక్టర్ కె. రాధారమణ, డాక్టర్ ఎ. సంధ్య, సప్తగిరి పత్రిక కన్నడ సబ్-ఎడిటర్ శ్రీ బి.ఎన్. శ్రీనివాసన్ గారికి, తదితర సిబ్బందికి, ఈ పుస్తకాలను సర్వాంగ సుందరంగా తీర్చి దిద్ది పాఠకులకు అతి తక్కువ వ్యవధిలో అందించడానికి తోడ్పడిన టి.టి.డి. ముద్రణాలయ అధికారి శ్రీ ఐ. పార్వతీశ్వర రావు గారికి, వారి సిబ్బందికి కృతజ్ఞతలు.

శ్రీవేంకటేశ్వరస్వామివారి అనుగ్రహ విశేషంవల్ల ఈ మహోత్తమగ్రంథం వెలుగు చూస్తున్నందుకు, ఆ వేదత్రయ స్వరూపునకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాము.

**డా॥ఎన్.ఎస్. రామమూర్తి**
కన్వీనర్
సంపాదకుడు - సప్తగిరి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సంపాదక మండలి

**అధ్యక్షులు**

**శ్రీ అజేయ కల్లం, ఐ.ఎ.ఎస్.,**

**కార్యనిర్వహణాధికారి, తి.తి.దే., తిరుపతి.**

**ప్రధాన సంపాదకులు: ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం,**

**సంపాదక మండలి సభ్యులు**

శ్రీపొత్తూరి వేంకటేశ్వరరావు

డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య

ఆచార్య కె. సర్వోత్తమరావు

**సలహా మండలి సభ్యులు**

డా॥ బిరుదురాజు రామరాజు

ఆచార్య ఎం. కులశేఖరరావు

ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు

ఆచార్య ఎం. బుద్ధన్న

డా॥ పి. రంగారావు, పౌరసంబంధాధికారి (ఎక్స్ అఫిషియో సభ్యులు)

డా॥ మేడసాని మోహన్, డైరెక్టర్ అన్నమాచార్య ప్రాజెక్టు, (ఎక్స్ అఫిషియో సభ్యులు)

డా॥ హెచ్.ఎస్. బ్రహ్మానంద, కార్యదర్శి, ధర్మప్రచార పరిషత్తు (ఎక్స్ అఫిషియో సభ్యులు)

**కన్వీనర్**

**డా॥ ఎస్.ఎస్.రామమూర్తి,**

"సప్తగిరి" సంపాదకులు, తి.తి.దేవస్థానములు, తిరుపతి.

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

| వ్యాఖ్యాతలు | పర్వాలు, ఆశ్వాసాలు |
|---|---|
| 1. డాక్టర్ దివాకర్ల వేంకటావధాని | ఆది. ఆశ్వా. 1,2,3 |
| 2. డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం | ఆది. ఆశ్వా. 4; శాంతి. ఆశ్వా.1 |
| 3. డాక్టర్ అప్పజోడు వేంకటసుబ్బయ్య | ఆది. ఆశ్వా. 5,6,7,8; సభా. ఆశ్వా. 1,2 |
| 4. డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులు | ఆరణ్య. ఆశ్వా. 1 నుండి 7 వరకు; భీష్మ. ఆశ్వా. 1,2 |
| 5. డాక్టర్ కె. సర్వోత్తమరావు | విరాట. ఆశ్వా. 1 |
| 6. డాక్టర్ ఆర్. అనంతపద్మనాభరావు | విరాట. ఆశ్వా. 2 |
| 7. శ్రీ సింగరాజు సచ్చిదానందం | విరాట. ఆశ్వా. 3; ద్రోణ. ఆశ్వా. 3,4; శల్య. ఆశ్వా.2 |
| 8. డాక్టర్ మేడవరం వేంకటనారాయణశర్మ | విరాట. ఆశ్వా.4 |
| 9. డాక్టర్ కె. రామగోపాలకృష్ణమూర్తి | విరాట. ఆశ్వా.5 |
| 10. డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు | ఉద్యోగ. ఆశ్వా. 1,2; సౌప్తిక. ఆశ్వా. 1,2 |
| 11. శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | ఉద్యోగ. ఆశ్వా. 3,4 |
| 12. శ్రీ కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి | భీష్మ. ఆశ్వా. 3 |
| 13. డాక్టర్ జి. హరిహరనాథ్ | ద్రోణ. ఆశ్వా. 1 |
| 14. డాక్టర్ మల్లెల గురవయ్య | ద్రోణ. ఆశ్వా. 2 |
| 15. డాక్టర్ కె. రాజన్నశాస్త్రి | ద్రోణ. ఆశ్వా. 5 |
| 16. శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య | కర్ణ. ఆశ్వా. 1 |
| 17. డాక్టర్ యస్వీ. రామారావు | కర్ణ. ఆశ్వా. 2 |
| 18. డాక్టర్ మరుపూరి కోదండరామరెడ్డి | కర్ణ. ఆశ్వా. 3 |
| 19. డాక్టర్ పి. వెంకటరాజు | శల్య. ఆశ్వా. 1 |
| 20. డాక్టర్ హెచ్. ఎస్. బ్రహ్మానంద | స్త్రీ. ఆశ్వా. 1,2; అశ్వ. ఆశ్వా 1,2; మౌసల-1; మహా.1; స్వర్గా-1 |
| 21. డాక్టర్ ఎస్. గంగప్ప | శాంతి. ఆశ్వా. 2 |
| 22. డాక్టర్ దావులూరి కృష్ణకుమారి | శాంతి. ఆశ్వా. 3 |
| 23. డాక్టర్ ఆకురాతి పున్నారావు | శాంతి. ఆశ్వా. 4 |
| 24. శ్రీ సముద్రాల లక్ష్మణయ్య | శాంతి. ఆశ్వా. 5 |
| 25. డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం | శాంతి. ఆశ్వా. 6 |
| 26. డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వరరావు | అను. ఆశ్వా. 1,2 |
| 27. డాక్టర్ శలాక రఘునాథశర్మ | అను. ఆశ్వా. 3,4 |
| 28. డాక్టర్ ఎమ్. కులశేఖరరావు<br>శ్రీ ముదివర్తి కొండమాచార్యులు | అను. ఆశ్వా. 5 |
| 29. శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు | అశ్వ. ఆశ్వా. 3,4 |
| 30. డాక్టర్ ఎ. నాగభూషణం | ఆశ్ర. ఆశ్వా. 1,2 |

# సంకేతాక్షర సూచి

ఆది. – ఆదిపర్వం
సభా. – సభాపర్వం
ఆర. – ఆరణ్యపర్వం
విరా. – విరాటపర్వం
ఉద్యో. – ఉద్యోగపర్వం
భీష్మ. – భీష్మపర్వం
ద్రోణ. – ద్రోణపర్వం
కర్ణ. – కర్ణపర్వం
శల్య. – శల్యపర్వం
సౌప్తి. – సౌప్తికపర్వం
స్త్రీ. – స్త్రీ పర్వం
శాంతి. – శాంతిపర్వం
అను. – అనుశాసవికపర్వం
అశ్వ. – అశ్వమేధపర్వం
ఆశ్ర. – ఆశ్రమవాసపర్వం
మౌస. – మౌసలపర్వం
మహా. – మహాప్రస్థానికపర్వం
స్వర్గా. – స్వర్గారోహణపర్వం
సం. – భండార్కరు సంస్థవారి సంస్కృతభారతప్రతి
సం.మ.భా. – సంస్కృత మహాభారతము
అను. – పై ప్రతిలోని అనుబంధాలు
సంపా. – ప్రధాన సంపాదకుడు

క. – కందపద్యం
వ. – వచనం
ఆ. – ఆటవెలది
తే. – తేటగీతి
సీ. – సీసం
ఉ. – ఉత్పలమాల
చ. – చంపకమాల
మ. – మత్తేభవిక్రీడితం
శా. – శార్దూలవిక్రీడితం
ఆశ్వా. – ఆశ్వాసం
క్రీ.శ. – క్రీస్తుశకం
య. – యగణం
మ. – మగణం
త. – తగణం
ర. – రగణం
జ. – జగణం
భ. – భగణం
న. – నగణం
స. – సగణం
ల. – లఘువు
గ. – గురువు
అలం. – అలంకారం
సం. – సంవత్సరం
మొ. – మొదలైన

# పీఠిక



---

ఉ. 'సారపు ధర్మమున్ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షు లె
వ్వార లుపేక్షసేసి రది వారల చేటగుఁ గాని ధర్మ ని
స్తారక మయ్యు సత్య శుభదాయక మయ్యును దైవ ముండెడున్.' **(ఉద్యో.3.273)**

"భారతే సార ముద్యోగమ్" -అని ప్రసిద్ధి. మహాభారతంలో ఉద్యోగపర్వం సారవంతం. ఆ పర్వంలోని సారమంతా ఈ పద్యం.

"యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం యత్రానృతేన చ,
హన్యతే ప్రేక్షమాణానాం హతా స్తత్ర సభాసదః". **(సం. 5.93.48)**

ధర్మం అధర్మంచేత, సత్యం అబద్ధంచేత చంపబడుతున్నప్పుడు ఎవరు కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోతారో, ఆ సభాసదులు నశిస్తారని వ్యాసభట్టారకుడు శ్రీకృష్ణుడినోట పలికించగా, దక్షు లుపేక్ష చేసినా, ధర్మాన్ని ఉద్ధరిస్తూ, సత్యానికి శుభాన్ని కలిగిస్తూ రక్షిస్తూ దైవం ఎల్లప్పుడూ ఉంటాడని తిక్కనసోమయాజి గోవిందుడినోట అదనంగా అనిపించి అద్భుతమైన ముగింపు నిచ్చాడు. అంతేకాదు. సత్యధర్మాలు అసత్యాధర్మాలచేత పీడించబడి లక్ష్యాలను సాధించలేని దీనస్థితికి చేరుతాయే కాని నశించవని తిక్కన తీర్పు. వాటిని ఉద్ధరించవలసిన బాధ్యత దైవాంశసంభూతులైన రక్షకులకు సహజంగా ఉంటుంది.

అది వారి ధర్మం, నిత్య సత్యం. దానిని విస్మరించే వారికి చావు తప్పదని వ్యాసభగవానుడు, కీడు తప్పదని తిక్కన సోమయాజి. మూలంలో ఈ ప్రభావం సభాసదులకు మాత్రమే పరిమితమైనట్లు స్ఫురిస్తుంది. తెలుగులో ఇది సార్వకాలీనమైన, సర్వజనీనమైన సత్యంగా వెలుగొందుతుంది. అంతేకాదు- వ్యాసవాక్యం నిష్ఠుర సత్యం. తిక్కన పద్యం నిర్మలసత్యం. వ్యాస భట్టారకుడి వ్యాఖ్య సభలకు ప్రాధాన్యమున్న సభాపర్వానికీ, ఉద్యోగపర్వానికీ వర్తించేటట్లు కనబడుతుంది. తిక్కనసూక్తి అష్టాదశపర్వాలనూ ఆవరించేదిగా వినబడుతుంది. ఈపద్యం ఉద్యోగపర్వసారమే కాదు; మహాభారత పరమార్థ సారం.

## 1. ఉద్యోగపర్వం ఉత్కంఠాపర్వం

"ఉద్యోగః పురుషలక్షణమ్"-అని ఒక సాధారణ సూక్తి. "ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీః"-అని హితోపదేశసూక్తి. ప్రయత్నంచేయటం పురుషలక్షణం, ఉద్యోగియైన పురుషసింహుడిని లక్ష్మి చేరుతుంది. మహాభారతంలో పురుషసింహులు పాండవులు. వారు రాజ్యసంపదకోసం చేసే విశేషయత్నం ఉద్యోగపర్వ కథాంశం.

పంచమవేదమనీ, కావ్యేతిహాసమనీ పేరుపొందిన ఆంధ్రమహాభారతంలో విరాట-ఉద్యోగపర్వాలు కేంద్రబిందువులు. పద్ధెనిమిది పర్వాల భారత కథ ఒక త్రాసైతే, ఈరెండు పర్వాలూ త్రాసులో మొగ్గుచూపే ముల్లువంటివి. విరాటపర్వంలో పాండవులు అజ్ఞాతవాసాన్ని నిర్విఘ్నంగా నిర్వహించారు. పాండవులు బయలు మెరశారు. అభిమన్యుడికీ ఉత్తరకూ వివాహమయింది. పాంచాల యాదవాది దేశాధిపతులు వివాహశుభకార్యం ముగిసిన తరువాత పాండవుల భవిష్యత్కార్యక్రమాన్ని నిర్ణయించటానికి విరాటరాజు సభాభవనంలో ధర్మరాజువద్ద పెద్ద సభతీర్చారు. పాండవులు రెండవసారి జూదం ఆడినప్పుడు రాజ్యాధికారాన్ని పొంది ఉన్నారు. జూదంలో పెట్టిన నియమాలలో రాజ్యప్రసక్తి లేదు. కాబట్టి అరణ్యాజ్ఞాతవాసాలు ముగిసిన తరువాత పాండవులకు వారి రాజ్యభాగం రావటమే న్యాయం. దానికోసం ప్రయత్నం చేయాలని నిశ్చయించారు.

ఉద్యోగమంటే ప్రయత్నం. పాండవులకు న్యాయంగా రావలసిన రాజ్యభాగంకోసం చేసే ప్రయత్నం ఉద్యోగం. ఆ యత్నాన్ని వివరించే కథా భాగం ఉద్యోగపర్వం. రాజ్యయత్నం రాజనీతి నాశ్రయించి సాగాలి. రాజనీతిలో ఉపాయాలు నాలుగున్నాయి. అవి సామ, దాన, భేద, దండోపాయాలు. మొదటి మూడు విఫలమైతే చివర ప్రయోగించదగింది దండోపాయం- అంటే యుద్ధం. యుద్ధానికి సిద్ధమయ్యే సామదానభేదదండోపాయాలను సాగించటం రాజనీతి. దీనిని నిర్వహించటమే ఉద్యోగపర్వంలోని ప్రధానవస్తువు.

మహాభారతం ఒక మహానాటకమైతే విరాటోద్యోగ పర్వాలు అందులో గర్భసంధిగల భాగంవంటివి. అంటే- ఇంగ్లీషు డ్రామాలో క్లైమాక్స్ (**climax**) వంటివి. పాండవులు ఏ క్షణంలో గుర్తించబడతారో, ఎప్పుడు అజ్ఞాతవాస నియమం భంగం కాకుండా పూర్తవుతుందో-అని పఠిత ఉత్కంఠను పొందుతాడు విరాటపర్వం చదివేటప్పుడు. అందువలన ఆ పర్వం నానారసాభ్యుదయోల్లాసి. ఉద్యోగపర్వంలో పాండవులకు రాజ్యం దక్కుతుందా? దక్కదా?-అనే ఉత్కంఠ బలంగా కలుగుతుంది. మూడు రాయబారాలు సాగినా కథ ముడివీడదు. చివరకు యుద్ధమే శరణ్యమని నిశ్చయించేంతవరకు కథలో ఇదమిత్థమని చెప్పలేని ఒక అనిశ్చిత భావం ఉంటుంది. అందువలన ఉద్యోగపర్వం ఉత్కంఠాపర్వం.

## 2. నాలుగు ఉపాయాలు: నాలుగు ఆశ్వాసాలు

ఉద్యోగం ఉపాయాశ్రితం. పాండవోద్యోగంలో ప్రవర్తిల్లిన నాలుగు రకాల ఉపాయాలను వివరించేందుకా అన్నట్లు సహజంగా నాలుగు ఆశ్వాసాలు అమరి ఉండటం విశేషం.

**(1). సామోపాయం: ప్రథమాశ్వాసం**

ప్రథమాశ్వాసంలో పాండవ పక్షాన సామోపాయ ప్రయోగానికి ప్రయత్నం ప్రారంభమయింది. బలరాముడి మాటలలో అది సూచించబడింది.

చ. 'తమ సగపాలు గోలుపడి దానిన యిప్పుడు గోరు వీరికిన్
సముచితవృత్తి నిచ్చి తమసామున సంతసమంది యున్కి యు
క్తము ధృతరాష్ట్ర సూనునకు; దాన నపాయము లేకయుండుఁ; గో
ప ముడిగి వీరు సేయుదురు బాంధవ; మిజ్జగముం బ్రియంపడున్'. **(ఉద్యో. 1. 19)**

వ. 'కావున నిక్కార్యం బెడసేయక యొక్కరుం బనుపవలయు.......' **(ఉద్యో. 1.20)**

అరణ్యాజ్ఞాతవాసాల తరువాత పాండవులకు న్యాయంగా రావలసిన రాజ్యభాగాన్ని రాజైన ధృతరాష్ట్రుడు పిలిచి ఇవ్వాలా? లేక పాండవులే ఆక్రమించుకొనాలా? అన్నది సమస్య. ధృతరాష్ట్ర దుర్యోధనులు కుత్సితులు కాబట్టి పాండవులను పిలిచి భాగమివ్వరు. ధర్మరాజు బలప్రయోగంతో తన రాజ్యభాగాన్ని అధీనంలోకి తెచ్చికొనవచ్చును. కాని, పెదతండ్రి అనుమతిని కోరటానికే నిర్ణయించాడు. ధృతరాష్ట్రుడు పేరుకు ప్రభువైనా ప్రభుత్వం చెలాయిస్తున్నది దుర్యోధనుడు. అడిగితే అతడు అంగీకరించడు, తండ్రిచేత అంగీకరింపచేయడు. పాండవులు బలవంతులే అయినా ఒంటరిగా భీష్మాదులతో పోరి రాజ్యాక్రమణం చేయటం లోకులు మెచ్చేపని కాదు. అదీకాక సహాయ సహకారాలు తక్కువగా ఉన్నరాజు తాను బలవంతుడైనా యుద్ధానికి సిద్ధంకావటం రాజనీతికాదు. సామోపాయంతో కార్యసాధనం చేయటం సమంజసం. శ్రీకృష్ణ బలరామాదులు చెప్పిన సలహా అదే. ధర్మజుడు పెద్దల సలహాలను శిరసా వహించి సామోపాయానికి సమ్మతించాడు. ద్రుపద పురోహితుడిని రాయబారిగా పంపే ప్రయత్నానికి అనుమతించాడు.

ద్రుపదపురోహితుడి రాయబారం సామోపాయంలో ఉండదగినంత సౌమ్యంగా లేదని భీష్మాదులు భావించారు.

క. 'నీ వాక్యము విప్రస్వా । భావికమై యిట్లు శ్రుతికిఁ బరుషం బైనన్
భావింపఁ గార్యమున యం । దే విధమున సభకు నింత యిష్టంబగునే?' **(ఉద్యో. 1. 243)**

అని పితామహుడే వ్యాఖ్యానించాడు. రాజ్యభాగ ప్రసక్తితోపాటు పాండవ పౌరుష ప్రశంస దుర్యోధనాదుల కోపాగ్నికి ఆజ్యం పోసినట్లయింది. సామప్రయోగసాధనమైన సంధియత్నం విఫలమయింది. బ్రాహ్మణ వచనంకంటె కురుసభలో పాండవులనూ, పార్థపరాక్రమాన్నీ కీర్తించిన భీష్ముడి వాక్కులు కర్ణాదులను కలతపెట్టాయి. సభలో రభస జరిగేవరకు వచ్చింది. ధృతరాష్ట్రుడు పాండవదూతను సౌమ్యంగా వారించి, తానూ సామోపాయాన్ని ప్రయోగించనున్నట్లు ప్రతివ్యూహాన్ని ప్రకటించాడు.

ఉ. 'మంచిగ నేను బంధులును మంత్రిజనంబులుఁ బెద్దలున్ విచా
రించి సమస్త భూప్రజకుఁ బ్రీతిగ బిడ్డలపాలి కిప్డు పు
త్తెంచెద సౌమ్యు నొక్కరు; మదీయ మనోగతి వారిఁ గూడి వ
ర్తించు తెఱంగు గైకొనుట దెల్లము కౌరవజాతి కెంతయున్'. **(ఉద్యో. 1. 256)**

పాండవుల రాయబారం దుష్టచతుష్టయానికి అంగీకారం కాలేదు. మరి, ధృతరాష్ట్రుడు నిండుకొలువులో తేల్చి చెప్పకుండా, తానూ ఒక రాయబారం నడుపుతానని పూనుకొన్నాడు. అయితే, ఆ రాయబారం-విఫలమైన పాండవ సామోపాయాన్ని సఫలం చేయటానికా? సఫలమైన కౌరవయత్నాన్ని కప్పిపుచ్చుకొనటానికా? పాండవ ప్రయత్నాన్ని

తిప్పికొట్టటానికా? సామోపాయాన్ని ప్రయోగించిన పాండవుల యత్నానికి ప్రతివ్యూహం పన్ని దాన్ని సమూలంగా కుప్పకూల్చటానికా? సభలో ఎవరికీ అంచనాలకు అందనట్లు నిపుణంగా మాట్లాడాడు ధృతరాష్ట్రుడు. ఏమైనా, ధర్మరాజు యుద్ధోద్యోగప్రగతిలో ఒకమెట్టు పైకెక్కటానికి బ్రాహ్మణుడి రాయబారం తోడ్పడింది.

ప్రథమాశ్వాసంలో సంజయుడి రాయబారంకూడా ఉండటం సమంజసం. సంజయుడి రాయబారం ధృతరాష్ట్రుడి వక్రరాజనీతిలో కుటిల సామోపాయానికి చక్కని నిదర్శనం. పాండవులు తమ రాయబారం ద్వారా సంధినీ, సహజీవనాన్ని కోరారు. అది లభించకపోతే సమరానికి సిద్ధమని ప్రకటించారు. దుర్యోధనుడు పాండవులతోడి సంధికి గాని, సహజీవనానికిగాని సమ్మతించడు. కాని, యుద్ధానికి కాలుదువ్వుతాడు. ధృతరాష్ట్రుడు కొడుకుమాటను కాదనలేడు; కాని, యుద్ధమంటే భయపడతాడు. కొడుకు కోరిక తీరాలి, కొడుకు యుద్ధంలో చావకుండ సుఖంగా ఉండాలి. దానికి మార్గం ఒక్కటే. ధర్మరాజు రాజ్యం కోరకూడదు, యుద్ధం చేయకూడదు. అతడిని శాంతచిత్తుడిగా మార్చి, సంపదలకు దూరంగా, సమరానికి విముఖంగా సాధువృత్తిలో జీవించేటట్లు బోధించాలి. మరొకమాటలో చెప్పాలంటే - ధర్మజుడు యుద్ధోద్యోగంలో మొదటి ఉపాయాన్ని - సామాన్ని ప్రయోగిస్తే, ధృతరాష్ట్రుడు ధర్మరాజు యుద్ధోద్యోగాన్నే పూర్తిగా మాన్పించి. శత్రువిజయాన్ని సౌమ్యంగా సాధించాలని యత్నించాడు. ఇది శుక్రరాజనీతిలోని వక్రసామోపాయం.

క. 'నెయ్యము వాటించి కడుం । దియ్య మెసఁగ నలుక లెల్లఁ దీఱునటులుగాఁ
గయ్యమను తలఁపు లోనుగ । నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగునన్'. **(ఉద్యో.1.271)**

ప్రయోగించిన ధృతరాష్ట్రుడి వక్రనీతి ధర్మరాజువద్ద వికటించింది. తండ్రి నీతిలోని అవినీతిని బట్టబయలుచేసి సంజయుడిని సర్దుమణిగేటట్లు చేశాడు యుధిష్ఠిరుడు.

క. 'ఎదిరిం దమయట్టుల కా । మదిఁ దలఁచినఁ బొసఁగుఁ గాక! మాకుం గుడు మిం
డిదె మీరు వ్రక్కఁ గొనుఁ డని । చదురడిచిన మనసుపొందు చక్కంబడునే!' **(ఉద్యో.1.312)**

సామోపాయంలో సక్రమనీతికి ధర్మరాజు, వక్రనీతికి ధృతరాష్ట్రుడు ప్రతినిధులుగా గోచరిస్తారు. న్యాయమైనా కౌరవులకు ఇష్టంలేని మాటలను కష్టం తోచేటట్లు చెప్పినందుకు బ్రాహ్మణుడి రాయబారం విఫలమైనదని భీష్మాదులు భావించారు. తేనెపూసిన కత్తులవంటి మాటలతో పాండవులకు నష్టం కలిగించే నయ వంచనా వాక్యాలను పలికి ధర్మజాదుల నిష్ఠురాలకు గురికావటం వలన సంజయుడి రాయబారం విఫలమైనదని కృష్ణాదులు భావించారు. విఫలమైన సామోపాయం పాండవులకు ప్రగతి సూచిక; కౌరవులకు దుర్గతి సూచిక! నాయక ప్రతినాయక పక్షాల సామోపాయ విఫల చిత్రణాల వలన ప్రథమాశ్వాసానికి నిండుదనం కలిగింది.

**(2). దానోపాయం: ద్వితీయాశ్వాసం**

శత్రువులు బలవంతులైనప్పుడు కాని, జయాపజయాలు సందిగ్ధావస్థలో ఉన్నప్పుడుగాని, యుద్ధంవలన కలిగే లాభంకంటె నష్టం అధికంగా ఉన్నప్పుడుగాని, సంధికుదుర్చుకొని శాంతిని పొందుదామనుకొన్నప్పుడుగాని, తాను తగినంత బలాన్ని సమీకరించుకొనలేనిస్థితిలో ఉన్నప్పుడుగాని సామాన్యంగా ప్రభువు దానోపాయాన్ని ప్రయోగిస్తాడు. అంతేకాదు, బలోన్నతికి కొంత సమయం కావలసివచ్చినప్పుడు కూడా దానాన్ని కాలయాపనకు ఒక అవకాశంగా రాజనీతిలో ప్రభువులు వాడుకొంటారు.

ఉద్యోగపర్వంలో ధర్మజుడు యుద్ధోద్యోగంలో ఒక భాగంలో దానోపాయాన్ని నిపుణంగా ప్రయోగించాడు. దీనిని గురించిన విచారమే ద్వితీయాశ్వాసకథా జీవితంగా వ్యాఖ్యానించ వచ్చును. ఉపప్లావ్యంలో విడిదిచేసి ఉన్న ధర్మరాజు

ప్రస్తుతం రాజ్యసంపద లేనివాడు, కాని, బంధుసంపద కలవాడు. ధృతరాష్ట్ర దుర్యోధనులు పాండవరాజ్యాన్ని హరించి, వారికి మరల రాజ్యావకాశం కలిగించకుండా, దానిని శాశ్వతంగా అనుభవించాలని కుతంత్రాన్ని పన్నుతున్న కుత్సితులు, భౌతికంగా చూస్తే కౌరవులు రాజ్యసంపన్నులు, బలవంతులుగా కనబడతారు. రాజ్యం లేకపోయినా స్వీయబలంతో ఎంతటి రాజ్యాన్నైనా కబళించివేయగల సమర్థుడు ధర్మరాజు. అయినా ధర్మనీతితో రాజ్యాన్ని పొందాలని భావించే ధర్మమూర్తి. అతడు ప్రయోగించే దానోపాయం ఈ పరిస్థితులలో గడుసుగా ఉంటుంది. సంజయుడితో ధర్మరాజు ఇట్లా అన్నాడు-

క. 'రండని పిలువఁ బనిచి, పా । లిండని కొడుకులకుఁ జెప్పి, యింద్రప్రస్థం
బొండెను వేఱొక పట్టణ । మొండెను మా కిచ్చి యనుచు టుచితమ కాదే?' **(ఉద్యో. 1.327)**

పాండవులకు రావలసిన రాజ్యభాగాన్ని ధృతరాష్ట్రుడు గౌరవంగా ఇవ్వాలని కోరుతూ, ఇంద్రప్రస్థమే కాకపోతే, మరేపట్టణమైనా ఇవ్వవచ్చునని ధర్మరాజు అడిగాడు. పూర్వం పాండవుల కిచ్చిన రాజ్యభాగానికి రాజధాని ఇంద్రప్రస్థం. దానిని పాండవులు పునర్నిర్మాణంచేసి అభివృద్ధిచేశారు. అక్కడినుండి దిగ్విజయంచేశారు. అక్కడే రాజసూయం చేశారు. మయసభాది అపూర్వ నిర్మాణవైభవాన్ని దానికి కల్పించారు. అదే దుర్యోధనుడి అసూయకు ఆలంబనమయింది; పాండవసంపదను హరించే దుర్యోధనుడి దుర్నీతికి ఆ పట్టణసంపదే మూలహేతువయింది. ఒకవేళ ఆ సంపదను దుర్యోధనుడు పాండవులకు తిరిగి ఇచ్చే తెంపు ప్రకటించలేకపోతే, మరొక పట్టణమైనా ఇమ్మని ధృతరాష్ట్రుడిని కోరటం ఇందులోని తాత్పర్యం. అభివృద్ధిచెందిన రాజ్యాన్ని త్యాగంచేసి అభివృద్ధిచెందని మరొక ప్రాంతాన్ని కోరుకొనటంలో కొంత త్యాగరూపమైన దానోపాయం భాసిస్తుంది. ధర్మరాజు బలహీనుడై ఈ మాట అనలేదు. రాజనీతిలో భాగంగా ఆ ఉపాయాన్ని ప్రయోగించాడు. అతడా ప్రతిపాదన చేయటానికి ముందు దానిని ఎవరికీ చెప్పలేదు. ఎవరి సలహాకూడా తీసికొనలేదు. వినేవారు ఆశ్చర్యపడేటట్లు ప్రకటించాడు. అయినా అది ఫలించలేదు. శ్రీకృష్ణుడితో ఈ అంశాన్ని గురించి ఇట్లా ప్రస్తావించాడు.

క. 'ఇచ్చటి బంధులు నీవును । నచ్చెరువడి వినుచునుండ నయిదూళులు మా
కిచ్చినను జాలునంటిని । బొచ్చెముగా దింతవట్టు పూర్ణము సుమ్మీ!' **(ఉద్యో. 3.11)**

ధర్మజుడు ప్రయోగించిన దానోపాయం ధృతరాష్ట్రుడి హృదయంలో కల్లోలాన్నీ, సంక్షోభాన్నీ సృష్టించింది. రాత్రిళ్ళు అతడు నిద్రపోలేకపోయాడు. విదురాదుల ప్రబోధాలను వింటూ వేదననుండి తేరుకొనాలని ప్రయత్నించాడు. కాని, అతడి హితులందరూ ధర్మజుడి రాజ్యభాగాన్ని గురించి ప్రస్తావించి, దానిని తిరిగి దానంచేస్తే, అతడికి మనశ్శాంతి లభిస్తుందనీ, కులక్షయం కాకుండా శుభం కలుగుతుందనీ బోధించారు. మచ్చుకు - విదురుడు విజ్ఞతతో చేసిన మందలింపు ధృతరాష్ట్రుడికి దిగ్భ్రాంతిని కలిగించింది.

ఉ. 'డక్కెను రాజ్యమంచు నకటా! యిటు దమ్ముని భాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచె; దది యెట్లఱుగున్? విను; మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు సూవె; యి
ట్లుక్కివుఁడైన నీ కొడుకు నుల్లము నున్నటు లాడఁ గూడునే?' **(ఉద్యో. 2.52)**

తమ్ముడి భాగమైన రాజ్యాన్ని తిరిగి తమ్ముడి కొడుకులకు ఇవ్వటమే దానమనుకొన్నా, ధృతరాష్ట్రుడు అంత బాధపడవలసిన పనిలేదు. రాజ్యాన్ని దిగమ్రింగబూనటం అతడి అవివేకం, దుర్యోధనుడి ధూర్తలక్షణం. ఆహారమనుకొని గాలాన్ని మ్రింగిన చేప చందంగా పాండవరాజ్యభాగాన్ని హరించి కౌరవులు మృత్యువుపాలు కావద్దని హెచ్చరించాడు విదురుడు. న్యాయంగా తనకు రావలసిన రాజ్యభాగాన్ని కూడా దానోపాయంలో భాగంగా చేర్చి ధర్మరాజు సాగించే ధర్మనీతి శత్రువులకు ప్రాణసంకటంగా తయారుకావటం విశేషం.

కౌరవులకున్న సైన్యసంపదను లెక్కించి, ధర్మజుడు ఏ ధైర్యంతో యుద్ధానికి సిద్ధం కాగలడని ధృతరాష్ట్రుడు విదురుడిని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు విదురుడు తలపట్టుకొన్నాడు. మూర్ఛపోయినంత బాధపడ్డాడు. అతడి అవివేకానికి ఆవేదన పడ్డాడు. చివరకు ఇట్లా అన్నాడు:

చ. 'వినుము నరేంద్ర! పాండుపృథివీపతి యగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు; మీరు తమ యయ్య సగంబును భూమి యీకత
క్కిన మఱి కాని ముంద రొక కీడుఁ దలంపఁడు; మీ బలంబు నె
ల్లను మదిఁ జీరికిం గొనఁడు లావున నేలఁ గొసందలంచినన్'. **(ఉద్యో. 2.170)**

దండోపాయానికి ధర్మరాజు పూనుకొంటే కౌరవసైన్యం అతడి కొకలెక్కలోకి రాదని చెప్పి, వారి తండ్రిపాలు నేల వారికిచ్చి దానోపాయాన్ని గౌరవిస్తే దండోపాయందాకా దారితీయ నవసరముండదని హితవు చెప్పాడు విదురుడు. గ్రుడ్డిరాజుకు ఆ మాట రుచించలేదు.

అయినా, సంజయాదులు ధృతరాష్ట్రుడికి ఎన్నో హితవులు చెప్పారు. పాండవ బలపరాక్రమాలను నిరూపించి చెప్పారు. చివరకు ధర్మరాజును శరణువేడితే శాంతి లభిస్తుందని హెచ్చరిక చేశారు. ధృతరాష్ట్రుడు దిమ్మరపోయి రాజ్యభాగాన్ని ధర్మజుడి కిమ్మని కొడుకును కోరాడు (2.246). అతడు తృణీకరించాడు. అంతటితో అయిదూళ్ళ ప్రసక్తికూడా అడుగంటి పోయింది. వాడి సూదిమొనమోపినంత నేలకూడా ఇవ్వనని తేల్చి చెప్పిన దుర్యోధనుడి మొండితనం ధర్మజుడి దానోపాయాన్ని విఫలంచేసి, యుద్ధోపాయానికి దారిని సుకరం చేసింది.

ధర్మజుడి దానోపాయం శత్రువులకూటమిలో రేపిన సంచలనాన్ని సర్వాంగంగా చిత్రించిన కథాభాగం ద్వితీయాశ్వాసం!

**(3). భేదోపాయం: తృతీయాశ్వాసం**

సామోపాయాన్ని ప్రయోగించగల రాజు సమయజ్ఞుడై ఉండాలి. దాన ప్రయోగనిపుణుడు దక్షుడై ఉండాలి. భేదోపాయప్రయోక్త లోకజ్ఞుడైన నీతిజ్ఞుడై ఉండాలి. యుద్ధోపాయాన్ని నిర్వహించే రాజు వ్యూహకుశలుడై ఉండాలి. ధర్మరాజు ఉద్యోగపర్వంలో చతురుపాయ సమర్థుడుగా చిత్రించబడ్డాడు. అందులోనూ - తృతీయాశ్వాసం ధర్మజుడి భేదోపాయ ప్రయోగ పాండిత్యానికి ప్రజ్ఞాపతాక!

శాస్త్రబద్ధంగా ప్రయోగించే రాజనీతి ధర్మనీతిగా మారుతుంది. యుద్ధం తప్పదని తెలిసిన ధర్మరాజు, సమరాన్ని సరాసరి ప్రకటించకుండా సామదానభేదాలను ముందుగా ప్రయోగించాడు. దానిరూపమే రాయబారపు ప్రయత్నం. పురోహితుడి, సంజయుడి రాయబారాల నాధారంగా చేసికొని ధర్మరాజు నిపుణంగా సామదానోపాయాలను ప్రయోగించి, కౌరవుల దుర్నీతి వలన అవి విఫలమైనట్లు స్పృహను లోకంలో సృష్టించాడు. తృతీయాశ్వాసంలో సామదానరూపంగా పైకి కనబడుతూనే గూఢంగా సాగే భేదోపాయాన్ని సారించాడు. ఈ ఉపాయం పైకి స్నేహహస్తం చాచినట్లుంటుంది. లోన శత్రుశిబిరంలో భేదాన్ని ప్రయోగిస్తున్నట్లుంటుంది. దానిని ధర్మరాజు శ్రీకృష్ణుడి రాయబారం ద్వారా సాధింపదలచాడు. శ్రీకృష్ణుడితో ధర్మజుడు పలికిన మాటలు మెత్తని పులి పలికే ధర్మనీతి సూక్తులు. ఆ రాయబారం ఒక వ్యూహం. దాని ప్రవక్త ధర్మరాజు, ప్రయోక్త శ్రీకృష్ణుడు.

సంజయుడి రాయబారం వలన ధృతరాష్ట్రుడు రాజ్యభాగ మిచ్చేది లేదనీ, అతడు దుర్యోధనుడి వక్రబుద్ధిని మార్చలేడనీ స్పష్టమయింది. శకుని కర్ణాదులను నిలువరించలేడని తేలింది. అయితే, భీష్మాది కురువృద్ధులూ, ఆచార్యాది

విజ్ఞులూ, విదురాది ధర్మవేత్తలూ ధర్మజుడి ధర్మనీతి వర్తనాన్ని గ్రహించగలరు, హర్షించగలరు, సమర్థించగలరు, ధృతరాష్ట్ర దుర్యోధనాదులకు హితబోధ చేయగలరు. అయినా, వారి మాటలు దుర్యోధనాదులు వినరు. వారు యుద్ధాన్నే కోరుతారు. విజయం తమకే దక్కుతుందనీ, పాండవులు రణంలో నిహతులౌతారనీ వారి నమ్మకం. ధృతరాష్ట్రుడు కొడుకును కాదనలేడు; యుద్ధాన్ని సమర్థించలేడు. డోలాయమానచిత్తుడై సమస్యను పరిష్కరించలేక కటకట పడతాడు. కాబట్టి, ఆయనముందు యుద్ధసమస్యనే పెద్దదిగా చేసి భయపెట్టాలి. అప్పుడు యుద్ధంచేయాలని భావించే దుర్యోధన వర్గానికీ, వద్దని వాదించే గురుభీష్మాది వీరవర్గానికీ భేదం ఏర్పడుతుంది. ధృతరాష్ట్రుడు ఏదో ఒక పక్షం వహించవలసి వస్తుంది. లేదా యుద్ధంవలన కలిగే వంశనాశనానికి నాంది నాలపించవలసి వస్తుంది. నింద మోయవలసి వస్తుంది. అందువలన, యుధిష్ఠిరుడు శాంతివచనాలతో రాయబారాన్ని మొదలు పెట్టాడు.

అయిదూళ్ళడిగినా ఇవ్వని దుర్యోధనుడి దౌష్ట్యంవలన యుద్ధం తప్పనిసరి ఔతుంది. యుద్ధంవలన రాజ్యంలోని భాగమే కాదు మొత్తం రాజ్యం పాండవుల వశమౌతుంది. అంటే, ధృతరాష్ట్ర దుర్యోధనుల పాలన హస్తినలో అస్తమిస్తుంది. ఆ మాటలు కౌరవసభలో ప్రకటించి, తన ఉద్యోగాన్ని (ప్రయత్నాన్ని) భీష్మద్రోణాది వృద్ధ గురు జనానికీ, రాజులకూ, ప్రజలకూ తెలియచెప్పి, యుద్ధంవలన కలిగే అనర్థాలను వారికి వివరించుమన్నాడు ధర్మరాజు. యుద్ధంవలన కౌరవవీరుల నాశనమే కాక, ఇరువైపులకు చెందిన వీరులు మరెందరో ప్రాణాలు కోల్పోవచ్చును. ఆ యుద్ధక్రూరకర్మకు మూలం పగ. దుర్యోధనుడు మూర్తీభవించిన పగ. అతడు పగ చల్లార్చుకొని స్నేహంతో కలిసి ఉండటానికి అంగీకరిస్తేనే శాంతి. లేదా, అది అతడి దోషమే ఔతుంది; వంశనాశనానికీ, రక్త ప్రవాహాలకూ దారితీస్తుంది. ఈ విషయం కురుసభలో అందరిముందు చెప్పి, నేరమంతా కౌరవపక్షంలోనే ఉన్నదని నిరూపించటానికీ, పాండవులు దండోపాయం ప్రయోగించటానికీ కౌరవుల దుష్టవర్తనమే మూల కారణమని లోకానికి తెలియచెప్పటానికీ చేసే యత్నమే శ్రీకృష్ణుడి రాయబారం. సంజయుడు అన్నట్లుగా 'అధర్మం చేస్తున్నది ధృతరాష్ట్రుడూ, అతడి కొడుకులే' అని అందరూ నమ్మేటట్లు చేయటం ఈ రాయబారం వెనుక ఉన్న వ్యూహం. ఇది రాజనీతిలోని భేదోపాయ రహస్యం.

ఉద్యోగపర్వంలో రెండు సభలున్నాయి. ఒకటి- ఉపప్లావ్యంలో ధర్మరాజున్న సభ. రెండు- హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు కొలువుదీరిన కౌరవసభ. ఈ రెండు సభలలో నాయకులు వరుసగా ధర్మరాజు, దుర్యోధనుడు. ధర్మరాజుకు దైవ సమానుడు, హితుడు, స్నేహితుడు శ్రీకృష్ణుడు. అతడి నిర్ణయాన్ని ధర్మరాజు శిరసావహిస్తాడు. భీమాదులు ధర్మరాజు వాదంతో కొంత భేదించినా, అన్నగారిమాట జవదాటరు. సంధిచేసికొనటం వారికి అంతరాంతరాలలో ఇష్టంలేకపోయినా, సంధిజరిగే పరిస్థితులు కౌరవసభలో లేవని తెలిసినా, ధర్మరాజు చేసే ప్రయత్నాన్ని భీమాదులు సమర్థించారు. అందువలన పాండవసభలో ఐక్యత, నాయకత్వం స్థిరంగా ఉన్నాయి. దివ్యాదివ్యుడైన శ్రీకృష్ణుడి వ్యూహసారథ్యం వారి కెప్పుడూ ఉన్నది. పురుషకారం, దైవయత్నం రెండూ పాండవులకు సమకూరాయి.

పాండవసభలో ఉన్న సమైక్య ధర్మస్థితి హస్తినాపురంలోని కౌరవసభలో లేదు. దుష్టచతుష్టయం సంధికిష్టపడదు. ధృతరాష్ట్రుడు కొడుకును కాదనలేడు. పాండవ పక్షంలో శ్రీకృష్ణుడివలె కౌరవపక్షంలో పెద్దరికపు గౌరవాన్ని పొందే నాథుడు లేడు. భీష్మాదులు, ఒక్కొకసారి ధృతరాష్ట్రుడు కూడా దుర్యోధన తిరస్కారాలకు గురి ఔతూ ఉంటారు. సభలో ఉన్న సభ్యులలోకూడా ఏకాభిప్రాయం లేదు. కౌరవసభ ఐక్యతలేని విభిన్న శక్తుల వింత కూటమి; దైవానుకూల్యంలేని దర్పభూమి; ధర్మశక్తిలేని కార్యక్షేత్రం. శ్రీకృష్ణుడికి కౌరవసభలో జరిగే అవమానం దైవానికీ, ధర్మానికీ జరిగే అవమానం. దానివలన యుద్ధం, కౌరవనాశనం తథ్యం. పాండవులకు యుద్ధానంతరం లభించేది రాజ్యభాగమే కాదు, కౌరవమహాసామ్రాజ్యం. ఈ ఫలసిద్ధిని పొందటానికి సాగించే యుద్ధోద్యోగంలో- శ్రీకృష్ణుడి రాయబారం కౌరవసభలో, స్కంధావారంలో, వీరులలో భేదభావసృష్టి చేసే ప్రయోజనాన్ని సాధించింది. కాని, యుద్ధాన్ని మాన్పజాలకపోయింది. యుద్ధాన్ని వద్దన్న భీష్మాదులు కూడా యుద్ధాన్ని వారించలేకపోయారు. శ్రీకృష్ణుడు కర్ణుడికి జన్మరహస్యం చెప్పి పాండవపక్షంలోకి అతడిని రప్పించటానికి

యత్నించాడు. ఈ అంశం ధర్మరాజు లక్ష్యంలో లేనిది. శ్రీకృష్ణుడు స్వతంత్రించి యత్నించింది. అక్కడా భేదోపాయం బెడిసికొట్టింది. కాని, కుంతికి కర్ణుడిచ్చిన వరాలలో అది కొంత ఫలించింది. మొత్తంమీద శ్రీకృష్ణుడి రాయబారం భేదాన్ని సృష్టించి ఫలించింది; యుద్ధాన్ని మాన్పలేక విఫలమయింది. భేదోపాయ వైఫల్యమే దండోపాయానికి దారితీసింది. ఉద్యోగపర్వంలో శ్రీకృష్ణుడు యుద్ధానికి ముహూర్తాన్ని ప్రకటించి వచ్చాడు. ధర్మరాజు శాస్త్రీయంగా సాగించిన యుద్ధోద్యోగంలోని దండోపాయాన్ని శ్రీకృష్ణుడు సమర్థనీయంగా ప్రదర్శించాడు.

ఈ తాత్పర్యమంతా ఈ క్రింది పద్యంలో ధర్మరాజు పొదివి చెప్పాడు.

మ. 'సుతువాఁడై వినయంబు సేకొనక యే చొప్పం దగం జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగ రాదంచు వే
గ తెగంబాఱకు; తెంపు సేయునెడ లోకంబెల్ల మెచ్చం బ్రకా
శిత ధర్మస్థితి నొంది మా మనము నిశ్చింతంబుగాఁ జేయుమీ!' **(ఉద్యో. 3.25)**

ధర్మజుడు ఊహించినదంతా శ్రీకృష్ణుడు ఉజ్జ్వలంగా సాధించి పెట్టాడు.

**(4). దండోపాయం: చతుర్థాశ్వాసం**

ధర్మరాజు రాయబారం ద్వారా సాధింపదలచుకొన్న ఫలితాలకు పరిమితమైనది తృతీయాశ్వాసం. ఆ పరిధికి మించి శ్రీకృష్ణుడూ కుంతీ సాధించిన భేదోపాయాలను చతుర్థాశ్వాసంలో చెప్పటం ఔచిత్యం. పాండవవీరులు భయపడే భీష్మద్రోణాదులు శ్రీకృష్ణుడి రాయబారంవలన మెత్తబడ్డారు. కర్ణుడు ధర్మరాజుకు సింహస్వప్నంవలె మిగిలిపోయాడు. అర్జునుడి పాశుపతాస్త్రం ఉన్నా, దానిని అతడు ప్రయోగించడు. కర్ణుడి 'శక్తి' పార్థుడి ప్రాణాలను హరించే అవకాశం ఉన్నది. కర్ణుడు ధర్మజాదులను సంహరించే వీలున్నది. ఈ ఆపదనుండి తప్పించుకొనే ఉపాయాన్ని శ్రీకృష్ణుడూ కుంతీ సమకూర్చిపెట్టారు. ఇక యుద్ధోపాయాన్ని నిర్విఘ్నంగా ప్రయోగించవచ్చును. కార్యనిర్దేశం చేయుమని శ్రీకృష్ణుడిని ధర్మరాజు ప్రార్థించాడు.

ఉ. 'యుద్ధమ కాక కార్యమును నొండొకఁ డెద్దియుఁ గల్గ నేర్చునే?
బుద్ధులు సెప్ప వాక్యముల పోల వినం డన నేల? యట్టిచో
బద్ధునిఁ జేయఁజూచె ననుఁ బట్టి సుయోధనుఁ; డింక నయ్యసం
బద్ధునితోడి సంధికి నుపాయము నామతిఁ దోఁప దెమ్మెయిన్'. **(ఉద్యో. 4.88)**

అని శ్రీకృష్ణుడు యుద్ధమే తగిన కార్యమని నిశ్చయించాడు. యుద్ధోపాయం ప్రారంభమయింది. చతుర్థాశ్వాసమంతా యుద్ధసన్నాహ సంభారమే. ఉభయ పక్షాల బలాబల నిరూపణం జరిగింది. ఆయా వీరుల విశేషవృత్తాంతాలు చెప్పబడ్డాయి. కౌరవులు పంపిన ఉలూకుడి రాయబారం దుర్యోధనుడి దురహంకారాన్ని ప్రదర్శించింది. పాండవులలో రణోత్సాహాన్ని రెట్టింపుచేసింది. శ్రీకృష్ణు డిచ్చిన సమాధానం భావికథార్థ సూచకం; దుర్యోధన దుశ్శాసనులకు దైవశాపం.

తే. 'బవర మెల్లియ; బిరుదవై బరవసంబు । గలిగి చావుము; చావక తొలఁగరాదు;
కృష్ణ సారథికంబగు జిష్ణురథము । దొడరి నీ వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు'.

క. 'రిత్తలు రజ్జెడు వాఁడే । మత్తగజాయుత బలుండు మారుతి యని ను
ద్వృత్తుఁ డగు దుస్ససేనుని । నెత్తు రురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్'. **(ఉద్యో. 4.203, 204)**

'చావక తొలగరాదు' - అనేమాట దుర్యోధనుడు తొడలు విరిగి పడిపోయే దురవస్థను సూచిస్తున్నది. యుద్ధపంచకమంతా ఈ వాక్యంలో ధ్వనిస్తుంది. ఉద్యోగపర్వం ఊర్జితకథోపేతం!

### 3. ఉద్యోగపర్వంలో షాడ్గుణ్య ప్రయోగరంగం

రాజు రాజ్యాన్ని సంపాదించాలన్నా, స్వీయరాజ్యాన్ని రక్షించుకొనాలన్నా షడ్గుణాలను పాటించాలని రాజనీతిజ్ఞులంటారు. దీనినే షాడ్గుణ్యమని పిలుస్తారు.

"సంధిం చ విగ్రహం చైవ యాన మాసన మేవ చ
ద్వైధీభావం సంశ్రయం చ షడ్గుణాం శ్చింతయే త్సదా". **(మనుస్మృతి. 7.160)**

అని మనుస్మృతి చెపుతున్నది. సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధీభావం, సంశ్రయం- అనేవి షడ్గుణాలు. అవి ఇవే వరుసలో ప్రయోగించబడాలని చెప్పటంకంటె సమయానుకూలంగా వాటిని ప్రవర్తిల్లచేయాలని శాస్త్రం. మహాభారత శాంతి పర్వంలో రాజనీతి విశేషాలలో చతురుపాయాలతోపాటు షడ్గుణాలు కూడా చెప్పబడి ఉన్నాయి. (శాంతి.2.285). "సంధిర్నా విగ్రహోయాన మాసనం ద్వైధమాశ్రయః షడ్గుణాః" అని అమరకోశం. పాండవులు రాజ్యప్రాప్తికోసం, కౌరవులు రాజ్యరక్షణకోసం షాడ్గుణ్యాన్ని పాటించటం రాజనీతిలో భాగం. ఉద్యోగపర్వం షాడ్గుణ్య ప్రయోగరంగం.

కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో షాడ్గుణ్యానికి ఒక అధ్యాయమే కేటాయించాడు. (సప్తమాధికరణంలోని ప్రథమాధ్యాయం)

1. "షాడ్గుణ్యస్య ప్రకృతి మణ్డలం యోనిః"

(సంధి మొదలైన ఆరుగుణాలకు స్వామ్యాదులైన ఐదు ప్రకృతులూ, ద్వాదశరాజమండలమూ మూలకారణం).

2. "సంధి విగ్రహాసన యాన సంశ్రయ ద్వైధీభావాః షాడ్గుణ్యం ఇత్యాచార్యాః"

(సంధి, విగ్రహం, ఆసనం, యానం, సంశ్రయం, ద్వైధీభావం- ఇవి ఆరూ షాడ్గుణ్యం- అని ప్రాచీనాచార్యులు చెప్పారు).

3. "ద్వైగుణ్యమ్ ఇతి వాతవ్యాధిః, సంధి విగ్రహాభ్యాం హి షాడ్గుణ్యం సంపద్యతే ఇతి"

(సంధి, విగ్రహం- అనే రెండు గుణాలే ప్రధానమైనవి. ఎందువల్లననగా సంధివిగ్రహాల చేత షాడ్గుణ్యం ఏర్పడుతుంది. అనగా ఆసనం మొదలైన నాలుగు, సంధివిగ్రహాలచేతనే ఏర్పడతాయి గాని వాటిలోనే అంతర్గతాలు అని వాతవ్యాధి అనే ఆచార్యుడి అభిప్రాయం). (ఈ వాతవ్యాధి ఉద్ధవుడు కావచ్చును).

4. "షాడ్గుణ్య మేవైతదవస్థాభేదాత్ ఇతి కౌటిల్యః"

(అవస్థలలో (పరిస్థితులలో) భేదం ఉండటంచేత ఆరుగుణాలు వేరు వేరు. అందుచేత షాడ్గుణ్యాన్నే అంగీకరించాలని కౌటిల్యుడి అభిప్రాయం).

5. "తత్ర పణబన్ధః సంధిః అపకారో విగ్రహః ఉపేక్షణ మాసనమ్. అభ్యుచ్చయో యానమ్. పరార్పణం సంశ్రయః సంధివిగ్రహోపాదానం ద్వైధీభావ ఇతి షడ్గుణాః"

(వాటిలో - 'సంధి' అనగా ఒప్పందం కుదుర్చుకొనటం. అపకారం చేయటం 'విగ్రహం'. సంధిచేసికొనకుండా, అపకారం చేయకుండా ఉండటం- 'ఆసనం'. శక్తినీ దేశకాలాదులలో అభివృద్ధినీ సంపాదించటం 'యానం'. ఈ విధమైన అభివృద్ధి ఉన్నప్పుడే శత్రువుమీదికి దండెత్తి వెళ్ళటం కుదురుతుంది కావున దీనికి యానం అని పేరు పెట్టబడింది. యానం అనగా అర్థం- దండెత్తి వెళ్ళటం. శత్రువు బలవంతుడైనప్పుడు తనను వాడికి సమర్పించటం (లొంగిపోవడం) సంశ్రయం.

లేదా, సహాయం కోరి మరొక బలవంతుడిని ఆశ్రయించడం సంశ్రయం. సంధివిగ్రహాలు రెండింటిని నడిపించటం- అనగా ఒక శత్రువుతో సంధి చేసికొని రెండవ శత్రువుతో వైరం కొనసాగించడం ద్వైధీభావం. ఈ విధంగా గుణాలు ఆరు.)

శ్లో. "ఏవం షడ్భిర్గుణై రేతైః స్థితః ప్రకృతి మణ్డలే
పర్యేషేత క్షయాత్ స్థానం స్థానా ద్వృద్ధిం చ కర్మసు"

(ప్రకృతి మండలంలో ఉన్నరాజు ఈ విధంగా ఈ ఆరు గుణాలను అనుసరిస్తూ క్షీణదశనుండి స్థానాన్ని (నిలకడను), స్థానంనుండి (స్థానంద్వారా) తన కర్మలలో వృద్ధినీ సంపాదించటానికి ప్రయత్నించాలి.)

(అర్థశాస్త్రమ్- బాలానందిని వ్యాఖ్య- ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు.) **(పుట 544, 545, 550)**

ధర్మరాజు ధర్మనీతి వర్తనుడైన ఉదాత్తుడు. ధర్మం తప్పని రాజనీతి అతడి విధానం. తనకు రావలసిన రాజ్యభాగాన్ని బలప్రయోగంతో సంపాదించగలిగే శక్తియుక్తులు తనకున్నా ధర్మబద్ధమైన రాజనీతితో కూడిన విధానాన్ని అనుసరించి రాజులకు ఆదర్శప్రాయు డయ్యాడు. అతడు ఉద్యోగపర్వంలో నిర్వహించిన నీతివర్తనం షాడ్గుణ్య ప్రయోగానికి శాస్త్రసమ్మతమైన ఉదాహరణం.

షాడ్గుణ్యంలో సంధివిగ్రహాలకు ప్రధానపాత్ర ఉంటుందని ప్రాచీనులు పేర్కొన్నారు. మిగిలిన నాలుగు గుణాలూ వాటినుండి పుట్టి వాటిలోనే అంతర్భవిస్తాయని కొందరు భావించగా, ఆరు గుణాలకూ అవసరాన్నిబట్టి ప్రత్యేక ప్రతిపత్తి ఏర్పడవచ్చుననీ, వాటివలన ప్రత్యేక ప్రయోజనాలుకూడా సాధించవచ్చుననీ కౌటిల్యుడు పేర్కొన్నాడు. ధర్మరాజు సమయోచితంగా షడ్గుణాలను ప్రయోగించి సమర్థు డనిపించుకొన్నాడు. షడ్గుణప్రయోగంవలన ధర్మజుడు రెండు దశలను సాధించాడు. 1.క్షీణదశనుండి స్థానాన్ని సంపాదించటం. 2.స్థానంనుండి శత్రువుమీద దాడిచేయగల సామర్థ్యాన్ని పెంపొందించుకొనటం. ఈ రెండు దశలను ధర్మనీతి వర్తనం వలన సాధించటం విశేషం.

**(1). సంధి:-** ఉపప్లావ్యంలో శ్రీకృష్ణుడు నిండుసభలో ధర్మజుడి ధర్మప్రవృత్తిని ప్రతిపాదించి అతడి రాజనీతికి గల ప్రాతిపదికను తెలియపరచాడు.

తే. 'ధర్మమార్గంబు దప్పక తలఁపుఁ డొక్క తెఱఁగు, ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు
వడయ నొడఁబడఁ డయ్యింద్రపదవియైన; । నుచితగతి నెంత వడసిన నుల్లసిల్లు'. **(ఉద్యో. 1.11)**

పాండవులు పితృధనమైన రాజ్యం అనుభవిస్తూ ఉండగా దానిని దుర్యోధనుడు కపటద్యూతం మిషగా అపహరించి అపకారం చేశాడు. ధర్మరాజు దిగ్విజయం చేసి తన రాజ్యానికి మహత్త్వాన్ని కల్పించుకొన్నాడు. చక్రవర్తిగా చెలామణి అయ్యాడు. కపటోపాయంతో దుర్యోధనుడు కాజేసిన రాజ్యాన్ని కపటమార్గంలో విగ్రహాన్ని ప్రదర్శించి సాధించవచ్చును. కాని, అత డామార్గాన్ని ఆశ్రయించటం లేదు. కాబట్టి, సంధి విగ్రహాలలో సంధి ఉపాదేయమయింది. అంతేకాక, పాండవులు-

క. 'అలఘుబల విక్రమోదా । త్తుల కైనను బలములేక దోర్గర్వముమై
గెలువఁగ వశమె? సహాయము । కలిమి ననంతంబులగు పగఱ సైన్యములన్?' **(ఉద్యో. 1.15)**

పాండవులు స్వీయబల సంపన్నులైనా, సహాయసంపత్తి లేకుండా బలవంతులైన శత్రువులతో కార్యసాధనం చేయటం కష్టం. అందువలన బలసమీకరణకైనా కొంత వ్యవధానం కావాలి. ఆలోగా సంధియత్నం చేయటం ఉత్తమమని నిర్ణయం తీసికొనటం జరిగింది.

ఉపప్లావ్య సభలో సంధిని సమర్థించిన వారూ ఉన్నారు. సమరాన్ని సమర్థించిన వారూ ఉన్నారు. ఆ రెండు వర్గాలకూ నాయకులు- యాదవవీరులైన శ్రీకృష్ణ బలరాములూ, సాత్యకీ కావటం గమనించదగిన అంశం. అయితే, సాత్యకి శ్రీకృష్ణుడి అభిప్రాయాన్ని వ్యతిరేకించినా ఒక మధ్యేమార్గాన్ని ప్రతిపాదించాడు.

క. 'నా మతమునఁ గార్యము సం । గ్రామము సేయుటయ; యిట్లు గా కీలోనన్
సామవచనంబు లక్కురు । భూమీశ్వరుతోడ నాడఁ బుచ్చెద రేనిన్'.

ఉ. 'దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలు పాలు రా
జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్నలోక సా
మాన్య విధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద; మ
న్యోన్య విరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడున్'. **(ఉద్యో. 1. 31, 32)**

ఈ అంశాన్ని ద్రుపదుడు సమర్థించాడు. సభ్యులందరూ అంగీకరించారు. ఫలితాంశమేమంటే- దుర్యోధనుడితో సామంగా మాట్లాడే రాయబారిని పంపాలి. కాని, అతడు దీనంగా రాజ్యాన్ని యాచించకూడదు. 'రాజపరమేశ్వరుడైన ధర్మరాజు తన రాజ్యభాగాన్ని తాను పొందటానికి అంగీకారాన్ని అర్థిస్తున్నాడు' అని మాత్రమే ఉండాలి. సంధియత్నం వలన ఆత్మాభిమానానికి ఏ మాత్రం తక్కువదనం రాకూడదు- అని నిశ్చయించారు. 'దుర్యోధనుడు అన్యోన్యవిరుద్ధ భాషణం చేస్తే ఎట్లాగూ జరుగబోయే యుద్ధంలో తగిన ఫలాన్ని అనుభవిస్తాడు'- అన్నాడు సాత్యకి. ఇందులో ఒక ధర్మసూక్ష్మం ఉన్నది. అరణ్యాజ్ఞాతవాసాలు పూర్తిచేసిన ధర్మరాజుకు రాజ్యభాగం న్యాయంగా సంక్రమించినట్లే. కాని, పెద్దల సమ్మతికోసం మర్యాదకు మారుపేరుగా రాయబారం నడపాలని నిర్ణయం.

మూలంలో సాత్యకి పలికిన మాటలలో ఈ తీర్పరితనం, నేర్పరితనం కానరావు. అతడు యశో వా, మృత్యుర్వా అన్నట్లు యుద్ధాన్నే ప్రతిపాదించాడు.

"నా ధర్మో విద్యతే కశ్చి చ్ఛత్రూన్ హత్వాఽఽతతాయినః॥
అధర్మ్య మయశస్యం చ శాత్రవాణాం ప్రయాచనమ్
హృద్గత స్తస్య యః కామ స్తం కురుధ్వ మతన్ద్రితాః॥
నిసృష్టం ధృతరాష్ట్రేణ రాజ్యం ప్రాప్నోతు పాణ్డవః
అద్య పాణ్డుసుతో రాజ్యం లభతాం వా యుధిష్ఠిరః
నిహతా వా రణే సర్వే స్వప్స్యన్తి వసుధాతలే॥". **(సం. 5.3.21, 22, 23)**

'క్రూరకర్ములైన శత్రువులను చంపటం అధర్మం కాదు. పగవారిని బిచ్చమెత్తటం ధర్మయుక్తం కాదు, కీర్తికరంకూడా కాదు. ధర్మరాజు మనసులో ఏముందో దానిని మెలకువతో సాధించండి. ధృతరాష్ట్రుడు మన్ననతో ఇచ్చే రాజ్యాన్నే ధర్మరాజు పొందుతాడు. ఆ విధంగా యుధిష్ఠిరుడు రాజ్యాన్ని పొందాలి. లేదా అందరూ యుద్ధంలో చచ్చి నేలపై దీర్ఘనిద్రపోవాలి!'- అన్నాడు.

తిక్కన మూలాన్ని చికిలిపెట్టి శిల్పం చేశాడు. షాడ్గుణ్యానికి అనువుగా సంభాషణలను సంస్కరించాడు. సంధిజరగాలి. కాని, రాజ్యాన్ని యాచిస్తున్నట్లు కాదు. తమ వాటాను మర్యాదగా పొందటానికి సమ్మతిని పొందటానికే. లేదా, యుద్ధం తప్పదని స్పష్టంచేయటానికే. అంటే - సంధి ప్రవర్తింపచేయటం 'సమ్మతి'కోసమే. సమ్మతించకపోతే విగ్రహాదులను

ప్రయోగించవలసి వస్తుంది- అని హెచ్చరిక! ఇది తిక్కన చేసిన నిష్కర్ష. దీనిని సమర్థించిన ద్రుపదుడు కూడా సంధిలో మార్దవం, ప్రసన్నత అవసరం లేదని స్పష్టంచేశాడు.

క. 'మృదుభాషణముల దుర్జన । హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె? యె
ల్లిదముగఁ గొని యంతంతకు । మద మెక్కుం గాక దురభిమానము పేర్మిన్'. **(ఉద్యో. 1. 34)**

ద్రుపదుడు తన పురోహితుడి ద్వారా నడపదలచింది స్వాభిమానంతో కూడిన సంధికాని, క్షీణదశలోనుండి నిలకడకోసం ధర్మరాజు చేసే సవినయ సంధికాదని స్పష్టం చేశాడు. అయినా, సంధి చేస్తూనే, సైన్యసహాయ సాధన సాగించి సమర సన్నాహాన్ని చేసేయత్నం చేశారు పాండవులు. అంటే- ధర్మరాజు విగ్రహంలేని సంధిని మొదటి గుణంగా ఎన్నుకొన్నాడన్నమాట! (కొందరు విగ్రహమంటే సైన్యంతో శత్రువు నెదుర్కొనటం అని అర్థం చెపుతారు. అయినా సైన్యసాధన యుద్ధయత్నమే కాని ఎదురుదాడి కాదు). సంధివిగ్రహాలు జంటగా నడుస్తాయని భావించే ప్రాచీనాచార్యులకంటె, పరిస్థితులనుబట్టి షడ్గుణాలను విడివిడిగా ప్రయోగించ వచ్చుననే కౌటిల్యుడు అభిప్రాయాన్ని తిక్కన తెలుగు భారతంలో బలపరిచాడు. సంధి విఫలమైతే విగ్రహం. ఇది ధర్మజుడి ధర్మనీతి. అంతేకాదు, శత్రువు ముందుగా విగ్రహానికి తలపడితే తాను దానికి పైచేయిగా ఎత్తువేసి విరుగుడు పెట్టాలని భావించినట్లున్నాడు. ధర్మరాజు చర్యలు ఫలానుమేయాలు!

**(2). విగ్రహం:-** అపకారం చేయటం విగ్రహమని నిర్వచనం. దీనిని ధర్మరాజు స్వయంగా చేయడు. అయితే, రాజనీతిలో పరిస్థితుల ప్రభావంవలన దానిని ప్రయోగించక తప్పదు. అటువంటి సన్నివేశం ఉద్యోగపర్వంలో ఏర్పడింది. ద్రుపదపురోహితుడు రాయబారిగా హస్తినాపురం వెళ్ళాడు. అక్కడ పెద్దలతో పరిచయాలు పెంచుకొంటున్నాడు. ఆ సమయంలో కౌరవ పాండవుల అభ్యర్థనల మేరకు రాజులు ఆయా స్కంధావారలలో చేరుతూ ఉన్నారు. శల్యుడు ధర్మరాజుకు మాట ఇచ్చి, అతడి వైపు చేరటానికి విపుల సైన్యంతో బయలుదేరి యాత్రసాగిస్తున్నాడు. దుర్యోధనుడు ఆ అదను కనిపెట్టి చారులను పంపి, శల్యుడికి మార్గంలో వలసిన సౌకర్యాలన్నీ చేయించాడు. శల్యుడు ఆ సౌకర్యాలు చేయిస్తున్నది ధర్మరాజని భావించి, ఆ చారులకు వరాలనివ్వటానికి సిద్ధమయ్యాడు. అప్పుడు దుర్యోధనుడు రంగప్రవేశం చేసి, నిజాన్ని చెప్పి, వరంగా అతడి సహాయాన్ని కోరాడు. ఇచ్చిన మాట ప్రకారం దుర్యోధనుడికి సహాయం చేయటానికి అంగీకరించాడు. అయితే, ఆ సంగతి ధర్మరాజుకు చెప్పి వస్తానని ససైన్యుడై ఉపప్లావ్యానికి వెళ్ళాడు. అక్కడ జరిగినదంతా ధర్మరాజుకు చెప్పాడు. శత్రుకృత విగ్రహ ప్రయోగాన్ని గ్రహించిన ధర్మరాజు తిరిగి తానుకూడా విగ్రహంతోనే తిప్పికొట్టాడు. యుద్ధంలో శల్యుడు కర్ణసారథ్యం చేస్తూ, అతడి మనసు కలతపడి యుద్ధం చేయలేనట్లుగా పరుషవాక్యాలు పలికి అర్జునుడిని రక్షించాలని కోరాడు. అందుకు శల్యుడు అంగీకరించాడు. అలనాడు నిండుసభలో ద్రౌపదిని తూలనాడిన కర్ణుడు వధార్హుడని నిశ్చయించాడు. తాను కర్ణుడికి అపకారం చేయుటానికి అంగీకరించాడు. దీని తాత్పర్య మిది- దుర్యోధనుడు సంధిచేయదలచలేదు కాబట్టి ధర్మరాజుకు అపకారం చేయతలపెట్టాడు. ధర్మరాజు అపకారం చేయకుండా సంధియత్నం మొదలుపెట్టినా, దుర్యోధనుడే అపకారం తలపెట్టినప్పుడు స్వీయరక్షణకోసం శత్రువుకు విగ్రహాన్ని (అపకారాన్ని) తలపెట్టాడు. ఇది దుర్యోధనుడి స్వయంకృతాపరాధ ఫలమే. అందువలన ధర్మరాజుకు దోషం లేదు. శల్యసహాయం పోవటంవలన తనకు కలిగే అపాయంకంటె, ఆరవప్రాణమైన కర్ణుడు చావటంవలన దుర్యోధనుడికి కలిగే అపకారం అపారం! అదే ధర్మజుడి విగ్రహ ప్రయోగ విశేషం.

**(3). ఆసనం:-** శత్రువు సమానబలం కలవాడై ఉంటే, అతడిని కదిలించకుండ, నిర్లిప్తంగా ఉంటూ, తన బలాన్ని క్రమంగా పెంచుకొని, అదనుచూచి అతడిపై దాడిచేయటం రాజనీతి. ఆ పరిస్థితులలో నిర్లిప్తంగా ఉండే స్థితిని ఆసనంగా పరిగణించాలి. ధర్మరాజుకు 'ఆసనం' అనే గుణాన్ని ప్రదర్శించటానికి అవకాశమే లేదు. ఎందువలన అంటే- అతడికి రాజ్యం

లేదు. క్షీణదశనుండి స్థానాన్ని (నిలకడను) పొందటానికి బంధువులు పట్టుబట్టి సాగించే ద్రుపదపురోహిత దౌత్యానికి అంగీకరించాడు. అది ధర్మరాజుకు ఒక స్థానాన్ని కలిగించింది. అంతేకాదు. ధర్మజుడి క్రోధాగ్ని ధృతరాష్ట్రుడి గుండెలో భయాన్ని రేపింది. ధర్మజుడి యుద్ధోద్యోగాన్ని రాజనీతితో భగ్నం చేయటానికి ధృతరాష్ట్రుడు సంజయుడి రాయబారంతో యత్నించాడు. ఆ రాయబారం ఫలిస్తే ధర్మజుడు సంధియత్నం చేయడు; కౌరవులకు అపకారం తలపెట్టడు. పోగా, క్రోధశాంతివలన మునివృత్తిని స్వీకరించి తనకు తానే అపకారం చేసికొంటాడు. ఇంతటి లోతైన వ్యూహం ధర్మరాజును ఆసనంలోకి త్రోసివేసేదే. కాని, ధర్మజుడు ఆ విపత్తునుండి తనను తాను రక్షించుకొన్నాడు. శ్రీకృష్ణు డందుకు సాయంచేశాడు. దానితో ధర్మరాజు సంజయుడి రాయబారాన్ని తిరస్కరించాడు. ధృతరాష్ట్రుడి వ్యూహాన్ని భగ్నంచేశాడు. గ్రుడ్డిరాజుకు నిద్రపట్టకుండా, దిక్కుతోచకుండా చేసి, అతడిని సంక్షోభంలో పడవేశాడు. 'మెత్తని పులి' అనిపించుకొన్నాడు.

**(4). సంశ్రయం:-** శత్రువుతో యుద్ధంచేయలేని రాజు తనను తాను కొంతకాలం రక్షించుకొనటానికి గాని, యుద్ధసన్నాహాలకోసం కొంతవ్యవధానం పొందటానికి గాని సంశ్రయగుణాన్ని ప్రయోగించటం రాజనీతి. ధర్మరాజు కీస్థితి లేదు. దుర్యోధనుడికి ఆ స్థితి రాలేదు. కాని, బంధుమిత్రుల కందరికీ ఆశ్చర్యం కలిగించేటట్లు ధర్మరాజు అర్ధరాజ్యానికి బదులు ఐదూళ్ళిస్తే చాలునని సంజయుడితో చెప్పాడు. ఇది ఒకవిధమైన లొంగుబాటు కాబట్టి సంశ్రయమే ఔతుంది. దీనికి దుర్యోధను డంగీకరించలేదు. దానివలన దుర్యోధనుడు అపకీర్తిపాలయ్యాడు. ధర్మరాజు కురువృద్ధుల సానుభూతిని పొందగలిగాడు. సంశ్రయాన్ని సాభిప్రాయంగా, సార్థకంగా, సమయోచితంగా వాడుకొన్న సమర్థుడు ధర్మరాజు.

**(5). ద్వైధీభావం:-** ధర్మరాజు నిర్వహించిన శ్రీకృష్ణుడి రాయబారం ద్వైధీభావానికి దివ్యోదాహరణం: ఇందులో సంధివిగ్రహాలు రెండూ ఒకేసారి సాగించటం జరిగింది.

ఉ. 'కావున శాంతిఁ బొందుటయ కర్జము; దా నది యట్టులుండె; శ్రీ
గావలె నంచుఁ బోరితము గామియుఁ గోరెద; మెల్లసొమ్ములుం
బోవుటయుం గులక్షయము వుట్టుటయున్ వెలిగాఁగ నొండుమై
నే విధి నైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా!' **(ఉద్యో. 3.22)**

ఈ పద్యం పై గుణానికి చక్కని నిదర్శనం. సంధివలన శాంతి పొందటం కర్తవ్యం. అయితే రాజ్య సంపదమాత్రం కావాలి. ఆ సంపద యుద్ధం జరగకుండా, కులక్షయం కాకుండా లభించాలి. దానికేదైనా విగ్రహం- అంటే భేదోపాయం- ప్రయోగించాలి. కార్యాన్ని సాధించాలి- అని ధర్మజుడి అభిప్రాయం. కౌరవసభలో ధృతరాష్ట్ర దుర్యోధనులు ప్రభుస్థానంలో ఉన్నవారు. వారిలో ధృతరాష్ట్రుడిని గౌరవిస్తూ సంధి జరుపుతున్నట్లు, గురుభీష్మాది వీరులతో మన్ననతో వర్తిస్తున్నట్లు, దుర్యోధనాదులతో వైరం సాగిస్తున్నట్లు శ్రీకృష్ణుడి రాయబారపు వైఖరి సాగటం ద్వైదీభావగుణ ప్రయోగప్రభావమే. దుర్యోధనుడిని సమర్థిస్తూ అతడి దుర్మార్గానికి దోహదకారి అయిన కర్ణుడితో చెలిమికట్టటానికి యత్నించటంకూడా ద్వైధీభావమే. శ్రీకృష్ణుడి రాయబారం అంత రమణీయంగా ఉండటానికి కారణం ధర్మజనీతిలోని ద్వైధీభావ ప్రదర్శనమే!

(6). యానం:- కౌరవులకు సైన్యసంఖ్యాబలం అధికంగా ఉన్నా, పాండవులు స్వీయబలంమీద విశ్వాసంతో, శ్రీకృష్ణుడి సహాయ సంపత్తితో యుద్ధాన్ని ప్రకటించగలిగారు. ఇక్కడ మరొక విషయం గమనించాలి. రాయబారాల ఘట్టాలలోనూ, రాయబారుల వార్తలను విని విశ్లేషించుకొనే చర్చాగోష్ఠులలోనూ కౌరవ పాండవబల తారతమ్య చర్య విస్తారంగా సాగింది. భీష్ముడు సర్వసైన్యాధ్యక్షుడైన తరువాత విశదంగా ఈ అంశాన్ని వివరించటంకూడా జరిగింది. ఇవన్నీ

పాండవులు క్షీణదశనుండి మహోన్నత దశకు వృద్ధిచెందిన స్థితిని తెలుపుతున్నాయి. ఈ విధంగా ఉద్యోగపర్వంలో షాడ్గుణ్యం సర్వాంగ సుందరంగా, సమర్థంగా చిత్రించబడింది.

ఉద్యోగపర్వంలో ధర్మజుడి వర్తనాన్ని తెలిసికొనాలంటే ఈ క్రింది అర్థశాస్త్ర సూత్రం తెలియాలి-

శ్లో. "ఆత్మవాం స్త్వల్పదేశోఽపి యుక్తః ప్రకృతి సంపదా

నయజ్ఞః పృథివీం కృత్స్నాం జయత్యేవ న హీయతే॥" **(అర్థశాస్త్రమ్. 6 అధి. 1అధ్యా. చివరి శ్లో.)**

(ఆత్మవంతుడై ఉండి ప్రకృతి సంపదతో కూడిన, నీతి శాస్త్రవేత్తయైన రాజు చిన్న దేశం మాత్రమే కలవాడైనాకూడా సమస్తభూమిని జయించి తీరుతాడు. ఎప్పటికీ నశించడు). అయిదూళ్ళిచ్చినా చాలునని అడిగిన ధర్మరాజు హృదయంలోని రాజనీతి రహస్యం ఈ శ్లోకంలో ధ్వనిస్తుంది.

## 4. రాయబారాల చదరంగం ఉద్యోగపర్వం

ఉద్యోగపర్వం సంధియత్నంతో మొదలై యుద్ధయత్నంతో ముగుస్తుంది. సామదానభేదోపాయాలు సంధిలోనే ప్రవర్తిల్లుతాయి. అందులోనే విఫలమౌతాయి. సంధియత్నాలలో రాయబారాల పాత్ర బలంగా ఉంటుంది. అర్హతలనుబట్టి రాయబారాలు-లేక-దూతలు-మూడు విధాలని అర్థశాస్త్రం విశ్లేషించింది. "ఉద్ధృత మన్త్రో దూతప్రణిధిః అమాత్యసంపదోపేతో నిసృష్టార్థః, పాదగుణహీనః పరిమితార్థః అర్ధగుణహీనః శాసనహరః" (అర్థశాస్త్రమ్. 16వ అధ్యాయం 12వ ప్రకరణం, సూత్రం-1.) (మంత్రం నిశ్చితమైన తరువాత దూతల ప్రయోగం జరగాలి. అమాత్యులకు ఉండే గుణసంపద అంతా ఉన్న దూత 'నిసృష్టార్థుడు'. అనగా కార్యభారం అంతా అతడిమీద విడిచివేయవచ్చునని అర్థం. నాల్గవవంతు గుణాలు తక్కువ ఉన్నవాడు 'పరిమితార్థుడు'. (పరిమితమైన ప్రయోజనం కలవాడు అనగా కొంతవరకే అతడికి కార్యభారం అప్పగించాలి). సగం గుణాలు లేనివాడు 'శాసనహరుడు' (అనగా రాజుపంపే వార్తలు తీసికొని వెళ్ళడానికి మాత్రమే తగినవాడు). (బాలానందిని వ్యాఖ్య ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు- పుట.61, 62).

మంత్రానికి తగిన దూతను ఎన్నుకొనటం రాజ్యతంత్ర రహస్యం. మంత్రం పంచాంగసహితం (అయిదంగాలతోకూడి ఉంటుంది). అవి - "కర్మణామారంభోపాయః. పురుష ద్రవ్య సంపత్, దేశకాల విభాగః । వినిపాత ప్రతీకారః, కార్యసిద్ధి రితి పంచాంగో మంత్రః". ఉద్దిష్ట కార్యాన్ని ఆరంభించటానికి అనువైన ఉపాయాన్ని నిర్ణయించటం, అంగబలాన్నీ, అర్థబలాన్నీ అంచనా వేసికొనటం, దేశకాల విభాగ వివేచనను గాఢంగా చేయటం, కార్యసాధనలో ఏర్పడే అవరోధాలకు, విఘ్నాలకు ప్రతిక్రియలను చేయటం, లక్షించిన కార్యాన్ని సాధించి ఫలాన్ని పొందటం- అనే అయిదంగాలనూ రాజనీతి చతురుడైన రాజు నిపుణంగా నిర్వహిస్తాడు. ఉద్యోగపర్వంలోని మంత్రనిర్వహణంలో ధర్మరాజు అగ్రగణ్యుడు; శ్రీకృష్ణుడు సాటిలేనివాడు. వీరిలో ఒకరు రాజు. మరొకరు దూత కావటం ఉద్యోగపర్వ విశేషం.

ఉద్యోగపర్వంలో నలుగురు దూతలు రాజకార్య నిర్వహణంలో తమ తమ పాత్రలను నిర్వహించారు. వారు - 1.ద్రుపదపురోహితుడు; 2.సంజయుడు; 3.శ్రీకృష్ణుడు; 4.ఉలూకుడు. ఈ దూతలను ప్రయోగించినవారు వరుసగా ద్రుపదుడు, ధృతరాష్ట్రుడు, ధర్మరాజు, దుర్యోధనుడు. దూతలనుబట్టి వారి నెన్నుకొన్న రాజుల యోగ్యతలు బయటపడతాయి. వారు నిశ్చయించిన మంత్రబలాలు కూడా వ్యక్తమౌతాయి.

రాజనీతి నిపుణుడైన రాజు మంత్రాన్నిబట్టి దూతలను మంత్రులనుండి కాని, పురోహితులనుండికాని ఎన్నుకొంటాడు.

శ్లో "బ్రాహ్మణే నైధితం క్షత్రం మన్త్రి మన్త్రాభిమన్త్రితమ్
జయ త్యజిత మత్యన్తం శాస్త్రానుగమశస్త్రితమ్". **(అర్థశాస్త్రమ్ 1 అధిక. 9వ అ. చి.శ్లోకం)**

గుణసంపన్నుడైన పురోహితుడిచేత వృద్ధిపొందబడిందీ, మంత్రియొక్క మంతనం అనే మంత్రంచేత పవిత్రీకృతమయిందీ అయిన దండనీతిని అనుసరించటం అనే శాస్త్రాన్ని పట్టిన క్షత్రియకులం మిక్కిలి అభివృద్ధి చెందుతుంది. దానిని ఎవరూ జయించలేరు- అని కౌటిల్యుడు పేర్కొన్నాడు. ఈ సూత్రం ఉద్యోగపర్వానికి అన్ని విధాలా అన్వయిస్తుంది. ఇందులోని దూతలు పురోహితుడు, మంత్రి, బంధువు, స్నేహితుడు మొదలైనవారు కావటం విశేషం!

అర్థశాస్త్రంలో అమాత్యపురోహిత గుణాలు స్పష్టంగా పేర్కొనబడి ఉన్నాయి. అమాత్య లక్షణాలు "జానపదః, అభిజాతః, స్వవగ్రహః, కృతశిల్పః, చక్షుష్మాన్, ప్రాజ్ఞః, ధారయిష్ణుః, దక్షః, వాగ్మీ, ప్రగల్భః, ప్రతిపత్తిమాన్, ఉత్సాహ ప్రభావయుక్తః, క్లేశసహః, శుచిః, మైత్రః, దృఢభక్తిః, శీలబలారోగ్య సత్త్వ సంయుక్తః, స్తమ్భచాపల్య వర్జితః, సంప్రియః, వైరాణా మకర్తేత్యమాత్య సంపత్, అతః పాదార్థ గుణహీనౌ మధ్యమావరౌ". (అర్థశాస్త్రమ్. నవమోఽధ్యాయః, పంచమ ప్రకరణమ్- మంత్రిపురోహితోత్పత్తిః పు.32)

అమాత్యుడు తనదేశానికి చెందినవాడు, మంచివంశంలో పుట్టినవాడు. పొరపాట్లను సులభంగా సరిదిద్ద దగినవాడు, శిల్పాలలో నేర్పరి, రాజుకు నేత్రంవంటిదైన అర్థశాస్త్రంలో పండితుడు, సహజబుద్ధి సంపన్నుడు, జ్ఞాపకశక్తి-లేదా-పట్టుదల కలవాడు, సమర్థుడు, వాక్చాతుర్యం కలవాడు, ప్రగల్భుడు(**bold**), సమయస్ఫూర్తి కలవాడు, ఉత్సాహమూ, ప్రభుశక్తీ ఉన్నవాడు, కష్టాలు సహించగలవాడు, శుచి అయినవాడు, స్నేహశీలుడు, దృఢమైన భక్తికలవాడు, శీలవంతుడు, ఆరోగ్యధైర్యాలు కలవాడు. మొండితనం, చాపల్యం లేనివాడు, అందరినీ ఆకట్టుకోగలవాడు, అనవసరమైన తగాదాలు సృష్టించనివాడు అయి ఉండాలి. ఈ గుణాలన్నీ కలవాడు ఉత్తముడు. వీటిలో నాల్గవవంతు లేనివాడు మధ్యముడు. సగం లేనివాడు అధముడు.

**పురోహితుడి గుణాలు:-** "పురోహిత ముదితోదిత కులశీలం షడఙ్గే వేదే దైవే నిమిత్తే దణ్డనీత్యాం చ అభివినీతమ్. ఆపదాం దైవమానుషీణామ్ అథర్వభిరుపాయైశ్చ ప్రతికర్తారం కుర్వీత. తమాచార్యం శిష్యః పితరం పుత్రో భృత్యః స్వామిన మివ చాను వర్తేత". (అర్థశాస్త్రమ్. పు. 33)

ఉన్నత కులసంజాతుడు, శీలవంతుడు, వేదవేదాంగాలనూ జ్యోతిషాది దైవసూచనలు గల శాస్త్రాలనూ తెలిసినవాడూ, శకునజ్ఞుడు, దండనీతిశాస్త్రజ్ఞుడు, దైవంవలన గాని, మానవులవలనగాని కలిగే ఆపదలను తొలగించగల అధర్వవేదమంత్ర ప్రయోగాలు గాని, ఇతరోపాయాలుగాని ప్రతిక్రియలుగా చేయగలవాడు పురోహితుడు. అన్ని పనులలోనూ అగ్రస్థానంలో ఉంచబడదగిన పురోహితుడిని- శిష్యుడు ఆచార్యుడినివలె, పుత్రుడు తండ్రినివలె, భృత్యుడు యజమానునివలె రాజు ఎప్పుడూ అనుసరించి ఉండాలి. (అర్థశాస్త్రమ్ పు.34).

**(1). ధర్మరాజుకొరకు హితులు సాగించిన పురోహిత దౌత్యం**

ద్రుపద పురోహితుడు దూతగా పంపదగిన యోగ్యత కలవాడు.

క. 'హితుఁడవు, మతిమంతుండవు, । చతురవచనకోవిదుఁడవు, సమయజ్ఞుఁడ, వు
న్నతవంశవర్ధనుఁడ, విం । గితవేదివి, నెచ్చెలివి, సుకృతి; వట్లగుటన్' **(ఉద్యో. 1.53)**

పాండవ దూతగా పంపటానికి పూనుకొన్నట్లు ద్రుపదుడు పేర్కొన్నాడు. అమాత్యలక్షణాలు కొన్ని కలిగి ఉన్న రాజపురోహితుడు ఈ దూత. ఇతడు ఉత్తమ పురోహిత దూత. ఇతడిని నియోగించినవాడు ద్రుపదుడు. అతడు నిర్వహింపదలచుకొన్నది బంధుకార్యం. పాండవులు అతడి అల్లుళ్ళు కావటంచేత అతడికి బంధుత్వంతోపాటు గురుత్వంకూడా ఉన్నది, బాధ్యతకూడా ఉన్నది. దూతను నియోగించి అతడిని వినియోగించుకొనే విధానాన్ని కూడా ద్రుపదుడు స్పష్టం చేశాడు.

క. 'ఇతఁడు మదీయాగ్ర పురో । హితుఁ; డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగన్
ధృతరాష్ట్ర కడకుఁ బనుపుఁడు । చతుర వచన రచనఁ గఱపి సంప్రీతిమెయిన్.'

ఉ. 'ఆతని సమ్ముఖంబునఁ దదగ్రతనూజు కడన్ మరున్నదీ
జాతుని సన్నిధిం గలశసంభవు నొద్దఁ గ్రమోచితంబుగా
నీ తెఱఁ గిట్టు లాడుమని యేర్పడ నంతయుఁ జెప్పి పుచ్చఁగా
నీతిమెయిం దగం బలుక నెయ్యము లాభముఁ బెంపు జొప్పడున్'. **(ఉద్యో. 1.38, 39)**

అర్థశాస్త్రాన్ని అనుసరించి ద్రుపదపురోహితుడు శాసనహరుడివంటివాడు. కురుసభలో ఎవరెవరితో ఏయే విధంగా మాట్లాడాలో రాజు నిర్దేశించినట్లు అతడు మాట్లాడి ఫలితాంశం పరిస్థితులమీదనే వదలేవాడు. పాండవపక్షాన ఎటువంటి నిర్ణయం స్వయంగా తీసికొనే చొరవ అతడికి లేదు. రాజనీతి తెలిసినవాడు కాబట్టి అతడు నిపుణంగా మాట్లాడగలడు. ఆ మాటలవలన సాధించబడవలసిన ప్రయోజనాలు మూడు- 1. కౌరవపాండవుల మధ్య స్నేహం. 2. పాండవులకు రాజ్యలాభం. 3. పాండవులకు అభ్యుదయం. ఈ ఫలితాలు సాధించగలిగే చతురవచన రచనను పురోహితుడికి ధర్మరాజాదులు నేర్పాలని ద్రుపదుడు నిర్దేశించాడు. అంటే ద్రుపదపురోహితుడి శక్తి యుక్తులు స్వతంత్రదూతకార్యానికి సమర్థాలు కావని స్పష్టంచేశాడు. అతడికి కౌరవసభలో చేయవలసిన 'ఎల్లపను'లనుకూడా పూసగ్రుచ్చినట్లు చెప్పిపంపవలసి ఉంటుందని కూడా పేర్కొన్నాడు. అందువలన పురోహితదూత ఉత్తమ శాసనహరుడు.

దైన్యం లేకుండా, రాజ్యభాగాన్ని యాచిస్తున్నట్లు కాకుండా, ధర్మరాజు తన రాజ్యభాగాన్ని ఏలుకొనే హక్కును అమలు పరచుకొనటానికి ధృతరాష్ట్రుడి సమ్మతిని కోరుతున్నట్లుగా కురుసభలో దూత మాట్లాడాలి. ఇది లోకమర్యాదను పాటించే పద్ధతిలో సాగించే రాయబారం. దీనికి ధృతరాష్ట్రుడు సహజంగా, న్యాయపద్ధతి ననుసరించి సమ్మతి తెలపాలి. అందులో అవరోధాలు ఉండటానికి వీలులేదు. కాబట్టి గౌరవప్రదంగా పాండవభాగాన్ని అనుభవించటానికి వారిని ఆహ్వానించాలి లేదా అనుమతించాలి. దానికి భిన్నంగా ఎటువంటి అసంబద్ధపు మాటలు పలికినా దానికి ఫలితాలు ఎట్లా ఉంటాయో కూడా వారికి తెలియచెప్పాలి. ఆ తరువాత జరిగేది జరుగుతుంది. ఇదీ రాయబారపు స్వభావం. ఇందులో పాండవపక్షంలోని అభిప్రాయాలకు అనుగుణంగా పలుకుమని చెప్పిన పద్ధతిలో మాటలాడటమే దూతకార్యం. ఇది మర్యాదగా పంపుతున్న పాండవుల హెచ్చరిక. అంతేకాదు, పాండవులు స్వయంగా పంపేదేకాకుండా పాండవ హితులూ బంధువులూ స్నేహితులూ కలిసి పంపుతున్న హితవాక్యం. ఇందులో మంచిమాటలూ ఉంటాయి. మందలింపులూ ఉంటాయి. హితవూ ఉంటుంది. తగవూ ఉంటుంది. వినయమూ ఉంటుంది. వీరాలాపమూ ఉంటుంది. ఇందులో చెప్పటమే ముఖ్యం. కౌరవులు వినకపోతే వారి కర్మకు వారే బాధ్యులు. ఈ రాయబారంలో పాండవుల రాజ్యభాగానికి సంబంధించిన హక్కును భుక్తంచేసికొనే సమ్మతి కొరకు మర్యాదగా ధృతరాష్ట్రుడి ఎదుట ప్రస్తావించటం ముఖ్యం. వారి ప్రతిస్పందన అనుకూలమైతే స్నేహం, లాభం, అభ్యుదయం. విపరీతమైతే యుద్ధం, నష్టం, వంశనాశం ఏర్పడతాయి. ఈ తులనాత్మక అవగాహన కలిగేటట్లు కురుసభలో పలికి ధృతరాష్ట్రుడు తగిన నిర్ణయం తీసికొనేటట్లు చేయటం దూతకార్యం. ఇందులో దూతకు స్వాతంత్ర్యం

లేదు. చెప్పినట్లు చేయటమే కార్యం. రాయబారం వలన కలిగే ఫలితాలకు అతడు బాధ్యుడు కాడు. అయితే, నిర్దేశించిన పనులనుగాని, పలుకుమన్న మాటలుగాని వివేకంతో చేయాలి, చెప్పాలి. దానికి తగిన సంస్కారం ఉన్నవాడు ద్రుపదపురోహితుడు. అందుకే అతడు ఉత్తమ శాసనహరుడు.

ద్రుపదపురోహితుడి రాయబారం పాండవపక్షంలో ఉన్న పెద్దలందరి అభిప్రాయాల సారాంశంగా కనబడుతుంది. ప్రత్యేకంగా ధర్మరాజాదులు చెప్పి పంపిన మాటలు కావు. అయినా, అవి ధర్మరాజుయొక్క అంగీకారాన్ని పొందినవే. ద్రుపదపురోహితుడు కౌరవసభలో ఒక హితవరి, మధ్యవర్తి, పెద్దమనిషి, ఇంగితజ్ఞుడు, అభిమానధనుడు మాట్లాడుతున్నట్లుంటుంది. అయితే, ఆ మాటలన్నీ అతడివి కావు, పాండవ పక్షంలో ఉన్న పెద్దలమాటలు. ఈ అభిప్రాయం వీరిది అని ప్రత్యేకంగా పేర్కొనకుండా పలికిన సామూహిక సందేశసారాలు. అందువలన పురోహిత దూతకు ఆ మాటలలో ఎటువంటి కర్తృత్వ భోక్తృత్వాలు లేవు.

ఒక్కమాటలో చెప్పాలంటే ద్రుపదపురోహితుడి దౌత్యం పాండవహితులు ధర్మరాజు కొరకు నడిపిన రాయబారం! అతడు పలికిన తీరులో ఉన్న పారుష్యం బ్రాహ్మణ స్వభావంగా భీష్ముడికి తోచింది. అయినా, ఆ కరకుదనం ఆయనకు చెప్పి పంపిన వారిదే. దానిని కప్పిపుచ్చి దూతమీద పెట్టి మాట్లాడాడు భీష్ముడు. అది ధృతరాష్ట్రుడి మనసుకు రాపిడి కలిగించింది. కాని, అతడు పాండవులు రాజ్యభాగం అనుభవించే హక్కుకు 'సమ్మతి' ప్రకటించలేకపోయాడు. అందుకే సంజయుడి రాయబారం పంపవలసివచ్చింది. విరుద్ధభాషణం సభలో చేయకుండా రాయబారి ద్వారా పలకటం ధృతరాష్ట్రుడి రాజనీతి!

**(2). ధర్మరాజుగురించి ధృతరాష్ట్రుడు చేసిన అమాత్యదౌత్యం**

సంజయుడు ధృతరాష్ట్రుడి హితుడు, అమాత్యుడు. కౌటిల్యుడి అర్థశాస్త్రంలో చెప్పబడిన అమాత్యగుణాలన్నీ ప్రధానమంత్రికి ఉండదగినవి. సంజయుడు ప్రధానమంత్రి కాడు. సన్నిహితుడైన అమాత్యుడు, హితుడు, బంధువు, శాస్త్రోక్తంగా చెప్పాలంటే ప్రధానమంత్రి విదురుడికంటె కొన్నిగుణాలు తక్కువవాడని చెప్పాలి. అయినా బుద్ధిమంతుడు, విశ్వాసపాత్రుడు. అందువలననే దూతగా ధృతరాష్ట్రుడు ఎన్నుకొన్నాడు. అతడు సంజయుడి రాయబారం ద్వారా సాధింపదలచుకొన్న కార్యం పరిమితమైనది. దాన్ని స్పష్టంగా సంజయుడికి తెల్పాడు.

క. 'నెయ్యము వాటించి కడుం । దియ్య మెసఁగ నలుకలెల్లఁ దీఱునటులుగాఁ
గయ్య మనుతలఁపు లోనుగ । నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగుగాన్'. **(ఉద్యో. 1.271)**

ధర్మజుడి కోపాన్ని తగ్గించేటట్లు, అతడు యుద్ధం మాట మానేటట్లు, నిపుణంగా మాట్లాడాలి. ఆ మాటలలో స్నేహం, తియ్యదనం జాలువారాలి. వాటిని విన్న ధర్మరాజు కోపాన్ని మరచిపోయి 'శాంతి ప్రకారంబునం కార్యంబు నడపి, యొక్కటియై మనేటట్లు ఒడబరచాలి'- అనేది దౌత్యలక్ష్యం. ధర్మజుడు శాంతిస్తే రాజ్యభాగం ఇస్తాననలేదు; కౌరవులూ పాండవులూ ఒక్కటియై ఎట్లా ఉంటారో సూచించలేదు. అందువలన సంజయుడు ఆ అంశాలమీద మాట్లాడే వీలులేదు. వాటిని తేల్చి చెప్పకపోతే ధర్మజుడు శాంతించే అవకాశమే లేదు. అయినా, సంజయుడు మాట నేర్పరితనంతో ధర్మరాజును శాంతమూర్తిగా మార్చాలి. ధర్మజుడి మనసు మారితే చరిత్ర మారుతుంది. పాండవపక్షం అతడి ఆనతిని శిరసావహిస్తుంది. భీమాదులు ధర్మజవాక్యబద్ధులై ఉంటారు. శాంతుడైన ధర్మరాజులో రాజ్యకాంక్ష సమసిపోయే శమభావం మొసులెత్తాలి. అంటే- యుద్ధోత్సాహానికి మూలమైన రాజ్యకాంక్షను తొలగిస్తే ధర్మజుడు మునివృత్తిని స్వీకరించవలసిందే. జీవితాంతం అడవులలో తాపసజీవితం గడుపుకొంటూ ఉండవలసిందే. అదే ధృతరాష్ట్రుడు లక్షిస్తున్న పరిష్కారం. అదే ఆయన దృష్టిలో 'ఒకటియై ఉండటం'. ఈ పరిమిత ప్రయోజనం కొరకు రాయబారం చేసే సంజయుడు 'పరిమితార్థుడు'.

ద్రుపదపురోహితుడి దౌత్యంలో ధృతరాష్ట్రుడు హితులచేత రెచ్చగొట్టబడిన ధర్మరాజును ఊహించాడు. అతడి కోరికను మన్నించటం గ్రుడ్డిరాజుకు ఇష్టంలేదు. అందువలన ధర్మరాజులో మానసిక పరిణామాన్ని తెస్తే యుద్ధోద్యోగమే ఆగిపోతుందని, అసలుకే మోసం తెచ్చే భేదనీతిని ప్రయోగించాడు. ఈ నీతి అందరికీ తెలిపి చేసింది కాదు. తన చుట్టుప్రక్కల ఉన్న మంత్రి మండలికీ, హితులకూ చెప్పిన తీరు వేరు. ఆ తరువాత సంజయుడికి ఏకాంతంలో బోధించిన విధం వేరు కావటంచేత ఈ రాయబారం అందరికీ తెలిసేటట్లు చేసినా, అందరి అభిప్రాయాలకూ ప్రాతినిధ్యం వహించదు. 'ధృతరాష్ట్ర డొక్కడూ రాజ్యభాగానికి అంగీకరిస్తే ఇతరులందరూ అంగీకరించినట్లే ఔతుం'దని ధర్మరాజు భావిస్తే, దానికి ప్రతిగా 'ధర్మరాజుకూడా శాంతిస్తే అందరూ శాంతించినట్లే ఔతుం'దని ధృతరాష్ట్రుడు దూతను ప్రయోగించాడు. సంజయదౌత్యంవలన సాధించబడేది ఏమీ ఉండదని తెలుసు. కాని, అదృష్టవశాత్తు ధర్మజుడు మారితే ఆపద తప్పుతుందని అనుకొన్నాడు ధృతరాష్ట్రుడు. అతడు చేసిన ఈ గూఢప్రయోగం (విగ్రహం) అతడికే కాక, అతడి పక్షం వారికంతా సుడిగుండంవలె చుట్టుకొంటుందని భావించలేకపోయాడు. ఒకవేళ రాయబారాన్ని సమగ్రస్ఫూర్తితో నిర్వహించుమని సంజయుడిని కోరి ఉన్నట్లయితే ఫలితం మరొకరకంగా ఉండేది. అట్లా కావటం ధృతరాష్ట్రుడి అభిమతం కాదు. అందుకే ఉత్తముడు కాని రాజుచేత ప్రయోగించబడిన సంజయుడు ఉత్తమదూత కాలేకపోయాడు. రాయబారం సఫలం కాదని సంజయుడికీ తెలుసు. కాని, సంధి యత్నంలో సామర్థ్యాన్ని ప్రదర్శిస్తే సహృదయుల సానుభూతిని పొందవచ్చునని తన ధర్మాన్ని శక్తివంచన లేకుండా నిర్వహించాడు. చివరకు ధర్మజుడి ప్రశంసల నందుకొన్నాడు కూడా!

క. 'ఎదురున్న రూపు వలుకఁగఁ । దుదిఁ గటకటఁ బడవు; నీవు దుర్ణయమును బె
ట్టిదమును, బెండును నగుపలు । కొదవదు నీ నాలుకకు నయోన్నత! యెపుడున్'.

క. 'నీ వొండె విదురుఁ డొండెను । గావలయుంగాక యిట్టి కార్యంబులకున్
రా వేఱ కలరె తగువా? । రీ వినయము నేర్పుగలదె యితరుల కెందున్?'. **(ఉద్యో. 1. 363,364)**

మొత్తం మీద సంజయ దౌత్యం ధర్మరాజును గురించి (ఉద్దేశించి) సాగించిన రాయబారమే.

### (3). ధర్మరాజే ధర్మనీతి కొరకు చేసిన రాయబారం శ్రీకృష్ణ దౌత్యం

శ్రీకృష్ణుడు అమాత్యుడు కాడు; పరమాత్ముడు. పాండవులకు ఆరాధ్యదైవం. ఆత్మబంధువు. మార్గదర్శి. ఆయన తనంతట తానే హస్తినాపురానికి పోయి ధృతరాష్ట్రుడికి హితవు చెప్పి, కులక్షయం కాకుండా, సంధి కుదిరించి పాండవులకు రాజ్యలాభం కలిగిస్తానని ప్రకటించుకొన్నాడు. అతడు స్వయంగా నియోగించుకొన్న పెద్దమనిషి రాయబారి. కౌరవపాండవులకు హితంకోరే మధ్యవర్తి. అయినా, పాండవపక్షవర్తి, ధర్మపక్షపాతి. ఆయనకు ధర్మరాజు తన అభిప్రాయాన్ని చెప్పి, తమకు హితంజరిగేటట్లు సంధినడుపుమని ప్రార్థించాడు. శ్రీకృష్ణు డాయన ఆనతిని పాటిస్తానని మాటయిచ్చాడు. ఆయన ఆశించే ఫలితాలు సిద్ధించేటట్లు దౌత్యం చేస్తానని ధైర్యం చెప్పాడు. సంజయుడి వర్తమానం ప్రకారం శ్రీకృష్ణుడు ఉభయులు (కౌరవపాండవుల) శ్రేయోభిలాషిగా హస్తినకు వస్తున్నాడు. పాండవుల దృష్టిలో అతడు ధర్మరాజునియోగాన్ని నిర్వహించటానికి హస్తినకు వెళ్ళుతున్నాడు. మరి, పరితల దృష్టిలో ఆయన యుద్ధాన్ని సిద్ధాంతీకరించటానికి హస్తినకు సర్వాధికారిగా చేరుతున్నాడు. ఆయనను రాయబారి అన్నదానికంటె హితవరి అని అనటం మేలు. అయినా, దుర్యోధనాదులైన కౌరవులందరూ అతడిని పాండవదూతగానే భావించారు, వ్యవహరించారు. అందువలన దూతకార్యంలో నియుక్తుడైన హితవరి సర్వాధికారి శ్రీకృష్ణుడు.

కౌటిల్యుడి అర్థశాస్త్రం ప్రకారం శ్రీకృష్ణుడు ప్రధానామాత్య లక్షణాలన్నీ సంతరించుకొన్న 'నిసృష్టార్థుడు'. దౌత్య లక్ష్యాలన్నింటినీ పేర్కొన్న ధర్మరాజు వాటిని సాధించే ఉపాయాలను కొన్ని సూచించాడే కాని, అన్నీ ఆయనకు వివరించి చెప్పలేదు. చివరకు-

క. ‘మమ్మెఱుఁగు, దెదిరి నెఱుఁగుదు, । నెమ్మి యెఱుఁగు, దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు, వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు, । పొ మ్మెవ్వఁడ నీకు నేను బుద్ధులు సెప్పన్?’ **(ఉద్యో. 3.34)**

అని శ్రీకృష్ణుడిపై సర్వకార్య నిర్వహణ భారాన్ని వదలివేశాడు. అర్జునాదులు శ్రీకృష్ణు డేనిర్ణయం చేస్తే దానినే శిరసావహిస్తామన్నారు. పురుషకారం, దైవానుకూల్యం రెండూ శ్రీకృష్ణుడే అని భావించారు. ఆయన తిమ్మిఅంటే తిమ్మి, బ్రహ్మి అంటే బ్రహ్మి ఔతుందని విశ్వసించారు. అందుకే సంధికై వెళ్ళిన శ్రీకృష్ణుడు యుద్ధాన్ని ప్రకటించి వచ్చాడు. శ్రీకృష్ణుడు సర్వస్వతంత్రుడైన పాండవదూత. ధర్మరాజుహృదయంలోని ధర్మనీతికి క్రియాశక్తి!

సర్వధర్మాభిజ్ఞుడైన శ్రీకృష్ణుడు దూతపాత్రను నిర్వహిస్తున్నప్పుడు దూత చేయవలసిన పనులన్నీ నిర్వహించి ఆ వృత్తికి ఒక ఆదర్శాన్ని కల్పించాడు. కౌటిల్యుడి అర్థశాస్త్రంలో దూత కార్యాలు ఇట్లా చెప్పబడ్డాయి.

శ్లో. “ప్రేషణం సంధిపాలత్వం ప్రతాపో మిత్రసంగ్రహః
ఉపజాపః సుహృద్భేదో దణ్డ గూఢాతిసారణమ్
బన్ధురత్నాపహరణం చారజ్ఞానం పరాక్రమః
సమాధిమోక్షో దూతస్య కర్మయోగస్య చాశ్రయః”. **(అర్థశాస్త్రమ్. 1 అధికరణం. 16వ. అధ్యా. పు.68.)**

వార్తలు పంపటం, ఇతర రాజులతో తనస్వామి చేసికొన్న సంధులను గట్టిచేయటం, తన స్వామి గొప్పతనాన్ని చాటడం, మిత్రులను సంపాదించటం, కృత్యాదులను రెచ్చగొట్టడం శత్రువుల స్నేహితులలో భేదం కలిగించటం (వాళ్ళను విడదీయటం). సైన్యాన్నీ, గూఢపురుషుల్నీ శత్రురాజ్యంలోనికి ప్రవేశపెట్టడం, శత్రువుల బంధువులను, రత్నాలను అపహరించడం, రహస్య సమాచారాలు తెలిసికొనటం. పరాక్రమం చూపడం, సమాధిని (పూచీకత్తుకోసం పట్టుబడిన వాడు **Hostage**) విడిపించటం, రహస్యమైన ఉపాయాలు పన్నడం- ఇవి దూతలు చేయవలసిన పనులు. (వ్యాఖ్య: ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు. పు.68).

శ్రీకృష్ణుడు దూతగా ఈ పనులనన్నింటినీ కార్యసాధనకు అనువుగా నిర్వహించిన నిపుణుడు. శ్రీకృష్ణుడు హస్తినాపురానికి చేరే వార్తల ప్రసారం విస్తారంగా సాగింది. విదురాది పాండవ శ్రేయోభిలాషుల హృదయాలలో చెరగకుండా ఉన్న పాండవాభిమానాన్ని పక్షపాతంగా పరివర్తింపచేశాడు శ్రీకృష్ణుడు. కురుసభలో పాండవ ధర్మనీతిని, వారి పరాక్రమ విశేషాలను శత్రుభయంకరంగా పొగడి వారి గొప్పతనాన్ని చాటాడు. శ్రీకృష్ణుడి ఉపన్యాసం విన్న రాజులు పాండవ ధర్మవర్తనంమీద సానుభూతిని పెంచుకొన్నారు. దుర్యోధన దుర్నీతిని అంతరాంతరాలలో గర్హించారు. శ్రీకృష్ణుడు కర్ణాది దురభిమానులను రెచ్చగొట్టి కురుసభలో కల్లోలం సృష్టించాడు. దుర్యోధనుడి బహిఃప్రాణమైన కర్ణుడి జన్మరహస్యం చెప్పి భేదోపాయాన్ని ప్రయోగించాడు. హస్తినాపురంలో సమకూడిన శత్రు శిబిరాలలోని వీరుల తీరులను, వారి బలాబలాలను, రహస్యాలను తెలిసికొన్నాడు. దుష్టచతుష్టయం శ్రీకృష్ణుడిని లంచాలతో వశంచేసుకొనటానికీ, ఆహారంలో విషం పెట్టి చంపడానికీ, ఒంటరివాడిని చేసి బంధించి వధించటానికీ యత్నించగా, స్వీయప్రతాపాన్ని ప్రదర్శించి తనను తాను రక్షించుకొన్నాడు, చతుర్విధోపాయాలను యథావకాశంగా ప్రయోగించాడు. దూతకార్యాల నన్నింటినీ ప్రదీప్తంగా నిర్వహించిన శ్రీకృష్ణుడు ఉత్తమదూత! విశ్వరూపాన్ని ప్రదర్శించి ధృతరాష్ట్రుడిని అనుగ్రహించి దివ్యాదివ్యుడనిపించుకొన్న శ్రీకృష్ణుడు పాండవదూతయే కాక, ధర్మదూత అనిపించుకొన్నాడు. శ్రీకృష్ణుడివంటి దివ్యాత్ముడైన దూత న భూతో న భవిష్యతి.

ముగ్గురు దూతల ముచ్చటను ఒక్కచోట ముడివేస్తే ఇట్లా చెప్పవచ్చును.

1. ధర్మరాజు కొరకు హితులు చేపట్టిన రాయబారం పురోహిత దౌత్యం. పురోహితుడు ‘శాసనహరుడు’.
2. ధర్మరాజు నుద్దేశించి ధృతరాష్ట్రుడు నడిపిన అమాత్యదౌత్యం సంజయదౌత్యం. సంజయుడు ‘పరిమితార్థుడు’.

3. ధర్మరాజు స్వయంగా ధర్మనీతి కొరకు చేసిన రాయబారం శ్రీకృష్ణ దౌత్యం. శ్రీకృష్ణుడు - 'నిసృష్టార్థుడు'.

**(4). అహంకారి చేపట్టిన అధిక్షేపదౌత్యం ఉలూకుడి రాయబారం**

ఉద్యోగపర్వం చివర దుర్యోధనుడు దురహంకారంతో పాండవ ప్రతిజ్ఞలను అధిక్షేపిస్తూ ఉలూకుడితో పంపిన సందేశం ఆవేశ ప్రధానంగా, అధిక్షేపాత్మకంగా సాగింది. ఉలూకుడు వస్తుతః శాసనహరుడివంటి దూత. మర్యాదలేకుండా మాట్లాడినా, ఉలూకుడిని మర్యాదతో చూచి, మర్యాద తెలియని దుర్యోధనుడికి తగిన సమాధానాన్ని తిప్పి పంపిన పాండవపక్షం గౌరవాన్ని గడించింది. దుర్యోధనుడి అధిక్షేపం పాండవవీరులలో యుద్ధోత్సాహాన్ని ఇనుమడింపజేసింది.

రాయబారపు ఘట్టాలలో గమనించదగిన మరొక అంశం- ఏమంటే. ఉలూకుడు, పురోహితుడు, సంజయుడు రాయబారులుగా వెళ్ళేముందు వారి ప్రభువులు వారికి చెప్పిన మాటలు తిక్కన వివరించలేదు. కాని, శ్రీకృష్ణుడు హస్తినాపురికి వెళ్ళేముందు ఉపప్లావ్యంలో పాండవవర్గంవారందరూ తమ తమ అభిప్రాయాలు చెప్పారు. హస్తినలో కౌరవ ముఖ్యులందరూ ఆయనతో చర్చించారు. శ్రీకృష్ణుడు ఇక్కడా, అక్కడాకూడా విశదంగా మాట్లాడాడు. ఉత్తముడైన రాయబారిని చిత్రించటంలో పాటించవలసిన సమగ్రశిల్పం శ్రీకృష్ణుడి రాయబారానికే దక్కింది. అందుకు కారణం రాజు ఉదాత్తుడు కావటం, రాయబారి ఉత్తముడు కావటమే. అంతేకాదు భావికథకు పోషకమైనది శ్రీకృష్ణుడి రాయబారమే.

కాగా, ఆయా రాజులయెదుట రాయబారులు మాట్లాడిన తీరు తెన్నులను తీర్చిదిద్దటంలో తిక్కన కావ్యకళాశిల్పాన్ని కమనీయంగా పోషించాడు. మరేపర్వంలోనూ ఇంతటి రాజనీతి చర్చ కానరాదు, రూపకోచిత రసోల్లాసం రాణించదు; పాండవకౌరవ పరాక్రమ తులనాత్మక చర్చ ఇంతగా ప్రత్యక్షం కాదు. దానిని అనుశీలించటం ఉద్యోగపర్వ శిల్ప కళావైభవాన్ని దర్శించటం!

**5. తిక్కన రచన : నాటకీయత**

తిక్కన సోమయాజి 'ఉభయకవిమిత్రుడు'. సంస్కృతాంధ్రభాషలలో కవిత్వం చెప్పటంవలన, దృశ్యశ్రవ్య ప్రక్రియలను రచనలో పోషించటంవలన, మార్గదేశీ పద్ధతులను సమన్వయించటంవలన, నిర్వచన చంపూకావ్య ప్రక్రియలను నిర్వహించటంవలన, కావ్యాన్నీ ఇతిహాసాన్నీ సంవిధానం చేయటంవలన, తత్సమ ఆచ్ఛికపదాలను నిపుణంగా మేళవించటంవలన- ఇటువంటి కారణాలవలన తిక్కనకు 'ఉభయకవి మిత్రు'డనే బిరుదు సార్థకమైనది. పై లక్షణాలలో శ్రవ్యకావ్య ప్రక్రియలో దృశ్యస్వభావాన్ని పొందుపరచి చెప్పే కావ్యరచనా విధానాన్ని 'నాటకీయత' అని అంటారు.

కావ్యంలో నాటకీయత - రంగపరికల్పన, చతుర్విధాభినయ ప్రదర్శన, వర్ణన, రూపకోచిత కావ్యాంశాల సంవిధానం మొదలైన అంశాలమీద ఆధారపడి ఉంటుంది. ఒక సన్నివేశాన్ని కొన్ని రంగాలుగా చిత్రించటానికి వీలుంటే, వాటిని కల్పించి రూపక స్వభావాన్ని కావ్యంలో చొప్పించటం రంగపరికల్పన. అభినయం నాలుగు రకాలు. 1.ఆంగికం, 2.ఆహార్యం, 3.వాచికం, 4.సాత్త్వికం. తిక్కన ఈ నాల్గింటిని యథోచితంగా పాత్రల అభినయంలో వర్ణించి రసాన్ని రక్తికట్టించటం చతుర్విధాభినయ ప్రదర్శనం. కావ్యనాటకోచిత వర్ణన. పతాకాది రూపకోచిత అంశాలను కావ్యంలో సంవదించటం మరొక లక్షణం. వీటిని ఉద్యోగపర్వ శిల్పానుశీలనలో భాగంగా పరిశీలించటం ప్రస్తుతాంశం.

నాటకీయతకు నారుపోసినట్లుంటుంది ఉద్యోగపర్వం. కథలో సహజంగా అమరిన సభలూ, సమావేశాలూ, సన్నివేశాలూ, సంభాషణలూ నాటకీయతకు జీవితాన్ని కల్పించాయి. సభలు నాటకంలోని అంకాలవలె, సమావేశాలు రంగాలవలె, సన్నివేశాలు దృశ్యాలవలె, సంభాషణలు సంఘటనలవలె రాణించటం విశేషం. కథన వర్ణనలు పూలదండలోని దారంవలె, యక్షగానంలో సూత్రధారవచనంవలె అమరి నాటకీయతకు కావ్యకళా గౌరవాన్ని కలిగిస్తున్నాయి.

రాజనీతి ప్రధానమైన ఉద్యోగపర్వంలో వ్యర్థ సన్నివేశంగాని, సంభాషణంగాని లేదు. అందుచేత రచన చక్కగా చిక్కగా సాగింది. అర్థవంతంగా నడిచింది. ఆలోచనామృతంగా ఆస్వాదనీయ గౌరవాన్ని పొందింది. తిక్కనలోని మహాకవి మహామంత్రిగా ఉద్యోగంలో ఉన్మీలించాడు. ఉదాత్తమైన ఒక మహానాటకం వంటి గొప్పకావ్యం (ఉద్యోగపర్వం) తెలుగువారికి దక్కింది.

మహానాటకంలో పది అంకాలున్నట్లుగా ఉద్యోగపర్వంలో పదిసభలు అంకాలుగా చిత్రించబడ్డాయి. ప్రధానపాత్రలతో రసవత్తరమైన సంభాషణలతో ఏకదివస వృత్తం ప్రదర్శితమైతే అంకం. అట్లాగే ఉద్యోగపర్వంలోని సభారంగాలు పది అంకాలుగా ప్రకాశిస్తున్నాయి. వాటిని ఈ క్రింది విధంగా గుర్తించవచ్చును.

**(1). అంకాలుగా గోచరించే సభలు**

| | |
|---|---|
| 1. ఉపప్లావ్యంలోని ధర్మరాజు సభ | 1. 6-50 |
| 2. ద్రుపదపురోహితుడి రాయబారం సాగిన ధృతరాష్ట్రుడి నిండుసభ. | 1. 230-257 |
| 3. సంజయుడి రాయబారం నడిచిన ధర్మరాజు పేరోలగం. | 1. 272-380 |
| 4. సంజయుడి పాండవసందేశాలు వినిపించిన ధృతరాష్ట్ర సభ. | 2. 116-302 |
| 5. పాండవులు శ్రీకృష్ణుడికి తమ సందేశాలను వినిపించిన శ్రీకృష్ణమందిర సభ. | 3. 5-129 |
| 6. శ్రీకృష్ణుడి రాకనుగురించి సమాలోచించిన ధృతరాష్ట్రుడి సభ | 3. 148-172 |
| 7. శ్రీకృష్ణుడి రాయబారం సాగిన ధృతరాష్ట్ర మహాసభ | 3. 247-411 |
| 8. శ్రీకృష్ణుడి తన రాయబారపు విశేషాలు తెలిపిన ధర్మరాజు సభ | 4. 72-112 |
| 9. ఉలూకుడి రాయబారం సాగిన పాండవ స్కంధావారం | 4. 817-210 |
| 10. భీష్ముడు కౌరవపాండవ వీరుల బలాబల నిరూపణం చేసిన స్వీయ స్కంధావార మందిర సభ | 4. 211-425 |

దశాంక సదృశమైన ఈ సభాఘట్టాలలో మహానాటకంలోవలె ప్రతిరెండు (అంకాలవంటి) సభలలోనూ కలిసి, ఒక్కొక్క సంధి నిర్వహించబడుతూ మొత్తంమీద పంచసంధులు పోషించబడేటట్లు వస్తునిర్మాణం జరగటం ఈ పర్వ విశేషం. ఉపప్లావ్యనగరంలో ఉద్యోగానికి బీజావాపనం జరిగింది. ధృతరాష్ట్రుడి సభలో ద్రుపదపురోహితుడు దానిని కార్యారంభంగా మలచి ప్రదర్శించాడు. ముఖసంధి అక్కడ భాసించింది. ధృతరాష్ట్రుడు సంజయుడిని రాయబారిగా పంపటం, ఆ గ్రుడ్డిరాజుమనోగతాన్ని సంజయుడు ధర్మరాజు సభలో వివరించటం, దానిమీద ధర్మజాదులు ఆగ్రహాన్ని వ్యక్తం చేయటం, శ్రీకృష్ణుడు హస్తినకు పోయి శాంతియత్నం చేయటానికి ముందుకు రావటం బిందువువంటిది. ఆ బిందువే కార్యక్షేత్రమంతా నీటిపై తైలబిందువువలె వ్యాపిస్తుంది. ధృతరాష్ట్రుడి సభలో సంజయుడు పాండవసందేశాలను వినిపించటం, వాటిపై కౌరవవీరుల పరస్పర చర్చలు, తీవ్రవాదోపవాదాలు రేగటంవంటివి తీవ్రయత్నాన్ని సూచిస్తున్నవి. ప్రయత్న బిందు సంబంధం గలది ప్రతిముఖసంధి. పాండవులు సంధి సందేశాలను శ్రీకృష్ణుడికి వినిపించటంలోనూ సంధి జరగదనే అనుమానంతోనే చతుర్విధోపాయాలను సారించటంలోనూ ప్రాప్త్యాశ, శ్రీకృష్ణుడు హస్తినాపురంలో ప్రవేశించటంతో అక్కడ చెలరేగిన భావవైరుద్ధ్యాల సందడి, మహర్షులు సభకు రావటం వంటి సన్నివేశాలలో పతాక ప్రకాశించింది. ప్రాప్త్యాశా పతాకల సంబంధం కలది

గర్భసంధి. శ్రీకృష్ణుడి రాయబారపు ఘట్టం నియతాప్తిని సూచించింది. కర్ణాదుల వృత్తాంతాలు ప్రకరి గౌరవాన్ని సంతరించుకొన్నాయి. శ్రీకృష్ణుడు ధర్మరాజు సభలో కౌరవ సభావృత్తాంతాన్ని నివేదించిన ఘట్టంలో అవ(వి)మర్శసంధి స్ఫురించింది. క్రోధవ్యసనాదులచేత గర్భసంధిలో ప్రకాశించిన బీజార్థాలను గురించి చేయబడే పర్యాలోచనమే ఈ కథా ఘట్టంలో ప్రధానాంశం. అదే అవ(వి)మర్శసంధి. ఉలూక ప్రలాపాలు, పాండవవీరుల ప్రతిజ్ఞలు కార్యరూపంతాల్చే ఉత్సాహాన్ని ఉద్ధరింపజేశాయి. భీష్మవచనాలు యుద్ధ నిర్వహణంలో పాండవ విజయాన్ని సూచిస్తూ ముగిశాయి. దానితో యుద్ధోద్యోగ ఫలాగమం సూచించబడింది. ఈ విధంగా పది అంకాలవంటి సభారంగాలు సమగ్ర నాటక కార్యస్వరూపాన్ని ప్రత్యక్షంచేయగలిగాయి. ఇది నాటకీయతలోని వస్తు నిర్మాణ శిల్ప మహత్త్వం!

ధర్మరాజును 'మెత్తనిపులి'గా చిత్రించాడు తిక్కన. పైకి మెత్తగా కనపడినా లోన పులివంటి పౌరుషశాలి, గూఢాభిమాని. అవసరం వచ్చినప్పుడు క్రౌర్యంకూడా ప్రదర్శించగలడు. కౌరవులు చేసిన అపకారం ధర్మరాజుకు ఆగ్రహం కలిగించాలి. హింసకు దారితీయాలి, యుద్ధానికి ప్రేరణ కావాలి. కాని, అతడు 'వశీకృతచిత్తుడు'. యుధిష్ఠిరనామధేయుడైనా మనస్సును అదుపులో ఉంచుకోగలడు. సమయజ్ఞుడు. ఎప్పుడు ఆగ్రహించాలో తెలుసు, ఎప్పుడు అనుగ్రహించాలో తెలుసు. ఆగ్రహానుగ్రహాలను కూడా ధర్మబద్ధం చేయటం ధర్మరాజు ప్రవృత్తి.

ధర్మరాజు సహజంగా ఉభయాయత్తసిద్ధి. కార్యసాధనం స్వయంగా నిర్వహించుకొని ఫలసిద్ధి పొందేవాడు స్వాయత్తసిద్ధి. మంత్రుల సహాయంతో సాధించేవాడు సచివాయత్త సిద్ధి. తాను మంత్రులతో కలిసి సమష్టిగా కృషి చేసి ఫలాన్ని పొందేవాడు ఉభయాయత్త సిద్ధి. పాండవులు స్వయంగా బలవంతులైన నాయకులు. శ్రీకృష్ణుడు వారికి మిత్రుడు, గురువు, దైవం, మార్గదర్శకుడు. అయినా ఉద్యోగంలో వారికి సచివోత్తముడు. ధర్మజుడు ఇచ్ఛాశక్తి, భీమార్జునులు క్రియాశక్తులు, శ్రీకృష్ణుడు జ్ఞానశక్తి. ధర్మరాజు తన ఉద్యోగాన్ని శ్రీకృష్ణముఖంగా సాగించాడు. భీమార్జునులు ధర్మజుడిని బలపరిచారు. ఇచ్ఛాక్రియాశక్తులు జ్ఞానప్రకాశంతో ప్రవర్తిల్లుతాయి. ఈ తత్త్వాన్ని రాజనీతి నాశ్రయించి సాగే ఉద్యోగపర్వం వ్యాఖ్యానించి చెప్పింది. పై పది అంకాలవంటి సభలూ ఆ పరమార్థాన్నే ప్రదర్శిస్తున్నాయి. ఈ పర్వ కార్యతత్త్వ కరదీపిక శ్రీకృష్ణుడి వ్యాఖ్య!

ఆ. 'రోషమయ మహాతరువు సుయోధనుఁ; డురు । స్కంధ మందులోనఁ గర్ణుఁ డలరుఁ;
గొమ్మ సౌబలుండు; గుసుమ ఫలములు దు । శ్శాసనుండు; మూల శక్తి తండ్రి'.

ఆ. 'ధర్మజుండు ధర్మతరు; వర్జునుఁడు ఘన । స్కంధ; మనిలసుతుఁడు శాఖ; కవలు
పుష్పఫలము; లేను భూసురులును వేద । ములుఁ దదీయమైన మూలచయము'.

క. 'ఈరెంటియందు నరసి య । సారం బిది, గాఢసార సహితం బిది నా
నేరవలయు; నదియును గా । కేరూపం బయ్యెనేని నీ సేమిటికిన్'? **(ఉద్యో. 1.355-357)**

ఉద్యోగపర్వంలో ధర్మనిర్ణయశక్తిగా శ్రీకృష్ణుడు పోషించబడటం పై సభాకార్యక్రమాలలో పాటించిన శిల్పం. ధర్మతరువుకు మూలబలాన్ని నిరూపించటం ఈ పర్వ పరమతాత్పర్యం. దానికి ప్రతిగా రోషమయ మహాతరువుకు మూలమైన, లోభశక్తి అయిన ధృతరాష్ట్రుడి బలహీనతను ప్రదర్శించటం కూడా పర్వకథార్థ ప్రయోజనమే. ఈ రెండింటి చిత్రణలో కానవచ్చే ప్రతిస్పర్ధి శిల్పం ప్రశంసనీయం.

1. ఉపప్లావ్య నగరంలోని ధర్మరాజుసభలో ఉద్యోగపర్వంలో నిర్వహించబడే కార్యసూత్రానికి నాందిపలికింది శ్రీకృష్ణుడే. అతడి ప్రతిపాదన ప్రాతిపదికగా బలరామసాత్యకి ద్రుపదాదుల ఆలోచన సాగింది. పురోహితుడి రాయబారం రూపొందింది. దానిని అంగీకరించి ధర్మరాజు శ్రీకృష్ణుడి ప్రయత్నాన్ని సమ్మతించాడు.

'ఎదిరిమతం బెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప వెరవగునే? కావున నియ్యవసరంబునఁ దగిన మానిసి నందులకుం బుచ్చవలయు! దుర్యోధనుడు వీరికి రాజ్యంబుపాలిచ్చిన మేలగుఁగాక! తక్కిన నప్పటికిఁ బోలిన పని సూచుకొందము' (ఉద్యో. 1.17) అన్న శ్రీకృష్ణుడి వాక్యం ధర్మజుడి ధర్మనీతి వర్తనానికి మూలం; పాండవోద్యోగానికి ప్రారంభం.

2. ద్రుపదపురోహితుడు ధృతరాష్ట్రుడి సభలో భీమార్జున సాత్యక్యాదుల పరాక్రమాలను ప్రశంసించి చివరకు 'శ్రీకృష్ణుడు పాండవుల కండగా ఉండగా వారు అసాధ్యులయ్యా'రని కీర్తించాడు.

మ. 'వివిధోపాయ పరాయణుండు, రిపుదోర్వీర్యాపహారక్రియా
ప్రవణోద్యోగుఁడు, మంత్రరక్షణ కళా ప్రావీణ్య గణ్యుండు, ధై
ర్యవివేకాది గుణోత్తరుం, డఖిల విద్యాజాల సంవేది మా
ధవుఁ డా దిక్కటె! పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే?' **(ఉద్యో. 1.240)**

ఇందులో శ్రీకృష్ణుడికి అయిదు విశేషణాలు వాడబడ్డాయి. పంచపాండవులకు ఆయా విశేషణాలు వరుసగా అన్వర్థం కాగలవిగాకూడా కనబడుతున్నాయి. వారి కాయా విశేషణాలు అబ్బటానికి ఆదిశక్తి శ్రీకృష్ణుడు. వాటిని అలవరచుకొని అసాధ్యు లనిపించుకొన్నారు వారు. శ్రీకృష్ణుడు సర్వశక్తి సంపన్నుడు కాబట్టే పంచపాండవుల విశిష్టగుణాలన్నీ తనయందే పండించుకొని పరిపూర్ణ రాజనీతి పురుషుడుగా రాణించాడు. పాండవులకు వాటి సిద్ధిని ప్రసాదించాడు. అంతటి మహిమగల వ్యక్తి కౌరవపక్షంలో లేడు. అస లాకాలంలోనే లేడు. శ్రీకృష్ణుడు నాయకులకే నాయకుడు. అతడు పాండవులకు సహాయకుడు.

3. సంజయ దౌత్యంలో దుర్యోధనాదులు రాజ్యం భోగించటానికే పుట్టారన్నట్లూ, వారిని మార్చటం కష్టమన్నట్లూ, వారివర్తనకు ఫలం వారనుభవిస్తారన్నట్లూ సరిపుచ్చి, ధర్మరాజు మాత్రం ఉత్తముడు కాబట్టి అతడికి 'రుధిరాభీలాన్నముకంటెను మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్' అని నియోగించాడు. దానికి మండిపడిన ధర్మరాజు, ఉభయపక్షాలలో ధర్మాధర్మనిర్ణయం చేయదగిన మహాత్ముడు శ్రీకృష్ణుడే అని ప్రశంసించి, అతడి మాటే పాండవులకు వేదవాక్యమని ప్రకటించాడు.

'ఇది కర్తవ్యం బిది యకర్తవ్యం బని మనల శాసింప వాసుదేవుండు గలండు; మన కీ వితర్కం బేటికి? నితండు ధర్మాధర్మవిదులకు గురుండు, కార్యాకార్య నిరూపకులకు శిక్షకుం, డుచితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుం; డితని పంపున గాదె యదుభోజాంధక వృష్ణి సంజయ కేకయ ప్రభృతి భూపతి ప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లుచున్నయది; విశేషించి మాకు నితని బుద్ధియ సమస్త పురుషార్థంబులకు మూలంబగుట నితని వచనం బవశ్యంబు నలంఘనీయంబు'. (ఉద్యో. 1.335)

శ్రీకృష్ణుడు బ్రాహ్మణుడిని రాయబారానికి పంపటానికి అంగీకరించాడు. పురోహితదౌత్యం ప్రవర్తిల్లింది కాని ఫలవంతం కాలేదు. సంజయుడి రాయబారం ధర్మరాజుకు ధర్మసంకటం తెచ్చిపెట్టింది. క్షత్రియులకు అహింసయా ధర్మం? శత్రువులను యుద్ధంలో సంహరించి రాజ్యాన్ని పాలించుటయా ధర్మం?- అన్న మీమాంస ఏర్పడింది; ఈ ప్రశ్న సంజయుడి రాయబారం వలననే ఏర్పడింది. ధర్మరాజు ధృతరాష్ట్రుడి పెద్దరికాన్ని తిరస్కరించి కౌరవపాండవుల కిరువురికీ శ్రీకృష్ణుడి హితవే శ్రేయస్కరమని ప్రతిపాదించాడు. సంజయుడి రాయబారం విఫలమయిన తరువాత మరల కార్యక్రమాన్ని సూచించవలసిన వ్యూహకర్త. బుద్ధిశక్తి శ్రీకృష్ణుడే కాబట్టి, ఆతడిని చూపించి భావికథాగతికి మార్గదర్శకుడిగా నియోగించాడు ధర్మరాజు. ఉపప్లావ్య సభలో

చెప్పిన కార్యానికి తరువాయి భాగం నిర్వహించవలసిన బాధ్యతను శ్రీకృష్ణుడిపై ఉంచాడు. ఉద్యోగ పర్వంలో ఇక శ్రీకృష్ణుడే కార్యనిర్దేశకుడని ధర్మరాజు నిశ్చయించటంతో ఈ పర్వంలో శ్రీకృష్ణుడిది కీలకస్థానమని స్పష్టమయింది. ప్రవర్తిల్లబోయే శ్రీకృష్ణుడి రాయబారానికి ఈ ప్రకటన భావికథార్థ సూచన!

4. సంజయుడు ధృతరాష్ట్రుడి సభలో, తాను జరిపిన సంధికార్య విశేషాలను తెలిపిన సందర్భంలో, ఆ గ్రుడ్డిరాజు పాండవ కౌరవ సేనల బలాబలాలను గురించి అనేక విధాలుగా వితర్కించాడు. అప్పుడు సంజయుడు ఇట్లా తేల్చి చెప్పాడు.

క. 'ఆ సేనకు నీ సేనకు । వాసి యడిగె దీవు నన్ను; వసుదేవసుతుం
డా సేనఁ గలఁడు; తత్సము । నీ సేనం జూపుమా నరేశ్వర! నాకున్'.

క. 'పలుమఱుఁ బాండుతనూజుల । కొలఁది వితర్కించెదవు; నిగూఢం బది; యేఁ
దెలియం బలికెద; వారికి । బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా!' **(ఉద్యో. 2.308,313)**

శ్రీకృష్ణుడి రాయబారం ప్రవర్తిల్లేముందు సంజయుడు చేసిన ఈ ప్రశంస కౌరవులకు కనువిప్పు కలిగించే శంఖారావం. హస్తినకు రానున్న శ్రీకృష్ణుడికి ఇది ప్రస్తావన. శ్రీకృష్ణుడి దివ్యశక్తి సూచిక.

5. పాండవులు తమ అభిప్రాయాలను తెలిపి సంధికార్యం నిర్వహించుమని ప్రార్థించేటప్పుడు శ్రీకృష్ణుడిని పురుషకారదైవానుకూల్యాల నిర్దేశకశక్తిగా కీర్తించి, అతడిని దైవంగా భావించి ప్రశంసించారు. మచ్చుకు అర్జునుడి ప్రశంస.

ఉ. 'నీ వొనరింపఁ బూనినపనిం గమలోదర! కీడు వుట్టునే?
కా వనినట్ల యుండి యవుఁ గార్యము; లట్లగుటం బ్రయత్న సం
భావనసేఁత పౌరుషము పద్ధతి; తత్ఫలసిద్ధి వొందుచో
దైవము దోడ్పడన్ వలయుఁ; దథ్యము రెండును నీ వినోదముల్'. **(ఉద్యో. 3.73)**

పాండవులకు పరమదైవమైన పురుషోత్తముడు చేపట్టిన పనివలన వారికి కీడు ఏర్పడదన్న విశ్వాసం ఉద్యోగపర్వ కార్యమూలం. చేపట్టిన కార్యం పైకి కానట్లుగానే కనపడుతున్నా ఆ పని పూర్తిగా అయిన ఫలితాలు పాండవుల కందుతాయి. అది శ్రీకృష్ణుడి దివ్యశక్తి. ఉద్యోగపర్వంలో సంధికార్యం విఫలమైనా పాండవుల ప్రయోజనాలన్నీ సాధించబడటం విశేషం. రాబోయే యుద్ధంలో విజయమార్గాలన్నీ భద్రంచేయబడ్డాయి. అవరోధాల కన్నిటికీ నివారణోపాయాలు నిగూఢంగా ప్రారంభించబడ్డాయి. అది శ్రీకృష్ణుడి దివ్యమహిమ. పురుషకారం ఎంతచేసినా దైవం అనుకూలించనిదే కార్యం సిద్ధించదు. శ్రీకృష్ణుడు దూత పాత్రలో సంధియత్నం చేసే నెపంగా ధర్మజుడి ధర్మనీతికి ఫలసిద్ధి కలిగేటట్లు కార్యనిర్వహణం చేయగలడని పాండవుల స్థిరవిశ్వాసం. అది శ్రీకృష్ణుడి దివ్యలీలావినోదం. దివ్యశక్తి మహిమ వినోదాలు శ్రీకృష్ణుడి దైవవ్యక్తిత్వ విభూతులు. వాటి ప్రదర్శనయే ఉద్యోగపర్వ తాత్పర్యం.

6. శ్రీకృష్ణుడు వస్తున్నాడన్న వార్త ధృతరాష్ట్రుడిలో, అతడి కుటుంబంలో, రాజధానిలో, సభామంటపంలో చిత్రమైన చైతన్యాన్ని జాగృతం చేసింది. వార్త వినగానే వృద్ధరాజుకు గలిగిన మొదటి స్పందన శ్రీకృష్ణుడి దివ్యవ్యక్తిత్వ స్ఫూర్తికి సూచిక! దుర్యోధనుడితో ఆత డన్నమాట లివి-

'సర్వలోకాభిగమ్యుండగు నమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి; మన కింతకంటెను బెంపెయ్యది? యతం డెవ్వరివలన సంతుష్టుం డయ్యె వారికి శుభంబున నెవ్వరిదెస ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుట దప్పు; దతనికి వలయు పూజ లాచరించుటకు సంవిధానంబు సేయుము......' (ఉద్యో. 3.149)

ఇది నాటకీయ పరిభాషలో గండమని చెప్పవచ్చును. ధృతరాష్ట్రుడి మాటలలో అతడి మనసులోని దివ్యచైతన్యం జాగృతమైన లక్షణం స్ఫుటంగా గోచరిస్తుంది. కౌరవసభలో శ్రీకృష్ణుడి దివ్యదర్శనం చేయగల దివ్యదృష్టిని పొందటానికి అర్హమైన సంస్కార బీజం ఈ వాక్యంలో ఉన్నది. శ్రీకృష్ణుడిని అనాదరం చేసినవారికి అశుభం కలుగుతుందని చెప్పినమాట అతడి అంతర్వాణి స్పందన భావికథార్థ సూచకమైన గండం!

7. శ్రీకృష్ణుడి రాయబారపు సభ హస్తినాపుర చరిత్రలోనే అపూర్వసన్నివేశం. లోకహితం కోరి ధర్మరక్షణ, దుష్టశిక్షణ చేయటానికి అవతరించిన నారాయణుడు శాంతి సందేశాన్ని ఇచ్చే దివ్యసభ. అందులో దివ్యులైన మహామునులున్నారు, భవ్యులైన భీష్మాదులున్నారు, మరెందరో పుణ్యాత్ములున్నారు. వారందరూ దైవీశక్తులు. దుర్యోధనాది దుష్టవర్గంలోని వారందరూ ఆసురీశక్తులు. వారి మధ్య పరమాత్మ రూపుడైన శ్రీకృష్ణుడు. ఆ మహాత్ముడు ఆయా ప్రవృత్తులు కలవారికి ఆయా రూపాలలో మనోగోచరమయ్యాడు. మచ్చుకు రెండు ఉదాహరణలు.

(1). సభాసదులు పుండరీకాక్షుడి దివ్యరూపాన్ని చూచి దైవీసంపన్నులవలె తన్మయత్వాన్ని చెందారు. ఇది సామూహిక సాధారణ స్పందన.

క. 'అంబుద శుభగాత్రుం బీ । తాంబరధరుఁ గమలదళనిభాక్షున్ హరిఁ జూ
డంబడసి లోచనము లమ్మ । తం బానినమాడ్కి సమ్మదంబునఁ దేలన్'.

క. 'ఆ కొలువువారు గర మచ । లాకృతి నొకపలుకు లేక యందఱు వింజం
బాఁ కిడిన కరణి నవశము । దాకారిత చిత్తవృత్తులై యుండంగన్'. **(ఉద్యో. 3.254, 255)**

(2) ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడిని విష్ణువుగా గుర్తించి పలికిన మాటలు.

క. 'కరుణింపుము సంశ్రితభయ । హరణధురీణా! సహింపు మజ్ఞానంబున్;
శరణంబు వేడెద భవ । చ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁ గదే!' **(ఉద్యో. 3.408)**

శ్రీకృష్ణుడి రాకను గురించి విన్నప్పుడు ధృతరాష్ట్రుడి అంతరాత్మ స్పందించిన విధంతో మొదలైన ఈ ఘట్టం అతడు ఆ పరమాత్ముడిని దర్శించి శరణువేడటంతో ముగియటం గమనిస్తే భావికథలో ఆసురీ ప్రవృత్తులలో ప్రాణాలతో మిగిలేది ధృతరాష్ట్రుడే అని అర్థమౌతున్నది. కురుసభలో శ్రీకృష్ణుడి దివ్యత్వం విశ్వరూపం తాల్చటం ఆ పాత్ర చిత్రణలో పరాకాష్ఠ.

8. శ్రీకృష్ణు డందించిన కౌరవసభాదౌత్యనివేదిక విని, వంశనాశనకారి అయిన యుద్ధసంకల్పం చేయటానికి ధర్మరాజు తటపటాయిస్తూ వితర్కిస్తూ ఉండగా అర్జునుడు ఈ విధంగా నిశ్చయించాడు.

ఆ. '(అనిన నట్ల కాక) యఖిల ధర్మజ్ఞాన । ఘనుఁడు మనకు నేడుగడయుఁ దాన
శౌరి నిశ్చయింప సంశయం బేటికి? । సంఘటింపుఁ డుగ్రసమరవిధము'. **(ఉద్యో. 4.93)**

శ్రీకృష్ణుడు చేసిన నిశ్చయాన్ని దైవనిర్ణయంగా భావించాడు ధర్మరాజు.

9. ఉలూకుడి రాయబారంలో దుర్యోధనుడు పాండవవీరుల నందరినీ అధిక్షేపించటమే కాక ప్రత్యేకంగా పార్థ శ్రీకృష్ణుల నుద్దేశించి ప్రగల్భాలు పలికాడు.

ఉ. 'మాయలు నింద్రజాలములు మాధవుఁ డిందును గొన్ని వన్నినన్
బాయవు రజ్జు లెప్పుడు నవారణ నీ వెటు లాడితేనియున్;
వేయును నేల? పార్థులును విష్ణులు వే పదివేలు వచ్చినం
జేయుదు మేము గయ్య; మొక చీరియు సంపదఁ బంచియిత్తుమే?' (ఉద్యో. 4.201)

ఈ మాటలకు శ్రీకృష్ణుడే అధిక్షేపహాస్యం చేస్తూ ఇట్లా సమాధాన మిచ్చాడు.

తే. 'బవర మెల్లియ; బిరుదవై బరవసంబు । గలిగి చావుము; చావక తొలఁగరాదు;
కృష్ణ సారథికం బగు జిష్ణురథము । దొడరి నీ వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు'. (ఉద్యో. 4.203)

దుర్యోధనుడికి ఈ మాటలు 'యముని మహిషపు లోహఘంటలు'. దుష్టసంహార రూపుడైన శ్రీకృష్ణుడి రౌద్రహాసం.

10. భీష్ముడు కౌరవపాండవ బలనిరూపణం చేస్తూ నిరుపమానమైన అర్జున శ్రీకృష్ణ పరాక్రమాన్ని అద్భుతంగా పేర్కొన్నాడు.

మ. 'నరుఁ డీ మానమువాఁ డనంగ వశమే? నా కంతవా రెందు నె
వ్వరు లే; రింకను బుట్ట; రా పులికి దుర్వారోద్యముం డైన యా
హరియుం దోడటె! యేమి చెప్పుదు? నతం డా సేనలం గాచు నొ
క్కరుఁడుం గీ టడఁగించు నీ బలములన్ గాండీవదుర్దాంతుఁడై'. (ఉద్యో. 4.258)

ఇది యుద్ధపంచక రణయజ్ఞానికి నాందీ గీతి.

ఉద్యోగపర్వ మహానాటకంలో దైవీశక్తి శ్రీకృష్ణుడు. ధర్మశక్తి ధర్మరాజు. బలశక్తి భీముడు, వీరభక్తి శక్తి అర్జునుడు, సేవాశక్తి కవలు- ఈ తత్త్వాన్ని ప్రకటించటమే ఈ అంకాలవంటి సభారంగాల పరమార్థం.

**(2). రంగాలుగా గోచరించే సమావేశాలు**

ప్రసిద్ధపాత్రలు కొద్దికాలంపాటు సమావేశమై సారవంతంగా గానీ, ప్రయోజనవంతంగాగానీ, చమత్కారవంతంగా గానీ సంభాషణలు సాగించి కార్యసాధన ప్రగతికి తోడ్పడేవి రంగాలుగా పరిగణించవచ్చును. అటువంటివి మరొక పది ఉద్యోగపర్వంలో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ నాటకీయ శిల్పానికి కాంతిని ప్రసాదిస్తున్నాయి. తిక్కన వాటిని తీర్చిదిద్దిన తీరు ప్రశంసనీయం. రంగాలవంటి సమావేశాలు ఈ క్రిందివి-

| | |
|---|---|
| 1. శ్రీకృష్ణుడు దుర్యోధనార్జునులతో జరిపిన సమావేశం. | 1. 60-90 |
| 2. శల్య ధర్మజుల సమావేశం. | 1. 104-216 |
| 3. కృష్ణద్వైపాయనుడు ధృతరాష్ట్ర దుర్యోధన సంజయాదులతో జరిపిన సమావేశం. | 2. 305-331 |
| 4. శ్రీకృష్ణుడు కుంతీదేవితో జరిపిన సమావేశం. | 3. 182-208 |
| 5. శ్రీకృష్ణుడి దుర్యోధన మందిర సమావేశం. | 3. 209-228 |
| 6. శ్రీకృష్ణుడు కుంతిదేవి మందిరంలో జరిపిన సమావేశం. | 4. 9-19 |

| | |
|---|---|
| 7. శ్రీకృష్ణుడు కర్ణుడితో రహస్యమంతనాలు చేసిన సమావేశం. | 4. 29-53 |
| 8. కుంతీకర్ణుల సమావేశం. | 4. 58-71 |
| 9. దుర్యోధనుడు ఆత్మీయులతో జరిపిన సమావేశం. | 4. 133-141 |
| 10. దుర్యోధనుడు భీష్మమందిరంలో జరిపిన సమావేశం. | 4. 143-162 |

1. పాండవులు యుద్ధసహాయం కొరకు వివిధదేశాల రాజులను ఉచిత పద్ధతులలో ఆహ్వానించారు. వారందరిలో శ్రీకృష్ణ సహాయాన్ని అర్థించే సంఘటన మహాభారతంలోనే మరపురాని ఘట్టంగా నిలిచిపోయింది. ధర్మజుడు కార్యాన్ని సంకల్పించి, అది పురుషకార ప్రధానమైతే, దానిని భీముడు నిర్వహించే అవకాశం కల్పిస్తాడు. దైవానుకూల్య ప్రధానమైతే అర్జునుడికి అవకాశం కలిగిస్తాడు. శ్రీకృష్ణ సహాయం దైవసహాయం కాబట్టి పార్థుడినే ద్వారకకు పంపించాడు. అటు దుర్యోధనుడుకూడా శ్రీకృష్ణునంతటి వాడిని సహాయం అడగటానికి దూతను పంపినదానికంటె తానే స్వయంగా పోవటం సముచితమని భావించి ద్వారకకు చేరాడు. అక్కడ శ్రీకృష్ణుడు పగటిపూట నిద్రిస్తున్నాడు. దుర్యోధనుడు అభిమానధనుడు కాబట్టి గోవిందుడి శయ్యవద్ద తలవైపు కూర్చున్నాడు. సహాయార్థియై వచ్చాడు కాబట్టి కృష్ణుడు మేల్కొనేంతవరకు మిన్నకున్నాడు. అర్జునుడు ఆ తరువాత వచ్చాడు. శ్రీకృష్ణుడి పాదాల సమీపంలో వినయభక్తి ప్రపత్తులు ఉట్టిపడేటట్లు నిలిచి ఉన్నాడు. శ్రీకృష్ణుడు నిద్రలేచి ముందుగా కనబడిన అర్జునుడిని పలకరించాడు. ముందువచ్చిన దుర్యోధనుడిని ఆ తరువాత యోగక్షేమాల నడిగాడు. సహాయం ఇద్దరికీ చేస్తానని మాట యిచ్చాడు. నారాయణాభిధానులైన గోపాలురు పదివేలమందిగల మూలబలాన్ని ఒకవైపూ, యుద్ధం చేయని తననొక్కడిని మరొకవైపూ భాగాలుగా ఉంచి, కోరుకొనే అవకాశం చిన్నవాడూ, అన్నచాటువాడూ అయిన అర్జునుడికి కల్పించాడు. అతడు ఆయుధంపట్టని శ్రీకృష్ణుడినే కోరుకొన్నాడు. దుర్యోధనుడు సంతోషించి పరిశేషన్యాయంతో నారాయణాఖ్య యాదవవీరులను గ్రహించి తిరిగివెళ్ళాడు. బలరాముడు యుద్ధంలో పాల్గొనని తేల్చి చెప్పాడు. అర్జునుడు శ్రీకృష్ణుడినే ఎందుకు కోరుకొన్నాడు?- అన్నది మహాభారత యుద్ధంలో హిమాలయమంత ప్రశ్న. అర్జునుడు యుద్ధంలో అన్యులసహాయం కోరడు. శ్రీకృష్ణుడు యుద్ధం చేస్తే అర్జునుడికి కీర్తి దక్కదు. శ్రీకృష్ణుడు కౌరవపక్షంలో చేరితే అతడికి ఎదురుపడ్డవాడు ఎండిపోతాడు కాబట్టి పాండవపక్షంలోనే ఉండాలి. అందుచేత సమరంచేయని శ్రీకృష్ణుడే పార్థుడికి సమ్మతుడౌతాడు. ఇవన్నీ ఇట్లా ఉండగా శ్రీకృష్ణుడిని రథసారథిగా చేసికొని యుద్ధం చేయాలని పార్థుడి మనసులోని కోరిక!

క. 'సారథ్యం బొనరింపు మ । పారకృపాలీల నెల్లభంగుల నా కీ
గౌరవమును జిరకాలము । గోరినయది; దీని నిమ్ము గుణరత్ననిధీ!' **(ఉద్యో. 1.88)**

అని కోరుకొన్నాడు. అడగటం ఒక ఆచారమన్నట్లు దుర్యోధనుడు వర్తిస్తే, అదికూడా ఒక కళ అని అర్జునుడు నిరూపించాడు. సహాయంచేయటం ఒక పరిపాటిగా దుర్యోధనుడు భావిస్తే, రాజనీతిగా నిర్వహించాడు శ్రీకృష్ణుడు. గోవిందుడు చతురోపాయ నిపుణు డనటానికి సాక్షిగా నిలిచే రంగం వంటి ఈ సన్నివేశం రత్నంవంటి ఉదాహరణ.

2. మహాభారతంలో కృష్ణసారథ్యం ఎంత ప్రశస్తమైనదో శల్యసారథ్యం అంత ప్రసిద్ధమైనది. ఒకటి భక్త రక్షణ కళాపారీణతకు బిరుదు పేరైతే, మరొకటి నయవంచన రూప విద్రోహచర్యకు మారుపేరు. శల్యుడు అశ్వహృదయం తెలిసిన విజ్ఞుడు. రథసారథ్యంలో శ్రీకృష్ణుడితో దీటైనవాడు. అందుకే దుర్యోధను డతడిని వంచనతో తనవైపు త్రిప్పుకొన్నాడు. శల్యుడు నిజాయితీపరుడు. అతడితీరును గమనించి ధర్మజుడు అతడిని తన కనుకూలంగా మలచుకొన్నాడు. కృష్ణసారథ్యంతో అర్జునుడు రణరంగంలో నిలిచినప్పుడు, దుర్యోధనుడు శల్యసారథ్యంతో కర్ణుడిని ప్రవేశపెట్టటం యుద్ధవ్యూహం. ఆ

తరుణంలో శల్యుడు హృదయశల్యాలవంటి మాటలతో కర్ణుడిని బాధించి, అర్జునుడికి పరోక్షంగా సహాయం చేయుమని ధర్మజుడు కోరాడు. సహజంగా కర్ణవిరోధి అయిన శల్యుడు కర్ణుడికే మృత్యుద్వారం చూపించే యమభటుడయ్యేటట్లు సన్నివేశాన్ని మలచుకొన్న ధర్మరాజు రాజనీతి కుశలుడు. భేదోపాయ మర్మజ్ఞుడు. ఈ ఘట్టం కర్ణపర్వంలోని ఒక విషాదాంత వీర చరిత్రకు కారణం కాబోతున్నది. అంతేకాదు, మహాభారత యుద్ధంలో వినవచ్చే కీలకమైన రహస్యపుటొప్పందాలతో ఇది ఒకటి. అందువలన ఇది రసవత్తరమైన రంగం.

3. కృష్ణద్వైపాయనుడు ప్రసన్నుడై సంజయుడిని తనకు బదులు ధృతరాష్ట్రుడికి వలసిన సలహాలివ్వటానికి నియోగించటం ఒక అపూర్వ సన్నివేశం. ఇకముందు సంజయుడు నిర్వహించే సార్థకమైన పాత్రకు ఇది శుభసూచన. సంజయ వ్యాసవాక్యతాత్పర్యాలు తత్త్వతః సమానార్థ బోధకాలని ఈ సన్నివేశం ధ్వనిస్తున్నది. సంజయవాక్యం:

సీ. 'పురుషోత్తముం డెల్లభువనంబులును దాన । యఖిల భూతాత్మకుండై విహార
లీల విచేష్టించు; నీ లోకముల మాయ । దొట్టి యొక్కొక మరి పుట్టి పెరిగి
కర్మానుచరణముల్ గైకొని వర్తించు; । శిష్టరక్షణమును దుష్టవిగ్ర
హంబును దనపను లగుటఁ బాండవుల నె । పం బిడుకొని ధర్మబాహ్యు లైన

తె. నీ తనూజుల నిక్కమ నిగ్రహింపఁ । దలఁచినాఁ డమ్మహాత్ముండు; తథ్య; మతని
నిట్టి చందంబువాఁ డని యెఱిఁగి యెవ్వ । రాశ్రయింతురు బ్రదుకుదు రట్టివారు'. **(ఉద్యో. 2.318)**

విష్ణువు శ్రీకృష్ణుడుగా అవతరించి శిష్టరక్షణకై పాండవులతో స్నేహంచేసి, దుష్టశిక్షణకై కురుక్షేత్ర యుద్ధంలో పాల్గొనబోతున్నాడన్న సత్యం మహాభారతంలో ద్రష్టలైన ఋషులు చెప్పేవాక్యం. వ్యాసు డాతాత్పర్యాన్నే సంజయుడిచేత చెప్పించాడు. అయినా గ్రుడ్డిరాజు నమ్మీనమ్మనట్లు నడయాడాడు. గాంధారిచేత దుర్యోధనుడికి చెప్పించాడు. అతడు మౌనం వహించాడు. అప్పుడు వ్యాసుడే స్వయంగా నారాయణతత్త్వాన్ని వివరించాడు. అతడి నాశ్రయించుమని బుజ్జగించి చెప్పాడు. ఆ మహర్షిముందు ధృతరాష్ట్రుడు ఎంతో ఆసక్తితో వాసుదేవనామనిర్వచనాన్ని, అతడిని పొందే ఉపాయాన్ని చెప్పుమని వేడాడు. వ్యాసుడు సంజయుడిచేత వాటిని ప్రబోధింపజేశాడు. ధృతరాష్ట్రుడు వారి మాటలు విన్నట్లే విన్నాడు. శ్రీకృష్ణుడిని దర్శించాలన్న కోరికను ప్రకటించాడు. ఎదుటివారు అది నిజమని నమ్మేటట్లు మాట్లాడాడు.

క. 'నాకు నయనేంద్రియముగతి । లేకుండుట కంతవగపు లే; దఖిల మనో
జ్ఞాకారుఁడైన హరి నా । లోకింపం గానమికిఁ గలుగు వగ పెపుడున్'.

ఉ. 'ఆతనిఁ గన్నులారఁగ నహర్నిశముం గనుఁగొంచు నుండు వా
రే తప మాచరించిరొ? యుపేంద్రుని నాశ్రితవత్సలున్ విని
ర్ధూతకలంకు ధర్మనిరతుం గరుణాకరు సర్వలోక వి
ఖ్యాతుఁ బవిత్రమూర్తి శరణాగతరక్షకు నాశ్రయించెదన్'. **(ఉద్యో. 2.329,330)**

వ్యాసమహర్షిముందు వాసుదేవుడిని శరణు వేడుతానని మాటయిచ్చాడు. ఆయన అంతర్ధానం కాగానే అంతఃపురం చేరి దానిని మరచిపోయాడు. ధృతరాష్ట్రుడి ద్వంద్వ ప్రవృత్తికి ఈ రంగం దర్పణం వంటిది.

4. విదురునింట నివసిస్తున్న కుంతీదేవి పొందే మానసిక వేదనను తెలిసికొనటానికి వీలైన ఏకైక సన్నివేశం శ్రీకృష్ణుడు కుంతీదేవిని దర్శించిన రంగం. ఆమె వేదనకు ఈ క్రింది పద్యం దర్పణం.

సీ. 'బావ యొప్పం డను పలుకుల నే మగు । నాతని కొడుకుఁ గీడాడ నేల?
కురువృద్ధుఁ డగు బాహ్లికుని దూఱ నేటికి? । భీష్మునిపైఁ బ్రయి వెట్ట నగునె?
యిట్టి క్రూరులయింటి కిచ్చిన మనవారి । నందుఁ గా; కట్లు దా ననుట మేలె?
యర్జును పుట్టిన యప్పుడు 'వీఁడు లో । కములెల్ల గెల్చుపొగడ్త మొగులు

తే. 'ముట్టునట్టిద యగు; రణమున జయించుఁ; । గౌరవుల; సోదరులుఁ దాను భూరిరాజ్య
గౌరవముఁ బొందు' నని యశరీరవాణి । వలికె; నది దిట్టువడు గాక వలయు నేని'.

వ. 'ధర్మంబు గలుగునే నది నిక్కం బయ్యెడు; దాని కెల్లను నిర్వాహకుండవు నీవు గలవు గాదె'.

**(ఉద్యో. 3.195, 196)**

శ్రీకృష్ణుడు కుంతీదేవి నోదార్చే ఘట్టం ద్రౌపది నోదార్చిన ఘట్టాన్ని తలపిస్తుంది. అందువలన ఈ రంగం విలువైనది. కుంతి పాండవుల కిచ్చే సందేశాలు వీరమాత ప్రవృత్తికి తగినవి.

5. దుర్యోధనునింట జరిగిన సమావేశంలో విందుముచ్చట వచ్చింది. అది విందురాజకీయం. తనయింటికి శ్రీకృష్ణుడు వచ్చాడు కాబట్టి అక్కడే భోజనం చేయాలనీ, అట్లాచేస్తే పాండవకౌరవు లిరువురి యోగక్షేమం కోరి శ్రీకృష్ణుడు సంధినడుప వచ్చినట్లు స్పష్టమౌతుందనీ దుర్యోధనుడివాదం. శ్రీకృష్ణుడు తాను దూతననీ, దౌత్యం ముగిసేవరకూ ఇరుపక్షాల వారియిండ్లలో భుజించటం న్యాయం కాదనీ, ఒకవేళ విందు వికటిస్తే దుర్యోధనుడికి అపనింద రావచ్చునని వాదించాడు. 'నేను శత్రువునా?' అని ప్రశ్నించిన దుర్యోధనుడికి 'నీవు పాండవులకు శత్రువువి. నాకు పాండవులు ప్రాణాలవంటివారు. నా ప్రాణశత్రువు నాకు శత్రువే ఔతా'డని ఘంటాపథంగా చెప్పాడు. అంతేకాదు విందురాజకీయాన్ని నీతిబద్ధం చేసి వ్యాఖ్యానించాడు.

చ. 'ప్రియ మెసఁగం దగం బిలిచి పెట్టెడు కూ డది లెస్సకూడు; ద
క్కయ నయహీనతం దమకు నాపద యై నెడ నిట్టు నట్టు నే
మియు నన లేని కూ డెదిరి మేవడి యై చను; నీవు మాదెసం
బ్రియుఁడవు గావు, మాకు ధృతి పెంపఱ నాపద లే దొకింతయున్'. **(ఉద్యో. 3.222)**

విందు వికటిస్తే సంధి వికటించినట్లే. ఆ వికటించటానికి కూడా దుర్యోధనుడే హేతువని పేర్కొనటం శ్రీకృష్ణుడి నేర్పు.

6. సంధికార్యాన్ని ముగించుకొని తిరిగిపోతూ శ్రీకృష్ణుడు కుంతీదేవిని దర్శించాడు. అప్పు డామె పుత్రుల కందించిన సందేశాలు పౌరుషోపేతంగా ఉన్నాయి. మచ్చు కొకపద్యం.

ఉ. 'రాజుల కెందు నారయఁ బరాక్రమ జీవనవృత్తి దక్క నొం
డోజ నిషిద్ధ మంద్రు మును; ఉత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు; బుద్ధివిహీనులు వానిఁ దక్కి ని
స్తేజపుఁగూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా!'. **(ఉద్యో. 4.14)**

ఆమె మాటలు భీష్మాదులకు ఆశ్చర్యం కలిగించాయి.

చ. 'పలుకునె యిట్లు గొంతి; విని బమ్మెరపోయితి; మింత బెట్టిదం
బు లగునె మాట? లయ్యమయుఁ బుణ్యుఁడు గృష్ణుఁడు గార్యవాదముల్
వలికెడువార లిట్లు దెగఁ బాఱిరి; ధర్మజ వారిరాశికిం
జెలియలికట్ట వాసె; మనచే నగు కర్జముచంద మెట్టిదో!' **(ఉద్యో. 4.22)**

ధర్మజుడు యుద్ధ నిర్ణయాన్ని తీసికొనటానికి కుంతి పౌరుషోక్తులు కూడా దోహదం కాబోతున్నాయి. కుంతిలోసైతం మండుతున్న క్రోధాగ్నిని తెలిసికొనటానికి భీష్మాదులకు అవకాశం కలిగిన ఈ రంగం (సన్నివేశం) యుద్ధోద్యోగ పరిపోషకం!

7. ఉద్యోగపర్వంలోని రాజకీయపుటెత్తులలో మేటిగా పరిగణించబడేది శ్రీకృష్ణుడు కర్ణుడితో రహస్యమంతనాలు చేసి అతడి జన్మరహస్యం చెప్పే సన్నివేశరంగం. తెలుగులోని మహాభారత నాటకాలలో (విశేషించి తిరుపతి వేంకటకవుల పాండవోద్యోగ నాటకంలో) ఈ రంగం హృదయంగమం. పాత్రల అంతర్వర్తనాల అసలురూపం బైటపెట్టే ఈ రంగం పాండవులు ప్రయోగించే భేదోపాయంలో భాగంగా శ్రీకృష్ణుడు స్వతంత్రించి ప్రయోగించింది. శ్రీకృష్ణుడి రాజనీతికి, కర్ణుడి ధర్మనీతికి ఇది మకుటాయమానమైన ఉదాహరణం.

శ్రీకృష్ణుడు దేవరహస్యంవంటి కర్ణుడి జన్మరహస్యాన్ని వాస్తవాన్ని ప్రకటిస్తున్నట్లు పూసగ్రుచ్చినట్లు సంగ్రహసుందరంగా చెప్పాడు. పాండవులు బంధుమిత్ర పరివారసమేతంగా కర్ణుడికి రాజ్యం పట్టంకట్టి సేవించగలరని నమ్మబలికాడు. రాజ్యాభిషిక్తుడైన కర్ణుడు అనుభవించే మహేంద్రవైభవాన్ని నూరురెట్లు చవులుపుట్టేటట్లు వర్ణించి ఆశ కల్పించాడు. ఆ తరువాత పాంచాల రాజపుత్రి కర్ణుడిని ఆరవ భర్తగా గ్రహించి వరుసగా ఏలుకొనేటట్లు ఒప్పిస్తానని హామీ ఇచ్చాడు. ఇన్ని అదృష్టాలు కలిసివచ్చిన పుణ్యాత్ముడుగా కర్ణుడిని అభివర్ణించి, అనుమానంలేకుండా పాండవపక్షంలో చేరుమని ఆహ్వానించాడు. ఆ పక్షంలో చేరితే కన్నతల్లి అయిన కుంతి సంతోషిస్తుందనీ సమస్త బంధుహిత వర్గాలవారు ఆనందిస్తారనీ ఉత్సాహపరిచాడు.

శ్రీకృష్ణుడి మాటలు అవాస్తవాలనటానికి వీలులేదు. కాని, ఆ సమయంలో అవి ఆచరణయోగ్యాలు కావని కర్ణుడు భావించాడు. కారణాలు వరుసగా నిజాయితీతో ఏకరువుపెట్టాడు. శ్రీకృష్ణుడు కర్ణుడిని వృద్ధజనోపసేవిగా, ధర్మసంవేదిగా కీర్తించాడు. దానికి చలించని కర్ణుడు కన్నతల్లి తనను గంగపాలుచేయగా, దరికిచేర్చి, పాలిచ్చి పెంచి, ఎన్నో కష్టాల కోర్చి పెద్దచేసి, ప్రేమతో చూస్తున్న పెంపుడు తల్లిదండ్రులను వదలిరావటం న్యాయమా? అని అడిగాడు. సూతదంపతులు కర్ణుడికి జాతకర్మాది సంస్కారాలు చేశారు. పెళ్ళిచేశారు. అట్టివారికి పుత్రుడు చేయవలసిన ఇహపర కర్మలను ఆచరించటం ధర్మంకాదా? అని ప్రశ్నించాడు. భార్యను, సంతతిని, బంధువర్గాన్ని వదలి పాండవులలో చేరటం ఉచితమా? అని సూటిగా అడిగాడు. అన్నింటికంటె మించి కర్ణుడి ఆరవప్రాణం దుర్యోధనుడు.

ఉ. 'సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును బెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దనయంతటి మానిసిఁ జేసియుండ నే
నే తగవూది యా కురుకులేశ్వరుఁ బాయుదు? ముట్ట వచ్చినన్'. **(ఉద్యో. 4.39)**

అని సర్వధర్మవేది అయిన శ్రీకృష్ణుడిని రాజనీతి పరంగా సమాధానం చెప్పమని అడిగాడు.

ఇక వీరనీతి ననుసరించి మరొక సూక్ష్మాంశాన్ని పేర్కొన్నాడు. కౌరవపాండవులలో మేటి విలుకాండ్రు కర్ణార్జునులని దుర్యోధనుడి తీర్పు. కర్ణుడు అర్జునుడిని యుద్ధంలో చంపి రాజ్యాన్ని నిష్కంటకం చేస్తాడని రారాజు నమ్మిక. దానిని వమ్ముచేయటం వీరనీతి కాదు. కర్ణార్జునులు సమవీరులు కావటంచేత ఎవరు ఎవరి పక్షం చేరినా వారికి ఆపకీర్తి వస్తుంది.

అందువలన కర్ణుడు కౌరవపక్షం వదలి పాండవపక్షంలో చేరటం కర్ణుడికే అపకీర్తి. కర్ణుడు అర్జునుడికి భయపడి యుద్ధారంభ సమయంలో పాండవపక్షంలో చేరాడని లోకం నిందిస్తుంది. అందువలన వ్యక్తి ధర్మాన్ని ఆశ్రయించి చూచినా అది న్యాయం కాదు.

ఇక లోకశ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని ఆలోచించినా శ్రీకృష్ణుడి ప్రతిపాదన ఆచరణయోగ్యం కాదు. తనకంటె పెద్దవాడు కర్ణుడని తెలిసిన ధర్మరాజు తాను రాజ్యానికి పట్టాభిషిక్తుడు కాడు. అది లోక శ్రేయస్కరం కాదు. ధర్మరాజువంటి ధర్మవీరుడు భూమిని శాశ్వతంగా పాలించాలి అని కర్ణుడు అంతరాంతరాలలో ఆశించాడు. అంతే కాదు కర్ణుడు యుద్ధాన్ని రణయజ్ఞంగా భావించాడు.

క. 'అనుజులు ఋత్విజులుగ నీ । పని యిటు సేయు మని నీ వుపద్రష్టవుగా
విను! కురుకుమార పశువిశ । సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్'. **(ఉద్యో. 4.45)**

అని చెప్పాడు. కర్ణుడి అంతరంగంలో ఉన్న ఆధ్యాత్మిక భావ మిది. కాని, తనను తనంతటివాడిగా చేసి గౌరవించిన దుర్యోధనుడికి ఋణం తీర్చుకొనటం సేవాధర్మం. కర్ణుడి కృతజ్ఞతాభావం అతడి వ్యక్తిత్వ సంస్కారానికి సంబంధించింది. దుర్యోధనుడికి సంతోషం కలిగే పనులు చేస్తూ, ఏవిధంగానైనా సరే అతడి చేత రాజ్యం ఏలిస్తూ ఉండటం అతడు కుదుర్చుకొన్న స్నేహసంధి నియమం. రాజనీతి బలి కోరింది. ధర్మనీతి కీర్తి నిచ్చింది- ఇది కర్ణుడి కథలోని విరుద్ధ ధర్మాల విపరీత ఫలం!

కర్ణుడి అంతరంగంలోని అవ్యక్తవేదన వినిపించే ఈ ఘట్టం పఠితకు విషాదమధురంగా ఉంటుంది.

8. కుంతీకర్ణుల సమావేశం మహాభారతకథలోనే పేరొందిన విషాద గంభీర దృశ్యం. అలనాడు కన్యగా కుంతి సూర్యుడి వరాన కర్ణుడిని కని గంగలో వదలిన తరువాత, మరల తల్లిగా అతడిని కలిసి మాట్లాడటం ఇదే మొదటిసారి. సూర్యుడు కర్ణుడి పుట్టుక కథను దేవరహస్యంగా కాపాడాడు. అయినా, అది సూచనగా కొందరికి తెలియకపోలేదు. కర్ణుడికి కూడా కొంత వినబడింది. కాని, బహిర్గతం కాలేదు. శ్రీకృష్ణుడు భేదోపాయ ప్రయోగంలోని భాగంగా కర్ణజన్మవృత్తాంతాన్ని ఆయనతో రహస్యంగా చెప్పాడు. ఆ తరువాత కుంతి పాండవ ప్రాణరక్షణార్థం కర్ణుడితో జన్మరహస్యాన్ని చెప్పటానికి ఉద్యుక్తురాలయింది. పరోక్షంగా ఇది కూడా యుద్ధోద్యోగంలో భాగంగా మారింది. అచ్చమైన వాత్సల్యంలో స్వార్థం, రాజనీతి ప్రవేశించి ఆమెను యమునాతీరం వరకు నడిపించాయి. దానికి దారితీసిన ఆమె ఆలోచన ఇది-

మ. 'తమవారిన్ సిరికై వధించు టిది సద్ధర్మంబె? యక్లేశకృ
త్యమె? తాఁ గయ్యము ద్రోణభీష్మకృప కర్ణాటోపముల్ మాన్పుట
ల్పములం దీఱునె? యందు నర్కజుని యుల్లం బెప్పుడుం గ్రోధ దీ
ప్తము భీమాదులమీఁదఁ; దక్కొరుల కుత్సాహంబు లే దాజికిన్'. **(ఉద్యో. 4. 57)**

రాజ్యసంపదకొరకు బంధువులను పరస్పరం చంపుకొనటం ధర్మంకాదని భావించిన తీరు అటు పాండవులకూ, ఇటు కౌరవులకూ వర్తిస్తుంది. అయినా, సందర్భాన్నిబట్టి పాండవులకే అది ఎక్కువగా చెందుతుంది. అప్పు డున్న పరిస్థితులలో యుద్ధోద్యోగం చేయటం ఎన్నో ఇబ్బందులతో కూడిన పని. ఆ ఇబ్బందులలో ముఖ్యంగా పేర్కొనదగినవి- ద్రోణ, భీష్మ, కృప, కర్ణులను సంహరించగల ఉపాయాలను అన్వేషించటమే. ఆ యోధచతుష్టయంలో పాండవులను తీవ్రంగా వ్యతిరేకించేది కర్ణుడు. మిగిలినవారికి అతడి కున్నంత యుద్ధపిపాస లేదు. అందులోనూ కర్ణుడికి ధర్మరాజుమీదకంటె భీమాదులమీద కోపం ఎక్కువ. అర్జునుడిమీద అతడికి పగ అపారం. ఈ సంగతి తెలిసిన కుంతి-కౌరవవీరులలో కర్ణుడు శాంతిస్తే యుద్ధం ఆగిపోతుందనీ, ప్రాణహాని లేకుండా పాండవులకు రాజ్యం లభిస్తుందనీ, కర్ణుడు పాండవులతో కలిస్తే తన పుత్రులందరూ

ఐకమత్యంతో స్నేహంగా బ్రతుకవచ్చుననీ, వారిని ఎదిరించగల వీరులు లోకంలో ఎవరూ ఉండరనీ భావించింది. దానికి ఒక వ్యక్తిగత రహస్యవ్యూహాన్ని ఆమె పన్నింది. కర్ణుడి జన్మరహస్యం అతడికి తెలిపి, పాండవులమీద సోదరస్నేహం పొంగులువారేటట్లు చేయాలని లక్షించింది. ఊహ వచ్చిన తరువాత మొట్టమొదటిసారి కర్ణుడిని 'కొడుకుఁగుఱ్ఱ' (చిన్ని నాన్నా!) అని పిలిచి ఏకాంతంగా తన మనసులోని మాట చెప్పింది. సూర్యుడు 'అది నిజ'మని ప్రకటించాడు. నిజం బయటపడింది.

అయితే, ఆమె మాటలతీరులో ఆర్ద్రతకంటె అవసరం ఎక్కువగా కనబడింది.

సీ. 'వినుము! సూతాన్వయంబున నీవు పుట్టుట । బొం; కేను మా కుంతిభోజునింటఁ
గన్నియనాఁడు భాస్కరుని రావించితి । వరమంత్ర బలమున; వచ్చి యతఁడు
సంప్రీతి నొసగంగ జన్మించినాఁడవు । నాకుఁ; గావునఁ బాండునందనుండ
వగుదు ధర్మస్థితి; నట్టి నీ వితరులఁ । గొలువ నేటికిఁ గురుకులవరేణ్య!

తే. ధర్మతనయాదులైన నీ తమ్ములకును । ధార్తరాష్ట్రులకును నీవ తగు విభుండ;
వేలు మీ లోకమెల్ల; నీ కేల రాధ । కొడు కితం డను తక్కువ? కొడుకుఁగుఱ్ఱ!' **(ఉద్యో. 4. 59)**

ఈ మాటలలో ఒక క్రమం ఉన్నది. కర్ణుడి మనసు మార్చటానికి ఆభిజాత్యాన్ని మొదటి అంశంగా ఎన్నుకొన్నది. అది నాయకుల లక్షణాలలో మొదటిది కూడా. అందుకే కర్ణుడు సూతవంశంలో పుట్టటం అబద్ధంగా చెప్పింది. సూర్యవరప్రసాదంవలన కుంతికి పుట్టటం వలన ధర్మస్థితి ననుసరించి పాండునందనుడుగా పరిగణించబడతాడని పేర్కొన్నది. ఇక్కడ నీవు రాధేయుడవు కావని అనకుండా సూతకులజుడవు కావనటం విశేషం. కౌంతేయుడ వనకుండా పాండునందనుడవు అనటం విశేషం. పెంచిన తల్లికంటె, కన్నతల్లికంటె పోషించిన తండ్రీ, కన్నతల్లి భర్తా అభిజాత్యకారకు లౌతున్నారు. వారి వారసత్వగౌరవాలు పుత్రులకు రావటం కూడా ధర్మస్థితి. దీనిని మొదట చెప్పి, ఆపై కర్ణుడి సేవావృత్తిని ప్రస్తావించింది. పాండవులు కౌరవులవలె స్వతంత్రులు కాబట్టి ప్రభుత్వానికి అర్హులు కాని, సేవకవృత్తికి కాదని హెచ్చరించింది. ఆభిజాత్యంచేత కర్ణుడు పాండవాగ్రజు డౌతాడు. సేవావృత్తిని పరిత్యజించటంవలన దుర్యోధనుడికి దూరమౌతాడు. పాండవ కౌరవులలో కర్ణుడే పెద్దవాడు కావటంచేత 'కురుకులవరేణ్యు'డౌతాడు. కౌరవపాండవులందరూ కర్ణుడినే రాజుగా మన్నిస్తారు. అప్పుడు రాధేయుడనే పేరు మాసిపోతుంది. (పైకి చెప్పకపోయినా) కౌంతేయుడనే పేరు నిలుస్తుంది- అని కుంతి భావించింది. ఆభిజాత్యాన్నీ, అధికారాన్నీ ఎరగాచూపి రాధేయుడనే ప్రసిద్ధినుండి కౌంతేయుడనే ప్రసిద్ధస్థితికి రమ్మని కర్ణుడిని కోరింది. కుంతి మాటలలో శ్రీకృష్ణుడు చూపిన ఎరలకంటె ఎక్కువేమీ లేవు. ఆరవభర్తగా కర్ణుడిని స్వీకరించేటట్లు ద్రౌపదిని ఒప్పిస్తానని ఆడది కాబట్టి కుంతి అనలేకపోయింది. ఆమె మాట ప్రకారమే ద్రౌపది పంచపాండవులు పంచుకొన్న భిక్ష. ఆరవభాగం ఆమెకు అంగీకారమో కాదో తెలియబరచలేదు. శ్రీకృష్ణుడిది శుద్ధమైన రాజకీయపుటెత్తు. కుంతిది మమతతో కూడుకొన్న రాజనీతి పథకం.

అందుకే కర్ణుడు ఆమె మాటలకు కరిగి నీరైపోలేదు. సూర్యబింబంనుండి వెలువడిన వాక్యాలు వినికూడా తబ్బిబ్బైపోలేదు. ధీరమనఃప్రవృత్తితో తీర్పరితనంతో మాట్లాడాడు. మొదట ఆభిజాత్యాన్ని గురించి ఎత్తుకొన్నాడు. పుట్టుక ఎట్టిదైనా సంస్కారాలనుబట్టి అభిజాత్య గౌరవం నిర్ణయించబడుతుంది. ఇది లోకనీతి. కుంతి కర్ణుడిని కనినా, క్షత్రియ సంస్కారాలకు దూరంచేసింది. అందువలన ఆమెకు గాని, పాండువంశజులకుగాని ఇహపరలోకాలకు సంబంధించిన సుఖాలను కలిగించే అవకాశం అతడికి లేకుండా చేసింది. ఆమె చేసిన నేరం కారణంగానే కర్ణుడు సూత సంస్కారాలకు గురికావలసి వచ్చింది. ఇప్పుడు ఆ స్థితిని మార్చి కుంతీపుత్రుడని వెల్లడిచేసికొంటే సంస్కారాలు మారవు, సంసార పరిస్థితులు మారవు. అవి మారకుండా క్షత్రియుడని ప్రకటించుకొనటం హాస్యాస్పదం. ఆ దీనస్థితిని కల్పించింది కుంతి.

జగత్ప్రకాశకారకుడైన సూర్యుడి పుత్రుడిని చీకటిలోకి నెట్టిన నేరం ఆమెది. అది తెలిసివచ్చేటట్లు తేటతెల్లంగా మాట్లాడాడు కర్ణుడు. 'నీకుఁ బుత్రుఁడ నని వచ్చు టింకఁ బోలునె చెపుమా!'- అనే వాక్యంలో పోలదని చెప్పటమే పరమతాత్పర్యం.

కుంతీదేవి కర్ణజన్మాన్ని పరమరహస్యంగా అంతవరకు కాపాడి, యుద్ధానికి ముందు దానిని ప్రకాశంచేయటం అనేకమైన అపోహలకు దారితీస్తుంది. కర్ణుడి జీవితంలో ధర్మసంక్షోభం కలిగిస్తుంది. కడుపుతీపితో కొడుకు పుట్టుకను బైటపెట్టినా అది అతడికి కడుపుకోతగా పరిణమించే పరిస్థితికి దారితీయవచ్చునని కర్ణుడు తన జన్మ రహస్యప్రకటనాన్ని వారించాడు.

లోకంలో అర్జునుడి పరాక్రమకీర్తి అపారంగా వ్యాపించి ఉండగా కర్ణుడు కుంతికొడుకు నంటూ, భానుపుత్రుడనంటూ ప్రకటించుకొని అతడితో కలిస్తే, అతడికి భయపడి పోయాడని నిందిస్తారు. అంతేకాక, దుర్యోధనుడి మూలంగా ప్రసిద్ధికెక్కాడు కర్ణుడు. శత్రువిజయాన్ని సాధించిపెడతాడనే ఆశతో యుద్ధసాగరంలో అతడిని నావగా చేసికొని ముందుకు సాగుతున్న తరుణంలో దుర్యోధనుడిని నట్టేట ముంచటం ధర్మనీతి కాదని నిశ్చయించాడు. కౌరవుల తిండి తింటున్న భీష్మాదులే యుద్ధంలో పాల్గొంటుంటే కర్ణుడు తప్పించుకొనటం సబబుకాదు. అంతేకాక, యుద్ధారంభకాలంలో మిత్రులను వదలి వెళ్ళితే వారిని సాటిరాజులు మెచ్చుకోరు. కాబట్టి కర్ణుడు ఆభిజాత్యాన్ని, అధికారాన్ని తృణీకరించి సూతవంశాన్నీ సేవాధర్మాన్నీ రక్షింపదలచుకొన్నాడు. అంటే కుంతీ ప్రార్థనను తిరస్కరించటమే న్యాయమని నిశ్చయించాడన్నమాట!

కాని, కన్నతల్లి జన్మ కొక్కసారి కోరిన కోర్కెను తీర్చలేకపోయినా, ఆ కోరిక వెనుక ఆమె మనసులో ఉన్న కడుపుతీపినీ, దానిని తగిన సమయంలో వాడుకొని పాండవులకు మేలు చెయ్యాలనుకొన్న రాజనీతినీ, కాదనకుండా మాతృఋణం తీర్చుకొందామనుకొన్నాడు దానవీరుడు కర్ణుడు.

ఉ. 'నీ పలుకెంత వోలినను నిర్ణయ మిట్టిద కాని యొండులే;
దీపనిమీఁది భారమున నీ విట వచ్చితి గాన పాండవుల్
సేపడి రేనిఁ జంప; నఱసేయక చెప్పెద, సవ్యసాచిపైఁ
గోపముపెద్ద; వాఁడు సమకూరిన బిట్టుఱఁ జంపుదుం జుమీ!'

ఆ. 'సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తి । కరమ; యతఁడు లోనుగాఁగ నేవు,
రేను లోనుగాఁగ నేవురు గాని, నీ । కొడుకు లార్వు రనుట విడువు మింక'. **(ఉద్యో. 4. 68,69)**

మహాభారత చరిత్రను మార్చిన రహస్యపుటొప్పందాలలో ఇది ఒకటి. విశేషమేమంటే ఇటువంటి రహస్య సంధులు చేసికొన్న వీరులు కౌరవపక్షంలోనే ఎక్కువ. వారిలో కర్ణుడు, శల్యుడు ముఖ్యులు. వీరిరువురిమీద దుర్యోధనుడికి ఆశలు అధికం. అయినా, దుర్యోధనుడి కిచ్చిన మాటకు విఘ్నం రాకుండా వ్యక్తిగత ధర్మాలకు ప్రాధాన్యమిచ్చిన వీరులు వీరు. స్వీయధర్మం సేవాధర్మానికి తత్త్వతః, విరోధం కావచ్చును. లేదా బాధకం కావచ్చును. అయినా కుడిచేతి దానం కుడిచేతిదే, ఎడమచేతి దానం ఎడమచేతిదే. దుర్యోధనుడి బలశక్తి బీటలు వారిన చప్పుడు ఈరంగంలో బాగా వినబడుతుంది. ఇది కుంతి ధర్మరాజుకొరకు చేసే యుద్ధోద్యోగానికి సమకూరే విజయదుందుభి! 'కర్ణుడు లేని భారతం నీరసం' అన్నసూక్తికి ఈ రంగం మూలం!

9. పాండవులు యుద్ధానికి సిద్ధమై కురుక్షేత్రంలో విడిసి ఉన్నారన్న వార్తలు చారుల వలన వినికూడా, వినినివాడివలె నటిస్తూ, ముఖంలో ఎటువంటి భావాలనూ ప్రదర్శించకుండా దుర్యోధనుడు ఆత్మీయులను పిలిపించి కొలువుతీర్చి ఇట్లా అన్నాడు.

క. 'తన వచ్చిన కార్యము మన । మనుకూలతఁ జేయకున్న హరి యలుకమెయిన్
జని యప్పాండు తనూజులు । మనములఁ గిను కూనునట్టి మాటలు సెప్పన్'.

చ. 'మును మనచేత భంగపడి ముచ్చిరి యుండుటఁ జేసి పాండునం
దనులును నెత్తివత్తు రుచితంబుగ; సంగర మెట్లుఁ గల్గుఁ; బే
ర్చిన బహుసైన్యముల్ బయలఁ జేరఁ దగన్ విడియింత; మెల్లి దం
డని పురిఁ జాటఁ బంచి దొరలందఱకున్ బడిసేయుఁ డేడ్తెఱన్'. **(ఉద్యో. 4. 134, 135)**

ఈ మాటలు దుర్యోధనుడికి ఉండదగినంత రాజనీతి పరిజ్ఞానం లేనట్లు స్ఫురింపజేస్తున్నాయి. శత్రుబలాన్ని గురించి అంచనావేయగల శక్తి అతడి బుద్ధికి ఉన్నట్లులేదు. శ్రీకృష్ణుడి మాటలు పాండవులలో కోపం రేకెత్తింపజేయగా, ఇదివరకు పడినపాట్లను స్మరించుకొంటూ వారు యుద్ధానికి సిద్ధమై వస్తారని అలవోకగా చెప్పాడు. సన్నివేశాన్నిబట్టి దుర్యోధను డీమాటలు వాస్తవాలను కప్పిపుచ్చిమాట్లాడుతున్నాడనీ భావించవచ్చును. అవగాహనలేని ఆహవనీతిని ప్రయోగిస్తున్నాడనీ వ్యాఖ్యానించవచ్చును. తనమాటకు తిరుగులేదన్న అహంకారంతో వ్యవహరిస్తున్నాడనీ తలంచవచ్చును. ఏమైనా, ప్రతినాయకుడి అపరిణత యుద్ధనీతిని తెలిపే చిన్ని ఘట్టం ఈ రంగం.

10. దుర్యోధనుడు భీష్మమందిరంలో జరిపిన సమావేశం యుద్ధోద్యోగ రీత్యా ఎంతో ప్రాధాన్యాన్ని సంపాదించుకొన్నది. భారత వీరుల గుట్టుమట్టులు తెలిసిన మహావీరుడు భీష్ముడు. అతడు కౌరవసేనకు ప్రథమ సైన్యాధ్యక్షుడు. అతడి మాటలు పితామహశాసనాలవలె ఉంటాయి. శత్రుమిత్ర బలాబల నిరూపణం సైన్యాధ్యక్షుడి ప్రథమ కర్తవ్యం. అందులోనే జయాపజయాలు వస్తుధ్వని నాశ్రయించి ప్రకటితమౌతాయి. వాటిని సూచించే విలువైన రంగం ఇది.

సర్వసైన్యాధ్యక్ష పదవి చేపట్టటానికి భీష్ముడు షరతులు పెట్టాడు. ఇట్టివి పాండవపక్షంలో వినబడవు. కౌరవవీరులలో ఉన్న రవరవలకు అవి సంకేతాలు.

1. 'యుద్ధకార్యాలలో ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా చెప్పాలి. మారుమాటలు పనికిరావు. నాకు కౌరవపాండవు లొక్కటే. నేను మీతో కలిసి ఉంటున్నాను కాబట్టి యుద్ధానికి రమ్మంటే వస్తాను. అది ఉచితం కూడా.

2. మీరు కోరటంవలన సైన్యాధిపత్యాన్ని స్వీకరిస్తాను. ఒక అర్జునుడు తప్ప న న్నెదిరించి నిలిచే వీరులు లేరు. అర్జునుడు నాకంటె ఎక్కువ శరాలు కలిగి ఉండటంచేత అతడిని ఎదురొడ్డి నిలవలేను.

3. మిగిలినవారి నందరినీ యుద్ధంలో వధించగలను. అయితే, పాండురాజనందనులను మాత్రం నేను చేజేతుల చంపలేను. వారుకూడా నా మీద భయంకరంగా దాడిచేయరు.

4. అది అట్లుండగా మరొకమాట! ముందుగా కర్ణుడినిగాని, నన్నుగాని యుద్ధంచేయటానికి అనుమతించుము. అట్లా చేయకపోతే నేను సైన్యాధ్యక్ష పదవిని స్వీకరించను'.

ఈ మాటలు నిష్ఠురాలుగా కనపడినా నిజాయితీతో కూడుకొన్న నిజాలు. కర్ణు డిదివరకే భీష్ముడు కూలేంతవరకు ఆయుధం పట్టనని శపథం చేశాడు. దాని నతడు ఈ సందర్భంలో మరల పేర్కొన్నాడు. భీష్ముడు సర్వసైన్యాధ్యక్షు డైనాడు. ఈ సన్నివేశంలో పాల్గొన్న పాత్రలు మూడైనా మూడూ మొదట్లోనే హంసపాదం వేశాయి. భీష్ముడిని ఎన్నికచేయక తప్పదుకాబట్టి

దుర్యోధనుడు సేనాధ్యక్షుడిగా చేశాడు. భీష్ముడు యుద్ధం చేయకతప్పదు కాబట్టి యుద్ధానికి ఒప్పుకొన్నాడు. కాని, అర్జునుడి ముందు తాను నిలువలేనన్నాడు. అతడిచేతిలో మరణిస్తా ననలేదు. కర్ణుడుండగా ఆయన యుద్ధం చేయనన్నాడు. భీష్ముడుండగా తాను యుద్ధం చేయనన్నాడు కర్ణుడు. దీనినిబట్టి ముందు పితామహుడు నాయకుడైనా అతడు మృతుడు కావటం తథ్యమని భావికథార్థధ్వని. మంగళారంభంగా సాగవలసిన ఈ రంగం అమంగళస్వరాలతో ఆరంభమైనది. కౌరవ పరాజయం తప్పదని సూచించబడింది. యుద్ధపర్వాలలో పాండవ విజయసూచనలు ప్రత్యర్థుల స్కంధావారంలోనే వినబడటంచేత యుద్ధోద్యోగం సఫలమైనదని స్పష్టమౌతున్నది.

**(3). దృశ్యాలుగా గోచరించే సన్నివేశాలు**

ఒకటిరెండు పాత్రలు ఒకసన్నివేశంలో తారసిల్లి ఏదైనా ప్రయోజనాన్ని సాధించే సంభాషణలను స్వల్పకాలంపాటు సాగించిన ఘట్టాన్ని దృశ్యంగా పరిగణించవచ్చును. అటువంటివి కూడా పది కనబడుతున్నాయి ఉద్యోగపర్వంలో.

| | |
|---|---|
| 1. శల్య దుర్యోధన సమావేశ సన్నివేశం. | 1. 94-103 |
| 2. సంజయుడు ధృతరాష్ట్రుడితో రాయబారపు వృత్తాంతం చెప్పే సన్నివేశం. | 2. 2-16 |
| 3. ధర్మరాజు ఆత్మీయులతో సభచేసిన సన్నివేశం. | 3. 3-4 |
| 4. పాండవులు శ్రీకృష్ణుడిని సాగనంపే సన్నివేశం. | 3. 133-144 |
| 5. శ్రీకృష్ణుడి హస్తినగర ప్రవేశ సన్నివేశం. | 3. 174-180 |
| 6. శ్రీకృష్ణుడి విదురమందిర సన్నివేశం. | 3. 229-244 |
| 7. సభానంతరం ధృతరాష్ట్రాదులతో శ్రీకృష్ణుడి సన్నివేశం. | 4. 4-8 |
| 8. భీష్మద్రోణులు దుర్యోధనుడికి హితవు చెప్పిన సన్నివేశం. | 4. 19-27 |
| 9. బలరాముడు తీర్థయాత్రలకు పోయే సన్నివేశం. | 4. 165-173 |
| 10. రుక్మి ప్రగల్భాలాడిన సన్నివేశం. | 4. 174-180 |

దృశ్యాలలో సంఘటన కెంత ప్రాధాన్యముంటుందో సంభాషణలకూ అంతే ప్రాముఖ్యముంటుంది. ముడివంటి ఒక సమస్య ముడిపడటమో, విడిపడటమో దృశ్యంలో గమనిస్తాం.

1. శల్య దుర్యోధన సమావేశం దుర్యోధనుడు ప్రయోగించిన నీతి కౌశలానికి ఫలంగా ఏర్పడింది. చారులు చేసిన సేవలకు మెచ్చి వరాలిద్దామనుకొన్న శల్యుడి ముందు దుర్యోధనుడు తారసిల్లి, అతడి సైన్య సహాయాన్ని పొందగలుగుతాడు.

క. 'సత్య సరస్వతి వగు; మౌ । చిత్య విశారదము నీదు చిత్తము; నియమౌ
దాత్త్యంబు మెఱయ నాకు న । మాత్యుఁడవై పూని నడవు మత్సైన్యంబున్'.

ఆ. 'తలఁపఁ బాండవులును ధార్తరాష్ట్రులు నీకు । నొక్కరూప; భక్తియుక్తిఁ జాల
నీవు నన్ను మాననీయుండు గాఁగ న । నుగ్రహించి తగఁ బరిగ్రహింపు'. **(ఉద్యో. 1. 95-96)**

ఇవి దుర్యోధనుడు పలికిన మాటలా? అని ఆశ్చర్యం వేస్తుంది. ధర్మజుడి వాక్యసంస్కారం గుబాళిస్తున్న దిందులో. ధర్మరాజుకు సాయంచేయబోయే శల్యుడిని తనవైపు త్రిప్పుకొనటంలో దుర్యోధనుడు కార్యచాతుర్యంతో పాటు వాక్యచాతుర్యంకూడా చూపి సాత్త్వికుడివలె చెలువొందిన ఈ దృశ్యం అరుదైనది.

2. ఉపప్లావ్య నగరం నుండి తిరిగి వచ్చిన సంజయుడు, సంజవేళలో ధృతరాష్ట్ర మహారాజుకు దౌత్య ఫలితాంశాలపై ప్రాథమిక నివేదికను మౌఖికంగా సమర్పించిన ఈ సన్నివేశం కథలో కీలకమైనది. సంజయుడు సూత్రకారుడివలె కొన్ని వాక్యాలే మాట్లాడాడు. అందులోనూ ఈ క్రింది పద్యం బ్రహ్మసూత్రంవలె రాణించింది.

చ. 'అనయము వుట్టె జూదమున; యప్పుడ యెంతయుఁ జిచ్చు వెట్టి కా
ల్చినయది నీ యుపేక్షయ; వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తని పులి; యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం; బిదప నీకును నాకు మరల్ప వచ్చునే?' **(ఉద్యో. 2.14)**

ఉద్యోగపర్వంలోని ధర్మరాజువ్యూహాన్ని సూత్రబద్ధం చేసిన గొప్ప పద్య మిది. దీని వ్యాఖ్యానమే ఈ పర్వకథాంశం. ఈ మాటలు విన్న ధృతరాష్ట్రుడు నిద్రపోలేదు. కథను నిద్రపోనివ్వలేదు. అంతటి చైతన్య బీజం ఈ సన్నివేశం.

3. సంజయుడు హస్తినాపురానికి తిరిగివెళ్ళిన మరునాడు ధర్మరాజు తన తమ్ములను, సుతులను, ఇష్టభృత్యవర్గాన్నీ పిలిచి తనయింట చిన్న సమావేశం ఏర్పరచి చేసి వారిముందు ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు.

క. 'మనము జనార్దను పాలికిఁ । జని కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు; బంధుహిత గురు । జనములతో రణము గాక సంప్రీతి యగున్'. **(ఉద్యో. 3.4)**

ఈ పద్యం శ్రీకృష్ణుడి రాయబారపు ఘట్టానికి ముందుమాట, లేదా నాందీవాక్యం. అల్పాక్షరాలలో అనల్పార్థం ఇమిడి ఉండే సారవంతమైన వాక్కు. ధర్మజుడి మాట సభ శిరసావహించింది. అందరూ కలిసి సామూహికంగా శ్రీకృష్ణమందిరానికి వెళ్ళారు. ఏకగ్రీవంగా తీసికొనే సభ తీర్మానాన్ని మరపించే ఈ దృశ్యం ధర్మజ నాయకత్వ దీప్తికి కరదీపిక!

4. హస్తినాపురికి బయలుదేరిన శ్రీకృష్ణుడితో పలికిన సాగనంపు మాటలలో ధర్మజుడు కుంతీదేవి ప్రసక్తితెచ్చి, ఆమెను దర్శించి రమ్మని ఆర్ద్రంగా అడిగాడు.

ఉ. 'వచ్చె జనార్దనుం డనినవార్తకుఁ బ్రాణము మేని కంతకున్
వచ్చిన సేదఁ దేఱుఁ గురువంశ పవిత్ర చరిత్ర గొంతి; నీ
వచ్చటి కేఁగి పాండవుల యందఱ మా ఱని చెప్పి మ్రొక్కుచున్
గ్రుచ్చియ కౌఁగిలించుకొని కుందిన చిత్తము నొప్పి దీర్పుమీ!' **(ఉద్యో. 3.134)**

కుంతిపట్ల పాండవాగ్రజుడికున్న ఆదరాభిమానాలతో కూడుకొన్న ప్రేమ అపారం. 'కురువంశ పవిత్ర చరిత్ర'- అనే విశేషణం ఆ పాత్ర స్వభావ సర్వస్వం. శ్రీకృష్ణుడు కుంతిని దర్శించి కొడుకుల భక్తి తాత్పర్యాలను స్వయంగా అందజేస్తాడు. ఆమెవద్ద నుండి పాండవులకు యుద్ధోత్సాహం కలిగించే పౌరుష సందేశాలను తెచ్చి వినిపిస్తాడు. ధర్మరాజు యుద్ధాన్ని ప్రారంభించటానికి ఆ తల్లి సందేశం ఒక ప్రధాన కారణం. అందువలన ఈ దృశ్యం భావికథా జీవిత పరిపోషకం.

ఈ సన్నివేశంలోనే అర్జునుడు జనులు వినేటట్లు చెప్పమని తన వీరసందేశం వినిపించాడు.

చ. 'జనులు వినంగ రాజ్యమున సాము గొనం గలవార మన్న యీ
జనపతి కార్యనిశ్చయము సమ్మతి గైకొని చేసినన్ సుయో
ధనుఁడును దమ్ములన్ సఖులు దానికి నేమును నియ్యకొందు; మొం
డనిన సుపుత్రమిత్త్రముగ నద్దెస నందఱఁ గ్రొచ్చి పాఁతుదున్'. **(ఉద్యో. 3.142)**

కొసమెరుపుగా మెరిసే ఈ పద్యంలో పాండవ హృదయం స్పష్టంగా ప్రకాశించి ఒక మెరుగైన ముగింపును పాండవ సందేశ ఘట్టానికి సమకూర్చింది.

5. శ్రీకృష్ణుడు హస్తినాపురంలో ప్రవేశించి పురవీథులలో ఊరేగుతూ ధృతరాష్ట్ర మందిరానికి చేరిన ఘట్టం మనోహరమైన మధుర దృశ్యం. భారతంలో భాగవతం ప్రవేశించినట్లుంటుంది. రమ్యహర్మ్యాలపై నిలిచి పూలగుత్తులను చల్లుతూ శ్రీకృష్ణ మహిమలను కీర్తించే అంగనామణులు గోపికల కెందులోనూ తీసిపోనట్లు గోచరిస్తారు.

సీ. 'ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల । పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె!
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల । మెచ్చించిన యా జగజెట్టి యితఁడె!
దుర్వృత్తుఁడగు కంసుఁ దునిమి యాతని తండ్రిఁ । బట్టంబు గట్టిన ప్రభు వితండె!
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల । కోర్కిదీర్చిన రసికుం డితండె!

తె. వెన్నలును గోపికాచిత్తవృత్తములును । నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె!
శ్రుతి శిరోభాగములఁ దన సుభగచరణ । సరసిజామోదమును గూర్చు చతురుఁ డితఁడె!'.
**(ఉద్యో. 3.175)**

మానవాకారంలో నున్న మాధవుడిని చూచిన మాన్యులు హస్తినాపురం ప్రజలు. ఆ ప్రజలను పాలించే సంస్కారం గ్రుడ్డిరాజుకు లేదనీ, మదాంధులైన దుర్యోధనాదులకు లేదనీ ధ్వని. (మిగిలిన వివరాలకు వ్యాఖ్య చూడండి).

6. హస్తినాపురంలోని విదుర మందిరం గంజాయి తోటలో ఉన్న తులసి వనం. అందులో ప్రవేశించిన తులసీదాముడు విదురుడితో సలిపిన సంభాషణలు శ్రీకృష్ణుడి రాయబారపు పరమార్థాన్ని ప్రపంచించే సారవచనాలు. కౌరవులు నిండు సభలో చేయ తలపెట్టిన దౌష్ట్యాన్ని గురించి శ్రీకృష్ణుడికి ఏకాంతంలో నివేదించి, మరునాటి కురుసభకు వెళ్ళవలదని సూచించాడు విదురుడు. దానికి శ్రీకృష్ణ డిచ్చిన సమాధానం రాజనీతి తిలకం. దుర్యోధనుడు వ్యర్థుడనీ తెలుసు. అతడిని సమర్థించే రాజులు పగను మనసులలో పెట్టుకొని సంధి కుదరనీయరనీ తెలుసు. అయినా ఉత్తములు ఊరకుండరాదు.

ఆ. 'పుడమి యెల్ల నొడ్డగెడవయి గజవాజి । యుతముగాఁ గడంగి యుగ్రమృత్యు
ముఖము సొరఁగఁ దివురు మూర్ఖత మాన్పుట । యధికమైన పుణ్య మనఘచరిత'. **(ఉద్యో. 3.238)**

శ్రీకృష్ణుడి రాయబారం ఈ దృష్టితో ఒక పుణ్యకర్మ. మానవులు పుణ్యంకాని పాపంకాని చేస్తూ చేస్తూ ఉండగా మధ్యలో అది విఫలమైనా, దాని ఫలితాన్ని అనుభవిస్తారని ధర్మవేత్త లంటారు. అది అట్లా ఉండగా ఈ యత్నం సామాజిక, కుటుంబ ధర్మాలను గౌరవించే శాంతియత్నం.

తే. 'చుట్టములలోన నొప్పమి వుట్టినప్పు । డడ్డపడి వారితోడఁ గొట్లాడి యైనఁ
దాని నుడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర । కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు'. **(ఉద్యో. 3.242)**

క్రూరకర్ము డనే నింద పడకుండా ఈ శాంతియాత్ర చేస్తున్నట్లు శ్రీకృష్ణుడు తన హృదయగీతను విదురుడికి వినిపించాడు. ధర్మజుడికి వినిపించింది ధర్మనీతిగీత; విదురుడికి వినిపించింది కర్మనీతిగీత. ఎవరికి, ఎప్పటికి ఎయ్యది ప్రస్తుతమో దానిని ప్రపంచించటం ఆ పురుషోత్తముడి లీలావిలాసం. శ్రీకృష్ణుడి రాయబారంలోని నైతికకోణాన్ని ఈ దృశ్యం ప్రదర్శించింది.

7. శ్రీకృష్ణుడి రాయబారపుసభ ముగిసింది. గాంధారి అంతఃపురానికి తిరిగి వెళ్ళింది. శ్రీకృష్ణుడు కుంతీగృహానికి బయలుదేరుతుండగా ధృతరాష్ట్రుడు చొరవతీసికొని తనయం దేమీ తప్పులేనట్లు శ్రీకృష్ణుడికి నివేదించుకొన్నాడు.

ఉ. 'వీరును బాండుపుత్రులును వేరము దక్కి పొసంగి మన్కికై
పోరిత మాడి యే నటులు బుద్ధులు సెప్పిన భంగియుం, గులా
చారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁ గాదె గదాధర! నీదు సన్నిధిన్'.

తే. 'నీకు శుద్ధుండ నగుటయ నిఖిల బంధు । మిత్ర గురుజన కోటికి ధాత్రి కెల్ల
నంబుజాక్ష! నిర్దోషుండ వగుట; గాన । నా తెఱంగు నీ వెఱుఁగుట నాకుఁ జాలు'. **(ఉద్యో. 4.3,5)**

కౌరవులూ పాండవులూ కలిసి ఉండాలని సభలో కొడుకులకు ఎన్నో బుద్ధులు చెప్పాడట!, ఎంతో కష్టపడ్డాడట! వంశగౌరవాన్ని నిలపటానికి అనేక విధాలుగా శ్రీకృష్ణుడి సన్నిధిలో కృషిచేసినట్లు కౌరవజాతికి స్పష్టమయిందట! శ్రీకృష్ణుడు నిర్మలాత్ముడు కావటంచేత ధృతరాష్ట్రుడి నిర్దోషిత్వాన్ని గుర్తిస్తే బంధుమిత్రజనకోటి కూడా గుర్తించినట్లేనట! ఈ మాట లంటున్న ధృతరాష్ట్రుడు దేవుడిముందు తన నిజాయితీని నివేదించుకొంటున్నట్లున్నది. అయితే, తాను కళ్ళుమూసికొని మాట్లాడితే దేవుడుకూడా కళ్ళుమూసికొని వింటాడనీ, అందరూ కళ్ళుమూసికొని అంగీకరిస్తారనీ భావించాడు. కాని, నీతులు చెప్పటంతో తన బాధ్యత తీరిపోయిం దనటం బాధ్యతారాహిత్యం. తాను రాజై తీర్పు చెప్పలేక, పాండవులకు పాలీయలేక, సంధి జరగటానికి అనుకూలంగా సాహసించి ఒక్క అడుగు ముందుకు వేయలేక, తాను నిర్దోషినని చెప్పుకుంటున్న ధృతరాష్ట్రుడు దుర్యోధనుడికంటె దుర్మార్గుడు. అతడి ఉపేక్షయే అతడి వంశానికి ఊపిరికుట్టుగా దాపురించింది. శ్రీకృష్ణుడు అతడి వక్రనీతిని అధిక్షేపిస్తున్నట్లు, అక్కడున్న పెద్దలందరికీ ధృతరాష్ట్రుడిమాట లుట్టంకించి చెప్పి, అతడు ప్రధానవ్యక్తి కాడనీ, అతడేమీ చేయలేడనీ తేల్చి చెప్పిన తరువాత ఇక హస్తినాపురంలో ఉండటం నిరర్థకమని పలికి, ప్రస్థానం సాగించాడు. సంధియత్నానికి ధృతరాష్ట్రుడు పాడిన చరమగీతం ఈ దృశ్యం.

8. శ్రీకృష్ణుడు హస్తినాపురాన్ని విడిచిపోతున్న సందర్భంలో భీష్మద్రోణులు దుర్యోధనుడికి చివరిసారిగా హితవును ఇట్లా బోధించారు.

శా. 'మాకుం జూడఁగఁ బోలు కార్య మిది ధర్మప్రీతి నీ వేఁగి సు
శ్లోకుండైన యుధిష్ఠిరుం గని జనస్తుత్యంబుగా శాంతివై
నీ కౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యే పొప్పు; దెందుం దుదిన్
శోకం బొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁ బోవే నృపా!'. **(ఉద్యో. 4. 24)**

ఈ హితవును దుర్యోధనుడు పెడచెవిని పెట్టాడు. దీనితో యుద్ధారంభానికి అడ్డంకు లేవీ లేకుండా పోయాయి. శాంతి విఫలం కావటానికి దుర్యోధనుడే కారకుడని కౌరవవీరులే నిశ్చయించినట్లు ఈ దృశ్యం బోధపరిచింది.

9. బలరాము డదృష్టవంతుడు. శ్రీకృష్ణ డంతటి తమ్ము డతడికున్నాడు. అందువలన భారమంతా ఆయనమీద ఉంచి నిశ్చింతగా జీవితం గడపటం, అప్పుడప్పుడూ శ్రీకృష్ణుడిమీద, బంధువులమీద తన పెద్దరికాన్ని చూపుతూ ఉండటం, ఆయనకు పరిపాటి. ఆ అలవాటులో భాగంగానే ధర్మరాజు సభకు వచ్చాడు. నిజానికి, ధర్మరాజు ఆయన సహాయం అడగలేదు. దుర్యోధనుడు అడిగాడు. అన్నదమ్ముల నడుమ జరిగే యుద్ధంలో పాల్గొనని బలరాముడు కచ్చితంగా చెప్పాడు. అందువలన ఎట్టి పరిస్థితులలోకూడా దుర్యోధనుడి వద్దకు పోలేదు. బలరాముడు యుద్ధంవలన కలిగే దారుణఫలితాలను వినలేక, చూడలేక తీర్థయాత్రకు పోదలచాడు. కాని, అతడి బహిఃప్రాణమైన శ్రీకృష్ణుడు ధర్మరాజాదుల పక్షంలో ఉన్నాడు. సంధికొరకు ప్రయత్నంచేసి దానిని కౌరవుల మూర్ఖతవలన సాధించలేకపోయాడు. యుద్ధం మొదలు కాబోతున్నది. శ్రీకృష్ణుడికి చెప్పిపోవాలని వచ్చాడు. కాని, ధర్మరాజు ప్రభువు కాబట్టి అతడిని కొలువులో కలిశాడు. బలరాముడికి పాండవులమీద జాలి. తమ్ముడు వారి పక్షంలో ఉండి వారిని యుద్ధంబారినుండి తప్పిస్తాడేమోనని ఆశించాడు. శ్రీకృష్ణుడికి సాధ్యంకానిది లేదని అతడివిశ్వాసం. సంధి కుదరలేదంటే శ్రీకృష్ణుడే సంధికి సుముఖుడు కాడేమో! అని అతడి ఊహ. దానికి కారణం గోవిందుడికి అర్జునుడిపై ఉండే మిక్కుటమైన మక్కువ- అని అతడి అనుమానం. ఇవన్నీ కలిసి అతడిని తీర్థయాత్రలకు పంపుతున్నాయి. ఈ ఒత్తిడితో ధర్మజుడిని దర్శించి, అతడిమీద జాలి చూపించబోయి, తన తమ్ముడిమీద చనువుగా చణుకులు విసిరాడు.

కౌరవపాండవులు క్రూరులై యుద్ధానికి దిగి బంధుమిత్రాదులకు ప్రాణహాని కలిగించటం దారుణకర్మగా గర్హించాడు బలరాముడు. ఇరుతెరగుల వారికీ సర్దిచెప్పి సంధిచేయుమని తానెన్నోసార్లు చెప్పినా శ్రీకృష్ణుడు పట్టించుకొనలేదని నొచ్చుకొన్నాడు. మాటల పొందికా, మన్ననా లేని కౌరవులకు ఏదో విధంగా నచ్చచెప్పి కార్యాన్ని చక్కజేసే బాధ్యత శ్రీకృష్ణుడికి ఉన్నదని భావించాడు. కాని, ఏదో కారణంవలన అతడు సంధి కుదిరించి ఉండడని అనుమానించాడు. ఉభయులకూ కావలసిన వాడైన శ్రీకృష్ణుడు అర్జునపక్షపాతి కాబట్టి పాండవులను వదలిపెట్టడని నిశ్చయించాడు.

ఉ. ‘కావున వీరికిం జయము గల్గుట నిశ్చయ మెల్ల భంగులం;
జావు నిజంబు వారికి; నసంశయమై యిటులుండ దీని నె
ట్లే వినఁ జూడ నేర్తు? దగ నింత ప్రవీణుల నేన చేసితిం
జూవె! సుయోధనుం బవనసూనుని నొండొరుఁ జంపఁ జూతునే?’ **(ఉద్యో. 4.171)**

శ్రీకృష్ణుడు పాండవ పక్షంలో ఉన్నందున పాండవులకు విజయం తథ్యమనీ, కౌరవులకు చావు తప్పదనీ నిస్సంశయంగా చెప్పాడు. చివరకు ఆయన బాధంతా తేల్చి చెప్పాడు. తన ప్రియశిష్యులైన దుర్యోధన భీముల నడుమ గదాయుద్ధం జరిగితే వారిరువురూ సమాన బలసంపన్నులు కాబట్టి ఉభయులూ చనిపోతారేమో అని శంకించాడు. ఆ విషాదాన్ని ఆయన చూడలేక తీర్థయాత్రలకు బయలుదేరాడు. బలరాము డెన్ని మాటలు మాట్లాడినా అటు ధర్మరాజు గాని, ఇటు కృష్ణుడు గాని కిమ్మనకుండా నమస్కరించి సాగనంపారు. ఆ నిశ్శబ్దంలో ఎంత ఔచిత్యముందో!

తమ్ముడైన శ్రీకృష్ణుడిని చనువుతో ఎన్నిమాటలన్నా, ఆయనచర్యలోని అంతరార్థం తెలిసికొనటం కష్టమని బలరాముడికి బాగా తెలుసు. అందుకే ‘హరి యెఱుఁగని చక్కటియుం । బురుషార్థము నా కెఱుంగఁ బోలునె?’ అని విజ్ఞుడుగా విన్నవించుకొన్నాడు. తమ్ముడు దేవుడని తెలిసికూడా తన పెద్దరికం చాటుకొనే భోళా పెద్దమనిషి బలరాముడు. అతడి పాత్ర చిత్రణాన్ని ఒక్కదృశ్యంలో పరిపూర్ణంగా చూపగలిగిన ఈ సన్నివేశం కడుసున్నితం.

10. గంభీరమైన యుద్ధ వాతావరణంలో రుక్మివృత్తాంతం ఒక చక్కని హాస్యవిరామం. రుక్మిణి అన్న అయిన రుక్మి విజయమనే దివ్య చాపం కలవాడు. కాని, చపలచిత్తుడు. అతడిని ఎవరూ యుద్ధానికి పిలవలేదు. అయినా, ససైన్యుడై ధర్మజుడి వద్దకు వచ్చి, సత్కారాలు పొంది అర్జునుడిని చూచి ప్రగల్భా లాడటం మొదలు పెట్టాడు.

'అర్జునా! యుద్ధం చేయటానికి నీకు భయంగా ఉంటే నాతో చెప్పుము. నాకు ఎదురుగా నిలబడగలిగిన వీరుడు లేడు. ఎటువంటి వీరుడినైనా యుద్ధంలో ఓడించి నీకు సాయంచేస్తాను!' అని అన్నాడు. రుక్మి నోడించి రుక్మిణిని తెచ్చి రాక్షస వివాహం చేసికొన్న శ్రీకృష్ణుడున్న సభలో ఆత డట్లా సిగ్గులేక మాట్లాడటం అందరికీ ఎబ్బెట్టుగా తోచింది. అర్జునుడు వెటకారంగా నవ్వి ఇట్లా అన్నాడు. 'గంధర్వరాజైన చిత్రరథుడిని గెలిచినప్పుడూ, విరాటరాజుగోవులను మరల్చి తెచ్చినప్పుడూ నీవెక్కడున్నావో తెలియక పిలవకపోవటం పొరపాటైపోయింది. ఇకముం దెప్పుడైనా నాకు తోడు వద్దువుగానిలే. అయితే, యుద్ధంలో నే నెవరి సహాయాన్నీ కోరను. అయినా విజయాలు కలుగుతున్నాయి. శ్రీకృష్ణుడు నాకు అండగా ఉన్నాడు. నేను భయపడవలసిన అవసరం లేదు. నాకు భయం తీర్చవలసిన అవసరం లే' దని రుక్మిని తృణీకరించాడు. అతడు వెళ్ళి దుర్యోధనుడిని అడిగాడు. అతడూ తిరస్కరించాడు. చివరకు రుక్మి తలవంచుకొని తన పట్టణానికి తిరిగిపోయాడు.

ఈ ఉదంతం వలన కౌరవపాండవు లిరువురూ మాటల పోటుగాళ్లను కాక యుద్ధవిశారదులనే సహాయసహకారాలకై అర్థించారనీ, పరాక్రమవంతులు కానివారు ప్రాధేయపడ్డా తమ పక్షాన చేర్చుకొనలేదనీ తెలుస్తున్నది. యుద్ధోద్యోగంలో అది ఒక ఉన్నత ప్రమాణం!

**(4). చతుర్విధాభినయం**

నాటకానికి చతుర్విధాభినయం జీవితం. కావ్యంలోని నాటకీయతకు చతుర్విధాభినయ వర్ణనం రసవదలంకారం. తిక్కన రచనలో అభినయ ప్రశంస క్షీరనీరన్యాయంగా కలసిమెలసి ఉంటుంది. విరాటపర్వం చతుర్విధాభినయ చంద్రాలోకం. షోడశ కళాపూర్ణుడైన చంద్రుడు శరత్కాలంలో ఎంత సమగ్రంగా ప్రకాశిస్తాడో విరాటపర్వంలో అభినయ చంద్రిక అంత పరిపూర్ణంగా విరాజిల్లింది. ఉద్యోగపర్వం అభినయ రీత్యా విరాటపర్వమంత విరాజమానం కాదు. అయితే అభినయాన్ని కావలసిన చోట సందర్భశుద్ధితో అనువుగా వాడుకొన్న జాగరూకత ఇందులో కనబడుతుంది. దానికి కారణం కూడా ఊహించవచ్చును. విరాటపర్వంలో పాండవులు వేషధారులు. అందువలన అభినయం వారికి లలితంగా, స్వభావ సుందరంగా ఉంటుంది. ఉద్యోగపర్వంలో రాజనీతి వర్తనం, పౌరుష ప్రవర్తనం ముఖ్యం. అందువలన లలితాభినయానికి పెద్దగా తావుండదు.

విరాటపర్వంలో ఆంగికానికీ ఆహార్యానికీ అవకాశం ఉన్నది. ఉద్యోగంలో తక్కువ. కీచకోదంతం విరాటపర్వంలో కీలకమైన పాత్ర నిర్వహించటం చేత సాత్త్వికాభినయానికి చక్కని అవకాశం దక్కింది. మొత్తానికి కీచకవధ ఘట్టం మినహాయిస్తే మిగిలిన ఘట్టాలలో కూడా అంతటి ముమ్మరమైన సాత్త్వికాభినయం కనబడదు. దక్షిణ ఉత్తర గోగ్రహణ ఘట్టాలలో వీరం పొంగులువారింది. క్రమంగా సాత్త్వికాభినయ వర్ణనం పలచబారింది. కొసమెరుపుగా ఉత్తరాభిమన్యుల వివాహ ఘట్టంలో సున్నితమైన సాత్త్వికం సొగసులు పోయింది. మరి ఉద్యోగ పర్వం కథ వేరు. ఇందులోనూ ద్రౌపదీ, కుంతీ మొదలైన స్త్రీ పాత్రలు ప్రవేశించిన ఘట్టాలలో సాత్త్వికం మృదువుగా మెరుస్తుంది. మిగిలిన చోట్ల అక్కడక్కడ కనబడుతుంది. విరాటపర్వంలో కంటె ఉద్యోగం వాచికాభినయంలో విస్తృతిని సంతరించుకొన్నది. ఉద్యోగపర్వంలో పాత్రలు తమ సంభాషణల ద్వారా తమ తమ అభిప్రాయాలనూ వ్యక్తిత్వాలనూ ప్రదర్శించుకొంటూ ఉంటాయి. పాత్రలు మాట్లాడిన

మాటలకే ఇందులో ప్రాధాన్యం కాని ఆ మాటలాడుతున్నప్పుడు అవి ప్రదర్శించే హావభావాలకు అభినయ ముద్రలకు అంత ప్రాధాన్యం కనబడదు. ఎప్పుడో భావతీవ్రత పరమస్థితికి అందుకొన్నపుడు అభినయ రేఖను తిక్కన అరుదుగా చిత్రించాడు.

**(అ). ఆంగికాభినయం**

ఉద్యోగపర్వంలో తిక్కన నిర్వహించిన ఆంగికాభినయాన్ని స్థూలంగా సమీక్షిస్తే ఈ క్రింది అంశాలను గమనించవచ్చును.

1. పాత్రల ఆకార భంగిమల కంటె ప్రవర్తన భంగిమలకు తిక్కన ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇచ్చాడు. ఉదాహరణకు- దుర్యోధన అర్జునుల స్వభావాలను వారి ఆంగిక అభినయాలతో సహజంగా వ్యక్తం చేసిన తిక్కన తేటగీతి పద్యం

తే. 'అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ । డరిగి తలయంపిదెస నున్నతాసనమున
నుండెఁ; బదపడి కాల్కడయొద్ద కల్లఁ । జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి'. **(ఉద్యో. 1.65)**

శ్రీకృష్ణుడి సన్నిధిలో ఉన్నతాసనంలో కూర్చున్న దుర్యోధనుడి అహంకారం, వినమ్రుడై నిలుచున్న సవ్యసాచి వినయం ఆ పాత్రల స్వభావాలకు సహజ సూచికలు. ఇటువంటి ఆంగికాభినయాలు ఉద్యోగపర్వంలో రసధ్వనికి పోషకాలుగా నిలుస్తాయి.

2. ఒక్కొక్క పాత్రకు ఆ పాత్రకు మాత్రమే సహజంగా గోచరించే ఆంగిక చేష్టను రంగంలో చిత్రించటం తిక్కన ప్రత్యేకత. ఉదాహరణకు- మద్రభూపాలుడైన శల్యుడు మిత్రులను కాని ఆత్మీయులను కాని కలిసినపుడు గాఢాలింగనం చేసికొనటం అలవాటు. సైన్య సహాయాన్ని కోరే మిషతో తనను కలిసిన దుర్యోధనుడిని సంభ్రమంతో గాఢాలింగనం చేసికొన్నాడు. ఈ ఆంగికాభినయంలో సంభ్రమం గౌరవ సూచకమే కాక కృతజ్ఞతా సూచకం కూడా. తన యుద్ధయాత్రలో దుర్యోధనుడు కల్పించిన సౌకర్యాలకు తన నిండు హర్షాన్ని తెలపటానికై నిండు కౌగిలింతను కల్పించాడు. హర్షాతిశయం కలిగినపుడు గాఢాలింగనం చేయటం శల్యుడి అలవాటు. ఈ అలవాటును ఆంగికాభినయంగా సన్నివేశంలో సందర్భోచితంగా వర్ణించి పాత్ర మనోగతభావాలను వ్యక్తం చేయటం తిక్కన శిల్పం.

ఇష్టం ఉన్నా లేకపోయినా, అన్నమాట ప్రకారం తన సహాయాన్ని అందిస్తానని దుర్యోధనుడికి మాట ఇచ్చిన శల్యుడు, ధర్మజుడి వద్ద సెలవు తీసికొని రావటానికీ బయలుదేరాడు. 'ఇచ్చినమాట తప్పవద్దనీ, వెంటనే తిరిగి రావా'లనీ కోరిన దుర్యోధనుడిని శల్యుడు మందహాసంతో ఆలింగనం చేసికొన్నాడు (ఉద్యో. 1.103). ఇక్కడ తిక్కన గాఢాలింగన ప్రసక్తి చేయలేదు. దరహాసాన్ని ప్రవేశపెట్టాడు. మొదటి కౌగిలింతలో ఉన్న గాఢత ఇందులో లేదు. దుర్యోధనుడి అదృష్టాన్ని చూచి నవ్వినట్లున్నది ఇక్కడి దరహాసం.

ఉపప్లావ్య స్కంధావారానికి చేరిన శల్యుడు, ధర్మరాజును అభినందించి పునరాలింగనం చేసినట్లు తిక్కన అభివర్ణించాడు (ఉద్యో. 1.104). యుధిష్ఠిరుడి మీద అతడికున్న అభిమానానికి ఈ పునరాలింగనం ఒక సంకేతం. ధర్మజుడి మనస్సు నొవ్వకుండా ఇంద్ర వృత్రాసుర వృత్తాంతాన్ని చెప్పి ధైర్యం చెప్పాడు. కర్ణుడి రథసారథ్యంలో విజయుడికి విజయం చేకూర్చేటట్లుగా రహస్యపు ఒప్పందం చేశాడు. ధర్మరాజునుండి విడిపోయినట్లు అతడు భావించకుండా ఉండేటట్లు నచ్చపలికాడు. తన రహస్య సహకారం అతడి కుంటుందని సూచిస్తున్నట్లుగా ధర్మరాజును గాఢతరంగా ఆలింగనం చేసికొన్నాడు. నిజానికి భౌతికంగా కౌరవపక్షంలో యుద్ధం చేస్తున్న శల్యుడు ధర్మరాజుకే విజయం చేకూరుస్తున్నాడు. ఈ రహస్యాన్ని కౌగిలింత అనే అలవాటును శల్యుడి పాత్రకు కలిగించి, ఆంగికాభినయంలో భాగంగా రచనలో చిత్రించి, నాటకీయతను తిక్కన పోషించాడు. ఇది ఒక విధమైన నిగూఢ అంతఃశిల్పం.

ఒక సన్నివేశంలో కార్యసాధన కొరకు ఒక్కొక్క పాత్ర ఒకరకమైన ఆంగికాభినయాన్ని పలుసార్లు ప్రకటిస్తున్నట్లు వర్ణించటం విశేషం. ఉదా॥ సంజయుడు ధృతరాష్ట్రుడి రాయబారిగా పాండవుల వద్దకు పోయినప్పుడు, వంగి వంగి నమస్కారాలు, సాష్టాంగ దండప్రణామాలు చేసినట్లు తిక్కన వర్ణించాడు. (చూడు. వివరాలకు ఉద్యోగం. 1.216, 1.272, 1.292, 1.303). పాండవులు రాజ్యభాగం కోరకుండా వారి మనస్సులు మెప్పించటమే అతడి రాయబారంలోని తాత్పర్యం. ఆ ప్రయోజనసాధనకై వినయాన్ని అతి వినయంగా ప్రదర్శించటం తిక్కన సంజయుడికి నేర్పిన అభినయం.

సమావేశాలకు, సభా చర్చలకు, వాదోపవాదాలకు, ఉపన్యాసాలకు, ఉపదేశాలకు, ఆలవాలమైన ఉద్యోగపర్వంలో వీరులుగా, నాయకులుగా చెలామణి అయిన పాత్రలు కొలువులలో మాట్లాడేటప్పుడు 'కలయం గనుగొని' మాట్లాడటం ఒక సభా మర్యాద రూపమైన ఆంగికాభినయాంశంగా తిక్కన తీర్చిదిద్దాడు. ఇది ఉద్యోగ పర్వమంతా కనబడే ప్రధానాంశం. (వివరాలకు చూడు. 1.6, 1.17, 1.307, 2.115, 3.130, 4.239 మొ.).

**(ఆ). ఆహార్యాభినయం**

ఉద్యోగపర్వంలో పాత్రల వస్త్రాద్యలంకరణాలు వర్ణించటం దాదాపు మృగ్యమే. వీరులను వర్ణించేటప్పుడు వారి ఆయుధాలను పేర్కొనటం భీమార్జునుల యందు ప్రచురంగా కనబడుతుంది. గాండీవధారియైన అర్జునుడు, గదాధారియైన భీముడు పలువురి చేత పలుమార్లు కీర్తింపబడతారు. శ్రీకృష్ణుడు చక్రధారి, కాని, యుద్ధంలో చక్రం పట్టనని ప్రతిజ్ఞ చేశాడు. రాజనీతిచక్రం పట్టాడు. అందువలన కాబోలు తిక్కన ఆతడి ఆంగిక ఆహార్య వైభవాన్ని మాత్రమే ఒక రమణీయమైన పద్యంలో వర్ణించాడు.

క. అంబుదశుభగాత్రుం బీ । తాంబరధరుఁ గమలదళనిభాక్షున్ హరిఁ జూ
డం బడసి లోచనము లమ్మ । తం బానిన మాడ్కి సమ్మదంబునఁ దేలన్.' **(ఉద్యో. 3.254)**

నీలమేఘశ్యాముడు, పీతాంబరధరుడు, కమలదళాక్షుడు అనే విశేషణాలు శ్రీకృష్ణుడి దివ్యాదివ్యమూర్తిని ధ్వనింపజేసే అభినయ సంకేతాలు. ఈ నాలుగు విశేషణాలు ఉద్యోగ పర్వంలో మరే పాత్రకు వాడబడవు. శ్రీకృష్ణుడే శ్రీమన్నారాయణుడు అని ధ్వనింపజేసే ఈ పద్యం ఉద్యోగ పర్వానికే ఒక మణిదీపం.

ఆంగిక ఆహార్యాభినయ స్ఫూర్తితో వెలువడిన మరొక పద్యం కూడా కృష్ణ నామధేయురాలైన ద్రౌపదిని గురించి కావటం విశేషం.

ఉ. 'ద్రోవది బంధురం బయినక్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెంద్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై'. **(ఉద్యో. 3.114)**

విషాద రోషాలను వెలిగ్రక్కే ఆహార్యాభినయం ఇందులో ద్రోవది బంధురమైన క్రొమ్ముడి నాశ్రయించి సాగటం సార్థకం. ఆమె జడ నల్లనికాంతులతో మిలమిలలాడుతూ బుసకొట్టే మహాభుజంగమో అన్నట్లు వ్రేలాడటం ఆశ్చర్యకరమైన అభినయం. తెలుగు సాహిత్యంతో విషాద రోషాభినయానికి విశిష్టమైన ఆహార్యాభినయానికి ఉదాహరణం ఈ పద్యం.

**(ఇ). వాచికాభినయం**

ఉద్యోగపర్వంలో మూడింట రెండు పాళ్ళు సంభాషణలే ఉన్నాయి. పద్యనాటకాలలోని పాత్రలు పాడే పద్యాలవలె అనేక పద్యాలు ఉద్యోగం నిండా ఉజ్జ్వలంగా భాసిస్తున్నాయి. పద్యాలు పాత్రోచితంగా, సందర్భోచితంగా, రసోచితంగా

తిక్కన రచించాడు. ఆయనే అక్కడక్కడ ఈ రహస్యాన్ని సూచించాడు కూడా. శ్రీకృష్ణుడు కౌరవసభలో రాయబారం జరుపుతూ ప్రదర్శించిన నేర్పరితనాన్ని ధర్మరాజుతో సంగ్రహంగా, విశ్లేషణాత్మకంగా పేర్కొన్నాడు. శ్రీకృష్ణుడి రాయబారాన్ని ప్రసిద్ధమైన తెలుగు పద్యాలతో తిక్కన నింపివేశాడు. అవి నాటకీయమైన శైలికి నాణ్యమైన ఉదాహరణాలు. ఆ పద్యాలలో కృష్ణుడు ప్రదర్శించిన వివిధ భావ దశలను ఆయన మాటల్లోనే ఈ విధంగా గమనించవచ్చును.

'...... ఏనును నాయోపినంత సామవాదంబు లాడితి; నారదాది మహామునులను సుయోధనునకు బుద్ధులు సెప్పునట్లు సేసితి; నేమిసెప్పినను నెంతటం బోకున్నం గినుక దెచ్చికొని జంకించియు భంగించియు ధిక్కరించియుఁ దృణీకరించియుం జూచితిఁ; గార్యంబు భగ్నం బగుట కొల్లక వెండియు శాంతవచనంబులు పలికితి; నతం డశక్తదుర్జనత సేయం జూచిన నమానుషంబు లగు వానం గొన్ని వెడమాయలం బన్ని పెక్కు పోకలం బోయితి; నెన్నిభంగుల సంధియ కావలయు నని పారలం గల యంతయుం బొరలితి; నప్పాపాత్ముం డెట్లునుం జక్కంబడక తనచలంబుతోన పొట్టుపార లయ్యుఁ గయ్యంబు వొడుచుం గాని యవశ్యంబును రాజ్యంబు పాలిచ్చువాఁడు గాఁడు; కౌరవులయెడ దండంబు దక్క నొండుపాయంబు లేదు; మీకుం బోలిన తెఱంగు సేయుండు'. (ఉద్యో. 4.33)

**(ఈ). సాత్త్వికాభినయం**

సాత్త్వికాభినయ వర్ణనలో తిక్కన అందెవేసిన చేయి. నాట్యశాస్త్ర మర్యాదలో సాత్త్వికాభినయానికి ఉన్న శక్తిస్థానాల నన్నింటిని విరాటపర్వంలో పరిణామక్రమస్ఫూర్తితో వర్ణించాడు. నానారసాభ్యుదయోల్లాసియైన విరాట పర్వంలో ఆ రచనా శిల్పం రక్తికట్టింది. విరాటపర్వంతో పోల్చి చూస్తే ఉద్యోగ పర్వంలో సాత్త్వికభావవర్ణనా వైచిత్రి తక్కువనే చెప్పాలి. ఎందరో పాత్రలు నానా భావ రసస్ఫోరకంగా మాట్లాడుతున్న సందర్భాలలో కూడా వారి సాత్త్వికాభినయాన్ని తిక్కన వర్ణించ లేదు. దానివలన వాచికాభినయానికి వాసి బాగా పెరిగింది. సూక్ష్మంగా పరిశీలించి చూస్తే ఒకటి రెండు విషయాలు గమనించవచ్చును.

1. సాత్త్విక సూచకంగా హాసాన్ని ఎడనెడ ప్రదర్శించటం. అందులోనూ కలకల నవ్వటం అనే అభినయాన్ని విశేషించి చెప్పటం.

(అ) శ్రీకృష్ణుడు ధర్మరాజుతో కౌరవులు చేసిన దుర్నయాలను పేర్కొంటూ దుష్టచతుష్టయం 'పుయిలోట దక్కి కలకల నవ్వుచుం బలికిన పలుకు లుగ్గడింప వచ్చునే' అని శ్రీకృష్ణుడు అన్నాడు (ఉద్యో. 3.37). శత్రుకృత అపహాస్యానికి సూచకం ఇక్కడి కలకల నవ్వటం.

(ఆ)క. 'వెఱ పెట్టిదియో యెన్నఁడు । నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ । గఱపినవా?'రనుచు శౌరి గలకల నవ్వెన్. **(ఉద్యో. 3.57)**

శ్రీకృష్ణుడి నవ్వు ఎగతాళి చేసేది కాదు ఎకసక్కెమాడేది.

(ఇ) కన్నీరు మున్నీరౌతున్న ద్రౌపదిని ఓదార్చటానికి ఉపాయంగా కలకల నవ్వును వాడిన వైనం విశిష్టం.

క. 'లలనా! యుడుగుము నీయే । డ్పుల కొలఁదియె కురునృపాల పుత్రకళత్రం
బులయేడ్పు? లింక వానిం । గలకల నవ్వుచు వినంగఁ గాలం బయ్యెన్.' **(ఉద్యో. 3.121)**

దుష్టచతుష్టయం కలకల నవ్వుతూ పాండవులను అవహేళన చేసిన దృశ్యాన్ని మరపించేటట్లు ఈ పద్యాన్ని నిర్వహించటం గమనించదగిన విషయం. కౌరవుల కళత్రాలు బావురుమని ఏడుస్తుంటే ఆ శోకనాదానికి ప్రతిగా ద్రౌపది కలకల నవ్వుతూ కసి తీర్చుకొనే ఒక భావచిత్రాన్ని కన్నుల ముందు రూపుకట్టించే కమనీయ పద్యశిల్ప మిది. ఉద్యోగపర్వం

గాంగేయుడు కలకల నవ్వటంతో ముగిసినట్లు చిత్రించటం కావ్యకళాశిల్పం. కర్ణుడు పాండవ సేనా సాగరాన్ని తన పరాక్రమ ప్రతాపంతో ఐదు రోజులలో ఇంకింప జేస్తానని శపథం చేసినపుడు భీష్ముడు కలకల నవ్వాడు. 'వట్టి మాటలు పలకటం కాదు గాండీవ గుణధ్వనికి ఎదురు నిల్చి పరాక్రమాన్ని ప్రదర్శించు' మని అపహసిస్తాడు. అంటే భీష్ముడు కలకల నవ్వటం భావికథార్థ సూచకం. పాండవ విజయ సంకేతం.

2. కలకల నవ్వటం అనుభావం ఔతుందా సాత్త్విక భావమౌతుందా అనే అనుమానం కొందరికి రావచ్చును. పై సన్నివేశాలలో కలకల నవ్వటం వివిధ భావస్థితులనే కాక మానసిక స్థితులను కూడ వ్యక్తం చేస్తున్నది. ఉద్యోగ పర్వంలో చాలా చోట్ల మానసిక స్థితి వ్యంజకాలైన అభినయాలనే వర్ణించాడు తిక్కన. అవి రసస్థితినందుకొన్న సాత్త్విక భావ దశలు. వాటిలో కావ్య నాటక మర్యాదలు రెండూ కలిసి కళామయంగా ప్రదర్శించబడ్డాయి. మచ్చుకు కొన్ని.

(అ) కౌరవ సభలో శ్రీకృష్ణుడి దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించిన సభాసదుల స్థితిని తిక్కన ఈ విధంగా వర్ణించాడు.

క. 'ఆ కొలువువారు గర మచ । లాకృతి నొక పలుకు లేక యందఱు వింజం
బాఁ కిడిన కరణి నవశ ము । దాకారిత చిత్తవృత్తులై యుండంగన్'. **(ఉద్యో. 3.255)**

ఈ పద్యంలోని చిత్తవృత్తి పరమాత్మను దర్శిస్తున్న మహర్షులు పొందే శాంతరసావస్థకు దీటుగా కనబడుతున్నది. శాంత చిత్తవృత్తులకే అటువంటి నిర్వికార మానసికావస్థ సాధ్యమౌతుంది. శ్రీకృష్ణుడి తేజోరూపం దర్శించిన భీష్మ విదుర ద్రోణ సంజయులు కన్నులు మూసికొన్నారట. అద్భుత భయానక రసాలు మనస్సులో నిండగా పుండరీకాక్షుడిని చూచి సాంద్రానందం పొందారట. (ఉద్యో. 3.405). ఇది కూడా అట్లాంటి బ్రహ్మానంద స్థితియే. ఆ తరువాత ధృతరాష్ట్ర విష్ణు దివ్య విజృంభణాన్ని దివ్యదృష్టితో చూచి ఆశ్చర్య రస నిమగ్నుడైనాడు (ఉద్యో. 3.410). ధృతరాష్ట్రుడు పొందింది, సాంద్రానంద స్థితి కాదు, ఆశ్చర్యమగ్న స్థితి. ఇట్లా పరిశీలిస్తే శాంత రసానందావస్థలను తిక్కన స్వయంగా అనుభవించి వాటిని ఆయా పాత్రల ద్వారా ప్రదర్శింపజేసినట్లున్నది.

(ఆ) వివిధ రసభావాలకు సంబంధించిన చిత్తావస్థలను సాత్త్విక స్ఫూర్తితో తిక్కన తేటతెల్లం చేశాడు. 'కినుక యెదఁగదురన్' (1.13), 'పరమానందంబు నొంది' (1.94), (వికచవదనుఁడగుచు' (1.99), 'మది వికాసముఁ బొందన్' (1.103, 1.276) 'చిత్తంబు కలఁత దేరె' (1.214), 'చిత్తంబు ప్రసన్నతం బొంద (3.132), 'గద్గద కంఠి' (3.100, 3.182), 'మోము విచ్చుచు' (3.207), 'మొగంబు రాజుచుండ' (4.25), 'దరహసిత వదనుండు' (3.58).

తిక్కనగారి సాత్త్విక భావ పరిణామ వర్ణన నైపుణ్యాన్ని తెలిసికొనటానికి గ్రుడ్డిరాజైన ధృతరాష్ట్రుడి హావభావాల చిత్రణం ఒక చక్కని ఉదాహరణం.

క. 'అన విని నిరుత్తరుం డయి । మనుజేంద్రుఁడు గొంతసేపు మ్రాన్పడి తలఁపుల్
పెనఁగొన నిద్రాహీనిం । దను వలయఁగ విదురుతోడఁ దా నిట్లనియెన్''. **(ఉద్యో. 3.53)**

జడపదార్థాలుగా భావింపబడే సూర్యచంద్రాదులను సైతం మానవీకరణం చేసి వారి చేత సాత్త్విక భావాలను ప్రదర్శింప చేయటం తిక్కన ప్రకృతి వర్ణనలో ప్రదర్శించే ప్రతిభ. మచ్చుకు.

తే. 'తనకులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్ర । లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు । గంది యెంతయుఁ జెలువేదెఁ జందురుండు'. **(ఉద్యో. 2.107)**

## 6. ఉద్యోగపర్వం - శిల్పానుశీలనం

మహాభారత విమర్శకులు ఉద్యోగపర్వాన్ని అనేక ముఖాలుగా సమీక్షించారు. నీతిశాస్త్రజ్ఞులకు నీతిశాస్త్రంగా మహాభారతం ప్రమాణంగా నిలవటానికి ప్రామాణికమైన ప్రయోగభాగంగా ఉద్యోగ పర్వాన్ని సంభావించారు. రాజనీతిలోని నీతిచాతుర్యం ఆరు రకాలుగా ప్రకాశిస్తూ ఉంటుంది.

1.వ్యూహాత్మకం 2.ప్రసంగాత్మకం 3.చతుర వచన రచనాత్మకం 4.ఉపన్యాసాత్మకం 5.క్రియాత్మకం 6.శాస్త్రబోధాత్మకం.

ఈ ఆరు లక్షణాలు ఉద్యోగపర్వంలో నిర్వహింపబడినా వాటిలో ప్రధానంగా ప్రసంగాత్మకాలూ ఉపన్యాసాత్మకాలూ పోషించబడ్డాయని విమర్శకులు భావించారు. రాజనీతిపరమైన ప్రసంగోపన్యాసాల శిల్పకళాలక్ష్మికి వజ్రకిరీటం వంటిది ఉద్యోగపర్వమని కీర్తించారు. ఈ పర్వానుశీలనంలో ఈ అంశమే మొదట ఎన్నదగింది.

ఆంధ్ర మహాభారతోపన్యాసాలలో ఉద్యోగపర్వాన్ని సమీక్షిస్తూ కీ.శే.నండూరి బంగారయ్యగారు ఈ అంశంమీద ప్రకటించిన కొన్ని అభిప్రాయాలు సాహితీ లోకంలో బాగా ప్రచారం చెందాయి. వాటిలో కొన్ని:

1. ‘‘ఉద్యోగ పర్వమున నన్నిటికంటెను మిక్కిలి మెచ్చుకొనదగినది వస్తుసంవిధాన చాతుర్యము. దీనినే వస్తు ప్రదర్శన శక్తి యని కూడా పేర్కొనవచ్చును. ఇందున్న రాయబారములకు గాని ప్రసంగములకు గాని సారాంశము తేల్చవలసివచ్చినచో మూడు వాక్యములలో జెప్పవచ్చును. ‘‘దుర్యోధనాదులు పాండవులపై నకారణముగ బగబూని శైశవము నుండియు బడరాని యిడుమలకు బాల్పరచిరి. అన్నిటికిని నోర్చుకొని పాండవులు శాంతాత్ములై తమ తండ్రి పాలు తమ కిచ్చినచో సంధియగునని వార్త పంపుచున్నారు. వారు తండ్రి పాలు వారి కిచ్చుట కంటెను న్యాయమేమున్నది?’’ కృష్ణుడే కానిండు. ఎవరు చెప్పిన వాక్యములకైన నింతే సారాంశము. అందుచే పర్వమునందలి వస్తువునంతను నించుమించుగఁ బునరుక్తి క్రింద జమకట్టుకొనవలసి యున్నది. కాని ఈ పునరుక్తిని ఏ మాత్రమును విసుగురానీకుండ ప్రపంచించుటలోనే ప్రదర్శన ప్రాగల్భ్యమున్నది.’’ (పుట.150)

2. ఉద్యోగ పర్వంలోని ప్రసంగాల వంటివి మరే పర్వంలోనూ సాధారణంగా కనబడవు. వాటిని 1.పరస్పర ప్రసంగాలని, 2.ఉపన్యాసాలని రెండు విధాలుగా విభజించవచ్చును. వ్యక్తులు ఒకరితో ఒకరు మాట్లాడుకొనే ప్రసంగాలు, పరిమిత సంఖ్యలో కూడి మాట్లాడుకొనే ప్రసంగాలు ఒక రకమైతే, వేదికలపై నిలిచి చేసే ప్రసంగాలు ఉపన్యాసాలు మరొక రకం. అన్ని రకాలకూ ఆదర్శప్రాయమైన ఉదాహరణలు ఉద్యోగపర్వంలో లభిస్తాయి. ఈ అంశాన్ని కీ.శే.నండూరి బంగారయ్యగారి మాటలలో గమనిద్దాం.

‘‘ఈనాడు పార్లమెంటరీ చర్చలలో నేమి, సమర ప్రచారమున నేమి, ఎలక్షనులలో నేమి, వక్తృత్వమున కొక ప్రత్యేక గౌరవమున్నది. దీని నొక కళగా నభ్యసించి యారాధించుచున్నాము. ఉపన్యాసము నెట్లు మొదలు పెట్టవలెనో క్రమముగా ప్రతిపాద్య విషయము నెట్లు విపులీకరించుకొనవలయునో ఈ యంశముల నన్నిటిని జాగరూకతతో కృషి చేసి సాధించుచున్నాము. భారతములో గూడ ‘‘సభలో నెట్లుపన్యసింప వలయును’’ అను ప్రశ్నకు సమాధానము లభ్యమగుచున్నది.

క. మనమునకుఁ బ్రియంబును హిత । మును బథ్యము తథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగుపలు । కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్.

ఈ గుణము లన్నింటికి లక్ష్య భూతములు కాదగియున్నవి సంజయ శ్రీకృష్ణుల యుపన్యాసములు. వాక్యోపవాక్యముల నిర్మాణమునందును, విషయ విభాగము నందును, వస్తు ప్రదర్శన శక్తియందును, నివి ప్రత్యేకముగా బరిశోధనార్హములు, ఉపన్యాసకళకు ఆదర్శముగ గ్రహించి వీని నారాధించినను నారాధింపవచ్చును.’’ (పుట 158)

3. "ఈ యుద్యోగ పర్వమును బఠించుచుండగ నీనాటి యుద్ధ సన్నాహములు, ఈనాటి కపట ప్రచారములు, ఈనాటి యుపన్యాస నైపుణ్యము లన్నియు ప్రత్యక్ష మగుచుండును. అందుచేతనే ఈ పర్వము మన కింత యామోదదాయకముగ నున్నది."

"ఇందలి (**Repartee**) సమాధాన నైపుణ్యమొకటి ప్రత్యేకముగా గణనీయము. ఎదుటివారి మనస్సులోని కౌటిల్యములను వారి వాక్కులలోని నక్కవినయములను గ్రహించి వాత పెట్టినట్లుగ సమాధానమిచ్చుట పలు తావుల గనవచ్చుచున్నది.

క. 'అనుజులు నీవును ద్రోవది । యును బుత్త్రచయంబు నున్న యోగక్షేమం
బున తెఱఁగారయఁ బుత్తెం । చె నితాంత స్నేహపూర్ణ చేతోవృత్తిన్'. **(ఉద్యో. 1.274)**

అని సంజయుడు ధృతరాష్ట్రుని పక్షమున పాండవుల క్షేమము విచారింపగా దానికి ధర్మరాజిచ్చిన సమాధానము.

క. 'ఆరాజు మాదెసంగల । కారుణ్యము కతమునను సుఖంబున ని ట్లు
న్నారము; నినుఁ బుత్తెంచిన । గారవమున నాదుమది వికాసముఁ బొందెన్.' **(ఉద్యో. 1.276)**

దీనిలోని భావమును సంజయుడు గ్రహింపక పోలేదు. మరల నీ యంశమును గూర్చి ధృతరాష్ట్రునితో ముచ్చటింప వలసి వచ్చినపుడు

క. 'వా రెల్లను భవదీయ । స్ఫారబలము గారణముగ సౌఖ్యంబున ను
న్నారమని పలుకుదురు; నిజ । మారయఁగా నట్లగాదె యది జననాథా!' **(ఉద్యో. 2.6)**

అని వ్యాఖ్యానించుచున్నాడు.

సంజయుని దుర్యోధనాదుల కుశలము నడుగుటలో ధర్మరాజు నిష్ఠురము నెంతో నిపుణముగ బ్రయోగించుచున్నాడు (ఆ.2.ప.277-281) అతని వాక్య విజృంభణము నంతను సంజయు డొక్కమాటలో గట్టివేయుచున్నాడు.

క. 'పొం దొందఁగ దలఁచితి వీ । విందుశిశిరమైన విమల హృదయంబున వా
రందఱకును సేమం బిట । ముందఱ లేకున్న నేఁడు మొదలుగఁ గలుగున్'. **(ఉద్యో. 1.283)**

కొన్ని కొన్ని స్వల్పాంశములను బెద్దగ కొనియాడుటయు, ప్రధానాంశమును దాచి పెట్టుటయు నిప్పటికి అప్పటి సామాన్య ధర్మమే.

ఉ. 'శాంతత బొంది కార్యము దెసన్ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ న
త్యంతముఁ దేఱి న న్నిటఁ బ్రియంబునఁ బంపెడునప్డు నాకుఁ దే
రెంతయు వేడ్కఁ దాన వెర వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁబంచె; ని
ట్లింత ఘటించెఁ బొందు; మన మీ పదనం దెలివొందఁగాఁ దగున్'. **(ఉద్యో. 1.293)**

ధృతరాష్ట్రుడు పాండవులకడకు బోవుచున్న సంజయుని రథమును స్వయముగ బన్నించినాడట. ఇదియొక గొప్పగ నాతడు గొనియాడుచున్నాడు. కాని పాలిచ్చుట గూర్చి యేమియు బలుకడు. అంతస్సారము శూన్యమైన ఈ యుపన్యాసము నొక్కమాటలో వాసుదేవుడు ఖండించుచున్నాడు.

క. 'ఆ రాజు సేయు నెయ్యము । గారామును జెప్పె దీవు గడుఁదీపులుగా
వీరు దమపాలు వడయక । నేరిమి మాటలనె తీరనేర్తురె చెపుమా?' **(ఉద్యో. 1.340)**

అసలు విషయమును గప్పిపుచ్చి అప్రధాన విషయములకు బ్రాధాన్యమిచ్చి మాటలాడుటయు నీ దొంగతనమును బట్టుకొని యెదిరి వారల్లరి చేయుటయు నేడే కాదు, నాడు గూడ గన వచ్చుచున్నది. దానినే మా ప్రాంతములలో నరచేతిలో తేనెవేసి మోచేతి వరకు నాకించుట యని వ్యవహరింతురు. ఈ నైపుణ్యమంతయు ప్రదర్శనశక్తిలోనే చేరును.

సంప్రదింపు సభలలోని ప్రసంగములలో పైగుణములు మాత్రమేగాక యిప్పటి **Symposiums** లోను పార్లమెంటరీ డిబేట్సులోను గానవచ్చు చర్చా నైపుణ్యము, ఒక మతమువా రిచ్చిన యుపన్యాసములోని ఒక్కొక్క యంశమునే గైకొని వరుసగా సమాధానమిచ్చు క్రమప్రకారమును ఇందు గానవచ్చుచున్నది. భారతము నందలి యుపన్యాసములను పరిశోధించినపుడు వాక్యోపవాక్యముల తార్కిక క్రమము (**Logical sequence**) లోగాని, అలంకారశోభ (**Rhetoric**) లోగాని, సమష్టియై గనవచ్చు స్నిగ్ధతాసంసిద్ధి (**Total finish**) లోగాని, విమర్శనాశక్తిలోగాని, వ్యాఖ్యాన పాటవములోగాని, సమాధాన నైపుణ్యములోగాని వక్తృత్వము ఎంతో యభివృద్ధినందిన దనుకొనుచున్న యీనాటి యుత్తమోపన్యాసముల కేమాత్రము దీసిపోవు. లాయడ్ జార్జి-(**Lloyd George**), విన్‌స్టన్ చర్చిల్ (**Winston Churchill** ) మున్నగు నాధునిక మహావక్తల యుద్ధ సమయములందలి యుపన్యాసములను గైకొని సంజయ శ్రీకృష్ణుల యుపన్యాసములతో బోల్చి చూచినచో మనము భారతీయులమను పక్షపాత బుద్ధిని దూరముగా నుంచి విమర్శించినను కడపటివారిదే పైచేయియని నిర్ణయింపక తప్పదు.

శిల్ప విధానము (**Technique**) స్థూలదృష్టి కించుమించుగా నొక్కటిగానే కానవచ్చుచున్నను వ్యక్తుల తారతమ్యమును బట్టి వానిలో సూక్ష్మ వ్యత్యాస మేర్పడకపోదు. ఏ కళయైనను సరే కావ్య రచనయే కానిండు. ఉపన్యాస ప్రధానమే కానిండు, విమర్శనమే కానిండు వ్యక్తుల యనుభావముపై (**personality**) గాఢముగ నాధారపడియుండును. శ్రీకృష్ణుని యనుభావము వేరుగ వివరించి చెప్పనక్కరలేదు. ఇక సంజయుడు కూడ సామాన్య వ్యక్తి కాడు. జీవన్ముక్తుడై ఈశ్వర సాక్షాత్కృతి నందిన మహాపురుషుడు. (ద్వి. ఆ.319, 320) అందుచే వ్యక్తిగతమైన యీతని యనుభావమంతయు నాతని ప్రసంగములలో ప్రతిబింబించుచున్నది. కార్యమెట్లయినను సంఘటింపవలెను. నుదారభావముతో బాండవుల కడకు వచ్చినపుడు కౌరవుల పక్షమున మాటలాడినాడే కాని నిజమున కాతనికున్న ధర్మోత్సాహ మపారము. ఇది కౌరవుల సభలో పాండవుల కడ నడచిన వృత్తాంతమును గూర్చి యాతడు చేసిన నివేదనములో ప్రత్యక్షమగుచున్నది. సంజయ శ్రీకృష్ణులకున్న మాహాత్మ్యమును ధర్మోత్సాహమును వారి యుపన్యాసములకు నుజ్జ్వలమైన శక్తిని ప్రసాదించుచున్నవి. అతీత భూముల నుండియు, సమదర్శనము నుండియు నుదయించువారి యుపన్యాసములలో సంచరించు దివ్యశక్తి స్వార్థ పరత్వము తోడను, హింసాపంకిలమైన యుద్రేకము తోడను నాడిన లాయడ్ జార్జి, చర్చిల్ మున్నగు వక్తల సమరోపన్యాసములలో నెట్లు ప్రత్యక్షము కాగలదు? కొంత కాలమునకు పూర్వము జాతీయత (**Nationalism**) అనగా నేదో మహోన్నతమైన యాదర్శముగా గౌరవించుచుండిరి. కాని రెండు ప్రపంచ మహాసంగ్రామములు చెలరేగి దాని గుట్టు నంతను బయట పెట్టినవిగదా?'' (పుటలు 163-166).

**(1). ఉపన్యాస శిల్పం**

పాండవ కౌరవ పక్షాలలో ప్రసిద్ధులైనవారందరూ ఉద్యోగపర్వంలో ఆయా సందర్భాలలో ఏదో రకంగా ఉపన్యసిస్తారు. కథ యుద్ధం వైపు నడుస్తున్నది కాబట్టి దానికి ఉన్ముఖంగా ఒకవైపు. ఉపశమనాత్మకంగా మరోవైపు తర్కబద్ధమైన వాక్య

సముదాయంతో స్వీయ తాత్పర్య ప్రతిపాదనం చేయడానికి పాత్రలు ప్రయత్నిస్తాయి. సత్య ప్రతిపాదన లక్ష్యంతో సాగే ఉపన్యాసానికి తర్కం అంతస్సూత్రం. ఎవరి తర్కం వారిదిగా కనబడుతున్న పాత్రల ఉపన్యాసాలలోనూ, ప్రసంగాలలోనూ తర్కశాస్త్ర ప్రమాణాలు ప్రతిఫలిస్తూనే ఉంటాయి. రాజనీతిశాస్త్రానికి అనుగుణమైన తర్కశాస్త్ర మర్యాదలు తొణికిసలాడుతూ ఉంటాయి. వాటిని వివిధ వాక్య విన్యాసాలలో ఉపన్యాస శిల్పంగా వెలువరించిన తిక్కన ప్రజ్ఞ ఉద్యోగపర్వానికి సాహిత్యోపాయనంగా లభించింది. రాజనీతిశాస్త్ర దృక్పథంతోకాని, తర్కశాస్త్ర దృక్పథంతోకాని ఉద్యోగపర్వాన్ని విస్తృతంగా వ్యాఖ్యానించవచ్చును. కాని, ఇక్కడ స్థాలీపులాక న్యాయంగా సమీక్షించటానికే వీలౌతుంది.

ప్రతిపాద్యాంశానికి లక్షణ పరిష్కారం చేస్తూ పదార్థ స్వరూప స్వభావాలను విశదీకరించడం తర్కశాస్త్ర పద్ధతి. తర్కం వాదాన్ని ఆశ్రయించి సాగుతుంది. అందువలన తర్కశాస్త్ర పద్ధతి వాదశైలి మీద ప్రధానంగా ఆధారపడిఉంటుంది. ఒక చిన్న విషయాన్నికానీ, ఒక పెద్ద విషయాన్నికానీ ఎంతగా విపులీకరిస్తే బాగుంటుందో, ఎంత సంగ్రహంగా చెబితే సరిపోతుందో వక్త తన వాదవిధానంలో నిర్ణయించుకొంటాడు. వాదంలో ప్రమాణం ఉండాలి. హేతువుండాలి. వాటిని ప్రయోగించే శక్తియుక్తులుండాలి. ఉద్యోగపర్వంలోని నాయక పక్షంలోని పాత్రలు హేతుబద్ధంగా మాట్లాడుతాయి. దుర్యోధనాదులు హేత్వాభాసను అమితంగా ఆశ్రయిస్తారు. ఈ భేదం వారి ప్రసంగాలలో ఉపన్యాసాలలో స్పష్టంగా కనబడుతుంది.

స్థూలంగా పరిశీలిస్తే ఉద్యోగపర్వంలోని దూతలు చేసే ఉపన్యాసాలు మూడు. వాటిలో ద్రుపద పురోహితుడి ఉపన్యాసం ప్రత్యక్ష ప్రమాణాన్ని ఆశ్రయించి సాగుతుంది. సంజయుడి రాయబారపు ప్రసంగం అనుమాన ప్రమాణం ప్రాతిపదికగా ప్రవర్తిల్లుతుంది. శ్రీకృష్ణుడి ఉపన్యాసాలు ఆప్తవాక్య ప్రమాణ ప్రాతిపదికగా ప్రకాశిస్తాయి. విశేషమేమంటే పంచపాండవులు, ద్రౌపది చేసే ఉపన్యాసాలలో జంటలు జంటలుగా ఒక్కొక్క ప్రమాణాన్ని ఆశ్రయించుకొని మాట్లాడుతారు. ఉదాహరణకు ద్రౌపది, సహదేవుడు ప్రత్యక్ష ప్రమాణవాదులు. భీముడు, అర్జునుడు అనుమాన ప్రమాణవాదులు. ధర్మజుడు, నకులుడు శబ్ద ప్రమాణవాదులు. ఈ విధంగా పాండవ పక్షం సాగించే ఉద్యోగపర్వకథాఘట్టం తర్కశాస్త్రజ్ఞులు తర్కశాస్త్రమని కీర్తించే విధంగా సాగుతుంది.

కౌరవపక్షంలో విపరీత తర్కం విశేషంగా ప్రకటితమౌతుంది. వారి వాదనలలో హేత్వాభాసతో కూడిన వితండవాదం గోచరమౌతుంది. అందులోను దుర్యోధనుడు ప్రత్యక్ష ప్రతికూల ప్రమాణవాది; కర్ణాదులు విపరీత అనుమాన ప్రమాణవాదులు. ధృతరాష్ట్రుడు ఆప్తవాక్య ప్రతికూలవాది. వ్యాసాదులు ప్రత్యక్ష ప్రమాణవాదులు. భీష్మాదులు అనుమాన ప్రమాణవాదులు. విదురాదులు శబ్ద ప్రమాణవాదులు. ఈ విధంగా కౌరవపక్షంలో తర్కవితర్క హేతువాద శక్తుల పరస్పర వైరుధ్య విలాసం ప్రకటితమౌతుంది. శాస్త్రం తెలిసిన వారు ఈ లోగుట్టులను విశ్లేషించుకొని ఉద్యోగపర్వంలోని ఉపన్యాసాలలో ప్రసంగాలలో ప్రదర్శితమయ్యే వైవిధ్యాన్ని, వైశిష్ట్యాన్ని తెలిసికొనగల్గుతారు. ఒకవేళ శాస్త్ర విశ్లేషణ తెలియకపోయినా అపూర్వ చమత్కార ప్రసంగ విన్యాసాల ప్రతిభా పరిమళాలను సహృదయులు ఆమోదించి సంతోషిస్తారు. సుప్రసిద్ధ న్యాయశాస్త్రవేత్త రఘునాథ శిరోమణి,

"విదుషాం నివహై రిహైకమత్యాత్
యదదుష్టం నిరటఙ్కి యచ్చ దుష్టమ్
మయి జల్పతి కల్పనాధినాథే
రఘునాథే మనుతాం తదన్యథైవ" (తత్త్వచింతామణి, వ్యాఖ్యదీధితి, ఈశ్వరానుమానం చివర)

పండితులందరు కలసి నిర్దుష్టమని నిరూపించిన విషయాన్ని దుష్టంగానూ, వారు దుష్టమని నిరూపించినదాన్ని నిర్దుష్టంగానూ నిరూపించగలగటం తర్క పండితుడి ప్రజ్ఞ. ఉద్యోగపర్వంలో పాండవులు ఏది నిర్దుష్టమంటారో కౌరవులు

దాన్ని దుష్టమంటారు. పాండవులు దేన్ని దుష్టమని పేర్కొంటారో కౌరవులు దాన్ని నిర్దుష్టమని నిరూపిస్తారు. ఈ తార్కికవాదబలమే ఇన్ని ఉపన్యాసాలకూ, ప్రసంగాలకూ మూలకందమై నిలవటం ఈ పర్వంలోని విశేషం.

**(2). ద్రుపద పురోహితుడు ప్రత్యక్ష ప్రమాణవాది**

1. పురోహిత దౌత్యానికి ప్రాతిపదిక ఉపప్లావ్యంలో శ్రీకృష్ణాదులు నిశ్చయించిన వ్యూహం. వారు అందరు వ్యక్తం చేసిన భావాలను ప్రత్యక్ష ప్రమాణాలుగా గ్రహించి కౌరవసభలో ప్రతిపాదించటమే పురోహితుడి కర్తవ్యం.

2. జరిగిన కథను ప్రత్యక్ష ప్రమాణంతో పూసగ్రుచ్చినట్లుగా చెప్పి కౌరవుల దుర్ణయాన్ని సభలో బట్టబయలు చేయటమే ఇతడి ఉపన్యాస ఆరంభ శిల్పం. ఉద్యోగపర్వంలోని ప్రథమాశ్వాసంలో 231వ పద్యం నుండి 241వ పద్యం వరకు సాగించిన అతడి ఉపన్యాసం వాస్తవాన్ని సమీక్షించి అవినీతిని నిందించి శ్రేయస్సును బోధించే సత్యప్రతిపాదన స్వభావం కలిగిన వాక్యజాతం. నిజాల నిప్పులను వెదజల్లినట్లు అతడి మాటలు నిష్ఠురంగానే ఉంటాయి. ఇది ప్రత్యక్ష ప్రమాణవాది ప్రసంగ స్వభావం. ఇదే స్వభావం సహదేవుడి వాక్యాలలో ద్రౌపది ఉపన్యాసంలో గోచరిస్తుంది. ప్రత్యక్ష ప్రమాణవాదుల ఉపన్యాస సంభాషణ శిల్పంలో ఒక సమాంతర రచనా శిల్పాన్ని తిక్కన పోషించాడు. ఇక వైవిధ్య దృష్టితో పరిశీలిస్తే బ్రాహ్మణవాక్యం నిర్వికారమైన నిష్ఠుర సత్యం. సహదేవుడి ప్రసంగం సాభిమాన సత్యావేశం. ద్రౌపది ఉద్వేగపూరిత ఉపన్యాసం ప్రత్యక్ష ప్రమాణాల నాధారంగా చేసికొని సాగిన రోషావేశపూరితమైన నిష్ఠుర ప్రసంగం. ప్రత్యక్షవాదుల వాక్యాలలో నిజాలతో కూడిన నిష్ఠురత నిండి ఉండటం వారి ఉపన్యాస శిల్పమని తిక్కన నిష్కర్ష.

**(3). సంజయుడు అనుమాన ప్రమాణవాది**

''అనుమితి కరణం అనుమానం పరామర్శ జన్యం జ్ఞానమ్ అనుమితిః''. (తర్కసంగ్రహం పుట.57).

అనుమితి అనే యథార్థ అనుభవానికి అసాధారణ కారణమైనది అనుమానం. పరామర్శ వలన కలిగే జ్ఞానం అనుమితి అనబడుతుంది. తెలిసిన దానితో తెలియని మరో దానిని ఊహించటంలో తోడ్పడేది హేతువు. హేతువుకూ సాధ్యానికీ అవినాభావ సంబంధం ఉన్నప్పుడే కార్యం సాధించబడుతుంది. దానినే వ్యాప్తి అంటారు. దీనిని ధృతరాష్ట్రపరంగా, ధర్మరాజుపరంగా అన్వయించవచ్చును. ధృతరాష్ట్రుడు పురోహితుడి సందేశం వలన పాండవులు యుద్ధ ప్రయత్నంలో ఉన్నారనీ, ధర్మరాజు క్రోధమూర్తి అయి ఉన్నాడనీ తెలిసికొన్నాడు. ''యత్ర యత్ర ధూమ స్తత్ర తత్ర అగ్నిః'' అనే హేతువును పురస్కరించుకొని ద్రుపద పురోహితుడి వాక్యాలు ధూమరాశిగా భావించి ధర్మజుడి కోపమనే అగ్నిని ధృతరాష్ట్రుడు అనుమానించాడు. దానిని ఆర్పటానికి చేసే విశిష్ట రాజనీతి యత్నమే సంజయుడి రాయబారం. అనుమానం రెండు విధాలు. 1.స్వార్థానుమానం. 2.పరార్థానుమానం. తనకు స్వయంగా కల్గిన అనుమితికి కారణమైన అనుమానం స్వార్థానుమానం. ధృతరాష్ట్రుడు మంత్రులకు, హితులకు చెప్పకుండా ధర్మరాజును శాంతపరిస్తే అతడి క్రోధం వలన కలుగబోయే యుద్ధం సమసిపోతుందని భావించాడు. ఈ స్వార్థానుమానాన్ని సంజయుడి ద్వారా పరార్థానుమానంగా పరివర్తింపజేశాడు. పొగవలన అగ్ని ఉంటుందని నిశ్చయించుకొన్నవాడు తన వెంటనున్న మిత్రుడికి ఆ నిశ్చయాన్ని కల్గించడానికి ప్రయత్నిస్తాడు. ఆ విధంగా ధర్మజుడి క్రోధోపశాంతి కోసం దూతగా సంజయుడిని పంపుతాడు. ఇందులో ప్రధానంగా ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణం, ఉపనయం, నిగమనం అనే అయిదు అంగాలు ప్రయోగించబడుతూ ఉంటాయి. సంజయుడి రాయబారంలో తిక్కన ఈ అయిదంగాలనూ నిపుణంగా ప్రయోగించాడు. సంజయుడి రాయబారపు ఉపన్యాసంలో ఉన్న సంవిధానశిల్ప మిదే. స్వార్థానుమితి పరార్థానుమితులకు పరామర్శయే ప్రధాన స్వభావం. అందువలన సంజయుడి వాక్యాలలో పరామర్శయే ఉంటుంది కాని మరే పరమార్థ సాధనమూ ఉండదు. ఈ విషయాన్ని గమనించిన ధర్మరాజు

క. 'ఆ రాజు మాదెసం గల । కారుణ్యము కతమునను సుఖంబున ని ట్లు
న్నారము; నినుఁ బుత్తెంచిన । గారవమున నాదుమది వికాసముఁ బొందెన్.' (ఉద్యో. 1.276)

అని ఎత్తిపొడిచాడు. జనార్దనుడు కూడ జంకు గొంకు లేకుండ ఈ విధంగా ఎత్తిపొడిచాడు.

క. 'ఆ రాజు సేయు నెయ్యము । గారామును జెప్పె దీవు గడుఁదీపులు గా
వీరు దమపాలు వడయక । నేరిమి మాటలన తీర నేర్తురె చెపుమా!' (ఉద్యో. 1.340)

సంజయుడి రాయబారాన్ని సమగ్రంగా సమీక్షిస్తే స్వార్థపరార్థ అనుమానాలు రాజనీతిపరమైన సామోపాయాన్ని ఆశ్రయించి లక్ష్యాన్ని సాధించటానికి ప్రయత్నించాయి. కాని, హేతుఫలసిద్ధి దానికి లేకపోవటంచేత అవి హేత్వాభాసంగా మిగిలిపోయాయి. నిశ్చయించబడిన సాధ్యం కల కార్యం స్వపక్షం అనబడుతుంది. నిశ్చిత సాధ్యాభావం కలది విపక్షం అనబడుతుంది. ధృతరాష్ట్రుడు స్వపక్షంగా ప్రారంభించినా సంజయుడి రాయబారం విపక్షంగా ముగిసింది.

ధర్మరాజాదులు కూడ సంజయుడి రాయబారం వలన రాజ్యప్రాప్తి సాధ్యమౌతుందని భావించారు. చివరకు సంజయుడు పొగ కాదనీ, రాజ్యప్రాప్తి అనే అగ్ని అనుమానించబడినా అది విపక్షమైపోయిందని తెలిసికొన్నారు. అనుమాన ప్రమాణాలతో సాగిన సంజయుడి రాయబారపుఘట్టం సఫలమౌతుందన్న ఆశతో మొదలై విఫలం కావటంతో ముగియటం వలన ఏర్పడిన పరామర్శ రూపమైన సంభాషణల చమత్కారం వైరుధ్య శిల్పంతో పోటాపోటీగా ఈ ఘట్టంలో రాణిస్తుంది. ఇది ఇందులోని వైచిత్ర్యం. ఇందులో మరొక విశేషమున్నది. సంధికార్యం వలన యుద్ధనీతిని శాస్త్రోక్తంగా ప్రదర్శించవచ్చునని భావించినా, ధర్మరాజు ఉపన్యాసం భీమార్జునులకు రుచించకపోయినా దానిని పరామర్శిస్తూ అంగీకరించారు. అందులో ధర్మజుడి స్వార్థానుమానం భీమార్జునులలో పరార్థానుమానంగా ప్రకాశించింది. దానివలన భీమార్జునులతో శ్రీకృష్ణుడు చేసిన సంభాషణలు చమత్కారవంతంగానూ రమ్యగంభీరంగానూ ఉండగల్గాయి. ఈ విధంగా స్వార్థానుమితి పరార్థానుమితిగా వ్యాపించి విపక్షంగా పరిణమించే ఘట్టంలోని పరామర్శ వాక్య చమత్కారాలకు ఉద్యోగపర్వం ఉదాత్త ఉదాహరణంగా నిలుస్తున్నది.

**(4). శ్రీకృష్ణుడు ఆప్తవాక్యప్రమాణవాది**

'ఆప్తవాక్యమ్ శబ్దః' 'ఆప్తస్తు యథార్థవక్తా' అని తర్క సంగ్రహం. ఆప్తుడి మాట శబ్ద ప్రమాణం. ఉన్నది ఉన్నట్లు మాట్లాడేవాడు ఆప్తుడు. పాండవులకు అన్ని విధాలా ఆప్తుడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడి వాక్యమే పాండవులకు వేదవాక్యమని ధర్మరాజు సంజయుడి ముందు ప్రకటించాడు. "వాక్యమ్ ద్వివిధమ్, వైదికమ్ లౌకికం చేతి వైదిక మీశ్వరోక్తత్వాత్ సర్వమపి ప్రమాణమ్. లౌకికంతు ఆప్తోక్తం ప్రమాణమ్, అన్యదప్రమాణమ్" అని తర్క సంగ్రహం. శ్రీకృష్ణుడు దివ్యాదివ్యుడుగా పాండవులకు ఆప్తుడైనాడు. కృష్ణుడి వాక్యం పాండవులకు ఈశ్వరవాక్యం, ఆప్తవాక్యం కూడ. ఈ ఉభయ ప్రవృత్తులు ఉద్యోగపర్వంలోని శ్రీకృష్ణుడి ప్రసంగాలలో, ఉపన్యాసాలలో ప్రకటితమౌతూ ఉంటాయి. ఆ పాత్రలోని వాక్య చమత్కారమంతా ద్వివిధ వాక్య ప్రమాణాశ్రితమైన సంభాషణల మీదనే ఆధారపడి ఉన్నది. దీనిని సాంగంగా ఆవిష్కరించటమే శ్రీకృష్ణపాత్రలోని అంతరార్థం.

కౌరవసభలో శ్రీకృష్ణుడు చేసిన ఉపన్యాసం ఆప్తవాక్య ప్రమాణంతోనే చేసే తార్కిక వాక్య విన్యాసానికి చక్కని తార్కాణం. ఎత్తుగడయే దాన్ని ధ్వనింపజేస్తున్నది.

క. 'జననాథ! నీ యెఱుంగని । పనులు గలవె? యైనఁ దగవుఁ బరమ హితంబుం
దనవారికిఁ జెప్పన తగు । నని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్.' (ఉద్యో. 3.257)

ఈ పద్యం ప్రత్యక్షర సార్థకం. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడికి బంధువు కావచ్చును కాని, నిండుకొలువులో ఆయనను జననాథుడి గనే భావించి సంబోధిస్తున్నాడు. శ్రీకృష్ణుడు వచ్చిన కార్యం జనహితానికి సంబంధించినది. జనహితం తెలిసిన వాడే జననాథుడు. అందువలన ధృతరాష్ట్రుడు ధర్మస్వరూపం తెలిసినవాడు అయిన జ్ఞాని అయి ఉండాలి. అట్టి జ్ఞానం కలవాడై ఉండాలని ధృతరాష్ట్రుడిని హెచ్చరించాడు. 'నీ యెఱుంగని పనులు గలవె' అని గౌరవంగా మెచ్చుకోలు మాటతో అతడి మనసును మెత్తపరిచాడు. తెలిసినవాడికి తెలియచెప్పవలసిన అవసరమేముంటుంది? ఐనా శ్రీకృష్ణుడు పరమహితాన్ని కోరి భరతాన్వయం ప్రీతి పొందేటట్లు ఆప్తవాక్యాన్ని పలకటానికి వచ్చాడు. శ్రీకృష్ణుడి ఉపన్యాసం ఆప్తవాక్యమని తాత్పర్యం.

'ఆకాంక్షా యోగ్యతా సన్నిధిశ్చ వాక్యార్థ జ్ఞానహేతుః
పదస్య పదాంతర వ్యతిరేక ప్రయుక్తాన్వయాననుభావకత్వ మాకాంక్షా.'

అని వాక్యలక్షణాన్ని లాక్షణికులు చెప్పారు. వాక్యం ఆకాంక్షాదులతో కూడుకొని ఉంటుంది. అది ఒక వాక్యం కావచ్చును. ఒక తాత్పర్యాన్ని ప్రదర్శించే సంభాషణ కావచ్చును. ఉపన్యాసం కావచ్చును. చివరకు కావ్యమూ కావచ్చును. ఇక్కడ శ్రీకృష్ణుడి ఉపన్యాసం సలక్షణమైన వాక్యం.

వాక్యంలో ఉండవలసిన మొదటి లక్షణం ఆకాంక్ష. ఆకాంక్ష అంటే ఎందుకు? ఏమిటి? మొదలైన ప్రశ్నలతో జిజ్ఞాసను రేపి వాక్య తాత్పర్యాన్ని గ్రహించాలన్న ఉత్కంఠను కల్గించటం. శ్రీకృష్ణుడి ఉపన్యాసం ఆప్తవాక్యంగా ఆరంభమౌతూండగానే ఆతడు చెప్పబోయే తాత్పర్యాన్ని గురించి పై పద్యం శ్రోతలలో ఒక ప్రామాణిక భావాన్ని ప్రకటిస్తూ, ఆయన చెప్పబోయే ప్రతి మాటను అవధానంతో వినాలి అనే ఆసక్తిని రేకెత్తిస్తున్నది.

"అర్థాబాధా యోగ్యతా" అని యోగ్యత లక్షణం. శ్రీకృష్ణుడు చెప్పదలచుకొన్న పరమ తాత్పర్యానికి బాధ కలుగకుండా అర్థవివరణం చేయటం ఆప్తవాక్యంలోని యోగ్యత. ప్రతిపాదనం, వివరణం, వివేచనం, విమర్శనం, సంస్థాపనం అని యోగ్యతకు ఐదు లక్షణాలు భాసిస్తాయి.

క. 'క్షీరోదక గతిఁ బాండవ । కౌరవు లొడఁగూడి మనికి కార్యం బది నీ
వారసి నడపుము; వారన । వీరనఁ గురుముఖ్య! నీకు వేఱుం గలదే?' **(ఉద్యో. 3.258)**

శ్రీకృష్ణుడి ఉపన్యాసంలో ప్రతిపాదించబడుతున్న ప్రధాన తాత్పర్యమిదే. దానిని మూడు వాక్యాలతో ముడిపెట్టి ప్రతిపాదించాడు శ్రీకృష్ణుడు. 1. పాండవ కౌరవులు పాలు నీరువలె కలిసి ఉండటం ఈ ఆప్త వాక్యం సాధించే పరమార్థం. 2. ఆ పరమార్థాన్ని ధృతరాష్ట్రుడు లెస్సగా అమలు చేయటం. 3.పాండవ కౌరవులందరూ పెరవారనీ, తన వారనీ భావించకుండా ప్రవర్తించేటట్లు చూడటం వలన కురుముఖ్యుడుగా ధృతరాష్ట్రుడు తన బాధ్యతను నిర్వర్తించడం. శ్రీకృష్ణుడు చెప్పబోయే ఆప్తవాక్యంలోని ప్రతిపాద్యాంశం ఇదే.

కురుముఖ్యా! అని సంబోధించిన శ్రీకృష్ణుడు కౌరవ వంశ శ్రేష్ఠుడుగా చేయవలసిన కర్తవ్యాన్ని మొదట వివరించాడు.

చ. 'భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గియుండు ననఁగా నుతిఁ గన్నది; యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁ దమ్ముఁడు నీ తనయుల్ యశోధురం
ధరశుభశీలు; రీ సుచరిత క్రమ మిప్పుడుఁ దప్పనేటికిన్?' **(ఉద్యో. 3.259)**

ఆప్తుడైన శ్రీకృష్ణుడు ఏదో ఒక పక్షాన్ని వహించకుండా వంశక్షేమాన్ని భావించటం విశేషం. వంశ క్షేమం ఆరు గుణాల మీద ఆధారపడి ఉన్నది. ధర్మాన్ని తెలిసికొనటం, న్యాయంగా వ్యవహరించటం, సత్యం తప్పకుండా ఉండటం, కలిసి మెలిసి ఉండే మైత్రిని పెంపొందించుకొనటం, అభ్యుదయాన్ని కోరటం, ప్రజలయందు కరుణభావాన్ని కలిగి ఉండటం, ఈ గుణాలను ధృతరాష్ట్ర పాండురాజుల తరం వరకూ ప్రభువులు పోషించుకొంటూ వచ్చారు. దాన్ని ధృతరాష్ట్రుడు భగ్నం చేయకుండా పాండవ కౌరవులు కలిసి ఉండేటట్లు చూడటం ధర్మం. పాండవులకు రావలసిన రాజ్యభాగం ఇవ్వటం న్యాయం. ఇదివరలో ధృతరాష్ట్రుడే పాండవుల కిచ్చిన మాట ప్రకారం పాండవ రాజ్యభాగాన్ని ఇచ్చి మన్నించటం సత్యం. పాండవ కౌరవుల మధ్య యుద్ధం రాకుండా వంశనాశనం కలగకుండా మైత్రిని పెంపొందించటం సాధించవలసిన పొత్తు. పాండవులు, కౌరవులు కలిసి ఉంటే వంశం బలోపేతంగా వర్ధిల్లుతుంది. ఈ అయిదు అంశాలు ఆచరణలోకి రావాలంటే ధృతరాష్ట్రుడు స్వార్థాన్నీ, కాపట్యాన్నీ, క్రౌర్యాన్నీ మాని కరుణ భావాన్ని ప్రదర్శించాలి. శ్రీకృష్ణుడు పలికిన ఈ మాటలలో కార్యాన్ని సాధించే వివరణం సూచించబడింది కాబట్టి ఆప్త వాక్యంలోని వివరణాంశ మిది.

వివరణం తరువాత శ్రీకృష్ణుడు నిపుణంగా వివేచనంతో విషయ విజ్ఞానాన్ని ధృతరాష్ట్రుడికి నివేదించాడు.

''ఈ వంశంబున కెల్ల నీవ కుదురు'' అనే పద్యంలో పాండవ కౌరవులు కలిసి ఉండే కార్యాన్నీ తీర్చదగిన బాధ్యత వంశానికెల్లా కుదురైన ధృతరాష్ట్రుడిదే అని స్పష్టం చేశాడు. ఎవరికి మేలు జరిగినా, కీడు జరిగినా నిజానికి నష్టపోయేది ధృతరాష్ట్రుడేనని తేల్చి చెప్పాడు. బాగుపడదలచుకొంటే సద్భావంతో సమస్యను ఆలోచించుమన్నాడు. సద్భావమంటే త్రికరణశుద్ధి మనసులో పొత్తును కోరాలి. మాటలలో అది వెలువడాలి. చర్యలో అది కనబడాలి. ఈ మూడింటినీ ఏకం చేసి వంశాన్ని నిలుపుమని శ్రీకృష్ణుడు వివేచనాత్మకమైన వివేకాన్ని అందించాడు.

వివేచనాన్ని విన్న తరువాత ధృతరాష్ట్రుడికి యథార్థజ్ఞానం కలగాలి. అది కలగటానికి మూడు అవరోధాలు ఏర్పడవచ్చును.

''అయథార్థానుభవ స్త్రివిధః, సంశయ విపర్యయ తర్కభేదాత్'' అని తర్క సంగ్రహం. అయథార్థానుభవం మూడు రకాలు. 1.సంశయం 2.విపర్యయం. 3.తర్కం. విరుద్ధములైన అనేక అంశాలను అన్వయించుకొని అవగాహన కలిగించే జ్ఞానం లేకపోవటం సంశయం. దానిని తొలగించటం ఆప్తవాక్యంలోని ఒక ముఖ్యలక్షణం.

'వినుము సుయోధనాదులగు వీరు సధర్ములుగాక...' 'కౌరవ పాండవుల్ తెఱఁగుఁ గైకొని శాంతతఁ బొందియున్కిమేల్' 'నీకు వలసినఁ దీర్పంగ నేరవచ్చు నధిప' 'అందు వృకోదరార్జునుల...' 'జగతిఁ గల జనపతులు నీ చరణపీఠ మర్థిఁ గొలువ...' అనే పద్యాలలో శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడి మనసులోని సంశయాలు తొలగిపోయేటట్లు సవిమర్శంగా మాట్లాడాడు. 'మిథ్యాజ్ఞానం విపర్యయమ్' అని విపర్యయానికి లక్షణం. విపర్యయాన్ని తొలగించటం ఆప్తవాక్య లక్షణం. ఆప్తవాక్యాన్ని గ్రహించటానికి అడ్డం పడే అవగుణం విపర్యయం. అది ధృతరాష్ట్రుడిలో పుష్కలంగా ఉన్నది. దానివలన అతడు సంకట పరిస్థితులలోబడి, ధర్మనిర్ణయాన్ని చేయలేక ఉపేక్షాభావాన్ని ప్రదర్శిస్తాడు. 'అనయము పుట్టె జూదమున యప్పుడ యంతయుఁ జిచ్చువెట్టి కాల్చినయది నీ యుపేక్షయ' (ఉద్యో. 2.14) అని సంజయుడు ఇదివరలోనే ఈ అంశాన్ని ధృతరాష్ట్రుడి మొగాన చెప్పాడు. ఇప్పుడు శ్రీకృష్ణుడు

క. 'నరనాథ! నీ వుపేక్షా । పరుఁడ వయినఁ గౌరవులక పాండవులక కా
దరయుఁగ భూప్రజ కెల్లను । దురితం బొనరించినట్ల; తుదిఁ గీడు సుమీ!' **(ఉద్యో. 3.266)**

అని కుండబద్దలు కొట్టినట్లు చెప్పి మిథ్యాజ్ఞానాన్ని తొలగించప్రయత్నించాడు. ఆ తరువాత తాను చెప్పదలచుకొన్న తాత్పర్యానికి అనుకూలమైన తర్కాన్ని సునిశితంగా ప్రదర్శించాడు. ''వ్యాప్యారోపేణ వ్యాపకారోప స్తర్కః'' అని తర్కాన్ని నిర్వచించింది తర్కసంగ్రహం. వ్యాప్యముంటే వ్యాపకమూ ఉండేది అనే ఆరోపం తర్కం. ఈ అంశానికి చక్కని ఉదాహరణలు-

క. 'కౌరవ పాండవులం దెవ్వారలకున్ జావు నొవ్వు వచ్చిన....'

ఉ. 'వీరును వారుఁ బండితులు...'

ఆ. 'అట్లుగాక యుండ నీ రెండు తెఱఁగుల...' **(ఉద్యో. 3.267,268,269)**

ఈ మూడు పద్యాలు శ్రీకృష్ణుడు ప్రతిపాదించ దలచుకొన్న ఉపన్యాస ఫలితాంశానికి తర్కబద్ధమైన జిజ్ఞాసను కల్పించేవి. అంతటి వీరులూ, పండితులూ అయినవారు యుద్ధంలో చనిపోతే ఎంత దారుణమో ఊహించుకొమ్మని చెప్పటం ఇక్కడ తర్కం. దానివలన మిథ్యాజ్ఞానం తొలగి యథార్థ జ్ఞానం ఏర్పడుతుంది.

వాక్యానికి వన్నె తెచ్చేది సన్నిధి. ''పదానా మవిలంబేనోచ్చారణం సన్నిధిః'' అని తర్కసంగ్రహం. విలంబనం లేకుండా వాక్యంలోనే వివిధాంశాలను చెప్పటం సన్నిధి. శ్రీకృష్ణుడి ఉపన్యాసంలో-

తే. 'పాండవులు దండ్రి సచ్చిన ప్రజలు వారి । నరసి ప్రోచితి శైశవ మాదిగాఁగ;
నడుమ నిష్కారణమ దిగవిడువఁ దగునె? । పారమొందంగ రక్షింపు గారవమున.' **(ఉద్యో. 3.271)**

ఈ పద్యం శ్రీకృష్ణుడి ఉపన్యాసంలోని అంశాలనన్నింటినీ అవిలంబంగా అన్వయించుకొనే తాత్పర్యానికి చక్కని అభివ్యక్తి. అంతే కాదు ధర్మరాజు శ్రీకృష్ణుడిని రాయబారిగా వెళ్ళుమని ప్రార్థిస్తూ

'ఆపద కడవం బెట్టఁగ నోపి... మాకీ పుట్టువునకుఁ బాండుక్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా!' అని పలికిన మాటలు ఇక్కడ అన్వయిస్తాయి. దీనిని కావ్య వాక్యార్థ సన్నిధి అని కూడ అనవచ్చును. పాండురాజు చనిపోతూ పాండవుల యోగక్షేమాలు చూడుమని ఎవరినీ ప్రార్థించలేదు. కాని, తండ్రి తరువాత తండ్రి అంతటి వాడు ధృతరాష్ట్రుడా? శ్రీకృష్ణుడా? వంశ మర్యాదను పాటిస్తే ధృతరాష్ట్రుడు. ఆప్త మర్యాదను పాటిస్తే శ్రీకృష్ణుడు. ఆప్తుడైన శ్రీకృష్ణుడు పాండవుల యోగక్షేమాలను చూచే బాధ్యతను చేపట్టాలని ధర్మజుడు మనవి చేసికొన్నాడు. దీనిని శ్రీకృష్ణు డంగీకరించాడు. మరి ధృతరాష్ట్రుడు వంశ మర్యాదను పాటించి వారి యోగక్షేమాలను చూడవలసినదిగా శ్రీకృష్ణుడు తేల్చి చెప్పాడు. కాని-

ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడి ఆప్త వాక్యాన్ని ప్రమాణంగా గ్రహించలేదు. పెదతండ్రిగా పాండవులకు చేయవలసిన న్యాయాన్ని అతడు భావించలేదు. వంశజులు వారి ధర్మాన్ని నిర్వహించక వంశధర్మానికి విఘాతం కల్పిస్తే, వారికి ఆప్తులైనవారు కూడ వారిని ధర్మమార్గంలో నడిపించలేకపోతే, ధర్మం వంచించబడినా నశించిపోదనీ దానిని దైవం రక్షిస్తాడని శ్రీకృష్ణుడు నిండుసభలో ప్రకటించాడు. ఇది ఆప్తవాక్యం చివర మెరిసే యథార్థ జ్ఞాన ప్రకాశం. ''వాక్యార్థజ్ఞానమ్ శబ్దజ్ఞానమ్'' అని తర్కసంగ్రహం. వాక్యం వలన కలిగిన పూర్ణవాక్యార్థ జ్ఞానమే శబ్దజ్ఞానం. దానికి ఉపకరణమైనది శబ్ద ప్రమాణం. శ్రీకృష్ణుడి ఉపన్యాసం శబ్ద ప్రమాణానికే ప్రమాణం.

శ్రీకృష్ణుడి రాయబారపు ఘట్టం ఆప్తవాక్య కల్పద్రుమంవలె ప్రకాశిస్తున్నది. పాండవులకు శ్రీకృష్ణోపదేశం ఆప్తవాక్యం. ఆయన కౌరవులకు గూడ ఆప్తవాక్య ప్రమాణ జ్ఞానాన్ని ప్రబోధించ ప్రయత్నించాడు. దాని కొఱకు అనేక విధాలుగా యత్నించాడు. ముందు తాను చెప్పాడు. నారదాది మహామునుల చేత చెప్పించాడు. భీష్మద్రోణాదుల చేత దుర్యోధన ధృతరాష్ట్రులకు చెప్పించి ఒప్పించటానికి ప్రయత్నం చేశాడు. చివరకు ధృతరాష్ట్ర, గాంధారులచేత కూడ దుర్యోధనుడికి శ్రీకృష్ణ వాక్య తాత్పర్యాన్ని పాటించుమని ప్రబోధింపజేశాడు. శ్రీకృష్ణుడు హస్తినాపురానికి పోయి ఆప్తవాక్య ప్రమాణవాదులనందరినీ జాగృతం చేసి, ప్రేరేపించి దుర్యోధనుడికి యథార్థజ్ఞానం కలిగించడానికి శతవిధాల యత్నించాడు. కాని, దుర్యోధనుడికి కర్ణుడి వాక్యమే ప్రమాణం. అందువలన సంధి కుదరలేదు. శ్రీకృష్ణుడు, కర్ణుడు వీరిరువురు ఆప్తవాక్య ప్రమాణవాదులు.

ఐతే ఒకరు యథార్థ జ్ఞానాన్నీ మరొకరు అయథార్థ జ్ఞానాన్నీ ఆశ్రయించారు. అయథార్థజ్ఞానలాభం వలన దుర్యోధనుడు నశిస్తాడు. యథార్థజ్ఞానం వలన పాండవులు విజయం సాధిస్తారు. ఈ తాత్పర్యాన్ని కావ్యశిల్పమయంగా చిత్రించటం తిక్కన నైపుణ్యం.

తర్కశాస్త్రంలో ఉపమాన ప్రమాణాన్ని కూడ పేర్కొంటారు. పదార్థ తత్త్వ జ్ఞానసాధనకు ఉపమానం బాగా తోడ్పడుతుంది. తెలిసిన వస్తువును సాదృశ్యంగా చూపించి మరొక వస్తువు తెలిపే ప్రమాణాన్ని ఉపమాన ప్రమాణం అంటారు. ఉద్యోగపర్వంలోని ఉపాఖ్యానాలు కొన్ని దానికి ఉదాహరణలుగా పేర్కొనవచ్చును. శల్యుడు పేర్కొన్న నహుష వృత్తాంతం, కణ్వుడు దుర్యోధనుడికి చెప్పిన గరుత్మంతుడి వృత్తాంతం ఇందుకు సాక్ష్యాలు.

### (5). ధర్మరాజు సమన్వయవాది

ఉద్యోగ పర్వ తృతీయాశ్వాసంలోని ధర్మజుడి ఉపన్యాసం ఆప్తవాక్య ప్రమాణవాది మాట్లాడే తీరుకు మంచి నిదర్శనం. ధర్మరాజు ఉపన్యాసాన్ని విశ్లేషిస్తే ప్రత్యక్ష అనుమాన శబ్ద ప్రమాణాలను వరుసగా ప్రదర్శిస్తూనే ఆ మూడింటిలో ఆప్తవాక్య ప్రమాణం శ్రేష్ఠమైనదని నిరూపించిన వైఖరి కనబడుతుంది.

1. ధర్మరాజు శ్రీకృష్ణుడిని తండ్రి తరువాత అంతటి వాడిగా భావించి గౌరవించటం, పాండవులను ప్రద్యుమ్నాది కుమారులతో సమానంగా మన్నించుమని అభ్యర్థించటం, తమ ప్రయత్నంలో ఎటువంటి దోషం రాకుండా ప్రబోధించి రక్షించుమని కోరటం ఆప్తవాక్య ప్రమాణం గౌరవమున్న ధర్మరాజు స్వభావాన్ని తెలుపుతున్నాయి. ఆ తరువాత 'మా తండ్రి తలపును నాతని నందను చందంబు....'' (ఉద్యోగ. 3.9) అనే పద్యం నుండి ''అక్కట లాఁతులైనఁ బగఱైనను జంపఁగఁ గోరనేల'' (ఉద్యో. 3.13) అనే పద్యం వరకు ధర్మరాజు యథార్థ విషయ కథనమే చేశాడు. ఈ మాటలు పల్కుతున్నప్పుడు ధర్మరాజు ప్రత్యక్ష ప్రమాణవాదిగా కన్పడుతాడు.

ఆ తరువాత 'క్షత్రధర్మమింత కష్టమగునె...' (ఉద్యో. 3.15) అనే పద్యం నుండి 'కావున శాంతిఁ బొందుటయ కర్జము' (ఉద్యో. 3.28) వరకు అనుమాన ప్రమాణ వాదిగా అత్యద్భుతంగా మాట్లాడాడు. 'మనమునఁ బక్షపాతగతి మాదెస మానుము' (ఉద్యో. 3.23) అనే పద్యం నుండి. 'ఎన్ని సంకటముల నెబ్బంగినెంతయు' (ఉద్యో. 3.26) వరకు ఆప్తవాక్య ప్రమాణవాదిగా అచ్చమైన నీతిని ప్రదర్శించాడు. ఆ తరువాత 'నీవు సుయోధను పాలికిఁ బోవఁగవలదు...' (ఉద్యో. 3.28) 'కుటిలమతు లవినీతులు క్రూరకర్ములు...' (ఉద్యో. 3.29) అను పద్యం వరకు తర్కాన్ని ప్రదర్శించాడు.

ఈ విధంగా ప్రత్యక్ష, అనుమాన, ఆప్తవాక్య, తర్క లక్షణాలను వరుసగా ప్రదర్శించి చివరకు వాటి నన్నింటిని ఆప్తవాక్య ప్రమాణ ప్రతిపాదనలో విలీనం చేసి తన సంవిధాన నైపుణ్యాన్ని ప్రకటించాడు.

ఆ. 'మేలుగాక నీకుఁ బోలినట్లయిన నం । దరిగి యేము వారు నర్థిఁ బొంది
యుండునట్లుగాఁగ నొడఁ బాటు గావింపు । మెల్లభంగి మనకు నిదియ లెస్స'. **(ఉద్యో. 3.33)**

క. 'మ మ్మెఱుఁగు, దెదిరి నెఱుఁగుదు, । నెమ్మి యెఱుఁగు, దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు, వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు; । పా మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్?' **(ఉద్యో. 3.34)**

ధర్మరాజు తర్క ప్రమాణబద్ధంగా, ధర్మసమ్మతంగా, ధర్మనీతి వర్తనాన్ని తలపులలో, మాటలలో, చేతలలో ప్రదర్శించిన సమన్వయమూర్తి.

### (6). పాత్రోచిత తర్కవైఖరులు

ఉద్యోగపర్వంలో పాత్రలన్నీ ప్రసంగిస్తాయి. ఆ ప్రసంగాలు ఆ పాత్రల ప్రవృత్తులను ప్రదీప్తం చేస్తుంటాయి. యుద్ధోద్యోగానికి సంబంధించిన తమ అభిప్రాయాలను ప్రకటిస్తుంటాయి. వాటన్నింటిలో ఒక అంతర్గతమైన వాక్యశిల్పం (ఉపన్యాస శిల్పం లేదా సంభాషణ శిల్పం) కొట్టవచ్చినట్లుగా కన్పిస్తుంది. శ్రీకృష్ణుడి వంటి ప్రధాన పాత్ర నుండి ఉలూకుడి వంటి స్వల్ప పాత్ర వరకు మాటలతో రూపురేఖలు చిత్రించిన వైఖరి తిక్కనగారి నాటకీయ శిల్పం.

ఆయా పాత్రలు పాత్రోచితంగా, సందర్భోచితంగా ప్రదర్శించిన వాఙ్మయ శిల్పాన్ని ఆయా పద్యాల విశేషాంశాలలో విపులంగా వివరించడం జరిగింది. రసజ్ఞులు వాటిని పరిశీలించగలరు.

### 7. ఉపాఖ్యాన శిల్పం

ఉద్యోగపర్వంలో ఉపాఖ్యానాలు మూడున్నాయి. ఒకటి- శల్యుడు ధర్మరాజుతో చెప్పిన నహుషుడి కథ లేదా పురందర విజయోపాఖ్యానం. రెండు- కౌరవ సభలో కణ్వ మహర్షి దుర్యోధనుడితో చెప్పిన గరుత్మంతుడి ఉపాఖ్యానం. మూడు- భీష్ముడు దుర్యోధనుడికి చెప్పిన అంబోపాఖ్యానం. ఈ మూడింటినీ మూడు రకాల ప్రయోజనాలకు వాడటమే కాక మూడు రకాల కావ్య కళాశిల్పాలకు ప్రతినిధులుగా తిక్కన తీర్చిదిద్దాడు.

ఒకటి- శల్యుడు చెప్పిన కథ సందర్భాన్ని బట్టి, ప్రయోజనాన్ని బట్టి ప్రత్యేకతను సంతరించుకొన్నది. 'కథ చెప్పినవాడు శల్యుడు. అతడు ఉపచారప్రియుడు. తనను సేవించిన వారికి ఒడలు మరిచి వరాలు ఇవ్వగలిగినవాడు. అందువలన ధర్మజుడికి సాయం చేయవలసిన తాను దుర్యోధనుడికి సాయం చేసే పరిస్థితి కల్పించుకొన్నాడు. మాట దుర్యోధనుడికి ఇచ్చినా మనసు ధర్మరాజు కిచ్చినవాడు. సాయం దుర్యోధనుడికి చేసినా, హితం ధర్మరాజుకు చేయనెంచినవాడు. కౌరవ పక్షాన యుద్ధం చేస్తున్నా, స్వీయ రథికుడైన కర్ణుడిని కలతపరచి, అర్జునుడి విజయానికి తోడ్పడుతానని మాట ఇచ్చినవాడు. ఆపద్ధర్మంతో కౌరవ పక్షాన నిలిచినా, అంతరంగ ధర్మంతో పాండవ విజయానికి తోడ్పడినవాడు. ఒకవైపు కృష్ణుడు పార్థసారథియై పాండవులకు ప్రత్యక్షంగా సాయపడ్డాడు. మరొక వైపు శల్యుడు కర్ణసారథియై పాండవులకు పరోక్షంగా సాయపడ్డాడు. త్వరపడి మాట ఇవ్వటం మూలంగా ధర్మరాజుకు దూరమౌతున్నందుకు ధర్మజుడికి ఊరట కలిగించటానికై ఇంద్ర విజయోపాఖ్యానాన్ని చెప్పాడు. ఆ కథా ప్రయోజనాన్ని ఈ క్రింది మాటలలో స్పష్టం చేశాడు.

ఉ. 'కౌరవనాథుఁ డా నహుషుకైవడి నాశముఁ బొందు వాసవ
శ్రీరమణీయుఁడై జయము సేకొని ధర్మజుఁ డంబురాశివే
లా రశనా సముజ్జ్వల విలాస మనోహర మేదినీ వధూ
సారసమగ్ర భోగముల సన్నుతి కెక్కెడుఁ దానుఁ దమ్ములున్.' **(ఉద్యో. 1.210)**

శల్యుడు పరంపరగా విన్న ఒక ఇతిహాసాన్ని సందర్భోచితంగా, సార్థకంగా ఉపాఖ్యానంగా చెప్పాడు. ఆఖ్యానానికి తోడ్పడేది ఉపాఖ్యానం. వస్తుధ్వనిని ఆశ్రయించి ఈ ఉపాఖ్యానం పాండవ విజయాన్ని ధ్వనింపజేస్తుంది. వృత్రాసురుడితో పోరి, ఓడిపోయి అజ్ఞాతవాసంలో నివసించాడు ఇంద్రుడు. ధర్మరాజు కూడా దుష్టచతుష్టయ దుర్నీతికి గురియై, అరణ్య, అజ్ఞాత వాసాలను గడిపాడు. ఇంద్రుడి తరువాత ఇంద్ర పదవిని అలంకరించిన నహుషుడు, ఇంద్ర సామ్రాజ్య లక్ష్మినే కాక శచీదేవిని కూడా కోరాడు. దుర్యోధనుడు కూడా మాయాద్యూతంలో పాండవ రాజ్యాన్ని హరించి, ద్రౌపదిని అవమానాల పాలుచేశాడు. నహుషుడికి పాపం పండి సప్త ఋషుల శాపానికి గురై, కొండచిలువగా మారి రాజ్యభ్రష్టుడైనాడు. అట్లాగే

దుర్యోధనుడు కూడ పాండవ రాజ్యభాగ మీయక అవినీతి పాలై, పూజ్యులను ఆప్తులను అవమానించి, రాజ్యభ్రష్టు డౌతాడని శల్యుడు సూచించాడు. ఇంద్రుడు దేవతల తేజస్సులను సమీకరించుకొని ఇంద్రపదవిని తిరిగి సాధించాడు. అట్లాగే ధర్మరాజు కౌరవులను ఓడించి, రాజ్యాన్ని త్వరలో తిరిగి పొందుతాడని శల్యుడు ఆకాంక్షించాడు. ఆశీర్వదించాడు. శత్రు సైన్యంలో చేరనున్న మహావీరుడైన శల్యుడు పాండవ విజయాన్ని వస్తుధ్వనిని ఆశ్రయించి భావికథార్థ సూచికగా చెప్పటం ఈ ఉపాఖ్యాన సార్థక్యం.

ప్రధానకథ కిది ఉపాంగమైనా ఆఖ్యానాన్ని ఉపమాన ప్రమాణంతో సమర్థిస్తున్న ఉపాఖ్యానం, దీని ప్రత్యేకత ఇది.

కణ్వమహర్షి దుర్యోధనుడికి చెప్పినది గరుత్మంతుడి వృత్తాంతం. పాండవ బలాన్ని, ప్రత్యేకించి నరనారాయణుల మహిమను తెలియక, దురహంకారంతో యుద్ధానికి తలపడి, అవమానం పొందిన దానికంటే, పాండవులతో కలిసి మెలసి ఉండటం మంచిదని హితవు చెబుతూ దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

క. 'అది వోలుఁ దన్ను నెదిరిని । మది నెఱుఁగక నిగ్రహించి మదమెత్తుట యొ
ప్ప; దహంకారం బొనరిం । పదె పౌరుషహానిఁ దొల్లి పక్షీంద్రునకున్.' **(ఉద్యో. 3.289)**

ఒకసారి మాతలికీ, గరుత్మంతుడికీ వాదు ఏర్పడింది. అన్నదమ్ముల మధ్య ఏర్పడిన ఆ తగాదాలో గరుత్మంతుడు ధిక్కరించి, మాతలిమీద మండిపడి విజృంభించాడు. దానికి వాసుదేవుడు కోపించి గరుత్మంతుడికి గర్వభంగం చేశాడు. ఈ కథలో అన్యాపదేశంగా దుర్యోధనుడికి హితబోధచేశాడు కణ్వుడు. ఉపాఖ్యానంలోని మాతలి వంటి వాడు ధర్మరాజు. అతడికి బలంతోపాటు న్యాయం కూడా తోడున్నది. ధర్మరాజుకు శ్రీకృష్ణుడి సాయం బలంగా ఉన్నది. గరుత్మంతుడి వంటివాడు దుర్యోధనుడు. అతడికి దేహబలం తప్ప, ధర్మబలం లేదు. అందువలన వాసుదేవుడి కోపానికి గురై అవమానాల పాలైనాడు. అట్లాగే దుర్యోధనుడు స్వీయబలంతో గర్వించి, ధర్మజుడితో యుద్ధం ప్రకటిస్తే, వాసుదేవుడి కోపానికి గురై నశించక తప్పదని వ్యంగ్యంగా సూచించాడు కణ్వుడు. ఇది ఉపమాన ప్రమాణంలో భాగం మాత్రమే. హితవును పెడచెవిని పెట్టిన దుర్యోధనుడికి నాశనం తప్పదని ఈ కథ నీతి చెబుతుంది.

క. 'బలవంతుల బలములు న । గ్గల మగుబల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే
కొలఁదుల వారికి గర్వము । నిలుచునె నయమార్గ వృత్తి నిలిచిన భంగిన్'. **(ఉద్యో. 3.303)**

కురుసభలో గుమికూడిన మునిజనులొక్కొక్కరూ చిన్నదో పెద్దదో ఏదో ఒక కథను చెప్పి, ఉపమాన ప్రమాణంతో దుర్యోధనుడికి ఉపదేశం నిర్వహించారు. జమదగ్ని మహర్షి దంభోద్భవుడి కథ చెప్పాడు. నారద మహర్షి గాలవుడి కథ చెప్పాడు. ఇట్లా మునులు చెప్పిన కథలన్నింటిలో ముక్తసరిగా చెప్పిన ఉపాఖ్యానం గరుత్మంతుడి కథ. ఆ తరువాత పేర్కొనదగినది గాలవుడి కథ. దంభోద్భవుడి కథ తిక్కన ఒక పద్యంలోనే కుదించివేశాడు. శల్యుడు చెప్పిన నహుషుడి కథ ఉపమానం కొరకు అయితే, మునులు చెప్పిన కథలు ఉపదేశం కొరకు. అందువలన ఉపాఖ్యాన శిల్పంలో వైవిధ్యం ఏర్పడింది.

భీష్ముడు చెప్పిన అంబోపాఖ్యానం ఆఖ్యానకం వంటిది. అంబ శిఖండిగా మారి భీష్ముడిపై ప్రతీకారం తీసికొనిరావటానికి పాండవ పక్షంలో నిలిచి ఉన్న వృత్తాంతాన్ని భీష్ముడే స్వయంగా చెప్పాడు. అంబ వృత్తాంతం భీష్ముడి చరిత్ర నుంచి పుట్టిందే. అతడి చర్యల వలన పెరిగిందే. అతడి నైష్ఠిక వ్రతం వలన ఎదురు తిరిగిందే. స్వయంవరంలో అంబను బలవంతాన తెచ్చి, ఆమె బ్రతుకుబాటను మార్చాడు భీష్ముడు. ఆమె హృదయాన్ని తెలిసికొని సాల్వుడి దగ్గరకు పంపి, ఔదార్యాన్ని ప్రకటించినా, సాల్వుడు ఆమెను గ్రహించకపోవటంతో ఆమె జీవితం విషాదభరితమైపోయింది. భీష్ముడి బ్రహ్మచర్య వ్రతం ఆమెను పెండ్లాడటానికి అడ్డం వచ్చింది. దానితో అంబ జీవితం అగమ్యగోచరంగా మారింది. ఆమె పరశురాముడిని ఆశ్రయించింది. పరశురాముడు భీష్ముడికి హితవు చెప్పాడు. భీష్ముడు ఆజన్మ బ్రహ్మచర్యవ్రతాన్ని విడవటానికి అంగీకరించలేదు. కాగా, వసువుల సాయంతో పరశురాముడిని ఓడించాడు. ధర్మదృష్టిలో భీష్ముడు విజయుడై నిలిచాడు.

కాని, అంబ తోకత్రొక్కిన త్రాచువలె పగబూని భీష్మ సంహారానికి తపస్సు చేసింది. శిఖండిగా మారింది. భీష్ముడిని యుద్ధంలో చంపటానికి సమయం కొరకు ఎదురు చూస్తున్నది. పేడివాడితో యుద్ధం చేయనని భీష్మ ప్రతిజ్ఞ. దాని నాధారంగా చేసికొని అర్జునుడు శిఖండిని ముందుంచుకొని భీష్ముడిపై దాడిచేస్తే అతడు దుర్మరణం పొందక తప్పదు. సంకల్ప మరణం వరంగా పొందిన భీష్ముడికి అంబవలన అసమయ మరణం ఏర్పడే అవకాశం ఉన్నది. దానిని దుర్యోధనుడికి తెలియజెప్పటం కొరకు అంబ వృత్తాంతాన్ని భీష్ముడు వివరించాడు. 'పాండవ వీరులనందరినీ చంపగలను కానీ, ఒక్క శిఖండిని మాత్రం చంపలేను' అని ప్రకటించిన భీష్ముడి వాక్యాన్ని వివరించుమని అడిగినపుడు 'ఏ నా శిఖండినిఁ జంపమికి మూలంబు సాలంగలదు. తత్ప్రపంచంబంతయు వివరించెద నాకర్ణింపుము' అని దాదాపు 150 పద్యాల విస్తృతి గల కథను పేర్కొన్నాడు. ఈ కథలో భీష్ముడు కన్నది, విన్నది, మునులు వివరించింది అయిన మూడు రకాల కథ ముడిపడి ఉంటుంది. భీష్ముడి ఆత్మకథలోని అంతర్భాగంగాను, భీష్ముడి విషాదాంతానికి సూచికగాను, కౌరవ మహాసైన్యాధ్యక్షుడు చనిపోక తప్పదనే కథార్థసూచనానికి సంకేతంగాను ఈ ఉపాఖ్యానం చెప్పబడింది. ఇదే కథ కథకుడు చెబితే ఆఖ్యానమై ఉండేది. భీష్ముడు చెప్పటం మూలాన ఆఖ్యానకమైనది. అందులోనూ నారదుడు చెప్పిన అంబ వృత్తాంతం ఉపాఖ్యానంగా భాసిస్తున్నది. అందువలన ఈ కథ ఆఖ్యానక, ఉపాఖ్యాన, కథాశిల్పాల త్రివేణి సంగమం.

తిక్కన ఆయా కథల స్వభావాన్ని బట్టి కథన శిల్పాన్ని కూడా మార్చాడు. నహుషుడి కథ వర్ణనాత్మక కథాకథన ప్రధానం. గరుత్మంతుడి కథ, కథాకథన ప్రధానం. అంబోపాఖ్యానం కావ్యరూపక కథాశిల్ప ప్రధానం.

## 8. మరికొన్ని విశేషాలు

1. "మూలము నందలి సనత్సుజాతీయము తెలుగున నించుమించుగా లుప్తమైనట్లే యెంచవచ్చును. ఇందులకు గొందఱు తిక్కనను మహాపరాధిగా బరిగణించుచున్నారు. కాని, కావ్యరసదృష్టితో జూచినపుడు ఈ శాస్త్ర గ్రంథ మిక్కడ లేకుండుట వలన రసము. వస్తువు రెండును విక్షిప్తములు గాలేదు. శాస్త్ర భాగము నంతను శాంతి, అనుశాసనికము, అశ్వమేధము మున్నగు పర్వములలో విశదీకరింప వచ్చుననియు, అచ్చట నున్నచో వస్తుగమనము నరికట్టవనియు కావ్యరసతత్త్వవేత్తయగు తిక్కన నిర్ణయించుకొని యుండవచ్చును. కొంద ఱిది గుహ్యమైన యోగశాస్త్రము గావున నాతడు విడిచి పెట్టి యుండవచ్చునని యూహించుచున్నారు. "పరతత్త్వము ప్రసాదించునట్టి గూఢోక్తులను గ్రహించుచుండ" అను వాక్యభాగము వారి యీ వాదనకు జేయూతగా నున్నది. కాని, యోగశాస్త్రమును గూఢమని యెంచి విసర్జింపవలసివచ్చినచో పైన చెప్పిన మూడు పర్వములలో విస్తర భాగము లుప్తము కావలసినదే. భారతమున శాస్త్ర భాగమున చాల పునరుక్తి యున్నది. సనత్సుజాతీయము, భగవద్గీత, ఉత్తరగీత, అనుగీత మున్నగున వెన్నియో ఒక్కొక్కటి ప్రత్యేకముగ గైకొన్నప్పుడు ఎంతో మనోహరములగు గ్రంథరాజములే యయ్యును సమూహముగ చేర్చి చూచినపుడు చాలా భాగము చెప్పినదే చెప్పుటయగుచున్నది. తిక్కన కేవలము "వేద భారవాహి"గా నందున ఆధ్యాత్మిక సంపద నంతయు గ్రంథముల మూలముననే గాకుండ అనుభవమున గూడ నాపోశనము పట్టిన వాడగుటచే శాస్త్రభాగము నాతడు పూర్ణముగ జీర్ణము చేసికొని వానిని ప్రత్యేకముగ కేటాయించి సమర సంరంభము ముగిసిన వెనుక శాంతియుతముగ గూర్చున్నప్పుడు ధర్మజాదుల ప్రసంగములలో క్రోడీకరించినాడు. ఇట్లగుటచే విషయ విభాగమునందును రసస్ఫూర్తి యందును గూడ నాంధ్ర మహాభారత మున్నత సోపానము లధిరోహించుచు మూలమును మించుచున్నది. దేనిని లోపముగ గొందఱు మనీషులు పరిగణింప జూచుచున్నారో అదియే తిక్కన విమర్శనా శక్తికిని, ఉచితజ్ఞతకును నిశితమైన తార్కాణముగా నాకు దోచుచున్నది." - నండూరి బంగారయ్యగారు. (ఆంధ్రమహాభారతోపన్యాసములు - తిక్కన - ఉద్యోగ పర్వము - పుట 148)

2. "ద్వితీయాశ్వాసమున నొక్కచో (107వ పద్యము మొదలు 115వ పద్యము వరకు) ప్రాతఃకాల వర్ణనమున్నది. దీనిని వర్ణించినను, వర్ణించకపోయినను కావ్య సౌందర్యమున కెట్టి లోపము రానేరాదు. వాల్మీకివలెగాని, కాళిదాసు వలె గాని ప్రకృతి తాదాత్మ్యము నొంది చేసిన వర్ణనము గాదిది. మధ్యకాలము నందలి సంస్కృత కవుల కృత్రిమ వర్ణనలతో

వియ్యమందుచున్నది. దీనినంత దోషముగా ఖండింపనక్కర లేదు గాని గుణముగా నెంచి పూజించుటకు మాత్రము బుద్ధి పుట్టకున్నది.'' - నండూరి బంగారయ్యగారు (ఆంధ్ర మహాభారతోపన్యాసములు - తిక్కన - ఉద్యోగపర్వము - పుట 149)

3. ''కావ్యతాస్ఫోరకముగనే గాక, సందర్భాలంకారములకై కూర్చిన వర్ణనలు పెక్కులు. అవి యిట్లుండును. 'తనకులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు లన్నదమ్ములతో నిగ్రహంబు గొనుట కుమ్మలించి వివర్ణతఁ నొంది నట్లు గంది యెంతయుఁ జెలువేదెఁ జందురుండు'' ఇత్యాదిగాఁ జంద్రాస్తమయ, తారకోదయములు, చక్రవాక, శుకకోకిల భృంగవిహారములు, మలయానిల సంచారములు, సూర్యోదయ సూర్యాతప ప్రసారములు వర్ణించెను. 'కలయట్టి వివిధార్థములు విశేషంబుగఁ దగ నొసంగుండు సత్పాత్రములకు' అని శ్రీకృష్ణుడు కౌరవుల నుద్భోధించి పలికిన మాటలు, 'కోల్పులి వీఁకమై గొదగొని లేళ్ళకు నుఱుకు తెఱంగునఁ దఱియఁ జొచ్చి' 'ఇత్యాదిగా భీమసేనాదుల భుజాటోప విజృంభణములు, 'గాండీవ గుణరవం బొండొండఁ జెలఁగంగ, శరపరంపర లాకసంబు గప్ప' నని యర్జునుని యస్త్రపాండిత్యప్రాభవము, 'అగ్నికుండమున ద్రోణాచార్యునకు నాశమొనరించు దానికై యుద్భవించె' నని. ధృష్టద్యుమ్ను దొడ్డతనము, 'వక్షస్థలంబున వనమాల గ్రాలంగ వెలిమావు గెడలు వాగెలు ధరించి' అని అర్జున సారథియగు కృష్ణ వర్ణనము, 'ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె' యని పురస్త్రీలు గోపాలు వర్ణించిన ఘట్టము ఇట్టివెన్నియో యిందు నచ్చుటచ్చుటఁ దమయున్కి జ్ఞప్తి చేయుచుండును. శ్రీకృష్ణుఁడు ప్రాకృతమూర్తిగా మొదలై పరమార్థ తత్త్వము వరకు వ్యాపించిన వివిధ రంగ విన్యాసములును యథాశక్తి సంవేద్యములుగాఁ జెప్పుట యిందులో గొప్పలో గొప్ప. తెలుగు బాసకు నిండుదనము గండతనము కరగించి పోతపోయుటలో నితఁడు సిద్ధహస్తుఁడు. మహాకవియైనవాఁడు మహామంత్రిగా మనసు పండిన లోకజ్ఞుఁడుగా నుండిన 'నిట్లుండు'ననుట యిందు ప్రతిపద్యమునఁ బ్రత్యక్షమగును. ఇంతయు తెలుగువారు చేసిన పుణ్యఫలమనుటలో నతిశయోక్తిలేదు.'' - గడియారము వేంకట శేషశాస్త్రిగారు. (ఆంధ్ర మహాభారతము-ఉద్యోగ పర్వము - పీఠిక 5 - పుట 28-29).

4. ''తిక్కనగారి భాషా ప్రాభవమపూర్వమైనది. ఆంధ్ర విద్వల్లోకము వేవిధముల ముక్తకంఠముగాఁ గొనియాడినది. కొంచెముగానైన దానిని రుచిచూచుట యుచితము. తిక్కనగారి పదకోశమునఁ జేరి ప్రజావదనములఁ బారాడు పదప్రయోగము లిట్టివి; వెసగలకాలరులు, వెలివీడు, కొట్టిన తిండికాఁడు, పవడించు, కొండుక, పల్లాయనంబువారు, ఒత్తొరువు, హోరాటము, అడియాసలు, కొఱతనుఱుకులు, పొంతువ, బెండు, వెడవెడయలుక, వాయొడు కూటువమూఁక, ఏలిమాటలు, ముక్కునవాని, చావడము, వేరిమి, క్రొత్తది, కోరడము, వేసరి, వాయపురజ్జులు, గూఢచర్య, కడవఁబడు, ఉవ్వెత్తుకొను, కవణము, లఘుసంచరణము, అడియరితనము, చక్కసగము, ఒట్టిన మంటలు, నమ్మిగ, చిడిముడిపడు, చిదురుపాలు, వీరమదము, పానుపడు, ఆతల-ఇత్యాదులు.'' (ఆంధ్ర మహాభారతము - ఉద్యోగపర్వము - పీఠిక - పుట. 29-30)

5. ''తిక్కనగారి పదబంధ విన్యాసము లిట్టివి: వారొకతల - నేనొకతల, నేలయొత్తికొన, పెట్టని కోటనీకు హరి, గొడ్డు వోయిన వారు, కుదుటఁ గూడవెట్టి కుడుచువారు, చెవులు చీములు కట్టు, ధర్మసూతి మెత్తని పులి, ఎరవయి నిల్చు, పతివోదురు, చిచ్చయినఁ బిడికిలింతము, అరచేతికిఁ దేరఁజాలు, ముక్కూరి వగచు, కడకొఱవులట్లు, ముకుఁద్రాటఁగాలు గ్రుచ్చు, పుడమి యెల్లనొడ్డగెడవయి, తోడు దొనలేని, బఱిపికొనిపోయి, నీకై పొరలితిమి, ఒక చాలు వాని బలుతీర్పు, వెఱగునఁ బుల్లవడు, ఒంటర మింటరములు, చీదకనుపడు, మీకభరము, విడిదల పయనములు, వెలలి బలరిపుఁడు, చిక్కని పోటు మానిసివి, అరవాయిగొను, పరివింటివాఁడు, అది ప్రాప్తకాలంబు, ఉక్కుఁగలఁడు, గద నేర్చు ముసురు కవిసి, తిట్లుపాట్లు, పాముల నెట్లట్ల, తూలపుచ్చు, అడుగుమాలిపోవు ఇత్యాదులు.'' (ఆంధ్ర మహాభారతము - ఉద్యోగపర్వము - పీఠిక - పుట. 30).

6. ''తిక్కనగారి వాక్యరచనాచాతురి యిట్టిది- మిముఁ జేరి నెగడు వాఁడ । కారుణ్యమున నిట నరసియుండుఁడు, తానైన నపుడు నీతిపథము విడిచె- మమ్మైన నిపుడు. చక్కని పథమున నడవుఁడనె, పిల్లిపట్టిన యీరువువేసియున్న, వీవు

చక్కనయి నిల్చుఁగాక, నా మోమున వ్రేలెడున్, విరిగిన బారసాప వచ్చునే వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపఁగన్, రథము రథము కదియ రానిచ్చి, దుఃఖములైనవి తెగు సమయము, మీమేనత్త నూఱడింపుము, పాలకడలి పాటయై యొప్పు మొనతలఁబడు, భూమి యొనర్చి పాండునృపపుత్త్రుల కిత్తునె, ధర్మజ వారిరాశిన్, జెలియలికట్టవాసె, పొట్టు పొరలయ్యుఁ గయ్యంబునాచు, ఉఱుకడ కేగి తోడుపడు, ఇంతలేక యాడు మెల్ల వినఁగ, తిగిచి కొనివచ్చునెడ, లభిమతం బిదికాకయుఁ గల్గెనేనియన్, బూని యొనర్తు, నెత్తురు నీరఁదేల్చు, కురుక్షితీశుఁడను బ్రహ్మకు వేయును నిండు, సర్వకురు సంతతికిన్, గలవాఁడు కాఁడె, నా మోమునన్ వ్రేలెడున్, విప్పచ్చుఁడు వెసవచ్చు గాండివంబును దానున్, అర్చిన మూరెఁడు నేర్చు, చేతుల తీటం బుత్తుము, విచార వివేకంబుల నాయెత్తు వత్తురె, గాలియును జిట్టాడంగ నీను, ఇది యిట్లయ్యె దక్కినది యట్లుండె, మనఁ బోవఁగరాదు, కైపెక్కి నట్టి తలఁపు, మాఱటనోరి దానను, ఒద్దియేఱు విడిసి - ఇత్యాదులు పరశ్శతములు.'' (ఆంధ్ర మహాభారతము - ఉద్యోగపర్వము - పీఠిక - పుట 30, 31)

7. ''తిక్కనగారి యుపమానము లర్థాంతర న్యాసము లిట్టివి: మడుగుఁ జీరయందు మసి దాకినట్లు, మాకుం గుడు మిండు మీరు ప్రక్క గొనుఁడు, రోషమయ మహాతరువు, ధర్మతరువు, సాదు రేఁగెనేనిం దలపొలమునఁ గాని నిలువఁ బోఁడు, పాలలోఁ బడిన బల్లివిధంబున, నిప్పులు వేఁడిమి సెడినట్లు, వింజం బాఁకిడిన కరణి, విధిసేసినగతిఁ బడకయుండ శివునకు వశమే, కొండం గని తగరు దాఁకఁ గోరుటఁ గాదే, నిప్పులన్ బొరలినయట్లు, మీనంబు చవిఁ గాలము మ్రింగినయట్లు, నీళుల నగ్ని పుట్టిన యట్టిది, అట మిన్నందినయంత వానిపొడ వెంతన్నట్లు, మంటలో మిడుత లుదగ్రవృత్తి నుఱుకఁదలఁచినట్లు, నేవోసిన యగ్నిభంగి, కావి సెలయేఱుల తోడినగంబు లట్లు, పామున్న యింటిలో నున్నయట్లు, చిచ్చొడిం గట్టినయట్లు, గజంబు గజంబు పల్లవం బల్లన దెమల్చులీల, శ్రీరామోకాలొడ్డిన వాని విధము - ఇత్యాదులు పెక్కులు.'' (ఆంధ్ర మహాభారతము - ఉద్యోగపర్వము - పీఠిక - పుట. 31)

8. ''తిక్కన గారి వ్యాకరణ విశేషము లిట్టివి: సురరాజ్యశ్రీ వాలింపఁగ, యోగక్షేమంబున తెఱఁగు, కాన తగంబొందుట, (ఇచ్చట కాన కళ) కాన నవశ్యము (ఇచ్చట కాన ద్రుతప్రకృతికము), వేగ తెగం బాఱకు (ఇచ్చట వేగ కళ) జగంబులన్నిని, పోవఁగఁద్రోతున్ (త్రోచు ధాతువు), అట్టిదిం గలదె, ప్రాణానం గలుగంగ, సంధియ కావింపంబడిరి, మఱాకుమన్న ఎన్నఁడేని కృష్ణుని తోడనే జెప్పితి, భూరిశ్రవుం డతిరథంబుల మొదలి, జెట్టానజెట్లు, సుఖమున్న వారె, ఎల్లవెంట, సంభావింపుము. విదురునితో ప్రాణగొడ్డము, కూడదు నార, బోనాలు వేర్పింప, చంపుదమ యిర్వురము, ఇత్యాదులు మఱియుంగొన్ని.'' (ఆంధ్ర మహాభారతము - ఉద్యోగపర్వము - పీఠిక - పుట. 31)

9. తిక్కనగారి రచనలో రెండు మూడు ప్రౌఢ రచనా విన్యాసములు గూడ గనఁబడును. చూడుఁడు:-

''ఒకటి గొని, రెండు నిశ్చలయుక్తిఁ జేర్చిఁ మూఁటి నాల్గింటిఁ కడు వశ్యములుగఁ జేసి'' ''జ్ఞాతుల పోరితమును, గోవ్రాతము నాక్రమము, విప్ర వర్ణముచనవున్'' ''తుది రాజ్యమ్ము సగమ్ముగొ మ్మడవియందున్ బేరు వంచించియున్, పదుమూఁడేఁడుల నీవునుం దిరిగిరా, పాలీక పోవచ్చునే'' ఇత్యాదులు దిక్సూచి ప్రాయములు. (ఆంధ్ర మహాభారతము - ఉద్యోగపర్వం - పీఠిక - పుట. 31)

## 9. ఉద్యోగ పర్వం - అంతరార్థం

అధ్యాత్మవిదులు మహాభారతాన్ని వేదాంతమని కీర్తిస్తారని నన్నయ భట్టారకుడు పేర్కొన్నాడు. అంతేకాక భారతీయ ఇతిహాసంలోని కథ ఆధ్యాత్మికమైన అంతరార్థాన్ని కూడా గలిగి ఉండాలని ప్రసిద్ధి. అందువలన మహాభారతం ఆధ్యాత్మికపరమైన సాధన మార్గాన్ని బోధించే వేదాంత గ్రంథంగా జిజ్ఞాసువులు భావిస్తారు.

1. ఉద్యోగం అంటే ఉత్+యోగం. ఉత్ అంటే ఉన్నతులైన సాధనా మనోవృత్తులతో, యోగం అంటే కలయిక, ఉద్యోగ పర్వంలో పాండవపక్షం సాత్త్విక వృత్తుల సమీకరణం. కౌరవపక్షం తామసిక వృత్తుల సమీకరణం. ఈ రెండు వృత్తులూ యుద్ధానికి తలపడి తమ తమ ఉన్నతులకు బలం చేకూర్చుకొనే యత్నం చేయటమే ఉద్యోగం అన్నమాట.

**(1). ఉపప్లావ్య నగర సమావేశం:-** ఉపప్లావ్య నగరంలో ధర్మజుడి సభలో శ్రీకృష్ణాదులు సమావేశమై ఉద్యోగ ప్రయత్నం ఆరంభించటం ఉన్నత సాత్త్విక మనోవృత్తుల సమీకరణం. అభిమన్యుడితో ఉత్తరకు వివాహమయింది. "అభితః మనుతే ఇతి అభిమన్యుః" అనే వ్యుత్పత్తిని ఆశ్రయించి అభిమన్యుడంటే అంతటా భగవంతుడిని భావించే సాధన అని అర్థం. ఉత్తర అంటే శ్రేష్ఠురాలైనదని అర్థం. ఉత్తరాభిమన్యుల వివాహం అంటే అంతటా భగవంతుడిని దర్శించే సాధకుడు సాగించే శ్రేష్ఠమైన సాధన. దీనినే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే ఆధ్యాత్మిక పరమ సాధన అంటారు. ఈ సాధనలో పంచసాత్త్విక వృత్తులకు తోడ్పడే ఇతర మనోవృత్తులే ఉత్తరాభిమన్యుల వివాహానికి హాజరైన రాజులుగా భావించాలి.

పంచ సాత్త్విక ప్రవృత్తులకు తోడ్పడే నిర్వృతి మనోవృత్తికి శ్రీకృష్ణుడు ప్రతీక. ముక్తిసాధనకు మరే విధమైన అడ్డంకులు కలిగించకుండా తామసికవృత్తి అంత తేలికగా లొంగదనే సత్యాన్ని గ్రహించి, యుద్ధం చేసి తామసిక వృత్తులను ఓడించటం కంటే గత్యంతరం లేదని నిర్ణయించుకొనటమే సాత్యకి మొదలగు రాజులు యుద్ధానికి సిద్ధపడాలన్న వాదనకు అంతరార్థం.

సాత్యకి అంటే సత్యాన్ని గ్రహించగల్గిన సాధకుడిలోని సత్యజ్ఞాన మనోవృత్తి. ద్రుపదుడు అంటే మూల ప్రకృతి. యుద్ధ సన్నాహాలు పూర్తి చేసిన తరువాతనే ద్రుపదుడు తన పురోహితుడితో రాయబారం పంపిద్దామన్నాడు. అంటే సాధకుడిలోని పంచసాత్త్విక వృత్తులపరమైన మూలసాత్త్వికప్రవృత్తి (ద్రుపదుడు), తామసిక వృత్తితో (దుర్యోధనుడితో) యుద్ధం తప్పదని అనుకొంటూ, యుద్ధానికి కావలసిన సాత్త్విక మనోవృత్తుల బలం (పాండవుల బలం) సమీకరించి ఉభయ పక్షాల బలం చూసికొని ఆపైన భవిష్యత్ క్షేమం కొరకు తామసిక మనోవృత్తులతో సఖ్యప్రయత్నం జరపాలని ద్రుపద ప్రయత్నంలోని అంతరార్థంగా మనం గ్రహించవచ్చును. శ్రీకృష్ణుడు ద్రుపదుడి సలహాను మెచ్చుకొన్నాడు. అంటే నిర్వృతి తత్త్వం శాంతి ప్రయత్నంతో ఉంటూ యుద్ధానికే మొగ్గుచూపిందని అంతరార్థం చెప్పాలి. మొత్తానికి ఈ ఘట్టంలో ఆధ్యాత్మిక సాధనపరంగా తేలిన తాత్పర్య మేమంటే - సాధకుడు తనలోని అన్ని వృత్తుల యొక్క పర్యాలోచనలను సాగించి, తామసిక వృత్తిని ఎదిరించి నెట్టివేసేందుకు తన ముక్తి సాధనలో తోడ్పడే మనోవృత్తులను కూడకట్టుకునేందుకు, గొప్ప యత్నం చేయాల్సి ఉంటుంది అని భావించి తత్సాధనకు పూనుకొంటాడు. ఇదే సాధకుడి ఆధ్యాత్మికపరమైన ఉద్యోగం.

**(2). శ్రీకృష్ణుడి సాహాయ్యక ఘట్టం:-** ఒకవైపు దుర్యోధనుడు మరొకవైపు అర్జునుడు శ్రీకృష్ణుడి సహాయాన్ని ఒకేసారి అర్థించారు. శ్రీకృష్ణుడు తన బలాన్ని ఒకవైపు, యుద్ధం చేయని తనను మరొకవైపు ఏర్పాటు చేసి క్రమంగా దుర్యోధనుడికి, అర్జునుడికి సమకూర్చాడు. పైకి కనబడే కథ ఇది. లోన అంతరార్థం ఈ విధంగా గోచరిస్తుంది. "తామసిక వృత్తి నిర్వృతి తత్త్వాన్ని తనకు తోడుగా ఉండాలని ఎప్పుడూ కోరదు. అట్లా కోరితే తామసిక వృత్తి నిర్వృతి తత్త్వం వలన తాను మఱుగునపడి పోవలసి వస్తుంది. అసలది దాని సమీపానికి పోనే పోదు. తామసిక వృత్తి ముక్తికి సంబంధించిన మనోవృత్తి కాదు. కాన అది, ముక్తి స్వరూపమే అయిన నిర్వృతి వృత్తిని తనకు సాయంగా ప్రక్కన ఉండటానికి సహించనే సహించదు. తానై దాని ప్రక్కన ఉండనే ఉండదు. తామసిక వృత్తి, ప్రవృత్తి తత్త్వాన్ని కోరుతుంది. కాని, నిర్వృత్తితత్త్వం దానికి కిట్టనే కిట్టదు కూడ. కృష్ణుడి యొక్క సైన్యం పదివేల సంఖ్యల గోపాలురను ఇంద్రియ సంబంధములైన ప్రవృత్తి వృత్తులుగా అంతరార్థం చెప్పుకోవాలి. గోశబ్దానికి ఇంద్రియమని అర్థం కాన గోపాలురంటే ఇంద్రియాలను పోషించే తామసిక వృత్తులు అని అర్థం. ఆ ఇంద్రియాలను పోషించే తామసిక ప్రకృతికి కావాలి అనే దానికి లభించా యన్నదే కృష్ణసైన్యం దుర్యోధనుడికి లభించిందన్న దానికీ, అందుకు దుర్యోధను డానందించాడన్నదానికీ అంతరార్థంగా భావించాలి. ఇతరులకు పరమాత్మ

తత్త్వాన్ని తెలియబడనీయకుండా ఆ పరమాత్మ తత్త్వం చుట్టూ ఆవరించి ఉండే మాయావరణ వృత్తులే గోపాలురైన కృష్ణసైనికులంటే. అర్జునుడు అంటే సాధకుడిలోని ఋజు ప్రవర్తనా సాత్త్విక వృత్తి. అది ముక్తిని కోరే వృత్తి కాన అది ముక్తి స్వరూపమేయైన నిర్వృతి తత్త్వాన్నే వాంఛిస్తుంది. అర్జునుడు శ్రీకృష్ణుడిని ఎన్నుకొన్నాడన్న దానికి అదే అంతరార్థం. కృష్ణుడు యుద్ధం చెయ్యడు, ఆయుధం పట్టడు, సాక్షి మాత్రంగా యుద్ధంలో ఉంటాడు. అయినా సరే, అర్జునుడు కృష్ణుడిని ఎంచుకొన్నాడు అంటే ముక్తిసాధనలో సాత్త్విక వృత్తులకు తామసిక వృత్తులు ఆవరించి అడ్డపడకుండా ఉండే జాగ్రత్త నిరంతరం వహిస్తూ ఉండాలి. నిర్వృతి తత్త్వం యొక్క పరిధిలో సాత్త్విక వృత్తులుంటే దేనితోనూ కలయిక అనేది లేక పరిశుద్ధములైన సాత్త్విక వృత్తులను తామసిక వృత్తులు ఎన్నటికీ కదల్పనే లేవు. సాత్త్విక వృత్తులలో ఏ కొంచెం లోపం ఉన్నా తామసిక వృత్తులకు సాత్త్విక వృత్తులను పూర్తిగా నాశనం చేసివేసే బలం వస్తుంది. కనుక సాత్త్విక వృత్తులు ఇంకొక వృత్తితో కలియకుండా ఉండటమే ముఖ్యాతిముఖ్యమైనది. కనుకనే నిర్వృతి తత్త్వాన్ని సాత్త్విక వృత్తులు కోటను ఆశ్రయించి ఉండునట్లు నిరంతరమూ ఆశ్రయించి ఉండటానికి కోరుతుంటాయి. నిర్వృతి తత్త్వం తమ్ము విడిచి పెట్టకుండా తమలో సాక్షి మాత్రంగా ఉంటేచాలు. నిర్వృతి మనోవృత్తితో చేరికవలననే తామసిక వృత్తులు సాత్త్వికవృత్తులను సమీపించలేవు. విడవకుండా తనలో ఉండటం తప్ప నిర్వృతి తత్త్వ మనోవృత్తి వేరే సాధనకు సాయం చేయనక్కర్లేదు. అదే, ఆయుధం పట్టి యుద్ధం చేయక సాక్షి మాత్రంగా ఉంటానన్న కృష్ణుడిని అర్జునుడు ఎంచుకోవడంలో ఉన్న రహస్యాన్ని మనం అంతరార్థపరంగా గ్రహించాల్సి ఉన్నది.

### (3). శల్యుడు కౌరవ పాండవులకు ఇరువురకూ సహాయం చేయటం

మద్రదేశాధిపతి శల్యుడు. మద్ర (మత్+అర) శబ్దానికి అహంకార మమకార నాశక మనోవృత్తి అని అర్థం. శల్యుడు అంటే కప్ప, సరిహద్దు అనే అర్థాలున్నాయి. కప్ప అటు జలతీరం (సరిహద్దు)లోనూ ఇటు జలంలోనూ దూకుతూ ఉంటుంది. అట్లాగే శల్యుడు అటు సాత్త్విక వృత్తుల (పాండవుల) వైపూ, ఇటు తామసిక వృత్తులవైపూ దాట్లు వేసే మనోవృత్తి వంటి వాడు. ఇటువంటి మనోవృత్తిని 'శల్యవృత్తి' అని కూడా అంటారు. సహజంగా సత్త్వగుణం మీద ఆసక్తి ఉన్నా తామసగుణంమీద ఇష్టం లేకపోయినా శల్యవృత్తి దానికి సాయపడే దౌర్బల్యానికి లోనయింది. ఇటువంటి మనస్తత్త్వం సాధకులలో అప్పుడప్పుడు కలుగుతూ ఉంటుంది. అటువంటప్పుడు బహిరంగంగా తామసికం వైపు ఉంటూ సాత్త్విక విజయానికి తోడ్పడుతూ ఉండటం జరుగుతూ ఉంటుంది. ఇరువైపులకూ చేరికగా సరిహద్దులో ఉండి, రెండు వైపులకూ కప్పవలె అటూ ఇటూ కూడా దాట్లు వేస్తూనే సాత్త్విక విజయం చేకూర్చే శల్యవృత్తి వంటిది శల్య సహాయం.

### (4). పాండవ కౌరవ సైన్య బల సమీకరణం

అంటే- సాత్త్విక తామసిక వృత్తుల స్వస్వబల సమీకరణ మన్న మాట! 1.ధృష్టకేతుడు, 2.జయత్సేనుడు, 3.జరాసంధి, 4.పాండ్యుడు, 5. నీలుడు, 6.ద్రుపదుడు, 7.విరాటుడు అనే రాజులు ఒక్కొక్కరు ఒక్కొక్క అక్షౌహిణి సేనతో పాండవ సేనలో చేరారు. అక్ష+ఉహినులు=అక్షోహిణులు. అంటే ఇంద్రియాలకు సంబంధించిన మనోవృత్తులు. సప్త+అక్షోహిణులు= అంటే సాధకుడి శరీరంలోని సాత్త్విక గుణాలుగల సప్త ధాతువులు. సప్తాక్షోహిణులకు ఏడుగురు నాయకులు. వారు ముక్తి సాధకుడిలోని సప్తసాత్త్విక లక్షణాలయిన 1.నిశ్చలత, 2.సర్వోత్కృష్టత, 3.శిథిలతారాహిత్యం, 4.జ్ఞానస్థితి, 5.అసంగతత్త్వం, 6.ప్రకృతి మూలస్థితి, 7.చైతన్యసుస్థిరస్థితి అనే వాటికి ప్రతీకలు. ఆ సప్తసాత్త్విక లక్షణాలు ముక్తిసాధన చేసే సాత్త్విక వృత్తులకు బలాన్నిస్తాయి. పాండవులకు ఏడక్షౌహిణుల సైన్యం సమకూరిందంటే అందులోని అంతరార్థ మిది.

కౌరవసేనలో 11 మంది రాజులు ఒక్కొక్క అక్షౌహిణీసేనతో చేరారు. వారు- 1.భగదత్తుడు, 2.భూరిశ్రవుడు, 3.శల్యుడు, 4.కృతవర్మ, 5.హార్దిక్యుడు, 6.జయద్రథుడు, 7.సుదక్షిణుడు, 8.కాంభోజరాజు, 9.బహురూపుడు, 10,11

అవంతిరాజులిద్దరు. మొత్తం కౌరవసైన్యం పదకొండు అక్షౌహిణులు. సాధకుడిలోని ముక్తివృత్తులను నాశనం చేయ సంకల్పించి, దశేంద్రియాలూ, మనస్సు అనే ప్రకృతి తత్త్వాల్లోనూ ఉన్న తామసిక గుణానికి తోడ్పాటును అందించే మనోవృత్తులు పదకొండు అక్షౌహిణులుగా చెప్పబడ్డాయి. పదకొండుమంది అక్షౌహిణీపతులు పదకొండు ప్రవృత్తులకు ప్రతినిధులు. భగవద్దత్తమౌ జన్మకారణమైన కర్మవాసన (భగదత్తుడు). అహంకారంతో పేరుపొందాలనే అశాశ్వత కీర్తి కాంక్ష (భూరిశ్రవుడు), సాత్త్విక తామసిక వృత్తులకు మధ్యస్థితిలో ఉండే శల్య ప్రవృత్తి (శల్యుడు), సంచిత కర్మవలన కలిగే తామసిక ప్రవృత్తి (కృతవర్మ), వినాశకరమైన మనోవృత్తి (హార్దికుడు), జనన మరణ పరిభ్రమణాలుగల శరీరస్థితి (జయద్రథుడు), వివిధ వృత్తులతో గల భోగాసక్తత (సుదక్షిణుడు), సుఖాసక్తత (కాంభోజరాజు), చంచలత్వదృష్టి (బహురూపుడు), సుఖదుఃఖాది ద్వంద్వగుణాలు (అవంతి రాజద్వయం) అనే ప్రవృత్తులు అక్షౌహిణీపతులు. ఈ ప్రవృత్తులు తామసిక గుణంతో చెలిమి చేస్తూ సాధకుడిలోని ముక్తిసాధనను భ్రష్టం చేస్తూ నిత్యమూ ఘర్షణను సృష్టించే ఐహికపరమైన పదకొండు మనోవృత్తులు. ఇవి ముక్తిసాధనను నాశనం చెయ్యటానికి తామసవృత్తికి తోడ్పడతాయి అని అంతరార్థంగా గ్రహించాలి.

### (5). శ్రీకృష్ణుడి రాయబారం

తామసిక వృత్తులను నిరోధించి నివృత్తి తత్త్వ ప్రబోధాన్ని సాధించటం శ్రీకృష్ణుడి రాయబారంలోని పరమార్థం. అయితే, తామసిక వృత్తుల నిరోధం యుద్ధంతో సాధించటమా? (అంటే సర్వతామసిక వృత్తులను నశింపచేయటమా లేక జ్ఞానంలో విలీనం చేయటమా?) లేక పంచేంద్రియాలలోని తామసిక వృత్తులను విఘ్నకారులు కాకుండా చేస్తే సరిపోదా? అన్న సులభ సాధనాభ్యాస విమర్శయే కౌరవులతో అయిదూళ్ళతో సంధియా? లేక యుద్ధమా? అన్న ఆలోచనలోని అంతరార్థం.

కొన్ని సాత్త్విక సాధనావృత్తులు సర్వతామసిక వృత్తులను వినాశం పొందించి తీరవలసిందే అని నిశ్చయించగా, మరికొన్ని పంచేంద్రియాలలోనూ తామసిక వృత్తులను లేకుండా చేస్తే సరిపోతుందనీ, ముక్తి పొందటానికి అదే చాలునని అభిప్రాయపడతాయి అన్నదే ధర్మరాజు సంధికి అంతరార్థం. ముక్తి మనోవృత్తి సర్వసంపూర్ణ ముక్తినే కాంక్షిస్తుందన్నది ద్రౌపది మాటల కంతరార్థం. నివృత్తి తత్త్వమైన శ్రీకృష్ణుడు కూడా అనగా పరమాత్మ వృత్తి కూడా సర్వసంపూర్ణ తామసిక నాశనాన్నే లోలోన అభిలషిస్తుంది.

సత్యం, శివం, సుందరం అనేవి నిర్గుణ పరమాత్మను చెప్పే పదాలు. సాధకుడిలో సత్యవృత్తి (సాత్యకి) కూడా తామసిక వినాశం వలననే ముక్తి యొక్క సంపూర్ణత సిద్ధిస్తుందని చెప్పుతుంది. జ్ఞానదీప్తి (సహదేవుడు) కూడా సర్వతామసిక వృత్తి యొక్క వినాశనాన్నే కోరుతుంది. ద్రౌపది, కృష్ణుడు, సాత్యకి, సహదేవుడు కేవలం యుద్ధాన్నే కోరారనటంలోని తాత్పర్య మిదే.

భీమార్జునులు యుద్ధమైనా సరే, సంధి అయినా సరే అన్నారంటే- అభయవృత్తీ, ఋజువృత్తీ రెండు మార్గాలలో కూడా ప్రవర్తించే వన్నమాట! యుధిష్ఠిరుడు మాత్రం కేవలం సంధినే కోరాడంటే యమనియమాది అష్టాంగ యోగవృత్తి శరీరంలో పంచేంద్రియ తామసికప్రవృత్తులను అణచివేసే వృత్తియేకాని, అది జ్ఞానంలో శక్తిగల వృత్తి కాదు. కాన, దానికి అయిదు ఇంద్రియాలలోనూ తామసిక వృత్తులు లేకపోతే సర్వసంపూర్ణ ముక్తి అదే సిద్ధిస్తుందని ధర్మరాజు సంధి యత్నంలోని అంతరార్థం.

సాధకుల ఇచ్ఛానుసారం ఎవరికి వారు ముక్తిసాధనలను ఎంచుకొని సాగించుకొంటారనే తత్త్వాన్ని చెప్పే కథాభాగమే- సంధియా? యుద్ధమా? అన్న చర్చ.

### (6). ధృతరాష్ట్రుడి సభలో శ్రీకృష్ణుడి విశ్వరూప ప్రదర్శనం

“విదురుడు అంటే జ్ఞానం. కృష్ణుడు అంటే నిర్వృతితత్త్వం. నిర్వృతి తత్త్వం జ్ఞానంతో విడవకుండా కలిసియే ఉంటుందన్నదే కృష్ణుడు విదురునింట్లో మకాం చేశాడు, విదురునితో సభాభవనానికి వెళ్ళాడు అన్నదానికి అంతరార్థం.

తామసిక వృత్తులు, సాత్త్విక వృత్తులతో ఏదో విధంగా పొత్తుగా ఉంటే వాటి మనుగడ సాగుతుందనీ, తాత్కాలికంగా తామసిక వృత్తులు సాత్త్విక వృత్తులను అణచగలిగినా చిట్టచివరకు సాత్త్విక వృత్తులు ఎప్పటికైనా ముక్తిని సాధించియే తీరుతాయనీ, కృష్ణుడి రాయబారంలోని అంతరార్థ సారాంశంగా మనకు తెలుస్తున్నది. ధృతరాష్ట్రునకు దివ్యదృష్టి ప్రసాదించబడి కృష్ణునిచే విశ్వరూపం చూపించబడింది. అంతలో అది ఉపసంహరింపబడింది. అంటే సాధకునిలోనున్న మూల తామసిక వృత్తికి అంతలోనే నిర్వృతి తత్త్వం ఆవహించి జ్ఞానోదయం కల్గి అంతలోనే అంతర్హితమైంది అనేది అంతరార్థంగా భావించాలి. అంటే సాధకునిలోని తామసిక గుణానికి కూడా తాను జరుపుతున్న సాత్త్విక గుణ వినాశన కార్యంలో తన శక్తిమీద ధైర్యం సడలి పోతుండడమూ, అంతలోనే తిరిగి స్వశక్తి మీద విశ్వాసం కల్గుతూండడమూ, జరుగుతూంటుందని అర్థం. మనస్సుచే కల్పితములగు విషయములందు సంగము అనేది లేకపోవడమే దివ్యదృష్టి అంటే. ఈ దివ్యదృష్టితో దేహదృష్టి నష్టమౌతుంది. వివిధంగా ఉండే విశ్వమంతటినీ విరాట్‌స్వరూప భగవంతుని అవయవములుగా గ్రహించు జ్ఞానప్రాప్తియే విశ్వరూప సందర్శన యోగమంటే "విశతి పరమాత్మా అత్ర ఇతి విశ్వం" అని వ్యుత్పత్తిలో ప్రపంచ స్వరూపాన్ని పరమాత్మ స్వరూపంగా తెలిసికొనే జ్ఞానం పొందడం విశ్వరూప సందర్శనానికి అర్థం. ధృతరాష్ట్రునకు తన పుత్రుల దురాగత కృత్యాలవలన ముందు ముందు కలిగే నష్టం కండ్లకు కట్టినట్లు స్పష్టంగా కనిపిస్తున్నా దుర్యోధనుని మరలించలేకపోయాడంటే సాధకులలోని తమోగుణం తన ప్రవృత్తి వల్ల తనకు నష్టం కల్గుతుందని తనకు స్పష్టంగా అనిపించినా దానిని లెక్కచేయక అహంకార మమకారాల ప్రాబల్యంతో సహజమైన తామసిక వృత్తుల్ని వదలియుండలేడన్న సంగతిని సాధకులు గుర్తించాలి. ఎన్ని విధాల జ్ఞానప్రబోధం జరిగినా తామసిక వృత్తి తన సహజతత్త్వం విడవదన్నదే గాంధారీ విదుర భీష్మద్రోణాదులు చెప్పినా దుర్యోధనుడు వినలేదన్న దానికి అంతరార్థం. కృష్ణుణ్ణి దుర్యోధనాదులు బంధించే యత్నం చేసేరంటే తామసిక వృత్తులు నిర్వృతి తత్త్వం తమ్ము ఆవరిస్తే తమ ఉనికికే భంగం కల్గుతుంది కాన అది తమ్ము ఆవరించకుండా చేసికొనే తామసిక ప్రకృతి యొక్క ప్రబల ప్రయత్నంగా దానిని భావించాలి."

## (7). శ్రీకృష్ణుడు కర్ణుడిని దుర్యోధనుడి పక్షం నుండి విడదీయటానికి చేసిన యత్నం

"కర్ణుని పాండవ పక్షంలో చేరడానికి కృష్ణుడు ఎన్ని విధాలుగానో యత్నించేడు. కర్ణుడు అంటే యోగమార్గంలోని పాక్షికంగా అమనస్కసుఖం అనుభవించే కుంభక ప్రాణాయామంగా మనం లోగడ అంతరార్థపరంగా చెప్పుకొని ఉన్నాం. సర్వసంపూర్ణమైన అమనస్కతయే నిర్వృతి తత్త్వం అలవడడానికి కారణం. నిర్వృతియే ముక్తి అంటే.

ముక్తితత్త్వం సాధించాలంటే సంపూర్ణమైన అమనస్కత కావాలి. ఆ అమనస్కత కుంభక ప్రాణాయామ ధ్యానం వల్ల కొంతసేపు మాత్రమే సిద్ధిస్తుంది. సాత్త్విక వృత్తులు మాత్రమే జ్ఞానమార్గంలో సర్వసంపూర్ణమైన అమనస్కతను సాధించగల్గుతాయి. అమనస్కతను స్థిరంగా నిల్పుకోవడానికి ఎక్కువ అభ్యాసం శ్రమ అవసరం. అయితే జ్ఞానమార్గంలో సాధించిన అమనస్కతయే సర్వ సంపూర్ణమైన, శాశ్వతమైన అమనస్కత అవుతుంది. కుంభక ప్రాణాయామంతో కల్గే అమనస్కత అసంపూర్ణమై అశాశ్వతమైనది మాత్రమే అవుతుంది. అది సులభంగా సాధ్యమయ్యేదే. సాధకులు యోగమార్గంలో కుంభకంతో అమనస్కతను అభ్యాసం చేసి ఆ అభ్యాసపాటవంవల్ల కుంభకం విడిచిన తర్వాత కూడ దానిని శాశ్వతంగా నిల్పుకొని సులభంగా ముక్తిని సాధించటం అనేది, యోగజ్ఞానమార్గాల రెండింటి యొక్క కలయిక వల్ల కల్గే ఫలితం. ఇది ముక్తి సాధకుల చేత అభ్యసింపబడుతుంది. ఈ సంగతి సాధకులకు తెల్పడమే కర్ణుణ్ణి పాండవులలో చేర్చడానికి కృష్ణుడు చేసిన ప్రయత్నానికి అంతరార్థం. నీవు కౌరవులలో ఉన్నా కుంతీపుత్రుడవుగా పాండురాజుకు కొడుకువే అవుతావనీ, పాండవులకు నీవు అన్నవౌతావనీ, ఆ కారణంగా నీకు రాజ్య పట్టాభిషేకం జరుపుతామనీ, ద్రౌపది ఆరవ భర్తగా నిన్ను వరిస్తుందని కృష్ణుడు కర్ణుని హెచ్చరించాడు. అంటే తమో వృత్తులతో (కౌరవులతో) కుంభకయోగం (కర్ణుడు) కలిసియున్నా పరంపరా సంబంధం వల్ల అది సాత్త్విక వర్గంలోనిదే అవుతుంది. కాన ముక్తిని కోరే పంచ సాత్త్విక వృత్తులతో (పాండవులతో) సోదరత్వం దానికి సిద్ధిస్తుందనీ, సాధకునిలోని ముక్తి తపన (ద్రౌపది) ముక్తి సాధనల్లో ఆరవ సూచనగా అంతరార్థం ఇందు గోచరిస్తుంది.

తామసిక వృత్తితో కాక కుంభక యోగం సాత్త్విక వృత్తుల చేరికతో అభ్యాసం సాగిస్తే కుంభకాన్ని విడిచినప్పుడు కూడ అమనస్కత సిద్ధించే వీలుంది. అలాగు సాత్త్విక వృత్తులతో కలవకపోతే కుంభక యోగంలోని పాక్షిక తామసిక గుణాన్ని జ్ఞానయోగంలోని ఋజువర్తనా వృత్తితో నాశం చేయడం జరగవలసి వస్తుంది- అని సాధకులకు తెలియచెప్పటమే కృష్ణుని పరుషోక్తులకు అంతరార్థం. కృష్ణుడు పాండవుల నివాసమైన ఉపప్లావ్యానికి చేరుకున్నాడు. 'ఉప' అంటే సమీపం అని అర్థం. ప్లవము అంటే తేలింపజేసేది తెప్ప అని అర్థం. ప్లావ్యం అంటే తేలింపజేయదగ్గది. తరింపజేసే సాధనా స్థితి అని అర్థం. ఆ స్థితి యొక్క సామీప్యంలో అనగా ముక్తి సామీప్యంలో సాత్త్విక వృత్తులున్నాయని అక్కడకు నిర్వృతి తత్త్వం చేరుకొంది అని కృష్ణుడు ఉపప్లావ్యానికి చేరాడన్నదానికి అంతరార్థం గ్రహించాలి.''

### (8). కర్ణుడిని పాండవులలో చేర్చటానికి కుంతీ ప్రబోధం: కర్ణుడి తిరస్కారం

''కుంతి అంటే 'కుంధీ' అని. అనగా సాధకునిలోని ఐహిక బుద్ధివృత్తి అనీ లోగడ చెప్పుకున్నాం. కర్ణుడు ఆమెకు సూర్యునివల్ల కల్గిన కుమారుడు కాన అతనిలో పిత్రంశంగా జ్ఞానదీప్తి, మాత్రంశంగా ఐహిక తామసిక వృత్తి కూడా చోటుచేసికొని ఉన్నాయి. కర్ణ పదానికి కుంభక యోగం అని అర్థం చెప్పుకొని ఉన్నాం. కుంభక యోగంలో వాయువును కుంభించి అమనస్కత కల్గినప్పుడు జ్ఞానదీప్తి, వాయువును విడిచివేసినపుడు ఐహిక తామస వృత్తి నిలిచి ఉంటాయి. కాన, కుంతి కర్ణుని ప్రబోధించిందంటే సాధకునిలోని కుంధీ వృత్తి అనగా ఐహిక భోగ వాంఛా వృత్తి కుంభకంలో పాక్షికంగా ఉండే ఐహిక వృత్తిని మేల్కొలిపే యత్నం చేసిందన్నమాట.

సూర్యుడు ''తల్లి మాట ప్రకారం ఆచరింపుమని ప్రబోధించే''డంటే సాధకునిలోని కుంభకయోగంలోని అమనస్కతతో పాక్షికంగా ఉన్న జ్ఞానదీప్తి సాత్త్వికవృత్తితో కాక పాండవులతో కాక తామసిక వృత్తితో (దుర్యోధనునితో) చెలిమి చేస్తూంటుంది. కావటం వల్ల కుంభకంలో వాయు నిరోధంతో వున్నప్పుడు కల్గిన అమనస్క జ్ఞానదీప్తికి సుస్థిరత రాదనీ తామసిక వృత్తులతో కాక సాత్త్విక వృత్తుల (పాండవుల) పొత్తుతోనే దానికి సుస్థిరత ఏర్పడి ఫలితం కల్గుతుందని ఆ ప్రబోధంలో అంతరార్థపరంగా యోగజ్ఞాన మార్గాలలో సాధన చేసే సాధకులకు తెలియజెప్పటమే అని మనం స్పష్టంగా గ్రహించవచ్చు.

కర్ణుడు ''అర్జునుడిని'' తప్ప మిగిలిన యుధిష్ఠిర భీమనకుల సహదేవులను యుద్ధంలో తనను ఎంత హింసించినా తాను వారిని చంపను అన్నాడు. అర్జునుడు అంటే సాధకునిలోని ఋజువర్తనా సాధన. దానివల్ల కలిగే ఫలితము కూడా ఒక్కటే. రెండూ జ్ఞాన ప్రదాయకములైన సాధనలే కాక ఒకటి ఉంటే రెండవది ఉండనక్కరలేదు. ఉండదు కూడ 'ఒకటి జ్ఞానమార్గంలోనిది' రెండవది యోగమార్గం లోనిది అనే పేర్లకు సంబంధించిన భేదమే తప్ప రెండూ ఇచ్చే ఫలితం ఒక్కటే. జ్ఞాన ప్రబోధం, యోగ ప్రబోధం రెండూ ముక్తిని సిద్ధింపజేయడంలో ఒకటే గనుక ఒకటి వుంటే రెండవది ఉండే అవసరం లేదు. అట్లా రెండూ వుండడం సంభవమూ కాదని సాధకులకు తెలియజేయడమే కర్ణుడు చేసిన అర్జున వధ ప్రతిజ్ఞలోని అంతరార్థంగా గ్రహించాలి. అయితే కుంతి, కర్ణుని పాండవుల పక్షంలోనికి రమ్మన్నది అన్నదానికి అంతరార్థ ప్రయోజనం ఏముంది? అనే ప్రశ్న ఇచ్చట సాధకులకు కల్గవచ్చు. తామసిక వృత్తితో కలయికే లేకపోతే ఋజు ప్రవర్తనా వృత్తితో కుంభక వృత్తి ముక్తి సంపాదనలో సమానమే అవుతుంది. యోగమార్గంలో కుంభక సాధన చేసే సాధకులు సాత్త్విక గుణాసక్తులుగా ఉండాలని వ్యాసుడు అంతరార్థపరంగా సాధకులకు చేసిన హెచ్చరికగా ఈ కుంతీ ప్రబోధాన్ని మనం గుర్తించాల్సి ఉంది. యుధిష్ఠిరుడంటే యమనియమాది యోగ సాధన. భీముడు అంటే అభయ వృత్తి. నకులుడంటే ఐహిక భోగ నివృత్తి; సహదేవుడంటే జ్ఞానదీప్తి. ఈ వృత్తులు కుంభక వృత్తికి సహకారులే కాని బాధాకరములు కావు. కాన అవి కర్ణుని అనగా కుంభక యోగవృత్తిని బాధించవు. ఒకవేళ బాధించినా కుంభక వృత్తి వానిని నశింపజేయవలసిన పనిలేదు. ఈ విధంగా కుంభక వృత్తి కుంభకాన్ని విడిచినప్పుడు ఒక ఋజు ప్రవర్తనా వృత్తిని తప్ప మిగిలిన వానిని నశింపజేయకుండా జాగ్రత్త వహింపవచ్చునని చెప్పడమే యుధిష్ఠిరాదులను చంపనని కర్ణుడన్న దానికి అంతరార్థపరమైన అర్థం. జ్ఞాన మార్గంలోని

ఋజు వృత్తిని పొందటం శక్యం కాకపోతే సాత్త్విక గుణశక్తితో కుంభక యోగవృత్తి యొక్క అభ్యాసంతో దాని లోటు భర్తీ చేసుకోవచ్చుననీ, యోగమార్గంలోని కుంభక యోగవృత్తిని నిల్వరించుకోలేకపోతే జ్ఞానమార్గంలోని ఋజువర్తనా వృత్తిని చేపట్టి మిగిలిన నాలుగు సాత్త్విక వృత్తులతో కూడి కొంత ఫలితం పొందవచ్చుననీ చెప్పడమే కర్ణుడు చనిపోయి అర్జునుడున్నా, అర్జునుడు చనిపోయి కర్ణుడున్నా నీకు అయిదుగురు పుత్రులు ఎప్పుడూ ఉండనే ఉంటారని కర్ణుడు, తల్లికి చివరిమాటగా చెప్పినదానికి అంతరార్థం. నేడు తమోగుణం వదలక యోగమార్గంలో కుంభక యోగంతో కల్గిన పాక్షిక అమనస్కతా శక్తివల్ల అణిమాది ఐహిక సిద్ధులు సిద్ధింపజేసికొని కొందరు బాబాలు, యోగులు ప్రజలకు దైవశక్తులుగా వానిని నమ్మించి ముక్తిసాధనను పూర్తి చేయకుండా ఆత్మద్రోహానికి పాల్పడే వారిని దుర్యోధనునికి తోడ్పడిన సూతపుత్రునిగా రాధేయునిగా, వసుషేణునిగా ముక్తిమార్గదూరులుగా వేర్పడిన కర్ణనామధారులనుగా తెలిసికోవాలనే హెచ్చరికను కూడా ఇందు అంతరార్థపరంగా ముక్తి సాధకులు గ్రహించాలి.''

(ఉద్యోగపర్వం: అంతరార్థం - అనే ఈ అంశాన్ని కళాప్రపూర్ణ, సరస్వతీ కంఠాభరణ, తత్త్వార్థ ప్రబోధక, విద్వాన్ డా.వేదుల సూర్యనారాయణశర్మగారి 'అంతరార్థ మహాభారతము' (ముక్తిసాధనా మార్గము) నుండి కృతజ్ఞతలతో గ్రహించటమైనది.)

## 10. కవిత్రయ మహాభారతం: వ్యాఖ్యానం

ఆదికావ్యమైన ఆంధ్రమహాభారతం తెలుగులో అవతరించి దాదాపు వెయ్యేళ్ళు ఔతున్నా, ఇంత వరకు దానికి సమగ్రవ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్టవ్యావహారిక భాషలో సరళ వ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి ఆనందించే అపూర్వమైన సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు భారతీయ వైదిక ధర్మ ప్రచారమహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమ వేదవ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండల రాయడు మాత్రమే చేపట్టి, ధర్మరక్షణ కళాప్రావీణ్యంతో ఈ బృహత్తర ధర్మకార్యాన్ని ప్రజలకు ప్రసన్నంగా ప్రసాదించగలిగిన పరమ దయాళువు. ఆ దేవదేవుడి కృపాకటాక్షంతో పండితులు పదునెనిమిది పర్వాల ఈ దివ్య ప్రబంధ మండలిని పరిష్కరించి, ప్రతిపద్యానికి వ్యాఖ్యానం వెలయించి, సవిమర్శకమైన పీఠికలు సమకూర్చి, కథాసారాదులతో సర్వార్థ సాధకంగా సంతరించి, సర్వాంగ సుందరంగా ప్రచురించి, సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీతిరుమలేశుడి పక్షాన బాధ్యత వహించి అభ్యుదయపరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి బోర్డ్ ఛైర్మన్, సభ్యులు, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, సంపాదకులూ, వారి సహకారులూ, సంపాదక సలహా మండలుల సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ఎడిటోరియల్‌సెల్ సభ్యులూ, పలురకాలుగా ఈ కార్యక్రమంలో తోడ్పడుతున్న అధికార, అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. అది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన అరణ్యపర్వం మూడవ సంపుటిగా రెండు భాగాలలో ప్రచురించబడింది. మొదటిభాగం నన్నయ రచించిన అరణ్య పర్వభాగం. రెండవ భాగం ఎఱ్ఱాప్రెగ్గడ పూరించిన అరణ్య పర్వ శేషం. ఈ విధంగా అరణ్యపర్వం విభజించబడి ప్రచురించబడటం తెలుగులో ప్రథమం. ఇక నాల్గవ సంపుటిగా విరాటపర్వం వెలువడింది. ఇప్పటి ఈ అయిదవ సంపుటి ఉద్యోగపర్వం.

ఉద్యోగపర్వ వ్యాఖ్యానంలో ఇద్దరు మహాపండితులు, కవులు, విమర్శకులు పాల్గొన్నారు. మొదటి రెండాశ్వాసాలకు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు, మిగిలిన రెండాశ్వాసాలకు శ్రీముదివర్తి కొండమాచార్యులుగారూ వ్యాఖ్యానం

వ్రాశారు. వీరిరువురూ ప్రసిద్ధ సాహిత్యాచార్యులూ, పరిశోధకులే కాక సహృదయశిఖామణులు, వ్యాకరణాలంకార శాస్త్ర నిష్ణాతులు. మీదు మిక్కిలి భారత తత్త్వ దర్శనం చేసిన మనీషులు. వారు ప్రతిభావంతమైన తమ వ్యాఖ్యానంతో ఉద్యోగపర్వాన్ని ఉజ్జ్వలంగా తీర్చిదిద్దారు. వారికి నా నమోవాకాలు.

తిక్కన సోమయాజి కవిత్వంలోని శిల్పకళావిశేషాలను సహృదయులకు అందుబాటులోకి తీసికొని రావటానికి అనువుగా నేను చాలా చోట్ల విశేష వ్యాఖ్యలు వ్రాసి వివరించాను. అవి 'సంపా'. అనే సంకేతాక్షరాలతో సూచించబడ్డాయి. ఉద్యోగ పర్వంలోని రాజనీతి విశేషాలు, రాయబారాల తీరులు, తిక్కన రచనలోని దృశ్యకావ్య వైఖరులు, కావ్యశిల్పానుశీలన సమీక్షలు. అంతరార్థ పరిశీలనలు మొదలైన అంశాలతో సవిమర్శకమైన పీఠికను సంతరించాను. ఉద్యోగపర్వ కథాసారాన్ని సమకూర్చాను. ఈ ప్రయత్నం ఆంధ్రావళి ఆమోదాన్ని పొందుతుందని ఆశిస్తున్నాను.

ఈ సంపుటి ఈ విధంగా రూపొందటానికి తోడ్పడిన మిత్రులు విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారికీ, శ్రీ కె.సత్యరామప్రసాద్ గారికీ, శ్రీ జి.రాధాకృష్ణగారికీ, శ్రీబాబుగారికీ, శ్రీమతి సుశీలా లక్ష్మీవిద్యానాథులకూ, డాక్టర్ వి.యస్.లక్ష్మికీ నా హార్దమైన కృతజ్ఞతలు.

పరమ కల్యాణ భద్రమూర్తి అయిన శ్రీ పద్మావతీ సహిత శ్రీవేంకటేశ్వరస్వామివారు వేదవేద్యుడు, వేదాంతగమ్యుడు, పరతత్త్వరూపుడు అయిన భక్త సులభుడు, సాహిత్య సంగీత ప్రియుడు, రసానందమూర్తి. ఆ స్వామికి ఈ పంచమ వేదం అక్షరమైన తోమాలసేవ. వ్యాఖ్యానం సుగంధపరిమళసేవ. ఉద్యోగ పర్వ విశేషాంశాలు ఉజ్జ్వలాలంకారసేవ. పీఠిక విరాణ్మూర్తికి మంగళ నీరాజనం. ఈ పర్వం స్వామివారికి సారస్వతమైన అక్షరార్చనం.

సత్య శివ సుందర రూపుడైన స్వామి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలోని భాగంగా పుణ్యపూజా కుసుమమంజరిగా సమర్పించుకొంటున్నాను. విశ్వ శ్రేయస్సును ప్రసాదించుమని స్వామిని వేడుకొంటున్నాను.

హైదరాబాదు
చిత్రభాను మహాశివరాత్రి
**1-3-2003**

**జి.వి.సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు
కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానం

# ఉద్యోగపర్వ కథాసారం

ఉత్తరాభిమన్యుల వివాహానికి వచ్చిన రాజబంధువులందరూ ఉపప్లావ్యంలో సమావేశమైనారు. శ్రీకృష్ణుడు పాండవ కార్యార్థియై వారందరినీ ఇట్లా ప్రబోధించాడు.

**పాండవోద్యోగం**

'పాండవులు కపటద్యూతంలో రాజ్యసంపదనంతా కోల్పోయారు. పరాక్రమవంతులై ఉండి కూడా సత్యనిరతితో అరణ్యాజ్ఞాతవాసాలు పూర్తిచేశారు. పన్నెండేళ్ళ అరణ్యవాసంలో రాక్షసుల వలనా, క్రూరమృగాలవలనా ఎన్నో ఇబ్బందులకు గురి అయ్యారు. కష్టతరమైన పదమూడో యేడు ఎన్నోఆపద లెదుర్కొని ఎట్లా గట్టెక్కగలిగారో మీకందరికీ తెలిసిందే. ధర్మరాజు ధర్మమార్గం తప్పి ఇంద్రపదవిని కూడా ఆశించడు. పాండవులు పితృధనంగానే కాక, దిగ్విజయం చేసి సంపాదించుకొన్నారు వారి సామ్రాజ్యాన్ని. దాన్ని కపటద్యూతంలో ధార్తరాష్ట్రులు అపహరించారు. అయినా, ధర్మరాజు వారికి కీడు చేయ తలపెట్టడు. ఈ రెండు విధాలను మనం పరిశీలిస్తే ఈ రెండు తెగలవారూ రాజ్యాన్ని పంచుకొని అనుభవించటం తగిన కార్యమని అనిపిస్తున్నది. దీనిపై మీ అభిప్రాయాలు ప్రకటించండి. ముందుగా నా మాట చెపుతున్నాను - పాండవు లింతవరకూ శాంతులై సమయాన్ని పాటించారు. ఇకపై తమ పరాక్రమాన్ని ప్రదర్శించుకొనాలని భావిస్తున్నారు. వీరి తలపు తెలిస్తే దుర్యోధనుడు తన మిత్రులతో కలిసి యుద్ధానికి సిద్ధమౌతాడు. యుద్ధమన్న తరువాత తక్కువబలం ఉన్నవారిమీద ఎక్కువబలం ఉన్నవారి ప్రభావం కనబడుతుంది. పాండవు లెంత బలవంతులైనా సైన్యబలాన్ని, మిత్రబలాన్ని సమీకరించుకోక తప్పదు. అప్పుడు ఈ వైపునా, ఆ వైపునా రాజులకూటమి ఏర్పడక మానదు. దేవాసురుల యుద్ధంలోవలె కొందరు చనిపోవక తీరదు. కాబట్టి ఇక్కడి వారి తలపులు, అక్కడివారి తలపులు ఎట్లా ఉన్నాయో తెలియవు. కార్యనిశ్చయం చేయటం ఇప్పుడు కష్టం. అందువలన తగిన రాయబారిని పంపటం అవసరం. దుర్యోధనుడు రాజ్యభాగం ఇచ్చాడా సరి, లేదా అప్పటికి తగిన విధంగా నడచుకొనటం న్యాయం'.

శ్రీకృష్ణుడి మాటలను బలరాముడు సమర్థించాడు. కాని, సాత్యకి రాయబారపు యత్నాన్ని వ్యతిరేకించాడు. 'సంగ్రామమే అవశ్య కర్తవ్య' మన్నాడు. అయితే, ధర్మరాజు అంగీకరించి రాయబారం నడపదలచుకొంటే - దీనంగా రాజ్యాన్ని అడగకుండా గౌరవపురస్సరంగా వా రిస్తే పుచ్చుకొనే పద్ధతిలోనే మాటలు సాగాలి' అని ప్రతిపాదించాడు. సాత్యకి అభిప్రాయాన్ని ద్రుపదుడు బలపరిచాడు. 'దుష్టాత్ముడైన దుర్యోధనుడు మంచిమాటలతో రాజ్యభాగా న్నివ్వటానికి అంగీకరించడు. దుర్జనుల హృదయాలు మెత్తని మాటలతో ప్రసన్నమౌతాయా? భీష్మద్రోణులు పెద్దవారే కాని, కూటికొరకు వారి ననుసరిస్తారు. ధృతరాష్ట్రుడికి కొడుకుమీద వ్యామోహం పెద్దది. కర్ణుడా వట్టి తులువ. మిగిలిన వారందరూ దుర్యోధనుడే సద్బుద్ధి కలవా డని కీర్తిస్తారు. కాబట్టి అతడు దుర్వినీతుడై ఎప్పుడూ యుద్ధానికే కాలుదువ్వుతుంటాడు. ఈసమయంలో మనం బలాలను సేకరించుకొనాలి. పిలువదగిన రాజులకు పిలుపులు పంపించాలి. దుర్యోధనుడు కూడా తనవారిని తాను పిలుచుకొంటాడు. ముందు పిలిచిన వారికి సహాయం అందజేసే మర్యాద రాజలోకంలో ఉన్నది. మనం త్వరపడి శల్య కేకయ జరాసంధ తనయాదులను, వారిబంధు మిత్రులను మన వైపు చేర్చుకొనటం అవసరం' -అని చెప్పి ద్రుపదుడు తన పురోహితుడిని దూతగా ధృతరాష్ట్రుడి పాలికి పంపాలనీ, ఎవ రెవరితో ఏయే మాటలు ఎట్లా మాట్లాడాలో అతడికి వివరంగా చెప్పితే వాటి నాతడు నిర్వహిస్తాడనీ సూచించాడు.

వాసుదేవుడు 'ద్రుపదుడి మాటలు కూడ ఉచితంగా ఉన్నాయి. అట్లాగే చేయాలి' అని అంటూ - 'నాకు కౌరవులు పాండవులు సమానమే. వారిరువురు రాజ్యాన్ని పంచుకొని అనుభవిస్తే చూచి సంతోషిస్తాను. పెళ్ళికి వచ్చి చాలరోజులయింది. మా ఇళ్ళకు మేము పోవాలి. ద్రుపదు డందరికీ కావలసినవాడు, అన్నీ తెలిసినవాడు; అతడు ఎట్లా చేస్తే అట్లా కానివ్వండి. ఇరువురికీ స్నేహం కుదిరితే సంతోషం. లేదా, మమ్ములను పిలవ బంపండి; వచ్చి సాయం చేస్తాం' ఆపైన అర్జునుడి కోపాగ్ని వారిని చుట్టుముట్టక మానదు' - అని నిష్కర్షచేసి నిజనగరానికి బయలుదేరాడు.

విరటుడి ప్రేరణతో యుద్ధోద్యోగం పాండవపక్షంలో ప్రారంభమయింది. పాండవులు, విరాటరాజు, ద్రుపదుడు సైన్యాలతో ఊరివెలుపల గుడారా లెత్తించి తమ కనురక్తులైన రాజులవద్దకు తగిన దూతలను పంపారు. ఈ సంగతిని తెలిసికొన్న దుర్యోధనుడు కూడా తన బంధుమిత్రగణాలను సమీకరించటం మొదలు పెట్టాడు. ఇట్లా రెండువైపులా స్కంధావారాలు సైన్యాలతో సమృద్ధమౌతూ ఉన్నాయి.

## ద్రుపద పురోహితుడి రాయబారం

ద్రుపదుడు ధర్మజుడి అనుమతితో వయోజ్ఞానవృద్ధుడైన పురోహితుడిని పిలిపించి ధృతరాష్ట్రుడి పాలికి దూతగా పంప నియోగించి ఇట్లా ప్రబోధించాడు - 'నీవు మతిమంతుడవు, చతురవచన కోవిదుడవు, సమయజ్ఞుడవు, హితుడవు కాబట్టి పాండవార్థమై నిన్ను ధృతరాష్ట్రుడి పాలికి దూతగా పంపుతున్నాను. అతడు పుత్రమమకారం కలవాడు; కుటిలుడు. అతడి వర్తనం, ధర్మజుడి శీలం రెండూ నీకు తెలుసు. పాండవులకు రాజ్యభాగం అడుగుతూ ధర్మనిష్ఠతో మాట్లాడితే అతడి అనుచరులందరూ ఆగ్రహిస్తారు. గురుభీష్మాదుల హృదయాలు యుద్ధంమీదకు పోకుండా, దుర్యోధనుడు సంధికంగీకరించేటట్లు నిపుణంగా మాట్లాడాలి. బంధువుల కందరికీ పాండవులు పడిన పాట్లను వివరిస్తూ, ఎవరికి నచ్చేవిధం వారిపట్ల అనుసరిస్తూ, నీవు చెప్పేదే మంచిమార్గమని వారందరూ భావించేటట్లు పలకాలి. అంతేకాదు, అక్కడి అందరి మనస్సులూ ఇక్కడ వ్రాలేటట్లు ఎన్నిఉపాయాలు దొరికితే అన్నీ ప్రయోగించాలి. కృష్ణాదుల వాదాలు నీవు విన్నావు కదా! వాటికి అనుకూలంగా పాండవులకు తేజోలాభం కలిగేటట్లు కార్యం నిర్వహించాలి. కురువృద్ధుల హృదయాలు గమనిస్తూ మసలుకొనాలి. నీ వాక్యసూత్రానికి సుయోధను డంగీకరించాడా - అదే అందరికీ సంతోషం కలిగిస్తుంది; ధర్మరాజుకు ప్రీతిని కలిగిస్తుంది. ఇక పోయిరా' అని హస్తినాపురికి పంపాడు. అతడు హస్తినాపురం వెళ్ళి కొన్నాళ్ళుండి ధృతరాష్ట్ర దుర్యోధన భీష్మాదులతో తగిన మాటలాడుతూ తగిన సమయంకొరకు ఎదురు చూచాడు.

ఆ సమయంలోనే ఇరుపక్షాలవారు వారివారి మిత్రులను సాయమడిగే యత్నాలు సాగిస్తున్నారు. దుర్యోధనుడు అన్యరాజన్యులను అడిగినట్లుగానే శ్రీకృష్ణుడి సహాయం అడగడానికి దూతను పంపటం ఉచితం కాదని తానే స్వయంగా వెళ్ళాడు. శ్రీకృష్ణుడు తన మందిరంలో శయనించి ఉన్నాడు. దుర్యోధనుడు వెళ్ళి తలవైపున ఉన్నపెద్దగద్దెమీద కూర్చున్నాడు. అదే సమయంలో అర్జునుడు కూడా వచ్చాడు. అతడు శ్రీహరిపాదాలచెంత వినమ్రుడై నిలువబడ్డాడు. కృష్ణుడు నిద్ర లేచి ముందుగా అర్జునుడిని చూచి పలుకరించాడు; ఆ తరువాత దుర్యోధనుడిని చూచి సంభావించాడు. ఇద్దరినీ వచ్చిన పనిని గూర్చి అడిగాడు. రాబోవు యుద్ధంలో తనకు సహాయం చేయు మని అడగటానికి వచ్చానని దుర్యోధనుడు పలికి, వచ్చిన వారిలో తానే మొదటివాడు కాబట్టి అడిగే అవకాశం మొదట కల్పించుమని కోరాడు.

శ్రీకృష్ణుడు అది కాదని, మొదట చూచినవాడు, చిన్నవాడు, అన్నచాటు వాడు అయిన అర్జునుడికి మొదట కోరుకొనే అవకాశం ఇచ్చాడు. తన బలాన్ని రెండు భాగాలు చేశాడు. నారాయణాఖ్యులైన పదివేలమంది గోపాలురు యుద్ధ నిపుణులు ఒకవైపు, ఆయుధం పట్టక యుద్ధం చేయక, సాయం చేసే తా నొక్కడూ ఒక్కవైపు ఏర్పరచాడు. ముందుగా అర్జునుడు శ్రీకృష్ణుడిని కోరుకొన్నాడు. దుర్యోధను డందుకు ఉప్పొంగి పోయి గోపాలురను తీసికొని వెడలి పోయాడు.

ఆ తరువాత సుయోధనుడు బలరాముడి సహాయాన్ని అర్థించాడు. అత డెవ్వరి పక్షాన పోరనని చెప్పాడు. ఆపైన కృతవర్మను కోరగా అక్షౌహిణీ సైన్యంతో అతడి పక్షాన చేరాడు.

పదివేల మంది నారాయణవీరులను కోరకుండా తన నొక్కని నెందుకు కోరుకొన్నావని శ్రీకృష్ణుడు అర్జునుని ప్రశ్నించాడు. అందుకు అత డిచ్చిన సమాధానం ఇది-

శ్రీకృష్ణా! నేను రణంలో ఎవరి సహాయాన్నీ తీసుకోను. నీవా ప్రసిద్ధుడవు. నీవు యుద్ధం చేస్తే నాకు పేరు రాదు. అంతేకాక నీ కెదురై విజయాన్ని సాధించటం దుర్లభం. విజయమూలమైన నీతోడు నాకుంటే చాలు. నీవు యుద్ధం

చేయకపోయినా సంతోషమే. అందువలననే నిన్ను కోరుకొన్నాను. ఓ మహాత్మా! నా రథానికి నీవు సారథివై నన్ను ముందుకు నడిపించు. అపారకృపారసం నా మీద చిలికి నాకీ వరం ప్రసాదించు. ఇది నా చిరకాలవాంఛితం. మన్నించు' అని పార్థుడు ప్రార్థించాడు.

'అర్జునా! నీ అభిమతం తీర్చటం నాకు ఆనందం. తప్పక నీ రథసారథ్యం నిర్వహిస్తాను. పార్థసారథి అనే పేరుతో ప్రసిద్ధిపొందుతాను' అని అనునయించి కిరీటిని తీసికొని ధర్మరాజు వద్దకు వెళ్ళి పాండవులకు కార్యాలోచనంలో మార్గదర్శిగా వ్యవహరించాడు మాధవుడు.

పాండవ దూతలు శల్య సహాయాన్ని కోరారు. అత డంగీకరించి పుత్రమిత్ర సేనాసమేతంగా బయలుదేరి ఉపప్లావ్యానికి అంచెలంచెలుగా యాత్ర సాగిస్తున్నాడు. దుర్యోధనుడు ప్రచ్ఛన్నంగా తనవారిచేత శల్య సైన్యానికి కావలసిన సౌకర్యాలన్నీచేయించాడు. దాని కతడు మెచ్చి పాండవదూతలే సహాయం చేస్తున్నారని భావించి వరమిస్తానని ప్రకటించాడు. సమయ మదేనని తెలిసికొని దుర్యోధనుడు శల్యుడి ముందుకు వచ్చి తన పక్షంలో చేరి యుద్ధం చేయుమని కోరాడు. దానికి కారణం-శల్యుడికి కౌరవపాండవు లిరువురూ సమానులేననీ, దుర్యోధనుడిని శల్యుడు ముందు చూచాడనీ పేర్కొన్నాడు. శల్యుడు దాని కంగీకరించాడు. కాని, ధర్మరాజుకు ఆ సంగతి చెప్పి వస్తానని ఉపప్లావ్యానికి వెళ్ళాడు. అతడికి జరిగిందంతా తెలిపాడు. ధర్మరాజు కూడా ఒక కోరిక కోరాడు. 'మాపక్షంలో అర్జునుడికి శ్రీకృష్ణుడు సారథి. వారి పక్షంలో కర్ణుడి రథసారథిగా అశ్వహృదయం తెలిసిన నిన్నే కోరాలని భావించి ఉంటారు. కర్ణసారథ్యం వహించేటప్పుడు అర్జునుడికి విజయం కలిగేటట్లు సహాయం చేయాలని ప్రార్థించాడు ధర్మజుడు. శల్యుడు దానికి అంగీకరించాడు. కర్ణరథసారథ్యం చేసేటప్పుడు అతడి హృదయం వికలమయ్యేటట్లు మాట్లాడి పరోక్షంగా పార్థవిజయానికి దోహదం చేస్తానని వాగ్దానం చేశాడు. కాలం కలిసి రానప్పుడు ఇంద్రుడు సైతం కొంతకాలం అజ్ఞాతంగా ఉండవలసి వచ్చిందనీ, కాలం కలిసివచ్చినప్పుడు సంపదలు కలిసివస్తాయనీ, అంతవరకు ఓర్పుతో జీవించాలని ఇంద్రోపాఖ్యానాన్ని చెప్పి ధర్మరాజును ఊరడించి, ప్రోత్సహించాడు.

ఈ విధంగా కౌరవ పాండవులు బంధుమిత్రుల సహాయంతో సైన్యసమీకరణం చేసికొన్నారు. పాండవులకు ఏడక్షౌహిణులు, కౌరవులకు పదకొండు అక్షౌహిణులు చతురంగబలం సమకూరింది. రెండువైపులా స్కంధావారాలు రణోత్సాహంతో కయ్యానికి కాలుదువ్వుతున్నాయి.

## కురుసభలో ద్రుపదపురోహితుడి దూతవాక్యం

ఈ వాతావరణంలో ధృతరాష్ట్రుడు ద్రుపదపురోహితుడి రాయబారాన్ని వినటానికి నిండుసభ తీర్చాడు. పురోహితుడు కౌరవేశ్వరుడికి, భీష్మాదులకు, దుర్యోధనాదులకు, సభాసదులకు అభివాదనం చేసి ఈ విధంగా ఉపన్యసించాడు.

'ధృతరాష్ట్ర పాండురాజులు సోదరులు కావటంచేత వారి వారి పుత్రులు తండ్రుల సంపదలను పొందటం మీకందరికీ ఉచితంగా తోస్తుందని భావిస్తాను. మొదటి రోజులలో వారిద్దరూ అట్లా ఉండటం కూడా మనకు తెలుసు. పాండవులు బాహుబలంతో రాజ్య వైభవాన్ని పొంది ఉండగా వంచనతో దానిని ధార్తరాష్ట్రులు గ్రహించిన విధం కూడా మీకు తెలుసు. ఈ పెద్దరాజు దీనికి అంగీకారం తెలిపాడు. ఇక ఏమని చెప్పేది?

నారీరత్నాన్ని సభలోకి ఆ విధంగా తెచ్చి అందరూ చూస్తుండగా చీరలు కుప్పలుపడేటట్లు విప్పి, సంపదలు హరించి, మహారణ్యంలో నివాసం చేసేటట్లు చేసి, తేలికగా మాట్లాడినప్పటికీ అన్నింటినీ సహించగలిగే పాండవులు ఈ సంధి ప్రయత్నం చేయటంలోని విలువను గమనించవచ్చును.

ధార్తరాష్ట్రుల వర్తనాన్నీ, పాండవుల వర్తనాన్నీ ఎటువంటి పక్షపాతం లేని బుద్ధితో వివేచించి ధృతరాష్ట్రుడికి మీరందరూ తగిన హితవు చెప్పండి.

పాండవులు కౌరవులతో పగను కోరటం లేదు. దానివలన ప్రజాక్షయం బాగా జరుగుతుంది కాబట్టి, దీనిని మీరు తేలికతనంగా తీసికొనవద్దు. వారు ధర్మపరులు కాబట్టి ఈ విధమైన న్యాయమార్గాన్ని అనుసరిస్తున్నారు.

అందున్నవి ఏడక్షౌహిణులు, ఇందుకూడినవి పదకొండు అక్షౌహిణులు అని బలగణాంకాలను గణిస్తారేమో! రణభూమిలో బాహుబలఘనుడు భీముడు, సాహసవీరుడు సాత్యకి వేయి అక్షౌహిణుల పెట్టు. గాండీవాన్ని చేపట్టి యుద్ధానికి సిద్ధమైన బీభత్సుడి పరాక్రమం అప్రతిహతం. అతడిని ఎదుర్కొనటం కొండను పొట్టేలు ఢీకొనటమే. అంతే కాదు, వివిధోపాయ నిపుణుడు, అఖిలవిద్యాజాల సంవేది అయిన మాధవుడు పాండవుల పక్షంలో ఉన్నాడు. ఇక వారికి అసాధ్యమనేది ఏముంటుంది? కాబట్టి, సమయం మించిపోకుండా, ఆ మహాత్ములను పిలిపించి హితం, ప్రియం రెండుపక్షాలవారికి కలిగేటట్లు భావించి న్యాయంగా కొంతరాజ్యం వారి కిచ్చి కలిసి ఉండటంలోనే కలదు సుఖం'.

ఈ విధంగా పలికిన పురోహితుడి సందేశం విని భీష్ముడు లేచి ఇట్లా అన్నాడు: 'పాండవులు ఎటువంటి ఆపదలు పొందకుండా ఉండటం అయ్యో! నిజంగా ఎంత అదృష్టం! శ్రీకృష్ణుడితో కలిసి, ధర్మమార్గాన్ని అనుసరించి, ప్రశాంతచిత్తాలతో ఇటువంటి సాధుమార్గాన్ని అనుసరించటం కూడా చాలమేలే! అయితే! ఓ రాయబారీ! నీ ఉపన్యాసం విప్రస్వభావంతో వినేవారికి పరుషంగా ఉండటం చేత నీ మాటలు కార్యరూపంలో పెట్టటానికి ఇష్టపడతారా? నియమానుసారులై పాండవులు పడిన పాట్లన్నీ లోకానికి తెలుసు. పుణ్యాత్ములను వేధించటం తగదు. వారికి కూడా రాజ్యంలో పాలిచ్చి ధృతరాష్ట్రుడు వారిని కూడా తన సుతులవలె చూచుకొనటం న్యాయం. అట్లా కాకపోతే ధర్మరాజు శాంతమూర్తిగా ఉంటాడేమో కాని అర్జునుడు ఊరుకొనడు. అతడు మోహరిస్తే ఎదురునిలిచే మగవాడున్నాడా ఈ లోకంలో?'

భీష్ముడి మాటలు కర్ణుడికి కోపం తెప్పించాయి. ఆవేశంతో అతడు ఇట్లా అన్నాడు.: 'అందరికీ తెలిసిన ఈ విషయాలను పదేపదే చెప్పటం దేనికి? జూదం దుర్యోధనుడి పక్షాన శకుని ఆడాడు. ధర్మరాజు ఓడిపోయాడు. ఇందులో తప్పేమి ఉన్నది? అరణ్యానికి వెళ్ళిన ధర్మజుడు సమయం ముగియకుండానే బయటపడి తండ్రిపాలు మాకు రావటం న్యాయమని గడుసరితనంతో అడగటం తప్పు. అంతేకాక విరటుడు, ద్రుపదుడు తమతమ సైన్యాలను తనకు సాయంగా చేర్చి యుద్ధానికి స్కంధావారాలను నిలిపి, ఇప్పుడు బలవంతంగా సగంభాగం కావాలని అడిగితే కురుపతి భయపడి ఇస్తాడా? అసలు ఇట్లా అడగటం న్యాయమేనా?' - అని గద్దించాడు. భీష్ము డామాటలకు కటకట పడ్డాడు.

'కర్ణా! నీవు బలే మొనగాడివయ్యా! ఎందుకు? వినేవాళ్ళు నవ్వేటట్లు పెద్దపెద్దమాటలు మాట్లాడతావు? అవక్రపరాక్రమశాలి అయిన అర్జునుడు నిన్న ఉత్తరగోగ్రహణయుద్ధంలో ఒక్కడే మనల్నందర్నీ ఓడించి గెల్చాడు. నీవు రణరంగంలో అతడిని గెలవలేవు కాని మనరాజు కొలువులో మాటలలో మాత్రం గెలుస్తావు. అర్జునుడు ఆవులవెంట తరుముతూ వస్తుంటే దుర్యోధనుడు పాండవుల అజ్ఞాతవాసకాలం ముగిసిందా లేదా అని నన్ను అడిగినప్పుడు నీవు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ వింటూ ఉండగా సమయం ముగిసిందని నేను చెప్పలేదా?' -అని కోపగించాడు.

మాటలు ముదురుతున్న ఆ తరుణంలో ధృతరాష్ట్రుడు కల్పించుకొని భీష్ముడిని భక్తితో బ్రతిమలాడి, కర్ణుడిని కసిరి, ద్రుపద పురోహితుడితో ప్రియ ముట్టిపడేటట్లు ఇట్లా అన్నాడు. 'నేనూ, బంధువులు, మంత్రులు, పెద్దలు బాగా ఆలోచించి సమస్తప్రజలకు ప్రీతికలిగేటట్లు బిడ్డలపాలికి ఒక సౌమ్యుడిని పంపుతాను. అతడు నా అభిప్రాయం ప్రకారం వారితో కలిసి చర్చించి ఇకముందు నడువవలసిన తీరును నిర్ణయించుకొనటం కౌరవజాతి కంతా స్పష్టమైన మార్గం. కాబట్టి ముందుగా నీవు వెళ్ళు' మని సగౌరవంగా సాగనంపాడు. పురోహితుడు ధర్మరాజుకు జరిగినదంతా నివేదించాడు.

## సంజయుడి రాయబారం

ధృతరాష్ట్రుడు పుత్రవృద్ధామాత్యసహితంగా కొలువుతీర్చి సంజయుడిని పిల్చి ఇట్లా చెప్పాడు:-

'సంజయా! నీవు ఉపప్లావ్యంలో ఉన్న పాండవుల వద్దకు వెళ్ళి వాసుదేవ సహితంగా వారున్నప్పుడు కలిసి, వారి దుఃఖం ఏవిధంగా ఉపశమిస్తుందో ఆవిధంగా సముచితంగా మాట్లాడాలి. మీ తండ్రి మీరు వనవాసక్లేశాన్ని తరించి అభ్యుదయం పొందటం విని చాల సంతోషించి నన్నిక్కడకు పంపాడని ముందుగా చెప్పుము. ధర్మరాజు నిండుకొలువున్నప్పుడు

అతడిని దర్శించి అతడి తమ్ములకు, బంధువులకు సంతోషం కలిగించేటట్లు మాట్లాడుము; స్నేహాన్ని పాటించి తియ్యని మాటలతో కోపం తీరేటట్లు చేసి, ధర్మజుడు యుద్ధమని మనస్సులో తలంచకుండా ఉండేటట్లు శాంతవచనాలు పలుకుము; కలిసి ఉండేటట్లు యత్నించుము'- అని చెప్పి రథ మెక్కించి పంపాడు. సంజయుడు ఉపప్లావ్యం చేరి ముందుగా నరనారాయణులను దర్శించి తగురీతిగా మాట్లాడి, మరునాడు ధర్మరాజును నిండుకొలువులో కలిసికొన్నాడు. ధర్మజుడితో సంజయు డిట్లా మాట్లాడటం మొదలుపెట్టాడు:

'ధర్మజా! పుణ్యాత్ముడవైన నిన్ను చూచి నేను ధన్యుడనైనాను. మీతండ్రి ధృతరాష్ట్రుడు మీ రిక్కడున్నా రని విని అత్యంతస్నేహపూర్ణమైన హృదయంతో మీ అందరి యోగక్షేమాలు తెలిసికొనటానికి నన్ను పంపాడు' - ఆ మాటలకు ధర్మరా జిట్లా అన్నాడు:

'ఆ రాజుకు మాపట్ల ఉన్న దయ కారణంగా ఇట్లా సుఖంగా ఉన్నాం. నిన్ను పంపించిన మర్యాదకు నా మనస్సెంతో వికసించింది. ఆ మహారాజు పుత్రపౌత్రాదులతో క్షేమమే కదా! దేశంలో అరిష్టాలు లేకుండా శుభపరంపర కలుగుతున్నదా? ద్రోణకృపాశ్వత్థామలు కుశలమేనా? భీష్ముడు క్షేమమా? కౌరవు లాయనకు పెద్దతన మిచ్చి గౌరవిస్తారా? బ్రాహ్మణులకు నేను దానం చేసిన వృత్తులు నేటికీ చెల్లుతున్నాయా? ఎవరైనా దండెత్తి వచ్చినపుడు మా గాండీవిని, భీమసేనుడిని స్మరిస్తున్నారా? మొన్న ఘోషయాత్రలో గంధర్వుల ఉదంతాన్ని అప్పుడప్పుడు మనసులలో నెమరువేసికొంటున్నారా? పక్షపాతం లేకుండా ఆలోచిస్తే అక్కడి వీరులలో అర్జునుడి చేత మానాన్ని, ప్రాణాన్ని దక్కించుకొనని వారెవరున్నారు? సంజయా! ఆ దుర్యోధనుడి మందిరంలో కార్యానికీ, ఖడ్గానికీ నేనే తగుదునంటూ చాతుర్యాన్ని ప్రదర్శించే కర్ణుడి ఆర్యత్వం ఇంకా చెల్లుతూనే ఉన్నదా?' అన్నాడు. ధర్మజుడి మాటలలో అధిక్షేపం తొంగి చూచింది. సంజయుడు సవినయంగా ఇట్లా అన్నాడు:

'కురురాజు కొలువులో అవినీతులూ ఉన్నారు, నీతిమంతులూ ఉన్నారు. దురహంకారులూ ఉన్నారు. సత్త్వ సంపన్నులూ ఉన్నారు. వారిలో ఒకడు చెప్పిన మాట మరొకడు వినడు. వారి మాటకేం గాని, నా విన్నపాన్ని ముందు మన్నించుము. ధర్మజా! వెన్నెల వంటి తెల్లని చల్లని మనస్సుతో స్నేహం చేయాలని భావిస్తున్నావు నీవు. అదే అందరికీ క్షేమం. ఇంతవరకూ అది లేకపోయినా ఇకముందు తప్పకుండా ఉంటుందని మా ఆశ! ధృతరాష్ట్ర మహారాజుకు వార్ధక్యంచేత మనస్సు ఒక విధంగా ఉండదు. అందువలన కొడుకు గర్వాన్ని నాడు మాన్పలేక మనస్తాపం పొంది ఇప్పుడు శాంతుడైనాడు. వారి చేష్టలనన్నింటిని పుణ్యాత్ముడవైన నీవు సహించి అజాతశత్రువనే కీర్తిని పొందగలిగావు. పాప నాశకమైన సత్పురుష జీవన పద్ధతి గైకొన్నవారు హింసాపరులౌతారా? పాండుకుమారులు దుర్వారబలాఢ్యులైనప్పటికీ శాంతస్వభావులు కావటంచేత ఆగ్రహాన్ని ప్రకటించి అధర్మాన్ని ఆచరించరని లోకులందరూ మిమ్మల్ని గురించి భావిస్తున్నారు. నరవరా! మీ తమ్ములూ, వాసుదేవుడూ, ఆప్తులూ, బంధువులూ కూడి ఉన్నప్పుడు మీతో మీ తండ్రి చెప్పుమన్న మాటలు నీకు వినిపిస్తాను' - అన్నాడు సంజయుడు. ధర్మజుడు సంజయుడి మాటలలోని నాన్పుడు స్వభావానికి విసిగి అధిక్షేపాత్మకంగా అతడికి తమ్ములను, గోవిందుడిని చూపించి రాజేమని చెప్పుమన్నాడో త్వరగా నివేదించుమన్నాడు.

సంజయుడు కృష్ణుడికీ, భీమాదులకూ, పాంచాల మత్స్య భూపాలురకూ పేరుపేరున నమస్కరించి, ధర్మజుడి ముందు చేతులు ముడుచుకొని వినయంగా ఇట్లా మాట్లాడ నారంభించాడు -

'ధృతరాష్ట్ర భూపాలుడు ప్రశాంత చిత్తంతో నన్నిక్కడకు పంపేటప్పుడు నారథం దగ్గరికి తానే స్వయంగా వచ్చి ఎంతో ఆప్యాయంగా ఈ మాటలు చెప్పాడు. మీరు సావధానంగా వినండి. మీ వంటి ధర్మజ్ఞులు, శాంతులు, అయిన ప్రసిద్ధులు చులకనైన పనులు చేయటం ఏ విధంగానూ న్యాయమౌతుందా? ధర్మరాజా! మడుగు చీరలో మసి చేరినట్లు దుర్యోధనుడి వలన కురుకులం కల్మషమైపోయింది. అయితే, ఆ కల్మషాన్ని పాపగల సమర్థుడవు నీవే! ఓ దయామయా! యుద్ధం జరిగితే జయాపజయాలు ఏ వైపు కలిగినా అవి సుఖాన్ని కలిగించవు. రణరంగంలో బాలురను, వృద్ధులను, బంధువులను, గురువులను చంపిన తరువాత ఆ సుఖాలు మాత్రం దేనికి? నీకు హరి పెట్టని కోట; భీమార్జున సాత్యకి విరాటాదులు మహావీరులు. వీరందరూ యుద్ధ భూమిలో నిలిస్తే దేవతలే ఎదుర్కొనటానికి భయపడతారు. అయితే, ఆ వైపూ తక్కువవారు లేరు. ద్రోణ భీష్మ కృపాశ్వత్థామ కర్ణశల్యాదులు ఒక్కొక్కరు అజేయులు. వారందరు కలిసి వస్తే

పరమేశ్వరుడైనా జయించటం కష్టం. ఇటువంటి మీ ఉభయ పక్షాలకు అన్యోన్య కలహం మేలుకాదు. ఈ సభలో ఉన్న వాసుదేవాదుల కందరికీ చేతులెత్తి మ్రొక్కుతున్నాను. మీరందరూ అసూయ మాని, కరుణామయుడైన ధర్మరాజును క్రోధశాంతి పొందుమని కోరండి. యుద్ధాన్నుండి ఉపశమిస్తే భీష్మాదులు కూడా సంతోషిస్తారు. సర్వలోకం సమ్మతిస్తుంది.' అని ధర్మజుడి ఎదుట వినమ్రుడై నిలువబడ్డాడు. అపుడు ధర్మజు డిట్లా అన్నాడు -

'సంజయా! నా మాటలలో స్నేహమనేది ఒక్కటే నీ చెవులకు వినిపించింది. కయ్యము లేకుండా ఉండండని మమ్మల్ని నీవు కోరుతున్నావు. బాగానే ఉన్నది. కయ్యం లేకుండానే దానివలన కలిగే అర్థసిద్ధి చేకూరితే ఇక వేరే కయ్యం చేయవలసిన పనేముంటుంది? ధృతరాష్ట్ర మహారాజు ద్యూత సభలో తాను నీతి మార్గానికి నీళ్ళువదిలి వక్రంగా వ్యవహరించాడు. ఇప్పుడు మాకు మాత్రం ఋజుమార్గంలో నడవండని నీతులు చెపుతున్నాడు. తమవలెనే ఎదుటివారిని గూడా భావించాలి. అట్లాకాక - 'మాకు కుడుమిచ్చి మీరు ప్రక్క తీసుకోండి' అన్న సామెతగా వ్యవహరిస్తే పొందు కుదురుతుందా?

మేము సంపద లేనివారమై ఉంటే అశక్తులమని లెక్కకట్టి మమ్మల్ని పిలిచి, గౌరవించి, రాజ్య మిచ్చేంత వెర్రివాడా మహారాజు? అతడి సలహాదారుల బుద్ధిని, కొడుకు కోరికను మన్నిస్తాడు కాని, ధర్మాన్ని పరిగణిస్తాడా? ఎందుకు మీకీ వృథా ప్రయాసలు? మానండి. ఆయన చరిత్రం నీకూ మాకూ ఈ నాటి వింతయా? ఎన్నడైనా తగిన మాటలు చెప్పి కొడుకును మాన్పగలిగాడా? పై పెచ్చు విషం త్రాగినా అతడే వీరుడని నమ్ముతాడు. ఆనాడు జూదపు సిరి వద్దని పెద్ద లనలేదా? దానిని ఆయన పెడచెవిని పెట్టలేదా? ఇక ముందు కూడా ధృతరాష్ట్రుడు దుర్యోధన శకుని కర్ణాదులు తన నే వైపు నడిపిస్తారో ఆ మార్గాన్నే అనుసరిస్తాడు. ఆయన పద్ధతి మార్చుకొంటాడా?

నీవు ఉత్తముల పద్ధతిని గురించి ఉపన్యసించావు. నీకు ఆ దుర్యోధనుడి అవినయం అనివార్యమని తెలియదా? లేక తెలిసిన అజ్ఞానమా? అతడికి శ్రీకృష్ణుడంటే లెక్కలేదు. అర్జునునికి ఎదురుగా కర్ణుడున్నాడని నమ్మి అహంకరిస్తాడు. ద్రోణ భీష్మ కృపాశ్వత్థామ కర్ణ దుర్యోధనాదులు యుద్ధా లెట్లా ఆశాపాశాలో పూర్వం గ్రహించలేదా? బంధువుల పరాక్రమాలు తెలిసి కూడా చావును వరించి యుద్ధాన్ని కోరుతున్నారు. ఇక కపిధ్వజ కాంతులు వారిని అంధీభూతులను చేయక తప్పదు.

నీవు ముందుగా మమ్మల్ని పొగిడావు. ఆ తరువాత కౌరవులను గెలవటం అసాధ్యమన్నావు. నే నీ మాటకు అంగీకరించను. నీవు పక్షపాతం లేకుండా మాట్లాడి ఉండవలసింది. అది అట్లా ఉండనీ. అవమానాలు పొంది కూడా మేము ఓర్పును ప్రదర్శించాం. నీకూ ఈ వివరాలన్నీ తెలుసు. వాటి నన్నింటినీ మా తండ్రి తలంచి మా కెటువంటి కీడు రాకుండా, మేము మరొకవైపు పోకుండా, లోకం మెచ్చేటట్లు మమ్మల్ని తనవద్దకు పిలిపించుకొని, రాజ్యంలో భాగం మాకిమ్మని కొడుకుల కాజ్ఞాపించి, ఇంద్రప్రస్థాన్నో మరొక నగరాన్నో మాకు రాజధానిగా చేసి ఏలుకొమ్మనటం సముచితం కాదా!' అని కొంత రోషాతిశయంతో అన్నాడు ధర్మరాజు. సంజయుడు మరలా ఇట్లా సంభాషణ సాగించాడు.

'ధర్మజా! ఎదుటివారు ఎన్ని తప్పులు చేసినా వాటిని ప్రక్కకు త్రోచి ఓర్పును ప్రదర్శిస్తావు కాబట్టి, నీ విన్ని మాటలు అన్నా తనివి తీరక నీకు నేను ఇంకా మనవి చేస్తాను. నిజంగా నీ గొప్పతనమంతా నీ అహింసా ప్రవృత్తిలో, నీ మచ్చ లేని చరిత్రంలో ఉన్నది. ఒకవేళ కౌరవులు దుర్మార్గులై రాజ్య భాగం ఇవ్వకుండా మీకు అన్యాయం చేశారే అనుకొందాం. మీ నడవడికి రక్తపు కూడు కంటే భిక్షాన్నమే సముచితం. అది ఎట్లాగంటావా? రాజసూయాధ్వరం చేసి దేవతలను మెప్పించి శాంతి దాంతులతో సకల లోకాలు కీర్తించగా బ్రతికిన పుణ్యమూర్తివి నీవు. అట్టి నీ పవిత్ర చరిత్రం హింసా కళంకితం కావటం ఉచితం కాదు. అంతే కాదు. అలనాడు అవినయంతో మాయాద్యూతం కల్పించి అంతటి అవమానం చేసిన వారిని వారి గర్వం చెల్లేటట్లు చేసి లోకుల చేత వారు తిట్లు పడేటట్లు ఎందుకు చేశావు? ఓర్పే సంపదగా ఇంతవరకు అడవులలో ఇడుమల నెందుకు అనుభవించావు? ఇంత ఉత్తమ పథంలో సాగి, ఇప్పుడు క్రూర పద్ధతిలో ప్రవేశించి బంధువులను, గురువులను వెదకి వెదకి వధించటం సౌఖ్యమా? అది ఆర్యనింద్యం; అస్థిరం.

హాలాహలం వంటి కోపాన్ని మ్రింగుకొనటంలో ముందుగా శివుడిని చెప్పి తరువాత నిన్ను పేర్కొనాలి. అటువంటి వాడవు ఆ గుణాన్ని పాటించి అనంత కీర్తిని గడించాలి' అని ప్రబోధించాడు.

దానికి సమాధానంగా ధర్మరా జిట్లా అన్నాడు -

'సంజయా! నీవు పలికింది యథార్థమే. లోకంలో కొన్ని చర్యలు పైకి చూస్తే ధర్మాలవలె అనిపించినా చివరకు అధర్మాలై చెడిపోతాయి. కొన్ని అధర్మాలుగా గోచరిస్తూనే చివరకు ధర్మాలై రూపొందుతాయి. కాబట్టి నన్ను నిందించ దలచుకొన్నట్లయితే నేను చేస్తున్నది ధర్మమనో అధర్మమనో నిరూపించి మరీ దూషించుము. కోపాన్ని పోగొట్టుకొనాలి. అహింసయే ఉత్తమ ధర్మం - ఇవి ధర్మాలే కదా! వంశానికి కళంకం తెచ్చేవారు, లోక కంటకులు అయిన పాపాత్ములను నిర్మూలించటం కూడా ధర్మమని పెద్దలు చెప్పారు. అది అట్లా ఉండనీ. రాజులకు యుద్ధం చేయటం ధర్మమా? అధర్మమా? నీవే చెప్పుము.

మనందరికీ ఇది కర్తవ్యం, ఇది అకర్తవ్యం అని శాసించటానికి వాసుదేవు డున్నాడు. మన కీ వితర్కం దేనికి? ఇతడు ధర్మాధర్మవిదులకు గురుడు, కార్యాకార్య నిరూపకులకు శిక్షకుడు, ఉచితానుచితజ్ఞులకు ప్రదర్శకుడు, యదుభోజ అంధక వృష్ణి సంజయ కేకయ ప్రభృతులైన ప్రభువులందరూ ఆయన ఆజ్ఞ చొప్పున ధర్మమార్గంలో నడుస్తున్నారు. విశేషించి గోవిందుడి బోధయే సమస్త పురుషార్థాలకూ మూలం కావటం చేత అతడి మాట అవశ్యం అలంఘనీయం' - అని ధర్మరాజు పలుకగా శ్రీకృష్ణుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

'నే నెప్పుడూ పాండవుల మేలు కోరేవాడిని. ధృతరాష్ట్రుడు కూడా పుత్ర పౌత్రవంతుడు. అతడికి కూడా కీడెందుకు కలగాలని మనసులో అనుకొంటూ ఉంటాను. ఆ రాజు తెలివితో నిన్నిక్కడికి పంపి నిండుమనసుతో వీరి యోగ క్షేమాలు తెలిసికొనటం నాకెంతో సంతోషంగా ఉన్నది. నీవు సముచితంగా వచ్చి స్నేహం, ధర్మం వినయం తేట పడేటట్లు మాట్లాడటం కూడా నాకు సమ్మదాన్ని కలిగించింది. ఇట్లా అన్నీ కలిసికట్టుగా ఏర్పడినా ధర్మరాజు మాటలు చూడగా సంధి జరిగే పద్ధతి కనపడటంలేదు. అది అంతే.... దుర్యోధనుడు మత్తుడు. చివరకు అందరూ కలిసిఉండటం అనే మాట ఎట్లా కలుగుతుంది? ధృతరాష్ట్రుడి మనసు మనకందరికీ తెలుసు కదా! ఆ రాజు నెరపే స్నేహాన్నీ, ఒలక బోసే వాత్సల్యాన్నీ, నీ వెన్నో తియ్యతియ్యని మాటలలో చెప్పావు. బాగుంది. కాని, పాండవులు తమకు రావలసిన రాజ్యభాగం పొందకుండా వట్టి వట్టి నేర్పు మాటలతో సరిపుచ్చుకొంటారా?

పాండవులు పెద్దగా పట్టించుకొనకుండా శాంతులై కౌరవులతో కలిసి ఉండటానికి కోరుకొంటే మంచిదే. ఓర్పు దయ ప్రకటించటం న్యాయమే. అయితే, తమకు న్యాయంగా రావలసిన రాజ్య భాగం తండ్రి పంచి ఇవ్వలేదని తెంపు చేసి యుద్ధాన్ని వీరు ప్రకటించినా అది ద్రోహమౌతుందా? ఈవిధంగా అవమానాలు పడుతూ తలవంచి బ్రతికిన దానికంటే, ఉజ్జ్వలులై ఎదుర్కొనటమే మేలు. నాకు చూడ పాండవులకు యుద్ధమే శరణ్యంవలె కనబడుతున్నది. క్షత్రియులకు యుద్ధం ధర్మం. రాజులు ఇచ్చేవారే కాని వేడుకొనేవారు కారు. న్యాయార్జిత విత్తంతో జీవిస్తున్నప్పుడు అన్యాయంగా వారి ధనాన్ని ఎవరైనా అపహరిస్తే అప్పుడు శస్త్రాస్త్ర ధర్మాలను ఇంద్రాదులు చెప్పారు.

కౌరవులు క్రిందుమీదు లెరుగకుండా అధర్మమార్గాన నడిచేవారు. నీ విక్కడ చెపుతున్న ధర్మాలను కౌరవులకు కూడా చెప్పవద్దా? లోకంలో జూదా లాడలేదా? కౌరవులు తులువలు కాకపోతే ద్రౌపదిని నిండుసభలో పలువురు చూస్తూ ఉండగా పగపట్టి అంతగా అవమానిస్తారా? అప్పుడు భీష్మాదులైన పెద్దలందరూ నోరెత్తకుండా ఊరకున్నారు. అప్పుడు ధృతరాష్ట్రుడు నోరెత్తి తన కొడుకులను కోపగించి ఆ దుష్కృత్యాన్ని మాన్పినట్లైతే నా మనసే కాదు లోకులందరి మనసులూ సంతోషించి ఉండేవి. నిందిస్తూ నిండు కొలువులోకి జుట్టు పట్టుకొని దుశ్శాసనుడు ద్రౌపదిని లాక్కొని వచ్చి నిర్దయతో అవమానిస్తుంటే మామ ఆ సతి యేడ్పుకు ఎట్లా ఓర్చుకొన్నాడు? ఆ సన్నివేశాన్ని ఎట్లా సహించాడు? అంతగా సహించిన ఆ రాజు ఈ నాడు ఇంతగా వీరిని ప్రేమిస్తూ యోగక్షేమాలు తెలిసికొనటానికి నిన్ను ఇంతగా పంపాడు. ఇది ఎట్లా సాధ్యపడింది?

అలనాడు నిండు సభలో 'ఇది కూడదు' అని అడ్డుపడే వాడు లేక అందరూ ఊరుకుంటే ద్రౌపది తనను తాను రక్షించుకొనే అదను ఏర్పడింది కాబట్టి సభలో అవమానం తప్పింది. పాండవులు బ్రతికి పోయారు. లేకపోతే ఆ కీడు రాజకుమారులు సహించదగిందేనా? సంజయా! అప్పుడు కర్ణశూలాలుగా కర్ణుడన్నమాటలు నీవు వినలేదా!

'లే రిచట మగలు నీకును । వీరలు జూదమున వోడి విడిచిరి నిన్నున్;
వారిజలోచన! నీపైఁ । గూరిమి గల మగని వెదకి కొను మొరు ననఁడే?' **(ఉద్యో. 1.250)**

ఈ మాటలు నరుడి హృదయంలో ములుకులవలె గుచ్చుకొంటూ దుర్భర వేదనను కలిగిస్తున్నాయి. ఎప్పుడన్నా ఆ రాజు దీనికి చికిత్స చేయటానికి యత్నించాడా? ఆ దుశ్శాసనుడు పాండవులను గొడ్డువోయిన వారనీ, పౌరుషం లేనివారనీ అనరాని, వినరాని మాటలెన్నో అని కించపరిచాడు. వాటి కేవైనా పలికాడా ఆ రాజు? కాబట్టి ఈసంధి కార్యం సంఘటించటం అసంభవమని నేను భావిస్తున్నాను. అయినా -

పాండవులను ప్రార్థించి, హస్తినాపురానికి నేను వచ్చి, కౌరవులకు బుద్ధిగా చెప్పి, రాజ్యభాగాన్ని ఇప్పిస్తే, వారు మృత్యుపాశాలనుండి తప్పించుకొంటారు. అన్యాయం కాని నామాటలు వారు మన్నించారా సరి, లేక లెక్కలేకుండా వెక్కిరించారా వారు పాండవ బాణాగ్నితో కాదు, స్వీయలోభాగ్నిలోనే పడి మగ్గిపోతారు. నా తలపులో ఇరు పక్షాలవారి కలరూపు ఇటువంటిది -

'రోషమయ మహాతరువు సుయోధనుఁ, డురు । స్కంధ మందులోనఁ గర్ణుఁ డలరుఁ,
గొమ్మ సౌబలుండు, గుసుమ ఫలములు దు । శ్శాసనుండు, మూల శక్తి తండ్రి'.

'ధర్మజుండు ధర్మతరు; వర్జునుఁడు ఘన । స్కంధ, మనిల సుతుఁడు శాఖ, కవలు
పుష్పఫలము, లేను భూసురులును వేద । ములుఁ దదీయమైన మూల చయము.' **(ఉద్యో.1.355,356)**

ఈ రెండింటిలో సారవంతమైన దేదీ? కాని దేదీ? అని మనం విచారించాలి. అయినా వీరిద్దరి మధ్య అసూయ అనవసరం. వీరిరువురూ కలిసి ఉండటం ఉచితం. ఎట్లాగంటే - ధృతరాష్ట్రుడూ, అతడి పుత్రులూ అరణ్యం వంటివారు. అందులో పాండవులు సింహాల లాంటివారు. సింహాలు లేని వనాన్ని జనం నిర్భయంగా నరుకుతారు. వనగర్భంలో ఉండని సింహాలకు వేగంగా చేటు చేకూరుతుంది. కాబట్టి వీరిద్దరూ ఎల్లప్పుడూ కలిసి ఉండటం సమంజసం. ధృతరాష్ట్రుడు పాండవులను దరికి చేర్చి తన కొడుకులవలె చూచుకొంటే వారు శత్రుమర్దనానికి పనికి వస్తారు. తన సేవలకూ ఉపకరిస్తారు. నేను ఈ పని మీద హస్తినాపురానికి వస్తాను. ఆ రాజు నాయత్నానికి ఒప్పుకొన్నా సరే లేదా ఒప్పుకోకపోయినా సరే. దానిని బట్టి మేము వ్యవహరిస్తాం.'

కృష్ణుడి మాటలు వినిన సంజయుడు తాను వచ్చిన పని అయినదని తెలిసికొని ధర్మజాదుల వద్ద అనుమతి వేడుకొన్నాడు వెళ్ళటానికి. తాను మాట్లాడిన మాటలలో దగనివి ఏమీ లేవుకదా? అని ప్రశ్నించాడు. అందుకు ధర్మజు డిట్లా అన్నాడు - 'నీవిక పోయి రావచ్చును. ఇందరు వింటుండగా ఇంత వివరంగా నీవు మాట్లాడావు. నీ మాటలలో ఉచితములు కానివి ఉన్నాయా? అట్లా అని ఎవరంటారు? ఎదుటివారి స్థితిగతులను చెప్పటంలో నీవు ఎటువంటి ఇబ్బందులూ పడవు. అవినయాన్ని, కాఠిన్యాన్ని నీపలుకెప్పుడూ పొందదు. ఇటువంటి పనులు నిర్వహించటానికి నీవుగాని విదురుడు గాని తగినవారు' అని పేర్కొని కరిపురంలో ఉన్న పెద్దలకు, పిన్నలకు, రాజలోకానికి, పరివారానికి అనువైన సంభావనలను అందించాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుడు నిండు కొలువుండగా కొన్ని మాటలు చెప్పమన్నాడు.

'ఓ పుణ్యాత్ముడా! నీ బలంచేతనే పాండవులు ఆపదలేమీ లేకుండా ఆప్త బంధువులతో కలిసి సుఖంగా ఉన్నారు. వారిని వారి తండ్రిగారి రాజ్య పీఠంమీద నిల్పి, ప్రభుత్వ మిచ్చి బాల్యంలో పోషించావు. ఇప్పుడే మాత్రం దయలేకుండా వారికి అహితం కావాలని కోరటం న్యాయమా? దానితో సంతోషించవద్దు. అంతకంతకు రాజ్యాశ పెరిగితే నిలువరించటం కష్టమౌతుంది. కాబట్టి శత్రువులందరు బెదరి చూడగా కలిసి ఉండటం మంచిది.'

మా తాత భీష్మాచార్యులతో ఇట్లా పలకండి -

'శంతనుడి వంశం అంతరించిపోకుండా నీవే నిలిపావు. అట్లాగే నీ అభిప్రాయాన్ని అనుసరించి నీ మనుమల కందరికీ పొందు కుదిర్చి, అధర్మ వృత్తికీ, చావుకూ వారిని దూరం చేయగలిగితే పండితులందరూ మెచ్చుకొంటారు.'

ఆ సమయంలో అచ్చటివారందరూ వినేటట్లు దుర్యోధనుడితో ఈ విధంగా చెప్పుము- 'బాహుబలాఢ్యులను బలహీనులవలె బయటకు పంపిన వెర్రితనం, చాలకాలం అడవులలో కొండలలో బాధలు పెట్టిన పరుసదనం, సభలో పాంచాలిని ఆ విధంగా తలపట్టి ఈడ్చిన తులువతనం- వీటి నన్నింటినీ ధర్మరాజు సహించాడు. నిజం. కురుకుమారులను రణరంగానికి బలిపెట్టబోకుము. ఇతరుల సొమ్ముకు ఆశపడబోకుము. వారి పాలు వారికిచ్చి కలిసి బ్రతకటం మంచిదనుము. మేము కలహాన్ని కోరకుండా పొందుకోరటం తనకే మేలవుతుంది. తన మనస్సులో ప్రజ్వలించే ఆశాజ్వాలను ఆర్పటానికి ఎవరూ ప్రయత్నం చేయరు. కాబట్టి నేను బుద్ధి చెప్పవలసి వచ్చింది. తన వద్ద ఉన్నంతమంది మహావీరులు మరెక్కడా లేనిమాట నిజం. మావైపు ధర్మం ఉన్నది. అఖిలలోక సేవితుడైన కృష్ణుడు మాకు రక్షగా ఉన్నాడు. కాబట్టి మమ్మల్ని గెలవటం తనకు సాధ్యం కాదు.

అది అట్లా ఉండనీ, నేను భీమసేనాదులకూ, తమకూ పెద్దవాడను కావటం చేత వీరూ, మీరూ నా ప్రార్థనను భంగం చేయకుండా శాంతి దాంతులను వహించి నన్ను అలజడి పెట్టకుండా యుద్ధం మాని ఎవరి సంపదలు వారు తీసికొని సుఖంగా ఉండటం మంచిది. అది పెద్దలకూ బుద్ధిమంతులకూ సంతోషం కలిగిస్తుంది. మాకు పెద్దగా రాజ్యభాగం ఇవ్వటానికి ఇష్టం లేకపోయినా కుశస్థలం, వృక్షస్థలం, వాసంతి, వారణావతం చాలు; కాదా ఎక్కడైనా పాండవులైదుగురు కలిసి ఉండటానికి వీలైన తావులు ఇస్తే చాలు; సర్వ శాంతి సమకూరుతుంది. బంధుమిత్ర పుత్ర గురు జనాదులతో అందరూ బ్రతికి సుఖంగా జీవించవచ్చును. ఇది నా అభిమతంగా ఆ మహాపురుషుడికి తెలియ జెప్పు' మని ధర్మజుడు విశదపరిచాడు.

సంజయు డందరికీ నమస్కరించి బయలుదేరాడు. అర్జునుడు అతడితో ఇట్లా అన్నాడు -

'సంజయా! నీవు మాకు బాలసఖుడవు. మాబాల్యం నుండి కౌరవ పాండవుల తీరు నీకు తెలియనిది కాదు. మా భీమసేనుడనే మత్తగజాన్ని నాడూ, నేడూ ధర్మజుడి దయాతిశయమనే అంకుశం నిలువరిస్తూ వస్తున్నది. లేకపోతే వారి ఆట ఎప్పుడో కట్టి ఉండేది. ఈ నయ విక్రమ విచార క్లేశాలు వారి కెందుకు?' అని సాధిక్షేపంగా పలికి సవ్యసాచి సగౌరవంగా సంజయుడిని హస్తినాపురానికి సాగనంపాడు.

## సంజయుడి నివేదిక

సంజయుడు సంజవేళకు రాజధాని చేరాడు. అంతఃపురంలో ఉన్న ధృతరాష్ట్రుడికి తన రాక ఎరిగించాడు. సూత్రప్రాయంగా తన సంధియత్నాన్ని వినిపించాడు -

'అనయము పుట్టె జూదమున; యప్పుడ యెంతయు చిచ్చు వెట్టె కా
ల్చినయది నీ యుపేక్షయ; వశీకృత చిత్తుఁడు ధర్మసూతి మె
త్తని పులి; యెల్లవారలు నధర్మము నీ పయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం; బిదప నీకును నాకు మరల్పవచ్చునే?' **(ఉద్యో. 2.14)**

వివరంగా మరునాడు నిండుకొలువులో వినిపిస్తానని సంజయుడు తన నివాసానికి పోయాడు. సంజయుడి మాటలు ధృతరాష్ట్రుడిలో అలజడి రేపాయి. రాత్రి నిద్ర పట్టలేదు. విదురుడిని పిలిపించుకొని మనశ్శాంతికొరకు రాత్రంతా నీతులు చెప్పించుకొన్నాడు. 'ధర్మరాజును వదలిపెట్టబోకుము; దృఢమతితో కొడుకులకు, మంత్రులకు నచ్చచెప్పి పొందు కుదిరేటట్లు

సాధించుము. దానివలన ధర్మం, కీర్తి, లాభం కలుగుతాయి' - అని విదురుడు బోధించాడు. ధృతరాష్ట్ర డతడి మాటలకు అంగీకారాన్ని తెలిపాడు. అంతటితో మనశ్శాంతి కుదరక విదురుడి సంకల్పంతో సనత్సుజాతుడిని పిలిపించుకొని అతడివలన అధ్యాత్మ తత్త్వాలను శ్రవణం చేశాడు. అంతలో తెల్లవారింది.

ధృతరాష్ట్రుడు కొలువు తీర్చాడు. సంజయుడు తన రాయబారపు వృత్తాంతాన్ని పూసగ్రుచ్చినట్టు చెప్పటం ప్రారంభించాడు. ధృతరాష్ట్రుడు వివిధాంశాలను గ్రుచ్చిగ్రుచ్చి అడిగి వివరాలు తెలిసికొన్నాడు. అతడు వాసుదేవుడి అభిప్రాయాన్ని గురించి సంజయుడిని మొదట ప్రశ్నించాడు. శ్రీకృష్ణుడు సత్యభామా ద్రౌపదులు అర్జునుడు కలిసి ఏకాంత మందిరంలో ఉండగా సంజయుడిని లోనికి పిలిపించుకొన్నాడు. దానివలన వారికి ధృతరాష్ట్రుడి మీద ఉన్న అనురాగం వ్యక్తమౌతుందని చెప్పాడు. నరుడి తొడలపై పాదాలుంచి నారాయణుడు శయనించి ఉన్నాడనీ, సంజయుడిని చూచి ఇరువురూ వినయంతో పలకరించారనీ చెప్పాడు. వారిరువురు కలిసి ధర్మజుడి ఆజ్ఞలు పాటిస్తారట! వారిని కాదని ఎదుర్కొనటం యముడి శిరస్సు త్రెంచటమే కదా అని హెచ్చరించాడు.

అలుగుటయే ఎఱుగని అజాతశత్రుడు అలిగాడంటే నీళ్ళలో అగ్ని పుట్టిందన్నమాటే! ఆ అగ్ని ఆర్పే పద్ధతి లేదు. కాబట్టి నేర్పుతో మీరు పనులు సాగించుకొనాలని గోవిందుడు ధృతరాష్ట్రుడిని ప్రబోధించినట్లు సంజయుడు తెలియపరిచాడు. 'గాండీవి రథానికి సారథినై అశ్వాలను తోలుకొని వస్తున్నప్పుడు కపిధ్వజచ్ఛటలు చూచి మీరు మూర్ఛపోతారు; కిరీటి బాణాలు చవిచూచి విచ్చిపోతారు' అని కృష్ణుడు హెచ్చరించాడు. అప్పుడు భీష్మ ద్రోణుల ప్రాపును కర్ణుడి గర్వాన్ని నమ్ముకొని ఉన్న దుర్యోధనుడి దురదృష్టాన్ని స్మరిస్తూ నిశ్చేష్టుడ నయ్యానని సంజయుడు చెప్పాడు.

ఆ తరువాత ధృతరాష్ట్రుడు అర్జునుడి సందేశాన్ని వినిపించుమని అడిగాడు. సవ్యసాచి పాండవ వాసుదేవ పరాక్రమాలను పేరు పేరున వర్ణించి చెప్పిన విధానాన్ని వివరించాడు సంజయుడు. ఆ మాటలు విని భీష్ముడు దుర్యోధనుడితో ఇట్లా హితవు చెప్పాడు -

'పార్థ వాసుదేవులు కలిసి ఏ వైపుండి యుద్ధానికి వస్తారో ఆ వైపు హరుడు కూడా కన్నెత్తి చూడలేడు. నీవు నే నెన్ని హితవులు చెప్పినా వినవు. బహుశః కౌరవులకు చేటుకాలం దాపురించినట్లుంది. ఈనాడు నా హితవు వినకపోతే రేపు యుద్ధంలో వారు పడిరి వీరు పడిరి అనే మరణవార్తలే వినవలసిన కాలం రావచ్చును. నీకు శకుని కర్ణ దుశ్శాసనుల మాటలే చెవి కెక్కుతాయి. అవే నీకు ఎగ్గును కలిగిస్తాయి.' - అన్న మాటలు విని కర్ణుడు భీష్ముడిపై మండిపడ్డాడు. అప్పుడు ఉత్తర గోగ్రహణ సమయంలో కర్ణుడు అర్జునుడి చేత పొందిన పరాభవాన్ని భీష్ముడు జ్ఞాపకం చేశాడు. అర్జునుడి వంటి విలుకాడిని నేను భూతలంమీద చూడలేదని ప్రశంసించాడు.

భీష్ముడి మాటలు లెక్కచేయకుండానే ధృతరాష్ట్రుడు సంజయుడి వైపు తిరిగి ధర్మజుడి అభిప్రాయాన్ని గురించి అడిగాడు. ఒక్కమాటలో చెప్పాలంటే -

'వినుము నరేంద్ర! పాండు పృథివీపతి యగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు; మీరు తమ యయ్య సగంబును భూమి యీక త
క్కిన మఱి కాని ముంద రొక కీడుఁ దలంపఁడు; మీ బలంబు నె
ల్లను మదిఁ జీరికిం గొనఁడు లావున నేలఁ గొనం దలంచినన్.' **(ఉద్యో. 2.170)**

ధర్మరాజు భీమాదుల పరాక్రమాలను తెలిపిన పద్ధతిని కూడా సంజయుడు స్పష్టపరిచాడు. ధృతరాష్ట్రుడు భీమసేనాదుల బలాలను విని భయకంపితుడయ్యాడు. అతడి భయాన్ని తొలగించటానికి దుర్యోధనుడు తన వైపున్న వారి బలపరాక్రమాలను ప్రస్తుతించాడు. సంజయుడు పాండవ దివ్య శక్తులను వివరించాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు- 'కౌరవ వీరులు అసాధ్యులు కదా! వీరిని ఎట్లా సాధించగలమని పాండవులు భావిస్తున్నారో తెల్పు'మని అడిగాడు. సంజయుడు ఇట్లా బదులు చెప్పాడు -

'భీష్ముడు శిఖండి పాలపడతాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి పాలపడతాడు. రారాజూ అతని తమ్ములూ భీముడి పాలబడి ప్రాణాలు వదులుతారు; కుమారులందరు అభిమన్యుడి పాలు; శకుని, సైంధవుడు, అశ్వత్థామ, కర్ణుడు; మిగిలిన మహావీరులు సవ్యసాచి పాలు; కృతవర్మ సాత్యకి పాలు; శకుని ఉలూకాదులు నకుల సహదేవుల పాలు; శల్యుడు ధర్మరాజు పాలు - అని పాండవ పక్షంలో కృతనిశ్చయులై ఉన్నారని సంజయుడు స్పష్టం చేశాడు. 'ధర్మజుడు రాజై హరి జయంవైపు నడిపించగా సాగే పాండవ సైన్యాన్ని దుర్యోధనుడు లెక్కచేయడు. ఇక నాజన్మం దుఃఖభాజన మౌతుందో ఏమో' అని ధృతరాష్ట్రుడు ఖిన్నుడైనాడు. దుర్యోధనుడిని పాండవులతో సంధిచేయుమని సామవాక్యాలు చెప్పాడు. దానిని కాదని దుర్యోధనుడు తన బలపరాక్రమాలను కీర్తించుకొన్నాడు. అతడికి బాసటగా కర్ణుడు వీరవాక్యాలు పలికాడు. భీష్ముడు కర్ణుడి ప్రగల్భాలను నిందించాడు. దానికి కోపగించి భీష్ముడు కర్ణుడి ప్రవర్తనను ఖండించాడు. ఇతడా కౌరవులను రక్షించేది? అని అధిక్షేపించాడు. భీష్ముడి మాటలకు మండిపడి కర్ణుడు పితామహుడు యుద్ధంలో నేల గూలేంతవరకు తాను యుద్ధంలో పాల్గొననని అస్త్రసన్న్యాసం చేశాడు.

సంజయుడి సందేశాన్ని దుర్యోధనుడు పెడచెవిని పెట్టాడు. ధృతరాష్ట్రుడు విని మౌనంగా ఊరకున్నాడు. సభాసదులందరు దిగ్గునలేచి ఇళ్ళకు వెళ్ళిపోయారు. సంజయుడు మాత్రం తండ్రికొడుకుల ముందు సాక్షిగా నిలిచాడు.

ఆ తరువాత వ్యాసుడు ప్రసన్నుడై ధృతరాష్ట్రుడిని శ్రీకృష్ణుడి నాశ్రయించుమని ప్రబోధించాడు. దానికతడు అప్పటికి సుముఖతను ప్రకటించాడు.

## శ్రీకృష్ణుడి రాయబారం : పాండవుల సందేశాలు

ఉపప్లావ్య నగరంలో ధర్మరాజు తమ్ములను, బంధువులను, ద్రౌపదిని వెంటబెట్టుకొని శ్రీకృష్ణుడి మందిరానికి వెళ్ళి కౌరవ సభకు అతడిని దూతగా పంపితే శుభం కలుగుతుందనే అభిప్రాయంతో ఇట్లా మనవి చేశాడు.

'మహాత్మా! ఆపదల నుండి రక్షించటానికీ, శుభములు కలిగించటానికీ ఈ జన్మకు పాండుభూపాలుడు నిన్ను చూపించి వెళ్ళాడు. మిత్రకార్యం చక్కజేసే సమయం వచ్చింది. నీవు కారణంగా అవినీతుడైన ఆ దుర్యోధనుడితో యుద్ధం లేకుండా మా వంతు రాజ్యాన్ని మేము పొందగలుగుతాం.' ఆ మాటలకు మాధవుడు సంతోషించి 'మీరు చెప్పినట్లే చేస్తాను' అని పేర్కొన్నాడు. అప్పుడు ధర్మరాజు ఇట్లా అన్నాడు.

'నిన్న సంజయుడు పలికిన మాటలను బట్టి మా తండ్రి ధృతరాష్ట్రుడి తలపు, దుర్యోధనుడి వైఖరి మనకు తెలిశాయి కదా! రాజ్య భాగం ఇవ్వకుండా మంచి మాటలతో మా అలుక తీర్చటానికి యత్నించారు. పదమూడేండ్లు మేము పడరాని పాట్లు పడి నియమం పాటించి వచ్చి ఉన్నా. కుల ధర్మాన్ని పాటింపదలచుకొనడా పెద్దరాజు. కొడుకు వక్రబుద్ధిని మాన్పలేడు. ఇంతకంటె మాకు వేరే కీడేమైనా ఉన్నదా? ఇక్కడి బంధువులు నీవు అబ్బురపడి వినేటట్లు మాకు అయిదూళ్ళిచ్చినా చాలని అన్నాను కదా! దానికీ వారు పూర్తిగా వ్యతిరేకమే. ఆ దుర్యోధనుడు ఆ మాత్రం అంగీకరించలేడా? ఔన్నత్యం లేకపోగా క్రూరత్వం ప్రదర్శిస్తే మరీ సహించలేం. సంపద నాకెందుకని అంటారా? నేను పోషించవలసిన చుట్టాలకు గ్రాసవాసోదైన్యాలు వస్తాయి. కాబట్టి సంపదను మే మిరువురం పంచుకొని అనుభవిస్తే సంతోషం కలుగుతుంది.

లోకంలో పెరవారైనా, పగవారైనా చంపుకోవాలనే ఎందుకు కోరతారో? మరొక మార్గమే లేదా? అది మంచిది కాదా? బంధుమిత్రులు కౌరవుల వైపున్నారన్న సంగతి గణించకుండా సంపద కొరకు వారిని వధించటం, దానివలన పాపాన్ని పొందటం అనే దురవస్థలను సహించవచ్చునా? శస్త్ర జీవితమే క్షత్రధర్మం. మేము మరొక ధర్మాన్ని ఆచరించరాదంటారు. అయినా వంశ నాశనం అభిమతం కాదు. కాబట్టి మా క్షత్రియ ధర్మ నిర్వహణం అత్యంత దుర్లభం. యుద్ధమైతే దానివలన అటు సంపద రావచ్చును లేదా ఇటు ప్రాణం పోవచ్చును. ఒక్కొక్కసారి పలువురు ఒక వీరుడి చేతిలో ఓడి పారిపోవటం సంభవించవచ్చును. బలవంతులు బలహీనుల చేత చెడటం కూడా సంఘటిల్లవచ్చును. రణరంగంలో జయాపజయాలు దైవాధీనాలు. పరాజయమైతే మరణం కంటె మనస్సును అధికంగా బాధిస్తుంది. పోరు లేని ఉపాయంతో శత్రువులను

కడతేర్చగలిగిన వాడు గుండె మీద చేయిపెట్టుకొని నిద్రించగలుగుతాడు. మనసులో పగ ఉంటే పామున్న యింట్లో ఉన్నట్లుంటుంది. చిత్తశాంతి ఉండదు. కాబట్టి అధిక దీర్ఘ వైర వృత్తి ఎప్పుడూ తగదు.

'పగ యడఁగించు టెంతయు శుభం, బది లెస్స, యడంగునే పగం
బగ? వగగొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే? కడుం
దెగ మొదలెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు; నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా!'. **(ఉద్యో. 3.21)**

కావున శాంతియే తత్క్షణ కర్తవ్యం. అది అట్లా ఉండగా సంపద కావాలనీ, యుద్ధం కాకూడదనీ మేం కోరుతున్నాం. మా సంపద కోల్పోకుండా కుల క్షయం కల్గకుండా మరొక పద్ధతిలో ఏ విధంగా చక్కబడినా అది మాకు నచ్చుతుంది. జనార్దనా! మా మీద పక్షపాత వైఖరి ప్రకటించవద్దు. ధర్మ నీతి వర్తనాలలో రెండువైపులా హితం అభ్యుదయం కలిగే విధాన్ని బోధించే విదురాది సజ్జనుల బుద్ధులకు నచ్చేటట్లు నిపుణంగానూ, భూపతులకందరికీ తెలిసేటట్లు పరుషంగానూ వక్తవ్యాంశాన్ని తెలియజెప్పుము.

రాజు అన్యాయంగా పరుషవాక్యాలు పలికినప్పటికీ వాటిని సహించి నిండుసభలో నిలిచి మాట్లాడుము. పెద్దల మాటలనూ, ప్రభువుల తలపులనూ మన్నించని దుర్యోధనుడి యెదుట కురువృద్ధుల తలపులను మనం గౌరవిస్తే జనులు మెచ్చుతారు. దుర్యోధనుడి పక్షం చేరి ధృతరాష్ట్రుడు అవినీతి చేసినప్పటికీ ఇక సంధి యత్నం సఫలం కాదని వెంటనే తిరిగి రాబోకుము. ధైర్యంతో జనులెల్లరూ తెలిసికొనేటట్లు మా అభిప్రాయాలను సభలో నిశ్చింతగా ప్రకటించుము. ఎన్ని సంకటాలు వచ్చినా ఎంత మనస్సు క్షోభించినా ఈ కార్యాన్ని నిర్వహించగలిగిన దక్షుడవు నీవే. నీ వే రకంగా ఈ కార్యాన్ని నడుపుతావో, అదే నాకు ప్రియమైనది.' ధర్మరాజు మాటలకు కృష్ణుడు ఇట్లా అన్నాడు.

'ధర్మనందనా! నీ మాట నిజం. ఆ ధృతరాష్ట్రుడు అట్టివాడే, తండ్రికి తగ్గకొడుకు దుర్యోధనుడు. నీ మనసులోని భావం నేను తెలిసికొన్నాను. అనుమానం పెట్టుకొనకు. వినదలచుకొంటే వినుము. నాకు నిజంగా కోపం వస్తే యుద్ధంలో నా కెదురు నిలిచి పోరాడే వాడు ఒక్కడూ లేడక్కడ కాబట్టి, నన్ను నిశ్చింతగా కౌరవ సభకు పంపుము. నేను వెళ్ళి రావటం వలన మేలు. అర్థసిద్ధి కలుగుతాయి. మనవైపు ఎటువంటి వంకపెట్టకుండా ఉండే స్థితి కలుగుతుంది.' కృష్ణుడి మాటలకు సంతుష్టుడై ధర్మరాజు కృతజ్ఞతా సూచకంగా అన్నమాట లివి-

'మేలగుగాక, నీ యిచ్చ వచ్చిన విధంగా వ్యవహరించి మేమూ వారూ కలిసి ఉండేటట్లు ఏ విధంగానైనా ఒప్పందం కుదిరించుము. మన కది మంచిది. నీకు మేము తెలుసు, వారు తెలుసు. హిత మేదో తెలుసు; సాధించవలసిన అర్థసిద్ధి తెలుసు; వాక్యపద్ధతి విశేషంగా తెలుసు, ఇంత తెలిసిన నీకు బుద్ధులు చెప్పటానికి నేనెవ్వరిని?' అని ఆప్యాయంగా అభినందించాడు.

శ్రీకృష్ణుడు ధర్మరాజుకు కౌరవులు చేసిన దుర్ణయాలను జ్ఞాపకంచేసి, ఆ సుయోధనుడు ఆయువున్నంతవరకు మీకు రాజ్యంలో ఆవంతభాగం పంచి ఇవ్వడు. కాబట్టి యుద్ధం తప్పదు. దానికి అనుగుణమైన శకునాలు ఎన్నో కనబడుతున్నాయి. కాబట్టి నీవు ఉత్సాహాన్ని తగ్గించుకొనవద్దు. చతురంగ బలాలను ఆయత్తం చేసికొంటూ, సాయం చేసే దొరలను పురి కొల్పుకొంటూ సమరానికి సన్నాహం సాగించుమని ప్రోత్సహించాడు.

పోరుకు ప్రోత్సాహం కలిగిస్తున్న పురుషోత్తముడిని చూచి భీముడు రోషంతో - 'ధర్మరాజు కోరుతున్నది శాంతిగాని యుద్ధం కా'దని జ్ఞాపకం చేశాడు. పాలూ నీరూవలె పాండవులూ కౌరవులూ కలిసి నివసిస్తూ ఉంటే దుర్యోధనుడు దుర్మార్గపు చేష్టలతో ఇంతపని చేశాడు. కులక్షయానికి కారకుడయ్యాడు. అది తప్పదు. అయినా నీవీ రాయబారి బిరుదంతో సాధ్యమైనంతవరకు సార్థక్యాన్ని సాధించుము. ఏ విధంగానైనా ప్రజలకు హితమయ్యేటట్లు సంధిని సాధించుము' అని నొక్కి చెప్పాడు.

భీముడు శాంతి వాక్యాలు మాట్లాడటం వినేవారికి ఆశ్చర్యం కలిగించింది. అతడి పౌరుషం ఆరిపోకూడదని భావించి గోవిందుడు అతడిని అధిక్షేపించాడు. యుద్ధమంటే భయపడి భీముడు శాంతిని కాంక్షిస్తున్నాడని పరాచకాలాడాడు. దానికి భీము డభిమానపడి శ్రీకృష్ణుడి నెద్దేవ చేశాడు. క్రుద్ధుడైన భీముడిని చూచి శ్రీకృష్ణుడు 'నీకు కోపం అలంకారమైనట్లు శాంతం కా'దని సర్ది చెప్పి యుద్ధోత్సాహాన్ని అతడిలో ఉరకలెత్తించేటట్లు చేశాడు.

అర్జునుడి అభిప్రాయాన్ని అడిగాడు గోవిందుడు. అత డిట్లా అన్నాడు.

'నీ వొనరింపఁబూనిన పనిం గమలోదర! కీడు పుట్టునే?
కావనినట్ల యుండి యవుఁ గార్యము; లట్లగుటం బ్రయత్న సం
భావన సేఁత పౌరుషము పద్ధతి; తత్ఫలసిద్ధి వొందుచో
దైవము తోడ్పడన్ వలయుఁ; దథ్యము రెండును నీ వినోదముల్.' **(ఉద్యో. 3.73)**

దానికి సమాధానంగా కృష్ణుడు - 'నేను సంధికొరకు ఓపినంత పురుషకారం చేస్తాను. దైవం చేత ఏమౌతుందో నాకు తెలియదు. అయినా, బాల్యంనుండి మీకు కీడు చేయాలని ఇన్ని పాపాలు చేసిన దుర్యోధనుడు ఇప్పుడు సంధి సందేశాన్ని అంగీకరిస్తాడని నేను అనుకోను' - అని ఖచ్చితంగా చెప్పాడు.

నకులుడు - వాసుదేవుడి వ్యక్తిత్వం సంధి జరగటానికి ఎంతో తోడ్పడుతుందనీ, గోగ్రహణం తరువాత కౌరవులు తప్పక మెత్తబడతారనీ ఆశాభావాన్ని వ్యక్తం చేశాడు. కాని, సహదేవుడు మాత్రం పౌరుషంతో సంధి యత్నాన్ని సమర్థించలేదు. సుయోధనుడు రాజ్యభాగాన్ని ఇస్తాడని విశ్వసించలేదు. సాత్యకి సహదేవుడి అభిమతాన్ని సమర్థించాడు. వారిద్దరి వీరాలాపాలను సభికులు విని ప్రశంసించారు.

చివరకు పాంచాలి కూడా తన అభిప్రాయాన్ని వాసుదేవుడికి తెలియపరిచింది. ఆమెకు ధర్మజుడి శాంతి వచనాలు దుఃఖాన్ని కలిగించాయి. గొంతు గద్గదమైపోయింది. అభిమానం అవమానాగ్నిచేత ప్రజ్వలితమైంది. అన్నతో ఆర్ద్రంగా ఇట్లా మొరపెట్టుకొన్నది.

'పద్మనాభా! నేను వరంవలన పుట్టాను. భరతవంశం మెట్టాను; పాండు భూపాలుడికి కోడలైనాను. జనవంద్యులైన పాండవులను భర్తలుగా పొందాను; నీతి విక్రములైన పుత్రులను కన్నాను; అన్నదమ్ముల ప్రాపు గాంచాను, నేను ఇన్ని విధాలుగా ప్రసిద్ధి కెక్కాను. ఇవన్నీ ఒక యెత్తు. రాజసూయావభృథస్నానంతో పవిత్రమైన నా వేణిని ఒక అధముడు ఈ అయిదుగురూ చూస్తూ ఉండగా నిండు సభలో లాగి అవమానించాడు. ఆ సభలో ఏకవస్త్రనయిన నన్ను దుశ్శాసనుడు అట్లా అవమానిస్తూ ఉంటే, వీరు చిత్రపటాలవలె మిన్నకుండి పోతే ముకుందా! నిన్ను నేను విశ్వాసంతో స్మరించాను. ఆ సన్నివేశాన్ని సంధిసమయంలో మరువబోకుము' అని అంటూ

'ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెంట్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొందు విషాదరోషముల్
గావఁగలేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై' **(ఉద్యో. 3.114)**

గోవిందుడి ముందు బెట్టి - 'ఇవి దుశ్శాసనుడి వ్రేళ్ళకు తగిలి సగం తెగిపోగా మిగిలి ఉన్న శిరోజాలు. వీటిని నీవు సంధివచనాలు పలికేటప్పుడు మరచిపోబోకుము. నా క్రొమ్ముడిని పట్టి లాగిన ఆ దుర్మార్గుడు తన శరీరం రణరంగంలో ముక్కలు ముక్కలై గుర్తించటానికి వీలులేనంత దీనంగా చావాలి. అప్పుడు కాని నా గుండెలోని మంట చల్లారదు. నేనిన్ని కష్టాలు పడటానికి కారకుడైన ఆ రారాజు పీనుగును కన్నార చూడకపోతే ఆ భీమసేనుడి పెనుగద, ఆ సవ్యసాచి గాండీవం కాల్పనా?

'నెట్టన యిట్టి యల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టిన యట్లు; పెద్దయును గాలము దీనికి నాఁ టెన్నఁడుం
బుట్టదు; దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తో
బుట్టువు తీవ్ర తేజమునఁ బొల్చిన భర్తలుఁ గల్గ నచ్యుతా!'. (ఉద్యో. 3.118)

అని గొంతు వణుకుతూ ఉండగా ద్రౌపది ఏడ్చింది.

శ్రీకృష్ణు డామెను ఆదరంతో ఓదార్చాడు. కన్నీరు తుడిచి కూర్చుండబెట్టాడు. ఆమె పెన్నెఱి వేణిని ముడవటానికి ముదితలను ఆదేశించాడు. ఆప్యాయంగా ఆమె కిట్లా ధైర్యం చెప్పాడు.

'చెల్లీ! నే నుండగా నీకెందు కీ శోకం? ధర్మజుడు పంపగా, భీమార్జునులు వెంట రాగా నేను రణరంగంలో శత్రుక్షయాన్ని చేస్తాను. మరొక రకంగా జరిగే అవకాశంలేదు. దురాత్ములైన కౌరవులు రాజ్యం ఇస్తారా? తల్లీ! నీవేడ్చే రోజులు పోయాయి. కౌరవుల భార్యల యేడ్పులు విని నీవు కలకల నవ్వే రోజులు దగ్గర పడ్డాయి. యముడి మహిషపు లోహ ఘంటల వికృత నాదాన్ని వినాలని కుతూహల పడుతున్న కౌరవులకు సంధికార్య శాంతివచనాలు సంతోషాన్ని కలిగిస్తాయా? విధి లిఖితం అట్లాగే ఉన్నది. అది తప్పక జరిగి తీరుతుంది. నేను కూడా ప్రతిజ్ఞ చేసి చెపుతున్నాను - 'పాండవులు శత్రుసంహారంచేసి ఉజ్జ్వల పుణ్య లక్ష్మీ సమేతులై అధిక విభవాన్ని పొందుతారు. నీవు చూస్తావు; ఆలస్యం లేదు; ఇది నిజం' అని ఊరడిస్తూ పలికాడు.

ఆపైన కౌరవ పాండవులకు హితం చేయటానికి ధర్మరాజు పంపగా ధృతరాష్ట్రుడి వద్దకు రాయబారిగా పోతానని శ్రీకృష్ణుడు పయనమైనాడు. శ్రీకృష్ణు డా సాయంకాలానికి కుశస్థలం చేరాడు. ధృతరాష్ట్రుడికి వర్తమానం అందింది. భీష్మాదులను దుర్యోధనాదులను పిలిచి శ్రీకృష్ణుడి రాకను గురించి ఆలోచించాడు. శ్రీకృష్ణుడి రాక శుభప్రదమనీ' అతడి మనస్సుకు నచ్చే పని చేస్తే ఇహపరదాయకమనీ విదురాదులు చెప్పారు. పాండవులకు రాజ్యంలో సగభాగం ఇస్తే గోవిందుడు సంతోషిస్తాడని భీష్మాదులు సూచించారు. దుర్యోధనుడు ఈ రెండింటినీ కాదన్నాడు. భాగమిస్తే భయపడ్డామని అధిక్షేపిస్తారనీ, శ్రీకృష్ణుడికి లంచమిచ్చి వశపరచుకొన్నా, లేదా బంధించి వశం చేసికొన్నా పాండవ పక్షం వారందరూ రెక్కలు విరిగిన పక్షులవలె తనకు వశమైపోతారనీ దుర్యోధనుడు దుష్టభావనం చేశాడు. భీష్మాదులు దానిని గర్హించారు.

## కౌరవసభలో శ్రీకృష్ణ సందేశం

మరునాడు శ్రీకృష్ణుడు హస్తినాపురికి వచ్చాడు. ప్రజలు అతడిని ఆసక్తితో చూచి పూలతో సేసలతో గౌరవించారు. మాధవుడు ధృతరాష్ట్ర మందిరంలో కురువీరులందరినీ దర్శించాడు. విదురునింట భోజనంచేశాడు. కుంతిని పలుకరించాడు. ధృతరాష్ట్రుడి నిండుకొలువులో జలదస్వర గంభీర స్వరంతో సకల జనులు, మహర్షులు సమ్మోదాంబుధిలో తేలేటట్లు మాట్లాడాడు.

'భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండు ననఁగా నుతిఁ గన్నది; యందు సద్గుణో
త్తరులరు నీవు నీ యనుఁగుఁ దమ్ముఁడు నీ తనయుల్ యశోధురం
ధరశుభశీలు రీ సుచరిత క్రమ మిప్పుడుఁ దప్ప నేటికిన్?'

'ఈ వంశంబున కెల్ల నీవ కుదు; రిం దెవ్వారి చందంబు లె
ట్లై వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ!'

'వినుము సుయోధనాదులగు వీరు సధర్మలు గాక కార్యము
ల్గానక మహార్థ సిద్ధి యెడలుం దమ కిట్లన కన్వయంబు వ
ర్తన మిది గాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బుయిలోడ రేమియున్.'

'కౌరవ పాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గులమంతకు నీ నృపకోటి కుర్వికిన్;
బోరితమైన నింతకును బుట్టు మహాపద; గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య! గణుతించి యవశ్యముఁ బొం దొనర్పవే.' **(ఉద్యో. 3.259-262)**

శ్రీకృష్ణ సందేశం సభాసదులు శ్రవణానందంగా విన్నారు. పాండవులు చివరకు చెప్పుమన్న మాటలను వివరించాడు. చివరకు సర్వతాత్పర్యాన్ని క్రోడీకరించి ఇట్లా పేర్కొన్నాడు.

'సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁబారిన దైన యవస్థ దక్షులె
వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభదాయక మయ్యును దైవ ముండెడున్.' **(ఉద్యో. 3.284)**

అని సభాసదుల నుద్దేశించి పలికి, ధృతరాష్ట్రుడితో 'వారి తండ్రి పాలు వారి కిచ్చి, నీ పాలు నీవు పుత్ర పౌత్రులతో అనుభవిస్తూ సుఖంగా ఉండటం బంధుమిత్ర కోటి మెచ్చే తెర'గని పేర్కొన్నాడు. చివరకు -

'వారలు శాంత శూరులు భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నా; రటుగాక మీకది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండుదురు భూవర! రెండు తెఱంగులందు నీ
కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా!' **(ఉద్యో. 3.284)**

శ్రీకృష్ణుడి గంభీరోపన్యాసం దుర్యోధనాదులను తప్ప మిగిలిన వారందరిని ఆకర్షించింది; అతడి వాదాన్ని ఏకగ్రీవంగా అంగీకరించేటట్లు చేసింది. నారదాది మహర్షులు, భీష్మాది కురువృద్ధులు, విదురాదులు దుర్యోధనుడిని సంధికంగీకరించుమని కోరారు. అతడు వారి అభిమతాలను తిరస్కరించాడు. దుర్యోధనుడు చిన్ననాటినుండి పాండవులకు నిష్కారణంగా తలపెట్టిన ఎగ్గులను శ్రీకృష్ణుడు ఏకరువు పెట్టి అధిక్షేపించాడు. కులపాంసనుడిని వధించి కులాన్ని రక్షించుకొనండని ప్రబోధించాడు. గాంధారి కొడుకుకు నీతులు చెప్పింది; ధృతరాష్ట్రుడు సుయోధనుడిని సంధి కొడబడుమని అనునయించాడు. ఎవరెన్ని చెప్పినా దుర్యోధనుడు వినక దుశ్శాసనాదులతో మంతనాలు సలిపి శ్రీకృష్ణుడిని నిండు సభలో బంధించి కారాగారంలో పడవేయాలని యత్నించాడు. అప్పుడు వాసుదేవుడు ధృతరాష్ట్రుడితో ఎలుగెత్తి 'నీకొడుకు నే నొంటరివాడనని బంధించ యత్నిస్తున్నా'డని ప్రకటించి దరహాసం చేశాడు. శ్రీకృష్ణుడు నిండుకొలువులో విశ్వరూప సందర్శనాన్ని ప్రసాదించాడు. ఆ తేజో రూపాన్ని జనం చూడలేక కన్నులు మూసికొన్నారు; నారదాదులు భీష్మ విదుర ద్రోణ సంజయులకు గోవిందుడు దివ్యదృష్టి నిచ్చాడు. వా రా దివ్యరూపాన్ని దర్శించి పరమానందాన్ని పొందారు. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడిని ప్రార్థించి తానుకూడా దివ్యదృష్టిని పొంది దివ్యదర్శనం చేసికొన్నాడు. మరల ఇతరులను చూడకుండానే దివ్యదృష్టిని ఉపసంహరింప చేయుమన్నాడు. అట్లా చేసి శ్రీకృష్ణుడు సాత్యకితో కలిసి సభలోనుండి వెలుపలకు వచ్చాడు.

హస్తినాపురినుండి హరి ఉపప్లావ్యానికి బయలుదేరాడు. కుంతిని దర్శించాడు. కొడుకుల యోగక్షేమాలు తెలిపాడు. వారికి సందేశమిమ్మని ఆమెను అడిగాడు. 'క్షత్రియులు పరాక్రమార్జిత విత్తాన్ని అనుభవించాలి గాని, కందమూలాదులను కా'దని ఆమె చెప్పింది. ఆ నాడు కొలువులో ద్రౌపది పొందిన భంగపాటును మరువవద్దనీ, ప్రతీకారం తీర్చుకొని చిరకీర్తిని గడించుకొమ్మనీ, వీరమాతవలె సందేశం పంపింది.

శ్రీకృష్ణుడు కర్ణుడిని తన రథమెక్కించుకొని కొంతదూరం తీసికొనిపోయి అతడి జన్మవృత్తాంతం చెప్పి, పాండవులలో కలిసిపొమ్మని కోరాడు; పాంచాలి అతడిని ఆరవ భర్తగా అంగీకరిస్తుందని హామీ ఇచ్చాడు. కర్ణుడు కృష్ణుడికి తగిన సమాధానమిచ్చాడు. కుంతీదేవి తనను కనినప్పటికీ సూతపత్ని పెంచింది. అంతకాలం సూతపుత్రుడుగా ప్రసిద్ధి కెక్కి ఇప్పుడు కాదనటం పాలు పిండిన తరువాత పొదుగు కోసినట్లవుతుందని కర్ణుడు భావించాడు. కర్ణుడిని అర్జునుడికి ఎదురుగా నిలుపదగిన శక్తి అని దుర్యోధనుడి విశ్వాసం. అతడి విజయమంతా కర్ణుడిపై గల ఆశ మీదనే ఆధారపడి ఉన్నది. ఇప్పుడు పాండవ పక్షం వహిస్తే పార్థుడికి భయపడి వచ్చాడని అందరూ అంటారు. అంతేకాక నమ్మిన రాజును మోసం చెయ్యట మౌతుంది. కృతఘ్నత అవుతుంది. మరొకటి - యుద్ధానంతరం రాజు కాదగినవాడు ధర్మరాజు. కర్ణుడు తనకు అగ్రజుడని తెలిస్తే అతడు రాజ్యం స్వీకరించడు. ధర్మజుడూ, అతడి తమ్ములూ ఋత్విజులుగా, శ్రీకృష్ణుడు ఉపద్రష్టగా రణయజ్ఞంలో కురుకుమార పశు విశసనం చేస్తాడు' అని కర్ణుడు తన మనోగత భావాలను వ్యక్తం చేశాడు. రాబోయే యుద్ధంలో కర్ణార్జునులలో అర్జునుడిదే విజయమని శ్రీకృష్ణుడు ప్రకటించి, కర్ణుడిని ఇంటికి పంపి తాను ఉపప్లావ్యానికి చేరుకొన్నాడు.

కౌరవాన్వయ మహార్ణవం ఇంకిపోయేటంతగా ఏర్పడిన విపత్తును గురించి విదురుడు కుంతితో చెప్పి విచారించి వెళ్ళిపోయాడు. ఆమె ఈ విపత్తును తొలగించే మార్గంకొరకు ఏకాంతంగా ఆలోచించింది. రహస్యంగా కర్ణుడి వద్దకు వెళ్ళి అతడి జన్మ రహస్యాన్ని తెలిపి, సహోదర స్నేహాన్ని అతడి హృదయంలో పెంపొందింపజేసి, క్రమంగా యుద్ధ యత్నాలను విముఖం చేయవచ్చునని భావించింది. గంగానదికి అనుష్ఠానార్థం కర్ణుడు రాగా అతడిని కుంతి దర్శించింది. అత డామెకు నమస్కరించాడు. ఆమె అతడితో జన్మవృత్తాంతాన్ని వివరించి చెప్పింది. కుంతీకుమారు డగుటచేతనూ, పాండవ ధార్తరాష్ట్రుల కంటె పెద్దవాడు కావటం చేతనూ భూమికి తానే రాజు కాదగినవాడవని ప్రోత్సహించింది. ఆమె మాటలకు అతడు చలించలేదు. 'క్షత్రియ సంస్కారాలు చేయకుండా అప్పుడు నీటిలో ఆవిధంగా పారవేసి, ఈనాడు ఈ విధంగా పలకటం న్యాయమా! సూర్యానుగ్రహం వలన పుట్టిన నేను నింద్యుడను కాకపోయినా నా జన్మ రహస్యంగా ఉండిపోయింది. అది ఇప్పుడు ప్రకటనం చేయటం ఎంతవరకు మేలు? విజయ విక్రమం ప్రసిద్ధి చెంది ఉండగా నే నిప్పుడు పాండవులతో కలిస్తే భయపడి ఈ పని చేశాడని లోకులు నిందించరా? నాపై ఆశలు పెట్టుకొన్న దుర్యోధనుడిని ఈ తరుణంలో విడవటం న్యాయమా? కాబట్టి నేను దుర్యోధనుడి పక్షంలో ఉండి నీ కొడుకులతో యుద్ధం చేస్తా'నని అతడు సేవాధర్మపరాయణుడై పలికాడు. పాండవులలో ఒక్క పార్థుడు తప్ప మిగిలినవారు చేజిక్కినా వారిని చంపనని మాట ఇచ్చాడు. యుద్ధంలో కర్ణుడు గాని, అర్జునుడు గాని ఎవరో ఒకరు మిగులుతారు. అతడితో కలిసి కుంతీపుత్రులు అయిదుగురు కాగలరనీ ఆరుగురు ఎన్నడూ కారని హెచ్చరించాడు. ఆమె కర్ణుడిని కౌగిలించుకొని అదంతా విధివిలాసమని పేర్కొని, కర్ణుడి మాటల కంగీకరించి, అతడిని ఆశీర్వదించి నిజ నివాసానికి వెళ్ళిపోయింది.

## యుద్ధ నిర్ణయం : సైన్యాల మోహరింపు

శ్రీకృష్ణుడు ఉపప్లావ్యంలో ధర్మరాజుకు హస్తినాపురి విశేషాలన్నింటినీ వివరించాడు. అప్పుడు 'మాకు ధర్మచ్యుతి లేకుండా భావి కార్యాన్ని నిశ్చయించు'మని నారాయణుడిని ధర్మరాజు ప్రార్థించాడు. అతడి నిర్ణయ మిది -

'యుద్ధమ కాక కార్యమును నొండొక టెద్దియుఁ గల్గ నేర్చునే?
బుద్ధులు సెప్ప వాక్యముల పోల విననండన నేల? యట్టిచో
బద్ధునిఁ జేయఁజూచె ననుఁ బట్టి సుయోధనుఁ; డింక నయ్యసం
బద్ధునితోడి సంధికి నుపాయము నా మతిఁ దోఁప దెమ్మెయిన్.' **(ఉద్యో. 4.88)**

శ్రీకృష్ణుడి నిర్ణయంతో యుద్ధం నిశ్చయమైనది. అతని సూచనపై ధృష్టద్యుమ్నుడు పాండవ సర్వ సైన్యాధ్యక్షుడుగా అభిషిక్తుడైనాడు. అట్లాగే అక్షౌహిణీపతులైన దండనాథులను శ్రీకృష్ణుడే నిర్దేశించాడు. కౌరవులతో యుద్ధం చేయటానికి కురుక్షేత్రంలో సైన్యాన్ని సంఘటించాలని నియమించాడు. శుభశకునాల మధ్య యుధిష్ఠిరుడి సైన్యం ఉత్సాహంతో కురుక్షేత్రానికి చేరింది.

దుర్యోధనుడు ద్రోణాదులను పదకొండు మందిని అక్షౌహిణీ పతులుగా చేశాడు. వారలను భీష్ముడికి చూపి అతడిని సర్వ సైన్యాధ్యక్షుడిగా అభిషేకించాడు. బలరాముడు తీర్థయాత్రలకు వెళ్ళాడు. భీష్ముడు కురు పాండవ వీరుల అంతరాలను తెల్పి కర్ణుడిని అర్ధరథుని గానూ, అర్జునుడిని సాటిలేని మహారథుడి గాను పేర్కొన్నాడు. భీష్ముడు తాను శిఖండిని చంపలేనని చెప్పాడు. దానికి కారణమైన అంబోపాఖ్యాన కథనంతా వివరించాడు. అయినను ఆ పాండవ సేనా సాగరం ఇంకిపోయేటట్లు యుద్ధం చేస్తానని సైన్యాన్ని ఉత్తేజపరిచాడు.

**- జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము

# ద్వితీయాశ్వాసము



# తృతీయాశ్వాసము

# చతుర్థాశ్వాసము





శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీగౌరీ పల్లవపుట । యోగాశ్రయ మంజరీ సముజ్జ్వల మూర్తీ !**
**యోగీంద్ర సంతతాంత । ర్యాగ పరీపాకరూప! హరిహరనాథా !** 1

**ప్రతిపదార్థం:** శ్రీగౌరీ= లక్ష్మీపార్వతులనెడి; పల్లవపుట= చిగురుటాకుల డొప్ప యొక్క; యోగ= సంబంధమునకు; ఆశ్రయ= ప్రాపైన; మంజరీ= పూలగుత్తివలె; సముజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; మూర్తీ!= స్వరూపంగలవాడా!; యోగి+ఇంద్ర= ఉత్తమోపాసకుల యొక్క; సంతత= ఎడతెగని; అంతర్యాగ= అంతర్యాగమనే ఒక ఉత్తమోపాసనము యొక్క; పరీపాకరూప!= ఫలరూపమయినవాడా!; హరిహరనాథా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! చిగురుటాకులతో గూడిన పూలగుత్తి వలె లక్ష్మీ పార్వతులతోగూడి మిక్కిలి ప్రకాశించే స్వరూపంగలవాడా! యోగిశ్రేష్ఠులు నిరంతరం చేసే అంతర్యాగమనే మహోపాసనకు ఫలమైన ఆకారం గలవాడా!

**విశేషం:** అలం: రూపకం. లక్ష్మీపార్వతులతో కూడిన హరిహరమూర్తి కేవలం హరిహరమూర్తికంటె సముజ్జ్వలతరమైనదని భావం.

**'శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం,**
**న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి'. (సౌందర్యలహరి.1)**

(శివుడు శక్తితో కూడినప్పుడే సకల కార్యనిర్వహణసమర్థు డవుతాడు. కానిచో కదలటానికి కూడా అసమర్థుడు.)

తిక్కన ఈ పద్యంలో పల్లవ-పుట-యోగ శబ్దాలతో అపూర్వమైన ఒక ఉత్తమోపాసనరహస్యాన్ని సూచించాడు. ఏదయినా దేవతామంత్రాన్ని ఉపాసించేటప్పుడు ఉపాసకుడు ఆ దేవతామంత్రాన్ని జపిస్తూ దేవతానుగ్రహాన్ని శీఘ్రంగాను, దృఢంగాను పొందాలంటే ఆ ప్రధాన దేవతామంత్రంతోపాటు తదనుకూలాలైన అంగమంత్రాలను గూడా జతచేసి జపించటం ఉపాసనా సంప్రదాయం. ఆ జత చేసే ప్రక్రియలు 1. పల్లవం, 2. సంపుటం, 3. యోజనం అని మూడు విధాలు. పల్లవ మంటే ప్రధాన మంత్రానికి తుదిని ఆ అంగమంత్రాన్ని సమకూర్చటం. సంపుటమంటే ప్రధాన మంత్రానికి తొలుతనే అంగమంత్రాన్ని సమకూర్చటం. యోజనమంటే ప్రధాన మంత్రానికి మొదటా చివరా కూడా అంగమంత్రాన్ని సమకూర్చటం. అట్లా సమకూర్చి జపిస్తే మంత్రశక్తి సముజ్జ్వలతరమై ఎంతటి ఫలాన్నైనా ఈయగల దేవతానుగ్రహం కలుగుతుందని శాస్త్ర హృదయం.

ప్రకృతం పరమేశ్వరరూప ప్రధానమంత్రానికి శ్రీదేవతాబీజాన్నీ, గౌరీదేవతా బీజాన్నీ పల్లవరూపంలోకాని, సంపుట రూపంలోకాని, యోజన రూపంలోకాని సమకూరిస్తే, ఆ పరమేశ్వరమూర్తి అంటే మంత్రం (మంత్ర ఏవ తు దేవతా) సముజ్జ్వలతర మవుతుందని భావం.

పరమేశ్వరుడు అంతర్యాగ పరీపాకరూపుడు. యాగమంటే దేవతాదుల నుద్దేశించి అగ్నిహోత్రంలో ఆజ్యాదిపదార్థాలను మంత్రపూర్వకంగా వేయటం. ఇది బాహ్యామనీ, అంతరమనీ రెండు విధాలు, బాహ్యాయాగం ప్రసిద్ధమే. అంతర్యాగమంటే అంతఃకరణంచే భావించబడే పదార్థాలను అంతఃకరణమందే కల్పించబడే అగ్నిహోత్రంలో వేల్పటం. బాహ్యాయాగాన్ని పరమేశ్వరార్పణ బుద్ధితో కావించి నిర్మలచిత్తుడైన తిక్కయజ్వ అంతర్యాగపు అతిశయం గ్రహించి పరమేశ్వరుడిని అంతర్యాగ పరీపాకరూపుడిగా ఇందులో సంబోధించాడు.

ఇట్లాగే తిక్కన శాంతిపర్వంలో కూడా-

**'హృదయ వేదికయందు సమిద్ధమూర్తి । వెలుఁగుచుండు తేజమునందు వేల్చుఁ బ్రాణ**
**ములను; యాజి య ట్లంతరమున నొనర్చు । యాగమున వీతకల్మషుఁడై వెలుంగు'**

అనటం గమనార్హం. బాహ్యోపకరణ విశేషాలతో చేయబడే యాగంవలెనే ఆంతరంగా శరీరంలో నిత్యమూ జరిగే వ్యాపారాలందే అపూర్వ భావనా విశేషంతో కావించబడటంచేత ఇది 'అంతర్యాగం' అనబడుతున్నది. ఈ అంతర్యాగానికి పూజాకుసుమాలు అహింస, ఇంద్రియనిగ్రహం, దయ, క్షమ, జ్ఞానాదులు. హోమ విషయంలో హుతవహుడు చైతన్యం, కుండం చిత్కుండం, హోమపదార్థం, హవ్యం - విశ్వం. ఈ అంతర్యాగానికి ఫలం

**'ఇ త్యన్తర్యజనం కృత్వా సాక్షాద్బ్రహ్మమయో భవేత్,**

**న తస్య పాపపుణ్యాని జీవన్ముక్తో భవే ద్ధ్రువమ్'.** అని చెప్పబడింది.

తిక్కన హరిహరనాథుడిని అటువంటి అంతర్యాగానికి ఫలస్వరూపుడిగా పేర్కొన్నాడు.

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.** **2**

**ప్రతిపదార్థం:** దేవా= ప్రభూ! ఇది కృతిపతియైన హరిహరనాథుడి సంబోధనం; వైశంపాయనుండు= ఆ పేరుగల వ్యాసశిష్యుడు; జనమేజయునకున్= పరీక్షిత్తు కొడుకైన జనమేజయుడనే పేరుగల మహారాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ప్రభూ! హరిహరనాథా! వ్యాసశిష్యుడైన వైశంపాయనముని జనమేజయమహారాజుతో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** వైశంపాయనుడు వ్యాసుడి శిష్యుడు, ముని, జనమేజయుడు ఉత్తరాభిమన్యుల కుమారుడైన పరీక్షిత్తు కొడుకు. వైశంపాయనుడు జనమేజయుడికి చెప్పినట్లు తిక్కన హరిహరనాథుడితో భారత కథ చెప్పుతున్నాడు.

### పాండవులు కృష్ణాదులంగూడి భావికార్య విధానము నాలోచించుట (సం. 5.1.1)

**తే. ఎలమి నభిమన్యు పెండిలి యివ్విధమునఁ । జేసి, యుల్లాసలక్ష్మిఁ గైసేసి మత్స్య**
**మనుజపతి యన్వయంబు పావనము సేసి, । దినచతుష్టయానంతరమునఁ బ్రియమున.** **3**

**ప్రతిపదార్థం:** (తరువాతి వచనంలోని 'ధర్మతనయుండు' కర్త.) ఎలమిన్= సంతోషంతో; అభిమన్యుపెండిలి= అభిమన్యుడిపెళ్ళి; ఇవ్విధమునన్ (ఈ+విధమునన్)= ఈ రీతిగా; చేసి; ఉల్లాసలక్ష్మిన్= ప్రకాశమనే శ్రీని; కైసేసి= అలంకరించి, మత్స్యమనుజపతి అన్వయంబు= మత్స్యదేశాధీశుడైన విరాటుడియొక్క, వంశం; పావనము సేసి (పావనము+చేసి)= పవిత్రంచేసి; దినచతుష్టయ+ అనంతరమునన్= నాలుగు దినముల తరువాత; ప్రియమునన్= ప్రీతితో.

**తాత్పర్యం:** ధర్మరాజు అభిమన్యుడి పెళ్ళి ఈ రీతిగా సంతోషంతో చేసి, ప్రకాశమనే సంపద అలంకారంగా శోభిల్లుతూ, విరాటుడి వంశాన్ని పవిత్రం చేసి, నాలుగు దినాలు కడచిన తరువాత ప్రీతితో.

**విశేషం:** అభిమన్యుడు అర్జునుడి కొడుకు. అతడికి విరాటుడి కూతురైన ఉత్తరతో పెళ్ళి జరిగింది. పాండవుల తోడి ఈ సంబంధం వలన విరాటుడి వంశం పావనమయింది.

**వ. ధర్మతనయుండు దమ్ములుం గొడుకులుం బరివేష్టించియుండ, విశాలరమణీయంబగు విరాటు కొలువు కూటంబున కరిగి యందు. 4**

**ప్రతిపదార్థం:** ధర్మతనయుండు= యముడి కొడుకైన ధర్మరాజు; తమ్ములున్= భీమాదులైన తమ్ములు నలుగురూ; కొడుకులున్= ప్రతివింధ్యాదులైన కొడుకులూ; పరివేష్టించి ఉండన్= చుట్టిఉండగా; విశాలరమణీయంబు+అగు= విశాలమూ, సుందరమూ అయిన; విరాటుకొలువుకూటంబునకున్= విరాటరాజు సభాభవనానికి; అరిగి= వెళ్లి; అందున్= ఆ కొలువులో.

**తాత్పర్యం:** ధర్మరాజు భీమాదులైన తమ్ములు నలుగురూ, ప్రతివింధ్యాదులైన కుమారులూ చుట్టియుండగా విశాలమూ, సుందరమూ అయిన విరాటరాజు సభాభవనానికి వెళ్ళి అందులో (వచనం 6లోని 'ఉన్న' అనే దానితో అన్వయం).

**విశేషం:** ధర్మరాజు తమ్ములు భీమార్జుననకులసహదేవులు, కొడుకులు ప్రతివింధ్యుడు, శ్రుతసేనుడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతకర్ముడు అనే ఉపపాండవులైదుగురూ, భీముడికొడుకు ఘటోత్కచుడూ, అర్జునుడి కొడుకు అభిమన్యుడు మొదలయినవారు. విరాటుడి కొలువు విశాలమైనది అంతేకాక అది రమణీయమైనది.

**క. విరటుఁడుఁ, బాంచాలుండును, । హరియును, రామ్ముండు, వారి యనుజ తనూజుల్,**
**పరిణయ సమాగతాఖిల । ధరణీశులు బలసియుండఁ, దద్దయు నెమ్మిన్. 5**

**ప్రతిపదార్థం:** విరటుఁడున్= విరాటరాజూ; పాంచాలుండును= పాంచాలదేశపురాజగు ద్రుపదుడూ; హరియును= శ్రీకృష్ణుడూ, రాముండు= బలరాముడూ; వారి= ఆ విరాటాదుల; అనుజతనూజుల్= తమ్ములూ, కొడుకులూ; పరిణయసమాగత+అఖిలధరణీ+ఈశులున్= వివాహానికి విచ్చేసిన ఎల్లరాజులూ; బలసి+ఉండన్= చుట్టుకొనిఉండగా; తద్దయున్= మిక్కిలి; నెమ్మిన్= ప్రీతితో.

**తాత్పర్యం:** విరాటుడూ, ద్రుపదుడూ, శ్రీకృష్ణుడూ, బలరాముడూ, వారి తమ్ములూ, కుమారులూ, వివాహానికి విచ్చేసిన రాజులందరూ పరివేష్టించిఉండగా, మిక్కిలి ప్రీతితో. (తరువాతి వచనంలోని 'ఉన్న' అనే దానితో అన్వయం.)

**వ. ఉన్నసమయంబున సభాసదులైన మానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణ యుధిష్ఠిరులతో సంభాషణంబులు సేయుచుండఁ, బాండవకార్యార్థియై కృష్ణుండు తదీయ వచనంబులు వారించి, వారలఁ గలయం గనుంగొని యిట్లనియె. 6**

**ప్రతిపదార్థం:** ఉన్నసమయంబునన్= ఆవిధంగా పరివేష్టించి ఉన్నవేళ; సభాసదులు+ఐన= సభ్యులైన; మానవేంద్రులు (మానవ+ఇంద్రులు)= రాజులు; నానావిధంబులన్= అనేకరీతుల; కృష్ణయుధిష్ఠిరులతోన్= కృష్ణుడితోను, ధర్మరాజుతోను; సంభాషణంబులు+చేయుచున్+ఉండన్= మాటలాడుతుండగా, కృష్ణుండు; పాండవకార్య+అర్థి+ఐ= పాండవుల పనిని కోరినవాడయి; తదీయవచనంబులు= వారి మాటలు; వారించి= ఆపి; వారలన్= వారిని; కలయన్+కనుంగొని= బాగుగా చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా వారందరూ కూడిఉన్న సమయంలో సభలోని రాజులు అనేకరీతులుగా కృష్ణుడితోనూ, ధర్మరాజుతోనూ మాటలాడుతుండగా, శ్రీకృష్ణుడు పాండవుల కార్యం కోరినవాడయి వారి మాటలను ఆపి, వారినందరినీ కలయ చూచి ఇట్లా అన్నాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడు 'పాండవకార్యార్థియై' వారలఁ గలయం గనుంగొని' మాట్లాడి నట్లు చెప్పటం సార్థకం. ఉద్యోగపర్వానికి కార్యారంభాన్ని చేస్తూ, అక్కడ ఉన్న రాజలోకమంతా ఏకమై వర్తించేటట్లుగా పలుకుతున్నాడని ధ్వని. నిజానికి పలుకవలసింది ధర్మజుడు. కాని, వచ్చినవారందరూ వివాహ శుభకార్యంలో పాల్గొనటానికి వచ్చిన బంధుమిత్రులు. వారిని ధర్మజుడు ప్రత్యక్షంగా యుద్ధంలో సహాయం చేయండని కోరటం ఉచితం కాదు. అదిగాక పాండవుల అంతరాత్మ వంటివాడు కృష్ణుడు. దైవశక్తిగా వారిచేత భావించబడి పూజించబడేవాడు. అతడిది భవిష్యద్వాణి, తప్పక జరిగేమాట అని వారికి విశ్వాసం ఉన్నది. పాండవులకు శ్రీకృష్ణుడు మార్గదర్శి. మహర్షి, 'యోగక్షేమం వహామ్యహమ్' అని రక్షించే పరమాత్మ. శ్రీకృష్ణుడు ఉద్యోగపర్వంలో పాండవేతివృత్తంలో నిర్వహించే కీలకమైన పాత్రను కవి ఈ మాటల వలన ధ్వనింపచేశాడు.(సంపా.)

**మ. 'కపటద్యూతమునందు సౌబలునిచేఁ గౌంతేయు లాత్మీయరా**
**జ్య పదభ్రంశముఁ బొంది, సత్యనిరతిన్ శక్తాత్ములై యుండియుం**
**గుపితస్వాంతులు గాక, తత్సమయ సంక్షోభంబు గాకుండఁగా,**
**విపినావాసము, గూఢచర్యయును గావింపం దలం పొప్పదే? 7**

**ప్రతిపదార్థం:** కౌంతేయులు= కుంతీపుత్రులు-పాండవులు; కపటద్యూతమునందున్= మోసపుజూదంలో; సౌబలునిచేన్= శకునిచేత; ఆత్మీయరాజ్యపదభ్రంశమున్= తమదైన రాజ్యస్థానంనుండి జారుపాటును - స్వీయ రాజ్యభ్రష్టతను; పొంది; సత్యనిరతిన్= సత్యమునందలి అత్యంతాసక్తిచేత; శక్త+ఆత్ములు+ఐ+ఉండియున్= సమర్థులై ఉండికూడా; కుపితస్వాంతులు+ కాక= కోపించిన మనస్సులు కలవారు కాకుండా; తద్+సమయసంక్షోభంబు+కాక+ఉండఁగాన్= ద్యూత నియమానికి భంగం కలుగకుండేటట్లు; విపిన+ఆవాసమున్= అరణ్యావాసమూ; గూఢచర్యయును= రహస్యవర్తనమూ, (అజ్ఞాతవాసమూ); కావింపన్+ తలంపు= చేయాలనే ఆలోచన; ఒప్పదే?= తగదా? బాగుకదా!

**తాత్పర్యం:** 'పాండవులు జూదంలో శకుని కుటిలత్వం చేత తమ రాజ్యం కోలుపోయి, సమర్థులై ఉండి కూడా, సత్యంపై ఉండే అత్యంతాసక్తిచేత, కుపితమనస్కులుగాక, ద్యూత నియమానికి భంగం కలగకుండా, అరణ్యాజ్ఞాతవాసాలు చేయనెంచడం సముచితం కాదా?

**విశేషం:** సౌబలుడు (శకుని) గాంధారదేశాధిపతియైన సుబలుడి కొడుకు. గాంధారికి అన్న. దుర్యోధనాదుల మేనమామ. దుర్యోధనుడి పక్షాన ఇతడే ధర్మరాజుతో జూదం ఆడి మోసంతో అతడిని ఓడించాడు. కౌంతేయులంటే కుంతి కొడుకులే

అయినా, పాండవుల కందరికీ వర్తిస్తుంది. సమర్థులై ఉండికూడా, కోపం తెచ్చుకోక, ద్యూత నియమోల్లంఘనం చేయక, అరణ్యాజ్ఞాతవాసాలు చేయ నెంచడం పాండవుల సత్యనిరతికి నిదర్శనం. 'సత్యమేవ జయతే'- అనే న్యాయాన్ని అనుసరించి వారికి విజయం కలుగాలని ధ్వని.

**ఆ. తలఁచినట్ల వ్రతము సలిపి యమ్మాడ్కిఁ బం । డ్రెండు వత్సరములు పాండవేయు**
**లకట! క్రూరసత్త్వ యాతుధానావలి । తోడఁ గాననమునఁ గూడి మనరె? 8**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; పాండవేయులు= పాండవులు; తలఁచినట్ల (తలఁచిన+అట్లు+అ)= అనుకొన్న విధంగానే; వ్రతముసలిపి= నియమం పాటించి; అమ్మాడ్కిన్ (ఆ+మాడ్కిన్)= ఆ రీతిగా; పంద్రెండువత్సరములు= పన్నెండేళ్ళు; కాననమునన్= అడవిలో; క్రూరసత్త్వయాతుధాన+ఆవలితోడన్= క్రూరమృగాలతోనూ, రాక్షససమూహంతోనూ; కూడి= కలిసి; మనరె= జీవించరా?

**తాత్పర్యం:** అయ్యో! పాండవులు అనుకొన్న విధంగానే నియమం పాటించి ఆ రీతిగా పన్నెండేళ్లు అడవిలో క్రూరమృగాలతోనూ, రాక్షస సమూహంతోనూ కలిసి జీవించలేదా?

**విశేషం:** సత్యధర్మ నిరతి వలన పాండవులు ఉదాత్తు లనిపించుకొన్నారు. కపటద్యూతంలో ధర్మజుడు దిగ్విజయం చేసి సంపాదించుకొన్న సంపదను కౌరవులు అపహరించారు. ఉద్ధతులు, కపటులు అనిపించుకొన్నారు. పాండవులు బలవంతులైనా వారిని కోపంతో మట్టుపెట్టలేదు. సమయ సంక్షోభాన్ని సృష్టించలేదు. సత్యాన్ని పాటించి, ధర్మాన్ని రక్షించారు. కాబట్టి 'ధర్మో రక్షతి రక్షితః' అనే న్యాయం వారిపట్ల వర్తిస్తుంది అని భావం. ధార్మికులను ధర్మం ధర్మపరుల సహాయరూపంగా సమకూడి రక్షిస్తుందని ధ్వని. శ్రీకృష్ణుడు తన ప్రతిపాదనకు తగిన ప్రాతిపదికను పద్యంలో బలంగా వేసి వాదకుశలు డనిపించుకొన్నాడు. (సంపా.)

**క. పదపడి, దుస్తరమగు నీ । పదుమూఁడగునేఁడు గడవఁబడుట యరిది; త**
**మ్మెదు రెఱుఁగమికై యాపద । లొదవిన సైరించి; రిట్టి యునికియుఁ గలదే? 9**

**ప్రతిపదార్థం:** పదపడి= పిమ్మట; దుస్తరము+అగు= దాటశక్యంకాని; ఈ పదుమూఁడగు+ఏఁడు= ఈ పదమూడో యేడు (అజ్ఞాతవాస సంవత్సరం); కడవన్+పడుట= దాటటం; అరిది= దుష్కరం; తమ్మున్= తమను; ఎదురు= శత్రువును, ఎఱుఁగమికై= తెలిసికొనకుండా ఉండటానికి; ఆపదలు= కష్టాలు; ఒదవినన్= కలిగినా; సైరించిరి= ఓర్చుకొన్నారు; ఇట్టి ఉనికియున్= ఇటువంటి జీవనం కూడా; కలదే= ఉన్నదా? (లేదని భావం.)

**తాత్పర్యం:** అరణ్య వాసానంతరం దాటశక్యం కాని అజ్ఞాతవాస సంవత్సరమైన ఈ పదమూడో యేడు గడపటం దుష్కరం. తమను శత్రువు తెలిసికోకుండా ఉండటానికి ఎన్ని ఆపదలు సంభవించినా వీళ్ళు సహించారు. ఇటువంటి బ్రదుకు ఉంటుందా?

**విశేషం:** తమను శత్రువు తెలిసికొంటే ద్యూతనియమం ప్రకారం మళ్ళీ పన్నెండేళ్ళు అరణ్యావాసం, ఒక యేడు అజ్ఞాతవాసం చేయాలి. అందుచేత అజ్ఞాతవాస సంవత్సరంలో ఎన్ని ఆపదలు వచ్చినా పాండవులు సహించారు. ఇంత కష్టపుబ్రదుకు ఎక్కడా ఉండదని భావం. పాండవుల పట్ల పారిషదుల సానుభూతిని సమకూర్చే సంభాషణ మిది.

**క. మీరలు ధర్మజు వర్తన । గౌరవ మెఱుఁగుదుర కాదె? కావున నా గాం**
**ధారీ తనూభవులకును, । వీరలకును హితమగా వివేకప్రౌఢిన్. 10**

**ప్రతిపదార్థం:** మీరలు= మీరు; ధర్మజు= ధర్మరాజుయొక్క; వర్తన గౌరవము= నడవడియొక్క గొప్పతనం; ఎఱుఁగుదురు+అ+కాదె!= తెలిసినవారే కదా!; కావునన్= కాబట్టి, ఆ గాంధారీ తనూభవులకును= గాంధారి కొడుకులైన ఆ కౌరవులకూ; వీరలకును= వీరికీ- పాండవులకూ; హితము+అ+కాన్= మేలు అయ్యే విధంగా; వివేక ప్రౌఢిన్= విచారణ సామర్థ్యంతో.

**తాత్పర్యం:** మీరు ధర్మరాజు సత్ప్రవర్తనం తెలిసినవారే కదా! కాబట్టి ఆ కౌరవులకూ, ఈ పాండవులకూ మేలు కలిగే విధంగా విచారణ శక్తితో (తరువాత పద్యంలోని 'తలఁపుఁడు' అనే క్రియతో అన్వయం.)

**విశేషం:** కౌరవ పాండవులకు ఉభయులకూ మేలు కలుగవలెనంటే బాగా విచారణ చేసే నేర్పు ఉండాల్సిందే.

**తే. ధర్మమార్గంబు దప్పక తలఁపుఁ డొక్క । తెఱఁగు; ధర్మువు దప్పి యుధిష్ఠిరుండు**
**పడయ నొడఁబడఁ డయ్యింద్రపదవియైన; । నుచితగతి నెంత వడసిన నుల్లసిల్లు. 11**

**ప్రతిపదార్థం:** ధర్మమార్గంబు; తప్పక= విడువక; ఒక్క తెఱఁగు= ఒక విధం; తలఁపుఁడు= ఆలోచించండి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ధర్మువు+తప్పి= అధర్మంగా; ఆ+ఇంద్రపదవి+ఐనన్= ఉన్నతమైన ఆ ఇంద్రపదవిని కూడా; పడయన్= పొందటానికి; ఒడఁబడఁడు= అంగీకరించడు; ఉచిత గతిన్= తగిన రీతిని; ఎంత+పడసినన్= ఎంత తక్కువ లభించినా; ఉల్లసిల్లున్= సంతోషిస్తాడు.

**తాత్పర్యం:** ధర్మమార్గం విడిచిపెట్టకుండా ఏదయినా ఒక విధం ఆలోచించండి. ధర్మరాజు అధర్మపద్ధతిన అత్యున్నతమైన ఆ ఇంద్రపదవి లభించినా అంగీకరించడు. సముచితమార్గంలో ఎంత తక్కువ లభించినా సంతోషిస్తాడు.

**విశేషం:** అలం: వినోక్తి. ధర్మరాజుకు ధర్మం ముఖ్యం. పదవి కాదు అని భావం.

**వ. కావునఁ బాండవులకుఁ బితృధనంబగు రాజ్యంబుఁ గపటద్యూతంబున దుర్యోధనుఁ డపహరించుటయు, నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించుకొన్న పదం బగుటయు; ధర్మసూను మహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం గీడు రోయమియు, నీరెండు దెఱంగుల వారికిం బంచి కుడువందగుటయుం దలపోసి, తగిన కార్యంబు సెప్పనర్హులు; రేనును నాకన్నంత సెప్పెద వినుండు. 12**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి, పాండవులకున్; పితృధనంబు+అగు= తండ్రి సొత్తు అయిన; రాజ్యంబున్; కపట ద్యూతంబునన్= మోసపుజూదంలో; దుర్యోధనుఁడు; అపహరించుటయున్= దొంగిలించటం; అది= ఆ రాజ్యం; వీరలు= వీరు (పాండవులు); దిగ్విజయంబున్+చేసి= దిక్కులను (ఆయాదిక్కులలోని రాజ్యాలను) గెలవటంచేత; అలవరించుకొన్న పదంబు= సంపాదించుకొన్న స్థానం; అగుటయున్= కావటం; ధర్మసూను మహానుభావంబు= ధర్మరాజు గొప్పతనం; విచారింపక= ఆలోచించక; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుడి కుమారులు-దుర్యోధనాదులు; పరిభవించినన్= అవమానించగా; తెగి= సాహసించి; ఇతండు= ధర్మరాజు; వారలకున్= కౌరవులకు; కీడు= హాని; రోయమియున్= తలపెట్టకపోవటం; ఈ రెండు తెఱంగులవారికిన్=

ఈ రెండు పక్షాలవారికీ; పంచి కుడువన్+తగుటయున్= విభజించుకొని అనుభవించతగి ఉండటం; తలపోసి= ఆలోచించి; తగిన కార్యంబు= తగిన కర్తవ్యం; చెప్పన్; అర్హులరు= తగినవారు; ఏను= నేను కూడా; నా కన్న+అంత= నేనెరిగినంత; చెప్పెదన్= చెపుతాను; వినుండు= వినండి.

**తాత్పర్యం:** కాబట్టి, పాండవులకు తండ్రి సొత్తయిన రాజ్యాన్ని మోసపు జూదంలో దుర్యోధనుడు అపహరించటమూ, అది వీరు దిక్కులను జయించి సంపాదించుకొన్నది కావటమూ, ధర్మరాజు మహానుభావం ఆలోచించక దుర్యోధనాదులు అవమానించినా సాహసించి ఈ ధర్మరాజు వాళ్ళకు ఎటువంటి హానీ చేయ తలపెట్టకపోవటమూ, ఈ రెండు పక్షాల వారికీ పంచుకొని అనుభవించదగింది అవటమూ విచారించి, తగిన కర్తవ్యం ఉపదేశించటానికి మీరు తగినవారు. నేను కూడా నేనెరిగినంతలో చెప్పుతాను వినండి.

**విశేషం:** ఈ మాటలలో శ్రీకృష్ణుడి వాఙ్నైపుణ్యం తెలుస్తున్నది. పాండవులకు రాజ్యం తండ్రి నుండి వచ్చినది. దానిని దుర్యోధనుడు అన్యాయపు జూదంలో అపహరించాడు. అది పాండవుల కష్టార్జితం. ధర్మరాజు ఎంతటి మహానుభావుడో తెలియక దుర్యోధనాదులు అవమానిస్తే, అతడు వాళ్ళకు కీడు తలపెట్టలేదు. రాజ్యం ఈ రెండు పక్షాలవారూ పంచుకొని అనుభవించదగింది. సభ్యులు సముచిత కర్తవ్యోపదేశం చేసే ముందు ఈ అంశాల నన్నిటినీ దృష్టిలో పెట్టుకొనాలి - అని శ్రీకృష్ణుడి హెచ్చరిక. శ్రీకృష్ణుడి మాటలలోని హేతుబద్ధత మెచ్చదగింది.

**క. కుంతీతనయులు సమయము । శాంతతమై నడపి, తమ భుజాబలమును, దు**
**ర్దాంతోద్యమ శౌర్యము నెఱిఁ । గింతు మనుచు నున్నవారు గినుక నెదఁ గదురన్. 13**

**ప్రతిపదార్థం:** కుంతీ తనయులు= కుంతి కొడుకులు - పాండవులు; సమయము= (ద్యూత) నియమాన్ని; శాంతతమైన్= శాంతితో; నడపి= పాటించి; కినుక= కోపం; ఎదన్= హృదయంలో; కదురన్= అతిశయించగా; తమ భుజాబలమును= తమ భుజపరాక్రమమునూ; దుర్దాంత+ఉద్యమ శౌర్యమున్= నిగ్రహించవీలుకాని, పూనికగల పరాక్రమమునూ; ఎఱిఁగింతుము+ అనుచున్+ఉన్నవారు= తెలపాలనుకొంటున్నారు.

**తాత్పర్యం:** పాండవులు ద్యూత నియమాన్ని శాంతంగా పాటించి, కోపం హృదయంలో అతిశయించగా, తమ భుజబలాన్నీ, నిగ్రహించరాని పూనికతోకూడిన పరాక్రమాన్నీ కౌరవులకు చూపాలనుకొంటున్నారు.

**విశేషం:** జూదానికి ముందు చేసికొన్న నియమాన్ని శాంతంగానే పాటించారు పాండవులు. అంతవరకూ తమ హృదయాలలో అణచిపెట్టబడిన కోపం పెల్లుబికి అనివార్యమైన తమ పరాక్రమం ప్రదర్శించాలనుకొంటున్నారు. ఇది వారి ధర్మనిరతినీ, పరాక్రమాన్నీ సూచిస్తుంది. అంతదాకా వారు ఊరుకొనటం చేతగాక కాదు; ధర్మపరాయణులు అవటం వలన మాత్రమే.

**క. వీరి తలం పెఱిఁగిన గాం । ధారీ తనయుఁడు సుహృద్వితానముఁ గూర్చుం,**
**'బోరఁ బరిమార్తుఁ గొంచెపు । వారై యున్నెడన' యని యవశ్యముఁ గడఁకన్. 14**

**ప్రతిపదార్థం:** వీరి= ఈ పాండవులయొక్క; తలంపు= అభిప్రాయం; ఎఱిఁగిన= తెలిసిన; గాంధారీ తనయుఁడు= గాంధారి కొడుకు- దుర్యోధనుడు; కొంచెపువారై (కొంచెము+వారు+ఐ)= అల్పసంఖ్యాకులయి; ఉన్న+ఎడన్+అ= ఉన్నప్పుడే; పోరన్= యుద్ధంలో; పరిమార్తున్= చంపుతాను; అని; అవశ్యమున్= తప్పనిసరిగా; కడఁకన్= ప్రయత్నంతో; సుహృద్+వితానమున్= మిత్రుల సమూహాన్ని; కూర్చున్= సమకూర్చుకొంటున్నాడు.

**తాత్పర్యం:** ఈ పాండవుల అభిప్రాయం తెలిసిన దుర్యోధనుడు 'అల్పసంఖ్యాకులై ఉన్నప్పుడే శత్రువులను యుద్ధంలో చంపుతా'నని అనివార్యమైన పూనికతో మిత్రబృందాన్ని సమకూర్చుకుంటున్నాడు.

**విశేషం:** 'శత్రువు అల్పుడై ఉన్నప్పుడే సాధించాలి' అనే రాజనీతిని దుర్యోధనుడు పాటించి, పాండవులను యుద్ధంలో చంపటానికి మిత్రులను కూర్చుకొని సన్నద్ధుడవుతున్నాడు. ఇది ఆతడి యుద్ధనీతికి నిదర్శనం.

**క. అలఘు బల విక్రమోదా । త్తుల కైనను బలము లేక దోర్గర్వముమై**
**గెలువఁగ వశమె, సహాయము । కలిమి ననంతంబు లగు పగఱసైన్యములన్? 15**

**ప్రతిపదార్థం:** అలఘు బల విక్రమ+ఉదాత్తులకున్+ఐనను= అధిక బలపరాక్రమాలచేత గొప్పవారైన వారికి కూడా; సహాయము కలిమిన్= తోడ్పాటు ఉండటం చేత; అనంతంబులు+అగు= అంతం లేని; పగఱ సైన్యములన్= శత్రుసేనలను; బలము లేక= సైన్యం లేకుండా; దోర్గర్వముమైన్ (దోః+గర్వము+మైన్)= భుజబలగర్వంతో; గెలువఁగన్+వశమె= గెలువ శక్యమా? (కాదని భావం.)

**తాత్పర్యం:** ఎంతటి బలపరాక్రమ సంపద కలవారికైనా, సహాయసంపద కలిగిన అనంతమైన శత్రుసైన్యాన్ని, నిస్సహాయంగా కేవల భుజబలగర్వంతోనే గెలవటం సాధ్యమవుతుందా?

**విశేషం:** దుర్యోధనుడివలెనే, పాండవులు కూడా కేవలం తమ భుజబలాన్నే నమ్ముకొని కూర్చుండక, సహాయసంపద గలిగి అనంతమైన శత్రుసైన్యాన్ని గెలవడానికి మిత్రబలాల్ని కూర్చుకోవాలని శ్రీకృష్ణుడి సూచన.

**క. కావునఁ బాండవ పక్షము । భూవల్లభకోటి యిచటఁ బ్రోవగు; నిమ్మై**
**నీ వీరులు, నా వీరులు । దేవాసురులట్ల యనికిఁ దెగుదురు గడిమిన్. 16**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; పాండవ పక్షము భూవల్లభకోటి= పాండవుల పక్షంలోని రాజుల సమూహం; ఇచ్చటన్= ఇక్కడ; ప్రోవు+అగున్= చేరుతుంది; ఇమ్మైన్ (ఈ+మైన్)= ఈ విధంగా; ఈ వీరులున్= పాండవవీరులూ; ఆ వీరులున్= ఆ కౌరవవీరులూ; దేవాసురులట్ల (దేవ+అసురుల+అట్లు+అ)= దేవతలు రాక్షసులు మాదిరిగానే; కడిమిన్= పరాక్రమంతో; అనికిన్= యుద్ధానికి; తెగుదురు= సాహసిస్తారు.

**తాత్పర్యం:** కాబట్టి, పాండవుల పక్షంలోని రాజుల సమూహం ఇక్కడ కూడుతుంది. ఈ రీతిగా పాండవ వీరులూ, కౌరవవీరులూ దేవతలు రాక్షసుల వలెనే పరాక్రమంతో యుద్ధానికి తెంపు వహిస్తారు.

**విశేషం:** అలం: ఉపమ, యథాసంఖ్యము. 'ఈ వీరులు నా వీరులు దేవాసురులట్ల' అనటంలోని క్రమాన్వయం చొప్పున పాండవులకు దేవతలతోనూ, కౌరవులకు అసురులతోనూ పోలిక సిద్ధిస్తున్నది. దేవాసుర యుద్ధంలో చివరికి దేవతలదే విజయం కాబట్టి, పాండవ కౌరవ యుద్ధంలో పాండవులదే విజయం అని శ్రీకృష్ణుడు సూచించినట్లయింది. దేవాసురయుద్ధంతో పోలికవలన భావి పాండవ కౌరవ యుద్ధం కూడా అతిభీకరంగా ఉండగలదని సూచన.

**వ. ఇది యిక్కడి తెఱంగునకుఁ దోఁచిన తలం; పక్కడివారి చిత్తవృత్తి యెట్టిదగుట యెఱుంగ; మెదిరిమతంబెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప వెరవగునే? కావున ని య్యవసరంబునం దగిన మానిసి నందులకుం**

**బుచ్చవలయు; దుర్యోధనుండు వీరికి రాజ్యంబు పా లిచ్చిన మేలగుఁగాక, తక్కిన నప్పటికిఁ బోలినపని సూచుకొంద'మని పలికిన విని బలదేవుం డియ్యకొని రాజలోకంబు నాలోకించి యిట్లనియె.** **17**

**ప్రతిపదార్థం:** ఇది; ఇక్కడి తెఱంగునకున్= ఇక్కడి పరిస్థితికి; తోఁచిన తలంపు= స్ఫురించిన అభిప్రాయం; అక్కడి వారి= అక్కడనున్న కౌరవులయొక్క; చిత్తవృత్తి= మనఃస్థితి; ఎట్టిదగుట (ఎట్టిది+అగుట)= ఎట్లా ఉన్నదీ; ఎఱుంగము= తెలియము; ఎదిరిమతంబు= ఎదుటివారి (శత్రువు) అభిప్రాయం; ఎఱుంగక= తెలిసికోకుండా; ఎట్టికార్యంబు= ఏపనినీ; నిశ్చయింపన్= నిర్ణయించడానికి; వెరవు+అగునే?= వీలవుతుందా?; కావునన్; ఇయ్యవసరంబునన్ (ఈ+అవసరంబునన్)= ఈ సమయంలో; తగిన మానిసిన్= అర్హుడైనవాడిని; అందులకున్= అక్కడికి- కౌరవసభకు; పుచ్చవలయున్= పంపాలి; దుర్యోధనుండు; వీరికిన్= పాండవులకు; రాజ్యంబుపాలు= రాజ్యభాగం; ఇచ్చినన్= ఇస్తే; మేలు+అగున్= మంచిది; కాక తక్కినన్= అట్లాకాకపోతే- రాజ్యభాగం ఇవ్వని పక్షంలో; అప్పటికిన్= ఆ సమయానికి; పోలినపని= తగిన కార్యం; చూచుకొందము= ఆలోచిద్దాం; అని; పలికినన్= పలుకగా; విని; బలదేవుండు= బలరాముడు; ఇయ్యకొని= సమ్మతించి; రాజలోకంబున్= రాజుల సమూహాన్ని; ఆలోకించి= చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇదీ ఇక్కడి పరిస్థితికి అనురూపమైన అభిప్రాయం. అక్కడి వారి మనఃస్థితి ఎట్లా ఉందో మనకు తెలియదు. ఎదుటివారి అభిప్రాయం తెలిసికొనకుండా ఏ కార్యాన్నీ నిశ్చయించటం మంచిదికాదు. కాబట్టి ఈ సమయంలో తగినవాడిని కౌరవసభకు పంపాలి. దుర్యోధనుడు వీరికి రాజ్యభాగం ఇస్తాడా మంచిది. ఇవ్వకపోతే ఏం చేయాలో ఆ సమయానికి చూచుకొందాం-' అని పలుకగా విని బలరాముడు దానికి సమ్మతించి రాజసమూహాన్ని చూచి ఇట్లా అన్నాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడి మాటలు అతడి కార్యనిపుణత్వాన్ని సూచిస్తున్నాయి.

**క.** **'హరి వాక్యము వింటిరె? యిది । యిరు దెఱఁగుల జనములకును హితమును ధర్మో**
**త్తరమును నైయున్నది యీ । వెరవున శక్యంబు మనకు వీరలఁ దీర్పన్.** **18**

**ప్రతిపదార్థం:** హరివాక్యమున్= శ్రీకృష్ణుడు చెప్పినమాట; వింటిరె?= విన్నారా?; ఇది= ఈ వచనం; ఇరు+తెఱఁగుల జనములకును= రెండు పక్షాల జనులకూ; హితమును= మేలును; ధర్మోత్తరమునున్= ధర్మంచేత శ్రేష్ఠమైనదీ; ఐ+ఉన్నది= అయి ఉన్నది; ఈ వెరవునన్= ఈ ఉపాయాన; మనకున్; వీరలన్= ఈ కౌరవపాండవులను; తీర్పన్= సమాధానపరచటానికి; శక్యంబు= సాధ్యం.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు చెప్పింది విన్నారా? ఇది ఇరుపక్షాల వారికీ మేలయినదీ; ధర్మయుక్తమైనదీ అవడంచేత శ్రేష్ఠమైనదీ అయి ఉంది. ఈ మార్గంలో మనకు ఈ ఉభయుల్నీ సమాధానపరచడం సాధ్యం.

**విశేషం:** శ్రీకృష్ణుడి హితవులో హితం, ధర్మం రెండూ కలిసి ఉండటం చేత ఆ సలహా పాటిస్తే పాండవకౌరవులకు హితం కలుగుతుంది, ధర్మయుక్తంగా ఉండటం చేత లోకులందరూ సంతోషిస్తారని భావం, (సంపా.).

**చ.** **తమ సగపాలు గోలుపడి దానిన యిప్పుడు గోరు వీరికిన్**
**సముచితవృత్తి నిచ్చి తమ సామున సంతసమంది యున్కి యు**
**క్తము ధృతరాష్ట్రసూనునకు; దాన నపాయము లేకయుండుఁ; గో**
**పముడిగి వీరు సేయుదురు బాంధవ; మిజ్జగముం బ్రియంపడున్.** **19**

**ప్రతిపదార్థం:** తమసగపాలు= తమ సగంభాగం; కోలుపడి= పోగొట్టుకొని; దానిన (దానిన్+అ)= దానినే; ఇప్పుడు; కోరువీరికిన్= కోరుకొంటున్న పాండవులకు; సముచిత వృత్తిన్= తగినరీతిగా ఇచ్చి; తమసామునన్= తమ సగం భాగంతో; సంతసము+అంది+ ఉన్కి= సంతోషపడి ఉండటం; ధృతరాష్ట్రసూనునకున్= ధృతరాష్ట్రుడి కొడుకు- దుర్యోధనుడికి; యుక్తము= తగినది; దానన్= దానిచేత; అపాయము లేక+ఉండున్= చెరుపు ఉండదు; వీరు= ఈ పాండవులు; కోపము+ఉడిగి= కోపం విడిచి; బాంధవము= చుట్టరికం; చేయుదురు= కొనసాగిస్తారు; ఇజ్జగమున్ (ఈ+జగమున్)= ఈ లోకం; ప్రియంపడున్ (ప్రియము+పడున్)= సంతోషిస్తుంది.

**తాత్పర్యం:** తమ సగం భాగం కోలుపోయి దానినే ఇప్పుడు కావాలంటున్న పాండవులకు సముచితంగా దానిని ఇచ్చి, తమ సగంతో తృప్తిపడి ఉండటం దుర్యోధనుడికి మంచిది. దానిచేత కీడు ఉండదు. పాండవులు కోపం విడిచి బంధుత్వం చూపుతారు. ఈ లోకం కూడా సంతోషిస్తుంది.

**విశేషం:** జూదంలో కోలుపోయింది రాజ్యంలోని తమసగపాలే కాబట్టి, దానిని పాండవులు కోరటం, కౌరవులివ్వడం, ఉన్నదాంతో తృప్తిపడటం దుర్యోధనుడికి మంచిదనీ, జరిగినదానిని మనసులో పెట్టుకొని పగ సాధించకుండా కౌరవులతో కలిసి జీవించటం పాండవులకు మంచిదనీ బలరాముడి అభిప్రాయం. ఇంతవరకూ బలరాముడు శ్రీకృష్ణుడి వాదాన్నే బలపరిచాడు.(సంపా).

**వ. కావున నిక్కార్యం బెడసేయక యొక్కరుం బనుపవలయు; వాఁడునుం జని యభిమతంబు సాధించునప్పుడు.** 20

**ప్రతిపదార్థం:** కావునన్; ఇక్కార్యంబు (ఈ+కార్యంబు)= ఈ పని; ఎడ+చేయక= ఆలస్యం చేయకుండా; ఒక్కరున్= ఒక్కడిని; పనుపవలయున్= పంపాలి; వాఁడునున్= ఆతడునూ; చని= వెళ్ళి; అభిమతంబు= అనుకొన్నది; సాధించు+అప్పుడు= సాధించేటప్పుడు.

**తాత్పర్యం:** కాబట్టి, ఈ పని ఆలస్యం కాకుండా ఒక్కణ్ణి అక్కడికి పంపాలి. అతడు కూడా వెళ్ళి, తాను అనుకొన్నది సాధించేటప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. మాట పొందెఱింగి, యోటమై నల్లన । చేరి, కౌరవేంద్రు చిత్తవృత్తి**
**కనుగుణంబుగాఁగ నానతుం డగుచుఁ బ్రా । ర్థించి యడుగకున్నఁ దెఱఁగుపడదు.** 21

**ప్రతిపదార్థం:** మాటపొందు= మాటలపొందిక; ఎఱింగి= తెలిసి; ఓటమైన్= వినయంతో; అల్లన= మెల్లగా; చేరి= దగ్గరై; కౌరవేంద్రు (కౌరవ+ఇంద్రు)= కౌరవశ్రేష్ఠునియొక్క - దుర్యోధనుడియొక్క; చిత్తవృత్తికిన్= మనఃస్థితికి; అనుగుణంబు+ కాఁగన్= అనుకూలంగా; ఆనతుండు+అగుచున్= మిక్కిలి నమ్రతతో వంగినవాడు అవుతూ; ప్రార్థించి= వేడుకొని; అడుగక+ ఉన్నన్= అడగకపోతే; తెఱఁగు పడదు= చక్కబడదు.

**తాత్పర్యం:** మాటతీరు తెలిసి వినయంతో మెల్లగా చేరి దుర్యోధనుడి మనఃస్థితి కనుకూలంగా వినమ్రుడై వేడుకొని అడుగకపోతే వ్యవహారం చక్కబడదు.

**విశేషం:** రాయబారి అయినవాడు ప్రవర్తించవలసిన తీరు బలరాముడు బాగా వివరించాడు. బలరాముడి మాటలలో పాండవుల దైన్యమూ, కౌరవుల ఆధిక్యమూ ధ్వనిస్తున్నాయి.

**వ. అది యెట్లనిన, ధర్మనందనుం డతని యుద్ధతికిం బుయిలోడి, మెయివడిగల నడవడిం బ్రవర్తిల్లుచుండియు, జూదంబు వెంట మోసపోయి, తొడరి చిక్కునం బడియె; అదియును నతం డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమింజేసియు, బంధుజనంబులు దన్ను వారించుటయుఁ, దా నాడుట మాని గాంధారరాజును నియమించినం, దత్కళా కౌశలంబునం బరిణతుండు గావున నా శకుని యాడి, యుధిష్ఠిరుం దొడ్డిన యొడ్డిమియు గెలుచుచు వచ్చె నట్లగుట, నాతని యందును గొఱంత లే; దిత్తెఱంగున వార లధర్మపరులని నిందింపరాకునికి కారణంబుగా వీరలు వుచ్చినమానిసి వినయంబుతోన యిక్కార్యంబు దీర్చికొని రావలయు' ననిన, సాత్యకి కోపించి యిట్లనియె. 22**

**ప్రతిపదార్థం:** అది; ఎట్లు; అనినన్; ధర్మనందనుండు= ధర్మరాజు; అతని+ఉద్ధతికిన్= ఆ దుర్యోధనుడి గర్వానికి; పుయిలోడి= సంకోచించి; మెయివడి+కల నడవడిన్= సౌమ్యతగల ప్రవర్తనంతో; ప్రవర్తిల్లుచున్+ఉండియున్= నడచుకొంటూ ఉండీ; జూదంబువెంటన్= ద్యూతద్వారమున; మోసపోయి; తొడరి= తొట్రుపడి; చిక్కునన్+పడియెన్= కష్టం పొందాడు; అదియునున్; అతండు= ఆ దుర్యోధనుడు; అక్షవిద్యాపాటవంబు= ద్యూతకళయందు నేర్పు; మిగులన్= మిక్కిలి; లేమిన్+ చేసియున్= లేకపోవటంచేతను; బంధుజనంబులు= చుట్టాలు; తన్నున్= తనను (దుర్యోధనుడిని); వారించుటయున్= అడ్డగించటంవలనను; తాను+ఆడుటమాని= తాను ఆడటం మాని; గాంధారరాజును= గాంధారదేశపురాజును (శకునిని); నియమించినన్= ఏర్పాటుచేయగా; తద్+కళాకౌశలంబునన్= ఆ ద్యూతవిద్యయందలి నేర్పులో; పరిణతుండు= పండినవాడు- ఆరితేరినవాడు; కావునన్; ఆ-శకుని; ఆడి= జూదమాడి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఒడ్డిన= పందెం కాసిన; ఒడ్డిమియున్= పందెపు ద్రవ్యాన్ని, కాపునూ; గెలుచుచున్ వచ్చెన్= గెలుస్తూ వచ్చాడు. అట్లు+అగుటన్= అట్లా కావడం చేత; ఆతనియందును= ఆ దుర్యోధనుడియందుకూడా; కొఱంత= తప్పు; లేదు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; వారలు= కౌరవులు; అధర్మపరులు+అని= అన్యాయపరులని; నిందింపరాక+ఉనికి= నిందించటానికి వీలులేకపోవటం; కారణంబు+కాన్= కారణం కావటంచేత; వీరలు= పాండవులు; పుచ్చినమానిసి= రాయబారిగా పంపే మనుష్యుడు; వినయంబు+తోన్+అ= అడకువతోనే; ఈ+కార్యంబు= ఈ రాయబారపుపనిని; తీర్చికొని రావలయున్= సాధించుకొనిరావాలి; అనినన్; సాత్యకి= శ్రీకృష్ణబలరాముల తమ్ముడు; కోపించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అది ఎట్లా అంటే - ధర్మరాజు ఆ దుర్యోధనుడి గర్వానికి సంకోచించి సౌమ్యంగానే ప్రవర్తిల్లుతూ, జూదంలో మోసపోయి, తొట్రుపాటుతో కష్టాలలో పడ్డాడు. అదికాక, దుర్యోధనుడు ద్యూతవిద్యలో ఎక్కువ నేర్పు లేకపోవటంచేతా, చుట్టాలు తనను వారించడంచేతా, తను ఆడటంమాని శకునిని నియమించాడు. ఆ శకుని ద్యూతవిద్యలో పండినవాడుకావటంచేత జూదమాడి ధర్మరాజు పందెంలో కాసిన పందెమెల్లా గెలుస్తూ రావటం వలన ఆ దుర్యోధనుడిలో కూడా తప్పులేదు. ఆ విధంగా కౌరవులు అన్యాయపరులని నిందించటానికి వీలుకాక పోవటం కారణంగా, పాండవులు పంపిన మనుష్యుడు వినయంతోనే ఈ రాయబారపు కార్యం సాధించుకొనిరావాలి.' ఆ మాటలు విని సాత్యకి కోపంతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** దుర్యోధనుడు గదాయుద్ధంలో బలరాముడికి శిష్యుడు. అందుచేతనే అతడి మాటలలో శిష్యవాత్సల్యం కనిపిస్తున్నది. దుర్యోధనుడికి జూదం ఆడటం చేతకాకపోతే ధర్మరాజును జూదానికి పిలవటం ఎందుకు? అది తప్పుకాదా? తన బదులు శకునిని ఆడమనడం తప్పుకాదా? శకుని ద్యూతకళాకౌశలమే ధర్మరాజు ఓడిపోవడానికి కారణం అంటున్నాడు కాని, అతడు మోసం చేశాడు అనటం లేదు. అందుచేత కౌరవులలోనూ దోషం ఉన్నదనడానికి వీలులేదట. ఈ విధమైన బలరాముడి వాదం అతడికి దుర్యోధనుడిపైగల శిష్యవాత్సల్యాన్నే చాటుతున్నది. అది గ్రహించటంవలననే సాత్యకికి అతడిపై కోపం వచ్చింది.

## సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపఁగూడదని చెప్పుట (సం. 5-3-1)

**ఆ. 'ఇట్టు లాడఁదగునె? యిది నీక పోలు ని । న్నేమనంగ నేర్తు? నిత్తెఱంగు**
**పాడి గాఁగఁ బూని పలుకంగఁ జెవి యొడ్డి । యాదరించువారి నందుఁగాక! 23**

**ప్రతిపదార్థం:** ఇట్టులు= ఈ విధంగా; ఆడన్+తగునె?= మాటాడవచ్చునా?; ఇది; నీకున్+అ= నీకే; పోలున్= తగును; ఈ+తెఱంగు= ఈ విధానం; పాడి+కాఁగన్= ధర్మంగా; పూని= ప్రయత్నించి; పలుకంగన్= పలికితే; చెవి+ఒడ్డి= చెవిఒగ్గి-శ్రద్ధతో; ఆదరించువారిన్= మన్నించేవాళ్ళను; అందున్+కాక= అంటానుగాని; నిన్నున్; ఏమి+అనంగన్+నేర్తున్?= ఏమి అనగలను?

**తాత్పర్యం:** 'ఇట్లా మాటాడవచ్చునా? ఇది నీ కొక్కడికే తగును. దుర్యోధనుడు చేసిన పద్ధతి ధర్మబద్ధమని నీవు ప్రయత్నించి అంటూంటే చెవి ఒగ్గి విని నిన్ను మన్నించేవాళ్ళను అంటానుగాని, నేను నిన్ను ఏమనగలను?

**విశేషం:** బలరాముడి వాదం దుర్యోధన పక్షపాతంతో కూడినదనీ, అది క్షంతవ్యం కాదనీ సాత్యకి అభిప్రాయం. అన్నవాడికంటె విన్నవాడు ఎక్కువ తప్పు చేసినవాడనే తెలుగుజాతీయం తలపునకువస్తుంది సాత్యకి మాటల్లో.

**క. వేడుక పుట్టిన జూదం । బాడెనె ధర్మజుఁడు? వార లందఱుఁ దమలోఁ**
**గూడుకొని పిలిచి బలిమిన । యాడి కపట జయము గొనుట యది దగవగునే? 24**

**ప్రతిపదార్థం:** ధర్మజుఁడు= ధర్మరాజు; వేడుక పుట్టినన్= కోరిక కలుగగా; జూదంబు; ఆడెనె?= ఆడినాడా?; వారలు+అందఱున్= వాళ్ళు అందరూ; తమలోన్+కూడికొని= తమలో తాము కూడి; పిలిచి; బలిమిన్+అ= బలవంతంగా; ఆడి= జూదం ఆడి; కపటజయము+కొనుట= మోసంతో గెలుపొందటం; అది; తగవు+అగునే?= న్యాయం అవుతుందా?

**తాత్పర్యం:** ధర్మరాజు వేడుక పడి జూదం ఆడినాడా? వాళ్ళు అందరూ - ముఖ్యంగా దుష్టచతుష్టయం - తమలో తాము కూడి ధర్మరాజును జూదానికి రమ్మని పిలిచి బలవంతంగా జూదం ఆడి మోసంతో గెలుపొందటం ధర్మం అనిపించుకొంటుందా?

**విశేషం:** సాత్యకి ఉన్నమాట అని, బలరాముడి మాటమార్పును బయటపెట్టాడు.

**క. ధర్మతనూభవు దెస దు । ష్కర్మము రూపించిన సభ నొకండును మైమైఁ**
**బేర్మి సెడక పోనేర్చునె? । ధార్మికు లిం కెట్టివారు తథ్యం బరయన్? 25**

**ప్రతిపదార్థం:** ధర్మతనూభవుదెసన్= ధర్మరాజుపక్షాన; దుష్కర్మమున్= దోషం; రూపించి= నిరూపించి; సభన్= సభలో; ఒకండును= ఒక్కడైనా; మైమైన్= సులభంగా; పేర్మి+చెడక-పోన్+నేర్చునె?= గౌరవం చెడగొట్టుకోకుండా ఉండగలడా?; తథ్యంబు+అరయన్= నిజం ఆలోచిస్తే; ధార్మికులు= ధర్మపరాయణులు; ఇంకన్+ఎట్టివారు?= ఇంతకంటె వేరుగా ఎట్లా ఉంటారు?

**తాత్పర్యం:** ధర్మరాజులో దోషం చూపించి సభలో ఏ ఒక్కడైనా సులభంగా గౌరవం కోలుపోకుండా ఉండగలడా? ఇక నిజానికి ధర్మరాజుకంటె ధార్మికులు ఎట్లా ఉంటారు?

**విశేషం:** ధర్మరాజులో దోషనిరూపణ చేయటం ఎవరికైనా గౌరవభంగకారణమే అవుతుందని సాత్యకి అభిప్రాయం. అన్నగారని మోమోటపడకుండా సాత్యకి ఉన్నమాట కుండబ్రద్దలు కొట్టినట్లు అనటం మెచ్చదగింది.

**చ. పలికినచందముల్ నెఱపి పైతృకమై చను రాజ్యభాగ మి**
**మ్ములఁ బడయం దలంచి బలముం జలమున్ నెఱపం గడంగు వీ**
**రలు నొరు వేఁడఁబోదురె? యరాతులు సాధుల మెత్తురే? రణం**
**బుల జయలక్ష్మిఁ జేకొనుటఁ బోలునె యొండొకరాజధర్మముల్? 26**

**ప్రతిపదార్థం:** పలికినచందముల్= ముందు అనుకొన్న రీతులు; నెఱపి= చేసి; పైతృకము+ఐ= పితృ సంబంధమైనదయి; చను= ఒప్పు; రాజ్య-భాగము; ఇమ్ములన్= సుఖంగా; పడయన్+తలంచి= పొందనెంచి; బలమున్= పరాక్రమమూ; చలమున్= పట్టుదలా; నెఱపన్= ప్రకటించటానికి; కడంగువీరలున్= పూనుకొనే ఈ పాండవులు; ఒరున్= ఇతరుని; వేఁడన్+పోదురె?= యాచించబోతారా?; అరాతులు= శత్రువులు; సాధులన్= మంచివాళ్ళను; మెత్తురే?= మెచ్చుకుంటారా? రణంబులన్= యుద్ధాలలో; జయలక్ష్మిన్= విజయమనే సంపదను; చేకొనుటన్= పొందటంతో; ఒండొక= వేరొక రకమైన; రాజ-ధర్మముల్= క్షత్రియధర్మాలు; పోలునె?= సరిపోలుతాయా?

**తాత్పర్యం:** ముందర అనుకొన్న రీతిగా చేసి, తండ్రివలన సంక్రమించిన రాజ్యభాగం సంతోషంగా పొందాలని బలమూ, చలమూ చూపాలనుకొంటూ ఉన్న ఈ పాండవులు కూడా ఇతరులను యాచించబోతారా? శత్రువులు మంచివాళ్ళను మెచ్చుకొంటారా? యుద్ధాలుచేసి జయలక్ష్మిని పొందటంతో వేరే ఏ రాజధర్మాలైనా సరిపోలుతాయా?

**విశేషం:** ద్యూత నియమం పాటించిన తరువాత ఎవరి రాజ్యభాగం వాళ్ళు తీసికొనాలని ముందర అనుకొన్న మాటలు. వాటి ప్రకారం పాండవులకు ఇప్పుడు తమభాగం రావాలి. పైగా అది పిత్రార్జితమైన ఆస్తి అవటం చేత పాండవులకు దానిపై హక్కు ఉన్నది. కౌరవులు న్యాయం చేయకపోతే వీళ్ళు పరాక్రమమూ, పట్టుదలా చూపగలరు. అట్లాంటి వీరు ఇతరులను యాచించబోతారా? అట్లా యాచించి మంచిగా ఉంటే శత్రువులు మెచ్చుతారా? అయినా యుద్ధంలో జయలక్ష్మిని పొందడంతో పోలే రాజధర్మం ఇంకొకటి ఏముంది? న్యాయం తమ పక్షాన ఉండగా, తాము శౌర్యవంతులయి ఉండగా పాండవులు కౌరవులను యాచించనక్కరలేదు. యుద్ధం చేసి జయలక్ష్మిని సాధించి రాజధర్మం నెరపాలని సాత్యకి నిశ్చితాభిప్రాయం.

**తే. సముచితములగు మాటలఁ జక్కఁబడక । తక్కనే, నుక్కివుం డగు ధార్తరాష్ట్రుఁ**
**గ్రూరశరముల నే నియ్యకొలుపువాఁడ । నవని కౌంతేయులకు నిచ్చునట్లుగాఁగ. 27**

**ప్రతిపదార్థం:** సముచితములు+అగు= మిక్కిలి తగిన; మాటలన్= మాటలతో; చక్కఁబడక= తిన్నబడక; తక్కనేన్= మానినట్లయితే; ఉక్కివుండు+అగుధార్తరాష్ట్రున్= కపటి అయిన దుర్యోధనుడిని; క్రూరశరములన్= క్రూరములైన బాణాలతో, ఏను= నేను; కౌంతేయులకున్= పాండవులకు; అవని= భూమి; ఇచ్చునట్లు+కాఁగన్= ఇచ్చేటట్లు; ఇయ్యకొలుపువాఁడన్= అంగీకరింపజేస్తాను.

**తాత్పర్యం:** మంచి మాటలతో చక్కబడకపోతే కపటిఅయిన దుర్యోధనుడిని నేను పరుషాలైన బాణాలతో పాండవులకు వారి భూభాగం ఇచ్చేటట్లు ఒప్పిస్తాను.

**విశేషం:** సాత్యకి వీరోచిత వాక్యాలు ప్రశంసనీయాలు.

**క. భీమార్జునులకు రణమున । నే మగలును బ్రతియె? వీరు నేనును సైన్యో**
**ద్దాములమై నడచిన, నే । భూమీశులు నెదిరి బ్రదికిపోవం గలరే? 28**

**ప్రతిపదార్థం:** భీమ+అర్జునులకున్= భీముడికీ, అర్జునుడికీ; రణమునన్= యుద్ధంలో; ఏ, మగలును= ఎట్టి వీరులైనా; ప్రతియె?= సాటియా?; వీరున్= ఈ భీమార్జునులూ; ఏనును= నేనూ; సైన్య+ఉద్దాములము+ఐ= సేనతో భయంకరులమై, నడచినన్= దండెత్తితే; ఏ-భూమి+ఈశులున్= ఏ రాజులైనా; ఎదిరి= ఎదిరించి; బ్రతికిపోవన్+కలరే?= బ్రతికిపోగలరా?

**తాత్పర్యం:** భీమార్జునులకు యుద్ధంలో వీరులెవరైనా సాటియా? వీరూ నేనూ సేనాసమేతులమై శత్రుభయంకరంగా యుద్ధభూమిలో నడిస్తే, ఏ రాజులైనా మమ్మల్ని ఎదిరించి బ్రదికిపోగలరా?

**ఆ. కవలవారుఁ, గొడుకుగమియుఁ, బాంచాలవ । ర్గంబు, వృష్ణివరులుఁ గడఁగిరేని,**
**నొక్క మాత్రలోన నువ్వెత్తుగొనరె? దు । ర్యోధనాది శతము నుద్దవిడిన. 29**

**ప్రతిపదార్థం:** కవలవారున్= నకుల సహదేవులూ; కొడుకు గమియున్= కొడుకుల సమూహమూ; పాంచాల,వర్గంబున్= పాంచాలదేశపు వీరుల సమూహమూ; వృష్ణి, వరులున్= వృష్ణివంశశ్రేష్ఠులూ; కడఁగిరి+ఏనిన్= యుద్ధానికి పూనినట్లయితే; ఒక్క-మాత్రలోనన్= ఒక రెప్పపాటుకాలంలోనే; దుర్యోధన+ఆది, శతమున్= దుర్యోధనుడూ మొదలైన నూరుగురునీ; ఉద్దవిడిన్+అ= శీఘ్రంగానే; ఉవ్వెత్తు కొనరె?= నిశ్శేషంగా చంపరా?

**తాత్పర్యం:** నకుల సహదేవులూ, కుమారుల సమూహం, పాంచాలదేశపు వీరులూ, వృష్ణివంశశ్రేష్ఠులూ యుద్ధసన్నద్ధులయితే, ఒక్క రెప్పపాటుకాలంలోనే దుర్యోధనాదులైన నూరుగురినీ శీఘ్రమే నిశ్శేషంగా నిర్మూలించరా?

**క. ఈ మత్స్యపతి సహాయము । గా మాకుం దీర్పరాని కార్యము గలదే?**
**సామాద్యుపాయపరుఁ, డు । ద్దామ భుజాబలయుతుం డితఁడు కేవలుఁడే? 30**

**ప్రతిపదార్థం:** ఈ, మత్స్యపతి= ఈ మత్స్యదేశపురాజు-విరాటుడు; సహాయము+కాన్= తోడుకాగా; మాకున్; తీర్పన్+రాని-కార్యము+కలదే?= సాధించరాని పని ఉన్నదా?; ఇతఁడు= ఈ విరటుడు; సామ+ఆది+ఉపాయ, పరుఁడు= సామ, దాన, భేద దండములనే నాలుగు ఉపాయాలూ కలవాడు; ఉద్దామ భుజా బల యుతుండు= భయంకరమైన భుజబలంతో కూడినవాడు; కేవలుఁడే?= సామాన్యుడా?

**తాత్పర్యం:** ఈ విరాటుడి తోడ్పాటుతో మాకు సాధించరాని కార్యం ఉన్నదా? సామ దాన భేద దండములనే నాలుగు ఉపాయాలూ కలవాడూ, భయంకరమైన భుజబలం గలవాడూ అయిన ఇతడు సామాన్యుడా?

**క. నా మతమునఁ గార్యము సం । గ్రామము సేయుటయ; యిట్లుగా కీలోనన్**
**సామవచనంబు లక్కురు । భూమీశ్వరుతోడ నాడఁ బుచ్చెదరేనిన్. 31**

**ప్రతిపదార్థం:** నా-మతమునన్= నా అభిప్రాయంలో; సంగ్రామము+చేయుట+అ= యుద్ధం చేయటమే; కార్యము= కర్తవ్యం; ఇట్లు+కాక= ఈరీతికాక; ఈ-లోనన్= ఈలోగా; ఆ+కురు-భూమి+ఈశ్వరుతోడన్= ఆ కురురాజుతో - దుర్యోధనుడితో; సామ వచనంబులు= శాంతవాక్కులు; ఆడన్= పలకటానికి; పుచ్చెదరు+ఏనిన్= పంపితే.

**తాత్పర్యం:** నా అభిప్రాయం ప్రకారం యుద్ధం చేయడమే కర్తవ్యం. అట్లా కాక, ఈ లోపల ఆ దుర్యోధనుడితో శాంతవచనాలు పలకటానికి ఎవరినైనా పంపితే - (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగఁ బాండునృపాలుపాలు రా**
**జన్యవరుండు ధర్మజుఁడు సమ్మతి వేఁడెడు నన్న, లోక సా**
**మాన్య విధిం దగంగ గరిమంబున నిచ్చినఁ బుచ్చికొంద; మ**
**న్యోన్య విరుద్ధభాషణము లాడినఁ, దత్ఫల మాతఁ డందెడున్. 32**

**ప్రతిపదార్థం:** దైన్యము+తక్కి= దీనత్వం విడిచిపెట్టి; దూత= రాయబారి; ఉచితంబుగన్= తగిన విధంగా; పాండు నృపాలు, పాలు= పాండురాజు భాగం; రాజన్యవరుండు, ధర్మజుఁడు= రాజశ్రేష్ఠుడైన ధర్మరాజు; సమ్మతిన్= ఇష్టంతో; వేఁడెడున్+అన్నన్= కోరుతున్నాడు అన్నప్పుడు; లోక సామాన్య విధిన్= లోకంలో సాధారణంగా జరిగే న్యాయం చొప్పున; తగంగన్= సముచితంగా; గరిమంబునన్= గౌరవంగా; ఇచ్చినన్= ఇస్తే; పుచ్చికొందము= తీసికొందాం; అన్యోన్య, విరుద్ధ, భాషణములు+అడినన్= ఒకదానికీ, ఇంకొకదానికి పొంతనలేని విధంగా మాటలాడితే; తద్+ఫలము= దాని ఫలం; ఆతఁడు= ఆ దుర్యోధనుడు; అందెడున్= అనుభవిస్తాడు.

**తాత్పర్యం:** ఏమాత్రమూ దీనత్వం లేకుండా దూత సముచితంగా పాండురాజు రాజ్యభాగం రాజోత్తముడైన ధర్మరాజు ఇష్టంతో వేడుకుంటున్నా డన్నప్పుడు, లోకసాధారణమైన న్యాయం చొప్పున తగినట్లుగా, సగౌరవంగా ఆ దుర్యోధనుడు ఇస్తే తీసికొందాం. అట్లాకాక పరస్పర విరుద్ధంగా మాటలాడితే దాని ఫలం అతడు అనుభవిస్తాడు.

**విశేషం:** దూత దైన్యం వహించవలసిన పనిలేదు. అది పాండవులకు పైతృకమైన ఆస్తి. ధర్మరాజు సామాన్యుడు కాడు. రాజోత్తముడు. అతడు దానిని కోరుకొంటున్నాడంటే, మర్యాదగా ఇవ్వటం లోకసాధారణమైన న్యాయం. అట్లాకాక అడ్డదిడ్డంగా మాటలాడినాడా, దుర్యోధనుడు దాని ఫలం - యుద్ధమరణం - అనుభవిస్తాడు. ఇది వీరోచితమైన సాత్యకి హెచ్చరిక.

**వ. అనిన ద్రుపదుం 'డిది వోలు; బలదేవు మాట మాట గాదు. బలపరాక్రమవంతుండును, సహాయ సంపన్నుండును, దుష్టాత్ముండునునైన దుర్యోధనుండు ప్రియవచనంబుల రాజ్యంబు పాలిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు; యుద్ధంబునంగాని చక్కంబడఁ' డని పలికి మఱియు నిట్లనియె. 33**

**ప్రతిపదార్థం:** అనినన్= అని సాత్యకి అనగా; ద్రుపదుండు; ఇది= సాత్యకి మాట; పోలున్= ఒప్పుతుంది; బలదేవు మాట= బలరాముడాడిన మాట; మాట+కాదు= సరిఅయినమాట కాదు; బలపరాక్రమవంతుండును= బలమూ, పరాక్రమమూ కలవాడూ; సహాయ సంపన్నుండును= మిత్రరాజుల సహకారం కలవాడూ; దుష్ట+ఆత్ముండును= దుష్ట స్వభావం కలవాడూ; ఐన, దుర్యోధనుండు; ప్రియ-వచనంబులన్= ప్రీతిపూర్వకాలైన మాటలతో; రాజ్యంబు, పాలు+ఇచ్చుటకున్= రాజ్యభాగం ఇవ్వటానికి; ఇయ్యకొనమి= అంగీకరించకపోవటం, సిద్ధంబు= తప్పక జరిగేదే; యుద్ధంబునన్+కాని= యుద్ధంచేతగాని; చక్కంబడఁడు= సరిపడడు; అని-పలికి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని సాత్యకి పలుకగా ద్రుపదుడు విని 'సాత్యకి మాట సముచితంగా ఉన్నది. బలరాముడి మాట సమ్మతం కాదు. బలపరాక్రమాలు కలవాడూ, సహాయ సంపత్తి కలవాడూ, దుష్టస్వభావుడూ అయిన దుర్యోధనుడు ప్రీతిపూర్వక వచనాలకు రాజ్యభాగం ఇవ్వడానికి ఇష్టపడడు. అది తప్పదు. యుద్ధంవలనగాని అతడు సరిపడడు' అని పలికి, ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** దుర్యోధనుడు రాజ్యభాగం ఇవ్వడని ద్రుపదుడు ఖచ్చితంగా చెప్పడానికి కారణాలు మూడు. దుర్యోధనుడు బలపరాక్రమాలు కలవాడు. అతడికి మిత్రరాజుల సహకారం ఉంది. అయినా, మంచితనం ఉంటే ఇవ్వవచ్చును. అది లేదు- దుష్టుడు. బలదేవుడిమాట మాట కాదు. మొదటి 'మాట'కూ, రెండో 'మాట'కూ అర్థభేదం లేకున్నా, తాత్పర్య భేదం ఉన్నది. మొదటి మాటకు 'వాక్కు' అనీ, రెండో మాటకు 'సరియైన వాక్కు' అనీ తాత్పర్యం. అందుచేత అలంకారం లాటానుప్రాసం అనే శబ్దాలంకారం.

**క. 'మృదుభాషణముల దుర్జన । హృదయములు ప్రసన్నతామహిమఁ బొందునె? యె**
**ల్లిదముగఁ గొని, యంతంతకు । మద మెక్కుంగాక దురభిమానముపేర్మిన్. 34**

**ప్రతిపదార్థం:** దుర్జన-హృదయములు= దుష్టుల మనస్సులు, మృదుభాషణములన్= మెత్తటి మాటలతో; ప్రసన్నతామహిమన్= సామంజస్యం అనే గొప్పతనాన్ని; పొందునె?= పొందుతాయా?; ఎల్లిదముగన్+కొని= అసమర్థతగా భావించి; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; దురభిమానము-పేర్మిన్= దుర్గర్వం యొక్క అతిశయంచేత; మదము+ఎక్కున్+కాక= మత్తెక్కుతాయికాని.

**తాత్పర్యం:** 'దుష్టుల హృదయాలు మృదువచనాలతో సామంజస్యం పొందవు. మెత్తగా మాటలాడటం అసమర్థతగా భావించి, దుర్గర్వాతిశయంచేత క్రమక్రమంగా మత్తెక్కుతాయి.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ఇది సామాన్యాంశం. 'మృదుభాషణముల దుర్యోధనుడి హృదయం ప్రసన్నతా మహిమ పొందదు' అనే అధ్యాహారమైన విశేషాంశాన్ని సమర్థిస్తున్నది.

**వ. అదియునుంగాక. 35**

**తాత్పర్యం:** అంతేకాక.

**తే. కూటికై ద్రోణభీష్ములు గుమతి యనక । యనుసరింతురు; ధృతరాష్ట్రుఁడును దనూజు**
**తృష్ణ నూనినవాఁడు; రాధేయు బోఁటి । తులువ లెల్లను నతని సద్బుద్ధి యండ్రు. 36**

**ప్రతిపదార్థం:** ద్రోణభీష్ములు= ద్రోణుడూ, భీష్ముడూ; కుమతి+అనక= (దుర్యోధనుడిని) దుర్బుద్ధి అనకుండా; కూటికై= తిండికొరకు; అనుసరింతురు= అనుసరిస్తారు; ధృతరాష్ట్రుఁడును; తనూజు తృష్ణన్= కొడుకు మీద వ్యామోహం; ఊనినవాఁడు= వహించినవాడు; రాధేయు, బోఁటి, తులువలు+ఎల్లను= కర్ణుడివంటి దుష్టులందరూ; అతనిన్= ఆ దుర్యోధనుడిని; సత్+బుద్ధి= మంచి బుద్ధిగలవాడు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** ద్రోణభీష్ములు దుర్యోధనుడిని దుర్బుద్ధి అని అనకుండా అతణ్ణి కూటి కొరకు అనుసరిస్తారు. ధృతరాష్ట్రుడు కూడా కొడుకు మీద వ్యామోహం కలిగి ఉంటాడు. కర్ణుడివంటి దుష్టులందరూ అతడిని మంచివాడంటారు.

**వ. కావున నతండు దుర్వినీతుండైయుండు; నెల్లభంగుల సంగరంబు గాఁగలయది; యీ సమయంబున బలంబులంగూర్చికొని పిలువందగు రాజులం బిలిచి పుచ్చవలయు; సుయోధనుండును దోడాసపడి పుచ్చు; నుచితపరులగు నరపతులు దొలుతఁ జెప్పినవారిక సహాయత్వంబుఁ జేయంజూతురు; మనము వెసగల**

**కాలరుల వేగంబ పుచ్చి, శల్య కేకయ ధృష్టకేతు జరాసంధతనయ ప్రభృతు లయిన భూపతులకును, వారి వారి బంధు మిత్ర జనంబులకునునెఱింగించి పుచ్చుట కార్యం; బిది నాకుం బోలిన తెఱం' గని పలికి తన కెలన సముచితాసనంబున నున్న విప్రవరుం జూపి. 37**

**ప్రతిపదార్థం:** కావునన్; అతండు= దుర్యోధనుడు; దుర్వినీతుండు+ఐ+ఉండున్= దుష్ప్రవర్తకుడై ఉంటాడు; ఎల్ల - భంగులన్= అన్నివిధాల; సంగరంబు= యుద్ధం; కాఁగల+అది= జరుగబోతుంది; ఈ-సమయంబునన్; బలంబులన్= సేనలను; కూర్చికొని= కూడగట్టుకుని; పిలువన్+తగు-రాజులన్= పిలువదగిన రాజులను; పిలిచి పుచ్చన్వలయున్= పిలువనంపాలి; సుయోధనుండును= దుర్యోధనుడుకూడా; తోడు+ఆసపడి= సహాయం ఆశించి; పుచ్చున్= పిలువనంపుతాడు; ఉచిత పరులు+అగు నరపతులు= ఉచితజ్ఞులైన రాజులు; తొలుతన్+చెప్పిన-వారికిన్+అ= మొదట కోరినవారికే; సహాయత్వంబున్= తోడ్పాటును; చేయన్+చూతురు= చేయాలని చూస్తారు; మనము; వెస+కల-కాలరులన్= వడిగల దూతలను; వేగంబు+అ= శీఘ్రంగా; పుచ్చి= పంపి; శల్య,కేకయ, ధృష్టకేతు, జరాసంధతనయ, ప్రభృతులు+అయిన= శల్యుడూ; కేకయుడూ; ధృష్టకేతుడూ; జరాసంధుడి కుమారుడూ మొదలుగాగల; భూపతులకును= రాజులకును; వారి, వారి, బంధు-మిత్ర జనంబులకును= వారి వారి చుట్టాలకూ, స్నేహితులకూ; ఎఱింగించి పుచ్చుట= తెలిపిపంపడం; కార్యంబు= కర్తవ్యం; ఇది; నాకున్+పోలిన తెఱంగు= నాకు తోచిన విధం; అని-పలికి; తన కెలనన్= తన ప్రక్క; సముచిత+ఆసనంబునన్= తగిన పీఠంపై; ఉన్న; విప్రవరున్= బ్రాహ్మణోత్తముడిని; చూపి.

**తాత్పర్యం:** కాబట్టి, ఆ దుర్యోధనుడు దుశ్చరితుడై ఉంటాడు. ఏ విధంగా చూసినా యుద్ధం జరుగబోతుంది. ఈ సమయంలో సేనలను సమకూర్చికొని పిలువదగిన రాజులను పిలువనంపాలి. దుర్యోధనుడు కూడా తోడ్పాటు నాశించి పిలువనంపుతాడు, ఉచితజ్ఞులైన రాజులు మొదట కోరినవారికే సహాయం చేయజూస్తారు. మనం వడిగల దూతలను శీఘ్రమే పంపి, శల్యుడూ, కేకయుడూ, ధృష్టకేతుడూ, జరాసంధకుమారుడూ మొదలయిన రాజులకు, వారి వారి చుట్టాలకూ స్నేహితులకూ తెలిపి పంపటం కర్తవ్యం. ఇదీ నాకు తోచిన విధం' అని పలికి తన ప్రక్కన సముచితాసనంమీద ఆసీనుడైన బ్రాహ్మణోత్తముడిని చూపి.

**క. ఇతఁడు మదీయాగ్ర పురో। హితుఁ; డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగన్**
**ధృతరాష్ట్రు కడకుఁ బనుపుఁడు। చతుర వచన రచనఁ గఱపి సంప్రీతిమెయిన్. 38**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ బ్రాహ్మణుడు; మదీయ+అగ్ర-పురోహితుఁడు= నా ప్రధాన పురోహితుడు; ఇతనికిన్; ఎల్ల పనులున్; ఎఱిఁగించి= తెలిపి; సంప్రీతి మెయిన్= సంతోషంతో; చతుర వచన రచనన్= నేర్పుగల మాటలాడటం; కఱపి= బోధించి; తగన్= ఒప్పేటట్లు; ధృతరాష్ట్రు కడకున్= ధృతరాష్ట్రుడి దగ్గరకు; పనుపుఁడు= పంపండి.

**తాత్పర్యం:** ఇతడు నా ప్రధాన పురోహితుడు. ఇతనికి చేయవలసిన పనులన్నీ తెలిపి, సంప్రీతితో నేర్పుగా మాటలాడటం బోధించి తగినట్లుగా ధృతరాష్ట్రుడి దగ్గరకు పంపండి.

**విశేషం:** అగ్రపురోహితుడిని పరిచయం చేసిన వాక్యాలు అర్థవంతాలు. పురోహితుడంటేనే రాబోయే హితాన్ని కోరేవాడు. అటువంటివారు ద్రుపదుడి కొలువులో ఎందరో ఉన్నారు. వారిలో అగ్రగణ్యుడు ఈ పురోహితుడు, సామాన్యంగా మంత్రులలో పురోహితుడు ఒకడుగా ఉండటం పరిపాటి. మంత్రి కావటం చేతనే ద్రుపదుడి ప్రక్కన ఉన్నతాసనం మీద అగ్ర పురోహితుడు

కూర్చున్నాడు. అతడిని పంపటం వలన భవిష్యత్తులో హితం జరుగుతుందని ద్రుపదుడి భావం. పురోహితుడిని రాయబారిగా పంపేటప్పుడు అతడు ఏయే పనులు ఏవిధంగా చేయాలో, ఏ విధంగా మాటలు పలకాలో కూడా చెప్పుమన్నాడు ద్రుపదుడు. ఆ రెండూ నేర్పవలసిన వని చెప్పటం గమనార్హం. భావి కథలో పురోహితుడి రాయబారం విఫలం కావటానికి అతడి మాట నేర్పరితనంలో ఉన్న అప్రౌఢియే కారణమని స్పష్టం ఔతుంది. అందుకే ఈ అంశాన్ని తిక్కన బీజప్రాయంగా ఇక్కడ చెప్పించాడు. (సంపా).

**ఉ. ఆతని సమ్ముఖంబునఁ దదగ్రతనూజుకడన్ మరున్నదీ**
**జాతుని సన్నిధిం గలశసంభవునొద్దఁ గ్రమోచితంబుగా**
**నీతెఱఁ గిట్టులాడుమని యేర్పడ నంతయుఁ జెప్పిపుచ్చఁగా**
**నీతిమెయిం దగం బలుక నెయ్యము లాభముఁ, బెంపుఁజొప్పడున్. 39**

**ప్రతిపదార్థం:** ఆతని-సమ్ముఖంబునన్= ఆ ధృతరాష్ట్రుడి ఎదుట; తద్+అగ్ర తనూజు కడన్= అతడి పెద్ద కొడుకు - దుర్యోధనుడి దగ్గర; మరుత్+నదీ-జాతుని సన్నిధిన్= గాంగేయుడి సన్నిధానంలో; కలశసంభవు+ఒద్దన్= ద్రోణుడి వద్ద; క్రమ+ఉచితంబుగాన్= క్రమంగానూ, ఉచితంగానూ; ఈ-తెఱఁగు= ఈ విషయం; ఇట్టులు+ఆడుము+అని= ఇట్లా మాట్లాడుమని; ఏర్పడన్= స్పష్టంగా; అంతయున్; చెప్పి పుచ్చఁగాన్= చెప్పిపంపితే; నీతి మెయిన్= రాజనీతితో; తగన్= ఒప్పుగా; పలుకన్= పలుకగా; నెయ్యము= స్నేహమూ; లాభమున్= లాభమూ; పెంపున్= గౌరవమూ; చొప్పడున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్రుడి ఎదుటా, అతడి పెద్దకొడుకైన దుర్యోధనుడి దగ్గరా, భీష్ముడి సన్నిధానంలోనూ, ద్రోణుడి వద్దా, క్రమంగానూ, ఉచితంగానూ ఈ విషయం ఇట్లా మాటాడుమని స్పష్టంగా అంతా చెప్పి పంపితే, ఇతడు రాజనీతితో ఒప్పుగా ఆ విధంగా పలికితే స్నేహమూ, లాభమూ, గౌరవమూ కలుగుతాయి.'

**వ. అనిన వాసుదేవుండు 'పాంచాలపతి వచనంబు లుచితంబులయి యున్నయవి; యిబ్భంగిన చేయవలయు' నని పలికి' మఱియు నిట్లనియె. 40**

**ప్రతిపదార్థం:** అనినన్; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; పాంచాల పతి వచనంబులు= ద్రుపదుడి మాటలు; ఉచితంబులు+అయి+ఉన్న+అవి= తగినవిగా ఉన్నాయి; ఈ+భంగిన్+అ= ఈ విధంగానే; చేయవలయున్+అని= చేయాలని; పలికి; మఱియున్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని ద్రుపదుడు పలుకగా శ్రీకృష్ణుడు 'ద్రుపదుడి మాటలు ఉచితంగా ఉన్నాయి. ఈ విధంగానే చేయాలి' అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'కౌరవులకుఁ బాండవులకు । నారయ నే నొక్కరూప; యట్లగుటఁ దగన్**
**వారును వీరును దమతమ । నేరిమిమెయి ధరణి యేలి నెగడఁగఁ జూతున్. 41**

**ప్రతిపదార్థం:** ఆరయన్= పరిశీలించగా; కౌరవులకున్; పాండవులకున్; నేను; ఒక్కరూపు+అ= ఒకలాటివాడనే; అట్లు+అగుటన్= అందుచేత; తగన్= ఒప్పుగా; వారును, వీరును= కౌరవులూ; పాండవులూ; తమ తమ నేరిమి మెయిన్= తమ తమ సామర్థ్యంతో, ధరణి+ఏలి= భూమిని పాలించి; నెగడఁగన్+చూతున్= ప్రసిద్ధి కెక్కాలని చూస్తాను.

**తాత్పర్యం:** పరిశీలించి చూస్తే నేను కౌరవులకూ, పాండవులకూ ఒకలాటివాడనే. అందుచేత వాళ్ళూ వీళ్ళూ ఒప్పుగా ఎవరి సామర్థ్యం చొప్పున వాళ్ళు భూమినేలి ప్రసిద్ధి వహించాలని భావిస్తాను.

**విశేషం:** పాఠాంతరం : కౌరవులును బాండవులును నారయ నాకొక్కరూప.

**తే.** **పెండ్లికని పిల్వఁ బంచినఁ బ్రియముతోడ। నేఁగుదెంచితి; మిన్నాళ్ళు నెల్ల యొప్పి**
**దములఁ జూచితి; మియ్యెడఁ దడవుగాఁగ। నిలువఁ దీఱదు పోయిరావలయు మాకు.** 42

**ప్రతిపదార్థం:** పెండ్లికిన్+అని= పెళ్ళికొరకని, పిల్వన్+పంచినన్= పిలువనంపితే; ప్రియముతోడన్= ప్రీతితో; ఏఁగుదెంచితిమి= వచ్చాము; ఇన్నాళ్ళున్= ఇన్నాళ్ళూ; ఎల్ల+ఒప్పిదములన్= అన్ని ముచ్చట్లూ; చూచితిమి; ఈ+ఎడన్= ఇక్కడ; తడవు+కాఁగన్= ఎక్కువకాలం; మాకున్; నిలువన్+తీఱదు= ఉండే తీరిక లేదు; పోయిరావలయున్.

**తాత్పర్యం:** పెళ్ళికని పిలిస్తే ప్రీతితో వచ్చాం. ఇన్నాళ్ళూ అన్ని ముచ్చట్లూ చూచాం. ఇక్కడ ఎక్కువ కాలం ఉండే తీరిక లేదు. మేము వెళ్లిరావాలి'.

**వ.** **అని పలికి ద్రుపదు నాలోకించి 'మీరు మాకెల్లవారికి గురుస్థానంబు; మీ మాట యనిన ధృతరాష్ట్రుండు బహుమానంబు సేయు, మిమ్ము శాంతనవుండునుం గొనియాడు; మీయందు ద్రోణకృపాచార్యులు సఖ్యంబు వాటింతు; రట్లగుటం జేసి.** 43

**ప్రతిపదార్థం:** అని; పలికి; ద్రుపదున్; ఆలోకించి= చూసి; మీరు; మాకున్ ఎల్లవారికిన్= మాకందరికీ; గురు-స్థానంబు= గురు సమానులు; మీ మాట+అనినన్= మీ మాట అంటే; ధృతరాష్ట్రుండు; బహుమానంబు+చేయున్= గౌరవిస్తాడు; మిమ్మున్; శాంతనవుండునున్= భీష్ముడునూ; కొనియాడున్= ప్రశంసిస్తాడు; మీయందున్; ద్రోణ-కృపాచార్యులు= ద్రోణుడూ, కృపాచార్యుడూ; సఖ్యంబు+పాటింతురు= మైత్రిని చూపుతారు; అట్లు+అగుటన్+చేసి= అందుచేత.

**తాత్పర్యం:** అని పలికి, ద్రుపదుడిని చూచి 'మీరు మాకందరికీ గురుస్థానీయులు. మీ మాట అంటే ధృతరాష్ట్రుడికి గౌరవం. మిమ్మల్ని భీష్ముడు కూడా ప్రశంసిస్తాడు. మీతో ద్రోణకృపాచార్యులు మైత్రిని కోరుతారు. అందుచేత. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **పాండవార్థమై యొక్కరుఁ బనుప మీక। భరము; మీ పలు కందఱపలుకు; మీరు**
**తెఱఁగు పఱుపంగ మిగిలి యుద్రేకులైన। వార చెడువారు; విమలవిచారవిభవ!** 44

**ప్రతిపదార్థం:** విమల విచార విభవ!= నిర్మలమైన ఆలోచనా సంపదకలవాడా, ద్రుపదుడా!; పాండవ+అర్థము+ఐ= పాండవుల నిమిత్తం; ఒక్కరున్= ఒకరిని; పనుపన్= పంపటానికి; మీకున్+అ= మీకే-మీదే; భరము= భారం; మీ పలుకు= మీ మాట; అందఱ-పలుకు= అందరిమాట; మీరు; తెఱఁగు పఱుపంగన్= చక్కదిద్దగా; మిగిలి= అతిక్రమించి; ఉద్రేకులు+ఐన+వారు+అ= ఆవేశపడేవాళ్ళే; చెడువారు= చెడిపోయేవాళ్ళు.

**తాత్పర్యం:** నిర్మలమైన ఆలోచనా సంపదగల ద్రుపదరాజా!, పాండవుల పక్షాన ఒకరిని పంపే భారం మీదే. మీ మాటే అందరి మాట. మీరు ఒక పద్ధతిగా చేసినప్పుడు దాని నతిక్రమించి ఆవేశపడేవారే చెడిపోతారు.

**క. పొందైన లెస్స; విరసపుఁ । గ్రం దయ్యెడు చందమైన, రాజుల నెల్లన్**
**ముందఱ రావించి క్రమం । బొందఁగ, మముఁ బిలువఁ బంపుఁ డొయ్యన పిదపన్. 45**

**ప్రతిపదార్థం:** పొందు+ఐనన్= సంధి జరిగితే; లెస్స= మంచిది; విరసము+క్రందు+అయ్యెడు చందము+ఐనన్= అనిష్టమైన భేదం పుట్టేటట్టయితే; రాజులన్+ఎల్లన్= రాజులనందరినీ; ముందఱన్= ముందుగా; రావించి= రప్పించి; క్రమంబు+ఒందఁగన్= క్రమంగా; పిదపన్= తరువాత; మమున్; ఒయ్యన= ఒప్పుగా; పిలువన్+పంపుఁడు= పిలిపించండి.

**తాత్పర్యం:** సంధి జరిగితే మంచిది. ఒకవేళ అనిష్టమైన భేదం పుట్టేటట్లయితే, ముందుగా రాజులనందరినీ రప్పించి క్రమంగా తరువాత మమ్ములను ఒప్పుగా పిలిపించండి.

**క. మీ పనుపున రాజ్యము పా । లీపాండు తనూభవులకు నీకున్న, భుజా**
**టోపభయంకరుఁ డర్జును । కోపానల మడరి ముట్టికొనదే వారిన్?' 46**

**ప్రతిపదార్థం:** మీ-పనుపునన్= మీ నియోగం చొప్పున; రాజ్యము పాలు= రాజ్యభాగం; ఈ+పాండు తనూభవులకున్= ఈ పాండవులకు; ఈక+ఉన్నన్= ఇవ్వకపోతే; వారిన్= ఆ కౌరవులను; భుజ+ఆటోప, భయంకరుఁడు+అర్జును-కోప+అనలము= భుజబలగర్వంచేత భీకరుడైన అర్జునుడి యొక్క కోపం అనే అగ్ని; అడరి= విజృంభించి; ముట్టికొనదే?= ఆక్రమించదా?

**తాత్పర్యం:** మీ ఆజ్ఞ చొప్పున రాజ్యభాగం ఈ పాండవులకు ఇవ్వకపోతే, భుజబలగర్వంచేత భయంకరుడైన అర్జునుడి కోపాగ్ని విజృంభించి ఆ కౌరవుల్ని ఆక్రమించదా?'

**విశేషం:** కోపానలము= కోపమనే అనలం - రూపకాలంకారం.

**చ. అని, గమనోన్ముఖుండయి మురాంతకుఁ డా ద్రుపదుండు ధర్మనం**
**దనుఁడు వృకోదరాదులగు తమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద**
**న్ననుప, హలాయుధ ప్రభృతి యాదవలోకము తోడరా ముదం**
**బున నిజపట్టణంబునకుఁ బోయె సముజ్జ్వల వైభవంబునన్. 47**

**ప్రతిపదార్థం:** అని, ముర+అంతకుఁడు= మురుడనే రాక్షసుడిని సంహరించినవాడు - శ్రీకృష్ణుడు; గమన+ఉన్ముఖుండు+అయి= వెళ్ళటానికి సిద్ధపడినవాడై; ఆ-ద్రుపదుండున్; ధర్మనందనుఁడున్= ధర్మరాజూ; వృకోదర+ఆదులు+అగు-తమ్ములున్= భీముడు మొదలుగాగల అతడి తమ్ములూ; మత్స్య మహీవిభుండున్= మత్స్యరాజైన విరాటుడూ; తన్నున్+అనుపన్= తనను సాగనంపగా; హల+ఆయుధ-ప్రభృతి, యాదవ లోకము= నాగలి ఆయుధంగా కలవాడు (బలరాముడు) మున్నగు యాదవుల సమూహం; తోడన్+రాన్=వెంటరాగా; ముదంబునన్= సంతోషంతో; సముజ్జ్వల వైభవంబునన్= మిక్కిలి ప్రకాశించే వైభవంతో; నిజపట్టణంబునకున్= తనదైన పట్టణానికి - ద్వారకకు; పోయెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణుడు ప్రయాణ సన్నద్ధుడై, ఆ ద్రుపదుడూ, ధర్మరాజూ, భీమాదులైన అతడి తమ్ములూ, విరాటుడూ, తనను పంపగా, బలరామాది యాదవ సమూహం వెంట రాగా, సంతోషంతో, సముజ్జ్వల వైభవంతో తన పట్టణమైన ద్వారకకు వెళ్ళాడు.

**వ. వివాహ మహోత్సవంబునకు వచ్చిన తక్కటి రాజులును సంగ్రామ సన్నాహంబునకై తమ తమ పురంబులకుం జనిరి; తదనంతరంబ. 48**

**ప్రతిపదార్థం:** వివాహమహత్(మహా)+ఉత్సవంబునకున్= వివాహమహోత్సవానికి; వచ్చిన; తక్కటి రాజులును= తక్కిన రాజులూ; సంగ్రామ సన్నాహంబునకై= యుద్ధ ప్రయత్నానికై; తమ, తమ, పురంబులకున్= తమ తమ నగరాలకు; చనిరి= వెళ్లారు; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** వివాహమహోత్సవానికి వచ్చిన మిగిలిన రాజులందరూ యుద్ధప్రయత్నాలు చేసికొనటానికి తమతమ నగరాలకు వెళ్ళారు. ఆ తరువాత.

**క. సమరమునకుఁ దగు నుద్యో । గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ గౌంతేయులు; మ**
**త్స్య మహీనాథుఁడు సన్నా । హము సేసెన్; ద్రుపదవిభుఁడు నాయిత మయ్యెన్. 49**

**ప్రతిపదార్థం:** కౌంతేయులు= పాండవులు; ఎలమిన్= సంతోషంతో; సమరమునకున్= యుద్ధానికి; తగు+ఉద్యోగమునన్= తగిన ప్రయత్నంలో; ప్రవర్తిల్లిరి= ఉన్నారు; మత్స్య మహీనాథుఁడున్= మత్స్యదేశపురాజు-విరాటుడూ; సన్నాహము+చేసెన్= యుద్ధ సన్నద్ధుడయ్యాడు; ద్రుపద విభుఁడున్= ద్రుపదరాజుకూడా; అయితము+అయ్యెన్= యుద్ధ సంసిద్ధుడయ్యాడు.

**తాత్పర్యం:** పాండవులు సంతోషంతో యుద్ధానికి తగిన ప్రయత్నంలో ఉన్నారు. విరాటుడూ యుద్ధ సన్నద్ధుడయ్యాడు, ద్రుపదరాజు కూడా యుద్ధ సంసిద్ధుడయ్యాడు.

**వ. ఇట్లు సన్నద్ధులై వెలివీడు విడిసి తమకు ననురక్తులైన రాజుల పాలికిం దగుదూతలం బుచ్చి; రట దుర్యోధనుండు వీరల చందంబు విని, తానును దన బంధుమిత్రగణంబైన రాజలోకంబు నెల్ల రావించిన. 50**

**ప్రతిపదార్థం:** ఇట్లు, సన్నద్ధులు+ఐ= యుద్ధ సంసిద్ధులై; వెలివీడు విడిసి= వెలుపలి నగరులో విడిది చేసి, తమకున్+అనురక్తులు+ఐన= తమయందు అనురాగం గల; రాజుల పాలికిన్= రాజుల వద్దకు; తగు దూతలన్= తగిన దూతలను; పుచ్చిరి= పంపారు; అటన్= అక్కడ - హస్తినాపురంలో; దుర్యోధనుండున్; వీరల చందంబు= పాండవుల విధం; విని; తానును; తన, బంధు, మిత్ర, గణంబు+ఐన, రాజ, లోకంబున్+ఎల్లన్= తన చుట్టాల, స్నేహితుల సమూహమైన రాజుల సమూహాన్నంతనూ; రావించినన్= రప్పించగా.

**తాత్పర్యం:** ఇట్లా యుద్ధ సంసిద్ధులై వెలుపలి నగరులో విడిది చేసి, తమయందు అనురాగం గల రాజుల వద్దకు తగిన దూతలను పంపారు. అక్కడ హస్తినాపురంలో దుర్యోధనుడు పాండవుల ప్రయత్నాలను గురించి తెలిసికొని, తాను కూడా తన బంధువులూ మిత్రులూ అయిన రాజుల సమూహాన్నంతటినీ రప్పించగా.

**క. ఇభ తురగ స్యందన గతి । రభసంబునఁ బృథివి యద్రువ రాఁ దొడఁగిరి భూ**
**విభులు నలుదిక్కులను లో । క భయంకరలీల నుభయకటకంబులకున్. 51**

**ప్రతిపదార్థం:** ఇభ, తురగ, స్యందన, గతి, రభసంబునన్= ఏనుగులయొక్క, గుర్రాల యొక్క, రథాలయొక్క, గమనములయొక్క వేగంచేత; పృథివి= భూమి; అద్రువన్= అదరగా; భూ విభులు= రాజులు, నలు దిక్కులను= నాలుగు దిక్కులందును;

ఉభయ కటకంబులకున్= ఇద్దరి శిబిరాలకూ; లోకభయంకర లీలన్= లోకానికి వెరపు పుట్టించే విధంగా; రాన్+తొడఁగిరి= రా నారంభించారు.

**తాత్పర్యం:** ఏనుగుల గుర్రాల రథాల గమనవేగంతో భూమి అదరగా రాజులు నాలుగు దిక్కుల నుండి ఉభయుల శిబిరాలకూ లోకభీకరంగా రావటం మొదలుపెట్టారు.

**ద్రుపదుఁడు తన పురోహితుని దుర్యోధనుకడకు దూతగాఁ బంపుట (సం. 5-5-28)**

**వ. అట్టి సమయంబున నజాతశత్రు ననుమతి వడసి పాంచాలపతి వయోజ్ఞానవృద్ధుండైన తన పురోహితుం గురుపతిపాలికిఁ బుచ్చువాఁడై యతని రావించి. 52**

**ప్రతిపదార్థం:** అట్టి సమయంబునన్= అప్పుడు; పాంచాలపతి= పాంచాలదేశపురాజు ద్రుపదుడు; అజాతశత్రు+అనుమతి+ వడసి= ధర్మరాజుయొక్క అనుజ్ఞ పొంది; వయస్(ః)+జ్ఞాన-వృద్ధుండు+ఐన= వయస్సు చేతా, జ్ఞానంచేతా పెద్దవాడయిన; తన-పురోహితున్; కురుపతి-పాలికిన్= కురురాజైన ధృతరాష్ట్రుడి దగ్గరకు; పుచ్చు+వాఁడు+ఐ= పంపువాడై; అతనిన్; రావించి= రప్పించి.

**తాత్పర్యం:** అటువంటి సమయంలో ద్రుపదుడు ధర్మరాజు అనుజ్ఞ పొంది వయస్సుచేతా, జ్ఞానం చేతా పెద్దవాడయిన తన పురోహితుడిని ధృతరాష్ట్రుడి దగ్గరకు పంపగోరి అతడిని రప్పించి.

**క. 'హితుఁడవు, మతిమంతుండవు, । చతుర వచన కోవిదుఁడవు, సమయజ్ఞుఁడ, వు**
**న్నత వంశవర్ధనుఁడ, విం । గిత వేదివి, నెచ్చెలివి, సుకృతి వ ట్లగుటన్. 53**

**ప్రతిపదార్థం:** హితుఁడవు= ఆప్తుడవు; మతిమంతుండవు= బుద్ధిమంతుండవు; చతుర, వచన, కోవిదుఁడవు= నేర్పుగల మాటలయందు పండితుడవు; సమయజ్ఞుఁడవు= సమయం తెలిసినవాడవు; ఉన్నత, వంశ, వర్ధనుఁడవు= ఉన్నత వంశాన్ని పెంచేవాడవు; ఇంగిత వేదివి= హృదయభావం తెలిసికొనేవాడవు; నెచ్చెలివి= మిత్రుడవు; సుకృతివి= పుణ్యశాలివి; అట్లు+అగుటన్= అందుచేత.

**తాత్పర్యం:** నీవు ఆప్తుడవు, బుద్ధిమంతుడవు, నేర్పుగా మాటలాడటంలో పండితుడవు, సమయం తెలిసినవాడవు, ఉన్నత వంశాన్ని అభివృద్ధిపరిచేవాడవు, హృదయంలోని భావాన్ని తెలిసికొనేవాడవు. ప్రియమిత్రుడవు, పుణ్యాత్ముడవు. అందుచేత.

**విశేషం:** ఈ పద్యంలో పురోహితుడు రాయబారిగా నియుక్తుడు కాదగిన లక్షణాలున్నవాడిగా ద్రుపదుడు ప్రశంసించాడు. అతడు చేయవలసిన పనులు తరువాతి పద్యంలో చెప్పాడు. వాటికి తగిన గుణాలనే ఈ పద్యంలో పేర్కొనటం విశేషం. ఈ రెండు పద్యాల భావాలను కలిపి చెప్పితే ఈ విధంగా తాత్పర్య మేర్పడుతుంది. 1. నీవు హితుడవు కాబట్టి కర్తవ్యమైన ఈ పని నీకు చెప్పుతున్నాను. 2. నీవు మతిమంతుడవు కాబట్టి నీ వాపని చేయటం న్యాయం. 3. నీవు చతురవచన కోవిదుడవు కాబట్టి నీ వన్ని విధాల మాట నేర్పరితనాన్ని ప్రకటించి ఆ పనికి ప్రయత్నించాలి. 4. ఉన్నతవంశ వర్ధనుడవు కాబట్టి పాండవార్థం ధృతరాష్ట్రుడి వద్దకు నిన్ను పంపుతున్నాను. 5. ఇంగితవేదివి కాబట్టి నేర్పు ప్రకటించగలవు. 6. నెచ్చెలివి

కాబట్టి నా కార్యాన్ని నీ కార్యంగా భావించగలవు. 7. సుకృతివి కాబట్టి చేపట్టిన పనిని కృతార్థం చేయగలవు(తీర్చగలవు). ద్రుపదుడి కార్య కారణబద్ధమైన వాక్యరచన అతడి చతురవచన రచనను తెలుపుతున్నది. అల్లసాని పెద్దన తన మనుచరిత్రలో శ్రీకృష్ణదేవరాయలు తనను 'హితుఁడవు, చతురవచోనిధివి' అని ప్రశంసించినట్లు అవతారికలో పేర్కొన్నాడు. (మను. 1.15). తిక్కన చతుర వచన రచన ఆతడిని ప్రభావితం చేసినట్లున్నది. అది సహజం కూడా. తిక్కన 'కవిబ్రహ్మ', పెద్దన 'ఆంధ్ర కవితా పితామహుడు'. (సంపా.).

**తే. నాకుఁ గర్తవ్య మగుపని నీకుఁ జేయఁ। దగవుగావున నెల్లవిధములఁ బూని।**
**పాండవార్థంబు ధృతరాష్ట్రుపాలి కరిగి। నేర్పువాటించి కార్యంబు దీర్పవలయు.' 54**

**ప్రతిపదార్థం:** నాకున్; కర్తవ్యము+అగు పని= చేయదగినపని; నీకున్; చేయన్= చేయటం; తగవు= న్యాయం; కావునన్= కాబట్టి; ఎల్లవిధములన్= అన్నివిధాలా; పూని= ప్రయత్నించి; పాండవ+అర్థంబు= పాండవుల కొరకు; ధృతరాష్ట్ర-పాలికిన్= ధృతరాష్ట్రుడి దగ్గరకు; అరిగి= వెళ్ళి; నేర్పు+పాటించి= నేర్పు చూపి; కార్యంబు= పని; తీర్పవలయున్= నెరవేర్చాలి.

**తాత్పర్యం:** నేను చేయవలసి ఉన్న పని నీవు చేయటం న్యాయం కాబట్టి, అన్ని విధాలా ప్రయత్నించి పాండవుల కొరకు ధృతరాష్ట్రుడి వద్దకు వెళ్ళి నేర్పు చూపి కార్యం సాధించాలి.'

**విశేషం:** పై(53) పద్య విశేషాంశాన్ని గమనించండి.

**వ. అని చెప్పి యొడంబఱిచి యతనితో మఱియు నిట్లనియె. 55**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; ఒడంబఱిచి= ఒప్పించి; అతనితోన్; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని చెప్పి అంగీకరించేటట్లు చేసి అతడింకా ఇట్లా అన్నాడు.

**క. 'విను కొడుకు గొన్న వేఁదుఱ। కొని కొట్టిన తిండికాఁడు కుటిలుం డతఁ; డా**
**జనపతి చందము, ధర్మజు। ననుపమ శీలంబు నెఱుఁగు; దది యట్లుండెన్. 56**

**ప్రతిపదార్థం:** విను; కొడుకు+కొన్న-వేఁదుఱు+అ= కొడుకుకు పట్టిన పిచ్చియే; కొని, కొట్టిన, తిండికాఁడు= పట్టిన పరమలోభి; అతఁడు; కుటిలుండు= కపటి; ఆ జనపతి చందమున్= ఆ రాజు విధమూ; ధర్మజు+అనుపమ శీలంబు= ధర్మరాజు సాటిలేని స్వభావమూ; ఎఱుఁగుదు+(వు)= తెలిసినవాడవు; అది+అట్లు+ఉండెన్= అది అట్లా ఉండనీ.

**తాత్పర్యం:** 'విను. ఆ ధృతరాష్ట్రుడు కొడుక్కు పట్టిన పిచ్చియే పట్టిన పరమలోభి. కపటి. ఆ రాజు విధమూ, ధర్మరాజు సాటిలేని స్వభావమూ ఎరుగుదువు. అది అట్లా ఉండనీ.

**తే. పుడమి పాలు పాండవులకు నడుగఁబోయి,। నీవు ధృతరాష్ట్రుతో ధర్మ నిష్ఠమైన**
**యుచిత మాడిన, నందుఁ బోటొడ్డియున్న। దొరల భృత్యుల మనములు దిరుగఁబడవె? 57**

**ప్రతిపదార్థం:** పుడమి-పాలు= భూభాగం; పాండవులకున్, అడుగన్+పోయి= అడగడానికి వెళ్లి; నీవు; ధృతరాష్ట్రుతోన్; ధర్మ-నిష్ఠము+ఐన+ఉచితము+ఆడినన్= ధర్మంతో కూడుకొన్న ఉచితమైన మాట పలికితే; అందున్= కౌరవుల పక్షంలో; పోటొడ్డి+ఉన్న=

యుద్ధసన్నద్ధులైన; దొరల, భృత్యుల, మనములు= ప్రభువుల యొక్కయు, సేవకుల యొక్కయు మనస్సులు, తిరుగఁబడవె= వెనుకకు మరలవా?

**తాత్పర్యం:** పాండవులకు భూభాగం ఇమ్మని అడగటానికి వెళ్ళి నీవు ధృతరాష్ట్రుడితో ధర్మయుక్తమూ, సముచితమూ అయిన మాట పలికితే, కౌరవుల పక్షంలో ఉన్న రాజుల, సేవకుల మనస్సులు మన కనుకూలంగా మారిపోవా?

**విశేషం:** 'దొరల భృత్యుల మనములు దిరుగఁబడవె?' - దీనికి మూలం- 'భవాంస్తు ధర్మసంయుక్తం ధృతరాష్ట్రం బ్రువన్ వచః మనాంసి తస్య యోధానాం ధ్రువ మావర్జయిష్యతి.' 'నీవుధృతరాష్ట్రుడితో ధర్మయుక్తమైన మాట చెప్పి అతడి యోధుల మనస్సులను తప్పకుండా వశం చేసికొంటావు.' అనగా, అట్లా వశం చేసుకొనేటట్లూ మాటాడాలని వేడికోలు. 'తిరుగఁబడవె? - అనే క్రియ సార్థకం. వారి వైపున్న మనస్సులు మనవైపు తిరుగబడవా? అనీ, యుద్ధం నుండి విముఖం కావా? అనీ రెండర్థాలు చెప్పుకొనవచ్చును.

**క. గురుభీష్మాదుల మనములు । దురమునకుం జొరకయుండ దుర్యోధనుఁ డా**
**తురుఁడై యొడఁబఱుపఁగ ని । ప్పరుసున నెరవైన జిచ్చవడు బల మెల్లన్. 58**

**ప్రతిపదార్థం:** గురు, భీష్మ+ఆదుల, మనములు= ద్రోణుడు, భీష్ముడు మున్నగువారి మనస్సులు; దురమునకున్= యుద్ధానికి; చొరక+ఉండన్= అంగీకరించకపోగా; దుర్యోధనుడు; ఆతురుఁడు+ఐ= వేగిరపాటుతో బాధపడినవాడయి; ఒడఁబఱుపఁగన్= అంగీకరింపచేయగా; ఈ+పరుసునన్= ఈ విధంగా; నెరవు+ఐనన్= సాధ్యపడితే; బలము+ఎల్లన్= సైన్యమంతా; జిచ్చు+పడున్= నిశ్చేష్టతను పొందుతుంది.

**తాత్పర్యం:** ద్రోణుడూ, భీష్ముడూ మొదలైనవారు యుద్ధానికి సుముఖత చూపకపోగా, దుర్యోధనుడు బాధపడి వారిని అంగీకరించేటట్లు చేయటం నీకు సాధ్యమయితే సైన్యమంతా ఆశ్చర్యంతో నిశ్చేష్టతను పొందుతుంది.

**ఉ. పాండుతనూభవుల్ వడిన పాటులు బంధులకెల్లఁ దెల్పుచున్,**
**బండిత వృద్ధ సజ్జనుల పాలికిఁబోయి కులోచితంబు గా**
**కుండుట సూపి చెప్పుచుఁ, బ్రియోక్తులఁ దక్కటివారి 'నిట్లు మే**
**లొండొకచంద మొప్ప' దని యుల్లములం దలపోయఁ జేయుచున్. 59**

**ప్రతిపదార్థం:** పాండు తనూభవుల్= పాండురాజు కొడుకులు పాండవులు; పడిన,పాటులు= పడ్డ కష్టాలు; బంధులకున్+ఎల్లన్= చుట్టాలకందరికీ; తెల్పుచున్= చెపుతూ; పండిత, వృద్ధ, సత్+జనులపాలికిన్= పండితులూ, పెద్దవారూ, మంచివారూ అయిన వారి దగ్గరికి; పోయి, కుల+ఉచితంబు= వంశానికి తగినది; కాక+ఉండుట+చూపి-చెప్పుచున్= కాకపోవటం నిరూపించి చెపుతూ; తక్కటివారిన్= తక్కినవారిని; ప్రియ+ఉక్తులన్= మంచి మాటలతో; ఇట్లు, మేలు= ఈ విధం మంచిది; ఒండొక, చందము= వేరు విధం; ఒప్పదు+అని= తగదని; ఉల్లములన్= మనస్సులలో; తలపోయన్+చేయుచున్= అనుకొనేటట్లు చేస్తూ.

**తాత్పర్యం:** పాండవులు పడ్డ కష్టాలు బంధువుల కందరికీ చెపుతూ, పండితులూ, వృద్ధులూ, సజ్జనులూ అయిన వారి దగ్గరికి వెళ్ళి 'ఇది వంశానికి తగినది కా'దని నిరూపించి చెపుతూ, తక్కినవారిని మంచిమాటలతో' ఈ విధం మంచిది, వేరే విధం మంచిది కాదు' అని మనస్సులలో అనుకొనేటట్లు చేస్తూ.

**విశేషం:** పురోహితుడు హస్తినాపురంలో సంప్రదించేవారిని ద్రుపదుడు వర్గీకరించిన విధం విశిష్టం. ముందు ధృతరాష్ట్ర దుర్యోధనాదులైన బంధువులతో, పండితు(గురువు)లైన కృపాచార్య ద్రోణాచార్యాదులతో, భీష్మ బాహ్లికాది వృద్ధులతో, సజ్జనులైన విదుర సంజయాదులతో ప్రతిపాద్యాంశం ఒకటే అయినా, వారి వారి ప్రవృత్తుల కనుగుణంగా ప్రవచించాలని భావం. (సంపా).

**వ. మఱియు సమస్తజనంబుల మనంబుల నిక్కడ వ్రాలునట్టి యుపాయంబు లెన్నిగల వన్నియు నయ్యె తగవులమై నాచరించుచుఁజరియించునది; యిచ్చట విరాటు కొలువు కూటంబునం బుట్టిన కృష్ణాదుల సంవాదంబు తెఱంగును మన యెఱింగినయదియె; తదనురూపంబుగాఁ బలికి పాండవులకుఁ దేజోలాభంబు గావించుట కర్తవ్యంబు; నీవు కరినగరంబున వసియించి ధృతరాష్ట్ర ధార్తరాష్ట్ర గాంగేయ విదుర గురుకృపాదుల కడ కరిగి నానాఁటికి వారి వారి చిత్తంబుల తెఱంగెఱింగి ప్రవర్తింపుము; దైవగతింజేసి నీయొడ్డిన సూత్రంబునకు సుయోధనుం డొడంబడియెనేనియు నదియ సకల జనసమ్మతంబయినవిధంబగు; దాన నజాతశత్రుండును బ్రీతుండగుఁ బోయి ర'మ్మని నిశ్చయంబు సేసిన, నమ్మహీసురవరుండు. 60**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకనూ; సమస్త జనంబుల, మనంబులున్= ఎల్లజనుల మనస్సులూ; ఇక్కడన్= పాండవులవైపున; వ్రాలు+అట్టి ఉపాయంబులు= చేరే ఉపాయాలు; ఎన్ని+కలవు= ఎన్ని ఉన్నాయో; అన్నియున్= అన్నీ; ఆ+ఆ+ఇ+తగవులమైన్= ఆయా పద్ధతుల ప్రకారం; ఆచరించుచున్= చేస్తూ; చరియించునది= ప్రవర్తించవలెను; ఇచ్చటన్= ఇక్కడ; విరాటు కొలువు-కూటంబునన్= విరాటుడి సభాభవనంలో; పుట్టిన= కలిగిన; కృష్ణ+ఆదుల, సంవాదంబు, తెఱంగును= కృష్ణుడూ మొదలయినవారి సంభాషణ విధమూ; మన+ఎఱింగిన+అది+ఎ= మనకు తెలిసినదే; తద్+అనురూపంబు+కాన్= దానికి తగినట్లుగా; పలికి; పాండవులకున్; తేజస్(ః)+లాభంబు= పరాక్రమ లాభం; కావించుట= చేకూర్చటం; కర్తవ్యంబు= చేయదగింది; నీవు; కరి నగరంబునన్= హస్తినాపురంలో; వసియించి= ఉండి; ధృతరాష్ట్ర, ధార్తరాష్ట్ర, గాంగేయ, విదుర, గురు కృప+ఆదుల; కడకున్= ధృతరాష్ట్రుడూ, అతడి కొడుకులైన దుర్యోధనాదులూ, భీష్ముడూ, విదురుడూ, ద్రోణుడూ, కృపుడూ మొదలయినవారిదగ్గరికి; అరిగి= వెళ్ళి; నాఁడు+నాఁటికిన్= క్రమక్రమంగా; వారి, వారి, చిత్తంబుల, తెఱంగు= ఆయా వీరుల మనోభావాల రీతిని; ఎఱింగి= తెలిసి; - ప్రవర్తింపుము= నడుచుకొమ్ము; దైవ-గతిన్+చేసి= అదృష్టవశంచేత; నీ+ఒడ్డిన-సూత్రంబునకున్= నీవు పన్నిన పన్నుగడకు; సుయోధనుండు= దుర్యోధనుఁడు; ఒడంబడియెన్+ఏనియున్= అంగీకరించాడా; అది+అ= అదే; సకల, జన, సమ్మతంబు+అయిన-విధంబు= అందరు జనులూ అంగీకరించే విధం; అగున్; దానన్= దానిచేత; అజాతశత్రుండును= ధర్మరాజుకూడా; ప్రీతుండు+అగున్= సంతోషిస్తాడు; పోయి-రమ్ము+అని= వెళ్లిరా అని; నిశ్చయంబు+చేసినన్= నిర్ణయించగా; ఆ+మహీసురవరుండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు.

**తాత్పర్యం:** ఇంకా, అందరి మనస్సులూ ఇక్కడికి చేరుకునే ఉపాయాలు ఎన్ని ఉన్నాయో అన్నిటినీ ఆయా విధాలుగా చేస్తూ వర్తించుము. ఇక్కడ విరాటుడి కొలువులో పుట్టిన కృష్ణాదుల మాటల తీరూ మనకు తెలిసిందే. దానికి తగ్గట్టుగా మాటాడి పాండవులకు బలం చేకూర్చటం నీవు చేయవలసిన పని. నీవు హస్తినాపురంలో ఉండి ధృతరాష్ట్రుడూ, అతడి కొడుకులైన దుర్యోధనాదులూ, భీష్ముడూ, విదురుడూ, ద్రోణుడూ, కృపాచార్యుడూ మొదలైనవారి దగ్గరికి వెళ్ళి, క్రమక్రమంగా వారి మనోభిప్రాయాలు తెలిసికొని ప్రవర్తించు. అదృష్టవశంచేత నీవు పన్నిన పన్నుగడకు దుర్యోధనుడు అంగీకరించాడా, అదే అందరికీ ఆమోదయోగ్యమైన విధం. దానివలన ధర్మరాజు కూడా సంతోషిస్తాడు. వెళ్లి రమ్మ' అని నిర్ణయించగా, ఆ ద్రుపద పురోహితుడు.

**క. మును పాంచాలవిభుని వీ । డ్కొని ధర్మజు భీము నరు నకులు సహదేవుం**
**గని యనుమతుఁడై యందఱు । ననుపఁగ మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్. 61**

**ప్రతిపదార్థం:** మును= ముందుగా; పాంచాల విభునిన్= పాంచాల దేశపు రాజయిన ద్రుపదుడిని; వీడ్కొని= వెళ్ళి వస్తానని విడిచి; ధర్మజున్, భీమున్, నరున్, నకులున్, సహదేవున్= ధర్మరాజునీ, భీముడినీ, అర్జునుడినీ, నకులుడినీ, సహదేవుడినీ; కని= చూచి; అనుమతుఁడు+ఐ= వారిచేత అనుజ్ఞ ఇవ్వబడినవాడయి; అందఱున్= అందరూ; అనుపఁగన్= పంపగా; మన్ననలు+పడసి= సమ్మానాలు పొంది; ప్రీతిన్= సంతోషంతో; అరిగెన్= వెళ్లాడు.

**తాత్పర్యం:** ముందుగా ద్రుపదుడి దగ్గర సెలవు పుచ్చుకొని, తరువాత ధర్మజుడి, భీముడి, అర్జునుడి, నకులుడి, సహదేవుడి అనుజ్ఞపొంది, సమ్మానాలు పొంది, అందరూ సాగనంపగా సంతోషంతో వెళ్ళాడు.

### దుర్యోధనుండును నర్జునుండును శ్రీకృష్ణుని దర్శింపఁబోవుట (సం. 5-7-2)

**వ. అంత నక్కడ దుర్యోధనుండు, సకల రాజన్య సామాన్యంబుగా గోపాలదేవు పాలికి దూతం బుచ్చుట దగ వగునే?యని విచారించి. 62**

**ప్రతిపదార్థం:** అంతన్; అక్కడన్= హస్తినాపురంలో; దుర్యోధనుండు; సకల, రాజన్య, సామాన్యంబు+కాన్= అందరి రాజులతోపాటు; గోపాల- దేవు పాలికిన్= శ్రీకృష్ణుడి దగ్గరికి; దూతన్= రాయబారిని; పుచ్చుట= పంపటం; తగవు+అగునే= మంచిదా; అని; విచారించి= ఆలోచించి.

**తాత్పర్యం:** 'అంతట హస్తినాపురంలో దుర్యోధనుడు రాజులందరి వద్దకువలెనే శ్రీకృష్ణుడి వద్దకు కూడా రాయబారిని పంపటం మంచిదా? అని ఆలోచించి.

**క. వెరవుమెయిఁ దాన కతిపయ । పరిజన సహితముగ నరిగెఁ బటు తురగ గతి**
**స్ఫురణానుమోదలీలా । భరితుఁ డగుచు వేగిరంపుఁ బయనములఁ దగన్. 63**

**ప్రతిపదార్థం:** తాను+అ= తానే; వెరవు-మెయిన్= ఉపాయంతో; కతిపయ, పరిజన, సహితముగన్= కొంతమంది పరిజనులతో; పటు, తురగ, గతి, స్ఫురణ+అనుమోద, లీలా, భరితుఁడు+అగుచున్= సమర్థములైన, గుర్రాల గమనం యొక్క ప్రకాశంయొక్క, సమ్మతితో కూడిన, విలాసంతో నిండిన వాడవుతూ; వేగిరము+పయనములన్= త్వరతో గూడిన ప్రయాణాలతో; తగన్= ఒప్పేటట్లు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఉపాయంతో, కొంతమంది పరిజనులను వెంటబెట్టుకొని, సమర్థములైన గుర్రాల వేగ విజృంభణను అనుమోదించే విలాసంతో కూడినవాడై, త్వరిత ప్రయాణాలతో తగినట్లుగా తానే వెళ్ళాడు.

**విశేషం:** 'వెరవు మెయిన్' అంటే ఉపాయంతో, నేర్పుతో అని అర్థాలు చెప్పవచ్చును. రాజనీత్యుపాయాన్ని ప్రయోగించే నేర్పని తాత్పర్యం ఏర్పడుతుంది. దుర్యోధనుడు శ్రీకృష్ణుడి వద్దకు స్వయంగా పోవాలని భావించటంలో భక్తిగాని, గౌరవంగాని, భయంకాని లేవు. శ్రీకృష్ణుడు యదుసింహుడు. అతడు పాండవపక్షపాతి. పైపెచ్చు బంధువు. పెద్దబలగం కలవాడు. అతడిఅన్న బలరాము డతడు ఎంత చెప్పితే అంత. పైపెచ్చు అర్జునుడికి బహిఃప్రాణం. అతడిని ముందుగా అడిగి తన వైపు

మళ్ళించుకొంటే పాండవ హితులలో భేదాన్ని కలిగించవచ్చునని ఊహ. భేదోపాయమే దుర్యోధనుడి ఊహకు దోహదం చేసింది. (సంపా.) దుర్యోధనుడి విలాసం అతడి రథాశ్వాల వేగానికి అనుగుణంగా ఉందన్నమాట.

**వ. చని తదీయ పురప్రవేశంబు సేసె; నా దివసంబున ధనంజయుండును గోవిందుం గానవచ్చె నట్టియెడ. 64**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి, తదీయ, పుర, ప్రవేశంబు= ఆ కృష్ణుడిదైన నగరం యొక్క ప్రవేశం; చేసెన్; ఆ- దివసంబునన్= ఆ రోజున; ధనంజయుండును= అర్జునుడు కూడా; గోవిందున్= శ్రీకృష్ణుడిని; కానన్+వచ్చెన్= చూడడానికి వచ్చాడు; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో.

**తాత్పర్యం:** వెళ్ళి ఆ శ్రీకృష్ణుడి నగరమైన ద్వారకలో ప్రవేశించాడు. ఆ రోజే అర్జునుడు కూడా శ్రీకృష్ణుడిని చూడటానికి వచ్చాడు. ఆ సమయంలో.

**తే. అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ। డరిగి తలయంపి దెస నున్నతాసనమున**
**నుండెఁ, బదపడి కాల్కడ యొద్ద కల్లఁ। జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి. 65**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ శ్రీకృష్ణుడు; పవడింపన్= శయనించి ఉండగా; మును= ముందు; కౌరవ+అధినాథుఁడు= కురురాజు - దుర్యోధనుడు; అరిగి= వెళ్ళి; తలయంపి దెసన్= తలాపి దిక్కున; ఉన్నత+ఆసనమునన్= ఎత్తయిన పీఠంపై; ఉండెన్; పదపడి= పిమ్మట; సవ్యసాచి= అర్జునుడు; కాలు+కడ+ఒద్దకున్= కాళ్ళకడవద్దకు; అల్లన్= మెల్లగా; చని= వెళ్లి; వినమ్రుఁడు+ఐ= మిక్కిలి విధేయత కలవాడై; నిలుచుండెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు శయనించి ఉండగా, ముందుగా దుర్యోధనుడు వెళ్ళి తలాపి దిక్కున ఉన్న ఉన్నత పీఠంమీద ఆసీనుడయ్యాడు. తరువాత వచ్చిన అర్జునుడు మెల్లగా కాళ్ళ కడకు వెళ్ళి మిక్కిలి వినయంతో నిలబడ్డాడు.

**విశేషం:** దుర్యోధనార్జునులు ఆ సమయంలో ప్రవర్తించిన తీరులు వారివారి స్వభావాలకు అనుగుణంగా ఉన్నాయి. దుర్యోధనుడు ఉద్ధతుడు; అర్జునుడు వినయపరుడు. తలనుండి కాళ్ళవరకు చూడటం శ్రీకృష్ణుడిని మానవుడిగా భావించి చూడటం - అది దుర్యోధనుడి దృక్పథం. పాదాలనుండి శిరస్సుదాకా చూడటం శ్రీకృష్ణుడిని మాధవుడిగా దర్శించటం - ఇది అర్జునుడి శరణాగత దృక్పథం.

**వ. అంత. 66**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత.

**క. మేలుకని కృష్ణుఁ డర్జును। నాలోకించి మఱి కౌరవాధిపుఁ గని త**
**త్కాలోచిత బహుమతిమైఁ। జాలఁ బ్రియం బిరువురకుఁ బ్రసన్నతఁ జేసెన్. 67**

**ప్రతిపదార్థం:** కృష్ణుఁడు; మేలుకని= మేల్కొని; అర్జునున్; ఆలోకించి= చూచి; మఱి= తరువాత; కౌరవ+అధిపున్= కౌరవరాజును - దుర్యోధనుడిని; కని= చూసి; తద్+కాల+ఉచిత-బహుమతిమైన్= ఆ సమయానికి తగిన గౌరవంతో; ఇరువురకున్= అర్జున దుర్యోధనుల కిద్దరికీ; ప్రసన్నతన్= ఆదరంతో; చాలన్+ప్రియంబు+చేసెన్= ఎంతో ప్రీతిని కలిగించాడు.

**తాత్పర్యం:** కృష్ణుడు నిద్రలేచి అర్జునుడిని ముందు చూచి తరువాత దుర్యోధనుడిని చూచి, ఆ సమయానికి తగిన మర్యాదతో, వారిద్దరినీ ఎంతో ఆదరించి ప్రీతిని గలిగించాడు.

**విశేషం:** అర్జునుడు కాళ్ళకడ ఉండడంచేత కృష్ణుడు అతడిని ముందుగానూ, దుర్యోధనుడు తలాపి దిక్కున వెనక ఉండడం చేత అతడిని తరువాత చూడడం తటస్థించింది. అంతేకాదు, ఒకరిని ఆలోకించాడు; మరొకరిని చూచాడు. ఆ తేడాను ప్రీతితో కప్పిపుచ్చాడు. ఇరువురికీ ప్రసన్నుడైనట్లుగా ప్రవర్తించాడు.

**వ. తదనంతరంబ.** **68**

**తాత్పర్యం:** ఆ పిమ్మటనే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. వారలఁ జూచి కేశవుఁడు 'వచ్చిన కార్యము సెప్పుఁ'డన్న న**
**క్కౌరవనాథుఁ డిట్లనియెఁ; 'గయ్యము సేయువగన్ సహాయముం**
**గోరి భవత్సకాశమునకుం జనుదెంచితి; మేము వీరు నీ**
**కారయ నొక్కరూప హృదయంబునఁ బేర్చిన బాంధవంబునన్.** **69**

**ప్రతిపదార్థం:** కేశవుఁడు= శ్రీకృష్ణుడు; వారలన్= ఆ దుర్యోధనార్జునులను; చూచి; వచ్చిన, కార్యమున్= వచ్చిన పని; చెప్పుఁడు+అన్నన్= చెప్పండి అనగా; ఆ+కౌరవ నాథుఁడు= ఆ కురురాజు-దుర్యోధనుడు; ఇట్లు+అనియెన్; కయ్యము+ చేయువగన్= యుద్ధం చేసే తలంపుతో; సహాయమున్= (నీ) తోడ్పాటును; కోరి; భవత్+సకాశమునకున్= నీ దగ్గరకు; చనుదెంచితిమి= వచ్చాము; ఏమున్= మేము కౌరవులమూ; వీరున్= పాండవులూ; నీకున్; ఆరయన్= చూడగా; హృదయంబునన్= మనస్సులో; పేర్చిన= అతిశయించిన; బాంధవంబునన్= చుట్టరికంచేత; ఒక్క రూపు+అ= ఒక్కటే.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు వాళ్ళిద్దరినీ చూచి 'మీరు వచ్చిన పని తెలుపండి' అనగానే, ఆ దుర్యోధనుడు ఇట్లా అన్నాడు. 'యుద్ధం చేసే తలంపుతో నీ తోడ్పాటును కోరి నీ దగ్గరికి వచ్చాము. కౌరవులమైన మేమూ, పాండవులైన వీరూ చూడగా, హృదయంలో నీకు బాగా దగ్గరచుట్టాల మవడంచేత, ఒక్కటే.

**విశేషం:** అర్జునుణ్ణి కలుపుకొని అతడి సంగతి కూడా దుర్యోధనుడు తానే చెప్పడం గమనించదగింది. అర్జునుడు కూడా తనలాగే కృష్ణ సహాయం కోసమే వచ్చి ఉంటాడని దుర్యోధనుడు సరిగానే ఊహించాడు.

**క. ము న్నేను గానవచ్చితి । నిన్నుఁ; సుజనులైనవారు నెమ్మిని మునుమున్**
**గన్నం దగఁ గైకొంద్రు; స । మున్నత సౌజన్య సారయుతుఁడవు నీవున్.** **70**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నిన్నున్; మున్ను= మొదట; కానన్+వచ్చితిన్= చూడవచ్చాను; సుజనులు+ఐన వారు= మంచివాళ్ళు; నెమ్మిని= ప్రీతితో; మునుమున్= మొట్టమొదట; కన్నన్= చూస్తే; తగన్= ఒప్పుగా; కైకొంద్రు= స్వీకరిస్తారు; ఆదరిస్తారు; నీవున్= నీవుకూడా; సమున్నత, సౌజన్య, సార యుతుఁడవు= మిక్కిలి గొప్పదైన మంచితనంయొక్క సారంతో కూడినవాడవు.

**తాత్పర్యం:** ముందుగా నేను నిన్ను చూడవచ్చాను. సత్పురుషులు మొట్టమొదట చూచినవాళ్ళను ప్రీతితో సముచితంగా ఆదరిస్తారు. నీవు కూడా ఎంతో మంచివాడవు.

**విశేషం:** నిన్ను చూడటానికి అర్జునుడికంటె ముందు నేను వచ్చాను. ముందు వచ్చిన వాళ్ళను సజ్జనులు ఆదరిస్తారు. నీవు సజ్జనుడవు' అని దుర్యోధనుడి సహేతుకమైన వాక్యాలకు ధ్వని 'అర్జునుడినికాక నీవు నన్నే స్వీకరించాలి. అప్పుడే నీ సౌజన్యం తెలుస్తుంది' అని.

**వ. కావున లోకంబుపాడి విచారించి నాకుం దోడు గావలయు' ననిన వాసుదేవుం డిట్లనియె. 71**

**ప్రతిపదార్థం:** కావునన్; లోకంబు, పాడి= లోకంలో ఉన్న న్యాయం; విచారించి= ఎంచి; నాకున్; తోడు+కావలయున్= సహాయపడాలి; అనినన్; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** 'కాబట్టి లోకంలో ఉన్న న్యాయాన్ని పాటించి నాకు నీవు సహాయపడాలి' అని దుర్యోధనుడనగా, శ్రీకృష్ణుడు అతడితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'నీ విట మున్న వచ్చి;తిది నిక్కము; పార్థునిఁ దొల్తఁ గాంచితిం;**
**గావున మీకు నిద్దఱకు గౌరవ మొప్పఁగఁదోడుపాటు స**
**ద్భావము; దీనికిం దెఱఁగు దప్పకయుండఁగ నేర్పరించెదన్;**
**మీ వల పెట్టు లట్ల తగ నీవును నీతఁడు గోరికొం డొగిన్. 72**

**ప్రతిపదార్థం:** నీవు; ఇటన్= ఇక్కడికి; మున్ను+అ= ముందే; వచ్చితి(వి); ఇది; నిక్కము= నిజం; పార్థునిన్= అర్జునుణ్ణి, తొల్తన్= మొదట; కాంచితిన్= చూశాను; కావునన్; మీకున్; ఇద్దఱకున్; గౌరవము+ఒప్పఁగన్= గౌరవం ఒప్పేటట్టు; తోడుపాటు= సహాయపడడం; సత్+భావము= మంచితనం; దీనికిన్= ఇందుకు; తెఱఁగు+తప్పక+ఉండఁగన్= పద్ధతి చెడకుండా ఉండేటట్లు; ఏర్పరించెదన్= విభాగం చేస్తాను; మీ - వలపు+ఎట్టులు+అట్లు+అ= మీ కోరిక ఎలా ఉన్నదో అలాగే; నీవునున్; ఈతఁడున్; తగన్= ఒప్పేటట్లు; ఒగిన్= క్రమంగా; కోరికొండు= కోరుకొనండి.

**తాత్పర్యం:** 'నీవు ఇక్కడికి ముందే వచ్చావు. ఇది నిజం. కాని నేను ముందుగా అర్జునుడిని చూచాను. కాబట్టి మీకు ఇద్దరికీ సగౌరవంగా సహాయపడడం మంచిది. ఇందుకు క్రమపద్ధతి చెడకుండా ఉండేటట్లు నేను ఒక విభాగం చేస్తాను. కనుక, నీవూ, ఇతడూ మీ మీ కోరికల ననుసరించి ఒప్పుగా క్రమంగా కోరుకొనండి.

**విశేషం:** తనను చూడటానికి ముందు వచ్చినవాడికీ, తను ముందు చూచిన వాడికీ న్యాయం జరిగే విధంగా ఏర్పాటు చేస్తానని శ్రీకృష్ణుడనటం అతడి ధర్మజ్ఞతకు నిదర్శనం.

**క. నా పాటియ పదివేవురు । గోపాలురు గలరు సమరకోవిద బాహా**
**టోపాభిరామమూర్తులు, । చాపాద్యాయుధ కళా విశారదచిత్తుల్. 73**

**ప్రతిపదార్థం:** సమర= యుద్ధంలో; కోవిద= పాండిత్యంకల; బాహా= భుజాలయొక్క; ఆటోప= గర్వంచేత; అభిరామ= మనోహరాలైన; మూర్తులు= ఆకారాలు కలవారూ; చాప= ధనుస్సు; ఆది= మొదలయిన; ఆయుధకళా= యుద్ధవిద్యయందు; విశారద= నేర్పుగల; చిత్తుల్= మనస్సులు కలవారూ అయిన; పదివేవురు= పదివేలమంది; గోపాలురు= యాదవవీరులు; నా-పాటి+అ= నా యంతటివారే; కలరు.

**తాత్పర్యం:** యుద్ధపాండిత్యంకలిగి భుజబలగర్వం చేత మనోహరాలైన ఆకారాలు కలవారూ; విల్లూ మొదలయిన ఆయుధాల విద్యలో నేర్పుగల మనస్సులు గలవారూ అయిన పదివేలమంది వీరులైన గోపాలురు నాఅంతటివారే ఉన్నారు.

**క. నారాయణాభిధానులు । వారలు గయ్యంబు సేయువా; రొక్కెడ నే**
**నూరక నిరాయుధ వ్యా । పారతమై నుండువాఁడఁ బరమాప్తుఁడనై. 74**

**ప్రతిపదార్థం:** నారాయణ+అభిధానులు, వారలు= నారాయణ నామధేయులైనవారు; కయ్యంబు= యుద్ధం; చేయువారు= చేస్తారు; నేను; నిరాయుధ, వ్యాపారతమైన్= ఆయుధాలను ప్రయోగించకుండా; పరమ+ఆప్తుఁడన్+ఐ= మిక్కిలిహితుడనై; ఒక్క+ఎడన్= ఒకచోట; ఊరక, ఉండువాఁడన్= ఊరికే ఉంటాను.

**తాత్పర్యం:** నారాయణ నామధేయులైన ఆ గోపాలవీరులు యుద్ధం చేస్తారు. నేను ఆయుధాల జోలికి పోకుండా, మిక్కిలి హితుడనయి ఒకచోట ఊరకే ఉంటాను.

**విశేషం:** శ్రీకృష్ణుడి మహానుభావత తెలిసిన ఏ అర్జునుడో తప్ప లౌకికుడు మరెవ్వడైనా, కృష్ణుడిని కాక నారాయణ నామధేయులనే కోరుకొంటాడు. కృష్ణుడు ఒక్కడు, వాళ్ళు పదివేల మంది. కృష్ణుడు ఆయుధం ముట్టడు. వాళ్ళు భుజబల సంపన్నులు, సర్వాయుధ విద్యానిపుణులు. అటువంటప్పుడు చూస్తూ చూస్తూ కృష్ణుడిని ఎవడు కోరుకుంటాడు? దుర్యోధనుడంతే చేశాడు.

**క. వా రొకతల, యే నొక తల; । యీ రెండు దెఱంగులందు నెయ్యది ప్రియ మె**
**వ్వారికిఁ జెప్పుఁడు; దొలితొలి । గోరికొనన్ బాలునికిఁ దగుం బాడిమెయిన్.' 75**

**ప్రతిపదార్థం:** వారు= పదివేల మంది నారాయణ నామధేయులు; ఒక తల= ఒక పక్షం; ఏను= నేను ఒక తల= ఒక పక్షం; ఈ, రెండు-తెఱంగులందున్= ఈ రెండు విధాలలోను; ఏ+వారికిన్= ఎవరికి; ఏ+అది= ఏది; ప్రియము= ఇష్టమో; చెప్పుఁడు; తొలి తొలి= మొట్టమొదట; కోరికొనన్= కోరుకోవడానికి; పాడిమెయిన్= న్యాయప్రకారం; బాలునికిన్= చిన్నవాడికి; తగున్.

**తాత్పర్యం:** ఆ పదివేలమంది నారాయణ నామధేయులైన గోపాలకులు ఒక పక్షం. నేనొక్కడినీ ఒక పక్షం. ఈ రెండు విధాలలోనూ ఎవరికి ఏది ఇష్టమో చెప్పండి. మొట్టమొదట చిన్నవాడు కోరుకొనటం న్యాయం.'

### అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిఁగాఁ గోరికొనుట (సం. 5-7-18)

**క. అని పలికి హరి కిరీటిం । గనుఁగొని 'కొండుకవు నీవు గావున, నీకున్**
**మును గోరఁ బాడి' యనవుడు । విని కృష్ణునిఁ గోరికొనియె విజయుం డెలమిన్. 76**

**ప్రతిపదార్థం:** అని; పలికి; హరి= శ్రీకృష్ణుడు; కిరీటిన్= అర్జునుణ్ణి; కనుఁగొని= చూచి; నీవు; కొండుకవు= చిన్నవాడవు; కావునన్; నీకున్; మును= ముందు; కోరన్= కోరుట; పాడి= ధర్మం; అనవుడున్= అనగానే; విని; విజయుండు= అర్జునుడు; ఎలమిన్= సంతోషంతో; కృష్ణునిన్; కోరికొనియెన్.

**తాత్పర్యం:** అని పలికి శ్రీకృష్ణుడు అర్జునుడిని చూచి 'మీ ఇద్దరిలో నీవు చిన్నవాడవు కాబట్టి, ముందు నీవు కోరుకొనటం ధర్మం' అనగానే విని అర్జునుడు సంతోషంతో శ్రీకృష్ణుడిని కోరుకొన్నాడు.

**విశేషం:** 'ఎలమిన్' - శ్రీకృష్ణుడు తనకు సహాయపడటం అర్జునుడికి సంతోషప్రదం. 'విజయుండు' అనేపదం ఇందులో సాభిప్రాయంగా ప్రయోగించబడింది. (చూడు: 87వ వచనం).

**ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి । నపహరించికొనినయట్ల కాఁగఁ**
**దలఁచి, చెన్నుమీఱి, బలములఁ గైకొని । చనియెఁ బ్రీతి రాము సదనమునకు. 77**

**ప్రతిపదార్థం:** దానికిన్= అర్జునుడు పదివేలమంది నారాయణులనుగాక కృష్ణుడిని కోరుకొన్నందుకు; ధార్తరాష్ట్రుఁడు= దుర్యోధనుడు; ఆత్మన్= మనస్సులో; పొంగి= సంతోషించి; వారిన్= ఆ నారాయణ నామధేయులను; అపహరించికొనిన+అట్లు+అ,కాఁగన్= అర్జునుడి ఏమరుపాటు వలన తాను దక్కించుకొన్నట్లుగానే; తలఁచి= ఎంచి; చెన్ను, మీఱి= కాంతి అతిశయించి; బలములన్= సేనలను; కైకొని= తీసికొని; రాము,సదనమునకున్= బలరాముడి ఇంటికి; ప్రీతిన్= సంతోషంతో; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** అర్జునుడు పదివేలమంది గోపకులను కాక కృష్ణుడిని కోరుకొన్నందుకు దుర్యోధనుడు మనస్సులో పొంగి, ఆ గోపకులను తాను అనాయాసంగా దక్కించుకున్నట్లే ఎంచి, సంతోషంతో కాంతి అతిశయించి, తన సేనలను తీసికొని బలరాముడి ఇంటికి ఆనందంతో వెళ్ళాడు.

**విశేషం:** ముందు కోరుకొనే హక్కు అర్జునుడికి లభించింది. అతడెక్కడ పదివేలమంది గోపవీరులను తన్నుకుపోతాడో అని దుర్యోధనుడి భయం. అర్జునుడు ఆ వీరులనుగాక శ్రీకృష్ణుడిని ఒక్కడినీ కోరుకొన్నందుకు దుర్యోధనుడి సంతోషం అంతా ఇంతా కాదు. ఆ సంతోషంతో వికాసం అతిశయించింది. పదివేలమంది కాదు, నూరువేల మంది అయినా ఒక్క కృష్ణుడికి సాటి రారు. ఆ సంగతి అర్జునుడికి తెలుసు. మూఢ దుర్యోధనుడికి తెలియదు.

**వ. చని యతనిం గని సమ్మానంబు వడసి తనవచ్చిన కార్యం బెఱింగించిన దుర్యోధనునకు బలదేవుం డిట్లనియె. 78**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి, అతనిన్= బలరాముడిని; కని= చూచి; సమ్మానంబు+పడసి= సత్కారం పొంది; తన వచ్చిన కార్యంబు= తాను వచ్చిన పని; ఎఱింగించినన్= తెలుపగా; దుర్యోధనునకున్; బలదేవుండు= బలరాముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** వెళ్ళి బలరాముడిని చూచి అతిథిసత్కారం పొంది, తాను వచ్చిన పని తెలుపగా, బలరాముడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**క. 'అభిమన్యు వివాహమునకుఁ । బ్రభువర్గం బెల్లఁ గూడఁబడియుండఁగ, నా**
**సభ నీకై యేఁ బలికితి; । నిభపురమున మాట వుట్ట దె ట్లీవు వినన్? 79**

**ప్రతిపదార్థం:** అభిమన్యు, వివాహమునకున్= అభిమన్యుడి పెళ్ళికి; ప్రభు, వర్గంబు+ఎల్లన్= వచ్చిన రాజసమూహం అంతా; కూడఁబడి+ఉండఁగన్= సమావేశం కాగా; ఆ, సభన్= ఆ సభలో; ఏన్= నేను; నీకై= నీకొరకు; పలికితిన్= మాటాడాను; ఇభపురమునన్= హస్తినాపురంలో; ఈవు= నీవు; వినన్= వినేటట్లు; మాట+పుట్టదు+ఎట్లు?= మాట పుట్టలేదా?

**తాత్పర్యం:** 'అభిమన్యుడి పెళ్ళి సందర్భంగా వచ్చిన రాజులందరూ సమావేశమయినప్పుడు ఆ సభలో నేను నీ పక్షం పలికాను. నీవు హస్తినాపురంలో ఈ మాట వినలేదా?

**వ. దానికిఁ గొంద ఱసహ్యపడి పాండవ పక్షపాతంబునం బ్రతికూలవచనంబులు వలికిన, నవి కృష్ణునకుఁ బ్రియంబులై యుండె నట్లగుటం జేసి. 80**

**ప్రతిపదార్థం:** దానికిన్= అందుకు; కొందఱు; అసహ్యపడి= సహింపజాలక; పాండవ,పక్షపాతంబునన్= పాండవులమీది అభిమానంతో; ప్రతికూల,వచనంబులు+పలికినన్= వ్యతిరేకపు మాటలు పలుకగా; అవి= ఆ మాటలు; కృష్ణునకున్; ప్రియంబులు+ఐ+ఉండెన్= ఇంపులై ఉన్నాయి; అట్లు+అగుటన్+చేసి= అందుచేత.

**తాత్పర్యం:** నా మాటకు సైపలేక కొందరు పాండవులమీది పక్షపాతంతో వ్యతిరేకించి మాటాడగా, ఆ మాటలు శ్రీకృష్ణుడికి రుచించాయి. అందుచేత.

**విశేషం:** తన మాటకు అసహ్యపడిన కొందరు 'సాత్యకి ద్రుపదులు.' బలరాముడు వారి పేర్లు చెప్పలేదు.

**తే. అతనిఁ బాసి యొక్కింత ప్రొద్దైన నిలువఁ। జాలమియు మూలముగ, విరసంపు మాట**
**లాడ నొల్లమి, నేమియు ననక యంత। నుండి యొక నిశ్చయమ్ముమై నున్నవాఁడ.' 81**

**ప్రతిపదార్థం:** అతనిన్= ఆ కృష్ణుడిని; పాసి= విడిచి; ఒక్క+ఇంత-ప్రొద్దు+ఐనన్= కొంచెంసేపు కూడా; నిలువన్+చాలమియున్= ఉండలేకపోవటం; మూలముగన్= మొదటి కారణంగా; విరసము+మాటలు= అనిష్టములైన మాటలు; ఆడన్+ఒల్లమిన్= మాటాడటం ఇష్టంలేకపోవటం చేత; ఏమియున్+అనక= ఏమీ మాటాడకుండా; అంతనుండి= అది మొదలుకొని; ఒక, నిశ్చయమ్ముమైన్= ఒక నిర్ణయంతో; ఉన్నవాఁడన్= ఉన్నాను.

**తాత్పర్యం:** కృష్ణుడిని విడిచి ఒక్క క్షణం కూడా ఉండలేకపోవటం మూలాన, విరసంగా మాటాడటం ఇష్టం లేకా, ఏమీ అనకుండా, అది మొదలుకొని నేను ఒక నిర్ణయం చేసికొన్నాను.'

**వ. అది యెయ్యది యంటేని. 82**

**ప్రతిపదార్థం:** అది= ఆ నా నిశ్చయం; ఏ+అది= ఏది; అంటి(వి)+ఏనిన్= అంటే-

**తాత్పర్యం:** ఆ నా నిశ్చయం ఏమిటని అడిగితే.

**క. మీరును వారును జలమునఁ। బోరెడునెడ, నెద్ది యెట్లు వోయిన నెఱి నే**
**నూరకయుండుదుఁ; దో డె। వ్వారికిఁ బోఁ; నింత నిక్కువం బెఱ్ఱంగిన్.' 83**

**ప్రతిపదార్థం:** మీరును; వారును= పాండవులును; చలమునన్= పట్టుదలతో; పోరెడు+ఎడన్= యుద్ధం చేసేటప్పుడు; ఎద్ది= ఏది; ఎట్లు+పోయినన్= ఎట్లాపోయినా - జయాపజయాలు ఎవరికైనా; నెఱిన్= తటస్థంగా; ఏను= నేను; ఊరక+ఉండుదున్= ఊరుకుంటాను; ఎవ్వారికిన్= ఎవరికీ; తోడు= సహాయం; పోను= పోవను; ఏ+భంగిన్= ఏవిధంగానైనా; ఇంత; నిక్కువంబు= నిజం.

**తాత్పర్యం:** మీరూ, వాళ్లూ పట్టుదలతో పోరాడేటప్పుడు, జయాపజయాలు ఎవరికైనా నేను తటస్థంగా ఊరుకుంటాను. ఎవరికీ సహాయం చేయను. ఏ విధంగానైనా ఇది నిజం.'

**వ. అనిన విని, దుర్యోధనుండు దాని కియ్యకొని, సవినయంబుగా బలదేవుని వీడ్కొని, వాసుదేవు నామంత్రణంబుసేసి, కృతవర్మ పాలికిం జని, యాతం డొక్క యక్షౌహిణితోడఁ దన్నుంగలయవచ్చువాఁడయి యూఱడం బలికినఁ బ్రియంబంది, నిజపురంబున కరిగెఁ; దదనంతరంబ కృష్ణుం డర్జునున కిట్లనియె. 84**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; దుర్యోధనుండు; దానికిన్; ఇయ్యకొని= అంగీకరించి; సవినయంబుగాన్= అణకువతో; బలదేవునిన్= బలరాముణ్ణి; వీడ్కొని= విడిచి; వాసుదేవున్= శ్రీకృష్ణుణ్ణి, ఆమంత్రణంబు+చేసి= వెళ్ళివస్తానని చెప్పి; కృతవర్మ పాలికిన్= కృతవర్మవద్దకు; చని; ఆతండు; ఒక్క+అక్షౌహిణి తోడన్= ఒక అక్షౌహిణి సేనతో; తన్నున్= తనను; కలయన్+ వచ్చువాఁడు+అయి= చేరవచ్చువాడై; ఊఱడన్= ఊరట కలిగేటట్లు; పలికినన్= పలుకగా; ప్రియంబు+అంది= సంతోషించి; నిజపురంబునకున్= తన నగరానికి; అరిగెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= ఆ పిమ్మటనే; కృష్ణుండు; అర్జుననకున్; ఇట్లు+అనియెన్= ఇట్లాఅన్నాడు.

**తాత్పర్యం:** బలరాముడి మాటలు విని దుర్యోధనుడు అందుకంగీకరించి వినయపూర్వకంగా అతడిని వీడుకొని, కృష్ణుడిని మళ్ళీపలకరించి, కృతవర్మవద్దకు వెళ్ళి, అతడు 'ఒక అక్షౌహిణీ సేనతో నీకు తోడ్పడ వస్తా' నని ఊరట కలిగేటట్లు పలుకగా, సంతోషించి తన నగరానికి - హస్తినాపురానికి వెళ్లాడు. ఆ తరువాత కృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** కృతవర్మ భోజదేశాధిపతి, దుర్యోధనుడి పక్షంలో ఉండి పాండవులతో పోరాడినవాడు. అక్షౌహిణి- అక్ష+ఊహిని- గుణం వచ్చి అక్షోహిణి కావలసి ఉండగా, వృద్ధి వచ్చి అక్షౌహిణి అయింది. అక్షోహిణి అనే గుణం వచ్చిన రూపాన్ని కూడా తిక్కనే ఉద్యోగపర్వం 1-236లో ప్రయోగించాడు. 'సహస్రా, క్షోహిణు లట్లగుట మీరు సూడరె యెందున్'. అక్షౌహిణీ సేన అంటే- 21,870 రథాలూ, అన్నే ఏనుగులూ, ఏనుగులకు మూడు రెట్లు గుర్రాలూ, ఆ మూడూ కలిస్తే అయ్యేటంత మంది కాలిబంట్లూ గల సేన.

**క. 'నారాయణ గోపాలుర । భూరిపరాక్రములఁ గురువిభుఁడు గొన, సంగ్రా**
**మారంభరహితు నన్నుం । గోరికొనుట నీకు మేలగునె తలపోయన్?' 85**

**ప్రతిపదార్థం:** కురువిభుఁడు= కురురాజు-దుర్యోధనుడు; భూరిపరాక్రములన్= అధిక పరాక్రమవంతులను; నారాయణగోపాలురన్= నారాయణులనే పేరు గల గోపకులను; కొనన్= తీసికొనగా; సంగ్రామ+ఆరంభ, రహితున్+నన్నున్= యుద్ధప్రయత్నం లేని నన్ను, కోరికొనుట= కోరుకొనటం; తలపోయన్= ఆలోచించగా; నీకున్; మేలు+అగునె?= మంచిదా?

**తాత్పర్యం:** 'దుర్యోధనుడు అధిక పరాక్రమవంతులైన నారాయణ నామధేయులైన గోపకులను కోరుకొనగా, యుద్ధం చేయనంటున్న నన్ను కోరుకోవటం వలన ఆలోచించగా నీకు ఏ విధంగా మేలు కలుగుతుంది?'

**క. అనుటయు, నాతఁడు హరి కి । ట్లను: 'నేను రణంబునకు సహాయం బొల్లన్;**
**విను, సుప్రసిద్ధుఁడవు నీ । వని సేసినఁ, బేరు నీక యగు నెప్పాటన్. 86**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని కృష్ణు డనగానే; ఆతఁడు= అర్జునుడు; హరికిన్+ఇట్లు+అనున్= కృష్ణుడితో ఇట్లా అన్నాడు; నేను; రణంబునకున్= యుద్ధానికి; సహాయంబు= తోడ్పాటు; ఒల్లన్= అంగీకరించను; విను; సుప్రసిద్ధుఁడవు-నీవు= మిక్కిలి వాసికెక్కిన నీవు; అని+చేసినన్= యుద్ధం చేస్తే; ఏ+పాటన్= ఏవిధంగా నైనా; పేరు= కీర్తి; నీకున్+అ= నీకే; అగున్.

**తాత్పర్యం:** కృష్ణుడి మాటలు విని అర్జునుడు అతడితో ఇట్లా అన్నాడు. 'నేను యుద్ధానికి తోడ్పాటు కోరను. వినుము. మిక్కిలి ప్రఖ్యాతుడవైన నీవు యుద్ధం చేస్తే, ఏవిధంగా నైనా, పేరు నీకే వస్తుంది.'

**విశేషం:** ఈ మాటవలన అర్జునుడు ఎటువంటి అసహాయశూరుడో తెలుస్తుంది.

**వ. నీ కెదురై జయంబు గొనరా; దట్లగుటం జేసి, విజయమూలం బగు నీతోడును వలయు; నీవు సమరంబు సేయకునికియుం బ్రియంబు కావున నిన్నుం గోరికొంటి' నని చెప్పి మఱియు నిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** నీకున్; ఎదురు+ఐ= ప్రతిపక్షంలో ఉండి; జయంబు= గెలుపు; కొనన్+రాదు= పొందటం అశక్యం; అట్లు+అగుటన్+చేసి= అందుచేత; విజయమూలంబు+అగు= విజయానికి ప్రధాన కారణమైన; నీతోడును= నీ సహాయం కూడా; వలయున్= కావాలి; నీవు; సమరంబు+చేయక+ఉనికియున్= యుద్ధం చేయకపోవటం కూడా; ప్రియంబు= ఇష్టం; కావునన్; నిన్నున్; కోరికొంటిన్; అని; చెప్పి; మఱియున్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ప్రతిపక్షంలో ఉంటే నిన్ను గెలవటం అశక్యం. అందుచేత విజయానికి ప్రధాన కారణమైన నీ తోడ్పాటు కావలసినదే. నీవు యుద్ధం చేయకుండా ఉండటం కూడా నాకిష్టమే. కాబట్టి నిన్ను కోరుకొన్నాను' అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** కృష్ణుడు ప్రతిపక్షంలోనే ఉంటే తమకు గెలుపు అసాధ్యం. అందుచేత అతడు తమ పక్షంలోనే ఉండాలి. తమ పక్షంలో ఉండి కృష్ణుడు యుద్ధం చేస్తే, పేరు తనకు గాక అతడికి దక్కుతుంది. కృష్ణుడు యుద్ధం చేయనన్నాడు. కాబట్టి అది తన కిష్టం. ఇదీ అర్జునుడు కృష్ణుడిని కోరుకొనటానికి హేతువు. ఈ మాటలవలన ఉభయుల పరాక్రమాతిశయం విదితమవుతుంది.

**క. 'సారథ్యం బొనరింపు మ । పారకృపాలీల నెల్లభంగుల నా; కీ**
**గౌరవమును జిరకాలము । గోరినయది; దీని నిమ్ము గుణరత్ననిధీ!' 88**

**ప్రతిపదార్థం:** గుణ,రత్న,నిధీ!= గుణములనే రత్నాలకు నిధానమైనవాడా! కృష్ణా!; అపార కృప లీలన్= అంతులేని దయావిలాసంతో; ఎల్ల భంగులన్= అన్ని విధాలా; నాకున్; సారథ్యంబు; ఒనరింపుము= చేయుము; ఈ గౌరవమును= ఈ గౌరవం; చిరకాలము= ఎంతోకాలంగా; కోరిన+అది= కోరినట్టిది; దీనిన్= ఈ కోరికను; ఇమ్ము.

**తాత్పర్యం:** సద్గుణ రత్నాలకు నిధిఅయినవాడా, శ్రీకృష్ణా! నీవు అపారమైన దయతో అన్ని విధాలా నా రథానికి సారథ్యం చేయుము. ఈ గౌరవాన్ని నేను ఎప్పటినుండో కోరుకొంటున్నాను. నా కోరిక తీర్చుము.'

**క. అనినఁ గిరీటికి హరి యి । ట్లను 'నీదగు కోర్కి దీర్చు టది నాకు వ్రతం**
**బనఘా! తగ సారథ్యం । బొనరించెద నీకు నసమయుద్ధక్రీడన్'. 89**

**ప్రతిపదార్థం:** అనినన్; హరి= కృష్ణుడు; కిరీటికిన్= అర్జునుడికి; ఇట్లు+అనున్; అనఘా!= పాపరహితుడా! నీదు+అగు+కోర్కి= నీదయిన కోరిక; తీర్చుట= నెరవేర్చటం; అది; నాకున్; వ్రతంబు= నియమం; నీకున్; అసమ యుద్ధ-క్రీడన్= అసమానమైన యుద్ధకేళిలో; తగన్= ఒప్పేటట్లు; సారథ్యంబు; ఒనరించెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** అనగా అర్జునుడితో కృష్ణుడు ఇట్లా అన్నాడు. 'పాపరహితుడా! నీ కోరిక తీర్చటం నాకు వ్రతం. అసమానమైన యుద్ధకేళిలో నేను నీకు సారథ్యం చేస్తాను.'

**విశేషం:** 'నీ కోరిక తీర్చటం నాకు వ్రతం' అనటంలో తప్పకుండా తీరుస్తాననీ, దానిని తాను పవిత్రకార్యంగా భావిస్తాననీ ధ్వని.

**క. అని యూఱడించి, నరుఁ దో । డ్కొని, ధర్మతనూజునొద్దకుం బ్రియ మెసఁగం**
**జనుదెంచెం గార్యాలో । చనమును దగఁజేయు బుద్ధి శౌరి గడంకన్. 90**

**ప్రతిపదార్థం:** అని, ఊఱడించి= ఓదార్చి; శౌరి= కృష్ణుడు; నరున్= అర్జునుడిని; తోడ్కొని= వెంటబెట్టుకొని; కార్య+ఆలోచనమును= కర్తవ్య విచారం; తగన్= ఒప్పేటట్టు; చేయుబుద్ధిన్= చేసే తలంపుతో; ధర్మతనూజు+ఒద్దకున్= ధర్మరాజు దగ్గరికి; ప్రియము+ఎసఁగన్= సంతోషం అతిశయించగా; కడంకన్= పూనికతో; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** అని ఓదార్చి కృష్ణుడు అర్జునుడిని వెంటబెట్టుకుని అనంతర కర్తవ్యం ఆలోచించే తలంపుతో ధర్మరాజు వద్దకు సంతోషాతిశయంతో, పూనికతో వచ్చాడు.

**వ. అంత నట శల్యుపాలికిం బోయినదూత లతనిం గని సముచితాలాపంబుల సమరసహాయత్వంబునకుఁ గోరి పిలిచినం బ్రీతుండై యతండును బుత్త్రమిత్త్రసమేతంబుగా నానాసేనాతిసంకులంబుగాఁ గదలి పాండవు లున్నయెడకు నిత్యప్రయాణంబుల నడచు సమయంబున. 91**

**ప్రతిపదార్థం:** అంతన్; అటన్= అక్కడ; శల్యుపాలికిన్= శల్యుడి వద్దకు; పోయిన దూతలు= వెళ్ళిన రాయబారులు; అతనిన్; కని; సముచిత+ఆలాపంబులన్= తగిన మాటలతో; సమరసహాయత్వంబునకున్= యుద్ధంలో తోడ్పడటానికి; కోరి; పిలిచినన్; అతండును; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడయి; పుత్త్ర,మిత్త్ర,సమేతంబుగాన్= కొడుకులతోను, స్నేహితులతోను; నానా-సేనా+అతిసంకులంబుగాన్= పెక్కు సంఖ్యలుగల సేనల మిక్కిలి సమ్మర్దంతో; కదలి; పాండవులు; ఉన్న+ఎడకున్= ఉన్నచోటికి; నిత్య-ప్రయాణంబులన్= ఎడతెగని పయనాలతో; నడచు సమయంబునన్= నడిచేటప్పుడు.

**తాత్పర్యం:** తరువాత అక్కడ శల్యుడి వద్దకు వెళ్లిన దూతలు అతడిని చూచి తగిన మాటలతో యుద్ధంలో తోడ్పడవలసినదిగా కోరి పిలువగా, శల్యుడునూ సంతోషించి పుత్రులతోనూ, మిత్రులతోనూ కూడి పెక్కు సేనలను తీసికొని కదలి పాండవులున్నచోటికి ఎడతెగని ప్రయాణాలతో నడిచేటప్పుడు.

## దుర్యోధనుండు శల్యసహాయంబు గోరుట (సం. 5-8-6)

**తే. ఇంతయును విని కౌరవాధీశ్వరుండు । దక్షులగు నాప్తజనములఁ దత్క్షణంబ**
**మద్రనాథుని చనియెడు మార్గమునకుఁ । బుచ్చి యెడనెడ నతుల విభూతి మెఱయ. 92**

**ప్రతిపదార్థం:** కౌరవ+అధి+ఈశ్వరుండు= కురుపతి-దుర్యోధనుడు; ఇంతయును; విని; తద్+క్షణంబు+అ= ఆ క్షణమే; దక్షులు+అగు= సమర్థులైన; ఆప్తజనములన్= విశ్వాసపాత్రులైన జనులను; మద్రనాథుని, చనియెడు, మార్గమునకున్= శల్యుడు వెళ్ళేదారికి; పుచ్చి= పంపి; ఎడనెడన్= అక్కడక్కడ; అతుల విభూతి= సాటిలేని సంపద; మెఱయన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పాండవుల సహాయార్థం శల్యుడు వస్తున్నాడనే వార్త విని ఆ క్షణమే సమర్థులూ, విశ్వాసపాత్రులూ అయిన జనులను శల్యుడు వెళ్ళేదారికి పంపి, సాటిలేని సంపద మెరయగా అక్కడక్కడ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. అరుదారు మేలుక ట్లాయితం బై చూడ । నొప్పారి తను పగు చప్పరములుఁ,**
**బరపైన చెలువంబు గరగరికయుఁ దియ్య । తెలి నీరుఁ గలిగిన దీర్ఘికలును;**
**బొడవైన మువ్వంచఁ బొలుచునట్లుగ నేనుఁ । గులకు గుఱ్ఱములకుఁ గొట్టములును,**
**ముందర బయలైన చందంబుఁ జతురాభి । మతమైన యాస్థానమండపములు**

**ఆ. బియ్యములును, నేయుఁ, బెరుఁగును, గూరఁగా । యలును, వంటకట్టియలును, గడ్డి,**
**కవణములును బెల్లుగా నొడఁగూర్చి ని । గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె. 93**

**ప్రతిపదార్థం:** అరుదారు= అపురూపమైన; మేలుకట్లు= చాందినులు; ఆయితంబు+ఐ= సిద్ధమై; చూడన్+ఒప్పారి= చూడదగి; తనుపు+అగు= చల్లదనంచేత తృప్తిని కలిగించేవైన; చప్పరములున్= పందిరులూ; పరపు+ఐన= విశాలమైనట్టియు; చెలువంబున్= అందమూ; గరగరికయున్= నైర్మల్యమూ; తియ్య తెలి నీరున్= తీయనైన స్వచ్ఛమైన నీరూ; కలిగిన; దీర్ఘికలును= నడబావులూ; పొడవు+ఐన; మూఁడు+వంచన్= మూడు వంచలతో; పొలుచునట్లుగన్= ఒప్పేటట్టు; ఏనుఁగులకున్; గుఱ్ఱములకున్; కొట్టములును= చావళ్ళూ; ముందరన్= ముందు; బయలు+ఐన, చందంబున్= బయలుగల విధమూ; చతుర+అభిమతము+ఐన= సుందరమూ; సమ్మతమూ అయిన; ఆస్థానమండపములున్= సభామండపాలూ; బియ్యములును; నేయున్= నేయీ; పెరుఁగును; కూరగాయలును; వంటకట్టియలును; గడ్డి; కవణములును= గుర్రాలూ మొదలైనవాటికి వేసే ఉలవల దాణాలూ; పెల్లుగాన్= అధికంగా; ఒడఁగూర్చి= సమకూర్చి; నిగూఢవృత్తిన్= రహస్యమైన వర్తనంతో; తానున్+కూడన్= తనుకూడా, నడచెన్.

**తాత్పర్యం:** అపురూపాలైన చాందినులు సిద్ధమై చూడదగిన చల్లటి పందిళ్ళూ, విశాలమైన, అందమూ, నైర్మల్యమూ, తీయని తెల్లని నీరు కల నడబావులూ, పొడవైన మూడు వంచలు ఒప్పేటట్లు ఏనుగులకూ గుర్రాలకూ చావళ్ళూ, ముందు బయలు గలవై, సుందరములూ సమ్మతములూ అయిన ఆస్థానమండపాలూ, బియ్యాలూ, నేయీ, పెరుగూ, కూరగాయలూ, వంటకట్టెలూ, గడ్డీ, ఉలవల దాణాలూ అధికంగా సమకూర్చి రహస్యంగా తను కూడా నడిచాడు.

**వ. ఇవ్విధంబున విడిదల పయనంపు సంపదలు వొంపిరివోవం దనకు సమకట్టిన సమస్త వస్తువుల యవైకల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుండై నిజపరిజనంబులం జూచి 'యిట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకుఁ బ్రవర్తకులైన యుధిష్ఠిరామాత్యు లెవ్వారు? వారలం దోడ్కొని రండు; వారలు ప్రసాదదానంబున కర్హు'లని పలుకు నవసరంబున, నటమున్న పలుదెఱంగులఁ బనులు సేయుచున్న తన పల్లాయనంబువారిలోఁ గలసి మఱువడియున్న కౌరవేశ్వరుం డమ్మాటలు విని, యతనికిం బొడసూప నిదియ సమయంబని సముచిత ప్రకారంబునఁ దన్నెఱింగించికొని వినయంబునఁ గనిన, నతండును సంభ్రమంబున గాఢాలింగనంబు సేసి కనకాసనంబున నునిచి, 'యింతయు నిమ్మహాత్ము నుద్యోగంబున నయ్యెం గావలయు' నని తలంచి విస్మయంబంది 'నీ కెయ్యది యిష్టంబు గోరు మిచ్చెద' ననిన, గాంధారీ నందనుండు పరమానందంబునం బొంది యిట్లనియె. 94**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; విడిదల, పయనము+సంపదలు= విడిదుల ప్రయాణపు సంపదలు; పొంపిరి+పోవన్= అతిశయించగా; తనకున్; సమకట్టిన= సమకూర్చిన; సమస్త-వస్తువుల+అవైకల్యంబునకున్= ఎల్ల వస్తువుల సంపూర్ణతకూ; శల్యుండు; సంతుష్ట+అంతరంగుండు+ఐ= సంతోషించిన మనస్సుకలవాడయి; నిజ పరిజనంబులన్+చూచి= తన పరిజనులను చూచి; ఇట్లు; చతురంబుగాన్= నేర్పుగా - మనోహరంగా; మనకున్; వలయువానిన్; సంపాదించుటకున్= సమకూర్చటానికి; ప్రవర్తకులు+ఐన= కారకులైన; యుధిష్ఠిర+అమాత్యులు= ధర్మరాజు మంత్రులు; ఏ+వారు?= ఎవరు?; వారలన్; తోడ్కొని,రండు= తీసికొని రండి; వారలు; ప్రసాద,దానంబునకున్= అనుగ్రహం ప్రసాదించటానికి; అర్హులు= తగినవారు; అని; పలుకు+అవసరంబునన్= పలికే సమయంలో; అట,మున్ను+అ= అంతకుముందే; పలు+తెఱంగులన్= అనేక విధాల; పనులు+చేయుచున్+ఉన్న= పనులు చేస్తున్న; తన, పల్లాయనంబు వారిలోన్= తన రౌతులలో (ఆప్తులలో - శ.ర.); కలసి; మఱువడి+ఉన్న= దాగిఉన్న; కౌరవ+ఈశ్వరుండు= కురుపతి- దుర్యోధనుడు; ఆ+మాటలు; విని; అతనికిన్= ఆ శల్యుడికి; పొడసూపన్= కనబడటానికి; ఇది+అ= ఇదే; సమయంబు+అని= అదనని; సముచిత-ప్రకారంబునన్= తగిన విధంగా; తన్నున్+ఎఱింగించికొని= తను ఫలానా అని చెప్పుకొని; వినయంబునన్= నమ్రతతో; కనినన్= చూడగా; అతండును; సంభ్రమంబునన్= గౌరవంతో; గాఢ+ఆలింగనంబు+చేసి= గట్టిగా కౌగిలించుకొని; కనక+ఆసనంబునన్= బంగారుపీఠంపై; ఉనిచి= ఉంచి; ఇంతయున్= ఇదంతా; ఈ+మహాత్ము+ఉద్యోగంబునన్= ఈ మహనీయుడి పూనికతో; అయ్యెన్+కావలయున్= జరిగింది కాబోలు; అని; తలంచి; విస్మయంబు+అంది= ఆశ్చర్యపడి; నీకున్; ఎయ్యది= ఏది; ఇష్టంబు; కోరుము; ఇచ్చెదన్; అనినన్; గాంధారీ-నందనుండు= గాంధారి కొడుకు - దుర్యోధనుడు; పరమ+ఆనందంబునన్+పొంది= మిక్కిలి ఆనందించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా విడిదుల ప్రయాణాలకు సౌకర్యాలు ఎక్కువయ్యేటట్లు తనకు సమకూర్చిన ఎల్ల వస్తువుల సమగ్రతకూ శల్యుడు సంతోషించి తన పరిజనులను చూసి 'ఇట్లా మనోహరంగా మనకు కావలసిన వాటిని సమకూర్చటానికి కారకులైన ధర్మరాజు మంత్రు లెవరు? వారిని తీసికొని రండి. వారు మా అనుగ్రహానికి పాత్రులు' అని పలికే సమయంలో, అంతకుముందే అనేక విధాల పనులు చేస్తూన్న తన రౌతులలో కలసి దాగిఉన్న దుర్యోధనుడు ఆ మాటలు విని, అతడికి కనిపించటానికి ఇదే అదనని తగిన రీతిగా తనను తెలియపరచుకొని, నమ్రతతో చూడగా, శల్యుడును గౌరవంతో గట్టిగా కౌగిలించుకొని బంగారు పీఠంమీద కూర్చుండబెట్టి 'ఇదంతా ఈ మహనీయుడి పూనికవలన జరిగింది కాబోలు' అని ఎంచి ఆశ్చర్యపడి 'నీ కేమి కావాలో కోరుకొమ్ము' అనగా, దుర్యోధనుడు మిక్కిలి ఆనందించి ఇట్లా అన్నాడు.

**క. 'సత్యసరస్వతి వగు; మౌ । చిత్య విశారదము నీదు చిత్తము; నియమౌ**
**దాత్త్యంబు మెఱయ నాకు న । మాత్త్యుఁడవై పూని నడపు మత్సైన్యంబున్. 95**

**ప్రతిపదార్థం:** సత్య,సరస్వతివి+అగుము= సత్యవచనుడివి కమ్ము; నీ+చిత్తము= నీ మనస్సు; ఔచిత్య, విశారదము= ఔచిత్యం తెలిసినట్టిది; నియమ+ఔదాత్త్యంబు= నియమపు ఒప్పిదం; మెఱయన్= ప్రకాశించగా; నాకున్; అమాత్యుఁడవు+ఐ= మంత్రివయి; పూని; మత్+సైన్యంబున్= నా సేనను; నడపు(ము)= నడిపించుము.

**తాత్పర్యం:** 'నీవు సత్యవచనుడివి కమ్ము. అన్న ప్రకారం చేయుము. నీ మనస్సు ఔచిత్యం తెలిసినట్టిది. నియమపు ఉదాత్తత ప్రకాశించేటట్లు' నాకు మంత్రివయి పూని నా సైన్యాన్ని నడిపించుము.

**ఆ. తలఁపఁ బాండవులును ధార్తరాష్ట్రులు నీకు । నొక్క రూప; భక్తియుక్తిఁ జాల**
**నీవు నన్ను మాననీయుండు గాఁగ న । నుగ్రహించి తగఁ బరిగ్రహింపు.' 96**

**ప్రతిపదార్థం:** తలఁపన్= ఆలోచించగా; నీకున్; పాండవులును; ధార్తరాష్ట్రులున్= ధృతరాష్ట్రుడి కొడుకులు - కౌరవులూ; ఒక్కరూపు+అ= ఒక్కరే, సమానులే; నీవు; నన్నున్; భక్తి యుక్తిన్= భక్తితో; చాలన్= ఎక్కువగా; మాననీయుండు+కాఁగన్= మన్నించదగినవాడుగా; అనుగ్రహించి; తగన్= తగినవిధంగా; పరిగ్రహింపు(ము)= స్వీకరించుము.

**తాత్పర్యం:** ఆలోచించగా నీకు పాండవులూ, కౌరవులూ ఒక్కటే. నీవు నన్ను భక్తితో మిక్కిలి మాన్యుడిగా అనుగ్రహించి స్వీకరించుము.'

**చ. అనవుడు శల్యుఁ డియ్యకొని, 'యట్టిద కాదె, విభేదవృత్తి నా**
**మనమున లేదు; పాండవసమాజము మీరును నొక్కరూప కా**
**వున నిది లెస్సమాట దగవుం దలపోయఁగ; మున్ను ప్రీతిఁ గాం**
**చిన నిను నెమ్మిఁ గూడుటయ చేయుదు నిట్టుల యెల్లభంగులన్. 97**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని దుర్యోధను డనినంతనే; శల్యుఁడు; ఇయ్యకొని= అంగీకరించి; అట్టిది+అ= అటువంటిదే; కాదె= కాదా; విభేదవృత్తి= పాండవులు; కౌరవులు వేర్వేరు అనే వ్యాపారం; నా, మనమునన్= నా మనస్సులో; లేదు; పాండవసమాజమున్= పాండవుల సమూహమూ; మీరునున్= మీరూ; ఒక్కరూపు+అ= ఒక్కటే; కావునన్; తగవున్= న్యాయం; తలపోయఁగన్= ఆలోచిస్తే; ఇది; లెస్సమాట= మంచిమాట; మున్ను= ముందు; ప్రీతిన్= ఆదరంతో; కాంచిన,నినున్= చూసిన నిన్ను; ఎల్లభంగులన్= అన్ని విధాలా; ఇట్టులు+అ= ఇట్లే; నెమ్మిన్= ప్రీతితో; కూడుట+అ, చేయుదున్= చేరటమే చేస్తాను.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడనగానే శల్యుడు సమ్మతించి 'అటువంటిదే కాదా? నా మనస్సులో పాండవులు వేరు, కౌరవులు వేరు అనే భేదబుద్ధి లేదు. పాండవులూ మీరూ ఒక్కటే. కాబట్టి న్యాయం ఆలోచిస్తే ఇది మంచి మాట. ముందుగా నన్ను సాదరంగా చూడడానికి వచ్చిన నిన్ను ఈ రీతిగా అన్ని విధాలా ప్రీతితో చేరతాను.

**ఉ. దానఁ గొఱంత లేే; దభిమతం బిది గాకయుఁ గల్గెనేనియుం**
**బూని యొనర్తు' నన్నఁ, గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి 'నీవు స**

**మ్మానము సేసి నా కిటు లమాత్యుఁడవైన పదంబుకంటె మే**
**లై నుతికెక్కు కోర్కి యెటు లారసి చూచిన నొండు గల్గునే?' 98**

**ప్రతిపదార్థం:** దానన్= ఆ విషయంలో - నిన్ను చేరే విషయంలో; కొఱంత,లేదు= లోపం లేదు; ఇది+కాకయున్= ఈ కోరిక కాకుండా; అభిమతంబు= వేరే కోరిక; కల్గెన్+ఏనియున్= ఉన్నప్పటికీ; పూని+ఒనర్తున్= ప్రయత్నించి చేస్తాను; అన్నన్= అని శల్యుడనగా; కురుపుంగవుఁడు= కురుశ్రేష్ఠుడు - దుర్యోధనుడు; ఎంతయున్+పొంగి= ఎంతో సంతోషించి; నీవు; సమ్మానము+చేసి= గౌరవం చేసి; నాకున్; ఇటులు= ఇట్లు; అమాత్యుఁడవు+ఐన-పదంబు కంటెన్= మంత్రివైన స్థానం కంటె; మేలు+ఐ= గొప్పదయి; నుతికిన్+ఎక్కు,కోర్కి= పొగడ్త కెక్కే కోరిక; ఎటుల+ఆరసి-చూచినన్= ఎట్లా పరిశీలించి చూచినా; ఒండు= ఇంకొకటి; కల్గునే?= ఉంటుందా?

**తాత్పర్యం:** నేను నిన్ను చేరే విషయంలో అనుమానం లేదు. ఇదికాక ఇంకా ఏదయినా కోరిక ఉంటే చెప్పు, దానిని కూడా తీరుస్తాను' అని శల్యుడనగా, దుర్యోధనుడు ఎంతో సంతోషించి 'నీవు గౌరవం చేసి నాకీ విధంగా మంత్రి వైనదానికంటె గొప్పదయి పొగడ్త కెక్కే కోరిక ఎట్లా పరిశీలించి చూచిన ఇంకొకటి ఉంటుందా?' (ఉండదని భావం.)

**వ. అనిన విని, వికచవదనుం డగుచు మద్రేశ్వరుండు. 99**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; మద్ర+ఈశ్వరుండు= మద్ర దేశాధిపతి - శల్యుడు; వికచ,వదనుండు+అగుచున్= వికసించిన ముఖం కలవాడు అవుతూ.

**తాత్పర్యం:** అని దుర్యోధను డనగా విని శల్యుడు వికసించిన ముఖం కలవాడవుతూ.

**క. 'చను నీవు హస్తి నగరం । బున; కేనును బాండుభూపపుత్త్రులఁ బ్రీతిం**
**గని యట వత్తు; నవశ్యం । బును వారలఁ జూడవలయుఁ, బోయెద' ననినన్. 100**

**ప్రతిపదార్థం:** నీవు; హస్తినగరంబునకున్= హస్తినాపురానికి; చను(ము)= వెళ్ళుము; ఏనును= నేను కూడా; పాండుభూపపుత్త్రులన్= పాండురాజు కొడుకులను - పాండవులను; ప్రీతిన్= సంతోషంతో; కని= చూసి; అట వత్తున్= హస్తినాపురం వస్తాను; వారలన్= పాండవులను; అవశ్యంబును= తప్పకుండా; చూడవలయున్= చూడాలి, పోయెదన్+అనినన్= వెళ్ళుతాను అనగా.

**తాత్పర్యం:** 'నువ్వు హస్తినాపురానికి వెళ్ళు. నేను కూడా పాండవుల్ని ఇష్టంతో చూసి హస్తినాపురం వస్తాను. నేను తప్పకుండా వాళ్ళను చూడాలి. వెళ్ళుతాను' అనగా.

**ఆ. 'అట్లకాక; వేగ మట వోయి మరలుండు; । వరము మఱవకుండవలయు ! మిమ్ముఁ ।**
**జేరి నెగడువాఁడఁ; గారుణ్యమున నిట । యరసి యుండుఁ'డనియెఁ గురువిభుండు. 101**

**ప్రతిపదార్థం:** కురు-విభుండు= కురుపతి - దుర్యోధనుడు; అట్లు+అ-కాక= అలాగే; వేగము= శీఘ్రంగా; అట+పోయి= అక్కడికి వెళ్లి; మరలుండు+తిరిగి రండి; వరము= మీరు నాకిచ్చిన వరం; మఱవక+ఉండవలయున్= మరచిపోగూడదు; మిమ్మున్; చేరి; నెగడువాఁడన్= వర్ధిల్లుతాను; కారుణ్యమునన్= దయతో; ఇట+అరసిఉండుఁడు= ఈవైపు దృష్టి పెట్టండి; అనియెన్.

**తాత్పర్యం:** దుర్యోధనుడు 'అలాగే చేయండి. అక్కడికి వెళ్లి శీఘ్రంగా తిరిగి రండి. నాకు మీరిచ్చిన వరం మాట మరచిపోగూడదు. మీతో చేరి వర్ధిల్లుతాను. దయతో ఈ వైపు కనిపెట్టుకొని ఉండండి.

**వ. అనవుడు.** **102**

**తాత్పర్యం:** అనగానే.

**క. దరహాసముతో మద్రే । శ్వరుఁ డాలింగనము సేసి, 'సందియపడ కీ**
**వరుగు' మని యనుప, నాతఁడు । కరిపురికిం జనియె మది వికాసముఁ బొందన్.** **103**

**ప్రతిపదార్థం:** మద్ర+ఈశ్వరుఁడు= మద్రదేశరాజు - శల్యుడు; దరహాసముతోన్= చిరునవ్వుతో; ఆలింగనము+చేసి= కౌగిలించుకొని; సందియపడక= అనుమానించక; ఈవు= నీవు; అరుగుము= వెళ్ళుము; అని; అనుపన్= పంపగా; ఆతఁడు= ఆ దుర్యోధనుడు; మది= మనస్సు; వికాసమున్+పొందన్= వికసించగా, ఆనందపడగా; కరిపురికిన్= హస్తినాపురానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** శల్యుడు చిరునవ్వుతో దుర్యోధనుడిని కౌగిలించుకొని 'నువ్వు సందేహపడకుండా వెళ్ళుము.' అని పంపగా, అతడు మనస్సులో ఆనందించి హస్తినాపురానికి వెళ్ళాడు.

### శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట (సం. 5-8-15)

**వ. అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని, స్కంధావారంబు దఱియం జొచ్చి, ధర్మనందనుని నివాసంబున కరిగిన, నతండు దమ్ములుం, దానును, ద్రౌపదీ సుభద్రలు, నభిమన్యు ప్రభృతి పుత్త్ర వర్గంబును నెదురువచ్చి, కృతప్రణాముండై, తోడ్కొనిపోయి, కాంచనాసనంబున నునిచి, యర్ఘ్యపాద్యంబు లిచ్చి, కుశలం బడిగిన, 'సర్వంబును గుశల సంపన్నంబ' యని వారల నందఱ నభినందించి, యుధిష్ఠిరుం బునరాలింగనంబు సేసి యిట్లనియె.** **104**

**ప్రతిపదార్థం:** అంతన్; శల్యుండున్; ఉపప్లావ్యంబునకున్; చని; స్కంధావారంబు= సేనలబిడారం; తఱియన్+చొచ్చి= ప్రవేశించి; ధర్మనందను నివాసంబునకున్= ధర్మరాజు ఉన్నచోటికి; అరిగినన్= వెళ్ళగా; అతండు= ధర్మరాజు; తమ్ములున్; తానును; ద్రౌపదీ సుభద్రలున్; అభిమన్యు ప్రభృతి పుత్త్ర వర్గంబును= అభిమన్యుడు మొదలైన కుమారుల సమూహమూ; ఎదురు వచ్చి; కృతప్రణాముండు+ఐ= నమస్కరించినవాడయి; తోడ్కొనిపోయి= తీసికొనివెళ్లి; కాంచన+ఆసనంబునన్= బంగారుపీఠం మీద; ఉనిచి= కూర్చుండజేసి; అర్ఘ్య,పాద్యంబులు= పూజాద్రవ్యములు, కాళ్ళు కడుగుకొన నీళ్ళు; ఇచ్చి; కుశలంబు+అడిగినన్= క్షేమం అడుగగా; సర్వంబును= అంతా; కుశలసంపన్నంబు+అ= క్షేమంతో కూడినదే; అని; వారలన్+అందఱన్= వాళ్ళనందరినీ; అభినందించి= సంతోషపెట్టి; యుధిష్ఠిరున్= ధర్మరాజును; పునః+ఆలింగనంబు+చేసి= మళ్ళీ కౌగిలించుకొని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పిమ్మట శల్యుడు ఉపప్లావ్యపురానికి వెళ్ళి పాండవుల బిడారం ప్రవేశించి, ధర్మరాజు నివాసానికి వెళ్ళగా, ధర్మరాజూ, తమ్ములూ, ద్రౌపదీ, సుభద్రా, అభిమన్యుడూ మొదలైన కుమారుల సమూహమూ ఎదురేగారు. ధర్మరాజు అతడికి నమస్కరించి తీసికొని వెళ్ళి బంగరుపీఠంపై కూర్చుండబెట్టి, అర్ఘ్యపాద్యాదులిచ్చి,

క్షేమ మడుగగా, 'అంతా క్షేమమే' అని వాళ్ళనందరినీ అభినందించి, శల్యుడు ధర్మరాజును మళ్ళీ కౌగిలించుకొని ఇట్లా అన్నాడు.

**క. 'జనరహితంబగు వనమున । ననుజన్ములు, ద్రుపదభూవరాత్మజయును, నీ**
**వును నింతకాల మలయక । యునికి కడున్ దుష్కరము, మహోదాత్తమతీ! 105**

**ప్రతిపదార్థం:** మహోదాత్తమతీ!= మిక్కిలి గొప్ప మనస్సుకలవాడా, ధర్మరాజా!; జన-రహితంబు+అగు-వనమునన్= నిర్జనారణ్యంలో; అనుజన్ములున్= తమ్ములూ; ద్రుపద-భూవర+ఆత్మజయును= ద్రుపదరాజు కూతురు-ద్రౌపదీ; నీవునున్; ఇంత-కాలము; అలయక+ఉనికి= అశ్రమంగా ఉండడం - క్షేమంగా ఉండడం; కడున్= మిక్కిలి; దుష్కరము= కష్టసాధ్యం.

**తాత్పర్యం:** 'మిక్కిలి గొప్ప మనస్సుకల ధర్మరాజా! నిర్జనమైన అరణ్యంలో తమ్ములూ, ద్రౌపదీ, నీవూ ఇంతకాలం క్షేమంగా ఉండటం మిక్కిలి కష్టసాధ్యం.

**ఆ. దానికంటె నరిది దలపోయ నజ్ఞాత । వాస ముజ్జ్వలాంగభాసమాను**
**లైన, మీకు; మీ దయాసూనృతాదుల । పెంపు మిమ్ముఁ గడవఁ బెట్టకున్నె? 106**

**ప్రతిపదార్థం:** తలపోయన్= ఆలోచించగా; ఉజ్జ్వల+అంగ, భాసమానులు+ఐన, మీకున్= ప్రకాశించే శరీరాలతో ఒప్పే మీకు; అజ్ఞాతవాసము; దానికంటెన్= ఆ అరణ్యావాసం కంటె; అరిది= ఆశ్చర్యకరం; మీ,దయా,సూనృత+ఆదుల, పెంపు= మీ దయా, సత్యమూ మొదలైనవాటి అతిశయం; మిమ్మున్; కడవన్+పెట్టక+ఉన్నె= కష్టాలనుండి దాటించకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** ఆలోచించగా, ప్రకాశించే శరీరాలతో ఒప్పే మీకు అజ్ఞాతవాసం ఆ అరణ్యావాసంకంటె మరీ కష్టం. దయా, సత్యమూ మొదలైన మీ గుణాల అతిశయం మిమ్ములను ఆపదలనుండి దాటించకుండా ఉంటుందా?

**క. ఇమ్మహి యెల్లను నీ మది । యుమ్మలికకుఁ జాల నొచ్చె, నుర్వీవర! నీ**
**విమ్మెయి నిప్పు డఖిల దురి । తమ్ములుఁ గడచుటకు సమ్మదమ్మునఁ బొదలెన్.' 107**

**ప్రతిపదార్థం:** ఉర్వీవర!= రాజా! (ధర్మరాజా!,) ఈ+మహి+ఎల్లను= ఈ భూమి అంతా; నీ,మది,ఉమ్మలికకున్= నీమనస్సులోని దుఃఖానికి; చాలన్= మిక్కిలి; నొచ్చెన్= బాధపడింది; నీవు; ఈ+మెయిన్= ఈ విధంగా; ఇప్పుడు; అఖిల, దురితమ్ములున్= అన్ని కష్టాలూ; కడచుటకున్= దాటినందుకు; సమ్మదమ్మునన్= సంతోషంతో; పొదలెన్= ఒప్పింది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ భూప్రజలందరూ నీ మనోవేదనకు చాలా బాధపడ్డారు. ఇప్పుడు నీవు ఈ విధంగా కష్టాలన్నీ గట్టెక్కినందుకు వాళ్ళు ఆనందిస్తున్నారు.'

**వ. అని యుచితసంభాషణంబులు సేసి, దుర్యోధనుండు తన్నుం గాంచిన విధంబును, నతండు ప్రార్థించిన తెఱంగును, దానికిఁ దా నియ్యకొనుటయుం జెప్పిన, ధర్మనందనుం డతని కిట్లనియె. 108**

**ప్రతిపదార్థం:** అని; ఉచిత, సంభాషణంబులు+చేసి= తగిన మాటలాడి; దుర్యోధనుండు; తన్నున్; కాంచిన, విధంబునున్= చూసిన రీతీ; అతండు; ప్రార్థించిన,తెఱంగునున్= కోరినరీతీ; దానికిన్; తాను; ఇయ్యకొనుటయున్= సమ్మతించటమూ; చెప్పినన్= చెప్పగా; ధర్మనందనుండు= ధర్మరాజు; అతనికిన్= శల్యుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని తగిన మాటలాడి, దుర్యోధనుడు తనను ఆదరంతో చూచిన విధమూ, అట్లు చూచి ప్రార్థించిన విధమూ, దానికి తాను సమ్మతించటమూ చెప్పగా, ధర్మరాజు శల్యుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'మేలు సేసితి; రొక్కరి మెచ్చి వారి । కోర్కి దీర్చుట పెద్దల గుణము కాదె?**
**యది మదీయ చిత్తమునకు హర్షకరమ; । తివిరి యొక్కటి వేఁడెద నవధరింపు. 109**

**ప్రతిపదార్థం:** మేలు+చేసితిరి= మంచిపని చేశారు; ఒక్కరిన్; మెచ్చి; వారికోర్కి= వారి కోరిక; తీర్చుట= నెరవేర్చటం; పెద్దల-గుణము+అ,కాదె= పెద్దవారి లక్షణమే కదా!; అది= మీరు చేసిన పని; మదీయ,చిత్తమునకున్= నా మనస్సుకు; హర్షకరము+అ= సంతోషదాయకమే; తివిరి= పూని; ఒక్కటి; వేఁడెదన్= కోరతాను; అవధరింపు(ము)= చిత్తగించుము.

**తాత్పర్యం:** 'మంచిపని చేశారు. ఒకరిని మెచ్చి వారి కోరిక తీర్చటం పెద్దవారి లక్షణమే కదా! అది నా మనస్సుకు ఆనందం కలిగించేదే. మిమ్మల్ని నేను ఒక్కటి కోరుకొంటాను. చిత్తగించండి.

**విశేషం:** 'మంచిపని చేశా'రంటూ ధర్మరాజు శల్యుడిని అభినందిస్తూనే ఎలా అతడిని తనకే సహాయపడేటట్లు చేసుకొంటున్నాడో చూస్తే, ధర్మరాజు రాజనీతిజ్ఞత, అతడి 'మెత్తనిపులితనం' ముందుచూపూ బోధపడతాయి. ఈ కోరిక వలన శల్యుడు తన పక్షంలో ఉన్నదానికంటె, పరపక్షంలో ఉండటమే ధర్మరాజుకు అధికతరమైన మేలు చేకూర్చింది.

**వ. పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు సేయువాఁడై యున్నవాఁడు; కర్ణుండు పార్థుతో నెప్పుడు మచ్చరించుచునుండు; వీరిరువురకు సంగ్రామం బైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యం బొనరింప మీరకాని యక్కడం దక్కొరుండు లేఁడు; గావున, నవశ్యంబును మీకుం గర్ణసారథ్యంబు గర్తవ్యంబు గాఁగలయది; సమర సమయంబున నిరాకరించి పలికి కర్ణు చిత్తంబునకుం గలంకవుట్టించి పార్థు రక్షింపవలయు; నకృత్యంబని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠించువా'రని యభ్యర్థించిన, సమ్మతించి శల్యుం డిట్లనియె. 110**

**ప్రతిపదార్థం:** పార్థునకున్= అర్జునుడికి; కృష్ణుండు; సారథ్యంబు; చేయువాఁడు+ఐ+ఉన్నవాఁడు= చేయబోతున్నాడు; కర్ణుండు; పార్థుతోన్; ఎప్పుడున్; మచ్చరించుచున్+ఉండున్= పోటీపడుతూ ఉంటాడు; వీరు+ఇరువురకున్= వీరిద్దరికీ; సంగ్రామంబు+ఐన+అప్పుడు= యుద్ధం సంభవించినప్పుడు; కృష్ణునకున్; ప్రతిసారథ్యంబు= సాటియైన సారథ్యం; ఒనరింపన్= చేయడానికి; మీరు+అ-కాని= మీరేకాని; అక్కడన్= కౌరవ పక్షంలో; తక్కు+ఒరుండు= ఇంకొకడు; లేఁడు; కావునన్; అవశ్యంబును= తప్పక; మీకున్; కర్ణ-సారథ్యంబు; కర్తవ్యంబు= చేయవలసినదిగా; కాఁగలయది= కాబోతుంది; సమర-సమయంబునన్= యుద్ధ సమయంలో; నిరాకరించి,పలికి= అనాదరించి పలికి; కర్ణుచిత్తంబునకున్= కర్ణుడి మనస్సుకు; కలంక= వ్యాకులత; పుట్టించి= కలిగించి; పార్థున్= అర్జునుడిని; రక్షింపవలయున్= కాపాడాలి; అకృత్యంబు+అని= చేయదగని పని అని; అనుమానింపక= సందేహించక; మత్+ప్రార్థనంబునన్= నా కోరికపై; ఎల్లభంగులన్= అన్ని విధాలా; ఈ+విధంబు; అనుష్ఠించువారు= చేస్తారు(మీరు తప్పక చేయాలి అని భావం); అని; అభ్యర్థించినన్= కోరగా; శల్యుండు; సమ్మతించి= అంగీకరించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడికి కృష్ణుడు సారథ్యం చేయబోతాడు. కర్ణుడు అర్జునుడితో ఎప్పుడూ పోటీపడుతూఉంటాడు. వీళ్ళకిద్దరికీ యుద్ధం జరిగినప్పుడు కృష్ణుడికి ప్రతిగా సారథ్యం చేయటానికి మీరు తప్ప అక్కడ ఇంకొకడు లేడు.

కాబట్టి మీకు తప్పక కర్ణ సారథ్యం కర్తవ్యం అవుతుంది. యుద్ధ సమయంలో మీరు అనాదరించి పలికి, కర్ణుడి మనస్సుకు కలత పుట్టించి అర్జునుడిని రక్షించాలి. ఇది అకార్యం అని సందేహించక నా ప్రార్థనపై ఏ విధంగానైనా సరే దీన్ని చేయాలి' అని ప్రాధేయపడగా శల్యుడు సమ్మతించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** ధర్మరాజు ఎంత లెస్సగా ఊహించాడో చూస్తే అతడి దూరదృష్టి అవగతం అవుతుంది. దుర్యోధనుడి ఎత్తుకు పైఎత్తు వేసి ధర్మరాజు అతడిని చిత్తు చేశాడు. 'అకృత్యం బని యనుమానింపక' - తన కోరిక అకృత్యం అని ధర్మరాజుకు తెలుసు. అయితే రాజకీయాలలో కృత్యాకృత్యాలు లేకపోవటం ఎప్పుడూ ఉంది. ధర్మరాజువంటివాడు కూడా రాజకీయాలకు అతీతుడు కాడని తెలుస్తున్నది.

**క.** **'అగు నిది వోలును; నాకుం । దగ వట్టిద; 'కర్ణునకు రథంబు గడప నీ**
**వగు' దని కోరిన కౌరవ । జగతీశ్వరు ప్రార్థనంబు సలుపఁగవలయున్.** **111**

**ప్రతిపదార్థం:** అగును= అవును; ఇది+పోలును= ఇది యుక్తమే; నాకున్; తగవు= న్యాయం; అట్టిది+అ= అదే; కర్ణునకున్; రథంబు; కడపన్= నడపటానికి; నీవు; అగుదు(వు)+అని= తగుదువని; కోరిన,కౌరవ,జగతీ+ఈశ్వరు,ప్రార్థనంబు= కోరిన దుర్యోధనుడి కోరిక; సలుపఁగవలయున్= నెరవేర్చాలి.

**తాత్పర్యం:** 'అవును. నీవు చెప్పింది యుక్తం. నాకు న్యాయం అదే. కర్ణుడికి రథం నడపటానికి నీవు తగుదువని కోరితే దుర్యోధనుడి కోరిక నేను తీర్చవలసిందే.

**క.** **కర్ణుని సారథినైనను । నిర్ణయమున కేను బార్థునిం గాచెద; నా**
**దుర్ణయవిచారు నెమ్మెయిఁ । గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్.** **112**

**ప్రతిపదార్థం:** కర్ణుని సారథిన్+ఐనను= కర్ణుడికి సారథినైనా; ఏను= నేను; నిర్ణయమునకున్= నిశ్చయానికి; పార్థునిన్= అర్జునుడిని; కాచెదన్= రక్షిస్తాను; ఆ దుర్ణయ విచారున్= ఆ అవినీతిపరుడిని - కర్ణుడిని, ఏ+మెయిన్= ఏ విధంగానైనా; కర్ణకఠోరంబులు= చెవులకు కఠినములైన మాటలు; ఆడి= పలికి; పోరన్= యుద్ధంలో; కలఁతున్= కలచివేస్తాను.

**తాత్పర్యం:** నేను కర్ణుడికి సారథినైనా, నిజానికి అర్జునుడిని రక్షిస్తాను. అవినీతిపరుడైన ఆ కర్ణుడిని ఏ విధంగానైనా కర్ణకఠోరాలైన పలుకులు పలికి యుద్ధంలో కలవరపరుస్తాను.

**విశేషం:** ధర్మరాజు స్వార్థంతో కోరితే కోరాడు. మొదట దుర్యోధనుడికి సాయం చేస్తానని ఒప్పుకొన్న పెద్దమనిషి శల్యుడు. మళ్ళీ ధర్మరాజుకు ఇట్లా ఎందుకు మాటిచ్చాడు? దానికి కారణాలు రెండు. ఒకటి- శల్యుడు పాండవులకు దగ్గర బంధువు. నకుల సహదేవులకు మేనమామ. అతడికి పాండవులవైపే మొగ్గు. వారికి సహాయపడటానికే వస్తూండగా, తనకు దారిలో బ్రహ్మాండములైన ఏర్పాట్లు చేసినవాడు దుర్యోధను డని తెలిసికొని అతడికి సాయం చేస్తానని మాటిచ్చాడు. రెండోది- కర్ణుడు దుర్ణయపరుడు. కులం తక్కువవాడు. అతడికి తాను సారథ్యం వహించడం అవమానంగా భావించాడు. అందుచేత అతడు ధర్మరాజుకు ఆ విధమైన మాట ఇచ్చాడు.

**తే.** **దర్పమును దేజమును మాయఁ దలరఁ బలికి । చిక్కువఱిచిన, నేయంగఁ జేతులాడ**
**కునికి, రాధాతనూజు నర్జునుఁడు తీవ్ర । బహుళ బాణపరంపర పాలుపఱుచు.** **113**

**ప్రతిపదార్థం:** దర్పమును= గర్వమూ; తేజమును= పరాక్రమమూ; మాయన్= నశించేటట్లు; తలరన్= జంకేటట్లు; పలికి; చిక్కు+పఱిచినన్= కలతపెట్టితే; ఏయంగన్= కొట్టటానికి; చేతులు+ఆడక+ఉనికిన్= చేతులాడకపోవటం చేత; రాధాతనూజున్= రాధేయుడిని-కర్ణుడిని; అర్జునుఁడు, తీవ్ర= క్రూరములైన; బహుళ= అనేకములైన; బాణ,పరంపర,పాలు,పఱుచున్= బాణాలవరుసకు గురిచేస్తాడు.

**తాత్పర్యం:** బలగర్వమూ, తేజస్సూ నశించి జంకే విధంగా మాట లని కర్ణుడిని కలతపెట్టితే, బాణప్రయోగం చేయటానికి అతడికి చేతులాడకపోవడం వలన, కర్ణుడిని అర్జునుడు తీవ్రాలైన అనేక బాణాల పాలు చేస్తాడు.

**చ. ఇది యొకఁ డేల? నీవు మది నెయ్యదిగోరినఁ జేయువాఁ డ; నాఁ**
**డదయత సూతసూతి సభ నాడినమాటకుఁ జాల నొచ్చి మా**
**హృదయము లెల్ల నీవలన నెంతయుఁ బక్షముసేయు; నక్కటా!**
**యదియునుగాక మీ పడిన యాపద లెవ్వరి నొవ్వఁజేయవే? 114**

**ప్రతిపదార్థం:** ఇది, ఒకఁడు+ఏల= ఇది ఒక్కటే కాదు; నీవు; మదిన్= మనస్సులో; ఏ+అది= ఏది; కోరినన్= కోరినా; చేయువాఁడన్= చేస్తాను; నాఁడు= ఆ వేళ, అదయతన్= నిర్దయత్వంతో; సూతసూతి= సూతపుత్రుడు-కర్ణుడు; సభన్= సభలో; ఆడిన-మాటకున్= పలికిన పలుకునకు; మా హృదయములు+ఎల్లన్= మా మనస్సులన్నీ; చాలన్+నొచ్చి= మిక్కిలి బాధపడి; నీవలనన్= నీమీద; ఎంతయున్= మిక్కిలి; పక్షము+చేయున్= పక్షపాతం వహిస్తాయి; అక్కటా!= అయ్యో!; అదియును+కాక= అదీ కాక; మీ, పడిన, ఆపదలు= మీరు అనుభవించిన కష్టాలు; ఎవ్వరిన్= ఎవరినైనా; నొవ్వన్+చేయవే?= నొప్పించవా?

**తాత్పర్యం:** ఈ ఒక్క కోరికే కాదు. నీవు మనస్సులో ఏది కోరినా, దానిని తీరుస్తాను. ఆ రోజున కురుసభలో సూతపుత్రుడు పలికిన మాటకు మా మనస్సులన్నీ మిక్కిలి నొచ్చి నీపై పక్షపాతం వహిస్తున్నాయి. అయ్యో! అదీకాక మీరు పడ్డపాట్లు ఎవరినైనా బాధించవా?

**విశేషం:** 'సూతసూతి సభ నాడిన మాటకు'- అప్పుడు కర్ణు డాడినమాట ఇది. ధర్మరాజు తన సర్వస్వం జూదంలో ఒడ్డి ఓడిపోయినప్పుడు ద్రౌపది కూడా అందులోనిదే కాబట్టి ఆమె ధర్మవిజిత. 'ఏకవస్త్రయై ఉండగా సభకు తీసికొనిరావచ్చునా? అన్నదానికి- భార్యకు దైవవిహితుండైన భర్త యొక్కరుండ'. ఇది యనేక భర్తృక గావున బంధకి యనంబడు; నిట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చిన ధర్మవిరోధంబు లేదు' - ఇవి వికర్ణుడి వచనాలను ప్రత్యాఖ్యానం చేస్తూ కర్ణుడు పలికిన పలుకులు. ఈ మాటలకు సభలోనివారంతా బాధపడ్డారు. కర్ణుడు దుర్ణయవిచారుడని శల్యు డనటం ఇందువల్లనే.

**ఆ. ఇట్లు వడితి ననుచు నెద నీవు వగవకు; । గారవమున నీ మనోరథమ్ము**
**ఫలము నొందు నెల్లభంగుల; దేవత । లయినఁ బడుదు రొక్క యవసరమున. 115**

**ప్రతిపదార్థం:** ఇట్లు+పడితిన్+అనుచున్= ఇట్లా బాధలు పడ్డానంటూ; నీవు; ఎదన్= హృదయంలో; వగవకు= విచారపడకు; గారవమునన్= గొప్పగా; నీమనోరథమ్ము= నీ కోరిక; ఎల్లభంగులన్= అన్ని విధాలా; ఫలమున్+ఒందున్= ఫలిస్తుంది; ఒక్క+ అవసరమునన్= ఒక్కొక్క సమయంలో; దేవతలు+అయినన్= దేవతలు కూడా; పడుదురు= కష్టాలు అనుభవిస్తారు.

**తాత్పర్యం:** ఇట్లా బాధలు పడ్డానంటూ నీవు మనస్సులో ఏమీ విచారపడకు. నీ కోరిక అన్నివిధాలా గొప్పగా ఫలిస్తుంది. ఒక్కొక్క సమయంలో దేవతలు కూడా కష్టా లనుభవిస్తారు.

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి, 'దేవతలయినఁ బడుదు రొక్క యవసరమున' అనటం వలన, ఇంక మీ విషయం వేరే చెప్పాలా? అనే అర్థం కైముత్యన్యాయంచేత సిద్ధిస్తున్నది కాబట్టి, అలంకారం కావ్యార్థాపత్తి.

**క. వాసవుఁడు దొల్లి నిజకాం । తా సహితము గాఁగ నధికదైన్యము నొందెన్;**
**మీ సంపద పెద్దయె? విధి । సేసిన గతిఁ బడకయుండ శివునకు వశమే?' 116**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; వాసవుఁడు= ఇంద్రుడు; నిజకాంతా, సహితము+కాఁగన్= తన భార్యతో కూడా; అధిక దైన్యమున్+ఒందెన్= మిక్కిలి దీనత్వం పొందాడు; మీ, సంపద; పెద్దయె= ఎక్కువా?; విధి= దైవం; చేసిన గతిన్= నిర్ణయించిన విధంగా; పడక+ఉండన్= అనుభవించకుండా ఉండడానికి; శివునకున్= శివుడికైనా; వశమే= తరమా?

**తాత్పర్యం:** పూర్వం ఇంద్రుడు తన భార్యతో కూడా మిక్కిలి దీనత్వం పొందాడు. ఇంద్రుడి సంపదముందు మీ సంపద ఎంత? దైవం నిర్ణయించిన విధంగా అనుభవించకుండా ఉండడానికి శివుడికి కూడా శక్యం కాదు'.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం, కావ్యార్థాపత్తి, 'విధి సేసినగతిఁ బడకయుండ శివునకు వశమే?' అను సామాన్యాంశంచేత వాసవుడు కష్టాలు పడటం, పాండవులు పడడం అనే విశేషాంశాలు సమర్థించబడ్డాయి కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం. 'శివునకు వశమే' అనటం వలన మీకు అసలే వశం కాదు-అనే అర్థం సిద్ధిస్తున్నది కావున కావ్యార్థాపత్తికూడా.

**వ. అనిన విని ధర్మనందనుం 'డింద్రుండు శచీసమేతంబుగా నట్టి దురవస్థ యేమికారణంబున నెత్తెఱంగున ననుభవించె?'నని యడిగిన, మద్రపతి 'దొల్లింటి యితిహాసంబు సెప్పెద విను'మని యిట్లనియె; 'దేవతలయందు మాన్యుండై త్వష్ట యనుపేరం బరఁగువాఁడు వాసవునకుఁ గీడు దలంచి మూఁడుదలలవాని నొక్కని సృజియించి, విశ్వరూప నామధేయుం జేసిన, నతం డింద్రపదవిం గోరి ఘోరతపంబు సేయుచున్న, దానికి భయంబంది నిలింపపతి యప్సరః స్త్రీలఁ 'దత్తపోభంగంబు సేయుం' డని నియమించి పంచిన. 117**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ధర్మనందనుండు; ఇంద్రుండు; శచీసమేతంబుగాన్= శచీదేవితోకూడా; అట్టి; దురవస్థ= దుస్స్థితి; ఏమి కారణంబునన్; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; అనుభవించెన్; అని; అడిగినన్; మద్రపతి= మద్రదేశపురాజు-శల్యుడు; తొల్లింటి= పూర్వపు; ఇతిహాసంబు= చరిత్ర; చెప్పెదన్; వినుము; అని; ఇట్లు+అనియెన్; దేవతలఅందున్; మాన్యుండు+ఐ= మన్నించతగ్గవాడయి; త్వష్ట+అనుపేరన్; పరఁగువాఁడు= ఒప్పేవాడు; వాసవునకున్= ఇంద్రుడికి; కీడు= హాని; తలంచి= ఎంచి; మూఁడు+తలలవానిన్; ఒక్కనిన్; సృజియించి= పుట్టించి; విశ్వరూప నామధేయున్+చేసినన్= విశ్వరూపుడనే పేరుగలవాడినిగా చేయగా; అతండు; ఇంద్ర పదవిన్= ఇంద్రత్వాన్ని; కోరి; ఘోర తపంబు+చేయుచున్+ఉన్నన్= భయంకరమైన తపస్సు చేస్తూఉండగా; నిలింపపతి= దేవతలరాజు - ఇంద్రుడు; దానికిన్; భయంబు+అంది= భయపడి; అప్సరస్+స్త్రీలన్= అచ్చరలను; తద్+తపస్(ః)+భంగంబు= వాడి తపస్సుకు విఘ్నం; చేయుండు+అని; నియమించి= ఏర్పాటు చేసి; పంచినన్= పంపగా.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు - 'ఇంద్రుడు శచీదేవితో కూడ అటువంటి దుష్థితిని ఏ కారణంగా, ఏ విధంగా అనుభవించాడు?' అని అడుగగా, శల్యుడు 'పూర్వపు చరిత్ర చెపుతా వినుము' అని ఇట్లా అన్నాడు. దేవతలలో ఆదరణీయుడై త్వష్ట అను పేరు గలవాడు ఇంద్రుడికి హాని తలపెట్టి, మూడుతలలవాడిని ఒకడిని పుట్టించి విశ్వరూపుడనే పేరు పెట్టాడు. అతడు ఇంద్రపదవిని కోరి ఘోరతపస్సు చేస్తుండగా, దానికి ఇంద్రుడు భయపడి వాడి తపస్సును చెరచండని అప్సరసలను ఆజ్ఞాపించి పంపగా.

**క. వారి విలాసంబులను, వి । హారముల, విలోకనముల, నాలాపములన్**
**మారవికారం బాతనిఁ । జేరద; యన్నాకపతియు సి గ్గెదఁ గదురన్. 118**

**ప్రతిపదార్థం:** వారి= ఆ అప్సరసల యొక్క; విలాసంబులను= ఒయ్యారాలచేతా; విహారములన్= క్రీడలచేతా; విలోకనములన్= చూపులచేతా; ఆలాపములన్= మాటలచేతా; మార వికారంబు= మన్మథ వికారం; ఆతనిన్= ఆ విశ్వరూపుడిని; చేరదు+అ; ఆ+నాకపతియున్= ఆ స్వర్గాధిపతియూ (ఇంద్రుడునూ); సిగ్గు; ఎదన్= హృదయంలో; కదురన్= అతిశయించగా.

**తాత్పర్యం:** ఆ అప్సరసల ఒయ్యారాలూ, క్రీడలూ, చూపులూ, మాటలూ ఆ విశ్వరూపుడికి మన్మథ వికారం కలిగించలేకపోయాయి. ఇంద్రుడు మిక్కిలి సిగ్గుపడి.

**తే. తలరి యమ్మునిఁ దెగఁజూచి ధర్మరహితుఁ । డగుట, యెవ్వరు నెఱుఁగనియట్లు గాఁగ**
**నేఁడు గాలంబు గడపిన, నెఱిఁగి భూత । గణము లాక్రోశ మొనరింపఁగా నతండు. 119**

**ప్రతిపదార్థం:** తలరి= చింతించి, వ్యాకులతచెంది; ఆ+మునిన్= ఆ మునిని; తెగన్+చూచి= వధించి; ధర్మరహితుఁడు+ అగుట= ధర్మహీనుడవడం; ఎవ్వరున్= ఎవరూ; ఎఱుఁగని+అట్లు+కాఁగన్= ఎరుగని అట్లుగా; ఏఁడు+కాలంబు= ఒక్క సంవత్సర కాలం; కడపినన్= కడపగా, భూత గణములు= భూత సమూహాలు; ఆక్రోశము+ఒనరింపఁగాన్= అరవగా; అతండు= ఆ ఇంద్రుడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు వ్యాకులపడి ఆ మునిని వధించి అధర్మపరు డవటం ఎవరూ ఎరుగనట్లు ఒక సంవత్సరకాలం గడపగా, భూతసమూహాలు ఆక్రోశించాయి. అప్పుడు ఇంద్రుడు.

**వ. తన దుష్కర్మంబు ప్రకటంబగుటకు రోసి, యొక్కవిషమవ్రతం బాచరించి, సముద్ర తరు ధరణీ స్త్రీజనంబులయందు బ్రహ్మహత్య విభాగించి పెట్టి, నిజకల్మషంబుఁ బాపికొని, మునిగణ సేవితుండయి సముల్లాసంబునం బొంది యునికికిఁ ద్వష్ట కోపించి. 120**

**ప్రతిపదార్థం:** తన దుష్కర్మంబు= తన దుష్కార్యం; ప్రకటంబు+అగుటకున్= అందరికీ తెలిసిపోవటానికి; రోసి= ఏవగించుకొని; ఒక విషమ వ్రతంబు= ఒక కఠోరమైన వ్రతం; ఆచరించి= చేసి; సముద్రతరుధరణీ స్త్రీజనంబులయందున్= సముద్రంలోనూ, చెట్లమీదా, నేలమీదా, స్త్రీలయందూ; బ్రహ్మహత్య= బ్రాహ్మణవధ వలన కలిగిన పాపం; విభాగించిపెట్టి= పంచిపెట్టి; నిజకల్మషంబున్= తన పాపమును; పాపికొని= పోగొట్టుకొని; మునిగణ సేవితుండు+అయి= మునుల సమూహంచేత సేవించబడినవాడయి; సముల్లాసంబునన్+పొంది+ఉనికికిన్= సంతోషంతో ఉన్నందుకు; త్వష్ట; కోపించి.

**తాత్పర్యం:** తన పాపకార్యం అందరికీ తెలిసిపోవటం వలన ఏవగించుకొని, ఒక కఠోరవ్రతం చేసి, ఆ బ్రహ్మహత్యా పాతకాన్ని, సముద్రంలోనూ, చెట్లలో, నేలమీదా, స్త్రీల యందూ విభజించిపెట్టి, తన పాపం పోగొట్టుకొని, మునుల సమూహంచేత సేవించబడుతూ సంతోషంతో ఉండడాన్ని చూచి త్వష్ట కోపించి.

**తే. 'అనపరాధుఁ, దపోనిధి, నధికశాంతి । యుక్తుఁ జంపిన పాపాత్ము నుఱక పట్టి**
**మ్రింగఁ జాలెడు వాని, నుత్తుంగదేహు । నేను సృజియింతుఁ జూడుఁడీ యీ క్షణంబ.' 121**

**ప్రతిపదార్థం:** అనపరాధున్= నిరపరాధుడినీ; తపస్(ః)+నిధిన్= తపోనిధిఅయిన వాడినీ; అధిక శాంతి యుక్తున్= మిక్కిలి శాంతగుణంతో కూడినవాణ్ణీ; చంపిన పాప+ఆత్మున్= చంపిన పాపిని; ఉఆక= లెక్క లేకుండా; పట్టి= పట్టుకొని; మ్రింగన్+ చాలెడు వానిన్= మ్రింగివేయగలవాడిని; ఉత్తుంగ దేహున్= మిక్కిలి ఎత్తైన శరీరం కలవాడిని; ఈ క్షణంబు+అ= ఇప్పుడే; ఏను= నేను; సృజియింతున్= పుట్టిస్తాను; చూడుఁడీ= చూడండి.

**తాత్పర్యం:** 'నిరపరాధుడూ, తపోనిధీ, అధికశాంతుడూ అయినవాడిని చంపిన పాపిని లక్ష్యపెట్టక పట్టుకొని మ్రింగివేయగలవాడిని నేను ఈ క్షణంలోనే పుట్టిస్తాను చూడండి.'

**చ.** **అనుచుఁ గడంగి నిష్ఠమెయి నగ్నిముఖం బొనరించి, వేలిమిం**
**దనయు సృజించి, లోకవిదితంబుగ వృత్ర సమాఖ్య యిచ్చి 'మ**
**ద్వినుత తపోబలంబునఁ బ్రదీపిత తేజుఁడవై జయింపు నీ'**
**వని నియమించి పంచె నమరాధిపుతో సమరంబు సేయఁగన్.** **122**

**ప్రతిపదార్థం:** అనుచున్; కడంగి= పూని; నిష్ఠమెయిన్= నియమంతో; అగ్ని ముఖంబు+ఒనరించి= అగ్ని సాధ్యాలైన కర్మలకు ముందు చేసే అంగకర్మ సముదాయం చేసి; వేలిమిన్= హోమమునందు; తనయున్= కుమారుడిని; సృజించి= పుట్టించి; లోక విదితంబుగన్= జగత్ప్రసిద్ధంగా; వృత్ర సమాఖ్య+ఇచ్చి= వృత్రుడనే పేరు పెట్టి; మత్+వినుత తపస్(ః)+బలంబునన్= నా పొగడబడే తపశ్శక్తిచేత; ప్రదీపిత తేజుఁడవు+ఐ= ప్రకాశించిన తేజస్సు గలవాడవై; నీవు; జయింపు(ము); అని; నియమించి= ఆజ్ఞాపించి; అమర+అధిపుతోన్= దేవరాజుతో-ఇంద్రుడితో; సమరంబు+చేయఁగన్= యుద్ధం చేయటానికి; పంచెన్= పంపాడు.

**తాత్పర్యం:** అంటూ పూని నియమంతో హోమం చేసి అగ్నికుండంలో కుమారుడిని పుట్టించి, జగత్ప్రసిద్ధంగా వృత్రుడనే పేరు పెట్టి 'నా గొప్ప తపశ్శక్తి చేత ప్రకాశించిన తేజస్సు గలవాడవై నీవు జయించుము' అని ఆజ్ఞాపించి, ఇంద్రుడితో యుద్ధం చేయటానికి పంపాడు.

### ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు సేయుట (సం. 5-9-45)

**చ.** **పనిచిన నాతఁడుం జనియె బాహుబలంబున నేచి; వాసవుం**
**డని కెదురేఁగుదెంచె; నిటు లద్భుతసంగరమైనచోట న**
**య్యనిమిషనాథుఁ బట్టుకొని యంగద వృత్రుఁడు మ్రింగె, దేవత**
**ల్మనమున బెగ్గలింపఁగఁ జలంబు బలంబును జూపి యుగ్రుఁడై.** **123**

**ప్రతిపదార్థం:** పనిచినన్= పంపగా; ఆతఁడున్= ఆ వృత్రుడు కూడా; బాహు బలంబునన్= భుజబలంతో; ఏచి= విజృంభించి; చనియెన్= వెళ్ళాడు; వాసవుండు= ఇంద్రుడు; అనికిన్= యుద్ధానికి; ఎదురు+ఏఁగుదెంచెన్= ఎదురువచ్చాడు; ఇటులు= ఇట్లా; అద్భుత సంగరము+ఐన చోటన్= ఆశ్చర్యకర యుద్ధం అయినప్పుడు; వృత్రుఁడు; దేవతల్; మనమునన్= మనస్సులో; బెగ్గలింపఁగన్= భయపడగా; చలంబున్= పట్టుదలా; బలంబును; చూపి; ఉగ్రుఁడు+ఐ= భయంకరుడై; ఆ+అనిమిషనాథున్= ఆ దేవరాజును - ఇంద్రుడిని; పట్టుకొని; అంగదన్= ఆకలితో; మ్రింగెన్= మ్రింగాడు.

**తాత్పర్యం:** పంపగా ఆ వృత్రుడునూ భుజబలంతో విజృంభించి వెళ్ళాడు. ఇంద్రుడు యుద్ధానికి ఎదురేగాడు. ఇట్లా ఆశ్చర్యకరమైన యుద్ధం జరిగినప్పుడు వృత్రుడు దేవతలు మనస్సులలో భయపడేటట్లు, పట్టుదలా, బలమూ చూపి భయంకరుడై ఆ ఇంద్రుడిని పట్టుకొని ఆకలితో మ్రింగాడు.

**వ. ఇట్లు మ్రింగినం ద్రిదశగణంబులు దత్‌క్షణంబ యాదైత్యునకు నావులించునట్టి యాలస్యం బావహించిన.** **124**

**ప్రతిపదార్థం:** ఇట్లు, మ్రింగినన్= మ్రింగగా; తద్+క్షణంబు+అ= ఆ క్షణమే; త్రిదశ గణంబులు= దేవతల సమూహాలు; ఆ దైత్యునకున్= ఆ రాక్షసుడికి; ఆవులించు+అట్టి= ఆవులించే; ఆలస్యంబు= మాంద్యం; ఆవహించినన్= కలిగించగా.

**తాత్పర్యం:** ఇట్లా మ్రింగగానే దేవతలు ఆ క్షణమే ఆ రాక్షసుడికి ఆవులించే బడలిక కలిగించగా.

**తే. అసురనాథుండు నలసత యడర నీల్గి । యావులించిన, నత్తఱి నమరవిభుఁడు**
**దన శరీరంబు సంకుచితంబు సేసి, । కడుజవంబునఁ గుప్పించి వెడల నుఱికె.** **125**

**ప్రతిపదార్థం:** అసుర నాథుండున్= రాక్షస ప్రభువూ; అలసత= మాంద్యం; అడరన్= అతిశయించగా; నీల్గి= ఒళ్ళు విరుచుకొని; ఆవులించినన్= ఆవులించగా; ఆ+తఱిన్= ఆ సమయంలో; అమర విభుఁడు= దేవతల రాజు- ఇంద్రుడు; తన శరీరంబున్; సంకుచితంబు+చేసి= ముడుచుకొని; కడు జవంబునన్= మిక్కిలి వేగంతో; కుప్పించి= దుమికి; వెడలన్+ఉఱికెన్= బయటికి ఉరికాడు.

**తాత్పర్యం:** రాక్షసరాజైన ఆ వృత్రుడునూ మాంద్యం అతిశయించి, ఒడలు విరుచుకొని ఆవులించగా, ఆసమయంలో ఇంద్రుడు తన శరీరాన్ని చిన్నదిగా చేసికొని మిక్కిలివేగంతో వెలుపలికి కుప్పించి దుమికాడు.

**క. వెలలి బలరిపుఁడు చలమునఁ । గలహమునకుం జొచ్చె; వృత్రు ఘనబాహుబలం**
**బలవికి మీఱెను దండ్రి వి । మల తపమునఁ జేసి సురల మనములు దలఁకన్.** **126**

**ప్రతిపదార్థం:** బలరిపుఁడు= బలుడనే రాక్షసుడి శత్రువు- ఇంద్రుడు; వెలలి= వృత్రుని నోటినుండి; వెలికి వచ్చి; చలమునన్= పట్టుదలతో; కలహమునకున్= యుద్ధానికి; చొచ్చెన్= ప్రవేశించాడు- యుద్ధానికి పూనుకొన్నాడు; తండ్రి విమల తపమునన్+చేసి= తండ్రిఅయిన త్వష్టయొక్క నిర్మలమైన తపస్సుచేత; సురల మనములు= దేవతల మనస్సులు; తలఁకన్= భయపడగా; వృత్రు ఘనబాహుబలంబు= వృత్రాసురుడి గొప్పదైన భుజబలం; అలవికిన్ మీఱెను= ఇంద్రుడి శక్తికి మించినది.

**తాత్పర్యం:** ఇంద్రుడు వెలికి వచ్చి పట్టుదలతో వృత్రుడితో యుద్ధానికి దిగాడు. తండ్రిఅయిన త్వష్ట యొక్క నిర్మల తపస్సు కారణంగా, వృత్రుడి గొప్ప భుజబలం దేవతల మనస్సులు భయపడేటట్లు, ఇంద్రుడిశక్తికి మించినదయింది.

**వ. ఇట్లధికబలుండైన వృత్రు నాటోపంబు సహింపంజాలక సురపతి దెరలి మరలి పఱచి మందరగిరి శిఖరంబున కరిగినం, గనుకనిం జని యనిమిషు లతనిం గూడుకొని, వృత్రవధోపాయంబు విచారించునెడ, నవ్వ్యాసవుండును దన మనంబున నిశ్చయించి.** **127**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అధిక బలుండు+ఐన= మిక్కిలి బలం కలవాడయిన; వృత్రు+ఆటోపంబున్= వృత్రుడి విజృంభణను; సహింపన్+చాలక= ఓర్చుకొనలేక; సురపతి= ఇంద్రుడు; తెరలి= తొలగి; మరలి= వెనుకకు తిరిగి; పఱచి= పారి; మందరగిరి; శిఖరంబునకున్= మందర పర్వత శిఖరానికి; అరిగినన్= వెళ్ళగా; అనిమిషులు= దేవతలు; కనుకనిన్+చని= సంభ్రమంతో

వెళ్ళి; అతనిన్; కూడుకొని= కలిసికొని; వృత్రవధ+ఉపాయంబు= వృత్రుడిని చంపటానికైన ఉపాయం; విచారించు+ఎడన్= ఆలోచించేటప్పుడు; ఆ+వాసవుండును= ఆ ఇంద్రుడును; తన మనంబునన్= తన మనస్సులో; నిశ్చయించి= నిర్ణయించి.

**తాత్పర్యం:** ఈ విధంగా అమితబలం కల వృత్రుడి విజృంభణం తట్టుకోలేక ఇంద్రుడు తొలగి మరలి పారి మందర పర్వత శిఖరానికి వెళ్ళగా, దేవతలు సంభ్రమంతో వెళ్ళి అతడిని కలిసికొని వృత్రుడిని చంపే ఉపాయం ఆలోచించేటప్పుడు ఆ ఇంద్రుడు తన మనస్సులో నిర్ణయం చేసికొని.

**క. 'హరిఁ గాంచి యతని చెప్పిన । పరమోపాయంబు సేసి బ్రతుకుద' మనినన్.**
**సుర లదియ కర్జమని య । మ్మురమర్దను కడకుఁ జనిరి మునులుం దారున్. 128**

**ప్రతిపదార్థం:** హరిన్= విష్ణుమూర్తిని; కాంచి= చూచి; అతని చెప్పిన; పరమ+ఉపాయంబు= గొప్ప ఉపాయం; చేసి; బ్రతుకుదము; అనినన్; సురలు= దేవతలు; అది+అ= అదే; కర్జము+అని= కార్యమని; మునులున్+తారున్= మునులూ; తామూ; ఆ+మురమర్దను కడకున్= ఆ విష్ణువు దగ్గరికి; చనిరి.

**తాత్పర్యం:** 'విష్ణుమూర్తిని దర్శించి, అతడు చెప్పే ఉపాయాన్ని ఆచరణలో పెట్టి బ్రదుకుదాం' అనగా దేవతలు అదే కార్యమని మునులూ, తామూ కలిసి ఆ విష్ణుమూర్తిదగ్గరికి వెళ్ళారు.

**వ. ఇట్లు దివిజానీకంబును పాకశాసనుం బురస్కరించుకొని 129**

**ప్రతిపదార్థం:** ఇట్లు; దివిజ+అనీకంబును= దేవతల సమూహమూ; మునిలోకంబును= మునుల సమూహమూ, పాకశాసనున్= ఇంద్రుడిని; పురస్కరించుకొని= ముందుపెట్టుకొని.

**తాత్పర్యం:** ఈ విధంగా దేవతల సమూహమూ, మునుల సమూహమూ ఇంద్రుడిని ముందిడుకొని.

**మ. చని యా దైత్యుతెఱంగు సెప్పి, 'యతులోత్సాహంబుమై నెప్పుడున్**
**దనుజవ్రాతము త్రు ళ్ళడంచి, దివిజేంద్రశ్రీవిలాసంబు పెం**
**పునఁ బొందించుట నీకు నైజము గదా, భూతేశ! ఘోరారిమ**
**ర్దన సంక్రీడ యొనర్పు లోకముల కత్యంతప్రమోదంబుగాన్.' 130**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; ఆ దైత్యుతెఱంగు+చెప్పి= ఆ రాక్షసుడి విధం చెప్పి; భూత+ఈశ!= భూతనాథా!; అతుల+ ఉత్సాహంబుమైన్= సాటిలేని వేడుకతో; ఎప్పుడున్= ఎప్పుడూ; దనుజవ్రాతము త్రుళ్ళు+అడంచి= రాక్షస సమూహం యొక్క గర్వం నశింపజేసి; దివిజ+ఇంద్రశ్రీ విలాసంబు= ఇంద్రుడి సంపదయొక్క విలాసం; పెంపునన్+పొందించుట= అభివృద్ధి చెందించడం; నీకున్; నైజము+కదా!= సహజం కదా!; లోకములకున్; అత్యంత ప్రమోదంబు+కాన్= మిక్కిలి సంతోషం అయ్యేటట్లు; ఘోర+అరిమర్దన సంక్రీడ= భయంకరులైన శత్రువులను నలగగొట్టడం అనే ఆట; ఒనర్పు(ము)= చేయుము.

**తాత్పర్యం:** వెళ్ళి ఆ రాక్షసుడి ప్రకారం చెప్పి, 'ఓ భూతనాథా! ఎంతో ఉత్సాహంతో ఎప్పుడూ రాక్షసుల గర్వం అణచి దేవేంద్రుడి లక్ష్మీ విలాసాన్ని అభివృద్ధి పొందించటం నీకు సహజం కదా! లోకాలకు మిక్కిలి ఆనందం కలిగేటట్లు భయంకర శత్రుసంహారక్రీడ చేయుము'- అని దేవతలు, మునులు విష్ణువును ప్రార్థించారు.

**క. అనిన విని, 'యొకటి సెప్పెద । వినుఁ డాతనితోడ సమరవిభునకుఁ దగఁ బొం**
**దొనరింపుఁ; డొక్క సమయం । బున నడఁకువఁ గులిశధారఁ బొందెద నేనున్. 131**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఒకటి; చెప్పెదన్; వినుఁడు; ఆతని తోడన్= ఆ వృత్రునితో; అమర విభునకున్= దేవేంద్రుడికి; తగన్= ఒప్పుగా; పొందు+ఒనరింపుఁడు= మైత్రి చేయండి; ఒక్క సమయంబునన్= ఒక సమయంలో; నేనున్= నేనూ; అడఁకువన్= అణకువతో; కులిశధారన్= వజ్రాయుధపుటంచును; పొందెదన్.

**తాత్పర్యం:** అనగా విని 'ఒక్కటి చెపుతా వినండి. అతడితో దేవేంద్రుడికి సంధి చేయండి. ఒక సమయంలో నేనూ వజ్రాయుధపువాదరలో రహస్యంగా చేరి ఉంటాను.

**వ. మదీయ తేజో విశేషంబున నప్పురుహూతున కుత్సాహంబు సంభవింపంగలయది. అప్పు డనాయాసంబునఁ బగతు వధియింప నగు'నని గదాధరుం డూఱడిలం బలికిన, బలసూదన ప్రముఖ నిఖిల సురలోకంబును సంతసిల్లి మగిడి వచ్చి వృత్రుకడకు మునిజనంబులం బుచ్చిన, వారునుం జని యతని కిట్లనిరి. 132**

**ప్రతిపదార్థం:** మదీయ తేజన్(ః)+విశేషంబునన్= నాదైన తేజస్సు యొక్క అధిక్యం చేత; ఆ+పురుహూతునకున్= ఆ ఇంద్రుడికి; ఉత్సాహంబు; సంభవింపన్+కలయది= పుట్టుతుంది; అప్పుడు; అనాయాసంబునన్= అశ్రమంగా, శ్రమలేకుండా; పగతున్= శత్రువును; వధియింపన్+అగున్= చంపవచ్చును; అని; గదాధరుండు= కౌమోదకి అనే గదను ధరించేవాడు-విష్ణువు; ఊఱడిలన్+పలికినన్= ఓదార్పు కలిగేటట్లు పలుకగా; బలసూదన ప్రముఖ నిఖిల సుర లోకంబును= ఇంద్రుడూ మొదలైన ఎల్ల దేవతల సమూహమూ; సంతసిల్లి= సంతోషించి; మగిడి వచ్చి= తిరిగి వచ్చి; వృత్రుకడకున్= వృత్రుడి వద్దకు; ముని జనంబులన్= మునులను; పుచ్చినన్= పంపగా; వారును; చని; అతనికిన్; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** నా తేజోవిశేషంచేత ఆ ఇంద్రుడికి ఉత్సాహం పుట్టుకొస్తుంది. అప్పుడు అశ్రమంగా శత్రువును సంహరింపవచ్చును.' అని విష్ణువు ఊరట కలిగేటట్లు చెప్పగా, ఇంద్రాది సకలదేవతలూ సంతోషంతో తిరిగి వచ్చి వృత్రాసురుడి వద్దకు మునులను పంపారు. వారు వెళ్ళి అతడితో ఇట్లా అన్నారు.

**క. 'భుజ బల దుర్జయుఁ డింద్రుం; । డజయ్యుఁడవు నీవు; నీకు నతనికి మీలో**
**విజయము దక్కదు; మీరే । చి జగంబులు నొవ్వ రణము సేయఁగనేలా? 133**

**ప్రతిపదార్థం:** ఇంద్రుండు; భుజ బల దుర్జయుఁడు= భుజబలంచేత జయించ శక్యం కానివాడు; నీవున్= నువ్వు కూడా; అజయ్యుఁడవు= జయించరానివాడవు; మీలోన్; నీకున్; అతనికిన్; విజయము= గెలుపు; దక్కదు= లభించదు; మీరు; ఏచి= విజృంభించి; జగంబులు= లోకాలు; నొవ్వన్= బాధపడేటట్టు; రణము= యుద్ధం; చేయఁగన్+ఏలా= చేయడమెందుకు?

**తాత్పర్యం:** 'ఇంద్రుడు భుజబలం చేత జయించ శక్యం కానివాడు. నువ్వూ జయించరానివాడవే. మీ యిద్దరిలో ఎవరికీ గెలుపు లభించదు. మరి మీరు విజృంభించి లోకాలు బాధపడేటట్టు యుద్ధం చేయడ మెందుకు?

**క. మైత్రీ సౌఖ్యముఁబోలునె । శాత్రవ మెమ్మెయిఁ దలంప? శక్రశ్రీకిం**
**బాత్రమవై యింపుగఁ ద । న్మిత్రుఁడవగు; మిదియ మేలు మీ యిద్దఱకున్.' 134**

**ప్రతిపదార్థం:** ఎమ్మెయిన్(ఏ+మెయిన్)+తలంపన్= ఏ విధంగా ఆలోచించినా, శాత్రవము= శత్రుత్వం, మైత్రీ-సౌఖ్యమున్= స్నేహ సుఖాన్ని, పోలునె= పోలుతుందా?, శక్ర శ్రీకిన్= ఇంద్రుడి సంపదకు; పాత్రమవు+ఐ= యోగ్యుడవయి; ఇంపుగన్= ఆనందంగా; తన్మిత్రుఁడవు (తద్+మిత్రుఁడవు)= అతడి స్నేహితుడవు; అగుము; మీ+ఇద్దఱకున్= మీ ఇరువురకూ; ఇది+అ= ఇదే; మేలు= లాభం.

**తాత్పర్యం:** ఏ విధంగా ఆలోచించినా మైత్రీసౌఖ్యంతో శత్రుత్వం సాటికాదు. ఇంద్రుడి సంపదకు యోగ్యుడవై ఆనందంగా అతడి మిత్రుడవు కమ్ము. ఇదే ఉభయతారకం.

**వ.** **అనవుడు వృత్రాసురుండు 'తేజంబువాసికి నాసపడియెడు మా యిరువురకు సఖ్యంబు సమకూర నేర్చునే?' యనుటయు నమ్మునులు' సత్పురుష సాంగత్యంబు సంభవించినఁ జేయమి నీతి గాదు. మహేంద్రుండు సకల లోక సమ్మత సద్భావుండుగావున నతనితోడి చుట్టఱికంబు మే'లనిన నొడంబడి యతండు వారల కిట్లనియె.** **135**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనినంతనే; వృత్ర+అసురుండు= వృత్రుడనే రాక్షసుడు; తేజంబు వాసికిన్= తేజస్సు యొక్క ఆధిక్యం కొరకు; ఆసపడియెడు మా+ఇరువురకున్= ఆశించే మా ఇద్దరికీ; సఖ్యంబు= స్నేహం; సమకూరన్+నేర్చునే?= లభించగలదా?; అనుటయున్; ఆ+మునులు; సత్+పురుష సాంగత్యంబు= మంచివారితో మైత్రి; సంభవించినన్= కలిగితే; చేయమి= చేయకుండా ఉండటం; నీతి+కాదు; మహేంద్రుండు; సకల లోక సమ్మత సత్+భావుండు= అన్ని లోకాలకూ సమ్మతమైన సద్భావం కలవాడు; కావునన్= కాబట్టి, అతని తోడి చుట్టఱికంబు= అతడి తోడి బంధుత్వం; మేలు= మంచిది; అనినన్; ఒడంబడి= సమ్మతించి; అతండు; వారలకున్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగానే, వృత్రాసురుడు 'తేజోవిశేషంకొరకు ఆశించే మా ఇద్దరికి స్నేహం కుదరగలదా?' అంటే, ఆ మునులు 'సజ్జనమైత్రి లభించినప్పుడు చేయకపోవడం నీతి కాదు. మహేంద్రుడు లోకాలన్నీ సమ్మతించే సజ్జనత్వం కలవాడు. కాబట్టి అతడితో బంధుత్వం మంచిది,' అనగా, దానికి సమ్మతించి వృత్రుడు వారితో ఇట్లా అన్నాడు.

**క.** **'ఏ నొక్క తెఱఁగు సెప్పెద; । దానిం గాదనక చేసి తగ మీరలు సం**
**ధానము దృఢముగఁ జేయుం । డా నాకేశునకు నాకు నధికప్రీతిన్.'** **136**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఒక్క తెఱఁగు= ఒక్క విధం; చెప్పెదన్; మీరలు; దానిన్; కాదు+అనక; చేసి; ఆ నాక+ఈశునకున్= ఆ స్వర్గ ప్రభువుకూ (ఇంద్రుడికీ); నాకున్; అధిక ప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; తగన్= ఒప్పేటట్టు; దృఢముగన్= గట్టిగా; సంధానము= సంధి; చేయుండు.

**తాత్పర్యం:** 'నేను ఒక పద్ధతి చెపుతాను. మీరు దానిని కాదనకుండా చేసి ఆ ఇంద్రుడికీ నాకూ మిక్కిలి సంతోషంతో ఒప్పుగా, దృఢంగా సంధి చేయండి.'

**వ.** **'అది యెయ్యది?' యనిన 'ఆర్ద్రం బగుదానను, శుష్కంబైన సాధనంబునను, దారువునం, బాషాణంబున, శస్త్రాస్త్రంబులం, దివంబున, రాత్రి యందును నేను వధ్యుండఁ గాకుండవలయు' ననిన, వారును దానికి నొడంబడి, యవ్వరంబు లొసంగి వృత్రవజ్రధరులకు మిత్రభావం బొనరించి, మగుడం జని, యత్తెఱంగు**

**వాసవున కెఱింగించి నిజనివాసంబుల కరిగిరి, సురనాథుండు సుఖంబుండి, పెద్దకాలంబునకుం దన మనంబునఁ బాయని వైరంబు సైరింపంజాలక, దామోదరుని పూనికయు, మునిజనంబు సేసిన సంధి విధంబును నిరూపించి, రిపుం బరిభవింప రంధ్రాన్వేషణంబు సేయుచుండి యొక్కనాఁడు. 137**

**ప్రతిపదార్థం:** అది; ఎయ్యది= ఏది; అనినన్; ఆర్ద్రంబు+అగుదానను= తడిసిన దానిచేతను; శుష్కంబు+ఐన సాధనంబునను= ఎండిన పరికరం చేతను; తరువునన్= చెట్టుచేతను; పాషాణంబునన్= రాయిచేతను; శస్త్ర+అస్త్రంబులన్= శస్త్రాలచేతను; అస్త్రాలచేతను; దివంబునన్= పగటివేళా; రాత్రిఅందును; నేను; వధ్యుండన్+కాక+ఉండవలయును= చంపదగినవాడిని కాగూడదు; అనినన్; వారును; దానికిన్; ఒడంబడి= సమ్మతించి; ఆ+వరంబులు= ఆ వరాలు; ఒసంగి= ఇచ్చి; వృత్ర వజ్రధరులకున్= వృత్రుడికీ, ఇంద్రుడికీ; మిత్ర భావంబు= మైత్రి; ఒనరించి= చేసి; మగుడన్+చని= తిరిగిపోయి; ఆ+తెఱంగు= ఆ విధం; వాసవునకున్= ఇంద్రుడికి; ఎఱింగించి= చెప్పి; నిజనివాసంబులకున్= తమ తమ ఇండ్లకు; అరిగిరి= వెళ్లారు; సురనాథుండు= ఇంద్రుడు; సుఖంబు+ఉండి= సుఖంగా ఉండి; పెద్ద కాలంబునకున్= చిరకాలంగా; తన మనంబునన్= తన మనస్సులో; పాయని వైరంబు= తొలగని విరోధం; సైరింపన్+చాలక= సహించలేక; దామోదరుని పూనికయున్= విష్ణువు ప్రయత్నమూ; ముని జనంబు= మునుల సమూహం; చేసిన సంధి విధంబును; నిరూపించి= గ్రహించి; రిపున్= శత్రువును; పరిభవింపన్= అవమానించటానికి (ఓడించటానికి); రంధ్ర+అన్వేషణంబు+చేయుచున్+ఉండి= మార్గం వెదకుతూ; ఒక్కనాఁడు= ఒక రోజున.

**తాత్పర్యం:** 'అది ఏది?' అని అడిగితే, తడిసినదానిచేతగాని, ఎండినదానిచేతగాని, కర్రచేతగాని, రాయిచేతగాని, శస్త్రాలచేతగాని, అస్త్రాలచేతగాని, పగలుగాని, రాత్రిగాని నేను చావగూడదు' అనగా, వారును దాని కంగీకరించి, ఆ విధంగానే వరాలిచ్చి, వృత్రుడికీ, ఇంద్రుడికీ సంధి చేసి తిరిగి పోయి, ఆ ప్రకారం ఇంద్రుడికి చెప్పి తమ తమ యిండ్లకు వెళ్లిపోయారు. ఇంద్రుడు సుఖంగా ఉండి, చిరకాలంగా తన మనస్సులో తొలగని విరోధం సహించలేక, విష్ణుమూర్తి ప్రయత్నమూ, మునులు చేసిన సంధి విధానమూ గ్రహించి, శత్రువును ఓడించే మార్గాన్ని వెదకుతూ ఒక రోజున.

**విశేషం:** అమంత్రకములైన ఆయుధాలు శస్త్రాలు. సమంత్రకములైన ఆయుధాలు అస్త్రాలు. 'రంధ్రాన్వేషణ' జాతీయం. ఏదో దోషం కొరకు, సాకు కొరకు ప్రయత్నించటమని అర్థం.

**చ. జలనిధి తీరభూమిఁ దన శత్రుఁ గనుంగొని, 'వీని నిప్డు దో**
**ర్బల మెసఁగంగ నాదు భిదురంబునఁ ద్రుంచెద; రాత్రిగాదు, తాఁ**
**దలఁప దివంబుగా; దిది యుదగ్రపరాక్రమ యోగ్య సంధ్య; నా**
**యలవుఁ జలంబుఁ జూప నెపమై తగు సాధన మెద్ది గల్గునో?' 138**

**ప్రతిపదార్థం:** జలనిధి తీరభూమిన్= సముద్రపుటొడ్డున; తన శత్రున్= తన విరోధిఅయిన వృత్రుణ్ణి; కనుంగొని= చూసి; వీనిన్; ఇప్డు; దోర్బలము (దోస్)(ః)+బలము)= భుజబలం; ఎసఁగంగన్= అతిశయించగా; నాదు భిదురంబునన్= నా వజ్రాయుధంతో; త్రుంచెదన్= వధిస్తాను; రాత్రి+కాదు; తలఁపన్= ఆలోచించగా; తాన్; దివంబు= పగలు; కాదు; ఇది= ఈ సమయం; ఉదగ్ర పరాక్రమ యోగ్య సంధ్య= మహా పరాక్రమానికి తగిన సంజవేళ; నా+అలవున్= నా బలమూ; చలంబున్= పట్టుదలా; చూపన్; నెపము+ఐ= కారణమై; తగు సాధనము; ఎద్ది= ఏది; కల్గునో?= కలుగుతుందో?

**తాత్పర్యం:** సముద్రతీరంలో తన విరోధియైన వృత్రుడినిచూసి 'ఇప్పుడు వీడిని భుజబలం అతిశయించగా, నా వజ్రాయుధంతో వధిస్తాను. ఇది రాత్రి కాదు, పగలు కాదు. మహాపరాక్రమం ప్రదర్శించటానికి తగిన సంధ్యా సమయం. నా బలాన్నీ, పట్టుదలనూ చూపటానికి కారణమై ఒప్పే సాధనం ఏది దొరుకుతుందో కదా!'

**క. అని తలఁచుచు నచ్చట నొక । వననిధి ఫేనంబుఁ జూచి వాసవుఁ 'డార్ద్రం**
**బును శుష్కంబును గాదిది' । యనుచుం గులిశమునఁ గూర్చి యధికరయమునన్. 139**

**ప్రతిపదార్థం:** అని; తలఁచుచున్; అచ్చటన్; ఒక వననిధి ఫేనంబున్= ఒక సముద్రపు నురుగును; చూచి; వాసవుఁడు= ఇంద్రుడు; ఇది; ఆర్ద్రంబును= తడిదీ; శుష్కంబును= ఎండినదీ; కాదు; అనుచున్; కులిశమునన్= వజ్రాయుధంతో; కూర్చి= జతపరిచి; అధిక రయమునన్= మిక్కిలి వేగంతో.

**తాత్పర్యం:** అని అనుకొంటూ ఇంద్రుడు అక్కడ ఒక సముద్రపు నురుగును చూచి 'ఇది తడిదీ కాదు, పొడిదీ కాదు-' అంటూ వజ్రాయుధంతో కూర్చి మిక్కిలి వేగంతో.

**తే. దాన వృత్రుని వ్రేయ నత్తఱి మురారి । యందుఁ దగ సంక్రమించి, యయ్యసురఁ జంపె;**
**జిష్ణుఁ డతిభక్తి విష్ణుఁ బూజించె నాత్మ । నఖిలలోకంబులకు మోద మావహిల్లె. 140**

**ప్రతిపదార్థం:** దానన్= దానిచేత; వృత్రునిన్; వ్రేయన్= కొట్టగా; ఆ+తఱిన్= ఆ సమయంలో; ముర+అరి= మురుడనే రాక్షసుడి శత్రువు - విష్ణువు; అందున్; తగన్= ఒప్పుగా; సంక్రమించి= ప్రవేశించి; ఆ+అసురన్= ఆ రాక్షసుడిని; చంపెన్; జిష్ణుఁడు= ఇంద్రుడు; అతి భక్తిన్= మిక్కిలి భక్తితో; విష్ణున్= విష్ణుమూర్తిని; ఆత్మన్= మనస్సులో; పూజించెన్= పూజించాడు; అఖిల లోకంబులకున్= ఎల్లలోకాలకూ; మోదము= సంతోషం; ఆవహిల్లెన్= కలిగింది.

**తాత్పర్యం:** దానితో వృత్రుడిని కొట్టటానికి పూనుకోగా, ఆ సమయంలో విష్ణువు అనువుగా ఆ సముద్రపు నురుగులో ప్రవేశించి ఆ రాక్షసుడిని సంహరించాడు. ఇంద్రుడు మిక్కిలి భక్తితో విష్ణుమూర్తిని మనస్సులో పూజించాడు. లోకాలన్నీ సంతోషించాయి.

**వ. ఇవ్విధంబునం బగతుం బరిమార్చి పేర్చి యింద్రుండు నిజపురంబునకుం జనియె; మఱియును భూతసంఘం 'బిట్లు బ్రహ్మహత్య సేయందగునే?' యని యతని నిందించినం బ్రభుత్వ సంపద సెడుటయు. 141**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; పగతున్= శత్రువును; పరిమార్చి= చంపి; పేర్చి= విజృంభించి; ఇంద్రుండు; నిజపురంబునకున్= తన నగరానికి; చనియెన్= వెళ్ళాడు; మఱియును; భూత సంఘంబు= పంచభూతాలసమూహం; ఇట్లు; బ్రహ్మహత్య; చేయన్+తగునే?; అని; అతనిన్; నిందించినన్= నిందించగా; ప్రభుత్వ సంపద= రాజ్యశ్రీ; చెడుటయున్= నశించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా శత్రువును సంహరించి విజృంభించి ఇంద్రుడు తన నగరానికి వెళ్ళాడు. కాని, పంచభూతాల సమూహం 'ఇట్లా బ్రహ్మహత్య చేయవచ్చునా?' అని అతడిని నిందించగా రాజ్యశ్రీ నశించింది.

**విశేషం:** 'భూతసంఘంబు' - అంటే పంచభూతాలు మొదలైనవి. ఇవి ప్రతిప్రాణీ చేసే పనికి సాక్షీభూతాలుగా ఉంటాయి.

**ఆ. నీచదశకు వచ్చి నిషధాచలంబున । కరిగి, సురవరేణ్యుఁ డడఁగియుండె;**
**నమరు లెల్లఁ గలఁగి, యన్యోన్యపీడన । భయముఁ బొంది కూడఁబాఱి, తమకు. 142**

**ప్రతిపదార్థం:** సురవరేణ్యుఁడు= దేవశ్రేష్ఠుడు, ఇంద్రుడు; నీచ దశకున్, వచ్చి= నీచస్థితికి వచ్చి; నిషధ+అచలంబునకున్= నిషధ పర్వతానికి; అరిగి= వెళ్ళి; అడఁగి+ఉండెన్= దాక్కొన్నాడు; అమరులు+ఎల్లన్= దేవతలందరూ; కలఁగి= కలతచెంది; అన్యోన్య పీడన భయమున్= పరస్పరం బాధించుకొంటారనే భయం; పొంది; కూడన్+పాఱి= కూడుకొని; తమకున్.

**తాత్పర్యం:** ఇంద్రుడు నీచస్థితికి వచ్చి నిషధపర్వతానికి వెళ్ళి దాగుకొన్నాడు. దేవతలందరూ కలత చెంది తమను తాము బాధించుకొంటారనే భయం పొంది, కూడుకొని, తమకు.

**క. కావలియై సురరాజ్య । శ్రీ పాలింపంగఁదగు విశేషంబున సం**
**భావితుఁడు నహుషుఁ డని చని, । యా విభుఁ గని తారు మునులు నతనికి నెమ్మిన్. 143**

**ప్రతిపదార్థం:** కావలి+ఐ= రక్షకుడయి; సురరాజ్యశ్రీ= దేవ రాజ్య సంపద; పాలింపంగన్= కాపాడటానికి; తగు విశేషంబునన్= తగిన ఆధిక్యంతో; సంభావితుఁడు= కొనియాడబడేవాడు; నహుషుండు; అని; చని= వెళ్ళి; తారున్= తామూ (దేవతలూ); మునులున్= మునులూ; ఆ విభున్= ఆ ప్రభువును; కని= చూచి; అతనికిన్; నెమ్మిన్= ప్రీతితో.

**తాత్పర్యం:** రక్షకుడయి సురరాజ్యశ్రీని కాపాడడానికి తగిన గొప్పతనం కలవాడు నహుషుడని నిర్ణయించి, వెళ్ళి తామూ, మునులూ ఆ ప్రభువును చూచి అతడికి ప్రీతితో.

## దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిం జేయుట (సం. 5-11-21)

**వ. పాకశాసను తెఱం గెఱింగించి. 144**

**ప్రతిపదార్థం:** పాకశాసను తెఱంగు= ఇంద్రుడి వృత్తాంతం; ఎఱింగించి= తెలిపి.

**తాత్పర్యం:** ఇంద్రుడి వృత్తాంతం చెప్పి.

**క. 'ర మ్మింద్రపదవి సేకొని । మ మ్మెల్లను నరయు' మనిన, మానవపతి, 'నా**
**కమ్మహిమకుఁ దగు మాహా । త్మ్యమ్ము గలదె? నన్ను నేల యలఁచెద?' రనినన్. 145**

**ప్రతిపదార్థం:** రమ్ము; ఇంద్రపదవి; చేకొని= స్వీకరించి; మమ్ము+ఎల్లనున్= మమ్మల్ని అందరినీ; అరయుము= కాపాడుము; అనినన్; మానవపతి= రాజు-నహుషుడు; నాకున్; ఆ+మహిమకున్= ఆ గొప్పతనానికి; తగు; మాహాత్మ్యమ్ము= సామర్థ్యం; కలదె?= ఉన్నదా?; నన్నున్; ఏల; అలఁచెదరు= శ్రమపెట్టుతారు; అనినన్.

**తాత్పర్యం:** 'రమ్ము. ఇంద్రపదవిని స్వీకరించి మమ్మల్ని అందరినీ కాపాడుము' అనగా నహుషుడు 'నాకు అటువంటి మహాకార్యానికి తగిన సామర్థ్యం ఉన్నదా? నన్నెందుకు శ్రమపెట్టుతారు?' అనగా.

**వ. అంత నిలువక యత్యంత ప్రార్థనంబు సేసి. 146**

**ప్రతిపదార్థం:** అంతన్; నిలువక= ఆగక; అత్యంత ప్రార్థనంబు+చేసి= మిక్కిలి ప్రార్థించి.

**తాత్పర్యం:** అంతటితో ఆగక మరి మరి ప్రార్థించి. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. యమ వరుణాది త్రిదశులు । దమ దమ శక్తి ప్రభావ దర్పంబులు భూ**
**రమణునకుఁ బంచి యిచ్చిరి । ప్రమోద మెసఁగంగ మునిసభామధ్యమునన్. 147**

**ప్రతిపదార్థం:** యమ వరుణ+ఆది త్రిదశులు= యముడూ, వరుణుడూ మొదలైన దేవతలు; ప్రమోదము+ఎసఁగంగన్= సంతోషం అతిశయించగా; మునిసభామధ్యమునన్= మునుల సభలో; తమ తమ శక్తి ప్రభావ దర్పంబులు= తమ తమ శక్తి సామర్థ్య గర్వాలు; భూ రమణునకున్= రాజుకు- నహుషుడికి; పంచి+ఇచ్చిరి= పంచిపెట్టారు.

**తాత్పర్యం:** యముడూ, వరుణుడూ మొదలుగా గల దేవతలు సంతోషంతో అతిశయించగా మునుల సమూహంలో తమ తమ శక్తిసామర్థ్యాల గర్వాలను నహుషుడికి పంచిపెట్టారు.

**వ. ఇవ్విధంబున నిచ్చి, యధికబలసమన్వితుం గావించి తోడ్కొనిపోయి, పూజ్యంబగు దివిజరాజ్యంబున కభిషిక్తుం జేసిన, నతండును బరమ ధర్మపరుండై, కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాది సమస్త దేవయోనులవలనను దేజోభాగంబులు పుచ్చికొని మహానుభావుండై, దివ్యముని సేవ్యంబైన యద్దేవేంద్ర పదంబు సేకొని తుంబురు నారదాది వినోద పాత్రంబులును, రంభాద్యప్సరోగణంబులుం గొలువ నభిమతభోగంబు లనుభవించుచు, మదంబు మిగిలి మన్మథాధీనుండై వర్తిల్లుసమయంబున నొక్కనాఁడు. 148**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; ఇచ్చి; అధిక బల సమన్వితున్= ఎక్కువ బలంతో కూడినవాడిని, కావించి= చేసి; తోడ్కొనిపోయి= తీసికొనివెళ్ళి; పూజ్యంబు+అగు= పూజించదగినదైన; దివిజ రాజ్యంబునకున్= దేవతల రాజ్యానికి; అభిషిక్తున్+చేసినన్= అభిషేకించబడిన వాడినిచేయగా; అతండును= ఆ నహుషుడును; పరమ ధర్మపరుండు+ఐ= మిక్కిలి ధర్మరతుడయి; కిన్నర కింపురుష గరుడ గంధర్వ సిద్ధ విద్యాధర+ఆది సమస్త దేవయోనుల వలనను= కిన్నరులూ, కింపురుషులూ, గరుడులూ, గంధర్వులూ, సిద్ధులూ, విద్యాధరులూ మొదలుగాగల ఎల్ల దేవతల జాతుల నుండీ; తేజస్(ః)+భాగంబులు; పుచ్చుకొని; మహానుభావుండు+ఐ= మహాత్ముడయి; దివ్య ముని సేవ్యంబు+ఐన= దేవతల చేతా, మునులచేతా సేవించదగిన; ఆ+దేవేంద్ర పదంబు+చేకొని= ఆ దేవేంద్ర పదవి స్వీకరించి; తుంబురు నారద+ఆది వినోద పాత్రంబులును= తుంబురుడూ, నారదుడూ మొదలైన వినోదం కలిగించేవారూ; రంభా+ఆది+అప్సరస్(ః)+గణంబులున్= రంభ మొదలైన అచ్చరల సమూహమూ; కొలువన్= సేవించగా; అభిమత భోగంబులు= ఇష్టసౌఖ్యాలు; అనుభవించుచున్; మదంబు మిగిలి= గర్వం అతిశయించి; మన్మథ+అధీనుండు+ఐ= మన్మథుడికి వశపడినవాడయి; వర్తిల్లు సమయంబునన్= ఉన్నసమయంలో; ఒక్కనాఁడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ఇచ్చి, అమిత బలయుక్తుడిగా చేసి, తీసికొనివెళ్ళి పూజ్యమైన దేవరాజ్యాని కభిషిక్తుడిని చేయగా, ఆ నహుషుడు మిక్కిలి ధర్మరతుడై, కిన్నరులూ, కింపురుషులూ, గరుడులూ, గంధర్వులూ, సిద్ధులూ, విద్యాధరులూ మున్నగు ఎల్ల దేవతలనుండి తేజస్సుల అంశాలు పుచ్చుకొని మహాత్ముడై దేవతలూ, మునులూ సేవించే ఆ దేవేంద్ర పదవిని స్వీకరించి, తుంబురుడూ నారదుడూ మొదలయిన వినోదాన్ని కలిగించేవారూ, రంభ మొదలయిన అచ్చరల సమూహాలూ సేవిస్తూండగా, ఇష్టభోగా లనుభవిస్తూ, మదం అతిశయించి మన్మథవశుడయి ఉన్న సమయంలో ఒకనాడు.

**తే. మహిత లావణ్యమున నసమాన యనఁగఁ । జనిన పౌలోమి యా నహుషునకు నయన**
**మార్గగోచర యగుటయు, మదన బాణ । భిన్న హృదయుఁడై, ధృతిఁబాయఁబెట్టి యతఁడు. 149**

**ప్రతిపదార్థం:** మహిత లావణ్యమునన్= గొప్పదిఐన దేహకాంతియందు; అసమాన+అనఁగన్+చనిన= సాటిలేనిది అనదగిన; పౌలోమి= శచి; ఆ నహుషునకున్; నయన మార్గ గోచర+అగుటయున్= కన్నుల త్రోవలో కనబడినదికాగా(కంటికగపడగా); అతఁడు; మదన బాణ భిన్న హృదయుఁడు+ఐ= మన్మథ బాణాలచేత భేదింపబడిన హృదయం కలవాడయి; ధృతిన్= ధైర్యాన్ని; పాయన్+పెట్టి= కోలుపోయి.

**తాత్పర్యం:** గొప్పదిఅయిన మేనికాంతితో సాటిలేనిది అనదగిన శచీదేవి ఆ నహుషుడి కంటబడగా అతడు మదనపరవశుడయి, ధైర్యం కోలుపోయి.

**విశేషం:** పౌలోమి-పులోముడనే దానవుడి కూతురు. ఇంద్రుడు పులోముడిని సంహరించి, అతడి పుత్రిక అయిన శచిని పెండ్లాడాడు.

**క. 'సురలోక రాజ్య పదవిన్ । గరిమంబున నున్న నన్నుఁ గవయం బరమా**
**దరలీలఁ జతురయగు నీ । సరసిజముఖి రామి యేమి చందమొ తలఁపన్?' 150**

**ప్రతిపదార్థం:** సుర లోక రాజ్య పదవిన్= స్వర్గ రాజ్యాధిపత్యంలో; గరిమంబునన్= గొప్పతనంతో; ఉన్న; నన్నున్; కవయన్= కూడటానికి; చతుర+అగు= నేర్పరిఅయిన; సుందరిఅయిన; ఈ సరసిజముఖి= పద్మంవంటి ముఖంకల ఈమె; పరమ+ఆదర లీలన్= మిక్కిలి ఆదరంతో; రామి= రాకపోవటం; తలఁపన్= ఆలోచించగా; ఏమి చందమొ?= ఏమి కారణమో?

**తాత్పర్యం:** 'స్వర్గరాజ్యాధిపత్య పదవిలో మహావైభవంతో ఉన్న నన్ను కూడటానికి సుందరాంగిఅయిన ఈ పద్మవదన మిక్కిలి ఆదరంతో రాకపోవటానికి ఏమి కారణం అయి ఉంటుంది?'

**క. అని యప్పొలఁతిం బిలిపిం । చిన, నదియును భయము నొంది, శీఘ్రమ దేవే**
**జ్యుని సదనమునకు శరణం । బనుచుం జనుటయును వాసవాచార్యుండున్. 151**

**ప్రతిపదార్థం:** అని; ఆ+పొలఁతిన్= ఆ కాంతను-శచిని; పిలిపించినన్= పిలిపించగా; అదియును= ఆమెయు; భయమున్+ ఒంది= భయపడి; శీఘ్రము+అ= వెంటనే; దేవ+ఇజ్యుని సదనంబునకున్= దేవగురువైన బృహస్పతి యింటికి; శరణంబు+ అనుచున్= శరణంటూ; చనుటయును= వెళ్ళగా; వాసవ+ఆచార్యుండున్= దేవగురుడునూ - బృహస్పతియూ.

**తాత్పర్యం:** అని ఆ శచీదేవిని పిలిపించగా, ఆమె భయపడి వెంటనే బృహస్పతి ఇంటికి శరణంటూ వెళ్ళగా ఆయన.

**వ. పరమాదరంబున నద్దేవిని గారవించి 'నిన్ను నహుషు దుర్వినయంబుఁ బొరయకుండ నరయువాఁడ; నాఖండలుండు నా యత్నంబున నవశ్యంబును దడయక వచ్చు' నని యూఱడించిన. 152**

**ప్రతిపదార్థం:** పరమ+ఆదరంబునన్= మిక్కిలి ఆదరంతో; ఆ+దేవిని= ఆ శచీదేవిని; గారవించి= గౌరవించి; నిన్నున్; నహుష దుర్వినయంబున్= నహుషుడి దుష్ప్రవర్తనను; పొరయక+ఉండన్= పొందకుండా; అరయువాఁడన్= రక్షిస్తాను;

ఆఖండలుండు= ఇంద్రుడు; నా యత్నంబునన్= నా ప్రయత్నంచేత; అవశ్యంబును= తప్పకుండా; తడయక= వెంటనే; వచ్చున్; అని; ఊఱడించినన్= ఓదార్చగా.

**తాత్పర్యం:** మిక్కిలి ఆదరంతో ఆ శచీదేవిని గౌరవించి 'నిన్ను నహుషుడి దుష్ప్రవర్తన బారిన పడకుండా కాపాడుతాను. ఇంద్రుడు నా ప్రయత్నంచేత తప్పక వెంటనే వస్తాడు' అని ఓదార్చగా.

**క. అది యెల్ల నెఱిఁగి కోపం । బొదవఁగ నహుషుండు 'గురున కుచితమె యే న**
**మ్ముదితం బిలిపింపఁగఁ దన । సదనంబున నునుచు' టనియె సంక్షుభితుండై. 153**

**ప్రతిపదార్థం:** అది+ఎల్లన్= అదంతా; ఎఱిఁగి= తెలిసి; కోపంబు+ఒదవఁగన్= కోపం పుట్టగా; నహుషుండు; సంక్షుభితుండు+ఐ= కలతపడినవాడయి; ఏను= నేను; ఆ+ముదితన్= ఆ ఇంతిని- శచిని; పిలిపింపఁగన్= పిలిపించగా; తన సదనంబునన్= తన ఇంటిలో; ఉనుచుట= ఉంచటం; గురునకున్= బృహస్పతికి; ఉచితమె?= తగునా?; అనియెన్.

**తాత్పర్యం:** అదంతా తెలిసి, కోపంతో నహుషుడు కలత చెంది 'నేను ఆ శచిని పిలిపిస్తే, తన ఇంటిలో ఉంచటం బృహస్పతికి తగునా?' అన్నాడు.

**చ. అనుడు మునీంద్రులున్ సురలు 'నక్కట నీ మహనీయ గౌరవం**
**బునకుఁ బరాంగనం గవయుబుద్ధి జనించుట యీడుగాదు' నా**
**విని, 'మును పూని యిమ్మెయి వివేకము గౌతముభార్యఁ బాకశా**
**సనుఁ డెడఁ గోరుచోఁ గఱపఁ జాలర మీ రది యెట్లు సెప్పుఁడా!' 154**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనినంతనే; ముని+ఇంద్రులున్= మునిశ్రేష్ఠులూ; సురలున్= దేవతలూ; అక్కట= అయ్యో; నీ మహనీయ గౌరవంబునకున్= నీ మహా మహత్త్వానికి; పర+అంగనన్= పరస్త్రీని; కవయు బుద్ధి= కూడాలనే తలపు; జనించుట= పుట్టటం; ఈడు+కాదు= సరి కాదు; నాన్= అనగా; విని; మును= పూర్వం; పాకశాసనుఁడు= పాకుడనే రాక్షసుడిని చంపినవాడు- ఇంద్రుడు; గౌతముభార్యన్= గౌతమ ముని భార్యను - అహల్యను; ఎడన్= హృదయంలో; కోరుచోన్= కామించినప్పుడు; మీరు; పూని= ప్రయత్నించి; ఈ+మెయి వివేకమున్= ఈ విధమైన జ్ఞానం; కఱపన్+చాలరు+అ= బోధించలేకపోయారా?; అది+ఎట్లు+చెప్పుఁడా!= అది ఎట్లాగో చెప్పండి. (ఏ విధంగా సమర్థించుకొనగలరో చెప్పండి అనిభావం.)

**తాత్పర్యం:** అనగానే మునివరులూ, దేవతలూ 'అయ్యో! నీ మహామహత్త్వానికి పరస్త్రీని కూడాలనే తలంపు పుట్టటం తగదు' అనగా నహుషుడు విని 'పూర్వం ఇంద్రుడు గౌతమమహర్షిభార్యఅయిన అహల్యను హృదయంలో కామించినప్పుడు మీరు ప్రయత్నించి అతనికి ఇటువంటి జ్ఞానం బోధించలేకపోయారా? అది ఎట్లాగో చెప్పండి.'

**విశేషం:** ఇంద్రుడు గౌతముడి భార్యయైన అహల్యను కామించి అర్ధరాత్రి కోడియై గౌతమాశ్రమ సమీపంలో కూయగా, గౌతముడు తెల్లవారిన దనుకొని స్నానార్థం వెళ్ళాడు. అప్పుడు ఇంద్రుడు ఆశ్రమంలో ప్రవేశించి అహల్యను కూడాడు.

**వ. అనుచు నతండు కోపించిన, భయంబుఁగొని వార లా పౌలోమి నతని పాలికిం దోడ్కొని వచ్చువారై పూని బృహస్పతికడకుం జని యద్దేవి వినుచుండ నిట్లనిరి. 155**

**ప్రతిపదార్థం:** అనుచున్; అతండు= నహుషుడు; కోపించినన్; వారలు= ఆ మునులు, దేవతలు; భయంబున్+కొని= భయపడి; ఆ పౌలోమిన్= ఆ శచీదేవిని; అతని పాలికిన్= అతడి వద్దకు; తోడ్కొని వచ్చువారు+ఐ= తీసికొని రాగోరినవారయి; పూని= ప్రయత్నించి; బృహస్పతి కడకున్= బృహస్పతి దగ్గరకు; చని= వెళ్ళి; ఆ+దేవి= ఆ శచి; వినుచున్+ఉండన్= వింటూండగా; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** అంటూ నహుషుడు కోపపడగా, ఆ మునులు, దేవతలు భయపడి శచీదేవిని అతడి వద్దకు తీసికొని రావాలని పూని బృహస్పతి దగ్గరకు వెళ్ళి ఆ శచి వింటూండగా ఇట్లా అన్నారు.

**క. 'నహుషుఁడు మహేంద్ర పదవీ। సహితుఁడు; శచికిన్ వరింపఁ జను నాతని; లో**
**కహితంబు గాఁగఁ బుచ్చుము। మహాత్మ! తచ్చిత్తమున యమర్షం బడఁగన్.' 156**

**ప్రతిపదార్థం:** నహుషుఁడు; మహేంద్ర పదవీ సహితుఁడు= మహేంద్ర పదవితో కూడుకొన్నవాడు; ఆతనిన్; వరింపన్= కోరటానికి; శచికిన్; చనున్= తగును; మహాత్మ!= మహానుభావా; తద్+చిత్తమున+అమర్షంబు= అతడి మనస్సునందలి కోపం; అడఁగన్= పోయేటట్లు; లోకహితంబు+కాఁగన్= లోకశ్రేయస్సు అయ్యేటట్లు; పుచ్చుము= పంపుము.

**తాత్పర్యం:** 'నహుషు డిప్పుడు మహేంద్ర పదవీ సమన్వితుడు. అతడిని వరించటం శచికి సముచితం. మహానుభావా! అతడి మనస్సులోని కోపం పోయేటట్లు, లోకాలకు మేలుకలిగేటట్లు ఆమెను పంపుము.'

**క. అనవుడు శోకం బడరఁగ। ననిమిషగురుఁ జూచి యిట్టులను శచి 'యటుపు**
**చ్చిన దూఱు రాదె? నను శుచి। యని మీ కొనియాడు టెల్ల నన్నతము గాదే?'. 157**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని దేవతలు, మునులనగా; శచి= శచీదేవి; శోకంబు= దుఃఖం; అడరఁగన్= పొంగిరాగా; అనిమిషగురున్= దేవతల గురువైన బృహస్పతిని; చూచి; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నది; ననున్= నన్ను; అటు పుచ్చినన్= ఆ నహుషుడున్న చోటికి పంపితే; దూఱు-రాదె= అపనింద కలుగదా! (పాపం కాదా? దోషం పుట్టదా?); ననున్= నన్ను; శుచి= పవిత్రురాలు; అని= అంటూ; మీ కొనియాడుట+ఎల్లన్= మీ పొగడటమంతా; అనృతము+కాదే!= కల్లబొల్లి (అబద్ధం)కాదా?

**తాత్పర్యం:** దేవతలు ఆ విధంగా అనగానే శచీదేవి దుఃఖంతో తల్లడిల్లుతూ బృహస్పతితో ఇట్లా పలికింది. 'నన్ను మీరు నహుషుడి వద్దకు పంపితే దోషం కాదా? నిందరాదా? పాపంకాదా? మీ రందరూ ఇన్నాళ్ళబట్టి పవిత్రురాల నని నన్ను పొగడటమంతా కల్లబొల్లి మాటలేనా?

**వ. అనిన విని దరహసితవదనుం డగుచుఁ బురుహూత పురోహితుండు. 158**

**ప్రతిపదార్థం:** అనినన్= అని శచీదేవి పలుకగా; పురుహూత పురోహితుండు= ఇంద్రుడి గురువు బృహస్పతి; విని; దరహసిత వదనుండు+అగుచున్= చిరునవ్వుతోడి ముఖం కలవాడవుతూ.

**తాత్పర్యం:** అని శచీదేవి పలుకగా బృహస్పతి విని చిరునవ్వు నవ్వుతూ.

**క. 'నహుషుండు పనుచువాఁ డటె!। విహితానుష్ఠానపరులు వీ రటె! తా లో**
**కహితం బటె! యిది మనకున్। మహనీయమ కాక యెట్లు మానఁగవచ్చున్?' 159**

**ప్రతిపదార్థం:** నహుషుండు; పనుచువాఁడు+అటె!= ఆజ్ఞాపించే వాడట!; వీరు= ఈ మునులు, వేల్పులు; విహిత+అనుష్ఠానపరులు+అటె!= విధిని ఆచరించడంలో ఆసక్తి కలవారట!; తాన్= అది; లోకహితంబు+అటె!= లోకానికి మేలట!; ఇది; మనకున్; మహనీయము+అ కాక= గొప్పపనేకాక; ఎట్లు మానఁగన్+వచ్చున్?= ఎట్లా మానగలం?

**తాత్పర్యం:** 'నహుషుడు ఆజ్ఞాపించేవాడట! ఈ మునులు, వేల్పులు విధిని ఆచరించటంలో ఆసక్తి కలవారట! అది లోకానికి మేలు కూర్చేదట! ఇంతటి గొప్ప పనిని మనం చేయకుండా ఎట్లా ఉండగలం!'

**విశేషం:** బృహస్పతి వారి మాటలను విపరీత లక్షణచేత అధిక్షేపించటం గమనించతగింది.

**వ. అని యుల్లసం బాడి యనిమిషులను ఋషులను జూచి యిట్లనియె. 160**

**ప్రతిపదార్థం:** అని; ఉల్లసంబు+ఆడి= ఎత్తిపొడిచి; అనిమిషులను= దేవతలను; ఋషులను= మునులనూ; చూచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ఎత్తిపొడిచి బృహస్పతి దేవతలనూ, మునులనూ చూచి ఇట్లా అన్నాడు.

**తే. 'శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి । కడపి పుచ్చిన నూర్ధ్వలోకములు దప్పుఁ,**
**బుణ్యకర్మంబు లఫలతఁ బొందు ననఁడె । కమలగర్భుండు దొల్లి జగద్ధితముగ?' 161**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; కమలగర్భుండు= బ్రహ్మ; జగత్+హితముగన్= లోకశ్రేయస్సుగా; శరణు+చొచ్చినన్= శరణని వస్తే; రక్షింపన్+చాలి+ఉండి= కాపాడగలిగి ఉండీ; కడపి పుచ్చినన్= పొమ్మని పంపేస్తే; ఊర్ధ్వ లోకములు= పైలోకాలు - పుణ్యలోకాలు; తప్పున్= ఉండవు; పుణ్యకర్మంబులు= పుణ్యకార్యాలు; అఫలతన్+పొందున్= ఫలించవు; అనఁడె?= అనలేదా?

**తాత్పర్యం:** 'పూర్వం బ్రహ్మ లోకశ్రేయస్సు కాంక్షించి, శరణన్న వారిని కాపాడగలిగి ఉండీ పొమ్మని పంపేస్తే పుణ్యలోకాలు ఉండవనీ, పుణ్యకార్యాలు ఫలించవనీ అనలేదా?'

**వ. అని యనురూపాలాపంబుల నిషేధింప, వార 'లట్లేనిఁ గర్తవ్యం బెయ్యది యూహింపు' మనిన, 'నద్దేవి నహుషుకడకుం జని సముచితంబుగాఁ దదీయ సాంగత్యంబున కెడవలికికొని వచ్చునది; యటమీఁద మన మందఱముం బురందరున కభ్యుదయం బగుతెఱంగాచరించువార' మనుటయు, వాచస్పతి వచనంబులకు సంతసించి సుర సంయమి సంఘంబు లరిగిన యనంతరంబ. 162**

**ప్రతిపదార్థం:** అని; అనురూప+ఆలాపంబులన్= తగిన మాటలతో; నిషేధింపన్= త్రోసిపుచ్చగా; వారలు= ఆ మునులూ, దేవతలూ; అట్లు+ఏనిన్= అట్లా అయితే; కర్తవ్యంబు= చేయదగినది; ఎయ్యది= ఏదో; ఊహింపుము= ఆలోచించుము; అనినన్; ఆ+దేవి= ఆ శచి; నహుషు కడకున్= నహుషుడి వద్దకు; చని= వెళ్ళి; సముచితంబుగాన్= తగిన విధంగా; తదీయ సాంగత్యంబునకున్= అతనితో కలయికకు; ఎడ+పలికికొని వచ్చునది= వ్యవధి కావాలని చెప్పి రావాలి; అట మీఁదన్= ఆపై; మనము+అందఱమున్= మనమంతా; పురందరునకున్= ఇంద్రుడికి; అభ్యుదయంబు+అగు తెఱంగు= శుభం కలిగే విధం; ఆచరించువారము= చేద్దాము; అనుటయున్= అనగానే; సుర సంయమి సంఘంబులు= దేవతల, మునుల సమూహాలు; వాచస్పతి వచనంబులకున్= బృహస్పతి మాటలకు; సంతసించి= సంతోషించి; అరిగిన+అనంతరంబు+అ= వెళ్ళిన వెంటనే.

**తాత్పర్యం:** అని తగిన మాటలతో ప్రోత్సహించగా, వారు 'అట్లా అయితే కర్తవ్యమేదో ఆలోచించుము' అనగా, 'ఆదేవి నహుషుడి వద్దకు వెళ్ళి తగినట్లుగా అతడితోడి కలయికకు వ్యవధి కావాలని అడిగి రావాలి. తరువాత మనమందరం ఇంద్రుడికి అభ్యుదయం కలిగే విధం చేద్దాం' అనగా, దేవతల మునుల సమూహాలు బృహస్పతి మాటలకు సంతోషించి వెళ్ళారు. వెంటనే.

**క. పౌలోమియు నా నహుషుని । పాలికిఁ జనుటయు, నతండు భావజ వికృతి**
**వ్యాలోల మానసుం డయి । లీలా సంభావనా లలిత ముఖుఁ డయ్యెన్. 163**

**ప్రతిపదార్థం:** పౌలోమియున్= శచీదేవియూ; ఆ నహుషుని పాలికిన్= ఆ నహుషుడి వద్దకు; చనుటయున్= వెళ్ళగా; అతండూ= ఆ నహుషుడు; భావజ వికృతి వ్యాలోల మానసుండు+అయి= మన్మథ వికారంచేత సంచలించిన మనస్సు కలవాడయి; లీలా సంభావనా లలిత ముఖుఁడు= విలాస భావాలతో అందమైన ముఖం కలవాడు; అయ్యెన్.

**తాత్పర్యం:** శచీదేవియూ ఆ నహుషుడి వద్దకు వెళ్ళగా, అతడు మన్మథ వికారంచేత సంచలించిన మనస్సు కలవాడయి, విలాస భావ సుందరమైన ముఖం కలవాడు అయ్యాడు.

**వ. అట్టియెడ. 164**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**ఉ. అల్లన యింతి యిట్లనియె 'నారసి వాసవు కల్మిలేమియుం**
**దెల్లముగా నెఱింగికొని తేఁకువలే కిట వచ్చు టొప్పు; నా**
**యుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె? నీ**
**వెల్ల నెఱుంగు; దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. 165**

**ప్రతిపదార్థం:** ఇంతి= స్త్రీ - శచి; అల్లన= మెల్లగా; ఇట్లు+అనియెన్; వాసవు కల్మి లేమియున్= ఇంద్రుడు ఉండటం; లేకపోవటం; ఆరసి= విచారించి; తెల్లముగాన్= స్పష్టంగా; ఎఱింగికొని= తెలిసికొని; తేఁకువ లేక= భయం లేకుండా; ఇట వచ్చుట+ఒప్పున్= ఇక్కడికి రావటం బాగుంటుంది; నా ఉల్లము= నా మనస్సు; శంకితంబు+అగుచున్+ఉండఁగన్= సందేహంతో భయపడుతూ ఉండగా; వేగిరపాటు= తొందరపడటం; మేలె?= మంచిదా?; నీవు; ఎల్లన్= అంతా; ఎఱుంగుదు(వు); నాకున్; చూడఁగన్; ఇప్పుడు; ఎడ= వ్యవధి; ఇచ్చుట; యుక్తము= మంచిది.

**తాత్పర్యం:** శచి అతనితో మెల్లగా ఇలా అన్నది. 'ఇంద్రుడు ఉన్నాడో లేడో బాగా విచారించి స్పష్టంగా తెలిసికొని నిర్భయంగా ఇక్కడికి రావటం బాగుంటుంది. నా మనస్సు శంకతో జంకుతూ ఉండగా తొందరపడటం మేలా? నీకంతా తెలుసు. ఇప్పుడు నాకు వ్యవధి ఇవ్వటం మంచిదని నా అభిప్రాయం'.

**వ. అని యొడంబఱిచి కొండొకకాలం బెడ వలికికొని యింద్రాణియు మగుడం జనుదెంచె; నమరగణంబును మునిజన సహితంబుగ విష్ణుదేవు పాలికి రహస్యవృత్తిం బోయి, జిష్ణుని దురితంబు వాపుటఁ గోరిన, శౌరి కరుణాయత్తచిత్తుండై. 166**

**ప్రతిపదార్థం:** అని; ఒడంబఱిచి= సమ్మతింపజేసి; కొండొక కాలంబు= కొంతకాలం; ఎడ+పలికికొని= వ్యవధి నడుగుకొని; ఇంద్రాణియున్= శచీదేవియు; మగుడన్+చనుదెంచెన్= మరలి వచ్చింది; అమర గణంబులును= దేవతా సమూహాలునూ; ముని జన సహితంబుగన్= మునిజనులతో కూడా; విష్ణుదేవు పాలికిన్= విష్ణుదేవుడి వద్దకు; రహస్య వృత్తిన్= రహస్య వ్యాపారంతో; పోయి; జిష్ణుని దురితంబు= ఇంద్రుడి బ్రహ్మహత్యాపాపం; పాపుటన్= పోగొట్టటం; కోరినన్= కోరగా; శౌరి= విష్ణుడు; కరుణా+ఆయత్తచిత్తుండు+ఐ= దయకు అధీనమైన మనస్సు కలవాడయి.

**తాత్పర్యం:** అని ఒప్పించి కొంతకాలం వ్యవధి అడిగి శచి తిరిగి వచ్చింది. దేవతలు మునులతో కూడా రహస్యంగా విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి ఇంద్రుడి పాపం పోగొట్టుమని కోరగా, విష్ణువు దయాధీన మనస్కుడయి.

**క. 'హయమేధంబున నాకుం । బ్రియ మొనరింపంగ వృత్రభేదికిఁ బుణ్యో**
**దయ మగు' నావుడు వారలు । రయమునఁ జని రందఱుం బురందరు కడకున్. 167**

**ప్రతిపదార్థం:** హయమేధంబునన్= అశ్వమేధయాగంచేత; నాకున్; ప్రియము+ఒనరింపంగన్= సంతోషం కలిగిస్తే; వృత్ర భేదికిన్= ఇంద్రుడికి; పుణ్య+ఉదయము+అగున్= పుణ్యం కలుగుతుంది; నావుడున్= అనగానే; వారలు; అందఱున్; పురందరు కడకున్= ఇంద్రుడి దగ్గరకు; రయంబునన్= వేగంగా; చనిరి= వెళ్లారు.

**తాత్పర్యం:** 'అశ్వమేధయాగం చేసి నాకు ప్రీతి కలిగిస్తే ఇంద్రుడికి పుణ్యం లభిస్తుంది' అనగానే వారందరూ ఇంద్రుడి దగ్గరకు వేగంగా వెళ్ళారు.

### ఇంద్రుండు నహుషు తేజోవిశేషంబు సూచి మఱుఁగువడుట (సం. 5-13-16)

**క. చని యతని నశ్వమేధం । బునఁ గల్మషరహితుఁ జేయఁ బురుహూతుండుం**
**దన పురికి నరిగి నహుషుం । గని తత్తేజోవిశేషకంపితుఁ డయ్యెన్. 168**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; అతనిన్; అశ్వమేధంబునన్= అశ్వమేధ యాగంచేత; కల్మషరహితున్+చేయన్= నిష్పాపుడిని చేయగా; పురుహూతుండున్= ఇంద్రుడునూ; తన పురికిన్= తన పట్టణానికి; అరిగి= వెళ్ళి; నహుషున్+కని= నహుషుడిని చూచి; తద్+తేజస్(ః)+విశేష కంపితుఁడు= అతడి తేజస్సు యొక్క ఆధిక్యంచేత చలించినవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** వెళ్ళి, అతడిని అశ్వమేధయాగంచేత పాపరహితుడిని చేయగా, ఇంద్రుడు తన పట్టణానికి వెళ్ళి, నహుషుడిని చూచి అతని తేజోవిశేషానికి భయకంపితుడయ్యాడు.

**వ. ఇట్లు వృత్రారి తన బ్రహ్మహత్య వాయుటయేకాని నహుషునంత బలంబు లేమింజేసి భయా కులితచిత్తుండై. 169**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వృత్ర+అరి= వృత్రుని శత్రువు - ఇంద్రుడు; తన బ్రహ్మహత్య= తన బ్రహ్మహత్యాపాపం; పాయుటయే కాని= పోగొట్టుకొనటమే కాని; నహుషు+అంత బలంబు= నహుషుడిబలం అంతబలం; లేమిన్+చేసి= లేకపోవటంచేత; భయ+ఆకులిత చిత్తుండు+ఐ= భయంచేత కలతచెందిన మనస్సు కలవాడయి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఇంద్రుడు తన బ్రహ్మహత్యాపాతకం పోగొట్టుకొనటమేకాని, నహుషుడి కున్నంత బలం తనకు లేకపోవటంచేత భయంతో కలతచెందిన మనస్సు కలవాడై.

**క. ఎందేనిఁ జనియె నాతని । సుందరియును నెమ్మనమున శోకోద్రేకం**
**బొంది 'పురందరుఁ డరిగిన । కందువ యే నిప్పు డెట్లు గాంతునొ?' యనుచున్. 170**

**ప్రతిపదార్థం:** ఎందున్+ఏనిన్= ఎక్కడికో; చనియెన్= వెళ్ళాడు; ఆతని సుందరియును= ఆతని భార్యయైన శచియు; నెఱ+మనమునన్= నెమ్మదిలో; శోక+ఉద్రేకంబు= దుఃఖాతిశయం; ఒంది= పొంది; పురందరుఁడు= ఇంద్రుడు; అరిగిన కందువ= వెళ్ళినచోటు; ఏను= నేను; ఇప్పుడు; ఎట్లు; కాంతునొ?= కనుగొంటానో?; అనుచున్.

**తాత్పర్యం:** ఎక్కడికో వెళ్ళాడు. అతడి భార్యఅయిన శచీదేవి తన మనస్సులో దుఃఖాతిశయం పొంది 'ఇంద్రుడు వెళ్ళిన చోటు నే నిప్పు డెట్లా తెలిసికొంటానో అని అనుకొంటూ.

**వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించినఁ దదీయాధి దేవత 'నీ సత్యంబువలన నీ మగనిం గను'దని చెప్పి, యనంతరంబ సాకారయై పొడసూపినఁ బౌలోమి 'నీవెవ్వ?'రవని యడిగిన, నదియును 'భవత్పాతివ్రత్య సత్య శౌచంబులకుఁ బ్రియంబంది వచ్చితి; నుపశ్రుతి' నని చెప్పి, 'నీకుం బాకశాసనుం జూపెదర'మ్మని తోడ్కొని హిమవంతంబు నుత్తరంబున మంజుమంతంబను మహాశైలంబున కరిగి, దానియందు శతయోజన విస్తీర్ణంబైన యొక్క సరోవరంబు సొచ్చి, యచ్చట నుల్లసిల్లు పంచవర్ణ కమనీయంబులగు కమలంబులలో నొక్క నాళంబు భేదించి, ముందటఁ బ్రవేశించె; నింద్రాణియుం దోడన చని తదీయ తంతుమధ్యంబున సూక్ష్మరూపంబున నున్న సురపతిం గన్నంత, నయ్యుపశ్రుతి యదృశ్యం బగుటయు. 171**

**ప్రతిపదార్థం:** నిశా సమయంబునన్= రాత్రివేళ; ఉపశ్రుతిన్= పలుకుల ద్వారా శుభాశుభాలను సూచించే దేవతను; ఆరాధించినన్= పూజించగా; తదీయ+అధిదేవత= ఆ ఉపశ్రుతికి సంబంధించిన అధిష్ఠానదేవత; నీ సత్యంబు వలనన్; నీ మగనిన్ కనుదు(వు)+అని చెప్పి= చూస్తావని చెప్పి; అనంతరంబు+అ= వెంటనే; స+ఆకార+ఐ= రూపంతో కూడినదై; పొడసూపినన్= ప్రత్యక్షంకాగా; పౌలోమి= శచి; నీవు+ఎవ్వరవు+అని+అడిగినన్= అదియును; భవత్+పాతివ్రత్య, సత్య, శౌచంబులకున్= నీ పాతివ్రత్యానికీ, సత్యానికీ, శుచిత్వానికీ; ప్రియంబు+అంది= సంతోషించి; వచ్చితిన్; ఉపశ్రుతిన్; అని చెప్పి; నీకున్; పాకశాసనున్= ఇంద్రుడిని; చూపెదన్, రమ్ము+అని= చూపిస్తాను రా అని; తోడ్కొని= వెంటబెట్టుకొని; హిమవంతంబు+ఉత్తరంబునన్= హిమవత్పర్వతానికి ఉత్తరంగా; మంజుమంతంబు+అను; మహత్ (మహా) శైలంబునకున్= మంజుమంతమనే పెద్ద పర్వతం దగ్గరకు; అరిగి= వెళ్ళి; దానియందున్; శత యోజన విస్తీర్ణంబు+ఐన= నూ రామడల వైశాల్యం కల; ఒక్క సరోవరంబు+చొచ్చి= ఒక కొలనిలో ప్రవేశించి; అచ్చటన్; ఉల్లసిల్లు= వికసించే; పంచ వర్ణ కమనీయంబులు+ అగు= అయిదు రంగులచేత అందమైనవగు; కమలంబులలోన్= పద్మాలలో; ఒక్క నాళంబున్= ఒక కాడను; భేదించి= చీల్చి; ముందటన్= ముందుగా; ప్రవేశించెన్; ఇంద్రాణియున్= శచీదేవియు; తోడన్+అ= వెంటనే; చని; తదీయ తంతు మధ్యంబున= దాని సూత్రం నడుమ; సూక్ష్మ రూపంబునన్= సూక్ష్మాకారంతో; ఉన్న; సురపతిన్= ఇంద్రుడిని, కన్న+అంతన్= చూచిన తరువాత; ఆ+ఉపశ్రుతి; అదృశ్యంబు+అగుటయున్= మాయం కాగా.

**తాత్పర్యం:** రాత్రివేళ ఉపశ్రుతిని పూజించగా, దాని అధిష్ఠాన దేవత 'నీ సత్యం వల్ల నీవు నీ భర్తను చూస్తా' వని చెప్పి, వెంటనే నిజాకారంతో ప్రత్యక్షం కాగా, శచీదేవి 'నీవెవ్వరవు?' అని అడిగింది. అది 'నేను ఉపశ్రుతిని. నీ పాతివ్రత్యానికీ శుచిత్వానికీ సంతోషించి వచ్చాను' అని చెప్పి, 'నీకు ఇంద్రుడిని చూపిస్తాను, రా' అని వెంట బెట్టుకొని హిమవంతానికి ఉత్తరంగా ముంజుమంత మనే పెద్ద పర్వతం వద్దకు వెళ్ళి, దానియందు నూరామడల

వైశాల్యంకల ఒక కొలనిలో ప్రవేశించి, అక్కడ వికసించిన అయిదు రంగుల సుందర పద్మాలలో ఒకదాని కాడను చీల్చి తాను ముందు ప్రవేశించింది. శచీదేవి కూడా వెంటనే వెళ్ళి దాని దారాల నడుమ సూక్ష్మరూపంతో ఉన్న ఇంద్రుడిని చూచింది. వెంటనే ఆ ఉపశ్రుతి మాయమైపోయింది.

**విశేషం:** భవత్ప్రాతిప్రత్య శౌచంబులకు - అని వావిళ్ళవారి ప్రతి. 'ముంజివంత'మని మున్నంగి శర్మ పరిష్కృతమైన ప్రతిలోను, తెలుగు విశ్వవిద్యాలయప్రతిలోను ఉండగా, మంజుమంతమని వావిళ్ళ ప్రతి. ఔత్తరాహ దాక్షిణాత్య సంస్కృత భారత ప్రతులలో దేనిలోనూ ఆ పర్వతం పేరే లేదు. పైగా మూలంలో శచి హిమవంతం దాటి ఉత్తర పార్శ్వానికి వెళ్ళి, బహుయోజన విస్తృతమైన సముద్రాన్నీ, అందులో ఒక మహాద్వీపాన్నీ, అక్కడ నానా పక్షి సమన్వితమైన ఒక సరస్సునూ చూచినట్లు ఉన్నది.

**'హిమవన్త మతిక్రమ్య ఉత్తరం పార్శ్వ మాగమత్,**
**సముద్రం చ సమాసాద్య బహు యోజన విస్తృతమ్.**
**ఆససాద మహాద్వీపం నానాద్రుమ లతా యుతమ్,**
**తత్రాపశ్యత్ సరో దివ్యం నానా శకునిభిర్యుతమ్.** (ఉద్యోగ. 15-6,7.)

**క. పతిసన్నిధి వడసి మహా। ద్భుత మందెడు శచి తదీయ పూర్వ సుకర్మ**
**స్తుతి సేయుచు నిలిచిన, నతఁ। డతివం గని సంభృతాదరాత్ముం డగుచున్. 172**

**ప్రతిపదార్థం:** పతి సన్నిధి+పడసి= భర్త సన్నిధిని పొంది; మహత్(మహా)+అద్భుతము+అందెడు శచి= మిక్కిలి ఆశ్చర్యపడే శచి, తదీయ పూర్వ సుకర్మ స్తుతి+చేయుచున్= ఆతడి వెనుకటి మంచి పనుల పొగడ్త చేస్తూ; నిలిచినన్= ఉండగా; అతఁడు; అతివన్= స్త్రీని-భార్యను; కని, సంభృత+ఆదర+ఆత్ముండు+అగుచున్= సంపూర్ణమైన ఆదరంతో కూడిన మనస్సు కలవాడవుతూ.

**తాత్పర్యం:** భర్త సమీపానికి వెళ్ళిన శచీదేవి మిక్కిలి ఆశ్చర్యపడుతూ అతడి వెనుకటి సత్కర్మలను పొగడుతూ ఉండగా, అతడు భార్యను చూచి మిక్కిలి ఆదరంతో కూడిన మనస్సు కలవాడై.

**ఉ. 'ఇచ్చట నేను నిల్చు టిది యెట్టు లెఱింగితి? నన్నుఁ గాన నీ**
**వచ్చిన కార్య మేమి? యనవద్యగుణోత్తర ! చెప్పు' నావుడుం**
**బొచ్చెము లేక యా నహుషు పోయిన పోకలు, వానికిం దగం**
**జెచ్చెరఁ గాలయాపనము సేసిన భంగియుఁ జెప్పె దేవియున్. 173**

**ప్రతిపదార్థం:** అనవద్య గుణ+ఉత్తర!= అనింద్యాలైన గుణాల చేత శ్రేష్ఠురాలా! శచీ!; నేను; ఇచ్చటన్; నిల్చుట+ఇది; ఎట్టులు+ఎఱింగితి(వి); నన్నున్; కానన్= చూడడానికి; నీ వచ్చిన కార్యము+ఏమి= నీవు వచ్చిన పని యేమిటి? చెప్పు(ము); నావుడున్= అనగానే; దేవియున్= శచీదేవియూ; ఆ నహుషు పోయిన పోకలున్= ఆ నహుషుడు ప్రవర్తించిన విధమూ; వానికిన్; తగన్= ఒప్పుగా, చెచ్చెరన్= శీఘ్రంగా; కాలయాపనము+చేసిన భంగియున్= కాలక్షేపం చేసిన విధమూ; పొచ్చెము లేక= కొరత లేకుండా; చెప్పెన్= చెప్పింది.

**తాత్పర్యం:** 'గుణవతులలో ఉత్తమురాలా! శచీ! నే నిక్కడ ఉన్నట్లు నీ కెలా తెలిసింది? నీవు నన్ను చూడవచ్చిన పనేమి? చెప్పుము' అనగానే శచీదేవి ఆ నహుషుడు పోయిన పోకడలూ, వాటికి ఒప్పుగా వెంటనే కాలక్షేపం చేసిన విధమూ పొల్లుపోకుండా చెప్పింది.

**వ. చెప్పి, యుపశ్రుతి తెఱంగును నతని కెఱింగించి 'దేవా! నీ విత్తఱింబ్రకాశుండవై, భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను రక్షింపక తక్కిన, నుక్కివుండగు నతని పాప నిశ్చయంబున నాపద వచ్చు' ననిన విని వల్లభకు దివిజవల్లభుం డిట్లనియె. 174**

**ప్రతిపదార్థం:** చెప్పి; ఉపశ్రుతి తెఱంగును= ఉపశ్రుతి విధమూ; అతనికిన్; ఎఱింగించి= తెలిపి; దేవా!; నీవు; ఈ+తఱిన్= ఈ సమయంలో; ప్రకాశుండవు+ఐ= బయటపడి; భవత్+ప్రతాపంబునన్= నీ పరాక్రమం చేత; నహుషునకున్; పరాభవంబు= అవమానం; ఒనరించి= చేసి; నన్నున్; రక్షింపక తక్కినన్= కాపాడకపోతే; ఉక్కివుండు+అగు= కపటి అయిన; అతని పాప నిశ్చయంబునన్= అతని దుష్ట నిర్ణయం చేత; ఆపద వచ్చున్= కష్టం కలుగుతుంది; అనినన్; విని; దివిజ వల్లభుండు= దేవరాజు- ఇంద్రుడు; వల్లభకున్= భార్యకు - శచికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ రీతిగా చెప్పి, ఉపశ్రుతి వృత్తాంతం కూడా అతడికి తెలిపి, 'దేవా! నీ విప్పుడు వెలువడి నీ ప్రతాపంచేత నహుషుడిని అవమానించి నన్ను రక్షించకపోతే, వంచకుడైన అతడి దుష్ట నిర్ణయం చేత ఆపద సంభవిస్తుంది' అనగా విని ఇంద్రుడు భార్యతో ఇట్లా అన్నాడు.

**క. 'ఆ నహుషు బాహుగర్వ మ । నూనంబై యున్నయది సముజ్జ్వల ముని స**
**మ్మాన ప్రవృద్ధ మగుటను; । దానం గాలంబు వేచెదను జయమునకున్. 175**

**ప్రతిపదార్థం:** ఆ నహుషు బాహు గర్వము= ఆ నహుషుడి భుజబల గర్వం; సముజ్జ్వల ముని సమ్మాన ప్రవృద్ధము= మిక్కిలి ప్రకాశించే మునుల ఆదరంచేత ఎక్కువగా వృద్ధి పొందింది; అగుటన్= అవటం చేత; అనూనంబు+ఐ+ఉన్న+అది= అనల్పంగా ఉన్నది; దానన్= అందుచేత; జయమునకున్= విజయానికి; కాలంబు వేచెదను= సమయం కనిపెట్టుకొని ఉంటున్నాను.

**తాత్పర్యం:** 'ఆ నహుషుడి భుజబలగర్వం మునుల సముజ్జ్వలమైన ఆదరంచేత వృద్ధి పొంది ఉండటం చేత అనల్పంగా ఉన్నది. అందుచేత అతడిని జయించటానికి కొంతకాలం వేచి ఉన్నాను.'

**చ. తఱి యగు నంతకున్ రిపునుదగ్రత సైఁచుట నీతి; నీవు నా**
**కఱపిన యట్ల చేయుము; తగం జని యాతనిఁ గాంచి 'నన్ను నె**
**త్తెఱఁగుననైనఁ బొందఁగ మదిం దలపోఁతయ కల్గెనేనిఁ గ్ర**
**చ్ఛఱ 'మునివర్గ వాహనుఁడవై చనుదె' మ్మను; మంతఁ దీఱెడున్. 176**

**ప్రతిపదార్థం:** తఱి+అగు+అంతకున్= సమయం అయ్యేదాకా; రిపు+ఉదగ్రతన్= శత్రువుయొక్క ఉద్ధతిని; సైఁచుట= సహించటం; నీతి; నీవు; నా కఱపిన+అట్లు+అ= నేను చెప్పినట్లే; చేయుము; తగన్= ఒప్పుగా; చని; అతనిన్; కాంచి= చూచి; నన్నున్; ఏ+తెఱఁగునన్+ఐనన్= ఏ విధంగా నైనా; పొందఁగన్= కూడటానికి; మదిన్= మనస్సులో; తలపోఁత+అ= ఉద్దేశమే;

కల్గెన్+ఏనిన్= ఉంటే; క్రచ్చు+అఱన్= శీఘ్రంగా; మునివర్గ వాహనుఁడవు+ఐ= మునుల సమూహం వాహనంగా కలవాడవయి; చనుదెమ్ము= రమ్ము; అనుము; అంతన్+తీఱెడున్= దానితో సమసిపోతాడు, ఆపదతీరిపోతుంది.

**తాత్పర్యం:** 'సమయం వచ్చేదాకా శత్రుడి ఉద్ధతిని సహించి ఉండటం రాజనీతి; నీవు నేను చెప్పినట్లే చేయుము. నీవు ఒప్పుగా అతడిని చూచి 'నన్ను ఎట్లా అయినా పొందడానికే నీకు ఉద్దేశం ఉంటే, నీవు వెంటనే మునుల సమూహాన్ని వాహనం చేసికొని నా దగ్గరికి రమ్ము అనుము. దానితో వాడి పని అయిపోతుంది.

**ఆ. అనిన 'నట్ల కాక' యని పతి వీడ్కొని, । యింతి నహుషుపాలి కేఁగుదెంచె;**
**నతఁడు దమక మడర నద్దేవిఁ బెద్దయు । నాదరించి యిష్ట మడుగుటయును. 177**

**ప్రతిపదార్థం:** అనినన్; అట్లు+అ+కాక= అట్లాగే; అని; పతిన్= భర్తను; వీడ్కొని= విడిచి; ఇంతి= స్త్రీ - శచి; నహుషు పాలికిన్= నహుషుడి దగ్గరకు; ఏఁగుదెంచెన్= వచ్చింది; అతఁడు= నహుషుడు; తమకము= మోహం; అడరన్= అతిశయించగా; ఆ+దేవిన్= ఆ శచీదేవిని; పెద్దయున్= మిక్కిలి; ఆదరించి= సంభావించి; ఇష్టము+అడుగుటయును= కోరిక అడగ్గా.

**తాత్పర్యం:** అనగా 'అట్లాగే' అని భర్త దగ్గర సెలవుపుచ్చుకొని, శచీదేవి నహుషుడి దగ్గరకు వచ్చింది. నహుషుడు మోహం అతిశయించగా శచీదేవిని ఎంతో ఆదరించి తనపట్ల ఆమెకు గల కోరికను గురించి అడుగగా.

**వ. ఇంద్రాణియు నిట్లనియె: 'మన నిరూపించిన సమయంబునకుఁ గొండొక తడవు గలదు. కాలం బగుటయు నిన్ను వరియించెద; నీవు మహాముని వాహనుండవు గావలయు. అది నాకుఁ బ్రియంబు; నీకు ననన్య సామాన్యం బైన యానంబు తేజోవిశేషకరం బగు' ననిన, నప్పలుకులకు నహుషుండు ప్రహర్షచిత్తుండై. 178**

**ప్రతిపదార్థం:** ఇంద్రాణియున్= శచీదేవియూ; ఇట్లు+అనియెన్; మన నిరూపించిన సమయంబునకున్= మనం నిర్ణయించుకొన్న సమయానికి; కొండొక తడవు= కొంచెం వ్యవధి; కలదు; కాలంబు+అగుటయున్= సమయం కాగానే; నిన్నున్; వరియించెదన్= కోరతాను; నీవు; మహత్(మహా)+ముని వాహనుండవు కావలయున్= నీవు మహర్షులు వాహనంగా కలవాడవు కావాలి; అది; నాకున్; ప్రియంబు= ఇష్టం; నీకున్; అనన్య సామాన్యంబు+ఐన యానంబు= ఇతరులకు ఎవ్వరికీలేని వాహనం; తేజస్(ః)+విశేషకరంబు+అగున్= తేజస్సును అధికం చేసేది అవుతుంది. అనినన్; ఆ+పలుకులకున్= ఆ మాటలకు; నహుషుండు; ప్రహర్షచిత్తుండు+ఐ= మిక్కిలి సంతోషించిన మనస్సు కలవాడయి.

**తాత్పర్యం:** శచీదేవి ఇట్లా అంది. 'మనం ఏర్పరుచుకొన్న సమయానికి ఇంకా కొంచెం వ్యవధి ఉన్నది. సమయం అయినప్పుడు నిన్ను వరిస్తాను. నీవు మహర్షులు వాహనంగా కలవాడవు కావాలి. అది నాకు ఇష్టం. ఎవరికీ లేని వాహనం నీకు తేజస్సును వృద్ధి పొందిస్తుంది.' అనగా, ఆ మాటలకు నహుషుడు మిక్కిలి సంతోషించిన మనస్సు కలవాడయి.

**ఆ. 'ఏను దక్క నొరుల కెవ్వరికైన న । వ్వాహనంబు నెక్క వశమె? నీకు**
**సమ్మతంబు గాఁగ సప్తర్షిగణము నా । యందలంబు మోవ నరుగుదెంతు.' 179**

**ప్రతిపదార్థం:** ఏను+తక్కన్= నేను తప్ప; ఒరులకున్+ఎవ్వరికిన్+ఐనన్= ఇతరుల కెవరికైనా; ఆ+వాహనంబున్= ఆ వాహనాన్ని; ఎక్కన్+వశమె= ఎక్క తరమా? నీకున్; సమ్మతంబు+కాఁగన్= నీకు ఇష్టం అయ్యేటట్లు; సప్త+ఋషి గణము= ఏడుగురు మునుల సమూహం; నా+అందలంబున్= నా పల్లకీని; మోవన్= మోయగా; అరుగుదెంతున్= వస్తాను.

**తాత్పర్యం:** 'నేను తప్ప ఇతరుల కెవ్వరికైనా అటువంటి వాహనం ఎక్కటానికి సాధ్యమవుతుందా? నీకు ఇష్టం అయ్యేటట్లు సప్తర్షులు నా పల్లకీ మోస్తూండగా వస్తాను.'

**క. అని వనితఁ బంచి, యప్పుడ । మునులం బిలిపించి; మౌర్ఖ్యమునఁ దనకున్ వా**
**హనముగఁ జేసి, యొకింతయు । ననుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్. 180**

**ప్రతిపదార్థం:** అని; వనితన్= స్త్రీని (శచిని); పంచి= పంపి; అప్పుడు+అ= వెంటనే; మునులన్; పిలిపించి; మౌర్ఖ్యమునన్= మూర్ఖత్వంతో; తనకున్; వాహనముగన్= వాహనంగా (పల్లకీ మోసేవారినిగా); చేసి; ఒక+ఇంతయున్= ఇంచుకైనా; అనుమానము లేక= సంకోచం లేకుండా; అతఁడు; ఎల్ల+ఎడలన్= అన్ని చోట్లా; తిరిగెన్.

**తాత్పర్యం:** అని శచిని పంపివేసి వెంటనే అతడు మునులను పిలిపించి, మూర్ఖత్వంతో వారిని తనకు వాహనంగా (వాహకులుగా) చేసికొని, కొంచెం కూడా సంకోచం లేకుండా అన్ని చోట్లా తిరిగాడు.

**క. చని పౌలోమియు సురగురుఁ । గని 'నహుషుడు వేచియున్నకాలం బెడ లే;**
**దనిమిషనాథున కిత్తఱి । ననుగ్రహము సేయవలయు నవహితబుద్ధిన్. 181**

**ప్రతిపదార్థం:** పౌలోమియున్= శచీదేవియు; చని; సురగురున్= దేవగురుడిని-బృహస్పతిని; కని; నహుషుఁడు; వేచి+ఉన్న కాలంబు= ఎదురు చూచే సమయం; ఎడ లేదు= దూరం లేదు; అనిమిషనాథునకున్= దేవేంద్రుడికి; ఈ+తఱిన్= ఇప్పుడు; అవహిత బుద్ధిన్= ఏకాగ్రమైన మనస్సుతో; అనుగ్రహము+చేయవలయున్= అనుగ్రహం చూపాలి.

**తాత్పర్యం:** శచీదేవి వెళ్ళి బృహస్పతిని చూచి 'నహుషుడు ఎదురు చూచే సమయం ఇంకెంతో దూరంలో లేదు. ఈ సమయంలో ఏకాగ్రమైన మనస్సుతో ఇంద్రుడిని అనుగ్రహించాలి.

**వ. శరణాగతనైన నన్ను రక్షింపు, మనిన నతం డిట్లనియె. 182**

**ప్రతిపదార్థం:** శరణ+ఆగతన్+ఐన నన్నున్= శరణు కొరకు వచ్చిన నన్ను రక్షింపుము; అనినన్; అతండు; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** శరణు కోరి వచ్చిన నన్ను రక్షించాలి' అనగా బృహస్పతి ఇట్లా అన్నాడు.

**క. 'ఆ నహుషువలన నాపద । రా నీ; నాతనికి నాతురత గావింపం**
**బూని యొనర్చెద వేలిమి । దానను మునివాహనత గతస్థైర్యుఁ డగున్. 183**

**ప్రతిపదార్థం:** ఆ నహుషు వలనన్= ఆ నహుషుడి నుండి; ఆపద; రానీను= రానివ్వను; ఆతనికిన్; ఆతురత= పీడ; కావింపన్= కలిగించటానికి; పూని= ప్రయత్నించి; వేలిమి= హోమం; ఒనర్చెదన్= చేస్తాను; దానను= ఆ హోమంచేతనూ; ముని వాహనతన్= మునులు వాహనంగా కలవాడవటం చేతా, గత స్థైర్యుఁడు+అగున్= పోయిన నిలకడ కలవాడవుతాడు.

**తాత్పర్యం:** 'ఆ నహుషుడి వలన నీకు ఆపద రానివ్వను; అతడికి ఆపద కలిగేటట్లు నేను ప్రయత్నించి హోమం చేస్తాను. దానివలనా, మునివాహనత్వం వలనా అతడు నిలకడ కోల్పోతాడు.'

**క. వెరవున నీ పతి యునికియు । నరసెద'నని యూరడించి, యప్పడ వైశ్వా**
**నరు నర్చితుఁ జేసి, పురం । దరు తెఱఁగుం జెప్పి యతనిఁ దడవం బనిచెన్. 184**

**ప్రతిపదార్థం:** వెరవునన్= ఉపాయంతో; నీ పతి+ఉనికియున్= నీ భర్త ఉనికినీ; అరసెదన్= చూస్తాను; అని; ఊరడించి= ఓదార్చి; అప్పుడు+అ= వెంటనే; వైశ్వానరున్= అగ్నిని; అర్చితున్+చేసి= పూజించి; పురందరు తెఱఁగున్= ఇంద్రుడి విధం; చెప్పి; అతనిన్= ఇంద్రుడిని; తడవన్= వెదకడానికి; పనిచెన్= పంపాడు.

**తాత్పర్యం:** 'ఉపాయంతో నీ భర్త ఉన్న చోటు చూస్తాను' అని ఊరడించి, వెంటనే అగ్నిదేవుడిని పూజించి, ఇంద్రుడి వృత్తాంతం చెప్పి, అతడిని వెదకడానికి పంపాడు.

అగ్నిదేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట (సం. 5-15-27)

**వ. పనిచిన వహ్నియు వనితా రూపంబునం జని మనోగతి యగుటంజేసి సర్వదిశలును, భూమ్యంతరిక్షంబులును, గిరివిపినంబులును గొండొక సేపునకుం గలయం జూచి, సంక్రందను నెందునుం గానక మగిడి వచ్చి, వాచస్పతికి నత్తెఱం గెఱింగించి, 'నాకు జలంబులు ప్రవేశింపరామి నంద పరికింపనేరనైతి; నప్పుల వలన నగ్నియు, బ్రాహ్మణుల వలన క్షత్రియ జాతియు, నశ్మంబుల వలన లోహంబును నుద్భవించె; వాని వాఁడిమి యెల్లయెడలనుంజెల్లుఁ; దమ తమ జన్మస్థానంబులయం దడంగుం, గావున నీళ్లు నాకు సంక్షయంబు సేయుట సుప్రసిద్ధం' బనిన విని యనిమిష గురుండు హవ్యవాహను నత్యంత గౌరవంబునం గనుంగొని. 185**

**ప్రతిపదార్థం:** పనిచినన్= పంపగా; వహ్నియున్= అగ్నియూ; వనితా రూపంబునన్= స్త్రీరూపంలో; చని= వెళ్ళి; మనస్(ః)గతి+అగుటన్+చేసి= మనోవేగం కలవాడవటం చేత, సర్వ దిశలును= అన్ని దిక్కులూ; భూమి+అంతరిక్షంబులును= భూమీ, ఆకాశమూ; గిరి విపినంబులును= కొండలూ, అడవులూ; కొండొక సేపునకున్= కొంచెం సేపటిలో; కలయన్+చూచి= అంతటా చూచి; సంక్రందనున్= ఇంద్రుడిని; ఎందునున్= ఎక్కడా; కానక= చూడక; మగిడి వచ్చి= తిరిగి వచ్చి; వాచస్పతికిన్= బృహస్పతికి; ఆ+తెఱంగు+ఎఱింగించి= ఆ విధం చెప్పి; నాకున్; జలంబులు= నీళ్ళు; ప్రవేశింపన్+రామిన్= ప్రవేశించలేకపోవటం చేత; అందున్+అ= అందులోమాత్రమే; పరికింపన్+నేరన్+ఐతిన్= చూడలేకపోయాను; అప్పుల వలనన్= నీళ్లనుంచి, అగ్నియున్; బ్రాహ్మణులవలనన్; క్షత్రియ జాతియున్; అశ్మంబుల వలనన్= రాళ్ల వలన; లోహంబును; ఉద్భవించెన్= పుట్టాయి; వాని వాఁడిమి= వాటి ప్రతాపం; ఎల్ల+ఎడలన్= అన్ని చోట్లా; చెల్లున్= చెల్లుతుంది; తమ తమ జన్మ స్థానంబులయందున్= తమ తమ పుట్టిన చోట్ల; అడంగున్= నశిస్తుంది; కావునన్; నీళ్ళు నాకున్; సంక్షయంబు+ చేయుట= నాశనం కలిగించటం; సుప్రసిద్ధంబు= బాగా తెలిసినదే; అనినన్; విని; అనిమిష గురుండు= దేవ గురువు - బృహస్పతి; హవ్యవాహనున్= అగ్నిని; అత్యంత గౌరవంబునన్= మిక్కిలి గౌరవంతో; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** ఆ విధంగా బృహస్పతి పంపగా, అగ్ని స్త్రీవేషం ధరించి వెళ్ళి, మనోవేగం కలవాడవటం చేత అన్ని దిక్కులూ, భూమ్యాకాశాలూ, కొండలూ, అడవులూ కొంచెం సేపటిలోనే కలయజూచి, ఇంద్రుడిని ఎక్కడా కానక

తిరిగి వచ్చి, బృహస్పతికి ఆ విధం చెప్పి, 'నాకు నీళ్ళల్లో ప్రవేశించటానికి అలవి కాకపోవటం చేత అందులో మాత్రం వెదకలేకపోయాను. నీళ్ళ వలన నిప్పూ, బ్రాహ్మణులవల్ల క్షత్రియులూ; రాళ్ళవలన లోహమూ పుట్టాయి. వాటి ప్రతాపం అన్ని చోట్లా చెల్లుతుంది కాని, తమ తమ పుట్టిన చోట్ల మాత్రం నశిస్తుంది. కాబట్టి నీళ్ళు నాకు నాశనం కలిగించటం మిక్కిలి ప్రసిద్ధమైనదే' అనగా విని బృహస్పతి అగ్నిదేవుడిని మిక్కిలి గౌరవంతో చూచి.

**మ. 'సకల స్థావర జంగమంబులు భవత్సాన్నిధ్యమాత్రంబునన్**
**వికసిల్లుం; గ్రతు వైభవంబులుఁ, జతుర్వేదంబులున్ నీవ; పా**
**వక! నీయంద జలంబులుం గలిగె; విశ్వవ్యాప్తిమై నున్ననీ**
**కొకచో టెట్టు లగమ్య మయ్యె? నిను నీ వూహింపు పెంపారఁగన్. 186**

**ప్రతిపదార్థం:** పావక!= అగ్నిదేవా!; సకల స్థావర జంగమంబులు= ఎల్ల అచరాలూ; చరాలూ; భవత్+సాన్నిధ్య మాత్రంబునన్= నీ సన్నిధి మాత్రం చేతనే; వికసిల్లున్= వికసిస్తాయి; క్రతు వైభవంబులున్= యజ్ఞ విభవాలూ; చతుర్వేదంబులున్= నాలుగు వేదాలూ; నీవు+అ= నీవే; నీ+అందున్+అ= నీయందే; జలంబులున్= నీళ్ళు కూడా; కలిగెన్= పుట్టాయి; విశ్వవ్యాప్తిమైన్+ఉన్న నీకున్= సర్వ వ్యాపనంతో ఉన్న నీకు; ఒక చోటు; ఎట్టులు= ఎట్లా, అగమ్యము+అయ్యెన్= చొరరానిది అయింది; పెంపు+ ఆరఁగన్= బాగా; నినున్; నీవు; ఊహింపు(ము).

**తాత్పర్యం:** 'అగ్నిదేవా! ఎల్ల అచరాలూ, చరాలూ నీ సన్నిధి మత్రం చేతనే వికసిస్తాయి. యజ్ఞ వైభవాలూ, నాలుగు వేదాలూ నీవే. నీళ్ళుసైతం నీయందే పుట్టాయి. జగద్వ్యాపకుడవైన నీకు ఒక చోటు చొరరానిది ఎట్లా అయింది? నిన్ను నీవు బాగా ఊహించుకో.

**ఉ. ఏనును బ్రహ్మమంత్రముల నెంతయు నీ కభివృద్ధిఁ జేసెదం**
**గాన విశంకతన్ సలిలగామివి గ' మ్మనినం, గృశానుఁడుం**
**బూనిక నేఁగి వారినిధి భూరి నదీ సరసీ తటాక సం**
**తానము రోయుచుం జని శతక్రతుఁ డున్న సరోవరంబునన్. 187**

**ప్రతిపదార్థం:** ఏనును= నేను కూడా; బ్రహ్మ మంత్రములన్= వేదమంత్రాలతో; నీకున్; ఎంతయున్= ఎంతో; అభివృద్ధిన్; చేసెదన్; కానన్; విశంకతన్= సంకోచం లేకుండా; సలిలగామివి+కమ్ము= నీళ్ళలో ప్రవేశించేవాడవు కమ్ము; అనినన్; కృశానుఁడున్= అగ్నియూ; పూనికన్= ప్రయత్నంతో; ఏఁగి= వెళ్ళి; వారినిధి భూరి నదీ సరసీ తటాకసంతానమున్= సముద్రాల, పెద్ద నదుల, సరస్సుల, కొలకుల సమూహాలను; రోయుచున్= వెదకుతూ; చని= వెళ్ళి; శతక్రతుఁడు= నూరుయజ్ఞాలు చేసినవాడు- ఇంద్రుడు; ఉన్న; సరోవరంబునన్= సరస్సులో.

**తాత్పర్యం:** నేను కూడా వేదమంత్రాలతో నీకు ఎంతో అభివృద్ధిని కలిగిస్తాను. కావున సంకోచం లేకుండా నీళ్ళలో ప్రవేశించుము'. అనగా అగ్ని కూడా ప్రయత్నంతో వెళ్ళి సముద్రాల, గొప్ప నదుల, సరస్సుల, కొలకుల సమూహాలు వెదకుతూ వెళ్ళి, ఇంద్రుడున్న సరస్సులో.

**ఉ. అంబురుహంబులం గలయ నారసి చొచ్చి, యొకండు నాళసూ**
**త్రంబున నున్న యింద్రుఁ గని, రాగమునన్ గురునొద్ద కగ్ని శీ**

**ఘ్రంబున నేఁగుదెంచి, తన కన్నతెఱంగెఱిఁగింప, నాతఁ డు**
**ల్లంబున నుల్లసిల్లి, సురలన్ మునులం దగఁగూడి గ్రక్కునన్.** 188

**ప్రతిపదార్థం:** అంబురుహంబులన్= తామరపువ్వులను; కలయన్= అంతటా; ఆరసి= వెదకి; ఒకండు చొచ్చి= ఒక పద్మంలో ప్రవేశించి; నాళ సూత్రంబునన్= దాని కాడయొక్క దారంలో; ఉన్న, ఇంద్రున్; కని; అగ్ని; గురు+ఒద్దకున్= బృహస్పతి వద్దకు, రాగమునన్= ప్రీతితో, శీఘ్రంబునన్= వేగంగా; ఏఁగుదెంచి= వచ్చి; తన కన్నతెఱంగు+ఎఱిఁగింపన్= తాను చూచిన విధం తెలుపగా; ఆతఁడు= బృహస్పతి; ఉల్లంబునన్= మనస్సులో; ఉల్లసిల్లి= సంతోషించి; సురలన్= దేవతలనూ; మునులన్= మునులనూ; తగన్= ఒప్పుగా; కూడి= కలిసి; గ్రక్కునన్= శీఘ్రంగా.

**తాత్పర్యం:** తామరపువ్వులను అంతటా వెదకి, ఒకదానిలో ప్రవేశించి, దాని కాడ దారంలో ఉన్న ఇంద్రుడిని చూసి, అగ్ని ప్రీతితో బృహస్పతి వద్దకు శీఘ్రంగా వచ్చి, తాను చూచిన విధం తెలుపగా, అతడు మనస్సులో సంతోషించి దేవతలనూ, మునులనూ కూడి వెంటనే.

**మ. దివిజాధీశ్వరుపాలికిం జని, కృతార్థీభూతచేతస్కుఁడై,**
**వివిధ స్తోత్ర పరంపరా చతుర వాగ్విన్యాసతం బ్రీతుఁ జే**
**సి, 'వరిష్ఠంబగు నీదు కృత్యము ననుష్ఠింపంగ నీ వుత్సహిం**
**పవు; నీ కేమి కొఱంత? వృత్రవధ యే పాపంబు రూపింపుమా?'** 189

**ప్రతిపదార్థం:** దివిజ+అధి+ఈశ్వరు పాలికిన్= దేవేంద్రుడి వద్దకు; చని= వెళ్ళి; కృతార్థీభూత చేతస్కుఁడు+ఐ= ధన్యమైన మనస్సుకల వాడయి; వివిధ స్తోత్ర పరంపరా చతుర వాక్+విన్యాసతన్= అనేకములైన స్తుతులయొక్క వరుసయందలి నేర్పుతో కూడిన మాటల రచనతో; ప్రీతున్+చేసి= సంతోషపెట్టి; నీవు; వరిష్ఠంబు+అగు= శ్రేష్ఠమైన; నీదు కృత్యమున్= నీ పనిని; అనుష్ఠింపంగన్= ఆచరించటానికి; ఉత్సహింపవు= యత్నించవు; నీకున్; ఏమి; కొఱంత= లోటు; వృత్ర వధ= వృత్రుణ్ణి చంపటం; ఏ పాపంబు?= ఏమి పాపకార్యం?; రూపింపుమా= నిరూపించుము.

**తాత్పర్యం:** ఇంద్రుడి వద్దకు వెళ్లి, కృతార్థమైన మనస్సు కలవాడయి, వివిధ స్తుతులలోని చతుర వాక్కులతో సంతోషపెట్టి, 'నీవు శ్రేష్ఠమైన నీ పనిని ఆచరించటానికి ఉత్సాహపడవు. నీ కేమి లోటు? వృత్రవధ పాపకార్యం ఎట్లా అయిందో చెప్పు.

**క. శరనిధి ఫేనంబున నా। హరి వొంది జగద్విరోధి యగు వృత్రునిఁ దాఁ**
**బరిమార్ప, నీకు విజయము। దొరకొనియెం గాక, దీన దోసము గలదే?'** 190

**ప్రతిపదార్థం:** శరనిధి ఫేనంబునన్= సముద్రపు నురుగులో; ఆ హరి= ఆ విష్ణువు; పొంది= చేరి; జగత్+విరోధి+అగు= లోక కంటకుడైన; వృత్రునిన్; తాన్= తాను (విష్ణువు); పరిమార్పన్= చంపగా; నీకున్; విజయము= గెలుపు; దొరకొనియెన్+కాక= లభించింది కాని; దీనన్= దీనియందు, దోసము= దోషం - పాపం; కలదే?

**తాత్పర్యం:** సముద్రపు నురుగులో ఆ విష్ణువు చేరి లోక కంటకుడయిన వృత్రుడిని చంపగా నీకు విజయం లభించింది. ఇందులో నీ దోషం ఏమున్నది?'

**విశేషం:** వృత్రుడిని చంపినవాడు విష్ణువు కాని, నీవు కాదని ఇంద్రుడి నిర్దోషిత్వాన్ని సమర్థించిన తీరు బృహస్పతి మాటనేర్పును విశదీకరిస్తుంది. అతడు 'వాచస్పతి' కదా!

**వ. అని సముచితంబుగా సంబోధించిన గురుని సంభాషితంబుల నిర్దోషితుండయి నిజరూపంబు వహించి, సకల సుమనోమునిసహితంబుగా నతని సంభావించి, జంభారి 'కర్తవ్యం బెయ్యది?' యని యడిగిన, నాచార్యుం 'డితం డెఱింగినను విస్పష్టంబుగా నహుషు వృత్తాంతంబంతయు వివరించెదం గాక' యని తలంచి యిట్లనియె. 191**

**ప్రతిపదార్థం:** అని, సముచితంబుగాన్= తగినట్లుగా; సంబోధించిన= తెలియబరిచిన; గురుని= బృహస్పతియొక్క; సంభాషితంబులన్= మాటలచేత; నిర్దోషితుండు+అయి= పాపరహితుడై; నిజ రూపంబు= స్వస్వరూపం; వహించి= తాల్చి; సకల సుమనస్(ః)+ముని సహితంబుగాన్= ఎల్లదేవతలతోనూ; మునులతోనూ; అతనిని= ఆ బృహస్పతిని; సంభావించి= ఆదరించి; జంభ+అరి= జంభుడనే రాక్షసుడి శత్రువు - ఇంద్రుడు; కర్తవ్యంబు= చేయదగింది; ఎయ్యది= ఏది; అని; అడిగినన్; ఆచార్యుండు= గురుడు - బృహస్పతి; ఇతండు; ఎఱింగినను; విస్పష్టంబుగాన్= తేటతెల్లంగా; నహుషు వృత్తాంతంబు+ అంతయున్= నహుషుడి వృత్తాంతమంతా; వివరించెదన్+కాక= వివరించి చెపుతాను; అని; తలంచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని తగిన విధంగా తెలియజెప్పిన బృహస్పతి మాటల వలన పాపరహితుడై తన ఆకారం ధరించి, ఎల్ల దేవతలతో మునులతో కూడా అతడిని ఆదరించి, ఇంద్రుడు కర్తవ్యం చెప్పుమని అడుగగా, ఆచార్యుడు 'ఇతడికి తెలిసినా సుస్పష్టంగా నహుషుడి వృత్తాంతమంతా వివరిస్తా' నని యెంచి ఇట్లా అన్నాడు.

**క. 'నాఁ డట్లు నీవు నీ దగు। పోఁడిమి సెడి యడఁగుటయును, భువనంబుల కె**
**వ్వాఁడును రక్షకుఁ డయ్యెడు। వాఁడిమగఁడు లేమిఁ ద్రిదశవర్గము మునులున్. 192**

**ప్రతిపదార్థం:** నాఁడు= ఆరోజు; అట్లు= ఆ విధంగా; నీవు; నీది+అగు పోఁడిమి= నీ పరాక్రమం; చెడి= నశించి; అడఁగుటయును= క్రుంగగా; భువనంబులకున్= లోకాలకు; ఎవ్వాఁడును= ఎవడూ; రక్షకుఁడు+అయ్యెడు వాఁడిమగఁడు= రక్షకుడయ్యే గొప్పశూరుడు; లేమిన్= లేకపోవటంచేత; త్రిదశ వర్గమున్= దేవతల సమూహమూ; మునులున్= మునులూ.

**తాత్పర్యం:** అప్పుడు ఆ విధంగా నీవు నీ పరాక్రమం నశించి క్రుంగిపోతే, లోకాలకు ఎవడూ రక్షకుడైన గొప్ప శూరుడు లేకపోవడం చేత దేవతలూ, మునులూ.

**ఉ. ఒండొరుచేతఁ బీడవడ నోపక రక్షకుఁ డైనవాని నా**
**ఖండలతుల్యు నేమిగతిఁ గాంతుమొకో?' యనుచున్న చోట, 'ను**
**ద్దండబలైక రక్ష్యము శతక్రతు రాజ్యము, దాని నేల న**
**న్యుండు సమర్థుఁడే?' యనుచు నొల్లరు దివ్యులలోన నెవ్వరున్. 193**

**ప్రతిపదార్థం:** ఒండొరుచేతన్= ఒకరిచేత ఒకరు; పీడ+పడన్+ఓపక= బాధపడలేక; రక్షకుఁడు+ఐన వానిన్= కాపాడేవాడిని; ఆఖండలతుల్యున్= ఇంద్రుడితో సమానమైనవాడిని; ఏమి గతిన్= ఏ విధంగా; కాంతుము+ఒకో= పొందుతామో; అనుచున్+ఉన్న చోటన్; శతక్రతు రాజ్యము= ఇంద్రుడి రాజ్యం; ఉద్దండ బల+ఏక రక్ష్యము= మహాబలవంతుడిచేతనే రక్షించబడదగినది;

దానిన్; ఏలన్= పాలించటానికి; అన్యుండు= ఇతరుడు; సమర్థుఁడే= శక్తిమంతుడా; అనుచున్; దివ్యులలోన్= దేవతలలో; ఎవ్వరున్= ఎవరూ; ఒల్లరు= ఇష్టపడరు.

**తాత్పర్యం:** ఒకరిచేత ఒకరు బాధపడలేక ఇంద్రసమానుడైన రక్షకుడిని ఏ విధంగా పొందుతామో అంటూ ఉన్నచోట - 'ఇంద్రుడి రాజ్యం మహాబలవంతుడిచేతనే రక్షించబడదగినది. దానిని పాలించటానికి ఇతరుడు శక్తిమంతుడా?' అంటూ దేవతలలో ఎవ్వరూ ఇష్టపడలేదు.

**వ. అట్టి సమయయంబున మునిజనసహితంబుగ ననిమిషులు నహుషు కడకుం జని మనంబుల మనుజుం డను ననుమానంబు దక్కి యతని నింద్రపదవిఁ బరిపాలించుటకుం బ్రార్థించిన, నతండును దాను హీనబలుండననిశంకించినం, దమ తమ తేజంబుల యంశంబు లతని కొసంగి శక్తిమంతుం గావించి యభిషిక్తుం జేసిన. 194**

**ప్రతిపదార్థం:** అట్టి సమయంబునన్= అటువంటి సమయంలో; అనిమిషులు= దేవతలు; ముని జన సహితంబుగన్= మునులతో కూడుకొని; నహుషు కడకున్; చని; మనంబులన్= మనస్సులలో; మనుజుండు+అను+అనుమానంబు+తక్కి= మనుష్యుడు అనే సంకోచం విడిచి; అతనిన్; ఇంద్ర పదవిన్; పరిపాలించుటకున్; ప్రార్థించినన్= కోరగా; అతండును= నహుషుడునూ; తాను; హీన బలుండన్+అని= బలహీనుడిని అని; శంకించినన్= అనుమానించగా; తమ తమ తేజంబుల+ అంశంబులు= తమ తమ తేజస్సుల భాగాలు; అతనికిన్; ఒసంగి= ఇచ్చి; శక్తిమంతున్= శక్తికలవాడిని; కావించి= చేసి; అభిషిక్తున్+చేసినన్= అభిషేకించగా.

**తాత్పర్యం:** అటువంటి సమయంలో మునులతో కూడా దేవతలు నహుషుడి వద్దకు వెళ్ళి, తమ మనస్సులలో అతడు మనుష్యుడనే శంక విడిచి, అతడిని ఇంద్రపదవిని స్వీకరించ ప్రార్థించగా, అతడునూ తాను బలహీనుడనని అనుమానించగా, వారు తమ తమ తేజస్సుల భాగాలు అతడి కిచ్చి సమర్థుడిని చేసి అభిషేకించగా.

**క. మహనీయ భవ త్పదవీ । మహితుండై నహుషుఁ డేచి, మదమున ధర్మ**
**స్పృహ దక్కి, తన్ను నిప్పుడు । వహియింపఁగ సన్మునీంద్రవర్గముఁ బనిచెన్. 195**

**ప్రతిపదార్థం:** మహనీయ భవత్+పదవీ మహితుండు+ఐ= ఉన్నతమైన నీ పదవి చేత గొప్పవాడయి; నహుషుఁడు; ఏచి= విజృంభించి; మదమునన్= గర్వంతో; ధర్మ స్పృహ= ధర్మమునందు ఆసక్తి; తక్కి= విడిచి; ఇప్పుడు; తన్నున్; వహియింపఁగన్= మోయటానికి; సత్+ముని+ఇంద్ర+వర్గమున్= సన్మునిశ్రేష్ఠుల సమూహాన్ని - సప్తర్షులను; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** అత్యున్నతమైన నీ పదవిచేత గొప్పవాడై నహుషుడు విజృంభించి, గర్వంతో ధర్మంమీద ఆసక్తి విడిచి, ఇప్పుడు తనను మోయటానికి సప్తర్షులను నియోగించాడు.

**ఆ. ఇదియకాదు; మఱియు నెన్నియు దుర్విన । యములు గలవు; వాని కలసి నిన్ను**
**వెదక వచ్చితిమి; వివేకహీనుండగు । నతనిఁ జెఱుప నిప్పు డవసరంబు. 196**

**ప్రతిపదార్థం:** ఇది+అ= ఇదే; కాదు; మఱియున్= ఇంకా; ఎన్నియున్= ఎన్నో; దుస్(ః)+వినయములు= చెడు నడవడులు; కలవు; వానికిన్; అలసి= బడలి; నిన్నున్; వెదకన్; వచ్చితిమి; వివేకహీనుండు+అగు+అతనిన్= జ్ఞానశూన్యుడైన అతడిని; చెఱుపన్= నశింపచేయటానికి, భ్రష్టుడిని చేయటానికి; ఇప్పుడు; అవసరంబు= తగిన సమయం.

**తాత్పర్యం:** ఇది ఒక్కటే కాదు, ఇంకా ఎన్నో దుర్మార్గాలు ఉన్నాయి. అతడితో పడిపడి బడలిపోయి నిన్ను వెతుక్కుంటూ వచ్చాము. వివేకశూన్యుడైన అతడిని పదవీభ్రష్టుడిని చేయటానికి ఇది తగిన సమయం.

**వ. అది యెట్లంటేని వినుము. నాఁడు హరి పంపునం జేసిన యశ్వమేధంబున నీ వపగతకల్మషుండ వైనను, నహుషునకుఁ దేజోహాని లేమిం జేసి యతని నాక్రమింపరాదయ్యెఁ; నిప్పుడు మహామునుల నధఃకరించి యతండు నిస్తేజుండై యున్నవాఁడు. కావున నీ చేతం జెడు, నట్లగుటయుం దురగమేధ ఫలపరిపాకంబ; యింక నుత్సాహంబు సేయు'మనుచున్న సమయంబున యమ వరుణ కుబేరులు సోమసహితంబుగా నరుగుదెంచి పురందరుం గాంచిన, నతండు ప్రియంబంది, యప్పటి కార్యంబు తెఱంగు వారల కెఱింగించి, తగిన సంభాషణంబుల వారలఁ బ్రీతచేతస్కులం జేసి, దృష్టి విషయ దుస్సహుండైన నహుషు గెలుచు నుపాయంబు విచారించు నవసరంబున. 197**

**ప్రతిపదార్థం:** అది; ఎట్లు+అంటి(వి)+ఏనిన్= ఎట్లా అంటే; వినుము; నాఁడు= అప్పుడు; హరి పంపునన్+చేసిన= విష్ణుమూర్తి ఆజ్ఞచేత చేసిన; అశ్వమేధంబునన్; నీవు; అపగత కల్మషుండవు+ఐనను= పోయిన పాపం కలవాడవైనను - పాపరహితుడవైనా; నహుషునకున్; తేజస్(ః)+హాని= తేజోనష్టం; లేమిన్+చేసి= లేకపోవటం చేత; అతనిన్; ఆక్రమింపన్+రాదు+అయ్యెన్= జయించ శక్యం కాకపోయింది; ఇప్పుడు; మహామునులన్= మహర్షులను; అధఃకరించి= తక్కువ చేసి - అవమానించి; అతండు; నిస్తేజుండు+ఐ= తేజోహీనుడై; ఉన్నవాఁడు; కావునన్; నీ చేతన్= నీ చేతిలో; చెడున్= నశిస్తాడు; అట్లు+అగుటయున్= అట్లా జరగటం కూడా; తురగమేధ ఫల పరిపాకంబు+అ= అశ్వమేధయాగం యొక్క ఫలితమే; ఇంకన్; ఉత్సాహంబు+ చేయుము= ఉత్సహించుము; అనుచున్+ఉన్న సమయంబునన్= అంటూన్న సమయంలో; యమ వరుణ కుబేరులు= యముడూ, వరుణుడూ, కుబేరుడూ, సోమ సహితంబుగాన్= చంద్రుడితో కూడా; అరుగుదెంచి= వచ్చి; పురందరున్= ఇంద్రుడిని, కాంచినన్= చూడగా; అతండు; ప్రియంబు+అంది= సంతోషించి, అప్పటి కార్యంబు తెఱంగు= అప్పటి కర్తవ్య విధానం; వారలకున్; ఎఱింగించి= తెలిపి; తగిన సంభాషణంబులన్= తగిన మాటలతో; వారలన్; ప్రీతి చేతస్కులన్+చేసి= సంతోషించిన మనస్సులు కలవారినిగా చేసి - సంతోషింపజేసి; దృష్టి విషయ దుస్సహుండు+ఐన నహుషున్= దృష్టి విషయంలో సహింప రానివాడైన నహుషుని; గెలుచు+ఉపాయంబు= గెలిచే ఉపాయం; విచారించు+అవసరంబునన్= ఆలోచించే సమయంలో.

**తాత్పర్యం:** అది ఎట్లా అంటే వినుము. అప్పుడు విష్ణుమూర్తి ఆజ్ఞచేత చేసిన అశ్వమేధయాగం వలన నీవు పాపరహితుడవైనా, నహుషుడి తేజస్సు నశించకపోవటంచేత, అతడిని జయించటానికి శక్యం కాకపోయింది. ఇప్పుడు అతడు మహర్షులను అవమానించి తేజస్సును కోల్పోయాడు. కాబట్టి నీ చేతిలో నశిస్తాడు. అట్లా జరగటం కూడా అశ్వమేధయాగఫలమే. ఇంక ఉత్సాహం చూపు' అంటున్న సమయంలో యముడూ, వరుణుడూ, కుబేరుడూ చంద్రుడితో కూడా వచ్చి ఇంద్రుడిని చూడగా, అతడు సంతోషించి, అప్పుడు కర్తవ్యమైన విధం వారికి చెప్పి, తగిన మాటలతో వారిని సంతోషపెట్టి, దృష్టివిషయంలో సహింపరాని నహుషుడిని గెలిచే ఉపాయం ఆలోచించే సమయంలో.

**విశేషం:** దృష్టి విష దుస్సహుండైన - ఈ పాఠం మున్నంగి శర్మ పరిష్కృత భారత ప్రతి లోనిది. ఇదే సంస్కృత భారత ప్రతులలోని పాఠానికి అనుగుణంగా ఉన్నది. 'తేజోహరం, దృష్టి విషం సుఘోరం మా త్వం పశ్యే ర్నహుషమ్.' ఉద్యోగ. 16-29. వావిళ్లవారి ప్రతిలోనూ, ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రతిలోనూ 'దృష్టి విషయ దుస్సహుండైన' అనే పాఠం ఉన్నది. అది మూలానుగుణం కాకపోవటం చేత విడువబడింది.

**క. 'కష్టం డగు నా నహుషుఁడు । నష్టాత్మకుఁ డయ్యెఁ; దివిజనాయక! నీ యు**
**త్కృష్ట చరితమున సురలకుఁ । దుష్టిగ నిజరాజ్య సంగతుఁడ వగు' మనుచున్. 198**

**ప్రతిపదార్థం:** దివిజ నాయక!= దేవేంద్రా!; కష్టుండు+అగు+ఆ నహుషుఁడు= పాపాత్ముడైన ఆ నహుషుడు; నష్ట+ఆత్మకుఁడు+ అయ్యెన్= చెడిపోయినవాడు అయ్యాడు; నీ+ఉత్కృష్ట చరితమునన్= గొప్పదైన నీ నడవడి చేత; సురలకున్= దేవతలకు; తుష్టిగన్= సంతోషం కలిగేటట్లు; నిజ రాజ్య సంగతుఁడవు= నీ రాజ్యంతో కూడినవాడవు; అగుము; అనుచున్.

**తాత్పర్యం:** 'పాపాత్ముడైన ఆ నహుషుడు నష్టపోయాడు. దేవేంద్రా! గొప్పదైన నీ చరితంచేత దేవతలకు సంతోషం కలిగేటట్లు నీవు నీ రాజ్యం స్వీకరించవచ్చును' అంటూ.

**క. మునివరుఁ డైన యగస్త్యుఁడు । ననుదెంచిన, శతమఖుండు సమ్మతి నుచితా**
**సన మిడి, యర్ఘ్యముఁ బాద్యము । నొనరిచి, యిట్లనియె సవినయోక్తి నతనితోన్. 199**

**ప్రతిపదార్థం:** మునివరుఁడు+ఐన+అగస్త్యుఁడు= మునిశ్రేష్ఠుడైన అగస్త్యుడు; చనుదెంచినన్= రాగా; శతమఖుండు= నూరు యజ్ఞాలు కలవాడు - ఇంద్రుడు; సమ్మతిన్= ఇష్టంతో; ఉచిత+ఆసనము+ఇడి= తగిన పీఠం ఇచ్చి; అర్ఘ్యమున్= పూజాద్రవ్యాన్నీ; పాద్యమున్= కాళ్లు కడుగుకొనడానికి నీరూ; ఒనరిచి= చేసి(ఇచ్చి); అతనితోన్; సవినయ+ఉక్తిన్= అడకువతో కూడిన మాటతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** మునిశ్రేష్ఠుడైన అగస్త్యుడు రాగా, ఇంద్రుడు అతడికి ఉచితమైన ఆసనమూ, అర్ఘ్యపాద్యాదులూ సగౌరవంగా ఇచ్చి, వినయపూర్వకంగా ఇట్లా అన్నాడు.

**ఆ. 'అధిక విభవ మెసఁగ నసమాన శక్తి స । నాథుఁ డగుచునున్న నహుషుఁ డిప్పు**
**డేమికతన భాగ్యహీనుఁడై యుజ్జ్వల । శ్రీ దొఱంగె మునివరేణ్య! చెపుమ.' 200**

**ప్రతిపదార్థం:** మునివరేణ్య!= మునిశ్రేష్ఠుడా!; అధిక విభవము+ఎసఁగన్= మిక్కిలి వైభవం అతిశయించగా, అసమాన శక్తి సనాథుఁడు= సాటిలేని శక్తితో కూడినవాడు; అగుచున్+ఉన్న= అవుతూ ఉన్న, నహుషుఁడు, ఇప్పుడు; ఏమి కతనన్= ఏ కారణంచేత; భాగ్యహీనుఁడు+ఐ= నిర్భాగ్యుడై; ఉజ్జ్వలశ్రీ= ప్రకాశించే సంపద; తొఱంగెన్= కోలుపోయాడు; చెపుమ= చెప్పుము.

**తాత్పర్యం:** 'మునివరా! అగస్త్యా! ఎంతో వైభవం అతిశయించగా నిరుపమానమైన సామర్థ్యంతో కూడుకొని ఉండే నహుషుడు ఇప్పుడు ఏ కారణంచేత నిర్భాగ్యుడై ప్రకాశించే సంపదను కోలుపోయాడో చెప్పుము.'

అగస్త్యుఁ డింద్రునకు నహుషుభ్రష్టతఁ దెలుపుట (సం. 5-17-7)

**వ. అనిన విని యమ్మునీంద్రుం డిట్లనియె; 'నన్నహుషుని మోచి వేసరుచున్న మును లతనికడ గోష్ఠీ వినోదంబుల నుండి 'బ్రాహ్మణంబు లయిన మంత్రంబులు గోసంప్రోక్షణంబునందుఁ జెప్పంబడియుండు; నవి నీకుఁ బ్రమాణ భూతంబు లగునే?' యని యడిగినం, బాపనిశ్చయుండై యతం' దమ్మంత్రంబులు ప్రమాణంబులు గా'వనిన నే నమ్మాట నిషేధించి, 'పూర్వాచార్యులచేత నభినందితంబులగు మంత్రంబులు నిందించుట యజ్ఞానం'బని**

**వివాదంబు సేసితి; నతండు కోపించి మదీయ మస్తకంబు దన్నె; నతనిం గనుంగొని, పుణ్యహీనుండును, దేజోహాని దీనుండును నగుట యుపలక్షించి, 'నీవు పూజనీయులయిన మహామునుల నిన్ను వహింపం బనిచితి; వారలు గొనియాడు మంత్రంబులు గర్హించి; తదియునుంగాక నన్ను నవమానించితి; గావున నింద్రపద భ్రష్టుండవై బహుసంవత్సరంబులు భూలోకంబున నురగరూపంబున నుండు' మని శాపం బిచ్చి, పదంపడి యనుగ్రహించి, 'భవదీయవంశజాతుండయి యజాతశత్రుం డను పెంపుగలిగి యుధిష్ఠిరనామధేయుండైన యొక్క సత్పురుషుని సందర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబు వడయువాఁడ' వనినఁ, దత్‌క్షణంబ.** **201**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ+ముని+ఇంద్రుండు= ఆ ముని శ్రేష్ఠుడైన అగస్త్యుడు; ఇట్లు+అనియెన్; ఆ+నహుషునిన్; మోచి= మోసి; వేసరుచున్+ఉన్న= బాధపడుతున్న; అతని కడన్= అతడి వద్ద; గోష్ఠీ వినోదంబులన్+ఉండి= ప్రసంగపు వేడుకలతో ఉండి; బ్రాహ్మణంబులు+అయిన మంత్రంబులు= బ్రాహ్మణములందలి మంత్రాలు (వేదమంత్రాలకు వ్యాఖ్యాన రూపమయినవి బ్రాహ్మణములు); గోసంప్రోక్షణంబునందున్= మంత్రజలంతో ఆవులను పవిత్రీకరించే సందర్భంలో; చెప్పంబడి+ ఉండున్; అవి; నీకున్; ప్రమాణ భూతంబులు+అగునే?= సమ్మదగినవి అగునా?; అని; అడిగినన్; పాప నిశ్చయుండు+ఐ= దుర్బుద్ధిఅయి; ఆ+మంత్రంబులు; ప్రమాణంబులు+కావు; అనినన్; నేను; ఆ+మాటన్; నిషేధించి= నిరాకరించి; పూర్వ+ ఆచార్యులచేతన్= ప్రాచీన గురువులచేత; అభినందితంబులు+అగు మంత్రంబులు= పొగడబడే మంత్రాలను; నిందించుట; అజ్ఞానంబు= తెలివి లేమి; అని; వివాదంబు+చేసితిన్= వాదించాను; అతండు; కోపించి; మదీయ మస్తకంబు= నా తల; తన్నెన్; అతనిన్; కనుంగొని= చూచి; పుణ్య హీనుండును= పుణ్యం పోయినవాడూ; తేజస్(ః)+హాని దీనుండును= తేజస్సు నశించటంచేత దుఃఖితుడూ; అగుట; ఉపలక్షించి= చూచి; నీవు; పూజనీయులు+అయిన= పూజ్యులైన; మహామునులన్= మహర్షులను; నిన్నున్; వహింపన్+పనిచితి(వి)= మోయటానికి నియోగించావు; వారలు; కొనియాడు= అభినందించే; మంత్రంబులు; గర్హించితి= నిందించావు; అదియునున్+కాక; నన్నున్, అవమానించితి(వి); కావునన్; ఇంద్రపద భ్రష్టుండవు+ఐ= ఇంద్ర స్థానంనుండి జారినవాడవయి; బహు సంవత్సరంబులు= పెక్కేండ్లు; భూ లోకంబునన్; ఉరగ రూపంబునన్= పాము రూపుతో; ఉండుము; అని; శాపంబు+ఇచ్చి; పదంపడి= తరువాత; అనుగ్రహించి= కరుణించి; భవదీయ వంశ జాతుండు+అయి= నీ వంశంలో పుట్టినవాడయి; అజాత శత్రుండు+అను పెంపు+కలిగి= అజాతశత్రుడు (పుట్టని శత్రువులు గలవాడు - శత్రువులులేనివాడు) అనే గొప్పతనం కలిగి; యుధిష్ఠిర నామధేయుండు+ఐ= యుధిష్ఠిరుడు (యుద్ధంలో స్థిరంగా ఉండేవాడు) అనే పేరుగలవాడయిన; ఒక్క; సత్పురుషుని సందర్శనంబునన్= మంచివాడి దర్శనం చేత; దురితంబులన్= పాపాలను; పాసి= విడిచి, పుణ్యలోకంబు+పడయువాఁడవు= పుణ్యలోకం పొందుతావు; అనినన్; తద్+క్షణంబు+అ= ఆ క్షణమే.

**తాత్పర్యం:** అనగా విని ఆ మునిశ్రేష్ఠుడైన అగస్త్యుడు ఇట్లా అన్నాడు. ఆ నహుషుడిని మోసి బాధపడుతున్న మునులు అతడి దగ్గర సల్లాపపు వేడుకలతో ఉండి 'బ్రాహ్మణములయిన మంత్రాలు గోసంప్రోక్షణంలో చెప్పబడి ఉన్నాయి. వాటిని నీవు నమ్ముతావా?' అని అడుగగా, దుర్బుద్ధిఅయిన అతడు 'ఆ మంత్రాలు నాకు ప్రమాణాలు కావు' అన్నాడు. నేను ఆ మాట నిరాకరించి 'పూర్వగురువులు అభినందించే మంత్రాలను నిందించడం అజ్ఞానం' అని వాదించాను. అతడు కోపించి నా తలను తన్నాడు. అతడిని చూచి, పుణ్యం పోయి, తేజస్సు నశించి దుఃఖితుడై ఉండటం గమనించి 'నీవు పూజ్యులైన మహర్షుల్ని నిన్ను మోయటానికి నియోగించావు, వారు కొనియాడే మంత్రాలను నిందించావు. అదీకాక నన్ను అవమానించావు. కాబట్టి ఇంద్రపదవినుండి భ్రష్టుడవై పెక్కేళ్ళు భూలోకంలో సర్పరూపంతో ఉండు.' అని శాపమిచ్చి, తరవాత అనుగ్రహించి 'నీ వంశంలో పుట్టి అజాతశత్రుడనే ప్రశస్తి కలిగి యుధిష్ఠిరుడనే పేరుగల ఒక సజ్జనుడి సందర్శనం చేత పాపాలు పోయి పుణ్యలోకం పొందుతావు' అనగా, ఆ క్షణమే.

**క. స్వర్గ పరిభ్రష్టుండై । దుర్గతికిం బోయె నతఁడు; దుష్టాత్ములకున్**
**దౌర్గత్యము, సుజనులకు న । నర్గళ సద్గతియు నగుట యరుదే యెందున్?' 202**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ నహుషుడు; స్వర్గ పరిభ్రష్టుండు+ఐ= స్వర్గలోకం నుండి జారినవాడయి; దుర్గతికిన్= దుస్ స్థితికి; పోయెన్; ఎందున్= ఎక్కడైనా; దుష్ట+ఆత్ములకున్= దుర్మార్గులకు; దౌర్గత్యమున్= దుస్స్థితీ; సుజనులకున్= సజ్జనులకు; అనర్గళ సత్+గతియున్= అడ్డులేని సద్గతీ; అగుట; అరుదే?= ఆశ్చర్యమా?

**తాత్పర్యం:** ఆ నహుషుడు స్వర్గలోకం నుండి భ్రష్టుడై దుర్గతి చెందాడు. ఎక్కడైనా దుర్మార్గులకు దుర్గతీ, సన్మార్గులకు సద్గతీ కలగటం ఆశ్చర్యమా?'

**విశేషం:** ఇందులో విశేషం సామాన్యంచేత సమర్థింపబడుతోంది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**మ. అనినన్ దేవతలుం దపోధనులు నత్యానందముం బొంది; రా**
**మునిఁ బూజించె నమర్త్యనాథుఁడు మనోమోదంబు సంధిల్ల, న**
**య్యనురాగంబు చరాచరంబులకు హృద్యం బయ్యెఁ; సర్వాప్సరో**
**జనముం గౌశికుఁ గానవచ్చె సుభగైశ్వర్యంబు శోభిల్లఁగన్. 203**

**ప్రతిపదార్థం:** అనినన్; దేవతలున్; తపోధనులు= తపస్సు ధనంగా కలవారు- మునులూ; అతి+ఆనందమున్+పొందిరి= మిక్కిలి ఆనందం పొందారు; అమర్త్య నాథుఁడు= సురరాజు- ఇంద్రుడు; మనస్(ః)+మోదంబు= మనస్సంతోషం; సంధిల్లన్= కలుగగా; ఆ మునిన్= ఆ మునిని- అగస్త్యుడిని; పూజించెన్; ఆ+అనురాగంబు= వారి ప్రేమభావం; చర+అచరంబులకున్= అజడాలకూ, జడములకూ; హృద్యంబు+అయ్యెన్= మదికింపు గొల్పింది. సర్వ+అప్సరస్(ః)+జనమున్= ఎల్ల అచ్చరల సమూహమూ; సుభగ+ఐశ్వర్యంబు= ఉదాత్తమైన ఐశ్వర్యం; శోభిల్లఁగన్= ప్రకాశించగా; కౌశికున్= ఇంద్రుడిని; కానన్+వచ్చెన్= చూడవచ్చింది.

**తాత్పర్యం:** అనగా, దేవతలూ మునులూ మిక్కిలి సంతోషించారు. ఇంద్రుడు ఆనందంతో ఆ అగస్త్యుణ్ణి పూజించాడు. వారిద్దరి ప్రేమ భావం స్వర్గంలోని చరాచరాలన్నింటికి సంతోషదాయకమయింది. ఉదాత్తమైన ఐశ్వర్యం ఒప్పగా అచ్చరలందరూ ఇంద్రుడిని చూడవచ్చారు.

**క. తదనంతరంబ. 204**

**తాత్పర్యం:** ఆ వెంటనే.

**ఉ. పావకుఁ డాదిగా దిగధిపాలురుఁ, గిన్నర సిద్ధ సాధ్యులున్,**
**దేవగురుండుఁ దోన చనుదేరఁగ, వైభవ ముల్లసిల్ల, నై**
**రావణ దంతి నెక్కి యమరావతికిం జని, యింద్రుఁ డా శచీ**
**దేవియుఁ దాను మోదమునఁ దేలి రభీష్ట వినోద లీలలన్. 205**

**ప్రతిపదార్థం:** పావకుఁడు+ఆదిగాన్= అగ్ని మొదలుగా; దిక్+అధిపాలురున్= దిక్పాలకులూ; కిన్నర సిద్ధ సాధ్యులున్= కిన్నరులూ, సిద్ధులూ, సాధ్యులూ; దేవగురుండున్= బృహస్పతీ; తోన్+అ= కూడానే; చనుదేరఁగన్= రాగా; వైభవము+ఉల్లసిల్లన్= వైభవం ప్రకాశించగా; ఐరావణ, దంతిన్+ఎక్కి= ఐరావతమనే ఏనుగు నెక్కి; అమరావతికిన్+చని; ఇంద్రుఁడు; ఆ శచీ

దేవియున్+తానున్= ఆ శచీదేవి; తనూ; అభీష్ట వినోద లీలలన్= కోరిన వేడుకల విలాసాలతో; మోదమునన్+తేలిరి= సంతోషంతో సుఖించారు.

**తాత్పర్యం:** అగ్నిదేవుడు మొదలుగాగల దిక్పాలకులూ, కిన్నరులూ, సిద్ధులూ, సాధ్యులూ బృహస్పతీ కూడా రాగా, వైభవం వెల్లివిరియగా, ఐరావతమనే ఏనుగు నెక్కి, అమరావతికి వెళ్ళి, ఇంద్రుడు ఆ శచీదేవితో ఇష్ట వినోద క్రీడలతో సంతోషంలో తేలియాడాడు.

**విశేషం:** అష్టదిక్పాలకులలో మొదటివాడు, తూర్పుదిక్కునకు అధిపతి ఇంద్రుడు. అతడిని చూడవచ్చినవారిలో ఇప్పుడు ఆగ్నేయదిక్కుకు అధిపతి అగ్ని. అతడు మొదలుగా మిగిలినవారు దక్షిణ దిగధిపతి- యముడు; నైఋతికి- నిర్ర్తి; పశ్చిమానికి- వరుణుడు, వాయవ్యానికి- వాయువు, ఉత్తరానికి- కుబేరుడు; ఈశాన్యానికి- ఈశ్వరుడు అధిపతులు. (సంపా.)

**వ. ఇవ్విధంబున మహానుభావుం డగు నమ్మహేంద్రుండు. 206**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; మహానుభావుండు+అగు= మహనీయుడైన; ఆ+మహేంద్రుండు= ఆ దేవేంద్రుడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా మహానుభావుడైన ఆ దేవేంద్రుడు.

**క. ఆజ్ఞాభంగం బయినం । బ్రాజ్ఞేతరునట్లు దుఃఖపడి యుండఁడె? తా**
**నజ్ఞాతవాసమును గా । లజ్ఞతఁ జలుపండె? యన్యులకు వగపేలా? 207**

**ప్రతిపదార్థం:** ఆజ్ఞా భంగంబు+అయినన్= తన అధికారానికి భంగం కలుగగా; ప్రాజ్ఞ+ఇతరు+అట్లు= అప్రాజ్ఞుడివలె, అపండితుడివలె; దుఃఖము+పడి= దుఃఖించి; ఉండఁడె?= ఉండడా? తాను; అజ్ఞాత వాసమును= ఇతరులకు తెలియకుండా ఉండటం; కాలజ్ఞతన్= సమయజ్ఞతతో; చలుపండె?= చేయడా?; అన్యులకున్= ఇతరులకు; వగపు= దుఃఖం; ఏలా?= ఎందుకు?

**తాత్పర్యం:** తన అధికారానికి భంగం వాటిల్లినప్పుడు పామరుడివలె దేవేంద్రుడివంటివాడు దుఃఖం అనుభవిస్తూ ఉండలేదా? తాను కాలప్రభావాన్ని గుర్తించి అజ్ఞాతవాసం చేయడా? ఇతరులకు దుఃఖ మెందుకు?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. ఇంద్రుడే ఆ విధంగా ప్రవర్తించినప్పుడు ఇతరుల సంగతి చెప్పాలా? అని కైముత్యంచేత అర్థసంసిద్ధి కలుగుతున్నది కాబట్టి అలంకారం కావ్యార్థాపత్తి.

**క. కావున మీ పడిన యర । ణ్యావాస క్లేశమునకు, నజ్ఞాత విధిన్**
**సేవకుల రైన దానికి । నోవకుఁడీ మీరు లఘుమనోవృత్తులరై.' 208**

**ప్రతిపదార్థం:** కావునన్; మీరు; లఘు మనస్(ః)+వృత్తులరు+ఐ= అల్పబుద్ధి కలవారయి; మీ పడిన అరణ్య+ఆవాస క్లేశమునకున్= మీరు పడ్డ అరణ్యావాస కష్టానికీ; అజ్ఞాత విధిన్= ఇతరులచేత ఎరుగబడకుండా; సేవకులరు+ఐన దానికిన్= సేవకులయినందుకూ; నోవకుఁడీ= బాధపడకండి.

**తాత్పర్యం:** కాబట్టి మీరు అరణ్యావాస దుఃఖం అనుభవించినందుకూ, ఇతరులకు తెలియకుండా సేవకత్వం చేసినందుకూ మీరు అల్పబుద్ధితో నొచ్చుకొనకండి.'

**వ. అని యిట్లు సెప్పి శల్యుండు సభాసదులం గలయం గనుంగొని. 209**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; చెప్పి; శల్యుండు; సభాసదులన్= సభ్యులను; కలయన్+కనుంగొని= బాగా చూచి.

**తాత్పర్యం:** అని ఈ విధంగా చెప్పి శల్యుడు సభలోఉన్న వారి నందరినీ బాగా చూచి.

**ఉ. కౌరవనాథుఁ డా నహుషుకైవడి నాశముఁ బొందు; వాసవ**
**శ్రీ రమణీయుఁడై జయము సేకొని ధర్మజుఁ డంబురాశి వే**
**లా రశనా సముజ్జ్వల విలాస మనోహర మేదినీ వధూ**
**సార సమగ్ర భోగముల సన్నుతి కెక్కెడుఁ దానుఁ దమ్ములున్. 210**

**ప్రతిపదార్థం:** కౌరవ నాథుఁడు= కురుపతి-దుర్యోధనుడు; ఆ నహుషు కైవడిన్= ఆ నహుషుడివలె; నాశమున్+పొందున్= నశిస్తాడు; ధర్మజుఁడు= ధర్మరాజు; వాసవ శ్రీ రమణీయుఁడు+ఐ= ఇంద్ర సంపదవంటి సంపదతో మనోహరుడయి; జయము+చేకొని= గెలుపొంది; తానున్+తమ్ములున్= తాను తమ్ములతో; అంబురాశి= సముద్రముయొక్క; వేలా= తీరం అనే; రశనా= మొలనూలుతో; సముజ్జ్వల= ప్రకాశించే; విలాస= లీలచేత; మనోహర= అందమైన; మేదినీ వధూ= భూమి అనెడు స్త్రీ యొక్క; సార= సారవంతములూ; సమగ్ర= సంపూర్ణములూ అయిన; భోగములన్= సౌఖ్యాలతో; సన్నుతికిన్+ ఎక్కెడున్= పొగడ్త కెక్కుతాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఆ నహుషుడివలె నశిస్తాడు. ధర్మరాజు ఇంద్రవైభవంతో విజయం సాధించి, తమ్ములతో సముద్ర తీరమనే మొలనూలి సముజ్జ్వల విలాసంచేత అందమైన భూమి అనే స్త్రీ యొక్క సారవంతాలైన సర్వభోగాలూ పొంది పొగడ్త కెక్కుతాడు.

**విశేషం:** అలం: ఉపమ. (కౌరవనాథుఁడా... నాశముఁబొందు); వేలా రశనా, మేదినీ వధూ అనే చోట్ల ఉపమేయోపమానాలకు అభేదం చెప్పబడింది కాబట్టి అలంకారం రూపకం.

**వ. అని పలికి వెండియు నతండు పాండవాగ్రజున కిట్లనియె. 211**

**ప్రతిపదార్థం:** అని; పలికి; వెండియున్= ఇంకా; అతండు= శల్యుడు; పాండవ+అగ్రజునకున్= ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికి శల్యుడు ధర్మరాజుతో ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'సౌఖ్యంబులు వొందు, జగ । త్ప్రఖ్యాతులుఁ జెందుఁ, దగఁ బురందర విజయో**
**పాఖ్యానము విన్నను, ద । ద్వ్యాఖ్యానము సేసినన్ జనావలి కనఘా! 212**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! ధర్మరాజా!; తగన్= ఒప్పుగా; పురందర+విజయ+ఉపాఖ్యానము= ఇంద్ర విజయ వృత్తాంతం; విన్నను= విన్నా; తద్+వ్యాఖ్యానము+చేసినన్= దానిని వ్యాఖ్యానించినా; జన+ఆవలికిన్= జనసముదాయానికి; సౌఖ్యంబులు+పొందున్= సుఖాలు కలుగుతాయి.; జగత్+ప్రఖ్యాతులున్= ప్రపంచకీర్తులూ; చెందున్= లభిస్తాయి.

**తాత్పర్యం:** 'అనఘా! ధర్మరాజా! సముచితంగా ఇంద్రవిజయకథ విన్నా, దానిని వ్యాఖ్యానించినా జనులకు సౌఖ్యాలు కలుగుతాయి. ప్రపంచ వ్యాప్తంగా కీర్తులు లభిస్తాయి.

**క. మోహరము నడచుచుండఁగ । నీ హరి విజయంబు విను నరేంద్రుఁడు రిపు సం**
**దోహంబు గెల్చుటకు సం । దేహం బించుకయు లేదు ధీరవిచారా!' 213**

**ప్రతిపదార్థం:** ధీర విచారా?= ధైర్యవంతమైన ఆలోచన కలవాడా! ధర్మరాజా!; మోహరము= యుద్ధం; నడుచుచున్+ ఉండఁగన్= జరుగుతుండగా; ఈ హరి విజయంబున్= ఈ ఇంద్ర విజయ వృత్తాంతాన్ని; విను నరేంద్రుఁడు= వినే రాజు; రిపు సందోహంబున్= శత్రువుల సమూహాన్ని; గెల్చుటకున్= గెలవటానికి; సందేహంబు= అనుమానం; ఇంచుకయున్+లేదు= కొంచెం కూడా లేదు.

**తాత్పర్యం:** ధర్మరాజా! యుద్ధం జరుగుతూ ఉండగా ఇంద్రవిజయమనే ఈ కథను విన్నరాజు శత్రుసమూహాన్ని గెలుస్తాడు. ఇందులో సందేహం ఏమాత్రమూ లేదు.'

**విశేషం:** ఇంద్రవిజయం విన్న ధర్మరాజు యుద్ధంలో శత్రువులను జయించటం తథ్యమని ధ్వని. ప్రాచీనకాలంలో ఇటువంటి విజయగాథలను యుద్ధశిబిరాల్లో వినిపించేసంప్రదాయం ఉన్నట్లు ఈ ఫలశ్రుతి వలన వెల్లడౌతున్నది. (సంపా.)

**వ. అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి 'మహానుభావా! భవదీయ భాషణ శ్రవణంబునఁ జిత్తంబు కలంక దేఱె' నని సంభావించి యతనికి సముచితంబులగు మజ్జన భోజనంబు లొనరించి, యనంతరంబ యతండు పయనంబునకు నుద్యోగించిన. 214**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ధర్మనందనుండు= ధర్మరాజు; మద్రపతిన్= మద్రదేశరాజును-శల్యుడిని; ప్రస్తుతించి= బాగా పొగడి; మహానుభావా!= మహాత్మా!; భవదీయ భాషణ శ్రవణంబునన్= మీ మాటల వినికి చేత; చిత్తంబు= మనస్సు; కలంకదేఱెన్= ప్రసన్నత నొందింది; అని; సంభావించి= ఆదరించి; అతనికిన్; సముచితంబులు+అగు= మిక్కిలి తగినవైన; మజ్జన భోజనంబులు= స్నానమూ, భోజనమూ; ఒనరించి= చేసి; అనంతరంబు+అ= వెంటనే; అతండు= శల్యుడు; పయనంబునకున్= ప్రయాణానికి; ఉద్యోగించినన్= పూనుకొనగా.

**తాత్పర్యం:** అనగా విని ధర్మరాజు శల్యుడిని సన్నుతించి 'మహాత్మా! మీ మాటలు వినటం చేత నా మనస్సు తేరుకొన్నది.' అని మన్నించి అతడికి తగిన విధంగా స్నాన భోజనాలు ఏర్పాటుచేసి, వెంటనే అతడు ప్రయాణానికి పూనుకోగా.

**విశేషం:** సత్కథాశ్రవణం సంకటహరణం అని నీతి.(సంపా.)

**ఆ. అతని ననుప నేఁగి యధిక సంప్రీతి నే । తెంచునప్పు డయ్యుధిష్ఠిరుండు**
**'రణములోన మీరు రాధేయుఁ బలుకుట । మఱవకుండవలయు మమ్ముఁ దలఁచి.' 215**

**ప్రతిపదార్థం:** అతనిన్= శల్యుడిని; అనుపన్+ఏఁగి= సాగనంపటానికి వెళ్ళి; అధిక సంప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; ఏతెంచు+అప్పుడు= వచ్చేటప్పుడు; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; రణములోనన్= యుద్ధంలో; మీరు; మమ్మున్+

తలఁచి= మమ్మల్ని దృష్టిలో పెట్టుకుని; రాధేయున్+పలుకుట= కర్ణుడిని నిరుత్సాహపరుస్తూ మాటాడటం; మఱవక+ ఉండవలయున్= మరచిపోగూడదు.

**తాత్పర్యం:** శల్యుడిని మిక్కిలి సంతోషంతో సాగనంపటానికి వెళ్ళి వచ్చేటప్పుడు ఆ ధర్మరాజు 'యుద్ధంలో మీరు మమ్మల్ని దృష్టిలో పెట్టుకొని కర్ణుడిని నిరుత్సాహపరుస్తూ మాట్లాడటం మరచిపోగూడదు' అన్నాడు.

**క. అనుటయు మద్రేశ్వరుఁ డా । తని నూఱడఁ బలికి గాఢతరముగ నాలిం**
**గన మొనరించి చనియె హ । స్తినాపురికి బలముతో నతిత్వరితగతిన్. 216**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనినంతనే; మద్ర+ఈశ్వరుఁడు= మద్రదేశాధిపతి శల్యుడు; ఆతనిన్; ఊఱడన్+పలికి= ఓదార్పుగా పలికి; గాఢతరముగన్= మిక్కిలి గట్టిగా; ఆలింగనము+ఒనరించి= కౌగిలించుకొని; అతి త్వరిత గతిన్= మిక్కిలి శీఘ్రగమనంతో; బలముతోన్= సైన్యంతో; హస్తినాపురికిన్; చనియెన్.

**తాత్పర్యం:** అని ధర్మరాజు అనగానే శల్యుడు అతడికి ఊరట కలిగేటట్లు మాటాడి గట్టిగా కౌగిలించుకొని, అతి శీఘ్ర గమనంతో హస్తినాపురానికి సైన్యంతో వెళ్ళిపోయాడు.

**విశేషం:** ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క ప్రత్యేకమైన అలవాటు ఉన్నట్లు చిత్రించటం తిక్కన నాటకీయరచనా శిల్పంలో భాగం. శల్యుడు మైత్రితో ఎదుటివారిని కౌగిలించుకొనటం అతడి అలవాటు. మొదట రాగానే ధర్మజుడిని కౌగిలించుకొన్నాడు (104వ పద్యం). పోతూ ఇప్పుడు గట్టిగా కౌగిలించుకొన్నాడు. ఆ గాఢమైన కౌగిలింత ధర్మరాజుకు తప్పక అనుకూలంగా వ్యవహరిస్తానని వ్యక్తం చేసిన ఆంగికాభినయం. మాటలకంటె చేతలే ఒక్కొక్కసారి ఎంతో మాట్లాడతాయి.(సంపా.)

**వ. అట్టి యవసరంబున. 217**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

### సాత్యక్యాదులు సేనాసమేతంబుగఁ బాండవులం జేరవచ్చుట (సం. 5-19-1)

**మ. సకలారాతి భయంకరుం డగుచు నుత్సాహంబు వాటించి, నే**
**లకు వ్రేఁ గయ్యెడుభంగి వచ్చె రణలీలాకౌతుకం బొప్పఁ దా**
**నొక యక్షౌహిణి తోడఁ, బాండవబలం బుల్లాసముం బొంద సా**
**త్యకి బాహాబలగర్వ నిర్వహణ విద్యాప్రౌఢి సంరూఢుఁడై. 218**

**ప్రతిపదార్థం:** సాత్యకి; సకల+అరాతి భయంకరుండు+అగుచున్= ఎల్లశత్రువులకు వెరపు కలిగించేవాడవుతూ; ఉత్సాహంబు+ పాటించి= అభిలాష పూని; బాహా బల గర్వ నిర్వహణ విద్యా ప్రౌఢి సంరూఢుఁడు+ఐ= భుజ పరాక్రమ గర్వాన్ని నిర్వహించే విద్యయందలి నేర్పుచేత మిక్కిలి ప్రసిద్ధుడై; రణ లీలా కౌతుకంబు+ఒప్పన్= యుద్ధక్రీడయందలి వేడుక ఒప్పగా; పాండవ బలంబు= పాండవుల సేన; ఉల్లాసమున్+పొందన్= సంతోషపడగా; తాను; ఒక+అక్షౌహిణి తోడన్= ఒక అక్షౌహిణీ సేనతో; నేలకున్= భూమికి; వ్రేఁగు= భారము; అయ్యెడు భంగిన్= అయ్యే విధంగా; వచ్చెన్.

**తాత్పర్యం:** సాత్యకి సర్వశత్రు భీకరుడవుతూ, ఉత్సాహంతో, యుద్ధక్రీడయందలి వేడుక ఒప్పగా, పాండవసేన సంతోషించగా, భుజ పరాక్రమ గర్వాన్ని చూపే విద్యయందలి నేర్పుచేత ప్రసిద్ధుడై, ఒక అక్షౌహిణీ సేనను తీసికొని, భూమికి భారం కలిగే విధంగా వచ్చాడు.

**విశేషం:** అక్షౌహిణి - 21870 రథాలు, అన్ని ఏనుగులు, 65610 గుర్రాలు, 109350 కాల్బలం కలసేన.

**వ. అంతం జేదిపతి యగు ధృష్టకేతుండును, జరాసంధనందనుండగు సహదేవుండును జెఱొక్క యక్షౌహిణి తోడం జనుదెంచిరి. సహోదరు లేవు రగు కేకయపతులు నేకాక్షౌహిణీ సమేతులై యేఁగుదెంచిరి; తదనంతరంబ. 219**

**ప్రతిపదార్థం:** అంతన్; చేది పతి+అగు ధృష్టకేతుండును= చేది దేశరాజగు ధృష్టకేతుడూ; జరాసంధ నందనుండు+అగు సహదేవుండును= జరాసంధుడి కొడుకైన సహదేవుడూ; చెఱి+ఒక్క+అక్షౌహిణి తోడన్= ఒక్కొక్క అక్షౌహిణీ సేనతో; చనుదెంచిరి= వచ్చారు; సహోదరులు+ఏవురు+అగు కేకయపతులున్= సోదరు లయిన అయిదుగురు కేకయ పతులూ; ఏక+ అక్షౌహిణీ సమేతులు+ఐ= ఒక్క అక్షౌహిణీ బలంతో; ఏఁగుదెంచిరి= వచ్చారు; తద్+అనంతరంబు+అ= ఆ వెంటనే.

**తాత్పర్యం:** అంతట చేది దేశపురాజైన ధృష్టకేతుడూ, జరాసంధుడి కుమారుడైన సహదేవుడూ ఒక్కొక్క అక్షౌహిణీ సేనతో వచ్చారు. సోదరులైన అయిదుగురు కేకయపతులూ ఒక అక్షౌహిణీ బలంతో వచ్చారు. ఆ వెంటనే.

**క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు । దడములఁ, గరిఘటల; భట రథవ్రాతములం**
**బుడమి చలింపఁగ ద్రుపదుఁడు । గడు వేడుకఁ దోడు సూపెఁ గౌంతేయులకున్. 220**

**ప్రతిపదార్థం:** ద్రుపదుఁడు; కొడుకులున్+తానును= కొడుకులూ; తానూ; గుఱ్ఱము+దడములన్= గుర్రపు సేనలతో; కరి ఘటలన్= ఏనుగుల గుంపులతో; భట రథ వ్రాతములన్= కాల్బంటుల, రథాల సమూహాలతో; పుడమి చలింపఁగన్= భూమి అదరేటట్లు; కడున్ వేడుకన్= మిక్కిలి సంతోషంతో; కౌంతేయులకున్= పాండవులకు; తోడు+చూపెన్= సహాయం కొరకు వచ్చాడు.

**తాత్పర్యం:** ద్రుపదుడు కొడుకులతో గుర్రపు దళాలతోనూ, ఏనుగుల గుంపులతోనూ, కాల్బంటుల రథాల సమూహాలతోనూ భూమి అదిరే విధంగా మిక్కిలి వేడుకతో పాండవులకు సహాయం చేయటానికి వచ్చాడు.

**వ. అదియును నొక యక్షౌహిణికిం గలిగి యొప్పె; నయ్యవసరంబున ననుజ తనుజ సమేతుండును, బార్వతీయ మహీపాల సహితుండును నై యొక్క యక్షౌహిణి యొడ్డనంబు దీర్చి. 221**

**ప్రతిపదార్థం:** అదియును= ఆ సేనయూ; ఒక+అక్షౌహిణికిన్+కలిగి+ఒప్పెన్= ఒక అక్షౌహిణి పరిమితి కలదై విలసిల్లింది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; అనుజ తనుజ సమేతుండును= తమ్ములతోనూ, కొడుకులతోనూ కూడినవాడూ; పార్వతీయ మహీపాల సహితుండునున్+ఐ= పర్వతప్రాంత దేశాల రాజులతో కూడిన వాడూ అయి; ఒక్క+అక్షౌహిణి+ఒడ్డనంబు+ తీర్చి= ఒక అక్షౌహిణీ వ్యూహం సవరించి.

**తాత్పర్యం:** అదియూ ఒక అక్షౌహిణి అయి ఒప్పింది. ఆ సమయంలో తమ్ములతోనూ, కొడుకులతోనూ కూడినవాడూ, పర్వతప్రాంతీయులైన రాజులతో కూడినవాడూ అయి ఒక అక్షౌహిణీ వ్యూహం సవరించి.

**క. చిందముల మ్రోఁతఁ బగతుర । డెందంబులతోడ దిక్తటీసంధులు నం**
**దంద పగులంగఁ, గుంతీ । నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడు సూపెన్. 222**

**ప్రతిపదార్థం:** చిందముల మ్రోఁతన్= శంఖముల ధ్వనులతో; పగతుర డెందంబుల తోడన్= శత్రువుల మనస్సులతో; దిక్+తటీ సంధులున్= దిక్ప్రదేశముల కలయికలు కూడా; అందంద= క్రమక్రమంగా; పగులంగన్= బ్రద్దలు కాగా; మత్స్య నాథుఁడు= మత్స్యదేశపు రాజయిన విరాటుడు; కుంతీ నందనులకున్= కుంతి కొడుకులకు-పాండవులకు; తోడు= సహాయం; చూపెన్.

**తాత్పర్యం:** శంఖధ్వనులచే శత్రుహృదయాలతోపాటు దిక్ప్రదేశాల సంధులు కూడా క్రమక్రమంగా పగులగా మత్స్య దేశాధీశుడైన విరాటుడు పాండవులకు సహాయుడై వచ్చాడు.

**విశేషం:** అలం: సహోక్తి. 'పగతురడెందంబులతోడ దిక్తటీసంధులు నందంద పగులంగ'. ఇక్కడ పగతురడెందములకూ, దిక్తటీ సంధులకూ సహభావం ఉన్నది కాబట్టి సహోక్తి.

**వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలుదెసలనుండి వచ్చిన బలం బొక్క యక్షౌహిణికిం గలిగి యొప్పె. 223**

**ప్రతిపదార్థం:** పాండ్య విభుండు లోనుగాన్= పాండ్యదేశపు రాజు మొదలైన; పలు దెసలనుండి వచ్చిన బలంబు= అనేక దిక్కుల నుండి వచ్చిన సైన్యం; ఒక్క+అక్షౌహిణికిన్+కలిగి+ఒప్పెన్= ఒక అక్షౌహిణి అయి ఒప్పింది.

**తాత్పర్యం:** పాండ్యదేశాధిపతి మొదలుగా నానాదిశలనుండి వచ్చిన సైన్యం ఒక అక్షౌహిణి అయి ఒప్పింది.

**క. ఏ డక్షౌహిణు లిమ్మెయిఁ । గూడెం బాండున్నపసుతులఁ గ్రూరాహవసం**
**క్రీడా వినోదమునకుం । దోడుపడం బూని యతి కుతూహల వృత్తిన్. 224**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; ఏడు+అక్షౌహిణులు; క్రూర+ఆహవ సంక్రీడా వినోదమునకున్= ఘోరమైన యుద్ధం అనే క్రీడయందలి వేడుక కొరకు; అతి కుతూహల వృత్తిన్= మిక్కిలి సంతోషంతో; తోడుపడన్+పూని= సహాయపడటానికి పూని; పాండు నృప+సుతులన్= పాండురాజు కొడుకులైన పాండవులను; కూడెన్= కలిసాయి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఏడు అక్షౌహిణులు ఘోరయుద్ధ క్రీడా వినోదం కొరకు మిక్కిలి కుతూహలంతో తోడ్పాటు చూపటానికి పూని పాండవులను కలిసాయి.

**వ. ఇవ్విధంబునం గూడి పెరిఁగి యుధిష్ఠిరు సైన్యంబు గయ్యంబునకుం గాలు ద్రవ్వుచునుండె; నంత నక్కడం గిరాతకాంచన సైన్యనిచయంబులం గూర్చికొని, సమరంబునకు నమరి యొక్క యక్షౌహిణి గల భగదత్తుండు సుయోధనుం గలిసె; భూరిపరాక్రముండయిన భూరిశ్రవుండును, మహాబలుండయిన శల్యుండును నేకాక్షౌహిణీ సమేతంబుగా నేతెంచిరి; వారలయట్ల సన్నద్ధుఁడై కాంభోజనాథుండైన సుదక్షిణుండును యవనేశ్వరుండును వచ్చె; నత్తెఱంగున సమకట్టి జయద్రథ ప్రముఖులైన సింధు సౌవీర నరపతు లరుగుదెంచిరి; మాహిష్మతీ పతి యగు నీలుండు, యాదవవీరుం డగు కృతవర్మయు, నవంతీశ్వరులు సోదరులు నగు విందానువిందు లిరువురునుంగా నిన్నలువురు నొక్కొక్క యక్షౌహిణితోడఁ జనుదెంచిరి;**

**మఱియునుం బలుదెసల నుండి వచ్చి కూడిన వాహినులు మూఁ డక్షౌహిణులకుం గలిగె; ధార్తరాష్ట్రులకుఁ దోడు పడం బూనినయవి పదునొకం డక్షౌహిణు లయ్యెఁ; నట్టియెడ. 225**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; కూడి; పెరిఁగి= వృద్ధిపొంది; యుధిష్ఠిరు సైన్యంబు= ధర్మరాజు సైన్యం; కయ్యంబునకున్+ కాలు+త్రవ్వుచున్+ఉండెన్= యుద్ధానికి సిద్ధపడుతూఉండింది; అంతన్; అక్కడన్= కౌరవపక్షంలో; కిరాత కాంచన సైన్య నిచయంబులన్= కిరాతులనూ, బంగారాన్నీ, సేనా సమూహాలనూ, కూర్చికొని; సమరంబునకున్= యుద్ధానికి; అమరి= ఒప్పి; ఒక్క+అక్షౌహిణి+కల భగదత్తుండు= ఒక అక్షౌహిణీబలం ఉన్న భగదత్తుడు; సుయోధనున్= దుర్యోధనుడిని కలిసెన్; భూరి పరాక్రముండు+అయిన భూరిశ్రవుండును= మిక్కిలి పరాక్రమవంతుడయిన భూరిశ్రవుడూ; మహాబలుండు+అయిన శల్యుండును; ఏక+అక్షౌహిణీ సమేతంబుగాన్= ఒక అక్షౌహిణీతో కూడి; ఏతెంచిరి= వచ్చారు; వారల+అట్లు+అ= వారి వలెనే- అనగా ఒక అక్షౌహిణితో; సన్నద్ధుఁడు+ఐ= సంసిద్ధుడయి; కాంభోజ నాథుండు+ఐన= కాంభోజదేశపురాజయిన; సుదక్షిణుండు+ అను యవన+ఈశ్వరుండును= సుదక్షిణుడనే యవనపతియూ; వచ్చెన్; ఆ+తెఱంగునన్= ఆ రీతిగా; సమకట్టి= పూని (అనగా ఒక అక్షౌహిణితో); జయద్రథ ప్రముఖులు+ఐన= జయద్రథుడూ మొదలైన; సింధు సౌవీర నరపతులు= సింధుదేశపురాజూ, సౌవీరదేశపురాజూ; అరుగుదెంచిరి= వచ్చారు; మాహిష్మతీ పతి+అగు నీలుండున్= మాహిష్మతీ దేశరాజయిన నీలుడూ; యాదవ వీరుండు+అగు కృతవర్మయున్; అవంతి+ఈశ్వరులు= అవంతి దేశరాజులూ; సోదరులున్= సహోదరులూ; అగు; వింద+అనువిందులు+ఇరువురునున్+కాన్= అవంతి దేశాధీశులూ సహోదరులూ అయిన విందుడూ, అనువిందుడూ; ఈ+నలువురున్= ఈ నలుగురూ; ఒక్కొక్క+అక్షౌహిణి తోడన్; చనుదెంచిరి; మఱియునున్; పలు దెసలనుండి= అనేక దిక్కుల నుండి; వచ్చి; కూడిన వాహినులు= చేరిన సేనలు; మూఁడు+అక్షౌహిణులకున్+కలిగెన్= మూడు అక్షౌహిణులు అయ్యాయి; ధార్తరాష్ట్రులకున్= కౌరవులకు; తోడుపడన్+పూనిన+అవి= సహాయపడటానికి వచ్చినవి; పదునొకండు+అక్షౌహిణులు; అయ్యెన్; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ రీతిగా కూడి పెరిగి ధర్మరాజుసైన్యం కయ్యానికి కాలుత్రవ్వుతూ ఉన్నది. అంత అక్కడ- కౌరవపక్షంలో- కిరాతకులనూ, ధనాన్నీ, సైన్య సమూహాలను కూర్చుకొని, యుద్ధానికి సిద్ధపడి ఒక అక్షౌహిణీసేనతో భగదత్తుడు దుర్యోధనుడిని చేరాడు. అధిక పరాక్రమవంతు డయిన భూరిశ్రవుడూ, మహాబలుడైన శల్యుడూ ఒక అక్షౌహిణితో వచ్చారు. వారివలెనే ఒక అక్షౌహిణితో కాంభోజరాజయిన సుదక్షిణుడనే యవనపతి వచ్చాడు. అదే విధంగా ఒక అక్షౌహిణితో సిద్ధపడి జయద్రథుడూ మొదలుగాగల సింధు సౌవీర దేశాల రాజులు వచ్చారు. మాహిష్మతీ ప్రభువైన నీలుడూ, యాదవవీరుడైన కృతవర్మా, అవంతీశ్వరులూ సోదరులూ అయిన విందుడూ అనువిందుడూ అనే ఇద్దరూ కలిసి ఈ నలుగురూ ఒక్కొక్క అక్షౌహిణితో వచ్చారు. ఇంకా అనేక దిక్కుల నుండి వచ్చి చేరిన సేనలు మూడు అక్షౌహిణులయ్యాయి. కౌరవులకు ఈ విధంగా సహాయపడవచ్చినవి పదకొండు అక్షౌహిణులయినాయి. ఆ సమయంలో.

**క. సవరణల నొప్పి, యనిఁ బాం । డవ బలముల మార్కొనం గడంగుచు, నత్యు**
**త్సవమునఁ బేర్చిన సేనల । కవకాశము లేదు విడియ హస్తిపురమునన్. 226**

**ప్రతిపదార్థం:** సవరణలన్= యుద్ధపరికరాలతో; ఒప్పి; అనిన్= యుద్ధంలో; పాండవ బలములన్= పాండవుల సేనలను; మార్కొనన్= ఎదుర్కొనటానికి; కడంగుచున్= ప్రయత్నిస్తూ; అతి+ఉత్సవమునన్= మిక్కిలి సంతోషంతో; పేర్చిన= విజృంభించిన; సేనలకున్; హస్తిపురమునన్; విడియన్= విడిది చేయటానికి; అవకాశము లేదు= స్థలం లేదు.

**తాత్పర్యం:** యుద్ధపరికరాలతో ఒప్పి, యుద్ధంలో పాండవుల సేనలను ఎదుర్కొనడానికి ప్రయత్నిస్తూ మిక్కిలి సంతోషంతో విజృంభించిన సేనలకు హస్తినాపురంలో విడిది చేయటానికి స్థలం చాలలేదు.

**క. నానాముఖముల విడియం । గా నియమించెను బలంబుఁ గౌరవపతి యా**
**సేనల దొరలకు నిలువఁగ । నైనను నెడ లేమి, నధిక హర్షం బెసఁగన్. 227**

**ప్రతిపదార్థం:** కౌరవ పతి= కురురాజు - దుర్యోధనుడు; ఆ సేనల దొరలకున్= ఆ సేనల నాయకులకు; నిలువఁగన్+ ఐననున్= నిలవటానికి కూడా; ఎడ లేమిన్= స్థలం లేకపోవటం చేత; బలంబును= సైన్యాన్ని; నానా ముఖములన్= పెక్కుచోట్ల; విడియంగాన్= విడిది చేసేటట్లు; అధిక హర్షంబు+ఎసఁగన్= మిక్కిలి సంతోషం అతిశయించగా; నియమించెను= ఏర్పాటు చేశాడు.

**తాత్పర్యం:** ఆ సేనల నాయకులకు నిలవటానికి కూడా స్థలం లేకపోవటం వలన సంతోషం అతిశయించగా దుర్యోధనుడు సైన్యాన్ని పెక్కుచోట్ల విడిసేటట్లు ఏర్పాటు చేశాడు.

**వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున, రౌహితకారణ్యంబున, మరుదేశంబున, నహిచ్ఛత్రంబునఁ, గాలకూటంబున, గంగాకూలంబున, వారణావతంబున, వటస్థానంబున విచ్చలవిడి విడిసి, ధనధాన్యాది సమస్త వస్తువుల కలిమింజేసి యెలమి మిగిలి యున్నంత. 228**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; కురుజాంగలంబునన్, రౌహితక+అరణ్యంబునన్, మరుదేశంబునన్, అహిచ్ఛత్రంబునన్, కాలకూటంబునన్, గంగాకూలంబునన్, వారణావతంబునన్; వటస్థానంబునన్; విచ్చలవిడి= స్వేచ్ఛగా; విడిసి; ధన ధాన్య+అది సమస్త వస్తువుల కలిమిన్+చేసి= ధనమూ, ధాన్యమూ మొదలయిన ఎల్ల వస్తువులూ ఉండటం చేత; ఎలమి మిగిలి= సంతోషం అతిశయించి; ఉన్న+అంతన్= ఉన్న తరువాత.

**తాత్పర్యం:** ఈ విధంగా కురుజాంగలంలోనూ, రౌహిత కారణ్యంలోనూ, మరుదేశంలోనూ, అహిచ్ఛత్రంలోనూ, కాలకూటంలోనూ, గంగాకూలంలోనూ (గంగాతీరంలోనూ), వారణావతంలోనూ, వటస్థానంలోనూ స్వేచ్ఛగా విడిసి, ధనమూ, ధాన్యమూ మొదలయిన వస్తువులన్నీ సమృద్ధిగా ఉండటంచేత సంతోషాతిశయంతో ఉండగా.

### ద్రుపద పురోహితుని రాయబారము (సం. 5-29-1)

**క. పాంచాల మహీవల్లభు । పంచిన భూదేవుఁ డుచితభంగి నగరి కే**
**తెంచి, ధృతరాష్ట్రుఁ బ్రీతిం । గాంచి, కృపద్రోణ విదుర గంగాసుతులన్. 229**

**ప్రతిపదార్థం:** పాంచాల మహీవల్లభు పంచిన భూదేవుఁడు= పాంచాలదేశపురా జయిన ద్రుపదుడు పంపిన బ్రాహ్మణుడు; ఉచిత భంగిన్= తగిన విధంగా; నగరికిన్= పట్టణానికి- హస్తినాపురానికి; ఏతెంచి= వచ్చి; ధృతరాష్ట్రున్; ప్రీతిన్= ఇష్టంతో; కాంచి= చూచి(దర్శించి); కృప ద్రోణ విదుర గంగాసుతులన్= కృపుడినీ, ద్రోణుడినీ, విదురుడినీ, భీష్ముడినీ.

**తాత్పర్యం:** ద్రుపదుడు పంపిన పురోహితుడు తగిన విధంగా హస్తినాపురానికి వచ్చి ధృతరాష్ట్రుడిని ప్రీతితో చూసి, కృపద్రోణ విదుర భీష్ములను (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** ఈ పద్యం ఎత్తుగడ సాభిప్రాయం. వచ్చిన రాయబారి పాంచాల దేశాధీశుడు పంపిన దూత. ఆయన భూదేవుడైన పురోహితుడు. పంపినవాడు ద్రుపదుడు. కార్యం పాండవులది. స్వభావాన్ని బట్టి పురోహితుడు రాబోయే మేలు తెలిపేవాడు. ఆ తీరు చూస్తే ఈ రాయబారం మిత్రుడి హితబోధవలె ఉండే అవకాశం ఎక్కువగా ఉన్నదని సూచన. బ్రాహ్మణుడి మాటలలో ధర్మరాజు పంపిన సందేశం కంటె ద్రుపదుడు మొదలైన హితుల అభిప్రాయాలే ప్రతిఫలించే అవకాశం ఉన్నది. అందువలన ఈ రాయబారం చాలా సున్నితమైనది. (సంపా.)

**వ. వారి వారి మందిరంబులకుం జని కని, సముచితాలాపంబులం బ్రసన్న చిత్తులం జేసి, దుర్యోధను సందర్శనం బును నిర్వర్తించి, నిత్య నిపుణారాధనంబున ధృతరాష్ట్రునభిముఖుం గావించి, యొక్క నాఁ డక్కౌరవేశ్వరు పేరోలగంబున సమస్త సేనాపతులం గలయం గనుంగొని యిట్లనియె. 230**

**ప్రతిపదార్థం:** వారి వారి మందిరంబులకున్+చని= వారి వారి ఇళ్ళకు వెళ్ళి; కని= చూసి; సముచిత+ఆలాపంబులన్= తగిన మాటలచేత; ప్రసన్న చిత్తులన్+చేసి= సంతోషించిన మనస్సులు కలవారినిగా చేసి; దుర్యోధను సందర్శనంబును= దుర్యోధనుడి దర్శనం కూడా; నిర్వర్తించి= చేసి, నిత్య నిపుణ+ఆరాధనంబునన్= ఎడతెగని నేర్పుతోడి పూజనంచేత; ధృతరాష్ట్రున్; అభిముఖున్= అనుకూలుడిని; కావించి= చేసి; ఒక్క నాఁడు; ఆ+కౌరవ+ఈశ్వరు పేరు+ఓలగంబునన్= ఆ ధృతరాష్ట్రుడి నిండుకొలువులో; సమస్త సేనాపతులన్= ఎల్ల సేనానాయకులను; కలయన్+కనుంగొని= బాగుగా చూచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** వారి వారి ఇళ్ళకు వెళ్ళి చూచి, తగిన మాటలతో మనస్సులకు సంతోషం కలిగించి, దుర్యోధనుడి దర్శనం కూడా చేసికొని, నిరంతరం నేర్పుతో ఆరాధించి ధృతరాష్ట్రుడిని తనకు అనుకూలుడినిగా చేసికొని, ఒకనాడు ఆ ధృతరాష్ట్రుడి నిండు కొలువులో సేనానాయకుల నందరినీ బాగుగా చూచి ఇట్లా అన్నాడు.

**విశేషం:** హస్తినాపురంలో ద్రుపద పురోహితుడు కొన్నాళ్ళు గడిపినట్లున్నాడు. అతడికి సరాసరి రాజసభలో ప్రవేశం దొరికినట్లు లేదు. అతడు అంతవేగంగా కోరినట్లూ లేదు. పట్టణంలోని పెద్దలనందరినీ దర్శించాడు. వారితో సమయోచితంగా మాట్లాడి వారి మనస్సులకు సంతోషం కలిగించాడు. దుర్యోధనుడిని కూడా దర్శించాడు. ధృతరాష్ట్రుడి హృదయానికెక్కాలంటే ఎన్నో నేర్పులు ప్రదర్శించవలసి వచ్చింది. రాజుమెచ్చి తనకనుకూలుడయిన తరువాత సభలో అసలు సంగతి ప్రస్తావించాడు. అనుకూల పరిస్థితుల కొరకు దూతపడే శ్రమ ఇందులో వ్యక్తమౌతున్నది. (సంపా.)

**సీ. 'ధృతరాష్ట్ర పాండుభూపతులు సహోదరు । లగుటయు, వారల యాత్మజులకుఁ**
**దమ తమ తండ్రుల ధనములు గైకొనఁ । దగుటయు, మీకు నందఱకుఁ జూడ**
**నుచితంబ కాదె? యట్లుండెఁ, దొల్లింటి చం । దంబును మనకుఁ దెల్లంబ కాదె?**
**ప్రాణగొడ్డము లగు పనుల వారలఁ దీర్పఁ । దలఁచినఁ, బున్నెంబు కలిమిఁ జేసి**

**తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవిఁ బొంది । యున్న, వంచనమెయి మహిఁ గొన్న తెఱఁగు**
**నెఱుఁగుదుర కాదె? దీనికి నెల్ల నియ్య । కొనియె నీ పెద్దరాజు నేమనఁగ నేర్తు? 231**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర పాండు భూపతులు= ధృతరాష్ట్రుడూ, పాండురాజూ; సహోదరులు+అగుటయున్= సోదరులు కావటమూ; వారల+ఆత్మజులకున్= వారి కొడుకులకు; తమ తమ తండ్రుల ధనములు; కైకొనన్+తగుటయున్= స్వీకరించతగి

ఉండటమూ; మీకున్+అందఱకున్; చూడన్; ఉచితంబు+అ కాదె!= న్యాయమే కదా!; అట్లు+ఉండెన్= విషయం అట్లా ఉండగా; తొల్లింటి చందంబును= పూర్వపు విధమూ; మనకున్; తెల్లంబు+అ కాదె!= స్పష్టమే కదా!; ప్రాణగొడ్డములు+అగు పనులన్= ప్రాణాపాయకరా లైన పనులతో; వారలన్=ఆ పాండవుల్ని; తీర్పన్+తలఁచినన్= చంపనెంచితే; పున్నెంబు కలిమిన్+ చేసి= పుణ్యం ఉండడం చేత; బాహు బలము+ఒప్పన్= భుజబలం ఒప్పగా; నిజరాజ్య పదవిన్+పొంది+ఉన్నన్= తమ రాజ్యపదవిని పొంది ఉండగా; వంచనమెయిన్= మోసంతో; మహిన్= భూమిని; కొన్న తెఱఁగున్= కాజేసిన విధమూ; ఎఱుఁగుదురు+అ+కాదె= మీకు తెలిసిందేకదా!; దీనికిన్+ఎల్లన్= దీనికంతకూ; ఇయ్యకొనియెన్= అంగీకరించాడు; ఈ పెద్దరాజున్= ఈ ధృతరాష్ట్రుణ్ణి, ఏమి+అనఁగన్ నేర్తున్?= ఏమనగలను?

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రుడూ, పాండురాజూ అన్నదమ్ములన్న విషయమూ, వాళ్ల కొడుకులకు తమ తమ తండ్రుల ఆస్తులు స్వీకరించదగిన విషయమూ మీకందరికీ చూడగా న్యాయమే కదా! అది అలా ఉండగా, పూర్వం జరిగినదంతా మనకు స్పష్టమేకదా! ప్రాణాలు తీసే పనులతో వాళ్లని చంపనెంచితే, పుణ్యం ఉండబట్టి, భుజబలంతో తమ రాజ్యపదవిని పొంది ఉండగా, మోసంతో భూమిని హరించిన విషయమూ మీరు ఎరిగినదే కదా! దీనికంతటికీ సమ్మతించాడు ఈ పెద్దరాజు, ఆయనను నేను ఏమనగలను?

**విశేషం:** 1. ద్రుపదుడు తన పురోహితుడికి కురుసభలో రాయబారిగా నిర్వహించవలసిన అంశాలను నిర్దేశించి పంపాడు. అందులో మొదటిది- 57వ పద్య తాత్పర్యం. అందులోనూ మూడు సూక్ష్మాంశాలున్నాయి. 1.పాండవులకు రాదగిన రాజ్యభాగాన్ని ముందుగా ప్రస్తావించాలి. 2. ఆ మాటలు ధర్మనిష్ఠంగానూ, ఉచితంగానూ ఉండాలి. ధృతరాష్ట్రుడికి తెలిసివచ్చేటట్లుండాలి. 3. ఆ మాటలు సభలో ఉన్న యుద్ధ వీరులైన రాజుల, సేనానుల మనసులు 'తిరుగబడేటట్లు' ఉండాలి. (ధృతరాష్ట్రుడికి వ్యతిరేకంగా, పాండవులకు అనుకూలంగా మారటం తిరుగబడటం). ఈ మూడు ప్రయోజనాలు సాధించటానికే విప్రుడు మాట్లాడటం మొదలుపెట్టాడు. అందుకే మొదట అన్నదమ్ముల బిడ్డలు వారి వారి రాజ్యసంపదలను పంచుకొని సుఖించటం అందరికీ ఆమోదయోగ్యమేకదా! అని పేర్కొన్నాడు. ఆ మాట ధృతరాష్ట్ర దుర్యోధనాదులకు సమ్మతం కాదు. అయినా, పాలుపంచుకొనటం 'మీకందరికీ ఆలోచిస్తే ఉచితంగా లేదా?' - అని సభ్యులైన వీరులను ప్రశ్నించాడు. వారు అంగీకరించినట్లు భావించాడు. ఆ అంశాన్ని స్థిరీకరించినట్లే మాటలు సాగించాడు. 'అట్లుండె' - అనే వాక్యం దాన్ని స్ఫురింపజేస్తుంది. ఇక రెండవ అంశం. న్యాయంగా పాండవులకు రావలసిన రాజ్యభాగాన్ని వారికి దక్కకుండా కౌరవులు చేసిన దుర్ణయాలను పేర్కొన్నాడు. పాండవుల ప్రాణాలు తీసే లాక్షా గృహదహనం వంటి యత్నాలు ఒకఎత్తు. వాటినుండి తమ పుణ్యబలం చేత పాండవులు తప్పించుకొని బయటపడి రాజ్య వైభవంతో విరాజిల్లుతూ ఉండగా మోసంతో ఆ సంపదను హరించటం మరొక ఎత్తు. ఈ రెండూ పాండవులకు జరిగిన అన్యాయాలే, అధర్మాలే. వాటిని నొక్కిచెప్పి రెండవ ప్రయోజనం సాధించాడు. కొస మెరుపుగా మరొకమాట అన్నాడు. అది మూడవ ప్రయోజనం. వీటి నన్నింటిని ధృతరాష్ట్రుడు అంగీకరించాడు. అది అన్నింటికంటె అధికమైన అధర్మం. దాన్నేమనేది? అని అన్నాడు. ఈ మాట బ్రాహ్మణు డంటున్నా ద్రుపదుడి మాటలుగానే వ్యవహారంలో గ్రహించాలి. అయినా ధృతరాష్ట్రుడి సభలో అతడి సహాయకుల ఎదుట, అతడినే దోషిగా చేసి మాట్లాడటం కార్యసాధన కుపయోగించదు. కాని, ధర్మనిష్ఠంగా మాట్లాడినట్లుంటుంది. ద్రుపదపురోహితుడు తన ఉపన్యాసాన్ని ధర్మనీతితో మొదలుపెట్టాడే కాని, రాజనీతితో కాదు. ధర్మ ప్రతిపాదనం వలన సభ్యుల మనస్సులు తిరుగబడుతాయని భావించాడు.(సంపా.)

2. బ్రాహ్మణుడి మాటలు పచ్చినిజాలే అయినా, వినటానికి కటువుగా ఉన్నాయి. మొదలు పెట్టుతూనే ఆయన మాటలు వాళ్ళకు కోపం తెప్పించేవిగా ఉన్నాయి. అవి చేదుమాత్రలవలె ఉన్నాయి. 'నీ వాక్యము విప్రస్వాభావికమై యిట్లు శ్రుతికిఁ బరుషంబైనన్' అని ఇదే మాట భీష్ము డనటం గమనించదగింది.

**శా. నారీరత్నము నట్లు దెచ్చి సభలోన న్వారలుం జూడఁగాఁ**
**జీరల్ ప్రోవులు గాఁగ నొల్చుటయు, లచ్చిం బుచ్చికోలున్, మహో**
**గ్రారణ్యస్థలి నిల్వఁబంచుటయు, దైన్యవ్యక్తిమై పల్కులున్**
**సైరింపం జను పాండవేయులకు నీ సంధిక్రమం బొప్పదే? 232**

**ప్రతిపదార్థం:** నారీ రత్నమున్= వనితామణిని-ద్రౌపదిని; అట్లు= ఆ రీతిగా; సభలోనన్+వారలున్= సభలో ఉన్నవాళ్ళు; చూడఁగాన్= చూస్తుండగా; చీరల్, ప్రోవులు+కాఁగన్= కట్టువస్త్రాలు రాసు లయ్యేటట్లు; ఒల్చుటయున్= ఊడదీయటమూ; లచ్చిన్+పుచ్చికోలున్= సంపదను హరించటమూ; మహా+ఉగ్ర+అరణ్య స్థలిన్= మిక్కిలి భయంకరమైన అటవీ ప్రదేశంలో; నిల్వన్+పంచుటయున్= ఉండేటట్టు పంపటమూ; దైన్య వ్యక్తిమై పల్కులున్= దీనదశయొక్క స్పష్టతకల మాటలూ- దీనదశను స్పష్టీకరించే రీతి మాటలూ; సైరింపన్+చను పాండవేయులకున్= సహించగలిగిన పాండవులకు; ఈ సంధి క్రమంబు= ఈ సంధి కార్యక్రమం; ఒప్పదే?= తగదా?- తగినదే అని భావం.

**తాత్పర్యం:** స్త్రీరత్నమైన ద్రౌపదినిట ఆ రీతిగా తెచ్చి సభాసదులు చూస్తూఉండగా ఆమె కట్టుకొన్న చీరలు పోగుపడేటట్లు విప్పటం, సంపదను హరించటం, మహాభీకరాటవిలో ఉండేటట్లు పంపటం, అజ్ఞాతవాస సమయంలో తమ దీనదశను స్పష్టపరిచే రీతి తమ మాటలూ సహించగలిగిన పాండవులకు ఈ సంధి కార్యక్రమం తగినదే!

**విశేషం:** 'పాండుతనూభవుల్ పడిన పాటులు బంధుల కెల్ల' తెల్పుతూ పండితులూ, వృద్ధులూ, సజ్జనులూ ఇతడిమాటలే మేలు, మరొక పద్ధతి మంచిదికాదు' అని మనస్సులలో తలపోసేటట్లు మాట్లాడాలని ద్రుపదుడు తన పురోహితుడితో చెప్పాడు (59వ పద్యం). దానిని పురస్కరించుకొని పురోహితు డీ పద్యం పలికాడు. మొదట ద్రౌపదీ వస్త్రాపహరణ వృత్తాంతాన్ని ప్రస్తావించాడు. ప్రతిపదాన్నీ సాభిప్రాయంగా ప్రయోగించాడు. ద్రౌపది నారీరత్నం. గౌరవింపదగిన ఆమెను 'అట్లా' తెచ్చారట. దుశ్శాసనుడు ఆమెను జుట్టుపట్టుకొని లాక్కొంటూ సభకు తెచ్చిన ఆ వైఖరి నలుగురిలో పేర్కొనరానిది అని గర్హణ వ్యక్తం చేశాడు. సభ్యులందరూ చూస్తూఉండగా 'చీరలు ప్రోవులుగా' ఒలిచారట! ఆ మాటలో కౌరవుల దుష్టసంకల్పం, అది విఫలమైన తీరూ, ద్రౌపది పాతివ్రత్య మాహాత్మ్యం ధ్వని. సంపదను అన్యాయంగా లాగుకొనటం, అడవులకు పంపటం, ఆ పంపేటప్పుడు పాండవులను దుశ్శాసనాదులు దుర్భాషలాడటం- పేర్కొన్నాడు. హస్తినాపురంలో ఉన్నవారికి తెలిసినవి ఆ దురంతాలే. అయితే, ఈ పాండవుల పాట్లన్నీ సభ్యులలో సానుభూతి కలిగించటానికి చెప్పి, వాటిని సహించిన పాండవులు ప్రతీకారానికి దిగకుండా సంధికి పూనుకొనటంలో ఉన్న సామంజస్యాన్ని పేర్కొన్నాడు. సంధి ప్రయత్నం పాండవుల ధర్మప్రవృత్తికీ, సహనశీలానికీ, ఉదాత్తతకూ పతాక గుణంగా అభివర్ణించాడు. ద్రుపదుడి సూచనను తు-చ తప్పక పాటించాడు. (సంపా.)

**క. వీరల వృత్తముఁ, బాండుకు । మారుల వర్తనముతెఱఁగు మాత్సర్యములే**
**కారసి, ధృతరాష్ట్రునకున్ । గారవమున బుద్ధిసెప్పఁగాఁ దగు మీకున్. 233**

**ప్రతిపదార్థం:** వీరల వృత్తమున్= ఈ కౌరవుల ప్రవర్తనా; పాండు కుమారుల వర్తనము తెఱఁగున్= పాండవుల నడత తీరూ; మాత్సర్యము లేక+ఆరసి= పక్షపాతం లేకుండా పరిశీలించి; ధృతరాష్ట్రునకున్; గారవమునన్= ఆదరంతో; బుద్ధి+చెప్పఁగాన్, మీకున్, తగున్= తగును.

**తాత్పర్యం:** ఈ కౌరవుల ప్రవర్తనా, ఆ పాండవుల నడతతీరూ పక్షపాతం లేకుండా పరిశీలించి ధృతరాష్ట్రుడికి మీరు బుద్ధి చెప్పటం మంచిది.

**విశేషం:** ఈ పద్యంలో సభ్యులముందు ఒక కర్తవ్యాన్ని ఉంచాడు పురోహితుడు. కౌరవ పాండవుల ప్రవర్తనలను నిష్పాక్షిక బుద్ధితో విచారించి, న్యాయాన్ని ధృతరాష్ట్రుడిని గౌరవంగా తెలియచెప్పండన్నాడు. అంటే తన వాదాన్ని ఏకగ్రీవంగా సమర్థించండని కోరాడు. తిక్కన వాడిన 'బుద్ధి సెప్పఁగాఁదగున్' అనే వాక్యం సాభిప్రాయం. బుద్ధి చెప్పటం - అనే జాతీయాన్ని తెలుగులో గౌరవ సూచకంగా కంటె నిందావాచకంగానే ఎక్కువగా వాడుతున్నా మిప్పుడు. కాని, తిక్కన ఇక్కడ వాడిన తీరు ఉభయార్థకంగా ఉండటం విశేషం. అయితే, గౌరవమున బుద్ధి చెప్పండి అనటం చేత సభాగౌరవం కాపాడబడింది. బుద్ధి అంటే హితవు అనే అర్థం ఇక్కడ గ్రాహ్యం. గుణపాఠం చెప్పండి అనే అర్థం ఇక్కడ ఉద్దిష్టం కాదు. కాని, ఆ ధ్వని స్ఫురించటం ఆ మాటలోని బలం. ద్రుపద పురోహితుడి కీ వాదంలో నేరాలుచేసిన దుర్యోధనాదులకంటె, వారిని వారించకుండా నిర్లిప్తంగా ఉన్న ధృతరాష్ట్రుడే మూల దోషిగా నిరూపించటం పరమతాత్పర్యం. ఆ ప్రయోజనాన్ని, పరుషంగానైనా, సాధించాడు పురోహితుడు. (సంపా.)

**తే.** **పాండవులు కౌరవులతోడి పగకు నొల్ల । రఖిల భూప్రజ నాశన మగుటఁజేసి**
**వార లస దని తలఁపంగ వలవ; దధిక । ధర్మపరులైన కతమునఁ దగవు నడచె.** **234**

**ప్రతిపదార్థం:** అఖిల భూ ప్రజ= ఎల్ల భూమియందలి ప్రజలూ; నాశనము+అగుటన్+చేసి= నశిస్తారు కాబట్టి; పాండవులు; కౌరవులతోడి పగకున్= కౌరవులతో వైరానికి; ఒల్లరు= ఇష్టపడరు; వారలు= పాండవులు; అసదు+అని= తక్కువ అని; తలఁపంగన్+వలవదు= భావించవద్దు; అధిక ధర్మపరులు+ఐన కతమునన్= మిక్కిలి ధర్మాత్ములు కావటం చేత; తగవు నడచెన్= మేలు జరిగింది.

**తాత్పర్యం:** ఎల్లభూమిలో ఉన్న ప్రజలు నశిస్తారు కాబట్టి పాండవులు కౌరవులతో వైరానికి ఇష్టపడరు. అట్లా అని వాళ్ళు బలహీనులని ఎంచవద్దు. మిక్కిలి ధర్మాత్ములు కావటంవలన ఒడంబడిక కొనసాగి న్యాయం నెరవేరింది.

**విశేషం:** 1. కౌరవపాండవుల ప్రవర్తనలలోని తారతమ్యాన్ని పై పద్యంలో నిరూపించి, వారిరువురి ఆలోచనలలో గల అంతరాన్ని ఇక్కడ పేర్కొంటూ పాండవుల ధర్మబద్ధమైన చిత్తవృత్తిని ప్రశంసించాడు పురోహితుడు. పాండవులు పగకు పూనుకొనకపోవటానికి కారణం ప్రజా నాశనాన్ని కోరని దయాప్రవృత్తియే. అంటే-కౌరవులు స్వార్థపరులు, పాండవులు లోకహిత పరాయణులు. లోకహితం కొరకు వారు తమసుఖాన్ని కూడా త్యాగం చేయగలరు. అయితే, ఈ దయాపరత్వాన్ని తక్కువతనంగా, బలహీనతగా భావించవద్దన్నాడు. పాండవులు మిక్కిలి ధర్మాత్ములు కాబట్టి లోకానికి మేలు జరిగింది. యుద్ధంకంటె అన్నివిధాలా ప్రజాహితకరమైన సంధి మేలని భావించే పాండవ ప్రవృత్తియే లోక శ్రేయస్సును కలిగిస్తుందని నిరూపించి చెప్పాడు పురోహితుడు. పాండవ సంధియత్నంలో ప్రధానాంశం ప్రజలయోగక్షేమమని సభలో చాటిచెప్పాడు.

2. ఉపన్యాసకళలో ఇదొక మెలకువ. ఒక విషయాన్ని సభ్యులముందు ప్రతిపాదించి, మీరే ఆలోచించి చూడండి - అని ప్రబోధించి, ఆ తరువాత ఎట్లా ఆలోచించాలో తానే చెప్పి ఎదుటివారిని ఒప్పించటం. తాను చెప్పినమాటలను సభ్యులు అంగీకరించేటట్లు చేయాలని పురోహితుడికి ద్రుపదుడు హితవు చెప్పాడు. అందుకే ఈ సంభాషణ శిల్పం. ఇది తిక్కన నాటకీయ రచనలో భాగం కూడా. (సంపా.)

**వ.** **అందుఁ గూడినవి యే డక్షౌహిణు, లిందుఁ గూడినవి పదు నొకం డక్షౌహిణులని తలంతురేని వినుండు.** **235**

**ప్రతిపదార్థం:** అందున్= పాండవ పక్షంలో; కూడినవి; ఏడు+అక్షౌహిణులు; ఇందున్= కౌరవుల పక్షంలో; కూడినవి; పదునొకండు+ అక్షౌహిణులు; అని, తలంతురు+ఏనిన్= అని సంఖ్యా ప్రాచుర్యంతోనే ఆలోచించేటట్లయితే; వినుండు.

**తాత్పర్యం:** పాండవుల పక్షంలో కూడినవి ఏ డక్షౌహిణులు మాత్రమే, కౌరవుల పక్షంలో కూడినవి పదకొండు అక్షౌహిణులు కదా! అని అనుకొంటారేమో! వినండి.

**విశేషం:** పాండవ కౌరవుల బలతారతమ్యాన్ని చెప్పాడిందులో పురోహితుడు. బలాన్ని సంఖ్యలతోగాని, సారవంతమైన బలంతోగాని లెక్కించవచ్చును. పాండవుల సేనకంటె కౌరవుల సేన నాలుగు అక్షౌహిణులు అధికం. సంఖ్యాప్రాచుర్యమే ప్రమాణమని భావించవద్దని పురోహితుడి హెచ్చరిక. కౌరవులది వాపు, పాండవులది బలుపు. వాపుకంటె బలుపే గొప్పది అని చెప్పబోతున్నాడు పురోహితుడు. ఇతడి మాటలలో ప్రతిపాద్యాంశాన్ని స్పష్టంగా చెప్పే ప్రజ్ఞ కనపడుతుంది. కాని, అందులో మర్మంలేని ధర్మావేశం ఎక్కువ. (సంపా.)

**క. బాహుబల ఘనుఁడు భీముఁడు, । సాహస రసికాత్ముఁ డయిన సాత్యకియు మహో**
**గ్రాహవభూమి సహస్రా । క్షౌహిణు; లట్లగుట మీరు గానరె యెందున్? 236**

**ప్రతిపదార్థం:** బాహు బల ఘనుఁడు= భుజబలంలో గొప్పవాడు; భీముడున్; సాహస రసిక+ఆత్ముఁడు+అయిన సాత్యకియున్= సాహసాలలో ఆనందించే స్వభావం కలవాడైన సాత్యకీ; మహా+ఉగ్ర ఆహవ భూమిన్= మిక్కిలి ఘోరమైన యుద్ధరంగంలో సహస్ర+అక్షౌహిణులు= వేయి అక్షౌహిణులు; అట్లు+అగుట= అట్లా అవటం; ఎందున్= ఎక్కడైనా; కానరె?= చూడలేదా?

**తాత్పర్యం:** భుజ పరాక్రమంలో ఘనుడైన భీముడూ, సాహస కార్యాలలో ఆనందపడే స్వభావం గల సాత్యకీ మహాభయంకర యుద్ధభూమిలో వేయి అక్షౌహిణులన్న సంగతి మీరు ఎక్కడైనా సరే చూడలేదా?

**విశేషం:** 1. గురు భీష్మాదులు యుద్ధానికి విముఖులై దుర్యోధనుడిని యుద్ధ విముఖుడిని చేసేటట్లు ప్రయత్నించాలనీ, దానికి తగిన మాటలు మాటాడాలనీ ద్రుపదుడు తన పురోహితుడికి చెప్పాడు. (పద్యం 58). దానికి తగినట్లుగా పురోహితుడు భీమ, సాత్యకి, విజయ కృష్ణుల ప్రతాపాలను వర్ణించటం ఆరంభించాడు. బాహుబలఘనుడైన భీముడూ, సాహస రసికాత్ముడైన సాత్యకీ కలిస్తే వేయి అక్షౌహిణులతో సమానమని లెక్కకట్టి చెప్పాడు. పాండవుల బాహుబలానికి ప్రతీకలు భీమసాత్యకులు. ఇక ధనుర్బల, నీతిబలాలకు అర్జునుడూ, కృష్ణుడూ ప్రతినిధులని వరుసగా చెప్పుతున్నాడు. (సంపా.)

2. వావిళ్ళ ప్రతిలోనూ, తెలుగు విశ్వవిద్యాలయ ప్రతిలోనూ ఈ పద్యం నాలుగోపాదం- 'సహస్రాక్షోహిణులట్లగుట మీరు సూడరె యెందున్' అనే పాఠం కనబడుతున్నది. మున్నంగి శర్మ ప్రతిలో 'సహస్రాక్షౌహిణు లట్లగుట మీరు గానరె యెందున్' అనే పాఠం మరికొన్ని ప్రతుల ననుసరించి స్వీకరింపబడింది. తిక్కన భారతంలో ఈ ఒక్క చోట తప్ప, ఎక్కడా 'అక్షోహిణి' అని ప్రయోగించలేదు. అక్షౌహిణి సాధువు. అక్షోహిణి అసాధువు. అందుచేత నేను మున్నంగివారి పాఠాన్నే స్వీకరించాను.

**క. గాండీవధన్వు నాహవ । పాండిత్యముఁ దలఁప నతని భండనమున మా**
**ర్కొండు నని యొకఁడు గడఁగుట । కొండం గని తగరు దాఁకఁ గోరుట గాదే? 237**

**ప్రతిపదార్థం:** గాండీవ ధన్వు+ఆహవ పాండిత్యమున్= గాండీవమనే ధనుస్సు కలవాడైన అర్జునుడి యొక్క యుద్ధ పాండిత్యం; తలఁపన్= ఆలోచిస్తే; అతనిన్; భండనమునన్= యుద్ధంలో; మార్కొండున్+అని= ఎదుర్కొంటానని; ఒకఁడు; కడఁగుట= పూనటం; కొండన్+కని= కొండను చూచి; తగరు= పొట్టేలు; తాఁకన్+కోరుట+కాదే?= ఎదురించటానికి కోరటమే కదా?

**తాత్పర్యం:** గాండీవి యుద్ధ నైపుణ్యాన్నిగూర్చి ఆలోచిస్తే ఆతడిని యుద్ధంలో ఎదుర్కొంటానని ఒకడు పూనుకొనడం, కొండను చూచి పొట్టేలు ఢీకొనటానికి సిద్ధపడటమే కాదా!

**విశేషం:** అలం: నిదర్శన. ఇందులో 'అతని భండనమున మార్కొండునని యొకఁడు గడఁగుట' అనే ఉపమేయ వాక్యానికీ, 'కొండం గని తగరు దాఁకఁగోరుట' అనే ఉపమాన వాక్యానికీ ఐక్యారోపణం (అభేదం) చెప్పబడింది కాబట్టి నిదర్శన. కొండను పొట్టేలు ఢీకొంటే ఏం జరుగుతుందో యుద్ధంలో గాండీవిని ఢీకొన్నవాడికీ అదే జరుగుతుందని భావం.

**క. ఆ బీభత్సుని భూరి భు । జా బలమును, దుర్నివార శౌర్యము, శర వి**
**ద్యా బహుళతయును బందికి । నై బవరముఁ జేసినట్టి హరుఁడ యెఱుంగున్. 238**

**ప్రతిపదార్థం:** ఆ బీభత్సుని భూరి భుజా బలమును= ఆ అర్జునుడి అధికమైన బాహుపరాక్రమమూ; దుర్నివార శౌర్యమున్= అడ్డగించటానికి శక్యంకాని శూరత్వమూ; శర విద్యా బహుళతయును= బాణవిద్యలో ఆధిక్యమూ; పందికిన్+ఐ= పందికొరకు; బవరమున్+చేసిన+అట్టి= యుద్ధం చేసినట్టి; హరుఁడు+అ= ఈశ్వరుడే; ఎఱుంగున్= తెలియును.

**తాత్పర్యం:** ఆ బీభత్సుడి గొప్పదైన బాహుపరాక్రమమూ, అవార్య శౌర్యమూ, అస్త్రవిద్యాధిక్యమూ పంది కొరకు అతడితో యుద్ధం చేసిన ఈశ్వరుడికే బాగుగా తెలుసు.

**విశేషం:** అలం: పరికరాంకురం. ఇందులో అర్జునుడికి 'బీభత్స' శబ్దప్రయోగమూ, ఈశ్వరుడికి 'హర' శబ్ద ప్రయోగమూ సాభిప్రాయాలు కాబట్టి పరికరాంకురం. విశేష్యం సాభిప్రాయమైతే పరికరాంకురాలంకారం అవుతుంది. బీభత్సుడంటే యుద్ధంలో శత్రువీరులకు బీభత్సం కలిగించేవాడు కాబట్టి అర్జునుడని అర్థం. హర శబ్దానికి ప్రళయసమయంలో సర్వమూ హరిస్తాడు కాబట్టి ఈశ్వరుడని అర్థం. అర్జునుడి తపస్సును పరీక్షించగోరి శివుడు కిరాత వేషం ధరించి మూకుడనే రాక్షసుడిని వరాహంగా చేసి అర్జునుడివద్దకు వచ్చాడు. అర్జునుడు ఆ పందిని కొట్టాడు. ఈశ్వరుడూ కొట్టాడు. ఇది నాదంటే నాదని యిద్దరికీ వివాదం ఏర్పడింది. యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అర్జునుడు చూపిన పరాక్రమానికి శివుడు మెచ్చి అతడికి పాశుపతాస్త్రం ఇచ్చాడు.

**వ. అదియునుం గాక. 239**

**తాత్పర్యం:** అదీకాక.

**మ. వివిధోపాయ పరాయణుండు, రిపుదోర్వీర్యాపహారక్రియా**
**ప్రవణోద్యోగుఁడు, మంత్ర రక్షణ కళా ప్రావీణ్యగణ్యుండు, ధై**
**ర్య వివేకాది గుణోత్తరుం, డఖిల విద్యాజాల సంవేది మా**
**ధవుఁ డా దిక్కటె! పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే? 240**

**ప్రతిపదార్థం:** వివిధ+ఉపాయ పరాయణుండు= రకరకాల ఉపాయాలకు ఆశ్రయమైనవాడూ; రిపు దోస్(ః)+వీర్య+అపహార క్రియా ప్రవణ+ఉద్యోగుఁడు= శత్రువుల యొక్క బాహువుల పరాక్రమాన్ని తొలగించే కార్యంలో సమర్థమైన ప్రయత్నం కలవాడూ; మంత్ర రక్షణ కళా ప్రావీణ్య గణ్యుండు= ఆలోచనయొక్క రక్షణం అనే విద్య యందలి నేర్పుచేత గణించదగినవాడూ; ధైర్యవివేక ఆది గుణ+ఉత్తరుండు= ధైర్యమూ, వివేకమూ మొదలైన గుణాల చేత శ్రేష్ఠుడూ; అఖిల విద్యా జాల సంవేది= ఎల్ల విద్యల సమూహాన్ని బాగుగా తెలిసినవాడూ; అగు; మాధవుఁడు= కృష్ణుడు; ఆ దిక్కు+అటె!= ఆ పక్షమట! పాండవేయులకున్; అసాధ్యంబు= సాధించరానిది; ఎద్దియున్= ఏదయినా; కల్గునే?= ఉంటుందా?

**తాత్పర్యం:** అనేకములైన ఉపాయాలకు ఆశ్రయమైనవాడూ, శత్రువుల భుజబలం హరించే క్రియలో సమర్థమైన పూనిక కలవాడూ, మంత్ర రక్షణమనే విద్య యందలి నేర్పు చేత గణించదగిన వాడూ, ధైర్యమూ, వివేకమూ మొదలైన గుణాల చేత శ్రేష్ఠుడైన వాడూ, ఎల్ల విద్యల సమూహమూ తెలిసినవాడూ అయిన శ్రీకృష్ణుడు ఆ వైపున ఉన్నాడట! ఇంక పాండవేయులకు సాధ్యంకాని దేమయినా ఉంటుందా?

**విశేషం:** 1. అలం: కావ్యలింగం. 'పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే' అనే సమర్థనీయమైన అంశం సమర్థించబడింది కాబట్టి ఇక్కడ కావ్యలింగం.

2. ఈ పద్యంలో వర్ణించబడిన మాధవుడు మానవాకృతిలో ఉన్న రాజనీతి. విజయమార్గంలో నడిచే ప్రభువుకు మొదట ఉండవలసింది వివిధోపాయాలను ప్రయోగించటంలో నేర్పరితనం.

**"లభేత సామదానాభ్యాం కృత్యాంశ్చ పరభూమిషు,**
**అకృత్యాన్ భేదదణ్డాభ్యాం పరదోషాంశ్చ దర్శయేత్" (అర్థశాస్త్రమ్. 14 అధ్యా. పు. 56)**

శత్రు రాజ్యాలలో ఉన్న కృత్యులను సామదానభేద దండోపాయాలతో తనవైపు త్రిప్పుకొనటం, అకృత్యులను భేదదండోపాయాలతో తనవైపు త్రిప్పుకొనటం, శత్రువుల దోషాలు వాళ్ళకు చూపుతూ ఉండటం - అనే అంశాలలో ప్రజ్ఞాధురీణుడు శ్రీకృష్ణుడు. అంటే రాజనీతిలోని చతుర్విధోపాయాలలో నిష్ణాతుడు.

శత్రువుల (భుజ) బలాన్ని హరించే క్రియలలో సమర్థుడైన వాడు రాజనీతిలో షాడ్గుణ్యం తెలిసినవాడని భావం. **"సంధి విగ్రహాసన యాన సంశ్రయ ద్వైదీభావాః షాడ్గుణ్యమ్ ఇత్యాచార్యాః"** - అని కౌటిల్యుడి అర్థశాస్త్రం. "వాటిలో 'సంధి'- అనగా ఒప్పందం కుదుర్చుకొనటం, అపకారం చేయటం 'విగ్రహం', సంధి చేసికొనకుండా, అపకారం చేయకుండా ఉండటం 'ఆసనం'. శక్తినీ, దేశకాలాదులలో అభివృద్ధిని సంపాదించడం 'యానం'. ఈ విధమైన అభివృద్ధి ఉన్నప్పుడే శత్రువు మీదికి దండెత్తి వెళ్ళటం కుదురుతుంది గాన దీనికి 'యానం' అని పేరుపెట్టబడింది. యానం అనగా దండెత్తివెళ్ళటం. శత్రువు బలవంతుడైనప్పుడు తనను వానికి సమర్పించుకొనటం 'సంశ్రయం'. సంధి విగ్రహాలు రెండింటినీ నడిపించటం 'ద్వైధీభావం'. ఈ విధంగా గుణాలు ఆరు. (కౌటిలీయమ్ అర్థశాస్త్రమ్ - ఆంధ్రవ్యాఖ్యాబాలానందినిలో - వ్యాఖ్యాత మహామహోపాధ్యాయ ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు- పు. 544 - 545). షాడ్గుణ్య ప్రయోగ విద్యానిపుణుడు శ్రీకృష్ణుడు.

రాజనీతిలో మంత్రం పంచాంగసహితం. **"కర్మణా మారంభోపాయాః పురుషద్రవ్యసంపత్, దేశకాల విభాగః వినిపాత ప్రతీకారః, కార్యసిద్ధి రితి పంచాఙ్గో మన్త్రః"** - అని అర్థశాస్త్రం. దీనిని బట్టి పనులు చేపట్టటంలో ఉపాయాలు ప్రయోగించటం, పురుషసంపదను ధన సంపదను పెంపొందించటం, దేశకాలాల విభాగాన్ని తెలియటం, విఘ్నాలకు ప్రతిక్రియలను ఆలోచించటం, కార్యసిద్ధి - అనే అయిదు అంగాలు గల మంత్రాన్ని రక్షించేకళలో ప్రావీణ్యం గలవారిలో శ్రీకృష్ణుడు ప్రథమగణ్యుడు.

ధైర్య వివేకాలు ధీరోదాత్తుల ఉత్తమగుణాలు. రాజనీతిలో ధైర్యంవలన సాహసం, దానివలన కార్యసాధనం ఏర్పడతాయి. వివేకంవలన ఎప్పుడెప్పుడేయే పనులు చేయవచ్చునో, చేయకూడదో నిర్దేశించటం కలుగుతుంది. దర్శకుడయ్యే నాయకుడికి ఉండవలసిన ఉత్తమగుణాలు కలవాడు శ్రీకృష్ణుడు.

'అఖిల విద్యాజాల సంవేది' - అనేది విశాలమైన అర్థాన్నిస్తుంది. ఇక్కడ రాజనీతికి సంబంధించిన విద్యలన్నీ నేర్చినవాడని చెప్పటం ప్రస్తుతం. **'ఆన్వీక్షికీ, త్రయీ, వార్తా, దణ్డనీతి శ్చేతి విద్యాః"** - అని అర్థశాస్త్రం. "పదార్థాల స్వరూపాన్ని యుక్తులచేత(హేతువుల చేత) పరీక్షించే విద్య ఆన్వీక్షికి(Philosophy), ఋగ్యజుస్సామవేదాలు 'త్రయి'. కృషి (వ్యవసాయం), పశుపాలన, వర్తకం వీటికి వార్త (Economics) అని పేరు. దండనీతి అంటే రాజనీతి (Political science), (అర్థశాస్త్రం. పు.13).

ఈ అయిదు విశేషణాలను కలిపి చదువుకొంటే శ్రీకృష్ణుడు జంగమ రాజనీతి శాస్త్రమనటం స్పష్టం. అతడి చెప్పుచేతలలో వర్తించే పాండవులకు అసాధ్యమనేది లేదని తాత్పర్యం. (సంపా.)

**ఆ. అదను దప్పకుండ నమ్మహాత్ముల నెమ్మిఁ । బిలువఁ బంచి, హితముఁ బ్రియము రెండు**
**పక్షములకు నగుట పాటించి తగవుమైఁ । గొంతభూమి యిచ్చి కూడి మనుఁడు.' 241**

**ప్రతిపదార్థం:** అదను+తప్పక+ఉండన్= సమయం మించిపోకుండా; ఆ+మహాత్ములన్= మహనీయులైన ఆ పాండవులను; నెమ్మిన్= ప్రీతితో; పిలువన్+పంచి= పిలిపించి; హితమున్+ప్రియమున్= మేలూ, ప్రీతీ; రెండు పక్షములకున్= ఇరు పక్షాల వారికీ; అగుట పాటించి= అవటం ఆలోచించి; తగవుమైన్= న్యాయంతో; కొంతభూమి, ఇచ్చి; కూడి= కలిసి; మనుఁడు= బ్రతకండి.

**తాత్పర్యం:** సమయం మించిపోకుండా మహనీయులైన ఆ పాండవులను ప్రీతితో పిలిపించి, హితమూ, ప్రియమూ రెండు పక్షాలకూ కలిగేటట్లు చూచి న్యాయంగా వాళ్ళకు కొంతభూమి ఇచ్చి కలిసి బ్రతకండి.'

**విశేషం:** ఈ వాక్యాలు ఒక మిత్రుడు హితవు చెప్పుతున్నట్లున్నాయి. నిజాని కవి ద్రుపదుడి హితోక్తులే. అయినా అవి పాండవానుమతితో పలికినవి. దూతద్వారా పలికించినవి. ఒక విధంగా ఇది పాండవ ప్రత్యక్ష ప్రార్థన కాదు. పాండవులూ, వారి హితులూ బంధువులూ కలిసి సామూహికంగా చేస్తున్న అభ్యర్థన. ఇందులో మూడంశాలు ముక్తసరిగా పేర్కొనబడ్డాయి. 1.మహనీయులైన ఆ పాండవులను ప్రీతితో వెంటనే పిలిపించాలి. 2.రెండు పక్షాలకూ హితమూ, ప్రియమూ కలిగేటట్లు న్యాయంగా కొంతభూమిని పంచి ఇవ్వాలి. 3. ఈ రెండూ చేసి కలిసి బ్రతకాలి. ఈ మూడూ ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నాయి. వీటిలో ఏ ఒకటి తప్పినా మూడూ ముడిపడవు. (సంపా.)

**చ. అనవుడు భీష్ముఁ డిట్లనియె 'నక్కట! భాగ్యముగాదె పాండునం**
**దను లొకయాపదం బడక ధర్మగతిం దగ నందఱున్ సుహృ**
**జ్జనులను గృష్ణునిం గలిసి సమ్మద మొందుటయుం బ్రశాంతిమై**
**మనముల నీసు దక్కి మృదుమార్గము వట్టుటయుం దలంపఁగన్. 242**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్నంతనే; భీష్ముఁడు; ఇట్లు+అనియెన్; అక్కట!= ఆహా!; తలంపఁగన్= ఆలోచించగా; పాండు నందనులు+అందఱున్= పాండవులు అందరూ; ఒక+ఆపదన్+పడక= ఏమీ ఆపద పొందక; ధర్మగతిన్= ధర్మమార్గంలో; తగన్= ఒప్పుగా; సుహృజ్జనులను (సుహృద్+జనులను)= మిత్రులనూ; కృష్ణునిన్, కలిసి; సమ్మదము+ఒందుటయున్= సంతోషించటమూ; ప్రశాంతిమైన్= అధికశాంతితో; మనములన్= మనస్సులందు; ఈసు= ఈర్ష్య; తక్కి= విడిచి; మృదు మార్గము+పట్టుటయున్= శాంతి మార్గం అవలంబించటమూ; భాగ్యము+కాదె!= అదృష్టం కదా!

**తాత్పర్యం:** ద్రుపద పురోహితుడు అట్లా అనగానే భీష్మ డిట్లా అన్నాడు: 'ఆహా! పాండవులు అందరూ ఎటువంటి ఆపదా చెందకుండా మిత్రులతోనూ, కృష్ణుడితోనూ కూడి సంతోషంగా ఉండటమూ, ప్రశాంతితో మనస్సులలో ఈర్ష్య విడిచి శాంతిమార్గం అవలంబించటమూ ఆలోచించగా అదృష్టం కదా!

**విశేషం:** ద్రుపద పురోహితుడు తన ఉపన్యాసాన్ని సభలోని పెద్దల నుద్దేశించే ప్రధానంగా సాగించాడు. దోషం రాజుమీద ఉంచాడు. ఇప్పుడు ఆ సభలో మారు పల్కవలసింది సభాసదుల పక్షాన కురుపితామహుడైన భీష్ముడే. ఇది సహజ సన్నివేశం.

అయితే - ఇక్కడ ఒక ప్రశ్న. భీష్ముడి సమాధానం ధృతరాష్ట్రుడి సమాధానం కాదు. పాండవ మిత్రపక్షం పురోహితుడి ముఖాన పలికితే, హస్తినాపుర ప్రముఖుల పక్షాన, సభాపక్షాన భీష్ముడు పలుకుతున్నాడు. పాండవులు ఆపద పొందకుండా ఉన్నందుకూ, స్నేహితులతో శ్రీకృష్ణుడితో కలిసి ఉన్నందుకూ, ధర్మమార్గం తప్పకుండా ఉన్నందుకూ, శాంతచిత్తులై అసూయలు విడిచి సాధుమార్గంలో సాగుతున్నందుకూ తమ అందరి పక్షాన భీష్ముడు సంతోషాన్ని వ్యక్తం చేశాడు. ఇవి ఔపచారికమైన మాటలే. (సంపా.)

**క. నీ వాక్యము విప్ర స్వా । భావికమై యిట్లు శ్రుతికిఁ బరుషం బైనన్,**
**భావింపఁ గార్యమునయం । దే విధమున సభకు నింత యిష్టం బగునే ? 243**

**ప్రతిపదార్థం:** నీ వాక్యము= నీ మాట; విప్ర స్వాభావికము+ఐ= బ్రాహ్మణ సహజమయి, ఇట్లు; శ్రుతికిన్= చెవికి - వినటానికి; పరుషంబు+ఐనన్= కష్టంగా ఉన్నా; భావింపన్= ఆలోచించగా; కార్యమున+అందున్= పని విషయంలో; ఏ విధమునన్= ఏ విధంగానైనా; సభకున్; ఇంత+ఇష్టంబు+అగునే?= ఇంత నచ్చుబాటు అవుతుందా!

**తాత్పర్యం:** నీ మాట బ్రాహ్మణ సహజమై, వినటానికి ఇట్లా కష్టమనిపించినా, ఆలోచిస్తే కార్యం విషయంలో మాత్రం ఏ విధంగా చూచినా సభకు ఎంతో నచ్చేదిగా ఉన్నది.

**విశేషం:** 1. నీ వాక్యము - అంటే నీవు చెప్పదలచుకొన్న దానిని చెప్పిన విధం. విప్రస్వాభావికం అంటే - బ్రాహ్మణ స్వభావోచితంగా అభివ్యక్తం అయిందని భావం. 'నిండుమనంబు నవ్యనవనీత సమానము పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము'- అని బ్రాహ్మణవాక్కుకు నన్నయ తెచ్చిన ఒక ప్రసిద్ధి ఉన్నది. అదీగాక ఇక్కడ బ్రాహ్మణుడు ధర్మనీతి చెప్పాడు. రాజనీతిని జోడించలేదు. అందువలన వినటానికి పరుషంగా ఉన్నది. మా కరకుదనం చేత కుండబ్రద్దలు వేసినట్లు చెప్పటం వలన మాటలు ఆస్వాదమధురంగా లేవు. సంధిమాటలు సౌమ్యసుందరంగా, సాదరంగా సాగాలి. అయితే చెప్పే పద్ధతి రుచించకపోయినా, ఆచరణలో అది ఎట్లా అయినా, చెప్పిన విషయం సభను ఆకట్టుకొన్న దని అభినందించాడు. భీష్ముడు సభలో ఉన్న విపరీత వాతావరణాన్ని సౌమ్యంగా సుముఖంగా మార్చాడు. సత్యాన్ని సమయోచితంగా చెప్పాడు. అది భీష్ముడి పరిణత ప్రజ్ఞను ధర్మాభిముఖ్యాన్ని తెలుపుతున్నది. (సంపా.)

2. రాజకీయపుటెత్తులు చేతగాని బ్రాహ్మణులు శ్రుతి మధురంగా మాటలాడలేరు. ఉన్నది ఉన్నట్లు సూటిగా మాటలాడటమే వాళ్ళకు సహజం.

**చ. సమయము యూఁది, పాండవు లశక్తుల చాడ్పున నిందు నాఁడు బ**
**న్నము వడి చన్న దైన్యము, వనంబునఁ బడ్డ విషాదవేదనా**
**శ్రమము, విరాటు వీట లఘు సంచరణంబున దాఁగియున్న దుః**
**ఖమును జగం బెఱుంగదె? యకల్మషులం బఱుపంగఁ బాడియే? 244**

**ప్రతిపదార్థం:** పాండవులు; సమయము+అ+ఊఁది= జూదానికి ముందు చేసికొన్న ఒప్పందాన్నే పట్టుకొని; అశక్తుల చాడ్పునన్= చేతకాని వాళ్ళవలె; ఇందున్= ఈ సభలో; నాఁడు= అప్పుడు; బన్నము+పడి= ఆపద పొంది; చన్న,దైన్యమున్= పొందిన దీనస్థితీ; వనంబునన్+పడ్డ= అడవిలో అనుభవించిన; విషాద, వేదనా, శ్రమమున్= విచారం వలన కలిగిన బాధ వలని బడలికా; విరాటు వీటన్= విరాటుడి నగరంలో; లఘు సంచరణంబునన్= తేలికైన (చులకనైన) ప్రవర్తనతో; దాఁగి+ఉన్న,

దుఃఖమును= అజ్ఞాతంగా ఉన్నప్పటి కష్టమూ; జగంబు= లోకం; ఎఱుంగదె; అకల్మషులన్= అపాపులను - మంచివారిని; పఱుపంగన్= బాధపెట్టటం; పాడియే?= ధర్మమా?

**తాత్పర్యం:** పాండవులు జూదానికి ముందు చేసికొన్న ఒప్పందాన్నే పట్టుకొని చేతకాని వాళ్ళవలె ఈ సభలో ఆనాడు భార్యా వస్త్రాపహరణ రూపమైన ఆపదవలన పొందిన దీనస్థితీ, అడవిలో పన్నెండేళ్ళపాటు అనుభవించిన కష్టాలూ, విరాటుడి నగరంలో అజ్ఞాతవాసం చేసినప్పటి దుఃఖమూ లోకానికి తెలియవా? అట్లాంటి సజ్జనులను బాధించటం న్యాయమా?

**విశేషం:** పురోహితుడు 232వ పద్యంలో పేర్కొన్న పాండవుల అవమానాలను, కష్టాలను భీష్ముడు కూడా స్మరించి వారిపట్ల సానుభూతిని వెల్లడించాడు, సభాసదులు ఆ అంశాలకు స్పందించేటట్లు ప్రకటించాడు. పాండవులను బాధించటం న్యాయమా? అని పురోహితుడి వలెనే భీష్ముడు సభనే ప్రశ్నించాడు. దీని కెవరు సమాధానం చెప్పాలి? (సంపా.)

**క. పితృధన మగు పా లుచిత । స్థితి వారల కిచ్చి, నిర్విశేషుండై యీ**
**పతి లోకము మెచ్చఁగ నిజ । సుత నివహమునట్ల వారిఁ జూడఁగవలయున్.** **245**

**ప్రతిపదార్థం:** ఈ+పతి= ఈ రాజు - ధృతరాష్ట్రుడు; లోకము, మెచ్చఁగన్= ప్రపంచం ప్రశంసించేటట్లు; నిర్విశేషుండు+ఐ= భేదభావం లేనివాడై; పితృధనము+అగు, పాలు= తండ్రి ఆస్తి అయిన వాటా; ఉచిత - స్థితిన్= తగిన విధంగా; వారలకున్= ఆ పాండవులకు; ఇచ్చి; నిజసుత నివహము+అట్లు+అ= తన కుమారుల సమూహం వలెనే; వారిన్= ఆ పాండవులను; చూడఁగన్+వలయున్= ఆదరించాలి.

**తాత్పర్యం:** ఈ ధృతరాష్ట్ర మహారాజు లోకం మెచ్చుకొనేటట్లు, భేదభావం లేనివాడై, తమతండ్రి ఆస్తిలోని వాటా సముచితంగా వాళ్ళ కిచ్చి వాళ్ళను తన కొడుకులవలెనే ఆదరించాలి.

**విశేషం:** ద్రుపదపురోహితుడి హితవును భీష్ముడు సమర్థించి, సభానుకూల్యాన్ని ప్రకటించాడు. (సంపా.)

**వ. అట్లుం గాక.** **246**

**తాత్పర్యం:** అంతేకాక.

**చ. కడవఁగ జూదమాడి, యవుఁ గాదన నేరక, సత్యభాషణం**
**బెడలిన వచ్చు ధర్మగతిహీనత కోర్వక, రాజ్యహీనతం**
**బడుటకు నోర్చి, ధర్మజుఁడు పంచిన సైరణ సేసెఁ గాక క**
**వ్వడి నెఱ గిన్క కెట్టి మగవారును నోర్తురె యిజ్జగంబులన్?'** **247**

**ప్రతిపదార్థం:** ధర్మజుఁడు= ధర్మరాజు; కడవఁగన్= కాలక్షేపం కొరకు; జూదము+ఆడి; అవున్+కాదు+అనన్, నేరక= అవునూ కాదూ అనలేక; సత్య భాషణంబు+ఎడలినన్= సత్యవాక్యం పోతే - నిజం చెప్పకపోతే; వచ్చు= కలిగే; ధర్మ గతి హీనతకున్= అధర్మానికి; ఓర్వక= సహించక; రాజ్య హీనతన్+పడుటకున్= రాజ్యనష్టం పొందటానికి; ఓర్చి= సహించి, పంచినన్= ఆజ్ఞాపించగా; సైరణ+చేసెన్+కాక= ఓర్పు వహించాడు కాని; కవ్వడి నెఱ+కిన్కకున్= అర్జునుడి పూర్ణాగ్రహానికి; ఇజ్జగంబులన్(ఈ+జగంబులన్)= ఈ లోకాలలో; ఎట్టి మగవారునున్= ఎటువంటి శూరులైనా; ఓర్తురె?= ఓర్వగలరా?

**తాత్పర్యం:** ధర్మరాజు కాలక్షేపం కొరకు జూదమాడి అవునసీ, కాదనీ అనలేక, నిజం చెప్పకపోతే కలిగే అధర్మానికి సహించక, రాజ్య నష్టానికి సహించి, తనను ఆజ్ఞాపిస్తే సహించాడు కాని, సవ్యసాచి పూర్ణాగ్రహానికి ఈ లోకాలలో ఎంతటి శూరులైనా ఓర్వగలరా?'

**విశేషం:** భీష్ముడు ధర్మరాజు సహనాన్ని ప్రశంసించాడు. ఆ వెంటనే ఊరుకోక కౌరవపాండవ బలాబల నిరూపణంలో పురోహితుడి అభిప్రాయాన్ని సమర్థించాడు. ఉత్తర గోగ్రహణ యుద్ధంలో అర్జునుడి పరాక్రమాన్ని ఉటంకించి, అతడితో ఎదురునిలిచి పోరాడగలిగిన శూరులు కౌరవులలో లేరన్నాడు. ఆ మాటకు కర్ణుడు అహంకరించి అడ్డుపడ్డాడు. రాయబారి మాటలు ప్రక్కకు పోయాయి. భీష్ముడి మాటలు రచ్చకెక్కాయి. (సంపా.)

**వ. అనిన విని కర్ణుండు కనలి యిట్లనియె.** **248**

**ప్రతిపదార్థం:** అనినన్, విని, కర్ణుండు; కనలి= కోపించి, ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని కర్ణుడు కోపించి ఇట్లా అన్నాడు.

**విశేషం:** అర్జునుడు కర్ణుడికి ప్రతిస్పర్ధి. అతడిని భీష్ముడు పొగడటం వలన కర్ణుడికి కోపం వచ్చింది. మానవంతుడైన శూరుడు పరప్రకర్షను సహించలేడుకదా!

**క. 'జనులెల్ల నెఱింగిన యీ । పని యేటికి నుగ్గడింపఁ బలుమఱు ? దుర్యో**
**ధనునకయి శకుని జూదం । బున మేదిని గెలిచె; ధర్మపుత్త్రుం డోడెన్.** **249**

**ప్రతిపదార్థం:** జనులు+ఎల్లన్= జనులందరూ; ఎఱింగిన, ఈ+పని; పలుమఱున్= పలుమార్లు; ఉగ్గడింపన్+ఏటికి?= అనటం ఎందుకు?; దుర్యోధనుని కయి= దుర్యోధనుడి కొరకు; శకుని, జూదంబునన్; మేదిని= భూమి, గెలిచెన్; ధర్మపుత్త్రుండు= ధర్మరాజు; ఓడెన్= ఓడాడు.

**తాత్పర్యం:** 'అందరికీ తెలిసిన ఈ విషయాన్ని మాటిమాటికీ అనటం ఎందుకు? దుర్యోధనుడి పక్షాన శకుని జూదం ఆడి రాజ్యం గెలిచాడు. ధర్మరాజు ఓడిపోయాడు.

**ఆ. దీన నేమి తప్పు? కానకు నేఁగిన । యతఁడు సమయవృత్తి నాక్రమించి,**
**తండ్రిపాలు మాకుఁ దగునంచు, నడియరి । తనము సేసి రాక తప్పు గాక,** **250**

**ప్రతిపదార్థం:** కానకున్= అడవికి; ఏఁగిన+అతఁడు= వెళ్ళినవాడు; సమయవృత్తిన్+ఆక్రమించి= చేసికొన్న ఒప్పందం అతిక్రమించి; తండ్రి పాలు= తండ్రి భాగం; మాకున్; తగున్+అంచున్; అడియరితనము+చేసి,రాక= లోభ గుణంతో రావటం; తప్పు+కాక= తప్పుగాని; దీనన్= ఇందులో; ఏమి తప్పు?= తప్పేమిటి?

**తాత్పర్యం:** అడవికి వెళ్ళినవాడు చేసికొన్న ఒప్పందం అతిక్రమించి, మా తండ్రి ఆస్తిలో వాటా మాకు ఇవ్వాలంటూ లోభిత్వంతో రావటం తప్పుగాని, జూదం ఆడటంలో తప్పేమిటి?

**విశేషం:** కర్ణుడి వాదం ఎంత అధర్మంగా ఉన్నదో చూడవచ్చును. ధర్మరాజు ద్యూత సమయాన్ని ఏమి అతిక్రమించాడు? పన్నెండేళ్ళు అరణ్యవాసమూ, ఒక యేడాది అజ్ఞాత వాసమూ చేసి వచ్చాడు గదా? అదే కదా 'ద్యూత సమయం?' ద్యూత

సమయ నిర్వహణానంతరం తమవాటా తమ కివ్వాలనటం 'అడియరితన' మెట్లా అవుతుందో? 'అడియరితనం' అనే దానికి 'బానిసతనం' అనికాక, 'లోభిత్వం' అని అర్థం చెప్పబడింది. అది సూర్యరాయాంధ్ర నిఘంటువు ననుసరించినది.

**క. విరటుఁడు ద్రుపదుఁడుఁ దోడుగ। బరవసమున నెత్తి విడిసి బలిమి నడిగినం**
**గురుపతియు వెఱచి యిచ్చునె। ధరలోఁ జక్క సగ? మిట్టి తగవులు గలవే?' 251**

**ప్రతిపదార్థం:** విరటుఁడున్, ద్రుపదుఁడున్; తోడుగన్= సహాయంగా; బరవసమునన్= ధైర్యంతో; ఎత్తి= పూని; విడిసి= దండెత్తి; బలిమిన్= బలవంతంగా; అడిగినన్= అడిగితే; కురుపతియున్= దుర్యోధనుడును; వెఱచి= భయపడిపోయి; ధరలోన్= భూమిలో; చక్క సగము= సరిసమం; ఇచ్చునె; ఇట్టి తగవులు+కలవే?= ఇటువంటి న్యాయపద్ధతులు ఎక్కడనైనా ఉన్నాయా?

**తాత్పర్యం:** విరాటుడూ, ద్రుపదుడూ సహాయులుగా పట్టుదలతో పూని దండెత్తి బలవంతంగా అడిగితే భయపడిపోయి దుర్యోధనుడు భూమిలో సరిసగం ఇస్తాడా? ఇటువంటి న్యాయాలు ఎక్కడైనా ఉన్నాయా?'

**వ. అనిన గాంగేయుండు గటకటంబడి కర్ణున కిట్లనియె. 252**

**ప్రతిపదార్థం:** అనినన్; గాంగేయుండు= భీష్ముడు; కటకటన్+పడి= కోపంతో బాధపడి; కర్ణునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా భీష్ముడు కోపించి కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**చ. చిక్కని పోటుమానిసి విసీ ! వినువారలు నవ్వ నేమిగా**
**నెక్కుడు మాట లాడెద? వహీన పరాక్రమశాలి యర్జునుం**
**డొక్కఁడ యార్వురన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్నఁ నేఁ**
**డిక్కడఁ బల్కులన్ గెలిచె దీ వతనిన్ మనరాజు కొల్వునన్. 253**

**ప్రతిపదార్థం:** చిక్కని, పోటుమానిసివి= గట్టి శూరుడవులే; ఇసీ= ఛీ; వినువారలు, నవ్వన్; ఏమిగాన్= ఎట్లుగా; ఎక్కుడు మాటలు+ఆడెదవు= అధికంగా మాటాడుతున్నావు?; అహీనపరాక్రమ శాలి+అర్జునుండు+ఒక్కఁడు+అ= తక్కువ కాని పరాక్రమంతో ఒప్పే అర్జునుడు ఒక్కడే; నిన్న; మనలన్, ఆర్వురన్= మనలను ఆరుగురిని; ఉగ్రరణంబునన్= భయంకరమైన యుద్ధంలో; గెల్చెన్; ఈవు= నీవు; నేఁడు; ఇక్కడన్; మన రాజు కొల్వునన్= మన రాజు సభలో; అతనిన్= అర్జునుడిని; పల్కులన్= మాటలలో; గెలిచెదు= గెలుస్తావు.

**తాత్పర్యం:** 'బలే మంచి శూరుడవులే, ఛీ ! వినేవాళ్ళు నవ్వేటట్లు ఇంత ఎక్కువగా ఎట్లా మాటలాడుతున్నావు? మహాపరాక్రమశాలి అయిన అర్జును డొక్కడే మనలను ఆరుగురినీ భయంకర యుద్ధంలో నిన్న గెలిచాడు, ఈ వేళ నీవు అతడిని ఇక్కడ మన రాజుసభలో మాటలలో గెలుస్తున్నావు.

**విశేషం:** చిక్కని పోటు మానిసివి - మంచి శూరుడవే-అని ఎగతాళి. నిన్న గో గ్రహణ సమయంలో అతడి చేతిలో అట్లా ఓడిపోయి ఈ వేళ ఇట్లా మాటాడుతున్నావంటే విన్నవాళ్ళు ఎవరైనా నవ్వుతారు. అతడు ఒక్కడే - మనలను ఆరుగురిని ఓడించాడు. అతడు గెలిచింది ఉగ్రరణంలో - నీవు గెలిచింది మనరాజు సభలో. అతడు గెలిచింది అస్త్ర శస్త్రాలతో; నీవు-

గెలిచింది మాటలతో-ఇదీ భీష్ముడు కర్ణుడిని పరిహసించిన విధం. ఉత్తర గోగ్రహణ యుద్ధంలో అర్జునుడు గెలిచిన ఆరుగురు వీరులు - 1.భీష్ముడు, 2.ద్రోణుడు, 3.కృపుడు, 4.అశ్వత్థామ, 5.కర్ణుడు, 6.దుర్యోధనుడు.

**క. నరుఁ డాల వెనుక వచ్చినఁ, । గురురా జడుగంగ, నీవు, గురుఁడును, గృపుఁడున్**
**గురుసుతుఁడు వినఁగ, వారల । చిరసమయము దెగుట యేను జెప్పనె తెలియన్? 254**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; ఆల, వెనుకన్= ఆవుల వెనుక; వచ్చినన్= రాగా; కురు రాజు= దుర్యోధనుడు; అడుగంగన్= అడుగగా; నీవున్; గురుఁడును= ద్రోణుడునూ; కృపుఁడున్= కృపాచార్యుడూ; గురుసుతుఁడున్= గురు పుత్రుడయిన అశ్వత్థామా; వినఁగన్= వింటూండగా; వారల చిర సమయము= ఆ పాండవుల బహుకాల దీక్ష - (శపథం); తెగుట= ముగియటం; ఏను= నేను; తెలియన్+చెప్పనె?= తెలిసేటట్లు చెప్పలేదా?

**తాత్పర్యం:** అర్జునుడు ఆవులను మరలించుకొని పోవటానికి వాటి వెనువెంట వచ్చినప్పుడు దుర్యోధనుడు పాండవుల అజ్ఞాతవాస కాలపు లెక్క అడిగాడు. అప్పుడు నీవూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా వింటూండగా లెక్కకట్టి, అది ముగిసిందని నేను స్పష్టంగా చెప్పలేదా?'

**తే. అనిన, ధృతరాష్ట్రుఁ డాపగాతనయు భక్తి । ననునయించి, రాధేయునిఁ గినిసి, ప్రియము**
**దోఁపఁ దా నిట్టు లనియె నా ద్రుపద మనుజ । పతి పురోహితుతోడ సంభ్రమము లేక. 255**

**ప్రతిపదార్థం:** అనినన్; ధృతరాష్ట్రుఁడు; ఆపగా తనయున్= నదీ పుత్రుడిని-భీష్ముడిని; భక్తిన్= భక్తితో; అనునయించి= బతిమాలి; రాధేయున్= కర్ణుడిని; కినిసి= కోపపడి; ఆ ద్రుపద మనుజపతి పురోహితుతోడన్= ఆ ద్రుపదరాజ పురోహితుడితో; సంభ్రమము లేక= వేగిరపాటు లేకుండా; ప్రియము+తోఁపన్= ప్రీతి కనబడేటట్లు; తాను; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** అని కర్ణుడనగా, ధృతరాష్ట్రుడు భీష్ముడిని భక్తితో బ్రతిమాలి ఓదార్చి, కర్ణుడిని కోపపడి, ఆ ద్రుపద పురోహితుడితో వేగిరపాటు లేకుండా, ప్రీతి కనబడేటట్లు ఇట్లా అన్నాడు.

**ఉ. 'మంచిగ నేను బంధులును మంత్రిజనంబులుఁ బెద్దలున్ విచా**
**రించి, సమస్త భూ ప్రజకుఁ బ్రీతిగ, బిడ్డల పాలి కిప్డు పు**
**త్తెంచెద సౌమ్యు నొక్కరు' మదీయ మనోగతి వారిఁ గూడి వ**
**ర్తించు తెఱంగు గైకొనుట దెల్లము కౌరవజాతి కెంతయున్. 256**

**ప్రతిపదార్థం:** మంచిగన్= మేలయ్యేటట్లు; ఏనున్= నేనూ; బంధులును= చుట్టాలూ; మంత్రి జనంబులున్= మంత్రులూ; పెద్దలున్; విచారించి= ఆలోచించి; సమస్త భూ ప్రజకున్= ఎల్ల భూ ప్రజలకూ, ప్రీతిగన్= సంతోషం కలిగేటట్లు; ఇప్డు= ఇప్పుడు; సౌమ్యున్+ఒక్కరున్= మంచివాడిని ఒక్కడిని, బిడ్డల పాలికిన్= బిడ్డల దగ్గరకు- పాండవుల వద్దకు; పుత్తెంచెదన్= పంపుతాను; మదీయ మనస్(ః)+గతి= నా మనస్సుయొక్క రీతి; వారిన్= ఆ పాండవులను; కూడి= కలిసి; వర్తించు తెఱంగు+కైకొనుట= మెలగే పద్ధతిని అవలంబించటం; కౌరవ జాతికిన్= కురువంశీయుల కందరికీ; ఎంతయున్+తెల్లము= మిక్కిలి స్పష్టం.

**తాత్పర్యం:** 'మేలు కలిగేటట్లు నేనూ, బంధువులూ, మంత్రులూ, పెద్దలూ ఆలోచించి, భూజనుల కందరికీ సంతోషంగా, ఇప్పుడు మంచివాడిని ఒకడిని నా బిడ్డలైన పాండవుల వద్దకు పంపుతాను. నేను మనస్సులో ఆ పాండవులతో కూడి ఉండే మార్గాన్నే అవలంబిస్తా నన్న సంగతి కురువంశీయుల కందరికీ సుస్పష్టం.

**విశేషం:** 1. కర్ణభీష్ముల వాగ్యుద్ధంతో కౌరవసభలో పాండవ పక్షం బలపడసాగింది. కర్ణుడికండగా దుర్యోధనుడు రంగంలోకి దిగినా భీష్ముడు సహించాడు. పైపెచ్చు సభ రసాభాస మౌతుంది. అందువలన ధృతరాష్ట్రుడు కల్పించుకొనక తప్పలేదు. భీష్ముడిని బ్రతిమిలాడాడు. కర్ణుడిని కోపగించాడు. ఆపైన తాను ద్రుపదపురోహితుడితో మాట్లాడాడు. పాండవులకు భాగమిస్తా ననలేదు కాని, పాండవుల వద్దకు దూతను పంపుతానన్నాడు. 'మా దూత నీవలె కాక, సౌమ్యంగా ఉంటా'డని ఎత్తిపొడిచాడు. పాండవులతో కూడి ఉండే మార్గాన్ని ఆలోచించి వర్తమానం పంపుతానన్నాడు. సభలో తన మర్యాద నిలుపుకొన్నాడు. (సంపా.)

2. నిజానికి ధృతరాష్ట్రుడి మనస్సు దుర్యోధనుడిని అనువర్తిస్తుందే తప్ప, తద్విరుద్ధంగా ప్రవర్తించాలని అనుకొనదు. పాండవులను కూడి ఉంటాననటం పైకి అనేమాట.

**తే. నీవు మున్నేఁగు' మని యతనికి విభూష । ణాంబరమ్ములతోఁ దమ్ములంబుఁ బెట్టి**
**వీడుకోలిచ్చి పుచ్చిన, విప్రవరుఁడు । పాండు జనపాల తనయుల పాలి కరిగె. 257**

**ప్రతిపదార్థం:** నీవు; మున్ను+ఏఁగుము+అని= ముందుగా వెళ్ళుము అని; అతనికిన్; విభూషణ+అంబరమ్ములతోన్= ఆభరణాలతోను, వస్త్రాలతోనూ; తమ్ములంబున్+పెట్టి= తాంబూలం ఇచ్చి; వీడుకోలు+ఇచ్చి= సెలవిచ్చి; పుచ్చినన్= పంపగా; విప్ర - వరుఁడు= బ్రాహ్మణ శ్రేష్ఠుడు; పాండుజనపాల తనయుల పాలికిన్= పాండురాజు కొడుకుల వద్దకు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'నీవు ముందు పద' అని అతడికి ఆభరణాలతోను, వస్త్రాలతోను తాంబూలం ఇచ్చి, సెలవిచ్చి పంపగా, ద్రుపద పురోహితుడు పాండవుల వద్దకు వెళ్ళాడు.

**వ. ఇట్లు సని వారలఁ గని యతండు సముచిత సంభాషణంబులఁ దనపోయి వచ్చిన తెఱం గెఱింగించె; నిట ధృతరాష్ట్రుండును బుత్త్ర మిత్త్ర వృద్ధామాత్య సహితంబుగా నాస్థానాసీనుం డయి యుండి సంజయు రావించి యతని కిట్లనియె. 258**

**ప్రతిపదార్థం:** ఇట్లు+చని= ఈ విధంగా వెళ్ళి; అతండు= ద్రుపద పురోహితుడు; వారలన్= ఆ పాండవులను; కని= చూచి; సముచిత సంభాషణంబులన్= తగిన మాటలతో; తన పోయి వచ్చిన తెఱంగు= తాను వెళ్ళి వచ్చిన విధం; ఎఱింగించెన్= తెలిపాడు; ఇటన్= ఇక్కడ; ధృతరాష్ట్రుండును; పుత్త్ర, మిత్త్ర, వృద్ధ+అమాత్య+సహితంబుగాన్= కొడుకులతోనూ, స్నేహితులతోనూ, పెద్దలతోనూ, మంత్రులతోనూ కలిసి; ఆస్థాన+ఆసీనుండు+అయి+ఉండి= సభాస్థానంలో కూర్చుండి; సంజయున్= సంజయుడిని; రావించి= రప్పించి; అతనికిన్= అతడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రుపద పురోహితుడు వెళ్ళి పాండవులను చూచి తాను వెళ్ళి వచ్చిన విధం తగిన మాటలతో తెలిపాడు. ఇక్కడ ధృతరాష్ట్రుడు కూడా పుత్రులతోనూ, మిత్రులతోనూ, పెద్దలతోనూ, మంత్రులతోనూ కూడి సభాస్థానంలో కూర్చొనిఉండి సంజయుడిని పిలిపించి అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** సంజయుడు సూత కులజుడు, మంచివాడు. ఎప్పుడూ ధృతరాష్ట్రుడి వద్దనే ఉండి అతడికి ఉపచారాలు చేస్తూ ఉంటాడు. ముందు ముందు కురుక్షేత్ర సంగ్రామ వార్తలు ఎప్పటికప్పుడు ధృతరాష్ట్రుడికి చెపుతూ ఉంటాడు. యుద్ధభూమిలో ఎవ్వరికీ కనపడకుండా నిరపాయంగా ఉండగలిగే శక్తి ఇతడికి వ్యాసుడు అనుగ్రహిస్తాడు.

**తే. 'పాండు నరపాల సుతు లుపప్లావ్యమునకు । వచ్చియున్నారు; నీ వేఁగి వాసుదేవ**
**సహితముగ వారిఁ గని, తద్విషాద మేమి । భంగి మాను నమ్మెయిఁ దగఁ బలుకవలయు.' 259**

**ప్రతిపదార్థం:** పాండు నరపాల సుతులు= పాండురాజు కొడుకులు; ఉపప్లావ్యమునకున్= ఉపప్లావ్యమనే పురానికి; వచ్చి+ఉన్నారు; నీవు+ఏఁగి= నీవు వెళ్ళి; వారిన్; వాసుదేవ సహితముగన్= శ్రీ కృష్ణుడితో కూడా; కని, తద్+విషాదము= వారి దుఃఖం; ఏమి భంగిన్ మానున్= ఏ విధంగా పోతుందో; అమ్మెయిన్ (ఆ+మెయిన్)= ఆ రీతిగా; తగన్= ఒప్పుగా; పలుకవలయున్= మాట్లాడాలి.

**తాత్పర్యం:** 'పాండవులు ఉపప్లావ్య పురానికి వచ్చి ఉన్నారు. నీవు వెళ్ళి శ్రీకృష్ణుడితో కూడి ఉండగా వారిని చూచి, వారి దుఃఖం ఏ విధంగా తొలగి పోతుందో, ఆ విధంగా ఒప్పుగా పలకాలి.

### ధృతరాష్ట్రుఁడు సంజయునిఁ బాండవుల యొద్దకుఁ బంపుట (సం. 5-22-1)

**క. 'మీ యయ్య, మీరు వనవా । సాయాసము నిస్తరించి యభ్యుదయమునన్**
**డాయుట విని ముదితాత్ముం । డై యిట పుత్తెంచె నన్ను' ననుమీ మొదలన్. 260**

**ప్రతిపదార్థం:** మొదలన్= మొదట; మీరు; వన వాస+ఆ యాసమున్= అరణ్య వాస దుఃఖాన్ని; విస్తరించి= దాటి; అభ్యుదయమునన్= అభివృద్ధితో; డాయుట= చేరటం; విని; మీ+అయ్య= మీ తండ్రి; ముదిత+ఆత్ముండు+ఐ= సంతోషించిన మనస్సు కలవాడై, నన్నున్; ఇట= ఇక్కడికి; పుత్తెంచెన్= పంపాడు; అనుమీ= అని చెప్పుము.

**తాత్పర్యం:** 'నీవు వెళ్ళగానే మొదట 'మీరు అరణ్యావాస దుఃఖాన్ని దాటి అభివృద్ధితో వచ్చారన్న సంగతి విని మీ తండ్రి సంతోషంతో నన్ను ఇక్కడికి పంపించా' డని పలుకుము.'

**వ. అని చెప్పి, చుట్ల నున్న వారలతో నిట్లనియె. 261**

**ప్రతిపదార్థం:** అని, చెప్పి; చుట్లన్+ఉన్న వారలతోన్= చుట్టూ ఉన్న వాళ్ళతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికి, తన చుట్టూ ఉన్నవాళ్ళతో ఇట్లా అన్నాడు.

**క. 'దుర్యోధనుండు కార్యా । కార్యజ్ఞుఁడు గామి నిట్టి కలఁక గలిగెఁ గా**
**కార్యులు దృఢధైర్యులు రణ । ధుర్యులు నగు పాండుసుతులు దోషాన్వితులే? 262**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు; కార్య+అకార్యజ్ఞుఁడు+కామిన్= చేయదగినదేదో, చేయదగని దేదో తెలిసిన వాడు కాకపోవటం చేత; ఇట్టి,కలఁక= ఇటువంటి సంక్షోభం; కలిగెన్+కాక= పుట్టింది కాని; ఆర్యులున్= మంచివాళ్ళూ; దృఢధైర్యులున్= మంచి ధైర్యం కల వాళ్ళూ; రణ ధర్యులున్= యుద్ధ కార్యభారం వహించేవాళ్ళూ, యుద్ధ నిపుణులూ; అగు; పాండు సుతులు= పాండవులు; దోష+అన్వితులే= దోష సహితులా?

**తాత్పర్యం:** 'మా దుర్యోధనుడు కార్యాకార్యాలు తెలియనివా డవటం చేత ఇటువంటి సంక్షోభం పుట్టింది కాని, మంచివాళ్ళూ, మంచి ధైర్యవంతులూ, యుద్ధ నిపుణులూ అయిన పాండవులు దోషులా?

**విశేషం:** తన కొడుకే మంచి చెడ్డలు తెలిసినవాడు కాడనీ, పాండవులు నిర్దోషులనీ అనటం ధృతరాష్ట్రుడు పైకి అనే మాటలు. అవి అతడి మాట నేర్పును సూచిస్తాయి.

**క. క్షీరోదకవృత్తి మనము । వారలునుం గలిసి బ్రదుకవలదే నెమ్మిన్?**
**వా రిడుమలఁ బడఁ దగియెడు । వారే? పితృభాగ మేలువారలు గారే? 263**

**ప్రతిపదార్థం:** మనమున్; వారలునున్; క్షీర+ఉదక వృత్తిన్= పాలూ నీళ్ళూ వలె; కలసి; నెమ్మిన్= ప్రీతితో; బ్రదుకవలదే= బ్రతుకవద్దా?; వారు, ఇడుమలన్+పడన్+తగియెడు వారే?= వాళ్ళు కష్టాలు పడదగిన వాళ్ళా?; పితృ భాగము+ఏలు వారలు+ కారే= తమ తండ్రి వాటా అనుభవించ దగిన వాళ్ళు కారా?

**తాత్పర్యం:** మనమూ, వాళ్ళూ పాలూ నీళ్ళూ వలె కలిసిపోయి హాయిగా బ్రతుకవద్దా? వాళ్ళు కష్టాలు పడదగ్గవాళ్ళా? తమ తండ్రి వాటా అనుభవించదగిన వాళ్ళు కారా?

**విశేషం:** అలం: యథాసంఖ్యం. 'క్షీరోదక వృత్తి మనము వారలునున్ గలిసి-' క్షీరం మనం, ఉదకం వారు- యథాసంఖ్యం. ఈ అలంకారంలో కౌరవపాండవులు విడదీయరానట్లుగా కలియటమే ముఖ్యం కాని, వారిలో పాలవంటివారు గొప్పవారనీ, నీళ్ళవంటివారు తక్కువవారనీ భావించరాదు. కాగా ఎప్పుడైనా పాలలో నీళ్ళు కలవటం లోక ప్రసిద్ధి. ధృతరాష్ట్రుడు 'క్షీరోదకవృత్తి మనము వారలనుం గలిసి బ్రతుకవలదే?' అంటే - 'క్షీరోదకగతిఁ బాండవ కౌరవు లొడఁగూడి మనకి కార్యం'బని శ్రీకృష్ణుడు అన్నాడు (చూడు. ఉద్యో.3.258). ఈ సారాసార విచారం ఆ అలంకారంలో లేదనలేము. కాని, ఎవరి కనుకూలంగా వారు యథాసంఖ్యాలంకారాన్ని ప్రయోగించా రన్నది వాస్తవం. (సంపా.)

**ఆ. మనల నింక నమ్మ రనృతాత్ము లన్యాయ । పరులు గర్వు లనుచుఁ బాండుసుతులు;**
**గూడి మనుట కియ్యకొనఁ నేర; రైనను । ధర్మజుండు గలఁడు దగవు నడప,' 264**

**ప్రతిపదార్థం:** మనలన్= మనలను; అనృత+ఆత్ములు= అసత్య పరులు; అన్యాయపరులు= అధర్మపరులు; గర్వులు= గర్వం కలవారు; అనుచున్; పాండుసుతులు= పాండవులు; ఇంకన్= ఇకమీదట; నమ్మరు; కూడి మనుటకున్= కలిసి బ్రతకటానికి; ఇయ్యకొనన్+నేరరు= ఒప్పుకొనజాలరు; ఐనను; తగవు నడపన్= ధర్మం నడపటానికి; ధర్మజుండు, కలఁడు.

**తాత్పర్యం:** మనలను అసత్యవాదులనీ, అధర్మపరులనీ, గర్విష్ఠులనీ అంటూ పాండవులు ఇకమీద విశ్వసించరు. మనతో కలిసి బ్రతకటానికి అంగీకరించజాలరు. అయినా, ధర్మం నడపటానికి ధర్మరాజున్నాడు.

**వ. అని పలికి వెండియు. 265**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా.

**మ. 'మన కీ కుండఁగ వచ్చునే? మనము దుర్మానంబు వాటించి యొ**
**ప్పని కార్యంబులు వట్టి వారికిఁ దగం బాలీక గర్వంబు లా**
**డిన, నిక్కంబగు నల్క నర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ గృ**
**ష్ణుని సారథ్యము నై జగత్త్రితయ సంక్షోభంబు గా కుండునే? 266**

**ప్రతిపదార్థం:** మనకున్; ఈక+ఉండఁగన్, వచ్చునే?= ఇవ్వకుండా ఉండటానికి మనకు శక్యమా?; మనము; దుర్మానంబు= చెడుగర్వాన్ని; పాటించి= పూని; ఒప్పని కార్యంబులు+పట్టి= తగని పనులు చేసి; వారికిన్; తగన్= తగునట్లుగా; పాలు+ఈక= భాగం ఇవ్వక; గర్వంబులు+ఆడినన్= గర్వంగా మాటాడితే; నిక్కంబు+అగు+అల్కన్= నిజమైన కోపంతో; అర్జునుఁడు, గాండీవంబున్; మోపెట్టన్= ఎక్కుపెట్టితే; కృష్ణుని సారథ్యమున్+ఐ= దానికి తోడు శ్రీకృష్ణుడి సారథ్యం కూడా ఉండి; జగత్+త్రితయ సంక్షోభంబు+కాక+ఉండునే?= మూడులోకాలకు కలత సంభవించకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** వారిభాగం వారికి ఇవ్వకుండా ఉందామన్నా మనకు శక్యం కాదు. మనం దురహంకారం పూని చేయగూడని పనులు చేసి వారికి సముచితంగా భాగం పంచిపెట్టక గర్వంగా మాటాడితే, నిజమైన కోపంతో అర్జునుడు గాండీవం ఎక్కుపెట్టగా, దానికి శ్రీకృష్ణుడి సారథ్యం కూడా తోడుకాగా ముల్లోకాలూ దద్దరిల్లకుండా ఉంటాయా?

**తే.** **అలఘు గదఁ బూంచికొని భీముఁ డతిరయమునఁ । గురుకుమారులపైఁ దీవ్రకోప మెసఁగఁ**
**గవియు టాత్మ భావించినఁ గంప మడరు; । నిక్క మెవ్వరు మార్కొని నిలుచువారు?** **267**

**ప్రతిపదార్థం:** భీముఁడు; అలఘు గదన్= పెద్ద గదను; పూంచి కొని= పట్టుకొని; అతి రయమునన్= మిక్కిలి వేగంతో; కురు కుమారులపైన్= కౌరవులమీద; తీవ్ర కోపము+ఎసఁగన్= తీవ్ర మైన కోపం అతిశయించగా; కవియుట= క్రమ్ముకొనటం; ఆత్మన్= మనస్సులో; భావించినన్= ఊహించుకుంటే; కంపము= వణకు; అడరున్= అధికమవుతుంది; నిక్కము= నిజంగా; ఎవ్వరు; మార్కొని= అతడిని ఎదుర్కొని; నిలుచువారు?= నిలువగలిగేవారు?

**తాత్పర్యం:** పెద్ద గద ధరించి భీముడు అమితవేగంతో తీవ్రమైన కోపం అతిశయించగా కౌరవులమీద పడటం మనస్సులో ఊహించుకొంటే వణకు పుట్టుకొస్తుంది. నిజంగా అతడిని ఎదిరించి నిలబడగలవారెవరు?

**సీ.** **కవ లగ్రజన్ముల కంటె నేమిటఁ గీడు? । ద్రుపదుఁ డల్పుండె? తత్సుతులు బాహు**
**గర్వ సమగ్రులు గారె? విరాటుండు । నాతని తమ్ములు, నాత్మజులును**
**నసదులే? సాత్యకి యలఁతులఁ బోయెడు । వాఁడె? వృష్ణి కుమారవరు లనేకు**
**లట్టి యోధులు పోర నరవాయిఁ గొందురే? । పాండ్యుండుఁ, గేకయపతులు నాది**

**తే.** **యైన బంధులు, మిత్త్రులు నగ్గలికలఁ । గొఱఁత వడియెడు వారె? యందఱను గెల్వ**
**నోపినను రుద్రునకు నైన నోర్వరాని । ధర్మపుత్త్రు కోపమునకుఁ దలఁకవలదె?'** **268**

**ప్రతిపదార్థం:** కవలు= నకుల సహదేవులు; అగ్ర జన్ములకంటెన్= అన్నగార్లకంటె; ఏమిటన్= ఎందులో; కీడు?= తక్కువ?; ద్రుపదుఁడు; అల్పుండె?= తక్కువ వాడా?; తద్+సుతులు= అతడి కొడుకులు; బాహు గర్వ సమగ్రులు+కారె?= భుజ బల గర్వంతో నిండినవారు కారా?; విరాటుండున్, ఆతని తమ్ములున్; ఆత్మజులునున్= కొడుకులూ; అసదులే?= తక్కువవారా? సాత్యకి; అలఁతులన్+పోయెడు వాఁడె?= తేలికగా పోయేవాడా?; వృష్ణి కుమార వరులు= వృష్ణివంశీయులైన కుమార శ్రేష్ఠులు; అనేకులు+అట్టి యోధులు= పెక్కుమంది అటువంటి యోధులు; పోరన్= యుద్ధంలో; అరవాయిన్+కొందురే?= జంకుతారా?; పాండ్యుండున్; కేకయ పతులున్= కేకయదేశపు రాజులూ; ఆది+ఐన బంధులున్= మొదలైన చుట్టాలూ; మిత్త్రులున్= స్నేహితులూ; అగ్గలికలన్= విజృంభించటంలో; కొఱఁత+పడియెడు వారె?= తక్కువ వాళ్ళా?; అందఱను గెల్వన్+ఓపినను=

వాళ్ళందరినీ గెలవగలిగినా; రుద్రునకున్+ఐనన్= రుద్రుడికి కూడా; ఓర్వరాని= ఓడించ తరం కాని; ధర్మపుత్త్రు కోపమునకున్= ధర్మరాజు కోపానికి; తలఁకవలదె?= వెరవవలదా?

**తాత్పర్యం:** నకుల సహదేవులు అన్నగార్లకంటె ఎందులో తక్కువ? ద్రుపదుడు తక్కువవాడా? అతడి కొడుకులు భుజబల గర్వం నిండినవాళ్ళు కారా? విరాటుడూ, అతడి తమ్ములూ, కొడుకులూ తక్కువ వాళ్ళా? సాత్యకి అంత తేలికగా పోయేవాడా? వృష్ణి వంశీయులైన కుమార శ్రేష్ఠులు, అటువంటి యోధులు అనేకులు యుద్ధంలో జంకుగొంటారా? పాండ్యరాజూ, కేకయదేశపు రాజులూ మొదలైన చుట్టాలూ, స్నేహితులూ విజృంభించటంలో తక్కువ తిన్నవాళ్ళా? అందరినీ ఓడించగలిగినా, రుద్రుడికి కూడా ఓడించటానికి శక్యం కాని ధర్మరాజు కోపానికి భయపడవలసిందే కదా!'

**విశేషం:** ధృతరాష్ట్రుడి మాటలను బట్టి అతడికి పాండవులమీద ప్రేమకంటె, వారంటే భయమే ఎక్కు వనిపిస్తుంది.

**వ. అని పలికి సంజయుదిక్కు మొగంబై యెల్లవారును విన నిట్లనియె. 269**

**ప్రతిపదార్థం:** అని, పలికి, సంజయు దిక్కు మొగంబు+ఐ= సంజయుడి కేసి చూచి; ఎల్లవారునున్= అందరూ; వినన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికి సంజయుడివైపు చూచి అందరూ వినేటట్లు ఇట్లా అన్నాడు.

**తే. నీవు ధర్మజుపాలికి నెమ్మి నరుగు; । మతఁడు పేరోలగం బున్న యవసరమునఁ**
**గాన్పు; మతనికి ననుజవర్గంబునకును । బంధులకు నింపు పుట్టంగఁ బలుకు మచట. 270**

**ప్రతిపదార్థం:** నీవు; ధర్మజు పాలికిన్= ధర్మరాజు దగ్గరకు; నెమ్మిన్= ప్రీతితో; అరుగుము= వెళ్ళుము; అతఁడు; పేరోలగంబు (పేరు+ఓలగంబు)+ఉన్న+అవసరమునన్= పెద్ద కొలువు తీర్చిఉన్న సమయంలో; కాన్పుము= కనిపించుము; అతనికిన్, అనుజ వర్గంబునకున్= తమ్ముల సమూహానికీ; బంధులకున్= చుట్టాలకూ; ఇంపు= సంతోషం; పుట్టంగన్= కలిగే విధంగా; అచటన్= అక్కడ; పలుకుము= మాటలాడుము.

**తాత్పర్యం:** నీవు ధర్మరాజు వద్దకు ప్రీతితో వెళ్ళుము. అతడు పెద్ద కొలువు తీర్చిన సమయంలో దర్శించుకొనుము. అతడికీ, ఆతడి తమ్ములకూ, బంధువులకూ సంతోషం కలిగే విధంగా అక్కడ మాటాడుము..

**క. నెయ్యము వాటించి, కడుం । దియ్య మెసఁగ, నలుక లెల్లఁ దీఱునటులుగాఁ**
**గయ్య మను తలఁపు లోనుగ । నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగునన్. 271**

**ప్రతిపదార్థం:** నెయ్యము+పాటించి= స్నేహం చూపి; కడున్= మిక్కిలి; తియ్యము+ఎసఁగన్= ప్రీతి అతిశయించగా; అలుకలు+ఎల్లన్= కోపాలన్నీ; తీఱు+అటులు+కాన్= తొలగిపోయే విధంగా; కయ్యము+అను తలఁపు+లోనుగన్= యుద్ధాలోచన మొదలుగా; ఆ+యమ నందనుఁడు= ఆ ధర్మరాజు; మాను+అట్టి తెఱఁగునన్= విడిచిపెట్టే విధంగా.

**తాత్పర్యం:** స్నేహం పాటించి, మిక్కిలి ప్రీతి అతిశయించగా, కోపాలన్నీ తీరిపోయేటట్లు ఆ ధర్మరాజు యుద్ధాలోచనాదికం మానే విధంగా.

**విశేషం:** ధృతరాష్ట్రు డీ పద్యంలో సంజయుడి రాయబారం సాధించవలసిన ప్రధాన ప్రయోజనాన్నీ, అందులో పాటించవలసిన విధానాన్ని నిర్దేశించాడు. 1.స్నేహం పాటించాలి. 2.వారిలో మిక్కిలి ప్రీతి అతిశయించేటట్లు చేయాలి. 3.ధర్మరాజు మనసులో ఉన్న కోపాలన్నీ తీరిపోవాలి. 4.ధర్మరాజు యుద్ధాలోచనం మానుకోవాలి. 5.శాంతిమార్గంలో కార్యం సాధించాలి. చివరి లక్ష్యం ధర్మరాజు యుద్ధాలోచన మానటం. ఇందులో రాజ్యభాగ ప్రసక్తి లేదు. ధర్మరాజు విరక్తికే ప్రాధాన్యం ఉన్నది. ఇది అపూర్వమైన రాయబారం. రాజనీతికి రత్నపరీక్ష వంటిది. (సంపా.)

### సంజయుఁ డుపప్లావ్యంబున నున్న పాండవులయొద్దకు వచ్చుట (సం. 5-22-39)

**వ. శాంతి ప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మనుట యొడఁగూర్చి రమ్ము; రథం బెక్కి పొ' మ్మని తగినతెఱంగున వీడ్కొలిపిన, సంజయుండునుం జని, యుపప్లావ్యంబు సొచ్చి, మాధవు మందిరంబున కరిగి, యభ్యంతర వినోదంబుల నరసహితుండై యున్న యన్నారాయణునకుం దనరాక యెఱింగించి పుచ్చి, తగఁ బ్రవేశించి, భయభక్తివినయ సంభ్రమంబులు మెఱయ వారలం గాంచి, యమ్మహాత్ము లిరువుర సంభావనంబులును, సంభాషణంబులునుం బడసి సంప్రీతచేతస్కుండై, మఱునాఁడు ధర్మతనయు నొడ్డోల గంబున్న సమయంబు వేచి, సముచితంబుగా నతనిం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన, నతండుం బ్రియపూర్వకంబుగా నాదరించి తన సమీపంబున నునిచికొనినం గొలిచియుండి యతని కిట్లనియె.** 272

**ప్రతిపదార్థం:** శాంతి ప్రకారంబునన్= శాంతి మార్గంలో; కార్యంబున్+నడపి= పనిని జరిపించి; ఒక్కటి+ఐ, మనుట= కలిసి బ్రతుకటం, ఒడన్‌కూర్చి రమ్ము= కలిగించి రావలసింది; రథంబు+ఎక్కి, పొమ్ము, అని; తగిన తెఱంగునన్= తగిన విధంగా; వీడ్కొలిపినన్= పంపగా; సంజయుండునున్, చని; ఉపప్లావ్యంబు+చొచ్చి= ఉపప్లావ్యపురం ప్రవేశించి; మాధవు మందిరంబునకున్ అరిగి= శ్రీకృష్ణుడి భవనానికి వెళ్ళి; అభ్యంతర వినోదంబులన్= అంతఃపురపు వేడుకలతో; నర సహితుండు+ఐ= అర్జునుడితో కూడినవాడై; ఉన్న+ఆ+నారాయణునకున్= ఉన్న ఆ శ్రీకృష్ణుడికి; తనరాక; ఎఱింగించి పుచ్చి= చెప్పి పంపి; తగన్+ప్రవేశించి= తగినట్లు ప్రవేశించి; భయ భక్తి వినయ సంభ్రమంబులు= భయమూ, భక్తీ, అడకువా, గౌరవమూ; మెఱయన్= ప్రకాశించగా; వారలన్, కాంచి; ఆ+మహాత్ముల+ఇరువుర= ఆ మహనీయు లిద్దరియొక్క; సంభావనంబులును= ఆదరములూ; సంభాషణంబులునున్= మాటలూ; పడసి= పొంది; సంప్రీత చేతస్కుండు+ఐ= సంతోషించిన మనస్సు కలవాడై; మఱునాఁడు; ధర్మ తనయు+ఒడ్డోలగంబు (ఒడ్డు+ఓలగంబు)+ఉన్న, సమయంబు వేచి= ధర్మరాజు నిండుకొలువుండే సమయం కాచుకొని; సముచితంబుగాన్= తగినరీతిని; అతనిన్= ధర్మరాజును; కని; సాష్టాంగంబుగాన్+ప్రణమిల్లినన్= సాష్టాంగంగా (ప్రధానాలైన ఎనిమిది శరీరావయవాలు నేలకు తాకేటట్లు) నమస్కరించగా; అతండున్= ధర్మరాజుకూడా; ప్రియ పూర్వకంబుగాన్= సంతోషపురస్సరంగా; ఆదరించి= గౌరవించి; సమీపంబునన్= దగ్గరగా; ఉనిచికొనినన్= ఉంచగా (ఉండేటట్లు కూర్చుండబెట్టుకొనగా); కొలిచి+ఉండి= సేవించి; అతనికిన్+ఇట్లు+అనియెన్= ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** శాంతిమార్గంలో కార్యం నడిపి కలిసి బ్రతకటాన్ని సాధించుకొని రమ్ము, రథమెక్కి వెళ్ళుము' అని తగిన విధంగా పంపగా, సంజయుడునూ వెళ్ళి, ఉపప్లావ్యపురం ప్రవేశించి, శ్రీకృష్ణుడి భవనానికి పోయి, అంతఃపురం ప్రవేశించి, అంతఃపురపు వేడుకలలో అర్జునుడితో కూడి ఉన్న ఆతడికి తన ఆగమనవార్త చెప్పి పంపి, ఒప్పుగా ప్రవేశించి, భయమూ, భక్తీ, వినయమూ ప్రకాశించగా వారిని చూచి, ఆ ఇద్దరి మహనీయుల మర్యాదలూ,

మన్ననలూ పొంది, సంతోషించిన మనస్సు కలవాడై మరునాడు ధర్మరాజు పెద్ద కొలువు తీర్చే సమయం కాచుకొని ఉండి, తగిన రీతిని ఆతడిని దర్శించి, సాష్టాంగ నమస్కారం చేశాడు. ధర్మరాజు ప్రీతి పురస్సరంగా ఆదరించి దగ్గర కూర్చుండ బెట్టుకొనగా సంజయుడు సేవించి అతడితో ఇట్లా అన్నాడు.

**తే. 'భాగ్యమున నిన్నుఁ గనుఁగొనఁ బడసి నాదు । చూడ్కి చరితార్థ మయ్యె; నస్తోక పుణ్య**
**ధనుఁడు మీ తండ్రి ధృతరాష్ట్ర ధరణినాథుఁ । డిందు మీ యున్కి విని, ప్రియ మెసకమెసఁగ. 273**

**ప్రతిపదార్థం:** భాగ్యమునన్= అదృష్టంచేత; నిన్నున్; కనుఁగొనన్+పడసి= చూడగలిగి; నాదు చూడ్కి= నా దృష్టి; చరితార్థము+ అయ్యెన్= సార్థక మయింది; అస్తోక పుణ్య ధనుఁడు= అనల్పమైన పుణ్యం ధనంగా గలవాడు(అగు); మీ తండ్రి ధృతరాష్ట్ర ధరణి నాథుఁడు= మీ తండ్రి అయిన ధృతరాష్ట్ర మహారాజు; ఇందున్= ఇక్కడ; మీ+ఉన్కి= మీరు ఉండటం; విని; ప్రియము= ప్రీతి; ఎసకము+ఎసఁగన్= అతిశయించగా.

**తాత్పర్యం:** 'అదృష్ట వశాన నిన్ను చూడగలగటం వలన నా దృష్టి సార్థకమయింది. అధిక పుణ్యధనుడైన మీ తండ్రి ధృతరాష్ట్ర మహారాజు మీ రిక్కడ ఉండటం విని, ప్రీతి అతిశయించగా.

**విశేషం:** సంజయుడు మాటలాడే తీరు ధర్మజుడికి ఆశాజనకంగా లేదు. ఆప్యాయంగా రాజ్యభాగమిచ్చి హస్తినాపురానికి పిలవటానికి సంజయుడు వచ్చినట్లు లేదు. అందువలన అతడు మాట్లాడే మాటలన్నీ కంటితుడుపు మాటలని ధర్మజుడు అంచనా వేయసాగాడు. సంజయుడు పొందకుండ మాట్లాడాలని యత్నించటం, ధర్మజుడు అతడికి అందకుండా మాట్లాడటం మొదలౌతున్నది. పైకి లోకమర్యాదకై మాటలాడుతున్నా, లోన ఒక గూఢమైన విరుద్ధార్థం స్ఫురించటం సంజయుడి సంభాషణ శిల్పం. అదృష్టవశాన నిన్ను చూడగలిగాననటం ఇది ఔపచారికం. నిన్ను మరల చూస్తానని అనుకొనలేదు. అదృష్టవశాన చూడగలిగాను - అని గూఢార్థం. నా దృష్టి సార్థకమయింది - ఇది లౌకికం. నిన్ను దర్శించటం వలన నా దృక్పథం ప్రయోజనంతో కూడినదయింది - ఇది గూఢార్థం. మీ తండ్రి మీరిక్కడ ఉన్నారని తెలిపి ప్రీతి చెందాడన్నాడు. పాండవులు క్షేమంగా ఉన్నారని తెలిసి సంతోషించాడని ప్రకృతార్థం. అయితే ధృతరాష్ట్రుడికి వాడిన విశేషణాలు ధర్మరాజును అధిక్షేపిస్తున్న భావాన్ని ధ్వనింపజేస్తాయి. రాజు అస్తోకపుణ్యధనుడట! ధరణినాథుడట! ఈ రెండింటిని కలిపి చదువుకొంటే ధృతరాష్ట్రుడు అపారపుణ్యధనుడు కాబట్టి ప్రభువై రాజ్యాన్ని పాలిస్తున్నాడనీ, అత డొక్కడే రాజనీ అర్థమేర్పడుతుంది. పరిశేషన్యాయంతో పుణ్యహీనులైన పాండవులు ఈ విధంగా రాజ్యహీనులై ఉపప్లావ్య నగరంలో ఉన్నందుకు తండ్రి ప్రీతి చెందాడనే విపరీతార్థం స్ఫురించే అవకాశం ఉన్నది. గూఢవ్యంగ్యార్థ ధ్వని కాకువు నాశ్రయించి ఈ పద్యంలో రాణించింది. (సంపా.)

**క. అనుజులు నీవును ద్రోవది । యును బుత్త్రచయంబు నున్న యోగక్షేమం**
**బున తెఱఁ గారయఁ బుత్తెం । చె నితాంత స్నేహపూర్ణ చేతోవృత్తిన్.' 274**

**ప్రతిపదార్థం:** అనుజులున్= తమ్ములూ; నీవును; ద్రోవదియును= ద్రౌపదీ; పుత్త్ర చయంబున్= కుమారుల సమూహమూ; ఉన్న యోగక్షేమంబున తెఱఁగు= కుశలంగా ఉన్న విధం; ఆరయన్= తెలిసికొనటానికి; నితాంత స్నేహ పూర్ణ చేతస్(ః)+ వృత్తిన్= అధికమైన మైత్రితో నిండిన మనోవ్యాపారంతో; పుత్తెంచెన్= (నన్ను) పంపాడు.

**తాత్పర్యం:** తమ్ములూ, నీవూ, ద్రౌపదీ, నీ కొడుకులూ కులాసాగా ఉన్న విధం తెలిసికొనటానికి అధిక మైత్రితో నిండిన మనస్సుతో నన్ను పంపాడు.

**విశేషం:** 1. 'నితాంత స్నేహపూర్ణ చేతోవృత్తిన్' - అని ఎంతో గొప్పగా చెప్పి, పాండవులు యోగక్షేమాలతో ఉన్న విధం తెలిసికొని రమ్మని రాజు సంజయుడిని పంపినట్లు తెలిపాడు. అంత అనురాగం నిండిన వాడు శూన్యహస్తాలతో క్షేమాదులను తెలిసికొనటానికి పంపాడంటే- ఎంత మర్యాదగా ఉంటుందో, అంత ఎగతాళిగా ఉంటుంది. ధర్మజుడు మెత్తనిపులి. సంజయుడికి దీటుగా మాట్లాడి దెబ్బకు దెబ్బ తీయాలనుకొనటానికి ఈ మాటలే హేతువులయ్యాయి.

2. పాండవులకు 'ఇంపు పుట్టంగఁ బలుకు'మని (270 వ పద్యం) ధృతరాష్ట్రుడు చెప్పిన మాటలకు అనువుగా నెయ్యం, తియ్యం, ప్రీతి అతిశయించేటట్లు పాండవుల వద్దకు ధృతరాష్ట్రుడు తనను పంపాడని చెప్పనారంభించాడు. (సంపా.)

**వ. అనిన సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 275**

**ప్రతిపదార్థం:** అనినన్; సూతనందనునకున్= సూతపుత్రుడైన సంజయుడికి; ధర్మ నందనుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనిపల్కిన సంజయుడితో ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**క. 'ఆ రాజు మా దెసం గల । కారుణ్యము కతముననుు సుఖంబున ని ట్లు**
**న్నారము; నినుఁ బుత్తెంచిన । గారవమున నాదుమది వికాసముఁ బొందెన్. 276**

**ప్రతిపదార్థం:** ఆ రాజు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; మాదెసన్+కల= మాయందు కలిగి ఉన్న; కారుణ్యము కతమునను= దయ కారణంగా; సుఖంబునన్= సుఖంగా; ఇట్లు+ఉన్నారము= ఇట్లా ఉన్నాం; నినున్, పుత్తెంచిన గారవమునన్= పంపిన వాత్సల్యం చేత; నాదు మది= నా మనస్సు; వికాసమున్+పొందెన్= సంతోషించింది.

**తాత్పర్యం:** 'ఆ ధృతరాష్ట్ర మహారాజుకు మా మీద ఉన్న దయచేత మేము ఇట్లా సుఖంగా ఉన్నాము. నిన్ను ఇక్కడకు పంపి చూపిన వాత్సల్యంచేత నా మనస్సు సంతోషించింది.

**విశేషం:** 1. ధర్మరాజు 'మెత్తని పులి' అనిపించే పద్యాలలో ఇది ఆణిముత్యం. ఈ పద్యంలో కాకువు నాశ్రయించి వ్యతిరేక వ్యంగ్యార్థం స్ఫురిస్తుంది. ఆ అర్థాన్ని ఇట్లా భావించవచ్చును. ఆ రాజుకు మా పట్ల ఉన్న దయ వలన ఇట్లా సుఖంగా ఉన్నాం - అన్నప్పుడు దయ-దయకాదు, కాపట్యం వలన అని అర్థం. ఇట్లు-అంటే ఈ విధంగా రాజ్యహీనులమై అని భావం; సుఖంగా - అంటే దుఃఖంగా అనీ, ఉన్నారమంటే-ఏదో ఇట్లా బ్రతుకు ఈడుస్తున్నాం అని భావం. తెలుగువారి వ్యవహారంలో దయ, ఇట్లు, సుఖంగా, ఉన్నాం - అనే మాటలు వ్యతిరేకార్థక ధ్వనికి వాడటం సర్వసామాన్యం. గౌరవవాక్యాలుగా పలికి, కాకువుతో అధిక్షేపంగా మార్చి, దెప్పిపొడుపు మాటలుగా వెలువరించిన ఈ పద్యం సంజయవాక్య రచనాశిల్పానికి ప్రతిస్పర్ధి శిల్పం. సంజయుడి వాక్యం ప్రౌఢం; ధర్మజుడి వాక్యం ప్రౌఢతరం. ఈ పద్యాన్ని తెలుగువారు లోకోక్తిగా వాడుకొంటారు.

2. 'నినుఁ బుత్తెంచిన గారవమున నాదుమది వికాసముఁ బొందెన్' - ఇది పైకి నిండుగా కనిపించే ప్రశంసావాక్యం. కాని దాని వెనుక ధర్మజుడి నిష్ఠురత్వం కూడా వ్యంగ్యంగా ధ్వనిస్తుంది. ద్రుపదపురోహిత రాయబారం విఫలమైన తరువాత, సంధి పొసగదని నిరాశ చెందుతున్న సమయంలో మాతండ్రి మిమ్ములను గౌరవంగా నా వద్దకు పంపటం వలన మనస్సు వికసించిందని ప్రకృతార్థం. ఎన్నో విషయాలు తెలిసి మనస్సు మరింత వివేకవంతమైనదని రెండో అర్థం. న్యాయమైన రాజ్యభాగాన్ని ఇవ్వకుండా, కఱ్ఱ విరుగకుండా, పాము చావకుండా ఎన్ని ఎత్తులు వేయవచ్చునో తెలిసికొని ధర్మజుడి బుద్ధి వికాసం పొందిందని గూఢార్థం. మూలంలోని ధర్మరాజువలె - 'చిర దిదం కుశలం భారతస్య । శ్రుత్వా రాజ్ఞః కురువృద్ధస్య సూత । మన్యే సాక్షా ద్దృష్ట మహం నరేంద్రం దృష్ట్వైత్వాం సంజయ ప్రీతి యోగాత్'' (సం. 5.23 .7) అనిఅనడు. సంజయుడు

రావటం సాక్షాత్తు ధృతరాష్ట్రుడు వచ్చినట్లే ఉన్నదనటం అతడి వినయసూచకం. తెలుగులో ధర్మరాజు అంత బయటపడేవాడు కాడు. (సంపా.)

3. ఆ రాజు - అని అనటం - సంజయుడు 273 పద్యంలో 'మీ తండ్రి ధృతరాష్ట్ర ధరణి నాథుఁడు' అని అన్నందుకు తిరిగి వడ్డింపు. తండ్రిగా కాక రాజుగా నిన్ను రాయబారిగా పంపాడు. ధృతరాష్ట్రుడికి మా పట్ల రాజ్యతంత్రమే కాని స్నేహతంత్రం లేదని అధిక్షేపం. ఇట్లు - అనేది అభినయ స్ఫోరక వాచకం. (సంపా.)

4. ధృతరాష్ట్రుడికి ధర్మరాజాదులపై ఏ మాత్రం వాత్సల్యం ఉందో అందరికీ తెలుసు. కాని, ధర్మరాజు ఇట్లా మాటలాడడంలో వ్యతిరేక లక్షణం గోచరిస్తుంది. 'సుఖంబున నిట్లున్నారము' అనడం కూడా అట్లాంటిదే.

**క. అమ్మనుజేశ్వరునకు సే । మమ్మే? పుత్త్రకులు సుఖులె? మనుమలు సమ్మో**
**దమ్మునఁ బెరిఁగెదరే? నగ । రమ్ముల భూములను శుభపరంపర గలదే ? 277**

**ప్రతిపదార్థం:** ఆ+మనుజ+ఈశ్వరునకున్= ఆ రాజుకు - ధృతరాష్ట్రుడికి; సేమమ్మే?= కుశలమా?; పుత్త్రకులు= కొడుకులు; దుర్యోధనాదులు; సుఖులె?= సుఖంగా ఉన్నారా?; మనుమలు; సమ్మోదమ్మునన్= సంతోషంతో; పెరిఁగెదరే?= పెరుగుతున్నారా? నగరమ్ములన్= పట్టణాలలోనూ; భూములను= జనపదాలలోనూ, పంటనేలలోనూ; శుభ పరంపర= మేళ్ళ వరుస, కలదే?= ఉన్నదా?

**తాత్పర్యం:** రాజైన ధృతరాష్ట్రుడికి క్షేమమా? అతడి కొడుకులు దుర్యోధనాదులు కుశలురా? మనుమలు సంతోషంతో పెరుగుతున్నారా? పట్టణాలలోనూ జనపదాలలోనూ శుభపరంపర ఉన్నదా?

**విశేషం:** ధర్మరాజు క్షేమసమాచారము లడిగేటప్పుడు కూడా క్రమంతప్పడు. రాజునూ, రాజుకుటుంబాన్నీ మొదట ప్రస్తావించాడు. ఆ తరువాత ప్రజా కుటుంబాన్ని గురించి ప్రశ్నించాడు. ప్రజలను నాగరకులూ, జానపదులూ అని వింగడించాడు. వారి వారి నివాసస్థలాలైన నగరాలనూ, పంటభూములుగల జనపదాలనూ పరామర్శించాడు. అడిగే ప్రశ్నలలో క్రియాపదాలు కూడా సార్థకాలే. రాజు క్షేమమా? పుత్రులు సుఖులా? మనుమలు సంతోషంతో ఉన్నారా? ఈ మూడు పలకరింపులలో వారి వారి మనస్తత్త్వాలు ధ్వనిస్తున్నాయి.(సంపా.)

**సీ. ద్రోణుండుఁ, గృపుఁడును, ద్రోణసుతుండును । సుఖమున్నవారె? సుశ్లోకుఁడైన**
**భీష్ముడు కుశలియే? పెద్దతనం బిచ్చి । యాతనిఁ గౌరవు లనుసరించి**
**మెలఁగుదురే? బ్రాహ్మణులకు మన్నన గల్గి । యుండునే? యే మర్థి నొసఁగి నట్టి**
**వృత్తులు సెల్లునే? యొత్తొరు వొండుల । వలనఁ బుట్టదుగదా? కలఁకు లందుఁ**

**తే. బుట్టినప్పుడు గాండీవి భుజబలంబుఁ । దలఁతురే? భీమసేను గదా విహార**
**ముగ్గడింతురె? కవలు మహోగ్రరిపుల । భూము లంతంత కొత్తుట పొగడఁబడునె? 278**

**ప్రతిపదార్థం:** ద్రోణుండున్; కృపుఁడును; ద్రోణ సుతుండును= అశ్వత్థామా; సుఖము+ఉన్నవారె?= సుఖంగా ఉన్నారా?; సుశ్లోకుఁడు+ఐన= కొనియాడబడే; భీష్ముండు; కుశలియే= క్షేమంగా ఉన్నాడా?; కౌరవులు; అతనిన్; పెద్ద తనంబు+ఇచ్చి= పెద్దరికం ఉంచి; అనుసరించి మెలఁగుదురే?= అనువర్తిస్తారా?; బ్రాహ్మణులకున్; మన్నన= ఆదరం; కల్గి+ఉండునే; మేము=

మేము; అర్థిన్= కోరికతో; ఒసఁగిన+అట్టి= ఇచ్చినటువంటి; వృత్తులు= జీవనోపాధులు; చెల్లునే?= కొనసాగుతున్నాయా? ఒత్తారువు= సంపీడనము- బాధ; ఒండులవలనన్= ఇతరులనుండి; పుట్టదు+కదా?= కలుగదు కదా?; అందున్= అక్కడ; కలఁకులు= కలతలు; పుట్టిన+అప్పుడు= ఏర్పడినప్పుడు; గాండీవి భుజ బలంబు= అర్జునుడి బాహు పరాక్రమం; తలఁతురే?; భీమసేను గదా విహారము= భీముడి గదాయుధ క్రీడ; ఉగ్గడింతురె?= ప్రశంసిస్తారా?; కవలు= నకుల సహదేవులు; మహత్ (మహా)+ఉగ్ర రిపుల= మిక్కిలి భయంకరులైన శత్రువులను; భూముల+అంతంతకు= రాజ్యంలోని ప్రదేశాల చివరలకు; ఒత్తుట= తరిమివేయటం; పొగడన్+పడునె?= కీర్తించబడుతుందా?

**తాత్పర్యం:** ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా సుఖంగా ఉన్నారా? సుప్రసిద్ధుడైన భీష్ముడికి క్షేమమా? కౌరవులు అతడికి పెద్దరికం ఇచ్చి అనువర్తిస్తూఉంటారా? బ్రాహ్మణులకు ఆదరం ఉన్నదా? మేము కోరి వారి కిచ్చిన జీవనోపాధులు కొనసాగుతున్నాయా? ఇతరులనుండి ఏ బాధా పుట్టదు గదా? అక్కడ కలతలు పుట్టినప్పుడు వారు గాండీవి బాహుపరాక్రమం తలచుకొంటారా? భీముడి గదాయుధ క్రీడ ప్రశంసిస్తారా? నకుల సహదేవులు భయంకరులైన శత్రువుల భూములను క్రమక్రమంగా ఆక్రమించటం స్తుతించబడుతున్నదా?

**విశేషం:** కౌరవులు భీష్ముడి పెద్దరికం పరిగణించరనీ, తాము బ్రాహ్మణుల కిచ్చిన అగ్రహారాదికాలను వారు కొనసాగించరనీ, తన తమ్ముల పరాక్రమాన్ని వారు తలపెట్టుతూ ఉంటారనీ ధర్మరాజు విశ్వాసం. అందులోనుండి పుట్టిన ఈ ప్రశ్నలు వ్యంగ్యార్థ బంధురాలు.

**మ. ఒకనాఁడా తమ ముందటం బలుమఱున్ హోరాటమై నేల యొ**
**త్తి కొనంగా బవరంబులన్ గెలువఁగాఁ దెల్లఁబుగాఁ జూచి పాం**
**డు కుమారాళి నుతింపకుండుదురె? యాటోపంబునన్ ఘోషయా**
**త్రకు గంధర్వులు వచ్చినప్పటి చరిత్రం బాత్మలం బాయునే? 279**

**ప్రతిపదార్థం:** ఒకనాఁడా?= ఒక్కనాడుకాదు; తమముందటన్= తమ ఎదుట; పలుమఱున్= ఎన్నోసార్లు; హోరాటమైన్= ఆటోపంతో; నేల+ఒత్తికొనంగాన్= నేల ఒత్తుకొనేటట్లు; బవరంబులన్= యుద్ధాలలో; గెలువఁగాన్; తెల్లంబుగాన్+చూచి= కళ్ళారా చూచి; పాండు కుమార+ఆళిన్= పాండవుల సమూహాన్ని; నుతింపక+ఉండుదురె?= పొగడకుండా ఉంటారా?; గంధర్వులు; ఆటోపంబునన్= గర్వంతో పెద్దపెట్టున; ఘోష యాత్రకున్; వచ్చిన+అప్పటి చరిత్రంబు= వచ్చిన నాటి వృత్తాంతం; ఆత్మలన్+ పాయునే?= మనస్సుల నుండి పోతుందా? మరచిపోతారా?

**తాత్పర్యం:** ఒకనాడా! తమ ఎదుట ఎన్నోమార్లు ఆటోపంతో నేల క్రుంగిపోయే విధంగా యుద్ధాలు గెలవటం కళ్ళారా చూచి కౌరవులు పాండవులను ప్రశంసించకుండా ఉంటారా? గంధర్వులు పెద్దపెట్టున ఘోషయాత్రకు వచ్చిన ఆనాటి వృత్తాంతం మరచిపోతారా?

**విశేషం:** అరణ్య వాసకాలంలో పాండవులు ద్వైతవనంలో ఉండగా దుర్యోధనుడు వారిని చిన్నపుచ్చటానికి ఘోష యాత్ర నెపంతో సపరివారంతో వచ్చి చిత్రరథుడనే గంధర్వుడిచేత చావుదెబ్బలు తిని భీమార్జునులచేత రక్షించబడ్డ వృత్తాంతం ఇక్కడ స్మరించాలి. ఆ వృత్తాంతాన్నీ, పూర్వ విజయాలనూ హస్తినాపురంలో మరచిపోకుండా స్మరిస్తున్నారా?- అని ప్రశ్నించి ధర్మరాజు తాము కౌరవులకు చేసిన మేలును, తమ పరాక్రమ విశేషాలనూ గుర్తు చేసి గడుసుదనం ప్రకటించాడు.

**క. వినుము మనము మధ్యస్థుల; । మని నర్జును నెదిరి, సంజయా! యిటము న్నె**
**వ్వనికిని మానముఁ బ్రాణం । బును దగఁ దక్కించుకొనఁగఁ బోలెనె చెపుమా! 280**

**ప్రతిపదార్థం:** సంజయా!; వినుము, మనము; మధ్యస్థులము= మధ్యవర్తులం; అనిన్= యుద్ధంలో; అర్జునున్; ఎదిరి= ఎదుర్కొని; ఇటమున్ను= ఇంతకుముందు; ఎవ్వనికిని= ఎవడికైనా; మానమున్= గౌరవం; ప్రాణంబును= ప్రాణమూ; తగన్= చక్కగా; దక్కించు కొనఁగన్+పోలెనె= నిలుపుకొనటం సాధ్యపడిందా? చెపుమా.

**తాత్పర్యం:** సంజయా! వినుము. మనం మధ్యవర్తులం. యుద్ధంలో అర్జునుడిని మార్కొని ఇంతకుముందు ఎవరికైనా మానప్రాణాలు రక్షించుకొనగలగటం సాధ్యపడిందా? నీవే చెప్పుము.

**విశేషం:** మనము మధ్యస్థులం అనటంలో అర్జునుడు నా తమ్ముడు గదా అని పక్షపాతంతో మాటాడటం లేదని ధర్మరాజు సూచన. కౌరవులందరూ యుద్ధంలో అర్జునుడికి ఓడి మానప్రాణాలను దక్కించుకొన్నవారే. అందువలన పాండవులపట్ల కృతజ్ఞులై ఉండాలి. అట్లా ఉంటున్నారా? అని వ్యంగ్యంగా అడిగాడు ధర్మరాజు.

**క. దుర్యోధను నింటం దగు । కార్యమునకు ఖడ్గమునకుఁ గలవాఁడై చా**
**తుర్యంబు మెఱయు కర్ణుని । యార్యత్వము సెల్లుచున్న యదియే నెమ్మిన్?' 281**

**ప్రతిపదార్థం:** దుర్యోధను+ఇంటన్= దుర్యోధనుడి ఇంటియందు; తగు= ఒప్పే; కార్యమునకున్, ఖడ్గమునకున్= పేచీ పూచీలకు; కలవాఁడు+ఐ= ఉన్నవాడయి; చాతుర్యంబు మెఱయు= నేర్పు ప్రకటించే; కర్ణుని+ఆర్యత్వము= కర్ణుడి పెద్దరికం; నెమ్మిన్= బాగా; చెల్లుచున్+ఉన్న+అది+ఏ?= కొనసాగుతున్నదా?

**తాత్పర్యం:** దుర్యోధనుడి ఇంట్లో వచ్చే పేచీ పూచీలకు నే నున్నానంటూ నేర్పు ప్రకటించే కర్ణుడి పెత్తనం బాగా సాగుతున్నదా?

**విశేషం:** తెలుగుజాతీయం ఉట్టిపడే ఈ కర్ణుడినిగూర్చిన పలకరింపు ధర్మరాజు హృదయంలో ఉన్న గూఢామర్షాన్ని ధ్వనింపచేస్తున్నది. దుర్యోధనుడి ఇంట్లో - అన్నప్పుడు అది ఇల్లు మాత్రమే కాదు, దుర్యోధనుడి ఆంతరంగిక విషయాలలో కూడా అని భావం. కార్యానికీ ఖడ్గానికీ- తెలుగు జాతీయం. కార్యమంటే ఆలోచన; ఖడ్గమంటే యుద్ధం. దుర్యోధనుడి ఆలోచనలన్నీ కర్ణుడివే. కర్ణు డెప్పుడూ సమస్యలకన్నింటికీ యుద్ధమే పరిష్కారంగా భావిస్తాడు. దుర్యోధనుడు యుద్ధోన్ముఖుడు కావటానికి కర్ణుడి ప్రోత్సాహం ఒకవైపు. అతడి పరాక్రమం మీద దుర్యోధనుడికి ఉన్న విశ్వాసం మరొకవైపు కారణాలు కావటం కాదనలేని వాస్తవం. చాతుర్యం మెరసేటట్లు కర్ణుడి ఆర్యత్వం చెల్లుతున్నదా?- అన్నవాక్యం అధిక్షేపాత్మకం. కర్ణుడి చాతుర్యం దుర్యోధనుడిని మెప్పించటం కొరకు పడేపాట్లను సూచిస్తున్నది. ఆర్యత్వం వ్యతిరేకవ్యంగ్యం వలన అతడి దౌష్ట్యాన్ని ధ్వనింపచేస్తున్నది. ధర్మరాజు యోగక్షేమా లడిగిన వారందరూ హస్తినాపురంలో రాజనీతి నిర్ణయాలను తీసికొనటంలో ఏదో ఒక విధంగా పాలు పంచుకొనేవారే కావటం విశేషం. విదురాదుల ప్రసక్తి ధర్మరాజు తేలేదు. ఆయన మాట ఎవరూ పట్టించుకోరు కాబట్టి. కౌరవ నిర్ణయాలలో పాలు పంచుకొనే వారందరూ క్షేమమేకదా? వారి క్షేమానికి మూలకారణం అర్జునుడి వలన మానప్రాణాలు దక్కటమే కదా? ఈ సంగతి గుర్తుంచుకొనటమే క్షేమం-అని గడుసుగా హెచ్చరించటం ఈ మాటలోని ధ్వని. చిట్టచివరకు కర్ణుడిని గురించి అడగటంలో కూడా విశేషం ఉన్నది. అందరూ ఒక ఎత్తు. అత డొక్కడూ ఒక ఎత్తు. అందరూ క్షేమంగా ఉండటం అతడి ఆలోచన మీదా, అతడి యుద్ధప్రీతిమీదా, అతడి ఆర్యత్వం మీదా ఆధారపడి ఉన్నదని

హెచ్చరిక. 'కర్ణుడు లేనిది భారతం లే' దనే సామెత అందుకే పుట్టింది. ధర్మరాజు అడిగిన కుశల ప్రశ్నలు కౌరవులపై అతడి మనసులో ఉన్న రహస్యమైన క్రోధాగ్నిని ప్రకటించే వాఙ్మయ వ్యంగ్యాస్త్రాలు. (సంపా.)

**వ. అనిన విని సంజయుండు సవినయంబుగా నిట్లనుఁ 'గురురాజునొద్ద నవినీతులు, నీతిమంతులు, సత్త్వసంపన్నులు, దురహంకారులు, మఱియు వివిధ ప్రకారులు నయి బెరసి యుండుదురు; వా రొకళ్ళొకళ్ళ మాటలం బోయెడువారు గారు; కావున వారి నంత యనం బనిలేదు; నా విన్నపంబు చిత్తగింపుము.** **282**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; సంజయుండు; సవినయంబుగాన్= అడకువతో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; కురురాజు+ ఒద్దన్= దుర్యోధనుడి దగ్గర; అవినీతులున్= అవినయపరులూ; నీతిమంతులున్= నీతి యుక్తులూ; సత్త్వ సంపన్నులున్= సాత్త్వికులూ; దురహంకారులున్= దురభిమానులూ; మఱియున్= ఇంకా; వివిధ ప్రకారులున్= రకరకాల వాళ్ళు; అయి; బెరసి+ఉండుదురు= చేరి ఉంటారు; వారు; ఒకళ్ళు+ఒకళ్ళ మాటలన్+పోయెడువారు+కారు= ఒకరి మాట ఇంకొకరు వినిపించుకొనరు; కావునన్; వారిన్; అంత+అనన్+పని లేదు= అంతగా ప్రస్తావించ నక్కర లేదు; నా విన్నపంబు= నా మనవి; చిత్తగింపుము= శ్రద్ధగా వినుము.

**తాత్పర్యం:** అనగా విని సంజయుడు అణకువతో ఇట్లా అన్నాడు- 'దుర్యోధనుడి దగ్గర అవినయపరులూ, నీతిమంతులూ, సత్త్వగుణసంపన్నులూ, దురభిమానులూ - ఇంకా ఎన్నో రకాలవాళ్ళు చేరి ఉంటారు. వారు ఒకరిమాట ఇంకొకరు వినిపించుకొనరు. కాబట్టి వారిని గూర్చి ప్రస్తావించటం అనవసరం. నా మనవి శ్రద్ధగా ఆలకించుము.

**విశేషం:** 1. ధర్మరాజు కుశలప్రశ్నలు దాడి చేస్తున్నట్లున్నాయి. అందువలన సంజయుడు సవినయంగా సమాధానం చెప్పాడు. సముద్ర తరంగం పెల్లుబికి వస్తున్నప్పుడు తలవంచటమే నీతి. అందులోనూ రాయబారి వినయంగా వంగి ధర్మరాజు అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నట్లు పలికితే అతడిలోని ఉడుకు తగ్గుతుంది. అందుకే ధృతరాష్ట్రుడి కొలువులోని వారిలో అనేక విధాల వారున్నారనీ, వారందరూ ఒకరిమాట మరొకరు వినరనీ, వారిలో ఏకవాక్యత లేదనీ ఒప్పుకొన్నాడు. క్రమంగా ధృతరాష్ట్రుడి పుత్రాదులు అవినీతులనీ, ద్రోణభీష్మాదులు నీతిమంతులనీ, సత్త్వసంపన్నులనీ, కర్ణాదులు దురహంకారులనీ పేర్కొన్నట్లు స్పష్టం. అయితే వారిని గురించి పట్టించుకొనవలసిన అవసరం లేదనీ, ఈ ప్రస్తుతాంశం వారందరికీ సంబంధించినది కాదనీ సూచించాడు. తన విన్నపాన్ని వినుమని కోరాడు. (సంపా.)

2. సంజయుడు ఉన్న పరిస్థితి చెప్పి, తాను వచ్చిన అసలు విషయానికి వస్తున్నాడు.

**క. పొందొందఁగఁ దలఁచితి నీ । విందు శిశిరమైన విమల హృదయంబున; వా**
**రందఱకును సేమం; బిట । ముందఱ లేకున్న, నేఁడు మొదలుగఁ గలుగున్.** **283**

**ప్రతిపదార్థం:** నీవు; ఇందు= ఇప్పుడు, ఇక్కడ; శిశిరము+ఐన విమల హృదయంబునన్= చంద్రుడివలె చల్లనైన నిర్మల హృదయంతో; పొందు+ఒందఁగన్+తలఁచితి(వి)= సంధి చేసికొనాలని అభిప్రాయ పడుతున్నావు; వారు+అందఱకును= వారి కందరికీ; సేమంబు= క్షేమమే (సేమంబు=క్షేమం); ఇట ముందఱన్= ఇంతకు ముందు; లేక+ఉన్నన్= లేకపోయినా; నేఁడు మొదలుగన్= ఈ వేళ మొదలుకొని; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** నీవు చంద్రుడి వలె చల్లనైన నిర్మల హృదయంతో సంధి చేసికొనదలచావు. వారి కందరికీ క్షేమం ఇంతకుముందు లేకపోయినా, ఈ వేళ మొదలుకొని కలుగుతుంది.

**విశేషం:** ధర్మరాజు సంధి కోరుతూండటం వలన దుర్యోధనాదులు ఇంకా క్షేమంగా ఉంటారు. యుద్ధమే వస్తే వాళ్ళకు నాశనం తప్పదు. ధర్మరాజును సుముఖుడిగా చేసికొనటానికి సంజయుడు ముందుగా అతడిని పొగడుతున్నాడు.

**క. ధృతరాష్ట్ర భూపతికి వృ । ద్ధత కతమునఁ జిత్త మొక విధము గామి సుతో**
**ద్ధతి మాన్పఁడ నాఁడు; మనః । క్షతి పిదపం బుట్టి యిపుడు శాంతుం డయ్యెన్. 284**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్ర భూపతికిన్= ధృతరాష్ట్ర మహారాజుకు; వృద్ధతకతమునన్= ముసలితనం కారణంగా; చిత్తము= మనస్సు; ఒక విధము+కామిన్= ఒకే విధంగా లేకపోవటం చేత; నాఁడు= ఆ వేళ; సుత+ఉద్ధతి= కొడుకుల ఔద్ధత్యం; మాన్పఁడు+అ= మాన్పనే లేదు; పిదపన్= తరువాత; మనస్(ః)+క్షతి= మనస్తాపం; పుట్టి= కలిగి; ఇపుడు= ప్రస్తుతం; శాంతుండు+ అయ్యెన్= శాంతం కలవా డయ్యాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజుకు ముదిమివలన మనస్సు ఒకరీతిగా ఉండకపోవటం చేత అప్పుడు కొడుకుల ఔద్ధత్యం మాన్పనే లేకపోయాడు. తరువాత మనస్తాపం కలిగి ఇప్పుడు శాంతుడయినాడు.

**విశేషం:** దుర్యోధనుడు దుష్కార్యాలు చేయకుండా ధృతరాష్ట్రుడు వారించలేడా? అని ధర్మరాజు అడుగుతాడేమో అని, అతడి 'వృద్ధత' యే అందుకు కారణం అని సంజయుడు అన్నాడు. పశ్చాత్తాపం కలిగి ఇప్పుడు శాంతుడవటం వలననే, సంధికొరకు తనను రాయబారిగా పంపించాడని సంజయుడి మాట.

**తే. ఇట్టి చందంబు లెల్లను నీవు పుణ్య । చిత్తవృత్తిమై సైఁచినఁ జెల్లివచ్చు;**
**నీ యజాతశత్రుత్వంబు నిఖిల లోక । విశ్రుతము గాదె, ధర్మప్రవీణహృదయ! 285**

**ప్రతిపదార్థం:** ధర్మ ప్రవీణ హృదయ!= ధర్మంలో నేర్పుగల హృదయం గలవాడా! ధర్మరాజా!; ఇట్టి చందంబులు+ఎల్లనున్= ఇటువంటి రీతులన్నీ; ఈవు= నీవు; పుణ్య చిత్తవృత్తిమైన్= ధర్మ సహితమైన మనోవ్యాపారంతో-దయా హృదయంతో; సైఁచినన్= సహించినట్లయితే; చెల్లివచ్చున్= సమసిపోతాయి; నీ+అజాత శత్రుత్వంబు= శత్రువులు పుట్టనివాడు అనబడే నీగుణం- నీ అజాత శత్రుబిరుదం; నిఖిల లోక విశ్రుతము+కాదె!= అన్ని లోకాలకూ తెలిసిందికాదా?

**తాత్పర్యం:** ధర్మబద్ధమైన హృదయం కల ధర్మరాజా! ఇటువంటి దుర్మార్గాలన్నీ నీవు కరుణా మనస్కుఁడవై సహిస్తే చెల్లుబాటు అవుతాయి. నీ అజాతశత్రుత్వం అన్ని లోకాలకు తెలిసిందే కదా!

**విశేషం:** ధర్మరాజు ధర్మప్రవీణహృదయుడట. అతడు కరుణాహృదయంతో కౌరవుల అన్యాయాలను సహించి తన అజాత శత్రు బిరుదం సార్థకం చేసికొనాలట. ఎంతసేపూ సంజయుడి నోట ఇదే మాట. అజాతశత్రువంటే - పుట్టని శత్రువులు కలవాడని అర్థం. ధర్మరాజుకు దుర్యోధనాదులు శత్రువులు. మరి ఆ బిరుదం ఎట్లా సార్థకమవుతుంది? శత్రువులందు కూడా శత్రుత్వం భావించకపోతే ధర్మరాజు అజాతశత్రుడౌతాడు. అటువంటి ధర్మజుడి ప్రవృత్తి పుణ్యచిత్తవృత్తివలన, ధర్మప్రవీణమైన హృదయం వలన కలిగినట్లు సంజయుడు కీర్తించాడు. ధృతరాష్ట్రుడు లక్షించిన ప్రయోజనాలలో ముఖ్యమైనది- 'కయ్యమను

తలఁపు లోనుగ నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగుగన్' చేయటం. దాని కనుగుణంగా సంజయుడు ఈ మాటలన్నాడు. (సంపా.)

**చ. జగముల నెల్లెడన్ దురిత సంతమసంబు జయింపఁ గోరి పా**
**ల్పుగఁ బరమేష్ఠి నిల్పిన వెలుంగు మహీసురు; లట్టి వారికిం**
**దగవు ఘటింప సత్పురుష దత్తములై చను జీవనంబు లెం**
**త గుమతులైన మార్తురె? పదంపడి యాయువు శ్రీయు నొల్లరే? 286**

**ప్రతిపదార్థం:** మహీసురులు= బ్రాహ్మణులు; జగములన్+ఎల్ల+ఎడన్= లోకాలయందు అంతటా; దురిత సంతమసంబున్= పాప మనే అంధకారాన్ని; జయింపన్+కోరి= పారద్రోలగోరి; పరమేష్ఠి= బ్రహ్మ; పొల్పుగన్= ఒప్పుగా, నిల్పిన= నిలువబెట్టిన; వెలుంగు= ప్రకాశం; అట్టి వారికిన్= అటువంటి బ్రాహ్మణులకు; తగవు= న్యాయం; ఘటింపన్= కలగజేయడానికి; సత్+ పురుష దత్తములు+ఐ= సుజనులచేత ఈయబడిన వయి; చను= ఒప్పునట్టి; జీవనంబులు= బ్రతుకు తెరువులు-వృత్తులు; ఎంత+కుమతులు+ఐనన్= ఎంతటి దుర్బుద్ధులయినా; మార్తురె?= నశింప జేస్తారా?; పదంపడి= తరువాత; ఆయువున్, శ్రీయున్= ఆయుస్సునూ, సంపదనూ; ఒల్లరే?= కోరరా?

**తాత్పర్యం:** బ్రాహ్మణులంటే - లోకాలలో అంతటా పాపాంధకారాన్ని పారద్రోలటానికని బ్రహ్మ చక్కగా నిలిపిన వెలుగే. అటువంటి వారికి సత్పురుషులు కల్పించిన జీవనోపాధులను ఎంతటి దుర్బుద్ధులయినా నశింపజేస్తారా? తరువాత ఆయుర్భాగ్యాలను కోరరా? (అట్లా లాక్కుంటే, వారు బ్రతుకరనీ, బ్రతికినా నిర్భాగ్యులవుతారనీ భావం.)

**విశేషం:** అలం: రూపకం. ధర్మరాజు అడిగిన ప్రశ్నల కన్నింటికీ ఒక్కొక్క దానికే సమాధానం చెప్పుకొంటూ వస్తున్నాడు సంజయుడు. 'ఏ మర్ది నొసఁగినట్టి వృత్తులు సెల్లునే?' అన్న ధర్మరాజు ప్రశ్నకు సమాధాన మిది. కౌరవులు నీవన్నట్లు దుర్మతులే కావచ్చును. కాని, బ్రాహ్మణులకు సత్పురుషు లిచ్చిన వృత్తులను అపహరించేటంత దుర్మార్గులు కారని సంజయుడి సమాధానం. దురిత - సంతమసంబు, వెలుంగు మహీసురులు - అనే చోట్ల ఉపమేయోపమానాలకు అభేదం చెప్పబడింది కాబట్టి అలంకారం రూపకం, ఈ పద్యంలోని అలంకారపు సొగసంతా అమూలకం.

**ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్పు డాత్మలన్**
**నెక్కొని మోములం బొడము నెవ్వగతోడ జనంబు లిట్టి యం**
**దక్కట! భీముఁ డైన, మన యర్జునుఁ డైనను, మాద్రి పుత్త్రులం**
**దొక్కరుఁడైన నీ పగఱ నుక్కడఁగింపరె యొక్క వ్రేల్మిడిన్? 287**

**ప్రతిపదార్థం:** ఒక్కొక చోన్= ఒక్కొక్కప్పుడు; కడంగి= పూని; ప్రతియోధులు= శత్రువీరులు; మార్కొను+అప్పుడు= ఎదుర్కొన్నప్పుడు; జనంబులు= జనులు; ఆత్మలన్= మనస్సులందు; నెక్కొని= అతిశయించి; మోములన్= ముఖాలలో; పొడము= కనబడే; నెవ్వగ (నెఱ+వగ) తోడన్= అధిక దుఃఖంతో; అక్కట!= అయ్యో!; ఇట్టి+అందున్= ఇటు వంటి సందర్భాలలో; భీముఁడు+ఐనన్= భీముడయినా; మన+అర్జునుఁడు+ఐనను; మాద్రి పుత్త్రులందున్+ఒక్కరుఁడు+ఐనన్= మాద్రి కొడుకులైన నకుల సహదేవులలో ఏ ఒక్క డయినా; ఈ పగఱన్= ఈ శత్రువులను; ఒక్క వ్రేల్మిడిన్= ఒక్క చిటికలో; ఉక్కు+అడఁగింపరె?= మట్టుపెట్టరా?

**తాత్పర్యం:** ఒక్కొక్కప్పుడు పూని శత్రువీరులు ఎదుర్కొనినప్పుడు జనులు మనస్సులలో నిండి ముఖాలలో కనవచ్చే అమిత దుఃఖంతో 'అయ్యో! ఇటువంటప్పుడు భీముడయినా, మన అర్జునుడయినా, మాద్రి కొడుకులైన నకుల సహదేవులలో ఏ ఒక్కడైనా ఉంటే ఈ శత్రువులను ఒక్క చిటికలో రూపుమాపరా?- (తరువాతి పద్యంలోని 'అంద్రు' అనే క్రియతో అన్వయం.)

**విశేషం:** ఇది 'కలఁకులందుఁ బుట్టినప్పుడు గాండీవి భుజబలంబుఁ దలఁతురా? భీమసేను గదా విహార ముగ్గడింతురె? కవలు మహోగ్రరిపుల భూము లంతంత కొత్తుట పొగడఁబడునె?' అన్న ధర్మరాజు ప్రశ్నకు సమాధానం.

**క.** **వారొక యాగ్రహవృత్తిం । గూరి యధర్మంబు సేఁతకుం జాలరు; దు**
**ర్వారబలు లయ్యుఁ బాండుకు । మారులు శాంతాత్ము' లంద్రు మనుజాధీశా !** **288**

**ప్రతిపదార్థం:** మనుజ+అధి+ఈశా!= రాజా!- ధర్మరాజా!; వారు= పాండవులు; ఒక ఆగ్రహ వృత్తిన్+కూరి= ఒక(తీవ్రమైన) కోప వ్యాపారాన్ని పొందినప్పటికీ; అధర్మంబు+చేఁతకున్+చాలరు= అధర్మం చేయటానికి ఓర్వరు; పాండు కుమారులు= పాండవులు; దుర్వార బలులు+అయ్యున్= వారించరాని పరాక్రమం కలవారయినా; శాంత+ఆత్ములు= శాంత స్వభావులు; అంద్రు= అంటారు.

**తాత్పర్యం:** ధర్మరాజా! 'పాండవులకు మిక్కిలి కోపం వచ్చినా, అధర్మం చేయజాలరు. వారు అనివార్య పరాక్రమ వంతులయినా శాంతస్వభావు' లని ప్రజ లంటారు.

**విశేషం:** ప్రజలు మా పరాక్రమ విశేషాలను స్మరిస్తుంటారా? అని ధర్మరాజు అడిగాడు (పద్యం 278). దానికి సమాధానంగా పాండవుల శాంత స్వభావాన్ని ఈ విధంగా సంజయుడు మెచ్చుకొనటం వాళ్ళను తనకు ఉన్ముఖులనుగా చేసికొని తాను వచ్చిన పని సఫలం చేసికొనటానికే. సంజయుడి స్వకార్య నిర్వహణ సామర్థ్యం, ధర్మజుడి హృదయంలో కోపం కంటె శాంతం చోటు చేసికొనేటట్లు మాట్లాడే నేర్పు ప్రశంసనీయం.

**క.** **నలువురు తమ్ములు, భవదా । ప్తులుఁ గృష్ణుఁడు వినుచునుండ భూవర! నీ కేఁ**
**గొలువునను విన్నవింపం । బలుకులు గల వవధరింపు పరిపాటి మెయిన్'.** **289**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా! ధర్మరాజా!; నలువురు తమ్ములన్, భవత్+ఆప్తులున్= నీ ఆత్మీయులూ; కృష్ణుఁడున్; వినుచున్+ఉండన్= వింటూండగా; నీకున్; ఏన్= నేను; కొలువునను= సభలో; విన్నవింపన్= మనవి చేయటానికి; పలుకులు= మాటలు; కలవు= ఉన్నాయి; పరిపాటి మెయిన్= క్రమంగా; అవధరింపు(ము)= చిత్తగించుము.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీ నలుగురు తమ్ములూ, నీ ఆత్మీయులూ, కృష్ణుడూ వింటూండగా నీకు నేను సభలో మనవి చేయవలసిన మాటలున్నాయి. వాటిని ఆనుపూర్విగా (మొదటనుండి చివరిదాకా) చిత్తగించుము.

**విశేషం:** ధృతరాష్ట్రుడు రాయబారపు మాటలను నిండుసభలో చెప్పుమన్నాడు. అందుకే సంజయుడు ధర్మరాజును అతడి నిండుసభలో మాట్లాడటానికి అనుమతి కోరాడు. సంజయుడికి సాధించే ప్రయోజనాన్ని చెప్పాడే కాని ధృతరాష్ట్రుడు మాట్లాడే మాటల తీరును చెప్పలేదు. సంజయుడు అందుకు సమర్థుడు. నిండుకొలువులో వినిపించే సంజయుడి సందేశంలోని మనసు ధృతరాష్ట్రుడిది, మాటలు సంజయుడివి. (సంపా.)

**చ. అనవుడు 'వీరె తమ్ములును, నాప్తులుఁ, గృష్ణుఁడు; వీరె తక్కుకొ**
**ల్వునఁ గలయట్టి సర్వజనులున్ వినుచుండెద; రయ్య నిన్ను నే**
**మను మని పంచెఁ జెప్పు మది యంతయు నేర్పడ' నన్న, ధర్మనం**
**దను గరువంపుఁ బల్కుల విధంబునకున్ మదిలోన నుల్కుచున్. 290**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; తమ్ములునున్, ఆప్తులున్, కృష్ణుఁడున్; వీరె= ఇక్కడే ఉన్నారు; కొల్వునన్+కల+అట్టి తక్కు, సర్వ జనులున్= సభలో ఉన్న మిగిలిన ఎల్ల జనులూ, వీరే; వినుచున్+ఉండెదరు= వింటుంటారు; అయ్య= తండ్రి-ధృతరాష్ట్రుడు; నిన్నున్; ఏమి+అనుము+అని పంచెన్= ఏమి చెప్పుమని చెప్పిపంపాడో; అది+అంతయున్= దానినంతటినీ; ఏర్పడన్= స్పష్టంగా; చెప్పుము; అన్నన్= అనగా; ధర్మ నందను గరువంపుఁ బల్కుల (గరువము+పల్కుల) విధంబునకున్= ధర్మరాజుయొక్క సగౌరవపు (గడుసరి) పలుకుల రీతికి; మదిలోనన్= మనస్సులో; ఉల్కుచున్= భయపడుతూ.

**తాత్పర్యం:** అనగానే 'తమ్ములూ, ఆత్మీయులూ, కృష్ణుడూ ఇరుగో ఇక్కడే ఉన్నారు. సభలోని మిగిలిన జనులందరూ ఇరుగో వింటూంటారు. తండ్రి ఏమి చెప్పుమని నిన్ను ఇక్కడికి పంపించాడో అదంతా స్పష్టంగా చెప్పుము'- అనగా ధర్మరాజు గడుసరి మాటల తీరుకు మనస్సులో భయపడుతూ.

**విశేషం:** ధర్మరాజుమాటలు 'గరువంపుఁబల్కు'లని సంజయుడు భావించాడు. గరువము - అంటే గౌరవమనీ, నైపుణ్యమని, గడుసరి తనమనీ అర్థాలున్నాయి. ఈ మూడూ ఇక్కడ సార్థకాలే. రాయబారం నడుపుతున్నది ధర్మరాజుతో. కానీ, ఆ రాయబారి మాటలు తమ్ములూ, ఆప్తులూ, కృష్ణుడూ మొదలైనవారు వినేటట్లు నిండుసభలో చెప్పుతాననటం ధర్మరాజుకు చిరాకు కలిగించేమాట. అందుకే వ్యంగ్యంగా సభలో ఉన్న తమ్ములనూ, ఆప్తులనూ, శ్రీకృష్ణుడిని చేతితో చూపిస్తూ, ప్రత్యక్షసాక్ష్యంగా మాట్లాడుతున్నట్లనిపిస్తూనే, మీ నియమాలన్నీ సమకూరాయికదా! ఇక ధృతరాష్ట్రు డేమి కబురంపాడో చెప్పుము' అని అన్నాడు. నీ మాటలు నేను వినటంకంటె, మావారందరూ వినటం ముఖ్యం కదా! అట్లాగే చెప్పుము. అని వ్యంగ్యావహేళన ధ్వనిస్తుంది - అది గడుసరితనం. (సంపా.)

**ఆ. సంజయుండు కృష్ణు సద్భక్తి నీక్షించి, । పవనపుత్త్రుఁ బార్థుఁ గవల ద్రుపద**
**తనయు సవినయమునఁ గనుఁగొని, ప్రీతిఁ బాం । చాలు మత్స్యధరణిపాలుఁ జూచి. 291**

**ప్రతిపదార్థం:** సంజయుండు; కృష్ణున్; సత్+భక్తిన్= మంచి భక్తితో; ఈక్షించి= చూచి; పవన పుత్త్రున్= వాయు కుమారుడైన భీముడినీ; పార్థున్= అర్జునుడినీ; కవలన్= నకుల సహదేవులనూ; ద్రుపద తనయున్= ద్రుపద పుత్త్రుడైన ధృష్టద్యుమ్నుడినీ; సవినయమునన్= అడకువతో; కనుఁగొని= చూచి; పాంచాలున్= ద్రుపదుడినీ; మత్స్య ధరణి పాలున్= మత్స్య దేశపు రాజయిన విరాటుడినీ; ప్రీతిన్= సంతోషంతో; చూచి.

**తాత్పర్యం:** సంజయుడు కృష్ణుడిని సద్భక్తితో చూచి, భీముడినీ, అర్జునుడినీ, నకుల సహదేవులనూ, ధృష్టద్యుమ్నుడినీ వినయపూర్వకంగా చూచి, ద్రుపదుడినీ, విరాటుడినీ ప్రీతితో చూచి, - (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** ధర్మరాజు ఎవరెవరిని ప్రత్యేకంగా పేర్కొని చూపాడో వారందరినీ విశేషంగా గౌరవించటం సంజయుడి గడుసరితనం.

**వ. 'సావధానులరై వినుం' డని పలికి, యుధిష్ఠిరుదెసకు మోడ్పుఁగేలు నిగిడించి యిట్లనియె. 292**

**ప్రతిపదార్థం:** సావధానులరు (స+అవధానులరు)+ఐ= ఏకాగ్రత కలవారయి; వినుండు= వినండి; అని, పలికి; యుధిష్ఠిరు దెసకున్= ధర్మరాజువైపు; మోడ్పుఁగేలు (మోడ్పు+కేలు); నిగిడించి= అంజలి ఘటించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'సావధానంగా వినండి' అని పలికి ధర్మరాజుకు అంజలి ఘటించి ఇట్లా అన్నాడు.

**ఉ. 'శాంతతఁ బొంది కార్యముదెసన్ ధృతరాష్ట్ర మహీశుఁ డాత్మ న**
**త్యంతముఁ దేఱి, న న్నిటఁ బ్రియంబునఁ బంచెడునప్డు నాకుఁ దే**
**రెంతయు వేడ్కఁ దాన వెర వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచె ని**
**ట్లింత ఘటించెఁ బొందు; మన మీ పదనం దెలివొందఁగాఁ దగున్. 293**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రమహీ+ఈశుఁడు= ధృత రాష్ట్ర మహా రాజు; శాంతతన్+పొంది; శాంతం వహించి; కార్యము దెసన్= పని విషయంలో; ఆత్మన్= మనస్సులో; అత్యంతమున్= మిక్కిలి; తేఱి= ప్రసన్నుడయి; నన్నున్; ఇటన్= ఇక్కడికి; ప్రియంబునన్= ప్రీతితో; పంచెడు+అప్డు= పంపేటప్పుడు; ఎంతయున్, వేడ్కన్= ఎంతో వేడుకతో; తాన (తాను+అ)= తానే; వెరవు= నేర్పు; ఏర్పడన్+చెప్పుచున్= స్పష్టంగా చెపుతూ; నాకున్; తేరు= రథం; పన్నన్+పంచెన్= సిద్ధం చేయ నియోగించాడు; ఇట్లు= ఈ విధంగా; పొందు= పొత్తు; ఇంత, ఘటించెన్= ఇంతగా కూర్చాడు; ఈ+పదనన్= ఈ తరుణంలో; మనము; తెలివి+ఒందఁగాన్+తగున్= జ్ఞానం కలిగి ఉండటం మంచిది.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజు శాంతం వహించి, పని విషయంలో మనస్సులో మిక్కిలి ప్రసన్నత పొంది, నన్ను ఇక్కడికి ప్రీతితో పంపేటప్పుడు ఎంతో వేడుకతో తానే నేర్పు స్పష్టంగా బోధించి, నాకు రథం సిద్ధపరచ నాజ్ఞాపించాడు. అతడు ఈ విధంగా పొత్తు కొరకు ఇంత శ్రద్ధ వహించాడు. ఈ అదనులో మనం తెలివి కలిగి వ్యవహరించటం మంచిది.

**విశేషం:** ధృతరాష్ట్రుడు పాండవుల దగ్గరకు తనను పంపించిన విధం సంజయుడు చాలా వివరంగా వర్ణించి చెప్పాడు. ఆ పంపిన విధానంలో ఆయన ఆప్యాయత వ్యక్తమౌతున్నది. దానికి కారణాలు వరుసగా చెప్పాడు కూడా. పాండవులు అరణ్యాజ్ఞాతవాసాలు ముగించుకొని అభ్యుదయపథంలో ఉన్నారని తెలిసికొనటం వలన ఇదివరలో ఆయన పొందిన వేదననంతా మరచి ప్రశాంత చిత్తుడైనాడు. ఆ తరువాత తన కర్తవ్యమేమిటి? అని వితర్కించుకొని కార్యశీలు డయ్యాడు. తన కర్తవ్యాన్ని స్పష్టంగా నిర్ణయించుకొన్నాడు. అందువలన తేరిన మనస్సుతో సంతోషంగా, ప్రీతితో నన్ను మీ వద్దకు పంపాడు. కాబట్టి ధృతరాష్ట్రుడు ఇంతగా మన పొత్తుకొరకు సన్నివేశాన్ని సంఘటించాడు. ఈ సందర్భాన్ని సద్వినియోగం చేసికొనటానికి మనం తెలివితో వ్యవహరించాలి - అని సూచించాడు. పొందుకావాలని కోరుకొంటున్న ధృతరాష్ట్రుడు దానికి ఏదైనా ఉపాయాన్ని చెప్పినట్లు సంజయుడు చెప్పడు. కాని, మనం, మనం అంటూ పూసుకొని మాట్లాడుతున్నాడు. (సంపా.)

**క. చులుకని కార్యము సేయం । దలఁచుట మీ యట్టి సర్వధర్మజ్ఞులు శాం**
**తులు ననఁ బ్రసిద్ధులగు పె । ద్దలకుం దగ వగునె యెవ్విధంబునఁ జూడన్ ? 294**

**ప్రతిపదార్థం:** మీ+అట్టి= మీవంటి; సర్వ ధర్మజ్ఞులున్; శాంతులున్= అన్నిధర్మాలూ తెలిసినవారూ; శాంత స్వభావులూ; అనన్; ప్రసిద్ధులు+అగు పెద్దలకున్= పేరుపడ్డ పెద్దలకు; చులుకనికార్యము= తేలికపని, అగౌరవపు పని; చేయన్+తలఁచుట= చేయాలనుకొనటం; ఏ+విధంబునన్+చూడన్= ఏ విధంగా చూచినా; తగవు+అగునె?= ధర్మం అవుతుందా?

**తాత్పర్యం:** అన్ని ధర్మాలూ తెలిసినవారూ, శాంతస్వభావులూ అని పేరుపడ్డ మీ వంటి వారికి ఏ విధంగా చూచినా లాఘవాన్ని కలిగించే పని చేయాలనుకొనటం, ధర్మమవుతుందా?

**విశేషం:** చులుకని కార్యము - నీచమైన పని - అంటే ఇక్కడ యుద్ధం.

**ఆ. మడుఁగుఁ జీరయందు మసి దాఁకినట్లు మీ । సత్కులమునఁ గల్మషంబు కౌర**
**వేంద్రు కతనఁ బొందె; నింతయుఁ బాపంగ । నీవ నేర్తు, కార్యనిపుణహృదయ! 295**

**ప్రతిపదార్థం:** కార్య నిపుణహృదయ!= కార్య నిర్వహణంలో నేర్పుగల హృదయం కలవాడా-ధర్మరాజా!; మడుఁగు+చీర+అందున్= పరిశుద్ధ వస్త్రంలో; మసి, తాఁకిన+అట్లు= నల్లనిమసి అంటుకొన్నట్లు; మీ సత్+కులమునన్= మీ మంచి వంశంలో; కౌరవ+ ఇంద్రు కతనన్= దుర్యోధనుడి మూలంగా; కల్మషంబు= మచ్చ; పొందెన్= ఏర్పడింది; ఇంతయున్= ఇదంతా; పాపంగన్= పోగొట్టటానికి; నీవు+అ= నీవే; నేర్తు(వు)= చాలుదువు, సమర్థుడవు.

**తాత్పర్యం:** కార్య నిర్వహణంలో నేర్పు చూపే ధర్మరాజా! పరిశుద్ధమైన వస్త్రంలో మసి అంటుకొన్నట్లు మీ సద్వంశంలో దుర్యోధనుడి మూలాన మచ్చ ఏర్పడింది. దానిని పోగొట్టటానికి నీవే సమర్థుడవు.

**విశేషం:** అలం: ఉపమ. మడుఁగుఁజీరయందు మసి దాఁకినట్లు --- కల్మషంబు - అలంకారం ఉపమ. దాన్ని పోగొట్టే నైపుణ్యం, నీకే ఉన్నది. ఎందుచేతనంటే నీవు 'కార్య నిపుణ హృదయుడవు.' ఈ విశేషణం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరం. సంజయుడు ఇట్లా దుర్యోధనుడిని నిందించటం కూడా ధర్మరాజును తనకు ఉన్ముఖుడిని చేసికొనటానికే, ఇది సంజయుడి మాటనేర్పునూ, కార్య నిపుణ హృదయత్వాన్నీ కూడా తెలుపుతుంది.

**చ. అఖిల జనక్షయంబయి, జయాపజయంబులు రెండునుం దుదిన్**
**సుఖములు గాని యీ పనికిఁ జొత్తురె యుత్తము? లట్లుఁగాక యా**
**నిఖిలసుఖంబు లేమిటికి నీవని వృద్ధజనంబు బాలురన్**
**సఖులను బంధులన్ గురులఁ జంపితయేని దయాపయోనిధీ! 296**

**ప్రతిపదార్థం:** దయా పయోనిధీ!= కరుణా సముద్రుడా! ధర్మరాజా!; అఖిల జన క్షయంబు+అయి= ఎల్ల జనుల నాశనమూ అయి; జయ+అపజయంబులు రెండునున్= గెలుపూ, ఓటమీ - ఈ రెండూ; తుదిన్= చివర - పర్యవసానంలో; సుఖములు+ కాని= లాభదాయకం కాని; ఈ పనికిన్= యుద్ధానికి; ఉత్తములు= సజ్జనులు; చొత్తురె?= పూనుకొంటారా?; అట్లున్+కాక= అదీకాక; నీవు; అనిన్= యుద్ధంలో; వృద్ధజనంబున్= ముసలివాళ్ళనూ; బాలురన్= పిల్లలనూ; సఖులను= మిత్రులనూ; బంధులన్= చుట్టాలనూ; గురులన్= గురువులనూ; చంపితయేనిన్ (చంపితివి+అ+ఏనిన్)= చంపినట్లయితే; ఆ నిఖిల సుఖంబులు+ఏమిటికిన్?= ఆ ఎల్ల సుఖాలూ ఎందుకు?

**తాత్పర్యం:** కరుణాసముద్రా! ధర్మరాజా! రాజులందరూ నశించి, పర్యవసానంలో జయాపజయాలు రెండూ లాభదాయకం కాని ఈ పనికి సజ్జనులు పూనుకొంటారా? అదీ కాక, నీవు యుద్ధంలో వృద్ధులనూ, పిల్లలనూ, మిత్రులనూ, బంధువులనూ, గురువులనూ చంపినట్లయితే ఆ సుఖాలన్నిటివలన ప్రయోజనం ఏముంటుంది?

**విశేషం:** అలం: పరికరం. సర్వజననాశనం కలిగించే యుద్ధానికి నీవు పూనుకోవు. ఎందుచేతనంటే నీవు 'దయాపయోనిధివి'. ధర్మరాజు విశేషణం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరం. 'జయాపజయంబులు రెండునుం దుదిన్ సుఖములుగాని'- యుద్ధంలో ఓడినవాడు పైకి ఏడుస్తాడు. గెలిచినవాడు లోపల ఏడుస్తాడు.

**ఉ. పెట్టనికోట నీకు హరి; భీముఁడు నర్జునుఁడున్ రణంబునం**
**దొట్టిన మంట; లా కొలఁది యోధుల సాత్యకియున్, విరాటుఁడున్;**
**జుట్టపు మేరు, వుగ్రరణ శోభితుఁ డీ ద్రుపదుండు; నిన్ను ని**
**ట్టట్టనవచ్చునే సురలకైనను? నొల్లవు గాక చివ్వకున్. 297**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు(ధర్మరాజుకు); హరి= కృష్ణుడు; పెట్టనికోట= సహజమైన రక్ష (చుట్టూ కట్టకపోయినా కోట కట్టినట్లు రక్ష కల్పించేవాడని భావం); భీముఁడున్; అర్జునుఁడున్; రణంబునందున్= యుద్ధంలో; ఒట్టిన మంటలు= ప్రజ్వలించే మంటలు; సాత్యకియున్; విరాటుఁడున్; ఆ కొలఁది, యోధులు+అ= ఆ పాటి వీరులే; చుట్టపు మేరువు (చుట్టము+మేరువు)= బంధువులలో మేరు సమానుడు; ఈ ద్రుపదుండున్; ఉగ్ర, రణ, శోభితుఁడు= భయంకర యుద్ధంలో ప్రకాశించేవాడు; చివ్వకున్= యుద్ధానికి; ఒల్లవు+కాక= ఇష్టపడవు కాని; నిన్నున్; సురలకున్+ఐనను= దేవతలకయినా; ఇట్టట్టనవచ్చునే(ఇట్టు+అట్టు+అనన్+వచ్చునే)?= ఇట్లా అట్లా అనడానికి శక్యమా? (కదిలించటానికి వీలుందా?)

**తాత్పర్యం:** నీకు శ్రీకృష్ణుడు పెట్టనికోట, భీముడూ, అర్జునుడూ యుద్ధంలో ప్రజ్వలించే మంటలు, సాత్యకీ, విరాటుడూ ఆపాటి వీరులే. మేరు సమాన బంధువయిన ఈ ద్రుపదుడు కూడ భయంకర యుద్ధంలో ప్రకాశించేవాడు. యుద్ధానికి ఇష్టపడవు గాని దేవతలకయినా నిన్ను ఇట్లా అట్లా అనడానికి శక్యమా?

**విశేషం:** 1. అలం: రూపకం, కావ్యార్థాపత్తి, హరిపెట్టనికోట, భీముఁడు నర్జునుఁడున్ రణంబునం దొట్టినమంటలు-అలంకారం రూపకం. నిన్ను నిట్టట్టనవచ్చునే సురలకైనను-మానవులమాట చెప్పడం ఎందుకు? - అలంకారం కావ్యార్థాపత్తి. ఒల్లవుగాక చివ్వకున్- ధర్మరాజు యుద్ధం మానాలని సంజయుడు పదే పదే అనటం గమనార్హం. 'కయ్యమను తెఱఁగు లోనుగ నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగునన్' - అనికదా ప్రభువు కోరిక.

2. తిక్కన రచనలో సంజయుడు సూక్తిసుధాకరు డయ్యాడు. పాత్రల స్వభావాలను సూత్రప్రాయంగా చెప్పటంలో సంజయుడు దిట్ట. ఈ పద్యం అందుకు ఉదాహరణం. 'హరి మీకు పెట్టని కోట' చుట్టూ రక్షకొరకు కోట కట్టకపోయినా కోటవలె యుద్ధంలో నిలబడి రక్షించే దైవశక్తి శ్రీకృష్ణుడు. భీమార్జునులు యుద్ధంలో ఒట్టిన మంటలు. శత్రువులు సమీపించటానికి శక్యంకాని దావానల సన్నిభులు; దరిచేరితే దహించే దమనమూర్తులు, తేజోధనులు అని భావం. విరాటుడు చుట్టపు మేరువు - 'మేరు పర్వతం సర్వదేవతలూ వసించే బంగారుకొండ', కోరికలు తీర్చేకొండ. విరాటు డటువంటి స్నేహమూర్తి. తెలుగు జాతీయాలతో పాత్రలకు వెలుగు, దివ్వెలవంటి సూక్తి నిర్వచనా లిచ్చిన తెలుగు వెలుగు తిక్కన. (సంపా.)

**వ. మఱియు నక్కడ. 298**

**తాత్పర్యం:** ఇంక కౌరవ పక్షంలో.

**ఉ. ద్రోణుఁడు, భీష్ముఁడుం, గృపుఁడు, ద్రోణసుతుండును గర్ణశల్యులుం**
**బ్రాణము లా సుయోధనుని పాలివ యండ్రు; నిజానుజన్ము ల**
**క్షీణపరాక్రముల్, సుతు లజేయులు; బాహ్లిక సోమదత్తు లా**
**స్థాణునకైన నోడరు; వశంబె జయింపఁగ వారి నేరికిన్? 299**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడున్, భీష్ముఁడున్, కృపుఁడున్; ద్రోణ సుతుండును= ద్రోణుడి కొడుకైన అశ్వత్థామా; కర్ణ, శల్యులున్= కర్ణుడూ, శల్యుడూ; ప్రాణములు= తమ జీవితాలు; ఆ+సుయోధనుని పాలివి+అ+అంద్రు= ఆ దుర్యోధనుడివే అంటారు; నిజ+అనుజన్ములు= తన తమ్ములు; అక్షీణ పరాక్రముల్= తక్కువకాని (అధికమైన) పరాక్రమం కలవారు; సుతులు= కొడుకులు; అజేయులు= గెలువదగనివారు; బాహ్లిక, సోమదత్తులు= బాహ్లికుడూ, సోమదత్తుడూ; ఆ+స్థాణునకున్+ఐనన్= ఆ శివుడికి కూడా; ఓడరు= జంకరు; వారిన్, జయింపఁగన్= గెలవటానికి; ఏరికిన్= ఎవరికైనా, వశంబె?= తరమా?

**తాత్పర్యం:** ద్రోణుడూ, భీష్ముడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, శల్యుడూ తమ ప్రాణాలు ఆ దుర్యోధనుడివే అంటారు. తమ్ములు మిక్కిలి పరాక్రమవంతులు. కొడుకులు జయింపరాని వారు. బాహ్లికుడూ, సోమదత్తుడూ ఆ స్థాణుడికి కూడా జంకరు. వారిని జయించటం ఎవరికైనా శక్యమా?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. 'సుతు లజేయులు' - అజేయులంటే జయింపదగని వారు, అజయ్యులు - జయింపరాని వారు, సుతులజయ్యులు అని ఉండవలసింది. కాని, అప్పుడు యతి మైత్రికి భంగం కలుగుతుంది. సోమదత్తుడు బాహ్లికుడి కొడుకు. 'స్థాణునకైన నోడరు' - కావ్యార్థాపత్తి.

**ఆ. అధిప! యిట్టి మీకు నన్యోన్య కలహంబు । నాకుఁ జూడ మే లనంగ రాదు;**
**రెండు పక్షములకుఁ బ్రియము హితంబును । నాత్మఁ గోరువారి నడిగి చూడు.' 300**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! - ధర్మరాజా!; ఇట్టి మీకున్= ఇటువంటి మీకు (కౌరవపాండవులకు); అన్యోన్యకలహంబు= పరస్పర యుద్ధం; నాకున్+చూడన్= నాకు చూడగా; మేలు+అనంగన్, రాదు= మంచిది అనగూడదు; రెండు పక్షములకున్= ఇరువైపులవారికీ; ప్రియమున్= సంతోషాన్నీ; హితంబునున్= మేలునూ; ఆత్మన్= మనస్సునందు; కోరువారిన్= ఆశించేవారిని; అడిగి-చూడు(ము).

**తాత్పర్యం:** ధర్మరాజా! ఇటువంటి మీరు ఒకళ్ళతో ఒకళ్ళు పోరాడటం వలన మేలు కలుగుతుందని నాకు అనిపించదు. ఇంకా రెండు పక్షాల వారికీ సంతోషాన్నీ, శ్రేయస్సునూ ఆకాంక్షించే వాళ్ళను అడిగి చూడుము.'

**వ. అని పలికి సూతనందనుండు గొలువు గలయం గనుంగొని. 301**

**ప్రతిపదార్థం:** అని, పలికి; సూతనందనుండు= సూతపుత్రుడు - సంజయుడు; కొలువు= సభ; కలయన్+కనుంగొని= అంతటా చూచి.

**తాత్పర్యం:** అని పలికి సంజయుడు సభ అంతటా చూపు సారించి.

**ఉ. 'మ్రొక్కెద వాసుదేవునకు, మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం,**
**దక్కటి మిత్త్ర బాంధవ హిత ప్రియమంత్రి వయస్య కోటికిన్**
**స్రుక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ**
**యిక్కరుణాకరున్ శరణ మే నిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్. 302**

**ప్రతిపదార్థం:** వాసుదేవునకున్= కృష్ణుడికి; మ్రొక్కెదన్= నమస్కరిస్తాను; సవ్యసాచికిన్= కవ్వడికి - అర్జునుడికి; చేతులు మోడ్చెదన్= చేతులు జోడిస్తాను; తక్కటి, మిత్త్ర, బాంధవ, హిత, ప్రియ, మంత్రి, వయస్య, కోటికిన్= మిగిలిన మిత్రుల,

బంధువుల, హితుల, ప్రియుల, మంత్రుల, వయస్యుల సమూహానికి; స్రుక్కుచున్= అడగుతూ- సవినయంగా; విన్నవించెదన్= మనవి చేస్తాను; అసూయలు+తక్కి= కోపాలు విడిచి; అనుజ్ఞ+చేయుఁడీ= అనుమతించండి; ఈ+కరుణా+ఆకరున్= ఈ దయాళువును-ధర్మరాజును; క్రోధశాంతికిన్= కోపం ఉపశమించటానికి; ఏను= నేను; ఇదె= ఇప్పుడే; శరణము, వేఁడెదన్= శరణు వేడుతున్నాను.

**తాత్పర్యం:** 'కృష్ణుడికి మ్రొక్కుతాను, అర్జునుడికి చేతులు జోడిస్తాను, తక్కిన మిత్రుల, బంధువుల, హితుల, ప్రియుల, మంత్రుల, వయస్యుల సమూహానికి సవినయంగా మనవి చేస్తాను. కోపాలు మాని అనుమతించండి, ఈ దయాళుడైన ధర్మరాజును కోపోపశమనానికై నేను ఇదే శరణు వేడుతాను.'

**విశేషం:** 1. సంజయు రాయబారపు ఘట్టంలో పతాకస్థానమైన పద్యమిది. నాటకీయమైన సన్నివేశం. పరమేశ్వరుడి ముందు భక్తుడు ప్రణమిల్లి శరణు వేడుతున్నట్లు భక్తిభావ ప్రవృత్తితో సంజయుడు ధర్మరాజుకు ప్రణామం చేస్తూ పలికిన మాటలివి. ధర్మరాజును కరుణాకరుడని ప్రశంసించాడు. కాబట్టి శరణువేడినవారి కోర్కెను కాదనక తీర్చటం కరుణామయుడి కర్తవ్యం. సంజయుడు కోరింది క్రోధశాంతి. అంటే ధర్మరాజు క్రోధమూర్తి అయి ఉన్నాడనీ, ఆ క్రోధాన్ని ఆయన శాశ్వతంగా చంపుకొని శాంతమూర్తి కావాలనీ కోరుకొన్నాడు. ధర్మజు డా వరం ఇవ్వాలి.

2. అందుకు ఆ సభలోని ప్రముఖు లందరూ అసూయలు మాని ధర్మరాజుకు అనుజ్ఞ ఇవ్వాలట, అంటే ముక్తకంఠంతో, ఏకాభిప్రాయంతో ధర్మజ క్రోధశాంతిని సమర్థించాలని ప్రార్థన.

3. ధర్మరాజును అనుమతించవలసిన వారిలో అగ్రగణ్యుడు శ్రీకృష్ణుడు. అందుకే ఆయనకు ముందుగా మ్రొక్కులు చెల్లించటం, నారాయణుడి తరువాత నరుడు. అతడు పైపెచ్చు సవ్యసాచి, అతడికి చేతులు జోడించాడు. రెండు చేతుల వాడి కలవాడికి రెండు చేతులూ ఎత్తి నమస్కరించటం న్యాయమే. (తలమీద చేతులెత్తి నమస్కరించటం మ్రొక్కటం. ఇది దేవ గురుమూర్తుల పట్ల సమంజసం. చేతులు జోడించటం వినయ గౌరవ ప్రదర్శకం). మిగిలిన వారందరికీ వినయంగా విన్నవించుకొన్నాడు. వారి వారి అధికారాలకు అనుగుణంగా అణకువను ప్రదర్శించి సంజయుడు సభా మర్యాదలను పాటించాడు. అందరినీ అర్థించి ధర్మరాజును ప్రార్థించాడు.

4. "శత్రు కృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః"- అని ప్రతాపరుద్రీయం. ధర్మరాజు క్రోధం కౌరవకృతాపచారాల వలన కలిగిన మనః ప్రజ్వలనరూపం. అది రౌద్రమై శత్రుప్రతీకార సంహారాలను చేపట్టి, శత్రుపక్షంలో శోకం కలిగించటానికి పూనుకొంటుంది. అట్టి రౌద్రకర్మను ఉపశమించుకొనుమని ధర్మరాజును సంజయుడు వేడుకొన్నాడు. రౌద్రం అర్థసాధన ప్రధానం. ధర్మజుడి క్రోధం రాజ్య సంపదను సాధించే ప్రయోజనంతో వర్తిస్తుంది. దానిని మానుకొనుమని సంజయుడి ప్రార్థన. క్రోధానికి అసూయ పోషకశక్తి. అందువలన అసూయను వదలి ధర్మరాజుకు క్రోధశాంతికై అనుజ్ఞ ఇవ్వండి- అని సభ్యులందరికీ సంజయుడి అభ్యర్థన.

5. సంజయుడి అభినయం, అభ్యర్థన ఎవరికైనా అనుమానం కలిగిస్తాయి. దూత శరణువేడుతున్నాడంటే ధృతరాష్ట్రుడి దూతగా సంజయుడు వ్యవహరిస్తున్నాడా? తన సొంత పూచీతో ఆ పని చేస్తున్నాడా? అన్నది మొదటి అనుమానం. దూత శరణు వేడడు. అది మర్యాద కాదు. కాబట్టి సంజయుడిది సొంత అభినయమే. అంటే ఆ మాటలన్నీ సంజయుడి వినయ విలాసాలే. ధృతరాష్ట్రుడి ఆదేశాలు కావు. కాబట్టి వాటిని అధికారికంగా అంగీకరించవలసిన అవసరం లేదు. భక్తిభావముద్రితమైన సంజయుడి పలుకులు ధర్మరాజు యుద్ధ విరమణ రూపమైన క్రియను చేపట్టటానికి ప్రేరణలుగా పనిచేస్తాయి. నిజంగా ఆ

మాటలకు ధర్మజుడు కరగిపోయి, కరుణాకరుడై యుద్ధం మానివేస్తే గొప్ప విపత్తు ఏర్పడుతుంది. క్రోధోపశాంతి వలన రాజ్యసుఖం వదలుకొనటమే ఫలమౌతుంది. ఇంత లోతుగా వ్యూహం పన్ని, పైకి అమాయకంగా మాట్లాడుతూ ముందరికాళ్ళకు బంధం వేయాలని శరణువేడినట్లు నటించాడు సంజయుడు. ధర్మరాజు శత్రు మర్మజ్ఞుడు. కౌరవ వ్యూహంలోని కౌటిల్యాన్ని పసికట్టాడు. కాని, బయటపడలేదు. (సంపా.)

**వ. అనుచుం బ్రణామపూర్వకంబుగాఁ బాండవాగ్రజు వదనంబునం జూడ్కినిలిపి, 'దేవా! యుపశమించుట లెస్స, యిమ్మెయికిం గురు పితామహుండును సంతసిల్లు; నాతనికనుమతంబయిన తెఱంగు సర్వలోకసమ్మతం బగు' నన విని ధర్మనందనుం డిట్లనియె. 303**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అంటూ; ప్రణామపూర్వకంబుగాన్= నమస్కార పూర్వకంగా; పాండవ+అగ్రజు వదనంబునన్= ధర్మరాజు ముఖంలో; చూడ్కి= చూపు; నిలిపి= ఉంచి; దేవా!; ఉపశమించుట= శాంతించటం; లెస్స= మంచిది; ఈ+మెయికిన్= ఈ రీతికి; కురు పితామహుండును= భీష్ముడుకూడా; సంతసిల్లున్= సంతోషిస్తాడు; ఆతనికిన్= భీష్ముడికికూడా; అనుమతంబు+ అయిన తెఱంగు= సమ్మతమైన విధం; సర్వలోక- సమ్మతంబు+అగున్= అన్ని లోకాలకూ అంగీకారం అవుతుంది; అనన్ విని= అనగా విని; ధర్మనందనుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అంటూ నమస్కార పురస్సరంగా ధర్మరాజు ముఖంలో చూపు నిలిపి 'దేవా! శాంతించటం మంచిది. దీనికి భీష్ముడు కూడా సంతోషిస్తాడు. ఆతడికి సమ్మతమైన విధం అన్నిలోకాలకూ సమ్మతమవుతుంది' - అనగా విని ధర్మరాజు ఇట్లా అన్నాడు.

**విశేషం:** భీష్ముడు కూడా సంతోషిస్తా డనటం తాతగారిమీద ఉన్న భక్తి గౌరవాలకొద్దీ ధర్మరాజు తప్పకుండా ఉపశమిస్తాడనే ఆశతో.

**ఉ. 'నెయ్యము దప్ప నొండొకటి నీ చెవి సోఁకెనె నాదు పల్కులం**
**దియ్యెడ? సంజయా! యనికి నెమ్మెయి నల్కెదు నీవు; మాకుఁ దాఁ**
**గయ్యము దక్కి మన్కి తగు కార్యము గా దొకొ? పోరితంబు లే**
**కయ్యెడు నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొండు సేయునే? 304**

**ప్రతిపదార్థం:** సంజయా!; అనికిన్= యుద్ధానికి; ఎమ్మెయిన్(ఏ+మెయిన్)= ఏదో ఒక విధంగా; నీవు; అల్కెదు(అల్కెదువు)= భయపడతావు; నాదు పల్కులందున్ (నా+పల్కుల+అందున్)= నా మాటలలో; నెయ్యము+తప్పన్= చెలిమికాక; ఒండొకటి (ఒండు+ఒకటి)= మరియొకటి; ఇయ్యెడన్ (ఈ+ఎడన్)= ఇప్పుడు; నీ చెవిన్+సోఁకెన్?= నీ చెవిని పడిందా?; మాకున్, తాన్; కయ్యము+తక్కి= యుద్ధం విడిచి; మన్కి= జీవించటం; తగు కార్యము+కాదు+ఒకొ!= తగిన పని కాదా?; పోరితంబు, లేక+అయ్యెడు+అర్థ సిద్ధి= యుద్ధం లేకుండా అయ్యే ప్రయోజన సిద్ధి (లేదా ధనప్రాప్తి); వెడఁగు+ఐనను= వెర్రివాడయినా; ఒల్లక= అంగీకరించక; ఒండు+చేయునే?= ఇంకొకటి చేస్తాడా?

**తాత్పర్యం:** 'సంజయా! యుద్ధానికి నీవు భయపడుతున్నావు, ఇప్పుడు నా మాటలలో చెలిమి కాక వేరొకటి నీ చెవిలో పడిందా? మాకు మాత్రం యుద్ధం లేకుండా జీవించటం తగిన పని కాదా? యుద్ధం లేకుండా ప్రయోజనం నెరవేరితే దానిని వెర్రివాడయినా కోరక ఇంకొకటి చేస్తాడా?

**విశేషం:** 1. సంజయుడి వాక్య నైపుణ్యం మీద ధర్మరాజు ఉక్తి చాతుర్యంతో ఎదురుదాడి మొదలుపెట్టాడు. అది అతడి గడుసరి తనం. అంతవరకు నిమ్మకు నీరెత్తినట్లు ఉన్న ఆతడు ఒక్కసారి విజృంభించాడు. ఈ పద్యంలో చెప్పే తాత్పర్యానికి ఎంత విశేషముందో, చెప్పే తీరుకు కూడా అంత వైశిష్ట్యం ఉన్నది.

2. శరణు వేడిన సంజయుడికి ధర్మరాజు సుముఖుడైనట్లే వాక్యం మొదలుపెట్టాడు. చెలిమి తప్ప మరొకమాట నానోట నీకు వినబడిందా? అని అన్నాడు. ఇది గుట్టు తెలిసి పలికినమాట. ఆప్యాయత ఒలకబోసేమాట! కాగా, క్రోధమే లేని నాలో క్రోధం ఉన్నట్లు ఈ విధంగా పలికా వెందుకు? నా ప్రవృత్తిని మసిపూసి మారేడుకాయ చేస్తావెందుకు? అని సంజయుడిని దెప్పిపొడిచాడు. సంజయుడి నాటకం బట్టబయలైనది. కౌరవులకే కాదు పాండవులకూ కయ్యం లేకుండానే ఉండాలని ఉన్నది- అని తనమీద వేసిన నేరాన్ని దులుపుకొని మాట్లాడాడు. చివరకు పలికినమాట కీలెరిగి పెట్టినవాత. యుద్ధం లేకుండానే అర్థసిద్ధి అయితే ఎంతటి వెర్రివాడైనా మరొక రకంగా ఎందుకు ప్రవర్తిస్తాడు? అని ఎదురు ప్రశ్న వేశాడు. ఇది చాలా లోతైన మాట. సంజయుడు కోరింది క్రోధోపశాంతి. శత్రువులు అర్థాన్ని హరించి అపకారం అవమానం చేయటం వలన దానిని మరల సంపాదించుకొనటానికి ప్రదర్శించే తీవ్రమనోభావం క్రోధం. యుద్ధం చేయకుండానే అర్థసిద్ధి కలిగితే క్రోధం ఉపశమిస్తుంది. లేదా అర్థంమీది తృష్ణే నశిస్తే శమిస్తుంది. ధర్మరాజు విరక్తుడై క్రోధాన్ని మానాలని సంజయుడి పన్నాగం. అర్థసిద్ధి కలిగితేనే క్రోధశాంతి కలుగుతుందని ధర్మరాజు ప్రతిసమాధానం. క్రోధశాంతికి అంగీకరించినా ధర్మరాజు సంజయుడి మార్గాన్ని అంగీకరించలేదు. శరణన్నవారిని కాదన్న దోషం ధర్మరాజుకు కలుగలేదు. అతడి యుక్తి చాతుర్యం అంత గొప్పది. (సంపా.)

3. 'యుద్ధం మాను, శాంతించు' అని మాటిమాటికీ సంజయుడు చెప్పిన దానికి ధర్మరాజు సూటిగా, స్పష్టంగా చెప్పిన సమాధానం ఇది. 'అర్థసిద్ధి' ముఖ్యమనీ, యుద్ధం చేయటం, మానటం దానిని బట్టి ఉంటుందనీ, అర్థసిద్ధి కాకపోతే యుద్ధం తప్పకపోవచ్చుననీ ధర్మరాజు మాటలలో ధ్వనిస్తున్నది.

**క. జనులకు నెల్లను బథ్యము । లనఁగా, ధర్మానుగతములగు ననఁ బొగడం**
**జను పనులు సేయు భీమా । ర్జునులే దుష్కర్మములకు రోయని వారల్? 305**

**ప్రతిపదార్థం:** జనులకున్+ఎల్లను= జనులకందరికీ; పథ్యములు+అనఁగాన్= మేలు చేసేవి అనిన్నీ; ధర్మ+అనుగతములు+ అగున్+అనన్= ధర్మాన్ని అనుసరించేవి అనిన్నీ; పొగడన్+చను= ప్రశంసించదగిన; పనులు, చేయు, భీమ+అర్జునులే= భీమార్జునులా; దుష్కర్మములకున్= చెడుపనులకు; రోయనివారల్?= అసహ్యించుకొననివారు?

**తాత్పర్యం:** జనులకందరికీ మేలు చేసేవి అనిన్నీ, ధర్మాన్ని అనుసరించేవి అనిన్నీ ప్రశంసించదగిన పనులు చేసే భీమార్జునులా చెడుపనులకు అసహ్యించుకొననివారు?

**విశేషం:** 'నేనే కాదు మా తమ్ములు భీమార్జునులు కూడా జనహిత ధర్మకార్యాలే చేస్తారు కాని యుద్ధం జోలికి' అనవసరంగా పోరు. దానిని అసహ్యించుకొంటారు' అని ధర్మరాజు తమ్ముల సంగతి కూడా చెప్పాడు.

**క. మది సుఖము గోరి, దుఃఖం । బొదవం గల కార్యములకు నుత్సాహము సే**
**యుదు రొప్పని తృష్ణం బడి । చదు రేమియు లేని యట్టి జను లాతురులై. 306**

**ప్రతిపదార్థం:** చదురు+ఏమియున్, లేని+అట్టి; జనులు= నేర్పు ఏ మాత్రమూ లేని జనులు; ఒప్పని, తృష్ణన్+పడి= తగని దప్పికి - దురాశకు లోఁబడి; ఆతురులు+ఐ= తొందరపడినవారయి; మది,సుఖము+కోరి= మనస్సంతోషం కోరి; దుఃఖంబు+ ఒదవన్+కల కార్యములకున్= దుఃఖం కలిగించే పనులకు; ఉత్సాహము+చేయుదురు= ఉత్సాహం చూపుతారు.

**తాత్పర్యం:** చతురత ఏ మాత్రమూ లేని జనులు తగని దురాశకు లోబడి తొందరపడినవారయి మనస్సంతోషం కోరి దుఃఖాన్ని కలిగించే పనులకు ఉత్సాహం చూపుతారు.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. తాము చదురులేని జనులం కామనీ, తమకు ఒప్పని తృష్ణ లేదనీ, దుఃఖావహకార్యాలకు తాము చొరమనీ ధర్మరాజు అభిప్రాయం. పద్యంలో ఉన్నది సామాన్యాంశం. 'మేము అట్లాంటి వాళ్ళం కాము' అనేది విశేషాంశం. అది అధ్యాహార్యం. అది సమర్థించబడుతున్నది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**ఆ. యోగ్యతృష్ణ దారు, లుచితంపుఁ గొలఁదిమై । నడచినట్టివారు బెడిదములకు**
**నంత సొత్తు రెట్లు? సంతాపకారుల । కాక పెనఁకువలు సుఖంబు లగునె? 307**

**ప్రతిపదార్థం:** యోగ్యతృష్ణన్= సముచితమైన ఆశతో; ఉచితంపుఁగొలఁదిమైన్ (ఉచితము+కొలఁదిమైన్)= తగిన విధంగా; దారులు= మార్గాలు; నడచినట్టివారున్= అనుసరించేవారూ; బెడిదములకున్= హింసాకృత్యాలకు; అంత+చొత్తురు+ఎట్లు?= అంతగా ఎట్లా పూనుకొంటారు?; పెనఁకువలు= యుద్ధాలు; సంతాపకారులు+అ కాక= అధిక దుఃఖాన్ని కలిగించేవే కాని; సుఖంబులు+అగునె?= సుఖ ప్రదాలు అవుతాయా?

**తాత్పర్యం:** సముచితమైన ఆశతో, తగిన విధంగా మంచి త్రోవల ననుసరించేవారు క్రౌర్యాలకు అంతగా ఎట్లా పూనుకొంటారు? యుద్ధాలు దుఃఖావహాలే కాని సుఖావహ లవుతాయా?

**వ. భోగంబులు వలదా యని తలంతు మేని. 308**

**ప్రతిపదార్థం:** భోగంబులు= సుఖాలు; వలదా= వద్దా; అని; తలంతుము+ఏనిన్= అనుకొంటే.

**తాత్పర్యం:** సుఖాలు వద్దా అని అనుకొంటే.

**తే. వస్త్ర మాల్యానులేపనావసరములును, । జతుర తూర్య త్రయంబుల సమయములును,**
**నేమ వెలిగాఁగ మా తండ్రి కించు నెట్లు; । పుత్త్రులన పట్టి మమ్మేల పోవఁ ద్రోచు? 309**

**ప్రతిపదార్థం:** వస్త్ర,మాల్య+అనులేపన+అవసరములును= వలువల, పూలమాలల, గంధపు పూతల వేళలూ; చతుర, తూర్య, త్రయంబుల; సమయములును= నేర్పరులయొక్క, నృత్త గీతవాద్యాల వేళలూ; ఏము వెలి+కాఁగన్= మేము దూరమైతే; మా తండ్రికిన్= మా తండ్రిఅయిన ధృతరాష్ట్రుడికి; ఇంచున్+ఎట్లు= ఎట్లా బాగుంటుంది?; పుత్త్రులన (పుత్త్రులన్+అ)= కొడుకులనే; పట్టి= పట్టుకొని; మమ్మున్+ఏల= మమ్ములను ఎందుకు; పోవన్+త్రోచున్?= పొమ్మంటాడు?

**తాత్పర్యం:** వస్త్రాలు కట్టుకొన్నప్పుడూ, పూలమాలలు ధరించినప్పుడూ, గంధపు పూతలు పూసికొన్నప్పుడూ, నేర్పరులు నృత్తగీత వాద్యాలు చేసేటప్పుడూ మేము దూరంగా ఉంటే మా తండ్రి ధృతరాష్ట్రుడికి ఏం బాగుంటుంది? అతడు కొడుకులనే పట్టుకొని మమ్మెందుకు పొమ్మంటాడు?

**వ. అయినను నొకమాట సెప్పెద సమచిత్తుఁడవై విను' మని యిట్లనియె. 310**

**ప్రతిపదార్థం:** అయిననున్= అయినప్పటికీ; ఒక - మాట, చెప్పెదన్; సమ చిత్తుఁడవు+ఐ= నిష్పక్షపాత బుద్ధి కలవాడవై; వినుము+అని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అయినా ఒక మాట చెపుతా నిష్పక్షపాతబుద్ధితో వినుము' అని ఇట్లా అన్నాడు.

**క.** **తానైన నపుడు వక్రుం । డై నీతిపథంబు విడిచె నక్కట! పతి; మ**
**మ్మైనను జక్కని తెరువునఁ । బూని నడవుఁ డనుచు నిపుడు బుద్ధులు సెప్పెన్.** **311**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; పతి= రాజు - ధృతరాష్ట్రుడు; తాను+ఐనన్= తానైతే; అపుడు; వక్రుండు+ఐ= కుటిలుడై; నీతి పథంబున్= నీతిమార్గాన్ని; విడిచెన్= వదలిపెట్టాడు; ఇపుడు; మమ్మున్+ఐనను= మమ్ములనయితే; చక్కని తెరువునన్= సన్మార్గంలో; పూని= ప్రయత్నించి; నడవుఁడు+అనుచున్= నడవండి అంటూ; బుద్దులు+చెప్పెన్= బుద్దులు చెపుతున్నాడు.

**తాత్పర్యం:** 'అయ్యో! ధృతరాష్ట్రుడు తానేమో అప్పుడు కుటిలుడై నీతిమార్గం విడిచిపెట్టాడూ! మమ్మల్నేమో 'సన్మార్గంలో ప్రయత్నించి నడవండి' అంటూ ఇప్పుడు బుద్ధులు చెపుతున్నాడూ! (ఇదేం న్యాయం?)

**క.** **ఎదిరిం దమయట్టుల కా । మదిఁ దలఁచినఁ బొసఁగుఁ గాక, మాకుం గుడు మిం**
**డిదె మీరు వ్రక్కఁ గొనుఁడని । చదు రడిచిన మనసు పొందు చక్కం బడునే?'** **312**

**ప్రతిపదార్థం:** ఎదిరిన్= ఎదుటివాడిని; తమ+అట్టులు+అ+కాన్= తమవలెనే; మదిన్= మనస్సులో; తలఁచినన్= భావిస్తే; పొసఁగున్+కాక= కుదురుతుంది కాని; మాకున్; కుడుము+ఇండు= కుడుము కుడుమంతా ఇవ్వండి; ఇదె= ఇదిగో; మీరు; వ్రక్కన్= ముక్కను; కొనుఁడు= తీసికొనండి; అని; చదురు+అడిచినన్= తెలివితో నటిస్తూ మాటాడితే; మనసుపొందు= మనస్సుల కలయిక; చక్కన్+పడునే?= తిన్న నవుతుందా?, అనుకూలంగా పొసగుతుందా?

**తాత్పర్యం:** ఎదుటివారిని తమవలెనే మనస్సులో భావిస్తే కుదురుతుంది కాని 'మాకు మొత్తం కుడుమంతా ఇవ్వండి, ఇదిగో మీరు ముక్క పుచ్చుకోండి' అని పరిహాస మాడితే మనస్సులు చక్కగా కలుస్తాయా?'

**వ.** **అని చూపి చెప్పి, వెండియు.** **313**

**తాత్పర్యం:** అని నిరూపించి చెప్పి ఇంకా. - (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ.** **'సంపద దక్కి యుండఁగ నశక్తు లనం జను మమ్ముఁ బిల్చి పూ**
**జింపఁగ నంత బేలె పతి? సెప్పెడు వారల బుద్ధి నాఁడ మ**
**న్నింపఁడ; యింక నేల యగు? నీ వడియాసల వచ్చి రిత్త గా**
**రింపక మాను; మాతని చరిత్రము నీకును మాకు వింతయే?** **314**

**ప్రతిపదార్థం:** సంపద+తక్కి+ఉండఁగన్= ఐశ్వర్యం పోయి ఉండగా; అశక్తులు+అనన్+చను మమ్మున్= బలహీనులుగా ఉన్న మమ్ములను; పిల్చి= ఆహ్వానించి; పూజింపఁగన్= పూజించటానికి; పతి= రాజు- ధృతరాష్ట్రుడు; అంత బేల+ఎ= అంత వెర్రివాడా?; చెప్పెడు వారల బుద్ధిన్= చెప్పేవాళ్ళ బుద్ధిని; నాఁడు+అ= అప్పుడే; మన్నింపఁడు+అ= ఆదరించనే లేదు; ఇంకన్+ఏల+అగున్?= ఇంక ఎందుకు కుదురుతుంది?; నీవు, అడియాసలన్= వట్టి ఆశలతో; వచ్చి; రిత్త= ఊరికే; కారింపక

మానుము= బాధపెట్టకుము; ఆతని చరిత్రము= ఆ ధృతరాష్ట్రుడి నడత; నీకును= నీకూ; మాకున్= మాకూ; వింతయే?= క్రొత్తా?

**తాత్పర్యం:** ఐశ్వర్యం కోల్పోయి బలహీనులమై ఉన్న మమ్ములను ఆహ్వానించి పూజించడానికి ధృతరాష్ట్రుడు అంత వెర్రివాడా? చెప్పేవాళ్ళ బుద్ధిని అప్పుడే ఆదరించలేదు. ఇంక ఎందుకు కుదురుతుంది? నీవు లేనిపోని ఆశలు పెట్టుకొని వచ్చి మమ్ములను ఊరికే బాధపెట్టకుము. ఆతడి ప్రవర్తన నీకూ మాకూ క్రొత్తా?

**క. తగు మాట లాంబికేయుం । డగు నని కైకొనునె యెన్నఁడైనను? గొడుకున్**
**మగఁటిమి గలఁ డనియెడు న । మ్మిగఁ జూచుచు నుండు విషము మ్రింగిన యేనిన్. 315**

**ప్రతిపదార్థం:** ఆంబికేయుండు= అంబిక కుమారుడు - ధృతరాష్ట్రుడు; తగు మాటలు= మంచిమాటలు; అగును+అని= ఔనని; ఎన్నఁడు+ఐనను= ఎప్పుడయినా; కైకొనునె?= స్వీకరిస్తాడా? - వింటాడా?; కొడుకున్= కొడుకును- దుర్యోధనుడిని; మగఁటిమి= పరాక్రమం; కలఁడు+అనియెడు నమ్మిగన్= ఉన్నవాడు అనే నమ్మకంతో; విషమున్+మ్రింగిన+ఏనిన్= విషం మ్రింగినా; చూచుచున్+ఉండున్= చూస్తూ ఉంటాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు మంచిమాటలకు ఔనని ఎప్పుడైనా ఊ కొడతాడా? కొడుకైన దుర్యోధనుడిని పరాక్రమవంతుడనే (గుడ్డి) నమ్మకంతో, విషం మ్రింగినా, చూస్తూ ఊరుకొంటాడు.

**క. జూదపుసిరి యాసపడం । గా దని విదురుండు సెప్పఁగా నప్పుడు క**
**ర్ణాదుల పలుకులు విని పతి । యాదరణము సేయకున్న, నంతన తీరున్. 316**

**ప్రతిపదార్థం:** జూదము+సిరి= జూదం వలని సంపద; ఆసపడన్+కాదు+అని= ఆశించకూడదని; విదురుండు, చెప్పఁగాన్, అప్పుడు; పతి= రాజు- ధృతరాష్ట్రుడు; విని; కర్ణ+ఆదుల పలుకులు= కర్ణుడూ మొదలయిన వాళ్ళమాటలు; ఆదరణము+ చేయక+ఉన్నన్= ఆదరించకుండా ఉంటే; అంతన్+అ= దానితోనే; తీరున్= తీరిపోయేది.

**తాత్పర్యం:** జూదంవలన వచ్చే సంపద కొరకు ఆశపడకూడదని విదురుడు చెప్పగా విని, అప్పుడు కర్ణాదుల మాటలు ధృతరాష్ట్రు డాదరించకుండా ఉంటే, దానితో తీరిపోయేది.

**క. ధృతరాష్ట్రుం డిట మీఁదను । సుతులును, శకునియును, సూతసుతుఁడును దను నే**
**గతి నడపించిరి వారల । మతమ యనుష్ఠించుఁగాక మరలం బడునే? 317**

**ప్రతిపదార్థం:** ఇటమీఁదను= ఇంకమీదట; ధృతరాష్ట్రుండు; సుతులును= కొడుకులూ (దుర్యోధన, దుశ్శాసనులు); శకునియును; సూత సుతుఁడును= కర్ణుడూ; తనున్= తనను; ఏ గతిన్+నడపించిరి= ఏ మార్గాన నడిపించారో; వారల మతము+అ= వాళ్ళ మతమే; అనుష్ఠించున్+కాక= ఆచరిస్తాడు కాని; మరలన్+పడునే?= దానికి విముఖు డవుతాడా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఇంకమీదట తనను కొడుకులు దుర్యోధన దుశ్శాసనులూ, శకునీ, కర్ణుడూ ఏ విధంగా నడిపిస్తే ఆ విధంగానే నడిచి వారి మతమే ఆచరిస్తాడు కాని తద్విముఖు డవుతాడా?

**విశేషం:** ఈ పద్యంలో యత్తత్ప్రయోగం చేయబడింది. కాని 'ఏగతి నడపించిరి' అని యచ్ఛబ్దం మాత్రం ఉన్నది కాని, 'ఆ గతి....' అని తచ్ఛబ్ద ప్రయోగం లోపించింది. అయితే, వారలమతమ అనే దానిలోనే తచ్ఛబ్ద భావం ఇమిడిఉంది. వారలమతమ=

ఆ మతమే - ఆగతే. అది విశేషం. ఇంతవరకూ ధర్మరాజు చేసిన ధృతరాష్ట్ర మనస్తత్త్వ విశ్లేషణ అతడి పర మనస్తత్త్వ పరిజ్ఞానానికి నిదర్శనం, ఇక దుర్యోధనుడి మనస్తత్త్వాన్ని విశ్లేషిస్తాడు.

**క. కార్యము తెఱఁ గిట్టిది; నీ । వార్య చరితమునకుఁ జొచ్చి యాడెదు; నీ కా**
**దుర్యోధను నవినయ మని । వార్యం బని యెఱుఁగరామి; వలనో, వెడఁగో? 318**

**ప్రతిపదార్థం:** కార్యము తెఱఁగు+ఇట్టిది= ఇదీ కార్యస్వరూపం; నీకున్; ఆ దుర్యోధను+అవినయము= ఆ దుర్యోధనుడి యొక్క చెడునడవడి; అనివార్యంబు+అని= మాన్ప శక్యం కానిది అని; ఎఱుఁగన్+రామిన్= తెలియకపోవటం చేత; నీవు; ఆర్యచరితమునకున్+చొచ్చి= 'పెద్దమనిషి తరహాగా'; ఆడెద+వు= మాటాడుతున్నావు; వలనో= వివేకమో; వెడఁగో= అవివేకమో!

**తాత్పర్యం:** ఇదీ కార్యస్వరూపం. నీకు ఆ దుర్యోధనుడి చెడునడత మాన్ప శక్యం కానిదని తెలియకపోవటం చేత నీవు అట్లా పెద్ద మనిషితరహాగా మాటాడుతున్నావు. నీది వివేకం అనుకొనాలా? అవివేకం అనుకొనాలా?

**క. చక్రధరు లెక్క గొనఁడు; ప । రాక్రమనిధి యర్జునునకు రాధేయ భుజా**
**విక్రమ మెదురుగఁ గొని, ని । ర్వక్రముఁ జేసికొనువాఁడు రాజ్యం బెల్లన్.' 319**

**ప్రతిపదార్థం:** వాఁడు= అతడు - దుర్యోధనుడు; చక్రధరున్= సుదర్శనమనే చక్రాన్ని ధరించినవాడిని- కృష్ణుడిని; లెక్క+ కొనఁడు= లక్ష్యపెట్టడు; పరాక్రమ నిధి= పరాక్రమానికి నిధి అయిన; అర్జుననకున్; రాధేయ భుజా విక్రమము= కర్ణుడి బాహు పరాక్రమం; ఎదురుగన్+కొని= ప్రతిగా భావించి; రాజ్యంబు+ఎల్లన్= రాజ్యాన్ని అంతనూ; నిర్వక్రమున్+చేసికొనున్= చక్కబరుచుకొంటాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు చక్రాయుధుడైన శ్రీకృష్ణుడిని లెక్కించడు; పరాక్రమానికి నిధి అయిన అర్జునుడికి కర్ణుడి బాహుపరాక్రమాన్ని ప్రతిగా భావించి రాజ్యన్నంతనూ నిష్కంటకం చేసికొని, చక్కబరుచుకొనా లనుకొంటున్నాడు.'

**విశేషం:** అలం: పరికరం. 'చక్రధరున్' అనే కృష్ణ విశేషణం సాభిప్రాయంగా ప్రయుక్త మయింది కాబట్టి పరికరం.

**వ. అని పలికి వెడవెడ యలుక వొడమిన, మఱియు నిట్లనియె. 320**

**ప్రతిపదార్థం:** అని, పలికి, వెడవెడ= కొద్దిగా; అలుక+పొడమినన్= కోపం రాగా; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికి కొంచెం కోపం రాగా ఇంకా ఇట్లా అన్నాడు.

**శా. 'చాపాచార్యుఁడు, భీష్ముఁడుం, గృపుఁడు, నశ్వత్థామయుం, గర్ణుఁడున్,**
**భూపశ్రేష్ఠుఁడుఁ దారు మున్నెఱుఁగరే పోరె? రెట్లుఁ గయ్యంబు లా**
**శాపాశంబులు చుట్ట; లా వెఱఁగియుం జావేఁడి మార్కొందు; రిం**
**తేపో! తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే? 321**

**ప్రతిపదార్థం:** చాప+ఆచార్యుఁడున్= ధనుర్గురువూ- ద్రోణుడూ; భీష్ముఁడున్, కృపుఁడున్; అశ్వత్థామయున్; కర్ణుఁడున్; భూప శ్రేష్ఠుఁడున్= రాజోత్తముడైన దుర్యోధనుడూ; తారు= తాము; మున్ను= పూర్వం; పోరు= యుద్ధం; ఎఱుఁగరే?= తెలియరా?; ఆశా పాశంబులు+చుట్టన్= ఆశలనెడి త్రాళ్ళు చుట్టుకోగా; ఎట్లున్= ఏ విధంగా నైనా; కయ్యంబులు= యుద్ధాలు - యుద్ధాలు

ఏ విధంగానైనా జరిగితీరతాయి; లావు= (మా) బలం; ఎఱిఁగియున్= తెలిసికూడా; చాన్+వేఁడి= చావగోరి; మార్కొందురు= ఎదుర్కొంటారు; ఇంతే పో= ఇదే నిశ్చయం; తమ్మున్= తమను; కపి ధ్వజ ప్రభలు+అ= (అర్జునుడి) కపిధ్వజం కాంతులే; అంధీభూతులన్= గ్రుడ్డివాళ్ళనుగా; చేయవు+ఏ?= చేయవా? చేస్తాయి అని భావం.

**తాత్పర్యం:** ద్రోణుడూ, భీష్ముడూ, కృపుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, దుర్యోధనుడూ - వీరంతా మునుపు యుద్ధం ఎరుగరా? రాజ్యకాంక్ష మొదలైన ఆశలనే పాశాలు చుట్టుకుంటే, యుద్ధా లెట్లాగూ తప్పవు. వారు మా బలం ఎరిగికూడా చావగోరి ఎదుర్కొంటున్నారు. ఇదే నిశ్చయం! అర్జునుడి కపిధ్వజ కాంతులే తమను గ్రుడ్డివాళ్ళనుగా చేస్తాయి.

**విశేషం:** 1. అలం: రూపకం. ద్రోణాది వీరులంతా ఇదివరకు యుద్ధం ఎరుగరా? ఆ యుద్ధాలలో ఏం జరిగిందో వాళ్ళకు తెలియదా? ఆశలనే పాశాలు అనేచోట ఉపమేయోపమానాలకు అభేదం చెప్పబడింది కాబట్టి అలంకారం రూపకం.

2. కపిధ్వజప్రభలు అను సమాసమునకు అర్జునుడి పరాక్రమ ద్యుతులు అనికూడా అర్థం చెప్పవచ్చు.

**క. మును మమ్ముఁ బొగడి, పదపడి । యని వారల గెలువ నరిది యని పొత్తుగఁ జె**
**ప్పిన మాటకు నే నొడఁబడ; । విను సంజయ! పక్షపాత వృత్తి విడువుమీ! 322**

**ప్రతిపదార్థం:** సంజయా!; (విను)ము; మును= ముందు; మమ్మున్; పొగడి; పదపడి= తరువాత; అనిన్= యుద్ధంలో; వారలన్; గెలువన్= గెలవటానికి; అరిది= అశక్యం; అని; పొత్తుగన్= పొందికగా; చెప్పిన మాటకున్; ఏన్= నేను; ఒడఁబడన్= అంగీకరించను; పక్షపాత వృత్తిన్= ఒకేవైపు అభిమానం కలిగి ఉండటం; విడువుమీ= విడిచిపెట్టుము.

**తాత్పర్యం:** సంజయా! వినుము. ముందు మమ్ములను పొగడి, పిమ్మట వాళ్ళను యుద్ధంలో గెలవటం అసాధ్యం అని పొందికగా నీ వన్నమాట నేను అంగీకరించను. పక్షపాతబుద్ధి విడిచిపెట్టుము.

**స్రగ్ధర.**

**గాండీవ జ్యారవం బుత్కట మయి పెలుచం గ్రమ్మినన్, భీము బాహా**
**దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్, వే**
**దండ ద్వంద్వంబు మాడ్కిం దఱిమి కవలు మాద్యద్గతిం దాఁకినం, జా**
**కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె బిట్టుల్కి మూర్ఛిల్లకుండన్? 323**

**ప్రతిపదార్థం:** గాండీవ జ్యా రవంబు= గాండీవం అనే అర్జునుడి వింటియొక్క అల్లెత్రాటియొక్క ధ్వని; ఉత్కటము+అయి= తీవ్రమై; పెలుచన్= అధికంగా; క్రమ్మినన్= వ్యాపించినా; భీము బాహా దండంబు= భీముడియొక్క దండంవంటి బాహువు; ఏపు+ఆరి= విజృంభించి; శుంభత్+గదన్= ప్రకాశిస్తున్న; గదను; జడియుచున్= త్రిప్పుతూ; రౌద్రంబుగాన్= భయంకరంగా; తోఁచినన్= కనబడినా; కవలు= నకులసహదేవులు; వేదండ ద్వంద్వంబు మాడ్కిన్= ఏనుగుల జంటవలె; తఱిమి= విజృంభించి; మాద్యత్+గతిన్= మత్తెక్కుతూఉన్న విధంగా; తాఁకినన్= మార్కొన్నా; కౌరవ్యులకున్= కౌరవసంబంధులకు; చాక+ఉండన్= చావకుండా ఉండటానికీ; పోక+ఉండన్= పారిపోకుండా ఉండటానికీ; బిట్టు+ఉల్కి= మిక్కిలి భయపడి; మూర్ఛిల్లక+ఉండన్= మూర్ఛపోకుండా ఉండటానికీ; వశమె?= తరమా?

**తాత్పర్యం:** అర్జునుడి గాండీవపు అల్లెత్రాటి ధ్వని అధికమయి మిక్కిలి వ్యాపించినా, భీముడి బాహుదండం విజృంభించి ప్రకాశిస్తున్న గదను త్రిప్పుతూ భయంకరంగా కనబడినా, నకుల సహదేవుల ఏనుగుల జంటవలె కలిసి మదించిన విధంగా మార్కొన్నా కౌరవసంబంధులకు చావకుండా, పారిపోకుండా, మిక్కిలి భయపడి మూర్ఛపోకుండా ఉండటానికి శక్యమా?

**విశేషం:** దీనికి మూలమైన సంస్కృత శ్లోకం -

**"గాణ్డీవ విస్ఫారిత శబ్ద మాజా వశృణ్వానా ధార్తరాష్ట్రా ధ్రియన్తే ।**
**క్రుద్ధస్య వ చే ద్భీమసేనస్య వేగాత్ సుయోధనో మన్యతే సిద్ధమర్థమ్ ॥**
**ఇన్ద్రోఽప్యేత న్నోత్సహేత్తాత హర్తు మైశ్వర్యం నో జీవతి భీమసేనే ।**
**ధనంజయే నకులే చైవ సూత, తథా వీరే సహదేవే మదీయే ॥** (సం. 5. 26. 14-15)

దీనితో పయి తెలుగుపద్యాన్ని పోలిస్తే తిక్కనమెలకువ విదితమవుతుంది.

'గాండీవజ్యా రావం కౌరవులు ఇప్పటిదాకా వినలేదు కాబట్టి బ్రదికిపోయారు. క్రుద్ధుడైన భీముడిని చూచేదాకా తనపూన్కి సాగిన దనే దుర్యోధనుడు నమ్మి ఉంటాడు. భీమార్జునులూ, వీరుడైన నకులుడూ, సహనశీలుడైన సహదేవుడూ సజీవులై ఉన్నంతవరకూ ఇంద్రుడు కూడా మా ఐశ్వర్యాన్ని హరించలేడు' - అని మూలశ్లోక భావం. ఇందులో పూర్వార్ధంలో భీమార్జునుల శౌర్యం గురించి చెప్పి, ఉత్తరార్ధంలో నకుల సహదేవులతోపాటు భీమార్జునులను మళ్ళీ పేర్కొన్నాడు వ్యాసుడు.

తిక్కన పద్యంలో ఈ పునరుక్తి లేదు. నలుగు రన్నదమ్ముల బలపరాక్రమాలనూ క్రమంగా ప్రకటించాడు తెలుగుకవి. అర్జును డని చెప్పకుండా 'గాండీవ జ్యారవ' మని మాత్రం చెప్పి అతడిని స్ఫురింపచేసిన తీరు బాగా ఉన్నది. అర్జునుడు శ్రవణ మాత్రభయంకరుడనీ, భీముడు దర్శనమాత్ర భయంకరుడనీ, నకుల సహదేవులు సంఘర్షణ మాత్ర భయంకరులనీ తారతమ్యాలను వ్యక్తీకరించిన విధం ప్రశంసనీయంగా ఉన్నది. కౌరవులు అర్జున, భీమ, నకుల, సహదేవుల పరాక్రమాలకు క్రమంగా చావకుండా, పారిపోకుండా, భయపడకుండా, మూర్ఛిల్లకుండా ఉండగలరా? అని క్రమాలంకారంలో చెప్పి వారి వారి బలాలను తిక్కన ధ్వనింపజేశాడు. 'స్రగ్ధరా' వృత్తం భావానుగుణంగానూ, సన్నివేశ సముచితంగానూ ఉన్నది. స్రగ్ధరలో నాలుగు పాదాలుంటాయి, ప్రతిపాదంలోనూ మ,ర,భ,న,య,య,య అనే గణాలుంటాయి. 1-8-15 అక్షరాలకు యతిమైత్రి, ప్రాసనియమం ఉంటుంది.

**వ. కావున.** **324**

**తాత్పర్యం:** కాబట్టి.

**చ. రణమున వారలన్ గెలువరా దను పల్కు లటుండనిమ్ము; స**
**ద్గుణుఁడవు నీవు వచ్చితి; ప్రకోపశమంబుగఁ బల్కి; తింకనై**
**రణ దగఁ జేయువారము; పరాభవ మొందియు మున్ను వారి దు**
**ర్గుణములు సైఁచు టీవు నొకకొంత యెఱుంగుదు వింతయేటికిన్?** **325**

**ప్రతిపదార్థం:** రణమునన్= యుద్ధంలో; వారలన్= ఆ కౌరవులను; గెలువన్+రాదు+అను పల్కులు= గెలవటానికి శక్యం కాదు అనే మాటలు; అటు+ఉండన్+ఇమ్ము= అట్లా ఉండనిమ్ము; సత్+గుణుఁడవు, నీవు= మంచి గుణాలు కలవాడవైన

నీవు; వచ్చితి(వి); ప్రకోపశమంబుగన్+పల్కితి(వి)= అధికమైన కోపం శాంతించేటట్లు పలికావు; ఇంకన్; తగన్= ఒప్పేటట్లు; సైరణన్+చేయువారము= సహనం చూపిస్తాం; మున్ను= పూర్వం; పరాభవము+ఒందియున్= అవమానం పొందికూడా; వారి దుర్గుణములు= వారి అవగుణాలు; సైఁచుట= సహించటం; ఈవున్= నీవుకూడా; ఒక కొంత= ఒకించుక; ఎఱుంగుదు(వు)= ఎరిగి ఉన్నావు; ఇంత+ఏటికిన్= ఇంతెందుకు?

**తాత్పర్యం:** యుద్ధంలో ఆ కౌరవులను గెలవటం అశక్యం అనే మాటలు అట్లా ఉండనీ. మంచివాడవు నీవు వచ్చావు. అధిక కోపం ఉపశమించేటట్లు మాటాడావు. ఇక మేము సహనం ఒప్పుగా వహిస్తాం. అవమానం పొందీ మునుపు మేము వాళ్ళ అవగుణాలు సహించి ఉండటం నీకూ కొంచెం తెలుసు. ఇంతెందుకు?

**ఉ. ఇంకను నట్ల కాఁ దలఁపు; మే మొక కీడునకుం దొడంగ; మా**
**శంకలు దక్కు; మయ్యకు విచారము గల్గెనయేని, బాంధవం**
**బంకుర మొత్త, మా వలన నక్కటికం బొలయంగ, మమ్ము నే**
**వంకకుఁ బోవనీక, గరువంబు జగంబు ప్రశంస సేయఁగన్. 326**

**ప్రతిపదార్థం:** ఇంకనున్= ఇకమీదట కూడా; అట్లు+అ= అట్లాగే; కాన్+తలంపుము= అవునని తలంచే; ఏము= మేము; ఒక కీడునకున్= ఒక అపకారానికి కూడా; తొడంగము= పూనుకొనము; ఆ శంకలు+తక్కుము= ఆ అనుమానాలు విడిచిపెట్టుము; అయ్యకున్= తండ్రి అయిన ధృతరాష్ట్రుడికి; విచారము= వివేకం (సరి అయిన ఆలోచన); కల్గెన్+అ+ఏనిన్= ఉంటే; బాంధవంబు= చుట్టరికం; అంకురము+ఒత్తన్= మళ్ళీ మొలకెత్తగా; మా వలనన్= మామీద; అక్కటికంబు= కనికరం; ఒలయంగన్= కలుగగా; మమ్మున్; ఏ వంకకున్= ఎక్కడికీ; పోవన్+ఈక= వెళ్ళనీయక; గరువంబున్= గొప్పతనాన్ని; జగంబు= లోకం; ప్రశంస+చేయఁగన్= పొగడగా.

**తాత్పర్యం:** ఇక మీదట కూడా అట్లాగే సహించి ఉంటామని యెంచుము; మేము ఒకఅపకారానికి కూడా పూనుకొనము. ఆ అనుమానాలు విడిచిపెట్టుము. తండ్రిఅయిన ధృతరాష్ట్రుడికి వివేకం కనక ఉన్నట్లయితే, చుట్టరికం మళ్ళీ మొలకెత్తేటట్లు మాపై దయయుంచి మమ్ములను ఎక్కడికీ వెళ్ళనీయక తన గొప్పతనం లోకులు ప్రశంసించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. రండని పిలువఁ బనిచి, పా । లిండని కొడుకులకుఁ జెప్పి, యింద్ర ప్రస్థం**
**బొండెను, వేఱొక పట్టణ । మొండెను మా కిచ్చి యనుచు టుచితమ కాదే?' 327**

**ప్రతిపదార్థం:** రండు+అని; పిలువన్+పనిచి= పిలిపించి; పాలు+ఇండు+అని= భాగం ఇవ్వండి అని; కొడుకులకున్+చెప్పి; ఇంద్రప్రస్థంబు+ఒండెను= ఇంద్రప్రస్థమో; వేఱు+ఒక, పట్టణము+ఒండెను= ఇంకో పట్టణమో; మాకున్, ఇచ్చి; అనుచుట= పంపటం; ఉచితము+అ కాదే?= మంచిది కాదా?

**తాత్పర్యం:** రండి అని పిలిపించి, వాళ్ళకు భాగం ఇవ్వండి అని తన కొడుకులకు చెప్పి, ఇంద్రప్రస్థమో, లేదా ఇంకో పట్టణమో మా కిచ్చి పంపటం మంచిది కాదా?'

**ఉ. నా విని సంజయుండు నరనాథున కిట్లను 'నెట్టి తప్పులుం**
**బోవఁగఁ ద్రోచి తాలిమియ పూనుదు గావున నిన్నిమాట లి**
**ట్లీవు వినంగ నాడియును, నేఁ దనివోవక విన్నవించెదన్**
**నీ విభవం బహింసయు ననింద్యచరిత్రమ కాక యన్యమే? 328**

**ప్రతిపదార్థం:** నాన్+విని= అని ధర్మరాజు అనగా విని; సంజయుండు; నరనాథునకున్= రాజుకు; ధర్మరాజుతో; ఇట్లు+అనున్; ఎట్టితప్పులున్= ఎటువంటి తప్పులనైనా; పోవఁగన్+త్రోచి= పోనీలే అని త్రోసివైచి; తాలిమి+అ= సహనమే; పూనుదు(వు)+ కావునన్= వహిస్తావు కాబట్టి; ఈవు= నీవు; వినంగన్= వినేటట్లు; ఇట్లు= ఇట్లా; ఇన్ని మాటలు; ఆడియును= పలికీ; నేన్= నేను; తనివి+పోవక= తృప్తిపడక; విన్నవించెదన్= మనవి చేస్తాను; నీ విభవంబు= నీ ఐశ్వర్యం; అహింసయున్= అహింసా; అనింద్య చరిత్రము+అ+కాక= నిందించ దగని నడవడే కాక; అన్యము+ఏ?= ఇంకొకటి కాదు కదా!

**తాత్పర్యం:** అని ధర్మరాజు అనగా విని సంజయుడు అతడితో ఇట్లా అన్నాడు- 'నీవు ఎట్లాంటి తప్పులనైనా పోనీలే అని ఉపేక్షించి సహనమే వహిస్తావు కాబట్టి నీవు వినేటట్లు ఈ విధంగా ఇన్నిమాటలు పలికి, నేను తృప్తి పడక ఇంకా మనవి చేస్తాను. నీ ఐశ్వర్యం, అహింసా, అనింద్యమైన నడవడీ తప్ప వేరొకటి కాదు కదా!

**విశేషం:** అహింసా సచ్చరితలే ఐశ్వర్యంగా గల నీవంటి వాడు రాజ్యభాగం కొరకు అంతగా పట్టించుకొనగూడదని సంజయుడి సూచన.

**క. పా లీక కౌరవులు దు । శ్శీలతఁ జెడఁ దలఁచిరేనిఁ, జెప్పెద, రుధిరా**
**భీలాన్నంబునకంటెను । మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్. 329**

**ప్రతిపదార్థం:** కౌరవులు, పాలు= భాగం; ఈక= ఇయ్యక; దుశ్శీలతన్= దుష్టస్వభావంతో; చెడన్+తలఁచిరి+ఏనిన్= చెడిపోవాలనుకొన్నా; చెప్పెదన్= చెపుతాను; మీ నడవడికిన్= మీ సత్ప్రవర్తనకు; రుధిర+ఆభీల+అన్నంబునకంటెను= నెత్తుటితో భయంకరమైన కూటికంటె; భిక్షా+అన్నము+ఐనన్= బిచ్చపు కూడైనా; మేలు+అగున్= మంచిది.

**తాత్పర్యం:** కౌరవులు దుష్టస్వభావులై మీకు రాజ్యభాగం ఇవ్వక చెడిపోవాలనుకొన్నా, చెపుతున్నాను వినుము మీ సత్ప్రవర్తనకు భయంకరమైన నెత్తుటికూటికంటె, బిచ్చపుకూడుతినటం మేలు.

**విశేషం:** 'రుధిరాభీలాన్నం' యుద్ధం చేయగా లభించే అన్నం. యుద్ధంలో శత్రువీరులను చంపగా లభించే అన్నం కాబట్టి అది 'ఆభీలం'= భయంకరంగా ఉంటుంది. కౌరవులు దుష్టులు. వాళ్ళు చచ్చినా మీకు భాగం ఇవ్వరు. అయినా సరే మీరు ఆ నెత్తుటి కూడుకొరకు ఆశించక, అడుక్కొని అయినా తిని బ్రతకటం నయం - అని ధర్మరాజుకు సంజయుడి సూచన.

**వ. అది యెట్లంటేని. 330**

**తాత్పర్యం:** నెత్తుటి కూటికంటె బిచ్చపుకూడు ఎట్లా నయం అంటావేమో.

**సీ. రాజసూయ మహాధ్వరం బట్లు నడపి స । ద్విజులకు సురలకుఁ దృప్తిఁ జేసి,**
**శాంతియు దాంతియు సకలలోకంబులఁ । బొగడొంద బ్రదికిన పుణ్యమూర్తి**
**విట్టి నీ చరితంబు హింసాకళంకిత । మగు టెంత యొప్పదు? నదియుఁగాక**
**దుర్ణయవృత్తి దుర్ద్యూతంబు పుట్టించి । యంతలు సేసిన యట్టివారి**

**తే. నేల గర్వంబు సెల్లంగ నిచ్చి, జగము । చేతఁ దిట్టులు వడునట్లు సేసి పోయి**
**తేల? యడవుల నిమ్మెయి నిడుమ గుడిచి । తేల? తాల్మియ ధనముగా నింత వడితి. 331**

**ప్రతిపదార్థం:** రాజసూయ మహత్(మహా)+అధ్వరంబు= రాజసూయ మహాయజ్ఞం; అట్లు= అంత గొప్పగా; నడపి= చేసి; సత్+ద్విజులకున్= ఉత్తమ బ్రాహ్మణులకూ; సురలకున్= దేవతలకూ; తృప్తిన్+చేసి= సంతుష్టి కలిగించి; శాంతియున్= అంతరింద్రియ నిగ్రహమూ; దాంతియున్= కర్మేంద్రియ నిగ్రహమూ; సకల లోకంబులన్= అన్ని లోకాలలోనూ; పొగడు+ ఒందన్= ప్రశంస పొందేటట్లే; బ్రదికిన పుణ్యమూర్తివి= బ్రదికిన పుణ్యాత్ముడవు; ఇట్టి నీ చరితంబు= ఇటువంటి నీ నడవడి; హింసా+అకళంకితము+అగుట= హింసచేత కలుషితం కాకపోవటం; ఎంత+ఒప్పదున్?= ఎంత బాగుండదు! ఎంతో బాగుంటుందని భావం; అదియున్+కాక= అదీకాక; దుర్ణయ వృత్తిన్= అవినీతి పద్ధతితో; దుర్ద్యూతంబు= దుష్టమైన జూదం; పుట్టించి= ఏర్పాటు చేసి; అంతలు+చేసిన+అట్టివారిన్= అంతటి ఘోరాలు చేసిన వాళ్ళను; ఏల= ఎందుకు; గర్వంబు+చెల్లంగన్+ ఇచ్చి= గర్వం చెల్లనిచ్చి; ఏల; జగముచేతన్= లోకంచేత; తిట్టులు+పడు+అట్లు+చేసి= తిట్లు పడేటట్లుచేసి; పోయితి(వి), ఏల; అడవులన్; ఇమ్మెయిన్(ఈ+మెయిన్)= ఈ విధంగా; ఇడుమ+కడిచితి(వి)?= కష్టా లనుభవించావు?; తాల్మి+అ= ఓరిమే; ధనము+కాన్= ధనంగా; ఇంత+పడితి(వి)= ఇంతపడ్డావు.

**తాత్పర్యం:** రాజసూయ మహాయజ్ఞం అంత వైభవోపేతంగా చేసి బ్రాహ్మణోత్తములకూ, దేవతలకూ సంతృప్తి కలిగించి, నీ శాంతీ, నీ కర్మేంద్రియ నిగ్రహమూ లోకాలలో ప్రశంస పొందేటట్లు బ్రదికిన పుణ్యాత్ముడవు. ఇటువంటి నీ నడవడి హింసతో కలుషితం కాకుండా ఉంటే ఎంత బాగుంటుంది! అదీకాక దుర్నీతితో కపటద్యూతం ఏర్పాటు చేసి అంతంత ఘోరాలు చేసిన వాళ్ళ గర్వం ఎందుకు చెల్లనిచ్చావు? లోకులచేత తిట్లు తినేటట్లు ఎందుకు చేశావు? అడవులలో ఈ విధంగా ఎందుకు కష్టపడ్డావు? ఓరిమే ధనంగా ఇన్నిపాట్లు పడ్డావు.

**విశేషం:** భిక్షాన్నానికి తగిన ప్రవర్తన శమదమాదిగుణాల వలన కలుగుతుంది. అట్టి శాంతిని, దాంతిని ధర్మజుడి ప్రవర్తనలో సంజయుడు నిరూపిస్తున్నాడు. రాజ్యాలను జయించి, రాజసూయం చేసి, అపారసంపదలను దానం చేసి దేవతలను, బ్రాహ్మణులను తృప్తిపరచటంలో శాంతిదాంతులు ప్రదర్శితమయ్యాయి. దుర్ద్యూతంలో వంచించి సంపదలు హరించి గర్వంతో పాండవులను అవమానించిన కౌరవులను ప్రజల నిందలకు వదిలివేసి, అరణ్యాజ్ఞాత వాసాలకు పోవటం కూడా శమదమాదుల వలననే. ఆ రెండు సందర్భాలలో కూడా పాండవులు భౌతిక రాజ్య సంపదల మీద తృష్ణను ప్రకటించలేదు. అది శమ దమ చిత్తవృత్తులు గల విరక్తుల స్వభావం. పాండవ ప్రవర్తన అట్లాగే ఉన్నదని సంజయుడు వ్యాఖ్యానించి వారికి సహనమే యోగ్యమైనదని సోదాహరణంగా వ్యాఖ్యానించాడు. (సంపా.)

**క. తుదిఁ బోయి క్రూర కర్మా । స్పదమగు తెఱఁగునకుఁ జొచ్చి, బంధుల గురులన్**
**వెదకి వధియించు సౌఖ్యం । బది యేటికి, నార్యనింద్య మస్థిర మరయన్. 332**

**ప్రతిపదార్థం:** తుదిన్+పోయి= చివరకు వెళ్ళి; క్రూర కర్మ+ఆస్పదము+అగు తెఱఁగునకున్+చొచ్చి= క్రూరపు పనికి చోటయిన పద్ధతికి పూని-యుద్ధానికి పూనుకొని; బంధులన్= చుట్టాలనూ; గురులన్= పెద్దలనూ; వెదకి; వధియించు+అట్టి సౌఖ్యంబు= చంపగా కలిగే సౌఖ్యం; అది+ఏటికిన్?= అది ఎందుకు?; అరయన్= పరిశీలించగా; ఆర్య నింద్యము= పెద్దలు నిందించేది; అస్థిరము= నిలకడలేనిదీ.

**తాత్పర్యం:** అట్లాంటి బ్రదుకు బ్రతికి, చివరకు క్రూరకర్మకు ఆస్పదమైన యుద్ధమార్గం అవలంబించి బంధువులను పెద్దలనూ వెదకి చంపటం వలన కలిగే సుఖం ఎందుకు? పరిశీలించగా ఆ సౌఖ్యం పెద్దలు నిరసించేదీ, నిలకడలేనిదీను.

**విశేషం:** శమంవలన శాంతం ఏర్పడుతుంది. శాంతం వలన అహింసా ప్రవృత్తి కలుగుతుంది. 'అహింసా పరమో ధర్మః' అని వేదోక్తి. ఇంతవరకు అహింసా వ్రతం నడిపి, ఇప్పుడు యుద్ధమనే క్రూరకర్మకు పూనుకొనటం నివృత్తి ధర్మ విరుద్ధం కాబట్టి, ధర్మరాజు శాంతుడై ఉండిపోతే. పెద్దలను చంపి సంపదను సాధించే పాపం లేకుండా పోతుంది. ఒకవేళ అట్లా వచ్చిన సంపదకూడా అనిత్యమని తెలిసి తరువాత నిర్వేదం పొందే అవసరం లేకుండా పోతుంది- అని సంజయుడు ధర్మరాజుకు బోధించాడు. సాత్త్వికుడైన యుధిష్ఠిరుడు దానికి సమ్మతించవచ్చునని భ్రమించాడు.(సంపా.)

**తే. అల్పులకు మ్రింగఁ జేఁదైన హాలహలము । భంగిఁ బొంగెడు కోపంబు మ్రింగికొనఁగ**
**నీలగళు నెన్ని నిన్నెన్నఁబోలు; నట్టి । నీవు సాలినఁ గా కేల నెగడుఁ బేరు?' 333**

**ప్రతిపదార్థం:** అల్పులకున్= తక్కువవారికి; మ్రింగన్= మ్రింగటానికి; చేఁదు+ఐన; హాలహలము భంగిన్= హాలాహలం వలె; పొంగెడు కోపంబున్= పొంగే కోపాన్ని; మ్రింగికొనఁగన్; నీలగళున్= నీలకంఠుడిని-ఈశ్వరుడిని, ఎన్ని= లెక్కించి; నిన్నున్; ఎన్నన్+పోలున్= లెక్కించదగును; అట్టి నీవు= అట్లాంటి నీవు; చాలినన్+కాక= సమర్థించకపోతే; పేరు= కీర్తి; ఏల= ఎట్లా; నెగడున్?= వస్తుంది?

**తాత్పర్యం:** క్షుద్రులకు మ్రింగటానికి చేదుగా ఉండే హాలాహలం వలె పొంగే కోపాన్ని దిగమ్రింగటంలో నీలకంఠుడి తరువాత నీవే అని చెప్పవచ్చును. అటువంటి నీవు కోపోపశమనానికి పూనుకోకపోతే నీకు పేరెట్లా వస్తుంది?'

**విశేషం:** అలం: ఉపమ, పరికరాంకురం. రాజ్యభాగం లేకున్నా ధర్మరాజు యుద్ధంవైపు మొగ్గకుండా ఉండటానికి సంజయుడు అతడిని ఆకాశం మీదకు ఎత్తేస్తున్నాడు. వట్టి పొగడ్తలకు ఉబ్బిపోయేవాడు కాడు ధర్మరాజు. హాలహలము భంగిఁ బొంగెడు కోపంబు - అలంకారం ఉపమ. ఈశ్వరుడికి నీలగళ శబ్దం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరాంకురం.

**చ. అనవుడుఁ బాండురాజతనయాగ్రణి సంజయుమోముఁ జూచి యి**
**ట్లను; 'నది యెల్ల నీ పలికినట్టిద; ధర్మువులట్ల యుండి బో**
**ధను లరయంగ వచ్చిన నధర్మములై చెడుఁ గొన్ని; ధర్మ వ**
**ర్తనములు గాక తోఁచి తుది ధర్మములై చనుఁ గొన్ని కర్మముల్. 334**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని సంజయుడు అనగానే; పాండురాజ తనయ+అగ్రణి= పాండురాజు యొక్క కొడుకులలో పెద్దవాడు ధర్మరాజు; సంజయు మోమున్= సంజయుడి ముఖం; చూచి; ఇట్లు+అనున్; అది ఎల్లన్= నీవు చెప్పినదంతా; నీ పలికిన+అట్టిది+అ= నీవు చెప్పినట్లే, నీ మాట యథార్థమే; కొన్ని(కర్మములు)= కొన్ని పనులు; ధర్మువులు+అట్లు+అ+ఉండి=

ధర్మాలవలెనే పైకి కనిపించి; బోధనులు= తెలిసినవాళ్ళు; అరయంగన్+వచ్చినన్= పరిశీలించవస్తే; అధర్మములు+ఐ; చెడున్= పోతాయి; కొన్ని కర్మముల్; ధర్మ వర్తనములు+కాక+తోఁచి= ధర్మాలవలె అనిపించక; తుదిన్= చివర; ధర్మములు+ఐ+చనున్= ధర్మాలయి ఒప్పుతాయి.

**తాత్పర్యం:** అని సంజయుడు అనగానే, ధర్మరాజు సంజయుడి ముఖంవైపు చూచి ఇట్లా అన్నాడు.' అదంతా నీవు చెప్పినట్లే, కొన్ని పనులు పైకి ధర్మాలవలె కనిపించి, తెలిసినవాళ్ళు పరిశీలిస్తే ధర్మాలు కాకుండా పోతాయి. మరికొన్ని పనులు ధర్మాలవలె మొదట అనిపించక చివరకు ధర్మాలయి ఒప్పుతాయి.

**విశేషం:** 'నేను యుద్ధం చేస్తా ననటం పైకి అధర్మం వలె తోచవచ్చును. కాని, తెలిసిన వాళ్ళెవరైనా రాజ్యభాగం లేకపోతే నేను యుద్ధానికి దిగటం ధర్మమే అని చెపుతారు-' అని ధర్మరాజు అభిప్రాయం. తరువాతి వచనంలో ఈ అభిప్రాయం స్పష్టపడుతుంది.

**వ. కావున నన్ను దూఱఁదలంచితేని నా చేయునది ధర్మం బధర్మంబని నిరూపించి మఱి దూఱుము; కోపంబు నివారింపం దగు; నహింసయ యుత్తమధర్మం బగు; నట్లయినను వంశదూషకులును, లోకకంటకులును నగు పాపాత్ముల నిర్మూలంబుగాఁ జెఱుచుట ధర్మంబని పెద్దలచేత విందు; మది యట్లుండె; సంగ్రామంబు రాజులకు ధర్మం బవుంగాదని నీవచెప్పు; మట్లుంగాక యిది కర్తవ్యం బిది యకర్తవ్యం బని మనల శాసింప వాసుదేవుండు గలండు; మన కీ వితర్కం బేటికి? నితండు ధర్మాధర్మవిదులకు గురుండు, కార్యాకార్య నిరూపకులకు శిక్షకుం, డుచితానుచితజ్ఞులకుఁ బ్రదర్శకుం; డితని పంపునంగాదె యదు భోజాంధక వృష్ణి సృంజయ కేకయ ప్రభృతి భూపతి ప్రకరంబు ప్రశస్త పథంబునం బ్రవర్తిల్లుచున్నయది; విశేషించి మాకు నితని బుద్ధియ సమస్త పురుషార్థమ్ములకు మూలం బగుట నితని వచనం బవశ్యంబు నలంఘనీయం' బనిన విని జనార్దనుండు సంజయున కిట్లనియె. 335**

**ప్రతిపదార్థం:** కావునన్, నన్నున్; దూఱన్+తలంచితి(వి)+ఏనిన్= నిందించాలనుకొంటే; నా చేయునది= నేను చేసేది; ధర్మంబు+అధర్మంబు+అని నిరూపించి= ధర్మమో అధర్మమో నిరూపించి; మఱి దూఱుము= మరీ నిందించుము; కోపంబు; నివారింపన్+తగున్= విడనాడటం ఉచితం; అహింస+అ= అహింసే; ఉత్తమ ధర్మంబు+అగున్= పరమ ధర్మం అవుతుంది; అట్లు+అయినను= అయినప్పటికీ; వంశ దూషకులును= వంశానికి చెడ్డపేరు తెచ్చేవాళ్ళూ; లోక కంటకులునున్= లోక బాధకులూ; అగు పాప+ఆత్ములన్= అయిన దుర్మార్గులను; నిర్మూలంబు+కాన్+చెఱుచుట= మొదలంటా చెరచటం; ధర్మంబు+అని; పెద్దలచేతన్; విందుము; అది+అట్లు+ఉండెన్; సంగ్రామంబు= యుద్ధం; రాజులకున్; ధర్మంబు; అవును+కాదు+అని, నీవు+అ, చెప్పుము, అట్లున్+కాక= అదీకాక; ఇది; కర్తవ్యంబు= చేయదగినది; ఇది; అకర్తవ్యంబు+అని= చేయదగనిది అని; మనలన్; శాసింపన్= ఆజ్ఞాపించటానికి; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; కలండు; మనకున్, ఈ వితర్కంబు+ ఏటికిన్= ఈ సంశయం ఎందుకు?; ఇతండు; ధర్మ+అధర్మ విదులకున్= ధర్మాధర్మాలు తెలిసినవాళ్ళకు; గురుండు= పెద్ద; కార్య+అకార్య నిరూపకులకున్= చేయదగిన, చేయదగని వాటిని నిర్ణయించేవారికి; శిక్షకుండు= గురువు; ఉచిత+అనుచితజ్ఞులకున్= మంచిఏదో చెడ్డఏదో తెలిసిన వారికి; ప్రదర్శకుండు= విశదీకరించేవాడు; ఇతని పంపునన్+కాదె= ఇతడి ఆజ్ఞచేతకదా; యదు భోజ+అంధక వృష్ణి, సృంజయ, కేకయ, ప్రభృతి, భూపతి, ప్రకరంబు= యదువులూ, భోజులూ, అంధకులూ, వృష్ణులూ, సృంజయులూ, కేకయులూ మొదలుగా గల రాజుల సమూహం; ప్రశస్త పథంబునన్= సన్మార్గంలో; ప్రవర్తిల్లుచున్+ ఉన్నఅది= నడుస్తున్నది; విశేషించి= ముఖ్యంగా; మాకున్= మాకు; ఇతని బుద్ధి+అ= ఇతడి తెలివే; సమస్త పురుషార్థమ్ములకున్= ధర్మార్థ

కామమోక్షాల కన్నింటికీ; మూలంబు+అగుటన్= పునాది అవటంచేత; ఇతని వచనంబు= ఇతడి మాట; అవశ్యంబున్= తప్పక; అలంఘనీయంబు= దాటరానిది; అనినన్; విని; జనార్దనుండు= కృష్ణుడు; సంజయునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కాబట్టి నన్ను నిందించాలనుకొంటే నేను చేసేది ధర్మమో, అధర్మమో నిర్ణయించి మరీ నిందించుము. కోపం విడనాడవలసిందే. అహింసే పరమధర్మం. అయినా వంశానికి చెడ్డపేరు తెచ్చేవాళ్ళూ, లోకానికి బాధకలిగించేవాళ్ళూ అయిన దుష్టులను మొదలంటా చెరచటం ధర్మమని పెద్దలవలన వింటాం. అది అట్లా ఉండనీ. యుద్ధం రాజులకు ధర్మం అవునో కాదో నీవే చెప్పుము. అదీకాక ఇది చేయదగింది, ఇది చేయదగనిది అని మనలను ఆజ్ఞాపించటానికి శ్రీకృష్ణు డున్నాడు, మన కీ సంశయం ఎందుకు? ఇతడు ధర్మాధర్మవేత్తలకు పెద్ద. కార్యాకార్య నిర్ణాయకులకు గురువు. ఉచితానుచితాలు తెలిసినవాళ్ళకు విశదీకరించేవాడు. ఇతడి ఆజ్ఞచేతనేకదా యదు భోజాంధక వృష్ణి సృంజయ కేకయాదులైన రాజుల సమూహం సన్మార్గంలో నడుస్తున్నది. ముఖ్యంగా మాకు ఇతడి తెలివే ధర్మార్థ కామమోక్షాల కన్నింటికీ మూలాధారం అవటంచేత ఇతడి మాట మాకు తప్పక అనతిక్రమణీయం-' అనగా విని శ్రీకృష్ణుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. ధర్మజుడు సంజయుడి వాదనను మెత్తగా కుశలంగా ఖండిస్తున్నాడు. మొదట ధర్మజుడు చేసే యుద్ధ ప్రయత్నం అతడి ప్రవర్తనకు తగినదా కాదా అన్నది ప్రస్తుత సమస్య కాదన్నాడు. అది ధర్మమా? అధర్మమా? అన్నది అసలు సమస్య అన్నాడు. దానిని ముందుగా నిర్ణయించి తనను సహేతుకంగా నిందించుమని హెచ్చరిక చేశాడు. అంటే సంజయుడి వాదానికి సరైన భూమిక లేదనీ, అప్రస్తుతమనీ, అనవసరమనీ తేల్చిచెప్పాడు.

2. సంజయుడు ధర్మాన్నే ప్రాతిపదికగా తీసికొంటే- వంశకంటకులనూ, లోక కంటకులనూ, పాపాత్ములనూ సమూలంగా సంహరించటం ధర్మం- అనే కొలమానంతో ధర్మజుడి యుద్ధం ధర్మమా? అధర్మమా? నిశ్చయించుమన్నాడు. యుద్ధం రాజులకు ధర్మమా? అధర్మమా? నిశ్చయించుమన్నాడు.

3. అయితే ధర్మరాజుకు సంజయుడు చెప్పిన ధర్మం ఉచితమా? క్షత్రియధర్మం ఉచితమా? అని తేల్చిచెప్పదగిన పరమ ధర్మవిదుడూ, ఉత్తమ న్యాయవిదుడూ శ్రీకృష్ణుడని నిర్దేశించాడు. ఇప్పుడు సంజయుడొకపక్షం. ధర్మజుడో పక్షం. న్యాయాధికారి శ్రీకృష్ణుడు. (సంపా)

4. సంజయ ధర్మరాజుల మాటలు వింటూ ఇప్పటివరకూ మౌనంగా ఉన్న శ్రీకృష్ణుడు ధర్మరాజు తన పేరెత్తగానే మాటాడటానికి ఉపక్రమిస్తున్నాడు.

**ఉ. 'పాండుతనూజకోటికి శుభం బెడఁ గోరుదు నెప్డు; నాంబికే**
**యుండును బుత్త్ర పౌత్త్ర మహిమోజ్జ్వలుఁ; డక్కట చేటు మేలె యం**
**చుండుదు; నట్లుగాక తెలివొంది యతం డిట వీరిఁ దేర్పఁగా**
**నిండుమనంబుతోఁ బనిచె ని న్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్. 336**

**ప్రతిపదార్థం:** ఎప్డున్= ఎప్పుడూ; పాండు తనూజ కోటికిన్= పాండవుల సమూహానికి; శుభంబు= మేలు; ఎడన్= హృదయంలో; కోరుదున్= ఆకాంక్షిస్తాను; ఆంబికేయుండును= ధృతరాష్ట్రుడు కూడా; పుత్త్ర పౌత్త్ర మహిమ+ఉజ్జ్వలుఁడు= కొడుకుల, మనుమల గొప్పతనంతో ప్రకాశించేవాడు; అక్కట= అయ్యో; చేటు= అశుభం; మేలు+ఎ= మంచిదా; అంచున్+ఉండుదున్=

అంటూ ఉంటాను; అట్లు+కాక= ఎవరికీ అశుభం కాకుండా; అతండు= ఆ ధృతరాష్ట్రుడు; తెలివి+ఒంది= జ్ఞానం కలిగి; వీరిన్= పాండవులను; తేర్పఁగాన్= ఓదార్చటానికి; నిన్నున్; నిండు మనంబుతోన్= నిండు మనస్సుతో; ఇటన్= ఇక్కడికి; పనిచెన్+అని= పంపాడని; దీనికిన్; ప్రీతిన్+పొందితిన్= సంతోషించాను.

**తాత్పర్యం:** 'నేను ఎప్పుడూ పాండవులకు హృదయంలో మేలు ఆకాంక్షిస్తూ ఉంటాను. ధృతరాష్ట్రుడు కూడా కొడుకుల మనుమల కలిమి అనే గొప్పతనంతో ప్రకాశించేవాడు. పాపం, అతడికి అశుభం మంచిదా అంటూ ఉంటాను. అట్లా ఎవరికీ అశుభం కాకుండా ధృతరాష్ట్రుడు జ్ఞానం తెచ్చుకొని పాండవులను ఓదార్చటానికి నిన్ను నిండుమనస్సుతో ఇక్కడికి పంపాడని దీనికి సంతోషించాను.

**ఆ. నీవు నుచితవృత్తి నెయ్యంబు, ధర్మంబు । వినయ మొప్పఁ దెలిపి, వీరు శాంతిఁ**
**బొందునట్టి భంగి పొసఁగఁ బల్కుటయును । నాకు సమ్మదం బొనర్చె నిపుడు. 337**

**ప్రతిపదార్థం:** నీవున్= నీవు కూడా; ఉచిత వృత్తిన్= సముచితంగా; నెయ్యంబు= స్నేహమూ; ధర్మంబు= ధర్మమూ; వినయము= మర్యాదా; ఒప్పన్= ఒప్పేవిధంగా; తెలిపి= చెప్పి; వీరు= పాండవులు; శాంతిన్+పొందు+అట్టి భంగి= శాంతించే విధం; పొసఁగన్= కలిగేటట్లు; పల్కుటయును= మాటలాడటం కూడా; నాకున్; ఇపుడు; సమ్మదంబు= సంతోషం; ఒనర్చెన్= కలిగించింది.

**తాత్పర్యం:** నీవుకూడా సముచితంగా స్నేహమూ, ధర్మమూ, మర్యాదా ఒప్పేటట్లు చెప్పి వీరు శాంతించే మార్గం ఏర్పడే విధంగా మాటాడటం కూడా నాకు ఇప్పుడు సంతోషం కలిగించింది.

**ఆ. అనఘ! యిట్టు లంతయును దలఁపం గడు । నెనసినట్టు లుండెనేని వింటె?**
**పాండవాగ్రజన్ము పలుకుల చందంబు । సూడ సంధి లేని చొప్పు దోఁచె. 338**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; ఇట్టులు= ఈ విధంగా; అంతయును= అంతా; తలఁపన్= ఆలోచించగా; కడున్= మిక్కిలి; ఎనసిన+అట్టులు+ఉండెన్+ఏనిన్= పొందుపడినట్లు ఉన్నప్పటికీ; వింటివి+ఎ?= విన్నావా?; పాండవ+అగ్రజన్ము పలుకుల చందంబు= ధర్మరాజు మాటలతీరు; చూడన్= చూడగా; సంధి లేని చొప్పు= సంధి లేని విధం; తోఁచెన్= స్ఫురించింది.

**తాత్పర్యం:** పాపరహితుడా, సంజయా! ఈ విధంగా అంతా చూడగా ఎంతో పొందుపడినట్లు ఉన్నప్పటికీ విన్నావు కదా! ధర్మరాజు మాటలతీరు చూస్తే సంధి కుదరని వైనం స్ఫురిస్తున్నది.

**క. అది యట్టిద; సంధానము । దుది నెమ్మెయిఁ గల్గు? నెట్లు దుర్యోధనుఁ డు**
**న్మదుఁడు; ధృతరాష్ట్రభూవిభు । హృదయంబు తెఱంగు గొంత యెఱుఁగుదుము కదా! 339**

**ప్రతిపదార్థం:** అది+అట్టిది+అ= అది అంతే- ధర్మరాజు అభిప్రాయం సరిఅయినదే; సంధానము= సంధి; తుదిన్= చివర జరగవలసినవన్నీ జరిగాక; ఏ+మెయిన్= ఏ రీతిగా; కల్గున్?= సిద్ధిస్తుంది; దుర్యోధనుఁడు; ఎట్లున్= ఎటు చూసినా; ఉన్మదుఁడు= ఉన్మత్తుడు, మహాగర్వి; ధృతరాష్ట్ర భూవిభు, హృదయంబు= ధృతరాష్ట్ర మహారాజు మనోరీతి; కొంత= కొంచెం; ఎఱుఁగుదుము కదా!= మనకు తెలుసుకదా!

**తాత్పర్యం:** అది అంతే, ధర్మరాజు అభిప్రాయం సరియైనదే. జరుగవలసిన వన్నీ జరిగాక సంధి ఎట్లా పొసగుతుందయ్యా? ఎటు చూసినా దుర్యోధనుడు మహాగర్వి, ధృతరాష్ట్ర మహారాజు హృదయం మనకు కొంచెం తెలుసుకదా!

**క. ఆ రాజు సేయు నెయ్యము । గారామును జెప్పె దీవు గడుఁ దీపులుగా**
**వీరు దమ పాలు వడయక । నేరిమి మాటలన తీర నేర్తురె చెపుమా! 340**

**ప్రతిపదార్థం:** ఆ రాజు= ఆ ధృతరాష్ట్రుడు; చేయు= చూపే; నెయ్యమున్= స్నేహమూ; గారామును= ఆదరమూ; ఈవు= నీవు; కడున్+తీపులు+కాన్= ఎంతో మధురంగా; చెప్పెదు(చెప్పెదవు)= చెపుతావు; వీరు= పాండవులు; తమ పాలు= తమ భాగం; పడయక= పొందకుండా; నేరిమి మాటలన్+అ= చతురవచనాలతోటే; తీరన్+నేర్తురె= సంతృప్తిపడగలరా? చెపుమా= చెప్పుము.

**తాత్పర్యం:** ఆ రాజు ధృతరాష్ట్రుడు చూపే స్నేహమూ, ఆదరమూ నీవు ఎంతో మధురంగా చెపుతావు. వీరు తమరాజ్యభాగం పొందకుండా వట్టి చతుర వచనాలతోటే తృప్తి పొందుతారా? నీవే చెప్పుము.

**ఉ. వీరలు పెద్ద ద్రవ్వ, కొకవెంట నొడంబడి, తేఁటి శాంతులై**
**కౌరవకోటిఁ గూడి మనఁగా మదిఁ గోరుట పెంపుఁ దాల్మియుం,**
**గారుణికత్వముం దగవుఁ గాదె? జగంబున పాడిఁ దండ్రిపా**
**లీరని తెంపు సేసి పయినెత్తిన నెత్తిరిగాక ద్రోహమే? 341**

**ప్రతిపదార్థం:** వీరలు= పాండవులు; పెద్ద త్రవ్వక= జరిగినవన్నీ ఎక్కువగా త్రవ్వకోకుండ; ఒకవెంటన్+ఒడంబడి= ఏదో ఒక పద్ధతికి అంగీకరించి; తేఁటి= ఊరట చెంది; శాంతులు+ఐ= ఉపశమించినవారయి; కౌరవ కోటిన్= కౌరవుల సమూహంతో; కూడి= కలిసి; మనఁగాన్= బ్రదకటానికి; మదిన్= మనస్సులో; కోరుట; పెంపున్= గొప్పతనమూ; తాల్మియున్= ఓరిమీ; కారుణికత్వమున్= కనికరమూ; తగవున్= న్యాయమూ; కాదె?= కాదా?; జగంబున పాడిన్= లోకధర్మం ప్రకారం; తండ్రి పాలు= తమ తండ్రి భాగం; ఈరు+అని= ఇవ్వరని; తెంపు+చేసి= తెగించి; పయిన్+ఎత్తినన్+ఎత్తిరి+కాక= మీదపడితే పడతారు (దండెత్తితే దండెత్తుతారు); ద్రోహమే?= అది ద్రోహ మవుతుందా?

**తాత్పర్యం:** పాండవులు పూర్వం జరిగినవన్నీ పెద్దగా త్రవ్వకోకుండా ఏదో ఒక పద్ధతికి అంగీకరించి ఊరట చెంది శాంతం వహించి కౌరవులతో కలిసి బ్రదకటానికి అంగీకరించారంటే, అది గొప్పతనమూ, ఓరిమీ, కనికరమూ, ధర్మమూ కాదా? లోకాచారాన్ని బట్టి తమతండ్రి భాగం వారు ఇవ్వటం లేదని తెగించి దండెత్తితే దండెత్తుతారు, అది ద్రోహ మెట్లా అవుతుంది?

**క. విను మవమానము పడి యి । ట్లునికిఁ బడయు పొగడు కంటె, నుజ్జ్వలులై మా**
**ర్కొనిన నది లెస్స; యెట్లయి । నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. 342**

**ప్రతిపదార్థం:** వినుము; అవమానముపడి= పరాభవం పొంది; ఇట్లు+ఉనికిన్= ఇట్లా ఉండటం చేత; పడయు పొగడు కంటెన్= పొందే పొగడ్తకన్నా; ఉజ్జ్వలులు+ఐ= ప్రకాశించే వారయి; మార్కొనినన్= ఎదుర్కొంటే; అది లెస్స= అది మంచిది; నాకున్+చూడన్= నా దృష్టిలో; ఎట్లు+అయినను= ఎట్లా అయినా; వీరికిన్= పాండవులకు; పోటు= యుద్ధం; మేలు= మంచిది.

**తాత్పర్యం:** సంజయా! వినుము. పరాభవం పొంది ఇట్లా దీనంగా ఉండటం వలన కలిగే పొగడ్తకన్నా, తేజస్వులై ఎదుర్కొంటే, అది మంచిది. నాకు చూడగా ఎట్లా అయినా వీరికి యుద్ధమే మంచిది.

**వ. 'సంగ్రామంబు రాజులకు ధర్మం బవుంగాదని నీవ చెప్పు'మని యుధిష్ఠిరుండు నిన్నడిగెఁగదా! ద్విజాతులకు యజన యాజనాది కర్మ కరణ విభాగంబు ధర్మశాస్త్రాచార్యులు విధించునప్పుడు రాజు లిచ్చువారు గాని, వేఁడుకొనువారు గారని చెప్పుట సకలలోక ప్రసిద్ధంబు; సర్వ వర్ణాశ్రమ ధర్మ పరిపాలనంబు సేయునట్టి రాజులు దార నిజధర్మంబు వదలుదురా? యదియునుంగాక; పాడితోడి యార్జనంబునం దమకుఁ గల కలిమి యనుభవించుచు సత్పథంబున నడచుచుండఁ, ద మ్మొరు లన్యాయంబు సేసినయప్పటికిం గదా యీ శస్త్రాస్త్రధర్మంబు లింద్రాదులగు పెద్దలు గావించిరి; నీ చెప్పెడి ధర్మంబులు కౌరవులకుం జెప్పవలవదా? వారలు గదా మీఁ దెఱుంగక కొఱఁతనుఱుకులై చెడు తెరువునం బోయెదువా' రని పలికి మఱియు నిట్లనియె. 343**

**ప్రతిపదార్థం:** సంగ్రామంబు= యుద్ధం; రాజులకున్; ధర్మంబు; అవును+కాదు+అని; నీవు+అ; చెప్పుము; అని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; నిన్నున్+అడిగెన్+కదా!; ధర్మ శాస్త్ర+ఆచార్యులు= ధర్మశాస్త్ర గురువులు; ద్విజాతులకున్= బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు; యజన యాజన+ఆది కర్మ కరణ విభాగంబున్= యజ్ఞం చేయటం, చేయించటం మొదలయిన పనుల చేతల విభజనను; విధించు+అప్పుడు= విధించేటప్పుడు; రాజులు; ఇచ్చువారు+కాని; వేఁడుకొనువారు కారు+అని= ఇచ్చేవాళ్ళేకాని పుచ్చుకొనేవాళ్ళు కారని; చెప్పుట; సకల లోక ప్రసిద్ధంబు= ఎల్ల లోకాలలోనూ ప్రసిద్ధమయినది; సర్వ వర్ణ+ఆశ్రమ ధర్మ పరిపాలనంబు= బ్రహ్మ క్షత్రియ వైశ్యులనే ఎల్ల వర్ణాశ్రమ ధర్మాలనూ కాపాడటం; చేయు+అట్టి రాజులు= చేసే క్షత్రియులు; తారు+అ= తామే; నిజ ధర్మంబున్= తమధర్మాన్ని; వదలుదురు+ఆ?= విడిచిపెడతారా?; అదియునున్+కాక; పాడితోడి+ ఆర్జవంబునన్= న్యాయయుక్తమైన సంపాదనతో, తమకున్+కల, కలిమి= తమ కున్న సంపద; అనుభవించుచున్; సత్+ పథంబునన్= సన్మార్గంలో; నడచుచున్+ఉండన్= నడుస్తూ ఉండగా; తమ్మున్; ఒరులు= ఇతరులు; అన్యాయంబు+చేసిన+ అప్పటికిన్+కదా= అన్యాయం చేసినప్పటికి కదా; ఈ శస్త్ర+అస్త్ర ధర్మంబులు= ఈ శస్త్రాల అస్త్రాల ధర్మాలు; ఇంద్ర+ఆదులు+అగు పెద్దలు= ఇంద్రుడూ మొదలైన పెద్దలు; కావించిరి= చేశారు; నీ చెప్పెడి ధర్మంబులు= నీవుచెప్పే ధర్మాలు; కౌరవులకున్; చెప్పన్+వలవదా?= చెప్పవద్దా?; వారలు+కదా; మీఁదు+ఎఱుంగక= రాగలదానిని ఎరుగక; కొఱఁతన్+ ఉఱుకులు+ఐ= ఉరికంబం మీదికి ఉరికే వారయి (అకార్యాలు చేసే వాళ్ళయి); చెడు+తెరువునన్+పోయెడు, వారు= అపమార్గంలో నడిచేవాళ్ళు; అని పలికి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'యుద్ధం క్షత్రియులకు ధర్మం అవునా కాదా నీవే చెప్పుము' అని ధర్మరాజు నిన్ను అడిగాడు కదా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు యజ్ఞం చేయటం, చేయించటం మొదలయిన పనుల విభజన ధర్మశాస్త్ర గురువులు విధించేటప్పుడు రాజులు ఇచ్చేవాళ్ళు గాని పుచ్చుకొనేవాళ్ళు కారని చెప్పటం సర్వజగత్ప్రసిద్ధమైన విషయం కదా! ఎల్ల వర్ణాశ్రమ ధర్మాలనూ కాపాడవలసిన రాజులు తామే తమధర్మాన్ని విడిచిపెడతారా? అదీకాక న్యాయార్జనతో తమకు కల సంపద ననుభవిస్తూ సన్మార్గంలో నడుస్తూంటే, తమ కెవరైనా అపకారం చేసినప్పుడు ఉపయోగపడటానికి కదా ఈ శస్త్రాస్త్రాల ధర్మాలు ఇంద్రుడూ మొదలైన పెద్దలు నిర్ణయించారు? నీవు చెప్పే ధర్మాలు కౌరవులకు చెప్పవద్దా? వాళ్ళు కదా రాబోయేది తెలిసికొనక అకార్యాలు ఆచరిస్తూ అపమార్గంలో నడిచేవాళ్ళు' అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'నెట్టన సభలో వేవుర । కట్టెదుర నరాతితనము గా కెంతయు వా**
**రెట్టితులువలో! ద్రౌపది । నట్టులు పఱిచెడిదె! జూదమాడరె యెందున్?' 344**

**ప్రతిపదార్థం:** నెట్టన= బరితెగించి; సభలోన్; వేవుర కడు+ఎదురన్= వేయిమంది ఎట్టఎదుట; ఎంతయున్+అరాతి తనము+కాక= మిక్కిలి శత్రుత్వం(పోకిరితనం) కాకపోతే; వారు; ఎట్టి తులువలో= ఎటువంటి దుర్మార్గులో; ద్రౌపదిన్; అట్టులు= ఆ విధంగా-పైకి చెప్పరాని రీతిగా; పఱిచెడిదె= అవమానించటమా; ఎందున్= ఎక్కడా; జూదము+ఆడరె?= జూదం ఆడరా?- ఇట్లా ఆడతారా? అని భావం.

**తాత్పర్యం:** 'సభలో వేయిమంది ఎట్టయెదుట తెగించి, మిక్కిలి పోకిరితనం కాకపోతే, వాళ్ళు ఎటువంటి దుర్మార్గులో ద్రౌపదిని ఆ విధంగా అవమానిస్తారా? ఎక్కడా జూదం ఆడరా? ఎవరైనా ఇట్లా చేశారా?'

**విశేషం:** ఈ పద్యంలో తిక్కన వాక్య విన్యాసం గమనించదగింది '. . . . వేవుర కట్టెదుర ద్రౌపది నట్టుల పఱిచెడిదె' అనే వాక్యం నడుమ'అరాతి తనముగా కెంతయు వారెట్టి తులువలో' అనే వాక్యం చొప్పించబడింది. ఇటువంటి రచన కోపావేశాన్ని సూచిస్తుంది. ద్విత్వప్రాసాక్షరం కోపోద్రేకాన్ని వ్యంజింపజేస్తున్నది.

**వ. అనవుడు సంజయుండు 'దేవా! నీ చిత్తంబున నిడి దీని నింత కొనయాడినఁ గర్జం బొడఁగూడునే?' యనిన వాసుదేవుం డిట్లనియె. 345**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; సంజయుండు; దేవా! నీ చిత్తంబునన్= నీ మనస్సులో; ఇడి= పెట్టుకొని; దీనిన్= ఈ విషయాన్ని; ఇంత కొనియాడినన్= ఇంతగా పట్టించుకొంటే; కర్జంబు+ఒడన్+కూడునే= కార్యం సఫలం అవుతుందా?; అనినన్= అని అనగా; వాసుదేవుండు= కృష్ణుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని కృష్ణుడనగానే సంజయుడు 'దేవా! ఈ విషయాన్ని నీ మనస్సులో పెట్టుకొని ఇంతగా పట్టించుకొంటే కార్యం సఫల మవుతుందా?' అని అనగా, కృష్ణుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** పూర్వం కౌరవులు చేసిన దుర్ణయాలన్నీ ఇప్పుడు తడవుతూ శ్రీకృష్ణుడు మాటాడటం వలన సంధికార్యం భగ్నమవుతుందని సంజయుడి భయం. కాని కృష్ణుడు ఆగక అవన్నీ ఏకరువు పెట్టుతున్నాడు. సంధి కాకూడదనే అతడి ఉద్దేశం.

**ఉ. 'అత్తఱి భీష్మముఖ్యులగు నచ్చటి వృద్ధజనంబు లెల్ల నో**
**రెత్తక యూరకుండిరి మహీశ్వరుచిత్త మెఱుంగకున్కిఁ; దా**
**నొత్తి కుమారులం గినియనోపఁడ; యక్కట! మాన్పఁ గన్న; నా**
**చిత్తము కాదు; లోకముల చిత్తము లెల్లను సంతసింపవే? 346**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ సమయంలో ద్రౌపదిని అవమానించేటప్పుడు; భీష్మ ముఖ్యులు+అగు= అచ్చటి వృద్ధజనంబులు+ఎల్లన్= భీష్ముడూ మొదలయిన అచటి పెద్దలందరూ; మహీ+ఈశ్వరు చిత్తము+ఎఱుంగక+ఉన్కిన్= రాజుయొక్క(ధృతరాష్ట్రుడి) అభిప్రాయం తెలియకపోవటం చేత; నోరు+ఎత్తక ఊరక+ఉండిరి= నోరు మెదపకుండా ఊరుకొన్నారు; తాను= ధృతరాష్ట్రుడు; కుమారులన్= కొడుకులను; ఒత్తి,కినియన్+ఓపఁడు+అ= గట్టిగా కోపపడలేదు; అక్కట!;=అయ్యో!; మాన్పన్+కన్నన్= ధృతరాష్ట్రుడు వారించగలిగితే; నా చిత్తము+అ కాదు= నామనస్సే కాదు; లోకముల చిత్తములు+ఎల్లనున్= లోకుల మనస్సులన్నీ; సంతసింపవే?= సంతోషించవా?

**తాత్పర్యం:** 'ద్రౌపదిని కౌరవు లవమానించేటప్పుడు భీష్ముడూ మొదలైన అక్కడి పెద్దలందరూ ధృతరాష్ట్ర మహారాజు అభిప్రాయం తెలియకపోవటం చేత నోరు మెదపకుండా ఊరుకొన్నారు. ఆ ధృతరాష్ట్రుడు కొడుకులను కోపపడలేదు. అయ్యో! అతడే కనక వాళ్ళను వారించగలిగితే, నా మనస్సే కాదు, లోకుల మనస్సులన్నీ సంతోషపడవా?

**విశేషం:** కౌరవ పాండవ విభేదమూలాన్ని శ్రీకృష్ణు డీపద్యంలో వివేచించాడు. తండ్రి మనసు తెలియక నోరు మెదపలేని పాండవులను, కౌరవులు అవినీతులై అవమానాల పాలు చేస్తుంటే వారిని వారించలేక అధర్మానికి ఆసట బాసటగా నిలిచిన ధృతరాష్ట్రుడే అన్ని పాపాలకు మూలహేతువనీ, బాధ్యుడనీ శ్రీకృష్ణుడు నిర్ణయించి చెప్పాడు. ఆ రాజు కొడుకులను వారించి ఉంటే భగవంతుడైన శ్రీకృష్ణుడూ, అన్ని లోకాలూ హర్షించి ఉండేవి అని చెప్పి, ఇప్పు డా ఇరువురూ ధృతరాష్ట్రుడిని గర్హిస్తున్నారని ధ్వనింపజేశాడు కృష్ణుడు! (సంపా.)

**ఉ.** **తిట్టులఁబోయి యక్కొలువు తేఁకువ వారలలోని కింతిఁ దా**
**నట్టులు దుస్ససేనుఁ డదయాకృతి ముందల వట్టి యీడ్వఁగా**
**నెట్టు సహించె మామ? సతి యేడ్పు టెలుంగున కెట్టు లోర్చె? నీ**
**పట్టున సేమ మారయఁగఁ బంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్?** 347

**ప్రతిపదార్థం:** దుస్ససేనుఁడు= దుశ్శాసనుడు; తిట్టులన్+పోయి= తిట్లతో పోయి; ఆ+కొలువు తేఁకువ వారలలోనికిన్= ఆ సభలోని మిగుల ధైర్యపరులైన గౌరవార్హులమధ్యకు; ఇంతిన్= స్త్రీని- ద్రౌపదిని; తాను; అట్టులు= ఆ విధంగా; అదయ+ ఆకృతిన్= నిర్దాక్షిణ్య రూపంతో; ముందు+తల+పట్టి+ఈడ్వఁగాన్= తలముందటి జుట్టు పట్టుకొని ఈడ్వగా; మామ= ధృతరాష్ట్రుడు; ఎట్టు సహించెన్= ఎట్లా ఓర్చుకొన్నాడు; సతి= పతివ్రతయొక్క; ఏడ్పు+ఎలుంగునకున్= రోదన స్వరానికి; ఎట్టులు+ఓర్చెన్= ఎట్లా సహించాడు; ఈ పట్టునన్= ఈ సమయంలో; క్రమ్మఱన్= మళ్ళీ; సేమము+ఆరయఁగన్= క్షేమం తెలిసికొనటానికి; పంచుటకున్= పంపటానికి; ఎట్టులు నేర్చెన్?= ఎట్లా నేర్చాడు?

**తాత్పర్యం:** దుశ్శాసనుడు తిట్లతోపోయి ఆ సభలో ఉన్న పెద్దల మధ్యకు ద్రౌపదిని ఆ విధంగా నిర్దాక్షిణ్యంతో ముందటి జుట్టుపట్టుకొని ఈడుస్తుంటే మామ ధృతరాష్ట్రుడు ఎట్లా సహించాడు? పతివ్రత రోదన ధ్వనికి ఎట్లా ఓర్చాడు? మళ్ళీ ఇప్పుడు క్షేమం తెలిసికొనటానికి దూతను పంపడానికి ఎట్లా నేర్చాడు?

**విశేషం:** ధృతరాష్ట్రుడు పాండవులను మున్నీట ముంచగలడు, వారిపట్ల మొసలి కన్నీరు కార్చగలడు. అతడి ప్రవృత్తి పయోముఖ విషకుంభం.. (సంపా.)

**చ.** **ఇది తగదంచు నడ్డపడునింతకు నేరక సభ్యులందఱున్**
**మది మఱగొన్న యట్టి యెడ మానినికిం దనుఁ దాన కాచికో**
**లొదవిన దానఁ జేసి సభ నొచ్చెము దక్కినఁ బాండునందనుల్**
**బ్రదికిరి గాక; యయ్యెడరు రాచకొమారుల కోర్చునట్టిదే?** 348

**ప్రతిపదార్థం:** ఇది= ఒకస్త్రీని సభలోనికి జుట్టుపట్టుకొని ఈడ్వటం; తగదు+అంచున్= మంచిది కాదంటూ; అడ్డపడు+ఇంతకున్= అడ్డుపడే మాత్రానికి కూడా; నేరక= తెలియక; సభ్యులు+అందఱున్= సభలోని వాళ్ళందరూ; మదిన్ మఱగొన్న+అట్టి+ఎడన్=

మనస్సునందు మరబొమ్మవలె స్తబ్దతతో దైన్యం పొంది ఉన్న సమయంలో; మానినికిన్= ఆ అభిమానవతికి; తనున్+తాను+అ= తనను తానే; కాచికోలు+ఒదవినదానన్+చేసి= రక్షించుకొన గలగడం చేత; సభన్= సభయందు; ఒచ్చెము+తక్కినన్= అవమానం జరగకపోవటం వలన; పాండు నందనుల్= పాండవులు; బ్రదికిరి+కాక= బ్రదికిపోయారు కాని; ఆ+ఎడరు= ఆ భంగపాటు; రాచ కొమారులకున్= రాచబిడ్డలకు; ఓర్చునట్టిదే?= సహించవలసిందా?

**తాత్పర్యం:** ఆడదానిని జుట్టుపట్టుకొని సభలోని కీడ్వటం మంచిది కాదని అడ్డుపడే మాత్రానికి చాలక సభలోని వాళ్ళందరూ మనస్సులలో దైన్యం పొంది ఉన్న సమయంలో పాపం ఆ మానవతి తనను తానే కాపాడుకొనగలగటం చేత సభలో అవమానం జరగక పాండవులు బ్రదికిపోయారు కాని, అటువంటి భంగపాటు రాచబిడ్డలు సహించవలసిందేనా?

**విశేషం:** కౌరవసభలో ద్రౌపదియొక్క గౌరవం రక్షించబడటానికి తాను కారణమైనా శ్రీకృష్ణుడా విషయాన్ని పేర్కొనకపోవటంలో ఆయన ఉదాత్తవ్యక్తిత్వం తేటతెల్లమౌతున్నది.

**వ. సంజయా! వినవే యప్పుడు సభాసధులకుఁ గర్ణశూలంబు లగునట్లుగాఁ గర్ణుండు. 349**

**ప్రతిపదార్థం:** సంజయా!; వినవే= నీవు వినలేదా?; అప్పుడు; సభాసదులకున్= సభ్యులకు; కర్ణ శూలంబులు+అగునట్లుగాన్= చెవులకు గ్రుచ్చుకొనేటట్లు; కర్ణుండు.

**తాత్పర్యం:** సంజయా! నీవు వినలేదా? అప్పుడు కర్ణుడు సభ్యుల చెవులకు గ్రుచ్చుకొనేటట్లు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'లే రిచట మగలు నీకును; । వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్;**
**వారిజలోచన! నీపైఁ । గూరిమి గల మగని వెదకికొను మొరు' ననఁడే? 350**

**ప్రతిపదార్థం:** ఇచటన్= ఇక్కడ; నీకును; మగలు= భర్తలు; లేరు; వీరలు= నీ భర్తలనబడే ఈ ఐదుగురూ; నిన్నున్; జూదమునన్; ఓడి; విడిచిరి; వారిజలోచన!= ఓ పద్మాక్షీ! ద్రౌపదీ!; నీ పైన్= నీ మీద; కూరిమి+కల మగనిన్+ఒరున్= ప్రేమగల భర్తను ఇంకొకడిని; వెదకికొనుము; అనఁడే= అనడా?.

**తాత్పర్యం:** 'ఇక్కడ నీకు భర్తలు లేరు. నీ భర్త లని చెప్పబడే ఈ ఐదుగురూ నిన్ను జూదంలో ఓడిపోయి వదిలేశారు. అందుచేత ఓ పద్మాక్షీ! నీ మీద అనురాగం గలిగిన భర్త నింకొకడిని వెతుక్కో' అనలేదా?

**క. నరునకు నదివాఙ్మయ మగు । శరమై హృదయంబు నాటి చలియింపక దు**
**ర్భర వేదనఁ జేయంగాఁ । జిరకాలము, దచ్చికిత్స చేసెనె చెపుమా? 351**

**ప్రతిపదార్థం:** అది= కర్ణుడన్న ఆ మాట; నరునకున్= అర్జునుడికి; వాక్+మయము+అగు శరము+ఐ= వాగ్రూపమైన బాణమయి; హృదయంబు నాటి= మనస్సులో గ్రుచ్చుకొని; చలియింపక= ఊడిరాక; దుర్భర వేదనన్= సహించ శక్యం కాని బాధను; చేయంగాన్= కలిగించగా; చిరకాలమున్= చాలాకాలంగా; తద్+చికిత్స చేసెనె?= దానికి ప్రతిక్రియ చేశాడా?; చెపుమా= చెప్పుము.

**తాత్పర్యం:** కర్ణ డాడిన ఆ మాట అర్జునుడికి వాగ్రూపమైన బాణమై హృదయంలో నాటుకొని ఊడిరాక దుస్సహమైన బాధ కలిగించగా చాలాకాలంగా దానికి ప్రతిక్రియ చేశాడా? నీవే చెప్పుము. (ఆ కర్ణుడిపై పగ దీర్చుకొనే ప్రతిక్రియ ఏమైనా ఇంతకాలంగా చేశాడా? అని భావం.)

**వ. మఱియు దుశ్శాసనుండు 'వీర లందఱును గొడ్డువోయిన వారలు; పౌరుషంబు గల మానిసి యిం దెవ్వం?' డనియె; నతని చెప్పినట్ల పెద్దగాలంబేని వీరల గొడ్డువోయిరి గాక, వీరిదెస వారికి నేమిఫలించె? వెండియుఁ దత్సమయంబునఁ బుట్టిన మాట లుగ్గడించునట్టివిగా; వీ సంధికార్యం బత్యంత దుర్ఘటంబని తలంచెద; నయినను. 352**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; దుశ్శాసనుండు; వీరలు+అందఱును= వీళ్ళందరూ; గొడ్డు+పోయినవారలు= నిష్ఫలులు, పౌరుషహీనులు; పౌరుషంబు+కల మానిసి= పౌరుషవంతుడైన మనుష్యుడు; ఇందున్= వీరిలో - ఈ పాండవులలో; ఎవ్వండు; అనియెన్; అతని చెప్పిన+అట్లు+అ= అతడు చెప్పిన విధంగానే; పెద్ద+కాలంబు+ఏనిన్= ఎంతోకాలమైనా; వీరలు+అ= వీరే- ఈ పాండవులే; గొడ్డు+పోయిరి+కాక= నిష్ఫలు లయినారే కాని; వీరి దెసన్= వీరివలన; వారికిన్= కౌరవులకు; ఏమి ఫలించెన్?= ఏమి ఫలితం దక్కింది?; వెండియున్= ఇంకా; తద్+సమయంబునన్= ఆసమయంలో; పుట్టిన మాటలు; ఉగ్గడించు+అట్టివి+కావు= పైకి అనవలసినవి కావు; ఈ సంధి కార్యంబు; అత్యంత దుర్ఘటంబు= మిక్కిలి అసాధ్యం; దీనిన్; ఘటియింపన్+చేయుట= కుదర్చటం; అశక్యంబు+ అని= తరం కాదని; తలంచెదన్= అనుకొంటాను; అయినను= అయినప్పటికీ.

**తాత్పర్యం:** ఇంకా దుశ్శాసనుడు 'వీళ్ళందరూ - ఈ పాండవులంతా, నిష్ఫలులు, పౌరుషహీనులు. వీరిలో పౌరుషవంతుడైన మనుష్య డెవడు? అన్నాడు. అతడు చెప్పిన రీతిగా ఎంతో కాలంగా వీళ్ళే నిష్ఫలులయినారే కాని వీరివలన వారి కేమి ఫలితం దక్కింది? ఇంకా ఆ సమయంలో పుట్టిన మాటలు పైకి అనవలసినవి కావు. ఈ సంధికార్యం జరగటం మిక్కిలి కష్టం. దీనిని కుదర్చటం అసాధ్యం అని భావిస్తున్నా. అయినా.

**విశేషం:** 'వీరల గొడ్డువోయిరి గాక, వీరి దెస వారికి నేమి ఫలించె?' కౌరవులు తమకి చేసిన అన్యాయాలకు పాండవులు ప్రతిస్పందించి వారికి ఏదయినా ప్రతీకారం చేసి పగదీర్చుకొని ఉంటే వారు సఫలులయినట్లు. ఇంతవరకూ అటువంటి దేమీ జరుగలేదు కాబట్టి పాండవులు 'గొడ్డువోయినవారే' అని శ్రీకృష్ణుడి అభిప్రాయం.

**సీ. పాండవేయులఁ దగం బ్రార్థించి, యందుల । కక్కట! యేనైన నరుగుదెంచి,**
**కౌరవులకు బుద్ధిగాఁ జెప్పి రాజ్యంబు । పాలుసేసిన, మృత్యుపాశములకుఁ**
**దప్పరే వారలు? దగవును నేర్పును । నా మీఁద నిలుచుట నాకుఁ గీడె?**
**నన్ను మన్నింతు; రన్యాయంబు సొరని నా । మాటకుఁ దా రొడఁబాటు లేక**

**తే. యుండుదురె? కేరడము లాడుచుండిరేనిఁ । గవియు పాండవ బాణాగ్ని గాదు సువ్వె,**
**తమ్ముఁ దమ లోభ మను చిచ్చు దరికొనంగఁ । దెగినవారయి పోదు; రింతియ తలంప. 353**

**ప్రతిపదార్థం:** పాండవేయులన్= పాండవులను; తగన్= ఒప్పుగా; ప్రార్థించి= మిక్కిలి బతిమాలి; అక్కట!= అయ్యో!; అందులకున్= అక్కడికి; ఏను+ఐనన్= నేనయినా; అరుగుదెంచి= వచ్చి; కౌరవులకున్; బుద్ధి+కాన్= బుద్ధివచ్చేటట్లు; చెప్పి;

రాజ్యంబు; పాలు+చేసినన్= భాగం చేస్తే; వారలు= కౌరవులు; మృత్యు పాశములకున్= మరణం అనే త్రాళ్ళకు; తప్పరే?= తప్పిపోరా?- వారు చావు తప్పించుకోరా అని భావం; తగవును= న్యాయమూ; నేర్పును; నా మీఁదన్; నిలుచుట= ఉండటం; నాకున్; కీడు+ఎ?= అనుచితమా?; నన్నున్; మన్నింతురు= (కౌరవులు) ఆదరిస్తారు-నేను చెప్పినట్లు వింటారు; అన్యాయంబు+చొరని, నా మాటకున్= అధర్మయుక్తం కాని నా మాటకు; తారు= తాము, వారు-కౌరవులు; ఒడఁబాటు లేక+ ఉండుదురె?= అంగీకరించకుండా ఉంటారా?; కేరడములు+అడుచున్+ఉందురు+ఏనిన్= పరిహాసంతో కూడిన తిరస్కారపు వంకరమాటలు పలుకుతూ ఉంటే; కవియు పాండవ బాణ+అగ్ని+కాదు సువ్వే= క్రమ్ముకొనే పాండవుల బాణాలనే అగ్ని కాదు సుమీ; తమ లోభము+అను చిచ్చు= తమ దురాశ అనే అగ్ని; తమ్మున్= తమను; దరికొనంగన్= దహించగా; తెగినవారు+ అయిపోదురు= నాశనమయిపోతారు; తలంపన్= ఆలోచించగా; ఇంతియ= ఇంతే.

**తాత్పర్యం:** పాండవులను ఒప్పేటట్లు బతిమాలి, అయ్యో! అక్కడికి నేనయినా వచ్చి, కౌరవులకు బుద్ధికలిగి ఉండండని చెప్పి రాజ్యం భాగం చేస్తే, వాళ్ళు చావు తప్పించుకొనరా?, న్యాయమూ, నేర్పూ నాపై ఉండటం నాకు అనుచితమా? నేను కలగజేసికొని న్యాయమూ నేర్పూ చూపటం నాకు తగదా? వాళ్ళు నా మాట వింటారు. అన్యాయం కాని నా మాటకు వాళ్ళు అంగీకరించకుండా ఉంటారా? అట్లా కాక, వంకరమాట లేమైనా అంటే, క్రమ్ముకొనేది పాండవుల బాణాలనే అగ్ని కాదు సుమీ! తమని తమ దురాశ అనే చిచ్చే దహించివేయగా నాశనమయిపోతారు. ఆలోచించగా జరిగే దింతే'.

**విశేషం:** అలం: రూపకం. బాణాగ్ని= బాణములనే అగ్ని, తమలోభమను చిచ్చు= తమ లోభమనే చిచ్చు - ఉపమేయోపమానాలకు అభేదం చెప్పబడింది కాబట్టి అలంకారం రూపకం, కృష్ణుడి మాటలలో సంధియొక్క అసాధ్యత్వం సుస్పష్టమయింది. సంజయుడు యుద్ధాన్ని ఆపడానికి ఎంత తెలివిగా మాటాడినా కృష్ణుడు, జరిగిపోయిన అన్యాయాలన్నీ ఏకరువుపెట్టి ఇది కుదిరేది కాదని సూటిగా కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పాడు.

**వ. అని పలికి వెండియు నిట్లనియె. 354**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు:

**ఆ. 'రోషమయ మహాతరువు సుయోధనుఁ డురు । స్కంధ మందులోనఁ గర్ణుఁ, డలరుఁ**
**గొమ్మ సౌబలుండు, గుసుమ ఫలములు దు । శ్శాసనుండు, మూలశక్తి తండ్రి. 355**

**ప్రతిపదార్థం:** సుయోధనుఁడు= దుర్యోధనుడు; రోషమయ మహాతరువు= క్రోధరూపమైన మహావృక్షం; కర్ణుఁడు; అందులోనన్= ఆ వృక్షంలో; ఉరు స్కంధము= పెద్ద బోదె; సౌబలుండు= శకుని; అలరు+కొమ్మ= పూలకొమ్మ; దుశ్శాసనుండు; కుసుమ ఫలములు= పూలు, పండ్లు; తండ్రి= ధృతరాష్ట్రుడు; మూల శక్తి= వేరుయొక్క బలం.

**తాత్పర్యం:** దుర్యోధనుడు క్రోధరూప మహావృక్షం. కర్ణుడు దాని పెద్ద బోదె. శకుని పూలకొమ్మ, దుశ్శాసనుడు పుష్ప ఫలములు. తండ్రి అయిన ధృతరాష్ట్రుడు దాని మూలబలం.

**విశేషం:** అలం: రూపకం. శ్రీకృష్ణుడు దుర్యోధనాది దుష్టచతుష్టయాన్ని రూపించిన తీరు బాగున్నది. ధృతరాష్ట్రుడు ఆ వృక్షమూల మనటం వలన దుర్యోధనుడి దుశ్చేష్టల కన్నింటికి మూల భూతుడైన వాడు అతడే అని శ్రీకృష్ణుడి అభిప్రాయం. చెట్టుబలం అంతా దాని వేరు లోనే ఉంటుంది కదా!

**ఆ. ధర్మజుండు ధర్మతరు, వర్జునుఁడు ఘన । స్కంధ, మనిలసుతుఁడు శాఖ, కవలు**
**పుష్పఫలము; లేను, భూసురులును, వేద । ములుఁ దదీయమైన మూల చయము. 356**

**ప్రతిపదార్థం:** ధర్మజుండు= ధర్మరాజు; ధర్మ తరువు= ధర్మరూపమనే చెట్టు; అర్జునుఁడు; ఘన స్కంధము= పెద్ద బోదె; అనిలసుతుఁడు= వాయుపుత్రుడు - భీముడు; శాఖ= కొమ్మ; కవలు= నకుల సహదేవులు; పుష్ప ఫలములు= పూలుపండ్లు; ఏనున్= నేనూ; భూసురులును= బ్రాహ్మణులూ; వేదములున్= వేదాలూ; తదీయము+ఐన మూల చయము= దానిదైన వేరుల సమూహం.

**తాత్పర్యం:** ధర్మరాజు ధర్మమనే చెట్టు. అర్జునుడు దాని పెద్ద బోదె. భీముడు దాని కొమ్మ. నకుల సహదేవులు పూలూ, పండ్లూ, నేనూ, బ్రాహ్మణులూ, వేదాలూ దాని వేళ్ళ సమూహం.

**విశేషం:** అలం: రూపకం. కౌరవులను గురించి చెప్పిన పద్యానికి ఇది దీటుగా ఉన్నది. అదీ ఆటవెలదే. ఇదీ ఆటవెలదే. దుర్యోధనుడి బలమంతా ధృతరాష్ట్రు డయితే, ధర్మరాజు బలం కృష్ణుడూ, బ్రాహ్మణులూ, వేదాలూను. ధర్మరాజు ప్రవర్తన కృష్ణప్రియంగానూ, బ్రాహ్మణసమ్మతంగానూ, వేదోక్తంగానూ ఉంటుందని భావం.

**క. ఈ రెంటియందు నరసి య । సారం బిది, గాఢసార సహితం బిది నా**
**నేరవలయు; నదియును గా । కేరూపం బయ్యెనేని నీ సేమిటికిన్? 357**

**ప్రతిపదార్థం:** ఈ రెంటియందున్= ఈ రెండింటిలోనూ; అరసి= పరిశీలించి; ఇది; అసారంబు= నిస్సారమయినదీ; ఇది; గాఢ సార సహితంబు= మిక్కిలి సారంతో కూడినదీ; నాన్+నేరవలయున్= అనేది తెలిసికొనాలి; అదియును+కాక; ఏ రూపం బు+అయ్యెన్+ఏనిన్= ఏ విధమయితేనేం; ఈసు= ఈర్ష్య, పగ; ఏమిటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** ఈ రెండింటిలోనూ పరిశీలించి ఇది నిస్సారమైనదీ, ఇది మంచి సారవంతమైనదీ అనేది తెలిసికొనాలి. అయినా ఏ విధమయితేనేం, ఈర్ష్య ఎందుకు?

**విశేషం:** పై పద్యాల క్రమాన్ని అనుసరించి రోషమయ మహాతరువు నిస్సారమైనదనీ, ధర్మతరువు సారవంతమైనదనీ గ్రహించాలి.

**మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులున్ వనము; కుంతీనందనుల్ సింహముల్;**
**మతి నూహింప నసింహమైన వనమున్ మర్దింతు; రెందున్ వనా**
**వృత వృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందుఁ; గా**
**న తగం బొందుట కార్య మీ యుభయమున్ సంతుష్టిమై నుక్కికిన్. 358**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండును; పుత్త్రులున్= కొడుకులూ; వనము= అడవి; కుంతీ నందనుల్= కుంతి కొడుకులు పాండవులు; సింహముల్; మతిన్+ఊహింపన్= మనస్సులో ఆలోచించగా; అసింహము+ఐన వనమున్= సింహాలు లేని అడవిని; మర్దింతురు= కొట్టివేస్తారు; ఎందున్= ఎక్కడైనా; వన+ఆవృత వృత్తంబులు+కాని సింహములకున్= అడవిచేత ఆవరించబడని సింహాలకు; వేగంబు+అ= శీఘ్రమే; చేటు+ఒందున్= హాని కలుగుతుంది; కాన= కావున; ఈ ఉభయమున్=

ఈరెండూ - వనమూ, సింహాలూ; సంతుష్టిమైన్= సంతోషంతో సుఖంగా; ఉన్కికిన్= ఉండటానికి; తగన్= ఒప్పుగా; పొందుట= కూడిఉండటం; కార్యము= చేయదగింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడూ, అతడి కొడుకులూ వనం. పాండవులు సింహాలు. ఆలోచించగా సింహాలు లేని అడవిని కొట్టివేస్తారు. ఎక్కడైనా అడవిలో లేని సింహాలకు వెంటనే హాని కలుగుతుంది. కాబట్టి ఈ రెండూ- వనమూ, సింహాలూ సుఖంగా ఉండాలంటే ఒప్పుగా కలిసి ఉండటం మంచిది.

**విశేషం:** అలం: రూపకం. ధృతరాష్ట్రుండును బుత్రులున్ వనము; కుంతీనందనుల్ సింహముల్ రూపకాలంకారాలు. కాన= కానన్ ఇది ద్రుతప్రకృతికమైనా, ఇక్కడ మాత్రం కళగా ప్రయోగించబడింది. ద్రుతప్రకృతికమయితే కానఁ దగం బొందుట అని ఉండాలి. అప్పుడు ప్రాసమైత్రి దెబ్బతింటుంది. కౌరవులూ, పాండవులూ ఇద్దరూ సుఖంగా ఉండాలంటే- వాళ్ళిద్దరూ కలిసి ఉండటం మంచిదని భావం.

**క. పరిచారకులై యుండుదు, । రరివర్గ వ్యతికరమున కగుదురు; వీరిన్**
**సరిఁ దన కొడుకుల మెలపిన । తెరువున మెలఁగింపవలదె ధృతరాష్ట్రునకున్. 359**

**ప్రతిపదార్థం:** (పాండవులు); పరిచారకులు+ఐ= సేవకులయి; ఉండుదురు= ఉంటారు; అరి వర్గ వ్యతికరమునకున్= శత్రు సమూహం వలని కష్టదశకు; అగుదురు= అవుతారు; ధృతరాష్ట్రునకున్; వీరిన్= ఈ పాండవులను; సరిన్= సమానంగా; తన కొడుకుల మెలపిన తెరువునన్= తన కుమారులను నడిపించిన మార్గంలో; మెలఁగింపన్వలదె?= నడిపించవద్దా?

**తాత్పర్యం:** పాండవులు కౌరవులకు పరిచర్య చేస్తూ ఉంటారు. శత్రువుల వలన ఏదయినా కష్టదశ ప్రాప్తించినప్పుడు వారిని ఆదుకొంటారు. అందుచేత ధృతరాష్ట్రుడు వీళ్ళను సరిగా తన కొడుకులను నడిపించే మార్గంలోనే నడిపించవద్దా? వీళ్ళను తన కొడుకుల వలెనే చూడవద్దా? అని భావం.

**విశేషం:** అరివర్గ వ్యతికరమున కగుదురు-ఘోషయాత్రా సంఘటనను దృష్టిలో పెట్టుకొని శ్రీకృష్ణు డా రీతిగా అన్నాడు.

**క. ఏ నీ పనికై వచ్చెదఁ । దా నొప్పఁ దలంచె నొండెఁ దప్పం దలఁచెన్;**
**దానన నెగడెద మే; మ । మ్మానవ నాథునకుఁ జెప్పు మా మతమెల్లన్. 360**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఈ పనికై= కౌరవపాండవులను కలిపే పనికొరకు; వచ్చెదన్; తాను= అతడు- ధృతరాష్ట్రుడు; ఒప్పన్+తలంచెన్= అంగీకరిస్తాడో; ఒండెన్= లేదా; తప్పన్+తలఁచెన్= అంగీకరించడో; ఏము= మేము; దానన్+అ= దానినిబట్టే; నెగడెదము= ప్రవర్తిస్తాం; ఆ+మానవ నాథునకున్= ఆ రాజుకు- ధృతరాష్ట్రుడికి; మా మతము+ఎల్లన్= మా అభిప్రాయమంతా; చెప్పు(ము).

**తాత్పర్యం:** నేను ఈ కౌరవ పాండవ సంధి కార్యానికై వస్తాను. ధృతరాష్ట్రుడు ఒప్పుకొంటాడో ఒప్పుకోడో? మేము దానినిబట్టే ప్రవర్తిస్తాం. ఆ రాజుకు మా అభిప్రాయమంతా చెప్పుము'.

**వ. అనిన విని సంజయుండు ధర్మతనయుం గనుంగొని 'యట్లయినను గడు లెస్సగదా! దేవా! నా వచ్చిన కార్యంబు సఫలం బయ్యెఁ; బనివినియెద' నని, వాసుదేవునకు నట్ల విన్నవించి, భీమార్జున నకుల సహదేవ**

**సాత్యకి ద్రుపద విరాటుల నీక్షించి, 'మీ యందఱచేత ననుజ్ఞాతుండన కదా? పోయి వచ్చెద. నా యాడిన మాటలయం దేమియుఁ దగని యట్టివి లేవు గదా?' యనుటయుఁ బాండవాగ్రజుం డతని కిట్లనియె.** **361**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; సంజయుండు; ధర్మతనయున్= ధర్మరాజును; కనుంగొని= చూచి; అట్లు+అయినను= అట్లా అయితే; కడున్= మిక్కిలి; లెస్స+కదా!= మంచిది కదా!; దేవా!; నా వచ్చిన కార్యంబు= నేను వచ్చిన పని; సఫలంబు+అయ్యెన్= నెరవేరింది; పనివినియెదన్= వెళ్ళివస్తాను; అని; వాసుదేవునకున్= కృష్ణుడికి; అట్లు+అ= అట్లాగే; విన్నవించి= మనవి చేసి; భీమ+అర్జున నకుల సహదేవ సాత్యకి ద్రుపద విరాటులన్+ఈక్షించి= భీముడినీ, అర్జునుడినీ, నకుల సహదేవులనూ, సాత్యకి, ద్రుపద, విరాటులనూ చూచి; మీ+అందఱచేతన్= మీ అందరిచేత; అనుజ్ఞాతుండన్+అ కదా?= అనుమతించబడినట్లే కదా?; పోయి వచ్చెదన్= వెళ్ళివస్తాను; నా+ఆడిన మాటలఅందున్= నే నన్న మాటలలో; ఏమియున్= ఏవీ; తగని+అట్టివి= అనుచిత మయినట్టివి; లేవు+కదా; అనుటయున్; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడు- ధర్మరాజు; అతనికిన్= ఆ సంజయుడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని సంజయుడు ధర్మరాజును చూచి 'అట్లా అయితే మరీ మంచిది కదా! నేను వచ్చినపని నెరవేరినట్లే. మీ అనుమతితో సెలవు పుచ్చుకొంటాను' అని చెప్పి, కృష్ణుడితో కూడా అట్లాగే మనవి చేసి, భీమార్జున నకుల సహదేవ సాత్యకి ద్రుపద విరాటులను చూసి మీ అనుమతితో 'నేనన్నమాటలలో ఏవీ అనుచితమైనవి లేవు కదా?' అనగా ధర్మరాజు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'నా వచ్చిన కార్యంబు సఫలం బయ్యె' - అది నిజం కాకపోయినా సంజయుడు ఇట్లా ఎందుకంటున్నాడు? తాను వచ్చింది సంధి చేయటానికి. అందుకొరకు కురుసభకు శ్రీకృష్ణుడంతటివాడు రాబోవటమే తన కార్యం సఫలమయినట్లు స్పష్టం చేస్తున్నది. శ్రీకృష్ణుడు సంధి చేయటానికి వస్తున్నాడంటే అది తప్పక జరుగుతుంది.

**ఆ. 'పోయి వత్తుగాక, యీ యున్న యందఱు । వినఁగ నాడి తీవు విశదభంగి;**
**నొక్కమాట యైన నుచితంబు గానిది । గలదె? యి ట్లనంగ వలయు నెట్లు?** **362**

**ప్రతిపదార్థం:** పోయివత్తు(వు)+కాక= వెళ్ళిరమ్ము; ఈ+ఉన్న+అందఱున్= ఇక్కడ ఉన్న వీళ్ళందరూ; వినఁగన్= వింటూండగా; ఈవు= నీవు; విశద భంగిన్= స్పష్టమైన విధంగా; ఆడితి(వి)= మాటాడావు; ఒక్క మాట+ఐనన్; ఉచితంబు+కానిది= తగనిది; కలదె?; ఇట్లు+అనంగన్వలయున్+ఎట్లు?= ఇట్లా మాట్లాడాలి.

**తాత్పర్యం:** 'వెళ్ళిరమ్ము. ఇక్కడ ఉన్న అందరూ వినేటట్లు నీవు స్పష్టంగా మాటాడావు. నీ మాటలలో ఒక్కటికూడా అనుచితమైనది లేదు. మాట అంటే ఇట్లా ఉండాలి!'

**క. ఎదురున్న రూపు పలుకఁగఁ । దుదిఁ కటకటఁ బడవు నీవు; దుర్ణయమును బె**
**ట్టిదమును బెండును నగు పలు । కొదవదు నీనాలుకకు నయోన్నత! యెపుడున్.** **363**

**ప్రతిపదార్థం:** ఎదురు= ముందు; ఉన్నరూపు= ఉన్న విధం; పలుకఁగన్= మాటాడటానికి; నీవు; తుదిన్= చివరకు; కటకటన్+ పడవు= బాధపడవు; నయ+ఉన్నత!= నీతియందు గొప్పవాడా!; నీ నాలుకకున్; ఎపుడున్= ఎప్పుడూ; దుర్ణయమును= నీతి మాలినదీ; బెట్టిదమును= పరుషమయినదీ; బెండును= నిస్సారమైనదీ; అగు పలుకు= అయినమాట; ఒదవదు= కలుగదు.

**తాత్పర్యం:** ముందుగా ఎదుటివారు ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడితే నీవు చివరకు బాధపడవు. నీతికోవిదుడా! నీ నాలుకకు ఎప్పుడూ నీతి మాలినదీ, పరుషమైనదీ, నిస్సారమయినదీ అయిన మాట పుట్టదు.

**క. నీ వొండె, విదురుఁ డొండెను । గా వలయుంగాక యిట్టి కార్యంబులకున్**
**రా వేఱ కలరె తగువా । రీ వినయము నేర్పు గలదె యితరుల కెందున్? 364**

**ప్రతిపదార్థం:** ఇట్టి కార్యంబులకున్= ఇటువంటి పనులకు; నీవు+ఒండెన్, విదురుఁడు+ఒండెను= నీవో, విదురుడో; కావలయున్+ కాక= కావాలి కాని; రాన్= రావటానికి; తగువారు= అర్హులు; వేఱు+అ కలరె?= వేరే ఉన్నారా?; ఎందున్= ఎక్కడైనా; ఇతరులకున్; ఈ వినయము నేర్పు కలదె?= ఈ వినయనైపుణ్యం (ఔచిత్యపు నేర్పు) ఉంటుందా?

**తాత్పర్యం:** ఇటువంటి పనులకు నీవో విదురుడో పూనుకొనాలి కాని, రావటానికి అర్హు లింకెవ రయినా ఉన్నారా? ఎక్కడైనా ఇతరులకు ఈ వినయనైపుణ్యం (ఔచిత్యపు నేర్పు) ఉంటుందా?

**చ. అరిగినయప్డు పెద్ద లగు నందఱి విప్రుల నెల్లఁ గాంచి, యా**
**దరమున వారి సేమ ముచితంబుగ నారసి, వెండి కాన్పుమీ**
**గురునిఁ బితామహుం గృపునిఁ; గూర్తురు వారలు నాకు; నా నమ**
**స్కరణము గాఁగ వారి కధికప్రియభక్తి నమస్కరింపుమీ! 365**

**ప్రతిపదార్థం:** అరిగిన+అప్డు= నీవు వెళ్ళినపుడు; పెద్దలు+అగు+అందఱి విప్రులన్+ఎల్లన్= అక్కడి పెద్దలైన బ్రాహ్మణుల నందరినీ; కాంచి= చూచి; ఆదరమునన్= గౌరవంతో; వారి సేమము= వాళ్ళ క్షేమం; ఉచితంబుగన్= తగినట్లుగా; అరసి= తెలిసికొని; వెండి= తరువాత; గురునిన్= ద్రోణుడినీ; పితామహున్= తాత భీష్ముడినీ, కృపునిన్; కాన్పుమీ= దర్శించుము; వారలు; నాకున్+కూర్తురు= నేనంటే ఇష్టపడతారు; వారికిన్; నా నమస్కరణము+కాఁగన్= నా నమస్కారంగా; అధిక ప్రియ భక్తిన్= మిక్కిలి ప్రీతితోడి భక్తితో; నమస్కరింపుమీ= నమస్కరించుము.

**తాత్పర్యం:** నీవు వెళ్ళినపుడు అక్కడ ఉన్న పెద్దలైన బ్రాహ్మణుల నందరినీ చూచి ఆదరంతో వాళ్ళ క్షేమం ఒప్పుగా తెలిసికొని, తరువాత ద్రోణ భీష్మ కృపులను దర్శించుము. వాళ్ళకు నేనంటే ఎంతో ఇష్టం. వారికి మిక్కిలి ప్రీతితో భక్తితో నేను నమస్కరించినట్లు నమస్కరించుము.

**సీ. మా తండ్రిఁ గని యేను బ్రీతి మ్రొక్కుట గాఁగ । దండప్రణామంబు దగ నొనర్పు;**
**దుర్వృత్తిఁ బొరయు నా దుర్యోధనుని సేమ । మడిగితి నని చెప్పు; మతని తమ్ముఁ**
**డగుటకుఁ దగియెడు నా దుస్ససేనుని । కుశల మారయుము; దక్కును గుమార**
**వర్గంబు నెల్లను, వనితాజనంబుల । నుచితంపుమై సుఖ మున్కి యడుగు;**

**ఆ. విదురు, శల్యుఁ గాంచి వినయంబు దోఁపంగ । నాడు; ద్రోణతనయు నక్కు సేర్చి**
**కొంటి ననుము; బాహ్లికుని సోమదత్తు, భూ । రిశ్రవసునిఁ దలఁచి ప్రియము నెఱపు. 366**

**ప్రతిపదార్థం:** మా తండ్రిన్= మా తండ్రి అయిన ధృతరాష్ట్రుడిని; కని= చూచి; ఏను= నేను; ప్రీతిన్= సంతోషంతో; మ్రొక్కుట+కాఁగన్= నమస్కరించినట్లు; దండ ప్రణామంబు= సాష్టాంగ నమస్కారం; తగన్= ఒప్పుగా; ఒనర్పు(ము)=

చేయుము; దుర్వృత్తిన్+పొరయు= చెడు నడవడి కలుగు; ఆ దుర్యోధనుని సేమము= ఆ దుర్యోధనుడి క్షేమం; అడిగితిన్+అని చెప్పుము; అతడి తమ్ముఁడు; అగుటకున్+తగియెడు+ఆ దుస్ససేనుని కుశలము= అతని తమ్ముడు అనటానికి అర్హుడైన ఆ దుశ్శాసనుడి క్షేమం; ఆరయుము= తెలిసికొనుము; తక్కను+కుమార వర్గంబున్+ఎల్లను= తక్కిన కుమారుల సమూహాన్ని అంతనూ; వనితాజనంబులన్= స్త్రీలనూ; ఉచితము+మై= తగిన విధంగా; సుఖము+ఉన్కి= సుఖంగా ఉన్న సంగతి; అడుగు(ము); విదురున్; శల్యున్, కాంచి= చూచి; వినయంబు+తోఁపంగన్= అణకువ కనబడేటట్లు; ఆడు(ము)= మాటాడుము; ద్రోణ తనయున్= ద్రోణుడి కొడుకైన అశ్వత్థామను; అక్కు+చేర్చికొంటిన్+అనుము= కౌగిలించుకొన్నానని చెప్పుము; బాహ్లికునిన్; సోమదత్తున్; భూరిశ్రవసునిన్; తలఁచి; ప్రియము= ఇష్టం; నెఱపు= చేయుము.

**తాత్పర్యం:** మా తండ్రిఅయిన ధృతరాష్ట్రుడిని చూచి నేను సంతోషంతో నమస్కరించినట్లు సాష్టాంగ నమస్కారం చేయుము. చెడు నడవడి కలిగి ఉండే ఆ దుర్యోధనుడి క్షేమం అడిగానని చెప్పుము. అతడికి తమ్ముడు అనిపించుకొనటానికి తగిన ఆ దుశ్శాసనుడి క్షేమం తెలిసికొనుము. తక్కిన కుమారులనూ, అందరినీ, స్త్రీలనూ, తగిన విధంగా సుఖంగా ఉన్న సంగతి తెలిసికొమ్ము. విదురుడినీ, శల్యుడినీ చూచి వినయంతో మాటాడుము; అశ్వత్థామను ఆలింగనం చేసికొన్నానని చెప్పుము. బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవసులను తలచి సంతోషం ప్రకటించుము.

**వ. మఱియు వంశవంతులు, వయోవృద్ధులు నగు భూపతులను, గృతవర్మను, గర్ణ శకుని సైంధవ ప్రభృతులను; దక్కటిరాజలోకంబును; గయ్యంబునకుఁ దోడు వచ్చిన సకల దేశాధీశులనుం గని, యెవ్వరితోడ నెవ్విధంబునం బలుకందగు ప్రణామ వినయ బాంధవ మైత్రీ వాత్సల్యంబులకు నయ్యై ప్రకారంబుల మద్వచనంబులుగాఁ బలికి; యుచితంబుమెయి నుపచరింపుము. 367**

**ప్రతిపదార్థం:** మఱియున్; వంశవంతులున్= కులీనులూ; వయస్(ః)+వృద్ధులున్= వయస్సుచేత పెద్దవారూ; అగు; భూపతులను= రాజులనూ; కృతవర్మను; కర్ణ శకుని సైంధవ ప్రభృతులను= కర్ణుడూ, శకునీ, సైంధవుడూ మొదలైన వారినీ; కయ్యంబునకున్= యుద్ధానికి; తోడు వచ్చిన= సహాయంగా వచ్చిన; సకల దేశ+అధీశులనున్= ఎల్ల దేశాల రాజులనూ; కని; ఎవ్వరి తోడన్; ఏ+విధంబునన్= ఏ రీతిగా; పలుకన్+తగు= పలుకరించదగిన; ప్రణామ వినయ బాంధవ మైత్రీ వాత్సల్యంబులకున్= నమస్కారం, వినయం, చుట్టరికం, స్నేహం, వాత్సల్యం అనేవాటికి; ఆ+ఆ+ప్రకారంబులన్= ఆయా విధాలుగా; మత్+వచనంబులుగాన్= నా మాటలుగా; పలికి; ఉచితంబు మెయిన్= తగిన విధంగా; ఉపచరింపుము= సమ్మానించుము.

**తాత్పర్యం:** ఇంకా, కులీనులూ, వయస్సుచేత పెద్దవారూ అయిన రాజులనూ, కృతవర్మనూ, కర్ణుడూ, శకునీ, సైంధవుడూ మొదలయిన వాళ్ళనూ, తక్కిన రాజసమూహాన్నీ, యుద్ధంలో తోడు పడడానికి వచ్చిన ఎల్లదేశాల ప్రభువులనూ చూచి ఎవరితో ఏ విధంగా నమస్కారం, వినయం, బంధుత్వం, స్నేహం, వాత్సల్యం అనే వాటితో పలకాలో ఆయా విధాలుగా నా మాటలుగా పలికి సముచితంగా ప్రవర్తించుము.

**క. దాసీ దాస జనముల కు । దాసీనము గాక యుండఁ, దడయక యే మి**
**త్రాసంగ మొంది, శత్రు ని । రాసం బొనరించి; తమ్ము నరసెద ననుమీ. 368**

**ప్రతిపదార్థం:** దాసీ దాస జనములకున్= దాసీ జనానికీ, దాస జనానికీ; ఉదాసీనము+కాక+ఉండన్= మనకెందుకని ఊరుకొనకుండా; తడయక= ఆలస్యం చేయకుండా; ఏన్= నేను; మిత్ర+ఆసంగము+ఒంది= మిత్రుల తోడ్పాటు పొంది; శత్రు నిరాసంబు+ఒనరించి= శత్రు నిరసనం చేసి; తమ్మున్= తమను; అరసెదన్+ అనుమీ!= రక్షిస్తానని చెప్పుము.

**తాత్పర్యం:** దాసీజనులనూ, దాసజనులనూ చూచి, మన కెందుకులే అని ఊరుకొనకుండా నేను, వెంటనే మిత్రులను కూర్చుకొని, శత్రువులను నిరసించి తమను కాపాడుతానని చెప్పుము.

**క. పోయిన మొగమున నచ్చటఁ । జేయు తెఱంగెల్ల నీకుఁ జెప్పితిఁ; బిదపన్**
**మా యయ్య పెద్ద కొలువున । వా యొడక యిట్టనంగ వలయుం జుమ్మీ! 369**

**ప్రతిపదార్థం:** పోయిన మొగమునన్= వెళ్ళీ వెళ్ళగానే; అచ్చటన్; చేయు తెఱంగు+ఎల్లన్= చేసే విధమంతా; నీకున్; చెప్పితిన్; పిదపన్= పిమ్మట; మా+అయ్య పెద్ద కొలువునన్= మా తండ్రిదైన నిండు సభలో; వాయి+ఒడక= పలుకటానికి వెనుకాడక; ఇట్టు+అనంగవలయున్+చుమ్మీ!= ఇట్లా పలకాలి సుమీ!

**తాత్పర్యం:** వెళ్ళీ వెళ్ళగానే అక్కడ నీవు చేయవలసిన దంతా నీకు చెప్పాను. తరువాత మా తండ్రి నిండోలగంలో మోమోటపడకుండా ఇట్లా అనాలి సుమీ!

**చ. అనఘ! భవద్బలంబునన యాపద యించుక లేక పాండునం**
**దనులు నిజాప్తబంధుసహితంబు సుఖస్థితి నున్నవారు; త**
**జ్జనకుని రాజ్యపీఠమున సమ్మద మొందఁగ నిల్పి శైశవం**
**బునన ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితి వారల విశ్రుతంబుగన్. 370**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; భవత్+బలంబునన్+అ= నీ బలం వలననే; పాండునందనులు= పాండవులు; ఆపద+ఇంచుక లేక= కొంచెం కూడా కష్టం లేకుండా; నిజ+ఆప్త బంధు సహితంబు= తమమిత్రులతోనూ, బంధువులతోనూ; సుఖ స్థితిన్+ఉన్న వారు= సుఖంగా ఉన్నారు; వారలన్= వారిని; శైశవంబునన్+అ= బాల్యంలోనే; తద్+జనకుని రాజ్య పీఠమునన్= వారి తండ్రి రాజ్యసింహాసనం మీద; సమ్మదము+ఒందఁగన్= సంతోషపడేటట్లు; నిల్పి; ప్రభుత్వము+ఇచ్చి= రాచరికం ఇచ్చి; తగన్= తగిన విధంగా; విశ్రుతంబుగన్= ప్రసిద్ధంగా; ప్రోచితి(వి)= రక్షించావు.

**తాత్పర్యం:** పాపరహితుడా! నీ బలం వలననే పాండవులు కొంచెమైనా కష్టమనేది లేకుండా, తమ మిత్రులతోనూ, బంధువులతోనూ సుఖంగా ఉన్నారు. వారిని బాల్యంలోనే వారి తండ్రి రాజ్య సింహాసనం మీద సంతోషపడేటట్లు కూర్చుండబెట్టి రాచరిక మిచ్చి తగిన విధంగా ప్రసిద్ధంగా కాపాడావు.

**విశేషం:** 'భవద్బలంబునన సుఖస్థితి నున్నవారు' ధర్మరాజు ఇట్లా నిజంగా అనమంటున్నాడా? దెప్పి పొడుపా? నిజానికి పాండవులు సుఖంగా లేరు. ఎన్నో కష్టాలు పడ్డారు. వాటి కన్నింటికీ ధృతరాష్ట్రుడే మూల కారణం. మరి ఇట్లా అనడం ఏమనుకొనాలి? 'అనఘ' అనే సంబోధనం కూడా అనుమానించదగ్గదే!

**ఉ. ఇప్పు డుపేక్ష సేసి, కృప యేమియు లేక, విహీనవృత్తి వా**
**రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పునె? యింతట సంతసింప రా**
**దిప్పుడు; నంతకంత నట యెక్కుడు గోరినఁ జాలకుండదే?**
**యొప్పదె కూడి మన్కి మన కొప్పనివారల యుక్కు దక్కఁగన్?' 371**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు; ఉపేక్ష+చేసి= ఒప్పరికించి, అశ్రద్ధ వహించి; కృప+ఏమియున్ లేక= దయ ఏమాత్రమూ లేకుండా; వారు; విహీన వృత్తిన్= అధమస్థితితో; ఒప్పమిన్= ఆపదను; పొందన్+చూచుట= పొందేటట్లు చూడటం; ఇది; ఒప్పునె?= తగునా?; ఇప్పుడున్= ఇప్పుడుకూడా; ఇంతటన్ సంతసింపరాదు= ఇంతటితో సంతోషించకూడదు; అంతకున్+అంతన్+అట+ ఎక్కుడు+కోరినన్= అంతకంటె అధికంగా కోరినప్పటికీ; చాలక+ఉండదే?= సరిపోకుండా ఉండదా?-ఎంత ఎక్కువ కోరినా చాలదని భావం; ఒప్పని వారల+ఉక్కు+తక్కఁగన్= పగవారి పొగరు అడగేటట్లు; మనకున్; కూడి మన్కి= కలిసి బ్రతకటం; ఒప్పదె?= తగదా?

**తాత్పర్యం:** బాల్యంలో అట్లా ఆదరించి, ఇప్పుడు ఒప్పరికించి, దయ ఎంత మాత్రమూ లేకుండా, వారు అధమ దశతో ఆపద పొందగా చూస్తూ ఊరుకొనటం తగునా? ఇప్పుడు అంతటితో సంతోషించకూడదు. అంతకంటె అధికంగా కోరినప్పటికీ సరిపోదు. పగవారి పొగరు అణగేటట్లు మనం కలిసి బ్రదకటం మంచిది కాదా?

**విశేషం:** నేనింకా తక్కువ కోరుతున్నాను గాని అంతకంటె ఎక్కువ కోరినప్పటికీ తక్కువే అవుతుందని భావం.

**వ. అని తదవసరంబునం బితామహుతో నిట్లనుము. 372**

**తాత్పర్యం:** అని ఆ సమయంలో భీష్ముడితో ఇట్లా అనుము.

**చ. 'అడఁగఁగనీక శంతనుని యన్వయముం గలిగించి; తీవ యి**
**ప్పుడుఁ దగ నీ మతంబునన పొందొడఁగూడఁగఁ జేర్చి పౌత్త్రులన్**
**సడికి నధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మన్చినం**
**బుడమిజనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే?' 373**

**ప్రతిపదార్థం:** ఈవు+అ= నీవే; శంతనుని+అన్వయమున్= శంతనుడి వంశాన్ని; అడఁగఁగ నీక= నశించిపోనివ్వకుండా; కలిగించితి(వి)= నిలబెట్టావు; ఇప్పుడు; తగన్= ఒప్పుగా; నీ మతంబునన్+అ= నీ ఇష్టప్రకారమే; పొందు+ఒడఁగూడఁగన్+ చేర్చి= సంధి కుదిరే విధంగా కలిపి; పౌత్త్రులన్= మనుమలను; సడికిన్= నిందకూ; అధర్మ వృత్తికినిన్= అన్యాయపు నడవడికీ; చావునకున్; తొలఁగించి= దూరంగా ఉంచి; మన్చినన్= బ్రదికిస్తే; పుడమి జనంబున్= భూజనులూ; రాజులునున్= రాజులూ; భూ సురులున్= బ్రాహ్మణులూ; నినున్= నిన్ను; ప్రస్తుతింపరే?= మెచ్చుకోరా?

**తాత్పర్యం:** ఇదివరకు నీవు శంతనుడి వంశం అంతరించి పోకుండా నిలబెట్టావు. ఇప్పుడు నీవే ఒప్పేటట్లు నీ ఇష్ట ప్రకారమే సంధి కుదిర్చి మనుమలను కలిపి, వారు నిందకూ, అన్యాయానికీ, చావుకూ దూరంగా ఉండేటట్లు చేసి బ్రదికిస్తే భూజనులూ, రాజులూ, బ్రాహ్మణులూ నిన్ను మెచ్చుకొనరా?

**విశేషం:** భీష్ముడు శంతనుడి కొడుకు. శంతనుడు సత్యవతిని పెళ్ళి చేసికొనటంలో భీష్ముడు సహాయపడ్డాడు. తాను పెళ్ళి చేసికొననని శపథం చేశాడు. సత్యవతీ శంతనులకు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అని ఇద్దరు కొడుకులు పుట్టారు. వారి చిన్నతనంలోనే శంతనుడు మరణించాడు. చిత్రాంగదుడు అవివాహితుడుగా మరణించాడు. భీష్ముడు కాశీరాజు కూతుళ్ళయిన అంబ, అంబిక, అంబాలిక అనే వాళ్ళను స్వయంవరంలో గెల్చి తీసికొనిరాగా, అంబ సాళ్వుడిని ప్రేమించానంటే వెళ్ళిపొమ్మని, అంబికాంబాలికలను విచిత్రవీర్యుడి కిచ్చి పెళ్ళి చేశాడు. విచిత్ర వీర్యుడు సంతానం పొందకుండానే చచ్చిపోయాడు. శంతనుడి

వంశం అంతరించిపోతున్నదని సత్యవతి తన ప్రథమ పుత్రుడైన వ్యాసుడిని (పరాశరుడి వలన సత్యవతికి పుట్టినవాడు) అంబికాంబాలికలకు దేవరన్యాయం చొప్పున సంతానం పొందవలసిందిగా ఆదేశిస్తుంది. వ్యాసుడివలన అంబికకు ధృతరాష్ట్రుడూ, అంబాలికకు పాండురాజూ జన్మించారు. దాసిఅయిన శూద్రస్త్రీకి విదురుడు జన్మించాడు. ఈ విధంగా భీష్ముడు శంతనుడి వంశం అంతరించిపోకుండా నిలబెట్టాడు.

**వ. అని పలికి వెండియు. 374**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా.

**క. ఇంతలు పుట్టిన చోటను । శంతనునందన! యహీన శాంతిపరుండై**
**కౌంతేయాగ్రజుఁ డాలము । పొంతం బో నొల్లఁ' డనుము బుధు లియ్యకొనన్. 375**

**ప్రతిపదార్థం:** బుధులు+ఇయ్యకొనన్= తెలిసినవారు సమ్మతించగా; శంతను నందన!= శంతనుని కుమారుడా! భీష్ముడా!; ఇంతలు+పుట్టిన చోటను= ఇంతలేసి ఘోరాలు జరిగినచోట కూడా; కౌంతేయ+అగ్రజుఁడు= పాండవులలో పెద్దవాడు; ధర్మరాజు; అహీన శాంతి పరుండు+ఐ= తక్కువకాని గొప్పశాంతియం దాసక్తికలవాడయి; ఆలము పొంతన్= యుద్ధం దరికి; పోన్+ఒల్లఁడు+ అనుము= పోవ నంగీకరించడు అనుము.

**తాత్పర్యం:** తెలిసిన వారు సమ్మతించగా 'భీష్ముడా! ఇంతలేసి ఘోరాలు జరిగిన సందర్భంలో కూడా ధర్మరాజు గొప్ప శాంతియందు ఆసక్తి గలవాడై యుద్ధపు చాయలకు పోవ నంగీకరించడు' అనుము.

**సీ. ఆ సమయంబున నచ్చటి వారెల్ల । వినునట్లుగా సుయోధనుని తోడ**
**'బాహుబలాఢ్యుల బలవిహీనుల క్రియ । వెడలంగ నడిచిన వెట్టితనము,**
**నత్యంత చిరకాల మడవులఁ గొండల । బాధలఁ బెట్టిన పరుసఁదనము,**
**సభలోన నట్లు పాంచాల రాజాత్మజఁ । దలవట్టి యీడ్చిన తులువతనము**

**తే. ధర్మపుత్త్రుండు సైరించెఁ దథ్య; మీవు । కురుకుమారుల నని మ్రింగికొనకు; మొరుల**
**సొమ్మునకు నాసపడఁ దగ; దిమ్ము వారి । పాలు; వారలతోఁ గూడి బ్రదుకు' మనుము. 376**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ సమయంలో; అచ్చటి వారు+ఎల్లన్= అక్కడ ఉన్నవాళ్ళు అందరూ; విను+అట్లుగాన్= వినేటట్లుగా; సుయోధనుని తోడన్= దుర్యోధనుడితో బాహు బల+ ఆఢ్యులన్= భుజ పరాక్రమ సంపన్నులైన పాండవులను; బల విహీనుల క్రియన్= పరాక్రమశూన్యులవలె; వెడలంగన్+అడిచిన వెట్టితనమున్= ఊళ్ళోనుండి వెళ్ళగొట్టిన వెర్రితనమూ; అత్యంత చిరకాలము= ఎంతోకాలం; అడవులన్= అడవులలోనూ; కొండలన్= కొండలలోనూ; బాధలన్+పెట్టిన పరుసఁదనమున్= బాధపెట్టిన క్రూరత్వమూ:సభలోనన్; అట్లు= ఆ రీతిగా పైకిచెప్పరాని విధంగా; పాంచాల రాజ+ఆత్మజన్= పాంచాల దేశపు రాజయిన ద్రుపదుడి కూతురిని-ద్రౌపదిని; తల+పట్టి+ఈడ్చిన తులువతనమున్= జుట్టుపట్టుకొని ఈడ్చిన తుంటరితనమూ, ధర్మపుత్త్రుండు= ధర్మరాజు; సైరించెన్= సహించాడు; తథ్యము= నిజం; ఈవు= నీవు; కురు కుమారులన్= కౌరవులను; అనిన్= యుద్ధంలో; మ్రింగికొనకుము= నాశనం చేసికొనకుము; ఒరుల సొమ్మునకున్= ఇతరుల డబ్బుకు; ఆసపడన్+తగదు= ఆశించకూడదు; వారి పాలు= వారి భాగం; ఇమ్ము= ఇచ్చివేయుము; వారలతోన్= ఆ పాండవులతో; కూడి= కలిసి; బ్రదుకుము; అనుము.

**తాత్పర్యం:** నీవు ధృతరాష్ట్రుడి సభలో ఇక్కడి సంగతులన్నీ చెప్పేటప్పుడు అక్కడున్నవాళ్ళంతా వినేటట్లు దుర్యోధనుడితో 'భుజ పరాక్రమ సంపన్నులైన పాండవులను పరాక్రమ శూన్యులవలె ఊళ్ళోనుండి వెళ్ళగొట్టిన మీ వెర్రితనమూ, ఎంతోకాలం అడవులలోనూ, కొండలలోనూ బాధలు పెట్టిన మీ క్రూరత్వమూ, సభలో ద్రౌపదిని ఆ విధంగా జుట్టుపట్టుకొని ఈడ్చిన మీ తుంటరితనమూ ధర్మరాజు సహించాడు నిజం. నీవు కౌరవులను యుద్ధంలో నాశనం చేసికొనకుము. ఇతరుల డబ్బుకొరకు ఆశించకూడదు. వారి భాగం వారి కిచ్చివేయుము. వాళ్ళతో కలిసి బ్రదుకుము' అని చెప్పుము.

**విశేషం:** 'బాహు బలాఢ్యుల..........వెఱ్ఱితనము.' భుజపరాక్రమసంపన్నులైన పాండవులను స్వప్రయోజనం కొరకు ఉపయోగించుకొనకుండా దుర్యోధనుడు వాళ్ళను ఊళ్ళోనుండి వెళ్ళగొట్టటం వెర్రితనం కాక మరేమిటి?

**వ.** **ఏము కలహం బొల్లక పొందుగోరుట తనకు మేలు; తన మనంబున దరికొను తృష్ణానలం బార్ప నొరు లడ్డంబు సొరమింజేసి, యేన బుద్ధి సెప్పవలసెఁ; దనయొద్దం గల యోధవీరులె య్యెడల లేమి దెల్లంబయినను, మాకుఁ జేదోడు ధర్మంబు గల; దదియునుంగాక యఖిలలోక సేవితుండైన కృష్ణుండు పెనుప్రాపు గావునఁ దమకు మమ్ము గెలువం గొలఁదిగా; దదియట్లుండె; నేను భీమసేనాదులకుం దమకుం బెద్దవాఁడ నగుట వీరును వారును మదీయ ప్రార్థనా భంగంబు సేయక, నాదగు శాంతియు దాంతియుఁ జెల్లించి; న న్నలజడిఁ బెట్టక, పోరితం బుడిగి తమతమ ధనంబులు గుడిచి సుఖంబుండుట మన పెద్దలకుం దక్కటి బుద్ధిమంతులకును సంతోషంబగుఁ; బెద్దయీ నోపఁడయ్యెనేనిఁ గుశస్థలంబును; వృకస్థలంబును; వాసంతియు; వారణావతంబును జాలుఁ; గాదేని మఱియు నెందేనియు నొక్కటి యగునట్లుగాఁ దన తోడఁబుట్టువు లేవురకు నిలువతావు లయి దిచ్చిన సర్వశాంతి యగు; నట్లయిన నిందలి యందలి బంధు మిత్త్ర సహాయజనంబులు గలసి నవ్వుచుం దెగడుచు నునికి మన మనంబులకుఁ బ్రియంబుసేయుఁ; గురు పాంచాల యాదవ మాత్స్యులు పరస్పర ప్రీతి సంపాదకత్వ సంపన్నులై బ్రదుకుట నాకుం గోర్కి; యింతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పు' మనిన విని 'దేవా! నీ యానతిచ్చిన మార్గంబంతయు నడపెద; మీ తండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు ప్రియం బట్లు సేయువాఁడ కాక' యనుచుం బ్రణామంబు సేసిన, సంజయునకు ధనంజయుం డిట్లనియె.** **377**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; కలహంబు+ఒల్లక= యుద్ధం అంగీకరించక; పొందు+కోరుట= సఖ్యం కోరటం; తనకున్; మేలు= మంచిది; తన మనంబునన్= తన మనస్సులో; దరికొను= మండే, తృష్ణా+అనలంబు= పేరాస అనే అగ్ని; ఆర్పన్= చల్లార్చటానికి; ఒరులు= ఇతరులు; అడ్డంబు+చొరమిన్+చేసి= అడ్డం రాకపోవటం చేత; ఏను+అ= నేనే; బుద్ధి+చెప్పన్+వలసెన్= బుద్ధి చెప్పవలసి వచ్చింది; తన+ఒద్దన్+కల యోధ వీరులు= తన దగ్గరున్న యుద్ధవీరులు; ఏ+ఎడలన్= ఎక్కడా; లేమి= లేకపోవటం; తెల్లంబు+అయినను= స్పష్టం అయినప్పటికీ; మాకున్; చేదోడు= సహాయం; ధర్మంబు; కలదు; అదియునున్+ కాక; అఖిలలోక సేవితుండు+ఐన కృష్ణుండు= ఎల్ల లోకాల చేత సేవించబడే కృష్ణుడు; పెను+ప్రాపు+కావునన్= పెద్ద దిక్కు కాబట్టి; తమకున్; మమ్మున్; గెలువన్+కొలఁది+కాదు= గెలవటం శక్యం కాదు; అది+అట్లు+ఉండెన్; ఏను; భీమసేన+ఆదులకున్= భీముడూ మొదలయిన వారికీ; తమకున్; పెద్దవాఁడన్+అగుటన్= పెద్దవాడిని అవటం చేత; వీరును+తారును= వీళ్ళూ, వాళ్ళూ; మదీయ ప్రార్థనా భంగంబున్+చేయక= నాదయిన ప్రార్థనను అనాదరించక; నాది+అగు శాంతియున్ దాంతియున్=

నా శాంతినీ, కర్మేంద్రియాల నిగ్రహశక్తినీ; చెల్లించి= సాగనిచ్చి; నన్నున్; అలజడిన్+పెట్టక= బాధపెట్టక; పోరితంబు+ఉడిగి= యుద్ధం మాని; తమ తమ ధనంబులు+కుడిచి= తమ తమ సొమ్ము లనుభవించి; సుఖంబు+ఉండుట= సుఖంగా ఉండటం; మన పెద్దలకున్; తక్కటి బుద్ధిమంతులకును= తక్కిన బుద్ధిమంతులకూ; సంతోషంబు+అగున్; పెద్ద+ఈన్+ఓపఁడు+ ఏనిన్= అంత ఎక్కువ ఇవ్వలేకపోతే; కుశస్థలంబును; వృకస్థలంబును; వాసంతియున్; వారణావతంబును; చాలున్= సరిపోతాయి; కాదు+ఏనిన్= లేకపోతే; మఱియున్+ఎందున్+ఏనియున్= మరి ఎక్కడైనా; ఒక్కటి+అగునట్లుగాన్; తన తోడఁబుట్టువులు+ ఏవురకున్= తన సోదరులైదుగురికీ; నిలువన్= ఉండటానికి; ఠావులు= నివాసస్థానాలు; అయిదు= ఐదు; ఇచ్చినన్= ఇస్తే; సర్వశాంతి+అగున్= సంపూర్ణ శాంతి ఏర్పడుతుంది; అట్లు+అయినన్= అట్లా జరిగితే; ఇందలి, అందలి బంధు మిత్ర సహాయ జనంబులు= ఇక్కడి అక్కడి చుట్టాలూ, స్నేహితులూ, తోడ్పాటుకై వచ్చిన వాళ్ళూ, కలిసి= కూడి; నవ్వుచున్; తెగడుచున్= త్రుళ్ళుతూ; ఉనికి= ఉండటం; మన మనంబులకున్= మన మనస్సులకు; ప్రియంబు+చేయున్= సంతోషం కలిగిస్తుంది; కురు పాంచాల యాదవ మాత్స్యులు= కౌరవులూ, పాంచాలురూ, యాదవులూ, మాత్స్యులూ; పరస్పర ప్రీతి సంపాదకత్వ సంపన్నులు+ఐ= ఒండొరుల ప్రేమ సంపాదనతో కూడినవారై; బ్రదుకుట; నాకున్+కోర్కి= నా కోరిక; ఇంతయున్; ఆ+మహా పురుషునకున్= ఆ మహానుభావుడికి; తెలియన్+చెప్పుము= స్పష్టపరుచుము; అనినన్; విని; దేవా; నీ+ఆనతి+ఇచ్చిన మార్గంబు+అంతయున్= నీవు సెలవిచ్చిన విధం అంతా; నడపెదన్= జరుపుతాను; మీ తండ్రి; నీకును; తమ్ములకును; వాసుదేవునకున్= కృష్ణుడికీ; ఎట్లు ప్రియంబు+అట్లు+చేయువాఁడు+అ కాక= ఎట్లా ఇష్టమో అట్లా చేసేవాడే అవుతాడు; అనుచున్; ప్రణామంబు+చేసినన్= నమస్కరించగా; సంజయునకున్; ధనంజయుండు= అర్జునుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** మేము యుద్ధానికి అంగీకరించక సఖ్యం కోరటం తనకు మంచిది. తన మనస్సులో రగిలే తృష్ణ అనే అగ్నిని ఆర్పటానికి ఇతరులు పూనుకొనకపోవటం చేత నేనే బుద్ధి చెప్పవలసి వచ్చింది. తన దగ్గర ఉన్న యోధులు ఎక్కడా లేకపోవడం స్పష్టమే అయినా, మాకు తోడ్పాటు ధర్మం ఉన్నది. అదీకాక ఎల్లలోకాలూ సేవించే కృష్ణుడు మాకు పెద్ద దిక్కు కాబట్టి తమకు మమ్ములను గెలవటం సాధ్యంకాదు. అది అట్లా ఉండనిమ్ము, నేను భీమాదులకూ, తమకూ పెద్దవాడిని అవటంచేత, వీళ్ళూ, వాళ్ళూ నా కోరికను అనాదరించక, నా శాంతినీ, దాంతినీ సాగనిచ్చి నన్ను బాధించక, యుద్ధం మాని, తమ తమ సొమ్ము లనుభవిస్తూ సుఖంగా ఉండటం మన పెద్దలకూ, తక్కిన బుద్ధిమంతులకూ సంతోషం. అంత ఎక్కువగా ఇవ్వలేకపోతే, కుశస్థలమూ, వృకస్థలమూ, వాసంతీ, వారణావతమూ సరిపోతాయి. లేకపోతే మరి ఎక్కడైనా ఏదో ఒకటి తన సోదరులకు అయిదుగురికీ నిలవడానికి చోట్లు అయిదిస్తే సంపూర్ణశాంతి అవుతుంది. అట్లా అయితే ఇక్కడి అక్కడి బంధువులూ, మిత్రులూ తోడ్పాటు కొరకు వచ్చినవాళ్ళూ కలిసి, నవ్వుతూ, త్రుళ్ళుతూ ఉండటం మన మనస్సులకు సంతోషం కలిగిస్తుంది. కురు పాంచాల యాదవ మాత్స్యులు ఒండొరుల ప్రేమను సంపాదించుకొని బ్రదకాలని నా కోరిక. ఇదంతా ఆ మహానుభావుడికి స్పష్టపరుచుము, అనగా విని 'దేవా! నీవు సెలవిచ్చిన విధానం అంతా నడుపుతాను. మీ తండ్రి నీకూ, తమ్ములకూ, కృష్ణుడికీ ఎట్లా ఇష్టమో అట్లా చేస్తాడు' అంటూ నమస్కరించగా, సంజయుడితో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** తృష్ణానలంబు-తృష్ణ అనే అనలం రూపకాలంకారం. కుశస్థలంబును, వృకస్థలంబును, వాసంతియు, వారణావతంబును, ఇంకొకటి ఏదయినా ఇట్లా ఏవో అయిదూళ్ళు మాత్రమే ధర్మరాజు కోరినట్లు కనిపించినా, అవి కౌరవ సామ్రాజ్యానికి ఆయువుపట్టులైన ఊళ్ళు. ధర్మరాజు గడుసుదనం అక్కడే ఉన్నది. 'అమ్మహాపురుషునకున్' ఆ మహానుభావుడికి - ఇది స్తుతికాదు విసుగు చెంది అన్నమాట. మూలంలో 'వాసంతి' లేదు. దానికి బదులు 'అవంతి' ఉన్నది. 'కుశస్థల వృకస్థలం అవన్తీం వారణావతమ్.'

**క. 'బాల సఖుండవు; నాకును । నీ లెస్సఁదనంబు; నేము నీతి విడిచి దు**
**శ్శీలుర మగుటయు; శైశవ । లీల మొదలు గాఁగ మును దెలియదే నీకున్? 378**

**ప్రతిపదార్థం:** బాల సఖుండవు= బాల్య మిత్రుడివి; నాకును; నీ లెస్సఁదనంబు= నీ మంచితనమూ; నీకున్; ఏము= మేము; నీతిన్; విడిచి; దుశ్శీలురము+అగుటయున్= దుష్టస్వభావులం అవటమూ; శైశవ లీల మొదలు+కాఁగన్= బాల్యం నుండి; మును= ముందు; తెలియదే?= తెలియదా?

**తాత్పర్యం:** నీవు నాకు బాల్య స్నేహితుడివి. నీ మంచితనం నాకూ, మేము నీతి విడిచి దుస్స్వభావులం అవటం నీకూ చిన్ననాటి నుండీ ముందు తెలియదా?

**విశేషం:** 'నాకును నీ లెస్సఁదనంబు!' 'ఏము నీతి విడిచి దుశ్శీలురమగుటయు' - ఇవి నిజంగా అన్నమాటలు కావు. విపరీతార్థాన్ని ఇచ్చే మాటలు.

**మ. బలమత్తాకృతి యైన భీముఁ డను శుంభత్కుంభి సంరంభమున్**
**నిలిపెన్ నాఁడును నంకుశంబయి; తుదిన్ నేఁడుం దదుద్రేకమున్**
**మలుఁగం జేయ నజాతశత్రుని కృపామౌగ్ధ్యంబ చాలంగ; వా**
**రల కేలా నయవిక్రమోచిత విచారక్లేశముల్ సంజయా!' 379**

**ప్రతిపదార్థం:** సంజయా!; అజాతశత్రుని కృపా మౌగ్ధ్యంబు+అ= ధర్మరాజు యొక్క దయతో కూడిన తెలివితక్కువతనమే; నాఁడును= అప్పుడూ; అంకుశంబు+అయి= అంకుశమయి; బల మత్త+ఆకృతి+ఐన= బలంచేత మదించిన ఆకారం కలవాడయిన; భీముఁడు+అను= భీముడనే; శుంభత్+కుంభి సంరంభమున్= ప్రకాశించే ఏనుగుయొక్క విజృంభణాన్ని; నిలిపెన్= ఆపుచేసింది; తుదిన్= చివర; నేఁడున్= ఇప్పుడూ; తద్+ఉద్రేకమున్= ఆ భీమగజం ఆవేశాన్ని; మలుఁగన్+చేయన్= అణచటానికి;(అదే), చాలంగన్= సరిపడగా; వారలకున్= ఆ కౌరవులకు; నయ విక్రమ+ఉచిత విచార క్లేశముల్= నీతితో కూడిన పరాక్రమానికి తగిన ఆలోచనల కష్టాలు; ఏలా?= ఎందుకు?

**తాత్పర్యం:** సంజయా! అజాతశత్రువైన ధర్మరాజు దయతో కూడిన తెలివితక్కువతనమే అప్పుడు అంకుశమయి, పరాక్రమ మత్తాకారుడైన భీముడనే మత్తేభం విజృంభణాన్ని ఆపుచేసింది. చివరకు ఇప్పుడుకూడా ఆ భీమగజం ఆవేశాన్ని అణచటానికి అదే సరిపడగా, ఆ కౌరవులకు నీతి పరాక్రమానికి తగిన ఆలోచనలు చేసే కష్టం ఎందుకుంటుంది?

**విశేషం:** అలం: రూపకం, పరికరాంకురం. భీముఁడనే శుంభత్కుంభి అలంకారం రూపకం. అజాతశత్రుని కృపామౌగ్ధ్యంబ అంకుశం బయి - రూపకమే. అజాతశత్రుఁడు అనే ధర్మరాజునామం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరాంకురం.

**వ. అని పలికి ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సముచిత ప్రకారంబున మజ్జన భోజనంబు లొనరించి, మాల్యానులేపనాద్యుపచారంబులు సేయించి, మణిభూషణ చిత్రాంబరంబు లొసంగి వీడుకొల్పిన, నతండును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియె' నని చెప్పిన. 380**

**ప్రతిపదార్థం:** అని పలికి; ధర్మతనయ+అనుమతంబునన్= ధర్మరాజుయొక్క అనుజ్ఞతో; సంజయునకున్; సపరివారంబుగాన్= పరిజనసమేతంగా; సముచిత ప్రకారంబునన్= తగిన విధంగా; మజ్జన భోజనంబులు= స్నానాహారాలు; ఒనరించి= చేసి; మాల్య+అనులేపన+ఆది+ఉపచారంబులు= దండలు, మైపూఁతలు మొదలయిన సమ్మానములు; చేయించి; మణి భూషణ చిత్ర+అంబరంబులు= రత్నాలంకారాలు, మనోజ్ఞములైన వస్త్రాలు; ఒసంగి= ఇచ్చి; వీడుకొల్పినన్= సెలవిచ్చి పంపగా; అతండును; పాండవులను; వాసుదేవునిన్= కృష్ణుడిని; వీడ్కొని చనియెన్= విడిచి వెళ్ళాడు; అని; చెప్పినన్= అని వైశంపాయనుడు చెప్పగా;

**తాత్పర్యం:** అని పలికి ధర్మరాజు అనుజ్ఞతో సంజయునకు పరిజనసమేతంగా తగిన విధాన స్నానాహారాలు చేయించి, పూలమాలలు, మైపూతలు మొదలయిన సమ్మానాలు జరిపించి, రత్నాలంకారాలు, మనోజ్ఞములయిన వస్త్రాలు సమర్పించి, సెలవిచ్చి పంపగా సంజయుడును పాండవులను, శ్రీకృష్ణుడిని విడిచి వెళ్ళాడు' అని వైశంపాయనుడు చెప్పగా.

**క. విని, యత్యంత కుతూహల । మునఁ బొదలుచు, 'సంజయుండు మున్నెచ్చటికిం**
**జనియెను? నెవ్వరితో నే । మనియెను వినవలయు; మునిజనాధిప! చెపుమా.' 381**

**ప్రతిపదార్థం:** విని= (జనమేజయుడు) విని; అత్యంత కుతూహలమునన్= మిక్కిలి ఆసక్తితో; పొదలుచున్= ఒప్పుతూ; ముని జన+అధిప!= మునీశ్వరా! వైశంపాయన మహర్షీ!; సంజయుండు; మున్ను= ముందు; ఎచ్చటికిన్= ఎక్కడకు; చనియెను= వెళ్ళాడు; ఎవ్వరితోన్; ఏమి+అనియెను; వినవలయున్; చెపుమా.

**తాత్పర్యం:** జనమేజయుడు విని మిక్కిలి ఆసక్తితో ఒప్పుతూ 'మునీశ్వరా! సంజయుడు ముందుగా ఎక్కడకు వెళ్ళాడు? ఎవరితో ఏ మన్నాడు? వినాలి చెప్పుము.'

**వ. అని యడిగిన. 382**

**తాత్పర్యం:** అని జనమేజయుడు అడుగగా. (తరువాతి ఆశ్వాసంలోని వచనంతో అన్వయం).

### ఆశ్వాసాంతము

**ఉ. భూరికృపానుషంగ! మునిపుంగవ చిత్త సరోజ భృంగ! సం**
**సార దవ ప్రవర్ష! సుర సంస్తుత దివ్య గుణ ప్రకర్ష! దో**
**స్సారనిరస్త దైత్య! శమశాలి మనస్స్థితి నిత్య! లోక ని**
**స్తారక శీల! నిర్వృతి విశాల! నిరంజన! పాపభంజనా! 383**

**ప్రతిపదార్థం:** ఇది కృతిపతి అయిన హరిహరనాథుడికి కృతికర్త తిక్కన చేసిన స్తుతి. భూరి కృపా+అనుషంగ!= (ఆపన్నులైన వారి యందు) గొప్ప దయ కలవాడా!; (అనుషంగము= ఆసక్తి); ముని పుంగవ చిత్త సరోజ భృంగ!;= మునిశ్రేష్ఠుల మనఃపద్మములకు తుమ్మెద అయినవాడా!; సంసార దవ ప్రవర్ష!= సంసారమనే కార్చిచ్చునకు ధారాపాతమైన వాడా!; సుర సంస్తుత దివ్య గుణ ప్రకర్ష!= దేవతలచేత మిక్కిలి స్తుతించబడిన ఉత్తమ గుణాతిశయం కలవాడా!; దోస్+సార నిరస్త దైత్య!= భుజబలంచేత నిరసింపబడిన రాక్షసులు కలవాడా!; శమశాలి మనస్+స్థితి నిత్య!= ఇంద్రియనిగ్రహం కలవారి మనస్సులందలి ఉనికిచేత శాశ్వతుడా-వశులైన మహర్షులు తమ మనసులను పరమేశ్వరుడియందే లగ్నం చేస్తారని భావం; లోక విస్తారక

శీల!= భక్త లోకాన్ని తరింపజేసే స్వభావం కలవాడా!; నిర్వృతి విశాల!= ఆనందం చేత విశాలుడా! (అనంతానంద స్వరూపుడా అని భావం); నిరంజన!= దేనితోనూ తగులులేనివాడా!; పాప భంజనా= (భక్తుల) పాపాలను నశింపజేసేవాడా! హరిహరనాథా!

**తాత్పర్యం:** ఆపన్నులయందు గొప్పదయ గలవాడా! మహర్షుల మనఃపద్మాలకు తుమ్మెద అయినవాడా! సంసారం అనే కార్చిచ్చుకు ధారాపాతమైన వాడా! దేవతల చేత కూడా స్తుతించబడిన సుగుణాల అతిశయం కలవాడా! భుజబలం చేత నిరసించబడిన రాక్షసులు కలవాడా! ఇంద్రియనిగ్రహం కలవారి మనస్సులందు నిత్యం ఉండేవాడా! భక్త లోకాల్ని తరింపజేసే స్వభావం కలవాడా! అనంతానంద స్వరూపుడా! దేనితోనూ సక్తత లేనివాడా! భక్తుల పాపాలను నశింపజేసేవాడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: రూపకం. అంత్యానుప్రాసం. ముని పుంగవ చిత్త సరోజ భృంగ- చిత్తములనే సరోజాలకు భృంగము- అలంకారం రూపకం. సంసారదవ ప్రవర్ష - సంసారమనే దవానికి ప్రవర్షమైనవాడు- అలంకారం రూపకం. రెండేసి విశేషణాలకు అంత్యానుప్రాసం.

**క. శ్రుతి మౌళి రత్నమూర్తీ! । శతధృతి ముఖ పద్మ షండ సౌరభ కీర్తీ!**
**రతిపతి హితాహితాక్షా! । సతత సమాచరిత భక్త జన సంరక్షా! 384**

**ప్రతిపదార్థం:** ఇది కూడా హరిహరనాథస్తుతే. శ్రుతి మౌళి రత్నమూర్తీ!= వేదం అనే స్త్రీయొక్క శిరస్సునకు రత్నమైన స్వరూపం కలవాడా! - వేదాంతాలచేత ప్రతిపాదించబడే వాడా అని భావం; శతధృతి ముఖ పద్మ షండ సౌరభ కీర్తీ!= బ్రహ్మయొక్క తామరల వంటి ముఖాల యొక్క సమూహం యొక్క పరిమళరూపకమైన యశస్సు కలవాడా!; రతి పతి హిత+అహిత+అక్షా!= మన్మథుడికి మేలూ, కీడూ కలుగజేసే కన్నులు కలవాడా!; సతత సమాచరిత భక్త జన సంరక్షా!= ఎల్లప్పుడూ చేయబడిన భక్త జనుల రక్షణం కలవాడా! నిత్యమూ భక్తులను రక్షించేవాడా అని భావం - హరిహరనాథా!

**తాత్పర్యం:** శ్రుతి కాంత శిరోరత్నమైనవాడా! వేదాంతాలచేత ప్రతిపాదించబడేవాడా! బ్రహ్మ ముఖ పద్మసమూహాల పరిమళంవంటి కీర్తి కలవాడా! (బ్రహ్మ ముఖ పద్మ నిర్గత చతుర్వేదాలూ పరమేశ్వరుడి యశస్సునే తెలుపుతున్నాయని భావం.) మన్మథుడికి మేలూ కీడూ కలుగజేసే కన్నులు కలవాడా! ఎల్లపుడూ భక్తజనులను రక్షించేవాడా! హరిహరనాథా!

**విశేషం:** శ్రుతిమౌళులు వేదాంతాలు. వాటికి రత్నమైన వాడు అనగా వాటిచేత ప్రతిపాదించబడేవాడు. వేదం పూర్వభాగం కర్మలకు సంబంధించేది. ఉత్తరభాగమైన ఉపనిషత్తులు పరమేశ్వరుడికి సంబంధించేవి. రతిపతి హితాహితాక్షా! హరి రూపంలో మన్మథుడు పుత్రుడవటం చేత అతడియందు ప్రసన్నమైన దృష్టీ, హరరూపంలో శత్రువవటం చేత మూడో కంటితో దహించి అతనియందు అహితమైన దృష్టీ హరిహరనాథుడి కున్నాయని భావం. శ్రుతిమౌళిరత్నమూర్తీ-రూపకాలంకారం. శతధృతి ముఖపద్మషండ సౌరభకీర్తీ రూపకాలంకారమే. రతిపతి హితాహితాక్షా - అలంకారం యథాసంఖ్యం. హితాక్షి హరిదీ, అహితాక్షి హరుడిదీ అని క్రమాన్వయం. రెండేసి పాదాలకు అంత్యానుప్రాసం పాటించబడింది.

**మాలిని.**

**సదయ విమల దృష్టీ! సంశ్రితాశీః ప్రవృష్టీ!**
**హృదయ కమల వాసా! యిద్ధమాయా విలాసా!**
**విదిత నిఖిల భూతీ! విశ్వరక్షాత్తహేతీ!**
**సదసదుపచితాత్మా! సంభృతానందవర్ష్మా! 385**

**ప్రతిపదార్థం:** ఇది కూడా హరిహరనాథుడిని స్తుతించే పద్యమే. సదయ విమల దృష్టీ!= (భక్తులయందు) దయతో కూడిన స్వచ్ఛమైన కీర్తిగలవాడా; సంశ్రిత+ఆశీస్+ప్రవృష్టీ!= ఆశ్రితులకు ఆశీస్సులను మిక్కిలి వర్షించేవాడా!; హృదయ కమల వాసా!= పద్మంవంటి హృదయం నివాసస్థానంగా కలవాడా!; ఇద్ధ మాయా విలాసా!= అప్రతిహతమైన మాయయొక్క జగదుత్పత్తి స్థితి లయ రూపమైన లీలగలవాడా!; విదిత నిఖిల భూతీ!= తెలియబడిన సకలైశ్వరములూ కలవాడా!; విశ్వ రక్షా+ఆత్త హేతీ!= జగద్రక్షణ కొరకే పొందబడిన ఆయుధములు కలవాడా!; సత్+అసత్+ఉపచిత+ఆత్మా!= సద్రూపంతోనూ, అసద్రూపంతోనూ పెంపొందిన స్వరూపం కలవాడా!; సంభృత+ఆనంద వర్త్మా!= పొందబడిన ఆనందమార్గం కలవాడా! హరిహరనాథా!

**తాత్పర్యం:** భక్తులయందు సదయమూ నిర్మలమూ అయిన దృష్టికలవాడా! ఆశ్రితులకు ఆశీస్సులను వర్షించేవాడా! హృదయపద్మం వాసస్థానంగా కలవాడా! అడ్డులేని మాయయొక్క జగదుత్పత్తి స్థితి లయరూపమైన లీలగలవాడా! సకలైశ్వర్యాలూ తెలిసినవాడా! జగద్రక్షణ కొరకే ఆయుధాలు ధరించినవాడా! సద్రూపంతోనూ, అసద్రూపంతోనూ పెంపొందిన స్వరూపం కలవాడా! ఆనందమార్గం పొందినవాడా! హరిహరనాథా!

**విశేషం:** 'సదసదుపచితాత్మా' విశ్వమంతా సదసద్రూపాలతో కూడి ఉన్నది. సద్రూపం కారణరూపం వాస్తవం. అసద్రూపం కార్యరూపం అవాస్తవం. కార్యములైన ఘటాదులు వాస్తవములు కావు. కారణమైన మట్టియే వాస్తవం. కార్యకారణ రూపంతో ఒప్పు ఈ విశ్వమంతా పరమేశ్వర రూపమే కాబట్టి పరమేశ్వరుడు సదసదుపచితాత్ముడు. లేదా సత్తంటే మూర్తరూపాలైన పృథివి, జలం, అగ్ని మొదలయినవి. అసత్తంటే అమూర్తములైన వాయువు, ఆకాశం మొదలయినవి. తదుపచితాత్ముడు పరమేశ్వరుడు, 'సంభృతానంద వర్త్మా'-పరమేశ్వరుడిని పొందించే భక్తి జ్ఞాన కర్మ మార్గాలలో ఏదయినా ఆనందపరిపూర్ణమే అని భావం. ఆశీః ప్రవృష్టీ రూపకం. హృదయ కమలం ఉపమిత సమాసం. రెండేసి విశేషణాలకు అంత్యప్రాసం పాటించబడింది.

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజ తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీ మహాభారతంబున యుద్యోగపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది; శ్రీమత్+ఉభయకవి మిత్త్ర= శ్రీమంతుడైన ఉభయకవిమిత్త్ర బిరుదాంచితుడూ(సంస్కృతకవులూ, ఆంధ్ర కవులూ ఈ ఉభయులకూ మిత్త్రుడు ఇది తిక్కన బిరుదు.) కొమ్మన+అమాత్య పుత్త్ర= కొమ్మన మంత్రి కుమారుడూ; బుధ+ ఆరాధన విరాజి= పండితుల పూజచేత ప్రకాశించే వాడూ; (అగు), తిక్కన సోమయాజి ప్రణీతంబు+అయిన= తిక్కన సోమయాజిచేత రచించబడిన; శ్రీ మహాభారతంబున+ఉద్యోగపర్వంబునందున్= శ్రీ మహాభారతంలోని ఉద్యోగపర్వంలో; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇది ఉభయ కవిమిత్త్ర బిరుదాంచితుడూ, కొమ్మనామాత్యుడి కుమారుడూ, బుధుల పూజచేత ప్రకాశించే వాడూ అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శ్రీ మహాభారతంలోని ఉద్యోగపర్వంలో మొదటి ఆశ్వాసం.

**ఉద్యోగపర్వంలోని ప్రథమాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీ విస్తారకరణ కరు । ణావేశోదార ! శశ్వదమలాకారా!**
**భావ వికార విదూర! శు । భావహ నామప్రకార! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** ఇది తిక్కన కృతిపతిఐన హరిహరనాథుడిని స్తుతిస్తూ చెప్పిన ఆశ్వాసాది పద్యం.

శ్రీ విస్తార కరణ కరుణా+ఆవేశ+ఉదార!= ఐశ్వర్యాన్ని అధికం చేసే దయయొక్క ఆవేశం చేత గొప్పవాడా!; శశ్వత్+అమల+ఆకారా!= ఎల్లప్పుడూ స్వచ్ఛమైన ఆకారం కలవాడా!; భావ వికార విదూర!= పదార్థాలకు లోకంలో గలిగే మార్పులకు మిక్కిలి దూరంగా ఉండేవాడా!; శుభ+ఆవహ నామ ప్రకార!= శుభాలను కలిగించే పేరు గలవాడా!; హరిహరనాథా!

**తాత్పర్యం:** హరిహరనాథా! ఐశ్వర్యాన్ని పెంపొందించే దయావేశంచేత గొప్పవాడా! ఎప్పుడూ నిర్మలమైన ఆకారం కలవాడా! పదార్థాలకు కలిగే జనన మరణాది వికారాలకు మిక్కిలి దూరమైనవాడా! జనులకు శుభాలను కలిగించే పేరు కలవాడా!

**విశేషం:** పరమేశ్వరుడి దయావేశం ఐశ్వర్యహేతు వనటానికి కుచేలాదుల వృత్తాంతాలు దృష్టాంతాలు. భావ వికార విదూర- లోకంలో వస్తువులకుగల పుట్టటం, ఉండటం, వృద్ధిపొందటం, మారటం, క్షీణించటం, నశించటం అనే ఆరు విధాలయిన మార్పులు లేని నిర్వికారుడు పరమేశ్వరుడు. 'శుభావహనామ ప్రకార' - పరమేశ్వరుడి నామం మంత్రరూపమే కాబట్టి అట్టి మంత్రజపం తదుపాసకుడికి శుభం కలుగజేస్తుంది.

### సంజయుఁడు ధర్మజుని సంధి పల్కులను ధృతరాష్ట్రునకుఁ దెల్పుట (సం.5-32-1)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; 'నివ్విధంబున వీడ్కొని సూతనందనుండు పవనజవంబు లగు నరదంబు తురంగంబులం దఱిమి ప్రొద్దుగ్రుంకునంతకుం గరిపురి సొచ్చి నగరి కరిగి యంతః పురంబున నున్న ధృతరాష్ట్రునకుం దనరాక యెఱింగించి పుచ్చి యతనిం గాంచి యడుగుల కెఱఁగిన, నమ్మహీవరుండును నత్యాదరంబున నెత్తి సమీపంబున నునిచినం గొలిచియుండి చేతులు మోడ్చి యిట్లనియె;** 2

**ప్రతిపదార్థం:** దేవా!= స్వామీ, హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్; ఇట్లు+అనియెన్; సూత నందనుండు= సంజయుడు; ఈ+విధంబునన్; వీడ్కొని= వీడి; పవన జవంబులు+అగు= వాయువువేగంవంటి వేగంగలవైన; అరదంబు తురంగంబులన్= రథాశ్వాలను; తఱిమి= పరుగెత్తించి; ప్రొద్దు+క్రుంకు+అంతకున్= సూర్యుడు అస్తమించే సమయానికి;

కరిపురి+చొచ్చి= హస్తినాపురం ప్రవేశించి; నగరికిన్+అరిగి= రాజభవనానికి వెళ్ళి; అంతఃపురంబునన్+ఉన్న ధృతరాష్ట్రునకున్= అంతఃపురంలో ఉన్న ధృతరాష్ట్రుడికి; తన రాక; ఎఱింగించి పుచ్చి= తెలిపి; అతనిన్; కాంచి; అడుగులకున్+ఎఱఁగినన్= పాదాలకు మొక్కగా; ఆ+మహీవరుండును= ఆ రాజును; అతి+ఆదరంబునన్= మిక్కిలి ఆదరంతో; ఎత్తి= లేవనెత్తి; సమీపంబునన్= చేరువలో; ఉనిచినన్= కూర్చుండ బెట్టగా; కొలిచి+ఉండి= సేవించి; చేతులు మోడ్చి= చేతులు జోడించి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ప్రభూ! హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు. 'సంజయుడు ఈ విధంగా పాండవులను వీడి వాయువేగాలయిన రథాశ్వాలను పరువెత్తించి సూర్యాస్తమయ సమయానికి హస్తినాపురం ప్రవేశించి, రాజభవనానికి వెళ్ళి, అంతఃపురంలో ఉన్న ధృతరాష్ట్రుడికి తన రాక తెలిపి, అతడిని చూచి, పాదాలకు మ్రొక్కగా, ఆ రాజు మిక్కిలి ఆదరంతో లేవనెత్తి దగ్గర కూర్చుండబెట్టుకొన్నాడు. సంజయుడు అతడిని సేవించి చేతులు జోడించి ఇట్లా అన్నాడు.

**ఉ.** **'దేవర పంపఁగాఁ జని యుధిష్ఠిరునిం గని వచ్చినాఁడ; నా**
**భూవిభుఁ డప్రమేయ గుణపూజ్యుఁడు మీకు నమస్కరించె; సం**
**భావనసేసె నా; కిచటి బంధుల నెల్లఁ దలంచె; మీ సుఖ**
**శ్రీ విభవంబులున్, సుతుల సేమము నన్నడిగెం బ్రసన్నుఁడై.'** 3

**ప్రతిపదార్థం:** దేవర= తమరు; పంపఁగాన్; చని= వెళ్ళి; యుధిష్ఠిరునిన్= ధర్మరాజును; కని= చూచి; వచ్చినాఁడన్; అప్రమేయ గుణ పూజ్యుఁడు= కొలది ఇడరాని సుగుణాలచే పూజించదగినవాడు; (అగు); ఆ భూవిభుఁడు= ఆ రాజు ధర్మరాజు; మీకున్; నమస్కరించెన్; నాకున్; సంభావన+చేసెన్= మర్యాద చేశాడు; ఇచటి బంధులన్+ఎల్లన్= ఇక్కడి చుట్టాలనందరినీ; తలంచెన్= స్మరించాడు; ప్రసన్నుఁడు+ఐ= సంతుష్టుడయి; మీ సుఖ శ్రీ విభవంబులున్= మీ సౌఖ్యమూ, సంపదా, వైభవమూ, సుతుల సేమమున్= కొడుకుల క్షేమమూ; నన్నున్+అడిగెన్.

**తాత్పర్యం:** 'తమరు పంపగా వెళ్ళి ధర్మరాజును చూచివచ్చాను. అమిత సుగుణాలు కలిగి పూజ్యుడైన ఆ రాజు మీకు నమస్కరించాడు. నాకు మర్యాద చేశాడు. ఇక్కడి చుట్టాలనందరినీ స్మరించాడు. సంతోషంతో మీ సౌఖ్యమూ, సంపదా, వైభవమూ, కొడుకుల క్షేమమూ నన్ను అడిగాడు.

**విశేషం:** రాయబారిగా సంజయుడు ఉపప్లావ్యంనుండి తిరిగి వచ్చి ధృతరాష్ట్ర మహారాజుకు అక్కడ జరిగిన విశేషాల తాత్పర్యాన్ని (సారాంశాన్ని) సంగ్రహంగా సారవంతంగా నివేదిస్తున్నాడు. ఇది ప్రాథమిక నివేదిక వంటిది. అందువలన ఇందులో ప్రతిపద సార్థక్యం పరిగణించదగింది. ప్రభువులైన మీరు నన్ను పంపారు. నేను 'యుధిష్ఠిరుడిని చూచి వచ్చాను' అని మొదటి వాక్యం. యుద్ధమందు స్థిరసంకల్పంతో ఉన్న ధర్మరాజును నేను అక్కడ చూచాను - అని అర్థం. 'చూచి వచ్చా'నంటే ఆశించిన ప్రయోజనం మరేమీ సిద్ధించ లేదని కూడా ధ్వని. ధర్మజుడు గుణపూజ్యుడు. ప్రసన్నుడు - అనిపించాడు; అందరినీ ఆదరంతో అభినందించాడని పేర్కొన్నాడు. ధృతరాష్ట్రుడి వ్యూహానికి విరుద్ధంగా యుద్ధ నిర్ణయంలో ధర్మజుడున్నా, శత్రువులు కూడా పూజ్యుడనీ, ప్రసన్నుడనీ భావించేటట్లు వ్యవహరించాడనీ తాత్పర్యం. యుధిష్ఠిరుడైనా ప్రసన్నుడై తండ్రియొక్క యోగక్షేమాలు తెలిసికొనటం, అతడి ప్రతినిధికి మర్యాద చేయటం, కౌరవుల క్షేమాన్ని అడగటం విశేషం. (సంపా.)

**తే. అనుడు ధృతరాష్ట్రుఁ డిట్లను 'నయ్యజాత । శత్రునకు సేమమే? యనుజన్ము లెల్ల**
**సుఖులె? బంధులు, భృత్యులు, సఖులు, మంత్రి । వరులు సంప్రీతిమెయి నున్నవారె యచట?' 4**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగానే; ధృతరాష్ట్రుఁడు+ఇట్లు+అనున్; ఆ+అజాతశత్రునకున్= ఆ ధర్మరాజుకు; సేమమే?; అనుజన్ములు+ఎల్లన్= తమ్ములందరూ; సుఖులె?= సుఖంగా ఉన్నారా?; బంధులున్= చుట్టాలూ; భృత్యులున్= సేవకులూ; సఖులున్= స్నేహితులూ; మంత్రివరులున్= మంత్రిశ్రేష్ఠులూ; అచటన్= అక్కడ; సంప్రీతి మెయిన్= సంతోషంతో; ఉన్నవారె?= ఉన్నారా?

**తాత్పర్యం:** అనగానే ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు; 'ఆ ధర్మరాజుకు క్షేమమా? అతడి తమ్ములందరూ సుఖంగా ఉన్నారా? అక్కడ చుట్టాలూ, సేవకులూ, స్నేహితులూ, మంత్రివర్యులూ సంతోషంతో ఉన్నారా?'

**విశేషం:** 'అజాతశత్రు'వనే పద ప్రయోగం సార్థకం. పేరుకు యుధిష్ఠిరుడైనా, స్వభావంచేత 'అజాత శత్రువు'. ధృతరాష్ట్రుడు ధర్మరాజులోని అజాతశత్రుత్వాన్ని మేలుకొల్పటానికే సంజయుడిని పంపాడు. అది సఫలమైనదా? అని ఆశతో ఆ పదాన్ని వాడాడు. ధర్మజుడి శాంతప్రవృత్తిని సహించి తమ్ములూ, బంధువులూ, భృత్యులూ సంతృప్తితో ఉన్నారా? అని అడిగాడు. లోగుట్టు లాగటానికి నగిషీగా మాట్లాడే తీరిది. (సంపా.)

**వ. అనిన సంజయుం డిట్లనియె; 5**

**తాత్పర్యం:** అనగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**క. 'వారెల్లను భవదీయ । స్ఫారబలము గారణముగ సౌఖ్యంబున ను**
**న్నారమని పలుకుదురు; నిజ । మారయఁగా నట్ల కాదె యది, జననాథా! 6**

**ప్రతిపదార్థం:** జననాథా= రాజా!; వారు+ఎల్లను= వారందరూ; భవదీయ స్ఫార బలము+కారణముగన్= నీదైన అధిక బలం కారణంగా; సౌఖ్యంబునన్= సుఖంగా; ఉన్నారము+అని పలుకుదురు= ఉన్నామని అంటారు; నిజము+ఆరయఁగాన్= నిజం చెప్పాలంటే; అది; అట్లు+అ కాదె!= అంతేకదా!

**తాత్పర్యం:** 'రాజా! వారందరూ నీ గొప్పబలం కారణంగా సుఖంగా ఉన్నాం' అని అంటారు. నిజం చెప్పాలంటే అది అంతేకదా!

**విశేషం:** ఈ వాక్యాలు మెలిక మాటలు. వ్యంగ్యోక్తులు. కాకువు స్థగితం చేసిన పలుకులు. ధర్మరాజు 'ఆ రాజు మాదెసం గల కారుణ్యము కతమునను సుఖంబున నిట్లున్నారము'- అని కాకువుతో ఎత్తి పొడిచినట్లున్నాడు. దానిని సంజయుడు యథాతథంగా నివేదించకుండా సంస్కరించాడు. ధృతరాష్ట్రుడి ఉజ్జ్వలబలంవలన వారు క్షేమంగా ఉన్నారని అంటున్నారు - అన్నాడు. అంటే ఇప్పటికీ ధృతరాష్ట్రుడి రక్షలోనే మేమున్నామని భావిస్తున్నామని పాండవులు అంటున్నారని భావం. నిజానికి ఆ మాటలు సత్యం కావు. నిజం గాని మాటలను నిజంగా నమ్మించటమే కదా సంజయుడి రాయబారంలోని రాజనీతి. ఆ రాజనీతిని కన్నులతో వెక్కిరిస్తున్నట్లు సంజయుడు పలికాడు. 'నిజ మారయఁగా నట్లకాదె!' అని, ధర్మజుడి కాకువును స్థగితం చేసి తన వ్యంగ్యోక్తిని ప్రకటించటం సంజయుడి వాక్యనీతి. (సంపా.)

**క. ధర్మజునకు భోగంబులు । ధర్మువున ట్లింపు గావు; ధర్మంబులలో**
**నిర్మల బుద్ధి నహింసకుఁ । గూర్మి గడుం గలఁ డతండు, కురువంశనిధీ! 7**

**ప్రతిపదార్థం:** కురు వంశ నిధీ!= కురువంశానికి ఆశ్రయమైనవాడా - ధృతరాష్ట్రా!; ధర్మజునకున్= ధర్మరాజుకు; భోగంబులు= సౌఖ్యాలు; ధర్మువు+అట్లు= ధర్మం వలె; ఇంపు+కావు= ప్రియము కావు; అతండు; నిర్మల బుద్ధిన్= స్వచ్ఛమైన మనస్సుతో; ధర్మంబులలోన్= ధర్మాలలో; అహింసకున్= అహింస అనే ధర్మానికి; కూర్మి= ప్రీతి; కడున్= మిక్కిలి; కలఁడు= కలవాడు;

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠుడా! ధృతరాష్ట్రా! ధర్మరాజుకు సౌఖ్యాలు ధర్మం వలె ప్రియం కావు. అతడు నిర్మల మనస్సుతో ధర్మాలన్నిటిలోనూ అహింసాధర్మాన్ని బాగా ఇష్టపడతాడు.

**విశేషం:** సంజయుడి రాయబారపు ప్రయత్నమంతా ధర్మరాజులోని శాంత ప్రవృత్తిని ప్రబుద్ధం చేసి, అతడి యుద్ధ ప్రయత్నం మాన్పించి, రాజ్యకాంక్ష లేని ప్రసన్నభావంతో వైరాగ్యచిత్తంతో జీవించేటట్లు ప్రబోధించటం కదా! ఆ పరివర్తన ప్రయత్నంతో సంజయు డెంత వరకు కృతకృత్యుడైనాడో తెలిసికొనటం ధృతరాష్ట్రుడి ఆసక్తి. దాని కనుగుణంగా ధర్మజుడి చిత్తవృత్తిని సంజయుడు వివరించనారంభించాడు. ధర్మరాజుకు భోగాల కంటె ధర్మమంటే ప్రీతి. ధర్మాలలో అహింస అంటే అత్యంత ప్రీతి అని ఆరంభించాడు. ధృతరాష్ట్రుడికి ఈ ఎత్తుగడ ఆశాజనకంగా ఉన్నది. అయితే, ధర్మమంటే ఏమిటి? అన్నది ఈ పద్యంలో మిగిలే యక్షప్రశ్న. (సంపా.)

**ఉ. మానుషశక్తి యొల్లఁడు; సమంచిత దైవమ యూఁదియుండు; నీ**
**పైన యతండు పుణ్యమును బాపముఁ బెట్టినవాఁడు; నీవు నీ**
**సూనువశంబ కాని యొకచొప్పుఁ దలంపవు; కర్ణ సౌబలా**
**ధీనము కార్యనిశ్చయము; తెల్లము నీ మత మొప్ప దేమియున్. 8**

**ప్రతిపదార్థం:** (ధర్మరాజు కర్త); మానుష శక్తి= పౌరుషమైన శక్తి; ఒల్లఁడు= అంగీకరించడు; సమంచిత దైవము+అ= ఒప్పిదమైన దైవమే; ఊఁది+ఉండున్= అవలంబించి ఉంటాడు; అతండు= ధర్మరాజు; నీ పైన్+అ= నీ మీదనే; పుణ్యమును+ పాపమున్+పెట్టినవాఁడు= పుణ్యపాపాలు పెట్టాడు; నీవు; నీ సూను వశంబు+అ కాని= నీ కొడుకు అధీనతే కాని; ఒక చొప్పున్= మరే విధమూ; తలంపవు= ఆలోచించవు; కార్య నిశ్చయము= కార్య నిర్ణయం; కర్ణ సౌబల+అధీనము= కర్ణ శకునుల వశం; నీ మతము= నీ విధం; ఏమియున్+ఒప్పదు= ఏమీ బాగుండదు; తెల్లము= స్పష్టం.

**తాత్పర్యం:** ధర్మరాజు పౌరుషాన్ని అంగీకరించడు; ఒప్పిదమైన దైవాన్నే నమ్ముకొని ఉంటాడు. అతడు పుణ్యపాపాలను నీమీదే పెట్టాడు. నీవు నీ కొడుకు కోరినట్లేకాని ఇంకో విధం ఆలోచించవు. కార్య నిర్ణయం కర్ణ శకునుల వశం. నీ విధం ఏమీ బాగుండదు. అది స్పష్టం.

**విశేషం:** 'అహింసా పరమో ధర్మః' అని నమ్మిన ధర్మరాజు ఆ ధర్మసాధనలో పురుషయత్నాన్ని చేస్తాడు కాని, అది దైవ సమ్మతం కాకపోతే సఫలం కాదని నమ్ముతాడు. ఇది ధర్మజుడి వ్యక్తిత్వంలోని కీలకమైన అంశం. అందువలన దేవుడి మీద భారం వేసి ఈ కార్యంలోని పుణ్యపాపాలు రెండూ ధృతరాష్ట్రుడి మీదనే ఉంచాడు ధర్మరాజు. అంటే, నిర్ణయం తీసికొనవలసింది ధృతరాష్ట్రుడే. అతడి నిర్ణయం దైవప్రేరితంగా ధర్మజుడు భావించి పురుషయత్నం చేయాలని భావించాడు. ధర్మజుడు స్వయంనిర్ణయం తీసికొని వైరాగ్య వృత్తిని వరిస్తాడేమో అనుకొని ధృతరాష్ట్రుడు పురుషయత్నం చేశాడు. ధర్మజుడు దానిని

నిపుణంగా త్రిప్పికొట్టి 'తండ్రి నిర్ణయమే దైవనిర్ణయంగా భావిస్తానన్నా'డని సంజయుడు తేల్చి చెప్పాడు. అంటే- పుణ్యపాపాలన్నీ ధృతరాష్ట్ర నిర్ణయం మీదే ఆధారపడి ఉన్నవనీ బాధ్యత గ్రుడ్డిరాజుదే అయిందనీ ధ్వని.

ఈ విధంగా ధర్మజ ప్రవృత్తిని తెలిపి అంతటితో ఆగక ధర్మజుడి ఎత్తుగడతో ధృతరాష్ట్రుడి అసలు బండారం ఎంత బైటపడుతుందో తెలిసేటట్లు వ్యంగ్యంగా రాజును అధిక్షేపగర్భితంగా ఆక్షేపించ నారంభించాడు. రాయబారి పాత్ర కంటె హితుడి పాత్రను గ్రహించి పలుక నారంభించాడు. అందులోని ముఖ్యాంశాలు ఇవి. అక్కడ నిర్ణయం ధర్మరాజుది. కాని, ఇక్కడ నిర్ణయం ధృతరాష్ట్రుడిది కాదు. అది దుర్యోధనాధీనం. ఆ దుర్యోధనుడి ఆలోచన కూడా అతడి స్వంతం కాదు. కార్యం నిశ్చయించేది కర్ణసౌబలులు. అందువలన కౌరవ నిర్ణయం పురుషయత్నమే కాదు. కాపురుషయత్నం, పరోక్ష యత్నం, పరాధీనమైన కార్యనిశ్చయం. అది అన్ని విధాలా అనర్థదాయకం. కాబట్టి ఈ పురుషయత్నం దైవబలం పొందలేక విఫలమౌతుందని ధ్వనిమయంగా పలికాడు. తన రాయబారి తనకే నీతి చెప్పితే వినే వింత పరిస్థితిలో పడ్డాడు ధృతరాష్ట్రుడు. ఇది శోచనీయావస్థ. (సంపా.)

**ఆ. ఆలు బిడ్డ లేని యట్టి త్రిమ్మరి యగు । కొయ్య గాక, కుదుటఁ గూడు వెట్టి**
**కుడుచువార లిట్టి క్రొవ్విదంబులు సేయఁ । జొచ్చు టిచ్చగించి చూతురయ్య? 9**

**ప్రతిపదార్థం:** ఆలు బిడ్డ లేని అట్టి త్రిమ్మరి+అగు కొయ్య+కాక= పెళ్లాం బిడ్డా లేక ఇష్టం వచ్చినట్లు తిరిగే మొద్దుకాక; కుదుటన్+కూడు+పెట్టి కుడుచువారలు= ఒకచోట స్థిరంగా ఉండి అన్నం తినేవాళ్ళు; ఇట్టి క్రొవ్విదంబులు= ఇటువంటి పొగరుబోతు చేతలు; చేయన్+చొచ్చుట= చేయబూనటం; ఇచ్చగించి చూతురయ్యా?= ఇష్టపడి చూస్తారా?

**తాత్పర్యం:** ఆలుబిడ్డలు లేక యథేచ్ఛగా తిరిగే మొద్దుగాక, ఒక చోట స్థిరంగా ఉండి అన్నం తినేవాళ్ళు ఇటువంటి పొగరుబోతు చేతలు ఇష్టపడి చూస్తూ ఊరుకొంటారా?

**విశేషం:** ఇది నిందోక్తి, అర్థవాదం. అలనాడు కురుసభలో దుర్యోధనాదులు చేసిన దుర్నయాన్ని నివారించకుండా ఉపేక్ష వహించిన ధృతరాష్ట్రుడి వర్తనం శత్రువుల చేత, మిత్రులచేత, ప్రజల చేత గర్హించబడుతున్నది. అది ఎంత నీచమైనదో సంజయు డీ పద్యంలో చెప్పాడు పరోక్షంగా. పెళ్ళాం బిడ్డలు లేనివాడు, దేశదిమ్మరి, మొద్దువంటివాడు అనే విశేషణాలు ధృతరాష్ట్రుడికి వర్తిస్తాయి. మర్యాదగా ఒక కుటుంబంలో ఉండి అన్నం తింటున్న పొగరుబోతులు కౌరవులు, వారివి అన్నం తినే వాళ్ళు చేసే పనులు కావు. పెళ్ళాలు బిడ్డలు లేనివాడు, తిరుగుబోతు, మొండిముండావాడు, బండ మొదలైనవి తెలుగుదనం ఉట్టిపడే తిట్లు. ఇవి సంజయుడు అంటున్నవిగా ఇందులో తోచినా తరువాతి పద్యంలో ఇవన్నీ ప్రజలంటూంటే చెవులు చీములు కట్టేట్లు వింటున్నవిగా చెప్పబడ్డాయి. ధృతరాష్ట్రుడికి ప్రజలలో ఉన్న అపకీర్తికి ఈ మాటలు అక్షర సాక్ష్యాలు. (సంపా.)

**చ. కొడుకులఁ గానరే నృపు లకుంఠితతేజుల నెందు? నిమ్మెయిం**
**జెడు తెరు వైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే?**
**పుడమి జనంబులెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు నుక్కి నో**
**చ్చెడు మది యెప్పుడుం, జెవులు చీములు గట్టెడుఁ గౌరవేశ్వరా! 10**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా= కురురాజా! ధృతరాష్ట్రా!; ఎందున్= ఎక్కడా; నృపులు= రాజులు; అకుంఠిత తేజులన్ కొడుకులన్= మొక్కవోని తేజస్సుగల కొడుకులను; కానరే?= కనరా?; ఈ+మెయిన్= ఈ విధంగా; చెడు తెరువు+ఐనచోన్=

దుర్మార్గులయితే; తగవు+చెప్పక= బుద్ధి చెప్పక; ఒప్పరికించి చూతురే= గ్రుడ్లప్పగించి చూస్తారా?; పుడమి జనంబులు+ఎల్లన్= భూజనులందరూ; నినున్; ప్రువ్వఁగన్+తిట్టఁగన్= పుచ్చిపోయేటట్లు; తిడుతూంటే; వించున్+ఉన్కిన్= వింటూ ఉండటం చేత; మది= మనస్సు; ఎప్పుడున్; నొచ్చెడున్= బాధపడుతుంది; చెవులు చీములు+కట్టెడున్= చెవులు పుచ్చిపోతున్నాయి. (వినలేకపోతున్నానని భావం.)

**తాత్పర్యం:** కురురాజా! ధృతరాష్ట్రా! మరి ఎక్కడా రాజులు కుంటువడని తేజస్సుగల కొడుకులను కనరా? నీవొక్కడివే కన్నావా? ఈ తీరుగా వాళ్ళు అపమార్గంలో నడుస్తూంటే బుద్ధిచెప్పక గ్రుడ్లప్పగించి చూస్తూంటారా? ప్రజ లంతా నిన్ను పుచ్చిపోయేటట్లు తిట్టుతూండగా వింటూ ఉండటం నా మనస్సు కెప్పుడూ బాధాకరంగా ఉన్నది. నా చెవులు పుచ్చిపోతున్నాయి.

**విశేషం:** కానరే అనే క్రియ సార్థకం. జాగ్రత్తగా చూచుకోరా, సరిదిద్దుకోరా, రక్షించుకోరా అని అన్వయిస్తుంది. ప్రువ్వఁగఁ దిట్టఁగన్- తెలుగు నుడికారం. చెవులు చీములు గట్టెడు - తెలుగు జాతీయం. ఇవి తిక్కన రచనలోని తెలుగుదనానికి మచ్చుతునకలు. (సంపా.)

**చ. చలమున దుస్ససేనుఁడును సౌబలుఁడున్ మిముఁ బట్టి యార్చ బొ**
**మ్మల క్రియ నాడుచుండుదురు మానక నీవు సుయోధనుండుఁ; దా**
**రలసి యొకప్డు పాండుసుతు లాగ్రహవృత్తికిఁ జొచ్చిరేని నీ**
**చలము బలంబునుం గులముఁ జక్కఁగఁ జేయరె యొక్క వ్రేల్మిడిన్? 11**

**ప్రతిపదార్థం:** చలమునన్= మాత్సర్యంతో; దుస్ససేనుఁడును= దుశ్శాసనుడూ; సౌబలుఁడున్= శకునీ; మిమున్+పట్టి+ఆర్చన్= మిమ్మల్ని పట్టుకొని ఆడిస్తూంటే; నీవున్; సుయోధనుండున్= దుర్యోధనుడూ; మానక= విడువకుండా ఎప్పుడూ; బొమ్మల క్రియన్= బొమ్మలవలె; ఆడుచున్+ఉండుదురు= ఆడుతూ ఉంటారు; పాండు సుతులు= పాండవులు; ఒక+అప్డు= ఒకవేళ; తారు= తాము; అలసి= విసిగిపోయి; ఆగ్రహ వృత్తికిన్+చొచ్చిరి+ఏనిన్= కోపపడితే; ఒక్క వ్రేల్మిడిన్= ఒక్కచిటిక సేపటిలో; నీ చలమున్ బలంబునున్ కులమున్= నీ మాత్సర్యాన్నీ, బలాన్నీ, కులాన్నీ, చక్కఁగన్+చేయరె?= నేలమట్టం చేసివేయరా?

**తాత్పర్యం:** దుశ్శాసనుడూ, శకునీ మాత్సర్యంతో మిమ్మల్ని పట్టుకొని ఎట్లా ఆడిస్తే అట్లా బొమ్మలవలె నీవూ, దుర్యోధనుడూ ఎప్పుడూ ఆడుతూ ఉంటారు. పాండవులే కనక ఒక వేళ విసిగిపోయి కినుక వహిస్తే, ఒక్క చిటిక కాలంలో నీ చలాన్నీ, బలాన్నీ, కులాన్నీ నేలమట్టం చేసివేయరా?

**విశేషం:** 'గులముఁ జక్కుఁగఁ జేయరె' - తెలుగు విశ్వవిద్యాలయప్రతి.

**క. వినుము యుధిష్ఠిరు సైరణ । మనవారలు వెఱపుగా సమర్థింతురు; డీ**
**కొనఁగం దగరే కొండం । గని యోటమి వెట్టినట్లు, కౌరవనాథా! 12**

**ప్రతిపదార్థం:** కౌరవ నాథా!= కురుప్రభూ, ధృతరాష్ట్రా!; వినుము; డీకొనఁగన్= ఎదుర్కొనగా; తగరే= పొట్టేలే; కొండన్+కని= కొండను చూచి; ఓటమి+పెట్టిన+అట్లు= ఓడిపోయిందని అన్నట్లు; మనవారు; యుధిష్ఠిరు సైరణన్= ధర్మరాజు శాంతాన్ని; వెఱపు+కాన్= పిరికితనంగా; సమర్థింతురు= భావిస్తారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! వినుము. మనవాళ్ళు ధర్మరాజు శాంతాన్ని భయంగా భావిస్తున్నారు. ఇది ఎట్లా ఉన్నదంటే గొర్రెపొట్టేలు కొండను చూచి 'ఇది నాతో ఓడిపోతుంది' అన్నట్లున్నది.

**విశేషం:** అలం: ఉపమ. గొర్రెపొట్టేలు కొండను డీకొన్నట్లు అనే జాతీయం తెలుగులో ఉన్నది. పొట్టేలు మరొక పొట్టేలుతో తలతో డీకొట్టి పోరు చేయటం స్వభావం. పొగరు వలన, మదం వలన అది అట్లా చేస్తుంది. అది ఒక్కొకసారి అజ్ఞానంలో కొండను గూడా డీకొని తల పగిలి చనిపోతుంది. కాబట్టి ఎదుటివారి బలాన్ని అంచనా వేయకుండా పోరుకు దిగటాన్ని ఈ జాతీయంతో పోల్చి చెబుతారు. అయితే ఇక్కడ పొట్టేలు దుర్యోధనుడు. కదలకుండా ఉన్న కొండ సహనమూర్తి అయిన ధర్మరాజు. కొండ తనంత తాను ముందుకు వచ్చి డీకొనదు కాబట్టి అది ఓడిపోయినట్లే అని పొట్టేలు ప్రకటిస్తే ఎట్లా ఉంటుందో దుర్యోధనుడు ధర్మరాజు బలహీనుడు అని భావించి అతడు పోరులో ఓడిపోతాడని ఆశించటం అట్లా హాస్యాస్పదంగా ఉంటుందని సంజయుడు ఈ పోలిక చెప్పాడు. పొట్టేలుకూ దుర్యోధనుడికీ మదం, అవివేకం; ధర్మరాజుకూ కొండకూ సహనం. బలం సమాన లక్షణాలు. (సంపా.)

**క. అనుజులకు నడ్డపడి యే । మిని జేయఁగ నీమిఁ జూచి మెచ్చితిగా కీ**
**వును; సాదు రేఁగె నేని । న్వినుము, తలపొలమునన కాని నిలువదు సుమ్మీ! 13**

**ప్రతిపదార్థం:** (ధర్మరాజు); అనుజులకున్= తమ్ములకు; అడ్డము+పడి= అడ్డం వచ్చి; ఏమిని= ఏమీ; చేయఁగన్+ఈమిన్+ చూచి= చేయనీయకపోవటం చూచి; ఈవును= నీవు కూడా; మెచ్చితి(వి)+కాక= సంతోషించావు కాని; విను(ము); సాదు= సాధువైన జంతువు; రేఁగెన్+ఏనిన్= విజృంభించిందా; తలపొలమునన్+అ+కాని నిలువదు సుమ్మీ!= ఊరి చివరి భాగంలోనే కాని ఆగదు సుమా! తుదముట్టించక మానదు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! వినుము. ధర్మరాజు తమ్ములకు అడ్డం వచ్చి ఏమీ చేయనీయకుండా అదుపులో పెట్టటం చూచి నీవు కూడా సంతోషించావు కాని, సాధుజంతువు విజృంభించిందా, ఊరి చివరి భాగంలోనే కాని ఆగదు సుమా! తుదముట్టించి తీరుతుంది సుమా! (అట్లాగే పరమసాధువైన ధర్మరాజు కనుక కోపంతో విజృంభించాడా, నిన్ను సర్వనాశనం చేయకమానడని భావం.)

**విశేషం:** 'సాదురేఁగెనేనిన్.... సుమ్మీ. అలంకారం: అప్రస్తుత ప్రశంస. 'సాదురేగెనేనిన్':- సాధు అనుదాని పూర్వరూపము 'సాతు' సంస్కృతమున 'సార్థమ్'. అనగా వ్యాపారస్థుల సముదాయము. దీనిని పూర్వము 'బిడారు' వ్యాపార మనెడివారు. వర్తకులు తమ సరుకులను బండ్లు మొ॥ వానిపై వేసుకొనిపోయి ఒకచోట(అనువయినచోట) నిలిపి అమ్ముకొనెడివారు. ఒక మజిలీ విడిచిన తరువాత రెండవ మజిలీ చేరువరకు ఆగెడువారుకారు. ఇక్కడ ధర్మరాజు అడ్డుపడకపోతే అతని తమ్ములు వైరమునకు అంతమును చూసెడివారే. వారు తలచుకొంటే మధ్యలో ఆగరు. అంతుచూస్తారని భావం. (ఈ విషయం తెలుగుపరిశోధన 2వ సంచిక నుండి గ్రహింపబడినది - రచయితకు కృతజ్ఞతలు)' జనహితవ్యాఖ్య (పు.176-177).

**చ. అనయము పుట్టె జూదమున యప్పుడ; యెంతయుఁ జిచ్చువెట్టి కా**
**ల్చినయది నీ యుపేక్షయ; వశీకృతచిత్తుఁడు ధర్మసూతి మె**
**త్తని పులి; యెల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకు**
**న్వినఁడును గానఁడుం, బిదప నీకును నాకు మరల్పవచ్చునే? 14**

**ప్రతిపదార్థం:** జూదమున+అప్పుడు+అ= జూదం ఆడినప్పుడే; అనయము+పుట్టెన్= అవినీతి ఏర్పడింది, కీడు మూడింది; నీ+ఉపేక్ష+అ= నీ ఊరుకోవడమే; ఎంతయున్= మిక్కిలి; చిచ్చు+పెట్టి కాల్చిన+అది= నిప్పుపెట్టి దహించివేసింది; వశీకృత చిత్తుఁడు ధర్మసూతి= స్వాధీన మనస్కుడైన ధర్మరాజు; మెత్తని పులి= పైకి మృదువుగా కనిపించే పులి; ఎల్లవారలున్= అందరూ; అధర్మము= అన్యాయం; నీ పయిన్= నీమీద; పెట్టు+అంతకున్= పెట్టేదాకా; వినఁడును+కానఁడున్= వినడు, కనడు;- ఏమీ ఎరుగనట్లు ఉంటాడు; పిదపన్= తరువాత- నీవు అన్యాయపరుడవని అందరూ నిన్ను నిందించిన తరువాత; నీకును, నాకును; మరల్పన్+వచ్చునే= వెనుకకు మరలించడం తరమా?

**తాత్పర్యం:** జూదం ఆడినప్పుడే అవినీతి ఏర్పడింది, కీడు మూడింది. అప్పుడు నీవు ఉపేక్షతో ఊరుకొనటమే (మనసులో) నిప్పు పెట్టి మిక్కిలి దహించివేసింది. (ఒడలు మండించింది.) ధర్మరాజు స్వాధీన మనస్కుడు. పైకి ఎంతో మృదువుగా కనిపించే పులి, లోకులంతా అన్యాయం నీమీద పెట్టే దాకా వినడు కనడు. ఏమీ ఎరుగనట్లు ఉంటాడు. అటువంటి నింద పడ్డ తరువాత అతడిని ఆపటం నీకూ నాకూ తరం కాదు.

**విశేషం:** 1. ఉద్యోగ పర్వంలో ప్రసిద్ధమైన పద్యాలలో ఇది ఒకటి. వక్త ఆలోచిస్తూ మాట్లాడటమే కాక వినేవారిచేత ఆలోచింప చేసే స్వభావం గల వాక్య విన్యాసం ఈ పద్య రచనాశిల్పం. ఈ పద్యంలో అయిదు వాక్యాలు ఉన్నాయి. వాక్యం వాక్యం మధ్య అభినయపరమైన విరామం పాటించబడటం గమనార్హం. రాజనీతిలో ఇటువంటి వాక్య శిల్పం తిక్కన రచనలో సర్వసామాన్యం.

2. సంజయుడు రాయబారిగా చేసిన ఈ దౌత్యకార్యంలో తాను చెప్పదలచుకొన్న పరమ తాత్పర్యాన్ని ఈ పద్యంలో చెప్పాడు. ఇది పాండవులు పంపిన సందేశం కాదు. సంజయుడి స్పందన; ధృతరాష్ట్రుడికి చెప్పదలచుకొన్న సత్య నివేదన రూపమైన హితవు.

3. జూదం ఆడినప్పుడే కీడు మూడింది. ఎవరికి? కౌరవులకని భావం. ఎటువంటి కీడు? పాండవులు ప్రతీకారం తీసికొనే పగ ఏర్పడటమనే కీడు. ఇది కూడా శ్రోతభావనకే వదలబడింది. ఆ తరువాత రెండో వాక్యం మొదలయ్యేలోగా వక్త హృదయంలో సాగిన భావన గమనించాలి. ఆ కీడు సమసిపోవటానికి వీలున్నదే. వెంటనే వారించినట్లయితే అది క్రోధ తీవ్రాగ్నిగా ప్రజ్వలించకుండా సమసి ఉండేది. అది జరగలేదు. అని చెప్పకుండా ధ్వనింపచేశాడు సంజయుడు.

4. ధృతరాష్ట్రుడు ఆ సభలో ఉపేక్ష వహించటమే చిచ్చు పెట్టి కాల్చినంత పని అయింది. "చిచ్చుపెట్టి కాల్చటం" తెలుగు జాతీయ ప్రయోగం. కళకళలాడుతున్న దానిని అగ్గిపెట్టి బుగ్గిచేయటమనీ, కలిసి ఉన్న వారి మధ్య కలహం పెట్టి వారిని కలతపెట్టటమనీ అర్థాలు చెప్పుకొనవచ్చును. చిచ్చుపెట్టి కాల్చటం వలన బాధ హృదయానికే కలుగుతుంది. ధృతరాష్ట్రుడు తండ్రిగా కౌరవ పాండవులు కలిసి ఉండటానికి యత్నించకుండా, ఊరకుండి కౌరవుల దుర్నయానికి తోడుపడ్డాడనే బాధ పాండవుల హృదయాలలో అగ్గిపెట్టినట్లు బాధ కలిగించి, వారిని నిలువునా దహించి వేసింది. ఇక ఆ బాధ నివారించడానికి వీలులేకపోయిందనీ, అది పగ సాధించటం వలననే చల్లారుతుందనీ భావం.

5. 'వశీకృతచిత్తుడు ధర్మసూతి మెత్తని పులి'- ఈ మూడు మాటలు ధర్మరాజు వ్యక్తిత్వాన్ని ధ్వనిమయంగా చిత్రించేవి. తమను అవమానించి వంచన చేసి, ఉపేక్షా భావాన్ని ప్రదర్శించినందుకు ధర్మరాజుకు తీవ్రమైన ఆగ్రహం కలిగింది కాని, అతడు వశీకృతచిత్తుడు కాబట్టి నిబ్బరంగా ఉన్నాడు. అతడి శాంతం అసమర్థత కాదు. అట్లా శాంతంగా ఉన్న ధర్మరాజు యమధర్మరాజు కొడుకు. అంటే సమయాన్ని చూచి కౌరవుల అంతం చూచేవాడు. ఎప్పుడు ఎట్లా మృత్యువు వస్తుందో తెలుపని విలయ శక్తి యమధర్మరాజు. అతడికి అన్ని విధాలా తగిన కొడుకు ధర్మరాజు. అందువలన అతడి వలన కౌరవులకు

మృత్యువెప్పుడు కలుగుతుందో జాగ్రత్తగా పరిశీలించ వలసి ఉంటుంది. మొత్తం మీద ధర్మరాజు మెత్తని పులి. పైకి మెత్తగా కనపడుతూ పులివలె శత్రువులపై లంఘించే క్రూరుడని భావం. తిక్కనగారు ధర్మరాజు కిచ్చిన తెలుగు బిరుద మిది. పండితుల ప్రశంసల నందుకొన్న ప్రయోగం అన్ని బాధలు పడి కూడా, పగ సాధించగలిగి కూడా శాంతికొరకు, సంధి కొరకు ప్రయత్నించటంలో మెత్తనిపులి స్వభావం గోచరిస్తుందని భావం.

6. మెత్తని పులి స్వభావం ఉద్యోగపర్వంలో ఎట్లా ప్రదర్శితమౌతుందో సంజయుడు వివేచించి చెప్పాడు. లోకులందరూ ధృతరాష్ట్రుడే పాండవులకు అన్యాయం చేశాడని అనుకొనేంత వరకూ ధర్మరాజు ఉలకడు, పలకడు. "వినఁడును కానఁడును" జాతీయం. మరే విషయాన్నీ విన్నట్లుగా గాని, చూచినట్లుగా గాని కనపడక ఏమీ ఎరుగనట్లు అమాయకంగా ఉంటాడని భావం. దానివలన ప్రజల సానుభూతి అతడి పట్ల ఏర్పడుతుంది అని ధ్వనిమయంగా ఊహించుకొనాలి.

7. ఆ తరువాత నాకూ నీకూ అతడిని మరల్చటం సాధ్యమౌతుందా? - ఈ వాక్యం కూడా జాతీయంతో కూడి ఉన్నది. మరల్చటం దేని నుండి? సాదురేగితే తలపొలానగాని ఆగడు కదా! అటువంటి యుద్ధం నుండి మరల్చటం. 'నీకూ నాకూ' అనే మాటల ప్రయోగం నుడికారం. ఇప్పుడు సంధి యత్నంలో ఉన్న నీకూ నాకూ అని ఒక అర్థం. ఎవరికైనా అని నుడికారపరమైన అర్థం.

8. ఈ పద్యం ప్రశ్నార్థకంతో ముగియటం కూడా సార్థకమే. ఆ ప్రశ్న ధృతరాష్ట్రుడి మనశ్శాంతిని, నిద్రను భగ్నం చేసింది. (సంపా.)

**చ. అనయము నొచ్చుచున్నయవి యంగము లెల్లను వేగ వచ్చుట;**
**న్మనము వశంబు గాదు; జననాయక! ప్రొద్దును బోయె; నిప్డు డేఁ**
**బనివిని రేపు పుత్త్రులును, బంధులు, నాప్తులు, నీవు నేర్పడన్**
**విన మన కార్యమంతయు సవిస్తరతం దగ విన్నవించెదన్.' 15**

**ప్రతిపదార్థం:** జననాయక!= రాజా!, ధృతరాష్ట్రా!; వేగన్+వచ్చుటన్= వడిగా రావటం చేత; అంగములు+ఎల్లను= అవయవాలన్నీ; అనయమున్= మిక్కిలి; నొచ్చుచున్+ఉన్న+అవి= నొప్పిపెడుతున్నాయి; మనము= మనస్సు; వశంబు+కాదు= స్వాధీనంలో లేదు; ప్రొద్దునున్+పోయెన్= ప్రొద్దుకూడా పోయింది; ఇప్పుడు; ఏన్= నేను; పనివిని= వెళ్లి పోయి; రేపు= ప్రొద్దున; పుత్త్రులును= కొడుకులూ; బంధులున్= చుట్టాలూ; ఆప్తులున్= స్నేహితులూ; నీవున్= నీవూ; ఏర్పడన్+వినన్= స్పష్టంగా వినేటట్లు; మన కార్యము+అంతయున్= మన ప్రయత్నం అంతా; తగన్= ఒప్పుగా; సవిస్తరతన్= విపులంగా; విన్నవించెదన్= మనవి చేస్తాను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! నేను వేగంగా రావటం వలన నా అవయవాలన్నీ నొప్పి పెడుతున్నాయి. నా మనస్సు స్వాధీనంలో లేదు. ప్రొద్దు కూడా పోయింది. ఇప్పుడు నేను వెళ్ళిపోయి ప్రొద్దున నీ కొడుకులూ, బంధువులూ, మిత్రులూ, నీవూ స్పష్టంగా వింటూండగా మన కార్యం అంతా ఒప్పుగా వివరంగా విన్నవిస్తాను.'

**ఆ. అనిన, 'నట్ల కాక' యని సంజయుని వీడు । కొలిపి, కొంత ప్రొద్దు కురువిభుండు**
**కార్యచింత మునిఁగి, కంచుకి నొక్కరుఁ । బిలిచి, వేగ విదురుఁ బిలువు మనియె. 16**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; కురు; విభుండు= కురురాజైన ధృతరాష్ట్రుడు; అట్లు+అ కాక= అలాగే; అని; సంజయునిన్; వీడు కొలిపి= పంపి; కొంత ప్రొద్దు= కొంతసేపు; కార్య చింతన్= కర్తవ్యాన్ని గురించిన ఆలోచనలో; మునిఁగి; కంచుకిన్+ ఒక్కరున్= కంచుకినొకడిని; పిలిచి; వేగన్= శీఘ్రంగా; విదురున్; పిలువుము+అనియెన్.

**తాత్పర్యం:** అని సంజయు డనగా ధృతరాష్ట్రుడు 'అట్లాగే' అని అతడిని పంపివేసి, కొంతసేపు కర్తవ్యం గురించిన ఆలోచనలో మునిగి, ఒక కంచుకిని పిలిచి, 'విదురుడిని వేగంగా పిలువుము' అన్నాడు.

**వ. వాఁడును సత్వరంబుగాఁ జని యతనిం దోడ్తెచ్చి కాన్పించిన, నమ్మహీవరుం డత్యాదరంబున విదురుం దనయొద్ద నునిచికొని యతని కి ట్లనియె: 17**

**ప్రతిపదార్థం:** వాఁడును= ఆ కంచుకియు; సత్వరంబుగాన్= వేగంగా; చని= వెళ్ళి; అతనిన్= విదురుడిని; తోడ్తెచ్చి= తీసికొనివచ్చి; కాన్పించినన్= చూపగా; ఆ+మహీవరుండు= ఆ రాజు ధృతరాష్ట్రుడు; అతి+ఆదరంబునన్= మిక్కిలి ప్రీతితో; విదురున్; తన+ఒద్దన్= తన దగ్గర; ఉనిచికొని= ఉంచుకొని; అతనికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఆ కంచుకి వేగంగా వెళ్ళి విదురుడిని తీసికొని వచ్చి చూపగా, ఆ రాజు మిక్కిలి ప్రీతితో విదురుడిని తన దగ్గర కూర్చుండబెట్టుకొని అతడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'పాండురాజసుతుల పాలికిఁ చని యిప్డు । సంజయుండు వచ్చి, సమ్ముఖమున**
**నన్నుఁ జాల దూఱి, నాకు రే పచ్చటి । పనులు సెప్పువాఁడ ననుచుఁ జనియె. 18**

**ప్రతిపదార్థం:** సంజయుండు; పాండురాజు సుతుల పాలికిన్+చని= పాండవుల దగ్గరకు వెళ్ళి; ఇప్డు= ఇప్పుడు; వచ్చి; సమ్ముఖమునన్= ముఖంమీద; సమక్షంలో, నన్నున్; చాలన్= మిక్కిలి; దూఱి= తిట్టి; రేపు= ప్రొద్దున; నాకున్; అచ్చటి పనులు= అక్కడ జరిగిన కార్యాలు; చెప్పువాఁడన్; అనుచున్; చనియెన్= వెళ్లాడు.

**తాత్పర్యం:** సంజయుడు పాండవుల దగ్గరకు వెళ్ళి ఇప్పుడు వచ్చి, నన్ను నా ముఖం మీదే మిక్కిలి తిట్టి, ప్రొద్దున నాకు అక్కడి కార్య విశేషాలు చెపుతానని వెళ్ళాడు.

**క. అప్పటినుండియు నెవ్వగ । గప్పికొనినఁ జిత్తవృత్తి గలఁగెడు; మేనున్**
**నిప్పులఁ బొరలినయ ట్లయి । చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా!' 19**

**ప్రతిపదార్థం:** శుద్ధ విచారా!= నిర్మల భావా- విదురా!; అప్పటి నుండియున్; నెవ్వగ - నెఱ+వగ= మిక్కిలి దుఃఖం; కప్పికొనినన్= ఆక్రమించగా; చిత్తవృత్తి= మనస్థితి; కలఁగెడున్= కలత చెందింది; మేనున్= శరీరం కూడా; నిప్పులన్= నిప్పులలో; పొరలిన+అట్లు+అయి= దొరలినట్లుగా అయి; నిద్ర; ఇంచుకయున్= కొంచెం కూడా; చొప్పడదు= లభించదు.

**తాత్పర్యం:** నిర్మలభావా, విదురా! అప్పటి నుంచి అధికమైన దుఃఖం ఆక్రమించి మనస్థితి కలత చెందింది. శరీరం నిప్పులలో పొరలినట్లయి కొంచెం కూడా నిద్రపట్టదు.'

**విశేషం:** తన ఉపేక్షయే విపత్తుకు మూలమని తెలిసిన తరువాత ధృతరాష్ట్రుడి మనస్సు దుఃఖంతో నిండింది. "సర్వేంద్రియాణ్య ప్రకృతిం గతాని' (సం. 5-33-12) అని మూలం. నెవ్వగ, కలత మనస్సులో పొందే అవస్థలు. వాటి వలన కలిగే సాత్త్వికభావం శరీరం నిప్పులలో పొరలినట్లు తాపం పొందటం. ఈ ఉపమానం జాతీయం. (సంపా.)

**వ. అనిన, విదురుం డిట్లనియె : 20**

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రు డనగా విదురు డతడితో ఇట్లా అన్నాడు :

**క. 'బలవంతుఁడు పై నెత్తిన । బలహీనుఁడు, ధనము గోలుపడిన యతఁడు, ము**
**చ్చిల వేచువాఁడుఁ, గామా । కుల చిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా! 21**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా, ధృతరాష్ట్రా! బలవంతుడు; పైన్+ఎత్తిన= మీద పడిన; బలహీనుఁడున్= దుర్బలుడూ; ధనము+కోలుపడిన+అతఁడున్= డబ్బు పోగొట్టుకున్నవాడూ; ముచ్చిలన్ వేచువాఁడున్= దొంగిలించటానికి ఎదురుచూచేవాడూ; కామ+ఆకుల చిత్తుఁడున్= కామం (కోరిక) చేత కలతపడిన మనస్సు గలవాడూ; నిద్ర లేక కుందుదురు= నిద్రపట్టక బాధ పడతారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! బలవంతుడు మీదపడిన దుర్బలుడూ, డబ్బు పోగొట్టుకొన్నవాడూ, ఎప్పుడు దొంగిలిద్దామా అని కాచుకొని కూర్చున్నవాడూ, కామం చేత మనస్సు కలత చెందినవాడూ నిద్రపట్టక బాధపడతారు.

**విశేషం:** ఇది చక్కని సూక్తి. దీనికి మూలం-

**"అభియుక్తం బలవతా, దుర్బలం హీన సాధనమ్**
**హృతస్వం కామినం చోర, మావిశన్తి ప్రజాగరాః" (సం. 5-33-13)**

**క. ఇక్కొఱగాముల లోపల । నొక్కటి నీ చిత్తవృత్తి నొందెనొ? యొరు సొ**
**మ్మెక్కటి గుడువఁ దలంచితొ? । నిక్కము గత మేమి సెపుమ నిద్ర సెడుటకున్?' 22**

**ప్రతిపదార్థం:** ఈ+కొఱగాముల లోపలన్= ఈ దోషాలలో; ఒక్కటి; నీ చిత్త వృత్తిన్+ఒందెనొ= నీ మనస్సులో చోటుచేసికొన్నదా; ఒరు సొమ్ము= ఇతరుల ధనం; ఎక్కటి= ఒక్కడవే; కుడువన్+తలంచితొ= అనుభవించాలనుకొన్నావా; నిద్ర+చెడుటకున్= నిద్రపట్టకపోవటానికి; నిక్కము కతము+ఏమి+చెపుమ= నిజమైన కారణం ఏమిటో చెప్పుము.

**తాత్పర్యం:** ఈ దోషాలలో ఏదయినా ఒక్కటి నీ మనస్సులో ప్రవేశించిందా?, ఇతరుడి ధనం ఒక్కడవే అనుభవించాలనుకొన్నావా? నిద్ర పట్టకపోవటానికి నిజమైన కారణం ఏమిటో చెప్పుము.'

**విశేషం:** పైన చెప్పిన కారణాలే కాక విదురుడు మరొక క్రొత్త కారణాన్ని కల్పించాడు. అది ఇతరుల ధనాన్ని మరొకడు ఒక్కడే అనుభవించటం. దానిని పేర్కొని ఎత్తిపొడిచాడు విదురుడు. (సంపా.)

**తే. అనిన, ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోడ । 'ధర్మసుతుమాటచొ ప్పెవ్విధంబొ యెఱుఁగ**
**కునికిఁజేసి చింతిల్లితి; నోపు దీవు । దెలియఁ జెప్పి నా యలమట మలుగఁ జేయ.' 23**

**ప్రతిపదార్థం:** అనినన్; ధృతరాష్ట్రుఁడు; అతని తోడన్; ఇట్లు+అనున్; ధర్మసుతు మాట చొప్పు= ధర్మరాజు మాట తీరు; ఏ+విధంబొ= ఎటువంటిదో; ఎఱుఁగక+ఉనికిన్+చేసి= తెలియకపోవటం చేత; చింతిల్లితిన్= దుఃఖించాను; ఈవు= నీవు; తెలియన్+చెప్పి; నా+అలమటన్= నా దుఃఖాన్ని, మలుగన్+చేయన్= పోగొట్టటానికి; ఓపుదు(వు)= చాలుదువు.

**తాత్పర్యం:** అని విదురు డనగా ధృతరాష్ట్ర డతడితో ఇట్లా అన్నాడు. 'ధర్మరాజు ఏమన్నాడో తెలియకపోవటం చేత దుఃఖించాను. నీవు స్పష్టపరిచి నా దుఃఖాన్ని పోగొట్టగలవు.'

**చ. అనవుడు నిట్లనున్ విదురుఁ; 'డక్కట! ధర్మసుతుండు బాంధవుం**
**డును జెలికాఁడునుం దగు భటుండును బ్రెగ్గడయున్ గురుండుఁ గాఁ**
**డె, నృపవరేణ్య! నీకుఁ? బ్రకటీకృత సత్త్వుఁడు శాంతమూర్తి స**
**ద్వినయ వివేక శీలముల విశ్రుతుఁ; డాతఁడు గీడు వల్కునే? 24**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని ధృతరాష్ట్రుడు అనగానే; విదురుఁడు; ఇట్లు+అనున్; అక్కట!= అయ్యో!; నృపవరేణ్య!= రాజశ్రేష్ఠుడా!; నీకున్; ధర్మసుతుండు= ధర్మరాజు; బాంధవుండును= చుట్టమూ; చెలికాఁడునున్= స్నేహితుడూ; తగు భటుండును= తగిన బంటూ; ప్రెగ్గడయున్= మంత్రీ; గురుండున్= రక్షకుడూ; కాఁడె?= కాడా?; ప్రకటీకృత సత్త్వుఁడున్= బయల్పరుపబడిన సత్త్వగుణం కలవాడూ; శాంతమూర్తి; సత్+వినయ వివేక శీలములన్= మంచి వినయం; వివేకం; శీలమూ అనే వాటి యందు; విశ్రుతుఁడున్= ప్రసిద్ధుడూ; ఆతఁడు= ఆ ధర్మరాజు; కీడు+పల్కునే= తప్పు మాట్లాడుతాడా?'

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అనగానే విదురుడు అతడితో ఇట్లా అన్నాడు: 'అయ్యో! రాజోత్తమా! నీకు ధర్మరాజు బంధువూ, స్నేహితుడూ, తగిన భటుడూ, మంత్రీ, రక్షకుడూ కాడా? తన సత్త్వగుణాన్ని స్పష్టపరిచినవాడూ; శాంతమూర్తీ, మంచి వినయం, వివేకం, శీలం అనే వాటిలో ప్రసిద్ధుడూ అయిన అతడు తప్పు మాట్లాడుతాడా?

**ఆ. నీవుఁ గొడుకు వారి నెఱి లేక పఱిచితి; । రదియ చాలు; నుచితమైన పాలు**
**పంచి యిండు; పిల్లి వట్టిన యీరువు । సేసియున్న నేల చెల్ల నేర్చు? 25**

**ప్రతిపదార్థం:** నీవున్+కొడుకున్= నీవూ, నీ కొడుకు దుర్యోధనుడూ; వారిన్= పాండవులను; నెఱి లేక= న్యాయం లేక-అన్యాయంగా; పఱిచితిరి= బాధించారు; అది+అ చాలున్= అదే చాలు; ఉచితము+ఐన పాలు= వాళ్ళకు న్యాయంగా ఇవ్వవలసిన భాగం; పంచి+ఇండు= పంచి ఇవ్వండి; పిల్లి+పట్టిన+ఈరువు+చేసి+ఉన్నన్= పిల్లి పట్టుకున్న మాంసంలా చేస్తే; ఏల చెల్లన్+నేర్చున్= ఎందుకు చెల్లుతుంది?

**తాత్పర్యం:** నీవూ, నీ కొడుకు దుర్యోధనుడూ వాళ్ళను అన్యాయంగా బాధించారు. అది చాలదా? వాళ్ళకు న్యాయంగా ఇవ్వవలసిన భాగం పంచిపెట్టండి. అంతేకాని, పిల్లి పట్టుకున్న మాంసం విధం చేస్తే ఎట్లా చెల్లుతుంది?

**విశేషం:** 'పిల్లి వట్టిన యీరువు' - దీనికి అనేకులు అనేక విధాలైన అర్థాలు చెప్పారు. శ్రీ ముస్నంగి లక్ష్మీనృసింహ శర్మగారు ఇట్లా చెప్పారు: 'ఈరువునకు చేఁదుగుండె' అని పడమటి సీమలోఁ గొంత భాగమున వాడుట కలదు. ప్రకృత సందర్భమున రాజ్యము సర్వము హరింపవలయునను దురాశకును, పాండవుల పరాక్రమమునకు జడుపునకును జిక్కువడిన ధృతరాష్ట్రునకు సరిపడ 'పిల్లి వట్టిన యీరువు' అని ఉపమింపఁబడినది. చేఁదుగుండెఁగఱచి తినుటకుఁజేఁదు, విడువ మనసొప్పదు-ఇట్లు మ్రింగలేక, క్రక్కలేక పెనఁగుచున్న పిల్లితో ధృతరాష్ట్రునకుఁ బోలిక చెప్పఁబడినది. ఈరువునకు మాంసమను నర్థము గ్రహించుచో నీ సందర్భమున కొప్పదు. మాంసమును బట్టిన పిల్లి దానిని గబళించి వేయును. అట్టిచో మ్రింగుడు వడక, క్రక్కనిష్టము లేక తల్లడవడు ధృతరాష్ట్రునకుఁ బోలిక యెట్లు? కావునఁ జేఁదుగుండె అను నర్థమే అన్నిట నొప్పియున్నది.'

వీరి అభిప్రాయం బాగానే ఉన్నది కాని, దీనికి ప్రధాన ప్రతిబంధకాలు రెండు ఉన్నాయి. ఒకటి- 'ఈరువు' అనే పదానికి ఏ నిఘంటువులోనూ 'మాంసము' అనే అర్థమేకాని, చేదుగుండె అనే అర్థం లేకపోవటం. రెండు- ఈరువునకు చేదుగుండె అనే వాడుక పడమటి సీమలో కొంతభాగంలో ఉన్నదట- కవి అంత అప్రసిద్ధమైన అర్థంలో ఈ శబ్దాన్ని ఎందుకు వాడతాడు? ఏమాత్రం వాడుకలో ఉన్నా అది నిఘంటువుల కెక్కి ఉండేదే.

'ఈరువు'నకు మాంసం అనే అర్థాన్ని చెప్పినా, ఈ సందర్భానికి అతుకుతుంది. ధృతరాష్ట్రుడు పాండవుల భాగాన్ని కూడా పట్టుకుని వదలిపెట్టటం లేదు. అది పిల్లి మాంసం పట్టుకుని విడిచిపెట్టకపోవటంవలె ఉన్నది. పిల్లి పట్టిన ఈరువువలె పాండవుల రాజ్యభాగాన్ని పట్టుకొని విడిచిపెట్టకపోతే ఎట్లా చెల్లుతుంది? అని సమన్వయం. ఇలా అర్థం చెపితే పైని చెప్పిన ప్రతిబంధకాలు ఉండవు. 'డక్కెను రాజ్యమంచు నకటా! యిటు దమ్ముని భాగమీక నీ వెక్కటి మ్రింగఁజూచెదు' (52) అనే పద్యం అభిప్రాయాన్నే చెపుతుంది.

ఈ 'ఈరువు'నకు 'ఈలువు' అనే పాఠం కొన్ని ప్రతులలో ఉన్నది. ఈలువు అనే మాటకు 'పాతివ్రత్యం' 'వ్రతం' అనే అర్థాలున్నాయి. 'పిల్లి పట్టిన వ్రతం' అంటే ఏమిటో- అది ఈ సందర్భానికి ఎట్లా కుదురుతుందో తెలియదు.

**వ. మీరు శకుని కర్ణ దుశ్శాసనుల మీఁద రాజ్యభారంబు వెట్టికొనియుండుదు; రిది దుది ముట్టనేర దెట్లంటేని. 26**

**ప్రతిపదార్థం:** మీరు, శకుని కర్ణ దుశ్శాసనుల మీఁదన్; రాజ్య భారంబు= ప్రభుత్వపు బాధ్యతను; పెట్టికొని+ఉండుదురు= ఉంచి వ్యవహరిస్తారు; ఇది; తుదిముట్టన్+నేరదు= కొనసాగలేదు; ఎట్లు+అంటి(వి)+ఏనిన్= ఎలా అంటావేమో!

**తాత్పర్యం:** మీరు- నీవూ నీ కొడుకూ- శకుని కర్ణ దుశ్శాసనులపై రాజ్యభారం మోపి ఉంటారు. ఇది చివరిదాకా కొనసాగబోదు. ఎలా అంటావేమో.

**క. తముఁ దా రెఱుఁగుట, వేగ ప । డమి, దాలిమి, విడుపు గలుగుటయు లేని ప్రభు**
**త్వము గలదె? వారియం దీ । సుమానుషము లొకఁడుఁ బట్టి చూడం గలఁడే? 27**

**ప్రతిపదార్థం:** తమున్= తమను; తారు= తాము; ఎఱుఁగుట= తెలిసికొనుట; వేగ పడమి= తొందరపడకపోవటం; తాలిమి= ఓర్పు; విడుపు+కలుగుటయున్= త్యాగం, ఈవి కలుగుటా; లేని ప్రభుత్వము+కలదె?= లేని ప్రభుత్వం ఉందా?; వారి యందున్= ఆ శకుని కర్ణ దుశ్శాసనులలో; పట్టిచూడన్= బాగా పరిశీలించి చూస్తే; ఈ సుమానుషములు+ఒకఁడున్= ఈ సుగుణాలలో ఒక్కటైనా; కలఁడే= కలవాడున్నాడా?

**తాత్పర్యం:** తమను తాము ఎరగటం, తొందరపడకపోవటం, ఓర్పు, ఈవీ లేని ప్రభుత్వం ఉంటుందా? ఆ శకుని కర్ణ దుశ్శాసనులలో బాగా పరిశీలించి చూస్తే పైసుగుణాలలో ఒక్కటైనా కలవాడున్నాడా?

**వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కమ తండ్రివని, తగవు నమ్మి, చాల సైరించియున్నవాఁ; డది నీవ యెఱుంగు' దనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె : 28**

**ప్రతిపదార్థం:** యుధిష్ఠిరుండు= ధర్మరాజు; నీవు; నిక్కము+అ= నిజంగానే; తండ్రివి+అని= తండ్రిగా తలంచి; తగవు నమ్మి= ధర్మాన్ని నమ్మి; చాలన్= మిక్కిలి; సైరించి ఉన్నవాఁడు= ఓపికపట్టి ఉన్నాడు; అది= ఆ సంగతి; నీవు+అ= నీవే; ఎఱుంగుదు(వు); అనినన్; విని; ధృతరాష్ట్రుండు+ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ధర్మరాజు నీవు నిజంగానే తండ్రివని, ధర్మం నమ్మి, మిక్కిలి ఓపికపట్టి ఉన్నాడు. అది నీవే ఎరుగుదువు' అనగా విని ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు :

**తే. 'సంజయునిచేతఁ గార్యంబు చంద మెల్లి । యెఱిఁగి, మన కెద్ది సేయంగఁ దెఱఁగు, దానిఁ**
**బనిచి చేయింపు; మిపుడు నా మనము దల్ల । డిలుట హితభాషణంబుల డిందుపఱుపు. 29**

**ప్రతిపదార్థం:** సంజయుని చేతన్= సంజయుడివలన; కార్యంబు చందము= కార్యం రీతి; ఎల్లి= రేపు; ఎఱిఁగి= తెలిసికొని; మనకున్; ఎద్ది= ఏది; చేయంగన్+తెఱఁగు= చేస్తే క్షేమకరమో; దానిన్, పనిచి= నియోగించి; చేయింపుము; ఇపుడు; నా మనము= నా మనస్సు; తల్లిడిలుట= కలత చెందటాన్ని; హిత భాషణంబులన్= మేలు కూర్చే మాటలతో; డింద పఱుపు(ము)= మాన్పుము.

**తాత్పర్యం:** 'సంజయుడు వెళ్ళిన పని ఏమయిందో రేపు అతడివలన తెలిసికొని మన కేది చేస్తే క్షేమకరమో దానిని నియోగించి చేయించుము. ఇప్పుడు నా మనస్సులోని కలతను హితభాషణాలతో మాన్పుము.

**వ. నీవు ధర్మాధర్మ విదుండవు; నయానయజ్ఞుండవు. నాకుం బ్రజాగరం బొనర్చుచున్న సంతాపం బుపశమిం**
**చునట్లుగా భవద్వచనామృతంబు నా యుల్లంబున వెల్లిగొల్పు' మనిన విదురుం డిట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** నీవు, ధర్మ+అధర్మ విదుండవు= ధర్మాధర్మాలు తెలిసినవాడవు; నయ+అనయజ్ఞుండవు= నీతి, అవినీతి తెలిసినవాడవు; నాకున్; ప్రజాగరంబు+ఒనర్చుచున్+ఉన్న= నిద్రలేమి కలిగిస్తూన్న; సంతాపంబు= దుఃఖం; ఉపశమించు+అట్లుకాన్= తగ్గేలాగ; భవత్+వచన+అమృతంబు= నీ మాటలనే అమృతం; నా+ఉల్లంబునన్= నా మనస్సులో; వెల్లి+కొల్పుము= ప్రవహించేటట్లు చేయుము; అనినన్; విదురుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నీవు ధర్మాధర్మాలూ, నీత్యవినీతులూ తెలిసినవాడవు. నాకు నిద్రాఖేదాన్ని కలిగిస్తూన్న దుఃఖం పోయేటట్లు నీ వచనం అనే అమృతాన్ని ప్రవహింపచేయి' అనగా విదురుడిట్లా అన్నాడు.

### ధృతరాష్ట్రునకు విదురుఁడు హిత ముపదేశించుట (సం. 5-33-16)

**క. 'జనులకు నొడఁ బా టగువిధ । మున నడచుచు, లోకనింద్యముల నుడుగుచు, మీఁ**
**దని యొకని కలిమి కులుకక । మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా! 31**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా, ధృతరాష్ట్రా!; జనులకున్; ఒడఁబాటు+అగు విధమునన్= అంగీకారమైన రీతిలో; నడచుచున్= ప్రవర్తిస్తూ; లోక నింద్యములన్= లోకం చేత నిందించదగిన పనులను; ఉడుగుచున్= మానుతూ; మీఁదు+అని= గొప్ప అని-తన కలిమికంటె ఎక్కువని; ఒకని కలిమికిన్= ఇంకొకడి సంపదకు; ఉలుకక= ఈర్ష్య చెందక; మనుజులతోన్= మనుష్యులతో; పొంది పొసఁగి= కలిసియుండి; మనుట= బ్రతకడం; ఒప్పున్= తగును.

**తాత్పర్యం:** 'రాజా, ధృతరాష్ట్రా! జనులకు అంగీకారమైన విధంగా ప్రవర్తిస్తూ, లోకం నిందించే పనులను చేయటం మాని, తన సంపద కంటె ఎక్కువని ఇంకొకడి సంపదకు ఈర్ష్య చెందక, మనుష్యులతో కలిసి మెలిసి బ్రతకటం మంచిది.

**విశేషం:** విదురుడు చేసే హితబోధ తత్కాలంలో ధృతరాష్ట్రుడి చిత్తవృత్తిని సంస్కరించి శాంతిని కూర్చేదీ, సర్వకాలాలలో లోకులకు హితం కలిగించేదీ కావటం విశేషం. అతడి బోధలో మూడంశాలు ముఖ్యంగా ఉన్నాయి. 1.లోకనీతి, 2.ధర్మప్రీతి 3.దైవభీతి. ఈ మూడూ త్రికరణ శుద్ధితో పాటిస్తే చిత్తశాంతి కలుగుతుందని హితబోధ తాత్పర్యం. ఈ పద్యంలో లోకనీతికి సంబంధించిన ముఖ్యాంశాలు నాలుగు పేర్కొనబడ్డాయి.

అవి- 1. జనులు మెచ్చుకొనేటట్లు ప్రవర్తించటం. 2.లోకులు నిందించే పనులను చేయకుండటం. 3. ఇతరులు తమకంటె బాగుపడుతున్నారే అని అసూయపడకుండా ఉండటం. 4.అందరితో కలిసి మెలిసి జీవించటం. 'యథారాజా తథా ప్రజా' అని న్యాయం. "యద్య దాచరతి శ్రేష్ఠః తత్త దే వేతరో జనః । సయత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" అని భగవద్గీత. అందువలన రాజు ప్రజలు మెచ్చుకొనేటట్లు ప్రవర్తించటం ప్రథమ నీతి. ధృతరాష్ట్రుడు లోభంతో పాండవులకు అన్యాయం చేసి అధర్మవర్తనుడని లోకంలో అపకీర్తి పొందాడు. ఆ అపకీర్తి అతడి అశాంతికి మూలం. రాజు ద్యూతం వంటి వ్యసనాలను అధికారికంగా గుర్తించి, వాటి వలన కలిగే ఫలితాలను ధర్మ పాలనలో భాగంగా పరిగణించటం వలన లోకనింద ఏర్పడుతుంది. నిందను లెక్కచేయకుండా వ్యవహరిస్తే మనస్తాపం తప్పదు. ధృతరాష్ట్రుడు అటువంటి లోకనిందాకరమైన ద్యూత చర్యకు ధర్మప్రతిపత్తి కలిగించి పరిపాలనను కలుషితం చేశాడు. దాని ఫలితం అనుభవిస్తున్నాడు. అసూయ మనస్సుకు చీడపురుగు వంటిది, ప్రవర్తనకు పాము కాటు వంటిది. పాండవ సంపదకు అసూయ పడి అన్యాయంగా దానిని దొంగిలించాలని కపట ద్యూతాన్ని జరిపి కలుషవర్తనులనిపించుకొన్నారు దుర్యోధనాదులు. ఆ పాపానికంతా అండదండలుగా నిలిచినవాడు ధృతరాష్ట్రుడు. అతడి మనస్సులోని అసూయయే అంతటి హాలాహలాన్ని పాండవ జీవితంలో నింపింది. పరుల సంపదను చూచి ఓర్వలేని ఆ చుప్పనాతి గుణం కట్టెలోని నిప్పువలె మనిషిని బూది చేస్తుంది. అందుకే ధృతరాష్ట్రుడికి అంతటి అశాంతి. కౌరవ, పాండవులు నీరక్షీరాల వలె కలిసి ఉంటే వంశానికి మేలు. కాని, ధృతరాష్ట్రుడికి స్వార్థబుద్ధి దుర్యోధనుడి దుష్ట ప్రయత్నాలను మాన్పలేక వంశనాశనానికి దోహదం చేసింది. ధృతరాష్ట్రుడు లోకనీతికి ఆదర్శం కావలసిన శ్రేష్ఠుడు, ప్రభువు. అతడే నీతి తప్పాడు. నిందించదగిన పనులు చేశాడు. అసూయకు గురిఅయ్యాడు. తమ్ముడి కొడుకులతో కలిసి ఉండలేకపోయాడు. ఈ నాలుగు దోషాలకూ గురి అయిన ధృతరాష్ట్రుడు పొందే మనస్తాపం స్వయంకృతాపరాధమే అని తాత్పర్యం. (సంపా.)

**క. కోపము, నుబ్బును, గర్వము । నాపోవక యునికియును, దురభిమానము, ని**
**ర్వ్యాపారత్వము నను నివి । కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా! 32**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా= కురురాజా, ధృతరాష్ట్రా!; కోపమున్, ఉబ్బును= పొంగిపోవటమూ; గర్వమున్; ఆపోవక+ఉనికియును= తృప్తిలేకపోవడమూ; దురభిమానమున్= తగని అభిమానమూ; నిర్వ్యాపారత్వమున్= ఏ పనీ చేయకపోవటమూ; అను+ఇవి; కాపురుష గుణంబులు+అండ్రు= దుర్జనుడి గుణాలు అంటారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! కోపమూ, పొంగిపోవటమూ, గర్వమూ, తృప్తిలేకపోవటమూ, దురభిమానమూ, ఏ పనీ చేయకపోవటమూ అనే ఇవి దుర్జనుడి లక్షణాలు అంటారు.

**విశేషం:** అంతశ్శత్రువుల వంటి ఈ ఆరుగుణాలు కలవాడు అధముడు. దుర్యోధను డటువంటి వాడు, అతడిని సమర్థించే ధృతరాష్ట్రుడూ ఆ కోవకు చెందుతాడు. ఇటువంటి వారి ప్రవర్తనం సంఘనీతికి చేటు. (సంపా.)

**క. ఏలిన వానిని, దైవము, । నాలిని, బంధులను సముచితారాధన సం**
**శీలతఁ బ్రీతులఁ జేయని । పాలసుఁడా ఫలము లాసపడు, మనుజేంద్రా! 33**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్రా!= రాజా! ధృతరాష్ట్రా!; ఏలినవానిని= రాజునూ; దైవమున్= భగవంతుడినీ; ఆలిని= భార్యనూ; బంధులను= చుట్టాలనూ; సముచిత+ఆరాధన సంశీలతన్= తగిన విధంగా పూజించే సత్స్వభావంతో; ప్రీతులన్+చేయని పాలసుఁడా= సంతోష పరచని యుక్తాయుక్త వివేకశూన్యుడా; ఫలములు+ఆసపడున్?= సత్ఫలితాలు ఆసపడేది?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! రాజునూ, భగవంతుడినీ, భార్యనూ, చుట్టాలనూ, తగిన విధంగా పూజించే సత్స్వభావంతో సంతోషపెట్టని యుక్తాయుక్త వివేకశూన్యుడా సత్ఫలితాలు ఆశించేది?

**విశేషం:** లోకనీతి ననుసరించి వివేకవంతులు రాజునూ, దైవాన్నీ, భార్యనూ, బంధువులనూ గౌరవంగా చూస్తూ సత్ప్రవర్తనతో వారిని సంతోషపెట్టుతారు. ఆ లక్షణాలు పాండవులకు సహజంగా ఉన్నాయి. వారు ధృతరాష్ట్రుడి మాట పాటించారు. శ్రీకృష్ణుడిని దైవంగా భావించి ఆరాధించారు. భార్యను ప్రేమతో చూచుకొన్నారు. బంధువులను ఆదరంతో గౌరవించారు. వారు ఆయా ధర్మాలకు తగిన సత్ఫలితాలు అనుభవించగలరు. ఆ నీతులను పాటించని కౌరవులూ, ధృతరాష్ట్రుడూ వివేకవిహీనులై విషాదానికి గురి ఔతారు. ధృతరాష్ట్రుడి మనస్తాపానికి అతడి వివేక రాహిత్యమే కారణం. (సంపా.)

**క. నెమ్మి గలవారి నొల్లరు । త మ్ముల్లనివారి వెనుకఁ దగులుదు; రధిక**
**త్వ మ్మెఱిఁగి యెఱిఁగి తొడరుదు । రి మ్మెఱుఁగని యట్టివార లిభపురనాథా! 34**

**ప్రతిపదార్థం:** ఇభపుర నాథా!= హస్తినాపుర ప్రభూ, ధృతరాష్ట్రా!; ఇమ్ము+ఎఱుఁగని+అట్టివారలు= ఉపాయశాలులు కానివారు; నెమ్మి కలవారిన్+ఒల్లరు= తమపై ప్రేమ ఉన్నవాళ్ళను, ఇష్టపడరు; తమ్మున్+ఒల్లనివారి వెనుకన్= తమను ఇష్టపడనివారి వెనుక; తగులుదురు= ఆసక్తి చూపుతారు; అధికత్వమ్ము= ఆధిక్యం గొప్పతనం; ఎఱిఁగి+ఎఱిఁగి= తెలిసి తెలిసి; తొడరుదురు= ఎదుర్కొంటారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! ఉపాయశాలులు కానివారు తమను ప్రేమించేవారంటే ఇష్టపడరు. తమను ప్రేమించనివారి వెనుక పడతారు. తమకంటె అధికులని తెలిసి తెలిసీ ఇతరులను ఎదుర్కొంటారు.

**విశేషం:** తనను నిజంగా గౌరవించే పాండవులను కాదని, తనను తమ వ్యూహంలో పావువలె భావించి తేలికగా చూచే దుష్టచతుష్టయాన్ని మన్నించి, అన్నిట్లోనూ అధికులైన పాండవులతో వైరం పెట్టుకొనటం ధృతరాష్ట్రుడి ఉపాయరాహిత్యమని తాత్పర్యం. అతడికి శాంతి లేకపోవటం సహజం. (సంపా.)

**క. ధనమును, విద్యయు, వంశం । బును దుర్మతులకు మదంబుఁ బొనరించును; స**
**జ్జను లైనవారి కడఁకువ । యును, వినయము నివియతెచ్చు నుర్వీనాథా! 35**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= రాజా, ధృతరాష్ట్రా!, ధనమును= డబ్బూ, విద్యయున్; వంశంబును= ఉత్తమ వంశమూ; దుర్మతులకున్= దుర్బుద్ధులకు; మదంబున్= గర్వాన్నీ; పొనరించును= కలిగిస్తాయి; ఇవి+అ= ఇవే- ధనవిద్యావంశాలే; సత్+జనులు+ఐన వారికిన్= సద్బుద్ధులకు; అడఁకువయును= నమ్రతా; వినయమున్= గౌరవమూ; తెచ్చున్= తెస్తాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! ధనమూ, విద్యా, ఉత్తమ వంశమూ దుర్బుద్ధులకు మదం కలిగిస్తాయి. ఇవే సద్బుద్ధులకు అడకువనూ, గౌరవాన్నీ తెచ్చిపెట్టుతాయి.

**విశేషం:** 1. దుర్బుద్ధులు కౌరవులు, సద్బుద్ధులు పాండవులు. వీరిరువురికీ ధనం, విద్య, ఉత్తమవంశం అనే మూడు అదృష్టాలున్నాయి. కాని, కౌరవులు వాటి వలన మదోన్మత్తులయ్యారు. కాని, పాండవులు వినయవంతు లయ్యారు. దానివలన వారు లోకనీతిలో గౌరవ పాత్రులయ్యారు. (సంపా.)

2. "దీనికి మూలంలో చక్కని చమత్కారం ఉంది.

**'విద్యా మదో ధన మద స్తృతీయోభిజనో మదః**

**ఏతే మదావలిప్తానాం ఏత ఏవ సతాం దమాః' (సం.5.33-41)**

ఈ మూడూ దుర్మార్గులకు మదమూ, సన్మార్గులకు దమమూ కలిగిస్తాయి. అక్షరాలు తిరగబడ్డాయి. (మద-దమ). కథా సంబంధిగా మదం దుర్యోధనుడికీ - దమం ధర్మరాజుకూ కలుగుతాయి. తెలుగులో అడకువ చేత దమమునూ, వినయం చేత శమమునూ గ్రహించాలి" జనహిత వ్యాఖ్య. (పు.185-186).

**క. అరిది విలుకాని యుజ్జ్వల । శర మొక్కని నొంచుఁ; దప్పి చనినం జను; నే**
**ర్పరి యైనవాని నీతి । స్ఫురణము పగరాజు, నతని భూమిం జెఱుచున్. 36**

**ప్రతిపదార్థం:** అరిది విలుకాని+ఉజ్జ్వల శరము= గొప్ప విలుకాడియొక్క ప్రకాశించే బాణం; ఒక్కనిన్= ఒకడిని; నొంచున్= బాధిస్తుంది; తప్పి చనినన్+చనున్= తప్పిపోతే తప్పిపోతుంది; నేర్పరి+ఐన వాని నీతి స్ఫురణము= నేర్పుగలవాడి నీతి ప్రకాశం; పగ రాజున్= శత్రురాజునీ; అతని భూమిన్= అతడి దేశాన్నీ; చెఱుచున్= నశింపజేస్తుంది.

**తాత్పర్యం:** గొప్ప విలుకాడి మంచి బాణం ఒకడిని బాధిస్తే బాధిస్తుంది లేదా తప్పిపోతే తప్పిపోతుంది కాని, నేర్పుగలవాడి నీతిస్ఫూర్తి శత్రురాజునూ, అతడి దేశాన్నీ నశింపజేస్తుంది.

**విశేషం:** దీనికి మూలం:

**"ఏకం హన్యా న్నవా హన్యా దిషుర్ముక్తో ధనుష్మతః**

**బుద్ధిర్బుద్ధిమతో త్సృష్టా హన్యా ద్రాష్ట్రం సరాజకమ్" (సం.5-33-42)**

బాణ(బల) ప్రయోగం ఎదుటివారి నొకరినే చంపుతుంది. బుద్ధి (నీతి) ప్రయోగం రాజునూ రాజ్యాన్నీ నశింపచేస్తుంది. దుర్యోధనుడు బలప్రయోగాన్ని నమ్ముకొన్నాడు. ధర్మరాజు ధర్మనీతిప్రయోగాన్ని నమ్ముకొన్నవాడు. దుర్యోధనుడు కొందరిని చంపగలడేమో కాని, ధర్మజుడి రాజనీతి కౌరవులనూ, వారి రాజ్యాన్నీ కూడా హరించగలదని ప్రకరణోచితమైన తాత్పర్యం. (సంపా.)

**తే. ఒకటిఁ గొని, రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, । మూఁటి నాల్గింటఁ గడు వశ్యములుగఁ జేసి,**
**యేనిటిని గెల్చి, యాఱింటి నెఱిఁగి, యేడు । విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు. 37**

**ప్రతిపదార్థం:** ఒకటిన్= ప్రభుత్వమును; కొని= చేపట్టి-స్వీకరించి; రెంటిన్= మంత్రము, ఉత్సాహము అను రెండింటిని; నిశ్చల యుక్తిన్+చేర్చి= కదలనీయక జోడు చేసి; మూఁటిన్= మిత్రులు, అమిత్రులు, తటస్థులు అనే మూఁడు వర్గాలను; నాల్గింటన్= సామ, దాన, భేద, దండములనే నాలుగు ఉపాయాలచేత; కడున్= మిక్కిలి; వశ్యములుగన్+చేసి= వశపరచుకొని; ఏనిటిన్= త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము అనే అయిదింటినీ; గెల్చి= జయించి; ఆఱింటిన్= సంధి, విగ్రహము, యానము,

ఆసనము, ద్వైధీభావము అనే ఆరింటినీ; ఎఱింగి= తెలిసికొని; ఏడు= వ్యసనముల నేడింటినీ; విడిచి; వర్తించువాఁడు= ఉండేవాడు; వివేక ధనుఁడు= వివేకం ధనంగా కలవాడు.

**తాత్పర్యం:** ప్రభుత్వాన్ని చేపట్టి, మంత్రోత్సాహములనే రెండింటినీ కదలనీయక జోడు చేసి, మిత్రులు, అమిత్రులు, తటస్థులు అనే మూడు వర్గాలనూ సామ దాన భేద దండములనే నాలుగు ఉపాయాలచేతా పూర్తిగా వశపరచుకుని, త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము అనే అయిదు ఇంద్రియాలనూ జయించి, సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావములు అనే ఆరింటినీ తెలిసికొని, వేట, జూదము, పానము, స్త్రీ, వాక్పారుష్యము, దండపారుష్యము, అర్థదూషణము అనే సప్త వ్యసనాలనూ విడిచి వర్తించేవాడు వివేకధనుడు.

దీనికి ఇంకో విధమైన అర్థం:

ఒకటి- బుద్ధి. దీనికి వాక్కు, క్రియ అనే రెండింటినీ నిశ్చలత్వంతో చేర్చి, ధర్మార్థకామాలనే మూడింటినీ బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసములనే నాల్గింటితో మిక్కిలి వశపడేటట్లు చేసి, వాక్, పాణి, పాద, పా,యూపస్థ లనే కర్మేంద్రియాల నయిదింటినీ గెలిచి, యజన, యాజ, నాధ్యయన, దాన, ప్రతిగ్రహాలనే ఆరు స్మార్త కర్మలను తెలిసి, ఆవరణం (పంచభూతాలు), బుద్ధ్యహంకారాలూ అనే ఏడింటినీ విడిచి వర్తించే వాడు వివేకధనుడు.

మరోవిధమైన అర్థం: ఒకటి- సత్త్వం, రెండు- రజస్తమస్సులు, మూడు- ధన దార పుత్రేషణములు, నాలుగు- ధ్యాన, ధారణ, యోగ, సమాధులు, తక్కినవి పైని చెప్పబడినట్లే.

**విశేషం:** మూల భారతంలో దీనికి సరియైన శ్లోకం-

> **'ఏకయా ద్వౌ వినిశ్చిత్య త్రీం శ్చతుర్భి ర్వశే కురు,**
> **పఞ్చ జిత్వా విదిత్వా షట్ సప్త హిత్వా సుఖీభవ.' (సం. 5-33.43)**

**క. వినుఁ, మధురాహారంబులు । గొనుటయుఁ, బెక్కండ్రు నిద్ర గూరినయెడ మే**
**ల్కని యునికియుఁ, గార్యాలో । చనముఁ, దెరువు నడచుటయును జన దొక్కనికిన్. 38**

**ప్రతిపదార్థం:** విను(ము), ఒక్కనికిన్= ఒంటరిగా; మధుర+ఆహారంబులు+కొనుటయున్= మధురములైన ఆహారాలు స్వీకరించటమూ, పెక్కండ్రు= అనేకులు; నిద్ర+కూరిన+ఎడన్= నిద్రించేచోట; మేల్కని+ఉనికియున్= మేలుకొని ఉండటమూ; కార్య+ఆలోచనమున్= ఒక పనిని గూర్చి ఆలోచించటమూ; తెరువు నడచుటయును= మార్గంలో నడవటమూ; చనదు= తగదు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! విను. మధురాహారాలు ఒక్కడూ తినటమూ, పలువురు నిద్రపోతుంటే ఒక్కడూ మేలుకొని ఉండటమూ, కార్యాలోచన ఒక్కడూ చేయటమూ, మార్గంలో ఒక్కడూ నడవటమూ తగదు.

**విశేషం:** దీనికి మూలం.

> **'ఏక స్స్వాదు న భుఞ్జీత ఏక శ్చార్థాన్ న చిన్తయేత్,**
> **ఏకో న గచ్ఛే దధ్వానం నైక స్సుప్తేషు జాగృయాత్,' (సం. 5.33.45)**

మధుర పదార్థం వంటి రాజ్యాన్ని న్యాయంగా పాండవులకు పంచి ఇచ్చి దానిని మరల హరించారు కౌరవులు. దానికి సాక్షీభూతుడు ధృతరాష్ట్రుడు. అందరూ నిద్రపోతూ ఉండగా మేల్కొని విదురుడి నీతి బోధ వింటున్నవాడు ధృతరాష్ట్రుడు. విదురుడు చెప్పే మాటలన్నీ వింటూ తనలో తాను ఏకాంతంగా తన వ్యూహాన్ని తీర్చిదిద్దికొనేవాడూ, ఎవరినీ నమ్మక తన దారిలో తాను ఒంటిగా సాగేవాడూ ధృతరాష్ట్రుడు. సంఘనీతికి సరిపడని వ్యక్తినీతి సన్మానయోగ్యం కాదనీ, పైపెచ్చు అది మనోవేదనను కలిగిస్తుందనీ తాత్పర్యం. (సంపా.)

**క. నడవడి యను మున్నీటిం । గడవం బెట్టంగ నోడకరణిం దగి తా**
**నొడఁగూడు ననిన, సత్యము । గడచినగుణ మింక నొండు గలదే యరయన్? 39**

**ప్రతిపదార్థం:** నడవడి+అను మున్నీటిన్= ప్రవర్తన అనే సముద్రాన్ని, కడవన్+పెట్టంగన్= దాటించటానికి; ఓడ కరణిన్= ఓడవలె; తగి= ఒప్పి; తాను; ఒడఁగూడన్+అనినన్= ఉంటుందంటే; అరయన్= పరిశీలించగా; సత్యము+కడచిన గుణము= సత్యాన్ని మించిన గుణం; ఇంకన్+ఒండు+కలదే?= ఇంకొకటి ఉన్నదా?

**తాత్పర్యం:** సత్ప్రవర్తన అనే సముద్రాన్ని దాటించటానికి ఓడవలె సత్యం ఒప్పి ఉంటుందంటే, సత్యాన్ని మించిన గుణం ఇంకోటి ఉంటుందా?

**విశేషం:** 1. ధర్మప్రీతి వ్యక్తిశీలాన్ని తీర్చిదిద్దుతుంది.

**'ధృతిః క్షమా దయాఽస్తేయం శౌచ మింద్రియనిగ్రహః**

**హ్రీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్'**

అని భారతంలో చెప్పబడింది. ఈ దశధర్మలక్షణాలలో సత్యం మూలభూతమైనది, సారభూతమైనది. సత్ప్రవర్తన దాటరాని సముద్రం వంటిదైతే, దానిని దాటటానికి తోడ్పడే ఓడవంటిది సత్యం. ధర్మజుడి చరిత్రం సత్ప్రవర్తన సాగరం వంటిది. అతడికి సత్యమే తరణోపాయం. అతడికి సత్య ధర్మపాలనం వలన కష్టాలు వచ్చాయి. అయినా అతడు అంతశ్శాంతిని కోల్పోలేదు. ధృతరాష్ట్రుడి స్థితి తద్భిన్నం. (సంపా.)

2. దీనికి మూలం:

**'ఏవమే వాద్వితీయం తద్యద్రాజన్నావ బుధ్యసే**

**సత్యం స్వర్గస్య సోపానం పారావారస్య నౌ రివ' (సం. 5-33-46)**

ఇందులో 'సత్యం స్వర్గ సోపానం' అనే వాక్యాన్ని తిక్కన గ్రహించలేదు. ప్రవర్తనను గురించి చెప్పేటప్పుడు సముద్రాన్ని ఓడతో దాటటం అనే ఉపమానమే సరిపోతుంది. దాటటం వేరు, ఎక్కటం వేరు. అందువలన ఆ వాక్యాన్ని వదలి నట్లున్నారు. (సంపా.)

**క. క్షమియించు వారిఁ గని చా । లమి వెట్టుదు; రైననుం దలంప, ననూన**
**క్షమయ కడు మెఱయు తొడ; వు । త్తమ రూపము గోరువారు దాల్తురు దానిన్. 40**

**ప్రతిపదార్థం:** క్షమియించు వారిన్= క్షమించే గుణం కలవాళ్ళను; కని= చూచి; చాలమి+పెట్టుదురు= అసమర్థత ఆరోపిస్తారు; ఐననున్= అయినప్పటికీ; తలంపన్= ఆలోచించగా; అనూనక్షమ+అ= తక్కువ కాని (గొప్పదైన) ఓర్పే; కడున్= మిక్కిలి; మెఱయు తొడవు= ప్రకాశించే ఆభరణం; దానిన్= ఆ ఆభరణాన్ని; ఉత్తమ రూపము+కోరువారు= సుందరతమమైన ఆకారం కావాలనుకొనే వాళ్ళు; తాల్తురు= ధరిస్తారు.

**తాత్పర్యం:** క్షమించే స్వభావం కలవాళ్ళను చూచి జనులు అసమర్థతను ఆపాదిస్తారు. అయినా, ఆలోచిస్తే, గొప్పదైన క్షమాగుణమే మిక్కిలి మెరిసే ఆభరణం. మంచి సౌందర్యం కావాలనుకొనేవాళ్ళు దానిని ధరిస్తారు.

**విశేషం:** 1. దశ విధ ధర్మ లక్షణాలలో సత్యం తరువాత క్షమ గణనీయమైనది. సత్యం ధర్మహృదయం, క్షమ అలంకారం. పైపద్యానికి మూలం.

**'ఏకః క్షమావతాం దోషో ద్వితీయో నోపలభ్యతే**

**యదేవం క్షమయా యుక్త మశక్తం మన్యతే జనః' (సం. 5-33-47)**

క్షమ గలవారిమీద అసామర్థ్య దోషం ఒకటే తప్ప మరే దోషమూ జనులు ఆరోపించటానికి వీలుకాదు. అది అతడి దోషంగా భావించరాదు. ఓర్పే మానవుడికి శ్రేష్ఠమైన బలం. అసమర్థులకు ఓర్పు గుణమైతే, సమర్థులకు భూషణమౌతుంది. క్షమను వశీకరణ శక్తిగా భావించాలి. క్షమ చేత సాధించలేని దేదీ లేదు అని మూలం క్షమాగుణ ప్రాశస్త్యాన్ని పేర్కొన్నది.

2. క్షమాగుణ సంపన్నుడు ధర్మరాజు. పాండవులు ద్వైతవనంలో ఉన్న సమయంలో ధర్మజుడు ద్రౌపదికి క్షమావీరుడి మాహాత్మ్యాన్ని వర్ణించి చెప్పాడు.

క. **'క్షమగల వానికిఁ బృథ్వీ । సమునకు నిత్యంబు విజయసంసిద్ధి యగున్**

**క్షమయైనవాని భుజవి । క్రమము గడున్ వలయు సర్వకార్యక్షమమై'. (ఆరణ్య.1.223).** అట్టి క్షమాగుణుడిని అసమర్థుడిగా భావించే దుర్యోధన ధృతరాష్ట్రుల భావాన్ని వ్యంగ్యంగా హెచ్చరించాడు; క్షమ లేని వాడు ఉత్తమవ్యక్తి కాజాలడని పేర్కొన్నాడు విదురుడు.

క. **పురుషుండు రెండు దెఱఁగుల । ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ; దా నెయ్యెడలం**
**బరుసములు వలుక కునికిన్; । దురితంబులు వొరయు పనులు దొఱఁగుట కతనన్.** 41

**ప్రతిపదార్థం:** పురుషుండు= మనుష్యుడు; రెండు+తెఱఁగులన్= రెండు విధాల; ధరన్= భూమియందు; ఉత్తముఁడు+ అనఁగన్+పరఁగన్= శ్రేష్ఠుడు అనదగిఉంటాడు; తాను; ఏ+ఎడలన్= ఎక్కడా; పరుసములు+పలుకక+ఉనికిన్= పరుషవాక్కులు పలకకుండటం చేతా; దురితంబులు+పొరయు పనులు= పాపకార్యాలు; తొఱఁగుట కతనన్= విడిచిపెట్టటం చేతా.

**తాత్పర్యం:** ఎక్కడా పరుషవాక్కులు పలకకపోవటం, పాపపు పనులు చేయకపోవటం- ఈ రెండింటిచేతా లోకంలో పురుషుడు ఉత్తముడు అనిపించుకొంటాడు.

**విశేషం:** దీనికి మూలం.

**'ద్వే కర్మణీ నరః కుర్వ న్నస్మిన్‌లోకే విరోచతే,**

**అబ్రువన్ పరుషం కిఞ్చి దసతో నార్థయం స్తథా.' (సం.5.33.50)**

పరుషాలాడటం వాగ్దోషం. పాపపు పనులు చేయటం చేష్టా దోషం. ఆ రెండు దోషాలు చేయనివారు ఉత్తములు. కౌరవులు ఆ రెండు దోషాలు చేశారు. పాండవులు చేయలేదు. అందువలన పాండవులు ఉత్తములు. ధర్మాచరణ ప్రవృత్తిని బోధిస్తున్నట్లున్న ఈ నీతులలో పాండవ గుణస్తుతి వ్యంగ్యంగా వినపడుతున్నది. (సంపా.)

**తే. చెల్లియుండియు సైరణ సేయువతఁడుఁ, । బేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ**
**దనకుఁ గల భంగి నిచ్చు నతండుఁ, బుణ్య । పురుషు లని చెప్పి రార్యులు కురువరేణ్య! 42**

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= కురువంశశ్రేష్ఠుడా, ధృతరాష్ట్రా!; చెల్లి+ఉండియున్= సమర్థుడయి ఉండికూడా; సైరణ+చేయు+ అతఁడున్= శాంతం వహించేవాడూ; పేద+పడియును= బీదవాడయినప్పటికిని; అర్థికిన్= యాచకుడికి; ప్రియముతోడన్= ప్రీతితో; తనకున్+కలభంగిన్= తనకున్నంతలో; ఇచ్చు+అతండున్= ఇచ్చేవాడూ; పుణ్యపురుషులు+అని= పుణ్యాత్ములని; ఆర్యులు= పెద్దలు; చెప్పిరి= అన్నారు.

**తాత్పర్యం:** కురువంశోత్తమా, ధృతరాష్ట్రా! సమర్థుడయి ఉండికూడా శాంతం వహించేవాడూ, బీదవాడయినప్పటికీ తనకున్నంతలో ఇచ్చేవాడూ పుణ్యాత్ములని పెద్దలన్నారు.

**విశేషం:** దీని మూల శ్లోకం-

**'ద్వా విమౌ పురుషౌరాజన్! స్వర్గస్యోపరి తిష్ఠతః।**

**ప్రభు శ్చ క్షమయా యుక్తో । దరిద్ర శ్చ ప్రదానవాన్'. (సం.5-33-53)** అరణ్యాజ్ఞాత వాస నియమాలను పాటించిన పాండవులలో ఈ రెండు గుణాలూ ప్రకాశించాయి. (సంపా.)

**ఆ. పాడి దప్పకుండఁ బడయు సొమ్ములకు న । పాత్రములకు నీగి, పాత్రములకుఁ**
**బెట్ట కునికి యనఁగ నెట్టన రెండు వి । ధములఁ గీడు దొడరు ధరణినాథ! 43**

**ప్రతిపదార్థం:** ధరణినాథా!= రాజా, ధృతరాష్ట్రా!; పాడి+తప్పక+ఉండన్= న్యాయం అతిక్రమించకుండా; పడయు సొమ్ములకున్= గడించే ధనములకు; అపాత్రములకున్= అనర్హులకు; ఈగి= ఇవ్వటం; పాత్రములకున్= అర్హులకు; పెట్టక+ఉనికి= ఇవ్వకపోవటం; అనఁగన్; రెండు విధములన్; కీడు= హాని; నెట్టన= తప్పక; తొడరున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! న్యాయబద్ధంగా సంపాదించిన ధనాన్ని అనర్హులకు ఇవ్వటమూ, అర్హులకు ఇవ్వకపోవటమూ అనే వాటివలన రెండు విధాలా కీడు కలుగుతుంది.

**విశేషం:** దీనికి మూలం:

**'న్యాయాగతస్య ద్రవ్యస్య బోద్ధవ్యౌ ద్వావతిక్రమౌ**

**అపాత్రే ప్రతిపత్తి శ్చ పాత్రే చాప్రతిపాదనమ్'. (సం. 5-33-54)**

ఈ నీతి కథాసందర్భంలో సవ్యంగా, అపసవ్యంగా కూడా ధృతరాష్ట్రుడికి తగిలి వస్తుంది. ఎట్లాగంటే- న్యాయపరంగా వచ్చిన పైతృకమైన రాజ్యాన్ని పాత్రులైన పాండవులకు ఇవ్వకపోవటం, అపాత్రులైన కౌరవులకు దక్కేటట్లు ప్రయత్నించటం అనే రెండు దోషాలు ధృతరాష్ట్రుడికి తగిలాయి. ఇకపోతే అన్యాయార్జిత ద్రవ్యమైన పాండవ రాజ్యాన్ని కూడా పాత్రులైన పాండవులకు చెందకుండా చేయటం, ఆపాత్రులైన కౌరవులకే దక్కేటట్లు చూడటం అనే దోషద్వయం కూడా ధృతరాష్ట్రుడికి చెందింది. కాబట్టి రెండు విధాలా ద్విగుణీకృతమైన కీడు గలుగుతుందని ధృతరాష్ట్రుడిని విదురుడు వ్యంగ్యంగా హెచ్చరించాడు. (సంపా.)

**తే. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు । ప్రల్లదంబును, దండంబుఁ బరుసఁదనము**
**సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేఁత । యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల. 44**

**ప్రతిపదార్థం:** వెలఁది= స్త్రీ; జూదంబు; పానంబు= మద్యసేవనం; వేఁట; పలుకు ప్రల్లదంబును= వాక్పారుష్యం; దండంబు పరుసఁదనమున్= దండపారుష్యం- అతిక్రూరంగా దండించటం; నిష్ప్రయోజనముగన్ సొమ్ము వమ్ము+చేఁత= నిరర్థకంగా డబ్బు పాడుచేయటం; అనెడు; సప్త వ్యసనములన్= ఏడు వ్యసనాలలోను; తగులన్+చనదు= ఆసక్తి చూపరాదు.

**తాత్పర్యం:** స్త్రీ, జూదం, త్రాగుడు, వేట, వాక్పారుష్యం, దండపారుష్యం, డబ్బు వృథా చేయటం అనే ఏడు వ్యసనాలయందు ఆసక్తి చూపరాదు.

**విశేషం:** అన్ని ప్రతులలోనూ 'దండంబుఁ, బరుసఁదనము' అని రెండుగా చూపబడ్డాయి. అది సరికాదు. అవి రెండయితే వ్యసనాలు ఎనిమిది అవుతాయి. అవి ఏడే కదా! దండంబు పరుసఁదనము అంతా ఒక్కటే. దానికి దండపారుష్యమని అర్థం. దండపారుష్యమంటే అతిక్రూరంగా దండించటం. మూలంలో 'మహచ్చదణ్డ పారుష్యం' అనే ఉన్నది. దండం వేరుగానూ, పారుష్యం వేరుగానూ లేదు.

మూలం: **'స్త్రి యోఽక్షా మృగయా పానం వాక్పారుష్యం చ పఞ్చమమ్,**
**మహచ్చ దణ్డపారుష్య మర్థదూషణ మేవ చ.'**

**తే. తగిన వేషంబు, దనుఁ దాన పొగడుకొనమి । నొచ్చియును గీడు వలుకమి, యిచ్చి వగవ**
**కునికి, దన కెంత నడవకయున్నఁ బథము । దప్పకుండుట నడవడి కొప్పు సేయు. 45**

**ప్రతిపదార్థం:** తగిన వేషంబు= తన హోదాకు ఉచితమైన వేషమూ; తనున్+తాను+అ= తన్ను తానే; పొగడుకొనమి= స్తుతించుకొనకపోవటం; నొచ్చియును+కీడు+పలుకమి= బాధపడికూడా కీడు పలకకపోవటం; ఇచ్చి వగవక+ఉనికి= దానం చేసి బాధపడకపోవటం; తనకున్+ఎంత నడవక+ఉన్నన్= తనకెంత గతి లేకున్నా; పథము+తప్పక+ఉండుట= మార్గం తప్పకుండడం; నడవడికిన్= ప్రవర్తనకు; ఒప్పు+చేయున్= మంచి కలిగిస్తాయి.

**తాత్పర్యం:** తన హోదాకు ఉచితమైన వేషధారణా, తనను తానే స్తుతించుకొనకపోవటమూ, బాధపడి కూడా కీడు పలుకక పోవడమూ, దానం చేసి- ఎందుకు చేశానా అని బాధపడకపోవటమూ, తన కెంత గతి లేకపోయినా ధర్మమార్గం అతిక్రమించకపోవటమూ ప్రవర్తనకు మేలు కలిగిస్తాయి. సత్ప్రవర్తన అనిపించుకొంటుంది.

**క. చెలిమియు, సంభాషణమును । బలిమి, వివాదంబుఁ, ద్రోపుఁ బాడియుఁ దమయం**
**తలవారితోన తగు; నధి । కుల, హీనుల తోడనైనఁ గొఱ గా దధిపా! 46**

**ప్రతిపదార్థం:** అధిపా= రాజా, ధృతరాష్ట్రా! చెలిమియున్= స్నేహమూ; సంభాషణమును= మాటా; బలిమి= బలమూ; వివాదంబున్= వాదించటమూ; (వివాహంబున్= పెండ్లీ - సూ.ని.); త్రోపుఁబాడియున్= యుద్ధమూ; తమ+అంతలవారితోన్+అ= తమతో సమానులైనవారితోనే; తగున్= ఒప్పుతుంది; అధికుల, హీనుల తోడన్+ఐనన్= తమకంటె గొప్పవారితోనూ, తక్కువవారితోనూ అయితే; కొఱ+కాదు= యుక్తంకాదు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! స్నేహమూ, మాటా, బలమూ, వివాదమూ (వివాహము), యుద్ధమూ తమతో సమానులైనవారితోనే ఒప్పుతుంది కాని, తమకంటె అధికులతోకాని, అల్పులతోకాని యుక్తం కాదు.

**విశేషం:** 'వివాదంబు' అనే దానికి బదులుగా 'వివాహంబు' అని సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఉదాహృతమైన చోట ఉన్నది. అది మూలానుగుణం కూడా. **"సమై ర్వివాహం కురుతే న హీనైః"** అని మూలం.

**తే. కొంచె మైనను దగఁ బంచి కుడువ మేలు; । పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము**
**ననుభవించుట హితము; శత్రునకు నైన । నిచ్చుటయ లెస్స యడిగినయెడ నృపాల! 47**

**ప్రతిపదార్థం:** నృపాల!= రాజా!; ధృతరాష్ట్రా!; కొంచెము+ఐనను= తక్కువ ఉన్నప్పటికీ, తగన్= ఒప్పుగా; పంచి= విభజించి, కుడువన్= అనుభవించటం; మేలు= మంచిది; పనుల+ఎడన్= పనులు చేసేటప్పుడు; దుఃఖము+ఓర్చి= కష్టం సహించి; అల్పంబు సుఖమున్= ఇంచుక సుఖాన్ని; అనుభవించుట; హితము= మేలు; అడిగిన+ఎడన్= అడిగితే; శత్రునకున్+ఐనన్; ఇచ్చుట+అ= ఇవ్వటమే; లెస్స= మంచిది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఎంత తక్కువ ఉన్నప్పటికీ దానినే ఒప్పుగా ఇతరులకు పంచిపెట్టి అనుభవించటం మంచిది. పనులు చేసేటప్పుడు కష్టానికి సహించి, ఇంచుక సుఖాన్ని అనుభవించటం మేలు. అడిగితే శత్రువుకైనా ఇవ్వటమే మంచిది.

**విశేషం:** దీనికి మూలశ్లోకం-

**'మితం భుంక్తే సంవిభజ్యాశ్రితేభ్యో । మితం స్వపి త్యమితం కర్మ కృత్వా**
**దదా త్యమిత్రే ష్వపి యాచిత స్సన్ । తమాత్మవంతం ప్రజహాత్యనర్థాః' (సం.5-33-55)**

అడిగితే శత్రువుకైనా ఇవ్వటం మంచిది- అనే నీతి ఇందులో ప్రత్యేకంగా పేర్కొనదగింది. పాండవులు తమ్ముడి బిడ్డలు. వారు తమకు న్యాయంగా రావలసిన రాజ్యభారం తిరిగి ఇమ్మని అడిగినప్పుడు ఇవ్వకపోవటం మహాదోషమని విదురుడి హితవు. (సంపా.)

**క. తను లోకము గొనియాడఁగ । విని యుబ్బఁడు సజ్జనుండు; వెండియుఁ గడు మే**
**లొనరించుఁ; గీ డొకించుక । యును దసదెసఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్. 48**

**ప్రతిపదార్థం:** సత్+జనుండు= మంచివాడు; తనున్= తనను; లోకము= లోకులు; కొనియాడఁగన్= పొగడితే; విని; ఉబ్బఁడు= పొంగిపోడు; వెండియున్= మళ్ళీ ఇంకా; కడున్= మిక్కిలి; మేలు+ఒనరించున్= మేలు చేస్తాడు; ఒక+ఇంచుకయును+ కీడు= అపకారం ఏకొంచెమూ; తన దెసన్= తనయందు; తోఁపన్+ఈక= కనబడనీయకుండా; ఉడుపుచున్+వచ్చున్= పోగొట్టుతూ ఉంటాడు.

**తాత్పర్యం:** లోకం తనను పొగడితే సజ్జనుడు విని పొంగిపోడు. ఇంకా ఎంతో మేలు చేస్తాడు. తానుమాత్రం ఏ కొంచెం కీడుకూడా చేయనివిధంగా ప్రవర్తిస్తాడు. ఇతరుల కీడును పోగొట్టుతూ ఉంటాడు.

**విశేషం:** దీనికి మూల శ్లోకం:

**'న హృష్య త్యాత్మసమ్మానే నావమానేన తప్యతే,**

**గాంగో హ్రద ఇవాక్షోభ్యో య స్స పండిత ఉచ్యతే'. (సం.5-33-56)**

ఇందులోని గంగాహ్రదం తోటి ఉపమానం తిక్కన గ్రహించలేదు. అక్షోభ్యంగా ఉంటాడు అన్నదాని కంటె ధర్మరాజులో కనపడే విశిష్ట లక్షణం- "గడు మేలొనరించుఁ, గీడొకించుకయును దనదెసఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్' అనే దానిని పేర్కొనటం గమనార్హం. ఇది సజ్జనుడి గురించి చెప్పుకొనే చక్కని సూక్తి. ధర్మరాజు గుణాలకు అక్షర నీరాజనం. (సంపా.)

**వ. ఇట్టి చందంబులు ధర్మనందనునకుం గల' వని పలికి, విదురుం డది ప్రసంగంబుగాఁ బాండవులఁ బ్రశంసించి, 'నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి, యిప్పు డుపేక్షించి, వారలు వెలినుండ నూరకుండం దగునే? తగుపాలిచ్చి, వారి రావించి, నీ కొడుకుల తోడివారింగా నడపుట యుచితంబు, మీరును వారును నొక్కటియై యున్న మీదిక్కు దేవతలకుం దేఱి చూడరా' దనిన, నమ్మాటలు వెడవెడ యూఁకొని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** ఇట్టి చందంబులు= ఇట్టి విధాలు; ఈ లక్షణాలు; ధర్మనందనునకున్+కలవు= ధర్మరాజుకున్నాయి; అని; పలికి, విదురుండు; అది ప్రసంగంబుగాన్= ఆ సందర్భంగా; పాండవులన్; ప్రశంసించి= స్తుతించి; నీవు; వారలన్; పెనిచి= పెంచి; మానుసులన్+చేసి= మనుష్యులను చేసి- పెద్దవాళ్ళను చేసి; రక్షించి= కాపాడి; ఇప్పుడు; ఉపేక్షించి= ఊరకుండి; వారలు; వెలిన్+ఉండన్= వేరే ఉంటూంటే; ఊరక+ఉండన్+తగునే= మాటాడకపోవటం తగునా?; తగుపాలు+ఇచ్చి= న్యాయంగా ఇవ్వవలసిన భాగం ఇచ్చి; వారిన్; రావించి= రప్పించి; నీకొడుకుల తోడివారిన్+కాన్= నీ కొడుకులతో సమానంగా; నడపుట= నడపటం- చూడటం; ఉచితంబు= మంచిది; మీరును; వారునున్; ఒక్కటి+ఐ+ఉన్నన్= ఏకమయి ఉంటే; మీ దిక్కు= మీకేసి; దేవతలకున్= దేవతలకు కూడా; తేఱి చూడన్ రాదు= తేరిచూడటం కష్టం; అనినన్; ఆ+మాటలకున్; వెడవెడ= ఇంచు కించుక; ఊఁకొని= ఊకొట్టి; ధృతరాష్ట్రుండు; విదురునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లాంటి లక్షణాలు ధర్మరాజు కున్నాయి' అని పలికి విదురుడు ఆ సందర్భంలో పాండవులను పొగడి, 'నీవు వాళ్ళను పెంచి పెద్దవాళ్ళను చేసి రక్షించి, ఇప్పుడు మాని, వాళ్ళు వేరే ఉంటూంటే ఊరుకొనవచ్చునా? వాళ్ళకు న్యాయంగా ఇవ్వవలసిన భాగం వాళ్ళకిచ్చి, వాళ్ళను రప్పించి, నీ కొడుకులతో సమానంగా చూడటం మంచిది. మీరూ వాళ్ళూ ఒక్కటయి ఉంటే మీకేసి దేవతలు కూడా తేరి చూడలేరు' అనగా, ఆ మాటలకు కొంచెంగా ఊకొట్టి ధృతరాష్ట్రుడు విదురుడితో ఇట్లా అన్నాడు :

**విశేషం:** ధర్మరాజు సంజయుడితో ఏమన్నాడో తెలియక, సంజయుడు తనను ఎందుకు ముఖం మీద తిట్టినట్లు మాటలాడాడో తెలియక ధృతరాష్ట్రుడు వేదనపడి విదురుడిని దాని కారణం వివరించుమన్నాడు. విదురుడు లోకనీతిని, ధర్మప్రీతిని పాటించే సజ్జనుల లక్షణాలను వివరించి, అవి ధర్మరాజులో నిండుగా ఉన్నాయని పేర్కొన్నాడు. కౌరవులయం దా గుణాలు లేవని తేల్చిచెప్పాడు. తులనాత్మకంగా ఈ అంశాలను వితర్కించుకొని పాండవులకు రావలసిన భాగాన్ని ఇచ్చి, వారిని దగ్గరికి తీసికొని, కలసి మెలసి స్నేహంతో ఉండుమనీ, కౌరవ పాండవులు సమైక్యంగా ఉంటే వారిని దేవతలు కూడా తేరిపార చూడలేరనీ హితవు చెప్పాడు. అదే ధర్మరాజు హృదయమన్నాడు. అదే ధృతరాష్ట్రుడి కర్తవ్యమన్నాడు. అదే ధృతరాష్ట్రుడి మనశ్శాంతికి మందని చెప్పాడు. ఈ మాటలు ధృతరాష్ట్రుడికి మ్రింగుడు పడలేదు. ఔనని తల ఊపలేడు; కాదని త్రోసివేయలేడు. ఆ మానసిక స్థితినే 'వెడవెడ ఊకొట్టే' అభినయంతో ప్రదర్శించాడు. (సంపా.)

**తే. 'హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగు దీవ; । ధర్మసుతు చందమును విదితంబు నీకు;**
**నట్లు గావున నెఱిఁగింపు మఖిలకార్య । జాతమును జిత్తతాపోపశమము గాఁగ.' 50**

**ప్రతిపదార్థం:** ఈవు+అ= నీవే; నాకున్; హితమున్= మేలయినదీ; కర్తవ్యమును= చేయదగినదీ, ఎఱుఁగుదు(వు); నీకున్, ధర్మసుతు చందమును= ధర్మరాజు పద్ధతీ; విదితంబు= తెలిసినది; అట్లు+కావునన్= అందుచేత; చిత్త తాప+ఉపశమము+ కాఁగన్= మనోవేదన పోయేటట్లు; అఖిల కార్య జాతమును= చేయదగినవాని సమూహమునంతనూ; ఎఱింగింపు(ము)= తెలుపుము.

**తాత్పర్యం:** 'నాకు మేలయినదీ, కర్తవ్యమయినదీ నీవే ఎరుగుదువు. ధర్మరాజు పద్ధతి కూడా నీకు తెలుసు. అందుచేత నా మనస్తాపం అడగేటట్టు నేను చేయవలసినదంతా చెప్పుము.'

**విశేషం:** ధృతరాష్ట్రుడు నివురు కప్పిన నిప్పు; విదురుడి మాటలు తనకు రుచించలేదని సూటిగా చెప్పడు. వక్రంగా వ్యక్తం చేస్తాడు. ఈ పద్యంలోని మూడు వాక్యాలలో మూడు మెలికలున్నాయి. 1.విదురుడు ధృతరాష్ట్రుడికి (పైపద్యంలో) చెప్పింది హితమూ, కర్తవ్యమే. కాని, ధృతరాష్ట్రుడు తనకు హితాన్నీ, కర్తవ్యాన్నీ చెప్పుమని మరల కోరుతున్నాడు. అంటే- ముందు చెప్పినవి తాను అంగీకరించటం లేదని సున్నితంగా సూచించి, విదురుడి హితవును వ్యంగ్యంగా త్రోసిపుచ్చుతున్నాడన్నమాట. ఇది మొదటి మెలిక. 2. ధర్మరాజు పద్ధతి కూడా విదురుడికి బాగా తెలుసు అని పేర్కొనటంలో గల అంతరార్థం - ధర్మరాజు మెత్తని పులి అనీ, సజ్జనుడుగా కనపడ్డా యుద్ధం చేయాలనీ, రాజ్యాన్ని పొందాలనీ స్థిరసంకల్పతో ఉన్నాడనీ, సమయం కొరకు వేచి ఉన్నాడనీ తెలిసికొనటం ముఖ్యమని సూచన. ఇది రెండవ మెలిక. 3.ధృతరాష్ట్రుడికి చిత్తోపశాంతి ఎట్లా ఔతుందో కూడా విదురుడు తెలిసికొని హితవు చెప్పాలనే సున్నితమైన హెచ్చరిక మూడవ మెలిక. తన మన సెరిగి, తన కోర్కె తీరే విధానాన్ని వివరంగా తెలుపుమని విదురుడిని వేడుకొన్నాడు. ధృతరాష్ట్రుడి దృక్పథంతో ఆలోచించి అతడికి హితవు కలిగేటట్లు, మనస్తాపం తీరేటట్లు భావి కార్యక్రమం ఎట్లా చెయ్యాలో సూచించాలని అతడి ఆశయం. అంటే ప్రచ్ఛన్నంగా ధర్మరాజు వ్యూహానికి ప్రతివ్యూహ మేమిటో సూచించాలని తాత్పర్యం. (సంపా.)

**క. అనుడు విదురుఁ డాతని కి । ట్లను; 'నిమ్మెయి నన్ను నొత్తి యడిగినఁ జెప్పం**
**జను నున్న రూపు; సెప్పెద । విను మవధానంబు తోడ విమలవిచారా! 51**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగానే; విదురుఁడు; ఆతనికిన్; ఇట్లు+అనున్; విమల+విచారా!= నిర్మలమైన భావాలు కలవాడా! ధృతరాష్ట్రా!; ఈ+మెయిన్= ఈ విధంగా; నన్నున్; ఒత్తి+అడిగినన్= నొక్కి అడిగితే; ఉన్న రూపు= ఉన్న సంగతి; చెప్పన్+ చనున్= చెప్పాలి; అవధానంబు తోడన్= శ్రద్ధగా; వినుము; చెప్పెదన్.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అడగగానే విదురుడు అతడితో ఇట్లా అన్నాడు: 'ఈ విధంగా నన్ను మరీ మరీ అడిగితే ఉన్న సంగతి చెప్పాలి. నిర్మలభావుడవైన ధృతరాష్ట్రా! శ్రద్ధగా వినుము చెప్పుతాను'.

**విశేషం:** ఒత్తి అడిగితే ఉన్న సంగతి చెప్పవలసి వస్తుంది. ఈ వాక్యం తెలుగు జాతీయంగా అమరింది. ఒత్తి అడగటమంటే- గట్టిగా అడగటం, నొక్కి అడగటం, బలవంతపెట్టి అడగటం, మరీ మరీ అడగటం, కావాలని అడగటం- అనే అర్థాలున్నాయి. ఆ అర్థాలన్నీ ఈ సందర్భంలో సార్థక మౌతాయి. మూలంలో- "అపృష్ట స్తన్యతత్ బ్రూయాత్ యస్య నేచ్ఛేత్ పరాభవమ్".

'రాజు యొక్క పరాజయాన్ని కోరని మిత్రుడు, భృత్యుడు, ఆ రాజు అడగకుండానే అతడికి మంచిదేదో, చెడ్డదేదో, శ్రేయస్కరమైనదేదో, ముప్పు తెచ్చేదేదో తప్పక చెప్పాలి. కాబట్టి కౌరవుల హితమేదో, శ్రేయస్కరమేదో, ధర్మయుక్తమైనదేదో చెప్పుతాను. సావధానంగా వినుము' అని విదురుడు పలికాడు. ఈ తాత్పర్యాన్నంతా 'ఉన్నమాట చెప్పవలసి వస్తుంది సుమా!' అనే తెలుగు జాతీయంతో ధ్వనిమయం చేయటమే కాకుండా - నీకు నిజం చెప్పటం ముఖ్యం కాని, కళ్ళనీళ్ళు తుడిచే కల్లబొల్లి మాటలను ముఖప్రీతి కలిగించే ముచ్చట్లు చెప్పటం నా అభిమతం కాదని సున్నితంగా పలికాడు. ధృతరాష్ట్రుడి వక్రపద్ధతికి దీటుగా విదురుడు వాచ్యమైన సూటి పద్ధతిని అనుసరించాడు. ఇందులో మరొక గడుసుదనం కూడా ప్రదర్శించాడు. అంతవరకూ దీటుగా విదురుడు వాచ్యమైన సూటి పద్ధతిని అనుసరించాడు. ఇందులో మరొక గడుసుదనం కూడా ప్రదర్శించాడు. అంతవరకూ నీతులు చెప్పినట్లు చెప్పి, అవన్నీ పాండవుల సుగుణాలుగా వ్యాఖ్యానించి, ఆ సుగుణాలు లేని కౌరవుల ప్రవృత్తులను వ్యంగ్యంగా నిరసించాడు. అదే సంగతిని మరల చెప్పవలసి వస్తే- ధృతరాష్ట్రుడి యొక్క కౌరవుల యొక్క దుర్గుణాలను, ప్రవర్తనలను ఉన్నవి ఉన్నట్లుగా కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పవలసి వస్తుంది అని అంటూ 'నామాటలు సావధానంగా వినుము' అని హెచ్చరించాడు. దోషాలను తెలిసికొని విమలవిచారుడవు కమ్మని సంబుద్ధితో సూచించాడు. (సంపా.)

**ఉ. డక్కెను రాజ్యమంచు నకటా! యిటు దమ్ముని భాగ మీక నీ**
**వెక్కటి మ్రింగఁ జూచె; దది యె ట్లఱుగున్? విను, మీను లోలతన్**
**గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు సూవె యి;**
**ట్లుక్కివుఁడైన నీ కొడుకు నుల్లము నున్నటు లాడఁగూడునే?' 52**

**ప్రతిపదార్థం:** అకటా!= అయ్యో!; రాజ్యము; డక్కెను= దక్కింది; అంచున్; ఇటు= ఇట్లా; తమ్ముని భాగము+ఈక= తమ్ముడి వాటా ఇవ్వక; నీవు; ఎక్కటిన్= ఒక్కడవే; మ్రింగన్+చూచెదు(దవు)= మ్రింగాలని చూస్తున్నావు - కాజెయ్యాలని చూస్తున్నావు, అది ఎట్లు+అఱుగున్= అది ఎట్లా జీర్ణమవుతుంది?; విను(ము); ఇట్లు= ఈ విధంగా తమ్ముడిభాగం కూడా మ్రింగాలని చూడటం; మీను= చేప; లోలతన్= పేరాసతో; గ్రక్కునన్= శీఘ్రంగా; ఆమిషంబు చవిన్= మాంసపురుచితో; గాలమున్; మ్రింగిన చాడ్పు+చూవె= మ్రింగిన విధం సుమీ; ఉక్కివుఁడు+ఐన= వంచకుడైన; నీ కొడుకు+ఉల్లము+ఉన్న+అటులు= నీ కుమారుడైన దుర్యోధనుడి మనసులో ఉన్నట్లు; ఆడన్+కూడునే?= చెప్పటం చెల్లుతుందా?

**తాత్పర్యం:** రాజ్యం చేతికి చిక్కింది గదా అని, అయ్యో! తమ్ముడి వాటా ఇవ్వక నీవు ఒక్కడవే మ్రింగివేయాలని చూస్తున్నావు. అది ఎట్లా అరుగుతుంది? విను. ఇది చేప పేరాసతో మాంసంతోపాటు శీఘ్రంగా గాలాన్ని కూడా మ్రింగటంవలె ఉంటుంది. కపటిఅయిన నీ కొడుకు మనస్సులో తలచినట్లంతా మాట్లాడితే అట్లా నెరవేరుతుందా?'

**విశేషం:** అలం: ఉపమ. నిజం చెప్పుతున్నాను వినుమని విదురుడు నిష్ఠురంగానూ, ముక్కుమీద గుద్దినట్లుగానూ ఉపమాలంకార సుందరంగానూ చెప్పాడు. అందులో తెలుగుదనం ఒలకపోశాడు. 'వెక్కటి మ్రింగఁజూచెదు' 'అది యెట్లరుగున్' గాలము మ్రింగిన చాడ్పు' ఈ పలుకుబడి తెలుగువారిది. ఈ భావాలు మూలంలోనూ ఉన్నాయి. (చూడు.5-34-13,14); కాని తెలుగులో పొందికగా కుదిరాయి. పేరాసను చేపగాలం మ్రింగటంతో పోల్చి చెప్పటం- జనంలో బాగా వ్యాప్తి చెంది ఉన్నది. ఒకరికి పెట్టకుండా ఒంటిగా తినే తిండి అరగదని తెలుగువారి జాతీయం. ఈ మాటలలో ఎంత చనువు ఉన్నదో అంత చురుకు కూడా ఉన్నది. (సంపా.)

**క. అన విని నిరుత్తరుం డయి । మనుజేంద్రుఁడు గొంతసేపు ప్రూన్పడి తలఁపుల్**
**పెనఁగొన, నిద్రాహానిం । దను వలయఁగ విదురుతోడఁ దా నిట్లనియెన్: 53**

**ప్రతిపదార్థం:** అనన్= విదురు డట్లా అనగా; మనుజ+ఇంద్రుఁడు= రాజు-ధృతరాష్ట్రుడు; విని; నిరుత్తరుండు+అయి= సమాధానం లేనివాడయి; కొంతసేపు; ప్రూన్పడి= నిశ్చేష్టుడయి; తలఁపుల్= ఆలోచనలు; పెనఁగొనన్= పెనగులాడగా; నిద్రాహానిన్= నిద్ర లేకపోవటం చేత; తనువు= శరీరం; అలయఁగన్= బడలగా; తాను; విదురు తోడన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** విదురుడి మాటలు విని ధృతరాష్ట్రుడు మాటలాడక, కొంతసేపు నిశ్చేష్టుడై, భావాలు ఒకదానితో ఒకటి పెనగులాడగా, నిద్ర లేకపోవటంచేత శరీరం బడలి, విదురుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** ప్రూన్పడటం సాత్త్విక భావం. కొయ్యబారిన ధృతరాష్ట్రుడు తేరుకొన్నాడు. దానికి రెండు దశలు పట్టింది. 1.ఏమి బదులు పలకాలో తెలియక భావాలు అతడిలో పెనగులాడాయి. 2. ఆ తరువాత సమాధానం చెప్పలేని అలసట నిద్రలేని అలసటను ముందుకు తెచ్చింది. దానితో మారుపలుకకుండా మంచి మాటలు వింటూ ఉండే స్థితిని ధృతరాష్ట్రుడు కోరుకొన్నాడు. ఇది ప్రూనుపడ్డ శరీరావస్థ గల మానసికావస్థను వ్యక్తం చేస్తున్నది. ఇది తిక్కన నాటకీయతకు ఉదాహరణం. (సంపా.)

**క. 'ఇందాఁక నీదు పలుకుల । డెందము తాపంబు గొంత డిందుపడియె; నా**
**కుం దగ నయానయంబుల । చందంబులు సెప్పుచుండు సౌజన్యనిధీ!' 54**

**ప్రతిపదార్థం:** సౌజన్య నిధీ!= మంచితనానికి నిధానమైనవాడా! విదురా!; ఇందాఁకన్= ఇప్పటివరకూ; నీదు పలుకులన్= నీ మాటల చేత; డెందము తాపంబు= (నా) మనస్తాపం; కొంత= కొంచెం; డిందు పడియెన్= తగ్గింది; నాకున్; తగన్= ఒప్పుగా; నయ+అనయంబుల చందంబులు= నీత్యవినీతుల రీతులు; చెప్పుచున్+ఉందు(ము)= చెపుతూ ఉండుము.

**తాత్పర్యం:** 'సౌజన్యానికి నిధివైన విదురా! ఇప్పటి వరకూ నీ మాటల వలన నా మనస్తాపం కొంచెం ఉపశమించింది. నీవే నాకు నీత్యవినీతుల రీతులు ఒప్పుగా చెప్పుతూ ఉండుము.'

**విశేషం:** ధృతరాష్ట్రుడు వినగోరుతున్నవి నయ+అనయములు. నయమంటే పొందించేది, నీతి, అనయము- అంటే పొందించనిది అవినీతి. ఒక కార్యం పొందుపడే నీతిని, పొందుపడని అవినీతిని ప్రక్కప్రక్కన చెప్పుమని రాజు కోరిక. ఇకపై విదురనీతి బోధ ఈ రీతిలో సాగుతుందని సూచన. (సంపా.)

**వ. అనిన విని విదురుం డిట్లనియె: 55**

**తాత్పర్యం:** అని అడుగగా విని విదురుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి । చేటె కాదు; విత్తు చేటుఁ గలుగుఁ;**
**బక్వమైనఁ గొనిన ఫల మించుఁ, జెడదు బీ । జంబుఁ; గార్యసిద్ధిచంద మిట్లు. 56**

**ప్రతిపదార్థం:** తనియన్= తృప్తిగా, బాగుగా; పండకుండన్= పక్వానికి రాకుండానే; మును= ముందుగా; కోసికొనన్; చవి చేటె+కాదు= రుచి లేకపోవటమే కాదు; విత్తు చేటున్+కలుగున్= విత్తనం కూడా నశిస్తుంది; పక్వము+ఐనన్= పండితే;

కొనినన్= స్వీకరిస్తే; ఫలము= పండు; ఇంచున్= బాగుంటుంది; బీజంబున్= విత్తనం కూడా; చెడదు= పోదు; కార్యసిద్ధి చందము+ఇట్లు= కార్యం సాఫల్యం పొందే రీతి ఇదీ.

**తాత్పర్యం:** బాగా ముగ్గకుండానే ముందే కోస్తే పండు రుచిగా లేకపోవటమే కాదు, విత్తనం కూడా పనికిరాదు. పక్వమైన తరువాత కోస్తే పండు బాగుంటుంది; విత్తనం కూడా చెడదు. కార్యం సఫలమయ్యే విధం కూడా ఇంతే.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. విశేషాంశం సామాన్యాంశం చేత సమర్థింపబడింది. కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం. ఫల విషయం విశేషం. కార్యసిద్ధి విషయం సామాన్యం. మూలంలోని రెండు శ్లోకాల తాత్పర్యాన్ని తిక్కన ఒక ఆటవెలదిలో సూక్తివలె స్ఫూర్తిమంతంగా రచించాడు. మూలం:

> **"వనస్పతే రపక్వాని ఫలాని ప్రచినోతి యః ।**
> **స నాప్నోతి రసం తేభ్యో బీజం చాస్య వినశ్యతి ॥**
> **యస్తు పక్వ ముపాదత్తే కాలే పరిణతం ఫలమ్ ।**
> **ఫలాద్రసం స లభతే, బీజా చ్చైవ ఫలం పునః ॥ (సం. 5-34-15,16)**

ఇది లోకనీతి, రాజనీతి కూడా. అపరిపక్వస్థితిలో ఫలాన్ని కోయరాదని నీతి. దాని వలన రససిద్ధి ఉండదు. బీజసిద్ధి కలుగదు. రససిద్ధి స్వీయప్రయోజన లబ్ధి. బీజసిద్ధి లోకహితసిద్ధి. ఈ రెండూ ఒక కార్యం సహజంగా కాలం చేత పరిపక్వం చెందటంమీద ఆధారపడి ఉంటాయి. పరిణత ఫలం వలన రససిద్ధి, కార్యసిద్ధి కలుగుతుంది. ఈ నీతిలోని అపరిపక్వస్థితి దుర్యోధనుడి నీతిని సూచిస్తున్నది. పరిపక్వ స్థితి ధర్మజుడి నీతిని ధ్వనింపచేస్తున్నది. దుర్యోధనుడు అత్యాశతో పాండవ సంపదను మాయాద్యూత నెపంతో హరించి దాని ఫలాన్ని శాశ్వతంగా అనుభవించలేని స్థితిని కల్పించుకొనటమేకాక, దాని వలన సత్ఫలితా లివ్వ గలిగిన బీజాలను (హేతువులను) నైతికంగా ధ్వంసం చేసికొన్నాడు. దాని వలన దుర్యోధనుడు అపహరించిన పాండవ సంపద అపరిపక్వ ఫలం వంటిది. ధర్మరాజు రాజ్యాన్ని కోల్పోయినా అరణ్యాజ్ఞాతవాసాలు నిర్వహించి, తన యుద్ధోద్యోగానికి తగిన కాలపరిపక్వస్థితిని కల్పించుకొంటున్నాడు. సామదాన భేద దండోపాయాలనే బీజాలు నయనీతితో ఫలించేటట్లు కార్యాన్ని పరిపక్వ స్థితికి తెచ్చుకొంటున్నాడు. నయనీతి ధర్మజుడిది; అవినయనీతి దుర్యోధనుడిది. ఇవే ఈ పద్యంలోని నయానయాలు. (సంపా.)

**తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ, దేఁటి । పువ్వుఁ దేనియ గొనియెడు పోల్కి నెదురు**
**గందకుండఁగఁ గొనునది కార్యఫలము; । బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువఁ జనదు. 57**

**ప్రతిపదార్థం:** మాలకరి= దండలు కట్టేవాడు; పుష్పములు= పువ్వులు, కోయు మాడ్కిన్= కోసే విధంగా; తేఁటి= తుమ్మెద; తేనియ= మకరందం; కొనియెడు పోల్కిన్= ఆస్వాదించే రీతిగా; ఎదురు= ఎదుటివాడు; కందక+ఉండంగన్= బాధపడకుండా; కార్యఫలమున్= ఒక పనియొక్క ఫలితాన్ని; కొనునది= పొందాలి; బొగ్గులకున్+పోలెన్= బొగ్గుల కొరకు వలె; మొదలు+అంటన్= పూర్తిగా; పొడువన్+చనదు= నరికివేయగూడదు.

**తాత్పర్యం:** దండలు కట్టేవాడు చెట్టునుండి పువ్వులు కోసే విధంగా, తుమ్మెద పువ్వులలోని మకరందం పీల్చుకొనే రీతిగా, ఎదుటివాడు బాధపడకుండా ఒక పని ఫలితాన్ని పొందాలి. అంతేకాని, బొగ్గుల కొరకు మొదలంటా నరికివేయగూడదు.

**విశేషం:** అలం: ఉపమ. ఉపమలు మూడు ఉన్నాయి కనుక, మాలోపమ. 1.'మాలకరి ...మాడ్కి', 2.'తేఁటి ...పోల్కి,' 3.'బొగ్గలకుఁ బోలె.' ఈ పద్యం కూడా మూలంలోని రెండు శ్లోకాల తాత్పర్యాన్ని కలిపి పునర్నిర్మించినది. మూల శ్లోకా లివి-

**"యథా మధుసమాదత్తే రక్షన్ పుష్పాణి షట్పదః ।**

**తద్య దర్థా న్మనుష్యేభ్య ఆదద్యా దవిహింసయా ॥**

**పుష్పం పుష్పం విచిన్వీత మూలచ్ఛేదం నకారయేత్ ।**

**మాలాకార ఇవారామే న యథాఽఙ్గారకారకః ॥ (సం. 5-34-17,18)**

-మూలంలోని 'అర్థం' తెలుగులో 'కార్యఫలం'గా పేర్కొనబడింది. వరుస మారినా ముచ్చటైన మూడు ఉపమానాలు ఒక పద్యంలో ఉక్తి విలాసాన్ని పొందాయి. మాలాకారుడి ఉపమానం ముందువచ్చింది. పూలు కోసినా మూలనాశం కాకూడదని నీతి అందులో ఉన్నది. ధర్మజుడి శాంతిసందేశం ఆ కార్యసిద్ధిని సూచిస్తుంది. అంతే కాదు. పూలను కోయటమంటే ఉపాయ సాధనం, లేదా ఉపకరణ సేకరణం. ధర్మజుడి సామదానాద్యుపాయాలు వంశనాశం కాకుండా ఉండటానికే ఉద్దేశించబడ్డాయి. పాండవులు కౌరవులకు పంపే సందేశాలన్నీ ఆ తాత్పర్యాన్నే సూచిస్తున్నాయి. ఆ తరువాత మధుకరోపమానం సార్థకం. ఇది శత్రుశిబిరంలోని వీరుల హృదయాలలో ధర్మజుడు తన ధర్మనీతి వర్తనం పట్ల సాముఖ్యం ఏర్పడటానికి చేస్తున్న ప్రయత్నం. భీష్మాదుల వంటి వారు కౌరవ వంశ వృక్షానికి పూచిన పూలు. వారి సాముఖ్యం పూదేనె. దానిని ధర్మరాజు వారి మనస్సులు కందకుండా దౌత్యం ద్వారా సంఘటిస్తున్నాడు. చివరకు యుద్ధం వలని కీడును అందరికీ తెలియజెప్పి వంశమూలాలు నాశనం కాకుండా, కౌరవులు నశించకుండా రక్షించ యత్నించాడు. స్వార్థం కొరకు కౌరవ వంశవృక్షాన్ని బొగ్గులు చేయతలచలేదు. ఇది ధర్మరాజు యొక్క నయనీతి. దుర్యోధనుడు ఈ మూడు రకాలైన యత్నాలనూ స్వీయకులనాశానికి అనుగుణంగా నడిపి అవినీతిని ప్రదర్శించాడు. పేర్లు ప్రత్యేకించి పేర్కొనకుండా ధర్మజ దుర్యోధను లనుసరిస్తున్న నీతి అవినీతులను అలంకార సుందరంగా ఆవిష్కరించిన సూక్తి ఇది. (సంపా.)

**క. పరుల ధనమునకు, విద్యా । పరిణతికిం, దేజమునకు, బలమునకు మనం**
**బెరియఁగ నసహ్యపడు న । న్నరుఁడు దెవులు లేని వేదనం బడు నధిపా! 58**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా, ధృతరాష్ట్రా!; పరుల ధనమునకున్= ఇతరుల డబ్బుకూ; విద్యా పరిణతికిన్= విద్యాపరిపక్వతకూ; తేజమునకున్= తేజస్సుకూ; బలమునకున్= పరాక్రమానికీ; మనంబు= మనస్సు; ఎరియఁగన్= మండేటట్టు; అసహ్యము+పడు+ఆ+నరుఁడు= ఓర్వలేని ఆ మనుష్యుడు; తెవులు లేని వేదనన్+పడున్= రోగం ఏమీ లేకుండానే బాధపడతాడు.

**తాత్పర్యం:** రాజా ధృతరాష్ట్రా! ఇతరుల డబ్బుకూ, విద్యాపరిపక్వతకూ, తేజస్సుకూ, బలానికీ మనస్సు కాలిపోయేటట్లు ఓర్వలేని ఆ మనుష్యుడు రోగం ఏమీ లేకుండానే బాధపడతాడు.

**విశేషం:** ఇది చక్కని లోకనీతి. హితోక్తి. మూల శ్లోకభావాన్ని సందర్భశుద్ధితో నిగ్గుతేల్చి తెలుగులో వెలయించాడు తిక్కన. మూలం-

**"య ఈర్షుః పరవిత్తేషు రూపే వీర్యే కులాన్వయే**

**సుఖ సౌభాగ్య సత్కారే తస్య వ్యాధి రనన్తకః". (సం. 5-34-42)**

ఇతరుల ధనానికీ, రూపానికీ, బలానికీ, కులానికీ, సుఖసౌభాగ్యాలకూ, సత్కారానికీ ఈర్ష్య పొందేవాడి రోగానికి అంతం లేదని మూల శ్లోక తాత్పర్యం. ఇది సర్వసాధారణ లోకనీతి. తిక్కన పద్యంలో ఈర్ష్య పడదగిన అంశాలను, వాటి వరుసను మార్చి

పునర్నిర్మించాడు. ఈర్ష్యపడేవాడు ఏ రోగం లేకున్నా, దీర్ఘరోగంతో బాధపడేవాడివలె లోలోన వేదన పడతాడని తిక్కన తీర్చిన భావం. ఈ దీర్ఘరోగి ధృతరాష్ట్రుడని చెప్పకుండానే తెలుస్తున్నది. అతడి కా వేదన- పాండవ సంపదను చూచిన తరువాత మొదలయింది. సంపదనంతా కపట ద్యూతంలో హరించాడు, పాండవులను అరణ్యాజ్ఞాతవాసాలకు పంపారు. వారు నయనీతి విద్యాపారంగతులు కావటంతో ధర్మానికి కట్టుపడి ఆడిన మాటను పాటించారు. వారు విజయవంతంగా ప్రతిజ్ఞలను ముగించినందుకు ధృతరాష్ట్రుడు లోలోన బాధపడ్డాడు. పాండవులు పాశుపతాది మహాస్త్రాలను సంపాదించి శత్రువులకు అసాధ్యులై ఉత్తమ శీలంతో ప్రకాశిస్తున్నారు. ఆ అంశం ధృతరాష్ట్రుడి హృదయంలో శల్యం వలె బాధిస్తున్నది. చివరిది పాండవుల బలం. పాండవుల బలాన్ని గురించి, విశేషించి శ్రీకృష్ణుడి మహత్వాన్ని గురించి తలచినప్పుడెల్లా ధృతరాష్ట్రుడికి గుండెలో శతఘ్నులు మ్రోగుతూ ఉంటాయి. మాయాద్యూతం నుండి రాయబారాల వరకు సాగిన కథలో పాండవులలో వెలుగొందిన సద్గుణాలు వరుసగా పేర్కొనటం ఒక విశేషం. రోగం కాని రోగం అసూయ. ధనం కొరకైన అసూయ ఇంద్రియ సంక్షోభాన్ని కలిగిస్తుంది. విద్యను చూచి పడే అసహనం బుద్ధిని కలతపెట్టుతుంది. తేజస్సు వలన కలిగే అసూయ హృదయాన్ని క్షోభ పెట్టుతుంది. శత్రువుల బలాధిక్యాన్ని గమనించి పొందే అసూయ శరీరాన్నంతా దగ్ధం చేస్తూ ఉంటుంది. ఇంతటి దారుణ రోగావస్థను ధృతరాష్ట్రుడు అంతరంగంలో పొందుతూ ఉన్నాడని ప్రకరణోచిత ధ్వని. (సంపా.)

**క. ఎదిరికి హితమును, బ్రియమును, । మది కింపును గాఁగఁ బలుకు మాటలు పెక్కై**
**యొదవినను లెస్స; యటు గా । కిది యది యన కూరకునికి యెంతయు నొప్పున్. 59**

**ప్రతిపదార్థం:** ఎదిరికిన్= ఎదుటివాడికి; హితమును= మేలయినదీ; ప్రియమున్= ఇష్టమైనదీ; మదికిన్+ఇంపును+కాఁగన్= మనస్సునకు సంతోషకరమైనదీ అయ్యేటట్టు; పలుకు మాటలు= మాటాడే మాటలు; పెక్కు+ఐ= ఎక్కువయి; ఒదవినను= కలిగితే; లెస్స= మంచిది; అటు+కాక= అలా కాక; ఇది+అది+అనక= ఏమీ అనకుండా- నోరెత్తకుండా; ఊరక+ఉనికి= ఊరుకోవడం; ఎంతయున్+ఒప్పున్= మిక్కిలి బాగుంటుంది.

**తాత్పర్యం:** ఎదుటి వాడికి మేలయినవీ, ఇష్టమైనవీ, మనస్సంతోషకరమైనవీ అయిన మాటలు ఎక్కువగా మాటాడగలిగితే మంచిది. అట్లా కాకపోతే ఏమీ అనకుండా నోరు మూసికొని ఊరుకొనటం ఎంతో మంచిది.

**విశేషం:** మూలంలోని విదురనీతి వాక్యాలను సందర్భోచితంగా వినిర్మించటం తిక్కన శిల్పం. అందుకు ఇటువంటి పద్యాలు ఉదాహరణలు.

**"వాక్ సంయమో హి నృపతే సుదుష్కరతమో మతః ।**
**అర్థ వచ్చ, విచిత్రం చ న శక్యం బహుభాషితుమ్" (సం. 5-34-76)**

వాక్సంయమనం పాటించటం చాలా కష్టం! సార్థకంగా, చమత్కారంగా నిరంతరం మాట్లాడటం అసాధ్యం- అని మూల శ్లోకం. మితహిత భాషణం మంచిదనీ, అది ఎదుటి వారికి ఇంపును కలిగించాలనీ, అట్లా నిరంతరం మాట్లాడటం మంచిదనీ, అట్టి నేర్పు లేకపోతే నోరు మూసికొని ఉండటం భావ్యమనీ తిక్కన చెప్పించాడు. ఈ వాక్యనీతి కౌరవులను ఉద్దేశించి చెప్పిందే. దుష్ట చతుష్టయం మాటల తీరే వారికి దోషాన్నీ, పాపాన్నీ, హానినీ కలిగిస్తున్నదని హెచ్చరిక. వారు మాట్లాడకుండ మిన్నకుండి నయ వాక్యకోవిదులను గౌరవించటమే ఉత్తమమని విదురుడి సూచన! పైది నీతివాక్యం; లోకహిత వాక్యం ఈ పద్యం. (సంపా.)

**క. చెలిమియుఁ బగయును, దెలివియుఁ, । గలఁకయు, ధర్మంబుఁ, బాపగతియును, బెంపుం,**
**దులువతనంబును వచ్చును । బలుకుబడిన; కానఁ బొసఁగఁ బలుకఁగ వలయున్. 60**

**ప్రతిపదార్థం:** చెలిమియున్= స్నేహమూ; పగయును= విరోధమూ; తెలివియున్= తెలివీ; కలఁకయున్= కలతా; ధర్మంబున్; పాపగతియును= పాపమార్గమూ; అధర్మమూ; పెంపున్= ఆధిక్యమూ; తులువతనంబును= తుంటరితనమూ; పలుకుబడిన్+అ= మాట తీరుచేతనే; వచ్చును; కానన్= కాబట్టి; పొసఁగన్+పలుకఁగన్+వలయున్= ఒప్పేటట్లు మాటాడాలి.

**తాత్పర్యం:** స్నేహ విరోధాలూ, జ్ఞానాజ్ఞానాలూ, ధర్మాధర్మాలూ, ఆధిక్య నైచ్యాలూ తమ మాటలతీరును బట్టి వస్తాయి. కాబట్టి ఒప్పుగా మాటాడాలి.

**విశేషం:** మూల శ్లోకం కంటే ఈ పద్యం సానబెట్టిన వజ్రంవలె ఉన్నది.

**"అభ్యావహతి కల్యాణం వివిధం వాక్ సుభాషితా ।**

**సైవ దుర్భాషితా రాజ న్ననర్థా యోపపద్యతే ॥' (సం. 5-34-77)**

పొసగేటట్లు పలకటం ఎంత లోకనీతియో, అంత రాజనీతి. పాండవ పక్షంలోని వారు, రాయబారులూ, భీష్మాది కురువీరులూ పొసగేటట్లు మాట్లాడుతారు. దుష్టచతుష్టయం పొసగని మాటలు పలుకుతారు. పొసగే మాటల వలన కలిగేవి స్నేహం, జ్ఞానం, ధర్మం, అభ్యుదయం. పొసగనిమాటల వలన క్రమంగా కలిగేవి పగ, కలక, పాపగతి, తులువతనం. ఉద్యోగపర్వంలో పాండవ కౌరవ పక్షాలలోని పాత్రలు ఎట్లా పలికారన్నది వాక్యరీతి విన్యాస చర్చ. తిక్కన ఈ పద్యంలో రాజనీతి పండిన తన వాక్యరచనా వైదగ్ధ్యాన్ని ప్రదర్శించాడు. రాయబారాల ఘట్టాలు వాక్యరచనా శిల్పాలకు రాచబాటలు. ఈ సూక్తిలో తిక్కన కవితా శిల్ప ప్రసక్తి కూడా ధ్వని. (సంపా.)

**క. బెడిదముగఁ గత్తి గొడ్డటఁ । బొడువఁ దెగినవ్రానఁ జిగురు వొడముఁ; బలుకులం**
**జెడఁ దునిసిన కార్యంబు ని । గుడనేరదు పిదపనెట్టుఁ గురువంశనిధీ! 61**

**ప్రతిపదార్థం:** కురువంశ నిధీ!= కురువంశానికి ఆశ్రయమైనవాడా ధృతరాష్ట్రా!; కత్తిన్= కత్తిచేతా; గొడ్డటన్= గొడ్డలి చేతా; బెడిదముగన్= గట్టిగా; పొడువన్= పొడువగా; తెగిన వ్రానన్= తెగినచెట్టునందు; చిగురు; పొడమున్= పుట్టుతుంది; పలుకులన్= మాటలచేత; చెడన్= చెడిపోగా; తునిసిన కార్యంబు= భగ్నమైన పని; పిదపన్= తరువాత; ఎట్టున్= ఏవిధంగానూ; నిగుడన్+ నేరదు= చక్కబడదు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! కత్తితోగానీ, గొడ్డలితోగానీ గట్టిగా నరకగా తెగిపోయిన చెట్టుకు చిగురు పుడుతుంది. కాని, మాటలచే చెడి భగ్నమైన కార్యం తరువాత ఏవిధంగానూ చక్కబడలేదు.

**విశేషం:** అలం: వ్యతిరేకం. ఇందు ఉపమేయంకంటె ఉపమానానికి ఆధిక్యం చెప్పబడింది. కాబట్టి అలంకారం వ్యతిరేకం. ఈ సూక్తి దుష్టచతుష్టయం పలికే మాటలలోని వాక్పారుష్యాన్ని, దానివలన కలిగే ఫలితాలను ధ్వనింపజేస్తున్నది. (సంపా.)

**క. తనువున విఱిగిన యలుఁగుల । ననువునఁ బుచ్చంగవచ్చు; నతి నిష్ఠురతన్**
**మనమున నాటిన మాటలు । విను మెన్ని యుపాయములను వెడలునె యధిపా! 62**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా! ధృతరాష్ట్రా! వినుము, తనువునన్= శరీరంలో; విఱిగిన+అలుఁగులన్= విరిగిపోయిన బాణాలను; అనువునన్= ఉపాయంతో; పుచ్చంగన్+వచ్చున్= తొలగించవచ్చు; అతి నిష్ఠురతన్= మిక్కిలి పారుష్యంతో; మనమునన్=

మనస్సునందు; నాటిన మాటలు= గ్రుచ్చుకొన్న మాటలు; ఎన్ని ఉపాయములను= ఎన్ని ఉపాయాలచేతనైనా; వెడలునె?= పోతాయా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! విను. శరీరంలో నాటుకొన్న బాణాలను ఉపాయంతో తొలగించవచ్చును. కాని, మిక్కిలి గట్టిగా మనస్సులో నాటుకొన్న మాటలు ఎన్ని ఉపాయాలచేతనైనా వెలికి వస్తాయా?

**విశేషం:** అలం: వ్యతిరేకం. ఇందులో ఉపమేయం కంటె ఉపమానానికి ఆధిక్యం చెప్పబడింది. కాబట్టి అలంకారం వ్యతిరేకం. ఈ సూక్తి నిండుసభలో కర్ణుడు పలికిన మాటలను, దుర్యోధన దుశ్శాసనుల దుర్భాషలను సూచిస్తున్నది. (సంపా.)

**ఉ. అక్కట! ధర్మనందనుని యాస్యమునం దొకనాఁడుఁ గీడుప**
**ల్కొక్కఁడు లేదు; నీ కొడుకు లొండొరు మీఱి నికృష్టవాక్యముల్**
**పెక్కులు పెక్కుభంగులను బ్రేలుచు నుండఁగ నీవు దానికిన్**
**స్రుక్కక వించు నుండె; దనురూపమె నీ కిది కౌరవేశ్వరా? 63**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= కురురాజా, ధృతరాష్ట్రా!; అక్కట= అయ్యో!; ధర్మ నందనుని+ఆస్యమునందున్= ధర్మరాజునోట; ఒక నాఁడున్= ఒకప్పుడునూ; కీడు పల్కు+ఒక్కఁడున్= దుర్భాష ఒక్కటి కూడా; లేదు; నీ కొడుకులు; ఒండొరున్= ఒకళ్ళ నొకళ్ళు; మీఱి= అతిక్రమించి; నికృష్ట వాక్యముల్= నీచములైన వాక్కులు; పెక్కులు= అనేకం; పెక్కు భంగులను= అనేక విధాల; ప్రేలుచున్+ఉండఁగన్= వాగుతూ ఉంటే; నీవు; దానికిన్; స్రుక్కక= జంకక; వించున్+ఉండెదు(దవు)= వింటూ ఉంటావు; నీకున్; ఇది; అనురూపమె?= తగినదేనా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! అయ్యో! ధర్మరాజు నోట ఒకప్పుడు దుర్భాష ఒక్కటి కూడా లేదు. నీ కొడుకులు ఒకళ్ళని మించి ఒకళ్ళు నీచవాక్యాలు అనేకం అనేక విధాలుగా ప్రేలుతూ ఉంటే నీవు దానికి జంకక వింటూ ఉంటావు. నీకిది తగినదేనా?

**విశేషం:** సద్భాషలు వినకపోవటం, దుర్భాషలు వింటూ వాటిని వారించక, మౌనంగా అంగీకరిస్తూ వాటికి బాసటగా నిలవటం మహాదోషం. ధృతరాష్ట్రుడు దుర్యోధనాదుల దుష్టభాషణ దుష్టఫలితాన్ని అనుభవించదగిన అర్హత పొందాడని ధ్వని. దాని ఫలమే అతడి అంతర్వేదన. (సంపా.)

**ఆ. చేటుకాలమైనఁ జెట్టమాటలు నెఱి । గాని తెరువు వట్టు కర్జములును**
**దగవు లట్లు తోఁచుఁ; దగియెడునవి యవి । నీతు లని మనంబు నిశ్చయించు. 64**

**ప్రతిపదార్థం:** చేటు కాలము+ఐనన్= చెడుకాలం దాపురించినప్పుడు; చెట్ట మాటలున్= చెడుమాటలును; నెఱి+కాని తెరువు+పట్టు కర్జములును= చెడుత్రోవపట్టిన పనులును; తగవులు+అట్లు తోఁచున్= ధర్మాలవలె తోస్తాయి; తగియెడు+అవి= తగిన మాటలూ; అవినీతులు+అని= నీతిమాలినవని; మనంబు= మనస్సు; నిశ్చయించున్= నిర్ణయిస్తుంది.

**తాత్పర్యం:** చెడుకాలం దాపురిస్తే చెడు మాటలూ, చెడుత్రోవ పట్టిన చేతులూ ధర్మబద్ధాలయినట్లు తోస్తాయి. తగిన మాటలూ, చేతలూ నీతిమాలినవని మనస్సు నిర్ణయిస్తుంది.

**విశేషం:** "వినాశకాలే విపరీత బుద్ధిః" అనే సూక్తికి ఈ పద్యం హృద్యమైన, అభినవాభివ్యక్తి. (సంపా.)

**వ. నీ బుద్ధి పాండవులతోడి విరోధంబునెడ మరలంబడమి పాపం బింతియకాక యేమి సేయుదము? మన కులంబునం దేజో ధైర్య ధార్మికత్వాది గుణంబుల గరిష్ఠుండయిన యుధిష్ఠిరుండు నీ సిరికి వెలియై యట్లుండుట దగ వగునే? నీ పెద్దతనంబు సూచి సైరణ వాటించి యున్నవాఁ'డనిన, విదురు దిక్కు మొగంబై ధృతరాష్ట్రుండు 'నీ చెప్పిన నీతివాక్యంబుల నా మనంబు దనివోవ దింకను జెప్పు' మనవుడు నతండు వెండియు నిట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** నీ బుద్ధి, పాండవులతోడి విరోధంబు+ఎడ= పాండవులతోడి పగ నుంచి; మరలంబడమి= మరలకపోవటం; పాపంబు; ఇంతియ కాక= ఇంతేకాక; ఏమి+చేయుదము? మన కులంబునన్= మన వంశంలో; తేజస్(ః)+ధైర్య ధార్మికత్వ+ఆది గుణంబులన్= తేజస్సూ, ధైర్యమూ, ధర్మపరాయణతా, మొదలైన గుణాల చేత; గరిష్ఠుండు+అయిన= గొప్పవాడైన; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; నీ సిరికిన్= నీ సంపదకు; వెలి+ఐ= దవ్వయినవాడై; అట్లు+ఉండుట; తగవు+అగునే; నీ పెద్దతనంబు+చూచి; సైరణ+పాటించి= శాంతం వహించి; ఉన్నవాఁడు; అనినన్; విదురు దిక్కు మొగంబు+ఐ= విదురుడి కేసి తిరిగి; ధృతరాష్ట్రుండు; నీ చెప్పిన నీతివాక్యంబులన్; నా మనంబు; తనివోవదు= తృప్తిపడదు, ఇంకనున్+చెప్పుము; అనవుడున్; అతండు; వెండియున్= మళ్లీ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నీ మనస్సు పాండవులపై పగ నుండి మరలకపోవటం పాపం. ఇంతే. ఏం చేద్దాం? మన వంశంలో తేజస్సూ, ధైర్యమూ, ధర్మపరత్వమూ మొదలైన గుణాల చేత గొప్పవాడైన ధర్మరాజు నీ సంపదకు దూరమైనవాడై అట్లా ఉండటం న్యాయమా? నీ పెద్దరికం చూచి శాంతం వహించి ఉన్నాడు' అనగా ధృతరాష్ట్రుడు విదురుడివైపు మొగంపెట్టి 'నీవు చెప్పిన నీతివాక్యాలతో నా మనస్సు తృప్తిపడదు. ఇంకా చెప్పుము.' అనగా విదురుడు మళ్ళీ ఇట్లా అన్నాడు:

**విశేషం:** ధృతరాష్ట్రుడు వస్తుతః గొప్ప శ్రోత. అతడి గ్రుడ్డితనం, స్థిరనిర్ణయం చేయలేని పిరికితనం అతడిని అట్లా మార్చింది. శత్రు మిత్ర పక్షాల వాదాలు చాలా ఓపికగా వింటాడు. దానికి అనువుగా విదురనీతి వాక్యబోధా శ్రవణం అమరింది. దీనివలన ధృతరాష్ట్రుడు కౌరవ పాండవ పక్షాల వర్తన విశేషాలను తులనాత్మకంగా తెలిసికొనే అవకాశం కలగటంతోపాటు, పాండవుల ప్రయత్నాలకు ప్రతిగా దుర్యోధను డనుసరించే పద్ధతిని మూల్యాంకనం చేసికొనటానికి అతడు ప్రయత్నించవచ్చును. రాత్రి తెల్లవారేదాకా, మనశ్శాంతి కలిగే దాకా విదురుడు నీతులు వల్లిస్తూనే ఉంటాడు. అక్కడక్కడ ధర్మరాజు యొక్క గొప్పతనాన్ని చెప్పి తన ఉపన్యాసాన్ని ఆపటానికి విదురుడు యత్నిస్తే, ధృతరాష్ట్రుడు కొనసాగించుమంటాడు. ఇది కూడా అతడి అనిశ్చిత మనఃస్థితిని వ్యక్తం చేస్తున్నది. (సంపా.)

**ఆ. 'సకల పుణ్యకర్మ చయమును నొకదెస, । వినుము పాడి దప్పకునికి యొక్క**
**దిక్కు; దీని శ్రుతులు తెలిపెడునెడఁ, బాడి । కలిమి యెందుఁ బెద్దగా నుతించె. 66**

**ప్రతిపదార్థం:** వినుము; సకల పుణ్య కర్మ చయమునున్= ఎల్ల పుణ్యాకార్యాల సమూహమూ; ఒక దెస= ఒకవైపు; పాడి+తప్పక+ఉనికి= ధర్మం తప్పకుండటం; ఒక్క దిక్కు= ఒక వైపు; దీనిన్; శ్రుతులు= వేదాలు; తెలిపెడు+ఎడన్= తెలిపే టప్పుడు; పాడి కలిమి= ధార్మిక సంపదనే; ఎందున్= ఎక్కడైనా; పెద్దగాన్= అధికంగా; నుతించెన్= పొగిడాయి.

**తాత్పర్యం:** విను. ఎల్ల పుణ్యకార్యాల సమూహమూ ఒక దిక్కునా, ధర్మం తప్పకుండా ఉండడం ఒక దిక్కునా ఉంచగా- దీనిని గురించి చెప్పేటప్పుడు వేదాలు ధార్మిక సంపత్తినే ఎందయినా అధికతరంగా పొగిడాయి.

**తే. పాడి గలిగిన నిహలోకఫలములెల్లఁ । జేరుటయ కాదు, కీర్తియుఁ జెందుఁ బురుషు;**
**ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు, నంత । కాలమును బుణ్యలోకంబు గల్గు నండ్రు. 67**

**ప్రతిపదార్థం:** పాడి+కలిగినన్= ధర్మం కనుక కలిగి ఉంటే; పురుషున్= మనుష్యుడిని; ఇహ లోక ఫలములు+ఎల్లన్= భూలోకఫలాలన్నీ; చేరుట+అ కాదు= చేరటమే కాదు; కీర్తియున్= కీర్తికూడా; చెందున్= కలుగుతుంది; ధరణిన్= భూమిలో; పొగడిత= పొగడ్త; ఎందాఁకన్= ఎంతకాలం; పరఁగున్= ఒప్పుతుందో; అంత కాలమును; పుణ్య లోకంబు, కల్గున్+అండ్రు= కలుగుతుంది అంటారు.

**తాత్పర్యం:** ధర్మం కనక కలిగి ఉంటే, పురుషుడిని భూలోకఫలాలన్నీ చేరడమే కాదు, అతడికి కీర్తి కూడా కలుగుతుంది. భూమిలో పొగడ్త (కీర్తి) ఎంతకాలం ఉంటుందో, అంతకాలమూ పుణ్యలోకం కలుగుతుందని అంటారు.

**వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతి సంభవుం డయ్యును, దనకొడుకు విరోచనుండును, నంగిరసుండను విప్రు కొడుకు సుధన్వుండును దమతమ ప్రాణంబు లొడ్డుగా నొడ్డి యొక్క ధర్మ సందేహంబునకుఁ బన్నిదంబు సఱచి వచ్చి త న్నడిగిన, నితండు గొడు, కితండు లాఁతి యని తలంపక మధ్యస్థుండై సుధన్వు గెలిపించి, యతని చేత నిజతనయుని జీవితంబు దానంబుగాఁ గొని వాని బ్రదికించెం గావున, నీవును ధర్మంబు విడువక, యధర్మోపేతులైన నీకొడుకులవలని పక్షపాతంబు విడిచి తెఱంగు సేయుము; వారును వీరును నాపదలేక బ్రదుకుదురు; నీవును శోకంబులేక తక్కుదు'వని చెప్పి మఱియును- 68**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వం; ప్రహ్లాదుండు; దైత్య జాతి సంభవుండు+అయ్యును= రాక్షసకులంలో పుట్టినవాడయినా; తన కొడుకు, విరోచనుండును; అంగిరసుండు+అను విప్రుకొడుకు సుధన్వుండును= అంగిరసుడనే బ్రాహ్మణుడి కుమారుడైన సుధన్వుడూ; తమ తమ ప్రాణంబులు; ఒడ్డుగాన్+ఒడ్డి= పణంగా పెట్టి; ఒక్క ధర్మ సందేహంబునకున్; పన్నిదంబు+చఱచి వచ్చి= పందెం వేసికొని వచ్చి; తన్నున్; అడిగినన్; ఇతండు; కొడుకు; ఇతండు; లాఁతి= ఇతరుడు; అని; తలంపక; మధ్యస్థుండు+ఐ= మధ్యవర్తియై; సుధన్వున్; గెలిపించి; అతని చేతన్; నిజ తనయుని జీవితంబున్= తన కొడుకు ప్రాణాన్ని; దానంబుగాన్; కొని; వానిన్; బ్రదికించెన్; కావునన్; నీవునున్; ధర్మంబు విడువక; అధర్మ+ఉపేతులు+ఐన= అధర్మంతో కూడుకొన్నవారైన; నీ కొడుకుల వలని పక్షపాతంబు విడిచి= నీ కొడుకుల మీది పక్షపాతం విడిచిపెట్టి; తెఱంగు+చేయుము= సంధిచేయుము; వారును; వీరునున్; ఆపద లేక; బ్రదుకుదురు; నీవును; శోకంబు లేక; తక్కుదువు= తొలగుదువు; అని, చెప్పి; మఱియును-

**తాత్పర్యం:** పూర్వం ప్రహ్లాదుడు రాక్షసకులంలో పుట్టినవాడయినా, తన కొడుకు విరోచనుడూ, అంగిరసుడనే బ్రాహ్మణుడి కొడుకు సుధన్వుడూ తమ తమ ప్రాణాలు పణంగా పెట్టి, ఒక ధర్మ సందేహానికి పందెం వేసికొని వచ్చి త న్నడిగితే, వీడు తన కొడుకూ, వీడు ఇతరుడూ అని భావించక మధ్యవర్తిత్వం వహించి, సుధన్వుడి పక్షాన తీర్పు చెప్పి, అతడి నుంచి తన కొడుకు జీవితాన్ని దానంగా పుచ్చుకొని అతడిని బ్రతికించాడు. కాబట్టి నీవు కూడా

ధర్మం విడువక, అధర్మపరులైన నీ కొడుకుల మీది పక్షపాతం విడిచిపెట్టి ఉభయులకూ సంధి చేయుము. వాళ్ళూ, వీళ్ళూ ఆపద లేక బ్రతుకుతారు. నీవూ దుఃఖం లేకుండా ఉంటావు.' అని చెప్పి, ఇంకా.

**విశేషం:** మూలంలో విపులంగా ఉన్న ప్రహ్లాదోదంతాన్ని సంగ్రహంగా రచించటం తిక్కన ప్రకరణౌచిత్యానికి నిదర్శనం. (సంపా.)

**క. 'పాపంబులు గర్జము లని । యేపునఁ జేయంగ నవియు నింపగు; ధర్మ**
**వ్యాపారంబు లకార్యము । లై పరిణతిఁ బొందెనేని నట్టుల చెల్లున్. 69**

**ప్రతిపదార్థం:** పాపంబులు; కర్జములు+అని= కార్యములని- చేయదగినవని; ఏపునన్= గర్వంతో; చేయంగన్= చేస్తే; అవియున్= ఆ పాపాలు కూడా; ఇంపు+అగున్= ఇష్టం అవుతాయి; ధర్మ వ్యాపారంబులు= ధర్మకార్యాలు; అకార్యములు+ఐ= చేయరానివయి; పరిణతిన్+పొందెన్+ఏనిన్= పరిణమిస్తే; అట్టులు+అ= అలాగే- అకార్యములుగానే; చెల్లున్= అయిపోతాయి.

**తాత్పర్యం:** పాపాలు చేయదగినపని గర్వంతో చేస్తే, అవే ఇష్టమవుతాయి. ధర్మకార్యాలు చేయరానివిగా పరిణమిస్తే అవి అట్లాగే అయిపోతాయి.

**విశేషం:** ఈ పద్య భావం మూలంలోని ముచ్చటైన రెండు సుభాషితాల సులభీకరణం: ఆ శ్లోకా లివి-

**"పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునః పునః**
**నష్ట ప్రజ్ఞః పాప మేవ నిత్య మారభతే నరః ॥**
**పుణ్యం ప్రజ్ఞాం వర్ధయతి క్రియమాణం పునః పునః**
**నష్ట ప్రజ్ఞః పాపమేవ నిత్య మారభతే నరః" (సం.5-35-52,53)**

**చ. అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని? నార్యులే**
**మదిఁ దలఁపంగ వారలు సమంచిత ధర్మము వల్కరేని? న**
**ట్టిదియును ధర్మువే తగ ఘటించిన నిక్కము లేద యేనిఁ? దాఁ**
**బదిలపునిక్కమే యొక నెపంబిడు చొప్పగునేని భూవరా! 70**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా, ధృతరాష్ట్రా!; ప్రియంబు+ఎసఁగన్= ప్రీతి అతిశయించగా; ఆర్యులు= పూజ్యులు; నిల్వరు+అ+ఏనిన్= ఉండకపోతే; అది; సభయే= సభయా (కాదని భావం); వారలు= వాళ్ళు-ఆ ఆర్యులు; మదిన్+తలఁపంగన్= మనస్సులో ఆలోచింపగా; సమంచిత ధర్మము+పల్కరు+ఏనిన్= ఒప్పయిన న్యాయం చెప్పకపోతే; ఆర్యులు+ఏ?= ఆర్యులా? (పూజ్యులా); తగన్+ఘటించినన్= ఒప్పుగా చేస్తే; నిక్కము లేదు+అ+ఏనిన్= సత్యం లేకపోయినట్లయితే; అట్టిదియును+ధర్మువు+ఏ!= అటువంటిది కూడా ఒక ధర్మమేనా?; ఒక నెపంబు+ఇడు చొప్పు+అగున్+ఏనిన్= ఏదో ఒక నెపం పెట్టే విధం అయితే; తాన్= తాను- ఆ సత్యం; పదిలము+నిక్కము+ఏ?= సిసలైన సత్యమా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! మిక్కిలి ప్రీతితో ఆర్యులు నిలవకపోతే అది కూడా ఒక సభయేనా? ఆ ఆర్యులు ఒప్పుగా న్యాయం మాటాడకపోతే, వాళ్ళూ ఓ ఆర్యులేనా? ఆ ధర్మాన్ని బాగా ఆచరిస్తే, అందులో సత్యం లేకపోతే, అదీ ఒక ధర్మమేనా? ఏదో ఒక నెపంతో కూడినదయితే, అదీ ఒక సిసలైన సత్యమా?

**విశేషం:** దీనికి మూలమైన శ్లోకం సంస్కృతభారతంలో ఇట్లా ఉంది.

**'న సా సభా యత్ర న సన్తి వృద్ధా । న తే వృద్ధా యే న వదన్తి ధర్మమ్,**

**నా సౌ ధర్మో యత్ర న సత్యమస్తి । న తత్ సత్యం యచ్ఛలే నానువిద్ధమ్.' (సం. 5-35-58)**

ఇదే శ్లోకం సంస్కృత భారతంలో సభాపర్వంలో కూడా ఉన్నది. (60-69) కాని దీనిని నన్నయ ఎందుచేతనో తెనిగించలేదు.

**ఉ. నీతి పథంబునన్ బ్రదుక నేర్చుట యుత్తమ భంగి; శౌర్య సం**
**జాతములై కరం బలరు సంపద లొందుట మధ్యవృత్తి; య**
**స్ఫీతములైన భారవహజీవనముల్ దలఁపం గనిష్ఠముల్;**
**నీతికి బాహ్యులైన, ధరణీవర! మెత్తురె వారి నుత్తముల్? 71**

**ప్రతిపదార్థం:** ధరణీవర!= రాజా, ధృతరాష్ట్రా!; నీతి పథంబునన్= నీతిమార్గంలో; బ్రదుకన్+నేర్చుట= బ్రతకగలగటం; ఉత్తమ భంగి= శ్రేష్ఠమయిన విధం; శౌర్య సంజాతములు+ఐ= పరాక్రమం చేత కలిగినవయి; కరంబు+అలరు= మిక్కిలి ఒప్పే; సంపదలు; ఒందుట; మధ్య వృత్తి= మధ్యమం; తలఁపన్= ఆలోచించగా; అస్ఫీతములు+ఐన= అరకొరలైన; భార వహ జీవనముల్= బరువుగా లాగే బ్రతుకులు; కనిష్ఠముల్= అధమాలు; నీతికిన్+బాహ్యులు+ఐనన్= నీతికి వెలి అయితే; వారిన్; ఉత్తముల్= సజ్జనులు; మెత్తురె?= మెచ్చుకొంటారా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! నీతిమార్గంలో బ్రతకగలగటం ఉత్తమం. శక్తియుక్తులతో సంపదలు పొందటం మధ్యమం. ఆలోచిస్తే బరువుగా లాగే అరకొరలైన బ్రతుకులు అధమం. నీతిమాలిన వాళ్ళను ఉత్తములు మెచ్చుకొంటారా?

**ఆ. కయ్యమునక యెపుడుఁ గాలు ద్రవ్వుదురు నీ । పుత్త్రు లెల్ల; సూతపుత్త్రుఁ డాది**
**యగు తదీయ మంత్రు లంతకు ముందర । బిరుదు; లీవు నీతి తెరువు సొరవు. 72**

**ప్రతిపదార్థం:** నీ పుత్త్రులు+ఎల్లన్= నీ కొడుకులందరూ; ఎపుడున్= ఎప్పుడూ; కయ్యమునకున్+అ= యుద్ధానికే; కాలు+త్రవ్వుదురు= కాలు తవ్వుతారు; సూత పుత్త్రుండు+ఆది+అగు తదీయ మంత్రులు= కర్ణుడూ మొదలుగాగల వారి మంత్రులు; అంతకు ముందరన్= అంతకు ముందే; బిరుదులు= క్రొవ్వెక్కినవాళ్ళు; నీవు; నీతి తెరువు= నీతిమార్గంలో; చొరవు= ప్రవేశించవు.

**తాత్పర్యం:** నీ కొడుకులందరూ ఎప్పుడూ కయ్యానికే కాలు దువ్వుతారు. కర్ణుడు మొదలుగాగల వారి సలహాదారులు అంతకుముందే క్రొవ్వెక్కి ఉన్నవాళ్ళు. నీవేమో నీతిమార్గం పట్టవు.

**క. పాండవులు శౌర్య మొల్లర । ఖండిత నీతి ప్రకార కార్యము మెచ్చై**
**యుండుదు; రెదు రేచినఁ దుది । మండుదు; రార్పంగ రాదు మఱి యెవ్వరికిన్. 73**

**ప్రతిపదార్థం:** పాండవులు; శౌర్యము+ఒల్లరు= పరాక్రమం అంగీకరించరు; అఖండిత నీతి ప్రకార కార్యము= మొక్కవోని నీతిమార్గంతోడి కార్యం; మెచ్చు+ఐ+ఉండుదురు= మెచ్చుకొంటూ ఉంటారు; ఎదురు+ఏచినన్= ఎదుటివాడు చెలరేగాడా; తుదిన్= చివరకు; మండుదురు= మండిపడతారు; మఱి= తరువాత; ఎవ్వరికిన్= ఎవరికీ; ఆర్పంగన్+రాదు= ఆర్పటం తరం కాదు.

**తాత్పర్యం:** పాండవులు అనవసరంగా పరాక్రమించడానికి ఇష్టపడరు. మొక్కవోని నీతిసహమైన కార్యమే మెచ్చుకుంటూ ఉంటారు. ఎదుటివాడు చెలరేగేడా, చివరకు మండిపడతారు. తరువాత వారిని ఆర్పటం (శాంతింప జేయటం) ఎవరి తరమూ కాదు.

**క. తమ తండ్రి భంగి నీకును । సముచిత మగు భక్తి సేసి సజ్జననుత మా**
**ర్గమున నడచువారల నీ । వమలమతిం గన్నకొడుకు ల ట్లరయఁదగున్.' 74**

**ప్రతిపదార్థం:** తమ తండ్రి భంగిన్= తమ తండ్రి అయిన పాండురాజువలె; నీకును, సముచితము+అగు భక్తి+చేసి= తగిన భక్తి చూపి; సత్+జన నుత మార్గమునన్= మంచివాళ్ళచేత పొగడబడే దారిలో; నడచు వారలన్= నడుచుకొనే వాళ్ళను; నీవు, అమల మతిన్= నిర్మలమైన మనస్సుతో; కన్న కొడుకులు+అట్లు= కన్న కొడుకులవలె; అరయన్+తగున్= చూడదగును.

**తాత్పర్యం:** తమ తండ్రి అయిన పాండురాజువలెనే నీ యందు సముచితమైన భక్తి కలిగియుండి సత్పురుషులు మెచ్చుకొనే మార్గంలో నడిచే ఆ పాండవులను నీవు నిర్మలబుద్ధితో కన్నకొడుకులవలె చూడదగును.'.

**వ. అని పలికి మఱియు నిట్లనియె: 75**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు.

**క. 'కారణము లేకయును నుప । కార పరత్వమున నొరుల కార్యంబులకున్**
**వారని యలజడిఁ బడియెడు । వారల చూ యేడుగడయు వారికి నధిపా! 76**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా, ధృతరాష్ట్రా!; కారణము లేకయును= ఏ కారణం లేకుండానే; ఉపకార పరత్వమునన్= ఉపకారం చేయాలనే ఆసక్తితో; ఒరుల కార్యంబులకున్= ఇతరుల పనులను గురించి; వారని= ఉడుగని; అలజడిన్+పడియెడు వారలు+అ+చూ= బాధపడేవాళ్ళే సుమా; వారికిన్= ఆ పాండవులకు; ఏడుగడయున్= దిక్కు.

**తాత్పర్యం:** 'రాజా! ధృతరాష్ట్రా! పాండవులు దిక్కులేనివారు అనుకొనకు. ఏమీ కారణం లేకుండానే ఉపకారం చేసే బుద్ధితో ఇతరుల పనుల గురించి ఉడుగని బాధపడే వాళ్ళే సుమా ఆ పాండవులకు దిక్కు.

**చ. ఒకరుని చేతిప్రోపును దదున్నతి ప్రాపును గాంచి, యెల్లవెం**
**టకును గొఱంతలేక పొగడందగు సంపద నొంది, యట్టి దా**
**తకుఁ దుదిఁ గీడు సేసిన కృతఘ్నుని పీనుఁగునైన రోఁత వు**
**ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా! 77**

**ప్రతిపదార్థం:** కురువంశ వర్ధనా!= కౌరవ వంశాన్ని వృద్ధిపొందించేవాడా!; ధృతరాష్ట్రా!; ఒకరుని చేతి ప్రోపును= ఒకడి చేతి పోషణమునూ; తద్+ఉన్నతి ప్రాపును= అతడి ఔన్నత్యం యొక్క అండనూ; కాంచి= పొంది; ఎల్ల వెంటకును= అన్ని విషయాలలోనూ; కొఱంత లేక= లోటు లేక; పొగడన్+తగు సంపదన్+ఒంది= పొగడదగిన సంపదను పొంది; అట్టి దాతకున్; తుదిన్= చివర; కీడు+చేసిన కృతఘ్నుని పీనుఁగున్+ఐనన్= హాని చేసిన కృతఘ్నుడి శవాన్ని కూడా; రోఁత+పుట్టక= అసహ్యించుకొనకుండా; కబళింపన్= తినటానికి; కుక్కలున్= కుక్కలు సైతం; ఒడంబడునే?= అంగీకరిస్తాయా?

**తాత్పర్యం:** ఓయి కురువంశశ్రేష్ఠుడా! ధృతరాష్ట్రా! ఒకడు ఒక మహానుభావుడి పోషణలో ఉండి, అతడి ఔన్నత్యాన్ని ఆసరాగా చేసికొని, ఏ విషయంలోనూ లోటులేక మంచి సంపద సంపాదించి చివరికి అటువంటి మహోదారునికే హాని చేస్తే, ఆ కృతఘ్నుడి శవాన్ని కూడా అసహ్యించుకొనకుండా తినటానికి కుక్కలు సైతం అంగీకరిస్తాయా?

**విశేషం:** ఈ పద్యం పరోక్షంగా ధృతరాష్ట్ర నింద. ఆ గ్రుడ్డిరాజు మొదట పాండురాజు పోషణలో ఉన్నాడు. అతడు తనను గద్దెమీద ఉంచి గౌరవిస్తే ఉన్నతిని పొందాడు. దిగ్విజయాలు చేసి ధనరాశులు తెచ్చి అందిస్తే అపారసంపదను అనుభవించాడు. అతడు చనిపోతే, అతడి కొడుకులకు అన్యాయం చేయతలపెట్టటం కృతఘ్నుడి లక్షణం. అటువంటి కృతఘ్నుడి శవాన్ని కుక్కలు కూడా ముట్టుకొనవు అన్నాడు విదురుడు. ఇంతకంటె హీనమైన తిట్టు మరొకటి ఉండబోదు. అయినా, నిబ్బరంగా ఉండటం ధృతరాష్ట్రుడి దుష్టనీతి. (సంపా.)

**వ.** **కావునఁ గృతము దలంపమి గీడు; పాండురాజు నీకుం బరమ భక్తుండు; పాండవులునుం దేజో లాభంబులు గావించినవారలు; వారల నాదరింపు' మని చెప్పి వెండియు నిట్లనియె: 78**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; కృతము= చేసిన మేలు; తలంపమి= గుర్తించుకొనకపోవటం; కీడు= తప్పు; పాండురాజు; నీకున్; పరమ భక్తుండు= మిక్కిలి భక్తుడు; పాండవులునున్= పాండవులు కూడా; తేజ(ః)+లాభంబులు= తేజస్సూ; లాభమూ; కావించిన వారలు= చేసినవాళ్ళు; వారలన్= వాళ్ళను; ఆదరింపుము+అని చెప్పి; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కాబట్టి చేసిన మేలు మరిచిపోవటం తప్పు. పాండురాజు నీకు మంచి భక్తుడు. పాండవులు కూడా తేజస్సూ, లాభమూ నీకు సంపాదించి పెట్టినవాళ్ళు. వాళ్ళను ఆదరించుము' అని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'కృతము తలంపమి కీడు' అని తిక్కన సూక్తి.

**క.** **'కృత మెఱుఁగుట పుణ్యము స । న్మతి దానికి సమము సేఁత మధ్యము, మఱి త**
**త్కృతమున కగ్గలముగ స । త్కృతి సేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్. (ఆది. 1.244)**

'కృత మెఱిఁగెడు పతియె జగజ్జనుల నెల్లఁ బరిపాలించును' (సభా. 1.46) అని నన్నయ. (సంపా.)

**ఆ.** **'బ్రదుకు, చేటు, పొగడువడుట, దూ ఱొందుట, । యీఁగి, వేఁడుకొనుట, యిట్లు మఱియుఁ**
**గలుగు సౌఖ్య దుఃఖములు వచ్చు నడవడి; । వాని కింత యేల వగవ నధిప! 79**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా, ధృతరాష్ట్రా!; బ్రదుకు= మంచి బ్రదుకూ; చేటు= వినాశమూ; పొగడు+పడుట= ప్రశంసలు పొందటమూ; దూఱు+ఒందుట= నిందపడటమూ; ఈఁగి= త్యాగమూ; వేఁడుకొనుట= అడుగుకొనటమూ; ఇట్లు= ఈ విధంగా; మఱియున్+కలుగు సౌఖ్య దుఃఖములు= ఇంకా ఉన్న సుఖాలూ; దుఃఖాలూ; నడవడిన్= ప్రవర్తనలో- జీవితంలో; వచ్చున్= కలుగుతాయి; వానికిన్= ఆ సుఖాలకూ, దుఃఖాలకూ; ఇంత వగవన్+ఏల?= ఇంతగా చింతించటం ఎందుకు?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఒకప్పుడు మంచి బ్రదుకు బ్రదుకవచ్చును, లేదా ఆపదలకు గురికావచ్చును, ఒకప్పుడు ప్రశంసలు పొందవచ్చును. లేదా అడుగుకొనే దుఃస్థితి రావచ్చును. ఇట్లా ఇంకా ఉన్న సుఖాలూ దుఃఖాలూ జీవితంలో కలుగుతూ ఉంటాయి. వాటి కొరకు ఇంతగా చింతించటం ఎందుకు?

**క. వగ బలము దఱుఁగు, రూపఱు; । వగచిన మతి దప్పుఁ, దెవులు వచ్చును; దూరన్**
**వగచి నలంగినఁ బ్రియ మగుఁ । బగతురకును; వగచు టుడుగు; పార్థివముఖ్యా!' 80**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= రాజోత్తమా, ధృతరాష్ట్రా!; వగన్= దుఃఖం చేత; బలము+తఱుఁగున్= శక్తి నశిస్తుంది; రూపు+అఱున్= ఆకారం చెడుతుంది; వగచినన్= దుఃఖిస్తే; మతి+తప్పున్= మనసు పాడవుతుంది; తెవులు వచ్చున్= రోగం వస్తుంది; దూరన్+వగచి నలఁగినన్= మిక్కిలి దుఃఖించి కృశిస్తే; పగతురకును= శత్రువులకు; ప్రియము+అగున్= సంతోషం కలుగుతుంది; వగచుట+ఉడుగు(ము)= దుఃఖించటం మానుము.

**తాత్పర్యం:** రాజోత్తమా, ధృతరాష్ట్రా! దుఃఖంవలన బలం నశిస్తుంది. ఆకారం చెడుతుంది. దుఃఖిస్తే మనసు పాడవుతుంది. రోగం వస్తుంది. మిక్కిలి దుఃఖించి కృశిస్తే శత్రువులు సంతోషిస్తారు. కాబట్టి దుఃఖించటం మానుము.

**విశేషం:** తిక్కన భారతంలో పగమీద ధర్మరాజూ, వగమీద విదురుడూ పలికిన పద్యాలు ప్రసిద్ధాలు. అందులో వగమీది పద్యమిది. దీనికి మూలం కూడా ముచ్చటగా ఉంటుంది.

**"సంతాపా ద్భ్రశ్యతే రూపం, సంతాపా ద్భ్రశ్యతే బలమ్**
**సంతాపా ద్భ్రశ్యతే జ్ఞానం, సంతాపా ద్వ్యాధి మృచ్ఛతి**
**అనవాప్యం చ శోకేన, శరీరం చోపతప్యతే**
**అమిత్రా శ్చ ప్రహృష్యన్తి మా స్మశోకే మనః కృథాః" (సం. 5-36-44,45)**

**వ. అనిన విని ధృతరాష్ట్రుండిట్లనియె : 81**

**తాత్పర్యం:** అనగా విని ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు.

**క. 'రిత్త యుపచారముల నే । నుత్తముఁ డగు ధర్మతనయు నుడికించితి; దు**
**ర్వృత్తులగు మత్సుతులకును । మిత్తి యగుం బోర; వగలు మిగులక యున్నే? 82**

**ప్రతిపదార్థం:** నేను, ఉత్తముఁడు+అగు ధర్మతనయున్= శ్రేష్ఠుడైన ధర్మరాజును; రిత్త ఉపచారములన్= వట్టి కల్లబొల్లి మాటలతో; ఉడికించితిన్= బాధించాను; దుర్వృత్తులు+అగు మత్+సుతులకును= దుష్టులైన నా కొడుకులకు; పోరన్= యుద్ధంలో; మిత్తి+అగున్= చావు కలుగుతుంది. వగలు= దుఃఖాలు; మిగులక+ఉన్నే?= కలగవా?

**తాత్పర్యం:** 'నేను ఉత్తముడైన ధర్మరాజును కల్లబొల్లిమాటలతో బాధించాను. దుష్టులైన నా కొడుకులకు యుద్ధంలో మరణం కలుగుతుంది. ఇంక నాకు దుఃఖం అతిశయించదా మరి?

**వ. నెవ్వగలు నివ్వటిల్లనీక నిలుపునట్టిది యెయ్యది? దాని నెఱింగింపు' మనిన విదురుం డిట్లనియె. 83**

**ప్రతిపదార్థం:** నెఱ+వగలు= పెను దుఃఖాలు; నివ్వటిల్లన్+ఈక= కలగనీయక; నిలుపు+అట్టిది= ఆపేది; ఎయ్యది?= ఏది?; దానిన్; ఎఱింగింపుము= తెలుపుము; అనినన్; విదురుండు; ఇట్లు+అనియెన్:

**తాత్పర్యం:** పెనుదుఃఖం కలుగకుండా ఆపేది ఏది? దానిని చెప్పుము.' అనగా; విదురుడు ఇట్లా అన్నాడు:

**తే. 'నియత తపమును, నింద్రియ నిగ్రహంబు, । భూరి విద్యయు శాంతికిఁ గారణములు;**
**వాని యన్నిటికంటె మేలైన శాంతి । కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర!' 84**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కురువంశశ్రేష్ఠుడా, ధృతరాష్ట్రా!; నియత తపమునున్= నియమయుక్తమైన తపస్సూ; ఇంద్రియ నిగ్రహంబున్= ఇంద్రియాలను అదుపులో పెట్టుకొనటమూ; భూరి విద్యయున్= అధికమైన విద్యా; శాంతికిన్+కారణములు= మనశ్శాంతికి కారణాలు; వాని+అన్నిటికంటెన్ మేలు+ఐన శాంతి కారణము= వాటన్నిటికన్నా గొప్ప శాంతి కారణం; లోభము+ఉడుగుట= పేరాస విడవటం.

**తాత్పర్యం:** 'కురువంశశ్రేష్ఠుడవైన ధృతరాష్ట్రా! నియమయుక్తమైన తపస్సూ, ఇంద్రియాలను అదుపులో పెట్టుకొనటమూ, అధిక విద్యా మనశ్శాంతికి కారణాలు. వాటన్నిటికంటే అసలైన శాంతి కారణం లోభం విడిచిపెట్టటం.'

**వ. అని వెండియు. 85**

**తాత్పర్యం:** అని మళ్ళీ.

**క. 'జ్ఞాతుల పోరితమును; గో । వ్రాతము నాక్రమము, విప్ర వర్గము చనవున్,**
**నాతులఁ గారించుటయును । బ్రీతిం జన నిచ్చునతని పెం పొప్పు నృపా! 86**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా, ధృతరాష్ట్రా!; జ్ఞాతుల పోరితమును= జ్ఞాతి వైరాన్నీ; గో వ్రాతము+ఆక్రమమున్= గోవుల సమూహాన్ని ఆక్రమించటాన్నీ; విప్ర వర్గము చనవున్= బ్రాహ్మణుల సమూహం పట్ల చులకనగా వర్తించటాన్నీ; నాతులన్= స్త్రీలను; కారించుటయును= బాధించటాన్ని; ప్రీతిన్= ఆసక్తితో; చననిచ్చు+అతని పెంపు= పోగొట్టేవాడి గొప్పతనం; ఒప్పున్= ఒప్పుతుంది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! జ్ఞాతి వైరాన్నీ, గోవులను ఆక్రమించటాన్నీ, విప్రులను లోకువ చేయటాన్నీ, స్త్రీలను బాధించటాన్నీ ఆసక్తితో నివారించేవాడి గొప్పతనం విలసిల్లుతూ ఉంటుంది.

**క. అలమికొని యొండొరుల ప్రో । పులఁ బ్రాపుల నెలమికలిమిఁ బొంది బహు జ్ఞా**
**తులు నెమ్మిఁ గూడి తామర । కొలని క్రియన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. 87**

**ప్రతిపదార్థం:** బహు జ్ఞాతులు= దాయాదులనేకులు; అలమికొని= కలసి మెలసి; ఒండొరుల ప్రోపులన్= ఒకరొకరి రక్షణములనూ; ప్రాపులన్= అండలనూ; ఎలమి కలిమిన్= సంతోష సంపదనూ; పొంది; నెమ్మిన్= ప్రీతితో; కూడి= ఒక్కరయి; తామర కొలని క్రియన్= తామరల సరస్సువలె; ఉజ్జ్వలులు+ఐ= ప్రకాశించేవాళ్ళయి; సిరికిన్+పట్టు+అగుదురు= శ్రీకి ఆకరమవుతారు.

**తాత్పర్యం:** దాయాదులు పెక్కండ్రు కలసి మెలసి ఒకరొకరి రక్షణలనూ, ఆశ్రయాలనూ, సంతోష సంపదనూ పొంది ప్రీతితో ఒక్కరయి తామరల సరస్సువలె ప్రకాశిస్తూ శ్రీకి స్థానమవుతారు.

**విశేషం:** తామరకొలని క్రియన్= అలంకారం : ఉపమ.

చ. కరి తురగాది ఘట్టనయు గాలియు నొంపదె యొంటి నున్న య
త్తరువు? ననేక భూరుహవితానము గుంపయిపేర్చి బాధలం
బొరయునె? యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు; లట్లు గా
కెరవయి నిల్చినం గెలని కెల్లిదమై పఱివోదు రెంతయున్. 88

**ప్రతిపదార్థం:** ఒంటిన్+ఉన్న+ఆ+తరువున్= ఒంటరిగా ఉన్న ఆ చెట్టును; కరి తురగ+ఆది ఘట్టనయున్= ఏనుగులూ, గుర్రాలూ మొదలయిన వానియొక్క రాపిడీ; గాలియున్= గాలీ; నొంపదె= బాధింపదా (వా); అనేక భూరుహ వితానము= పెక్కు చెట్ల సమూహం; గుంపు+అయి పేర్చి= గుంపుగా ఉండి విజృంభిస్తే; బాధలన్+పొరయునె?= బాధలు పొందుతాయా?; అన్న+తమ్ములును; పొందినన్= కలిసి ఉంటే; ఏరికిన్+అసాధ్యులు= ఎవరికైనా అసాధ్యులవుతారు; అట్లు+కాక= అట్లాకాక; ఎరవు+అయి= వేరయి; నిల్చినన్= ఉన్నట్లయితే; కెలనికిన్= శత్రువుకు; ఎల్లిదము+ఐ= లోకువయి; ఎంతయున్= మిక్కిలి; పఱి+పోదురు= నశిస్తారు.

**తాత్పర్యం:** చెట్టు ఒక్కటే ఉంటే, దానిని ఏనుగులూ, గుర్రాలూ త్రొక్కివేస్తాయి; గాలి కూల్చివేస్తుంది. పెక్కు చెట్లు ఒకచోట గుంపుగా ఉంటే అవి ఎటువంటి బాధా పొందవు. అట్లాగే అన్నదమ్ములు కూడా కలిసివుంటే ఎవరికైనా అసాధ్యులవుతారు. అట్లాకాక వేర్వేరుగా ఉంటె శత్రువుకు లోకువయి మిక్కిలి నశిస్తారు.

**విశేషం:** అలం: దృష్టాంతం.

వ. కావునఁ గౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై పొదలిన నెదిరికి నజయ్యు లగుదురు; పరుల యొత్తులేని రాజ్యంబు పూజ్యమహిమం బరఁగు. వనవాసంబునం గుందిన కౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట నీ కొడుకులకు నిలుపు గావించుట యగు'నని చెప్పి మఱియు నిట్లనుఁ 'బ్రియవాదు లెందును గల రప్రియం బగుంగాకేమియని పథ్యంబు(తథ్యంబు) వలుకువారు లేరు. జూదంబునప్పు డే నడ్డపడి, యప్రియం బగుటకు శంకింపక తథ్యంబు వలికితి; నది నీకు రుచియింపక, రోగికిఁ బథ్యాహారంబు దలకంటగించునట్లయ్యె; నైన నిప్పుడుం జెప్పెద వినుము: కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున, మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయు చందంబున సుయోధనాదులం బట్టి యుధిష్ఠిర ప్రముఖుల విడిచితి; నేఁడు కార్యంబు ముట్టవచ్చినం దోఁపక మిడుంగుఱు సోఁకినట్లు దల్లడించెదవు. కులంబునకై యొకనిఁ దొఱంగుటయ నీతి యని పెద్దలు సెప్పుదురు; దుర్ణయపరుండై సద్బుద్ధి సెప్ప వినం డేని, మనము దుర్యోధనుం దొఱంగిన నేమి యగు? నది యట్లుండె, సంపద సహాయంబు నపేక్షించియుండు; సహాయంబు సంపద నుద్దేశించి వర్తిల్లు; నిట్లవి యొకటొకటి పొందునంగాని సిద్ధింపవు కావున నీ సంపద పాండవులకును, వారి సహాయత్వంబు నీకునుం బ్రియం బొనరింప, నొండొరుల కలయుట మేలుగాక, మనలావువెలిసేయుట లెస్స యగునే? కురువంశనిస్తారకులగు భీష్మ యుధిష్ఠిరులును, నవక్ర విక్రములగు కర్ణార్జునులును, బ్రతాపధాములగు భీమ దుర్యోధనులును, శస్త్రాస్త్రపారగులగు నభిమన్యు లక్ష్మణ ప్రభృతి కుమారులును, శాపాను గ్రహసమర్థులగు ద్రోణ ద్రుపదాది పరమాప్తులును, వారి వారి బంధు మిత్రజనంబులును, నొక్క మొగంబై నీ పనుపు సేయుచు,

**నయ విక్రమంబు లప్రతిహతంబులై నడవం, బృథివి శాసింప భవదీయ విభవం బుజ్జ్వలంబై యొరులకెడలేక చెల్లుచున్న నెంత యొప్పగునో యటు విచారింపుము. పాండవులు ధీరమతులై వైర మెత్తక యూరక తొలంగియుండిరేనియుఁ, గతిపయ దినంబులలోఁ జీకాకుపడి చెడుంగాక, గాంధారీనందనుచేత వసుంధరా పరిపాలన భారంబు నిర్వహింపబడునే?' యనిన విని ధృతరాష్ట్రుండు విదురున కి ట్లనియె:**

**89**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; కౌరవులున్, పాండవులున్, ఒండొరులకున్= ఒకరి కొకరు; ప్రాపు+ఐ= అండయై; పొదలినన్= ఒప్పితే; ఎదిరికిన్= శత్రువుకు; అజయ్యులు+అగుదురు= జయించరానివారు అవుతారు; పరుల+ఒత్తులేని రాజ్యంబు= శత్రువుల అదుముడు లేని రాజ్యం; పూజ్య మహిమన్+పరఁగున్= పూజించదగిన గొప్ప మహిమతో ఒప్పుతుంది; వన వాసంబునన్= అడవిలో నివసించటం చేత; కుందిన కౌంతేయులన్= దుఃఖించిన పాండవులను; తడయక= ఆలస్యం చేయక; తెచ్చి= తీసికొని వచ్చి; ఉచిత పదంబు+ఇచ్చి= తగిన స్థానం కల్పించి; నిలుపుట= నిలపటం; నీ కొడుకులకున్ నిలుపు+కావించుట+అగున్= నీ కొడుకులను నిలపటమే అవుతుంది, అని, చెప్పి, మఱియున్; ఇట్లు+అనున్; ప్రియవాదులు= ఇచ్చకాలు పలికేవాళ్ళు; ఎందున్+కలరు= ఎక్కడైనా ఉంటారు; అప్రియంబు+అగున్+కాకేమి+అని= అప్రియం అయితే అయిందని; పథ్యంబు+పలుకువారు లేరు= హితం పలికేవాళ్ళు లేరు; జూదంబు+అప్పుడు= జూదం ఆడే సమయంలో; ఏను= నేను; అడ్డము+పడి= అడ్డం వచ్చి; అప్రియంబు+అగుటకున్= రుచించేది కామికి; శంకింపక= సంకోచించక; తథ్యంబు+పలికితిన్= సత్యం చెప్పాను; అది; నీకున్; రుచియింపక= నచ్చక; రోగికిన్= జబ్బుచేసినవాడికి; పథ్య+ఆహారంబు= పథ్యమైన ఆహారం; తలకంటగించు+అట్లు+అయ్యెన్= సయించనట్లు అయింది; ఐనన్= అయినప్పటికీ; ఇప్పుడున్= ఇప్పుడుకూడా; చెప్పెదన్+వినుము= చెపుతాను విను; కాకంబులన్= కాకులను; కైకొని= చేరదీసి; మయూరంబులన్= నెమళ్ళను; పరిహరించు విధంబునన్= విడిచి పెట్టినట్లుగా; మార్జాలంబులన్= పిల్లులను; పాటించి= ఆదరించి; సింహంబుల+ఎడన్= సింహాలపై; అనాదరంబు+చేయు చందంబునన్= విముఖత చూపే విధంగా; సుయోధన+ఆదులన్= దుర్యోధనుడు మొదలయినవాళ్ళని పట్టి= పట్టుకొని; యుధిష్ఠిర ప్రముఖులన్= ధర్మరాజాదులను విడిచితివి; నేఁడు= ఈవేళ; కార్యంబు; ముట్టన్+వచ్చినన్= విషమించగా; తోఁపక= ఏం చెయ్యాలో తెలియక; మిడుంగుఱులు సోఁకిన+అట్లు= నిప్పులుతాకినట్లు; తల్లడించెదవు= భయపడుతున్నావు; కులంబునకున్+ఐ= వంశంకొరకు; ఒకనిన్= ఒక్కడిని; తొఱంగుట+అ= విడిచిపెట్టటమే; నీతి; అని; పెద్దలు+చెప్పుదురు= పెద్దలంటారు; దుర్ణయపరుఁడు+ఐ= అవినీతిపరుడై; సత్+బుద్ధి+చెప్పన్ వినండు+ఏనిన్= మంచి మాటలు చెపితే వినకపోతే; మనము; దుర్యోధనున్= దుర్యోధనుడిని; తొఱంగినన్= విడిచిపెట్టితే; ఏమి+అగున్= ఏమవుతుంది; అది; అట్లు+ఉండెన్= అట్లా ఉండనీ; సంపద; సహాయంబున్= తోడును; అపేక్షించి+ఉండున్= కోరుతుంది; సహాయంబు= తోడు; సంపదన్+ ఉద్దేశించి వర్తిల్లున్= సంపదనుబట్టి ఉంటుంది; ఇట్లు= ఇట్లా; అవి= సహాయమూ, సంపదా; ఒకటి+ఒకటి పొందునన్+కాని సిద్ధింపవు= ఒక దానితో ఒకటి కలిసి ఉంటేనే కాని లభించవు; కావునన్; నీ సంపద; పాండవులకును; వారి సహాయత్వంబు= వారి తోడ్పాటు; నీకునున్= నీకూ; ప్రియంబు+ఒనరింపన్= ప్రీతి కలిగించాలంటే; ఒండొరుల కలయుట= ఒక్కళ్ళతో ఒకళ్ళు కలిసి ఉండడం; మేలు+కాక= మంచిదికాని; మన లావు= మన బలం; వెలి+చేయుట= బయటపెట్టటం; లెస్స+అగునే?= మంచిదా?; కురు వంశ నిస్తారకులు+అగు భీష్మ యుధిష్ఠిరులును= కురుకులాన్ని ఉద్ధరించే వాళ్ళయిన భీష్మ ధర్మరాజులూ; అవక్ర విక్రములు+అగు= మంచి పరాక్రమవంతులైన; కర్ణ+అర్జునులును= కర్ణార్జునులూ; ప్రతాపధాములు+అగు భీమ దుర్యోధనులును= పరాక్రమ నిలయులైన భీమ దుర్యోధనులూ; శస్త్ర+అస్త్ర పారగులు+అగు అభిమన్యు లక్ష్మణ ప్రభృతి కుమారులును= శస్త్రాస్త్ర విద్యలలో ఆరితేరిన అభిమన్యుడు లక్ష్మణుడు మొదలుగా గల యువకులూ; శాప+అనుగ్రహ సమర్థులు+అగు ద్రోణ ద్రుపద+ఆది పరమ+ఆప్తులును= శపించడానికీ అనుగ్రహించడానికీ సమర్థులైన ద్రోణుడూ, ద్రుపదుడూ మొదలైన గొప్ప ఆత్మీయులూ; వారి వారి బంధు మిత్ర జనంబులును= వారి వారి చుట్టాలూ, స్నేహితులూ; ఒక్క

మొగంబు+ఐ= ఏకమయి; నీ పనుపు+చేయుచున్= నీ ఆజ్ఞ పాటిస్తూ; నయ విక్రమంబులు= నీతి పరాక్రమాలు; అప్రతిహతంబులు+ఐ వడవన్= నిరాటంకంగా సాగుతూ ఉంటే; పృథివిన్+శాసింపన్= భూమిని పరిపాలిస్తే; భవదీయ విభవంబు= నీ వైభవం; ఉజ్జ్వలంబు+ఐ= ప్రకాశిస్తూన్నదయి; ఒరులకున్= ఇతరులకు; ఎడ లేక చెల్లుచున్+ఉన్నన్= ఆపులేక చెల్లుతూ ఉంటే; ఎంత+ఒప్పు+అగునో అటు విచారింపుము= ఎంత బాగుంటుందో ఆలోచించుము; పాండవులు; ధీరమతులు+ఐ= నిర్వికారచిత్తులయి; వైరము+ఎత్తక= పగమాట తలపెట్టక; ఊరక తొలంగి+ఉండిరి+ఏనియున్= మాటాడక ఊరుకున్నప్పటికీ; కతిపయ దినంబులలోన్= కొన్నాళ్ళలో; చీకాకుపడి= ఇబ్బందులుపాలయి; చెడున్+కాక= నశిస్తుంది కాని; గాంధారీ నందనుచేతన్= దుర్యోధనుడి చేత; వసుంధరా పరిపాలన భారంబు= భూపాలన భారం; నిర్వహింపంబడునే?= వహించబడుతుందా?; అనినన్; విని; ధృతరాష్ట్రుండు; విదురునకున్; ఇట్లు+అనియెన్;

**తాత్పర్యం:** కాబట్టి కౌరవులూ, పాండవులూ ఒకళ్ళకొకళ్ళు అండగా ఉంటే శత్రువుకు జయించరానివాళ్ళవుతారు. శత్రువుల ఒత్తిడి లేని రాజ్యం అధికమహిమతో ఒప్పుతుంది. అడవిలో నివసించి దుఃఖితులైన పాండవులను వెంటనే రప్పించి వాళ్ళకు సముచితస్థానం ఇచ్చి నిలపటం, నీ కొడుకులను బ్రదికించుకొనటమే అవుతుంది-' అని చెప్పి విదురు డింకా ఇట్లా అన్నాడు: 'ఇచ్చకాలు మాట్లాడేవాళ్ళు ప్రతీచోటా ఉంటారు. అప్రియమయితే అయిందని హితం పలికేవాళ్ళు వేరు. రుచించేది కాదని సంకోచించక జూదం ఆడేటప్పుడు నేను అడ్డుపడి హితం చెప్పాను. అది నీకు రుచించక, రోగం వచ్చిన వాడికి పథ్యం సయించనట్లు అయింది. అయినా ఇప్పుడు కూడా చెపుతా వినుము. కాకులను చేరదీసి నెమళ్లను పారద్రోలినట్లూ, పిల్లులను ఆదరించి సింహాలను తోసిపుచ్చినట్లూ, దుర్యోధనాదులను పట్టుకుని ధర్మరాజాదులను వదిలేశావు. ఈవేళ పీకమీదకు వస్తే ఏం చేయాలో తోచక నిప్పులు తగిలినట్లు తల్లడిల్లిపోతున్నావు. కులం నిలపటానికి ఒక్కడిని వదలివేయటమే నీతి అని పెద్దలంటారు. అవినీతిపరుడై, మంచి చెపితే వినిపించుకొనకపోతే, మనం దుర్యోధనుడిని వదలుకుంటే నష్టం ఏమిటి? అది అట్లా ఉండనీ. సహాయం సంపదను బట్టీ, సంపద సహాయాన్ని బట్టీ ఉంటాయి. ఇట్లా అవి ఒకదానితో ఒకటి కూడి ఉంటేనే కాని సిద్ధించవు. కాబట్టి నీ సంపద పాండవులకూ, వాళ్ళ సహాయం నీకూ ప్రీతి కలిగిస్తూ ఉంటే పరస్పరం కలిసి ఉండటం మేలుకాని, మన బలం బయట పెట్టుకొనటం మంచిదా? కురు వంశోద్ధారకులైన భీష్మ ధర్మరాజులూ, మంచి పరాక్రమవంతులైన కర్ణార్జునులూ, పరాక్రమ నిలయులయిన భీమ దుర్యోధనులూ, శస్త్రాస్త్ర విద్యలలో ఆరితేరిన అభిమన్యు లక్ష్మణాది కుమారులూ, శపించటానికీ, అనుగ్రహించటానికి సమర్థులైన ద్రోణ ద్రుపదాదులైన ఆత్మీయులూ, వాళ్ళ వాళ్ళ చుట్టాలూ, మిత్రులూ ఏకమయి, నీ ఆజ్ఞ పాటిస్తూ, నీతి పరాక్రమాలు నిరాటంకంగా సాగుతూండగా, భూపరిపాలన కావిస్తూంటే, నీ వైభవం ప్రకాశవంతమై, శత్రువులకు స్థానం లేక, సాగితే అదెంత బాగుంటుందో ఒక్కసారి ఆలోచించుము. పాండవులు నిర్వికారచిత్తులై పగమాట తలపెట్టక మాటాడక ఊరుకొన్నా, కొన్ని నాళ్ళలో ఇబ్బందులు పాలయి చెడుతుందేకాని, దుర్యోధనుడిచేత రాజ్యం పాలించబడదు.' అని విదురుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు :

**విశేషం:** 'అది నీకు రుచియింపక, రోగికిఁ బథ్యాహారంబు దల కంటగించునట్లయ్యె.' అలంకారం ఉపమ, 'కాకంబులంగైకొని, మయూరంబులం బరిహరించు విధంబున, మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయు చందంబున, సుయోధనాదులంబట్టి యుధిష్ఠిర ప్రముఖుల విడిచితివి.' అలంకారం ఉపమ. 'మిడుంగుఱులు సోఁకినట్లు' - అలంకారం ఉపమ.

**తే. 'నీవు సెప్పిన మాటలు నిర్మలములు, । నిపుణ సమ్మతములు, రాజనీతి మార్గ**
**బోధకంబులు; నైనను బుత్త్రువిడువ । నోప, 'ధర్మో జయతి'యని యుండువాఁడ.' 90**

**ప్రతిపదార్థం:** నీవు+చెప్పిన మాటలు= నీవు చెప్పిన మాటలు; నిర్మలములు= కల్మషంలేనివి; నిపుణ సమ్మతములు= నేర్పరుల చేత అంగీకరించబడేవి, రాజనీతి మార్గ బోధకంబులున్= రాజనీతి మార్గాన్ని బోధించేవీ; ఐనను= అయినా; పుత్త్రున్= కొడుకును; విడువన్+ఓపన్= విడువలేను; ధర్మః+జయతి= ధర్మం జయిస్తుంది; అని; ఉండువాఁడన్= ఉంటాను.

**తాత్పర్యం:** 'నీవు చెప్పిన మాటలు కల్మషం లేనివి. నేర్పరులు సమ్మతించేవి, రాజనీతి మార్గాన్ని బోధించేవి. అయినా కొడుకును విడవలేను. 'ధర్మం జయిస్తుంది' అని చూస్తూ ఉంటాను.

**వ. అనిన విని విదురుం డతని కిట్లనియె: 'దేవా! జ్ఞాతులు గుణహీనులైనను విడువందగ దనిన, సకల గుణసంపన్నులై భవత్ప్రసాదంబు గోరుచున్న కౌంతేయులన్ దిగవిడువం దగునే? యేను నీకు హితంబు గోరెడువాఁడనని నిశ్చయించి నా బుద్ధి వినుము; వారల జీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియలైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి, తెఱంగు పఱచిన లెస్స యని చూచెద; నతని విడువ వలయునని చెప్పితినేనిఁ బెనఁకువం బశ్చాత్తాపంబువుట్టు; దాని కప్పుడు ప్రతీకారంబు లేదు. కావున నెల్లభంగుల నియ్యకొని పాండవులతోడ సంధి సేయవలయు; నట్లుం గాక. 91**

**ప్రతిపదార్థం:** అనినన్, విని, విదురుండు; అతనికిన్= ధృతరాష్ట్రుడికి; ఇట్లు+అనియెన్; దేవా= ప్రభూ, ధృతరాష్ట్రా!; జ్ఞాతులన్= దాయాదులను, గుణ హీనులు+ఐనను= గుణం లేని వాళ్ళయినా; విడువన్+తగదు+అనినన్= విడవకూడదంటే; సకల గుణ సంపన్నులు+ఐ= ఎల్ల సుగుణ సంపదగలవారై; భవత్+ప్రసాదంబు= నీ అనుగ్రహం; కోరుచున్+ఉన్న కౌంతేయులన్= కోరుతూన్న పాండవులను; దిగన్+విడువన్+తగునే?= విడనాడ వచ్చునా?; ఏను= నేను; నీకున్; హితంబు+కోరెడువాఁడన్+అని నిశ్చయించి= మేలు కోరేవాడినని నిర్ణయించి; నా బుద్ధిన్+వినుము= నా తలపు వినుము; వారల జీవనంబునకున్= వాళ్ళ బ్రతుకుకు; కొన్ని+అలంతి పల్లియలు+ఐనను= కొన్ని చిన్న పల్లెలయినా; దుర్యోధనున్+ఒడంబఱచి= దుర్యోధనుణ్ణి సమ్మతింపజేసి; ఏర్పఱచి= నిర్ణయించి; తెఱంగు పఱచినన్+లెస్స+అని చూచెదను= సంధి చేస్తే మంచిదని భావిస్తాను; అతనిన్; విడువన్+వలయున్+అని చెప్పితిన్+ఏనిన్= విడిచిపెట్టాలంటున్నానంటే; పెనఁకువన్= యుద్ధం చేత; పశ్చాత్+తాపంబు+ పుట్టున్= తరువాత విచారించవలసి ఉంటుంది. దానికిన్; అప్పుడు; ప్రతీకారంబు లేదు= మారుచేత లేదు- ఏమీ చేయలేము; కావునన్; ఎల్లభంగులన్= అన్ని విధాలా; ఇయ్యకొని= అంగీకరించి; పాండవులతోడన్; సంధి, చేయవలయున్; అట్లున్+కాక= అదికాక.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడనగా విని విదురుడు అతడితో ఇలా అన్నాడు. 'ప్రభూ! దాయాదులు గుణంలేని వాళ్ళయినా విడిచిపెట్టకూడదంటే, సకల సుగుణ సంపద గలవారై నీ అనుగ్రహం కోరుతున్న పాండవులను విడనాడవచ్చా? నేను నీకు మేలు కోరేవాణ్ణని నిర్ణయించి నా మాట వినుము. వాళ్ళు బ్రతకడానికి కొన్ని చిన్న పల్లెలయినా; దుర్యోధనుడిని సమ్మతింపజేసి, కేటాయించి, సంధి చేస్తే మంచిదని భావిస్తాను. అతడిని విడిచి పెట్టాలంటున్నానంటే, అట్లా చేయకపోతే, యుద్ధం వలన తరువాత విచారించవలసి వస్తుంది. ఇక దానికప్పుడు ఏమీ చేయలేము కాబట్టి అన్ని విధాలా అంగీకరించి పాండవులతో సంధి చెయ్యాలి. అట్లాకాక- (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** 'జ్ఞాతులు గుణహీనులైనను... దిగవిడువందగునే?' - అలంకారం కావ్యార్థాపత్తి.

**క. తమలోని పొళ్ళకుం గా । సమరము సేసినను గాని చాఁ జనదె? శరీ**
**రము లాధివ్యాధి జరా । సమన్వితము లగుటఁ జేటు సహజం బరయన్. 92**

**ప్రతిపదార్థం:** తమలోని పొళ్లకున్+కాన్= తమ తమ పంపకాల విషయంగా; సమరము+చేసినను+కాని= యుద్ధం చేస్తే కాని; చాన్+చనదె?= చావరాదా?; అరయన్= పరిశీలించగా; శరీరములు= మేనులు; ఆధి వ్యాధి జరా సమన్వితములు+అగుటన్= మనోవ్యాధులతోనూ; రోగాలతోనూ; ముసలితనంతోనూ కూడుకొన్నవి కావటం చేత; చేటు= నాశనం, సహజం.

**తాత్పర్యం:** తమ తమ పంపకాల విషయంగా యుద్ధం చేస్తే కాని చావు రాదా ఏమి? చూడగా శరీరాలు మనోవ్యాధితోనూ, రోగంతోనూ, ముసలితనంతోనూ కూడుకొన్నవవటంచేత వాటికి నాశనం సహజం.

**చ. గజ తురగాది సంపదలుఁ, గాంతలతోడి విహారలీలలుం,**
**బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేయుక్రమంబుఁ, బోరులన్**
**విజయము లొంది పేర్చుటయు, విస్ఫురితాభరణానులేపవ**
**స్త్ర జనిత వైభవంబుఁ గల రాజులుఁ బోయిర కాక నిల్చిరే? 93**

**ప్రతిపదార్థం:** గజ తురగ+ఆది సంపదలున్= ఏనుగులూ, గుర్రాలూ మొదలుగాగల సంపదలూ; కాంతలతోడి విహార లీలలున్= అందమైన స్త్రీలతోడి క్రీడా విలాసాలూ; ప్రజకున్= జనానికి; అనురాగము+ఒందన్= ప్రీతి కలిగేటట్లు; పరిపాలన+చేయు క్రమంబున్= ఏలే పద్ధతీ; పోరులన్= యుద్ధాలలో; విజయమున్+పొంది పేర్చుటయున్= గెలుపుగాంచి అతిశయించటమూ; విస్ఫురిత+ఆభరణ+అనులేప వస్త్ర జనిత వైభవంబున్= ప్రకాశించే భూషణాలూ, మైపూతలూ, వస్త్రాలూ అనే వాటి నుండి పుట్టిన విభవమూ; కల రాజులున్= ఉన్నరాజులు కూడా; పోయిరి కాక= మరణించారేకాని; నిల్చిరే?= జీవించి ఉన్నారా?

**తాత్పర్యం:** ఏనుగులు, గుర్రాలు మొదలుగాగల సంపదలూ, అందమైన స్త్రీలతోడి క్రీడా విలాసాలూ, ప్రజలకు ప్రీతికరంగా పరిపాలించే పద్ధతీ, యుద్ధాలలో గెలిచి అతిశయించటమూ, ప్రకాశించే ఆభరణాలూ, మైపూతలూ, వస్త్రాలూ అనే వాటివలన కలిగే వైభవమూ కల రాజులు సైతం మరణించారే తప్ప జీవించి ఉన్నారా?

**క. కావునఁ జెవికిం జేఁ దగు । నీ వాక్యము వినఁగఁ జాలితేని, నిహపర**
**శ్రీ విభవములకుఁ గీర్తికిఁ । దావలమై వెలయు టింత తథ్యము సుమ్మీ! 94**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; చెవికిన్+చేఁదు+అగు+ఈవాక్యమున్= చెవికి చేదుగా ఉండే ఈ మాటను; వినఁగన్+చాలితి(వి)+ఏనిన్= వినగలిగావా; ఇహపర శ్రీ విభవములకున్= ఈ లోకపు, పరలోకపు సంపదలకూ వైభవాలకూ; కీర్తికిన్; తావలము+ఐ= స్థానమయి; వెలయుట= ఒప్పుట; ఇంత తథ్యము సుమ్మీ!= ఇంతా నిజం సుమా!

**తాత్పర్యం:** కాబట్టి చెవికి చేదుగా ఉండే ఈ మాట వినగలిగావా ఇహలోక, పరలోక సంపదలకూ, వైభవాలకూ, కీర్తికీ నిలయమైన వాడవయి ఒప్పడం నిజం సుమా!

**క. తగ నీలో నూహింపుము; । దిగ విడువకు ధర్మతనయు; దృఢమతివై పొం**
**దగు చందము గొడుకులకుం । బ్రెగడలకుం జెప్పి తీర్పు పెం పేర్పడఁగన్. 95**

**ప్రతిపదార్థం:** తగన్= ఒప్పుగా; నీలోన్= నీ మనస్సులో; ఊహింపుము= ఆలోచించుము; ధర్మతనయున్= ధర్మరాజును; దిగన్+విడువకు(ము)= విడనాడకు; దృఢ మతివి+ఐ= గట్టి మనస్సుకలవాడవై; కొడుకులకున్; ప్రెగడలకున్= మంత్రులకూ; పొందు+అగు చందము= సంధి అయ్యే విధం; చెప్పి; పెంపు+ఏర్పడఁగన్= అభ్యుదయం కలిగేటట్లు; తీర్పు(ము)= కుదుర్చుము.

**తాత్పర్యం:** నీలో నీవే బాగా ఆలోచించుకొమ్ము. ధర్మరాజును విడనాడకుము. మనసు గట్టిపరచుకుని కొడుకులకూ, మంత్రులకూ సంధి అయ్యే విధం చెప్పి అభ్యుదయం కలిగేటట్లు కుదుర్చుము.'

**ఆ. అనిన నాంబికేయుఁ డను: 'నీదు పలుకులఁ । గలఁక దేఱి బుద్ధి దెలివి నొందె;**
**నిట్ల చేయువాఁడ; నిదియ కర్జము, ధర్మ । మును, యశంబు, లాభమును దలంప.'** 96

**ప్రతిపదార్థం:** అనినన్; ఆంబికేయుఁడు= అంబిక కొడుకు - ధృతరాష్ట్రుడు; అనున్; నీదు పలుకులన్= నీ మాటల చేత; బుద్ధి= మనస్సు; కలఁక+తేఱి= నిర్మలమయి; తెలివిన్+ఒందెన్= తేరుకుంది; ఇట్లు+అ చేయువాఁడన్= ఇట్లాగే చేస్తాను; తలంపన్= ఆలోచించగా; ఇది+అ= ఇదే; కర్జమున్= చేయదగిందీ; ధర్మమును= ధర్మమూ; యశంబున్= కీర్తి; లాభమును= లాభమూ.

**తాత్పర్యం:** అని విదురు డనగా, అతడితో ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు: 'నీ మాటల వలన నా మనస్సు నిర్మలమై తేరుకుంది. నేను ఇట్లాగే చేస్తాను. ఆలోచించగా ఇదే చేయదగింది. ఇదే ధర్మమూ, కీర్తి, లాభమూ.'

**చ. అనుడు ముదంబు నమ్మమియు నాత్మఁ బెనంగొన నన్నతోడ ని**
**ట్లను విదురుండు: 'పెద్దవడి కక్కట! నీ మది కార్యవృత్తి నూ**
**ల్కొనియె; సుయోధనుం గని యకుంఠిత నిశ్చయమై యతండు వ్రా**
**లినదెస వ్రాలకుండిన బలే, మముబోఁటులకుం బ్రియం బగున్.** 97

**ప్రతిపదార్థం:** అనుడున్= అని ధృతరాష్ట్ర డనగానే; విదురుండు; ముదంబున్= సంతోషమూ; నమ్మమియున్= అపనమ్మకమూ; ఆత్మన్= మనస్సులో; పెనంగొనన్= పిరిగొనగా; అన్నతోడన్= అన్న అయిన ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనున్; అక్కట!= ఆహా!; ఇది సంతోషసూచకం; పెద్దవడికిన్= ఎంతో కాలానికి; నీ మది= నీ మనస్సు; కార్యవృత్తిన్= చేయదగిన నడవడియందు; నూల్కొనియెన్= స్థిరపడింది; సుయోధనున్+కని= దుర్యోధనుడిని చూచి; అకుంఠిత నిశ్చయము+ఐ= కుంటువడని నిర్ణయమై; అతండు; వ్రాలిన దెసన్= మొగ్గినవైపు; వ్రాలక+ఉండినన్= మొగ్గకపోతే; బలే; మము బోఁటులకున్= మా వంటివారికి; ప్రియంబు+అగున్= ఆనందం కలుగుతుంది.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్ర డనగానే విదురుడు ఒకవైపు సంతోషమూ, ఇతడిలో నిజంగా మార్పు వచ్చిందా అనే అపనమ్మకమూ మనస్సులో పిరిగొనగా అన్నగారితో ఇట్లా అన్నాడు. 'ఆహా! ఎంతో కాలానికి నీ మనస్సు చేయదగిన దానియందు స్థిరపడింది. దుర్యోధనుడిని చూచి, నిర్ణయం మార్చుకోక, అతడు మొగ్గినవైపు నీవు కూడా మొగ్గకపోతే, బలే, మావంటివారికి ఎంతో ఆనందం కలుగుతుంది.'

**వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి.** 98

**తాత్పర్యం:** అని పలికి విదురుడు నిట్టూర్పు పుచ్చి.

**క. 'దైవంబు నేర్చుఁగాః కిటు । వోవఁగ నే నేర్తు, నేరఁ బొమ్మని పలుకం**
**గా వశమె నరున? కెక్కుడు । దైవము పౌరుషముకంటె ధరణీనాథా!' 99**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా! ధృతరాష్ట్రా!; దైవంబు+అ= దైవమే; నేర్చున్+కాక= సమర్థమైనదికాని; ఇటు+పోవఁగన్= ఇట్లా నడవటానికి; ఏన్= నేను; నేర్తున్= సమర్థుడిని; నేరన్+పొమ్ము+అని పలుకంగాన్= సమర్థుడను కానులే అనడానికి; నరునకున్= మనుష్యుడికి; వశమె?= తరమా?; దైవము; పౌరుషము కంటెన్= పురుష ప్రయత్నంకంటె; ఎక్కుడు= గొప్పది.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజా! దైవమే సమర్థమయినది. 'నే నిలా నడవగలను, నడవలేనులే' అనటానికి మానవుడి తరమా? పురుష ప్రయత్నం కంటె దైవం గొప్పది.'

**విశేషం:** ధృతరాష్ట్రుడిలో మార్పు వచ్చిందే అని సంతోషించిన విదురుడు మళ్ళీ ఇట్లా అనటానికి కారణం ధృతరాష్ట్రుడి మాటలలో అతడికి ఒకవైపున ఉన్న అపనమ్మకమే.

**వ. అనిన, విదురునకు వైచిత్రవీర్యుం డిట్లనియెః 100**

**ప్రతిపదార్థం:** అనినన్, విదురునకున్, వైచిత్రవీర్యుండు= విచిత్రవీర్యుడి కొడుకు ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్;

**తాత్పర్యం:** అని విదురుడనగా, అతడికి ధృతరాష్ట్రు డిట్లా అన్నాడు:

**తే. 'ధర్మ పథమును, నీతి తత్త్వంబు తెరువు । నిర్మలము లగు పలుకుల నీవు నాకుఁ**
**దెలియఁ జెప్పితి; పరమార్థ దృష్టి యెట్టి । వాక్యములఁ గల్గుఁ? జెప్పుము వాని ననఘ! 101**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా, విదురా!; ధర్మ పథమును= ధర్మ మార్గాన్నీ; నీతి తత్త్వంబు తెరువున్= నీతితత్త్వపు మార్గాన్నీ; నీవు; నాకున్; నిర్మలములు+అగు పలుకులన్= స్వచ్ఛములైన మాటలలో; తెలియన్+చెప్పితి(వి)= స్పష్టపరచినావు; పరమార్థ దృష్టి= పారమార్థికమైన చూపు; ఎట్టి వాక్యములన్+కల్గున్?= ఎటువంటి వాక్కులవల్ల ఏర్పడుతుంది?; వానిన్, చెప్పుము.

**తాత్పర్యం:** 'పుణ్యాత్మా విదురా! నీవు నాకు ధర్మమార్గాన్నీ, నీతితత్త్వమార్గాన్నీ స్వచ్ఛములైన మాటలలో స్పష్టపరిచావు. ఆధ్యాత్మిక దృష్టి ఎటువంటి వాక్కులవలన ఏర్పడుతుందో వాటిని చెప్పుము.'

### సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబుఁ జెప్పుట - (సం. 5-41-2)

**వ. అని యడిగిన, విదురుం డతని కిట్లనియెః 'నాకుఁ దోఁచిన యన్నియు నా నేర్చినట్లు నీ కెఱింగించితి; నత్యంత గుహ్యంబులగు నర్థంబులు పురాణుం డయ్యునుం గుమారుం డగు సనత్సుజాతుండు దెలుపనోపుంగాని యిట మీఁద నాకుం దెలియ' దనిన ధృతరాష్ట్రుం 'డమ్మునీంద్రుండు నా కెంతదవ్వు! నీవ యవియునుం జెప్పు' మనిన, 'నేను శూద్రయోని జాతుండ, వేదాంత వేద్యంబు లగు నర్థంబులు నా కగోచరంబు; లమ్మహాత్ము బుద్ధి నే నెఱుంగుదు. దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు; నతండు దెలుపంజాలు' ననిన, ధృతరాష్ట్రుం డతి కుతూహలుండై. 102**

**ప్రతిపదార్థం:** అని; అడిగినన్; విదురుండు; అతనికిన్; ఇట్లు+అనియెన్; నాకున్; తోఁచిన+అన్నియున్= తెలిసినవన్నీ; నా నేర్చిన+అట్లు= నా శక్తి ననుసరించి; నీకున్; ఎఱింగించితిన్= తెలిపాను; అత్యంత గుహ్యంబులు+అగు+అర్థంబులు= మిక్కిలి రహస్యములైన విషయాలు; పురాణుండు+అయ్యునున్= చాలా కాలం నాటి వాడయినా; కుమారుండు+అగు సనత్సుజాతుండు= యువకుఁడే అయిన సనత్సుజాతుడు; తెలుపన్+ఓపున్+కాని= చెప్పగలడుకాని; ఇట మీఁదన్= ఈపైని; నాకున్; తెలియదు; అనినన్; ధృతరాష్ట్రుండు; ఆ+ముని+ఇంద్రుండు= ఆ మునీశ్వరుడు; నాకున్; ఎంత దవ్వు= ఎంతో దూరం; నీవు+అ= నీవే; అవియునున్= అవి కూడా; చెప్పుము; అనినన్; నేను; శూద్రయోని జాతుండన్= శూద్ర స్త్రీ సంభవుడిని; వేదాంత వేద్యంబులు+అగు+అర్థంబులు= వేదాంతుల చేతనే తెలియదగిన విషయాలు; నాకున్+అగోచరంబులు= నాకు తెలియవు; ఆ+మహాత్ముబుద్ధి= ఆ మహనీయుడి హృదయం; నేను; ఎఱుంగుదున్; దేవతలకున్; తెలియని+అట్టివి; ఆతనికిన్; తెలియున్; అతండు; తెలుపన్+చాలున్= చెప్పగలడు; అనినన్; ధృతరాష్ట్రుండు; అతి కుతూహలుండు+ఐ= మిక్కిలి ఆసక్తిగలవాడయి-

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అడుగగా విదురుడు అతడితో ఇట్లా అన్నాడు: 'నాకు తెలిసినవన్నీ యథాశక్తి నీకు తెలిపాను. మిక్కిలి రహస్యాలయిన విషయాలు ఏకాలం నాటివాడో అయినా యువకుడే అగు సనత్సుజాతుడు చెప్పగలడు కాని ఈ పైని నాకు తెలియదు.' అంటే, ధృతరాష్ట్రుడు 'ఆ మునీశ్వరుడు నాకెంతో దవ్వు. సులభుడు కాడు. నీవే అవి కూడా చెప్పు.' అనగా 'నేను శూద్రుడిని. వేదాంతులకు మాత్రమే తెలియదగిన విషయాలు నాకు తెలియవు. ఆ మహాత్ముడి హృదయం నాకు తెలుసు. దేవతలకు కూడా తెలియని విషయాలు అతడికి తెలుసు. అతడు తెలుపగలడు' అనగా ధృతరాష్ట్రుండు మిక్కిలి ఆసక్తి గలవాడయి.

**ఆ. 'మనకు నిప్పు డతనిఁ గను తెఱంగెయ్యది । యగుటయును నెఱుంగ' ననిన, విదురుఁ**
**డధిక భక్తిఁ దలఁచె నాత్మలో నాశ్రిత । వత్సలత్వ నిధి సనత్సుజాతు. 103**

**ప్రతిపదార్థం:** మనకున్; ఇప్పుడు; అతనిన్; కను తెఱంగు+ఎయ్యది+అగుటయునున్= చూచే మార్గం ఏదో కూడా; ఎఱుంగన్+అనినన్= తెలియదనగా; విదురుఁడు; ఆత్మలోన్= మనస్సులో; ఆశ్రిత వత్సలత్వ నిధిన్= ఆశ్రయించిన వారిమీద వాత్సల్యానికి ఆశ్రయమైనవాడిని; సనత్సుజాతున్; అధిక భక్తిన్= మిక్కిలి భక్తితో; తలఁచెన్= స్మరించాడు.

**తాత్పర్యం:** 'మన కిప్పుడు అతడిని చూసే మార్గం ఏదో కూడా తెలియదే' అని ధృతరాష్ట్ర డనగా, విదురుడు తన మనస్సులో ఆశ్రితులపై వాత్సల్యానికి నిధియైన సనత్సుజాతుడిని అమితభక్తితో తలచుకొన్నాడు.

**వ. ఇట్లు దలంచుటయును, దివ్యజ్ఞాన మాననీయుండగు నమ్మునివరేణ్యుం డాక్షణంబ పొడసూపిన, విదురుం డతని వచ్చుట యుగ్గడించుచు, వినయంబున నతని నెదుర్కొని, దండ నమస్కారంబు లాచరించి, యున్నతాసనంబిడి, యర్ఘ్యపాద్యంబు లిచ్చి, ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబునుం జేసియున్న ధృతరాష్ట్రు నతనికిం జూపి విదురుం డి ట్లనియె: 104**

**ప్రతిపదార్థం:** ఇట్లు; తలంచుటయును; దివ్యజ్ఞాన మాననీయుండు+అగు+ఆ+మునివరేణ్యుండు= ఆధ్యాత్మిక జ్ఞానం చేత మాన్యుడైన ఆ మునిశ్రేష్ఠుడు; ఆ క్షణంబు+అ= ఆ క్షణమే; పొడ+చూపినన్= ప్రత్యక్షంకాగా; విదురుండు; అతని వచ్చుట= అతని రాక; ఉగ్గడించుచున్= ప్రకటిస్తూ; వినయంబునన్= నమ్రతతో; అతనిన్; ఎదుర్కొని; దండ నమస్కారంబులు+ఆచరించి= సాష్టాంగవందనాలు చేసి; ఉన్నత+ఆసనంబు+ఇడి= ఉన్నతమైన పీఠం వేసి; అర్ఘ్య పాద్యంబులు+ఇచ్చి= పూజాద్రవ్యాలూ;

పాదప్రక్షాళన జలమూ ఇచ్చి; స సంభ్రమంబుగాన్= వేగిరపాటుతో; ప్రత్యుత్థానంబును= ఎదుర్కోలూ; ప్రణామంబునున్= నమస్కారమూ; చేసి+ఉన్న; ధృతరాష్ట్రున్; అతనికిన్+చూపి; విదురుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లా స్మరించగానే, ఆధ్యాత్మిక జ్ఞానంచేత మాన్యుడైన ఆ మునిశ్రేష్ఠుడు ఆ క్షణమే ప్రత్యక్షం కాగా, విదురుడు అతడి రాక ప్రకటించి, నమ్రతతో అతని కెదురేగి సాష్టాంగ నమస్కారాలు చేసి, ఉన్నత పీఠం వేసి, అర్ఘ్యపాద్యాదులిచ్చి, వేగిరపాటుతో ఎదుర్కోలూ, నమస్కారమూ చేసి ఉన్న ధృతరాష్ట్రుడిని అతడికి చూపి ఇట్లా అన్నాడు:

**క.** **'దేవా! దేవర కృప నీ। భూవల్లభుఁ డమల తత్త్వ బోధకమై సౌ**
**ఖ్యావహ మగు వాక్య చయముఁ। దా వినఁ గోరుటయు, మిమ్ముఁ దలఁచితి భక్తిన్.** **105**

**ప్రతిపదార్థం:** దేవా!= స్వామీ!; ఈ భూవల్లభుఁడు= ఈ రాజు-; ధృతరాష్ట్రుడు; దేవర కృపన్= తమ దయచేత; అమల తత్త్వ బోధకము+ఐ= నిర్మలమైన తత్త్వాన్ని ఉపదేశించేదయి; సౌఖ్య+ఆవహము+అగు వాక్య చయమున్= సుఖాన్ని కలిగించే వాక్కుల సమూహాన్ని; తాన్= తాను; వినన్+కోరుటయును= వినగోరగా; మిమ్మున్; భక్తిన్= భక్తితో; తలఁచితిన్= స్మరించాను.

**తాత్పర్యం:** 'స్వామీ! ఈ ధృతరాష్ట్ర మహారాజు తమ దయవలన నిర్మలమైన వేదాంత తత్త్వాన్ని ఉపదేశించేదీ, సుఖాన్ని కలిగించేదీ అయిన వాక్సమూహాన్ని వినగోరడం చేత మిమ్ములను భక్తితో స్మరించాను.

**వ.** **మీరును గారుణ్యాతిశయంబున విజయం చేసితిరి. గురు సమాశ్రితులగు వార లెద్దాని వలన సుఖదుఃఖంబులు, లాభాలాభంబులుఁ, బ్రియద్వేషంబులు నాదిగాఁ గల ద్వంద్వంబులం బడక బ్రదుకుదు? రట్టి పరమార్థోపదేశంబున నితనిం గృతార్థునిం గావించి రక్షింపవలయు'నని ప్రార్థించినం, బార్థివుండునుం దదనురూపంబు లగు నాలాపంబుల నారాధించినం బ్రసన్నుండై, సనత్సుజాతుం డధ్యాత్మ విషయంబులగు వివిధ వాక్యంబుల సోపాన ప్రకారంబున నంతకంతకు సూక్ష్మంబులగు నర్థంబులు సమర్థించుచు, నందుఁ బ్రజ్ఞాచక్షుండెయ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివరించుచు, హృదయ పుష్కర కలితంబగు పరతత్త్వంబు ప్రసాదించునట్టి గూఢోక్తు లనుగ్రహించుచుండ, నెట్టకేలకుఁ బ్రభాతం బగుటయు, ధృతరాష్ట్ర విదురుల నామంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధానంబు నొందె; నట్టి సమయంబున.** **106**

**ప్రతిపదార్థం:** మీరును, కారుణ్య+అతిశయంబునన్= దయాతిశయంతో; విజయం చేసితిరి= విచ్చేశారు; గురు సమాశ్రితులు+అగు వారలు= గురువు నాశ్రయించుకొన్నవారు; ఏ+దాని వలనన్= దేనివలన; సుఖదుఃఖంబులున్; ప్రియ ద్వేషంబులున్; ఆదిగాన్= మొదలుగా; కల; ద్వంద్వంబులన్+పడక= జంటలయందు తగుల్కొనక; బ్రదుకుదురు; అట్టి; పరమార్థ+ఉపదేశంబునన్= తత్త్వం ఉపదేశించడం చేత; ఇతనిన్; కృతార్థునిన్= ధన్యుడిని; కావించి= చేసి; రక్షింపన్+వలయున్= కాపాడాలి; అని; ప్రార్థించినన్= కోరగా; పార్థివుండునున్= రాజు- ధృతరాష్ట్రుడు కూడా; తద్+అనురూపంబులు+అగు+ఆలాపంబులన్= దానికి తగిన మాటల చేత; ఆరాధించినన్= పూజించగా; ప్రసన్నుండు+ఐ= సంతోషించినవాడయి; సనత్సుజాతుండు; అధ్యాత్మ విషయంబులు+అగు వివిధ వాక్యంబులన్= పరమార్థానికి సంబంధించిన వివిధ వాక్కులతో; సోపాన ప్రకారంబునన్= ఒకదాని తరువాత ఒకటిగా- మెట్ల వరసను; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; సూక్ష్మంబులు+అగు+అర్థంబులు= అగోచరములైన విషయాలు; సమర్థించుచున్= బోధిస్తూ; అందున్= వాటిలో; ప్రజ్ఞా చక్షుండు= గ్రుడ్డివాడు- ధృతరాష్ట్రుడు; ఎయ్యది= ఏది; ఏర్పడన్+అడిగెన్= స్పష్టపరచుమని అడిగాడో; అది+ఎల్లన్= అదంతా; వివరించుచున్=

స్పష్టపరుస్తూ; హృదయ పుష్కర కలితంబు+అగు పరతత్త్వంబు= హృదయ పద్మంలో ఉన్న పరతత్త్వం; ప్రసాదించు+అట్టి= అనుగ్రహించే; గూఢ+ఉక్తులు+అనుగ్రహించుచున్+ఉండన్= రహస్యోక్తులు అనుగ్రహిస్తూంటే; ఎట్టకేలకున్= చాలసేపటికి; ప్రభాతంబు= ఉదయం; అగుటయున్= కాగా; ధృతరాష్ట్ర విదురులన్; ఆమంత్రణంబు+చేసి= వీడ్కొని; ఆ+దేవముని= ఆ దివ్యర్షి; అంతర్ధానంబున్+ఒందెన్= అదృశ్యుడయ్యాడు; అట్టి సమయంబునన్= ఆ సమయంలో-.

**తాత్పర్యం:** మీరు కూడా దయాతిశయంతో విచ్చేశారు. గురువు నాశ్రయించుకొన్నవారు దేనివలన సుఖదుఃఖాలూ లాభాలాభాలూ, ప్రియద్వేషాలూ మొదలుగాగల ద్వంద్వాలలో తగుల్కొనక బ్రదుకుతారో అటువంటి తత్త్వోపదేశంచేత ఇతడిని ధన్యుడిని చేసి కాపాడాలి' అని ప్రార్థించగా, ధృతరాష్ట్రుడు కూడా దానికి తగిన మాటలతో పూజించగా ప్రసన్నుడయి సనత్సుజాతుడు అధ్యాత్మ విషయాలైన వివిధ వాక్యాలతో ఒకదాని తరువాత ఒకటిగా- మెట్ల వరసను- క్రమక్రమంగా సూక్ష్మార్థాలు సమర్థిస్తూ, వాటిలో ధృతరాష్ట్రుడు స్పష్టపరచుమన్న వాటినన్నిటినీ వివరిస్తూ, హృదయపద్మంలో ఉన్న పరమాత్మ ప్రసాదించే రహస్య వాక్కులు అనుగ్రహిస్తూండగా, చాలాసేపటికి ప్రొద్దుపొడవగా, ధృతరాష్ట్ర విదురులను వీడుకొని ఆ దేవర్షి అదృశ్యుడయ్యాడు. ఆ సమయంలో.

### ప్రాతఃకాల వర్ణనము (అమూలకము)

**తే.** **తన కులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్ర । లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట**
**కుమ్మలించి వివర్ణత నొందినట్లు । గంది, యెంతయుఁ జెలు వేదెఁ జందురుండు.** **107**

**ప్రతిపదార్థం:** తన కులంబునన్= తన వంశంలో; పుట్టిన; ధార్తరాష్ట్రులు= కౌరవులు; అన్నదమ్ములతోన్; విగ్రహంబు+ కొనుటకున్= విరోధించటానికి; చందురుండు= చంద్రుడు; ఉమ్మలించి= దుఃఖించి; వివర్ణతన్= కాంతిహీనతను; ఒందిన+ అట్లు= పొందిన విధంగా; కంది= తేజోవిహీనుడయి; ఎంతయున్= మిక్కిలి; చెలువు+ఏదెన్= అందం కోల్పోయాడు.

**తాత్పర్యం:** తన వంశంలో పుట్టిన కౌరవులు అన్నదమ్ములతో విరోధపడినందుకు చంద్రుడు దుఃఖించి కాంతిహీనతను పొందినవిధంగా తేజోవిహీనుడై మిక్కిలి అందం కోల్పోయాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. కౌరవులు చంద్రవంశోద్భవులు. ఉదయ సమయంలో చంద్రుడు పాలిపోవడం సహజం. దానికి ధార్తరాష్ట్ర లన్నదమ్ములతో విగ్రహము గొనుట హేతువు కాదు. హేతువుకాని దానిని హేతువుగా చెప్పటం చేత అలంకారం హేతూత్ప్రేక్ష.

మూలంలో ఈ సందర్భంలో ప్రాతఃకాలవర్ణన లేదు. 'తస్యాం రజన్యాం వ్యుష్టాయాం' అని మాత్రమే మూలభారతంలో ఉన్నది. ఆ మాత్రపు సూచననే పురస్కరించుకుని తిక్కన ఇక్కడ ప్రాతఃకాల వర్ణన విపులంగా చేశాడు. నీతులతోనూ, ధర్మాలతోనూ విసుగెత్తిన పఠితలకు ఈ ప్రకృతి వర్ణన ఇంచుక చిత్తాహ్లాదాన్ని కలిగిస్తుంది.

**క.** **కుముదములుఁ దారు నొక్కటఁ । బ్రమదంబున నుండి, వాని పదవి దొలఁగినం**
**దమకున్ నిలువఁగఁ దగదను । క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్.** **108**

**ప్రతిపదార్థం:** తారకంబులు= నక్షత్రాలు; కుముదంబులున్= (తెల్ల) కలువలూ; తారున్= తామూ; ఒక్కటన్+ఒకచోట; ప్రమదంబునన్= సంతోషంతో; ఉండి; వాని పదవి తొలఁగినన్= ఆ కుముదముల సంపద నశించగా; తమకున్; నిలువఁగన్+ చనదు+అను క్రమమునన్= ఉండగూడదనే న్యాయం చొప్పున; చను+అట్లు= పోయే విధంగా; విరిసెన్= అదృశ్యమయ్యాయి.

**తాత్పర్యం:** కలువలూ తామూ ఒకేచోట సంతోషంతో ఉండి, ఆ కలువల సంపద నశించగానే - ఉన్నతస్థానం తొలగగానే - ఇంక తాము అక్కడ ఉండటం భావ్యం కాదని తొలగి పోయాయా అన్నట్లు నక్షత్రాలు అదృశ్యమయ్యాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. రాత్రివేళ కలువలు వికసిస్తాయి. నక్షత్రాలు కూడా అప్పుడే మెరుస్తూంటాయి. రాత్రి నశించగానే, సూర్యోదయం కాగానే కలువల వికాసం నశిస్తుంది. నక్షత్రాలు కూడా సహజంగానే అదృశ్యమవుతాయి. నక్షత్రాలు అదృశ్యమవటానికి కలువల పదవి పోయినప్పుడు ఇంక మనం ఉండగూడదనుకొనటం హేతువు కాదు. హేతువుకాని దానిని హేతువుగా ఊహించటంచేత ఇక్కడ అలంకారం హేతూత్ప్రేక్ష.

**ఉ. ఎత్తిన వేడ్కఁ గంధరము లెత్తి, మొగంబులు సాఁచి, చూడ్కులం**
**జిత్తములన్ నిగిడ్చి, తమ చెందెడు నిక్కలు రోసి, యింపు ద**
**ళ్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి, యెలర్చు కాయ్వులం**
**జిత్తజుకేళిఁ దేలె విలసిల్లుచు జక్కవదోయి వేకువన్. 109**

**ప్రతిపదార్థం:** వేకువన్= తెల్లవారుజామున; జక్కన దోయి= చక్రవాక పక్షుల జంట; ఎత్తిన వేడ్కన్= అతిశయించిన కోరికతో; కంధరములు+ఎత్తి= మెడలెత్తి; మొగంబులు= ముఖాలు; చాఁచి; చూడ్కులన్= చూపులతో; చిత్తములన్= మనస్సులను కూడా; నిగిడ్చి= ప్రసరింపజేసి; తమ చెందెడు+ఇక్కలు రోసి= తాము వెళ్ళవలసిన స్థానాలు వెదకి; ఒక్కచోన్= ఒకచోట; ఇంపు+తళ్కొత్తఁగన్= ఆనందం అతిశయించగా; ఒకటిన్+ఒక్కటి+కాంచి= ఒకదాని నొకటి చూచి; ఎలర్చు కాయ్వులన్= వికసిల్లే వలపులతో; విలసిల్లుచున్= ప్రకాశిస్తూ, ఆనందిస్తూ, చిత్తజుకేళిన్= మన్మథక్రీడయందు; తేలెన్= సుఖించాయి.

**తాత్పర్యం:** తెల్లవారుజామున చక్రవాక పక్షుల జంట అతిశయించిన కోరికతో మెడలెత్తి, ముట్టెలు చాచి, చూపులతోపాటు మనస్సులను కూడా ప్రసరింపజేసి, తాము చేరవలసిన స్థానాలు వెదకి, ఒకచోట ఆనందమతిశయించగా ఒకదానిని ఒకటి చూచి విలసిల్లుతూ ప్రకాశించే వలపులతో మన్మథక్రీడ చేసి ఆనందించాయి.

**విశేషం:** అలం: స్వభావోక్తి. చక్రవాకపక్షుల జంట రాత్రి తెల్లవార్లూ ఒకదాని నొకటి వీడి విరహం అనుభవించి తెల్లవారుజామున కలిసికొంటాయని కవులు వర్ణిస్తారు. పక్షుల పనులను స్వభావరమణీయంగా ఇందులో కవి వర్ణించాడు కాబట్టి అలంకారం స్వభావోక్తి.

**మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ, మనోమోదంబునం దేఁటు ల**
**ల్లన యొలిన్ వెడలంగ, రేకులు సముల్లాసంబునన్ బింక మె**
**క్క నయంబెక్కుచు, గద్దె పొం దెడలి వీఁకం గేసరంబుల్ గడ**
**ల్కొనఁ, దోడ్తో మధు వుచ్చి, పేరెలమిఁ బొల్పుం జెందె నంభోజముల్. 110**

**ప్రతిపదార్థం:** అంభోజముల్= పద్మాలు; మును= ముందు; సౌరభ్యము= పరిమళం; నివ్వటిల్లఁగన్= వ్యాపించగా; తేఁటులు= తుమ్మెదలు; మనస్(ః)+మోదంబునన్= మనస్సంతోషంతో; అల్లన= మెల్లగా; ఓలిన్= క్రమంగా; వెడలంగన్= బయలుదేరగా; రేకులు= పూవురేకులు; సముల్లాసంబునన్= వికాసంతో; బింకము+ఎక్కన్= పైకి లేవగా- విచ్చుకోగా; నయంబు+ఎక్కుచున్= అంద మతిశయిస్తూ; కేసరంబుల్= అకరువులు; గద్దె పొందు+ఎడలి= దుద్దునుండి వీడి; వీఁకన్= విజృంభణంతో; కడల్కొనన్= వ్యాపించగా; తోడ్తోన్= వెనువెంటనే; మధువు+ఉచ్చి= తేనె పైకి వచ్చి; పేరు+ఎలమిన్= అధిక వికాసంతో- సంపూర్ణ వికాసంతో; పొల్పున్+చెందెన్= అందగించాయి.

**తాత్పర్యం:** పద్మాలు ముందుగా పరిమళం వ్యాపించగా, తుమ్మెదలు దానికి మనస్సంతోషంతో మెల్లగా క్రమంగా వాటి దగ్గరకు బయలుదేరగా, రేకులు మంచి వికాసంతో విచ్చుకోగా, అందమతిశయిస్తూ, అకరువులు దుద్దునుండి వీడి విజృంభణంతో వ్యాపించగా, వెనువెంటనే తేనె పైకి వచ్చి, సంపూర్ణ వికాసంతో అందగించాయి.

**విశేషం:** అలం: స్వభావోక్తి. ఇందులో ఉదయ సమయంలో పద్మాల వికసన క్రమాన్ని స్వభావసుందరంగా కవి వర్ణించాడు కాబట్టి అలంకారం స్వభావోక్తి. మనోమోదంబునన్.... వెడలంగ .... పద్మాలు వికసించకుండానే వాటి పరిమళం ముందు వ్యాపిస్తుంది. దానికి ఆకృష్టములై తుమ్మెదలు క్రమక్రమంగా వాటిదరికి వెడతాయి. గద్దె పొందెడలి - కేసరాలు మొగ్గగా ఉన్నప్పుడు దుద్దునంటిపెట్టుకుని ఉంటాయి. పువ్వు వికసించగానే అవి దాని నుంచి విడివడుతాయి. గ్రద్దె- అనే పాఠం అన్ని ప్రతులలోనూ ఉంది. కాని ఆ పదం సూర్యరాయాంధ్ర నిఘంటువులో లేదు. అందులో 'గద్దె' అని ఉన్నది. అందుచేత అదే గ్రహించబడింది. తోడ్తో మధువుచ్చి - పువ్వు వికసించిందే తడవుగా అందులో నుండి మకరందంపైకి పొరలుతుంది.

**చ. వెడవెడ నిద్రవొంది కనువిచ్చిన పాంథులమీఁద దాడి వోఁ,**
**దడఁబడ నొండొరుం బిలుచు దర్పకు పంపు బలంబులోని య**
**ల్కుడు కరణిం జెలంగె శుక కోకిల భృంగతతుల్ వనంబులం**
**దెడనెడఁ బల్కఁ, గూయ, సొగియింపఁగ మ్రోయఁగఁ దద్విరావముల్. 111**

**ప్రతిపదార్థం:** వనంబులందున్= తోటలలో; శుక కోకిల భృంగ తతుల్= చిలుకల, కోకిలల, తుమ్మెదల సమూహాలు; ఎడనెడన్= అప్పుడప్పుడు; పల్కన్= పలుకగానూ; కూయన్= కూయగానూ; సొగియింపఁగన్ మ్రోయఁగన్= సుఖించేటట్లు రొదచేయగానూ; తద్ విరావముల్= వాటి వాటి ధ్వనులు; వెడవెడ= మిక్కిలి అల్పంగా; నిద్ర+పొంది= నిద్రపోయి; కనువిచ్చిన= కళ్ళు తెరిచిన; పాంథుల మీఁదన్= విరహుల పైకి; దాడి+పోన్= దండెత్తేటప్పుడు; తడఁబడన్= తొట్రుపడేటట్లు; ఒండొరున్= పరస్పరం; పిలుచు= పిలిచే; దర్పకు పంపు బలంబులోని+అల్కుడు కరణిన్= మన్మథుడు పంపే సైన్యంలోని ధ్వనివలె; చెలంగెన్= మ్రోగాయి- ఒప్పాయి.

**తాత్పర్యం:** తోటలలో చిలుకలూ, కోకిలలూ, తుమ్మెదలూ అప్పుడప్పుడు పలుకుతున్నాయి, కూస్తున్నాయి, సుఖం కలిగేటట్లు రొద చేస్తున్నాయి. ఆ ధ్వనులు ఎట్లా ఉన్నాయంటే- ఇంచుక నిద్రపోయి కళ్ళు తెరిచిన విరహుల మీదికి తన బలగాన్ని పంపితే, అందులోని పరివారం వాళ్లమీదకు పోయేటప్పుడు తొట్రుపాటుతో పరస్పరం పిలుచుకుంటూ చేసే చప్పుడువలె ఒప్పుతున్నాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. విరహులకు రాత్రి నిద్రపట్టలేదు. తెలతెలవారుతూందనగా కొంచెం కన్నుమూశారు. తెల్లవారగానే కళ్ళు తెరిచారు. అప్పుడు వాళ్లపైకి మన్మథుడు తన బలగాన్ని పంపాడు. అతడి బలగం చిలుకలూ, కోకిలలూ, తుమ్మెదలూ. అవి 'మన ప్రభువు ఆజ్ఞ అయింది. ఇంక ఏమాత్రమూ ఆలస్యం చేయగూడదు. విరహుల మీదకు పోదాం రండి అని తొట్రుపాటుతో ఒకళ్ళ నొకళ్ళు పిలుస్తున్నాయా అన్నట్లుగా పలుకుతున్నాయి, కూస్తున్నాయి, రొద చేస్తున్నాయి. అవి అప్పుడు చేసే చప్పుడులా అన్నట్లుగా ఉన్నాయి వనంలో చిలుకలూ, కోకిలలూ, తుమ్మెదలూ పలికే పలుకుల, కూసే కూతల, చేసే రొదల చప్పుడులు.

**సీ. పద్మపరాగంబుఁ బరఁగించు నరుణోద । యంబు కాంతికిఁ జెలువంబు మిగులఁ,**
**బరువంబు దప్పిన విరుల రాలుచుఁ దరు । చయము చుక్కలు లేని చదలఁ జెనయ,**
**నరవిరి నెత్తాని నడరించు నున్నిద్ర । విట వీటి సౌరభవితతి వొదల,**
**నెలఁత చీరిన యెఱకల నెఱిఁ దీర్చు జ । క్క వలు చందోయి కేఁకట యొనర్ప.**

**ఆ. వెలరువాఱు దీవియల నల్లనల్లార్చు । సోర్ణగండ్లయందుఁ జొచ్చి సుడిసి,**
**తిరిగి వేగుఁబోక తెమ్మెర లెలదీఁగ । కొనల వంక లొత్తు, ననలఁ బ్రోచు.** 112

**ప్రతిపదార్థం:** వేగుఁబోక తెమ్మెరలు= తెల్లవారుజామునందలి పిల్లగాలులు; తిరిగి= సంచరించి; అరుణ+ఉదయంబు కాంతికిన్= సూర్యోదయపు కాంతికి; చెలువంబు= అందం; మిగులన్= అతిశయించగా; పద్మ పరాగంబున్= తామర పుప్పొడిని; పరఁగించున్= వ్యాపింపజేస్తుంది; తరు చయము= చెట్ల సమూహం; చుక్కలు లేని చదలన్= నక్షత్రాలు లేని ఆకాశాన్ని; చెనయన్= పోలేటట్లు; పరువంబు+తప్పిన విరులన్= పక్వస్థితి నతిక్రమించిన పువ్వులను; రాలుచున్= రాలగొట్టుతుంది; ఉన్నిద్ర విట వీటిన్= నిద్రలేని విటుల వీటి యొక్క ప్రదేశంయొక్క; సౌరభ వితతి= పరిమళాల సమూహం; పొదలన్= అతిశయించేటట్లు; అర విరి నెఱ+తావి= సగం విచ్చిన పూల పరిమళాన్ని; అడరించున్= వ్యాపింపజేస్తుంది; జక్కవలు= చక్రవాకపక్షులు; చెన్ను+తొవలకున్= ఎర్ర కలువల కొరకు; ఏఁకట+ఒనర్పన్= అభిలాష చేయగా- అపేక్షించగా; నెలఁత= ఆడు జక్కవ- చక్రవాకి; చీరిన+ఎఱకల= చీలిన రెక్కల యొక్క; నెఱిన్= చిక్కును; తీర్చున్= సరిచేస్తుంది; సోర్ణ గండ్ల యందున్= కిటికీలలో; చొచ్చి= ప్రవేశించి; సుడిసి= చుట్టుకొని; వెలరు+పాఱు= వెలవెల పోయే; దీవియలన్= దీపాలను; అల్లన్= మెల్లగా; అల్లార్చున్= చలింపజేస్తుంది; ఎలదీఁగ కొనల వంకలు= లేదీగల చివరల వంకరలు; ఒత్తున్= సరిచేస్తుంది; ననలన్= పువ్వుల్ని; ప్రోచున్= పెంచుతుంది.

**తాత్పర్యం:** తెల్లవారుజామున వీచే గాలి సంచరిస్తూ సూర్యోదయపు కాంతికి అందం అతిశయించేటట్లు తామర పుప్పొడిని ఎగురగొట్టుతుంది. చెట్ల సమూహం నక్షత్ర రహితమైన ఆకాశాన్ని పోలేటట్లు వాడిపోయిన పువ్వులను రాలగొట్టుతుంది. నిద్రలేని విటుల ప్రదేశంలో పరిమళాలు అతిశయించేటట్లు సగం విచ్చిన పూల సువాసనను వ్యాపింపచేస్తుంది. చక్రవాక పక్షులు ఎర్ర కలువల కొరకు అభిలషించగా చక్రవాకి చీలిన రెక్కల చిక్కు సరిచేస్తుంది. కిటికీలను చుట్టి వచ్చి వెలవెలపోయే దీపాలను మెల్లగా చలింపచేస్తుంది. లేదీగ కొసల వంకరలను తీరుస్తుంది. పువ్వులను పెంచుతుంది.

**విశేషం:** అలం: స్వభావోక్తి, ఉపమ. గాలి వీచే విధాన్ని కవి స్వభావరమణీయంగా వర్ణించాడు కాబట్టి అలంకారం స్వభావోక్తి. అరుణోదయం కాంతి ఎరుపు. పద్మరాగం కూడా ఎరుపే. అందుచేతనే చెలువం మిగలటం. పూలు రాలిపోతే చెట్లు చుక్కలులేని ఆకాశంవలె ఉంటాయి. అలంకారం ఉపమ. విటులు పరిమళద్రవ్యాలు పూసికొని' (సెంట్లు మొదలైనవి) గుమగుమలాడుతుంటారు. వాళ్ళ వలన ఆ వీడంతా పరిమళిస్తుంది. పూల నెత్తావితో ఆ వీడు మరింత పరిమళిస్తుంది. తెల్లవారుజామున సూర్యుడి వెలుగువలన దీపాలు వెలవెలపోతాయి. కిటికీలలో వీచేగాలి వాటిని అల్లల్లాడిస్తుంది.

**ఆ. అంత నుదయశైల మను నశోకద్రుమ । సమితియందుఁ గాంతి చారుభంగి**
**నెఱయ విరిసి తొలుత నెగసిన యుజ్జ్వల । స్తబక మనఁగఁ బద్మసఖుఁడు వొడిచె.** 113

**ప్రతిపదార్థం:** అంతన్= పిమ్మట - తెల్లవారిన తరువాత; ఉదయ శైలము+అను+అశోక ద్రుమ సమితి+అందున్= తూర్పుకొండ అనే అశోక వృక్షాల సమూహంలో; కాంతి; చారు భంగిన్= మనోహరమైన విధంగా; నెఱయన్= నిండగా; విరిసి= పూసి; తొలుతన్= మొదటిసారి; నెగసిన+ఉజ్జ్వల స్తబకము+అనఁగన్= బయల్వెడలిన ప్రకాశించే పూలగుత్తియో అనేటట్లు; పద్మసఖుఁడు= పద్మబాంధవుడు-సూర్యుడు; పొడిచెన్= ఉదయించాడు.

**తాత్పర్యం:** అప్పుడు తూర్పుకొండ అనే అశోక వృక్ష సమూహంలో కాంతి మనోహరంగా వ్యాపించగా పూసి మొదటిసారిగా బయల్వెడలిన ప్రకాశించే పూలగుత్తియా అనేటట్లు సూర్యుడు ఉదయించాడు.

**విశేషం:** అలం: రూపకం. ఉదయశైలమే అశోకద్రుమ సమితి. పద్మసఖుడే ఉజ్జ్వలస్తబకం - రూపకం. తదనుప్రాణితమైన ఉత్ప్రేక్ష. సూర్యబింబం ఎరుపు. అశోకపుష్ప స్తబకం కూడా ఎరుపే. పుష్పస్తబకం గుండ్రన. సూర్యబింబం కూడా గుండ్రనిదే. అంచేత పోలిక సరిపోయింది. తొలుత- సూర్యు డొక్కడే అందుచేత పుష్పస్తబకం కూడా ఒక్కటే. మరి పూయవు. స్తబకమూ, సూర్యబింబమూ రెండూ ఉజ్జ్వలాలే. అశోకద్రుమ సమితి అనటం కొండతో పోలికకు.

**సీ.** **ఉర్వీధరంబుల నొప్పెడు జేవుఱుఁ । జఱుల కాంతికి నును మెఱుఁగు వెట్టి,**
**ధరణీజ గుల్మ లతా వితానము పల్ల । వములకుఁ గట్టెఱ్ఱ వన్నె యొసఁగి,**
**యరుణాంబుజంబుల యంతర్దళంబుల । తళతళలకు జిగి దళము కొల్పి,**
**చక్రవాకద్వయ సంతతి యెఱకల । కొమరారు కెంజాయఁ గ్రొత్తసేసి,**

**ఆ.** **తనదు బాలబింబ మనుపమేయప్రభా । పటల జటిల గగనభాగ మగుచు**
**నుల్లసిల్లి, జగము లెల్లను విలసిల్లఁ । బూర్వశిఖరిమీఁదఁ బొడిచె నినుఁడు.** **114**

**ప్రతిపదార్థం:** ఉర్వీధరంబులన్= కొండలందు; ఒప్పెడు= ఒప్పే; జేవుఱు+చఱుల కాంతికిన్= జేవురు రంగు చరియల కాంతికి; నును మెఱుఁగు+పెట్టి= ఇంచుక మెరుగుపెట్టి; ధరణీజ గుల్మ లతా వితానము పల్లవములకున్= చెట్లయొక్కయు, పొదలయొక్కయు, తీగల యొక్కయు సమూహం యొక్క చివురులకు; కడు+ఎఱ్ఱ వన్నె+ఒసఁగి= మిక్కిలి ఎరుపురంగు కలిగించి; అరుణ+అంబుజంబుల= ఎఱ్ఱతామరలయొక్క; అంతర్దళంబుల తళతళలకు= లోపలి రేకుల తళతళమనే కాంతులకు; జిగిన్= మెఱుగుదనాన్ని; దళము+కొల్పి= అధికం చేసి; చక్రవాక ద్వయ సంతతి ఎఱకల= చక్రవాక పక్షుల జంటల సమూహం యొక్క రెక్కల యొక్క; కొమరు+ఆరు= అందగించే; కెంపు+చాయన్= ఎఱ్ఱటి కాంతిని; క్రొత్త+చేసి= అపూర్వం చేసి; తనదు బాల బింబము= తన యొక్క లేతబింబం; అనుపమేయ ప్రభా పటల జటిల గగన భాగము+అగుచున్= సాటిలేని కాంతుల యొక్క సమూహంచేత క్రిక్కిరిసిన ఆకాశ ప్రదేశం కలది అవుతూ; ఉల్లసిల్లి= ప్రకాశించి; జగములు+ఎల్లను= లోకాలన్నీ; విలసిల్లన్= ప్రకాశించగా; ఇనుఁడు= సూర్యుడు; పూర్వ శిఖరి మీఁదన్= తూర్పు కొండపై; పొడిచెన్= ఉదయించాడు.

**తాత్పర్యం:** కొండలలో ఒప్పే జేవురురంగు చరియల ఎఱ్ఱటి కాంతికి ఇంచుక మెరుగు పెట్టి, చెట్ల, పొదల, తీగల సమూహాల చిగుళ్లకు మిక్కిలి ఎరుపు వన్నె కలిగించి, ఎఱ్ఱ తామరల లోపలి రేకుల తళతళలాడే కాంతిని అతిశయింపజేసి, చక్రవాక పక్షుల జంటల సమూహపు రెక్కల మనోహరమైన ఎఱ్ఱటి కాంతిని అపూర్వం చేసి, తన లేత బింబం ఆకాశ ప్రదేశాన్ని సాటిలేని కాంతి పుంజంతో క్రిక్కిరిసినదిగా చేస్తూ ఒప్పగా, లోకాలన్నీ ప్రకాశించేటట్లు సూర్యుడు ఉదయ పర్వతం మీద ఉదయించాడు.

**విశేషం:** అలం: స్వభావోక్తి. కొండ చరియలు సహజంగానే జేవురురంగు కలిగి ఉంటాయి. ఉదయ సూర్యుడి కాంతి వాటికింకా ఇంచుక మెరుగు పెడుతుంది. చివుళ్ళ కాంతి సహజంగానే ఎరుపు. సూర్యకాంతి దాని నింకా ఎర్రగా చేస్తున్నది. ఎర్ర తామరల లోపలి రేకులు తళతళలాడుతూంటాయి. ఆ తళతళలను మరింత సాంద్రం చేస్తున్నది సూర్యబింబం. చక్రవాక మిథునాల రెక్కలకు ఎర్రటి కాంతిని అపూర్వంగా కలిగిస్తున్నాడు సూర్యుడు.

**వ. ఇట్లు సూర్యోదయం బగుటయు, ధృతరాష్ట్రుండు తత్కాలోచితాచారంబులు నిర్వర్తించి, తగు తెఱంగున నలంకృతుం డయి, యాస్థానమండపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ, గుంభ సంభవ కృప కృతవర్మాశ్వత్థామ కర్ణాదు లగు దొరలును, భీష్మ విదుర బాహ్లిక సోమదత్త భూరిశ్రవః ప్రభృతులగు బంధుజనులును, దుర్యోధన దుశ్శాసన ప్రముఖులగు కుమారులును లోనుగాఁ గల సమస్త పరిజనంబులును వచ్చి బలసియుండి; రయ్యవసరంబున సంజయుండు వచ్చి వాకిట నిలిచి పణిహారుల వలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి, సముచిత ప్రదేశంబునం గూర్చుండి, తన మాటలు వినుటకుఁ జిడిముడిపడుచున్న కొలువుఁ గలయం గనుంగొని యిట్లనియె. 115**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సూర్య+ఉదయంబు+అగుటయున్= సూర్యోదయం కాగా; ధృతరాష్ట్రుండు; తద్+కాల+ఉచిత+ఆచారంబులు= ఆ సమయానికి తగిన పనులు; నిర్వర్తించి= చేసి; తగు తెఱంగునన్= తగిన విధంగా; అలంకృతుండు+అయి= అలంకరించబడినవాడై; ఆస్థాన మండపంబునకున్+అరిగి= సభా మందిరానికి వెళ్ళి; పేరు+ఓలగంబు+ఇచ్చినన్= నిండు సభ తీర్చగా; కుంభసంభవ కృప కృతవర్మ+అశ్వత్థామ కర్ణ+ఆదులు+అగు దొరలును= ద్రోణుడూ, కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా, కర్ణుడూ మొదలైన నాయకులునూ; భీష్మ విదుర బాహ్లిక సోమదత్త భూరిశ్రవస్+ప్రభృతులు+అగు బంధు జనులును= భీష్ముడూ, విదురుడూ, బాహ్లికుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ మొదలుగాగల చుట్టాలునూ; దుర్యోధన దుశ్శాసన ప్రముఖులు+అగు కుమారులును= దుర్యోధనుడూ, దుశ్శాసనుడు మొదలైన కుమారులునూ; లోనుగాన్+కల సమస్త పరిజనులును= మొదలుగాగల ఎల్ల పరివారమూ; వచ్చి; బలసి+ఉండిరి= కూడి ఉన్నారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; సంజయుండు; వచ్చి; వాకిటన్= ద్వారం దగ్గర; నిలిచి; పణిహారుల వలనన్= ద్వారపాలకుల చేత; తన్నున్+ఎఱింగించి పుచ్చి= తన రాక తెలియజేసి; చొచ్చి= ప్రవేశించి; సముచిత ప్రదేశంబునన్= తగిన స్థానంలో; కూర్చుండి; తన మాటలన్ వినుటకున్; చిడిముడి పడుచున్+ఉన్న= వేగిరపడుతున్న; కొలువున్= సభను; కలయన్+కనుంగొని= అంతటా చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇట్లా సూర్యోదయం కాగా ధృతరాష్ట్రుడు ఆ సమయానికి తగిన పనులు చేసి, తగిన విధంగా అలంకరించుకొని, సభాస్థానానికి వెళ్ళి నిండుసభ తీర్చగా, ద్రోణుడూ, కృపుడూ, కృతవర్మా, అశ్వత్థామా మొదలగు నాయకులూ, భీష్ముడూ, విదురుడూ, బాహ్లికుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ మొదలైన బంధువులూ, దుర్యోధనుడూ, దుశ్శాసనుడూ మొదలగు కుమారులూ, ఇంకా ఉన్న ఎల్ల పరిజనులూ వచ్చి పరివేష్టించారు. ఆ సమయంలో సంజయుడు వచ్చి ద్వారం దగ్గర నిలిచి ద్వారపాలకుల చేత తన రాక తెలిపి ప్రవేశించి తగిన స్థానంలో కూర్చుండి, తన మాటలు వినటానికి తొందరపడుతున్న సభను అన్ని వైపులా చూచి ఇట్లా అన్నాడు.

### సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగుసెప్పుట (సం. 5-46-15)

**తే. 'పాండురాజ తనూజులపాలి కర్థి । నిమ్మహారాజు పనుపంగ నేఁగి ధర్మ**
**పుత్త్రుఁ గాంచితి; నాతండు మైత్రి మెఱయఁ । గౌరవుల సేమ మెల్లఁ బేర్వేర నడిగె. 116**

**ప్రతిపదార్థం:** పాండురాజు తనూజుల పాలికిన్= పాండురాజు కొడుకుల వద్దకు; అర్థిన్= కోరికతో; ఈ+మహారాజు పనుపంగన్= ఈ ధృతరాష్ట్ర మహారాజు; పంపగా; ఏఁగి= వెళ్ళి; ధర్మపుత్త్రున్= ధర్మరాజును; కాంచితిన్= చూచాను; ఆతండు; మైత్రి మెఱయన్= స్నేహం ప్రకాశించగా- ఒప్పగా; కౌరవుల సేమము+ఎల్లన్= కౌరవుల క్షేమం అంతా; పేర్వేరన్= పేరుపేరునా; అడిగెన్= అడిగాడు.

**తాత్పర్యం:** 'పాండవుల వద్దకు ఈ ధృతరాష్ట్ర మహారాజు పంపగా వెళ్ళి ధర్మరాజును చూచాను. అతడు చెలిమి ఒప్పగా కౌరవుల యోగక్షేమాలను గురించి పేరుపేరునా అడిగాడు.

**వ. మఱియుఁ దగువారల నెల్ల నయ్యై యుచితవిధిం బ్రణామంబున, వినయంబున, బాంధవంబున, మిత్రభావంబున, వాత్సల్యంబునఁ, బ్రసాదంబున నాదరించె; నేనును భూనాథుండు గఱపిన తెఱంగునఁ గొఱంత లేకుండ బంధుత్వంబునకు వలయు మాటలాడితిఁ; బదంపడి కార్యంబు ప్రసంగించి నా యాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లింత యొప్పునే?' యని యగ్గించిన, ధృతరాష్ట్రం డవహితుండై యడుగఁ, దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పిన భంగులు, నతండు వానికి నెల్ల నుత్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి, ధృతరాష్ట్రునకుం, బితామహునకు, దుర్యోధనునకుం గ్రమంబున వారివారితో నాడుమని నియమించిన చందంబులు ధర్మనందను పలుకుల పరిపాటిం దేటపడం జెప్పి సూతసూనుండు వెండియు నిట్లనియె. 117**

**ప్రతిపదార్థం:** మఱియున్, తగు వారలన్+ఎల్లన్= తగువారినందరినీ, ఆ+ఆ=ఆయా; ఉచిత విధిన్= తగిన విధంగా; ప్రణామంబునన్= నమస్కారంతో; వినయంబునన్= నమ్రతతో; బాంధవంబునన్= చుట్టరికంతో; మిత్ర భావంబునన్= స్నేహభావంతో; వాత్సల్యంబునన్= ప్రేమతో; ప్రసాదంబునన్= అనుగ్రహంతో; ఆదరించెన్= సంభావించాడు; ఏనును= నేనును; భూనాథుండు= రాజు ధృతరాష్ట్రుండు; కఱపిన తెఱంగునన్= బోధించిన విధంగా; కొఱంత లేక+ఉండన్= లోపం లేకుండా; బంధుత్వంబునకున్= చుట్టరికానికి; వలయు మాటలు+ఆడితిన్= అవసరమైన పలుకులు పలికాను; పదంపడి= పిమ్మట; కార్యంబు ప్రసంగించి= వచ్చిన పనిని ప్రస్తావించి; నా+ఆడిన మాటలకున్= నేను పలికిన పలుకులకు; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; పలికిన వచనంబులు= పలికిన పలుకులు; ఇంత+ఒప్పునే!= ఎంత బాగున్నాయి!; అని; అగ్గించినన్= పొగడగా; ధృతరాష్ట్రుండు; అవహితుండు+ఐ+అడుగన్= సావధానుడై అడుగగా; తాను; ఆ+యుధిష్ఠిరునకున్= ఆ ధర్మరాజుకు; చెప్పిన భంగులున్= చెప్పిన తెఱగులూ; అతండు; వానికిన్+ఎల్లన్= వాటి కన్నింటికీ; ఉత్తరంబు+ఇచ్చిన తెఱంగునున్= సమాధానం చెప్పిన విధమూ; ఎఱింగించి= తెలిపి; ధృతరాష్ట్రునకున్; పితామహునకున్= తాతకు- భీష్ముడికి; దుర్యోధనునకున్; క్రమంబునన్= వరుసగా; వారి వారితోన్; ఆడుము+అని= చెప్పుమని; నియమించిన చందంబులున్= విధించిన విధములూ; ధర్మనందను పలుకుల పరిపాటిన్= ధర్మరాజు మాటల క్రమమూ; తేటపడన్+చెప్పి= స్పష్టపడేటట్లు చెప్పి; సూతసూనుండు= సంజయుడు; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇంకా తగువారినందరినీ ఆయా వారికి తగిన రీతిని నమస్కారమూ, వినయమూ, బంధుత్వమూ, స్నేహభావమూ, వాత్సల్యమూ, అనుగ్రహమూ నెరపి ఆదరించాడు. నేను కూడా రాజు బోధించిన విధంగా లోపం లేకుండా బంధుత్వానికి అవసరమైన రీతిగా పలికాను. పిమ్మట, వచ్చిన పనిని ప్రస్తావించి నేను పలికిన పలుకులకు ఆ ధర్మరాజు పలికిన పలుకులు ఎంత బాగున్నాయి!' అని పొగడగా, ధృతరాష్ట్రుడు సావధానుడై అడుగగా, తాను ఆ ధర్మరాజుతో అన్న మాటలూ, అతడు వాటి కన్నింటికీ సమాధానం చెప్పిన విధమూ తెలిపి, ధృతరాష్ట్రుడికీ,

భీష్ముడికీ, దుర్యోధనుడికీ క్రమంగా వారి వారితో చెప్పుమని చెప్పిన రీతులు ధర్మరాజు మాటల క్రమంలో స్పష్ట పడేటట్లు చెప్పి సంజయుడు ఇంకా ఇట్లా అన్నాడు:

**తే. 'ఏ నుపప్లావ్య పురమున కేఁగి తొలుత । వాసుదేవార్జునులఁ గంటి; వారు నీతి**
**పథము దప్పని మాటలు బలిమిఁ దోఁచు । నట్లుగా నాడి; రవి వినుం డాదరించి.' 118**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఉపప్లావ్య పురమునకున్; ఏఁగి; తొలుతన్= మొదట; వాసుదేవ+అర్జునులన్= కృష్ణుడినీ, అర్జునుడినీ; కంటిన్= చూచాను; వారు; నీతి పథము+తప్పని మాటలు= నీతి మార్గం అతిక్రమించని మాటలు; బలిమిన్= విధిగా; తోఁచు+అట్లు+కాన్= స్ఫురించే విధంగా; ఆడిరి= పలికారు; అవి; ఆదరించి వినుండు= ఆదరంతో వినండి.

**తాత్పర్యం:** 'నేను ఉపప్లావ్యపురానికి వెళ్ళి మొదట కృష్ణార్జునులను చూచాను. వారు నీతిమార్గం తప్పని మాటలు విధిగా తోచేటట్లు పలికారు. వాటిని సాదరంగా వినండి.'

**విశేషం:** ఉపప్లావ్య నగరంలో సంజయుడు మొదట దర్శించింది వాసుదేవార్జునులను. వాసుదేవుడిని దర్శించబోగా అక్కడ అర్జునుడు అతడి వెంట అంటిపెట్టుకొని ఉన్నాడు. నరనారాయణ మైత్రిని ముమ్మూర్తుల ఈ పుట్టుకలో వారిద్దరు ప్రదర్శించారు. వారిద్దరూ నీతియుక్తంగా పలికారని చెప్పటంవలన వారు కుటిల నీతిని ప్రదర్శించలేదని భావం. (సంపా.)

**వ. అనిన విని ధృతరాష్ట్రుం 'డవ్వాసుదేవు చిత్తం బె? ట్లతం డేమనియె?' నని యడిగిన, నతనికి సంజయుం**
**డిట్లనియె: 119**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ధృతరాష్ట్రుండు; ఆ+వాసుదేవు చిత్తంబు+ఎట్లు= ఆ కృష్ణుడి మనస్సు ఎట్లా ఉన్నది?; అతండు; ఏమి+అనియెన్; అని+అడిగినన్; అతనికిన్; సంజయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని ధృతరాష్ట్రుడు 'ఆ కృష్ణుడి మనస్సు ఎట్లా ఉన్నది? అత డే మన్నాడు?' అని అడుగగా, అతడితో సంజయుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** కృష్ణార్జునులలో వాసుదేవుడి హృదయమేమిటి? అతడి మాటల తీరేమి?టని ధృతరాష్ట్రుడు గుచ్చి గుచ్చి అడిగాడు. పాండవుల బుద్ధిశక్తితోపాటు ఆత్మశక్తికూడ శ్రీకృష్ణుడే. అతడి మాటను వారందరు శిరసా వహిస్తారు. అర్జునుడు ధర్మజుడి తమ్ముడు. అన్న మాట దాటని వాడు. వాసుదేవుడిమాట దైవాజ్ఞగా భావించేవాడు. అందువలన శ్రీకృష్ణుడి అభిప్రాయాన్ని ధృతరాష్ట్ర డడిగాడు. అతడి మాటలలో అతడి హృదయం ప్రతిఫలిస్తుందా? అని ప్రత్యేకించి అడగటం ధృతరాష్ట్రుడి నైజం. తాను మనసుకూ, మాటకూ పొంతన లేనివాడు కావటంచేత లోకమంతా తన వలెనే ఉంటుందని భావిస్తాడు. ఏమైనా ధృతరాష్ట్రుడికి శ్రీకృష్ణుడి రాజనీతిజ్ఞతమీద గౌరవ ప్రపత్తులకన్నా భయసందేహాలే ఎక్కువగా ఉన్నాయని తెలుస్తుంది. (సంపా.)

**ఉ. 'తానును సత్యభామయును ద్రౌపదియున్ నరుఁడున్ రహస్యగో**
**ష్ఠీ నిరతాత్ముఁడై సుతులుఁ జేరని చెందని యట్టిచోటఁ గాం**
**తానివహంబు గొల్వఁ బ్రమదస్థితి నుండియుఁ, బిల్వఁబంచె న**
**న్నా నలినోదరుండు; హృదయంబున నీ దెస కూర్మియెట్టిదో? 120**

**ప్రతిపదార్థం:** ఆ నలిన+ఉదరుండు= ఆ పద్మనాభుడు- శ్రీకృష్ణుడు; తానును; సత్యభామయునున్; ద్రౌపదియున్; నరుఁడున్= అర్జునుడూ; రహస్య గోష్ఠీ నిరత+ఆత్ముఁడు+ఐ= రహస్య సంభాషణలో ఆసక్తిగల మనస్సు కలవాడయి; సుతులున్= కొడుకులు కూడా; చేరని చెందని+అట్టి చోటన్= దగ్గరకు రానటువంటి చోట; కాంతా నివహంబు= భార్యల సమూహం; కొల్వన్= సేవిస్తూండగా; ప్రమద స్థితిన్+ఉండియున్= ఆనందస్థితిలో ఉండి కూడా; నన్నున్; పిల్వన్+పంచెన్= పిలిపించాడు; హృదయంబునన్= అతడి హృదయంలో; నీ దెస కూర్మి= నీ మీది ప్రేమ; ఎట్టిదో= ఎటువంటిదో (ఎంత గొప్పదో).

**తాత్పర్యం:** 'ఆ శ్రీకృష్ణుడూ తనూ, సత్యభామా, ద్రౌపదీ, అర్జునుడూ రహస్య సంభాషణలు గావించే కోరిక కలవాడై కొడుకులు కూడా సమీపించని చోట, భార్యలు కొలుస్తూండగా, ఆనందంగా ఉండి కూడా నన్ను పిలిపించాడు. ఆతడి హృదయంలో నీమీద ఎంత ప్రేమో!

**విశేషం:** శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడిమీద గల అపారమైన ఆదరగౌరవాలను అతడి దూతను గౌరవించటం ద్వారా ప్రకటించాడు. అంతఃపురంలో కాంతలతో, అర్జునుడితో కలిసి ముచ్చటలాడుతున్న రహస్య సమావేశమది. కొడుకులకే అందులోనికి ప్రవేశం లేదు. కాని, సంజయుడికి దర్శన మిచ్చాడు. అది తన మీది అభిమానం కాదనీ, ధృతరాష్ట్రుడి మీది ప్రేమ అనీ సంజయుడు వ్యాఖ్యానించాడు. శ్రీకృష్ణుడి వర్తనం రెండంచులున్న కత్తి వంటిది. తేనె పూసిన కత్తివలె ధృతరాష్ట్రుడు రాయబారం పంపాడు. శ్రీకృష్ణుడు కూడా దానికి ప్రతిగా వ్యవహరించాడు. శ్రీకృష్ణుడు తనమీద ప్రేమాదరాలు ప్రదర్శించాడంటే నమ్మేంత అమాయకుడు కాడు ధృతరాష్ట్రుడు. అయినా లోకమర్యాద ననుసరించి శ్రీకృష్ణుడి నీతివర్తనం పరమోదారం. (సంపా.)

**వ. ఏనును దత్ప్రకారంబు పణిహారుల వలన మున్న యెఱింగిన వాఁడ నగుటం జేసి కంచుకంబును, శిరోవేష్టనంబును ధరియించి వినీత వేషుండనై పోవునప్పుడు కృష్ణార్జును లనేక మణిమయ భూషణ ప్రభా భాసితులై యొక్కసెజ్జన యున్నవారు; కృష్ణుండు పవ్వళించి యుండి, చాఁచిన చరణంబులు దొడలపై నిడికొని యర్జునుండు గూర్చున్నవాఁడు; సత్యభామయుం బాంచాలియుం గద్దియలపై నున్నవారు; సవినయంబుగా నేనును దండప్రణామంబు సేసిన నన్నాదరించి, కృష్ణుని చేసన్న నర్జును పనుపునం గనక రత్నమయంబగు నతని పాదపీఠం బతండు వ్రేల్చిన కాళ్ళు దిగిచికొన; నిద్దఱు ముద్దియ లెత్తి తెచ్చి నాకుం బెట్టిన, నేనును దానిం గరతలంబున నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి, కేలు మొగిడ్చి ఫాలతలంబునం గదియించి, నీలవర్ణులు బాహుబల మద భరితులును నయి యేనుఁగు దోయియుంబోలె నున్న యమ్మాధవధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రు పులకలును, దదనంతరంబ భయంబునుం బుట్టె; నట్టియెడ. 121**

**ప్రతిపదార్థం:** ఏనును= నేను కూడా; తద్+ప్రకారంబు= ఆవిధం; పణిహారుల వలనన్= ద్వారపాలకుల వలన; మున్ను+అ= ముందే; ఎఱింగిన వాఁడన్+అగుటన్+చేసి= ఎరిగినవాడనవటం చేత; కంచుకంబును= చొక్కానూ; శిరోవేష్టనంబును= తలపాగానూ; ధరియించి; వినీత వేషుండను+ఐ= పెద్ద మనిషి తరహా వేషం కలవాడినయి; పోవు+అప్పుడు= వెళ్ళేసరికి; కృష్ణ+ అర్జునులు; అనేక మణిమయ భూషణ ప్రభా భాసితులు+ఐ= పెక్కు మణులతో నిర్మించబడిన అలంకారాల కాంతులచేత ప్రకాశించిన వారై; ఒక్క సెజ్జన్+అ= ఏకశయ్యయందే; ఉన్నవారు; కృష్ణుండు; పవ్వళించి+ఉండి= పరుండి; చాఁచిన చరణంబులన్= చాచిన పాదాలను; తొడలపైన్+ఇడికొని= తొడలమీద పెట్టుకొని; అర్జునుండు, కూర్చున్నవాఁడు; సత్యభామయున్; పాంచాలియున్= ద్రౌపదీ; గద్దియలపైన్= పీఠాలమీద; ఉన్నవారు; ఏనును; సవినయంబుగాన్= అడకువతో; దండ ప్రణామంబు+చేసినన్=

సాష్టాంగ నమస్కారం చేయగా; నన్నున్+ఆదరించి= నన్ను సంభావించి; కృష్ణుని చేసన్నన్= కృష్ణుడి చేతి సంజ్ఞతో; అర్జును పనుపునన్= అర్జునుడి ఆజ్ఞచొప్పున; కనక రత్న మయంబు+అగు+అతని పాదపీఠంబు= బంగారుతోనూ; మణులతోనూ చేయబడినదైన అతడి పాదపీఠం; అతండు (వ్రేల్చిన కాళ్ళు+తిగిచికొనన్= అతడు పెట్టుకున్న కాళ్ళు తీసికొనగా; ఇద్దఱు ముద్దియలు= ఇద్దరు స్త్రీలు; ఎత్తి; తెచ్చి; నాకున్; పెట్టినన్; నేనును; దానిన్; కరతలంబునన్= చేతితో; అంటుచున్= తాకుతూ; ధరణీ తలంబునన్= నేల మీద; కూర్చుండి; కేలు మొగిడ్చి= చేతులు జోడించి; ఫాల తలంబునన్= నుదుటిమీద; కదియించి= పెట్టి; నీల వర్ణులున్= నల్లని మేని చాయగలవారూ; బాహు బల మద భరితులును= భుజపరాక్రమమనే మదంతో కూడినవారూ; అయి, ఏనుఁగు దోయియున్+పోలెన్= ఏనుగుల జంటా అన్నట్లుగా; ఉన్న, ఆ+మాధవ ధనంజయులన్= ఆ కృష్ణార్జునులను; చూచు+అప్పుడు= చూసేటప్పుడు; నాకున్; హర్ష+అశ్రు పులకలును= సంతోష బాష్పాలూ, గగుర్పాటూ; తద్+అనంతరంబు+అ= ఆ వెంటనే; భయంబునున్; పుట్టెన్= కలిగింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** నేనూ వాళ్ళున్న విధం ద్వారపాలకుల చేత ముందే తెలిసినవాడిని కావడం చేత, చొక్కా, తలపాగా ధరించి పెద్ద మనిషి తరహా వేషంతో వెళ్ళినపుడు కృష్ణార్జునులు పెక్కు మణులు పొదిగిన అలంకారాల కాంతులతో మెరిసిపోతూ ఒక్క శయ్యపైనే ఉన్నారు. కృష్ణుడు పరుండి చాచుకొన్న పాదాలను తన తొడలపై పెట్టుకొని అర్జునుడు కూర్చున్నాడు. సత్యభామా, ద్రౌపదీ పీఠాలపై ఆసీనలయ్యారు. నేను సవినయంగా సాష్టాంగ నమస్కారం చేయగా కృష్ణుడు నన్ను ఆదరించాడు. బంగారంతోనూ, మణులతోనూ, చేసిన పాదపీఠంపై తను పెట్టుకొన్న కాళ్ళు తీసివేయుగా, కృష్ణుడి చేతి సంజ్ఞతోనూ, అర్జునుడి ఆజ్ఞ చొప్పునా, ఇద్దరు స్త్రీలు దానిని తెచ్చి నాకు వేయగా, నేను దానిని చేతితో తాకి, నేలపైన కూర్చుండి చేతులు జోడించి నుదుటిపై పెట్టి, నల్లని మేనిచాయ కలిగి, భుజ పరాక్రమ గర్వితులై ఏనుగుల జంటవలె ఉన్న ఆ కృష్ణార్జునులను చూస్తుంటే నాకు ఆనందంతో కళ్ళు చెమర్చాయి, ఒళ్ళు పులకించింది. ఆ తరువాత భయం కూడా వేసింది. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** 1. శ్రీకృష్ణుడి మందిర సన్నివేశంలో ఒక దివ్య వాతావరణాన్ని సంజయుడు దర్శించాడు. వాసుదేవుడు నారాయణుడు. అర్జునుడు పాద సంవాహన రూపమైన సేవాభక్తిని ప్రదర్శిస్తున్న భాగవతోత్తముడు. వారిద్దరు ఒకే శయ్యమీద ఉన్నారు. అది వారి అభేద ప్రవృత్తికి నిదర్శనం. సత్యభామా ద్రౌపదులు వేరే గద్దెలపై కూర్చొని ఉన్నారు. వారు మధుర ముగ్ధ భక్తిభావాలకు ప్రతీకలు. పరమాత్మను సేవించే మూడు రకాల భక్తుల ముప్పేట దృశ్యమది. శ్రీకృష్ణుడికి సంజయుడు దండప్రణామం చేశాడు. అది ఎంతటి రాచరికపు మర్యాదో, అంతటి భక్తి మర్యాద. సంజయుడు దూతగానే కాక, భక్తుడుగా నమస్కరించాడు. అందుకే తనకు రత్న సింహాసనం చూపించినా వద్దని నేలమీద కూర్చున్నాడు. నెన్నుదురును నేలకు తాకించి నమస్కరించాడు. ఏన్గుల జంటవలె ఉన్న నరనారాయణులను చూచి పులకించాడు, ఆనందాశ్రువులను రాల్చాడు. అది భక్తి తన్మయభావానికి ప్రతీక. భక్తిభావం తరువాత భయభావం కలగటం విశేషం. ఇది రసధ్వని. భక్తుడుగా చూచినప్పుడు ఆనందం కలిగింది. ఆ స్థితి నుండి లౌకిక స్థాయికి వచ్చి దూతగా చూచినప్పుడు భయం కలిగింది. ధృతరాష్ట్రుడి సందేశం ఋజుమార్గాన సాగేది కాదు. వాసుదేవుడి ముందు తాను ప్రదర్శించబోయే వక్రనీతికి అతడి అంతరాత్మ భయభావాన్ని ప్రదర్శించింది. తన అనుభవాన్ని దాచుకొనకుండ చెప్పుతున్న సంజయుడి నిజాయితీ ఇందులో స్పష్టం. (సంపా.)

2. 'ఏనుఁగు దోయియిం బోలె నున్న యమ్మాధవధనంజయులన్' - అలంకారం ఉపమ. వాళ్లిద్దరూ ఏనుగులవలె తోచటం చేత 'భయం'.

**క. 'ఈ యిరువురుఁ బంచిన పని । సేయుదురట! ధర్మజునకుఁ జేకుఱని తలం**
**పేయది? యతనిం దొడరుట । వేయేటికి జముని శిరము వ్రేయుట గాదే?' 122**

**ప్రతిపదార్థం:** ఈ+ఇరువురున్= ఈ ఇద్దరూ కృష్ణార్జునులు; పంచిన పని+చేయుదురు+అటె= ధర్మరాజు చెప్పినపని చేస్తారట!; ధర్మజునకున్= ధర్మరాజుకి; చేకుఱని తలంపు+ఏ+అది= నెరవేరని కోరిక ఇక ఏముంటుంది?; వేయి+ఏటికిన్= వేయి మాట లెందుకు?; అతనిన్+తొడరుట= ఆ ధర్మరాజును ఎదిరించటం; జముని శిరము వ్రేయుట+కాడే= యమధర్మరాజు శిరస్సును తెగవేయటమే కాదా?

**తాత్పర్యం:** 'ఈ కృష్ణార్జునులిద్దరూ తాను ఏ పనిచెప్పితే ఆ పని చేస్తారట! ఇంక ధర్మరాజుకు నెరవేరని కోరికంటూ ఏముంటుంది? వేయిమాట లెందుకు? ఒక్క మాటలో చెప్పాలంటే, అతడిని యుద్ధంలో ఎదిరించడం అంటే, యమధర్మరాజు శిరస్సును తెగవేయటమే కాదా?

**విశేషం:** అలం: నిదర్శన. సాక్షాత్తూ యమధర్మరాజు తల తెగెయ్యటం ఎవరికైనా ఎంత అసాధ్యమో, ధర్మరాజును యుద్ధంలో ఎదిరించటం అంత అసాధ్యం అని భావం. 'అతనిం దొడరుట ................ జముని శిరము వ్రేయుట గాదే' - ఉపమాన వాక్యార్థానికీ (జముని శిరము వ్రేయుట), ఉపమేయ వాక్యార్థానికీ (అతనిం దొడరుట) అభేదం చెప్పబడటం చేత అలంకారం నిదర్శన.

**వ. అని తలంచుచుండ, నమ్మహానుభావులు నన్ను సంభావించి, తా రుపయోగించునట్టి యన్నపానంబులను, దమకుఁగట్టఁదగినట్టి వస్త్రంబులను, దాము దొడుగునట్టి భూషణంబులను నాకుఁ బ్రియంబొనర్చి గారవించిరి, నేనును నా పోయిన కార్యంబు విన్నవించిన; విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు వలుకం దొడంగిన వారించి వారిజోదరుం డిట్లనియె: 123**

**ప్రతిపదార్థం:** అని; తలంచుచున్+ఉండన్= అనుకుంటూంటే; ఆ+మహానుభావులు= ఆ మహాత్ములు; నన్నున్; సంభావించి= ఆదరించి; తారు= తాము; ఉపయోగించు+అట్టి+అన్నపానంబులను= ఉపయోగించే అన్నపానాలనూ; తమకున్+కట్టన్+తగిన+ అట్టి వస్త్రంబులను= తాము కట్టదగిన వస్త్రాలనూ; తాము; తొడుగు+అట్టి భూషణంబులను= ధరించే అలంకారాలూ; నాకున్; ప్రియంబు+ఒనర్చి= ప్రీతితో ఇచ్చి; గారవించిరి= గౌరవించారు; నేనును; నా పోయిన కార్యంబు= నేను వెళ్ళిన పని; విన్నవించినన్= మనవి చేయగా; విజయుండు= అర్జునుడు; బలు మొగంబుతోన్= తీక్ష్ణమైన ముఖంతో; దానికిన్; ఉత్తరంబు= సమాధానం; పలుకన్+తొడంగినన్= చెప్పబూనగా; వారిజ+ఉదరుండు= పద్మనాభుడు- శ్రీకృష్ణుడు; వారించి= ఆపి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని అనుకుంటూంటే, ఆ మహాత్ములు నన్ను ఆదరించి తాముపయోగించే అన్నపానాలు, తాము కట్టదగిన వస్త్రాలూ, తాము ధరించే ఆభరణాలూ నాకు ప్రీతితో సమర్పించి గౌరవించారు. నేను వెళ్ళిన పని మనవి చేశాను. అప్పుడు అర్జునుడు తీక్ష్ణమైన ముఖంతో దానికి సమాధానం చెప్పబోతూ ఉంటే కృష్ణుడు ఆపి ఇట్లా అన్నాడు:

### సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుండు సెప్పినమాట లెఱింగించుట (సం. 5-58-18)

**తే. 'వినుము సంజయ! ధృతరాష్ట్ర విభుని పెద్ద । కొలువునందుఁ దత్పుత్త్రులు, గురుఁడుఁ, గృపుఁడు,**
**నాపగానందనుఁడు మొదలైన సకల । జనులు వినుచుండఁగా నిట్టు లనుము నీవు. 124**

**ప్రతిపదార్థం:** సంజయ!= సంజయా!; వినుము; ధృతరాష్ట్ర విభుని పెద్ద కొలువునందున్= ధృతరాష్ట్ర మహారాజు నిండుసభలో; తద్+పుత్త్రులున్= అతడి కొడుకులూ; గురుఁడున్= ద్రోణుడూ; కృపుఁడున్; ఆపగానందనుఁడున్= నదీసుతుడూ- భీష్ముడూ; మొదలు+ఐన= ఆదిగాగల; సకల జనులున్= ఎల్లరూ; వినుచున్+ఉండఁగాన్= వింటూండగా; నీవు; ఇట్టులు+అనుము.

**తాత్పర్యం:** సంజయా! వినుము. ధృతరాష్ట్ర మహారాజు నిండుసభలో అతడి కొడుకులూ, ద్రోణుడూ, కృపుడూ, భీష్ముడూ మొదలుగాగల వాళ్ళందరూ వింటూండగా నీవు ఇట్లా అనుము.

**ఆ. అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్ళుల । నగ్ని పుట్టినట్టి దయ్యెఁ; మీకు**
**నార్ప వెరవు లేదు; నేర్పుమై నింకఁ గా । వింపవలయు పనులు వినుఁడు మీరు. 125**

**ప్రతిపదార్థం:** ఆ+అజాతశత్రుఁడు= ఆ ధర్మరాజు; అలుగుట= కోపం వహించటం; నీళ్ళులన్= నీళ్ళల్లో; అగ్ని= నిప్పు; పుట్టిన+అట్టిది+అయ్యెన్= పుట్టటంవంటిది; మీకున్; ఆర్పన్= ఆర్పటానికి; వెరవు= ఉపాయం; లేదు; ఇంకన్= ఇకమీదట; నేర్పుమైన్= నేర్పుతో; కావింపవలయు పనులు= చేయవలసిన పనులు; మీరు; వినుఁడు= వినండి.

**తాత్పర్యం:** ఆ అజాతశత్రుడికి కోపం రావటం అంటే, నీళ్ళల్లో నిప్పు పుట్టటం వంటిది. దానిని ఆర్పటానికి మీకు ఉపాయం లేదు. ఇక మీదట నేర్పుతో మీరు చేయవలసిన పనులు వినండి.

**విశేషం:** అలం: నిదర్శన, పరికరాంకురం. 'అయ్యజాతశత్రుఁ డలుగుట నీళ్ళుల - నగ్ని పుట్టినట్టిది' - ఉపమాన వాక్యానికీ (నీళ్ళుల నగ్ని పుట్టుట); ఉపమేయ వాక్యానికీ (అయ్యజాతశత్రుఁ డలుగుట) ఐక్యారోపణం- అభేదం - చెప్పబడింది కాబట్టి అలంకారం నిదర్శన. నీళ్ళల్లో అగ్ని పుట్టడం ఎలాంటి వైపరీత్యమో, అజాతశత్రుడికి (శత్రువులే లేనివాడికి) కోపం రావటం అటువంటి వైపరీత్యమని భావం. 'ధర్మరాజు' శబ్దానికి 'అజాతశత్రు'డనే శబ్దం సాభిప్రాయంగా వాడబడింది కాబట్టి అలంకారం పరికరాంకురం.

**వ. అవి యెవ్వి యంటేని. 126**

**తాత్పర్యం:** అంటే మీరు చేయవలసిన పనులు ఏవి అంటావేమో.

**సీ. కలయట్టి వివిధార్థములు నశేషంబుగఁ । దగ నొసంగుండు సత్పాత్రములకుఁ,**
**జెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి । సత్కరింపుఁడు సంతసం బెలర్ప,**
**నిచ్ఛానుగుణముల నింద్రియసుఖముల । ననుభవింపుఁడు హృదయంబు లలర,**
**నాండ్రను బిడ్డల నయ్యె విధంబుల । గారవింపుఁడు ప్రియపూరితముగ**

**తే. మఱియు నెవ్వరి చిత్త మెత్తెఱఁగునందు । వాటమైయుండు నది యెల్ల వలయునట్లు**
**సేసి విహరింపుఁ; డిం కెడ సేయ కనికి । నడవుఁ డఱచేతఁ బ్రాణంబు లిడి కడంగి. 127**

**ప్రతిపదార్థం:** కల+అట్టి= ఉన్నట్టి; వివిధ+అర్థములున్= రకరకాల వస్తువులూ; అశేషంబుగన్= నిశ్శేషంగా- సంపూర్ణంగా; సత్+పాత్రములకున్= మంచి యోగ్యులైనవారికి; తగన్= ఒప్పుగా; ఒసంగుండు= ఇచ్చివేయండి; చెలులన్= స్నేహితులను; చుట్టములన్= బంధువులను; ఆశ్రితులను= ఆశ్రయించుకొన్న వాళ్ళనూ; రావించి= రప్పించి; సంతసంబు+ఎలర్పన్= సంతోషం అతిశయించగా; సత్కరింపుఁడు= సమ్మానించండి; ఇచ్ఛా+అనుగుణములన్= కోరికకు అనుకూలమైన వాటిని;

ఇంద్రియ సుఖములన్= ఇంద్రియ సౌఖ్యాలను; హృదయంబులు+అలరన్= హృదయాలు ఆనందించగా; అనుభవింపుడు; ఆంద్రను= భార్యలనూ; బిడ్డలన్= బిడ్డలనూ; ఆ+ఆ విధంబులన్= ఆయా విధాలుగా; ప్రియ పూరితముగన్= ప్రీతి నిండేటట్లు; గారవింపుఁడు= ఆదరించండి; మఱియున్= ఇంకా; ఎవ్వరి చిత్తము= ఎవరి మనస్సు; ఏ+తెఱఁగు+అందున్= ఏ రీతిలో; వాటము+ఐ+ఉండున్= సక్తమై ఉంటుందో-తగిలి ఉంటుందో; అది+ఎల్లన్= అదంతా; వలయు+అట్లు+చేసి విహరింపుఁడు= కావలసిన విధంగా చేసి స్వేచ్ఛగా సంచరించండి; ఇంకన్; ఎడ+చేయక= ఆలస్యం చేయక; అఱచేతన్= అరచేతిలో; ప్రాణంబులు+ఇడి= ప్రాణాలు పెట్టుకొని; కడంగి= పూని; అనికిన్= యుద్ధానికి; నడవుఁడు= నడవండి.

**తాత్పర్యం:** ఉన్న వస్తువులన్నీ యోగ్యులైనవాళ్ళకు ఒప్పుగా పంచిపెట్టండి. స్నేహితులనూ, చుట్టాలనూ, ఆశ్రితులనూ రప్పించి సంతోషం అతిశయించగా సమ్మానించండి. మీ కోరికలకు అనుకూలంగా హృదయాలు ఆనందించేటట్లు ఇంద్రియసుఖాలు అనుభవించండి. మీ భార్యల్నీ, బిడ్డల్నీ ఎవరికి ఏ విధం తగుతుందో ఆ విధంగా ప్రీతి నిండేటట్టు ఆదరించండి. ఇంకా- ఎవరి మనస్సు ఏ రీతియందు తగిలి ఉంటుందో అదంతా కావలసినవిధంగా స్వేచ్ఛగా చేసి సంచరించండి. ఇంక ఆలస్యం చేయకుండా ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని యుద్ధానికి బయల్దేరండి.

**విశేషం:** కృష్ణు డిట్లా చెప్పడం యుద్ధంలో కౌరవులకు చావు తప్పదనే ఉద్దేశంతో చేయవలసినవీ, అనుభవించవలసినవీ ఇప్పుడే-బ్రతికుండగానే చేసికొనండి అని హెచ్చరిస్తున్నారు.

**వ. అని చెప్పఁ; మింత యేమిటి కంటేని. 128**

**తాత్పర్యం:** ఇదంతా ఎందుకు చెపుతున్నావంటావేమో.

**ఉ. ఎందును నెవ్వరుం బడని యెంతయుఁ గష్టముపాటు వచ్చినం**
**గొందల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్న నన్ను 'గో**
**విందుఁడ ! కావు' మంచుఁ బలవించుట యీఁగఁగరాని యప్పుఁ బో**
**లెం దలపోయ వ్రేఁగయి చలింపకయున్నది యెప్పుడున్ మదిన్. 129**

**ప్రతిపదార్థం:** పాండువిభు కోడలు= పాండురాజు కోడలు- ద్రౌపది; ఎందునున్= ఎక్కడా; ఎవ్వరున్= ఎవ్వరూ; పడని= అనుభవించని; ఎంతయున్+కష్టము, పాటు, వచ్చినన్= ఎంతో కష్టం వస్తే; కొందలము+అంది= దుఃఖించి; దవ్వులన్+ఉన్న నన్నున్= దూరంగా ఉన్న నన్ను; గోవిందుఁడ!= కృష్ణా!; కావుము= రక్షించుము; అంచున్= అంటూ; పలవించుట= ఏడవటం; ఈఁగఁగన్+రాని+అప్పున్+పోలెన్= తీర్చరాని అప్పువలె; తలపోయన్= చింతించగా; వ్రేఁగు+అయి= బరువై; మదిన్= మనస్సులో; ఎప్పుడున్= నిరంతరమూ; చలింపక+ఉన్నది= నిలిచి ఉన్నది.

**తాత్పర్యం:** పాండురాజు కోడలు - ద్రౌపది ఎప్పుడూ ఎవరూ పడని ఎంతో కష్టం వస్తే, దుఃఖించి, ఎక్కడో దూరంగా ఉన్న నన్ను 'గోవిందా! రక్షించుము' అంటూ ఏడవటం తీర్చలేని అప్పువలె - ఆలోచించగా బరువై నా మనస్సులో ఎప్పుడూ నిలిచి ఉన్నది.

**విశేషం:** యుద్ధంలో కౌరవులు నశించినప్పుడే ఆ అప్పు తీరుతుంది అని కృష్ణుడి అభిప్రాయం.

**తే. ఇట్టి యేఁ దేరు గడపంగ, నెందు నుతికి । నెక్కు గాండీవ మేడ్తెఱ నెక్కు వెట్టి**
**రెండు దొనలను బూని కిరీటి యనికి । వచ్చు నేఁ డెల్లి; యెందుఁ బోవచ్చు మీకు?' 130**

**ప్రతిపదార్థం:** ఇట్టి+ఏన్= ద్రౌపదికి ఋణగ్రస్తుడనై ఉన్న నేను; తేరు+కడపంగన్= రథం తోలగా; ఎందున్= ఎక్కడా; నుతికిన్ ఎక్కు గాండీవము= పొగడ్తకెక్కు గాండీవం; ఏడ్తెఱన్= పరాక్రమంతో; ఎక్కు+పెట్టి= సజ్యం చేసి- నారి తొడిగి; రెండు దొనలను= రెండు అమ్ముల పొదులను; పూని= ధరించి; కిరీటి= అర్జునుడు; నేఁడు+ఎల్లి= ఈవేళ రేపట్లో; అనికిన్= యుద్ధానికి; వచ్చున్; మీకున్; ఎందున్+పోన్+వచ్చున్?= ఎక్కడకు తప్పించుకొని పోవీలౌతుంది? (కాదని భావం).

**తాత్పర్యం:** ద్రౌపదికి అప్పుపడి ఉన్న నేను రథం తోలగా, పొగడ్త కెక్కిన గాండీవాన్ని పరాక్రమంతో ఎక్కుపెట్టి రెండు అంపపొదులను ధరించి అర్జునుడు ఈవేళ రేపట్లో యుద్ధానికి వస్తాడు. ఇక మీరు ఎక్కడికి పోతారు?'

**విశేషం:** శ్రీకృష్ణుడి మనోగతమైన భావం ఈ తేటగీతిలో తేటతెల్లమవుతున్నది. ద్రౌపదికి శ్రీకృష్ణుడు పడిన అప్పును తీర్చికొనటానికే శ్రీకృష్ణుడు పార్థసారథిగా పూనుకొంటాడు. రథస్థుడైన అర్జునుడు గాండీవ పరాక్రమాన్ని ప్రదర్శిస్తాడు. ఇక కౌరవులు తప్పించుకొనే అవకాశం లేదు అని హెచ్చరించాడు. (సంపా.)

**వ. అని పలుకునప్పటి వారి యెత్తికోలును, నీ కొడుకు నిలుపోపమియునుం దలంచి భయం బందితి; నితండు వారల నెఱుంగండు; భీష్మద్రోణుల ప్రాపును, గర్ణు గర్వంబును దన్ను గెలిపించునని నచ్చి తొడరెడు' ననిన విని ధృతరాష్ట్రుం 'డర్జునుం డేమనియె?' నని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె: 131**

**ప్రతిపదార్థం:** అని పలుకు+అప్పటి వారి+ఎత్తికోలును= అని పలికేటప్పటి వారి పూనికా (కోరికా); నీ కొడుకు నిలుపు+ఓపమియునున్= నీ కొడుకు దుర్యోధనుడు (వాళ్ళకు ఇవ్వవలసిందేదో) విడవలేకపోవటమూ; తలంచి; భయంబు+అందితిన్= భయపడ్డాను; ఇతండు= దుర్యోధనుడు; వారలన్= పాండవులను; ఎఱుంగండు; భీష్మ ద్రోణుల ప్రాపును= భీష్మద్రోణుల అండా; కర్ణు గర్వంబును= కర్ణుడి గర్వమూ; తన్నున్+గెలిపించున్+అని నచ్చి తొడరెడున్= తనను గెలిపిస్తాయని నమ్మి ఎదిరిస్తాడు; అనినన్; విని; ధృతరాష్ట్రుండు; అర్జునుండు; ఏమి+అనియెన్; అని; అడిగినన్; అతనికిన్; సంజయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికేటప్పటి వారి పూనికా, నీ కొడుకు వాళ్ళకివ్వవలసింది ఇవ్వలేకపోవటమూ తలచుకొని నేను భయపడ్డాను. ఇతడికి వాళ్ళ సంగతి తెలియదు. భీష్మద్రోణుల అండా, కర్ణుడి గర్వమూ తనను గెలిపిస్తాయనే ధీమాతో ఎదిరిస్తాడు' అనగా, ధృతరాష్ట్రుడు విని 'అర్జును డేమన్నాడు?' అని అడుగగా అతడికి సంజయుడు ఇట్లా అన్నాడు:

**విశేషం:** శ్రీకృష్ణుడు పార్థసారథిగా యుద్ధంలో పాల్గొంటానని చెప్పి శత్రు సంహారం చేసేది అర్జునుడే అని ధ్వనింపజేశాడు. అందువలన అర్జునుడి అభిప్రాయాన్ని ధృతరాష్ట్రుడు తెలిసికొనగోరాడు. అర్జునుడు శ్రీకృష్ణుడికి అంగమా? ధర్మరాజుకు అంగమా? అనే అనుమానం కలిగి ఉండవచ్చును. ఏమైనా పాండవ పక్షంలో పార్థుడి అభిప్రాయానికి బలమున్నదని భావించి ధృతరాష్ట్రుడు అడిగాడు. (సంపా.)

## సంజయుఁడు ధృతరాష్ట్రున కర్జునుఁడు చెప్పిన మాట లెఱింగించుట (సం. 5-47-6)

**క. 'నరుఁ దలుక వొడమియును సు । స్థిరుఁడై, తన యెఱ్ఱ సెరల చెలువునఁ గెందా**
**మరలం దెగడెడు కన్నుల । నరుణచ్ఛవి నెఱయ నిట్టు లనియె నరేంద్రా! 132**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా, ధృతరాష్ట్రా!; నరుఁడు= అర్జునుడు+పొడమియును= కోపం వచ్చినా; సుస్థిరుఁడు+ఐ= చలించని వాడయి; తన+ఎఱ్ఱ సెరల చెలువునన్= తన కళ్ళల్లోని జీరల కాంతితో; కెంపు+తామరలన్= ఎర్ర తామరలను; తెగడెడు కన్నులన్= తిరస్కరించే కన్నులలో; అరుణ+ఛవి= ఎర్రని కాంతి; నెఱయన్= నిండగా; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజా! కోపం వచ్చినా అర్జునుడు చలించక, తన కళ్ళల్లోని ఎర్రటి జీరల కాంతి చేత ఎర్ర తామరలను తిరస్కరించే కళ్ళల్లో ఎర్రటి కాంతి నిండగా ఇట్లా అన్నాడు.

**విశేషం:** అర్జునుడి కళ్ళల్లో ఎర్రటి జీరలుండటం చేత వాటి కాంతిచే అవి ఎర్ర తామరలవలె ఉన్నాయి. వాటిలో ఎర్రటి కాంతి నిండటం కోపాతిశయంచేత.

**ఆ. 'ఆ సుయోధనుండు, నతనికిఁ దోడ్పడ । నరుగుదెంచినట్టి ధరణినాథ**
**చయము వినుచునుండ సంజయ ! నా వచ । నములు గాఁగ ని ట్లనంగవలయు. 133**

**ప్రతిపదార్థం:** సంజయ!= సంజయుడా!; ఆ సుయోధనుండున్= ఆ దుర్యోధనుడూ; అతనికిన్; తోడ్పడన్+అరుగుదెంచిన+అట్టి= సాయపడటానికి వచ్చినట్టి; ధరణినాథ చయమున్= రాజుల సమూహమూ; వినుచున్+ఉండన్= వింటూండగా; నా వచనములు+కాఁగన్= నా మాటలుగా; ఇట్లు+అనంగన్ వలయున్= ఇట్లా చెప్పాలి.

**తాత్పర్యం:** 'సంజయా! ఆ దుర్యోధనుడూ, అతడికి సాయపడటానికి వచ్చిన రాజుల సమూహమూ వింటూండగా నా మాటలుగా నీవు ఇట్లా అనాలి.

**ఉ. పాండుని యగ్రనందనుఁడు పా లడుగం దగ నీఁడయేని, మా**
**కొం డన నేల? మే లది; సుయోధనుఁ డింతకుమున్ను పెక్కు లు**
**ద్దండతఁ దాను జేసిన విధంబుల కెల్ల మెఱుంగు వెట్టిన**
**ట్లుండెడుఁ గాక, యేనును వృకోదరుఁడుం బ్రియమందునట్లుగన్. 134**

**ప్రతిపదార్థం:** పాండుని+అగ్ర నందనుఁడు= పాండురాజు పెద్ద కొడుకు ధర్మరాజు; పాలు+అడుగన్= భాగం ఇమ్మంటే; తగన్= ఒప్పుగా; ఈఁడు+అ+ఏనిన్= ఇవ్వకపోతే; మాకున్; ఒండు+అనన్+ఏల= ఇంకో మాట అనటం ఎందుకు?; అది; మేలు= మంచిది; ఇంతకున్+మున్ను= ఇదివరకు; సుయోధనుఁడు= దుర్యోధనుడు; ఉద్దండతన్= తెగువతో; తాను; చేసిన పెక్కులు విధంబులకున్+ఎల్లన్= చేసిన ఎన్నో వాటికన్నిటికీ; ఏనును= నేనూ; వృక+ఉదరుఁడున్= భీముడూ (తోడేలు పొట్టవంటి పొట్టగలవాడు); ప్రియము+అందు+అట్లుగన్= సంతోషిస్తూండగా; మెఱుంగు+పెట్టిన+అట్లు+ఉండెడున్+కాక= మెరుగుపెట్టినట్లుగా ఉంటుందిలే.

**తాత్పర్యం:** ధర్మరాజు భాగం ఇమ్మని అడిగితే ఒప్పుగా ఇవ్వకపోతే, మేము ఇంకో మాట అనటం ఎందుకు? అది మంచిది. ఇంతకు ముందు దుర్యోధనుడు మహాగర్వంతో చేసిన ఎన్నో పనుల కన్నింటికీ - నేనూ భీముడూ సంతోషించేటట్టుగా మెరుగుపెట్టినట్లు ఉంటుందిలే.

**విశేషం:** 'ఇంతకు మున్ను .... మెఱుంగు వెట్టి నట్లుండెడుఁగాక' - ఇంతకు ముందు దుర్యోధనుడు మాకెన్నో అపకారాలు చేశాడు. అవి మా ప్రతీకారానికి చాలనివైతే; ఇప్పుడు ధర్మరాజు కోరినట్లుగా భాగం ఇవ్వకపోవడం వాటికి తోడై, మా ప్రతీకారానికి తగినవౌతాయని భావం.

**క. మా యిరువురతోఁ గయ్యము । సేయ నతం డియ్యకొనిన, సిద్ధించెన కా**
**దే యుచితచరితుఁ డగు కౌం । తేయాగ్రజు కార్య; మట్టి తెఱఁగొప్పుఁ గదా! 135**

**ప్రతిపదార్థం:** మా+ఇరువురతోన్= మా ఇద్దరితో-నాతోనూ; భీముడితోనూ; కయ్యము+చేయన్= యుద్ధం చేయడానికి; అతండు= దుర్యోధనుడు; ఇయ్యకొనినన్= అంగీకరిస్తే; ఉచిత చరితుఁడు+అగు కౌంతేయ+అగ్రజు కార్యము= మంచినడవడి కల ధర్మరాజు పని; సిద్ధించెన్+అ+కాదే= ఫలించినట్లే కాదా?; అట్టి తెఱఁగు= అటువంటి విధం; ఒప్పున్+కదా!= మంచిది కదా!

**తాత్పర్యం:** దుర్యోధనుడు నాతోనూ, భీముడితోనూ యుద్ధం చేయటానికి అంగీకరిస్తే, ఇంక మాకు కావలసిందేమిటి? ధర్మరాజు అనుకున్నపని నెరవేరినట్లే! అట్లా అయితే మంచిదే కదా!

**విశేషం:** దుర్యోధనాదులను ప్రతిఘటించటంలో భీమార్జునుల సంఘటిత శక్తిని ప్రస్తావించటం ప్రకరణౌచిత్యం. వ్యంగ్యంగా ధర్మజ నాయకత్వాన్ని అర్జునుడు సమర్థించటం సూక్ష్మాంశం. (సంపా.)

**క. వనవాసంబున భూశ । య్యను ధర్మజుఁ డున్నయట్టి యాయాసము వో**
**వునె, యంపశయ్య దుర్యో । ధనుఁడు రణక్షోణిఁ బడక తక్కిన యేనిన్? 136**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుఁడు; రణ క్షోణిన్= యుద్ధభూమిలో; అమ్ము+శయ్య= అమ్ముల సెజ్జ మీద; పడక తక్కిన+ఏనిన్= పడకుండా ఉన్నట్లయితే; ధర్మజుఁడు= ధర్మరాజు; వన వాసంబునన్= అరణ్యావాసంలో; భూశయ్యను= నేలే పాన్పుగా; ఉన్న+అట్టి+ఆయాసము= ఉన్న కష్టం; పోవునె?= పోతుందా?

**తాత్పర్యం:** దుర్యోధనుడు యుద్ధభూమిలో అమ్ముల పాన్పు మీద పడకుండా ఉంటే, ధర్మరాజు వనవాస సమయంలో నేలమీదే పరుండి పడ్డ ఆయాసం పోతుందా?

**విశేషం:** దుర్యోధనుడు రణరంగంలో అంపశయ్యమీద పడటం అనేది ధ్వనిమయమైన ఆలంకారికోక్తి. ధర్మరాజు వనవాసంలో నేలమీద పడుకొని ఎంత బాధపడ్డాడో ఆ ఆయాసం దుర్యోధనుడికి అంపశయ్యపై శయనించినప్పుడు తెలియాలి. నేలమీద పడుకొన్న ధర్మజుడి దుఃఖం తాత్కాలికం. కాని, దుర్యోధనుడి అంపశయ్య మరణశయ్యయే ఔతుందని ధ్వని. (సంపా.)

**ఉ. సూనృత మూఁది బన్నములు సూడక లోన నడంచినట్టి కో**
**పానల మెండియున్న నిబిడాటవిపైఁ బచరించు తీవ్ర దా**

**వానలుఁ బోలి శాత్రవచయంబుపయిం గవియించి నిల్చినం**
**గాని యుధిష్ఠిరున్ సరకుగాఁ గొన రా ధృతరాష్ట్రనందనుల్.** 137

**ప్రతిపదార్థం:** సూనృతము+ఊఁది= సత్యాన్ని పట్టుకొని; బన్నములు+చూడక= కష్టాలు లెక్కచేయక; లోనన్= లోపల; అడంచిన+అట్టి= అణచిపెట్టినట్టి; కోప+అనలము= కోపం అనే అగ్ని; ఎండి+ఉన్న నిబిడ+అటవిపైన్= ఎండిపోయి ఉన్న దట్టమైన అడవి మీద; పచరించు= వ్యాపించే; తీవ్ర దావ+అనలున్+పోలి= దారుణమైన కార్చిచ్చువలె; శాత్రవ చయంబుపయిన్= విరోధి వర్గం మీద; కవియించి= వ్యాపింపజేసి; నిల్చినన్+కాని= నిలిస్తేనేకాని; ఆ ధృతరాష్ట్ర నందనుల్= ఆ ధృతరాష్ట్రుడి కొడుకులు- కౌరవులు; యుధిష్ఠిరున్= ధర్మరాజును; సరకుగాన్+కొనరు= లక్ష్యపెట్టరు.

**తాత్పర్యం:** సత్యాన్నే పట్టుకొని, కష్టాలను పరిగణించక, లోపలే అణచుకొన్న కోపాగ్నిని ఎండిపోయి ఉన్న దట్టమైన అడవిమీదకు ప్రసరించే దారుణమైన కార్చిచ్చువలె - శత్రు సమూహంపైకి వ్యాపింప జేస్తేనే కాని ధృతరాష్ట్రుడి కొడుకులు యుధిష్ఠిరుడిని లెక్కచేయరు.

**విశేషం:** 'లోన నడంచినట్టి కోపాగ్ని... గవియించి' .....అలంకారం ఉపమ. కోపాగ్ని....కోపమనే అగ్ని....రూపకం. రూపకానుప్రాణితమైన ఉపమ. 'యుధిష్ఠిరున్' ఇక్కడ ధర్మరాజుకు యుధిష్ఠిర శబ్దం సాభిప్రాయంగా ప్రయోగించబడింది. కాబట్టి అలంకారం పరికరాంకురం.

**మ.** **గద సారించుచు నంత్యకాల విచలత్కాలాకృతిన్ భీముఁ డు**
**న్మద మాతంగచయంబు నుగ్గుగ, లసన్నానా రథవ్రాతముల్**
**చదియన్, భూరి హయవ్రజంబు పొడిగా సంరంభతుంగాంగుఁడై**
**కదియం జూచి బలే! సుయోధనుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్.** 138

**ప్రతిపదార్థం:** భీముఁడు; అంత్య కాల విచలత్ కాల+ఆకృతిన్= ప్రళయ సమయంలో విశేషంగా చలించే యముడివలె; గదసారించుచున్= గద త్రిప్పుతూ; ఉన్మద మాతంగ చయంబు= మిక్కిలి మదించిన ఏనుగుల గుంపు; నుగ్గుగన్= ముక్కలు కాగా; లసత్+నానా రథ వ్రాతముల్= ఒప్పుతూన్న అనేక రథాల సమూహాలు; చదియన్= నలిగిపోగా; భూరి హయ వ్రజంబు= అధికమైన గుర్రాల సమూహం; పొడి+కాన్= పొడికాగా; సంరంభ తుంగ+అంగుఁడు+ఐ= ఉద్రేకం చేత ఎత్తయిన శరీరం కలవాడై; కదియన్= సమీపించగా; సుయోధనుఁడు= దుర్యోధనుడు; చూచి; రాజ్యంబునన్= రాజ్యంలో; భాగంబు+ఇచ్చున్ బలే!= భాగం ఇస్తాడు సుమీ!

**తాత్పర్యం:** భీముడు ప్రళయకాలంలో విశేషంగా చలించే యముడివలె గద త్రిప్పుతూ, మదించిన ఏనుగుల సమూహం ముక్కలు ముక్కలు కాగా, ఒప్పే పెక్కు రథాల సమూహాలు నలిగిపోగా, అధికమైన గుర్రాల సమూహం పొడియైపోగా; ఉద్రేకంతో పెరిగిన శరీరం కలవాడై సమీపించటం చూచి దుర్యోధనుడు రాజ్యంలో భాగం ఇస్తాడు సుమీ!

**విశేషం:** 'అంత్యకాల విచలత్కాలాకృతిన్' - అలంకారం ఉపమ. 'ఆకృతి' శబ్దం ఇక్కడ ఇవార్థకం - ఉపమా వాచకం.

**సీ. కోల్పులి వీఁకమై గొదగొని లేళ్లకు । నుఱుకు తెఱంగునఁ దఱియఁ జొచ్చి,**
**పెనుగాలి జీమూత బృందంబుపైఁ బెట్టి । దంబుగ వీఁచుచందమున నడరి,**
**కసి మసంగిన మారి గడఁగి జీవులమీఁద । నుగ్రతఁ గవియున ట్లురవడించి,**
**యాఁకొన్న లయరుద్రుఁ డాగ్రహంబున జగ । త్ప్రచయంబు ముట్టెడు భంగిఁ బొదివి.**

**తే. నకులుఁడును, దదనుజుఁడు, సాత్యకియు, నా సు । భద్ర కొడుకును నెదిరిన బలము నెల్ల**
**బెదరఁ, జెదర, బడల్పడఁ, బెల్లు సావఁ । జేయఁగని కౌరవులు సంధి సేయువారు. 139**

**ప్రతిపదార్థం:** కోల్పులి= పెద్దపులి; వీఁకమైన్= పరాక్రమంతో; గొదగొని= ఆకలిగొని; లేళ్లకున్= లేళ్లకై; ఉఱుకు తెఱంగునన్= ఉరికే విధంగా; తఱియన్+చొచ్చి= తాకి; పెనుగాలి= పెద్దగాలి; జీమూత బృందంబుపైన్= మేఘాల సమూహం మీద; బెట్టిదంబుగన్= భయంకరంగా; వీచు చందమునన్= వీచే విధంగా; అడరి= విజృంభించి; కవిసి- కసి మసంగిన మారి= రెచ్చిపోయిన మృత్యుదేవత; కడఁగి= పూని; జీవుల మీఁదన్= ప్రాణులపై; ఉగ్రతన్= భయంకరత్వంతో; కవియు+అట్లు= పడే విధంగా; ఉరవడించి= విజృంభించి; ఆఁకొన్న= ఆకలిగొన్న; లయ రుద్రుఁడు= ప్రళయకాల రుద్రుడు; ఆగ్రహంబునన్= కోపంతో; జగత్+ప్రచయంబున్= లోకాల సమూహాన్ని; ముట్టెడు భంగిన్= ఆక్రమించే విధంగా; పొదివి= మార్కొని; నకులుఁడును+తద్+అనుజుఁడున్= నకులుడూ, అతడి తమ్ముడు సహదేవుడూ; సాత్యకియున్; ఆ సుభద్ర కొడుకును= ఆ సుభద్ర కొడుకైన అభిమన్యుడూ; ఎదిరిన బలమున్+ఎల్లన్= ఎదుర్కొనిన సైన్యాన్ని అంతనూ; బెదరన్= భయపడేటట్లుగాను; చెదరన్= చెల్లాచెదరయి పోయేటట్లుగాను; బడల్పడన్= చీకాకుపడేటట్లుగాను; పెల్లు+చావన్= ఎక్కువగా చచ్చేటట్లుగాను; చేయన్= చేయగా; కని= చూచి; కౌరవులు; సంధి+చేయువారు= సంధి చేస్తారు.

**తాత్పర్యం:** బెబ్బులి ఆకలిగొని పరాక్రమంతో క్రౌర్యంతో లేళ్ళమీదికి ఉరికే విధంగా తాకీ, పెద్ద గాలి మేఘసమూహంపై భయంకరంగా వీచే విధంగా కవిసీ, రెచ్చిపోయిన మృత్యుదేవత పూని ప్రాణులపై క్రూరంగా పడే విధంగా విజృంభించీ, ఆకలిగొన్న ప్రళయ సమయ రుద్రుడు ఆగ్రహంతో లోకాల సమూహాన్ని ఆక్రమించే విధంగా మార్కొనీ, నకులుడూ, సహదేవుడూ, సాత్యకీ, అభిమన్యుడూ తమ్మెదుర్కొన్న శత్రుబలమంతా బెదిరిపోయేటట్లూ, చెల్లాచెదరయిపోయేటట్లూ; చీకాకు పడేటట్లూ, పెక్కుమంది చచ్చేటట్లు చేస్తే చూచి కౌరవులు సంధి చేస్తారు.

**విశేషం:** అలం: ఉపమ. సీసపద్యంలోని ఒక్కొక్క పాదాన్ని తేటగీతిలోని ఒక్కొక్క వీరుడితో సమన్వయిస్తే బాగుంటుంది. కోల్పులి లేళ్ల మీదకు ఉరికేటట్లు నకులుడు శత్రుసైన్యాన్ని బెదరగొట్టితేనూ, పెనుగాలి మేఘాల్ని తరిమేటట్లు సహదేవుడు శత్రు బలాన్ని బెదరగొట్టితేనూ, రెచ్చిపోయిన మృత్యువు జీవులపై పడే విధంగా సాత్యకి వైరి సేనను చీకాకు పరిస్తేనూ, ఆకొన్న ప్రళయకాల రుద్రుడు లోకాలను ఆక్రమించే విధంగా అభిమన్యుడు విరోధి సైన్యాన్ని చంపితేనూ- ఇట్లా సమన్వయించడానికి అవకాశం ఉన్నది. అప్పుడు అలంకారం యథాసంఖ్యం- తదనుప్రాణితమైన ఉపమ. పద్యంలో ఒక్కొక్క ఉపమానాన్నీ, ఒక్కొక్కవీరుడినీ, అతడు చేసే పనినీ విడివిడిగా చెప్పటంచేత ఈ రీతి సమన్వయం సముచితమేమో అనే ఊహ వచ్చింది.

**ఉ. చిత్తము లుల్లసిల్ల, నల సింహకిశోరము లొక్కమై మదో**
**న్మత్త గజావళిం బొదువుమాడ్కి నరాతి బలంబు ముట్టి, యు**
**ద్వృత్తిఁ గడంగి యప్రతిమవీరులు ద్రౌపదిపుత్త్రులేవురున్**
**నెత్తురు నీరఁ దేల్చిన ననిం గని మీ నృపుఁ డల్క దీఱెడిన్. 140**

**ప్రతిపదార్థం:** అప్రతిమ వీరులు ద్రౌపది పుత్రులు+ఏవురున్= సాటిలేని పరాక్రమవంతులైన ద్రౌపది కొడుకులు (ఉపపాండవులు) అయిదుగురూ; చిత్తములు= మనస్సులు; ఉల్లసిల్లన్= సంతోషించగా; అల= ఆ; సింహ కిశోరములు= సింగపు కొదమలు; ఒక్కమైన్= ఒక్క పెట్టున; మద+ఉన్మత్త గజ+ఆవళిన్= మదంచేత మిక్కిలి పొగరెక్కిన ఏనుగుల వరసను; పొదువు మాడ్కిన్= ఆక్రమించే విధంగా; అరాతి బలంబున్= శత్రుసైన్యాన్ని; ముట్టి= తాకి; ఉద్వృత్తిన్= గర్వంతో; కడంగి= పూని; నెత్తురు నీరన్= రక్తం అనే జలంలో; తేల్చినన్= తేలిస్తే; అనిన్= యుద్ధాన్ని; కని= చూసి; మీ నృపుఁడు= మీ రాజు - దుర్యోధనుడు; అల్క+తీఱెడిన్= కోపం వీడుతాడు.

**తాత్పర్యం:** సాటిలేని పరాక్రమవంతులైన ఉపపాండవు లైదుగురూ మనస్సులు సంతోషించగా సింగపు కొదమలు ఒక్క పెట్టున మదించిన ఏనుగుల గుంపులను ఆక్రమించే విధంగా శత్రుసైన్యాన్ని ఆక్రమించి నెత్తురు అనే నీటిలో తేలిస్తే, ఆ యుద్ధాన్ని చూసి మీ రాజు - దుర్యోధనుడు శాంతిస్తాడు.

**విశేషం:** అలం: ఉపమ. నెత్తురు నీరన్ అనే చోట రూపకం. 'చిత్తము లుల్లసిల్లన్' అనేదానిని ఉపమేయోపమానాలు రెండింటితోనూ ద్రౌపది పుత్త్రులు చిత్తము లుల్లసిల్లన్ సింహ కిశోరములు చిత్తము లుల్లసిల్లన్ అనే రీతిగా అన్వయించవచ్చును.

**మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహాజిం బ్రాణముల్ డాఁప కు**
**జ్జ్వలులై తో నడవన్, విరాటుఁడును బాంచాలుండు నేపారి సే**
**నల యుద్రేకము రౌద్రముం బెనుప, నానా హేతి ఘోరంబుగాఁ**
**దలపడ్డం గని గాక; స్రుక్కుదురె గాంధారీసుతుల్ మాటలన్? 141**

**ప్రతిపదార్థం:** చెలులున్= స్నేహితులూ; చుట్టలున్= చుట్టాలూ; ఇష్టభృత్యులున్= ఇష్టులైన సేవకులూ; మహా+ఆజిన్= గొప్ప యుద్ధంలో; ప్రాణముల్; డాఁపక= దాచుకోకుండా; ఉజ్జ్వలులు+ఐ= ప్రకాశించేవారై; తోన్= కూడా; నడవన్= నడవగారాగా; విరాటుఁడును; పాంచాలుండున్= ద్రుపదుడూ; ఏపు+ఆరి= విజృంభించి; సేనల= సేనల యొక్క; ఉద్రేకమున్= విజృంభణమూ; రౌద్రమున్= కోపమూ; పెనుపన్= వృద్ధి పొందించగా; నానా హేతి ఘోరంబు+కాన్= పెక్కు ఆయుధాల చేత భయంకరమైనదికాగా; కని కాక= చూసికాని; గాంధారీ సుతుల్= గాంధారి కొడుకులు - కౌరవులు; మాటలన్= మాటలచేత; స్రుక్కుదురె= వెనుకకు తగ్గుతారా?

**తాత్పర్యం:** స్నేహితులూ, చుట్టాలూ, ఇష్టసేవకులూ మహాయుద్ధంలో ప్రాణాలు దాచుకోకుండా ప్రకాశిస్తూ వెంట రాగా విరాటుడూ, ద్రుపదుడూ విజృంభించి సేనల విజృంభణమూ, రౌద్రమూ వృద్ధిపొందిస్తూ, అనేకాయుధాలతో భయంకరంగా మార్కొనడం చూచికాని కౌరవులు మాటలచేత వెనుకకు తగ్గుతారా?

**చ. తఱిమి శిఖండి తన్నొరులు దాఁకఁగ నెవ్వరి దిక్కుఁజూడ కే**
**డ్తెఱఁ దనపూన్కిపై మనము ధీరత నిల్పి, రథంబు బల్విడిం**
**బఱపి, కురుక్షితీశుఁడను బ్రహ్మకు వేయును నిండ భీష్ముపై**
**కుఱికినఁ గాక, మాకు సగ మూరక యిత్తురె మీరు మేదినిన్? 142**

**ప్రతిపదార్థం:** శిఖండి; తన్నున్; ఒరులు= శత్రువులు; తాఁకఁగన్= ముట్టగా; ఎవ్వరి దిక్కున్+చూడక= ఎవరివైపూ చూడక; తఱిమి= కవిసి; ఏడ్తెఱన్= పరాక్రమంతో; తన పూన్కిపైన్= తన పనిమీద; మనము= మనస్సు; ధీరతన్= ధైర్యంతో; నిల్పి;

రథంబున్; బల్విడిన్= వేగంగా; పఱపి= పోనిచ్చి; కురుక్షితి+ఈశుఁడు+అను బ్రహ్మకున్= కురురాజు - దుర్యోధనుడు అనే బ్రహ్మకు; వేయును నిండన్= వేయేళ్ళు నిండగా- మరణించగా; భీష్మపైన్= భీష్ముడి మీదకు; ఉఱికినన్+కాక= ఉరికితేనే కాని; మాకున్; మీరు; మేదినిన్= భూమిలో- రాజ్యంలో; సగము; ఊరక+ఇత్తురె?= ఊరికే ఇస్తారా?

**తాత్పర్యం:** తనను శత్రువులు ముట్టగా శిఖండి ఎవరివైపూ చూడక కవిసి పరాక్రమంతో తన పనిమీదే మనస్సు ధైర్యంతో నిలిపి, రథం వేగంగా పోనిచ్చి, కురురాజు (దుర్యోధనుడు) అనే బ్రహ్మకు వెయ్యేళ్ళూ నిండగా- మరణించగా- భీష్ముడి మీదకు ఉరికితేనే కాని మాకు మీరు రాజ్యంలో సగం ఊరికే ఇస్తారా?

**విశేషం:** కురుక్షితీశుఁ డను బ్రహ్మకు- అలంకారం రూపకం, శిఖండి - పూర్వజన్మలో అంబ. భీష్ముడు తనను నిరాకరించాడనే కోపంతో అతడిని సాధించాలని తపస్సు చేసింది. తరువాత జన్మలో ఆమె ద్రుపదుడికి కూతురై పుడుతుంది. కాని, తల్లిదండ్రు లామెను పురుషుడుగానే పెంచి, హేమవర్మ కూతురుతో వివాహం చేస్తారు. తన అల్లుడు పురుషుడు కాడని తెలిసి హేమవర్మ ద్రుపదుడిపై దండెత్తుతాడు. శిఖండి స్థూలకర్ణుడనే యక్షుడి అరణ్యంలో ప్రాయోపవేశం చేస్తూండగా, స్థూలకర్ణుడామె వృత్తాంతం విని తన పురుషత్వం ఆమెకిచ్చి, ఆమె స్త్రీత్వం తాను గ్రహిస్తాడు. శిఖండి భారత యుద్ధంలో పాండవుల పక్షంలో ఉంటాడు. షండులతోనూ, స్త్రీలతోనూ యుద్ధం చేయనని భీష్ముడి ప్రతిజ్ఞ. ఆ విషయం తెలిసికొని పాండవులు భీష్ముడితో యుద్ధం చేయుమని శిఖండిని నియోగిస్తారు. భీష్ముడు శిఖండిని చూడగానే అస్త్రసన్న్యాసం చేస్తాడు.

**శా. విద్యుద్దండము నిల్చిపొల్చినగతిన్ విల్లందమైయుండ న**
**స్మ ద్యోధావలి మానసంబున రణోత్సాహంబు రెట్టింప ధృ**
**ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ, వీక్షించి కా**
**కుద్యోగించుట కేల తక్కుదురు మీ రుగ్రాహవక్రీడకున్? 143**

**ప్రతిపదార్థం:** విద్యుత్+దండము= మెఱపు దండం; నిల్చి; పొల్చిన గతిన్= ఒప్పిన విధంగా; విల్లు, అందము+ఐ+ఉండన్= అందంగా ఉండగా; అస్మద్+యోధ+ఆవలీ మానసంబునన్= మా వీరుల వరుస యొక్క మనస్సులో; రణ+ఉత్సాహంబు= యుద్ధోత్సాహం; రెట్టింపన్= ఇనుమడించగా; ధృష్టద్యుమ్నుండు= ద్రుపద పుత్రుడు; కడంగి= పూని; ద్రోణున్= ద్రోణుడిని; కడిమిన్= పరాక్రమంతో; డాయంగన్= సమీపించగా; వీక్షించికాక= చూచికాని; మీరు; ఉగ్ర+ఆహవ క్రీడకున్= భయంకరమైన యుద్ధం అనే ఆటకు; ఉద్యోగించుటకున్= పూనుటకు; ఏల తక్కుదురు?= ఎందుకు విరమిస్తారు?

**తాత్పర్యం:** విద్యుద్దండంవలె విల్లు అందగించగా, మా యోధుల మనస్సులలో యుద్ధోత్సాహం ఇనుమడించగా, ధృష్టద్యుమ్నుడు పూని ద్రోణుడిని పరాక్రమంతో సమీపించగా చూచికాని మీరు భయంకర యుద్ధక్రీడకు పూనుకొనటం ఎందుకు విరమిస్తారు?

**విశేషం:** విద్యుద్దండము నిల్చిపొల్చినగతిన్ విల్లందమైయుండ - అలంకారం ఉపమ. విద్యుద్దండం మెరిసి ఇట్టే అదృశ్యమవుతుంది. అది క్షణప్రభ. అందుచేతనే 'నిల్చి' అనటం. ధృష్టద్యుమ్నుడు ద్రుపదుడి కొడుకు. ద్రోణుడు తనను అవమానించటం చేత, అతడిని చంపగల కొడుకు కొరకు ద్రుపదుడు పుత్రేష్టి చేస్తాడు. ధృష్టద్యుమ్నుడూ, ద్రౌపదీ యజ్ఞకుండంలోంచి పుట్టుతారు. ధృష్టద్యుమ్నుడు పాండవుల పక్షంలో ఉండి కౌరవులతో పోరాడతాడు. అతడు ద్రోణుడిని చంపలేదు కాని, చనిపోయిన ద్రోణుడి శిరస్సు ఖండిస్తాడు. ఆ కోపంతో ద్రోణ పుత్రుడైన అశ్వత్థామ ధృష్టద్యుమ్నుడిని రాత్రి శిబిరంలో నిద్రపోతూండగా ఆకస్మికంగా మీదబడి వధిస్తాడు.

**సీ.** **గాండీవ గుణ రవం బొండొండ చెలఁగంగ, । శరపరంపర లాకసంబు గప్పఁ,**
**బ్రతి విశిఖములు ఖండితములై రాలంగ, । నెదిరి సైన్యంబుల మదగజాది**
**చతురంగములును జర్జరితంబులై యవ । యవ భేద మెఱుఁగని యట్లు గాఁగఁ**
**దునిసిన, నెత్తురు నెనడును నెమ్ములు । నెఱచియుఁ గండలు నెనసి సమర**

**తే.** **తలము ఘోరంబుగాఁ, గపిధ్వజము, ధవళ । హరులు శోభిల్ల, నొగలపై హరి యెలర్ప,**
**దేవదత్తంబు మ్రోయఁ దోఁతెంచునట్టి । రథముఁ గని కాని కానఁడు రాజరాజు.** **144**

**ప్రతిపదార్థం:** గాండీవ గుణ రవంబు= గాండీవమనే వింటి యొక్క అల్లెత్రాటి ధ్వని; ఒండు+ఒండు+అ= క్రమక్రమంగా; చెలఁగంగన్= మ్రోయగా; శరపరంపరలు= బాణాల వరుసలు; ఆకసంబు+కప్పన్= ఆకాశాన్ని కప్పివేయగా; ప్రతి విశిఖంబులు= ఎదిరి బాణాలు- శత్రువుల బాణాలు; ఖండితములు+ఐ= ముక్కలయి; రాలంగన్= రాలిపోగా; ఎదిరి సైన్యంబులన్= శత్రుసేనల యందలి; మద గజ+ఆది చతురంగములును= మదించిన ఏనుగులు మున్నగు నాలుగు యుద్ధాంగాలూ- రథ, గజ, తురగ, పదాతులు; జర్జరితంబులు+ఐ= తూంట్లు పడినవయి; అవయవ భేదము+ఎఱుఁగని+అట్లు+కాఁగన్= అవయవాల తేడా ఎరగని విధంగా; తునిసినన్= ముక్కలయిపోగా; నెత్తురున్+నెనడునున్= రక్తమూ, ఎముకలలోని క్రొవ్వూ(మూలుగ); ఎమ్ములున్= ఎముకలూ; ఎఱచియున్= మాంసమూ; కండలున్; ఎనసి= కలిసి; సమరతలము= యుద్ధభూమి; ఘోరంబు+కాన్= భయంకరం కాగా; కపి ధ్వజమున్; ధవళ హరులున్= శ్వేతాశ్వాలూ; శోభిల్లన్= ప్రకాశించగా; నొగలపైన్= బండికాడికట్టుకట్టలపై- తొట్టెలో; హరి= కృష్ణుడు; ఎలర్పన్= ఒప్పగా; దేవదత్తంబు మ్రోయన్= దేవదత్తమనే శంఖం మ్రోయగా; తోఁతెంచు+అట్టి= కనబడే; రథమున్+కని కాని= రథాన్ని చూచికాని; రాజరాజు= దుర్యోధనుడు; కానఁడు= చూడడు- తెలిసికొనడు.

**తాత్పర్యం:** గాండీవమనే వింటి అల్లెత్రాటి ధ్వని క్రమక్రమంగా మ్రోయటమూ, బాణాల సమూహాలు ఆకాశాన్ని కప్పివేయటమూ, శత్రువుల బాణాలు ముక్కలై రాలటమూ, శత్రు సేనలలోని మత్తేభాలు మొదలుగాగల చతురంగ బలాలూ తూంట్లు పడినవై, ఇది ఈ అవయవం అనే వైనం తెలియకుండేటట్లు ముక్కలైపోగా, రక్తంతోనూ, మజ్జతోనూ, ఎముకలతోనూ, మాంసంతోనూ, కండలతోనూ కూడి యుద్ధభూమి భయంకరం కావటమూ, కపిధ్వజమూ, తెల్లగుర్రాలూ ఒప్పగా, తొట్టెలో హరి ఒప్పగా, దేవదత్తమనే శంఖం మ్రోయగా కనబడే రథం చూచికాని రాజరాజు- దుర్యోధనుడు కానలేడు.

**విశేషం:** అలం: పర్యాయోక్తం. ఈ విషయం మాటాడుతూన్నవాడు అర్జునుడు. అతడు తన పేరు చెప్పకుండా, విన్నవాళ్లకు అర్జునుడని స్ఫురించే విధంగా మాటాడింపజేశాడు కవి. కపిధ్వజమూ, ధవళ హరులూ, తొట్టెలో హరీ, దేవదత్తము - ఇవి ఆ రథం అర్జునుడిదని స్ఫురింపజేస్తున్నాయి. ఇది పర్యాయోక్తమనే అలంకారం. భంగ్యంతరం చేత గమ్యార్థసిద్ధి జరగటం పర్యాయోక్తం.

**శా.** **బాలక్రీడ మహాసురప్రకరమున్ భంజింపఁడే? యెప్పుడుం**
**ద్రైలోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపదే? యట్టి శౌ**
**ర్యాలంకారు మహాత్ముఁ దా సరకుసేయం డచ్యుతున్! మ మ్మతం**
**డేలా కైకొను? నా సుయోధనునియం దెగ్గేది యూహింపఁగన్?** **145**

**ప్రతిపదార్థం:** బాలక్రీడన్= పిల్లాటయందు; మహా+అసుర ప్రకరమున్= గొప్ప రాక్షసుల సమూహాన్ని; భంజింపఁడే?= చంపడా? ఎప్పుడున్= నిత్యమూ; త్రైలోక్యంబును= మూడు లోకాల సమూహమూ; భక్తి యుక్తిన్= భక్తితో; తగన్= ఒప్పుగా; ఆరాధింపదే?= పూజింపదా?; అట్టి శౌర్య+అలంకారున్= అటువంటి పరాక్రమం అలంకారంగా కలవాడిని, మహాత్మున్= మహానుభావుడిని, అచ్యుతున్= కృష్ణుడిని; తాన్= తాను - దుర్యోధనుడు; సరకు+చేయండు= లక్ష్యపెట్టడు; అతండు= దుర్యోధనుడు; మమ్మున్; ఏలా= ఎందుకు; కైకొనున్?= లక్ష్యపెడతాడు?; ఊహింపఁగన్= ఆలోచింపగా, ఆ సుయోధనునియందున్= ఆ దుర్యోధనుడిలో; ఎగ్గు+ఏది?= దోషమేది- అపరాధ మేముంది?

**తాత్పర్యం:** పిల్లాటయందు ఘోర రాక్షసుల సమూహాన్ని చంపడా? నిత్యమూ మూడులోకాలూ భక్తితో ఒప్పుగా పూజింపవా? అటువంటి పరాక్రమం అలంకారంగా కలవాడూ, మహాత్ముడూ అయిన కృష్ణుడిని తను లెక్కచేయడు! ఇంక అతడు మమ్మల్ని ఎందుకు లెక్కచేస్తాడు? ఆలోచిస్తే ఆ దుర్యోధనుడిలో తప్పేముంది?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. శౌర్యాలంకారుడూ, మహాత్ముడూ అయిన కృష్ణుడినే లెక్కచేయని దుర్యోధనుడు మమ్మల్ని లెక్క చేయకపోవటం దోషం కాదు- సహజమే అని భావం. 'తా సరకు సేయం డచ్యుతున్ మమ్మతండేలా కైకొను?' అచ్యుతుడినే సరకుసేయనివాడు మమ్మల్ని సరకు సేయడని వేరే చెప్పాలా? అని కైముత్యం చేత అర్థ సంసిద్ధి జరుగుతోంది కాబట్టి అలంకారం కావ్యార్థాపత్తి.

**వ. ఏము పితామహ గురు కృపాచార్యులకు నమస్కరించి, యస్మదీయ రాజ్యభాగంబునకై తొడరి కయ్యంబు సేయువారము; కౌరవులకుంబూని యెవ్వరేమాతోఁబెనంగినను వారి శస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబులగునని తలంచెదము; పండ్రెండు వత్సరంబులు వనంబున నమ్మెయి నిడుమలం బడి, జనపదంబునం బదుమూఁడగునేఁ డజ్ఞాతవాసాయాసం బట్లనుభవించి వచ్చి, మా తండ్రి పాలికినై పెనం గు మమ్ము నింద్రాది సుర సహాయులయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువారైరేని ధర్మంబుకంటె నధర్మము బలవంతం బైనయదియగు; నింతియకాని మా చేయునట్టిది గీ డైనదిగా; దేము వాసుదేవుని మున్నిడుకొని నడతుము గావున, నీ యుద్ధంబునం జయంబు మాకు సిద్ధంబ; యెల్ల భంగులం గర్ణ సహితంబుగా గాంధారీనందనులం దునిమి యేము భూమి గొనుట దప్పదు; 'గాండీవంబు దివియకయును గుడుసువడియెడు; బాణంబులు దమయంతన తూణీరంబుల వెడలెడుఁ; దోలూడ్చు మహానాగంబునుంబోలెఁ గరవాలంబు దాన యొఱవెలికి నిగుడుచున్నయది గావున, మా కవశ్యంబును సంగరంబు సంభవించుఁ; బాశుపతాది దివ్యశరంబులం గురుపక్ష ప్రజాక్షయంబు సేసి శాంతిం బొందెదము; సూతనందనా! నీవు సుస్థిరుండవై యింతయుం దెలియం బలుకవలయు; నిమ్మాటలు విని కురువృద్ధుండగు బాహ్లికుండును, బితామహుండగు భీష్ముండును, గురుం డగు కుంభసంభవుండును, శిక్షకుండగు కృపాచార్యుండును, గురుపుత్రుండగు నశ్వత్థామయు, సద్బుద్ధి యగు విదురుండును, ధర్మాచరణకల్యుండగు శల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది యయ్యెడు; సుయోధనాదు లాయుష్మంతు లగువారకాక! యని పలికె.' నని చెప్పిన విని మందాకినీనందనుం డందఱు విన దుర్యోధనున కి ట్లనియె: 146**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; పితామహ గురు కృపాచార్యులకున్= భీష్ముడికీ, ద్రోణుడికీ, కృపాచార్యుడికీ; నమస్కరించి; అస్మదీయ రాజ్య భాగంబునకై= మా రాజ్యభాగం కొరకు; తొడరి= పూని; కయ్యంబు+చేయువారము= యుద్ధం చేస్తాం;

కౌరవులకున్+పూని= కౌరవులకొర్కై యత్నించి; ఎవ్వరేన్= ఎవరైనా; మాతోన్; పెనంగినను= యుద్ధం చేస్తే; వారి శస్త్ర+అస్త్రంబులు; ధర్మ ప్రతిహతంబులు+అగున్+అని తలంచెదము= ధర్మం చేత దెబ్బ కొట్టబడినవి అవుతాయని భావిస్తాం; పండ్రెండు వత్సరంబులు= పన్నెండేళ్ళు; వనంబునన్= అడవిలో; ఆ+మెయిన్= ఆ విధంగా; ఇడుమలన్+పడి= కష్టా లనుభవించి; జనపదంబునన్= దేశంలో; పదుమూఁడగు+ఏఁడు= పదమూడోయేడు; అజ్ఞాతవాస+ఆయాసంబు+అట్లు+అనుభవించి వచ్చి= అజ్ఞాతవాస కష్టం ఆ విధంగా అనుభవించి వచ్చి; మా తండ్రి పాలికినై= మా తండ్రి వాటా కొరకు; పెనంగు మమ్మున్= పోరాడే మమ్మల్ని; ఇంద్ర+ఆది సుర సహాయులు+అయ్యును= ఇంద్రుడు మొదలగు దేవతలు తోడుగా గలవారయినా; ధార్తరాష్ట్రులు= కౌరవులు; గెల్చువారు+ఐరి+ఏనిన్= గెలిస్తే; ధర్మంబు కంటెన్; అధర్మంబు; బలవంతంబు ఐన+అది+అగున్= బలవత్తరం అవుతుంది; ఇంతియకాని= ఇంతేకాని; మా చేయు+అట్టిది= మేము చేసేది; కీడు+ఐనది+కాదు= తప్పుకాదు; ఏము; వాసుదేవునిన్= కృష్ణుడిని; మున్ను+ఇడికొని= ముందు పెట్టుకొని; నడతుము; కావునన్; ఈ యుద్ధంబునన్, జయంబు; మాకున్; సిద్ధంబు+అ= సిద్ధమే; ఎల్లభంగులన్= అన్ని విధాలా; కర్ణ సహితంబుగాన్= కర్ణుడితో కూడా; గాంధారీ నందనులన్= గాంధారి కొడుకులను-కౌరవులను; తునిమి= వధించి; ఏము= మేము; భూమి+కొనుట; తప్పదు; గాండీవంబు; తివియకయును= లాగకుండానే; గుడుసు+పడియెడున్= గుండ్రంగా చుట్టుకుంటున్నది; బాణంబులు; తమ+అంతన్+అ= తమకు తామే; తూణీరంబులన్+వెడలెడున్= అమ్ముల పొదులలోనుండి వెలువడుతున్నాయి; తోలు+ఊడ్చు మహత్ నాగంబునున్+పోలెన్= కుబుసం విడిచిపెట్టే పెద్ద పామువలె; కరవాలంబు= కత్తి; ఒఱ వెలికిన్= ఒరబయటికి; నిగుడుచున్+ఉన్న+అది= వస్తున్నది; కావునన్; మాకున్; అవశ్యంబును= తప్పక; సంగరంబు= యుద్ధం; సంభవించున్= కలుగుతుంది; పాశుపత+ఆది దివ్య శరంబులన్= పాశుపతం మొదలైన దేవతా సంబంధ్యాస్త్రాలతో; కురు పక్ష ప్రజా క్షయంబు+చేసి= కౌరవుల పక్షంలో ఉన్న జనుల నాశనం చేసి; శాంతిన్+పొందెదము= శాంతిస్తాం; సూత నందనా!= సంజయా!; నీవు; సుస్థిరుండవు+ఐ= నిలకడగలవాడవై-జంకులేనివాడవయి; ఇంతయున్= ఇదంతా; తెలియన్+పలుకవలయున్= తెలపాలి; ఈ+మాటలు; విని; కురు వృద్ధుండు+అగు బాహ్లికుండును= కురు వంశంలో పెద్దవాడైన బాహ్లికుడూ; పితామహుండు+అగు భీష్ముండును= తాత అయిన భీష్ముడూ; గురుండు+అగు కుంభసంభవుండును= ద్రోణుడూ; శిక్షకుండు+అగు కృపాచార్యుండును= ఆచార్యుడైన కృపుడూ; గురు పుత్త్రుండు+అగు+అశ్వత్థామయున్= ద్రోణుడి కుమారుడైన అశ్వత్థామా; సత్+బుద్ధి+అగు విదురుండును= బుద్ధిమంతుడైన విదురుడూ; ధర్మ+ఆచరణ కల్యుండు+అగు శల్యుండును= ధర్మం ఆచరించటంలో సమర్థుడైన శల్యుడూ; ఎయ్యది= ఏది; నిశ్చయించి= నిర్ణయించి; పలికిరి; అది; అయ్యెడున్; సుయోధన+ఆదులు= దుర్యోధనుడు మొదలగువారు; ఆయుష్మంతులు+అగు వారు+అ కాక= ఆయువు కలవాళ్ళు అవుతారు కాక; అని; పలికెన్; అని; చెప్పినన్; విని; మందాకినీ నందనుండు= గంగాసుతుడు- భీష్ముడు; అందఱున్; వినన్; దుర్యోధనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** మేము భీష్ముడికీ, ద్రోణుడికీ, కృపుడికీ నమస్కరించి, మా రాజ్యభాగానికై పూని యుద్ధం చేస్తాం. కౌరవుల కొరకు ఎవరైనా మాతో యుద్ధం చేసినా, వారి శస్త్రాలూ, అస్త్రాలూ ధర్మంచేత నిరోధించబడతాయని భావిస్తాం. పన్నెండేళ్ళు అడవిలో అలా కష్టా లనుభవించి, గ్రామంలో పదమూడోయేడు అజ్ఞాతవాస కష్టం అట్లా అనుభవించి వచ్చి, మా తండ్రి వాటా కొరకు పోరే మమ్మలను, ఇంద్రాది దేవతలు తోడు వచ్చినా కౌరవులు గెలిస్తే, ధర్మం కంటె అధర్మం బలవత్తరం అన్నమాట. ఇంతేకాని మేము చేసేది తప్పు కాదు. మేము కృష్ణుడిని ముందు పెట్టుకొని నడుస్తాం కాబట్టి ఈ యుద్ధంలో గెలుపు మాదే, అన్ని విధాల కర్ణుడితో కూడా కౌరవులను వధించి మేము భూమిని పుచ్చుకొనటం తప్పదు, గాండీవం లాగకుండానే వంగుతున్నది. బాణాలు తమకు తామే అంప పొదులలోనుండి వెలువడుతున్నాయి. కుబుసం విడిచే మహాసర్పంవలె ఖడ్గం తనంతట తానే ఒరలో నుండి బయటికి వస్తున్నది. కాబట్టి మాకు తప్పకుండా యుద్ధం జరిగితీరుతుంది. పాశుపతాది దివ్యాస్త్రాల చేత కురుపక్షంలో

ఉన్న వాళ్ళను నశింపజేసి శాంతిస్తాం. సంజయా! నీవు ఏమీ జంకకుండా ఇదంతా స్పష్టపరచాలి. ఈ మాటలు విని కురువృద్ధుడైన బాహ్లికుడూ, తాత అయిన భీష్ముడూ, గురుడైన ద్రోణుడూ, ఆచార్యుడైన కృపుడూ, గురుపుత్రుడైన అశ్వత్థామా, బుద్ధిమంతుడైన విదురుడూ, ధర్మనిర్వహణ దక్షుడైన శల్యుడూ ఏది నిర్ణయించి పలుకుతారో అది జరుగుతుంది. దుర్యోధనాదులు దీర్ఘాయువు లవుతారు కాక' అన్నాడు. ఆ మాటలు విని భీష్ముడు అందరూ వినేటట్లు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'గాండీవంబు దివియకయును గుడుసువడియెడు - బాణంబులు దమయంతన తూణీరంబుల వెడలెడు; కరవాలంబు దాన యొఱ వెలికి నిగుడుచున్నయది.' అలంకారం విభావన. కారణం లేకుండానే కార్యం జరిగినట్లు చెప్పటం విభావనాలంకారం. 'తోలూడ్చు మహానాగంబునుం బోలెఁ గరవాలంబు దాన యొఱ వెలికి నిగుడుచున్నయది'- అలంకారం ఉపమానుప్రాణిత విభావన.

**సీ. నలినగర్భుఁడు పెద్ద కొలువున నున్నెడ । సురపతి ప్రముఖుల చూడ్కులెల్ల**
**మెఱయు తేజంబున మిఱుమిట్లు గొన నిద్ద । అచ్చట నొరసికొంచరుగఁ జూచి,**
**'వీ రెవ్వ, రిమ్మెయి మీ రుండ సరుకుసే । యని యట్లు వోయెడు నట్టివార?'**
**లని బృహస్పతి బ్రహ్మ నడిగిన నతని కి । ట్లనియె నా చతురాస్యుఁ డాదరమునఁ**

**తే. దపము పెంపును బలశౌర్యదర్పములును । గలిగి లోకహితార్థంబుగాఁ జరింతు**
**రే యుగంబున నరుఁడు నారాయణుండు । ననఁ బ్రసిద్ధికి నెక్కిన మునులు సుమ్ము!' 147**

**ప్రతిపదార్థం:** నలిన గర్భుఁడు= తమ్మిచూలి-బ్రహ్మ; పెద్ద కొలువునన్= నిండు సభలో; ఉన్న+ఎడన్= ఉండగా; సురపతి ప్రముఖుల చూడ్కులు+ఎల్లన్= ఇంద్రాదుల చూపులన్నీ; మెఱయు తేజంబునన్= ప్రకాశించే తేజస్సుతో; మిట్లు+మిట్లు+కొనన్= కళ్ళు చెదిరిపోయేటట్లు; ఇద్దఱు= ఇరువురు; అచ్చటన్; ఒరసికొంచున్= రాసుకొంటూ; అరుగన్+చూచి= వెళ్ళటం చూచి; వీరు= ఈ ఇరువురూ; ఎవ్వరు?; ఈ+మెయిన్= ఈ విధంగా; మీరు+ఉండన్= మీరు ఉంటూండగా; సరకు+చేయని+అట్లు= లెక్కచేయనట్లు; పోయెడు+అట్టివారలు= ప్రవర్తిస్తున్నారు; అని; బృహస్పతి; బ్రహ్మన్; అడిగినన్= అడుగగా; ఆ చతురాస్యుఁడు= ఆ బ్రహ్మ; ఆదరమునన్= ప్రీతితో; అతనికిన్; ఇట్లు+అనియెన్; తపము పెంపును= తపోమహిమా; బల శౌర్య దర్పములను= బలం, శౌర్యం, గర్వం కలిగి; లోక హిత+అర్థంబుగాన్= లోకం మేలుకోసం; ఏ యుగంబునన్= ఏ యుగంలో అయినా; నరుఁడున్ నారాయణుండున్+అనన్+ప్రసిద్ధికిన్+ఎక్కిన మునులు= నరుడూ నారాయణుడూ అని ప్రసిద్ధి వహించిన మునులు; చరింతురు సుమ్మ!= సంచరిస్తారు సుమా!

**తాత్పర్యం:** బ్రహ్మ నిండుసభ తీర్చి ఉండగా, ఇంద్రాదుల చూపులన్నీ- మెరిసిపోయే తేజస్సుతో కళ్ళుమిరుమిట్లు కొలిపేటట్లు ఇద్దరు ఒకరినొకరు రాసుకుంటూ వెళ్ళటం చూచి, 'ఈ ఇరువురూ ఎవ్వరు? మీ రుంటూండగా మిమ్ములను లక్ష్యపెట్టనట్లు సంచరిస్తున్నారు?' అని బృహస్పతి బ్రహ్మనడుగగా, ఆ బ్రహ్మ ప్రీతితో ఇట్లా అన్నాడు: 'తపశ్శక్తీ, బలమూ, పరాక్రమమూ, గర్వమూ కలిగి లోకహితం కొరకు ప్రతియుగంలోనూ నరుడూ, నారాయణుడూ అని ప్రసిద్ధికెక్కిన మునులు సంచరిస్తారు సుమా!'

**వ. అని పలికి వెండియు 148**

**తాత్పర్యం:** అని పలికి, ఇంకా.

**క. 'అనిమిషహితము దనుజ నా । శనమును జేయుదు; రధర్మ సంగ్రామము గ**
**ల్గిన చోట ధర్మపరు లగు । జనముల గెలిపింతు రధిక సంరంభమునన్. 149**

**ప్రతిపదార్థం:** అనిమిష హితమున్= దేవతలకు మేలూ; దనుజ నాశనమును= రాక్షస వినాశాన్నీ; చేయుదురు; అధర్మ సంగ్రామము= అధర్మ యుద్ధం; కల్గిన చోటన్; ధర్మపరులు+అగు జనములను= ధర్మాత్ములైన జనుల్ని; అధిక సంరంభమునన్= మిక్కిలి ఆటోపంతో; గెలిపింతురు.

**తాత్పర్యం:** 'దేవతలకు హితమూ, రాక్షసులకు వినాశమూ చేస్తారు. అధర్మయుద్ధం జరిగేచోట ధర్మపరులైన జనులను మిక్కిలి ఆటోపంతో గెలిపిస్తారు.

**వ. దేవాసుర యుద్ధంబు నప్పు డింద్రుండు వోయి వీరి నారాధించి తో డడిగినం, జనుదెంచి పాలోమ కాలకేయాదులగు ననేక దైత్య దానవులం జంపి యింద్రునకు విజయంబు గావించి; రది మొదలుగా వీరల నెల్లవారలు నెఱింగియుండుదు; రిది యొక్క తేజంబ రెండు దెఱంగులై వెలుంగుచుండు' నని చెప్పి, వినోదార్థంబు జన్మాంతరంబు నొందిన యమ్మహాత్ములు గదా యీ యర్జునుండును వాసుదేవుండును! నర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబు వొడిచి నివాతకవచుల నఱువది వేవుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబుసేసె; వాసుదేవు పరాక్రమంబు గంస నరకాసుర ప్రముఖ నిఖిల దుష్ట నిగ్రహంబునం బ్రసిద్ధంబు గాదె? తెలియ విను మున్నరూపు సెప్పెద. 150**

**ప్రతిపదార్థం:** దేవ+అసుర యుద్ధంబు+అప్పుడు= దేవదానవ యుద్ధ సమయంలో; ఇంద్రుండు+పోయి; వీరిన్; ఆరాధించి= పూజించి; తోడు= సహాయం; అడిగినన్= అడుగగా; చనుదెంచి= వచ్చి; పౌలోమ కాలకేయ+ఆదులు+అగు= పౌలోములు; కాలకేయులు మొదలగు; అనేక దైత్య దానవులన్= పెక్కురు దైత్యులనూ, దానవులనూ; చంపి; ఇంద్రునకున్; విజయంబు= గెలుపు; కావించిరి; అది మొదలుగాన్; వీరలన్; ఎల్లవారలున్= అందరూ; ఎఱింగి+ఉండుదురు; ఇది; ఒక్క తేజంబు+అ= ఒక తేజస్సే; రెండు+తెఱంగులు+ఐ= రెండు విధాలయి; వెలుంగుచున్+ఉండున్= ప్రకాశిస్తూ ఉంటుంది; అని; చెప్పెన్; ఈ+అర్జునుండును; వాసుదేవుండును= కృష్ణుడూ; వినోద+అర్థంబు= వేడుకకొరకు; జన్మ+అంతరంబున్+ఒందిన= మరో జన్మనందిన; ఆ+మహాత్ములు+కదా!= ఆ మహానుభావులే కదా!; అర్జునుండు; సముద్ర తీరంబునన్= సముద్రపుటొడ్డున; హిరణ్యపురంబు+పొడిచి; నివాతకవచులన్; అఱువది వేవురన్= అరవై వేల మందిని; నిర్జించి= జయించి; పర్జన్యునకున్= ఇంద్రుడికి; ప్రియంబు+చేసెన్= ప్రీతి కలిగించాడు; వాసుదేవు పరాక్రమంబు= కృష్ణుడి శౌర్యం; కంస నరక+అసుర ప్రముఖ నిఖిల దుష్ట నిగ్రహంబునన్= కంసుడూ; నరకాసురుడూ మొదలయిన ఎల్ల దుర్మార్గుల వధచేత; ప్రసిద్ధంబు+కాదె= తెలిసిందేకదా; ఉన్న రూపు= ఉన్న విధం; చెప్పెదన్; తెలియన్+వినుము.

**తాత్పర్యం:** దేవ దానవ యుద్ధ సమయంలో ఇంద్రుడు వెళ్ళి ఈ నరనారాయణులను పూజించి సహాయం చేయండని అడిగితే, వచ్చి పౌలోములూ, కాలకేయులూ మొదలైన పెక్కుమంది దైత్యులనూ, దానవులనూ చంపి ఇంద్రుడికి విజయం సంపాదించిపెట్టారు. అది మొదలుకొని వీరిని అందరూ ఎరుగుదురు. ఇది ఒక్క తేజస్సే. రెండు విధాలుగా అయి ప్రకాశిస్తూ ఉంటుంది' అని చెప్పాడు. వేడుక కొరకు మరో జన్మనెత్తిన ఆ మహాత్ములే

కదా ఈ అర్జునుడూ, కృష్ణుడూ. అర్జునుడు సముద్రతీరస్థమైన హిరణ్యపురం పొడిచి అరవైవేలమంది నివాతకవచులను జయించి ఇంద్రుడికి ప్రీతి కలిగించాడు. కృష్ణుడి పరాక్రమం కంస నరకాసురాది సకల దుర్మార్గులను చంపడం వలన తెలిసిందేకదా! ఉన్న విధం చెపుతాను తెలిసేటట్లు వినుము.

**క. ఆ యిరువురు నొకతలయై । యాయోధనమునకు నడచునట్టిద యేనిన్**
**వే యేల మనక కా దెదు । రై యేడ్తెఱఁ దాఁక హరునకైనను వశమే? 151**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరువురున్= ఆ కృష్ణార్జును లిద్దరూ; ఒక తల+ఐ= ఏకమయి; అయోధనమునకున్= యుద్ధానికి; నడచు+అట్టిది+అ+ఏనిన్= నడవటమే జరిగితే; వేయి+ఏల= వేయి మాట లెందుకు? మనకున్+అ కాదు= మనకే కాదు; ఎదురు+ఐ= ఎదురుగా ఉండి; ఏడ్తెఱన్= పరాక్రమంతో; తాఁకన్= ఎదిరించటానికి; హరునకున్+ఐనను వశమే= ఆ ఈశ్వరుడికైనా సాధ్యమే?

**తాత్పర్యం:** ఆ కృష్ణార్జును లిద్దరూ ఏకమయి యుద్ధానికి నడవడమే జరిగితే, వేయి మాటలెందుకు? మనకే కాదు, ఎదురుగా నిలబడి పరాక్రమంతో ముట్టటానికి ఆ హరుడికి కూడా సాధ్యం కాదు.

**విశేషం:** హరుడికే సాధ్యం కాదన్నప్పుడు మనకు సాధ్యం కాదని వేరే చెప్పాలా? అని కైముత్యంచేత అర్థ సంసిద్ధి కలుగుతున్నది. కాబట్టి అలంకారం కావ్యార్థాపత్తి. ఇక్కడ ఈశ్వరుడికి హరశబ్దం సాభిప్రాయంగా ప్రయుక్తమైంది కాబట్టి అలంకారం పరికరాంకురం.

**క. సారథియు రథియు నై యొక । తేరం గృష్ణు లతిఘోరతేజస్సార**
**స్ఫారతఁ దోఁచిన నైనను । ధీరత వాటించి చూచి తెలిసెదవు బలే!' 152**

**ప్రతిపదార్థం:** కృష్ణులు= కృష్ణార్జునులు; సారథియున్; రథియున్+ఐ= రథికుడూ అయి; ఒక తేరన్= ఒక రథం మీద; అతి ఘోర తేజస్+సార స్ఫారతన్= మిక్కిలి భయంకరమైన తేజస్సారం యొక్క ఆధిక్యంతో; తోఁచినన్+ఐననున్= కనబడినప్పుడైనా; ధీరత+పాటించి= ధైర్యం కలిగి; చూచి; తెలిసెదవు బలే!= తెలిసికొంటావు సుమీ!

**తాత్పర్యం:** ఒక కృష్ణుడు సారథీ, ఇంకో కృష్ణుడు (అర్జునుడు) రథికుడూ అయి ఒక రథంపై మిక్కిలి భయం కరమైన తేజస్సారపుటాధిక్యంతో కనబడినప్పుడైనా నీవు ధైర్యం వహించి చూచి తెలిసికొంటావులే.'

**విశేషం:** కృష్ణుడంటే శ్రీకృష్ణుడే కాక, అర్జునుడు కూడా. కృష్ణుడు= నల్లనివాడు. అర్జునుడు నల్లని వాడవటం చేత అతడు కూడా కృష్ణు డనబడతాడు. ఇక్కడ 'కృష్ణులు' అని ఇద్దరికీ ఒకే శబ్దం వాడటం వలన వారి ఐక్యాన్ని ఒక తేజస్సే రెండయిన దనటాన్ని సూచిస్తున్నాడు కవి.

**వ. అనుచు నా సుయోధను నుపలక్షించి శాంతనవుండు మఱియు నిట్లనియె: 153**

**ప్రతిపదార్థం:** అనుచున్; ఆ సుయోధనున్= ఆ దుర్యోధనుడిని; ఉపలక్షించి= చూచి; శాంతనవుండు= శంతనుపుత్రుడు-భీష్ముడు; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అంటూ ఆ దుర్యోధనుడిని చూచి భీష్ముడు ఇంకా ఇట్లా అన్నాడు.

**క.** **'మది నా మాట కొకింతయు । బెదర వకార్యంబునందుఁ బ్రియము గలిగి యుం**
**డుదు; కౌరవులకుఁ గాలము । తుదియో కా కిట్టి గర్వితుని నే మందున్? 154**

**ప్రతిపదార్థం:** నా మాటకున్; ఒక+ఇంతయున్= కొంచెం కూడా; మదిన్= మనస్సులో; బెదరవు= భయపడవు; అకార్యంబునందున్= చెడుపనియందు- చేయదగని పనియందు; ప్రియము+కలిగి+ఉండుదు(వు)= ప్రీతి కలిగి ఉంటావు; కౌరవులకున్; కాలము+తుది+ఓ= అంత్యకాలమో; కాక= లేకపోతే; ఇట్టి గర్వితునిన్= ఇట్లాంటి పొగరుబోతును; ఏమి+అందున్?= ఏమంటాను?

**తాత్పర్యం:** 'నా మాటకు కొంచెం కూడా మదిలో భయపడవు. చేయదగని పనియందు ప్రీతి కలిగి ఉంటావు. కౌరవులకు పోగాలం దాపురించిందేమో లేకపోతే ఇట్లాంటి పొగరుబోతును నిన్ను ఏమంటాను?

**తే.** **హితములగు నాదు వచనంబు లిపుడు వినని । వాఁడవైతేని నప్పుడు 'వారు వడిరి,**
**వీరు వడి' రను పలుకులు విందుగాక । శకుని కర్ణ దుశ్శాసనుల్ సమ్మతింప. 155**

**ప్రతిపదార్థం:** హితములు+అగు నాదు వచనంబులు= మేలును గూర్చే నా మాటలు; ఇపుడు; వినని వాఁడవు! ఐతి(వి)+ఏనిన్= వినకపోతే; అప్పుడు= యుద్ధ సమయంలో; శకుని కర్ణ దుశ్శాసనుల్; సమ్మతింపన్= ఇష్టపడగా; వారు+పడిరి= వారు చచ్చారు; వీరు+పడిరి= వీరు చచ్చారు; అను పలుకులు= అనే మాటలు; విందు(వు)+కాక= వింటావులే.

**తాత్పర్యం:** నీ హితం కోరే నా మాటలు ఇప్పుడు నీవు వినకపోతే, అప్పుడు కురుక్షేత్ర యుద్ధ సమయంలో 'వారు చచ్చారు, వీరు చచ్చారు' అనే మాటలు - శకునీ, కర్ణుడూ, దుశ్శాసనుడూ ఇష్టపడగా - వింటావులే.

**వ.** **దుష్ట కష్ట నికృష్టాత్ము లగు నిమ్మువ్వురుఁ జెప్పెడు బుద్ధులుగాని యొండు విననొల్ల; వేమి సేయవచ్చు?' నని పలికినం గానీనుండు గనలి గాంగేయున కిట్లనియె; 156**

**ప్రతిపదార్థం:** దుష్ట కష్ట నికృష్ట+ఆత్ములు+అగు+ఈ+ముయ్వురున్= దుర్మార్గులూ, పాపులూ, నీచ బుద్ధులూ అయిన ఈ ముగ్గురూ (కర్ణ శకుని దుశ్శాసనులు); చెప్పెడు బుద్ధులు+కాని= చేసే బోధలు కాని; ఒండు= ఇంకొకటి; వినన్+ ఒల్లవు= వినటానికి ఇష్టపడవు; ఏమి చేయన్+వచ్చున్?= ఏమిటి చేయటం?; అని; పలికినన్; కానీనుండు= కర్ణుడు (కన్యాపుత్రుడు); కనలి= కోపం వహించి; గాంగేయునకున్= భీష్మునికి (గంగా పుత్రుడు); ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దుర్మార్గులూ, పాపులూ, నీచస్వభావులూ అయిన ఈ కర్ణ శకుని దుశ్శాసనులు ముగ్గురూ చేసే బోధలే కాని ఇంకొకటి వినడానికి ఇష్టపడవు. ఏం చెయ్యటం?' అని అంటే, కర్ణుడు కోపించి భీష్ముడితో ఇట్లా అన్నాడు.

**ఆ.** **'ఇట్టు లాడఁ దగునె? యే నేమి సేసితిఁ? । గొలిచి కుడుచు పాడి నలవుఁ జలముఁ**
**బలుకు టెందు నెగ్గె? పతికిఁ బుత్త్రులకును । మనుమలకు హితంబ యొనర నడతు. 157**

**ప్రతిపదార్థం:** ఇట్టులు= ఇలా; ఆడన్+తగునె= మాటాడవచ్చా?; ఏను+ఏమి+చేసితిన్= నేనేం చేశాను?; కొలిచి కడుచు పాడిన్= సేవించి, తినే ధర్మంచేత; అలవున్= ఉపాయమూ; చలమున్= పంతమూ; పలుకుట; ఎందున్= ఎక్కడా; ఎగ్గె= తప్పా?; పతికిన్= రాజుకూ - ధృతరాష్ట్రుడికీ; పుత్త్రులకును= కొడుకులకూ; మనుమలకున్; హితంబు+అ= మేలే; ఒనరన్= కలిగేటట్లు; నడతున్= ప్రవర్తిస్తాను.

**తాత్పర్యం:** 'నీవు ఇట్లా మాటాడవచ్చా? నేనేం చేశానని? వాళ్ళను సేవిస్తూ, వాళ్ళ ఉప్పు తింటూన్న న్యాయం చేత, ఏదో నాకు తోచిన ఉపాయం చెప్పటమూ, వాళ్ళకై పంతం పూనటమూ ఎక్కడైనా తప్పా? నే నెప్పుడూ ధృతరాష్ట్ర మహారాజుకూ, అతడి కొడుకులకూ, మనుమలకూ మేలే కలిగేవిధంగా ప్రవర్తిస్తాను.

**క. కాని తెఱఁగైన నింతటి । మానిసిఁ గా నేల చేయు మనుజేంద్రుఁడు న**
**న్నీ నెఱి దప్పిన మాటలు । నీ నోరన్ వెడలఁ దగునె నిండిన సభలోన్?' 158**

**ప్రతిపదార్థం:** కాని తెఱఁగు+ఐనన్= దుర్మార్గం అయితే; మనుజ+ఇంద్రుఁడు= రాజు-దుర్యోధనుడు; నన్నున్; ఇంతటి మానిసిన్+కాన్= ఇంతటి గొప్పవాడినిగా; ఏల చేయున్= ఎందుకు చేస్తాడు?; నిండిన సభలోన్= నిండు సభలో; ఈ నెఱి+ తప్పిన మాటలు= ఈ అన్యాయపు మాటలు; నీ నోరన్= నీ నోటి నుండి; వెడలన్+తగునె?= రావచ్చా?

**తాత్పర్యం:** నాది దుర్మార్గం అయితే, రాజు దుర్యోధనుడు నన్ను ఇంతటి గొప్పవాడుగా ఎందుకు చేస్తాడు? నిండుసభలో ఈ అన్యాయపు మాటలు నీ నోటి నుండి వెలువడవచ్చా?'

**విశేషం:** 'ఇంతటి మానిసిఁగా నేల చేయు' - కర్ణుడు సూతకులజుడని కుమారాస్త్ర విద్యా ప్రదర్శనలో పెద్దలు పాల్గొననీయకపోతే, దుర్యోధనుడు అప్పటికప్పుడు అంగరాజ్యానికి అభిషిక్తుడిని చేసి కర్ణుడిని రాజుగా చేస్తాడు. ఇదీ కర్ణుడి అభిప్రాయం.

**వ. అనిన విని భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె: 159**

**తాత్పర్యం:** అనగా విని భీష్ముడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు :

**భీష్ముఁడు కర్ణుని దుర్ణయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట (సం. 5-48-33)**

**తే. 'ఒకట నైనను వారియం దొకరిలోని । చిదుర పాలును బోలండు; సిగ్గులేక**
**'పాండవుల గెల్తు నే' నని పలుకుచుండు; । వీని రజ్జులు దులువలు విండ్రు తగిలి! 160**

**ప్రతిపదార్థం:** ఒకటన్+ఐనను= ఒక్క విషయంలో అయినా; వారి యందున్= ఆ పాండవులల్లో; ఒకరిలోని చిదురపాలును= ఒక్కరిలోని చిన్న తునుకంత కూడా; పోలఁడు= సరిపోడు; సిగ్గులేక; పాండవులన్; నేను; గెల్తున్; అని; పలుకుచున్+ఉండున్= అంటూఉంటాడు; వీని రజ్జులు= వీని పొల్లుకూతలు; తులువలు= దుర్మార్గులు; తగిలి= ఆసక్తి వహించి; విండ్రు= వింటారు.

**తాత్పర్యం:** ఒక్క విషయంలోనైనా పాండవులలో ఒకడిలోని చిన్ని తునుకంత కూడా పోలడు. సిగ్గులేక పాండవులను నేను గెలుస్తానంటూ ఉంటాడు ఈ కర్ణుడు. వీడి పొల్లుకూతలను దుర్మార్గులు ఆసక్తితో వింటారు.

**క. మగఁటిమి వారికి వీఁ డెదు । రుగ నమ్మి, సుయోధనుఁడు విరోధము గొని, స**
**ర్వ గుణాఢ్యులు బలవంతులు । నగు పాండునృపాలసుతుల నవమానించెన్. 161**

**ప్రతిపదార్థం:** మగఁటిమిన్= పరాక్రమంలో; వారికిన్= ఆ పాండవులకు; వీఁడు= ఈ కర్ణుడు; ఎదురుగన్= ప్రతిగా; నమ్మి; సుయోధనుఁడు= దుర్యోధనుడు; విరోధము+కొని= శత్రుత్వం తాల్చి; సర్వ గుణ+ఆఢ్యులున్= సకల సుగుణ సంపన్నులూ; బలవంతులున్= పరాక్రమవంతులూ; అగు; పాండు నృపాల సుతులన్= పాండురాజు కొడుకులను-పాండవులను; అవమానించెన్= పరాభవించాడు.

**తాత్పర్యం:** పరాక్రమంలో పాండవులకు కర్ణుడు ప్రతి అని నమ్మి దుర్యోధనుడు పాండవులతో శత్రుత్వం వహించి సకల సుగుణ సంపన్నులూ, పరాక్రమవంతులూ అయిన వాళ్ళని అవమానించాడు.

**ఉ. ఒక్కఁ డొకం డనేక విధ యుద్ధ జయంబులు గొన్నవారు వా;**
**రెక్కడ నేమి సేసె నితఁ? డీతని తమ్మునిఁ గూలనేసి యు**
**క్కెక్కిన పార్థుపైఁ గవిసెనే? పసు లాతఁడు గ్రమ్మఱింపఁగా**
**నక్కడ లేఁడె వీఁడు? భవదాత్మజుఁ గోల్పడె ఘోషయాత్రలోన్. 162**

**ప్రతిపదార్థం:** వారు= పాండవులు; ఒక్కఁడు+ఒకండు= ఒక్కొక్కడు; అనేక విధ యుద్ధ జయంబులు= పెక్కురీతులైన యుద్ధ విజయాలు; కొన్నవారు= పొందినవారు; ఇతఁడు= ఈ కర్ణుడు; ఎక్కడన్; ఏమి+చేసెన్?= ఏం చేశాడు?; ఈతని తమ్మునిన్; కూలన్+ఏసి= కూల్చి చంపి; ఉక్కు+ఎక్కిన పార్థుపైన్= అతిశయించిన అర్జునుడి మీద; కవిసెనే?= పడ్డాడా?; అతఁడు= అర్జునుడు; పసులు= గోవులు; క్రమ్మఱింపఁగాన్= మరలించగా; వీఁడు= ఈ కర్ణుడు; అక్కడ లేఁడె?; ఘోషయాత్రలోన్; భవత్+ఆత్మజున్= నీ కొడుకును- దుర్యోధనుడినీ; కోల్పడెన్= పోగొట్టుకొన్నాడు (ఓడగొట్టుకొన్నాడు).

**తాత్పర్యం:** పాండవులు ఒక్కొక్కడు అనేక విధాలయిన యుద్ధ విజయాలు పొందినవారు. వీడు ఎక్కడ ఏం చేశాడు? ఇతడి తమ్ముడిని కూల్చి విజృంభించిన అర్జునుడిమీదికి ఉరికాడా? అతడు గోవులను మరలించుకొనిపోతే, వీడు అక్కడ లేడా? ఘోషయాత్రలో నీ కొడుకును ఓడింపజేసికొన్నాడు.

**విశేషం:** 'ఈతని తమ్మునిఁ గూలనేసి యుక్కెక్కిన పార్థుపైఁ గవిసెనే?' - ఈతడి తమ్ముడు 'సంగ్రామజిత్తు' అని తెలుస్తున్నది. ఉత్తరగోగ్రహణ సందర్భంగా అర్జునుడితో సంగ్రామజిత్తు అనేవాడు తలపడగా, అర్జును డతడి 'తల దునిమివైచె' అని ఉన్నది. వెంటనే 'అపుడు రాధేయుఁ డిమ్మెయి ననుజుపాటుఁ జూచి' అని ఉన్నది. (విరాట. 5-80, 81). అందుచేత కర్ణుడి తమ్ముడు సంగ్రామజిత్తు అని చెప్పాలి.

**వ. ఈ దురాత్ముండు కర్జం బెఱుంగక నీతిబాహ్యుండై వలసినట్లు ప్రేలరిమాట లాడుచుండు; నీవునుం గైకొని వినుచుండుదువు; మేల కాక!' యనిన భీష్ము పలుకులు విని ద్రోణుం డమ్మహారాజుతో నిట్లనియె; 163**

**ప్రతిపదార్థం:** ఈ దురాత్ముండు= దుష్టబుద్ధి గల ఈ కర్ణుడు- ఈ దుష్టుడు; కర్జంబు+ఎఱుంగక= చేయవలసిన పని తెలియక; నీతి బాహ్యుండు+ఐ= నీతికి వెలియైన వాడయి - అవినీతిపరుడయి; వలసిన+అట్లు= ఇష్టం వచ్చినట్లు; ప్రేలరి మాటలు+అడుచున్+ఉండున్= వదరుబోతు మాటలాడుతూ ఉంటాడు; నీవునున్= నీవు కూడా; కైకొని= సమ్మతించి; వినుచున్+ఉండుదువు= వింటూంటావు; మేలు+అ కాక= మంచిదే; అనినన్; భీష్ము పలుకులు; విని; ద్రోణుండు; ఆ+ మహారాజుతోన్= ధృతరాష్ట్ర మహారాజుతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ దుష్టుడు చేయవలసిన పని ఏమిటో తెలియక అవినీతిపరుడయి ఇష్టం వచ్చినట్లు ప్రేలుతూ ఉంటాడు. నీవూ సమ్మతించి ఊఁ కొట్టుతుంటావు. మంచిదే' అనగా, భీష్ముడి మాటలు విని ద్రోణుడు ధృతరాష్ట్ర మహారాజుతో ఇట్లా అన్నాడు.

**ఉ. 'శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాఁడు గాఁడె? య**
**త్యంత హితంబు లీ పలుకు; లాహవ మొప్పదు; ధర్మసూతితోఁ**
**బొంతము మేలు; దేవపతిపుత్త్రుఁడు సంజయుతోడ నాడిన**
**ట్లంతకు నోపు; మీకుఁ దెలియం దగు ఖాండవదాహ మాదిగాన్. 164**

**ప్రతిపదార్థం:** శాంతనవుండు= శంతను పుత్త్రుడు- భీష్ముడు; సర్వకురు సంతతికిన్+కలవాఁడు+కాఁడె= కురు సంతానానికంతకూ పాండవులకూ, కౌరవులకూ కావలసినవాడు కాడా?; ఈ పలుకులు= ఇతడి మాటలు; అత్యంత హితంబు= మిక్కిలి మేలు కూర్చేవి; ఆహవము+ఒప్పదు= యుద్ధం తగదు; ధర్మసూతితోన్= ధర్మపుత్త్రుడితో; పొంతము= పొందు; మేలు= మంచిది; దేవ పతి పుత్త్రుఁడు= సురరాజు కొడుకు అర్జునుడు; సంజయుతోడన్+ఆడిన+అంతకున్+ఓపున్= సంజయుడితో అన్నంతా చేయటానికి సమర్థుడు; ఖాండవ దాహము+ఆదిగాన్= ఖాండవ వన దహనం మొదలుగా; మీకున్; తెలియన్+తగున్= తెలిసికొనటం మంచిది.

**తాత్పర్యం:** "భీష్ముడు అటు పాండవులకూ, ఇటు కౌరవులకూ మొత్తం కురు సంతతికంతకూ కావలసినవాడు కాడా? అతని మాటలు మిక్కిలి మేలు కూర్చేవి. యుద్ధం తగదు. ధర్మరాజుతో సంధి చేసుకోవడం మంచిది. అర్జునుడు సంజయుడితో అన్నంతా చేయగలవాడు. ఖాండవ వనదహనం మొదలుగా అతడు చేసిన వీరకృత్యాలు తెలిసికొనటం మంచిది.

**ఆ. శర శరాసనములు ధరియింప రెట్టు లె । వ్వరును? మగతనంబు వలనుఁ గలిగి**
**కయ్యమున జయంబు గైకొనరే యొరు? । లర్జునుండ విజయుఁ డనఁగ నెగడె! 165**

**ప్రతిపదార్థం:** ఎవ్వరును= మరెవ్వరూ; శర శరాసనములు= బాణాలూ; ధనుస్సులూ; ధరియింపరు+ఎట్టులు= ధరించరా ఏమి?; ఒరులు= ఇతరులు; మగతనంబు= పౌరుషం; వలనున్+కలిగి= నేర్పు కలిగి; కయ్యమునన్= యుద్ధంలో; జయంబు+కైకొనరే= గెలుపొందరా?; అర్జునుండు+అ= అర్జును డొక్కడే; విజయుఁడు+అనఁగన్+నెగడెన్= విజయు డనగా పేరుపొందాడు.

**తాత్పర్యం:** మరెవ్వరూ విల్లమ్ములు ధరించరా ఏమి? ఇతరులు పౌరుషమూ, శక్తీ (నేర్పు) కలిగి యుద్ధంలో గెలుపొందరా? అర్జునుడి కొక్కడికే విజయు డనే పేరు వచ్చింది!

**క. మన వీటనకా, దయ్య । ర్జునునకు సరివింటివానిఁ జూడఁగ లోకం**
**బున నెందు లేమి దెల్లం । బనుమానములేదు; తొడరనగునే వానిన్?' 166**

**ప్రతిపదార్థం:** మన వీటన్+అ కాదు= మన దేశంలోనే కాదు; ఆ+అర్జుననకున్; సరి వింటి వానిన్= సమానుడైన విలుకాడిని; చూడఁగన్; లోకంబునన్; ఎందున్; లేమి; తెల్లంబు= స్పష్టం; అనుమానము లేదు= సందేహం లేదు; వానిన్; తొడరన్+అగునే?= ఎదిరించటం సాధ్యమా?

**తాత్పర్యం:** మన దేశంలోనే కాదు, ఆ అర్జునుడితో సమానుడైన విలుకాడు చూడగా లోకంలో ఎక్కడా లేకపోవటం స్పష్టం. సందేహం లేదు. అతడిని ఎదిరించటం అసాధ్యం.'

**వ. అని చెప్పి, యప్పాటం బరమహితోపదేశంబు సేసిన భీష్మ ద్రోణుల పలుకు లాదరింపక, వారికి సదుత్తరంబు లీక, వారలతోడం దదనురూపంబుగా సంభాషింపక, ధృతరాష్ట్రుండు వెండియుఁ బాండవులవలని వార్త లడుగుటకు సంజయుదిక్కు మొగంబైనం జూచి, కురుపక్షవీరు లందఱుఁ బ్రాణంబుల దెస నిరాశులై యుండి; రమ్మహీపతి సంజయునితో నిట్లనియె; 167**

**ప్రతిపదార్థం:** అని; చెప్పి; ఆ+పాటన్= ఆ విధంగానే; పరమహిత+ఉపదేశంబు+చేసిన భీష్మ ద్రోణుల పలుకులు= మంచి హితం ఉపదేశించిన భీష్మ ద్రోణుల మాటలు; ఆదరింపక= స్వీకరించక; వారికిన్= ఆ భీష్మద్రోణులకు; సత్+ఉత్తరంబులు+ ఈక= తగిన సమాధానాలు చెప్పక; వారలతోడన్; తద్+అనురూపంబుగాన్= వాటికి తగినట్లుగా; సంభాషింపక= మాటాడక; ధృతరాష్ట్రుండు; వెండియున్= మళ్ళీ; పాండవుల వలని వార్తలు= పాండవులను గూర్చిన విషయాలు; అడుగుటకున్; సంజయు దిక్కు మొగంబు+ఐనన్= సంజయుడివైపు చూడగా; చూచి, కురుపక్ష వీరులు+అందఱున్= కౌరవపక్షంలో ఉన్న వీరులంతా; ప్రాణంబుల దెసన్= ప్రాణాల మీద; నిరాశులు+ఐ= ఆశలేనివారై; ఉండిరి; ఆ+మహీపతి= ఆ రాజు-ధృతరాష్ట్రుడు; సంజయునితోన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని చెప్పి ఆ విధంగా మంచి హితవు ఉపదేశించిన భీష్మద్రోణుల మాటలు మన్నించక, వారికి తగిన సమాధానాలు చెప్పక, వాళ్ళతో వాటికి తగ్గట్టుగా మాటాడక ధృతరాష్ట్రుడు మళ్ళీ పాండవులను గూర్చిన విషయా లడగడానికి సంజయుడికేసి చూచాడు. అది చూచి కౌరవుల పక్షంలో ఉన్న వీరులంతా తమ ప్రాణాల మీద ఆశలు వదులుకొన్నారు. ఆ ధృతరాష్ట్ర మహారాజు సంజయుడితో ఇట్లా అన్నాడు :

**విశేషం:** ధృతరాష్ట్రుడు పాండవుల గొప్పతనం విని సహించలేడు. అందుచేతనే భీష్మ ద్రోణుల మాటలు అతడికి రుచించలేదు. వాళ్ళమాటలకు సమాధానాలు చెప్పలేదు.

**తే. 'ధర్మ పుత్త్రున కిక్కడి తలఁపు భంగి । యెట్టు లుండు? నీ సైన్యంబులెల్లఁ గూడి**
**యునికి వినియెనే? యెవ్వరిఁ గొని యతండు । కౌరవులమీఁది కెత్తి రాఁగలుగువాఁడు?' 168**

**ప్రతిపదార్థం:** ధర్మ పుత్త్రునకున్= ధర్మరాజునకు; ఇక్కడి తలఁపు భంగి= ఈ పక్షాన్ని గూర్చిన ఆలోచనా క్రమం; ఎట్టులు+ ఉండున్?= ఎట్లా ఉంటుంది?; ఈ సైన్యంబులు+ఎల్లన్= ఇక్కడి సేనలన్నీ; కూడి+ఉనికి= కూడి ఉండటం; వినియెనే?= విన్నాడా?; అతండు; ఎవ్వరిన్+కొని= ఎవరిని తోడు చేసికొని; కౌరవుల మీఁదికిన్; ఎత్తి రాన్+కలుగువాఁడు?= దండెత్తి రాగలుగుతాడు?

**తాత్పర్యం:** 'ధర్మరాజు ఈ పక్షం గూర్చి ఏమనుకొంటున్నాడు? ఇక్కడ సైన్యాలన్నీ మోహరించి ఉండటం అతడికి తెలుసా? అతడు ఎవరిని తోడు చేసికొని కౌరవులపైకి దండెత్తి రాగలవాడు.

**వ. అనిన విని సంజయుండు వెచ్చనూర్చి, ఱిచ్చవడి, మూర్ఛవోయిన చందంబున డెందంబు మొగుడం జేష్టలు దక్కియుండి, కొండొక సేపునకుఁ జిత్తం బొక్కింత సేసికొని, 'యక్కటా! యీ భూపాలుం డింత బేల యగునే? యుధిష్ఠిరుం డెవ్వరిఁ గొని యెత్తి వచ్చు వాఁడని యడుగుచున్నవాఁ! డింత యెఱుంగని వాఁ డెంతసెప్పినను తెలియనేర్చునే? యితని భంగి యిట్టిదనినఁ, గొడుకుల తెఱంగు వేఱ యెన్న నేల? యే నింక**

**నేమనువాఁడ? నైనను నన్నడిగిన మాటకుం దగిన మాఱుమాట పలుకవలయునకాదె' యని తలంచి**
**ధృతరాష్ట్రున కిట్లనియె;' 169**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; సంజయుండు; వెచ్చన్+ఊర్చి= వేడి నిట్టూర్పు విడిచి; ఱిచ్చ+పడి= నిశ్చేష్టుడయి; మూర్ఛ+పోయిన చందంబునన్= మూర్ఛిల్లిన రీతిగా; డెందంబు= హృదయం; మొగుడన్= ముడుచుకొనగా; చేష్టలు+తక్కి+ఉండి= కొయ్యబారిపోయి; కొండొక సేపునకున్= కొంతసేపటికి; చిత్తంబు+ఒక్క+ఇంత చేసికొని= మనస్సు కొంచెం పదిలపరుచుకొని; అక్కటా= అయ్యో; ఈ భూపాలుండు= ఈ రాజు- ధృతరాష్ట్రుడు; ఇంత బేల+అగునే?= ఇంత వెర్రివాడా? యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఎవ్వరిన్= ఎవరిని; కొని= తీసికొని ఎత్తి వచ్చువాఁడు+అని= దండెత్తి రానున్నాడని; అడుగుచున్+ఉన్నవాఁడు; ఇంత; ఎఱుంగనివాఁడు; ఎంత+చెప్పినను; తెలియన్+నేర్చునే= తెలిసికొనగలడా; ఇతని భంగి= ఇతడి విధం; ఇట్టిది+అనినన్= ఇటువంటిదంటే; కొడుకుల తెఱంగు; వేఱు+అ= వేరే; ఎన్నన్+ఏల?= ఎంచటం ఎందుకు?; ఏను; ఇంకన్; ఏమి; అనువాఁడన్; ఐనను; నన్నున్+అడిగిన మాటకున్; తగిన; మాఱుమాట= ప్రతివచనం, సమాధానం; పలుకవలయున్+అ కాదె!= చెప్పవలసిందే కదా!; అని; తలంచి; ధృతరాష్ట్రునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని సంజయుడు వేడి నిట్టూర్పు పుచ్చి, నిశ్చేష్టుడయి, మూర్ఛిల్లిన విధంగా మనస్సు ముకుళించగా కొయ్యబారిపోయి, కొంతసేపటికి మనస్సు గట్టిపరచుకొని, 'అయ్యో! ఈ రాజు ఇంత వెర్రివాడా? యుధిష్ఠిరుడు ఎవరిని తీసికొని దండెత్తి రానున్నాడని అడుగుతున్నాడు! ఇంత తెలియనివాడు ఎంత చెప్పితే మాత్రం తెలిసికొంటాడా? ఇతడి విధం ఇట్టిదంటే కొడుకుల విధం వేరే చెప్పటం ఎందుకు? నే నింక ఏమంటాను? అయినా, నన్నడిగిన మాటకు తగిన సమాధానం చెప్పాలి కదా!' అని తలచి ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'ఇతని భంగి యిట్టిదనినఁ గొడుకుల తెఱంగు వేఱ యెన్ననేల?' అలంకారం కావ్యార్థాపత్తి. 'యుధిష్ఠిరుండు' అతడే యుద్ధంలో స్థిరంగా ఉండేవాడయితే ....' అని యుధిష్ఠిర శబ్దం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరాంకురం.

**చ. 'వినుము నరేంద్ర! పాండుపృథివీపతి యగ్రసుతుండు సంధిసే**
**యన మదిఁ గోరు; మీరు దమ యయ్యసగంబును భూమియీక త**
**క్కిన మఱికాని ముంద రొకకీడుఁ దలంపఁడు; మీ బలంబు నె**
**ల్లను మదిఁ జీరికిం గొనఁడు లావున నేలఁ గొనం దలంచినన్.' 170**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= రాజా, ధృతరాష్ట్రా!; వినుము; పాండు పృథివీ పతి అగ్ర సుతుండు= పాండురాజు పెద్ద కొడుకు ధర్మరాజు; సంధి+చేయన్+అ మదిన్+కోరున్= సంధి చేసికొనటానికే మనస్సులో కోరుతున్నాడు; మీరు; తమ+అయ్య సగంబును భూమి+ఈక తక్కిన మఱికాని= తమ తండ్రి సగం భూమిని ఇవ్వకపోతే తప్ప; ముందర= ముందు; ఒక కీడున్= ఒక హానిని కూడా; తలంపఁడు; లావునన్= పరాక్రమంతో; నేలన్= భూమిని; కొనన్+తలంచినన్= పుచ్చుకొనాలనుకొంటే- పుచ్చుకోవలసివస్తే, మీ బలంబున్+ఎల్లను= మీ సైన్యాన్నంతనూ; మదిన్= మనస్సులో; చీరికిన్+కొనఁడు= కొంచెం కూడా లక్ష్యపెట్టడు.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజా! వినుము. ధర్మరాజు సంధి చేసికొనటానికే మనస్సులో కోరుతున్నాడు. మీరు తమ తండ్రి సగం భూమినీ ఇవ్వకపోతే తప్ప, ముందే ఏ కీడూ తలపెట్టడు. బలంతోనే భూమిని పుచ్చుకొనవలసి వస్తే, మీ బలాన్ని కొంచెం కూడా లక్ష్యపెట్టడు.

**విశేషం:** ఒక రాయబారి తన ప్రయత్నాన్నీ ఫలితాంశాలనూ ప్రభువుముందు లేదా సభముందు ఉంచేటప్పుడు నాలుగంశాలు తన నివేదనంలో ప్రదర్శిస్తాడు. 1.సారాంశాన్ని అసందిగ్ధంగా చెప్పటం. 2.సమస్యలను స్పష్టంగా వివరించటం. 3.శత్రుపక్షంవారి ప్రవృత్తులను ప్రస్ఫుటంగా వివేచించి చెప్పటం. 4.తాను గమనించిన అంశాలను నిర్మొగమాటంగా తేటతెల్లంగా చెప్పటం. ధర్మజాదులను గురించి తన తుది అంచనాలను ఫలితాంశాలుగా ప్రకటిస్తున్న ఈ ఘట్టంలో ధర్మజుడిని గూర్చి చెప్పిన పద్యమిది. ఈ పద్యంలోని మూడు వాక్యాలలో పై మూడంశాలు ప్రదర్శితమయ్యాయి. వాటిని చెప్పిన తీరులో సంజయుడి మొగమోటం లేనితనం స్పష్టమవుతున్నది. సంజయుడు సమర్థుడైనా వాగ్మి. (సంపా.)

**వ. అతం డెవ్వరిం గొని యెత్తివచ్చువాఁ డని యడిగితివి; నీ యెఱుంగని వార లం దెవ్వరు గల? రవధరింపుము. 171**

**ప్రతిపదార్థం:** అతండు= ధర్మరాజు; ఎవ్వరిన్+కొని= ఎవరిని వెంటబెట్టుకొని; ఎత్తి వచ్చువాఁడు+అని+అడిగితివి= దండెత్తి వస్తాడని అడిగావు; నీ+ఎఱుంగని వారలు+అందున్+ఎవ్వరు+కలరు?= నీకు తెలియనివాళ్ళు అక్కడ ఎవరున్నారు? అవధరింపుము= చిత్తగించుము.

**తాత్పర్యం:** ధర్మరాజు ఎవరిని తోడు తెచ్చుకొని దండెత్తి రానున్నాడని అడిగావు. నీకు తెలియనివాళ్ళు అక్కడ ఎవరున్నారు? చిత్తగించుము:

**మ. బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణపారీణుఁ గీ**
**చక నిర్మూలన కేళి లోలు సమరోత్సాహైక శీల ప్రవ**
**ర్తకు నాగాయుత సామ్యకీర్తిత బలోదగ్రుం బ్రతివ్యూహ దా**
**హకు భీముం గొని వచ్చు ధర్మజుఁడు బాహాటోపముం జూపఁగన్. 172**

**ప్రతిపదార్థం:** ధర్మజుఁడు= ధర్మరాజు; బక విధ్వంసిన్= బకాసుర నాశకుడూ; జటా+అసుర+అంతకున్= జటాసురుడిని అంత మొందించినవాడూ; హిడింబ+ప్రాణ పారీణున్= హిడింబుడనే రాక్షసుడి ప్రాణాల పారం ముట్టినవాడూ- ప్రాణాల అంతు చూచిన వాడూ; కీచక నిర్మూలన కేళి లోలున్= కీచకుడిని తుదముట్టించటం అనే ఆటయందు ఆసక్తి గలవాడూ; సమర+ఉత్సాహ+ఏక శీల ప్రవర్తకున్= యుద్ధోత్సాహమనే ప్రధానమైన స్వభావంతో ప్రవర్తించేవాడూ; నాగ+అయుత సామ్య కీర్తిత బల+ఉదగ్రున్= పదివేల ఏనుగుల సాదృశ్యంతో పొగడబడే పరాక్రమంచేత భయంకరుడూ- పదివేల ఏనుగుల బలంతో సమానమైన పొగడబడే బలంచేత భయంకరమైనవాడూ; ప్రతివ్యూహ దాహకున్= శత్రువుల మారు వ్యూహాలను తగల బెట్టేవాడూ అయిన; భీమున్= భీముడిని; బాహా+ఆటోపమున్= భుజాల విజృంభణాన్ని - భుజబల విజృంభణాన్ని; చూపఁగన్= చూపించటానికి; కొని వచ్చున్= తీసికొని వస్తాడు.

**తాత్పర్యం:** బకాసురుడిని చంపినవాడూ, జటాసురుడిని అంతమొందించినవాడూ, హిడింబుడనే రాక్షసుడి ప్రాణాల అంతు చూచినవాడూ, కీచకుడిని తుదముట్టించటమనే ఆటయందు ఆసక్తి కలవాడూ, యుద్ధోత్సాహం ఒక్కటే స్వభావంగా ప్రవర్తించేవాడూ, పదివేల ఏనుగుల బలమంత బలం గలవాడని పొగడబడే భయంకరుడూ, శత్రువుల వ్యూహాలను తగలబెట్టేవాడూ అయిన భీముడిని భుజపరాక్రమ విజృంభణం చూపించటానికి వెంటబెట్టుకొని ధర్మరాజు వస్తాడు.

**విశేషం:** పద్యంలోని భీమ విశేషణాలన్నీ సంస్కృత సమాస భీమము లయి అతడి భీమ పరాక్రమాన్ని సూచిస్తున్నాయి. ప్రకరణాను గుణమైన శయ్యను ప్రదర్శించటం మహాకవుల ప్రత్యేకత.

**వ. మఱియును.** **173**

**తాత్పర్యం:** ఇంకా.

**మ. అట మిన్నందిన యట్టివాని పొడ వెం తన్నట్లు ఫాలాక్షు నె**
**క్కటి కయ్యంబునఁ గన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించు; టం**
**తటి వానింగొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ**
**చ్చుటకుం గొంకునె? వీఁపు సక్కనయి నిల్చుంగాక మీ సైన్యముల్.** **174**

**ప్రతిపదార్థం:** ఫాల+అక్షున్= నుదుట కన్నుగలవాడిని- ఈశ్వరుడిని; ఎక్కటి కయ్యంబునన్= ద్వంద్వయుద్ధంలో; కన్న= పొందిన- చూచిన; ఫల్గును భుజా గర్వంబున్= అర్జునుడి బాహు పరాక్రమ గర్వాన్ని; లెక్కించుట= లెక్కపెట్టటం; అట మిన్ను+అందిన+అట్టి వాని పొడవు= ఆకాశాన్ని తాకిన ఆ మనుష్యుడి పొడవు; ఎంత+అన్న+అట్లు= ఎంత అని అడగటం వంటిది; అంతటి వానిన్+కొని= అంతటి గొప్పవాడిని మహోన్నతుడిని తీసికొని; ధర్మసూతి= ధర్మరాజు; సమర+ఉత్సాహంబు మైన్= యుద్ధోత్సాహంతో; ఎత్తి వచ్చుటకున్= దండెత్తి రావటానికి; కొంకునె?= సందేహిస్తాడా?; మీ సైన్యముల్= మీ సేనలు; వీఁపు+చక్కన+అయి= వీపు తిన్ననై; నిల్చున్+కాక= ఉంటాయిలే - వెనుదిరుగుతాయిలే.

**తాత్పర్యం:** నిటలాక్షుడిని ద్వంద్వయుద్ధంలో కన్న అర్జునుడి భుజబలం పరిమితి ఎంత అని లెక్కించటం, ఆకాశాన్ని తాకే ఆ మనుష్యుడి పొడవెంత అని అడగటం లాంటిది. అంతటివాడిని వెంటబెట్టుకొని ధర్మరాజు యుద్ధోత్సాహంతో దండెత్తి రావటానికి సందేహిస్తాడా? మీ సైన్యాలు వెనుదిరిగి పోవాలిసిందే.

**విశేషం:** ఈశ్వరు డనక ఫాలాక్షు డనటం తన్మహిమను చెప్పటం కొరకు ఫాలాక్ష శబ్దం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరాంకురం. 'అట మిన్నందిన యట్టివాని ..... లెక్కించుట' - ఉపమేయోపమాన వాక్యాలకు ఐక్యారోపణం చెప్పబడింది కాబట్టి అలంకారం నిదర్శన. వెనుదిరుగుతాయి అనే' దానిని 'వీఁపు సక్కనయి నిల్చు'నని భంగ్యంతరంచేత చెప్పడంచేత అలంకారం పర్యాయోక్తం.

**తే. నకులు సహదేవుఁ గొని ధర్మనందనుండు । మొనసి కౌరవ బలముల ముట్టికొనఁగఁ**
**దలఁచి తఱి వేచి వచ్చుట ధరణినాథ! । సింగములఁ బట్టి వేఁటాడు భంగి గాదె?** **175**

**ప్రతిపదార్థం:** ధరణినాథ= ధృతరాష్ట్ర మహారాజా!; ధర్మనందనుండు= ధర్మరాజు; నకులున్; సహదేవున్; కొని= వెంటబెట్టుకొని; మొనసి= పూని; కౌరవ బలములన్= కౌరవుల సేనలను; ముట్టికొనఁగన్+తలఁచి తఱి వేచి వచ్చుట= ఎదుర్కొన దలచి సమయం చూచి రావటం; సింగములన్+పట్టి= సింహాలను అవలంబించి వెంటతీసికొని; వేఁట+ఆడు భంగి+కాదె= వేటాడటానికి రావటం వంటిది కాదా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! నకులుడినీ, సహదేవుడినీ తీసికొని ధర్మరాజు పూని కౌరవులపై దండెత్తాలని తలచి సమయం చూచి రావటం, సింహాలను తీసికొని వేటాడటానికి రావటం వంటిది కాదా?

**విశేషం:** వేటకాడు వేటాడటానికి వెళ్ళేటప్పుడు సాధారణంగా తనతో వేటకుక్కలను తీసికొనివెళ్ళుతాడు. అట్లాకాక సింహాలనే తీసికొని వెళ్ళటం వంటిది- ధర్మరాజు నకుల సహదేవులను తీసికొని కౌరవుల మీదకు వెళ్ళటం. వేటపని అంతా సింహాలే చేసేస్తాయి. వేటగాడిపని సులభతరం అవుతుంది. అట్లాగే యుద్ధకార్యం అంతా నకుల సహదేవులే చేసి, ధర్మరాజు పని సులభతరం చేస్తారని స్వారస్యం. ఉపమేయోపమాన వాక్యాలకు ఐక్యారోపణం చేయటం వలన అలంకారం నిదర్శన.

**తే.** **ద్రౌపదేయులు, నా సుభద్రా సుతుండు । నుక్కు తునియలు గారె? మి మ్మక్కుమార**
**వరులఁగొని యోర్చువాఁడయి వచ్చు ధర్మ । పుత్త్రుఁ; డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు?'** **176**

**ప్రతిపదార్థం:** ద్రౌపదేయులున్= ద్రౌపది కొడుకులూ-ఉపపాండవులూ; ఆ సుభద్రా సుతుండున్= ఆ సుభద్ర కొడుకు అభిమన్యుడూ; ఉక్కు తునియలు+కారె= ఉక్కు ముక్కలు కారా? - మహాబలవంతులు కారా; ధర్మపుత్త్రుఁడు= ధర్మరాజు; ఆ+కుమార వరులన్+కొని= ఆ కుమార శ్రేష్ఠులను తీసికొని; మిమ్మున్= మిమ్ములను; ఓర్చువాఁడు+అయి= ఓడించటానికని; వచ్చున్; చూడంగన్= ఆలోచించగా; ఇది; నీకున్; ఎట్లు+పోలదు?= ఎట్లా సంగతం కాదు?

**తాత్పర్యం:** ద్రౌపది కొడుకులూ, ఆ సుభద్ర కొడుకు అభిమన్యుడూ ఉక్కు ముక్కలు కారా? ధర్మరాజు ఆ కుమారశ్రేష్ఠులను వెంట బెట్టుకుని మిమ్ములను ఓడించటానికి వస్తాడు. ఆలోచించగా ఇది నీకు ఎట్లా సంగతం కాదు? - ఔననిపించటం లేదు?'

**విశేషం:** ద్రౌపదేయులు, ఆ సుభద్రాసుతుడు ఉక్కుతునియలు - అలంకారం రూపకం.

**వ.** **అని చెప్పి వెండియు నిట్లనియె :** **177**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు :

**క.** **'వృష్ణి కుమారోత్తముఁ డా । కృష్ణుని తమ్ముండు సాత్యకియు, దవదహనా**
**త్యుష్ణ ప్రతాపదీప్తులు । కృష్ణా సోదరులుఁ దలఁపఁ గేవలులె నృపా!** **178**

**ప్రతిపదార్థం:** నృపా!= ధృతరాష్ట్ర మహారాజా!; వృష్ణికుమార+ఉత్తముఁడు= వృష్ణివంశకుమారులలో శ్రేష్ఠుడు; ఆ కృష్ణుడి తమ్ముండు సాత్యకియున్; దవ దహన+అతి+ఉగ్ర ప్రతాపదీప్తులు= కార్చిచ్చు యొక్క మిక్కిలి వేడియైన ప్రతాపము అనెడి ప్రతాపము (పరాక్రమము) యొక్క కాంతులైనవారు; అగు; కృష్ణా సోదరులు= ద్రౌపది సోదరులు; తలఁపన్= ఆలోచించగా; కేవలులె?= సామాన్యులా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! వృష్ణి వంశ కుమారులలో శ్రేష్ఠుడూ, ఆ కృష్ణుడి తమ్ముడూ అయిన సాత్యకీ, కార్చిచ్చు యొక్క అత్యుష్ణమైన ప్రతాపం అనే పరాక్రమం యొక్క కాంతులైనవారగు ద్రౌపదీ సోదరులు ఆలోచించగా సామాన్యులా?

**విశేషం:** దవదహనాత్యుష్ణ ప్రతాపదీప్తులు- ప్రతాపము (మిక్కిలి తాపము) అనెడి ప్రతాపము (పరాక్రమము)-శ్లిష్ట రూపకం. దీప్తులే అయిన కృష్ణా సోదరులు-రూపకం.

**సీ. శౌర్యోజ్జ్వలుండు పాంచాల భూనాథుండు, । మహితవిక్రముఁ డగు మత్స్యవిభుఁడు**
**నధిక ధైర్యాన్వితు లతని తమ్ము, లుదగ్ర । తేజస్కులైన తదీయసుతులు,**
**నన్నదమ్ములు ప్రతాపోన్నతు లేవురు । కేకయపతులు, నక్షీణ బాహు**
**శక్తియుక్తులు జరాసంధ సూనుఁడు సహ । దేవుండు, నా జయత్సేన విభుఁడు**

**తే. వినుము శిశుపాల తనయులు వీరధనులు । ధృష్టకేతుండు వృషభుండుఁ, దీవ్రరణ వి**
**నోది యదుభర్త చేకితానుండు, దర్ప । ఘనుఁడు శైబ్య నృపాలుండుఁ గలరుగాదె! 179**

**ప్రతిపదార్థం:** వినుము= ధృతరాష్ట్రా! వినుము; శౌర్య+ఉజ్జ్వలుండు= పరాక్రమంచేత ప్రకాశించేవాడు; అగు; పాంచాల భూనాథుండున్= పాంచాల దేశపురాజూ- ద్రుపదుడూ; మహిత విక్రముఁడు+అగు మత్స్య విభుఁడున్= గొప్ప పరాక్రమం కలవాడైన మత్స్యరాజు విరాటుడూ; అధిక ధైర్య+అన్వితులు+అతని తమ్ములు= ఎక్కువ ధైర్యంతో కూడినవారైన తమ్ములూ; ఉదగ్ర తేజస్కులు+ఐన తదీయ సుతులున్ అన్నదమ్ములన్= భయంకరమైన తేజస్సు గల వారగు అతడి కొడుకులూ, అన్నలూ, తమ్ములూ; ప్రతాప+ఉన్నతులు+ఏవురు కేకయ పతులున్= పరాక్రమం చేత గొప్పవారైన అయిదుగురు కేకయ వంశరాజులూ; అక్షీణ బాహు శక్తియుక్తులు= తరుగని భుజం యొక్క పరాక్రమంతో కూడినవారు; అగు; జరాసంధ సూనుఁడు సహదేవుఁడున్+ఆ జయత్సేన విభుఁడున్= జరాసంధుడి కొడుకు సహదేవుడూ, ఆ జయత్సేన రాజూ; శిశుపాల తనయులున్= శిశుపాలుడి కొడుకులూ; వీర ధనులున్= పరాక్రమమే ధనంగా కలవారు; అగు; ధృష్టకేతుండున్; వృషభుండున్; తీవ్ర రణ వినోది యదుభర్త చేకితానుండున్= తీవ్రమైన యుద్ధం చేత వినోదించే వాడైన యాదవరాజు చేకితానుడూ; దర్పఘనుఁడు= (పరాక్రమ) గర్వంచేత గొప్పవాడు అగు శైబ్యరాజూ; కలరు+కాదె!= ఉన్నారు గదా!

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! వినుము. శౌర్యంచేత ప్రకాశించే ద్రుపదుడూ, గొప్ప పరాక్రమం కలవాడైన విరాటుడూ, మిక్కిలి ధైర్యంతో కూడినవారైన అతడి తమ్ములూ, గొప్ప తేజస్సు కలవారగు అతడి కుమారులూ, అన్నదమ్ములూ, పరాక్రమంచేత ఉన్నతులైన అయిదుగురు కేకయరాజులూ, తరుగని భుజ పరాక్రమంతో కూడిన జరాసంధ తనయుడు- సహదేవుడూ, ఆ జయత్సేనరాజూ, శిశుపాలుడి కుమారులూ, పరాక్రమధనులూ అయిన ధృష్టకేతు వృషభులూ, తీవ్ర యుద్ధంలో వినోదించే యాదవరాజు చేకితానుడూ, పరాక్రమగర్వంచేత ఘనుడైన శైబ్యనృపాలుడూ ఉన్నారు గదా!

**క. వీరెల్లఁ బాండురాజ కు । మారుల పాటునకుఁ గుందు మనములతోడన్**
**వారి పగ దీర్పఁ గడఁగెడు । వారల కా, కందు లాఁతివారుం గలరే? 180**

**ప్రతిపదార్థం:** వీరు+ఎల్లన్= వీళ్ళందరూ; పాండు రాజ కుమారుల పాటునకున్= పాండవుల కష్టానికి; కుందు మనములతోడన్= దుఃఖించే మనస్సులతో; వారి పగ+తీర్పన్= వారి పగదీర్చటానికి; కడఁగెడు వారలు+అ కాక= ప్రయత్నించేవాళ్ళేకాని; అందున్= అక్కడ; లాఁతివారున్+కలరే?= వేరేవాళ్ళు కూడా ఉన్నారా?

**తాత్పర్యం:** ఈ వీరులందరూ పాండవుల ఆపదకు దుఃఖించే మనస్సులతో ప్రతీకారం చేసి వాళ్ళ పగదీర్చటానికి ప్రయత్నించేవాళ్ళే కాని వేరేవాళ్ళు ఎవరూ లేరు.

**వ. భీమసేనసూనుండు ఘటోత్కచుండు తండ్రికంటెను లావును బీరంబునుం గలవాఁడు, మాయాబలంబున మనబలంబు నెల్లం గలంచు; మఱియును దూర్పున నుత్తరంబునం గలుగు నరనాయకులు నానా సేనా సమన్వితులయి వచ్చి చిచ్చయిననుం బిడికిలింత మనుచున్నవా; రదియునుంగాక. 181**

**ప్రతిపదార్థం:** భీమసేన సూనుండు= భీముడి కొడుకు; ఘటోత్కచుండు; తండ్రికంటెను; లావును= బలమూ; బీరంబునున్= పరాక్రమమూ; కలవాఁడు; మాయా బలంబునన్= మాయా శక్తితో; మన బలంబున్+ఎల్లన్= మన సేననంతనూ; కలంచున్= చీకాకుపరుస్తాడు; మఱియును; తూర్పునన్; ఉత్తరంబునన్; కలుగు నర నాయకులు= ఉన్న రాజులు; నానా సేనా సమన్వితులు+ అయి వచ్చి= అనేక సేనలతో కూడినవారయి వచ్చి; చిచ్చు+అయిననున్+పిడికిలింతము+అనుచున్+ఉన్నవారు= నిప్పయినా పిడికిట్లో పట్టుకుందాం అంటున్నారు; అదియునున్+కాక-

**తాత్పర్యం:** భీముడి కొడుకు ఘటోత్కచుడు తండ్రికన్నా బలపరాక్రమాలు కలవాడు. మాయాబలంచేత మన సైన్యాన్నంతనూ చీకాకు పరుస్తాడు. ఇంకా తూర్పునా, ఉత్తరానా ఉన్న రాజులు అనేక సేనలతో వచ్చి అగ్గి నయినా సరే పిడికిట పట్టుకుందాం అంటున్నారు. అదీకాక.

**విశేషం:** చిచ్చయిననుం బిడికిలింతము- ఎంత కష్టం వచ్చినా సహిద్దాం - అలంకారం అతిశయోక్తి.

**క. సకల భువనములు నఱ చే । తికిఁ దేరంజాలు నట్టి ధీమంతుఁడు దే**
**వకి కొడుకు గలఁడు ధర్మజు । నికి; నాతం డెత్తి రాక నిలుచునె యధిపా?' 182**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా, ధృతరాష్ట్రా!; సకల భువనములున్= ఎల్ల లోకాలూ; అఱ చేతికిన్; తేరన్+చాలు+అట్టి= తేగలిగే; ధీమంతుఁడు= బుద్ధిమంతుడు - శక్తి మంతుడు; దేవకి కొడుకు= దేవకి కొడుకు- శ్రీకృష్ణుడు; ధర్మజునికిన్= ధర్మరాజుకు; కలఁడు= ఉన్నాడు; ఆతండు= ఆ ధర్మరాజు; ఎత్తి రాక నిలుచునె?= దండెత్తకుండా ఉంటాడా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! లోకాల నన్నిటినీ అరచేతిలోకి తీసికొని రాగలిగే శక్తి సంపన్నుడు దేవకి కొడుకు శ్రీకృష్ణుడు ధర్మరాజుకున్నాడు. ఇంక ఆ ధర్మరాజు దండెత్తి రాకుండా ఉంటాడా?'

**విశేషం:** 'సకల భువనములు నఱచేతికిఁ దేరం జాలునట్టి' - లోకాల నన్నిటినీ తన చెప్పుచేతులలో పెట్టుకొనగల.

**వ. అని చెప్పిన సూతపుత్త్రునకు నంబికాపుత్త్రుం డిట్లనియె: 183**

**ప్రతిపదార్థం:** అని; చెప్పిన; సూత పుత్త్రునకున్= సంజయుడికి; అంబికా పుత్త్రుండు= ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికిన సంజయుడితో ధృతరాష్ట్రు డిట్లా అన్నాడు.

### ధృతరాష్ట్రుండు భీమసేనాదుల పరాక్రమంబు దలంచి దుఃఖించుట (సం. 5-50-1)

**క. 'వారి దెస నీదు సెప్పిన । యా రథికులు ప్రబలు లగుదు రందఱు; నైనన్**
**వా రెల్లను నొకతల, య । మ్మారుతి యొకతల బలప్రమాణము సూడన్. 184**

**ప్రతిపదార్థం:** వారి దెసన్= వారి పక్షంలో; నీదు+చెప్పిన ఆ రథికులు= నీవు పేర్కొన్న ఆ రథికులు; అందఱున్, ప్రబలులు+అగుదురు= మిక్కిలి బలవంతులవుతారు; ఐనన్= అయినా; బల ప్రమాణము+చూడన్= బలపరిమితి చూస్తే; వారు+ఎల్లరున్= వాళ్ళందరూ; ఒక తల= ఒక ఎత్తు; ఆ+మారుతి+ఒక తల= ఆ భీముడు ఒక ఎత్తు.

**తాత్పర్యం:** పాండవపక్షంలో నీవు చెప్పిన ఆ రథికులందరూ మిక్కిలి బలవంతులే. అయినా బలపరిమితి చూస్తే వాళ్ళంతా ఒక ఎత్తు, ఆ భీము డొక్కడూ ఒక యెత్తు.

**విశేషం:** ఇది ధృతరాష్ట్రుడి అంచనా. పాండవవీరులందరూ ఒక ఎత్తు. భీముడొక్కడూ ఒక్క ఎత్తు. ఇది అతడి దృక్కోణం. భీముడే కౌరవులను సంహరిస్తానని ప్రతినబూనాడు. చేసిన ప్రతిజ్ఞను నిర్వహించి తీరుతాడు. అంతే కాదు. తనమీదకు వచ్చిన శత్రువులను మట్టుపెట్టటం, వ్యూహాలను భగ్నం చేయటం అతడి సాహసవృత్తి. భీముడు ధృతరాష్ట్రుడికి సింహస్వప్నం వంటివాడు. (సంపా.)

**ఉ.** **భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచునుండు నాకు, రే**
**లేమియు నిద్ర రా; దతని నేడ్తెఱ మార్కొనఁ జాలునట్టి వాఁ**
**డీ మొన లేఁ; డతం డలుక నెత్తిన యా గద కాలదండ; ము**
**ద్దామ విలాసుఁడై కురు కదంబములో విహరింపకుండునే?** **185**

**ప్రతిపదార్థం:** భీమున్= భీముడిని; తలంచినన్= తలచుకొంటే; నాకున్; మనంబు= మనస్సు; భీతిన్= భయంతో; కలంగుచున్+ ఉండున్= కలత చెందుతూ ఉంటుంది; రేలు= రాత్రులు; ఏమియున్ నిద్ర రాదు= కొంచెం కూడా నిద్ర పట్టదు; అతనిన్= ఆ భీముడిని; ఏడ్తెఱన్= పరాక్రమంతో; మార్కొనన్+చాలు+అట్టివాఁడు= ఎదురుకొనగలిగేవాడు; ఈ మొనన్= ఈ సేనలో; లేఁడు; అతండు+ఆ భీముడు; అలుకన్= కోపంతో; ఎత్తిన ఆ గద= ఎత్తి పట్టుకొన్న ఆ గదాయుధం; కాల దండము= యమ దండం; ఉద్దామ విలాసుఁడు+ఐ= విశృంఖలమైన లీల గలవాడయి; కురు కదంబములోన్= కౌరవుల సమూహంలో; విహరింపక+ ఉండునే?= విహరించకుండా ఉంటాడా?

**తాత్పర్యం:** భీముడిని తలచుకొంటే నాకు గుండె బేజారెత్తిపోతూ ఉంటుంది. రాత్రులు కొంచెమయినా నిద్రపట్టదు. అతడిని పరాక్రమంతో ఎదురుకొనగలవాడు ఈ సైన్యంలో లేడు. అతడు కోపంతో ఎత్తిన గదాదండం యమదండమే. అతడు అడ్డులేకుండా కౌరవ సమూహంలో విహరించకుండా ఉంటాడా?

**విశేషం:** 'ఆ గద కాలదండము' - అలంకారం రూపకం. భీముడి వలన గ్రుడ్డిరాజు పొందే భయభావాన్ని రమణీయంగా తిక్కన చిత్రించాడు. భీముడి వలని భయం వలన మనస్సు కలతచెందటం అనుభావం. రాత్రిళ్ళు నిద్రపట్టకపోవటం సాత్త్వికభావం. నిరంతరం మేల్కొని భీముడిని గురించే ఆలోచిస్తూ ఉంటే అతడిని ఎదుర్కొనే వీరుడు కౌరవపక్షంలో లేడని స్పష్టమవుతుంది. దాని వలన మరణభీతి కలుగుతుంది. ఆ భావమే భీముడి గదను యమదండంగా భావింపజేస్తుంది. దానితో గుండె పగిలినంత పని ఔతుంది. కౌరవ సమూహంలో అతడు దండధారి అయిన యముడివలె విహరిస్తున్నట్లుగా మనోరంగంలో గోచరిస్తుంది. స్మరణ రూపమైన ఈ ఊహాచిత్రం భావరమణీయం. (సంపా.)

**తే.** **చిఱుతనాఁడును వాఁడు నాశిక్షఁ బోఁడు; । వీరు చివ్వకుఁ జొత్తురు వైర మెత్తి;**
**వానిచేఁ బీడ వడియును మాన; రిదియ । కాదె యీ భేదమున కెల్లఁ గారణంబు.** **186**

**ప్రతిపదార్థం:** వాఁడు= ఆ భీముడు; చిఱుత నాఁడును= చిన్నప్పుడు కూడా; నా శిక్షన్+పోఁడు= నేను చెప్పినట్లు వినడు; వీరు= ఈ కౌరవులు; వైరము+ఎత్తి= పగపెట్టుకొని; చివ్వకున్+చొత్తురు= కయ్యానికి పూనుకొంటారు; వానిచేన్= ఆ భీముడి చేత; పీడ+పడియును= బాధ పొందికూడా; మానరు= పగ విడువరు; ఈ భేదమునకున్+ఎల్లన్= ఈ కురుపాండవ వైరాని కంతకూ; కారణంబు; ఇది+అ+కాదె!= ఇదే కదా!

**తాత్పర్యం:** ఆ భీముడు చిన్నప్పుడు కూడా నా మాట వినేవాడు కాడు. వీళ్ళు పగబూని కయ్యానికి కాలు ద్రవ్వుతారు. వాడిచేత బాధ పొందికూడా పగ విడవరు. ఈ కౌరవ పాండవ వైరానికంతకూ మూలకారణం ఇదే కదా!

**క. సమరమున దైత్య దానవ । సమితియు నాతని నెదుర్పఁ జాలదు; భుజయు**
**ద్ధమున జరాసంధుని నొక । నిమిషంబునఁ జంపె; నొరులు నిలుతురె యెదురన్? 187**

**ప్రతిపదార్థం:** సమరమునన్= యుద్ధంలో; దైత్య దానవ సమితియున్= రాక్షస జాతుల సమూహం కూడా; ఆతనిన్= ఆ భీముడిని; ఎదుర్పన్+చాలదు= ఎదిరించ లేదు; భుజ యుద్ధమునన్= బాహుయుద్ధంలో; జరాసంధునిన్; ఒక నిమిషంబునన్+ చంపెన్= ఒక్క రెప్పపాటుకాలంలో చంపాడు; ఒరులు= ఇతరులు; ఎదురన్= ఎదురుగా; నిలుతురె?= నిలబడగలరా?

**తాత్పర్యం:** యుద్ధంలో రాక్షస జాతుల సమూహం కూడా ఆ భీముడిని ఎదిరించలేదు. బాహుయుద్ధంలో అతడు జరాసంధుడిని ఒక్క రెప్పపాటు కాలంలో చంపాడు. ఇంక ఇతరులు ఎదుట నిలబడతారా?

**విశేషం:** 'భుజ యుద్ధమున .... యెదురన్' కైముత్యం చేత అర్థ సంసిద్ధి జరుగుతున్నది కాబట్టి అలంకారం కావ్యార్థాపత్తి.

**మ. బొమ లల్కన్ ముడివడ్డ, రౌద్రరస ముప్పొంగం, దనర్పన్ భుజా**
**గ్రము, 'లిందెవ్వఁడు నాకు మా' అనుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల దు**
**ర్దమ లీలం గదియంగ, భీముఁ గని ధైర్యం బేది కౌరవ్యసై**
**న్యము లంతంతఁ గలంగఁ బాఱినటులై నా మోమునన్ వ్రేలెడిన్. 188**

**ప్రతిపదార్థం:** బొమలు= కనుబొమలు; అల్కన్= కోపంతో; ముడి+పడ్డన్= ముడిపడగా; రౌద్ర రసము+ఉప్పొంగన్= రౌద్ర రసం పొంగి పొరలగా; భుజ+అగ్రములు= భుజాల కొనలు; తనర్పన్= పొంగగా; ఇందున్= ఈ కురుసేనలో; ఎవ్వఁడు; నాకున్; మాఱు+అనుచున్= ఎదురంటూ; శౌర్యస్ఫూర్తి= పరాక్రమ ప్రకాశం; శోభిల్లన్= ప్రకాశించగా, ఒప్పగా; దుర్దమ లీలన్= అణచరాని విధంగా; కదియంగన్= సమీపించగా; భీమున్; కని; కౌరవ్య సైన్యములు= కురుసేనలు; ధైర్యంబు+ఏది= ధైర్యం నశించి; అంతంతన్= క్రమక్రమంగా; కలంగన్+పాఱిన+అటులు+ఐ= కలత చెందిన విధమై; నా మోమునన్, వ్రేలెడిన్= నా కళ్ళకు కట్టినట్లున్నాయి.

**తాత్పర్యం:** కోపంతో కనుబొమలు ముడిపడగా, రౌద్రరసం పొంగి పొరలగా, భుజాల కొనలు పొంగగా, ఈ కురుసేనలో నాకు ఎదురెవ్వడు అంటూ పరాక్రమం ఒప్పగా, అణచరాని విధంగా సమీపించే భీముడిని చూచి ధైర్యం నశించి కౌరవసైన్యాలు కలత చెందినట్లై, నా కళ్లకు కట్టినట్లున్నాయి.

**విశేషం:** రౌద్రరసమూర్తి అయిన భీముడి ఆంగికాభినయం శత్రువుల హృదయాలపై అంతటి భయముద్రను వేసిందన్నమాట! కళ్ళున్నవాళ్ళు కళ్ళు మూసికొని చూచినా భయపడతారు. ఇక గ్రుడ్డిరాజు మనోనేత్రంతో దర్శించి లోలోననే హడలిపోతున్నాడు. (సంపా.)

**క. కరవాలము గద మొదలగు । పరికర మేమియును లేక బాహుబలమునం**
**గరి గతి నడరినను వృకో । దరునకు నొకఁ డెదుర నిలిచి తలపడువాఁడే? 189**

**ప్రతిపదార్థం:** కరవాలము= కత్తి; గద, మొదలు+అగు; పరికరము= సాధనం; ఏమియును-లేక; బాహు బలమునన్= భుజబలంతో; కరి గతిన్= ఏనుగువలె; అడరినను= విజృంభిస్తే; వృకోదరునకున్= భీముడికి; ఒకఁడు; ఎదురన్; నిలిచి; తలపడువాఁడే;= ప్రతిఘటించగలడా?

**తాత్పర్యం:** కత్తి, గద మున్నగు సాధన సామగ్రి ఏమీ లేకుండానే కేవలం భుజబలంతో ఏనుగువలె విజృంభించినా భీముడి ఎదుట నిలబడి ఎవడైనా ప్రతిఘటించగలడా?

**విశేషం:** భీముడికి ఇక్కడ వృకోదరుడు (వృకము= తోడేలు ఉదరం వంటి ఉదరం గలవాడు) అనే శబ్దం సాభిప్రాయంగా ప్రయోగించబడింది కాబట్టి అలంకారం పరికరాంకురం.

**తే. ప్రళయకాల సముద్రము భంగిఁ బొంగి । కడు భయంకరుఁడగు భీముఁ గడవ నీఁద**
**వశమె నా పుత్త్రులకు? విధివశము వొంది । యెదిరిఁ దమ్మును నెఱుఁగరు మదము కతన. 190**

**ప్రతిపదార్థం:** ప్రళయ కాల సముద్రము భంగిన్= ప్రళయ సమయంలోని సముద్రంవలె; పొంగి, కడున్= మిక్కిలి; భయంకరుఁడు+ అగు భీముని= వెరపు గొలిపే భీముడిని; కడవన్+ఈఁదన్= దాటేటట్లు ఈదటానికి; నా పుత్త్రులకున్= నా కుమారులకు; వశమె?= తరమా?; విధి వశము+పొంది= విధి వశం చేత; మదము కతనన్= గర్వం క్రొవ్వు కారణంగా; ఎదిరిన్+తమ్మునున్= ఎదుటివాళ్ళనూ; తమనూ; ఎఱుఁగరు.

**తాత్పర్యం:** ప్రళయ సమయంలో సముద్రంవలె పొంగి మిక్కిలి వెరపు గొలిపే భీముడిని తరించేటట్లు ఈదటానికి నా కుమారులకు శక్యమా? విధి వశంచేత, మదం కొద్దీ, ఎదుటివాళ్ళనూ తమనూ ఎరగరు.

**విశేషం:** 'ప్రళయ కాల సముద్రము భంగిన్' - అలంకారం ఉపమ.

**క. చిచ్చునకుఁ దోడు కరువలి । వచ్చు గతిన్ భీము దుర్నివార విహారం**
**బచ్చు పడఁగఁ బ్రాపై వి । వ్వచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దానున్. 191**

**ప్రతిపదార్థం:** చిచ్చునకున్= అగ్నికి; తోడు= సహాయం(గా); కరువలి= గాలి; వచ్చు గతిన్= వచ్చే విధంగా; భీము దుర్నివార విహారంబు= భీముడియొక్క అడ్డగించ శక్యం కాని విహారం; అచ్చు పడఁగన్= తెల్లమయ్యేటట్లు; ప్రాపు+ఐ= అండయై- తోడయి; వివ్వచ్చుఁడు= బీభత్సుడు- అర్జునుడు; గాండివంబును+తానున్= గాండీవమూ; తానూ- గాండీవ సహితుడై; వెసన్= శీఘ్రంగా; వచ్చున్.

**తాత్పర్యం:** అగ్నికి వాయువు తోడయినట్లు, భీముడి అనివార్యమైన యుద్ధ విహారం బాగా తెలిసేటట్లు, అతడికి అండగా అర్జునుడు గాండీవంతో శీఘ్రంగా వస్తాడు.

**విశేషం:** 'చిచ్చునకుఁ దోడు కరువలి వచ్చుగతిన్... వివ్వచ్చుఁడు వెసవచ్చు.' అలంకారం ఉపమ. ధృతరాష్ట్రుడికి కూడా అభిమానంలో దుర్యోధను డొక్కడూ ఒక ఎత్తు; మిగిలిన వారందరూ మరొక ఎత్తు. అందుకే దుర్యోధనుడిని, అతడి సోదరులనూ చంపే భీముడు మొదటి స్థానంలో జ్ఞాపకం వస్తాడు. ఆ తరువాత భీష్మ, ద్రోణ, కర్ణాది వీరులనందరినీ చంపగలిగిన అర్జునుడు మేటివీరుడైనా తరువాత లెక్కకు వస్తాడు. ఇది సహజం. (సంపా.)

**వ. సంజయా! వినుము; నీ కున్న రూపు సెప్పెద. 192**

**తాత్పర్యం:** సంజయా! నీకు ఉన్న సంగతి చెపుతాను. వినుము.

**క. ఆ యర్జును మగఁటిమి కెన । యే యుగములఁ జూడ వినఁగ నెందును గలదే?**
**నీ యెదుర నాడి నంతయుఁ । జేయుట కతఁ డోపు; రిత్త సెప్పెడువాఁడే? 193**

**ప్రతిపదార్థం:** ఆ+అర్జును మగఁటిమికిన్= ఆ అర్జునుడి పరాక్రమానికి; ఎన= సాటియైనవాడు; ఏ యుగములన్= ఏయుగాలలోనైనా- ఏ కాలంలోనైనా; ఎందును= ఎక్కడైనా; చూడన్ వినఁగన్= చూడడానికీ, వినడానికీ; కలఁడే?= ఉన్నాడా? అతఁడు; నీ+ఎదురన్= నీ ఎదురుగా; ఆడిన+అంతయున్= చెప్పినదంతా; చేయన్+ఓపున్= చేయటానికి సమర్థుడు; రిత్త+చెప్పెడు వాఁడే?= ఊరికే చెప్పేవాడా?

**తాత్పర్యం:** ఆ అర్జునుడికి పరాక్రమంలో సాటియైనవాడు ఏ యుగాలలోనైనా, ఎక్కడైనా ఉన్నాడని చూచామా, విన్నామా? అతడు నీ యెదుట అన్నదంతా చేయగల సమర్థుడు. ఊరికే అనేవాడా?

**విశేషం:** అర్జునుడు కూడా అన్నంత పనీచేస్తాడని భయం. (సంపా.)

**ఉ. ఎక్కటి గాండివంబు నుతికెక్కి వెలుంగుట! మీఁదఁ గేశవుం**
**డక్కజమైన తేజ! మది యాసపడండు, దనంత నర్జునుం**
**డొక్కఁడ వైరిసేనలకు నొట్టిన మంట! ప్రతాపమూర్తు లి**
**ట్లొక్కెడఁ గూడె, నిన్నిటి మహోగ్రపు వేఁడిమి కోర్వవచ్చునే? 194**

**ప్రతిపదార్థం:** ఎక్కటి గాండివంబు= సాటిలేని గాండీవం; నుతికిన్+ఎక్కి వెలుంగుట= పొగడ్తకెక్కి ప్రకాశించటం; మీఁదన్= ఆపైన; కేశవుండు= కృష్ణుడు; అక్కజము+ఐన తేజము= ఆశ్చర్యకరమైన తేజస్సు; అది, ఆసపడండు= దానికొరకు ఆశపడడు; తన+అంతన్= స్వయంగా; అర్జునుండు+ఒక్కఁడు+అ= అర్జునుడొక్కడే; వైరి సేనలకున్= శత్రుసేనలకు; ఒట్టిన మంట= మండే మంట; ఇట్లు= ఈవిధంగా; ప్రతాపమూర్తులు= తేజోమూర్తులు మూడు- గాండీవం, కృష్ణుడు, అర్జునుడు; ఒక్క+ఎడన్= ఒకచోట; కూడెన్= కలిశాయి; ఇన్నిటి మహా+ఉగ్రపు(ము)+వేఁడిమికిన్= ఈ మూడిటి మిక్కిలి భయంకరమైన వేడిమికి; ఓర్వన్+వచ్చునే?= సహించ శక్యమా?

**తాత్పర్యం:** సాటిలేని గాండీవం పొగడ్తకెక్కేటట్లు వెలుగుతూంటుంది. ఆపైన కృష్ణుడు ఇంకో ఆశ్చర్యకరమైన తేజస్సు. ఆ తేజస్సును అర్జునుడు ఆశించడు. తనకు తాను అర్జును డొక్కడే శత్రుసైన్యాలకు మండుతున్న మంట.

ఈ విధంగా ప్రతాపమూర్తులు మూడూ ఒక్కచోట కూడాయి. ఇన్ని ప్రతాపాల భయంకరమైన వేడిని తట్టుకో తరమా?

**విశేషం:** అలం: రూపకం, శ్లేష, సార్థక శబ్ద ప్రయోగం వలన ఈ పద్యంలో 'ప్రతాపమూర్తు లిట్లొక్కెడఁ గూడెన్' అనే వాక్యం ప్రాణం. ప్రతాపమూర్తులంటే పరాక్రమమూర్తులనీ, ప్రకాశమానులనీ, అధికంగా తాపం కలిగించే వారనీ రెండర్థాలు స్ఫురిస్తాయి. వీరులనీ అగ్నులనీ తాత్పర్యం. ఇక్కడ యుద్ధ యజ్ఞ త్రేతాగ్నులని కూడా ధ్వని. గాండీవం ఒక తేజస్సు. కృష్ణు డొక తేజస్సు, అర్జును డొక తేజస్సు. అర్జునుడు గాండీవ తేజస్సునే గ్రహిస్తాడు. కాని, కేశవ తేజాన్ని గ్రహించడు. అందువలన కేశవార్జునులు స్వతంత్ర తేజస్సులు. అవి మహోగ్ర భావాన్ని చెందినప్పుడు కలిగే 'వేడిమి'కి ఇతరులు తట్టుకొనటం కష్టం. వేడిమి అంటే కోపం, పౌరుషం అనీ, వెచ్చదనమనీ అర్థాలున్నాయి. అందువలన ఇందులో ధ్వనిమయంగా త్రేతాగ్ని రూపకం సార్థకంగా రాణించింది. ఆ ముచ్చిచ్చు మృత్యువు వంటిదని గ్రుడ్డిరాజు భయం. (సంపా.)

**క. దివిజ దనుజ సహితము లగు । భువనము లన్నిట మహేంద్ర పుత్త్రుఁడు విజయో**
**త్సవ లీలఁ గ్రీడ సల్పుం; । దవులం బడఁడెందు నత్యుదగ్ర బలమునన్.'** **195**

**ప్రతిపదార్థం:** మహేంద్ర పుత్త్రుండు= మహేంద్రుడి కొడుకు- అర్జునుడు; దివిజ దనుజ సహితములు+అగు భువనములు+ అన్నిటన్= దేవతలతోనూ; రాక్షసులతోనూ కూడినవైన లోకాలన్నిటా; విజయ+ఉత్సవ లీలన్= గెలుపు వేడుకల విలాసంతో; క్రీడ+చల్పున్= విహరిస్తాడు; అతి+ఉదగ్ర బలమునన్= మిక్కిలి భయంకరమైన బలం వలన; ఎందున్= ఏ భువనంలోనూ; తవులంబడఁడు= అరికట్టబడడు.

**తాత్పర్యం:** అర్జునుడు సురాసుర సహిత లోకాలన్నిటిలోనూ విజయోత్సవలీలలతో విహరిస్తాడు. మిక్కిలి భయంకరమైన బలం ఉండటం వలన అతడు ఏ లోకంలోనూ అరికట్టబడడు.'.

**వ. అని పలికి వెండియు.** **196**

**తాత్పర్యం:** అని పలికి, మళ్ళీ.

**క. 'కురుసేనఁ గదా! గెలుచుట । కరము భరం బర్జునునకు! గాండీవమునం**
**బెరిఁగిన యమ్ముల మంటలు! దరికొని తెగఁ గాల్చునట్టిద యగుం జుమ్మీ!** **197**

**ప్రతిపదార్థం:** కురు సేనన్+కదా!= కౌరవ సైన్యాన్ని కదా!; అర్జుననకున్; గెలుచుట; కరము భరంబు= మిక్కిలి కష్టం!; (ఇది విపరీతార్థ ద్యోతకం); గాండీవమునన్= గాండీవంలో; పెరిఁగిన= వృద్ధి పొందిన; అమ్ముల మంటలు+అ= బాణాల మంటలే; దరికొని= విజృంభించి; తెగన్+కాల్చు+అట్టిది+అ= నిశ్శేషంగా కాల్చేదే; అగున్+చుమ్మీ!= అవుతుంది సుమీ!

**తాత్పర్యం:** కౌరవ సైన్యాన్ని! గెలవటం అర్జునుడికి చాలా(వింత) కష్టం! గాండీవంలో వృద్ధిపొందిన బాణాల మంటలే విజృంభించి, దానిని నిశ్శేషంగా దహించేవి అవుతాయి సుమీ!

**విశేషం:** 'గెలుచుట కరము భరం బర్జునునకు' ఏమీ భరం కాదనే విపరీతార్థమే ఇక్కడ గ్రాహ్యం.

వ. **భీమార్జునుల కొలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ రెఱుంగుదు? రెఱింగియు మానుషంబు వాటించి సేన మొగంబున నిలుతురు; కీర్తి వట్టి ప్రాణంబులు విడుతు; రంతియకాని చేయునది లే; దదియునుం గాక పౌత్రులగుటయు శిష్యు లగుటయు, గాంగేయునకు గురునకు సామాన్యం బగుటం జేసి, రెండు దెఱంగుల వారికి వీ రొక్కరూప; మన కడనున్న తప్పునకు మనముందట నిలువవలయునను నింత మాత్రకుంగా వీరల కింత వలసె; నేను దైవాధీనత కతంబున బిడ్డల నొత్తి చెప్పను, నియమింపనుం జాల; మొదల విదురుం డేమని చాటి చెప్పి నదియంతయుం బాటిలె; జూదంబు నాఁటనుండియుఁ గురుజాతికిం జేటు మూఁడుట దోఁచుచుండు; మంద బుద్ధియు, లోభోపహతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుఁ డింతసేసెఁ; గాలపర్యాయంబునఁ గౌరవులకుఁ గడవరాని యవస్థ వచ్చె; సంజయా! నే నేమి సేయుదు? నెందుఁ జొత్తు? నెద్ది దెరు? వెవ్వరు శరణంబు? వా రిరువురుఁ గల యంతటన పోయెనే? విను' మని మఱియు నిట్లనియె:'** **198**

**ప్రతిపదార్థం:** భీమ+అర్జునుల కొలందులు= భీమార్జునుల శక్తులు; భీష్మ ద్రోణులు ఎఱుంగు+అంతకంటెన్= భీష్మ ద్రోణులకు తెలిసినదానికంటె; ఎవ్వరు+ఎఱుంగుదురు?= ఎవరికి తెలుసు?; ఎఱింగియున్= తెలిసికూడా; మానుషంబు+ పాటించి= అభిమానం వహించి; సేన మొగంబునన్= సేన అగ్రభాగాన; నిలుతురు= ఉంటారు; కీర్తి+పట్టి= కీర్తి నవలంబించి- కీర్తే ముఖ్యమని; ప్రాణంబులు; విడుతురు; అంతియకాని; చేయు+అది లేదు; అదియునున్+కాక; పౌత్రులు+అగుటయున్= మనుమలు కావటం; శిష్యులు+అగుటయున్= శిష్యులు కావటం; గాంగేయునకున్= భీష్మునికీ; గురునకున్= ద్రోణుడికీ; సామాన్యంబు+అగుటన్+చేసి= సమానమవటం చేత; రెండు+తెఱంగులవారికిన్= ఇరు పక్షాలవారికీ; వీరు; ఒక్క రూపు+అ= ఒక్కటే; మన కడన్+ఉన్న తప్పునకున్= మన దగ్గరనున్న దోషానికి; మన ముందటన్ నిలువ వలయున్+అను+ఇంత మాత్రకున్+కాన్= మన ముందు నిలిచి తీరాలనే ఈ మాత్రానికే కదా; వీరలకున్+ఇంత వలసెన్= వీళ్ళకింత కావలసి వచ్చింది; నేను; దైవ అధీనత కతంబునన్= విధివశం చేత; బిడ్డలన్+ఒత్తి చెప్పనున్, నియమింపనున్+చాలన్= పిల్లలకు గట్టిగా చెప్పడానికీ, వాళ్ళను ఆజ్ఞాపించటానికీ సమర్థుడినీ కాను; మొదలన్= ఆదిలో; విదురుండు; ఏమి+అని చాటి చెప్పెన్= ఏమని విశదంగా చెప్పాడో; అది+అంతయున్+పాటిలెన్= అదంతా జరిగింది; జూదంబు నాఁటన్+ఉండియున్= జూద మప్పటినుండీ; కురుజాతికిన్= కౌరవులకు; చేటు మూఁడుట తోఁచుచున్+ఉండున్= కీడు వాటిల్లుతున్నదని అనిపిస్తూంటుంది; మందబుద్ధియున్= తెలివిమాలినవాడూ; లోభ+ఉపహతుండునున్= దురాశా దూషితుడూ; అయి, దురభిలాషంబునన్= దుష్టవాంఛతో; దుర్యోధనుఁడు; ఇంత+చేసెన్; కాల పర్యాయంబునన్= కాల భ్రమణంలో; కౌరవులకున్; కడవన్+రాని అవస్థ= దాటరాని దుస్స్థితి; వచ్చెన్; సంజయా!; నేను+ఏమి చేయుదున్; ఎందున్+చొత్తున్= ఎక్కడికి వెళ్ళుతాను?; ఎద్ది తెరువు?= ఏది మార్గం?; ఎవ్వరు - శరణంబు?= ఎవరు దిక్కు?; వారు+ఇరువురున్= ఆ భీమార్జును లిద్దరూ; కల+అంతటన్+అ+ పోయెనే?= ఉండటంతోనే అయిపోయిందా; వినుము+అని; మఱియున్= ఇంకా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీమార్జునుల శక్తులు భీష్మ ద్రోణులకు తెలిసినదానికంటె ఎవరికీ తెలియదు. తెలిసి కూడా, అభిమానం వహించి వాళ్ళు మన సేనా ముఖంలో నిలుస్తారు. కీర్తే ముఖ్యమనుకొని ప్రాణాలు విడుస్తారు. ఇంతేకాని చేసేది లేదు. అదీగాక మనుమలు కావడమూ, శిష్యులు కావటమూ భీష్మద్రోణులకు సమానమవటం చేత, వీళ్ళు ఇరు పక్షాలవారికీ ఒక్కటే. మన దగ్గర ఉన్న దోషానికి మనముందు నిలిచితీరాలనే ఈ మాత్రానికే కదా వీళ్ళ కింత కావలసి వచ్చింది! నేను విధివశంచేత బిడ్డలకు నొక్కి చెప్పటంగాని, ఇట్లా నడవండి ఇట్లా నడవకండి అని అజ్ఞాపించటంగాని చేయలేకపోతున్నాను. ఆదిలో విదురు డెట్లా జరుగుతుందని విశదంగా చెప్పాడో, అట్లాగే జరిగింది. జూద

మప్పటినుండి కౌరవులకు కీడు జరుగుతున్నట్లు అనిపిస్తున్నది. తెలివిమాలినవాడూ, దురాశా దూషితుడూ అయి దుష్టవాంఛతో దుర్యోధనుడు ఇంత పని చేశాడు. కాలభ్రమణంలో కౌరవులకు దుస్తరమైన దురవస్థ తటస్థించింది. సంజయా! నే నేమి చేస్తాను? ఎక్కడికి పోతాను? ఏది దారి? ఎవరు దిక్కు? ఆ భీమార్జునులు ఇద్దరూ ఉండటంతోనే అయిపోయిందా? వినుము.' అని ఇంకా ఇట్లా అన్నాడు:

**చ. 'అనుజులు నట్టి వార; ద్రుపదాది సుహృజ్జను లెల్ల నంతకం**
**టెను బలవంతు; లాహవ పటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు; స**
**ద్వినయ వివేక శీలముల విశ్రుతుఁ డాతఁడు బంధు భృత్యులం**
**దనకు వశంబు సేసికొనుదానికి నేర్చుఁ బ్రభుత్వ సంపదన్. 199**

**ప్రతిపదార్థం:** అనుజులున్= తమ్ములు కూడా; అట్టివారు+అ= అంతటివాళ్ళే; ద్రుపద+ఆది సుహృద్+జనులు+ఎల్లన్= ద్రుపదుడు మొదలైన మిత్రులందరూ; అంతకంటెను బలవంతులు; రాజు యుధిష్ఠిరుండు= రాజయిన ధర్మరాజు; ఆహవ పటిష్ఠుఁడు= యుద్ధంలో మిక్కిలి గట్టివాడు; సత్+వినయ వివేక శీలములన్= మంచి వినయం, వివేకం, స్వభావమూ అనే వాటిచేత; విశ్రుతుఁడు= ప్రసిద్ధుడు; ఆతఁడు= ఆ ధర్మరాజు; ప్రభుత్వ సంపదన్= ప్రభుత్వపు కలిమి చేత- ప్రభువు అవటం చేత; బంధు భృత్యులన్= చుట్టాలనూ, సేవకులనూ; తనకున్ వశంబు+చేసికొనుదానికిన్+నేర్చున్= తనకు అధీనులను చేసుకొనటం తెలిసినవాడు.

**తాత్పర్యం:** ఆ భీమార్జునుల తమ్ములు - నకుల సహదేవులు కూడా అంతటివాళ్ళే. ద్రుపదుడు మొదలుగా గల స్నేహితులందరూ అంతకంటె బలవంతులు. రాజైన యుధిష్ఠిరుడు యుద్ధంలో చాలా గట్టివాడు. మంచి వినయమూ, వివేకమూ, శీలమూ అనే వాటిచేత ప్రసిద్ధుడు. అతడు ప్రభువవటంచేత బంధువులనూ, సేవకులనూ తనకు స్వాధీనులను చేసికొనటం తెలిసినవాడు.

**విశేషం:** 'ఆహవ పటిష్ఠుఁడు రాజు యుధిష్ఠిరుండు'- ఇక్కడ యుధిష్ఠిర శబ్దం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరాంకురం.

**ఆ. సత్య శౌచ ధర్మశాలి దయాపరుం । డట్టి ధర్మపుత్త్రు నాక్రమింప**
**మనము దలఁచు టెల్ల మంటలో మిడుత లు । దగ్రవృత్తి నుఱుకఁ దలఁచునట్ల. 200**

**ప్రతిపదార్థం:** సత్య శౌచ ధర్మశాలి= సత్యమూ, శుచిత్వమూ, ధర్మమూ అనే వాటిచేత ఒప్పేవాడు; దయాపరుండు= దయా స్వభావుడు; అట్టి ధర్మపుత్త్రున్= అటువంటి ధర్మరాజును; మనము= మనం; ఆక్రమింపన్+తలఁచుట+ఎల్లన్= ఆక్రమించాలనుకొనటం అంతా; మిడుతలు; మంటలోన్; ఉదగ్రవృత్తిన్= గర్వంతో; ఉఱుకన్+తలఁచు+అట్లు+అ= ఉరకాలనుకొనటం వంటిదే.

**తాత్పర్యం:** సత్యమూ, శుచిత్వమూ, ధర్మమూ అనేవాటితో ఒప్పేవాడు. అటువంటి ధర్మరాజును మనం ఆక్రమించాలనుకొనటం అంతా - మిడుతలు గర్వంతో మంటలో ఉరకా లనుకొనటమే.

**విశేషం:** ఇందులో ఉపమేయ వాక్యానికీ (ధర్మపుత్త్రు నాక్రమింప మనము దలఁచు టెల్ల); ఉపమాన వాక్యానికీ (మంటలో మిడుత లుదగ్రవృత్తి నుఱుకఁ దలఁచునట్ల) ఐక్యారోపణం చేయబడింది కాబట్టి అలంకారం నిదర్శన.

**వ. కావునఁ బాండవులతోడి భండనంబునఁ గులక్షయం బగుట దప్పదు; శాంతిఁ బొందుటయ మేలు; మనవారల కది ప్రియంబగునేని దానికిఁ దగిన యత్నంబు సేసెద' ననిన విని ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె:** **201**

**ప్రతిపదార్థం:** కావునన్; పాండవులతోడి భండనంబునన్= పాండవులతో యుద్ధంలో; కుల క్షయంబు+అగుట= వంశ నాశన మవటం; తప్పదు; శాంతిన్+పొందుట+అ= శాంతి వహించటమే; మేలు= మంచిది; మన వారలకున్; అది= శాంతి; ప్రియంబు+అగున్+ఏనిన్= ఇష్టమైనది అయితే; దానికిన్; తగిన యత్నంబు+చేసెదన్; అనినన్; విని; ధృతరాష్ట్రునకున్; సంజయుండు; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** కాబట్టి పాండవులతో జరిగే యుద్ధంలో వంశనాశన మవటం తప్పదు. శాంతి వహించటమే మేలు. మనవాళ్ళకు అది (శాంతి) ఇష్టమయితే దానికొరకు తగిన ప్రయత్నం చేస్తాను.' అనగా విని ధృతరాష్ట్రుడితో సంజయుడు ఇట్లా అన్నాడు.

**క. 'దేవర యానతి యిచ్చిన । యీ వాక్యము లెస్స! నాఁడు నీవ యుపేక్షం**
**బో విడిచితి; వింకను నీ । చే వత్తురు వారు; వీరి చే టొప్పుదురే?** **202**

**ప్రతిపదార్థం:** దేవర= ప్రభువు; ఆనతి+ఇచ్చిన= సెలవిచ్చిన; ఈ వాక్యము; లెస్స= మంచిది; నాఁడున్= అప్పుడు; ఈవు+అ= నీవే; ఉపేక్షన్= అలక్ష్యంతో; పోన్; విడిచితివి= ఆ పాండవులను వదిలేశావు; వారు= పాండవులు; ఇంకను; నీచేన్+వత్తురు= నీ వశంలోకి వస్తారు; వీరి చేటు+ఒప్పుదురే?= కౌరవుల హానికి సమ్మతిస్తారా?- కౌరవులకు కీడు కలుగుతుందంటే సహిస్తారా?

**తాత్పర్యం:** 'ప్రభువు సెలవిచ్చిన ఈ మాట మంచిది. అప్పుడు నీవే అలక్ష్యం చేసి పాండవులను వదిలేశావు. ఇప్పుడైనా మించిపోయింది లేదు. ఇంక వాళ్ళు నీ అధీనంలోకి వస్తారు. కౌరవుల హానికి వాళ్ళు అంగీకరిస్తారా?'

**వ. అది యెట్లంటేని.** **203**

**తాత్పర్యం:** పాండవులు కౌరవులకు కీడు జరుగుతుందంటే ఒప్పుకోరనేది ఎట్లా అంటావేమో.

**క. వారు దెస లొత్తికొనియు ధ । రా రాజ్యం బిచ్చి పోయిరా పోరా? తా**
**రారణ్యపీడఁ బడియును । రారాజుం జెఱకుఁ బాపరా మన మెఱుఁగన్?** **204**

**ప్రతిపదార్థం:** వారు= పాండవులు; దెసలు+ఒత్తికొనియున్= దిక్కులను రాచికొని - దిక్కుల్ని అంటిపెట్టుకొని; ధరా రాజ్యంబు+ఇచ్చి పోయిరా పోరా?= భూరాజ్యం మీ కిచ్చి వెళ్ళిపోయారా లేదా?; తారు= తాము; ఆరణ్య పీడన్+పడియును= అరణ్యవాస బాధ పడి కూడా; మనము+ఎఱుఁగన్= మనం ఎరుగగా; రారాజున్= దుర్యోధనుడిని; చెఱకున్+పాపరా= గంధర్వుల బంధనం నుండి విడిపించరా?

**తాత్పర్యం:** పాండవులు భూరాజ్యం మీ కిచ్చి దిక్కులను పట్టుకొని వెళ్ళిపోయారా లేదా? తాము అరణ్యంలో బాధలు పడుతూ కూడా దుర్యోధనుడిని ఘోషయాత్రా సందర్భంలో గంధర్వుల చెరనుండి విడిపించటం మనకు తెలుసు గదా!

**వ. అట్టి యెడ నైనను.** 205

**తాత్పర్యం:** ఆ సమయంలో అయినా.

**క. రావించి తగవుమై సం । భావింపవ కాక, నాఁడ పాండవు లలుకం**
**బో విడువరె? మిగులుదురే । నీ వచనంబులకుఁ? బిలిచి నిలుపుము వారిన్.'** 206

**ప్రతిపదార్థం:** రావించి= (పాండవులను) రప్పించి; తగవు మైన్= న్యాయంతో; సంభావింపవు+అ+కాక= ఆదరించవుకాని; నాఁడు+అ= అప్పుడే - నీవు ఆదరించిననాడే; పాండవులు; అలుకన్= కోపాన్ని; పోన్+విడువరె?= విడిచిపెట్టరా?; నీ వచనంబులకున్= నీ మాటలకు(ను); మిగులుదురే?= అతిక్రమిస్తారా?; వారిన్; పిలిచి; నిలుపుము= అధికారంలో ఉంచుము.

**తాత్పర్యం:** పాండవులను రప్పించి న్యాయం చేసి ఆదరించవుగాని, ఆనాడే వారు కోపం విడిచిపెట్టరా? నీ మాటలు అతిక్రమిస్తారా? వారిని (ఇప్పుడైనా) పిలిచి నిలుపుము.

**దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరుల సామర్థ్యంబు సెప్పుట (సం. 5-54-1).**

**వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కి ట్లనియె:** 207

**తాత్పర్యం:** అనగా విని దుర్యోధనుడు తండ్రితో ఇట్లా అన్నాడు.

**చ. 'అడవులఁ గొండలం బడి మహాపద రూపటి చన్నవారి ని**
**ప్పుడు కొనివచ్చి కృష్ణుఁ డొక ప్రోవుగఁ గూటువమూఁకఁ గూర్చినం,**
**బొడుతురె పాండునందనులు? భూవర! యేటికి నింతభీతి? మా**
**కడిమియు లావు నీ వసదుగా గణుతింపకు; గెల్తు మెమ్మెయిన్.** 208

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; అడవులన్= అడవులలోనూ; కొండలన్+పడి= కొండలలోనూ పడి; మహత్(మహా)+ఆపదన్= పెద్ద ఆపద చేత; రూపు+అటి చన్నవారిన్= రూపు చెడిపోయినవాళ్ళను; ఇప్పుడు; కొని; వచ్చి; కృష్ణుఁడు; ఒక ప్రోవుగన్= ఒక గుంపుగా; కూటువ మూఁకన్= ప్రోత్సాహపరిచి అక్కడక్కడ వెదకి తెచ్చిన పిరికిబలాన్ని; కూర్చినన్= కూరిస్తే; పాండునందనులు= పాండవులు; పొడుతురె?= యుద్ధం చేస్తారా?; ఇంత భీతి= ఇంత అధికమైన భయం; ఏటికిన్?= ఎందుకు?; నీవు; మా కడిమియున్= పరాక్రమమూ; లావున్= బలమూ; అసదుగాన్= తక్కువగా; గణింపకు(ము)= లెక్కించకుము; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; గెల్తుము= జయిస్తాం.

**తాత్పర్యం:** 'అడవులలోనూ, కొండలలోనూ పడి పెద్ద ఆపదచేత రూపుచెడిపోయిన వాళ్ళను ఇప్పుడు తీసికొని వచ్చి కృష్ణుడు శిక్షణంలేని పిరికివాళ్ళ గుంపును ఒక ప్రోవుగా కూరిస్తే పాండవులు యుద్ధం చేస్తారా? రాజా! ఎందుకయ్యా నీకు ఇంతటి భయం? మా బలపరాక్రమాన్ని నీవు తక్కువ అంచనా వేయకుము. ఎట్లా అయినా మేమే గెలుస్తాం.

**విశేషం:** 'పొడుతురె పాండునందనులు' -ఇది తిక్కన రచనలోని తెలుగు పలుకుబడికి చక్కని ఉదాహరణం. ఈపద్యం దుర్యోధనుడి స్వభావాన్ని స్పష్టంగా చాటుతున్నది.

**తే. పరశురాముని గెలిచిన బల్లిదుండు । భీష్ముఁ; డవనీశు లీతని పేరు వినినఁ**
**బాఱుచుండుట యెఱుఁగవే? పాండుపుత్త్రు । లనఁగ నెంతటివా రితం డలిగెనేని? 209**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు; పరశురామునిన్; గెలిచిన; బల్లిదుండు= శూరుడు; అవని+ఈశులు= రాజులు; ఈతని పేరు వినినన్= ఇతడి పేరు వింటేనే; పాఱుచున్+ ఉండుట= పరిగెత్తుకొని పోతూండటం; ఎఱుఁగవే?= తెలియవా?; ఇతండు; అలిగెన్+ఏనిన్= కోపం వహిస్తే; పాండుపుత్రులు+అనఁగన్+ఎంతటివారు= పాండవులంటే ఎంతటివారు?

**తాత్పర్యం:** భీష్ముడు పరశురాముడిని గెలిచిన శూరుడు. రాజు లితని పేరు వినగానే పారిపోవటం నీకు తెలియదా? ఇతడికి కోపం వస్తే పాండవులంటే ఎంత?

**విశేషం:** 'పరశురాముని గెలిచిన బల్లిదుండు భీష్ముఁడు' - అంబ కోరికపై భీష్ముడిని లొంగదీసుకోవడానికి పరశురాము డతడితో యుద్ధం చేశాడు. కాని భీష్ము డతడికి లొంగకపోవడంతో పరశురాముడు ఆ యత్నం విరమించాడు.

**క. కృపుఁడును గురుఁడు నయోనిజు । లపరిమిత భుజాబలాఢ్యు, లాహవకేళీ**
**నిపుణు, లజేయులు; వీరలు । కుపితాత్మకులైన మాఱుకొనునే హరుఁడున్? 210**

**ప్రతిపదార్థం:** కృపుఁడును; గురుఁడున్= ద్రోణుడూ; అయోనిజులు= యోనినుంచి పుట్టనివారు- పవిత్రులు; అపరిమిత భుజా బల+ఆఢ్యులు= మితిలేని బాహుబలంతో కూడినవారు; ఆహవ కేళీ నిపుణులు= యుద్ధ క్రీడయందు నేర్పరులు; అజేయులు= జయించరానివారు; వీరలు; కుపిత+ఆత్మకులు+ఐనన్= కోపించిన వారయితే; హరుఁడున్= ఈశ్వరుడయినా; మాఱుకొనునే?= ఎదుర్కొంటాడా?

**తాత్పర్యం:** కృపుడూ, ద్రోణుడూ అయోనిసంభవులు, అమిత బాహు బల సంపన్నులు. యుద్ధ క్రీడలో ఆరితేరిన వారు. వీళ్ళకు కోపం వస్తే హరుడు కూడా ఎదుర్కొనలేడు.

**విశేషం:** కృపుడు - శరద్వంతుడనే ముని తపస్సు చేస్తూండగా ఇంద్రుడతడి తపస్సును భగ్నం చేయటానికి ఒక అప్సరసను పంపాడు. ఆమెను చూడగానే మునికి కామం కలిగి రేతఃపతనమయింది. అతడి వీర్యం ఒక రెల్లుకాడమీద ద్వివిధంగా పడింది. అందులోంచి ఒక కొడుకూ, కూతురు పుట్టారు. వేట కొరకు వచ్చిన శంతనుడు వీళ్ళను చూచి కృపతో పెంచాడు. అందుచేతనే కొడుకు కృపుడూ, కూతురు కృపీ అయ్యారు. ఈ విధంగా కృపుడు అయోనిజుడు. ద్రోణుడు- భరద్వాజుడు ఘృతాచిని చూచి కామపరవశుడవుతాడు. అతడికి రేతః పతనమయింది. దానిని తెచ్చి భరద్వాజు డొక ద్రోణం (కుండ)లో పెట్టి కాపాడాడు. అందులోనుండి ద్రోణుడు పుట్టుతాడు. ఈ విధంగా ద్రోణుడు అయోనిజుడు. 'హరుఁడున్' ఈశ్వరుడికి బదులుగా హరశబ్దం సాభిప్రాయంగా ప్రయోగించబడింది కాబట్టి అలంకారం పరికరాంకురం.

**క. ఈశ్వర వరజనితుఁడు, హరి । దశ్వ ప్రతిమాన తేజుఁ, డస్త్రకళా ని**
**త్యై శ్వర్య ధురంధరుఁ డీ । యశ్వత్థామ గలుగ మన కని వెఱపేలా? 211**

**ప్రతిపదార్థం:** ఈశ్వర వర జనితుఁడు= ఈశ్వరుడి వరం వలన పుట్టినవాడూ; హరిదశ్వ ప్రతిమాన తేజుఁడు= సూర్యుడితో (పచ్చని గుర్రాలు గలవాడు) సమానమైన తేజస్సు కలవాడూ; అస్త్ర కళా నిత్య+ఐశ్వర్య ధురంధరుఁడు= అస్త్ర విద్య అనే

శాశ్వతైశ్వర్యం యొక్క భారాన్ని ధరించినవాడూ- అస్త్ర విద్యా సంపద అధికంగా కలవాడూ (అగు); ఈ+అశ్వత్థామ+కలుగన్= ఈ అశ్వత్థామ ఉండగా; మనకున్; అని వెఱపు= యుద్ధ భయం; ఏలా?= ఎందుకు?

**తాత్పర్యం:** ఈశ్వరుడి వరం వలన పుట్టినవాడూ, సూర్యుడి తేజస్సు వంటి తేజస్సు గలవాడూ, అస్త్ర విద్యా సంపన్నుడూ అయిన ఈ అశ్వత్థామ ఉండగా మనకు యుద్ధ భయం ఎందుకు?

**ఆ. సహజ కుండలుండు, శౌర్యధుర్యుఁడు, సము । దీర్ణ బాహుబలుఁడు కర్ణుఁ డిందుఁ**
**గలఁడు; వీని కెదురు గలఁడని యెన్నుమా । ధర్మపుత్త్రుపాల, ధరణినాథ! 212**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; సహజ కుండలుండు= సహజములైన (పుట్టుకతోఉన్న) కుండలాలు గలవాడు; శౌర్య ధుర్యుఁడు= పరాక్రమ భారం వహించినవాడు; సముదీర్ణ బాహు బలుఁడు= మిక్కిలి గొప్ప భుజ బలంగలవాడు; (అగు); కర్ణుఁడు; ఇందున్= ఇక్కడ; కలఁడు; ధర్మపుత్త్రు పాలన్= ధర్మరాజు దగ్గర; వీనికిన్; ఎదురు; కలఁడు+అని; ఎన్నుమా= ఎంచుమా?

**తాత్పర్యం:** రాజా! సహజములైన కుండలాలు కలవాడూ, పరాక్రమభారం వహించినవాడూ, మిక్కిలి గొప్ప భుజబలం గలవాడూ అయిన కర్ణుడు ఇక్కడ ఉన్నాడు. ధర్మరాజు దగ్గర ఇతడికి ప్రతి అనదగినవాడు ఉన్నాడేమో ఎంచుము.

**క. వినుము నరేశ్వర! కర్ణుని । పెనుపు; మహేంద్రుండు వచ్చి ప్రియమున శచికై**
**తను నర్థింపఁగ నిచ్చెను । గొను మని లోకంబు లెఱుఁగఁ గుండల యుగమున్. 213**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= రాజా!; కర్ణుని పెనుపు= కర్ణుడి గొప్పతనం; వినుము; మహేంద్రుండు; వచ్చి; ప్రియమునన్= ప్రీతితో; శచికై= శచి కొరకు; తనున్; అర్థింపఁగన్= కోరగా; కొనుము+అని= తీసుకో అని; లోకంబులు+ఎఱుఁగన్= లోకాలు ఎరిగేటట్లు - జగద్విదితంగా; కుండల యుగమున్= కుండలాల జతను; ఇచ్చెను= ఇచ్చాడు- (దానం చేశాడు.)

**తాత్పర్యం:** రాజా! కర్ణుడి గొప్పతనం చెపుతా వినుము. ఇంద్రుడు వచ్చి ప్రీతితో శచి కొరకని తనను కోరితే, తీసికొమ్మని కుండలాల జత ఇవ్వటం జగద్విదితం.

**విశేషం:** సహజ కవచ కుండలాలతో కూడిన కర్ణుడు తన కొడుకైన అర్జునుడికి అజేయు డవుతాడని భయపడి ఇంద్రుడు బ్రాహ్మణ వేషధారియై వచ్చి వాటినిమ్మని కర్ణుడిని అడగ్గా, అతడు మహోదారు డవటం వలన అంతకుముందే తన తండ్రియైన సూర్యుడు వారించినా, ఇచ్చి వేశాడు. అదీ అతని 'పెనుపు.'

**వ. వీర లా ధర్మపుత్త్రాదుల చేతన కా దెవ్వరి చేతనుం జెడమి దెల్లంబు. బాహ్లిక సోమదత్త భూరిశ్రవ శ్శల్య సింధురాజ గాంధారరాజ ప్రభృతి మహావీరులు వీరలకంటెను శక్తి సమగ్రులు. తక్కటి రాజలోకంబును, సహాయులై వచ్చిన వివిధ దేశాధీశులును నాతోడి సుఖదుఃఖంబుల కియ్యకొని, యగ్గలికమై నగ్నినైన నుఱుకను, సముద్రంబైన నీఁదను దెంపుసేసి పొంపిరివోవుచున్నవారు. కావునఁ బాండవులకు మా దిక్కుదేతి చూడనుం గొలంది గా, దనుమానింపకు; మిట్లునుంగాక మాకు నెవ్వరును లేక చుట్టంబులును జెలులును**

**విడిచి, తోడు వచ్చినవారును విచ్చిపోయి, భృత్యులును విరక్తులై, వారిక పోటుమానుసులును, బంధుమిత్ర సహాయులును, బ్రజానురాగంబునుం గలిగినట్టిదైన నది ప్రాప్తకాలం; బింతియకాని, యేమింక వారి యడుగు లొత్తను, బాఱిపోవనుం జాల; మెల్ల భంగుల సమరంబు సేయుదుము; మా తలంపిట్టిద; నా తలంచినట్లొండె, వాసుదేవుండు దలంచిన ట్లొండె నయ్యెడు నట్లైన మే; లింత వట్టును నిర్ణయం' బని పలికి, మఱియు నిట్లనియె: 214**

**ప్రతిపదార్థం:** వీరలు= వీరు - ఈ వీరులు; ఆ ధర్మపుత్త్ర+ఆదులచేతన్+అ కాదు= ఆ ధర్మరాజు మున్నగువారిచేతనే కాదు; ఎవ్వరి చేతనున్; చెడమి= చెడకపోవటం; తెల్లంబు= స్పష్టం; బాహ్లిక సోమదత్త భూరిశ్రవస్+శల్య సింధురాజ గాంధారరాజ ప్రభృతి మహావీరులు= బాహ్లికుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, సైంధవుడూ, శకునీ మొదలైన మహావీరులు; వీరల కంటెను; శక్తి సమగ్రులు= బలంచేత సంపూర్ణులు; తక్కటి రాజ లోకంబును= తక్కిన రాజుల సమూహమూ; సహాయులు+ఐ వచ్చిన వివిధ దేశ అధీశులును= వివిధ దేశాల రాజులూ; నాతోడి సుఖ దుఃఖంబులకున్= నాతోపాటు సుఖాలకూ దుఃఖాలకూ; ఇయ్యకొని= సమ్మతించి; అగ్గలికమైన్= ఉత్సాహంతో; అగ్గిన్+ఐనన్+ఉఱుకను= నిప్పులోనైన ఉరకడానికీ; సముద్రంబు+ఐనన్+ఈఁదను= సముద్రమైనా ఈదటానికీ; తెంపు+చేసి= సాహసించి; పొంపిరి+పోవుచున్+ఉన్నవారు= విజృంభిస్తున్నారు; కావునన్; పాండవులకున్; మా దిక్కు+తేఱి చూడనున్+కొలంది+కాదు= మావైపు తేరి చూడటానికి కూడా తరం కాదు; అనుమానింపకుము= సందేహించకుము; ఇట్టునున్+కాక= ఇట్లా కాక; మాకున్; ఎవ్వరును; లేక; చుట్టంబులును; చెలులును= స్నేహితులూ; విడిచి; తోడు వచ్చినవారును; విచ్చిపోయి= విడిచిపోయి; భృత్యులును= సేవకులు కూడా; విరక్తులు+ఐ= అసంతుష్టులయి; వారికిన్+అ= వారికే- ఆ పాండవులకే; పోటు మానుసులును= వీరులూ; బంధు మిత్ర సహాయులును= చుట్టాలూ, స్నేహితులూ, తోడ్పడ వచ్చినవాళ్ళూ; ప్రజా+అనురాగంబునున్= ప్రజల అనురాగమూ; కలిగిన+అట్టిది+ఐనన్= కలిగేటట్లయితే; అది; ప్రాప్త కాలంబు= ప్రారబ్ధం; ఇంతియ+కాని; ఏము= మేము; ఇంకన్; వారి అడుగులు+ఒత్తను= వారి పాదాలు పట్టటానికిగాని; పాఱిపోవనున్= పారిపోవటానికిగాని; చాలము= ఓపము; ఎల్ల భంగులన్= అన్ని విధాల; సమరంబు+చేయుదుము= యుద్ధం చేస్తాము; మా తలంపు+ఇట్టిది+అ= మా అభిప్రాయం ఇదే; నా తలంచిన+అట్లు+ఒండెన్= నేను అనుకొన్నట్లయినా; వాసుదేవుండు= కృష్ణుడు; తలంచిన+అట్లు+ఒండెన్= అనుకున్నట్లయినా; అయ్యెడున్= అవుతుంది; ఎట్లు+ఐనన్= ఎట్లా అయినా; మేలు= మంచిది; ఇంత వట్టును= ఇంతవరకూ; నిర్ణయంబు= నిశ్చయం; అని; పలికి; మఱియున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇప్పుడు నేను చెప్పిన వీరులు ఆ ధర్మరాజాదులచేతనే కాదు, మరెవ్వరిచేతా చెడిపోరు అనేది స్పష్టం. బాహ్లికుడూ, సోమదత్తుడూ, భూరిశ్రవుడూ, శల్యుడూ, సైంధవుడూ, శకునీ మొదలైన మహావీరులు వాళ్ళకంటెను బలవంతులు. తక్కిన రాజ సమూహమూ, తోడ్పడ వచ్చిన వివిధ దేశాల రాజులూ నాతోపాటు సుఖ దుఃఖాలకు సమ్మతించి, ఉత్సాహంతో నిప్పులలోనైనా ఉరకటానికీ, సముద్రమైనా ఈదటానికీ తెగించి విజృంభిస్తున్నారు. కాబట్టి పాండవులు మావైపు తేరి చూడటానికి కూడా సమర్థులు కారు. సందేహించకుము. ఇట్లాకాక, మాకు ఎవరూ లేక, చుట్టాలూ, స్నేహితులూ విడిచిపెట్టి, తోడువచ్చినవాళ్ళూ వెళ్ళిపోయి, సేవకులూ అసంతుష్టులయి, ఆ పాండవులకే వీరులూ, బంధువులు, మిత్రులు, సహాయులు, ప్రజానురాగమూ లభించేటట్లయితే, అది మా ప్రారబ్ధం. ఇంతేకాని, మేము ఇంక వారి పాదాలు పట్టటంగాని, పారిపోవటంగాని చేయలేము. అన్నివిధాలా యుద్ధం చేస్తాము. ఇదే మా అభిప్రాయం. నేననుకొన్నట్లయినా కావాలి, కృష్ణు డనుకొన్నట్లయినా జరగాలి. ఎట్లా అయినా మేలే. ఇంతవరకూ నిశ్చయం' అని పలికి, ఇంకా ఇట్లా అన్నాడు:

**తే. 'కులములోఁ దలవంపగు కూడు గుడువఁ । బంపఁ జూచెద, వొకళులఁ బఱుతు రట్టె!**
**వారు పై నెత్తి వచ్చినఁ 'బోరి కోప' । మనిన, ధృతి చేట కాక, పొం దగునె చెపుమ? 215**

**ప్రతిపదార్థం:** కులములోన్= వంశంలో; తలవంపు+అగు కూడు= అవమానకరమైన కూడు; కుడువన్+పంపన్+చూచెదవు= తినుమని పంపటానికి చూస్తావు; ఒకళులన్= ఒకళ్ళను; పఱుతురు+అట్టె!= బాధిస్తారట!; వారు= ఆ బాధితులు; పైన్+ఎత్తి వచ్చినన్= మీదికి దండెత్తి వస్తే; పోరికిన్+ఓపము= యుద్ధానికి చాలం- యుద్ధం చేయలేము; అనినన్= అంటే; ధృతి+చేటు+అ కాక= ధైర్యం చెడటమేకాని; పొందు+అగునె చెపుమ?= సంధి- సఖ్యం కుదురుతుందా? చెప్పుము.

**తాత్పర్యం:** 'కులంలో అవమానకరమైన, సిగ్గు చేటయిన కూడు తినుమని పంపాలని చూస్తున్నావు. ఒకళ్ళను బాధించిన వాళ్ళ మీదకు ఆ బాధితులు దండెత్తి వస్తే 'మేము యుద్ధం చేయలేము' అంటే, ధైర్యానికి చేటే (కీడే) కాని సఖ్యం కుదురుతుందా?

**విశేషం:** ఇంతవరకూ మేము పాండవులను బాధించాం. ఇప్పుడు వాళ్ళు మామీద తిరగబడితే 'మేము పోరాడలే'మంటే, 'వీళ్ళకు ధైర్యం లేదంటారే' తప్ప సఖ్యం కుదురుతుందా? అని భావం.

**క. నీవు బతిమాలి కొడుకుల । చావునకును జేటునకును జాలక, యిమ్మై**
**వా విడిచి యఱచినం గడు । నేవ పడరె జనులు? నిన్ను నే మననేర్తున్? 216**

**ప్రతిపదార్థం:** నీవు; బతిమాలి= దీనంగా వేడుకొని; కొడుకుల చావునకును+చేటునకును= కొడుకుల చావుకీ, హానికీ; చాలక= సైపక; ఈ+మైన్= ఈ విధంగా; వా విడిచి= నోరు విడిచి; అఱచినన్= ఏడిస్తే; జనులు= లోకులు; కడున్+ఏవ పడరె?= మిక్కిలి అసహ్యించుకోరా?; నిన్నున్; ఏమి+అనన్+నేర్తున్?= నేను ఏమనగలను?

**తాత్పర్యం:** నీవు వాళ్ళను దీనంగా వేడుకొని, నీ కొడుకుల చావుకూ, హానికీ ఓర్వక, ఇట్లా నోరు విడిచి విలపిస్తే లోకులు మిక్కిలి అసహ్యించుకొనరా? నిన్ను నేనేమనగలను?

**తే. భీమసేనుని నీ వింత పెద్ద చేసి । పెక్కు భంగులఁ జెప్పితి 'యుక్కు గలఁడు,**
**గదకు నేర్చు నం' చెంతయు బెదరె; దతఁడు । నన్నుఁ బోలమి యెఱుఁగవే నరవరేణ్య? 217**

**ప్రతిపదార్థం:** నరవరేణ్య!= రాజా!; నీవు; భీమసేనునిన్= భీముడిని ఇంత పెద్ద చేసి= ఇంత పెద్దవాడిని చేసి; పెక్కు భంగులన్= అనేక విధాల; చెప్పితి(వి)= చెప్పావు; ఉక్కు+కలఁడు= శౌర్యం కలవాడూ; గదకున్+నేర్పున్= గదయందు నేర్పరి; అంచున్; ఎంతయున్= మిక్కిలి; బెదరెదు (దవు)= భయపడతావు; అతఁడు; నన్నున్; పోలమి= సరిపోలకపోవటం; ఎఱుఁగవే?= తెలియవా?

**తాత్పర్యం:** రాజా! నీవు భీముడిని ఇంత గొప్ప చేసి అనేక విధాల చెప్పావు. అతడు బలం గలవాడు, గదయందు నేర్పరి అంటూ ఎంతో భయపడుతున్నావు. అతడు నన్ను పోలడని నీవు ఎరుగవా?

**విశేషం:** పెక్కు భంగులఁ జెప్పితి యుక్కు గలఁడు- ఇందులో 'చెప్పితి' అనేది మధ్యమపురుషక్రియ- చెప్పితివి. దీని వకారానికి లోపం వచ్చి, చెప్పితి+ఇ అయి, సంధి జరిగి, చెప్పితి అయింది. దీనిలోని ఇకారానికి ఉక్కులోని ఉకారం పరమయి-

'మధ్యమ పురుష క్రియలయం దిత్తునకు సంధి యగును' - బాల. సం.7 సూత్రం చేత 'చెప్పి తుక్కు ....' అని కావాలి. కాని అన్ని ప్రతులలోనూ 'చెప్పితి యుక్కు' అని యడాగమం వచ్చిన రూపమే ఉన్నది. కొన్ని వావిళ్ళవారి ప్రతులలో మాత్రం 'చెప్పి తట్లుక్కు గలఁడు' అనే పాఠం అధస్సూచికలో ఇవ్వబడింది.

**మ. గద నాతో 'సరి మూఁడు లోకముల నేఁ గానం; జలం బెత్తి యు**
**న్మదుఁ డా భీముఁడు న న్ననిం దొడరిన న్వజ్రప్రహారంబు బె**
**ట్టిదమై తాఁకినఁ గూలు పర్వతము మాడ్కిం గుంభినిం గూలవ్రే**
**సెద! నా కోర్కి గదా గదారణము వచ్చెం బెద్దకాలంబునన్! 218**

**ప్రతిపదార్థం:** గదన్= గదయందు- గదా యుద్ధంలో; నాతోన్, సరి= సమానుడిని; మూఁడు లోకములన్; ఏన్= నేను; కానన్= చూడను; ఉన్మదుఁడు= మిక్కిలి పొగరెక్కినవాడు; ఆ భీముఁడు; చలంబు+ఎత్తి= పంతం అతిశయించి; నన్నున్; అనిన్= యుద్ధంలో; తొడరినన్= మార్కొంటే; వజ్ర ప్రహారంబు= వజ్రపు దెబ్బ; బెట్టిదము+ఐ= గట్టిదయి; తాఁకినన్= తగిలితే; కూలు పర్వతము మాడ్కిన్= కూలిపోయే కొండలాగా; కుంభినిన్= నేల మీద; కూలన్+వ్రేసెదన్= పడిపోయేటట్లు కొడతాను; నా కోర్కిగదా= ఇది నా కోరిక కదా; పెద్ద కాలంబునన్= చిరకాలానికి; గదా రణము= గదాయుద్ధం; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** గదా యుద్ధంలో నాతో సమానుడు మూడులోకాలలోనూ నాకు కనిపించడు. పొగరెక్కిన ఆ భీముడు పంతం అతిశయించి నన్ను యుద్ధంలో మార్కొంటే, వజ్రం దెబ్బ గట్టిగా తగిలితే కూలిపోయే కొండలాగా, వాడిని నేలమీద పడేటట్లు కొట్టుతాను. ఇది నా కోరిక గదా! చిరకాలానికి గదాయుద్ధం వచ్చింది.

**విశేషం:** 'వజ్ర ప్రహారంబు బెట్టిదమై తాఁకినఁ గూలు పర్వతము మాడ్కిన్'- అలంకారం ఉపమ. నా కోర్కి గదా గదారణము ... గదా శబ్ద పునరక్తి అతని గదా యుద్ధ ప్రీతిని తెలియజేస్తున్నది. అలంకారం : యమకం.

**ఆ. అతఁడు పడిన వెండి యా సేనఁ గోల్తల । సేయ నొకఁడు లేమి సిద్ధ; మింత**
**యెఱిఁగి వెఱచి కాదె 'యే నూళ్ళు లైనను । దమకుఁ జాలు' ననియె ధర్మసుతుఁడు. 219**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ భీముడు; పడినన్= పడిపోతే; వెండి= మళ్ళీ; ఆ సేనన్= ఆ సైన్యాన్ని; కోల్తల+చేయన్= ఎదుట నిలబడి యుద్ధసన్నాహం చేయటానికి; ఒకఁడు= ఎవడూ; లేమి= లేకపోవటం; సిద్ధము= స్పష్టం; ఇంత+ఎఱిఁగి వెఱచి కాదె= ఇదంతా ఎరిగి భయపడే కదా; ధర్మ సుతుఁడు= ధర్మరాజు; తమకున్; ఏను+ఊళ్ళులు+ఐనను= అయి దూళ్ళయినా; చాలున్= సరిపోతాయి; అనియెన్.

**తాత్పర్యం:** భీముడు నేలగూలితే ఇంక ఆ సేనలో ఎదుట నిలబడి యుద్ధం చేయటానికి మరెవ్వడూ లేడనటం స్పష్టం. ఇదంతా తెలిసి భయపడే కదా ధర్మరాజు 'మాకు అయిదూళ్ళయినా చాలు' అనటం!

**వ. అర్జునుండు గలం డని తలంచితివేని. 220**

**తాత్పర్యం:** భీముడు పోతే అర్జును డున్నాడు గదా అని అనుకొంటున్నావేమో.

**తే. కర్ణు పడసిన యా శక్తి గలుగఁ, బోర । బ్రదుక వచ్చునె నరునకు? నదియుఁ గాక,**
**యతని భీష్మాది రథికుల యతులితాస్త్ర । మేయ దివ్యబాణంబులు మ్రింగికొనవె? 221**

**ప్రతిపదార్థం:** కర్ణు పడసిన+ఆ శక్తి కలుగన్= కర్ణుడు పొందిన ఆ శక్త్యాయుధం ఉండగా; నరునకున్= అర్జునుడికి; పోరన్= యుద్ధంలో; బ్రదుకన్+వచ్చునె= బ్రతుక తరమా?; అదియున్+కాక= అదీకాక, అతనిన్= అర్జునుడిని; భీష్మ+ఆది రథికుల= భీష్ముడు మున్నగు రథికుల యొక్క; అతులిత= సాటిలేని; అప్రమేయ= ఇంత అని మితి ఏర్పరచడానికి శక్యంకాని; దివ్య బాణంబులు= దేవతా సంబంధి బాణాలు; మ్రింగికొనవె?= మ్రింగెయ్యవా?

**తాత్పర్యం:** కర్ణుడు పొందిన ఆ శక్త్యాయుధం ఉన్నంతకాలం, అర్జునుడికి యుద్ధంలో బ్రతుక తరమా? అదీకాక అతడిని భీష్మాది వీరుల సాటిలేనివీ, అమిత శక్తిమంతాలూ అయిన దివ్యబాణాలూ మ్రింగేయవా?

**వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదులగు నీ కొడుకు లొకం డొకండ జగంబులెల్ల జయింపఁజాలుదు; రందఱు నొక్క మొగంబై త్రోచి నడచిన సవ్యసాచి నొక్కరుండ కాదు; పాండవులనెల్ల నొక్కెత్తున వైచికొన నోపుదు; రట్లునుంగాక, మాకు నక్షౌహిణులు పదునొకండు, వారికి నే డక్షౌహిణులు, మా సైన్యంబు సారవంతంబు; వారిబలంబు నిస్సారంబు; వారు మమ్మెవ్విధంబున జయింపనోపుదు? రీ యెక్కువ తక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముక్కూరి వగచుచున్నవాఁడవు; నిన్ను వగవకుండ నుడుపం జాల మంతియ కాని, తక్కెల్ల పనులకుం జాలుదు' మని పలికి, సంజయు దెసఁ గనుంగొని సుయోధనుం డిట్లనియె: 222**

**ప్రతిపదార్థం:** దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేన+ఆదులు+అగు నీ కొడుకులు= దుశ్శాసనుడూ, దుష్ప్రహుడూ, దుర్ముఖుడూ, వివింశతీ, వికర్ణుడూ, చిత్రసేనుడూ మొదలగు నీ కొడుకులు; ఒకండు+ఒకండు+అ= ఒక్కొక్కడే; జగంబులు+ఎల్లన్= లోకాలన్నీ; జయింపన్+చాలుదురు= జయించగలరు; అందఱున్= అంతా; ఒక్క మొగంబు+ఐ= ఒక్కసారిగా; త్రోచి నడచినన్= కలిసి నడిస్తే; సవ్యసాచిన్+ఒక్కరుండు+అ కాదు+ అర్జునుడిని ఒక్కడినే కాదు; పాండవులన్+ ఎల్లన్= పాండవులనందరినీ; ఒక్క+ఎత్తునన్= ఒక్కపెట్టున; వైచికొనన్+ఓపుదురు= ఎగురగొట్టగలరు; అట్లునున్+కాక= అదీకాక; మాకున్; అక్షౌహిణులు; పదునొకండు= పదకొండు; వారికిన్; ఏడు అక్షౌహిణులు; మా సైన్యంబు; సారవంతంబు; వారి బలంబు; నిస్సారంబు= సారం లేని; వారు; మమ్మున్; ఏ+విధంబునన్; జయింపన్+ఓపుదురు?= జయించగలరు?; ఈ ఎక్కువ తక్కువలు; విచారింపక= ఆలోచించక; వలవని వెఱపు= కూడని భయం; కట్టికొని= పొంది; ముక్కూరి వగచుచున్+ఉన్నవాఁడవు= తెలివి తక్కువగా దుఃఖిస్తున్నావు; నిన్నున్; వగవక+ఉండన్= దుఃఖించకుండా; ఉడుపన్+చాలము= మాన్పలేము; అంతియ కాని; తక్కు+ఎల్ల పనులకున్+చాలుదుము= తక్కిన పనుల కన్నిటికీ సమర్థులం; అని పలికి; సంజయు దెసన్+కనుంగొని= సంజయుడికేసి చూచి; సుయోధనుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** దుశ్శాసనుడూ, దుష్ప్రహుడూ, దుర్ముఖుడూ, వివింశతీ, వికర్ణుడూ, చిత్రసేనుడూ మొదలుగాగల నీ కొడుకులు ఒక్కొక్కడే లోకాల నన్నిటినీ జయించగలరు. ఇక అందరూ ఒకటై కలిసి నడిస్తే అర్జునుడిని ఒక్కడినే కాదు- పాండవుల నందరినీ ఒక్క పెట్టున ఎగుర గొట్టగలరు. అదీకాక, మాకు పదకొండు అక్షౌహిణు లున్నాయి. వాళ్ళకి ఏడే ఉన్నాయి. మా సైన్యం సారవంతమైంది. వాళ్ళది నిస్సారం. వాళ్ళు మిమ్మల్ని ఎలా జయించగలరు? ఈ ఎక్కువ తక్కువలను చూడక తగని భయం పెట్టుకొని తెలివితక్కువగా దుఃఖిస్తున్నావు. మేము తక్కిన పనులన్నీ చేయగలం కాని నిన్ను ఏడువకుండా మాత్రం చేయలేము.' అని పలికి సంజయుడి వైపు చూచి దుర్యోధను డిట్లా అన్నాడు:

**క. 'నానాదేశంబుల బలు । మానుసులం గూర్చికొని సమత్సరబుద్ధిం**
**దా నే మనియెడు నయ్యమ । సూనుం డాతని తెఱంగు సూతము చెపుమా!' 223**

**ప్రతిపదార్థం:** నానా దేశంబుల బలు మానుసులన్= అనేక దేశాలలో ఉన్న గొప్ప మనుష్యులను- వీరులను; సమత్సర బుద్ధిన్= క్రోధ బుద్ధితో; కూర్చికొని= కలిపికొని; ఆ+యమ సూనుండు= ఆ ధర్మరాజు; తాను; ఏమి+అనియెడున్= ఏమంటాడు?; ఆతని తెఱంగు+చూతము చెపుమా!= అతడి సంగతి చూద్దాం చెప్పుము.

**తాత్పర్యం:** 'అనేక దేశాలలో ఉన్న గొప్ప వీరులను క్రోధ బుద్ధితో కూర్చుకొని ఆ ధర్మరాజు ఏమంటాడో- అతడి సంగతి చెప్పుము చూద్దాం.'

**వ. అనిన విని సంజయుం డిట్లనియె : 224**

**తాత్పర్యం:** అనగా విని సంజయుడిట్లా అన్నాడు :

సంజయుఁడు దుర్యోధనునకు ధర్మరాజు నిశ్చయం బెఱింగించుట (సం. 5-55-2)

**ఉ. 'ఆతఁడు భండనం బనిన నార్చిన మూరెఁడు వేర్చు; నెంతయుం**
**బ్రీతి వహించి తమ్ము లొక పెండ్లికిఁ బోయెడు నట్ల యున్నవా;**
**రా తెలి వెందునుం గలదె? యందలి నాయకు 'లెప్పుడొక్కొ మా**
**చేతుల తీఁట పుత్తు?' మను చిత్తమ కాని చలింప రేమియున్. 225**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ధర్మరాజు; భండనంబు+అనినన్= యుద్ధమంటే; ఆర్చినన్ మూర+ఎఁడు+పేర్చున్= అరిస్తే మూరెడు పైకి విజృంభిస్తాడు; తమ్ములు; ఎంతయున్; ప్రీతి వహించి= సంతోషం పూని; ఒక పెండ్లికిన్+పోయెడు+అట్లు+అ+ఉన్నవారు= ఒక పెళ్ళికి వెళ్ళే విధంగానే ఉన్నారు; ఆ తెలివి= ఆ ఉల్లాసం; ఎందునున్+కలదె?= ఎక్కడైనా ఉన్నదా?; అందలి నాయకులు= ఆ పక్షంలోని నాయకులు; ఎప్పుడు+ఒక్కొ!= ఎప్పుడోకదా!; మా చేతుల తీఁట+పుత్తుము= మా చేతుల దురద తీర్చుకొంటాం; అను చిత్తము కాని= అనే మనస్సే- కోరికే కాని; ఏమియున్+చలింపరు= కొంచెం కూడా చలించరు.

**తాత్పర్యం:** 'ధర్మరాజు యుద్ధం అనగానే మూరెడు లేస్తాడు. అతడి తమ్ములు ఎంతో సంతోషంతో ఒక పెళ్ళికి వెళ్ళుతున్న విధంగానే ఉన్నారు. వాళ్ళ ఉల్లాసం ఎక్కడైనా ఉన్నదా? ఆ పక్షంలోని నాయకులు 'మా చేతుల దురద తీర్చుకొనటం ఎప్పుడా?' అని ఉవ్విళ్ళూరుతూంటారు కాని కొంచెం కూడా చలించరు.

**తే. నరుని పాశుపతాది బాణముల పెంపు, । భీము గద సొంపు నమ్మి యుద్దామ లీలఁ**
**జెలఁగి వెఱపేది యక్కడి బలము ముసురు । గవిసి యెపుడుఁ గయ్యమునకుఁ గాలు ద్రవ్వు.' 226**

**ప్రతిపదార్థం:** అక్కడి బలము= ఆ పక్షంలోని సైన్యం; నరుని పాశుపత+ఆది బాణముల పెంపున్= అర్జునుడి పాశుపతం మొదలైన అస్త్రాల గొప్పతనమూ; భీము గద సొంపున్= భీముడి గద అందమూ- శక్తీ; నమ్మి, ఉద్దామ లీలన్= విశృంఖలంగా; చెలఁగి= విజృంభించి; వెఱపు+ఏది= భయం లేక; ముసురు కవిసి= గుమికూడి; ఎపుడున్= ఎప్పుడూ; కయ్యమునకున్; కాలు+త్రవ్వున్= సై కొడుతూ ఉంటుంది.

**తాత్పర్యం:** ఆ పక్షంలోని సైన్యం అర్జునుడి పాశుపతాది బాణాల గొప్పతనమూ, భీముడి గద గొప్పతనమూ నమ్మి విశృంఖలంగా గుమికూడి ఎప్పుడూ కయ్యానికి కాలుద్రవ్వుతూ ఉంటుంది.'

**క. నావుడు 'నిది యౌ, సంజయ! । కైవారము సేసె దీవు కౌంతేయుల; వా**
**రేవి రణ సాధనమ్ములు । గా వెఱవక నడచువారు కౌరవుల పయిన్?' 227**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగానే; సంజయ!; ఇది+ఔన్= ఇది సరే; ఈవు= నీవు; కౌంతేయులన్= పాండవులను; కైవారము+చేసెదు (దవు)= స్తుతి చేస్తావు; వారు= ఆ పాండవులు; ఏవి; రణ సాధనమ్ములు+కాన్= యుద్ధ పరికరాలుగా; కౌరవుల పయిన్= కౌరవుల మీదకు; వెఱవక= నిర్భయంగా; నడచువారు?= నడుస్తారు- దండెత్తుతారు?

**తాత్పర్యం:** అనగానే, 'సంజయా! అది సరే. నీవు పాండవులను పొగుడుతావు. ఆ పాండవులు వేటిని యుద్ధసాధనాలుగా చేసికొని కౌరవుల మీదకు నిర్భయంగా దండెత్తుతారు?'

**వ. అనిన సుయోధనునకు సూతనందనుం డర్జును దివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవదత్తంబుల మహానుభావంబులు వేఱువేఱ వర్ణించి చెప్పి, యుధిష్ఠిర భీమ నకుల సహదేవుల యరదంబులు, తురంగాది పరికరంబు లిట్టిట్టి వని యేర్పడం బలికి, విరాట ద్రుపదాదులకు వలయు నుపకరణంబులు గొఱంత లేమియు నెఱింగించిన, ధృతరాష్ట్రుం 'డిందుఁ గల బలు మానుసు లెవ్వరికి నసాధ్యులు. వీరి సాధించుతెఱం గూహించిరే?' యని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె: 228**

**ప్రతిపదార్థం:** అనిన సుయోధనునకున్= అట్లా అడిగిన దుర్యోధనుడికి; సూత నందనుండు= సంజయుడు; అర్జును= అర్జునుడి యొక్క; దివ్య రథ శ్వేత+అశ్వ కపిధ్వజ దేవదత్తంబుల= దేవతా సంబంధాలయిన రథమూ; తెల్లని గుర్రాలూ, కపిధ్వజమూ; దేవదత్తమూ అనేవాటి; మహా+అనుభావంబులు= గొప్పతనాలు; వేఱు వేఱు+అ= ప్రత్యేకంగా; వర్ణించి చెప్పి= వివరించి చెప్పి; యుధిష్ఠిర, భీమ, నకుల, సహదేవుల, రథాలు= ధర్మజ, భీమ, నకుల, సహదేవుల రథాలు; ఇట్టి+ఇట్టివి+అని= ఇట్లాంటివి ఇట్లాంటివి అని; ఏర్పడన్+పలికి= స్పష్టంగా చెప్పి; విరాట ద్రుపద+ఆదులకున్ వలయు+ఉపకరణంబులు= విరాటుడూ, ద్రుపదుడూ మొదలైనవాళ్ళకు కావలసిన సాధనాలు; కొఱంత లేమియున్= లోటు లేకపోవటం; ఎఱింగించినన్= చెప్పగా; ధృతరాష్ట్రుండు; ఇందున్= కౌరవ పక్షంలో; కల= ఉన్న; బలు మానుసులు= మహావీరులు; ఎవ్వరికిన్= ఎవరికీ; అసాధ్యులు= సాధించరానివారు - జయించరానివారు; వీరిన్= కౌరవ వీరులను; సాధించు తెఱంగు= జయించే విధం; ఊహించిరే; అని అడిగినన్; అతనికిన్= ధృతరాష్ట్రుడికి; సంజయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని అడిగిన దుర్యోధనుడితో సంజయుడు అర్జునుడి దివ్యరథమూ, తెల్లగుర్రాలూ, కపిధ్వజమూ, దేవదత్తమనే శంఖమూ అనే వాటి మహత్త్వాలు ప్రత్యేకంగా వివరించి చెప్పి, ధర్మజ భీమ నకుల సహదేవుల రథాలూ, మొదలగు ఉపకరణాలూ ఇట్లాంటి విట్లాంటివని స్పష్టంగా చెప్పి, విరాటుడూ, ద్రుపదుడూ మొదలైనవారికి కావలసిన సాధనాల లోటు లేకపోవటం చెప్పగా, ధృతరాష్ట్రుడు 'కౌరవ పక్షంలోని మహావీరులు ఎవరికీ అసాధ్యులు. వీళ్ళను సాధించే విధం వాళ్ళు ఊహించారా?' అని అడిగితే, అతడితో సంజయుడు ఇట్లా అన్నాడు:

**సీ. 'గంగాసుతుండు శిఖండిపా, లతనికిఁ । బ్రాపు మత్స్యేశ్వరు బలము; కుంభ**
**భవుఁడు ధృష్టద్యుమ్ను పా, లతనికిఁ దోడు । పడు ద్రౌపదీ పుత్త్ర పంచకంబు;**
**రారాజుఁ, దమ్ములు మారుతి పాలు; కు । మారు లందఱు నభిమన్యు పాలు;**
**శకుని సైంధవులు, నశ్వత్థామ కర్ణులుఁ, । దక్కొరుచేఁ బోని దండిమగలు**

**ఆ. సవ్యసాచి పాలు; సాత్యకి పాల్ కృత । వర్మ; చేకితాన వసుమతీశు**
**పాలు సోమదత్తుఁ; డాలంబునకు నిట్లు । నిశ్చయించి రచట నృపవరేణ్య! 229**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజోత్తమా! ధృతరాష్ట్రా!; భీష్ముడు శిఖండి పాలు= వంతు; అతనికిన్= ఆ శిఖండికి; మత్స్య+ ఈశ్వరు బలము= మత్స్య దేశరాజు - విరాటుడి సేన; ప్రాపు= అండ; కుంభభవుఁడు= ద్రోణుడు; ధృష్టద్యుమ్ను పాలు; అతనికిన్; ద్రౌపదీ పుత్త్ర పంచకంబు తోడుపడున్= ద్రౌపది కొడుకులు - ఉపపాండవులు అయిదుగురూ సహాయపడతారు; రారాజున్+తమ్ములున్= దుర్యోధనుడూ, అతడి తమ్ములూ; మారుతి పాలు= భీముడి పాలు; కుమారులు+అందఱున్= యువకులంతా; అభిమన్యు పాలు; శకుని సైంధవులున్; అశ్వత్థామ కర్ణులున్; తక్కు+ఒరుచేన్+పోని దండి మగలు= ఇంకొకడి చేత పడని మహాశూరులు; సవ్యసాచి పాలు= అర్జునుడి వంతు; కృతవర్మ; సాత్యకి పాల్; సోమదత్తుఁడు; చేకితాన వసుమతీ+ఈశు పాలు= చేకితానుడనే యాదవరాజు పాలు; అచటన్; ఆలంబునకున్= యుద్ధానికి; ఇట్లు= ఇట్లా; నిశ్చయించిరి= నిర్ణయించుకొన్నారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు శిఖండి వంతు. ఆ శిఖండికి విరాటుడి సైన్యం అండ. ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి వంతు. అతడికి ఉపపాండవు లైదుగురూ తోడ్పడుతారు. దుర్యోధనుడూ, అతడి తమ్ములూ భీముడి వంతు. యువ వీరులంతా అభిమన్యుడి వంతు. శకుని సైంధవులూ, అశ్వత్థామ కర్ణులూ- ఇతరుడికి లొంగని మహాశూరులైన వారూ అర్జునుడి వంతు. కృతవర్మ సాత్యకి వంతు. సోమదత్తుడు చేకితానుడనే యాదవరాజు వంతు. యుద్ధానికి ఇట్లా అక్కడ నిర్ణయించుకొన్నారు.

**క. నకులుఁడు, సహదేవుండును, । శకుని నులూకాది సుతుల సారస్వతులం**
**బ్రకటబలులైన కాళిం । గకులను సమయించువారు కౌరవనాథా! 230**

**ప్రతిపదార్థం:** కౌరవ నాథా!= కురురాజా, ధృతరాష్ట్రా!; నకులుఁడున్, సహదేవుండునున్; శకునిన్; ఉలూక+ఆది సుతులన్= ఉలూకుడూ మున్నగు కొడుకులనూ; సారస్వతులన్; ప్రకట బలులు+ఐన కాళింగకులను= ప్రసిద్ధమైన బలంగల కాళింగకులను, సమయించువారు= చంపుతారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! నకులుడూ, సహదేవుడూ శకునినీ, ఉలూకుడూ మొదలైన కొడుకులనూ, సారస్వతులనూ, ప్రసిద్ధమైన బలం కల కాళింగకులనూ చంపుతారు.

**క. కేకయులు మనలఁ గలిసిన । కేకయుల జయించువారు; కృతపుణ్యుఁడు సు**
**శ్లోకుఁడు ధర్మతనూజుఁడు । లోకోత్తరు శల్యుఁ దా గెలుచువాఁ డధిపా ! 231**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా, ధృతరాష్ట్రా!; కేకయులు; మనలన్; కలిసిన కేకయులన్; జయించువారు; కృతపుణ్యుఁడు= చేయ బడిన పుణ్యం కలవాడు - పుణ్యాత్ముడు; సుశ్లోకుఁడు= మంచి కీర్తి గలవాడు అగు; ధర్మ తనూజుఁడు= ధర్మరాజు; తాన్= తాను; లోకోత్తరున్= అసాధారణుడు అయిన శల్యున్= శల్యుడిని; గెలుచువాఁడు= గెలుస్తాడు.

**తాత్పర్యం:** రాజా! కేకయులు మనలను కూడిన కేకయులను జయిస్తారు. పుణ్యాత్ముడూ, సుశ్లోకుడూ అయిన ధర్మరాజు లోకోత్తరుడైన శల్యుడిని గెలుస్తాడు.

**వ. అట్టి పలుకుల సమయంబున నచ్చోటఁ గొందఱు జనంబులు ధర్మనందను నుద్దేశించి. 232**

**ప్రతిపదార్థం:** అట్టి పలుకుల సమయంబునన్= ఆ మాటల సందర్భంలో; ఆ+చోటన్= అక్కడ; కొందఱు జనంబులు= కొంతమంది జనులు; ధర్మనందనున్+ఉద్దేశించి= ధర్మరాజుతో.

**తాత్పర్యం:** ఆ మాటల సందర్భంలో అక్కడ కొందరు జనులు ధర్మరాజుతో (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'ఇతఁ డెక్కడ? మద్ర మహీ । పతి యెక్కడ? నితని కతఁడు సాటియె?' యనుడుం,**
**బ్రతివచనంబుల శల్యుని । యతి బల శౌర్యములు వారి కాతఁడ చెప్పెన్. 233**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ధర్మరాజు; ఎక్కడన్; మద్ర మహీపతి= మద్రదేశాధిపతి శల్యుడు; ఎక్కడన్; ఇతనికిన్; అతఁడు; సాటియె?= సమానుడా?; అనుడున్= అనగానే; ఆతఁడు+అ= అతడే- ధర్మరాజే; ప్రతి వచనంబులన్= బదులు పలుకులతో; వారికిన్; శల్యుని+అతి బల శౌర్యములు= శల్యుడి అమిత బలపరాక్రమాలు; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'ధర్మరా జెక్కడ? శల్యు డెక్కడ? ఇతడికి అతడు సమానుడా?' అనగానే వారికి అతడే శల్యుడి అమిత బలపరాక్రమాలను గూర్చి చెప్పాడు.

**విశేషం:** ఇతఁ డెక్కడ మద్రమహీపతి యెక్కడ- అననురూపములైన వాటికి ఘటన వర్ణించబడింది కనుక విషమాలంకారం.

**వ. ఇట్లు గాకయు నెవ్వరి మొగంబున నెవ్వరు వడిరి, వారికి వార చాలియుండు వా రని; రివ్విధంబునఁ గ్రొవ్వు మిగిలి కొఱంతలేని తెగువం దేజరిల్లుచున్నవారు. నీకు నీ కొడుకునకు నెయ్యది గర్జంబై తోఁచె నదియ చేయుం' డనిన విని విచిత్రవీర్యతనయుం డిట్లనియె. 234**

**ప్రతిపదార్థం:** ఇట్లు+కాకయున్= ఇట్లా కాక; ఎవ్వరి మొగంబునన్+ఎవ్వరు పడిరి= ఎవరిని ఎవరు ఎదుర్కొంటే; వారికిన్, వారు+అ= వారే; చాలి+ఉండువారు+అనిరి= గెలువగలుగుతారు అన్నారు; ఈ+విధంబునన్; క్రొవ్వు మిగిలి= గర్వం అతిశయించి; కొఱంత లేని తెగువన్= తక్కువకాని సాహసంతో; తేజరిల్లుచున్+ఉన్నవారు= ప్రకాశిస్తున్నారు; నీకున్; నీ కొడుకునకున్; ఎయ్యది+కర్జంబు+ఐ+తోఁచెన్= ఏది చేయదగిందని అనిపిస్తుందో; అది+అ= అదే; చేయుండు; అనినన్; విని; విచిత్రవీర్య తనయుండు= విచిత్రవీర్యుడి కొడుకు- ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఇట్లాగే కాక, ఎవరిని ఎవరు మార్కొంటారో, వారిని వారే గెలువగలుగుతారు' అన్నారు. ఈ రీతిగా గర్వం అతిశయించి కొదవ లేని సాహసంతో వారు ప్రకాశిస్తున్నారు. ఇక- నీకూ నీ కొడుకుకూ ఏది చేయదగిందని అనిపిస్తే అదే చేయండి' అనగా విని ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు:

**క. 'నా కొడుకుల కెక్కడి బ్రదు? । కే కొలఁది దలంపు నిప్పు డెన్నిన వీరా**
**నీకంబు నోర్వవచ్చునె । యీ కూడిన సైనికులకు? నే మనువాఁడన్? 235**

**ప్రతిపదార్థం:** నా కొడుకులకున్; ఎక్కడి బ్రదుకు?= ఇక బ్రతికి ఉండటం ఎక్కడిది?- చావు తప్పదు; ఏ కొలఁది+తలంపన్= ఎంత ఆలోచించినా; ఈ కూడిన సైనికులకున్= ఈ కూడుకొన్న సైనికులకు; ఇప్పుడు+ఎన్నిన వీర+అనీకంబున్= ఇప్పుడు నీవు చెప్పిన వీరుల సమూహాన్ని (వీరుల సేనను); ఓర్వన్+వచ్చునె?= ఓడించవీలవుతుందా?; ఏమి+అనువాఁడన్!= ఇంక ఏమంటాను!

**తాత్పర్యం:** 'ఇంక నా కొడుకులకు ఎక్కడి బ్రదుకు? ఎంత ఆలోచించినా, ఇక్కడ కూడుకొన్న సైనికులకు ఇప్పుడు నీవు చెప్పిన వీరుల సమూహాన్ని- వీరుల సేనను గెలవటం సాధ్యపడుతుందా? ఇక నేనేమి అనేది?

**క. రాజు యుధిష్ఠిరుఁడై, హరి । దా జయ మొడఁగూర్ప నున్నఁ, దత్సైన్యము రా**
**రా జిట్లు సరకు సేయమి । నా జన్మము దుఃఖభాజనం బగుటఁ జుమీ! 236**

**ప్రతిపదార్థం:** రాజు; యుధిష్ఠిరుఁడు+ఐ= ధర్మరాజయి; హరి= కృష్ణుడు; తాన్= తాను; జయము+ఒడఁగూర్పన్+ఉన్నన్= గెలుపు కలిగించబోతూండగా; తద్+సైన్యమున్= ఆ సేనను; రారాజు= దుర్యోధనుడు; ఇట్లు; సరకు+చేయమి= లక్ష్యపెట్టకపోవటం; నా జన్మము= నా పుట్టుక; దుఃఖభాజనంబు+అగుటన్+చుమీ!= దుఃఖానికి పాత్రమైనది అవటం చేత సుమా!

**తాత్పర్యం:** రాజు ధర్మరాజుయి, కృష్ణుడు జయం కలిగించబోయే ఆ సైన్యాన్ని దుర్యోధనుడు ఇట్లా లక్ష్య పెట్టకపోవటం నా పుట్టుక దుఃఖశీలం అవటంచేతనే.

**విశేషం:** ధర్మరాజుకు యుధిష్ఠిరు డనే శబ్దం సాభిప్రాయంగా ప్రయోగించబడింది కాబట్టి అలంకారం పరికరాంకురం.

**క. నా కుడుప నేల వశమగు? । నీ కూడిన భూపతులకు నింతియ కాలం**
**బై కడచన్నది సంజయ! । నీ కీ వగపేల? యింక నిలుపుము పలుకుల్.' 237**

**ప్రతిపదార్థం:** నాకున్+ఉడుపన్+ఏల వశము+అగున్= మాన్పటానికి నాకెట్లా సాధ్యమవుతుంది?; ఈ కూడిన భూపతులకున్= ఈ చేరిన రాజులకు; ఇంతియ కాలంబు+ఐ కడచన్నది= ఇంతే బ్రదుకయిపోయింది - ఆయువు ఇంతటితో మూడింది; సంజయ; నీకున్; ఈ వగపు+ఏల?= ఈ శ్రమ-దుఃఖం ఎందుకు?; ఇంకన్, పలుకుల్, నిలుపుము= ఇక నీ మాటలు చాలించుము.

**తాత్పర్యం:** నే నెట్లా మాన్పగలను? ఈ చేరిన రాజులకు ఆయువు మూడింది. సంజయా! నీ కీ శ్రమ ఎందుకు? ఇంక చెప్పకుము.'

**వ. అనిన విని దుర్యోధనుండు నిజ జనకునితో నిట్లనియె : 238**

**తాత్పర్యం:** అనగా విని దుర్యోధనుడు తన తండ్రితో ఇట్లా అన్నాడు :

**ఉ. 'ఏమును బాండునందనులు నేక కులంబునఁ బుట్టి యొక్కచో**
**నే మొకఁడైనఁ జేసి గెడ నెప్డుఁ జరించినయట్టివార; ము**
**ద్దామబలంబు శౌర్యమును దర్పము వారిక కల్గి, వార సం**
**గ్రామమునన్ జయింతు రనఁగా నొక నిశ్చయ మెట్లు గల్గెడున్? 239**

**ప్రతిపదార్థం:** ఏమును= మేమూ; పాండు నందనులున్= పాండవులూ; ఏక కులంబునన్= ఒకే కులంలో; పుట్టి; ఒక్కచోన్= ఒక చోట; ఏము; ఒకఁడు+ఐనన్+చేసి= ఒకటి (ఏకం) అవటం చేత; ఎప్డున్= ఎప్పుడూ; గెడన్= జతగా; చరించిన+అట్టి సంచరించినవాళ్ళం; ఉద్దామ బలంబున్= అధిక బలమూ; శౌర్యమును= పరాక్రమమూ; గర్వమున్; వారికిన్+అ= వారికి-వారికే; కల్గి; వారు+అ= వారే; సంగ్రామమునన్= యుద్ధంలో; జయింతురు+అనఁగాన్= జయిస్తారంటే; ఒక నిశ్చయము= ఒక నిర్ణయం; ఎట్లు+కల్గెడున్= ఎట్లా కలిగింది?

**తాత్పర్యం:** 'మేమూ పాండవులూ ఒకే కులంలో పుట్టి, ఒక్కచోట ఏకమవటం చేత ఎప్పుడూ జతగా సంచరించిన వాళ్ళం. అట్లాంటప్పుడు అధికమైన బలపరాక్రమాలూ గర్వమూ వారికే కలిగి, వారే యుద్ధంలో జయిస్తారనే నిర్ణయం నీకు ఎట్లా ఏర్పడింది?

**ఉ.** **వారిని, వారివారి నిటు వర్ణన సేసెదు గాని, మమ్ము మా**
**వారిఁ దలంప; వి ప్పుడమి వారికిఁ బాయను, మాకు నంతయున్**
**జేరను మున్ సృజించె విధి సిద్ధము, దీని నొకండు మాన్పఁగా**
**నేరఁ; డకారణంబ మది నెవ్వగ లేటికిఁ బట్టుకొల్పఁగన్?'** **240**

**ప్రతిపదార్థం:** వారిని= పాండవులనూ; వారి వారిన్= వాళ్ళ వాళ్ళనూ; ఇటు= ఇట్లా; వర్ణన+చేసెదు(దవు)+కాని= వర్ణిస్తావు కాని; మమ్మున్; మా వారిన్; తలంపవు; ఈ+పుడమి= ఈ భూమి; వారికిన్+పాయను= వాళ్ళకు లేకుండానూ; మాకున్; అంతయున్= అంతా; చేరను= చెందేటట్లు; విధి= బ్రహ్మ - దైవం; మున్= ముందు, మొదటే; సృజించెన్= పుట్టించాడు-నిర్ణయించాడు; సిద్ధము= తప్పదు; దీనిన్= ఈ విధి నిర్ణయాన్ని; ఒకండు= ఎవడూ; మాన్పఁగాన్+నేరఁడు= తప్పించలేడు; ఆకారణంబు+అ= నిష్కారణంగానే; మదిన్= మనస్సులో; నెఱ+వగలు= అధిక దుఃఖాలు - ఎక్కువ ఆలోచనలు; పట్టుకొల్పఁగన్+ఏటికి?= కలిగించడం దేనికి?

**తాత్పర్యం:** పాండవులనూ, వాళ్ళ వాళ్ళనూ ఇట్లా తెగ పొగుడుతావు కాని, మమ్ములను, మా వాళ్ళనూ తలపెట్టవు. ఈ భూమి వాళ్ళకు కాదనీ, మాకే అంతా చెందాలనీ మొదటే విధి నిర్ణయించాడు. ఇది తప్పదు. ఈ విధి నిర్ణయాన్ని ఎవడూ తప్పించలేడు. నిష్కారణంగా మనస్సులో ఇంత బాధ పడటం దేనికి?'

**వ.** **అనిన విని సూతనందనునకు నంబికానందనుం డిట్లను- 'నా కొడు కున్మత్త ప్రలాపంబులు సేయుచున్నవాఁ డింతియకాని సత్యధర్మ నయ పరాక్రమ సహాయ సంపన్నులైన పాండవులఁ దనకు గెలువ వచ్చునే? తాను బ్రబలుం డయినను బెనఁకువ గీడ కాక మేలగునే? యది యట్లుండె; నొక్కటి యడిగెద సంజయా! చెప్పుము.** **241**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; సూతనందనునకున్= సంజయుడికి; అంబికానందనుండు= ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనున్; నా కొడుకు; ఉన్మత్త ప్రలాపంబులు+చేయుచున్+ఉన్నవాఁడు= పిచ్చి పిచ్చిగా వాగుతున్నాడు; ఇంతియకాని= ఇంతే కాని; సత్య ధర్మ నయ పరాక్రమ సహాయ సంపన్నులు+ఐన పాండవులన్= సత్యమూ, ధర్మమూ, నీతీ, పరాక్రమం, సహాయమూ తోడుగా గలిగిన పాండవులను, తనకున్+గెలువన్+వచ్చునే?= తనకు గెలవటం సాధ్యమా?; తాను; ప్రబలుండు+అయినను= మిక్కిలి బలం కలవాడే అయినప్పటికీ; పెనఁకువ= కలహం; కీడు+అ+కాక= హానే కాని; మేలు+అగునే= మంచిదవుతుందా?; అది+అట్లు+ఉండెన్= అది అట్లా ఉండనీ; సంజయా!; ఒక్కటి+అడిగెదన్; చెప్పుము.

**తాత్పర్యం:** అనగా విని సంజయుడితో ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు. 'నా కొడుకు పిచ్చి పిచ్చిగా వాగుతున్నాడు. ఇంతేకాని సత్యమూ, ధర్మమూ, నీతీ, పరాక్రమం, సహాయమూ గలిగిన పాండవులను తను గెలవగలడా? తాను అధిక బలవంతుడయినప్పటికీ కలహం కీడే కాని మేలు కలిగిస్తుందా? అది అట్లా ఉంచి, సంజయా! నిన్నొక్కటి అడుగుతాను చెప్పుము.

**క. సమరమునకుఁ బురికొల్పుచు, । మముఁ దలఁచిన నుల్లి కుట్టు మాటలఁ దచ్చి**
**త్తము లుడికించుచుఁ బాండవ । సమితిం గడఁగించువా రచట నెవ్వరొకో?' 242**

**ప్రతిపదార్థం:** సమరమునకున్= యుద్ధానికి; పురికొల్పుచున్= ప్రేరేపిస్తూ; మమున్= మమ్మల్ని; తలఁచినన్= తలచుకోగానే; ఉల్లి కుట్టు మాటలన్= సూటీ పోటీ మాటలతో- ఎత్తి పొడుపు మాటలతో; తద్+చిత్తములు= వాళ్ళ మనస్సులు; ఉడికించుచున్= వేడెక్కిస్తూ; పాండవ సమితిన్= పాండవుల సమూహాన్ని; కడఁగించువారు= ప్రోత్సహించేవాళ్ళు; అచటన్= అక్కడ; ఎవ్వరు+ ఒకో?= ఎవరో?

**తాత్పర్యం:** యుద్ధానికి పురికొల్పుతూ మా మాట స్మరించగానే సూటిపోటి మాటలతో వాళ్ళ మనస్సులను వేడెక్కిస్తూ పాండవులను ప్రోత్సహించే వాళ్ళు అక్కడ ఎవరో?'

**క. నావుడు సంజయుఁ డిట్లను; । 'దేవా! పాండవుల యలుక ధృష్టద్యుమ్నుం**
**డే వెరవుమాటనైనను । నే వోసిన యగ్ని భంగి నిగుడం జేయున్. 243**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగానే; సంజయుఁడు; ఇట్లు+అనున్; దేవా!; ధృష్టద్యుమ్నుండు; ఏ వెరవు మాటన్+ఐనను= ఏ రకం మాటతో అయినా; పాండవుల అలుకన్= పాండవుల కోపాన్ని; నే+పోసిన+అగ్ని భంగిన్= నేయి పోసిన నిప్పువలె; నిగుడన్+చేయున్= రగుల్కొలుపుతాడు.

**తాత్పర్యం:** అట్లా ధృతరాష్ట్రుడు అడగగానే సంజయుడు ఇట్లా అన్నాడు: 'ప్రభూ! ధృష్టద్యుమ్నుడు ఏదో మాటతో పాండవుల కోపాన్ని నెయ్యి పోసిన నిప్పువలె రగుల్కొలుపుతాడు.

**విశేషం:** నే వోసిన యగ్ని భంగి- అలంకారం ఉపమ.

**వ. అతండు ధర్మతనయుతో నిట్లను: 'గాంగేయ కుంభసంభవాది మహావీర క్రూరసత్త్వ బహుళంబును, గరిఘటా గిరి కదంబ కలితంబును, దురంగ నికర తరంగ పరంపరా ఘోరంబు నగు కౌరవసేనా సముద్రంబునకు నేనొక్క చెలియలికట్టనై నిలిచెద' ననవుడు నయ్యుధిష్ఠిరుండు 'నీ వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే? యెట్లును సంగరంబున మమ్ముద్ధరింపు' మనియె; నిట్లు గొనియాడిన, నాతండు నా దెసం గనుంగొని, 'సంజయా! మీ వారల కెల్లనుం దెలియం జెప్పు; మీశ్వరాది దేవతలు సమకట్టిన సవరణగల యర్జునుచేత నిర్జింపంబడిన యుత్కృష్టజాతు లనేకు లగుట యెఱుంగుదుర కాదె? మనుష్యు లతనికెంత పెద్ద? యిట్టి జెట్టి వెన్నుదన్ని చూడఁగలవాఁడు గావున, మముబోంట్లెల్లఁబోక పెనంగినం, బోరు భరంబైనం, బ్రాణంబులపై వచ్చు; నంతకంటెను బరమ దయాపరుండైన పాండవాగ్రజు మఱువు సొచ్చి బ్రదుకుం డను; మంతలంతలు**

**దప్పులు సేసితి మని తలంక వలవ; దెంత సేసినను, గౌంతేయ పూర్వజుండు శాంతి సుధానిధి యగుటంజేసి శరణు సొచ్చినం గాచు' నని పలికె' ననిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనున కిట్లనియె: 244**

**ప్రతిపదార్థం:** అతఁడు= ధృష్టద్యుమ్నుడు; ధర్మతనయుతోన్= ధర్మరాజుతో; ఇట్లు+అనున్; గాంగేయ కుంభసంభవ+ఆది మహావీర క్రూర సత్త్వ బహుళంబును= భీష్ముడూ, ద్రోణుడూ మున్నగు గొప్ప వీరులనే క్రూరమృగాలతో సాంద్రమైనదీ; కరి ఘటా గిరి కదంబ కలితంబును= ఏనుగుల గుంపు అనే కొండల సమూహంతో కూడుకొన్నదీ; తురంగ నికర తరంగ పరంపరా ఘోరంబును= గుర్రాల సమూహం అనే అలల వరసచేత భయంకరమైనదీ; అగు; కౌరవ సేనా సముద్రంబునకున్= కురుసైన్యం అనే సముద్రానికి; ఏను= నేను; ఒక్క చెలియలికట్టను+ఐ= ఒక గట్టు నయి; నిలిచెదన్= నిలుస్తాను; అనవుడున్= అనగానే; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; నీవు; ఇంతకున్+చాలుట= ఈ చెప్పినదానికి సమర్థుడవటం; ఎవ్వరున్= ఎవరూ; ఎఱుంగరే?= ఎరగరా?; ఎట్లునున్= ఎట్లా అయినా; సంగరంబునన్= యుద్ధంలో; మమ్మున్; ఉద్ధరింపుము= లేవనెత్తుము, ఆదుకో; అనియెన్; ఇట్లు; కొనియాడినన్= పొగడగా; అతండు+ ధృష్టద్యుమ్నుడు; నా దెసన్= నా వైపు; కనుంగొని= చూచి; సంజయా!; మీ వారలకున్+ఎల్లనున్= మీవాళ్ళకందరికీ; తెలియన్+చెప్పుము= తెలిసేటట్లు చెప్పుము; ఈశ్వర+ఆది దేవతలు= ఈశ్వరుడూ మొదలైన దేవతలు; సమకట్టిన సవరణ+కల= సమకూర్చిన యుద్ధపరికరాలు ఉన్న; అర్జును చేతన్; నిర్జింపంబడిన= జయించబడిన; ఉత్కృష్ట జాతులు= గొప్పవాళ్ళు; అనేకులు+అగుట= పెక్కుమంది అవటం; ఎఱుంగుదురు+అ కాదె= ఎరుగుదురు కదా; అతనికిన్; మనుష్యులు= మానవ మాత్రులు; ఎంత పెద్ద?= ఏమి ఎక్కువ?; ఇట్టి జెట్టి= ఇటువంటి వీరుడు; వెన్ను దన్ని చూడన్+కలవాఁడు+కావునన్= వెనకాల ఉండి చూడగలవాడు కాబట్టి; మము బోంట్లు+ఎల్లన్= మావంటివాళ్ళు అందరూ; పోక పెనంగినన్= పారిపోకుండా యుద్ధం చేయగా; పోరు= యుద్ధం; భరంబు+ఐనన్= అతిశయం అయితే; ప్రాణంబులపైన్+వచ్చున్= ప్రాణాంతకమవుతుంది; అంతకంటెను= దానికంటె; పరమ దయాపరుండు+ఐన= మిక్కిలి దయగల వాడయిన; పాండవ+అగ్రజు= ధర్మరాజుయొక్క; మఱువు+చొచ్చి= శరణుపొంది; బ్రదుకుండు+అనుము= బ్రతకండి అని చెప్పుము; అంతలు+అంతలు+తప్పులు+చేసితిమి+అని= అంతంత అపరాధాలు చేశామని; తలంకవలవదు= భయపడవద్దు; ఎంతలు+చేసినను= ఎంతటి ఘోరాలు చేసినా; కౌంతేయ పూర్వజుండు= పాండవులలో పెద్దవాడు- ధర్మరాజు; శాంతి సుధానిధి+అగుటన్+చేసి= శాంతికి చంద్రుడు అవటం చేత- శాంతి అనే అమృతానికి నిధానం కావటం చేత; శరణు+చొచ్చినన్= శరణంటే; కాచున్= రక్షిస్తాడు; అని; పలికెన్; అనినన్; విని; ధృతరాష్ట్రుండు; దుర్యోధనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అతడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: 'భీష్మద్రోణాది మహావీరులనే క్రూరమృగాలతో తరచైనదీ, ఏనుగుల గుంపు అనే కొండల సమూహంతో కూడుకొన్నదీ, గుర్రాల సమూహం అనే అలల వరసచేత భయంకరమయినదీ అయిన కురుసేన అనే సముద్రానికి నేను ఒక గట్టునయి నిలుస్తాను' అనగానే ఆ ధర్మరాజు 'నీవు అన్నంత దానికీ సరిపోతావని ఎవరికి తెలియదు? ఎట్లా అయినా యుద్ధంలో మమ్మల్ని ఆదుకో' అన్నాడు. ఇట్లా పొగిడితే, ధృష్టద్యుమ్నుడు నావైపు చూచి 'సంజయా! మీ వాళ్ళ కందరికీ తెలిసేటట్లు చెప్పుము. ఈశ్వరుడు మొదలైన దేవతలు సమకూర్చిన యుద్ధ పరికరాలు గల అర్జునుడిచేత జయించబడిన గొప్పవాళ్ళు ఎంతో మంది ఉండటం మీకు తెలిసిందే కదా! మనుష్యులు అతడికి ఏమి ఎక్కువ? ఇటువంటి శూరుడు వెనకాల ఉండి చూడగలవాడు కాబట్టి, మావంటివాళ్ళం పారిపోకుండా నిలబడి యుద్ధం చేస్తాం. అప్పుడు యుద్ధం తలకు మించిన బరువై ప్రాణాంతక మవుతుంది. దానికంటె మిక్కిలి దయగలవాడైన ధర్మరాజును శరణనివేడి బ్రతకండి అని చెప్పుము. అంతలేసి తప్పులు చేశాం అని భయపడవద్దు. ఎంతటి తప్పులు చేసినా ధర్మరాజు శాంతికి చంద్రుడు (శాంతి అనే అమృతానికి నిధానం) కాబట్టి, శరణంటే రక్షిస్తాడు' అని పలికాడు:' అనగా విని ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** 'గాంగేయ ... బహుళంబును',- 'కరిఘటా .... కలితంబును', 'తురంగ నికర తరంగ ఘోరంబును'; 'కౌరవ సేనా సముద్రంబునకు నేను చెలియలికట్టను' - అన్నీ రూపకాలంకారాలు. 'ఒక్క చెలియలికట్టనై నిలిచెద' - చెలియలి కట్ట సముద్రం పొంగి పొరలకుండా ఆపినట్లు, 'నేను కౌరవసేన మీదికి రాకుండా అడ్డుపడతాను' అని భావం. 'శాంతి సుధా నిధి' శాంతి అనే సుధకు నిధి- అలంకారం రూపకం. 'అర్జును చేత నిర్జింపబడిన ఉత్కృష్ట జాతులనేకులగుట యెఱుంగుదుర కాదె? మనుష్య లతని కెంత పెద్ద?' - అలంకారం కావ్యార్థాపత్తి.

**క. 'పరిజనులకు నీకును ని । ద్ధరలోన సగంబు సాలుఁ; దక్కటి సగముం**
**గర ముచితంబుగఁ బాండవ । వరుఁ డగు ధర్మజున కిచ్చి బ్రదుకుము నెమ్మిన్. 245**

**ప్రతిపదార్థం:** పరిజనులకున్ నీకునున్= నీ పరివారానికీ, నీకూ; ఈ+ధరలోనన్= ఈ భూమిలో; సగంబు+చాలున్= సగం సరిపోతుంది; తక్కటి సగమున్= మిగిలిన సగాన్ని; కరము+ఉచితంబుగన్= సముచితంగా; పాండవ వరుఁడు+అగు ధర్మజునకున్+ఇచ్చి= పాండవ శ్రేష్ఠుడైన ధర్మరాజు కిచ్చి; నెమ్మిన్= హాయిగా; బ్రదుకుము= జీవించుము.

**తాత్పర్యం:** 'నీకూ నీ పరివారానికే ఈ భూమిలో సగం చాలు, తక్కిన సగం సముచితంగా ధర్మరాజుకిచ్చి హాయిగా బ్రతుకుము.

### ధృతరాష్ట్రుఁడు దుర్యోధనునితో సంధి సేయుమని చెప్పుట (సం. 5-57-4)

**చ. పెనఁకువ నాక యేల మన పెద్దల కెవ్వరి కియ్యకోలు గా;**
**దనుచిత వృత్తి గాన గురుఁడాదిగ నాప్తులు బంధుమిత్రులున్**
**గొనకొని పోరికిం జొర; రకుంఠిత తేజుఁడు ధర్మపుత్రుఁ; డా**
**తనిఁ దగఁ గూడి మన్కి ప్రమదం బగుఁ గౌరవజాతి కెంతయున్.' 246**

**ప్రతిపదార్థం:** పెనఁకువ= యుద్ధం; నాకున్+అ= నాక= నాకే; ఏల; మన పెద్దలకున్; ఎవ్వరికిన్; ఇయ్యకోలు+కాదు= సమ్మతం కాదు; అనుచిత వృత్తి+కానన్= తగని వ్యాపారం కాబట్టి; గురుఁడు+ఆదిగన్= ద్రోణుడు మొదలుకొని; ఆప్తులున్; బంధు మిత్రులున్= చుట్టాలూ; స్నేహితులూ; గొనకొని= పూని; పోరికిన్= యుద్ధానికి; చొరరు= ప్రవేశించరు - ముందుకు రారు; ధర్మపుత్రుఁడు= ధర్మరాజు; అకుంఠిత తేజుఁడు= కుంటువడని తేజస్సు కలవాడు; ఆతనిన్; తగన్= ఒప్పుగా; కూడి మన్కి= కలిసి బ్రతకటం; కౌరవజాతికిన్= కురు కులానికి; ఎంతయున్= మిక్కిలి; ప్రమదంబు+అగున్= ఆనందమవుతుంది.

**తాత్పర్యం:** యుద్ధం నాకే కాదు, మన పెద్దల కెవ్వరికీ సమ్మతం కాదు. అది తగని పని కాబట్టి ద్రోణుడు మొదలుకొని ఆప్తులుగాని, బంధువులుగాని, మిత్రులుగాని యుద్ధానికి పూని ముందుకు రారు. ధర్మరాజు కుంటువడని తేజస్సు కలవాడు. ఆతడితో ఒప్పుగా కలిసి బ్రతకటం కౌరవజాతికి ఎంతో సంతోషం కలిగిస్తుంది.'

**వ. అని వెండియు. 247**

**తాత్పర్యం:** అని మళ్ళీ.

**క. 'కర్ణుండు రేఁచి పెట్టఁగ, । దుర్ణయపరులైన శకుని దుశ్శాసను లీ**
**నిర్ణయమె మేలనఁగ, నీ । కర్ణములకు నించు నెట్లు కార్యవచనముల్?' 248**

**ప్రతిపదార్థం:** కర్ణుండు; రేఁచి పెట్టఁగన్= ప్రేరేపించగా; దుర్ణయపరులు+ఐన= అవినీతిపరులైన; శకుని దుశ్శాసనులు; ఈ నిర్ణయమె; మేలు+అనఁగన్; కార్యవచనముల్= చేయాల్సినదానికి సంబంధించిన మాటలు; ఎట్లు ఇంచున్= ఎట్లా ఇష్టమవుతాయి?

**తాత్పర్యం:** 'కర్ణుడు ప్రేరేపించగా, అవినీతిపరులైన శకుని దుశ్శాసనులు ఈ నిర్ణయం బాగుందని మెచ్చుకోగా, చేయవలసిన దానికి సంబంధించిన మాటలు నీకెట్లా చెవికెక్కుతాయి?'

**వ. అనినఁ గటకటంబడి సుయోధనుం డిట్లనియె : 249**

**తాత్పర్యం:** అనగా, బాధపడి దుర్యోధనుడు ఇట్లా అన్నాడు :

**క. 'నీ చెప్పెడి పెద్దలు ద్రో । ణా చార్యులు మొదలుగాఁగ నని కొల్లని వా**
**రై చేరని వారిం గొని । యే చక్కం బెట్టువాఁడ నేఁ బాండవులన్? 250**

**ప్రతిపదార్థం:** నీ చెప్పెడి= నీవు చెప్పే; పెద్దలు ద్రోణాచార్యులు మొదలు+కాఁగన్= పెద్దలైన ద్రోణాచార్యులు మున్నుగా; అనికిన్= యుద్ధానికి; ఒల్లనివారు+ఐ= ఇష్టపడనివారయి; చేరనివారిన్= కలిసిరానివారిని; కొనియే= కొనియా; ఏన్= నేను; పాండవులన్; చక్కంబెట్టువాఁడన్= జయిస్తాను.

**తాత్పర్యం:** 'నీవు చెప్పే పెద్దలు ద్రోణాచార్యులు మొదలగు యుద్ధాని కంగీకరించక కలిసిరానివాళ్ళను వెంటబెట్టుకొనియా నేను పాండవులను జయిస్తానని అనుకొంటున్నావు?

**శా. రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవ**
**క్రోధజ్వాలల నార్తు; నొండొకఁడు నాకుం దోడె? నీ వింక నన్**
**బాధం బెట్టకు; వాఁడి సూది మొనమోవంజాలు నంతైన నే**
**నీ ధాత్రీతల మీను వారలకు; నాకే లింత సేగిం బడన్?' 251**

**ప్రతిపదార్థం:** రాధేయుండును= కర్ణుడూ; దుస్ససేనుఁడును= దుశ్శాసనుడూ; పోరన్= యుద్ధంలో; ప్రాపు+కాన్= అండగా; పాండవ క్రోధ+జ్వాలలన్= పాండవుల కోపాగ్ని జ్వాలలను; ఆర్తున్= ఆర్పుతాను; ఒండు+ఒకఁడు= ఇంకొకడు; నాకున్; తోడె?= తోడా? ఇంకొక డెవడూ నాకు తోడు అక్కర్లేదు అని భావం; నీవు; ఇంకన్; నన్; బాధన్+పెట్టకు; నేను; వారలకున్= పాండవులకు; ధాత్రీతలము= భూభాగం; వాఁడి సూది మొన మోవన్+చాలు+అంత+ఐనన్= వాడిఅయిన సూది మొన ఆక్రమించేటంత కూడా; ఈను= ఇవ్వను; నాకున్; ఇంత సేగిన్+పడన్+ఏల?= ఇంత చేటు పొందటం ఎందుకు?

**తాత్పర్యం:** యుద్ధంలో నాకు కర్ణుడూ, దుశ్శాసనుడూ అండగా ఉండగా నేను పాండవుల కోపాగ్ని జ్వాలలను ఆర్పుతాను. ఇంకొకడి సాయం నా కెందుకు? నీవు ఇంక నన్ను బాధించకుము. నేను వాడి సూది మొన పట్టేటంత భూమిని కూడా పాండవులకు ఇవ్వను. ఇంత చేటు పొందే అవసరం ఏముంది నాకు?'

**విశేషం:** క్రోధ జ్వాలలన్ - క్రోధమనే (అగ్ని) జ్వాలల్ని - అలంకారం రూపకం. సూదే సన్నం. వాడి సూది మరీ సన్నం. దాని మొన చెప్పలేనంత సన్నం. అది పట్టేటంత నేలను గూడా ఇవ్వను- అణువంత భూమిని కూడా ఇవ్వనని భావం.

**వ. అనిన గాంధారీవల్లభుం డతని కిట్లనియె: 252**

**ప్రతిపదార్థం:** అనినన్; గాంధారీ వల్లభుండు= గాంధారి భర్త- ధృతరాష్ట్రుడు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని దుర్యోధను డనగా, ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'నీకు నంత వగవ; నీపోవు తెరువునఁ । బోవు వారు గాఁగఁ బూనియున్న**
**వారికెల్ల నేను వగచెదఁ; గయ్యంబు । వలవ దుడుగు మయ్య చలము గొనక. 253**

**ప్రతిపదార్థం:** నీకున్+అంత వగవన్= నీ కొరకు అంతగా దుఃఖించను; నీ పోవు తెరువునన్= నీవు వెళ్ళే మార్గంలో; పోవు వారు+కాఁగన్+పూని+ఉన్న వారికిన్+ఎల్లన్= వెళ్ళటానికి యత్నించే వాళ్ళందరి కొరకు; ఏను= నేను; వగచెదన్= దుఃఖిస్తాను; కయ్యంబు వలవదు= యుద్ధం వద్దు; చలము కొనక= పంతం పూనక; ఉడుగుము+అయ్య= మానవయ్య.

**తాత్పర్యం:** 'నీ కొరకు అంతగా విచారించను. నీవు పయనించే దారిలో పయనించడానికి యత్నించే వాళ్ళందరికొరకు నేను విచారిస్తాను. యుద్ధం వద్దు. పంతానికి పోక మానవయ్యా!

**చ. ఉభయ బలంబులుం బొగడ నుగ్రత భీముఁడు విస్ఫురద్గదన్**
**రభస మెలర్పఁ గుంభములు వ్రయ్యఁగ వ్రేసిన, నెత్తు రొల్కఁగా**
**నిభముల పిండు గావి సెలయేఱుల తోడి నగంబులట్లు సం**
**క్షుభితములై పయిం బఱవఁ జూచి తలంచెదు నాదు వాక్యముల్! 254**

**ప్రతిపదార్థం:** భీముఁడు; ఉభయ బలంబులున్= రెండు పక్షాల సేనలూ; పొగడన్= పొగడగా; ఉగ్రతన్= కోపంతో; విస్ఫురత్+గదన్= ప్రకాశించే గదతో; రభసము+ఎలర్పన్= సంతోష మతిశయించగా; కుంభములు= కుంభస్థలాలు; వ్రయ్యఁగన్+ వ్రేసినన్= బ్రద్దలయ్యేటట్లు కొట్టగా; నెత్తురు+ఒల్కఁగాన్= రక్తం ఓడగా; ఇభముల పిండు= ఏనుగుల గుంపు; కావి సెలయేఱుల తోడి నగంబుల+అట్లు= ఎర్రటి సెలయేళ్ళతోడి కొండల వలె; సంక్షుభితములు+ఐ= మిక్కిలి వ్యాకులత నొందినవయి; పయిన్+పఱవన్= పైని వ్యాపించగా; చూచి; నాదు వాక్యముల్= నా మాటలు; తలంచెదు (దవు)= స్మరిస్తావు.

**తాత్పర్యం:** ఇరుపక్షాల సేనలూ ప్రశంసిస్తూండగా భీముడు మహాకోపంతో ప్రకాశించే గదతో, హర్షం అతిశయించగా కుంభస్థలాలు బ్రద్దలు కొడితే, నెత్తురోడుతూ ఏనుగుల గుంపు ఎర్రటి సెలయేళ్ళతో కూడిన కొండల వలె మిక్కిలి వ్యాకులత చెంది పైని వ్యాపించగా చూచి నా మాటలు స్మరిస్తావు.

**విశేషం:** 'నెత్తు రొల్కఁగా నిభముల పిండు గాని సెలయేఱులతోడి నగంబు లట్లు సంక్షుభితములై పయిం బఱవ'- అలంకారం ఉపమ.

**చ. ఉఱక ధనంజయుండు వివిధోగ్ర శరంబుల నొక్క మాత్ర నే**
**డ్తెఱ నుఱుమాడినం బుడమిఁ ద్రెళ్ళిన నీదగుసైన్యమంతయున్**
**నఱకినఁ బడ్డ ఘోర విపినంబు విధంబున నున్నఁ జూచి, య**
**త్తఱి నయినం దలంపు ముచితంబగు నా వచనంబుఁ బుత్త్రకా!' 255**

**ప్రతిపదార్థం:** పుత్త్రకా!= కుమారా!; ధనంజయుండు= అర్జునుడు; ఉఱక= ఎవర్నీ సరకు గొనక; వివిధ+ఉగ్ర శరంబులన్= పెక్కు రీతులైన భయంకర బాణాలతో; ఒక్క మాత్రన్= ఒక రెప్పపాటు కాలంలో; ఏడ్తెఱన్= పరాక్రమంతో; నుఱుమాడినన్= వధించగా; పుడమిన్= నేలమీద; త్రెళ్ళిన= పడిన; నీ+అది+అగు సైన్యము+అంతయున్= నీదైన సేన అంతా; నఱకినన్= నరకగా; పడ్డ= పడిపోయిన; ఘోర విపినంబు విధంబునన్= భయంకరమైన అడవి వలె; ఉన్నన్+చూచి= ఉండటం చూచి; ఆ+తఱిన్+అయినన్= ఆ సమయంలోనైనా; ఉచితంబు+అగు నా వచనంబున్= తగిన నా మాటను; తలంపుము= స్మరించుము.

**తాత్పర్యం:** కుమారా! అర్జునుడు ఎవర్నీ సరకుగొనకుండా పెక్కు రీతులైన భయంకర బాణాలతో ఒక్క రెప్పపాటు కాలంలో పరాక్రమంతో నరకగా నేలమీద పడిన నీ సేన అంతా నరికితే పడిపోయిన భయంకరాటవి వలె ఉండటం చూచి, అప్పుడైనా సముచితమైన నా మాటను స్మరించుము.

**విశేషం:** 'నుఱుమాడినం బుడమిఁ ద్రెళ్ళిన నీదగు సైన్యమంతయున్ - నఱకినఁ బడ్డ ఘోర విపినంబు విధంబున నున్నన్'- అలంకారం ఉపమ.

**వ. అని పలికి, యతని వలనం బలుకుగానక మనంబు మరలంబెట్టు కొని కొడుకులు జయింప నోపుదురొకో యను నాస సంజయు దిక్కు మొగంబుసేసి పాండవ కౌరవ పక్షంబులం గలవారి నడుగుచుం, గొలందులు దలపోయుచు, నాతని వచనంబులం దన విచారంబులను బలాబలంబులు నిశ్చయించి, పాండవేయు లెక్కు డవుట యెఱుంగుచుఁ, గ్రమ్మఱ నా సూతపుత్రుతో లెక్కలు వెట్టుచుం, బోలించుచుఁ, బెద్దప్రొద్దు వితర్కించి, కౌంతేయుల శక్తి దేవశక్తియు, గాంధారేయుల శక్తి మనుష్యశక్తియుంగాఁ దెలిసినవాఁడై, యంబికానందనుండు నిజనందనునితో నిట్లనియె: 256**

**ప్రతిపదార్థం:** అని; పలికి; అతని వలనన్= అతడిలో - దుర్యోధనుడిలో; పలుకు+కానక= ఎటువంటి సమాధానమూ పొందక; మనంబు= మనస్సు; మరలన్+పెట్టుకొని= మరల్చుకొని; కొడుకులు; జయింపన్+ఓపుదురు+ఒకో+అను+ఆసన్= గెలవగలరా అనే ఆశతో; సంజయు దిక్కు మొగంబు+చేసి= సంజయుడికేసి చూచి; పాండవ కౌరవ పక్షంబులన్+కలవారిన్= పాండవుల పక్షంలోనూ, కౌరవుల పక్షంలోనూ ఉన్నవాళ్ళని గూర్చి; అడుగుచున్= అడుగుతూ; కొలందులు+తలపోయుచున్= సామర్థ్యాలు తలచుకొంటూ; ఆతని వచనంబులన్= ఆ సంజయుడి మాటలతోనూ; తన విచారంబులను= తన ఆలోచనలతోనూ; బల+ అబలంబులు= బలాబలాలు; నిశ్చయించి= నిర్ణయించి; పాండవేయులు; ఎక్కుడు+అవుట= ఎక్కువవటం; ఎఱుంగుచున్= తెలిసికొంటూ; క్రమ్మఱన్= మళ్ళీ; ఆ సూతపుత్త్రుతోన్= ఆ సంజయుడితో; లెక్కలు+పెట్టుచున్= లెక్కలు కట్టుతూ; పోలించుచున్= పరస్పరం పోలుస్తూ; పెద్ద ప్రొద్దు= చాలసేపు; వితర్కించి= యుక్తులతో ఆలోచించి; కౌంతేయుల శక్తి= పాండవుల శక్తి; దేవశక్తియున్= దివ్యశక్తీ; గాంధారేయుల శక్తి= కౌరవుల శక్తి; మనుష్య శక్తియున్+కాన్= మానవశక్తీ అని; తెలిసినవాఁడు+ఐ= గుర్తించినవాడై; అంబికా నందనుండు= ధృతరాష్ట్రుడు; నిజ నందనునితోన్= తన కొడుకుతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని పలికి, అతడినుండి మారుపలుకు పొందక మనస్సు మరలించుకొని, కొడుకులు గెలవగలరా అనే ఆశతో సంజయుడివైపు చూచి, పాండవ కౌరవ పక్షాలలో ఉన్నవారిని గూర్చి ప్రశ్నిస్తూ, వాళ్ళ వాళ్ళ శక్తులు తలచుకొంటూ, పాండవులు అధికులు కావడం తెలిసి, మళ్ళీ ఆ సంజయుడితో లెక్కలు కట్టుతూ, ఒకళ్ళతో

ఒకళ్ళని పోలుస్తూ, చాలాసేపు యుక్తులతో ఆలోచించి, పాండవుల శక్తి దివ్యశక్తి అనీ; కౌరవుల శక్తి మానవశక్తి అనీ తెలిసి ధృతరాష్ట్రుడు తన కొడుకు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**క. 'నరుఁ డగ్నిదేవుఁ దనకును । వరదునిఁగాఁ గొలిచినాఁడు; వానికిఁ గేతు**
**స్ఫురణం బాదిగఁ గల సం । గర పరికర మెల్ల నతఁడు గావించె దయన్. 257**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; అగ్నిదేవున్= అగ్నిదేవుడిని; తనకును; వరదునిన్+కాన్= వరాలిచ్చేవాడినిగా; కొలిచినాఁడు= సేవించినాడు; వానికిన్= అర్జునుడికి; కేతు స్ఫురణంబు+ఆదిగన్+కల= జెండా ప్రకాశం మొదలుకొని ఉన్న; సంగర పరికరము+ఎల్లన్= యుద్ధసాధనం అంతా; అగ్నిదేవుడు; దయన్= దయతో; కావించెన్= చేశాడు- ఇచ్చాడు.

**తాత్పర్యం:** అర్జునుడు అగ్నిదేవుడిని తనకు వరదాత అయ్యేటట్లు సేవించాడు. అర్జునుడికి జెండా మొదలైన యుద్ధోపకరణాలనన్నిటినీ అగ్నిదేవుడు దయతో అనుగ్రహించాడు.

**వ. అదియునుం గాక ధర్మదేవతయు, వాయుదేవుండును, వాసవుండును, నాశ్వినులును వారలకుఁ బాండురాజు తోడి వారలు; వారి నొక కీడునుం బొరయకుండ రక్షింతురు గావున, భీష్మ ద్రోణ ప్రముఖులకుఁ బాండవులం బరిభవింపరామి దెల్లంబు. 258**

**ప్రతిపదార్థం:** అదియున్+కాక= అదీకాక; ధర్మదేవతయున్= ధర్ముడూ - యముడూ; వాయుదేవుండును; వాసవుండునున్= ఇంద్రుడూ; ఆశ్వినులును= అశ్వినీ దేవతలూ; వారలకున్= పాండవులకు; పాండురాజు తోడివారలు= పాండురాజుతో సమానులు; వారిన్= పాండవులను; ఒక కీడునున్= ఒక హాని కూడా; పొరయక+ఉండన్= కలగకుండా; రక్షింతురు= కాపాడతారు; కావునన్; భీష్మ ద్రోణ ప్రముఖులకున్= భీష్ముడు, ద్రోణుడు మొదలైనవారికి; పాండవులన్; పరిభవింపన్+రామి= ఓడించలేకపోవటం; తెల్లంబు= స్పష్టం.

**తాత్పర్యం:** అదీకాక, ధర్ముడూ, వాయువూ, ఇంద్రుడూ, అశ్వినీదేవతలూ వాళ్ళకు పాండురాజెంతో అంత. వాళ్లకు ఎటువంటి హానీ కలగకుండా వారు కాపాడుతారు. కాబట్టి భీష్ముడూ, ద్రోణుడూ మొదలైనవాళ్ళు పాండవులను జయించలేరనడం స్పష్టం.

**విశేషం:** పాండవుల కందరికీ పాండురాజు తండ్రి అయినప్పటికీ ధర్మరాజు యముడి అంశవలనా, భీముడు వాయుదేవుడి అంశవలనా, అర్జునుడు ఇంద్రుడి అంశవలనా, నకుల సహదేవులు అశ్వినీ దేవతల అంశవలనా పుట్టినవాళ్ళు కాబట్టి, యమాదులైన ఆ అయిదుగురూ పాండవులకు పాండురాజుతో సమానులు. అందుచేతనే పాండవులను ఆదుకొనటం.

**క. దేవత లేటికిఁ? బార్థుఁడు । దేవ సముఁడు గాఁడె? వాఁడు దివిజులచేతం**
**బోవని దైత్యులఁ జంపఁడె? । యీవును నీవారు నతని నెఱుఁగరె చెపుమా? 259**

**ప్రతిపదార్థం:** దేవతలు+ఏటికిన్= దేవతల దాకా ఎందుకు?; పార్థుఁడు= అర్జునుడు; దేవ సముఁడు+కాఁడె?= దేవతలతో సమానుడు కాడా?; వాఁడు= అర్జునుడు; దివిజుల చేతన్+పోవని దైత్యులన్= దేవతలకు సాధ్యంకాని రాక్షసులను; చంపఁడె?= చంపలేదా?; ఈవును= నీవూ; నీ వారున్= నీ వాళ్ళూ; అతనిన్; ఎఱుఁగరె?= తెలియరా; చెపుమా= చెప్పుము.

**తాత్పర్యం:** దేవతల దాకా ఎందుకు? అర్జునుడు దేవతలతో సమానుడు కాడా? అతడు దేవతలకు సాధ్యంకాని రాక్షసులను చంపలేదా? నీవూ, నీవాళ్ళూ అతడిని ఎరగరా చెప్పుము.

**వ. కౌరవులకు వచ్చిన యిమ్మహాభయంబునకుఁ బ్రతీకారంబు శాంతిం గడచినయది లేఁ; దెన్ని భంగులం జూచినఁ గయ్యం బుడుగుటయ మనకుం గర్తవ్యంబై యున్నయది; యుపశమింపవయ్య! దీర్ఘ వైరంబు వలవదనినఁ దండ్రికిఁ గొడు కిట్లనియె: 260**

**ప్రతిపదార్థం:** కౌరవులకున్; వచ్చిన= కలిగిన; ఈ+మహా భయంబునకున్= ఈ గొప్ప ఆపదకు; ప్రతీకారంబు= చికిత్స; శాంతిన్= శాంతిని; కడచిన+అది లేదు= మించింది లేదు; ఎన్ని భంగులన్+చూచినన్= ఎన్ని విధాల చూసినా; కయ్యంబు= యుద్ధం; ఉడుగుట+అ= విరమించటమే; మనకున్; కర్తవ్యంబు+ఐ= చేయదగినదయి; ఉన్న+అది= ఉన్నది; ఉపశమింపవయ్యా= శాంతించవయ్య; దీర్ఘ వైరంబు= చిరకాలపు పగ; వలవదు= వద్దు; అనినన్; తండ్రికిన్; కొడుకు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కౌరవులకు వచ్చిపడ్డ ఈ మహాపదకు చికిత్స శాంతిని మించింది లేదు. ఎన్ని విధాల చూచినా యుద్ధం విరమించటమే మనం చేయవలసింది. శాంతించవయ్యా. దీర్ఘవైరం పనికి రాదు.' అనగా తండ్రికి కొడుకిట్లా అన్నాడు:

**క. 'దేవత లర్జుననకుఁ దో । డై వత్తు రనంగ వలవ; దది యెట్లనినన్
దేవత్వము రాగద్వే । షావేశము లేమిఁ గాదె యైనది మొదలన్? 261**

**ప్రతిపదార్థం:** దేవతలు; అర్జుననకున్; తోడు+ఐ= సహాయంగా; వత్తురు+అనంగన్ వలవదు= వస్తారనవద్దు; అది+ఎట్లు+ అనినన్+అది ఎట్లా అంటే; మొదలన్= మొట్టమొదట; దేవత్వము; రాగ ద్వేష+ఆవేశము లేమిన్+కాదె+ఐనది?= రాగద్వేషాల ఆవేశం లేకపోవటం చేతనే కదా ఏర్పడింది?

**తాత్పర్యం:** 'దేవతలు అర్జునుడికి సహాయులై వస్తారనవద్దు. అది ఎట్లా అంటే- మొట్టమొదట- అసలు, దేవత్వం అంటే రాగద్వేషరాహిత్యమే కదా!

**విశేషం:** 'అర్జునుడి మీద రాగమూ, మామీద ద్వేషమూ పూని దేవతలు అతడికి సహాయపడితే వాళ్ళు దేవత లెట్లా అవుతా'రని దుర్యోధనుడి ప్రశ్న. అసలు దేవత్వం అంటే రాగద్వేషరాహిత్యమే. వాళ్ళు నిజంగా దేవతలే అయితే అర్జునుడికి సాయపడరని దుర్యోధనుడి అభిప్రాయం.

**వ. కావున వా రొకళ్ళవారుం గా; రట్లుంగాక పక్షపాతులై పూని వత్తురయేని నది దేవత్వంబు గా; దట్టి దేవత్వంబున నర్జునుండును సురక్షితుండు గానేరఁడు; నీకు నా పనికిఁ జింత వలవ' దని పలికి, వెండియు నిట్లనుఁ; 'బెఱిఁగి వచ్చు కార్చిచ్చు నుడుపను, బాషాణ వర్షంబు వారింపను, మహావాయువు నిలుపను, నీళ్ళు గట్టిగా నభిమంత్రించి వానిపైఁ గరి తురగాదుల నడపింపను, నా సేన నడచునప్పుడు వలసినచోట జలంబు లుత్పాదింపను జాలుదు; సింహ శరభ శార్దూల భూత బేతాళాది క్రూరసత్త్వ సంరంభ స్తంభన ప్రకారం బెఱుంగుదు, మిత్త్రశత్త్రు విషయంబులైన శుభాశుభంబులు వలయుభంగి నావహింపనేర్తు; మఱియు నానావిధ సిద్ధి ప్రదంబులగు మంత్ర ధ్యానాద్యనుష్ఠానంబుల నాకుం గొఱంత లేదు; నీ చెప్పిన యగ్నిప్రముఖ**

**దేవతలం బ్రసన్ను లగునట్లుగా నారాధించినవాఁడ; వారికి నాకుం బోలె మహానుభావంబు గలిగినఁ బదుమూఁడు వత్సరంబు లబ్బంగి నిడుమలం బడుదురె? వినుము చెప్పెద. 262**

**ప్రతిపదార్థం:** కావునన్; వారు= ఆ దేవతలు; ఒకళ్ళవారున్+కారు= ఏ ఒక్కరి వాళ్ళూ కారు; అట్లున్+కాక= అట్లాకాక; పక్షపాతులు+ఐ= ఏ ఒక్కరి పక్షమో వహించి; పూని వత్తురు+అ+ఏనిన్= ప్రయత్నించి వచ్చే మాటయితే; అది; దేవత్వంబు+కాదు; అట్టి దేవత్వంబునన్; అర్జునుండును; సురక్షితుండు= లెస్సగా కాపాడబడినవాడు; కాన్+నేరఁడు= కాలేడు; నీకున్; నా పనికిన్= నేను చేసే పనిని గూర్చి; చింత= విచారం; వలవదు= వద్దు; అని; పలికి; మఱియున్= ఇంకా; ఇట్లు+అనున్; పెఱిగి వచ్చు కార్చిచ్చున్+ఉడుపను= పెద్దదయి వచ్చే అడవి నిప్పును మాన్పటానికీ- ఆర్పటానికీ; పాషాణ వర్షంబున్= రాళ్ళ వానను; వారింపను= ఆపటానికీ; మహా వాయువున్= పెనుగాలిని; నిలుపను= నిలపటానికీ; నీళ్ళు; గట్టిగాన్; అభిమంత్రించి= మంత్రంచే సంస్కరించి; వానిపైన్; కరి తురగ+ఆదులన్= ఏనుగులు, గుర్రాలు మొదలైన వాటిని; నడిపింపను= నడపటానికీ; నా సేన= నా సైన్యం; నడచు+అప్పుడు= నడిచేటప్పుడు; వలసిన చోటన్= కావలసినచోట; జలంబులు= నీళ్ళు; ఉత్పాదింపను= పుట్టించటానికీ; చాలుదున్= సమర్థుడిని; సింహ శరభ శార్దూల భూత బేతాళ+ఆది క్రూర సత్త్వ సంరంభ స్తంభన ప్రకారంబు= సింహాలూ, శరభమృగాలూ (సింహం కంటె బలవత్తరమై ఎనిమిది పాదాలుగల జంతువు), పెద్దపులులూ, భూతాలు, బేతాళురూ మొదలయిన క్రూరమృగాల అలజడి యొక్క నిలుపుదల విధం; ఎఱుంగుదున్; మిత్త్ర శత్రు విషయంబులు+ఐన= మిత్రులకూ, శత్రువులకూ సంబంధించిన; శుభ+అశుభంబులు= శుభాలూ, అశుభాలూ; వలయు భంగిన్= కావలసిన రీతిగా; ఆవహింపన్+నేర్తున్= కలిగించగలను; మఱియున్; నానా విధ సిద్ధి ప్రదంబులు+అగు= అనేక రీతులైన సిద్ధులు కలిగించే; మంత్ర ధ్యాన+ఆది+అనుష్ఠానంబులన్= మంత్రాల ధ్యానమూ మొదలైన వాటి చేతలలో; నాకున్; కొఱంత లేదు= లోటు లేదు; నీ చెప్పిన= నీవు చెప్పిన; అగ్ని ప్రముఖ దేవతలన్= అగ్ని మొదలగు దేవతలను; ప్రసన్నులు+ అగు+అట్లు+కాన్= సంతుష్టులుఅయ్యే విధంగా; ఆరాధించినవాఁడన్= పూజించాను; వారికిన్= పాండవులకు; నాకున్+పోలెన్= నావలె; మహత్(మహా)+అనుభావంబులు+కలిగినన్= గొప్ప ప్రభావాలు ఉన్నట్లయితే; పదుమూఁడు సంవత్సరంబులు= పదమూడేళ్ళు; ఆ+భంగిన్= ఆ విధంగా; ఇడుమలన్+పడుదురు+ఏ?= కష్టాలు పడతారా?; చెప్పెదన్, వినుము= చెపుతాను వినుము.

**తాత్పర్యం:** కాబట్టి ఆ దేవతలు ఏ ఒక్కరి వాళ్ళూ కారు. అట్లాకాక ఏదో ఒక పక్షం వహించే మాటయితే వారిది దివ్యత్వం కాదు. అటువంటి దేవత్వంచేత అర్జునుడూ లెస్సగా కాపాడబడలేడు. నా గురించి నీవు బాధపడవద్దు' అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు: పెచ్చురేగి వచ్చే కార్చిచ్చును ఆర్పటానికీ, రాళ్ళ వర్షం ఆపటానికీ, పెనుగాలిని స్తంభింపచేయటానికీ, నీళ్ళ గట్టిగా మంత్రించి, వాటిపై ఏనుగులు గుర్రాలు మొదలైనవాటిని నడిపించటానికీ, నా సైన్యం నడిచేటప్పుడు కావలసినచోట నీళ్ళు పుట్టించటానికీ సమర్థుడిని. సింహాలూ, శరభాలూ, పెద్ద పులులూ, భూతాలూ, బేతాళురూ మొదలయిన క్రూర మృగాల అలజడిని స్తంభింపజేసే విధం నాకు తెలుసు. మిత్రులకు శుభాలూ, శత్రువులకు అశుభాలూ కలిగించే విధం నేనెరుగుదును. ఇంకా ఎన్నో విధాల సిద్ధులను కలిగించే మంత్ర ధ్యానాదుల విషయంలో నాకు లోటు లేదు. నీవు చెప్పిన అగ్ని మొదలగు దేవతలను ప్రసన్నులయ్యేట్లు పూజించాను. పాండవులకు నాకువలె మహాప్రభావమే ఉంటే పదమూడేళ్ళు ఆ విధంగా కష్టా లనుభవిస్తారా? చెపుతా వినుము.

**విశేషం:** మిత్ర శత్రు విషయంబులైన శుభా శుభంబులు- మిత్ర విషయములైన శుభాలు, శత్రు విషయములైన అశుభాలు అని క్రమం. అటువంటి అమానుషాలైన శక్తులు గల తనకు మనుష్యమాత్రులైన పాండవు లొక లెక్కా అని దుర్యోధనుడి ధీమా.

దుర్యోధనుఁడు తండ్రితోఁ దన బలపరాక్రమంబులు సెప్పుట (సం. 5-60-20)

**క. ఏ నలిగిన వారిని సుర । లైనను రక్షింపనోప; రమరు లలిగినం**
**బూని చెడకుండఁ గాతును; । మానవు లొక సరకె నాకు మనుజాధీశా? 263**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అలిగినన్= కోపిస్తే; వారిని= ఎదుటివారిని; సురలు+ఐనను= దేవతలయినా; రక్షింపన్+ఓపరు= కాపాడలేరు; అమరులు= దేవతలు; అలిగినన్= కోపిస్తే కూడా; పూని= యత్నించి; చెడక+ఉండన్= చెడిపోనివిధంగా; కాతును= రక్షిస్తాను; మనుజ+అధి+ఈశా= రాజా; నాకున్; మానవులు= మనుష్యమాత్రులు; ఒక సరకు+ఎ?= ఒక లెక్కా?

**తాత్పర్యం:** రాజా! నాకు కోపం వస్తే వాళ్ళను దేవతలు కూడా రక్షించలేరు. దేవతలకు కోపం వస్తే కూడా, ప్రయత్నించి హానికలుగకుండా ఉండేటట్లు రక్షిస్తాను. అటువంటి నాకు మనుష్య లోక లెక్కా?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి.

**తే. గర్వమున నాడు మాటలుగాఁ దలంప । వలవ; దిది యెల్ల నిక్కంబు; వసుమతీశ!**
**నన్ను నేఁ జెప్పికొందునే యెన్నఁడైన? । నాత్మసంస్తుతి పౌరుషం బగునె చెపుమ? 264**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ!= రాజా!; గర్వమునన్= గర్వంతో; ఆడు మాటలు+కాన్= చెప్పే మాటలుగా; తలంపన్+వలవదు= భావించవద్దు; ఇది+ఎల్లన్= ఇప్పుడు నేను చెప్పినదంతా; నిక్కంబు= నిజం; ఎన్నఁడు+ఐనన్= ఎప్పుడైనా; నన్నున్; నేన్= నేను; చెప్పికొందునే= పొగుడుకొంటానా?; ఆత్మ సంస్తుతి= తనని తాను పొగడుకొనటం; పౌరుషంబు+అగునె చెపుమ?= పురుష లక్షణం ఔతుందా చెప్పుము?

**తాత్పర్యం:** రాజా! నా మాటలను గర్వంతో అన్నవిగా భావించి తీసిపారెయ్యకుము. ఇప్పుడు నేను చెప్పినదంతా నిజం. ఎప్పుడైనా నన్ను నేను పొగడుకొంటానా? ఆత్మస్తుతి పురుషలక్షణమా? చెప్పుము.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'నన్ను నేఁ ... యెన్నఁడైన' అనే విశేషాంశం. 'ఆత్మ సంస్తుతి పౌరుషం బగునె' అనే సామాన్యాంశంచేత సమర్థించబడుతున్నది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**వ. ధర్మతనయాది పాండవేయులును, ద్రుపదాది పాంచాలురును, విరాటాది మాత్స్యులును, వాసుదేవాది యాదవులును, మఱియునుం గేకయ పాండ్య మాగధ చైద్య ప్రముఖ నిఖిల దండనాయకులును నాబారింబడి మున్నీరు సొచ్చిన యేఱుల చందంబున నడంగిపోవుట యవధరించెదుగాక! వారెల్లఁ దేజోధైర్య పరాక్రమోపాయ విచార వివేకంబుల నాయెత్తు వత్తురె? పితామహ ద్రోణ కృపాశ్వత్థామలు శస్త్రాస్త్ర విషయంబులుగా నేమేమి యెఱుంగుదు రెంతెంత నేర్తు రది యెల్ల నెఱుంగుదు; నంతయు నేర్తు' నని పలికి, యందఱు వెఱఁగుపడియుండం, దాను సంజయుతో సంగరంబు తెఱంగు నాలోచనంబుగాఁ బాండవుల దెస మాటలాడుచుండఁ గర్ణుండు ధృతరాష్ట్రుం గైకొనక, ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా నిట్లనియె: 265**

**ప్రతిపదార్థం:** ధర్మ తనయ+ఆది పాండవేయులును= ధర్మరాజు మొదలుగాగల పాండవులూ; ద్రుపద+ఆది పాంచాలురును= ద్రుపదుడు మొదలైన పాంచాలదేశీయులూ; విరాట+ఆది మాత్స్యులును= విరాటుడు మొదలగు మత్స్యదేశీయులూ; వాసుదేవ+ఆది యాదవులును= కృష్ణుడు మున్నగు యాదవులూ; మఱియునున్= ఇంకా; కేకయ పాండ్య మాగధ చైద్య ప్రముఖ నిఖిల దండ నాయకులును= కేకయులు, పాండ్యులు, మాగధులు, చైద్యులు మొదలైన ఎల్ల సేనాధిపతులూ; నా బారిన్+పడి= నా హింసకు లోనయి; మును+నీరు+చొచ్చిన= సముద్రంలో ప్రవేశించిన; ఏఱుల చందంబునన్= నదుల విధంగా; అడంగిపోవుట= రూపుమాసిపోవటం; అవధరించెదవు+కాక= చిత్తగిస్తావు; వారు+ఎల్లన్= వాళ్ళందరూ; తేజస్+ధైర్య పరాక్రమ+ఉపాయ విచార వివేకంబులన్= ధైర్యంలోనూ, పరాక్రమంలోనూ, ఉపాయంలోనూ, ఆలోచనలోనూ, వివేకంలోనూ; నా+ఎత్తు వత్తురె?= నాతో సాటి అవుతారా?; పితామహ ద్రోణ కృప+అశ్వత్థామలు= భీష్ముడూ, ద్రోణుడూ, కృపుడూ, అశ్వత్థామా; శస్త్ర+అస్త్ర విషయంబులుగాన్= శస్త్రాల విషయంలోనూ, అస్త్రాల విషయంలోనూ; ఏమి+ఏమి+ఎఱుంగుదురు; ఎంత+ఎంత; నేర్తురు; అది+ఎల్లన్; ఎఱుంగుదున్; అంతయున్+నేర్తున్; అని పలికి; అందఱున్; వెఱఁగుపడి+ఉండన్= ఆశ్చర్యపడుతూండగా; తాను; సంజయుతోన్; సంగరంబు తెఱంగున్= యుద్ధ పద్ధతిని; ఆలోచనంబు+కాన్= ఆలోచనగా; పాండవుల దెసన్= పాండవులను గూర్చి; మాటలు+ఆడుచున్+ఉండన్= మాటలాడుతూండగా; కర్ణుండు; ధృతరాష్ట్రున్; కైకొనక= పట్టించుకొనక; ధార్తరాష్ట్రునకున్= దుర్యోధనుడికి; ప్రియంబు+కాన్= ఇష్టమయ్యేటట్లు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు మొదలైన పాండవులూ, ద్రుపదుడు మున్నగు పాంచాలురూ, విరాటుడు మొదలగు మాత్స్యులూ, కృష్ణుడు మొదలుగా గల యాదవులూ, ఇంకా కేకయులు, పాండ్యులు, మాగధులు, చైద్యులు మొదలైన ఎల్ల సేనాధిపతులూ, నా హింసకు లోనయి, సముద్రంలో కలిసిన నదుల విధాన రూపుమాసిపోవటం చిత్తగిస్తావులే. వాళ్ళందరూ తేజస్సులోను, ధైర్యంలోను, పరాక్రమంలోను, ఉపాయంలోను, ఆలోచనలోను, వివేకంలోను నాతో సాటి ఔతారా? భీష్ముడికీ, ద్రోణుడికీ, కృపుడికీ, అశ్వత్థామకూ శస్త్రాలను గురించీ, అస్త్రాలను గురించీ ఏమేమి, ఎంతెంత తెలుసో అది అంతా, అంత బాగానూ నాకూ తెలుసు' అని పలికి, అందరూ ఆశ్చర్యంతో చూస్తూండగా, తాను సంజయుడితో యుద్ధవిషయమై పాండవులను గురించి మాటలాడుతూంటే, కర్ణుడు ధృతరాష్ట్రుడిని పట్టించుకొనక దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'మున్నీరు సొచ్చిన యేఱుల చందంబున' - అలంకారం ఉపమ.

**క. 'గురు నలుక నాకు నస్త్ర। స్ఫురణ మెడలె నండ్రు జనులు; బొం కది; పూజా**
**పరతమెయి నమ్మునీశ్వరు। కరుణ గొఱలి మగుడఁ బడయఁ గాంచితిఁ బ్రీతిన్. 266**

**ప్రతిపదార్థం:** జనులు= లోకులు; నాకున్; గురు+అలుకన్= గురుడి కోపం చేత; అస్త్ర స్ఫురణము= అస్త్రాల స్ఫురణ; ఎడలెన్= పోయింది; అండ్రు= అంటారు; అది; బొంకు= అసత్యం; పూజాపరత మెయిన్= పూజాపరత్వంచేత; ఆ+ముని+ఈశ్వరు కరుణ= ఆ మునిశ్రేష్ఠుడి దయ; కొఱలి= అతిశయించి; ప్రీతిన్= సంతోషంతో; మగుడన్= మళ్ళీ; పడయన్+కాంచితిన్= పొందగలిగాను.

**తాత్పర్యం:** 'నాకు గురువుగారి కోపం కారణంగా అస్త్రాలు స్ఫురించ కుండా పోయాయని లోకులంటారు. కాని, అది అసత్యం. నా ఆరాధనాపరత్వంచేత ఆ మునిశ్రేష్ఠుడి దయ అతిశయించి సంతోషంతో మళ్ళీ పొందగలిగాను.

**విశేషం:** 'గురు నలుక' బ్రాహ్మణుడిని అని చెప్పి తన దగ్గర అస్త్రవిద్య నేర్చుకొనే కాలంలో పరశురాముడు కర్ణుడి ఒడిలో పరున్నాడు. అప్పు డొక కీటకం కర్ణుడితొడ కరిచింది. రక్తం కారుతున్నా, కర్ణుడు గురువుగారికి నిద్రాభంగం అవుతుందని ఓర్చుకొని కదలలేదు. కొంతసేపటికి పరశురాముడు లేచి, రక్తం చూచి, బ్రాహ్మణుడయితే ఇంత సహనం ఉండదని ఎంచి 'నీ కులం ఏమిటో చెప్పుము' అన్నాడు. కర్ణుడు తాను సూతకులజుడిని అని చెప్పాడు. అసత్య మాడినందుకు పరశురాముడు కోపించి, ఆపద వచ్చినప్పుడు బ్రహ్మాస్త్రం అతడికి తోచదనీ, మృత్యువు ఆసన్నమైనపుడు తోస్తుందనీ కర్ణుడిని శపించాడు.

**ఉ. కావున నస్త్రశస్త్రము లఖండిత సంపద నొంది యుండు; దే**
**వావలికైన నన్నుఁ జెనయన్ భర; మేఁ గలుగంగ నర్జునుం**
**డే విడిపించు మేదినిఁ? గడింది మగంటిమి యుల్లసిల్లఁగా,**
**నీవు బలంబు మెచ్చ నని నిల్చెద గెల్చెదఁ బాండవేయులన్. 267**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; అస్త్ర శస్త్రములు; అఖండిత సంపదన్= సంపూర్ణ సంపదతో; ఒంది+ఉండున్= ఒప్పి ఉంటాయి; దేవ+ఆవలికిన్+ఐనన్= దేవతల సమూహానికైనా; నన్నున్; చెనయన్= ఎదిరించడం; భరము= కష్టం; ఏన్+కలుగంగన్= నేనుండగా; మేదినిన్= భూమిని; అర్జునుండే= అర్జునుడా; విడిపించున్?= విడిపిస్తాడు?; కడింది మగంటిమి= అధికమైన పరాక్రమం; ఉల్లసిల్లఁగాన్= ప్రకాశించగా; నీవున్= నీవూ; బలంబున్= నీ సైన్యమూ; మెచ్చన్= పొగడగా; అనిన్= యుద్ధంలో; నిల్చెదన్= నిలబడతాను; పాండవేయులన్= పాండవులను; గెల్చెదన్= జయిస్తాను.

**తాత్పర్యం:** కాబట్టి నాకు అస్త్రశస్త్ర సంపద సంపూర్ణంగా ఉన్నది. దేవతలకయినా నన్ను తాకడం కష్టం. నే నుండగా అర్జునుడా భూమిని పట్టుకొని పోవటం? అధికమైన పరాక్రమం ప్రకాశించగా, నీవూ నీ సైన్యమూ ప్రశంసించగా, యుద్ధంలో నిలుస్తాను, పాండవులను గెలుస్తాను.

**శా. గాంగేయాదులు నీకడన్ నిలిచి వేడ్కం జూడఁగా సర్వ సే**
**నాంగాంగంబులమీఁద గాలియును జిట్టాడంగ నీ కేను వీఁ**
**కం గౌంతేయులఁ దాఁకి, తత్తనువు లుగ్రస్ఫారబాణాలిఁ గూ**
**లం గోదండ విలాసముల్ మెఱయ లీలం బోరఁ గ్రీడించెదన్,' 268**

**ప్రతిపదార్థం:** గాంగేయ+ఆదులు= భీష్ముడు మొదలగువారు; నీ కడన్= నీ చెంత; నిలిచి; వేడ్కన్= వేడుకతో; చూడఁగాన్; సర్వ సేనాంగ+అంగంబుల మీఁదన్= రథ గజ తురగ పదాతులనే అన్ని సేనావిభాగాల యొక్క శరీరాల మీదా; గాలియును= గాలి కూడా; చిట్టాడంగన్+ఈక= సోకనియ్యకుండా; ఏను= నేను; వీఁకన్= పరాక్రమంతో; కౌంతేయులన్= పాండవులను; తాఁకి= ఎదిర్చి; తద్+తనువులు= వాళ్ళ మేనులు; ఉగ్ర స్ఫార బాణ+ఆలిన్= భయంకరములూ; అధికములూ అయిన బాణాల వరుస చేత; కూలన్= నేలపై పడేటట్లు; కోదండ విలాసముల్= వింటి లీలలు; మెఱయన్= ప్రకాశించగా; పోరన్= యుద్ధంలో; క్రీడించెదన్= విహరిస్తాను.

**తాత్పర్యం:** భీష్మాదులు నీ దగ్గర ఉండి వేడుక చూస్తూండగా, రథ గజ తురగ పదాతులైన సర్వసేనాంగాల మేనులపై గాలి కూడా సోకనీయక, నేను పరాక్రమంతో పాండవులను ఎదుర్కొని, వాళ్ళ శరీరాలు భయంకర బాణాలచే కూలిపోయేటట్లు వింటి లీలలు ప్రకాశించగా యుద్ధభూమిలో విహరిస్తాను.'

**వ. అనిన విని యినసందనునకు మందాకినీనందనుం డిట్లనియె: 269**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఇన నందనునకున్= సూర్యపుత్రుడికి; (కర్ణుడికి); మందాకినీ నందనుండు= గంగాసుతుడు-(భీష్ముడు); ఇట్లు+అనియెన్:

**తాత్పర్యం:** అనగా విని భీష్ముడు కర్ణుడితో ఇట్లా అన్నాడు :

**క. 'కాలుఁడు ప్రేరేపఁగ నిటు । ప్రేలినయంతటన నిన్నుఁ బెద్దగఁ దలఁపం**
**బోలునె మాకును? నుడుగుము; । చాలుదు నీ వెల్ల పనులు సాధింపంగన్! 270**

**ప్రతిపదార్థం:** కాలుఁడు= యముడు; ప్రేరేపఁగన్= పురికొల్పగా; ఇటు ప్రేలిన+అంతటన్+అ= ఇట్లా వాగగానే; మాకును; నిన్నున్; పెద్దగన్+తలఁపన్+పోలునె?= గొప్పగా భావించడం మంచిదా?; ఉడుగుము= చాలులే; నీవు; ఎల్ల పనులు, సాధింపగన్= అన్ని పనులూ సాధించటానికి; చాలుదు(వు)= సమర్థుడివి!

**తాత్పర్యం:** 'యముడు పురికొల్పగా ఇట్లా నీవు వాగుతూంటే నిన్ను గొప్పగా భావించటం మాకు తగునా? చాలులే ఊరుకో. నీవు అన్ని పనులూ సాధించడానికి సమర్థుడివి!

**విశేషం:** 'చాలుదు నీవెల్ల పనులు సాధింపంగన్' - విపరీత లక్షణచే వ్యతిరేకార్థాన్నే గ్రహించాలి.

**ఉ. కూలెడువారె పాండవులు? ఘోరపుఁబోర నొకం డొకండ యీ**
**చాలెడువార లెల్ల మును చావఁ, గ్రమంబున సేన లన్నియుం**
**గూలఁగఁ గౌరవుల్ పిదపఁ గూలుదు; రింతియకాక, నోరి చే**
**టేల? వృథాభిమానమున నిన్నియుఁ బ్రేలెదు సూతనందనా! 271**

**ప్రతిపదార్థం:** సూత నందనా!= కర్ణా!; పాండవులు; కూలెడువారె?= కూలిపోయేవాళ్ళా?; ఘోరము+పోరన్= భయంకరమైన యుద్ధంలో; ఈ చాలెడు వారలు+ఎల్లన్= ఈ సమర్థులైన వాళ్ళందరూ; ఒకండు+ఒకండు+అ= ఒక్కొక్కడే; మును= ముందు; చావన్= చావగా; క్రమంబునన్; సేనలు+అన్నియున్; కూలఁగన్= కూలిపోగా; పిదపన్= తరువాత, కౌరవుల్; కూలుదురు; ఇంతియ కాక= జరిగేది ఇంతేలే; నోరిచేటు+ఏల?= వాగటం ఎందుకు?; వృథా+అభిమానమునన్= పనికిమాలిన గర్వంతో; ఇన్నియున్+ప్రేలెదు?= ఇన్ని వాగుతావు?

**తాత్పర్యం:** కర్ణా! పాండవులు కూలిపోయేవాళ్ళా? భయంకర యుద్ధంలో ఈ సమర్థులందరూ, ఒక్కొక్కడే ముందు చావగా, క్రమంగా సేనలన్నీ కూలిపోగా, అప్పుడు కౌరవులు చస్తారు. జరిగేది ఇంతేలే. ఊరికే వాగటం ఎందుకు? పనికిమాలిన గర్వంతో ఇన్ని మాటలూ వాగుతావు.

**తే. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి । చేతఁ గవ్వడి పడునని చూతువేని**
**వాసుదేవునిచే నది వ్రయ్యలయ్యుఁ, । దునియ లయ్యును, బొడియయ్యుఁ దొరఁగు ధరణి. 272**

**ప్రతిపదార్థం:** దివిజ పతి= దేవేంద్రుడు; నీకున్; ఇచ్చిన= ఇచ్చినట్టి; తీవ్ర శక్తిచేతన్= తీవ్రమైన శక్త్యాయుధంచేత; కవ్వడి= అర్జునుడు; పడును+అని= కూలుతాడని; చూతువు+ఏనిన్= చూస్తావేమో, అనుకొంటున్నావేమో; అది= ఆ శక్తి; వాసుదేవునిచేన్=

కృష్ణుడిచేత; వ్రయ్యలు+అయ్యున్= ముక్కలయీ; తునియలు+అయ్యును= చిద్రుపలయీ; పొడి+అయ్యున్= చూర్ణం అయీ; నులి అయీ; ధరణిన్= నేలమీద; తొరఁగున్= రాలుతుంది.

**తాత్పర్యం:** దేవేంద్రుడు నీ కిచ్చిన తీవ్ర శక్త్యాయుధంచేత అర్జునుడు కూలిపోతాడని అనుకొంటున్నావేమో, ఆ శక్తి కృష్ణుడిచేత ముక్కలయి, చిద్రుపలయి, చూర్ణమయి నేల రాలుతుంది.

**విశేషం:** తాను అడగగానే అతని సహజ కవచకుండలాలను ఇచ్చిన కర్ణుడి ఔదార్యానికి మెచ్చుకొని ఇంద్రుడు అతడికి, అతడి కోరికపై, ఒక దివ్యశక్తి నిచ్చాడు. దానిని ఒక్కడి మీదనే ఒక్కసారి ప్రయోగించాలని ఇంద్రుడు ఆనతిచ్చాడు. దానిని అర్జునుడిపై ప్రయోగిద్దాం అని కర్ణుడు అనుకొంటాడు. కాని, దానిని ఘటోత్కచుడిపై ప్రయోగించవలసివస్తుంది.

**క. సర్పముఖ శరము గల దను । దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ దలఁపకు; హరి పెం**
**పేర్పడఁగ నదియ కా, దట । తీర్పవలయువాని నెల్లఁ దీర్చు నరునకై.' 273**

**ప్రతిపదార్థం:** సర్ప ముఖ శరము కలదు+అను దర్పంబునన్= సర్పముఖంకల అస్త్రం ఉన్నదనే గర్వంతో; క్రీడిన్= అర్జునుడిని; తొడరన్= ఎదుర్కొనటానికి; తలఁపకు= అనుకొనకు; హరి= కృష్ణుడు; పెంపు+ఏర్పడఁగన్= గొప్పతనం స్పష్టపడేటట్లు; అది+అ= అదే; కాదు; నరునకై= అర్జునుడి కొరకు; అట తీర్పవలయు వానిన్+ఎల్లన్= ఆ నశింపజేయవలసిన వాటినన్నిటినీ; తీర్చున్= నాశనం చేస్తాడు.

**తాత్పర్యం:** నా దగ్గర సర్పముఖం గల అస్త్రం ఉన్నది గదా అనే గర్వంతో అర్జునుడిని ఎదుర్కొందా మనుకొనకు. కృష్ణుడు దానినే కాదు, అర్జునుడి కొరకు నాశనం చేయవలసిన వాటినన్నిటినీ నాశనం చేస్తాడు.'

**వ. అని పలికి, ధృతరాష్ట్రునితో నిట్లనియె: 274**

**తాత్పర్యం:** అని పలికి, ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు :

**క. 'జ్ఞాతులు దమలోఁ బొందినఁ । జేతో మోదమున వెలిఁగి చెలు వొందుదు; ర**
**న్నీతిం బాసిన విగత వి । భూతిం గడకొఱవులట్ల పొగయుదు రధిపా! 275**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా! ధృతరాష్ట్రా!; జ్ఞాతులు= దాయాదులు; తమలోన్= ఒకరితో ఒకళ్ళు; పొందినన్= కలిసి ఉంటే; చేతన్+మోదమునన్= మనస్సంతోషంతో; వెలిఁగి= ప్రకాశించి; చెలువు+ఒందుదురు= ఒప్పుతారు; ఆ+నీతిన్+కలిసి ఉండాలనే ఆ నీతిని; పాసినన్= విడిచిపెడితే; విగత విభూతిన్= పోయిన సంపదతో - సంపద పోయి; కడ కొఱవుల+అట్లు+అ= కాలగా మిగిలి పొగవచ్చే కట్టెలవలె; పొగయుదురు= పొగచిమ్ముతారు- లో లోపల తపిస్తారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! జ్ఞాతులు ఒకళ్ళతో ఒకళ్ళు కలిసి ఉంటే మనస్సంతోషంతో వెలిగి ఒప్పుతారు. ఆ నీతిని విడనాడినట్లయితే, ఐశ్వర్యం కోల్పోయి, కాలగా మిగిలి పొగలు చిమ్మే కట్టెలవలె లో లోపల తపిస్తారు.

**విశేషం:** కడకొఱవు లట్ల- అలంకారం ఉపమ, 'జ్ఞాతులు దమలో.... పొగయుదురు' - ఇదంతా సామాన్యాంశం. దీనిచే 'పాండవులూ కౌరవులూ కలిసి ఉంటే బాగుంటుంది' అనే విశేషాంశం సమర్థించబడుతున్నది కాబట్టి అలంకారం అర్థాంతరన్యాసం.

**వ. కావునఁ దమలో విరోధం బొప్పదు; సంభాషణ సహభోజనాది సత్కారంబులను, సవినయ వర్తనంబులను బ్రీతులైన జ్ఞాతు లిహ పరార్థ సాధకు లగుదు' రని చెప్పి వెండియు. 276**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; తమలోన్ విరోధంబు+ఒప్పదు= తమలో తాము కలహించగూడదు; సంభాషణ సహభోజన+ఆది సత్కారంబులను= మాట్లాడుకొనటం; కలిసి భోజనం చేయటంవంటి సత్కార్యాలచేతా; సవినయ వర్తనంబులను= వినయంతో కూడిన నడవడులచేతా; ప్రీతులు+ఐ= సంతోషించినవారయి; జ్ఞాతులు; ఇహ పర+అర్థ సాధకులు= ఈ లోకపు, పరలోకపు ప్రయోజనాలను సాధించేవారు; అగుదురు; అని; చెప్పి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** కాబట్టి తమలో తాము కలహించటం తగదు. మాటలాడుకొనటం, కలిసి భోజనం చేయటం మొదలైన సత్కారాలచేతా, వినయంతో కూడిన నడవడులచేతా ప్రీతులై జ్ఞాతులు ఈ లోకపు, పరలోకపు ప్రయోజనాలను సాధించగలుగుతారు' అని చెప్పి ఇంకా.

**క. 'విను మే నొక శైలమునకు । మును భూసురవర్గ సహితముగ నొకపనికిం**
**జను నెడఁ జనరాని తటం । బున నొక జున్నుండె; దానిఁ బొగడిరి తద్జ్ఞుల్. 277**

**ప్రతిపదార్థం:** వినుము; మును= పూర్వం; ఏను= నేను; ఒక శైలమునకున్= ఒక కొండకు; భూసురవర్గ సహితముగన్= బ్రాహ్మణుల సమూహంతో కూడా; ఒక పనికిన్= ఒక పనిమీద; చను+ఎడన్= వెళ్ళే సమయంలో; చనన్+రాని తటంబునన్= దుర్గమమైన చరియఅందు; ఒక; జున్ను= తేనెపట్టు; ఉండెన్; దానిన్; తద్జ్ఞుల్= తెలిసినవారు; పొగడిరి.

**తాత్పర్యం:** 'వినుము. పూర్వం నేను ఒక కొండమీదికి బ్రాహ్మణ సమూహంతో కూడా ఒక పని మీద వెళ్ళేటప్పుడు దుర్గమమైన చరియయందు ఒక తేనెపట్టు ఉన్నది. తెలిసినవారు దానిని పొగిడారు.

**తే. 'దీని తేనియఁ ద్రావిన మానవులకు । జరయు రుజయును దప్పియుఁ జావుఁ గలుగ'**
**వనఁగఁ, గొందఱు బోయలు విని, కడంగి । యుఱక మొఱకలై చఱిఁబడ నుఱికి రపుడు. 278**

**ప్రతిపదార్థం:** దీని తేనియన్; త్రావిన మానవులకున్= త్రాగిన మనుష్యులకు; జరయున్= ముసలితనమూ; రుజయును= రోగమూ; డప్పియున్= ఆయాసమూ, దాహమూ; చావున్; కలుగవు+అనఁగన్; కొందఱు బోయలు; విని; కడంగి= పూని; అపుడు; ఉఱక= లక్ష్యపెట్టక; మొఱకులు+ఐ= మూర్ఖులయి; చఱిన్= చరియలో; పడన్; ఉఱికిరి.

**తాత్పర్యం:** దీని తేనె త్రాగిన మనుష్యులకు ముసలితనమూ, రోగమూ, శ్రమా, (దాహమూ), చావూ ఉండవని అనగా, కొందరు బోయలు విని, పూని, మూర్ఖులై లక్ష్యపెట్టక అప్పుడు చరియలో పడేటట్లు ఉరికారు.

**వ. ఇట్లుఱికి మృతిఁ బొంది; రట్లపోలె నవినీతు లైన నీ కొడుకులు పుడమి యెల్లను దార యేలుతీపుఁ జూచెదరుగాని తమ పొలిసి పోవుటం గానరు; వీర లర్జునుతోడం బెనంగి మానప్రాణంబులు దక్కించుకొనువారె? యట్లుంగాక సమబలులైననుం గయ్యంబునఁ గదా వీరౌదురు వారౌదు రనవచ్చు; నదియేల నీలోనికి ధర్మనందనుం దెచ్చికొనుటయ నీకుఁ గర్తవ్యం' బనిన బాహ్లికుండు ధార్తరాష్ట్రున కిట్లనియె: 279**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ఉఱికి; మృతిన్+పొందిరి= మరణించారు; అట్లు+అ పోలెన్= ఆ రీతిగానే; అవినీతులు+ఐన నీ కొడుకులు= అవినయపరులైన నీ కొడుకులు; పుడమి+ఎల్లను= భూమినంతనూ; తారు+అ= తామే; ఏలు తీపున్+చూచెదరు+

కాని= పరిపాలించాలనే తీపి కొరకు చూస్తారు కాని, తమ పొలిసిపోవుటన్+కానరు= తాము చచ్చిపోతామని చూడరు; వీరలు; అర్జును తోడన్; పెనంగి= పోరి; మాన ప్రాణంబులు= మానాన్నీ, ప్రాణాన్నీ; దక్కించుకొనువారె?= నిలుపుకొంటారా?; అట్లున్+కాక= అట్లాకాక; సమ బలులు+ఐననున్= సమానమైన బలం కలవాళ్ళయినా; కయ్యంబునన్+కదా= యుద్ధంలో కదా; వీరు+ఔదురు, వారు+ఔదురు+అనన్+వచ్చున్= వీళ్ళు సమర్థులు, వాళ్ళు సమర్థులు అనవచ్చును; అది+ఏల= అదంతా ఎందుకు?; నీ లోనికిన్; ధర్మనందనున్= ధర్మరాజును; తెచ్చికొనుట+అ= తెచ్చుకొనటమే; నీకున్; కర్తవ్యంబు= చేయదగింది; అనినన్; బాహ్లికుండు; ధార్తరాష్ట్రునకున్= దుర్యోధనుడికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లా ఉరికి మరణించారు. అట్లాగే అవినయపరులైన నీ కొడుకులు భూమినంతనూ తామే ఏలాలనే తీపి కోసం చూస్తారుగాని తాము చచ్చిపోతామేమో అని చూడరు. వీళ్ళు అర్జునుడిని ఎదుర్కొని మానప్రాణాలు దక్కించుకొంటారా? అట్లాకాక, సమానమైన బలం కలవాళ్ళయినా, యుద్ధంలోగదా వీరి సామర్థ్యాలూ, వారి సామర్థ్యాలూ తేలేది? అదంతా ఎందుకు? ధర్మరాజును నీలోకి తెచ్చుకొనటం నీకు కర్తవ్యం' అనగా; బాహ్లికుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** భీష్ముడు ధృతరాష్ట్రుడితో చెప్పిన జ్ఞాతులు ప్రవర్తించవలసిన విధంగానీ, జున్ను కొరకు ఆశపడి మరణించిన బోయల వృత్తాంతంగానీ, సంస్కృత భారత ప్రతులలో కానరావు.

**క. 'కను బ్రమసిన తెరువరి తన । కనపాయం బైన మార్గ మరసి తగ నెఱిం**
**గినవారు సెప్పఁగాఁ గై । కొనని కరణిఁ దగిన వెంటకుం జొర వకటా!' 280**

**ప్రతిపదార్థం:** ఎఱింగినవారు= తెలిసినవాళ్ళు; తనకున్; అనపాయంబు+ఐన మార్గము= అపాయంలేని దారి; అరసి= చూచి; తగన్= ఒప్పుగా; చెప్పఁగాన్= కనుబ్రమసిన తెరువరి= కళ్ళు మిరుమిట్లుగొన్న బాటసారి; కైకొనని కరణిన్= అవలంబించని విధంగా; అకటా!= అయ్యో!; తగిన వెంటకున్+చొరవు= తగిన దారికి నీవు రావు.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! తెలిసినవాళ్ళు తనకు అపాయం లేని దారి చూపి ఒప్పుగా చెప్పగా కళ్ళు మిరుమిట్లుగొన్న పాంథుడు అవలంబించని విధంగా, అయ్యో! నీవు తగిన దారికి రావుగదా!'

**విశేషం:** అలం: ఉపమ. బాహ్లికుడనిన ఈ మాటలు సంస్కృత భారత ప్రతులలో గానరావు.

**వ. అనిన వైచిత్రవీర్యుండు దుర్యోధనున కిట్లనియె: 281**

**తాత్పర్యం:** అనగా, ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**మ. 'కొడుకా! యే నెటు లట్ల బాహ్లికుఁడు నీకుం గూర్చు, భీష్ముండు నీ**
**యెడ సస్నేహుఁడు, వీరి మాట విను; మే మీ ముప్పురున్ మన్ననల్**
**వడయంగాఁ దగునట్టివారము; నినుం బ్రార్థించెదన్ ధర్మజున్**
**విడువంగాఁ దగ, దిమ్ము వారలకు నుర్విం బాలు నెమ్మిం దగన్.' 282**

**ప్రతిపదార్థం:** కొడుకా!= బిడ్డా!; ఏను+ఎటులు+అట్లు+అ= నే నెట్లాగో అలాగే; బాహ్లికుఁడు; నీకున్+కూర్చున్= నీవంటే ఇష్టపడతాడు; భీష్ముండున్= భీష్ముడుకూడా; నీ+ఎడన్= నీ విషయంలో; సస్నేహుఁడు= స్నేహభావంతో కూడినవాడు; వీరి

మాట వినుము; ఏము+ఈ మువ్వురున్= ఈ మేము ముప్పురమూ; మన్ననల్+పడయంగాన్+తగు+అట్టి వారము= మన్ననలు పొందదగిన వాళ్ళం; నినున్; ప్రార్థించెదన్= బతిమాలుతాను; ధర్మజున్; విడువంగాన్+తగదు= విడిచిపెట్టదగదు; వారలకున్= పాండవులకు; ఉర్విన్= భూమిలో; పాలు= భాగం; నెమ్మిన్= సంతోషంతో; తగన్= ఒప్పుగా; ఇమ్ము.

**తాత్పర్యం:** 'నాయనా! దుర్యోధనా! నా వలెనే బాహ్లికుడు కూడా నీవంటే ఇష్టపడతాడు. భీష్ముడు కూడా నీయందు స్నేహభావం కలిగి ఉంటాడు. వీళ్ళ మాట విను. ఈ మేము ముప్పురమూ నీ మన్ననలు పొందదగినవాళ్ళం. నిన్ను బతిమాలుకుంటానురా. ధర్మరాజును విడిచిపెట్టదగదురా. వాళ్ళకు భూమిలో వాటా ప్రీతితో ఒప్పుగా ఇయ్యరా!'

**క. అనినను వెండియు నొడఁబా । టునకుఁ జొరని దానికిం గొడుకుతోడఁ గడుం**
**గినిసి ధరణీశ్వరుం డి । ట్లనుఁ గొలువున నున్న వార లందఱు వినఁగన్. 283**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; వెండియున్= ఇంకా; ఒడఁబాటునకున్+చొరనిదానికిన్= సమ్మతించకపోవటానికి; కడున్= మిక్కిలి; కినిసి= కోపించి; ధరణీ+ఈశ్వరుఁడు= రాజు-ధృతరాష్ట్రుడు; కొలువునన్+ఉన్నవారలు+అందఱున్= సభలో ఉన్నవాళ్ళందరూ; వినఁగన్= వినేటట్లు; కొడుకుతోడన్; ఇట్లు+అనున్.

**తాత్పర్యం:** అని తాను చెప్పగా, ఇంకా సమ్మతించకపోవటానికి మిక్కిలి కోపించి ధృతరాష్ట్రుడు సభలో ఉన్నవాళ్ళందరూ వింటూండగా కొడుకుతో ఇట్లా అన్నాడు:

**తే. 'బవరములు గావె! విఱిగిన బార సాఁప । వచ్చునే? యొక్కరుండ వివ్వచ్చుఁ డదరి**
**పసులఁ బెట్టించునపుడు నీ బలము విఱుగ । దయ్యెనే? నీవుఁ గర్ణుండు నచట లేరె?' 284**

**ప్రతిపదార్థం:** బవరములు+కావె?= యుద్ధాలు జరగలేదా?; విఱిగిన బార+చాఁపవచ్చునే?= విరిగిపోయిన చేయి చాపవచ్చా? (ఓడిపోయి మళ్ళీ యుద్ధానికి పూనుకొనవచ్చా?); వివ్వచ్చుఁడు+ఒక్కరుండు+అ= బీభత్సుడు (అర్జునుడు) ఒక్కడే; అదరి= విజృంభించి; పసులన్= పశువులను; పెట్టించు+అపుడు= విడిపించే సమయంలో; నీ బలము= నీ సైన్యం; విఱుగదయ్యెనే?= పారిపోలేదా?; అచటన్= అక్కడ; నీవున్+కర్ణుండున్= నీవూ; కర్ణుడూ; లేరె?= లేరా?

**తాత్పర్యం:** 'ఇదివరలో యుద్ధాలు జరగలేదా? విరిగిపోయిన చేయి చాచవచ్చా?- ఓడిపోయి మళ్ళీ యుద్ధానికి పూనుకొనవచ్చా? అర్జును డొక్కడూ విజృంభించి పశువులను విడిపించేటప్పుడు నీ సైన్యం పారిపోలేదా? నీవూ, కర్ణుడూ అక్కడ లేరా?'

**వ. అని రాధేయు దిక్కు మొగంబై మఱియు నిట్లనియె: 285**

**తాత్పర్యం:** అని కర్ణుడికేసి చూసి ధృతరాష్ట్రుడు ఇంకా ఇట్లా అన్నాడు:

**ఆ. 'నాఁటి కొలఁది గాదు; నారాయణుఁడు నొగ । లెక్కఁ, గెలన భీముఁ డేచి నడవ,**
**ననుజ తనుజ సహితుఁడై వచ్చు వివ్వచ్చు । మార్కొనంగ వశమె మనకుఁ గర్ణ! 286**

**ప్రతిపదార్థం:** కర్ణ!; నాఁటి కొలఁది+కాదు= అప్పటివలె అనుకొన్నావేమో! (గోగ్రహణ సమయంలో ఉన్నంతే అనుకొన్నావేమో); కాదు= అంత మాత్రమే కాదు; నారాయణుఁడు= కృష్ణుడు; నొగలు+ఎక్కన్= రథం తొట్టెలో కూర్చుండగా; కెలనన్= ప్రక్కన;

భీముఁడు; ఏచి= విజృంభించి; నడవన్= నడవగా; అనుజ తనుజ సహితుఁడు+ఐ= తమ్ములతో; కొడుకులతో కూడినవాడయి; వచ్చు వివ్వచ్చున్= వచ్చే బీభత్సుడిని- అర్జునుడిని; మనకున్; మార్కొనంగన్+వశమె?= ఎదుర్కొనతరమా?

**తాత్పర్యం:** 'కర్ణా! అప్పటివలె- గోగ్రహణ సమయంలో వలె- అంతమాత్రమే అనుకొన్నావేమో! కాదు. కృష్ణుడు సారథి అయి రథం తొట్టెలో కూర్చుండగా, ప్రక్కన భీముడు విజృంభించి నడవగా, తమ్ములతోనూ, కొడుకులతోనూ వచ్చే బీభత్సుడిని ఎదుర్కొనటం మన తరమా?

**విశేషం:** 'ఉత్తర గోగ్రహణ సమయంలో అర్జును డొక్కడే దండెత్తి వచ్చాడు. ఇప్పు డట్లా కాదే! ఒక్కడూ వచ్చినప్పుడే మనం ఓడిపోయాము. ఇప్పుడు వాళ్ళందరితోనూ వస్తే అర్జునుడిని మనం ఎదుర్కొనగలమా?' అని భావం. ఇక్కడ బీభత్సుడు అనే పదానికి వికృతియైన 'వివ్వచ్చుడు' అనే శబ్దాన్ని సాభిప్రాయంగా ప్రయోగించటం వలన అలంకారం పరికరాంకురం. యుద్ధంలో అర్జునుడు బీభత్సం చేస్తాడు కాబట్టి అతనికి బీభత్సుడనే పేరు వచ్చింది.

**చ. బలమును దర్పమున్ మెఱయ బంటుతనంబున నీవు పాండవే**
**యుల నని మార్కొనం గడఁగు టొప్పెడు తెంపగుఁ; జచ్చి శుద్ధుఁడై**
**పలుకులు మాన్పు భృత్యుఁ డను పాటి దలంచెద; విట్లు మేలె? య**
**చ్ఛలమున నీ సుయోధనుని చావున కోర్చుట గాదె యంతయున్? 287**

**ప్రతిపదార్థం:** నీవు; బలమును= పరాక్రమమూ; దర్పమున్= గర్వమూ; మెఱయన్= ప్రకాశించగా; బంటుతనంబునన్= శూరత్వంతో; పాండవేయులన్= పాండవులను; అనిన్= యుద్ధంలో; మార్కొనన్+కడఁగుట= ఎదుర్కొన పూనటం; ఒప్పెడు తెంపు+అగున్= మంచి సాహసమే అవుతుంది; చచ్చి; శుద్ధుఁడు+ఐ= పవిత్రుడయి; పలుకులు= నిందలు; మాన్పు= పరిహరించే (పోగొట్టే); భృత్యుఁడు= సేవకుడు; అను పాటి= అనే మాత్రం (అంత మాత్రమే); తలంచెదవు= అనుకొంటున్నావు; ఇట్లు మేలె?= ఈ రీతి మంచిదా?; ఇంతయున్= ఇదంతా; (నీవు పాండవులను ఎదుర్కొనటం); అచ్చలమునన్= పట్టుదలతో;- పూనికతో; ఈ సుయోధనుని చావునకున్= ఈ దుర్యోధనుడి చావుకు; ఓర్చుట+కాదె!= సహించటమే కదా!

**తాత్పర్యం:** 'నీవు పరాక్రమమూ, గర్వమూ ప్రకాశించగా శూరత్వంతో పాండవులను ఎదురుకొనపూనటం మంచి సాహసమే అవుతుంది. 'కర్ణుడు చచ్చి పవిత్రుడై నిందలు పోగొట్టుకొన్న భృత్యుడు' అనే పేరు సంపాదిస్తావు. నీవు అంతమాత్రమే కోరుకొంటున్నావు. ఇది మంచిది కాదు. ఎందుచేతనంటే- ఇదంతా ఈ దుర్యోధనుడికి చావు మూడటమే అవుతుంది. దానిని సహించటమే అవుతుంది.'

**విశేషం:** 'చచ్చి శుద్ధుఁడై' - పాండవులను ఎదిరించటం మంచి సాహసమే అయినా ఆ యుద్ధంలో నీవు తప్పక చస్తావని సూచన. చచ్చి పవిత్రుడై నిందలు పాపిన భృత్యుడు కర్ణుడు అనే పేరు నీకు వస్తుంది. నీవు అదొక్కటే చూచుకొంటున్నావు. ఇది న్యాయం కాదు. ఎందుచేతనంటే ఇదంతా దుర్యోధనుడి చావుకే కారణం కనక.

**వ. అనిన విని కానీనుండు సంక్షుభితమానసుండై 'యిది యెల్ల నిట్లయ్యె; నిట్లుం గాక, తక్కినయది యట్లుండె; నదీ సూనుండు నన్ను నిరాకరించి పలికిన పలుకుల ఫలం బనుభవించుం గాక!' యని యతని నుద్దేశించి యిట్లనియె: 288**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; కానీనుండు= కన్యాపుత్త్రుడు - కర్ణుడు; సంక్షుభిత మానసుండు+ఐ= మిక్కిలి కలగిన మనస్సు కలవాడయి; ఇది+ఎల్లన్= ఇదంతా; ఇట్లు+అయ్యెన్= ఇట్లా అయింది; ఇట్లున్+కాక= ఇట్లా కాక; తక్కిన+అది= తక్కినది; అట్లు+ఉండెన్= అట్లా ఉండగా; నదీ సూనుండు= గంగానది కొడుకు- భీష్ముఁడు; నన్నున్; నిరాకరించి= తిరస్కరించి; పలికిన పలుకులు ఫలంబు; అనుభవించున్+కాక= తప్పక అనుభవిస్తాడు; అని; అతనిన్+ఉద్దేశించి= అతడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రు డనగా విని కర్ణుడు కలగిన మనస్సు కలవాడయి 'ఇదంతా ఇట్లా అయింది. తక్కినది అట్లా ఉండగా భీష్ముడు నన్ను తిరస్కరించి పలికిన పలుకుల ఫలితం తప్పకుండా అనుభవిస్తాడు' అని అతడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** ధృతరాష్ట్రుడు కూడా తనను నిరాకరించి పలికినా, ఆ మాటలకంటె భీష్ముడి తిరస్కారవాక్యాలే కర్ణుడికి ఎక్కువ బాధ కలిగించాయి.

### కర్ణుఁడు భీష్మునిపై రోషముచేత నస్త్రసన్న్యాసంబు సేయుట (సం. 5-61-13)

**తే.** **'నీకు నా లావు తోడ్పాటు లేకయుండ ၊ వలయు; నీ తెగునంతకుఁ గలన నిలువ;**
**నాయుధంబులు విడిచితి; నంత మీఁద ၊ మెఱసి బలవిక్రమంబులు నెఱపువాఁడ.'** **289**

**ప్రతిపదార్థం:** నీకున్; నా లావు తోడ్పాటు= నా బలం తోడు; లేక+ఉండవలయున్= లేకపోవాలి; నీ తెగు+అంతకున్= నీవు చచ్చేదాకా; కలనన్= యుద్ధంలో; నిలువన్= ఉండను; ఆయుధంబులు; విడిచితిన్; అంతమీఁదన్= ఆపైని (నీవు చచ్చినమీదట); మెఱసి= విజృంభించి; బల విక్రమంబులు= బలపరాక్రమాలు; నెఱపువాఁడన్= చూపిస్తాను.

**తాత్పర్యం:** 'నీకు నా బలం తోడు లేకుండా ఉండాలి. నీవు చచ్చేవరకూ నేను యుద్ధభూమిలో అడుగుపెట్టను. అస్త్రాలు విడిచాను. ఆ తరువాత - నీవు చనిపోయిన తరువాత - విజృంభించి నా బలపరాక్రమాలు చూపిస్తాను.'

**విశేషం:** కర్ణుడు పంతానికి పోయి, భీష్ముడి మీది ద్వేషం కొద్దీ, రాజభక్తినీ, తన కర్తవ్యాన్నీ విస్మరించి అవివేకంతో ఇట్లాంటి శపథం చేశాడు.

**వ.** **అని శస్త్రసన్న్యాసంబుసేసి కొలువున నిలువనొల్లక దిగ్గన లేచిపోయె; నట్టియెడ శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో నిట్లనియె:** **290**

**ప్రతిపదార్థం:** అని; శస్త్రసన్న్యాసంబు+చేసి= శస్త్రాలు విడిచిపెట్టి; కొలువునన్= సభలో; నిలువన్+ఒల్లక= ఉండటానికి ఇష్టపడక; దిగ్గనన్= వెంటనే; లేచిపోయెన్; అట్టి+ఎడన్= ఆ సమయంలో; శాంతనవుండు= భీష్ముడు; నవ్వుచున్; దుర్యోధనునితోన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని శస్త్రసన్న్యాసం చేసి కర్ణుడు సభలో ఉండటానికి ఇష్టపడక వెంటనే లేచి వెళ్ళిపోయాడు. అప్పుడు భీష్ముడు నవ్వుతూ దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**క. 'అంతకుఁ జాలఁడె కర్ణుం? । డింతకు మును బాస యిచ్చి యెన్నఁడు బొంకం!**
**డింతటి మానిసి యలిగినఁ । గౌంతేయుల కెట్లు బ్రదుకఁగా వచ్చు ననిన్?' 291**

**ప్రతిపదార్థం:** కర్ణుండు; అంతకున్+చాలఁడె?= అందుకు తగ్గవాడు కాడా?; ఇంతకున్+మును= ఇంతకు పూర్వం; బాస+ ఇచ్చి= శపథం చేసి; ఎన్నఁడున్= ఎప్పుడూ; బొంకండు= అసత్యమాడడు; (మాట తప్పేవాడే ఎప్పుడూ అని భావం); ఇంతటి మానిసి= ఇంత సమర్థుడైనవాడు; అలిగినన్= కోపిస్తే; అనిన్= యుద్ధంలో; కౌంతేయులకున్= పాండవులకు; ఎట్లు బ్రదుకఁగాన్ వచ్చున్= బ్రదకటానికి ఎలా సాధ్యమవుతుంది?

**తాత్పర్యం:** 'కర్ణుడు అందుకు తగ్గవాడు కాడా? ఇంతకుముందు ప్రతిజ్ఞ చేసి ఎప్పుడూ బొంకడు! ఇంతటి మహావీరుడు అలిగితే యుద్ధంలో పాండవులెట్లా బ్రదకగలరు?'

**విశేషం:** విపరీత లక్షణచే భీష్ముడి మాటలకు వ్యతిరేకభావాన్నే గ్రహించాలి. కర్ణుడు అస్త్రసన్న్యాసం చేయటానికి తగినవాడే అనీ, మాట తప్పటం ఎప్పుడూ అతడికి అలవాటే అనీ, ఇంతటి మహావీరుడు అలిగితే యుద్ధంలో పాండవులకు ఏమీ కాదనీ భావం.

**క. అని వెండియు నిట్లను: 'నా । తని మాటల కెట్లుఁ గడఁగి ధర్మతనయుతో**
**నని సేయక తక్కవు నీ । వనుమానము వాయఁ జూడు మతనిని, నన్నున్. 292**

**ప్రతిపదార్థం:** అని, వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనున్; నీవు; ఆతని మాటలకున్; ఎట్లున్= ఎట్లా అయినా; కడఁగి= పూని; ధర్మ తనయుతోన్= ధర్మరాజుతో; అని+చేయక తక్కవు= యుద్ధం చేయకుండా ఉండవు- యుద్ధం చేసి తీరుతావు; అనుమానము= సందేహం; పాయన్= పోయేటట్లు; అతనిని= ఆ కర్ణుడినీ; నన్నున్; చూడుము.

**తాత్పర్యం:** అని భీష్ము డింకా ఇట్లా అన్నాడు: 'నీవు అతడి మాటలను పట్టుకుని' అతడి 'భరోసా' చూచుకొని ధర్మరాజుతో ఎట్లాగూ యుద్ధం చేసితీరుతావు. నీ అనుమానం తీరేటట్లు అప్పుడు అతడినీ నన్నూ చూద్దువుగాని- (మా ఇద్దరి పరాక్రమాల తారతమ్యం నీకప్పుడు నిస్సందేహంగా బోధపడుతుందని భావం.)

**వ. ఏను బాహ్లిక ద్రోణ ప్రముఖులు గనుంగొనుచుండఁ బ్రతివీరుల ననేక సహస్రంబుల సమయించెదఁ; బిదప రాధేయు రణంబునుం జూచెదవుగాక!' యనిన విని దుర్యోధనుండు కర్ణ పక్షపాతియు, నవినీతుండు నగుటం జేసి సహింపక పితామహుతో నిట్లనియె: 293**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; బాహ్లిక ద్రోణ ప్రముఖులు= బాహ్లికుడూ, ద్రోణుడూ మొదలగువారు; కనుంగొనుచున్+ఉండన్= చూస్తూండగా; ప్రతివీరులన్+అనేక సహస్రంబులన్= పెక్కువేలమంది శత్రువీరులను; సమయించెదన్= చంపుతాను; పిదపన్= తరువాత; రాధేయు రణంబునున్= కర్ణుడి యుద్ధం కూడా; చూచెదవు+కాక= చూద్దువులే; అనినన్; విని; దుర్యోధనుండు; కర్ణ పక్షపాతియున్= కర్ణుడి మీద పక్షపాతం కలవాడూ; అవినీతుండున్= అవినయపరుడూ; అగుటన్+చేసి= కావడంచేత; సహింపక= ఓర్వక; పితామహుతోన్= భీష్ముడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నేను బాహ్లికుడూ, ద్రోణుడూ మొదలైనవారు చూస్తుండగా పెక్కువేల మంది శత్రువీరులను చంపుతాను. తరువాత కర్ణుడి యుద్ధనైపుణ్యం కూడా చూద్దువుగాని' అనగా విని దుర్యోధనుడు కర్ణుడి మీద పక్షపాతం కలవాడూ, అవినయపరుడూ కావటంచేత ఓర్వక భీష్ముడితో ఇట్లా అన్నాడు:

**చ.** **'ఎఱిఁగి యెఱింగి యొండె, మది నేది యెఱుంగక యొండె నెప్డు నం**
**దఱు వినఁ 'బాండునందనులు దర్పితులై యని గెల్తు' రండ్రు; ముం**
**దఱ నిను బాహ్లికున్ గురునిఁ దక్కటివారిని నమ్మి యేను నే**
**డ్తెఱ నని సేయఁబూనితిఁ; గడింది మగంటిమి తోడు సాలదే? 294**

**ప్రతిపదార్థం:** ఎఱిఁగి+ఎఱింగి+ఒండెన్= తెలిసి తెలిసో; మదిన్= మనస్సులో; ఏది+ఎఱుంగక+ఒండెన్= ఏమీ తెలియకో; ఎప్డున్= ఎప్పుడూ; అందఱున్= అందరూ; వినన్= వినేటట్లు; పాండునందనులు= పాండవులు; దర్పితులు+ఐ= గర్వించినవారయి; అనిన్= యుద్ధంలో; గెల్తురు= గెలుస్తారు; అండ్రు= అంటారు; ముందఱన్= మొదట; నినున్= నిన్నూ; బాహ్లికున్; గురునిన్= ద్రోణుణ్ణీ; తక్కటివారిని= తక్కినవాళ్ళనూ; నమ్మి; ఏను; ఏడ్తెఱన్= విజృంభణంతో; అని+చేయన్+పూనితిన్= యుద్ధం చేయటానికి సిద్ధపడ్డాను; కడింది మగంటిమి తోడు= అధికమైన పరాక్రమం యొక్క సాయం; చాలదే?= సరిపోదా?

**తాత్పర్యం:** తెలిసో తెలియకో అందరూ 'పాండవులు పరాక్రమ గర్వంతో యుద్ధంలో గెలుస్తా'రని అంటారు. మొదట నిన్నూ, బాహ్లికుడినీ, ద్రోణుడినీ, తక్కినవాళ్ళనీ నమ్ముకొని విజృంభించి యుద్ధం చేయడానికి సిద్ధపడ్డాను. నా అధికమైన పరాక్రమం తోడ్పాటు సరిపోదా?

**ఉ.** **కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నా కొరులేల? సద్భటా**
**కీర్ణ విరోధి సైన్యముల గెల్వఁగఁ జాలుదు మేము; మాకు నీ**
**యర్ణవ వేష్టిత క్షితి యనర్గళ విక్రమ మొప్పదక్కు; మా**
**నిర్ణయ మెల్ల నిట్టి; దవినీతియొ నీతియొ చూడుమీ తుదిన్.' 295**

**ప్రతిపదార్థం:** కర్ణుఁడును; దుస్ససేనుఁడును= దుశ్శాసనుడూ; కల్గఁగన్= ఉండగా; నాకున్; ఒరులు+ఏల= ఇతరు లెందుకు; ఏము+అ= మేమే; సత్+భట+విరోధి సైన్యములన్= గొప్ప వీరులతో గూడిన శత్రు సేనలను; గెల్వఁగన్+చాలుదుము; గెలవగలం; మాకున్; అనర్గళ విక్రమము+ఒప్పన్= అడ్డులేని పరాక్రమం ఒప్పగా; ఈ అర్ణవ వేష్టిత క్షితి= ఈ సముద్ర పరివృతమైన భూమి; దక్కున్= లభిస్తుంది; మా నిర్ణయము+ఎల్లన్= మా నిశ్చయమంతా; ఇట్టిది; అవినీతియొ; నీతియొ; తుదిన్= చివర; చూడుమీ.

**తాత్పర్యం:** కర్ణుడూ, దుశ్శాసనుడూ ఉండగా నాకు ఇతరులెందుకు? మంచి వీరులతో వ్యాపించిన శత్రుసేనలను మేమే గెలవగలం. ఈ సముద్ర పరీత భూమి అడ్డులేని పరాక్రమం ఒప్పగా మాకు దక్కుతుంది. ఇదీ మా నిశ్చయం. అవినీతో, నీతో చివరకు చూడుము'.

**క.** **అను పలుకులకు విషాదము । దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు దననందను నే**
**మనియుం బలుకఁగఁజాలక । వెనుఁబాటున నిట్టులనియె విదురునితోడన్. 296**

**ప్రతిపదార్థం:** అను పలుకులకున్= దుర్యోధను డన్న ఆ మాటలకు; విషాదము= విచారం; తనుకఁగన్= కలుగగా; ధృతరాష్ట్ర విభుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; తన నందనున్= తన కొడుకును; ఏమి+అనియున్+పలుకఁగన్+చాలక= ఏమీ అనలేక; వెనుఁబాటునన్= విచారంతో; విదురునితోడన్; ఇట్టులు+అనియెన్.

**తాత్పర్యం:** దుర్యోధనుడి మాటలకు దుఃఖం కలుగగా, ధృతరాష్ట్ర మహారాజు తన కొడుకును ఏమీ అనలేక విచారంతో విదురుడితో ఇట్లా అన్నాడు:

**తే. 'మృత్యుపాశోపహతుఁడయ్యె మీఁదు లేక। సూతనందనుతోఁగూడి నా తనూజుఁ**
**డకట! నాశంబుఁ బొందువాఁడయ్యెఁ; మనకు। నింకఁ జేయంగ నగుపని యెద్ది చెపుమ?' 297**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; నా తనూజుఁడు= నా కొడుకు; మీఁదు లేక= పైని లేక - తనకంటె అధికుడు లేక; సూత నందనుతోన్= కర్ణుడితో; కూడి= కలిసి; మృత్యుపాశ+ఉపహతుఁడు+అయ్యెన్= మృత్యుపాశాలచేత కొట్టబడినవాడు అయ్యాడు; నాశంబున్+పొందువాఁడు+అయ్యెన్= నశిస్తున్నాడు; మనకున్; ఇంకన్; చేయంగన్+అగు పని= చేయదగినపని; ఎద్ది= ఏది; చెపుమ= చెప్పుము.

**తాత్పర్యం:** 'అయ్యో! నా కొడుకు పైనెవడూ లేక కర్ణుడితో కలిసి మృత్యుపాశాలలో చిక్కుకున్నాడు. నశిస్తున్నాడు. ఇంక మనకు చేయదగిం దేదో చెప్పుము.'

**వ. అనిన విని విదురుం డతని కిట్లను: 'మనవారలు మున్న దుర్బలులు. తమలోనం బెనంకువలయి విరస వచనంబు లాడుచు నింతలు పుట్టించుట యది యర్జుననకుఁ గార్యసాధనం బింతియకాక యే మనువారము? వారలు బంధుమిత్త్ర సహాయులుం దారును నొక్క తలంపువారలయి యున్నవారు. వలవని యీ వెంగలి మాటలు విడిచి పాండవులం బిలువం బనిచి తగవు నడపుటదక్క మనకుఁ జేయందగుపని వేఱొండు గలుగునే?' యని చెప్పిన, ధృతరాష్ట్రుండు సంజయు చెప్పిన కార్యవచనంబులు కొఱంత వినంగలవాఁడై యతని దిక్కు మొగంబు సేసి. 298**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; విదురుండు; అతనికిన్; ఇట్లు+అనున్; మనవారలు; మున్ను+అ= ముందే; దుర్బలులు= బలహీనులు; తమలోనన్; పెనంకువలు+అయి= కలహాలయి; విరస వచనంబులు+ఆడుచున్= దుర్భాషలాడుతూ; ఇంతలు పుట్టించుట= ఇంతా కలిగించడం; అది అర్జుననకున్; కార్యసాధనంబు= ప్రయోజనాన్ని సాధించిపెట్టేది; ఇంతియకాక ఏమి+అనువారము?= ఇంతేతప్ప ఏమంటాం?; వారలు= పాండవులు; బంధు మిత్త్ర సహాయులున్+తారునున్= చుట్టాలూ, స్నేహితులూ, తోడువచ్చినవాళ్ళూ; ఒక్క తలంపు వారలు+అయి+ఉన్నవారు= ఏకాభిప్రాయులై ఉన్నారు; వలవని+ఈ వెంగలి మాటలు= పనికిరాని ఈ పిచ్చిమాటలు; విడిచి; పాండవులన్; పిలువన్+పనిచి= పిలిపించి; తగవు నడపుట+తక్కన్= న్యాయం చేయటం తప్ప; మనకున్+చేయన్+తగు పని= మనం చేయదగినపని; వేఱు+ఒండు+కలుగునే?= ఇంకోటి ఉంటుందా?; అని, చెప్పినన్; ధృతరాష్ట్రుండు; సంజయు చెప్పిన= సంజయుడు చెప్పిన; కార్య వచనంబుల కొఱంత= రాయబారపు మాటల శేషం; వినంగలవాఁడు+ఐ= వినగోరినవాడై; అతని దిక్కు= అతడి వైపు; మొగంబు+చేసి= తిరిగి.

**తాత్పర్యం:** అనగా విని విదురుడు అతడితో ఇట్లా అన్నాడు: 'మనవాళ్ళు అసలే బలహీనులు. తమలో తాము పోట్లాడుకొంటూ దుర్భాషలాడుకుంటూ ఇట్లా ఉండటం అది అర్జునుడికి లాభం. ఇంతేతప్ప ఏమంటాం? పాండవులు ఏకాభిప్రాయులై ఉన్నారు. పనికిమాలిన ఈ పిచ్చిమాటలు కట్టిపెట్టి పాండవులను పిలిపించి న్యాయం చేయటం తప్ప మనం చేయవలసింది ఇంకోటి లేదు' అని చెప్పగా, ధృతరాష్ట్రుడు సంజయుడు చెప్పిన రాయబారపు మాటల శేషం వినగోరి అతడివైపు చూచి.

**క. 'మును వరుసతోడఁ దన తలఁ । చిన యన్నియు నీవు వినఁగఁ జెప్పి తగవుమై**
**నిను వీడుకొల్పునెడ, న । ర్జునుఁ డేమని నిశ్చయించెఁ జూతము చెపుమా!' 299**

**ప్రతిపదార్థం:** మును= ముందు; వరుసతోడన్= క్రమంతో; తన తలఁచిన+అన్నియున్= తన మనస్సులో ఉన్నవన్నీ; నీవు; వినఁగన్+చెప్పి; తగవుమైన్= సముచితంగా; నినున్; వీడుకొల్పు+ఎడన్= పంపించేటప్పుడు; అర్జునుఁడు; ఏమి+అని; నిశ్చయించెన్= నిర్ణయించాడో; చెపుమా= చెప్పుమా; చూతము= చూద్దాం.

**తాత్పర్యం:** 'ముందు తన మనస్సులో ఉన్నవన్నీ క్రమంగా నీవు వినేటట్లు చెప్పి, సముచితంగా నిన్ను పంపించేటప్పుడు అర్జునుడు తుదినిర్ణయంగా ఏమన్నాడో చెప్పుము చూద్దాము.'

**క. అని యడిగిన సంజయుఁ డి । ట్లనుఁ: 'దుదిఁ బార్థుండు నిశ్చయము సేసి సుయో**
**ధనుతో నిందలి పెద్దలు । వినఁగా ననుమన్నపలుకు వినుము నరేంద్రా!' 300**

**ప్రతిపదార్థం:** అని; అడిగినన్; సంజయుఁడు; ఇట్లు+అనున్; నర+ఇంద్రా!= రాజా!; పార్థుండు= అర్జునుడు; తుదిన్= చివరగా; నిశ్చయము+చేసి= నిర్ణయించి; సుయోధనుతోన్; ఇందలి పెద్దలు; వినఁగాన్; అనుము+అన్న పలుకు= చెప్పుమన్న మాట; వినుము.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు డడుగగా సంజయుడు అతడితో ఇట్లా అన్నాడు: 'మహారాజా! అర్జునుడు చివరగా నిర్ణయించి దుర్యోధనుడితో ఇందలి పెద్దలు వింటూండగా చెప్పుమన్న పలుకులు చెపుతా వినుము.'

**మ. 'కురువంశోత్తముఁడైన ధర్మజుఁడు 'నాకుం దండ్రిపా లీఁదగున్**
**ధరలో సా' మని తాన పల్క, వినియున్ దర్పంబుమై నీక త**
**క్కిరయేనిం, జటు లాస్మదీయ విశిఖాగ్నిజ్వాలలం దాహుతుల్**
**వరుసం బెట్టుదు ధార్తరాష్ట్రతతి నైశ్వర్యం బవార్యంబుగన్.' 301**

**ప్రతిపదార్థం:** కురు వంశ+ఉత్తముఁడు+ఐన ధర్మజుఁడు= కురు వంశశ్రేష్ఠుడైన ధర్మరాజు; నాకున్; తండ్రిపాలు= తండ్రివాటా; ధరలోన్ సాము= భూమిలో సగం; ఈన్+తగున్= ఈయదగును; అని; తాను+అ= తానే స్వయంగా; పల్కన్= చెప్పగా; వినియున్; దర్పంబు+మైన్= గర్వంతో; ఈక తక్కిరి+అ+ఏనిన్= ఇయ్యకపోయారో, ధార్తరాష్ట్ర తతిన్= ధృతరాష్ట్ర పుత్రుల సమూహాన్ని; వరుసన్= వరసగా ఒక్కొక్కడినే; ఐశ్వర్యంబు= సంపద, రాజ్యభాగం; అవార్యంబుగన్= తప్పనిసరి అయ్యేటట్లు; చటుల+అస్మదీయ విశిఖ+అగ్ని జ్వాలల+అందున్= చలించే నా బాణాలనే అగ్నిజ్వాలలలో; ఆహుతుల్ పెట్టుదున్= వేలుస్తాను-హోమం చేస్తాను.

**తాత్పర్యం:** 'కురువంశ శ్రేష్ఠుడైన ధర్మరాజు స్వయంగా- 'మా తండ్రి వాటా భూమిలో సగం నాకివ్వదగు'నని అంటే, వినీ, గర్వంతో ఇయ్యకపోయారో, ధృతరాష్ట్ర పుత్రుల సమూహాన్ని వరసగా, మాకు రాజ్యభాగం తప్పనిసరి అయ్యేటట్లు, నా చంచలమైన బాణాలనే అగ్ని జ్వాలలో వేలుస్తాను.'

**విశేషం:** విశిఖాగ్నిజ్వాలలు - విశిఖాలనే అగ్నిజ్వాలలు - రూపకాలంకారం.

**వ. అని పలికి, కౌఁగిలించుకొని భూషణాంబరాది కమనీయ వస్తువు లొసంగిన, నేనునుం బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింతవట్టును దేవరకు నెఱింగింప వేగంబ వచ్చితి' ననిన నమ్మాటలు దుర్యోధనుం డాదరింపక పెడచెవులంబెట్టె; ధృతరాష్ట్రుండును ఱిచ్చవడి యూరకుండె; నప్పు డయ్యిరువురపాలను సంజయుం డొక్కరుండుదక్క నయ్యాస్థానంబున నున్న సమస్త జనంబులును దిగ్గన లేచి తమతమ నివాసంబులకుం బోయిరి; తదనంతరంబ. 302**

**ప్రతిపదార్థం:** అని; పలికి; కౌఁగిలించుకొని; భూషణ+అంబర+ఆది కమనీయ వస్తువులు= అలంకారాలూ, వస్త్రాలూ మొదలగు కోరదగిన వస్తువులు; ఒసంగినన్= ఇయ్యగా; ఏనునున్= నేనుకూడా; పాండవులను; వాసుదేవునిన్= కృష్ణుడినీ; సవినయంబుననన్= అడకువతో; వీడ్కొని= విడిచి; ఇంతవట్టును= ఇంతవరకూ; దేవరకున్= తమకు; ఎఱింగింపన్= తెలపటానికి; వేగంబు+అ= వేగమే; వచ్చితిన్; అనినన్; ఆ+మాటలు; దుర్యోధనుండు; ఆదరింపక= మన్నించక; పెడచెవులన్+పెట్టెన్= వినిపించుకొనలేదు; ధృతరాష్ట్రుండును; ఱిచ్చవడి= నిశ్చేష్టుడై; ఊరక+ఉండెన్; అప్పుడు; ఆ+ఇరువుర పాలను= ఆ ఇద్దరి దగ్గరా; సంజయుండు; ఒక్కరుండు+తక్కన్= ఒక్కడు తప్ప; ఆ+ఆస్థానంబునన్; ఉన్న; సమస్త జనంబులను= ఎల్లజనులూ; దిగ్గనన్+లేచి= వెంటనే లేచి; తమ తమ నివాసంబులకున్= తమ తమ ఇండ్లకు; పోయిరి; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** అని పలికి కౌగిలించుకొని అలంకారాలూ, వస్త్రాలూ మొదలైన వస్తువు లియ్యగా నేనూ పాండవులనూ కృష్ణుడినీ వీడి ఇంతవరకూ తమకు తెలపటానికి వేగమే వచ్చాను' అనగా ఆ మాటలు దుర్యోధనుడు మన్నించక వినిపించుకొనలేదు. ధృతరాష్ట్రుడునూ నిశ్చేష్టుడై ఊరుకున్నాడు. అప్పుడు ఆ ఇద్దరి దగ్గరా సంజయుడు ఒక్కడు తప్ప ఆ ఆస్థానంలో ఉన్నవాళ్ళందరూ వెంటనే లేచి తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఆ తరువాత (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తనుజవశవర్తి యగు న । మ్మనుజేంద్రుఁడు దన సుతుండు మర్దింపఁగ నో**
**పునొ యనిఁ బాండుతనూజుల? । నను మతి సంజయునితోడ నాడె దురాశన్. 303**

**ప్రతిపదార్థం:** తనుజ వశవర్తి+అగు+ఆ+మనుజ+ఇంద్రుఁడు= కొడుకునకు అధీనుడై మెలగే ఆ రాజు - ధృతరాష్ట్రుడు; తన సుతుండు= తన కొడుకు; అనిన్= యుద్ధంలో; పాండు తనూజులన్= పాండవులను; మర్దింపఁగన్+ఓపునొ= చంపగలడా; అను మతిన్= అనే తలపుతో; సంజయునితోడన్; దురాశన్= దురాశతో; ఆడెన్= పలికాడు.

**తాత్పర్యం:** కొడుకునకు అధీనుడై మెలగే ఆ ధృతరాష్ట్ర మహారాజు, తన కొడుకు పాండవులను యుద్ధంలో చంపగలడా? అనే తలపుతో సంజయుడితో దురాశతో ఇట్లా అన్నాడు:

**సీ. 'ఈ రెండు వీకుల తారతమ్యంబులు । నెఱుఁగుదు; పోరైన నెవ్వ రోర్తు**
**రిది నిశ్చయింతమే? యెందు నుపాయంబుఁ । బౌరుషంబును గలవారు గలరు?**
**సూతము చెపు' మన్న సూతనందనుఁడు 'న । న్నడిగెద వే నొంటి యడుగవలదు;**
**మీ యయ్య సాత్యవతేయుఁ డీయెడకు వేం । చేయునట్లుగ భక్తిఁ జేసి తలఁపు;**

**తే. పిలువఁబంపు గాంధారి; వారలు వినీతి । రతులు, నిశ్చయవిదులు, ధర్మజ్ఞ చిత్తు;**
**లుల్లమున నీ కసూయాదు లొదవెనేని । పూని మాన్పంగ నేర్తురు మానవేంద్ర!' 304**

**ప్రతిపదార్థం:** ఈ రెండు వీళుల తారతమ్యంబులున్= ఈ రెండు సేనల తరతమ భావాలూ; ఎఱుఁగుదువు; పోరు+ఐనన్= యుద్ధం వస్తే; ఎవ్వరు+ఓర్తురు?= ఎవరు గెలుస్తారు?; ఇది నిశ్చయింతమే?= ఇది నిర్ణయిద్దామా?; ఎందున్= ఏ సేనలో; ఉపాయంబున్; పౌరుషంబుమ; కలవారు= కలరు?; చూతము; చెపుము; అన్నన్; సూతనందనుఁడు= సంజయుడు; మానవ+ ఇంద్ర!= రాజా!; నన్నున్ అడిగెదవు+ఏన్= అడిగితే; ఒంటి+అడుగన్ వలదు= ఒంటరిపాటున అడగవద్దు; మీ+అయ్య= మీ తండ్రి; సాత్యవతేయుఁడు= వ్యాసుడు; ఈ+ఎడకున్= ఇక్కడికి; వేంచేయునట్లుగన్= విచ్చేసేటట్లు; భక్తిన్+చేసి తలఁపుము= భక్తితో ధ్యానించుము; గాంధారిన్; పిలువన్+పంపుము= పిలిపించుము; వారలు; వినీతిపరులు= మర్యాదస్థులు; నిశ్చయవిదులు= నిర్ణయం తెలిసినవారు; ధర్మజ్ఞచిత్తులు= ధర్మం తెలిసిన మనస్సు కలవారు; నీకున్; ఉల్లమునన్= మనస్సులో; అసూయా+ ఆదులు= ఈర్ష్య మొదలైనవి; ఒదవెన్+ఏనిన్= కలిగినట్లయితే; పూని= పూనిక వహించి; మాన్పంగన్+నేర్తురు= పోగొట్టగలరు.

**తాత్పర్యం:** 'ఈ రెండు సైన్యాలలోనూ గల తరతమ భావాలను నీ వెరుగుదువు. యుద్ధం వస్తే ఎవరు గెలుస్తారో నిశ్చయిద్దామా? ఏ సైన్యంలో ఉపాయమూ, పౌరుషమూ కలవాళ్ళు ఉన్నారు? చూద్దాం చెప్పుము'' అనగా, సంజయుడు 'రాజా! నన్నడిగే మాటుంటే ఒంటరిగా అడగవద్దు. మీ తండ్రి వ్యాసుడు ఇక్కడికి విచ్చేసేటట్లు ఆయనను భక్తితో ధ్యానించుము. గాంధారిని పిలిపించుము. వాళ్ళు మర్యాదస్థులు, నిర్ణయం తెలిసినవాళ్ళు. ధర్మం తెలిసిన మనస్సు కలవాళ్ళు. నీకు మనస్సులో అసూయ మొదలైనవి కలిగితే వాటిని పోగొట్టగలవాళ్ళు.'

### కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రుని యొద్దకు వచ్చుట (సం. 5-65-8)

**వ. అనిన విని యంబికానందనుం 'డట్లకాక'యని యొక కంచుకిం బిలిచి వానిం బుచ్చి గాంధారి రావించి, సద్భక్తి తాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయన మహామునిం దలంచిన, దివ్యబోధ మహనీయుండైన యమ్మహాత్ముండు విజయం చేయుటకు, నందఱు దండ ప్రణామంబులు సేసి సమున్నతాసనంబున నునిచి, యర్ఘ్యపాద్యాది విధులం బూజించియున్న సమయంబున ధృతరాష్ట్రుండు విన్నపంబు సేయక మున్న యమ్మహాపురుషుండు ధృతరాష్ట్ర సంజయుల చిత్తవృత్తులు దాన యెఱింగినవాఁడగుటం జేసి, సంజయువలనఁ బ్రసన్న దృష్టి నవలోకించి యతని కిట్లనియె: 305**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అంబికా నందనుండు= ధృతరాష్ట్రుడు; అట్లు+అ కాక= అట్లాగే; అని; ఒక కంచుకిన్+పిలిచి= ఒక రాజాంతఃపురాధికారిని పిలిచి; వానిన్; పుచ్చి= పంపి; గాంధారిన్; రావించి= రప్పించి; సత్+భక్తి తాత్పర్యంబునన్= సద్భక్తి తత్పరత్వంతో; కృష్ణద్వైపాయన మహామునిన్= వ్యాసమహర్షిని; తలంచినన్= ధ్యానించగా; దివ్య బోధ మహనీయుండు+ఐన+ ఆ+మహాత్ముండు= దివ్యజ్ఞానం చేత పూజనీయుడైన ఆ మహానుభావుడు; విజయం చేయుటయున్= విచ్చేయగా; అందఱున్; దండ ప్రణామంబులు+చేసి= సాష్టాంగ నమస్కారాలు చేసి; సమున్నత+ఆసనంబునన్= ఎత్తయిన పీఠంపై; ఉనిచి= కూర్చుండపెట్టి; అర్ఘ్య పాద్య+ఆది విధులన్= పూజాద్రవ్యాలూ, పాదజలమూ మొదలైన సత్కారాలతో; పూజించి+ఉన్న సమయంబునన్= పూజించి ఉన్నప్పుడు; ధృతరాష్ట్రుండు; విన్నపంబు+చేయక మున్ను+అ= మనవి చేయకముందే; ఆ+మహాపురుషుండు= ఆ మహాత్ముడు; ధృతరాష్ట్ర సంజయుల చిత్తవృత్తులు= ధృతరాష్ట్ర సంజయుల మనోగతాలు; తాను+అ= తానే; ఎఱింగిన వాఁడు+అగుటన్+చేసి= తెలిసినవాడవటంచేత; సంజయువలనన్= సంజయుడికేసి; ప్రసన్నదృష్టిన్= అనుగ్రహంకల చూపుతో; అవలోకించి= చూచి; అతనికిన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అట్లా సంజయుడనగా విని ధృతరాష్ట్రుడు 'అలాగే' అని ఒక కంచుకిని పిలిచి అతడిని పంపి గాంధారిని రప్పించి, భక్తిపారవశ్యంతో వ్యాస మహర్షిని ధ్యానించగా, దివ్యజ్ఞాన మహనీయుడైన ఆ మహానుభావుడు

విచ్చేశాడు. అందరూ సాష్టాంగ నమస్కారాలు చేసి ఉన్నతమైన పీఠంపై ఆసీనుడిని చేసి అర్ఘ్యం పాద్యం మొదలైన సత్కారాలతో పూజించి ఉన్నప్పుడు, ధృతరాష్ట్రుడు మనవి చేయకుండానే, ఆ మహాత్ముడు ధృతరాష్ట్ర సంజయుల మనోగతాలు తెలిసినవాడవటం చేత, సంజయుడికేసి అనుగ్రహంతో కూడిన దృష్టితో చూచి, అతడితో ఇట్లా అన్నాడు:

**క. 'నీవు సమస్తము నెఱుఁగుదు । గావున నీ కూరకుండఁగాఁ దగదు; ధరి**
**త్రీ వల్లభుఁ డడిగిన పని । యీ విధమని తెలియఁబలుకు మేను వినంగన్.' 306**

**ప్రతిపదార్థం:** నీవు; సమస్తమున్+ఎఱుఁగుదువు+కావునన్= అంతా ఎరుగుదువు కాబట్టి; నీకున్+ఊరక+ఉండఁగాన్+తగదు= నీవు ఊరుకొనగూడదు, ధరిత్రీ వల్లభుఁడు= రాజు- ధృతరాష్ట్రుడు; అడిగిన పని; ఈ విధము+అని= ఇదీ అని; ఏను వినంగన్= నేను వినేటట్టు; తెలియన్+పలుకుము= స్పష్టంగా చెప్పుము.

**తాత్పర్యం:** 'నీకు అన్నీ తెలుసు కాబట్టి నీవు ఊరుకొనగూడదు. ధృతరాష్ట్రుడు అడిగిన ప్రశ్నకు సమాధానం నేను వినేటట్లు స్పష్టంగా చెప్పుము.'

**వ. అనినఁ బ్రసాదం బని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె: 307**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ప్రసాదంబు+అని= సంతోషం అని; సంజయుండు; ధృతరాష్ట్రునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని వ్యాసుడు అనగానే 'సంతోషం' అని సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**క. 'ఆ సేనకు నీ సేనకు । వాసి యడిగె దీవు నన్ను, వసుదేవసుతుం**
**డా సేనఁ గలఁడు; తత్సము । నీ సేనం జూపుమా నరేశ్వర! నాకున్. 308**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= రాజా, ధృతరాష్ట్రా!; ఈవు= నీవు; నన్నున్; ఆ సేనకున్= ఆ (పాండవుల) సేనకూ; ఈ సేనకున్= ఈ (కౌరవుల) సేనకూ; వాసి= తారతమ్యం; అడిగెదవు; ఆ సేనన్= పాండవుల సేనలో; వసుదేవ సుతుండు= కృష్ణుడు; కలఁడు= ఉన్నాడు; ఈ సేనన్= కౌరవుల సేనలో; తద్+సమున్= అతడితో సమానుడిని; నాకున్; చూపుమా= చూపించుము.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రా! నీవు నన్ను పాండవుల సేనకూ, కౌరవుల సేనకూ తారతమ్యం అడిగావు. పాండవుల సేనలో కృష్ణు డున్నాడు. ఈ కౌరవసేనలో అతడితో సమానుడిని నాకు చూపించుము.

**వ. వాసుదేవుం డెట్టివాఁ డని యడిగెదేనిం జెప్పెద. 309**

**ప్రతిపదార్థం:** వాసుదేవుండు= కృష్ణుడు; ఎట్టివాఁడు+అని= ఎటువంటివాడు అని; అడిగెదు (దవు)+ఏనిన్= అడిగితే; చెప్పెదన్.

**తాత్పర్యం:** కృష్ణుడు ఎట్లాంటివాడని అడిగితే, చెప్పుతాను వినుము.

**చ. జగముల నన్నిటిం దనవశంబుగఁ జేసినవీరు, భంగమున్,**
**బగయు లలాట లోచనుఁడు వాపఁగఁ బేర్చినయట్టి బాణు, నొ**
**క్క గడియలోన గర్వ మడఁగం బరిమార్చె; సురేంద్ర కల్పకం**
**బు గరములీలఁ దెచ్చె; హరి భూరి పరాక్రమ మప్రసిద్ధమే! 310**

**ప్రతిపదార్థం:** జగములన్+అన్నిటిన్= లోకాల నన్నింటినీ; తన వశంబుగన్+చేసిన వీరున్= తనకు లోబడేటట్లు చేసికొన్న వీరుడిని; భంగమున్= అవమానమూ; పగయున్= శత్రుత్వమూ; లలాట లోచనుఁడు= నుదుట కన్నుకలవాడు- శివుడు; పాపఁగన్= లేకుండా చేయగా; పేర్చిన+అట్టి= విజృంభించినట్టి; బాణున్= బాణుడిని; ఒక్క గడియలోన్+అ= ఒక గడియ కాలంలోనే; గర్వము+అడఁగన్= గర్వం నశించిపోయేటట్లు; పరిమార్చెన్= సంహరించాడు; సుర+ఇంద్ర కల్పకంబు= దేవేంద్రుడి కల్పవృక్షం- పారిజాతం; కరము లీలన్= మిక్కిలి విలాసంతో- అనాయాసంగా; తెచ్చెన్; హరి భూరి పరాక్రమము= కృష్ణుడి మహాపరాక్రమం; అప్రసిద్ధమే?= ప్రసిద్ధమైనది కాదా? (అందరికీ తెలిసిందే కదా!)

**తాత్పర్యం:** లోకాల నన్నింటినీ తనకు అధీనాలుగా చేసికొన్న వీరుడూ, అవమానమూ, శత్రుత్వమూ ముక్కంటి పోగొట్టగా విజృంభించినవాడూ అయిన బాణుడిని ఒక గడియ కాలంలోనే గర్వం నశించేటట్లు వధించాడు. దేవేంద్రుడి పారిజాత వృక్షాన్ని అవలీలగా తీసికొనివచ్చాడు. కృష్ణుడి మహాపరాక్రమం సుప్రసిద్ధమే కదా!

**విశేషం:** బాణుడు - బాణాసురుడు బలి కొడుకు. ఇతడు ఈశ్వరుడిని గురించి తపస్సు చేసి మూడు లోకాలలోనూ తన కెదురు లేకుండా వరం పొందుతాడు. ఇతని కూతురు ఉష. ఈమె కలలో చూచిన అనిరుద్ధుడిని ప్రేమించి తన చెలికత్తె సాయంతో అతణ్ణి తన అంతఃపురానికి రప్పించుకొంటుంది. అతనితో సంగమించటం వలన ఆమె గర్భవతి అవుతుంది. ఈ సంగతి బాణుడు తెలిసికొని అనిరుద్ధుడి తాతయైన కృష్ణుడితో యుద్ధం చేస్తాడు. కృష్ణుడు బాణుడి వేయి బాహువులను నరుకుతాడు. బాణుడు ఓడిపోయి ఉషానిరుద్ధులకు వివాహం జరిపిస్తాడు. 'సురేంద్ర కల్పకంబు గరము లీలఁ దెచ్చె' - కృష్ణుడు సత్యభామ కోరికపై ఇంద్రుడి మీదికి దండెత్తిపోయి అతడి నందనవనంలోని పారిజాత వృక్షాన్ని భూమికి తెచ్చి సత్యభామ పెరట్లో నాటుతాడు.

**ఆ. అధిక దుష్కరంబులైన కార్యంబులు । క్రీడవోలెఁజేయుఁ గేశవుండు;**
**విను మతండు పార్థు నెనసి యేకార్థుఁడై । యుండుఁ బూర్వ భవ సఖుండు గాన. 311**

**ప్రతిపదార్థం:** కేశవుండు= కృష్ణుడు; అధిక దుష్కరంబులు+ఐన కార్యంబులు= మిక్కిలి కష్టములైన పనులు; క్రీడ+పోలెన్+చేయున్= ఆటవలె చేస్తాడు; వినుము; అతండు; పూర్వభవ సఖుండు+కానన్= పూర్వజన్మలో మిత్రుడు కాబట్టి, పార్థున్= అర్జునుడిని; ఎనసి= కూడి; ఏక+అర్థుఁడు+ఐ+ఉండున్= ఒకే ప్రయోజనం కలవాడై ఉంటాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! విను. కృష్ణుడు మిక్కిలి కష్టములైన పనులు ఒక ఆటవలె అవలీలగా చేస్తాడు. అంతేకాక అతడు పూర్వజన్మలో అర్జునుడికి స్నేహితుడు కాబట్టి, అర్జునుడితోకూడి ఒకే ప్రయోజనం కలిగి ఉంటాడు.

**ఆ. అట్టి వాసుదేవుని చక్రంబు నిజమాయాబలంబునఁ బాండవుల సర్వ సమర సాధనంబుల యందును సూక్ష్మరూపవ్యాపియై నిలిచి వారికి విజయం బొసంగుచుండు' నని చెప్పి, మఱియు నిట్లనియె: 312**

**ప్రతిపదార్థం:** అట్టి వాసుదేవుని చక్రంబు= అటువంటి కృష్ణుని చక్రాయుధం (సుదర్శనం); నిజ మాయా బలంబునన్= తనదైన మాయయొక్క శక్తిచేత; పాండవుల సర్వ సమర సాధనంబుల అందును= పాండవుల యుద్ధ పరికరాలన్నిటిలోనూ; సూక్ష్మ రూప వ్యాపి+ఐ= సూక్ష్మరూపంతో వ్యాపించినదై; నిలిచి; వారికిన్; విజయంబు; ఒసంగుచున్+ఉండున్= కూరుస్తూంటుంది; అని; చెప్పి; మఱియున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అటువంటి కృష్ణుని సుదర్శనం తన మాయా బలంతో పాండవుల యుద్ధోపకరణాలన్నిటియందూ సూక్ష్మరూపంతో వ్యాపించి, వారికి విజయం చేకూరుస్తుంది' అని చెప్పి, ఇంకా ఇట్లా అన్నాడు:

**క. 'పలుమఱుఁ బాండు తనూజుల । కొలఁది వితర్కించెదవు; నిగూఢం బదియుం**
**దెలియం బలికెద; వారికి । బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా! 313**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= రాజోత్తమా, ధృతరాష్ట్రా!; పాండు తనూజుల కొలఁది= పాండవుల సామర్థ్యం; పలుమఱున్= పలుసార్లు; వితర్కించెదవు= సంశయిస్తావు; నిగూఢంబు+అదియున్+తెలియన్+పలికెదన్= రహస్యమైన దానినికూడా తెలిసేటట్లు చెపుతాను; వారికిన్= పాండవులకు; బలమును= పరాక్రమమూ; సత్త్వంబున్= ప్రాణమూ; హరి+అ= కృష్ణుడే.

**తాత్పర్యం:** 'రాజోత్తమా, ధృతరాష్ట్రా! నీవు మాటిమాటికీ పాండవుల సామర్థ్యాన్ని సంశయిస్తావు. అది రహస్యమైనా, స్పష్టపరుస్తాను. వారికి కృష్ణుడే పరాక్రమమూ, ప్రాణమూ.

**వ. హరి మహత్త్వంబు విన్నవించెద నవధరింపుము. 314**

**తాత్పర్యం:** కృష్ణుడి మాహాత్మ్యం మనవి చేస్తాను, శ్రద్ధగా వినుము.

**క. ఒక తల సమస్త జగములు, । నొకఁడ జనార్దనుఁడు నిలిచి యొక తలయైనన్,**
**సకలము నసార; మాతం । డొకరుని సారంబ చాల నుత్కృష్టమగున్. 315**

**ప్రతిపదార్థం:** సమస్త జగములున్= లోకాలన్నీ; ఒక తల= ఒక వైపూ; జనార్దనుఁడు+ఒక్కఁడు+అ= కృష్ణు డొక్కడూ; నిలిచి; ఒక తల+ఐనన్= ఒక వైపూ అయితే; సకలమున్= అంతా; అసారము= నిస్సారం; ఆతండు+ఒకరుని సారంబు+అ= అతడొక్కడి సారమూ; చాలన్+ఉత్కృష్టము+అగున్= మిక్కిలి గొప్పది అవుతుంది.

**తాత్పర్యం:** లోకాలన్నీ ఒక పక్షాన, కృష్ణు డొక్కడూ ఒక పక్షాన నిలిస్తే, అంతా నిస్సారమూ అతడి ఒక్కని సారమూ మహోత్కృష్టమూ అవుతుంది.

**క. తలఁపునన వాసుదేవుఁడు । గలిగింపను, నిలుప, నడఁపఁగా నోపు జగం**
**బుల; మఱియును గ్రీడార్థము । పలువోకలఁ బుచ్చుచుండుఁ బౌరవనాథా! 316**

**ప్రతిపదార్థం:** పౌరవ నాథా!= పూరు వంశశ్రేష్ఠుడా, ధృతరాష్ట్రా!; వాసుదేవుఁడు= కృష్ణుడు; తలఁపునన్+అ= సంకల్పంచేతనే; జగంబులన్= లోకాలను; కలిగింపను= పుట్టించడానికీ; నిలుపన్= నిలపటానికీ; అడఁపఁగాన్= నశింపచేయటానికీ; ఓపున్= చాలును; మఱియును= ఇంకా; క్రీడా+అర్థము= ఆటకొరకు; వినోదంకొరకు; పలు+పోకలన్+పుచ్చుచున్+ఉండున్= అనేక రీతులను ప్రయోగిస్తూంటాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! కృష్ణుడు సంకల్పమాత్రంచేతనే లోకాల సృష్టి స్థితి లయాలను చేయగల సమర్థుడు. ఇంకా ఎన్నో రీతులను ప్రయోగిస్తూంటాడు.

**విశేషం:** కృష్ణుడు త్రిమూర్త్యాత్మకుడని భావం.

**క.** **ఎక్కడ నడచును సత్యం, । బెక్కడ ధర్మంబు వరఁగు, నెక్కడఁ గలుగుం**
**జక్కటి నిలుచుం గృష్ణుం । డక్కడ; నతఁ డున్నకడన యగు జయ మధిపా!** **317**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా, ధృతరాష్ట్రా!; సత్యంబు; ఎక్కడన్; నడచున్= ప్రవర్తిస్తుందో; ధర్మంబు; ఎక్కడ; పరఁగున్= ఒప్పుతుందో; చక్కటి= న్యాయంగా; ఎక్కడన్; కలుగున్; కృష్ణుండు; అక్కడన్; నిలుచున్= ఉంటాడు; అతఁడు; ఉన్న కడన్+అ= ఉన్నచోటనే; జయము; అగున్.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! సత్యం ఎక్కడ ప్రవర్తిల్లుతుందో, ధర్మం ఎక్కడ ఒప్పుతుందో, న్యాయం ఎక్కడ ఉంటుందో కృష్ణుడు అక్కడ నిలుస్తాడు. అతడున్న చోటనే జయం కలుగుతుంది.

**సీ.** **పురుషోత్తముం డెల్ల భువనంబులును దాన । యఖిల భూతాత్మకుండై విహార**
**లీల విచేష్టించు; నీ లోకముల మాయ । దొట్టి యొక్కొకమరి పుట్టి, పెరిఁగి**
**కర్మానుచరణముల్ గైకొని వర్తించు; । శిష్టరక్షణమును, దుష్ట నిగ్ర**
**హంబును దన పను లగుటఁ; బాండవుల నె । పం బిడుకొని ధర్మబాహ్యు లైన**

**తే.** **నీ తనూజుల నిక్కమ నిగ్రహింపఁ । దలఁచినాఁ డమ్మహాత్ముండు; తథ్య మతని**
**నిట్టి చందంబువాఁ డని యెఱిఁగి యెవ్వ । రాశ్రయింతురు, బ్రదుకుదు రట్టివారు.'** **318**

**ప్రతిపదార్థం:** పురుష+ఉత్తముండు= కృష్ణుడు; ఎల్లభువనంబులును= అన్నిలోకాలు; తాను+అ= తానే; అఖిల భూత+ ఆత్మకుండు+ఐ= ఎల్లప్రాణులలో అంతర్యామిగా- నున్నవాడై; విహార లీలన్= ఒక ఆటగా; విచేష్టించున్= క్రియా కలాపములు సాగిస్తుంటాడు; ఈ లోకములన్= ఈ లోకాలలో; మాయ+తొట్టి= మాయను అవలంబించి; ఒక్కొకమరి= ఒక్కొక్కసారి; పుట్టి; పెరిఁగి; కర్మ+అనుచరణముల్+కైకొని= కర్మలను అనుసరించటం స్వీకరించి; వర్తించున్= మెలగుతాడు; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు- కృష్ణుడు; శిష్ట రక్షణమును= మంచివాళ్ళను కాపాడడమూ; దుష్ట నిగ్రహంబును= చెడ్డవాళ్ళను శిక్షించటమూ; తన పనులు+అగుటన్= తన విధులు అవటం చేత; పాండవుల నెపంబు+ ఇడుకొని= పాండవులను నిమిత్తంగా చేసికొని; ధర్మ బాహ్యులు+ఐన నీ తనూజులన్= ధర్మానికి వెలిఅయిన- అధర్మపరులైన నీ కొడుకులను; నిక్కము+అ= నిజంగానే; నిగ్రహింపన్+తలఁచినాఁడు= శిక్షించనెంచాడు; తథ్యము= ఇది నిశ్చయం; అతనిన్; ఇట్టి చందంబువాఁడు+అని+ఎఱిఁగి= ఇటువంటివాడని తెలిసి; ఎవ్వరు; ఆశ్రయింతురు= ఆశ్రయిస్తారో, శరణు కోరతారో; అట్టివారు; బ్రదుకుదురు= ప్రాణాలతో ఉంటారు.

**తాత్పర్యం:** కృష్ణుడు సకలలోక స్వరూపుడు. సర్వ జీవాంతరాత్ముడై ఒక క్రీడగా క్రియాకలాపములు సాగిస్తుంటాడు. మాయనవలంబించి ఈ లోకాలలో ఒక్కొక్కసారి పుట్టి, పెరిగి తన జన్మలకు అనుగుణమైన కర్మలను స్వీకరించి ప్రవర్తిస్తాడు. శిష్టులను రక్షించటమూ, దుష్టులను శిక్షించటమూ తన పనులు కావటం చేత పాండవుల నెపంతో

అధర్మపరులైన నీ కొడుకులను ఆ మహాత్ముడు నిజంగా శిక్షించదలచుకొన్నాడు. ఇది తథ్యం. ఇటువంటి మహనీయుడని తెలిసి అతడిని ఎవరు ఆశ్రయిస్తారో, వాళ్ళు బ్రదుకుతారు.'

**విశేషం:** అతడిని ఆశ్రయించనివాళ్ళు చస్తారని అర్థం.

**క. అనవుడు ధృతరాష్ట్రుఁడు 'వి। ష్ణుని నే నెఱుఁగని విధంబునుం, దెలియఁగ నీ**
**కని యున్న తెఱఁగుఁ జెప్పుమ'। యనుటయు సూతసుతుఁ డిట్టులను నాతనితోన్. 319**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అన్నంతనే; ధృతరాష్ట్రుఁడు; విష్ణునిన్= విష్ణువును; ఏను= నేను; ఎఱుఁగని విధంబునున్= ఎరగని విధమూ; నీ కని+ఉన్న తెఱఁగున్= నీవు చూచి ఉన్న- తెలిసిఉన్న విధమూ; తెలియఁగన్= స్పష్టపడేటట్లు; చెప్పుమ; అనుటయున్= అనగా; సూతసుతుఁడు= సంజయుడు; అతనితోన్= ఆ ధృతరాష్ట్రుడితో; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సంజయుడు అట్లా అన్నంతనే ధృతరాష్ట్రుడు 'విష్ణువును నేను ఎరుగకపోవటానికీ, నీవు ఎరగటానికీ కారణం ఏమిటో స్పష్టంగా చెప్పుము' అని అడగగా, సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**వ. 'విద్యయు నవిద్యయు ననఁగా రెండు గల; వవిద్యాదూషితుండై తమోగ్రస్తుండైనవాఁడు విష్ణు నెఱుంగఁడు. విద్యాసంపన్నుం డెఱుంగు' ననిన, 'విద్య యనునది యెట్టి? దెద్దాన నీవా సర్వేశ్వరు నెఱింగితి? దాని, నవిద్య యెట్టిది? దానిని జెప్పు' మనుటయు, నాంబికేయునకు సంజయుం డిట్లనియె: 'సాత్త్విక రాజస తామస వికారంబుల త్రిప్పులంబడక ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగి యుండుదు; దీన నే నచ్యుతు నెఱుంగుదు; విద్య యిట్టిది. నీకునుం, దక్కెవరికైనను నతని నెఱుంగుటకు నిదియ తెరు; విట్టిదిగాని విధం బవిద్య' యని చెప్పిన, నతండు నిజనందనున కిట్లనియె: 320**

**ప్రతిపదార్థం:** విద్యయున్; అవిద్యయున్; అనఁగాన్; రెండు; కలవు; అవిద్యా దూషితుండు+ఐ= అవిద్యచేత నిందితుడయి; తమస్(ః)+గ్రస్తుండు+ఐనవాఁడు= తమోగుణం చేత ఆక్రమించబడినవాడు; విష్ణున్; ఎఱుంగఁడు; విద్యాసంపన్నుండు= విద్యతో కూడినవాడు; ఎఱుంగున్; అనినన్; విద్య+అను+అది+ఎట్టిది?= విద్య అనేది ఎటువంటిది?; ఏ+దానన్= దేనిచేత; నీవు; ఆ సర్వేశ్వరున్= ఆ కృష్ణుడిని; ఎఱింగితివి; దానిన్= దానినీ; అవిద్య; ఎట్టిది; దానిని; చెప్పుము; అనుటయున్; ఆంబికేయునకున్= ధృతరాష్ట్రుడికి; సంజయుండు; ఇట్లు+అనియెన్; సాత్త్విక రాజస తామస వికారంబుల త్రిప్పులన్+పడక= సత్త్వ రజస్తమో గుణ వికారాల చిక్కులలో పడక; ధర్మంబు+ఆచరించుచున్= ధర్మ ఆచరిస్తూ; భావశుద్ధి+కలిగి= అంతశ్శుద్ధి కలిగి; ఉండుదున్= ఉంటాను; దీనన్= దీనిచేత; నేను; అచ్యుతున్= కృష్ణుడిని; ఎఱుంగుదున్; నీకునున్; తక్క+ఎవరికిన్+ ఐననున్= తక్కిన ఎవరికైనా; అతనిన్; ఎఱుంగుటకున్; ఇది+అ= ఇదే; తెరువు= మార్గం; ఇట్టిది కానివిధంబు= ఇటువంటిది కానిది; అవిద్య; అని; చెప్పినన్; అతండు; నిజనందనునకున్= తన కుమారుడికి- దుర్యోధనుడికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** విద్య అనీ, అవిద్య అని రెండున్నాయి. అవిద్య చేత పాడయి, తమోగుణం చేత ఆక్రమించబడినవాడు విష్ణువును ఎరగడు. విద్యతో కూడుకొన్నవాడు ఎరుగుతాడు, అనగా, 'విద్య అనేది ఎటువంటిది? నీవు ఆ సర్వేశ్వరుడిని ఎలా తెలిసికొనగలిగావో దానినీ, అవిద్య ఎటువంటిదో దానినీ చెప్పుము అని అడగగా, ధృతరాష్ట్రుడితో సంజయుడు ఇట్లా' అన్నాడు: 'సత్త్వ రజస్తమోగుణాల వికారాలకు లోనుగాక, ధర్మం ఆచరిస్తూ, అంతశ్శుద్ధి కలిగి ఉంటాను.

దీనివలన నేను ఆ విష్ణువును ఎరుగుదును. ఇదీ విద్య. నీకుగానీ, ఇంకెవరికిగానీ విష్ణువును తెలిసికొనే మార్గం ఇదే. ఇటువంటిది కానిది అవిద్య' అని చెప్పగా, ధృతరాష్ట్రుడు తన కొడుకుతో ఇట్లా అన్నాడు:

**క. 'మన కాప్తుఁడు సంజయుఁ; డీ । తని యుపదేశంబు వట్టి ధర్మమున ముకుం**
**దుని నాశ్రయింపవయ్య! య । తనిఁ జొచ్చిన బ్రదుకుదీవుఁ దమ్ములు సుతులున్.' 321**

**ప్రతిపదార్థం:** సంజయుఁడు; మనకున్; ఆప్తుండు= కావలసినవాడు; ఈతని+ఉపదేశంబు+పట్టి= ఇతడి బోధను అనుసరించి; ధర్మమునన్= ధర్మంతో; ముకుందునిన్= కృష్ణుడిని; ఆశ్రయింపవయ్య!= ఆశ్రయించు నాయనా!; అతనిన్+చొచ్చినన్= అతడిని శరణంటే; తమ్ములున్; సుతులున్= కొడుకులూ; ఈవున్= నీవూ; బ్రదుకుదువు= ప్రాణాలతో ఉంటావు.

**తాత్పర్యం:** 'సంజయుడు మన మేలు కోరేవాడురా, ఇతని ఉపదేశం పాటించి ధర్మంతో కృష్ణుడిని ఆశ్రయించు నాయనా. అతడిని శరణంటే నీవు నీ తమ్ములతోనూ, కొడుకులతోనూ బ్రదుకుతావు.'

**చ. అనిన సుయోధనుండు దమ యయ్యకు నిట్లను: 'నిజ్జగంబు ల**
**న్నిని నొకపెట్ట మ్రింగినను, నెట్టన సర్వము గాచెనేనియు**
**న్వినుము - ముకుందుఁ డర్జునుని నెచ్చెలి నాఁ జెవులార వించు, నిం**
**క నతని నొక్క బామునకుఁగా ధృతిపెంపఱ నాశ్రయింతునే?' 322**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధృతరాష్ట్రు డనగానే; సుయోధనుండు= దుర్యోధనుడు; తమ+అయ్యకున్= తమ తండ్రికి; ఇట్లు+అనున్; వినుము; ఈ+జగంబులు+అన్నినిన్= ఈ లోకాల నన్నింటినీ; ఒకపెట్టన్= ఒక్కసారిగా; మ్రింగినను; నెట్టన= నిజంగా; సర్వము= అన్నింటినీ; కాచెన్+ఏనియున్= రక్షించినా; ముకుందుఁడు= కృష్ణుడు; అర్జునుని నెచ్చెలి నాన్= అర్జునుడి చెలికాడు అనగా; చెవులు+ఆరన్; వించున్= వింటూ; ఇంకన్; అతనిన్; ఒక్క బామునకున్+కాన్= ఒక కష్టానికిగాను; ధృతిపెంపు= ధైర్యాతిశయం; అఱన్= నశించగా; ఆశ్రయింతునే?= ఆశ్రయిస్తానా?

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రు డనగానే, దుర్యోధనుడు తన తండ్రితో ఇట్లా అన్నాడు: 'విను. ఈ లోకాల నన్నింటినీ ఒక్కసారిగా మ్రింగినా, అన్నింటినీ నిజంగా రక్షించినా, కృష్ణుడు అర్జునుడి చెలికాడని చెవులారా వింటూ, ఇంక అతడిని ఒక కష్టం వచ్చింది గదా అని, ధైర్యాతిశయం నశించగా ఆశ్రయిస్తానా?'

**విశేషం:** ఇందులో ఔపవిభక్తికమైన ఎన్ని శబ్దం అనౌపవిభక్తికంగా ప్రయుక్తమవటం విశేషం.

**తే. అనిన గాంధారి కిట్లను జనవిభుండు: । 'నీ తనూజుండు దుర్మాని నీతిబాహ్యుఁ**
**డుద్ధతుం డీసుమాని నా బుద్ధి వినఁడు; । వీఁడు సెడుఁగాని బ్రదుకంగ లేఁడు సుమ్ము!' 323**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దుర్యోధను డనగానే; జనవిభుండు= రాజు - ధృతరాష్ట్రుడు; గాంధారికిన్; ఇట్లు+అనున్; నీ తనూజుండు= నీ కొడుకు - దుర్యోధనుడు; దుర్మాని= దురభిమానం కలవాడు; నీతిబాహ్యుఁడు= నీతికి వెలిఅయినవాడు; ఉద్ధతుండు= గర్వితుడు; ఈసు మాని= ఈర్ష్య విడిచి; నా బుద్ధిన్; వినఁడు; వీఁడు; చెడున్+కాని= చెడిపోతాడే తప్ప; బ్రదుకంగన్+లేఁడు సుమ్ము!= బ్రతకలేడు సుమా!

**తాత్పర్యం:** అని దుర్యోధను డనగానే ధృతరాష్ట్రుడు గాంధారితో ఇట్లా అన్నాడు: 'నీ కొడుకు దురభిమాని, నీతిమాలిన వాడు. గర్వితుడు. ఈర్ష్య విడిచి నా బుద్ధి వినడు. వీడు చెడిపోతాడే తప్ప బ్రదకలేడు.'

**ఉ. నావుడుఁ దల్లి యిట్టులను నందనుతోఁ: 'నిది యేల యాయువున్**
**శ్రీ విభవంబులన్ మము నశేషసుహృజ్జనులం దొఱంగఁగా**
**నీవు గడంగె? దిట్టి యవినీతులునుం గలరే? వృకోదరుం**
**డై విధి సంపఁగా నొరుల కాఁగఁగ వచ్చునె యింకఁ బుత్త్రకా?' 324**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగానే; తల్లి; నందనుతోన్= కొడుకుతో; ఇట్టులు+అనున్; పుత్త్రకా!= కొడుకా!; నీవు; ఆయువున్; శ్రీ విభవంబులన్= సంపదనూ, వైభవాలనూ; మమున్; ఆశేష సుహృద్+జనులన్= సకల మిత్రులనూ; తొఱఁగఁగాన్+కడంగెదవు= విడిచిపెట్టాలని చూస్తావు; ఇది+ఏల?= ఎందుకురా ఇది?; ఇట్టి+అవినీతులునున్+కలరే!= ఇటువంటి అవినయపరులు కూడా ఉన్నారా?; విధి= దైవం; వృకోదరుండు+ఐ= భీముడై - భీముడి రూపంలో; చంపఁగాన్= చంపుతూ ఉంటే; ఇంకన్; ఒరులకున్= ఇతరులకు; ఆఁగఁగన్ వచ్చునె?= ఆప తరమా?

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రు డనగానే తల్లి గాంధారి తన కొడుకుతో ఇట్లా అన్నది: 'నాయనా, దుర్యోధనా! నీవు ఆయువునూ, సంపద్వైభవాలనూ, మమ్మల్నీ, సర్వమిత్రుల్నీ వదులుకొన యత్నిస్తావు ఎందుకురా? ఇటువంటి అవినీతులు కూడా ఉన్నారా? దైవం భీముడి రూపంలో నిన్ను చంపబోతూంటే ఇంక ఎవరాపగలరు?'

**విశేషం:** భీముడికి 'వృకోదర' శబ్దం సాభిప్రాయం కాబట్టి అలంకారం పరికరాంకురం.

**వ. అనియె; నట్టి యెడం గృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రునకిట్లను 'కృష్ణుండు నీకుం గూర్చు; నీవుం బరమాప్తుండైన సంజయు నతనిపాలికిం బుచ్చి; తది లెస్స కార్యం బయ్యె, వీఁడును నమ్మహానుభావు మహనీయ ప్రభావం బున్నరూ పెఱుంగు. వీని బుద్ధి విని యద్దేవు నాశ్రయింపు; మతం డేకాగ్రచిత్తులై యారాధించినవారికిఁ జేరువ యగుఁ; గామక్రోధోపహతులై తమ తమ ధనంబులం దృప్తులు గాక యన్యాయంబున వర్తించువారలకు దూరంబై యుండు; నెల్లభంగుల నాతనిం జొచ్చి బ్రదుకు;' మనినం, 'బ్రసాదం బట్ల చేయుదు' నని, విచిత్రవీర్యనందనుండు సూతనందనునితో 'నవ్వాసుదేవ నామ నిర్వచనంబు నాకుఁ దేటపడం దెలిపి యతనిం బొందు నుపాయం బుపదేశింపవే' యని యడిగిన. 325**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నది; అట్టి+ఎడన్= అప్పుడు; కృష్ణద్వైపాయనుండు= వ్యాసుడు; ధృతరాష్ట్రునకున్; ఇట్లు+అనున్; కృష్ణుండు; నీకున్; కూర్చున్= ఇష్టపడతాడు; నీవున్= నీవూ; పరమ+ఆప్తుండు+ఐన సంజయున్= మిక్కిలి కావలసినవాడైన సంజయుడిని, అతని పాలికిన్= ఆ కృష్ణుడి దగ్గరకు; పుచ్చితివి= పంపావు; అది; లెస్స కార్యంబు+అయ్యెన్= మంచి పని అయింది; వీఁడునున్= ఈ సంజయుడు కూడా; ఆ+మహానుభావు మహనీయ ప్రభావంబు= ఆ మహాత్ముడి మహామహిమ యొక్క; ఉన్న రూపు= ఉన్న విధం; ఎఱుంగన్; వీని బుద్ధి విని; ఆ+దేవున్= ఆ కృష్ణుడిని; ఆశ్రయింపుము; అతండు= కృష్ణుడు; ఏకాగ్రచిత్తులు+ఐ= అతడియందే లగ్నమైన మనస్సు కలవారయి; ఆరాధించినవారికిన్= పూజించినవారికి; చేరువ+ అగున్= చేరువవుతాడు; కామ క్రోధ+ఉపహతులు+ఐ= కామమూ, క్రోధమూ మొదలైవాటిచే కొట్టబడినవారయి; తమ తమ

ధనంబులన్= తమ తమ సంపదలతో; తృప్తులు+కాక= తనివి చెందక; అన్యాయంబునన్= సబబుగాని పద్ధతిలో; వర్తించువారలకున్= నడిచేవారికి; దూరంబు+ఐ+ఉండున్= దూరంగా ఉంటాడు; ఎల్ల భంగులన్= అన్నివిధాలా; ఆతనిన్= ఆ కృష్ణుడిని, చొచ్చి= చేరి; బ్రదుకుము= జీవించుము; అనినన్= అనగా; ప్రసాదంబు= చిత్తం; అట్లు+అ= అట్లాగే; చేయుదున్+అని= చేస్తానని; విచిత్రవీర్య నందనుండు= ధృతరాష్ట్రుడు; సూతనందనునితోన్= సంజయుడితో; ఆ+వాసుదేవ నామ నిర్వచనంబు= ఆ 'వాసుదేవు'డనే పేరున కర్థం; నాకున్; తేటపడన్+తెలిపి= స్పష్టపరిచి; అతనిన్= ఆ వాసుదేవుడిని; పొందు+ఉపాయంబు పొందేకిటుకు; ఉపదేశింపవే= బోధించవా; అని అడిగినన్= అని అడుగగా.

**తాత్పర్యం:** అని గాంధారి అన్నది. అప్పుడు వ్యాసుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: 'కృష్ణుడంటే నీ కిష్టం. నీవు మిక్కిలి కావలసినవాడైన సంజయుడిని అతడి దగ్గరకు పంపావు. అది మంచి పని అయింది. సంజయుడూ ఆ మహాత్ముడి మహా మహిమ యాథార్థ్యం తెలిసినవాడు. ఈ సంజయుడి మాట విని ఆ కృష్ణుడిని ఆశ్రయించుము. అతడు ఏకాగ్రచిత్తతతో ఆరాధించేవాళ్ళకు చేరువవుతాడు. కామ క్రోధాదులచేత దూషితులై తమకున్నదానితో తృప్తిపడక అన్యాయమార్గంలో ప్రవర్తించేవాళ్ళకు దూరమవుతాడు. అన్నివిధాలా అతడిని చేరి బ్రదుకుము. 'అనగా- 'చిత్తం అలాగే చేస్తా' అని ధృతరాష్ట్రుడు సంజయుడితో 'ఆ వాసుదేవుడనే పేరుకు అర్థం ఏమిటో నాకు స్పష్టపరిచి, అతడిని పొందే ఉపాయం ఉపదేశించవా' అని అడుగగా.

**తే. 'ఎల్లయందును దా వసియించు, టెల్ల । యదియుఁ దనయందు వసియించు టండ్రు వాసు**
**దేవుఁ డనుపేరి కర్థంబు; దెల్ల మింత । యెఱుఁగు జనులందుఁ దగ వసియించు శుభము. 326**

**ప్రతిపదార్థం:** వాసుదేవుఁడు+ అను పేరికిన్= వాసుదేవుడు అనే పేరుకు; అర్థంబు; ఎల్లఅందును= అన్నింటను; తాన్; వసియించుట= ఉండటమూ; ఎల్ల+అదియున్= ప్రతీదీ; తన+అందున్; వసియించుట; అండ్రు= అంటారు; తెల్లము= స్పష్టం; ఇంత+ఎఱుఁగు జనులందున్= ఈ విషయం తెలిసినవాళ్ళయందు; శుభము= మేలు; తగన్= ఒప్పుగా; వసియించున్= ఉంటుంది.

**తాత్పర్యం:** 'వాసుదేవుడు' అనే పేరుకు అర్థం అన్నిటా తాను ఉండటమూ, ప్రతీదీ తనయందు ఉండటమూ అంటారు పెద్దలు. ఇది స్పష్టం. ఈ విషయం తెలిసినవాళ్ళకు ఒప్పుగా శుభం కలుగుతుంది.

**తే. అతనిఁ బొందు నుపాయంబు నంతరంగ । నిగ్రహమ కాఁగ నార్యు లనుగ్రహింతు;**
**రోపి చిత్తవికారంబు లుడిపి, యేక । బుద్ధిఁ గొలువఁ బ్రసన్నతఁ బొందు నతఁడు. 327**

**ప్రతిపదార్థం:** అతనిన్= ఆ వాసుదేవుడిని; పొందు+ఉపాయంబున్= పొందే ఉపాయాన్ని; అంతరంగ నిగ్రహము+అ కాఁగన్= మనోనిగ్రహమే అని; ఆర్యులు+అనుగ్రహింతురు= పెద్దలు సెలవిస్తారు; ఓపి= ఓర్చి; చిత్తవికారంబులు+ఉడిపి= మనోవికారాలను విడిచి; ఏకబుద్ధిన్= ఏకాగ్రచిత్తంతో; కొలువన్= సేవిస్తే; అతఁడు= వాసుదేవుడు; ప్రసన్నతన్+పొందున్= ప్రసన్నుడవుతాడు.

**తాత్పర్యం:** మనోనిగ్రహమే ఆ వాసుదేవుడిని పొందడానికి ఉపాయం అని ఆర్యులు సెలవిస్తారు. ఓర్పు వహించి, మనోవికారాలను పోగొట్టి, ఏకాగ్రతతో సేవిస్తే వాసుదేవుడు ప్రసన్నుడవుతాడు.

**వ. నీవును బలుబుద్ధులుడిగి గోవిందు నాశ్రయింపు' మనినం బ్రజ్ఞాచక్షుం డిట్లనియె: 328**

**ప్రతిపదార్థం:** నీవును; పలు బుద్ధులు= పెక్కు చింతలు; ఉడిగి= మాని; గోవిందున్= కృష్ణుడిని; ఆశ్రయింపుము= శరణువేడుము; అనినన్; ప్రజ్ఞా చక్షుండు= బుద్ధియే నేత్రాలుగా కలవాడు - చర్మచక్షువులు లేనివాడు - గ్రుడ్డివాడు- ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నీవుకూడా పెక్కు అన్యచింతలను విడిచి కృష్ణుడిని ఆశ్రయించు' అనగా ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు:

**క. 'నాకు నయనేంద్రియము గతి । లేకుండుట కంత వగపులే; దఖిల మనో**
**జ్ఞాకారుఁడైన హరి నా । లోకింపం గానమికిఁ గలుగు వగ పెపుడున్. 329**

**ప్రతిపదార్థం:** నాకున్; నయన+ఇంద్రియము గతి= నేత్రేంద్రియ సౌకర్యం; లేక+ఉండుటకున్= లేకపోవటానికి; అంత వగపు లేదు= అంత విచారం లేదు; అఖిల మనోజ్ఞ+ఆకారుఁడు+ఐన హరిన్= అందరికంటె మనోహరమైన ఆకారంగల కృష్ణుడిని; ఆలోకింపన్+కానమికిన్= చూడలేకపోవటానికి; ఎపుడున్= ఎల్లప్పుడూ; వగపు= దుఃఖం, విచారం; కలుగున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** 'నాకు నేత్రేంద్రియ సౌకర్యం లేనందున అంత విచారం లేదు. అందరికంటె మనోహరమైన ఆకారం కల కృష్ణుడిని చూడలేకపోతున్నానే అని ఎప్పుడూ విచారిస్తాను.

**ఉ. ఆతనిఁ గన్నులారఁగ నహర్నిశముం గనుఁగొంచు నుండువా**
**రే తప మాచరించిరో? యుపేంద్రుని, నాశ్రితవత్సలున్, విని**
**ర్ధూతకలంకు, ధర్మనిరతుం, గరుణాకరు, సర్వలోక వి**
**ఖ్యాతుఁ, బవిత్రమూర్తి, శరణాగతరక్షకు నాశ్రయించెదన్'. 330**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ఆ కృష్ణుడిని; కన్నులారఁగన్= కళ్ళారా; అహర్నిశమున్= పగలూ, రాత్రీ; కనుఁగొంచున్+ఉండువారు= చూస్తూ ఉండేవాళ్ళు; ఏ తపము+ఆచరించిరో?= ఎటువంటి తపం చేశారో?; ఆశ్రిత వత్సలున్= ఆశ్రయించినవాళ్ళపై వాత్సల్యం కలవాడూ; వినిర్ధూత కలంకున్= ఎగురగొట్టబడిన పాపాలు కలవాడూ; ధర్మనిరతున్= ధర్మంపై ఆసక్తి కలవాడూ; కరుణాకరున్= దయగలవాడూ; సర్వలోక విఖ్యాతున్= అన్ని లోకాలలోనూ ప్రసిద్ధుడూ; పవిత్రమూర్తిన్= పావనాకారుడూ; శరణ+ఆగత రక్షకున్= శరణన్నవారిని కాపాడేవాడూ; అయిన; ఉపేంద్రునిన్= కృష్ణుడిని; ఆశ్రయించెదన్= శరణు వేడుతాను.

**తాత్పర్యం:** ఆ కృష్ణుడిని కళ్ళారా రేయింబవళ్ళు చూస్తూ ఉండేవాళ్ళు ఎటువంటి తపం చేశారో? ఆశ్రిత వత్సలుడూ, పాపాలను ఎగురగొట్టేవాడూ, ధర్మపరుడూ, సదయుడూ, సర్వలోక ప్రసిద్ధుడూ, పావనాకారుడూ, శరణాగతరక్షకుడూ అయిన కృష్ణుడిని ఆశ్రయిస్తాను.'

**వ. అని పలికి పరమశాంతుండై పారాశర్యు నుద్దేశించి 'దేవా! యేను వాసుదేవుని శరణు సొచ్చి బ్రదుకువాఁడ' ననుచుఁ గృతాంజలి యగుటయు వ్యాసమహామునియు నాశీర్వాదంబు సేసి యంతర్హితుం డయ్యెఁ; గౌరవేశ్వరుండును దుర్యోధన సంజయుల నిజ నివాసంబులకుం బోవం బనిచి, తానును గాంధారియు నభ్యంతర మందిరంబున కరిగి, యుచిత వ్యాపారంబులం బ్రవర్తిల్లుచునుండె' నని చెప్పిన విని 'పదంపడి పుట్టిన విశేషంబు లెట్టి' వని యడిగిన. 331**

**ప్రతిపదార్థం:** అని; పలికి; పరమ శాంతుండు+ఐ= మిక్కిలి శాంతుడయి; పారాశర్యున్= వ్యాసుడిని; ఉద్దేశించి; దేవా; ఏను; వాసుదేవునిన్; శరణు+చొచ్చి; బ్రదుకువాఁడన్; అనుచున్; కృత+అంజలి= నమస్కరించినవాడు; అగుటయున్= కాగా; వ్యాస మహామునియున్; ఆశీర్వాదంబు+చేసి; అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యుడయ్యాడు; కౌరవ+ఈశ్వరుండును= కురుప్రభువునూ - ధృతరాష్ట్రుడునూ; దుర్యోధన సంజయులన్; నిజ నివాసంబులకున్= తమ ఇండ్లకు; పోవన్+పనిచి= పంపివైచి; తానును; గాంధారియున్; అభ్యంతర మందిరంబునకున్= అంతఃపురగృహానికి; అరిగి= వెళ్ళి; ఉచిత వ్యాపారంబులన్= తగిన పనులలో; ప్రవర్తించుచున్= మెలగుతూ; ఉండెన్; అని; చెప్పినన్; విని; పదంపడి= తరువాత; పుట్టిన విశేషంబులు; ఎట్టివి; అని; అడిగినన్.

**తాత్పర్యం:** అని పలికి మిక్కిలి శాంతం వహించి వ్యాసుడిని చూచి, 'దేవా! నేను వాసుదేవుడిని శరణుచొచ్చి బ్రదుకుతాను' అంటూ నమస్కరించగా వ్యాసమహర్షియు దీవించి అదృశ్యుడయ్యాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుడినీ సంజయుడినీ వారి నివాసాలకు పంపివైచి, తాను గాంధారితో అంతఃపురగృహానికి వెళ్ళి తగిన పనులలో మెలగుతూ ఉన్నాడు' అని వైశంపాయనుడు చెప్పగా విని, జనమేజయుడు 'తరువాత పుట్టిన విశేషాలు ఏమిటి?' అని అడగగా. (తరువాత మూడో ఆశ్వాసంలోని రెండో వచనంలోని 'అనియె' అనే క్రియతో అన్వయం.)

### ఆశ్వాసాంతము

**శా. నిత్యానిత్యవివేక వైభవ సమున్నిద్రాంతరంగస్ఫుట**
**ప్రత్యక్షా! పరమేశ! విశ్వ జగదారాధ్యా! మహానంత చి**
**త్సత్యానంద విభు స్వభావ మహితా! సంవిత్సమాధాన దౌ**
**ర్గత్య వ్యాహృతి సంప్రవర్తన విదగ్ధ శ్రీ పదాంభోరుహా! 332**

**ప్రతిపదార్థం:** నిత్య+అనిత్య= ఇది నిత్యమూ, అది అనిత్యమూ అనే; వివేక= జ్ఞానం యొక్క; వైభవ= సంపద చేత; సమున్నిద్ర= మేల్కొన్న; అంతరంగ= మనస్సులో; స్ఫుట= స్పష్టమైన; ప్రత్యక్షా!= దర్శనం కలవాడా!; పరమేశ!= ఉత్కృష్టుడవైన ఈశ్వరా!; విశ్వ జగత్+ఆరాధ్యా!= సర్వజగత్తులచేతను పూజించదగినవాడా! మహా= గొప్పదీ; అనంత= అంతం లేనిదీ అయిన; చిత్= జ్ఞానమూ; సత్య= సత్యమూ; ఆనంద= ఆనందమూ; విభు= సర్వ వ్యాపకుడై ఉండటం; అనే; స్వభావ= స్వభావం చేత; మహితా!= పూజించబడినవాడా!; సంవిత్= జ్ఞానాన్ని; సమాధాన= కలిగించటంచేత; దౌర్గత్య వ్యాహతి= పాపవినాశాన్ని; సంప్రవర్తన= కలిగించటంలో; విదగ్ధ= నేర్పుగల; శ్రీ పద+ అంభోరుహా!= పద్మాలవంటి శ్రీపాదాలు కలవాడా!

**తాత్పర్యం:** ఇది నిత్యమూ, అది అనిత్యమూ అనే వివేక సంపద చేత ప్రబుద్ధమైన మనస్సులో స్పష్టంగా సాక్షాత్కరించేవాడా! పరమేశ్వరా! సకల జగత్తుల చేత ఆరాధించ దగినవాడా! గొప్పదీ, అంతం లేనిదీ అయిన సచ్చిదానంద సర్వవ్యాపకత్వ స్వభావం చేత పూజించబడేవాడా! ఉత్తమ జ్ఞానాన్ని కలిగించి, పాపాన్ని పోగొట్టటంలో నేర్పుగల శ్రీపాదపద్మాలు కలవాడా! హరిహరనాథా!

**విశేషం:** నిత్యానిత్య ...... ప్రత్యక్షా - భగవంతుడగు హరిహరనాథుడు ఏది నిత్యమో, ఏది అనిత్యమో తెలిసిన మనస్సులు గలవారికి తప్పక ప్రత్యక్షమవుతాడు. సంవిత్సమాధాన ... శ్రీ పదాం భోరుహా-పరమేశ్వరుడి శ్రీపాదపద్మాల ధ్యానం చేత జ్ఞానం కలిగి పాపాల నుండి విముక్తులవుతారు.

**క. వ్యాసాది మునిప్రోక్త మ । హా సందర్భాప్రమేయతా రూఢ గుణో**
**ల్లాసా! నైర్గుణ్యసము । ద్భాసి రహస్యానుభావ! భక్తాధీనా!** 333

**ప్రతిపదార్థం:** వ్యాస+ఆది= వ్యాసుడూ మొదలైన; ముని= మహర్షులచేత; ప్ర+ఉక్త= చెప్పబడిన; మహా సందర్భ= వాఙ్మయంలోని గొప్ప ప్రకరణాలచేత కూడా; అప్రమేయతా= నిర్ణయించశక్యం కాని; ఆరూఢ= ప్రసిద్ధాలైన; గుణ= గుణముల యొక్క; ఉల్లాసా!= ప్రకాశం కలవాడా! నైర్గుణ్య= గుణరాహిత్యం చేతనే; సముద్భాసి= మిక్కిలి ప్రకాశించే; రహస్య= గూఢమైన; అనుభావ!= ప్రభావం కలవాడా! భక్త+అధీనా= భక్తులకు వశమైనవాడా!

**తాత్పర్యం:** శ్రీకృష్ణద్వైపాయనాది మహర్షులచేత రచించబడిన గ్రంథాల ప్రకరణాలలో కూడా నిర్ణయించ శక్యంకాని గుణముల ప్రకాశం కలవాడా! గుణరాహిత్యమునందే ప్రకాశించే గూఢమైన మహాశక్తి కలవాడా! భక్తవశంవదుడా హరిహరనాథుడా!

**విశేషం:** 'వ్యాసాది...గుణోల్లాసా!' వ్యాసాది మహర్షులు పరమేశ్వర ప్రతిపాదకములైన బ్రహ్మసూత్ర భగవద్గీతాది మహాగ్రంథాలను పరమేశ్వర నిరూపణకై రచించినా, ఆ గ్రంథాలు కూడా పరమేశ్వరుడి గుణప్రకాశాన్ని ప్రతిపాదించలేకపోతున్నాయి. 'నైర్గుణ్య ---- భావ' ఎటువంటి గుణాలూ లేకున్నా, జగత్సృష్టి స్థితి లయ రూపమైన మహాశక్తి అతడియందు అంతర్గతంగా ఉంటుందని భావం. 'భక్తాధీనా' పరమేశ్వరుడు వాస్తవంగా స్వతంత్రుడే అయినా, భక్తజనులకు మాత్రం అధీనుడు.

**మాలిని.**

**నమ దనిమిషచూడా నవ్యరత్న ప్రభా సం**
**గమ రుచిర పదాబ్జా! గర్వ దుర్వార దైత్యో**
**ద్యమ బహుల తమో మార్తాండ! దోః క్రీడన ప్ర**
**క్రమ లలిత వికాసా! గాఢ భక్తి ప్రకాశా!** 334

**ప్రతిపదార్థం:** నమత్= నమస్కరిస్తున్న; అనిమిష= దేవతలయొక్క; చూడా= సిగయందలి; నవ్య= క్రొత్తవియగు; రత్న= మణుల యొక్క; ప్రభా= కాంతుల యొక్క; సంగమ= కలయికచేత; రుచిర= మనోహరమైన; పద+అబ్జా!= తామరలవంటి పాదములు కలవాడా! గర్వ= అహంకారం చేత; దుర్వార= వారించశక్యంకాని; దైత్య= రాక్షసుల యొక్క; ఉద్యమ= లోకాలను బాధించే ప్రయత్నం అనే; బహుల తమస్= గాఢాంధకారానికి; మార్తాండ!= సూర్యుడైనవాడా!; దోస్+క్రీడన= దుష్ట శిక్షణం కోసమైన భుజ పరాక్రమంయొక్క; ప్రక్రమ= ప్రారంభమనే; లలిత వికాసా!= మనోహరమైన వికాసం కలవాడా!; గాఢ భక్తి ప్రకాశా!= దృఢమైన భక్తి చేతనే ప్రకాశించేవాడా! - హరిహరనాథా!

**తాత్పర్యం:** హరిహరనాథా! తలలొగ్గి నీకు నమస్కరించే దేవతల సిగల లోని నూత్నమణుల కాంతుల కలయికచేత మనోహరమైన అడుగుదామరలు కలవాడా!, అహంకారం చేత వారించ శక్యం కాని రాక్షసుల జగద్బాధక ప్రయత్నం అనే గాఢాంధకారానికి సూర్యుడైనవాడా; దుష్టులను శిక్షించటం కొరకు చూపే భుజపరాక్రమం అనే లీల కలవాడా! దృఢమైన భక్తి చేతనే తెలియబడేవాడా!

**విశేషం:** 'దైత్యోద్యమ బహుల తమో మార్తాండ' - దైత్యోద్యమమే బహుల తమస్సు. దానికి హరిహరుడే మార్తాండుడు - రూపకాలంకారం. బహుల తమస్సును మార్తాండుడు పారద్రోలే విధంగా, దైత్యోద్యమాన్ని హరిహరనాథుడు వమ్ము చేస్తాడని

భావం. మాలినీ వృత్తంలోని ప్రతి పాదంలో వరుసగా న-న-మ-య-య- అనే గణాలు వరుసగా ఉంటాయి. 9వ అక్షరం యతిస్థానం. ప్రాస నియతం.

**గద్యము**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున నుద్యోగపర్వంబునందు ద్వితీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది ఉభయ కవిమిత్త్ర బిరుదాంచితుడూ, కొమ్మనామాత్యుడి కుమారుడూ, బుధుల పూజచేత ప్రకాశించేవాడూ అగు తిక్కన సోమయాజిచే రచించబడిన శ్రీ మహాభారతంలోని ఉద్యోగపర్వంలో రెండో ఆశ్వాసం.

ఉద్యోగపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము - తృతీయాశ్వాసము

**శ్రీవాగ్విభవారోగ్య । ప్రావీణ్యప్రాభవానుభావమహిత సౌ**
**ఖ్యావహ పదస్మరణ! కరు । ణావాస కటాక్షకిరణ! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీవాక్+విభవ= లక్ష్మీసరస్వతుల యొక్క సమృద్ధి; ఆరోగ్య= రోగం లేకుండటం; ప్రావీణ్య= నేర్పు; ప్రాభవ= ప్రభుత్వం అనే వాటియొక్క; అనుభావ= ప్రభావంచేత; మహిత= గొప్పదైన; సౌఖ్య= ఆనందాన్ని; ఆవహ= కలిగించే; పదస్మరణ= పాదములయొక్క స్మరణం కలవాడా!; కరుణా= దయకు; ఆవాస= నిలయమైన; కటాక్ష కిరణ!= కడగంటి చూపులయొక్క వెలుగు కలవాడా!; హరిహరనాథా= హరిహరనాథుడనే పేరుగల దైవమా!

**తాత్పర్యం:** హరిహరనాథుడనే పేరు గల పరమేశ్వరా! నీ చరణాలను స్మరించేవారికి నీవు ఐశ్వర్యం. విద్య, ఆరోగ్యం, నైపుణ్యం, ప్రభుత్వం అనే వాటిని లభింపజేసి, వాటి మహిమ చేత గొప్పదైన ఆనందాన్ని సమకూరుస్తావు. నీ పదధ్యానం అటువంటి మహిమ గలది. స్వామీ! వెలుగులు వెదచల్లే నీ క్రీగంటి చూపులు దయకు నిలయాలు.

### శ్రీకృష్ణుని రాయబారము (సం. 5-70-1)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె:** 2

**తాత్పర్యం:** స్వామీ! హరిహరనాథా! అవధరించుము. కథకుడైన వైశంపాయన మహర్షి శ్రోత అయిన జనమేజయ మహారాజుతో ఇట్లా అన్నాడు:

**తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన ధర్మ । సుతుఁడు మఱునాఁడు దమ్ముల సుతుల నిష్ట**
**భృత్యవరులఁ గొలువునకుఁ బిలువఁ బనిచి । యెల్లవారలు వినుచుండ నిట్టు లనియె.** 3

**ప్రతిపదార్థం:** సంజయుఁడు= ధృతరాష్ట్రుడి దగ్గర నుండి దూతగా వచ్చిన సూతపుత్రుడైన సంజయుడు; తన్నున్= తనను (ధర్మపుత్రుడిని); వీడ్కొని= వదలి; చనినన్= (హస్తినాపురికి) వెళ్ళగా; ధర్మసుతుఁడు= యముని కుమారుడైన ధర్మరాజు; మఱునాఁడు= మరుసటిదినం; తమ్ములన్= తమ్ములను; సుతులన్= కొడుకులను; ఇష్టభృత్యవరులన్= తనకు ప్రీతిపాత్రులైన సేవకులను; కొలువునకున్= ఆస్థానానికి; పిలువన్+పనిచి= పిలుచుకొనిరండని పరిచారకులను పంపి; ఎల్లవారలు= అందరును; వినుచున్+ఉండన్= ఆలకిస్తూ ఉండగా; ఇట్టులు+అనియెన్= ఈ ప్రకారంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఉపప్లావ్య పట్టణంలో ఉన్న తనను వదలి సంజయుడు హస్తినాపురికి వెళ్ళిన తరువాత ధర్మనందనుడు ఆ మరుసటిరోజు తన తమ్ముళ్ళనూ, కొడుకులనూ, సామంతరాజులనూ చెంతకు పిలిపించుకొని, వారంతా వింటుండగా ఇట్లా అన్నాడు :

**విశేషం:** సంజయుడి రాయబారం వలన పాండవులకు ఒరిగినదేమీ లేదు. అందువలన శ్రీకృష్ణుడి రాయబారం అవసరమైనది. దానికి శ్రీకారం చుట్టుతూ పాండవ నాయకుడైన ధర్మరాజు కాలయాపనం జరుగకుండా మరునాడే యత్నం ప్రారంభించాడు. తన స్వంత కొలువులో ఆత్మీయులనూ, సన్నిహితులనూ సమావేశపరిచాడు. అది ఒక విధంగా ఆత్మీయసభ, ఆంతరంగిక సభ, అత్యవసర సమావేశం. రాజు తనంతట తాను పిలిచిన సభ. నాటకీయంగా ఇదొక చిన్నరంగం వంటిది. సభలో సభ్యులు కూర్చున్నట్లూ, వారందరూ వినేటట్లుగా ధర్మరాజు సమావేశ ప్రయోజనాన్ని వినిపించనున్నట్లూ ఒక నిండైన దృశ్యం ఈ తేటగీతిలో ప్రత్యక్షమయింది. (సంపా.)

**క. 'మనము జనార్దను పాలికిఁ । జని కౌరవసభకు నతనిఁ జనుమని ప్రార్థిం**
**చిన మేలు బంధు హిత గురు । జనములతో రణము గాక సంప్రీతి యగున్.' 4**

**ప్రతిపదార్థం:** మనము= మన మందరమూ; జనార్దను పాలికిన్= శ్రీకృష్ణుడి వద్దకు; చని= వెళ్ళి; కౌరవ సభకున్= ధృతరాష్ట్రుడి కొలువుకూటానికి; చనుము+అని= పొమ్మని; అతనిన్= ఆ శ్రీకృష్ణుడిని; ప్రార్థించినన్= వేడుకొన్నచో; మేలు= మంచిది; బంధు హిత గురుజనములతోన్= చుట్టాలు, మేలుకోరేవారు, గురువులు అయినట్టివారితో; రణము కాక= యుద్ధం జరగకుండ; సంప్రీతి+అగున్= సంతోషం కలుగుతుంది.

**తాత్పర్యం:** 'మన మంతా కలిసి మాధవుడి దగ్గరకు వెళ్ళి కౌరవసభలో మన విషయాలన్నీ చర్చించవలసినదిగా ఆయనను వేడుకొందాము. అట్లా చెయ్యటంవలన మనకెంతో మేలు కలుగుతుంది. ఎందుకంటే చుట్టాలతో, హితులతో, గురువులతో మనకు పోరు తప్పుతుంది. ఆనందం కలుగుతుంది.'

**విశేషం:** సభలో ముక్తసరిగా మూడు ముక్కలతో తాత్పర్యం తేటపడేటట్లు మాటలాడే ధర్మజుడి నేర్పు ఈ పద్యంలో స్పష్టం. ఇందులో రెండు వాక్యాలున్నాయి. రెండూ మిశ్ర సమ్మితంగా ఉన్నాయి. వాటిలో వాడిన పదాల వరుస కూడా కార్యక్రమ సూచకంగా ఉండటం విశేషం. 'అందరూ కలిసి జనార్దనుడి దగ్గరకు పోవాలి. ఆ తరువాత కౌరవ సభకు ఆయనను పొమ్మని ప్రార్థించాలి. అట్లా చేయుటం శుభం. మనకు మేలు జరుగుతుంది. ఆ మేలు ఎటువంటిదంటే బంధువులతో, స్నేహితులతో చివరకు పెద్దలతో యుద్ధం తప్పుతుంది. సంతోషం కలుగుతుంది' అని అన్నాడు. కార్యాన్నీ, ఫలాన్నీ ఒక్కసారి దర్శించగల వాక్యం. చమత్కార మేమంటే - ఈ వాక్యాలు సున్నితమైన ఆదేశాలు, నిపుణమైన నిర్ణయాలు, తీర్చిదిద్దిన తీర్మానాలు. రాజు ఒక సంగ్రహ ప్రకటన చేయుటం, దాని నందరూ ఏకగ్రీవంగా అంగీకరించటం ఈ సన్నివేశ చాతుర్యం. ధర్మజుడి సర్వామోద నాయకత్వం ఈ సన్నివేశం ధ్వనింపజేస్తున్నది.

2. శ్రీకృష్ణుడే స్వయంగా 'కురుసభకు వచ్చి శాంతివచనాలు ధృతరాష్ట్రుడితో పలుకుతా'నని సంజయుడి రాయబారపు సందర్భంగా చెప్పాడు (ఉద్యో-1-360). ధర్మరాజు దానిని వ్యవస్థీకరించే ప్రయత్నం చేస్తున్నాడు. ఈ రచనలో శబ్దార్థగుణమైన ప్రసాదం పోషించబడింది. (సంపా.)

**వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవు మందిరంబున కరిగి యతని చేత సత్కృతుండయి సమస్త పరిజనంబులుం బరివేష్టింప నొక్క పార్శ్వంబునం బాంచాలియు సముచిత పరివార పరివృతయై యుండ నతండునుం దానును సుఖాసీనులై యుండి యతనితో నిట్లనియె: 5**

**ప్రతిపదార్థం:** అని పలికి= అలా ధర్మరాజు వచించి; వారలు+అందఱున్= సోదరులు, కుమారులు, సామంతులు, ఇష్టభృత్యులు; బలసి= చుట్టుకొని; చనుదేరన్= తన వెంట రాగా; మాధవు మందిరంబునకున్= శ్రీకృష్ణుడి భవనానికి; అరిగి= పోయి;

అతనిచేతన్= వాసుదేవుడి చేత; సత్కృతుండు+అయి= సమ్మానించబడి; సమస్త పరిజనంబులున్= పరివారమంతా; పరివేష్టింపన్= తన చుట్టూ చేరగా; ఒక్క పార్శ్వంబునన్= ఒకవైపు; పాంచాలియున్= పాంచాల దేశాధిపతి పుత్రికఅయిన ద్రౌపది; సముచిత పరివార పరివృత ఐ= తగిన పరిజనంతో చుట్టబడినదై; ఉండన్= ఉండగా; అతండునున్= ఆ శ్రీకృష్ణుడునూ; తానును= ధర్మరాజున్నూ; సుఖ+ఆసీనులు+ఐ+ఉండి= హాయిగా కూర్చుండినవారై; అతనితోన్= హరితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా పలికి ధర్మజుడు తనవారంతా వెనువెంట రాగా శ్రీకృష్ణుడున్న చోటికి వెళ్ళాడు. అక్కడ ఆయన ఆదరణలు అందుకొన్నాడు. పరివారమంతా తనను సేవిస్తుండగా, తగిన పరిజనంతో ద్రౌపది ఒక ప్రక్క నుండగా ధర్మరాజు కృష్ణుడితోపాటు హాయిగా కూర్చున్నాడు. ఆ తరువాత ఇట్లా అన్నాడు :

**విశేషం:** ఇందులోనిది మాధవుడి మందిరంలోని రంగం, ఆ రంగంలో పాత్రలు కూర్చున్న రంగపరికల్పనం ప్రత్యక్షం. సామూహికంగా అందరూ కలిసి మాధవుడి మందిరానికి పోయారు. క్రమశిక్షణతో మెలగారు. విశేష మేమంటే పరివారంతో పాంచాలి కూడా అక్కడికి వచ్చింది. ఆమె పరిజనంతో కూడి ఒక ప్రక్కన కూర్చున్నది. మిగిలిన వారందరూ మరొక ప్రక్కన కూర్చున్నారు. ఉభయ పార్శ్వాలకు నడుమ ఉన్నతాసనాలమీద శ్రీకృష్ణుడు, ధర్మరాజు అభ్యర్థి కాబట్టి అత డీ సంభాషణ మొదలు పెట్టాడు. అంటే మరొక రంగం ప్రారంభమైనదన్నమాట. రంగ పరికల్పన శిల్పంలో తిక్కన అందెవేసిన చేయి. (సంపా.)

**క. 'ఆపదఁ గడవం బెట్టఁగ । నోపి శుభంబైనదాని నొడఁగూర్పను మా**
**కీ పుట్టువునకుఁ బాండు । క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా! 6**

**ప్రతిపదార్థం:** మహాత్మా!= మహానుభావా!; ఆపదన్= కష్టాన్ని; కడవన్+పెట్టఁగన్= దాటించుటకు; ఓపి= సమర్థుడై; శుభంబు+ఐనదానిన్= మేలు గూర్చునట్టిదానిని; ఒడఁగూర్పను= కలిగించుటకు; మాకున్= తన కుమారులమైన మాకు; ఈ పుట్టువునకున్= ఈ జన్మకు; పాండుక్ష్మాపాలుఁడు= పాండు మహారాజు; నిన్నున్+చూపి= నిన్ను దిక్కుగా మాకు కనబరచి; చనియెన్= స్వర్గం చేరాడు.

**తాత్పర్యం:** 'మహానుభావా! కష్టాలను తొలగించటానికీ, శుభాలను సమకూర్చటానికీ సమర్థుడవైన నిన్ను ఈ జన్మకు మాకు దిక్కుగా చూపి, మా తండ్రి పాండుమహారాజు వెళ్ళిపోయాడు.

**విశేషం:** అలం: హేతువు. 1.ధర్మజుడి ధర్మనీతికి కీర్తిధ్వజం వంటి ఉపన్యాసానికి ఈ పద్యం నాందీ వాక్యం వంటిది. 2. 'మహాత్మా!' అనే సంబుద్ధి ధర్మరాజు శ్రీకృష్ణుడిలో దేవుడినీ, పూజ్యుడినీ, స్నేహితుడినీ, మార్గదర్శకుడినీ దర్శిస్తున్నాడని ధ్వని. 3. 'తండ్రి తరువాత తండ్రి వంటివాడవు నీవే' అని చెప్పే భావాన్ని 'మా తండ్రి పోతూ నిన్ను చూపించి వెళ్ళాడు' అనటం తెలుగు జాతీయం. అంటే- పాండవులు తండ్రి లేని బిడ్డలనీ, వారిని తండ్రిగా రక్షించి, పోషించి దీవించవలసిన బాధ్యత ఆయనదే అనీ పలికాడు ధర్మజుడు. ఈ జన్మకు నీవే మా తండ్రివి - అనటం శరణాగత భావానికి ప్రతీక. 4. కష్టాలనుండి గట్టెక్కించేవాడూ, శుభాలు కలిగించేవాడూ భగవంతుడు. లేదా మహాత్ముడు. దుష్టశిక్షణ, శిష్టరక్షణ విధుల వంటివవి. వాటిని పాండవులకు సదా సమకూర్చే పరమాత్మ శ్రీకృష్ణుడని ధర్మజుడు భగవద్భక్తి విశేష చిత్తవృత్తిని ప్రదర్శించాడు. 5. శ్రీమన్నారాయణుడైన శ్రీకృష్ణుడు స్నేహభక్తి భావవశుడై పాండవుల యోగక్షేమాలు చూడటం ప్రసిద్ధం. 6. ఉద్యోగపర్వంలో పాండవులను యుద్ధమనే ఆపద నుండి గట్టెక్కించటం, రాజ్యలాభమనే శుభాన్ని కలిగించటం శ్రీకృష్ణుడి కర్తవ్యాలని ధ్వని.

తనంతట తానే హస్తినాపురానికి వెళ్ళి శాంతియత్నం చేయబూనటం - ఆపద గడవం బెట్టటం. ఫలిత మేమైనా పాండవులకు విజయాన్ని చేకూర్చి కౌరవనాశనం చేయటం శుభఫలం. ఈ రెండూ శ్రీకృష్ణుడి అంటే భగవంతుడి అధీనంలో ఉన్నాయనటం, ఆ భగవద్రూపుడైన శ్రీకృష్ణుడే తల్లి, తండ్రి, దైవం, రక్ష అని నివేదించుకొనటం ధర్మజుడి భక్తియుక్తమైన ధర్మనీతి వర్తనకు నిదర్శనం. ప్రార్థనకు శుభారంభం. ఇందులోని గుణం ప్రసాదం. (సంపా.)

**తే.** **సమయ మిది మిత్త్రకార్యంబు చక్కఁ జేయ । నీ కతంబున నే మవినీతుఁ డైన**
**యా సుయోధను తోడి పోరాట దక్కి । యనుభవింతుము మా యంశమగు ధరిత్రి.** 7

**ప్రతిపదార్థం:** మిత్ర కార్యంబున్= స్నేహితుల యొక్క పనిని; చక్కన్+చేయన్= సరిచేయటానికి; సమయము+ఇది= ఇది తగిన వేళ; నీ కతంబునన్= నీ మూలాన; ఏము= మేము; అవినీతుఁడు+ఐన= అవిధేయుడైనట్టి; ఆ సుయోధనుతోడి పోరాట= ఆ దుర్యోధనుడి తోడి కలహం; తక్కి= మాని; మా+అంశము+అగు ధరిత్రిన్= మా వంతు భూమిని; అనుభవింతుము= మేము అనుభవించగలం.

**తాత్పర్యం:** కృష్ణా! మిత్రులమైన మా పనిని చక్కబెట్టడానికి నీ కిది తగిన తరుణం. నీవు రాయబారానికి వెళ్ళితే అయోగ్యుడైన ఆ దుర్యోధనుడితో మేము యుద్ధం చేయవలసిన అవసరం రాదు. మా పాలికి వచ్చే రాజ్యాన్ని మేము అనుభవించగలం.

**విశేషం:** దివ్యాదివ్యుడైన శ్రీకృష్ణుడికి సూటిగా చేసిన ప్రార్థన ఇది. ఇందులో రెండంశాలు స్పష్టమవుతున్నాయి.

1. కురుపాండవుల వివాదం మిత్రకార్యంగా భావించుమని వేడికోలు. మిత్రకార్యమైతేనే మిత్రసమ్మితమైన ప్రబోధం నిర్వహించటానికి వీలవుతుంది. హితబోధకు అవకాశ మేర్పడుతుంది. ఇరువైపులా సమయ మెరిగి మందలించటానికి అనువుగా ఉంటుంది.

2. కౌరవపక్షంలో ప్రధానుడు దుర్యోధనుడు. అతడు నీతియుతుడు కాకపోగా అవినీతిపరుడు. అతడిని మిత్రవాక్యాలతో ఒక త్రోవకు తేవటం తేలికైన పనికాదు. అతడు రాజ్యపిపాసి. అందువలన యుద్ధం కాకుండా అతడు రాజ్యభాగమీయటం అసంభవం.

3. అటువంటి దుర్యోధనుడితో, అతడి తండ్రితో మంతనాలు సలిపి, హితవు చెప్పి పాండవులకు న్యాయంగా రావలసిన రాజ్యభాగాన్ని తిరిగి ఇప్పించటానికి శ్రీకృష్ణుడు కృషి చేయాలి.

4. ఈ పద్యం 6వ పద్యానికి అనుబంధం. అది సూత్రం. ఇది ఉదాహరణం. అది శ్రీ కృష్ణుడి దక్షతను తెలిపేది. ఇది ఆ దక్షత వలన సాధించదగిన అసాధ్యకార్యాన్ని నిర్దేశించేది.

5. ఇందులో ధర్మరాజు శాంతియుతంగా తనకు రావలసిన నేల వాటాను మాత్రమే కోరుతున్నాడు. దానికి దుర్యోధను డంగీకరించడు. సగమిస్తే పూర్తిగా జయించగల పరాక్రమం పాండవులకున్నదని అతడికి తెలుసు. ధర్మజుడు భాగం అడుగుతున్నాడు. కాదంటే మొత్తం రాజ్యాన్నే ఆక్రమిస్తాడు. భావి వ్యూహమంతా 'పోరాట దక్కి యనుభవింతుము మా యంశమగు ధరిత్రి' అనే వాక్యంలో బీజప్రాయంగా నిక్షిప్తం చేయబడి ఉన్నది.

6. కాబట్టి ఈ పద్యం భావి యుద్ధోద్యోగ బీజతుల్యం. గుణం ప్రసాదం (సంపా.)

**వ.** **నీకు మేము ప్రద్యుమ్నాది కుమారుల తోడివారము, మమ్ము దురితంబులు వొరయకుండ నరసి రక్షింపు' మనవుడు వాసుదేవుండు 'నీ పంచిన యట్ల చేయంగలవాఁడ; నెయ్యది తలంపు? సెప్పు' మనిన**

**నజాతశత్రుండు 'నీవు కరినగరంబున కరిగి కౌరవులతోడం దగిన మాటలాడి తెఱంగు సేయవలయు' నని ప్రార్థించి, యతని నియ్యకొలిపి యిట్లనియె: 8**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; మేము= పాండవులం; ప్రద్యుమ్న+ఆది కుమారులతోడివారము= ప్రద్యుమ్నుడు మొదలైన నీ పుత్రులతో సమానులం; మమ్మున్= మమ్ములను; దురితంబులు= పాపములు; పొరయక+ఉండన్= చెందకుండేటట్లుగా; అరసి= విచారించి; రక్షింపుము= కాపాడుము; అనవుడున్= అని ధర్మరాజు వేడిన మీదట; వాసుదేవుండు= వసుదేవుని కుమారుడైన శ్రీకృష్ణుడు; నీ పంచిన+అట్లు+అ= నీవెట్లా చేయుమని చెపుతావో ఆ విధంగా; చేయన్+కలవాఁడన్= చేయగలను; ఏ+అది+తలంపు+చెప్పుము= నీ ఉద్దేశ మేమిటో నాకు తెల్పుము; అనినన్= అని శ్రీకృష్ణుడు పలుకగా; అజాతశత్రుండు= విరోధులే లేని ధర్మరాజు; నీవు కరినగరంబునకున్+అరిగి= నీవు హస్తినాపురికి వెళ్ళి; కౌరవులతోడన్= ధృతరాష్ట్రుడు మొదలైనవారితో; తగిన మాటలు+ఆడి= ఉచితములైన పలుకులు పల్కి; తెఱంగు+చేయవలయున్= ఒక దారి నేర్పరచాలి; అని ప్రార్థించి= అని వేడుకొని; అతనిన్= శ్రీకృష్ణుడిని; ఇయ్యకొలిపి= సమ్మతింపజేసి; ఇట్లు+అనియెన్= మళ్ళీ ఈ ప్రకారం పలికాడు.

**తాత్పర్యం:** కృష్ణా! ప్రద్యుమ్నుడు మొదలైన నీ కుమారులు నీకు ఎట్లాంటివాళ్ళో మేము కూడా అట్లాంటి వాళ్ళమే. మాకు పాపాలు సోకకుండేటట్లు ఆలోచించి మమ్మల్ని కాపాడుము' అంటూ ధర్మనందనుడు ప్రార్థించాడు. అంతట శ్రీకృష్ణుడు 'నీవు ఏమి చేయుమని ఆదేశిస్తావో అట్లా చేస్తాను. నీ అభిప్రాయ మేమిటో చెప్పు' మన్నాడు. అప్పుడు ధర్మజుడు కృష్ణుడితో 'నీవు హస్తినాపురికి పోయి కౌరవులతో తగుమాటలాడి ఒకదారి నేర్పరచాలి' అని అర్థించి, అందు కాయనను అంగీకరింపజేసి మళ్ళీ ఇట్లా పలికాడు :

**విశేషం:** 1. రక్షించుమని ధర్మరాజు శ్రీకృష్ణుడిని - దేవుడిని ప్రార్థించినట్లు ప్రార్థిస్తున్నాడు. ఆ రక్షా విధానం పితాసుత సంబంధ బంధురమై ఉండాలని తమను ప్రద్యుమ్నాదులతో పోల్చుకొన్నాడు. అంటే శ్రీకృష్ణుడిని పాండవుల కపికిశోర న్యాయంతో రక్షించుమని వేడుతున్నారని భావం. పాండవ యత్నం లేకుండా భగవంతుడైన శ్రీకృష్ణుడి యత్నమే కార్యంగా సాగాలని వేడుకొన్నాడు. అంటే, పాండవుల భారమంతా శ్రీకృష్ణుడిపై ఉంచారన్నమాట.

2. పాండవులకు పాపాలు సోకకుండా కార్యం నిర్వహించుమని మరొక వేడికోలు. ఇది ధర్మజుడి ధర్మనీతి వర్తనాన్నీ, భగవంతుడికి ప్రీతిపాత్రమైన ప్రవృత్తినీ వ్యంజింపజేస్తున్నది. ఉద్యోగంలో రాజనీతి ప్రవర్తిల్లినా, అది ధర్మహాని కలిగించి పాండవులకు అపకీర్తిని, పాపఫలితాన్ని కలిగించకూడదు. అర్థం కంటె ధర్మమే ధర్మరాజుకు ప్రీతి. అది దేవుడు మెచ్చే గుణం.

3. ధర్మరాజు ప్రార్థిస్తున్నాడు. శ్రీకృష్ణుడు 'నీ ఆదేశాన్ని అక్షరాలా పాటిస్తా'నని అంటున్నాడు. ఇక్కడ ఒక రాజనీతి ధర్మసూత్రం ఉన్నది. శ్రీకృష్ణుడు తానే హస్తినాపురానికి పోవాలని నిశ్చయించాడు. దానికి ధర్మజుడి అనుమతిని కోరలేదు. అయితే ధర్మజుడు ఆ ప్రతిపాదనను నిండుసభలోనే సమ్మతించాడు. కాగా, శ్రీకృష్ణుడు కురుసభలో స్వతంత్ర ప్రతిపత్తితో మాట్లాడతాడు. అందువలన ఆ మాటలాడేటప్పుడు ఏ పక్షానికీ అతడు ప్రాతినిధ్యం వహించక ధర్మదేవతలవలె పలుకవచ్చును. కాబట్టి, ముందుగానే తన వాదాన్ని శ్రీకృష్ణుడి ముందు నివేదించుకొనటానికి ధర్మరాజు పూనుకొన్నాడు. శ్రీకృష్ణుడు మనసు విప్పి, ధర్మరాజు ఏది ఆజ్ఞాపిస్తే దానినే చేస్తానని చెప్పి, తాను పాండవపక్షాననే హస్తినకు వెళ్ళుతున్నట్లు ప్రకటించాడు. దానితో ప్రభువు ధర్మరాజనీ అతడి పంపున వెళ్ళుతున్న రాయబారి శ్రీకృష్ణుడనీ భావించే అవకాశం కలిగింది. దానిని ధర్మరాజు చక్కగా వినియోగించుకొని 'నీవు హస్తినాపురానికి పోయి కౌరవులతో తగు మాటలాడి న్యాయం చేయు'మని కోరాడు. అంటే-

మొదట శ్రీకృష్ణుడు స్వీయ సంకల్పంతో పోదలచాడు. ఇప్పుడు పాండవ ప్రార్థనకు అనువుగా పోవనిశ్చయించాడు. శ్రీకృష్ణుడు ఎంత స్వతంత్రుడో, అంతటి భక్తపరతంత్రుడని రాజనీతిపరంగా కూడా ప్రదర్శించటం ఈ సన్నివేశ విశేషం. (సంపా.)

**సీ. 'మా తండ్రి తలఁపును నాతని నందను । చందంబు నిన్న నా సంజయుండు**
**పలికిన పలుకులఁ దెలిసెఁగదా నీకు; । వారి చిత్తము భంగి వాఁ డెఱుంగుఁ;**
**బాలు పంపనియీక మేలిమాటలన మ । మ్మలుక దీర్చెదరు తా; రధిక దుష్క**
**రంబైన యాసమయం బేము పదుమూఁడు । వత్సరంబులు సల్పి వచ్చియుండఁ**

**ఆ. గులము పాడి నడపఁ దలఁపడ; పతి సెడఁ । దలఁచెనేనిఁ గొడుకు వలచినట్టి**
**వాఁడు గాన యతని వక్రత మాన్పలేఁ; । డింతకంటెఁ గలదె యెడరు మాకు? 9**

**ప్రతిపదార్థం:** మా తండ్రి తలఁపును= మా నాయనగారైన ధృతరాష్ట్రుడి ఉద్దేశం; ఆతని నందను చందంబున్= ఆయన కొడుకైన దుర్యోధనుడి తీరూ; నిన్న= నిన్నటి దినం; ఆ సంజయుండు పలికిన పలుకులన్= దూతగా వచ్చిన సంజయుడు మాటలాడిన మాటల వలన; నీకున్= నీకు; తెలిసెన్+కదా!= తెలిసింది కదా!; వారి చిత్తము భంగిన్= ఆ కౌరవుల మనోవైఖరి; వాఁడు+ఎఱుంగున్= ఆ సంజయుడికి తెలుసు; పాలుపంపు+అని+ఈక= మీ భాగమునకు వచ్చిన భూమి ఇంతని ఇయ్యక; మేలి మాటలన్+అ= తియ్యని పలుకులతోనే; తారు= ఆ కౌరవులు; మమ్ము+అలుక+తీర్చెదరు= మేము అలుగకుండ బుజ్జగిస్తారు; అధిక దుష్కరంబు+ఐన= చేయుట కేమాత్రం శక్యం కాని; ఆ సమయంబున్= ఆ ప్రతిజ్ఞను; ఏము= మేము; పదుమూఁడు వత్సరంబులు సల్పి= పన్నెండేళ్ళరణ్యవాసం; ఒకయే డజ్ఞాతవాసం చేసి; వచ్చియుండన్= రాగా; పతి= ధృతరాష్ట్రుడు; కులము పాడి నడపన్= వంశధర్మం సాగించుటకు; తలపఁడు+అ= అనుకొనకున్నాడు; చెడన్+తలఁచెనేనిన్= చెడిపోదలచుకుంటే; కొడుకున్ వలచినట్టివాఁడు= దుర్యోధనుడిమీద దురభిమానం చూపువాడవుతున్నాడు; కానన్= కాబట్టి; అతని వక్రతన్+మాన్పన్+లేఁడు= కొడుకు కుటిలబుద్ధిని తొలగించలేకున్నాడు; ఇంతకంటెన్= ఈ విషమ స్థితికంటె; మాకున్= అన్నదమ్ములమైన మాకు; ఎడరు= ఆపద; కలదె?= మరొకటున్నదా? (లేదని భావం.)

**తాత్పర్యం:** 'నిన్న సంజయుడు మాట్లాడిన మాటల వలన మా తండ్రి ధృతరాష్ట్రుడి ఉద్దేశ మేమిటో, అతడి కుమారుడైన దుర్యోధనుడి తీరు ఎటువంటిదో నీకు తెలిసింది కదా! ఆ తండ్రి కొడుకుల చిత్తవృత్తులు ఎట్లాంటివో సంజయుడికి తెలుసు. మా రాజ్యభాగం మాకియ్యకుండా, మాకు కోపం రాకుండా, కల్లబొల్లి మాటలతో బుజ్జగిస్తున్నారు. చెప్పిన ప్రకారం మేము ఏమాత్రం చేయశక్యంకాని అరణ్యాజ్ఞాతవాసాలు పదమూడేళ్ళు చేసి వచ్చిఉండగా ధృతరాష్ట్రుడు వంశధర్మం పాటించకున్నాడు. చెడదలచియే అతడు కొడుకు దారి ననుసరిస్తున్నాడు. అతడికి కొడుకుపట్ల వల్లమాలిన దురభిమానం కాబట్టి, సుయోధనుడి కుటిలత్వం మాన్పలేకున్నాడు. ఇంతకంటె మాకు విపత్తు మరేముంటుంది?

**విశేషం:** 1. ధర్మజుడు మహావక్త. విషయ స్వభావాన్ని బట్టి దానిని ఆతడు ప్రపంచించే తీరు మారుతూ ఉంటుంది. శ్రీకృష్ణుడు హస్తినాపురానికి వెళ్ళి పరిష్కరించవలసిన సమస్యలోని ప్రధానాంశాన్ని మొదట సవిస్తరంగా, సమర్థవంతంగా ప్రతిపాదించా డీ పద్యంలో. 'ఇంతకంటెఁ గలదె యెడరు మాకు?' అన్నది ప్రధానాంశంలోని ప్రాణం. 'ఆపదఁ గడవం బెట్టగ నోపెడి' శ్రీకృష్ణుడికి తన కేర్పడిన ఆపద (ఎడరు)ను పేర్కొన్నాడు.

2. సంజయుడి రాయబారం వలన దుర్యోధన ధృతరాష్ట్రుల మనోగతం తెల్లమైపోయింది. రాజ్యభాగమీయకుండా మాయమాటలతో పాండవుల కోపం చల్లార్చే సాంత్వన వచనాలు పలుకుతున్నారు. పాండవులు దుష్కరమైన అరణ్యాజ్ఞాతవాసాలు నియమంతో

గడపినా వంశ మర్యాదను పాటించి కౌరవులు రాజ్యభాగమిచ్చే ఆలోచన చేయరు. దుర్యోధనుడు దుర్మార్గుడై నాశనం కావటానికి సిద్ధమైనా, అది తెలిసిన ధృతరాష్ట్రుడు తన కొడుకు వక్రబుద్ధిని మాన్పలేదు. కొడుకును కాదనలేని ధృతరాష్ట్రుడి చిత్తవృత్తియే పాండవులకు అడ్డువచ్చిన పెద్ద సమస్య. దీనిని తీర్చి కార్యాన్ని శాంతంగా సాధించుకొనటమే శ్రీకృష్ణుడి ముందున్న సమస్య - అని ధర్మరాజు పండు ఒలిచి చేతిలో పెట్టినట్లు చెప్పాడు.

3. 'పాలుపంపని యీక.....తారు' - అనేది సంజయుడి రాయబారపు సారాంశం. దీనికి మూలం. "అప్రదానేన రాజ్యస్య శాంతి మస్మాసు మారతి" (సం. 5-70-80) యుద్ధోన్ముఖులు కాకుండా శాంతి పరచటానికే. (సంపా.)

**క. జననియు సమస్త బాంధవ । జనములుఁ బ్రియమంద, వారి శాంతులఁగాఁ జే**
**యను, నెమ్మిగ నొక్కటియై । మననుం దెఱఁగేది యునికి మా పౌరుషమే? 10**

**ప్రతిపదార్థం:** జననియున్= మా తల్లిఅయిన కుంతీదేవి; సమస్త బాంధవ జనములున్= చుట్టాలందరున్నూ; ప్రియము+అందన్= సంతోషం చెందగా; వారిన్= దుర్యోధనాదులను; శాంతులన్+కాన్+చేయను; నెమ్మిగన్= కూర్మితో; ఒక్కటి+ఐ+మననున్= కౌరవులున్నూ మేమూ కలసి మెలసి జీవించటానికీ; తెఱఁగు+ఏది+ఉనికి= దారి దోచక ఇట్లా పడిఉండటం; మా పౌరుషమే?= మాకు మగతనం అవుతుందా?

**తాత్పర్యం:** మా తల్లీ, చుట్టపక్కాలూ హర్షించేటట్లూ, దుర్యోధనాదులందరూ యుద్ధంమాట ఎత్తకుండా శాంతించేటట్లూ, కౌరవులూ మేమూ కలసి మెలసి ఒద్దికగా జీవించేటట్లూ మార్గం తెలియక ఇట్లా బ్రతకటం మాకు మగతనం కాదు.

**విశేషం:** ఎడరు తీరటంవలన రెండు ఫలితాంశాలు కలగాలని ధర్మరాజు స్పష్టం చేస్తున్నాడు.

1. ప్రస్తుతం ఉన్న స్థితి ఇట్లాగే కొనసాగటానికి వీలులేదు. అట్లా కొనసాగటం పాండవ పౌరుషానికే తలవంపులు. కాబట్టి పరిష్కారం త్వరగా జరగాలి.

2. అయితే ఆ పరిష్కారం తల్లికీ బంధువులకూ సంతోషంతోపాటు ఊరట కలిగించేదిగా ఉండాలి. కౌరవ పాండవులు కలిసి కలకాలం జీవించేటట్లుండాలి. (సంపా.)

**క. ఇచ్చటి బంధులు నీవును । నచ్చెరువడి వినుచునుండ నయిదూళ్ళును మా**
**కిచ్చినను జాలు నంటిని । బొచ్చెముగా దింతవట్టు పూర్ణము సుమ్మీ! 11**

**ప్రతిపదార్థం:** ఇచ్చటి బంధులు= ఇక్కడనున్న చుట్టాలూ; నీవును= నీవూ; అచ్చెరువడి= ఆశ్చర్యపడి; వినుచున్+ఉండన్= వింటూండగా; మాకున్= అన్నదమ్ములమైన మాకు; అయిదు+ఊళ్ళును= ఐదు గ్రామాలను; ఇచ్చినను= ఇచ్చినప్పటికీ; చాలున్+అంటిని= సరిపోతుందని సంజయుడితో అన్నాను; పొచ్చెము+కాదు= తక్కువ కాదు; ఇంతవట్టు= నేనాడిన ఈమాత్రపు మాట; పూర్ణము సుమ్మీ!= చాలు సుమా!

**తాత్పర్యం:** కృష్ణా! ఇక్కడున్న చుట్టాలూ, నీవు విస్మయంతో వింటుండగా- 'సక్రమంగా మాకు అర్ధరాజ్యం పంచియివ్వటానికి మా తండ్రికి మనసొప్పకపోతే ఇంద్రప్రస్థం, కుశస్థలం, వృకస్థలం, వాసంతి, వారణావతం చాలు. అందుకూ అతడిష్టపడకపోతే ఎక్కడైనా మేము తలదాచుకొనటానికి ఐదూళ్ళిచ్చినా చాలు' నని సంజయుడితో ఇంతవరకూ నే చెప్పిన మాటలలో కపటం లేదు. అంతా యథార్థం సుమా!

**విశేషం:** 1. ఆ ఫలితాంశాల సాధనలో ధర్మజుడు ఇంతకు పూర్వమే ఒకదారి చూపించాడు. అర్ధరాజ్యం బదులు అయిదూళ్ళు ఇస్తే చాలునని నిండుమనసుతో ఉన్నాడు. నిజానికి అది దానోపాయ ప్రయోగ నైపుణ్యం. దానివలన బంధువులతో పాటు కృష్ణుడు కూడా ఆశ్చర్యపోయాడు. అంతటి ఔదార్యం కూడా దుర్యోధన ధృతరాష్ట్రుల ప్రవర్తన వలన బూడిదలో పోసిన పన్నీరై పోయింది - అని ధర్మరాజు మనవి చేశాడు. అంతకంటె మంచి ఉపాయం మరేదైనా ఉంటుందా? అని ఆలోచించాలని సమస్యలోని మరొక ముడి విప్పి చెప్పాడు. 2. ధర్మరాజడిగిన అయిదూళ్ళ పేర్లు మూలంలో ఇట్లా ఉన్నాయి. అవిస్థలం, వృకస్థలం, మాకంది, వారణావతం మరింకేదైనా ఒక ఊరు. తెలుగులో అవిస్థలం, మాకంది పట్టణాలకు బదులు కుశస్థలం, వాసంతి పేర్కొనబడ్డాయి. (చూడు. ఉద్యో. 1.377). (సంపా.)

**శా. ఆ దుర్యోధనుఁ డంతమాత్రయును జేయంజాలఁడో కాని, పెం**
**పేదం గ్రూరత కోర్వరాదు; సిరి నా కేలందునే, గ్రాసవా**
**సోదైన్యంబులు వచ్చు నా యరయు నీ చుట్టాలకుం; గావునన్**
**మోదంబందుట గల్గుఁ గౌరవులు నేముం బొంది శ్రీ నొందినన్. 12**

**ప్రతిపదార్థం:** ఆ దుర్యోధనుఁడు= ఆ సుయోధనుడు; అంతమాత్రయును+చేయన్+చాలఁడో కాని= కడకు నేను కోరిన ఐదూళ్ళైనా ఇస్తాడో ఇవ్వడో తెలియదు గాని; పెంపు+ఏదన్= గౌరవం నశించేటట్లు; క్రూరతకున్+ఓర్వన్ రాదు= క్రూరకర్మలు కావించటానికి సహించలేను; సిరి= రాజ్యసంపద; నాకున్+ఏల+అందునేన్= నా కెందు కని తలంచితినేని; నా+అరయు= నేను చూచే; ఈ చుట్టాలకున్= ఈ బంధు జనాలకు; గ్రాసవాసస్(ః)+దైన్యంబులు వచ్చున్= తిండికీ, బట్టకూ కరువేర్పడుతుంది; కావునన్= అందుచేత; కౌరవులున్= ధార్తరాష్ట్రులూ; ఏమున్= మేమూ; పొంది= కూడి; శ్రీన్+ఒందినన్= సంపద పొందితే; మోదంబు+అందుట+కల్గున్= సంతోషం పొందటం జరుగుతుంది.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు కడకు నే నడిగిన ఐదూళ్ళయినా ఇస్తాడో ఇవ్వడో తెలియదు. కాని, గౌరవం చెడేటట్లు క్రూర కార్యాచరణానికి నా మనసు ఒప్పుకోదు. పోనీ, రాజ్యసంపద నా కెందు కని వారిని అడగటం మానితే, నన్నాశ్రయించుకొనిఉన్న నా బంధుజనులకు కూటికీ, గుడ్డకూ దైన్యం ఏర్పడుతుంది. కనుక కౌరవులూ, మేమూ ఒద్దికగా ఉండి రాజ్యసంపద పంచుకొంటే ఉభయులకూ సంతోషం సమకూరుతుంది.

**విశేషం:** 1. ధర్మజుడు ఈ పద్యంలోని వాక్యాలను భావోద్వేగంతో పలికినట్లు తిక్కన రచించాడు. ఇందులో నాలుగు వాక్యాలున్నాయి. అవి భిన్న భావావస్థలను వ్యక్తం చేసేవి. 'దుర్యోధను డీమాత్రం కూడా చేయలేడా?' అన్నది ఆవేశంతో, ఆవేదనతో గొంతెత్తి పలికే రోషవాక్యం. ఆ వాక్యం తరువాత కొంత విరామం అభినయంగా స్ఫురిస్తుంది. ఉదాత్త స్థాయిలో పలికిన ఆ వాక్యం నుండి తన గొంతును మంద్రస్థితికి తెచ్చుకొనటానికి 'కాని' అనే పదం తోడ్పడింది. ఈ వాక్యానికీ తరువాతి వాక్యానికీ ఉన్న అంతరం తెలియచెప్పింది. 'పెంపేదం గ్రూరత కోర్వరాదు' అనే వాక్యంలో ధర్మజుడి అభిమానం ద్యోతకమైనది. అప్పటి తన దీనస్థితిని స్ఫురింపచేసింది. దీనికి రెండు మూడు రకాల అర్థాలు చెప్పవచ్చును. (1) దుర్యోధనుడి పరంగా-అయినా, ఆ విధంగా ఔన్నత్యాన్ని వీడి క్రూరత్వాన్ని చేపట్టటం సహించరాదు- అని చెప్పవచ్చును. (2) ధర్మరాజుపరంగా- అతడు ఐదూళ్ళు కూడా ఇవ్వలేదని నా గౌరవాన్ని దిగజార్చుకొని నన్ను నేను క్రూరంగా కించపరచుకొనటం సహించరాని స్థితి. (3) దుర్యోధనుడు అయిదూళ్ళు ఇవ్వలేదనే నెపంతో గౌరవం చెడేటట్లు క్రూరకార్యానికి పూనుకొనటానికి నా మనసు ఒప్పుకోదు. సందర్భశుద్ధి గలిగిన మూడంచుల అర్థాలతో ముచ్చట కొలిపే ఈ వాక్యం ఒక్కటే మంద్రస్థాయిలో అనే వాక్యం. ఆ తరువాత కొంత విరామం ఉంటుంది. 'సిరి నాకేలందునే?' - ఈ వాక్యం సంజయుడి రాయబారంలోని తాత్పర్యాన్ని

మనసులో తలచుకొని గూఢమైన బాధతో, దెబ్బతిన్న ఆత్మాభిమానంతో, ఆలోచిస్తూ, గంభీరంగా అనే వాక్యం. ధృతరాష్ట్రుడు 'పాండవులకు రాజ్యం వద్దు, యుద్ధం కూడదు, ప్రశాంతంగా బ్రాహ్మణుల వలె జీవించటం ఉచిత'మని సంజయుడి ద్వారా సూచించాడు. ఆ ఆదేశాన్ని అనుసరించి ధర్మరాజు తనకు సంపద ఎందుకులే? అని అనుకొన్నా- అది పొసగని పని అని భావం. దీనిని మరొక విధంగా అన్వయించవచ్చును. 'ఒకవేళ దుర్యోధనుడు ఐదూళ్ళు కూడా ఇవ్వకపోతే ధర్మరాజుకు సిరి సంపదలకు ఆలవాలమైన రాజ్యం అసలు ఉండదు. అయినా, ధర్మరాజు సిరిని కోరకుండా వైరాగ్య జీవితం గడపటానికి అతడు విపుల సంసారి. అందువలన అది సాధ్యం కాదు. మరి సిరి ఎందుకు? అంటే.. 'నా అరయు చుట్టాలకు - గ్రాసవాసోదైన్యం వస్తుం'దని ధర్మజుడి సమాధానం. ఇది తన స్థితిని చెప్పుకొనటమే కాక కౌరవులను వ్యంగ్యంగా ఎత్తిపొడవటం కూడా, నూరుగురు కొడుకులు, బంధువులు ఉన్న పెద్ద సంసారం ధృతరాష్ట్రుడిది. వారి కొరకే అత డీ రాజ్యాన్ని హరించింది. వారి పోషణ వారి కెంత ముఖ్యమో తనవారి పోషణ తనకంత ముఖ్యమని ధర్మజుడి ఎత్తిపొడుపు. అంతేకాదు. తనది కూడా క్షత్ర గార్హస్థ్య జీవితమనీ, బ్రాహ్మణ సన్న్యాస జీవితం కాదనీ హెచ్చరిక! ఈ వాక్యం ధర్మరాజు నిక్కచ్చిగా, నిష్ఠురంగా, నిండుగా, గండుగా అన్నాడు. ఈ మూడు వాక్యాలే ధర్మజుడి వాదనలో మూడు బలమైన అంశాలు. వాటి ఫలితాలు శ్రోత ఊహించాలని గ్రహించాలి. అంటే, అయిదూళ్ళయినా ఇవ్వని క్రూరత్వం ఏర్పడితే, మా అయిదుగురి బంధువులనూ పోషింప దగినంత రాజ్యాన్ని మేము గ్రహించక తప్పదు. అప్పుడు యుద్ధం తప్పదు. 'కౌరవ నాశనం తప్పదు. ఇవన్నీ ఊహించగలిగితే ధర్మరాజు 'కావునన్' అనటంలో ఉన్న గడుసుదనం గోచరిస్తుంది. 'కౌరవ పాండవులు కలిసి రాజ్యసంపదను పంచుకొంటే ఉభయులూ సంతోషాన్ని పొందే స్థితి ఏర్పడుతుంది' అని ధర్మజుడు తేల్చి చెప్పాడు.

2. తిక్కన ధర్మరాజు యొక్క ఉపన్యాస శిల్పంలో కొన్ని శైలీ స్వభావాలను రచనలో ప్రవేశపెట్టాడు. అవి (1) ఒక పద్యాన్ని ఒక విధమైన భావావస్థకు ఆలోచనాత్మకమైన అభివ్యక్తిగా మలచటం. ఈ వాక్యంలో ధర్మరాజు ఉభయులూ సంపద పంచుకొనటం ఉచితం అనే తాత్పర్యాన్ని చెప్పటానికి కావలసిన మానసికావస్థను ప్రకటించాడు. (2) పద్యాన్ని వాక్యమండలిగా రూపొందించటం. (3) వాక్యానికీ వాక్యానికీ మధ్య కొంత విరామం ఉన్నట్లు, అభినయం సాగుతున్నట్లు, ఒక భావం నుండి మరొక భావానికి మరలుతున్నట్లు స్ఫూర్తిని కలిగించటం. వాక్యాలను పలకటంలో ఉండే ఉదాత్తానుదాత్తస్థితులను ధ్వనింప జేయటం. (4) వాచికాభినయ ద్యోతకమైన నాటకీయ పద్య రచనను సంతరించటం. (5) వాదాంశాలను క్రమంగా ఆవిష్కరించి పద్యం చివర ప్రతిపాద్యాంశ ఫలితాంశాన్ని ప్రకటించటం. ఈ లక్షణాలన్నీ ఒక మహావక్త, రాజనీతివేత్త మాట్లాడే ఉపన్యాసంలో గోచరించే అంశాలు.

3. తిక్కన రచించిన మంచి పద్యాలలో ఇది ఒకటి. ధర్మజోపన్యాసంలో తిక్కన వివిధ అర్థగుణాలను సార్థకంగా వాడాడు. ఇందులో అజఠరత్వం, అపారుష్యం అనే లక్షణాలు గల సౌకుమార్యం సంతరించబడింది. (సంపా.)

**ఉ. అక్కట! లాఁతులైనఁ బగఱైనను జంపన కోర నేల? యొం**
**డొక్క తెఱంగు లేదె? యది యొప్పదె? బంధు సుహృజ్జనంబు లా**
**దిక్కన నున్నవారు; గణుతింపక సంపదకై వధించి దూ**
**ఱెక్కుట దోషమందు టను నీ దురవస్థల కోర్వవచ్చునే?' 13**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; లాఁతులు+ఐనన్= పరాయివారైనా; పగఱు+ఐనను= శత్రువులే అయినా; చంపన్+అ+కోరన్+ఏల= చంపాలనే ఎందుకు కోరాలి?; ఒండు+ఒక్క+తెఱంగు లేదె?= యుద్ధం కంటె మరొకమార్గం లేదా?; అది+ఒప్పదె?= ఆ మార్గం తగింది కాదా?; ఆ దిక్కునన్= ఆ కౌరవుల పక్షంలో; బంధు సుహృద్ జనంబులు= చుట్టాలు, మిత్రులు; ఉన్నవారు= ఉన్నారు; గణుతింపక= ఆ వైపున ఉన్న మా బంధుమిత్ర వర్గాన్ని లెక్కించక; సంపదకై= సిరికై; వధించి= (వారిని) చంపి; దూఱు+ఎక్కుట= నిందలపాలవటం; దోషము+అందుట= పాపం మూటగట్టుకొనటం; అను= అనునట్టి; ఈ దుర్+అవస్థలకున్= ఈ దుర్దశలకు; ఓర్వన్+వచ్చునే?= సహింప శక్యమగునా? (కాదని భావం.)

**తాత్పర్యం:** అయ్యో! వారు ఇతరులే అగుదురుగాక! విరోధులే అగుదురుగాక! వారిని చంపవలెననే ఎందుకు కోరాలి? పోరాటంకంటే మరో మంచిదారి లేదా? ఆ మార్గం మంచిది కాదా? కౌరవుల పక్షంలో మా చుట్టాలు, మిత్రులు ఉన్నారు. వారిని లెక్కించక రాజ్యసంపదకై సంహరిస్తే నిందలపాలుగాక తప్పదు. పాపాలు మూటగట్టుకొనక తప్పదు. ఇట్లా ఇహపరాలు రెంటికీ దూరం చేసే దుర్దశను నేను భరించలేను.

**విశేషం:** 1. రారాజు రాజ్యభాగ మీయడు కాబట్టి యుద్ధం చేసి రాజ్యాభాగం పొందటమే కర్తవ్యం- అని భావించే వారి తలపులను మనస్సులో ఉంచుకొని ధర్మరాజు యుద్ధం కంటే వేరే మరొక మార్గాన్ని అన్వేషించవలసిన అవసరాన్ని ఈ పద్యంలో నొక్కి చెపుతున్నాడు. పైపద్యంలో రాజ్యభాగం యొక్క అవసరాన్ని చెప్పి, దానిని సాధించే మార్గాన్ని గురించి తన ఆలోచనా విధానాన్ని ఈ పద్యంలో ఆవిష్కరించాడు.

2. ఈ పద్యం 'అక్కట!' అనే మాటతో మొదలవుతున్నది. అది విచారాన్నీ, ఆశ్చర్యాన్నీ తెలిపే వాచికాభినయ వాచకం! ఆమాట అనే ముందు ధర్మజుడి భావనలో యుద్ధమే కర్తవ్యమనే యోచన మెదలిన సంగతి ధ్వని. ఇట్లా అభినయాంశాలతో, అభినయ వాచకాలతో మనోగత భావాలను ధ్వనింప చేయటం నాటకీయ శిల్పంలో రసధ్వని.

3. చంపవలసి వస్తే లోకంలో పరాయివారినీ, శత్రువులనూ ఎన్నుకొనటం సహజం. వారితో స్నేహ సంబంధాలుగాని, రక్త సంబంధాలుగాని, భావజాల సంబంధాలు కాని ఉండవు కాబట్టి. అయినా వారిని కూడా రాజ్యం కొరకు చంపాలనుకొనటం అహింసాధర్మం కాదు. మానవ మూల్యమైన దయాధర్మం కూడా కాదు. అది యుద్ధనీతి ఔతుందేమో కాని, ధర్మనీతి కాదు. ఆ అంశాన్ని ఈ వాక్యంలో ధర్మజుడు చెప్పాడు. ఇది సాధారణ శాంతిసూక్తం.

4. 'ఒండొక్క తెఱంగు లేదె?' ఇది ఆలోచనాముద్రతో వేస్తున్న ప్రశ్న. ఎదుటివారిని 'ఆలోచించండి' అని అడుగుతున్న నాట్యముద్ర. దీని వెనుక రాజనీతి కూడా ఉన్నది. చతుర్విధోపాయాలలో చివరిది. సామ, దాన, భేదోపాయాలు విఫలమైపోయిన తరువాత దండోపాయాన్ని తప్పనిసరి పరిస్థితులలో ప్రయోగించాలి కాని, ముందుగానే తొందరపడి యుద్ధం చేయరాదు. అయితే, యుద్ధానికి ప్రత్యామ్నాయమైన ఉపాయం ప్రప్రథమ కర్తవ్యం. దానిని ధర్మజుడు సూచిస్తున్నాడు.

5. 'అది యొప్పదె?' - అట్లా చెయ్యటం న్యాయం కాదా? అని ప్రశ్నిస్తున్నాడు. ధర్మజుడి దృక్పథంలో అదే న్యాయం. సభ్యులు కూడా తన అభిప్రాయంతో అంగీకరించేటట్లు చేసే నేర్పుతో కూడిన ప్రశ్న. ఈ ప్రశ్న వేసి ధర్మరాజు కొంత విరామం పాటించి ఉంటాడు. ఆయన నిజానికి ఏ పరాయివారినో, శత్రువులనో ఉద్దేశించి మాట్లాడటం లేదు. హస్తినాపురంలో ఉన్న బంధు మిత్రులను గురించే భావిస్తున్నాడు. ఆ ఆలోచన నుండి తరువాతి వాక్యం వెలువడింది.

6. 'బంధు సుహృజ్జనంబు లా దిక్కున నున్నవారు'. ఇది పాండవు లను కొనవలసిన మాట. కౌరవు లెట్లాగూ పాండవులు బంధువులని భావించటం లేదు. ధర్మరాజు దయామూర్తి కాబట్టి ఈ ధర్మనీతి పద్ధతిలో ఆలోచిస్తున్నాడు. పగవారినే చంపగూడదని లోకనీతి చెప్పుతుండగా బంధు మిత్రులను చంపటం న్యాయమా? అని యుద్ధోద్యోగానికి విరుగుడుగా ఈ అంశాన్ని పేర్కొన్నాడు.

7. ఈ ధర్మనీతిని లెక్కచేయకుండా సంపద కొరకు బంధుమిత్రులను యుద్ధంలో చంపితే రెండు దుర్దశలు కలుగుతాయట! అవి- అపకీర్తి, పాపం. ఈ రెండూ ధర్మవీరుడి జీవితానికి ఇహపరాలు లేకుండా చేసే దుర్దశలు. అపకీర్తి వలన ఈ జన్మలో మృత్యువు పాలైనట్లే, పాపంవలన జన్మ జన్మలలో సద్గతి కోల్పోయినట్లే. కాబట్టి కౌరవులను యుద్ధంలో చంపితే పాండవు లిహపరాలకు చెడుతారని ధర్మరాజు నిశ్చయం.

8. 'ఈ దురవస్థల కోర్వవచ్చునే?' సంపద లేకపోయినా బ్రతుక వచ్చునుగాని, అపకీర్తితో పాపంతో బ్రతకటం అసాధ్యమని ధర్మజుడి నీతిసూక్తం.

9. ఈ పద్యం ముగిసేసరికి రెండు విరుద్ధాంశాలు ధర్మజుడు ప్రతిపాదించాడు. (1) రాజ్యభాగం కావాలి. అందరూ కలిసి ఉండాలి. (2) యుద్ధం జరుగకూడదు. ఈ రెండూ జరిగేవి కావని స్పష్టం. కాని, ఆ దిశలో యత్నం జరగాలని ధర్మజుడి ఆశయం.

10. ఈ విషయాన్ని సభ మననం చేసికొనటానికి ధర్మరాజు కొన్ని క్షణాల విరామం ఇచ్చాడు. అది నాటకీయంగా అవసరం.

11. ఈ పద్యంలో శ్లేషమనే శబ్దార్థోభయ గుణాలు సంతరించబడ్డాయి. రచనలో మసృణత్వం, పదవాక్య సంవిధానంలో ఘటన ఈ పద్య రచనకు ప్రాణం.

12. తిక్కన తీర్చిదిద్దిన ఉపన్యాస శిల్ప పద్యాలలో ఇది కూడా ప్రశస్తి చెందింది. నేటికీ తెలుగువారి మాటలలో సంధి యత్నాల పట్ల ఈ పద్యం పల్లవిగా వినిపిస్తుంది. (సంపా.)

**వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 14**

**తాత్పర్యం:** అట్లా ధర్మజుడు పలికి మరల ఇట్లా అన్నాడు :

**విశేషం:** ఉపన్యాసఘట్టంలో తిక్కన నడుమ నడుమ రచించే చిన్న చిన్న వచనాలను అభినయ వ్యంజకాలుగా రూపొందించటం నాటక శిల్పం. పాండవాగ్రజుడు అనే విశేషణం సార్థకం. అతడి మాట పాండవ స్కంధావారంలో ముక్తకంఠంతో వినపడుతుం దని ధ్వని. 'వెండియు' - అనేది కొన్ని క్షణాల విరామానంతరం అనే కాలసూచిక. (సంపా.)

**ఆ. క్షత్త్రధర్మ మింత కష్టమగునె? పెఱ । ధర్మ మాచరింపఁ దగ దటండ్రు**
**గాన శస్త్రజీవికయ తగియున్నది; । యైన వంశనాశ మనభిమతము. 15**

**ప్రతిపదార్థం:** క్షత్త్రధర్మము= రాజధర్మము; ఇంత కష్టము+అగునె?= ఇంతటి కష్టంతో కూడుకొన్నది గదా!; పెఱ+ధర్మము= (క్షత్రియులు) అన్యధర్మము; ఆచరింపన్+తగదు+అటండ్రు= అనుష్ఠించరాదని పెద్దలు చెప్పుతారు; కానన్= కాబట్టి; శస్త్రజీవిక+అ+తగి+ఉన్నది= మాకు ఆయుధోపజీవనమే యుక్తమై ఉన్నది; ఐనన్= అయినప్పటికీ; వంశనాశము= కులనిర్మూలనం; అనభిమతము= నాకు ఇష్టం కాదు.

**తాత్పర్యం:** ఔరా! క్షత్రియ ధర్మపాలనం ఎంతో కష్టంతో కూడుకొన్నది. అన్య ధర్మాచరణం రాజులకు తగదని పెద్దలంటారు. కనుక ఆయుధాలను చేతబట్టి బ్రదకటమే వారికి యోగ్యమైన పని. కాని, రాజ్యానికై కులనిర్మూలనం చేయటం నాకు సమ్మతం కాదు.

**విశేషం:** 1. అజాతశత్రువు యొక్క అంతర్మథనానికి ఈ ఆటవెలది అచ్చమైన అభినయ వాచికం. ఈ పద్యానికి మూలం గమనిస్తే దీని ముచ్చట మరీ బాగుంటుంది.

**"పాపః క్షత్రియ ధర్మోఽయం నయంచ క్షత్రబాంధవాః,**
**స నః స్వధర్మోఽధర్మో వా వృత్తి రన్యా విగర్హితా". (సం. 5-70-46)**

"క్షత్రియ ధర్మం ఎంత పాపం!' అని మూలంలో అంటే. 'ఎంత కష్టం?' అని తెలుగులో అన్నాడు. 'మనమేమో క్షత్రియ బంధువుల' మని మూలంలో ఉంటే. తిక్కన దానిని వదలివేశాడు. ఈ విషయం వాచ్యం చేయవలసిన అవసరం లేదు. 'అది

మనకు స్వధర్మం. ధర్మమైనా పరధర్మం నిందకు పాత్రమౌతుంది' - అని మూలం. దీని వరుస మార్చి - 'పెఱ ధర్మమాచరింపఁ దగ దటంఁడు' అని మొదట పలికాడు తెలుగులో. ఆటవెలది ఉత్తరార్ధం అన్వయ సుందరంగా తెలుగులో అమరింది. క్షత్రియులైన పాండవులకు 'శస్త్రజీవికయే' స్వధర్మమై తగి ఉన్నది. అట్లని యుద్ధం చేసి కార్యం సాధించటమే కర్తవ్యం కాదు. వంశనాశనం జరుగకుండా కార్యసాధనం చేయటం కర్తవ్యం. క్షత్రధర్మానికీ, అహింసకూ సంఘర్షణ వచ్చినపుడు యుద్ధేతర మార్గంలో కార్యాన్ని లోకహితంగా సాధించటం కూడా ధర్మమే. దానినే ధర్మనీతివర్తనం అంటారు. ధర్మరాజు ఆ మార్గాన్ని సూచించాడు.

2. ఆటవెలది పాదాలు నాలుగూ నాలుగు వాక్యాలు. విరుద్ధ ధర్మ సూచికలు. అయినా అన్వయసుందరాలు.

3. ఇందులో అర్థవ్యక్తి అనే శబ్దార్థ గుణాలు పోషించబడ్డాయి. (సంపా.)

**వ. అదియునుంగాక. 16**

**తాత్పర్యం:** ఇంతేకాక.

**ఆ. కలహ మగుట లక్ష్మిఁ గావించుఁ, బ్రాణహా । నియును జేయు; నింత నిక్కువంబు;**
**పలువు రొకని కోడి పాఱుట, బల్లిదు । లనదచేతఁ జెడుటయును ఘటించు. 17**

**ప్రతిపదార్థం:** కలహము+అగుట= యుద్ధం రావటం (సంభవించటం); లక్ష్మిన్= సంపదను; కావించున్= లభింపజేస్తుంది; ప్రాణహానియును+చేయున్= ప్రాణనష్టం గూడ కలిగిస్తుంది; ఇంత నిక్కువంబు= (ధనసంప్రాప్తి, ప్రాణనష్టం, యుద్ధం వలన జరగటం) యథార్థం; పలువురు= అనేకులు; ఒకనికిన్+ఓడి= ఒక్కడి చేతిలో అపజయం పొంది; పాఱుట= పరుగిడిపోవటం; బల్లిదులు= బలవంతులు; అనదచేతన్= దుర్బలుడిచేత; చెడుటయును= నశించుటయున్నూ; ఘటించున్= కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** యుద్ధం జరిగితే సంపదలు సంప్రాప్తిస్తాయి. ప్రాణహాని కూడా సంభవిస్తుంది. ఇందులో సందేహం లేదు. పెక్కుమంది ఒక్కడి చేతిలో ఓడిపోయి పరుగెత్తిపోవటం, బలవంతులు బలహీనుడి చేజిక్కి సమసిపోవటం కూడ జరుగుతుంది.

**విశేషం:** యుద్ధం వలన లాభనష్టాలు మొదట చెప్పాడు ధర్మజుడు. సంపద కలగటం లాభం. ప్రాణహాని నష్టం. యుద్ధంలో జరిగే అబ్బురాలను రెండింటిని తరువాత పేర్కొన్నాడు. ఒకే మహావీరుడి చేతులలో పలువురు పారిపోవచ్చును. ఒక్కొక్కసారి అసమర్థులైన వారు గుంపు కట్టి బలవంతులను చంపవచ్చును. మొదటి దానికి అర్జునుడు, భీష్ముడు ఉదాహరణలు కావచ్చును. కౌరవులు చంపిన అభిమన్యుడు, ఘటోత్కచుడు మొదలైనవారు రెండవ పద్ధతికి ఉదాహరణలు. ఇవి అసహజమైనవి. అదృష్టంమీద, అవకాశం మీద ఆధారపడిన ఇటువంటి సంఘటనలను ఆధారంగా చేసికొని జయాపజయాలను ముందే నిశ్చయించటం కష్టం. జయాపజయాలు దైవాధీనాలు. ఈ వాస్తవం - యుద్ధోపాయం విశ్వసనీయం కాదని సూచిస్తున్నది. (సంపా.)

**క. జయమగు నోడుదు మను ని । శ్చయ మొక్కఁడు లేదు; వినుము! సమరమునఁ బరా**
**జయము మరణంబు కంటె హ్యా । దయపుట భేదనము సేయుఁ దథ్యం బనఘా! 18**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్య పురుషా!; వినుము= నా మాట లాలకించుము; సమరమునన్= యుద్ధంలో; జయము+అగున్= మనకే విజయం లభిస్తుంది. ఓడుదుము= మనమే అపజయం పొందుతాము; అను నిశ్చయము= అనే నిర్ణయం;

ఒక్కఁడు లేదు= ఒకటీ లేదు; పరాజయము= అపజయం; మరణంబుకంటెన్= మృతికంటె కూడా; హృదయపుట భేదనము+చేయున్= దొప్పవంటి గుండెను పగులగొట్టుతుంది; తథ్యంబు= ఇది నిజం

**తాత్పర్యం:** కృష్ణా! యుద్ధంలో మనమే గెలుస్తాం, లేదా ఓడిపోతాం అని నిశ్చయంగా చెప్పటానికి వీలులేదు. సంగ్రామంలో అపజయమే సంప్రాప్తమైతే అది మరణంకంటె గుండెను బ్రద్దలు చేసి, దుస్సహమైన వేదనను కలిగిస్తుంది. ఇది నిజం.

**విశేషం:** 'విజయం తథ్యం కాని యుద్ధం కంటె మరణం మే' లని ధర్మరాజు పేర్కొని సభ్యులు, యుద్ధేతర మార్గాలలో కార్యసాధన మేలని తలంచేటట్లు చేస్తున్నాడు. యుద్ధం చేయాలనే భీమాదుల వాదాలను తర్కబద్ధమైన ప్రతివాద చాతుర్యంతో నియమిస్తున్నాడు. (సంపా.)

**క. కాన నవశ్యముఁ బెనఁకువ । గాని యుపాయమునఁ బగఱఁ గడతేర్చు ధృతిం**
**బూని నడచు నెవ్వఁడు డెం । దానం జెయివెట్టికొని యతఁడు నిద్రించున్. 19**

**ప్రతిపదార్థం:** కానన్= కాబట్టి; అవశ్యమున్= తప్పక; పెనఁకువ కాని= కయ్యం జరగని; ఉపాయమునన్= వెరవు చేత; పగఱన్= శత్రువులను; కడతేర్చు ధృతిన్+పూని= అణచునట్టి ధైర్యం వహించి; ఎవ్వఁడు నడచున్= ఎవడు మెలగునో; అతఁడు= అట్టివాడు; డెందానన్= గుండెమీద; చెయి+పెట్టికొని= చేతిని ఉంచుకొని; నిద్రించున్= హాయిగా నిద్రపోతాడు.

**తాత్పర్యం:** యుద్ధం అన్ని అనర్థాలకు మూలమవటంచేత కయ్యం చేయకుండానే ఉపాయంతో విరోధులను అణచివేయగలననే ధైర్యం వహించి ఎవడు ప్రవర్తిస్తాడో వాడు గుండెమీద చేయి వేసుకొని నిశ్చింతగా నిదురిస్తాడు.

**విశేషం:** యుద్ధోపాయాన్ని ప్రయోగించే అవసరం రాకుండానే సామదాన భేదోపాయాలతోనే కార్యఫలాన్ని సాధించటం ఉత్తమమని ధర్మజుడు తేల్చిన ఫలితాంశం. ఇది శాస్త్ర సమ్మతమైన ధర్మనీతి. ఈ పద్యంతో ఒక ప్రతిపాదన ముగిసింది. అందుకే 'కాన' అని పద్యం మొదలైంది. ధర్మరాజు తన ఉపన్యాసంలో ప్రతిపాద్యాంశ పరిసమాప్తిని సూచించే వాక్యాన్ని 'కావున' అని మొదలు పెడుతూ ఉంటాడు. అది ఆయన వాక్యశిల్పం. (సంపా.)

**ఆ. పగయ కలిగె నేనిఁ బాము న్న యింటిలో । నున్న యట్లకాక యూఱడిల్లి**
**యుండు నెట్లు చిత్త మొకమాటుఁ గావున । వలవ దధిక దీర్ఘ వైరవృత్తి. 20**

**ప్రతిపదార్థం:** పగ+అ+కలిగెనేనిన్= విరోధమే ఏర్పడితే; పాము+ఉన్న+ఇంటిలోన్= సర్పమున్న గృహంలో; ఉన్న+అట్ల కాక= ఉన్నట్లే ఉంటుందిగాని; ఒకమాటున్= ఒకసారిఅయినా; చిత్తము= హృదయం; ఊఱడిల్లి= ఊరటపొంది; ఎట్లు+ఉండున్?= ఎట్లా ఉండగలదు?; కావునన్= కాబట్టి; అధికదీర్ఘవైరవృత్తి= చిరకాలం విరోధంతో మెలగటం; వలవదు= కూడదు.

**తాత్పర్యం:** శత్రుత్వమే ఏర్పడితే పామున్న యింటిలో కాపురమున్నట్లే ఉంటుందిగాని ఒక తడవైనా మనస్సు నిమ్మళంగా ఉండదు. కనుక ఎవరితోనూ దీర్ఘకాలం విరోధంతో ప్రవర్తించటం తగదు.

**విశేషం:** అలం: ఉపమ. ఇది గొప్ప నైతిక సూక్తి, సుభాషితం. మూలం:

"సుఖం ప్రశాన్తః స్వపితి హిత్వా జయపరాజయౌ ॥
జాత వైర శ్చ పురుషో దుఃఖం స్వపితి నిత్యదా ।
అనివృత్తేన మనసా స సర్ప ఇవ వేశ్మని ॥
ఉత్సాదయతి యః సర్వం యశసా స విముచ్యతే ।" (సం. 5-70-59,60,61)

జయాపజయాలను పట్టించుకొనని ప్రశాంతచిత్తులు సుఖంగా నిద్రిస్తారు. పగపట్టిన పురుషుడు ప్రతిదినం దుఃఖంతో పడుకొంటాడు. పగ వలన సుఖం లేని వాడు పామున్న ఇంటిలో ఉన్నవాడి వలె సర్వాన్నీ పాడుచేసికొంటాడు. వాడికి పూర్వమున్న కీర్తి కూడా తరిగిపోతుంది- అని మూల తాత్పర్యం. తిక్కన మూలాన్ని సందర్భోచితంగా చికిలిపెట్టి నాడుకొన్నాడు.

సంస్కృతంలో వైరం అనే పదానికి తెలుగు-పగ. ఈ పదం తెలుగులో బాగా ప్రచారంలో ఉన్నది. పాముకూ పగకూ కవి సమయం వంటి అనుబంధం ఉన్నది. అందువలన తిక్కన పగ కలిగిన చిత్తం పాము పుట్ట వంటిదనీ, అటువంటి చిత్తవృత్తిగల వ్యక్తి పాముపుట్ట ఉన్న ఇల్లనీ ఉపమించాడు. వ్యాస హృదయానికి వన్నెపెట్టాడు.

పగ ఒకసారి ప్రవేశిస్తే శాంతి ఉండదు కాబట్టి దానిని తగ్గించటం, తొలగించటం తప్ప మార్గాంతరం లేదు. అంటే ఎక్కువ కాలం పగను మనసులో ఉంచుకొనకుండా నిర్మూలించుకొనటమే యుద్ధనివారణకు తరణోపాయమని ధర్మజుడి భావన.

యుద్ధానికి మూలం పగ. ఎడతెగని పగయే యుద్ధోన్మాదంగా మారుతుంది. మాయాద్యూతంలో వంచించి రాజ్యాన్ని కాజేశారనే పగతో పాండవులలో యుద్ధజ్వాల రగులుతున్నది. బలవంతులైన పాండవులు బ్రతికి ఉంటే ప్రభుత్వం దక్కదని అసూయాపరులైన కౌరవులు వారి మీద పగతో యుద్ధానికి కూడా సిద్ధమవుతున్నారు. ఇది ఉభయులకు వర్తించే నీతి. పగ తగ్గితే యుద్ధ ప్రవృత్తి సహజంగానే సమసిపోతుంది. యుద్ధేతరోపాయాలలో ఇది ఉత్తమం, నైతికం, ఆధ్యాత్మికం. కాని, అది సాధ్యమా? అన్నది హిమాలయమంత ప్రశ్న. (సంపా.)

**చ. పగ యడఁగించు టెంతయు శుభం; బది లెస్స; యడంగునే పగం**
**బగ? వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే? కడుం**
**దెగ మొదలెత్తిపోవఁ బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు; నే**
**మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు గేశవా! 21**

**ప్రతిపదార్థం:** కేశవా!= శ్రీకృష్ణా!; పగ+అడఁగించుట= విరోధాన్ని రూపుమాపటం; ఎంతయున్+శుభంబు= మిక్కిలి శ్రేయస్కరం; అది లెస్స= అది మంచిపని; పగన్= విరోధంచేత; పగ+అడంగునే= విరోధం శమిస్తుందా? (అంటే శమించదు); వగ+కొన్నన్= (ఒకరి) పగవలన (మరొకరు)బాధపడితే; మార్కొనక= అతడిని ఎదిరించక; పల్కక+ఉండఁగన్+వచ్చునే= ఊరకుండటం శక్యమా? కాదు; కడున్+తెగన్= పరమ సాహసంతో; మొదలు+ఎత్తిపోవన్= తుదముట్టేటట్లు; పగన్+తీర్పఁగన్+వచ్చినన్= వైరాన్ని నిర్మూలించటానికి సిద్ధపడితే; క్రౌర్యము+ఒందున్= క్రూరకృత్యములకు తాను ఒడిగట్టవలసి వస్తుంది; ఏమిగతి+తలంచినన్= ఏ విధంగా ఆలోచించినా; పగకున్= విరోధానికి; మేలిమి లేమి= ఆధిక్యం లేకుండుట; ధ్రువంబు= నిజం.

**తాత్పర్యం:** విరోధాన్ని అణచివేయడం ఎంతో శ్రేయస్కరం. అది మంచి పని. విరోధం వలన విరోధం సమసిపోదు. ఒకడు వైరం వహించి మరొకరికి బాధ కలిగిస్తే, బాధపెట్టిన వాడితో తలపడక ఊరకుండటం శక్యం గాదు. పరమ సాహసంతో తుదముట్ట పగను నిర్మూలించటానికి పూనుకొంటే దారుణ కృత్యాలకు ఒడిగట్టవలసివస్తుంది. కనుక, ఎన్ని విధాల ఆలోచించినా పగవలన కీడేగాని ప్రయోజనం శూన్యం. కృష్ణా! ఇది నిజం.

**విశేషం:** 1. పగ వలన కలిగే అనర్థాన్ని చెప్పే గొప్ప సూక్తి ఇది. తెలుగువారి నిత్య వ్యవహారంలో నిత్యంగా నిలిచే సత్యం వంటి పద్యం. తిక్కన రచించిన మేటి పద్యాలలో ఒకటి.

2. ధర్మరాజు తర్కబద్ధంగా ఆలోచిస్తాడు. ఆలోచిస్తూ మాట్లాడుతాడు. ఆ పాత్ర స్వభావానికి అనుగుణంగా ఈ పద్యాన్ని చిన్న చిన్న వాక్యాల పొందికైన రచనతో చేశాడు తిక్కన. చిన్న వాక్యం ఆలోచనాతరంగం. శాంతి పొందటం కర్తవ్యం. 'దానికి భంజకం పగ' అని చెప్పాలి. దానినే పగను గురించి వివరించి, 'అది లేకపోతేనే శాంతి, అది కర్తవ్యం' అని ధర్మరాజు చెప్పాడు. కూడనిది ముందు చెప్పితే కూడేదాని ప్రతిపాదనకు బలం వస్తుంది. దీన్నే తర్కంలో నేతి నేతి వాదం అంటారు. ధర్మరాజు దానిని పాటించాడు.

3. ధర్మరాజు మౌలికంగా శాంతి కాముకుడు. ధర్మనీతి వర్తనుడు. కౌరవులు రాజ్యభాగ మీయరని సంజయుడి రాయబారం వలన తేలిపోయింది. అది కౌరవుల పగ సాధింపు చర్య. అయితే, ఆ పగల వలన కలిగే ఫలమేమిటి? అని జిజ్ఞాసువైన ధర్మరాజు ఆలోచించాడు. శ్రీకృష్ణుడి రాయబారానికి మూలకారణం పగలేకుండా చేయటమే అని బలంగా ఈ పద్యంలో ప్రతిపాదిస్తున్నాడు.

4. పగ ఉన్న మనసు పాము పుట్ట ఉన్న ఇల్లు వంటిది. అందులో శాంతి ఉండదు- అని చక్కని దృష్టాంతాన్ని నిత్య జీవితంలో నుండి తీసికొని పూర్వపద్యంలో చెప్పి, ఈ పద్యాన్ని ఎన్నుకొనటంలో మంచి పూర్వరంగం తయారు చేసి, ప్రతిపాద్యాంశాన్ని చెపుతున్న వాద కౌశలం ప్రకటిత మౌతున్నది.

5. పగను అణచటం ఎంతైనా శుభం. శుభం అనే మాటకు బదులు మేలు, మంచిది, హితవు వంటి అర్థాలు వచ్చే పదాలు వాడవచ్చును. తెలుగు పలుకుబడిలో 'శుభం' పదాని కున్న వాడుక శక్తి మరో పదానికి లేదు. 'అది లెస్స' అనే చిన్నవాక్యం- తెలుగువారు తాను చెప్పిన దాన్ని స్థిరంగా నమ్ముతున్నారని ధ్రువీకరించే పద్ధతికి ప్రతినిధి. 'నిజం. నా మాట నమ్ము- సత్యం' మొదలైన పలుకుబడులకు అది సమానం. ధర్మరాజు చెప్పింది తాను గట్టిగా నమ్మి చెప్పిందే అని అర్థం. తెలుగు పలుకుబడి గల వాక్యాలకు ఈ తిక్కన పద్యం రత్నాల పేటి.

6. పగను గురించి చెప్పే ఈ పద్యంలో ధర్మరాజు- (పాండవులు) - భవిష్యత్తులో అనుసరించబోయే కార్యాచరణ పద్ధతి ఈ పగమీదే ఆధారపడి ఉంటుందని హెచ్చరిక చేశాడు. పగ వలన వగగొన్నవారు తిరగబడకుండా ఊరుకొనబోరట! సంజయుడు- పాండవులు శాంతించాలని చెప్పాడు. దానికి తిరుగు సమాధాన మిది. కౌరవుల పగకు తగిన సమాధానం చెప్పటమే వగగొన్న పాండవుల సహజ కార్యాచరణం. అయితే, ఒకసారి పగసాధింపుకు దిగితే ఇక దయాదాక్షిణ్యాలకు తావుండదు. సంధి వచనాలకు అవకాశముండదు. దారుణమైన క్రూరవృత్తితో శత్రు సంహారమే సాగుతుంది. కౌరవనాశనం తప్పదు. కాబట్టి ఎన్ని రకాలుగా ఆలోచించినా పగను తొలగించక పోతే ఎటువంటి మంచీ ఏర్పడదు. చివర 'ధ్రువంబు కేశవా!' అనే వాక్యం కూడా - ఇది నిశ్చయం, ఇది జరిగి తీరుతుంది. నా మాట అయి తీరుతుంది. ఇది నిజం- ఇన్ని అర్థాలనిస్తుంది. వాద ప్రతిపాద్యాంశంలోని నిత్యత్వాన్ని స్థాపించే తర్కరహస్యం ఈ పద్య నిర్మాణ మర్మం.

7. పూర్వరంగాన్ని ముందు పద్యంలోనూ, తాత్పర్యాన్ని తరువాతి పద్యంలోనూ చెప్పిన తిక్కన ఛందస్సుల మధ్య తర్కంతో వంతెన కట్టాడు. 'కావున శాంతి పొందుటయ కర్జము' అనే నిశ్చితాంశం తరువాతి పద్యం ఎత్తుగడలోని వాక్యం.

8. తిక్కన నాటకీయ సంభాషణ శిల్పంలో ఉపన్యాస రచన- లేదా - దీర్ఘ సంభాషణ ఒక విశిష్టాంశం. సందేశమిచ్చే ముఖ్యపాత్రలూ, దూతలూ మాత్రమే ఈ దీర్ఘసంభాషణలు చేస్తారు. భారతంలో ధర్మజుడి ఉపన్యాస ఖండికలలో ఉద్యోగపర్వంలోని ఈ భాగం ప్రసిద్ధమైనది. అందులో ఈ పద్యం శిరోమణి వంటిది.

9. ఈ పద్యంలో వాడిన తెలుగు పదాల పొందిక గమనిస్తే సంస్కృత భారతంలోని భావాలను తెలుగులో ఎంత ఆత్మీయం చేసికొని, జాతీయంగా తెలుగు పలుకుబడికి ప్రాణంగా తిక్కన రచించాడో స్పష్టమవుతుంది. విశేషించి - పగ, శుభంబు,

లెస్స, పగ, మార్కొనక, కడుందెగ మొదలెత్తిపోవ, మేలిమి, ధ్రువంబు మొదలైన పదాలు సార్థకాలు, శబ్ద ప్రయోగౌచిత్యానికి పద్యమంతా ఉదాహరణమే.

10. 'పగ గొన్న మార్కొనక' - అనే పాఠానికి 'పగగొన్న మార్కొనక', 'తెగగొన్న మార్కొనక' అనే పాఠాంతరాలు కనపడుతున్నాయి.

11. ఈ పద్య రచనకు సహకరించిన మూలశ్లోక మిది-

**"న చాపి వైరం వైరేణ కేశవ వ్యుపశామ్యతి,**
**హవిషాగ్నిర్యథా కృష్ణ, భూయ ఏవాభివర్ధతే". (సం. 5-70-63)**

కేశవా! పగతో పగ ఎప్పటికీ చల్లారదు. హోమ పదార్థా లుంచిన కొద్దీ హోమాగ్ని ఎట్లా ప్రజ్వరిల్లుతుందో పగవలన పగ మరల మరల రగిలి పెచ్చుపెరుగుతుంది. తిక్కన ఈ ఉపమానాన్ని గ్రహించలేదు. యజ్ఞోపకరణాన్ని పగకు ఉపమానంగా వాడక పోవటం వలన ఔచిత్యం పోషించబడింది. మూలంలో కంటె తిక్కన పద్యం వస్తువులో, రచనలో, జిగి బిగి ప్రదర్శిస్తున్నది.

12. తిక్కన ధ్వనిమార్గంలో కవిత రచించాడు. అందులోనూ రసధ్వని ఆయన ప్రత్యేక రంగం. వాచికాభినయ ప్రధానమైన ఈ ఘట్టంలో మాటలు పాత్రల స్వభావాలనూ, స్వభావాలు ప్రకరణ భావాలనూ, ధ్వనింపజేసి, నాయకుడైన ధర్మజుడి ధర్మనీతి వర్తనంలోని ఉత్సాహదీప్తిని వ్యక్తం చేస్తున్నాయి. ధర్మజుడి ధర్మవీరం తిక్కన కవితలో రసోల్లాసం.

13. తిక్కన శబ్దగుణానికి అర్థగుణాన్ని వన్నెగా నిలుపుతాడు. ఈపద్యం అటువంటి శిల్పానికి ఉదాహరణం. పదబంధంలోని మసృణత్వమే శబ్దగుణమైన శ్లేష లక్షణం. బహుపదా లున్నప్పటికీ ఏకపదం వలెనే భాసించటం దాని స్వభావం. అర్థగుణమైన శ్లేష అర్థఘటనకు సంబంధించింది. అనేకభావా లున్నప్పటికీ వాటికి ఐక్యఘటనాన్ని మార్చేదిగా అర్థగుణశ్లేష రాణిస్తుంది. శ్లేషలో క్రమం, కౌటిల్యం, అనుల్బణత్వం ఉపపన్నమై ఉండాలని వామనుడు పేర్కొన్నాడు. ఈ మూడు లక్షణాలూ ధర్మజుడి వాక్యఘటనలో అర్థగుణ సిద్ధిని పొందాయి. ధర్మరాజు మాటల పొందికలో ఎంత మన్నిక ఉంటుందో, వాక్యాల కూర్పులో అంత అర్థ సంఘటన ఉంటుంది. మాటలను అతకటం శబ్దగుణం, ఊటగా ఊరే భావాలను బహు వాక్యాలలో ప్రయాణింపజేసినా ఏకధారను అర్థస్ఫూర్తియందు సంఘటింపజేయటం అర్థగుణం. తిక్కన రచనలో శబ్దగుణమైన శ్లేష అర్థగుణమైన శ్లేషకు ఊడిగం చేస్తుంది. వాక్యవిన్యాసంలో ఏకసూత్రంగా ఉండే ఆలోచనాక్రమం ఒక్కొక్కప్పుడు వక్రతతో కూడి ఉన్నా, అనుల్బణత్వాన్ని ఆద్యంతమూ ఆదరిస్తుంది. ఇది తిక్కన సంభాషణ శిల్పంలోని ఆయుస్సూత్రం. ఈ పద్యంలోని ధర్మజుడి వాక్యరచన అర్థగుణమైన శ్లేషకు శీర్షప్రాయమైన ఉదాహరణం.

14. ఈ పద్యంలో అలంకారం లేదు. కాని, నాటకీయత ఉన్నది. సమాసాలు లేవు కాని, వాక్య విన్యాసం ఉన్నది. ఆడంబరం లేదు. కాని, ఆలోచన ఉన్నది. తిక్కన పద్యరచన ఆలోచనామృతం. (సంపా.)

**ఉ. కావున శాంతిఁ బొందుటయ కర్జము; దా నది యట్టులుండె; శ్రీ**
**గావలె నంచుఁ, బోరితము గామియుఁ గోరెద; మెల్లసొమ్ములుం**
**బోవుటయుం గులక్షయము పుట్టుటయున్ వెలిగాఁగ నొండుమై**
**నే విధినైనఁ జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా! 22**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; శాంతిన్+పొందుట+అ= శాంతి వహించటమే; కర్జము= చేయవలసిన పని; తాన్+అది+అట్టులు+ఉండెన్= ఆ విషయం అట్లా ఉండనీ; శ్రీ+కావలెన్+అంచున్= సంపద కావలెననీ; పోరితము+కామియున్= యుద్ధం జరగకుండ ఉండవలెననీ; కోరెదము= మేము వాంఛిస్తాము; ఎల్ల సొమ్ములున్= ఉన్న సమస్త ధనాలూ; పోవుటయున్=

నశించటమూ; కులక్షయము పుట్టుటయున్= వంశనాశం కలగటమూ; వెలి కాఁగన్= ఈ రెండునూ జరగకుండా; ఒండుమైన్= వేరొక్క విధంగా; ఏ విధిన్+ఐనన్= ఏ ప్రకారంగా నైనా; చక్కన్+పడుట= బాగుపడటం; ఎంతయున్+ఒప్పున్+చుమీ!= మిక్కిలి తగును గదా! (ఎంతో బాగుంటుంది కదూ!); జనార్దనా!= శ్రీకృష్ణా!.

**తాత్పర్యం:** వైరం వలన ప్రయోజనం శూన్యం. కలత లేక నిమ్మళంగా ఉండటమే తగిన పని. కృష్ణా! ఆ విషయమట్లా ఉండనీ. నేను సంపద కావాలనీ, యుద్ధం జరగకుండ ఉండాలనీ కోరుకొంటున్నాను. యుద్ధం వలన ధననష్టం, వంశనాశనం జరుగుతుంది. ఈ రెండూ జరగని ఉపాయంతో ఎట్లాగయినా బాగు పడటం మిక్కిలి సముచితం కదా!

**విశేషం:** 1. పాండవోద్యోగ సారసర్వస్వ మనదగిన పద్యం ఇది. ఉద్యోగపర్వానికి గుండెకాయవంటిది.

2. కావున- అనే నిశ్చితార్థంతో మొదలు కావటం రచనాశిల్పం.

3. యుద్ధం లేకుండా శాంతి పొందటం ప్రస్తుత కర్తవ్యం - అని ఫలితాంశ ప్రతిపాదనం.

4. దూతకార్యంలో లక్ష్యం శాంతి. ఆ శాంతిని సాధించే మార్గంలో రక్షించబడవలసిన మూల్యాలు మూడు. అవి:

(1) రాజ్య సంపద కావాలి. (2) కాని, యుద్ధం జరగకూడదు. (3) సంపద నష్టం కాకుండా, కులక్షయం కాకుండా మరే మార్గంలోనైనా, ఏ పద్ధతిలో నయినా కార్యం చక్కబడాలి.

ఈ ప్రణాళిక ధర్మజుడి ఉద్యోగంలోని ధర్మనీతి. ఇంతటితో ధర్మజుడి ప్రధాన ప్రతిపాదనం ముగిసింది. (సంపా.)

**చ. మనమునఁ బక్షపాతగతి మాదెస మానుము ధర్మనీతి వ**
**ర్తనముల రెండు దిక్కుల హితంబును బెంపును గల్గునట్టి చొ**
**ప్పున విదురాది సజ్జనుల బుద్ధికి రా నుచితంబుతోడి మె**
**ల్పునఁ బరుసందనంబునను భూపతులెల్ల నెఱుంగ నాడుమీ! 23**

**ప్రతిపదార్థం:** మనమునన్= నీ హృదయంలో; మా దెసన్= మా విషయమై; పక్షపాతగతిన్= అభిమానం చూపటం; మానుము= వదలి పెట్టుము; ధర్మనీతివర్తనములన్= ధర్మంతో నీతితోకూడిన నడవడికలతో; రెండు దిక్కులన్= ఇరుపక్షాలకూ; హితంబును= మేలును; పెంపును= అభివృద్ధియు; కల్గునట్టి చొప్పునన్= సమకూడే రీతిలో; విదుర+అది= విదురుడు మొదలైన; సజ్జనుల బుద్ధికిన్+రాన్= సత్పురుషుల మనసునకు సమ్మతమయ్యేటట్లుగా; ఉచితంబుతోడి మెల్పునన్= అనువైన మెత్తబాటుతోనూ; పరుసందనంబునను= కరకుదనంతోనూ; భూపతులు+ఎల్లన్= కురుసభలోని రాజులందరూ; ఎఱుంగన్= తెలిసికొనేటట్లు; ఆడుమీ= పలుకుము.

**తాత్పర్యం:** కృష్ణా! మా విషయంలో పక్షపాతం చూపవద్దు. ధర్మం, నీతి- వీటి ననుసరించి ఇరుపక్షాలకున్నూ మేలు, అభివృద్ధి సమకూరే రీతిలో, విదురుడు మొదలైన సత్పురుషుల మనసులకు సమ్మతమయ్యేటట్లుగా తగినంత మెత్తదనంతోనూ, కఠినమైన మందలింపులతోనూ కురుసభలో రాజు లందరూ గ్రహించేటట్లు మాట్లాడుము.

**విశేషం:** ఇంతవరకూ దౌత్య కార్య లక్ష్యాన్నీ, ప్రయోజనాన్నీ నిర్దేశించిన ధర్మరాజు ఈ పద్యం మొదలుకొని 26వ పద్యం వరకు దూత వర్తనాన్ని గురించి తన అభిప్రాయాలను తెలుపుతున్నాడు. ఇవి పరోక్షంగా ఉత్తమదూత సాధారణ లక్షణాలుగా

కూడా అన్వయిస్తాయి. అవి 1. మనస్సులో పక్షపాతగతి మానాలి. 2. ధర్మనీతి పథంలో తప్పకుండా నడవాలి. 3. ఉభయ పక్షాలకూ మేలూ, అభ్యుదయం కలిగేటట్లు మాట్లాడాలి. 4. సభ్యులలో విదురాది సత్పురుషులకు సమ్మతమయ్యేటట్లు మాట్లాడాలి. 5. అవసరాన్ని బట్టి మెత్తగానూ, కఠినంగానూ, మందలిస్తున్నట్లుగా సంభాషణ నిపుణంగా సాగించాలి. 6. సభలోనున్న రాజులందరూ పాండవుల ఉద్యోగాన్ని సక్రమంగా, సమగ్రంగా తెలిసికొన గలిగేటట్లు మాట్లాడాలి. మహాభారతంలో- దూతలకు ఉండదగిన ఈ లక్షణాలన్నీ చెప్పింది ధర్మజుడు. ఆచరించి చూపింది శ్రీకృష్ణుడు. (సంపా.)

**చ. తగవునఁ బోక రాజు బెడిదంబులు వల్కినయేని సైఁచి యొ**
**ప్పుగ నిలుమీ; గురుత్వముఁ బ్రభుత్వమునుం గల పెద్దవారి మా**
**ట గొనమి యా సుయోధను కడన్ నిలువన్ మన మెల్ల గారవం**
**బుగఁ గురువృద్ధ పల్కుఁ దలఁపుం జన నిచ్చిన మెచ్చరే జనుల్? 24**

**ప్రతిపదార్థం:** రాజు= దుర్యోధనుడు; తగవునన్+పోక= న్యాయమార్గాన నడువక; బెడిదంబులు= కఠినవాక్యాలు; పల్కిన+ ఏనిన్= మాట్లాడినట్లయితే; సైఁచి= సహించి; ఒప్పుగన్+నిలుమీ= చక్కగా నిలబడుము; గురుత్వమున్= పెద్దరికం; ప్రభుత్వమునున్= రాచరికమున్నూ; కల= కలిగిన; పెద్దవారిమాట= వృద్ధుల వచనం; కొనమి= ఆదరించకుండటం; ఆ సుయోధను కడన్+నిలువన్= ఆ దుర్యోధనుడి దెసనుండగా; మనము+ఎల్లన్= మనమందరమూ; గారవంబుగన్= మర్యాదతో; కురువృద్ధు పల్కున్= కౌరవులలో పెద్దవారైన భీష్మాదుల మాటను; తలఁపున్= ఉద్దేశమును; చనన్+ఇచ్చినన్= సాగనిస్తే; జనుల్= లోకులు; మెచ్చరే?= మనలను పొగడకుందురా?

**తాత్పర్యం:** న్యాయ మెంచక దుర్యోధనుడు పరుష వాక్యాలు పల్కితే సహించవలసింది. తొందరపాటున సభ విడిచి రావద్దు. పెద్దరికం, రాచరికంగల పెద్దలమాట సుయోధనుడు వినలేదనే నింద వాడి తలపై వేయవలసింది. మనం గౌరవంగా కురువృద్ధులైన భీష్మాదుల మాటనూ, ఉద్దేశాన్నీ సాగనిస్తే లోకులు మనలను మెచ్చుకొంటారు.

**విశేషం:** ఈ పద్యంలో ధర్మరాజు కురుసభలో ఏర్పడే సంఘటనలను బుద్ధిబలంతో ఊహించి ఆయా సందర్భాలలో శ్రీకృష్ణుడు వ్యవహరించవలసిన తీరులను నిర్దేశించాడు. అవి-

(1) దుర్యోధనుడు అన్యాయంగా, అసభ్యంగా, పరుషంగా పలికినా, వ్యవహరించినా వాటిని సహించి సభలో నిగ్రహంతో ఉండాలి. తొందరపడి సభ వెలువడి రావద్దు. ఇది కీలకాంశం.

(2) సభలోని పెద్దలు దుర్యోధనుడి దుష్ప్రవర్తనాన్ని వారిస్తారు. నిందిస్తారు, అతడికి హితవులు బోధిస్తారు. అతడు వారి మాటలు వినడు. ఆ నింద అతడికి నిండు కొలువులో ఏర్పడేటట్లు నిబ్బరంగా నిలిచి నిర్వహించాలి.

(3) ధృతరాష్ట్రుడు పెద్దలు చెప్పిన మాటలు విని, వారికి అనుకూలంగా మాట్లాడి, కొడుకును వారించవచ్చును. ఆ పరిస్థితిని గమనించి, ధృతరాష్ట్రుడి ఆనతిని మనం గౌరవిస్తున్నట్లు వ్యవహరించి, అతడి మాట సాగేటట్లు చేయాలి. అంటే దుర్యోధనుడి మాట కాదని పాండవులకు ధృతరాష్ట్రుడు రాజ్యభాగం ఇచ్చే పరిస్థితులను కలిగించి ఫలప్రాప్తిని సాధించాలి.

(4) దీనినే సామభేదోపాయాల నిపుణ ప్రయోగమంటారు రాజనీతిలో. దీనివలన యుద్ధం లేకుండానే పాండవులకు రాజ్యభాగం దక్కే అవకాశా లేర్పడతాయి. (సంపా.)

**మ. సుతువాఁడై వినయంబు సేకొనక యేచొప్పున్ దగం జెప్ప కా**
**ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగ రాదంచు వే**

**గ తెగంబాఱకు తెంపుసేయునెడ లోకంబెల్ల మెచ్చం బ్రకా**
**శిత ధర్మస్థితి నొంది మా మనము నిశ్చింతంబుగాఁ జేయుమీ! 25**

**ప్రతిపదార్థం:** ఆ ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు; సుతువాఁడు+ఐ= కుమారుడి పక్షం వహించినవాఁడై; వినయంబు చేకొనక= విధేయత చూపక; ఏ చొప్పున్= ఏ మార్గమునూ; తగన్+చెప్పక= యుక్తంగా తేల్చక; అవినీతిన్ చేసినను= అవినీతితో వర్తించినట్లయితే; సంధింపంగన్+రాదు+అంచున్= సంధి చేయటం పొసగదని; వేగ= వెంటనే; తెగన్+పాఱకు= సాహస కార్యానికి పూనవద్దు; తెంపు+చేయు+ఎడన్= సాహసానికి పూనుకొనవలసినప్పుడు; లోకంబు+ఎల్లన్+మెచ్చన్= జనులందరూ కొనియాడునట్లుగా; ప్రకాశిత ధర్మస్థితిన్+ఒంది= ప్రకటితమైన ధర్మంలో నెలకొన్నవాడవై; మా మనమున్= మా హృదయాన్ని; నిశ్చింతంబుగాన్+చేయుమీ= నిర్విచారంగా ఉండేటట్లు కావించవలసింది.

**తాత్పర్యం:** ఆ ధృతరాష్ట్ర మహారాజు కుమారుడి పక్షం వహించి వినయం వీడి ఏ అభిప్రాయం వెల్లడించక అవినీతితో మెలగినప్పుడు ఇక నేమాత్రం సంధి పొసగదని వెంటనే సాహసించవద్దు. సాహసం చేయవలసివస్తే జనులంతా కొనియాడేటట్లు ప్రకటిత ధర్మమందు నిలిచిన వాడవై మా మనసు విచారరహితంగా ఉండేటట్లు చేయవలసింది.

**విశేషం:** 1. ఒకవేళ- అనుకొన్నట్లు ధృతరాష్ట్రుడు వ్యవహరించక దుర్యోధనుడి దుర్నీతిని సమర్థించి అవినీతితో ప్రవర్తించి, రాజ్యభాగాన్ని ఇవ్వదలచకపోతే సంధికార్యం చెడిపోయిందని వెంటనే సభను వదలిపెట్టి రావద్దు.

2. సాహసించి నిండు కొలువులో నిలబడి ప్రజలందరూ గ్రహించేటట్లు పాండవుల ధర్మస్థితి ప్రకటితమయ్యేటట్లు గంభీరంగా ఉపన్యసించుము. ప్రజలు పాండవ ప్రయత్నాలు తెలిసికొని సత్యధర్మస్థితిని సమర్థిస్తే చాలు. రాయబారం సఫలమైనట్లే. అంటే సామదాన భేదాల ప్రయోగాన్ని కౌరవులు తిరస్కరించి యుద్ధోపాయానికి దారిచూపినట్లే ఔతుంది. (సంపా.)

**ఆ. ఇన్ని సంకటముల నిబ్భంగి నెంతయు । నొగులు చిత్తవృత్తి నొవ్వు దీర్ప**
**వెజ్జ వీవకావె! వేయేల? యేగతి । నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము.' 26**

**ప్రతిపదార్థం:** ఇన్ని సంకటములన్= ఇన్ని చిక్కులతో; ఈ+భంగిన్= ఈ విధంగా; ఎంతయున్= మిక్కిలి; నొగులు= వికలమౌతున్న; చిత్తవృత్తి నొవ్వు= మనో వ్యాపారము యొక్క వేదనను; తీర్పన్= తొలగించటానికి; వెజ్జవు= వైద్యుడవు; ఈవు+అ+కావె!= నీవే కదా!; వేయి+ఏల= పలుమాట లెందుకు?; ఏ గతిన్= ఏ రీతిగా; నడపన్+తలఁచితి(వి)= మమ్ములను ముందుకు నడిపించ దలచుకొన్నావో; అది+అ= అదే; నాకున్+ప్రియము= నాకిష్టం.

**తాత్పర్యం:** కృష్ణా! ఇన్ని చిక్కులతో ఈ ప్రకారంగా నా మనస్సు వికలమై వేదన చెందుతున్నది. నా మనో బాధను తొలగించుటకు తగిన వైద్యుడవు నీవుకాక మరెవ్వరు? ఇన్ని మాటలెందుకు? నీవు మమ్ము ఏ మార్గాన నడిపించ నెంచావో ఆ మార్గంలో నడవటమే నాకు సమ్మతం.'

**విశేషం:** 1. ధర్మరాజు తన చిత్తం చిక్కులతో ఈ విధంగా వేదనపడుతున్నదని చెప్పాడు. అంటే ఆయన తన మనసులోని బాధనే వెళ్ళగ్రక్కాడన్న మాట. అంటే శ్రీకృష్ణుడికి తన బాధను నివేదించుకొన్నాడన్నమాట! ఆయనది ఆదేశం కాదనీ, నివేదనమనీ నిపుణంగా చెప్పాడు. ఇది వాస్తవంగా గోచరించే రాజనీతి. ఆ సంగతి శ్రీకృష్ణుడికి తెలుసు.

2. ధర్మరాజు నిర్దేశించిన లక్ష్యాలు, సాధించవలసిన విధానాలు, ఫలితాంశాల అంచనాలు సంక్లిష్టంగా ఉన్నాయి. అఘటనా ఘటన సామర్థ్యం ఉంటేనే అవి సాధ్యాలవుతాయి.

3. నొవ్వు తీర్చే వైద్యుడు శ్రీకృష్ణుడని ధర్మరాజు సాభిప్రాయంగా అన్నాడు. ఆ నొవ్వేమిటి? ఆ మందేమిటి?

(1) కౌరవులమీద నిందపడకుండా తాను యుద్ధం ప్రకటించవలసి వస్తుందేమోనని ధర్మజుడి బాధ. ఆ బాధను తొలగించే మందు రాయబారం.

(2) దుర్యోధనుడి దుర్నయాన్ని ధృతరాష్ట్రుడు పుత్రవ్యామోహంతో సమర్థిస్తూ సంధి కార్యాన్ని భగ్నం చేస్తే తప్ప యుద్ధం ధర్మనీతియుక్తం కాదు. కౌరవసభలో దాని కనుగుణంగా కథ నడిపే కథానాయకుడుగా ఒక మహావ్యక్తి కావాలి. అది నెరవేరాలని ధర్మజుడి బెంగ. దానిని తీర్చగలిగిన మానసిక వైద్యుడు శ్రీకృష్ణుడు.

(3) దుర్యోధన ధృతరాష్ట్రులు దుర్నీతి ప్రదర్శించినా, భీష్మాదులు, రాజులు, మిత్రులు, ప్రజలు, పాండవ యత్నాన్ని విని హర్షించి కౌరవులను నిందించి, పాండవోద్యోగాన్ని సమర్థించాలి. ఆ విధంగా శత్రు శిబిరంలో భేదోపాయాన్ని ప్రయోగించాలని ధర్మజుడి చింత. ఆ చింతను, వంతను తీర్చగలవాడు శ్రీకృష్ణుడు.

(4) రోగి తన రోగ లక్షణాలను తన బాధను వైద్యుడికి చెప్పుతాడు. బాధానివారణ వైద్యుడి కర్తవ్యం. కాని, చికిత్స విధానం ఆయనదే ఔతుంది. శ్రీకృష్ణుడు మహాత్ముడైన దివ్య పురుషుడు. సాక్షాత్ నారాయణుడు. అతడి సంకల్పం ప్రకారమే కార్యం నడుస్తుంది, నడుస్తున్నది. అయితే, నారాయణుడు భక్తవత్సలుడు. మొరపెట్టుకొన్న వారిని రక్షిస్తాడు. వారికి ప్రియం చేకూరుస్తాడు. 'మ్రొక్కిన వరమిచ్చు వేల్పు' శ్రీకృష్ణుడు. అందుకే వేయేల? ఏగతి నడపఁ దలఁచితి, అదియ నాకుఁ బ్రియము' అని 'అన్యథా శరణం నాస్తి' అని వేడుకొంటూ దైవసంకల్పమే తన సంతోషంగా పేర్కొని ముగించాడు.

(5) 'ఆపదఁ గడవం బెట్టఁగ' (6వ పద్యం) అని మొదలు పెట్టి 'ఇన్ని సంకటముల నిబ్బంగి' అని ముగించే ఈ పద్యాల ఎత్తుగడలలో ఒకే విధమైన మనఃస్థితి ఉండటం, శ్రీకృష్ణుడిని దివ్యాత్ముడిగా భావించే భక్తిభావం ప్రకటితం కావటం గమనిస్తే తిక్కన పూర్వాపరకావ్య కథార్థ సమన్వయ శిల్పం స్పష్టమవుతుంది. (సంపా.)

**వ. అని చెప్పి తలంచికొని వెండియు నిట్లనియె : 27**

**తాత్పర్యం:** అని పలికి, ఏదో భావం మనసుకు రాగా, మళ్ళీ ఇట్లా అన్నాడు:

**విశేషం:** 'తలంచికొని' - అభినయ విశేష వ్యంజకం. పాదరసం వంటి బుద్ధిగల ధర్మరాజు - శ్రీకృష్ణుడు కురుసభకు పోతే ఏయే సన్నివేశాలు జరుగవచ్చునో, ఏయే విపరీత పరిస్థితులు శ్రీకృష్ణుడు ఎదుర్కొనవలసి వస్తుందో ఊహించాడు. బహుశః దుర్యోధనాదులు శ్రీకృష్ణుడిని ఒంటరివాడిని చేసి బంధించవచ్చును, సంహరించవచ్చును. ఒకవేళ అటువంటి గడ్డు పరిస్థితినే ఎదుర్కొనవలసి వస్తే యుద్ధ ప్రయోజనాల కొరకు శ్రీకృష్ణుడిని నిష్ప్రయోజనంగా బలిపెట్టుకొనవలసి వస్తుందేమో-అనే భావం ధర్మజుడి మనసులో మెరసినట్లుంది. మరల మాట్లాడటం మొదలు పెట్టాడు. ఆలోచనాముద్రలో ఉన్న ధర్మజుడిని గమనించి, అత డింకా మాట్లాడే అవకాశమున్నదని ఎవరూ పలకటానికి ముందుకు రాలేదు. ఇవన్నీ నిశ్శబ్దంగా ధ్వనింపబడే తిక్కన నాటకరంగ సూచనలు. (సంపా.)

**క. 'నీవు సుయోధను పాలికిఁ । బోవఁగ వలదనియు నొక్క బుద్ధి వొడమెడున్;**
**గోవింద! యతఁడు మంత్రులుఁ । గావరమునఁ జక్క వినరు కార్యవచనముల్. 28**

**ప్రతిపదార్థం:** గోవింద= కృష్ణా!; నీవు= నీవు; సుయోధనుపాలికిన్= దుర్యోధనుడి దగ్గరకు; పోవఁగన్+వలదు= వెళ్ళవద్దు; అనియున్= అనికూడ; ఒక బుద్ధి పొడమెడున్= ఒక తలంపు కలుగుతున్నది; అతఁడు= ఆ సుయోధనుడు; మంత్రులున్= ఆతడి సచివులు; కావరమునన్= పొగరుబోతుతనంతో; కార్యవచనముల్= సంధి మాటలు; చక్కన్+వినరు= శ్రద్ధగా ఆలకించరు.

**తాత్పర్యం:** 'కృష్ణా! నీవు దుర్యోధనుడి దగ్గరకు వెళ్ళటం సముచితం కాదని కూడా నాకొక తలంపు కలుగుతున్నది. అతడూ, ఆతడి మంత్రులూ పొగరుబోతులు. వారు నీ సంధివచనాలు శ్రద్ధగా చెవులబెట్టరు.

**తే.** **కుటిలమతు లవినీతులు క్రూరకర్ము; । లట్టి నీచుల కడకు ని న్ననుపఁజాల;**
**నీవు సంకటపడియెడు దేవపదవి । యైన నే నొల్ల; నొంటి యం దరుగు టుడుగు.'** **29**

**ప్రతిపదార్థం:** కుటిలమతులు= కుచ్చితపు బుద్ధిగలవారు; అవినీతులు= అడకువ లేనివారు; క్రూరకర్ములు= ఘోరకృత్యాలు చేసేవారూ అయిన; అట్టి నీచుల కడకున్= అటువంటి తుచ్ఛులైన కౌరవుల వద్దకు; నిన్నున్= నిన్ను; అనుపన్+చాలన్= పంపలేను; నీవు సంకటపడియెడు= నీవు శ్రమల పాలు కావలసిన; దేవపదవి+ఐనన్= స్వర్గరాజ్యమైనా; నేను+ఒల్లన్= నేనిష్టపడను; ఒంటిన్= ఒంటరిగా; అందున్+అరుగుట+ఉడుగు(ము)= అక్కడికి వెళ్ళటం మానవలసింది.

**తాత్పర్యం:** కృష్ణా! దుర్యోధనాదులు వక్రబుద్ధి గలవారు, వినయరహితులు, దారుణకృత్యాలకు పాల్పడేవారు. అట్లాంటి తుచ్ఛుల దగ్గరికి నిన్ను పంపలేను. నిన్ను చిక్కులపాలు చేసే ఇంద్రపదవిని సైతం నేను వాంఛించను. కనుక కౌరవుల కడకు నీవు ఒంటరిగా వెళ్ళటం మానుకో.'

**విశేషం:** 1.28, 29 పద్యాలలో ధర్మజుడు శంకించినవన్నీ ఊహలుగా అనిపించినా, అతడు శంకించినట్లుగానే అవి జరుగబోతున్నాయి. అంటే ధర్మరాజు ఆగామిని అంత నిర్దిష్టంగా దర్శించగల ప్రజ్ఞావంతు డన్నమాట!

2. త్రిలోకపదవికంటె శ్రీకృష్ణుడి క్షేమం ధర్మజుడికి ప్రియం- అనే వాక్యం పాండవుల అనన్యభక్తికి ప్రత్యక్షర సాక్ష్యం.

3. దీనికి మూలం : "నహినః ప్రణయే ద్ద్రవ్యం, నదేవత్వం కుతః సుఖమ్ । న చ సర్వామరైశ్వర్యం తవరోధిన మాధవ!" (5.70.84). 'ఒంటి యం దరుగుటుడుగు' అనే మాట అమూలకం. అయినా ప్రకరణోచితం" (సంపా.)

**చ.** **అనవుడుఁ గృష్ణుఁ డిట్లనియె 'నా ధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త**
**త్తనయుఁడ యేల; నీ పలుకు తథ్యము; నీ తలఁ పే నెఱింగితి;**
**న్మనమున శంక దక్కుము; వినన్ వలతే విను; మేను నిక్క మ**
**ల్గిన నచటం గలండె రణకేళికి మార్కొన నొక్కఁడేనియున్?** **30**

**ప్రతిపదార్థం:** అనవుడున్= ధర్మజుడు అట్లా పలుకగా; కృష్ణుఁడు= వాసుదేవుఁడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; తత్+తనయుఁడ+ఏల?= అతని కుమారుడైన సుయోధను డొక్కడే యేమి?; ఆ ధృతరాష్ట్రుఁడున్+అట్టివాఁడు+అ= ఆంబికేయుడును అట్లాంటివాడే; నీ పలుకు తథ్యము+అ= నీమాట నిజమే; నీ తలఁపు= నీ భావం; ఏను+ఎఱింగితిన్= నేను తెలిసికొన్నాను; మనమునన్= నీ హృదయంలో; శంక+తక్కుము= అనుమానం మాను; వినన్ వలతేన్= నా మాటలు వినగోరితే; వినుము= వినుము; ఏను= నేను; నిక్కము= నిజంగా; అల్గినన్= నిజంగా ఆగ్రహిస్తే; అచటన్= ఆ కురుసభలో; రణకేళికిన్= యుద్ధ క్రీడకు; మార్కొనన్= ఎదిరించటానికి; ఒక్కఁడు+ఏనియున్= లెక్కకు ఒక్కడైనా; కలండె?= ఉన్నాడా?

**తాత్పర్యం:** ధర్మజుడి మాటలకు శ్రీకృష్ణుడు ఇట్లా బదులు పలికాడు. 'సుయోధను డొక్కడేయేమి, ఆతడి తండ్రి ధృతరాష్ట్రుడుగూడ నీవు పల్కిన తీరువాడే. నీ మాట సత్యం. నీ భావ మేమిటో నేను గ్రహించాను. నీవు మనసులో సందేహించ వద్దు. నా మాటలు వినదలిస్తే వినుము. నేను నిజంగా ఆగ్రహిస్తే అక్కడ యుద్ధంలో న న్నెదిరించగలవాడు ఒక్కడైనా ఉన్నాడా?

**విశేషం:** 1. ఒంటరిగా కురుసభకు వెళ్ళటం మానుమని స్నేహ పురస్సరంగా ధర్మరాజు అన్నాడు. దానికి శ్రీకృష్ణుడు ఆర్ద్రుడయ్యాడు. ధర్మజుడి మనసులో ఉన్న శంక తొలగించాలని ఈ పద్యంలోని మాటలన్నాడు. ధర్మజుడివలెనే శ్రీకృష్ణుడు చిన్న చిన్న వాక్యాలతో తన మనోభావాన్ని తెలిపాడు. దుర్యోధన ధృతరాష్ట్రుల స్వభావా లటువంటివే అని ఒప్పుకొన్నాడు. ధర్మజు డనిన మాటలన్నీ నిజాలనీ (నిజాలౌతాయనీ) చెప్పాడు. 'నీతలఁ పే నెఱింగితి'- అనే వాక్యం బహుళార్థకం. ధర్మజుడు తన ఉపన్యాసంలో కోరుతున్న తాత్పర్యాన్ని, అంతరార్థాన్ని అవగాహనం చేసికొన్నానని ఒక అర్థం. కురుసభకు పోతే ఏర్పడే అపాయాన్ని గురించి శంకిస్తున్న ధర్మజుడి ఆత్మీయతను గ్రహించానని మరొక అర్థం. మనస్సులో శంకను మానేయమన్న వాక్యం - రెండర్థాలకూ వర్తిస్తుంది. 'వినవలతేన్ వినుము'- అనే వాక్యం శ్రీకృష్ణుడి అభిమానోక్తి, వీరోక్తి, ఒంటరిగా వెళ్ళినా, ఎంద రెదిరించినా, నిజంగా కోపించి యుద్ధానికి దిగితే శ్రీకృష్ణుడికి ఎదురైన వాడు కురుసభలో లేడని చెప్పి, 'నే నొక్కడినే, నావలె మరొక్కడున్నాడా?' అని వీరోక్తి పలికాడు. ఒక్కడు - అంటే ఒంటరివాడు అని ఒక అర్థం. ఏకైక వీరుడు అని మరొక అర్థం. శ్రీకృష్ణు డొక్కడైనా ఏకైక వీరుడని ధ్వని. ఇవి సంభాషణ చమత్కారాలని భావించినా, శ్రీకృష్ణుడి మాటలు కూడా కురుసభలో సత్యాలు కాబోతున్న భావికథార్థ ధ్వనులవలె వెలుగొందుతున్నాయి. ఈ పద్యంలో శ్రీకృష్ణుడి దివ్యాదివ్య స్వభావం ధ్వని.

2. ఇందులో అర్థవ్యక్తి అనే గుణం భాసిస్తున్నది. శ్రీకృష్ణ స్వభావ స్ఫుటత్వం ఇందులోని అర్థగుణదీప్తి. (సంపా.)

**క. పనుపుము కౌరవసభ; కేఁ । జను టెట్లును మేల; యర్థ సంసిద్ధియగున్;**
**మన కొకటం బాపము రా । కునికికిఁ గతమైన పలుకు లొండెను గలుగున్.' 31**

**ప్రతిపదార్థం:** కౌరవసభకున్= కౌరవుల కొలువు కూటానికి; పనుపుము= నన్ను పంపుము; ఏన్= నేను; చనుట= అచటికి వెళ్ళటం; ఎట్లును+మేలు+అ= ఏ విధంగా ఆలోచించినా అది మంచిదే; అర్థ సంసిద్ధి+అగున్= మన ప్రయోజనం నెరవేరుతుంది; మనకున్= మనకు; ఒకటన్= ఏ రకంగానూ; పాపము రాక+ఉనికికిన్= దురితం రాకుండటానికి; కతము+ఐన= కారణమైన; పలుకులు+ఒండెను= మాటలైననూ; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** నన్ను కౌరవ సభకు పంపుము. నేనచటికి వెళ్ళటం ఎంతైనా మంచిది. మన కార్యం నెరవేరుతుంది. లేదా మనకు పాపం సంభవించని పలుకులైనా పలకడానికి వీలవుతుంది.'

**విశేషం:** ఈ పద్యం ధర్మరాజు హృదయాన్ని పూర్తిగా తెలిసికొన్న దూత పలికినట్లుండటం విశేషం. ప్రతి వాక్యం ప్రయోజనాత్మకం.

(1) 'నన్ను కౌరవసభకు పంపుము'- శ్రీకృష్ణుడు స్వతంత్రుడుగా కౌరవసభకు పోయినట్లు కాకుండా ధర్మజుడి రాయబారిగానే వెళ్ళుతున్నట్లు సూచించి, ధర్మరాజ ప్రభుత్వాన్ని గౌరవించాడు, మన్నించాడు.

(2) 'నేను వెళ్ళటం అన్ని విధాలా మంచిది'- ఈ మాట నిజం. ధర్మజుడు సామదాన భేదోపాయాలను ప్రయోగించి, అవన్నీ కౌరవులవలననే భంగమయ్యాయని నిరూపించగల వ్యక్తిని కోరుతున్నాడు. అతడి ఆశయాల నన్నింటిని నెరవేర్చటమే కాక,

చూచి రమ్మంటే కాల్చి వచ్చే సమర్థుడు శ్రీకృష్ణుడు. కర్ణుడితో సాగించిన మంతనాలవంటివి శ్రీకృష్ణుడే చేయగలడు. అవెంతో మేలు చేశాయి. అందువలన సర్వసమర్థుడైన రాయబారి శ్రీకృష్ణుడని స్పష్టం.

(3) ధర్మరాజు కోరినట్లు అర్థసిద్ధి అయ్యేటట్లు, పాపం రానట్లు, కీర్తి కలిగేటట్లు మాట్లాడతానని శ్రీకృష్ణుడు పలకటం ధర్మరాజుకు పరిపూర్ణ సంతృప్తి నిచ్చింది. అర్థమంటే సంపద, ప్రయోజనం అని రెండర్థాలు. ఇక్కడ మొదట సంధి ప్రయోజనసిద్ధి, ఆ తరువాత యుద్ధ విజయసిద్ధి అని గ్రహించవచ్చును. ధర్మజుడి విస్తృతోపన్యాస సారాంశం ఒక కంద పద్యంలో అందంగా చెప్పాడు కృష్ణుడు. ధర్మజుడు గడుసుగా మాట్లాడగలడు. ఒడుపుగా మాట్లాడగలడు. (సంపా.)

**వ. అని పలికిన యుధిష్ఠిరుం డిట్లనియె: 32**

**తాత్పర్యం:** శ్రీకృష్ణుని మాటలకు ధర్మనందనుడు ఇట్లా అన్నాడు:

**ఆ. 'మేలుగాక నీకుఁ బోలినట్లయిన నం । దరిగి యేము వారు నర్థిఁ బొంది**
**యుండునట్లుగాఁగ నొడఁబాటు గావింపు । మెల్లభంగి మనకు నిదియ లెస్స. 33**

**ప్రతిపదార్థం:** మేలుగాక!= శుభమగుగాక;! నీకున్= నీకు; పోలిన+అట్లు+అయినన్= యుక్తమని తోస్తే; అందున్+అరిగి= కౌరవసభకు వెళ్ళి; ఏము= మేము; వారు= కౌరవులు; అర్థిన్= ప్రీతితో; పొంది+ఉండునట్లు కాఁగన్= కూడిఉండేటట్లు; ఒడఁబాటు కావింపుము= అంగీకారం కుదుర్చుము; ఎల్లభంగిన్= అన్ని విధాల; మనకున్= మనకు; ఇది+అ లెస్స= సంధియే మేలు.

**తాత్పర్యం:** 'కృష్ణా! మంచిది. కురుసభకు వెళ్ళటం నీకు యుక్తమని తోస్తే వెళ్ళి మేమూ, వారూ కలసి మెలసి ఉండేటట్లుగా సంధి కుదుర్చుము. అన్ని విధాలా వారితో సంధి కుదుర్చుకొనటమే మనకు మంచిది.

**క. మ మ్మెఱుఁగు, దెదిరి నెఱుఁగుదు । నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా**
**క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు । పా మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. 34**

**ప్రతిపదార్థం:** మమ్మున్+ఎఱుఁగుదు(వు)= మేమెట్లాంటి వాళ్ళమో ఎరుగుదువు; ఎదిరిన్+ఎఱుఁగుదు(వు)= కౌరవు లెట్టివారో ఎరుగుదువు; నెమ్మిన్+ఎఱుఁగుదు= కూర్మిఅనగా ఎటువంటిదో ఎరుగుదువు; అర్థసిద్ధినెఱి+ఎఱుఁగుదు(వు)= కార్యసాధన విధాన మెట్టిదో ఎరుగుదువు; వాక్యమ్ముల పద్ధతిన్+ఎఱుఁగుదు(వు)= మాటలాడే తీరు ఎట్టిదో ఎరుగుదువు; నీకున్+బుద్ధులు+ చెప్పన్= నీకు ఉపాయాలు బోధించటానికి; నేను+ఎవ్వఁడన్= నేనేపాటివాడిని; పొమ్ము= హస్తినాపురికి వెళ్ళిరమ్ము.

**తాత్పర్యం:** కృష్ణా! పాండవులూ, కౌరవులూ ఎట్లాంటివారో ఎరుగుదువు. కూర్మి అంటే ఎట్టిదో ఎరుగుదువు. కార్యసాధన విధాన మెట్టిదో ఎరుగుదువు. మాటలాడు తెరగెట్టిదో ఎరుగుదువు. నీకు ఉపాయాలు చెప్ప నేనే పాటివాడిని?, హస్తినకు వెళ్ళి రమ్ము.'

**విశేషం:** 1. ఈ పద్యం పైకి ప్రశంసావాక్యం, లోన దూతలక్షణవివేకం.

2. ధర్మరాజు చేసిన ఉపన్యాసంలోని లోగుట్టులు తెలిసిన వ్యక్తి శ్రీకృష్ణుడే. మిగిలిన వారికి చూచాయగా మాత్రం గోచరమై ఉండవచ్చును. శ్రీకృష్ణుడు ఆవులిస్తే ప్రేవులు లెక్క పెట్టగలవాడని అతడి సమాధానం బైటపెట్టింది. దానికి లోలోన సంతోషించి ముసి ముసి నవ్వులతో ప్రశంసల జల్లులు కురిపించాడు ధర్మరాజు. 'ఎఱుగుదు(వు)' అనే క్రియను అయిదుసార్లు వాడాడు. ఆరవసారి వాచ్యం చేయకుండా ధ్వనిమయం చేసి సర్వజ్ఞత్వాన్ని సూచించాడు.

3. శ్రీకృష్ణుడిని 'దివ్యుడిగా సర్వజ్ఞుడిగా ప్రశంసించిన తాత్పర్యం ఇది. మమ్ములను గురించి తెలుసు. ఆపైన ఎదుటి వారిని గురించి తెలుసు అనటంలో పాండవాధిక్యాన్ని తెలిసినవాడివని భావం. శ్రీకృష్ణుడిని రాయబారిగా ప్రశంసించిన తాత్పర్యంలో 'నీకు ఉభయ పక్షాలూ తెలు'సని భావం. 'ఇరువురికి ఉన్న అనుబంధ మెటువంటిదో తెలుసు. వాక్య రచనా పద్ధతులు తెలుసు. ఇన్ని తెలిసిన సర్వజ్ఞుడైన నీకు ధర్మనీతులు చెప్పటానికి నేనెంత వాడను?' అని ఒక అర్థం. 'నీకు ఉపాయాలు చెప్పేటంత వాడినా నేను?'- అని మరొక అర్థం. అన్ని వాక్యాలూ ఒక ఎత్తు; చివరివాక్యం ఒక్కటీ ఒక ఎత్తు. ముగింపు వాక్యాన్ని మెరిపించిన వాడే మహావక్త. ఈ పద్యంలో చివరి వాక్యం- తెలుగుదనం పుక్కిట పట్టిన వాక్యం. అప్యాయతకు అచ్చమైన నిదర్శనం. ముచ్చటైన ముగింపు. (సంపా.)

### శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవుల దుర్ణయంబు సెప్పుట (సం. 5-71-1)

**సీ. అనిన ముకుందుఁ డిట్లనియె; 'సంజయుని మా । టలును నీవన్న పల్కులును వింటి;**
**నీమది ధర్మైకనిష్ఠమై యున్నది; । వైరంబు విడువరు వారు; ద్రోణ**
**భీష్ములు గలరని బిరుదులై యున్న వా; । రగునె రాజన్యుల కడఁగి కుడువ?**
**నక్లేశవృత్తి రాజ్యము చవి గొన్న వా । రేల యిత్తురు నీకుఁ బాలు సెపుమ!**
**తే. ధార్తరాష్ట్రులు సడికి నధర్మమునకు । నలుక రెన్నఁడు; విడువు దైన్యంబు; పాడువు**
**కయ్య మరివర్గ జయమునఁ గలుగు నిహ ప । రములుఁ జిరకీర్తియును బాండురాజతనయ! 35**

**ప్రతిపదార్థం:** అనినన్= ధర్మజుడు అట్లా పలుకగా; ముకుందుఁడు= మోక్షప్రదాతయగు శ్రీకృష్ణమూర్తి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా మాట్లాడాడు; పాండురాజ తనయ!= పాండురాజు పుత్రుడవైన ధర్మజా!; సంజయుని మాటలును= సంజయు డాడిన వాక్యాలూ; నీవు+అన్న పల్కులును= నీవు మాట్లాడిన మాటలూ; వింటిన్= ఆకర్ణించితిని; నీ మది= నీ హృదయం; ధర్మ+ఏకనిష్ఠమైన్+ఉన్నది= ధర్మమునందే ముఖ్యంగా నెలకొని ఉన్నది; వారు= కౌరవులు; వైరంబున్+విడువరు= విరోధాన్ని మానరు; ద్రోణభీష్ములు= గురుడూ, పితామహుడూ; కలరు+అని= తమ పక్షంలో ఉన్నారని; బిరుదులు+ఐ= శూరులై; ఉన్నవారు= ఉన్నారు; రాజన్యులకున్= క్షత్రవంశజులకు; అడఁగి= విధేయులై; కుడువన్= భుజించటం; అగునె?= తగునా?; అక్లేశవృత్తిన్= ఎట్టి కష్టం లేకుండా; రాజ్యము చవికొన్నవారు= రాజ్యం యొక్క రుచి చూచినవారు; నీకున్= నీకు; పాలు= రాజ్యభాగం; ఏల+ఇత్తురు చెపుమ!= ఎందుకిస్తారో చెప్పుము; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుడి కొడుకులు; సడికిన్= నిందకు; అధర్మమునకున్= అన్యాయానికి; ఎన్నఁడున్= ఎప్పుడూ; అలుకరు= భయపడరు; దైన్యంబు= దీనతను; విడువు(ము)= వదలిపెట్టుము; కయ్యము పాడువు(ము)= పోరు సల్పుము; అరివర్గజయమునన్= శత్రు సమూహాన్ని జయించటంవలన; ఇహపరములున్= ఇహపరసుఖాలునూ; చిరకీర్తియున్= శాశ్వత యశమున్నూ; కలుగున్= నీకు లభించగలవు.

**తాత్పర్యం:** ధర్మనందనుడి మాటలు విని శ్రీకృష్ణు డిట్లా అన్నాడు. 'పాండురాజపుత్రా! సంజయు డాడిన మాటలూ, నీవు పల్కిన పల్కులూ విన్నాను. నీ మనస్సు ధర్మంలో పూర్తిగా నెలకొని ఉన్నది. కౌరవులు పగ మానరు. భీష్మ ద్రోణులు తమ పక్షంలో ఉన్నారని శూరులై నిక్కుతున్నారు. రాజులకు అణగిమణగి యాచించి భుజించటం తగదు. అనాయాసంగా లభించిన రాజ్యం రుచి మరిగిన కౌరవులు పుడమిలో పాలు పంచి నీ కెందు కిస్తారో నీవే చెప్పుము. దుర్యోధనాదులు నిందకూ, అధర్మానికీ ఎన్నడూ జంకరు. నీవు దైన్యం వదలిపెట్టుము. యుద్ధం సలుపుము. శత్రు సమూహాన్ని జయించటం వలన ఇహపరసుఖాలు సమకూరుతాయి. శాశ్వత కీర్తి లభిస్తుంది.

**విశేషం:** 1. ఇంతవరకు శ్రీకృష్ణుడు హస్తినాపురానికి వెళ్ళే రాయబారిగా మాట్లాడాడు. ప్రభువైన ధర్మరాజు నిర్దేశించిన ప్రయోజనాలను సాధిస్తానని నిస్సంశయంగా పలికాడు. ఇక ఇప్పుడు శ్రీకృష్ణుడు మిత్రుడుగా, హితవరిగా, సచివుడుగా పాండవులు నమ్మిన భగవంతుడుగా మాట్లాడుతున్నాడు. ధర్మరాజు ఉపప్లావ్యనగరంలో ఎట్లా వ్యవహరించుకొనాలో చెప్పుతున్నాడు. ఇది పాండవులకు వాసుదేవుడు చెప్పే హితవు.

2.'మ మ్మెఱుఁగు, దెదిరి నెఱుఁగుదు' అని ధర్మరాజు చేసిన ప్రశంసకు అనుగుణంగా శ్రీకృష్ణుడు తా నెఱిగిన అంశాలను ఈ పద్యంలో నివేదించాడు. 'ధర్మజుడి మనస్సు ధర్మైక నిష్ఠం. ధార్తరాష్ట్రులు నిందకూ, అధర్మానికీ ఎన్నడూ జంకరు' అని తేల్చి చెప్పాడు. "తన ధర్మాశ్రితా బుద్ధిః । తేషాం వైరాశ్రితా మతిః" (5-71-2) అని మూలం. ధర్మాధర్మాలకు సంధి కుదురుతుందా? అన్న ప్రశ్న లేవనెత్తాడు మాధవుడు. సంధి సందిగ్ధం కాబట్టి పాండవులు సమర సన్నాహం మానకూడదని హితవు చెప్పాడు. ధర్మజుడు చేస్తున్న శాంతి యత్నానికి, పాండవ యుద్ధ సన్నాహం విరుద్ధం కాదని ప్రకటించాడు. శ్రీకృష్ణుడి హితవు అనుష్ఠాన రాజనీతి.

3. తిక్కన మూలంలోని భావాలను సందర్భోచితంగా మార్చి రచించటం సర్వసామాన్యం. దానికి ఉదాహరణగా ఇక్కడ ఒక విషయం చెప్పుకొనవచ్చును. కౌరవులను గురించి చెప్పుతూ శ్రీకృష్ణుడు -

> **"అతి గృద్ధాః కృతస్నేహా దీర్ఘకాలం సహోషితాః**
> **కృత మిత్రాః కృతబలా ధార్తరాష్ట్రాః పరంతప". (సం. 5-71-6)**

అని అన్నాడని మూలం. 'ధార్తరాష్ట్రులు మిక్కిలి పిసినిగొట్టువారు. అయినా మీరు చాలాకాలం వారితో స్నేహం చేశారు, కలిసి మెలసి ఉన్నారు. మైత్రి పెంపొందించుకొన్నారు. బలాన్ని కూడా పెంపొందించుకొని ఉన్నారు' అనే ఈ మాటలను తిక్కన స్వీకరించక. 'అక్లేశవృత్తి రాజ్యము చవిగొన్న వారేల యిత్తురు నీకుఁ బాలు సెపుమ?' అని అనిపించాడు. ఈ వాక్యం సన్నివేశౌచిత్యాన్ని పెంచింది.

4. ఎత్తుగీతి తిక్కన పాత్రోచిత సంభాషణ కెత్తిన పతాక! ధర్మజుడి శాంతిప్రయత్నంతో పాండవ స్కంధావారంలో ఉత్సాహం కొంత మందగించినట్లు కనపడింది. అది భావి కార్యసాధనకు పోషకం కాదు. శ్రీకృష్ణ డా సమయంలో పగనూ, సమరోత్సాహాన్నీ, వీరరౌద్రరసస్ఫూర్తినీ పాండవవర్గంలో జాగృతం చేసి రసోల్లాసాన్ని కలిగించదలచాడు. అందువలననే ఎత్తుగీతిలో నినాద కవిత్వం చెప్పాడు. అందులో అంతర్గత తర్కం కూడా ఇమిడ్చాడు. 'కౌరవులు నిందకు భయపడరు కాబట్టి నీవు దైన్యాన్ని వదలిపెట్టుము: వాళ్ళు అధర్మానికి జంకరు కాబట్టి నీవు యుద్ధానికి జంకక వారిమీద దాడి చేయుము' అని రెచ్చగొట్టాడు. శత్రువులను జయించటం వలన ఇహపర సుఖాలూ, చిరకీర్తీ వస్తాయని ధర్మజుడి చిత్తవృత్తికి హత్తుకొనేటట్లు పలికాడు.

5. దూతగా శ్రీకృష్ణుడు శాంతినీ, హితుడుగా యుద్ధాన్నీ అనుసరిస్తూ ద్విముఖ పాత్ర నిర్వహిస్తున్నట్లు కనపడుతున్నా, ధర్మజుడు సాధించ దలచుకొన్న ధర్మనీతికి అది విరుద్ధం కాదని తెలిపే సంభాషణ ఇక ముందు శ్రీకృష్ణుడు సాగించటం గమనార్హం.

6. 'పాండురాజతనయ!' అనే సంబుద్ధి సార్థకం. చిరకీర్తీ, ఇహపరాలూ పాండురాజు పుత్రుడైతేనే కోరుకొంటాడని భావం.

7. ధర్మైకనిష్ఠమై ఉన్న ధర్మరాజు చిత్తవృత్తిని యుద్ధైక నిష్ఠం చేయటానికి శ్రీకృష్ణుడు ప్రయోగించిన ప్రథమ వాఙ్మయోపాయం ఈ పద్యం. (సంపా.)

**మ. గురుభీష్మాదులు సూచుచుండ సభ మీకుం గీడు నాఁ డట్లు ము**
**ష్కరులై చేసిరి; యంతసేసియును బశ్చాత్తాపముం బొంద నో**
**పర వా రెన్నఁడు; నట్టిచోటఁ గృపయున్ బంధుత్వముం దక్కు; మె**
**వ్వరుఁ గోపింపరె యా దురాత్మకుల గర్వక్రౌర్యముల్ సూచినన్. 36**

**ప్రతిపదార్థం:** గురు భీష్మ+ఆదులు= ఆచార్యుడైన ద్రోణుడు; పితామహుడైన భీష్ముడు మున్నగువారు; చూచుచున్+ఉండన్= వీక్షిస్తూఉండగా; సభన్= కొలువులో; మీకున్= మీకు; కీడు= అపకారం; నాఁడు= అప్పుడు; అట్లు= ఆ విధంగా; ముష్కరులు+ఐ= నీచులై; చేసిరి= చేశారు; అంత చేసియును= అంతటి కీడు చేసికూడా; వారు= కౌరవులు; ఎన్నఁడున్= ఒకనాడైనా; పశ్చాత్తాపమున్+పొందన్+ఓపరు+అ= చేసిన తప్పును గూర్చి తరువాత చింతించినవారు కారు; అట్టిచోటన్= అట్టివారి విషయంలో; కృపయున్= కారుణ్యమునూ; బంధుత్వమున్= చుట్టరికాన్నీ; తక్కుము= మానుము; ఆ దురాత్మకుల గర్వ క్రౌర్యముల్= ఆ దుష్టచిత్తుల యొక్క పొగరుబోతుతనం, క్రూరత్వం; చూచినన్= పరికిస్తే; ఎవ్వరున్+కోపింపరె?= ఎంతటి సాధువులైనా కోపగించక మానుతారా?

**తాత్పర్యం:** గురుడు, భీష్ముడు మొదలైన పెద్దలు చూస్తుండగా, సభలో తుచ్ఛులైన కౌరవులు మీకు ఆనాడు అపకారం చేశారు. అంతటి అపకారం చేసికూడా ఆ తరువాతనైనా, వారు చేసిన తమ తప్పుకు ఎన్నడూ పశ్చాత్తాపం ప్రకటించనేలేదు. అట్టి వారి విషయంలో కారుణ్యం, బంధుభావం విడిచిపెట్టుము. ఆ దుష్టచిత్తులయొక్క పొగరు, క్రౌర్యం చూస్తే ఎవరైనా వారిపై కోపపడకుంటారా?

**విశేషం:** 1. 'పగ యడగించుటెంతయు శుభంబు'- అన ధర్మరాజుఅభిమతం. అది రాజకీయానికి పనికి వచ్చే శాంతి సూక్తం. కాని, పాండవ స్కంధావారానికి అప్పు డది పనికిరాదు. కురుసభలో పగ సెగలు క్రక్కుతున్న వాస్తవం గమనించి కూడా పాండవులు పగను చల్లార్చుకొనటం సబబుకాదు. అందువలన పగకు మూలమైన కౌరవ దుష్కృత్యాన్ని శ్రీకృష్ణు డిందులో పేర్కొన్నాడు. అందులోనూ ఆ చెప్పే తీరులో ఒక క్రమోన్మీలనం గోచరిస్తుంది. శ్రోతను భావోద్వేగస్థితికి చేర్చే మాటల పొందిక కనబడుతుంది. అది శ్రీకృష్ణుడి ప్రబోధ వాక్యరచనా శిల్పం.

2. కౌరవులు వస్తుతః దురాత్ములు, పైపెచ్చు గర్విష్ఠులు, క్రూరులు. ఈ మూడు గుణా లున్నవారిని లోకంలో ఎవరైనా కోపిస్తారు! గర్హిస్తారు. దురాత్ములు అనటానికి - ద్రోణ భీష్మాదులు చూస్తూ ఉండగా నిండుసభలో పాండవులకు నీచంగా కీడు చేయటమే సాక్ష్యం. ఒకవేళ ఆవేశంలో ఆ తప్పు చేసినా, వారు గర్వాంధులు కాబట్టే చేసిన తప్పుకు పశ్చాత్తాపం కూడా ప్రకటించలేదు. ఇప్పటకీ క్రూరులై మీకు కీడే తలపెట్టుతున్నారు. అటువంటి వారిమీద దయాదాక్షిణ్యాలు కాని, బంధుత్వ మిత్రత్వాలు కాని తగవు. కాబట్టి యుద్ధం వలన బంధునాశన మవుతుందని నిర్వేదం చెందవలసిన అవసరం లేదని హితవు చెప్పాడు. కోపంతో పగసాధించటమే కర్తవ్యమని బోధించాడు.

3. 'ఎవ్వరు కోపింపరె?' అనే ప్రశ్నార్థకం వ్యంగ్యగర్భితం. 'ఎవరు కోపించరు? నీ వొక్కడివి తప్ప' అని భావం. లోకమంతటిదీ ఒకదారి, నీవొక్కడిదీ ఒకదారి - అని సున్నితమైన అధిక్షేపం. కరుడుకట్టుకొన్న భావాలను కరిగించటానికి ప్రశ్నార్థక వాక్యాలు వేడి తూటాల వంటివి. శ్రీకృష్ణుడికి వాటిప్రయోగం బాగా తెలుసు. (సంపా.)

**వ. కపటపు నెత్తంబు నెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు పులిలోట దక్కి కలకల నవ్వుచుం బలికిన పలుకు లుగ్గడింపవచ్చునే? వాని విని సమస్త జనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతులరయి యుండియు సత్యంబు వాటించి యూరకపోక సూచి యచ్చెరు వాటుతో నుమ్మలించుచుండిరి; తిట్టువాట్లం బోయెడువారు దైవోపహతులై మున్న చెడియుండుదురు గావున వారలం జంపనుం జెఱుపనుం జులుకన క్రూరాత్ములగు కౌరవులెల్లవారికి వధ్యులుగాఁ దగుదురు; నీకేల యవధ్యులైరి? పాపాత్మకులగు హింసకులం బాముల నెట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు.** 37

**ప్రతిపదార్థం:** కపటము నెత్తంబు= మోసపు జూదం; నెపంబుగాన్= మిషగా; మిమ్మున్= మిమ్ములను; వెడలనడుచు+అప్పుడు= అడవులకు పంపేటప్పుడు; దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు= దుర్యోధనుడు, దుస్ససేనుడు, శకుని, సూతపుత్రుడైన కర్ణుడు; పుయిలోట+తక్కి= సంకోచం వీడి; కలకల నవ్వుచున్= పకపక నవ్వుతూ; పలికిన పలుకులు= మాట్లాడిన మాటలు; ఉగ్గడింపన్+వచ్చునే?= పలుక దగినవా?; వానిన్+విని= ఆ మాటలు విని; సమస్త జనంబులు= ప్రజలందరు; ధృతరాష్ట్రున్+ నిందించుచున్= ధృతరాష్ట్రుడిని దూషిస్తూ; మీరు బలవంతులరు+అయి+ఉండియున్= మీరు బలశాలురై ఉండికూడా; సత్యంబు+పాటించి= సత్యము నవలంబించి; ఊరకపోక+చూచి= తలవంచుకొని అడవులకు వెళ్ళటం చూచి; అచ్చెరు+ పాటుతోన్= ఆశ్చర్యం పొందుటతో; ఉమ్మలించుచున్+ఉండిరి= దుఃఖపడుచుండిరి; తిట్టువాట్లన్+పోయెడువారు= నిందల పాలైనవారు; దైవ+ఉపహతులై= దైవముచే చెరుపబడినవారై; మున్ను+అ= ముందుగానే; చెడి+ఉండుదురు= చెరుపబడినవారౌదురు; కావునన్= కనుక; వారలన్= కౌరవులను; చంపనున్= సంహరించటానికీ; చెఱుపనున్= చెరచటానికీ; చులుకన= తేలిక; క్రూర+ఆత్ములు+అగు= కఠినచిత్తులైన; కౌరవులు= దుర్యోధనాదులు; ఎల్లవారికిన్= అందరికిని; వధ్యులు కాన్+తగుదురు= చంప దగినవారౌతారు; నీకున్= నీకు మాత్రం; ఏల+అవధ్యులు+ఐరి?= ఎందుకు చంపకూడనివారైనారు? పాప+ఆత్మకులు+అగు= పాపంతో కూడిన చిత్తంగల; హింసకులన్= ఘాతుకులను; పాములన్+ఎట్లు= సర్పాలను ఎట్లా వధిస్తారో; అట్లు= ఆ ప్రకారం; నిర్విచారంబుగాన్= ఆలోచించకుండా; వధియించుట కర్తవ్యంబు= చంపటమే చేయదగినపని.

**తాత్పర్యం:** ధర్మజా! కపట ద్యూతంలో మిమ్ము ఓడించి అడవులకు పంపేటప్పుడు దుర్యోధనుడు, దుశ్శాసనుడు, శకుని, కర్ణుడు సంకోచం లేకుండా పకపక నవ్వుతూ ఆడిన మాటలు నోటితో వెల్లడించరానివి. ఆ మాటలన్నీ విని ప్రజలంతా ధృతరాష్ట్రుడిని దూషిస్తూ, మీరు బలవంతులై ఉండికూడా సత్యమునకు తల ఒగ్గి తలవంచుకొని ఊరక అడవులకు వెళ్ళటం చూచి ఆశ్చర్యపడుతూ దుఃఖించారు. నిందాపాత్రులైనవారు దైవంచేత ముందుగానే చెరుపబడి ఉంటారు. కనుక అటువంటివారిని చంపటం, చెరచటం చాల తేలిక. దుష్టచిత్తులైన కౌరవులు అందరికీ చంపదగిన వారైనప్పుడు నీకు మాత్రం చంపదగనివారైనారా? పాపహృదయులైన హింసాస్వభావులను పాముల నెట్లా ఆలోచించక వధిస్తారో అట్లా వధించడం తగిన పని.

**విశేషం:** అలం: ఉపమ: అర్థాంతరన్యాసం. పాపాత్ములను, హింసాత్మకులను పాములను నిర్దాక్షిణ్యంగా చంపినట్లు చంపాలి-అనేది ప్రతిపాద్యాంశం. పాముల కున్న విషలక్షణాలు కౌరవులయందు నిరూపించటం ఇందులోని అలంకార శిల్పం.

1. కపట ద్యూత సభలోనూ, అడవులకు పంపేటప్పుడూ పాండవులను దుర్యోధన, దుశ్శాసన, శకుని, కర్ణ లాడిన పరిహాసోక్తులు పాములు వేసే కాట్లవంటివి. పాముల కాట్లతో చంపబూనినా భీముడు వాటిని నిగ్రహించి బ్రతికిన ఘట్టాలు జ్ఞాపకం వస్తాయి. దుర్యోధనాదుల పరిహాస వాక్యాలు పాండవులకు విషబాధను కలిగించిన మాట వాస్తవం. బాధ కోర్చి సత్యవ్రతాన్ని సహనంతో పాటించిన పాండవుల ఉత్తమప్రవృత్తి ప్రజాదరణం పొందింది. కౌరవులను జనులు నిందించారు. వారి క్రౌర్యానికి కన్నీరు పెట్టారు. శ్రీకృష్ణుడు వాటిని మృత్యుదంష్ట్రల కాట్లగా అభివర్ణించాడు. పాము కాటుకు విరుగుడున్నది కాని, చావు కాటుకు తిరుగు లేదు. ఈ నీతితో కౌరవులు దైవోపహతులు. వారు తమ పాపకార్యాలతో ధార్మికంగా, నైతికంగా హతులైనారు. చనిపోయినవారిని భౌతికంగా చంపటమే మిగిలి ఉన్నదన్నాడు. ఈ మాటలంటున్న శ్రీకృష్ణుడిలో భగవద్గీతాచార్యుడు ప్రత్యక్షమవుతున్నాడు. అందుకే పాండవులను కౌరవుల వధకు ప్రేరేపించాడు.

2. పగ కలిగి ఉన్న మనసు పాముల పుట్టలున్న ఇల్లు వంటిదని ధర్మరాజన్నాడు. (3.20) దానికి శ్రీకృష్ణు డిస్తున్న ప్రచ్ఛన్న ప్రత్యాఖ్యానం.

ధర్మరాజు మనసులో పుట్టపెట్టుకొని ఉన్న పాము లెవరో కాదు- కౌరవులే. ఆ పాములను చంపకపోతే శాంతి ఎట్లా కలుగుతుంది? అని ఎదురు ప్రశ్న వేస్తున్నాడు. కాబట్టి 'వధించుట కర్తవ్యంబు' అని తర్కబద్ధంగా తేల్చి ఫలితాంశాన్ని నిర్దేశించాడు. శ్రీకృష్ణుడి తర్కానికి తట్టుకొనటం సామాన్యులకు సాధ్యం కాదు. (సంపా.)

**క. మీ తండ్రికి భీష్మునకుం । జేతోముద మొదవ భక్తి సేయన తగు నీ;**
**కా తలకు నేనుఁ జని వి । ఖ్యాతంబుగ నీదు వినయ మభివర్ణింతున్. 38**

**ప్రతిపదార్థం:** మీ తండ్రికిన్= మీ జనకుడైన ధృతరాష్ట్రుడికీ; భీష్మునకున్= తాతయగు భీష్ముడికీ; చేతస్(ః)+ముదము= హృదయానికి సంతోషం; ఒదవన్= కలుగునట్లు; నీకున్= నీకు; భక్తి చేయన్+అ తగున్= భక్తి చూపటమే యుక్తం; నేనున్= నేను; ఆ తలకున్= అక్కడికి; చని= వెళ్ళి; విఖ్యాతంబుగన్= వెల్లడిఅయ్యేటట్లు; నీదు వినయము= నీ అడకువను; అభివర్ణింతున్= పొగడుతాను.

**తాత్పర్యం:** ధర్మజా! మీ తండ్రి ధృతరాష్ట్రుడికీ, తాత భీష్ముడికీ, హృదయానందం కలిగేటట్లు భక్తి చూపటమే నీకు ఉచితం. నేనా కురుసభకు వెళ్ళి నీ వినయగుణాన్ని అందరికీ తేటపడేటట్లు లెస్సగా వర్ణిస్తాను.

**విశేషం:** కురుసభలో ధృతరాష్ట్రుడు మెచ్చుకొంటే సాహసించి రాజ్యంలో సగభాగం ఇవ్వవచ్చును. భీష్ముడు సంతోషిస్తే ధృతరాష్ట్రాదులకు హితవు చెప్పి పాండవులకు న్యాయం జరిగేటట్లు చూడవచ్చును. లేదా యుద్ధమే జరిగితే స్వేచ్ఛామరణశక్తి ఉన్న ఆ పితామహుడు స్వీయ వధోపాయాన్ని పాండవులకు చెప్పవచ్చును. వారి మనసులలో అట్టి సౌముఖ్యాన్ని కలిగించాలంటే కురుసభలో శ్రీకృష్ణుడు ధర్మజుడి వినయాది గుణాలను ప్రస్తుతించటం రాజనీతి. ఇది భేదోపాయంలో ఒక భాగం. (సంపా.)

**క. చెలులుం జుట్టలు దేశం । బులరాజులు వినఁగ నీదు పుణ్యచరిత్రం**
**బులు నీవు ధర్మమార్గము । దలఁచుటయుం దెలియఁబలికెదం గురుసభలోన్. 39**

**ప్రతిపదార్థం:** చెలులున్= మిత్రులూ; చుట్టలున్= బంధువులూ; దేశంబుల రాజులున్= నానా దేశాధిపతులూ; వినఁగన్= వింటూ ఉండగా; నీదు పుణ్య చరిత్రంబులు= నీ పవిత్రమైన నడవడులు; నీవు ధర్మమార్గము తలఁచుటయున్= నీవు న్యాయ మార్గాన్ని ఎంచుకొన్న తీరూ; కురు సభలోన్= కౌరవుల కొలువులో; తెలియన్+పలికెదన్= స్పష్టంగా వక్కాణిస్తాను.

**తాత్పర్యం:** మిత్రులూ, బంధువులూ, నానా దేశాల రాజులూ ఆలకించగా నీ పావనమైన ప్రవర్తననూ, నీవు ధర్మమార్గం అవలంబించే తీరూ కౌరవుల సభలో అందరికీ తెలిసేటట్లుగా మాట్లాడుతాను.

**విశేషం:** కురుసభలో సంధికార్యం ఫలించినా ఫలించకపోయినా సభ్యులైన బంధుమిత్రులైన రాజులందరూ పాండవుల ధర్మనీతి వర్తనాన్ని మెచ్చుకొని, కౌరవులను నిందించి నిరసించేటట్లుచేయటమే ధర్మజ వ్యూహం. దానిని సఫలంగా నిర్వహిస్తానని శ్రీకృష్ణుడు స్పష్టం చేశాడు. (సంపా.)

**వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగుమాలిన మాట లాడుటయుఁ దండ్రి యతని వారింప నేరమికిఁదో డుపేక్షకుం డగుటయుఁ జూచి, మీ తొల్లింటిపాట్లునుం దలంచి యెల్లవారును వారిన గర్హింతు; రింతియ కాక మనకు నొండేమి వలయు? నా యోపినంతయుఁ బెక్కు భంగుల సంధియ కావింపఁజూచెద; నవ్విధంబు**

**సిద్ధించిన మేలుగాదె! యట్లుగాకతక్కిన నచ్చోటి యుత్సాహంబు చందంబును, నందుఁ జేయంగలవారి వర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయంబగు విధంబునం జనుదెంచెద. 40**

**ప్రతిపదార్థం:** దానికిన్= నా పలుకులకు; దుర్యోధనుండు+ఇయ్యకొనక= సుయోధను డంగీకరించక; తెఱంగు మాలిన మాటలు+ఆడుటయున్= న్యాయం తప్పిన పలుకులు పలకటమున్నూ; తండ్రి= జనకుడైన ధృతరాష్ట్రుడు; అతనిన్= దుర్యోధనుడిని; వారింపన్ నేరమికిన్+తోడు= అడ్డగించలేనందుకు తోడుగా; ఉపేక్షకుండు+అగుటయున్= ఉదాసీనుడు కావటమున్నూ; చూచి= కనుగొని; మీ తొల్లింటి పాట్లునున్+తలంచి= మీరు మునుపు పడిన కష్టాలను స్మరించి; ఎల్లవారును= సభలోని వారందరూ; వారిన్+అ= ఆ కౌరవులనే; గర్హింతురు= నిందిస్తారు; ఇంతియకాక= ఇంతకంటెను; మనకున్+ఒండు+ ఏమివలయున్?= మనకు మరేమి కావలెను?; నా+ఓపినంతయున్= నా శక్తి కొలది; పెక్కు భంగులన్= అనేక రీతుల; సంధి+అ కావింపన్+చూచెదన్= సంధి చేయటానికే యత్నిస్తాను; ఆ విధంబు సిద్ధించినన్ మేలు+కాదె!= అట్లా సంధికార్యం నెరవేరితే మంచిదే కదా! అట్లు కాక తక్కినన్= అట్లా సంధి కార్యం నెరవేరకపోతే; అచ్చోటి+ఉత్సాహంబు చందంబును= ఆ కౌరవుల యొక్క ప్రయత్నాల తీరునూ; అందున్+చేయన్+కలవారి వర్తనంబులున్= అక్కడ యుద్ధం చేయగలవారియొక్క ప్రవర్తనలనూ; కొలందులున్= వారి వారి శక్తియుక్తుల పరిమాణములనూ; ఎఱింగి= గ్రహించి; నీకున్= నీకు; విజయంబు+అగు విధంబునన్= గెలుపు చేకూరే పద్ధతిలో; చనుదెంచెదన్= మరలివస్తాను.

**తాత్పర్యం:** నేను సభలో పలికిన పలుకులకు దుర్యోధనుడు సమ్మతించక న్యాయం విడిచి ప్రసంగించటం, ధృతరాష్ట్రుడు అతడి మాటలు తిరస్కరించకపోవటమే కాక తాను ఉదాసీన వైఖరి వహించటం కనులారా చూస్తూ, మీరింతకుముందు అనుభవించిన కష్టాలన్నిటినీ స్మరించి సభలోనివారంతా ఆ కౌరవులనే చీకొడతారు. ఇంతకు మించి మనకు కావలసింది ఏముంది? నా శక్తి కొలది బహు విధాల సంధికే ప్రయత్నిస్తాను. సంధి కుదిరితే మంచిదే. ఒకవేళ కుదరకపోతే ఆ సభలోని వారి ప్రయత్నాలు ఎట్లా ఉన్నవో, యుద్ధం చేయగల అచటివారి ప్రవర్తనలూ, వారి సామర్థ్యాలూ ఏపాటివో గ్రహించి, నీకు విజయం సమకూడేవిధంగా మరలివస్తాను.

**విశేషం:** ఒక రాయబారివలన సాధించబడే ఉపాయాలన్నీ సాధించగలనని శ్రీకృష్ణుడు మాట ఇచ్చాడు. ధర్మరాజు చెప్పని మరొక విశేషం కూడా పలికాడు. శత్రు బలాబల రహస్యాలు తెలిసి కొనిరావటం రాయబారంలో ఔపచారికాంశం. ధర్మరాజుకు విజయం కలిగేటట్లు తిరిగి రావటం రాజనీతి పరాకాష్ఠ. దానిని కూడా శ్రీకృష్ణుడు సాధిస్తే 'చూచి రమ్మంటే కాల్చిరాగల' ప్రతిభను ప్రదర్శించినట్లవుతుంది. (సంపా.)

**తే. ఆ సుయోధను ముక్కున నావి గలుగఁ । బుడమి నీ కీఁడు గావునఁ బోర కలుగు,**
**నేను గయ్యపు శకునంబు లెన్నియేనిఁ । గంటి; నీ వనుత్సాహివి గాఁగ వలదు. 41**

**ప్రతిపదార్థం:** ఆ సుయోధను ముక్కునన్= ఆ దుర్యోధనుడి ముక్కులో; అవి కలుగన్= ఊపిరి ఉండగా; పుడమిన్= భూమిని; నీకున్+ఈఁడు= నీకు పంచి ఇవ్వడు; కావునన్= కనుక; పోరు+అ కలుగున్= యుద్ధమే సంభవిస్తుంది. నేను కయ్యపు శకునంబులు= నేను యుద్ధ నిమిత్తాలు; ఎన్నియేనిన్+కంటిన్= ఎన్నో చూచాను; నీవు+అనుత్సాహివి+కాఁగన్+వలదు= నీవు యుద్ధ ప్రయత్నాలు విరమించవద్దు. (నీవు యుద్ధోత్సాహం లేనివాడవు కావద్దు.)

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడి ముక్కులో శ్వాస ఉన్నంతకాలం అతడు నీకు రాజ్యభాగం ఇవ్వడు. యుద్ధం తప్పదు. పోరు జరిగే శకునాలు నేనెన్నో చూచాను. కాబట్టి (ఈ తరుణంలో శాంతి, సంధి - అంటూ) యుద్ధోత్సాహాన్ని మాని(శాంతమూర్తివై) ఉండవద్దు.

**విశేషం:** 'ముక్కున నావి గలుగ' - చక్కని తెలుగు నుడికారం, 'నీ వనుత్సాహివి గాఁగవలదు' అన్నది శ్రీకృష్ణుడి ఉపన్యాస పరమ తాత్పర్యం. (సంపా.)

**వ. చతురంగ బలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పికొనుచు నాలస్యంబులేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండవలయునని పలికిన విని వృకోదరుండు దామోదరున కిట్లనియె: 42**

**ప్రతిపదార్థం:** చతురంగబలంబులన్= రథ గజ తురగ పదాతులను; ఆయితంబు+కావించుచున్= సంసిద్ధం చేస్తూ; దొరలన్= రాజులను; పురి కొల్పికొనుచున్= యుద్ధానికి ప్రేరేపిస్తూ; ఆలస్యంబు లేక= జాగుచేయక; సమరంబునకున్= యుద్ధానికి; సన్నాహంబు+చేయుచున్+ఉండన్+వలయున్= ప్రయత్నాలు చేస్తూ ఉండాలి; అని పల్కినన్= అని శ్రీకృష్ణు డనగా; విని; వృకోదరుండు= భీముడు; దామోదరునకున్= శ్రీకృష్ణునకు; ఇట్లు+అనియెన్= ఇలా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మజా! రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాలిబంటులు అనే నాలుగు రకాల సేనా విశేషాన్ని సంసిద్ధం చేసికొని, దొరలను యుద్ధానికి ప్రేరేపిస్తూ ఆలస్యం జరగకుండా కదనానికి సన్నాహాలు సాగించు అని శ్రీకృష్ణు డన్నాడు. ఆ మాటలు విని భీమసేనుడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** 1. చతురంగ బలాలు= రథాలు, ఏనుగులు, గుర్రాలు, పదాతులు అనే సైన్యంలోని నాలుగు అంగాలు.

2. **"సాంగ్రామికం తే యదుపార్జనీయం । సర్వం సమగ్రం కురు తన్నరేంద్ర!' (సం.5-71-36)** అనే మూలశ్లోకానికి ఈ వచనం వివరణం. ఇది భావికథార్థ సూచన. శ్రీకృష్ణుడు కర్ణుడితో - యుద్ధం రాబోయే అమావాస్య నాడు ప్రారంభమవుతుందని ప్రకటించి రాబోతున్నాడు. అందువలన ఏ క్షణంలోనైనా యుద్ధయాత్ర సాగించే యత్నంలో ఉండాలని శ్రీకృష్ణుడు ధర్మరాజును హెచ్చరించాడు. (సంపా.)

**క. 'సమరంబు గలుగు ననుచును । మము వెఱపింపంగ వలదు మాధవ! నీ వా**
**కుమతి యగు ధార్తరాష్ట్రుఁడు । శమించు కార్యంబు నడపు సౌజన్యమునన్.' 43**

**ప్రతిపదార్థం:** మాధవ!= శ్రీకృష్ణా!; నీవు= నీవు; సమరంబు కలుగున్+అనుచును= యుద్ధం సంభవిస్తుందని పలుకుతూ; మమున్= మమ్మల్ని; వెఱపింపంగన్+వలదు= భయపెట్టవద్దు; ఆ కుమతి+అగు= ఆ చెడుబుద్ధి కల్గిన; ధార్తరాష్ట్రుఁడు= ధృతరాష్ట్రుడి కొడుకైన దుర్యోధనుడు; శమించు కార్యంబు= అణగి మణగి ఉండే పనిని; సౌజన్యమునన్= మంచితనంతో; నడపు(ము)= ప్రవర్తింపజేయుము.

**తాత్పర్యం:** 'లక్ష్మీవల్లభా! యుద్ధం జరుగుతుందని చెప్పుతూ మమ్ము భయపెట్టవద్దు. దుష్టచిత్తుడైన ఆ దుర్యోధనుడు అణగి మణగిఉండే పనిని సద్భావంతో సాధించుము.'

**విశేషం:** 1. ఈ పద్యం నాటకీయతకు చక్కని ఉదాహరణం.

2. 'సమరానికి సన్నాహం చేయు'మన్న శ్రీకృష్ణుడి వాక్యానికి భీముడు స్పందించి, 'సమరంబు గలుగు ననుచు మము వెఱపింపవలదు' అని పలకటం నాటకీయం. ఒక రకమైన ప్రయోగాతిశయం.

3. తన అభిప్రాయం ఎవ్వరూ అడుగకుండానే భీముడు సంభాషణ మొదలుపెట్టి తన ఆవేశ స్వభావాన్నీ, అన్నగారి మాటను శ్రీకృష్ణుడు కాదంటున్నాడని భ్రమించి తొందరపడటంలో ధీరోద్ధతనూ ప్రదర్శించాడు. అయితే అతడు నిష్కల్మషుడు కావటం చేత ఎవరూ అపార్థం చేసికొనరు.

4. భీముడి మాటల వలన అతడు శ్రీకృష్ణుడిని దివ్యుడిగా కంటే, అదివ్యుడైన దూతగానే భావిస్తున్నట్లుగా స్పష్టం. (సంపా.)

**వ. అని వెండియు. 44**

**తాత్పర్యం:** అని మళ్ళీ భీమసేనుడు (ఇట్లా అన్నాడు).

**శా. 'పాపాత్ముండు మదాంధుఁ డా తులువ నీపంపెట్లునుం జేయఁగా**
**నోపం; డడ్డము సెప్ప రెవ్వరును; మానోద్రేకమున్ గర్వముం**
**గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం గుందించుటం బోయిన**
**ట్లే పోనిత్తురు; గాన ని న్నతఁడు జాలింబెట్టెడుం జూడుమీ! 45**

**ప్రతిపదార్థం:** ఆ తులువ= ఆ కుత్సితుడైన దుర్యోధనుడు; పాప+ఆత్ముండు= దురితచిత్తుడు; మద+అంధుఁడు= మదముచేత కన్నుగానవివాడు; నీ పంపు= నీ ఆజ్ఞ; ఎట్లునున్= ఏ విధంగానూ; చేయఁగాన్+ఓపండు= చేయలేడు; ఎవ్వరును= ఏ ఒక్కరైనను; అడ్డము చెప్పరు= అతడిని ఎదిరించి మాట్లాడరు; మాన+ఉద్రేకమున్= అహంకారము యొక్క ఆటోపమునూ; గర్వమున్= పొగరుబోతుతనమునూ; కోపంబున్= క్రోధమునూ; తనున్+త్రిప్పన్= తనను ఆడిస్తుండగా; ఆప్తజనులన్= ఆత్మీయులైనవారిని; కుందించుటన్= దుఃఖపెట్టటం చేత; పోయినట్లే పోనిత్తురు= అతడు వెళ్ళే దారినే చూస్తూ ఊరకుంటారు; కాన= కాబట్టి; నిన్నున్= నిన్ను; అతఁడు= ఆ దుర్యోధనుడు; జాలిన్+పెట్టెడున్= చింతల పాలు చేయగలడు; చూడుమీ= గ్రహింపుమా! (చూస్తూ ఉండుము)

**తాత్పర్యం:** 'మాధవా! ఆ దుర్యోధనుడు కలుషాత్ముడు. మదంచేత కన్ను మిన్ను కాననివాడు. కుత్సితుడు. నీ ఆదేశం మన్నించడు. ఒక్కరైనను అతడి మాటకు అడ్డు చెప్పలేరు. అహంకారం, గర్వం, కోపం తనను పట్టి ఆడిస్తుండగా ఆప్తులను సైతం అతడు దుఃఖపెట్టుతున్నాడు. అత డేమైపోయినా తమకేమి లెమ్మని అందరూ మిన్నకుండటం చేత ని న్నతడు సంకటపరుస్తాడు సుమా!

**విశేషం:** హస్తినాపురాన్ని తలచుకొంటే భీముడికి పాపాత్ముడైన దుర్యోధనుడే జ్ఞాపకం వస్తాడు. అతడు చేసిన అపకారాలు గుర్తుకు వస్తాయి. కోపోద్రేకం కలుగుతుంది. ఆవేశంలో అతడిని నిందిస్తాడు. ఇది భీమ స్వభావం. ఆ సహజ స్వభావానికి ఈ పద్యం అద్దం పట్టుతున్నది. దుర్యోధనుడు పాపాత్ముడనీ, మదాంధుడనీ, తులువ అనీ, నోరారా తిట్టితేతప్ప అతడికి తృప్తి ఉండదు. అతడిలో దురహంకారం, గర్వం, కోపం అనే దుష్ట గుణాలు ఉంటాయనీ, వాటి వలన పరులను, ఆత్మీయులను బాధపెట్టుతాడనీ, పెద్దల మాటలు వినడనీ, భీముడిని తిప్పలు పెట్టుతాడనీ పేర్కొంటాడు. శత్రువైన దుర్యోధనుడిని గురించి భీముడికి ఎంత స్పష్టమైన అవగాహన ఉన్నదో ఈ పద్యం స్పష్టం చేస్తున్నది. (సంపా.)

**ఉ. చొచ్చిన చోన చొచ్చి తెగఁ జూచెద నంచుఁ గడంగుచుండు; న**
**న్నెచ్చఁడు బాహుగర్వమున; నీచు సుయోధనుఁ; డట్టివానితోఁ**
**బొచ్చెములేక కూడి మనఁ బోవక పోవఁగరాదు నాకు వి**
**వ్వచ్చుఁడు రాచవారుఁ గురువంశము చేటున కోపకుండుటన్. 46**

**ప్రతిపదార్థం:** నీచు సుయోధనుఁడు= తుచ్ఛుడైన దుర్యోధనుడు; చొచ్చిన చోన్+అ= నేను ప్రవేశించినచోటనే; చొచ్చి= తానూ ప్రవేశించి; తెగన్+చూచెదన్+అంచున్= నన్ను చంపుతా నంటూ; కడంగుచున్+ఉండున్= పూనిక వహిస్తూ ఉంటాడు;

బాహుగర్వమునన్= భుజవిక్రమంలో; నన్+మెచ్చఁడు= నన్ను లెక్కించడు; వివ్వచ్చుఁడు= బీభత్సుడు (అర్జునుడు); రాచవారున్= ప్రభువైన ధర్మరాజు; కురువంశము చేటునకున్= కురువంశముయొక్క వినాశానికి; ఓపక+ఉండుటన్= సహింపకుండటంచేత; అట్టివానితోన్= అటువంటి (అల్పుడైన) దుర్యోధనుడితో; నాకున్= నాకు; పొచ్చెములేక= కపటంలేక; కూడి= కలసి; మనన్+పోవక= జీవించనెంచక; పోవఁగన్+రాదు= తప్పుకొనటానికి వీలులేకుండా ఉన్నది.

**తాత్పర్యం:** నేను ప్రవేశించిన చోట తానూ ప్రవేశిస్తూ నన్ను చంపటానికి యత్నిస్తుంటాడు. భుజ విక్రమంలో నన్ను లెక్కించడు. ఆతడు వట్టి తుచ్ఛుడు. ఫల్గునుడూ, ప్రభువైన ధర్మజుడూ కురువంశ వినాశానికి సమ్మతించ కుండటం వలన ఆ దుర్యోధనుడితో నిష్కపటంగా కలసి మెలసి జీవించడం నాకు తప్పేటట్లు లేదు.

**విశేషం:** భీముడి ఆత్మాభిమానమే కాక, అమాయకత్వం కూడా బైటపడుతున్నది. (సంపా.)

**ఉ. పాండవ కౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మిమై**
**నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె; నాతఁ డొ**
**క్కండ కులక్షయంబునకుఁ గారణమం; ద్రది దప్ప; దైన నీ**
**వొం డన నేల యా బిరుదు నోపిన యంతయుఁ దీర్పు నేర్పునన్. 47**

**ప్రతిపదార్థం:** పాండవ కౌరవుల్= పాండవులూ, కౌరవులూ; పాలును నీరును+పోలెన్= పాలూ నీరూ వలె; కలసి= (విడదీయటానికి వీలు లేనట్లుగా) కలిసిపోయి; నెమ్మిమైన్= ప్రేమతో; ఉండఁగన్= జీవిస్తూ ఉండగా; దుష్టచేష్టలన్= దుండగపు పనులతో; సుయోధనుఁడు; ఇంతలు+చేసెన్= ఇట్టి దుర్ణయాలు కావించాడు; ఆతఁడు+ఒక్కఁడు+అ= అతడొక్కడే; కులక్షయంబునకున్= వంశ వినాశనానికి; కారణము+అంద్రు= హేతువని పెద్దలు చెప్పుతారు; అది+తప్పదు= ఆ మాట వృథా కాదు; అయినన్= అయినప్పటికినీ; నీవు; ఒండు+అనన్+ఏల?= నీవు వేరొక మాట పలుకుటెందుకు?; ఆ బిరుదున్= ఆ శూరుని; ఓపిన+అంతయున్= శక్తిఉన్నంత వరకూ; నేర్పునన్= చాతుర్యంతో; తీర్పు(ము)= చక్కబఱచుము.

**తాత్పర్యం:** పాండవులూ, కౌరవులూ పాలూ నీరూవలె కలసి మెలసి ప్రేమతో జీవిస్తుండగా దుర్యోధనుడు తన దుండగపు పనులతో ఒద్దిక చెరచివేశాడు. అతడే ఈ కురువంశ వినాశానికి కారణమని పెద్దల మాట ఆ మాట ఎన్నటికినీ తప్పదు. ఐనప్పటికీ నీవు నేర్పుతో శక్తి కలిగినమేరకు ఆ జగజెట్టిని దారిలో పెట్టజూడుము.

**విశేషం:** 1. అలం: ఉపమ, క్రమం. పాండవులూ కౌరవులూ పాలూ, నీరూ వంటివారు. ఉపమాన ఉపమేయాలను ఆ వరుసలోనే గ్రహించాలి. కాబట్టి క్రమాలంకారం. పాండవులు పాలవంటివారు. కౌరవులు నీళ్ళవంటివారు. అంటే నీళ్ళకంటె పాలు చిక్కన. కౌరవులకంటె పాండవులు బలవంతులు అని ధ్వని. ఇందులో మరొక విశేషం కూడా ఆలోచిస్తే స్ఫురిస్తుంది. పాలతో కలిసి ఉంటేనే నీటికి గౌరవం. నీళ్ళతో పాలు కలిపిస్తే పాలకు విలువ లేదు. పాలూ నీరూ కలిసి ఉన్నప్పుడు వాటిని వేరు చేసేది హంస. కాని, దుర్యోధనుడు హంస కాదు. కాకి. అతడు చేసింది నీరక్షీర వివేకం కాదు. కలిసి వున్న పాలనూ నీళ్ళనూ కలుషితం చేశాడు. కలిసి ఉన్న గుణం కలిగించేది కులవృద్ధి. దానిని పాడు చేయటం కులక్షయం. పాడైపోయిన పాలు ఏ ప్రయోజనాన్నీ పొందలేవు. ఈ తాత్పర్యం మరొక వ్యంగ్యార్థం.

2. ఈ మాటలంటున్న భీముడు ధర్మరాజుతమ్ము డనిపించుకొన్నాడు. అయితే ధర్మజుడు తన భావాన్ని గూఢంగా నిపుణంగా చెప్పగలడు. భీముడు బయటపడి ఘాటుగా చెప్పగలడు. ధర్మరాజుకూ సంధిమీద నమ్మకం లేదు. అయినా

అంతకంటె మించిన రాజనీతి ప్రయోజనాల కొరకు, భేదోపాయాన్ని ప్రయోగించటం కొరకు శ్రీకృష్ణుడిని రాయబారిగా పంపుతున్నాడు. ఆ సంగతి అందరికీ తెలిసేటట్లు చెప్పాడు. కాని, భీముడికి ఆ వ్యూహరహస్యాలు తెలియవు. దుర్యోధనుడిని కులక్షయ కారకుడిగా నిరూపించటానికే శ్రీకృష్ణుడి రాయబారం పనికి వస్తుందని భావించాడు. భావాభివ్యక్తితో ఈ రెండు పాత్రల తారతమ్యం పరమ రమణీయం.

3. భీముడికి దుర్యోధనుడు ఆగర్భశత్రువు. ఆ దుర్మార్గుడు భీముడిని చంపటానికి చేసిన కుతంత్రాలు ఇన్నీ అన్నీ కావు. భీముడు లేకపోతే పాండవులు లేనట్లే అని సుయోధనుడి అంచనా. అతడంటే భీముడికి అమితకోపం. దుర్యోధనుడు పుట్టినప్పుడే అతడు కులక్షయకారకుడని ఆకాశవాణి పలికింది. ఆ తరువాత వ్యాసమహర్షి చెప్పాడు. అయినా, ధృతరాష్ట్రుడు వాటిని పట్టించుకొనలేదు. దుర్యోధనుడి దుష్టచేష్టలన్నీ క్రమంగా కులక్షయానికే దారితీస్తున్నాయి. సంధి యత్నం సాగుతుందనే నమ్మకం భీముడికీ లేదు. అయినా, శ్రీకృష్ణుడు రాయబారం చేయవలసిందే, ధర్మజుడి ఆనతి పాటించవలసిందే- అని భీముడి అభిప్రాయం.

4. ఈ పద్యంలో 'దుష్టచేష్టలు', 'ఇంతలు సేసె' 'అది తప్పదు', 'నీవు ఒండన నేల?', 'ఆ బిరుదు' అనే పదాలు తెలుగు పలుకుబడిని పుక్కిటబట్టాయి. అంత, ఇంత, ఎంత అనే అవ్యయాలకు తెలుగులో ఎంతటి శక్తి ఉన్నదో అంతటిశక్తి 'ఇంతలు సేసె' అనే వాక్యంలో ఉన్నది. జరిగిన కథంతా అందులో ధ్వనిస్తుంది. శబ్దప్రయోగౌచిత్యానికి ఇవి ప్రమాణాలు.

5. తిక్కన నాటకీయతలో పాత్రోచిత సంభాషణ ఒక ప్రత్యేకత. భీముడు లౌకిక వాది. అతడికి భుక్తియందున్న ఆసక్తి భక్తియందు లేదు. అందుకే 'పాలు నీరు' ఉపమానం తీసికొన్నాడు. పరమాత్ముడైన హరిని రాయబారిగానే మన్నిస్తాడు. అతడిలోని దివ్యత్వం ఇతడికి కనపడదు. భీమపాత్రోచితమైన సంభాషణ ఇది. ఇట్లాగే ఈ సన్నివేశంలో ధర్మజ, అర్జున, నకుల, సహదేవులూ, ద్రౌపదీ, శ్రీకృష్ణుడూ, చేసే సంభాషణలలో వారి వారి సంస్కారాలు గుబాళిస్తుంటాయి. ఇటువంటి రచన రసధ్వనిలోని ఒక మెళకువ; నాటకీయ రచనాశిల్పంలోని ఒక రహస్యం. (సంపా.)

6. ఈ సందర్భంలో భీముడు కులక్షయ కారకులైన అసురవంశ రాజులను పదునెనిమిది మందిని పేర్కొన్నట్లు మూలంలో ఉన్నది. వారు- 1. హైహయవంశజుడైన ముదావర్తుడు 2. నీప కులానికి చెందిన జనమేజయుడు 3. తాలజంఘ వంశజుడైన బహుళుడు 4. క్రిమి కులోద్భవుడు వసువు 5. సువీరవంశజుడు అజబిందువు 6. సురాష్ట్ర కులజుడు రుషర్ధికుడు 7. బలీహ వంశజుడు అర్కజుడు 8. చీనీయ వంశం వాడైన ధౌతమూలకుడు 9. విదేహ వంశీయుడైన హయగ్రీవుడు 10. మహౌజ క్షత్రియ వంశజుడు పరాయువు 11. సుందరవంశీయుడు బాహువు 12. దీప్తాక్షకులజుడైన పురూరవుడు 13. చేది మత్స్య వంశీయులలోని సహజుడు 14. ప్రవీర వంశంలోని వృషధ్వజుడు 15. చంద్రవత్స కులజుడు ధారణుడు 16. ముకుట వంశీయుడు విగాహనుడు 17. నందివేగ కులోద్భవుడు శముడు 18. చంద్ర వంశజుడైన దుర్యోధనుడు. (వివరాలకు చూడు: సం. 5-72-11 నుండి 18).

**చ. తన పారిపోవునంతకు నుదగ్రతయుం గపటంబు మాన నే**
**ర్చునె ధృతరాష్ట్ర సూనుఁడు? యశోభరితంబగు భారతాన్వయం**
**బున కొక నిందవచ్చు ననుబుద్ధి దురాత్మున కేలకల్గు? నా**
**యనమెయిఁబోయి హీనగతినైన ఘటించిన నెంత యొప్పునో! 48**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రసూనుఁడు= ధృతరాష్ట్రుడి కొడుకైన దుర్యోధనుడు; తన పారిపోవునంతకున్= తాను చచ్చేవరకూ; ఉదగ్రతయున్= క్రౌర్యమునూ; కపటమున్= మోసమునూ; మానన్+నేర్చునె?= విడువగలడా?; యశోభరితంబు+అగు= కీర్తితో నిండిన; భారత+అన్వయంబునకున్= భరతుడు జన్మించిన వంశానికి; ఒక నింద వచ్చున్= అపకీర్తి కల్గుతుంది; అను బుద్ధి= అనే తలంపు; దుర్+ఆత్మునకున్= దుష్టహృదయుడైన ఆ దుర్యోధనుడికి; ఏల+కల్గున్?= ఎందుకు జనిస్తుంది?;

ఆయన మెయిన్+పోయి= అతడి తలంపు ననుసరించి; హీనగతిన్+ఐనన్= నీచస్థితితో నైనను; ఘటించినన్= సంధి కుదుర్చుకొంటే; ఎంత+ఒప్పునో!= ఎంత బాగుంటుందో కదా!

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు తాను చచ్చేవరకూ తన క్రౌర్యాన్నీ, మోసమునూ విడిచిపెట్టడు. కీర్తిమంతమైన భరతవంశం అపకీర్తి పాలవుతుందే అనేతలంపు ఆ దుష్టచిత్తుడికి కలుగనే కలుగదు. ఆ సుయోధనుడి మనోవైఖరి ననుసరించి నీచత్వానికి దిగజారిఅయినా మనం సంధి కావించుకొంటే అదెంతో మేలుగా ఉంటుంది.

**విశేషం:** 1. 'ఆయన మెయిన్+పోయి'= మా అన్న ధర్మజుడి తలంపు ననుసరించి - అనిన్నీ, నాయన మెయిన్+పోయి= తండ్రి అయిన ధృతరాష్ట్రుడి తలంపు ననుసరించి - అనిన్నీ అన్వయం చెప్పటానికి వీలుంది.

2. విరాటోద్యోగ పర్వాలలో భీముడు తన సహజమైన ఔద్ధత్యాన్ని తగ్గించుకొని ఉదాత్తుడి వలె వ్యవహరించాడు. ఈ పద్యం అట్టి ప్రవృత్తికి చక్కని ఉదాహరణం. ఇది భీముడికి అలంకారం కాదనీ, కార్యసాధకం కాదనీ శ్రీకృష్ణుడు భావించి అతడిని యుద్ధోత్సాహపూరితుడినీ, ఉద్ధతుడినీ చేయాలని యత్నిస్తాడు. (సంపా.)

**వ. అని పలికి, మాకును వారికిఁ బితామహుండగు భీష్ముండు వినుచుండ సుయోధనుతోడం గురుకులేశ్వరు నాస్థానంబున నా వచనంబులుగా నిట్లనుము. 49**

**ప్రతిపదార్థం:** అని, పలికి; మాకును, వారికిన్= (పాండవులకూ, కౌరవులకూ); పితామహుండు+అగు= తండ్రియొక్క తండ్రి (తాత); అయిన; భీష్ముండు; వినుచున్+ఉండన్= వింటూ ఉండగా; కురుకుల+ఈశ్వరు+ఆస్థానంబునన్= ధృతరాష్ట్రుడి నిండు కొలువులో; సుయోధను తోడన్= దుర్యోధనుడితో; నా వచనంబులుగాన్; నా మాటలుగా; ఇట్లు+అనుము= ఇట్లా చెప్పుము.

**తాత్పర్యం:** కృష్ణా! మాకూ, కౌరవులకూ తాతఅయిన భీష్ముడు వింటుండగా ధృతరాష్ట్ర మహారాజు కొలువులో నా మాటలుగా సుయోధనుడితో ఇట్లా చెప్పుము.

**తే. అన్నదమ్ములమై యుండి యకట! మనల । నొరులు దలయెత్తి చూడ నొండొరులతోడఁ**
**బెనఁగ నేటికి? నీ నేల పెద్దవారి । బుద్ధి విని పంచి కుడుచుట పోల దొక్కొ? 50**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; అన్నదమ్ములము+ఐ+ఉండి= సోదరులమై జన్మించికూడా; మనలన్= మనలను; ఒరులు= ఇతరులు; తల+ఎత్తి+చూడన్= ఆశ్చర్యంతో కనుగొనగా; ఒండొరుల తోడన్= ఒకరితో మరొక్కరు; పెనఁగన్+ఏటికిన్?= పోట్లాడుకొనటమెందుకు?; ఈ నేలన్= ఈ భూమిని; పెద్దవారి బుద్ధి విని= పెద్దలు చెప్పిన నీతులు ఆలకించి; పంచికుడుచుట= పంచుకొని అనుభవించటం; పోలదు+ఒక్కొ!= యుక్తము కాదా!

**తాత్పర్యం:** మనం అన్నదమ్ములమై ఉండి కూడ లోకులు తలయెత్తి చూచి పరిహసించగా మనలో మనం ఒకరితో నొకరు పోట్లాడుకొనటం మంచిది కాదు. హస్తినాపుర సామ్రాజ్యాన్ని పెద్దల మాట ప్రకారం పంచుకొని హాయిగా అనుభవించటం ఎంతో మేలుగదా!

**క. అని యెవ్విధమున నైనను । వనజోదర! సంధి సేయవలయుం దగ నే**
**ము వారును గలయుట భూ । జనులకునెల్లను హితంబు సౌఖ్యకరంబున్.' 51**

**ప్రతిపదార్థం:** అని= అనుచు; వనజ+ఉదర!= పద్మనాభా!; ఏ విధమునన్+ఐనను= ఏ రీతిగానైనా; సంధిచేయన్+వలయున్= సంధి సమకూరేటట్లు చేయవలసింది; తగన్= చక్కగా; ఏమును వారును కలయుట= మేమూ, కౌరవులూ ఒకటిగా చేరటం; భూజనులకున్+ఎల్లన్= పుడమిలోని ప్రజలందరికీ; హితంబు= మేలు; సౌఖ్యకరంబున్= సుఖాన్ని కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** పద్మనాభా! నా మాటలుగా కురుసభలో అట్లా చెప్పి, ఎట్లాగైనా సంధి పొసగేటట్లు ప్రయత్నించుము. వారూ మేము కలసిమెలసి వర్తించటం పుడమిజనులకు ఎంతో మేలు. సుఖకరంగానూ ఉంటుంది.'

**చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి యంబుజనాభుఁడు వల్కు 'నెన్నఁడున్**
**విననివి భీముపాలఁ గడు వింతలు వింటిమి మాట; లగ్గి చ**
**ల్లనగుట భూరిభూధరము లాఘవ మొందుటఁ గాదె యివ్విధం**
**బున నితఁ డిప్డు మార్దవముఁ బొందుట; యింకిటఁ జెప్ప నేటికిన్? 52**

**ప్రతిపదార్థం:** అనుటయున్= భీమసేను డట్లా వచించగా; అంబుజనాభుఁడు= కమలం నాభియందుగలవాడు- శ్రీకృష్ణుడు; పిన్న నవ్వు నగి= చిన్నగానవ్వి; పల్కున్= ఇట్లా మాట్లాడాడు. ఎన్నడున్= ఎప్పుడునూ; విననివి= మేము ఆలకించనట్టివి; భీము పాలన్= భీమసేనుడి దగ్గర; కడున్ వింతలు మాటలు వింటిమి= మిక్కిలి వింత (విస్మయం) కలిగించే పలుకులు విన్నాము; ఈ+విధంబునన్= ఇట్లా; ఇతఁడు= భీముడు; ఇప్డు= ఈ సమయంలో; మార్దవము పొందుట= మృదుత్వం వహించటం అన్నది; అగ్గి చల్లన+అగుట= నిప్పు చల్లబడటం; భూరిభూధరము= గొప్ప పర్వతం; లాఘవము+ఒందుట కాదె= తక్కువతనం పొందటమే అవుతుంది; ఇంకన్+ఇటన్+చెప్పన్+ఏటికిన్?= మరిఇక్కడ పలుకవలసిన దేమున్నది?

**తాత్పర్యం:** భీమసేనుడి మాటలకు పద్మనాభుడు చిరునవ్వు నవ్వి ఇట్లా అన్నాడు: మునుపెన్నడు విననట్టి మాటలు ఇపుడు భీముడి నోటినుండి విన్నాను. మఱి చెప్పవలసిన దేముంది? ఈ విధంగా వృకోదరుడు ఇపుడు మెత్తబడటం చూడగా అగ్ని చల్లదనం పొందినట్లుగా, గొప్ప పర్వతం తేలిక అయిన చందంగా ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

1. శ్రీకృష్ణుడు భీముడి మాటలను విని చిరునవ్వు నవ్వాడు. వికృతి వలన హాసం పుట్టుతుంది. భీముడు సహజంగా ఉద్ధతుడు, కాని, ఉదాత్తుడివలె మాట్లాడుతున్నాడు. దుర్యోధన స్మరణ మాత్రం చేతనే కోపోద్రేకంతో ఉగ్రరూపం తాల్చి, అతడిని అంతం చేయటమే తనకు సంతోషదాయకమని భావించే భీముడు అతడిపై అన్నదమ్ముల ప్రేమను, ఐక్యభావాన్ని ఒలకబోస్తూ అతడితో కలిసి జీవించటం కర్తవ్యమంటున్నాడు. శ్రీకృష్ణుడిని ఏ విధంగానైనా సరే అతడిని ఒప్పించి సంధి చేయుమని అడుగుతున్నాడు. ఇది భీముడిలోని స్వభావ విశ్రుతి. దీనిని అలంకారంతో ధ్వనింపచేయటం రచనా శిల్పం.

2. వికృతి వలన ఆశ్చర్యం కలిగిందని వాచికాభినయంతో శ్రీకృష్ణుడి పాత్ర మాటల వలన ధ్వనింపజేసింది. 'ఎన్నడున్ విననివి', 'కడువింతలు' అనే మాటలు తెలుగుదనం మూటకట్టినట్లున్నాయి. మూలంలో- "ఏత చ్ఛృత్వా మహాబాహుః కేశవః ప్రహసన్నివ- అభూతపూర్వం భీమస్య మార్గవోపహితం వచః" (సం. 5-73-1) అని ఉన్నది. శ్రీకృష్ణుడు మూలంలో పెద్దగా నవ్వాడు. తెలుగులో చిరునవ్వు నవ్వాడు. ప్రహసనం చేస్తే భీముడు నొచ్చుకొంటాడనీ, కోపిస్తాడనీ తెలుగులో తిక్కన భావించి ఈ మార్పు చేసి ఉండవచ్చును. 'అభూతపూర్వం' అనే మాటకు తెలుగులో చక్కని వ్యాఖ్యానమిచ్చాడు తిక్కన.

3. భీముడు మెత్తబడటం అగ్గి చల్లబడినట్లూ, మహాపర్వతం తేలిక పడ్డట్లూ ఉన్నదట! భీముడు శాంతి సూక్తం పలకటం శత్రువులను దహించే అతడి క్రోధభావం శాంతించినట్లున్నదని భావం. శత్రువులకు తలవంచని సమున్నత ఆత్మాభిమానం

వదలి బంధుత్వాన్ని భావించి కలసి ఉండాలని తలంచటం పర్వతం తేలికపడటం వంటిది. ఈ రెండంశాలూ భీముడి స్వభావానికి విరుద్ధమైనవి. అయినా, ధర్మరాజుమీది భక్తిగౌరవాలచేత భీముడు మెత్తపడ్డాడు. ఇది వింతగా ఉన్నదని శ్రీకృష్ణుడు చిరునవ్వు నవ్వాడు.

4. 'ఇం కిటఁ జెప్ప నేటికిన్?' అనే వాక్యం ఆశ్చర్య భావముద్రను వ్యక్తం చేస్తున్నది. భీముడిని ఆ విధంగా నేను చూడలేను. అతడు సహజస్వభావంతో ఉంటేనే బాగుంటుందని సూచన అందులో వినబడుతుంది. పఠితలు ఆ వాక్యంతో తాదాత్మ్యం పొందుతారు. (సంపా.)

### శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడి యుద్ధమునకుఁ బురికొల్పుట (సం. 5-73-1)

**తే. అని సహోదరు లాజి నాయాసపడుట । కోర్వమియుఁ గౌరవులఁ జంప నొల్లమియును,**
**గలుగు నెయ్యంబు పెంపునఁ గరుణ నార్ద్రుఁ । డైన పవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి. 53**

**ప్రతిపదార్థం:** అని= అలా వచించి; ఆజిన్= యుద్ధంలో; సహోదరులు= తోబుట్టువులు; ఆయాసపడుటకున్= శ్రమ చెందటానికి; ఓర్వమియున్= సహించలేకుండుటయున్నూ; కౌరవులన్= దుర్యోధనాదులను; చంపన్+ఒల్లమియున్= చంపుటకు ఇష్టపడ కుండటమున్నూ; కలుగు నెయ్యంబు పెంపునన్= మనసులో కలిగే ప్రేమాధిక్యం చేతనున్నూ; కరుణన్= దయారసముచేత; ఆర్ద్రుఁడు+ఐన= కరగిపోయిన; పవనజున్= వాయుపుత్రుడైన భీముడిని; పురికొల్పన్= రెచ్చగొట్టటానికై; ఆత్మన్+తలఁచి= మనసులో సంకల్పించి. (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** తన తోబుట్టువులు యుద్ధంలో కష్టపడటానికి సహించలేనందుననూ, కౌరవులను సంహరించటానికి ఇష్టపడనందుననూ, కలిగిన స్నేహాధిక్యం చేతనున్నూ పొంగిన కరుణచేత వాయునందనుడు కరగిపోయాడు. అతడిని యుద్ధానికి రెచ్చగొట్టవలెనని మనసులో సంకల్పించి.

**విశేషం:** భీముడు ఎందుకు, ఎట్లా మెత్తబడ్డాడో చెప్పి, అతడి మానసిక స్థితిని వ్యాఖ్యానించే చక్కని పద్యం ఇది. సహోదరులు యుద్ధం చేయటం వలన పొందే శ్రమను భావించి, వారి కా శ్రమ లేకుండా చేద్దామనే స్నేహాతిశయం మొదటి కారణమట! కౌరవులను చంపటం వలన వంశనాశన మవుతుందనే కరుణాభావం రెండవ కారణమట! క్రోధభావం స్నేహభావం వలన మెత్తబడుతుంది. కరుణ వలన ఆర్ద్రమవుతుంది. ఈ క్రమాన్ని భావించిన శ్రీకృష్ణుడు ఇంగితజ్ఞుడు, రసజ్ఞుడు. ఇప్పుడు స్నేహ, కరుణ భావాలకు విరుగుడు పెట్టి ఆర్ద్రత నుండి ఆగ్రహాన్ని ప్రజ్వలింపచేసి, యుద్ధానికి భీముడిని పురికొల్పటం శ్రీకృష్ణుడి సంకల్పం. రాబోయే పద్యంలో ఈ పరిణామ క్రమం గోచరిస్తుంది. (సంపా.)

**వ. మురమర్దనుం డతనితో నిట్లనియె : 54**

**ప్రతిపదార్థం:** మురమర్దనుండు= మురాసురుని సంహరించినవాడు, శ్రీకృష్ణుడు; అతనితోన్= భీమునితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు భీముడితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'యుద్ధము మీఁది వేడ్కయు మహోగ్ర విరోధుల నల్కఁజేయు ద**
**ర్పోద్ధతియున్ సుయోధనుని యున్నతి సైఁపని యేపు రాజ్యసం**
**సిద్ధి నిజాగ్రజన్మునకుఁ జేయు తలంపును గల్గు నీ వసం**
**బద్ధములైన వాక్యములు వల్కుట యొప్పునె కీచకాంతకా!' 55**

**ప్రతిపదార్థం:** కీచక+అంతకా!= కీచకుడినీ, ఉపకీచకులనూ మట్టుపెట్టిన వాయుపుత్రా!; యుద్ధము మీఁది వేడ్కయున్= సంగ్రామం సల్పుటలోని అభిలాష; మహా+ఉగ్రవిరోధులన్= మిక్కిలి భయంకరులైన శాత్రవులను; అల్కన్+చేయు= భయపెట్టే; దర్ప+ఉద్ధతియున్= గర్వాటోపమునూ; సుయోధనుని+ఉన్నతిన్= దుర్యోధనుడి గొప్పతనమును; సైఁపని+ఏపున్= సహించనట్టి విజృంభణమునూ; రాజ్యసంసిద్ధిన్= రాజ్యలాభమును; నిజ+అగ్రజన్మునకున్= నీ అన్నఅయిన ధర్మపుత్రుడికి; చేయుతలంపును= కలిగించే ఉద్దేశమునూ; కల్గు నీవు= ఉన్నట్టి నీవు; అసంబద్ధములు+ఐన= పొందికలేని వైన; వాక్యములు= పలుకులు; పల్కుట+ఒప్పునె?= చెప్పుట తగునా? (తగదని భావం.)

**తాత్పర్యం:** కీచకుడి రూపుమాపిన భీమసేనా! సంగ్రామం సల్పటంలో కుతూహలమూ, పరమ దారుణ శాత్రవులను గడగడ వణకించే శౌర్యాటోపమూ, దుర్యోధనుడి గొప్పతనము సహించని ఔద్ధత్యమూ, అన్నఅయిన ధర్మజుడికి రాజ్యప్రాప్తి కలిగించే సంకల్పమూ కలిగిన నీవు ఇపుడు పొంతన లేని మాటలు మాట్లాడటం తగదుసుమా!'

**విశేషం:** 1. ఈ పద్య ప్రాణం 'నీ వసంబద్ధములైన వాక్యములు పల్కుట యొప్పునె?' అనే వాక్యం. అసంబద్ధాలు అంటే పొందిక లేనివనీ, సందర్భానికి తగినవి కానివనీ, అనరాని మాటలనీ, వ్యర్థపదాలనీ అర్థాలున్నాయి. ఆ నాలుగర్థాలూ సార్థకమయ్యేటట్లు శ్రీ కృష్ణుడు వ్యాఖ్యానించటం విశేషం.

2. ఇందులో భీముడి సహజ లక్షణాలు నాలుగు చెప్పబడ్డాయి. 1.యుద్ధం మీద ఎప్పుడూ ఉండే ప్రీతి. 2.భయంకర శత్రువులను సైతం లెక్క చేయని గర్వోన్నతి. 3.దుర్యోధనుడి ఆధిక్యాన్ని సహించని ఉద్ధతి. 4.ధర్మరాజుకు రాజ్యం కట్టబెట్టాలన్న సంకల్పం. యుద్ధప్రీతి కలవాడు 43, 50, 51 పద్యాలు మాట్లాడడు. శత్రుభావం కౌరవులపట్ల ఉన్న భీముడు 45, 46, 47 పద్యాలు పలకడు. దుర్యోధనుడి మీది పగగల భీముడు 48 పద్యం చెప్పడు. కాని, ఇప్పుడు అన్నాడంటే భీమ స్వభావం తెలిసినవారికి అవి పొందిక లేని మాటలుగా తోస్తాయి.

3. యుద్ధం చేసి శత్రువర్గాన్ని చంపి విజయాన్ని సాధించవలసిన ఆ తరుణంలో భీముడు అనదగిన మాటలు కావు ఇవి. నిజానికి భీముడి మాటలు కార్యరూపం తాల్చేవి కావు కాబట్టి వ్యర్థమైనవని కూడా తోచవచ్చును. అందువలన అసంబద్ధ శబ్దం సార్థకం.

4. ఆర్ద్ర హృదయం యుద్ధోత్సాహంతో కరడు కట్టుతుంది. శత్రువుల ధిక్కార స్మరణం వలన ఆగ్రహంగా మారుతుంది. సోదరుడైనా తనను చంపజూచిన దుర్యోధనుడి స్మరణ చేత స్నేహం పగగా మారుతుంది. చివరకు 'కీచకాంతకా!' అనే పిలుపుతో ద్రౌపదికి కౌరవులు చేసిన అవమానం జ్ఞాపకం వచ్చి అతడిని చంపినట్లే చంపాలనే క్రోధోద్రేకం పొంగులువారుతుంది. అంటే ఈ పద్యం భీముడిని అతడి సహజ స్వభావంతో వెలుగొందటానికి చేసిన వాఙ్మయ ప్రేరణ మన్నమాట. ఇది రసధ్వని. (సంపా.)

**వ. అని యంత నిలువక. 56**

**తాత్పర్యం:** అని అంతటితో ఆగక.

**క. 'వెఱ పెట్టిదియో యెన్నఁడు । నెఱుఁగని నీ యట్టివాని కెవ్వరొకో యీ**
**పిఱికితన మింత యలవడ । గఱపినవా' రనుచు శౌరి గలకల నవ్వెన్. 57**

**ప్రతిపదార్థం:** వెఱపు+ఎట్టిదియో= భయమంటే ఎటువంటిదో; ఎన్నఁడున్= ఏనాడును; ఎఱుఁగని= తెలియని; నీ+అట్టివానికిన్= నీవంటి బలశాలికి; ఈ పిఱికితనము; ఇంత+అలవడన్= ఇంతగా అభ్యాసమయేట్లు; కఱపినవారు= బోధించినవారు; ఎవ్వరు+ఒకో= ఎవరో కదా!; అనుచున్= అంటూ; శౌరి= శ్రీకృష్ణుడు; కలకల నవ్వెన్= పకపకమని నవ్వాడు.

**తాత్పర్యం:** 'భయమంటే ఏమిటో ఎప్పుడూ తెలియని నీవంటి ధీరుడికి ఈ పిరికితనం ఇంతగా అలవాటయ్యేటట్లు చేసినవారు ఎవరో?' అని హరి పకపక నవ్వాడు.

**విశేషం:** భయ మెరుగని భీముడికి పిరికితనం నూరిపోసిం దెవ్వరు? -అని ప్రశ్న వేయటం ఒక ఎత్తు, కలకలనవ్వటం మరొకయెత్తు. భీముడి వాక్యాలు అనునయవాక్యాలే కాని భయపడినవాడి మాటలు కావు. కాని, శ్రీకృష్ణుడు వాటికి భయం రంగు పులుముతున్నాడు. అతడిది వక్రోక్తి, జల్పోక్తి. అయినా లోకం భీముడు పిరికివాడని అనుకొనే ప్రమాదముందని హెచ్చరించాడు. అతడిని సంకటస్థితిలో పెట్టాడు. 'దీని కేమి సమాధానం చెప్పుతావు?' అన్నట్లు హాస్యంగా నవ్వాడు. ఈ నవ్వు కవ్వింపు నవ్వు, చనువుతో చుర్రెక్కించే నవ్వు, పిరికివాళ్ళను చూస్తే లోకం ఇట్లాగే నవ్వుతుంది అని ఎగతాళి చేసే నవ్వు. అందుకే శ్రీకృష్ణుడు కలకలనవ్వినా భీముడికి పెళపెళ కోపం రాలేదు. పైపెచ్చు ఆప్యాయంగా ఆ పరిహాసానికి ప్రతిస్పందనగా భీముడు ఒక చిరునవ్వును చిందించాడు. (సంపా.)

**వ. దానికి దరహసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున కిట్లనియె: 58**

**ప్రతిపదార్థం:** దానికిన్= శౌరి వచనాలకు; దరహసిత వదనుండు+అగుచున్= చిరునవ్వుతో కూడిన ముఖం కలవాడై; భీమసేనుండు= భీముడు; వసుదేవసూనునకున్= వసుదేవుడి పుత్రుడైన శ్రీకృష్ణుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా సమాధాన మిచ్చాడు.

**తాత్పర్యం:** శౌరి మాటలకు భీముడు చిరునవ్వు తన మోమున నిండగా వాసుదేవుడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. 'బంటుతనంబు మాటలకుఁ బాఱకు; పాండునృపాలుపాలు గై**
**కొంటయ చాలునన్న నృపకుంజరు పల్కుల కడ్డమాడ రా**
**కుంట యెఱుంగవే; మును సుయోధను చందముఁ జూపి యప్పు డే**
**మంటి యుపేంద్ర! న న్నని రణాగ్రమునన్ నిను మూదలించెదన్. 59**

**ప్రతిపదార్థం:** ఉపేంద్ర!= మాధవా!; బంటుతనంబు మాటలకున్+పాఱకు= పౌరుష వచనాలు పలకటానికి పూనవద్దు; పాండు నృపాలు పాలు= పాండు మహారాజుయొక్క రాజ్యభాగం; కైకొంటయ చాలున్= గ్రహించుటయే మనకు చాలు; అన్న నృపకుంజరు పల్కులకున్= అని పలికిన రాజోత్తముడైన ధర్మజుడి మాటలకు; అడ్డము+ఆడన్+రాకుంట= వ్యతిరేకంగా పలుక లేకుండటం; ఎఱుంగవే= నీకు తెలుసు గదా; మును= మున్ముందు; సుయోధను చందమున్+చూపి= దుర్యోధనుడు పడే పాట్లు కనబరచి; అప్పుడు= దౌత్యం కావింప కురుసభకు వెళ్ళే సమయంలో; నన్నున్= నన్ను; ఏమంటి= ఏమని పల్కితివి; అని= అంటూ; రణ+అగ్రమునన్= అని మొనలో; నినున్= నిన్ను; మూదలించెదన్= హెచ్చరించుకొంటాను.

**తాత్పర్యం:** 'కృష్ణా! మగసిరి మాటలు నా దగ్గర మాట్లాడవద్దు. మన తండ్రి రాజ్యభాగమే మనకు చాలునని ప్రభువగు ధర్మరాజు పలికిన మాటలకు మేము బదులు చెప్పలేకుండటం నీకు తెలుసు. జరుగబోయే సంగ్రామంలో దుర్యోధనుడు పడే పాట్లు చూపి ఆనాడు కురుసభకు వెళ్ళేటప్పుడు ఉపప్లావ్యపురిలో నన్నేమంటివో జ్ఞప్తికి తెచ్చుకొమ్మని యుద్ధముఖంలో నిన్ను హెచ్చరించకపోనులే.

**విశేషం:** 1. భీము డీ పద్యంలో శ్రీకృష్ణుడితో రసికవీరుడుగా పరిహాసోక్తులు మాట్లాడాడు. 'కృష్ణా! నీ వేమీ నాకు పౌరుషం నూరిపోసేపని లేదులే. ధర్మరాజు రాజ్యభాగం తీసికొంటే చాలులే అన్నందువలననే నే నిట్లా మాట్లాడాను. కాని, ఆనాడు

కురుసభలో దుర్యోధనుడి తీరు చూచి నేను ప్రతిజ్ఞ చేసిన మాటలు నీకు తెలియవా? వాటిని రణరంగంలో చేసి చూపిస్తాను. అంటే దుర్యోధనుడి తొడలు విరుగగొట్టి నేను పిరికివాడిని కానని నీ ఎదుట నిరూపించుకొంటాను' అని భీముడు సరసంగానే పౌరుషంగా మాట్లాడాడు. నవ్వుతూ మాట్లాడితే కలిగే ఫల మది. భీముడు సంధి జరిగితే సౌమ్యుడు; యుద్ధం జరిగితే యముడు.

2. ఏమంటి యుపేంద్ర - 'అంటివి' అనునది మధ్యమపురుషక్రియ. 'లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు.' అనే సూత్రంచేత, వకారానికి లోపం వచ్చి 'అంటి' అయినది. 'మధ్యమపురుషక్రియలయం' 'దిత్తునకు సంధి యగు' అనే సూత్రంచేత, సంధి నిత్యంగా రావలసి యుండగా, ఏమంటి యుపేంద్ర - అని యడాగమము వచ్చుట విశేషం. ఏమంటి వుపేంద్ర- అన్నచో సరిపోయెడిది. (సంపా.)

**క. నా కొలఁది విచారింపక । నీ కిట్లనఁ దగునె? మిన్ను నేలయు నిమ్మైఁ**
**గాక తిరుగంగఁ బడినం । బో కే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతున్. 60**

**ప్రతిపదార్థం:** నా కొలఁది= నా శక్తి ఏపాటిదో; విచారింపక= ఆలోచించకుండ; నీకున్+ఇట్లు+అనన్+తగునె?= నీకు ఇట్లా పలకటం న్యాయమా?; మిన్నున్= ఆకాశమూ; నేలయున్= భూమియు; ఇమ్మైన్+కాక= ఇప్పుడున్నట్లుండక; తిరుగంగన్+పడినన్= తార్మారైనప్పటికీ; పోక= వెనుకాడక; ఏన్= నేను; ముంజేతులు+ఒడ్డి= ముంజేతులు అడ్డముపెట్టి; పోవఁగన్+త్రోతున్= వాటి వాటి స్థానాలకు నెట్టివేస్తాను.

**తాత్పర్యం:** బావా! నా శక్తిసామర్థ్యాలు ఏపాటివో ఆలోచించక ఇట్లా నీవు మాట్లాడటం న్యాయం కాదు. నేలా, నింగీ ఇప్పుడున్నట్లు కాక తలక్రిందులైనప్పటికీ వెనుదీయక నేను ముంజేతులు ఒడ్డి వాటిని పాటుకు తోస్తాను సుమా!'

**విశేషం:** 1.అలం: అత్యుక్తి. "అత్యుక్తి రద్భుతా తథ్య శ్యార్యౌదార్యాది వర్ణనమ్". శ్రీకృష్ణుడి పరిహాసానికి భీముడి అత్యుక్తి సమతౌల్యాన్ని తెచ్చింది. మూలశ్లోకం ఇట్లా ఉన్నది.

**"యది మే సహసా క్రుద్ధే సమేయాతాం శిలే ఇవ,**
**అహ మేతే నిగృహ్ణీయాం బాహుభ్యాం సచరాచరే". (సం. 5-74-8)**

భూమ్యాకాశాలు పరస్పరం రాపిడి పడితే విడదీస్తానని అనటం సంస్కృతంలో జాతీయం కావచ్చును. కాని, నేలా నింగీ తిరగబడితే సరిగా త్రోయటం తెలుగువారికి దగ్గరగా ఉండే జాతీయం. 2.శ్రీకృష్ణుడి మాటలకు భీముడికి అభిమానం పొడుచుకొని వచ్చింది కాని, ఆగ్రహం ప్రజ్వరిల్లలేదు. ఈ సందర్భంలో కొందరు కవులు భీముడికి నిజంగా పట్టరానంత కోపం వచ్చినట్లు, అతడు శ్రీకృష్ణుడిని తూలనాడినట్లూ చిత్రిస్తారు. వారు వ్యాసుడి వద్దా, తిక్కన వద్దా ఔచిత్యపాఠాలు నేర్చుకొనాలి. ఇక్కడ భీముడు ఉచితజ్ఞుడు. (సంపా..)

**ఉ. నావుడు 'నవ్వుటాల కనినం బవనాత్మజ! యింత యేటికిం?**
**గేవల యోధవే? పరుల కిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్**
**జావడమైనఁ జూచి యిది చందము గాదని యంటిఁగాక, నీ**
**చేవయు లావు నీవు మును చేసిన భంగులు నే నెఱుంగనే? 61**

**ప్రతిపదార్థం:** నావుడున్= భీమసేను డట్లా పలుకగా; పవన+ఆత్మజ!= వాయునందనా!; నవ్వుటాలకున్= ఎగతాళికి; అనినన్= నేనట్లా అంటే; ఇంత+ఏటికిన్?= ఇంత ఎందుకు?; కేవల యోధవే?= నీవు సామాన్య వీరుడవా?; పరుల కిల్బిషముల్=

శత్రువు లొనర్చిన పాతకములు; తలపోయక= మదినెంచక; ఈ+మెయిన్= ఈ విధంగా; జావడము+ఐనన్= అపౌరుషవృత్తి నవలంబించగా; చూచి= గమనించి; ఇది చందము+కాదు= ఇది సుక్షత్రియుడి పద్ధతి కాదు; అని+అంటిన్+కాక= అని పల్కితినే తప్ప; నీ చేవయున్= నీ సారమూ; లావు= బలమూ; నీవు+మును+చేసిన భంగులు= నీవు పూర్వం చేసిన వీరవిహారాలూ; ఏన్= నేను; ఎఱుంగనే!= తెలియనటయ్యా!

**తాత్పర్యం:** భీముడి మాటలు విని వాసుదేవుడు 'పవనపుత్రా! నే నేదో పరిహాసానికై పలికిన మాటలకు ఇంత రాద్ధాంతమా? నీవు అసామాన్య వీరుడివి. ఇట్లాంటివాడివి దుర్యోధనాదులు మునుపు మీకు చేసిన అపకారాలను స్మరించక పౌరుష హీన వాక్యాలు పల్కటం చూచి, ఇది నీవంటి రాచబిడ్డకు యుక్తం కాదన్నానేగాని మరేమీ కాదు. నీ భుజసారం, శక్తీ, నీవు పూర్వం చేసిన సాహసకృత్యాలు- హిడింబాసుర, బకాసుర, కీచక, జరాసంధాది వధలు నాకు తెలియనివి కావు గదా!'

**విశేషం:** భీముడిలో క్రోధాగ్ని చల్లారలేదని తెలిసికొన్న శ్రీకృష్ణుడు తనవి పరిహాస వచనాలని ఊరటపలికి, భీముడి బలపరాక్రమాలను ప్రశంసించి, అతడిలో యుద్ధోత్సాహాన్ని స్థాయిగా నిలిపాడు. (సంపా.)

**వ. అని చెప్పి మాధవుండు మఱియును. 62**

**తాత్పర్యం:** ఇట్లా వచించి శ్రీకృష్ణుడు మళ్ళీ భీముడితో ఇట్లా అన్నాడు:

**ఉ. 'పార్థుఁడు పోరఁ దేరు గడపం దనకున్ ననుఁ గోరి యెంతయుం**
**బ్రార్థన సేసె; దాని కనురాగము నొందితి నేను గాన యు**
**ద్ధార్థులమైన మాకు నిను నాసపడం దగదే? యశంబు నా**
**నార్థములున్ విరోధి విజయంబునఁ దక్కఁగ నొంటఁ గల్గునే?' 63**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు= కుంతీపుత్రుడైన అర్జునుడు; పోరన్= యుద్ధంలో; తనకున్= తనకు; తేరు+కడపన్= రథం తోలటానికి; ననున్+కోరి= నన్ను అభిలషించి; ఎంతయున్+ప్రార్థన చేసెన్= మిక్కిలి వేడుకొన్నాడు; దానికిన్= అర్జునుడి వేడికోలుకు; నేను+అనురాగము+ఒందితిన్= నేను ఆసక్తి వహించాను; కానన్= కనుక; యుద్ధ+అర్థులము+ఐన మాకున్= యుద్ధం చేయవలెనని కాంక్షిస్తున్న మా ఇద్దరికీ; నినున్= నిన్ను; ఆస+పడన్+తగదే?= కోరుకొనటం యుక్తమే గదా!; యశంబున్= కీర్తీ; నానా+అర్థములున్= బహుళ ప్రయోజనాలూ; విరోధి జయంబునన్+తక్కఁగన్= శత్రువులను గెల్చుటచేగాక; ఒంటన్= మరొక్క విధాన; కల్గునే?= లభింపగలవా? (లభించవని అర్థం.)

**తాత్పర్యం:** 'ఫల్గునుడు యుద్ధంలో తనకు రథసారథ్యం చేయవలసిందిగా నన్ను మిక్కిలి కోరుకొన్నాడు. అందుకు నేను సమ్మతించాను. కనుక యుద్ధం అభిలషిస్తున్న మాకు కదనంలో నీ తోడ్పాటు ఎంతో అవసరం. కీర్తి, సకల ప్రయోజనాలూ శాత్రవులను గెలవటంవలన కాక మరో విధంగా సమకూడవు గదా!'

**విశేషం:** ఈ పద్యంలోని వాక్యప్రవృత్తిని గురించి తిక్కన 66వ వచనంలో- పరిహాసంతో పని సాధించే సరస వాక్యాలని సూచించాడు. ఇంతవరకూ పరిహాసంతో పని సాధించే మాటలయ్యాయి. ఇప్పుడు సరస వాక్యాలు ఇక్కడ మొదలయ్యాయి. సరస వాక్యం వినోద పర్యవసాయిగా ఉంటుంది. నవ్వుతో చిగురిస్తుంది. ఉద్ధతుడైన భీముడికి ఇతరులు తనకంటె గొప్పవారంటే

మండిపడతాడు. ప్రత్యేకించి కౌరవవీరులంటే అసలు సహించలేడు. శ్రీకృష్ణుడు పాండవులలోనే సారథిగా తన సహాయం పొందిన అర్జునుడి ప్రస్తావన చేసి, వారిద్దరూ కలసి భీముడి సహాయాన్ని కోరతామని వ్యంగ్యంగా అన్నాడు. ఇందులో కాకువులో రెండర్థాలు స్ఫురించవచ్చును.

1. మేమిద్దరం కలిసి యుద్ధం చేసినా విజయం సాధ్యం కాకపోవచ్చును. కాబట్టి నీసహాయం మాకు అవసరం అని. అంటే భీముడి సహాయమే విజయమూలమని ప్రశంస. కృష్ణార్జునుల కంటె భీముడే అధికుడని తాత్పర్యం. 2.అసలు యుద్ధం చేసేది కృష్ణార్జునులే. వారి బలపరాక్రమాలే విజయ హేతువులు. అయినా, భీముడి సహాయం కూడా విజయానికి తోడ్పడుతుందని మరొక అర్థం. ఈ భావంలో భీముడు కృష్ణార్జునులకు సహాయకుడు, ఉపాంగతుల్యుడు. భీముడు రెండో అర్థాన్ని గ్రహిస్తే ఉద్రిక్తుడు కావచ్చును. కాని, ఆ వాక్యం శ్రీకృష్ణ డాడుతున్న సరస వాక్యంగా గ్రహించటం చేత కోపం తెచ్చుకొనకుండా సరితూకంగా తానూ పరిహాసోచిత వీరసరసం మాట్లాడగలిగాడు. భీముడిని సరైన బాటలో పెట్టిన శ్రీకృష్ణుడి సరసవాక్య మిది. (సంపా.)

**వ. అనవుడు. 64**

**తాత్పర్యం:** అని అనగా.

**శా. 'ఏమీ! పార్థుఁడు నీవు దండిమగలై యీవచ్చు కౌరవ్య సం**
**గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్ద మిట్టెక్కి మి**
**మ్మే మెల్లన్ వెఱఁగంది చూచెదముగా; కీసారెకుం బోయి రా**
**భీముం డిత్తఱి రిత్తమాటలకుఁ గోపింపండుసూ పెంపఱన్.' 65**

**ప్రతిపదార్థం:** ఏమీ!= ఎట్టెట్టూ!; పార్థుఁడున్= అర్జునుడూ; నీవున్= నీవూ; దండిమగలు+ఐ= మేటి శూరులై; ఈ వచ్చు= ఇప్పుడు రానున్న; కౌరవ్య సంగ్రామ క్షోభమున్= కురు సంతతి యొక్క యుద్ధంవలని కలతను; బాహుదర్పమునన్= భుజగర్వంతో; తీర్పన్= తొలగిస్తుండగా; ఏము+ఎల్లన్= తక్కిన మేమందరమూ; పెద్ద+మిట్టు+ఎక్కి= ఎత్తైన మిట్టమీద నిలిచి; వెఱఁగు+అంది= ఆశ్చర్యంపొంది; చూచెదముగాక= తిలకిస్తాము లెమ్ము; ఈ సారెకున్= ఈ తడవకు; పోయిరా= సంధికి వెళ్ళిరమ్ము; భీముండు= ఈ భీమసేనుడు; ఈ+తఱిన్= ఈ సమయంలో; రిత్త మాటలకున్= వ్యర్థ వచనాలకు; పెంపు+ అఱన్= గౌరవం చెడేటట్లు; కోపింపండు సూ!= కోపము వహించడు సుమా!

**తాత్పర్యం:** ఎట్టెట్టూ? అర్జునుడూ నీవూ మేటిశూరులై రానున్న కురు సంగ్రామ క్షోభను మీ భుజశక్తితో నివారిస్తుంటే మేమందరమూ చేతులు ముడుచుకొని పెద్ద మిట్ట నెక్కి ఆశ్చర్యంతో మిమ్ము చూస్తుంటాంలే. నీవు ఈ సారికి కురుసభకు వెళ్ళి రావయ్యా! ఇట్లాంటి సమయంలో భీముడు గౌరవం చెడేటట్లు వ్యర్థ వచనాలకు కోపం చెందడు.'

**విశేషం:** ఇది వ్యంగ్య సరసోక్తి. భీముడు గూఢాభిమానం తొంగి చూచేటట్లు మాట్లాడాడు. 'ఏమీ!' - ఆశ్చర్యార్థకం. కాకువులో పరిహాసార్థకం 'దండి మగలై' - తెలుగుదనం గుబాళించే సమాసం. మేటి వీరులై అని అర్థం. భీముడికంటె గొప్పవారుగా రణరంగంలో రాణించే వారై అని భావం. భీము డీ మాటలు ఎగతాళిగా కూడా అనే అవకాశం ఉన్నది; గౌరవంగా కూడా చెప్పే అవకాశం ఉన్నది; అందువలన ఎదుటివా రేమీ అనలేరు. శ్రీకృష్ణుడు రెండు రకాల అర్థాలు వచ్చే సరసవాక్యాలు ఎట్లా మాట్లాడాడో భీముడూ వాటికి దీటుగా మాట్లాడాడు. 'మిట్టలెక్కి మీ పరాక్రమాన్ని మేము భయపడుతూ చూస్తాంలే' అనే మాట మనసులో దెబ్బతిన్న అభిమాని ఎదుటివారి మనసు దెబ్బతినకుండా నవ్వి ఊరుకొనేటట్లు మాట్లాడిన సరసవ్యంగ్యోక్తి. ఇవన్నీ

ఒక ఎత్తు. 'ఈ సారెకుం బోయిరా!' అనే వాక్యం మరొక ఎత్తు. 'ఎప్పుడో జరుగబోయే యుద్ధంలో సారథ్యాన్ని నిర్వహిస్తానని బడాయిలు కొట్టటం ఎందుకు? యుద్ధం చేయటం కంటె సంధి చేయటం తక్కువైనదేమీ కాదు. నీనేర్పు ఈ సంధి సారథ్యంలో మొదట బైటపడుతుంది. ఇక్కడ నీవు నెగ్గితే యుద్ధం సంగతి ఆ తరువాత గమనిద్దాం' అని ఆ వాక్యంలో స్ఫురించే వ్యంగ్యార్థం. 'భీముఁ డిత్తటి రిత్తమాటలకుఁ గోపింపండు సూ పెంపఱన్' - ఈ వాక్యం వినయ వివేకంతో పలికిన వీరవాక్యం. తనపేరు తానే చెప్పుకొనటం, అహంకార సూచకమైన ప్రథమ పురుష ప్రయోగం కాక, వినయసూచకమైన ప్రథమపురుష కావటం విశేషం. శ్రీకృష్ణుడు 'అసంబద్ధ వాక్యా'లని భీముడిని ఎత్తిపొడిచిన దానికి, భీముడు 'రిత్తమాటల'ని శ్రీకృష్ణుడి పట్ల ప్రయోగించాడు. కోపం రేకెత్తించాలని శ్రీకృష్ణుడు మేలమాడిన సంగతి గుర్తించి 'నీ యత్నాలు ఫలించవు' నేను గంభీరుడను, ధీరుడను, వివేకుడను, ఉదాత్తుడను అని కన్నులెగరేస్తూ పరిహాసంగా భీముడు పలికాడు. (సంపా.)

**వ. అని పలికి యివ్విధంబున గోపాలదేవు మేలంపు మెయివడి కార్యవచనంబులకుం దగం దానును దోడ్తో సరసం బాడుటయకా మఱుమాటలాడి యంతటఁ దనివోవక బకమర్దనుం డతనితో నిట్లనియె: 66**

**ప్రతిపదార్థం:** అని పలికి= అంటూ మాట్లాడి; ఈ+విధంబునన్= ఈ రకంగా; గోపాలదేవు= శ్రీకృష్ణస్వామియొక్క; మేలంపు మెయివడి కార్యవచనంబులకున్= పరిహాసంతో కూడిన కార్యానుకూలాలైన మాటలకు; తగన్= ఒప్పిదంగా; తానును= తాను గూడ; తోడ్తోన్= వెంటనే; సరసంబు+ఆడుట+అ కాన్= సరసమాడటమేకాగా; మఱుమాటలు+ఆడి= ప్రతివచనాలు పలికి; అంతటన్+తని+పోవక= ఆ మాటలతోనే తనివి తీరక; బకమర్దనుండు= బకాసురుడిని చంపినవాడు- భీముడు; అతనితోన్+ఇట్లు+అనియెన్= కృష్ణుడితో ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** భీము డీవిధంగా గోపాలకృష్ణుడి పరిహాస చతురాలైన పని సాధించే మాటలకు యుక్తంగా వెంటనే తానుగూడ సరసపు మాటలతోనే సమాధానం చెప్పి, అంతటితో తృప్తిపడక మళ్ళీ ఇట్లా అన్నాడు:

**ఉ. 'కయ్యము గల్గినట్లయిన గంధ గజ ప్రకరంబు కుంభముల్**
**వ్రయ్యఁ దురంగ పంక్తులు ధరం బడఁ దేరిగముల్ బడల్పడన్**
**డయ్యమి కీవు వెక్కసపడన్ గదపండువు సేయఁగోరు నా**
**దయ్యము నెత్తికోలు దుది దాఁకుటగాదె భుజంగభంజనా! 67**

**ప్రతిపదార్థం:** భుజంగభంజనా!= కాళీయుడిని మర్దించిన కృష్ణా!; కయ్యము+కల్గినట్లు+అయినన్= పోరాటం జరిగితే; గంధగజ ప్రకరంబు కుంభముల్= మదించిన ఏనుగుల గుంపుల యొక్క తలలు; వ్రయ్యన్= బ్రద్దలు కాగా; తురంగ పంక్తులు= గుర్రాల బారులు; ధరన్+పడన్= భూమిపై కూలగా; తేరిగముల్= రథాల మొత్తాలు; బడల్ పడన్= శిథిలాలుకాగా; డయ్యమికిన్= నేను అలసట చెందకున్నందుకు; ఈవు= నీవు; వెక్కసపడన్= దుస్సహత్వము చెందగా; గద పండువు+చేయన్+కోరు= నా హస్త మందలి గదకు ఉత్సవం చేయనెంచుతున్న; ఆ దయ్యము+ఎత్తికోలు= ఆ దైవం యొక్క ఉద్యమం, ఆ విధియొక్క విజృంభణం; తుది+తాఁకుట గాదె!= కడముట్టుటయే(నెరవేరటమే) అగును సుమా!

**తాత్పర్యం:** యుద్ధం జరిగితే మదించిన యేనుగుల తలలు బ్రద్దలు చేస్తాను. గుర్రాల బారులను భూమిపై కూలుస్తాను. రథ సమూహాలను నుగ్గు నుగ్గు చేస్తాను. ఇంత చేసికూడా బడలిక చెందని నన్ను చూచి నీవు ఆశ్చర్యపడక మానవు. నా గదతో పండుగ చేయగోరుతున్న దైవసంకల్పం అప్పుడే కదా సఫలమయ్యేది!

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం. లోకోక్తి. అర్జునుడికి గాండీవ పాండిత్యం ఎంత పేరు తెచ్చిందో భీముడికి గదాయుధం అంత కీర్తి తెచ్చింది. గదాయుద్ధంలో భారత వీరులలో అతడు మేటి. 'దయ్యము నెత్తికోలు దుది దాకుట కాదె'. ఇది లోకోక్తి. (సంపా.)

చ. అన విని దేవకీతనయుఁ డాతని కిట్లనుఁ 'జెప్పినంత కం
టెను మిగులంగఁ జేయుదు గడింది మగండవు నిన్నుఁ దెప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకున్ భయమొందక దుఃఖవార్ధు లీఁ
దిన మము నెల్ల నిక్కొఱఁత దీర్చి సుఖాత్ములఁ జేయు పావనీ! 68

**ప్రతిపదార్థం:** అనన్+విని= భీముడట్లా పలుకగా విని; దేవకీతనయుఁడు= దేవకీదేవి కుమారుడైన కృష్ణుడు; ఆతనికిన్= భీముడికి; ఇట్లు+అనున్= ఈ రీతిగా చెప్పాడు; పావనీ!= వాయుకుమారా!; చెప్పిన+అంతకంటెను= చెప్పినదానికన్న, మిగులంగన్+చేయుదు(వు)= ఎక్కువగా చేస్తావు; కడింది మగండవు= నీవు మేటి వీరుడివి; నిన్నున్= నిన్ను; తెప్పగాన్+కొని= నౌకగా చేసికొని; పలుమాఱున్= పెక్కుసారులు; ఆపదలకున్= కష్టాలకు; భయము+ఒందక= వెరపు చెందక; దుఃఖవార్ధులు+ ఈదిన= దుఃఖాలనే సాగరాలను దాటిన; మమున్+ఎల్లన్= మమ్ములనందరినీ; ఈ కొఱఁతన్+తీర్చి= ఇప్పు డేర్పడిన ఆపదను బాపి; సుఖ+ఆత్ములన్+చేయు!= సుఖంతో గూడిన హృదయం కలవారినిగా చేయవయ్యా!

**తాత్పర్యం:** భీముడు పలికిన పలుకులు విని శ్రీకృష్ణుడు 'వాయునందనా! నీవు చెప్పినదానికంటె ఎక్కువగానే చేస్తావు. నీవు గొప్ప వీరుడివి. నిన్ను తెప్పగా చేసికొని కడగండ్లకు భయపడకుండా మేము దుఃఖమనే సముద్రాలీది గట్టెక్కినాము. ఇప్పు డేర్పడిన సంకటం తొలగించి మమ్మ సుఖపెట్టవలసింది.

**విశేషం:** అలం: రూపకం. సంధియత్న సమయంలో ధర్మరాజు యుద్ధోత్సాహాన్ని మానకుండా ఉండటానికి భీమాదులలో పౌరుషాన్ని ప్రజ్వలింపజేస్తున్న శ్రీకృష్ణుడి వ్యూహశక్తికి ఈ పద్యం ఒక తార్కాణం. భీముడు పైకి చల్లారినట్లున్నా, లోన మండుతూనే ఉన్నాడని పాండవ పక్షానికి ప్రదర్శింపజేసి చూపించాడు. 'పావనీ!' - సార్థక సంబోధనం. దుఃఖవార్ధులు దాటేవారికి భీముడు తెప్పయేకాదు, తెప్పను ముందుకు త్రోసి ఒడ్డుకు చేర్చే పవనకుమారుడు (పిల్లగాలి) కూడా అని చమత్కారం. (సంపా.)

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ । బదనికి రాఁ బలికి సంధి వాటించెద; నా
కది యొప్పదె! కాని తుదిం । గుదురింతకు నీవ కావె గుణరత్ననిధీ!' 69

**ప్రతిపదార్థం:** గుణరత్ననిధీ! -సద్గుణాలనెడు రత్నాలకు నిలయమైనవాడా!; ఇదె= ఇప్పుడే; పోయెదన్= కురుసభకు వెళ్తాను; కౌరవ్యులన్= కురువంశసంభవులను; పదనికి రాన్+పలికి= పాకానికి వచ్చేటట్లు మాట్లాడి; సంధి పాటించెదన్= సంధి సమకూరుస్తాను; నాకున్= నాకు; అది+ఒప్పదె?= అట్లా సంధి కుదుర్చుట సమ్మతమే; కాని; తుదిన్= చివరకు సంధి కుదురని పక్షంలో; ఇంతకున్+కుదురు= అన్నింటికినీ; ఆధారము; నీవు+అ, కావె!= నీవే సుమా!

**తాత్పర్యం:** గుణరత్న నిధివైన భీమా! నే నిపుడే కురుసభకు వెళ్ళుతాను. పాకానికి వచ్చేటట్లు వారితో మాట్లాడి సంధి పొసగే టట్లు చూస్తాను. అట్లా యత్నించటం నాకు సమ్మతమే. ఒకవేళ సంధి కుదరని పక్షంలో మాకు అన్నింటికీ ఆధారం నీవే సుమా!'

**విశేషం:** 1. 'ఈ సారెకుం బోయిరా' అని 65వ పద్యంలో భీముడన్న మాటలకు ప్రతిధ్వని ఈ పద్యం.

2. ఒక దీర్ఘసంభాషణను ముగించే తరుణంలో పాటించే నిర్వహణ శిల్పం తిక్కన రచనలో గమనించదగింది. ఈ పద్యం శ్రీకృష్ణుడు భీముడితో చేసిన సంభాషణకు సముచితమైన ముగింపు.

3. 'తుదిన్ కుదు రింతకు నీవకావె గుణరత్ననిధీ' - కుదుటపరిచే వాడు, ఆధారమైన వాడు భీముడు అనే మాట సాధారణార్థంలో సరసంగా ఉన్నది. భావికథార్థ వ్యంజకంగా కూడా ఉన్నది. మహాభారత యుద్ధంలో చిట్టచివర దుర్యోధన సంహారమే విజయనిర్ధారకంగా నిలిచే అంశం. దానిని విజయవంతంగా ముగించి భారత యుద్ధంలో విజయానికి ఒక కుదురుగా నిలిచేవాడు భీముడే కదా! శ్రీకృష్ణుడు సత్యవాక్కు. 'గుణరత్ననిధీ' ప్రశంసకు పరాకాష్ఠ. (సంపా.)

## అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దన యభిప్రాయంబు సెప్పుట (సం. 5-76-1)

**వ. అనిన వాసుదేవున కర్జునుం డిట్లనియె : 70**

**తాత్పర్యం:** అని పలికిన కృష్ణుడితో అర్జునుడు ఇట్లా అన్నాడు :

**తే. 'చెప్పఁ గల యంతవట్టును జెప్పె నీ క । జాత శత్రుండు; వింటి వీ వా తెఱంగు;**
**మాకు నెల్లను బలుకంగ మాట లొండు । గలవె? యైనను జెప్పెదఁ గన్నయంత. 71**

**ప్రతిపదార్థం:** అజాతశత్రుండు= ధర్మరాజు; నీకున్= నీకు; చెప్పన్+కల+అంతవట్టును+చెప్పెన్= చెప్పగలిగినంతవరకు చెప్పాడు; ఈవు= నీవు; ఆ తెఱంగు వింటివి= ఆయన పలుకుల చందం విన్నావు; మాకున్+ఎల్లను= మాకందరికీ; పలుకంగన్= చెప్పటానికి; మాటలు= పలుకులు; ఒండు+కలవె?= వేరే ఉన్నవా?; ఐనను= లేనప్పటికీ; కన్న+అంత= ఎరిగినంతవరకూ; చెప్పెదన్= పలుకుతాను.

**తాత్పర్యం:** 'ధర్మనందనుడు నీకు చెప్పవలసినదంతా చెప్పాడు. ఆయన మాటలన్నిటినీ నీవు విన్నావు. ప్రత్యేకంగా మేము చెప్పవలసిన మాటలు లేవు. అయినా నాకు తోచిన మాటలు నేనూ చెపుతాను.

**విశేషం:** భీముడు సూటిగా మాట్లాడితే అర్జునుడు సున్నితంగా మాట్లాడతాడు. చెప్పవలసినదంతా 'అజాతశత్రుడు' చెప్పాడట. ఆ విశేషణం సార్థకం. ధర్మజుడి మాటలు శత్రువులు కూడా కాదన లేని రీతిలో ఉన్నాయి. అతడు మాట్లాడిన తరువాత ఎవరికైనా మాటలు మిగులుతాయా? అనటం ఔపచారికార్థం. అతడి అభిప్రాయం కంటె వేరైన నిశ్చయం మాకు ఉంటుందా? అని మరొక అర్థం. అయినా చెప్పుతున్నాను వినుమని అంటున్న అర్జునుడు పెద్దలను కాదనని స్వీయ అస్తిత్వం కల అభిమానధనుడని స్పష్టమవుతున్నది. (సంపా.)

**మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ మీ నేర్చునే**
**సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగునంచున్ మున్న కైపెక్కిన**
**ట్టితలం పచ్యుత! నీకుఁ గల్గినది; గాండీవంబు దివ్యాస్త్ర సం**
**తతియుం బెట్టినయట్లయుండ మముఁ జింతం బాపరాదో కదే! 72**

**ప్రతిపదార్థం:** అచ్యుత!= శ్రీకృష్ణా!; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు; అతి లోభదూషితుఁడు= మిక్కిలి దురాశచేత నిందింపదగినవాడు; ధాత్రీ భాగము= పుడమిలో పాలు; ఈన్+నేర్చునే= ఇచ్చుటకు సమ్మతిస్తాడా?; సుతుఁడున్= అతని కుమారుడైన సుయోధనుడు; కష్టుఁడు= కర్కశుడు; సంధి+ఏల+అగున్+అంచున్= సంధి ఎట్లా కుదురుతుందని; మున్న+అ= ముందుగానే; కైపు+ఎక్కినట్టి తలంపు= సందేహంతో కూడిన ఆలోచన; నీకున్+కల్గినది= నీకు పుట్టింది; గాండీవంబున్= నా ధనుస్సును; దివ్య+అస్త్ర సంతతియున్= దివ్యములైన బాణ సమూహమును; పెట్టిన+అట్ల+ఉండన్= వానికేమాత్రం

పనితగులకుండ ఉన్నచోటనే అవి ఉండగా; మమున్= మమ్ము; చింతన్+పాపరాదో+కదే?= విచారం పాలుగాకుండా చేయగూడదా యేమి?

**తాత్పర్యం:** కృష్ణా! ధృతరాష్ట్రుడు పరమ దురాశాపరుడు. అతడు మాకు రాజ్యభాగ మివ్వటానికి అంగీకరించడు. అతడి కొడుకు గూడా మిక్కిలి కర్కశుడు. మరి సంధి కుదరటం అసంభవమని ముందుగానే నీకు సందేహం కలిగింది. నా గాండీవం, దివ్యబాణ పరంపర పనిమాని ఊరక ఉన్నచోటనే ఉండగా మేము ఏ విచారం లేకుండా ఉండే మార్గం చూపించలేవా?

**విశేషం:** అర్జునుడు గూఢాభిమాని. ధృతరాష్ట్రుడు దుర్యోధనుడు సంధి పడనీయరని అతడి దృఢ విశ్వాసం. శ్రీకృష్ణుడు కూడా అటువంటి అభిప్రాయాన్ని ఆవేశంతో అనటం కూడా జరిగింది. (చూడు పద్యాలు 1.352; 3.41). అంటే అర్జునుడికున్న అభిప్రాయమే కృష్ణుడి కున్నదన్నమాట! శ్రీకృష్ణుడు అచ్యుతుడు, అన్న మాట నుండి జారి పోయేవాడు కాదు. అయినా సంధి యత్నం చేస్తున్నాడు. ఇందులో సహజ విరోధాభాసం ఉన్నది. జగన్నాటక సూత్రధారి సాగించే రాజనీతి ఉన్నది. దానిని మనసులో పెట్టుకొని ఎత్తిపొడుపుగా 'నా గాండీవం, దివ్యాస్త్రాలూ ఉన్నవి ఉన్నట్లుగానే ఉండగా మా దిగులు తీరేటట్లు చేయు'మని అనటం వ్యంగ్యోక్తి. అర్జునుడి రథసారథిగా కృష్ణుడు కుదిరింది గాండీవి పరాక్రమాన్ని ప్రపంచానికి చాటటానికే. అదీ శ్రీకృష్ణు డన్నమాటే. ఇపుడు సంధి చేస్తే ఆమాట నిలువదు. అచ్యుత బిరుదం పొసగదు. కాబట్టి ఘటనాఘటన సమర్థుడైన శ్రీకృష్ణుడిలోని దివ్యత్వాన్ని భావిస్తూ 'అన్న మాటలన్నీ నిలబెట్టుకొని అచ్యుతత్వాన్ని కాపాడుకొ'మ్మని పార్థుడు సున్నితమైన వ్యంగ్యోక్తిని పలికాడు. (సంపా.)

**ఉ. నీ వొనరింపఁ బూనిన పనిం గమలోదర! కీడు వుట్టునే?**
**కా వనినట్ల యుండి యవుఁ గార్యము; లట్లగుటం బ్రయత్న సం**
**భావనసేఁత పౌరుషము పద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో**
**దైవము దోడ్పడన్ వలయుఁ; దథ్యము రెండును నీ వినోదముల్. 73**

**ప్రతిపదార్థం:** కమల+ఉదర!= ఓ పద్మనాభా!; నీవు+ఒనరింపన్+పూనిన పనిన్= నీవు చేయనెంచిన పనికి; కీడు+పుట్టునే?= హాని కలుగుతుందా? (కలుగదనిభావం); కార్యములు= నీవు సంకల్పించిన పనులు; కావు+అనినట్లు+అ+ఉండి= నెరవేరనట్లే కనిపించినప్పటికీ; అవున్= నెరవేరుతాయి; అట్లు+అగుటన్= అందువలన; ప్రయత్న సంభావన+చేఁత= కార్యమొనర్చుటకు పూనుకొనటం; పౌరుషము పద్ధతి= పురుష లక్షణం; తద్+ఫలసిద్ధి+పొందుచోన్= ఆ కార్యం యొక్క ఫలమును పొందే విషయంలో; దైవము తోడ్పడన్ వలయున్= దైవము సాయపడాలి; రెండును= కార్యం అనుకూలించటం, అనుకూలించకపోవటం, అనేవి, పౌరుషమూ దైవమూ అనేవి; నీ వినోదముల్= నీ ఇచ్ఛకు లోబడి ఉంటాయి; తథ్యము= ఇది నిజం.

**తాత్పర్యం:** స్వామీ! నీవు చేయ నెంచిన పనికి హాని ఎప్పుడూ కలుగదు. కొన్ని పనులు ఫలించనట్లే ముందు కనిపించినా చివరకు ఫలిస్తాయి. కాబట్టి కార్యానికి పూనుకొనటం పురుష లక్షణం. కార్యఫలం తనకు సమకూరటంలో దైవ సహాయం అవసరం. కనుక పురుషయత్నం, దైవానుకూల్యం. కార్యం అనుకూలించటం, అనుకూలించకపోవటం అనేవి రెండున్నూ నీ సంకల్పానికి లోబడి ఉంటాయి. ఈ మాట వాస్తవం.

**విశేషం:** 1. నరనారాయణ మహర్షులే భూతలం మీద అర్జునుడుగా, శ్రీకృష్ణుడుగా జన్మించారు. అర్జునుడు శ్రీకృష్ణుడి పట్ల స్నేహభక్తిని ప్రసరిస్తూ ఉంటాడు. నరుడు భక్తుడు, నారాయణుడు భగవంతుడు. అందువలన శ్రీకృష్ణుడిని దైవస్వరూపుడుగా,

పురుషకారదైవానుకూల్య శక్తిస్వరూపుడుగా భావించి పలుకుతున్నాడు. అతడి దృష్టిలో కృష్ణుడు దూత కాడు; ఘటనాఘటన సమర్థుడైన పరమాత్ముడు. ఆ భావానికి ఈ పద్యం అద్దం.

2. దైవ సంకల్పానికి వికల్పం లేదు. అయితే, కృష్ణుడు సంధిని కోరుతున్నాడా? యుద్ధాన్ని కోరుతున్నాడా? అన్నది అసలు ప్రశ్న. అది ఫలాన్ని చూచి తెలిసికొనవలసిన సత్యం. ఆ కార్యం ఏదైనా జయం మాత్రం తథ్యం - అని అర్జునుడి విశ్వాసం.

3. ఈ పద్యం భక్తిభావ వ్యంజకంగా ఉన్నది. ఎత్తుగడలో, ముగింపులో, నిర్వహణలో సమత అనే గుణం కనపడుతున్నది. వాక్య నిర్మాణంలో ఆ గుణం ప్రతిఫలిస్తున్నది. అది భక్తుడైన అర్జునుడి మనస్సులోని నిర్మలత్వాన్ని సమత్వాన్ని సూచిస్తున్నది.

4. తిక్కన రచనలోని నాటకీయతలో పాత్రోచిత సంభాషణ ప్రవృత్తికి ఈ పద్యం ఉదాహరణం.

5. వాక్య విన్యాసంలో భక్తిభావాన్ని ధ్వనింపచేయటం తిక్కన రసధ్వనిశిల్పం.

6. 'కమలోదర!' సార్థక శబ్ద ప్రయోగం. శ్రీకృష్ణుడిలో విష్ణువును దర్శించే భావన ధ్వని. 'తథ్యము' 'నీ వినోదముల్' అనే పదాలు సమానమైన దైవలీలా విలాసాన్ని ధ్వనింపజేస్తున్నాయి. తేటతెనుగుకు తిక్కన శైలి ప్రసిద్ధి. దాని కిది ఉదాహరణం. (సంపా.)

**ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యులన్న నె**
**వ్వారికిఁ బోలదే సుజనవత్సల! నీ విటులంట వారు మ**
**మ్మీరసమెత్తి కీడ్పఱిచి యింతలుసేసినదాన నీ మదిం**
**గూరిన నొవ్వుసొంపునను గోపము పెంపునఁ గాదె యారయన్. 74**

**ప్రతిపదార్థం:** సుజన వత్సల!= సత్పురుషులందు ప్రేమగల కృష్ణా!; వేరిమిన్= శత్రుభావంతో; ధర్మజున్= ధర్మపుత్రుడిని; పరిభవించిన ద్రోహులు= అవమానపరచిన ఘాతుకులు; వధ్యులు= చంపదగినవారు; అన్నన్= అనగా; ఎవ్వారికిన్+పోలదే= ఎవరికైనను యుక్తమే; నీవు+ఇటులు+అంట= యుద్ధంలో కౌరవులను జయించి రాజ్యభాగం గైకొనుట సమంజసమని నీవు పల్కటం; ఆరయన్= నిజం పరికిస్తే; వారు= ఆ కౌరవులు; ఈరసము+ఎత్తి= ద్వేషం వహించి; మమ్మున్= మమ్ములను; కీడ్పఱిచి= కష్టపెట్టి; ఇంతలు చేసిన దానన్= ఇంతటి దురవస్థల పాలు కావించిన కారణాన; నీ మదిన్= నీ హృదయంలో; కూరిన= నిండిన; నొవ్వుసొంపునను= బాధాతిశయం వలననూ; కోపము పెంపునన్+కాదె!= క్రోధవిజృంభణం వలననేకదా!

**తాత్పర్యం:** శత్రుభావంతో జూదంలో ధర్మజు నోడించి అవమానించిన ఆ ఘాతుకులు వధార్హులని ఎవరైనా చెప్పగలరు. నీవు సత్పురుషుల యందు వాత్సల్యం కలవాడవు కనుక ఆ కౌరవులు మా యెడ ద్వేషం పూని, మమ్ములను బాధించి, ఇంతటి దుఃస్థితి పాలుగావించిన కారణాన నీ హృదయంలో నెలకొన్న మిక్కుటమైన బాధ చేతనున్నూ, అగ్గలమైన కోపం చేతనున్నూ వారిని సంగ్రామంలో నిర్జించి, రాజ్యభాగం గైకొనటం యోగ్యమని చెప్పావుగాని మరేమీ కాదు.

**విశేషం:** అలం: కావ్యలింగం. 'సమర్థనీయ స్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్'. 'అజాతశత్రువైన ధర్మరాజుపై శత్రుభావం పూని అవమానించిన ద్రోహులైన కౌరవులు వధ్యులు అని ఎవరికైనా అనిపిస్తుంది. సుజనవత్సలా! నీకు కూడా అనిపించింది. అది సహజమే' అని తన ఊహను ఉపపత్తితో సమర్థించుకొంటున్నాడు అర్జునుడు. పగబూని పాండవులను పరిపరివిధాల బాధించినందుకు శ్రీకృష్ణుడి మనసు నొచ్చి కోపం వచ్చి ఉంటుందని సమర్థించాడు. అట్లా కోపం రావటానికి కారణం పాండవులు సుజనులు కావటం. శ్రీకృష్ణుడు సుజన వత్సలుడు కావటం. ఈ మాటలో తన మనోభావాలనే శ్రీకృష్ణుడిపై ఆరోపించి చెప్పే వైఖరి కూడా తోస్తుంది. నరనారాయణుల అభేద ప్రవృత్తి ఇందులో వ్యంగ్యంగా స్ఫురిస్తుంది. (సంపా.)

**ఉ. ఐనను జిత్తగింపు; ద్రుపదాత్మజ నాసభ నట్లు సేసినన్**
**దానికి సైఁప లెస్సయని దైన్యముఁ బొందుట కోర్చి యమ్మెయిం**
**గాననభూమికిం జనుట కారుణికోత్తమ! నీ వెఱుంగవే?**
**కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్పు నేర్పునన్.** 75

**ప్రతిపదార్థం:** కారుణిక+ఉత్తమ!= దయావంతులలో శ్రేష్ఠుడా!; ఐనను= ఇనప్పటికినీ; చిత్తగింపు= మా మాటలు అవధరించవలసింది; ద్రుపద+ఆత్మజన్= పాంచాలిని; ఆ సభన్= ఆనాటి ఒడ్డోలగంలో; అట్లు+చేసినన్= తలవెంట్రుకలు పట్టి ఈడ్చి వలువలు ఒలిచినమా; దానికిన్= ఆ దుండగాలకు; సైఁపన్+లెస్స+అని= సహించియుండటం మంచిదని; దైన్యమున్+పొందుటకున్+ఓర్చి= దీనదశ పాలవటానికి సహించి; ఆ+మెయిన్= ఆ విధంగా; కానన భూమికిన్+చనుట= అరణ్య ప్రదేశాలకు వెళ్ళుట; నీవు+ఎఱుంగవే?= నీకు తెలియదా?; కానన్= ఇన్నిటినీ నీ వెఱిగి ఉన్నందువలన; సహించి= ఓర్చుకొని; పాండవులన్ కౌరవులన్= కౌరవ పాండవులను; నేర్పునన్= సామర్థ్యంతో; తగన్+కూర్పు(ము)= ఒకటిగా చేయవలసింది.

**తాత్పర్యం:** పరమ కృపాశాలివగు కృష్ణా! కౌరవులను ఏమి చేసినా దోషం లేనప్పటికీ నా మాటలు ఆలకించవలసింది. ఆనాడు నిండు సభలో పాంచాలిని కొప్పుపట్టి ఈడ్చి, వలువ లొలిచిననూ మంచిదని మిన్నకున్నాం. దైన్యస్థితి పొందుటకున్నూ ఓర్చి, తలవంచుకొని అడవులకు పోయాం. ఇదంతా నీవెఱుగుదువు. కావున వారి దుండగాలన్నింటినీ మన్నించి, నేర్పుతో కౌరవ పాండవుల నొకటిగా ఉండేటట్లు కావించుము.

**విశేషం:** 1. అర్జునుడి మాటల కన్నిటికీ కీలకం వలె ఉండేది సంబుద్ధి. 'కారుణికోత్తమా!' అని శ్రీకృష్ణుడిని సంబోధించాడు. ఇతరుల కష్టసుఖాలను తనవిగా భావించి ఆర్ద్రుడయ్యే వారిలో అగ్రగణ్యుడు శ్రీకృష్ణుడట! అందువలన అలనాడు కౌరవసభలో ద్రౌపదికి చేసిన అవమానాలకు సైతం ఓర్చి అరణ్యాజ్ఞాతవాసాలు చేసి కష్టాలు పడిన పాండవుల దీనస్థితిని శ్రీకృష్ణుడు తానే అనుభవించినట్లు భావించి క్రోధోద్రిక్తుడు కావటం అతడి నైజగుణం. అటువంటి వాడు కౌరవ సభలో ఆ దైన్యాన్ని స్మరించి కోపానికి వశుడై సంధి యత్నాన్ని విఫలం చేస్తాడేమో! అని అర్జునుడు సహనాన్ని ప్రబోధిస్తున్నాడు. ఇది తన మానసిక స్థితిని శ్రీకృష్ణుడియందు ఆరోపించటమే, పైపెచ్చు సంధి ప్రయత్నాల సమయంలో పాండవులు పడిన బాధలు మరచిపోవద్దనటం వ్యతిరేక వ్యంగ్యధ్వని. పార్థుడిక్రోధం హృదయంలో గూఢంగా ధ్వనిస్తున్నది. (సంపా.)

2.'ద్రుపదాత్మజ నా సభనట్లు సేసినన్' - ద్రౌపదికి కౌరవులు చేసిన అవమానం పైకి చెప్పరాని దనుట.

**తే. అలవి యెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి । మమ్ముఁ బఱచిన పాటులు మానసమునఁ**
**జవుటఁబెట్టిన విత్తుల చందమొంది । యంకురింపక చెడిపోయె నంబుజాక్ష!** 76

**ప్రతిపదార్థం:** అంబుజ+అక్ష!= కమలాల వంటి కన్నులు గల శ్రీకృష్ణా!; అలవి+ఎఱుఁగక= తమశక్తి ఏపాటిదో తెలిసికొనక; ధార్తరాష్ట్రులు= కౌరవులు; కడంగి= పూనుకొని; మమ్మున్= మమ్ములను; పఱచిన పాటులు= పెట్టిన బాధలు; మానసమునన్= మా హృదయంలో; చవుటన్+పెట్టిన= చవిటి నేలలో విత్తిన; విత్తుల చందము+ఒంది= గింజల తీరై; అంకురింపక= మొలకెత్తక; చెడిపోయెన్= నశించాయి.

**తాత్పర్యం:** పుండరీకాక్షా! తమ శక్తి ఏపాటిదో తెలిసి కొనక దుర్యోధనాదులు పూనుకొని మమ్మ నానావిధ బాధలకు గురి చేశారు. చవిటి నేలలో విత్తిన విత్తులు మొలకెత్తక నశించిన విధంగా ఆ తలంపులన్నీ మా హృదయంలోనే అణగారిపోయాయి.

**విశేషం:** అలం: ఉపమ. 1.అర్జునుడి మనస్సులో ఉన్న గూఢామర్షకు ఈ పద్యం అద్దం పట్టుతున్నది. బాధ పొందిన హృదయక్షేత్రాలు పగ సాధింపు చర్యతో సారవంతమౌతాయి. కాని, పాండవ హృదయాలు ధర్మజశాంతి ప్రబోధం చేత శమభావాన్ని పొంది యుద్ధబీజాలు మొలకెత్తని చవిటి నేలలుగా తయ్యారయ్యాయి. దానితో వారి ఆశలు, ఆకాంక్షలు మొలకెత్తని విపరీతస్థితికి గురి అయ్యాయి. ఇది ఆత్మనిర్వేదాన్ని భగవంతుడితో చెప్పుకొంటున్న తీరు. యుద్ధ వాంఛను గూఢంగా వ్యక్తం చేస్తున్న వైఖరి. వ్యతిరేక వ్యంగ్య స్ఫూర్తి ధ్వనించే విధంగా మాట్లాడే ఈ తీరు సుకుమార వైఖరి అంటారు. (సంపా.)

2. దుర్యోధనాదులు మాకు కలిగించిన కష్టాలు నా మనస్సులో చవిటినేలలో చల్లిన విత్తులవలె మొలకెత్తకుండా చెడిపోయాయి - అని తెలుగులో ఉండగా, మూలంలో - 'సనామ సమ్య గ్వర్తేత పాండవేష్విత మాధవ, నమే సంజాయతే బుద్ధిః బీజ ముప్తమి వోష'(సం. 5-76-19) - చవిటి నేలలో చల్లిన విత్తనంవలె, దుర్యోధనుడు పాండవుల విషయంలో సరిగా ప్రవర్తిస్తాడని నాకు అనిపించటంలేదు. అని మూలంలో ఉంది. (సంపా.)

**వ. అమ్మొఱకుల నెమ్మెయి నయినను. 77**

**తాత్పర్యం:** ఆ మూర్ఖులను ఏ విధంగానైనా

**క. ఒడఁబఱిచి మాకు వారికిఁ । బుడమి సగము గాఁగఁ జేసి పొంది పొసఁగియుం**
**డెడు నట్టి తెఱఁగు సేయుట । కడు మేఁ; లది గౌరవము సుఖంబును జేయున్. 78**

**ప్రతిపదార్థం:** ఒడన్+పఱిచి= సమ్మతింపజేసి; మాకున్ వారికిన్= మాకున్నూ, కౌరవులకున్నూ; పుడమి సగము గాఁగన్+చేసి= భూమిలో చెరిసగము వచ్చునట్లొనరించి; పొంది పొసఁగి+ఉండెడు+అట్టి= కలిసి మెలసి జీవించే; తెఱఁగుచేయుట= విధానం రూపొందించటం; కడున్+మేలు= మిక్కిలి మంచిది; అది= ఆ ఏర్పాటు; గౌరవమున్= గౌరవాన్ని; సుఖంబును= సౌఖ్యాన్ని; చేయున్= కలిగిస్తుంది.

**తాత్పర్యం:** కృష్ణా! ఆ మూర్ఖుల నెట్లాగయినా సంధి కొప్పించి మాకూ, వారికీ రాజ్యంలో చెరిసగం వచ్చేటట్లుగా చేసి, ఉభయులం కలిసి మెలసి ఒద్దికగా జీవించే ఏర్పాటు కావించటం చాలా మంచిది. ఆ ఏర్పాటు వలన మాకు గౌరవమూ, సౌఖ్యమూ లభిస్తాయి.

**క. నీ కిట్టిది చిత్తమునకు । రాకున్నది యేని వలదు రం డిమ్మెయి మీ**
**రీకార్యము సేయుం డని । మా కానతి యిమ్ము కంసమర్దన! తెలియన్. 79**

**ప్రతిపదార్థం:** కంసమర్దన!= కంసుడిని నిర్మూలించినవాడా!; నీకున్= నీకు; ఇట్టిది= ఇటువంటి సంధి విధానం; చిత్తమునకున్+రాక+ఉన్నది+ఏనిన్= మనసునకెక్కని పక్షాన; వలదు= అక్కరలేదు; మీరు రండు= మీరు రండి; ఈ+మెయిన్= ఈ విధంగా; ఈ కార్యము చేయుండు+అని= మీరీపని చేయండని; తెలియన్= మేము గ్రహించి అనుసరించేటట్లుగా; మాకున్+ఆనతి+ఇమ్ము= మాకు ఆజ్ఞ దయచేయుము.

**తాత్పర్యం:** కృష్ణా! కౌరవులతో మేము సంధి చేసికొనుట మీ దివ్యచిత్తానికి సరిపడకపోతే - ఆ పద్ధతి మీకు తగదు, మీరు ఈ రకంగా ఈ పని చెయ్యండి అని స్పష్టంగా మాకు ఆజ్ఞ నివ్వండి.

**మ. హిత మిబ్భంగిది మాకు ధర్మము తెఱం గిట్లుండునం చేను నీ**
**మతి బోధింప వలంతినే? హితము ధర్మంబున్ విచారించి చూ**
**చి తగున్‌బొమ్మని యేది పంచి తది నిశ్చింతంబునంజేసి యు**
**న్నతిఁ బొందంగలవారమై యునికి కృష్ణా! నేఁడుగా వచ్చెనే! 80**

**ప్రతిపదార్థం:** కృష్ణా!= శ్రీకృష్ణా!; మాకున్= మాకు; హితము+ఈ భంగిది= మేలుగల్గించు పద్ధతి ఇటువంటిది; ధర్మము తెఱంగు= న్యాయసరణి; ఇట్లు+ఉండున్+అంచున్= ఈరీతిగా ఉండునని; ఏను= నేను; నీ మతి బోధింపన్= నీ మదికి గోచరింపచేయటానికి; వలంతినే= సమర్థుడనా? (కానని అర్థం); హితమున్, ధర్మంబున్= హితమునూ, ధర్మమునూ; విచారించి చూచి= ఆలోచించి నిర్ణయము ఒనర్చి; తగున్+పొమ్ము+అని= ఈ దారిలో చక్కగా సాగుమని; ఏది+పంచితి(వి)= ఏమి సల్పుటకు ఆజ్ఞాపింతువో; అది= దానిని; నిశ్చింతంబునన్+చేసి= నిర్విచారంగా కావించి; ఉన్నతిన్+పొందన్+కలవారము+ఐ+ ఉనికి= ఔన్నత్యం వహించి జీవించే స్థితి; నేఁడుగా+వచ్చెనే?= ఈ నాడు వచ్చిందా? కాదని భావం.

**తాత్పర్యం:** కృష్ణా! మా కిది మేలు కలిగిస్తుంది; ధర్మస్వరూప మిటువంటిది- అని నీకు తెలియజెప్పుటకు నేను ఏపాటివాడిని? ఏది హితమో, ఏది న్యాయమో నీవే ఆలోచించి నిర్ణయించి ఈ దారిని పొమ్మని నిర్దేశిస్తే ఆ మార్గాన్ని అవలంబించి నిర్విచారంగా నీవు చెప్పినట్లు చేసి ఉన్నతస్థితికి రాగలం. అట్టి స్థితి నేడు క్రొత్తగా ఏర్పడింది కాదుకదా!

**విశేషం:** 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' అన్న గీతాకారుడి వాక్యానికి అనుగుణంగా అర్జునుడు పాండవుల అనన్య భక్తి విశేషాన్ని పేర్కొని, శ్రీకృష్ణు డేది చెప్పితే అదే హితవు. అదే ధర్మం అని భావించే శరణాగత ప్రవృత్తిని, నిరహంకార చిత్తవృత్తినీ ఈ పద్యంలో ప్రదర్శించి భక్తు డనిపించుకొన్నాడు. 78, 79, 80 పద్యాలు అర్జునుడి త్రికరణశుద్ధిని ప్రదర్శిస్తున్నాయి. (సంపా.)

**వ. అనిన విని కృష్ణుండు విజయున కిట్లనియె : 81**

**తాత్పర్యం:** అనగా విని కృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు :

**ఉ. వెరవున లావునం గృషికి వేయు విధంబుల మేలొనర్చినం**
**దొరకొనునే ఫలంబు? తటితోఁ దగు వర్షము లేకయున్నఁ నె**
**ప్పరుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలియించు టెల్ల నా**
**దరణమునం బ్రసన్నమగు దైవముచేఁతన చూవె ఫల్గునా! 82**

**ప్రతిపదార్థం:** ఫల్గునా!= (ఉత్తర ఫల్గునీ నక్షత్రాన జన్మించిన) అర్జునా!; వెరవునన్= ఉపాయంతో; లావునన్= శక్తితో; కృషికిన్= సేద్యానికి; వేయు విధంబులన్= బహు ప్రకారాల; మేలు+ఒనర్చినన్= దోహదం చేసినప్పటికినీ; తటితోన్= అదనులో; తగు వర్షము లేక+ఉన్నన్= తగినంత వాన కురియకపోతే; ఫలంబు దొరకొనునే?= పంట లభించగలదా?; ఏ+పరుసునన్= ఏ విధంగా నైనను; లెస్స+చేసినను= చక్కగా పనులు గావించిననూ; పౌరుషముల్ ఫలియించుట+ఎల్లన్= పురుష యత్నాలు సఫలం కావటం అన్నది; ఆదరణమునన్= ప్రేమతో; ప్రసన్నము+అగు= అనుగ్రహం చూపు; దైవము చేఁతన్+అ చూవె= దైవం యొక్క తోడ్పాటు వల్లనే సుమా!

**తాత్పర్యం:** ఉపాయంతో శక్తితో శ్రమించి సేద్యానికి పలు రకాల దోహదం చేసినప్పటికీ సమయానికి తగినంత వర్షం లేకుంటే పంట చేతికందదు. అట్లాగే ఎన్నో విధాల పరిశ్రమ చేసినప్పటికినీ ప్రేమతో దైవం ప్రసన్నమైనప్పుడే పురుషయత్నాలు సఫలమౌతాయి.

**విశేషం:** 1. అలం: దృష్టాంతం, అప్రస్తుత ప్రశంస, అర్థాంతరన్యాసం. "చేద్ బింబప్రతిబింబత్వం దృష్టాంత స్తదలంకృతిః". రెండు వాక్యాలకు బింబప్రతిబింబ భావం వర్తించబడితే దృష్టాంతం. ఈ పద్యంలో పద్యపూర్వార్ధంలోని వాక్యానికి ఉత్తరార్ధంలోని వాక్యం దృష్టాంతం. "అప్రస్తుత ప్రశంసా స్యాత్ సా యత్ర ప్రస్తుతాశ్రయా". అప్రస్తుత కథనం వలన ప్రస్తుతం స్ఫురిస్తే అప్రస్తుత ప్రశంస. ఇక్కడే సేద్యం, సకాలవర్షం లేక ఫలం చేతికందకపోవటం అనే అప్రస్తుత కథనం వలన ప్రస్తుత కథాంశం స్ఫురించబడుతున్నది కాబట్టి అప్రస్తుత ప్రశంస.

2. 'పురుషకారం, దైవానుకూల్యం అనేవి రెండూ నీ లీలలే కృష్ణా!' అని అర్జునుడు శ్రీకృష్ణుడి దివ్యత్వాన్ని కీర్తించగా, శ్రీకృష్ణుడు తాను దివ్యుడు కానట్లు, లౌకిక వ్యక్తి అయినట్లు, దైవం ప్రత్యేకంగా ఉన్నట్లూ మాట్లాడిన మాటలివి. 'దైవం మానుష రూపేణ.'

3. ఎన్ని పాట్లు పడి వ్యవసాయం చేసినా తగిన సమయంలో పడిన వర్షం వలననే పంట పండుతుంది. అట్లాగే ఎవరెన్ని ప్రయత్నాలు చేసినా ఆ సమయానికి దేవుడు ప్రసన్నుడైతేనే అవి ఫలిస్తాయి- అనే ఈ తాత్పర్యంలో అర్థాంతర న్యాసాలంకారం కూడా సార్థకంగా ఔచిత్యవంతంగా ప్రయోగించబడింది. అర్థాంతరన్యాసంలో సామాన్యం విశేషం చేత కాని, విశేషం సామాన్యం చేతకాని సమర్థించబడాలి. ఇందులో సామాన్యం విశేషం చేత సమర్థించబడింది. ఇటువంటి అర్థాంతరన్యాసం తక్కువగా కవులు వాడుతుంటారు. విశేషాన్ని సామాన్యంతో సమర్థించే పద్ధతిని మార్చి చెప్పిన ఈ వాక్యం శ్రీకృష్ణుడి స్వభావాన్ని ధ్వనింపజేస్తున్నది. అతడు నిజంగా దివ్యుడే. కాని, అదివ్యుడనని సమర్థించుకొనబోతున్నాడు. ఇది నిజానికి వ్యత్యస్తమే. దానిని అలంకార ధ్వనితో తిక్కన ప్రదీప్తం చేశాడు.

4. శ్రీకృష్ణు డీ సందర్భంలో చెప్పిన ఈ పద్యం, రాబోయే పద్యం, ఈ రెండూ - ధర్మరాజు పలికిన రెండు పద్యాలకు ప్రతి రూపాలుగా కనపడతాయి. ఉదా.

ధర్మ: పగయడగించు టెంతయు శుభంబు... (3.21)

శ్రీకృష్ణ: వెరవున లావునం గృషికి వేయువిధంబుల ... (3.82)

ధర్మ : కావున శాంతి బొందుటయ కర్జము ... (3.22)

శ్రీకృష్ణ: కావున సంధికిం బురుషకార మొనర్చెద ... (3.83)

తిక్కన పద్యరచనలో సందర్భోచితంగా, పాత్రోచితంగా ఇటువంటి సంవాద శిల్పాలను ప్రదర్శిస్తాడు. శ్రీకృష్ణ పాత్రోచిత పద్య మిది. పద్యం సంబుద్ధితో అంతమైనప్పుడు ప్రతిపాద్యాంశంమీద శ్రోత సమాహితాన్ని నిలిపే సూచన గోచరిస్తుంది.

6. తెలుగు - పదాల పొందికకు ఈ పద్యం హృద్యమైన ఉదాహరణం. (సంపా.)

**ఉ. కావున సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయున్**
**దైవముచేఁత యెట్లగునొ దాని నెఱుంగ సుయోధనుండు సం**
**భావనసేసి పా లొసఁగు పాడియ కల్గిన బాల్యమాదిగా**
**నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే? 83**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; సంధికిన్= సంధికి; ఓపిన+అంతయున్= శక్తి ఉన్నంతవరకూ; పురుషకారము+ఒనర్చెదన్= పురుష ప్రయత్నం చేస్తాను; దైవము చేఁత+ఎట్లు+అగునొ?= దైవ మేమి చేయదలం చాడో; దానిన్+ఎఱుంగన్= ఆ విషయం

తెలియలేను; సుయోధనుండు= దుర్యోధనుడు; సంభావన+చేసి= మనమాట నాదరించి; పాలు+ఒసఁగు= భాగమిచ్చునట్టి; పాడియ కల్గినన్= న్యాయబుద్ధి గలవాడైతే; బాల్యము+ఆదిగాన్= చిన్నతనం నుండి; ఏ+విధిన్+ఐననున్= ఏ రకంగానైనను; చెఱుపన్= మిమ్ము నాశనం చేయటానికి; ఇంతలు పాపములు= ఇంతటి పాపపుపనులు; ఆచరించునే?= చేస్తాడా? (చేయడని అర్థం-)

**తాత్పర్యం:** నేను మాత్రం నా శక్తికొద్దీ సంధి సమకూర్చటానికే ప్రయత్నిస్తాను. దైవం ఏమి చేయదలచాడో చెప్పలేను. దుర్యోధనుడు ఆదరంతో రాజ్యభాగమిచ్చే న్యాయబుద్ధికలవాడైతే చిన్నతనంనుండి ఎన్నో విధాల మిమ్మల్ని పాడు చెయ్యటానికి ఇన్ని దుష్కృత్యాలు కావిస్తాడా? (కావించడని తాత్పర్యం.)

**విశేషం:** మూలాన్ని సందర్భోచితంగా మలచే నేర్పరితనానికి ఈ పద్యం చక్కని ఉదాహరణం. మూల శ్లోకా లివి-

**"అహం హి త త్కరిష్యామి పరం పురుషకారతః ।**
**దైవంతు న మయా శక్యం కర్మ కర్తుం కథంచన ॥ (సం. 5-77-5)**
**యత్తు వాచా మయా శక్యం కర్మణా చాపి పాండవ ।**
**కరిష్యే తదహం పార్థ న త్వాశంసే శమం పరైః ॥ (సం. 5-77-18)**

మూలంలో కృష్ణుడు విధి ప్రస్తావన చేశాడు. తెలుగులో అది లేదు. సంధి జరిగే నమ్మకం, ఆశా తనకు లేదని మూలంలో శ్రీకృష్ణుడు అన్నాడు. తెలుగులో పురుషయత్నం చేస్తాను కాని దైవానుకూల్యం ఎట్లా ఉంటుందో తెలియదన్నాడు. అంటే ఉండదనే ధ్వని. ఇది అర్జునుడి అంతరంగాన్ని ఊరట పరిచే వాక్యం. చిన్ననాటినుండి దుర్యోధనుడు ప్రదర్శించే ప్రవర్తనను పేర్కొని, అందులో మార్పు లేదు కాబట్టి సంధి జరగటం అసంభవమని ప్రత్యక్ష ప్రమాణాల నాధారంగా ప్రతిపాదించటం విశేషం. పద్య ఉత్తరార్థం తరువాతి కథార్థాల కనుగుణంగా మలచబడటం విశేషం. (సంపా.)

**వ. అది యెల్ల నట్లుండె; నిచ్చట విరాటు పసులన్ బెట్టింప నీవు వోయిన యప్పుడు భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు. 84**

**ప్రతిపదార్థం:** అది+ఎల్లన్+అట్లు+ఉండెన్= ఆ సంగతి అట్లా ఉండగా; ఇచ్చటన్= మత్స్యనగరంలో; విరాటు పసులన్+పెట్టింపన్= విరటుడి గోవులను మరలించటానికి; నీవు పోయిన+అప్పుడు= నీవు వెళ్ళిన సమయంలో; భీష్మండు= పితామహుడు; దుర్యోధను తోన్+చెప్పిన తెఱంగు= దుర్యోధనుడితో వచించిన విధ మిది:

**తాత్పర్యం:** ఆ విషయం అట్లా ఉంచుము. మత్స్యనగరంలో విరటుడి గోవులను కౌరవులు తోలుకొనిపోతుండగా, వాటిని మళ్ళించుకొనిరావటానికి నీవు వెళ్ళినప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో పలికిన పలుకులివి:

**ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు రా**
**లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే?**
**హెచ్చగుఁ గుందగుం దొడరు టెల్ల విధంబుల కోర్చు టట్లుగా**
**కిచ్చఁ దలంచి యొక్క మెయి నిత్తఱిఁ బొందగుచేఁతయుం దగున్. 85**

**ప్రతిపదార్థం:** వచ్చినవాఁడు= గోవులను మరలించటానికై అరుదెంచినట్టివాడు; ఫల్గునుఁడు= అర్జునుడు; అవశ్యమున్= తప్పక; గెల్తుము+అనంగన్ రాదు= మనమే జయించగలమని చెప్ప వీలుగాదు; రాలచ్చికిన్+ఐ= రాజ్యలక్ష్మికొరకు; పెనంగినన్=

పోరాడితే; బలంబులు రెండును= ఇరుసైన్యాలూ; గెల్వన్+నేర్చునే?= జయించగలవా? (జయించలేవని అర్థం); హెచ్చగున్= ఒకటి మించుతుంది; కుందు+అగున్= మరొక్కటి తగ్గుతుంది; తొడరుట= ఎదిరించటం; ఎల్లవిధంబులకున్+ఓర్చుట= జయాపజయాలను భరించుటే ఔతుంది; అట్లు+కాక= జయాపజయాలను కలిగించే పోరాటానికి దిగకుండా; ఇచ్చన్+తలంచి= మనసులో యోచించి; ఒక్క మెయిన్= ఒక రీతిని; ఈ+తఱిన్= ఈ సమయంలో; పొందు+అగు+చేఁతయున్+తగున్= పొత్తు సమకూడే పనికి పూనుకోవటమే యుక్తం.

**తాత్పర్యం:** ఆవులను మరలించుకొని పోవుటకై వచ్చినవాడు అర్జునుడు! తప్పక యుద్ధంలో మనమే గెలుస్తా మనటానికి వీలుగాదు. రాజ్యలక్ష్మి కొరకు సైన్యాలు తలపడితే ఇరుపక్షాలు జయం పొందగలవా? ఒకరిది పైచేయి, మరొకరిది క్రిందిచేయి అవుతుంది. జయాపజయాలను భరించటానికి సమ్మతమైతేనే సంగ్రామానికి దిగవలె. అట్లాకాకుండా ఆలోచించి ఏదో ఒక విధంగా సంధి కావించుకొనటం మంచిది.

**విశేషం:** 1. కృష్ణుడు మహావక్త. ప్రతిపాద్యాంశాలకు దృష్టాంతాలను పేర్కొంటూ మాట్లాడటం తర్కబద్ధ వాక్యవాదికి సహజగుణం. శ్రీకృష్ణుడు అర్జునుడితో చెప్పదలచుకొన్న అంశం- దుర్యోధనుడు సంధికి అంగీకరించడని. దానికి తార్కాణంగా ఉత్తర గోగ్రహణ సమయంలో భీష్ముడు పలికిన ఈ పద్యాన్ని (విరా. 4.234) పేర్కొని, దానికి దుర్యోధనుడిచ్చిన సమాధానాన్ని చెప్పాడు. అది - 'మనకూ పాండవులకూ ఎట్లా పొత్తు కలుగుతుంది? నేను వారి రాజ్యభాగం తిరిగి ఇవ్వను. యుద్ధం చేసి పరాక్రమంతో వారిని జయించటమే మార్గం. ఇది నా నిశ్చయం.' (విరా. 4.235)

2. యుద్ధంలో జయాపజయాలు అనిశ్చితాలని చెప్పే భీష్ముడి అభిప్రాయం లోకనీతి వాక్యమే. యుద్ధం వద్దనే వారూ, శాంతిని కోరేవారూ ఈ అంశాన్ని పేర్కొని, సంధి అనుసరణీయమని చెప్పుతారు. ఉద్యోగపర్వంలో ధర్మరాజు కూడా ఇటువంటి అభిప్రాయాలే వ్యక్తం చేశాడు. (3.18). యుద్ధంలో జయమో, ఓటమో నిశ్చయంగా చెప్పలేం. యుద్ధంలో ఓడితే మరణం కంటె దుర్భరమైన మనోవేదన పడాలి. కాబట్టి, సంధి మేలంటాడు ధర్మరాజు. ధర్మరాజూ, భీష్ముడూ ఒకే రకంగా, శాస్త్రీయంగా, లోకహితంగా, అచరణయోగ్యంగా ఆలోచిస్తున్నారని ఇక్కడ స్పష్టం. ఒకసారి ఇట్లాంటి యత్నం చేసి భీష్ముడు విఫలుడు కాగా, ఇప్పుడు ధర్మరాజు సఫలుడౌతాడా? అనే ప్రశ్న శ్రీకృష్ణుడు రేకెత్తించాడు.

3. 'వచ్చిన వాడు ఫల్గునుఁడు'- తిక్కనగారి ఈ వాక్యం తెలుగువారి జాతీయమైపోయింది. ఫల్గునుడు అంటే ఫల్గుని నక్షత్రంలో పుట్టినవాడు. పిడుగులు పడేటప్పుడు 'అర్జునః ఫల్గునః'' అని తలచుకొంటాం. పిడుగు పడి చనిపోతామన్న భయం కలిగే సమయంలో తలచుకొనే ఈ పేరు పిడుగుపాటు వంటి వాడు అనే అర్థంలో తెలుగువారి నోట రూఢికెక్కింది. ఎవడో అసాధ్యుడు వస్తున్నాడనే అర్థంలో తెలుగు వ్యవహారంలో రూఢి కెక్కింది. ఆ పలుకుబడికి ఈ పద్యం మూలం.

4. అచ్చమైన తెలుగు పదాలను దేశీయంగా వాడటం, ద్విత్వచకారప్రాస పద్యం ఎత్తుగడలో ఆశ్చర్యం, ముగింపులో హితబోధ అచ్చు గుద్దినట్లు కనపడుతున్నాయి.

5. పాత్రోచిత, సందర్భోచిత సంభాషణలకు తిక్కన పెట్టింది పేరు. భీష్ముడు శాంతి కాముకుడు. కాని, మహావీరుడు. అతడి దృష్టిలో అర్జునుడు అతిలోకవీరుడు. దానికి కారణం అతడు సాధించిన పాశుపతాస్త్రం, ఇంద్రాది దేవతలిచ్చిన అస్త్ర సంపద. 'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' అని లోకోక్తి. పండితుడే పండితుడిని అంచనా వేయగలడు. ఈ మాట ఈ పద్యంలో అక్షర సత్యం.

6. ఈ పద్యంలో అర్జునుడి పరాక్రమం ధ్వని. దానిని ధ్వనింపజేసి కౌరవ పాండవుల మధ్య సంధి కుదిరించాలన్న భీష్ముడి శాంతి సంకల్పం ధ్వని. కవిత్రయం ధ్వని ప్రస్థానానికి సంబంధించిన వారు. తిక్కన రసధ్వని మార్గంలో సాగాడు. శబ్దవాక్య

ప్రయోగంలో తిక్కన ఔచిత్య పాలనం చేస్తాడు. శబ్దగుణాల కంటె అర్థ గుణాలను ఎక్కువగా పోషిస్తాడు. ఈ పద్య రచనలో ప్రసాద గుణం ఉన్నది. బంధ శైథిల్యం అర్థ వైమల్య పోషకంగా నిలవటం ఇందులో విశేషం.

7. తిక్కన తన రచనలో కొన్ని పద్యాలను సందర్భోచితంగా పునరుక్తం చేశాడు. అట్లా చేసిన వాటిల్లో ఈ పద్యం, తరువాతి పద్యం కూడా ఉన్నాయి. కథలో కీలకపాత్ర నిర్వహించే ఈ రెండు పద్యాలూ వస్తుగత ప్రాధాన్యం కలవి. (సంపా.)

**వ. అనియె దానికతం డుత్తరం బిచ్చిన తెఱంగు. 86**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని భీష్ముడు చెప్పాడు; దానికిన్= అందుకు; అతండు= దుర్యోధనుడు; ఉత్తరంబు+ఇచ్చిన తెఱంగు= సమాధానం చెప్పిన విధం ఇది:

**తాత్పర్యం:** భీష్ముడి పలుకులకు దుర్యోధనుడు ఇట్లా సమాధాన మిచ్చాడు:

**ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు । నెట్లు వొందు గలుగు? నేను రాజ్య**
**భాగ మీను; సమరభంగిక విక్రమ । నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 87**

**ప్రతిపదార్థం:** మనకున్= మనకూ; పాండురాజు తనయ వర్గమునకున్= పాండురాజు యొక్క కుమార సమూహానికీ; ఎట్లు+పొందు+కలుగున్?= ఎట్లా పొత్తు కుదురుతుంది?; నేను రాజ్యభాగము+ఈను= నేను రాజ్యంలో భాగం పంచి వారి కివ్వను; సమర భంగికిన్+అ= యుద్ధపద్ధతికే; విక్రమ నిరతిన్+పూనుట= యుద్ధమునందు ఆసక్తి వహించటం; ఇది+అ= ఇదియే; నిశ్చయంబు= నా నిర్ణయం.

**తాత్పర్యం:** మనకూ పాండవులకూ పొత్తెలా పొసగుతుంది? నేను రాజ్యంలో వారికి భాగం పంచి ఇవ్వను. పరాక్రమంతో సమరం సాగించి రాజ్యమంతా ఏలుకొనటానికే నిర్ణయించుకున్నాను.

**వ. అని పలికె; నది యంతయుఁ బదంపడి మనమెల్ల వింటిమ కాదె! యా మాటల ఫలం బప్పుడ కనియు నా కష్టాత్ముండు వెండియుఁ దెలియండు. 88**

**ప్రతిపదార్థం:** అని పలికెన్= అని చెప్పాడు; అది+అంతయున్= ఆ సంగతంతా; పదంపడి= తరువాత; మనము+ఎల్లన్= మనమందరమూ; వింటిమి+అ కాదె!= విన్నాంగదా!; ఆ మాటల ఫలంబు= ఆ మాటల వలన కలిగిన లాభమేమిటో; అప్పుడు= ఆ ఉత్తర గోగ్రహణ యుద్ధంలో; ఆ కష్ట+ఆత్ముండు= ఆ కఠినచిత్తుడైన దుర్యోధనుడు; కనియున్= చూచి కూడా; వెండియున్= ఆ తరువాతనైనా; తెలియండు= గ్రహించలేకున్నాడు.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు భీష్ముడితో చెప్పిన మాటలు ఆ తర్వాత మనమంతా విన్నాం. ఆ మాటల ఫలమేమిటో ఉత్తర గోగ్రహణ యుద్ధంలో అతడు చవి చూచాడు. రణంలో నీచేత పరాజితుడైన తర్వాతకూడా ఆ దుష్టచిత్తుడు తన మూర్ఖపు పట్టు విడువలేకున్నాడు.

**తే. అతని గుణదోషముల చంద మట్లయుండె; । నాకు ధర్మజు బుద్ధిన నడపవలయు**
**నిత్తెఱం గాచరింపంగ నేఁగి యచట । నెల్ల తెఱఁగును నేర్పడ నెఱిఁగివత్తు.' 89**

**ప్రతిపదార్థం:** అతని గుణదోషముల చందము= ఆ దుర్యోధనుడి గుణావగుణముల తీరు; అట్లు+అ+ఉండెన్= ఆవిధంగా ఉండనీ; నాకున్= నాకు; ధర్మజుబుద్ధిన్+అ= ధర్మరాజు తలపుజాడలోనే; నడవన్+వలయున్= మెలగవలసి ఉన్నది; ఈ+తెఱంగు+

ఆచరింపఁగన్+ఏఁగి= సంధి సమకూర్చటానికి కురుసభకు వెళ్ళి; అచటన్= అక్కడ; ఎల్ల+తెఱఁగును= ఉన్న విధమంతా; ఏర్పడన్= విశదంగా; ఎఱిఁగి వత్తున్= తెలిసికొని వస్తాను.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడి గుణదోషాలు అట్లా ఉండనీ. నేను ధర్మరాజు కోరిన చందంగా రాయబారం నడపటానికి కురుసభకు వెళ్ళవలసి ఉన్నది. పొత్తు కుదర్చటానికి వెళ్ళి, అక్కడ వారి వర్తనాలెలా ఉన్నాయో తేటతెల్లంగా తెలిసి కొని తిరిగి వస్తాను.'

**విశేషం:** అర్జునుడితో పలికిన ఈ చివరి పద్యం రాయబారపు రహస్యం చెప్పే రాజనీతి మంత్రం. దుర్యోధనాదులు ఎట్లా వర్తించినా శత్రు రహస్యాలను తెలిసికొనటం, భేదోపాయాన్ని నిపుణంగా ప్రయోగించటం, విజయావకాశాలను మెరుగు చేసికొనటం - అనేవి శ్రీకృష్ణుడి హస్తినాపుర ప్రయాణ ప్రయోజనాలలోని రహస్యం. ధర్మజుడు కోరేదీ అదే. దానిని మనసు విప్పి అర్జునుడితో చెప్పిన ముగింపు పద్యం. (సంపా.)

**చ. అనిన ముకుందుతో నకులుఁ డల్లన యిట్లను 'నీకు ధర్మజుం**
**డును బవనాత్మజుండు నరుఁడుం దగఁ జెప్పుట రిత్తగాదు; మా**
**మనము లరణ్యవాసమున మత్స్యమహీపతిపాల నున్నయ**
**ద్దినముల భంగి గావు; కృపఁ దీవ్రతఁ గుందిన చంద మయ్యెడున్. 90**

**ప్రతిపదార్థం:** అనిన ముకుందుతోన్= అని పల్కిన కృష్ణుడితో; నకులుఁడు; అల్లన= తిన్నగా; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; నీకున్= నీకు; ధర్మజుండును= ధర్మరాజూ; పవన+ఆత్మజుండున్= భీమసేనుడూ; నరుఁడున్= అర్జునుడూ; తగన్+చెప్పుట= ఒప్పిదంగా తెలపటం; రిత్తకాదు= వట్టిమాటలు కావు; మా మనములు= మా మనసులు; అరణ్యవాసమునన్= అడవులలో నివసించేకాలంలో; మత్స్యమహీపతి పాలన్+ఉన్న= విరాట మహారాజు దగ్గర నివసిస్తున్న; ఆ దినముల భంగిన్+కావు= ఆ రోజులలో ఉన్నవిధంగా లేవు; కృపన్= దయ చేత; తీవ్రతన్= తీవ్రతచేత; కుందిన చందము+అయ్యెడున్= కొరతపడినట్లు ఉన్నవి.

**తాత్పర్యం:** సంధికార్యం సాధించటానికై కురుసభకు వెళ్ళి వస్తానన్న శ్రీకృష్ణుడితో నకులు డిట్లా అన్నాడు: నీకు ధర్మనందనుడూ, భీమసేనుడూ, అర్జునుడూ చెప్పినవి వట్టి మాటలు కావు. మా మనస్సులు అప్పు దరణ్యావాసకాలంలో, విరాట మహారాజు దగ్గర గడపిన అజ్ఞాత వాసకాలంలోని రోజులలో వలె ప్రతీకారేచ్ఛతో ఇప్పుడు లేవు. కౌరవులపట్ల కారుణ్యాతిశయంతో తీవ్రత తగ్గినట్లు ఉన్నాయి.

**విశేషం:** నకులుడు ధర్మజుడివలె వక్రోక్తులు కాక, భీముడివలె సూటిమాటలు కాక, అర్జునుడి వలె సున్నితంగా కాక, ఋజువాదిగా మాట్లాడతాడు. అందరికంటె ఆశావాదిగా కనపడతాడు. భీమాదులందరిలో కంటె సంధికి సుముఖంగా పలికిన అమాయకుడు నకులుడు. తాము ప్రతీకారేచ్ఛతో కాక కారుణ్యాతిశయంతో ఉన్నామని చెప్పటం అట్లా ఉండగా, ధర్మరాజాదులందరూ అటువంటి చిత్తవృత్తితోనే ఉన్నారని అంటున్నాడు. భీముడికంటె అమాయకుడివలె మాట్లాడాడు. అతడు అందగాడు. అతడి చిత్తం ఆర్ద్రం. అది ఈ పద్యంలో ప్రతిఫలించింది. (సంపా.)

**క. కడవఁగ నొకళ్ళు పసరము । నడిచిన నొక్కకులుఁ బెయ్య నడువ వలయునే?**
**చెడుతెరు వా కౌరవ్యుల । కడ నిలుచుంగాక మనకుఁ గ్రౌర్యం బేలా? 91**

**ప్రతిపదార్థం:** కడవఁగన్= ముందు మిగిలి; ఒకళ్ళు= ఒకరు; పసరమున్= ఆవును; అడిచినన్= కొట్టగా; ఒక్కళులు= మరొక్కరు; పెయ్యన్= దూడను; అడువన్+వలయునే?= కొట్టవలెనా?; చెడు తెరువు= చెడ్డదారి; ఆ కౌరవ్యుల కడన్= ఆ ధార్తరాష్ట్రులవద్దనే; నిలుచున్+కాక= ఉండుగాక; మనకున్= మనకు; క్రౌర్యంబు+ఏలా?= ఆ క్రూరత్వం ఎందుకు?

**తాత్పర్యం:** కృష్ణా! ముందుగా తొందరపడి ఒకడు గోవును కొట్టితే మరొకడు దాని దూడను కొట్టాలా? ఆ పని మంచిది కాదు. ఆ దుర్యోధనాదులు చెడుమార్గం అనుసరిస్తే అనుసరించనీ. మనం మాత్రం క్రూరులమై ఎందుకు మెలగాలి?

**విశేషం:** అలం: ప్రతివస్తూపమ. "వాక్యయో రేక సామాన్యే ప్రతివస్తూపమా మతా." రెండు వాక్యాలకూ ఒకే సమానధర్మముండి అది భిన్న శబ్దాల చేత చెప్పబడితే ప్రతివస్తూపమాలంకారం. 'ఒకడు ఆవును కొడితే మరొకడు దాని దూడను కొట్టాలా'- అనేది తెలుగు సామెత. కౌరవులు పాండవులను కష్టాల పాలు చేస్తే, తిరిగి పాండవులు కౌరవులను హింసించాలా? అని సాధువర్తనుడివలె మాట్లాడాడు నకులుడు. పై పద్యంలో మెత్తబడిన హృదయం ఈ పద్యంలో కరుణతో జాలువారింది. (సంపా.)

**సీ. గోగ్రహణంబునఁ గోలె నెంతయు మెత్తఁ । బడకుండుదురె వారు పద్మనాభ!**
**నీ యనుగ్రహమున నెమ్మిమైఁ గూడిన । బలము లేడక్షౌహిణులును, దొరలుఁ,**
**బాంచాల యాదవ పాండ్య కేకయ మాత్స్య । లొకతెంపు నెఱుఁగకయున్నవారె**
**భీమార్జునుల లావు పెంపును నీ సహా । యంబును గలుగుట కలుక రెట్లు?**

**ఆ. గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి । సెప్పి వారిఁ జక్కఁ జేయరెట్లు?**
**కార్య మీవు చెప్పఁగా విదురుండు వి । నంగ నెట్లు గాదనంగ వచ్చు?** 92

**ప్రతిపదార్థం:** పద్మనాభ!= కృష్ణా!; గోగ్రహణంబునన్+కోలెన్= తమ్ము ఓడించి విరటుడి పశువులను ఏకాంగవీరుడై అర్జునుడు మరలించుకొని వచ్చినప్పటినుండి; వారు= కౌరవులు; ఎంతయున్= మిక్కిలి; మెత్తన్+పడక+ఉండుదురె= మునుపటి కాఠిన్యము తగ్గి మెత్తబడకుంటారా? (మెత్తబడి ఉంటారని భావం); నీ అనుగ్రహమునన్= నీ దయచేత; నెమ్మిమైన్= ప్రేమచేత; కూడిన= మన పక్షంలో చేరిన; బలములు+ఏడు+అక్షౌహిణులును= ఏడక్షౌహిణుల సైన్యాలునూ; దొరలున్= ప్రభువులూ; పాంచాల, యాదవ, పాండ్య, కేకయ, మాత్స్యులు= ద్రుపద సాత్యకుల యొక్కయూ; పాండ్య కేకయ భూవల్లభుల యొక్కయూ; విరాట మహారాజు యొక్కయూ; ఒక తెంపున్+ఎఱుఁగక+ఉన్నవారె?= విశిష్టమైన సాహస ప్రవృత్తిని తెలియజాలకున్నారా?; (తెలియుదురని భావం); భీమ+అర్జునుల లావు= భీమార్జునుల యొక్క శక్తి; వెరవు= ఉపాయం; నీ సహాయంబును= నీ యొక్క తోడ్పాటున్నూ; కలుగుటకున్= ధర్మరాజునకు లభించటానికి; ఎట్లు+అలుకరు?= ఎందుకు జంకరు?; (జంకుదురని భావం); గురుఁడున్= ద్రోణాచార్యులూ; కృపుఁడున్= కృపాచార్యులూ; బాహ్లికుఁడున్= బాహ్లికుడూ; భీష్ముఁడును= పితామహుడూ; బుద్ధి చెప్పి= నీతి బోధించి; వారిన్= కౌరవులను; ఎట్లు+చక్కన్+చేయరు= ఎందులకు చక్కబరచకుంటారు?; (చక్కబరుస్తారని భావం); ఈవు= నీవు; కార్యము చెప్పఁగాన్= కర్తవ్యం ఉపదేశించగా; విదురుండు వినంగన్= విదురుడు వినగా; ఎట్లు= ఏవిధంగా; కాదు+అనంగన్ వచ్చున్?= కాదనటానికి వీలౌతుందా? (శక్యం కాదని భావం).

**తాత్పర్యం:** వీరాధి వీరులైన తమ్మందరినీ నిర్జించి అర్జును డొక్కడే విరటుడి పశువులను మళ్ళించుకొని వచ్చిననాటి నుండి కౌరవులు మునుపటి కరకుదనం వదలి మెత్తబడి ఉంటారు. నీ కృపవలన కూర్మితో ఏడక్షౌహిణుల సైన్యం

వాటి అధిపతులూ, ధర్మరాజు పక్షాన చేరటం వారెరుగరా? పాంచాల యాదవ పాండ్య మత్స్య దేశాల రాజుల సాహస ప్రవృత్తు లెట్టివో వారికి తెలియదా? భీమార్జునుల బల విక్రమాలు, గొప్పతనం, నీ తోడ్పాటు ధర్మపుత్రుడికి ఉన్నాయని వారు భయపడకుండా ఉంటారా? ద్రోణ కృపాచార్యులు, బాహ్లికుడు, భీష్ముడు, నీతి బోధించి ఎట్లాగైనా వారిని చక్కబరచకుండా ఉంటారా? విదురుడు వింటుండగా, నీవు చేసే కర్తవ్య బోధను తిరస్కరించటం వారికి ఎట్లా సాధ్యమౌతుంది?

**విశేషం:** ఈ పద్యం పాత్ర స్వభావోచిత సంభాషణకు అచ్చమైన ఉదాహరణం. నకులుడు తన వలెనే పరులు కూడా ఉంటారని భావించే ఋజుభావుకుడు. అందువలననే పరిస్థితులనుండి గుణపాఠాలు నేర్చికొని దుర్యోధనుడు మారి, సంధి కంగీకరిస్తాడని భావించాడు. శ్రీకృష్ణు డంతటివాడు పోయి మాట్లాడితే కౌరవులు భయభక్తులతో ఆయన మాట నంగీకరిస్తారని అంచనా వేశాడు. నకులుడి మాటలకు శ్రీకృష్ణు డేమీ మాట్లాడడు. బహుశః అతడి అమాయకత్వానికి పైకి కనపడని కడుపులోనే నవ్వుకొని ఉంటాడు - పఠితవలె. (సంపా.)

**వ. అట్లుంగాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రు లాదరింపకుండ వెఱవరే? నీ పోయినప్పుడ యీ కార్యంబు చక్కనగు' ననిన విని సహదేవుండు వాసుదేవున కిట్లనియె: 93**

**ప్రతిపదార్థం:** అట్లున్+కాక= అంతేకాక; నీవు తమ పాలికిన్+పోవుట= నీవు తమ దగ్గరకు విచ్చేయటం; ధార్తరాష్ట్రులు+ ఆదరింపక+ఉండన్+వెఱవరే= దుర్యోధనాదులు గౌరవించకుండ ఉండటానికి జంకరా?; నీ పోయినప్పుడు+అ= నీవు వెళ్ళినవెంటనే; ఈ కార్యంబు చక్కన్+అగున్= ఈ సంధికార్యం నెరవేరుతుంది; అనినన్ విని= నకులు డట్లా పలుకగా విని; సహదేవుండు వాసుదేవునకున్+ఇట్లు+అనియెన్= సహదేవుడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కృష్ణా! నీవు తమ దగ్గరకు వస్తే దుర్యోధనాదులు నిన్ను అనాదరించటానికి భయపడతారు. నీవు వెళ్ళిన వెంటనే కార్యం సఫలమవుతుంది' అని నకులు డన్నాడు. ఆ పిదప సహదేవుడు శ్రీకృష్ణుడితో ఇట్లా చెప్పాడు:

**ఉ. 'రక్కెస మాట లాడెదరు రాజును దమ్ములు; వానిలోన నీ**
**వొక్కటియైనఁ గాదనక యూఁ కొనుచుండుట యంతకంటె మే;**
**లక్కట! యిట్లు వేఁడికొననైనను బోయెదువో; సుయోధనుం**
**డెక్కడ? భూమిలోన సగమిచ్చుట యెక్కడ? దానవాంతకా! 94**

**ప్రతిపదార్థం:** దానవ+అంతకా!= రాక్షసులను అంతమొందించినవాడా!; కృష్ణా!; రాజును= ప్రభువగు ధర్మజుడునూ; తమ్ములున్= ఆయన తమ్ములునూ; రక్కెస మాటలు+ఆడెదరు= అయుక్తములైన పల్కులు పల్కుతున్నారు; వానిలోనన్= వారు చెప్పిన మాటలలో; నీవు= నీవు; ఒక్కటి+ఐనన్= ఒకమాటనైనను; కాదు+అనక= కాదనకుండ; ఊఁకొనుచున్+ఉండుట= ఊఁకొట్టుతూ ఉండటం, అంగీకరించటం; అంతకంటెన్ మేలు= వారు పల్కిన దానికంటె బాగున్నది; అక్కట!= అయ్యో!; ఇట్లు వేఁడికొనన్+ఐనను+పోయెదువో= ఈ రీతిగా వారిని బిచ్చమడగటానికి సైతం వెళ్ళుతావా?; సుయోధనుండు+ఎక్కడ?= దురాత్ముడైన ఆ దుర్యోధను డెక్కడ?; భూమిలోనన్= పుడమిలో; సగము+ఇచ్చుట+ఎక్కడ?= అర్ధ భాగ మివ్వటం ఎక్కడ?

**తాత్పర్యం:** 'ఔరా! ధర్మపుత్రుడూ, ఆతడి సోదరులూ తగని పల్కులు పల్కుతున్నారు. వాటిలో ఒక మాటనైనా తిరస్కరించక అన్నిటికీ నీవు ఊకొట్టటం అంతకన్న బాగుంది. రాక్షసులను విధ్వంసం చేసిన నీవు కురుసభకు

బిచ్చమడగటానికి సైతం పోతావన్నమాట? దుష్టచిత్తుడైన దుర్యోధను డెక్కడ? రాజ్యంలో మనకు సగం పంచి ఇవ్వటం ఎక్కడ? అది కల్ల.

**విశేషం:** 1. పాండవులలో చిన్నవాడైన సహదేవుడు చిచ్చుంద్రీ వంటివాడు. అభిమానధనుడు. పౌరుషోపేతుడు. సంధి మాటలు అతడికి సరిపడవు. అందువలన ధర్మరాజాదుల అభిప్రాయాన్ని కాదంటున్నాడు. ఇతడివి వీరోక్తులు, పౌరుషోక్తులు.

2. అభిప్రాయం నచ్చకపోతే ఎంతటి దగ్గరి వారైనా ఇతడికి పరాయివారుగా కనపడతారు. అందుకే ఇతడి దృష్టిలో ధర్మరాజూ, అతడి తమ్ములూ అయోగ్యమైన మాటలు మాట్లాడేవారట! సహదేవుడు ధర్మజుడి తమ్ముడు కాడా? నకులుడు తమ్ముడైనప్పుడు అతడు కాడా? ప్రశ్న అది కాదు. ధర్మజుడి మాటకు 'తందానతాన' పలికి తమ్ములనిపించుకొంటున్న నీడలు భీమాదులు. సహదేవు డా స్థితిని కోరటం లేదు. అందువలన వారికంటె తనను వేరు చేసి చెప్పుకొన్నాడు. ఇది కోపపరుల స్వభావం.

3. చేటతోపాటు పరుగు కూడా ఎండుతుందట. అట్లాగే ధర్మరాజాదులతోపాటు శ్రీకృష్ణుడు కూడా దైన్యస్థితికి రావలసి వచ్చిందట! ఎందుకంటే- తనవలె కాక ఆయన ధర్మజుడి తమ్ములతో చేరిపోయాడట! అందుకే దానవాంతకుడు ఇప్పుడు బిచ్చగాడివలె కౌరవసభకు పోతున్నాడట! వ్రతం చెడినా ఫలం దక్కదని అధిక్షేపించాడు యువకిశోరమైన సహదేవుడు.

4. ఇది సహదేవ పాత్రోచిత పద్యం. రంగస్థల ప్రదర్శనకు పనికివచ్చే నాటకీయ రచన.

5. 'రక్కసమాట లాడెదరు' వంటి మాటలు అతడి కసిని బైట పెట్టుతున్నాయి. ప్రకరణౌచిత్యంతో ప్రకాశిస్తున్నాయి.

6. పౌరుషోపేతుడైన సహదేవుడి మాటలు సాత్యకి వంటి ఆవేశపరులను ఆకర్షిస్తాయి. ధర్మరాజు మాటలలోని లోతులు తెలియని వెలితి పఠితకు తెలుస్తుంది. విశేషమేమంటే- ధర్మరాజు కాని, భీమార్జునులు కాని, శ్రీకృష్ణుడు కాని అతడిమీద ఏ విమర్శా చేయరు. సంధిప్రయత్నం జరుగుతున్నా, ధర్మజుడి స్కంధావారంలో యుద్ధాగ్ని చల్లారకూడదు. సవన యజ్ఞానికి ధర్మజుడింట నున్న త్రేతాగ్నులు-భీముడు, అర్జునుడు, సహదేవుడు. ఈ అగ్నులు చల్లారకుండటమే ఔచిత్యం. ధర్మజ వాసుదేవాదులు కోరేది కూడా అదే. (సంపా.)

**మ. తలఁపం గూడునె యింత లేసి దొర లీ దైన్యంబు? చుట్టంబులుం**
**జెలులుం దిట్టరె? లాఁతిరాజులకు మెచ్చే యి వ్విధం' బిట్టిదిం**
**గలదే? వేఁడఁగ ధర్మజుం డడుగఁ బోఁగాఁ గృష్ణుఁ డా ధార్తరా**
**ష్ట్రులు పాలీక చలంబునం బెనఁగ నిట్లుం గూడు దీపయ్యెనే? 95**

**ప్రతిపదార్థం:** ఇంతలు+ఏసి దొరలు= ఇంతటి శక్తిమంతులైన ప్రభువులు- ధర్మజ భీమార్జున నకులులు; ఈ దైన్యంబు= ఒకరిని యాచించే దీనత్వం; తలఁపన్+కూడునె?= తలచనైనా తలచవచ్చునా?; చుట్టంబులున్= బంధువులూ; చెలులున్= మిత్రులూ; తిట్టరె?= మనలను నిందించరా?; లాఁతి రాజులకున్= ఇతర రాజులకును; ఈ+విధంబు= ఇట్టి చందం; మెచ్చే?= మెప్పు గలిగిస్తుందా?; ఇట్టిదిన్+కలదే= లోకంలో ఇంత విడ్డూరం ఉంటుందా?; ధర్మజుండు+వేఁడఁగన్= పాలివ్వండని ధర్మరాజు యాచించగా; కృష్ణుఁడు+అడుగన్+పోఁగాన్= శ్రీకృష్ణుడు రాజ్యభాగం అడగటానికివారి వద్దకు వెళ్ళగా; ఆ ధార్తరాష్ట్రులు= ఆ కౌరవులు; పాలు+ఈక= భాగమీయకుండా; చలంబునన్= ఈర్ష్యతో; పెనఁగన్= పోరాటం సాగించగా; ఇట్లున్= ఇన్నివిధాల బాధపడి సంపాదించే; కూడు= తిండి; తీపు+అయ్యెనే?= అంత రుచికరం అయిందా?

**తాత్పర్యం:** ధర్మజాదుల వంటి దొడ్డదొరలు ఇంతటి దైన్యానికి దిగజారటం ఊహించని విషయం. ఇందుకు బంధువులూ స్నేహితులూ నిందించక మానరు. యుద్ధ సన్నద్ధులై వచ్చిన పాంచాలాది మహీపతులకు ఈ తీరు

మెప్పు కలిగించదు. లోకంలో ఇట్టి విడ్డూరం మరొకటి ఉంటుందా? ధర్మరాజు రాజ్యభాగం యాచించటం, దానిని పరమ పురుషుడైన శ్రీకృష్ణుడు అడగబోవటం, లోభదూషితులైన కౌరవులు భాగమివ్వక ఈర్ష్యతో పోరాడటం గమనిస్తే-ఇంతటి హీనమైన తిండి కూడా ఇంత ఇంపయిందా?

**విశేషం:** సహదేవుడు పాండవుల ఆత్మాభిమానం ఉట్టిపడేటట్లు మాట్లాడిన ఈ పద్యంలో అన్నీ ప్రశ్నార్థకాలే. పద్యం చివర 'ఇట్లుం గూడు దీపయ్యెనే?' అనే ప్రశ్న ఈ భావావస్థకు పరాకాష్ఠ. ఇట్లున్- అని చెప్పబడే దీనావస్థను నిరూపించేవి మిగిలిన ప్రశ్నలన్నీ. ధర్మరాజు చక్రవర్తి అయి కూడా యాచించటం మొదటి దైన్యం. దానివలన బంధుమిత్రులు తమను తేలికగా చూడటం రెండవ దైన్యం. లోకంలో మిగిలిన రాజులు కూడా దీనిని గర్హించటం మూడవ దైన్యం. ఈ విధంగా తనకు తాను తేలిక కావటం, బంధుమిత్ర రాజసంస్థానాలలో తేలిక పడటం కంటె అభిమానధనుడైన ప్రభువుకు హీనమైన స్థితి మరొకటి ఉండదని సహదేవుడి అభియోగం. పోగా, ఇంతటి దైన్యంతో ధర్మరాజు శ్రీకృష్ణుడిని హస్తినాపురికి పంపినా పని చక్కపడుతుందా అంటే- ఆ ఆశ కూడా లేదు. పైపెచ్చు ధర్మజ శ్రీకృష్ణుల ప్రతిపాదనలను కౌరవులు లోభంతో ఈర్ష్యతో త్రోసిరాజని పోరుకు దిగితే ఎంత పరువు పోయినట్లు? పరులచేత ఛీ అనిపించుకొంటూ పొందే తిండి రుచిగా అనిపించిందా? అని నిష్ఠురంగా మాట్లాడాడు. 'కూడు రుచిస్తుందా' అనేది తెలుగు జాతీయం. ఇక్కడ జీవన భృతికై రాజ్యాన్ని యాచించటం అనుసరణీయమైన విధానం కాదని భావం. సహదేవుడి మాటలు రోషావేశంతో కూడి అభిమాన స్ఫోరకాలుగా ఉన్నా, రాజనీతిలోని లోతులు తెలిసికొన్నవిగా కనపడవు. అందుకే శ్రీకృష్ణుడు అతడి మాటల నంత పట్టించుకొన్నట్లు లేదు. (సంపా.)

**ఉ. వీరలు ధర్మమార్గము సవిస్తరతం దగనాడి రేనియు**
**న్వారలు దాని కియ్యకొనినన్ విను మచ్యుత! యట్టిసంధి పెం**
**పారఁగ నేర్చునే? యుచితమైనది కయ్యము; వంకమాట లే**
**నేరఁ గురుప్రవీరుసభ నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ! 96**

**ప్రతిపదార్థం:** వీరలు= ధర్మజాదులు; ధర్మమార్గమునన్= న్యాయసరణిలో; సవిస్తరతన్= విపులంగా; తగన్+ఆడిరి+ఏనియున్= ఒప్పిదంగా చెప్పినప్పటికిన్నీ; వారలు= కౌరవులు; దానికిన్+ఇయ్యకొనినన్= అందులకు సమ్మతించి ఏదో కొంత ఇచ్చినను; అచ్యుత= శ్రీకృష్ణా!; వినుము= నా మాటలు వినుము; అట్టి సంధి= ఆ విధంగా కుదుర్చుకొన్న సంధి; పెంపు+ఆరఁగన్+ నేర్చునే?= గౌరవాన్ని కలిగించగలుగుతుందా?; కయ్యము+అ= యుద్ధమే; ఉచితము+ఐనది= యోగ్యమైనది; వంక మాటలు= కృత్రిమ వచనాలు; ఏన్+నేరన్= చెప్పటం నాకు తెలియదు; కురుప్రవీరుసభన్= ధృతరాష్ట్రుడి ఓలగంలో; నిశ్చయము= మా నిర్ణయము; ఇట్టిది కాఁగన్= ఇదేఅని; చెప్పుమీ!= పలుకుము.

**తాత్పర్యం:** అచ్యుతా! మావారు న్యాయమార్గ మెట్టిదో విపులంగా చర్చించినప్పటికీ, అందుకు కౌరవు లంగీకరించి ఏదో కొంత మా కిచ్చినప్పటికీ, ఈ పొత్తు పెంపు వహించదు. మాకు యుద్ధమే తగినది. వంకర మాటలు నాకు తెలియవు. కాబట్టి ఆ ధృతరాష్ట్రుడి నిండు కొలువులో నా నిశ్చయం ఇటువంటిదిగా చెప్పుము.

**విశేషం:** సంధికుదిరి కౌరవపాండవులు గతాన్ని మరచి కలసి స్నేహంతో జీవించటం అసంభవం. ఈ నిజం తెలిసి కూడా ఈ సంధి ప్రయత్నాలు దేనికి? అని ప్రశ్నించి ధర్మరాజాదుల పలుకులన్నీ 'వంక మాటలు'- వక్రోక్తులు అని అధిక్షేపించాడు సహదేవుడు. తనకు వంకమాటలాడటం చేతగాదన్నాడు. కాబట్టి తన అభిప్రాయం భిన్నమైనదని చెప్పడం అతడి ప్రత్యేకత. తెగించి మాట్లాడే స్వభావం ఈ పద్యంలో స్పష్టం. (సంపా.)

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొ; మ్మడవియందుం, బేరు వంచించియుం,
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగిరాఁ బాలీకపోవచ్చునే?
యది గాదేఁ దెగి బంటవై యఱుము మాయల్వన్ను నేర్పింకఁ జె
ల్లదుసూ నీ కని యా సుయోధనుని యుల్లం బుచ్చిపోనాడుమీ!' 97

**ప్రతిపదార్థం:** తుదిన్= చివరకు; రాజ్యమ్ము సగమ్ము+కొమ్ము= పాండు మహారాజు గడించిన రాజ్యంలో సగం తీసికొమ్ము; అడవియందున్= అరణ్యాలలో పన్నెండేళ్ళూ; పేరు వంచించియున్= పేర్లు మాటుపరచుకొని ఒక యేడూ; పదుమూఁడు+ ఏఁడులు= ఇట్లా పదమూడేళ్ళు; తిరిగి రాన్= మేము సంచరించి మరలిరాగా; నీవునున్= నీవునూ; పాలు+ఈక= భాగమొసగక; పోన్+ వచ్చునే?= తప్పించుకొనటానికి వీలవుతుందా?; అది+కాదు+ఏన్= అట్లా రాజ్యమొసగ నైతివేని; తెగి= సాహసించి; బంటవు+ఐ= వీరుడవై; అఱుము= యుద్ధంలో మమ్ము ఎదుర్కొని నశించుము; మాయల్+పన్ను నేర్పు= కపటం పన్నటంలోని చాతుర్యం; ఇంకన్= ఇకమీదట; నీకున్ చెల్లదుసూ+అని= నీకు సాగదుసుమా అని; ఆ సుయోధనుని+ఉల్లంబు+ఉచ్చిపోన్= ఆ దుర్యోధనుడి మనసుకు గ్రుచ్చుకొనేటట్లు; ఆడుమీ!= పలుకుము.

**తాత్పర్యం:** మా తండ్రి పాండురాజు గడించిన రాజ్యంలో ఎట్టకేలకు నీవు కూడ సగం తీసికో. పన్నెండేళ్ళు అరణ్యవాసం, మారుపేర్లతో ఒరులెరుగకుండ ఒక యేడు అజ్ఞాతవాసం ఇట్లా పదమూడేళ్ళు గడపి మేము ప్రాణాలతో మరలిరాగా రాజ్యంలో పాలుపంచి మాకివ్వక నీకు తప్పుతుందా? నీ వట్లా రాజ్యభాగం ఇవ్వటానికి ఇష్టపడకపోతే శూరుడవై సాహసంతో మమ్మెదుర్కొనుము. ఇకమీదట నీ టక్కుటమారాలు సాగవు - అని దుర్యోధనుడి హృదయానికి సూటిగా గ్రుచ్చుకొనేటట్లు నీవు మాట్లాడుము.'

**విశేషం:** 1. మూలభారతంలో సహదేవుడి ఈ మాటలు లేవు. అందులో ఎంతసేపూ సంధివద్దు, యుద్ధం వచ్చేటట్లే వ్యవహరించుమని చెప్పినట్లే ఉన్నది.

2. ఇది వీరోచిత భాషణం. అతడి వాదంలో అసలు రాజ్యాధికారం పాండురాజుదే. అతడు దయతో ఇస్తే - సగం పొందతగినవారు కౌరవులు. కాగా, 'అరణ్యాజ్ఞాతవాసాలు మాట ప్రకారం పూర్తి చేసి వచ్చిన తరువాత కూడా మా సహజ రాజ్యాన్ని మాకివ్వటానికి దుర్యోధనుడు కాదనటమేమిటి? అతడి కేమి హక్కున్నది? రాజ్యభాగం ఇవ్వకపోతే దుర్యోధనుడు దురాక్రమణం చేసిన వాడౌతాడు. దండార్హుడౌతాడు. మా దాడికి యోగ్యుడౌతాడు. ఇదీ అసలు వ్యవహారం. దీనిని కాదని మాయలూ మర్మాలూ చేస్తే చెల్లేది లే దని నిష్ఠురసత్యం. గుండె బ్రద్దలయ్యేటట్లు చెప్పు'మన్నాడు. 'పాండురాజు దయాభిక్షగా ఇచ్చిన రాజ్యం తింటున్నది దుర్యోధనుడు. దానిని గుర్తించకపోవటం అన్యాయం, అహంకారం, అక్రమంగా ఆక్రమించిన పాండవ భాగాన్ని ఇవ్వకపోవటం లోభగుణం, క్రౌర్యం, రెండు విధాలా తప్పు చేసింది కౌరవులే. వారు వధ్యులుకాని, యాచించదగినవారు కా'దని సహదేవుడి అభిప్రాయం. ఇట్లా విశిష్టంగా మాట్లాడటం పాండవులలో సహదేవుడికే చెల్లింది. అందుకే సజాతీయ ప్రవృత్తిగల సాత్యక్యాదుల మెచ్చుకోలు వెంటనే అతడికి లభించింది. (సంపా.)

3. ఈ పద్యాన్ని విమర్శకులు మరికొన్ని విధాలుగా వ్యాఖ్యానించారు. వాటిని 'జనహిత' వ్యాఖ్య ఇట్లా సమీకరించింది.

"సంస్కృత మహాభారతంలో వ్యాసఘట్టాలు ప్రసిద్ధాలు. తిక్కన కూడా కొన్ని పద్యాలు అలా వ్రాశాడు. వాటిల్లో ఇది ఒకటి. దీనికి కొంత మంది విజ్ఞులు ఎలా అర్థాలు చెప్పారో పరిశీలిద్దాం.

(i) "తిక్కన రచనలో రెండు మూడు ప్రౌఢ రచనావిన్యాసములు గూడ గనఁబడును'' అని చెప్పి శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురించిన ఉద్యోగపర్వం పీఠికలో ఈ పద్యం ఉదాహరించారు.

అర్థం: "అడవి యందున్= అరణ్యములోను; పేరు వంచించియున్= మారుపేరులు పెట్టుకొనియు; పదుమూఁడేఁడులు= పదమూడు సంవత్సరములు; ఉండి యను క్త్వార్థక మధ్యాహారము; తుదిన్= చివరను; రాజ్యమ్ము సగమ్ము గొమ్ము= అర్ధరాజ్యమును స్వీకరించుము (అని); నీవు= నీవు (దుర్యోధనుడని యర్థము); అనన్= (ధర్మరాజుతో) అనగా; (అట్లుచేసి); తిరిగి రాన్= తిరిగి రాగా; పాలీక పోవచ్చునే?= భాగమీయకుండుట న్యాయమా?; అది కాదేన్= అది నీయిష్టము కాకున్న; తెగి= సాహసించి; బంటవై= వీరుడవై; అఱుము= ఆక్రమించుము (గెలువుము); మాయల్ పన్ను నేర్పు= మాయలను గల్పించు తెలివి; ఇంకన్= ఇకమీద; చెల్లదుసూ= పనికి రాదు సుమా; నీకని; ఆ సుయోధనుని= ఆ దుర్యోధనుని యొక్క; ఉల్లంబు= డెందంబు; ఉచ్చిపోన్= డస్సిపోవునట్లుగా; ఆడుమీ= పల్కుమా.

తాత్పర్యం: వనవాసాజ్ఞాతవాసములు రెండును బదుమూడేడులు సలిపి, తుది రాజ్యమ్ము సగమ్ముగొమ్మని నీవనగా, ధర్మరాజు తిరిగిరా పాలీయకుండుట న్యాయమా? అట్లిష్టపడవేని సాహసించి వీరుడవై యుద్ధమున గెలువుము. మోసగించి సంపాదించు నేర్పింక నీకు సాగదు సుమా! యని యాసుయోధనుని యుల్లంబుచ్చిపోవునట్లు వచింపుమా! యని సహదేవుడు శ్రీకృష్ణునితో జెప్పెనని తాత్పర్యము. (చూ. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక; సంపుటి 17, సంచిక-5, పుట= 253).

(ii) "శ్రీ చంద్రాభట్ట రామమూర్తిగారు 'నీవనన్' అని సవరించి చెప్పిన యర్థము సముచితముగా కనిపించుచున్నది'' అని తిక్కన కావ్య శిల్పము అనే సిద్ధాంత గ్రంథంలో డా॥ కేతవరపు వేంకట రామకోటిశాస్త్రిగారు భావించారు.

అర్థం: "నీవునున్= నీవు కూడ; తుదిన్= మాకు బంచియిచ్చిన పిమ్మట; రాజ్యమ్ము సగమ్ము= అర్ధరాజ్యమును; కొమ్ము= పుచ్చుకొనుము; అడవియందున్= అరణ్యమునందును; పేరు వంచించియున్= అజ్ఞాతమునందును; పదమూడు వత్సరములు; తిరిగిరాన్= తిరిగిరాగా; పాలు+ఈకన్= భాగం ఇవ్వకుండా; పోవచ్చునే?= ఉండవచ్చునా?; అదికాదు+ఏన్= అది పొసఁగనిచో; తెగి= తెగించి; బంటవు+ఐ= వీరుడవై; అఱుము= ఎదుర్కొని నశింపుము; మాయల్+పన్ను= మోసములను పన్నునట్టి; నేర్పు= కౌశలము; నీకున్= నీకు; చెల్లదు+సూ(సుమీ); అని; ఆ సుయోధనుని= ఆ దుర్యోధనుని యొక్క; ఉల్లంబు= మనస్సు; ఉచ్చిపోన్= దూరిపోవునట్లుగా; ఆడుమీ= పల్కుము.

తాత్పర్యం: 'తొలుత మాకు సగము రాజ్యము పంచి యిచ్చి మిగిలిన దానిని నీవు పుచ్చుకొమ్ము. పదమూడు వత్సరము లరణ్యముల నజ్ఞాతమున గడపి వచ్చిన తరువాత రాజ్యభాగ మీయకపోవచ్చునా? అది పొసఁగనిచోఁ దెగించి వీరుడవై యుద్ధమునకు వచ్చి మమ్మెదుర్కొనుము. మాయలు పన్ను నీనేర్పు ఇక చెల్లదు సుమీ! యని యా దుర్యోధనుని హృదయమున గాటముగా గుచ్చుకొని పోవునట్లు పలుకుము.' (శ్రీ వావిలాల సోమయాజులు).

భీమార్జున నకులులు ధర్మరాజు అభిప్రాయాన్ని కాదనలేకా, ఔను అనటం ఇష్టం లేకా, ఎటూగాని మాటలు మాట్లాడారు కాని సహదేవుడు జంకు లేకుండా తన పైవాళ్ళు చెప్పలేని దానిని సూటిగా చెప్పాడు. పాండవులలో ముగ్గురు ఒకే మాట మీద ఉన్నట్లు, ఒక్కరు అందుకు భిన్నంగా ఉన్నట్లు అనిపిస్తుంది. కాని, తరువాత ద్రౌపది చెప్పబోయే మాటలకు సహదేవుని ఈ మాటలు ఉపోద్ఘాతంలాగా ఉన్నాయి. పాండవ పక్షంలో సంధికి అనుకూలత కంటే వ్యతిరేకతే ఉందని ఇక్కడి నుండి స్పష్టమవుతుంది' (ఉద్యోగపర్వము జనహిత వ్యాఖ్య. పు. 373-375).

(iii) శ్రీ పార్థసారథి రచించిన ఉద్యోగపర్వము - ఆమ్నాయకళానిధి వ్యాఖ్యలో ఇట్లా ఉన్నది.

అర్థం: "తుదిన్= కడపటి పక్షమగు; రాజ్యమ్ము సగమ్ము కొమ్ము; అడవియందున్= వనవాసమునను; పేరు వంచించియున్= మారు పేరులతోడ నజ్ఞాతవాసమునను; పదుమూఁడేఁడులు, తిరిగి రాన్; నీవు; పాలు= భాగమైనను; ఈక= ఇయ్యక; పోవచ్చునే; అది; కాదేని= ఇచ్చుట కాకపోయినన్; బంటవై= శూరుడవై; అఱుము= యుద్ధమునఁ జచ్చిపొమ్ము; మాయల్ పన్ను నేర్పు= మోసములు చేయు గట్టితనము; ఇంకన్= ఇఁట మీఁద; చెల్లదు సూ= జరుగదు సుమా; నీకున్; అని; సుయోధనుని యుల్లంబు= వాని మనసు; ఉచ్చిపోన్= నాటునట్లుగా; ఆడుమీ= భాషింపుమా!

తాత్పర్యం: న్యాయముగా రాజ్యమంతయు మాదైనను, గడపటి పక్షమున సగము రాజ్యమునైనను నీవు తీసికొని సగము మాకిమ్ము. మేమడవులందు బండ్రెండేళ్ళు తిరిగి మాఱుపేరులు పెట్టుకొని యజ్ఞాతవాసమున నొక్కయేఁడు వసించి తిరిగి వచ్చినపుడు మారాజ్యమంతయు నిచ్చుట యటుండ నీవు సగభాగమైన నియ్యకపోవచ్చునా? అట్లు నీ మనసు రాని యెడల శూరుడవై యుద్ధమునకుం దిగుము. లోఁగడవలె టక్కు చేసి రాజ్యముం గొనుట యింక ననుకూలింపదు సుమా!'' అని దుర్యోధనుడి మనంబున నాటునట్లు పలుకుము.' (పు.279) (సంపా.).

(iv) కొందరీ క్రింది విధంగా అర్థం చెప్పుతారు.

అర్థం: అడవియందున్= పన్నెండేళ్ళు అడవిలోనూ; పేరు వంచించియున్= మారుపేర్లు పెట్టుకొని; ఒక యేడు అజ్ఞాతంగానూ; (ఈ విధంగా) పదుమూఁడు+ఏఁడులు= పదమూడు సంవత్సరాలు; నీవునున్= (మావలెనే) నీవుకూడా; తిరిగి రా= తిరిగి రమ్ము; తుదిన్= చివర; రాజ్యమ్ము సగమ్ము= సగం రాజ్యభాగం; కొమ్ము= తీసికొమ్ము; పాలు+ఈక పోవచ్చునే?= (నీకు) భాగం ఇవ్వకుండా ఉండటానికి (మాకు) వీలవుతుందా?; అట్లాగే- అనుకొన్న విధంగా పదమూడేళ్ళు కడపి తిరిగి వచ్చిన మాకు నీవు కూడా భాగం ఇవ్వకుండా ఉండటానికి వీలులేదు; అది కాదు+ఏన్= ఆ రీతిగా ఇవ్వటానికి ఇష్టం లేకపోతే; తెగి= సాహసించి; బంటవు+ఐ= వీరుడవయి; అఱుము= నశించుము; (ఒప్పందం ప్రకారం మా భాగం మాకు ఇవ్వాలి లేకపోతే వీరోచితంగా యుద్ధంలో చావాలి అనటం); (అంతేకాని) - మాయల్- పన్ను నేర్పు= వంచనా శిల్పం; ఇంకన్= ఇకమీద; నీకున్; చెల్లదు, సూ= సాగదు సుమా; అని, ఆ - సుయోధనుని; ఉల్లంబు= మనస్సు; ఉచ్చిపోన్= దూసుకొని పోయేటట్లు; ఆడుమీ= మాటాడుము.

తాత్పర్యం: నీవు కూడా మా వలెనే పదమూడేళ్ళు తిరిగిరా, చివర సగం రాజ్యం తీసుకో. మేము వాటా పెట్టకుంటే నీవు ఒప్పుకుంటావా? అట్లాగే ఒప్పందం ప్రకారం పదమూడేళ్ళు కడపి తిరిగి వచ్చిన మాకు రాజ్యభాగం ఇవ్వకుండా ఉండటానికి నీకు వీలులేదు. అట్లా కాకపోతే యుద్ధంలో చావుము. (మా వాటా మాకు ఇచ్చి తీరాలి లేదా చచ్చి తీరాలి.) ఇంక నీకు మాయలు పన్నే నేర్పు సాగదు - అని ఆ దుర్యోధనుడి మనస్సు దూసుకొనిపోయే విధంగా మాటాడుము.

**మ. అనినన్ సాత్యకి ప్రీతుఁడై 'యితఁడు లెస్సై యుండఁబల్కెం; బ్రయో**
**జనముం గల్గదు గౌరవంబుఁ జెడు దుశ్చారిత్రకుం డా సుయో**
**ధను బోధింపఁగఁ బోయినన్; సరభసోత్సాహంబుమై నున్న వీ**
**రనికాయంబున కెల్లనుం బ్రియము సంగ్రామంబు మే లెమ్మెయిన్.' 98**

**ప్రతిపదార్థం:** అనినన్= అని సహదేవుడు పలుకగా; సాత్యకి= కృష్ణుడి తమ్ముడు; ప్రీతుఁడు+ఐ= సంతోషించినవాడై; ఇతఁడు= సహదేవుడు; లెస్స+ఐ+ఉండన్+పల్కెన్= చక్కగా మాట్లాడాడు; దుస్+చారిత్రకుండు= చెడువర్తనములు గల; ఆ సుయోధనున్= ఆ దుర్యోధనుడిని; బోధింపఁగన్+పోయినన్= మంచి తెలియ జెప్పుటకు యత్నించిననూ; ప్రయోజనమున్+ కల్గదు= లాభం కూడా ఉండదు; గౌరవంబున్+చెడున్= మన పరువుకూడా పోతుంది; సరభస+ఉత్సాహంబుమైన్+ఉన్న= సంతోషంతో కూడిన యుద్ధ యత్నంతో ఉన్న; వీర నికాయంబునకున్+ఎల్లనున్= వీరుల సమూహాని కంతటికినీ; ఏ+మెయిన్= ఏ విధంగా యోచించిననూ; సంగ్రామంబు ప్రియము= యుద్ధమే ఇష్టమైనది; మేలు= శ్రేయస్కరం కూడ.

**తాత్పర్యం:** సహదేవుడి మాటలకు సాత్యకి సంతోషించి ఇట్లా అన్నాడు: 'ఈతడు యుక్తంగా మాట్లాడాడు. దుర్యోధనుడు దుష్టవర్తనుడు. అతడికి నీతులు చెప్పబోతే ప్రయోజనముండదు. అంతే కాదు. మన గౌరవం కూడ ఊడిపోతుంది. సంతోషోత్సాహాలతో ఉన్న ఈ వీరులందరికీ యుద్ధమే ఇష్టం. ఏ విధంగా ఆలోచించినా మనకు సంగ్రామమే మంచిది.'

**వ. అనిన విని రథికవరు లందఱు 'సహదేవుం డింత యొప్పనాడునే? సాత్యకి పలుకు లిట్లుండునే? తక్కటివి యెక్కడి మాటలు? పగవారి నడిగికొనంబోవుట యుచితంబఁట! కయ్యంబు కర్జంబుగాదఁట! భంగంబు నీఁగికొనం దగదఁట! యనునివి మొదలుగా ననేకు లనేక ప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్క మ్రోఁతగాఁ జెలంగిన యెలుంగులు నింగి ముట్టెఁ దదనంతరంబ. 99**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= సహదేవ సాత్యకుల మాటలు విని; రథికవరులు+అందఱున్= రథమెక్కి యుద్ధం చేసే వీరాగ్రేసరులంతా; సహదేవుండు+ఇంత+ఒప్పన్+ఆడునే!= సహదేవు డింత ఒప్పిదంగా పల్కునా!; సాత్యకి పలుకులు+ఇట్లు+ఉండునే!= సాత్యకి మాటలింత బాగుంటాయా?; తక్కటివి= మిగిలినవారు చెప్పినవి; ఎక్కడి మాటలు?= ఏమి పలుకులు?; పగవారిన్+అడిగి కొనన్+పోవుట= శత్రువులను యాచించటానికి వెళ్లటం; ఉచితంబు+అఁట!= యోగ్యమట!; కయ్యంబు కర్జంబు+కాదు+అఁట!= యుద్ధం చేయటం తగదట!; భంగంబున్+ఈఁగి కొనన్+తగదు+అట!= అవమానం బాపుకొనుట తగదట!; అనునివి మొదలుగాన్= అనునిటువంటి మాటలతో; అనేకులు= పలువురు; అనేక ప్రకారంబులన్= పలు రకాల; వీర+ఆలాపంబులన్= వీరోక్తులతో; కొలువు+ఎల్లన్= సభఅంతా; ఒక్క మ్రోఁతగాన్= ఒకే ధ్వనితో నిండినదికాగా; చెలంగిన+ఎలుంగులు= చెలరేగిన కంఠధ్వనులు; నింగిన్+ముట్టెన్= అంబరం అంటాయి; తత్+అనంతరంబు+అ= ఆ పిదప.

**తాత్పర్యం:** సహదేవుడూ, సాత్యకీ చెప్పిన మాటలు విని రథికశ్రేష్ఠులందరూ 'ఆహా! సహదేవు డెంత చక్కగా పలికాడు. సాత్యకి మాటలు ఎంత బాగా ఉన్నాయి! తక్కినవారి మాటలు ఏమి మాటలులే. విరోధులను యాచించటానికి వెళ్లటం మంచిదట! యుద్ధం చేయడం తగదట! వారు చేసిన అవమానానికి ప్రతీకారం కూడదట!' అంటూ అక్కడ అనేకులు అనేక విధాల వీరోక్తు లాడుతుండగా కొలువుకూటంలో ఒకే రొద చెలరేగింది. వారి కంఠధ్వనులు ఆకాశాన్ని తాకాయి. ఆ తరువాత.

**విశేషం:** ధర్మజుడు పలికిన రాజనీతి వాక్యాలకు సభ నిశ్శబ్దంగా ఉండి పోయింది. భీమార్జున నకులులు పల్కిన మాటలకు మారుపల్కకుండా ఊరుకొన్నది. సహదేవుడి మాటలకు ఉబ్బితబ్బిబ్బయిపోయింది. మనసులలో ఉన్న యుద్ధోత్సాహాన్ని మాటలలో బైటపెట్టింది. సభ్యుల వీరాలాపాలు గమనిస్తే పాండవ స్కంధావారమంతా యుద్ధాన్నే కోరుతున్నదని ప్రకటితమైనది. దీనిని పోషించటమే శ్రీకృష్ణుడి సంకల్పం. అందుకే వారిని వారించని వైనం. (సంపా.)

### ద్రౌపది కృష్ణునితోఁ దన మున్ను పడిన భంగపాట్లు సెప్పుట (సం. 5-80-1)

**తే. ధర్మనందను పలుకులు దనకు హృదయ । తాప మొనరింప మోమున దైన్య మొంద**
**నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ । గనలి శౌరితో గద్గదకంఠి యగుచు. 100**

**ప్రతిపదార్థం:** ధర్మనందను పలుకులు= ధర్మజుడాడిన మాటలు; తనకున్= తనకు; హృదయతాపము+ఒనరింపన్= మనస్సునకు వ్యథ కలిగించగా; మోమునన్= ముఖంలో; దైన్యము+ఒందన్= దీనత తోపగా; ఉన్నపాంచాలి= అక్కడఉన్న ద్రౌపది; కనలి= కోపించి; శౌరితోన్= శ్రీకృష్ణుడితో; గద్గద కంఠి+అగుచున్= డగ్గుత్తిక పడిన గొంతుగలదై; ఇట్లు+అని= ఈ రీతిగా; ఒయ్యన్+ పలికెన్= తిన్నగా మాట్లాడింది.

**తాత్పర్యం:** ధర్మపుత్రుడి వాక్కులు తన హృదయానికి వేదన కలిగించగా, తన ముఖంలో దైన్యం నెలకొనగా; అందరి మాటలు వింటూ అక్కడున్న ద్రౌపది కోపించి, శ్రీకృష్ణుడిని చూచి డగ్గుత్తికతో మెల్లగా ఇట్లా అన్నది.

**విశేషం:** 1. తిక్కన ద్రౌపది పాత్రను ఈ ఘట్టంలో సమున్నతంగా సహజంగా చిత్రించాడు. పాండవులు యుద్ధనీతిని అనుసరించి మాట్లాడుతారు. ఆమె హృదయ నీతిని పాటించి మాట్లాడుతుంది. ఆమెలో ఆవిర్భవించే భావకదంబాన్ని ఆమె చేష్టలు అభినయ దర్పణాలుగా వ్యాఖ్యానిస్తాయి. తిక్కన నాటకీయ రచనా శిల్పం ఈమె హావభావాలలో ఆయువు పోసికొన్నది.

ఆమెకు ధర్మరాజు మాటలు మనస్తాపాన్ని కలిగించాయి. దాని వలన ఆమె ముఖం చిన్నబుచ్చుకొన్నది. ఇది మనస్తాపానికి అనుభావం. ఆమెకు కోపం వచ్చింది. 'కనలు' అనే పదం సార్థకం. ఆపాదమస్తకం కోపంతో ఎఱ్ఱబడింది. ఇది సాత్త్విక భావం. గద్గద కంఠంతో నెమ్మదిగా మాట్లాడటం మొదలుపెట్టింది. గాద్గద్యం తన పరితాపానికి అనువైన వాచికాభినయంతో కూడిన సాత్త్వికభావం. మెల్లగా మాట్లాడటం మనస్తాప వ్యంజకం.

2. మూలంలో ద్రౌపది ధర్మజాదుల పలుకులకు ప్రతిస్పందించిన వివరాలు కూడా ఇవ్వబడ్డాయి.

**"రాజ్ఞస్తు వచనం శ్రుత్వా ధర్మార్థ సహితం హితమ్**
**కృష్ణా దాశార్హ మాసీన మబ్రవీచ్ఛోకకర్శితా॥**
**సుతా ద్రుపదరాజస్య స్వసితాయత మూర్ధజా**
**సంపూజ్య సహదేవం చ సాత్యకిం చ మహారథమ్॥**
**భీమసేనం చ సంశాన్తం దృష్ట్వా పరమదుర్మనాః**
**అశ్రుపూర్ణేక్షణా వాక్య మువాచేదం మనస్వినీ॥" (సం. 5-80-1,2,3)**

ధర్మార్థ సహితంగా మాట్లాడిన ధర్మరాజు మాటలు విని ద్రౌపది శోకంతో కుమిలిపోయి శ్రీకృష్ణుడితో పలికింది. సహదేవుడిని, సాత్యకిని ప్రశంసించింది. చల్లబడిన భీముడిని చూచి గుండెలో కుమిలిపోతూ కళ్ళల్లో నీళ్ళు నిండగా ఆ అభిమానవతి ఇట్లా అన్నది. తిక్కన ధర్మరాజు ప్రసక్తిని చెప్పి మిగిలిన విశేషాలు వదలాడు. భీమాదులేమన్నా, ఎన్ని అన్నా ధర్మజుడి మాటను కాదనలేరు. శ్రీకృష్ణుడూ అంతే. అయినా ఆతడు స్వతంత్రుడు కాబట్టి తాను నమ్మింది చెప్పగలడు. చెప్పింది చేసి చూపించగలడు. అందువలన తిక్కన ద్రౌపది ధర్మజుడి మాటనే లెక్కలోకి తీసికొంటుంది. మిగతావారిని గురించి మాట్లాడకుండా ఉండటం ఇక్కడ ప్రకరణౌచిత్యం. తిక్కన ఔచిత్య పోషణ కిది తార్కాణం.

3. వ్యాసుడు మహర్షి. ధర్మరాజు పలికిన మాటలు ధర్మార్థ సహితాలైనా అవి ఆమెకు శోకం కలిగించాయని వ్యాఖ్యానం చేశాడు. అది సత్యమే అయినా ఆమె అవివేకాన్ని బైటపెట్టినట్లుంటుందని తిక్కన ధర్మార్థ ప్రసక్తి తీసికొని రాలేదు. ఆమెకు అంతస్తాపం కలిగిందని చెప్పాడు. వ్యాసుడు చిత్రించిన ద్రౌపది శోకమూర్తి. అశ్రుపూర్ణ నయన. మూలంలో అనుభావ సంచారిభావాలు వర్ణించబడ్డాయి. తిక్కన ద్రౌపది కన్నీటి వరకు రాలేదు. మొగం చిన్నబుచ్చుకొన్నది. మనసులో బాధపడుతున్నది. ఆ తాపానికి శరీరమంతా (మొగమంతా) నల్లబడిపోయింది. గొంతు బొంగురుపోయింది. అంటే కన్నీళ్ళు గొంతుకలోనే ఉన్నాయి కాని, ఇంకా కళ్ళల్లోకి పొంగలేదు. తిక్కనది క్రమదశావికాసస్ఫూర్తిగల అభినయ శిల్పం. రసాభ్యుదయ శిల్పంలో అది భాగం. (సంపా.)

**ఉ. అంతలు సేసి పోనడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు**
**త్తెంతురె? యిట్టి యూఱట మదిం బ్రియమందె యుధిష్ఠిరుండు దా**
**నంతన యూళ్లు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చు నొక్కొ? యీ**
**కంత కృపావిహీనమతి నాతఁడు నొంచునె యన్నదమ్ములన్? 101**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; అంతలు+చేసి= అన్ని దుండగా లొనర్చి; పోన్+అడిచి= అడవులకు తరుమగొట్టి; సంజయు చేతన్= సంజయుడితో; చెప్పి పుత్తెంతురె?= ఉపచార వాక్యాలు చెప్పి పంపుతారా?; ఇట్టి+ఊఱట‌న్= ఇటువంటి ఓదార్పు మాటలచేత; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; మదిన్+ప్రియము+అందెన్= మనసులో సంతోషించాడు; సుయోధనుఁడు= ఆ దుర్యోధనుడు; తాను; అంతన్+అ= అంత తేలికగా; ఏవురకున్= అన్నదమ్ము లైదుగురకూ; ఊళులు+ఐదు= ఐదు గ్రామాలను; ఇచ్చును+ఒక్కొ?= ఇస్తాడా?; ఈక= ఇవ్వక; అంత కృపావిహీనమతిన్= అంత నిర్దయమైన చిత్తంతో; అతఁడు= సుయోధనుడు; అన్నదమ్ములన్= సహోదరులను; నొంచునె?= బాధిస్తాడా?

**తాత్పర్యం:** కౌరవులు అంతటి అకృత్యాలు చేసి, అడవులకు తరిమివేసి, నేడు సంజయుడిచేత ఊరడింపు మాటలు చెప్పిపంపుతారా? ధర్మనందనుడు ఆ మాటలకు మనసులో ఎంతో ఉబ్బిపోగా, సుయోధనుడు తనకై తాను మనసొప్పి ఐదుమంది అన్నదమ్ములకు ఐదూళ్ళు ఇస్తాడా? ఇవ్వక దయారహిత బుద్ధితో అత డింకా ఇట్లా అన్నదమ్ములను బాధిస్తాడు కాబోలు!

**విశేషం:** 1. ద్రౌపది తనకు కలిగిన మనస్తాపానికి గల హేతువులను ఒక్కొక్క దానిని పేర్కొంటూ తన అభిప్రాయాన్ని శ్రీకృష్ణుడికి నివేదించుకొనటం ద్రౌపది ఉపన్యాసశిల్పంలోని మొదటి ముఖ్యాంశం. అందులో ఈ పద్యం మొదటిది.

2. ఇందులో అయిదూళ్ళడిగిన ధర్మరాజు దైన్యాన్నీ, అవి కూడా ఇవ్వని దుర్యోధనుని దౌష్ట్యాన్నీ పేర్కొంటూ 'కౌరవుల వలన పాండవులకు ఇంకా బాధలు తప్పవు కాబోలు' అని తన మనోవేదనను ప్రదర్శించింది. ఇందులో వ్యంగ్యంగా ధర్మజుడి అయిదూళ్ళ ప్రతిపాదనను ద్రౌపది గర్హిస్తున్నది. కౌరవులకు కాళ్ళిస్తున్నట్లు బాధపడుతున్నది. ఇది మనస్తాపానికి మొదటి కారణం.

3. ఈ పద్యం ప్రతిపద సార్థకం. 'అంతలు చేసి' అంటే- చెప్పలేనన్ని బాధలు పెట్టి అని భావం. 'పోనడచి' అన్నప్పుడు అన్యాయంగా రాజ్యం నుండి వెళ్ళగొట్టిన ఆ కాఠిన్యం వ్యంగ్యం. 'అక్కట!' ఇది జాలిని తెలిపేది కాదు. కౌరవుల నీతిలేని తనానికి అబ్బురపాటు వ్యక్తం చేసిన మాట. అంత చేసి, మరల సిగ్గు లేకుండా రాయబారం పంపుతారా? అని భావం. 'చెప్పి పుత్తెంతురె?' రాయబారం పంపుతారా? అని సామాన్యార్థం. కాని, కౌరవులే స్వయంగా వచ్చి క్షమాభిక్ష కోరి రాజ్యభాగం ఇవ్వవలసింది ఇవ్వకపోగా, సంజయుడితో కబురంపుతారా? అది ఆహ్వానం కాదు ప్రచ్ఛన్నమైన అపకారం. సంజయుడి రాయబారం వట్టి కన్నీటి తుడుపు. అతడి మాటలు శుష్కప్రియాలూ, శూన్య హస్తాలు, వాటికి ధర్మరాజు అమాయకుడై ఉబ్బితబ్బిబ్బయిపోయి, అయిదూళ్ళ బేరానికి దిగాడు. ఈ వరుసను ఇట్లా చెప్పటం వలన పై సన్నివేశాల కన్నిటినీ ధర్మజుడి వర్తనమే కారణమని ధ్వని. దానివలన ముఖ్యంగా ద్రౌపది హృదయతాపాన్ని పొందిందని భావం. (సంపా.)

4. ఇందు 'ఇట్టె యూఱట మదిం బ్రియమంది యుధిష్ఠిరుండు ---' అనేది అసమాపకం. తరువాతి తలంపు పైకొనటంచేత ఆ వాక్య మంతటితో ఆగింది. సహజమైన మాట వరస పాటించి చూపినాడు తిక్కన. 'సంజయుచేతఁ జెప్పి పుత్తెంతురె?' అనేచోట 'సంజయుచేత' అనే మాటలో ఊతమున్నది. ధర్మరాజును మోమాటపెట్ట గల నేర్పరిని -సంజయుడిని పంపినారే అని వారి సమయాభిజ్ఞతకూ, స్వభావగ్రహణ కౌశలానికీ, కుటిల ప్రయోగానికీ వింతపాటు. 'ఇట్టెయూఱట----యుధిష్ఠిరుండు' అనే వాక్యంలో వెక్కసపాటు. అంతలో 'తానంతనె---సుయోధనుఁ డిచ్చునొక్కొ?' అనిన సందియపాటు. 'అన్నదమ్ములన్' అనుటలో ఎత్తిపొడుపు. సహజసిద్ధమైన వాక్యరచన!' ఈ కంత కృపావిహీనమతి --- అన్నదమ్ములన్' అనుటలో ఎత్తిపొడుపు! తిక్కన రచనలో ఇటువంటి అసమాపక వాక్యాలు గల పద్యాలు ఉంటాయని, వాటిలో ఇది ఒకటనీ విమర్శకులంటారు. 'ప్రియమందె' అని ఉంటే అన్వయం సుకరం.

**చ. తన మును బడ్డ బన్నములుఁ దమ్ములపైఁ గల కూర్మి పేర్మి నీ**
**జనపతి సైఁపకున్నె? యది సక్కన; రాజ్యము పాలులేక తీ**
**ఱున కొడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె? 'చాలరైరి వీ'**
**రన రొకొ? నానలేమి యని యాడరె లోకమువారు కేశవా? 102**

**ప్రతిపదార్థం:** కేశవా!= శ్రీకృష్ణా!; ఈ జనపతి= ఈ ప్రభువైన ధర్మజుడు; తన మునుపడ్డ బన్నములున్= తా నింతవరకు పొందిన పరాభవాలు; తమ్ములపైన్+కల= తమ్ముళ్ళైన కౌరవుల మీద ఉన్న; కూర్మిపేర్మిన్= అనురాగాతిశయంచేత; సైఁపక+ ఉన్నె?= సహించకుండా ఉంటాడా? (సహిస్తాడని భావం); అది+చక్కన= అట్లా సహించటం మంచిదే; రాజ్యము పాలులేక= రాజ్యంలో భాగం లేకుండా; తీఱునకున్= సంధికి; ఒడఁబాటు+కల్గినన్= అంగీకారం కుదిరితే; లోకమువారు= ప్రజలు; ఎఱుంగమి పెట్టరె?= పాండవులు తెలివిమాలినవారని పల్కరా?; వీరు చాలరు+ఐరి+అనరు+ఒకొ?= వీరు యుద్ధం చేయటానికి సమర్థులు కారని అనరా?; నానలేమి+అని+ఆడరె?= సిగ్గులేనివారని నిందించకుండ ఉంటారా?

**తాత్పర్యం:** కృష్ణా! ప్రభువగు ధర్మజుడు తమ్ములైన దుర్యోధనాదులైన కౌరవులమీద తనకున్న ప్రేమాతిశయంవలన తా నింతవరకు పొందిన అవమాన పరంపరలు సహించిన సహించుగాక! మంచిదే. కాని రాజ్యంలో భాగం తీసికొనకుండా వారితో పొత్తుకు అంగీకరిస్తే మాత్రంలోకులు పాండవు లెంత అవివేకులు! ఎంత అసమర్థులు! ఎంత సిగ్గులేనివారు! అని నిందించరా?

**విశేషం:** 1. ద్రౌపది తన మనోవేదనకు రెండవ కారణం గురించి ఇందులో వ్యంగ్యంగా చెప్పుతున్నది. ఈ పద్యంలో ఒక క్రమాన్వయం ఉన్నది. ధర్మరాజు తాను పడ్డ కష్టాలన్నీ మరచిపోయి తమ్ముళ్ళయిన కౌరవులను ప్రేమాతిశయంతో మన్నిస్తే ఆయనకు బాగానే ఉండవచ్చునుగాని లోకులు మాత్రం పాండవు లెంత అవివేకులు అని నవ్విపోతారు. రాజ్యభాగం ప్రసక్తి లేకుండా సంధి చేసికొంటే ధర్మరాజుకు తృప్తిగానే ఉండవచ్చును కాని లోకులు మాత్రం పాండవుల వంటి అసమర్థులు మరెవ్వరూ లేరని ఎగతాళి చేస్తారు. ఈ రెండూ బాంధవ్యానికీ ఔదార్యానికీ ప్రతీకలుగా భావించి ధర్మరాజు మురిసిపోవచ్చును కాని లోకులు పాండవులకు సిగ్గులేదని ఏవగించుకొంటారు. కాబట్టి కౌరవులతో సంధి కొరకు చేసే ఎటువంటి ప్రయత్నమైనా పాండవులకు నగుబాట్లు కలిగిస్తుందనీ, అటువంటి పనిని చేసి తమ నిందను తామే కొనితెచ్చుకొంటున్నారనీ వారి భార్య అయిన ద్రౌపది మనోవేదన పడుతున్నట్లు చెప్పింది. పగవారితో పొత్తు బంధుత్వం కాదనీ, పరిహాస జనకమనీ ద్రౌపది అభిప్రాయం. (సంపా.)

2. 'ఈ జనపతి సైఁపకున్నె?' --- ఈ మాటలో ధర్మరాజు దయాగుణాన్ని అసమయ, అస్థానపతితంగా ఎగతాళి చేస్తున్నది ద్రౌపది. 'తమ్ములపైన్ - ఇక్కడ తమ్ములంటే పాండవులనే అర్థం అంత సమంజసంగా ఉండదు. పాండవులపై గల ప్రేమాతిశయం చేత ధర్మరాజు సహించకపోతాడా? అనటంకంటె, 'తమ్ములపై' అనేదానికి దుర్యోధనాదులని చెప్పితే ద్రౌపది వ్యంగ్య సహితమైన వాగ్విన్యాసానికి సూచకమవుతుంది. (సంపా.)

**శా. పెంపేదన్ దమకిట్టి తక్కువలు రూపింపంగ నేలా? విచా**
**రింపన్ వారిక మేలు సంధి; దము వారిం జూచినం దారు సా**
**ధింపం జాలరొ? కాక పోరఁ దగ మర్దింపం దలంపేని శం**
**కింపం బట్టొకొ? వారు బ్రాహ్మణులె యే కీడైన సైరింపఁగన్? 103**

**ప్రతిపదార్థం:** పెంపు+ఏదన్= గౌరవం చెడేటట్లు; తమకున్= తమకు; ఇట్టి తక్కువలు= ఇంతటి హీనత్వములు; రూపింపంగన్+ ఏలా?= తామే నిరూపించుకొనటం ఎందుకు?; విచారింపన్= తర్కించగా; సంధి= పొత్తు; వారికిన్+అ మేలు= కౌరవులకే లాభం; తమున్ వారిన్ చూచినన్= తమనూ కౌరవులనూ పోల్చుకొన్నప్పుడు; తారు= కౌంతేయులు; సాధింపన్+చాలరొ?= కార్యం నెరవేర్చుకొనలేరా?; కాక= అట్లా పని సాధించుకొనలేకపోతే; పోరన్= రణంలో; తగన్= చక్కగా; మర్దింపన్+తలంపు+ఏనిన్= దండించే ఉద్దేశం ఉంటే; శంకింపన్+పట్టు+ఒకో!= సందేహానికి తావున్నదా? ఏ కీడు+ఐనన్+సైరింపఁగన్= ఎట్టి దోషమైనా సహించి విడిచిపెట్టటానికి; వారు= ఆ దుర్యోధనాదులు; బ్రాహ్మణులె?= భూసురులా?

**తాత్పర్యం:** గౌరవం చెడిపోయేటట్లు తాము తక్కువవార మని ఏల నిరూపించుకొనవలె? బాగా ఆలోచిస్తే సంధి కౌరవులకే లాభం. తా మెంత మాత్రమో, కౌరవు లెంతమాత్రమో పోల్చి చూచుకొంటే కౌంతేయులు కార్యం సాధించలేరా? సంధి పొసగనప్పుడు పోరిలో వారిని దండించే తలపు వీరికి ఉంటే గెలవటంలో అనుమానానికి అవకాశమే లేదు. ఏ తప్పు చేసినా మన్నించి విడిచిపెట్టటానికి దుర్యోధనాదులు బ్రాహ్మణులా ఏమి?

**విశేషం:** 1. ద్రౌపది తన మనోవేదనకు గల మూడవ కారణం చెప్పుతున్నది. ఈ మనోవేదన ధర్మజుడి మాటల వలన ఏర్పడింది. ధర్మరాజు రాజ్యభాగం అర్థించటంలో తనను తాను తక్కువ పరచుకొన్నాడు. అందుకే ఆమె బాధ. కులక్షయం కాకుండా సంధి చేసికొనదలిస్తే అది పాండవులకంటె కౌరవులకే ఎక్కువ లాభం. వారందరూ ఎన్ని దుర్మార్గాలు చేసినా ప్రాణాలతో బ్రతుకుతారు. బలాబలాలతో పోల్చి చూచుకొంటే వారందరికంటె పాండవులే శ్రేష్ఠులు కదా! యుద్ధంలో ఎవరికి అపజయం కలుగుతుందో చెప్పలేమని భయపడి ఎందుకు సంధి చేయాలి?- అని ఆమె మనోవేదన. అసలు ధర్మరాజుకు యుద్ధం చేసి వారిని శిక్షించాలన్న తలపే మనస్సులో లేదు. ఉంటే ఇన్ని అనుమానాలూ, ఆలోచనలూ ఉంటాయా? అసలు సమస్య ధర్మజుడి శాంతికాముకత్వమే. అయితే, ధర్మజుడి శాంతి గుణాన్ని చూచి దుర్యోధనాదులు హర్షిస్తారా? గౌరవిస్తారా? అట్లా చేయటానికి వారు బ్రాహ్మణులు కారు కదా! - అని ద్రౌపది అధిక్షేపించింది. పాండవులు క్షత్రియుల వలె కాక బ్రాహ్మణులవలె వర్తించి తమ గౌరవాన్ని తామే జారవిడుచుకొంటున్నారని ద్రౌపది మనస్సులో వేదన పడుతున్నది. తమ ఉపాయంతో పాండవులు తమకే అపాయం తెచ్చుకొంటున్నారని ఆమె వేదన.

2. ఆత్మన్యూనతా భావం గల పాండవులకు వారి అతి సమర్థత గుర్తు చేస్తున్నది ద్రౌపది. 'విచారింపన్ వారికమేలు సంధి.' అనటంలో పాండవుల తెలివి మాలినతనాన్నీ, దూరదృష్టి రాహిత్యాన్నీ ఒక పనివల్ల కలిగే లాభాలాభాలను బేరీజు వేసికొనలేని అసమర్థతనూ వెక్కిరిస్తున్నది ద్రౌపది. తము వారిం జూచినం దారు సాధింపం జాలరొ?' -- పాండవుల ఆత్మ సామర్థ్యజ్ఞతా రాహిత్యాన్ని ఈసడిస్తున్నది. 'శంకింపం బట్టొకొ?' -- కౌరవ మర్దనమెంత ధర్మబద్ధమో నిరూపిస్తున్నది. 'వారు బ్రాహ్మణులె- సైరింపఁగన్' బ్రాహ్మణుడెంతటి పాపి అయినా 'బ్రాహ్మణో నహంతవ్యః', అనే ధర్మసూక్ష్మాన్ని చెప్పి క్షమించటానికి వారు బ్రాహ్మణులు కారు గదా అని అడుగుతున్నది. ద్రౌపది పాండవులను కౌరవ నాశనానికి పురికొల్పేవిధం ఆమె వాక్చాతుర్యాన్ని, హేతుబద్ధతనూ నిరూపిస్తున్నది. (సంపా.)

**ఉ. ఓట యొకింత యేనియు సుయోధను చిత్తమునందు లేదు; నీ**
**మాటలఁ బోవునే దురభిమానమ యెక్కుడు పూనుఁగాక; య**
**చ్చోటన సంగరంబు లగు చొప్పులు పుట్టిననైనఁ బాండవుల్**
**పోటున కిచ్చగింతురొకొ! పోదురొ కానల నుండ నచ్యుతా!** **104**

**ప్రతిపదార్థం:** అచ్యుతా!= శ్రీకృష్ణా!; ఓట= భయం; ఒకింత+ఏనియున్= రవ్వంతైనా; సుయోధను చిత్తమునందున్= దుర్యోధనుడి మనస్సులో; లేదు= లేదు; నీ మాటలన్= నీ హితవచనాలను; పోవునే= అనుసరిస్తాడా?; దురభిమానము+అ=

చెడ్డ అహంకారమునే; ఎక్కుడు పూనున్+కాక= మిక్కిలి వహిస్తాడు; ఆ+చోటన్+అ= ఆ కురుసభలోనే; సంగరంబులు+అగు చొప్పులు= యుద్ధం జరిగే సూచనలు; పుట్టినన్+ఐనన్= సంభవించినప్పటికిన్నీ; పాండవుల్= కౌంతేయులు; పోటునకున్= పోరాటానికి; ఇచ్చగింతురు+ఒకొ!= ఇష్టపడతారంటావా?; కానలన్+ఉండన్= అడవులలో నివసించటానికి; పోదురొ!= వెళ్ళుదురో ఏమో తెలియదు.

**తాత్పర్యం:** కృష్ణా! సుయోధనుడి మనసులో భయం ఒకింతైనా లేదు. నీ హితవచనాలను అనుసరిస్తాడా? అంతకంతకూ దురహంకారమే ప్రదర్శిస్తాడు. ఆ కురుసభలో యుద్ధం జరిగే సూచన లేర్పడితే అప్పటికైనా పాండవులు కదనానికి సిద్ధపడతారో? వనాలలోనే వసించటానికి వెళ్ళుతారో ఏమో?

**విశేషం:** సుయోధనుడు రాజ్యభాగ మీయనని పరుషంగా మాట్లాడి శ్రీకృష్ణుడికి కీడు తలపెట్టినా సభను వీడిరాకుండా ఓర్పుతో నిలబడి పాండవుల సత్ప్రవర్తన సభలోనివారికి తెలిపేటట్లు మాట్లాడి రమ్మని ధర్మజు డంటున్నాడు. ఆమాటలు ఆమెకు బాధ కలిగించాయి. దుర్యోధనుడికి 'ఓట' లేదట! లజ్జ, సిగ్గు, భయం, మొగమోటం, జంకు, గొంకు, భయం, భక్తి అనే భావాలు ఈ మాటలో స్ఫురిస్తాయి. వాటికి సంబంధించిన కొద్దిపాటి సంస్కారం కూడా లేని కరడు కట్టిన దురహంకారి దుర్యోధనుడు. అతడు మంచి మాటలతో వింటాడా? మరీ కొండెక్కి కూర్చుంటాడు. అతడు పాండవులు పనికిరానివారని భావించి యుద్ధానికి కాలుదువ్వుతాడు. అప్పుడైనా పాండవులు పౌరుషంతో యుద్ధానికి సిద్ధమవుతారా? లేదా, వంశనాశనమవుతుంది యుద్ధం వద్దని మేము ముందే అన్నాము కదా అని మాట నిలబెట్టుకొనటానికి అడవులకు పోతారా? - అని ద్రౌపది మనోవేదనతో ప్రశ్నించింది. అలనాటి కురుసభలో ప్రదర్శించిన మనః ప్రవృత్తినే ఇప్పుడు కూడా ప్రదర్శించి ధర్మరాజు రాజ్యావకాశాన్ని చేజేతులా జారవిడచుకొని మరల శాంతికై అడవులకు పోతాడేమోనని ఆమె వేదన! దీనితో ధర్మరాజు ప్రవర్తనయే ఆమె వేదనకు హేతువని తేలింది. (సంపా.)

**ఉ. ఏ నిటులంటి నా వలవ; దింకను నీవును రాజుఁ దమ్ములుం**
**గా నుచితంబు చూచి మన కార్యము మీసుజనత్వముం జెడం**
**గా నొకభంగి సేయక తగం గురువర్గము తోడి సంధి మీ**
**కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్.** 105

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఇటులు+అంటిన్+నాన్+వలవదు= నేనిట్లా మాట్లాడానని అనుకొనవద్దు; ఇంకను= మరియు; నీవును; రాజున్= ధర్మజుడూ; తమ్ములున్+కాన్= తమ్ములునూ కూడి; ఉచితంబు చూచి= తగిన పద్ధతిని పరికించి; మన కార్యమున్= మన పనియు; మీ సుజనత్వమున్= మీ మంచితనమును; చెడంగాన్= చెడిపోయేటట్లు; ఒక భంగి+చేయక= ఏదో విధంగా సరిపెట్టుకొనక; తగన్= యుక్తంగా; కురువర్గముతోడి సంధి= కౌరవులతో పొత్తు; మీకున్+ఐన తెఱంగునన్= మీకు శక్యమైన రీతిలో; వలచినట్టులు+అ= మీకిష్టమైన పద్ధతిలో; నేర్పులు+ఏర్పడన్= మీ చాతుర్యాలు వెల్లడి అయ్యేటట్లు; చేయుఁడు= చేయవలసింది.

**తాత్పర్యం:** అన్నా! నే నిట్లన్నానని వేరుగా తలంచవద్దు. ఇంకా నీవూ, ధర్మజుడూ, అతని తమ్ముళ్ళూ కలసి, ఏది యుక్తమో పరికించి, మన పనీ, మీ మంచితనమూ చెడేటట్లు, ఏదో ఒక విధంగా కాకుండా ఒప్పిదంగా ఉండేటట్లు, శక్యమైనంతలో మీకిష్టమైనట్లు, మీ నేర్పు తేటపడేటట్లుగా కౌరవులతో పొత్తు కుదుర్చుకొనండి.

**విశేషం:** ఇవి ద్రౌపది యొక్క గూఢామర్షోక్తులు. విపరీతవ్యంగ్యోక్తులు. మగవారు తన గోడు పట్టించుకొనకుండా తమకు తోచిన పనులు నిరంకుశంగా చేసికొంటూ పోతూంటే, తన మాట సాగదని తెలిసి కూడా, వ్యంగ్యోక్తులతో మెత్తని నిష్ఠురాలాడే

అభిమానవతి పలికే కాకూక్తు లివి. ద్రౌపది అనే మాటలకు అర్థాలు విపరీతంగా ఉంటాయి. అట్లా ఉండేటట్లు మాట్లాడటమే కాకువు.

1. నేనిట్లా అంటున్నానని మీరేమీ అనుకొనవద్దు- అంటే ధర్మరాజు చేస్తున్న సంధి యత్నాన్ని కాదన్న దానికి తప్పుపట్టబోకండి, నిరసించబోకండి. కాని, మాటలలోని వాస్తవాన్ని, నా మనసులోని బాధను గమనించండి. నా మాటలు నా మనసుకు తేటలు. వాటిని పట్టించుకొనటం కనీస కర్తవ్యం - అని భావం.

2. ఇంకను- మరింకొకమాట. ఇది నా సొంత గోడని అనుకొంటారేమో. అయినా నేను అనుకొంటున్న విషయాన్ని మీకు తెలుపుతున్నాను వినండి.

3. కృష్ణా! ఇప్పుడు జరుగుతున్న ప్రయత్నం నీవూ, పాండవులూ కలిసి రాజనీతికి ఉచితంగా చేస్తున్న కార్యం. కాదనటానికి నేనెవరిని? ఏమైనా, మీరు చేసే కార్యంలో మీ మంచితనంతో అందరూ మెచ్చుకొనే పద్ధతినే అవలంబిస్తారు కాని, నేను పడ్డపాట్లు మీకు జ్ఞాపకముండవు. అయినా, మీమీ ప్రయోజనాలు చెడకుండా కౌరవులతో సంధిని మీ నేర్పరితనం వాసికెక్కేటట్లు, మీకు కావలసినట్లు చేసి కొనటమేగా నేను కోరేది? - అని ద్రౌపది నిష్ఠురంగా మాట్లాడింది. ఈ సంధి ప్రయత్నం వలన పాండవులు మంచివారనిపించుకొంటారేమో కాని, నేను మాత్రం వారు మంచిపని చేస్తున్నారని అనలేను. నే ననకపోయినంత మాత్రాన ఎవరికి కావాలి? - అని ఎత్తిపొడుపు మాటలంటూ తన అభిప్రాయానికి కూడా తగినంత విలువ ఇవ్వటం కనీస కర్తవ్యమనీ, అది ఇంతవరకు పాండవుల మనసులలోకే రాలేదనీ, ఆత్మీయుడైన శ్రీకృష్ణుడితో మనవి చేసికొంటున్నది ద్రౌపది. గూఢాధిక్షేపోక్తులతో గూఢాభిమానాన్ని ప్రదర్శించిన గొప్ప పద్యం ఇది. ఇంతవరకు ధర్మజుడి సంధి యత్నాన్ని నిరసించింది. ఇకపై తన మనస్తాపాన్ని పరిగణనంలోకి తీసికొనని పరిస్థితికి పరితాపాన్ని వ్యక్తం చేస్తున్నది.

4. ద్రౌపది తన ఒక్కతెపైనా పూర్తి బాధ్యతను పెట్టుకొనటంలేదు. ఏదయినా జరగకూడనిది జరిగితే, నింద తన ఒక్కతె మీదనే పడుతుంది. ద్రౌపది గడుసరి మాటనేర్పూ, వ్యవహారజ్ఞానమూ అద్భుతాలు. తమ కార్యమూ చెడకూడదు. వారి మంచితనమూ, పౌరుషమూ చెడకుండా సంధికార్యాన్ని నిర్వహించాలట! తాను కర్తవ్యబోధ చేస్తూనే, మీకు నచ్చినట్లు, నేర్పుతో చక్కబెట్టండి అంటోంది. ఆమె వాఙ్నైపుణ్యం ప్రశంసనీయం.

**వ. అని మఱియు నిట్లనియె.** **106**

**తాత్పర్యం:** అని ఇంకా ద్రౌపది ఇట్లా మాట్లాడింది :

**ఉ. ఆఱడిఁ బోకయున్ ఫలము నందుటయుం గని పల్కనేరమిన్**
**మాఱట నోరి దాననయి మాటలు చిత్తమునందు నిల్ప కేఁ**
**గాఱులు ప్రేలెదన్; వినుఁడు; కర్జము నెగ్గును గాన నల్కమై,**
**వీఱిఁడి యైన మానిసికి వెండి వివేకము గల్గనేర్చునే?** **107**

**ప్రతిపదార్థం:** ఆఱడిన్+పోకయున్= నిందలపాలగుటయు; ఫలమున్+అందుటయున్= ప్రయోజనం సిద్ధించటమూ; కని= చూచికూడా; పల్కన్+నేరమిన్= (భర్తలు) మాటాడకపోవటం చేత; మాఱటనోరిదానన్+అయి= ఆడినమాటనే ఆడెడి దాననయి; చిత్తము నందున్= మనస్సులో; మాటలు నిల్పక= మాటలు దాచుకొనక; ఏన్= నేను; కాఱులు ప్రేలెదన్= ఏమిటో వదరుతున్నాను; వినుఁడు= నా మాట లాలకించండి; అల్కమైన్= కోపంచేత; కర్జమున్+ఎగ్గున్, కానన్= చేయవలసిన దానిని, హానిని తెలియలేను; వీఱిఁడి+ఐన+మానిసికిన్= వెర్రిపట్టిన మనిషికి; వెండి= మరల; వివేకము= యుక్తా యుక్తపరిజ్ఞానం; కల్గన్+నేర్చునే?= సమకూడగలదా?

**తాత్పర్యం:** నేను అల్లరి పాలవటమూ, తత్ఫల మనుభవించటమూ చూచి కూడా 'పల్కనేరమి'కి కర్త నేను అనటం కంటె, పాండవులనటమే మేలు. నా భర్తలు మాటాడక పోవటంచేత, ఆడినమాటనే మళ్ళీ మళ్ళీ ఆడే దాననయి, మాటలను మనస్సులోనే నిల్పలేక, నేను ఏదో నోటికి వచ్చినట్లు మాటాడుతున్నాను. వినండి. కోపోద్రేకం చేత ఏది కార్యమో, ఏది అకార్యమో తెలియకున్నాను. అవివేకి అయిన మానిసికి మళ్ళీ వివేకం కలుగుతుందా? (ఈ మాటలు మూలంలో లేవు.)

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 1. తన బాధను గాని, మాటనుగాని పట్టించుకొనని ధర్మజుడి వైఖరిమీద ద్రౌపది వ్యంగ్యమైన వాఙ్మయాస్త్రాలు ప్రయోగిస్తున్నది. అన్నీ విపరీత వ్యంగ్యార్థక కాకువులు.

2. కార్యాకార్య వివేకుడై ధర్మరాజు ఆచితూచి మాట్లాడుతాడు. ఆమాట బైటికి అనకుండా 'నాకు మంచీ చెడులూ తెలిసికొని మాట్లాడటం చేతకా'దని ద్రౌపది అంటుంది. అంటే. ఆమెకు చేతకాదని కాదు, చేతకాదని ధర్మరాజాదులు అనుకొంటారు కాబట్టి, తన మాటలు పట్టించుకొనరు కాబట్టి ఆ మాట అన్నది. పైకి వినయంగానూ లోన వేదనగానూ వినపడుతుం దీ వాక్యం.

3. మాట దాచుకోలేక పైకి బడబడ మాట్లాడే మనిషట ద్రౌపది! ఇది ధర్మరాజు ప్రవృత్తికి సాక్షాత్ విరుద్ధం. అదే అందులోని అధిక్షేపం. ధర్మజుడు బైటపడడు, ద్రౌపది బైటపడుతుంది. ఆమె చెడ్డదనిపించుకొంటుంది. అసలు మౌనంగా చేసేది ధర్మరాజే అని ఆమె ఆక్షేపం.

4. ఇటువంటి దాననైనా నామాట కాస్త వినండి-అని నిష్ఠురమాడింది. నామాట త్రోసివేయదగింది కాదని మందలింపు అందులో ధ్వని.

5. నాకు మంచి చెడ్డలు తెలియవు అనటం కూడా గడుసరిదనమే. మంచిచెడ్డలనేవి పురుష ప్రమాణంతో నిర్ణయించేవి కావనీ, అవమానాల పాలైన తనను దృష్టిలో ఉంచుకొని నిశ్చయించండనీ ద్రౌపది మనవి చేసింది.

6. 'కోపంతో వెర్రిదాన్ని అయిపోయిన నావంటి మనసున్న దానికి వివేకం ఉంటుందా?' అని అర్థాంతరన్యాసాలంకారం వలె మాట్లాడింది. ఆమె మాటలు అరణ్య రోదనలుగా మారటానికి గల కారణం ఆమె మనసులోని మాటను మన్నించకపోవటమే అని తన మనోవేదనను వ్యక్తం చేసింది.

7. 'కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ' అని కదా న్యాయం. సంధి విషయంలో పాండవ పత్ని అయిన ద్రౌపది యొక్క సలహా అడగలేదని అభిమానంతో అన్నమాట ఇది! ధర్మజుడి నిర్ణయమే అందరి నిర్ణయమన్న నిరంకుశ వైఖరిని ఆమె ఆత్మన్యూనతాభావ ద్యోతకమైన వ్యంగ్యాధిక్షేపోక్తులతో నిందించటం ఇందులోని సంభాషణ శిల్పం. (సంపా.)

8. మూలం: పునరుక్తంచ వక్ష్యామి విశ్రమ్భేణ జనార్దన- కాతు సీమన్తినీ మాదృక్ పృథివ్యా మస్తి కేశవ- "మాఱట నోరి దాననయి -----

**చ. వరమునఁ బుట్టితిన్, భరత వంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ**
**వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి, నీతి విక్రమ**
**స్థిరులగు పుత్త్రులం బడసితిన్, సహజన్ముల ప్రాపు గాంచితిన్**
**సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్. 108**

**ప్రతిపదార్థం:** వరమునన్+పుట్టితిన్= దేవతా వరప్రసాదాన జన్మించాను; భరత వంశమున్+చొచ్చితిన్= భరతుడు మూల పురుషుడుగా గల కురు వంశమునందు మెట్టాను; అందున్= ప్రసిద్ధమైన ఆ కురువంశంలో కూడ; పాండు భూవరునకున్=

పాండు మహారాజునకు; కోడలు+ఐతిన్= కోడలనైనాను; జనవంద్యులన్= ప్రజలచేత నమస్కరించదగినవారిని; పొందితిన్= పతులుగా పడశాను. నీతి విక్రమస్థిరులు+అగు= రాజనీతిలో, పరాక్రమంలోనూ చలించనివారైన; పుత్రులన్+పడసితిన్= కొడుకులను కన్నాను; సహజన్ముల ప్రాపు+కాంచితిన్= సోదరుల యొక్క అండగలదాననైనాను; సరసిజనాభ!= (కమలము నాభియందుగల) శ్రీకృష్ణా!; ఇన్నిటన్= ఇన్ని విధాల; ఎంతయున్= మిక్కిలి; ప్రశస్తికిన్+ఎక్కినదానన్= ప్రఖ్యాతి పొందాను.

**తాత్పర్యం:** కృష్ణా! నేను దేవతావర ప్రసాదం వలన జన్మించాను. భరతవంశం మెట్టాను. భరతకుల ప్రసిద్ధుడైన పాండు మహారాజుకు కోడలినైనాను. జనులచేత నమస్కరించదగిన భర్తలను పొందాను. రాజనీతి లోనూ, శౌర్యంలోనూ చలించని ఉత్తమ పుత్రులను కన్నాను. తోబుట్టువుల తోడు నాకున్నది. ఇన్ని విధాల నేను ప్రఖ్యాతి గడించాను.

**విశేషం:** 1. ధర్మరాజు ద్రౌపది చింతను పరిగణనంలోనికి తీసికొనటం లేదని ద్రౌపది మనోవేదన. దానిని మరింత మండించే లక్షణం ఆమె అస్తిత్వాన్నీ, వ్యక్తిత్వాన్నీ లెక్కించక పోవటం. అందుకని ఇంత అవజ్ఞకు గురి అయిన తనను గురించి తానే చెప్పుకొంటున్నది. ఇది అహంకారంతో చెప్పుకొనేది కాదు. తనంతట తానే చెప్పుకొని ఎదుటివారి మన్ననల కొరకై పాటుపడవలసిన దైన్యాన్ని ఎత్తిచూపి, ఎదుటివారిని ఎత్తిపొడవటానికి వాఙ్మయాస్త్రంగా ప్రయోగించటానికి అన్నది. అప్పటి రాజనీతిలో తన మనోభావానికి కూడా తగినంత గౌరవస్థానం ఇవ్వాలని ఒత్తిడి తేవటానికి ఈ పద్యం అన్నది. ఇది మానోక్తికి మధురోదాహరణం.

2. ఉత్తమ ఇల్లాలికి గౌరవ ప్రమాణాలు ఆరు. (1) పుట్టుక (పుట్టింటి) గౌరవం, (2) మెట్టినింటి గౌరవం. (3) అత్తామామల గౌరవం (4) భర్త గౌరవం, (5) సంతాన గౌరవం, (6) పుట్టింటి సహకార గౌరవం. ఈ షడ్గౌరవాలు పరిపూర్ణంగా గలది ద్రౌపది అని వరుసగా పేర్కొన్నది.

3. ద్రౌపది వాక్కులలో అహంకారం కంటె అభిమానం అధికంగా ధ్వనిస్తున్నది. (సంపా.)

4. పైపెచ్చు ఆమె అయోనిజ. ద్రుపద మహారాజు తపఃఫలం. వరమున పుట్టిన పుణ్యవతి. అట్టి సహధర్మచారిణి అభిప్రాయాన్ని, సలహాలను అవజ్ఞ చేయటం అసమంజసం. పాండవులు ఆ పొరపాటు చేశారని ఈ పద్యంలో చెప్పింది. శ్రీకృష్ణుణ్ణికూడా అటువంటి పొరపాటు చేయవద్దని తరువాత పద్యంలో హెచ్చరించబోతున్నది.

5. దీనికి మూలము.

**సుతా ద్రుపదరాజస్య వేదిమధ్యాత్ సముత్థితా,**
**ధృష్టద్యుమ్నస్య భగినీ తవ కృష్ణ ప్రియా సఖీ ॥**
**ఆజలాఢ కులం ప్రాప్తా స్నుషా పాణ్డోర్మహాత్మనః,**
**మహిషీ పాణ్డు పుత్రాణాం పఞ్చేంద్ర సమవర్చసామ్ ॥**
**సుతా మే పఞ్చభి ర్వీరైః పఞ్చ జాతా మహారథాః**
**అభిమన్యు ర్యథా కృష్ణ తథా తే తవ ధర్మతః, ॥ (సం. 3-80- 21, 22, 23)**

**వ. అట్లుంగాక.** **109**

**తాత్పర్యం:** అంతమాత్రమే కాకుండా.

**ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం**
**భావన సేయు; దిట్టి ననుఁ బంకజనాభ! యొకండు రాజసూ**
**యావభృథంబు నందు శుచియై పెనుపొందిన వేణి వట్టి యీ**
**యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ; గులాంగన ని ట్లొనర్తురే?** **110**

**ప్రతిపదార్థం:** పంకజనాభ!= పద్మము నాభియందు కలవాడా, శ్రీకృష్ణా! నీవు సుభద్రకంటెన్= నీ చెల్లెలైన సుభద్ర కంటెను; కడున్= మిక్కిలి; నెయ్యమున్= స్నేహమూ; గారవమున్= గౌరవమూ; తలిర్పన్= అతిశయించగా; సంభావన చేయుదు(వు)= నన్ను ఆదరిస్తావు; ఇట్టి ననున్= నీ మన్ననకు పాత్రురాలనైన నన్ను; ఒకండు= నోటితో ఉచ్చరించరానివాడైన దుశ్శాసనుడు; రాజసూయ+అవభృథంబునందున్= రాజసూయ యాగదీక్షానంతరం చేసే మంగళ స్నానంచే; శుచి+ఐ= పవిత్రమై; పెనుపు+ ఒందిన= మహిమ గాంచిన; వేణిన్+పట్టి= నా జడను పట్టుకొని; ఈ ఏవురు+చూడఁగాన్= ఈ భర్త లైదుగురూ చూస్తూ ఉండగా; సభకున్+ఈడ్చెన్= సభలోని కీడ్చి తెచ్చాడు; కుల+అంగనన్= ఇల్లాలిని; ఇట్లు+ఒనర్తురే?= ఇంతటి అవమానానికి గురిచేస్తారా?

**తాత్పర్యం:** పద్మనాభా! నీవు నన్ను నీ చెల్లెలు సుభద్రకంటె మిక్కిలి స్నేహ గౌరవాలతో ఆదరిస్తావు. ఇట్లాంటి నన్ను రాజసూయ యజ్ఞదీక్షానంతరం కావించిన మంగళ స్నానంతో పావనమై, మహిమ గాంచిన నా జడ పట్టుకొని ఒకానొకడు నా పతులైదుగురూ చూస్తుండగా కొలువులోనికి ఈడ్చి తెచ్చాడు. ఇల్లాలిని ఇట్లా పరాభవిస్తారా? నీవే చెప్పుము.

**విశేషం:** 1. శ్రీకృష్ణుడితో ఆత్మీయత ఉట్టిపడేటట్లు ద్రౌపది పలికిన గొప్పపద్య మిది. రసధ్వని రమణీయం. ప్రతిపదసార్థక రచన.

2. శ్రీకృష్ణుడు సుభద్రకంటె ప్రేమగా, ఆదరంగా ద్రౌపదిని చూచేవాడట. అది నిజం. సుభద్ర స్వంత చెల్లెలు. ఆమె యోగక్షేమాలన్నీ శ్రీకృష్ణుడే చూచాడు. రహస్యంగా అర్జునుడికిచ్చి వివాహం కూడా చేశాడు. అయినా, ఆయనకు ద్రౌపదంటే అంతకంటె ప్రేమ. కురుసభలో ఆమెను అవమానం నుండి రక్షించాడు. ఆమెను కనురెప్పవలె కాపాడుతూ ఆమెను గౌరవంగా మర్యాదలిచ్చి మన్నిస్తాడు. పాండవులకంటె శ్రీకృష్ణుడికి ఆమెయందు ఆదరణం అధికం. పాండవు లామె కష్టనిష్ఠురాలను పట్టించుకొనరు కాని, శ్రీకృష్ణుడు వాళ్ళవలె ఉండడు, ఉండకూడదు అని ఆమె అభిమతం. శ్రీకృష్ణుడికి అభిమాన పాత్రురాలు కావటం ఆ తరంలో గొప్ప అదృష్టం. గొప్ప యోగ్యత. అందుకే 'పంజకనాభ! అట్టి నన్ను' అని అనగలిగింది సార్థకంగా, సాభిమానంగా, చనువుగా.

3. అట్టి ఆమెను ఒకడు జుట్టుపట్టి సభకు లాగికొని తెచ్చాడని అన్నది. ఒకడు అనే మాటకు అల్పుడు, ఏకాకి, పేరుచ్చరించరాని పాపి - అనే అర్థాలు ఈ ప్రకరణంలో సరిపోతాయి. శ్రేష్ఠుడనే అర్థం ఉన్నా ఇక్కడ అది పొసగదు. ఆ ఒకడు దుశ్శాసనుడు.

4. ఒక అల్పుడు - మహాపరాక్రమవంతులైన 'ఈ యేవురు' (అని పాండవులవైపు చూపించి అనే అభినయాత్మక వాచకం) ఏమీ చేయలేక కళ్ళప్పగించి చూస్తూ ఉండగా, ఆమె కేశపాశాన్ని పట్టి లాగాడట! ఆ కేశపాశం సామాన్యమైనదా! రాజసూయయాగం చేసి, పరిసమాప్తిలో పవిత్రమైన అవభృథ స్నానం చేయడం చేత పవిత్రమైనది. సమ్రాజ్ఞి అర్హత పొందిన ఆ కేశం ఆమె సుమంగళీత్వానికి చిహ్నం. దాన్ని కించపరిచేటట్లు దుశ్శాసనుడు లాగాడని జ్ఞాపకం చేసింది. ఆ చేష్ట వెనుక ఉన్న కౌరవుల క్రౌర్యం తలపోసింది. పాండవుల నిస్సహాయ స్థితికి నిట్టూర్చింది. కృష్ణుడి దయకు ధ్వనిమయంగా కృతజ్ఞత చెప్పింది. 'ఇల్లాలిని ఇట్లా చేస్తారా?' అని ప్రశ్నించింది. 'ఇట్లు' అనే మాట చాలా విలువైనది. కౌరవులు పరుల ఇల్లాలిని ఇట్లా అవమానిస్తారా? అని, పాండవులు తమ ఇల్లాలిని అట్లా అగచాట్ల పాలుపడనిస్తారా? అని ఉభయులను మందలించింది. అసలు ఇల్లాళ్ళను ఇటువంటి అవమానాల పాలు చేసే వారితో పాలు పంచుకోబోతారా? అని అందరినీ ప్రశ్నించింది. దాని సమాధానం కొరకు శ్రీకృష్ణుడివైపే చూచింది. ఇది మానసిక వేదనను పతాక స్థానాన్ని చేర్చే ప్రశ్న.

5. సంధి వద్దని నేరుగా చెప్పక, ద్రౌపది ఈ విధంగా మాటాడటం వలన సంధిగాక యుద్ధమే అవశ్యం జరగాలని ఆమె అభిప్రాయంగా శ్రీకృష్ణుడు గ్రహించగలడు. 'నీ చెల్లెలు సుభద్రకే ఇటువంటి అవమానం జరిగితే నీవు ఊరుకొంటావా? మరి నీవు నన్ను అంతకంటె మిన్నగా ఆదరిస్తావు కదా! నా విషయంలో ఉపేక్షించవచ్చా?' అని ఆమె హృదయం. (సంపా.)

**ఉ. ఆ సభ కేకవస్త్ర యగు నట్టి ననుం గొనివచ్చి నొంచు దు**
**శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రములై తగుచేష్ట లేక నా**
**యాసలు మాని చిత్రముల యాకృతి నున్న యెడన్ ముకుందా! వి**
**శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం; బదియుం దలంపవే. 111**

**ప్రతిపదార్థం:** ముకుందా!= కృష్ణా!; ఆ సభకున్= ఆ కురుసభలోనికి; ఏకవస్త్ర+అగునట్టి ననున్= రజస్వలనైన నన్ను; కొని వచ్చి= ఈడ్చి తెచ్చి; నొంచు= బాధిస్తున్న; దుశ్శాసనున్+చూచుచున్= దుస్ససేనుడి దుండగం చూస్తూ; పతులు= నా భర్తలు; అసంభ్రములు+ఐ= తొట్రుపాటు చెందనివారై; తగుచేష్ట లేక= తగిన చర్య గైకొనక; నా+ఆసలు మాని= నాపై తమ ఆశలు వదలుకొని; చిత్రముల+ఆకృతిన్= బొమ్మల ఆకారంతో - నిశ్చేష్టులై; ఉన్న+ఎడన్= ఉన్నట్టి సమయంలో; విశ్వాసము తోడన్= నమ్మికతో; మనంబు= నా హృదయం; నిన్+కొలువన్+వచ్చెన్= నిన్ను సేవించటానికి వచ్చింది; అదియున్+తలంపవే= ఆ విషయాన్ని కూడా స్మరించుము.

**తాత్పర్యం:** ముకుందా! ఆ నాడు కురుసభకు ఒంటి చీరతో ఉన్న (బైటచేరి ఉన్న) నన్ను బలాత్కారంగా లాగితెచ్చి దుశ్శాసనుడు బాధిస్తుంటే నా భర్తలు దిగ్భ్రాంతి పొంది ఏమీ చెయ్యలేక నా మీది ఆశలు వదలుకొని చిత్రాలవలె కదలక మెదలక ఉండగా నమ్మికతో నా మనస్సు నిన్ను భజించటానికి పూనుకొన్నది. ఆ విషయాన్ని నీవు సంధి కుదిర్చేవేళ జ్ఞప్తికి తెచ్చుకో!

**విశేషం:** 1. సభానీతి లేక రాజనీతిని గురించి పై పద్యంలో మాట్లాడి, కుటుంబ నీతికి వెలియైన రాజనీతిని గురించి ఇక్కడ పేర్కొంటున్నది ద్రౌపది. ఏకవస్త్ర (ముట్టయిన) అయిన స్త్రీని పురుషుడు తాకరాదు. ఆమెను బాధపెట్టరాదు. ఇది కుటుంబ నీతి, గృహనీతి. దీనిని రాజనీతితో ధ్వంసం చేయటం అవినీతి. దుశ్శాసనాదులు చేసిన అవినీతి దండార్హం. అయినా, దానిని పాండవులు చూస్తూ, ఎటువంటి ప్రతిస్పందన లేకుండా, ఆశలు వదలుకొని, బొమ్మలవలె కూర్చున్నారు. చక్కని నాటకీయ సన్నివేశ స్మృతి. అట్టి దయనీయ సమయంలో విశ్వాసంతో తలచినంతమాత్రంలోనే శ్రీకృష్ణుడు ఆమెను కాపాడాడు. దానిని గుర్తుంచుకొనమంటున్నది ద్రౌపది.

2. 110వ పద్యంలో శ్రీకృష్ణుడికి తనపై నిజసోదర నిర్విశేషమైన ఆదరం ఉందని చెప్పి, యిప్పుడు ఈ పద్యంలో తనకు శ్రీకృష్ణుడిపై ఎంత విశ్వాసమో చెప్పుతోంది ద్రౌపది. ఆ సమయంలో నిజ భర్తలకు తన యెడగల ఉపేక్షాభావం చేత, ఆమె నిస్సహాయత ఎవరికైనా జాలి కలిగిస్తుంది. 'అదియుం దలంపవే' - సంధి కుదిర్చేటప్పుడు అవన్నీ మనసులో పెట్టుకొని ప్రయత్నిస్తే, అది ఎట్లాగూ కుదిరేది కాదు. శ్రీకృష్ణుడికే సంధి కుదర్చటం ఇష్టంకాదు. అది అతని పూర్వపు మాటలలో తెల్లమైంది. ఇప్పుడు ద్రౌపదికి కూడా సంధి ఇష్టం కాదని స్పష్టమౌతున్నది.

3. ఇందులో చక్కని ధ్వని ఉన్నది. 'ప్రస్తుత సంధి ప్రయత్నంలో కూడా- కౌరవుల చేత అవమానించబడిన నేను పరోక్షంగా- అదే స్థితిలో నేటికీ ఉన్నాను. సంధి చేయటం నన్ను నిండుకొలువులో అవమానించడం వంటిదే' అని ధ్వని. ఆనాడు మిన్నక కూర్చున్నారు పాండవులు. ఈ రోజు కూడా తనను పట్టించుకొనక, తనను అవమానం నుండి రక్షించక, తమ మంచితనం కొరకు దుర్మార్గులతో స్నేహం చేయబోతున్నారు. వారితో కలిసి బ్రతకాలని భావిస్తున్నారు. ఈ పరిస్థితులలో ద్రౌపది ఆనాటి వలెనే శ్రీకృష్ణుడితో తన మొర చెప్పుకొంటున్నది. ఆనాడు శ్రీకృష్ణుడు ఆమెను ఎట్లా ఆదుకొన్నాడో, అట్లాగే ఇప్పుడూ అట్టి ప్రేమతో ఆదుకొనవలెనని ప్రార్థిస్తున్నది. ఆనాటి సభకూ ఈనాటి సభకూ చక్కని సామ్యాన్ని ధ్వనింపచేసిన ద్రౌపది వాక్కులు ఆలోచనామృతాలు.

4. అర్థవ్యక్తి అనే శబ్దార్థగుణ స్వభావాలు ఈ పద్యంలో హృద్యంగా రాణిస్తున్నాయి. (సంపా.)

**చ. అరయమిఁ జేసి కోడ లన కప్పుడు దాసిగఁ జేసె; నమ్మహా**
**పురుషుని పాలికిం బతులు వోవఁగ వీరలతోన యేను జె**
**చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో? యటుఁగాక పాడిమై**
**వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ! నిశ్చయింపుమా!' 112**

**ప్రతిపదార్థం:** మాధవ!= లక్ష్మీవల్లభా!; అరయమిన్+చేసి= ముందు వెనకలు విచారించక; కోడలు+అనక= కోడలు అని కూడా భావించక; దాసిగన్+చేసెన్= నన్ను ఊడిగపుదానిగ చేశాడు; ఆ+మహాపురుషుని పాలికిన్= ఆ దొడ్డ మనిషి ధృతరాష్ట్ర మహారాజు కడకు; పతులు పోవఁగన్= నా భర్తలు వెళ్ళగా; వీరలతోన్+అ= వీరి వెంటనే; ఏను= నేను; చెచ్చెరన్+చని= శీఘ్రముగా పోయి; వారికిన్= ఆ పెద్దలకు; కోటరంబు= కోడరికము; తగన్+చేయుదునో= చక్కగా చేయవలెనో; అటుఁగాక= అలా కాకుండా; పాడిమైన్= న్యాయముతో; వరవుడము= దాస్యము; ఓపి= సహించి; చేయుదునొ= చేయవలెనో; నిశ్చయింపుమా= నీవే నిర్ణయించవలసినది.

**తాత్పర్యం:** అన్నా! ముందు వెనుకలు ఆలోచించక కోడలని కూడా భావించక అప్పుడు నన్ను దాసిని గావించిన ఆ పెద్దమనిషి ధృతరాష్ట్ర మహారాజు దగ్గరకు నా భర్తలు వెళ్ళగా, వారి వెంట నేను కూడా వెళ్ళి ఆ పెద్దలకు కోడరికము చేయాలో లేక న్యాయప్రకారం వారికి దాస్యమే చేయాలో నీవే నిర్ణయించి చెప్పుము.'

**విశేషం:** 1. ఈ పద్యం ఒక కీలకాంశం. ద్రౌపది సమయోచిత ప్రతిభకు మచ్చుతునక. సభాపర్వంలో 'మున్ను తన్నోడి ఆపైన నన్నోడెనా? నన్ను మున్నోడి విభుఁడు ఆమీద తన్నోడెనా?' అని అడిగిన చిక్కుముడి ప్రశ్నవంటిది.

2. హస్తినాపురంలో జరిగిన మాయా ద్యూతంలో ధర్మజాదులు ఓడి దాసులయ్యారు. ద్రౌపదిని దాసిగా భావించి కౌరవులు అవమానించారు. దానిని ధృతరాష్ట్రుడు గమనిస్తూనే కిమ్మనకున్నాడు. ఆపైన రాజ్యాన్నిచ్చాడు. పాండవులు ప్రభువులైనారు. ద్రౌపది రాణి అయింది. ఆపైన పునర్ద్యూతంలో ఓడి అరణ్యాజ్ఞాతవాసాల పాలయ్యారు. ఆ పరిస్థితులకూ ధృతరాష్ట్రుడు సాక్షిగా నిలిచాడు. 'ఒకవేళ ఇప్పుడు హస్తినాపురికి పోతే పాండవుల స్థితి ఏమిటి? రాజ్యాన్ని వదలిపోయిన పాండవులకు రాజ్యమున్నట్లా? లేనట్లా? దుర్యోధన ధృతరాష్ట్రులు ఇస్తేనే ఉన్నట్లా? ఇవ్వకపోతే లేనట్లా? ఒకవేళ రాజ్యభాగం ఇవ్వకపోయినా, వారితో కలిసి ఉండే సంధి కుదిరితే ధృతరాష్ట్రుడి సమ్ముఖంలో పాండవుల అధికారమేమిటి? రాజ్యంలేని రాజులా? ఇచ్చిన రాజ్యాన్ని కోల్పోవటం ద్వారా వారు దాసులుగానే పరిగణించబడతారా? రాజ్యం స్వీయాధికారం వలన ఏర్పడేదా? కౌరవుల దయాభిక్షవలన కలిగేదా? ఇంతటి సందిగ్ధావస్థలో పాండవులు ధృతరాష్ట్రుడి మందిరానికి పోతే వారెట్లా మెలగుతారో, మెలగరాదో వారికే ఏమైనా నిశ్చితాభిప్రాయం ఉన్నదో లేదో నాకు తెలియదు. కాని, నేను ధృతరాష్ట్రుడికి కోడరికం చేయాలా? దాస్యం చేయాలా? అన్నది నీవే నిశ్చయించి చెప్పు'మని శ్రీకృష్ణుడిని వేడింది. స్వాభిమానాన్ని సర్వనాశనం చేసే సంధిని ఆమె అంగీకరించదు. ఆమె మనోవేదన పాండవులకు పట్టదనీ, దానిని శ్రీకృష్ణుడే పట్టించుకొని తగిన పరిష్కారం చూపించాలనీ ఆమె పరితాపం. (సంపా.)

**వ. అని యట్లుగ్గడించి. 113**

**తాత్పర్యం:** అట్లా పలికి.

**ఉ. ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి, వెండ్రుకల్**
**దా వలచేతఁ బూని, యసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో**

**నా విలసిల్లి వ్రేలఁగ, మనంబునఁ బొంగు విషాద రోషముల్**
**గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై. 114**

**ప్రతిపదార్థం:** ద్రోవది= ద్రౌపది; బంధురంబు+అయిన= ఒప్పిదమైన; క్రొమ్ముడిన్= క్రొత్త సిగముడిని; గ్రమ్మన= శీఘ్రంగా; విడ్చి= విప్పి; వెంట్రుకల్= శిరోజాలు; తాన్= తాను; వలచేతన్+పూని= కుడిచేతపట్టుకొని; అసిత+ఛవిన్= నల్లని కాంతితో; పొల్చు= ఒప్పు; మహాభుజంగమో= గొప్ప సర్పమేమో; నాన్= అన్నట్లు; విలసిల్లి= ప్రకాశించి; వ్రేలఁగన్= వ్రేలాడుతుండగా; మనంబునన్= తన హృదయంలో; పొంగు= అతిశయిస్తున్న; విషాదరోషముల్= దుఃఖమూ కోపమూ; కావఁగన్+లేక= అణచుకొనలేక; బాష్పములు= కన్నీరు; క్రమ్మఁగన్= కన్నులలో ఆవరించగా; ఆర్త+ఐ= దుఃఖితురాలై; దిగ్గనన్+లేచి= తటాలున లేచి.

**తాత్పర్యం:** ద్రౌపది తన ఒప్పిదమైన అప్పుడే వేసుకున్న కొప్పును గ్రక్కున విప్పి, శిరోజాలను కుడిచేతదాల్చి నల్లని రంగుతో నిగనిగలాడే పెద్ద పాములలె ప్రకాశిస్తూ వ్రేలాడుతుండగా తన హృదయంలో చెలరేగు దుఃఖాన్నీ, క్రోధాన్నీ ఆపుకొనలేక కనులలో అశ్రువులు నిండగా విలపిస్తూ తటాలున లేచి దుఃఖితురాలై. (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** 1. అలం: ఉత్ప్రేక్ష. శ్రీకృష్ణుడి ఎదుట ద్రౌపది తన మనోగత వేదనను ప్రదర్శించిన మాటలతో పాటు ఆమె చేష్టలను కూడా వర్ణించిన పద్యాలలో ఇది ఆణిముత్యం.

2. ద్రౌపది ఉపన్యాసంలో తిక్కన చేసిన వర్ణనగా నిలిచిన పద్యం ఇది ఒక్కటే. మిగిలినవన్నీ ద్రౌపదీ సంభాషణలే. ఈ పద్యం నాటకీయతలోని ఆంగిక, ఆహార్య, సాత్త్వికాభినయాల సంపుటి. అందువలన అభినయం రీత్యా ఒక ప్రత్యేక స్థానం దీనికి ఉన్నది. తెలుగు సాహిత్యంలోని మంచి పద్యాలలో ఇది ఒకటిగా ఆంధ్రులు భావిస్తారు.

3. ద్రౌపది కురుసభలో పొందిన అవమానానికి ప్రత్యక్ష ఉద్దీపన విభావం ఆమె దీర్ఘ శిరోజవేణి. ఆమె శిరోజాలు అవభృథస్నానపూతమైనవి. అవి దుశ్శాసనుడి కరస్పర్శతో అపవిత్రమయ్యాయి. ఆ అవమానానికి తగిన ప్రతీకారంకొరకు ఆమెహృదయంలో పగ అనే చిచ్చు మండుతున్నది. ఆ అగ్నినుండి రేగిన పొగలా అన్నట్లున్నాయి ఆమె శిరోజాలు. అంతేకాదు. అవి కౌరవులను కాటందాలని బుసలు కొట్టుతున్న కాలమహాభుజంగమా అన్నట్లున్నాయి. కౌరవ నాశాన్ని కోరే ప్రతీకార వాంఛకు ప్రతీక ఆమె శిరోజ మంజరి.

4. ఇందులోని ఉత్ప్రేక్షాలంకారం సార్థకం. ఉపమాన ధర్మసంబంధం చేత ఉపమేయాన్ని ఉపమానంగా భావించటం (లేదా ఊహించటం) ఉత్ప్రేక్ష. ఇందులో ద్రౌపది శిరోజవేణి ఉపమేయం. అది 'అసితచ్ఛవిఁ బొల్చు మహాభుజంగమో' అన్నట్లు ఇందులో భావింపబడుతున్నది. అలంకారం సార్థకం కావటంతో అలంకారౌచిత్యం ఏర్పడింది. అలంకార స్వభావంతో భావికథార్థ ధ్వని ప్రతీయమానం ఔతున్నది.

5. పాండవ యుద్ధనీతిలో కీలకస్థానం వహించవలసిన అంశం ద్రౌపది జడ. అది అపవిత్రమైనది. పవిత్రం కావాలంటే మార్గమేమిటి? ఆలోచించండని సూచిస్తున్నది. అక్కడ ఆమె ప్రదర్శించిన అభినయం ఆమె భావాలకు ఆంగిక వ్యాఖ్యానం. ఆమె శిరోజాలను తన కుడిచేతిమీద ఉంచింది. శ్రీకృష్ణుడు తోబుట్టువు కాబట్టి కుడిచేతిమీద ఉంచి భారమంతా ఆయనమీద ఉండునట్లు చేసింది. ముడి విప్పటంలో ఆత్రుత ప్రకటించింది. మాటలు వెలువడటానికి ముందే మనోవేదన వెలికి తీసికొని వస్తున్నది. తన శిరోజాల విషయంలో తనకు ఊరట కలిగించే ఉపాయం ఎవ్వరూ ఊహించక పోవటంతో విషాదం మొదట తలయెత్తింది. తనంతట తాను ఆ విషయం శ్రీకృష్ణాదులకు జ్ఞాపకం చేయవలసి వచ్చినందుకు రోషం పొంగివచ్చింది. ఆ అవమాన వేదన స్మరణ చేత దుఃఖం పెల్లుబికి కన్నీళ్ళు క్రమ్మాయి. ఇక ఆలస్యం పనికి రాదని పగ వగను వెనకకు త్రోసి

తానే ముందుకు వచ్చింది. దానితో ఆమె దిగ్గున లేచింది. అదుపులో పెట్టుకొనలేని దుఃఖం ఆర్తిగా మారింది. గుండెలో కరడు గట్టిన వేదన మాటలతో బైటపడాలంటే అంతవరకూ అడ్డుగా నిలిచిన దుఃఖం ఆర్తిగా మారి త్రోవ ఇవ్వాలి. లోతైన అభినయ రహస్యాలను ద్రౌపది పాత్రయందు సంగ్రహ సుందరంగా వర్ణించి తిక్కన రసాభ్యుదయ శిల్పాన్ని ప్రదర్శించాడు.

6. ఏడుస్తూ ద్రౌపది శిరోజాలను శ్రీకృష్ణుడి ముందు ఉంచటం ఈ నాటకీయతలోని పరాకాష్ఠ. తీరని సమస్యను దేవుడి ముందుంచి వేడుకొన్న స్ఫూర్తి ఇందులో ఉన్నది. ఎదుట లేని శ్రీకృష్ణుడిని అప్పుడు తలచింది. ఎదుట నున్న మాధవుడి ముందు ఇప్పుడు తన గోడు వినిపించింది. అప్పు డాదుకొన్నాడు కృష్ణుడు. ఇప్పుడూ ఆదుకోక తప్పదు.

7. ఈ పద్యానికి మూల మిట్లున్నది -

> **"ఇత్యాక్త్వా మృదుసంహారం వృజినాగ్రం సుదర్శనమ్,**
> **సునీల మసితాపాఙ్గీ సర్వగంధాధివాసితమ్ ॥**
> **సర్వలక్షణసంపన్నం మహాభుజగవర్చసమ్,**
> **కేశపక్షం వరారోహా గృహ్య వామేన పాణినా ॥**
> **పద్మాక్షీ పుణ్డరీకాక్ష ముపేత్య గజగామినీ,**
> **అశ్రుపూర్ణేక్షణా కృష్ణా కృష్ణం వచనమబ్రవీత్ ॥ (సం. 5.80.33-35)**

మూలంలో ద్రౌపది 'వామేన పాణినా' అని జడను ఎడమచేత పట్టినట్లున్నది. తిక్కన 'వలచేత' అని కుడిచేతికి మార్చాడు. మూలంలో 'అశ్రుపూర్ణేక్షణా' అని ఉండగా తెలుగు 'విషాదరోషముల్ గావఁగలేక' అని ఉన్నది. విషాదరోషాలను ఆపుకొనలేకపోతే బాష్పాలు క్రమ్మటం తప్పదు. (సంపా.)

**వ. గోవిందు ముందటంబెట్టి యిట్లనియె : 115**

**తాత్పర్యం:** కృష్ణుడి ఎదుట తలవెండ్రుకలను పారబట్టి ఇట్లా అన్నది :

**క. 'ఇవి దుస్ససేను వ్రేళ్ళం। దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి; కౌ**
**రవుల కడఁ దీఱుమాటల। యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వీనిన్. 116**

**ప్రతిపదార్థం:** అచ్యుత!= శ్రీకృష్ణా!; ఇవి= ఈ వెండ్రుకలు, దుస్ససేను వ్రేళ్ళన్+తవిలి= దుశ్శాసనుడి వ్రేళ్ళలో చిక్కుకొని; సగము= అర్ధభాగం; త్రెవ్విపోయి= తెగిపోయి; తక్కిన+అవి= మిగిలినట్టివి; కౌరవులకడన్= దుర్యోధనాదుల దగ్గర; తీఱుమాటల+ అవసరమునన్= సంధి వచనములాడే సందర్భంలో; వీనిన్= ఈ శిరోజాలను; తలఁపన్+వలయున్= నీవు యోచించవలెను.

**తాత్పర్యం:** 'కృష్ణా! ఈ శిరోజాలు దుశ్శాసనుడు నన్ను బలాత్కారంగా సభకీడ్చి తెచ్చేవేళ అతడి చేతివ్రేళ్ళలో చిక్కుకొని సగం తెగిపోగా మిగిలినవి. నీవు కౌరవుల దగ్గర సంధి వచనములాడే సందర్భంలో వీటిని జ్ఞప్తిలో ఉంచుకొనాలి.

**విశేషం:** 1. 114వ పద్యంలో ద్రౌపది మనస్సులో పొంగిన భావాలలో విషాదం మొదటిది. దానికి సంబంధించిన వాచికాభినయం ఇది. ఇందులో వాడిన పదాలు దీప్తరసత్వాన్ని వ్యంజింపజేస్తూ కాంతిగుణంతో రాజిల్లుతున్నాయి.

2. దీనికిమూలం :

> **'అయం తే పుణ్డరీకాక్ష దుశ్శాసనకరోద్ధృతః**
> **స్మర్తవ్యః సర్వకార్యేషు పరేషాం సంధిమిచ్ఛతా॥" (సం. 5.80.36)** అని మాత్రమే ఉండగా, తెలుగున తిక్కన -

'ఇవి దుస్ససేను వేళ్ళం, దవిలి సగము త్రెవ్విపోయి దక్కినయవి'' - అనటం వినటానికీ చూడటానికీ మరింత బాధాకరం. (సంపా.)

**సీ. ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యాచేయి । దొలుతగాఁ బోరిలో దుస్ససేను**
**తను వింత లింతలు దునియలై చెదరి రూ । పఱియున్నఁ గని యుడుకాఱుఁగాక!**
**యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది; । పెనుగద వట్టిన భీమసేను**
**బాహుబలంబును బాటించి గాండీవ । మను నొక విల్లెప్పుడును వహించు**

**ఆ. కట్టి విక్రమంబు గాల్పనే? యిట్లు బ । న్నములు వడిన ధర్మనందనుండు**
**నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ । గానఁ బడయమైతిమేనిఁ గృష్ణ! 117**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= శ్రీకృష్ణా!; పోరిలోన్= యుద్ధములో; తొలుతగాన్= ప్రప్రథమంగా; ఈ వెండ్రుకలు+పట్టి= ఈ శిరోజాలను ఒడిసిపట్టి; ఈడ్చిన= లాగిన; ఆ చేయి= ఆ దుశ్శాసనుడి హస్తము; దుస్ససేను తనువు= దుశ్శాసనుడి శరీరం; ఇంతలు+ఇంతలు+తునియలు+ఐ= ఇంతింత ముక్కలై; చెదరి= చెల్లా చెదరై; రూపు+అఱి+ఉన్నన్= రూపు చెడియుండగా; కని= చూచి; ఉడుకు+ఆఱున్+కాక= నామనస్తాపం చల్లారునుగాని; అలుపాలన్= స్వల్పకార్యాలతో; ఇది; పొనుపడునట్టి చిచ్చే?= అణగారే అగ్నియా?; ఇట్లు= ఈ విధంగా; బన్నములు+పడిన= భంగపాటులొందిన; ధర్మనందనుండున్= ధర్మజుడూ; నేనున్= నేనున్నూ; రాజరాజు పీనుంగున్= దుర్యోధనుడి శవమును; కన్నారన్+కానన్+పడయము+ఐతిమి+ఏనిన్= కనులార చూచే భాగ్యానికి నోచనిచో; పెనుగద+పట్టిన= పెద్ద గదను ధరించిన; భీమసేను బాహుబలంబును= వాయునందనుని భుజశక్తీ; పాటించి= ఆదరించి; గాండీవము+అను+ఒక విల్లు= గాండీవం అనెడు ఒక చాపమును; ఎప్పుడున్= ఎల్లవేళల; వహించు= తాల్చు; కట్టివిక్రమంబు= అర్జునుడి పరాక్రమమూ; కాల్పనే?= తగుల బెట్టటానికా?

**తాత్పర్యం:** యుద్ధంలో ప్రప్రథమంగా నా తలవెండ్రుకలను పట్టి సభలోని కీడ్చి తెచ్చిన ఆ దుశ్శాసనుడి హస్తం, అతని దేహం ఇంతింత ముక్కలై చెల్లాచెదరుగా నేలబడి రూపు మాసిఉండగా చూచినప్పుడే నా మనస్తాపం చల్లారగలదు. అల్పకార్యాలతో చల్లారే అగ్ని కాదిది. ఆ విధంగా పరిభవముల పాలైన ధర్మనందనుడూ, నేనూ దుర్యోధనుడి శవాన్ని కనులార చూడటానికి నోచుకొనకపోతే, కొండంత గదను మూపున వేసికొని తిరిగే భీమసేనుడి భుజబలమూ, ఆదరంతో గాండీవమనే పేరుగల దొడ్డ వింటిని ధరించే పాండవమధ్యముడి శౌర్యమూ తగులబెట్టనా?

**విశేషం:** 1. ఈ పద్యంలో ఉన్న సొగసు మూలంలో లేదు. దుశ్శాసనుడి శరీరమంతటిలోను, ప్రప్రథమంగా తన వెండ్రుకలు పట్టి యీడ్చిన ఆ చేయి రూపఱవలెనట. ద్రౌపదికాతని చేయి యన్న అంతటి ప్రత్యేకమైన కోపము! 'తొలుతగా' అను పదం చాల ముఖ్యమైనది. ఇది మూలంలో లేదు. 'దుశ్శాసన భుజం శ్యామం సంభిన్నం పాంసుగుణ్ఠితమ్' అని మాత్రమే ఉన్నది. ఆతని తను వింత వింతలు దునియలై చెదరవలయు ననుట మూలంలో లేనే లేదు. పెచ్చరిల్లిన అచ్చమైన ఆమె కోపం అచ్చ తెనుగు పదములలో ప్రదర్శింపబడటం మెచ్చదగినది. ఏడ్చుచున్న ద్రౌపదిని పఠితల కన్నుల యెదుట సాక్షాత్కరింప జేసినాడు తిక్కన. ఆతడి నాటకీయ రచనలో, పాత్రల ప్రత్యక్షీకరణ మొక అంశం. 'పెనుగద పట్టిన భీమసేను ----- కట్టి విక్రమంబు గాల్పనే' --- అనే మాటలు మూలంలో లేవు. "ఇత్యుక్త్వా బాష్పరుద్ధేన కణ్ఠే నాయతలోచనా, రురోద కృష్ణా సోత్కమ్పం సస్వరం బాష్పగద్గదమ్, స్తనౌ పీనాయతశ్రోణీ, సహితా వధివర్షతీ'' - అనేది తెలుగులో లేదు.

2. 114వ పద్యంలోని ద్రౌపది రోషభావానికి అనుగుణమైన వాక్యాలివి. దుశ్శాసన దుర్యోధనులపై ఆమె కెంత కసి కడుపులో మండుతున్నదో ఈ దీర్ఘమైన సీసపద్యం సాక్ష్యంగా తిక్కన చిత్రించాడు. శత్రుసంహారమే ఆమె కడుపు మంటకు చల్లార్పు.

ఆ ఉపశమనం చేయలేనప్పుడు 'భరించేవాళ్ళు భర్తలం' అని చెప్పుకొనే వారిలో బలవంతులమనుకొనే భీముడిగదా, అర్జునుడి గాండీవం తగుల బెట్టనా? అని నిష్ఠురమాడింది. ధర్మజుడి మాటలకు తల ఊపుతున్న వారిద్దరిమీద నిప్పులు కురిపించింది. ఈ పద్యం ఆమెలోని ప్రతీకారాగ్ని జ్వాలల భుగభుగలను మూర్తికట్టించింది. (సంపా.)

**ఉ. నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కెస తాల్మిఁ జిచ్చొడిం**
**గట్టిన యట్లు పెద్దయును గాలము దీనికి నాఱు టెన్నఁడుం**
**బుట్టదు దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ**
**బుట్టువు తీవ్ర తేజమునఁ బొల్చిన భర్తలు గల్గ నచ్యుతా!' 118**

**ప్రతిపదార్థం:** అచ్యుతా!= శ్రీహరీ!; దుష్ట నిగ్రహము పూని= దుర్మార్గులను శిక్షించటానికి పూనిక వహించి; జగంబులు= లోకాలు; కాచునట్టి= కాపాడే; తోఁబుట్టువు= అన్నవైన నీవూ; తీవ్ర తేజమునన్= మిక్కిలి ప్రతాపంతో; పొల్చిన భర్తలున్= ఒప్పుతున్న పతులూ; కల్గన్= నాకుండగా; నెట్టన= అనివార్యంగా; ఇట్టి+అల్కన్= ఇటువంటి క్రోధాన్ని; చిచ్చు+ఒడిన్+కట్టిన+ అట్లు= నిప్పును ఒడిలో ఉంచుకొన్నట్లు; పెద్దయును+కాలము= బహుకాలం; రక్కెస తాల్మిన్= దుస్సహమైన ఓర్పుతో; మదిన్+నిల్పితిన్= మనసులో భరించాను; దీనికిన్= ఈ అవమానాగ్నికి; ఆఱుట= శమించటం; ఎన్నఁడున్ పుట్టదు= ఏనాడూ కలుగదు.

**తాత్పర్యం:** దుష్టులను శిక్షించటానికి లోకాలను రక్షించటానికి పూనుకొనిఉన్న నీవంటి తోడబుట్టువూ, మిక్కుటమైన పరాక్రమంతో దీపించే భర్తలు కలిగి కూడా నేను ఇంతటి పరాభవ జనిత క్రోధాగ్నిని, నిప్పును ఒడిలో నుంచుకొన్న చందాన రాక్షస సహనంతో భరిస్తున్నాను. ఈ పరిభవానలం శమించటం ఏనాడూ కలుగదు.

**విశేషం:** అలం: ఉపమ, హేతువు.

1. కోపాన్ని చిచ్చుతో పోల్చటం విశిష్టం. పదమూడేళ్ళుగా కోపాన్ని గుండెల్లో దాచింది ద్రౌపది. అది చిచ్చును ఒడిలో మూటకట్టి పెట్టుకొన్నట్లున్నదట! ఒడిలోని చిచ్చు ఒడలెల్ల కాలుస్తుంది. గుండెలోని చిచ్చు అంతరంగాన్నే దహిస్తుంది. అయినా 'రక్కెసతాల్మి'తో ఆమె సహించింది. 'రాక్షసమైన ఓర్పు' అనే అర్థాన్నిచ్చే తెలుగు పలుకుబడి రక్కెసతాల్మి. అల్క, చిచ్చు ఒడి, రక్కెస తాల్మి అనే తెలుగు మాటలు ఇక్కడ సార్థకాలు. గుండెలు కాల్చే భావచిత్రం చిచ్చు అనే పదంతోనే ఏర్పడుతుంది. అట్లాగే మిగతావి కూడా. ఉపమానం ఉజ్జ్వలం.

2. ఆమె గుండెలోని చిచ్చు - తోబుట్టువు. భర్తలూ అండగా ఉన్నా, ఆరేటట్లు కనపడటం లేదని ఆమె వేదన. అన్న దుష్టశిక్షణ, శిష్టరక్షణ వ్రతంతో అవతరించిన మహాత్ముడు. ఎదురు లేని పరాక్రమం కలవారు పాండవులు. అయినా ఆమె వేదన ఆరదు - అని హేత్వలంకారంలో పలికింది. హేతువునూ హేతుమంతాన్నీ ఒకే వాక్యంలో వర్ణించటం హేత్వలంకారం. (సంపా.)

## శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట (సం. 5-80-43)

**వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుండయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను బెన్నెఱివేణి ముడువనుం దగువారి నియోగించి య మ్మానినితో నిట్లనియె: 119**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని; ఎలుంగు రాలుపడన్= కంఠధ్వని కంపించగా; ఏడ్చిన= విలపించిన; యాజ్ఞసేనిన్= ద్రౌపదిని; కృపా+ఆయత్తచిత్తుండు+అయి= దయకు అధీనమైన మనస్సుకలవాడై; నారాయణుండు= శ్రీకృష్ణుడు; ఊరార్చి= ఓదార్చి;

కూర్చుండన్+నియమించి= కూర్చుండుమని తెలిపి; కన్నీరు తుడువను= కన్నీరు తుడవటానికీ; పెన్నెఱి వేణి ముడువను= అందమైన పెద్ద కొప్పును ముడివేయటానికీ; తగువారిన్= తగిన స్త్రీలను; నియోగించి= నియమించి; ఆ+మానినితోన్= ఆత్మాభిమానం కల్గిన ఆ ద్రౌపదితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇట్లా కంఠస్వరం కంపిస్తుండగా పాంచాలి విలపించింది. శ్రీకృష్ణుడు ఆమెను ఊరడించి కూర్చుండుమని చెప్పి ఆమె కన్నీటి నొత్తడానికి, చెదరిన చక్కని పెద్ద కొప్పును ముడవటానికి తగినవారిని నియమించి, ఆ మానవతితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** తిక్కన అభినయ క్రమాన్ని శిల్పమయం చేశాడు. ద్రౌపది 100వ పద్యంలో గద్గద కంఠంతో నెమ్మదిగా మాట్లాడటం ప్రారంభించింది. 114వ పద్యంలో మనస్సులో విషాదరోషాలు పొంగగా కళ్ళలో నీళ్ళు నిండగా దిగ్గన లేచి దుఃఖించింది. ఈ పద్యంలో కంఠస్వరం కంపించగా ఏడ్చింది (బావురుమన్నది). అది పరాకాష్ఠ బావురుమని విలపించటంతో ఆమె మాట లయిపోయినవని సూచన. అంతవరకు మధ్యలో ఆమెతో మాట్లాడకుండా ఉండటం మాధవుడి మనోవిజ్ఞానశాస్త్రపాండిత్యం. (సంపా.)

**ఉ. 'మ్రుచ్చిర నేల యేఁ గలుగ? ముద్దియ! నాకు వృకోదరుండు వి**
**వ్వచ్చుఁడుఁ దోడుగాఁగ జనవంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ**
**మెచ్చుగ శత్రు సంక్షయము మేకొని చేసెదఁగాక! వేఱొకం**
**డచ్చుపడంగ నేర్చునె? దురాత్ములు కౌరవు లుర్వి యిత్తురే? 120**

**ప్రతిపదార్థం:** ముద్దియ!= ఓ ముద్దరాలా! ద్రౌపదీ; ఏన్+కలుగన్= నేనుండగా; మ్రుచ్చిరన్+ఏల= శోకించుటెందుకు?; నాకున్= నాకు; వృకోదరుండున్= భీముడూ; వివ్వచ్చుఁడున్= సవ్యసాచి; తోడు కాఁగన్= సహాయులు కాగా; జనవంద్యుఁడు= జనులచేత నమస్కరించదగిన; ధర్మసుతుండు= ధర్మరాజు; పంపన్= ఆజ్ఞాపించగా, నీ మెచ్చుగన్= నీకు ప్రీతి కలిగేటట్లు; మేకొని= సమ్మతించి; శత్రు సంక్షయమున్= శాత్రవ నిర్మూలనం; చేసెదన్+కాక!= చేస్తాను సుమా!; వేఱు+ఒకండు= మరొకదారి; అచ్చుపడంగన్+నేర్చునె?= అలవడటానికి వీలుందా? (వీలులేదు); దురాత్ములు= దుష్టచిత్తులైన; కౌరవులు= ధార్తరాష్ట్రులు; ఉర్విన్+ఇత్తురే?= భూమిని పంచి మనకిస్తారా?

**తాత్పర్యం:** పాంచాలీ! నేనుండగా ఎందుకు శోకిస్తావు? నాకు భీమార్జునులు సాయపడగా, జనవినుతుడైన ధర్మజుడు ఆజ్ఞాపించగా, నీవు సంతోషించేటట్లు శాత్రవులను నిర్మూలిస్తాను. మరొక మార్గం లేదు. దుష్టచిత్తులైన కౌరవులు భూమిని పంచి మన కిస్తారా? (ఇవ్వరని భావం).

**విశేషం:** 1. ద్రౌపది 'అచ్యుతా' అని (పద్యం 118) ఎలుగెత్తి పిలిచింది. ఆ పిలుస్తున్నప్పుడు ఆమె కంఠధ్వని కంపించింది (ప.119). ఆ పిలుపు 'అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణం మమ!' అన్న భక్తుడి పిలుపువలె ఉన్నది. గజేంద్రుడి కేకవలె తోచింది. 'అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్'- అని ప్రతిజ్ఞచేసిన శ్రీకృష్ణుడిలోని భగవదంశ ప్రబుద్ధమయింది. దివ్యాదివ్యుడివలె వెలుగొందే ఆ వాసుదేవుడు కృపాయత్తచిత్తుడయ్యాడు. ఆ స్థితిలో ఆయన సాక్షాత్ 'నారాయణుడు'గా వెలుగొందాడు. అతడి మాటలు భక్తరక్షణ కళాప్రావీణ్యంతో ప్రతిధ్వనించాయి. ఈ పద్యం ఆ ప్రతిధ్వనులలో మొదటిది.

2. ఇందులోని ప్రతి వాక్యం సార్థకం. పదాల పొందిక కూడా సాభిప్రాయం. అనునయించటం కూడా ఒక కళగా తెలిసిన మహానుభావుడు శ్రీకృష్ణుడు. 'ఏడుస్తావెందుకమ్మా నేనుండగా పిచ్చితల్లీ?' అన్న వ్యవహార వాక్యానికి మొదటి వాక్యం పద్యాకృతి. ముందు దుఃఖాన్ని విడువుమన్నాడు. నే నున్నానని నమ్ముమన్నాడు. ఆ నమ్మిక దుఃఖాన్ని తొలగిస్తుందన్నాడు. నన్ను నమ్మికూడా, నన్నడిగి కూడా ఇంకా ఎందుకు దుఃఖిస్తావు? నీ భక్తి నా మనస్సు కెక్కింది. నే నెప్పుడూ నీకు ప్రసన్నుడనే. ఈ సంగతి తెలిసి కూడా దుఃఖించే నీవు ఎంత అమాయకురాలవు! - అనే భావం ఏర్పడే ఆ మాటలు తీవ్ర దుఃఖాన్ని తగ్గిస్తాయి. తన మాట విని ఆదుకొనే దేవుడివంటి అన్న ఉన్నాడన్న ధైర్యం ఏర్పడుతుంది. మొదటి వాక్యమే కాదు అందులోని పదాల వరస కూడా మార్చటానికి వీలు పడనివి కావటం విశేషం.

3. యుద్ధంలో శ్రీకృష్ణుడు ద్రౌపది మెచ్చేటట్లు శత్రువులను సంహరిస్తాడట! పాండవులు తన దుఃఖాన్ని తీర్చలేదని శ్రీకృష్ణుడిని వేడుకొంటున్న ద్రౌపదిని ఊరట పరచే వాక్యమిది. యుద్ధం చేస్తాననీ, ఆ చేయటం నీకు పూర్తిగా సంతోషం, తృప్తీ కలిగించటానికే అనీ అనటంతో ద్రౌపదికి హామీ దొరికింది. ఆమె నిశ్చింతురాలు కాగలిగింది ఆ వాక్యంతో. అయితే ఆ వాక్యంలో అనుబంధాలు రెండున్నాయి. 1. భీమార్జునులు తోడుపడతారట. 117వ పద్యంలో 'భీమసేను బాహుబలంబును, నొక విల్లెప్పుడును వహించు కట్టి విక్రమంబు కాల్పనే?' అని అధిక్షేపించిన దానికి ఇది పరోక్ష సమాధానం. యుద్ధంలో శ్రీకృష్ణుడికి భీమార్జునులు అండగా నిలిచి ద్రౌపది ఆశలను చిగురింప చేస్తారని ధ్వని. ఆ తరువాత 'జనవంద్యుడు ధర్మసుతుడు ఆజ్ఞాపించగా' అనటం సాభిప్రాయం. ద్రౌపది కోపమంతా ధర్మజుడి మాటల మీదనే. అతడు సంధి మాటలు మాట్లాడినందుకే. సంధి కోరే ధర్మరాజే సమరాన్ని చేయండని ఆజ్ఞాపిస్తాడనీ, అతడి ఆజ్ఞతోనే యుద్ధం సాగుతుందనీ చెప్పి ద్రౌపది మనోవేదనకు మూలమైన అనుమానాన్ని తొలగించాడు. పరిస్థితులను అట్లా మార్చే బాధ్యత శ్రీకృష్ణుడు స్వీకరించాడు.

4. 'మరొకం డచ్చు వడంగ నేర్చునె?' అనే వాక్యం జరుగబోయే శత్రుసంహారాన్ని ధ్రువీకరించే వాక్యం. దానివలన విశ్వాసం గట్టిపడుతుంది. దుఃఖం ఉపశమిస్తుంది.

5. రాయబారం జరిగినా దురాత్ములు రాజ్యభాగ మివ్వరని - చివర చెప్పిన వాక్యం కొసమెరుపు. 112వ పద్యంలో ద్రౌపది లేవనెత్తిన కీలకమైన ప్రశ్నకు కీలెరిగి చెప్పిన సమాధానం, సంధి ఫలవంతం కాదని సూచన. ద్రౌపది దిగులుపడవలసిన దేమీ లేదని భావం. భావి కథంతా ద్రౌపదిని సంతోషపెట్టటానికే సాగుతుందనీ, దానినంతా శ్రీకృష్ణుడే సూత్రధారుడై నడుపుతాడనీ, నమ్మకం కలిగి ఉండుమనీ శ్రీకృష్ణుడు ద్రౌపదికి అభయహస్తం ఇచ్చాడు.

6. పాండవుల వలెనే పాండవపత్ని కూడా శ్రీకృష్ణుడిని పరమాత్మగా భావించే సంస్కృతినీ, భక్తజనావన బిరుదాంకితుడైన నారాయణుడి స్వభావాన్ని ప్రకటిస్తున్న అవతార పురుషుడని భావించే సంస్కృతీ ఈ పద్యంలో బింబ ప్రతిబింబభావంతో ప్రకటితం కావటం వస్తుధ్వని. (సంపా.)

**క. లలనా! యుడుగుము నీ యే । డ్పుల కొలఁదియె కురునృపాల పుత్త్ర కళత్రం**
**బుల యేడ్పు; లింక వానిం । గలకల నవ్వుచు వినంగఁ గాలం బయ్యెన్. 121**

**ప్రతిపదార్థం:** లలనా!= ఓ వనితా, ద్రౌపదీ; ఉడుగుము= దుఃఖించటం మానుము; కురునృపాల పుత్త్ర కళత్రంబుల+ఏడ్పులు= కురురాజయిన ధృతరాష్ట్రుని కొడుకుల భార్యల యొక్క రోదనములు; నీ+ఏడ్పుల కొలఁదియె= నీ యేడ్పుల పరిమాణం కలవే; ఇంకన్= ఇక; వానిన్= వారి శోకాలను; కలకలనవ్వుచున్= నీవు పకపక నవ్వుతూ; వినంగన్= వినటానికి; కాలంబు+అయ్యెన్= సమయం వచ్చింది.

**తాత్పర్యం:** అమ్మా! దుఃఖం మాను. నీ వెంత విలపించావో దుర్యోధనాదుల భార్యలుగూడ అంత విలపిస్తారు. వారి యేడ్పులు నీవు పకపక నవ్వుతూ వినే సమయం సమీపించింది.

**విశేషం:** 1. అలం: విషమం. "విషమం వర్ణ్యతే యత్ర ఘటనా ననురూపయోః". అననురూపాలైన వాటికి సంబంధాన్ని వర్ణించటం విషమాలంకారం. కౌరవుల భార్యల విలాపాలకూ ద్రౌపది కలకలనవ్వటానికీ ఇందులో సంబంధం చెప్పబడింది కావున విషమం.

2. అనునయంలో పాటించే మెలకువలకు శ్రీకృష్ణుడు పెట్టింది పేరు. ద్రౌపదికి దుఃఖాన్ని కలిగించింది కౌరవులు. వారి భార్యాపుత్రులు ఆమెవలె దుఃఖిస్తే ఆమెకు ఉపశాంతి. పరదుఃఖం ఉపశమనమే కాదు ఉల్లాసం కూడా కలిగిస్తుందన్న మానసిక సూత్రం తెలిసిన విజ్ఞుడు శ్రీకృష్ణుడు. అందుకు విషమాలంకారం అర్థవంతంగా ఉంటుందని తిక్కన తీర్పు. (సంపా.)

**క. యమ మహిష ఘంటికా నా । దము వినఁ గౌతూహలంబు దళుకొత్తెడు చి**
**త్తములు గల కౌరవుల కి । ష్టము లగునే సంధికార్య శాంతవచనముల్? 122**

**ప్రతిపదార్థం:** యమ మహిష ఘంటికా నాదమున్= యముడి వాహనమైన దున్నపోతు యొక్క మెడగంటల చప్పుడును; వినన్= వినటానికి; కౌతూహలంబు= ఉబలాటము; తళుకొత్తెడు= అతిశయిస్తున్న; చిత్తములుకల= మనస్సులు కల్గిన; కౌరవులకున్= ధార్తరాష్ట్రులకు; సంధికార్య శాంతవచనముల్= సంధికి సంబంధించిన శాంతంతోడి మాటలు; ఇష్టములు+అగునే?= సమ్మతాలౌతాయా? (కానేరవు.)

**తాత్పర్యం:** అమ్మా! యముని దున్నపోతు మెడలోని గంటల సవ్వడి వినటానికి మిక్కిలి ఉబలాటపడుతున్న కౌరవులకు సంధికి సంబంధించిన సౌమ్య వాక్యాలు సమ్మతాలు కావు.

**విశేషం:** అలం: అప్రస్తుతప్రశంస. మహిషం యముడి వాహనం. యము డా వాహనాన్ని ఎక్కి వడివడిగా వస్తున్నప్పుడు దాని మెడలోని లోహఘంటలు మ్రోగుతాయి. అవి వినబడితే మరణం ఆసన్నమైనదని ధ్వని. మరణాన్ని మనసారా కోరుకొంటున్న కౌరవులకు బ్రతకటానికి వీలున్న సంధి వాక్యాలు రుచించవనటం- వారికి త్వరలో మరణం తథ్యమని ధ్వని. నిజానికి శ్రీకృష్ణుడు హస్తినకు పోవటానికీ, యమ మహిష ఘంటానాదం వినబడటానికీ ఉన్న సాజాత్యాన్ని ఊహిస్తే ఆలోచనామృతం. (సంపా.)

**క. మొదల విధినియతియును న । ట్టిద యందురు పెద్ద; లది ఘటింపకపో దే**
**మదిఁ జూచి చెప్పినను ద । ప్పదు మేరువు దిరిగెనేనిఁ బాంచాలసుతా! 123**

**ప్రతిపదార్థం:** పాంచాల సుతా!= పాంచాల రాజపుత్రీ!; పెద్దలు= తెలిసినవారు; మొదలన్= తొలుతనే; విధి నియతియును= విధి నిర్ణయం కూడా; అట్టిది+అ+అందురు= కురుపాండవులకు పొత్తు కుదరదనీ కౌరవులకు చావు మూడిందనే చెపుతారు; అది ఘటింపక పోదు= అలా జరగకుండాపోదు; ఏన్= నేను; మదిన్+చూచి= బుద్ధిలో ఊహించి; చెప్పినను= వాకొన్నచో; మేరువు తిరిగెను+ఏనిన్= మేరు పర్వతం తల్లక్రిందైనను; తప్పదు= నా వచనం వ్యర్థంగాదు.

**తాత్పర్యం:** అసలు దైవ నిర్ణయ మిదే అని పెద్దలు చెపుతున్నారు. ఇంతకు అదే జరుగుతుంది. నేను బుద్ధిలో ఊహించి చెప్పిన మాట మేరు పర్వతం తలక్రిందైనను తప్పదు సుమా!

**విశేషం:** అలం: అతిశయోక్తి. శ్రీకృష్ణుడే కాలపురుషుడని ధ్వనింపజేసే పద్యం ఇది. ఆతడి దివ్యాదివ్య స్వభావం మాటలలో వ్యంగ్యం. పెద్దలంటున్నారన్నప్పుడు అదివ్యుడు. నేను మదిఁ జూచి చెప్పెదను అన్నప్పుడు దివ్యుడు. మేరుపర్వతం తలక్రిందైనా

నామాట తప్పదంటున్న శ్రీకృష్ణుడు విధిస్వరూపుడు. భక్తప్రసన్నుడైన భగవంతుడు దివ్యరూపంతో మాట్లాడుతున్న అనుభూతి నందించే పద్య మిది. (సంపా.)

**తే. పూని పలికెద వినుము రిపు క్షయంబుఁ । జేసి యుజ్జ్వల పుణ్యలక్ష్మీ సమేతు**
**లైన పాండు కుమారుల యధిక విభవ । మీవు సూచెదు; తడవులే; దిది నిజంబు! 124**

**ప్రతిపదార్థం:** పూని పలికెదన్= నొక్కి చెపుతున్నాను; వినుము= నా మాటలు వినుము; రిపుక్షయంబున్+చేసి= విరోధులను నాశముచేసి; ఉజ్జ్వల పుణ్యలక్ష్మీసమేతులు= ప్రకాశించే పుణ్యమనెడు సంపదతో కూడినట్టి; పాండు కుమారుల= పాండవుల యొక్క; అధిక విభవము= గొప్ప ప్రాభవము; ఈవు= నీవు; చూచెదు(వు)= చూడగలవు; తడవు లేదు= ఇందుకు ఆలస్యం లేదు; ఇది నిజంబు= నా మాట సత్యం.

**తాత్పర్యం:** ద్రుపదపుత్రీ! శపథం చేసి చెపుతున్నాను. నా పలుకు లాలకించుము. విరోధులను విధ్వంసం చేసి, ప్రకాశమానమైన పుణ్యసమృద్ధితో కూడిన పాండురాజ తనయుల యొక్క మిక్కుటమైన వైభవాన్ని నీవు దర్శించగలవు. ఇందుకు అట్టే ఆలస్యం లేదు. నా మాట నిజం.'

**విశేషం:** ఈ మాటలు విశ్వరూప ప్రదర్శనం చేస్తూ పరమాత్ముడు పలుకుతున్న అద్భుత వాతావరణం స్ఫురింపజేస్తున్నవి. శ్రీకృష్ణుడి వాక్కు భగవన్నిర్ణయమని స్పష్టమవుతుంది. ఊరడింపు కిది పరాకాష్ఠ. ద్రౌపది హృదయతాపం చల్లారింది అని ధ్వని. (సంపా.)

**క. అని యూఱడిలఁగఁ బలికిన । విని యంకిలి దేఱు చిత్తవృత్తిగలుగు నం**
**గన యే డ్పుడిగెం; దగ ఫ । ల్గునుఁ డిట్లని పలికె నపుడు గోవిందునితోన్. 125**

**ప్రతిపదార్థం:** అని+ఊఱడిలఁగన్= అంటూ ఊఱడిల్లేటట్లు; పలికినన్= శ్రీకృష్ణుడు చెప్పగా; విని; అంకిలి తేఱు+చిత్తవృత్తి కలుగు= కలతనుండి ప్రసన్నత కాంచిన మనోవ్యాపారంగల; అంగన= ద్రౌపది; ఏడ్పు+ఉడిగెన్= విలపించటం మానింది; తగన్= ఒప్పుగా; ఫల్గునుఁడు= అర్జునుడు; అపుడు= ఆ సమయాన; గోవిందునితోన్= గోపాలదేవుడితో; ఇట్లు+అని పలికెన్= ఈ విధంగా వచించాడు.

**తాత్పర్యం:** జనార్దను డిట్లా ద్రౌపదిని సాంత్వనవచనాలతో ఊరడించాడు. ఆమె కలత వీడి ప్రసన్నత నొందిన మనసుగలదై యేడ్పు మానింది. పిదప పార్థుడు గోపాలకృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'పాండవులు ధార్తరాష్ట్రులుఁ బుండరీక । నేత్ర ! చుట్టరికంబున నీకు నొక్క**
**రూప; కావునఁ గోరి యేరూపునందు । నుభయపక్షంబులకుఁ జేయు ముచితహితము. 126**

**ప్రతిపదార్థం:** పుండరీక నేత్ర!= తెల్ల దామరల వంటి కన్నులు గల కృష్ణా!; నీకున్= నీకు; చుట్టరికంబునన్= బంధుత్వం చేత; పాండవులున్= పాండుపుత్రులమైన మేము; ధార్తరాష్ట్రులున్= ధృతరాష్ట్రుడి కుమారులగు దుర్యోధనాదులు; ఒక్క రూప= ఒకే విధమైనవారం; కావునన్= కనుక; కోరి= వాంఛించి; ఏ రూపు+అందున్= ఎట్లాగయినా; ఉభయ పక్షంబులకున్= రెండు వర్గాలకు ఉచిత హితము+చేయుము= తగిన మేలు చేయుము.

**తాత్పర్యం:** 'కమల పత్రాక్షా! బంధుత్వమును బట్టి కురుపాండవులు నీకు సమానులే. కనుక ఏ విధంగానైనా ఆసక్తితో ఇరువర్గాలకూ తగిన మేలు గావించు.

**విశేషం:** 124లో విరోధుల విధ్వంసాన్ని గురించి మాట్లాడిన శ్రీకృష్ణుడు దివ్యత్వస్థాయిలోకి వెళ్ళి మాట్లాడినట్లుండగా, అర్జునుడు అతడిని వాస్తవ స్థితిలోనికి తెచ్చాడు. బంధుత్వం అనే సమాన గుణంతో ఉభయులకూ మేలు చేయుమన్నాడు. (సంపా.)

**క. ధర్మార్థ సంగతంబుగ । ధర్మతనయు చెప్పినట్ల తగఁ బల్కఁగ నా**
**దుర్మతులు కౌరవులు స । త్కర్మమునకుఁ జొరకయున్న దైవమ యెఱుఁగున్. 127**

**ప్రతిపదార్థం:** ధర్మ+అర్థ సంగతంబుగన్= ధర్మార్థాలతో కూడేటట్లుగా; ధర్మతనయు చెప్పినట్లు+అ= ధర్మనందనుడు తెల్పినట్లుగా; తగన్= ఒప్పిదముగా; పల్కఁగన్= నీవు కురుసభలో మాట్లాడితే; ఆ దుర్మతులు= ఆ చెడుబుద్ధి కలిగిన; కౌరవులు= దుర్యోధనాదులు; సత్కర్మమునకున్= మంచి పనికి; చొరక+ఉన్నన్= నడుము కట్టనిచో; దైవము+అ+ఎఱుఁగున్= ఆవల దేవుడే పని చక్కబెట్టగలడు.

**తాత్పర్యం:** కృష్ణా! ధర్మార్థయుక్తంగా ధర్మపుత్రుడు చెప్పినట్లు కౌరవ సభలో చక్కగా హితోక్తులు పలుకవలసింది. దుర్బుద్ధిగల కౌరవులు మంచి చేయటానికి పూనుకొనకపోతే దైవమున్నాడు. ఆ దేవుడే అన్నీ చక్కబెట్టగలడు.'

**విశేషం:** శ్రీకృష్ణుడు ధర్మజుడికి ఇచ్చిన మాటను జ్ఞాపకం చేసి, కౌరవసభలో సముచిత విధానంలో వ్యవహరించుమన్నాడు. దైవం మీద భారముంచి ప్రయత్నించటం పురుషకారం. తగిన ఫలాన్ని అందించేది దైవానుకూల్యం. దూతగా శ్రీకృష్ణుడు పురుషకారం చేస్తాడు. దైవంగా ఆయనే ఫలాన్ని అందిస్తాడు - అని అర్జునుడు ధర్మ కర్మ యోగాన్ని ప్రదర్శిస్తూ పలికాడు. నరుడు నారాయణుడికి సన్నిహితుడు కావటంతో ఆ చనువు తీసికొనగలిగాడు. (సంపా.)

**క. అన విని 'కౌరవులకు మీ । కును హితముఁ బ్రియంబుఁ జేయఁ గోరియ కుంతీ**
**తనయాగ్రజుపని ధృతరా । ష్ట్రుని కడకుం బోయెదను గడుం బ్రీతిమెయిన్. 128**

**ప్రతిపదార్థం:** అనన్ విని= అర్జునుడిట్లా పలుకగా ఆలించి; కౌరవులకున్= దుర్యోధనాదులకూ; మీకును= మీకున్నూ; హితమున్= మేలు; ప్రియమున్= స్నేహమునూ; చేయన్+కోరి+అ= చేయటానికి కోరికొనియే; కుంతీ తనయ+అగ్రజుపనిన్= ధర్మనందనుడి పనిమీద; కడున్+ప్రీతిమెయిన్= మిక్కిలి సంతోషంతో; ధృతరాష్ట్రుని కడకున్= ఆంబికేయుని దగ్గరకు; పోయెదన్= వెళ్ళుతాను.

**తాత్పర్యం:** పార్థుడి పలుకులు విని శ్రీకృష్ణుడు - 'అర్జునా! కౌరవులకూ మీకూ ఇష్టమైనదానిని, మేలుగూర్చే దానినీ చేయవలెనని తలంచి కుంతీపుత్రులలో పెద్దవాడైన ధర్మజుడి పనిమీద ధృతరాష్ట్రుడి దగ్గరకు మిక్కిలి సంతోషంతో వెళ్ళుతున్నాను.'

**విశేషం:** పైకి చూస్తే ద్రౌపదికి తగిన మాటలు ఆమె వద్దా, అర్జునుడికి తగిన మాటలు అతడి వద్దా శ్రీకృష్ణుడు పలికినట్లుంటుంది కాని, శ్రీకృష్ణుడి మాటలలో వైరుధ్యం లేదు. ఎట్లాగంటే - ధర్మజుడి వాక్యాలు యుద్ధానికి పూర్వార్ధం; ద్రౌపదికి ఇచ్చిన మాటలు యుద్ధానికి ఉత్తరార్ధం. ఆ వరుసలో నిర్వహించే శ్రీకృష్ణుడు కార్యపరమార్థం. (సంపా.)

**క. అని పలికిన హరి ధర్మ వ । చనముల తెఱఁగున కజాతశత్రుఁడు చిత్తం**
**బునఁ బొంగి 'యట్ల చేయుము । మన నిశ్చయ మిదియ దీని మఱవకు మనఘా!' 129**

**ప్రతిపదార్థం:** అని పలికిన= ఈ విధంగా వచించిన; హరి= శ్రీకృష్ణుడి యొక్క; ధర్మవచనముల తెఱఁగునకున్= న్యాయంతో కూడిన వాక్యాల పద్ధతికి; అజాతశత్రుఁడు= ధర్మజుడు; చిత్తంబునన్+పొంగి= మనస్సులో ఉబ్బి; అనఘా!= పుణ్యపురుషా!; అట్లు+అ చేయుము= అట్లే కావించుము; ఇది+అ మన నిశ్చయము= ఇదే మనయొక్క నిర్ణయం; దీనిన్= ఈ మాటను; మఱవకుము= మరిచిపోవద్దు.

**తాత్పర్యం:** త్రివిక్రముడి ధర్మయుక్తమైన మాటల తీరునకు ధర్మరాజు మనసులో పొంగిపోయాడు. 'మహానుభావా! నీ వన్నట్లే చేయవలసింది. మా తలపు కూడ అదే. ఈ విషయం మరచిపోవద్దు.'

**విశేషం:** ద్రౌపదితో శ్రీకృష్ణుడు మాట్లాడిన తరువాత ధర్మజుడు అడుగవలసిన మాటలు అర్జునుడే అడిగాడు. శ్రీకృష్ణుడు ధర్మజుడి వ్యూహానికి అనుగుణంగా మాట్లాడాడు. దానికి ధర్మజుడు పొంగిపోయాడు. శ్రీకృష్ణుడితో మూడు మాటలన్నాడు. 'అట్లాగే చేయుము; మన నిశ్చయం ఇదే. ఓ పుణ్యాత్మా! దీనిని మరచిపోకుము'. ఈ మూడూ కార్యనిర్ణాయక మంత్రాలు. మొదటివాక్యం అధికారికం. రెండవ వాక్యం నిశ్చయాత్మకం. మూడవ వాక్యం ఔపచారికం. (సంపా.)

**వ. అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి నారాయణుం జూచి 'నీ నక్షత్రంబు రోహిణిగదా యెల్లి రేవతి నీకుఁ జంద్ర తారాబలంబులు గలవు; గమనంబునకు రేపకడయ మేలు; పయనం బగుట లెస్స'యని చెప్పిన నప్పలుకుల కతండు సగౌరవంబుగా నియ్యకొనినం బాండవాగ్రజుండు కొలువుం గలయం గనుంగొని యెల్లవారును విన నది యట్లకాక యని పలికి తదనంతరంబ తానునుం దమ్ములుఁ బాంచాలియుఁ బరివారంబును నుచిత ప్రకారంబున నిజనివాసంబులకుం జనిరి; మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు గాలోచిత కృత్యంబులు నిర్వర్తించి సూర్యోపాస్తి సేసి యగ్ని సమారాధనం బాచరించి ధరణిసురులం బ్రణామపూర్వకంబుగాఁ బ్రయాణ దాన ప్రముఖ పూజావిశేషంబులం బ్రీతులం గావించి వారల యిచ్చు నాశీర్వాదంబులును సమంత్రాక్షత దూర్వాంకురాదులునుం గైకొని యుచిత ప్రదేశంబున నుండి సాత్యకి రావించి. 130**

**ప్రతిపదార్థం:** అని= అని ధర్మరాజు పలికి; కార్యంబు నిశ్చయించి= చేయవలసిన పనిని తీర్మానించి; దినశుద్ధి నిరూపించి= మంచి రోజు నిర్ణయించి; నారాయణున్+చూచి= కృష్ణుడిని చూచి; నీ నక్షత్రంబు రోహిణి కదా= నీ జన్మనక్షత్రం రోహిణి కదా; ఎల్లి= రేపు; రేవతి= రేవతీ నక్షత్రము; నీకున్ చంద్ర తారాబలంబులు+కలవు= నీకు చంద్రబలమున్నది. తారా బలమున్నది; గమనంబునకున్= ప్రయాణానికి; రేపకడయ= ఉదయమే; మేలు= మంచిది; పయనంబు+అగుట లెస్స= ప్రయాణమై వెళ్ళటం బాగు; అని చెప్పినన్= అని చెప్పగా; ఆ+పలుకులకున్= ధర్మజుడి మాటలకు; అతండు= శ్రీకృష్ణుడు; సగౌరవంబుగాన్= ఆదరంతో; ఇయ్యకొనినన్= అంగీకరించగా, పాండవ+అగ్రజుండు= ధర్మనందనుడు; కొలువున్= సభను; కలయన్+కనుంగొని= తేరిపారచూచి; ఎల్లవారును వినన్= అందరూ వినేటట్లుగా; అది+అట్లు+అ+కాక= అది అట్లే అగుగాక!; అని పలికి; తద్+అనంతరంబు+అ= అటు తరువాత; తానున్= తానూ; తమ్ములున్= అనుజులూ; పాంచాలియున్= ద్రౌపదియూ; పరివారంబును= భృత్యవర్గమునూ; ఉచిత ప్రకారంబునన్= తగు విధంగా; నిజనివాసంబులకున్+చనిరి= తమ తమ నివాస ప్రదేశాలకు వెళ్ళారు; మఱునాఁడు= ఆ మరుసటి దినం; అరుణ+ఉదయంబునన్= సూర్యోదయవేళ; కృష్ణుండు; కాల+ఉచిత కృత్యంబులు= ప్రాతఃకాలానికి తగిన పనులు; నిర్వర్తించి= చేసి; సూర్య+ఉపాస్తి+చేసి= సూర్యోపాసన కావించి; అగ్ని సమారాధనంబు+ఆచరించి= అగ్నికార్యం నెరవేర్చి; ధరణిసురులన్= బ్రాహ్మణులను; ప్రణామ పూర్వకంబుగాన్= నమస్కార పురస్సరంగా; ప్రయాణ దాన ప్రముఖ పూజా విశేషంబులన్= ప్రయాణకాలంలో చేసే దానాలు అర్చనలు మొదలైన

వాటిచే; ప్రీతులన్+కావించి= సంతోషింపజేసి; వారల+ఇచ్చు= ఆ బ్రాహ్మణు లిచ్చే; ఆశీర్వాదంబులును= దీవనలును; సమంత్ర+అక్షత దూర్వా+అంకుర+ఆదులున్= మంత్రపూర్వకాక్షతలు, గరికపోచలు మున్నగువాటిని; కైకొని= గ్రహించి; ఉచిత ప్రదేశంబునన్+ఉండి= తగిన తావులో నిల్చినవాడై; సాత్యకిన్ రావించి= సాత్యకిని రప్పించి.

**తాత్పర్యం:** ధర్మజుడు కృష్ణుడిని కౌరవసభకు పంపటానికి తీర్మానించి రేపు మంచి రోజని తెల్పి, 'నారాయణా! నీ జన్మనక్షత్రం రోహిణి; వృషభరాశి. రేపు రేవతీ నక్షత్రం గనుక చంద్రుడు మీనరాశిలో ఏకాదశ స్థానంలో శుభుడై ఉన్నాడు. కావున చంద్ర బలమునూ, రేవతి నీకు సాధన తార అగుటచే తారాబలమున్నూ చక్కగా కుదిరి ఉన్నవి. ప్రయాణానికి రేపు ఉదయమే అనుకూలం' అని చెప్పాడు. మాధవుడు ధర్మజుడి పలుకులను సగౌరవంగా అంగీకరించాడు. పిదప ధర్మపుత్రుడు కొలువు నలువంకలా కలయచూచి అందరూ వింటుండగా 'ఇదే మన నిర్ణయం' అని చెప్పాడు. తరువాత ధర్మరాజు, అతడి తమ్ములు, ద్రౌపది, పరివారం తగిన విధాల తమ తమ నివాస స్థానాలకు తరలి వెళ్ళిపోయారు. మరుసటి దినం శ్రీకృష్ణుడు సూర్యోదయం కాగానే కాలోచిత కృత్యాలు సలిపి, సూర్యోపాసన చేశాడు. అగ్నిని ఆరాధించాడు. బ్రాహ్మణులకు నమస్కారాలు చేసి, ప్రయాణ కాలంలో చేయవలసిన దానాలు, పూజలు సల్పి, వారిని సంతోషపరిచాడు. బ్రాహ్మణుల దీవనలను, వారు మంత్ర పురస్సరంగా ఇచ్చిన అక్షతలను, దూర్వాంకురాలను స్వీకరించాడు. ఉచిత ప్రదేశంలో ఉండి, దామోదరుడు సాత్యకిని పిలిపించాడు.

**విశేషం:** 1. ప్రయాణాలకు తారాబలం చంద్రబలం చూడటం పరిపాటి. 'శుక్లే పక్షే శీతరశ్మి ర్బలీయాన్' అని జ్యోతిశ్శాస్త్రం (రత్నమాల). కాబట్టి చంద్ర బలం ఉన్నది. శ్రీకృష్ణుడి జన్మనక్షత్రం రోహిణి. ప్రయాణ నక్షత్రం రేవతి. రోహిణికి రేవతి సాధన తార ఔతుంది. రేవతి ప్రయాణానికి శుభ నక్షత్రం. ధర్మజుడు భావించినట్లు శ్రీకృష్ణ దౌత్యం సాధించబడుతుంది- అని ధ్వని.

2. వేదోచితమైన సంస్కారం కలవాడు ప్రయాణారంభంలో నిర్వహించే పుణ్య విధులు ఇందులో చెప్పబడ్డాయి. ఇవి తిక్కననాటి ఆచారాలు కూడా కావచ్చును. ఆతడు కూడా వైదిక మార్గ నిష్ఠమగు వర్తనం కలవాడు కదా! (సంపా.)

**క. 'మన ప్రజలోఁ గరిపురికిం । జనుదేరఁగ వలయువారి సవరణతో రం**
**డని యేర్పడ నియమింపు ప । యనమై యేతెమ్ము నీవు' నని తగ మఱియున్. 131**

**ప్రతిపదార్థం:** మన ప్రజలోన్= మన యాదవులలో; కరిపురికిన్= హస్తినానగరానికి; చనుదేరఁగన్ వలయువారిన్= రావలసిన వారిని; సవరణతోన్= సన్నాహంతో; రండు+అని= రావలసిందని; ఏర్పడన్= స్పష్టముగా; నియమింపు= నిర్ణయించుము; నీవున్= నీవుకూడా; పయనము+ఐ+ఏతెమ్ము= ప్రయాణమై నా వెంట రావలసింది; అని= అని చెప్పి; తగన్= ఒప్పిదంగా; మఱియున్= ఇంకను ఇట్లాఅన్నాడు;

**తాత్పర్యం:** 'మన యాదవులలో హస్తినాపురానికి రావలసిన వారినందరినీ, సన్నాహాలతో రావలసిందిగా స్పష్టంగా చెప్పుము. నీవు కూడా నా వెంట ప్రయాణమై రమ్మ' అంటూ ఇంకా ఇట్లా చెప్పాడు:

**వ. 'దుర్యోధనుండు దుష్టాత్మకుం; డతని మన్నించు మానుసులునుం గుటిలబుద్ధులు గావునఁ జక్రగదా ద్యాయుధంబులు రథంబునం బెట్టింపవలయు' నని చెప్పి పనిచి సమయజ్ఞతం బొడసూపి నిలుచున్న దారుకుం జూచి తేరు పూన్ప నియోగించిన, నతండును మణిగణ ప్రభాపటల జటిలంబగు నరదంబు వన్ని**

**శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబు లనంబరఁగు తురంగంబులం బూన్చి గరుడధ్వజం బెత్తి తెచ్చినం దానునుం బయనంపుఁ జందంబునఁ గట్టాయితంబై జనంబుల చూడ్కులకుం బండు వగుచుఁ బుండరీకాక్షుండు మంగళ తూర్యంబులు సెలంగఁ జామరంబు లుల్లసిల్ల రథం బెక్కిన యవసరంబున యాదవ పరివారంబుతో నరుగుదెంచిన సాత్యకిం దన రథం బెక్కించుకొని యాంగికంబులైన శుభ సూచకంబులు గైకొనుచుఁ బూర్ణ కలశ వృషభాది భద్రపదార్థంబుల నవలోకించుచుఁ బుణ్యాంగనలు సేసలొలుకఁ జిత్తంబు ప్రసన్నతం బొంద వెడలునప్పుడు. 132**

**ప్రతిపదార్థం:** దుర్యోధనుండు; దుష్ట+ఆత్మకుండు= చెడు మనస్సు కలవాడు; అతని మన్నించు= అతడు ఆదరించు; మానుసులునున్= మనుష్యులు కూడ; కుటిలబుద్ధులు= వక్రబుద్ధికలవారు; కావునన్= కనుక; చక్ర గదా+ఆది+ఆయుధంబులు= సుదర్శన మనే చక్రం, కౌమోదకి అనే గద మొదలైన యుద్ధోపకరణాలను; రథంబునన్+పెట్టింపన్+వలయున్= రథములో నుంచవలసినది; అని చెప్పి; పనిచి= పంపి; సమయజ్ఞతన్+పొడచూపి= సమయము నెఱిగినవాడై కన్పించి; నిలుచున్న దారుకున్+చూచి= నిలబడియున్న దారుకుడనే తన సారథినిగాంచి; తేరు పూన్పన్+నియోగించినన్= రథమును ఆయత్తం కావించుమని ఆజ్ఞాపించగా; అతండును= సారథియైన దారుకుడు కూడా; మణిగణ ప్రభా పటలజటిలంబు= మణుల సమూహము యొక్క కాంతిపుంజముచే సాంద్రమైనది, అగు+అరదంబు+పన్ని= అయినట్టి రథమును సిద్ధపరిచి; శైబ్యసుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులు= శైబ్యము, సుగ్రీవము, మేఘపుష్పము, వలాహకము; అనన్+పరఁగు= అను పేర్లతో ఒప్పుతున్న; తురంగంబులన్+పూన్చి= గుర్రాలను కట్టి; గరుడ ధ్వజంబు+ఎత్తి= రథముపై గరుడుని జెండా నిలిపి; తెచ్చినన్= తన సన్నిధికి కొనిరాగా; పుండరీక+అక్షుండు= తెల్లదామరలవంటి కన్నులుగల శ్రీకృష్ణమూర్తి; పయనంపుఁ జందంబునన్= ప్రయాణ విధానంతో; కడు+ఆయితంబు+ఐ= మిక్కిలి సంసిద్ధుడై; జనంబుల చూడ్కులకున్= ప్రజల యొక్క నేత్రాలకు; పండువు+ అగుచున్= ఉత్సవం చేస్తూ; మంగళ తూర్యంబులు= మంగళ వాద్యాలు; చెలంగన్= మ్రోయగా; చామరంబులు+ఉల్లసిల్లన్= వింజామరలు విలసిల్లగా; రథంబు+ఎక్కిన+అవసరంబునన్= రథారోహణం కావించిన సమయంలో; యాదవ పరివారంబుతోన్= యదువంశమునకు చెందిన బలగంతో; అరుగుదెంచిన= వచ్చినట్టి; సాత్యకిన్; తన రథంబు; ఎక్కించుకొని; ఆంగికంబులు+ఐన= అంగములందు ఏర్పడిన; శుభసూచనంబులు+కైకొనుచున్= శుభ శకునాలను స్వీకరిస్తూ; పూర్ణకలశ వృషభ+ఆది= జలముతో నిండిన కలశము, ఎద్దు మొదలైన; భద్ర పదార్థంబులన్= శుభ ప్రదాలైన వస్తువులను; అవలోకించుచున్= చూస్తూ; పుణ్య+ అంగనలు= ముత్తైదువలు; సేసలు+ఒలుకన్= అక్షతలు చల్లగా; చిత్తంబు= తన మనస్సు; ప్రసన్నతన్+పొందన్= శాంతమై ఉండగా; వెడలు+అప్పుడు= బయలుదేరే వేళలో.

**తాత్పర్యం:** 'దుర్యోధనుడు దుష్టచిత్తుడు. అతడు ఆదరించే మనుషులంతా వంకరబుద్ధి గలవారు. కాబట్టి నీవు చక్రం, గద మొదలైన ఆయుధాలను రథంలో పెట్టించు' అని శ్రీకృష్ణుడు సాత్యకితో చెప్పి పంపాడు. సమయం గుర్తించి దారుకుడు అనే సారథి ఎదుటికి వచ్చి నిలబడగా అతడిని కనుగొని శ్రీకృష్ణుఁడు 'నీవు రథాన్ని ఆయత్తం కావించుము' అని ఆజ్ఞాపించాడు. మణి సమూహాల కాంతిపుంజంతో నిండిన రథానికి శైబ్యం, సుగ్రీవం, మేఘ పుష్పం, వలాహకం అనే గుర్రాలను కట్టి, రథంమీద గరుడకేతనం నిలిపి దారుకుడు అరదం తీసికొనివచ్చాడు. అంతట కృష్ణుడు ప్రయాణ సన్నాహంతో ప్రజలకు కన్నుల పండువు కావిస్తూ, మంగళ వాద్యాలు మ్రోగుతుండగా, వింజామరలు వీస్తుండగా రథారోహణం చేశాడు. సాత్యకి యాదవ పరిజనంతో ఎదుటికి రాగా అతడిని తన రథ మెక్కించుకొని కుడి కన్ను అదరటం మొదలైన ఆంగికాలైన శుభ నిమిత్తాలకు ప్రీతి చెందుతూ, పూర్ణ కుంభం,

వృషభం మొదలైన క్షేమకర పదార్థాలను చూస్తూ, ముత్తయిదువలు అక్షతలు చల్లుతుండగా ప్రసన్నమైన మనస్సుతో కృష్ణుడు బయలుదేరాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 1. రాజపురుషులు యాత్రకు బయలుదేరేటప్పుడు భద్రతకు తీసికొనే రక్షణ చర్యలను శ్రీకృష్ణుడు నిశితంగా పాటించటం ఆతడి కార్యదక్షతకు నిదర్శనం. చిన్న విషయంలో కూడా పెద్ద జాగ్రత్త అవసరమని తాత్పర్యం.

2. ప్రయాణం సాగించేటప్పుడు మంగళవాద్యాలు మ్రోయించటం, శుభశకునాలు దర్శించటం, శుభ చిహ్నాలను తమ శరీరాల మీద తోచటాన్ని గమనించటం, పూర్ణకుంభ వృషభ దర్శనాలను చేయటం, వనితలు అక్షతలూ పూలూ చల్లటం మొదలైన దేశీయాచారాలను వర్ణించటం జాతి వార్తా విశేషకథనం. (సంపా.)

**సీ. పాండవ యాదవ పాంచాల కేకయ । పాండ్య మాత్స్యాదులు భద్రదంతి**
**హయరథంబులతోడ నతికుతూహలమున । వచ్చినఁ గనుఁగొని వారినెల్ల**
**సంభావనంబుల సంభాషణంబుల । నాదరించుచుఁ దగ నల్ల నల్ల**
**విభవంబు మెఱయంగ విడిదల పఱపెల్లఁ । గడచిన యత్తఱిఁ గరము శుభము**

**ఆ. లైన శకునములకు నందఱుఁ బ్రియమంద । నరుగుచున్నయట్టి యవసరమున**
**రథము రథముఁ గదియ రా నిచ్చి ధర్మనం । దనుఁడు నెమ్మి నిట్టు లనియె హరికి. 133**

**ప్రతిపదార్థం:** పాండవ, యాదవ, పాంచాల, కేకయ, పాండ్య, మాత్స్య+ఆదులు= పాండవులు, యాదవులు, పాంచాల విభుడు - ద్రుపదుడు, కేకయ రాజు, పాండ్య భూపతి, మత్స్య దేశాధీశుడు విరాటరాజు మొదలైనవారు; భద్ర దంతి హయరథంబుల తోడన్= భద్రజాతికి చెందిన ఏనుగులు, గుర్రాలు, రథాలతో; అతి కుతూహలమునన్= మిక్కిలి అభిలాషతో; వచ్చినన్= రాగా; కనుఁగొని= శ్రీకృష్ణుడు చూచి; వారిన్+ఎల్లన్= వారినందరినీ; సంభావనంబులన్= మన్ననలతో; సంభాషణంబులన్= చక్కని మాటలతో; ఆదరించుచున్= గౌరవిస్తూ; తగన్= ఒప్పిదంగా; అల్లన్+అల్లన్= మెల్ల మెల్లగా; విభవంబు+మెఱయంగన్= వైభవం ప్రకాశించగా; విడిదల పఱపు+ఎల్లన్= సేనలు విడిసిన ప్రదేశమంతా; కడచిన+ఆ+తఱిన్= దాటిన తరుణంలో; కరము= మిక్కిలి; శుభములు+ఐన+శకునములకున్= మంగళకరాలైన శకునాలకు; అందఱున్= అచటి వారెల్లరూ; ప్రియము+ అందన్= సంతోషపడగా; అరుగుచున్న+అట్టి అవసరమునన్= వెళ్ళుతున్న వేళలో; రథమున్= తన రథాన్ని; రథమున్+కదియన్+ రాన్+ఇచ్చి= శ్రీకృష్ణుడి రథాన్ని వెంబడించేటట్లు కావించి; ధర్మనందనుఁడు; హరికిన్= గోవిందుడికి; నెమ్మిన్= ప్రీతితో; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** పాండవులు, యాదవులు, పాంచాల విభుడైన ద్రుపదుడు, కేకయరాజు, పాండ్య వల్లభుడు, విరాట మహారాజు మొదలైనవారు భద్రజాతికి చెందిన ఏనుగులు, గుర్రాలు, రథాలతో మిక్కిలి ఆసక్తితో వచ్చారు. వారిని వీక్షించి శ్రీకృష్ణుడు ఆదరణలతో సంభాషణలతో గౌరవించాడు. వైభవంతో మెల్ల మెల్లగా సేనలు నిలిచి ఉన్న తావులన్నిటినీ దాటగానే శుభ శకునాలు గోచరించాయి. అందరూ ఎంతో హర్షించారు. అలా శ్రీకృష్ణుడు వెళ్ళుతున్న సమయంలో తన రథం అతడి రథం దగ్గరకు పోనిచ్చి ధర్మపుత్రుడు శ్రీహరితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'వచ్చె జనార్దనుం డనిన వార్తకుఁ బ్రాణము మేనికంతకున్**
**వచ్చిన సేదఁ దేఱుఁ గురువంశ పవిత్రచరిత్ర గొంతి నీ**
**వచ్చటి కేఁగి పాండవుల యందఱ మాఱనిచెప్పి మ్రొక్కుచున్**
**గ్రుచ్చియ కౌఁగిలించుకొని కుందిన చిత్తము నొప్పి దీర్పుమీ! 134**

**ప్రతిపదార్థం:** కురువంశ పవిత్ర చరిత్ర= కురువంశమును పావనము చేయు నడవడిగల; గొంతి= కుంతీదేవి; జనార్దనుండు= శ్రీకృష్ణుడు; వచ్చెన్= వచ్చాడు; అనిన వార్తకున్= అనినట్టి వృత్తాంతానికి; ప్రాణము= ఊపిరి; మేనికిన్+అంతకున్= శరీరాని కంతటికినీ; వచ్చినన్= రాగా; సేద తేఱున్= బడలిక నుండి తేరుకొంటుంది; నీవు+అచ్చటికిన్+ఏఁగి= నీవు ఆమె ఉన్న తావునకు పోయి; పాండవుల+అందఱ మాఱు+అని చెప్పి= పాండవులందరికీ బదులు అని పలికి; మ్రొక్కుచున్= నమస్కరిస్తూ; గ్రుచ్చి+అ కౌఁగిలించుకొని= గట్టిగా కౌగిలించుకొని; కుందిన చిత్తము నొప్పిన్= క్రుంగిపోయిన మనసులోని బాధను; తీర్పుమీ!= పోగొట్టుము.

**తాత్పర్యం:** 'మా తల్లి కుంతీదేవి కురువంశాన్ని పవిత్రం చేసే ప్రవర్తన కలది. మధుసూదనుడు వచ్చాడన్న సంగతి చెవి సోకగానే ఆమె శరీరమంతటికినీ చైతన్యం వచ్చినట్లుంటుంది. (ప్రాణం లేచి వచ్చినట్లుంటుంది.) ఆమె శ్రమ తొలగిపోతుంది. నీవు మా తల్లి కడకేగి మా అందరికి మారుగా నమస్కరించి, గట్టిగా కౌగిలించుకొని, కుప్పకూలిన ఆమె మనసులోని బాధను నివారించుము.

**చ. అడవికి నేఁగునాఁడు మము నంపఁగ నెంతయు దవ్వు వచ్చిన**
**ప్పుడు దనమోము దైన్యమునఁ బొందెడు నశ్రులుఁ జూచి చూచి య**
**ట్లొడఁబడి డించిపోవలసె నుమ్మలికమ్మున గొంతి యింతకుం**
**బడుగయి పాలలోఁ బడిన బల్లి విధంబున నుండకుండునే? 135**

**ప్రతిపదార్థం:** అడవికిన్+ఏఁగునాఁడు= అరణ్యావాసానికి వెళ్ళే వేళలో; మమున్+అంపఁగన్= మమ్ము పంపటానికి; ఎంతయున్ దవ్వు= మిక్కిలిదూరం; వచ్చిన+అప్పుడు= వచ్చిన సమయాన; తన మోము= తన ముఖం; దైన్యమునన్= దీనత్వంచేత; పొందెడు+అశ్రులు= పొందుతున్న దుఃఖబాష్పాలు; చూచి చూచి= ఆ విధంగా కనులతో చూస్తూ కూడ; అట్లు ఒడఁబడి= ఆ రీతిగా సమ్మతించి; డించిపోన్+వలసెన్= వదలిపెట్టి వెళ్ళవలసి వచ్చింది; ఉమ్మలికమ్మునన్= శోకంతో; గొంతి= (మా జనని) కుంతీదేవి; ఇంతకున్= ఇప్పటికి; బడుగు+అయి= శుష్కించినదై; పాలలోన్ పడిన= పాలలో పడిన; బల్లి విధంబునన్= బల్లివలె; ఉండక+ఉండునే?= ఉండక ఉంటుందా? (ఉండి ఉంటుంది.)

**తాత్పర్యం:** అడవులకు పోయేటప్పుడు మమ్ములను పంపటానికి చాలా దూరం నడచి వచ్చింది. ముఖంలో దైన్యం నెలకొన్నది. కన్నులలో దుఃఖబాష్పాలు నిండాయి. అట్టి మా తల్లిని చూస్తూ చూస్తూ సమ్మతించి హస్తినలో విడిచిపెట్టి వెళ్ళవలసి వచ్చింది. పాలలో పడిన బల్లివలె ఆమె దుఃఖంతో ఈపాటి కెంతో శుష్కించిపోయి ఉంటుంది.

**విశేషం:** 1. అలం: ఉపమ, లోకోక్తి.

2. ధర్మజుడు కుంతీదేవిని గురించి చెప్పిన మాటలు వత్సల, ప్రేమోరసముద్రితాలు. తల్లిని కలిసికొని తమ పక్షాన ఆమెను ప్రేమతో కౌగిలించుకొని మనోవేదన తొలగేటట్లుగా శ్రీకృష్ణుడిని మాట్లాడుమన్నాడు. అడవికి పంపేనాడు ఆమె దైన్యంతో కన్నీరు మున్నీరయిన ఆనాటి దృశ్యం ఇంకా కళ్ళల్లో మెదలుతున్నదని ధర్మజుడు జ్ఞాపకం చేసికొన్నాడు. విధిలేక ఆమెను హస్తినలో వదలవలసి వచ్చింది. ఇన్నేళ్ళుగా ఆమె దిగులుతో వరుగై పోయి ఉంటుందని అంటూ 'పాలలో బడ్డ బల్లి' వలె అనే ఉపమానం వాడాడు. పాలు రుచిగా ఉండేవయినా, దానిలో పడి బల్లి ప్రాణాంతకంగా భావిస్తుంది. హస్తినలో విదురుడింట ఆమె సుఖంగా ఉన్నా పుత్ర వియోగతాపంతో వేడిపాలలోని బల్లివలె మగ్గిపోతూ ఉంటుందని సార్థకంగా చెప్పాడు. లోకోక్తిని ఉపమానంగా తీసికొని చెప్పటం దేశీయం. (సంపా.)

**క. లక్కయిలు కాలినది మొద । లక్కట! మా తల్లి మాకునై నెవ్వగతోఁ**
**బెక్కిడుమలఁ బడుచున్నది । దిక్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్. 136**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; లక్క ఇలు కాలినది మొదలు= లాక్షాగృహదహనం జరిగినప్పటి నుండి; మా తల్లి= మా జనని; మాకున్+ఐ= మా కొఱకు; నెఱ+వగతోన్= నిండు దుఃఖంతో; ఎవ్వరు దిక్కులేని అట్లు= ఎవరూ తనకు ఆధారం లేనివిధంగా; దీనత్వమునన్= దైన్యంతో; పెక్కు+ఇడుమలన్+పడుచున్+ఉన్నది= పలు కష్టాలు అనుభవిస్తున్నది.

**తాత్పర్యం:** అయ్యో! లాక్షాగృహదహనం జరిగినది మొదలు దిక్కుమాలినదానివలె మా తల్లి దైన్యంతో మా కొరకు పలు కష్టాలు అనుభవిస్తూ ఉన్నది.

**క. ఏ ననుట గాఁగ దుఃఖము । లైనవి దెగు సమయ మయ్యె నని చెప్పుము; మీ**
**మేనత్త నూఱడింపుము; । దా నెప్పుడు నీవు గలవు తన కనుచుండున్.' 137**

**ప్రతిపదార్థం:** ఏన్+అనుట+కాఁగన్= నేను చెప్పినట్లుగా; దుఃఖములు+ఐనవి= దుఃఖాలనునట్టివి; తెగు సమయము+అయ్యెన్= తొలగేవేళ సమీపించింది; అని చెప్పుము= అని చెప్పవలసింది; మీ మేనత్తన్+ఊరడింపుము= మీ మేనత్త అగు కుంతీదేవిని ఓదార్చ వలసింది; తాన్= మా అమ్మ; ఎప్పుడున్= ఎల్లవేళలందు; తనకున్= తనకు; నీవు కలవు+అని= నీవు(ఆధారమని) ఉన్నావని; అనుచున్+ఉండున్= పలుకుతుంటుంది.

**తాత్పర్యం:** దుఃఖాలు అనుభవించటం ఐనది, కష్టాలు తొలగే సమయం వచ్చింది - అని మా అమ్మతో నేను చెప్పినట్లుగా చెప్పవలసింది. కృష్ణా! మీ మేనత్తను ఊరడించవలసింది. నీవు తన కెప్పుడూ ఆధారమని ఆమె పలుకుతుంటుంది.'

**వ. అని చెప్పి వెండియు. 138**

**తాత్పర్యం:** ధర్మజుడిట్లా చెప్పి, మరల ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**ఆ. 'గురుఁడు బాహ్లికాది కురువృద్ధులును సుహృ । ద్బాంధవులు నశేష ధరణిపతులుఁ**
**బ్రీతిఁ బొంద నెవ్వరికి నేది దగుఁ బ్రణా । మాది విధుల నడపు నాదుపలుకు. 139**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; బాహ్లిక+ఆది= శంతన మహారాజు తమ్ముడైన బాహ్లికుడు మున్నగు; కురువృద్ధులును= కురు వంశములోని పెద్దలును; సుహృత్+బాంధవులును= చెలికాండ్రు, చుట్టాలును; అశేష ధరణి పతులున్= సకల రాజులున్నూ; ప్రీతిన్+పొందన్= సంతోషం చెందేటట్లు; ఎవ్వరికిన్+ఏది, తగున్= ఎవరి యెడల ఏది ఉచితమో; ప్రణామ+ఆది విధులన్= నమస్కారాలు మొదలైన ఉపచారాల చేత; నాదు పలుకున్= నా మాటను; నడపు(ము)= వారికి అందజేయవలసింది.

**తాత్పర్యం:** 'గురువగు ద్రోణాచార్యులు, బాహ్లికుడు మొదలైన కురువంశంలోని పెద్దలు, చెలికాండ్రు, చుట్టాలు, సకల భూపతులు సంతసించేటట్లు ఎవరి పట్ల ఏది ఉచితమో, ఆ విధంగా నమస్కారాది విధు లొనర్చినానని నా మాటగా వారికి చెప్పుము.

**క. పరమ ప్రియమున నాకై । పరిరంభణ సేసి గాఢ బాంధవ సాంద్రా**
**దరమున సంభాషింపు వి । దురుతోఁ; మధ్యస్థుఁడగు హితుం డతఁ డనఘా!' 140**

**ప్రతిపదార్థం:** అనఘా!= దోషరహితుడా!; నాకై= నాకు మారుగా; పరమ ప్రియమునన్= మిక్కిలి ప్రేమతో; పరిరంభణ చేసి= కౌగిలించుకొని, గాఢ బాంధవ= దృఢమైన చుట్టరికంచేత కలిగిన; సాంద్ర= నిబిడమైన; ఆదరమునన్= గౌరవంచేత; విదురుతోన్; సంభాషింపు(ము)= మాట్లాడుము; అతఁడు= ఆ మహనీయుడు; మధ్యస్థుఁడు+అగు హితుఁడు= పక్షపాతం లేక ఉభయ వర్గాల మేలు కోరేవాడు.

**తాత్పర్యం:** మిక్కిలి ప్రేమతో నాకు బదులుగా విదురుడిని కౌగిలించుకొని గాఢమైన బాంధవాదరంతో ఆయనను గౌరవించి మాటాడుము. అతడు పక్షపాతం లేకుండా కురు పాండవుల మేలుకోరే మహనీయుడు.'

**వ. అనియెఁ దదనంతరంబ యర్జునుండు. 141**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తర్వాతనే.

**తాత్పర్యం:** అని ధర్మరాజు చెప్పినాడు. అటు తర్వాత అర్జునుడిలా అన్నాడు.

**చ. 'జనులు వినంగ రాజ్యమున సాము గొనంగలవారమన్న యీ**
**జనపతి కార్యనిశ్చయము సమ్మతి గైకొని చేసినన్ సుయో**
**ధనుఁడును దమ్ములున్ సఖులు దానికి నేమును నియ్యకొందు మొం**
**డనిన సపుత్త్రమిత్త్రముగ నద్దెస నందఱ గ్రొచ్చి పాఁతుదున్.' 142**

**ప్రతిపదార్థం:** జనులు వినంగన్= ప్రజలందరూ వింటుండగా; రాజ్యమునన్= హస్తినాపుర సామ్రాజ్యంలో; సాము= సగపాలు; కొనన్+కలవారము= తీసికొనగలం; అన్న= అని నుడివిన; ఈ జనపతి కార్య నిశ్చయమున్= విభుడగు ధర్మజుడి కార్య నిర్ణయాన్ని; సుయోధనుఁడును= దుర్యోధనుడూ; తమ్ములున్= అతడి సహోదరులూ; సఖులున్= అతని చెలికాండ్రూ; సమ్మతిన్= అంగీకారంతో; కైకొని= అతని మాట స్వీకరించి; చేసినన్= ఆచరిస్తే; దానికిన్= అర్ధ రాజ్యం తీసుకొనటానికి; ఏమును= మేమున్నూ; ఇయ్యకొందుము= ఒప్పుకొంటాం; ఒండు+అనినన్= వేరు విధంగా పలికితే; సపుత్త్ర మిత్త్రముగన్= సుతులతో, హితులతో కూడా; ఆ+దెసన్+అందఱన్= ఆ పక్షంలోఉన్న వారినందరినీ, గ్రొచ్చి పాఁతుదున్= గోయి త్రవ్వి పూడ్చిపెడతాను.

**తాత్పర్యం:** 'జనులంతా వింటుండగా రాజ్యంలో సగభాగం మేము తీసికొంటాం'. అని ధర్మజుడు తీర్మానించాడు. ఆ తీర్మానానికి సమ్మతించి దుర్యోధనుడూ, అతడి తమ్ములూ, అతడి స్నేహితులూ అర్ధరాజ్యమిస్తే మేము అందుకు అంగీకరిస్తాము. ఇందుకు మరో విధంగా చెపితే కౌరవపక్షంలో ఉన్నవారినందరినీ సుతులతో హితులతో కూడ గోతులు త్రవ్వి పూడ్చిపెడతాను.'

**విశేషం:** 'అందఱ గ్రొచ్చి పాఁతుదున్' - అన్నది తెలుగు జాతీయం. కోపం వచ్చినప్పుడు ఎదుటివారిని (గొయ్యితీసి) పాతిపెడతాననటం తెలుగువారికి అలవాటు. కాగా, యుద్ధ రంగాలలో కుప్పలు కుప్పలుగా పడి ఉన్న శవాలను పెద్ద పెద్ద గోతులు తవ్వి మూక ఉమ్మడిగా పూడ్చటం కూడా సహజం. ఏమైనా ఈ వాక్యం అర్జునుడికి కౌరవులమీదగల తీవ్రకోపాన్ని వ్యక్తం చేస్తున్నది. (సంపా.)

**మ. అనినన్ మెచ్చి వృకోదరుం డితఁడు కార్యం బింత దెల్లంబుగాఁ**
**బొనరం బల్కునె?' యంచుఁ బేరెలుఁగు సొంపుం బొంద వక్త్రంబు పా**
**ల్పున దర్పం బొలయంగ నంగములునుం బొంగార నుద్బృంహిత**
**ధ్వనియై పొల్చు మహోగ్ర సింధురము చందం బొంది యొప్పెం గడున్. 143**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పార్థుడు పలుకగా; మెచ్చి= మెచ్చుకొని; వృకోదరుండు= భీమసేనుడు; ఇతఁడు= అర్జునుడు; కార్యంబున్= చేయదగిన పనిని; ఇంత తెల్లంబుగాన్= ఇంత విస్పష్టంగా; పొనరన్+పల్కునె?= ఒప్పుగ చెప్పుతాడా?; అంచున్= అంటూ; పేరు+ఎలుఁగు= గొప్ప కంఠధ్వని; సొంపున్+పొందన్= అందగించగా; వక్త్రంబు పొల్పునన్= ముఖ సౌందర్యం చేత; దర్పంబు= గర్వం; ఒలయంగన్= వ్యాపించగా; అంగములునున్= అవయవాలు కూడా; పొంగు+ఆరన్= పొంగగా, ఉబ్బగా; ఉత్+బృంహితధ్వని+ఐ= గొప్ప ఘీంకార శబ్దంకలదై; పొల్చు= శోభిల్లు; మహా+ఉగ్రసింధురము చందంబున్+ఒంది= మహా భయంకరమైన ఏనుగు తీరై; కడున్= మిక్కిలి; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** అర్జునుడి పలుకులు శ్లాఘిస్తూ 'ఇతడు చేయవలసిన పనిని గూర్చి ఎంతో విస్పష్టంగా చెప్పాడు అంటూ తన గంభీర కంఠస్వరం అందం చిందగా, ముఖ సౌందర్యంచేత గరువం వ్యాపించగా, అవయవాలు పొంగగా, గొప్ప ఘీంకార ధ్వనితో చెలువారు మత్తగజంవలె భీముడు ప్రకాశించాడు.

**విశేషం:** భీముడు గొప్ప సహృదయుడు. అర్జునుడు వీరవాక్యం మాట్లాడగా విని తానే ఆ మాటలన్నంత ఉప్పొంగిపోయాడు. ఆ అన్నదమ్ముల ఆత్మీయత కూడా అటువంటిదే. వీరోల్లాసంతో సంతోషించే భీముడు ప్రదర్శించే ఆంగికాభినయం ఇందులో సుందర గంభీరం. మాటలు శ్రావ్య గంభీరంగా వెలువడ్డాయి. ముఖం గర్వంతో అందంగా వెలిగిపోయింది. ఒడలు ఉప్పొంగింది. పెద్ద పెట్టున ఘీంకారం చేసే మత్తేభంవలె మనోహరంగా ఉన్నాడు. మదేభం వలె ఉన్న భీముడిని మత్తేభవిక్రీడితంలో వర్ణించటం ఛందశ్శిల్పం. (సంపా.)

**క.** **నకుల సహదేవులును దా । నికి సంతసమంది 'యిట్లు నెయ్యము కయ్యం**
**బొక తెఱఁగు సేసికొని తడ । యక ర మ్మని పలికి రప్పు డచ్యుతుతోడన్.** **144**

**ప్రతిపదార్థం:** నకుల సహదేవులును= నకులుడూ; సహదేవుడూ; దానికిన్= అర్జునుడి పలుకులకు; సంతసము+అంది= సంతోషపడి; ఇట్లు= ఈ ప్రకారంగా; నెయ్యము= స్నేహమో; కయ్యము= యుద్ధమో; ఒక తెఱఁగు+చేసికొని= రెంటిలో ఒక దానిని నిశ్చయించి; తడయక రమ్ము+అని= ఆలసింపక రమ్మని; అచ్యుతు తోడన్= శ్రీకృష్ణుడితో; అప్పుడు= ఆ సమయాన; పలికిరి= చెప్పారు.

**తాత్పర్యం:** నకుల సహదేవులు అందుకు సంతసించి పొత్తో లేక పోరో ఏదో ఒకటి తీర్మానించుకొని వెంటనే రావలసినదని శ్రీకృష్ణుడితో చెప్పారు.

### శ్రీకృష్ణుఁడు నారదాది మహామునులం గని సంభాషించుట (సం. 5-81-58)

**వ.** **ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయు మాటలు సెప్పి 'యతనిఁ గౌఁగిలించికొని యథోచిత ప్రకారంబుల వీడుకొని వలగొని మగిడిరి; తక్కినవారలు నర్హంబులగు తెఱంగుల నామంత్రితులై మరలిరి; మాధవుండును బ్రయాణ సర్వ సంభార నిర్వాహకులం గలయం గనుంగొని తగిన సల్లాపంబులు సేసి, కరినగరంబు పెం దెరువుఁ గైకొని దారుకుని చతురత్వంబునఁ దురంగంబుల పటుత్వంబున నత్యంత సమీచీనంబైన యానంబున మనం బలరం జనిచని, యొక్కయెడ నారద జమదగ్ని కణ్వాదులగు మహామునులం గొందఱం గని రథంబు డిగ్గి నమస్కరించి సభక్తి తాత్పర్యంబునఁ గుశలం బడిగి, మీ**

**రిక్కడకు, విజయంచేయుటకుఁ గతం బేమి? సేయంగల పని యెయ్యది? నా కానతిం' డనిన నారాయణునకు నారదుం డిట్లనియె.** **145**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈతీరున; పాండునందనులు; అందఱును; గోవిందునకున్= కృష్ణుడికి; వలయు మాటలు+చెప్పి= చెప్పవలసిన మాటలు చెప్పి; అతనిన్; కౌఁగిలించికొని; యథా+ఉచిత ప్రకారంబులన్= అర్హమైన విధానాలతో; వీడుకొని= వెళ్ళి వస్తామని చెప్పి; వలగొని= ప్రదక్షిణంచేసి; మగిడిరి= మరలారు; తక్కినవారలు; అర్హంబులు+అగు తెఱంగులన్= తగిన విధాల; ఆమంత్రితులు+ఐ= ఆ కృష్ణుడిచేత అనుమతి కొన్నవారై; మరలిరి= తిరిగి వెళ్ళారు; మాధవుండును; ప్రయాణ సర్వ సంభార నిర్వాహకులన్= పయనానికి కావలసిన సమస్త వస్తువులు సమకూర్చేవారిని; కలయన్+కనుంగొని= తేరిపార చూచి; తగిన సల్లాపంబులు+చేసి= తగు ముచ్చటలు ఆడి; కరినగరంబు పెను+తెరువు+కైకొని= హస్తినాపురికి పోయే పెద్దబాట ననుసరించి; దారుకుని చతురత్వంబునన్= దారుకుని నేర్పు చేతను; తురంగంబుల-పటుత్వంబునన్= గుఱ్ఱాలయొక్క దృఢత్వం చేతను; అత్యంత సమీచీనంబు+ఐన= మిక్కిలి యుక్తమైన; యానంబునన్= గమనంచేత; మనంబు+అలరన్= హృదయ మానందించగా; చని చని= వెళ్లి వెళ్లి; ఒక్క+ఎడన్= ఆ వెళుతున్న దారిలో; నారద, జమదగ్ని; కణ్వ+ఆదులు+అగు= నారదుడు, జమదగ్ని, కణ్వుడు మొదలైన; మహామునులన్= మహర్షులను; కొందఱన్; కని= చూచి; రథంబు; డిగ్గి= దిగి; నమస్కరించి; సభక్తి తాత్పర్యంబునన్= భక్తితోడి తత్పరత్వంతో; కుశలంబు+అడిగి= క్షేమం విచారించి; మీరు; ఇక్కడకున్; విజయం చేయుటకున్= రావటానికి; కతంబు+ఏమి?= కారణమేమిటి?; చేయన్+కలపని+ఎయ్యది?= తమకు నేనేకార్యం చేయాలి?; నాకున్; ఆనతి+ఇండు= సెలవియ్యండి; అనినన్; నారాయణునకున్; నారదుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవు లందరూ శ్రీకృష్ణుడికి చెప్పవలసిన మాటలన్నీ చెప్పి, ఆలింగనం చేసికొని అర్హ ప్రకారంగా సెలవు పుచ్చుకొని ప్రదక్షిణం చేసి వెనుకకు మరలారు. యాదవులు, పాంచాలురు మొదలైన వారంతా తగు విధాల కృష్ణుడి అనుమతి పొంది అక్కడ నిల్చిపోయారు. తరువాత శౌరి ప్రయాణానికి కావలసిన పదార్థాలు సమకూర్చినవా రందరినీ కనుగొని వారితో ముచ్చటించాడు. హస్తినానగరికి వెళ్ళే విశాల మార్గంలో దారుకుని నైపుణ్యం, గుఱ్ఱాల పటుత్వం కారణంగా సాగిన చక్కని రథగమనం ఆయన మనస్సును ఆహ్లాదపరిచింది. కృష్ణుడు వెళ్ళుతుండగా దారిలో ఒకచోట నారదుడు, జమదగ్ని, కణ్వుడు మొదలైన మహర్షులు కొందరు కనిపించారు. వెంటనే గోవిందుడు రథం దిగి వారికి నమస్కరించాడు. మాధవుడు భక్తితత్పరుడై వారి క్షేమం విచారించి, 'మీరిక్కడికి విచ్చేయటానికి హేతువేమిటి? నేను తమకు చేయవలసిన పనులేమి?' సెలవియ్యం'డని అడిగాడు. అప్పుడు నారదుడు నారాయణుడితో ఇట్లా అన్నాడు:

**సీ.** **'అనఘ! పుణ్యాత్ముఁడ వగు నిన్నుఁ గనుఁగొనఁ, । గౌరవసభ నీవు గారవమునఁ**
**బలికెడి పలుకుల భంగు లాకర్ణింప, । విదుర భీష్మాదులు విను తెఱంగు**
**నుత్తరం బిచ్చు కార్యోక్తులు నెఱుఁగంగ । వేడుక వచ్చిరి వీరలెల్ల'**
**నని చెప్ప విని 'లెస్స, యట్ల చేయుదురుగా' । కని హరి వల్కిన నమ్మునీంద్రు**

**తే.** **లతని దీవించి 'నీవు పొ; మ్మచటి కేము । నరుగుదెంచెద'మని ప్రీతి ననుప నరిగి**
**యొక్క పుణ్యాశ్రమంబున యొద్ది యేట । విడిసి దివస ప్రవర్తన విధులు నడిపి.** **146**

**ప్రతిపదార్థం:** అనఘ!= దోషరహితుడా!; పుణ్య+ఆత్ముఁడవు+అగు నిన్నున్= సుకృతాత్ముడవైన నిన్ను; కనుఁగొనన్= చూడటానికి; కౌరవ సభన్= ధృతరాష్ట్రుని కొలువులో; నీవు; గారవమునన్= ఆదరంతో; పలికెడి పలుకుల భంగులు= మాటాడే

మాటల తీరులు; ఆకర్ణింపన్= వినటానికీ; విదుర భీష్మ+ఆదులు= విదురుడు, భీష్ముడు మొదలైనవారు; విను తెఱంగు= వినే విధం; ఉత్తరంబు+ఇచ్చు కార్య+ఉక్తులు= కార్యానికి సంబంధించి వారు సమాధాన మిచ్చే మాటలు; ఎఱుఁగంగన్= తెలియటానికి; వీరలు+ఎల్లన్= ఈ మునీశ్వరులందరు; వేడుకన్= కుతూహలంతో; వచ్చిరి= వచ్చారు; అని; చెప్పన్; విని; లెస్స= మంచిది; అట్ల చేయుదురు గాక= అట్లే వచ్చి విందురుగాక; అని; హరి; పల్కినన్; ఆ+ముని+ఇంద్రులు= ఆ మౌనిశ్రేష్ఠులు; అతనిన్ దీవించి= కృష్ణుడిని ఆశీర్వదించి; నీవు; అచటికిన్= కురుసభకు పొమ్ము; ఏము= మేము; అరుగుదెంచెదము= వస్తాం; అని; ప్రీతిన్= సంతోషంతో; అనుపన్+అరిగి= వారు సాగనంపగా వెళ్ళి; ఒక్క+పుణ్య+ఆశ్రమంబున+ఒద్ది+ఏటన్= ఒక పావనాశ్రమం చెంతగల నది ఒడ్డున; విడిసి= దిగి; దివసప్రవర్తన విధులు+నడిపి= ఆహ్నికాలైన వేదవిహిత కార్యాలు ఆచరించి.

**తాత్పర్యం:** 'వాసుదేవా! పుణ్యచిత్తుడవైన నిన్ను చూడటానికి కౌరవ సభలో నీవు ఆదరంతో చెప్పే మాటలు వినటానికీ, విదురుడు భీష్ముడు మొదలైనవారు వినే విధమూ, విని వారిచ్చే సమాధానాలూ తెలిసికొనటానికీ కుతూహలపడి ఈ మునీశ్వరులంతా వచ్చారు' అని చెప్పగా శ్రీకృష్ణుడు ఆలకించి 'మంచిది అలాగే చేయండి' అని అనుమతించాడు. మహర్షులు ఆయనను ఆశీర్వదించి 'నారాయణా! నీవు హస్తినాపురికి వెళ్ళుము. మే మక్కడికి వస్తాము' అని సంతోషంతో పంపగా, కృష్ణుడు బయలుదేరి ఒక పావనాశ్రమం చెంత గల ఏటి ఒడ్డున విడిది చేశాడు. అక్కడ శాస్త్ర విహితాలైన ఆహ్నికాలు నిర్వర్తించాడు.

**వ. కమలనాభుండు గదలిపోయి సూర్యాస్తమయ సమయంబునఁ గుశస్థలంబు సేరం జనునప్పు డందలి విప్రు లెదురు వచ్చి కాంచి నిజనివాసంబులకుం బిలిచినం బ్రసన్నవదనుండగుచు సమ్మర్దంబు వలవదని పలికి విశాల రమణీయంబైన బహిరంగణంబునం బటకుటీర ప్రకరం బెత్తించి విడిసి, తగువారును దానును వారల గృహంబుల కరిగి యభ్యాగత పూజలు గైకొని వారిని సంభావించి విడిదలకుం జని సమయ సముచిత వృత్తిం బ్రవర్తిల్లుచుండె; నంత నక్కడ; 147**

**ప్రతిపదార్థం:** కమలనాభుండు= కమలం నాభియందు కల శ్రీకృష్ణుడు; కదలిపోయి= పయనం సమకట్టి; సూర్య+అస్తమయ సమయంబునన్= ప్రొద్దు గ్రుంకువేళకు; కుశస్థలంబు చేరన్+చను+అప్పుడు= కుశస్థలమనే ప్రదేశాన్ని సమీపించే సమయంలో; అందలి విప్రులు= కుశస్థల వాసులైన బ్రాహ్మణులు; ఎదురు వచ్చి= కృష్ణుడికి ఎదురుగా వెళ్ళి; కాంచి= చూచి; నిజనివాసంబులకున్= తమ ఇండ్లకు; పిలిచినన్= రండని ఆహ్వానింపగా; ప్రసన్న వదనుండు+అగుచున్= అనుగ్రహంతో కూడిన మోముకలవాడై; సమ్మర్దంబు వలవదు= సందడి పనికిరాదు; అని పలికి; విశాల రమణీయంబు+ఐన= విరివి ఐనది సుందరమైనది అగు; బహిః+అంగణంబునన్= మైదానంలో; పట కుటీర ప్రకరంబు+ఎత్తించి= పెక్కు గుడారాలు వేయించి; విడిసి= వాటిలో దిగి; తగువారును= తగిన మనుష్యులును; తానును; వారల గృహంబులకున్; అరిగి; అభ్యాగత పూజలు+కైకొని= భోజనమప్పుడు వచ్చిన వారికి చేసే సత్కారాలు స్వీకరించి; వారిని సంభావించి= ఆ బ్రాహ్మణులను ఆదరించి; విడిదలకున్+చని= తాము విడిసిన పట కుటీరాలకు వెళ్ళి; సమయ సముచిత వృత్తిన్= ఆ వేళకు దగిన పనిపాటులలో; ప్రవర్తిల్లుచున్+ఉండెన్= మెలగుతూ ఉన్నాడు; అంతన్= అటు పిమ్మట; అక్కడ= హస్తినాపురంలో.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు బయలుదేరి ప్రొద్దుగ్రుంకే వేళకు కుశస్థలం సమీపించాడు. అక్కడి బ్రాహ్మణులు నారాయణునకు ఎదురువచ్చి తమ గృహాలకు రమ్మని ఆహ్వానించారు. శౌరి ప్రశాంత ముఖంతో వారిని చూచి, ఇంత మంది పరిజనంతో రావటం లేదు, అని చెప్పి అక్కడొక విశాలమైన సుందరమైన మైదానంలో గుడారాలు

వేయించాడు. పరిజనమంతా ఆ శిబిరాలలో ఉండగా తాను, అర్హులైన కొద్దిమందితో మాత్రం ముకుందుడు ఆ విప్రుల నిలయాలకు వెళ్ళాడు. అక్కడ వారిచ్చే అతిథి సపర్యలు స్వీకరించాడు. భూసురులను ఆదరించి తిరిగి తమ విడిది పట్టులకు చేరి, ఆ సమయానికి తగిన పనులలో నిమగ్నుడైనాడు. ఇక హస్తినాపురంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. వార్త విని యాక్షణమ కౌరవక్షితీశ్వ। రుండు గాంగేయ గురు విదురులను బుత్త్రు**
**సంజయునిఁ గర్ణు సైంధవు శకునిఁ బిలువఁ। బనిచి తా నిట్టు లనియె నందనునితోడ. 148**

**ప్రతిపదార్థం:** కౌరవక్షితి+ఈశ్వరుండు= ధృతరాష్ట్ర మహారాజు; వార్తన్ విని= కృష్ణుడు వస్తున్న సమాచారం తెలిసి; ఆ క్షణమ= అప్పుడే; గాంగేయ గురు విదురులను= గంగా పుత్రుడైన భీష్ముడిని, ఆచార్యుడైన ద్రోణుడిని, సచివుడైన విదురుడిని; పుత్త్రున్= కుమారుడైన దుర్యోధనుడిని; సంజయునిన్= చెలికాడగు సంజయుడిని; కర్ణున్= రాధేయుడిని; సైంధవున్= అల్లుడైన సైంధవుడిని; శకునిన్= మరిదిఅయిన శకునినీ; పిలువన్+పనిచి= దగ్గరకు రప్పించుకొని; నందనునితోడన్= కుమారుడితో; తాన్= తాను (ఆ ధృతరాష్ట్రుడు); ఇట్టులు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** కురువంశ విభుడగు ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడు తమకడకు వస్తున్నాడనే సమాచారం విని, వెంటనే తన దగ్గరికి భీష్ముడిని, ద్రోణుడిని, విదురుడిని, దుర్యోధనుడిని, కర్ణుడిని, సైంధవుడిని, శకునినీ పిలిపించాడు. దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**వ. 'కృష్ణుఁడు పాండవ కార్యార్థంబుగా మనయొద్దకు వచ్చుచున్నవాఁడు; నేఁడు కుశస్థలంబున విడిసె రేపిందులకు వచ్చునని వింటి; మిట్టి యాశ్చర్యంబునుం గలదే! సర్వలోకాభిగమ్యుండగు నమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి; మన కింతకంటెను బెంపెయ్యది? యతం డెవ్వరివలన సంతుష్టుండయ్యె వారికి శుభంబును, నెవ్వరిదెస ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుటదప్ప; దతనికి వలయు పూజ లాచరించుటకు సంవిధానంబు సేయుము; గృహాలంకరణాది మంగళప్రకారంబు లనుష్ఠింప నియమింపు; మతని చిత్తంబునకు నీ విభవంబును దనమీఁది ప్రియంబునుం దోఁచునట్టి తెఱంగున సమస్తంబును సమకట్టుము. 149**

**ప్రతిపదార్థం:** కృష్ణుఁడు; పాండవ కార్య+అర్థంబుగాన్= పాండవుల పని కొరకై; మన+ఒద్దకున్; వచ్చుచున్+ఉన్నవాఁడు; నేఁడు; కుశస్థలంబునన్; విడిసెన్; రేపు; ఇందులకున్; వచ్చున్; అని; వింటిమి; ఇట్టి ఆశ్చర్యంబునున్+కలదే?= ఇంతటి వింత ఉన్నదా?; సర్వలోక+అభిగమ్యుండు= సమస్త లోకములకు పొందదగినవాడు; అగు+అ+మహానుభావునకున్; మనము; అభిగమ్యులము+ఐతిమి= పొందదగినవారమైనాము; మనకున్; ఇంతకంటెను; పెంపు+ఎయ్యది?= భాగ్యమేముంది?; అతండు; ఎవ్వరివలనన్; సంతుష్టుండు+అయ్యెన్= మిక్కిలి సంతోషం పొందిన వాడాయెనో; వారికిన్; శుభంబును; ఎవ్వరి దెసన్= ఎవరి విషయమున; అనాదరంబు+చేసెన్= మన్నన చూపడో; వారికిన్; అశుభంబున్= అమంగళమూ; అగుట; తప్పదు; వలయు= కావలసిన; పూజలు= సపర్యలు; ఆచరించుటకున్= కావించటానికి; సంవిధానంబు+చేయుము= ఏర్పాటు చేయుము; గృహ+అలంకరణ+ఆది= ఇండ్లు అలంకరించటం మున్నగు; మంగళ ప్రకారంబులు= శోభన కార్యాలు; అనుష్ఠింపన్= ఆచరించటానికి; నియమింపుము= ఆజ్ఞాపించుము; అతని చిత్తంబునకున్= శౌరి మనస్సునకు; నీ విభవంబును= నీ ప్రాభవం; తన మీఁది ప్రియంబునున్= తన యెడ నీకు గల ఇష్టం; తోఁచునట్టి తెఱంగునన్= గోచరించే విధంగా; సమస్తంబును సమకట్టుము= అన్ని ఏర్పాట్లు చేయుము.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణుడు పాండవుల పనిమీద మన దగ్గరకు వస్తున్నాడు. ఈ రోజు కుశస్థలంలో నిలిచాడు. ఇక్కడకు రేపు వస్తాడని విన్నాను. ఇంతటి అద్భుత విషయం ఉన్నదా? లోకులందరు ఎవడి చెంతకు చేరవలెనని ఉవ్విళ్ళూరుతారో అట్టి మహానుభావుడు మనకడకు వస్తున్నాడు. మన కింతకంటే అదృష్టముందా? ఎవ్వరు అతడిని సంతోషపెట్టుతారో వారికి శుభాలూ, ఎవరు అతడిని ఆదరించరో వారికి అశుభాలూ జరగటం తథ్యం. కావున ఆయనకు సర్వ సపర్యలు చేయటానికి కావలసిన ఏర్పాట్లన్నీ చక్కగా కావించుము. భవనాలు అలంకరించటం మొదలైన మంగళ కార్యాలకు వెంటనే ఆదేశాలివ్వవలసింది. అతడి హృదయం సంతోషించేటట్లు, నీ ప్రాభవానికి తగ్గట్లు, తనమీద నీకున్న ప్రేమ వెల్లడి అయ్యేటట్లు సర్వమూ సంసిద్ధ మొనర్చుము.'

**విశేషం:** 1. అలం: ప్రహర్షణం. "ఉత్కంఠితార్థ సంసిద్ధి ర్వినా యత్నం ప్రహర్షణమ్'. ప్రయత్నం లేకుండానే అభిమతార్థం సిద్ధించినట్లు చెప్పితే ప్రహర్షణాలంకారం. ధృతరాష్ట్రుడి వాక్యాలు ఈ అలంకారానికే అలంకారం.

2. ధృతరాష్ట్రుడు గుడ్డివాడు. కాని, లోవెలుగుతో శ్రీకృష్ణుడి దివ్యత్వాన్ని గుర్తించి 'సర్వలోకాభిగమ్యుండగు నమ్మహానుభావునకు మన మభిగమ్యులమైతిమి. మన కింతకన్నకు 'బెం పెయ్యది?' అని ఉప్పొంగిపోయాడు. ఇది సహజమైన ఆత్మానందోల్లాసం. ఇక్కడ ఈ వాక్యం కీలకం. పాండవుల కొరకైనా పరమాత్ముడు కౌరవసభకు వస్తున్నాడని గుర్తించి ధృతరాష్ట్రుడు నిండుసభలో విశ్వరూపదర్శనం చేయదగిన అంతస్సంస్కారం, లోచూపు కలవాడని వస్తుధ్వని.

3. కన్నులు లేకపోయినా కమలనాభుడిని అంతర్నేత్రంతో చూడగల ధృతరాష్ట్రుడు కన్నులున్నా పద్మాక్షుడిని కనుగొనలేని గర్వాంధుడైన దుర్యోధనుడికి ఆ మహాత్ముడిని ఆరాధించుమని చెప్పటం విశేషం. గర్భశిలవంటి వాడు ధృతరాష్ట్రుడు.

4. శ్రీకృష్ణుడు సాక్షాత్ నారాయణుడని భావించిన ధృతరాష్ట్రుడు ఆయన ఆదరణం పొందగలగటం శుభప్రదం. అనాదరణం పొందటం అశుభం- అని నిర్దేశించాడు. ఇది భావికథార్థ సూచిక అయిన పతాక.

5. అపూర్వాహ్వాన సంభారాలు చేయండని ఉప్పొంగుతూ ధృతరాష్ట్రుడు ఆదేశాలిచ్చాడు. ఆ మాటలన్నీ దుర్యోధనుడు వింటాడని అతడూ భ్రమించలేదు. అందుకే మెళకువగా అన్నాడు - దుర్యోధనుడి వైభవ మొకవైపూ, ప్రీతి మరొక వైపూ ప్రదర్శితమయ్యేటట్లుగా స్వాగత సన్నాహాలు చేయుమన్నాడు.

6. పరమాత్మయొక్క భావనం, దర్శన స్పర్శన సంభాషణ సాముఖ్యాల సమ్మోదం, అనుగ్రహాశీర్వాద ప్రసాద లాభం మొదలైన వాటి వలన కలిగే ప్రహర్షణం తెచ్చిపెట్టుకొనేది కాదు. అంతఃప్రబోధంతో ఆవిర్భవించే ప్రహర్షణం. (సంపా.)

**క. అనిన ధృతరాష్ట్ర పలుకులు । గొనియాడిరి సంతసిల్లి గురుఁడును భీష్మం**
**డును నౌఁగాకని దుర్యో । ధనుడుం బరిచారక ప్రతతిఁ బిలిపించెన్. 150**

**ప్రతిపదార్థం:** అనిన ధృతరాష్ట్ర పలుకులు= అని చెప్పిన ధృతరాష్ట్రుడి మాటలు; గురుఁడును= ద్రోణుడును; భీష్మండును= భీష్ముడూ; సంతసిల్లి= ఆనందించి; ఔన్+కాక+అని= మంచిదే అని; కొనియాడిరి= మెచ్చారు; దుర్యోధనుఁడున్= సుయోధనుడూ; పరిచారక ప్రతతిన్= సేవకుల సమూహాన్ని; పిలిపించెన్= రావించాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు, భీష్ముడు ధృతరాష్ట్రుడి మాటలకు సంతోషించి ఇది యుక్తమే అని మెచ్చారు. అంతట దుర్యోధనుడు సేవకులను పిలిపించాడు.

**వ. ఇట్లుచిత పరివారంబు రావించి యతండు. 151**

**తాత్పర్యం:** ఈ విధంగా దుర్యోధనుడు తగిన పరిచారకులను పిలిపించి ఇట్లన్నాడు:

**క. 'అలుకుఁడు మృగమదమున, ము । గ్గులు వెట్టుఁడు గప్పురమునఁ, గుంకుమమున గో**
**డలు పూయుఁడు' మణిదామక । ములు గట్టుఁడు పెద్ద కూటమున సొంపారన్. 152**

**ప్రతిపదార్థం:** పెద్ద కూటమునన్= సభాసదనంలో; సొంపు+ఆరన్= కనుల కింపుగా; మృగమదమునన్= కస్తూరితో; అలుకుఁడు= నేల నలకండి; కప్పురమునన్= కర్పూరంతో; ముగ్గులు+పెట్టుఁడు= రంగవల్లికలు తీర్చండి; గోడలు= గోడలు; కుంకుమమునన్= కుంకుమ ద్రవ్యంతో; పూయుఁడు= మెత్తండి; మణిదామకములు+కట్టుఁడు= మణుల దండలు ద్వారాలకు కట్టండి.

**తాత్పర్యం:** సభా సదనంలో నేలను కస్తూరితో అలకండి. కర్పూరంతో రంగవల్లికలు తీర్చండి. గోడలు కుంకుమ పంకంతో మెత్తండి. ద్వారదేశాలకు మణుల దండలు వ్రేలాడదీయండి.

**విశేషం:** విశేషం: అలం: ఉదాత్తం.

**వ. మఱియు నగరెల్లను శోభిల్ల నలంకారంబు సేయుండు. 153**

**తాత్పర్యం:** ఒక్క కొలువు కూటమునేకాక నగరమంతా అలంకరించండి.

**క. పెనుపుం జతురత మెఱయఁగ । మన యింటను దుస్ససేను మందిరమున శో**
**భనశిల్పము లొనరింపుఁడు । చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరము లిడన్. 154**

**ప్రతిపదార్థం:** పెనుపున్= పెంపును; చతురత= నేర్పు; మెఱయఁగన్= వెల్లడి అయ్యేటట్లు; మన+ఇంటను= మన భవనంలో; దుస్ససేను మందిరమునన్= దుశ్శాసనుడి సౌధంలో; శోభన శిల్పములు+ఒనరింపుఁడు= మంగళకరమైన చిత్తరువులు వ్రాయించండి; వృకస్థలమునందున్= వృకస్థలం అనేచోట; చప్పరములు+ఇడన్+చనుఁడు= పందిళ్ళు వేయటానికి పొండి.

**తాత్పర్యం:** మీ కళాచాతుర్యము వెల్లడి యగునట్లు మన భవనంలో, దుశ్శాసనుడి భవనంలో మనోహరాలైన చిత్తరువులు చిత్రించండి. వృకస్థలంలో చలువ పందిళ్ళు వేయించండి.

**వ. అది విడి పట్టు గాఁదగియెడు ప' ట్టని పలికి 'వాసుదేవుండు రేపకడయ వచ్చునంతకుమున్న యింతయుం గావింపవలయు' నని పనిచి పురంబున నుత్సవంబు సాటుండని నియోగించి వివిధ గంధ మహిత మాల్యంబులు సంపాదింపను మణిభూషణ చిత్రాంబరంబులు సమకట్టను సరసాన్నస్వాదు పాన ద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరులగు తద్జ్ఞుల నియమించె; నట్టి యెడ నాంబికేయుండు విదురున కిట్లనియె: 155**

**ప్రతిపదార్థం:** అది= వృకస్థలము; విడిపట్టు= విడిది; కాన్+తగియెడు పట్టు= కాదగిన చోటు; అని పలికి; వాసుదేవుండు; రేపకడయ వచ్చున్= ఉదయమే రాగలడు; అంతకున్ మున్ను+అ= అతడి రాకకు మునుపే; ఇంతయున్ కావింపన్ వలయున్= ఈ పనులన్నీ చేయవలె; అని పనిచి= అని సేవకులను నియమించి; పురంబునన్= పట్టణంలో; ఉత్సవంబు+చాటుండు= సంబరాన్ని చాటండి; అని నియోగించి= అని భృత్యుల నాజ్ఞాపించి; వివిధ గంధ మహిత మాల్యంబులు= పలు విధాలైన సువాసనలతో గొప్పవైన పూలదండలు; సంపాదింపను= కొనివచ్చుటకు; మణి భూషణ చిత్ర+అంబరంబులు=

మణుల నగలు, వింత గొలుపు వస్త్రాలు; సమకట్టను= సమకూర్చటానికి; సరస+అన్న= రససంపన్నాలైన అన్నాలు; స్వాదు పానద్రవ్యంబులు= రుచికరమైన పానీయాలు; ఒడఁగూర్పను= లభింపజేయుటకు; నేర్పరులు+అగు= సమర్థులైన; తద్జ్ఞులన్= తెలిసినవారిని; నియమించెన్= నియోగించాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆంబికేయుండు= అంబిక కొడుకు- ధృతరాష్ట్రుడు; విదురునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** వృక్షస్థలం లం విడిది చేయటానికి తగిన చోటు 'అని పరిచారకులతో పలికి దుర్యోధనుడు మళ్ళీ ఇట్లా అన్నాడు: 'శ్రీకృష్ణుడు ఉదయమే ఇచటికి రాగలడు. రావటానికి మునుపే అన్ని పనులు చేయాలి సుమా' అని వారిని పంపివేశాడు. 'హస్తినాపురంలో ఉత్సవం చాటండి' అని మరి కొందరిని ఆజ్ఞాపించాడు. 'రకరకాల సుగంధ ద్రవ్యాలు, పూలదండలు, రత్నాల నగలు, చిత్ర, విచిత్రాలైన వస్త్రాలు సమకూర్చండి. రుచికరాలైన వంటకాలు, కమ్మని పానీయాలు సిద్ధం చేయండి' అంటూ ఆయా పనులలో ప్రవీణులైనవారిని నియమించాడు. ఆ తరువాత ధృతరాష్ట్రుడు విదురుడితో ఇట్లా అన్నాడు:

### ధృతరాష్ట్రుండు విదురుతో శ్రీకృష్ణు రాక సెప్పి సంతోషించుట (సం. 5-84-20)

**క. 'వివిధ మణిమయ రథంబులు । జవనాశ్వంబులును భద్రసామజములు ర**
**త్న విభూషణములు దాసీ । నివహంబులుఁ జాలఁ గృష్ణునికి నే నిత్తున్. 156**

**ప్రతిపదార్థం:** వివిధ మణిమయ రథంబులున్= రకరకాల రతనాల రథాలను; జవన+అశ్వంబులును= వడిగల గుఱ్ఱలను; భద్ర సామజములున్= భద్రజాతికి చెందిన ఏనుగులను; రత్న విభూషణములున్= రతనాల ఆభరణాలను; దాసీ నివహంబులున్= పనికత్తెల గుంపును; చాలన్= ఎక్కువగా; నేను; కృష్ణునకున్; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** 'నేను శ్రీకృష్ణుడికి మణులు పొదిగిన రకరకాల రథాలను, వేగంగా పరుగెత్తగల గుర్రాలను, భద్రజాతికి చెందిన గజాలనూ, రతనాల సొమ్ములనూ, పెక్కుమంది పరిచారికలను ఇస్తాను.

**క. మన యింట సుయోధను గృహ । మున దుశ్శాసను నికేతమున నెయ్యది యా**
**తని చూడ్కి కించు నదియె । ల్లను గౌరవమొప్ప నీవలయు మన మనఘా!' 157**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; మన+ఇంటన్= మన గృహంలో; సుయోధను గృహమునన్= దుర్యోధనుడి మందిరంలో; దుశ్శాసను నికేతమునన్= దుశ్శాసనుడి సౌధంలో; ఎయ్యది= ఏ వస్తువు; ఆతని చూడ్కికిన్+ఇంచున్= ఆయన చూపునకు ఇంపు గొలుపుతుందో; అది+ఎల్లను= దాని నంతయు; గౌరవము+ఒప్పన్= ఆదర మతిశయించునట్లు; మనము= మనం; ఈన్+వలయున్= (కృష్ణుడికి) ఇవ్వాలి.

**తాత్పర్యం:** విదురా! మన గృహంలో కాని, సుయోధనుడి మందిరంలోగాని; దుశ్శాసనుడి భవనంలోగాని గోవిందుడి చూపులకు ఏ వస్తువు ఇంపు కలిగిస్తుందో ఆ వస్తువును మన మెంతో ఆదరంతో ఆయనకు సమర్పించాలి.'

**విశేషం:** శ్రీకృష్ణు డేది కోరితే అది కానుకగా ఇచ్చి, అతడిని తన వాడిగా చేసికొని, పాండవులలో భేదాన్ని తీసికొనిరావాలని ధృతరాష్ట్రుడి రాజకీయ వ్యూహం. ఇది శత్రువుల పట్ల ప్రచ్ఛన్న భేదోపాయం. (సంపా.)

**చ. అన విని యాతఁ డిట్లనియె 'నంబుజనాభునిఁ బ్రీతుఁ జేయు కం**
**టెను హితమైన కృత్య మొకటిం గలదే? యది మేలు; పాండునం**
**దనులకు నైదయూళ్ళు లుచితస్థితి నిచ్చుట కోపమన్న యు**
**న్కిన యిటు లోపు కల్మి ధరణీవర! యేమిట వచ్చెఁ జెప్పుమా! 158**

**ప్రతిపదార్థం:** అనన్ విని= ధృతరాష్ట్రుడు అట్లు పల్కగా విని; ఆతఁడు+ఇట్లు+అనియెన్= విదురుడిట్లా చెప్పాడు; అంబుజనాభునిన్= కమలము నాభియందుగల నారాయణుడిని; ప్రీతున్ చేయు కంటెను= సంతుష్టుడిని చేయటంకంటే; హితము+ఐన; కృత్యము= శ్రేయస్కరమైనపని; ఒకటిన్+కలదే!= మరొక టున్నదా?; అది మేలు= అట్లా చేయటం మంచిది; పాండునందనులకున్= నీ తమ్ముని కొడుకులకు; ఐదు+అ+ఊళ్ళు= కేవలం ఐదు గ్రామాలు; ఉచితస్థితిన్= న్యాయమైన రీతిలో; ఇచ్చుటకున్= ఇవ్వటానికి; ఓపము= సహించలేము; అన్న+ఉన్కిన్+అ= అనెడు స్థితిలో; ఇటులు+ఓపు+కల్మి= వాసుదేవునకు నచ్చినవెల్లా ఇచ్చుటకు చాలిన సిరి; ధరణీవర!= ఓరాజా!; ఏమిటన్ వచ్చెన్= ఏవిధంగా లభించింది; చెప్పుమా!= తెలుపుము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడిట్లా పలికిన పలుకులు విని విదురుడు ఇట్లా బదులు పలికాడు: 'మహారాజా! పరమాత్ముడైన శ్రీకృష్ణుడిని సంతుష్టుని చేయటంకన్న మంచిపని మరొక్కటి ఉంటుందా? అది మన కెంతో శ్రేయస్కరం. కాని, పాండు కుమారులకు న్యాయపద్ధతిలో కేవలం ఐదు గ్రామాలు ఇవ్వటానికి తగినశక్తిలేని మనకు శ్రీహరి కిష్టమైనవాటిని సమర్పించటానికి చాలినంత సంపద ఉన్నట్లుండి ఎట్లా లభించిందో చెప్పు.

**విశేషం:** ధృతరాష్ట్రుడి లోభగుణాన్ని వ్యంగ్యంగా అధిక్షేపించటం ఇందులో ధ్వని. అయినవాళ్ళకు అయిదూళ్ళివ్వలేని పీనాసి ఆ భగవంతుడికి సమర్పించగల సంపదను ఇవ్వగలడా? అని ప్రశ్న. 'భక్తి కలుగుకూడు పట్టెడైనను చాలు' అనే వేమన సూక్తి జ్ఞాపకం వచ్చేటట్లు మాటలాడాడు విదురుడు. (సంపా.)

**ఉ. నీ తలఁ పేను గంటి నొకనేర్పున శౌరికి లంచమిచ్చి సం**
**ప్రీతునిఁ జేసి, కార్యగతి భేదము సేయఁగఁ జూచె; దింత బే**
**లైతిగదే! సుమేరు సదృశార్థముఁ జూచియుఁ బార్థుఁ బాయునే?**
**యాతఁడు? క్రీడి భక్తియును నచ్యుతు పెంపును నీ వెఱుంగవే? 159**

**ప్రతిపదార్థం:** నీ తలఁపు= నీ ఉద్దేశం; ఏను= నేను; కంటిన్= తెలిసికొన్నాను; ఒక నేర్పునన్= ఒక చాతుర్యంతో; శౌరికిన్= శ్రీకృష్ణుడికి; లంచము+ఇచ్చి= లంచమిచ్చి; సంప్రీతునిన్+చేసి= సంతుష్టుడిని చేసి; కార్యగతిన్= రాయబారం విషయంలో; భేదము+చేయఁగన్+చూచెదు= భేదబుద్ధి పుట్టించాలని ఆలోచిస్తున్నావు; ఇంత బేల+ఐతి+కదే!= ఇంత మూఢుడవైనావు గదా! ఆతఁడు= కృష్ణుడు; సుమేరుసదృశ+అర్థమున్= మేరుపర్వతమంత ధనాన్ని; చూచియున్= చూచికూడా; పార్థున్= అర్జునుడిని; పాయునే?= విడుస్తాడా?; క్రీడిభక్తియును= అర్జునుడి పరమప్రేమనూ; అచ్యుతు పెంపును= గోవిందుడి గొప్పతనమునూ; నీవు; ఎఱుంగవే?= తెలియవా?

**తాత్పర్యం:** మహారాజా! నీ ఉద్దేశం నేను గ్రహించాను. ఏవో కానుకలు సమర్పించే మిషతో శ్రీకృష్ణుడికి లంచమిచ్చి, తృప్తిపరిచి పాండవుల విషయమై కార్యవిధానంలో భేదబుద్ధి కల్పించవలెనని యత్నిస్తున్నావు. నీ వెంత తెలివిమాలినవాడవో చెప్పలేను. నీవు మేరుపర్వతంతో సమానమైన ధనం సమర్పించినప్పటికీ, ఆయన

అర్జునుడిని విడువడు. వాసుదేవుడిపై, పార్థుడికున్న భక్తి ప్రపత్తు లెటువంటివో, గోపాలదేవుడి గొప్పతన మెటువంటిదో తెలియనివాడవా నీవు?

**విశేషం:** ధృతరాష్ట్రుడు లోభి. శ్రీకృష్ణుడిని లోభపెట్టి వశం చేసికొనవలెనని యత్నించటం ఎంత అవివేకమో విదురుడు హెచ్చరించాడు. నరనారాయణుల సంబంధం విభజించలేని భక్తి ప్రేమ సూత్రాలతో కట్టబడి ఉన్నది. దానిని మేరు పర్వతమంత ధనాన్నిచ్చినా భేదించ లేవని హెచ్చరించాడు. వారిది అర్థార్థ సంబంధం కాదని తెల్పాడు. శ్రీకృష్ణుడు భక్తికి వశమవుతాడు కాని, లంచాలతో కాదని తేల్చి చెప్పాడు. ధృతరాష్ట్రుడి నైచ్యం ఈ భేదోపాయంలో తేటపడుతుంది. (సంపా.)

**తే. అర్జునుఁడు ప్రాణతుల్యుండు హరికి నట్లు । గాన జలపూర్ణ మంగళ కలశమునకుఁ**
**బాద్యమునకును గుశలసంప్రశ్నమునకు । మిగుల నొండు జనార్దను మెచ్చుగాదు. 160**

**ప్రతిపదార్థం:** హరికిన్= శ్రీకృష్ణునికి; అర్జునుఁడు; ప్రాణతుల్యుండు= ప్రాణంతో సమానమైనవాడు; అట్లు+కానన్= అందువలన; జలపూర్ణ మంగళ కలశమునకున్= మంగళార్థమై నీటితో నిండిన కుంభమునకును; పాద్యమునకును= కాళ్ళు కడుగుకొనే నీళ్ళకును; కుశల సంప్రశ్నమునకున్= యోగక్షేమాలు అడుగుటకంటెను; మిగులన్= మించి; ఒండు= మరొక్కటి; జనార్దను మెచ్చు+కాదు= శౌరికి ప్రీతిని కలిగించదు.

**తాత్పర్యం:** అర్జునుడు శ్రీకృష్ణుడికి ప్రాణసమానుడు కనుక మంగళాచారానికైన జలపూర్ణ కుంభానికి మించి, కాళ్ళు కడుగుకొనే నీళ్ళకు మించి, యోగక్షేమాలు పరామర్శించటానికి మించి మరేదీ అతడికి ప్రీతికరంకాదు.

**క. మన కడకు నేమి కార్యం । బునకై యాతండు వచ్చెఁ బూనికిమెయి నా**
**పని వంచింపక చేయుట । విను మతనికిఁ బ్రియము; తక్కువేయును నేలా?' 161**

**ప్రతిపదార్థం:** వినుము; ఆతండు= శ్రీకృష్ణుడు; మన కడకున్= మన దగ్గరకు; ఏమి కార్యంబునకై= ఏ పని మీద; వచ్చెన్= వచ్చాడో; పూనికి మెయిన్= శ్రద్ధతో; ఆ పనిన్= ఆ కార్యాన్ని; వంచింపక= మోసగించక; చేయుట= చేయటం; అతనికిన్= హరికి; ప్రియము= ఇష్టం; తక్కు= ఇతరములు; వేయునున్+ఏలా?= వేయి చేయట మెందుకు?

**తాత్పర్యం:** మహారాజా! నా మాటలు వినుము. శ్రీకృష్ణుడు మన దగ్గరకు ఏ పని మీద వస్తున్నాడో ఆ పనిని మోసగించక నెరవేర్చటం అతడికి ఇష్టం. ఆ పనిని కాదని మనం ఎన్ని చేసినా ఏమి లాభం?' (ఏమీ లాభం లేదని భావం).

**వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కిట్లనియె: 162**

**తాత్పర్యం:** విదురుడి మాటలు విని సుయోధనుడు జనకుడితో ఇట్లా అన్నాడు:

**క. 'అది విదురు చెప్పినట్టిద । తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వేఱగునే?**
**పదనెఱుఁగ కీఁగియిచ్చిన । బెదరి రనరె యొచ్చెమైనఁ బిమ్మట నగరే! 163**

**ప్రతిపదార్థం:** అది విదురు చెప్పిన+అట్టిది+అ= విదురుడు చెప్పిన ఆ మాట వాస్తవం; తుదిన్= కడకు; కృష్ణుఁడు; పాండుసుతులతోన్= పాండవుల నుండి; వేఱు+అగునే?= విడివడునా?; పదను+ఎఱుఁగక= మనసు యొక్క పాకం

తెలియక; ఈఁగి+ఇచ్చినన్= కానుకలు(దానాలు) ఇస్తే; బెదరిరి+అనరె?= కౌరవులు భయపడినా రనరా?; ఒచ్చెము+ఐనన్= న్యూనత కలిగితే; పిమ్మటన్= పిదప; నగరె?= పరిహసింపరా?

**తాత్పర్యం:** 'కృష్ణుడి తత్త్వ మెట్టిదో విదురుడు చెప్పాడు. అతడు పాండవులను ఎన్నటికీ విడువడు. అతడి మనః పరిపాకం తెలియక కానుకలిస్తే మనం భయపడ్డామని అంటారు. కార్యంలో న్యూనత కలిగితే పిదప మనలను అందరూ పరిహసిస్తారు.

**ఆ. అతఁడు పూజనీయుఁ డగు; నే నెఱుంగుదు; । నైన ధనము లీఁగి యనదతనము**
**వచ్చుఁ; బెచ్చు పెరిఁగి వైరులు గర్వింతు; । రేల పగ యడంగు నిట్టులైన?' 164**

**ప్రతిపదార్థం:** అతఁడు= శ్రీకృష్ణుడు; పూజనీయుఁడు+అగున్= పూజించదగిన వాడే ఔతాడు; ఏన్+ఎఱుంగుదున్= నాకు తెలుసు; ఐనన్= కాని; ధనములు+ఈఁగిన్= ధనావళి ఇవ్వటంచేత; అనదతనము+వచ్చున్= మనకు అల్పత్వం కలుగుతుంది; పెచ్చుపెరిఁగి= అంతకంతకు విజృంభించి; వైరులు= మన విరోధులు; గర్వింతురు= అహంకరిస్తారు; ఇట్టులు+ఐనన్= ఇట్లు కావిస్తే; పగ+ఏల+అడంగున్?= శత్రుత్వం ఎట్లా అణగిపోతుంది?

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు పూజించటానికి తగినవాడని నాకు తెలుసు. కాని, అతడికి మనం ధనాలిస్తే మన అల్పత్వం బయటపడుతుంది. వైరులు అంతకంతకూ అహంకరిస్తారు. ఇందువలన విరోధం శమించదు.'

**క. అనవుడు భీష్ముఁడు ధృతరా । ష్ట్రున కిట్లను 'నీవునుం గొడుకు నేమే ని**
**చ్చిన నొకటి యీఁగి లేకు । న్నను వేఱొక్కటి దలంచునా కేశవుఁడున్. 165**

**ప్రతిపదార్థం:** అనవుడున్= దుర్యోధనుడు అట్లా పలుకగనే; భీష్ముడు; ధృతరాష్ట్రునకున్; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; నీవునున్; కొడుకున్; ఏమేన్= ఏమైనను; ఇచ్చినన్+ఒకటి= ఇస్తే ఒకవిధంగా; ఈఁగి లేకున్నను= ఇవ్వక పోయిననూ; వేఱు+ ఒక్కటి= మరొక్కటి; కేశవుఁడున్= శ్రీకృష్ణుడు కూడా; తలంచునా?= భావిస్తాడా?

**తాత్పర్యం:** సుయోధనుడు పలికిన తర్వాత భీష్ముడు ధృతరాష్ట్రుడిని జూచి 'నీవూ, నీ కొడుకూ ఏమైనా ఇస్తే ఒక విధంగానూ, ఇవ్వకపోతే మరొక విధంగానూ ఆ శ్రీకృష్ణుడుకూడా భావిస్తాడా?

**క. విను, మతఁడు సేయఁబూనిన । పని దప్పింపంగరాదు పాండవులం దే**
**ర్పను గృష్ణుఁడు వెరవుగఁ జొ । చ్చిన మే లాపురుషు పనుపు సేయుము పుత్రా! 166**

**ప్రతిపదార్థం:** పుత్త్రా!= వత్సా!; వినుము= నా మాటలు వినుము; అతఁడు= కృష్ణుఁడు; చేయన్+పూనిన పనిన్= చేయటానికి నిర్ణయించిన కార్యాన్ని; తప్పింపంగన్ రాదు= తొలగద్రోయటానికి శక్యం కాదు; పాండవులన్= పాండవులను; తేర్పను= ప్రసన్నులను కావించటానికి; కృష్ణుఁడు= పురుషోత్తముడు; వెరవుగన్+చొచ్చినన్= యుక్తంగా ఇందు ప్రవేశించిన; మేలు= మంచిది; ఆ పురుషు పనుపు చేయుము= ఆ మహానుభావుడి ఆజ్ఞ నిర్వర్తించుము.

**తాత్పర్యం:** కుమారా! నారాయణుడు చేయదలచిన పనిని తప్పించటానికి మన తరం కాదు. ఆయన పాండవుల నుద్ధరించటానికి ఇక్కడికి రావటం సమంజసమే. ఆ మహాత్ముడి ఆజ్ఞ శిరసావహించుము.

**క. నారాయణుండు ధర్మా । ర్థారూఢము గాఁగఁ బలుకు నది నీవును నీ**
**వారును గైకొని యెంతయు । గారవమునఁ జేయ నెల్ల కార్యంబు నగున్.' 167**

**ప్రతిపదార్థం:** నారాయణుండు= శ్రీకృష్ణుడు; ధర్మ+అర్థ+అరూఢము కాఁగన్= ధర్మార్థాలతో ప్రసిద్ధమయ్యేటట్లుగా; పలుకునది= చెప్పునట్టిదానిని; నీవును; నీ వారును= నీ మిత్రులును; కైకొని= స్వీకరించి; ఎంతయున్= మిక్కిలి; గారవమునన్+చేయన్= ఆదరంతో చేస్తే; ఎల్లకార్యంబున్+అగున్= పనులన్నీ చక్కబడతాయి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ధర్మార్థయుక్తంగా చెప్పే మాటలు నీవూ, నీవారూ గ్రహించి మిక్కిలి ఆదరంతో ఆ ప్రకారంగా చేస్తే పనులన్నీ సఫలమౌతాయి.'

**క. అనుటయు సుయోధనుఁడు భీ । ష్మున కిట్లనుఁ 'బాండురాజు సుతులకు నిమ్మే**
**దిని హరి సగపా లీఁ దగు । ననుఁ బో, యే నీను, గాని యది యట్లుండెన్. 168**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పితామహుడు చెప్పగా; సుయోధనుఁడు= దుర్యోధనుడు; భీష్మునకున్= భీష్ముడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; హరి= శ్రీకృష్ణుడు; పాండురాజ సుతులకున్= పాండురాజు కుమారులకు; ఈ+మేదినిన్= ఈ భూమిలో; సగపాలు= అర్ధ భాగం; ఈన్+తగున్+అనున్+పో= ఇవ్వటం యోగ్యం అని అంటాడు; ఏన్= నేను; ఈను= ఇవ్వను; కాని; అది+అట్లు+ఉండెన్= ఆ విషయమంతే.

**తాత్పర్యం:** భీష్ముడి మాటలు విని దుర్యోధనుడు ఆయనతో ఇట్లా అన్నాడు: 'శ్రీకృష్ణుడు పాండవులకు అర్ధరాజ్య మిమ్మని చెపుతాడు; నేను ఇవ్వను. ఆ విషయం వదలిపెట్టండి.

**విశేషం:** పాండవులకు రాజ్యభాగం ఇవ్వనని దుర్యోధనుడు ఉత్తర గోగ్రహణ సమయంలో భీష్ముడికి చెప్పాడు. (విరా. 4-236) అతడా మాట మీదనే ఉన్నాడు. (సంపా.)

**వ. వేఱొక కార్యంబు సేయం దలంచితి; నది వినుము! పాండవులకు నేడుగడయు జనార్దనుం; డతనింబట్టి బంధించిన ఱెక్కలు విఱిగిన పులుఁగులుం బోలె వారు నాకు విధేయు లగుదురు; పాంచాల యాదవాదులైన తదీయ బంధు మిత్రులు నా వశంబున వర్తిల్లుదురు; సమస్త దేశంబులు నేన యేలుదు; దీనికిం దగిన యుపాయ సహాయంబు లనువు సేసెద; నీవింక నేమి సెప్పెదవు చెప్పుమనిన విని యతిఘోరంబగు నవ్విచారంబునకు నమాత్యసహితంబుగా సంతప్తచిత్తుండై వైచిత్రవీర్యుండు కొడుకున కిట్లనియె: 169**

**ప్రతిపదార్థం:** వేఱు+ఒక కార్యంబు= మరొక పని; చేయన్+తలంచితిన్= చేయటానికి సంకల్పించాను; అది వినుము= ఆ పని ఏమిటో వినుము; జనార్దనుండు= శ్రీకృష్ణుడు; పాండవులకున్; ఏడు+కడయున్= గురువు, తల్లి, తండ్రి, పురుషుడు, విద్య, దైవం, దాత అని సప్త ప్రకారాలుగా రక్షకమైఉన్నవాడు; అతనిన్ పట్టి బంధించినన్= అతడిని పట్టుకొని కట్టిపడవేస్తే; వారు= పాండవులు; ఱెక్కలు విఱిగిన= రెక్కలు తెగిన; పులుఁగులున్+పోలెన్= పక్షుల మాదిరిగా; నాకున్; విధేయులు+అగుదురు= అణగి మణగి ఉంటారు; పాంచాల యాదవ+ఆదులు+ఐన= ద్రుపదుడు, యాదవులు మొదలైన; తదీయ బంధు మిత్రులు= పాండవులయొక్క చుట్టాలు, హితులు; నా వశంబునన్+వర్తిల్లుదురు= నా అధీనంలో మెలగుతారు; సమస్త దేశంబులు; నేను+అ= నేనే; ఏలుదున్= పాలిస్తాను; దీనికిన్ తగిన; ఉపాయ సహాయంబులు= ఉపాయం, తోడ్పాటు; అనువు+చేసెదన్=

సిద్ధపరుచుకొంటాను; నీవు; ఇంకన్; ఏమి చెప్పెదవు చెప్పుము; అనినన్+విని= దుర్యోధనుడనగా విని; అతి ఘోరంబు+అగు= మిక్కిలి దారుణమైన; ఆ+విచారంబునకున్= అతడి ఆలోచనకు; అమాత్య సహితంబుగాన్= మంత్రులతో కూడ; సంతప్త చిత్తుండు+ఐ= ఉడుకుతున్న మనస్సు కలవాడై; వైచిత్రవీర్యుండు= విచిత్రవీర్యుడి కొడుకైన ధృతరాష్ట్రుడు; కొడుకునకున్= దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** మరొక పని చేయదలచాను. అదేమిటో వినుము. పాండవులకు గురువు, తల్లీ, తండ్రీ, పురుషుడూ, విద్యా, దైవం, దాత అయి సర్వ విధాల రక్షిస్తున్న ఆ శ్రీకృష్ణుడిని పట్టి బంధిస్తే వారు రెక్కలు విరిగిన పక్షులై నాకు అణగి మణగి ఉంటారు. పాంచాలపతి, యాదవులు మొదలైన వారి చుట్టపక్కాలు, మిత్రులు నేను చెప్పినట్లు మెలగుతారు. దేశాలన్నీ నేనే ఏలుతాను. ఇందుకు తగిన ఉపాయం, తోడ్పాటు సిద్ధం చేసికొంటాను. ఇక నీవేమి చెప్పదలచావో చెప్పుము' అన్నాడు. మిక్కిలి దారుణమైన అతడి ఆలోచనకు మంత్రులతో కూడిన ధృతరాష్ట్రుడు తన హృదయం ఉడికిపోగా సుయోధనుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** 1. అలం: ఉపమ. శ్రీకృష్ణుడు దూరమైతే పాండవులు రెక్కలు తెగిన పక్షులవలె విలవిలలాడి తనకు వశమవుతారని దుర్యోధనుడి వ్యూహం. ఇది భేదం కాదు ద్రోహం. ఇది కుటిలోపాయం. దుష్టనీతి. ధర్మనీతి ఈ ఉపాయాన్ని అంగీకరించదు. పైపెచ్చు గర్హిస్తుంది.

2. దుర్యోధనుడు బరి తెగించి తన దుర్నీతిని అందరి ముందూ ప్రకటించి, ఎవరేమన్నా తన యత్నం కొనసాగుతుందని ప్రకటించి ఉద్ధతుడివలె వ్యవహరించాడు. (సంపా.)

**క. 'ఓహో! యిట్లనుట జగ । ద్ద్రోహం; బిమ్మాట మఱవు; దూతత్వంబున్**
**మాహాత్మ్యంబును ధర్మో । త్సాహంబును విను మబాధ్యతకుఁ గారణముల్. 170**

**ప్రతిపదార్థం:** ఓహో!= ఔరా!; ఇట్లు+అనుట= శ్రీకృష్ణుడిని బంధిస్తానని పలకటం; జగత్+ద్రోహంబు= లోకానికి కీడు చేయటం; ఈ+మాట= ఇపుడు నీవన్నమాట; మఱవు= మరచిపొమ్ము; వినుము= నా మాట వినుము; దూతత్వంబున్= రాయబారితనం; మాహాత్మ్యంబున్= మహానుభావత్వం; ధర్మ+ఉత్సాహంబును= ధర్మానికై పాటువడటం; అబాధ్యతకున్= బాధించబడ కుండుటకు; కారణముల్= హేతువులై ఉన్నవి.

**తాత్పర్యం:** 'ఔరా! శ్రీకృష్ణుడిని బంధిస్తాననటం లోకానికంతటికీ కీడు చేసినట్లేకదా! ఈ దురాలోచన మానుము. రాయబారిగా వచ్చినవాడిని, మహాత్ముడిని, న్యాయంకొరకు పాటువడేవాడిని బాధించకూడదు.

**విశేషం:** ఊహించని విషయాన్ని ఒక్కసారిగా విన్నప్పుడు కలిగే ఆశ్చర్యభావం, వినకూడని విషయం విన్నప్పుడు కలిగే ఉద్వేగం ఈ పద్యంలోని చిత్తవృత్తి. దుర్యోధనుడి వ్యూహం బాధ్యతారహితమైనదని ధృతరాష్ట్రుడు ఉద్వేగంతో పేర్కొన్నాడు. దానికి కారణాలు మూడింటిని చెప్పాడు. 1. శ్రీకృష్ణుడు దూత. అతడిని బంధించరాదు. 2. అతడు మహాత్ముడు. మహాత్ములకు కీడు చేస్తే హాని కలుగుతుంది. 3. అతడు ధర్మసాధనోత్సాహంతో వస్తున్న పుణ్యాత్ముడు. అతడికి కీడు చేయటం అధర్మం. అందువలన శ్రీకృష్ణ నిర్బంధం సర్వత్రా నిరసించతగిందని తెలిపాడు. (సంపా.)

**క. ఈ కారణములు గలవను । నా కొలఁదియె వాసుదేవుఁ? డదిగాకయుఁ గీ**
**డే కురువంశమున కతని । రాక? యతం డేమి సేసెరా పాపాత్మా!' 171**

**ప్రతిపదార్థం:** ఈ కారణములు గలవు= ఈ హేతువులన్నీ శ్రీకృష్ణుడి విషయంలో ఉన్నవి; అను+ఆ కొలఁదియె?= అన్నంత మాత్రమేనా?; వాసుదేవుఁడు= శ్రీకృష్ణుడు (అతడు జగద్వ్యాపకుడైన భగవంతుడు); అదికాకయున్= అంతేకాక; అతనిరాక= ఆ మహనీయుడి ఆగమనం; కురువంశమునకున్= కురుకులానికి; కీడే?= హానికరమా?; అతండు= కృష్ణుడు; ఏమి చేసెరా?= ఏమి తప్పు చేశాడురా?; పాప+ఆత్మా?= పాపచిత్తుడా!

**తాత్పర్యం:** దౌత్యం నెరపుటకు వస్తున్నవాడు, గొప్పవాడు, ధర్మం నిలపటానికి పాటుపడేవాడు అయిన గోపాలదేవుడిని నొప్పించరాదు. అతడు సామాన్యు డనుకొన్నావా? సకల జగద్వ్యాపకుడైన శ్రీమన్నారాయణుడు. ఇంతేకాదు. అతడిరాకవలన మన కురువంశానికి ఏమి హాని? పాపీ! పట్టి బంధించటానికి అతడు చేసిన తప్పేమిటి?'

**విశేషం:** 1. శ్రీకృష్ణుడిని బంధించటం ఎంత అధర్మమో, అంత అసంబద్ధం. సామాన్యుడైతే బంధించవచ్చు ననుకొంటే శ్రీకృష్ణుడు అసామాన్యుడు. కీడు చేసిన వాడైతే అతడికి కీడు తలపెట్టటం లోకన్యాయం. కాని, కురువంశానికి హితం కోరి వచ్చేవాడిని బంధించటం దరిచేరిన అదృష్టాన్ని దూరం చేసికొనటమే. ఈ మాటలన్న తరువాత ధృతరాష్ట్రుడు నిగ్రహించుకొనలేక బావురుమన్నట్లు 'పాపాత్మా! శ్రీకృష్ణుడు నీకేం అపకారం చేశాడురా?' అని ఎలుగెత్తి ఆక్రోశించాడు.

2. ఇది చిత్తశుద్ధితో అన్న మాటలుగానూ ఉన్నాయి, అందరి ముందు కొడుకును మందలిస్తున్నట్లూ ఉన్నాయి. తండ్రిమాట కొడుకు లెక్కచేయడని చెప్పుకొంటాడు. ఎవరైనా చెప్పగలిగితే చెప్పి దుర్యోధనుడిని మార్చండని పిలుపునిస్తాడు. పైకి ఎన్ని పలికినా లోన పుత్రుడి పక్షంవాడే ధృతరాష్ట్రుడు. అతడి నీతివాక్యాలు నీటి బుడగలు. (సంపా.)

**వ. అని యదల్చె నప్పుడు గాంగేయుం డాంబికేయున కిట్లను 'నీ కొడుకు ప్రాణగొడ్డంబైన కార్యంబు సేయందలంచె దామోదరు నిట్లు సేయం జూచెనేనిం దానును దనవారును వినాశంబుఁ బొందుదు; రింతియ; యిది సేసిరి సేయరైరి యమ్మహాత్మునెడ నీయపరాధంబు విచారించిన దుష్టాత్ములు నష్టాత్ముల కాక, యని పలికి యేనిట్టిదాని వినంజాల' ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన లేచిపోయె, ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో 'నిటువంటి కొఱగాములు మనంబునం దలంచినప్పుడు సేయంగలవాఁడవు గావున దీనం జేటువచ్చు నుడుగుమయ్య' యనిచెప్పి యతనిం దక్కినవారినిం బోవంబనిచి తగిన వర్తనంబున నుండె; మఱునాఁడు. 172**

**ప్రతిపదార్థం:** అని+అదల్చెన్= అని కోపంతో ధృతరాష్ట్రుడు గద్దించాడు; అప్పుడు; గాంగేయుండు= గంగాపుత్రుడగు భీష్ముడు; ఆంబికేయునకున్= అంబ కొడుకైన ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; నీ కొడుకు; ప్రాణగొడ్డంబు+ఐన= ప్రాణసంకటం కలిగించే; కార్యంబు చేయన్+తలంచెన్; పని చేయటానికి తలపెట్టాడు; దామోదరున్= వనమాలా విరాజితుడైన శ్రీకృష్ణుడిని; ఇట్లు; చేయన్+చూచెన్+ఏనిన్= చేయటానికి యత్నిస్తే; తానును= అతడూ; తనవారును= అతడికి సంబంధించిన వాళ్ళూ; వినాశంబున్ పొందుదురు= నాశనాన్ని పొందుతారు; ఇంతి+అ= ఇది నిశ్చయం; ఇది చేసిరి+చేయరు+ఐరి= ఈ పని చేసినా; చేయకమానినా; ఆ+మహాత్ము+ఎడన్= ఆ మహానుభావుడి విషయమై; ఈ+అపరాధంబు= ఈ దోషం; విచారించిన= సంకల్పించిన; దుష్ట+ఆత్ములు= పాపహృదయులు; నష్ట+ఆత్ములు+అ కాక= నాశనమై పోతారు పో; అని పలికి= అంటూ భీష్ముడు వచించి; ఏను= నేను; ఇట్టిదానిన్= ఇటువంటి పాపపు మాటను; వినన్+చాలన్= విని భరించలేను; అనుచున్; మొగంబు= ముఖం; గంటు+పెట్టుకొని= ముడుచుకొని; దిగ్గనన్= శీఘ్రంగా; లేచిపోయెన్= ఆ చోటు విడిచి వెళ్ళిపోయాడు; ధృతరాష్ట్రుండును; దుర్యోధనుడితో; ఇటువంటి, కొఱగాములు= అకార్యములు; మనంబునన్= మనస్సులో; తలంచిన+అప్పుడు= అనుకొన్న వెంటనే; చేయన్+కలవాఁడవు= చేసే స్వభావం కలవాడివి; కావునన్= కాబట్టి; దీనన్= ఈ

పాపకార్యాచరణంవలన; చేటువచ్చున్= కీడు మూడుతుంది; ఉడుగుము+అయ్య!= నాయనా, ఈ చెడుపని చేయవద్దు; అని చెప్పి; అతనిన్; తక్కినవారినిన్= మిగిలిన వారిని; పోవన్+పనిచి= వెళ్ళిపొండని చెప్పి; తగిన వర్తనంబునన్+ఉండెన్= ధృతరాష్ట్రుడు తన పనిలో తాను ఉన్నాడు; మఱునాఁడు= ఆ మరుసటి రోజు.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు తన కుమారుడిని కసరినాడు. అప్పుడు భీష్ముడు ధృతరాష్ట్రుడితో 'నీ కుమారుడు ప్రాణసంకటమైన పనికి పూనుకొన్నాడు. గోవిందుడికి ఇట్లా కీడు చేయటానికి యత్నిస్తే తానూ తనవారూ నాశనమైపోతారు. ఈ పని చేసినా చేయకున్నా ఆ మహాపురుషుడి యెడ ఇట్టి అపకారం తలపెట్టిన దుష్టులు నష్టమై పోతారు. నేనిటువంటి మాటలు వినలేను' అని పలికి ముఖం ముడుచుకొని అక్కడనుండి వెంటనే లేచివెళ్ళాడు. ధృతరాష్ట్రుడు కొడుకుతో 'ఇటువంటి అకార్యాలను ఎప్పుడు మనసులో అనుకుంటావో అప్పుడే వాటిని చేసి తీరుతావు. నాయనా! ఇట్లాంటి పాడుపని చేస్తే కీడుమూడుతుంది. కనుక ఈ పని విరమించుకొనుము' అని చెప్పి అతడినీ, తక్కినవారినీ వెళ్ళండని చెప్పి, తన పాటికి తాను ఉండిపోయాడు. ఆ మరునాడు.

**విశేషం:** 1. దుర్యోధనుడి దుష్టవ్యూహానికి భీష్ముడు అసమ్మతి తెలియజేయటమే కాక, దానివలన కలిగే దుష్పరిణామాలను కూడా తెలియజెప్పాడు. 'వినాశకాలే విపరీత బుద్ధిః' అని భావించి సభనుండి తొలగిపోయాడు. పాండవులలో భేదాన్ని కలిగించాలని తలంచిన ధృతరాష్ట్ర దుర్యోధనుల పన్నాగాలు విఫలమై, వారి పక్షంలోనే భేదోపాయం ప్రవర్తిల్లింది. మహాత్ముడైన శ్రీకృష్ణుడి రాకయే ఇన్ని కలతలకు కారణమైతే, ఆయన దౌత్యం ఎంతటి విపరీత పరిణామాలకు దారితీస్తుందో చెప్పలేమన్న భావం ధ్వని.

2. 'అకార్యాలను అనుకొన్నప్పుడే ఆచరణలో పెట్టటం దుర్యోధనుడి స్వభావం'- అని ధృతరాష్ట్రుడి వ్యాఖ్య. దానిని వారించాడు. కాని, దుర్యోధనుడు వినడని తెలుసు. ధృతరాష్ట్రుడు తన అధికారాన్ని వినియోగించి కొడుకును దండించడు. అదుపులేని అవినీతికి ప్రభువుగా ఉన్న ధృతరాష్ట్రుడి ద్వంద్వనీతికి ఈ సన్నివేశం ఉదాహరణం. (సంపా.)

**సీ. కాలోచితములగు కరణీయములు దీర్చి । కమలనాభుఁడు రేపకడయ కదలి**
**తనుఁ గుశస్థలవాసు లనుప రా నందఱ । నాదరంబున నిల్పి యరుగునపుడు**
**గజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు । ధృతరాష్ట్ర సుతుఁడు పుత్తేరఁ బ్రీతి**
**నెడ నెడఁ గొనివచ్చి యిచ్చిన వాని నె । ల్లను వేడ్క ననుభవించిన విధంబు**

**తే. సలిపి, యనుభవ మొల్లక చనఁగ, నెదుర । బాహ్లిక ద్రోణ భీష్మాది బంధుమిత్త్ర**
**గణము సర్వభూపాల లోకంబుఁ గురుకు । మార వర్గంబుఁ బుత్తెంచె మనుజవిభుఁడు. 173**

**ప్రతిపదార్థం:** కమలనాభుఁడు= పద్మము బొడ్డునగల శ్రీహరి; కాల+ఉచితములు+ఐన= వేళకు తగినట్టి; కరణీయములు తీర్చి= చేయదగిన పనులు చేసి; రేపకడ+అ= ప్రాతఃకాలంలోనే; కదలి= బయలుదేరి; తనున్= తనను; కుశస్థలవాసులు= కుశస్థలంలో ఉన్నవారు; అనుపన్+రాన్= సాగనంపటానికిరాగా; అందఱన్= వారినందరినీ; ఆదరంబునన్= మన్ననతో; నిల్పి= ఆగండని చెప్పి; అరుగు+అపుడున్= వెళ్ళేసమయంలో; కజ్జంబులును= భక్ష్యాలను; పండ్లున్= ఫలాలను; గంధమాల్యంబులున్= చందనం; పూలదండలు; ధృతరాష్ట్ర సుతుఁడు= దుర్యోధనుడు; పుత్తేరన్= పంపగా; ప్రీతిన్= సంతోషంతో; ఎడన్+ఎడన్= అక్కడక్కడ; కొనివచ్చి= తీసికొనివచ్చి; ఇచ్చినవానిన్+ఎల్లను= తన కిచ్చిన వాటినన్నిటినీ; వేడ్కన్= అభిలాషతో; అనుభవించిన విధంబు సలిపి= అనుభవించినట్లుగా నటించి; అనుభవము+ఒల్లక= నిజంగా ఆయా

పదార్థాలను అనుభవించక; చనఁగన్= వెళ్ళుతుండగా; మనుజవిభుఁడు= నరపతి అయిన ధృతరాష్ట్రుడు; బాహ్లిక ద్రోణ భీష్మ+ఆది= బాహ్లికుడు, ద్రోణుడు, భీష్ముడు మొదలైన; బంధు మిత్ర గణమున్= చుట్టాలయొక్క హితుల యొక్క సముదాయాన్ని; సర్వభూపాల లోకంబున్= సమస్త రాజసమూహాన్ని; కురుకుమార వర్గంబున్= తన కొడుకుల యొక్క మొత్తమును; ఎదురన్ పుత్తెంచెన్= శ్రీకృష్ణుడికి ఎదురుకోలు జరపటానికి పంపాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ప్రాతఃకాల విధు లన్నిటినీ నెరవేర్చి ఉదయమే హస్తినాపురికి బయలుదేరనుండగా కుశస్థల నివాసులు తనను సాగనంపటానికై దగ్గరకు వచ్చారు. వారినందరినీ ఆగండని నిల్పి శౌరి బయలుదేరాడు. అతడు వెళ్ళుతున్నప్పుడు దుర్యోధనుడు పంపగా పిండివంటలు, పండ్లు, చందనము, పూలదండలు దారిలో అక్కడక్కడా ప్రీతితో ఆయనకు తెచ్చి ఇచ్చారు. ఇచ్చినవాటినెల్ల నారాయణుడు అభిలాషతో అనుభవించినవానివలె నటించాడు. నిజానికి వాటి నతడు అనుభవించలేదు. ఇట్లా శ్రీహరి హస్తినాపురికి వస్తుండగా ధృతరాష్ట్ర మహారాజు- బాహ్లికుడు, భీష్ముడు, ద్రోణుడు మొదలైన బంధు మిత్ర కోటిని, సకల రాజ సమూహాన్ని, తన పుత్రులను ఆయనకు ఎదురుకోలు సల్పటానికి పంపాడు.

### శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుని మందిరంబునకుఁ బోవుట (సం. 5-87-1)

**వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు దక్కనెల్లవారిం దూర్యాది శోభన పదార్థంబులు సమకట్టి ధృతరాష్ట్రుండు వనుప నెదుర్కొనిన వాసుదేవుండు వారల నందఱ నయ్యైతెఱంగుల సంభావించి, కృతవర్మ దమవాఁడు గావున నతనికి సవిశేష స్నేహంబు సేసి, యతండు సేరువరా సమస్త జనంబులుం బరివేష్టింపం జని తన రాకకు నలంకృతంబును బ్రమోద చాపల సుభగ జనంబును నైన పురంబు సొచ్చి, రాజమార్గంబున నరుగు నవసరంబున మౌక్తిక మిళితంబులు బహుగంధ లుళితంబులు నగు నక్షత ప్రకరంబులును బుష్ప నికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మ్రొక్కుచుఁ జొక్కుచు నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలిచి కనుంగొను నంగనాజనంబులు తమలోన. 174**

**ప్రతిపదార్థం:** ఇట్లు; దుర్యోధనుండు; ఒక్కరుండు తక్కన్= ఒకడు తప్ప; ఎల్లవారిన్= అందరినీ; తూర్య+ఆది శోభన పదార్థంబులు= వాద్యాలు మొదలైన మంగళ వస్తువులు; సమకట్టి= సిద్ధపరిచి; ధృతరాష్ట్రుండు; పనుపన్= పంపగా; ఎదుర్కొనినన్= ఎదురురాగా; వాసుదేవుండు; వారలన్+అందఱన్= వారినందరినీ; అయ్యై తెఱంగులన్ సంభావించి= ఆయా విధాల ఆదరించి; కృతవర్మ; తమవాఁడు కావునన్= తమ భోజ వంశస్థుడగుటచేత; అతనికిన్+సవిశేష స్నేహంబు+చేసి= ఆతనిపై మిక్కుటమైన స్నేహం కనబరిచి; అతండు= ఆ కృతవర్మ; చేరువన్ రాన్= వెంట వస్తుండగా; సమస్త జనంబులున్+పరివేష్టింపన్= జనులందరూ తన చుట్టూ బలసిఉండగా; చని= వెడలి; తన రాకకున్; అలంకృతంబును= అలంకరించబడినదిన్నీ; ప్రమోదచాపల సుభగ జనంబును= సంతోషంచేత సంచలిస్తున్న సుందర జనములు కలది; ఐన= ఐనట్టి; పురంబు చొచ్చి= హస్తినాపురం ప్రవేశించి; రాజమార్గంబునన్; అరుగు+అవసరంబున్= వెళుతున్న సమయంలో; మౌక్తిక మిళితంబులు= ముత్యాలతో చేరినవియు; బహుగంధ లుళితంబులు= పెక్కు సువాసనలతో కూడినవి; అగు= ఐనట్టి; అక్షత ప్రకరంబులును= అక్షతల సమూహాలును; పుష్పనికరంబులును= పువ్వుల యొక్క మొత్తములును; చల్లుచున్; సంతసిల్లుచున్= సంతోషిస్తూ; మ్రొక్కుచున్= నమస్కరిస్తూ; చొక్కుచున్= ఒడలు మరుస్తూ; ఇరు+కెలంకున్= రాజమార్గానికి రెండు వైపుల; రమ్యహర్మ్యంబులపైన్= అందమైన మేడల మీద; నిలిచి= నిలువబడి; పొలిచి= ప్రకాశించి; కనుంగొని= చూస్తున్న; అంగనాజనంబులు= ఆడువారు; తమలోనన్= తమలో తాము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజు ఒక్క దుర్యోధనుడిని తప్ప తక్కిన వారినెల్ల వాసుదేవుని మంగళ వాద్యాలతో ఎదుర్కొనడానికి పంపించాడు. శ్రీకృష్ణుడు తనను ఆహ్వానించటానికి ఎదురుగా వచ్చిన వారినందరినీ ఆయా రీతుల గౌరవించాడు. కృతవర్మ తమవాడు గనుక అతడిని ప్రత్యేకంగా ఆదరించాడు. కృతవర్మ తన వెంబడి వస్తుండగా, జనులందరూ తన చుట్టూ బలసిరాగా, తనరాక సందర్భంగా చక్కగా అలంకరించబడినట్టిదీ, సంతోషంచేత కళకళలాడుతున్న ప్రజలు గలదీ అయిన హస్తినాపురంలో ప్రవేశించాడు. అతడు రాజమార్గంలో వెళుతుండగా రకరకాల సువాసనలు విరజిమ్ముతున్న ముత్యాలు కలిపిన తలంబ్రాలు, పూల మొత్తాలు శౌరిమీద చల్లుతూ, సంతసిస్తూ, నమస్కరిస్తూ, పరవశిస్తూ మార్గానికి ఇరువైపుల నున్న అందమైన మేడలపై నిలిచి కనుగొంటున్న వనితలు తమలో తాము ఇట్లా అనుకొన్నారు:

**విశేషం:** 1. మూర్ధాభిషిక్తులైన ధృతరాష్ట్ర దుర్యోధనులు తప్ప మిగిలిన పెద్దలూ, పిన్నలూ అందరూ శ్రీకృష్ణుడిని ఆహ్వానించటానికి వెళ్ళారు. అది రాచమర్యాదలలో శ్రేష్ఠమైన పద్ధతి. శ్రీకృష్ణుడిని దూతగానే కాక మహాత్ముడుగా భావించిన వైఖరి ధ్వని.

2. ఆ వేడుకలో దుర్యోధనుడు పాల్గొంటే జరుగరానిది జరుగవచ్చునని కూడ ధృతరాష్ట్రుడు భావించి, అతడిని పంపకపోయి ఉండవచ్చును.

3. శ్రీకృష్ణుడి దివ్యతేజం జీవులనందరినీ ఆకర్షించింది. ప్రజలందరూ ఆ పరమాత్ముడిని దర్శించుకొనటానికి ఉత్సాహ పడ్డారు. సముచితంగా ఆరాధిస్తూ ఆహ్వానించారు. (సంపా.)

**సీ.** **'ప్రాణంబుతోఁ గూడ రక్కసి చన్నుల । పాలు ద్రావిన ప్రౌఢబాలుఁ డితఁడె!**
**వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మె । చ్చించిన యా జగజెట్టి యితఁడె!**
**దుర్వృత్తుఁడగు కంసుఁ దునిమి యాతని తండ్రిఁ । బట్టంబు గట్టిన ప్రభు వితండె!**
**సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల । కోర్కిఁ దీర్చిన రసికుం డితండె!**

**తే.** **వెన్నలును గోపికాచిత్త వృత్తములును । నరసి ముచ్చిల నేర్చిన హరి యితండె!**
**శ్రుతిశిరోభాగములఁ దన సుభగచరణ । సరిసిజామోదమును గూర్చు చతురుఁ డితఁడె!** 175

**ప్రతిపదార్థం:** ప్రాణంబుతోన్+కూడన్= అసువులతో కూడ; రక్కసి చన్నుల పాలు= రాక్షసిఅయిన పూతన చనుబాలు; ద్రావిన= క్రోలిన; ప్రౌఢబాలుఁడు= గడుసరి పిల్లవాడు; ఇతఁడె!= ఈతఁడే సుమా!; వ్రేల్మిడిన్= చిటిక వేసినంతలో; చాణూరున్= కంసుడి మల్లవీరుడైన చాణూరుడిని; విఱిచి= భంజించి; లోకములన్= జగాలను; మెచ్చించిన= మెప్పించినట్టి; ఆ జగజెట్టి+ ఇతఁడె!= ఆ మేటివీరు డితడే సుమా!; దుర్వృత్తుఁడు+అగు= చెడు నడవడి గల్గినట్టి; కంసున్+తునిమి= కంసుడిని సంహరించి; ఆతని తండ్రిన్= అతని తండ్రియగు ఉగ్రసేనుడిని; పట్టంబు+కట్టిన= పట్టాభిషిక్తుడిని చేసిన; ప్రభువు+ఇతండె!= దొర యితడే సుమా!; సత్యభామకున్= సత్యాదేవికి; పారిజాతంబుపైన్+కల= ఇంద్రుడి నందనోద్యానంలోని పారిజాత వృక్షం మీద నున్న; కోర్కిన్= కాంక్షను; తీర్చిన రసికుండు+ఇతండె!= నెరవేర్చిన సరసు డితడేసుమా!; వెన్నలును= నవనీతపు ముద్దలు; గోపికా చిత్త వృత్తములును= గోపికల యొక్క మనోవ్యాపారాలనూ; అరసి= తెలిసికొని; ముచ్చిలన్+నేర్చిన= దొంగిలించనేర్చిన; హరి= దోషాలను హరించే నారాయణుడు; ఇతండె!= ఇతడే సుమా!; శ్రుతి శిరస్+భాగములన్= వేద శీర్ష ప్రదేశాలందు - ఉపనిషత్తులందు; తన సుభగ చరణ సరసిజ+ఆమోదమును= తన యొక్క మనోహరమైన పాదపద్మాలయొక్క పరిమళాన్ని, కూర్చు= సంధించు; చతురుఁడు= నేర్పరి; ఇతఁడె!= ఇతడే సుమా!

**తాత్పర్యం:** ప్రాణాలతోపాటు రాక్షస కాంత అయిన పూతన చనుబాలు పానం చేసిన గడుసరి పిల్లడు ఇతడే. చిటికెలో మల్లవీరుడైన చాణూరుడిని విరిచి ప్రోగులుపెట్టి లోకాలను మెప్పించిన మేటి శూరు డితడే సుమా! దుష్టవర్తనుడైన కంసుడిని నిర్మూలించి, అతడి జనకుడైన ఉగ్రసేనుడికి మధురా రాజ్యపట్టం కట్టబెట్టిన ప్రభు వితడే సుమా! పారిజాతవృక్షంపై సత్యభామకు గల కోర్కి తీర్చిన రసికవల్లభు డితడే సుమా! వెన్నలతోపాటు గొల్ల చేడెల చిత్తాలను అపహరించ నేర్చిన శ్రీహరి ఇతడే సుమా! ఉపనిషత్తులకు తన పాదపద్మ పరిమళాన్ని సంధింప జాలు జాణ ఇతడే సుమా!

**విశేషం:** 1. అలం: ఉల్లేఖం, ఉదాత్తం. 'బహుభి ర్బహుధోల్లేఖా దేకస్యోల్లేఖ ఇష్యతే''. ఒకే వస్తువు అనేకుల చేత అనేకవిధాలుగా వర్ణించబడితే ఉల్లేఖాలంకారం. "ఉదాత్త మృద్ధిశ్చరితం శ్లాఘ్యం వాన్యోపలక్షణమ్'' శ్లాఘనీయమైన సమృద్ధిని వర్ణించినా, మహాపురుషుల చరిత్రాన్ని ఉపలక్షణంగా వర్ణించినా ఉదాత్తం. హస్తినాపురంలో పిల్లల నుండి వృద్ధుల వరకు శ్రీకృష్ణుడిని పరిపరివిధాల ప్రశంసించిన ఘట్టమిది. ప్రశంసలకు సీసం కుదురైన ఛందం. ఒక్కొక్క చరణం ఒక్కొక్క ప్రశంసకు అనువై ఆరు ప్రశంసలకు ఆలవాలమై అందగిస్తుంది. శ్రీకృష్ణుడు ఉదాత్తుడు కావటంతో ఉదాత్తాలంకారం సార్థకం.

2. ఉల్లేఖంలో ఆరు ప్రశంసలున్నాయి. అవి- 1. ప్రౌఢ బాలుడు 2. జగజెట్టి 3. ప్రభువు 4. రసికుడు 5. హరి 6. చతురుడు. ఆ ఆరు ప్రశంసలూ క్రమంగా శైశవంలో, బాల్యంలో, యౌవనంలో, ప్రౌఢ దశలో, వార్ధక్య దశలో, ముముక్షు దశలో ఉన్నవారు ప్రశంసించే వాక్యాలు. వారి వారి మనస్తత్త్వాలకు అనుగుణమైన ప్రశంసలివి. సహృదయులు గమనించటం సులభం. పసిబాలుడి నుండి పరమాత్మ వరకు సాగిన ఈ దశలు భాగవత కృష్ణుడి దివ్యమహిమలుగా విజ్ఞులు భావిస్తున్నారు. శ్రీకృష్ణుడు పరమాత్మ అని నిర్ధారించటానికి తోడ్పడే షడ్లింగాలు ఇవి. ఉపనిషత్తులపై నిలచిన ఉజ్జ్వలతత్త్వం శ్రీకృష్ణతత్త్వం. (సంపా.)

**వ.** **అనుచు నతి కుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధంబగు పౌరలోకం బాలోకన కౌతుకంబునఁ దన రథంబు గదిసిన సందడి జడియు వేత్రహస్తుల వారించుచు నారాయణుండు సమ్మర్ద మందగమనంబునం జని మణితోరణ సుందరం బగు రాజమందిర ద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగు మొగసాలఁ జొచ్చి యరదంబు డిగ్గి యల్లన నడచునప్పు డంతకు మున్నయరిగి భీష్మద్రోణ ప్రముఖులగు తగు వారలు ధృతరాష్ట్రునిం బొదువ నతండుఁ బ్రత్యుత్థానంబు సేసి విదుర సంజయ సహితంబుగా నెదుర్కొనం జేరి.** **176**

**ప్రతిపదార్థం:** అనుచున్; అతి కుతూహలంబునన్= మిక్కిలి వేడ్కతో; అవలోకింపన్= కనుగొనటానికి; ఆబాలవృద్ధంబు+అగు= పిల్లలు మొదలు ముదుసళ్ళ వరకుగల; పౌరలోకంబు= పురప్రజలు; ఆలోకన కౌతుకంబునన్= తనను చూచుటయందలి అభిలాషతో; తన రథంబున్= తన తేరిని; కదిసిన సందడిన్= సమీపించటం వలన ఏర్పడిన రద్దిని; జడియు= నివారించే; వేత్రహస్తులన్= బెత్తాలవారిని; వారించుచున్= వలదని పలుకుతూ; నారాయణుండు; సమ్మర్ద మందగమనంబునన్+చని= జనుల రాయిడివలన మెల్లని గమనంతో వెళ్ళి; మణితోరణ సుందరంబు+అగు= రత్నాలతోరణముచే అందమైన; రాజమందిర ద్వారంబు= రాజభవనం యొక్క వాకిలి; ప్రవేశించి= చొచ్చి; కక్ష్య+అంతరంబులు+కడచి= లోగిళ్ళు దాటి; ఏనుంగు మొగసాలన్+చొచ్చి= ఏనుగులను కట్టివేసే చావడిలో ప్రవేశించి; అరదంబు+డిగ్గి= రథంనుండి దిగి; అల్లన= తిన్నగా; నడచునప్పుడు= నడిచేవేళ; అంతకున్+మున్ను+అ= అంతకు మునుపే; అరిగి= వెళ్ళి; భీష్మ ద్రోణ ప్రముఖులు+అగువారలు= భీష్ముడు, ద్రోణుడు మొదలైనవారు; ధృతరాష్ట్రునిన్+పొదువన్= ధృతరాష్ట్రుడిని పట్టుకొనగా; అతండున్= ఆంబికేయుడు; ప్రత్యుత్థానంబు+చేసి= ఎదుర్కొనుటకు లేచినవాడై; విదుర సంజయ సహితంబుగాన్= విదురుడితో సంజయుడితో; ఎదుర్కొనన్+ చేరి= నారాయణుడిని ఎదుర్కొనటానికి సమీపించి. (క్రింది పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** అంటూ మిక్కిలి అభిలాషతో శౌరిని దర్శించటానికి పిల్లలు మొదలు ముసలివారివరకు హస్తినాపురిలోని ప్రజలంతా వేడ్కపడి ఆయన రథం చుట్టూ గుమిగూడారు. ఆ జనుల రాయిడిని తొలగించటానికై వేత్రహస్తులు బెత్తాలు ఝళిపించగా, వలదని వారిని వారిస్తూ నారాయణుడు ఆ సందడిలో మెల్లని గమనంతో మణితోరణంతో విరాజిల్లే రాజమందిర ద్వార ప్రవేశం చేశాడు. తొట్టికట్లు దాటుతూ పోయి ఏనుగుల చావడిలో ప్రవేశించి అక్కడ రథం దిగాడు. అక్కడ నుండి గోవిందుడు తిన్నగా నడిచివస్తుండగా అంతకుమునుపే వెళ్ళినవారై భీష్ముడు, ద్రోణుడు మొదలైనవారు ధృతరాష్ట్రుడిని పొదివి పట్టుకొన్నారు. ధృతరాష్ట్రుడు విదుర సంజయులతో నడచి వచ్చి ముకుందుడిని ఎదుర్కొన్నాడు.

**ఆ. అతనిఁ గౌఁగిలించి యచ్చటఁ గల విదు । రాది శిష్టజనుల నాదరార్ద్ర**
**బంధు దృష్టిఁ జూచి పరిరంభ సంభావ । నము లొనర్చి శౌరి ప్రమద మెసఁగ. 177**

**ప్రతిపదార్థం:** శౌరి= శ్రీకృష్ణుడు; అతనిన్+కౌఁగిలించి= ధృతరాష్ట్ర మహారాజును ఆలింగనం చేసికొని; అచ్చటన్+కల= అక్కడున్న; విదుర+ఆది+శిష్టజనులన్= విదురుడు మొదలైన పెద్దలను; ఆదర+ఆర్ద్ర+బంధుదృష్టిన్= ఆదరంచేత మృదువైన చుట్టపు చూపుతో; చూచి= కనుగొని; పరిరంభ సంభావనములు= ఆలింగనాదికమైన మన్ననలు; ఒనర్చి= చేసి; ప్రమదము+ ఎసఁగన్= సంతోష మొప్పగా. (మీది వచనంతో అన్వయం)

**తాత్పర్యం:** మాధవుడు ధృతరాష్ట్ర మహారాజును కౌఁగిలించుకొని, విదురుడు మొదలైన పెద్దలను ఆదరమేదురమైన చుట్టపు చూపులతో చూచి, మన్ననతో వారిని ఆలింగన మొనర్చుకొన్నాడు.

**వ. వార లందఱకును సాత్యకిని దగిన సమాచారంబులు నడపం బనిచె; నటమున్న ధృతరాష్ట్రు పనుపునం దెచ్చి పెట్టిన నచ్చోటన యున్న యున్నత కనకాసనంబున నతం డునుప నాసీనుం డయ్యె; నవ్వాసుదేవునకు విహితానుష్ఠాన పరాయణు లగు నగరి పురోహితులు రాజానుమతంబున నర్ఘ్యపాద్య మధుపర్కాద్యుపచారంబు లాచరించి యతని తమ్ముని నర్ఘ్యపీఠంబున నునిచి యర్చించిరి; నరనాథుండును దొరలును నిజోచితాసనంబుల నుండిరి; కొలువెల్లను సూర్యోదయ సమయంబునఁ గమలాకరంబు విధంబున వికసించి యుండె నయ్యవసరంబునఁ గృష్ణుండు ధర్మనందను వచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామ పరిరంభణ ప్రముఖ సముచిత సంభావనంబులు వలికి సంభాషణంబులకుం జొచ్చి. 178**

**ప్రతిపదార్థం:** వారలందఱకును; సాత్యకిని తగిన సమాచారంబులు+నడపన్= తగిన వార్తలు అందించటానికి; పనిచెన్= నియమించాడు; అటమున్న+అ= అంతకు మునుపే; ధృతరాష్ట్రు పనుపునన్+తెచ్చిపెట్టిన= ధృతరాష్ట్రుడి ఆదేశంవలన తెచ్చిఉంచిన; ఆ+చోటన్+అ+ఉన్న= అక్కడేఉన్న; ఉన్నత+కనక+ఆసనంబునన్= ఎత్తయిన బంగారు పీఠమునందు; అతండు= ధృతరాష్ట్రుడు; ఉనుపన్= కూర్చుండ బెట్టగా; ఆసీనుండు+అయ్యెన్= కూర్చున్నాడు; ఆ వాసుదేవునకున్= గోపాలదేవుడికి; విహిత+అనుష్ఠాన+పరాయణులు+అగు= శాస్త్రోక్తమైన ఆచారమునందు శ్రద్ధగలవారైన; నగరి పురోహితులు= రాజపురోహితులు; రాజ+అనుమతంబునన్= ధృతరాష్ట్రుడి సమ్మతితో; అర్ఘ్యపాద్యమధుపర్క+ఆది+ఉపచారంబులు= చేతులకు కాళ్ళకు నీళ్ళు ఇచ్చుట, పాలలో కలిపిన తేనె ఇవ్వటం మొదలైన సమ్మానాలు; ఆచరించి= చేసి; అతని తమ్మునిన్= శ్రీకృష్ణుడి అనుజుడైన సాత్యకిని; అర్ఘ్యపీఠంబునన్+ఉనిచి= తగిన పీఠముపై కూర్చుండ బెట్టి; అర్చించిరి= పూజించారు; నరనాథుండును= ధృతరాష్ట్రుడును; దొరలును= ఇతర రాజులును; నిజ+ఉచిత+ఆసనంబులన్+ఉండిరి= తమకు తగిన పీఠాలపై తాము

కూర్చున్నారు; కొలువు+ఎల్లను= సభ అంతా; సూర్య+ఉదయసమయంబునన్= భానుడుదయించిన వేళలో; కమల+ఆకరంబు విధంబునన్= తామర కొలనువలె; వికసించి+ఉండెన్= ప్రకాశిస్తున్నది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; కృష్ణుండు; ధర్మనందను వచనంబులుగాన్= ధర్మరాజు చెప్పిన మాటలుగా; ఆంబికేయునకున్= అంబిక కుమారుడైన ధృతరాష్ట్రుడికీ; తగువారలకున్= తగినట్టివారికినీ; ప్రణామ= నమస్కారాలు; పరిరంభణ= ఆలింగనాలు; ప్రముఖ= మొదలైన; సముచిత సంభావనంబులు= తగిన మన్ననలు; పలికి= తెలిపి; సంభాషణంబులకున్= మాటలకు; చొచ్చి= ఉపక్రమించి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అందరి యోగక్షేమాలు విచారించటానికై సాత్యకిని నియమించాడు. అంతకుమునుపే అచ్చటికి ధృతరాష్ట్ర మహారాజు ఆజ్ఞ చేత ఎత్తయిన బంగారు పీఠాన్ని తెచ్చి ఉంచారు. ఆ పీఠంపై ధృతరాష్ట్రుడు కూర్చుండ బెట్టగా శౌరి కూర్చున్నాడు. అప్పుడు శాస్త్ర విహితమైన ఆచారమునందు శ్రద్ధ గల రాజపురోహితులు రాజుగారి అనుమతితో వాసుదేవుడికి అర్ఘ్యం పాద్యం మధుపర్కం మొదలైన మర్యాదలు జరిపారు. గోవిందుడి తమ్ముడగు సాత్యకిని కూడా తగిన పీఠంమీద కూర్చుండ బెట్టి పూజించారు. ఆ తరువాత ధృతరాష్ట్రుడూ, తక్కిన రాజులూ తమ తమ గద్దెలపై ఉన్నారు. సూర్యోదయ కాలంలో పద్మసరస్సువలె సభ అంతా కళకళలాడుతూ ఉండింది. అప్పుడు శ్రీకృష్ణుడు ఆంబికేయునకూ, అర్హులైనవారికీ ధర్మరాజు మాటలుగా ఆతడి నమస్కారాలు, ఆలింగనాలు మొదలైన మన్ననలు అందజేసి సంభాషించటానికి ఉపక్రమించాడు.

**విశేషం:** 1. అలం: ఉపమ. సూర్యోదయ సమయంలో వికసించిన కమలాలతో ఒప్పారే సరోవరం వలె కౌరవసభ కృష్ణ దర్శనంతో కళకళలాడిందని భావం. చక్కని ఉపమానం. శ్రీకృష్ణ దివ్యత్వదీపకం.

2. ఈ సన్నివేశంలో అతిథులు వచ్చినప్పుడు ఆయా సందర్భాలలో సాగే రాజమర్యాదలను సవిస్తరంగా, సముచితంగా వర్ణించి తిక్కన రంగ మర్యాదలను నాటకీయంగా చిత్రించాడు. (సంపా.)

**క. రాజునకుఁ దియ్య మెసఁగెడు । పూజా వచనముల నెయ్యపుంబలుకులఁబే**
**రోజ మెయి బంధుమిత్ర స । మాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్. 179**

**ప్రతిపదార్థం:** రాజునకున్= ధృతరాష్ట్రునకు; తియ్యము+ఎసఁగెడు= ప్రియమొప్పు; పూజావచనములన్= గౌరవ వాక్యాలతోను; పేరు+ఓజమెయిన్= మహోత్సాహంతో; బంధుమిత్ర సమాజములకున్= చుట్టముల యొక్క హితుల యొక్క సమూహమునకు; నెయ్యపున్+పలుకులన్= స్నేహ వచనాలతోడనూ; తగన్= ఒప్పిదముగా; కుమారులకున్= ధృతరాష్ట్రుడి కొడుకులకు, మేలములన్= పరిహాసాలతోడను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడికి ప్రీతి కలిగించే గౌరవ వచనాలతో; బంధు మిత్ర సమూహానికి మహోత్సాహమొప్పే ప్రేమవచనాలతో, కురుకుమారవర్గానికి పరియాచకపు మాటలతో. (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** శ్రీకృష్ణుడు సభలో సంభాషణ ప్రారంభించాడు. సంభాషణం రాయబారపు ఉపన్యాసం కాదు. పలు హోదాలలో ఉన్నవారిని ఆయా పద్ధతులలో పలుకరించే మర్యాద. శ్రీకృష్ణుడి ప్రవర్తనలోని ప్రతి చిన్న అంశాన్ని కూడా వదలకుండా తిక్కన జాతి వార్తా చమత్కారయుతంగా వర్ణించాడు. ఈ పద్యంలో మొదట రాజును పలుకరించాడు. ఆ మాటలతో రాజుకు సంతోషం కలిగించాడు. ఆయనకు సాక్షాత్తు (వాక్పుష్పాలతో) పూజిస్తున్నట్లు, గౌరవిస్తున్నట్లు మర్యాదను నడిపాడు. రాజును ఒక్కడినీ పలకరించే తీరొకటి. ఆ తరువాత బంధువులు, మిత్రులు మొదలైన వారు సభలో ఆయాచోట్ల కలిసి కూర్చుండి

ఉంటారు. వారిని సామూహికంగా పలకరించాడు. స్నేహంగా ఉత్సాహంగా మాట్లాడాడు. తరువాత కురుకుమార వర్గాన్ని గుంపుగా పలకరించాడు. వారితో పరిహాసాలాడుతూ చనువును స్నేహాన్నీ ప్రకటించాడు. సంభాషణ వైవిధ్యం వర్ణన శిల్పం. (సంపా.)

**వ. ఇంపు పుట్టించుచుఁ గొండొకసేపు నిలిచి పుండరీకాక్షుండు విదురు సదనంబునకుం జనియెద మఱియుఁ బోవలయు నెడలకుం బోయి వచ్చెద' నని పలికి యాంబికేయుననుమతి వడసి యరుగ, విదురుండు ససంభ్రమంబునం గడచిచని మంగళోపచార సహితంబుగా నెదుర్కొని భయ భక్తి వినయ స్నేహానందంబులఁ గందళితుం డగుచు గోవిందునకు దేవోపచారంబుల ననేక ప్రకారంబుల నర్చన లిచ్చి, కౌంతేయుల కుశలం బడిగిన నతనికి వారలవృత్తాంతంబు సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిన యనంతరంబ. 180**

**ప్రతిపదార్థం:** ఇంపు పుట్టించుచున్= ఆనందం కలిగిస్తూ; కొండొకసేపు= కొంత తడవు; నిలిచి= ఆగి; పుండరీక+అక్షుండు= తెల్లదామరల వంటి కన్నులు గల గోవిందుడు; విదురు సదనంబునకున్= విదురుడి గృహానికి; చనియెదన్= వెళ్ళుతాను; మఱియున్= ఇంకను; పోవలయు+ఎడలకున్= పోవలసిన చోట్లకు; పోయివచ్చెదన్; అని పలికి; ఆంబికేయు+అనుమతి+పడసి= ధృతరాష్ట్రుడి అంగీకారం పొంది; అరుగన్= వెళ్ళగా; విదురుండు; ససంభ్రమంబునన్= వేగిరపాటుతో; కడచిచని= దాటుకొని వెళ్ళి; మంగళ+ఉపచార+సహితంబుగాన్= శుభకరాలైన సేవలతో కూడునట్లుగా; ఎదుర్కొని= స్వాగతం చెప్పి; భయభక్తి వినయ స్నేహ+ఆనందంబులన్= భయం, భక్తి, అణకువ, ప్రేమ, సంతోషం అనే గుణాలతో; కందళితుండు+అగుచున్= వికాసం పొందినవాడై; గోవిందునకున్= శ్రీ కృష్ణుడిని; దేవ+ఉపచారంబులన్= దేవతలకు కావించే మన్ననలతో; అనేక ప్రకారంబులన్= పలు విధముల; అర్చనలు+ఇచ్చి= పూజ లొసగి; కౌంతేయుల కుశలంబు= పాండవుల క్షేమం; అడిగినన్= ప్రశ్నించగా; అతనికిన్= విదురుడికి; వారల వృత్తాంతంబు= పాండవుల యొక్క సమాచారం; సమస్తంబును= అంతయూ; సవిస్తరంబుగన్= విపులంగా; చెప్పిన+అనంతరంబు+అ= చెప్పిన తరువాత.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు కొంతసేపు అక్కడ ఆగి, విదురుడి గృహానికీ, ఇంకా వెళ్ళవలసిన చోట్లకూ వెళ్ళి వస్తాను' అని ధృతరాష్ట్రుడి అంగీకారం పొంది బయలుదేరాడు. విదురుడు గబగబ ముందువెళ్ళి తన యింటి దగ్గర ఎదుర్కొని శ్రీహరికి స్వాగతం పలికాడు. భయం, భక్తి, వినయం, స్నేహం, సంతోషం పెల్లుబుకగా గోవిందుడికి దేవతోపచారాలతో, బహువిధాల పూజలు చేశాడు. కుంతీపుత్రుల యోగక్షేమాలు అడిగాడు. అతడికి కమలాక్షుడు పాండవుల సంగతి అంతా పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. ఆ తరువాత.

**విశేషం:** 1. సభలో సంభాషించే వారితో మాట్లాడి, సభాసదులైన వారందరికీ సంతోషం కలిగేటట్లుగా తన దివ్య మంగళ విగ్రహ దర్శనాన్ని ప్రసాదిస్తూ కొంతసేపు నిలవటం రాజసభలో పెద్దల మర్యాద. శ్రీకృష్ణుడు దివ్యుడు కావటం చేత అతడి దర్శనానికి ప్రత్యేకత ఉన్నది. 'పురుషులందు పుణ్యపురుషులు వేరయా!' అన్న వేమన సూక్తి ఇక్కడ నిజమనిపిస్తుంది.

2. ఒకసారి రాజసభలో ప్రవేశించిన దూత రాజానుమతితోనే బయటకు వెళ్ళాలి. దౌత్యం మొదలు కాకపోయినా కృష్ణుడు సభామర్యాదను పాటించాడు. ధృతరాష్ట్రుడికి తన కార్యక్రమం చెప్పి అనుమతి వేడాడు.

3. విదురుడు శ్రీకృష్ణుడిని దివ్యుడిగా భావించి షోడశోపచార విధులతో దేవతార్చన విధితో పూజించాడు. భయభక్తి, వినయ వందనా లాచరిస్తూ పులకించాడు. విదురుడు భక్తుడు. శ్రీకృష్ణుడు భగవంతుడు. అందుకే భక్తుడి ఇంటికి వెళ్ళాడు భగవంతుడు. లౌకిక ఆధ్యాత్మిక భావాల తారతమ్య మిక్కడ స్పష్టం. (సంపా.)

**క. ముదమునఁ గృష్ణుఁడు కుంతీ । సదనమునకుఁ జనియె; నపుడు సమ్మదమున న**
**వ్విదురుం 'డోగిర మొనరిం । చెద' నని తన్నడుగ 'నట్ల చేయుం' డనుచున్. 181**

**ప్రతిపదార్థం:** కృష్ణుఁడు, ముదమునన్= సంతోషంతో; కుంతీ-సదనమునకున్= కుంతి యింటికి; చనియెన్= వెళ్ళాడు; అపుడు; ఆ+విదురుండు= ఆ విదురుడు; సమ్మదమునన్= హర్షంతో; ఓగిరము+ఒనరించెదన్= వంట చేయిస్తాను; అని; తన్నున్+అడుగన్= తనతో చెప్పగా; అట్ల చేయుండు+అనుచున్= అట్లాగే చేయించం డని చెప్పి.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు సంతోషంతో కుంతీ గృహానికి వెళ్ళాడు. అప్పుడు విదురుడు హర్షించి 'వంట చేయిస్తాను' అని శ్రీహరితో అన్నాడు. అట్లాగే చేయించండి' అని చెప్పి కృష్ణుడు.

**వ. చని కాంచిన నద్దేవియు నతని తోడు నీడయుంబోని తన కొడుకులం దలంచి యడలు వుట్టిన నమ్మాధవు మెడ వట్టికొని యెలుంగెత్తి యేడ్చిన, నతండు సంబోధించి యూరార్ప నెట్టకేలకు నుడిగి యాతనికి నాసన విన్యాసనాద్యుపచారంబులు చేయించి తత్సమీపంబున నుచిత పీఠంబునం గూర్చుండి గద్గద కంఠంబుతో నిట్లనియె. 182**

**ప్రతిపదార్థం:** చని= కుంతీదేవి నివాసానికి ఏగి; కాంచినన్= ఆమెను చూడగా; ఆ+దేవియున్= ఆ కుంతీదేవికూడ; అతని తోడు నీడయున్+పోని= అతని వెన్నంటి వచ్చు నీడల వంటివారైన; తన కొడుకులన్+తలంచి= తన కుమారులను జ్ఞప్తికి తెచ్చుకొని; అడలు+పుట్టినన్= దుఃఖం జనించగా; ఆ+మాధవు మెడ పట్టుకొని= కృష్ణుడి కంఠం పట్టుకొని; ఎలుంగు+ఎత్తి= గొంతెత్తి; ఏడ్చినన్= విలపించగా; అతండు= హరి; సంబోధించి= అత్తా అని హెచ్చరించుకొని; ఊరార్పన్= ఓదార్చగా; ఎట్టకేలకున్= తుదకు; ఉడిగి= ఏడ్పుమాని; అతనికిన్= మేనల్లుడికి; ఆసన+విన్యాసన+ఆది+ఉపచారములు చేయించి= పీఠముంచటం మొదలైన మన్ననలు కావించి; తద్+సమీపంబునన్= అతడి చెంగట; ఉచిత పీఠంబునన్+కూర్చుండి= తగిన పీఠం మీద కూర్చొని; గద్గద కంఠంబుతోన్= డగ్గుత్తికతో; ఇట్లు+అనియెన్= ఇట్లా పలికింది:

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు కుంతీదేవి గృహానికి వెళ్ళి ఆమెను దర్శించాడు. ఆమె అతడి వెన్నంటే నీడల వంటి తన కొడుకులు జ్ఞప్తికి రాగా దుఃఖంతో మేనల్లుడి మెడపట్టుకొని గొంతెత్తి విలపించింది. ముకుందుడు అత్తా అని సంబోధించి ఊరడించాడు. హరి ఊరడింపుతో ఆమె ఏడ్పుమాని అతడికి కూర్చుండ పీఠం వేయించటం మొదలైన ఉపచారాలు చేయించింది. తాను ఆయన చెంత అర్హపీఠంమీద ఆసీనురాలై ఎలుగురాలుపడ ఇట్లా అన్నది.

**విశేషం:** కుంతీదేవికి ఎదుట శ్రీకృష్ణుడు కనపడగానే అతడికి తోడునీడలవలె ఉండే పాండవులు జ్ఞాపకం రావటం వలన ఆమెకు దుఃఖం పొంగివచ్చింది. శ్రీకృష్ణుడు పాండవుల కెంత ఆత్మీయుడో కుంతీదేవి కంత ఆత్మీయుడు. వత్సల భావద్యోతకమైన చేష్ట - అప్యాయంగా మెడను కౌగిలించుకొనటం. మనసులో బాధను కొన్నేళ్ళుగా అణచుకొని ఉండటంచేత దానిని ఒక్కసారిగా వెలువరించే సాత్త్విక భావం వంటి అభినయ విశేషం ఎలుగెత్తి ఏడ్వటం. కుంతికి శ్రీకృష్ణుడన్నా, తన బిడ్డలన్నా ఉన్న అభేద వాత్సల్య భావం ఇందులో వ్యంగ్యం. స్వయంగానూ, ధర్మజుడి ప్రార్థన వలననూ ఆమెను దర్శింప వచ్చాడు శ్రీకృష్ణుడు. సాక్షాత్తు తన పుత్రులను చూచిన సంతృప్తి ఆమెకు కలిగించాలని వచ్చాడు. అందువలననే ఈ సన్నివేశంలో ఆ ఆర్ద్రత. (సంపా.)

**సీ. 'నీ శిక్షఁ బెరుఁగుట నీతిమంతులుఁ బుణ్య । పరులు శూరులు గదా పాండుసుతులు**
**సుఖవృత్తిఁ బెక్కండ్రు సూరెలఁ గొలువ నుం । డెడువార లిడుమలఁ బడుచు నిర్జ**
**నంబైన కానలోనన యెట్లు నిలిచిరి? । ననుఁ బెట్టి నాయెదఁ గొనుచుఁ జనిరి**
**యేను వడ్డింపంగ నింపారఁ గుడిచి మె । త్తని సెజ్జ నిద్రించి వినుతభద్ర**

**తే. గాన కరి బృంహితముల మేల్కాంచునట్టి । వారు కందమూలంబు లాహారములుగఁ**
**బొదలఁ బుట్టలఁబడి యుండి పులుఁగు మెకము । లఱవ మేల్కనుచుండిరే యక్కటకట! 183**

**ప్రతిపదార్థం:** నీ శిక్షన్= నీ అభ్యాసంలో; పెరుఁగుటన్= పెరిగినవారగుటచేత; పాండుసుతులు= పాండుపుత్రులు; నీతిమంతులున్= న్యాయంతో కూడినవారు; పుణ్యపరులు= సుకృతమునందు ఆసక్తికలవారు; శూరులుగదా= వీరులు గదా!; పెక్కండ్రు= పలువురు; సూరెలన్= కుడి యెడమ పార్శ్వములందు; కొలువన్= సేవిస్తుండగా; సుఖవృత్తిన్= సుఖ జీవనోపాయంతో; ఉండెడివారలు= ఉన్నట్టివారు; ఇడుమలన్+పడుచున్= కష్టాలనుభవిస్తూ; నిర్జనంబు+ఐన= మనుష్యులులేని; కానలోనన్+అ= అడవులలోనే; ఎట్లు నిలిచిరి?= ఎట్లున్నారు?; ననున్+పెట్టి= నన్నిక్కడ వదలిపెట్టి; నా+ఎదన్+కొనుచున్+చనిరి= నా హృదయాన్ని తమ వెంట తీసికొని వెళ్ళారు; ఏను వడ్డింపంగన్= నేను వడ్డన చేయగా; ఇంపు+ఆరన్+కుడిచి= కమ్మగా కడుపార భుజించి; మెత్తని సెజ్జన్= మృదువైన పాన్పుల మీద; నిద్రించి= నిదురపోయి; వినుత= కొనియాడదగిన; భద్రగాన= మంగళ గానాల చేతను; కరిబృంహితములన్= ఏనుగుల ఫీంకార ధ్వనుల చేతను; మేల్కాంచునట్టివారు= కనులు తెరచునట్టివారు; కందమూలంబులు= గడ్డలు; వేళ్ళు; ఆహారములుగన్= భోజనంకాగా; పొదలన్= పొదలలో; పుట్టలన్= పుట్టలమీద; పడియుండి= నివసిస్తూ; పులుఁగు మెకములు= పక్షులు, జంతువులు; అఱవన్= అరవగా; మేల్కనుచున్+ఉండిరే?= మేల్కొనుచున్నారా?; అక్కట+అకట!= అయ్యయ్యో! (వారికెన్ని కష్టాలు వచ్చాయి.)

**తాత్పర్యం:** 'కృష్ణా! నీ కట్టుబాటులో పెరిగిన వారగుటచే పాండవులు నీతిమంతులు, పుణ్యపరులు, వీరులు అయినారు. వారు ఇరుగెలంకులజేరి పెక్కుమంది సేవిస్తుండగా సుఖంగా నుండవలసినవారు కష్టాలనుభవిస్తూ నిర్మానుష్యాలైన అరణ్యాలలో ఎట్లా నివసించారో! నన్నిక్కడ విడిచిపెట్టి నా హృదయాన్ని తమవెంట కొనిపోయారు. నేను వడ్డిస్తుంటే కడుపారా కమ్మగా తిని మెత్తని పాన్పుల మీద నిదురించి మాగధుల మంగళ గానాలతో, భద్రగజాల ఫీంకార ధ్వనులతో మేల్కొనునట్టి నా బిడ్డలు పొదలలో గుట్టలలో పడియుండి పక్షుల కూతలకు, జంతువుల అరపులకు మేల్కొంటున్నారు గదా! అయ్యో, వారి కెన్ని కష్టాలువచ్చాయి?

**విశేషం:** అలం: విషమం. కుంతీదేవి వేసిన కుశల ప్రశ్నలలో ఒక మర్యాద. సంస్కృతి, మాతృప్రేమావిష్కార క్రమం గోచరిస్తుంది. కొడుకుల శీలం వీరమాతకు ప్రథమ గణ్యమైన కుశలాంశం. ఆ తరువాత వారి సుఖజీవన విధానాన్ని గురించిన విశేషం తెలిసికొనగోరుతుంది. ఆ తరువాత తన పెంపకంలో తాను చూపిన వాత్సల్యం. వారు పొందిన సుఖాలను గురించి సంస్మరణం తల్లి అడుగుతుంది. తల్లి లాలించటం, అన్నం పెట్టటం, నిద్రపుచ్చటం, నిద్రలేపటం మొదలైన సేవలు చేసి పిల్లలను పెంచుతుంది. వాత్సల్యపూర్ణంగా అవన్నీ పిల్లలు కలకాలం అనుభవించాలని ఆశిస్తుంది. కుంతి ఈ పద్యంలో వీటిని ప్రస్తావించటం సహజం. కుశల ప్రశ్నలలో తొలుత నిలిచే చల్లని మాటలివి. (సంపా.)

**ఆ. తండ్రిలేని ప్రజలు తల్లిని బాసి పె । ద్దయునుగాల మివ్విధమునఁ బడిరి**
**భంగపాటు దుఃఖపాటును సంకట । పాటు గలిగె విరటు పాలఁ బిదప.' 184**

**ప్రతిపదార్థం:** తండ్రి లేని ప్రజలు= తండ్రిని కోల్పోయిన బిడ్డలు; తల్లినిన్+పాసి= తల్లిని గూడా విడిచి; పెద్దయును+కాలము= చాలా కాలము; ఈ+విధమునన్= ఈ రీతిగా; పడిరి= కష్టాలనుభవించారు; పిదపన్= అరణ్యావాసమైన తరువాత; విరటుపాలన్= విరటుడి దగ్గర; భంగపాటు= అవమానం; దుఃఖపాటు= దుఃఖాలనుభవించటం; సంకటపాటు= చిక్కులలో పడటం; కలిగెన్= సంభవించాయి.

**తాత్పర్యం:** తండ్రి లేని పాండవులు తల్లినైన నన్ను కూడా విడిచి చాలా కాలం ఈ విధంగా అడవులలో కష్టాలు అనుభవించారు. ఆ పిదప విరటుడికడ వారికి భంగపాటు, దుఃఖపాటు, సంకటపాటు కలిగాయి.'

**విశేషం:** పాండవులు పొందిన కష్టాలను మూడంచెలుగా భావించిందా తల్లి. 1. తండ్రి పోయిన తరువాత పాండవులు భంగపాటు పొందారు. రాజ్యభాగ ప్రసక్తిగాని, రాజ్యాన్ని కోల్పోయే ప్రసక్తిగాని, దుర్యోధనాదుల వలన కలిగే అవమానాలుగాని పాండురాజు బ్రతికి ఉంటే జరిగేవి కావు. కాబట్టి, తండ్రిలేని పిల్లలు కాబట్టే రాజ్యాన్ని కోల్పోయి అరణ్యాజ్ఞాతవాసాలు చేసే అవమానం కలిగింది.

2. పాండవులు తల్లిని వదలి ఎన్నడూ లేరు. కాని, అరణ్యావాసానికి వెళ్లుతూ ఆమెను వదలి వెళ్ళవలసి వచ్చింది. ఆ వియోగం తల్లికీ, బిడ్డలకూ దుఃఖతీవ్రతను కలిగించింది.

3. ఇక అజ్ఞాతవాసకాలంలో విరాటనగరంలో పాండవులు ఎన్నో చిక్కులు పడవలసి వచ్చింది. తండ్రి లేని పిల్లలు అందరికీ లోకువ. తల్లికి దూరమైన పిల్లలు ఆదరానికి దూరమైనవారు. అజ్ఞాతవాసంలో దినదినగండంగా బ్రదుకవలసి వస్తుంది. ఆ అవస్థలను తలచుకొన్న తల్లి- కుంతి తల్లడిల్లిపోయింది. (సంపా.)

**వ. అని వెండియు. 185**

**తాత్పర్యం:** అని, మరల.

**ఉ. 'దానదయాపరుం డయిన ధర్మతనూభవు సేమ మెట్లు? పం**
**చాననవిక్రముం డగు బకారికి భద్రమె? యస్త్ర శస్త్ర వి**
**ద్యానిపుణుండు క్రీడి సుఖియా? వినయాభరణుల్ గవల్ సమా**
**ధాన సమేతులే? యకట! ద్రౌపది సాధ్వి; సుఖంబె దానికిన్? 186**

**ప్రతిపదార్థం:** దానదయాపరుండు+అయిన= దానదయా గుణాలలో శ్రద్ధ గల్గిన; ధర్మ తనూభవు= ధర్మజుడియొక్క; సేమము+ఎట్లు?= క్షేమమెట్లా ఉన్నది?; పంచ+ఆనన విక్రముండు+అగు= సింహపరాక్రమంతో సమానమైన పరాక్రమం కల్గిన; బక+అరికిన్= బకాసురుడిని సంహరించిన భీమసేనుడికి; భద్రమె?= కుశలమా?; అస్త్ర శస్త్ర విద్యానిపుణుండు= బాణవిద్యలలో ఆయుధ విద్యలలో నేర్పరి అయిన; క్రీడి= అర్జునుడు; సుఖియా?= హాయిగానున్నాడా?; వినయ+ఆభరణుల్= అడకువయే సొమ్ములుగా గల్గిన; కవల్= అమడలు - నకుల సహదేవులు; సమాధాన సమేతులు+ఏ= శాంతితో కూడిఉన్నారా?; అకట!= అయ్యో! ద్రౌపది= ద్రుపద పుత్రి; సాధ్వి= పతివ్రత; దానికిన్+సుఖంబె?= ఆమెకు సౌఖ్యమేనా?

**తాత్పర్యం:** దానదయాగుణాలుగల ధర్మజునకు క్షేమమా? సింహపరాక్రముడైన భీమసేనుడికి కుశలమా? అస్త్రశస్త్ర విద్యలందు ఆరితేరిన అర్జునుడు హాయిగా ఉన్నాడా? వినయాలంకృతులైన నకుల సహదేవులు నెమ్మదిగా ఉన్నారా? అయ్యో! పాంచాలి పరమ సాధ్వి- ఆమె సుఖంగా ఉన్నదా?

**విశేషం:** పిల్లల క్షేమం గురించి అడిగేటప్పుడు తల్లి వారి అసలు పేర్లు పేర్కొనకుండా, ముద్దుపేర్లుకాని, బిరుదనామాలుకానీ, ఆత్మీయముద్రతో పిలిచే పిలుపులు గాని పలకటం లోకసహజం. దాని కనుగుణంగా ధర్మతనూభవుడు, బకారి, క్రీడి, కవలు - అనటం గమనించదగింది. వారిని ఆమెకు నచ్చిన, ఆమె మెచ్చిన గుణాలతో విశేషించి పేర్కొనటం ఆమె అభిమానానికి నిదర్శనం. వీరమాతలు పిల్లల యోగక్షేమాల నడిగే నమూనా పద్యమిది. కోడలిని పేరు పెట్టి పిలిచి, సాధ్విగా గౌరవించటం ఆదరాభిమానాలకు సాక్ష్యం. దాదాపు 25 శ్లోకాలలో కొడుకులను గురించి అడిగిన మూలంలోని కుంతి బావురుమన్నట్లుంటుంది. తిక్కన తీర్చిదిద్దిన కుంతి నిర్వేదాన్ని కూడా నిబ్బరంగా ప్రదర్శించగలిగింది. (సంపా.)

**చ. కొడుకుల కంటె నయ్యనుఁగుఁ గోడలి కెక్కుడు గూర్తుఁ గోడలుం**
**గొడుకులు సేయు భక్తి కట కోటి మడుంగులు భక్తి నాకు నె**
**ప్పుడుఁ దగఁ జేయుచుండు నది పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ**
**త్తడి సకలంబుఁ జూడ సభ దైన్యముఁ బొందుట సూచి పొక్కితిన్. 187**

**ప్రతిపదార్థం:** కొడుకుల కంటెన్= కుమారుల కంటెను; ఆ+అనుఁగు కోడలికిన్= ఆ కూర్మి కోడలికి; ఎక్కుడు కూర్తున్= నేను మిక్కిలి ప్రియపడుదును; కొడుకులు చేయు భక్తికిన్= కుమారులు కనబరచే పరమప్రేమకు; అట కోటి మడుంగులు భక్తిన్= అంతకు కోటి రెట్లు భక్తిని; నాకున్= నాకు; ఎప్పుడున్= ఎల్లవేళలందును; తగన్= చక్కగా; చేయుచున్+ఉండున్= ఆమె సలుపుతుంటుంది; అది పుణ్యచరిత్ర= ఆమె పవిత్రమైన నడవడి గలది; కుల+అగ్రగణ్య= వంశములో తొలుత లెక్కించ దగినది; క్రొత్తడి= మగనాలు; సకలంబున్+చూడన్= అందరూ చూస్తూఉండగా; సభన్= కురుసభలో; దైన్యమున్+ పొందుట చూచి= దీన దశ పాలవటం చూచి; పొక్కితిన్= దుఃఖించాను.

**తాత్పర్యం:** కొడుకుల కంటె కోడలు అంటే నాకు చాలా ఇష్టం. కుమారులు చూపు ప్రేమ కంటె కోటి రెట్లు భక్తితో ఆమె నాకు సేవలు చేస్తుంది. పాంచాలి పవిత్రమైన నడవడి కలది. కులంలో వన్నె కెక్కింది. ఆ మగనాలు అందరు చూస్తుండగా కురుసభలో అంతటి దైన్యం పొందటం చూచి దుఃఖపడ్డాను.

**విశేషం:** కోడలిని మెచ్చుకొనే అత్త గుణవంతురాలు. కుంతి కోడలిని ఉత్తమురాలని ప్రశంసించింది. ఆమెను మనసారా ప్రేమించింది. కొడుకులకంటె ఆమెకు కోడలే ప్రీతిపాత్రురాలట! ద్రౌపది కుంతిని భక్తితో సేవించేదట! ఆమె పుణ్యచరిత్రట! కులాగ్రగణ్యట! మగనాలట! అంతటి అనురాగవతికి అంతటి అవమానం జరిగినందుకు ఆవేదన పడింది. ఈ పద్యం ఒక సత్యాన్ని బైటపెట్టింది. పాండవపక్షం వారందరిలో అగ్నివలె గుండెలను మండిస్తున్నది- కురుసభలో ద్రౌపది పొందిన అవమాన దుఃఖం. ద్రౌపది ఒకవైపు గర్వకారణం. మరొకవైపు జాలికి తావలం. (సంపా.)

**తే. నాఁడు ద్రౌపది వడిన బన్నములు సూడ । నోర్చినప్పుడ యెంతకు నోర్వఁ జెపుమ**
**యంత గడచిన దుఃఖంబు లనుభవింపఁ । గలవె లోకంబువారికిఁ గమలనాభ! 188**

**ప్రతిపదార్థం:** కమలనాభ!= పద్మం నాభియందుగలవాడా!; కృష్ణా; నాఁడు= ఆనాడు; ద్రౌపది+పడిన బన్నములు= ద్రౌపది పొందిన అవమానాలను; చూడన్+ఓర్చిన+అప్పుడు+అ= చూచి సహించ జాలినప్పుడే; ఎంతకున్+ఓర్వన్?= ఎంతకైనా భరించలేనో; చెపుమ= పల్కుమా!; (ఎన్నిటినైన భరింపగలనని అర్థం); లోకంబు వారికిన్= లోకులకు; అంత+కడచిన దుఃఖంబులు= ఆమె అనుభవించిన దుఃఖాల కంటె మించిన దుఃఖాలు; కలవె!= ఉన్నవా? (లేవని భావం.)

**తాత్పర్యం:** ఆనాడు పాంచాలి పొందిన అవమానాలు చూచి సహింపజాలిన నేను ఎంతకైనా ఓర్చుకోగలను. ఆమె అనుభవించిన కష్టాలను మించిన కష్టాలు లోకంలోని వారెవ్వరూ అనుభవించి ఉండరు.

**విశేషం:** ద్రౌపది పొందిన కష్టాలు మరెవ్వరూ లోకంలో అనుభవించి ఉండరని చెపుతూనే ఆ కష్టాలను చూచి సహించి ఇంకా బ్రతికి ఉన్న తాను మరెన్ని కష్టాలనైనా ఓర్చుకొనగలనని తన దుర్భర మనోవేదనను ధ్వనిమయంగా వ్యక్తం చేసింది కుంతి. సంధి మాటలలో శాంతి ప్రసంగాలలో కూడా మరువ లేని బడబాగ్ని వంటి బాధ ద్రౌపది మీది సానుభూతి. (సంపా.)

**వ. అట్టి యెడ. 189**

**తాత్పర్యం:** ఆ సమయాన.

**క. విదురుం డొక్కఁడు దక్కఁగ । సదస్యు లెవ్వరును ధర్మసంక్షయ మిది కూ**
**డదు నార; యతని శీలమ । కుదు రీ లోకమున కింతకుం దలఁపంగన్." 190**

**ప్రతిపదార్థం:** విదురుండు+ఒక్కఁడు+తక్కఁగన్= విదురు డొక్కడు తప్ప; సదస్యులు= సభలో ఉన్నవారు; ఎవ్వరును= ఒక్కరైనను కూడ; ఇది ధర్మ సంక్షయము= ద్రౌపదీ వస్త్రాపహరణం ధర్మమును నశింపజేస్తుంది; కూడదు= ఇట్టి నీచపు పని తగదు; నారు+అ= అనరు; తలఁపంగన్= ఆలోచించగా; ఈ లోకమునకున్+ఇంతకున్= ఈ జగమున కంతటికినీ; అతని శీలము+అ= ఆతడి వర్తనమే; కుదురు= ఆధారం.

**తాత్పర్యం:** విదురు డొక్కడు దప్ప నాటి సభలోని వారిలో ఒక్కరైనా పాంచాలిని పరాభవించటం ధర్మ వినాశక కృత్యం; ఇది తగదు అని పల్కినవారు కారు. ఆలోచించగా విదురుడి సత్స్వభావమే ఈ జగత్తుకంతా ఆదర్శప్రాయం.

**వ. అని యివ్విధంబునఁ గృష్ణుతోడఁ దన యుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకంబు వెల్లిగొనఁ గొండొక దిగం బాటెడు చిత్తంబుతో మఱియు నిట్లనియె; 191**

**ప్రతిపదార్థం:** అని; ఈ+విధంబునన్; కృష్ణుతోడన్; తన+ఉమ్మలికంబులు= తన దుఃఖాలు; అన్నియున్+త్రవ్వికొని= అన్నింటినీ స్మృతికి తెచ్చుకొని; శోకంబు= దుఃఖం; వెల్లిగొనన్= పొంగిప్రవహించగా; కొండొక దిగన్+పాటెడు చిత్తంబుతోన్= కొంచెం క్రుంగిపోతున్న మనస్సుతో; మఱియున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కుంతీదేవి ఈ విధంగా మేనల్లుడైన శ్రీకృష్ణుడితో తన దుఃఖాలన్నింటినీ జ్ఞప్తికి తెచ్చుకొని శోకం వెల్లివిరియగా కొంచెం క్రుంగిన మనస్సుతో మళ్ళీ ఇట్లా అన్నది:

**క. 'ఇది యెల్లను నొకతల; యీ । పదు మూఁ డేఁడులును నాకు బావకొడుకుచే**
**నదయమగు కూడుగుడుచుట । యది యొక తలయయ్యె; నేమి యనఁగల దనఘా! 192**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యపురుషా!; ఇది+ఎల్లను+ఒకతల= ఈ కష్టాలన్నీ ఒక ఎత్తు; ఈ పదుమూఁడు+ఏఁడులును= ఈ పదమూడు సంవత్సరాలూ; నాకున్= నాకు; బావకొడుకుచేన్= బావ కుమారుడైన దుర్యోధనుడిచేత; అదయము+అగుకూడు= దయలేని అన్నం; కుడుచుట+అది= తినటంఅన్నది; ఒక తల+అయ్యెను= ఒక యెత్తైనది; ఏమి+అనన్+కలదు?= చెప్పటాని కింకే మున్నది?

**తాత్పర్యం:** కృష్ణా! ఈ పడిన కష్టాలు, అనుభవించిన దుఃఖాలు అన్నీ ఒక యెత్తు. ఈ పదమూడేళ్ళూ నాకు బావ కొడుకు పెట్టే దయమాలిన తిండి తినటం ఒక యెత్తుగా ఉన్నది. నే నేమి చెప్పగలనయ్యా?

**విశేషం:** కుంతి అభిమానవతి. అందుకే పదమూడేళ్ళు పరాయి పంచలో ఉండటంతోపాటు బావ కొడుకైన దుర్యోధనుడు నిర్దయగా, పరుషంగా వ్యవహరిస్తూ పెట్టుతున్న తిండి తినటం ఆమె భరించలేకపోయింది. 'ఏమి యనగలదు అనఘా!' అనే వాక్యం ఆమె దైన్యావస్థ యొక్క పరాకాష్ఠ! 'బావకొడుకు' అనే మాట సార్థకం. సొంత కొడుకులుండి కూడా బావగారి కొడుకు పెట్టే తిండి తినవలసి వచ్చిందని ఒక దైన్య భావం. 'దుర్యోధనుడి' పేరుచ్చరించని అనిష్టం అందులో వ్యంగ్యం. (సంపా.)

**క. తన్నుఁ దన తమ్ములను నా । కన్న కొడుకు లట్ల తలఁతుఁ గాని విభేదం**
**బెన్నఁడు నా మది లేమికి । వెన్నుఁడ దైవంబు సాక్షి వినుము పలికెదన్.** 193

**ప్రతిపదార్థం:** తన్నున్= ఆ దుర్యోధనుడినీ; తన తమ్ములను= అతడి సహోదరులనూ; నా కన్నకొడుకులు+అట్ల+ తలఁతున్+కాని= నా కడుపున గన్నబిడ్డలైన పాండవులవలెనే భావిస్తానుగాని; విభేదంబు= వ్యత్యాసం; ఎన్నఁడున్= ఎప్పుడూ; నా మదిన్+లేమికిన్= నా మనసులో లేనందుకు; వెన్నుఁడ= ఓ విష్ణుమూర్తీ!- కృష్ణుడా!; (దైవంబు సాక్షి= ఇందుకు దేవుడే సాక్షి.) పలికెదన్ వినుము= చెప్పుతున్నాను వినుము.

**తాత్పర్యం:** కృష్ణా! దుర్యోధనుడినీ, అతని తోబుట్టువులనూ నా కడుపున గన్న కొడుకులవలెనే చూస్తాను గాని భిన్నంగా చూడను. నాకు భేదబుద్ధి లేనందుకు ఆ దేవుడే సాక్షి అని చెపుతున్నాను వినుము.

**విశేషం:** కుంతీదేవి పాండవ కౌరవులను సమదృష్టితో చూచేది. కాని, కౌరవులు మాత్రం తననూ, తన బిడ్డలనూ వేరుగా చూచారని మనోవేదన. ఆమె చిత్తశుద్ధికి దైవం సాక్ష్యం- అనటం జాతీయం. (సంపా.)

**క. ఇది నిక్కం బగునేనియుఁ । దుది నీవుం బాండవులను దురితరహితులై**
**ముదమందఁ జూడఁగనియెద; । నది దీనికి మందు సువ్వె యంబుజనాభా!** 194

**ప్రతిపదార్థం:** అంబుజనాభా!= పద్మము నాభియందు గలవాడా!; ఇది నిక్కంబు+అగున్+ఏనియున్= ఈ మాటలే నిజమైతే; తుదిన్= చివరకు; నీవున్= నీవున్నూ; పాండవులును= పాండవులున్నూ; దురితరహితులు+ఐ= పాపంలేనివారై; ముదము+అందన్= సంతోషం పొందగా; చూడన్+కనియెదన్= చూడటానికి నోచుకొంటాను; అది= అట్లా మీరు ఆనందంతో ఉండటం; దీనికిన్+ మందు+చువ్వె!= నా ఇప్పటి మనోవ్యథకు ఔషధం ఔతుంది సుమా!

**తాత్పర్యం:** కృష్ణా! నా మాట సత్యమైతే కడపటికి నీవూ పాండవులూ దోషాలంటనివారై ఆనందించగా చూడనోచెదను. ఇప్పటి నా హృదయ వ్యథకు మీరు పరమానందంతో ఉండగా చూడటమే ఔషధం సుమా!

**విశేషం:** 1. పాండవులను కౌరవులను సమంగా చూడటం అనేది నిజమే అయితే పాండవులు నిందలపాల్గాక, విజయులై తిరిగి వస్తారని ప్రమాణం చేసింది. ఇదీ దేశీయాచారమే.

2. అన్ని బాధలకూ నివారణశక్తి శ్రీకృష్ణుడే అని నమ్మి భక్తి విశ్వాసాలను ప్రదర్శించే కుంతీస్వభావం ఇందులో విశదం. (సంపా.)

సీ. **బావ యొప్పం డనుపలుకుల నేమగు? । నాతని కొడుకుఁ గీడాడనేల?**
**కురువృద్ధుఁడగు బాహ్లికుని దూఱ నేటికి? । భీష్మునిపైఁబ్రయి వెట్టనగునె?**
**యిట్టి క్రూరుల యింటి కిచ్చిన మనవారి । నందుఁగా కట్లు దాననుటమేలె?**
**యర్జును పుట్టిన యప్పుడు 'వీఁడు లో । కము లెల్ల గెల్చు పొగడ్త మొగులు**

తే. **ముట్టు నట్టిద యగు, రణమున జయించు । గౌరవుల; సోదరులుఁ, దాను భూరి రాజ్య**
**గౌరవముఁ బొందు' నని యశరీరవాణి । పలికె; నది తిట్టుపడుఁగాక వలయునేని.** 195

**ప్రతిపదార్థం:** బావ+ఒప్పండు+అనుపలుకులన్= ధృతరాష్ట్రుడు మా మేలు సహించలేడు అనే మాటల వలన; ఏమి+అగున్?= ఏమి ప్రయోజనం?; ఆతని కొడుకున్= అతడి పుత్రుడైన దుర్యోధనుడిని; కీడు+ఆడన్+ఏల?= నిందించటమెందుకు?; కురువృద్ధుఁడు+అగు= కౌరవులలో పెద్దవాడైన; బాహ్లికునిన్= బాహ్లికుడిని; దూఱన్+ఏటికిన్?= తిట్టటం ఎందులకు?; భీష్మునిపైన్= పితామహుడిమీద; ప్రయి+పెట్టన్+అగునె?= నింద మోపవచ్చునా?; ఇట్టి క్రూరులు+ఇంటికిన్= ఇట్టి కఠినాత్ముల యొక్క గృహానికి; ఇచ్చిన= నన్ను కోడలిగా చేసిన; మనవారిన్= పుట్టింటివారిని; అందున్+కాక= అంటానే అనుకో; అట్లు= ఆ విధంగా; తాన్= నేను; అనుట మేలె?= నిందించటం న్యాయమా? (కాదని భావం); అర్జును పుట్టిన+అప్పుడు= అర్జునుడు జన్మించిన సమయంలో; వీఁడు= పార్థుడు; లోకములు+ఎల్లన్= జగములన్నిటిని; గెల్చు= జయిస్తాడనే; పొగడ్త= ప్రశంస; మొగులు ముట్టినట్టిది+అ+అగున్= మేఘమండలం తాకునటువంటి దౌతుంది; రణమునన్= కదనంలో; కౌరవులన్+జయించున్= దుర్యోధనాదులను గెలుస్తాడు; సోదరులున్= తోబుట్టువులూ; తానున్= తానూ; భూరి రాజ్యగౌరవమున్+పొందున్= గొప్ప రాజ్యం ఏలుట వలని గొప్పతనమును పొందుతాడు; అని= అంటూ; అశరీరవాణి= అశరీరవాక్కు; పలికెన్= పల్కింది; వలయున్+ఏనిన్= కావలసివస్తే; అది= అశరీరవాణి; తిట్టుపడున్+కాక!= నిందించబడుగాక!

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు పాండవుల మేలోర్చువాడు కాడని అనటంవలన ఏమి లాభం? అతని కొడుకు దుర్యోధనుడిని తిట్టటం వలన ప్రయోజనమేముంది? కౌరవులలో పెద్దవాడగు బాహ్లికుడిని నిందించడం దేనికి? భీష్మడి మీద తప్పు మోపటం న్యాయమా? ఇట్లాంటి కఠినచిత్తుల ఇంటికి నన్ను కోడలిని చేసిన నా పుట్టింటివారినే దూషించాలి. అట్లా దూషించటం కూడా సమంజసం ఔతుందా? పార్థుడు జన్మించినవేళ 'ఇతడు లోకాలన్నీ జయిస్తాడనే కీర్తి మేఘమండల మంటుతుంది. ఇతడు కౌరవులను యుద్ధంలో గెలుస్తాడు. తానూ, తన తోబుట్టువులూ భూరి సామ్రాజ్యాధిపత్య గౌరవం పొందుతారు' అని అశరీరవాణి పలికింది. అవసరమైతే ఇట్లా నుడివిన ఆ అశరీరవాణినే నిందించాలి. మరెవ్వరినీ కాదు.

**విశేషం:** కుంతీదేవి మెత్తని హృదయం గల తల్లియే కాదు, కడుపులోని బాధను గడుసుదనంతో చెప్పగల గడుసరి కూడా. శ్రీకృష్ణుడి బహిఃప్రాణమైన అర్జునుడు పుట్టినప్పుడు ఆకాశవాణి పలికిన పలుకుల వైపు శ్రోత మనస్సును మళ్ళించి గ్రుచ్చుకొనేటట్లు చెప్పటానికి. 'నేతినేతివాదం' వలె- ధృతరాష్ట్రుడిని అనటం ఎందుకు? దుర్యోధనుడిని అనటం ఎందుకు? అని వరుస మొదలు పెట్టింది. ఆ మాట నిజానికి శ్రీకృష్ణుడి మనస్సుకు గ్రుచ్చుకొనాలని అన్నదే. (సంపా.)

వ. **ధర్మంబు గలుగునే నది నిక్కంబయ్యెడు; దాని కెల్లను నిర్వాహకుండవు నీవు గలవు గాదె! నీ మన్నించు నెచ్చెలులకుం జెప్పెడు మాటలు గలవు విను; మయ్యుధిష్ఠిరునితో నిట్లనుము;** 196

**ప్రతిపదార్థం:** ధర్మంబు కలుగునేన్= లోకంలో ధర్మమున్నట్లయితే; అది నిక్కంబు+అయ్యెడున్= అశరీరవాణి మాటలు యథార్థాలవుతాయి; దానికిన్+ఎల్లను= ఆ ధర్మానికంతటికినీ; నిర్వాహకుండవు= ప్రవర్తిల్ల చేసేవాడవు; నీవు+కలవు+కాదె!= నీవున్నావు గదా!; నీ మన్నించు నెచ్చెలులకున్= నీ వాదరించే నీ ప్రియమిత్రులైన పాండునందనులకు; చెప్పెడు మాటలు+కలవు= చెప్పవలసిన మాట లున్నాయి; వినుము= ఆలింపుము; ఆ+యుధిష్ఠిరునితోన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+అనుము= ఈ విధంగా చెప్పు.

**తాత్పర్యం:** లోకంలో ధర్మ మున్నట్లయితే అశరీరవాణి చెప్పినదే సత్యమవుతుంది. కృష్ణా! ధర్మోద్ధారకుడవు నీవున్నావు. నీవు మన్నించే నీ అనుగు నెచ్చెలికాండ్రకు చెప్పవలసిన మాట లున్నాయి. వినవలసింది. ముందుగా ధర్మతనయుడితో ఇట్లా చెప్పుము:

**విశేషం:** 1. ధర్మముంటే దేవతల మాటలు నిజమౌతాయట! అన్నిటికీ నిర్వాహకుడైన శ్రీకృష్ణుడే ఉన్నాడట! ఈ దృఢ నిశ్చయమే ఆమెను ధర్మశీలనుగా నిలిపింది. ఆమె కొడుకులను ధర్మమార్గంలో నడిపింది.

2. కొడుకుల స్వభావాలను బట్టి ఎవరెవరికి ఎటువంటి సందేశమివ్వాలో తెలిసిన వివేకవతి అయిన వీరమాత కుంతి.

3. ఉపప్లావ్యంనుండి వచ్చిన కృష్ణుడు పాండవ దూత. హస్తినాపురంనుండి తిరిగి వెళ్ళే శ్రీకృష్ణుడు కుంతీదూత. (సంపా.)

**క. వేఁడికొని కృపణులై కను । పోఁడిమి యది యేల రాజపుత్రులు దమ మై**
**వాఁడిమి దప్పిన నిప్పులు । వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే? 197**

**ప్రతిపదార్థం:** కృపణులు+ఐ= దీనులై; వేఁడికొని= ప్రార్థించి; కనుపోఁడిమి= పొందునట్టి సంపద; అది+ఏల?= అదెందుకు?; రాజపుత్రులు= క్షత్రియకుమారులు; తమ= తమయొక్క; మైవాఁడిమి= శరీరమందలి ప్రతాపం; తప్పినన్= విడిచినయెడల; నిప్పులు= అగ్నులు; వేఁడిమి చెడిన+అట్లు= వేడిమిని గోల్పోయినట్లే అగును; జనులు విని= ప్రజలు అట్టి ప్రతాపహీనుల ఆజ్ఞ లాలించి; ఉలుకుదురే?= జంకుదురా? (జంకరని అర్థము.)

**తాత్పర్యం:** దీనులై యాచించి గడించిన సంపద లెందుకు? క్షత్రియ కుమారులు ఒడలిలో తేజం కోల్పడితే నిప్పులు వేడిమిని విడిచినట్లే అవుతుంది. మగటిమి లేనివారి మాటలకు జనులు జంకుతారా?

**విశేషం:** అలం: ఉపమ. ఇది ధర్మరాజున కిచ్చిన సందేశం. అతడిని మూడు విధాల మందలించింది కుంతి. 1. నీకు రావలసిన రాజ్యభాగాన్ని దీనుడివలె యాచించటం తప్పు. అట్లా భిక్షాదానంగా వచ్చే రాజ్యాన్ని స్వీకరించటం తప్పు- అని మొదటి హెచ్చరిక. కపట ద్యూతంలో రాజ్యసంపద కోల్పోయినప్పుడు ద్రౌపదికి వరంగా ధృతరాష్ట్రుడు దానిని తిరిగి ఇచ్చాడు. అరణ్యాజ్ఞాతవాసాలు ముగిసిన తరువాత కూడ మరల ధృతరాష్ట్రుడి దయ కొరకు, దుర్యోధనుడి సుముఖత కొరకు ఇంత దీనంగా అడగటం అవమానం. అడగటంలో కూడా ఆత్మగౌరవం ఉండాలి. రాజ్యభాగం ఇవ్వకపోయినా అయిదూళ్ళు ఇస్తే చాలని కోరటం మరీ అవమానం- అని హెచ్చరించింది.

2. క్షత్రియులు ప్రతాపాన్ని విడిచిపెడితే వేడిలేని అగ్నులవలె మారి శత్రువులను తపింపచేసే శక్తిని కోల్పోతారు. కాబట్టి యుద్ధంలో పరాక్రమాన్ని ప్రదర్శించి రాజ్యాన్ని పొందండి. క్షత్రియ ధర్మాన్ని రక్షించండి. యుద్ధం కంటె శాంతి మేలు అని భావిస్తున్న ధర్మజుడిని యుద్ధోన్ముఖుడిగా చేయాలన్న వీరమాత ప్రబోధ మిది.

3. ఒకవేళ ప్రతాపరహితులై యాచించి, రాజ్యాన్ని పొందినా జనులు ఆ రాజులను గౌరవించరు. కాబట్టి అటువంటి రాజ్యసంపదను పొందినా ప్రభుత్వాన్ని నిలుపుకొనటం కష్టం.

4. తాత్పర్య మేమంటే- 'దైన్యాన్ని వదులు. క్షత్రియోచిత పరాక్రమాన్ని ప్రదర్శించి రాజ్యాన్ని సాధించు. ప్రజల ఆదరాభిమానాలను పొందు.' ఈ మూడూ పరస్పరాశ్రితాలైన గుణాలు. ఏ ఒకటి లేకపోయినా మిగిలినవి దక్కవు అని శాంతికాముకుడైన ధర్మజుడు పౌరుషాగ్నితో ప్రజ్వలించేటట్లు పలికింది. అయితే, ధర్మజుడు సూక్ష్మగ్రాహి కాబట్టి సందేశాన్ని మృదువుగా, వ్యంగ్యంగా, మనసు నొవ్వకుండా చెప్పింది.

5. కుంతి మనసులో పడుతున్న వేదనకు ఈ మాటలు అక్షరదీపికలు. వీరులను కన్న రాజమాత తన కొడుకులు వీరులుగానే బ్రతికి తనకు గౌరవం తేవాలని అనుకొనటం సహజం. కాని, ధర్మజుడు ధర్మనీతిలో భాగంగా చతుర్విధోపాయాలను ప్రదర్శిస్తూ సంధియత్నం చేస్తున్నాడే కాని, పౌరుషహీనుడై కాదన్న సత్యం గమనార్హం. (సంపా.)

**వ. భీమార్జునుల కిట్లని చెప్పుము: 198**

**తాత్పర్యం:** భీముడికి, అర్జునుడికి ఇట్లా చెప్పుము:

**ఆ. కొడుకుఁ గాంచు రాచకూఁతు రెద్దానికి? । నట్టిపనికి నుచితమైన సమయ**
**మొదవెఁ; దడయుటింక నొప్పదు; జనములు । నట్లుగాని పురుషు లనరు మిమ్ము. 199**

**ప్రతిపదార్థం:** రాచకూఁతురు= క్షత్రియపుత్రి; ఏ+దానికిన్= దేనికొరకు; కొడుకున్+కాంచున్= కుమారుడిని కంటుందో; అట్టిపనికిన్= అట్లాంటి యుద్ధ కార్యానికి; ఉచితము+ఐన+సమయము+ఒదవెన్= తగిన వేళ వచ్చింది; ఇంకన్= ఇటమీదట; తడయుట= ఆలసించటం; ఒప్పదు= తగదు; అట్లు+కాని= అప్పుడు తప్ప; జనములు= ప్రజలు; మిమ్మున్= మిమ్ములను; పురుషులు+అనరు= మగవారని చెప్పరు.

**తాత్పర్యం:** క్షత్రియకన్య పెండ్లాడి కొడుకును ఏ కార్యానికై కంటుందో, అట్టి ప్రతాపప్రదర్శనకు తగిన అదను సంప్రాప్తించింది. ఇక ఆలసించటం తగదు. అప్పుడుగాని మిమ్మల్ని ప్రజలు మగవారని అనరు సుమా!

**విశేషం:** 1. కుంతీదేవి తన కొడుకులలో ధర్మజుడిని ప్రత్యేకంగా, ప్రజ్ఞావంతుడైన మనీషిగా భావించి గౌరవిస్తుంది. ఆ తరువాత భీమార్జునులను ఒక జంటగా, నకుల సహదేవులను ఒక జంటగా భావిస్తుంది. ద్రౌపదిని ప్రత్యేకంగా సంభావిస్తుంది. ఈ స్వభావం ఈ సందర్భంలో స్పష్టమౌతున్నది.

2. ధర్మజుడు నీతిజ్ఞుడు కాగా, భీమార్జునులు గదాగాండీవాలతో ప్రసిద్ధి కెక్కిన శస్త్రజీవులు. నిజానికి క్షత్రియ వనిత యుద్ధంలో సాటిలేని మేటి వీరులను కనాలనీ, వారు రణరంగంలో తమ మగతనం ప్రదర్శించి తమకు, తనకు పేరు తేవాలనీ అనుకొంటుంది. తల్లి కలలు కని కన్న వీరసంతానం భీమార్జునులు. ఆ కలలు నిజం చేయటం వారి ధర్మమని హెచ్చరిక. ఆమె కోర్కెను తీర్చకపోతే వారు వీరులు కాదు, ఆమె వీరమాత కాజాలదు- అని నిష్ఠురం.

3. యుద్ధం చేసి పౌరుషాన్ని ప్రదర్శించకపోతే వారిని పురుషులని లోకం గుర్తించదట! ఇది చాలా నిష్ఠురమైన మాట. మరీ, బృహన్నలగా అజ్ఞాతవాసం చేసిన అర్జునుడికి గుచ్చుకొనే మాట! తెలుగులో 'మిమ్మలిని మగవా రనరు' అనే తిట్టు జాతీయం. బలపరాక్రమమే తమ అస్తిత్వంగా బ్రతికే కొడుకులను ఉత్తేజపరిచే వాఙ్మయ శిల్పం తెలిసిన వీరమాత కుంతి.

4. భీమార్జునులు కీచకవధలోనూ, దక్షిణ ఉత్తర గోగ్రహణ ఘట్టంలోనూ తమ పౌరుషాన్ని ప్రదర్శించే ఉన్నారు. కాని, ఆమె వాటిని గుర్తించినట్లు చెప్పకపోవటం గడుసుదనం. ఆ యుద్ధాలు పాండవులు ఆత్మరక్షణ కొరకు చేసినవి. కాని, మాతృమూర్తిని వీరమాతగా చేయాలంటే కౌరవులపై యుద్ధం చేసి తమ శస్త్రాస్త్రబల సంపదను ప్రదర్శించి పురుషులనిపించుకొన్నప్పుడే సాధ్యమౌతుందని హెచ్చరిక చేసింది. ఆలసించవద్దని ప్రేరేపించింది.

5. భీమార్జునులకు ధర్మరాజుకు వలె సున్నితంగా చెప్పలేదు. బాణంతో గుచ్చినట్లు మాట్లాడింది. మగతనం- అనే మాట వారి మనసులపై దెబ్బకొట్టుతుంది. ఆకలి తెలిసి అన్నం పెట్టేదీ, అదనెరిగి ఆగ్రహించేదీ, అనువుగా మందలించేదీ, ఆదర్శంతో తీర్చిదిద్దేదీ తల్లి, కుంతి వీరమాత. (సంపా.)

**క. భుజ బలమున జీవించుట । నిజధర్మము మెత్తఁబడుట నింద్యము; మాద్రీ**
**ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా । త్మజఁ గార్యం బడుగుమనుము తగనందఱతోన్. 200**

**ప్రతిపదార్థం:** భుజబలమునన్= బాహు విక్రమంతో; జీవించుట= బ్రతకటం; నిజధర్మము= క్షత్రియ ధర్మం; మెత్తఁబడుట= అణగిపోవటం; నింద్యము= దూషింపదగింది అని; మాద్రీప్రజలకున్= మాద్రి కుమారులకు; చెప్పుము= తెలుపుము; ద్రుపద+ ఆత్మజన్= ద్రౌపదిని; తగన్= ఒప్పిదంగా; అందఱతోన్= పాండవులందరితో; కార్యంబు+అడుగుము+అనుము= కర్తవ్యం గురించి అడుగుమని చెప్పుము.

**తాత్పర్యం:** మాద్రీనందనులైన నకుల సహదేవులతో- బాహుబలంతో బ్రదకటం క్షత్రియధర్మమనీ, అణగిమణగి ఉండటం దూషింపదగిన విషయమనీ చెప్పుము. తన కర్తవ్యమేమిటో ద్రౌపది నడిగి తెలిసికొనండని పాండవులందరితో చెప్పుము.

**విశేషం:** 1. కవలలు నకుల సహదేవులు. వారిద్దరికీ కలిపి సందేశం ఇవ్వటం ఔచిత్యం. అందులోనూ క్రమాన్ని పాటించి అన్వయించుకొంటే నకులుడికి భుజబలంతో జీవించుమని హెచ్చరిక. సహదేవుడికి క్షత్రియ ధర్మంలో మెత్తబడటం నింద్యమని గట్టిగా చెప్పింది. శ్రీకృష్ణుడితో వారిరువురు మాట్లాడిన తీరులు గమనిస్తే ఈ సందేశాలు వారి మనఃప్రవృత్తులకు అచ్చంగా అతికినట్లున్నాయని స్పష్టమవుతుంది.

2. పాండవులలో పరాక్రమాన్ని ప్రేరేపించే ప్రధానశక్తిగా ద్రౌపదిని కుంతి గుర్తించి, సమయోచితంగా వారిలో యుద్ధోత్సాహాన్ని ప్రజ్వలింపజేస్తూ ఉండుమని కోరింది. ద్రౌపది కాంతాసమ్మితంగా కార్యాన్ని చక్కదిద్దగలదని ఆమె విశ్వాసం. అది సహజం కూడా. (సంపా.)

**చ. అలిగిన భీమ ఫల్గునుల కడ్డము లేమి యెఱుంగు; దంతలం**
**తలు వడి వాని నీఁగవలదా? విను మాపని కెల్లఁ బాండుపు**
**త్రులె కలవారు; నీ కెటుల దోఁచిన నట్టులు సేయువారు గా;**
**కలఘువిచార! నా యలఁత యార్పుము; నన్ గడతేర్పు మెమ్మెయిన్.' 201**

**ప్రతిపదార్థం:** అలిగినన్= కోపగిస్తే; భీమఫల్గునులకున్= భీమార్జునులకు; అడ్డము లేమిన్= అవరోధం లేకుండటం; ఎఱుంగుదున్= తెలియుదును; అంతలు+అంతలు+పడి= అంతలేసి అవమానాల పాలై; వానిన్= ఆ పరాభవాలను; ఈఁగన్ వలదా= తీర్చుకొనవద్దా; వినుము= ఆలింపుము; ఆ పనికిన్+ఎల్లన్= పరాభవ దుఃఖాలను బాపుకొనే పనికంతా; పాండుపుత్రులె కలవారు= పాండు నందనులే సంసిద్ధంగా ఉన్నారు; నీకున్= నీకు; ఎటులు తోఁచినన్= ఏ విధమైన అభిప్రాయం కల్గుతుందో; అట్టులు+చేయువారు+కాక= ఆ విధంగా సల్పగలరు; అలఘువిచార!= గొప్ప ఆలోచనగలవాఁడా! కృష్ణా!; నా+అలఁత= నా శోకం; ఆర్పుము= తొలగించుము; నన్= నన్ను; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; కడతేర్పుము= ఉద్ధరించుము.

**తాత్పర్యం:** అలుక వహిస్తే భీమార్జునులకు అడ్డం లేదని నాకు తెలుసు. అంతంత అవమానాలు పొంది ఆ కసి తీర్చుకొనవద్దా? ఆ పని పాండునందనులు చేయగలరు. నీవెట్లా చెపితే వారట్లా చేస్తారు. గొప్ప ఆలోచనగల నీవు నా బాధ తీర్చవలసినది. నన్ను ఎట్లయినా దుఃఖాల నుండి కడతేర్చవలె.'

**విశేషం:** 1. ఈ మాటలు కుంతీదేవి శ్రీకృష్ణుడితో అంటున్నవి. ఆమె ఆయనను కోరింది రెండంశాలు: 1. నా దుఃఖం (అనే అగ్నిని) ఆర్పుము. 2. నన్ను ఉద్ధరించుము. ఈ రెండూ పరమాత్మరూపుడైన శ్రీకృష్ణుడి దివ్యత్వాన్ని గుర్తించి అన్నవే. 'కడతేర్పుము' అనే క్రియ తెలుగు జాతీయం. దానికి అనేకార్థాలున్నా ఇక్కడ కష్టాలనుండి గట్టెక్కించుమని భావం.

2. కుంతి విజ్ఞురాలు. ఒక కార్యం సాధించబడాలంటే ఇచ్ఛాక్రియా జ్ఞానశక్తుల సమన్వయ వినియోగాలు అవసరం. ఇక్కడ ఇచ్ఛాశక్తులు భీమార్జునులు. వారు కోపిస్తే చాలు ఆ కార్యానికి అడ్డం ఉండదు. ఆ సంగతి శ్రీకృష్ణుడికి కూడా తెలుసుననటం కుంతీదేవి గడుసుదనం. అవమానాల పాలైన పాండవులు వాటికి ప్రతీకారం తీర్చికొనే ప్రయత్నం చేయాలి. ఇది కార్యశక్తి. పాండవులు సంఘటితంగా కూడి యుద్ధకార్యాన్ని స్వయంగా నిర్వహించగలరని కుంతీదేవి కొడుకుల పౌరుషంమీద ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించింది.

3. ఇక పాండవ పక్షంలో ఇచ్ఛాక్రియాశక్తులకు మూలమైనదీ, చోదకమైనదీ, వాటిని నియంత్రించగలిగినదీ. ఫలాగమందాకా ముందుకు నడిపించేదీ జ్ఞానశక్తి. అదే శ్రీకృష్ణుడు. ఆ అర్థం వ్యంగ్యంగా స్ఫురించేటట్లు 'అలఘువిచార!' అని సంబోధించింది. నీ కెట్లా తోస్తే అట్లా పాండవులను నియోగించు మని కోరింది. కార్యచక్రం తిప్పుమని వేడింది. ఫలితం మాత్రం- కుంతి వంత తీరాలి. ఆమె ఉద్ధరించబడాలి.

4. కుంతి మనోదుఃఖం అగ్నివంటిదని 'ఆర్పు' అనే క్రియతో ధ్వనింపజేశాడు తిక్కన. అది శత్రుసంహారంవలన సాధ్యం. ఇక ఉద్ధరించమంటే- పరుల పంచలో ఇతరుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడి దైన్యంతో బ్రతికే అప్పటి దురవస్థ నుండి ఉద్ధరించటమే, పాండవులు పరాక్రమంతో రాజ్యాన్ని జయించి, తనను రాజమాతగా గౌరవపదంలో నిలపటమే. ఈ పని చేసే వారు పాండవులైనా చేయించే దైవీసంకల్పశక్తి శ్రీకృష్ణు డని ఆమె తాత్పర్యం. కార్యసాధకమైన మాటల పొందికలో అర్థవ్యక్తి అనే గుణం రాణించి వస్తు స్వభావ స్ఫుటత్వాన్ని కలిగిస్తున్నది. (సంపా.)

**వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యిట్లనియె: 202**

**తాత్పర్యం:** కుంతి అట్లా తన మనోబాధను వెల్లడించగా కృష్ణుడు ఆమె నోదార్చి ఇట్లా చెప్పాడు:

### శ్రీకృష్ణుఁడు కుంతీదేవి నూఱడించుట (సం. 5-88-89)

**చ. 'సుగుణవు, పుట్టినింటికిని జొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ**
**దగుచరితంబునన్ నడచు ధన్యవు, ధీరవు, దేవి! నీ వెడ**
**న్వగ లడఁగింపకున్న భువనంబుల నింకిట నెవ్వ రోర్చువా**
**రు గలఁక దక్కుమీ హృదయ రోగము లన్నియుఁ బుచ్చివైచెదన్. 203**

**ప్రతిపదార్థం:** దేవి!= కుంతీమహాదేవీ!; సుగుణవు= మంచి గుణములు కలదానివి; పుట్టిన+ఇంటికిని= పుట్టింటికినీ; చొచ్చిన+ ఇంటికిన్= అత్త యింటికినీ; తేజము+ఎక్కఁగాన్= వన్నె మీరగా; తగుచరితంబునన్= యోగ్యమైన నడవడితో; నడచుధన్యవు= ప్రవర్తించే పుణ్యాత్మురాలవు; ధీరవు= ధైర్యముగలదానవు; నీవు= అట్టి నీవు; ఎడన్= హృదయంలో; వగల్= చింతలు; అడగింపక+ఉన్నన్= అణచకపోయినచో; ఇంకన్= మరి; ఇటన్= ఇక్కడ; భువనంబులన్= లోకాలలో; ఓర్చువారు= దుఃఖాలను సహించేవారు; ఎవ్వరు?= ఎవరు గలరు?; కలఁక+తక్కుమీ= సంక్షోభం మానుము; హృదయ రోగములు+అన్నియున్= నీ మనోవ్యాధు లన్నింటినీ; పుచ్చివైచెదన్= తొలగించివేస్తాను.

**తాత్పర్యం:** 'అత్తా! నీవు గుణవంతురాలివి. పుట్టినింటికీ, మెట్టినింటికీ వన్నె వాసి ఏర్పడగా ఒప్పిదమైన నడవడితో ప్రవర్తించే పుణ్యాత్మురాలివి. ధైర్యంగలదానివి. ఇట్టి నీవు మనస్సులోని చింతలను అణచుకొనకుంటే మరి ఈ లోకంలో దుఃఖాలను సహించేవారు ఎవరుంటారు? అమ్మా! కలత మానుము. నీ మనోవ్యాధులన్నిటినీ తొలగిస్తాను.

**విశేషం:** 1. యోగ్యుడైన భక్తుడు ఆర్తితో అడుగుతుంటే కరుణారసం పొంగగా అభయహస్తం ఇస్తున్న భగవంతుడివలె శ్రీకృష్ణుడు పలుకుతూ ఉండటం పరిపాటి. 2. ద్రౌపది కెట్లా అభయహస్త మిచ్చాడో, కుంతికీ అట్లాగే అభయహస్త మిచ్చాడు. సంధి కాదు, యుద్ధం ఆగదు. విజయం సిద్ధించక మానదు, మనశ్శాంతి కుదరక తీరదు- అన్నట్లు ధైర్యం చెప్పాడు.

3. కుంతీ మనోవేదనను రోగంగా చెప్పి రూపకాలంకార శోభను కలిగించాడు తిక్కన. ఇక్కడ బహువచనం చెప్పటం మరొక విశేషం. కుంతి మనసులో పాండవుల బెంగ ఒక ప్రక్క. తనకు కన్యాత్వంలో సూర్యుడి వరం వలన కలిగిన కర్ణుడి బెంగ మరొక ప్రక్క బాధిస్తున్నాయి. ఒక దానిని చెప్పగలిగింది. మరొకటి చెప్పలేనిదిగా దాచుకొన్నది. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు. ఆ దుఃఖాన్ని కూడా మానుస్తానన్నాడు. ఎట్లా? అది భావికథలోగాని ప్రసన్నం కాదు. శ్రీకృష్ణుడిని దివ్యుడిగా భావిస్తే అతడు దివ్యమహిమలనే ప్రసాదించగలడు. (సంపా.)

**క. తనయులుఁ గోడలు సేమం । బున నున్నా; రధిక భక్తిపూర్వముగా దం**
**డనమస్కారంబులు నీ । కొనరించిరి, కౌఁగిలించి రుల్లములఁ దగన్. 204**

**ప్రతిపదార్థం:** తనయులున్= నీ కుమారులును; కోడలున్= నీ కోడలుకూడా; సేమంబునన్+ఉన్నారు= సుఖంగా ఉన్నారు; అధిక భక్తిపూర్వముగాన్= మిక్కుటమైన భక్తి పురస్సరంగా; నీకున్= నీకు; దండ నమస్కారంబులు+ఒనరించిరి= నీకు సాగిలపడి మ్రొక్కారు; తగన్= చక్కగా; ఉల్లములన్= తమ మనసులందు; కౌఁగిలించిరి= నిన్ను కౌగిలించుకొన్నారు.

**తాత్పర్యం:** అత్తా! నీ కొడుకులు కోడలు క్షేమంగా ఉన్నారు. మిక్కిలి భక్తితో నీకు సాగిలపడి మ్రొక్కులు సమర్పించారు. మనసులందే నిన్ను కౌగిలించుకొన్నారు.

**క. నీ కొడుకు లొండు సుఖములు । చేకొన; రవ్వీరసుఖమ చిత్తములఁ గరం**
**బాకాంక్షింతు; రలంతులఁ । బోక గలుగు నెట్టు? లల్పబుద్ధులె వారల్? 205**

**ప్రతిపదార్థం:** నీ కొడుకులు= నీ కుమారులు; ఒండు సుఖములు= ఇతర సౌఖ్యాలు; చేకొనరు= గ్రహించరు; ఆ+వీరసుఖము+అ= శౌర్యవృత్తి వలన చేకూరు సౌఖ్యమే; చిత్తములన్= హృదయములందు; కరంబు= మిక్కిలి; ఆకాంక్షింతురు= కోరుకొంటారు; అలంతులన్+పోక= అల్పమార్గాలలో వెళ్ళటం; ఎట్టులు+కలుగున్?= వారికెట్లా అలవడుతుంది?; వారల్= నీ కుమారులు; అల్పబుద్ధులె?= నీచస్వభావులా?- కారు సుమా!

**తాత్పర్యం:** అత్తా! నీ కుమారులు లోక సాధారణమైన సౌఖ్యాలు అనుభవించటానికి అంగీకరించరు. వీర ధర్మాన లభించే సౌఖ్యమే తమ మనస్సులో కోరుకొంటారు. వారు తుచ్ఛమార్గాలు అనుసరించేటంత నీచబుద్ధులు కారు సుమా!

**క. ఉత్సాహంబున శత్రు కు । లోత్సాదన విధి యొనర్చి యున్నత సామ్రా**
**జ్యోత్సవము నొందు పుత్త్రుల । నుత్సుకతం జూతుగాక; యూఱడు మింకన్.' 206**

**ప్రతిపదార్థం:** ఉత్సాహంబునన్= పూనికతో; శత్రుకుల+ఉత్సాదన విధి+ఒనర్చి= విరోధి వంశాన్ని పెల్లగించి వేయటం అనే కార్యం నిర్వహించి; ఉన్నత సామ్రాజ్య+ఉత్సవము= దొడ్డ ప్రభుత్వం అనే పండుగను; ఒందు= పొందే; పుత్రులన్= కొడుకులను; ఉత్సుకతన్= ఉబలాటంతో; చూతు+కాక= చూచెదవు లెమ్ము; ఇంకన్= ఇక; ఊఱడుము= ఊరడిల్లుము.

**తాత్పర్యం:** పాండవులు విరోధివంశాన్ని కూకటివేళ్ళతో పెల్లగించి వేసి,; ఉన్నత సామ్రాజ్యాధిపత్యమనే పండుగను జరుపుకుంటుంటే నీవు ఉత్సాహంతో కనుగొనగలవు. ఇంక ఊరట వహించుము.'

**చ.** **అన విని మోము విచ్చుచు మురారికి నిట్లనుఁ గుంతి 'పాండు నం**
**దనులకుఁ దండ్రియున్ గురువు దైవము నారయ నీవ కావె! నీ**
**మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్ల చే**
**సి నెగడువారు గాక నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే? 207**

**ప్రతిపదార్థం:** అనన్+విని= శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు విని; కుంతి= కుంతీదేవి; మోము విచ్చుచున్= మొగం వికసింప చేస్తూ; ముర+అరికిన్= ఆ మురవైరికి; ఇట్లు+అనున్= ఈ రీతిగా చెప్పింది; పాండునందనులకున్= పాండుకుమారులకు; తండ్రియున్= జనకుడును; గురువు= ఒజ్జయును; దైవమున్= దైవతమును; ఆరయన్= పరికించగా; నీవు+అ+కావె!= నీవేగదా!; నీ మనమునన్= నీ చిత్తంలో; ధర్మమున్= న్యాయాన్ని; హితమున్= మేలును; మంచిగన్+చూచి= చక్కగ తలపోసి; విధించిన+అట్లు+అ= నీవు నిర్ణయించిన విధాన; చేసి= ఆచరించి; నెగడువారు+కాక= వృద్ధి పొందుతారు లెమ్ము; నినున్+చేరినన్= నిన్నాశ్రయించుకొన్నచో; ఆపదలు= కష్టాలు; ఒందన్+నేర్చునే= కలుగ గలవా? (కలుగవని అర్థం.)

**తాత్పర్యం:** కృష్ణుడి మాటలు వినేసరికి కుంతీదేవి ముఖం వికసించింది. ఆమె మురవిధ్వంసకుడైన మేనల్లుడితో ఇట్లా అన్నది. 'పాండుకుమారులకు తండ్రి, గురువు, దైవం నీవేకదా! నీ మనస్సులో ఏది న్యాయమో, ఏది హితమో మంచిగా నీవే చూచి ఇట్లా చేయండి అని నిర్దేశిస్తే వారు అట్లా చేసి బాగుపడగలరు. నిన్ను ఆశ్రయించుకొన్నవారికి ఎట్టి ఆపదలు రావుగదా!

**విశేషం:** 1. అలం: మాలారూపకం. 2.పాండవులకు శ్రీకృష్ణుడు వరుసగా తండ్రి, గురువు, దైవం అని నివేదించుకొన్నది. ముగ్గురూ ఒకరిలోనే ఉన్నారు. తండ్రిగా ధర్మాన్ని నిర్దేశిస్తాడు. గురువుగా హితాన్ని బోధిస్తాడు, దైవంగా 'మంచిగ చూస్తాడు' అంటే యోగక్షేమం వహిస్తాడు అని క్రమాన్వయం. 'నిను చేరిన నాపద లొంద నేర్చునే!' అన్నది విశ్వాసంతో కూడుకొన్న శరణాగత భక్తి భావ ప్రకటనం. భగవంతుడి రక్షణలో ఉన్నవారి దరికి ఆపదలు చేరవు అన్నది విశ్వాసం. పాండవులు శ్రీకృష్ణుడిని శరణు వేడి అటువంటి భద్రస్థితిలో ఉన్నారని ధ్వని. (సంపా.)

**క.** **వారలక యేల మాధవ! । కౌరవులకు మఱియు నీజగంబులకెల్లం**
**జేరుగడ నీవ; నీ పలు । కారయ వేదంబ కాదె యఖిలంబునకున్.' 208**

**ప్రతిపదార్థం:** మాధవ!= శ్రీకృష్ణా!; వారలకున్+అ+ఏల?= పాండవులకు మాత్రమే అననేల?; కౌరవులకున్= కౌరవులకుకూడా; మఱియున్= ఇంకను; ఈ జగంబులకున్+ఎల్లన్= ఈ లోకాలన్నింటికినీ; చేరుగడ= శరణం; నీవు+అ= నీవే సుమా!; అఖిలంబునకున్= సమస్తమునకునూ; ఆరయన్= విచారించగా; నీ పలుకు= నీ వచనం; వేదంబు+అ కాదె!= వేదమే గదా!

**తాత్పర్యం:** మాధవా! ఒక్క పాండుకుమారులకే అననేల? కౌరవులకునూ; ఈ లోకము లన్నింటికినీ నీవేదిక్కు సమస్త జగాలకూ పరికించగా నీ పలుకే వేదం కదా!'

**విశేషం:** 1. అలం: రూపకం. శ్రీకృష్ణుడి మాట వేదం.

2. భగవంతుడు జగద్రక్షకుడనీ, పాండవ కౌరవులందరికీ ఆయన సముడనీ భావించే కుంతీభావంలో సమత్వం స్ఫురిస్తున్నది.

3. అఖిలలోకాలకూ శ్రీకృష్ణుడి వాక్కులు వేదంకాగా ఆ మాటలు విన్నవారు ధర్మమూర్తు లౌతారు. విననివారు పతితులౌతారని ధ్వని. (సంపా.)

**వ. అనినం బ్రసన్నవదనుం డగుచు నద్దేవి గారవించి యామంత్రణంబు సేసి తదావాసంబు వెలువడి తనరాకకు నలంకృతంబైన దుర్యోధను మందిరంబునకుఁ గృతవర్మ సాత్యకి సమేతుండయి పోవు గోవిందునిం గని తదీయ ద్వారపాలకులు సంభ్రమంబునం బఱచి యతని కెఱిఁగించి తదనుమతంబునం బఱతెంచి యెదుర్కొని కక్ష్యాంతరంబుల సందడి నెడగలుగ జడియుచు వినయంబునం దోడ్కొనిచన నమ్మనుజవిభుండు కైలాసశిఖరాకారంబగు సౌధంబున బాహ్లిక భీష్మ ద్రోణ ప్రభృతులును, గర్ణశకుని సైంధవాదులును, దుశ్శాసన వికర్ణ దుర్ముఖ ప్రముఖులును మఱియు ననేక దేశాధీశులునుం బరివేష్టింపఁ బేరోలగంబున సింహాసనాసీనుండై యున్న యెడకుం జను నప్పు డాసుయోధనుండు సపరివారంబుగాఁ బ్రత్యుత్థానంబు సేయం జేర నరిగి యతనికిం దగువారలకు నాలింగనాద్యుపచారంబులు తానుం దమ్ముండును నాచరించి. 209**

**ప్రతిపదార్థం:** అనినన్; ప్రసన్న వదనుండు+అగుచున్= అనుగ్రహంతో కూడిన ముఖం కలవాడై; ఆ+దేవిన్= ఆ కుంతిని; గారవించి= గౌరవించి; ఆమంత్రణంబు+చేసి= ఆమె నుండి వీడ్కోలు పడసి; తద్+ఆవాసంబు+వెలువడి= ఆమె గృహం నుంచి బయటకువచ్చి; తన రాకకున్= తన ఆగమనమునకై; అలంకృతంబు+ఐన= అలంకరించబడిన; దుర్యోధను మందిరంబునకున్= సుయోధనుడి సౌధానికి; కృతవర్మసాత్యకి సమేతుండు+అయి= కృతవర్మ, సాత్యకి అనే వారితో కూడినవాడై; పోవు గోవిందునిన్; కని= చూచి; తదీయ ద్వారపాలకులు= ఆ దుర్యోధనుడి వాకిలిగాచువారు; సంభ్రమంబునన్+ పఱచి= తొట్రుపాటుతో పరుగెత్తిపోయి; అతనికిన్+ఎఱిఁగించి= సుయోధనుడికి కృష్ణుడి రాక తెలిపి; తద్+అనుమతంబునన్= సుయోధనుడి అంగీకారంతో; పఱతెంచి= మరలివచ్చి; ఎదుర్కొని= శ్రీకృష్ణుడికి ఎదురుగా వచ్చి; కక్ష్యా+అంతరంబుల సందడిన్= లోగిళ్ళ లోపల కలిగిన సమ్మర్దమును; ఎడ కలుగన్= దారి ఏర్పడేటట్లు; జడియుచున్= తొలగిస్తూ; వినయమునన్= అణకువతో; తోడ్కొని చనన్= వెంట బెట్టుకొని వెళ్ళగా; ఆ+మనుజ విభుండు= ఆ నరనాథుడైన సుయోధనుడు; కైలాస శిఖర+ఆకారంబు+అగు= కైలాస పర్వత శిఖరం మాదిరి ఉన్న; సౌధంబునన్= భవనంలో; బాహ్లిక భీష్మ ద్రోణ ప్రభృతులును= బాహ్లికుడు, భీష్ముడు, ద్రోణాచార్యులు మొదలైనవారున్నూ; కర్ణ శకుని సైంధవ+ఆదులును= కర్ణుడు శకుని సైంధవుడు మొదలైనవారున్నూ; దుశ్శాసన వికర్ణ దుర్ముఖ ప్రముఖులును= దుశ్శాసనుడు, వికర్ణుడు, దుర్ముఖుడు మొదలైనవారున్నూ; మఱియున్= ఇంకను; అనేక దేశ+అధీశులునున్= పెక్కు దేశాల రాజులున్నూ; పరివేష్టింపన్= చుట్టుచేరిఉండగా; పేరు+ ఓలగంబునన్= గొప్ప కొలువు కూటంలో; సింహ+ఆసన+ఆసీనుండు+ఐ= సింగపు గద్దె మీద కూర్చుండినవాడై; ఉన్న+ఎడకున్= ఉన్న తావుకు; చను+అప్పుడు= వెళ్ళుతున్న సమయంలో; ఆ సుయోధనుండు= ఆ దుర్యోధనుడు; సపరివారంబుగన్= పరిజనులతో కూడ; ప్రత్యుత్థానంబు+చేయన్= ఎదుర్కోలు జరుపుటకై; చేరన్+అరిగి= శ్రీకృష్ణుడి సమీపానికి వెళ్ళి; అతనికిన్= శ్రీకృష్ణుడికి; తగువారలకున్= అతని వెంట వచ్చిన అర్హులైన వారందరికీ; ఆలింగన+ఆది+ఉపచారంబులు= కౌగిలించుకొనటం మున్నగు మన్ననలు; తానున్= తానును; తమ్ముండును= తన అనుజుడైన దుశ్శాసనుడును; ఆచరించి= కావించి.

**తాత్పర్యం:** కుంతీదేవి మాటలు విని శ్రీకృష్ణుడు ప్రశాంత ముఖపద్మంతో ఆ దేవిని మన్నించి, సెలవు పుచ్చుకొని, ఆమె నివాసం నుండి వెలుపలికి వచ్చాడు, తన ఆగమనానికై అలంకరించబడిన దుర్యోధనుడి భవనానికి హరి

కృతవర్మతో సాత్యకితో కలిసి బయలుదేరాడు. కృష్ణస్వామి రాకనుగాంచి వాకిటి కావలివాండ్రు సత్వరంగా వెళ్ళి దుర్యోధనుడికి ఆ వార్త తెలిపారు. ఆయన ఆదేశంతో వారు వచ్చి శౌరి నెదుర్కొని లోగిళ్ళలోని సమ్మర్దం తొలగిస్తూ దారి నేర్పరచి వినయంతో తోడ్కొనిపోయారు. సుయోధనుడు కైలాస శిఖరంవలె ఉన్న ఉన్నత సౌధంలో బాహ్లికుడు భీష్ముడు ద్రోణుడు మున్నగువారూ, కర్ణుడు శకుని సైంధవుడు మొదలైనవారూ, దుశ్శాసనుడు వికర్ణుడు దుర్ముఖుడు ఆదిగాగలవారూ, ఇంకా పలు దేశముల ప్రభువులూ తన చుట్టూ చేరి ఉండగా, సింహాసనాసీనుడై కొలువుదీరి ఉన్నాడు. అక్కడికి శ్రీకృష్ణుడు వస్తుండగా దుర్యోధనుడు పరిజనులతో కూడ ఎదుర్కోలు జరపటానికై మురారిని చేరవచ్చి ఆయనకూ, తగినవారలకూ తానూ తన తమ్ముడు దుశ్శాసనుడూ ఆలింగనాదులైన మన్ననలు చేశారు.

**విశేషం:** అలం: ఉపమ. 1. దుర్యోధనుడి భవనం శిఖరాకారంవలె ఉన్నదనటంలో ఉపమ.

2. శ్రీకృష్ణుడు ప్రసన్నవదనుడై కుంతిని గౌరవించాడంటే దైవానుగ్రహం ఆమె పట్ల ఉంటుందని ధ్వనింపజేశాడు.

3. దుర్యోధనుడి మందిరంలో ప్రవేశించేటప్పుడు శ్రీకృష్ణుడికి భద్రతా సేనానులవలె కృతవర్మ, సాత్యకి ఇరువైపుల నడవటం గమనార్హం. అది మిత్రమందిరంగా కంటె శత్రుమందిరంగానే శ్రీకృష్ణుడు భావిస్తున్నాడని ధ్వని.

4. మందిరంలో కక్ష్యలన్నీ దాటి సభాభవన కక్ష్యలో ప్రవేశించిన తరువాత దుర్యోధనుడు పరివారంతో ఎదుర్కోలివ్వటం రాజమందిర మర్యాద. తనను ఆహ్వానించటానికి వస్తున్న దుర్యోధన దుశ్శాసనాదులను స్నేహపూర్వకమైన ఆలింగనాదులతో సమ్మానించటం స్నేహ మర్యాద. ఆసనాదు లిచ్చి అతిథిని గౌరవించటం అతిథి మర్యాద. దూతకిచ్చే మర్యాదలకంటె ఉన్నతమైన వాటిని కౌరవులు శ్రీకృష్ణుడికి అందచేస్తున్నారు. అది వారి వ్యూహంలో ఒక భాగం, గౌరవించి, కానుకలిచ్చి శ్రీకృష్ణుడిని పాండవులనుండి వేరు చేయాలన్న భేదోపాయం. (సంపా.)

**క. అతఁ డునుపఁగఁ గనక మయో । న్నత పర్యంకంబునందు నారాయణుఁ డూ**
**ర్జిత మహిమ నుండి యభ్య । ర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతులన్. 210**

**ప్రతిపదార్థం:** అతఁడు+ఉనుపఁగన్= సుయోధనుడు కూర్చుండ బెట్టగా; కనకమయ= సువర్ణమయమైన; ఉన్నత పర్యంకంబు+అందున్= ఎత్తయిన మంచం మీద; నారాయణుఁడు= వాసుదేవుడు; ఊర్జిత మహిమన్+ఉండి= గొప్ప ప్రభావంతో అధివసించి, తగంగన్= ఒప్పుగా; అతనిచేన్= దుర్యోధనుడి చేత; సత్కృతులన్= సత్కారాలతో; అభ్యర్చితుఁడు+అయ్యెన్= లెస్సగా పూజించబడ్డాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కూర్చుండ బెట్టగా సమున్నతమైన బంగరు మంచం మీద గొప్ప విభూతితో వాసుదేవుడు కూర్చుండి అత డొనర్చే సత్కారాలతో మిక్కిలి పూజించబడ్డాడు.

### శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట (సం. 5-89-1)

**వ. సాత్యకియును సముచిత ప్రకారంబునం బూజితుండయ్యెఁ; దదనంతరంబు నిజాసనాసీనులయి తన మొగంబునం జూడ్కి నిలిపియున్న దుర్యోధనాదులతో మాధవుండు మధురసంభాషణంబులు సేయుచుండె; నట్టియెడ. 211**

**ప్రతిపదార్థం:** సాత్యకియును, సముచిత ప్రకారంబునన్= తగు విధంగా, పూజితుండు+అయ్యెన్= పూజించబడ్డాడు, తద్+అనంతరంబు= అటుపిమ్మట, నిజ+ఆసన+ఆసీనులు+అయి= తమ పీఠాలమీద కూర్చుండినవారై, తన మొగంబునన్=

తన ముఖంమీద, చూడ్కిన్= దృష్టిని, నిలిపి+ఉన్న= ప్రసరింపజేస్తున్న, దుర్యోధన+ఆదులతోన్= సుయోధనుడు మొదలైనవారితో, మాధవుండు= లక్ష్మీవల్లభుడు, శ్రీకృష్ణుడు; మధుర సంభాషణంబులు+చేయుచున్+ఉండెన్= ఇంపైన మాటలాడుతూ ఉన్నాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** సాత్యకికూడ తగు విధంగా పూజించబడ్డాడు. పిదప తమ తమ పీఠాలమీద కూర్చుండి తన వదనం మీద చూపులు సారించిఉన్న దుర్యోధనుడు మొదలైనవారితో గోవిందుడు ఇంపైన మాటలు మాట్లాడుతుండినాడు. ఆ సమయంలో - (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. సముచితంబుగఁ గూరలచంద ముగ్గ। డించి కుడుపు తెఱంగు పుట్టించి పలుకు**
**నా సుయోధనుతోఁ గృష్ణుఁ డచటఁ దాను। గుడువ నొల్లక యునికి యేర్పడఁగఁ జెప్పె. 212**

**ప్రతిపదార్థం:** సముచితంబుగన్= మిక్కిలి యుక్తంగా; కూరలచందము= కూరల విధం- శాకపాకాల రీతి; ఉగ్గడించి= పలికి; కుడుపు తెఱంగు పుట్టించి= భోజన విషయం ప్రస్తావనకు దెచ్చి; పలుకు= మాట్లాడుతున్న; ఆ సుయోధనుతోన్= ఆ దుర్యోధనుడితో; కృష్ణుఁడు= శ్రీ కృష్ణుడు; అచటన్= దుర్యోధనుడి గృహంలో; తాను= తాను; కుడువన్+ఒల్లక+ఉనికి= భుజించటాని కిష్టపడని స్థితి; ఏర్పడఁగన్+చెప్పెన్= స్పష్టంగా తెలిపాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తగు విధాన తన ఇంటిలో వండిన శాకపాకాల వివరాలు తెలిపి, భోజన విషయం ప్రస్తావనకు తేగా, శ్రీకృష్ణుడు అక్కడ తాను భుజించటానికి ఇష్టపడకుండటం స్పష్టంగా చెప్పివేశాడు.

**విశేషం:** ఇంటికి వచ్చిన అతిథిని భోజనానికి ఆహ్వానించటం గృహస్థుడి మర్యాద. దానిని దుర్యోధనుడు నిర్వహించినట్లుగా పైకి కనపడుతున్నాడు. అప్యాయతతో, భక్తితో, వినయంతో పిలిచేవారు కూరల రుచిని గురించి అంతగా గొప్పలు చెప్పుకోరు. భోజనంమీద మోహం కలిగేటట్లు మాట్లాడరు. ఆ వైఖరిలో సహజత్వం కొరవడినట్లు ఎదుటివారికి స్పష్టం ఔతున్నది. అన్నంలో విషం పెట్టటానికి పన్నాగం వేశాడా? అన్నంత అనుమానం కలుగుతుంది. అందువలననే శ్రీకృష్ణుడు 'అన్నం తినజాలను' అన్నాడు. 'తినను' అనలేదు. తినను అంటే తిరస్కారమౌతుంది. 'తినజాలను' అంటే పరిస్థితుల ప్రభావమౌతుంది. అడుగడుగున సమస్యలు సృష్టించి శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతిగా, కౌరవ విరోధిగా, కపట వర్తనుడుగా నిరూపించాలని దుర్యోధనుడు ప్రయత్నించటం ఇక్కడే ప్రారంభమయింది. విందు నొక సమస్య చేశాడు దుర్యోధనుడు. (సంపా.)

**వ. చెప్పిన విని దుర్యోధనుండు సూర్యసూను వదనం బవలోకించి యల్లన యిట్లనియె: 213**

**ప్రతిపదార్థం:** చెప్పినన్+విని; దుర్యోధనుండు; సూర్యసూనువదనంబు= సూర్యుని పుత్రుడైన కర్ణుడి ముఖం; అవలోకించి= చూచి; అల్లన= నెమ్మదిగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి మాటలు విని సుయోధనుడు రవితనయుడైన కర్ణుడి ముఖం వైపు చూచి నెమ్మదిగా ఇట్లా అన్నాడు:

**క. 'హరి పలికిన విధ మెంతయు। నెరవై యున్నయది వింటె యిమ్మాట తెఱం**
**గరయుదము తొలుత; నీ పెను। పరిచందం బెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్.' 214**

**ప్రతిపదార్థం:** హరిపలికిన విధము= కృష్ణుడు మాటాడిన తీరు; ఎంతయున్= మిక్కిలి; ఎరవై+ఉన్న+అది= భేదబుద్ధితో కూడిఉన్నది; వింటె!= వింటివిగదా!; ఈ+మాట తెఱంగు= ఈ పలుకుల విధ మెట్టిదో; తొలుతన్= మొదట; అరయుదము= పరిశీలిద్దాం; పిదపన్= తరువాత; ఈ పెనుపరిచందంబు+ఎల్లన్= ఈ పెద్దమనిషి వైనమంతా; ఎఱుకపడియెడున్= బయటపడుతుంది.

**తాత్పర్యం:** 'కర్ణా! శ్రీకృష్ణు డాడినమాట మిక్కిలి భేదబుద్ధితో కూడి ఉంది. నీవు విన్నావుకదా! మొదట అతడిమాటతీరు పరిశీలిద్దాం. అవతల ఆ పెద్దమనిషి పద్ధతి అంతా తేటతెల్లమవుతుంది.'

**విశేషం:** దుర్యోధనుడి నీతిని తీర్చిదిద్దే ఆప్తమిత్రుడు కర్ణుడని మొదట్లోనే బైటపెట్టుకొన్నాడు దుర్యోధనుడు. భోజనానికి రాని కారణం అడిగితే పాండవ పక్షపాతం బయటపడుతుంది. ఆ తరువాత శ్రీకృష్ణుడి చర్యలన్నీ పక్షపాతంతో, శత్రుత్వంతో కూడినవే అని నిరూపించవచ్చునని దుర్యోధనుడి వ్యూహం. (సంపా.)

**వ. అని పలికి యచ్చ్యుతున కిట్లనియె: 215**

**తాత్పర్యం:** అని చెప్పి దుర్యోధనుడు శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు:

**తే. 'వలయు నన్నపానంబులు పలు దెఱఁగుల । నేర్చు విధముల నే మొడఁ గూర్చి వేడ్క**
**నున్న నీ వుపయోగింప నొల్లకునికి । బాంధవమునకు నీతికి బాహిరంబు. 216**

**ప్రతిపదార్థం:** వలయు+అన్నపానంబులు= కావలసిన అన్నం, పానీయాలు; పలు+తెఱఁగులన్= అనేకరీతుల; నేర్చు విధములన్= మాకు తెలిసినంతలో; ఏము= మేము; ఒడఁగూర్చి= సిద్ధపరిచి; వేడ్కన్+ఉన్నన్= అభిలాషతో ఉండగా; నీవు= నీవు; ఉపయోగింపన్+ఒల్లక+ఉనికి= భుజించటాని కిష్టపడకుండటం; బాంధవమునకున్= చుట్టరికానికి; నీతికిన్= న్యాయానికి; బాహిరంబు= వెలియైన విషయం.

**తాత్పర్యం:** 'కృష్ణా! కావలసిన అన్నపానీయాలు పలురీతుల మాకు తెలిసినంతలో సిద్ధపరిచి మేము ఆశతో ఉండగా, నీవు వాటిని భుజించటానికి ఇష్టపడకపోవటం మన చుట్టరికానికి, న్యాయానికి విరుద్ధమైన విషయం.

**క. కౌరవులకుఁ బాండవులకు । నారయ నీ వొక్క రూప; యసదృశ ధర్మా**
**చారుండవు రాజునకుం । గూరుతు? కతమేమి యిట్లగుటకుం జెపుమా'. 217**

**ప్రతిపదార్థం:** కౌరవులకున్= ధృతరాష్ట్రుడి కుమారులమైన మాకూ; పాండవులకున్= పాండురాజు కొడుకులకున్నూ; ఆరయన్= పరికింపగా; నీవు; ఒక్కరూపు+అ= సమానమైనవాడివే; అసదృశ+ధర్మ+ఆచారుండవు= సాటిలేని న్యాయాచరణం గలవాడివి; రాజునకున్= ధృతరాష్ట్ర మహారాజునకు; కూరుతు(వు)= ప్రియమైనవాడివి; ఇట్లు+అగుటకున్= నీ విట్లా మారిపోవటానికి; కతము+ఏమి?= కారణ మేమి? చెపుమా= చెప్పుము.

**తాత్పర్యం:** ఆలోచించగా కురుపాండవులకు నీవు ఒకే విధమైనవాడవు. అంతేకాదు. సాటిలేని ధర్మశీలుడవు. ధృతరాష్ట్ర మహారాజుకు ఇష్టుడవు. ఇట్లాంటివాడివి మా యింట భుజించను అనటానికి హేతువేమో చెప్పుము.'

**క. అనుడు నుపేంద్రుఁడు మనుజేం । ద్రుని కిట్లను 'దూత లెందుఁ దొలిదొలి గుడువం**
**గొనఁ గట్టఁ దొడఁగుదురె? వ । చ్చిన కార్యము దీర్చి పిదపఁ జేయుదు రెల్లన్.' 218**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని దుర్యోధనుడు ప్రశ్నించగా; ఉపేంద్రుఁడు= దేవేంద్రుడికి అనుజన్ముడైన శ్రీకృష్ణుడు; మనుజ+ఇంద్రునికిన్= నరేశ్వరుడైన దుర్యోధనుడికి; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; దూతలు= రాయబారులు; ఎందున్= ఎక్కడైనా; తొలి+తొలిన్= దౌత్యానికి మునుముందే; కుడువన్= భుజించటానికి; కొనన్= సత్కారములందుకొనటానికి; కట్టన్= నూతన వస్త్రాలు స్వీకరించి ధరించటానికి; తొడఁగుదురె= పూనుకొందురా? (పూనుకొనరని అర్థము;) వచ్చిన కార్యమున్= ఏ పనిమీద వచ్చిరో ఆ పనిని; తీర్చి= నెరవేర్చి; పిదపన్= తరువాత; ఎల్లన్+చేయుదురు= అన్ని మన్ననలను స్వీకరిస్తారు.

**తాత్పర్యం:** శ్రీ కృష్ణుడు దుర్యోధనుడికి ఇట్లా ప్రత్యుత్తరమిచ్చాడు: 'రాయబారులు వచ్చినపని చూడకుండ మున్ముందుగా భుజించటం, వస్తువులను గైకొనటం, ఉడుపులు చేకొని ధరించటం కూడదు. వచ్చిన పని నెరవేర్చిన తరువాత అన్ని మర్యాదలు అంగీకరిస్తారు.'

**విశేషం:** దుర్యోధనుడు శ్రీకృష్ణుడిని అందరికీ కావలసిన బంధువుగా ఆహ్వానించి చెప్పాడు. అందువలన విందుకు అంగీకరించకపోవటం శ్రీకృష్ణుడి దోషంగా పేర్కొన్నాడు. శ్రీకృష్ణుడు తాను విందుకు రాకపోవటానికి రాయబారి ధర్మాన్ని కారణంగా పేర్కొన్నాడు. రాయబారి వచ్చినపని ముగించకుండా భుజించటం, కానుకలు తీసికొనటం, నూతన వస్త్రాలు తీసికొని ధరించటం నిషేధమనే రాజనీతిని పేర్కొని తాను వచ్చినపని ముగించిన తరువాత మర్యాదలన్నీ స్వీకరిస్తానని చెప్పాడు. బంధుత్వంకంటె బాధ్యత ప్రథమగణ్యం. (సంపా.)

**వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కిట్లనియె: 219**

**ప్రతిపదార్థం:** అనినన్= అని కృష్ణుడు పలుకగా; గాంధారీనందనుండు= గాంధారి కుమారుడైన సుయోధనుడు; దేవకీనందనునకున్= దేవకీదేవి తనయుడైన శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా బదులు పలికాడు.

**తాత్పర్యం:** మాధవుని మాటలకు సుయోధను డిలా బదులు చెప్పాడు:

**ఆ. 'వేగపడుట మేలె? వినుము; కార్యము దీఱుఁ। దీఱకుండు దాని తెఱఁగు దగిన**
**యప్పు డాడరాదె? యిప్పుడు ముకుఁ ద్రాటఁ। గాలు గ్రువ్వనేల కమలనాభ! 220**

**ప్రతిపదార్థం:** కమలనాభ!= కమలము నాభియందు గల వాడా కృష్ణా!; వేగపడుట మేలె?= త్వరపడటం మంచిదా?; వినుము= నా మాటలు వినుము; కార్యము తీఱున్= పని నెరవేరవచ్చును; తీఱక+ఉండున్= నెరవేరకపోవచ్చును; దాని తెఱఁగు= ఆ విషయం; అప్పుడు+ఆడన్‌రాదె= అప్పుడు పలుకవచ్చును కదా!; ఇప్పుడు= ఈ సమయంలో; ముకుఁద్రాటన్= ముక్కునకు గ్రుచ్చిన త్రాటియందు; కాలు+క్రువ్వన్+ఏల?= కాలిని దూర్చుటెందుకు?

**తాత్పర్యం:** పద్మనాభా! తొందరపడటం అంత మంచిదికాదు. నా మాట వినుము. పని అవుతుంది, కాకపోతుంది. అవసరం వచ్చినపుడు ఆ సంగతి మాటాడవచ్చును గదా! ముక్కుకు గ్రుచ్చిన త్రాటిలో కాలు దూర్చటమెందుకు?

**విశేషం:** 1. అలం: లోకోక్తి. లోకోక్తితో కలిపి చెప్పటం లోకోక్తి అలంకారం. 2.శ్రీకృష్ణుఁడు విందుకూ రాయబారం పూర్తికావటానికీ లంకె పెట్టాడు. దానిని దుర్యోధనుడు నిపుణంగా పరిహసిస్తున్నాడు. శ్రీకృష్ణుడు తొందరపడుతున్నాడని ఒక అభియోగం చేశాడు. రాయబారానికీ విందుకూ సంబంధం లేదని చెప్పాడు. ఒకవేళ రాయబారం సఫలం కావచ్చును, కాకపోవచ్చును.

దానికీ విందుకూ ముడిపెట్టటం తొందరపాటు అని హెచ్చరించాడు. చివరకు 'ముక్కుత్రాటిలో కాలుదూర్చటం ఎందుకు?' అనే లోకోక్తితో ఎత్తిపొడిచాడు. పని మొదలు కాకపోగా ముగింపు సంగతి ఎందుకు అప్పుడే తెస్తావు? అని భావం. మరొక మాటలో చెప్పాలంటే- సంధి కుదురుతుందంటేనే నేను విందు చేస్తా'నన్నట్లున్నదని భావం. ముక్కుత్రాడు - మొదటి మర్యాదలకూ, కాలు - చివరి ముగింపుకూ ఆ సూక్తిలో స్ఫూర్తినిస్తాయి. శ్రీకృష్ణుడి వక్రనీతిని బయటపెట్టాలని పలికిన మాట లివి. (సంపా.)

**వ. నీవు వచ్చినవాఁడవు మా యింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట యొప్పుఁగాక; కుడువనొల్ల ననం దగునె? దీనికిం గారణంబు నా యెఱింగిన యది లేదు; విచారింపక పలికి' తనిన మందరధరుండు మందస్మితంబుతో నందఱం గలయం గనుంగొని ధార్తరాష్ట్రకరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చు లీలం గేల నమర్చి 'యిట్టి మాటలు తేటపఱుపవలయునేని విను'మని యతని కిట్లనియె: 221**

**ప్రతిపదార్థం:** వచ్చినవాడవు నీవు; మా యింటన్= మా గృహంలో; కుడిచి= భుజించి; కూర్చుండి; ఎల్లపనులన్= అన్ని కార్యాలూ; చెప్పుట; ఒప్పున్+కాక= తగునుగాని; కుడువన్+ఒల్లన్+అనన్+తగునె?= భుజించటాని కిష్టపడను అని చెప్పటం యుక్తమా?; దీనికిన్= ఇట్లు తిననని చెప్పటానికి; కారణంబు; నా+ఎఱిఁగిన+అది= నాకు తెలిసినట్టిది; లేదు; విచారింపక పలికితి(వి)= ఆలోచించక మాట్లాడావు; అనినన్; మందరధరుండు= క్షీరసాగర మథన కాలంలో మందరగిరిని మూపున దాల్చిన మహాకూర్మ స్వరూపుడైన శ్రీకృష్ణుడు; మందస్మితంబుతోన్= చిరునవ్వుతో; అందఱన్+కలయన్+కనుంగొని= అక్కడున్నవారినెల్ల తేరిపారజూచి; ధార్త రాష్ట్రకరంబు= దుర్యోధనుడి చేతిని; గజంబు= ఏనుగు; పల్లవంబున్= చిగురుటాకును; అల్లన= మెల్లగా; తెమల్చులీలన్= చలింప జేయు విధాన; కేలన్+అమర్చి= తన చేతిలో ఇమిడ్చి; ఇట్టిమాటలు= ఇటువంటి పలుకులు; తేటపఱుపన్+వలయున్+ఏనిన్= విశదం చేయవలసి వస్తే; వినుము= చెప్పుచున్నాను ఆలకించు; అని; ఆతనికిన్; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** కృష్ణా! వచ్చినవాడివి వచ్చినట్లు మా ఇంటిలో కమ్మగా భుజించి, హాయిగా కూర్చుండి, అన్ని పనులు చెప్పటం తగును గాని భుజించటానికి సమ్మతించనని చెప్పవచ్చునా? ఇందుకు కారణం నా యెరిగినంతలో ఏదీలేదు. ఆలోచించక ఇట్లా పలికావు' అని దుర్యోధను డన్నాడు. అప్పుడు వెన్నుడు చిరునవ్వు నవ్వుతూ అక్కడున్నవారినంతా కలయజూచి ఏనుగు చిగురుటాకును తొండంతో పట్టుకొని కదల్చేరీతిగా దుర్యోధనుడి చేతిని తన హస్తంతో పట్టుకొని కదల్చుతూ ఇట్లాంటి విషయాలు వివరించవలసిన అవసరముంటే వెల్లడిస్తాను. విను'మంటూ అతడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** 1. అలం: ఉపమ. తన ఇంట విందు చేయనన్న శ్రీకృష్ణుడి వర్తనానికి కారణ మేమిటో రారాజుకు బోధపడలేదు. సూటిగా అతడినే అడిగాడు. అట్లా అడిగితే శ్రీకృష్ణుడి బండారం బైటపడుతుందని దుర్యోధనుడి తలపు. అడిగితే దుర్యోధనుడి బండారం బైట పెడదామని గోవిందుడి మనసు. ఇద్దరికీ అవకాశం దొరికింది.

2. ఇక్కడ శ్రీకృష్ణుడి అభినయం అమోఘం. క్షీరసాగర మథనంలో మందరపర్వతాన్ని మోసిన ఆదికూర్మ రూపుడు శ్రీకృష్ణుడు. ఈ సమస్య ఒక లెక్కా? మందహాసం చేస్తూ అందరినీ చూచాడు. తాను చెప్పబోయే అంశం దుర్యోధనుడే కాదు అందరూ వినదగింది అని హెచ్చరిక. దుర్యోధనుడి దుర్వివేకంపై ఒక పరిహాస హేల. అంతటితో ఆగక ఏనుగు తన తొండంతో ఒక చిగురాకును అవలీలగా పైకి లేపినట్లు దుర్యోధనుడి చేతితో కరచాలనం చేస్తూ పలికాడు. (చక్కని ఉపమాలంకారం.) దీనిభావ మేమి? 'దుర్యోధనా! నీ సంగతి నీవే త్రవ్వుకొని అడుగుతున్నావు. నేను చెప్పే మాటల కన్నిటికీ

నీవే బాధ్యుడవు. ఇందులో నా తప్పేమీ ఉండదు. తరువాత నన్నని లాభం లేదు' - అని ఆ అభినయానికి అర్థం. 'వివరించమంటే వివరిస్తాను వినండి' అని హుందాగా హుంకరించాడు. దుర్యోధనుడు కదిలించాడు. శ్రీహరి విజృంభించాడు. (సంపా.)

**చ. ప్రియమెసఁగం దగం బిలిచి పెట్టెడు కూ డది లెస్సకూడు; ద**
**క్కయనయహీనతం దమకు నాపద యైనెడ నిట్టునట్టు నే**
**మియు ననలేని కూ డదియు మేవడియై చను; నీవు మా దెసం**
**బ్రియుఁడవు గావు; మాకు ధృతి పెంపఱ నాపదలే దొకింతయున్. 222**

**ప్రతిపదార్థం:** ప్రియము+ఎసఁగన్= ప్రేమ అతిశయించగా; తగన్+పిలిచి= హృదయపూర్వకంగా ఆహ్వానించి; పెట్టెడుకూడు= పెట్టే అన్నం; అది లెస్సకూడు+తక్క= అది మంచి అన్నం దప్ప; అయనయహీనతన్= శుభం, న్యాయం లేకుండా; తమకున్= తమకు; ఆపద+ఐన+ఎడన్= విపత్తు సంభవించిన చోట; ఇట్టున్+అట్టున్= ఇట్టిట్టని; ఏమియున్+అనలేని= సంకటస్థితిలో ఇంచుకకూడా బదులాడటానికి వీలుగాని; కూడు+అదియున్= భోజనం కూడా; మేవడి+ఐ+చనున్= ఉచితమైనదే ఔతుంది.; నీవు; మా దెసన్= మా యెడ; ప్రియుఁడవు కావు= ప్రేమకలవాడవు కావు; మాకున్= మాకు; ధృతిపెంపు+అఱన్= ధైర్యసమృద్ధి చెడేటట్లుగా; ఒకింతయున్= రవంతైనా; ఆపద లేదు= కీడు వాటిల్లలేదు.

**తాత్పర్యం:** ప్రేమతో తన ఇంటికి పిలిచి పెట్టే భోజనం మంచి భోజనం. విపత్తు కలిగినచోట ఔను కాదని బదులేమీ పలకటానికి వీలుగాని సంకట స్థితిలో అయనయములు లేక తినే కూడు కూడా ఉచితమైన కూడే అవుతుంది. దుర్యోధనా! నీవు మా ఎడ ప్రేమకలవాడవు కావు. మాకు ధైర్యం నశించగా ఇప్పుడు ముంచుకొని వచ్చిన ఆపద కొంచెం కూడా లేదు. అందువలన నీ ఇంటిలో భుజించటానికి ఇష్టపడను.

**విశేషం:** 1.ప్రీతితో పిలిచి పెట్టే విందు ప్రియమైనది. లేదా 'భక్తి గలుగుకూడు పట్టెడైనను చాలు'. అంటే దుర్యోధనుడు ఇంటికి వచ్చిన తరువాత శ్రీకృష్ణుడిని విందుకు పిలిచాడు. అయినా అచ్చమైనా స్వచ్ఛమైన ప్రీతితో పిలువలేదు. మరొకమాటలో చెప్పాలంటే రాజకీయమైన దురుద్దేశంతో పిలిచాడని భావం.

2. ఏదైనా తీరని ఆపద కలిగితే, కాదనలేక కటకటపడుతూ తప్పనిసరిగా తినే మిగిలిన కూడు కూడా తినదగిందే. ప్రీతితో పెట్టే భోజనం ఒకటి, ఆపదలో చేసే భోజనం ఒకటి- ఈ రెండే సబబైన విందులు.

3. ఈ రెండు ప్రమాణాలూ దుర్యోధనుడి పట్ల వర్తించవు. అతడు పాండవులకు హితుడు కాడు; పాండవుల కిప్పు డంతటి ఆపద ఏమీ రాలేదు అన్నాడు కృష్ణుడు. ఇది ముక్కుపై గుద్దినట్లు చెప్పిన సమాధానం. మూర్ఖంగా వేసిన ప్రశ్నకు ఇటువంటి జవాబే తగింది.

4. ఈ పద్యానికి మూలం:

**'సంప్రీతి భోజ్యా న్యన్నాని ఆపద్భోజ్యాని వా పునః**

**నచ సంప్రీయసే రాజన్ నచైవా సద్గతా వయమ్' (సం. 5-89-25)**

తిక్కన దీనిని చక్కని తెలుగు పద్యంగా మార్చాడు. (సంపా.)

**వ. అట్లుంగాక. 223**

**తాత్పర్యం:** అంతేకాదు.

**క. పగవారి యింటఁ గుడిచిన । నగుఁ దమ కనుమాన; మమృత మైనను దారుం**
**బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ । దగ; దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో? 224**

**ప్రతిపదార్థం:** పగవారి+ఇంటన్= శత్రు గృహంలో; కుడిచినన్= భుజిస్తే; తమకున్= తమకు; అనుమానము+అగున్= సందేహం కలుగుతుంది; అమృతము+ఐనను= సుధారసమైనప్పటికిన్నీ; తారున్= గృహస్థులు; పగతురకున్= తమ విరోధులకు; కుడువన్+పెట్టఁగన్+తగదు= తినబెట్టరాదు; ఒడళులకున్= దేహాలకు; ఎప్పుడు= ఏ సమయంలో; ఏ+విధము+పాటిలునో!= ఏమి జరుగుతుందో తెలియదుకదా!

**తాత్పర్యం:** శత్రుగృహాలలో భుజించేటప్పుడు వారు తన కేమి పెడతారో అని సందేహం కలుగుతుంది. అమృతమైనప్పటికినీ యజమానులు తమ శత్రువులకు తినబెట్టటం కూడదు. క్షణభంగురాలైన ఈ శరీరాలకు ఎప్పుడు ఏ విధంగా చేటు మూడుతుందో చెప్పలేము కదా!

**విశేషం:** ఇది చక్కని సూక్తి. ఈ పద్యం లోకధర్మనీతిగా కనపడుతున్నా దుర్యోధనుడి దురాలోచనను ధ్వనింపచేసే నిపుణోక్తి. శత్రువు విషాహారం పెట్టకపోయినా, తినినవాడికి సహజంగా ఏదయినా హాని జరిగితే, అతడు శత్రువు పెట్టినకూడు తినటంవలన అనే అనుమానం కలుగుతుంది. (సంపా.)

**వ. నేను పగతుండనె యంటేని. 225**

**ప్రతిపదార్థం:** నేను; పగతుండనె?= శత్రువునా?; అంటి(వి)+ఏని= అంటావేమో!

**తాత్పర్యం:** నేను నీకు విరోధినా? అని ప్రశ్నిస్తావేమో - వినుము.

**క. అలుగుదు పాండవులకు వా । రలు నాకుం బ్రాణములు ధరావల్లభ! యి**
**ట్టలముగఁ దమ ప్రాణములకు । నలుగు జనులు పగతు రగుట యనుమానంబే? 226**

**ప్రతిపదార్థం:** ధరావల్లభ!= రాజా!; పాండవులకున్= పాండవులపై; అలుగుదు(వు)= నీవు కోపం వహిస్తావు; వారలు= కౌంతేయులు; నాకున్ ప్రాణములు= నాకు అసువుల వంటివారు; ఇట్టలముగన్= అధికంగా; తమ ప్రాణములకున్= తమ ప్రాణాలపై; అలుగు జనులు= కినుక వహించినవారు; పగతురు+అగుట= విరోధులు కావటం; అనుమానంబే?= సందేహమా?

**తాత్పర్యం:** దుర్యోధనా! పాండవులంటే నీకు కోపం. వారు నాకు పంచప్రాణాలు. తమ ప్రాణాలకు ఎసరుపెట్టేవారు తమకు విరోధులు కావటంలో సంశయ మేముంది?

**విశేషం:** 1. పాండవులనుండి కృష్ణుడిని వేరు చేయాలనీ, లేదా బంధించాలనీ, లేదా చంపాలనీ దుర్యోధనుడు ప్రకటించిన పన్నాగం. వింద ప్రాణాలు తీసే ప్రయోగం. ఆ సంగతిని శ్రీకృష్ణుడు ధ్వనిమయంగా చెప్పాడు.

2. పాండవులు తన పంచప్రాణాలని ప్రకటించిన శ్రీకృష్ణుడు వారు ఆయనకంటె అభిన్నులని స్పష్టం చేశాడు. కృష్ణుడికి దుర్యోధనుడు నేరుగా శత్రువు కాకపోయినా, అతడికి ప్రాణసములైన పాండవులకు శత్రువు కాబట్టి, అతడు తనకూ శత్రువే. శ్రీకృష్ణుడి హేతుబద్ధ వాఙ్నైపుణ్యం ప్రశంసనీయం. (సంపా.)

**ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య । మాదిగాఁగఁ గీడె యాచరింతు;**
**పుణ్యపరులు తోడఁబుట్టువు లార్యులు । వైర మెత్తఁదగునె వారితోడ? 227**

**ప్రతిపదార్థం:** కారణంబులేక= నిమిత్తంలేక; కౌంతేయులకున్= కుంతీపుత్రులకు; బాల్యము+ఆది కాఁగన్= చిన్నతనంనుండి; కీడె= అపకారమే; ఆచరింతు(వు)= చేస్తుంటావు; పుణ్యపరులు= పుణ్యకార్యాలు సల్పటంలో శ్రద్ధకలవారు; తోడఁబుట్టువులు= సహోదరులు; ఆర్యులు= పూజ్యులు ఐన; వారితోడన్= పాండవులతో; వైరము+ఎత్తన్+తగునె?= కలహించవచ్చునా?

**తాత్పర్యం:** వైర కారణమేమీ లేకుండా చిన్నతనం నుండీ నీవు పాండవులకు అపకారమే చేస్తున్నావు. వారు నీకు సహోదరులు, పుణ్య కార్యాలందు ఆసక్తి గలవారు, పూజ్యులు. అట్టివారితో నీవు విరోధం కలిగి ఉండవచ్చునా?

**వ. ఇట్లున్న మీ యందఱ యన్నంబులు దుష్టాన్నంబులు; విదురుం డొక్కని యన్నంబు భోక్తవ్యంబని నిశ్చయించితిఁ గావున నందుఁ బోయెద'నని చెప్పి యజ్జనపతి యనుమతి సేయఁ జనునప్పుడు తోడన బాహ్లిక భీష్మాది కౌరవులును గుంభసంభవ ప్రముఖులైన మాన్యులును జని మాధవుతోడ 'మా యిండ్ల నెల్లను గానిక లాయితంబులు చేసికొని నీవు విజయం చేయుటకు నెదురు చూచుచున్న వార'మని పల్కి ప్రార్థించిన 'నే నన్ని చోట్లకు వచ్చిన వాఁడన; యందఱ యర్చనలుం గైకొంటిన; మీరు నిలువుం'డని వారల నిలిపి విదురు గృహంబునకుం బోయిన. 228**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఉన్న= పుణ్యపురుషులను; పూజ్యులను బాధిస్తున్న; మీ+అందఱ+అన్నంబులు= మీ అందరియొక్క భోజనాలు; దుష్ట+అన్నంబులు= పాపపు కూళ్ళు; విదురుండు+ఒక్కని+అన్నంబు= ఒక్క విదురుడి అన్నం మాత్రం; భోక్తవ్యంబు= భుజించదగింది; అని నిశ్చయించితిన్= అని నిర్ణయించుకొన్నాను; కావునన్= కనుక; అందున్+పోయెదన్= అతడి ఇంటికి వెళ్ళుతాను; అని చెప్పి; ఆ+జనపతి+అనుమతి+చేయన్= రాజగు దుర్యోధనుడు సమ్మతించగా; చను+అప్పుడు= వెళ్ళేటప్పుడు; తోడన్+అ= అతడివెంటనే; బాహ్లిక భీష్మ+ఆది కౌరవులును= బాహ్లికుడు భీష్ముడు మున్నగు కురువంశస్థులును; కుంభసంభవ ప్రముఖులు+ఐన మాన్యులును= కలశంనుండి ఉద్భవించిన ద్రోణుడు మున్నుగా గల పెద్దలూ; చని= వెళ్ళి; మాధవుతోడన్= కృష్ణుడితో; మా+ఇండ్లన్+ఎల్లను= మా అందరి ఇళ్ళలో; కానికలు= బహుమతులు; ఆయితంబులు చేసికొని= సిద్ధపరచుకొని; నీవు విజయం చేయుటకున్= నీవు విచ్చేయటానికి; ఎదురుచూచుచున్+ఉన్నవారము= ప్రతీక్షిస్తున్నాం; అని పల్కి= అని నుడివి; ప్రార్థించినన్= వేడుకోగా; నేను; అన్నిచోట్లకున్+వచ్చినవాఁడను+అ= వచ్చినట్లే; అందఱ+అర్చనలున్= మీ అందరి పూజలు; కైకొంటిన్+అ= స్వీకరించినట్లే; మీరు నిలువుండు= మీరు ఆగండి; అని; వారలన్ నిలిపి= వారిని తన వెంట రాకుండ అక్కడే ఆగేటట్లు చేసి; విదురు గృహంబునకున్; పోయినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** పుణ్యాత్ములను బాధిస్తున్న మీ అందరి అన్నాలు చెడుతిండ్లు. ఒక్క విదురుడి అన్నమే భుజించదగినది అని నిర్ణయించుకొన్నాను. కావున అక్కడికి వెళ్ళుతాను' అని చెప్పి దుర్యోధనుడు పంపగా వెళ్ళుతున్న సమయంలో శ్రీకృష్ణుడిని బాహ్లికుడు భీష్ముడు మొదలైన కురువృద్ధులున్నూ, ద్రోణాచార్యులు మొదలైన పూజ్యులున్నూ, వెంబడించి 'మా ఇళ్ళలో నీ కోసం కానుకలు సిద్ధపరచుకొని ఉన్నాము. నీ రాకకు ఎదురు చూస్తున్నాము. మా ఇళ్ళకు దయచేయండని వేడుకొన్నారు. 'నేను మీ అందరి ఇళ్ళకు వచ్చినట్లే, మీ పూజలన్నీ అందుకొన్నట్లే అని భావించండి. ఇక ఆగండి' అని వాళ్ళను నిలిపి, విదురుడి మందిరానికి వెళ్ళాడు.

**విశేషం:** 1. కౌరవుల ఇండ్లలోని విందులు పాపపుకూళ్ళు అని నిందించాడు. 2. విదురు డొక్కడే హితుడనీ, అతడి విందే హితమైన భోజనమనీ ప్రకటించాడు. 3. భీష్మాదు లెందరో తమ ఇండ్లకు పిలిచారు. 'అందరూ పిలిచినట్లే, నేను వచ్చినట్లే, మీ పూజలందుకొన్నట్లే' అని అనునయించాడు. నిజానికి భీష్మాదులతో పలికిన మాటలు సర్వవ్యాపకుడైన సర్వేశ్వరుడు అనదగిన మాటలు. ఆధ్యాత్మికమైన అర్థంలో మీ అందరి ఇండ్లకూ భౌతికంగా రాకపోయినా మీ అందరి పూజలూ మానసికంగా అందుకొన్నానని అర్థం. లౌకికంగా- మీరందరూ కౌరవుల నాశ్రయించి ఉన్నారు కాబట్టి మీకూళ్ళు నాకు పొసగవు అని చెప్పినట్లు తాత్పర్యం. (సంపా.)

**సీ. సంభ్రమ స్నేహ నిశ్చల భక్తియుక్తిఁ బ । విత్ర మజ్జనము గావించి విదురుఁ**
**డెల్లవంటకమును నేర్పడ బోనాలు । వేర్పింప, నెంతయుఁ బ్రీతి ముంద**
**రోజమై బ్రాహ్మణభోజనం బొనరించి । సపరివారముగ విశాల రమ్య**
**పూత స్థలంబునఁ బుండరీకాక్షుండు । దమ్ముండు దాను నుత్సవ మెలర్ప**

**తే. సరస రంజక మహనీయ సంప్రయోగ । మగు చతుర్విధ హృద్యాన్న మారగించె**
**లలిత సంభావనా మంజులంబు లైన । పలుకు లెడనెడ విదురున కెలమి యొసఁగ. 229**

**ప్రతిపదార్థం:** విదురుఁడు; సంభ్రమస్నేహ నిశ్చలభక్తియుక్తిన్= ఆదరం, స్నేహం, నిలుకడఐన భక్తి అనేవాటితో కూడినవాడై; పవిత్ర మజ్జనము+కావించి= శౌరికి పావనమైన స్నానం చేయించి; ఎల్లవంటకమును= పలు తెరగులైన వంటకములు అన్నీ; ఏర్పడన్= విశదంకాగా; బోనాలు+పేర్పింపన్= భోజనపదార్థములు పేర్పించగా; ఎంతయున్+ప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; ముందర= తాను భుజించటానికి మునుపే; ఓజమైన్= క్రమ ప్రకారం; బ్రాహ్మణభోజనంబు+ఒనరించి= బ్రాహ్మణులకు భోజనం పెట్టి; పుండరీక+అక్షుండు= తెల్లదామరలవంటి కన్నులుగల నారాయణుడు-శ్రీకృష్ణుడు; విశాల రమ్య పూత స్థలంబునన్= విశాలమైన, సుందరమైన, పవిత్రమైన ప్రదేశంలో; సపరివారముగన్= సహచరులతోకూడ; తానున్= తానున్నూ; తమ్ముండున్= అనుజుడైన సాత్యకియున్నూ; ఉత్సవము+ఎలర్పన్= వేడుకమీరగా; సరస= రసవంతమూ; రంజక= మదికింపు గొల్పేది; మహనీయ సంప్రయోగము+అగు= గొప్పగా చేయించబడింది ఐన; చతుర్విధ= భక్ష్య భోజ్య లేహ్య చోష్యములు అనే నాల్గు విధాలైన; హృద్య+అన్నము= ఆత్మకింపైన భోజనం; ఎడన్+ఎడన్= మధ్య మధ్య; లలిత సంభావనా మంజులంబులు+ఐన= మృదులములైన ప్రశంసలచేత ఒప్పుతున్నట్టి; పలుకులు= మాటలు; విదురునకున్= విదురుడికి; ఎలమి+ఒసఁగన్= సంతోషం కలిగించగా; ఆరగించెన్= భుజించాడు.

**తాత్పర్యం:** విదురుడు ఆదరం, స్నేహం, నిలుకడ గల భక్తి అనే గుణాలతో కూడినవాడై శౌరికి మంగళస్నానం చేయించాడు. ఆ తరువాత వండిన వంటకాలన్నింటినీ వరుసగా వడ్డన చేయించాడు. శ్రీకృష్ణుడు ఆచారక్రమాన్ని అనుసరించి బ్రాహ్మణులు ముందు భుజించిన తరువాత తానూ, తన తమ్ముడూ, సహచరులూ పవిత్రమైన విశాల సుందర ప్రదేశంలో సంతోషంగా భోజనాలకు కూర్చున్నారు. నడుమ నడుమ మృదుల సమ్మాన వాక్యాలతో విదురుడికి ఆనందం కలిగిస్తూ, మహనీయంగా, కమనీయంగా తయారు చేసిన రసవంతాలు, ఆత్మ కింపైనవీ అయిన భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యాలనే నాలుగు విధాలైన భోజన పదార్థాలను శ్రీకృష్ణుడు ఆరగించాడు.

**వ. ఆతండును. 230**

**తాత్పర్యం:** ఆ విదురుడు కూడ.

**క. 'గోవింద! సంభ్రమము సం । భావింపుము మాకు నిదియ పరమధనం; బొం**
**డే విధమున నీ కర్చన । గావింపం జాలువాఁడు కలఁడే యెందున్?' 231**

**ప్రతిపదార్థం:** గోవింద!= శ్రీకృష్ణా!; సంభ్రమము సంభావింపుము= మా ఆదరపూర్వకమైన ఆతిథ్యం మన్నించవలసింది. మాకున్+ఇదియ= మా ఆతిథ్యం నీవు స్వీకరించటమే; పరమధనంబు= గొప్పధనం; ఒండు+ ఏ విధమునన్= మరే విధంగానూ; నీకున్+అర్చన+కావింపన్+చాలువాఁడు= నీకు పూజలు చేయగలిగినవాడు; ఎందున్+కలఁడే?= ఎక్కడైనను ఉన్నాడా? (లేడని అర్థం.)

**తాత్పర్యం:** 'పురుషోత్తమా! నా ఆతిథ్యం మన్నించుము. నీకు ఆతిథ్యమివ్వటమే మాకు పరమ సంపద. వేరొక విధంగా నిన్ను అర్చించగలవాడు ఎక్కడా లేడు.'

**విశేషం:** మానవాకారంలో వచ్చిన మాధవుడికి భక్తి కలుగుకూడు పెట్టి భజించటానికి విదురుడి విందు ఉదాహరణం. (సంపా.)

**వ. అని మఱియు నత్యంత వినయ వాక్యమ్ముల నారాధించుచుండె; నిట్లు కృతాహారుండైన హరికి చందన చర్చా ద్యుపచారంబు లాచరించి యవ్విదురుండు కృతార్థుండై యుండఁ; గవి గాయక ప్రముఖ నిఖిల విద్వజ్జనంబులు పాఠక వాంశిక వైణికాది వినోద పాత్రంబులు నప్పరమేశ్వరుం గానవచ్చి ప్రొద్దుపుచ్చి యభిమతార్థంబులు వడసి చనిరి; రాత్రియగుటయుం దగిన యభ్యంతర మందిరంబున హంసతూలికా తల్పంబున భుజంగ తల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండి. 232**

**ప్రతిపదార్థం:** అని, మఱియున్= ఇంకను; అత్యంత వినయ వాక్యమ్ములన్= మిక్కిలి అణకువతో కూడిన మాటలచేత; ఆరాధించుచున్+ఉండెన్= శ్రీకృష్ణుడిని పూజిస్తూ ఉన్నాడు. ఇట్లు= ఈ రీతిగా; కృత+ఆహారుండు+ఐన= స్వీకరించిన భోజనంకలవాడైన; హరికిన్= కృష్ణుడికి; చందనచర్చా+ఆది= గంధం పూయటం మున్నగు; ఉపచారంబులు+ఆచరించి= సేవలుచేసి; ఆ+ విదురుండు; కృతార్థుండు+ఐ+ఉండన్= మనోరథం ఫలించినవాడై-ధన్యుడై ఉండగా; కవిగాయక ప్రముఖ= కవులు, గానం చేసేవారు మొదలుగా గల; నిఖిల విద్వత్+జనంబులు= సమస్త పండితులు; పాఠక= స్తుతిపాఠకులూ; వాంశిక= పిల్లన గ్రోవులూదేవారూ (మురళివాయించేవారూ); వైణిక= వీణ వాయించేవారూ; ఆది= మున్నుగా గల; వినోద పాత్రంబులు= వేడుక కలిగించే కళాకారులు; ఆ+పరమ+ ఈశ్వరున్= భగవంతుడైన శ్రీకృష్ణుడిని; కానన్+వచ్చి= దర్శించి; ప్రొద్దు+పుచ్చి= కాలక్షేపం చేసి; అభిమత+అర్థంబులు+ పడసి= ఇష్టప్రయోజనాలను పొంది; చనిరి= తమ నివాసాలకు వెళ్ళారు; రాత్రి; అగుటయున్= కాగా; తగిన; అభ్యంతర మందిరంబునన్= లోపలి సౌధంలో; హంసతూలికా తల్పంబునన్= అంచ రెక్కలతో తయారుచేసిన మెత్తని పరుపుమీద; భుజంగ తల్పున్= శేషశాయియైన శ్రీమహావిష్ణువును; ఉనిచి= అధివసింపజేసి; అతని కడన్= ఆ పరమపురుషుడి చెంత; ఉచిత+ఆసనంబునన్= తగిన పీఠంమీద; ఉండి= కూర్చున్నవాడై.

**తాత్పర్యం:** విదురుడు మిక్కిలి వినయ వచనాలతో స్వామిని ఆదరించాడు. భోజనమైన తరువాత శ్రీహరికి గంధం పూయటం మొదలైన సపర్యలన్నీ చేసి విదురుడు ధన్యుడైనాడు. ఆ తరువాత కవులు గాయకులు మొదలైన సకల విద్వాంసులు, స్తుతిపాఠకులు, వేణువు లూదేవారు, వీణ వాయించేవారు- ఇట్లా వివిధ విద్యలలో ప్రవీణులై వినోదాన్ని కలిగించే కళాకారులందరూ ఆ జగన్నాయకుని దర్శించి కాలక్షేపం కావించి ఇష్టార్థాలు పడసి తమ తమ నివాసాలకు వెళ్ళారు. రాత్రికాగానే విదురుడు లోపలి సౌధంలో హంసతూలికా తల్పంమీద గోవిందుడిని శయింపజేసి ఆయన దగ్గర తగిన పీఠంమీద తాను కూర్చుండి.

**ఆ. 'విదురుఁ డిట్టు లనియె నిది యొక కార్యంబు । గాఁగఁ బూని యిందు రాఁగఁ దగునె?**
**దుష్టబుద్ధి నీచు దుర్యోధనుండు నీ । మాట వినునె? దురభిమాన ఘనుఁడు. 233**

**ప్రతిపదార్థం:** విదురుఁడు, ఇట్టులు+అనియెన్; ఇది+ఒక కార్యంబు కాఁగన్+పూని= ఇది ఒక చేయవలసిన పనిగా భావించి పనిగట్టుకొని; ఇందున్= ఇక్కడికి; రాఁగన్+తగునె?= మీరు రావచ్చునా?; దుర్యోధనుండు; దుష్టబుద్ధి= చెడు తలంపుకలవాడు; నీచు= అల్పుడు; దుర్+అభిమాన ఘనుఁడు= దురహంకారంలో దొడ్డవాడు; నీ మాట వినునె?= నీ హితవు వింటాడా?

**తాత్పర్యం:** పడుకపైనున్న పరమేశ్వరుడితో విదురు డిట్లా పలికాడు: 'స్వామీ! ఇదొక పనిగా పనిగట్టుకొని ఇక్కడికి నీవు రావచ్చునా? దుర్యోధనుడు దురాత్ముడు. నీచుడు. దురహంకార పూరితుడు. అతడు నీ మాటలను వింటాడా?

**క. వచ్చిన సైన్యంబులఁ గని । పెచ్చు పెరిఁగినాఁడు; ద్రోణ భీష్ముల లావుల్**
**నచ్చియుఁ గర్ణుం డొక్కఁడ । యిచ్చుఁ దనకు విజయ మనియు నెంతయుఁ బొంగున్. 234**

**ప్రతిపదార్థం:** వచ్చిన సైన్యంబులన్+కని= తన చెంతకు జేరిన పదకొండక్షౌహిణుల సేనలను చూచి; పెచ్చు+పెరిఁగినాఁడు= విర్రవీగుతున్నాడు; ద్రోణ భీష్ముల లావుల్= ద్రోణ భీష్ముల యొక్క శక్తులు; నచ్చియున్= నమ్మికూడ; కర్ణుండు+ ఒక్కఁడు+అ= రాధేయు డొకడే; తనకున్= తనకు; విజయము+ఇచ్చున్+అనియున్= గెలుపు నొసగ గలడనియు; ఎంతయున్= మిక్కిలి; పొంగున్= మిడిసిపడుతుంటాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన పక్షాన చేరిన పదకొండక్షౌహిణుల సేనలను చూచుకొని విర్రవీగుతున్నాడు. ద్రోణభీష్ముల శక్తిపై విశ్వాసమున్నప్పటికీ ఒక్క కర్ణుడే తనకు జయం కలిగిస్తాడని మిడిసిపడుతుంటాడు.

**వ. నీ విట వచ్చుట వినిన యప్పుడు ధార్త రాష్ట్రులందఱుం గూడంబాటి తమలో నిశ్చయించిన తెఱంగు నీ శాసనం బుల్లంఘింపం గలవారు 'పాండునందనులకు నేమియు నీకుండువారు' తార యీ ధాత్రియంతయు బీఱువోవ కుండ నేలువారు; వారింగూడిన రాజులెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగపడినవారు గావునఁ గర్ణుతో నేకార్థులమై చత్తుము గెలుతు; మింతియ కాని యొండు లేదని నిశ్చయించికొని యున్నవా; ర ట్లగుటంజేసి దుర్యోధనుండు గండు మిగిలి యున్నవాఁడు; సంధి గానేరదు; వారల కందఱకు నిది ప్రాప్తకాలంబై యున్నయది; యెట్లును నుడుగ నేర్చినవారు గా;రిట్లు తమ్మెఱుంగని దుష్టాత్ముల నడుమం గూర్చుండుటయు నవ్వెంగలివిత్తు లఱచు వీఱిఁడి యఱపులకు వంకలొత్తి మాఱుసెప్పుటయు నొప్పకయుండు వెడంగు లగుటం గార్యవచనంబు లెఱుంగరు; మొఱకులగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు; వారల తలంపులు కీడు; నీ మహనీయ ప్రభావబుద్ధి పౌరుషంబు లే నెఱుంగుదు; నయినను బాండవేయులపై స్నేహంబునను నీమీఁది భక్తినిం జెప్పెద; నందుఁ బో వలవ' దనిన వాసుదేవుం డతని కిట్లనియె: 235**

**ప్రతిపదార్థం:** నీవు, ఇటవచ్చుట= ఇక్కడికి రావటం; వినిన+అప్పుడు= విన్నవెంటనే; ధార్తరాష్ట్రులు+అందఱున్= కౌరవులందరూ; కూడన్+పాటి= గుంపుగా చేరి; తమలోన్= తమలో తాము; నిశ్చయించిన తెఱంగు= నిర్ణయించుకొన్న విధం ఏమిటంటే; నీ శాసనంబు= నీ ఆజ్ఞ; ఉల్లంఘింపన్+కలవారు= అతిక్రమిస్తారు; పాండునందనులకున్; ఏమియున్+ఈక+ఉండువారు= ఏమి కూడ ఇవ్వరు; తారు+అ= తామే; ఈ ధాత్రి+అంతయున్= ఈ పుడమి నంతటినీ; బీఱుపోవక+ఉండన్= బెత్తెడు చోటుకూడ వదలకుండా; ఏలువారు= పాలించదలచారు; వారిన్ కూడిన రాజులు+ ఎల్లను= వారి పక్షం అవలంబించిన

రాజులంతా; దిక్+విజయంబునాఁడు= (కౌంతేయులు) దిగ్విజయం చేసేటప్పుడు; పాండవుల చేతన్; భంగపడినవారు= ఓడించబడినవారు; కావునన్= అట్లగుటచేత; కర్ణుతోన్= రాధేయుడితోపాటు; ఏక+అర్థులము+ఐ= ఒకే ప్రయోజనం ఆశించినవారమై; చత్తుము= యుద్ధంలో చావనైనా చస్తాము; గెలుతుము= గెలువనైనా గెలుస్తాము; ఇంతి+అకాని= ఇంతే తప్ప; ఒండు లేదు= మరో మార్గం మాకు లేదు; అని నిశ్చయించుకొని ఉన్నవారు= అని తీర్మానించుకొని ఉన్నారు; అట్లు+అగుటన్+చేసి= వారల నిర్ణయం ఇట్లా ఉండటం వలన- అనగా కదనానికి వారు కాలు ద్రవ్వటం వలన; దుర్యోధనుండు; గండు మిగిలి+ఉన్నవాఁడు= పౌరుషం వహించి(పొగరుబట్టి) ఉన్నాడు; సంధి, కానేరదు= జరుగబోదు; వారలకున్, అందఱకున్, ఇది ప్రాప్తకాలంబు+ఐ+ఉన్నఅది= వినాశకాలం దాపురించి ఉన్నది; ఎట్లును= ఏ విధంగానైనా; ఉడుగన్ నేర్చినవారు కారు= యుద్ధం చేయవలెననే సంకల్పం మానుకొనేవారు కారు; ఇట్లు= ఈ ప్రకారంగా; తమ్ము+ఎఱుంగని= తమ హాని వృద్ధులే తమకు తెలియనట్టి; దుష్ట+ఆత్ముల+నడుమన్= చెడు మనసులుకలవారి మధ్య; కూర్చుండుటయున్= మీరు కూర్చొనటం; ఆ+వెంగలి విత్తులు= ఆ మూర్ఖ శిరోమణులు; అఱచు; వీఱిఁడి+అఱపులకున్= అవివేకపు కూతలకు; వంకలు+ఒత్తి= వంకరలు సరిదిద్ది; మాఱు చెప్పుటయున్= బదులాడుటయు; ఒప్పక+ఉండున్= యుక్తంగా నుండదు; వెడంగులు+అగుటన్= అవివేకులు కావడంవలన; కార్యవచనంబులు+ఎఱుంగరు= ప్రయోజనకరమైన మాటలు వినరు; మొఱకులు+అగుటన్= మూర్ఖులు కావటంవలన; ప్రతాప భాషణంబులకున్= వేడిమాటలకు; వెఱవరు= భయపడరు; వారల తలంపులు కీడు= వారి ఆలోచనలు చెడ్డవి; నీ మహనీయ ప్రభావ బుద్ధి పౌరుషంబులు= నీ గొప్ప మహిమ, బుద్ధి, మగటిమి; ఏన్+ఎఱుంగుదున్= నాకు తెలుసు; అయినను, పాండవేయులపైన్+స్నేహంబునను= పాండవులమీద గల ప్రేమచేతను; నీమీఁది భక్తినిన్= నీయందుగల భక్తిచేతను; చెప్పెదన్; అందున్+పోవలదు= కురుసభకు వెళ్ళవద్దు; అనినన్; వాసుదేవుండు; అతనికిన్; ఇట్లు+ అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** నారాయణా! నీ విక్కడికి వస్తున్నావని వినినప్పుడు కౌరవులందరూ చేరి తమలో నిర్ణయించుకొన్న సంగతులు మనవి చేస్తాను. వారు నీ ఆజ్ఞ నతిక్రమిస్తారు. పాండవులకు ఏమీ పంచి ఇవ్వరు. తామే ఈ భూమినంతటినీ ఏలుకో దలచారు. వారితో చేరిన రాజులంతా పాండవులు దిగ్విజయం చేసినప్పుడు వారిచేతిలో అవమానం పొందినవారు గనుక తామూ పాండవులతో యుద్ధం చేసి (కర్ణుడితో పాటు) చస్తాం లేదా గెలుస్తాం తప్ప మరో మార్గం అనుసరించమని నిర్ణయించుకొని ఉన్నారు. కాబట్టి దుర్యోధనుడు అహంకరించి ఉన్నాడు. కనుక సంధి జరగదు. కౌరవులకు వినాశకాలం దాపురించింది. అందువలన వారు కదనానికి కాలు ద్రవ్వుతున్నారు. ఇట్లా ఒళ్ళెరుగక త్రుళ్ళిపడుతున్న ఆ దుష్టచిత్తుల మధ్య నీవు కూర్చొని, ఆ మూఢాగ్రేసరులు కూసే అవివేకపు కూతలకు సర్ది సర్ది బదులుమాటలు పల్కటం బాగుండదు. వారందరూ తెలివిమాలినవారు. కనుక ప్రయోజనకరమైన పలుకుల విలువ వారికి తెలియదు. పరమ మూర్ఖులు గనుక చురుకుపుట్టించు మాటలకు చలించరు. వారివి చెడు తలంపులు, స్వామీ! నీ మహామహిమ, నీ ప్రజ్ఞాపాటవం, నీ పౌరుషం నేనెఱుగుదు. అయిననూ పాండుపుత్త్రులపై గల ప్రేమచేతనూ, నీ యెడగల భక్తిచేతనూ చెపుతున్నాను. నీవు వారున్న సభకు వెళ్ళవద్దు' అని పల్కగా విని పురుషోత్తముడు విదురుడితో ఇట్లా అన్నాడు:

**తే. 'నీ వివేకంబు నాప్తియు నెఱపితీవు । తల్లిదండ్రుల మాడ్కి హితంబు సెప్పి**
**తేను నా రాక తెఱఁగెల్ల నేర్పరించి । చెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ. 236**

**ప్రతిపదార్థం:** నీ వివేకంబు= నీ జ్ఞానము; ఆప్తియున్= ఆప్తత్వము; ఈవు= నీవు; నెఱపితి(వి)= ఉపయోగపరచావు; తల్లిదండ్రులమాడ్కిన్= జననీజనకులవలె; హితంబు+చెప్పితి(వి)= ఏదిమేలు కలిగిస్తుందో తెలిపినావు; ఏను= నేను; నా రాక

తెఱఁగు+ఎల్లన్= నేను ఎందుకు వచ్చానో అదంతయు; ఏర్పరించి+చెప్పన్= తేటతెల్లమొనర్పగా; విని= ఆలకించి; ఏమి చెప్పినన్ చేయువాఁడన్= ఏమి చెపుతావో ఆ ప్రకారమే చేస్తాను.

**తాత్పర్యం:** 'నీ వివేకం, ఆత్మీయత నాయెడ కనబరచి, తల్లిదండ్రులకైవడి హితం చెప్పావు. నేనిచటికి వచ్చిన దెందుకో వారికి తెలియజెప్పి, అందుకు వారేమంటారో తెలిసికొని అందుకు అనుగుణంగా చేయవలసింది చేస్తాను.

### శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట (సం. 5-91-3)

**క. ఎఱుఁగుదు నేను సుయోధను । కొఱగామియు నతనితోడఁ గూడిన నృపు లం**
**దఱుఁ బగ మనమున నిడికొని । యఱుముటయును సంధి పొసఁగదనియు మహాత్మా! 237**

**ప్రతిపదార్థం:** మహాత్మా!= దొడ్డబుద్ధిగలవాడా!; నేను; సుయోధను కొఱగామియున్= దుర్యోధనుడి చెడ్డతనాన్ని; అతని తోడన్+కూడిన= అతడితో జేరిన; నృపులు+అందఱున్= రాజులంతా; పగ= వైరం; మనమునన్+ఇడికొని= మనసులో ఉంచుకొని; అఱుముటయును= ప్రతిఘటించటమూ; సంధి పొసఁగదు+అనియున్= సొత్తుకుదరదనీ; ఎఱుఁగుదున్= తెలియుదును.

**తాత్పర్యం:** 'నాకు దుర్యోధనుడి దౌష్ట్యమంతా తెలుసు. అతడితో చేరిన రాజులందరూ పాండవుల మీద పగగొని ఎదిరించటానికి సిద్ధంగా ఉన్నారనీ తెలుసు. సంధి సమకూడదనీ తెలుసు.

**ఆ. పుడమియెల్ల నొడ్డగెడవయి గజవాజి । యుతముగాఁ గడంగి యుగ్ర మృత్యు**
**ముఖము సొరఁగఁ దివురు మూర్ఖత మాన్చుట । యధికమైన పుణ్య మనఘచరిత! 238**

**ప్రతిపదార్థం:** అనఘచరిత!= దోషరహితమైన నడవడి గలవాడా!; పుడమి+ఎల్లన్= భూమండలమంతా; ఒడ్డగెడవు+అయి= భారంతో ఒక ప్రక్క కొరగి; గజ వాజియుతముగాన్= ఏనుగులు గుర్రాలు అనువాటితో కూడ; కడంగి= పూనుకొని; ఉగ్రమృత్యు ముఖము+చొరఁగన్= దారుణమైన మిత్తియొక్క నోటిలో ప్రవేశించటానికి; తివురు= త్వరపడుతున్న; మూర్ఖతన్= మొండితనాన్ని; మాన్పుట= తొలగించటం; అధికము+ఐన పుణ్యము= మిక్కిలి పుణ్యకార్యం.

**తాత్పర్యం:** భూ మండలమంతా భారముతో ఒక ప్రక్కకొరగి ఏనుగులతో, గుర్రాలతో కూడ భీకరమైన మృత్యువు నోటిలో ప్రవేశించటానికి వేగిరపడుతున్నది. ఇట్టి మూర్ఖత్వాన్ని తొలగించుట మిక్కిలి పుణ్య కార్యం.

**వ. మానుప వచ్చునే యంటేని. 239**

**తాత్పర్యం:** భూమండలం మృత్యువు నోటిలో ప్రవేశించకుండ ఆపటం శక్యమా అంటే.

**క. దొరకొని పుణ్యముఁ బాపము । నరుఁ డర్థిం జేయుచుండ నడుమ నొకట న**
**వ్వెర వెడలి తప్పినను ద । త్పరిణతి ఫలమొందునండ్రు ధర్మవిధిజ్ఞుల్. 240**

**ప్రతిపదార్థం:** దొరకొని= పూనిక వహించి; పుణ్యమున్= సుకృత కర్మలనూ, పాపమున్= దురిత కర్మలనూ; నరుఁడు= మానవుడు; అర్థిన్= ఆసక్తితో; చేయుచున్+ఉండన్= కావిస్తున్నప్పుడు; నడుమన్= మధ్యలో; ఒకటన్= ఒకానొక కారణంచేత; ఆ+వెరవు+ఎడలి= ఉపాయము చెడి; తప్పినను= ఆ కార్యము నెరవేరకపోయిననూ; ధర్మవిధిజ్ఞుల్= ధర్మస్వరూపమెరిగిన పెద్దలు; తద్+పరిణతి= ఆ పనులయొక్క పరిణామం; ఫలము+ఒందున్+అండ్రు= ఫలం చెందుతుందని చెప్పుతారు.

**తాత్పర్యం:** ఒకడు పూనికతో పుణ్యమో, పాపమో చేస్తూ ఉండగా నడుమ ఏదో ఒక కారణంచేత ఆ పని నెరవు తప్పి నెరవేరకపోయినా చేసిన ప్రయత్నం మాత్రం ఫలాన్ని పొందియే తీరుతుంది - అని ధర్మస్వరూపం తెలిసిన పెద్దలు చెపుతారు. విదురా! ఇక్కడ నా మాట ఫలించినా ఫలించకపోయినా చేసిన పుణ్యయత్నఫలం మాత్రం నాకు దక్కుతుంది.

**విశేషం:** దీనికి మూలం:

**"ధర్మకార్యం యతన్ శక్త్యా నచేచ్ఛక్నోతి మానవః**

**ప్రాప్తో భవతి తత్పుణ్య మత్ర మే నాస్తి సంశయః." (సం. 5-91-6)**

మానవుడు తన శక్తిలోపం లేకుండా ధర్మకార్యాన్ని చేయటానికి ప్రయత్నిస్తాడు. ఒకవేళ అతడు దానిని పూర్తి చేయలేక, ఫలం పొందకపోయినా, దాని పుణ్యాన్ని తప్పక పొందుతాడు. అందులో నాకు సంశయం లేదు. ఈ శ్లోకం భారత కథాసందేశంగా వినిపిస్తున్నది. (సంపా.)

**వ. అట్లుంగాక. 241**

**తాత్పర్యం:** అంతే కాకుండా.

**తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు। డడ్డపడి వారితోడఁ గొట్లాడియైన**
**దాని నుడుపంగఁ జొరకున్నవానిఁ గ్రూర। కర్ముఁడని చెప్పుదురు కర్మకాండవిదులు. 242**

**ప్రతిపదార్థం:** చుట్టములలోనన్= బంధువులలోపల; ఒప్పమి పుట్టినపుడు= ద్వేషం కలిగినప్పుడు; అడ్డపడి= అడ్డం వచ్చి; వారితోడన్= ఆ చుట్టాలతో; కొట్లాడి+ఐనన్= తగవులాడి అయినా; దానిన్= ఏర్పడిన విరోధాన్ని; ఉడుపంగన్= మాన్పటానికి చొరక+ఉన్నన్= పూనుకోకపోతే; వానిన్= అట్టివాడిని; కర్మకాండ విదులు= కార్యస్వరూపం తెలిసిన పెద్దలు; క్రూరకర్ముఁడు+అని= ఘాతుకుడని; చెప్పుదురు= చెప్పుతారు.

**తాత్పర్యం:** బంధువులలో పరస్పరం వైరమేర్పడితే అడ్డం వచ్చి వారితో తగవులాడి అయినా ఆ పగను మాన్పకుంటే అలాంటివాడిని క్రూరకర్ముడని కర్మకాండయొక్క తత్త్వం తెలిసిన పెద్దలు చెపుతారు.

**వ. కావున నీ రెండు దెఱంగులవారికి శాంతిగావింపం బ్రయత్నంబు సేసెద; ధర్మార్థ సహితంబైన తెఱంగు మాటలు మంత్రి జన సహితుండైన సుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితంబయిన విధంబు వంచన లేక చెప్పెడు నన్ను పాండవులవాఁడని శంకించి యతండు నామాట వినండయ్యె నేనియు మేలకాక యిట్లు సొచ్చి చెప్పకున్న నన్నదమ్ములు దమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదా? యని యజ్ఞులైన జను లాడుదు; రెల్లభంగులం గార్యం బార్యు లియ్యకొనం జెప్పుదు; ధార్త రాష్ట్రులుం దమకు బ్రదుకు తెరువైన నా పలుకులు వట్టుదురు; పట్టక నీ తలంచిన చందమునం దులువలై కలఁగం బాఱినవారు నా ముందర నిలువం జాలుదురే' యని పలికిన విదురుం డట్లకాక యని సమ్మతించి యామంత్రణంబు సేసి నిజ శయన స్థానంబునకుం జనియె; ననంతరంబ. 243**

**ప్రతిపదార్థం:** కావునన్; ఈ రెండు తెఱంగుల వారికిన్= ఈ కురు పాండవులకు; శాంతి కావింపన్= సంధి చేయటానికి; ప్రయత్నంబు చేసెదన్= ప్రయత్నం చేస్తాను; ధర్మ+అర్థ సహితంబు= ధర్మార్థాలతో కూడిన; తెఱంగు మాటలు= సంధి వచనాలు; మంత్రిజన సహితుండు+ఐన= మంత్రులతో కూడిన; సుయోధనునకున్; చెప్పెదన్; తనకున్, పాండునందనులకున్= పాండురాజు కుమారులకు; లోకంబునకున్; హితంబు+అయిన విధంబు= మేలు కలిగించే మార్గం; వంచనలేక= కపటం లేక; చెప్పెడు నన్నున్; పాండవులవాఁడు+అని= పాండవ పక్షపాతి అని; శంకించి= అనుమానించి; అతఁడు; నా మాట; వినండు+ అయ్యెన్+ఏనియున్= పెడచెవిని బెట్టినచో; మేలకాక= మంచిదే పొమ్ము; ఇట్లు చొచ్చి చెప్పక+ఉన్నన్= ఇట్లు కార్యరంగంలో ప్రవేశించి చెప్పదగిన మాటలు నేను చెప్పకపోతే; అన్నదమ్ములు; తమలోనన్; పోరన్= కలహించుకొంటుండగా; కృష్ణుండు; వారింపక= అడ్డుపడక; ఉపేక్షించెన్= అశ్రద్ధ చేశాడు; తన చేతన్= తన వల్ల; చక్కంబడదా= కార్యము నెరవేరదా; అని, అజ్ఞులు+ఐన జనులు= ఏమీ తెలియని మనుష్యులు; ఆడుదురు= పలుకుతారు; ఎల్ల భంగులన్= అన్ని విధాలా; కార్యంబు; ఆర్యులు= పెద్దలు; ఇయ్యకొనన్= సమ్మతించగా; చెప్పుదున్; ధార్తరాష్ట్రులున్= దుర్యోధనాదులుకూడ; తమకున్= తమకు; బ్రదుకు, తెరువు+ఐన= జీవనాధారమైన; నా పలుకులు= నా మాటలు; పట్టుదురు= చేకొందురు గాక; పట్టక= నా మాటలు ఆదరింపక; నీ తలంచిన చందంబునన్= నీవు భావించిన విధాన; తులువలు+ఐ= కుత్సితులై; కలఁగన్+పాఱినన్= చిత్తసంక్షోభము పొందినయెడల; వారు; నా ముందరన్= నా యెదుట; నిలువన్+చాలుదురే?= ధైర్యంతో నిలబడగలరా?; అని పల్కినన్; విదురుండు; అట్లు+అ కాక= నీవు సంకల్పించినట్లే; అని సమ్మతించి; ఆమంత్రణంబు+చేసి= హరి దగ్గర పోయి రమ్మనిపించుకొని; నిజశయన స్థానంబునకున్= తాను పరుండే ప్రదేశానికి; చనియెన్= వెళ్ళాడు; అనంతరంబు+అ= అటుతరువాత.

**తాత్పర్యం:** కురుపాండవుల పొత్తుకొరకు ప్రయత్నం చేస్తాను. ధర్మార్థయుక్తంగా ఒద్దిక మాటలు మంత్రి సహితుడైన దుర్యోధనుడికి చెపుతాను. అతడికీ, పాండుకుమారులకూ, సర్వజనులకూ మేలు కలిగించే మార్గమేదో మోసం లేకుండా తెలుపుతాను. ఇట్లా చెపుతున్న నన్ను పాండవ పక్షపాతి అని, దుర్యోధనుడు సందేహపడి నా మాటలు వినకపోతే పోనీ. అదీ ఒకందుకు మంచిదే. ఇట్లా నేను ఈ రెండు కుటుంబాలవిషయంలో జోక్యం కలిగించుకొనకుంటే అన్నదమ్ములు తమలో తాము పోట్లాడుకొంటుంటే కృష్ణుఁడు వారించక తన కేమీ పట్టనట్లు ఊరక ఉండిపోయాడు; తాను అనుకుంటే కార్యం చక్కదిద్దలేడా? అని అవివేకులు నన్ను ఆడిపోసుకొంటారు. అందుచేత పెద్దలు సమ్మతించేటట్లు అన్ని విధాలా కార్యం చక్కబెట్టటానికి అనుకూలమైన మాటలు వారికి చెపుతాను. దుర్యోధనాదులు తాము బ్రదకటానికి దారి కల్పించే నా మాటలు మన్నిస్తే బాగుపడతారు. అట్లా నా పలుకులు ఆదరించక నీవు భావించినట్లు కుత్సితులై మనసులు చెరుచుకొని తిరగబడితే వారు నాముందు నిలువ గల్గుతారా?' అని వాసుదేవుడు విదురుడితో పలికాడు. విదురుడు 'అట్లాగే స్వామీ అని ఆయన మాటలకు సమ్మతి తెల్పి' శౌరికడ సెలవు తీసికొని తాను పరుండేచోటికి వెళ్ళిపోయాడు.

**ఆ. ఆతని వచన రచన యాత్మలోఁదలపోసి । యిట్టివాఁడు గలఁడె యెందు?' ననుచుఁ**
**బాలకడలి కడల పాటియై యొప్పు న । ప్పాన్పునందు శౌరి పవ్వడించె. 244**

**ప్రతిపదార్థం:** శౌరి= శూరుడి మనుమడైన శ్రీకృష్ణుడు; అతని వచన రచన= ఆ విదురుడి మాటలయొక్క పొంకమును; ఆత్మలోన్= తన మదిలో; తలపోసి= స్మరించి; ఇట్టివాఁడు= ఇంతటి మహనీయుడు; ఎందున్= ఎచ్చటైనా; కలఁడు+ఎ?= ఉన్నాడా?; అనుచున్= అనుకొంటూ; పాలకడలి కడలపాటి+ఐ= క్షీర సాగర తరంగాలకు సమానమై; ఒప్పు= ప్రకాశించే; ఆ+ పాన్పునందున్= ఆ పరుపుమీద; పవ్వడించెన్= పండుకొన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు విదురుడి మాటల పొందికను తన మదిలో స్మరించి, ఇంతటి మహనీయు డెక్కడైనా ఉన్నాడా అని అనుకొంటూ క్షీరసముద్ర తరంగాలవలె విశాలమైన ఆ తెల్లని పరుపుమీద పవ్వళించాడు.

**విశేషం:** అలం: ఉపమ. శ్రీకృష్ణుడియందు విష్ణుత్వం అలంకార ధ్వని. (సంపా.)

**వ. ఇట్లు సుఖనిద్రసేసి వేగుంబోకట మాగధమంగళగానంబుల మేలుకాంచి సమయ కర్తవ్యంబులు సలిపె; నట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం బురుషోత్తముండ వారలు మొదలుగాఁగల యిష్ట జనంబులు పరివేష్టింప నుచిత ప్రదేశంబున నున్నంత. 245**

**ప్రతిపదార్థం:** ఇట్లు సుఖనిద్ర+చేసి= ఇట్లా విదురుడి గృహంలో హాయిగా నిదురించి; వేగుంబోకటన్= తెల్లవారే సమయంలో; మాగధ మంగళగానంబులన్= మేలుకొలుపువారియొక్క శుభకరాలైన గానములచేత; మేలుకాంచి= నిదుర లేచి; సమయ కర్తవ్యంబులు= ప్రాతఃకాలకృత్యాలు; సలిపెన్; అట్టియెడన్= అట్టివేళలో; కృతవర్మయున్; సాత్యకియున్; వచ్చి; పొడచూపినన్= కనబడగా; పురుషోత్తముండు= శ్రీకృష్ణుడు; వారలు మొదలుగాన్ కల= కృతవర్మ సాత్యకి ప్రభృతులైన; ఇష్టజనంబులు= ప్రియమైన వారు; పరివేష్టింపన్= తన చుట్టు చేరగా; ఉచిత ప్రదేశంబునన్= తగిన చోట; ఉన్న+అంతన్= ఉండగా.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు విదురుడి గృహంలో సుఖంగా నిద్రించి వేగుజామున వైతాళికులు వచ్చి మేలు కొలుపు పాటలు పాడగా మేల్కొని, ప్రాతఃకాల కృత్యములన్నీ నెరవేర్చాడు. ఇంతలో కృతవర్మ, సాత్యకి వచ్చి కనిపించుకొన్నారు. నారాయణుడు వారితోపాటు, మరికొంతమంది ఇష్టులు తన చుట్టూ చేరి కొల్చుచుండగా తగిన చోట ఆసీనుడై ఉన్నాడు. అప్పుడు.

**క. ఇనతనయ శకుని దుశ్శాసన సహితము । గాఁగ నెలమిఁ జనుదెంచి సుయో**
**ధనుఁడు ప్రియోక్తులఁ దగు వా । రును దానును వారిజోదరుం గొనియాడెన్. 246**

**ప్రతిపదార్థం:** సుయోధనుఁడు= దుర్యోధనుడు; ఇన తనయ= సూర్య పుత్రుడైన కర్ణుడు; శకుని= శకుని; దుశ్శాసన సహితము కాఁగన్= దుశ్శాసనునితో కూడ; ఎలమిన్= సంతోషంతో; చనుదెంచి= వచ్చి; ప్రియ+ఉక్తులన్= ఇంపైన మాటలతో; తగువారును= అర్హులైనవారున్నూ; తానును= తానున్నూ; వారిజ+ఉదరున్= కమలనాభుడిని; కొనియాడెన్= శ్లాఘించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు రాధేయుడితో శకునితో దుశ్శాసనుడితో కలసి సంతోషంతో వచ్చి, మది కింపైన మాటలతో తగినవారూ, తానూ మధుసూదనుడిని వినుతించాడు.

**వ. అతండును మధుర సంభాషణంబులు చేయ వార లతనికి ధృతరాష్ట్రుండు బంధుమిత్త్రాది సమస్త పరిజన సమన్వితుండయి పేరోలగంబున నునికి యెఱిఁగించినఁ బ్రియంబునఁ గట్టాయితంబైన తేరెక్కి భేరీశంఖచామర ప్రముఖ భద్ర చిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మ సాత్యకు లొక్కరథంబునను, దుర్యోధనాది దుష్టచతుష్టయం బొక్క రథంబునను బార్శ్వంబుల రాఁ బౌరులకుఁ గన్నుల పండువగుచు రాజమందిర ద్వారంబు సేర నరుగునప్పటి యులివునకుఁ గొలువువారెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు నవతరించి యరవిందనాభుండు. 247**

**ప్రతిపదార్థం:** అతండును= శ్రీకృష్ణుడున్నూ; మధుర సంభాషణంబులు చేయన్= ప్రియమైన పలుకులు పలుకగా; వారలు= ఆ వచ్చిన దుర్యోధనాదులు; అతనికిన్= శ్రీకృష్ణుడికి; ధృతరాష్ట్రుండు; బంధుమిత్ర+ఆది+సమస్త పరిజన సమన్వితుండు+అయి= చుట్టాలు, స్నేహితులు మున్నగు పరివారంతో కూడివున్నవాడై; పేరు+ఓలగంబునన్+ఉనికి= నిండుకొలువున ఉండటం; ఎఱిఁగించినన్= తెలుపగా; ప్రియంబునన్= ఇష్టంతో; కడు+ఆయితంబు+ఐన= సర్వ సంసిద్ధమై ఉన్న; తేరు+ఎక్కి= రథమెక్కి; భేరీ శంఖ చామర ప్రముఖ భద్ర చిహ్నంబులతోన్= భేరులు, శంఖములు, వింజామరలు మొదలైన మంగళ లాంఛనాలతో; వెడలి= బయలుదేరి; గరుడధ్వజంబు+క్రాలన్= రథంపై గరుత్మంతుడి టెక్కెం ప్రకాశించగా; కృతవర్మసాత్యకులు; ఒక్క రథంబునను; దుర్యోధన+ఆది+దుష్ట చతుష్టయంబు= దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని అనే దుర్మార్గులు నలుగురు; ఒక్క రథంబుననూ; పార్శ్వంబులన్+రాన్= తన రథానికి కుడియెడమ ప్రక్కల వస్తూ ఉండగా; పౌరులకున్= పురజనులకు; కన్నుల పండువు+అగుచున్= కన్నుల విందుచేస్తూ; రాజమందిర ద్వారంబు= ధృతరాష్ట్రుడి సభాభవనం యొక్క వాకిలి; చేరన్+అరుగు+అప్పటి+ఉలివునకున్= సమీపించే వేళలో ఏర్పడిన సద్దునకు; కొలువువారు+ఎల్లన్= సభలో ఉన్నవారందరూ; అతి+ఉత్సుకులు+ఐ= మిక్కిలి ఉత్సాహం కలవారై; ఎదురుచూడన్= ప్రతీక్షిస్తుండగా; రథ+ఉత్తమంబున్= శ్రేష్ఠమైన తేరును; అవతరించి= దిగి; అరవిందనాభుండు= పద్మం నాభియందుగల శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** దుర్యోధనాదులతో శౌరికూడా ప్రియమైన మాటలు మాట్లాడాడు. అప్పుడు సుయోధనాదులు శ్రీకృష్ణుడితో 'ధృతరాష్ట్రమహారాజు బంధుమిత్రులతో పరిజనులతో కొలువుదీరి ఉన్నారు' అని చెప్పారు. ఆ మాటలతో సంతోషించి శ్రీహరి సంసిద్ధంగా ఉన్న రథమెక్కాడు. భేరులు, శంఖాలు, వింజామరలు మొదలైన మంగళ లాంఛనాలతో, గరుడకేతనం ప్రకాశిస్తుండగా రథంపై బయలుదేరాడు. తన అరదానికి ఒకవైపు సాత్యకి కృతవర్మలు ఎక్కిన రథం, మరోవైపు దుర్యోధన దుశ్శాసన కర్ణ శకునులనే నలుగురు దుర్మార్గులెక్కిన రథం వస్తుండగా స్వామి పురజనుల కన్నులకు విందు గావిస్తూ రాజభవనద్వారం సమీపించాడు. స్వామి తేరు మందిర ద్వారం సమీపిస్తుండగా కలిగిన సందడికి కొలువు కూటంలోని వారంతా రాజీవలోచనుడి రాకకు పరమోత్సాహంతో ఎదురుచూడసాగారు. శ్రీమన్నారాయణుడు శ్రేష్ఠమైన రథం నుండి క్రిందికి దిగాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. ఎదురు వచ్చిన విదురుని యిచ్చు కరముఁ । దమ్ము చేయును రెండు హస్తములఁ బట్టి**
**నడచె ముందటఁ గదియు సందడిఁ గడంగి । కర్ణ దుర్యోధనులు దొలఁగంగ జడియ. 248**

**ప్రతిపదార్థం:** ఎదురువచ్చిన= తన కెదురుగా వచ్చిన; విదురుని+ఇచ్చుకరమున్= విదురుడందిచ్చిన హస్తాన్నీ; తమ్ము చేయును= తమ్ముడైన సాత్యకి హస్తాన్నీ; రెండు చేతులన్+పట్టి= తన రెండు బాహువులతో ఊతగా గ్రహించి; ముందటన్= ఎదుట; కదియు సందడిన్= ఏర్పడిన సమ్మర్దాన్ని; కడంగి= పూని; కర్ణ దుర్యోధనులు= కర్ణుడూ, దుర్యోధనుడునూ; తొలఁగంగన్= దూరమయ్యేటట్లు; జడియన్= తోలగా; నడచెన్= నారాయణుడు సాగాడు.

**తాత్పర్యం:** తన కెదురుగా వచ్చి విదురు డందించిన హస్తాన్నీ; తమ్ముడైన సాత్యకి చేతినీ తన రెండు చేతులతో ఊతగా గ్రహించి శ్రీకృష్ణుడు నడుస్తూండగా ఎదుట ఏర్పడిన జన సమ్మర్దాన్ని కర్ణ దుర్యోధనులు దవ్వులకు తొలగద్రోశారు.

**వ. కృత వర్మాది యాదవులు లోనుగాఁగల యభ్యంతరులైన బలు మానుసులు పొదివి కొని పోవఁదన సమీపంబునఁ గౌరవులు రవి సన్నిధి తారాగ్రహంబుల చందం బగుచుండం దేజోరాజియగు రాజీవాక్షుండు చని తనకుఁ బ్రత్యుత్థానంబు సేసిన కురురాజును దొరలను నభినందించుచు. 249**

**ప్రతిపదార్థం:** కృతవర్మ+ఆది యాదవులు= కృతవర్మ మొదలైన యదువంశస్థులు; లోనుగాన్+కల= మొదలుగా కలిగిన; అభ్యంతరులు+ఐన= సన్నిహితులైన; బలు+మానుసులు= దొడ్డమనుష్యులు; పొదివి కొనిపోవన్= కూడికొనిపోగా; తన సమీపంబునన్= తన దగ్గర; కౌరవులు; రవి సన్నిధిన్= సూర్యుడి ముందు; తారాగ్రహంబుల చందంబు+అగుచుండన్= నక్షత్రాల గ్రహాల వలె వెలవెల పోతూ ఉండగా; తేజోరాశి+అగు= వెలుగుల ప్రోగైన; రాజీవ+అక్షుండు= కమల నేత్రుడు; చని= సభలో ప్రవేశించి; తనకున్= తనకు; ప్రత్యుత్థానంబు+చేసిన= ఎదురుగా వచ్చిన; కురురాజును= ధృతరాష్ట్రుడినీ; దొరలను= ఇతర రాజులను; అభినందించుచున్= మెచ్చుకొంటూ.

**తాత్పర్యం:** బలసంపన్నులు, సన్నిహితులు అయిన కృతవర్మ మొదలైన యాదవులు తనను అలముకొని వెంటరాగా, తన సన్నిధిలో కౌరవులందరూ భాస్కరుడి మ్రోల తారలవలె, గ్రహములవలె వెలవెల పోతుండగా, వెలుగుల ముద్దఅయిన పుండరీకాక్షుడు కొలువుకూటం లోనికి వచ్చాడు. ధృతరాష్ట్రుడూ, ఇతర ధరాపతులూ శౌరికి ఎదురు వచ్చి ఆహ్వానించారు. శ్రీకృష్ణుడు వారిని అభినందిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: ఉపమ. ధృతరాష్ట్రుడి సభలో ప్రవేశించిన కృష్ణుడు సూర్యుడివలె వెలుగు ముద్దగా వెలిగిపోయాడట. కౌరవులు తారకలవలె, గ్రహాల వలె వెలవెల పోయారట! త్వరలో శ్రీకృష్ణుడు చూపబోయే విశ్వరూపానికి ఈ అలంకారం ధ్వనిసంకేతం. (సంపా.)

**క. తన కని పెట్టిన మణిమయ । కనకోన్నత పీఠమునఁ బ్రకాశంబున ని**
**ల్చిన యెడఁ దోఁచిరి నారద । ముని ప్రముఖు లంతరిక్షమున నుజ్జ్వలులై. 250**

**ప్రతిపదార్థం:** తనకున్+అని= తనకొరకని; పెట్టిన= ఉంచిన; మణిమయ+కనక+ఉన్నతపీఠమునన్= రతనాలు చెక్కిన, ఎత్తయిన బంగరు గద్దెపై; ప్రకాశంబునన్= కాంతితో; నిల్చిన+ఎడన్= నిలిచినవేళలో; అంతరిక్షమునన్= ఆకాశమునందు; ఉజ్జ్వలులు+ఐ= దీప్తిమంతులై; నారదముని ప్రముఖులు= నారదుడు మున్నగు మునిపుంగవులు; తోఁచిరి= కనబడ్డారు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు తన కొరకై అక్కడనుంచిన రత్నఖచితమగు ఎత్తయిన బంగారు గద్దెమీద వెలుగులు వెదచల్లుతూ నిలిచి ఉండగా ప్రకాశమానులై నారదుడు మొదలగు మునీశ్వరులు గగనతలంలో కాన్పించారు.

**విశేషం:** కౌరవ సభలో శ్రీకృష్ణుడిని నిలిపి అతడి చుట్టూ ఒక దివ్య వాతావరణాన్ని ధ్వనింపజేయటం ఈ వర్ణన పరమార్థం. ఎత్తైన చోట మణుల కాంతులతో మెరుస్తున్న బంగారు గద్దె. ఆ గద్దెకే ప్రకాశాన్ని కలిగించే దివ్యతేజోమూర్తి శ్రీకృష్ణుడు. దానికితోడు ఆయన దర్శనం కొరకు వచ్చిన నారదాది దివ్యమునీంద్రులు. నేల శ్రీకృష్ణుడితో ఆకాశానికి అంటింది. నారదాదుల ఆగమనంతో నింగి నేలకు దిగింది. ఇహపరాల అద్భుత సమ్మేళనం శ్రీకృష్ణ సందర్శనం. (సంపా.)

**వ. ఇవ్విధంబున సన్నిహితులయిన యమ్మహామునులం గురుపితామహునకుం జూపి నారాయణుం డిట్లనియె. 251**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; సన్నిహితులు+అయిన= అచటికి చనుదెంచిన; ఆ+మహామునులన్= ఆ మహర్షులను; కురుపితామహునకున్= కౌరవులకు తాత అయిన భీష్ముడికి; చూపి= కనబరిచి; నారాయణుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అచటికి వచ్చిన మహామునులను కౌరవులకు తాతఅయిన భీష్ముడికి చూపి ఇట్లా అన్నాడు:

**ఆ. మనలఁ జూచువేడ్కఁ జనుదెంచినారు మ । హాత్ములైన నారదాది మునులు;**
**వీరి కర్ఘ్యపాద్య విధు లొనరించి యా । సనము లిడఁగఁ బనుపు సత్వరముగ. 252**

**ప్రతిపదార్థం:** మనలన్= మనలను; చూచువేడ్కన్= చూడవలెననే అభిలాషతో; మహా+ఆత్ములు+ఐన= మహానుభావులైన; నారద+ఆది మునులు= నారదుడు మొదలైన మునీశ్వరులు; చనుదెంచినారు= విచ్చేశారు; వీరికిన్= ఈ మహాపురుషులకు; అర్ఘ్య+పాద్య విధులు= అర్ఘ్యమివ్వటం, పాద్యమివ్వటం అనే ఉపచారాలు; ఒనరించి= చేసి; సత్వరముగన్= తొందరగా; ఆసనములు+ఇడఁగన్= పీఠాలు వేయటానికి; పనుపుము= పంపుము.

**తాత్పర్యం:** మనలను చూడవలెననే కుతూహలంతో మహనీయులైన నారదాది మహర్షులు విచ్చేశారు. వీరికి అర్ఘ్య పాద్యాదులైన ఉపచారాలు చేయించు, వారు కూర్చుండటానికి వెంటనే పీఠాలు వేయించు.

**వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట తగవుగా'దనినం గొలువువారెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునుల వలను జూచుచుండ భీష్ముండు పరిచారకులం బనిచి కనక మణిమయాసనంబు లనేకంబులు దెప్పింప వార లరుగుదెంచిన వారలకు నమస్కరించి యాసనార్ఘ్య పాద్యాది విధులం బూజలు సేయించి కృష్ణుండు గూర్చున్న యనంతరంబ ధృతరాష్ట్రుండునుం దక్కటివారును నుచిత ప్రకారంబుల నమ్మునీంద్రులకు నభివందనంబులు సేసి నిజాసనా సీనులైరి; దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరువంకలం గూర్చుండిరి. కర్ణ దుర్యోధనులుం జేరువ నొక్క గద్దియ నుండిరి. విదురుండును మణిపీఠంబునఁ గృష్ణుని వెనుక దెసఁ దదీయోన్నత పీఠంబునఁ గరంబత్తమిల్లి యుండె; గాంధార రాజు నిజపుత్త్ర పరివృతుండై యొక్క దిక్కున నుచిత పీఠాసీనుండయ్యెఁ; నట్టి సమయంబున. 253**

**ప్రతిపదార్థం:** వీరలు= నారదాది మునులు; సముచిత+ఆసనంబులన్+ఉండక= తగిన పీఠాలపై కూర్చుండక; మనకున్; కూర్చుండుట; తగవు+కాదు= ధర్మంకాదు; అనినన్= అని శ్రీకృష్ణుడు పలుకగా; కొలువువారు+ఎల్లన్= సదస్యులందరూ; సంభ్రమ+ఆశ్చర్యములతోన్= సంతోషాద్భుతములతో; మునుల వలను= ఆ మునీశ్వరులవైపు; చూచుచున్+ఉండన్; భీష్ముండు; పరిచారకులన్+పనిచి= సేవకులను పంపి; కనకమణిమయ+అసనంబులు= బంగారు రత్నాలు తాపిన పీఠాలు; అనేకంబులు= పెక్కు; తెప్పింపన్; వారలు= ఆ నారదాదులు; అరుగుదెంచినన్= (సభకు)రాగా; వారలకున్; నమస్కరించి; ఆసన+అర్ఘ్య పాద్య+ఆదివిధులన్= ఆసనాలివ్వటం; అర్ఘ్యమివ్వటం; పాద్యమొసగటం మొదలైన ఉపచారాల చేత; పూజలు= అర్చనలు; చేయించి; కృష్ణుఁడు; కూర్చున్న+అనంతరంబు+అ= కూర్చున్న తరువాతనే; ధృతరాష్ట్రుండునున్; తక్కటివారును= మిగిలినవారున్నూ; ఉచిత ప్రకారంబులన్= తగురీతుల; ఆ+ముని+ఇంద్రులకున్= ఆ నారదాది ముని పుంగవులకు; అభివందనంబులు చేసి= ప్రణామాలు సలిపి; నిజ+ఆసన+ఆసీనులు+ఐరి= తమ తమ పీఠాలందు కూర్చున్నారు; దుశ్శాసనుండును, వివింశతియును; గద్దియలు+ఇడన్= పీఠాలుంచగా; సాత్యకియున్; కృతవర్మయున్; కృష్ణున్, కదిసి= ఆనుకొని; ఇరువంకలన్= రెండువైపుల; కూర్చుండిరి; కర్ణ దుర్యోధనులున్; చేరువన్= చెంతనే; ఒక్క గద్దియన్; ఉండిరి; విదురుండును; మణిపీఠంబునన్; కృష్ణుని; వెనుకదెసన్= వెనుకవైపున; తదీయ+ఉన్నత పీఠంబునన్= ఎత్తైన గద్దియమీద; కరంబు= మిక్కిలి; అత్తమిల్లి= ఒరిగి; ఉండెన్= ఉన్నాడు; గాంధారరాజు= శకుని; నిజపుత్త్ర పరివృతుండు+ఐ= శకుని తన కుమారులతో చుట్టబడినవాడై; ఒక్కదిక్కునన్= ఒక దెస; ఉచితపీఠ+ఆసీనుండు+అయ్యెన్= తగిన గద్దెపై ఉన్నాడు; అట్టి సమయంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** 'నారదాది మహామునులు తగిన పీఠాలపై కూర్చుండకుండా మనం కూర్చుండటం న్యాయం కాదు' అని శ్రీకృష్ణుడు భీష్ముడితో చెప్పాడు. సదస్యులంతా తొట్రుపాటుతో ఆశ్చర్యపడి ఆ మునులవైపే చూస్తుండిపోయారు. భీష్ముడు సేవకులను పంపి మణులు తాపిన బంగారు గద్దెలు పెక్కింటిని తెప్పించాడు. ఇంతలో మునీశ్వరు లచటికి విచ్చేయగా పరమాత్ముడు వారికి నమస్కరించి, ఆసనమివ్వటం, అర్ఘ్య పాద్యాదు లొసంగటం మొదలైన దివ్యోపచారాలతో పూజలు చేయించాడు. వాసుదేవుడు కూర్చున్న పిదప ధృతరాష్ట్రుడున్నూ, మిగిలిన వారున్నూ తగిన రీతుల ఆ మునిపుంగవులకు నమస్కారాలు చేసి తమ తమ పీఠాలపై ఆసీనులయ్యారు. దుశ్శాసనుడు, ధార్తరాష్ట్రులలో పదిహేడవవాడగు వివింశతి అనే అతడు గద్దె లిడగా సాత్యకి, కృతవర్మ శ్రీకృష్ణుడికి రెండువైపులా ఆనుకొని కూర్చున్నారు. కర్ణుడు, దుర్యోధనుడు ఆ సమీపంలో ఒకే పీఠాన ఉండినారు. విదురుడు వెనుక తట్టుగా మురారి యొక్క ఎత్తైన గద్దెమీదికి వ్రాలి మణిపీఠంమీద కూర్చున్నాడు. గాంధార రాజైన శకుని తన కొడుకులతో ఒక తట్టు తగిన గద్దెమీద తానుండినాడు. ఇట్టిసమయంలో.

**విశేషం:** 1. శ్రీకృష్ణుడు నిలిచిన సభ లౌకికత్వం మీద దివ్యత్వం ఆవేశించిన ట్లుంటుంది. కురువీరులందరూ లేచి దివ్యమునులకు ఆసనాలిచ్చి కూర్చొనబెట్టారు. శ్రీకృష్ణుడి దివ్య సందేశం వినటానికై వచ్చిన మహర్షులు వారు. శ్రీకృష్ణుడి సందేశం యొక్క గొప్పదనాన్ని మునిగణం మౌనంగా వ్యాఖ్యానించి చెపుతున్నట్లున్నది.

2. దేవర్షులు కూర్చున్న తరువాత శ్రీకృష్ణుడు కూర్చున్నాడు. ఆ తరువాత ధృతరాష్ట్రుడు, ఆ తరువాత సభ్యులు కూర్చున్నారు. సభ నంతా శ్రీకృష్ణాధీనమైన ఒక దివ్యానుభూతి వాతావరణం అలముకొన్నది.

3. సభలో భద్రతా విశేషాలు ప్రత్యేకంగా గమనించదగినవి. అవి ఆసనాలు అమర్చటంలో స్పష్టమౌతున్నది. శ్రీకృష్ణుడి భద్రత అత్యంత ముఖ్యం. అందుకే ఆయన కిరుప్రక్కల సాత్యకీ, కృతవర్మా కూర్చున్నారు - అంగరక్షకులవలె. విదురుడు వెనుకభాగంలో ఒదిగి కూర్చున్నాడు. అంటే మూడు దిక్కులా నమ్మిన బంటులవంటి వారు శ్రీకృష్ణుడికి రక్షా కవచంవలె వ్యాపించి కూర్చున్నారు. శ్రీకృష్ణుడికి ఎదురు బడి ఎవరూ నిలవలేరని ధ్వని.

4. శ్రీకృష్ణుడికి కొద్ది దూరంలో ఒక ప్రక్కన కర్ణదుర్యోధనులు ఒకే సింహాసనం మీద కూర్చున్నారు. తనువులు వేరైనా మనసులు ఒకటే సుమా! అని వారి నేస్తం ఆ కూర్చోటంలో ధ్వనించబడుతున్నది. వారిద్దరూ శ్రీకృష్ణుడిని బంధించటానికి అనువైన దూరంలో కూర్చున్నారు. శకుని సకుటుంబంగా ఆ సమీపంలో ఉన్నాడు. దుశ్శాసనుడు అన్నకు నీడగా ఉంటాడు. దుష్టచతుష్టయం దాడికి అనువుగా సభలో కూర్చున్నది. ఈ విధంగా సభాసదులు కూర్చొనటంలో కూడా వ్యూహరచన మున్నట్లు చిత్రించటం రాజకీయ సభా ప్రాశస్త్యాన్ని తెలుపుతున్నది. ఉద్యోగపర్వ సభలో ఇది అన్ని విధాలా ఉన్నతమైన రాజ్య (రాజకీయ) సభ. (సంపా.)

**క. అంబుద శుభగాత్రుం బీ । తాంబరధరుఁ గమలదళ నిభాక్షున్ హరిఁ జూ**
**డం బడసి లోచనము లమృ । తం బానిన మాడ్కి సమ్మదంబునఁ దేలన్.** **254**

**ప్రతిపదార్థం:** అంబుద శుభగాత్రున్= మేఘం వంటి మంగళకరమైన శరీరం కలవాడును; పీత+అంబరధరున్= పచ్చని పట్టు పుట్టం కట్టినవాడును; కమలదళ నిభ+అక్షున్= తామర రేకులతో సమానమైన కన్నులు కలవాడును; అగు; హరిన్= శ్రీకృష్ణుడిని; చూడన్+పడసి= చూచే భాగ్యంపొంది; లోచనములు= నేత్రాలు; అమృతంబు+ఆనినమాడ్కిన్= సుధారసమును గ్రోలిన విధాన; సమ్మదంబునన్= ఆనందమునందు; తేలన్= తేలగా.

**తాత్పర్యం:** మేఘవర్ణంవలె సుందరమైన దేహవర్ణం కలవాడూ, పచ్చని పట్టుపుట్టం ధరించినవాడూ, తామర రేకులతో సమానమైన నయనాలు కలవాడూ, అయిన శ్రీహరిని చూడనోచినందులకు సభలోనివారి కన్నులు అమృతరసాన్ని గ్రోలినట్లు ఆనందంలో ఓలలాడాయి.

**విశేషం:** అలం: ఉపమ. 1. రాజనీతికి ఈ రాయబారపు ఘట్టం శిఖరాయమాణం. అందులో శ్రీకృష్ణుడి వ్యక్తిత్వం మకుటాయమానం. ఈ ఘట్టాన్ని అటు వ్యాసమహర్షి, ఇటు తిక్కన సోమయాజీ అద్భుతంగా చిత్రించారు.

2. సభలో అందరినీ ఆకర్షించేది వక్త యొక్క రూపవైభవం. అంటే ఆంగిక, ఆహార్య అభినయ సంపద. శ్రీకృష్ణుడు కన్నుల పండుగ కలిగించే మధురాకృతి కలవాడు. వ్యాసమహర్షి మాటలలో.

**'అతసీ పుష్ప సంకాశః పీతవాసా జనార్దనః**

**వ్యభ్రాజత సభామధ్యే హేమ్నీవోపహితో మణిః' (సం. 5-92-52)**

నల్లని అవిసెపూవు వంటి మేనికాంతి కలవాడూ, పచ్చని పట్టువస్త్రం ధరించినవాడూ అయిన శ్రీకృష్ణుడు సభామధ్యంలో బంగారంలో పొదిగిన ఇంద్రనీలమణివలె ప్రకాశించాడు- అని వ్యాసుడు వర్ణించాడు. తిక్కన శ్రీకృష్ణుడిని అంబుదశుభగాత్రుడుగా మొదట పేర్కొన్నాడు. సర్వజనుల కన్నులనూ, హృదయాలనూ ఆకర్షించేది శ్రావణమేఘం. పచ్చని పట్టువస్త్రం కట్టటం శ్రీకృష్ణుడి నైజం. ఆ రంగు చూచేవారికి శాంతిని ప్రసాదిస్తుంది. ఆ తరువాత తిక్కన- మూలంలో ప్రస్తావించబడని కమలదళనిభాక్షులను వర్ణించాడు. విశాలాక్షుడని విష్ణువుకు పెట్టింది పేరు. ప్రకృతి నుండి పురుషోత్తముడి వరకు, భౌతికం నుండి ఆధ్యాత్మికం వరకు, సౌందర్యం నుండి కారుణ్యం వరకు వ్యాపించి ఉన్న ఒక దివ్యచైతన్యం రూపుతాల్చిన అనుభవం. గాత్రం ఇంద్రియాలను, అంబరం మనస్సును, కమలాక్ష దృష్టి ఆత్మను ఆకట్టుకొనే స్వభావం కలవి. వీటన్నిటినీ తిక్కన ఒకచోట కూర్చాడు.

3. శ్రీకృష్ణుడు ఒక దివ్యాదివ్యవిభావం. ఆయనను చూచిన సభాసదులు మూడంచెల అనుభూతిని పొందారు. క్రమంగా అన్వయించుకొంటే 'అంబుదనిభ గాత్రుడి'ని చూచి కన్నులు ఆనందించాయి. పీతాంబరధరుడిని చూచి మనస్సులు అమృతం త్రాగిన అనుభూతిని పొందాయి. కమలదళాక్షుని కరుణామయ విశాలదృక్కులను చూచి ఆత్మలు ఆనందాంబుధిలో తేలినట్లున్నవి. తిక్కన అలంకారధ్వని ఇక్కడ గమ్యమానం. మూడు రకాల అనుభవాన్ని ఒక ఉపమాలంకారంలో సూచించాడు. కన్నులు అమృతరసాన్ని గ్రోలి ఆనందంలో తేలాయట! ఇది అలంకారాన్ని మించిన ధ్వనిమయ భావచిత్రం.

4. సభలో అందరినీ ఆకర్షించే రూపం, వేషం, అభినయం (దృష్టి) అనే మూడంశాలు ముప్పిరిగొని ముచ్చట కొలపటం నాటకీయత. (సంపా.)

**క. ఆ కొలువువారు కర మచ । లాకృతి నొక పలుకులేక యందఱు వింజం**
**బాఁకిడిన కరణి నవశ ము । దాకారిత చిత్తవృత్తులై యుండంగన్. 255**

**ప్రతిపదార్థం:** ఆ కొలువువారు= ధృతరాష్ట్రుడి కొలువుకూటంలో ఉన్నవారు; కరము= మిక్కిలి; అచల+ఆకృతిన్= కదలని రూపాలతో; ఒక పలుకులేక= ఏమియు మాటాడక; అందఱున్= ఎల్లరు; వింజంబు= వింధ్య పర్వతం; ఆఁక+ఇడిన కరణిన్= అడ్డపడిన తీరున; అవశ+ముద్+ఆకారిత+చిత్తవృత్తులు+ఐ= పారవశ్యం, సంతోషం రూపుగొన్న మనోవ్యాపారం కలవారై; ఉండంగన్= ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** మేరుగిరి చుట్టూ ప్రదక్షిణం చేస్తున్న సూర్యుడి భ్రమణాన్ని వింధ్యపర్వతం నిరోధించిన వేళ సృష్టి నిశ్చలమైనట్లు ధృతరాష్ట్రుడి కొలువు కూటంలోని వారందరూ శ్రీకృష్ణ సందర్శనంతో తమ మనస్సులు సంతోష పరవశాలు కాగా ఇట్టట్టు చలింపక నోట మాటలేక అట్లే స్తంభించిపోయారు.

**విశేషం:** అలం: ఉపమ. 1. శ్రీకృష్ణుడి దివ్య దర్శనం చేసికొంటున్న సభాసదుల స్థితిని తిక్కన ఉపమాలంకార సుందరంగా వర్ణించాడు. తెలుగుదనం ఒలకపోశాడు.

2. సభాసదుల అవస్థలన్నీ సాత్త్వికాభినయ విశేషాలు కావటం చేత అవి తెచ్చిపెట్టుకొన్నవి కాక శ్రీకృష్ణ దర్శనం వలన పొంగిన సాత్త్వికచిత్తవృత్తి జన్యమైన సహజాభినయ విశేషాలని స్పష్టం.

3. ఇందులో మూడు రకాలైన అవస్థలు వర్ణించబడ్డాయి. 1. 'కరమచలాకృతి' అవస్థ. మిక్కిలి కదలని ఆకృతితో ఉన్నారట! లేదా, శ్రేష్ఠమైన పర్వతంవలె స్థిరమైన ఆకృతితో సభ్యులున్నారట. అంటే ఆశ్చర్యజన్యమైన స్తంభావస్థలో ఆంగికాభినయాన్ని ప్రదర్శిస్తున్నారన్నమాట. స్తంభావస్థలో వాచికాభినయం ఉండకపోవటం సహజం. అందుకే 'ఒక పలుకు లేక' ఉండిపోయారు. ఇవి అభినయావస్థలు.

4. ఇక వారి చిత్తవృత్తులు 'వింజం బాకిడిన కరణి' నవశముదాకారిత చిత్తవృత్తులై ఉన్నట్లు తిక్కన విశేషంగా వర్ణించాడు. వింధ్యపర్వతం అడ్డుపడితే జనులు సూర్యచంద్రుల గతిని గమనించలేక కాలజ్ఞానాన్ని కోల్పోయారట. ఆ అనుభవాన్ని తెలుగులో జాతీయంగా భద్రపరచుకొన్నారు తెలుగువారు. అంటే, శ్రీకృష్ణుడి దివ్యాకారాన్ని చూస్తూ కాలాన్ని మరచిపోయారు. దానికి కారణం- వారందరూ పారవశ్యంతో కూడుకొన్న ఆనందమే ఆకారంగా రూపుదాల్చిన చిత్తవృత్తులు కలవారయ్యారు. ఇది తన్మయావస్థ. (సంపా.)

## శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట (సం. 5-93-1)

**క. జలదస్వన గంభీరత । నెలుఁగొప్పఁగ దంత దీప్తు లెసఁగ ముకుందుం**
**డలరుచు సభ నఖిల జనం । బులు విన ధృతరాష్ట్ర భూవిభున కిట్లనియెన్. 256**

**ప్రతిపదార్థం:** ముకుందుఁడు= శ్రీకృష్ణుడు; జలదస్వన గంభీరతన్= మేఘధ్వనియొక్క గాంభీర్యంతో; ఎలుఁగు+ఒప్పఁగన్= తన కంఠధ్వని సొంపారగా; దంత దీప్తులు+ఎసఁగన్= దంతాల యొక్క కాంతులు అతిశయించగా; సభన్= సభలో; అలరుచున్= ప్రకాశిస్తూ; అఖిలజనంబులు= ధృతరాష్ట్రుడి కొలువులోనున్న సమస్త ప్రజలు; వినన్= ఆలకించగా; ధృతరాష్ట్ర భూవిభునకున్= ధృతరాష్ట్ర మహారాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా వచించాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు మేఘధ్వనివలె గంభీరమైన తన కంఠధ్వనితో, దంతాల కాంతులు ప్రసరిస్తూ ఉండగా సభలో వెలుగొందుతూ సదస్యులందరూ చెవులు నిక్కించుకొని ఆలకిస్తుండగా ధృతరాష్ట్ర మహారాజుతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** 1. అలం: ఉపమ. శ్రీకృష్ణుడి కంఠస్వరం మేఘ గర్జనవలె గంభీరంగానూ, హృదయంగమంగానూ ఉన్నది. దానికి తోడు ఆయన దంతకాంతులు మెరుపుల వలె మెరిసిపోతున్నాయి. వర్షాకాల ప్రకృతి రామణీయకం కాల్పనిక సౌందర్యంతో శ్రీకృష్ణుడియందు దర్శనమిస్తున్నట్లు తిక్కన చిత్రించి, సందేశ ఘట్టానికి పూర్వరంగ ప్రక్రియను నిర్వహించాడు. చెప్పేవాడు గొప్పవాడైతే చెప్పేది గొప్పగా రాణిస్తుంది. (సంపా.)

**క. 'జననాథ! నీ యెఱుంగని । పనులు గలవె? యైనఁ దగవుఁ బరమహితంబుం**
**దనవారికిఁ జెప్పన తగు । నని వచ్చితి భారతాన్వయము ప్రియమొందన్. 257**

**ప్రతిపదార్థం:** జననాథ!= రాజా ధృతరాష్ట్రా!; నీ+ఎఱుంగని+పనులుకలవె?= నీకు తెలియని కార్యాలున్నాయా?; ఐనన్= అయినప్పటికీ; తగవున్= న్యాయాన్ని; పరమ హితంబున్= మిక్కిలి శ్రేయస్కరమైనదానిని; భారత+అన్వయము= భరతుడు

జన్మించిన కురువంశము; ప్రియము+ఒందన్= సంతోషపడగా; తనవారికిన్= నా వారికి; చెప్పన్+అ+తగున్+అని= చెప్పటమే ఉచితమని; వచ్చితిన్= ఇక్కడికి వచ్చాను.

**తాత్పర్యం:** 'మహారాజా! నీ వెరుగని కార్యా లేమున్నాయి? ఐనప్పటికీ, భరతవంశం సంతోషించేటట్లు నా ఇరుకుటుంబాలవారికీ న్యాయమూ, పరమహితమూ చెప్పటం ఉచితమని నేనిక్కడికి వచ్చాను.

**విశేషం:** 1. శ్రీకృష్ణుడి గంభీరోపన్యాసం ఇక్కడి నుండి ప్రారంభమౌతున్నది. ఉపన్యాసానికి ఉపక్రమణిక ఊపిరి. ఎత్తుగడలోనే వక్త శ్రోతల చిత్తాలను ఆకర్షించాలి. అందుకై శ్రీకృష్ణుడు నాలుగంశాలను తొలి పలుకులలో తోచేటట్లు చెప్పాడు. అవి- (1) సంబుద్ధి (2) వినయవచనం (3) వక్త లక్ష్యం (4) ప్రయోజనం.

2. 'జననాథ!' అన్న సంబుద్ధి సార్థకం. ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడి మాటలను కౌరవులకు తండ్రిగా కాక, ప్రజలకు ప్రభువుగా వినాలని ధ్వని. ఇందులో వంశం కంటె ప్రజల యోగక్షేమం ముఖ్యమని సూచన. లోకక్షేమం కొరకే శ్రీకృష్ణుడి బోధ అని ధ్వని.

3. పెద్దల ముందు ఉపన్యసించేటప్పుడు వివేకవంతుడు వినయోక్తులతో మొదలు పెట్టాలి. దాని వలన వక్త యొక్క నిరహంకార ప్రవృత్తి వ్యక్తమై శ్రోతల ఆభిముఖ్యం ఏర్పడుతుంది. శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడి ఆభిముఖ్యాన్ని సాధించ యత్నించాడు రెండవ అంశంలో.

4. శ్రీకృష్ణుడు తన ఉపన్యాసానికి లక్ష్యాన్ని వివరించాడు మూడవ అంశంగా. కౌరవులందరూ తనవారని అనుకొని వారితో తన అభిప్రాయం చెప్పటం న్యాయమని భావించి శ్రీకృష్ణుడు హస్తినకు వచ్చాడట! ఆ మాటలలో రెండు లక్ష్యాలున్నాయి. 1. న్యాయం 2. పరమహితం ఏర్పడేటట్లు చెప్పటం.

5. ఆ చెప్పటం వలన భారతాన్వయమంతా సంతోషించే ప్రయోజనం సాధించబడుతుందని సూచించాడు. లక్ష్య ప్రయోజనాల నిర్దేశం వలన వక్తవ్యాంశం మీద ఆసక్తి అంకురిస్తుంది.

6. అవధాన సాధనమే ఈ పద్య ప్రయోజనం. ప్రసాద గుణభూయిష్ఠమైన రచన దీనికి ప్రాణం. (సంపా.)

**క. క్షీరోదక గతిఁ బాండవ । కౌరవు లొడఁగూడి మనికి కార్యం బది నీ**
**వారసి నడపుము వా రన । వీ రనఁ గురుముఖ్య! నీకు వేఱుంగలదే? 258**

**ప్రతిపదార్థం:** కురుముఖ్య!= కురువంశంలో ప్రధానమైనవాడా!; క్షీర+ఉదకగతిన్= పాలూ, నీరూవలె; పాండవ కౌరవులు= పాండవులున్నూ కౌరవులున్నూ; ఒడన్+కూడి= ఒద్దిక కలిగి; మనికి= జీవించటం; కార్యంబు= చేయదగినపని; అది= దానిని; నీవు= నీవు; ఆరసి= పరికించి; నడపుము= సాగించుము; నీకున్= నీకు; వారు+అనన్= పాండవులనగా; వీరు+అనన్= కౌరవులనగా; వేఱున్+కలదే= భేదమున్నదా? (లేదని అర్థం.)

**తాత్పర్యం:** కురునాథా! పాండవ కౌరవులు పాలూ నీరూ వలె కలసి మెలసి జీవించటం మంచిపని. వారు అట్లా ఒద్దికతో ఉండేటట్లు నీవు వారిని నడపించవలసింది. పాండవులు వేరు, కౌరవులు వేరు అనే భేదబుద్ధి నీకు లేదు కదా!

**విశేషం:** అలం: ఉపమ, యథాసంఖ్యం. కురుముఖ్యుడుగా ధృతరాష్ట్రుడు చేయవలసిన బాధ్యతను ఇక్కడ శ్రీకృష్ణుడు చెప్పుతున్నాడు. 1. పాండవ కౌరవులు పాలూనీరువలె కలిసి ఉండటం కాదగిన కార్యం. 2. అట్లా జరగాలంటే ధృతరాష్ట్రుడు కౌరవపాండవులను సమంగా చూడాలి. ఇందులో మొదటిది న్యాయం. రెండవది హితం.

2. కౌరవ పాండవులు కలిసి ఉండాలి అన్నప్పుడు చాలవరకు ఈ ఘట్టంలో అందరూ క్షీరోదక సామ్యాన్నే స్వీకరించారు. అయితే ధృతరాష్ట్రుడు కౌరవపాండవులు క్షీరోదకాలవంటివారన్నాడు. (1.263), భీముడు పాండవ కౌరవులను క్షీరోదకా లన్నాడు. (3.47). శ్రీకృష్ణుడు పాండవ పక్షం వాడే కాబట్టే వారు పాలవలె బలవంతులనీ, కౌరవులు నీరువలె బలహీనులనీ, పాండవుల నాశ్రయించి బ్రతకటమే ధార్తరాష్ట్రులకు క్షేమమనీ భావించాడు. (సంపా.)

**చ. భరతకులంబు ధర్మమును బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం**
**గరుణయుఁ గల్గి యుండు ననఁగా నుతిఁ గన్నది; యందు సద్గుణో**
**త్తరులరు నీవు నీ యనుఁగుఁ దమ్ముఁడు; నీ తనయుల్ యశోధురం**
**ధర శుభ శీలు; రీ సుచరిత క్రమ మిప్పుడుఁ దప్పనేటికిన్? 259**

**ప్రతిపదార్థం:** భరతకులంబు= భరతుడు జన్మించిన కురువంశం; ధర్మమును= ధర్మమూ; పాడియున్= న్యాయమూ; సత్యమున్= సూనృతమూ; పొత్తున్= ఐకమత్యమూ; పెంపునున్= గొప్పతనమూ; కరుణయున్= కృపయూ; కల్గి+ఉండున్+ అనఁగాన్= కల్గియుంటుందని; నుతిన్+కన్నది= ప్రఖ్యాతి వహించింది; అందున్= అట్టి వంశంలో; నీవున్= నీవూ; నీ+ అనుఁగుఁ దమ్ముఁడున్= నీ ప్రియమైన తమ్ముడు పాండురాజూ; సద్గుణ+ఉత్తరులరు= మంచి గుణాలచేత శ్రేష్ఠులు; నీ తనయుల్= నీ కొడుకులున్నూ నీ తమ్ముడి కొడుకులున్నూ; యశోధురంధర శుభశీలురు= కీర్తి భారాన్ని వహిస్తున్న మంచి స్వభావం కలవారు; ఈ సుచరితక్రమము= పరంపరగా వస్తున్న ఈ మంచి నడవళ్ళతీరును; ఇప్పుడున్= ఇప్పుడుకూడా; తప్పన్+ ఏటికిన్?= విడుచుట ఎందులకు?

**తాత్పర్యం:** మహారాజా! మీ భరతవంశం ధర్మం న్యాయం సత్యం ఐకమత్యం గౌరవం కారుణ్యం మొదలైన సద్గుణాలు గలిగి పొగడ్త కెక్కింది. అట్టి వంశంలో నీవూ, నీ ప్రియ సహోదరుడు పాండురాజూ, సద్గుణాలయందు శ్రేష్ఠులు, మరి నీ కుమారులో కీర్తి భారం వహించజాలినవారు, కళ్యాణ స్వభావులు. ఇంత మంచి నడవడిగల వంశసంప్రదాయం ఇపుడు కూడా తప్పించటమెందుకు?

**విశేషం:** 1. వెనుకటి పద్యంలో ధృతరాష్ట్రుడు నిర్వహించవలసిన బాధ్యతలు అవశ్య కర్తవ్యాలని చెప్పటానికి శ్రీకృష్ణుడు ఉపపత్తులను ఏకరువు పెట్టుతున్నాడు. వాటిల్లో మొదటిది వంశగౌరవ సంప్రదాయ పరిరక్షణ. దానిని వివరించా డీ పద్యంలో.

2. భరతవంశం ఆరు గుణాలకు ప్రసిద్ధి. వాటిని ఈ క్రమంలో చెప్పుకొనాలి. (1) ధర్మం - వేదశాస్త్రాదులలో ప్రతిపాదించిన విధి. (2) న్యాయం - లోకహితాన్ని కలిగించే సాంఘిక మర్యాద. (3) సత్యం - నిజం మాట్లాడటం, నిజం భావించటం, నిజం పాటించటం (4) పొత్తు - అరమరికలు లేక ఒకరి మేలు ఒకరు కోరుతూ కలసి మెలసి ఉండటం. (5) గౌరవం - వ్యక్తిసుఖం కంటె వంశానికి కళంకం రాకుండా గౌరవం కలిగేటట్లు వర్తించటం (6) కరుణ - సర్వజీవ హితభావం.

3. భరతవంశంలో కొందరు కొన్ని కొన్ని గుణాలు ఆచరించి ఉండవచ్చును. కాని, పాండురాజూ, ధృతరాష్ట్రుడూ అన్ని గుణాలను ఆచరించేవారిలో అగ్రగణ్యులుగా పరిగణించబడతారు. ఈ మాట ధృతరాష్ట్రుడి యందు సత్యం కాకపోయినా ముందుకాళ్ళకు బంధంగా శ్రీకృష్ణుడు అట్లా పొగిడాడు. 'నీతనయుల్' అనే మాట పాండవ కౌరవుల కిద్దరికీ వర్తిస్తుంది. తండ్రి లేని పాండవులను ధృతరాష్ట్రుడే తండ్రిగా పెంచి పెద్దవాళ్ళను చేశాడని తాత్పర్యం. కౌరవ పాండవులు యశోధురంధర శుభశీలురట! యశస్సు, వంశ గౌరవ పరిరక్షణ వలననే కలుగుతుందని ధ్వని. ఆ మంచి వంశ సంప్రదాయాన్ని మానవద్దని హితవు చెప్పాడు. ఈ పద్యం హితోక్తి. (సంపా.)

శా. ఈ వంశంబున కెల్ల నీవ కుదు; రిం దెవ్వారి చందంబు లె
ట్లై వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృత్తంబున్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ! 260

**ప్రతిపదార్థం:** కౌరవ్యవంశ+అగ్రణీ!= కురువంశంవారిలో శ్రేష్ఠుడా!; ఈ వంశంబునకున్+ఎల్లన్= ఈ కురుకులాని కంతటికీ; నీవు+అ= నీవే; కుదురు= ఆశ్రయం; ఇందున్= ఈ కురువంశస్థులలో; ఎవ్వారి చందంబులు= ఎవ్వరి నడవడులు; ఎట్లు+ఐ వర్తిల్లినన్= ఏ విధంగా ఉండునో వాటిననుసరించి, కీడు= హాని, మేలు= వృద్ధి; తుదిన్= కడపటికి; నీఅందున్+ఒందెడున్= నీకే చెందగలవు; కానన్= కనుక; సద్భావంబు+ఆరసి= మంచి తలంపునకు వచ్చి; లోనిపొత్తు= అంతరంగంలో ఒద్దిక; వెలివృత్తంబున్= బహిరంగ ప్రవర్తన; జనస్తుత్యముల్= ప్రజలచేత మెచ్చదగినవిగా; కావింపన్= చేయటానికి; నీకున్+అ= నీకే; ఏ విధమునన్= ఏ విధంగానైనా; తగున్= యోగ్యం.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! నీవు కురువంశస్థులలో అగ్రేసరుడివి. ఈ వంశాని కంతటికీ నీవే ఆధారం. నీ కుటుంబంలో ఎవ్వరెవ్వరి నడవడికలు ఎట్టెట్లుగా ఉంటాయో వాటినిబట్టి కలిగే మేలు కీళ్ళు నీకే చెందుతాయి. కాబట్టి నీవు ఇరు కుటుంబాల వారి శ్రేయస్సు నూహించి అంతరంగ స్నేహం, బహిరంగ ప్రవర్తన జనులు మెచ్చేటట్లుగా ఏవిధంగానైనా వారిని చక్కదిద్దవలసి ఉంటుంది.

**విశేషం:** కౌరవ్య వంశాగ్రణీ! అనే పిలుపు సాభిప్రాయం. ధృతరాష్ట్రుడు కౌరవవంశరాజులలో అగ్రగణ్యుడు కావాలంటే ఈ తగవు (న్యాయం) పాటించాలని శ్రీకృష్ణుడు నిర్దేశించాడు. 1. ఇప్పుడు ఈ వంశానికంతా నీవే ఆధారం. అతడు న్యాయంగా వ్యవహరిస్తే వంశం నిలుస్తుంది. లేదా వంశం అతడితోనే అంతమౌతుంది. అంతటి కీలకమైనది ఆయన వర్తనం.

2. వంశంలో ఇతరులు అతడిని కాదని ఏమి చేసినా, దానివలన కలిగే కీడుగాని, మేలుగాని ధృతరాష్ట్రుడే అనుభవించవలసి వస్తుంది.

3. కాబట్టి కుటుంబ శ్రేయస్సును భావించి, మనసూ మాటా ఒకటిగా తలంచి, జనులు మెచ్చేటట్లు వ్యవహరించాలి.

4. ఏ విధంగా చూచినా ఈ బాధ్యత మరెవ్వరిదీ కాదు. ధృతరాష్ట్రుడిదే. కాదని తప్పించుకొనటం న్యాయం కాదు- అని శ్రీకృష్ణుడు స్పష్టపరిచాడు. తరతరాల వంశ సంప్రదాయ గౌరవం ఒక్క ధృతరాష్ట్రుడి వర్తనం మీదనే ఆధారపడి ఉన్నదనీ, వంశ చరిత్రలో ధృతరాష్ట్రుడు కీలకమైన పాత్ర నిర్వహించవలసి వచ్చిందనీ, న్యాయంగా వ్యవహరించి కౌరవ్యవంశాగ్రణి కావాలనీ శ్రీకృష్ణుడు హెచ్చరించాడు. (సంపా.)

చ. వినుము! సుయోధనాదులగు వీరు సధర్ములు గాక కార్యము
ల్గొనక మహార్థసిద్ధి యెడలుం దమ కిట్లన కన్వయంబు వ
ర్తనమిది గాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బుయిలోడ రేమియున్. 261

**ప్రతిపదార్థం:** వినుము= మహారాజా, నామాటలాలకించవలసింది; సుయోధన+ఆదులు+అగు+వీరు= దుర్యోధనుడు మొదలుగా గల్గిన నీ కుమారులు; సధర్ములు కాక= ధర్మము ననుసరించే వారుకాక; కార్యముల్+కొనక= చేయదగిన మంచి పనులు

చేయక; ఇట్లు= ఈ రీతిగా మెలగితే; తమకున్= తమకు; మహా+అర్థసిద్ధి= గొప్ప ప్రయోజనాలు చేకూరుట; ఎడలున్+అనక= తొలగిపోవునని తలంచక; అన్వయంబు వర్తనము= వంశపు నడవడి; ఇది కాదు= ఇటువంటిది కాదు; నాక= అనక; బెడిదంపుఁ దనంబునన్= దారుణ స్వభావంతో; బంధుకోటికిన్= బంధువర్గానికి; మనసులు నొవ్వఁగాన్:= హృదయాలు వ్యథ చెందేటట్లు; అవగుణంబులకున్= దుర్గుణాలకు; ఏమియున్= ఇంచుకయు; వుయిలోడరు= వెనుదీయరు.

**తాత్పర్యం:** రాజా! వినుము. దుర్యోధనాదులైన వీరు ధర్మపరులుగాక, సత్కార్యాలాచరించక, ఇట్లా ఉంటే మహార్థసిద్ధికి దూరమవుతామని తలంచక, వంశపునడవడి ఇట్టిది కాదనక, దారుణ బుద్ధితో బంధువుల మనస్సులు బాధచెందేటట్లుగా దుష్టచేష్టలు చేయటానికి ఏమాత్రం వెనుదీయకున్నారు.

**విశేషం:** భరతవంశం సద్గుణాలకు నిలయం. మరి ధృతరాష్ట్రుడి కొడుకులు అవగుణాలకు ఆశ్రయాలు. కాబట్టి దుశ్చేష్టలు చేయటానికి వెనుకాడరు. వంశపురుషులకు కౌరవులకూ ఉన్న భేదాన్ని శ్రీకృష్ణుడు చక్కగా విశ్లేషించాడు. వారు సధర్ములు- వీరు అధర్ములు. వారు న్యాయవర్తనులు - వీరు మంచి పనులు చేపట్టరు. వారు సత్యనిష్ఠులు - వీరు మహార్థసిద్ధిని లెక్కచేయని అసత్యనిష్ఠులు. వారు వంశజులందరూ కలసి మెలసి ఉండాలనేవారు. వీరు అన్వయ వర్తనాన్ని గౌరవించనివారు; వారు వంశౌన్నత్యానికి కృషి చేశారు. వీరు బంధుకోటి మనసులను బాధపెట్టి వంశగౌరవాన్ని మట్టి కలిపారు. వారు కరుణామూర్తులు - వీరు పాపకర్మలకు వెనుకాడని కఠినాత్ములు. ఈ విధంగా కౌరవులు భరత వంశ సంప్రదాయాన్ని చట్టుబండలు చేశారని స్పష్టంగా చెప్పాడు. వీరివలననే వంశ క్షయం కలుగుతుందని ధ్వనింపచేశాడు. (సంపా.)

**ఉ. కౌరవ పాండవుల్ తెఱఁగు గైకొని శాంతతఁ బొందియున్కి మే**
**లారయ నాకు నీకుఁ గులమంతకు నీ నృపకోటి కుర్వికిం**
**బోరితమైన నింతకును బుట్టు మహాపద గావునన్ ధరి**
**త్రీ రమణాగ్రగణ్య! గణుతించి యవశ్యముఁ బొం దొనర్పవే! 262**

**ప్రతిపదార్థం:** ధరిత్రీ రమణ+అగ్రగణ్య!= రాజులలో ఉత్తముడా!; కౌరవపాండవుల్= కౌరవులూ, పాండవులూ; తెఱఁగు+కైకొని= సంధి నిర్ణయానికి వచ్చి; శాంతతన్+పొంది= ప్రసన్నత్వం వహించి; ఉన్కి= ఉండటం; ఆరయన్= పరికించగా; నాకున్= నాకును; నీకున్= నీకును; కులము+అంతకున్= కురువంశాని కంతటికీ; ఈ నృపకోటికిన్= ఈ రాజ సమూహానికి; ఉర్వికిన్= ఈ జగత్తునకూ; మేలు= శ్రేయం; పోరితము+ఐనన్= యుద్ధం జరిగితే; ఇంతకును= ఈ సమస్తమునకునూ; మహా+ఆపద+పుట్టున్= గొప్ప విపత్తు సంభవిస్తుంది; కావునన్= అట్లగుటచేత; గణుతించి= నా మాటలు లెక్కించి; అవశ్యమున్= తప్పక; పొందు+ఒనర్పవే= సంధి కావించవలసింది.

**తాత్పర్యం:** కౌరవులు పాండవులు ఒక మంచి నిర్ణయానికి వచ్చి, శాంతం వహించి, జీవించటం మంచిది. ఇట్లు వారు ప్రసన్నచిత్తులై ఉండటం నాకూ, నీకూ, కురువంశానికీ, ఈ రాజ సమూహానికీ, ఈ భూ మండలానికి శ్రేయం. అట్లాకాక యుద్ధమే సంభవిస్తే మనందరికీ మహా విపత్తు కలుగుతుంది. కనుక రాజోత్తమా! నా మాటలపై విశ్వాసముంచి తప్పక సంధి జరిపించవలసింది.

**విశేషం:** 1. శ్రీకృష్ణుడు తనవారని భావించేవారికి తెలిపే పరమహితం ఈ పద్యతాత్పర్యం.

2. కౌరవ పాండవు లేదో ఒక పద్ధతితో శాంతి కుదుర్చుకొంటే మేలయ్యేది శ్రీకృష్ణుడికి, ధృతరాష్ట్రుడికి, వంశంలో ఉన్నవారి కందరికీ, ఆ సభలో ఉన్న రాజులందరికీ, చివరకు సమస్త భూమికీ అని పేర్కొనటం సఖ్యత వలన ఎంతటి సౌఖ్యమేర్పడుతుందో భావనా రమణీయంగా ప్రసన్నమౌతున్నది.

3. యుద్ధమైతే అందరికీ మహాపద కలుగుతుంది - దాన్ని లెక్కలోనికి తీసికొనుమన్నాడు. పాండవ యాదవ కుటుంబ సభ్యులు కొందరైనా పోవటం శ్రీకృష్ణుడి కేర్పడే ఆపద. కొడుకులందరూ మరణించి తర్పణాలు ఇవ్వటానికి కూడా ఎవ్వరూ మిగలని మహాపద ధృతరాష్ట్రుడిది. కౌరవులందరూ నశించటం వంశజుల కేర్పడే మహాపద. యుద్ధంలో సహాయపడే రాజులు ప్రాణాలు కోల్పోతారు. దానివలన భూమి వీరులను కోల్పోతుంది. రక్తంతో తడుస్తుంది. జననాశం ఏర్పడుతుంది. వితంతువుల విషాదం పెల్లుబుకుతుంది. ఇవన్నీ లోకాని కేర్పడే ఆపదలు. వీటిని పరిగణించి తప్పక సంధి చేయుమని హితవు చెప్పి హెచ్చరించాడు శ్రీకృష్ణుడు. (సంపా.)

**తే. నీకు వలసినఁ దీర్పంగ నేరవచ్చు । నధిప! తెఱఁగు నీ వశమున యదియ కాన**
**నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె । సిద్ధ మెవ్వారిఁ దెలివొందఁ జేయనేర్తు. 263**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; తెఱఁగు= సంధి; నీ వశమున+అదియ+కానన్= నీ అధీనంలో ఉన్నట్టిదే కావటం చేత; నీకున్+వలసినన్= నీకు అవసరమని తోస్తే; తీర్పంగన్+నేరన్+వచ్చున్= కార్యం సరిదిద్దవచ్చు; నీకున్= నీకు; వీరలన్+తేర్చుట= కురుపాండవుల కలతలు మాన్పి ప్రసన్నులను చేయటం; నెఱియకాదె?= న్యాయంగదా!; సిద్ధము= ఇది నీ వశము లోనిది; ఏ+వారిన్= ఎవ్వరినైనను; తెలివి+ఒందన్= వివేకం పొందేటట్లు; చేయన్+నేర్తు(వు)= చేయటానికి నీవు సమర్థుడివి.

**తాత్పర్యం:** రాజా! సంధికార్యం నీ చేతిలో ఉన్నది. అవసరమైతే పని చక్కబెట్టగలవు. కురుపాండవులను ప్రసన్నులను చేయుట న్యాయం. ఎవ్వరికైనా వివేకం కల్గించటానికి నీవు సమర్థుడవు. ఇది నిజం.

**విశేషం:** 1. సంధి అవశ్యం జరగవలసిన కార్యం. అది ధృతరాష్ట్రుడిపై ఆధారపడి ఉన్నది. ఆ సంధి జరిపే పద్ధతి కూడ ధృతరాష్ట్రుడి అధీనంలోనే ఉన్నది. కాబట్టి కౌరవ పాండవులను సంధి కంగీకరించేటట్లు ప్రసన్న మనస్కులను చేయటం కర్తవ్యం. అది చేయగలవాడు ధృతరాష్ట్ర డొక్కడే - ఇది శ్రీకృష్ణుడి మాటల ఫలితాంశం. ప్రతిపాద్యాంశ తాత్పర్యాన్ని స్పష్టంగా చెప్పటం ఉపన్యాస ఉపసంహారాంశం ఔతుంది.

2. ఇంతవరకు వంశగౌరవానికి తగ్గట్లుగా ధృతరాష్ట్రుడూ, అతడి కొడుకులూ నడచుకొనవలసిన అంశాన్నీ, సంధి అవసరాన్నీ విడమరచి చెప్పాడు. సంధి చేయటం న్యాయమన్నాడు. ధృతరాష్ట్రుడే ఆ నిర్ణయం తీసికొనటం పరమహితమన్నాడు శ్రీకృష్ణుడు. 257వ పద్యంలో ఆరంభించిన విశ్లేషణను ఇక్కడివరకు హేతుబద్ధంగా కొనసాగించటం తిక్కన సంభాషణ శిల్పం. (సంపా.)

**ఉ. అందు వృకోదరార్జునుల నాహవ రంగమునందు మీఱువా**
**రెందఱొ యెన్నుమా యిచట; నీ గురుభీష్ములఁ గ్రేణిసేయువా**
**రెందఱొ; వారు వీరు నని నీల్గుటకంటె భవద్బలంబులై**
**యందఱుఁగూడు టొప్పదె జనాధిప! శాంతి యొనర్పు మెమ్మెయిన్. 264**

**ప్రతిపదార్థం:** అందున్= అక్కడఉన్న; వృకోదర+అర్జునులన్= భీమార్జునులను; ఆహవరంగమునందున్= యుద్ధరంగంలో; మీఱువారు= మించగలవారు; ఎందఱొ+ఎన్నుమా= ఇక్కడ ఎందరున్నారో నీవే లెక్కించు; ఇచటన్= ఇక్కడఉన్న; ఈ

గురుభీష్ములన్= ఈ ద్రోణుడిని; భీష్ముడిని; క్రేణి+చేయువారు= పరిహసించగలవారు; ఎందఱొ?= అక్కడెందరున్నారు?; వారున్, వీరున్= అక్కడివారూ, ఇక్కడివారూ; అనిన్= యుద్ధంలో; ఈల్గుట కంటెన్= చావటంకంటె; భవత్+బలంబులు+ఐ= నీ బలగాలై; అందఱున్= వీరందరూ; కూడుట+ఒప్పదె?= కలసిమెలసి వర్తించటం తగదా?; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; శాంతి+ఒనర్పుము= సంధిచేయుము.

**తాత్పర్యం:** అక్కడున్న భీమార్జునులను యుద్ధరంగంలో మించేవారు ఇక్క డెంద రున్నారో చెపుము? ఇక్కడున్న ద్రోణభీష్ముల పరాక్రమాన్ని లక్ష్యపెట్టక పరిహసించ గలవారు అక్కడ కూడా లేరు. ఇట్లా ఉభయ పక్షాలలోని వీరులు యుద్ధంలో చావటం కన్న నీ బలగాలై కలసి మెలసి వర్తించటం మంచిది. మహారాజా! ఏవిధంగానైనా వీరిని శాంతింపజేయుము.

**విశేషం:** 1. భరతవంశ సంప్రదాయం నిలపగలిగిన కీలకస్థానంలో ధృతరాష్ట్రుడున్నాడని చెప్పి కౌరవ పాండవులు కలసి ఉంటే కలిగే లాభాలను వివరిస్తున్నాడు శ్రీకృష్ణుడు. వాటిలో మొదట సంఘటిత బలశక్తిని ప్రస్తావిస్తున్నా డీ పద్యంలో. పాండవ పక్షంలో భీమార్జునులూ, కౌరవ పక్షంలో గురు భీష్ములూ కలిసి ఉంటే ధృతరాష్ట్రుడి రాజ్యం శత్రుదుర్భేద్యంగా ఉంటుందని చెప్పాడు. రాజ్యానికీ, రాజుకూ మొదట కావలసింది రక్ష. ఆ అంశాన్ని ఇందులో ఒత్తి చెప్పాడు.

2. మూలంలో ఇరుపక్షాలలో ఉన్న పెక్కు వీరుల పేర్లు చెప్పబడ్డాయి. కాని, పై నలుగురూ సంగ్రామంలో ఓడడం దుర్లభం. మిగిలినవారి కా ప్రతిపత్తి లేదు. అందువలన తిక్కన ఈ మార్పు చేశాడు. దుర్యోధనుడు ఇటువంటి మహావీరులలో ఒకడని శ్రీకృష్ణుడు చెప్పకుండా ఉండటం గమనింపదగిన అంశం. ఆ సత్యాన్ని గుర్తించుమని ధృతరాష్ట్రుడికి వ్యంగ్యంగా హితవు పలికాడు శ్రీకృష్ణుడు.

3. ఏ విధంగానైనా శాంతిని స్థాపించుము- అన్నది పద్యంలోని వాద తాత్పర్యం. తిక్కన ఒక్కొక్క పద్యాన్ని ఒక వాదాంశానికి ప్రతినిధిగా నిలపటం వాదన కళ. కార్యకారణ సంబద్ధమైన తాత్పర్య ప్రతిపాదనం అందులోని వాక్యకళ. వస్తువు కనుగుణమైన పద్య రచనా శైలిని సంఘటించటం కావ్యకళ. బంధ శైథిల్యం, అర్థవైమల్యం గల ప్రసాదగుణం ఈ రచనలోని జీవకళ. (సంపా.)

**తే. జగతిఁగల జనపతులు నీ చరణపీఠ । మర్థిఁ గొలువ సముద్ర వేలావృతోర్వి**
**యెల్ల నేలుట యొప్పదే? । తల్లి ప్రజల । యెడ విరోధంబు వాటించు టెంత మేలు? 265**

**ప్రతిపదార్థం:** జగతిన్+కల= లోకంలో ఉన్న; జనపతులు= రాజులు; నీ చరణ పీఠము= నీ పాద పీఠం; అర్థిన్= ప్రీతితో; కొలువన్= సేవిస్తుండగా; సముద్ర వేలా+ఆవృత= సాగరం యొక్క చెలియలికట్టచేత చుట్టబడిన; ఉర్వి+ఎల్లన్= పుడమి నంతయు; ఏలుట= నీవు పాలించటం; ఒప్పదే?= తగదా?; తల్లి= జనని; ప్రజల+ఎడన్= తన బిడ్డల విషయంలో; విరోధంబు పాటించుట= వైరం వహించటం; ఎంత మేలు?= ఏపాటి శ్రేయం?

**తాత్పర్యం:** లోకంలోని రాజులందరూ నీ పాదపీఠాన్ని ప్రీతితో సేవిస్తుండగా సముద్రపు చెలియలికట్టచేత చుట్టబడిన పుడమినంతటినీ నీవే ఏకచ్ఛత్రంగా పరిపాలించటం తగును. తల్లి తన బిడ్డలపట్ల శత్రుత్వం వహించటం ఎంత సమంజసమో నీవే యోచించుము.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం, నిదర్శన. 1.ఇందులో సర్వసామ్రాజ్యాధిపత్యం ధృతారాష్ట్రుడిదే అని హెచ్చరించటం ముఖ్యాంశం. కాని, ధృతరాష్ట్రుడు ఆ అధికారం తన కుమారుడిదిగా ప్రజలు భావించేటట్లు వ్యవహరిస్తాడు. దానిని మానుకొమ్మని శ్రీకృష్ణుడి హితవు. పాండవులను కూడ ఉత్తరాధికారులుగా గుర్తించుమని హెచ్చరిక.

2. ఆ అంశాన్ని (విశేషాన్ని) లోకన్యాయంతో (సామాన్యంతో) సమర్థించాడు ఈ పద్యంలో. తల్లికి బిడ్డలుంటారు. వారినందరినీ సమభావంతో ప్రేమతో చూడటమే వాత్సల్యం. అట్లాకాక పక్షపాత వైఖరి ప్రకటించటం అన్యాయం- అని చెప్పి పాండవుల పట్ల విరోధం ప్రదర్శించటం అన్యాయమని శ్రీకృష్ణుడు హెచ్చరించాడు. 'ప్రజలు' అనే శబ్దం సార్థకం. పిల్లలనీ, ప్రజలనీ రెండర్థాలు. ధృతరాష్ట్రుడు రాజకుమారులకూ ప్రజలకూ తల్లివంటివాడనీ ధ్వని. ఏలుట - అనే క్రియ సాభిప్రాయం. కొడుకులను అదుపులో ఉంచటం, ప్రజలను పాలించటం అనే అర్థాలేర్పడతాయి. 'విరోధంబు పాటించు టెంత మేలు?' అని ప్రశ్నార్థక వాక్యాన్ని చివర ఉంచటం సాభిప్రాయం. ఒక హితాన్ని చెప్పి దాని బాగోగులను గురించి ఎదుటివారి చేతనే ఆలోచింపచేయటానికి తోడ్పడే శక్తిమంతమైన పద్ధతి ప్రశ్నార్థక వాక్య ప్రయోగం. సంభాషణ శిల్పి తిక్కన తెలిసివాడిన సంభాషణ శిల్పమిది.

3. రచనలో అర్థవ్యక్తి అనేగుణం సార్థకంగా పోషించబడింది. (సంపా.)

**క. నరనాథ! నీవుపేక్షా । పరుఁడ వయినఁ గౌరవులక పాండవులక కా**
**దరయఁగ భూ ప్రజకెల్లను । దురితం బొనరించి నట్ల తుదిఁ గీడు సుమీ! 266**

**ప్రతిపదార్థం:** నరనాథ!= రాజా!; నీవు; ఉపేక్షాపరుఁడవు+అయినన్= ఈ విషయంలో అశ్రద్ధ వహిస్తే; కౌరవులకున్+అ పాండవులకున్+అ+కాదు= కురుపాండవులకే కాదు; అరయఁగన్= ఆలోచిస్తే; భూప్రజకున్+ఎల్లను= పుడమి యందలి జనుల కందరికినీ; దురితంబు+ఒనరించిన+అట్లు+అ= పాపం చేసినట్లే ఔతుంది; తుదిన్= చివరకు; కీడు+చుమీ!= నీకే అపకారం సుమా!

**తాత్పర్యం:** రాజా! నీవు కురుపాండవుల విషయంలో శ్రద్ధ వహించకుంటే ఈ ఉభయ వర్గాలకే కాదు, పుడమిలోని జనులందరికీ పాపం చేసినట్లే ఔతుంది. చివరకు నీకే హాని కలుగుతుంది.

**విశేషం:** ధృతరాష్ట్రుడు తల్లివలె తన ధర్మాన్ని నిర్వహించకుండా ఉపేక్ష వహిస్తే కలిగే నష్టాన్ని ఈ పద్యంలో పేర్కొన్నాడు శ్రీకృష్ణుడు. ఉపేక్ష వలన మొదట కౌరవులకే హాని జరుగుతుంది. పాండవులకు అన్యాయం జరుగుతుంది. ప్రజలకు అపద కలుగుతుంది. 'దురిత' శబ్దం నానార్థ వ్యంజకం. చివరికి ధృతరాష్ట్రుడికే కీడు మూడుతుంది. ఉపేక్ష వలన కులనాశనం, ప్రజాక్షయం, చివరకు ఆత్మహాని చేసికొన్న వాడవుతాడని ధృతరాష్ట్రుడిని శ్రీకృష్ణుడు హెచ్చరించి, పరమ హితాన్ని బోధించాడు. లోకంలో ఆత్మనాశన కారకమైన చర్యను చేపట్టటానికి ఎవరైనా జంకుతారు. ధృతరాష్ట్రుడు ఆ విషయంలో కూడా గ్రుడ్డిరాజే. (సంపా.)

**క. కౌరవ పాండవులం దె । వ్వారలకుం జావు నొవ్వు వచ్చిన మే లు**
**ర్వీరమణ! చిత్తమున నె । ట్లారయుమా నీకు దుఃఖమగు నెట్లయినన్. 267**

**ప్రతిపదార్థం:** ఉర్వీరమణ!= భూనాథా!; కౌరవ పాండవులందున్= కౌరవులలో పాండవులలో; ఏ+వారలకున్= ఎవరికైనా; చావు= మరణం; నొవ్వు= బాధ; వచ్చినన్= కలిగినా; చిత్తమునన్= మనస్సులో; ఎట్లు మేలు= ఏ విధంగా మేలవుతుందో; ఆరయుమా= పరిశీలించుము; ఎట్లు+అయినన్= వారికి ఏలాగైనా; నీకున్= నీకు; దుఃఖము+అగున్= విషాదం కలుగుతుంది.

**తాత్పర్యం:** రాజా! కురు పాండవులలో ఎవరికి మరణం సంప్రాప్తించినా, బాధలు కలిగినా నీకు ఎట్లా మేలవుతుందో మనస్సులో ఆలోచించుము. వారికి చావు నోవులు వస్తే నీకే ఏ విధంగానైనా దుఃఖం కలుగుతుంది.

**విశేషం:** 1. అలం: యథాసంఖ్యం. గుణం: అర్థవ్యక్తి.

2. ఉపేక్ష వలన యుద్ధం వస్తుంది. కౌరవ పాండవులకు రణంలో చావు కలుగవచ్చును, లేదా బాధ కలుగవచ్చును. ఈ వాక్యంలో యథాసంఖ్యాలంకారం వాక్యశిల్పంలో భాగం. అంటే కౌరవులకు చావు, పాండవులకు బాధ కలుగుతాయని ధ్వని.

3. ఇది ఫలితాంశమని గట్టిగా చెప్పాడు శ్రీకృష్ణుడు. అదే నిజమైతే ధృతరాష్ట్రుడి స్థితి ఏ విధంగా ఉంటుంది? ఆలోచించు కొనుమంటున్నాడు శ్రీకృష్ణుడు. ప్రస్తుతం ధృతరాష్ట్రుడు ఉర్వీరమణుడు (రాజు). కౌరవులు చనిపోతే అతడి రాచరికం చిక్కులలో పడుతుంది. ఉపేక్ష వలన ధృతరాష్ట్రుడి రాచరికం మరుక్షణమే అపాయస్థితిలో పడుతుంది. నైతికంగా అతడు భూరమణుడుగా ఉండలేడు. పదవీభ్రష్టుడు కావటం ఒక విధమైన దుఃఖం. ఒకవేళ పాండవులు ధృతరాష్ట్రుడి పెద్దరికాన్ని గౌరవించినా వారు ఎత్తిపొడుపు మాటలలో వేధించక మానరు. అప్పుడూ అతడికి దుఃఖమే మిగులుతుంది. యుద్ధంలో పాండవపక్షంలో కూడా కొందరు చనిపోవచ్చును. వారు అందుకు మనసు నొచ్చుకొనవచ్చును. ఆ విపత్తుకు కారణం ధృతరాష్ట్రుడి ఉపేక్షయే అని భావించి గ్రుడ్డిరాజును వేధించవచ్చును. అదీ అతడికి దుఃఖహేతువే. అందువలననే శ్రీకృష్ణుడు 'ధృతరాష్ట్రా! నీ మనసులో ఎన్నిరకాలుగా ఆలోచించినా ఉపేక్ష వలన చివరకు నీకు మిగిలేది దుఃఖమే సుమా!' అని విషయాన్ని విశ్లేషించి చెప్పాడు. (సంపా.)

**ఉ.** **వీరును వారుఁ బండితులు, విక్రమవంతులు, బాహుగర్వదు**
**ర్వారులు; పూని రిత్త బవరంబున నాఱడిఁ జావఁబోవ నె**
**ట్లూరక యుండవచ్చుఁ? గడు నొప్పెడు మేనులు వాఁడి కైదువుల్**
**గూరఁగ నాటినం బుడమిఁ గూలుట కక్కట! యోర్వవచ్చునే?** **268**

**ప్రతిపదార్థం:** వీరును= ఈ కౌరవులున్నూ; వారున్= ఆ పాండవులున్నూ; పండితులు= చదువు సాములు నేర్చినవారు; విక్రమవంతులు= పరాక్రమం కలవారు; బాహుగర్వ దుర్వారులు= భుజబలంచేత అడ్డగించరానివారు; పూని= ఉద్యమించి; రిత్తబవరంబునన్= తమలో తమకు ఏర్పడిన వ్యర్థమైన కలహంవల్ల; ఆఱడిన్= వ్యర్థంగా; చావన్+పోవన్= మరణించటానికి సిద్ధపడగా; ఎట్లు+ఊరక+ఉండన్+వచ్చున్?= నివారించక మౌనంగా ఎట్లుండదగును?; వాఁడి కైదువుల్= పదునైన ఆయుధాలు-బాణాలు; కూరఁగన్ నాటినన్= దూసుకొనిపోయేటట్లు గ్రుచ్చుకొనగా; కడున్= మిక్కిలి; ఒప్పెడు మేనులు= సుకుమారమైన శరీరాలు; పుడమిన్+కూలుటకున్= నేలపై త్రెళ్ళుటకు; అక్కట!= అయ్యో!; ఓర్వన్+వచ్చునే?= సహింపశక్యమగునా? (శక్యం కాదని భావం.)

**తాత్పర్యం:** కౌరవులూ పాండవులూ మంచి చదువరులు, పరాక్రమవంతులు. భుజదర్పం గలవారు గనుక ఎవ్వరూ వీరి నడ్డగించలేరు. ఇట్లాంటివారు తమలో తమ కేర్పడిన కొరమాలిన యుద్ధంలో ఊరక మరణించటానికి సిద్ధపడుతుండగా అడ్డపడక చూస్తూ ఊరకుండటం యుక్తం కాదు. ఇంత కోమలమైన శరీరాలు వాడి బాణాలు ఆవలికి దూసుకొని వెళ్ళేటట్లు గ్రుచ్చుకోగా నేలమీద కూలటం చూచి సహించటానికి శక్యం కాదు.

**విశేషం:** 1. యుద్ధంలో నిరర్థకంగా వీరులు చనిపోయే పరిస్థితి వస్తే ఉపేక్షతో ఊరుకొనటం ఏమి న్యాయం? అని ప్రశ్నిస్తున్నాడు శ్రీకృష్ణుడు. తాను ఉపేక్ష విడనాడి శాంతి కొరకు యత్నించటానికి కారణ మదే అని సూచిస్తున్నాడు. తన ప్రబోధంతో ధృతరాష్ట్రుడిని కూడా తనవలె స్పందించుమని హితవు చెప్పుతున్నాడు.

2. చనిపోయేవారు వ్యర్థులు కారు. చదువుకొన్నవారు, పరాక్రమవంతులు. పైపెచ్చు తమ భుజబలాలమీద ఉన్న నమ్మకంతో యుద్ధానికి వెనుకాడనివారు, వారిని నిష్కారణంగా కొల్పోతే దేశంలో జ్ఞానేచ్ఛాక్రియా వృత్తులలో సుశిక్షితులైన వీరులు తరుగౌతారు. దేశం అన్ని విధాలా దివాలా తీస్తుంది అని హెచ్చరించాడు.

3. దేశానికి మానవ సంపదగా పేరొందే వీరులు యుద్ధంలో ఆయుధాల బారిపడి చనిపోతే ఆ దృశ్యం చూడటానికీ, భావించటానికీ దుర్భరం. నిష్కారణ హింసను సహించవచ్చునా? అని ప్రశ్నించి ధృతరాష్ట్రుడిని ఆలోచించుమని హెచ్చరించాడు శ్రీకృష్ణుడు.

4. తిని కూర్చుండి సంపదను నిష్కారణంగా నాశనం చేసికొనే వాడు జాతికి ద్రోహి. ధృతరాష్ట్రుడు ఉపేక్ష వహిస్తే అటువంటి నిందపడతాడు. అర్థవ్యక్తి గుణ ప్రధాన రచనలో తిక్కన వస్తుస్వభావాన్ని స్ఫుటంగా వ్యక్తీకరించా డీపద్యంలో. (సంపా.)

**ఆ. ఇట్లు గాక యుండ నీ రెండు దెఱఁగుల । వారి గాచికొనుము వసుమతీశ !**
**నీదు ప్రాభవంబు నీతియు శాంతియు । నఖిల జనులుఁ బొగడునట్లుగాఁగ.' 269**

**ప్రతిపదార్థం:** వసుమతీ+ఈశ!= భూవల్లభా! ధృతరాష్ట్రా! నీదు ప్రాభవంబు= నీ యొక్క దొరతనం; నీతియున్= రాజనీతీ; శాంతియున్= కామక్రోధాది రాహిత్యమూ; అఖిల జనులు= సమస్త ప్రజలు; పొగడునట్లు కాఁగన్= ప్రశంసించునట్టి తీరులో; ఇట్లు+కాక+ఉండన్= ఇట్లా చావు నొవ్వుల పాలుగాకుండా; ఈ రెండు తెఱఁగులవారిన్= ఈ ఉభయ పక్షాల వారిని; కాచికొనుము= రక్షించుకొమ్ము.

**తాత్పర్యం:** రాజా! నీ విభుత్వమునూ, రాజనీతినీ, శాంతినీ సమస్త ప్రజలు మెచ్చుకొనేటట్లు కురుపాండవులు సంగ్రామంలో నశించకుండా సంరక్షించుకొనుము'.

**విశేషం:** యుద్ధం రాకుండా చేసి, రెండు వైపులవారినీ చావు నొవ్వుల నుండి రక్షించుకొంటే ధృతరాష్ట్రుడికి నాలుగు ప్రయోజనాలు కలుగుతాయని శ్రీకృష్ణుడు చెప్పాడు. 1. ప్రభుత్వం నిలుస్తుంది. 2. లోకనీతి, రాజనీతి, ధర్మనీతి ఫలించి ప్రభునీతి ప్రకాశిస్తుంది. 3. శాంతి ఏర్పడి రక్తపాతం లేని స్నేహభావం చిగురిస్తుంది. 4. ప్రజలందరూ ధృతరాష్ట్రుడి వర్తనాన్ని నోరారా కీర్తిస్తారు. ఉపేక్షాభావంతో పక్షపాత వైఖరి అనుసరిస్తే రాజ్యం పోతుంది. అవినీతిపరుడనే అపకీర్తి వస్తుంది. బ్రతుకంతా అశాంతితో గడపవలసి వస్తుంది. ప్రజలు చీకొట్టి నిందిస్తారు. తులనాత్మకంగా ఆలోచించి హితమైన పద్ధతి నాశ్రయించుమని పేర్కొన్నాడు. 5. వంశగౌరవం కొరకు కౌరవ పాండవుల నడుమ సంధి కుదిరించటంలో ఉపేక్ష వహిస్తే కలిగే విషపరిణామాల గురించి ఇంతవరకు శ్రీకృష్ణుడు వివరించాడు. ఈ అంశం తరువాత మరొక అంశాన్ని ఎత్తుకొంటున్న దానికి సూచనగా 'అని చెప్పి వెండియు' అని తరువాతి వచనం వాడటం తిక్కన ఉపన్యాస శిల్పంలో భాగం. (సంపా.)

**వ. అని చెప్పి వెండియు. 270**

**తాత్పర్యం:** అనిచెప్పి శ్రీకృష్ణుడు మళ్ళీ (ఇట్లా అన్నాడు:)

**శ్రీకృష్ణుఁడు పాండవులు సెప్పిన మాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట (సం. 5-93-36)**

**తే. పాండవులు తండ్రి సచ్చిన ప్రజలు వారి । నరసి ప్రోచితి శైశవ మాదిగాఁగ**
**నడుమ నిష్కారణమ దిగవిడువఁ దగునె? । పొరమొందంగ రక్షింపు గారవమున. 271**

**ప్రతిపదార్థం:** పాండవులు= ధర్మజాదులు; తండ్రి చచ్చిన ప్రజలు= తండ్రిలేని బిడ్డలు; వారిన్= వారలను; శైశవము+ ఆదిగాఁగన్= చిన్నప్పటినుంచి; అరసి ప్రోచితి(వి)= చక్కగ విచారించి కాపాడావు; నడుమన్= మధ్యలో; నిష్కారణము+అ=

హేతువులేకుండా; దిగన్+విడువన్+తగునె?= వదలి వేయవచ్చునా?; పారము+ఒందంగన్= ఆవలిగట్టు చేరువరకూ; గారవమునన్= ఆదరంతో; రక్షింపు(ము)= కాపాడుము.

**తాత్పర్యం:** 'పాండవులు తండ్రిలేని పిల్లలు. వారిని పసితనంనుంచి చల్లగా కాపాడావు. ఇప్పుడు వారిని కారణం లేకుండా మధ్యలోనే విడిచిపెట్టటం న్యాయం కాదు. కడపటివరకు నీవు ప్రేమతో వారిని కాపాడవలసిందే.

**విశేషం:** 1. 'పాండవులు తండ్రి లేనివారు' అనే మాట ఉద్యోగపర్వంలో బాగా వినబడుతుంది. ధర్మరాజే పాండురాజు పోతూ శ్రీకృష్ణుడిని చూపి వెళ్ళాడని పేర్కొన్నాడు. (ఉద్యో. 3.6) కొడుకులను ఆపదనుండి రక్షించటం, వారికి శుభాలు కలిగించటం తండ్రి బాధ్యత. వంశపారంపర్యంగా వచ్చిన బాధ్యత ధృతరాష్ట్రుడి మీద ఉన్నది. కన్నతండ్రి పోతే వంశంలో పెంపుడు తండ్రిగా వ్యవహరించే పెద్దవాడు ఆ బాధ్యతలు నిర్వహించాలి. ఇది ఉమ్మడి కుటుంబ ధర్మం. దానిని ధృతరాష్ట్రుడికి జ్ఞాపకం చేశాడు శ్రీకృష్ణుడు. కొందరు భావించినట్లు ఈ వాక్యం పాండవుల పట్ల సానుభూతి కలిగించటానికి అన్నది కాదు.

2. ఆ బాధ్యతను ధృతరాష్ట్రుడు ఇదివరలో నిర్వహించాడు. పాండవులను పెంచి పెద్దవారిగా చేశాడు. అయితే ఆరంభించి మధ్యలో కార్యాన్ని దిగవిడవటం ఉత్తముల స్వభావం కాదు. అందువలన ఆ బాధ్యతను అతడి జీవితం ఉండేంత వరకూ కొనసాగించటం న్యాయమని శ్రీకృష్ణుడు ప్రబోధించాడు. (సంపా.)

**వ. పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ జెప్పుమని నాకుం జెప్పిన విధంబు వినుము: తన పంపునం బండ్రెండు వత్సరంబులు వనంబున వసియించితిమి. పదుమూఁడగునేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జలిపితిమి; మా తండ్రి సమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్టునుం బడయుదు మని కృతనిశ్చయులమై పడితిమి; తల్లియుఁ దండ్రియు నెల్ల చుట్టంబులు నేడుగడయును మాకుఁ దాన; మావలన నేరమి గల్గినం గినిసి యిట్లుగా దట్లని చక్కం బెట్టునది; తనగల పది వేలేండ్లకుం దన్నకాని మఱియెఱుంగ మెట్టివారమైనను మమ్మును దుర్యోధనాదులనుం దలంపరు తనయందుఁదెఱంగు గలిగిన నెవ్వరు గొఱగాకున్నను గులంబుపాడి సెడక చెల్లునని' రని పలికి మఱియు నిట్లనియె: 272**

**ప్రతిపదార్థం:** పాండు కుమారులు; నీకున్; పరమభక్తిన్= మిక్కిలి భక్తితో; ప్రణమిల్లి= నమస్కరించి; అందఱున్; ఒక్కమాటగా= ఏకవాక్యంగా; నీతోన్; చెప్పుము+అని; నాకున్; చెప్పిన విధంబు; వినుము; తన పంపునన్= తన ఆజ్ఞచేత; పండ్రెండు వత్సరంబులు= పన్నెండేళ్ళు; వనంబునన్; వసియించితిమి; పదుమూఁడగు+ఏఁడు; జనపదంబునన్= జనులుండే తావున; అజ్ఞాతవాసంబునున్+చలిపితిమి= ఇతరులు మమ్మెరుగకుండేటట్లుగా నివాసం చేశాము; మా తండ్రి సమయంబు పరిపాలించి= మా తండ్రి ఏర్పరచిన ఒడంబడికను నెరవేర్చి; ఏము= మేము; అర్ధరాజ్యంబు; ఎట్టును= ఏ విధంగానైనా; పడయుదుము= పొందగలం; అని, కృతనిశ్చయులము+ఐ= తీర్మానించుకొన్నవారమై; పడితిమి= కష్టాలు అనుభవించాం; తల్లియున్; తండ్రియున్; ఎల్లచుట్టంబులున్, ఏడుగడయును= సర్వవిధాల రక్షించేవాడు; మాకున్, తాన్+అ= అతఁడే; మా వలనన్; నేరమి+కల్గినన్= దోషముంటే; కినిసి= కోపించి; ఇట్లుకాదు; అట్లు+అని; చక్కన్+పెట్టునది= సరిదిద్దవలెను; తన కల పదివేల+ఏండ్లకున్= తాను జీవించిన పదివేల సంవత్సరాలకైనా; తన్నున్+అకాని= తన్నేతప్ప; మఱి+ఎఱుంగము= ఇతరుల నాశ్రయించం; ఎట్టివారము+ఐనను= మే మెటువంటివాళ్ళమైనా; మమ్మును; దుర్యోధన+ఆదులను; తలంపరు= లోకులు భావింపరు; తనయందున్+తెఱంగు+కల్గినన్= తనకు కార్యం సరిదిద్దవలెనన్న తలంపుఉంటే; ఎవ్వరు కొఱ+కాకున్నను= ఎవరు పనికిమాలిన వారైనా; కులంబుపాడి= వంశధర్మం; చెడక; చెల్లును= సాగును; అనిరి; అని పలికి; మఱియున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! పాండునందనులు నీకు పరమభక్తితో నమస్కరించి ఒకే గొంతుతో చెప్పుమని నాతో చెప్పి పంపిన మాటలు చెపుతాను, వినుము. 'తండ్రీ! నీ ఇష్టప్రకారం పన్నెండు సంవత్సరాలు అరణ్యాలలో నివసించాము. పదమూడవ సంవత్సరం విరటుడి పట్టణంలో అజ్ఞాతవాసం కావించాము. ఈ విధంగా ఒడంబడికను నెరవేర్చి మేము రాజ్యంలో సగపాలు పొందగలమని దృఢనిశ్చయంతో ఉన్నాము. మాకు తల్లి, తండ్రి, చుట్టములు- వెయ్యేల సర్వవిధ రక్షకులు మీరే. మా వలన ఏమైనా అపరాధముంటే కోపించి ఇట్లా కాదు అట్లా నడచుకొనండని చెప్పి చక్కబెట్టండి. నీవు పదివేలేండ్లు జీవించినప్పటికినీ నిన్ను దప్ప మరెవ్వరినీ ఎరుగము. ఎట్టివాళ్ళమైననూ, మమ్మూ, దుర్యోధనాదులనూ లోకులు అనుకోరు. నీకు సదభిప్రాయముంటే మాలో ఎవరు కొరగాకపోయినా వంశ ధర్మం చెడక నిలుస్తుంది అని నీతో చెప్పుమన్నారు' అంటూ శ్రీకృష్ణుడు ఆయనతో ఇంకా ఇట్లా అన్నాడు:

**విశేషం:** 1. తండ్రిలేని పాండవులు ధృతరాష్ట్రుడే తమ తండ్రిగా భావించి, భక్తి ప్రపత్తులతో పలికిన మాటల పద్ధతిని గమనించుమని శ్రీకృష్ణుడు వివరించటం ఇందులో ప్రధానాంశం. 'మాటల పద్ధతి' రచనలోని విశేషాంశం.

2. అరణ్యాజ్ఞాత వాసాలు నిర్వహించండని ఆజ్ఞ ఇచ్చింది ధృతరాష్ట్రుడే నట. ఇది ఎట్లా? దుర్యోధనుడి ప్రవర్తనను అడ్డుకొనకుండా ఉపేక్షతో అతడి చర్యలకు రాజముద్ర గౌరవాన్ని కలిగించినవాడు ధృతరాష్ట్రుడు. ప్రవర్తన దుర్యోధనుడిదైనా బాధ్యత ధృతరాష్ట్రుడిదే. అందువలన అతడికి నివేదించుకొనటం.

3. ధృతరాష్ట్రుడు పాండవులకు అర్ధరాజ్యం ఆధికారికంగా ఇచ్చి ఉన్నాడు. అనుద్యూతంలో రాజ్యాన్ని వారు కోల్పోలేదు. ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరంగా ఇచ్చిన రాజ్యభాగం న్యాయంగా పాండవులదే ఔతుందికదా! ఈ విధంగా రెండుసార్లు ధృతరాష్ట్రుడే అర్ధరాజ్యాన్ని పాండవులకు దత్తం చేసి ఉండగా, అరణ్యాజ్ఞాత వాసాల తరువాత వారి కా భాగం సహజంగా చెందుతుంది అని నిర్ధారించి చెప్పి, ఆ భాగాన్ని ఒప్పచెప్పవలసింది ధృతరాష్ట్రుడు. కాని, విచిత్రమేమంటే అతడు తన బాధ్యతను దుర్యోధనుడికి బదిలీ చేశాడు. అట్లని తన ప్రభుత్వాన్ని వదలు కొన్నాడా? లేదు. ప్రభువు తానై ఉండి ప్రభుత్వం కొడుకు దనే ద్వంద్వ వైఖరిని పాండవులు గుర్తించటం లేదు. సమస్య అంతా అక్కడే ఉన్నది. శ్రీకృష్ణుడు కూడా ధృతరాష్ట్రుడి ద్వంద్వ వైఖరిని వ్యంగ్యంగా నిరసిస్తున్నాడు.

4. పాండవులు అన్నివిధాలుగా రక్షకుడు ధృతరాష్ట్రుడని నమ్మి ఉన్నారు కాబట్టి అర్ధరాజ్యం ఎట్లాగూ వస్తుందనే విశ్వాసంతో ఉన్నారు.

5. ఒకవేళ పాండవులవలన ఏవైనా లోపాలుకాని, పొరపాట్లుకానీ ఉంటే వాటిని సరిజేసి కార్యం చక్కబెట్టవలసిన కర్తవ్యం కూడా ధృతరాష్ట్రుడిదే అని ధ్రువపరుస్తున్నారు.

6. పాండవులు ధృతరాష్ట్రుడికి జీవితాంతం కృతజ్ఞులమై ఉంటామంటున్నారు. తమను దుర్యోధనాదులతో సమంగా చూడమంటున్నారు.

7. వంశధర్మం పాటించే న్యాయాన్ని ధృతరాష్ట్రుడు మన్నిస్తే ఎవరు పనికి వచ్చినా, పనికి రాకపోయినా పుత్రులందరూ బాగుపడతారు. కులం వర్ధిల్లుతుంది.

8. తండ్రి చచ్చిన పాండవులు ధృతరాష్ట్రుడిని తండ్రిగా భావించి పలకటంలో విశేషం గమనార్హం. పాండురాజే బ్రతికి ఉంటే కురుపాండవ భేదం ఉండేది కాదు. కలసి ఉండే కుటుంబం కొరకు ఆయన తన సర్వస్వాన్ని ధారపోశాడు. ఆయన గతించటం వలన ధృతరాష్ట్రుడిని తండ్రిగా గౌరవించవలసి వచ్చింది. అయితే పాండవులు త్రికరణశుద్ధిగా పితృభక్తిని పచరిస్తున్నారు. ఇక దాని కనుగుణంగా వ్యవహరించవలసిన న్యాయం ధృతరాష్ట్రుడి మీదే ఉన్నదని శ్రీకృష్ణుడు నిర్దేశిస్తున్నాడు.

9. సంజయుడు 'ధర్మసూతి మెత్తని పులి', 'ఎల్లవారలు నధర్మము నీపయి బెట్టునంతకు న్వినడును, గానడుం; బిదప నీకును నాకు మరల్ప వచ్చునే?' (2.14) అన్న మాటలు ఇక్కడ స్మరణీయాలు.

10. ధర్మజుడి ధర్మనీతి పద్మవ్యూహం వంటిది. మాటలు తేటలుగా ఉన్నా, అందులో నీతి సుడిగుండాలుగా మెలికలు తిరుగుతూ ఉంటుంది. సామోపాయంతో సానబెట్టిన చతురవచనా లివి. (సంపా.)

**ఉ. 'సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపముచేత బొంకుచేఁ**
**బారముఁ బొందలేక చెడఁ బాఱినదైన యవస్థ దక్షు లె**
**వ్వార లుపేక్ష సేసి రది వారల చేటగుఁగాని ధర్మని**
**స్తారక మయ్యు సత్యశుభ దాయక మయ్యును దైవ ముండెడున్.' 273**

**ప్రతిపదార్థం:** సారపుధర్మమున్= శ్రేష్ఠమైన ధర్మమును; విమల సత్యమున్= నిర్మలమైన సత్యమును; పాపముచేతన్= దురితం చేతనూ; బొంకుచేన్= అబద్ధం చేతనూ; పారమున్+పొందన్+లేక= గట్టు చేరలేక; చెడన్ పాఱినది+ఐన+అవస్థన్= చెడటానికి సిద్ధంగా ఉన్న దుర్దశలో; దక్షులు= చక్కదిద్దటానికి సమర్థులు; ఏ+వారలు= ఎవరు; ఉపేక్ష+చేసిరి= అశ్రద్ధ వహిస్తారో; అది= అట్లా ఒప్పరికించటం; వారలచేటు+అగున్= వారికే హాని కలిగిస్తుంది; కాని= కాని; ధర్మనిస్తారకము+అయ్యున్= ధర్మమునుద్ధరించేదిగానూ; సత్యశుభదాయకము+అయ్యును= సత్యానికి మేలు కల్గించేదిగాను; దైవము+ఉండెడున్= దైవం ఆధారంగా ఉంటుంది.

**తాత్పర్యం:** 'ఉత్తమమైన ధర్మం, నిర్మలమైన సత్యం పాపంచేతను, అబద్ధం చేతనూ దరి చేరలేక చెడటానికి సంసిద్ధంగా ఉన్న స్థితిలో వాటిని రక్షించే శక్తి ఉన్నా ఎవరు అడ్డుపడక అశ్రద్ధ వహిస్తారో అది వారలకే హానికరమవుతుంది. ఆ స్థితిలో భగవంతుడు ధర్మమును ఉద్ధరించటానికీ, సత్యమునకు శుభం కలిగించటానికీ ముందుకు వస్తాడు.

**విశేషం:** అలం: యథాసంఖ్యం.

1. పాండవులు సభాసదుల నుద్దేశించి చెప్పుమన్న సందేశ మిది. ఉద్యోగపర్వ తాత్పర్యానికీ, మహాభారత కథాతత్త్వానికీ ఈ పద్యం ఆత్మవంటిది. తెలుగువారు క్లిష్టపరిస్థితులలో భగవంతుడు ధర్మాన్నీ ధర్మాత్ములనూ రక్షిస్తాడనీ, అధర్మాన్నీ, అధర్మాత్ములనూ శిక్షిస్తాడనీ తమ విశ్వాసాన్ని ఈ పద్యం చదివి వ్యక్తం చేస్తూ ఉంటారు. అందువలన తెలుగు సాహిత్యంలో ఈ పద్యం ఒక ధర్మదీపం.

2. మూల తాత్పర్యాన్ని తిక్కన చికిలిపెట్టి తెలుగులో నిర్మించాడు. మూలం-

**"యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం యత్రానృతేన చ**
**హన్యతే ప్రేక్షమాణానాం హతాస్తత్ర సభాసదః ॥**
**విద్ధో ధర్మో హ్యధర్మేణ సభాం యత్ర ప్రపద్యతే**
**న చాస్య శల్యం కృన్తన్తి విద్ధా స్తత్ర సభాసదః**
**ధర్మ ఏతా నారుజతి యథా నద్యనుకూలజాన్ ॥**
**యే ధర్మ మనుపశ్యన్త స్తూష్ణీం ధ్యాయన్త ఆసతే**
**తే సత్య మాహుర్ధర్మం చ న్యాయ్యం చ భరతర్షభ!" (సం. 5.93.48-50)**

ధర్మం అధర్మం చేతా, సత్యం అసత్యం చేతా నశిస్తున్నప్పుడు చూస్తూ ఊరకుంటే సభాసదులకే చేటు మూడుతుంది. ధర్మం అధర్మం చేతిలో దెబ్బతిని సభలోకి ప్రవేశిస్తే దాని బాధను (ముల్లును) తొలగించకపోతే ఆ సభాసదులే దెబ్బతింటారు. అటువంటి వారిని నది తన ఒడ్డున పుట్టిన చెట్లను ప్రవాహంతో పెకలించి వేసినట్లుగా, ధర్మం వారిని ఉన్మూలించివేస్తుంది. కాబట్టి, ధర్మాన్ని సదా పరిశీలిస్తూ, పరిరక్షిస్తూ దానినే ధ్యానిస్తూ కాలం గడిపేవారు సత్యాన్నీ, ధర్మాన్నీ, న్యాయాన్నీ మాత్రమే పలుకుతారు - అని పై శ్లోకాల తాత్పర్యం. వ్యాసుడు మహర్షి, తిక్కన మహాకవి. ఋషివాక్కు ఇతిహాసంలో అర్థప్రధానం, కవి వాక్కు కావ్యేతిహాసంలో శబ్దార్థోభయప్రధానం. మూలానికీ తెలుగుకూ ఈ తారతమ్యం గమ్యం.

3. సారవంతమైన ధర్మం, నిర్మలమైన సత్యం - అంటున్న తిక్కన మాటలలో ఆ విశేషణాలు ఆ విశేష్యాలకు నిత్యధర్మాలుగా పేర్కొనటం గమనార్హం. ధర్మం ఎప్పుడూ సారవంతమైనదే. శక్తిమంతమైనదే, సత్యం ఎల్లప్పుడూ కల్మషం లేనిదే, నిర్మలమైనదే, స్వచ్ఛమైనదే. అవి రెండు స్వయం సమర్థములైనవే. అయితే వాటిని వ్యతిరేకించేవీ, కలతపెట్టేవీ, నశింపజేయ యత్నించేవి పాపం, బొంకు కాని, అవి (వరుసగా) సారవంతం, నిర్మలం కాకపోవటం చేత ధర్మసత్యాలను నశింపచేయలేవు. అయితే, సత్యధర్మాలు ఫలవంతమయ్యే తరుణంలో అవి ఫలించకుండా అడ్డుపడి చెరిచే యత్నాలు చేస్తాయి. అప్పుడు ధర్మసత్యాలు చెడబారే పరిస్థితులు ఏర్పడతాయి. కాని, అవి చెడిపోవు. 'ధర్మో రక్షతి రక్షితః' అనే న్యాయాన్ని అనుసరించి ధర్మాత్ములు, సత్యశీలురు వాటిని తమ శక్తియుక్తులతో రక్షించే యత్నం చేస్తారు. పాపం చేసేవారూ, అబద్ధా లాడేవారూ మానవులే; ధర్మాన్ని రక్షించేవారూ సత్యాన్ని కాపాడేవారూ మానవులే. అయితే ధర్మాన్ని రక్షించేవారు దానికొరకు తమ శక్తిని ధారపోయాలి. సత్యాన్ని రక్షించేవారు సత్యాచరణంలోని అసంబద్ధతను తొలగించి త్రికరణశుద్ధిని ప్రదర్శించాలి. అప్పుడు ధర్మసత్యాలు తమ సార నిర్మలత్వాలను రక్షించుకొనగలుగుతాయి. ఎందుకంటే - ధర్మం సత్యం ఎంతటి గుణాలో అంతటి ఆచరణాలు. ఆచరణలోపం వలననే ధర్మం బలాన్ని కోల్పోయినట్లు, సత్యం మలినమైనట్లు కనపడతాయి. దీనిని తెలిసిన విజ్ఞులు తమ బాధ్యతను తెలిసికొని వాటిని రక్షించి తమను తాము రక్షించుకొనాలి. ఆ విషయంలో ఉపేక్ష చేస్తే వారి చరిత్రలకు ధర్మసత్య కవచాలు తొలగిపోయి బలహీనులై పాపాలకూ, అసత్యాలకూ బలి అయిపోతారు. దక్షులై కూడా తమ ధర్మాన్ని నిజాయితీతో నిర్వహించని వారికి చేటు రాకతప్పదని ఈ సందేశం.

4. మానవులు తమ ధర్మాన్ని నిర్వర్తించకపోతే ధర్మ, సత్యాలు నశించిపోవు. ఎట్లాగంటే వేదాన్ని రక్షించవలసింది బ్రాహ్మణుడు. కాని, అతడు వేద ధర్మాన్ని ఆచరించకపోతే వేదం వెనకబడినట్లుంటుందేమో కాని నశించిపోదు. వేదాన్ని రక్షించిన వాడే బ్రాహ్మణుడనబడతాడు. వేదాన్ని పరమాత్ముడు రక్షించగలడు, ఉద్ధరించగలడు. అట్లాగే ధర్మాన్ని సత్యాన్ని కూడా, అందుకే భగవంతుడు ధర్మోద్ధారకుడు, సత్యశుభదాయకుడు అని ప్రశంసించబడతాడు. ధర్మంలోని సారం, సత్యంలోని విమలత్వం దైవం.

5. ఈ మాటలంటున్న శ్రీకృష్ణుడే పాండవుల దృక్పథంలో దైవం. ధర్మరాజు సత్యశీలుడు. అతడు వంచితుడూ, రాజ్యాన్ని కోల్పోయి బలహీనుడై ధర్మసత్య ఫలాన్ని పూర్తిగా పొందలేని దురవస్థలో ఉన్నట్లు ఇప్పుడు కనపడుతున్నాడు. పాపానికీ, అబద్ధానికీ ప్రతినిధులైన కౌరవుల వలన పాండవులు తమ ప్రయత్నంలో పారం ముట్టలేక నశించిపోతారని తెలుస్తున్నప్పుడు దక్షులైన సభాసదులు ఆ పరిస్థితిని చక్కబెట్టాలి. అది వారి విధ్యుక్తధర్మం. అక్కడ విఫలులైతే వారి ముప్పు వారే కొని తెచ్చుకొంటారని ధ్వని.

6. ఉదాత్తమైన ఈ పద్యాన్ని పెక్కురు పండితులు వ్యాఖ్యానించారు. వారి వాక్యాలలో కొన్ని - శ్రీ భూపతి లక్ష్మీనారాయణ రావుగారి వ్యాఖ్య.

"ఈ పలుకులు గంభీరభావ ప్రధానములైనవి. సత్యధర్మములను భావించుచున్న పాండవు లెట్లును దైవముచే రక్షితు లగుదు రనియుఁ, గౌరవుల వలనఁ గలిగిన యాపదనుండి సత్యధర్మముల నుద్ధరింప సమర్థులయ్యు, నుపేక్ష వహించిన భీష్మాదులు చెడుదురనియు, నీవాక్యములు తెలుపుచున్నవి. భీష్మద్రోణాదులకుఁ గూడ స్వధర్మస్మృతిఁ గలుగఁ జేయుట కృష్ణుని యుద్దేశము.

'ద్రోణ భీష్మ లీ దిక్కు సుమ్మ' అని దుర్యోధనుడు పల్కినట్లు కౌరవుల యుద్ధోత్సాహమంతయు నీయిరువురపైఁ బడియున్నదని కృష్ణుఁ డెఱుఁగును. వారిని యధర్మ ప్రయత్నమునకు విముఖులఁ గావించి, యుద్ధమునఁ బాల్గొనకుండునట్లు చేసినచో కోరలూడ్చిన త్రాచులై, కౌరవులు సంధి కొప్పుకొందురని కృష్ణుని యాశయము. కనుక, ధర్మనాశము నెడ నౌదాసీన్యము కూడ నధర్మమే యగునని భీష్మాదులు కీవాక్యములు సూచించుచున్నవి." (భారతము: తిక్కన రచన. పు. 57-58).

7. డా. పాటిబండ మాధవశర్మగారి వ్యాఖ్య:- "ఈ సందేశమున కురుక్షేత్ర సంగ్రామ పర్యవసానము వ్యంగ్యముగా సూచింపబడినది. ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమున ధర్మసత్యములకు అధర్మ+అసత్యములతో సంఘర్షణ తటస్థించినది. అధర్మాసత్యములే బలవత్తరములై ధర్మసత్యములు గట్టెక్కజాలని యవస్థ వచ్చినది. ధర్మము గమ్యము చేరలేక చెడబారుట లోకవినాశమునకు హేతువగును. లోకకల్యాణము నభిలషించువారెల్లరును ధర్మవిజయమునకు తోడ్పడవలయును. అధర్మ విజృంభణమును నిరోధింపవలయును. అట్లు చేయుటకు దక్షత కలిగియుండియు ఉదాసీన భావముచేత గాని, పక్షపాతముచేత గాని సత్యధర్మ నాశనమును కనులారా చూచుచు ఎవ్వ రుపేక్షింతురో వారి వినాశనమునకే ఆ యుపేక్ష కారణ మగును. ఉపేక్షాభావమున వారు తమ కర్తవ్యము నిర్వర్తింపనంత మాత్రమున సత్యధర్మముల కెట్టి క్షతియు కలుగదు. ధర్మమునకు, సత్యమునకు దైవము ఎప్పుడును అండగా నుండును. ధర్మమును ఒడ్డెక్కించును. సత్యమునకు శుభము కూర్చును. అట్టి దైవమైన శ్రీకృష్ణుడు తమకు రక్షగా నున్నాడనియు, సమర్థులైన భీష్మద్రోణాదులు ఉదాసీనత వహించినను, కౌరవపక్షమున నిల్చినను వారు నశించుట తప్పదనియు పాండవుల సందేశమందలి వ్యంగ్యార్థము." (తిక్కన కవితా వైభవము: యువభారతి ప్రచురణ. పు. 27-28)

8. ప్రసాదగుణంలో పర్యవసించే గుణం అర్థవ్యక్తి ఇందులో పోషించబడింది. ఝటిత్యర్థ ప్రతిపత్తి హేతుత్వం శబ్దగుణమైన అర్థవ్యక్తి లక్షణం. వస్తు స్వభావ స్ఫుటత్వం అర్థగుణమైన అర్థవ్యక్తి. నన్నయ తిక్కనలకు అర్థవ్యక్తి అంటే అలవిమాలిన అభిమానం. నన్నయలో శబ్దగుణమైన అభివ్యక్తి. తిక్కన రచనలో అర్థగుణమైన అర్థవ్యక్తి బలంగా ఉన్న అనర్ఘరత్నాలవంటి పద్యాలు వెలువడ్డాయి. తిక్కన రచనలో ఈ పద్యం ఉజ్జ్వ లోదాహరణం. ధర్మరక్షాదక్షమైన దైవం యొక్క స్వభావాన్ని వ్యాఖ్యానించే వాక్యసముదాయం ఇందులో ప్రసన్నంగా ప్రకాశిస్తున్నది కాబట్టి అర్థవ్యక్తి అర్థవంతంగా అవతరించింది. (సంపా.)

**వ. అని యీ సభ్యులకుం జెప్పుమనిరి; నీవును సభాసదులైన రాజులు నేమనియెద రనుం; డేను ధర్మంబును నీతియుఁ జుట్టఱికంబును మున్నిడుకొని మనోవాక్ప్రకారంబు లేక రూపంబైన సత్యంబకాఁ జెప్పితి; నిత్తెఱంగు మీకు మేలు; క్రోధమాన మత్సరంబులు విడిచి యిట్లు సేయుండు. 274**

**ప్రతిపదార్థం:** అని; ఈ సభ్యులకున్= సభలోని పెద్దలకు; చెప్పుము+అనిరి= చెప్పవలసినదిగా పాండవులు నన్ను కోరారు. నీవును; సభాసదులు+ఐన రాజులు= సభలో ఉన్న దొరలు; ఏమి+అనియెదరు+అనుండు= ఏమిచెపుతారో చెప్పండి; ఏను= నేను; ధర్మంబును= న్యాయమును; నీతియును= రాజనీతిని; చుట్టఱికంబును= బాంధవమును; మున్ను+ఇడుకొని= ముందుంచుకొని; మనః వాక్+ప్రకారంబులు= మనసు యొక్క వాక్కు యొక్క వైఖరులు; ఏకరూపంబు+ఐన= ఒకే విధమైన; సత్యంబకాన్= సత్యమునే;చెప్పితిన్; ఈ+తెఱంగు= ఈ విధం; మీకున్; మేలు= మంచిని కలిగిస్తుంది; క్రోధ మానమత్సరంబులు= కోపం, గర్వం, ద్వేషం; విడిచి; ఇట్లు+చేయుండు= నేను చెప్పిన రీతిని ఆచరించండి.

**తాత్పర్యం:** పాండవులు సభలోని పెద్దలకు నన్ను చెప్పుమని కోరినమాటలు చెప్పాను. మహారాజా! నీవూ, సభలోని రాజులూ ఇందుకు బదు లేమి చెపుతారో చెప్పండి. నేను నీతి ధర్మాలనూ, బాంధవాన్నీ ముందుంచుకొని మనో వాక్కులు ఏకరూపంగాఉన్న సత్యమునే చెప్పాను. నే చెప్పిన పద్ధతి మీకు మేలు గలిగిస్తుంది. కోపం గర్వం ద్వేషం వదలి, నేను చెప్పినట్లు చేయండి.

**విశేషం:** 1. శ్రీకృష్ణుడి సందేశంలో ధర్మం, నీతి చుట్టరికం అనే అంశాల మేళవింపు కనబడుతుంది. ధర్మం విశ్వవ్యాప్తం, నీతి కార్యవ్యాప్తం, చుట్టరికం వ్యక్తి సంబంధి - ఈ మూడూ పరస్పరం విరుద్ధం కాకుండా ఉండటం ధర్మనీతివర్తనం. శ్రీకృష్ణుడి సందేశం దానికుదాహరణం.

2.మనోవాక్కాయ కర్మలు ఏకమై వ్యక్తమైన వాక్కు సత్యం. శ్రీకృష్ణుడు త్రికరణశుద్ధిగా పలికిన ఈ సందేశం సత్యం. అంటే నిజాయితీతో కూడుకొన్న నిజం.

3. శ్రీకృష్ణుడి సత్యవాక్కును గుర్తించాలంటే క్రోధం, అభిమానం, మాత్సర్యం అనే గుణాలు మాని ఆలోచించాలి. క్రోధం వలన ధర్మం దర్శనమివ్వదు. అభిమానం వలన నీతి యొక్క నిజస్థితి స్ఫురించదు. మాత్సర్యం వలన చుట్టరికపు ప్రేమ మనసులో మోసులెత్తదు. ఆ మూడు అవగుణాలను వదలితే శ్రీకృష్ణుడి సందేశంలోని నిజస్థితి గోచరిస్తుంది. క్రోధ మాన మత్సరాలకు పుట్టినిల్లు దుర్యోధనుడు. అతడి అంశలుగా క్రోధంతో దుశ్శాసనుడు, మానంతో కర్ణుడు, మత్సరంతో శకుని ఎప్పుడూ మసలుతుంటారు. వారికి శ్రీకృష్ణుడి సందేశ తాత్పర్యం సవ్యంగా స్ఫురించదని ధ్వని. (సంపా.)

**ఆ. పాండవులకుఁ దగిన పాలు మేదిని బంచి । యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు?**
**ధర్మమెద్ది? సముచితంబగు విధమెద్ది? । శక్యమెద్ది? చెపుఁడ వాక్యవిదులు! 275**

**ప్రతిపదార్థం:** పాండవులకున్= పాండుపుత్రులకు; మేదినిన్= పుడమిలో; తగినపాలు= రా దగిన భాగం; పంచి+ఇచ్చుకంటెన్= పంచి ఇవ్వటం కంటె; కార్యము+ఎద్ది+కలదు?= చేయదగిన పని మరేముంది?; ధర్మము+ఎద్ది?= ఇంతకంటె న్యాయమేముంది?; సముచితంబు+అగు విధము+ఎద్ది?= మిక్కిలి తగిన తెఱంగు వేరొక టేముంది?; శక్యము+ఎద్ది?= మీకు వీలైన పని ఇంకొకటి ఏమున్నది?; వాక్య విదులు= మాటలతీరెరింగిన పెద్దలారా!; చెపుఁడ= చెప్పండి.

**తాత్పర్యం:** కౌంతేయులకు పుడమిలో తగిన భాగం పంచి ఇవ్వటంకంటె మంచి పని మరొక టేముంది? ధర్మం వేరేముంది? ఇంతకంటె తగిన తెరగు అన్యమేముంది? మీకు శక్యమైనది ఇంతకన్న ఏముంది? వాక్య పద్ధతి నెరింగిన పెద్దలు మీరే చెప్పండి.'

**విశేషం:** ఇంతవరకు నాలుగంచెలుగా సాగిన శ్రీకృష్ణ సందేశంలో ధర్మశాస్త్ర తర్కశాస్త్ర పండితులు పరిశీలిస్తే నాలుగు నిర్ణయాలకు రాకతప్పదనే హెచ్చరిక ఇందులో ఉన్నది. 1. పాండవులకు రాజ్యభాగ మీయటమే కార్యం. 2. అదే ధర్మం. 3. అదే సముచితమైన నీతి. 4. అదే ప్రస్తుతం సాధ్యమైన పని. శ్రీకృష్ణుడే సభాభిప్రాయాన్ని ఏకోన్ముఖం చేసి వారిచేత ఒప్పించేటట్లు ధ్రువీకరిస్తూ మాట్లాడాడు. సమర్థుడైన వక్త సాధించే ప్రబోధఫల మిది. (సంపా.)

**క. అని పలికి మహారాజా । వినుమని ధృత రాష్ట్రు తోడ వెండియుఁ దా ని**
**ట్లని చెప్పె వాసుదేవుఁడు । తనమది నఱలేక కార్యదశ దెలియంగన్. 276**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; మహారాజా!= భూవల్లభా ధృతరాష్ట్రా!; వినుము+అని; ధృతరాష్ట్రుతోడన్; వెండియున్= మరల; కార్యదశ తెలియంగన్= కార్యపద్ధతి విశదమయ్యేటట్లు; వాసుదేవుఁడు= శ్రీకృష్ణుడు; తన మదిన్= తన హృదయంలో; అఱలేక= మర్మంలేక; తాన్+ఇట్లు+అని చెప్పెన్= తా నీ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఇట్లా వచించి శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడితో రాజా! నా మాటలు విను' మంటూ మనసులో మర్మం ఉంచుకోక కార్యపద్ధతి తేటతెల్లమయ్యేటట్లు మళ్ళీ ఈ విధంగా పలికాడు:

**ఆ. 'వారి తండ్రిపాలు వారికి నిచ్చి నీ। పాలు నీవుఁ బుత్త్ర పౌత్ర చయము**
**ననుభవించి సుఖులరై యుండుఁ డిది బంధు। మిత్త్ర సుజనకోటి మెచ్చు తెఱఁగు. 277**

**ప్రతిపదార్థం:** వారి తండ్రిపాలు= పాండవుల తండ్రి భాగం; వారికిన్+ఇచ్చి= పాండవులకు ఇచ్చి; నీ పాలు= నీ రాజ్యభాగం; నీవున్= నీవూ; పుత్త్రపౌత్ర చయమున్= నీ కొడుకులయొక్క మనుమలయొక్క సమూహం; అనుభవించి= కుడిచి; సుఖులరు+ఐ+ ఉండుఁడు= హాయిగా జీవించండి; ఇది= ఇట్లా ఉండటం; బంధుమిత్ర సుజనకోటి= చుట్టముల స్నేహితుల సత్పురుషులయొక్క సముదాయం; మెచ్చుతెఱఁగు= కొనియాడువిధమై ఉన్నది.

**తాత్పర్యం:** 'రాజా! పాండవుల తండ్రి భాగం పాండవుల కిచ్చి; నీ రాజ్యభాగం నీ కుమారులు, నీ మనుమళ్ళూ హాయిగా అనుభవిస్తూ ఉంటే చుట్టాలూ, స్నేహితులూ, సత్పురుషులూ మిమ్ము కొనియాడుతారు.

**విశేషం:** ఈ పద్యంలో శ్రీకృష్ణుడు పాండవ పక్షంగానే కాక బంధుమిత్ర సుజనకోటిపక్షాన, వారందరి ఏకగ్రీవాంగీకారంగా, ఫలితాంశాన్ని ప్రకటించటం గమనిస్తే, ధృతరాష్ట్రుడిని ఏకాకి చేసి, అంగీకరించక తప్పనిదైన ఒత్తిడి స్థితిని కల్పించే నీతి వలె కనపడుతుంది. అయినా, అది న్యాయమని అందరికీ అనిపిస్తుంది. ధర్మజుడు ఆశించిన ఫలితాన్ని శ్రీకృష్ణు డింతవరకు విజయవంతంగా సాగించాడు. (సంపా.)

**క. ఎఱుఁగవె యజాతశత్రుని। నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నె**
**త్తెఱఁగున ననువర్తించెనొ। యెఱుఁగవె? తగు చేవ గలుగు టెఱుఁగవె? యధిపా! 278**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; అజాతశత్రుని= ధర్మజుడియొక్క; నెఱియును= న్యాయమును; ధర్మంబున్= ధర్మమును; సత్యనిష్ఠయున్= సత్యమునందలి ఉనికియు; ఎఱుఁగవె?= తెలియవా? మిమున్= మిమ్ము; ఏ+తెఱఁగునన్= ఏ విధంగా; అనువర్తించెనొ= అనుసరించిమెలగెనో; ఎఱుఁగవె= తెలియవా?; తగుచేవ= తగిన శక్తి; కలుగుట= ఆతడు కల్గియుండటం; ఎఱుఁగవె?= తెలియవా?

**తాత్పర్యం:** మహారాజా! ధర్మజుడి న్యాయమూ, ధర్మమూ, సత్యప్రవృత్తీ నీకు తెలుసు. అతడు మిమ్మాశ్రయించుకొని ఎట్లా ఉండినదీ నీకు తెలుసు. తగినశక్తి కలిగి ఉండటం కూడ నీకు తెలుసు.

**విశేషం:** ఇది ధర్మరాజ ప్రశంస. ఆరుగుణాల చేత అతడు అగ్రగణ్యుడు.

1. అజాతశత్రుత్వం-ఎదుటివారు అతడిని శత్రువనుకొనవచ్చునేమో కాని అతడు ఎదుటివారిని ఎప్పుడూ శత్రువని భావించడు. ఇది అపూర్వగుణం. మహాభారత చక్రవర్తులలో ధర్మరాజుకే చెల్లింది. 2. న్యాయం తప్పని లోకనీతి. 3. ధర్మం తప్పని వేదనీతి. 4. సత్యం తప్పని వ్యక్తి నీతి. 5. పెద్దల మాట తప్పని వంశనీతి. 6. రాజ్యం పాలించగలిగిన శక్తి - ప్రభునీతి. ఈ ఆరుగుణాలు ఉత్తమ వంశకర్తకుండే లక్షణాలు. సారపు ధర్మం, విమలసత్యం ధర్మజుడి జీవిత రథచక్రాలు. (సంపా.)

**వ. అది యెల్ల నీ వెఱుంగు; దైనను దెలియఁ జెప్పెద విను; మింద్రప్రస్థపురంబున నుండి పాండవాగ్రజుండు నీకుం బెంపునుం బేరునుం జేయం గోరి. 279**

**ప్రతిపదార్థం:** అది+ఎల్లన్= అది అంతయూ; నీవు+ఎఱుంగుదు= నీకు తెలియును; ఐనను; తెలియన్+చెప్పెదన్+వినుము= తేటతెల్లంగా తెలుపుతాను వినుము; ఇంద్రప్రస్థపురంబునన్+ఉండి; పాండవ+అగ్రజుండు= పాండవులలో తొలుత జన్మించిన ధర్మజుడు; నీకున్; పెంపునన్= గౌరవమును; పేరునున్= ప్రఖ్యాతిని; చేయన్+కోరి= కలిగింపనెంచి.

**తాత్పర్యం:** ధర్మజు డెటువంటివాడో నీ వెరుగుదువు. అయినప్పటికీ స్పష్టంగా చెపుతాను, విను. అతడు ఇంద్రప్రస్థపురంలో ఉంటూ నీకు గౌరవఖ్యాతులు కలిగింప నెంచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. మద మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁజే**
**యుదునని పూని దిగ్విజయ మున్నతిఁజేసి మహావిభూతితో**
**మదిమదినుండ నీ సుతుఁడు మంత్రులు సౌబలు జూదమార్చి సం**
**పద గొని యంతఁ బోవక సభన్ ద్రుపదాత్మజ భంగపెట్టరే. 280**

**ప్రతిపదార్థం:** మదము+అడఁగించి= గర్వాన్ని తొలఁగించి; భూపతి సమాజమున్+ఎల్లను= రాజలోకమంతటినీ; నిన్నున్= నిన్ను; కొల్వన్+చేయుదున్+అని= సేవించేటట్లు చేయుదునుగాక అని; పూని= పూనుకొని; దిగ్విజయము= దిగ్జయమును; ఉన్నతిన్+చేసి= గొప్పగా కావించి; మహావిభూతితోన్= గొప్ప ఐశ్వర్యంతో; మది మదిన్+ఉండన్= నెమ్మదిగా ఉండగా; నీ సుతుఁడు= నీ కుమారుడైన దుర్యోధనుడు; మంత్రులు= అతడికి ఆలోచనచెప్పే కర్ణదుశ్శాసనులు; సౌబలున్= సుబలుని పుత్రుడైన శకునిని; జూదము+ఆర్చి= జూదమాడించి; సంపదన్+కొని= సిరిని హరించి; అంతన్+పోవక= అంతటితో విడువక; ద్రుపద+ఆత్మజన్= ద్రౌపదిని; సభన్= కొలువులో; భంగపెట్టరే= అవమానించినారు గదా!

**తాత్పర్యం:** రాజుల దర్పమడచి వారందరు నిన్ను కొలిచేటట్లు చేయటానికై ధర్మనందనుడు గొప్పగా దిగ్విజయం చేసి మిక్కుటమైన సిరిసంపదలతో తులతూగుతూ నిమ్మళంగా ఉన్నాడు. అప్పుడు నీ తనయుడూ, అతని మంత్రులూ చేరి శకునిచే జూదమాడించి ధర్మజుడి సంపదనెల్ల హరించారు. అంతటితో తృప్తిపడక నిండుసభలో ద్రౌపదిని పరాభవించారు.

**విశేషం:** 1. ధర్మరాజు దిగ్విజయం చేయటం ధృతరాష్ట్రుడి ఔన్నత్యాన్ని పెంచటానికే అన్నాడు కృష్ణుడు.

2. దిగ్విజయంలో ఓడిన రాజులు దుర్యోధనుడికి సాయం చేస్తున్నారు. వారి నుద్దేశించి చెప్పిన మాట ఇది. దిగ్విజయం చేసింది ధర్మరాజు; దాని ఫలితాన్ని అనుభవిస్తున్నది ధృతరాష్ట్రుడు. ఆ యుద్ధాలన్నీ ధృతరాష్ట్రుడి సంపదను పెంచటానికే అని వారు గ్రహించి పాండవులయందు సాముఖ్యాన్ని వహించాలని శ్రీకృష్ణుడి అభిప్రాయం.

3. ధర్మజుడు తండ్రిపెంపుగోరి సంపద గడిస్తే, దుర్యోధనుడు తండ్రికి కళంకం తెచ్చేటట్లు సంపద హరించాడు. అంతేకాదు ద్రౌపదిని నిండుసభలో భంగపరచి తండ్రికి తలవంపులు తెచ్చాడు. తులనాత్మక విచారంతో ఎవరు యోగ్యులో తేల్చుకొనుమని సూచన. తండ్రి పెంపుకు కృషి చేసిన కొడుకుకు కీడు తలపెట్టటం తగదని హితవు. (సంపా.)

**ఉ. దానికి నీ వొడంబడితి; ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం**
**బూని వృకోదరార్జునులు భుగ్నులుగాఁ బెడచేతఁ గన్ను నీ**
**రూనఁగ నొత్తుకొంచుఁ జని యుగ్ర వనంబున దుఃఖమగ్నుఁడై**
**దీనత నుండి పూన్కి దగఁ దీర్చియుఁ గూడి మనంగఁ గోరెడిన్. 281**

**ప్రతిపదార్థం:** దానికిన్= దుర్యోధనుడి దుష్టచేష్టకు; నీవు+ఒడంబడితి(వి)= నీవు సమ్మతించావు; ధర్మజుఁడు= ధర్మరాజు; అంతయున్+చూచి= పరిస్థితి నాకళించుకొని; సత్యమున్+పూని= సత్యం అవలంబించి; వృకోదర+అర్జునులు= భీమార్జునులు; భుగ్నులుగాన్= విఱిగినవారు కాగా, క్రుంగినవారుకాగా; కన్ను= నేత్రములు; నీరు+ఊనఁగన్= కన్నీరు వహించగా; పెడచేతన్=

వెనుక చెయ్యితో; ఒత్తుకొంచున్= తుడుచుకొంటూ; చని= వెళ్ళి; ఉగ్రవనంబునన్= ఘోరారణ్యంలో; దుఃఖమగ్నుఁడు+ఐ= శోకమునందు మునిగినవాడై; దీనతన్+ఉండి= దైన్యంతో పడియుండి; పూన్కిన్= ప్రతిజ్ఞను; తగన్+తీర్చియున్= సక్రమంగా నిర్వహించికూడా; కూడి= మీతో కలసిమెలసి; మనంగన్= జీవించాలని; కోరెడిన్= కోరుకొంటున్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడి దుష్కృత్యాలకు నీవు సమ్మతించావు. ధర్మరాజు తనకేర్పడిన సంకటాన్ని గమనించి సత్యం తప్పక తన ఆజ్ఞచేత భీమార్జునులు బలముడిగి క్రుంగిపోగా కంటినుండి కారుకన్నీటిని పెడచేతితో తుడిచికొంటూ ఘోరారణ్యాలకు వెళ్ళాడు. అక్కడ దుఃఖాలలో మునిగి దైన్యం అనుభవిస్తూ ప్రతిజ్ఞను సక్రమంగా నెరవేర్చికూడా నేడు మీతో ఒద్దికగా జీవించవలెనని కోరుకుంటున్నాడు.

**విశేషం:** 1. దుర్యోధనుడు చేసిన దుర్నయం క్షమార్హం కానిది. అయినా, దానికి ధృతరాష్ట్రుడు అంగీకరించి ఆ పాపభారాన్నంతా తన తలమీద వేసికొన్నాడు. అందుచేత పాండవులు అరణ్య అజ్ఞాతవాసాలు ఆయాసపడుతూనే సత్యవ్రతంగా నిర్వహించారు. అడవులలో అన్ని యాతనలు పడికూడా పగ సాధించే క్రౌర్యానికి పోకుండా, అన్ని అపకారాలు చేసినా కౌరవులతో కలిసి జీవించాలని కోరుతున్నారు. అజాతశత్రువు శీలానికి ఇంతకంటె నిదర్శన మే ముంటుంది? - అని ధర్మజుడి ధీరోదాత్తతను, శాంతికాముకత్వాన్నీ బంధుప్రీతిని సమర్థవంతంగా సభలో తెలియచెప్పాడు.

2. భీమార్జునులు కన్నీరొత్తుకొంటూ వెళ్ళినట్లు చెప్పిన అంశం సాభిప్రాయం. వారు క్రోధమూర్తులు. యుద్ధాన్నే కోరుతున్నారు. అయినా, వారిని తగిన విధంగా నియంత్రించి సత్యధర్మాలను పాటిస్తున్నాడు ధర్మరాజు. అతడివలె ధృతరాష్ట్రుడు కూడ తన పుత్రులను అదుపులో పెట్టి పాండవులకు న్యాయం చేయాలని హెచ్చరిక. (సంపా.)

**క. తనుఁ దాన పోలుఁగా కే। మనవచ్చు? నజాతశత్రు నతిశాంతతయున్**
**వినయము సత్యము ము న్నే। జనపతులకుఁ గలవు సెపుమ? సౌజన్యనిధీ! 282**

**ప్రతిపదార్థం:** సౌజన్యనిధీ!= మంచితనానికి స్థానమైనవాఁడా!; తనున్+తాను+అ+పోలున్+కాక= ఆతడికి అతడే సాటిఅగును; ఏమి+అనన్+వచ్చున్?= అతడిని ఎంతని కొనియాడగలము?; అజాతశత్రు= ధర్మజుడియొక్క; అతి= మిక్కుటమైన; శాంతతయున్= శాంతస్వభావమూ; వినయమున్= అణకువా; సత్యమున్= సత్యమూ; మున్ను= పూర్వం; ఏ జనపతులకున్+ కలవు= ఏ రాజులకున్నాయో; చెపుము+అ= చెప్పుము.

**తాత్పర్యం:** ధర్మపుత్రుడికి సాటి ధర్మపుత్రుడే. అతడిని ఎంతని కొనయాడగలం? ఆయన శాంతస్వభావం, అణకువ, సత్యనిష్ఠ ఇంతకుమునుపు ఏ రాజులకున్నవో చెప్పు.

**విశేషం:** 1. అలం: అనన్వయం, కావ్యలింగం. "ఉపమానోపమేయత్వం యదేక స్యైవ వస్తుతః". ఒకే వస్తువుకు ఉపమానత్వం, ఉపమేయత్వం కూడా చెప్పితే అనన్వయం. ధర్మజుడు తనకు తానే పోలినవాడు అనటం అనన్వయం. సాటి లేని మేటి వ్యక్తిత్వం ధ్వని. మహాభారత పురుషులలో శ్రీకృష్ణుడిని మించిన మహాపురుషుడు లేడని ప్రసిద్ధి. అతడి ప్రశంస పొందిన ధర్మరాజు ధన్యజీవి.

2. "సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్" అని కావ్యలింగాలంకార లక్షణం. అతడి కతడే సాటి అయిన ధర్మరాజును ప్రశంసించటానికి మాటలు లేవట! శాంతవినయ సత్యగుణాలలో అతడివంటివారు అంతవరకు లేరట! ఇది అతిశయోక్తిగా ఉన్నా ధర్మజుడి అనన్యత్వాన్ని సమర్థించే వాక్యమే- అందుకు కావ్యలింగం.

3. ధర్మజుడి వంటి రాజులు అంత వరకు పుట్టలేదన్న ప్రశంస సమకాలీనులైన ప్రభువులలో గల అతడి నిరుపమాన వ్యక్తిత్వాన్ని ధ్వనిస్తున్నది. (సంపా.)

**క. ఏ నిం తాడితి నీ సం। తానం బిరుదెఱఁగునకు హితము గోరి భవ**
**త్సూనుని మతి యతిలోభము। మానిచి పాండవులఁ దెమ్ము మనుజాధీశా! 283**

**ప్రతిపదార్థం:** మనుజ+అధి+ఈశా!= నరనాథా!; నీ సంతానంబు= నీ బిడ్డలైన; ఇరు+తెఱఁగునకున్= రెండు పక్షాల వారికి; హితమున్+కోరి= మేలు దలచి; ఏను= నేను; ఇంత+ఆడితిన్= ఇన్నిమాటలు చెప్పాను; భవత్+సూనుని= నీ కొడుకైన దుర్యోధనుడియొక్క; మతి+అతిలోభమున్= మనస్సునందలి మిక్కిలి దురాశను; మానిచి= తొలగించి; పాండవులన్+తెమ్ము= పాండవులను నీ కడకు రప్పించుకొనుము.

**తాత్పర్యం:** మంచితనంగల ధృతరాష్ట్ర మహారాజా! నీ బిడ్డలైన కురుపాండవుల మేలు గోరి నే నిన్నిమాటలు చెప్పవలసి వచ్చింది. నీ పుత్త్రుడైన దుర్యోధనుడి మనసులో ఉన్న పరమ దురాశను తొలగించి, పాండవులను నీ చెంతకు పిలిపించుకొనుము.

**విశేషం:** ధర్మరాజ ప్రశంస ప్రయోజనం అతడిని పిలిపించటం కొరకే. దానికి ప్రతిబంధకంగా నిలిచే దుర్యోధనుడి లోభాన్ని నియమించటం కొరకే. (సంపా.)

**ఉ. వారలు శాంతశూరులు; భవచ్చరణంబులు గొల్వఁబూని యు**
**న్నారటుఁగాక మీ కది మనంబున కప్రియమేని నింతకుం**
**బోరికి వచ్చుచుండుదురు; భూవర! రెండు దెఱంగులందు నీ**
**కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా!' 284**

**ప్రతిపదార్థం:** వారలు= కౌంతేయులు; శాంతశూరులు= శాంతస్వభావులున్నూ, పరాక్రమవంతులున్నూ; భవత్+చరణంబులు= నీ పాదాలు; కొల్వన్= సేవించటానికి; పూని+ఉన్నారు= సంసిద్ధంగా ఉన్నారు; అటున్+కాక= అట్లాకాక; మీకున్= మీకు; అది= పాండవుల పొత్తు; మనంబునకున్= మీ మనస్సులకు; అప్రియము+ఏనిన్= ఇష్టంకానిచో; ఇంతకున్= ఈపాటికి; పోరికిన్= యుద్ధానికి; వచ్చుచున్+ఉండుదురు= వస్తూ ఉంటారు; భూవర!= రాజా!; రెండు తెఱంగులందున్= సంధి సంగ్రామాలలో; నీకున్= నీకు; ఆరయన్= ఆలోచించగా; ఏది పథ్యము+అగున్= ఏది హితమౌతుందో; ఆ+విధము= ఆ తెఱగు; ఏర్పడన్+నిశ్చయింపుమా!= తేటపడేటట్లు తీర్మానించుము.

**తాత్పర్యం:** మహారాజా! పాండవులు ఎంతటి శాంత స్వభావులో అంతటి వీరాగ్రేసరులు. వారు నీ పాదసేవ చేయటానికి సంసిద్ధంగా ఉన్నారు. వా రట్లా మీతో కలసి మెలసి వర్తించటం మీకు ఇష్టంకాకపోతే ఈ పాటికి కదనం కావించటానికి బయలుదేరి వస్తుంటారు. సంధి, సంగ్రామం - ఈ రెండింటిలో మీ కేది హితమని తోస్తుందో దానిని నిర్ణయించి వెల్లడించండి.'

**విశేషం:** 1. అలం: విషమం. "విషమం వర్ణ్యతే యత్ర ఘటనాననురూపయోః" అననురూపాలైన వాటికి సంబంధం వర్ణిస్తే విషమాలంకారం. పాండవులు శాంతశూరులు - అనే వాక్యం చక్కని ఉదాహరణం. శాంత శూరత్వాలు అననురూపాలైన

గుణాలు. పాండవులు అట్టి గుణాలు కలవారని భావం. తిక్కన ధర్మరాజును - 'మెత్తనిపులి' అని అన్నాడు. పాండవులను 'శాంతశూరులు' అని పేర్కొన్నాడు. తెలుగు సాహిత్యంలో ఈ బిరుద విశేషణాలు తిక్కన ప్రతిభావైభవానికి కీర్తి పతాకలు.

2. శాంతులు కాబట్టి ధృతరాష్ట్రుడిని సేవించాలని భావిస్తున్నారు. ధృతరాష్ట్రుడు వారికి రాజ్యభాగమిచ్చి మన్నించకపోతే శూరులవలె యుద్ధానికి సిద్ధమౌతారు. సహజంగా వారు శాంతులు, అవసరం వస్తే వారు శూరులు. ధృతరాష్ట్రుడు పాండవుల నెట్లా ప్రవర్తించవలెనని కోరుకొంటున్నాడో తేల్చిచెప్పాలని సభలో నిలదీసి అడిగాడు కృష్ణుడు. ఇది సందేశంలోని తారాస్థాయి (క్లైమాక్స్). (సంపా.)

**చ. అనవుడు రోమహర్షణము లంగములం బొడమన్ సదస్యు లె**
**ల్లను బ్రియమంది నెమ్మనములం 'బురుషోత్తముఁ డింత యొప్పఁ బ**
**ల్కునె? మఱుమాటలాడ నయకోవిదుఁ డెవ్వఁడు? ధీరుఁడెవ్వఁ? డిం**
**దనువరి యెవ్వఁ' డంచు నచలాకృతులై నెఱి నూరకుండఁగన్. 285**

**ప్రతిపదార్థం:** అనవుడున్= శ్రీకృష్ణుడు అట్లా పలుకగా; అంగములన్= శరీరములందు; రోమహర్షణములు= గగుర్పాటు; పొడమన్= కలుగగా; సదస్యులు+ఎల్లను= కొలువులోని వారంతా; ప్రియము+అంది= హర్షించి; నెమ్మనములన్= తమ నిండు మనసులలో; పురుషోత్తముఁడు= శ్రీ కృష్ణుడు; ఇంత+ఒప్పన్+పల్కునె= ఇంత బాగా మాట్లాడుతాడా? (ఎంతబాగా మాట్లాడాడు? అని భావం); మఱుమాటలు+ఆడన్= ఆ మాటలకు బదులు పలకటానికి; ఇందున్= ఈ సభలో; నయకోవిదుఁడు+ ఎవ్వఁడు?= నీతిశాస్త్ర నిపుణుడు ఎవడున్నాడు?; ధీరుఁడు+ఎవ్వఁడు?= ధైర్యశాలి ఎవడున్నాడు?; అనువరి+ఎవ్వఁడు?= ఉపాయశాలి ఎవడున్నాడు?; అంచున్= అని పలుకుతూ; అచల+ఆకృతులు+ఐ= చలించని ఆకారాలు గలవారై; నెఱిన్= ఒప్పుగా; ఊరక+ఉండఁగన్= మిన్నకుండగా.

**తాత్పర్యం:** శ్రీ కృష్ణుడి మాటలు వినగానే సభ్యులందరి శరీరాలు గగుర్పాటు వహించాయి. వారు మనస్సులలో ఎంతో సంతోషించి, 'నారాయణు డెంత ఒప్పిదంగా మాటాడాడు! శౌరి మాటలకు ప్రతివచనాలు పల్కగల నీతి నిపుణుడు, ధీరుడు, ఉపాయశాలి ఈ కొలువులో ఎవడున్నాడు' అని కదలక మెదలక నోరు విప్పక అట్లాగే ఉండిపోగా, (తరువాతి వచనంతో అన్వయం.)

**విశేషం:** ఒక మహావక్త ఉపన్యసించినప్పుడు సభాసదులు ఎట్లా సమ్మోహితు లౌతారో వర్ణించిన పద్యమిది.

1. అందరి శరీరాల మీద పులకలు నిలిచాయి. ఇది సాత్త్వికభావం. అప్రయత్నకృతమైన సాత్త్విక చేష్ట అవ్యక్తమైన ఆనందానికి గుర్తు.

2. మనస్సులు సంతోషించాయి- ఇది పద్యఃపరనిర్వృతి వంటిది.

3.'ఇంత ఒప్పఁ బల్కునె?' - అనే మాట ఆశ్చర్య ప్రకటనం. శ్రీకృష్ణ సందేశంలోని వస్తువుకు శ్రోతలు అబ్బురపాటు పడిన వైఖరి.

4. 'మారుమాటాడే నీతికోవిదు డెవ్వడున్నాడు?' అన్నది ఆశ్చర్యజనకమైన ప్రతిస్పందన. శ్రీకృష్ణుడి సందేశోపన్యాసంలో చెప్పిన దెంత బాగుందో, చెప్పినతీరు అంతకంటె బాగుంది. దానికి తిరుగుచెప్పే పండితులు లేరని భావం. ఇది బుద్ధిమంతుల ప్రశంస.

5. 'ధీరు డెవ్వడు' - అట్లా చెప్పగలిగిన ధైర్యం ఉన్న వాడెవడు? ధృతరాష్ట్రుడి నిండు కొలువులో అతడి ఉపేక్షయే ప్రళయ హేతువని ప్రకటించి, రాజ్యభాగమివ్వటం కంటె గత్యంతరం మరొకటి లేదని సూటిగా, ఘాటుగా చెప్పగల మొనగాడు శ్రీకృష్ణు డొక్కడే అని తెగువరుల ప్రశంస.

6. 'అనువరి ఎవ్వడు?' అన్న ప్రశ్న రాజనీతిజ్ఞులు వేసేది. శ్రీకృష్ణుడి మాటలు పైకి నీతులు. లోన సామదానభేదోపాయ బృంహితాలు. ధర్మనీతి మార్గంలో ఉపాయాలు ప్రయోగించ బడతాయి. కౌరవులు దుర్నీతి మార్గగాములు కాబట్టి ఉపాయ నైపుణ్యం ఉండదు. యుద్ధ పిపాస మాత్రమే కనపడుతుంది.

7. 'అచలాకృతులై ఊరకుండటం' సాత్త్వికాభినయం. కదలకుండా కొండవలె (ఉపమాలంకారం) కొయ్యబారి కూర్చుండిపోయారు. అందుకే కాబోలు జమదగ్న్యాది మహర్షులు తేరుకొని మాట్లాడటం మొదలు పెట్టారు.

8. శ్రీకృష్ణుడు కౌరవసభలో గాలినంతా తనవైపు మళ్ళించుకొన్నాడు. ధర్మజుడి ఉపాయంలోని తొలిఘట్టం విజయవంతంగా ముగించాడు. (సంపా.)

**వ. జామదగ్న్య మహాముని సుయోధనునితో నిట్లనియె : 286**

**ప్రతిపదార్థం:** జామదగ్న్య మహాముని= జామదగ్న్యుడనే మహర్షి; సుయోధనునితోన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** జామదగ్న్యుడు అనే మహర్షి దుర్యోధనుడితో ఇట్లా చెప్పాడు :

**సీ. వినుము దంభోద్భవుం డనురాజు దన కెదు। రెవ్వరు లేరంచు గ్రొవ్వి నరుఁడు**
**నారాయణుం డనువారలు గంధమా। దనమను నగమునఁ దపము సేయ**
**వారిపైఁ జని యాహవమునకుఁ బిలిచిన। నమ్మునీంద్రులు వలదని యనేక**
**విధములఁ జెప్పంగ వెండియుఁ బోకున్నఁ। గుశముష్టి నుజ్జ్వల విశిఖ వృష్టిఁ**

**ఆ. గురిసి నరుఁడు సేనఁ గూల్చి యాతని భంగ। పెట్టి పట్టి విడిచె నట్టి యమ్మ**
**హాత్ము లిపుడు పార్థుఁడనఁ గృష్ణుఁడనఁగ లీ। లార్థ కలిత జన్ములైరి సూవె! 287**

**ప్రతిపదార్థం:** వినుము= సుయోధనా! నా మాటలు వినుము; దంభోద్భవుండు+అను రాజు= దంభోద్భవుఁడనే ప్రభువు; తనకున్+ఎదురు+ఎవ్వరున్+లేరు+అంచున్= తనకు అడ్డమెవ్వరూ లేరని; క్రొవ్వి= గర్వించి; నరుఁడు; నారాయణుండు; అనువారలు= అనునట్టివారు; గంధమాదనము+అను నగమునన్= గంధమాదనము అనే పేరుగల పర్వతంమీద; తపము+చేయన్= తపసు చేస్తుండగా; వారిపైన్+చని= వారిమీదికి వెళ్ళి; ఆహవమునకున్+పిలిచినన్= యుద్ధానికి ఆహ్వానించగా; ఆ+ముని+ఇంద్రులు= ఆ మునీశ్వరులు; వలదు+అని= వద్దని; అనేక విధములన్= పలు రీతుల; చెప్పంగన్= పలుకగా; వెండియున్= మరల; పోక+ఉన్నన్= అతడు తొలగకున్నప్పుడు; నరుఁడు= నరుడనే ఋషి; కుశముష్టిన్= దర్భలు ధరించిన పిడికిటితో; ఉజ్జ్వల విశిఖ వృష్టిన్= వాడియైన బాణాలు అనే వర్షమును; కురిసి= వర్షించి; సేనన్+కూల్చి= దంభోద్భవుడి సైన్యాన్ని హతంచేసి; ఆతనిన్= అతడిని; భంగపెట్టి= పరాభవించి; పట్టి= బంధించి; విడిచెన్= ఆ తరువాత కరుణతో వదలివేశాడు; అట్టి= అటువంటి; ఆ+మహా+ఆత్ములు= ఆ మహనీయులు; ఇప్పుడు= ఈవేళ; పార్థుఁడు+అనన్= అర్జునుడనగా; కృష్ణుఁడు+అనఁగన్= శ్రీకృష్ణుడనగా; లీలా+అర్థ+కలిత జన్ములు+ఐరి+చూవె!= విలాసం కొరకు పుట్టుకలను స్వీకరించారు సుమా!

**తాత్పర్యం:** దుర్యోధనా! వినుము. దంభోద్భవుడనే రాజు తనకు ఎదురెవ్వరూ లేరని గర్వంతో విర్రవీగుతూ, నరనారాయణులనే దేవర్షులు గంధమాదన పర్వతంమీద తపస్సు చేసికొంటుంటే వారిపైకి వెళ్ళి యుద్ధానికి ఆహ్వానించాడు. ఆ మహామునులు యుద్ధం వద్దని ఎన్నో విధాల చెప్పిచూచారు. అతడు మొండికి పడి అక్కడి నుండి కదలకుంటే నరుడు దర్భలు ధరించిన పిడికిటితో వాడియైన బాణాల వాన కురిపించి దంభోద్భవుడి సేనలను హతం చేశాడు. అతడిని పట్టి పరాభవించి చివరికి దయదలచి వదలివేశాడు. ఆ మహానుభావు లిద్దరూ ఇప్పుడు పార్థుడనే పేరుతో శ్రీకృష్ణుడనే పేరుతో క్రీడార్థమై ఈ భువిలో అవతరించారు సుమా!

**వ. కావున నీవా దంభోద్భవు చందంబున నుద్ధతి వాటించుటయు, నరనారాయణులతోడఁ దొడరుటయు మీఁద మేలయి యుండదు; పాండవులతోడి పొందు మేలనిన యనంతరంబ కణ్వుండు దుర్యోధనున కిట్లనియె: 288**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; నీవు; ఆ దంభోద్భవు చందంబునన్= ఆ దంభోద్భవుడి మాదిరి; ఉద్ధతి+పాటించుటయున్= గర్వం వహించటమూ; నరనారాయణులతోడన్; తొడరుటయున్= ఎదిరించటమూ; మీఁదన్= ముందు; మేలు+అయి+ఉండదు= శ్రేయం కలిగించదు; పాండవులతోడి పొందు= పాండవులతో కలిసి ఉండటం; మేలు= మంచిది; అనిన+అనంతరంబు+అ= అని జామదగ్న్యుడు చెప్పిన పిదప; కణ్వుండు; దుర్యోధనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కాబట్టి ఆ దంభోద్భవుడి విధంగా గర్వం వహించటం, నరనారాయణులను ఎదిరించటం మేలుకాదు. పాండవులతోడి పొందు మేలు' అని జామదగ్న్యుడు చెప్పిన పిదప కణ్వుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

### కణ్వుండు దుర్యోధనునితో గరుత్మంతుని వృత్తాంతంబు సెప్పుట (సం. 5-95-1)

**ఆ. అదివోలుఁ; దన్ను నెదిరిని । మది నెఱుఁగక నిగ్రహించి మదమెత్తుట యొ**
**ప్పః దహంకారం బొనరిం । పదె పౌరుషహానిఁ దొల్లి పక్షీంద్రునకున్. 289**

**ప్రతిపదార్థం:** అది+పోలున్= జామదగ్న్యుడు చెప్పినమాటలు తగిఉన్నవి; తన్నున్= తనను; ఎదిరినిన్= ఎదుటివానిని; మదిన్= మనస్సులో; ఎఱుఁగక= తెలియలేక; నిగ్రహించి= త్రోసివేసి; మదము+ఎత్తుట= గర్వపడటం; ఒప్పదు= తగదు; తొల్లి= మునుపు; పక్షి+ఇంద్రునకున్= పక్షులకు రాజైన గరుత్మంతుడికి; అహంకారంబు= గర్వం; పౌరుషహానిన్= పరాక్రమానికి చేటు; ఒనరింపదె?= కలిగింపలేదా? (కలిగించినదని అర్థం.)

**తాత్పర్యం:** 'జామదగ్న్య మహాముని చెప్పిన మాటలు సమంజసాలు. తన శక్తినీ, ఎదిరి శక్తినీ గమనించక గర్వంతో ధిక్కరించటం యుక్తం కాదు. పూర్వం అహంకారం గరుత్మంతుడికి శౌర్యహానిని కలిగించింది సుమా!

**వ. అది యెట్లనిన. 290**

**తాత్పర్యం:** ఆ కథ యేమిటంటే.

సీ. **అమరేంద్రరథసూతుఁడైన మాతలి దన । సుత గుణకేశికిఁ బతిఁ దగంగ**
**నారసి యార్యకుండను భుజంగాధిపు । మనుమనిఁ జికురుని తనయు సుముఖు**
**నర్థిమైఁ గోరిన నార్యకుం డుమ్మలి । కంబుతో నిట్లను "గరుడుఁ డితని**
**తండ్రి వధించి యెంతయు నల్కమై వీని । నింకిట నెల సమయించువాఁడు**

ఆ. **గాఁగఁ బూనిపోయెఁ గావున నే మియ్య । కొనఁగనేర" మనిన విని 'బలారి**
**నడిగి పడసి యిత్తు నాయువు రం' డని । వారిఁగొనుచు నరిగె సారథియును.** 291

**ప్రతిపదార్థం:** అమర+ఇంద్ర= దేవేంద్రుడియొక్క; రథసూతుఁడు+ఐన= రథసారథి ఐన; మాతలి= మాతలి అనేవాడు; తనసుత= తన కొమార్తెఅయిన; గుణకేశికిన్= గుణకేశి అనేదానికి; పతిన్= భర్తను; తగంగన్= చక్కగా; ఆరసి= విచారించి; ఆర్యకుండు+అను= ఆర్యకుడనే పేరుగల; భుజంగ+అధిపు మనుమనిన్= సర్పరాజు యొక్క మనుమడూ; చికురుని తనయున్= చికురుడనే వాడి కుమారుడూ అయిన; సుముఖున్= సుముఖుడనే పేరుగలవాడిని; అర్థిమైన్= ఆసక్తితో; కోరినన్= వేడగా; ఆర్యకుండు= ఆర్యకుడు; ఉమ్మలికంబుతోన్= దుఃఖంతో; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; గరుడుఁడు= గరుత్మంతుడు; ఇతని తండ్రిన్= ఈతడి జనకుడిని; వధించి= చంపి; ఎంతయున్= మిక్కిలి; అల్కమైన్= కోపంతో; వీనిన్= సుముఖుడిని; ఇంకన్+ఇటన్= ఇంకనిక్కడ; నెలన్= నెలరోజులలో; సమయించువాఁడు+కాఁగన్= చంపేటట్లుగా; పూని= నిశ్చయించి; పోయెన్= వెళ్ళాడు; కావునన్= కనుక; ఏము= మేము; ఇయ్యకొనఁగన్+నేరము= పెండ్లికి అంగీకరించలేము; అనినన్+విని= అని ఆర్యకుడు చెప్పగా ఆలించి; సారథియును= ఇంద్ర రథ సారథి అయిన మాతలియు; బల+అరిన్= బలుడనే రాక్షసుడికి విరోధి అయిన దేవేంద్రుడిని; అడిగి= అర్థించి; ఆయువున్= ఆయుర్దాయాన్ని; పడసి+ఇత్తున్= పొంది సుముఖుడికిస్తాను; రండు= మీరు నావెంట రండి; అని= అనుచు; వారిన్+కొనుచున్+అరిగెన్= వారిని తన వెంట తీసికొనివెళ్ళాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడి రథసారథి అయిన మాతలి గుణకేశి అనే తన కొమార్తెకు విచారించుకొని, ఆర్యకుడు అనే సర్పనాయకుడి మనుమడున్నూ, చికురుడనే వాడి తనయుడున్నూ అయిన సుముఖుడిని భర్తగా నిర్ణయించాడు. అట్లా నిర్ణయించుకొని ఆర్యకుడి దగ్గరకు వెళ్ళి ప్రీతితో సుముఖుడిని కోరాడు. అప్పుడు ఆర్యకుడు దుఃఖంతో 'గరుత్మంతుడు వీని తండ్రియైన చికురుడిని చంపివేసి, నెలరోజులలో సుముఖుడిని కూడ సంహరిస్తానని కోపంతో పంతగించి పలికి వెళ్ళాడు. ఇట్టి దశలో మేము సుముఖుడి వివాహానికి సమ్మతించలేము' అని చెప్పాడు. ఆ మాటలు విని మాతలి 'దేవేంద్రుడి నడిగి సుముఖుడికి ఆయుస్సు తీసి యిస్తాను రం'డని వారిని తన వెంటబెట్టుకొని ఇంద్రుడి కడకు వెళ్ళాడు.

వ. **వారల భాగ్యంబున నప్పు డింద్రుండును, నుపేంద్రుండును, నొక్కచో నుండం గని మాతలి యక్కార్యంబు విన్నవించినం గరుణించి జిష్ణుండు విష్ణునకుం జెప్పి చేయించువాఁడై వైనతేయు దెసకుం దాన చాలి సుముఖుం జిరాయు రుపేతుం జేసిన** 292

**ప్రతిపదార్థం:** వారల భాగ్యంబునన్= వారి అదృష్టంచేత; అప్పుడు; ఇంద్రుండును; ఉపేంద్రుండును= విష్ణువు; ఒక్కచోన్= ఒక్కచోట; ఉండన్+కని= ఉండటం చూచి; మాతలి; ఆ కార్యంబు విన్నవించినన్= తాను వచ్చినపని మనవి చేయగా; కరుణించి; జిష్ణుండు= దేవేంద్రుడు; విష్ణునకున్+చెప్పి చేయించువాఁడు+ఐ= మహావిష్ణువునకు దెలిపి చేయించేవాడై; వైనతేయు

దెసకున్= వినతా పుత్రుడైన గరుత్మంతుడి దిక్కునకు; తాను+అ= తానే; చాలి= శక్తి గల్గినవాఁడై; సుముఖున్= సుముఖుడిని; చిర+ఆయుః+ఉపేతున్+చేసినన్= దీర్ఘాయుష్యంతో కూడినవాడిని చేయగా.

**తాత్పర్యం:** వారి అదృష్టంవలన అప్పుడు ఇంద్రుడూ ఉపేంద్రుడూ ఒకే చోట ఉన్నారు. మాతలి వారిని చూచి వచ్చిన కార్యం నివేదించాడు. అందుకు సురపతి కరుణించి విష్ణుదేవుడికి చెప్పి చేయించదలచి, గరుత్మంతుడి విషయంలో తాను చాలుదునని ఎంచి సుముఖుడిని దీర్ఘాయుష్మంతుణ్ణి చేశాడు.

**క. మాతలి పాణిగ్రహణం । బాతనిఁ జేయించియున్న నంతయు విని తా**
**నేతెంచి గరుడుఁ డతి కో । పాతురుఁడై రేఁగి పెలుచ నమరాధిపుతోన్. 293**

**వ. వాసుదేవ సన్నిధి నిట్లనియె. 294**

**ప్రతిపదార్థం:** మాతలి= ఇంద్ర సారథి; ఆతనిన్= సుముఖుడిని; పాణిగ్రహణంబు చేయించి= పెండ్లి చేయించి; ఉన్నన్= సుఖంగా ఉండగా; అంతయున్+విని= ఆ విషయమంతా తెలిసి; గరుడుఁడు= గరుత్మంతుఁడు; తాన్+ఏతెంచి= తా నచ్చటికి వచ్చి; అతికోప+ఆతురుఁడు+ఐ= మిక్కిలి కోపంతో ఒడలు తెలియనివాడై; పెలుచన్+రేఁగి= మిక్కిలి చెలరేగి; అమర+అధిపుతోన్= దేవతలకు రాజైన ఇంద్రుడితో; వాసుదేవ సన్నిధిన్= నారాయణుడి సముఖంలో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** మాతలి తన పుత్రికను సుముఖుడి కిచ్చి వివాహం జరిపించి ఉండగా ఆ సంగతి విని గరుత్మంతుడు అక్కడికి వచ్చి క్రోధపరవశుడై ఇంద్రుడితో నారాయణుడి సమక్షంలో ఇట్లా అన్నాడు:

**క. 'విను నీ వదితిసుతుండవు । వినత కొడుక నేను; విఱ్ఱవీఁగెడు మనకున్**
**జనకుఁడు గ శ్యపుఁ డొక్కఁడ; । దనుజుల శోధించి చంపుదమ యిరువురమున్. 295**

**ప్రతిపదార్థం:** విను= వినుము; నీవు; అదితిసుతుండవు= అదితియొక్క కొడుకవు; నేను; వినత కొడుకన్= వినతయొక్క కొడుకును; విఱ్ఱవీఁగెడు మనకున్= మిక్కిలిఒప్పుతున్న మనకు; జనకుఁడు= తండ్రి; కశ్యపుఁడు+ఒక్కఁడు+అ= కశ్యపుడొకడే; ఇరువురమున్= మనమిద్దరమునూ; దనుజులన్= రక్కసులను; శోధించి= వెదకి; చంపుదము+అ= చంపుదామా?

**తాత్పర్యం:** 'అదితిపుత్రుడవు నీవు. వినతా పుత్రుడను నేను. వైభవాతిశయంగల మన కిద్దరికీ కశ్యపు డొక్కడే తండ్రి. ఇద్దరం కలిసి రాక్షసులను వెదకి వెదకి చంపుదామా?

**క. ఏమిట నీకేఁ దక్కువ । నా మేరకు నడ్డపడితి 'నావుడు నింద్రుం**
**డీ మహనీయ మహిమకును । ధామము విష్ణుండుగాక తక్కొరుఁ డగునే?' 296**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; ఏన్= నేను; ఏమిటన్= ఏ విషయంలో; తక్కువ?= లొచ్చు?; నా మేరకున్= నా నిర్ణయానికి; అడ్డపడితి(వి)= అడ్డం వచ్చావు; నావుడున్= అని గరుత్మంతుడనగా; ఇంద్రుండు= ఇంద్రుడు; ఈ మహనీయ మహిమకును= ఈ నీ గొప్ప ప్రభావానికి; ధామము= ఆశ్రయం; విష్ణుండు+కాక= విష్ణుదేవుడే తప్ప; తక్కు+ఒరుఁడు+అగునే?= మరొక్కడు కాడు.

**తాత్పర్యం:** ఇంద్రా! ఏ విషయంలో నేను నీ కంటె తక్కువ? నా నిర్ణయానికి నీవెందుకు అడ్డుపడ్డావు? అని గరుత్మంతుడు ప్రశ్నించగా సురనాథుడు ఈ నీ గొప్ప ప్రభావానికి అంతటికీ విష్ణుదేవుడు తప్ప మరొక్కడు కారణం కాదు.'

**వ. అనిన విని గటకటం బడి గరుత్మంతుం డిట్లనియె: 297**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; కటకటంబడి= విచారపడి; గరుత్మంతుండు= గరుత్మంతుడు; ఇట్లు+అనియెన్= ఇట్లాఅన్నాడు.

**తాత్పర్యం:** ఇంద్రుడి మాటలకు విచారపడి గరుత్మంతు డిట్లా అన్నాడు :

**ఉ. 'తమ్ముఁడ! నీవు నా కొలఁది తథ్యమెఱుంగక నాకు నీచభా**
**వమ్మగు భంగిఁ జేసితివి; వాసవ! యి య్యదితి ప్రసూత వం**
**శ మ్మఖిలమ్ముఁ దాల్తు నొక సన్నపు టీఁకన; యిట్టి నన్ను నీ**
**విమ్మెయి దూలపుత్తె! యని యీక్షణరోచులఁ గెం పెలర్పఁగన్. 298**

**ప్రతిపదార్థం:** తమ్ముఁడ!= తమ్ముడవైన ఇంద్రుడా!; నీవు= నీవు; నా కొలఁది= నా శక్తి యొక్క పరిమాణం; తథ్యము= వాస్తవంగా; ఎఱుంగక= తెలియజాలక; నాకున్= నాకు; నీచభావమ్ము+అగుభంగిన్+చేసితివి= అల్పస్థితి కలిగేటట్లు వ్యవహరించావు; వాసవ!= ఇంద్రా! ఈ+అదితి ప్రసూత వంశమ్ము+అఖిలమ్మున్= ఈ అదితికి జన్మించిన దేవతాకులం అంతటినీ; ఒక సన్నము+ ఈఁకన్+అ= ఒక సన్నపాటి ఈకమీదే; తాల్తున్= ధరించగలను; ఇట్టి నన్నున్= ఇట్లాంటి బలాఢ్యుడనైన నన్ను; నీవు= నీవు; ఈ+మెయిన్= ఈ విధంగా; తూల+పుత్తె?= చిన్నబుచ్చుతావా?; అని= అంటూ; ఈక్షణరోచులన్= కన్నుల కాంతులందు; కెంపు+ఎలర్పఁగన్= ఎర్రదనం అతిశయించగా.

**తాత్పర్యం:** 'తమ్ముడా! నీవు నా శక్తి సామర్థ్యాలు ఎట్లాంటివో వాస్తవంగా గ్రహించలేక నాకు హీనత్వమేర్పడేటట్లుగా ప్రవర్తించావు. అదితిగన్న సమస్త దేవతాకులాన్ని ఒక సన్నని ఈకపై ధరించగలను సుమా! ఇంతటి బలాఢ్యుడిని నన్ను నీవీరకంగా చిన్నబుచ్చుతావా?' అని నేత్రకాంతులలో ఎర్రదనం నిండగా.

**వ. ఉన్నం గనుంగొని కోపించి వాసుదేవుండు వెడనవ్వు నవ్వుచు. 299**

**ప్రతిపదార్థం:** ఉన్నన్= అక్కడుండగా; కనుంగొని= చూచి; కోపించి= అలుకపూని; వాసుదేవుండు= నారాయణుడు; వెడనవ్వు+ నవ్వుచున్= వెటకారంగా నవ్వుతూ.

**తాత్పర్యం:** ఇంద్రుడిపై గ్రుడ్లురుముతూ అక్కడున్న గరుత్మంతుడిని చూచి నారాయణుడు వెటకారంగా నవ్వుతూ.

**క. 'నీవేటి మోపుకాఁడవు? । నా వెరవున నిన్ను నడపినను గర్వం బే**
**లా వెడఁగ' యంచుఁ దనముం । జే వీఁపున నిడ సురేంద్రజిత్తు వికలుఁడై. 300**

**ప్రతిపదార్థం:** వెడఁగ!= వివేకహీనుడా!; నీవు+ఏటి మోపుకాఁడవు?= నీవేపాటి బరువు మోయగలవాడవు?; నా వెరవునన్= నా చాతుర్యంచేత; నిన్నున్+నడపినను= నిన్ను ప్రవర్తింపజేస్తుంటే; గర్వంబు+ఏలా?= నీ కింతటి పొగరెందుకు?; అంచున్= అని;

తనముంజే= తనయొక్క ముంజేతిని; వీఁపునన్+ఇడన్= అతడి వీపుమీద ఉంచగా; సురేంద్రజిత్తు= ఇంద్రుడిని జయించిన గరుత్మంతుడు; వికలుఁడు+ఐ= బెదరినవాఁ డై.

**తాత్పర్యం:** 'అవివేకీ! నీవు ఏపాటి భారం మోయగలవురా? నా సామర్థ్యంతో నిన్ను నడుపుకొనివస్తుంటే నీకు పొగరెందుకు?' అంటూ పరమపురుషుడు తన ముంజేతిని అతడి వీపుమీద మోపాడు. ఆ భారానికి గరుత్మంతుడు బెదరిపోయాడు.

**క. ఎఱకలు విచ్చుచుఁ దుండము । దెఱచుచు వ్రేఁగడరి సొగసి త్రెళ్ళి వివశుఁడై**
**యఱచిన నోడకుమని హరి । నెఱి సక్కఁగఁ ద్రోచి యెత్తె నెగయంగఁ గృపన్. 301**

**ప్రతిపదార్థం:** ఎఱకలు= రెక్కలు; విచ్చుచున్= చాస్తూ; తుండము+తెఱచుచున్= నోరు (ముక్కు పుటాలు) తెరుస్తూ; వ్రేఁగు+అడరి= బరువు అతిశయించటం చేత; సొగసి= మూర్ఛిల్లి; త్రెళ్ళి= క్రిందపడి; వివశుఁడు+ఐ= ఒడ లెరుగనివాడై; అఱచినన్= ఆక్రోశించగా; హరి= విష్ణుమూర్తి; ఓడకుము+అని= భయపడవద్దని; నెగయంగన్= ఎగురుటకు; నెఱిన్= ఈకలచిక్కును; చక్కఁగన్+త్రోచి= బాగుగా సవరించి; కృపన్= దయతో; ఎత్తెన్= పైకెత్తాడు.

**తాత్పర్యం:** పుండరీకాక్షుడు తన వీపుమీద చేయి మోపగానే ఆ బరువునకు గరుత్మంతుడు రెక్కలు చాస్తూ, నోరు తెరుస్తూ నొచ్చి నేలమీద కూలి ఒడలు తెలియక ఆక్రందనం చేశాడు. అంతట శ్రీహరి 'గరుడా! భయపడవ' ద్దని ఆతడి ఈకల చిక్కు చక్కగా సవరించి ఎగరటానికి కరుణతో అతడిని పైకెత్తాడు.

**వ. ఇవ్విధంబునం గేశవుండు గరుణించి గరుడని ననునయించి 'యింక నవుదానికి నుద్ధతి మాని బుద్ధిగలిగి యుండు' మని వీడ్కొలిపి పుచ్చినం బోయెం; గావున గర్వంబు గొఱగా'; దింతయు నీ మహానుభావుం డెఱుంగునని నారదుం జూపియితండు మాతలి కన్యా కార్యంబునకుఁ దోడైనడచె; నడుగు; మదియకాదు సర్వేశ్వరుం డగు మాధవు మాహాత్మ్యం బితనికిం గరతలా మలకం బయి యుండు; బ్రభవిష్ణుండగు నాదివిష్ణుండు గదా యీ కృష్ణుం డీతని సహాయత్వంబు గల కౌంతేయులతోడం గూడి మనికి కార్యం' బనిన నారదుండు ధార్తరాష్ట్రు నాలోకించి.' 302**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; కేశవుండు= శ్రీహరి; కరుణించి= దయచూపి; గరుడనిన్= గరుత్మంతుడిని; అనునయించి= ఓదార్చి; ఇంకన్= ఇటుపై; అవుదానికిన్= జరుగనున్న దానికి; ఉద్ధతిన్‌మాని= గర్వం వదలి; బుద్ధి+కలిగి+ఉండుము; అని; వీడ్కొలిపి= సెలవొసగి; పుచ్చినన్= పంపగా; పోయెన్= వెళ్ళాడు; కావునన్; గర్వంబు; కొఱగాదు= పనికిరాదు; ఇంతయున్= ఈ సంగతిఅంతా; ఈ+మహా+అనుభావుండు= ఈ మహాత్ముడు; ఎఱుంగన్+అని; నారదున్+చూపి; ఇతండు= ఈ నారదమహర్షి; మాతలి కన్యా కార్యంబునకున్= మాతలి కొమార్తె పనికై; తోడు+ఐ నడచెన్= సాయంగా వెంట వెళ్ళాడు; అడుగుము= నారదుడిని ప్రశ్నించుము; అది+అ కాదు= అంతమాత్రమే కాదు; సర్వ+ఈశ్వరుండు+అగు= విశ్వానికి ప్రభువైన; మాధవు మాహాత్మ్యంబు= లక్ష్మీవల్లభుడి ప్రభావం; ఇతనికిన్= నారదుడికి; కరతల+ఆమలకంబు+అయి+ఉండున్= చేతిలోని ఉసిరిక కాయవలె స్పష్టంగా తోస్తూ ఉంటుంది; ఈ కృష్ణుండు= ఈ కృష్ణమూర్తి; ప్రభవిష్ణుండు+అగు= ప్రభావశీలుడైన; ఆదివిష్ణుండు+కదా!= ఆదినారాయణమూర్తికదా!; ఈతని సహాయత్వంబు+కల= ఈతని తోడ్పాటు కలిగిఉన్న; కౌంతేయుల తోడన్= కుంతీ కుమారులతో; కూడి మనికి= కలసి జీవించటం; కార్యంబు= చేయదగిన పని; అనినన్= అని కణ్వమహాముని పలుకగా; నారదుండు; ధార్తరాష్ట్రున్= ధృతరాష్ట్రుడి కుమారుడైన దుర్యోధనుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా విష్ణుదేవుడు దయచూపి గరుత్మంతుడిని ఊరడించి, 'ఇక మీదట నీవు గర్వం విడిచి బుద్ధిగలిగి ఉండు'మని సెలవిచ్చి పంపగా, అతడు వెళ్ళిపోయాడు. కావున గర్వం పనికి రాదు. ఇదంతయు మహాత్ముడైన ఈ నారద మహర్షికి తెలుసు' అని దుర్యోధనుడికి నారదుడిని చూపి 'ఈయన మాతలి కొమార్తె పనికై వారి వెంట వెళ్ళాడు. ఈయనను అడిగిచూడుము. ఇంతేకాదు, సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడి మహిమ ఇతడికి అరచేతిలోని ఉసిరిక కాయ సుమా! ప్రభావశీలుడైన ఆదినారాయణమూర్తియే ఈ దేవకీనందనుడని గ్రహించుము. ఈయన తోడ్పాటు గల కుంతీపుత్రులతో నీవు పొత్తుగలిగి ఉండటం చేయదగిన పని' అని కణ్వమహర్షి పలికాడు. అప్పుడు నారద మునీంద్రుడు సుయోధనుడిని చూచి.

**క. 'బలవంతుల బలములు న । నగ్గలమగు బల మెదురఁ గలుగఁగాఁ గీడ్పడు నే**
**కొలఁదుల వారికి గర్వము । నిలుచునె నయమార్గ వృత్తి నిలిచిన భంగిన్.' 303**

**ప్రతిపదార్థం:** బలవంతుల బలములు= బలశాలులయొక్క శక్తులు; ఎదురన్= తమముందు; అగ్గలము+అగు+బలము= అధికమైన బలం; కలుగఁగాన్= ఏర్పడగా; కీడ్పడున్= తక్కువయిపోతుంది; ఏ కొలఁదుల వారికిన్= ఎంతటి శక్తి సంపన్నులకైనా; నయమార్గవృత్తి= న్యాయమార్గ ప్రవర్తనం; నిలిచిన భంగిన్= నిలబడినట్లుగా; గర్వము= పొగరు; నిలుచునె?= నిలబడగలదా?;

**తాత్పర్యం:** 'బలవంతుల బలాలు అంతకంటె మిక్కుటమైన బలం ఎదురైనపుడు అవి క్రిందైపోతాయి. ఎంతటి శక్తిసంపన్నులకయినా ధర్మమార్గ ప్రవర్తనం తలయెత్తి నిలబడినట్లుగా అహంకారం నిలబడలేదు.'

**వ. అని పలికి వెండియు నిట్లనియె: 304**

**తాత్పర్యం:** అని పలికి మరల నారదు డిట్లా వచించాడు :

**ఆ. 'ఇదియకాని చేయ నెద్ది యే ననుచు । నిర్బంధవృత్తిఁ దలఁపు వట్టికొనిన**
**నట్టి వాని కెందు నలజడి పాటిల్లు । గాలవుండు గుఱియ కాఁడె మనకు? 305**

**ప్రతిపదార్థం:** ఇదియకాని= ఈ పని దప్ప; ఎద్దియేన్= మరేపనిని; చేయన్+అనుచున్= నేను చేయనని; నిర్బంధవృత్తిన్= కదలమెదలగూడని పట్టుదలయందు; తలఁపు పట్టుకొనినన్= తన అభిప్రాయం నిల్పితే; అట్టివానికిన్= అట్లాంటి మొండి పట్టుపట్టినవాడికి; ఎందున్= ఎచ్చటకూడ; అలజడి= క్లేశం; పాటిల్లున్= కల్గుతుంది; గాలవుండు= గాలవుడనే ముని కుమారుడు; మనకున్= మనకు; గుఱి+అ కాఁడె= ఇందుకు సాక్షి కాడా?

**తాత్పర్యం:** 'నేనీ పనిదప్ప మరే పనీ చేయను - అని మొండిపట్టుపట్టినవాడికి ఎక్కడ కూడా ఆపదలే కల్గుతాయి. గాలవుడనే ముని కుమారుడు ఇందుకు ఉదాహరణం.

**వ. వినుము విశ్వామిత్రు పాల విద్యాభ్యాసంబు సేసి గాలవుండను మునికుమారుండు 'గురుదక్షిణ యేమి సమర్పింతు' నని యడిగిన, నతం'డేమియు నేల?'యని యుడిపిన, నుడుగక యెన్ని సెప్పిన నన్నింటికి నన్నిసెప్పి నిర్బంధించినఁ, గటకటంబడి యత్తపోధనవర్యుం 'డట్లేని శుద్ధ ధవళవర్ణంబులై యొక్క కర్ణంబు నీలంబైన యుత్తమాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి యి'మ్మని పలికినం బోయి. 306**

**ప్రతిపదార్థం:** వినుము; విశ్వామిత్రుపాలన్= విశ్వామిత్రుడి దగ్గర; విద్యా+అభ్యాసంబు చేసి= విద్యను నేర్చి; గాలవుండు అను ముని కుమారుండు; గురుదక్షిణ; ఏమి; సమర్పింతున్?= ఇచ్చికొనేది?; అని+అడిగినన్; అతండు= విశ్వామిత్రుడు; ఏమియున్; ఏల; అని; ఉడిపినన్= మాన్పగా; ఉడుగక= మానక; ఎన్ని చెప్పినన్; అన్నింటికిన్; అన్నిచెప్పి; నిర్బంధించినన్= బలాత్కారం చేయగా; కటకటంబడి= కోపించి; ఆ+తపోధన+వర్యుండు= తపమే ధనంగా గల మునులలో శ్రేష్ఠుడు విశ్వామిత్రుడు; అట్లు+ఏనిన్= అట్లా అయితే; శుద్ధ ధవళ వర్ణంబులై= కేవలం తెల్లని రంగు కలిగినవై; ఒక్క కర్ణంబు= ఒక చెవి; నీలంబు+ఐన= నల్లనిరంగు కలిగిన; ఉత్తమ+అశ్వంబులు= మేలుజాతి గుఱ్ఱాలు; ఎనమన్నూఱు= ఎనిమిది వందలు; తెచ్చి+ఇమ్ము; అని; పలికినన్; పోయెన్= తేవటానికి గాలవుడు వెళ్ళాడు.

**తాత్పర్యం:** దుర్యోధనా! ఆ గాలవుడి వృత్తాంతం వినుము. గాలవుడనే ముని కుమారుడు విశ్వామిత్రుడి దగ్గర విద్యలు అభ్యసించి 'తమకు గురుదక్షిణ నేనేమి సమర్పించుకొనవలెనో సెలవివ్వండి' అని గాధేయుడిని అడిగాడు. అందుకు విశ్వామిత్రుడు 'ఏమీ వద్దు' అన్నాడు. అన్నప్పటికీ గాలవుడు మానక గురువు చెప్పిన ప్రతిమాటకూ బదులు చెపుతూ గురుదక్షిణ చెప్పితీరవలెనని బాధించాడు. విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. అట్లాగయితే శరీరమంతా తెల్లగా ఉండి, ఒక చెవిమాత్రం నల్లగా ఉండే మేలుజాతి గుఱ్ఱాలు ఎనిమిదివందలు తెచ్చి ఇవ్వవలసిందని అడిగాడు. అట్లాగే అని గాలవుడు అశ్వాలకోసం అక్కడినుంచి బయలుదేరివెళ్ళాడు.

**తే.** **గాలవుం డవ్విధము ఘోటకముల నెందుఁ । బడయలేక చింతాభరభ్రాంతుఁ డగుచు**
**వెడలి యాహార నిద్రలు విడిచి తా మ । హాపథముఁ బోదుఁగాకని యరిగి యరిగి.** **307**

**ప్రతిపదార్థం:** గాలవుండు= గాలవుడు; ఆ+విధము ఘోటకములన్= ఆ రకమైన గుఱ్ఱాలను; ఎందున్= ఎక్కడా; పడయన్‌లేక= సంపాదించలేక; చింతాభర+భ్రాంతుఁడు+అగుచున్= విచారభారంచేత మనసు చలించినవాడు ఔతూ; వెడలి= పయనమై; ఆహారనిద్రలు విడిచి; తాన్= తాను; మహాపథమునన్+పోదున్+కాక= ప్రాణాంతం కావించుకుంటాను గాక; అని; నిశ్చయించుకొని; అరిగి అరిగి= వెళ్ళి వెళ్ళి.

**తాత్పర్యం:** దేహమంతా తెలుపు, ఒక చెవి మాత్రం నలుపు కలిగిన గుఱ్ఱాలను గాలవుడు ఎక్కడా సంపాదించలేక పోయాడు. విచారభారం చేత భ్రమచెంది ఆహారనిద్రలు కూడ మాని వేశాడు. ప్రాణాంతం చేసుకుంటానని నిర్ణయించుకొని గాలవుడు అట్లా వెళ్ళి వెళ్ళి.

**వ.** **ఒక్కచో గరుడునిం గని బాలసఖుండు గావున నతనికిం దనవృత్తాంతంబు సెప్పిన నతండు కరుణా భరితుండై** **308**

**ప్రతిపదార్థం:** ఒక్కచోన్= ఒకచోట; గరుడునిన్+కని; బాలసఖుండుకావునన్= చిననాటి చెలికాడు గనుక; అతనికిన్; తన వృత్తాంతంబు= తన సమాచారం; చెప్పినన్; కరుణా భరితుండు+ఐ= గరుత్మంతుడు దయతో నిండినవాడై

**తాత్పర్యం:** దైవికంగా ఒకచోట గరుత్మంతుడిని చూశాడు. గరుత్మంతుడు తనకు చిననాటి చెలికాడుగనుక అతనికి సంగతి అంతా చెప్పాడు. గరుడుడు దయతో నిండిన మనసు కలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **'దేవతలు గాని యిట్టివి । గావింపం జాల రీ సకల దిక్కులలో**
**దేవేంద్రు దిక్కు బహు దివి । జావాసం బందుఁ బోద మని మునిపుత్త్రున్.'** **309**

**ప్రతిపదార్థం:** దేవతలు+కాని= వేల్పులు తప్ప; ఇట్టివి= ఇటువంటి పనులు; కావింపన్+చాలరు= చేయలేరు; ఈ సకల దిక్కులలోన్= ఈ దిక్కులన్నింటిలో; దేవేంద్రు దిక్కు= తూర్పు; బహు దివిజ+ఆవాసంబు= పలు దేవతలకు నిలయం; అందున్+పోదము+అని= అక్కడికి వెళ్ళుదామని; మునిపుత్రున్= గాలవుడిని.

**తాత్పర్యం:** దేవతలు తప్ప ఇలాంటి కార్యాలు ఇతరులు సాధించలేరు. అన్ని దిక్కులలో తూర్పు దిక్కు వేల్పులకు నిలయం కనుక అక్కడకి వెళదామని గరుత్మంతుడు గాలవుడితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁడై । పఱచి జలధిలోనఁ జదలఁ బాఱెడునెడఁ జె**
**య్వఱి దప్పి నిలువఁ జాలక । యొఱగిన గాలవుని డించె నొక గిరి మీఁదన్. 310**

**ప్రతిపదార్థం:** అఱకడన్+ఇడి= భుజస్కంధంపై పెట్టుకొని; ప్రాక్+ముఖుఁడు+ఐ= తూరుపు మొగమైనవాడై; పఱచి= పరువెత్తి; జలధిలోనన్= సముద్రంమీద; చదలన్= ఆకాశంలో; పాఱెడు+ఎడన్= ఎగిరిపోయేటప్పుడు; చెయ్వు+అఱి= చేష్టలుడిగి; దప్పిన్= శ్రమచేత; నిలువన్+చాలక= స్కంధ ప్రదేశంమీద ఉండలేక; ఒఱగిన గాలవునిన్= ప్రక్కకు వ్రాలిన గాలవుడిని; ఒక గిరిమీఁదన్= ఒక కొండమీద; డించెన్= గరుత్మంతుడు దించాడు.

**తాత్పర్యం:** గరుత్మంతుడు గాలవుడిని తన భుజస్కంధంమీద కూర్చుండ బెట్టుకొని, తూర్పు ముఖంగా బయలుదేరి సముద్రంమీద ఆకాశవీథిలో ఎగిరిపోతూ ఉండగా గాలవుడు చేష్టలుడిగి, శ్రమచేత నిలువలేక ప్రక్కకొరుగుతుండగా అతడిని ఒక కొండ మీద దించాడు.

**వ. ఇట్లు డించి డప్పిదేర్చి యందుఁ గశ్యప నందనుండు శాండిలి యను నొక్క తపస్విశాపంబునఁ బక్షంబులు డుల్లి యనుగ్రహంబునం గ్రమ్మఱ వచ్చిన విషాదమోదంబు లనుభవించి యట ననుట సాలించి మగుడ మహీతలంబునకు మునికుమారుం దెచ్చి యయాతి తన నెచ్చెలియని ప్రతిష్ఠానపురనాథుండగు నతని కడకు నాతనిం దోడ్కొని చని, యగ్గాలవు తెఱం గెఱింగించిన నతండు. 311**

**ప్రతిపదార్థం:** ఇట్లు; డించి= దించి; డప్పి+తేర్చి= శ్రమను పోగొట్టి; అందున్= ఆ గిరిమీద; కశ్యపనందనుండు= కశ్యపప్రజాపతి కుమారుడైన గరుత్మంతుడు; శాండిలి+అను+ ఒక్క తపస్వి శాపంబునన్= శాండిలి అనే పేరుగల ఒకానొక ముని శాపం వలన; పక్షంబులు= రెక్కలు; డుల్లి= రాలి; అనుగ్రహంబునన్= ఆ ముని కృపవలన; క్రమ్మఱన్= మరల; వచ్చినన్= మొలవగా; విషాద+మోదంబులు= రెక్కలు రాలినందుకు దుఃఖమును, మరల మొలచినందుకు సంతోషమును; అనుభవించి; అటచనుట= అలా తూర్పు దెసకు వెళ్ళటం; చాలించి= మాని; మగుడన్= మరల; మహీతలంబునకున్= భూస్థలికి; మునికుమారున్+తెచ్చి; యయాతి= యయాతి అనే పేరుగల రాజు; తన నెచ్చెలి+అని= తన ప్రియమిత్రుడని; ప్రతిష్ఠాన పురనాథుండు+అగు= ప్రతిష్ఠాన పట్టణానికి అధిపతిఅయిన; అతని కడకున్= యయాతిదగ్గరకు; అతనిన్= గాలవుడిని; తోడ్కొని చని= తీసికొని వెళ్ళి; ఆ+గాలవు తెఱంగు= ఆ గాలవుని వృత్తాంతం. ఎఱింగించినన్= చెప్పగా; అతండు= ఆ యయాతి మహారాజు.

**తాత్పర్యం:** గరుత్మంతుడు గాలవుడిని కొండమీద దించి బడలిక పోగొట్టాడు. అక్కడ శాండిలి అనే పేరుగల ఒక మునీశ్వరుడి శాపంవలన తన రెక్కలు రాలి పడగా దుఃఖించి ఆ ముని అనుగ్రహంతో మరల మొలవగా సంతోషించి తూర్పు దెసగా ప్రయాణం సమకట్టటం మానివేశాడు. గరుడుడు మరల గాలవుని భూమండలానికి

కొనివచ్చాడు. ప్రతిష్ఠానపురాధీశ్వరుడు యయాతి తనకు అనుగు చెలికాడగుటవల్ల అతడి చెంతకు గాలవుడిని తోడ్కొని వెళ్ళి ఆతడి వృత్తాంతమంతా చెప్పాడు.

**క. తన కట్టి గుఱ్ఱములు లే । కునికిని మాధవి యనంగ నొప్పెడు పుత్త్రిన్**
**ముని కొసఁగె దీనికై యే । మనుజేశుఁడు నీఁడె హయసమాజము ననుచున్. 312**

**ప్రతిపదార్థం:** తనకున్= తనకు; అట్టి గుఱ్ఱములు= అట్లాంటి గుర్రాలు; లేక+ఉనికిని= లేకుండుటవలన; మాధవి+అనంగన్+ ఒప్పెడు= మాధవి అనే పేరుతో ప్రకాశించే; పుత్త్రిన్= కొమార్తెను; దీనికై= ఈ కన్యకకై; ఏ మనుజ+ఈశుఁడు= ఏ రాజైనను; హయసమాజమున్= అశ్వాల సమూహాన్ని; ఈఁడె?= ఇవ్వకుంటాడా?; అనుచున్= అని భావించి; మునికిన్+ఒసఁగెన్= గాలవుడికి సమర్పించాడు.

**తాత్పర్యం:** యయాతి మహారాజు తనకు అట్లాంటి గుర్రాలు లేనందున మాధవి అనే తన పుత్రికను - ఈ కన్యక కొరకై ఏ రాజైనను గుర్రాల నివ్వకపోతాడా అని భావించి గాలవుడికి ఆమెను సమర్పించాడు.

**వ. ఇ ట్లొసంగినం దోడుకొని. 313**

**తాత్పర్యం:** ఇట్లా ఇవ్వగా ఆమెను (మాధవిని) వెంటబెట్టుకొని.

**తే. ఇట్టి హయములుగల రాజు లెవ్వరొక్కొ! । యనుచుఁ దిరిగి యయోధ్యకుఁ జని తదీయ**
**నాథు నిక్ష్వాకుఁ గనిన నన్నరవరుండు । దనకు నిన్నూఱ కాని లేవనియె హరులు. 314**

**ప్రతిపదార్థం:** ఇట్టి హయములు= ఇట్లాంటి గుర్రాలు; కలరాజులు= కలిగిన భూపతులు; ఎవ్వరు+ఒక్కొ!= ఎవరున్నారో!; అనుచున్= అని తలస్తూ; తిరిగి= సంచరించి; అయోధ్యకున్+చని= అయోధ్యానగరానికి వెళ్ళి; తదీయనాథున్= ఆ పట్టణ ప్రభువైన; ఇక్ష్వాకున్+కనినన్= ఇక్ష్వాకు భూపాలుడిని దర్శించగా; ఆ+నరవరుండు= ఆ మనుజేశ్వరుడు; తనకున్= తనకు; ఇన్నూఱు+అ+కాని= రెండువందలే తప్ప(అంతకుమించి); హరులు= గుర్రాలు; లేవు+ అనియెన్= లేవని చెప్పాడు.

**తాత్పర్యం:** యయాతి మహారాజు తనకిచ్చిన మాధవిని వెంటబెట్టుకొని, గాలవుడు విశ్వామిత్రుడు చెప్పిన లక్షణాలు కల గుర్రాలు కలిగిన రాజు లెవరా అంటూ సంచారం చేసి, ఇక్ష్వాకు మహారాజు ఏలుతున్న అయోధ్యానగరానికి వచ్చాడు. ఆయనను సందర్శించాడు. ఆయన తనకు అట్లాంటి గుర్రాలు రెండువందలు తప్ప అంతకుమించి లేవని చెప్పాడు.

**క. అన విని మాధవి ఋషికి । ట్లను నొక్క మహానుభావు నతుల వరమునం**
**దనయవతి నయ్యు నేఁ గ । న్యన యగుదుంగాన నిమ్ము నన్నీతనికిన్. 315**

**ప్రతిపదార్థం:** అనన్+విని= ఇక్ష్వాకు మహారాజు అట్లా చెప్పగా విని; మాధవి= యయాతి పుత్త్రి; ఋషికిన్= మునిఅయిన గాలవుడికి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నది; ఒక్క మహానుభావు+ అతులవరమునన్= ఒకానొక మహనీయుడి సాటిలేని వరంచేత; తనయవతిన్+అయ్యున్= బిడ్డలు కన్నదాననైనప్పటికిన్నీ, నేన్= నేను; కన్యన్+అ+అగుదున్= పెండ్లికాని కన్యకగానే ఉంటాను; కానన్= కాబట్టి; నన్నున్= నన్ను; ఈతనికిన్= ఈ ఇక్ష్వాకు మహారాజునకు; ఇమ్ము= అర్పించుము.

**తాత్పర్యం:** ఇక్ష్వాకు విభుడి మాట లాలకించి మాధవి గాలవుడితో ఇట్లా చెప్పింది. 'ఒకానొక మహాత్ముడి వరప్రభావం వలన నేను బిడ్డలను కన్నప్పటికీ, కన్యకగానే ఉంటాను. కనుక నన్ను ఈతడికి భార్యగా సమర్పించండి.

**వ. ఒక్క సమయంబు సేసికొని యిచ్చి గుఱ్ఱంబులు వచ్చినవి యెల్లరాఁబుచ్చి కొమ్మనిన గాలవుండు నవ్విధంబునకు సమ్మతించె; నపత్యార్థియై యిక్ష్వాకుండును నయ్యుంకువునకు భార్య యగుట పుత్త్రజన్మావధిగా నొడివి యశ్వంబుల నొసంగి కన్యకం బరిగ్రహించి దానియందు వసుమనస్సుండను కొడుకుం బడసి గాలవునకు నమ్మగువను మగుడ సమర్పించినఁ జూచి యబ్భంగిం గలచోట్ల నెల్ల నరసి తురంగంబులం గావించికొమ్మని యతనికిం జెప్పి సుపర్ణుండు సనియె; మఱియు మహీతలంబునం గ్రుమ్మరి యమ్ముని కుమారుండు గందువ లెఱింగి పోవంబోవ. 316**

**ప్రతిపదార్థం:** ఒక్క సమయంబు+చేసికొని= ఒక ఒడంబడిక కావించుకొని; ఇచ్చి= పత్నిగా నన్నొసగి; గుఱ్ఱంబులు వచ్చినవి+ ఎల్లన్= వచ్చిన గుఱ్ఱాల నన్నింటిని; రాన్+పుచ్చికొమ్ము= వచ్చినట్లుగా తీసికొమ్ము; అనినన్= అని మాధవి చెప్పగా; గాలవుండు; ఆ విధంబునకున్; సమ్మతించెన్= అంగీకరించాడు; ఇక్ష్వాకుండును; అపత్య+అర్థిఐ= సంతానాన్ని అభిలషిస్తున్నవాడై; ఆ+ఉంకువునకున్= ఆ శుల్కానికి (అల్లుడు కన్యకార్థం మామకిచ్చే ద్రవ్యం); భార్య+అగుట= మాధవి తనకు పెండ్లమగుట; పుత్త్రజన్మ+అవధిగాన్+నొడివి= కుమారుడు కలుగునంతవరకే గడువుగా చెప్పి; అశ్వంబులన్; ఒసంగి= గాలవున కిచ్చి; కన్యకన్; పరిగ్రహించి= స్వీకరించి; దానియందున్= మాధవియందు; వసుమనస్సుండు, అను కొడుకున్; పడసి= పొంది; గాలవునకున్; ఆ+మగువను= ఆ కాంతను; మగుడన్ సమర్పించినన్= తిరిగి ఇచ్చివేయగా; సుపర్ణుండు= గరుత్మంతుడు; చూచి= ఆ విధమంతా చూచి; ఆ+భంగిన్= ఆరీతిగా; కలచోట్లన్+ఎల్లన్+అరసి= గుఱ్ఱాలున్న తావులన్నిటిని చూచి; తురంగంబులన్= అశ్వములను; కావించికొమ్ము= సంపాదించుకొమ్ము; అని; అతనికిన్= గాలవునకు; చెప్పి; చనియెన్= తన దారిని తానే వెళ్ళాడు; మఱియున్; మహీతలంబునన్= భూ ప్రదేశంలో; క్రుమ్మరి= సంచరించి; ఆ+ముని కుమారుండు; కందువలు+ఎఱింగి= గుఱ్ఱాలున్న జాడలు దెలిసి; పోవన్+పోవన్= పోతూ పోతూ ఉండగా.

**తాత్పర్యం:** ఒక ఒడంబడిక చేసుకొని నన్ను ఇక్ష్వాకుడికి పత్నిగా నిచ్చి వచ్చిన గుఱ్ఱాలను వచ్చినట్లుగా పుచ్చుకొమ్మని మాధవి చెప్పింది. అందుకు గాలవుడు సమ్మతించాడు. సంతానం అభిలషిస్తున్న ఇక్ష్వాకు చక్రవర్తి, ఒక కుమారుడు కలుగునంత వరకే మాధవి తనకు భార్యగా ఉంటుందని పల్కి, కన్యాశుల్కంగా ఇన్నూరు గుఱ్ఱాలను గాలవుడికి సమర్పించాడు. ఇక్ష్వాకువు మాధవి యందు వసుమనస్సుడు అనే కొడుకును పొంది తిరిగి ఆమె నతని కిచ్చివేశాడు. ఇదంతయు గమనించిన గరుత్మంతుడు ఈ పద్ధతిలోనే గుఱ్ఱాలను సంపాదించుకొమ్మని మునిపుత్త్రుడికి చెప్పి వెళ్ళిపోయాడు. గాలవుడు గుఱ్ఱాల కొరకు అవనీతలంలో తిరుగుతున్నాడు.

**క. ఆ సమయంబునను దివో । దాసుఁడు నౌశీనరుండుఁ దరుణికి నిన్నూ**
**ఱేసి హయంబుల నిచ్చి మ । హాసత్త్వుల సుతులఁ బడసి రధికప్రీతిన్. 317**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునను= అట్టితరి; దివోదాసుఁడున్= కాశీనగరాధిపతి అయిన దివోదాసుఁడు; ఔశీనరుండున్= భోజపుర ప్రభువైన ఔశీనరుడును; తరుణికిన్= చెలువయైన మాధవికి; ఇన్నూఱు+ఏసి= రెండేసి వందలు; హయంబులన్+ఇచ్చి= గుఱ్ఱాల నొసగి; అధికప్రీతిన్= మిక్కుటమైన సంతోషంతో; మహాసత్త్వులన్= మిక్కిలి బలశాలులైన; సుతులన్+పడసిరి= కొడుకులను కన్నారు.

**తాత్పర్యం:** అట్టి సమయంలో కాశీశ్వరుడైన దివోదాసుడు, భోజపురాధీశ్వరుడైన ఔశీనరుడు మాధవికి రెండేసి వందల గుర్రాల నిచ్చి అధిక బలవంతులైన కుమారులను పరమసంతోషంతో పొందారు.

**వ. ఇట్లు క్రమంబునఁ గాశీశ్వరునకుఁ బ్రతర్దనుని భోజపురనాథునకు శిబిం గనిన యక్కన్యకఁ గొని వెండియు వసుంధరం దిరుగుచుండ గరుత్మంతుండు గ్రమ్మఱి వచ్చి యమ్మునితో నీ వింక జాలింబడ వలవ; దొక్క కారణంబున నీ రాజులు మువ్వురకు నివ్వాజులు గలిగె; నింతియకాని యొండెడ నీచందంబున మొత్తంబులై దొరకనేర; వియ్యాఱునూఱు గుఱ్ఱంబులను గురువునకు సమర్పింపు; మొక్కటి సెప్పెద వినుమని యిట్లనియె. 318**

**ప్రతిపదార్థం:** ఇట్లు; క్రమంబునన్= వరుసగా; కాశీశ్వరునకున్= కాశీపట్టణప్రభువైన దివోదాసునకు; ప్రతర్దనునిన్= ప్రతర్దనుడనే కుమారుడినీ; భోజపురనాథునకున్= భోజపట్టణానికి భర్తఅయిన ఔశీనరునకు; శిబిన్= శిబిఅనే పుత్రుడినీ; కనిన= కనినట్టి; ఆ+కన్యకన్= బిడ్డలను కనికూడ కన్యాత్వం పాయని మాధవిని; కొని= గాలవుడు వెంటబెట్టుకొని; వెండియున్= మరల; వసుంధరన్= భూమిలో; తిరుగుచున్; ఉండన్; గరుత్మంతుండు; క్రమ్మఱివచ్చి= మరలివచ్చి; ఆ+మునితోన్= గాలవుడితో; నీవు; ఇంకన్; జాలిన్+పడన్+వలవదు= శ్రమపడవద్దు; ఒక్క కారణంబునన్= ఒక హేతువు చేత; ఈ రాజులు మువ్వురకున్= ఇక్ష్వాకువు, దివోదాసుడు, ఔశీనరుడు అనే ఈ ముగ్గురు ప్రభువులకు; ఈ+వాజులు+కలిగెన్= ఈ గుర్రాలు లభించాయి; ఇంతియకాని= ఇంతేతప్ప; ఒండు+ఎడన్= మరొక్కచోట; ఈ చందంబునన్= ఈ మాదిరి; మొత్తంబులు+ఐ= గుంపులుగా; దొరకన్+నేరవు= లభించజాలవు; ఈ+ఆఱునూఱు గుఱ్ఱంబులను= నీవు సంపాదించిన ఈ ఆరువందల గుర్రాలను; గురువునకున్= గురువైన విశ్వామిత్రుడికి; సమర్పింపుము; ఒక్కటి చెప్పెదన్; వినుము; అని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా కాశీశ్వరుడైన దివోదాసుడికి ప్రతర్దనుడు అనే కుమారుడిని, భోజ పట్టణాధీశ్వరుడైన ఔశీనరునకు శిబి అనే తనయుడిని క్రమంగా మాధవి కన్నది. కనికూడా కన్యాత్వం కోల్పోని ఆమెను వెంటబెట్టుకొని మళ్ళీ గుర్రాలకై గాలవుడు భూ సంచారం చేస్తుండగా గరుత్మంతుడు మరల వచ్చి అతడితో- 'నీవిక శ్రమపడవద్దు. ఒకానొక కారణం చేత ఈ ముగ్గురు రాజులకు ఇట్లాంటి గుర్రాలు లభించాయి. అంతేకాని లోకంలో మరెక్కడా ఈ విధంగా ఇన్ని గుర్రాలు దొరకవు. ఈ ఆరువందల అశ్వాలను నీ గురుడైన విశ్వామిత్రుడికి సమర్పించుము. ఒక మాట చెపుతాను, వినుము.

**క. ఈ మువ్వుర తెఱఁగునఁ దగ । నా మునియుం గొడుకుఁ బడయునట్లుగ ని మ్మీ**
**కోమలిని గొఱంతకు వి । శ్వామిత్రున కెట్టులైన సంప్రార్థనతోన్. 319**

**ప్రతిపదార్థం:** ఈ మువ్వుర తెఱఁగునన్= ఈ ముగ్గురు రాజులవలెనే; తగన్= యుక్తంగా; ఆ+మునియున్= మౌనిఐన ఆ విశ్వామిత్రుడున్నూ; కొడుకున్= కుమారుడిని; పడయునట్లుగన్= పొందేటట్లుగా; కొఱంతకున్= తక్కువపడిన ఇన్నూరు గుర్రాల కొరకు; ఎట్టులు+ఐనన్= ఏవిధంగా నైనా; సంప్రార్థనతోన్= వేడికోలుతో; ఈ కోమలినిన్= సుకుమారిఅయిన ఈ మాధవిని; ఇమ్ము= గురుదక్షిణగా సమర్పించుము.

**తాత్పర్యం:** ఈ ముగ్గురు రాజుల వలెనే మౌనిఅయిన విశ్వామిత్రుడు కూడ కుమారుడిని కనే విధంగా తక్కువ పడిన ఆ రెండువందల గుఱ్ఱాలకొరకై ఎట్లాగైనా వేడుకొని విశ్వామిత్రుడికి తరుణిఅయిన మాధవిని సమర్పించవలసింది.'

వ. అని తానునుఁ దోడుసని యత్తపస్విపాలికింబోయి యత్తెఱం గెఱింగించి, గాలవుం గానిపించి, 'యీతండు బాలుండు, నీవు దయాళుండ' వితనిం గృతార్థుం జేయవలయు నని ప్రార్థించి పక్షిరా జక్కార్యంబు చక్కంజేసి పోయిన. 320

**ప్రతిపదార్థం:** అని; తానును; తోడు+చని= సహాయంగా బయలుదేరి; ఆ+తపస్విపాలికిన్+పోయి= ఆ మునీంద్రుడి చెంతకుపోయి; ఆ+తెఱంగు+ఎఱింగించి= గాలవుడు ఆరువందల గుఱ్ఱాలను సంపాదించినవైనమూ, మరెక్కడా అలాంటి గుఱ్ఱాలు దొరకని స్థితీ తెలిపి; గాలవున్; కానిపించి= చూపి; ఈతండు; బాలుండు= పసివాడు; నీవు; దయాళుండవు= కరుణాస్వభావుడవు; ఇతనిన్; కృతార్థున్+చేయన్+వలయున్= కోరిక నెరవేరినవాడినిగా కావించవలెను; అని ప్రార్థించి= అని వేడుకొని; పక్షిరాజు= ఖగనాథుడైన గరుత్మంతుడు; ఆ+కార్యంబు; చక్కన్+చేసి= సరిపరచి; పోయినన్= వెళ్ళగా.

**తాత్పర్యం:** గరుత్మంతుడు తాను కూడ గాలవుడికి తోడుగా విశ్వామిత్ర మునీంద్రుడి పాలికి వెళ్ళి గాలవుడిని చూపి, అతడు ఆరువందల అశ్వాలను సంపాదించిన వైన మెరింగించి 'ఇతడు పసివాడు; నీవు కృపాస్వభావుడివి. ఇతడిని గురు ఋణంనుండి విముక్తుణ్ణి కావించు'మని వేడుకొని, పని చక్కబెట్టి వెళ్ళిపోగా.

క. మునివరుఁ డష్టకుఁ డనియెడు । తనయుఁ బడసి శిష్యునకు సుదతి నొప్పించెన్;
వనితయుఁ దపంబు సేయం । జనియెను; గాలవున కిట్టి చరితము గలిగెన్. 321

**ప్రతిపదార్థం:** మునివరుఁడు= మునులలో శ్రేష్ఠుడైన విశ్వామిత్రుడు, అష్టకుఁడు+అనియెడు= అష్టకుడనే పేరుగల; తనయున్+పడసి= కుమారుడిని పొంది; శిష్యునకున్= ఛాత్రుడైన గాలవుడికి; సుదతిన్= చక్కని దంతాలుగల మాధవిని; ఒప్పించెన్= అతడికి అప్పజెప్పాడు; వనితయున్= మాధవియు; తపంబుచేయన్+చనియెన్= తపస్సు చేయటానికి వెళ్ళింది; గాలవునకున్= గాలవుడికి; ఇట్టి చరితము= ఇట్టి వర్తనం; కలిగెన్= సంప్రాప్తమైనది.

**తాత్పర్యం:** మునిపుంగవుడైన విశ్వామిత్రుడు అష్టకుడనే కుమారుడిని కని శిష్యుడికి మాధవిని అప్పగించాడు. మాధవి కూడ తపస్సు చేసికొనటానికి వెళ్ళిపోయింది. గాలవుడి కథ ఇట్లా జరిగింది.

వ. కావున నెట్టివారికి నిర్బంధము దగదు; దుర్మానంబు దుర్దశ నాపాదించు; నయ్యయాతి దుర్మానంబునంగాదె పుణ్యలోక పరిభ్రష్టుండై మాధవీ పుత్త్రులగు నన్నలువురు దౌహిత్రులకతంబున నూర్ధ్వగతిం గనియె; నట్లగుటం జేసి. 322

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఎట్టివారికిన్= ఎటువంటివారికైనను; నిర్బంధము తగదు= బలాత్కారం కూడదు; దుర్మానంబు= దురహంకారం; దుర్దశన్= దుఃస్థితిని; ఆపాదించున్= కలిగిస్తుంది; ఆ యయాతి; దుర్మానంబునన్+కాదె= దుర్గర్వం వల్లనే కదా; పుణ్యలోక పరిభ్రష్టుండు+ఐ= ఉత్తమలోకాలనుండి జారినవాడై; మాధవీపుత్త్రులు+అగు= మాధవి అనే తన కొమార్తె కొడుకులైన; ఆ+నలువురు దౌహిత్రుల కతంబునన్= ఆ నలుగురు మనుమళ్ళ మూలాన (దుహిత= కూతురు; దౌహిత్రుడు= దుహితయొక్క పుత్త్రుడు- మనుమడు); ఊర్ధ్వగతిన్+కనియెన్= ఉత్తమలోక ప్రాప్తినందాడు; అట్లు+ అగుటన్+చేసి= అందువలన.

**తాత్పర్యం:** దుర్యోధనా! ఎట్టివారికైనా నిర్బంధం పనికిరాదు. దురహంకారం దుఃస్థితి కలిగిస్తుంది. యయాతి మహారాజు దురహంకారం చేతనే పుణ్యలోకాలనుండి దిగజారి కొమార్తె మాధవియొక్క నలుగురు తనయుల మూలాన ఊర్ధ్వలోక ప్రాప్తి నందాడు. కాబట్టి- (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నిర్బంధము దుర్మానము । దుర్బుద్ధికిఁ గాక తగునె? దుర్యోధన! నీ**
**మార్బలమె పాండవులకున్ । దౌర్బల్యము వాయు శుభము దలఁకొను సంధిన్. 323**

**ప్రతిపదార్థం:** దుర్యోధన!= సుయోధనా!; నిర్బంధము= కదలమెదలగూడని కట్టుబాటూ; దుర్మానము= దురహంకారమూ; దుర్బుద్ధికిన్+కాక= దుష్టచిత్తుడికి తప్ప; తగునె?= నీకు తగునా? (తగవని అర్థం); నీ మార్బలమె?= పాండవులు నీకు శత్రుబలమా? (కారనుట); పాండవులకున్= కౌంతేయులకు; సంధిన్= పొత్తువలన; దౌర్బల్యము+పాయున్= దుర్బలత్వం తొలగుతుంది; శుభము= మేలు; తలఁకొనున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** సుయోధనా! పరులను నిర్బంధించటం, దురహంకారం పూనటం దుష్టాత్ముడికి తప్ప నీకు తగవు. నీవు ప్రతిఘటించడం పాండవుల దౌర్బల్యాన్ని తొలగిస్తుంది. సంధివల్ల నీకు మేలు కల్గుతుంది.

**విశేషం:** సూర్యరాయాంధ్ర నిఘంటువులో ఈ పద్యమిట్లు పేర్కొనబడింది: **"క. నిర్బంధము దుర్మానము । దుర్బుద్ధికిఁ గాక తగునె? దుర్యోధన! నీ । మార్బలమె పాండవేయులు? దౌర్బల్యము వాయు, శుభముదలఁకొను సంధిన్."** ప్రతిపదార్థం: నిర్బంధమున్= బలాత్కారమూ; దుర్మానమున్= దురహంకారమూ; దుర్బుద్ధికిన్+కాక= దుష్టబుద్ధికి కాక; తగునె= తగునా?; దుర్యోధన!; పాండవేయులు= పాండవులు; నీ-మార్బలమె?= నీ శత్రుబలమా?; సంధిన్= సంధిచేత; దౌర్బల్యము+పాయున్= దుర్బలత్వము పోతుంది; శుభము= మంచి; తలఁకొనున్= కలుగుతుంది. (సంపా.)

**వ. కృష్ణుని మాట విని నీ వక్కౌరవాన్వయంబు రక్షింపు' మనియె; నివ్విధంబున నమ్మువ్వురు మునీంద్రులు సెప్పిన హితోపదేశంబుల దెస ననాదరంబు సేసి గాంధారేయుండు రాధేయుం గనుంగొని చేయప్పళించి నవ్వి 'వీర లింత వెఱ్ఱు లగుదురే?' యని పలికి వారల నవలోకించి. 324**

**ప్రతిపదార్థం:** కృష్ణునిమాటన్; విని; నీవు; ఈ+కౌరవ+అన్వయంబున్= ఈ కురువంశమును; రక్షింపుము= కాపాడుము; అనియెన్; ఈ+విధంబునన్; ఆ+మువ్వురు; ముని+ఇంద్రులు= మునిశ్రేష్ఠులు, చెప్పిన; హిత+ఉపదేశంబుల దెసన్= హితబోధలపట్ల; అనాదరంబు+చేసి= అసమ్మతి చూపి; గాంధారేయుండు= గాంధారి కుమారుడైన దుర్యోధనుడు; రాధేయున్= కర్ణుడిని; కనుంగొని= చూచి; చే+అప్పళించి= చప్పట్లు చరచి; నవ్వి= పరిహసించి; వీరలు= ఈ మునులు; ఇంత వెఱ్ఱులు+అగుదురే?= ఇంత పిచ్చివారా? అని పలికి; వారలన్= ఆ మునీశ్వరులను; అవలోకించి= కనుగొని.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి మాటలు విని నీవు ఈ కురువంశాన్ని కాపాడుము'. అని నారదుడు పలికాడు. ఆ విధంగా ఆ ముగ్గురు మునిపుంగవులు చెప్పిన హితవాక్యాలను మన్నించక దుర్యోధనుడు కర్ణుడిని చూచి, చేయి చరుస్తూ, నవ్వి 'ఈ మునీశ్వరు లెంత పిచ్చివారు? అని పలికి, వారిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

### దుర్యోధనుఁడు నారదాది మునుల మాటలు వినక నిరాకరించుట (సం. 5-122-1)

**క. 'మునులార! నన్ను విధి యే । మని మును పుట్టించె నట్టులయ్యెడుఁ గా కీ**
**వినఁ జవి గాని పలుకులకుఁ । బని గలదే యుడుగుఁ డింక బహుభాషణముల్. 325**

**ప్రతిపదార్థం:** మునులార!= ఓ మునీశ్వరులారా!; నన్నున్= నన్ను; విధి= బ్రహ్మదేవుఁడు; ఏమి+అని= ఎట్లు కమ్మని; మును= తొలుత; పుట్టించెన్= జన్మింపజేశాడో; అట్టులు+అయ్యెడున్+కాక= అట్లాగే జరుగుతుంది పొండు; ఈ+వినన్+చవికాని+

పలుకులకున్= వినుటకు రుచించని మీ మాటలవలన; పనికలదే?= ప్రయోజనముందా?; ఇంకన్= ఇక; బహుభాషణముల్= పలుమాటలు; ఉడుగుఁడు= మానండి.

**తాత్పర్యం:** 'ఓ మునీశ్వరులారా! బ్రహ్మదేవుఁడు నన్ను ఏమి కమ్మని పుట్టించాడో అట్లానే జరుగుతుంది. వినటానికి రుచించని మీ మాటలవలన ఏమి ప్రయోజనం? ఇక పలుమాటలాడటం చాలించండి.'

**వ. అనిన విని ధృతరాష్ట్రుం డమ్మహామునులతో నిట్లనియె. 326**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ధృతరాష్ట్రుండు; ఆ+ మహామునులతోన్; ఇట్లు+ అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కుమారుని పలుకులు విని ధృతరాష్ట్రుడు ఆ మహర్షులతో ఇట్లా అన్నాడు:

**తే. 'మీరు చెప్పిన బుద్ధులు గారవమునఁ। జేయఁ గాంచినఁ బుణ్యంబు సేయ నెట్లు**
**నా ముఖంబునఁ గార్యంబు నడవ దేమి। సేయువాఁడ నొం డెద్దియుఁ జెప్పలేదు. 327**

**ప్రతిపదార్థం:** మీరు చెప్పిన బుద్ధులు= మీరు చేసిన హితోపదేశాలు; గారవమునన్= ఆదరంతో; చేయన్+కాంచినన్= చేయుటకు నోచియున్నచో; పుణ్యంబున్+ఎట్లు+చేయన్= సుకృతం చేసినవాడనే అగుదును గదా!; నా ముఖంబునన్= నా చేతిమీదుగా; కార్యంబు నడవదు= పని జరుగదు; ఏమి చేయువాఁడన్?= నేనేమి చేయగలను?; చెప్పన్= ఇంతకుమించి నుడువుటకు; ఒండు+ఎద్దియున్+లేదు= మరేమియూ లేదు.

**తాత్పర్యం:** 'మునిపుంగవులారా! మీరు చేసిన హితోపదేశాన్ని ఆదరంతో అనుసరించగలిగితే నేను పుణ్యం చేసినవాడనే ఔతాను గదా! కాని నావల్ల ఏ పనీ కాదు. నే నేమి చేయగలను? ఇంతకుమించి చెప్పవలసినదేమీ లేదు.'

**క. అని యతఁడు శౌరితో ని। ట్లను 'నిహముం బరముఁ గలుగునట్టి విధము నీ**
**వనఘా! చెప్పితి; నాకుం। జన వేదియు లేదు దీన సమ్మతి నడపన్. 328**

**ప్రతిపదార్థం:** అని= అనుచు; అతఁడు= ధృతరాష్ట్రుడు; శౌరితోన్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనున్= ఈ లాగున అన్నాడు; అనఘా= పుణ్యాత్ముడా!; నీవు ఇహమున్= ఈ లోకమందు సుఖము; పరమున్= ఆలోకమందు సుఖము; కలుగు+అట్టివిధమున్= లభించే మార్గాన్ని; చెప్పితి(వి)= వచించావు; దీనిన్= నీవు చెప్పిన హితమును; సమ్మతిన్= అంగీకారముతో; నడపన్= ఆచరణలోనుంచుటకు; నాకున్= నాకు; చనవు= చొరవ, ఏదియున్+లేదు= ఏ మాత్రం లేదు.

**తాత్పర్యం:** మునులతో అట్లా పల్కి ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుడితో ఇట్లాఅన్నాడు. 'పుణ్యపురుషా! ఇహపరాలు రెండూ సమకూడే విధమేదో నీవు చెప్పావు. కాని, నీవు చెప్పినట్లుగా కార్యం నిర్వర్తించటానికి నాకు ఏ మాత్రం చొరవ లేదు.

**ఆ. మందబుద్ధి నాదు నందనుఁ డీవు పో। రాని చుట్టమవు మహానుభావుఁ**
**డవు దయార్ద్రచిత్తుఁడవు; వీనిఁ దేర్పవే। యనునయించి యెట్టులైనఁ గృష్ణ!' 329**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= గోవిందా!; నాదు నందనుఁడు= నా కుమారుఁడు; మందబుద్ధి= మూఢచిత్తుడు; ఈవు= నీవు; పోరానిచుట్టమవు= త్రోసివేయరాని బాంధవుడవు; మహానుభావుఁడవు= మహాత్ముడివి; దయా+ఆర్ద్ర చిత్తుఁడవు= కృపచేత

తడిసిన మనస్సుకలవాడవు; వీనిన్= దుర్యోధనుడిని; అనునయించి= బుజ్జగించి; ఎట్టులు+ఐనన్= ఏ విధంగానైనను; తేర్పవే!= ప్రసన్నుడిని కావించుమయ్యా!

**తాత్పర్యం:** కృష్ణా! నా కుమారుడు మూఢచిత్తుడు. నీవో త్రోసిరాజనని బాంధవుడవు. మహాత్ముడవు. కారుణ్య కలిత హృదయుడివి. వీని నెట్లాగయినా శాంతింపజేయు మని వేడుకొంటున్నాను.'

**క. అనిన ముకుందుఁడు దుర్యో । ధనుతో నిట్లనియె 'విమల తర వంశమునన్**
**జనియించి తెల్లగుణముల । ననూనుఁడవు నీకు నా దురాగ్రహ మేలా? 330**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధృతరాష్ట్రుడు కోరగా; ముకుందుఁడు= కృష్ణుడు; దుర్యోధనుతోన్= సుయోధనుడితో; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా అన్నాడు; విమలతర వంశమునన్= పరమ స్వచ్ఛమైన కురుకులంలో; జనియించితి(వి)= పుట్టావు; ఎల్లగుణములన్= అన్నిగుణాలచేత; అనూనుఁడవు= అధికుడవు; నీకున్= ఇట్టి నీకు; ఈ+దుర్+ఆగ్రహము+ఏలా?= ఈ మొండిపట్టుదల ఎందుకు?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు తనను ఆ రీతిని కోరగా కృష్ణు డిట్లా పలికాడు: 'సుయోధనా! నీవు మిక్కిలి నిర్మలమైన వంశంలో జన్మించావు. అన్ని సద్గుణాలచే గొప్పవాడివి. ఇట్లాంటి నీకు ఈ మొండిపట్టుదల తగునటయ్యా!'

**చ. తులువలు గాక యిట్టిదొర దుర్ణయవృత్తికిఁ జొచ్చునయ్య? పు**
**త్త్రులు ననుజన్ములుం జెలులు దుష్టపథంబునఁ బోవకుండఁ జు**
**ట్టలుఁ దగువారుఁ దండ్రియు నొడంబడఁ జేయుము కార్య; మల్పబు**
**ద్ధుల వెడమాట లూఁకొనకు; దోసము సేగియు వచ్చు నమ్మెయిన్. 331**

**ప్రతిపదార్థం:** తులువలు+కాక= కుచ్ఛితులు తప్ప; ఇట్టిదొర= నీవంటి ప్రభువు; దుర్ణయవృత్తికిన్= అన్యాయకార్యాలకు; చొచ్చును+అయ్య?= పాల్పడునా; పుత్త్రులున్= నీ కుమారులును; అనుజన్ములున్= తమ్ముళ్ళు; చెలులున్= మిత్రులు; దుష్టపథంబునన్= చెడుదారిలో; పోవక+ఉండన్= నడవకుండునట్లు; చుట్టలున్= బంధువులును; తగువారున్= పెద్దలు; తండ్రియున్= నీ జనకుడును; ఒడంబడన్= సమ్మతించగా; కార్యమున్+చేయుము= పని నిర్వహించుము; అల్పబుద్ధుల= నీచమనస్కులయొక్క; వెడమాటలు= తుచ్ఛవాక్యాలు; ఊఁకొనకు(ము)= అంగీకరించకుము; ఆ+మెయిన్= అట్లు అంగీకరించినయెడల; దోసమున్= పాపం; సేగియున్= కీడును; వచ్చున్= వస్తాయి.

**తాత్పర్యం:** సుయోధనా! ఎవరో కుచ్ఛితులు తప్ప నీవంటి ఉత్తమ ప్రభువు ఇట్లాంటి అన్యాయ కార్యాలకు పాల్పడవచ్చునా? నీ కుమారులు, తమ్ములు, స్నేహితులు చెడుదారిలో నడవకుండా చూచుకో. నీ బంధువులు, పెద్దలు, జనకుడు సమ్మతించేటట్లుగా పాండవులతో పొత్తు కావించుకొనుము. అల్పబుద్ధిగలవారి చెడుమాటలు వినవద్దు. వారి మాటలకు తల ఒగ్గితే నీకు పాపం సంభవిస్తుంది. ఆపద మూడుతుంది.

**క. పాండిత్య శౌర్య నిత్యులు । పాండుసుతులు వారిఁగూడి బ్రదుకుట ధృతరా**
**ష్ట్రుండును బాహ్లికుఁడును భీ । ష్మండు గురుఁడు కోరు తెఱఁగు సూవె నరేంద్రా! 332**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= మనుజేశ్వరా!; పాండుసుతులు= పాండురాజు కుమారులు; పాండిత్య శౌర్య నిత్యులు= వివేకం పరాక్రమం అనేవాటిచే స్థిరులు; వారిన్+కూడి= వారితో చేరి; బ్రదుకుట= మనటం; ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్రుడూ; బాహ్లికుడూ, భీష్మండున్= భీష్ముడూ; గురుఁడున్= ద్రోణుఁడూ; కోరు తెఱఁగు+చూవె= కోరుకొనే తీరు సుమా!

**తాత్పర్యం:** పాండవులు పాండిత్య పరాక్రమ సమగ్రులు. వీరితో కలసి మెలసి మీరు జీవించవలెనని ధృతరాష్ట్ర బాహ్లిక భీష్మ ద్రోణులు కోరుకొంటున్నారు సుమా!

**ఆ. విను మసత్య లోభమున సిరియగునె యాఁ । కొని ముసిండి దినినఁ గ్రొవ్వు లావుఁ**
**గలుగునయ్య? శకుని కర్ణ దుశ్శాసన । మంత్రితంబు కార్య తంత్ర మగునె? 333**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలింపుము; అసత్యలోభమునన్= అసత్యమందలి దురాశచేత; సిరి+అగునె?= సంపద సమకూడగలదా? ఆఁకొని= ఆకలిగొని; ముసిండి+తినినన్= ముసిడి పండ్లను భుజిస్తే; క్రొవ్వులావు+కలుగును+అయ్య?= కండ బలిమి లభిస్తుందా?; శకుని కర్ణ దుశ్శాసన మంత్రితంబు= శకుని కర్ణ దుశ్శాసనులచే చెప్పబడిన సలహా; కార్య తంత్రము+అగునె?= పనిని సాధించటానికి సాధనం కాగలదా? (కాదని భావం).

**తాత్పర్యం:** దుర్యోధనా! విను. అసత్యలోభం వల్ల సంపద సమకూడదు. ఆకలి వేసినపుడు మిసమిసలాడుతూ భ్రాంతి గొలిపే ముష్టిచెట్టుపండ్లను తింటే శరీరానికి పుష్టి తుష్టి ఏర్పడుతుందా? అందుకు మారుగా ఆ పండ్లు ప్రాణాంతక మవుతాయి. అట్లాగే శకుని కర్ణ దుశ్శాసనుల చెడు సలహాలు కార్యకారులు ఔతాయా?

**విశేషం:** అలం: నిదర్శన.

**శా. తోడంబుట్టిన భీమపార్థుల మహా దోర్దర్పముల్ లాఁతులై**
**తో డంచుం బెఱవారి దుర్బలుల నెందుం జొచ్చి దైన్యంబునం**
**గూడం బెట్టెదు; నీవ పాండుసుతులం గుందింపఁగా సత్యముం**
**బాడిం దప్ప రొకప్పుడుం గినియ రా బంధుత్వ మే లొల్లవో? 334**

**ప్రతిపదార్థం:** తోడన్+పుట్టిన= సోదరులుగా జన్మించిన; భీమపార్థుల= భీమార్జునుల యొక్క; మహా+దోః +దర్పముల్= గొప్ప భుజశౌర్యాలు; లాఁతులు+ఐ= అన్యములై; పాండుసుతులన్= పాండవులను; కుందింపఁగాన్= బాధించటానికి; నీవు+అ= నీవే; పెఱవారిన్= పరాయివారైన; దుర్బలులన్= శక్తిహీనులను; తోడు+అంచున్= సహాయులని; ఎందున్+చొచ్చి= ఎక్కడెక్కడికో వెళ్ళి; దైన్యంబునన్= కృపణత్వంతో; కూడన్+పెట్టెదు= గుంపుగా చేర్చుకొంటున్నావు; సత్యమున్= నిజమును; పాడిన్= న్యాయమును; తప్పరు= కౌంతేయులు విడిచినవారుకారు; ఒకప్పుడున్= ఏనాడుకూడా; కినియరు= నీపై క్రోధం వహించరు; ఆ బంధుత్వమున్= ఆ చుట్టరికమును; ఏల+ ఒల్లవో?= ఎందుకు ఇష్టపడవో తెలియదు.

**తాత్పర్యం:** సహోదరులైన భీమార్జునులు గొప్ప భుజపరాక్రమాలు కలవారు. వారు నీకు పరాయివారైనారు. వారిని నొప్పించటానికి సాయపడగలరని శక్తిహీనులను పరాయివారిని ఎక్కడెక్కడికో వెళ్ళి కృపణత్వంతో వేడుకొని అందరినీ గుంపుగా చెంతకు చేర్చుకొంటున్నావు. పాండవులు సత్యాన్నీ, న్యాయాన్నీ వీడనివారు. ఎన్నడూ నీమీద క్రోధం వహించినవారు కాదు. అట్లాంటివారి చుట్టరికం నీ కెందుకు గిట్టదో తెలియదు.

**ఉ. వారును మీరుఁ బొంది జనవల్లభు లెల్లను భృత్యభావనం**
**జేర సమస్త వస్తువులుఁ జేకుఱఁగా బ్రదుకొప్పుఁగాక నీ;**
**కీరస మెత్తికోల్ గఱపి యిప్పుడు కార్యము దప్పఁజూచు నీ**
**వారలు ముట్టవచ్చిన నవశ్యము నంతకుఁ జాలరుం జుమీ! 335**

**ప్రతిపదార్థం:** వారును= ఆ పాండవులూ; మీరున్= కౌరవులైన మీరూ; పొంది= ఒద్దికగా ఉండి; జనవల్లభులు+ఎల్లను= రాజులందరూ; భృత్యభావనన్= సేవాబుద్ధితో; చేరన్= మిమ్మాశ్రయించగా; సమస్త వస్తువులున్= ఎల్లపదార్థాలును; చేకుఱఁగాన్= మీకు లభించగా; బ్రదుకు= జీవించటం; ఒప్పున్+కాక= తగి ఉండగలదుగాని; నీకున్= నీకు; ఈరసము+ఎత్తికోల్+కఱపి= ద్వేషం వహించేట్లు బోధించి; ఇప్పుడు= ఈ సమయాన; కార్యమున్+తప్పన్+చూచి= పని చెడిపోయేటట్లు చేసే; నీ వారలు= నీ పక్షంలో ఉన్నవారు; ముట్టన్+వచ్చినన్= పాండవులు మీపై దండెత్తి వచ్చినపుడు; అవశ్యము= నిశ్చయంగా; అంతకున్+చాలరున్+చుమీ!= వారి నెదిరించటానికి సమర్థులు కాలేరు సుమా!

**తాత్పర్యం:** పాండవులూ మీరూ పొత్తుకూడి ఉండగా, రాజులందరూ తాము సేవకుల మనే తలంపుతో మిమ్ముచేరి కొలుస్తుండగా, అన్ని పదార్థాలు మీకు సమకూడగా హాయిగా జీవించటం మంచిది. అంతేకాని, నీకు కౌంతేయులపై ద్వేషం కల్పించి ఇప్పుడు పనిచెరచటానికి కంకణం కట్టుకొన్న నీ మనుషులు, పాండవులు మీపై యుద్ధానికి తరలివచ్చిన సమయంలో వారి నెదిరించటానికి ఏమాత్రం కొరగారు సుమా!

**ఆ. వీరు కారు పాండవేయులఁబోర మా । ర్కొన సురాసురులకుఁ గొలఁది గాదు**
**కాన వారితోడి కయ్యంబునకు నిర్ణ । యింపవలదు । సంధి పెంపుఁ జేయు. 336**

**ప్రతిపదార్థం:** వీరు+అ+కాదు= నీవు విశ్వసించిన కర్ణాదులే కాదు; పాండవేయులన్= పాండుపుత్రులను; పోరన్= యుద్ధంలో; మార్కొనన్= ఎదిరించటానికి; సుర+అసురులకున్= దేవదానవులకు కూడ; కొలఁది+కాదు= శక్యం కాదు; కానన్= కాబట్టి; వారి తోడి కయ్యంబునకున్= కౌంతేయుల తోడి కలహానికి; నిర్ణయింపన్+వలదు= నిశ్చయించవద్దు; సంధి= పొత్తు; పెంపున్+చేయున్= వృద్ధిని కల్గిస్తుంది.

**తాత్పర్యం:** కర్ణాదులకే కాదు, దేవదానవులకు కూడ కౌంతేయులను ఎదుర్కొనటం శక్యంకాదు. కనుక పాండవులతో పోరాటానికి నిర్ణయం చేయవద్దు. సంధియే అభివృద్ధి కలిగిస్తుంది.

**విశేషం:** అలం: అనన్వయం.

**క. ఈయున్న రాజులందఱు । వాయుసుతున కొక్క యెత్తు; వాఁ డలిగిన శూ**
**లాయుధుఁడు వడఁకు; నా కౌం । తేయులతోఁ బెనఁగు టుడుగు ధీరవిచారా! 337**

**ప్రతిపదార్థం:** ధీర విచారా!= ధైర్యాలోచన కలవాడా!; ఈ+ఉన్న రాజులు+అందఱున్= నీ పక్షంలో చేరి ఉన్న ఈ దొరలంతా; వాయుసుతునకున్= గాడ్పుపట్టి ఐన భీమసేనుడికి; ఒక్క+ఎత్తు= సమానం; వాఁడు+అలిగినన్= అతడు కోపిస్తే; శూల+ఆయుధుఁడున్= శూలం ఆయుధంగా గలిగిన పరమేశ్వరుడుకూడా; వడఁకున్= గడగడలాడుతాడు; ఆ కౌంతేయులతోన్= ఆ కుంతీదేవి కుమారులతో; పెనఁగుట+ఉడుగు(ము)= పోరు సల్పటం మానుము.

**తాత్పర్యం:** ఇక్కడున్న ఈ దొరలంతా చేరి భీమసేనుడికి ఒక యెత్తు. భీముడు గనుక కినుకవహిస్తే త్రిశూలపాణి అయిన ఈశ్వరుడే భయంతో కంపించిపోతాడు. కాబట్టి కౌంతేయులతో కలహించటం మానుకో!

**క. ఒక కార్యము సెప్పెద మీ । సకల బలమునందు సవ్యసాచి కెదురుగా**
**నొకరుఁడు గలిగినఁ గయ్యము । నకుఁ బూనుఁడు; రిత్త బహుజనక్షయ మేలా? 338**

**ప్రతిపదార్థం:** ఒక కార్యము+చెప్పెదన్= ఒక కర్తవ్యం నీకు చెపుతాను; మీ సకలబలమునందున్= మీకున్న సమస్త సైన్యంలో; సవ్యసాచికిన్= అర్జునుడికి; ఎదురుగాన్= ఎదిరించటానికి సమర్థుడుగా; ఒకరుఁడు= ఒక్కడు; కలిగినన్= ఉంటే; కయ్యమునకున్= యుద్ధానికి; పూనుఁడు= సిద్ధపడండి; రిత్త= వ్యర్థంగా; బహుజనక్షయము+ఏలా?= అనేక ప్రజా వినాశం ఎందుకు?

**తాత్పర్యం:** సుయోధనా! ఒక సంగతి చెపుతాను విను. మీ సమస్త సైన్యంలో అర్జునుడిని ఎదిరించగల వీరుడొక్కడుంటే యుద్ధానికి నడుంకట్టుము. నిరుపయోగంగా బహుజన వినాశం ఎందుకు చేస్తావు?

**క. పెక్కండ్రు గోవులంగొని । యుక్కు మిగిలి నడవ వెనుక నుద్దవిడిం దా**
**నొక్కఁడ నరుఁ డేతెంచినఁ । జిక్కె సమస్తంబు నది ప్రసిద్ధమ కాదే? 339**

**ప్రతిపదార్థం:** పెక్కండ్రు= పలువురు వీరులు; గోవులన్+కొని= ఆవులను తోలుకొని; ఉక్కుమిగిలి నడవన్= శౌర్యంతో చెలరేగి ముందుకు సాగుతుండగా; వెనుకన్= వారి వెనుక; ఉద్దవిడిన్= పూనికతో; తాన్+ఒక్కఁడు+అ= తానొక్కడే; నరుఁడు= అర్జునుడు; ఏతెంచినన్= రాగా; సమస్తంబు చిక్కెన్= ఆవులన్నీ దొరకిపోయాయి; అది= ఆ గోవులను మరలించుకొనివచ్చిన విషయం; ప్రసిద్ధమ కాదే!= అందరికీ తెలిసినదేగదా!

**తాత్పర్యం:** పెక్కుమంది వీరులు విరటుడి గోవులను తోలుకొని శౌర్యంతో హస్తినాపురికి వెళ్ళుతుండగా వెనకనే వేగంగా వచ్చి, అర్జునుడు తా నొక్కడే ఆవులన్నింటినీ మత్స్యపురికి మరలించుకు వచ్చిన సంగతి ప్రఖ్యాతమే కదా!

**క. తోడు దొనలేనియప్పటి । క్రీడి కొలఁది యట్టి దధిప! కినియక విను మేఁ**
**దోడై రా నెదురుట గడుఁ । గీడు; వలవ దుడుగవయ్య గెలు పరిది సుమీ! 340**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; తోడుదొన= తనకు ఎట్టి సహాయం, అమ్ములపొదులు; లేని= లేనటువంటి; అప్పటి క్రీడి కొలఁది+అట్టిది= అజ్ఞాతవాస దీక్షలో ఉన్న ఫల్గునుడి పరాక్రమం అటువంటిది; కినియక వినుము= కోపపడక నా మాటలు వినుము; ఏన్= నేను; తోడు+ఐ రాన్= సహాయంగా రాగా; ఎదురుట= అర్జునుడిని మార్కొనటం; కడున్+కీడు= మిక్కిలి హానికరం; వలవదు= తగదు; ఉడుగవు+అయ్య!= వారితో పోరు సల్పటం మానవయ్యా; గెలుపు= విజయం; అరిదిసుమీ!= దుర్లభం సుమా!

**తాత్పర్యం:** తనకు ఎటువంటి సహాయమూ, అమ్ముల పొదులూ లేని అజ్ఞాతవాసకాలంనాటి అర్జునుడి విక్రమం అటువంటిది. రాజా! నే చెప్పేది కోపగించక విను. నేనే తనకు సహాయుడనై రాగా పార్థుడితో ప్రతిఘటించటం చేటునకు మూలం. ఆ ఆలోచన మానుకో. యుద్ధంలో నీకు విజయం అశక్యం సుమా!

**తే. అనుజ తనుజులుఁ జెలులు వియ్యములు నడుగు । మాలి పోదురు నీకుఁగా మనుజనాథ!**
**దొరకుఁ గులనాశనుండను దూఱు మేలె? । పాండవుతోడ నొడఁగూడి బ్రదుకవయ్య! 341**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; అనుజతనుజులున్= తమ్ముళ్లూ, కుమారులూ; చెలులున్= మిత్రులూ; వియ్యములున్= వివాహ సంబంధులున్నూ; నీకున్+కాన్= నీ కొరకై; అడుగుమాలిపోదురు= అణగారిపోతారు; దొరకున్= ప్రభువునకు; కులనాశనుండు= వంశవిధ్వంసకుడు; అను+దూఱు= అనునట్టి నింద; మేలె?= మంచిదా? పాండవులతోడన్= పాండుకుమారులతో; ఒడన్+కూడి= పొత్తుకూడి; బ్రదుకవు+అయ్య!= జీవించవయ్యా!

**తాత్పర్యం:** సుయోధనా! నీ తమ్ముళ్లూ, కుమారులూ, స్నేహితులూ, పిల్లనిచ్చినవారూ, పిల్లను చేసికొన్నవారూ నీమూలంగా నాశనమవుతారు. నీవంటి ప్రభువుకు కులవినాశకుడు అనే నింద పొందటం మంచిదికాదు. పాండవులతో కలిసి మెలసి జీవించు.

**ఉ. రాజ్యముభారమెల్ల ధృతరాష్ట్రునియంద వెలుంగుచుండఁ, ద**
**త్పూజ్య కుమార పట్టమునఁ బొల్చి చరింపఁగ నీవు, పాండవుల్**
**సజ్యతఁ దండ్రి చిత్తము ప్రసన్నతఁ బొందఁగఁ గొల్చి యున్కి సా**
**మ్రాజ్యముగాఁ దలంతు రనురక్తమతిం దమకున్ ధరాధిపా! 342**

**ప్రతిపదార్థం:** ధరా+అధిపా!= రాజా!; రాజ్యము భారము+ఎల్లన్= రాజ్యమేలే బరువంతా; ధృతరాష్ట్రుని యందున్+అ= ధృతరాష్ట్రుడియందే; వెలుంగుచున్+ఉండన్= ప్రకాశిస్తుండగా; నీవు; తద్+పూజ్యకుమార పట్టమునన్= మాననీయమైన యౌవరాజ్య పదవిలో; పొల్చి= ఒప్పుచు; చరింపఁగన్= మెలగుతుండగా; పాండవుల్= పాండుకుమారులు; సజ్యతన్= విండ్లెక్కువెట్టి; తండ్రి చిత్తము= జనకుడైన ధృతరాష్ట్రుడి మనస్సు; ప్రసన్నతన్+పొందఁగన్= శాంతితో కూడి ఉండగా కొల్చి+ఉన్కి= సేవిస్తూ ఉండటం; తమకున్= తమకు; అనురక్తమతిన్= అనురాగముతో నిండిన హృదయంతో; సామ్రాజ్యముగాన్+తలంతురు= చక్రవర్తిత్వం వచ్చినట్లుగా భావిస్తారు.

**తాత్పర్యం:** రాజా! రాజ్య భారమంతా ధృతరాష్ట్రుడే వహించి ప్రకాశిస్తుంటే, నీవు యౌవరాజ్య పట్టాభిషిక్తుడవై రాచకార్యాలు చూచుకొంటుంటే, పాండవులు విండ్లెక్కు పెట్టుకొని రాజ్యరక్షణ గావిస్తూ జనకుడైన ఆంబికేయుడి మనస్సు ఎట్టి కలతలు లేక ప్రశాంతంగా ఉండగా, ఆయనకు సేవలు చెయ్యటమే తమకు చక్రవర్తిత్వమని అనురాగం గల హృదయాలతో భావిస్తారు.

**క. కౌరవనాయక! పాండుకు । మారులు నీ తోడి పొత్తు మనియెద మనఁగా**
**శ్రీ రా మోఁకా లొడ్డిన । వారి విధము కాదె నీవు వలదను టెల్లన్.' 343**

**ప్రతిపదార్థం:** కౌరవనాయక!= కురురాజా!; పాండుకుమారులు= పాండునందనులు; నీతోడి పొత్తు మనియెదము= నీతో ఒద్దికగా ఉండి జీవిస్తామని; అనఁగాన్= అంటుంటే; నీవు; వలదు+అనుట+ఎల్లన్= వద్దని చెప్పడం; శ్రీరాన్= సిరివస్తుంటే; మోకాలు+ ఒడ్డినవారి విధమకాదె!= మోకాలు అడ్డంపెట్టే వారి చందంగా ఉండదా?

**తాత్పర్యం:** కురునాథా! పాండునందనులు నీతో సంధి చేసికొని జీవిస్తామని ఆశతో ఉంటే, నీవు వారి పొత్తు నాకు వద్దని నిరాకరించటం- లక్ష్మి తానై నడచి ఇంటికి వస్తుంటే రావద్దని మోకాలు అడ్డంపెట్టేవారి చందంగా ఉన్నది.

**విశేషం:** అలం: లోకోక్తి.

భీష్మద్రోణులు దుర్యోధనునకు హితంబు సెప్పుట (సం. 5-123-1)

**చ. అన విని భీష్ముఁ డిట్లనియె నాధృతరాష్ట్ర తనూజుతోడ 'నీ**
**జనకుని మాట వట్టుము ప్రసన్నమతిన్ । మనవంశ మెల్లఁ బా**
**వనముగ నిందు వచ్చి బుధవత్సలుఁ డీ హరి యిట్లు సెప్పఁగా**
**వినమిఁ గడుం జెడుం దెరువు; । వీరల పం పొనరింపు పెంపుగన్. 344**

**ప్రతిపదార్థం:** అనన్ విని= అని శ్రీకృష్ణుడు పలుకగా విని; భీష్ముఁడు; ఆ ధృతరాష్ట్ర తనూజు తోడన్= ఆ ధృతరాష్ట్రుడి కుమారుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; ప్రసన్నమతిన్= ప్రశాంతమైన మనస్సుతో; నీ జనకునిమాట+పట్టుము= నీ తండ్రిమాట గ్రహించుము; మన వంశము+ఎల్లన్= మన కురు కుల మంతయూ; పావనముగన్= పవిత్రముకాగా; ఇందున్+వచ్చి= ఇక్కడికి విచ్చేసి; బుధవత్సలుఁడు= విద్వాంసుల యందు ప్రేమ కలిగిన వాడైన; ఈ హరి= ఈ శ్రీకృష్ణుడు; ఇట్లు చెప్పఁగాన్= ఇంత హితం బోధించగా; వినమిన్= వినకుండుట; కడున్= మిక్కిలి; చెడున్+తెరువు= పెడత్రోవ; వీరల పంపు= నీ తండ్రి యొక్క, నారాయణుడికి యొక్క ఆనతి; పెంపుగన్= వృద్ధికరంగా; ఒనరింపు(ము)= ఆచరించుము.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి పలుకులు విని భీష్ముడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు: నీ తండ్రిమాట ప్రశాంత హృదయంతో స్వీకరించు. మన కురుకులం పవిత్రమయేటట్లు పండితుల యందు ప్రేమగల నారాయణుడు ఇక్కడికి విచ్చేసి నీకు హితం తెలిపాడు. ఆయన వచనాలు వినకపోవటం వినాశనానికి మార్గం. వీరందరూ ఆజ్ఞాపించిన పని అభ్యుదయకరంగా ఆచరించు.

**క. మానక ధృతరాష్ట్రుఁడు ప్రా । ణానం గలుగంగ బంధునాశము రాజ్య**
**శ్రీనాశము నుద్దామయ । శోనాశముఁ జేయనేల చూచెద చెపుమా! 345**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; ప్రాణానన్+కలుగంగన్= ప్రాణాలతో ఉండగా; మానక= వదలక; బంధునాశమున్= చుట్టాల యొక్క వినాశనాన్నీ; రాజ్యశ్రీ నాశమున్= రాజ్యలక్ష్మియొక్క వినాశనాన్నీ; ఉద్దామ యశోనాశమున్= గొప్పదైన కీర్తియొక్క వినాశనాన్ని; ఏల= ఎందుకు; చేయన్+చూచెదు+చెపుమా!= చేయడానికి సంకల్పించావో చెప్పుము.

**తాత్పర్యం:** 'సుయోధనా! నీ తండ్రి ధృతరాష్ట్రుడు ప్రాణాలతో ఉండగానే' విడువకుండా చుట్టాలనూ, రాజ్యాన్నీ, హద్దులేని కీర్తినీ ఎందుకు నాశనం చేయాలని యత్నిస్తావో చెప్పు.

**విశేషం:** అలం: సముచ్చయం.

**వ. కృష్ణార్జునులతోడి విరోధం బీ బంధులోకంబునక కాదు లోకంబున నెవ్వరికినిం జూడం బోలదు లోకంబులు రెంటికిని హానిం జేయక కూడి బ్రదుకుట మే'లనినఁ దదనంతరంబ ద్రోణాచార్యుండు దుర్యోధనున కిట్లనియె: 346**

**ప్రతిపదార్థం:** కృష్ణ+అర్జునుల తోడి విరోధంబు= శ్రీ కృష్ణార్జునులతోడి వైరం; ఈ బంధులోకంబునకున్+అ+కాదు= ఈ చుట్టాల సమూహానికే కాదు; లోకంబునన్= జగత్తులో; ఎవ్వరికినిన్= ఎట్టివారికిన్నీ; చూడన్+పోలదు= చూచి సహించటానికి శక్యం కాదు; లోకంబులు రెంటికిని= ఇహపరాలు రెంటికిన్నీ; హానిన్+చేయక= చేటు కలిగించక; కూడి= పాండవులతో చేరి;

బ్రదుకుట మేలు= జీవించటం మంచిది; అనినన్= అని భీష్ముడు పలుకగా; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; ద్రోణ+ఆచార్యుండు= గురువైన ద్రోణుడు; దుర్యోధనునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కృష్ణార్జునులతో పెట్టుకొనే శత్రుత్వం ఈ సమస్త బంధువులకే కాదు, పుడమిలో ఎవ్వరికినీ చూచి సహించరానిదే అవుతుంది. నీవు ఇహపరాలకు కీడు కలిగించక పాండవులతో కలసిమెలసి జీవించటం మంచిది' అని చెప్పాడు. తరువాత గురువైన ద్రోణుడు సుయోధనుడితో ఇట్లా అన్నాడు :

**తే. 'పితృ పితామహ గురులమై ప్రీతిఁగోరు। చున్న యట్టి మా పరమ హితోపదేశ**
**వాక్యములు విని దుర్జన వచన రచనఁ। గొనక బంధులతో నొడఁగూడి మనుము. 347**

**ప్రతిపదార్థం:** పితృపితామహ గురులము+ఐ= తండ్రి, తాత గురువులము అయి; ప్రీతిన్= మీకు సంతోషం; కోరుచున్+ఉన్న+అట్టి= వాంఛిస్తున్నట్టి; మా పరమ హిత+ఉపదేశ వాక్యములు= మిక్కిలిమేలు సమకూర్చే మా హిత వచనాలు; విని= ఆలించి; దుర్జన వచన రచనన్= దుర్మార్గుల పలుకులయొక్క కల్పనను; కొనక= ఆదరించక; బంధులతోన్= చుట్టాలతో; ఒడఁగూడి= చేరి; మనుము= జీవించుము.

**తాత్పర్యం:** 'సుయోధనా! మీ తండ్రియైన ధృతరాష్ట్రుడు, తాత భీష్ముడూ, గురుడనైన నేనూ మీకు సుఖం కోరుతున్న వాళ్ళం. మేలు కలిగించే మా మంచి మాటలు విను. దుర్మార్గుల పల్కులు ఆదరించక బంధువులైన పాండుపుత్త్రులతో కలసిమెలసి జీవించు.

**ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు త్రోవఁ బో**
**వన్న కుమార! యట్లయిన వాయువు శ్రీయును నీకుఁ గల్గు మా**
**కన్నులు సల్లఁగా నకట గన్గొనుచుండుదు మేము; నట్లుగా**
**కున్నను నీవ నేర్తు నొండన నేరము నిండు కొల్వునన్. 348**

**ప్రతిపదార్థం:** కుమార!= వత్సా!; సుయోధనా!; వెన్నుఁడు= విష్ణుమూర్తి - కృష్ణుడు; ప్రీతిన్= ప్రేమతో; చెప్పిన= వచించిన; సవిస్తర వాక్+ప్రచయంబు త్రోవన్= విపులమైన మాటల సమూహం చొప్పున; పోవు+అన్న!= పోగదవయ్యా!; అట్లు+అయినన్= శ్రీకృష్ణుడు బోధించిన మార్గాన్ని అనుసరిస్తే; ఆయువున్= ఆయుష్యం; శ్రీయును= సంపదా; నీకున్+కల్గున్= నీకు లభించగలవు; మా కన్నులు చల్లఁగాన్= మా కన్నులు చల్లబడగా; అకట!= ఆహా! మేము= మేమందరం; కన్గొనుచున్+ఉండుదుము= చూస్తూ ఉండగలం; అట్లు+కాక+ఉన్నను= నీవు శౌరియొక్క వాక్య పద్ధతి ననుసరించకుంటే; నీవు+అ నేర్తు(వు)= నీవే తత్ఫల మనుభవించగలవు; నిండు కొల్వునన్= అందరున్న సభలో; నినున్= నిన్ను; ఒండు+అనన్+నేరము= ఇంతకు మించి ఏమీ పల్కలేము.

**తాత్పర్యం:** వత్సా! గోవిందుడు ప్రేమతో నుడివిన విపులమైన హితవాక్యాలు విన్నావు. ఆ దారిలో మెలగవలసింది. అట్లయితే నీకు ఆయుష్యం, సిరి సంపదలు సమకూడుతాయి. మా కన్నులతో చల్లగా మిమ్ము చూస్తూ హాయిగా ఉంటాము. అట్లా నీవు శౌరి వాక్యపద్ధతి ననుసరించకుంటే తత్ఫలం నీవే అనుభవిస్తావు. ఇంతకుమించి నిండుసభలో నిన్ను ఏమీ అనలేము.'

**చ. అనవుడు నాంబికేయుఁడు నిజాత్మజుదిక్కు మొగంబుచేసి యి**
**ట్లను 'హరి నాశ్రయించి భవదగ్రజుఁ బుణ్యు నజాతశత్రునిం**
**గను మటవోయి దీన మన కార్యము లన్నియు సిద్ధిఁబొందు; నీ**
**తనిపలు కాదరింపమిఁ బదంపడి పాటిలు నెల్ల చేటులున్. 349**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అట్లా ద్రోణాచార్యుడు పల్కినమీదట; ఆంబికేయుఁడు= ధృతరాష్ట్రుడు; నిజ+ఆత్మజు దిక్కు= తన కుమారుడి వైపు; మొగంబుచేసి= ముఖం త్రిప్పి; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; హరిన్+ఆశ్రయించి= శ్రీకృష్ణుడిని ఆధారంగా చేసికొని; భవత్+అగ్రజున్= నీ అన్నగారిని; పుణ్యున్= సుకృతశాలి అయిన; అజాతశత్రునిన్= ధర్మజుడిని; అటవోయి= ఉపప్లావ్య పురికలిగి; కనుము= దర్శించుము; దీనన్= ఆయనను కలిసికొనటంచేత; మన కార్యములు+అన్నియున్= మన పనులన్నీ; సిద్ధిన్+పొందున్= నెరవేరుతాయి; ఈతని పలుకున్+ఆదరింపమిన్= మాధవుడి మాటలు మన్నించకుంటే; పదంపడి= తరువాత; ఎల్లచేటులున్= అన్ని ఆపదలు; పాటిలున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** ద్రోణాచార్యులు అట్లా హితం ఉపదేశించిన తరువాత ధృతరాష్ట్రుడు తన కుమారుడి వైపు ముఖం త్రిప్పి ఇట్లా అన్నాడు: నీవు శ్రీకృష్ణుడిని ఆధారంగా చేసికొని అక్కడికి వెళ్ళి నీకు అన్నగారున్నూ, పుణ్యాత్ముడున్నూ అయిన ధర్మపుత్రుడిని చూడు. అందువల్ల మన పనులన్నీ సఫలమవుతాయి. నారాయణుడి మాటలు ఆదరించకుంటే ఆ తరువాత ఎన్నో కష్టాలు కలుగుతాయి.'

**వ. అనియె; నట్టియెడ గురుభీష్ము లొత్తి చెప్పం దలంచి గాంధారేయున కిట్లనిరి: 350**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని ధృతరాష్ట్రు డన్నాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; గురుభీష్ములు; ఒత్తిచెప్పన్+తలంచి= నొక్కిచెప్పతలచినవారై; గాంధారేయునకున్= గాంధారి కుమారుడైన దుర్యోధనుడికి; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు కుమారుడికి చెప్పిన తరువాత ఇంకా నొక్కి చెప్పదలచి ద్రోణభీష్ములు సుయోధనుడితో ఇట్లా అన్నారు:

**క. 'ఈ కృష్ణుని సారథ్యము । నా కృష్ణుని గాండివంబునై తోఁపక ము**
**న్నీ కొలఁదిఁ జక్కఁబడి నీ । వీ కురువంశంబు గావు మిభపురనాథా!' 351**

**ప్రతిపదార్థం:** ఇభపురనాథా!= హస్తిపురాధీశ్వరా!; ఈ కృష్ణుని సారథ్యమున్= ఈ గోపాలకృష్ణుడి రథచోదకత్వమూ; ఆ కృష్ణుని= పాండవమధ్యముడైన అర్జునుడి; గాండివంబున్+ఐ= గాండివమనే ధనుస్సు కలదై; తోఁపకమున్ను= యుద్ధం ఏర్పడకమునుపే; ఈ కొలఁదిన్+చక్కఁబడి= ఈ పాటి ఉపదేశాలతో మనసు సవరించుకొని; నీవు; ఈ+కురువంశంబున్= ఈ కౌరవ వంశాన్ని; కావుము= రక్షించుము.

**తాత్పర్యం:** 'రాజా! ఈ శ్రీకృష్ణుడు రథసారథ్యం సల్పుతుండగా, గాండివం చేత ధరించి అర్జునుడు యుద్ధ రంగంలో ప్రత్యక్షం కాకమునుపే నీవు ధర్మజుడిని సందర్శించి కార్యం చక్కదిద్దుకొని కౌరవవంశమంతటినీ కాపాడు.'

**వ. అని పలికి మఱియు. 352**

**తాత్పర్యం:** అంటూ భీష్మ ద్రోణులు మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **'ధర్మపుత్త్రుని పద ద్వయమున కతిభక్తి । నెఱఁగిన నతఁడు ని న్నెత్తి గ్రుచ్చి**
**నిడుఁ గేలఁ బెద్దయుఁ దడవుగాఁ గౌఁగిలింపఁగ భీముఁడును నీవుఁ బరమహర్ష**
**మునఁ జారుతర వక్షములు సంగతములుగాఁ । బరిరంభణం బొనర్పంగ నరుఁడుఁ**
**గవలును మ్రొక్కినఁ గరమర్థిఁ దిగిచి నీ । వాలింగనంబు సేయంగ, నిట్లు**

**తే.** **వారు మీరును దగ బాంధవమునఁ బొదలి । యింపు దళుకొత్తఁ దామరతంపరైనఁ**
**జెలులుఁ జుట్టలుఁ గలసి పేరెలమిఁ బొంది । యుల్లసిల్లంగఁ గులమెంత యొప్పునొక్కొ!** **353**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్త్రుని పదద్వయమునకున్= ధర్మజుడి యొక్క పాదాల జంటకు; అతిభక్తిన్= మిక్కుటమైన భక్తితో; ఎఱఁగినన్= నీవు సాగిలపడి నమస్కరించగా; అతఁడు= ధర్మజుడు; నిన్నున్ గ్రుచ్చి+ఎత్తి= నిన్ను పట్టి లేవనెత్తి; నిడుఁగేలన్= దీర్ఘబాహువులతో; పెద్దయున్+తడవుగాన్= చాలసేపు; కౌఁగిలింపఁగన్= ఆలింగనం చేసికొనగా; భీముఁడును నీవున్= భీమసేనుడూ, నీవూ; పరమహర్షమునన్= మిక్కిలి సంతోషంతో; చారుతరవక్షములు= మిక్కిలి అందమైన రొమ్ములు; సంగతములు కాన్= హత్తుకొనేటట్లు; పరిరంభణంబు+ఒనర్పంగన్= కౌగిలించుకొనగా; నరుఁడున్= అర్జునుడూ; కవలును= నకులసహదేవులూ; మ్రొక్కినన్= నీకు వందనం చేయగా; కరము+అర్థిన్= మిక్కిలి ప్రీతితో; తిగిచి= వారిని చెంతకు లాగికొని; నీవు; ఆలింగనంబు+ చేయంగన్= వారిని కవుగిలించుకొనగా; ఇట్లు= ఈ ప్రకారం; వారున్ మీరును= పాండవులున్నూ, మీరున్నూ; తగన్= ఒప్పుగా; బాంధవమునన్+పొదలి= చుట్టరికంతో ఏపారి; ఇంపు తళుకొత్తన్= ప్రియ మతిశయించగా; తామరతంపర+ఐనన్= మిక్కిలి అభివృద్ధి గాంచగా; చెలులున్= స్నేహితులు; చుట్టలున్= బంధువులు; కలసి= కూడి; పేరు+ఎలమిన్+పొంది= పరమానందం చెంది; ఉల్లసిల్లంగన్= ప్రకాశించగా; కులము= కురువంశం; ఎంత+ఒప్పున్+ఒక్కొ= ఎంతగా సొంపారునోగదా!

**తాత్పర్యం:** సుయోధనా! నీవు ధర్మజుడి అడుగుల జంటకు అత్యంత భక్తితో ప్రణమిల్లినప్పుడు అతడు నిన్ను పట్టి లేవనెత్తి దీర్ఘ బాహువులతో చాలసేపు కౌగిలించు కొనగా, భీముడూ నీవూ మీ సుందర వక్షస్థలాలు హత్తుకొనేటట్లు మిక్కిలి సంతోషంతో ఆలింగనం చేయగా, అర్జునుడూ నకుల సహదేవులూ నీకు ప్రణామం కావించినపుడు నీవు వారిని దగ్గరకు చేరదీసి కవుగిలించుకోగా- ఇట్లా వారూ మీరూ పరస్పరం వందనాలింగనాలతో, చుట్టరికంతో పెంపారుతూ ప్రియమతిశయిల్ల అభివృద్ధి చెందుతుండగా, స్నేహితులు బంధువులు ఇట్లా ఉన్న మిమ్ము చూచి మిక్కిలి హర్షించగా మీ కురువంశం ఎంత చక్కగా ఉంటుందో ఊహించు.

**క.** **సమరమునకు వచ్చిన భూ । రమణు లుభయకటకములను బ్రమదం బెసఁ గం**
**దమతమ పురములకుం బో । వ మహీ జను లెట్టి యుత్సవముఁ బొందుదురో!'** **354**

**ప్రతిపదార్థం:** సమరమునకున్ వచ్చిన= యుద్ధం చేయటానికి వచ్చిన; భూరమణులు= రాజులు; ఉభయ కటకములను= రెండు సేనాశిబిరాలలో; ప్రమదంబు+ఎసఁగన్= హర్షం అతిశయించగా; తమ తమ పురములకున్+పోవన్= తమ తమ నగరాలకు తరలివెళ్ళగా; మహీజనులు= పుడమిలోని ప్రజలు; ఎట్టి+ఉత్సవమున్= ఎంతటి సంతోషాన్ని; పొందుదురో!= పొందుతారో కదా!

**తాత్పర్యం:** యుద్ధం చేయటానికి వచ్చిన రాజులు రెండు సేనా శిబిరాలలో ఆనందం విస్తరిల్లగా తాము తమ తమ పట్టణాలకు తరలివెళ్ళుతుంటే పుడమిలోని ప్రజలు ఎంత ఆనందిస్తారో చెప్పటానికి శక్యం కాదు.'

**వ. అని వెండియు ననేక విధంబులం జెప్పి యీ రెండు దెఱంగుల వారును బంచి కుడిచి సుఖంబున్న నఖిల భూ ప్రజకును బ్రమోదం బగుం గావున నట్లుసేసి యందఱచేత దీవనలు వడయవయ్య నీ'వనిన విని దుర్యోధనుం డప్పుండరీకాక్షు వీక్షించి యిట్లనియె: 355**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= ఇంకను; అనేకవిధంబులన్= పలురీతులు; చెప్పి; ఈ రెండు తెఱంగులవారును= ఈ ఉభయ కుటుంబాలవారున్నూ; పంచి= రాజ్యం పంచుకొని; కుడిచి= అనుభవిస్తూ; సుఖంబు+ఉన్నన్= హాయిగా ఉంటే; అఖిల భూ ప్రజలకును= పుడమిలోని జనులందరికినీ; ప్రమోదంబు= సంతోషం; అగున్= కలుగుతుంది; కావునన్; అట్లుచేసి; అందఱచేతన్; నీవు; దీవనలు పడయవయ్యా= ఆశీర్వాదములు పొందవలసింది; అనినన్= అని ద్రోణ భీష్ములు చెప్పగా; విని; దుర్యోధనుండు; ఆ+పుండరీక+అక్షున్= ఆ కమల నేత్రుడిని శ్రీకృష్ణుడిని; వీక్షించి= చూచి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లా ఇంకా ద్రోణభీష్ములు పలు విధాలుగా చెప్పి 'మీరెండు కుటుంబాలవారూ రాజ్యం పంచుకొని అనుభవిస్తూ, హాయిగా ఉండటం పుడమిలోని జనులందరికీ సంతోషం కలిగిస్తుంది కనుక మేము చెప్పినట్లు చేసి నీవు అందరివల్ల ఆశీస్సులు పొందు'మని చెప్పారు. వారి మాటలన్నిటినీ విని దుర్యోధనుడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**క. 'గురుఁడును బితామహుఁడు నీ । నరనాథుఁడు నెల్ల ప్రొద్దు నను దూఱుదు; రి**
**ప్పరుసున నీవును దామో । దర! దూఱెదుగాని తగవుఁ దలఁపవు కంటే! 356**

**ప్రతిపదార్థం:** దామోదర!= శ్రీకృష్ణా!; గురుఁడును= ద్రోణాచార్యులూ; పితామహుఁడున్= తాతయైన భీష్ముడూ; ఈ నరనాథుఁడున్= ఈ ధృతరాష్ట్ర మహారాజూ; ఎల్లప్రొద్దున్= ఎల్లప్పుడూ; ననున్= నన్ను; దూఱుదురు= నిందిస్తారు; ఈ పరుసునన్= ఈ విధంగా; నీవును; దూఱెదు(వు)కాని= నన్ను నిందిస్తావే తప్ప; తగవున్+తలఁపవు+కంటే!= న్యాయమాలోచించవుగదా!

**తాత్పర్యం:** 'గురువైన ద్రోణుడూ, తాతగారు భీష్ముడూ, తండ్రి ధృతరాష్ట్ర మహారాజూ ఎప్పుడూ నన్ను తిడుతుంటారు. నీవున్నూ అదే విధంగా నన్ను నిందిస్తావేగాని న్యాయం ఆలోచించవుగదా!

**క. వనితం బఱిచి రరణ్యం । బున నిడుమలఁ బడితి మనుచుఁ బోటరులై చం**
**పను జెఱుపఁదలఁచి మా దెసఁ । గనలుదు రప్పాండుసుతు లకారణమ కడున్. 357**

**ప్రతిపదార్థం:** వనితన్= ద్రౌపదిని; పఱిచిరి= అవమానించారు; అరణ్యంబునన్= అడవిలో; ఇడుమలన్+పడితిమి= కష్టాలు అనుభవించాము; అనుచున్= అని పల్కుతూ; పోటరులు+ఐ= శూరులై; ఆ+పాండుసుతులు= ఆ పాండు రాజు కొడుకులు; అకారణమ= నిష్కారణంగా; కడున్= మిక్కిలి; చంపను= చంపటానికీ; చెఱుపన్= నాశనం చేయటానికీ; తలఁచి= భావించి; మా దెసన్= మా యెడ; కనలుదురు= కోపం వహిస్తారు.

**తాత్పర్యం:** 'ద్రౌపదిని భంగపరిచారు. అడవులలో మేము నానా కష్టాలు అనుభవించాము' అంటూ పాండవులు నిష్కారణంగా మాపై క్రోధం వహించి వీరులై మమ్మల్ని చంపటానికీ, నాశం చేయటానికీ ఆలోచిస్తారు.

**మ. అరయం దప్పొకయింత నా వలన లే దా ధర్మపుత్త్రుండు జూ**
**దరి వెంటం దమకించి సౌబలునిచేతన్ భూమిఁ గోల్పోయి ము**
**ష్కరుఁడై వెండియు నొడ్డఁగా నతఁడు నక్షప్రౌఢిమై గెల్చె; నే**
**తెరువైనం దనయిచ్చతోఁ బడియె; నింతేకాక యేఁ బూఁటయే? 358**

**ప్రతిపదార్థం:** అరయన్= పరికించగా; నావలనన్= నావలన; తప్పు= దోషం; ఒక+ఇంతలేదు= రవ్వంతయినా లేదు; ఆ ధర్మపుత్త్రుండు= ఆ ధర్మరాజు; జూదరి వెంటన్+తమకించి= జూదరితనంతో వేగిరపడి; సౌబలుని చేతన్= శకునిచేత; భూమిన్= పుడమిని; కోల్పోయి= పోగొట్టుకొని; ముష్కరుఁడు+ఐ= మూర్ఖుడై; వెండియున్= మరల; ఒడ్డఁగాన్= పందెం చరచగా; అతఁడు= ఆ శకుని; అక్షప్రౌఢిమైన్= పాచికల ఆటలోని నేర్పుతో; గెల్చెన్= జయించాడు; ఏ తెరువు+ఐనన్= ఏ దారి అయినా; తన+ఇచ్చతోన్+పడియెన్= తన ఇష్టప్రకారమే అనుసరించాడు; ఇంతేకాక= ఇంతదప్ప; ఏన్+పూఁటయే?= అందుకు నేను బాధ్యుడనా?

**తాత్పర్యం:** కృష్ణా! న్యాయంగా ఆలోచిస్తే నా వలన తప్పేముంది? ధర్మరాజు జూదరి అయి, తానే శకునిని వెంబడించి వేగిరపడి అతడి చేతిలో పుడమినంతా కోలుపోయాడు. అంతటితో ఆట మానక మూర్ఖుడై మరల పందెం చరచగా సౌబలుడు తనకు పాచికల ఆటలో ఉన్న ప్రావీణ్యంతో గెలిచాడు. ఏ తెరువైనా ధర్మజుడు తన ఇష్టప్రకారమే త్రొక్కినాడు. అంతేతప్ప అతని కష్టనష్టాలకు నేను బాధ్యుడనా?

**తే. మాత్స్య పాంచాల పాండ్యాది మనుజపతులఁ । గూర్చికొని తార కయ్యంబు గోరి యెత్తి**
**విడిసి; రింతియ కాక యివ్విధము నుగ్ర । కర్మమున కేము దొడఁగుట గలదె చెపుమ? 359**

**ప్రతిపదార్థం:** మాత్స్య+పాంచాల+పాండ్య+ఆది మనుజపతులన్= మత్స్య దేశం; 'పాంచాల దేశం'; పాండ్య దేశం మున్నగు దేశాలరాజులను; కూర్చికొని= చేర్చుకొని; తారు+అ= తామే; కయ్యంబు+కోరి= యుద్ధం అభిలషించి; ఎత్తి విడిసిరి= మాపై దండెత్తటానికి దిగి ఉన్నారు; ఇంతియకాక= ఇంతేతప్ప; ఈ+విధము+ఉగ్రకర్మమునకున్= ఇట్లాంటి క్రూరకృత్యానికి; ఏము= మేము; తొడఁగుట+కలదె?= పూనుకొనటం జరిగిందా; చెపుమ!= కృష్ణా!; నీవే వచించు.

**తాత్పర్యం:** కృష్ణా! మత్స్య పాంచాల పాండ్యాది దేశాల రాజులందరినీ కూర్చుకొని యుద్ధం చేయవలెననే కోరికతో తామే మాపై దండెత్తటానికి సిద్ధంగా ఉన్నారు. ఇట్లాంటి క్రూర కృత్యానికి మేమెప్పుడు పాల్పడినామో నీవే చెప్పు.

**క. ఉక్కఱి సురపతి కైనను । మ్రొక్కము నృపధర్మమూఁది మొనతలఁబడినన్**
**మిక్కిలి పేరును నిట దివి । నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట నుపేంద్రా! 360**

**ప్రతిపదార్థం:** ఉప+ఇంద్రా!= కృష్ణా!; నృపధర్మము+ఊఁది= క్షత్రియ ధర్మం అవలంబించి; మొనతలన్= రణాగ్రమునందు; పడినన్= కూలినా; ఇటన్= ఈ లోకంలో; మిక్కిలి పేరును= గొప్ప కీర్తినీ; దివిన్= స్వర్గంలో; అక్కజముగన్= ఆశ్చర్యకరంగా; పెంపున్= వృద్ధినీ; పడయన్+అగుటన్= పొందగలగటంచేత; ఉక్కు+అఱి= పౌరుషాన్ని వీడి; సురపతికిన్+ఐనన్= దేవేంద్రుడికైననూ; మ్రొక్కము= నమస్కరించం.

**తాత్పర్యం:** కృష్ణా! క్షత్రియధర్మం వహించి యుద్ధం చేస్తూ నేలగూలితే ఇక్కడ వీరుడన్న విఖ్యాతి లభిస్తుంది. అక్కడ వీర స్వర్గ సుఖాలు చేకూరుతాయి. అందువల్ల మేము పౌరుషముడిగి దేవేంద్రుడికైనా నమస్కరించం.

**చ. చిఱుతఁదనంబునం దగవు చిత్తమునం దలపోయలేక ముం**
**దఱ యటు వోవనిచ్చితిఁ । బితామహుఁడున్ జనకుండు నింకఁ గ్ర**
**చ్ఛఱ నిలఁ బంచి చక్క సగ మక్కడ నెవ్వరికేని మద్బలం**
**బెఱుఁగక యీఁదలంచినను నే నది యేటికి సమ్మతించెదన్? 361**

**ప్రతిపదార్థం:** చిఱుతఁదనంబునన్= నేను పసివాడుగా నున్నప్పుడు; తగవు= న్యాయం; చిత్తమునన్= మనసులో; తలపోయన్+లేక= భావించజాలక; ముందఱ= జరిగిన రోజులలో; అటుపోవన్+ఇచ్చితిన్= అట్లా జరుగనిచ్చాను; పితామహుఁడున్= భీష్ముడూ, జనకుండున్= ధృతరాష్ట్రుడూ; ఇంకన్= ఇకమీదట; క్రచ్చఱన్= అనాలోచితంగా; ఇలన్+పంచి= భూమిని విభజించి; చక్కసగము= సరిగా సగపాలు; అక్కడన్+ఎవ్వరికిన్+ఏనిన్= అక్కడ పాండవులలో ఎవరికైనా; మత్+బలంబు+ఎఱుఁగక= నా శక్తి తెలియక; ఈన్+తలంచినను= ఇవ్వటానికి సంకల్పిస్తే; ఏన్= నేను; అది+ఏటికిన్+సమ్మతించెదన్?= అట్లా సగపాలు పంచి ఇవ్వటానికి ఎందుకు అంగీకరిస్తాను.

**తాత్పర్యం:** చిన్నతనంలో న్యాయమేదో తెలియనప్పుడు అట్లా సాగనిచ్చాను. ఇపుడు మా తండ్రి, తాత అనాలోచితంగా నా శక్తి సామర్థ్యాలు గుర్తించక రాజ్యంలో సగపాలు పాండవులలో ఎవ్వరికైనా పంచి ఇవ్వవలెనని సంకల్పిస్తే అందుకు నేను ఎందుకు అంగీకరిస్తాను?

**తే. తొంటి చవిగని యిప్పుడుఁ దోఁచి పాండు । సుతులు రాజ్యంబు చేయంగఁ జూచినారు;**
**నాకు నీఁ దీఱునే యింక నాఁటి చూఱ । లెక్కడివి ద్రోణ భీష్ము లీ దిక్కుసుమ్ము! 362**

**ప్రతిపదార్థం:** తొంటిచవి+కని= మునుపటి రుచి మరగి; ఇప్పుడున్+తోఁచి= ఈ వేళ కూడా ప్రత్యక్షమై; పాండుసుతులు= పాండుకుమారులు; రాజ్యంబు చేయంగన్= రాజ్యమేలటానికి; చూచినారు= వాంఛిస్తున్నారు; నాకున్= నాకు; ఈన్+తీఱునే= ఇవ్వటానికి వీలగునా?; ఇంకన్= ఇక; నాటి చూఱలు= ఆనాటి కొల్లలు; ఎక్కడివి?= ఎక్కడున్నవి?; ద్రోణ భీష్ములు= గురు పితామహులు; ఈ దిక్కు+చుమ్ము!= మా పక్షంలో ఉన్నారు సుమా!

**తాత్పర్యం:** మునుపటి రుచిమరగి మళ్ళీ ఇప్పుడు ప్రత్యక్షమై కౌంతేయులు రాజ్యమేలుటకు కోరుతున్నారు. కాని, నే నిస్తానా? ఆనాటి దోపిళ్ళు ఇకమీదట సాగవు. ద్రోణభీష్ములు మా పక్షంలో ఉన్నారు.

**ఉ. ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు; పల్కకుండు మిం**
**కేమియు; వాఁడి సూదిమొన యించుక మోపిన యంతమాత్రయున్**
**భూమి యొనర్చి పాండునృపపుత్త్రుల కిత్తునె । యెవ్వరైన సం**
**గ్రామమునన్ జయంబుఁ గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్. 363**

**ప్రతిపదార్థం:** ఏమును= మేమూ; వారున్= పాండవులూ; పంచికొని= రాజ్యాన్ని పంచుకొని; ఏలుట+కల్గదు= పరిపాలించటం జరగదు; ఇంకన్+ఏమియున్= మరేమిన్నీ; పల్కక+ఉండుము= బదులాడవద్దు; వాఁడిసూదిమొన= సన్నని సూదియొక్క కొన; ఇంచుక= కొంచెం; మోపిన+అంతమాత్రయున్= ఆక్రమించినంత మేర కూడా; భూమి+ఒనర్చి= పుడమిని చీల్చి; పాండునృప పుత్త్రులకున్= పాండురాజు కుమారులకు; ఇత్తునె?= ఇస్తానా? నేనివ్వను; ఎవ్వరు+ఐనన్= అటు వారో; ఇటు మేమో;

సంగ్రామమునన్= రణంలో; జయంబు కొని= విజయం పొంది; రాజ్యము చేయుట= రాజ్యము నేలటానికి; నిశ్చయించితిన్= నిర్ణయించుకొన్నాను.

**తాత్పర్యం:** మేమూ, వారూ పుడమిని పంచుకొని పరిపాలించటం జరగదు. ఇందుకు నీ వేమీ బదులు చెప్పవద్దు. వాడి సూదిమొన మోపినంతమాత్రమైనా భూమిని పంచి పాండునందనులకు నేనివ్వను. మాలో ఎవరో ఒకరు యుద్ధంలో విజయం పొంది రాజ్యం చేయటానికి నిర్ణయించాను.'

**విశేషం:** అసలే అది సూది. అదీ వాడియైనది. దాని మొనమాత్రమే, అదికూడా ఎక్కువ మోపక 'ఇంచుక' - పాండవులకు కొంచెం కూడా ఇవ్వననటానికి ఈ కూర్పు. (సంపా.)

**తే. అనిన విని కిన్కఁ బూనిన యలఁతి నగవు। చెలువు మొగమున కొక క్రొత్త పొలు పొనర్పఁ**
**బుండరీకాక్షుఁడగు టెల్లఁ బోయి యప్పు। డరుణ కమలాక్షుఁ డగుచు మురాంతకుండు. 364**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= దుర్యోధనుడి మాటలు ఆలకించి; కిన్కన్+పూనిన= కోపం వహించిన; అలఁతినగవు చెలువు= చిరునవ్వుయొక్క సొగసు; మొగమునకున్= తన ముఖానికి; ఒక క్రొత్త పొలుపు+ఒనర్పన్= ఒక నూతన సౌందర్యాన్ని ఆపాదించగా; పుండరీక+అక్షుఁడు+అగుట+ఎల్లన్= తెల్లదామరలవంటి కన్నులుగలవాడగుట అంతా; పోయి= తొలగి; ముర+అంతకుండు= మురాసురుడిని హరించిన శ్రీకృష్ణుడు; అప్పుడు= ఆ సమయంలో; అరుణ+కమల+అక్షుఁడు+అగుచున్= ఎర్రదామరల వంటి కన్నులు గలవాడై.

**తాత్పర్యం:** దుర్యోధనుడి మాటలకు కోపం వహించిన చిరునవ్వుసొగసు తన ముఖమునకు ఒక క్రొత్త అందం సంతరించగా; తెల్లదామరలవంటి కన్నులుగలవాడవటం అంతాపోయి మురవిధ్వంసకుడైన వాసుదేవుడు ఎర్రదామరలవంటి కన్నులు గలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: పర్యాయం, ఉపమ. కృష్ణుఁడు సహజంగా పుండరీకాక్షుడు - తెల్ల దామరలవంటి కన్నులు గలవాడు. ఇప్పుడు కోపంవచ్చి కన్నులు ఎఱ్ఱబడ్డాయి. అందుచేత అరుణ కమలాక్షుడయ్యాడు. ఆరుణ్యం కోపానికి చిహ్నం. శ్రీకృష్ణుడు కుపితుడయ్యాడన్న విషయాన్ని తిక్కన ధ్వనిపూర్వకంగా చెప్పటం ప్రశంసనీయం. పాత్రల మనోభావాలను ఇట్లా బాహ్య వర్ణనలద్వారా చెప్పటం తిక్కన నేర్పు. (సంపా.)

### శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో మున్నతండు చేసిన దుర్ణయంబు సెప్పుట (సం. 5-126-1)

**క. 'మొనతలఁబడియెదు నీచె। ప్పిన యట్టుల తడవులేదు బిరుదలరై నీ**
**వును వీరు నిలువుఁ డిదె భం। డన మెల్లియ వచ్చె నూఱటలు గనుఁడింకన్. 365**

**ప్రతిపదార్థం:** నీ చెప్పిన+అట్టులు+అ= నీవు వచించిన విధంగానే; మొనతలన్+పడియెదు(వు)= రణాగ్రంలో కూలెదవు; తడవు లేదు= ఇందుకు ఆలస్యం లేదు; బిరుదులరు+ఐ= వీరులై; నీవును= నీవూ; వీరున్= నీకు సాయపడవచ్చిన ఈ రాజులూ; నిలువుఁడు= నిలబడండి; భండనము= యుద్ధం; ఎల్లి+అ+వచ్చెన్= రేపే వస్తున్నది; ఇంకన్= ఇక; ఊఱటలు+కనుఁడు= తృప్తి వహించండి; ఉపశమనం పొందండి.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! నీవు చెప్పినట్లే రణాగ్రంలో కూలగలవు. ఇందుకు ఆలస్యం లేదు. శూరులై నీవూ, నీకు సాయపడవచ్చిన ఈ రాజులందరూ నిలబడండి. రేపే యుద్ధం వస్తున్నది. ఇక ఊరడిల్లండి.

**సీ. అరయంగఁ దప్పు లేదంటి నీవలనఁ గీ । డొకనాఁడు సేసియు నొక్కనాఁడు**
**సేయవె? నీ జనించిన యది యాదిగా । నుడుగక పాండవేయులకుఁ జాల**
**నెగ్గు సేసితి విషమిడి, పెనుఁబాములఁ । గఱపించి, నీరిలోఁ గట్టి త్రోచి,**
**లక్కయిల్ గాలిచి, పెక్కు భంగులఁ జంపఁ । దలఁచినఁ జావక ధర్మరక్షఁ**

**ఆ. జేసి నెగడి రాచసిరి నొందియున్నఁ జూ । పోప కీవు తీవ్ర పాపబుద్ధిఁ**
**గసలి జూద మొకటి కల్పించి కపటంబు । సేయ దాన నెల్ల చేటుఁబుట్టె. 366**

**ప్రతిపదార్థం:** అరయంగన్= విచారించగా; నీ వలనన్= నీయెడ; తప్పులేదు+ అంటి(వి)= దోషం లేదని చెప్పావు; ఒకనాఁడు కీడు చేసియున్= ఒకనాడు పాండవులకు హాని చేసి; ఒక్కనాఁడు చేయవె= ఒకరోజు చేయకున్నావా? (ఎప్పుడూ చేస్తున్నావని అభిప్రాయం), నీ జనించిన అది+ఆదిగాన్= నీవు పుట్టింది మొదలుకొని; ఉడుగక= మానక; పాండవేయులకున్= పాండుపుత్రులకు; చాలన్= మిక్కిలి; ఎగ్గుచేసితి(వి)= కీడు చేశావు; విషము+ఇడి= అన్నంలో విషంపెట్టి; పెనుఁబాములన్+ కఱపించి= నిదురిస్తున్నప్పుడు పెద్ద పెద్ద సర్పాలచేత కరపించి; లక్క+ఇల్+కాలిచి= లాక్షాగృహదహనం చేయించి; పెక్కుభంగులన్= అనేక రీతుల; చంపన్+తలఁచినన్= చంపటానికి యత్నించగా; చావక= చనిపోక; ధర్మరక్షన్+చేసి= ధర్మం తమను కాపాడటం వలన; ధర్మాన్ని తాము కాపాడటం వలన; నెగడి= వృద్ధికి వచ్చి; రాచసిరిన్= రాజ్యలక్ష్మిని; ఒంది+ఉన్నన్= పాండవులు పొంది సుఖులై ఉండగా; చూపు+ఓపక= చూచి సహించలేక; ఈవు= నీవు; తీవ్ర పాపబుద్ధిన్= దారుణమైన పాపచింతతో; కసలి= కోపించి; జూదము+ఒకటి కల్పించి= ద్యూతక్రీడ ఒకటి ఏర్పాటు చేసి; కపటంబు చేయన్= పాండవులను మోసగించగా; దానన్= అందువలన; ఎల్లచేటున్= ఇంత అనర్థమూ; పుట్టెన్= కల్గింది.

**తాత్పర్యం:** విచారిస్తే నీవల్ల దోషం లేదని చెప్పావు. సుయోధనా! ఒకనాడు పాండవులకు కీడుచేసి మరొకనాడు చేయకున్నావా? నీవు పుట్టింది మొదలు మానకుండ వారికి అపకారాలు చేస్తూనే ఉన్నావు. తినే అన్నంలో విషం పెట్టించావు. పెద్ద పెద్ద విషసర్పాల చేత కరిపించావు. కాళ్లూ చేతులు కట్టించి గంగ మడుగులోనికి నెట్టించావు. లక్కయింటిలో నివసిస్తుండగా కాల్పించావు. ఇట్లా అనేక విధాల పాండవులను నీవు చంపటానికి యత్నించావు. కాని, వారి ధర్మం వారి ప్రాణాలను కాపాడింది. వా రెట్లాగో పైకివచ్చి రాజ్యసంపదను పొంది హాయిగా జీవిస్తుంటే నీకు కన్నుకుట్టింది. దారుణమైన పాపహృదయంతో వారిమీద కినుక పూని, జూదమొకటి ఏర్పాటు చేశావు. ధర్మజుని ఆ కపటద్యూతంలో ఓడించగా ఇంత అనర్థం కల్గింది.

**విశేషం:** ధర్మరక్షఁజేసి - వారు ధర్మాన్ని రక్షించటం చేతా, వాళ్ళని ధర్మం రక్షించటంచేత - అని రెండు విధాల అర్థం చెప్పవచ్చు. 'ధర్మో రక్షతి రక్షితః' అని కదా సూక్తి (సంపా.)

**తే. అన్నదమ్ముల నెత్తంబు లాడి సతుల । తలలువట్టి సభాస్థలంబులకు నీడ్చి**
**చీర లొలిపింతురే? యిట్టి వారి నెందుఁ । దడవుమా నీ వొకండవు దక్క నధిప! 367**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అన్నదమ్ములన్= తోడబుట్టువులతో; నెత్తంబులు+ఆడి= పాచికలాడి; సతుల తలలు+పట్టి= ఇల్లాండ్ర తలవెండ్రుకలు పట్టి; సభాస్థలంబులకున్+ఈడ్చి= కొలువుకూటాలలోనికి ఈడ్చుకొనివచ్చి; చీరలు+ఒలిపింతురే=

వలువలు ఊడదీయిస్తారా; నీవు+ఒకండవు+తక్కన్= నీ వొక్కడివేగాని; ఎందున్= ఎక్కడైనా; ఇట్టివారిన్+తడవుమా!= ఇటువంటి వారున్నారేమో చెప్పుము.

**తాత్పర్యం:** నీ వొకడివి తప్ప లోకంలో ఎక్కడైనా తోడబుట్టువులతో జూదమాడి, మగనాండ్ర శిరోజాలు పట్టుకొని కొలువు కూటాలలోనికి ఈడ్చుకొని వచ్చి, కట్టిన పుట్టాలు తొలగించే వారున్నారేమో నీవే చెప్పు.

**ఉ. అప్పుడు నీవు గర్ణుఁడును నాడిన మాటలు కొల్వులోపలం**
**జెప్పెడునట్టివే? కులము శీలముఁ గల్గిన పుణ్యకాంత క**
**ట్లొప్పమి చేయుటెల్లఁ గనియున్న జనంబులు వించునుండఁగాఁ**
**దప్పొక యింత లేదను విధం బది నీక చనున్ సుయోధనా! 368**

**ప్రతిపదార్థం:** సుయోధనా!= దుర్యోధనా!; అప్పుడు= ద్రౌపదీ మానభంగసమయంలో; నీవున్= నీవూ; కర్ణుడును= కర్ణుడూ; ఆడినమాటలు= పల్కిన పలుకులు; కొల్వులోపలన్= ఈ సభలో; చెప్పెడు+అట్టివే?= వాకొన దగినవా (కావని భావం); కులము= ఉత్తమ వంశాభిజాత్యమూ; శీలము= మంచి నడవడీ; కల్గిన పుణ్యకాంతకున్= కలిగి ఉన్న పవిత్రురాలైన వనితకు; అట్లు+ఒప్పమిచేయుట+ఎల్లన్= ఆ విధంగా పరాభవించటమంతా; కని+ఉన్న= చూచి ఉన్నట్టి; జనంబులు= ఈ సభలో ఉన్న జనులు; వించున్+ఉండఁగాన్= ఆలకిస్తూండగా; తప్పు+ఒక+ఇంత+లేదు= నావలన ఎట్టి నేరమూ లేదు; అనువిధంబు+ అది= అని చెప్పుచున్నట్టి తీరు, నీకున్+అ+చనున్= నీకే చెల్లింది.

**తాత్పర్యం:** సుయోధనా! పాంచాలికి నిండుసభలో పరాభవం జరుగుతున్నప్పుడు నీవూ, కర్ణుడూ మాట్లాడిన మాటలు ఇపు డీ సభలో చెప్పదగినట్టివి కావు. ఉత్తమ వంశాభిజాత్యం, సత్ప్రవర్తన కల్గిన పరమ పతివ్రతను ఆ విధంగా మీరు పరాభవించటం కనులార చూచిన ఈ జనులందరూ వింటుండగా నా వల్ల ఏ నేరమూ లేదని పల్కటం నీ కొకడికే చెల్లింది.

**విశేషం:** అట్లొప్పమి చేయుటెల్ల - అట్లు - అనిర్వాచ్యమైన విధంగా, - అట్టి ఘోరమైన అనిభావం. 'అరయం దప్పొకయింత నావలనలే' దన్న దుర్యోధనుడి మాటకిది యెత్తిపొడుపు. (సంపా.)

**తే. ఎత్తి విడిసిన వారని యెల్ల తప్పుఁ । బాండవుల మీఁదఁ బెట్టిన బ్రదుకుగలదె?**
**ద్రోణ భీష్ములుఁ దండ్రియుఁ దోడుతోడఁ । జెప్పు తగుమాట లేమియుఁ జెవులు సొరవు. 369**

**ప్రతిపదార్థం:** ఎత్తి విడిసినవారు+అని= దండెత్తటానికి చేరి ఉన్నారని; ఎల్లతప్పున్= దోషమంతటినీ; పాండవుల మీఁదన్; పెట్టినన్= మోపినచో; బ్రదుకు+కలదె?= మీకు ఆయువు దక్కుతుందా? ద్రోణ భీష్ములు, తండ్రియున్= జనకుడును; తోడుతోడన్= ఒకరి తరువాత మరొక్కరు; చెప్పు= బోధించే; తగుమాటలు= హితవాక్యాలు; ఏమియున్= ఒక్కటి కూడా; చెవులు+చొరవు= నీ చెవులలో దూరవు గదా!

**తాత్పర్యం:** మాపైకి దండెత్తి రావటానికి సిద్ధంగా ఉన్నారని నేరమంతటినీ పాండవులమీద మోపితే మీకు ఆయువు దక్కుతుందా? ద్రోణుడు, భీష్ముడు, నీ తండ్రి ధృతరాష్ట్రుడు ఒకరి తరువాత మరొకరు చెప్పే హితవచనాలు నీవు వినటమే లేదు.

**క. శాంతిం బొందుట నీకుం । గుంతీ పుత్త్రులకు మేలగున్; దానిక యే**
**నింతయు నాడెద; నది నీ । కెంతయు రుచియింపకునికి యెఱిఁగి యెఱిఁగియున్. 370**

**ప్రతిపదార్థం:** శాంతిన్+పొందుట= క్రోధాదులు విడిచి ఒద్దికగా మెలగటం; నీకున్= నీకూ; కుంతీపుత్రులకున్= పాండవులకూ; మేలు+అగున్= శ్రేయోదాయకం; నీకున్= నీకు; అది+ఎంతయున్= అదేమాత్రం; రుచియింపక+ఉనికి= ఇష్టం కాకుండటం; ఎఱిఁగి+ఎఱిఁగియున్= బాగా తెలిసికూడా; దానికిన్+అ= మీరు శాంతితో జీవించటం కొరకే; ఏను= నేను; ఇంతయున్+ ఆడెదన్= ఇంతగా చెపుతున్నాను.

**తాత్పర్యం:** శాంతి వహించటం నీకూ, పాండవులకూ మిక్కిలి మంచిది. పాండవులతో పొత్తు నీకు బొత్తిగా గిట్టదని తెలిసికూడా శాంతికోసం నేనింతగా నీకు నొక్కి చెపుతున్నాను.

**వ. అని యిట్లు నారాయణుండు నానా ప్రకారంబులం జెప్పుటకుఁ గటకటం బడియెడు దుర్యోధనునకు దుశ్శాసనుం డిట్లనియె: 371**

**ప్రతిపదార్థం:** అని+ఇట్లు; నారాయణుండు; నానా ప్రకారంబులన్= పలురకాలుగా; చెప్పుటకు; కటకటంబడియెడు= బాధపడుతున్న; దుర్యోధనునకున్; దుశ్శాసనుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ రకంగా నారాయణుడు బహు విధాల హితవాక్యాలు పలుకుతుంటే వినటానికి బాధపడుతున్న దుర్యోధనుడితో దుశ్శాసనుడు ఇట్లా అన్నాడు:

**మ. 'జనకుండున్ గురుభీష్ములుం దగిన కర్జం బాప్తులై నీకుఁ బ్రీ**
**తి నెఱింగించు తెఱంగు గాదు తమబుద్ధిం బోయి సంధాన మి**
**ట్లొనరం జేయకయున్నఁ గృష్ణుకు నిన్నొప్పించు వా; రింతవ**
**ట్టు నిజం; బిచ్చట నింక నీయునికి నెట్లుం గీడు వుట్టుం జుమీ! 372**

**ప్రతిపదార్థం:** జనకుండున్= మన తండ్రీ; గురుభీష్ములున్= ద్రోణుడూ; భీష్ముడూ; తగిన కర్జంబు= యోగ్యమైన పని; ఆప్తులు+ఐ= ఇష్టులై; నీకున్= నీకు; ప్రీతిన్= ప్రేమతో; ఎఱింగించు తెఱంగు కాదు= తెలిపే తీరు కానేకాదు; తమ బుద్ధిన్+ పోయి= తాము చెప్పిన త్రోవ ననుసరించి; సంధానము= సంధి; ఇట్లు= వారు చెప్పినట్లు; ఒనరన్= సముచితంగా; చేయక+ ఉన్నన్= నీవు చేయకపోతే; కృష్ణునకున్= వాసుదేవుడికి; నిన్నున్= నిన్ను; ఒప్పించువారు= అప్పగిస్తారు; ఇంతవట్టు నిజంబు= నేను చెప్పుచున్నది వాస్తవం; ఇచ్చటన్= ఇక్కడ; ఇంకన్= ఇటుమీద; నీ+ఉనికిన్= నీవుండుటవలన; ఎట్లున్= ఏవిధంగానైనా; కీడు+పుట్టున్+చుమీ!= హాని కల్గుతుంది సుమా!

**తాత్పర్యం:** మన తండ్రీ, ద్రోణాచార్యులూ, పితామహుడూ నీ మేలు కోరి కర్తవ్యం ప్రేమతో నీకు చెప్పేవిధం ఇది కానేకాదు. తాము చెప్పినట్లుగా విని నీవు పాండవులతో పొత్తు కుదుర్చుకొనకుంటే నిన్ను వీరు శ్రీకృష్ణుడికి వశం చేస్తారు. ఈ మాట నిజం. ఇక ఇక్కడ నీ వుండటం చేత ఏ విధంగానైనా హాని కలుగుతుంది సుమా!

**ఆ. అనిన బాహ్లికాదులగు కురువృద్ధుల । నాత్మజనకుఁ గృష్ణు నాదరింప**
**కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన । లేచిపోయె సంచలించెఁ గొలువు. 373**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దుస్ససేనుడు చెప్పగా; బాహ్లిక+ఆదులు+అగు= శంతనుడి తమ్ముడైన బాహ్లికుడు మొదలైన; కురువృద్ధులన్= కౌరవులలో వయసు మళ్ళినవారినీ; ఆత్మజనకున్= తన తండ్రినీ; కృష్ణున్= నారాయణుడినీ; ఆదరింపక= గౌరవించక; అతఁడు= దుర్యోధనుడు; రాజసమునన్= దురహంకారంతో; అప్పుడు= ఆ సమయాన; దిగ్గనన్= శీఘ్రంగా; లేచిపోయెన్= సభనుంచి నిష్క్రమించాడు; కొలువు= సభ; సంచలించెన్= కలవరపడింది.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు అట్లా చెప్పగానే బాహ్లికుడు మొదలైన కురువంశ వృద్ధులనూ, తమ తండ్రినీ, వాసుదేవుడినీ లెక్కించకుండ దుర్గర్వంతో దుర్యోధనుడు సభనుంచి వెంటనే లేచి వెళ్ళాడు. కొలువంతా కలవరపాటు చెందింది.

**తే.** **అతని వెనుకన కర్ణుండు ననుజగణము । శకునియును వారి పొందైన జనపతులును**
**బోయి రమ్మెయిఁ జని యొక్క ప్రోవుగట్టి । వేఱ యంతంత నుండిరి కోఁఅడమున.** **374**

**ప్రతిపదార్థం:** అతని వెనుకన్+అ= దుర్యోధనుడి వెంబడే; కర్ణుండున్= రాధేయుడూ; అనుజగణమున్= తమ్ముళ్ళ గుంపూ; శకునియును= సౌబలుడూ; వారిపొందు+ఐన= వారికి అనుకూలురైన; జనపతులును= రాజులున్నూ; పోయిరి= వెళ్ళారు; ఆ+మెయిన్+చని= ఆ విధంగా వారు వెళ్ళి; ఒక్క ప్రోవు+కట్టి= ఒక గుంపుగా చేరి; కోఁఅడమునన్= క్రోధంతో; వేఱ= ప్రత్యేకంగా; అంతంతన్+ఉండిరి= కొంతదూరంలో ఉన్నారు.

**తాత్పర్యం:** దుర్యోధనుడి వెంట కర్ణుడు, సహోదరుల సమూహం, శకుని, మిత్రులైన రాజులు సభనుండి ఆ విధంగా లేచిపోయి గుంపుగట్టి క్రోధంతో వేఱుగా కొంచెం దూరంలో ఉండిపోయారు.

**వ.** **ఇ ట్లున్నం గనుంగొని గాంగేయుండు.** **375**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఉన్నన్= వారిట్లుండగా; కనుంగొని= చూచి; గాంగేయుండు= గంగకొడుకైన భీష్ముడు.

**తాత్పర్యం:** దుర్యోధనాదులు సభనుంచి అట్లా లేచిపోయి ఒకచోట గుంపుగా చేరి ఉండగా చూచి గంగా పుత్రుడిట్లా అన్నాడు:

**చ.** **'ఇతఁ డిదియేల క్రొవ్వి ధరణీశుఁడ నంచు వృథాభిమానియై**
**మతిచెడి లోభమోహ మదమత్సరముల్ దనుఁ ద్రిప్ప ని ట్లసం**
**గతమునఁ బోయె; వీని వెనుకం జని రేమి దలంచియో మహీ**
**పతులును; వీరు గొంద ఱతి పౌరుష మానసు లేమిచేయుదున్?'** **376**

**ప్రతిపదార్థం:** ఇతఁడు= దుర్యోధనుఁడు; ఇది+ఏల= ఇట్లెందుకు; క్రొవ్వి= మదించి; ధరణీ+ఈశుఁడన్+అంచున్= భూపతిననుచు; వృథా+అభిమాని+ఐ= వ్యర్థమైన అహంకారం కలవాడై; మతిచెడి= బుద్ధిలేక; లోభమోహమదమత్సరముల్= దురాశ, అజ్ఞానం, పొగరు, ద్వేషం అనే దుర్గుణాలు; తనున్= తనను; త్రిప్పన్= పట్టి ఆడించగా; ఇట్లు= ఈ ప్రకారంగా; అసంగతమునన్+ పోయెన్= అమర్యాదగా వెళ్ళాడు; వీని వెనుకన్= ఈ దుర్యోధనుని వెనుకనే; ఏమి తలంచియో= ఏమి భావించిరోగాని; మహీపతులును= రాజులును; చనిరి= వెళ్ళారు; వీరు కొందఱు= వీరిలో కొంతమంది; అతి పౌరుషమానసులు= మిక్కిలి పౌరుషంతో కూడిన మనస్సులు కలవారు; ఏమి చేయుదున్?= ఏమి చేసేది? (ఏమి చేయటానికీ తోచటం లేదని భావం).

**తాత్పర్యం:** 'ఈ దుర్యోధనుడు తానూ ఒక రాజునని కొరమాలిన అహంకారంతో పొగరెక్కి, బుద్ధిలేక, అత్యాశ, అజ్ఞానం, మదం, ఈర్ష్య అనే దుర్గుణాలకులోనై, అమర్యాదగా సభనుండి లేచివెళ్ళాడు. ఏ ఉద్దేశంతోనో వీని వెంబడి మరికొందరు రాజులు కూడా వెళ్ళిపోయారు. వీరు కొంతమంది మిక్కిలి పౌరుషంతో కూడిన మనసులు కలవారు. ఇప్పుడేమి చేయవలెనో తోచటం లేదు.'

**విశేషం:** అలం: సముచ్చయం.

**తే.** **అని జనార్దనుఁ గనుఁగొని 'యకట' కాల । పక్వమయ్యె నీ నరపతి ప్రతతి కెల్ల !**
**ననుడుఁ దగువారి దెసఁ గలయంగఁ జూచి । తగవు మెయి నిట్టులనియె నన్నగధరుండు.** **377**

**ప్రతిపదార్థం:** అని; జనార్దనున్+కనుఁగొని= అంటూ శ్రీకృష్ణుడిని చూచి; అకట!= అయ్యో!; ఈ నరపతి ప్రతతికిన్+ఎల్లన్= ఈ రాజసమూహాని కంతకూ; కాలపక్వము+అయ్యెన్= కాలం పండింది సుమా; అనుడున్= అని పల్కగా; ఆ+నగధరుండు= ఆ గోవర్ధనగిరినెత్తిన గోవిందుడు; తగు వారిదెసన్= యోగ్యులైన వారివైపు; కలయంగన్+చూచి= తేరిపార చూచి; తగవు మెయిన్= ధర్మయుక్తంగా; ఇట్టులు+అనియెన్= ఇట్లా పలికాడు.

**తాత్పర్యం:** భీష్ముడు శ్రీకృష్ణుడి వంక చూచి ఈ రాజులందరికీ వినాశకాలం దాపురించినట్లుంది అని అనగానే శ్రీకృష్ణుడు సభలో యోగ్యులైనవారి వైపు చూచి న్యాయసమ్మతంగా ఇట్లా ప్రసంగించాడు.

**శా.** **'ఈ దుర్యోధనుఁ డింత గర్వియగునే । యీ యున్నవారెల్ల నా**
**చే దైన్యంబునఁ బొందు టొప్పదని చర్చింపండ; యీ భంగికిన్**
**లేదే యొండు దెఱంగు? సత్కులముఁ బాలింపంగ వర్జింపరా**
**దే? దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ? బోదే భేద మీ జాతికిన్?** **378**

**ప్రతిపదార్థం:** ఈ దుర్యోధనుఁడు= ఈ సుయోధనుడు; ఇంత గర్వి+అగునే= ఇంతటి పొగరుబోతు అవుతాడా? ఈ+ఉన్నవారు+ ఎల్లన్= ఇక్కడున్న రాజులంతా; నాచేన్= నావలన; దైన్యంబునన్+పొందుట= దీనత్వం పాలుకావడం; ఒప్పదు+అని= తగదని; చర్చింపండ?= ఎందుకు ఆలోచించడు?; ఈ భంగికిన్= దుర్యోధనుడి ఈ రీతి వ్యవహారానికి; ఒండు తెఱంగు లేదే?= మరొక మార్గం ఏదీ లేదా?; సత్కులమున్= సద్వంశమును; పాలింపఁగన్= కాపాడటానికి; దుష్టాత్మకున్= చెడుబుద్ధిగలవాడిని; నీచున్= అల్పుడిని; ఒక్కరునిన్= ఒక్కడిని; వర్జింపన్‌రాదే?= పరిత్యజించ తగదా? ఈ జాతికిన్= ఈ కౌరవజాతికి; భేదము పోదే!= ఈ చీలిక తొలగదా?

**తాత్పర్యం:** 'ఈ సుయోధనుడి కింత పొగరా? ఈ సభలో ఉన్న రాజులందరూ 'నా చేత దైన్యం అనుభవించటం తగ'దని ఆలోచించకున్నారు. ఈతడి అనుచిత ప్రవృత్తి మాన్పటానికి మరో మార్గ మేదీ లేదా? సద్వంశాన్ని సంరక్షించటానికి ఆ కుటుంబంలో పుట్టిన దుష్టచిత్తుడు, అల్పుడు అయిన ఒకే ఒకడిని పరిత్యజించటం తగదా? ఈ కౌరవ జాతి కేర్పడిన పీడ తొలగదా?

**ఉ.** **కంసుఁడు నిట్ల తండ్రి మది గందెడు చంద మొనర్చి ధర్మ వి**
**ధ్వంసము సేసినం గులమువారలు నా కెఱిఁగింప నేను దు**

**ర్మాంసము గోయు వైద్యుని క్రమంబున నాతనిఁ ద్రుంచి యన్వయో**
**త్తంసముఁ జేయనే జనకుఁ; దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్?** 379

**ప్రతిపదార్థం:** కంసుఁడున్= కంసుడుకూడ; ఇట్లు+అ= ఈ దుర్యోధనుడివలెనే; తండ్రి మది= జనకుడైన ఉగ్రసేన మహారాజు చిత్తం; కందెడు చందము+ఒనర్చి= కుమిలిపోయేటట్లు చేసి; ధర్మ విధ్వంసమున్+చేసినన్= ధర్మాన్ని నిర్మూలించగా; కులమువారలు= భోజవంశంలో పుట్టినవారు; నాకున్= నాకు; ఎఱింగింపన్= తెలుపగా; నేను= నేను; దుర్మాంసమున్= చెడుమాంసాన్ని; కోయు= ఖండించే; వైద్యుని క్రమంబునన్= చికిత్సకుడి విధాన; ఆతనిన్= కంసుడిని; త్రుంచి= సంహరించి; జనకున్= అతని తండ్రి అయిన ఉగ్రసేనుడిని; అన్వయ+ఉత్తంసమున్+చేయనే?= కులమునకు పెద్దగా చేయలేదా?; తద్+విధము= ఆ రీతి; మీరున్ చేసినన్= మీరు కూడా సల్పినచో; ఒప్పదె?= బాగుండదా?

**తాత్పర్యం:** కంసుడు ఈ విధంగానే తండ్రి మనసు నొప్పించి ధర్మాన్ని నశింపజేస్తుంటే కులబంధువులు వచ్చి నాకు చెప్పుకొన్నారు. చెడుమాంసాన్ని కోసివైచే వైద్యుడివలె నేను ఆ దుష్టుడిని సంహరించి అతడి జనకుడైన ఉగ్రసేనుడికి రాజ్యపట్టం కట్టి కులానికి మేటిగా చేశాను. మీరున్నూ అట్లా చేయటం సముచితంగా ఉండదా?

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. అంతతోడ నెల్ల యాపదలును దీఱు । వంశ మధిక గౌరవంబు నొందుఁ**
**గూడి మనుట గలుగుఁ గురు పాండవులకు ని । త్తెఱఁగు సూడ మీకు నుఱవకాదె?** 380

**ప్రతిపదార్థం:** అంతతోడన్= అంతటితో; ఎల్ల+ఆపదలును= అన్నికష్టాలూ; తీఱున్= తొలగిపోతాయి; వంశము= కౌరవ వంశం; అధికగౌరవంబున్+ఒందున్= మిక్కిలి ఆదరణ పొందుతుంది; కురుపాండవులకున్= కౌరవులకూ, పాండవులకూ; కూడిమనుట+కలుగున్= కలసి జీవించటం సమకూడుతుంది; ఈ తెఱఁగు చూడన్= ఆలోచిస్తే ఈ ప్రక్రియ; మీకున్= మీకు; ఉఱవు+అ కాదె!= ఉచితమే కదా!

**తాత్పర్యం:** దుర్యోధనుడి పీడ విరగడ కావటంతో అన్ని కష్టాలు తీరుతాయి. కురువంశం మిక్కిలి గౌరవం పొందుతుంది. కురుపాండవులకు కలసి జీవించే భాగ్యం లభిస్తుంది. కనుక నే చెప్పిన మార్గం మీకు సముచితమైనది కదా!'

**వ. అనిన విని ధృతరాష్ట్రుం డదరిపడి విదురున కిట్లనియె:** 381

**ప్రతిపదార్థం:** అనినన్+విని= శ్రీకృష్ణుడట్లా చెప్పగా ఆలించి; అదరిపడి= భయపడి; ధృతరాష్ట్రుండు; విదురునకున్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సదస్యులతో శ్రీకృష్ణు డన్న మాటలు విని ధృతరాష్ట్రుడు బెదరిపోయి విదురుడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'బుద్ధిమంతురాలు పొందుగఁ బలుకంగ । నేర్చు; వచ్చి కొడుకుఁ దేర్చిపోవుఁ**
**గాన వేగ నీవు గాంధారిఁ దోడితె' । మ్మనుడు నరిగి యతఁడు నట్లచేసి.** 382

**ప్రతిపదార్థం:** బుద్ధిమంతురాలు= తెలివిగలది; పొందుగన్= తగినట్లు; పలుకంగన్+నేర్చున్= మాటలాడటం తెలిసినట్టిది; వచ్చి= ఇక్కడికి వచ్చి; కొడుకున్= కుమారుడిని; తేర్చిపోవున్= ప్రసన్నుడిని చేసి వెళ్ళుతుంది; కానన్= కాబట్టి; వేగ= శీఘ్రమే; నీవు= నీవు; గాంధారిన్= గాంధారీదేవిని; తోడితెమ్ము= పిలుచుకొనిరమ్ము; అనుడున్= అని ధృతరాష్ట్రుడు చెప్పగా; అరిగి= వెళ్ళి; అతఁడు= విదురుడు; అట్ల చేసెన్= ఆమెను సభకు వెంటబెట్టుకొని వచ్చాడు.

**తాత్పర్యం:** 'గాంధారి తెలివిగలది. తగినట్లు మాట్లాడే నేర్పున్నది. ఇక్కడికి వచ్చి తన కుమారుడిని శాంతింపజేస్తుంది. నీవు త్వరగా వెళ్ళి ఆమెను సభకు తోడ్కొనిరమ్ము' అని ధృతరాష్ట్రుడు చెప్పగా విదురుడు వెళ్ళి ఆమెను వెంటబెట్టుకొని వచ్చాడు.

**వ. అద్దేవియు. 383**

**తాత్పర్యం:** ఆ గాంధారీ దేవియును.

**క. చనుదెంచి యుచిత పీఠం । బున నున్నం గురువిభుండు పొలఁతుకతో ని**
**ట్లను; నీ తనూభవుఁడు దు । ర్వినయంబునఁ జనియె; నిట్టి వెంగలి గలఁడే? 384**

**ప్రతిపదార్థం:** చనుదెంచి= వచ్చి; ఉచిత పీఠంబునన్+ఉన్నన్= తగిన ఆసనంపై ఉండగా; కురువిభుండు= కురు రాజైన ధృతరాష్ట్రుడు; పొలఁతుక తోన్= పత్ని అయిన గాంధారితో; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికాడు; నీ తనూభవుఁడు= నీ కుమారుడు; దుర్వినయంబునన్= అవిధేయతతో; చనియెన్= సభనుంచి లేచి వెళ్ళాడు; ఇట్టి వెంగలి+కలఁడే?= ఇటువంటి మూర్ఖుడున్నాడా?

**తాత్పర్యం:** గాంధారి విదురుడి వెంట వచ్చి తగిన పీఠంమీద కూర్చున్నది. అప్పుడు ధృతరాష్ట్రుడు. ఆమెతో ఇట్లా అన్నాడు. 'నీ కుమారుడు అవిధేయుడై సభనుంచి వెళ్ళిపోయాడు. ఇట్లాంటి మూర్ఖుడు ఎక్కడైనా ఉన్నాడా?'

**విశేషం:** దుర్యోధనుడు తనకూ కొడుకైనప్పటికీ, భార్యయైన గాంధారితో మన తనూభవుడనక 'నీ తనూభవుఁ' డనటం లోక సహజం. (సంపా.)

**క. నీవైనఁ జెప్పి శాంతుం । గావింపఁగ నోపుదేనిఁ గౌరవకుల మీ**
**గోవిందు శాసనము సం । భావింపం గాంచి చెడక బ్రదుకుంజుమ్మీ! 385**

**ప్రతిపదార్థం:** నీవు+ఐనన్+చెప్పి= నీవైనా తెలిపి; శాంతున్+కావింపఁగన్= ప్రసన్నుడిని కావించటానికి; ఓపుదు(వు)+ఏనిన్= చాలి ఉంటే; కౌరవకులము= కురువంశం; ఈ గోవిందుశాసనమున్= ఈ ముకుందుడి యొక్క ఆజ్ఞను; సంభావింపన్+కాంచి= ఆదరించగల్గినదై; చెడక= నశించక; బ్రదుకున్+చుమ్మీ!= జీవించును సుమా!

**తాత్పర్యం:** 'నీవైననూ చెప్పి దుర్యోధనుడిని శాంతింపజేయగలిగితే శ్రీకృష్ణుడి ఆజ్ఞ ఆదరించబడినదై, ఈ కురువంశం నశించక బ్రతికి ఉంటుంది.'

**తే. అనుడు 'నీ పుత్త్రుఁ డవినీతుఁ డగుట యెఱిఁగి । యెఱిఁగి వాని వశంబున నేలపోయె**
**దీవు పాండవులకు నేమియిచ్చితేని । నడ్డపడ నెవ్వరికి వచ్చు నధిప! చెపుమ.' 386**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని ధృతరాష్ట్రుడు పలుకగా; నీ పుత్త్రుఁడు= నీ కుమారుడు; అవినీతుఁడు= అణకువ లేనివాడు; అగుట= అయి యుండుట; ఎఱిఁగి+ఎఱిఁగి= తెలిసి తెలిసికూడ; వాని వశంబునన్+ఏల పోయెదు(వు)?= వాడికి లోబడి ఎందుకు మెలగుతావు?; ఈవు= నీవు; పాండవులకున్= పాండు కుమారులకు; ఏమి+ఇచ్చితి+ఏనిన్= ఏమిచ్చినప్పటికిన్నీ; అధిప!= రాజా!; ఎవ్వరికిన్+అడ్డపడన్ వచ్చున్?= కాదని చెప్పటానికి ఎవరితరం?; చెపుమ= నీవే చెప్పుము.

**తాత్పర్యం:** 'రాజా! నీ కొడుకు అవిధేయుడని తెలిసి తెలిసి వాని ఇష్ట ప్రకారం ఎందుకు వ్యవహరిస్తావు? నీవు పాండుకుమారులకు ఏమిచ్చినా వద్దని నీకు అడ్డుపడే వారెవరో నీవే చెప్పు.'

**విశేషం:** ధృతరాష్ట్రుడు గాంధారితో 'నీ తనూభవు' డంటే, ఆమెకూడా తదనుగుణంగానే 'నీ పుత్త్రు' డనటం గమనించదగింది. లోకంలో కొడుకు చెడ్డవాడైతే తల్లి దండ్రులిట్లా ఎవరిమట్టుకు వారు అతడిని తన కొడుకు కాడనటం పరిపాటి. 'నీ కొడుకని అంటావేమి? నీకు మాత్రం కొడుకు కాడా? అని యెత్తిపొడుపు. 'అధిప' అనే సంబోధనం కూడా సాభిప్రాయం. నీవు అధిపుడవు. ఏమయినా చేయగల సమర్థుడివి. పాండవులకు ఏమి ఇస్తే నిన్ను వారించగలిగే వారెవరున్నారు? నీవు రాజువు కదా! అందుచే తప్పంతా నీదే అంటోంది గాంధారి. (సంపా.)

**క. అని గాంధారి పతియుఁ దా । నును విదురుం బనిచె నందనుం బిలువ; నతం**
**డును మొగము జేవుఱింపఁగఁ । జనుదెంచెను సభకు విదుర సంప్రార్థితుఁడై. 387**

**ప్రతిపదార్థం:** అని గాంధారి= అని గాంధారి పలికి; పతియున్= తనభర్త అగు ధృతరాష్ట్రుడూ; తానును= తానూ; నందనున్= కుమారుడైన దుర్యోధనుడిని; పిలువన్= పిలుచుకొని రావటానికి; విదురున్= విదురుడిని; పనిచెన్= పంపారు; విదుర సంప్రార్థితుఁడు+ఐ= విదురుడిచే వేయబడినవాడై; అతండును= ఆ దుర్యోధనుడూ; మొగము జేవుఱింపఁగన్= ముఖం క్రోధంతో ఎఱ్రబడగా; సభకున్= కొలువులోనికి; చనుదెంచెను= వచ్చాడు.

**తాత్పర్యం:** అట్లా గాంధారి వచించి తానూ ధృతరాష్ట్రుడూ దుర్యోధనుడిని సభకు పిలుచుకొనిరమ్మని విదురుడిని పంపారు. విదురుడు వెళ్ళి రమ్మని చెప్పగా సుయోధనుడు కోపంతో ముఖం ఎఱ్రపడగా సభకు వచ్చాడు.

**వ. మున్ను దనతోడం జనిన వార లందఱు నచ్చోటన నిలువ నిట్లువచ్చి సుయోధనుండు నిజాసనాసీనుండై యున్నఁజూచి తల్లి చిత్తంబున గర్హించుచు నతనికి ధర్మంబును నీతియును జుట్టఱికంబును బ్రదుకుఁదెరువును నిజశక్తియు సహాయంబు గొలందియుఁ గులజన చిత్త ప్రకారంబున బాండుపుత్త్రుల బలపరాక్రమంబులుఁ దెలియునట్లుగాఁ దెఱంగుపడం జెప్పి, బుజ్జగించియుం గినిసియు ననేక విధంబుల నాడిన నమ్మాటల దెస ననాదరంబు సేసి యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణాదులం గలిసి వారునుం దానును దుర్మం త్రంబునకుం జొచ్చి. 388**

**ప్రతిపదార్థం:** మున్ను= మునుపు; తనతోడన్చనినవారలు= తనతో వెళ్ళినవారు; అందఱున్; ఆ+చోటన్+అ= అక్కడే; నిలువన్; ఇట్లు వచ్చి= ఈ విధంగా వచ్చి సుయోధనుండు; నిజ+ఆసన+ఆసీనుండు+ఐ= తన పీఠంమీద కూర్చున్నవాడై; ఉన్నన్; చూచి; తల్లి; చిత్తంబునన్= మనసులోపల; గర్హించుచున్= నిందిస్తూ; అతనికిన్; ధర్మంబును; నీతియును; చుట్టఱికంబును; బ్రదుకు+తెరువును= జీవనోపాయం; నిజశక్తియున్= అతనిశక్తిని; సహాయంబు కొలఁదియున్= ఆతడికి జరిగేసాయం యొక్క మోతాదు; కులజన చిత్తప్రకారంబును= కుల బంధువుల యొక్క మనోవైఖరి; పాండు పుత్త్రుల బల పరాక్రమంబులున్;

తెలియునట్లుగాన్; తెఱంగుపడన్+చెప్పి= తేటతెల్లంగా తెలిపి; బుజ్జగించియున్= బతిమాలుకొనియూ; కినిసియున్= కోపించియూ; అనేకవిధంబులన్= పలు రకాల; ఆడిన= పల్కినట్టి; ఆ+మాటల దెసన్= ఆ పలుకులయెడ; అనాదరంబు+చేసి= ఆదరం చూపక; ఉద్ధతిన్= గర్వంతో; క్రమ్మఱన్+చని= మరల వెళ్ళి; అతండు= దుర్యోధనుడు; కర్ణ+ఆదులన్+కలిసి= కర్ణుడు మొదలైనవారితో చేరి; వారునున్= ఆ కర్ణాదులు; తానును; దుర్మంత్రంబునకున్+చొచ్చి= దురాలోచనకు పూనుకొని.

**తాత్పర్యం:** మునుపు తనతోపాటు సభనుండి లేచి వచ్చిన వారంతా అక్కడే నిలువగా దుర్యోధనుడు తానొక్కడే వచ్చి తన పీఠంమీద కూర్చున్నాడు. గాంధారి అతడిని గమనించి మనసులో తిట్టుకొంటూ అతనికి ధర్మం, రాజనీతి, బాంధవ్యం, బ్రతికే మార్గం, అతనికున్న శక్తి, సహాయము యొక్క మితి, కురువంశంలోని పెద్దల మనోవైఖరి, పాండవుల శక్తిసామర్థ్యాలు స్పష్టంగా అతడి బుద్ధి కెక్కేటట్లు చెప్పింది. అతడిని బతిమాలి, కోపించి బహువిధాలుగా హితవాక్యాలు పలికింది. కాని, అతడు తల్లిమాటలు నిరాదరించి గర్వంతో మళ్ళీ లేచి వెళ్ళి కర్ణాదులతో చేరి తానూ వారూ దురాలోచనకు పూనుకొన్నారు.

### దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱంబెట్టఁ దలంచుట (సం. 5-128-1)

**క. హరి తలఁ పొప్పదు భీష్ముని। గురునిం గూర్చికొని మనలఁ గ్రొవ్వఱఁ బట్టం**
**గర ముత్సహించుచున్నాఁ। డరయ నతని వచన రచన నంతయుఁ దెలిసెన్. 389**

**ప్రతిపదార్థం:** హరి తలఁపు+ఒప్పదు= శ్రీకృష్ణుడి సంకల్పం మంచిది కాదు; భీష్మునిన్= గాంగేయుడిని; గురునిన్= ద్రోణుడిని; కూర్చికొని= తనవైపు చేర్చుకొని; మనలన్= మనందరినీ; క్రొవ్వు+అఱన్= పౌరుషం చెడేటట్లు; పట్టన్= బంధించటానికి; కరము= మిక్కిలి; ఉత్సహించుచున్+ఉన్నాఁడు= యత్నిస్తున్నాడు; అరయన్= పరికించగా; అతని వచనరచనన్= శౌరిమాటల తీరును బట్టి; అంతయున్+తెలిసెన్= సమస్తం వెల్లడి ఐనది.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణుడి ఉద్దేశం మంచిది కాదు. అతడు గురుభీష్ములను తనవైపు కూడ గట్టుకొని, మనందరినీ గర్వమణగేటట్లు పట్టటానికి మిక్కిలి యత్నిస్తున్నాడు. ఇదంతా అతడి మాటల తీరును బట్టి వెల్లడి ఔతున్నది.

**విశేషం:** నిజానికి కృష్ణుడిని బంధింప జూచేది తానూ తన మిత్రులూ, కృష్ణుడే తనను బంధింపజూస్తున్నాడనటం విడ్డూరం. దుష్టుడైన దుర్యోధనుడు తాను చేయబోయే దౌష్ట్యానికి హేతువును కల్పిస్తున్నాడు. (సంపా.)

**క. మునుఁ దాఁ గంసునిఁబరి మా। ర్చిన చందము వారికెల్లఁ జెప్పెడుఁ; దనకున్**
**మును మనము గడఁగి వెసఁబ। ట్టినఁ గార్యం బగుఁ; జలంబు డింపకుఁ డింకన్. 390**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; తాన్= తాను; కంసునిన్ పరిమార్చిన చందమున్= కంసుడిని చంపిన వైనం; వారికిన్+ఎల్లన్= సభలోని భీష్మ ద్రోణాదులందరికీ; చెప్పెడున్= చెపుతున్నాడు; తనకున్ మును= తాను మనలను బంధించటానికి పూర్వమే; మనము= మనమందరమూ; కడఁగి= పూనుకొని; వెసన్= శీఘ్రంగా; పట్టినన్= శౌరిని బంధిస్తే; కార్యంబు+అగున్= మనపని నెరవేరుతుంది; ఇంకన్= ఇంక; చలంబు; డింపకుఁడు= పట్టుదల వదలకండి.

**తాత్పర్యం:** పూర్వం తాను కంసుడిని సంహరించిన విధమెట్టిదో గురుభీష్మాదులైన మనవారి కందరికీ చెప్పుతున్నాడు. తనకంటె మనమే ముందు మిగిలి అతడిని వెంటనే బంధిస్తే మనపని నెరవేరుతుంది. పట్టుదల మానకండి.

**తే. పట్టి యీతనిఁ జెఱఁబెట్టి పాండవులకు । దిగులు పుట్టింత మంతటఁ దెగక యెత్తి**
**వచ్చిరేనియు నిర్జింప వచ్చుఁ గోఱ । లెల్లఁ బుచ్చిన నురగంబు లేమిసేయు? 391**

**ప్రతిపదార్థం:** ఈతనిన్+పట్టి= శౌరిని పట్టుకొని; చెఱన్+పెట్టి= చెరసాలలో ఉంచి; పాండవులకున్= పాండునందనులకు; దిగులు పుట్టింతము= జాలికలిగేటట్లు చేద్దాము; అంతటన్= అంతటితో; తెగక= వెనుదీయక; ఎత్తివచ్చిరి+ఏనియున్= మనపై దాడి సలిపితే; నిర్జింపన్+వచ్చున్= వారి నోడించవచ్చు; కోఱలు+ఎల్లన్= కోరలన్నీ; పుచ్చినన్= తీసివేస్తే; ఉరగంబులు= పాములు; ఏమి చేయున్?= ఏమి చెయ్యగలవు?

**తాత్పర్యం:** కృష్ణుడిని పట్టి చెరలో పెట్టి పాండవులకు దిగులు పుట్టిద్దాము. అంతటితో వారు దారికి వస్తారు. ఒకవేళ దారికి రాక మనపైకి దండెత్తి వస్తే వారిని సులువుగా మనం ఓడించవచ్చు. కోరలు తీసిన పాము లేమి చేస్తాయి?

**విశేషం:** అలం: నిదర్శన.

**వ. అని విచారించె నట్లు దుష్కార్యాలోచనంబు సేసి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులగు దుష్టచతుష్టయంబు మొదలుగాఁ గల యవినీతులు దైతేయమర్దను మర్దింప నిశ్చయించి; రయ్యవసరంబున. 392**

**ప్రతిపదార్థం:** అని విచారించెన్= అని దుర్యోధనుడు ఆలోచించాడు. అట్లు= ఆ విధంగా; దుష్కార్య+ఆలోచనంబు చేసి= చెడుపని చేయటానికి ఆలోచించి; దుర్యోధన దుశ్శాసన; శకుని కర్ణులు; అగు= అనునట్టి; దుష్టచతుష్టయంబు= నలుగురు దుర్మార్గులు; మొదలుగాన్+కల= మున్నుగా ఉన్నట్టి; అవినీతులు= చెడు నడవడికలవారు; దైతేయ మర్దనున్= రాక్షసులను నలగగొట్టిన నారాయణుడిని; మర్దింపన్ నిశ్చయించిరి= పీడించటానికి నిర్ణయించుకొన్నారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కృష్ణుడిని పట్టవలెనని దుష్కార్యాలోచన చేసి, దుష్టచతుష్టయం అని పిలువబడే దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు, ఇంకా వారి పక్షంలో ఉన్న చెడు నడత గలిగిన మరికొందరూ రాక్షసాంతకుడైన శౌరిని బంధించాలని నిశ్చయించుకొన్నారు.

**చ. అడఁకువ లేమి నల్కి యురియాడుట నొండొరుఁగూడకుండుటన్**
**బుడిబుడి మాటలాడుటను బోవుచు వచ్చుచుఁ గ్రందు గ్రమ్మఱం**
**బడుటను దెల్లమైన మును పన్నుగఁ దాఁ బరికించి యున్కి న**
**ప్పుడు హరిఁ బట్టు సంకులము పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్. 393**

**ప్రతిపదార్థం:** అడఁకువలేమిన్= వినయం లేకుండటంచేత; అల్కి= శంకించి; ఉరియాడుటన్= కళవళపడటం చేతను; ఒండొరున్+కూడక+ఉండుటన్= ఒకరితో మరొకరు చేరకుండటం చేతను; బుడిబుడి మాటలు+ఆడుటను= గుసగుసలాడు కొనటంచేతను; పోవుచున్ వచ్చుచున్= రాకపోకలు సల్పుతూ; క్రందు= సందడి; క్రమ్మఱన్+పడుటను= మరల నేర్పడుట చేతను; తెల్లము+ఐనన్= స్పష్టంకాగా; మును= ముందే; పన్నుగన్= చక్కగా; తాన్= తాను; పరికించి+ఉన్కిన్= గమనిస్తూ ఉండుటచేత; అప్పుడు= ఆ వేళ; హరిన్= శ్రీకృష్ణుడిని; పట్టు సంకులము= బంధించే సంరంభం; పుట్టుట= జనించటం; సాత్యకి= (కృష్ణుడి సోదరుడు); నిశ్చయించుచున్= నిర్ణయిస్తూ

**తాత్పర్యం:** దుర్యోధనాదులు వినయరహితులై భయంతో కళవళించటం, ఒకరి నొకరు చేరకుండటం, ఒకరితో ఒకరు గుసగుసలాడుకొనటం, అటునిటు తిరుగులాడుతుండటంవల్ల సందడి హెచ్చుటం - ఈ లక్షణాలవల్ల

విషయం విశదమై ముందుగానే అంతా చక్కగా గమనించటం వల్ల శౌరిని బంధించే సంరంభం ఏర్పడిందని అప్పుడు సాత్యకి నిర్ణయిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: సముచ్చయం.

**తే.** **బఱటి కొనిపోయి కృతవర్మ బన్నఁ బనిచె। నీవు బలమును వాఁకిట నిలువు; మేను**
**లోపలికి నెల్లఁ జాలుదుఁ; బాపబుద్ధు। లన్నదెసఁ దప్పిరని నిర్భయమునఁ జెప్పె.** **394**

**ప్రతిపదార్థం:** బఱటి= సైగగా గోకి; కొనిపోయి= తనవెంట తీసికొనివెళ్ళి; కృతవర్మన్= కృతవర్మను; పన్నన్+పనిచెన్= యుద్ధానికి తలపడుమని చెప్పాడు; నీవును= నీవూ; బలమును= సేనలూ; వాఁకిటన్= సభాద్వారమునందు; నిలువుము= నిలబడండి; ఏను= నేను; లోపలికిన్+ఎల్లన్= సభలోపలి పని కంతటికీ; చాలుదున్= సరిపోతాను; పాపబుద్ధులు= దురిత చిత్తులైన దుర్యోధనాదులు; అన్నదెసన్+తప్పిరి= అన్నపట్ల దౌష్ట్యానికి దిగారు; అని, నిర్భయమునన్+చెప్పెన్= నిర్భీతితో పలికాడు.

**తాత్పర్యం:** సాత్యకి సైగచేసి కృతవర్మను తనవెంట కొనిపోయి 'నీవు యుద్ధానికి సంసిద్ధంగా ఉండు. నీవూ, సేనలూ వాకిట నిలబడండి. సభలోని సంగతి నంతా నేను చూచుకొంటాను. దురితచిత్తులై దుర్యోధనాదులు అన్నపట్ల అక్రమ మార్గానికి దిగారు' అంటూ నిర్భయంగా పలికాడు.

**వ.** **ఇట్లు పరమాప్తుండగు హార్దిక్యు నటపుచ్చి సాత్యకి సత్వరంగాఁ జనుదెంచి జనార్దనునకు నత్తెఱంగెల్ల నెఱింగించి, తదనుమతిం గౌరవేశ్వర బాహ్లిక గురు భీష్మ విదురులతో నిట్లనియె.** **395**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; పరమ+ఆప్తుండు+అగు= మిక్కిలి హితుడైన; హార్దిక్యున్= కృతవర్మను (హృదికుని కొడుకు); అట+పుచ్చి= సభ వెలుపల ఉండుమని పంపి; సాత్యకి; సత్వరంబుగాన్= వేగంగా; చనుదెంచి= వచ్చి; జనార్దనునకున్= శ్రీకృష్ణుడికి; ఆ+తెఱంగు= ఆ విధమంతయు; ఎఱింగించి; తత్+అనుమతిన్= అచ్యుతుడి అంగీకారంతో; కౌరవేశ్వర; బాహ్లిక గురు; భీష్మ; విదురుల తోన్= ధృతరాష్ట్రుడు, బాహ్లికుడు, ద్రోణుడు, భీష్ముడు, విదురుడు అనువారితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** సాత్యకి ఈ విధంగా పరమహితుడూ యాదవుడూ అయిన కృతవర్మను సభ వాకిట పోరాటానికి సంసిద్ధంగా ఉండుమని పంపి, తాను శీఘ్రంగా కొలువు లోనికి వచ్చాడు. శ్రీకృష్ణుడికి విషయమంతా చెప్పి, ఆయన అంగీకారంతో ధృతరాష్ట్ర బాహ్లిక గురు భీష్మ విదురులతో ఇట్లా అన్నాడు:

**మ.** **'అదె కౌరవ్యు లశక్తదుర్జనత సేయంబూని పైఁ బాఱఁజూ**
**చెద రమ్మైఁ దమచేతఁ దీఱునె జయశ్రీకాంతు దైత్యాంతకుం**
**బొదువం దారు దలంచు టెల్ల ననలంబుం జీర బంధింపఁగా**
**మది నూహించిన యట్లకాక తమ దుర్మంత్రంబులం బోవునే?'** **396**

**ప్రతిపదార్థం:** అదె= అదిగో; కౌరవ్యులు= కురుకుమారులు; అశక్త దుర్జనతన్+చేయన్+పూని= శక్తి లేనందున దౌర్జన్యం జరుపనెంచి; పైన్+పాఱన్+చూచెదరు= శ్రీకృష్ణుడి మీదికి ఉరుక యత్నిస్తున్నారు; అమ్మైన్= (ఆ+మైన్) ఆ విధంగా

గమకించటం; తమచేతన్+తీఱునె?= తమవలన సాధ్యపడుతుందా?; జయశ్రీకాంతున్= జయలక్ష్మీ వల్లభుడూ; దైత్య+అంతకున్= దానవ వినాశకుడూ అయిన శౌరిని; పొదువన్= పట్టటానికి; తారు= తాము; తలంచుట+ఎల్లన్= సంకల్పించటమన్నది; అనలంబున్= అగ్నిని; చీరన్= వస్త్రంలో; బంధింపఁగాన్= మూట గట్టటానికి; మదిన్= మనస్సులో; ఊహించిన+అట్లకాక= తలంచినట్లే అవుతుందిగాని; తమ దుర్మంత్రంబులన్= తమయొక్క దుష్టాలోచనలతో; పోవునే?= పని నెరవేరుతుందా?

**తాత్పర్యం:** 'అదుగో! కౌరవులు శక్తిహీనులై దౌర్జన్యం జరుపదలచి శ్రీకృష్ణుడి మీదికి దుముక యత్నిస్తున్నారు. అది తమవల్ల శక్యమవుతుందా? శౌరిని ఏమిగా భావించారో! ఆయన జయలక్ష్మీవల్లభుడు. దైత్య సంహారకుడు, అట్లాంటి పురుషోత్తముడిని పట్టనెంచటం వస్త్రంలో అగ్నిని మూట గట్టటమే అవుతుంది. తమ దురాలోచనల వల్ల పని నెరవేరుతుందా?'

**విశేషం:** అలం: రూపకం.

**వ. అనిన విదురుం డదరిపడి వైచిత్త్రవీర్యున కిట్లనియె: 397**

**ప్రతిపదార్థం:** అనినన్; విదురుండు; అదరిపడి= బెదరిపోయి; వైచిత్త్ర్యవీర్యునకున్= విచిత్రవీర్యుడి కుమారుడైన ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** సాత్యకి మాటలు విని విదురు డదిరిపడి ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**ఉ. 'భూవర! నీ తనూభవులు పుణ్యు నగణ్యపరాక్రమున్ హరిం**
**గేవల మర్త్యుఁగాఁ దలఁచి కిట్టినఁ బట్టినఁ దారు మంటపై**
**వావిరిఁ గ్రమ్ము నా శలభ వర్గము చాడ్పున మ్రందిపోరె? కా**
**లావధి యయ్యెఁ గావలయు నక్కట! వారికి వారివారికిన్. 398**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; నీ తనూభవులు= నీ కుమారులు; పుణ్యున్= కలుష రహితుడూ; అగణ్య పరాక్రమున్= గణింప శక్యంగాని శౌర్యము కలవాడునూ అయిన; హరిన్= శ్రీమన్నారాయణుడిని; కేవల మర్త్యుగాన్+తలఁచి= సామాన్యుడైన మానవమాత్రుడిగా నెంచి; కిట్టినన్= సమీపించినా; పట్టినన్= బంధించినా; తారు= తాము; మంటపైన్= అగ్నిజ్వాలపై; వావిరిన్= వరుసగా; క్రమ్ము= మూగు; ఆ శలభ వర్గము చాడ్పునన్= ఆ మిడుతలదండువలె; మ్రందిపోరె?= మాడిపోవరా?; అక్కట!= అయ్యో; వారికిన్= కౌరవులకు; వారివారికిన్= వారితో చేరిన వారికందరికినీ; కాల+అవధి+అయ్యెన్+కావలయున్= ఆయుష్యం యొక్క గడువు తీరింది కాబోలు!

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజా! నీ కుమారులు సుకృతాత్ముడూ, లెక్కింప శక్యంగాని పరాక్రమం కలవాడూ అయిన శ్రీహరిని సాధారణ నరుడిగా భావించి ఎదుర్కొని బంధించనెంచితే అగ్నిజ్వాలలపై మూగిన మిడుతల దండువలె మాడి మసియైపోతారు. కౌరవులకూ, కౌరవులతో చేరినవారికీ మరణ సమయం ఆసన్నమయిందేమో!'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అనుటయు గోవిందుం డందఱు విన నంబికానందనున కిట్లనియె: 399**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని విదురుడనగా; గోవిందుండు= గోపాలదేవుడు; అందఱువినన్= సభ్యులంతా ఆలకించగా; అంబికానందనునకున్= ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** విదురుడట్లా పలికిన మీదట అందరు వింటుండగా శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**ఉ. 'రోషము నాపయిం గలిగి క్రూరతఁ గౌరవు లింతసేఁత సం**
**తోషము! నీవు ప్రాభవముతోఁ దగ నాకు ననుజ్ఞయిమ్ము; ని**
**ర్దోషత నేను నోపుగతి దోర్బల దుర్జయులైన వారి వి**
**ద్వేషముఁ జక్కఁ బెట్టి జగతీవర! యింతకుఁ బోయివచ్చెదన్.' 400**

**ప్రతిపదార్థం:** జగతీవర!= రాజా!; రోషము= కోపం; నాపయిన్+కలిగి= నామీద జనించి; క్రూరతన్= కర్కశత్వంతో; కౌరవులు= నీ కుమారులు; ఇంతచేఁత= ఇంతపనికి పూనుకొనటం; సంతోషము+అ= నాకు ఆనందమే; నీవు; ప్రాభవముతోన్= రాచరికంతో; తగన్= యుక్తంగా; నాకున్= నాకు; అనుజ్ఞ+ఇమ్ము= ఉత్తరువు నొసగుము; నిర్దోషతన్= దోషం కలుగకుండా; నేనున్= నేనునూ; ఓపుగతిన్= చాలినంతవరకు; దోర్బలదుర్జయులు+ఐన= భుజ విక్రమంతో సులభంగా జయించ రానట్టి; వారి= దుర్యోధనాదుల యొక్క; విద్వేషమున్= వైరమును; చక్కన్+పెట్టి= సరిదిద్ది; ఇంతకున్= ఇటుపై; పోయివచ్చెదన్= పయనమై వెళ్ళుతాను.

**తాత్పర్యం:** 'మహారాజా! నామీద కినుక వహించి ద్రోహబుద్ధితో కౌరవులింతపనికి పూనుకొన్నారు. చాలా సంతోషం. నీవు నీ రాజాధికారంతో నాకు ఉత్తరువిస్తే నేను దోషమొదవకుండ నా శక్తికొలది బాహుశక్తితో సులభంగా జయించరాని ఈ కురుకుమారుల విరోధాన్ని చక్కబెట్టి, ఆ తర్వాతనే ఇక్కడనుండి పయనమై వెళ్ళుతాను.'

**క. అనుడు ససంభ్రమముగ న । జ్జనపతి దుశ్శాసనాది సకల పరిజనం**
**బును నాదుర్జనునిం దో । డ్కొని రమ్మని విదురుఁ బనుచుడుం జని యతఁడున్. 401**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని వాసుదేవుడు పలుకగానే; ససంభ్రమముగన్= తొట్రుపాటుతో; ఆ+జనపతి= ఆ నరేశ్వరుడు అయిన ధృతరాష్ట్రుడు; దుశ్శాసన+ఆది+సకల పరిజనంబును= దుశ్శాసనుడు మొదలైన అనుచరవర్గమునూ; ఆ దుర్జనునిన్= ఆ దుర్మార్గుడైన దుర్యోధనుడినీ; తోడ్కొని రమ్ము+అని= ఇచటికి తీసికొని రమ్ము అని; విదురున్ పనుచుడున్= విదురుడిని పంపగా; అతఁడున్= విదురుడునూ; చని= వెళ్ళి

**తాత్పర్యం:** వాసుదేవుడి మాటలు విని తొట్రుపాటుతో ధృతరాష్ట్రుడు దుశ్శాసనుడు మొదలైన పరిజనంతోపాటు దుర్మార్గుడైన దుర్యోధనుడిని ఇక్కడికి పిలుచుకొని రమ్మని పంపగా విదురుడు వెళ్ళి.

**వ. సపరివారంబుగా దుర్యోధనుం దోడ్తెచ్చినం జూచి యతనికి ధృతరాష్ట్రుం డిట్లనియె: 402**

**ప్రతిపదార్థం:** సపరివారంబుగాన్= పరిజనులతో కూడ; దుర్యోధనున్; తోడ్తెచ్చినన్+చూచి= విదురుడు వెంట బెట్టుక రాగా వీక్షించి; అతనికిన్; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** విదురుడు వెళ్ళి పరిజనులతో కూడ దుర్యోధనుడిని సభకు తోడుకొని వచ్చాడు. అపుడు ధృతరాష్ట్రుడు అతడిని చూచి ఇట్లా అన్నాడు :

**చ. 'అలవి యెఱుంగ కిట్లు దనుజారికిఁ గీడొనరింప నీవు నీ**
**తులువలు నుత్సహించితిరి దుర్మతులార! సమీరు మీకుఁ జే**
**నలవడఁ బట్టవచ్చునె? మహాద్రిఁ గదల్పఁగఁ బోలునే? దవా**
**నలుఁ జమరంగ శక్యమె? వినాశముఁ బొందెద రేమి సేయుదున్?' 403**

**ప్రతిపదార్థం:** దుర్మతులార!= దుష్టాత్ములారా!; అలవి+ఎఱుంగక= మీ శక్తి ఏపాటిదో గుర్తించక; ఇట్లు= ఈ ప్రకారంగా; దనుజ+అరికిన్= రాక్షస విరోధి అయిన రాజీవాక్షునకు; కీడు+ఒనరింపన్= హాని కల్గించటానికి; నీవున్= నీవూ; ఈ తులువలున్= ఈ తుంటరులూ; ఉత్సహించితిరి= పూనుకొన్నారు; మీకున్= మీకు; సమీరున్= వాయువును; చేన్+అలవడన్+పట్టన్+వచ్చునే= చేతిలోనికి ఇమిడేటట్లు బంధించటం శక్యమా? మహా+అద్రిన్= గొప్ప పర్వతాన్ని; కదల్పఁగన్+పోలునే?= పెల్లగించతరమా? దవ+అనలున్= కార్చిచ్చును; చమరంగన్+శక్యమె= చేతితో నలపటానికి వీలౌతుందా? వినాశము పొందెదరు= మీరు నశించిపోతారు; ఏమిచేయుదున్?= ఏమనగలను? ఏం చేయగలను?

**తాత్పర్యం:** 'దుర్బుద్ధి పుట్టి మీ శక్తి ఏపాటిదో తెలిసికొనక దైత్య మర్దనుడైన నారాయణుడికే హాని కల్గించటానికి నీవూ, ఈ తుంటరులూ పూనిక వహించారు. వాయువును చేతిలో ఇముడ్చటానికి వీలవుతుందా? మహా పర్వతాన్ని పెకలించటం సాధ్యమా? కార్చిచ్చును నలచివేయటానికి శక్యమవుతుందా? ఊరక నాశనమై పోతారు సుమా! మిమ్ము నే నేమి చేయగలను?

**విశేషం:** అలం: నిదర్శన.

**ఆ. అనిన విదురుఁ డిట్టులను సుయోధనుతోడ । 'బాలకేళిఁ దొడఁగి లీలఁ గృష్ణుఁ**
**డెచట నెచట నెవ్వరెవ్వరి నేమేమి । సేసె వినవె? యేల చెడియె దిట్లు?' 404**

**ప్రతిపదార్థం:** అనినన్= ధృతరాష్ట్రుడట్లా చెప్పగా; సుయోధనుతోడన్= దుర్యోధనునితో; విదురుఁడు+ఇట్టులు+అనున్= విదురు డిట్లా అన్నాడు; కృష్ణుఁడు= భగవంతుడైన శ్రీకృష్ణుడు; బాలకేళిన్+తొడఁగి= బాలక్రీడలు చేయటానికి ఆరంభించినది మొదలు; లీలన్= వినోదంగా; ఎచటన్+ఎచటన్= ఎక్కడెక్కడ; ఎవ్వరిన్+ఎవ్వరిన్= ఎవరెవరిని; ఏమి+ఏమి+చేసెన్= ఏమేమి చేశాడో; వినవె?= నీవు వినలేదా?; ఇట్లు= ఈ విధంగా; ఏల చెడియెదు(వు)?= ఎందుకు చెడిపోతావు?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు దుర్యోధనుడిని చీకొట్టిన తర్వాత విదురు డతనితో ఇట్లా అన్నాడు: శ్రీకృష్ణుడు శైశవక్రీడ లారంభించినప్పటి నుండి ఎక్కడెక్కడ, ఎవ్వరెవ్వరిని, ఏమేమి చేసిందీ నీకు తెలియదా? వృథాగా ఎందుకు నాశనమై పోతావు?

**విశేషం:** అలం: వృత్త్యనుప్రాసం.

**వ. అనియె నట్టియెడఁ గట్టెదురనున్న యక్కురుపతికుమారుం జక్కం జూచి యేనొక్కరుండన యని తలంచియె దుర్మదంబునం బొదివి పట్ట నుత్సాహంబు సేసితనుచు దరహాసంబు సేయు వాసుదేవుని ఫాలప్రదేశంబున బ్రహ్మయు, వక్షంబున విరూపాక్షుండును, వదనంబున వహ్నియుఁ, బార్శ్వంబుల నింద్ర యమ వరుణ కుబేరులు నాదిత్యమరుద్విశ్వేదేవాశ్వినులు నుద్భవించిరి హలగాండీవ మండిత బాహులగు బలదేవార్జునులు**

**సవ్య దక్షిణ భుజంబులను, నిజాయుధ హస్తులగు యుధిష్ఠిర భీమ నకుల సహదేవులు వీఁపునను. వివిధ ప్రహరణ పాణులగు యదువృష్ణి భోజాంధక వీరు లూరులను బ్రభవించిరి; జనిత నానాహస్త విన్యస్తంబులయి శంఖచక్ర గదా ఖడ్గ శక్తి శార్ఙ్గ ప్రముఖ నిఖిల సాధనంబులు వెలింగె; నేత్ర శ్రోత్ర నాసా వివరంబుల సధూమ ధూమకేతు జ్వాలా జాలంబులు నిగిడె; రోమకూప కలాపంబులం దరణి కిరణ నిభ ప్రభలు వెడలె; నిట్లు దుర్నిరీక్షంబగు నత్తేజోరూపంబుఁ గనుంగొనం గొలఁదిగాక సకల జనంబుల నయనంబులు మొగిడ్చి యద్భుత భయానక రసంబుల జొత్తిల్లు చిత్తంబుల తోడం గదలకుండ నప్పుండరీకాక్షుండు నారదాది మహా మునుల వలనను భీష్మవిదుర ద్రోణ సంజయుల యందును గరుణా తరంగితంబగు కటాక్ష వీక్షణం బొలయ వారలకు దివ్య దృష్టి యొసంగిన నా పుణ్యపురుషులు సాంద్రానందంబునం దేలుచుండి; రయ్యవసరంబున.**

**405**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని పలికినాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; కడు+ఎదురన్+ఉన్న= ఎట్ట ఎదుట ఉండిన; ఆ కురుపతికుమారున్+చక్కన్+చూచి= ఆ ధృతరాష్ట్ర పుత్రుని తేరిచూచి; ఏను= నేను; ఒక్కరుండన్+అ+అని= ఒంటరివాడనని; తలంచియె= భావించియేగదా; దుర్మదంబునన్= దురహంకారంతో; పొదివి+పట్టన్= ఆక్రమించి బంధించటానికి; ఉత్సాహంబుచేసితి(వి)= పూనిక వహించావు; అనుచున్= అని పల్కుతూ; దరహాసంబు చేయు= చిరునవ్వు నవ్వుతున్న; వాసుదేవుని ఫాలప్రదేశంబునన్= శ్రీకృష్ణుని యొక్క నొసటిభాగంలో; బ్రహ్మయున్= బ్రహ్మదేవుడూ; వక్షంబునన్= గుండెమీద; విరూప+అక్షుండును= శంకరుడును; వదనంబునన్= ముఖమునందు; వహ్నియున్= అగ్నీ; పార్శ్వంబులన్= కుడి యెడమ ప్రక్కలందు; ఇంద్ర= ఇంద్రుడూ, యమ= యముడూ; వరుణ= వరుణుడును; కుబేరులున్= కుబేరుడు అనే దిక్పాలకులున్నూ; ఆదిత్య= ఆదిత్యులు; మరుత్= మరుత్తులు; విశ్వేదేవ= విశ్వేదేవులు; ఆశ్వినులున్= ఆశ్వినులనేవారు; ఉద్భవించిరి= పుట్టారు. హల గాండీవమండిత బాహులు+అగు= నాగలి, గాండీవం అనే ఆయుధాలతో ప్రకాశించే హస్తాలుగల; బలదేవ+అర్జునులు= బలరాముడు, అర్జునుడు; సవ్యదక్షిణ భుజంబుల= ఎడమకుడిచేతులందు; నిజ+ఆయుధ హస్తులు+అగు= తమ తమ ఆయుధాలు చేతులందు కల్గిన; యుధిష్ఠిర= ధర్మజుడు; భీమనకులసహదేవులు; వీఁపునను= వీపునందును; వివిధ ప్రహరణపాణులు+అగు= రకరకాలైన ఆయుధాలు చేతులయందు ధరించిన వారైన; యదువృష్ణి భోజ+అంధక వీరులు= యదువృష్ణి భోజ అంధక వంశాలకు చెందిన శూరులు; ఊరులను= తొడలయందును; ప్రభవించిరి= పుట్టారు; జనిత నానాహస్త విన్యస్తంబులు+అయి= కలిగిన పెక్కుచేతులందు ఉంచబడినవై; శంఖచక్రగదా ఖడ్గ శక్తి శార్ఙ్గ ప్రముఖ= శంఖం చక్రం గద ఖడ్గం శక్తి శార్ఙ్గం మొదలైన; నిఖిల సాధనంబులు= సమస్తములైన ఉపకరణములు; వెలింగెన్= ప్రకాశించాయి; నారాయణుడి శంఖం పేరు పాంచజన్యం; సుదర్శనం ఆయన చక్రం; కౌమోదకి గద; ఖడ్గ నామం నందకం; చాపం పేరు శార్ఙ్గం.

నేత్ర శ్రోత్ర నాసా వివరంబులన్= కన్నులు, చెవులు, ముక్కు అనే అవయవాల యొక్క రంధ్రాల నుంచి; సధూమ= పొగతో కూడిన; ధూమకేతు= అగ్నియొక్క; జ్వాలాజాలంబులు= మంటలయొక్క గుంపులు; నిగిడెన్= వ్యాపించాయి; రోమకూప కలాపంబులన్= రోమకూపాల సమూహమునుండి; తరణి కిరణ= సూర్యకిరణాలతో; నిభ= సమానాలైన; ప్రభలు= కాంతులు; వెడలెన్= బయలుదేరాయి; ఇట్లు= ఈ మాదిరి; దుర్నిరీక్షంబు= చూడటానికి శక్యం కానిది; అగు= అయినట్టి; ఆ తేజోరూపంబున్= ఆ తేజోమయమైన స్వరూపాన్ని; కనుంగొనన్= చూడటానికి; కొలఁది+కాక= తరంకాక; సకల జనంబులు; నయనంబులు= కన్నులు; మొగిడ్చి= మూసికొని; అద్భుత భయానక రసంబులన్= ఆశ్చర్యము; భయానకం అనే రసాలతో; జొత్తిల్లు= తడిసిన; చిత్తంబుల తోడన్= మనసులచే; కదలక+ఉండన్= చలించకుండగా; ఆ+పుండరీక+అక్షుండు= ఆ కమల నయనుడు; నారద+ఆది మహామునులవలనను= నారదుడు మొదలైన మహర్షుల వైపునను; భీష్మ విదుర ద్రోణ

సంజయులందును; కరుణా తరంగితంబు+అగు= కృపారసమున పొంగి పొరలుతున్న; కటాక్ష వీక్షణంబు+ఒలయన్= కడకంటి చూపు ప్రసరించగా; వారలకున్= ఆ మహనీయులకు; దివ్యదృష్టి; ఒసంగినన్= ప్రసాదించగా; ఆ పుణ్యపురుషులు= ఆ సుకృతాత్ములు; సాంద్ర+ఆనందంబునన్= అధికమైన సంతోషము నందు; తేలుచున్+ఉండిరి= ఓలలాడుతూ ఉండిపోయారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో శ్రీకృష్ణుడు ఎట్టయెదుటనున్న దుర్యోధనుడిని తేరిపారజూచి 'నేను ఒంటరివాడననే కదా నీవు దుర్గర్వంతో నన్ను పైనబడి బంధించాలని ఉత్సాహపడుతున్నావు అంటూ ఒక చిరునవ్వు నవ్వాడు. అప్పుడు ఆ వాసుదేవుడి నుదుట బ్రహ్మదేవుడు, వక్షఃస్థలంలో రుద్రుడు, ముఖంలో అగ్ని, పార్శ్వ ప్రదేశాలలో ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు, ద్వాదశాదిత్యులు, మరుత్తులు, విశ్వేదేవతలు, ఆశ్వినులు జనించారు. నాగలి, గాండీవం చేతులందు ధరించిన బలరాముడు పార్థుడు ఎడమ కుడిచేతుల నుంచి ఉద్భవించారు. వీపునుండి తమ తమ ఆయుధాలు చేతులందు గలిగి ధర్మరాజు, భీమసేనుడు, నకులుడు, సహదేవుడు ఆవిర్భవించారు. అనేకములైన ఆయుధాలు హస్తాలలో ధరించిన యదు, వృష్ణి, భోజక, అంధక వంశాలకు చెందిన తన బంధువులైన వీరు లెందరో శౌరి తొడలనుండి ప్రభవించారు. భగవంతుడైన ఆ పరమ పురుషుడి నానాహస్తాలలో శంఖం, చక్రం, గద, ఖడ్గం, శక్తి, శార్ఙ్గం మొదలైన పలు దివ్యాయుధాలు ప్రకాశించాయి. పురుషోత్తముడి నేత్ర కర్ణ నాసికా రంధ్రాల నుండి పొగతో కూడి అగ్నిజ్వాలల సముదాయం వెలువడి వ్యాపించింది. త్రివిక్రముడి రోమ కూపాలనుండి రవికిరణాలతో సమానమైన కాంతులు వెలువడ్డాయి. ఇట్లా నేత్రాలు మిరుమిట్లు గొలిపే ఆ ముకుందుడి దివ్యతేజ స్స్వరూపం చూడటానికి శక్యం కాక సమస్త జనులు కన్నులు మూసుకొని ఆశ్చర్య భయానక రసాలలో తమ మనస్సులు మునిగి తేలుతుండగా నిశ్చేష్టులయ్యారు. అప్పుడు తెల్ల దామరలవంటి కన్నులు గల ఆ దేవదేవుడు నారదుడు మొదలైన మహర్షుల వైపూ, భీష్ముడు, విదురుడు, ద్రోణుడు, సంజయుడు అనే వారివైపూ దయతో నిండిన తన కడగంటి చూపులు ప్రసరింపజేసి వారికి తన విశ్వరూపం సందర్శించటానికి దివ్యదృష్టి ప్రసాదించాడు. ఆ పుణ్యపురుషులు నారాయణమూర్తియొక్క విశ్వరూపాన్ని తిలకిస్తూ పరిపూర్ణమైన ఆనందానుభవంలో ఓలలాడుతూ ఉన్నారు. ఆ సమయంలో.

**విశేషం:** కశ్యప ప్రజాపతికి అదితివలన కల్గినవారు ఆదిత్యులు. వీరు పన్నెండుమంది. ఇంద్రుడు, ధాత, సవితృడు, త్వష్ట, పూషుడు, అర్యముడు, భగుడు, వివస్వంతుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు.

మరుత్తులు ఏభైనాల్గుమంది.

ఇంద్రుడు దితిగర్భంలో ప్రవేశించి వజ్రాయుధంతో భ్రూణమును నలభై తొమ్మిది శకలాలు కావించాడు. పంచ ప్రాణాలు తోడుకాగా వీరు యాభై నలుగురయ్యారు.

విశ్వేదేవులు పదిమంది. ధర్మునకు దక్షపుత్రి విశ్వయందు జన్మించినవారు; క్రతువు, దక్షుడు, వసువు, సత్యుడు, కాలరాముడు, ముని, కురజుడు, మనుజుడు, వీజుడు, రోచమానుడు. హవ్య కవ్యాలలో వీరు అర్చితులు.

అశ్వినీ దేవులు ఇద్దరు.

తనరూపం చూడగోరిన అర్జునిడికి శ్రీకృష్ణ పరమాత్మ దివ్య చక్షువు లిచ్చి చూడుమంటూ చూపిన రూపంలో వీరంతా గోచరించారు.

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుతస్తథా,
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. (గీత 11-6)

**తే. దేవదుందుభి వ్రాతంబు దివిరెఁ గల్ప । వృక్ష పుష్ప ధారామయ వృష్టి గురిసె**
**సిద్ధ సాధ్య విద్యాధర శ్రేణి భక్తి । నిచ్చు జయజయ శబ్దంబు లెసఁగెఁ జదల. 406**

**ప్రతిపదార్థం:** దేవదుందుభి వ్రాతంబు= వేల్పుల భేరులయొక్క సమూహం; తివిరెన్= మ్రోగింది; కల్పవృక్ష పుష్ప ధారామయవృష్టి= కల్పతరు కుసుమాలు అనే జల్లులతో నిండిన వాన; కురిసెన్= వర్షించింది; సిద్ధ సాధ్య విద్యాధర శ్రేణి= సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు అనే దేవతాగణం; భక్తిన్= భక్తితో; ఇచ్చు= సలుపునట్టి; జయజయ శబ్దంబులు= జేజే అనే ధ్వనులు; చదలన్= ఆకాశంలో; ఎసఁగెన్= అతిశయించాయి.

**తాత్పర్యం:** దేవతలయొక్క భేరీ సమూహం మ్రోగింది. కల్పతరు కుసుమాల వానజల్లు కురిసింది. సిద్ధులు సాధ్యులు విద్యాధరులు అనే దేవతా సముదాయం భక్తితో చేసిన జయజయధ్వానాలు అంతరిక్షంలో నిండాయి.

**వ. అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు విష్ణుని దివ్యవిజృంభణంబు గావలయు నని యూహించి. 407**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ధృతరాష్ట్రుండు; ఆ+మహాసంకులంబు= సభయందు ఏర్పడిన కలకల ధ్వని; విష్ణుని దివ్య విజృంభణంబు కావలయున్+అని= వాసుదేవుడి యొక్క విశ్వవ్యాపకత్వ మగునేమో అని; ఊహించి= వితర్కించి.

**తాత్పర్యం:** అప్పుడు ఆంబికేయుడు కొలువులో ఏర్పడ్డ కలకలధ్వని విని, అది గోపాలదేవుడి యొక్క విశ్వరూప ప్రదర్శనమై ఉంటుందని భావించి.

**క. 'కరుణింపుము సంశ్రితభయ । హరణ ధురీణా! సహింపు మజ్ఞానంబున్**
**శరణంబు వేఁడెద భవ । చ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే! 408**

**ప్రతిపదార్థం:** సంశ్రిత భయహరణధురీణా!= ఆశ్రితులయొక్క భీతిని తొలగించే కార్యభారం వహించేవాడా!; కరుణింపుము= దయచూడుము; అజ్ఞానంబున్= అవివేకాన్ని; సహింపుము= మన్నించు; శరణంబు వేఁడెదన్= నిన్నే రక్షకుడిగా ప్రార్థిస్తున్నాను; భవత్+చరణంబులు= నీ పాదాలు; కనుఁగొనన్= దర్శించటానికి; ప్రసాదింపన్+కదే!= అనుగ్రహించుము.

**తాత్పర్యం:** 'వాసుదేవా! ఆశ్రితుల భయాన్ని తొలగించేవారిలో అగ్రేసరుడవు. నన్ను దయతో చూడు. నా అజ్ఞానాన్ని మన్నించు. నిన్నే శరణు వేడుతున్నాను. నీ పాదములు దర్శించే భాగ్యం అనుగ్రహించు'.

**చ. అనుడు దయార్ద్రచిత్తుఁడగు నప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టి య**
**జ్జనపతి కద్భుతం బడర సమ్మదపూరము గ్రమ్మ నాతఁడుం**
**గనుఁగొని భక్తి మ్రొక్కి 'నినుఁగంటిఁ గృతార్థుఁడనైతి; నింక నొ**
**ల్ల నొరులఁ జూడ లోచనములం బురుషోత్తమ! సంహరింపవే' 409**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని ఆంబికేయుడు వేడగా; దయా+ఆర్ద్ర చిత్తుఁడు+అగు= దయతో తడిసిన మనస్సుగల ఆ+పరమ+ఈశ్వరుఁడు= ఆ దేవ దేవుఁడు; ఆ+జనపతికిన్= ఆ నరేశ్వరుడైన ధృతరాష్ట్రుడికి; అద్భుతంబు+అడరన్=

ఆశ్చర్య మతిశయిల్లగా; దృష్టిన్+ఇచ్చెన్= చూపు ననుగ్రహించాడు; ఆతఁడున్= అంధరాజైన ధృతరాష్ట్రుడు; సమ్మదపూరము+ క్రమ్మన్= ఆనందాశ్రువులు కన్నులలో నిండగా; కనుఁగొని= స్వామి యొక్క విశ్వరూపం సందర్శించి; భక్తిన్= భక్తితో; మ్రొక్కి= నమస్కరించి; పురుషోత్తమ!= గోవిందుడా!; నినున్‌కంటిన్= నిన్ను దర్శించాను; కృతార్థుఁడన్+ఐతిన్= ధన్యుడనయ్యాను; ఇంకన్= ఇటుపై; ఒరులన్+చూడన్+ఒల్లన్= ఇతరులను చూడటానికి ఇష్టపడను; లోచనములన్= నీ విచ్చిన నేత్రాలను; సంహరింపవే= నిరోధించు!

**తాత్పర్యం:** ధృతరాష్ట్రు డట్లా వేడగా దయారసంతో తడిసిన మనస్సుగల ఆ దేవదేవుడు అంధనృపతికి ఆశ్చర్యం కలిగేటట్లు దివ్యదృష్టి ప్రసాదించాడు. దేవుడిచ్చిన చూపుతో కనులలో ఆనందబాష్పాలు క్రమ్మగా అతడు శ్రీకృష్ణుడి విశ్వరూపం వీక్షించి భక్తితో నమస్కరించి 'పురుషోత్తమా! నిన్ను చూచాను. ధన్యుడనయ్యాను. నిన్ను జూచిన కన్నులతో ఇతరులను చూడటాని కిష్టపడను. నీవిచ్చిన చూపు నీవే వెనుకకు తీసికొమ్ము!'

**క. అనిన పలుకులకు నచ్చటి । జనులెల్ల నృపాలు సితవిశాలాక్షుఁ గనుం**
**గొనుచుండి రపుడు తమనె । మ్మనమ్ము లాశ్చర్యరస నిమగ్నంబులుగాన్. 410**

**ప్రతిపదార్థం:** అనిన పలుకులకున్= అనిన ధృతరాష్ట్రుడి మాటలకు; అపుడు= ఆ సమయాన; అచ్చటి జనులు+ఎల్లన్= అక్కడున్న జనులంతా; తమ నెమ్మనమ్ములు= తమ నిండు హృదయాలు; ఆశ్చర్య రస నిమగ్నంబులు కాన్= అద్భుత రసంలో మునిగినవి కాగా; సితవిశాల+అక్షున్= తెల్లని వెడదలైన కన్నులు గల; నృపాలున్= ఆ ధృతరాష్ట్ర మహారాజును; కనుంగొనుచున్+ఉండిరి= చూస్తూ ఉన్నారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుని మాటలకు ఆ సభలో ఉన్న జనులందరూ తమ హృదయాలు అద్భుతరసంలో మునిగిపోగా విశాలమైన తెల్లని కన్నులు గల ఆ రాజును చూస్తూ ఉండిపోయారు.

**వ. తదనంతరంబ దామోదరుండు ధృతరాష్ట్రు నభిమతం బొడఁగూడ నతని కన్ను లెప్పటియట్ల కావించి, నిజ విశ్వరూప ప్రపంచంబు నుపసంహరించి, మునీంద్రుల నామంత్రణంబు సేయ నమ్మహాత్ము లంతర్ధానంబు సేసిరి; దానును సముత్థానంబు సేసి యంతకుమున్న సన్నిహితులైయున్న కృతవర్మ కరంబును, సాత్యకి హస్తంబును నవలంబించి యూరక వెడలెనని చెప్పిన. 411**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; దామోదరుండు= శ్రీకృష్ణుడు; ధృతరాష్ట్ర+అభిమతంబు= ధృతరాష్ట్రుడి యొక్క కోరిక; ఒడఁగూడన్= నెరవేరగా; అతని కన్నులు; ఎప్పటి+అట్ల+కావించి= మునుపటి వలె అంధములుగా ఉండేటట్లు చేసి; నిజ విశ్వరూప ప్రపంచంబున్= తన విశ్వవ్యాపకమైన దివ్యరూపాన్ని; ఉపసంహరించి= వెనుకకు తీసికొని; ముని+ఇంద్రులన్= నారదాది మహర్షులను; ఆమంత్రణంబు+చేయన్= పోయిరండని సెలవీయగా; ఆ+మహాత్ములు= ఆ మహానుభావులు; అంతర్ధానంబు చేసిరి= మాయమైనారు; తానును= శ్రీకృష్ణుడుకూడా; సముత్థానంబు+చేసి= పీఠంనుండి దిగి; అంతకున్+ మున్న= తాను పీఠం నుండి లేవడానికి మునుపే; సన్నిహితులు+ఐ= సముఖాన నిలిచినవారై; ఉన్న= ఉన్నట్టి; కృతవర్మ కరంబును= కృతవర్మయొక్క చేతిని; సాత్యకి హస్తంబును= సాత్యకియొక్క చేతిని; అవలంబించి= పట్టుకొని; ఊరక వెడలెన్= మౌనంగా బయలుదేరాడు; అని చెప్పినన్= అని వైశంపాయన మహర్షి చెప్పగా.

**తాత్పర్యం:** ఆ తరువాత శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడి కోరిక తీరేటట్లు ఎప్పటివలెనే అతడి కన్నులు గ్రుడ్డివిగా చేసి తన జగద్వ్యాపకమైన మహామూర్తిని ఉపసంహరించాడు. నారదాది మహర్షులకు వెళ్ళిరండని సెలవిచ్చాడు. అంతట ఆ మహనీయులు అదృశ్యమయ్యారు. అప్పుడు వాసుదేవుడు తన పీఠం నుండి దిగాడు. అప్పటికే సముఖంలో నిలిచి ఉన్న సాత్యకి కృతవర్మల హస్తము లూది నారాయణుడు మౌనంగా అక్కడినుండి బయలుదేరాడు అని వైశంపాయన మహర్షి జనమేజయుడికి చెప్పగా.

**ఆ. 'ఇవ్విధమునఁ గృష్ణుఁ డేఁగిన పిదపటి । కథ వినంగ నాకుఁ గౌతుకంబు**
**మనము నిండి గడలు కొనుచున్నయది వివ । రించి చెప్పు మునివరేణ్య' యనుడు. 412**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ రీతిగా; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఏగిన పిదపటి కథన్= వెళ్ళిన తరువాత జరిగిన కథను; వినంగన్= వినటానికి; నాకున్= నాకు; కౌతుకంబు= కుతూహలం; మనమునిండి= మనస్సునందు నిండి; కడలు కొనుచున్+ఉన్న అది= పొంగి పొరలుతూ ఉన్నది; మునివరేణ్య!= మునులలో శ్రేష్ఠుడా!; వివరించి చెప్పు= విపులంగా తెలుపుము; అనుడున్= అని జనమేజయుడు అడుగగా.

**తాత్పర్యం:** ఈ విధంగా శ్రీకృష్ణుడు సభనుండి వెళ్ళిన తరువాత జరిగిన కథ వినవలెననే కుతూహలం నా ఎదలో నిండి పొంగి పొరలుతున్నది. ఆ విషయం మునివర్యా! నాకు సవిస్తరంగా తెల్పు'మని జనమేజయ మహారాజు వైశంపాయన మహర్షిని అడిగాడు.

## ఆశ్వాసాంతము

**ఉ. భక్త మనస్ ప్రమోదకర పాదసరోజ వికాస! చేతనా**
**శక్తిమయ ప్రభావ! ముని సంస్తుత! సాత్యవతేయభారతీ**
**ప్రోక్త! నిగూఢ సంప్రకట భూమ సమాశ్రయ! వత్సలత్వ సు**
**వ్యక్త కృపాభిరామ! గుణ వర్జన! నిష్కల! నిత్యపుష్కలా! 413**

**ప్రతిపదార్థం:** భక్త మనస్ ప్రమోదకర= భక్తులయొక్క చిత్తమునకు ఆనందాన్ని కలిగించే; పాదసరోజ వికాస!= పద్మాలవంటి పాదాలయొక్క వికాసం కలవాడా!; (హరిహరనాథుని చరణ కమలధ్యానం వలన భక్తుల హృదయాలకు సంతోషం సమకూడుతుందని భావం); చేతనాశక్తిమయ ప్రభావ!= చైతన్య విశిష్టమైనశక్తి యొక్క మహిమగలవాడా! (చైతన్య విశిష్టమైన ఆయన బలం యొక్క మహిమవలననే సకలమూ ప్రవర్తిల్లుతుందనుట); ముని సంస్తుత= జ్ఞానులచేత కొనియాడబడేవాడా; సాత్యవతేయ భారతీ ప్రోక్త!= సత్యవతీ పుత్రుడైన వేదవ్యాస మునీంద్రుడియొక్క వాఙ్మయంచేత చక్కగా చెప్పబడినవాడా! (వ్యాసమహర్షి రచించిన సారస్వతమంతా భగవత్ప్రశస్తిని తెలియజెప్పుతుందనుట); నిగూఢసంప్రకట భూమసమాశ్రయ!= అవ్యక్తం. వ్యక్తం అయినట్టి కారణ కార్యమైన బృహద్రూపాన్ని ఆశ్రయించినవాడా!; వత్సలత్వ+సువ్యక్త+కృపా+అభిరామ!= వాత్సల్య గుణముచేత చక్కగా తెలియబడునట్టి కృపచేత ఇంపైనవాడా!; గుణవర్జన!= ప్రాకృతికములైన హేయగుణాలు లేనివాడా! (హేయ ప్రత్యనీకములైన కారుణ్య వాత్సల్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్య కామ సత్య సంకల్ప కృతిత్వ కృతజ్ఞతాదులైన అసంఖ్యేయ కళ్యాణ గుణాలకు ఆటపట్టుగా భగవంతుడిని పెద్దలు వినుతించారు); నిష్కల!= అంశం లేనివాడా! ((ప్రాణము,

శ్రద్ధ ఈ మొదలైనవి షోడశకళలు, సాధారణ పురుషుడు ఈ పదారు కళలు కలవాడు; భగవంతుడట్టివాడు కాడు; ఆయన నిష్కళుడు); నిత్యపుష్కలా!= ఎల్లప్పుడు పూర్ణుడవై ఉండేవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! నీ చరణకమల వికాసం భక్తుల మనస్సులకు సంతోషం చేకూరుస్తుంది. చైతన్య విశిష్టమైన శక్తి సామర్థ్యా లున్నవాడవు నీవు. నిన్ను యోగీశ్వరులు వినుతిస్తారు. వ్యాస రచితమైన వాఙ్మయం నిన్ను గూర్చి తెలుపుతుంది. కారణ కార్యరూపంలో వ్యక్తావ్యక్తంగా ఉన్న పరబ్రహ్మ స్వరూపుడవు నీవు. శరణాగతులందు ప్రకటితమైన వాత్సల్యాన్ని బట్టి నీ కారుణ్య మెంతటిదో బాగా స్పష్టమవుతున్నది. నీవు హేయగుణ రహితుడవు. కళ్యాణ గుణ పరిపూర్ణుడవు. షోడశకళలు గల సాధారణ పురుషుడి వలెగాక నిష్కలుడవై, పురుషోత్తముడవై ఉన్నావు. వృద్ధి క్షయాలు లేక నీవు నిత్యపూర్ణుడవై విలసిల్లుతున్నావు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అవ్యయ నిర్మల విభవా! । దివ్య ప్రభవా! సుఖైక దీప్తానుభవా!**
**నవ్యత్వనిత్య! యతిసం । సేవ్యసుసాంగత్య! లోక జీవన కృత్యా!** 414

**ప్రతిపదార్థం:** అవ్యయ= నాశరహితమైన? నిర్మల= మాలిన్యంలేని; విభవా!= వైభవం కలవాడా! (విభవ శబ్దానికి నిర్వృతి అనే అర్థం ఉండుటచే (భగవంతుడు శాశ్వతనిర్మల మోక్ష స్వరూపుడు) దివ్య ప్రభవా!= అప్రాకృతమగు పుట్టుక గలవాడా! (భగవంతుడి జన్మకర్మలు దివ్యములు; ప్రాకృతములు కావు); సుఖ+ఏకదీప్త+అనుభవా!= ఆనందంచేతనే ముఖ్యంగా ప్రకాశించే అనుభవం కలవాడా! (భగవంతుడి అనుభవం కేవలానందమే); నవ్యత్వ నిత్య!= నూతనత్వం చేత ఎడతెగని వాడా! (దేవుడు శాశ్వతమైన నవ్యత్వం గలవాడు); యతి సంసేవ్య సుసాంగత్య!= యోగులచేత మిక్కిలి అనుభవించదగిన భేదరహిత భావం కలవాడా!; లోక జీవన కృత్యా!= జగములను పోషించడమే కార్యంగా కలవాడా! (నిఖిల భువన జన్మస్థేమ భంగములు ఆయన కృత్యములే అయిననూ జీవులకు బ్రతుకుతెరువు కల్పించటమే ఆయన ముఖ్యమైన కృత్యం.)

**తాత్పర్యం:** హరిహరనాథా! నాశరహితమూ, దోషరహితమూ అయిన మోక్షస్వరూపం కలవాడివి నీవు. నీ పుట్టుక సాధారణ జీవుల పుట్టుక వంటిదిగాదు. అది దివ్యమైనది. కేవల సుఖరూపమైన ఆనందంతో నీవు ప్రకాశిస్తుంటావు. నీవు నిత్యనూతనుడివి. అభేద భావంతో పరమయోగులచేత అనుభవించబడుతుంటావు. లోకాలను పరిపోషించటమే నీ ప్రధాన కృత్యం.

**విశేషం:** అంత్యానుప్రాసం.

**మాలిని.**

**రవిశశి మయనేత్రా! ప్రస్ఫురత్కాంతి హృద్యా!**
**నవ జరఠ వికార న్యాస లీలానవద్యా!**
**వివృత నిగమ శాఖా విశ్రుతాగ్రైక వేద్యా!**
**వివిధ నియత చర్యా విత్త చిత్త ప్రసాద్యా!** 415

**ప్రతిపదార్థం:** రవిశశిమయ నేత్రా!= సూర్య చంద్ర రూపాలైన కన్నులు కలవాడా!; (విరాట్ విగ్రహుడైన పరమేశ్వరుడికి 'చక్షుషీ చంద్ర సూర్యౌ' నేత్రాలు చంద్ర సూర్యులు అని శ్రుతులు చెపుతున్నాయి.) ప్రస్ఫురత్ కాంతి హృద్యా!= మిక్కిలి ప్రకాశించే తేజస్సుచేత మనోహరమైనవాడా! (గగనతలంలో ఒకేసారి వేయి మంది సూర్యు లుదయిస్తే ఆ కాంతి ఆ మహాత్ముడి కాంతికి సమానం కావచ్చు అని గీత చెపుతుంది.)

**దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా,**
**యది భాస్సదృశీ సా స్యా ద్భాసస్తస్య మహాత్మనః**

నవజరఠ వికార న్యాస లీలా+అనవద్యా= బాల్యం వార్ధకం అనే భావవికారాలు ఉంచటం అనే విలాసంచే దోషరహితమైనవాడా! (పుట్టుట, ఉండుట, మారుట, పెరుగుట, కృశించుట, నశించుట అనేవి ఆరువిధాలైన భావవికారాలు. అవి లేనివాడు భగవంతుడు. కాని తనయందునూ, జగమునందునూ వాటిని ఆరోపించటం ఆయనకు లీల); వివృత నిగమశాఖా= వివరించబడిన వేదశాఖలయందలి; విశ్రుత+అగ్ర+ఏక+వేద్యా!= ప్రసిద్ధమైన కొనలచే ముఖ్యంగా తెలియబడేవాడా( వ్యాఖ్యానించబడ్డ వేదశాఖల యొక్క అగ్రభాగములు ఉపనిషత్తులు, వాటిచేతనే భగవంతుడిని తెలుసుకోవచ్చు. ఋగ్యజుస్సామాథర్వణములని వేదాలు నాలుగు. ఆ చతుర్వేదములు 1131 శాఖలుగా విభజించబడినాయి. వాటి అగ్రభాగాలే ఉపనిషత్తులు. బ్రహ్మసూత్రములకు, గీతకు, ఉపనిషత్తులకు పెద్దలు వ్యాఖ్యానాలు రచించారు. వాటివలన భగవత్తత్త్వం తెలియవీలవుతుంది.) వివిధ నియతచర్యా= పలు తెరగులైన యమనియమాది చర్యల వలన; విత్త= పొందబడిన; చిత్తప్రసాద్యా!= మనస్సుచేత ప్రసన్నుడిగా చేయదగినవాడా! (యమనియమాదులైన చర్యలచేత మనస్సు స్వాధీనం కాగా అట్టి మనస్సునందే భగవంతుడు గోచరిస్తాడు.)

**తాత్పర్యం:** హరిహరనాథా! నీ కన్నులు సూర్యచంద్రరూపాలు. దీపిస్తున్న నీ తేజస్సు మనసులకు ఇంపుగొలుపుతుంది. బాల్య యౌవన కౌమార వార్ధక్యాదులు లేనివాడవైనా వాటిని నీ యందూ, జగమునందూ ఆరోపించటం నీ కొకలీల. వివిధాలైన వేదశిరస్సులచేతనే తెలియదగినవాడవు నీవు. యమనియమాదులచేత స్వస్థమైన మనస్సునకే నీవు గోచరిస్తావు.

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం.

మాలినీ వృత్తంలోని ప్రతిచరణంలోనూ న-న-మ-య-య- అనే గణాలుంటాయి. 9వ అక్షరం యతిస్థానం. ప్రాసనియమం ఉన్నది.

**గద్యము.**

**ఇది శ్రీమ దుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబున నుద్యోగ పర్వంబునందుఁ దృతీయాశ్వాసము.**

**తాత్పర్యం:** శ్రీమంతులైన సంస్కృతాంధ్ర కవీశ్వరులకు హితుడును, కొమ్మన మంత్రికి కుమారుడును, పండితులను పూజించటంచేత ప్రకాశించేవాడును అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శుభకరమైన మహాభారతంలోని ఉద్యోగపర్వంలో మూడవ ఆశ్వాసం ముగిసింది.

**ఉద్యోగపర్వంలో తృతీయాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము - చతుర్థాశ్వాసము

**శ్రీ మత్తులసీ పల్లవ । దామచ్ఛవిలబ్ధ మరకత ప్రతిమత్వో**
**ద్దామ ప్రభాస్థిమాలా । శ్యామాయిత విపులవక్ష హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీమత్= శోభాయుక్తమైన; తులసీపల్లవదామ= తులసి చిగుళ్లమాలిక యొక్క; ఛవి= కాంతిచేత; లబ్ధ= పొందబడిన; మరకత ప్రతిమత్వ= గరుడపచ్చల మణులతోడి పోలికతో; ఉద్దామ ప్రభా= అధికమైన కాంతిగల్గిన; అస్థిమాలా= పునుకలదండచేత; శ్యామాయిత= నీలంగా చేయబడిన; విపులవక్ష!= విశాలమైన రొమ్ము కలవాడా!; హరిహరనాథా!= హరిహరనాథుడనే పేరుగల దేవా!

**తాత్పర్యం:** హరిహరనాథా! శోభావంతమైన తులసి చిగుళ్ల మాలికయొక్క నల్లని కాంతిపొత్తుచేత తెల్లని పునుకదండ గరుడపచ్చల సామ్యం పొందినదై తన విశేషమైన దీప్తిచేత నీ వెడల్పయిన ఎడమరొమ్మును నీలంగా చేస్తున్నది స్వామీ!

**విశేషం:** నారాయణుడు నల్లని రంగు కలవాడు. అతడు తులసీదళదాముడు, శంభుడు తెల్లటి మేనివాడు. పునుకదండను తాల్చేవాడు. తులసి నల్లటిది. పునుక తెల్లటిది. హరిహరనాథుడి దక్షిణార్థ శరీరం వైష్ణవం. వామార్ధభాగం శైవం. ఒకే మూర్తి కనుక ఒకే వక్షఃస్థలం. ఆ వక్షఃస్థలం యొక్క కుడిభాగంలో నల్లని తులసీమాల, ఎడమ భాగమందు తెల్లని అస్థిమాల ప్రకాశిస్తున్నాయి. కాని, స్ఫటికంవలె తెల్లని పునుకదండ తులసిమాలయొక్క సంసర్గంతో గరుడపచ్చల కాంతి సామ్యం పొంది తెల్లని ఆయన రొమ్మును నల్లగ మారుస్తున్నది.

### శ్రీకృష్ణుండు కుంతియింటికిం జని యాయమతో మాటలాడుట (సం. 5-129-20)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియెఁ గృష్ణుం డత్తెఱంగున వెడలిన విస్మితయై గాంధారి యభ్యంతర మందిరంబున కరుగం గౌరవులెల్లను బంధుమిత్ర సహాయ సహితంబుగాఁ దనతోడన వెడల, మొగంబు గంటు వెట్టికొని కక్ష్యాంతరంబులు గడచినప్పుడు దారుకుండు తేరినొగలపై నుండి పొడసూపి కేలు మొగిడ్చి ఫాలభాగంబునం గదియించినం, దత్ప్రదేశంబున నిలిచి, వారలదెస మరలిచూచి 'మీ రింక నిలువుం' డని పలికిన నాంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి.** 2

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా! అవధరించు; వైశంపాయనుండు; జనమేజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; కృష్ణుండు, ఆ+తెఱంగునన్= ఆ విధంగా; వెడలినన్= సభనుండి మౌనంగా లేచి వెళ్ళగానే; విస్మిత+ఐ= ఆశ్చర్యం పొందినదై; గాంధారి; అభ్యంతరమందిరంబునకున్+అరుగన్= లోపలి నగరుకు వెళ్ళగా; కౌరవులు+ఎల్లను; బంధుమిత్ర

సహాయ సహితంబుగాన్= బంధువులతో, మిత్రులతో, తోడ్పడేవారితో కూడ; తనతోడన్+అ= తన వెంబడినే; వెడలన్= బయలుదేరగా; మొగంబు గంటుపెట్టికొని= ముఖం చిన్నపుచ్చుకొని; కక్ష్యా+అంతరంబులు= తొట్టికట్లు; కడచిన+అప్పుడు= దాటినప్పుడు; దారుకుండు= కృష్ణసారథి; తేరి నొగలపైన్+ఉండి= రథంయొక్క నొగలమీదినుంచి; పొడచూపి= కన్పించి; కేలుమొగిడ్చి= చేతులు జోడించి; ఫాలభాగంబునన్= నెన్నుదురు ప్రాంతంలో; కదియించినన్= చేర్చగా; తద్+ప్రదేశంబునన్+ నిలిచి= శ్రీకృష్ణుడు ఆ తావులో ఆగి; వారలదెసన్ మరలిచూచి= తన వెంటవస్తున్న వారివైపునకు తిరిగి చూచి; మీరు+ఇంకన్, నిలువుండు+అని; పల్కినన్= గోవిందుడు చెప్పగా; అంబికేయుండు= ధృతరాష్ట్రుడు; పుండరీక+అక్షున్+చేరి= శ్రీకృష్ణుడిని సమీపించి; నిజతనూజులన్= తన కుమారులను; ఉపలక్షించి= ఉద్దేశించి.

**తాత్పర్యం:** స్వామీ హరిహరనాథా! అవధరించుము: వైశంపాయన మహర్షి జనమేజయ మహారాజుతో ఇట్లా అన్నాడు: వాసుదేవుడు ఆ విధంగా సభనుంచి నిష్క్రమించగానే ఆశ్చర్యపడి గాంధారీదేవి లోపలినగరుకు వెళ్లిపోయింది. కౌరవులందరూ బంధుమిత్ర సహాయులతో కూడి తనను వెంబడించగా శ్రీ కృష్ణుడు ముఖం చిన్నపుచ్చుకొని కక్ష్యాంతరాలు దాటాడు. అక్కడ రథసారథి అయిన దారుకుడు తేరినొగలపైనుండి మోడ్చినచేతులు నిటల ప్రదేశంలో చేర్చి తనను కనిపించుకొన్నాడు. దేవకీనందనుడు అక్కడ ఆగాడు. వెంటవస్తున్న వారివైపు తిరిగి 'మీ రిక నిలవండి' అని పలికాడు. పిదప ధృతరాష్ట్రుడు శ్రీహరి చెంతకు చేరి తన కొడుకులను ఉద్దేశించి (ఇట్లా అన్నాడు).

**ఉ. 'వీరును బాండుపుత్త్రులును వేరము దక్కి పొసంగి మన్కికై**
**పోరితమాడి యే నటులు బుద్ధులు సెప్పిన భంగియుం, గులా**
**చారము నిర్వహింపఁ బలుచందములం దగ దుఃఖపాటు నీ**
**కౌరవజాతికిం దెలిసెఁ గాదె గదాధర! నీదు సన్నిధిన్.' 3**

**ప్రతిపదార్థం:** గదాధర!= కౌమోదకి అనే గదను ధరించే శ్రీకృష్ణా!; వీరును= నా కుమారులున్నూ; పాండు పుత్త్రులును= పాండవులున్నూ; వేరము+తక్కి= విరోధం విడిచి; పొసంగి మన్కికై= అనుకూలంగా ఉండటానికై; ఏన్= నేను; పోరితము+ఆడి= జగడమాడి; అటులు= ఆ ప్రకారంగా; బుద్ధులు+చెప్పిన భంగియున్= నీతులు బోధించిన తీరున్నూ; కుల+ఆచారమున్+ నిర్వహింపన్= వంశధర్మం నిలపటానికి; పలుచందములన్= పెక్కువిధాల; తగన్= మిక్కిలి; దుఃఖపాటున్= దుఃఖంపొందటమున్నూ; నీదు సన్నిధిన్= నీ సమక్షంలో; ఈ కౌరవజాతికిన్= ఈ కౌరవులకు; తెలిసెన్+కాదె!= విదితమైనది కదా!

**తాత్పర్యం:** 'కృష్ణా! కౌరవులున్నూ పాండవులున్నూ విరోధం వీడి ఒద్దికగా జీవించటానికై జగడమాడి నే నెన్ని రీతుల బుద్ధులు చెప్పానో, వంశ ధర్మం నిలుపుటకై ఎన్నివిధాల శ్రమపడ్డానో నేడు నీ సముఖంలో కౌరవజాతికి వెల్లడి అయింది గదా!'

**వ. అని వెండియు. 4**

**తాత్పర్యం:** అని, మళ్ళీ ఇట్లా అన్నాడు:

**తే. 'నీకు శుద్ధుండ నగుటయ నిఖిలబంధు । మిత్ర గురుజన కోటికి ధాత్రి కెల్ల**
**నంబుజాక్ష! నిర్దోషుండ నగుట; గాన । నా తెఱంగు నీ వెఱుఁగుట నాకుఁ జాలు. 5**

**ప్రతిపదార్థం:** అంబుజ+అక్ష!= కమలనేత్రుడా!; నీకున్= నీకు; శుద్ధుండన్+అగుట+అ= కల్మషం లేనివాడనగుటయే; నిఖిలబంధుమిత్ర గురుజనకోటికిన్= ఎల్ల చుట్టాలు, స్నేహితులు, గురుజన సమూహానికీ; ధాత్రికిన్+ఎల్లన్= లోకమున కంతటికిన్నీ; నిర్దోషుండన్+అగుట= దోషరహితుడనగుట; కానన్= కనుక; నా తెఱంగు= నాతత్త్వం; నీవు+ఎఱుఁగుట= నీకు తెలియటం; నాకున్+చాలు= నాకు చాలు.

**తాత్పర్యం:** 'కృష్ణా! నేను పరిశుద్ధుడనని నీవు గుర్తిస్తే సమస్తబంధువులు, మిత్రులు, గురుజనాలు, లోకమూ నన్ను నిర్దోషినని గుర్తించినట్లే. కాబట్టి నా చంద మెట్లాంటిదో నీవు తెలిసికొనుటయే నాకు ముఖ్యం.'

**వ. అనిన విని యచ్యుతుండు బాహ్లిక భీష్మ ద్రోణ కృప ప్రముఖ నిఖిల విశిష్టజనంబుల నాలోకించి. 6**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; బాహ్లిక భీష్మ ద్రోణ కృప ప్రముఖ= శంతనుమహారాజు తమ్ముడైన బాహ్లికుడు, భీష్ముడు, ద్రోణాచార్యులు, కృపాచార్యులు మొదలైన; నిఖిల విశిష్టజనంబులన్= సకల సదాచారసంపన్నులైన (ముఖ్యులైన)వారిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి మాటలు విని గోవిందుడు బాహ్లిక భీష్మ ద్రోణ కృపాదులైన సదాచార సంపన్నులను (ప్రముఖులను) చూచి.

**తే. 'ఇప్పు డీ సభఁ బుట్టిన యింతవట్టు । మీకుఁ దెల్లంబు గాదె! యీ మేదినీ వి**
**భుండు దా నేమిటికిని ముఖ్యుఁడఁ గాను । దప్పు దనదెస లేదని చెప్పి విడిచె. 7**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు= ఈ వేళ; ఈ సభన్= ఈ కొలువులో; పుట్టిన+ఇంతవట్టు= జరిగిన సంగతి అంతా; మీకున్= మీకు; తెల్లంబు+కాదె!= స్పష్టమైనదికదా!; ఈ మేదినీ విభుండు= ఈ ధృతరాష్ట్ర మహారాజు; తాను= తాను; ఏమిటికిని= ఏ విషయానికీ; ముఖ్యుండన్ కాను= ప్రధానుడినికాను; తప్పు= దోషం; తనదెసన్= తనయెడ; లేదు+అని= లేదని; చెప్పివిడిచెన్= చెప్పివేశాడు.

**తాత్పర్యం:** 'ఇప్పు డీ సభలో జరిగిన సంగతి అంతా మీకు స్పష్టమే కదా! ఈ ధృతరాష్ట్ర మహారాజు తాను దేనికిన్నీ ప్రధానుడనుకాననీ, తనయెడ తప్పులు లేవనీ చెప్పివేశాడు.

**వ. కావున నాకు నియ్యెడం దడయం బనిలేదు; పోయివచ్చెద; ధర్మపుత్త్రునకు నింత వృత్తాంత బెఱింగింపవలయు' నని పలికి వారల నామంత్రణంబు సేసినవాఁడై రథారోహణంబు సేసి ధృతరాష్ట్రుండును నచటి జనంబులును వెనుకం జనఁ జని కుంతీగృహద్వారంబున నరదంబు డిగ్గి. 8**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; నాకున్, ఈ+ఎడన్= ఇచ్చట; తడయన్+పనిలేదు= ఆలసించవలసిన అక్కరలేదు; పోయివచ్చెదన్; ధర్మపుత్త్రునకున్, ఇంతవృత్తాంతంబు= ఈ జరిగిన సంగతి అంతా; ఎఱింగింపన్+వలయున్; అని, పలికి; వారలన్= ఆ బాహ్లికాదులను; ఆమంత్రణంబు+చేసినవాఁడు+ఐ= అక్కడ ఆగుటకు సెలవిచ్చినవాడై; రథ+ఆరోహణంబు చేసి= రథమెక్కి; ధృతరాష్ట్రుండును; అచటిజనంబులును; వెనుకన్+చనన్= తన రథం వెనుక వస్తుండగా; చని= వెళ్ళి; కుంతీగృహద్వారంబునన్= కుంతీదేవి యింటివాకిలి దగ్గర; అరదంబు= రథం; డిగ్గి= దిగి.

**తాత్పర్యం:** కనుక నా కిచ్చుట ఆగవలసిన అవసరం లేదు, వెళ్ళివస్తాను. ఇక్కడ జరిగిన సంగతి అంతా ధర్మరాజునకు చెప్పాలి' అంటూ నారాయణమూర్తి అక్కడున్నవారిని నిలవం డని సెలవిచ్చి రథమెక్కాడు. ధృతరాష్ట్రుడు, మిగిలినవారు సగౌరవంగా సాగనంపటానికి వెనుక వస్తుండగా శౌరి కుంతీదేవి వాకిట రథం దిగాడు.

**క. వారందఱుఁ దనతోడన । గారవమున నరుగుదేరఁగాఁ జొచ్చి మహో**
**దారుఁడు కుంతీ చరణాం । భోరుహముల కెఱఁగి వినయభూషణుఁ డగుచున్. 9**

**ప్రతిపదార్థం:** వారు+అందఱున్= ధృతరాష్ట్రుడు మొదలైనవారెల్లరూ; తనతోడన్+అ= తన వెంబడినే; గారవమునన్= ఆదరంతో; అరుగుదేరగాన్= రాగా; చొచ్చి= కుంతీదేవి ఇంటిలో ప్రవేశించి; మహా+ఉదారుఁడు= మిక్కిలి దొడ్డవాడైన శ్రీకృష్ణుడు; వినయభూషణుఁడు+అగుచున్= వినయగుణమే ఆభరణంగా కలిగినవాడై; కుంతీచరణము+అంభోరుహములకున్+ ఎఱఁగి= పద్మాలవంటి కుంతీదేవి పాదాలకు నమస్కరించి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు మొదలైనవారందరూ గౌరవంతో తన వెంబడి రాగా, మిక్కిలి దొడ్డవాడైన కేశవుడు వినయగుణాన్వితుడై కుంతి గృహంలోనికి ప్రవేశించి ఆమె పాదపద్మాలకు నమస్కరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కౌరవసభఁ దా నాడిన । గౌరవవాక్యములుఁ గార్యఖడ్గక్రమ వా**
**క్పూరములు సుయోధను దు । ష్ప్రారంభము నల్పవచన పద్ధతిఁ జెప్పెన్. 10**

**ప్రతిపదార్థం:** కౌరవసభన్= ధృతరాష్ట్రుడి కొలువులో; తాన్= తాను; ఆడిన= పల్కిన; గౌరవ వాక్యములున్= ఆదరంతో కూడిన పలుకులున్నూ; కార్యఖడ్గ క్రమ వాక్పూరములున్= కార్యవాదిగా, ఖడ్గవాదిగా పలికిన పలుకుల సమూహాలునూ; సుయోధను= దుర్యోధనుడియొక్క; దుష్ప్రారంభమున్= తనను బంధించే దుష్ట ప్రయత్నమున్నూ; అల్పవచన పద్ధతిన్+ చెప్పెన్= తక్కువ మాటలతోనే తెలిపాడు.

**తాత్పర్యం:** కురుసభలో ఆదరంతో తాను పల్కిన పల్కులున్నూ, కార్యవాదిగా, ఖడ్గవాదిగా చెప్పిన మాటలున్నూ, దుర్యోధనుడి దుష్టప్రయత్నమున్నూ సంక్షిప్తంగా ఆమెకు తెలిపాడు.

**వ. ఇట్లు ధృతరాష్ట్రు కొలువునం బుట్టిన విశేషంబుల పాండురాజమహిషి కెఱింగించి మాధవుండు మఱియును. 11**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ధృతరాష్ట్రు కొలువునన్; పుట్టిన విశేషంబులు= జనించిన వింతలు; పాండురాజు మహిషికిన్= పాండురాజు యొక్క పట్టపురాణి అయిన కుంతికి; ఎఱింగించి; మాధవుండు= లక్ష్మీకాంతుడైన శ్రీకృష్ణుడు; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** ఇట్లా శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుడి కొలువుకూటంలో కలిగిన వింతలు పాండురాజు పట్టపురాణి కుంతీదేవికి తెలిపి మళ్ళీ (ఇట్లా అన్నాడు:)

**తే. 'కురుకుమారులు తమయంతఁ గుడిచి క్రొవ్వి । మీఁ దెఱుంగరు; మాకేమి? మేల కాక;**
**నాలుకలు గ్రోయు నర్జునానలము దగిన । యెర గొనం గని సంతృప్తి యెసక మెసఁగు. 12**

**ప్రతిపదార్థం:** కురుకుమారులు= కౌరవులు; తమ అంతన్= తమకు తామే; కుడిచి= రాజభోగాలు అనుభవించి; క్రొవ్వి= పొగరెక్కి; మీఁదు+ఎఱుంగరు= రానున్నదేమిటో తెలియకున్నారు; మేలు+అ కాక= మంచిదే అవుతుంది. మాకున్+ఏమి= మాకు మరేమి నష్టంలేదు; నాలుకలు క్రోయు= జిహ్వాలు చాస్తున్న; అర్జున+అనలము= అర్జునుడనే అగ్ని; తగిన ఎర+కొనన్= తగిన ఆహారం గైకొనగా; కని= చూచి; సంతృప్తి= సంతోషం; ఎసకము+ఎసఁగున్= అతిశయిస్తుంది.

**తాత్పర్యం:** 'కౌరవులు తమపాటికి తాము హాయిగా రాజ్యభోగా లనుభవిస్తూ పొగరుపట్టి రానున్నది తెలియకున్నారు. మాకది మంచిదే. మంటలు వెలిగ్రక్కుతున్న అర్జునుడనే అగ్ని తనకు తగిన ఆహారం లభించినందుకు ఎంతో సంతృప్తి వహిస్తుంది.

**విశేషం:** అలం: రూపకం.

**వ.** **పాండుకుమారులపాలికిం బోయి వచ్చెద; వారికిం దగిన బుద్ధు లానతి'మ్మనిన నద్దేవి విక్రమోపజీవులయిన ముచుకుందుండును సృంజయుండును నను తొంటినరపతుల చరిత్రంబులు సెప్పి, 'యుధిష్ఠిరుండు వీరిని వినండొ కాక'యని పలికి యెల్లవారును వినుచుండ వెండియు నిట్లనియె.** **13**

**ప్రతిపదార్థం:** పాండుకుమారుల పాలికిన్= పాండవుల దగ్గరకు; పోయి వచ్చెదన్; వారికిన్; తగిన బుద్ధులు; ఆనతి+ఇమ్ము= సెలవిమ్ము; అనినన్, ఆ+దేవి; విక్రమ+ఉపజీవులు= పరాక్రమాన్ని అనుసరించి బ్రతికినవారు అయిన ముచుకుందుండును, సృంజయుండునున్; అను= అనునట్టి; తొంటినరపతుల చరిత్రంబులు= పూర్వపురాజుల కథలు; చెప్పి, యుధిష్ఠిరుండు; వీరిని వినండొ కాక= వీరిని గూర్చి వినలేదా ఏమి?; అని పలికి; ఎల్లవారును; వినుచుండన్; వెండియున్= మరల; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** నేను పాండునందనుల దగ్గరకు వెళ్ళివస్తాను. వారికి చెప్పవలసిన మాటలు సెలవిమ్ము!' అని శ్రీకృష్ణు డడిగినాడు. అపుడు కుంతీదేవి పరాక్రమం నమ్ముకొని జీవించిన ముచుకుందుడు, సృంజయుడు అనే పూర్వపు రాజుల కథలు చెప్పి, 'ధర్మజుడు వీరిని గురించి విని ఉన్నాడో, లేదో' అని పలికి, అక్కడి వారంతా ఆలకిస్తుండగా మళ్ళీ ఇట్లా అన్నది:

**విశేషం:** ముచుకుందుడు - భారత ప్రతులన్నిటిలోను ఈ పదం ఇట్లే ఉన్నది. పూర్వగాథాలహరిలో మాత్రం ముచికుందుడని కలదు. ఇరువురు నొక్కరే అయియుంటారు.

ఇతడొకసారి అలకాపట్టణముపై దండెత్తెను. త్రోవలోనే కుబేరుని భటులు ఈతని సైన్యముపైబడి కొట్టారు. అప్పుడితడు తన పురోహితుని ప్రార్థించాడు. పురోహితుడు తాను చేసిన తపస్సు, మంత్రములు, పూజలు మొదలగువాని వలన వాని సైన్యానికి తిరిగి బలం కలిగించాడు. పిమ్మట ఈతడు కుబేరుడి మీదికి యుద్ధమునకు పోగా, బ్రాహ్మణ క్షాత్ర బలములేకమై ఉండటం వలన నీతో నేను పోరలేనని చెప్పి తప్పుకొన్నాడు. (భార.)

ముచికుందుడు ఒక రాజు. మాంధాత కుమారుడు. ఇతడు దేవాసురులకు యుద్ధమైనప్పుడు దేవతలకు సహాయం చేశాడు. దేవతలు వరం కోరుకో అన్నారు. ఇతడు మిక్కిలి డస్సి ఉండటం చేత, నిద్రపోతూ, ఎవరైనా తనకు నిద్రాభంగం చేస్తే, వారిని ఇతడు చూడగానే, వారు భస్మం కావాలని వరం కోరుకొంటాడు. ఇతడు ఒక గుహలో నిద్రపోతుండగా, కాల

యవనుడు ఆ గుహలోనికే వచ్చి, ఇతనిని చూచి కృష్ణుడని భ్రమించి తన్నాడు. ముచికుందుడు లేచి వానిని చూడగానే వాడు భస్మమయ్యాడు.

సృంజయుడు : ఒక రాజు. ఇతని కడకు పర్వతనారదులు రాఁగా, వారి పరిచర్యకు ఇతడు తన కూతురైన మదయంతిని నియోగించాడు. నారదుడామెను వలచుటచే, రాజామెను నారదుని కిచ్చి పెండ్లి చేశాడు.

సృంజయుడు మూత్ర పురీషములు కూడా బంగారమగునట్టి కుమారుడిని పొందగోరి బ్రాహ్మణులను పూజించి, తన కోరికను నారదుడితో చెప్పాడు. నారదుడి అనుగ్రహం వలన అతని కట్టి కొడుకు పుట్టాడు. అతనిపేరు సువర్ణష్ఠీవి. క్రూరులు కొందరు అతని లోపల బంగారం ఉంటుందని భ్రమించి వానిని చంపి చీల్చారు. సృంజయుఁడు మిక్కిలి దుఃఖించి నారదుడిని తలచుకోగా, నారదుడు వచ్చి, అతని పుత్త్రుణ్ణి బ్రతికించాడు. సృంజయుడు భార్యాపుత్త్రులతో భాగీరథీతీరంలో వనవిహారం చేస్తుండగా, ఇంద్రుడు సువర్ణష్ఠీవి బలానికి భయపడి శార్దూల రూపంలో చంపవలసిందిగా తన వజ్రాన్ని ఆదేశించాడు. వజ్రం వాడిని చంపింది. రాజు కోరికపై నారదుడు మళ్ళీ వానిని బ్రతికించాడు. (సంపా.)

**ఉ. 'రాజుల కెందు నారయఁ బరాక్రమజీవన వృత్తి దక్క నొం**
**డోజ నిషిద్ధ మంద్రు మును; లుత్తమసత్త్వులు వంశధర్మముల్**
**పూజిత భంగిఁ జేయుదురు; బుద్ధివిహీనులు వానిఁ దక్కి ని**
**స్తేజపుఁ గూటి కియ్యకొని దీనతఁ బొందుదు రంబుజోదరా! 14**

**ప్రతిపదార్థం:** అంబుజ+ఉదరా!= పద్మనాభా!; ఆరయన్= పరికించగా; రాజులకున్= నరపతులకు; ఎందున్= ఎచ్చటకూడ; పరాక్రమ జీవనవృత్తి+తక్కన్= శౌర్యంతో జీవించే నడవడిక తప్ప; ఒండు+ఓజ= మరోపద్ధతి; నిషిద్ధము= కూడదని; మునులు+అంద్రు= జ్ఞానులు చెపుతారు; ఉత్తమసత్త్వులు= శ్రేష్ఠ బలసంపన్నులు; వంశధర్మముల్= కులాచారాలు; పూజిత భంగిన్= గౌరవపద్ధతిలో; చేయుదురు= ఆచరిస్తారు; బుద్ధివిహీనులు= తెలివిమాలినవారు; వానిన్+తక్కి= తమ కులధర్మాలను అనుసరించక; నిస్తేజము+కూటికిన్= పౌరుషహీనమైన తిండికి; ఇయ్యకొని= సమ్మతించి; దీనతన్+పొందుదురు= దైన్యాన్ని పొందుతారు.

**తాత్పర్యం:** 'గోవిందా! రాజులు పరాక్రమంతో జీవించవలెనేకాని, మరో మార్గం వారికి తగదని జ్ఞానులు చెపుతారు. బలసంపన్నులు తమ కులధర్మాలను గౌరవబుద్ధితో అనుష్ఠిస్తారు. తెలివిమాలినవారు వంశాచారం వదలిపెట్టి పౌరుషహీనమైన తిండికి సమ్మతించి దేబెలై మనుగడ సాగిస్తారు.

**క. నీ వియ్యంబులు సంధియ । కావింపంబడిరి; వీరిఁ గలయుట కష్టం;**
**బా వెరవు దప్పుటయ మే । లై వచ్చెం బొమ్ము; విడువు మనుమానంబున్. 15**

**ప్రతిపదార్థం:** నీ వియ్యంబులు= నీ మరదులైన నా కొమారులు; సంధి+అ= సంధినే; కావింపన్= చేయుటకు; పడిరి= శ్రమ చెందారు; వీరిన్= ఈ కౌరవులను, కలయుట= చేరుట; కష్టంబు= నా బిడ్డలకు కష్టం; ఆ వెరవు= ఆ సంధిమార్గం; తప్పుట+అ= తొలగిపోవటమే; మేలు+ఐ; వచ్చెన్ పొమ్ము= మంచికే వచ్చింది సుమా!; అనుమానంబున్= ఈ విషయంలో సందేహం; విడువుము= వదలిపెట్టుము.

**తాత్పర్యం:** కృష్ణా! నీ మరదులు సంధికొరకు సకలవిధాల శ్రమపడ్డారు. కాని, కౌరవులతో కలసిమెలసి మనుగడసాగించటం కష్టం. ఇపుడు సంధి తప్పిపోవడం కూడ మంచికే జరిగింది. నీవు ఈ విషయంలో శంకించవద్దు.

**మ. నిజవంశోచిత వీరవృత్తమున కున్మేషంబుగా నా కపి**
**ధ్వజుఁ డుత్సాహము సేయకున్న నకటా! దైన్యంబు వాటిల్లదే?**
**భుజదర్పోద్ధతుఁడైన భీమునకు నీ పొం దొప్పునే? నీవు స**
**ర్వజగన్మాన్యుఁడ వెందు రాఁదగునె? దైవం బిట్లు దప్పించునే!' 16**

**ప్రతిపదార్థం:** నిజవంశ+ఉచిత= తమ క్షత్రియ కులానికి (కురువంశానికి) తగిన; వీరవృత్తమునకున్= పరాక్రమపు నడవడికి; ఉన్మేషంబుగాన్= వికాసంగా; ఆ కపిధ్వజుఁడు= హనుమంతుడు టెక్కెమందు కలిగిన ఫల్గునుడు; ఉత్సాహము+చేయక+ ఉన్నన్= ఉద్యమించకుంటే; అకటా!= అయ్యో!; దైన్యంబు+పాటిల్లదే?= చులుకదన మేర్పడదా?; భుజదర్ప+ఉద్ధతుఁడు+ఐన= బాహుబలంచే గర్వితుడైన; భీమునకున్= భీమసేనుడికి; ఈ పొందు= ఈ సంధి; ఒప్పునే?= తగి ఉంటుందా?; నీవు= నీవు; సర్వజగత్+మాన్యుఁడవు= సకల లోకాలచేత - గౌరవించదగినవాడవు; ఇందున్= ఈ కురుసభకు; రాన్+తగునె?= రావచ్చునా?; దైవంబు= భగవంతుడు; ఇట్లు తప్పించునే!= ఈ విధంగా పొత్తు కుదరకుండ చేశాడు గదా!

**తాత్పర్యం:** మధుసూదనా! క్షత్రియ జాతికి (కురువంశానికి) తగినది వీరవృత్తి. దానికి వన్నెగా కపికేతనుడైన పార్థుడు రణోత్సాహం చూపకుంటే నలుగురిలో పలుచనైపోడా? భుజబల గర్వితుడైన భీమసేనుడికి ఈ సంధి తగినదేనా? సకల లోకపూజ్యుడవైన నీవు ఈ పనికై ఇక్కడికి రావచ్చునా? దేవుడు మేలు చేయగా సంధి భగ్నమైనది.

**వ. అని యంత నిలువక గొంతి యిట్లనియె: 17**

**ప్రతిపదార్థం:** అని; అంతన్ నిలువక= అంతటితో ఆగక; గొంతి= కుంతీదేవి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నది.

**తాత్పర్యం:** ఈ మాటలతో ఆగక కుంతీదేవి మరల ఇట్లా అన్నది:

**క. 'మఱచిరె కొలువున ద్రౌపదిఁ । బఱచిన బన్నంబు? ధర్మపథము దొఱంగన్**
**వెఱచుట కప్పటి కది దగుఁ; । జెఱచినచో వెదక వలదె చిరతర కీర్తిన్?' 18**

**ప్రతిపదార్థం:** కొలువునన్= సభలో; ద్రౌపదిన్= పాంచాలిని; పఱచిన బన్నంబున్= అవమానపరచటాన్ని; మఱచిరె?= (నా కుమారులు) మరచిపోయారా?; ధర్మపథంబున్= న్యాయ మార్గాన్ని; తొఱంగన్= విడవటానికి; వెఱచుట= భయపడటం; అప్పటికిన్+అది+తగున్= ఆ సమయానికి అది యుక్తంగానే ఉండింది; చెఱచినచోన్= ధర్మాన్ని నాశనం చేస్తే; చిరతరకీర్తిన్= శాశ్వతమైన యశస్సును; వెదకన్+వలదె?= అన్వేషించవద్దా?

**తాత్పర్యం:** 'కౌరవులు నిండుసభలో పాంచాలిని అవమానించటం నా కుమారులు మరచిపోయారా? న్యాయమార్గాన్ని వీడటానికి జంకి వా రప్పుడు అట్లా అడవులకు వెళ్ళటం యుక్తమేకాని, న్యాయంగా తమకు రావలసిన అర్ధరాజ్యం ఇవ్వక తామే హరింపదలచి కౌరవులు ధర్మవినాశనానికి పూనుకొన్నప్పుడు తాము శాశ్వతకీర్తిని సంపాదించటానికి యత్నంచేయవద్దా?'

శ్రీకృష్ణుఁడు కర్ణునిఁ దన రథం బెక్కించుకొని కొన్ని రహస్యోక్తులు పలుకుట (సం. 5-138-1)

**వ. అని పలికి పుండరీకాక్షుం గౌఁగిలించుకొని, యచ్యుతుండు మ్రొక్కిన దీవించి, 'యేను సుఖంబున్న దాన'నని పాండవులకుం జెప్పుము; చేతుల లావునం గనిన జీవనంబున బ్రదుకుం డనుము; పోయిర'మ్మని వీడుకొల్పిన సింహగమనసుందరంబుగా వెడలి, తన తోడన కదలివచ్చిన ధృతరాష్ట్రాదుల నిలువంబనిచి, రథారోహణంబు సేసి గోవిందుండు కర్ణుదెసం గనుంగొని, 'న న్ననిచి వత్తుగానిర'మ్మని కరంబు సాఁచి చెయివట్టి తన యరదం బెక్కించికొని, సాత్యకి వేసరి నెక్కి కెలనం జనుదేరం గదలిచని, యనుపవచ్చిన కృతవర్మ నుచిత ప్రకారంబున సస్నేహంబుగా నిలిపి యరుగు నవసరంబునఁ బౌరలోకంబు. 19**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని కుంతీదేవి వచించి; పుండరీక+అక్షున్= శ్రీకృష్ణుడిని; కౌఁగిలించుకొని; అచ్యుతుండు- శ్రీకృష్ణుడు; మ్రొక్కినన్= తనకు నమస్కరించగా; దీవించి; ఏను= నేను; సుఖంబు+ఉన్నదానన్= సుఖంగా ఉన్నాను; అని, పాండవులకున్; చెప్పుము; చేతులలావునన్= భుజబలంతో; కనిన= పడసిన; జీవనంబునన్= బ్రదుకుతో; బ్రదుకుండు+అనుము= జీవించండి అని చెప్పుము; పోయిరమ్ము= వెళ్లిరమ్ము; అని; వీడుకొల్పినన్= సెలవిచ్చి పంపగా; సింహగమన సుందరంబుగాన్= సింహంయొక్క నడకవలె అందమైన నడకతో; వెడలి= బయలుదేరి; తన తోడన్+అ= తన వెంబడినే; కదలివచ్చిన; ధృతరాష్ట్ర+ఆదులన్= ధృతరాష్ట్రుడు మొదలైనవారిని; నిలువన్+పనిచి= ఆగండి అని చెప్పి; రథ+ఆరోహణంబు చేసి= రథము నెక్కి; గోవిందుండు; కర్ణుదెసన్= రాధేయుడివైపు; కనుంగొని; నన్నున్+అనిచివత్తు+కాని= నన్ను సాగనంపి వత్తువులే; రమ్ము+అని; కరంబు+చాఁచి; చెయి+పట్టి= అతడి హస్తం పట్టుకొని; తన+అరదంబు; ఎక్కించికొని; సాత్యకి; వేసరిన్+ఎక్కి= కంచరగాడిద (అశ్వతరము) నెక్కి; కెలనన్= ప్రక్కను; చనుదేరన్= రాగా; కదలిచని= బయలుదేరివెళ్ళి; అనుపన్ వచ్చిన= తనను సాగనంపటానికి వచ్చిన; కృతవర్మన్; ఉచిత ప్రకారంబునన్= తగు విధంగా; సస్నేహంబుగాన్= ప్రేమయుక్తంగా; నిలిపి= ఆపి; అరుగు+అవసరంబునన్= వెళ్ళే సమయంలో; పౌరలోకంబు= పురజనులు.

**తాత్పర్యం:** కుంతీదేవి అట్లా పలికి శ్రీకృష్ణుడిని కౌగిలించుకొన్నది. గోవిందుడు తనకు మ్రొక్కగా దీవించి, 'నేను సుఖంగా ఉన్నానని నా కుమారులకు చెప్పుము. భుజ విక్రమంతో సంపాదించిన బ్రదుకు తెరువుతో బ్రదకండని చెప్పుము. పుండరీకాక్ష! పోయిరమ్ము' అని వీడ్కొల్పింది.

శౌరి సింహగమనంవలె సుందరమైన నడకతో కదలి తనతో కదలివస్తున్న ధృతరాష్ట్రుడు మొదలైనవారిని నిలవండని పలికి, తాను రథమెక్కాడు. కర్ణుడివైపు చూచి 'నన్ను సాగనంపివద్దువుగాని రావయ్యా!' అని చెయిసాచి అతడి చేయిపట్టి రథంమీద ఎక్కించుకొన్నాడు.

సాత్యకి ప్రక్కన అశ్వతరము నెక్కి వస్తుండగా శ్రీకృష్ణుడు ముందుకు సాగాడు. తనను సాగనంపటానికి వచ్చిన కృతవర్మను తగిన విధంగా స్నేహయుక్తంగా నిలిపి నారాయణుడు వెళ్ళుతున్నప్పుడు పట్టణ ప్రజలు. (ఇట్లా అన్నారు:)

**ఉ. 'అక్కట! వాసుదేవు పను పాదరణంబునఁ జేయరైరి; వీ
రెక్కడి బుద్ధిమంతు? లని నిందును నందును లోకమెల్లఁ బే
రుక్కున మ్రగ్గుటం దలఁప నొల్ల కపాయము సేసి రట్టె! యీ
యుక్కివు లెందునుం గలరె? యొప్పరు వో ధృతరాష్ట్ర నందనుల్.' 20**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; వాసుదేవు పనుపు= కృష్ణుడి ఆజ్ఞ; ఆదరణంబునన్= గౌరవంతో; చేయరు+ఐరి= చేసినవారు కారు; వీరు= ఈ కౌరవులు; ఎక్కడి బుద్ధిమంతులు?= ఏమి బుద్ధిమంతులండీ?; అనిన్= యుద్ధంలో; ఇందునున్= ఈ కౌరవుల పక్షంలోనూ; అందును= ఆ పాండవుల పక్షంలోనూ; లోకము+ఎల్లన్= జనులందరూ; పేరు+ ఉక్కునన్= మిక్కిలి శౌర్యంతో పోరి; మ్రగ్గుటన్= నశించిపోవటం; తలఁపన్+ఒల్లక= ఆలోచించటానికి ఇష్టపడక; అపాయము చేసిరి+అట్టె!= హాని చేశారు గదా!; ఈ+ఉక్కివులు= ఇంత కఠినులు; ఎందునున్+కలరె?= ఎక్కడైనా ఉన్నారా?; ధృతరాష్ట్రనందనుల్= ధృతరాష్ట్రుడి కుమారులు; ఒప్పరు+పో!= ఓర్వలేరు.

**తాత్పర్యం:** 'అయ్యో! వాసుదేవుడి ఆదేశం ఆదరంతో స్వీకరించని వీరు ఏపాటి బుద్ధిమంతులు? సంగ్రామంలో ఇరుపక్షాలలోని జనులంతా శౌర్యంతో పోరి కూలుతారని భావించక ఇంతటి జనహానికి పూనుకొన్నారు. ఇట్లాంటి కపటులు ఎక్కడైనా ఉన్నారా? ధృతరాష్ట్రుడి కుమారులు ఓర్వలేని వారు సుమా!

**వ.** **అని మఱియు ననేకు లనేక ప్రకారంబులం బలుకుచు నిరుగెలంకులం జూచుచుండఁ బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె; నట ధృతరాష్ట్రుండును మగిడి కొలువు కూటంబునకు వచ్చి యెప్పటివారలు పరివేష్టింప నుండి కృష్ణుని వలని మాటలాడుచున్న సమయంబున సుయోధనునితో భీష్మద్రోణు లిట్లనిరి.** **21**

**ప్రతిపదార్థం:** అని, మఱియున్; అనేకులు= పలువురు; అనేక ప్రకారంబులన్= పెక్కురీతుల; పలుకుచున్; ఇరు+కెలంకులన్= రెండుప్రక్కల; చూచుచున్+ఉండన్; పుండరీక+అక్షుండు= శ్రీకృష్ణుడు; పురంబు నిర్గమించెన్= హస్తినాపురినుండి వెలువడ్డాడు; అట; ధృతరాష్ట్రుండును; మగిడి= మరలి; కొలువు కూటంబునకున్+వచ్చి; ఎప్పటివారలు= మునుపటివారు; పరివేష్టింపన్= చుట్టుకొని ఉండగా; ఉండి; కృష్ణుని వలని మాటలు= కృష్ణుని గురించిన మాటలు; ఆడుచున్+ఉన్న= పలుకుతున్న; సమయంబునన్; సుయోధనుతోన్; భీష్మద్రోణులు; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** ఇట్లా పలువిధాల పలుకుతూ మార్గానికి రెండు వైపులా నిలిచి జనులు చూస్తూండగా నారాయణుడు పట్టణం నుండి వెలువడ్డాడు. తరువాత ధృతరాష్ట్రుడు తిరిగి కొలువు కూటానికి వచ్చి ఎప్పటివారలు చుట్టూచేరి ఉండగా కృష్ణుడిని గురించి మాటాడుతున్న సమయంలో దుర్యోధనుడితో ద్రోణభీష్ము లిట్లా అన్నారు:

**చ.** **'పలుకునె యిట్లు గొంతి? విని బమ్మెరపోయితి; మింత బెట్టిదం**
**బు లగునె మాట? లయ్యమయుఁ బుణ్యుఁడుఁ గృష్ణుఁడు గార్యవాదముల్**
**వలికెడు వార లిట్లు దెగఁబాఱిరి; ధర్మజవారిరాశికిం**
**జెలియలికట్ట వాసె; మనచే నగు కర్జముచంద మెట్టిదో?'** **22**

**ప్రతిపదార్థం:** గొంతి= కుంతీదేవి; ఇట్లు పలుకునె?= ఇట్లా మాట్లాడుతుందా?; విని= ఆమె మాటలు విని; బమ్మెరపోయితిమి= దిగ్భ్రాంతిచెందాము; మాటలు= ఆమె పలుకులు; ఇంత బెట్టిదంబులు+అగునె?= ఇంత కఠినంగా ఉంటాయా?; ఆ+అమయున్= ఆ తల్లియును; పుణ్యుఁడున్= ధర్మాత్ముడైన; కృష్ణుఁడున్= వాసుదేవుడును; కార్యవాదముల్ పలికెడువారలు= పనికి అనుకూలించే మాటలు చెప్పునట్టివారు; ఇట్లు= నేఁడీ విధంగా; తెగన్+పాఱిరి= సాహసించారు; ధర్మజ వారిరాశికిన్= ధర్మరాజు అనే సాగరానికి; చెలియలికట్ట+పాసెన్= గట్టులేకుండా పోయింది; మనచేన్+అగు= మన వలన అయ్యే; కర్జము చందము= కార్య విధం; ఎట్టిదో!= ఎటువంటిదో!

**తాత్పర్యం:** 'కుంతీదేవి ఇట్లా మాట్లాడుతుందని ఊహించలేదు. ఆమె పలుకులకు దిగ్భ్రమ కలిగింది. ఆమె వాక్కులు ఎంతో కఠోరంగా ఉన్నాయి. ఆమెయూ, ధర్మస్వరూపుడైన శ్రీకృష్ణుడున్నూ పని అనుకూలపడేటట్లు పలుకనేర్చినవారు. ఈనా డిట్లా వారు సాహసోక్తు లాడారు. ధర్మజుడనే సముద్రానికి చెలియలికట్ట లేకుండా పోయింది. ఈ విషయంలో మనం చేయగలిందేమిటో తోచటంలేదు.'

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని పలికి వెండియు. 23**

**తాత్పర్యం:** భీష్ముడు ద్రోణుడు మళ్ళీ దుర్యోధనుడితో (ఇట్లా అన్నారు:)

**శా. 'మాకుం జూడఁగఁబోలు కార్య మిది: ధర్మప్రీతి నీ వేఁగి సు**
**శ్లోకుండైన యుధిష్ఠిరుం గని జనస్తుత్యంబుగా శాంతిమై**
**నీ కౌరవ్యులనెల్లఁ గాచికొనవే యే పొప్ప దెందుం; దుదిన్**
**శోకం బొందక వేగమ్మైఁ గదలి కృష్ణుంగూడఁబోవే నృపా!' 24**

**ప్రతిపదార్థం:** నృపా!= దుర్యోధనా!; మాకున్= మాకు; చూడఁగన్= ఆలోచించగా; పోలు= తగిన; కార్యము+ఇది= పని యిది; ధర్మప్రీతిన్= ధర్మమందలి ఆసక్తితో; నీవు+ఏఁగి= నీవువెళ్ళి; సుశ్లోకుండు+ఐన= ఉత్తమకీర్తిశాలి అయిన; యుధిష్ఠిరున్+కని= ధర్మరాజును దర్శించి; జనస్తుత్యంబుగాన్= జనులు మెచ్చుకొనేటట్లు; శాంతిమైన్= శాంతితో; ఈ కౌరవ్యులన్+ఎల్లన్= ఈ కురువంశంలో పుట్టిన వారినందరినీ; కాచికొనవే= రక్షించుకొనుము; ఎందున్= ఎక్కడను; ఏపు+ఒప్పదు= గర్వం చెల్లదు; తుదిన్= కడపటికి; శోకంబు+ఒందక= దుఃఖం పాలుగాక; వేగమైన్= శీఘ్రంగా; కదలి= బయలుదేరి; కృష్ణున్+కూడన్+పోవే= శ్రీకృష్ణుడిని చేరబొమ్ము.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! ఆలోచింపగా మాకు తోచిన కర్తవ్యం ఇది. నీవు ధర్మాసక్తితో వెళ్ళి సత్కీర్తిశాలి అయిన ధర్మజుడిని దర్శించి, జనులు మెచ్చేటట్లు శాంతితో ఈ కురుకులమంతటినీ సంరక్షించుకొమ్ము. ఇక ఔద్ధత్యం ఏ మాత్రం కూడదు. కడకు దుఃఖం పాలు కాకుండ వేగిరమే కదలిపోయి శ్రీకృష్ణుడిని కలిసికొమ్ము!'

**వ. అనిన విని దుర్యోధనుండు మొగంబు రాఁజుచుండ నూరకుండె; గాంగేయుండును గురుండును దిగ్గనలేచి యతని నవలోకించి. 25**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; దుర్యోధనుండు; మొగంబు= ముఖం; రాఁజుచున్+ఉండన్= మండుతూ ఉండగా; ఊరక+ఉండెన్; గాంగేయుండును= భీష్ముడూ; గురుండును= ద్రోణుడూ; దిగ్గన లేచి= తటాలున లేచి; అతనిన్; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** భీష్మద్రోణులమాటలకు దుర్యోధనుడు మొగం కోపంతో మండుతూ ఉండగా సమాధానం చెప్పకుండా ఉన్నాడు. అప్పుడు వారిద్దరూ తమ పీఠాలనుంచి తటాలున లేచి సుయోధనుడివైపు చూచి.

**క. 'కురునృప! విను సంసారము । దరిద్రొక్కినవార; మింకఁ దలఁకెదమే? సం**
**గరమునకు నేము నీకై । పొరలితి; మెట్లైన నగును బోయెద' మనుచున్. 26**

**ప్రతిపదార్థం:** కురునృప!= సుయోధనా!; విను= మేము చెప్పేది వినుము; సంసారముదరి+త్రొక్కినవారము= జీవితం యొక్క చివరి ఒడ్డు చేరినవాళ్ళం; ఏము= మేము; ఇంకన్= మరి; సంగరమునకున్= యుద్ధానికి; తలఁకెదమే?= జంకుతామా?; నీకై పొరలితిమి= నీ మేలుగోరి ఎన్నో విధాల చెప్పిచూచాం; ఎట్లు+ఐనన్+అగును= విధి నిర్ణయమెట్లాఉందో అట్లే జరుగుతుంది; పోయెదము= మేము వెళ్ళి వస్తాం; అనుచున్= అని పలుకుతూ.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! మా మాటలు వినుము. మేము సంసారపు ఆవలి తీరం చేరినవాళ్ళం. ఇట్లాంటి మేము పోరాటానికి భయపడతామా? నీ మేలు గోరి ఎన్నో రీతుల చెప్పిచూచాం. విధి నిర్ణయమెట్లా ఉంటే అట్లాగే ఔతుంది. ఇక మేము వెళ్ళి వస్తాం' అని పలుకుతూ.

**క. అరిగిరి, రాజును నభ్యం । తరమునకుం జనియె, రాజతనయుండు బహిః**
**పరివారముఁ బొమ్మని మిత । పరిజనుఁడై యేఁగె నాత్మభవనంబునకున్. 27**

**ప్రతిపదార్థం:** అరిగిరి= భీష్మద్రోణులు వెళ్ళారు; రాజును= ధృతరాష్ట్రుడున్నూ; అభ్యంతరమునకున్+చనియెన్= లోపలి గృహంలోనికి వెళ్ళిపోయాడు. రాజతనయుండు= సుయోధనుడు; బహిఃపరివారమున్= వెలుపల ఉన్న బలగాన్ని; పొమ్ము+అని= వెళ్ళుమని చెప్పి; మితపరిజనుఁడు+ఐ= కొద్ది పరివారం కలవాడై; ఆత్మభవనంబునకున్= తన మందిరానికి; ఏఁగెన్= పోయాడు.

**తాత్పర్యం:** భీష్మద్రోణులు వెళ్ళగానే ధృతరాష్ట్రుడు అభ్యంతర గృహానికి వెళ్లిపోయాడు. రాజకుమారుడైన సుయోధనుడు వెలుపలనున్న సేవకులను వెళ్ళండని చెప్పి మితమైన పరివారంతో తానూ తన భవనానికి వెళ్ళిపోయాడు.

**తే. అంత నక్కడ నచ్యుతుఁ డరిగి యరిగి । యధిక సంప్రీతి దలకొన నర్కతనయు**
**నాననంబు వీక్షించి యిట్లనియె నెమ్మి । నన్యు లెవ్వరు వినకుండ నతనితోడ. 28**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; అక్కడన్= అచ్చట; అచ్యుతుఁడు= శ్రీకృష్ణుడు; అరిగి అరిగి= వెళ్ళి వెళ్ళి; అధిక సంప్రీతి= మిక్కుటమైన ప్రేమ; తలకొనన్= కలుగగా; అర్కతనయు+ఆననంబు= కర్ణుడి యొక్క ముఖం; వీక్షించి= చూచి; నెమ్మిన్= కూర్మితో; అన్యులు+ఎవ్వరున్= ఇతరులెవ్వరున్నూ; వినకుండన్= వినకుండా; అతనితోడన్= కర్ణుడితో; ఇట్లు+ అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అట్లా వెళ్ళివెళ్ళి మిక్కిలి ప్రేమతో సూర్యుడి కుమారుడైన కర్ణుడి వదనం తిలకించి, ఇతరులెవ్వరున్నూ వినకుండ అతడితో ఇట్లా అన్నాడు:

**సీ. 'నీవు వృద్ధజనోపసేవివి, ధర్మసం । వేదివి, తెలియంగ వినుము; సిద్ధ**
**మంత్రబలంబున మార్తాండు వరమునఁ । గన్నియ తఱి గొంతి గన్నవాఁడ**
**వగుటఁ బాండునృపాలు నగ్రసుతుండవు; । ధర్మమార్గం బిది; ధర్మతనయుఁ**
**డాదిగాఁ గల తమ్ములందఱు నా చేత । నెఱిఁగి నీ యడుగుల కెఱఁగి సకల**

**ఆ. పుత్త్ర మిత్త్ర బంధు భూరిసేనా సమ । న్వితముగాఁగఁ గొలిచి నిన్ను రాజ్య**
**భారవహనమునకుఁ బట్టంబుగట్ట ను । జ్జ్వలుఁడ వగుదు; రమ్ము వారికడకు. 29**

**ప్రతిపదార్థం:** నీవు; వృద్ధజన+ఉపసేవివి= పెద్దలను సేవించినవాడివి; ధర్మసంవేదివి= ధర్మమును చక్కగా ఎరిగినవాడివి; తెలియంగన్+వినుము= స్పష్టమయ్యేటట్లు వినుము; సిద్ధమంత్రబలంబునన్= సిద్ధించిన(దివ్యమైన) ఒక మంత్రశక్తిచేత; మార్తాండువరమునన్= సూర్యుడి వరముచేత; కన్నియతఱిన్= తాను కన్యగా ఉన్నప్పుడే; గొంతి= కుంతీదేవి; కన్నవాఁడవు= కనినట్టివాడివి; అగుటన్= అయినందువలన; పాండునృపాలు= పాండు రాజుయొక్క; అగ్రసుతుండవు= పెద్దకుమారుడవు; ఇది ధర్మమార్గంబు= ఇది ధర్మసమ్మతం; ధర్మతనయుఁడు+ఆదిగాన్+కల= ధర్మజుడు మొదలుగా కలిగిన; తమ్ములు+ అందఱున్; నాచేతన్+ఎఱిఁగి= నీవు తమకు అన్నవన్న వార్త నేను తెల్పగా విని; నీ+అడుగులకున్+ఎఱఁగి= నీ పాదాలకు నమస్కరించి; సకల= సమస్తమైన; పుత్త్రమిత్త్ర బంధు భూరిసేనా సమన్వితము+కాఁగన్= కుమారులు, స్నేహితులు, చుట్టాలు, గొప్పసేనలు అన్నింటితోకూడా; కొలిచి= భజించి; నిన్నున్= నిన్ను; రాజ్యభారవహనమునకున్= రాజ్యభారం వహించటానికి; పట్టంబు+కట్టన్= అభిషేకించగా; ఉజ్జ్వలుఁడవు+అగుదు(వు)= మిక్కిలి ప్రకాశించగలవు; వారి కడకున్= పాండవుల దగ్గరకు; రమ్ము= అరుగుదెంచుము.

**తాత్పర్యం:** 'కర్ణా! నీవు పెద్దలను సేవించినవాడివి. ధర్మం బాగుగా తెలిసినవాడివి. నే చెప్పేది చక్కగా వినుము, కన్యకగా ఉన్నప్పుడు కుంతీదేవి దివ్యమైన మంత్రమహిమచేత మార్తాండుడి వరంవలన నిన్ను కన్నది. అందుచేత నీవు పాండురాజుకు పెద్దకుమారుడవు. ఇది ధర్మసమ్మతం. ధర్మజుడు, ఆతడి తమ్ములు నీవు తమకు అన్నవని నాచేత తెలిసికొని నీ పాదాలకు నమస్కరించి, పుత్రమిత్ర బంధుసేనాసహితంగా కొలిచి రాజ్యభారం వహించటానికి నీకు పట్టం కట్టుతారు. ఆ రీతిగా నీవు రాజ్యపదవిలో ప్రకాశించగలవు. కనుక నాతో కలసి వారి దగ్గరకు రమ్ము.

**వ. ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుంజేయుదు; నీవు దొలుత వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజైయుధిష్ఠిరుండు నీ రథంబున నుండి నీకు ధవళచామరంబులు వైచు; వాయుపుత్త్రుండు సితచ్ఛత్రంబు వట్టు; సవ్యసాచి సారథ్యంబుచేయు; మఱియుఁ బాంచాల యాదవ పాండ్యమాత్స్యులు లోనుగాఁగల రాజలోకంబుతోడఁ గవలు నభిమన్యు ప్రభృతి కుమారులు బెరయ నే మెల్లం బలసి పరివేష్టించి వత్తు; మిట్టి మహేంద్ర విభవంబున మహనీయుండ వగుచు మహీచక్రం బేలు' మని మఱియును. 30**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నిన్నున్; సామ్రాజ్యంబునకున్+అభిషిక్తున్+చేయుదున్= పాండవరాజ్యపదానికి అభిషిక్తుడిని చేస్తాను; నీవు; తొలుతన్= మొదట; వెడలునప్పటి మహోత్సవంబునకున్= ఊరేగటానికి బయలుదేరునట్టి గొప్పసంబరంలో; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; యువరాజై; నీ రథంబునన్+ఉండి= నీ తేరిలో నిలిచి; నీకున్; ధవళచామరంబులు వైచున్= వింజామరలతో విసరగలడు; వాయుపుత్రుండు= భీమసేనుడు; సిత+ఛత్రంబు= తెల్లని గొడుగు; పట్టున్= పట్టుకొనగలడు; సవ్యసాచి= అర్జునుడు; సారథ్యంబు చేయున్= నీ రథం నడుపగలడు; మఱియున్= ఇంకను; పాంచాల, యాదవ, పాండ్య, మాత్స్యులు= ద్రుపదుడు, యాదవప్రభువులు, పాండ్యరాజు, విరాటుడు; లోనుగాన్+కల= మున్నుగా కలిగిన; రాజలోకంబుతోడన్= రాజుల సమూహంతో; కవలు= అమడలైన నకులసహదేవులు; అభిమన్యు ప్రభృతికుమారులు= అభిమన్యుడు మొదలైన కుమార వర్గం; బెరయన్= కూడగా, నిండగా; ఏము+ఎల్లన్= మేమందరమూ; బలసి పరివేష్టించి వత్తుము= గుమిగా నిన్ను చుట్టుకొని వస్తాము; ఇట్టి మహా+ఇంద్రవిభవంబునన్= ఈ విధమైన దేవేంద్రవైభవంతో; మహనీయుండవు+అగుచున్= గొప్పవాడ వవుతూ; మహీచక్రంబు+ఏలుము= భూమండలం పరిపాలించుము; అని; మఱియును.

**తాత్పర్యం:** కర్ణా! నిన్ను పాండవసామ్రాజ్యానికి అభిషిక్తుడిని చేస్తాను. నీవు అభిషిక్తుడవై రథమెక్కి నగరంలో ఊరేగునప్పటి మహోత్సవంలో యువరాజై ధర్మజుడు నీకు వింజామరలు వీస్తాడు. భీమసేనుడు తెల్లగొడుగు

పట్టుతాడు. అర్జునుడు రథసారథ్యం వహిస్తాడు. పాంచాల యాదవ పాండ్య మాత్స్య మహీపతులు మొదలైన రాజులందరితో నకుల సహదేవులు, అభిమన్యుడు మొదలైన కుమార వర్గం చేరగా మేమందరమూ గుంపుగా నిన్ను పరివేష్టించి వస్తాము. ఇట్లా, దేవేంద్ర వైభవంతో మహనీయుడవై మహీమండలాన్ని పరిపాలించుము' అని పలికి మళ్ళీ ఇట్లా అన్నాడు:

**క. 'పాంచాల రాజపుత్త్రియు । నంచితముగ నిన్నుఁ బొందు నాఱవ వరుసన్;**
**సంచితపుణ్యుఁడ వీ వొక । యించుకయును వేఱుసేయ కేతె మ్మెలమిన్. 31**

**ప్రతిపదార్థం:** పాంచాల రాజపుత్రియున్= పాంచాలరాజు కూతురైన ద్రౌపదియు; అంచితముగన్= ఒప్పిదంగా; నిన్నున్= నిన్ను; ఆఱవ వరుసన్= ఐదుమందితోపాటు ఆరవవాడిగా; పొందున్= పతిగా పడయగలదు; సంచితపుణ్యుఁడవు= సముపార్జించిన సుకృతము గల; ఈవు= నీవు; ఒక+ఇంచుకయును= కొంచెంకూడా; వేఱుచేయక= భేదభావంలేక; ఎలమిన్= సంతోషంతో; ఏతెమ్ము= పాండవులను చేరుము.

**తాత్పర్యం:** 'కర్ణా! ద్రౌపది ఐదుమందితోపాటు నిన్ను ఆరవభర్తగా ఆప్యాయంతో స్వీకరిస్తుంది. సుకృతాత్ముడవైన నీవు రవంతేని భేదభావంలేక సంతోషంతో పాండవులను కలిసికొనటానికి రమ్ము.

**విశేషం:** 'అంచితముగ నిన్నుఁబొందు నాఱవ వరుసన్' - అనే వాక్యానికి మూలం: షష్ఠే చ త్వాం తథాకాలే ద్రౌపద్యుపగమిష్యతి' ఆరవస్థానమందు నిన్ను ఆవిధంగా ద్రౌపది పొందగలదు.

**వ. ఇట్లైనఁ గుంతికి సమస్త బంధుమిత్త్రులకుఁ బ్రియంబగు' ననిన విని రహస్యంబుగా రాధేయుండు మాధవున కిట్లనియె: 32**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఐనన్= ఇట్లా నీవు పాండవులతో చేరితే; కుంతికిన్= కుంతీదేవికీ; సమస్త బంధుమిత్రులకున్= బంధువులూ మిత్రులూ అందరికీ; ప్రియంబు+అగును= సంతోషం కలుగుతుంది; అనినన్; విని; రహస్యంబుగాన్= గుట్టుగా; రాధేయుండు= రాధాపుత్రుడైన కర్ణుడు; మాధవునకున్= లక్ష్మీవల్లభుడైన కృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** కర్ణా! నీవు పాండవులతో చేరితే, కుంతికిన్నీ, తక్కిన సకల బంధువులకూ, స్నేహితులకూ సంతోషం కలుగుతుంది' అని శ్రీకృష్ణు డనగా విని రాధేయుడు నారాయణుడితో ఇట్లా అన్నాడు:

**కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగిన యుత్తరంబు లిచ్చుట (సం. 5-139-1)**

**చ. 'వెడవెడ యేనుఁ దొల్లి యిది వింటి' ననుం గని కుంతి నిర్దయన్**
**జెడ నదివైచిపోయెఁ; గృపఁజేకొని సూతుఁడు దెచ్చి తాను మున్**
**గొడుకులఁ గానకున్కిఁ బ్రియకుం దగనిచ్చినఁ జేపెఁ జన్నుఁ; ల**
**ప్పడఁతియు నప్పుడాదిగ శుభస్థితిఁ బెంచెఁ బ్రయత్నశీలయై. 33**

**ప్రతిపదార్థం:** వెడవెడ= కొంచెం కొంచెం; ఏనున్= నేను కూడ; ఇది= నీవు చెప్పిన విషయమునే; తొల్లి= మునుపు; వింటిన్= విన్నాను; కుంతి= కుంతీదేవి; ననున్+కని= నన్ను ప్రసవించి; నిర్దయన్= దయమాలినదై; చెడన్= నాశమయ్యేటట్లు; నదిన్=

నదిలో; వైచి= పారవేసి; పోయెన్= ఇంటికి వెళ్ళింది; సూతుఁడు= అధిరథుడు; కృపన్+చేకొని= దయతో నన్ను గ్రహించి; తెచ్చి= తన ఇంటికి తీసికొనివచ్చి; తాను= తాను; మున్= నన్ను కొనిరావటానికి మునుపు; కొడుకులన్+కానక+ఉన్కిన్= కుమారులను పడయకుండటంచేత; ప్రియకున్= తన భార్య అయిన రాధకు; తగన్= ఒప్పుగా; ఇచ్చినన్= ఇవ్వగా; చన్నులు చేఁపెన్= ఆమె స్తనాలకు పాలువచ్చాయి; ఆ+పడఁతియున్= ఆ వనితయు; అప్పుడు+ఆదిగన్= అదిమొదలుకొని; ప్రయత్నశీల+ఐ= విడువని పూనిక(జాగరూకత)కలదై; శుభస్థితిన్+పెంచెన్= మంచి స్థితిలో నన్ను సాకింది.

**తాత్పర్యం:** 'కృష్ణా! నీవు చెప్పిన విషయం కొంచెం కొంచెం నేనూ విని ఉన్నాను. కుంతీదేవి నన్ను కని కనికరంలేనిదై గంగలోఁద్రోసి యింటి కేగింది. అప్పుడు సూతుడు దయతో నన్ను ఎత్తుకొని వచ్చి, తనకు అంతకుముందు బిడ్డలులేనందున తన ప్రియురాలైన రాధ కందించాడు. ఆమెకు పుత్త్రప్రేమ పొడమగా చన్నులు చేపాయి. అది మొదలు ఆమె పాలిచ్చి మిక్కిలి పూనికతో ఉన్నతస్థితిలో నన్ను పెంచింది.

**క. మూత్ర పురీషాదులు దమ । గాత్రములం దింక వారు గారవ మెసఁగం**
**బుత్త్రుండని సంవర్ధిత । గాత్రునిగాఁ జేసి రింతకాలముఁ గూర్మిన్. 34**

**ప్రతిపదార్థం:** మూత్రపురీష+ఆదులు= నా యొక్క మలమూత్రాదులు; తమగాత్రములందున్= తమ శరీరములందు; ఇంకన్= ఆరిపోగా; వారు= ఆ సూతదంపతులు; గారవము+ఎసఁగన్= ఆదరం అతిశయించగా; పుత్త్రుండు+అని= తమ కొడుకని; ఇంతకాలమున్= ఇన్నాళ్ళూ; కూర్మిన్= వాత్సల్యంతో; సంవర్ధితగాత్రునిగాన్+చేసిరి= పోషించబడిన దేహం కలవాడినిగా చేశారు.

**తాత్పర్యం:** తమ శరీరములందు నా మలమూత్రాదులు ఇంకిపోగా పరమాదరంతో నన్ను కన్నకుమారుడిగా ఆ సూత దంపతులు ఇంతకాలం ఈ శరీరాన్ని పరిపోషించారు.

**క. నేఁ డింక నెఱిఁగి యొరువుల । వాఁడఁ గదా యనుచు నేను వారిఁ దొఱఁగినం**
**బోఁడిమి సెడదే? మదిఁ గడు । వాఁడి గలదె నాకు నకట వారిజనాభా! 35**

**ప్రతిపదార్థం:** వారిజనాభా!= పద్మం నాభియందుగల శ్రీకృష్ణా! నేఁడు= ఈనాడు; ఎఱిఁగి= నా జన్మవృత్తాంతం తెలిసి; ఇంకన్= ఇటుపై; ఒరువులవాఁడన్ కదా= ఇతరుల బిడ్డను గదా; అనుచున్= అని తలుస్తూ; నేను= నేను; వారిన్= సూత దంపతులను; తొఱఁగినన్= విడిచిపెట్టితే; పోఁడిమి+చెడదే?= ధర్మం నశింపదా?; అకట!= అయ్యో!; నాకున్= నాకు; మదిన్= మనసులో; కడున్= మిక్కిలి; వాడి కలదె?= క్రూరత్వ మున్నదా?

**తాత్పర్యం:** నేడు నాజన్మవృత్తాంతం తెలిసి నేను ఇతరుల బిడ్డను గదా అని పెంచి పెద్దనుచేసిన ఆ సూతదంపతులను వదలివస్తే ధర్మం తప్పినవాడినికాగలను. కృష్ణా! నామనసులో అంతటి క్రౌర్యమున్నదా? (లేదని భావం.)

**వ. వృద్ధోప సేవనంబును ధర్మ సంవేదనంబునుం గలవాఁడ వని నన్ను నీవ చెప్పితివి; రాధయు నధిరథుండును నాకు జాతకర్మాది సమస్త సంస్కారంబులు నిజకులోచితంబుగా నాచరించి; రట్టి తల్లిదండ్రులకుఁ బుత్త్రకృత్యంబులు నిర్వర్తింపక వారలంబాసి యేను వచ్చుట ధర్మంబగునే?' యని పలికి వెండియు. 36**

**ప్రతిపదార్థం:** నన్నున్= నన్ను; వృద్ధ+ఉపసేవనంబును= పెద్దలను సేవించటం; ధర్మసంవేదనంబును= ధర్మం తెలియటం; కలవాఁడవు+అని= కలిగిఉన్నవాడవని; నీవు+అ= నీవే; చెప్పితివి= అన్నావు; రాధయున్; అధిరథుండును; నాకున్; జాతకర్మ+ఆది,

సమస్తసంస్కారంబులు= పుట్టినప్పటినుండి చేయవలసిన వైదిక సంస్కారాలు; నిజకుల+ఉచితంబుగాన్= తమ కులానికి దగినట్లుగా; ఆచరించిరి= చేశారు; అట్టి; తల్లిదండ్రులకున్; పుత్త్రకృత్యంబులు= కుమారుడు చేయవలసిన కార్యములు; నిర్వర్తింపక= చేయకుండా; వారలన్; పాసి= విడిచి; ఏను= నేను; వచ్చుట; ధర్మంబు+అగునే?= ధర్మం ఔతుందా?; అని పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! నేను పెద్దలను భక్తితో సేవించేవాడననీ, ధర్మం తెలిసినవాడననీ నీవే పలికావు. రాధ, అధిరథుడు నాకు పుట్టినప్పటినుండి చేయవలసిన వైదిక సంస్కారాలన్నీ తమ కులాచారానికి తగినట్లు చేసిఉన్నారు. అట్టి తల్లిదండ్రులకు తనయుడుగా నేను చేయవలసిన పనులను చేయకుండా వారిని వదలి పాండవుల దగ్గరకు రావటం ధర్మమా? చెప్పు'మని పలికి మరల కర్ణు డిట్లా అన్నాడు:

**క. 'సోదరులుఁ బ్రియులు ననుజులు । నా దెసఁ బెక్కండ్రు; వారినందఱ విడువం**
**గాదని యూహింపక దా । మోదర! నన్నిట్లు పిలుచు టుచితమె? చెపుమా! 37**

**ప్రతిపదార్థం:** దామోదర!= శ్రీకృష్ణా!; సోదరులున్= తోడబుట్టినవారు; ప్రియులున్= ఇష్టులు; అనుజులున్= తమ్ములూ; నా దెసన్= నా వైపు; పెక్కండ్రు= పలువురున్నారు; వారిన్+అందఱన్= వారినందరినీ; విడువన్+కాదు+అని= వదలటానికి వీలుగాదని; ఊహింపక= ఆలోచించక; నన్నున్= నన్ను; ఇట్లు= ఈవిధంగా; పిలుచుట= పాండవులను చేరరమ్మని ఆహ్వానించటం; ఉచితమె?; చెపుమా!= నీకు తగునా? తెలుపుము.

**తాత్పర్యం:** కృష్ణా! సోదరులు, ఇష్టులు, తమ్ముళ్ళు నా వైపు పలువురున్నారు. వారినందరినీ వదలిపెట్టడానికి వీలుకాదని భావించక నన్ను కౌంతేయులను కలియరమ్మని ఆహ్వానించటం నీకు తగునా? చెప్పుము.

**వ. అదియునుం గాక. 38**

**తాత్పర్యం:** ఇంతే కాక.

**ఉ. సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ములకంటె నాకు సం**
**ప్రీతియొనర్చి తేజమును బెంపును నాఁటికినాఁటి కగ్గలం**
**బై తనరార నన్నుఁ దనయంతటి మానిసిఁ జేసియుండ నే**
**నేతగవూఁది యా కురుకులేశ్వరుఁ బాయుదు? ముట్టవచ్చినన్. 39**

**ప్రతిపదార్థం:** వీఁడు= ఈ కర్ణుఁడు; సూతసుతుండు= సూతజాతివాడి కొడుకు; అనక= అని తలంచక; సూనుల తమ్ములకంటెన్= తన కొడుకులకంటెను, అనుజులకంటెను; నాకున్= నాకు; సంప్రీతి+ఒనర్చి= సంతోషం కలుగజేసి; తేజమును= ప్రతాపాన్ని; పెంపును= వృద్ధినీ; నాఁటికిన్ నాఁటికిన్= దినదినానికి; అగ్గలంబు+ఐ= మిక్కుటమై; తనరారన్= అతిశయించగా; నన్నున్= నన్ను; తన+అంతటి మానిసిన్+చేసి= తనంత వాడినిగా చేసి; ఉండన్= నా యెడ స్నేహభావంతో ఉండగా; నేను; ఏ తగవు+ఊఁది= ఏ ధర్మాన్ని ఆశ్రయించి; ఆ+కురుకుల+ఈశ్వరున్= కురువంశ నాయకుడైన దుర్యోధనుడిని; ముట్టన్ వచ్చినన్= శత్రువులు దాడి సల్పనుండగా; పాయుదున్?= వీడుతాను?

**తాత్పర్యం:** ఈ కర్ణుడు సూతజాతివాడి కొడుకని భావించక తన కుమారులకంటె, తమ్ముళ్ళకంటె నాకు సంతోషం కలిగిస్తూ నా ప్రతాపం, ఔన్నత్యం దినదినానికీ అతిశయిస్తుండగా సుయోధనుడు నన్ను తనంతవాడినిగా చేశాడు.

అట్లాంటి కురుకులాధినాథుడైన దుర్యోధనుడిని యుద్ధం ముంచుకొని వస్తున్న వేళలో ఏ ధర్మాన్ని అనుసరించి విడువగలనో నీవే చెప్పుము.

**క. నను నయ్యర్జునునకు నెదు । రని పెద్దయు నమ్మియుండు నక్కట! దుర్యో**
**ధనుఁ; డా నమ్మిగ వమ్ముగఁ । జనునే పాండవులఁ గలయఁ జన నా కనఘా! 40**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; దుర్యోధనుఁడు= రాజరాజు; ననున్= నన్ను; ఆ+అర్జుననకున్= ఆ పార్థుడికి; ఎదురు+అని= యుద్ధంలో దీటని; పెద్దయున్= మిక్కిలి; నమ్మి+ఉండున్= విశ్వసించి ఉంటాడు; అక్కట!= అయ్యో!; ఆ నమ్మిగ= ఆతడి విశ్వాసం; వమ్ముగన్= రిత్తకాగా; నాకున్= నాకు; పాండవులన్ కలయన్+చనన్= పాండవులను చేరబోవటం; చనునే?= తగునా?

**తాత్పర్యం:** కృష్ణా! సుయోధనుడు సంగ్రామంలో నన్ను అర్జునుడికి దీటని మిక్కిలి నమ్మకంతో ఉన్నాడు. ఆతడి నమ్మకం వమ్ముచేసి నేను కౌంతేయులను చేరబోవటం తగునా?

**ఆ. ఏను నర్జునుండు నెక్కటెక్కటి దల । పడకయున్న నగరె పుడమి జనము?**
**లందు నాదు వచ్చు టతనికి నపకీర్తి । యనిన నాకు వేఱె యడుగనేల? 41**

**ప్రతిపదార్థం:** ఏనున్= నేనూ; అర్జునుండున్= అర్జునుడూ; ఎక్కటిన్+ఎక్కటిన్= ఒకడితో నొక్కడు; తలపడక+ఉన్నన్= యుద్ధంలో ఢీకొనకుంటే; పుడమిజనములు= భూమియందలి జనులు; నగరె?= పరిహసించరా?; అందున్= పాండవుల చెంతకు; నాదు వచ్చుట= నేను రావటం; అతనికిన్= ఆ పార్థునకు; అపకీర్తి= దుర్యశం; అనినన్= అని చెప్పినప్పుడు; నాకున్= నా విషయమై; వేఱె= ప్రత్యేకంగా; అడుగన్+ఏల?= చెప్పటం ఎందుకు?

**తాత్పర్యం:** నేనూ, అర్జునుడూ రణంలో ఒకరినొక్కరు ఎదుర్కొనకుంటే లోకులు నవ్వరా? నేను పాండవులను చేరరావటం అర్జునుడికి అపకీర్తి హేతువయినప్పుడు, మరి అది నాకెంత అవమానకరమో వేరే చెప్పాలా?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి.

**క. హిత ముపదేశించితి నీ । వతి నిర్మలబుద్ధి వగుట; నైనను నిది నా**
**మతి సొరదు; రహస్యము ర । క్షితముగఁ బాటింపుమయ్య! చిత్తములోనన్. 42**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; అతినిర్మలబుద్ధివి+అగుటన్= మిక్కిలి స్వచ్ఛమైన మనస్సుకలవాడవు గనుక; హితము+ఉపదేశించితి(వి)= శ్రేయమైనదానిని బోధించావు; ఐననున్= కాని; ఇది= నీవు సల్పిన ఈబోధ; నా మతిన్= నా హృదయంలో; చొరదు= ప్రవేశించదు; రహస్యము= ఈ గుట్టు; రక్షితముగన్= సంరక్షింపబడేటట్లు; చిత్తములోనన్= నీ మనస్సులో; పాటింపుము+అయ్య!= ఉంచుకొనవయ్యా!

**తాత్పర్యం:** శ్రీ కృష్ణా! నీవు మిక్కిలి నిర్మలమైన మనస్సుకలవాడవు కనుక నాకు మేలు కలిగే విధమేదో బోధించావు. కాని, నీ హితోపదేశం నా మనస్సుకు ఎక్కదు. నేను కుంతీపుత్రుడనన్న ఈ రహస్యం వెలికి పొక్కనీయకుండా భద్రంగా నీ హృదయంలోనే ఉంచుకొమ్ము.

**వ. అది యేమిటి కంటేని.** 43

**తాత్పర్యం:** అదెందుకని అడుగుతావేమో.

**తే. ధర్మతనయుండు తాను నా తమ్ముఁ డగుట । యెఱిఁగెనేనియు సామ్రాజ్య మేల పూను?**
**నట్టి ధార్మికుఁ డాధిపత్యంబుఁ జేయ । వలవదే శాశ్వతంబుగ వసుధకెల్ల?** 44

**ప్రతిపదార్థం:** ధర్మతనయుండు= ధర్మరాజు; తాను; నా తమ్ముఁడు+అగుట= నాకు తమ్ముడు అనే విషయం; ఎఱిఁగెన్+ ఏనియున్= తెలిసికొన్నయెడల; సామ్రాజ్యమున్= దొరతనాన్ని; ఏల పూనున్?= ఎందుకు వహిస్తాడు; అట్టి ధార్మికుఁడు= అటువంటి పుణ్యాత్ముడు; శాశ్వతంబుగన్= స్థిరంగా; వసుధకున్+ఎల్లన్= పుడమికంతటికిని; ఆధిపత్యంబున్+చేయన్+వలవదే?= అధిపతిగా ఉండి పాలించవద్దా?

**తాత్పర్యం:** ధర్మపుత్రుడు నాకు తమ్ముడని తాను తెలిసికొంటే భూమండలాధిపత్యం వహించడు. కాని, అట్లాంటి ధర్మాత్ముడు శాశ్వతంగా ఈ పుడమి కంతటికి రాజై పరిపాలించటం న్యాయంకదా!

**క. అనుజులు ఋత్విజులుగ, నీ । పని యిటు సేయుమను నీ వుపద్రష్టవుగా**
**విను! కురుకుమార పశువిశ । సనమున రణయజ్ఞ మతఁడు సమ్మతిఁ జేయున్.** 45

**ప్రతిపదార్థం:** విను!= కృష్ణా! నా పలుకులాలకించు; అతఁడు= ధర్మజుడు; అనుజులు= తన తమ్ములు; ఋత్విజులుగన్= యజ్ఞం చేయించే ఋత్విక్కులు కాగా; ఈ పని= ఈ కార్యం; ఇటు చేయుము= ఈ విధంగా నిర్వహించుము; అను= అని పలికే; నీవు= నీవు; ఉపద్రష్టవు కాన్= యజ్ఞకర్మలోని గుణదోషాలను కనిపెట్టేవాడవు కాగా; కురుకుమారపశువిశసనమునన్= కౌరవులనే యజ్ఞపశువులను చంపుటద్వారా; రణయజ్ఞము= యుద్ధమనే యాగాన్ని; సమ్మతిన్= ఇష్టంతో; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** కృష్ణా! ధర్మజుడు తన తమ్ములు నలుగురూ, హోత, ఉద్గాత, అధ్వర్యువు, బ్రహ్మ అని యజ్ఞం చేయించే యాజకులు కాగా, ఈ పని ఇట్లా చేయండి అని యజ్ఞకర్మలోని గుణదోషాలను కనిపెట్టి చెప్పే ఉపద్రష్టవు నీవు కాగా, కౌరవులనే పశువులను విశసించి సంప్రీతితో రణయజ్ఞం చేస్తాడు.

**విశేషం:** అలం: రూపకం.

**వ. దానం బుణ్యభూమి యగు కురుక్షేత్రంబున మముబోం ట్లెల్లను సద్గతి వడయుదురు గాక!' యనిన విని వసుదేవనందనుండు సూతనందనున కిట్లనియె.** 46

**ప్రతిపదార్థం:** దానన్= దానివలన; పుణ్యభూమి+అగు= ధర్మక్షేత్రమైన; కురుక్షేత్రంబునన్= కురుక్షేత్రంలో; మముబోంట్లు+ఎల్లను= మా వంటివారందరూ; సత్+గతి= ఉత్తమలోకాలను; పడయుదురుగాక!= పొందుతారుగాక!; అనినన్= అని కర్ణుడు పలుకగా; విని; వసుదేవనందనుండు= వసుదేవుడి పుత్రుడైన శ్రీకృష్ణుడు; సూతనందనునకున్= అధిరథుడి ఆత్మజుడైన కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కృష్ణా! ధర్మజుడు యుద్ధ యజ్ఞంచేసే ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో మా వంటివారంతా ఉత్తమగతులు పొందుతారు' అని కర్ణుడు పలుకగా విని శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు:

**మ. 'దయ నా యాడినమాటఁ గైకొనవు సంతాపంబుఁ దెచ్చుం జుమీ!**
**స్మయ మెట్లుం దుది నీకు నర్జునునితో మాత్సర్యమైనం బరా**
**జయ మొండెన్ మృతి యొండెఁ గాక గెలువన్ శక్యంబె? పెక్కంద్ర కిం**
**తియ కాలం బగునట్టె నీ మనము శాంతింబొందఁగా నేర్చునే? 47**

**ప్రతిపదార్థం:** దయన్= కృపతో; నా+ఆడినమాటన్= నేను పలికిన పలుకును; కైకొనవు= ఆదరించకున్నావు; స్మయము= గర్వం; సంతాపంబున్= దుఃఖమును; తెచ్చున్+చుమీ!= కలిగించగలదు సుమా!; ఎట్లున్= ఎట్లాగయినా; తుదిన్= చివరకు; నీకున్= నీకు; అర్జునునితోన్= పార్థుడితో; మాత్సర్యము+ఐనన్= ద్వేషమొదవినచో; పరాజయము+ఒండెన్= అపజయమో లేదా; మృతి+ఒండెన్= మరణమో; కాక= ఈ రెంటిలో ఒకటితప్ప; గెలువన్ శక్యంబె?= అతనిని జయించుట నీ తరమా? (కాదని అర్థం); పెక్కం(డ్రకున్= అనేకులకు; ఇంతియకాలంబు+అగునట్టె= బ్రతుకు ఇంతవరకే ఉన్నది కాబోలు (ఆ కారణముచే); నీ మనము= నీ హృదయం; శాంతిన్+పొందగాన్+నేర్చునే?= శాంతిని పొందజాలునా? (చాలదని అర్థం.)

**తాత్పర్యం:** 'కనికరంతో నేను పలికిన పల్కులు గైకొనకున్నావు. అహంకారం దుఃఖాన్ని కలిగిస్తుంది సుమా! అర్జునుడిపై ద్వేషం వహించిన నీకు అతడితోటి పోరాటంలో పరాజయమో ప్రాణహానియో - ఈ రెంటిలో ఒకటితప్ప విజయం సంప్రాప్తించదు. పలువురకు చేటుకాలం దాపురించి ఉండగా నీ మనసు శాంతి వహించగలదా?

**క. గాండీవముఁ గవదొనలు న । ఖండిత దివ్యాస్త్రములు నొగలపై నేనుం**
**జండ భుజబలమునై యు । ద్దండత నరుఁ డడర నెదురఁ దరమే నీకున్? 48**

**ప్రతిపదార్థం:** గాండీవమున్= గాండీవమనే ధనుస్సు; కవదొనలున్= అక్షయబాణతూణీరాల జంట; అఖండిత దివ్య+అస్త్రములు= అమోఘాలైన దివ్యబాణాలు; నొగలపైన్= తన తేరి నొగల మీద; నేనున్= నేనూ; చండభుజబలమున్+ఐ= తీవ్రమైన బాహుశక్తిగలిగి; ఉద్దండతన్= ఉగ్రంగా; నరుఁడు+అడరన్= అర్జునుడు విజృంభించగా; నీకున్= నీకు; ఎదురన్+తరమే?= యుద్ధంలో ఎదిరించ శక్యమా? (కాదని భావం.)

**తాత్పర్యం:** గాండీవం, అక్షయ తూణీరాల జంట, అమోఘమైన దివ్యశరాలు, అపార భుజ విక్రమం తనకు తోడై ఉండగా, తన రథం తోలుతూ నొగలపై నేనుండగా, భయంకరంగా చెలరేగిన అర్జునుడిని కయ్యంలో ఎదుర్కొనటానికి నీకు శక్యం కాదు.

**విశేషం:** తిరుపతికవుల ఉద్యోగ విజయాల నాటకంలోని సుప్రసిద్ధమైన 'జెండాపై కపిరాజు, ముందు సితవాజి శ్రేణి.....' అనే పద్యానికి ఇది స్ఫూర్తియేమో!

**వ. ఎల్లభంగులలం బాండవుల గెల్తు; రది యట్లుండె; నీవు పొ; మ్మిప్పుడ పోయి సుయోధనునకును గురుభీష్ములకును మీకుం దోడువచ్చిన రాజుల కందఱకుం జెప్పు : మిమ్మాసంబు సౌమ్యంబై సమశీతోష్ణంబై పుష్పఫలోపేతంబును, సమగ్ర ధాన్యంబును, సులభయవ సేంధనంబును నగుచు నొప్పియున్నయది; యేడెనిమిది దివసంబులకు నమావాస్య వచ్చు; నది పుణ్యదినంబు; నాఁడు భండనంబు గావలయు' ననినఁ గానీనుండు కమలనాభున కిట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** ఎల్లభంగులన్= అన్ని విధాల; పాండవులు+అ= పాండవేయులే; గెల్తురు= జయిస్తారు; అది+అట్లు+ఉండెన్= ఆ సంగతి అట్లా ఉండనీ; నీవు పొమ్ము= నీవు కరినగరికి వెళ్ళుము; ఇప్పుడు+అ పోయి= ఇపుడే వెళ్ళి; సుయోధనునకును; గురుభీష్ములకును; మీకున్= మీకు; తోడువచ్చిన= సాయపడటానికి వచ్చిన; రాజులకున్; అందఱకున్; చెప్పుము; ఈ+మాసంబు= ఈ నెల; సౌమ్యంబు+ఐ= శాంతమై; సమ శీత+ఉష్ణంబు+ఐ= సమానమైన చలీ, వేడీ కలదై; పుష్పఫల+ఉపేతంబును= పూలతో పండ్లతో కూడినదై; సమగ్ర ధాన్యంబును= అధికమైన ధాన్యం కలదై; సులభ యవస+ఇంధనంబును= తేలికగా లభించే పచ్చిక, వంటచెరకులు కలది; అగుచున్; ఒప్పి+ఉన్నయది= సొంపారుతున్నది; ఏడు+ఎనిమిది దివసంబులకున్= ఏడెనిమిది రోజులకు; అమావాస్య; వచ్చున్; అది= ఆ అమావాస్య; పుణ్యదినంబు= పవిత్రమైన రోజు; నాఁడు= ఆ అమావాస్యరోజు; భండనంబు= యుద్ధం; కావలయున్= జరుగవలెను; అనినన్; కానీనుండు= కుంతి కన్యగా నున్నపుడు సూర్యవర ప్రసాదంతో జనించిన కర్ణుడు; కమలనాభునకున్= బొడ్డున తామరగల శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** సర్వవిధాల పాండవేయులే జయిస్తారు. ఆ విషయం అట్లా ఉండనీ. నీవు హస్తినాపురికి వెళ్ళి ఇపుడే దుర్యోధనుడికీ, భీష్మ ద్రోణులకూ, మీకు సాయపడవచ్చిన రాజులందరికీ చెప్పుము. ఈ నెల అంత చలి, వేడిమి లేక పూలతో పండ్లతో కూడి, ధాన్యంతో నిండి, తేలికగా పచ్చిక, వంట చెరకు దొరుకుతుండగా పెంపారుతున్నది. ఏడెనిమిది రోజులలో అమావాస్య వస్తుంది. అది పుణ్య తిథి. ఆనాడు యుద్ధం ప్రారంభం కావాలి' అని శ్రీకృష్ణుడు చెప్పాడు. అందుకు కర్ణుడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** నేడు అమావాస్య. ఏ పనినీ ఆరంభింపగూడని అపవిత్రదినంగా భావింపబడుతుండగా, నాడు యుద్ధంవంటి అతిముఖ్యమైన కార్యాన్ని ఆరంభించదగిన పుణ్యదినంగా భావించబడటం విశేషం.

**క. 'కలవు నిమిత్త స్వప్నం । బులు కౌరవ పాండవులకుఁ బోటగు; దానన్**
**గెలు పయ్యుధిష్ఠిరునకును । గల; దెఱుఁగుదు నీవు సెప్పఁగా నేమిటికిన్? 50**

**ప్రతిపదార్థం:** నిమిత్త స్వప్నంబులు= శకునాలు, కలలు; కలవు= భావియుద్ధాన్నే సూచిస్తున్నాయి; దానన్= ఆ కారణముచే; కౌరవ పాండవులకున్= కౌరవులకు, పాండవేయులకు; పోటు+అగున్= పోరాటం జరుగుతుంది; ఆ యుధిష్ఠిరునకున్= ఆ ధర్మజునకు; గెలుపు+కలదు= విజయం కలుగుతుంది; ఎఱుఁగుదున్= నాకు తెలుసు; నీవు చెప్పఁగాన్+ఏమిటికిన్?= నీవు తెలుపవలసిన అవసరం ఏముంది? (లేదని భావం).

**తాత్పర్యం:** శకునాలూ, కలలూ భావియుద్ధ సూచకాలై ఉన్నాయి. అందుచేత కురుపాండవులకు పోరు జరుగుతుంది. ఆ పోరాటంలో ధర్మజుడికి గెలుపు కలుగుతుంది. ఆ విషయం నాకు తెలుసు. నీవు వేరే చెప్పటమెందుకు?

**వ. అట్లుగాన కదా యే నందు రా' నని పలికి మఱియును. 51**

**ప్రతిపదార్థం:** అట్లు+కాన్+అ+కదా= అందువలననేగదా!; ఏను= నేను; అందున్+రాను= అక్కడికి రావటానికి సమ్మతించను; అని పలికి; మఱియును.

**తాత్పర్యం:** కృష్ణా! అందువలననే కదా నేను పాండవుల వద్దకు రానని చెప్పుతున్నాను' అని పలికి కర్ణుడు ఇంకా. (ఇట్లా అన్నాడు:)

**క. 'దీనికి మూలము శకునియు । నేనును, దుశ్శాసనుండు, నింతియ; కుంతీ**
**సూనుల వారలు గలసిన । రానేరఁగ వచ్చు నాకు రాజీవాక్షా! 52**

**ప్రతిపదార్థం:** రాజీవ+అక్షా!= కమలాల వంటి కన్నులుగల కృష్ణా!; దీనికిన్= ఈ సంగ్రామానికి; శకునియున్= సౌబలుడూ; నేనును= నేనున్నూ; దుశ్శాసనుండు= దుస్ససేనుడూ; మూలము= హేతువై ఉన్నాము; ఇంతియ= ఇది నిజం; వారలు= ఆ శకుని దుశ్శాసనులు; కుంతీసూనులన్= కుంతి కొడుకులను; కలసినన్= కూడినప్పుడే; నాకున్= నాకు; రానేరఁగన్ వచ్చున్= రాదగి ఉంటుంది.

**తాత్పర్యం:** ఈ సంగ్రామానికి శకుని, నేను, దుశ్శాసనుడు కారణభూతులం. ఇది నిజం. వారిద్దరు పాండవేయులను కలసినప్పుడు గదా నేను వారిని కలవవలసి ఉంటుంది? వారూ, నేనూ కౌంతేయులను కలవటం అసంభవం.

**వ. ఈ సమర సముద్రంబు గడవ నీఁది నిన్నుం గనియెదఁ; గాదేని నూర్ధ్వలోకంబునం గాంచెద; నీ వింక నేమియుం బలుకకుము; పని వినియెద'నని కౌఁగిలించుకొనిన 'నట్ల కాక పొ'మ్మని విష్ణుండు వీడుకొలువ రాధేయుండు రథావతరణంబు సేసి, కనక రత్నమయంబగు తన యరదం బెక్కి కరిపురంబున కరిగె; నచ్యుతుండును సాత్యకిం దన రథం బెక్కించుకొని దారుకుం జూచి 'పద పద పోనిమ్ము పోని'మ్మని పలికి లలితాటోపకలితుండగుచుఁ జనియె; నట్టియెడ విదురుండు విషాదంబుతోఁ బాండురాజమహిషి పాలికిం జని యిట్లనియె. 53**

**ప్రతిపదార్థం:** ఈ సమర సముద్రంబున్= ఈ యుద్ధమనెడు సాగరాన్ని; కడవన్+ఈఁది= కడముట్ట దాటి; నిన్నున్+కనియెదన్= నిన్ను సందర్శిస్తాను; కాదు+ఏనిన్= అట్లా రణ విజయం పొందలేక వీరమరణం చెందితే; ఊర్ధ్వలోకంబునన్= పరలోకంలో; కాంచెదన్= చూస్తాను; నీవు; ఇంకన్; ఏమియున్; పలుకకుము; పని వినియెదన్= వెళ్ళివస్తాను; అని; కౌఁగిలించుకొనినన్; అట్లకాక= అట్లాగే; పొమ్ము+అని; విష్ణుండు= వెన్నుడు; వీడు కొల్వన్= అంపగా; రాధేయుండు; రథ+అవతరణంబు చేసి= రథం నుండి క్రిందికి దిగి; కనక రత్నమయంబు+అగు= బంగారంతో రతనాలతో నిర్మించిన; తన+అరదంబు+ఎక్కి= తన రథాన్ని అధిరోహించి; కరిపురంబునకున్= హస్తినాపురానికి; అరిగెన్; అచ్యుతుండును= శ్రీకృష్ణుడు కూడా; సాత్యకిన్; తన రథంబు; ఎక్కించుకొని; దారుకున్+చూచి= దారుకుడనే తన రథసారథిని చూచి; పద పద; పోనిమ్ము పోనిమ్ము; అని పలికి; లలిత+ఆటోప కలితుండు+అగుచున్= ఉల్లాసకరమైన గర్వంతో కూడినవాడవుతూ; చనియెన్= పాండవుల దగ్గరకు వెళ్ళాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో, విదురుండు; విషాదంబుతోన్= దుఃఖంతో; పాండురాజమహిషి పాలికిన్+చని= పాండురాజు పట్టపు దేవేరి అయిన కుంతి చెంతకు వెళ్ళి; ఇట్లు+అనియన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! కురుపాండవులకు ఏర్పడనున్న ఈ సంగ్రామ మనే సముద్రాన్ని తుదముట్టనీది విజయినై ఇక్కడ నిన్ను దర్శిస్తాను. లేదా కూలి వీరస్వర్గంచేరి పరమేశ్వరుడవైన నిన్ను చూస్తాను. నా కిక సెలవిప్పించు'మంటూ స్వామిని కర్ణుడు కౌగిలించుకొన్నాడు. వెన్నుడు 'అట్లాగే వెళ్ళు'మని అనుమతి నీయగా రాధేయుడు రాజీవాక్షుడి రథంనుండి దిగి కనకరత్నమయమైన తన తేరెక్కి హస్తినాపురికి తిరిగివెళ్ళాడు. అచ్యుతుడు అంతవరకు దవ్వుల నున్న సాత్యకిని తన రథ మెక్కించుకొని సారథి అయిన దారుకుడితో 'పదపద, రథాన్ని పోని'మ్మని చెప్పి సొబగైన దర్పంతో వెళ్ళాడు. అట్టి సమయంలో విదురుడు దుఃఖంతో పాండునృపాలుడి పట్టపురాణి కుంతీదేవి గృహానికి వెళ్ళి ఆమెతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** సమరసముద్రంబు - అలంకారం రూపకం.

**ఉ.** **'అక్కట! కౌరవాన్వయ మహార్ణవ మింకెడునట్లు వుట్టె; నిం**
**దొక్కరుఁడైనఁ గేశవు హితోక్తికి మేకొనఁ డయ్యె; నర్జునుం**
**డెక్కటి దాన చాలుఁ దము నిందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ; బెం**
**పెక్కిన పాండునందనుల యేడ్తెఱఁ దొల్లియుఁ దా రెఱుంగరే?** **54**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; కౌరవ+అన్వయ+మహా+అర్ణవము= కౌరవ వంశమనే గొప్ప సముద్రం; ఇంకెడు+అట్లు+పుట్టెన్= ఎండిపోయేటట్లు యుద్ధం తటస్థించింది; ఇందున్= ఈ కురువంశంలో; ఒక్కరుఁడు+ఐనన్= ఒక్కడు కూడ; కేశవుహిత+ఉక్తికిన్= శ్రీకృష్ణుడి శ్రేయస్కరమైన వచనానికి; మేకొనఁడు+అయ్యెన్= సమ్మతించలేదు; అర్జునుండు= పార్థుడు; ఎక్కటి= అసహాయశూరుడు; తమున్+ఇందఱన్= కౌరవులనందరినీ; తీవ్రశర+అగ్నిని= తీక్ష్ణములైన బాణాలనే నిప్పుతో; కాల్చన్= దహించటానికి; తాను+అ చాలున్= తానొక్కడే సరిపోతాడు; పెంపు+ఎక్కిన= ఘనతగాంచిన; పాండునందనుల= పాండుకుమారుల యొక్క; ఏడ్తెఱన్= శక్తిని (సామర్థ్యాన్ని, పరాక్రమాన్ని); తొల్లియున్= ఇదివరలోకూడా; తారు= తాము; ఎఱుంగరే?= తెలియకున్నారా?

**తాత్పర్యం:** 'అయ్యో! కౌరవవంశమనే సాగరం ఇంకిపోయేటట్లుగా యుద్ధం తటస్థించింది. కౌరవులలో ఒక్కడైనా శ్రీకృష్ణుడి హితబోధ మన్నించలేదు. అర్జునుడు అసహాయశూరుడు. అత డొక్కడే తామందరినీ వాడిబాణాలనే అగ్ని చేత దహించి వేయగలడు. ప్రసిద్ధికెక్కిన పాండవుల శక్తిసామర్థ్యాలు ఎట్లాంటివో వీరికి ఇంతకు మునుపు తెలియనివి కావు గదా!

**విశేషం:** అలం: రూపకం. కౌరవాన్వయ మహార్ణవము, తీవ్ర శరాగ్ని.

**తే.** **అన్ని వడియును బంధుక్షయంబు సేయ । నొల్ల కెల్ల విధంబుల నుపశమంబ**
**కోరి రప్పాండవేయులు; వారి కిట్టి । దొసఁగు వచ్చునె తులువల తోడఁబుట్టి.'** **55**

**ప్రతిపదార్థం:** ఆ+పాండవేయులు= ఆ పాండునందనులు; అన్ని పడియును= అన్ని కష్టాలు అనుభవించినప్పటికినీ; బంధుక్షయంబు+చేయన్+ఒల్లక= చుట్టాలను నాశనం చెయ్యటాని కిష్టపడక; ఉపశమంబు+అ కోరిరి= శాంతినే వాంఛించారు; తులువల తోడన్+పుట్టి= తుచ్ఛులైన దుర్యోధనాదులకు సోదరులై పుట్టి; వారికిన్= పుణ్యాత్ములైన పాండుపుత్రులకు; ఇట్టి దొసఁగు వచ్చునె?= ఇట్టి విపత్తు కలిగిందే?

**తాత్పర్యం:** పాండుకుమారులు అన్ని కష్టాలు అనుభవించినప్పటికీ చుట్టాలను నాశనం చేయటానికి ఇష్టపడక సకల విధాల శాంతినే అభిలషించారు. అట్టి మహనీయులకు దుర్మార్గులైన కౌరవులు తోడబుట్టువులైనందుకు ఇట్లాంటి బాధలు కలిగాయి'.

**వ.** **అని వెండియు నివ్విధంబు మాటలఁ బాండవులకుఁ గయ్యంపు టలజడియైన వగపు దోఁప నాడుచుం గొండొక ప్రొద్దు నిలిచి నిజనివాసంబునకుం బోయిన యనంతరంబ కుంతి యిట్లని వితర్కించె.** **56**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= మరల; ఈ+విధంబు మాటలన్= ఇట్లాంటి మాటలతో; పాండవులకున్= ధర్మజాదులకు; కయ్యము+అలజడి+ఐనన్= యుద్ధ సంక్షోభ మేర్పడగా; వగపు+తోఁపన్= చింత వ్యక్తమయ్యేటట్లు; ఆడుచున్= పలుకుతూ; కొండొక ప్రొద్దు= కొంత తడవు; నిలిచి= కుంతీగృహంలో ఆగి; నిజ నివాసంబునకున్= తన నివాస ప్రదేశానికి; పోయిన+ అనంతరంబు+అ= వెళ్లిన తరువాత; కుంతి; ఇట్లని; వితర్కించెన్= ఆలోచించింది.

**తాత్పర్యం:** విదురుడు పాండవుల కేర్పడిన యుద్ధాందోళనగురించి ఇట్లాంటి మాటలతో తన దుఃఖం వ్యక్తమయ్యేటట్లు పలుకుతూ, కొంచెం సేపు కుంతీగృహంలో నిలిచి, పిదప తన నివాసప్రదేశానికి వెళ్ళాడు. అట్లా విదురుడు వెళ్ళిన తరువాత కుంతి తన మనసులో ఇట్లా ఆలోచించింది:

**మ.** **'తమ వారిన్ సిరికై వధించు టిది సద్ధర్మంబె? యక్లేశ కృ**
**త్యమె తాఁ గయ్యము? ద్రోణ భీష్మ కృప కర్ణాటోపముల్ మాన్చు ట**
**ల్పములం దీఱునె? యందు నర్కజుని యుల్లం బెప్పుడుం గ్రోధ దీ**
**ప్తము భీమాదుల మీఁదఁ; దక్కొరుల కుత్సాహంబు లే దాజికిన్.'** **57**

**ప్రతిపదార్థం:** తమవారిన్= తమ చుట్టాలను; సిరికై= రాజ్యలక్ష్మికై; వధించుట= చంపటం; ఇది సత్+ధర్మంబె?= ఇది శ్రేష్ఠమైన ధర్మమా?; కయ్యము తాన్= సంగ్రామమన్నది; అక్లేశ కృత్యమె?= దుఃఖ మొదవని కార్యమా?; ద్రోణ భీష్మ కృప కర్ణ+ఆటోపముల్= ద్రోణ భీష్ముల యొక్క, కృప కర్ణులయొక్క యుద్ధ విజృంభణాలు; మాన్చుట= లేకుండా చేయటం; అల్పములన్+తీఱునె?= తక్కువ యత్నాలతో జరిగేదా?; అందున్= ఆ ద్రోణభీష్మ కృపకర్ణులలో; అర్కజుని+ఉల్లంబు= కర్ణుడి మనస్సు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; భీమ+ఆదుల మీఁదన్= భీముడు మొదలైన వారిమీద; క్రోధ దీప్తము= కోపంతో మండుతుంటుంది; తక్కొరులకున్= మిగిలిన కౌరవ సేనలోని వీరులకు; ఆజికిన్= యుద్ధం సల్పడానికి; ఉత్సాహంబు లేదు= అభిలాష లేదు.

**తాత్పర్యం:** 'తమ చుట్టాలను రాజ్యసంపదకై చంపటం ఉత్తమ ధర్మమౌతుందా? యుద్ధం చేయటం దుఃఖరహిత కార్యం కాదుగదా! ద్రోణభీష్మకృపకర్ణుల వీరావేశాలు మాన్పటం తక్కువ యత్నంతో జరిగేవి కావు. ఆ ద్రోణ భీష్మ కృప కర్ణులలో ఆ సూర్యపుత్రుడి మన సెప్పుడూ భీమాదుల మీద కోపంతో మండిపోతుంటుంది. కురుసేనలోని తదితర యోధులకు యుద్ధం చేయాలనే అభిలాష లేదు.'

**వ.** **అని యిత్తెఱంగునఁ బెక్కులు చింతించి తలంచుకొని 'కర్ణునకుం బుట్టువు తెలిపి సహోదర స్నేహం బావహించెద; నట్లయిన నాహవంబువలని కడంక యుడుగకుండునె?' యని విచారించి యతని పాలికిం బోన నిశ్చయించి, యుచిత ప్రకారంబున వెడలి యతం డనుష్ఠానార్థంబు భాగీరథికిం జనుట విని తత్ప్రదేశంబున కరిగి యతనికి జపకాలంబయి యునికిం జూచి వెనుక వలనఁ గూర్చుండఁ, గొండొక సేపునకు జపంబుదీఱి కలయం గనుంగొని యమ్మహాదేవింగాంచి కానీనుండు సంభ్రమ వినయంబులతోడం జేరి సూత గోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభివాదనంబు చేసి 'నీవు విజయంచేసిన కార్యం బేమి? నాకుం జేయంగల పని యెయ్యది? యానతి'మ్మనినఁ గుంతి యేకాంతంబుగా నిట్లనియె.** **58**

**ప్రతిపదార్థం:** అని; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; పెక్కులు చింతించి= అనేక విధాలుగా ఆలోచించి; తలంచుకొని= భావించి; కర్ణునకున్; పుట్టువు తెలిపి= జన్మ ప్రకారం తెలిపి; సహోదర స్నేహంబు+ఆవహించెదన్= తోడబుట్టువుల మీద

ప్రేమను కలిగిస్తాను; అట్లు+అయినన్= అట్లాచేస్తే; ఆహవంబు వలని కడంక= యుద్ధమునందలి పూనిక; ఉడుగక+ఉండునె?= మానకుంటాడా?; అని విచారించి= అని తలపోసి; అతని పాలికిన్+పోవన్+నిశ్చయించి= అతడి దగ్గరకు వెళ్ళటానికి నిర్ణయించి; ఉచిత ప్రకారంబునన్= తగిన విధంగా; వెడలి= బయలుదేరి; అతండు= కర్ణుడు; అనుష్ఠాన+అర్థంబు= విధులాచరించుట కొరకు; భాగీరథికిన్= గంగానదికి; చనుట విని= వెళ్ళాడని తెలిసికొని; అతనికిన్= ఆ కర్ణుడికి; జపకాలంబు= మంత్రజపం చేసే సమయం; అయి+ఉనికిన్= అయి ఉండటం; చూచి; వెనుక వలనన్= అతడికి వెనుక తట్టు; కూర్చుండన్= ఆసీనురాలు కాగా; కొండొక సేపునకున్= కొంత తడవునకు; జపంబు తీఱి= జపం ముగించి; కలయన్+కనుంగొని= నలువైపుల చూచి; ఆ+మహాదేవిన్+కాంచి= పాండురాజు పట్టపు దేవేరిని కనుగొని; కానీనుండు= కన్యాపుత్రుడైన కర్ణుడు; సంభ్రమ వినయంబుల తోడన్= తొట్రుపాటుతో, అణకువతో; చేరి= ఆమెను సమీపించి; సూతగోత్రంబును= తనకు సంబంధించిన సూతగోత్రాన్ని; రాధేయ నామంబునున్= రాధేయుడనే తన పేరునూ చెప్పి; అభివాదనంబు చేసి= పాదనమస్కారంచేసి; నీవు; విజయంచేసిన కార్యంబు+ఏమి?= వచ్చిన పని ఏమిటి?; నాకున్+చేయన్+కల+పని+ఏ+అది?= నేను నీ కొరకై చేయవలసిన పనిఏమిటి?; ఆనతిమ్ము= సెలవిమ్ము; అనినన్; కుంతి; ఏకాంతంబుగాన్= రహస్యంగా; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కుంతీదేవి ఇట్లా పలురకాల ఆలోచించింది. 'కర్ణుడికి ఆతడి జన్మ వృత్తాంతం చెప్పి తన తోబుట్టువుల మీద ప్రేమ కలిగిస్తాను. అట్లా సోదరుల మీద ప్రేమ జనింపజేస్తే యుద్ధం చేయవలెననే పట్టుదల మానుకొంటాడు కదా! అని భావించి అతడి దగ్గరకు వెళ్ళాలని నిశ్చయించుకొన్నది. కర్ణుడు అనుష్ఠానార్థం గంగానదికి వెళ్ళాడని విని తా నక్కడికి వెళ్ళింది. ఆ సమయంలో కర్ణుడు జపం చేస్తున్నాడు. మెల్లగా వెళ్ళి అతని వెనుక కుంతి కూర్చున్నది. కొంచెంసేపటికి తన జపం పూర్తి కాగానే కర్ణుడు కనులు దెరచి నాల్గువైపుల కలయజూచాడు. కుంతి కనిపించింది. అతడు పాండు రాజమహిషిని చూడగానే సంభ్రమ వినయాలతో దగ్గరకు వచ్చాడు. తన సూత గోత్రం, రాధేయ నామధేయం చెప్పి ఆమెకు ప్రణమిల్లాడు. 'నీ విక్కడికి ఏమి పనిమీద వచ్చావో, నేను చేయవలసిన పని ఏమిటో సెల'విమ్మని అడిగాడు. ఆమె రహస్యంగా కర్ణుడితో ఇట్లా అన్నది:

**కుంతీదేవి కర్ణునకు నతండు తన పుత్త్రుం డగుట దెలుపుట (సం. 5-143-1)**

**సీ. 'వినుము! సూతాన్వయంబున నీవు పుట్టుట । బొం; కేను మా కుంతిభోజునింటఁ**
**గన్నియనాఁడు భాస్కరుని రావించితి । వరమంత్రబలమున; వచ్చి యతఁడు**
**సంప్రీతి నొసఁగంగ జన్మించినాఁడవు । నాకుఁ; గావునఁ బాండునందనుండ**
**వగుదు ధర్మస్థితి; నట్టి నీ వితరులఁ । గొలువ నేటికిఁ గురుకులవరేణ్య?**

**తే. ధర్మతనయాదులైన నీ తమ్ములకును । ధార్తరాష్ట్రులకును నీవ తగు విభుండ;**
**వేలు మీ లోకమెల్ల; నీ కేల రాధ । కొడు కితం డను తక్కువ? కొడుకుఁగుఱ్ఱ!'** 59

**ప్రతిపదార్థం:** కొడుకుఁ గుఱ్ఱ!= ముద్దుకుమారా!; వినుము= ఆలకించుము; సూత+అన్వయంబునన్= సూతకులంలో; నీవు పుట్టుట= నీవు జన్మించటం; బొంకు= అబద్ధం; ఏను= నేను; మా కుంతి భోజు+ఇంటన్= మా తండ్రిఐన కుంతిభోజుడి గృహంలో; కన్నియనాఁడు= కన్యగా ఉన్నప్పుడు; భాస్కరునిన్= సూర్యభగవానుడిని; వరమంత్రబలమునన్= శ్రేష్ఠమైన మంత్రశక్తిచేత; రావించితిన్= చెంతకు రప్పించాను; అతఁడు వచ్చి= ఆ సూర్యుడు వచ్చి; నాకున్= నాకు; సంప్రీతిన్= సంతోషంతో; ఒసఁగంగన్= నిన్ను అనుగ్రహించగా; జన్మించినాఁడవు= పుట్టావు; కావునన్= కాబట్టి; ధర్మస్థితిన్= న్యాయపద్ధతితో; పాండు నందనుండవు= పాండురాజు కుమారుడవే; అగుదు(వు)= ఔతావు; అట్టి నీవు= అటువంటి నీవు; ఇతరులన్= అన్యులను;

కొలువన్+ఏటికిన్?= సేవించుటెందులకు?; కురుకులవరేణ్యా!= కురువంశంలో ఉత్తముడవైనపుత్రా!; ధర్మతనయ+ఆదులు+ అయిన= ధర్మజుడు మున్నుగా గల; నీ తమ్ములకును= నీ తమ్ములందరికీ; ధార్తరాష్ట్రులకును= దుర్యోధనాదులైన కౌరవులందరికీ; నీవు+అ= నీవే; తగు విభుండవు= తగిన రాజువు; ఈ లోకము+ఎల్లన్= ఈ జగమంతా; ఏలుము= పాలించుము; నీకున్= నీకు; ఇతండు రాధకొడుకు= ఈ కర్ణుడు రాధయొక్క కుమారుడు; అను తక్కువ= అనునట్టి హీనస్థితి; ఏల?= ఎందుకు?

**తాత్పర్యం:** 'వత్సా! నా మాట వినుము. నీవు సూతకులంలో జన్మించినావనటం అబద్ధం. నేను మా తండ్రి కుంతి భోజుడి గృహంలో కన్యగా ఉన్నప్పుడు గొప్ప మంత్ర బలంతో భాస్కరుడిని నా చెంతకు రప్పించాను. ఆతడు వచ్చి సంతోషంతో అనుగ్రహించగా నీవు నాకు జన్మించావు. కావున ధర్మ ప్రకారం నీవు పాండురాజు కుమారుడివే. అట్లాంటి నీవు పరులసేవలో పడిఉండటం తగదు. నీవు కురువంశశ్రేష్ఠుడవు. ధర్మజాదులైన నీ తమ్ముళ్ళకూ, సుయోధనాదులైన కౌరవులకూ నీవు తగిన దొరవు గనుక, ఈ పుడమినంతా నీవే పాలించుము. కర్ణుడు రాధా తనయుడన్న హీనస్థితి నీ కెందుకు?'

**క. అని పలికిన యవసరమున । నినబింబములోన నుండి 'యిది నిజ మిభ్భం**
**గిన నెగడవన్న మేలగు' । నను వాక్యము వెడలెఁ గర్ణుఁ డాకర్ణింపన్. 60**

**ప్రతిపదార్థం:** అని పలికిన+అవసరమునన్= కుంతీదేవి అట్లా చెపుతున్న సమయంలో; కర్ణుఁడు+ఆకర్ణింపన్= కర్ణుడు వినేటట్లుగా; ఇన బింబములోనన్+ఉండి= సూర్యమండలంలో నుండి; ఇది నిజము= కుంతి చెప్పినది సత్యం; ఈ+భంగిన్+అ= ఆమె చెప్పిన రీతిలో మెలగి; నెగడవు+అన్న= వర్ధిలుమయ్యా; మేలు+అగున్= నీకు శ్రేయం కలుగుతుంది; అను వాక్యము వెడలెన్= అనే వచనం వినవచ్చింది.

**తాత్పర్యం:** కుంతీదేవి అట్లా అనగానే 'ఆమె చెప్పింది నిజం. నీవు ఆమె చెప్పినట్లు నడచుకొని వర్ధిల్లుము. ఇది నీకు మేలు' అనే వాక్యం కర్ణుడు వింటుండగా సూర్యబింబంలో నుండి వెలువడింది.

**తే. దాని వినియును నపుడు రాధాసుతుండు । దిరుగఁబడని మనంబుతో ధీరవృత్తిఁ**
**దల్లి కిట్లను 'నీమాట తథ్యమగున । యైన నొక్కటి సెప్పెద నవధరింపు. 61**

**ప్రతిపదార్థం:** దానిన్= ఆ మాటను; వినియునున్= వినికూడ; అపుడు; రాధాసుతుండు= రాధ కొడుకు-కర్ణుడు; తిరుగన్+పడని+మనంబుతోన్= మరలని చిత్తంతో; ధీరవృత్తిన్= ధైర్యమునందు నిలుకడ కలిగినవాడై; తల్లికిన్= జననికి; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; నీ మాట తథ్యము= నీ వాడింది సత్యం; అగును+అ= అయినదే; ఐనన్= అయినప్పటికినీ; ఒక్కటి చెప్పెదన్= నేనొకమాట చెపుతాను; అవధరింపు= శ్రద్ధగా వినుము.

**తాత్పర్యం:** సూర్యుడు చెప్పిన మాట విని కూడ కర్ణుడు మారని మనస్సుతో ధైర్యం అవలంబించి తల్లితో ఇట్లా అన్నాడు: 'నీవు చెప్పింది సత్యమే అయినప్పటికీ నే నొకటి చెపుతాను. చిత్తగించుము.

**క. క్షత్రియ సంస్కారమునకుఁ । బాత్రముగా నీవు నన్నుఁ బాటింప విహా**
**ముత్రఫలములకు నీ కేఁ । బుత్త్రుఁడ నని వచ్చుటింకఁ బోలునె చెపుమా? 62**

**ప్రతిపదార్థం:** క్షత్రియ సంస్కారమునకున్= క్షత్రియ కులోచితమైన జాతకర్మాది షోడశ కర్మలకు; పాత్రముగాన్= అర్హుడయ్యేటట్లు; నీవు= నీవు; నన్నున్= నన్ను; పాటింపవు= ఆదరించినదానవు కావు; నీకున్= అట్టి నీకు; ఇహ+అముత్ర ఫలములకున్= ఇహపరలోక కర్మఫలాలను కలిగించటానికి; ఏన్= నేను; పుత్త్రుఁడన్+అని+వచ్చుట= కుమారుడనని పేర్కొంటూ రావటం; ఇంకన్= ఇక; పోలునె చెపుమా!= తగునా? నీవే చెప్పుము.

**తాత్పర్యం:** క్షత్రియులకు తగిన సంస్కారాలకు నేను నోచుకొనేటట్లు నీవు చేయలేదు. ఇప్పుడు ఇహపరసుఖాలు కల్గించుట కొరకై నేను పుత్రుడనని నీ వెంట రావటం తగునా? నీవే చెప్పుము.

**వ. సూర్యానుగ్రహంబునఁ జేసి నింద్యంబుగాక తక్కెనేనియు నా జన్మంబు పరమ రహస్యంబునై యున్నయది; దీనిఁ బ్రకాశంబు చేయుట మనకెంత మే? లట్లుంగాక. 63**

**ప్రతిపదార్థం:** సూర్య+అనుగ్రహంబునన్+చేసి= సూర్యుడి ప్రసాదంవలన; నింద్యంబు+కాక+తక్కెన్+ఏనియున్= దూషించదగినది కాకపోయినప్పటికిన్నీ; నా జన్మంబు= నా పుట్టుక; పరమ రహస్యంబున్+ఐ+ఉన్న+అది= మిక్కిలి గూఢంగా ఉన్నది; దీనిన్= నా జన్మాన్ని; ప్రకాశంబు చేయుట= వెల్లడి చేయటం; మనకున్+ఎంత మేలు?= మనకు ఏమాత్రం మేలు?; అట్లున్+కాక= అంతేకాక.

**తాత్పర్యం:** సూర్యభగవానుని ప్రసాదంచేత నా జన్మ దూషించదగినది కానప్పటికీ పరమ రహస్యంగా ఉన్నది. దీనిని ఈనాడు వెల్లడి చేయటం మనకేమంత మంచిది? (మంచిది కాదని భావం). అదీకాక.

**ఆ. విజయు విక్రమంబు విఖ్యాతమై యుండ । 'నేను గుంతికొడుక భానుజుండ'**
**ననుచు నతనిఁ గూడ నరిగిన నతనికి । వెఱచి పోయె ననరె? వేయు నేల? 64**

**ప్రతిపదార్థం:** విజయు విక్రమంబు= అర్జునుడి పరాక్రమం; విఖ్యాతము+ఐ+ఉండన్= ప్రసిద్ధమైఉండగా; నేను; కుంతి కొడుకన్= కుంతీదేవి పుత్రుడను; భానుజుండన్= సూర్యుడి అనుగ్రహంతో జన్మించినవాడిని; అనుచున్= అని చెప్పికొంటూ; అతనిన్= అర్జునుడిని; కూడన్+అరిగినన్= కలియటానికి వెళ్ళితే; అతనికిన్= ఆ పార్థుడికి; వెఱచి పోయెన్= కర్ణుడు భయపడి అతడిని చేరబోయాడు; అనరె?= అని లోకులు పలుకరా?; వేయున్+ఏల?= ఇక పలుమాట లెందుకు?

**తాత్పర్యం:** పలుమాటలెందుకు? పార్థుడి పరాక్రమం ప్రసిద్ధమైఉండగా 'నేను కుంతీతనయుడిని, భానుడి వరప్రసాదం వల్ల జనించిన వాడిని' అని చెప్పుకొంటూ అతడిని చేరబోతే, లోకులు నన్ను భయపడి పాండవులను చేరబోయాడని అనక మానరు.

**క. కడిఁది పగఱ నేఁ దెప్పగఁ । గడవంగా నీఁదఁదలఁచు కౌరవనాథుం**
**జెడుఁ గాక యంచు నిత్తఱి । విడువఁదగునె? యతని వలన వెలసిన వాఁడన్. 65**

**ప్రతిపదార్థం:** కడిఁది పగఱన్= సాధించరాని శత్రువులను (దుస్తర శత్రువులనే సముద్రాన్ని); నేన్= నేను; తెప్పగన్= నౌకగా; కడవంగాన్+ఈఁదన్+తలఁచు= ఈది గట్టుచేరనెంచే; కౌరవనాథున్= దుర్యోధనుడిని; చెడున్+కాక+అంచున్= నాశనం కానిమ్మని; ఈ+తఱిన్= అక్కర గలిగిన ఈ సమయంలో; అతని వలనన్= కురుపతి వలన; వెలసినవాఁడన్= ప్రసిద్ధిగాంచిన వాడనైన నేను; విడువన్+తగునె?= వదలిపెట్టటం భావ్యమా?

**తాత్పర్యం:** దుస్తర విరోధులనే సముద్రాన్ని నన్ను తెప్పగా చేసికొని ఈది గట్టు చేరవలెననే విశ్వాసంతో ఉన్న ఆ కురుపతిని అవసర సమయంలో వదలివేయటం నాకు ధర్మం కాదు. ఆయన వల్లనే నేను ప్రసిద్ధి కెక్కాను.

**క. కౌరవులచేతఁ గుడిచిన । వారికి నిది సమయ; మెట్టివారును సంగ్రా**
**మారంభంబునఁ బాయుదు । రే? రాజులు మనలఁ దిట్టరే యట్లయినన్. 66**

**ప్రతిపదార్థం:** కౌరవులచేతన్= కౌరవులవలన; కుడిచిన వారికిన్= మనుగడ సాగిస్తున్నవారికి; ఇది సమయము= సాయపడటానికి ఇది తగిన వేళ; ఎట్టివారును= ఎంత కృతఘ్నులైనా; సంగ్రామ+ఆరంభంబునన్= యుద్ధ ప్రారంభంలో; పాయుదురే?= వీడుదురా?; అట్లు+అయినన్= అట్లా చేస్తే; మనలన్= మనలను; రాజులు= ప్రభువులు; తిట్టరే?= దూషించరా?

**తాత్పర్యం:** కౌరవుల తిండి తిని జీవిస్తున్నవారు వారికి సాయపడటానికి ఇది తగిన సమయం. ఎంత విశ్వాసం లేనివారైనా యుద్ధం మొదలయ్యేటప్పుడు తమ పక్షాన్ని వదలి వస్తారా? ఇట్లా చేస్తే తోడ్పాటు చూపవచ్చిన రాజులు మనలను నిందించరా?

**వ. ఏ నవశ్యంబును దుర్యోధనునకై నీకొడుకులతోడం బెనంగుదు. 67**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; అవశ్యంబును= తప్పక; దుర్యోధనునకై= సుయోధనుడి కొరకు; నీ కొడుకుల తోడన్; పెనంగుదున్= పోరాడతాను.

**తాత్పర్యం:** నేను దుర్యోధనుడి కొరకు తప్పక నీ కుమారులతో పోరాడుతాను.

**ఉ. నీ పలు కెంత వోలినను నిర్ణయ మిట్టిద కాని యొండు లేఁ;**
**దీపని మీఁది భారమున నీ విట వచ్చితిగాన పాండవుల్**
**సేపడిరేనిఁ జంప; నఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ**
**గోపము పెద్ద; వాఁడు సమకూరిన బిట్టఱఁ జంపుదుం జుమీ! 68**

**ప్రతిపదార్థం:** నీ పలుకు+ నీ వచనము; ఎంత పోలినను= ఎంత తగియున్నను; నిర్ణయము= నా నిశ్చయము; ఇట్టిది+అ కాని+ఒండులేదు= ఇదేగాని మరియొకటికాదు; ఈ పనిమీఁది భారమునన్= ఈ కార్యభారం వహించి; ఈవు= నీవు; ఇటవచ్చితి(వి)= ఇక్కడికి వచ్చావు; కాన= కనుక; పాండవుల్= ధర్మజాదులు; చేపడిరేనిన్= నా చేతికి దొరకినా; చంపన్= సంహరించను; అఱ చేయక చెప్పెదన్= కపటం లేకుండా పలుకుతున్నాను; సవ్యసాచిపైన్= అర్జునుడి మీఁద; కోపము పెద్ద= నాకు మిక్కిలి కోపం; వాఁడు= అతడు-అర్జునుడు; సమకూరినన్= లభిస్తే; బిట్టఱన్= శీఘ్రంగా; చంపుదున్+చుమీ!= సంహరిస్తాను సుమా!

**తాత్పర్యం:** నీ మాట ఎంత ధర్మయుక్తంగా ఉన్నప్పటికీ నా నిశ్చయమింతే. ఇక మారదు. నీవు ఈ కార్యభారం మీద నా దగ్గరకు వచ్చావు. కపటం లేక చెపుతున్నాను. ధర్మజాదులు నా చేతికి దొరకితే నేను వారిని చంపను. అర్జునుడి మీద నాకు క్రోధం మెండు. వాడు తటస్థపడితే మాత్రం చంపి తీరుతాను.

**ఆ. సవ్యసాచిచేతఁ జచ్చుటయును గీర్తి । కరమ యతఁడు లోనుగాఁగ నేవు**
**రేను లోనుగాఁగ నేవురుగాని నీ । కొడుకు లార్వురనుట విడువు'మింక. 69**

**ప్రతిపదార్థం:** సవ్యసాచి చేతన్= అర్జునుడిచేత; చచ్చుటయును= మరణించటం కూడ; కీర్తికరము+అ= నాకు యశస్సునే కలిగిస్తుంది; అతఁడు లోను+కాఁగన్= అతనితో కూడ; ఏవురు= నీకు ఐదుమందే; ఏను లోనుగాఁగన్= అతడు పోతే నాతో కూడ; ఏవురు+కాని= ఐదుమందే తప్ప; నీ కొడుకులు= నీ తనయులు; ఆర్వురు+అనుట= ఆరుమంది అనటం; ఇంకన్+ విడువుము= ఇక మానుము.

**తాత్పర్యం:** అర్జునుడి చేతిలో నేను చావటం కూడ కీర్తికరమే. నేను పోయినప్పుడు అతడితో కూడ నీకు ఐదుమందే కొడుకులు. అతడు పోతే నాతో కూడ నీకు ఐదుమందే అవుతారు గాని, ఆరుమంది కొడుకు లనటం ఇక మానుకొమ్మ!'

**చ. అనుటయు నప్డు గొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని**
**ట్లను 'నిది దైవసంఘటన మక్కట! యెట్లును దప్ప నేర్చునే?**
**యనుపమ సత్యవిస్ఫురణ నాడినమాట మఱాకుమన్న! నీ**
**యనుజుల నల్వురం గడపు; మర్జునుఁ జేఁతకు సమ్మతించితిన్. 70**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని కర్ణుడు పలుకగా; అప్డు= ఆ వేళ; గొంతి= కుంతీదేవి; హృదయంబునన్= మదిలో; శోకము నివ్వటిల్లన్= దుఃఖం నిండగా; ఇట్లు+అనున్= ఈ తీరున పల్కింది; ఇది దైవ సంఘటనము= ఇది భగవన్నిర్ణయం; ఎట్లును= ఏ రీతిగానైనా; తప్పన్+నేర్చునే?= తప్పిపోదుగదా!; అనుపమ సత్య విస్ఫురణన్= సాటిలేని సత్యం తోచేటట్లు; ఆడిన మాట= పలికిన పలుకు; మఱాకుము+అన్న!= వత్సా! మరచిపోవద్దు; నీ+అనుజులన్+నల్వురన్= నీ తమ్ములు నలుగురినీ; కడపుము= వదలిపెట్టుము; అర్జునున్+చేఁతకున్= పార్థుడి విషయంలో నీవు చేసే చేతకు; సమ్మతించితిన్= ఒప్పుకొన్నాను.

**తాత్పర్యం:** కర్ణు డట్లా పలుకగా కుంతి హృదయంలో దుఃఖమతిశయించగా ఇట్లా అన్నది: 'ఇది భగవత్సంకల్పం. ఎట్లాగూ దీనిని తప్పించ శక్యం కాదు. నీవు సాటిలేని సత్యం ప్రకాశించేటట్లు పలికిన పలుకులు మరచిపోవద్దు. నీ నలుగురు తమ్ములను చంపక వదలి పెట్టుము. యుద్ధం చేసి అర్జునుడిని సంహరించటానికి నేను అంగీకరించాను.'

**ఆ. అనుచుఁ గౌఁగిలింప నర్కజుం 'డట్ల కా' । కని ప్రియంబు మెఱయ వినతుఁ డైన**
**నరిగె సదనమునకు నద్దేవి; యతఁడును । జనియె నిజనివాసమునకుఁ బ్రీతి. 71**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని; కౌఁగిలింపన్= ఆలింగనం చేసికోగా; అర్కజుండు= సూర్యసూతి; అట్లకాక+అని= అట్లేఅని; ప్రియంబు మెఱయన్= ప్రేమ ప్రకాశించేటట్లు; వినతుఁడు+ఐనన్= నమస్కరించగా; ఆ దేవి= కుంతీదేవి; సదనమునకున్= తన నివాసానికి; అరిగెన్= వెళ్ళింది; అతఁడును= ఆ రాధేయుడు కూడ; నిజనివాసమునకున్= తన మందిరానికి; ప్రీతిన్= సంతోషంతో; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** కుంతీదేవి ఆవిధంగా పలికి కర్ణుడిని కౌగిలించుకొన్నది. అతడు 'అలాగే' అని పలికి, ప్రేమతో ఆమెకు నమస్కరించాడు. తరువాత వారిద్దరూ తమ తమ నివాసాలకు సంతోషంతో వెళ్ళిపోయారు.

**వ. అక్కడ వాసుదేవుం డుచిత ప్రయాణంబుల నుపప్లావ్యంబునకుం జని ధర్మతనయుచేతం బూజితుండయి, భీమసేనాదులు విరాట ద్రుపదముఖ్యులగు తగువారలుఁ దన్నుం గాంచిన వారినెల్ల నభినందించి, కొలువున నుండి యుధిష్ఠిరుతో నిట్లనియె. 72**

**ప్రతిపదార్థం:** అక్కడ; వాసుదేవుండు; ఉచిత ప్రయాణంబులన్= తగిన పయనములతో; ఉపప్లావ్యంబునకున్+చని= పాండవులున్న ఉపప్లావ్యపురికి వెళ్ళి; ధర్మతనయుచేతన్; పూజితుండు+అయి= పూజింపబడినవాడై; భీమసేన+ఆదులు= భీముడు మొదలైనవారు; విరాట ద్రుపద ముఖ్యులు+అగు= విరాట మహారాజు, ద్రుపద మహారాజు మొదలైన; తగువారలున్= అర్హులైనవారునూ; తన్నున్+కాంచినన్= తనను దర్శించగా; వారిన్+ఎల్లన్= వారినందరినీ; అభినందించి= ప్రశంసించి; కొలువునన్+ఉండి= సభలో నుండి; యుధిష్ఠిరుతోన్= ధర్మజుడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు తగిన ప్రయాణాలతో హస్తినాపురి నుండి కదలి ఉపప్లావ్యానికి వచ్చి అక్కడ ధర్మజుడి పూజలందుకొన్నాడు. భీముడు మొదలైనవారు, విరాటుడు ద్రుపదుడు మున్నగు అర్హులైనవారు తనను దర్శించగా, వారినందరినీ మెచ్చుకొన్నాడు. సభలో ఆసీనుడై ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**తే.** **'ధార్తరాష్ట్ర లున్మత్తులు; తగిన పలుకు । లేల విని సంధి సేయుట కిచ్చగింతు?**
**రెదిరిఁ దమ్మును నెఱిఁగిర యేని వార । లంత లంతలు చేయుదు రయ్య నాఁడు?'** 73

**ప్రతిపదార్థం:** ధార్తరాష్ట్రులు= దుర్యోధనాదులు; ఉన్మత్తులు= మదం చేత కన్ను మిన్ను కాననివారు; తగిన పలుకులు= అనుకూలాలైన మాటలు; ఏల విని= ఎందులకు ఆలకించి; సంధి చేయుటకున్= సంధి చేయటానికి; ఇచ్చగింతురు?= అంగీకరిస్తారు?; ఎదిరిన్= ఎదుటివారి శక్తినీ; తమ్మును= తమ శక్తినీ; ఎఱిఁగిరి+అ+ఏనిన్= తెలిసినవారే అయితే; నాఁడు= జూదమాడేవేళ; అంతలు+అంతలు= అంతంత నీచకృత్యాలు; చేయుదురు+అయ్య!= చేసేవారా?

**తాత్పర్యం:** దుర్యోధనాదులు పొగరుతో కన్నుమిన్ను కానకున్నారు. న్యాయంగా మాటాడే మాటలు విని సంధి చేయటానికి వారెందు కంగీకరిస్తారు? తమ బలం, ఎదిరి బలం ఎరిగినవారైతే వారు ఆనాడు సభలో అంతంత నీచకృత్యాలకు పాల్పడుతారా?'

**వ.** **అని యెల్లవారును వినఁ దనపోయివచ్చిన కార్యంబు తెఱంగెఱింగించి, పథిశ్రమంబు పుచ్చువాఁడయి పుండరీకాక్షుండు నిజమందిరంబున కరిగె; నాఁటి రాత్రి ధర్మనందనుం డనుజ సహితంబుగా నుచిత ప్రదేశంబున నుండి గోవిందుని రావించి 'నీవు సుయోధనునితోఁ బలికిన చందం బెయ్యది? యతండేమి విధంబున నుత్తరం బిచ్చె?' నని యడిగిన నచ్యుతుఁ డిట్లనియె.** 74

**ప్రతిపదార్థం:** అని; ఎల్లవారును= సభలో ఉన్నవారంతా; వినన్= ఆలింపగా; తన పోయి వచ్చిన కార్యంబు తెఱంగు= తాను హస్తినాపురికి వెళ్ళివచ్చిన విషయమంతా; ఎఱింగించి= తెలిపి; పథిశ్రమంబు పుచ్చువాఁడు+అయి= దారి బడలిక తొలగించుకొనటానికి; పుండరీక+అక్షుండు; నిజమందిరంబునకున్= తన నివాసానికి; అరిగెన్= వెళ్ళాడు; నాఁటి రాత్రి= ఆ రేయి; ధర్మనందనుండు; అనుజసహితంబుగాన్= తమ్ముళ్ళతో కూడి; ఉచిత ప్రదేశంబునన్+ఉండి= తగిన ప్రదేశంలో చేరి; గోవిందునిన్ రావించి= ముకుందుడిని రప్పించుకొని; నీవు సుయోధనునితోన్ పలికిన; చందంబు= విధం; ఏ+అది?= ఎట్టిది?; అతండు+ఏమి, విధంబునన్; ఉత్తరంబు+ఇచ్చెన్= బదులు చెప్పాడు?; అని; అడిగినన్; అచ్యుతుఁడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని అక్కడున్న వారంతా వింటుండగా తాను హస్తినాపురికి వెళ్ళి వచ్చిన పని తీరంతా తెలిపి, దారి బడలిక తొలగించు కొనేందుకు, కమలాక్షుడు తన నివాసానికి వెళ్ళాడు. ఆనాటి రాత్రి ధర్మరాజు తమ్ముళ్ళతో తగిన ప్రదేశంలో ఉండి ముకుందుని అక్కడికి రప్పించి 'నీవు దుర్యోధనుడితో అక్కడ ఏమి మాట్లాడావో, అందుకు అతడు ఏమి సమాధానం చెప్పాడో తెల్పవలసిం'దని కోరాడు. అందుకు శౌరి ఇట్లు అన్నాడు:

శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ గౌరవసభం బుట్టిన విశేషంబు దెలుపుట (సం. 5-145-1)

**క. 'కయ్యము గాని తెఱంగున । నెయ్యంబగు నట్లుగాఁగ నెఱిఁ బలికితి నే**
**నెయ్యది సుఖంబు పథ్యం । బెయ్యది యరయంగఁ దథ్య మెయ్యది దానిన్. 75**

**ప్రతిపదార్థం:** కయ్యము కాని తెఱంగునన్= యుద్ధం జరుగని విధంగా; నెయ్యంబు+అగునట్లు కాఁగన్= స్నేహం కలిగేటట్లుగా; ఎయ్యది సుఖంబు= ఏది సుఖం చేకూరుస్తుందో; పథ్యంబు+ఎయ్యది= ఏది హితకరమో; తథ్యము+ఎయ్యది?= సత్యమైనదేదో; దానిన్= దానిని; అరయంగన్= వారు తెలిసికొనేటట్లుగా; నేను= నేను; నెఱిన్+పలికితిన్= న్యాయంగా వచించాను.

**తాత్పర్యం:** 'ధర్మజా! వారికీ మీకూ యుద్ధం జరుగకుండేటట్లు, స్నేహం కలిగేటట్లు, ఏది ఉభయులకు సుఖం కలిగిస్తుందో, ఏది మేలు చేస్తుందో, ఏది సత్యమైనదో దానిని వారికి విస్పష్టంగా తెలిసేటట్లు న్యాయం తప్పక వచించాను.

**తే. బహు విధంబులఁ బలుకు నా పలుకు లెల్లఁ । జీఁదక న్నిడి తన పెడచెవులఁ బెట్టి**
**యీఱతాఱలు మఱుమాట లిచ్చి యపహ । సించె; దుర్యోధనుఁడు వేయుఁ జెప్పనేల?' 76**

**ప్రతిపదార్థం:** బహు విధంబులన్= అనేక రీతుల; పలుకు నా పలుకులు+ఎల్లన్= చెప్పిన నా మాట లన్నింటినీ; చీఁదకన్ను+ఇడి= (చిందపక్షివలె) ఆవేశపూరితమైన చూపులతో చూస్తూ; తన పెడచెవులన్+పెట్టి= తన చెవి వెనుక భాగాన ఇడి - (అనగా తన చెవులలో చొరనీయక); ఈఱతాఱలు= వక్రములైనట్టి; మఱుమాటలు+ఇచ్చి= బదులుపలుకులు పలికి; దుర్యోధనుఁడు= కురురాజు; అపహసించెన్= పరిహాసం చేశాడు; వేయున్+చెప్పన్+ఏల?= ఇక పలుమాటలతో ప్రయోజన మేముంది?

**తాత్పర్యం:** అనేక విధాల పలుకుతున్న నా పలుకులన్నీ చీదకన్నువేసి చూస్తూ తన చెవులలో చొరనీయక వంకర జవాబులు చెపుతూ దుర్యోధనుడు నన్ను గేలి చేశాడు. అత డాడిన మాటలు మీకు చెప్పి లాభ మేముంది?'

**విశేషం:** చీఁదకన్నిడి - చీఁద కనువడి (మున్నంగి శర్మపాఠం) - శ్రద్ధలేని దృష్టి పెట్టి - సరిగా చూడక. దీనికి మూలం. "మయా నాగపురం గత్వా సభాయాం ధృతరాష్ట్రజః తథ్యం పథ్యం హితం చోక్తో న చ గృహ్ణాతి దుర్మతిః" నచ గృహ్ణాతి - అనేదానికి తిక్కన తెలుగు 'చీఁద కన్నిడి.'

**క. అనిన విని ధర్మజుం డి । ట్లను 'నప్పుడు తండ్రి యుచిత మాడఁడె? భీష్ముం**
**డును గురుఁడు విదురుఁడుం ద । క్కిన పెద్దలుఁ బలుకరే తగిన చందమునన్? 77**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= శ్రీకృష్ణుడు అట్లా పలుకగా; ఆలించి= విని; ధర్మజుండు= ధర్మరాజు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అప్పుడు= దుర్యోధనుడు అట్లా మాటాడుతున్న సమయంలో; తండ్రి= ధృతరాష్ట్రుడు; ఉచితము+ఆడఁడు+ఎ= యుక్తముగా చెప్పలేదా? భీష్ముండును, గురుఁడున్, విదురుఁడున్= ఈ ముగ్గురున్నూ; తక్కిన పెద్దలున్= సభలో పెద్దలైన ఇతరులును; తగిన చందమునన్= తగిన రీతిని; పలుకరే?= మాటాడలేదా?

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి పలుకులు విని ధర్మజు డిట్లా అన్నాడు: 'గోవిందా! దుర్యోధనుడు అట్లా వంకర మాట లాడుతున్నవేళ ధృతరాష్ట్రుడు సముచితంగా పలుకలేదా? భీష్ముడు, ద్రోణుడు, విదురుడు, సభలోనున్న ఇతరులైన పెద్దలు తగిన విధంగా మాటాడలేదా?

**క. నావుడు హరి యిట్లను 'స । ద్భావమున విచిత్రవీర్యతనయుఁడుఁ దగ నా**
**నా విధములఁ జెప్పిన సం । భావన వినఁ డతఁడు, పలుకుఁ బ్రతికూలంబుల్. 78**

**ప్రతిపదార్థం:** నావుడున్= ధర్మజుడట్లా అడుగగా; హరి= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; సత్+భావమునన్= మంచి తలంపుతో; విచిత్రవీర్య తనయుఁడున్= విచిత్రవీర్యుడి కుమారుడైన ధృతరాష్ట్రుడు; తగన్= ఒప్పుగా; నానా విధములన్= పలురీతుల; చెప్పినన్= చెప్పినప్పటికిన్నీ; సంభావనన్= ఆదరంతో; అతఁడు= సుయోధనుడు; వినఁడు= ఆలకించలేదు; ప్రతికూలంబుల్= అనుకూలాలు కాని మాటలు; పలుకున్= పలికాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా ప్రశ్నించగా శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు. 'మంచి మనసుతో ధృతరాష్ట్రుడు చక్కగా, పలు విధాల చెప్పినప్పటికీ ఆ మాటలను ఆదరంతో దుర్యోధనుడు విన్నవాడు కాడు. అందుకు విరుద్ధంగానే పలికాడు.

**సీ. శంతను పుణ్యవంశం బంకురించిన । చందంబు, నంబికానందనుండు**
**జాత్యంధుఁడై యుండ సామ్రాజ్యమంతయుఁ । బాలించి పాండునృపాలుఁ డతనిఁ**
**గొలిచి యుండుటయును, గురుకులంబున కెల్ల । దేజంబుగా మీరు దిగ్విజయము**
**సేసి కావించిన సిరి వారు వంచనఁ । గొనుటయు, సత్య మకుంఠితముగ**

**తే. నీవు సమయంబు నడపిన నెఱియుఁ దండ్రి । పాలు మీకు నీఁదగుటయుఁ, బాడిలేమి**
**నరయఁ జెడుదురు కౌరవు లనియుఁ, బెద్ద । లెల్లఁ జెప్పిరి మొగమోట యింతలేక. 79**

**ప్రతిపదార్థం:** శంతను పుణ్యవంశంబు= శంతను మహారాజుయొక్క పవిత్రమైన వంశం; అంకురించిన చందంబు= మొలకెత్తిన విధం; అంబికా నందనుండు= అంబిక యొక్క కుమారుడైన ధృతరాష్ట్రుడు; జాత్యంధుఁడై+ఉండెన్= పుట్టుగ్రుడ్డియై ఉండగా; పాండు నృపాలుఁడు= తమ్ముడైన పాండురాజు; సామ్రాజ్యము+అంతయున్+పాలించి= సామ్రాజ్యము నెల్ల ఏలుతూ; అతనిన్= పుట్టుగ్రుడ్డియైన అన్నను; కొలిచి+ఉండుటయున్= సేవిస్తూ ఉండటం; కురు కులంబునకున్+ఎల్లన్= కౌరవ వంశమున కంతటికినీ; తేజంబుగాన్= వన్నె కలుగునట్లుగా, మీరు= మీరలు; దిక్+విజయము చేసి= దిక్కులను జయించి; కావించిన సిరిన్= గడించిన సంపదను; వారు= దుర్యోధనాదులు; వంచనన్+కొనుటయున్= మోసముతో హరించుటయునూ; సత్యము+అకుంఠితముగన్= సత్యము మొక్క పోకుండ; నీవు= నీవు; సమయంబు నడపిన నెఱియున్= ప్రతిజ్ఞాకాలం పదమూడేండ్లు చెల్లించిన క్రమమునూ; తండ్రి పాలు= మీ జనకుని రాజ్యభాగం; మీకున్= మీకు; ఈన్+తగుటయున్= ఇచ్చుట ధర్మమనియూ; పాడిలేమిన్= న్యాయము తమ పట్ల లేనందున; అరయన్= ఆలోచించి చూచినట్లయితే; కౌరవులు+ చెడుదురు+అనియున్= దుర్యోధనాదులు పాడైపోతారనియూ; మొగమోట= దాక్షిణ్యము; ఇంతలేక= రవంతయు లేకుండ; పెద్దలు+ఎల్లన్= సభలోని పెద్దవారంతా; చెప్పిరి= దుర్యోధనునకు తెల్పినారు.

**తాత్పర్యం:** శంతను మహారాజు పవిత్ర వంశం అంతరించకుండ చిగిరించిన క్రమం, ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డియై ఉండగా పాండురాజు సామ్రాజ్యమంతటినీ తానే పరిపాలిస్తూ అంధుడైన అన్నను భక్తితో కొలిచి ఉండటం, కురువంశానికెల్ల వన్నె కలిగేటట్లు మీరు దిక్కులన్నీ జయించి గడించిన సంపదనంతా కపటద్యూతంలో వారు అపహరించటం, సత్యం తప్పక నీవు ప్రతిజ్ఞాకాలం పదమూడేండ్లు ధర్మయుక్తంగా గడపడం, మీ తండ్రి పుడమి

పాలు మీకు ఇవ్వదగిఉండటం, న్యాయం వదలి మీ రాజ్యభాగం కూడ హరించదలిస్తే, కౌరవులందరూ నాశనమవుతారని సభలోని పూజ్యులంతా మోమోటపడకుండా చెప్పారు.

**క. అలయక యందఱుఁ జెప్పం । గల యంతయుఁ జెప్పి; రతఁడు కటకటఁబడి య**
**క్కొలువు వెడలి పోయెం ద । మ్ములుఁ గర్ణుఁడు రాజలోకముం దో నరుగన్. 80**

**ప్రతిపదార్థం:** అలయక= విసుగు చెందక; అందఱున్= సభలోని పూజ్యులందరూ; చెప్పన్+కల+అంతయున్= తాము చెప్పగలిగినదంతా; చెప్పిరి= చెప్పారు; అతఁడు= సుయోధనుడు; కటకటన్+పడి= వారి హితబోధకు కలతచెందుతూ; తమ్ములన్= దుశ్శాసనాదులూ; కర్ణుఁడున్= రాధేయుడూ; రాజలోకమున్= యుద్ధానికి సాయపడవచ్చిన రాజుల సమూహం; తోన్+అరుగన్= వెంటరాగా; ఆ+కొలువు వెడలిపోయెన్= ఆ సభనుండి నిష్క్రమించాడు.

**తాత్పర్యం:** సభలోని పెద్దలంతా ఏమాత్రం విసుగుకొనకుండ చెప్పవలసినదంతా చెప్పనే చెప్పారు. కాని, దుర్యోధనుడు వారి మాటలకు సంకటపడుతూ, తమ్ముళ్ళూ, కర్ణుడూ, యుద్ధంలో తనకు సాయపడటానికి వచ్చిన రాజులూ తన్ను అనుసరించగా సభనుండి లేచి వెళ్ళాడు.

**వ. ఇట్లు కొడుకు ముష్కరుండై యరిగిన ధృతరాష్ట్రుండు గాంధారి రావించి. 81**

**ప్రతిపదార్థం:** ఇట్లు; కొడుకు; ముష్కరుండు+ఐ= కుటిలుడై; అరిగినన్= వెళ్ళగా; ధృతరాష్ట్రుండు; గాంధారినిన్; రావించి-

**తాత్పర్యం:** ఇట్లా కుటిలబుద్ధితో కొడుకు సభలోనుండి లేచి వెళ్ళగా, ధృతరాష్ట్రుడు గాంధారిని కొలువుకూటానికి పిలిపించి.

**క. తగ విదురుఁ బంచి యాతని । మగుడఁగఁ బిలిపించె; నా యమయుఁ దనయునకున్**
**వగయును గూర్మియు వెరవును । మిగిలిన వచనముల సంధి మెయికొనఁ జెప్పెన్. 82**

**ప్రతిపదార్థం:** తగన్= ఒప్పుగా; విదురున్+పంచి= విదురుడిని పంపి; ఆతనిన్= సుయోధనుడిని; మగుడఁగన్= మరల; పిలిపించెన్= సభకు రప్పించాడు; ఆ+అమయున్= ఆ గాంధారీదేవి కూడ; తనయునకున్= తన కుమారుడికి; వగయును= దుఃఖాన్నీ; కూర్మియున్= ప్రేమనూ; వెరవును= జీవనోపాయాన్నీ; మిగిలిన= అతిశయించిన; వచనములన్= వాక్కులచేత; సంధి మెయికొనన్+చెప్పెన్= సంధికి అంగీకరించేటట్లు చెప్పింది.

**తాత్పర్యం:** అటు పిమ్మట ధృతరాష్ట్రుడు విదురుడిని పంపి దుర్యోధనుడిని మరల సభకు పిలిపించాడు. గాంధారి తన కుమారుడు సంధికి సమ్మతించేటట్లు తన మాటలలో శోకం, ప్రేమ, ఉపాయం నెలకొనగా చెప్పింది.

**వ. ఎవ్వ రెంత సెప్పినను గైకొనక కడంగి దుర్యోధనుండు దనకుం గలవారల నెల్లను గురుక్షేత్రంబునకు నడవుండని చెప్పంబనిచె; భీష్ముని సేనా ముఖంబు సేసికొని యెత్తి విడియం గలవాఁ; డిది ధార్తరాష్ట్రుల నిశ్చయం; బేనును నా యోపినంత సామవాదంబు లాడితి; నారదాది మహామునులను సుయోధనునకు బుద్ధులు సెప్పునట్లు సేసితి; నేమి చెప్పినను నెంతటం బోకున్నం గినుక దెచ్చికొని జంకించియు భంగించియు ధిక్కరించియుఁ దృణీకరించియుం జూచితిఁ గార్యంబు భగ్నంబగుట కొల్లక వెండియు శాంత వచనంబులు**

**వలికితి; నతం డశక్త దుర్జనత సేయం జూచిన నమానుషంబు లగువానిం గొన్ని వెడమాయలం బన్ని పెక్కుపోకలం బోయితి నెన్ని భంగుల సంధియ కావలయునని పొరలంగలయంతయుంబొరలితి; నప్పాపాత్ముం డెట్లునుం జక్కంబడక తన చలంబుతోన పొట్టుపొరలయ్యుఁ గయ్యంబు వొడుచుంగాని, యవశ్యంబును రాజ్యంబు పాలిచ్చు వాఁడు గాఁడు; కౌరవుల యెడ దండంబు దక్క నొం డుపాయంబు లేదు; మీకుం బోలిన తెఱంగు సేయుం' డనిన ధర్మతనయుండు తమ్ములం గనుంగొని యిట్లనియె: 83**

**ప్రతిపదార్థం:** ఎవ్వరు ఎంత చెప్పినను; కైకొనక= ఆదరించక; కడంగి= పూనుకొని; దుర్యోధనుండు; తనకున్+కలవారలన్+ ఎల్లను= తనకున్నవారి నందరినీ; కురుక్షేత్రంబునకున్; నడవుండు+అని= తరలి వెళ్ళండని; చెప్పన్+పనిచెన్= చెప్పి పంపాడు; భీష్ముని; సేనాముఖంబు చేసికొని= సేనల యొక్క అగ్రభాగమునం దుంచుకొని; ఎత్తి విడియన్+కలవాఁడు= యుద్ధానికి సైన్యంతో దిగుతాడు; ఇది ధార్తరాష్ట్రుల నిశ్చయంబు= ఇది కౌరవుల నిర్ణయం; ఏనును= నేను కూడ; నా+ఓపిన+అంత= నాకు శక్తిగల్గిన మేరకు; సామవాదంబులు+ఆడితిన్= హితవచనాలు పలికాను; నారద+ఆది మహామునులను= నారదుడు మున్నగు మహర్షులను కూడ; సుయోధనునకున్; బుద్ధులు చెప్పునట్లు చేసితిన్= నీతులు చెప్పేటట్లు చేశాను; ఏమి చెప్పినను; ఎంతటన్+పోక+ఉన్నన్= ఏ దారికీ రాకుండగా; కినుక తెచ్చికొని= కోపం వహించి; జంకించియున్= బెదిరించియు; భంగించియున్= అవమానించియు; ధిక్కరించియున్= తిరస్కరించియు; తృణీకరించియున్= అలక్ష్యం చేసియు; చూచితిన్= పనిని సాధించ యత్నించాను; కార్యంబు భగ్నంబు+అగుటకున్= పని చెడటానికి; ఒల్లక= ఇష్టపడక; వెండియున్= మరల; శాంత వచనంబులు పలికితిన్= ప్రసన్న వాక్యాలాడాను; అతండు= సుయోధనుడు; అశక్త దుర్జనత+చేయన్+చూచినన్= తనకు శక్తి లేనందున దౌర్జన్యానికి పూనుకోగా; అమానుషంబులు+అగువానిన్= మానవాతీతాలైనట్టి; కొన్ని వెడమాయలన్+పన్ని= కొన్ని వింత మాయలు కల్పించి; పెక్కుపోకలన్+పోయితిన్= పలుభంగుల ప్రవర్తించాను; ఎన్ని భంగులన్= సర్వవిధాలా; సంధి+అ కావలయున్+అని= సంధి యే పొసగవలెనని; పొరలన్+కలయంతయున్+పొరలితిన్= ఎంతవరకు పాటుపడాలో అంతవరకూ పాటుపడ్డాను; ఆ+పాప+ఆత్ముండు= ఆ దురితచిత్తుడు; ఎట్లునున్= ఏ విధంగానూ; చక్కంబడక= దారికి రాక; తన చలంబుతోన్+అ= తన మాత్సర్యంతోనే; పొట్టుపొరలు+అయ్యున్= పీడితుడైనప్పటికిన్నీ; కయ్యంబు పొడుచున్+కాని= యుద్ధం సల్పునేగాని; అవశ్యంబును= తప్పకుండా; రాజ్యంబు+పాలు+ఇచ్చువాఁడు కాఁడు= రాజ్యంలో భాగమివ్వడు; కౌరవుల ఎడన్= కౌరవుల పట్ల; దండంబు తక్కన్= దండోపాయము తప్ప; ఒండు= మరొక; ఉపాయంబు లేదు; మీకున్+పోలిన తెఱంగు చేయుండు= మీకు అనుకూలమైన మార్గాన్ని అనుసరించండి; అనినన్; ధర్మతనయుండు; తమ్ములన్; కనుంగొని; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఎవరు ఎన్ని విధాల చెప్పినప్పటికీ వారి మాటలు మన్నించక దుర్యోధనుడు తన పక్షంలోనివారినంతా కురుక్షేత్రానికి తరలిపొండని ఆజ్ఞాపించాడు. భీష్ముడిని సర్వసైన్యాధ్యక్షుడిని చేసి మనపై దాడి సల్పడానికి దిగగలడు. ఇది కౌరవుల నిర్ణయం. నేను నా శక్తి మేరకు మంచి చెప్పాను. అంతేకాదు. నారదాది మహర్షులు సుయోధనుడికి నీతులు గరపేటట్లు చేశాను. ఎవ రేమి చెప్పినప్పటికీ అతడు దారికి రానందున నేను కోపం తెచ్చుకొని బెదరించి, అవమానించి, తిరస్కరించి, చులుకన చేసి కార్యసాఫల్యం కోసం ఎంతో ప్రయత్నించాను. కార్యం చెడిపోతుందేమోనని మళ్ళీ శాంతవచనాలు పలికాను. ఇంత చేసినా దుర్యోధనుడు అశక్త దుర్జనత్వానికి పాల్పడగా అపుడు అమానుషాలైన కొన్ని అద్భుత మాయలు అక్కడ ప్రదర్శించాను. అన్ని విధాల పొత్తుకొరకు పొరలగలంత మేర పొరలాడాను. కాని, ఆ దుష్టచిత్తుడు దుర్యోధనుడు ఏ విధంగానూ చక్కబడక మాత్సర్యంతో, తనకు ఎన్ని బాధలు వచ్చినప్పటికిన్నీ యుద్ధం చేస్తాడేగాని మీకు రాజ్యభాగం మాత్రమివ్వడు. కౌరవుల పట్ల దండోపాయం తప్ప మరేదీ కొరగాదు. మీకు ఎట్లా సమ్మతమో అట్లా చేయండి' అని శ్రీకృష్ణుడు పల్కగా విని ధర్మరాజు తన తమ్ముళ్ళను చూచి ఇట్లా అన్నాడు:

**విశేషం:** రాజు శత్రువులను జయించటానికి ప్రయోగించే సామాదులను ఉపాయాలంటారు. వీటిని- సామం, దానం, భేదం, దండం అంటారు. వీటితో 'ఉపేక్ష' చేర్చి శుక్రుడు ఉపాయాలు ఐదన్నాడు. మాయ, ఉపేక్ష, ఇంద్రజాలం అనే మూటిని సామాదులతో చేరిస్తే సప్తోపాయాలని మరికొందరు పెద్దలంటారు.

1. సామం: ఇది చతురుపాయాలలో మొదటిది. మంచిమాట, శాంతపరచుట, ఓదార్చుట, అనునయించుట. అనుకూల ప్రవర్తన రూపమైన ఈ ఉపాయం ఐదు విధాలు. పరస్పరోపకారం కనిపింప జేయటం, మంచితనం చేయటం, గుణాలను కొనియాడటం, చుట్టరికాన్ని తెలపటం, నేను నీ వాడనని మంచిమాటలాడటం.

2. దానం: ఇది రాజ్యాంగ చతురుపాయాలలో రెండోది. ఇది పంచ విధం. తనకున్న ధనమివ్వటం, ఎక్కడనైనా ధనం తీసికొంటే దానికి తాను అనుకూలుడై ఉండటం, అపూర్వ వస్తువుల నివ్వటం, అన్యుల ధనం పుచ్చుకొనేటట్లు చేయటం, అప్పుతీర్చటం.

3. భేదం: చతురుపాయాలలో మూడోది. శత్రుపక్షంలో పరస్పర విరోధం పెట్టటం.

4. దండం: శత్రువుల పట్ల ప్రయోగించే చతురుపాయాలలో నాల్గవది. ఇది వధించటం, ధనం అపహరించటం, పీడించటం అనే మూడు విధాలుగా ఉంటుంది.

**క. 'కురుసభఁ బుట్టిన చందము । హరి యంతయుఁ జెప్పెఁ; నింక ననుమానము లేఁ;**
**దరి మర్దనమున కయ్యెడు । వెరవుం జేవయును మెఱయ వెడలుఁడు గడఁకన్.' 84**

**ప్రతిపదార్థం:** కురు సభన్= కౌరవుల కొలువు కూటంలో; పుట్టిన చందము= జరిగిన విధం; హరి= నారాయణుడు; అంతయున్+చెప్పెన్= సమస్తం తెల్పినాడు; ఇంకన్= ఇక; అనుమానము లేదు= సందేహం లేదు; అరిమర్దనమునకున్= శాత్రవులను దండించటానికి; అయ్యెడు= వలసినట్టి; వెరవున్= ఉపాయమూ; చేవయున్= శక్తీ; మెఱయన్= ప్రకటమయ్యేటట్లు; కడఁకన్= పూనికతో; వెడలుఁడు= బయలుదేరండి.

**తాత్పర్యం:** 'కౌరవుల కొలువు కూటంలో జరిగిన సంగతినంతా నారాయణుడు సవిస్తరంగా చెప్పాడు గదా! ఇక మనం శంకించ నవసరం లేదు. విరోధులను మట్టుపెట్టటానికి మన శక్తియుక్తులు ప్రస్ఫుటమయేటట్లు పూనిక వహించండి. రణరంగానికి కదలండి.'

**వ. అని పలికి, యజాతశత్రుండు కరుణాయత్తచిత్తుండై యచ్యుతు నాలోకించి. 85**

**ప్రతిపదార్థం:** అని పలికి; అజాతశత్రుండు= ధర్మరాజు; కరుణా+ఆయత్తచిత్తుండు+ఐ= దయకు అధీనమైన మనస్సుకలవాడై; అచ్యుతున్; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఇట్లా ధర్మజుడు తమ్ముళ్ళను ఆదేశించి దయాపరవశ హృదయుడై శ్రీ కృష్ణుడిని చూచి.

**క. 'కురువంశముఁ ద్రుంచుటకుం । జొరఁజాలక నా మనంబు సుడివడియెడు; నే**
**వెరవును దొరకొనదు గదే । సరసీరుహనాభ! పొందు సంపాదింపన్. 86**

**ప్రతిపదార్థం:** సరసీరుహనాభ!= కమలనాభా!; కురువంశమున్= కౌరవజాతిని; త్రుంచుటకున్= నాశనం చేయటానికి; చొరన్+చాలక= యుద్ధంలో ప్రవేశించ నొల్లక; నా మనంబు= నా చిత్తం; సుడి పడియెడున్= పరిభ్రమిస్తున్నది; పొందు= వారితోడి కలయిక; సంపాదింపన్= పొందటానికి; ఏ+వెరవును= ఏ ఉపాయం కూడా; దొరకొనదు+కదే!= లభించక పోయిందిగదా!

**తాత్పర్యం:** 'కృష్ణా! కురువంశం నిర్మూలించటానికి సమ్మతించక నా మనస్సు పరిభ్రమిస్తున్నది. వారితో పొత్తు సాధించడానికి మన కెట్టి మార్గం లభించ లేదుగదా!

**వ. నా మనంబును దమ్ములతలంపును నీ వెఱుంగుదు; ధార్తరాష్ట్రుల చందంబును భీష్మ ద్రోణ విదురాదుల చిత్తంబులును నెఱింగి వచ్చితి; మాకు ధర్మచ్యుతి లేకుండునట్టి కార్యంబు నిశ్చయింపు' మనిన నారాయణుం డిట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** నా మనంబును= నా హృదయం; తమ్ముల తలంపును= నా అనుజుల ఉద్దేశం; నీవు+ఎఱుంగుదు(వు)= నీవు తెలియుదువు; ధార్తరాష్ట్రుల చందంబును= దుర్యోధనాదుల తీరును; భీష్మ ద్రోణ విదుర+ఆదుల చిత్తంబులును= భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మున్నగువారి మనస్సులను; ఎఱింగివచ్చితి(వి)= తెలిసికొని వచ్చావు; మాకున్= మాకు; ధర్మచ్యుతి లేకుండునట్టి కార్యంబు= ధర్మము నుండి జారుపాటు జరుగనట్టి పనిని; నిశ్చయింపుము= నీవే నిర్ణయించుము; అనినన్; నారాయణుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నారాయణా! నా మనస్సెట్టిదో, నా తమ్ముల ఉద్దేశమేమిటో నీకు తెలుసు. అక్కడ దుర్యోధనాదుల తీరు, భీష్మ ద్రోణ విదురాదుల తలపులు తెలిసికొనివచ్చావు. మాకు ధర్మహాని కలుగ కుండునట్టి కార్యమేదో నీవే నిర్ణయించు'మని ధర్మజుడు వేడగా గోవిందు డిట్లాఅన్నాడు:

**ఉ. 'యుద్ధమ కాక కార్యమును నొండొకఁ డెద్దియుఁ గల్గనేర్చునే?**
**బుద్ధులు చెప్ప వాక్యములఁ బోల వినం డననేల? యట్టిచో**
**బద్ధునిఁ జేయఁజూచె ననుఁబట్టి సుయోధనుఁ, డింక నయ్యసం**
**బద్ధునితోడి సంధికి నుపాయము నా మతిఁ దోఁప దెమ్మెయిన్.' 88**

**ప్రతిపదార్థం:** యుద్ధము+అ,కాక= సంగ్రామమే తప్ప; కార్యమునున్= చేయవలసినపని కూడ; ఒండొకఁడు= ఇంకొక్కటి; ఎద్దియున్= ఏదియు; కల్గన్+నేర్చునే?= ఉండగలదా?; బుద్ధులు చెప్ప వాక్యములన్= నీతులు నేర్పే మాటలను; పోలన్= చక్కగా; వినండు+అనన్+ఏల?= అతడు ఆలకించలేదని చెప్పటమెందుకు?; అట్టిచోన్= నేను హితం చెప్పుతూఉండగా; సుయోధనుఁడు= దుర్యోధనుడు; ననున్+పట్టి= నన్ను పట్టుకొని; బద్ధునిన్+చేయన్+చూచెన్= బంధించటానికి యత్నించాడు; ఇంకన్= ఇక; ఆ+అసంబద్ధునితోడి సంధికిన్= ఆ అయోగ్యుడి తోటి పొత్తుకు; ఉపాయము= వెరవు; నా మతిన్= నా మనసులో; ఏ+మెయిన్= ఏ విధంగానూ; తోఁపదు= గోచరించదు.

**తాత్పర్యం:** 'యుద్ధము తప్ప చేయవలసినపని మరొక టేదీ లేదు. నేను చెప్పే నీతివాక్యాలు అతడు వినలేదని అనటం మాత్రమే కాదు. అట్లా నేను హితం చెపుతున్నప్పుడు సుయోధనుడు నన్ను పట్టుకొని బంధింప జూచాడు. ఇక అట్లాంటి అయోగ్యుడితోడి పొత్తుకు ఉపాయమేదో నా మనసుకు స్ఫురించటం లేదు.'

**వ. అని చెప్పి విదురుం డేకాంతంబున నాడినమాటలును, భీష్మద్రోణ బాహ్లికాదులగు పెద్దలకు ధార్తరాష్ట్రుల దెసం బుట్టిన మనఃక్షోభంబును, గుంతి కౌరవులు వినం బలికిన పలుకులుం బ్రకటించి ధర్మపుత్త్రుపైఁ బాపంబు లేకునికిఁ దెలిపి సమరం బవశ్య కర్తవ్యంబుగా నిశ్చయించె; నట్టియెడఁ దమ్ము లన్న మొగంబునం జూడ్కి నిలిపి యూరకుండి; రతండు వారలం గలయం గనుంగొని యిట్లనియె: 89**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; విదురుండు; ఏకాంతంబునన్= రహస్య ప్రదేశంలో; ఆడిన మాటలును= పలికిన పలుకులును; భీష్మద్రోణ బాహ్లిక+ఆదులు+అగు= భీష్ముడు ద్రోణుడు బాహ్లికుడు మున్నగు; పెద్దలకున్= పూజ్యులకు; ధార్తరాష్ట్రుల దెసన్= దుర్యోధనాదులయెడ; పుట్టిన= కలిగిన; మనఃక్షోభంబును= మనస్సులందలి కలతను; కుంతి; కౌరవులు; వినన్= వినేటట్లు; పలికిన పలుకులున్= చెప్పిన మాటలున్నూ; ప్రకటించి= వెల్లడించి; ధర్మపుత్త్రుపైన్= ధర్మరాజు మీద; పాపంబులేక+ఉనికిన్= పాపం లేకుండుటను; తెలిపి= చెప్పి; సమరంబు= యుద్ధం; అవశ్యకర్తవ్యంబుగాన్+నిశ్చయించెన్= తత్క్షణం చేయదగిన పనిగా నిర్ణయించాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; తమ్ములు; అన్న మొగంబునన్; చూడ్కి నిలిపి= దృష్టి సారించి; ఊరక+ఉండిరి; అతండు= ధర్మజుడు; వారలన్= తమ్ములను; కలయన్+కనుంగొని= తేరిపార చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని పలికి శ్రీకృష్ణుడు రహస్య ప్రదేశంలో విదురుడు పల్కిన మాటలూ, భీష్ముడు ద్రోణుడు బాహ్లికుడు మొదలైన పెద్దలకు దుర్యోధనాదుల విషయంలో ఏర్పడిన హృదయ సంక్షోభమూ, కుంతీదేవి కౌరవులు వింటుండగా పలికిన పలుకులూ వెల్లడించి, ధర్మజుపట్ల ఏ పాపం లేదని చెప్పాడు. యుద్ధమే తత్క్షణ కర్తవ్యంగా నిర్ణయించాడు. అప్పుడు తమ్ము లందరూ అన్నగారి ముఖం చూస్తూ మౌనంగా ఉండిపోయారు. అంతట ధర్మపుత్త్రుడు తమ్ముళ్ళను కలయజూచి ఇట్లా అన్నాడు:

**ఉ. 'కౌరవకోటిచేత మన కష్టపుఁబాటు తలంపు వచ్చినం**
**గ్రూరవిచేష్టితంబునకు గొంతి యొడంబడె; బంధువర్గమున్**
**ఘోరముగా వధించుటకుఁ గోల్కొన కున్నది బుద్ధి; మీరు ని**
**ర్ధారణ చేయుఁడా హితము ధర్మము నయ్యెడు వృత్తమెట్టిదో.' 90**

**ప్రతిపదార్థం:** కౌరవ కోటి చేతన్= కౌరవవర్గంవలన; మన కష్టపుఁబాటు= మనం పడిన బాధలు; తలంపు వచ్చినన్= జ్ఞప్తికి రాగా; క్రూర విచేష్టితంబునకున్= కౌరవులను నిర్మూలించే ఘాతుకపు పనికి; గొంతి= కుంతీదేవి; ఒడంబడెన్= సమ్మతించింది; బంధువర్గమున్= చుట్టాల సమూహాన్ని; ఘోరముగాన్= దారుణంగా; వధించుటకున్= చంపటానికి; బుద్ధి= నా మనస్సు; కోల్కొనక+ఉన్నది= ఉత్సాహించటం లేదు; మీరు= తమ్ములైన మీరు; హితము= మేలు; ధర్మము= న్యాయం; అయ్యెడు= కలుగునట్టి; వృత్తము= చర్య (నడవడి); ఎట్టిదో= ఎటువంటిదో; నిర్ధారణ చేయుఁడా= నిర్ణయించండి.

**తాత్పర్యం:** 'కౌరవుల వలన మనం పడిన కష్టాలు స్మృతికి రాగానే మన తల్లి కుంతీదేవి మారణకర్మకు సమ్మతించింది. చుట్టాలను దారుణంగా చంపటానికి మాత్రం నా మనసు ఉత్సాహించటం లేదు. మనకు మేలు గూర్చేదీ, ధర్మయుక్తమైనదీ అయిన నడవడి ఎటువంటిదో మీరే నిర్ధారణ చేయండి.'

**వ. అనిన విని అర్జునుం డతని కిట్లనియె : 91**

**తాత్పర్యం:** అనగా విని అర్జునుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**చ. 'హితమును ధర్మముం దగవు నిట్టిది నా మన మేమి నేర్తు? మ**
**చ్యుతుఁడు సమస్త ధర్మ పరిశోధకుఁ; డా విదురుండుఁ; బాండు భూ**
**పతి సతియుం దగం బలుకు పల్కుల సందియమెల్లఁ బాసె; ని**
**ట్లితఁడు రణంబు చేయుఁ డన నింక విచారము లెల్ల నేటికిన్?' 92**

**ప్రతిపదార్థం:** హితమున్= మేలూ; ధర్మమున్= పుణ్యమూ; తగవున్= న్యాయమూ; ఇట్టిది నాన్= ఇటువంటిదని చెప్పటానికి; మనము+ఏమి నేర్తుము?= మనకేమి తెలియును?; అచ్యుతుఁడు= శ్రీకృష్ణుడు; సమస్త ధర్మ పరిశోధకుఁడు= ఎల్ల ధర్మాలను పరిశీలించిన మహానుభావుడు; ఆ+విదురుండున్= విదురుడును; పాండు భూపతి సతియున్= పాండు మహారాజు దేవేరిఅయిన కుంతియు; తగన్= ఒప్పిదంగా; పలుకు పల్కులన్= నుడివిన మాటలవలన; సందియము+ఎల్లన్+పాసెన్= అనుమానమంతా తొలగిపోయింది; ఇట్లు= ఈ ప్రకారంగా; ఇతఁడు= శ్రీకృష్ణ భగవానుడు; రణంబు చేయుఁడు+అనన్= యుద్ధం చేయండని చెప్పగా; ఇంకన్= మరి; విచారములు+ఎల్లన్= ఆలోచనలన్నీ; ఏటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** 'ఏది హితమో, ఏది ధర్మమో, ఏది న్యాయమో మన కేమి తెలుసు? నారాయణుడు, ఎల్ల ధర్మాలను పరిశీలించినవాడు. ఆ విదురుడు, పాండు మహారాజు పత్ని కుంతీదేవి చక్కగా పలికిన పలుకుల వలన సందేహమంతా తీరిపోయింది. శ్రీకృష్ణ భగవానుడు యుద్ధం చేయండని పల్కగా మనకు వేరే ఆలోచన లెందుకు?'

**ఆ. అనిన 'నట్లుకాక యఖిల ధర్మజ్ఞాన । ఘనుఁడు మనకు నేడుగడయుఁ దాన**
**శౌరి నిశ్చయింప సంశయం బేటికి? । సంఘటింపుఁ డుగ్ర సమర విధము.'** **93**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ఫల్గునుడు పలుకగా; అట్లకాక= సరిసరి; అఖిల ధర్మజ్ఞాన ఘనుఁడు= సమస్త ధర్మముల యొక్క జ్ఞానంచేత గొప్పవాడు; మనకున్= మనందరికీ; ఏడుగడయున్= రక్షకుడును; తాన్+అ= తానే; శౌరి= అట్టి నారాయణుడు; నిశ్చయింపన్= కర్తవ్యం నిర్దేశించగా; ఏటికిన్ సంశయంబు?= అనుమాన మింకెందుకు?; ఉగ్రసమర విధము= దారుణమైన యుద్ధ విధానం; సంఘటింపుఁడు= రూపొందించండి.

**తాత్పర్యం:** పార్థు డట్లా పలుకగానే ధర్మజుడు 'అట్లే కానివ్వండి. సకల ధర్మ స్వరూపం ఎరింగిన మహానుభావుడూ, మనకు రక్షకుడూ వాసుదేవుడే. ఆయన కర్తవ్యం నిర్దేశించిన తరువాత మనకు సందేహం తగదు. దారుణ యుద్ధ సన్నాహాలు సాగించండి.'

**వ. అని యుధిష్ఠిరుండు తమ్ములతో నెట్టకేలకుం దెగువ సెప్పి.** **94**

**ప్రతిపదార్థం:** అని; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; తమ్ములతోన్; ఎట్టకేలకున్= తుదకు; తెగువ చెప్పి= నిర్ణయం తెలిపి.

**తాత్పర్యం:** అంటూ ధర్మరాజు తుదకు యుద్ధం చేయటమే కర్తవ్యమని నిర్ణయించి.

**క. 'బాహాగర్వము వివిధ । వ్యూహ విధిజ్ఞతయుఁ గలిగి యొకరుం డే డ**
**క్షోహిణులు నడపి భీష్మో । త్సాహంబున కోర్చు చాపధరుఁ డెవ్వఁ డొకో!** **95**

**ప్రతిపదార్థం:** బాహాగర్వమున్= భుజ దర్పమూ; వివిధ వ్యూహ విధిజ్ఞతయున్+కలిగి= పలురకాలైన వ్యూహాలు పన్నటం తెలిసి ఉండి; ఒకరుండు= తా నొక్కడే; ఏడు+అక్షోహిణులు నడపి= ఏడక్షౌహిణుల సేనను ముందుకు సాగించి; భీష్మ+ఉత్సాహంబునకున్= పితామహుడి యొక్క సమర విజృంభణానికి; ఓర్చు= తాళగలిగిన; చాపధరుఁడు= విలుకాడు; ఎవ్వఁడు+ఒకో!= మనలో ఎవడున్నాడు?;

**తాత్పర్యం:** 'బాహు బలము, బహువిధాలైన వ్యూహాలను పన్నే విధానంలో తెలివితేటలు గలిగి, ఏడక్షౌహిణుల సైన్యాన్ని నడిపి భీష్ముడి రణోత్సాహాన్ని అరికట్టగలిగిన మేటి విలుకాడు మనలో ఎవ్వడు?

**వ. అట్టివానికి వాహినీ నాయకత్వం బిచ్చి యభిషేకంబు సేయవలయు.' 96**

**ప్రతిపదార్థం:** అట్టివానికిన్= అట్టి వీరాగ్రేసరుడికి; వాహినీ నాయకత్వంబు+ఇచ్చి= సేనాధిపత్యం ఇచ్చి; అభిషేకంబు చేయన్ వలయున్= అభిషేకం జరపాలి.

**తాత్పర్యం:** మనం అటువంటి వీరాగ్రణికి సర్వసేనాధిపత్యం ఇచ్చి అభిషేకించాలి.'

**తే. అనిన సహదేవుఁ డిట్లను 'నధిప! పుత్త్ర । పౌత్ర సోదరవంతుండు బాహువీర్య**
**ఘనుఁడు మన కాశ్రయంబయి మనిచె మత్స్య । దేశపతి గాఁడె సేనాపతిత్వమునకు?' 97**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధర్మజుడు చెప్పగా; సహదేవుఁడు+ఇట్లు+అనున్= సహదేవుడు ఈ విధంగా చెప్పాడు; అధిప!= రాజా! పుత్త్రపౌత్ర సోదరవంతుండు= కొడుకులు, మనుమలు, తోడబుట్టినవారు కలవాడు; బాహువీర్యఘనుఁడు= భుజపరాక్రమంచేత దొడ్డవాడు; మనకున్= మనందరికీ; ఆశ్రయంబు+అయి= ఆధారమై; మనిచెన్= కాపాడాడు; మత్స్యదేశపతి= మత్స్యదేశానికి పాలకుడైన విరాట మహారాజు; సేనాపతిత్వమునకున్= సేనలయొక్క ఆధిపత్యానికి; కాఁడె?= చాలడా?

**తాత్పర్యం:** ధర్మజుడి పలుకులు విని సహదేవుడు ఇట్లా అన్నాడు: 'రాజా! విరాటుడు కొడుకులూ మనుమళ్ళూ సోదరులూ మొదలైన బలగం కలవాడు. బాహుబలంలో గొప్పవాడు. మనకు ఆధారమై ఉండినవాడు. అట్టి మత్స్యమహీపతి సేనాధిపత్యానికి తగడా?'

**వ. అనవుడు నకులుండు. 98**

**తాత్పర్యం:** తరువాత నకులుడు (ఇట్లా అన్నాడు:)

**చ. 'బలఁగముఁ బెంపుఁ, దేజమును, బాహుబలంబును, నగ్గలంబు పె**
**క్కు లెఱుఁగుఁ గార్య ఖడ్గములకుం దగు త్రోవలు; ద్రోణులందు భీ**
**ష్ములదెసఁ గోపముం గలఁ, డమోఘ పరాక్రమశాలి, నీ బలం**
**బుల కధినాథుఁగా ద్రుపదభూపతిఁ బట్టముఁ గట్టు టెట్లొకో!' 99**

**ప్రతిపదార్థం:** బలఁగమున్= పరివారం; పెంపున్= గొప్పతనం; తేజమును= ప్రతాపం; బాహుబలంబునన్= భుజశక్తీ; అగ్గలంబు= అధికంగా ఉన్నవాడు; కార్యఖడ్గములకున్; కార్యవాదానికీ, ఖడ్గవాదానికీ; తగు= తగినట్లు; త్రోవలు= మార్గాలు; పెక్కులు+ఎఱుఁగున్= అనేకాలు తెలిసినవాడు; ద్రోణులందున్= ద్రోణాచార్యుల వారియందును; భీష్ములదెసన్= పితామహులయందును; కోపమున్+కలఁడు= క్రోధం కలవాడు; అమోఘ పరాక్రమశాలి= మొక్కవోని శౌర్యం కల్గినవాడు; అయిన; ద్రుపద భూపతిన్= ద్రుపద మహారాజును; నీ బలంబులకున్= నీ సేనలకు; అధినాథున్+కాన్= అధిపతిగా; పట్టమున్+కట్టుట= అభిషేకించటం; ఎట్లు+ఒకో?= ఎట్లుండునో యోచించండి.

**తాత్పర్యం:** 'పరివారం, గొప్పతనం, ప్రతాపం, భుజవీర్యం అధికంగా కలవాడూ, కార్యఖడ్గ వాదాలకు తగిన అనేక మార్గాలు ఎరిగినవాడూ, ద్రోణ భీష్ములయందు కోపం కలవాడూ, మొక్కవోవని కడిమిగలవాడూ అయిన ద్రుపద మహారాజును నీ సేనలకు అధిపతినిచేస్తే ఎట్లా ఉంటుందో ఆలోచించు.'

వ. అనుటయుం దదనంతరంబ ధనంజయుఁడు. 100

**తాత్పర్యం:** నకులుడు ద్రుపదుడికి సేనాధిపత్యం అప్పగించటం తగునని పలికిన పిమ్మట అర్జునుడు (ఇట్లా అన్నాడు:)

ధృష్టద్యుమ్నాదులకు సేనానాయకత్వంబు నిర్ణయించుట (సం. 5-149-18)

**సీ. 'అగ్నికుండమున ద్రోణాచార్యునకు నాశ । మొనరించుదానికై యుద్భవించె;**
**రథరథ్యములు ధనుర్బాణంబులును దను । త్రాణఖడ్గములు నుద్దామ లీలఁ**
**దనతోన జన్మించె; దహన శిఖామూర్తి । భుజవీర్య విక్రమ స్ఫూర్తిశాలి**
**సైన్యనాథుండు ధృష్టద్యుమ్నుఁ డగునని । తలఁచెద; నాతఁడు దక్క నొరులు**

**తే. భీష్ము తాఁ కోర్వ; రుగ్రంపు బిరుదు ధైర్య । ధన ఘనుండు శిఖండి భీష్మునకు మృత్యు**
**వై జనించినవాఁడు మహాబలుండు । దండనాయకుఁ జేయ నతండు దగును.' 101**

**ప్రతిపదార్థం:** అగ్నికుండమునన్= హోమకుండంలో; ద్రోణ+ఆచార్యునకున్= గురుడైన ద్రోణుడికి; నాశము+ఒనరించు దానికై= నిర్మూలంచేసే పనికై; ఉద్భవించెన్= జన్మించాడు; రథ రథ్యములు= రథమూ, అశ్వాలూ; ధనుః+బాణంబులును= విల్లూ, అమ్ములును; తను త్రాణ ఖడ్గములు= కవచమూ, కత్తీ; ఉద్దామలీలన్= భయంకర విలాసంతో; తనతోన్+అ= తనతోడనే; జన్మించెన్= పుట్టాయి; దహనశిఖామూర్తి= అగ్నిజ్వాలవంటి ఆకృతి కలవాడు; భుజవీర్య విక్రమస్ఫూర్తిశాలి= బాహుబలం, ప్రతాప ప్రకాశం కలవాడు; అయిన; ధృష్టద్యుమ్నుఁడు= ద్రుపదపుత్రుడు; సైన్యనాథుండు+అగున్+అని= సేనాధిపతి కాగలడని; తలఁచెదన్= భావిస్తాను; ఆతఁడు+తక్కన్= ధృష్టద్యుమ్నుడు దప్ప; ఒరులు= ఇతరులు; భీష్ముతాఁకున్+ ఓర్వరు= భీష్ముడి ధాటికి ఆగలేరు; ఉగ్రంపు బిరుదు= అతడు ప్రచండ శూరుడు; ధైర్యధన ఘనుండు= ధైర్యమనే ధనం కలవారిలో గొప్పవాడు; శిఖండి= అంగనాపూర్వుడైన ద్రుపద పుత్రుడు శిఖండి; భీష్మునకున్= గాంగేయునకు; మృత్యువు+ఐ= మిత్తిఅయి; జనించినవాఁడు= పుట్టినవాడు; మహాబలుండు= గొప్ప శక్తి కలవాడు; దండనాయకున్+చేయన్= దళవాయిని చేయటానికి; అతండు తగును= అతడు అర్హుడవుతాడు.

**తాత్పర్యం:** 'ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడిని నిర్మూలించుటకై అగ్నికుండం నుండి పుట్టాడు. అతడితోపాటు రథం, గుర్రాలు, విల్లమ్ములు, కవచఖడ్గాలు అగ్నికుండం నుంచి పుట్టాయి. ధృష్టద్యుమ్నుడు అగ్నిజ్వాలతో సమానమైన ఆకారం కలవాడు. బాహుబలం కలవాడు, ప్రతాపవంతుడు. సర్వసైన్యాధిపతిగా ఉండటానికి తగినవాడని భావిస్తున్నాను. అతడు తప్ప మరొక్కడు భీష్ముడి ధాటికి తట్టుకోలేడు. మరి శిఖండి అంటేనో- భయంకరమైన వీరుడు. ధైర్యశాలి. మిక్కిలి బలం కలవాడు. భీష్ముడి పాలిటికి మిత్తియై పుట్టినట్టివాడు. అతడిని దళవాయిగా చేయవచ్చును.

**విశేషం:** ధృష్టద్యుమ్నుని జన్మవృత్తాంతము: భరద్వాజుడనే మునియొక్క కలశంలో ఉద్భవించిన ద్రోణుడు, పృషతుని పుత్రుడైన ద్రుపదుడు ఆబాల్య మిత్రులు. వారిద్దరు వేదాలు చదివి, ధనుర్వేదం అగ్నివేశుని దగ్గర అభ్యసించారు. ద్రుపదుడు తండ్రి తరువాత పాంచాల దేశానికి ప్రభువైనాడు. ద్రోణుడు తన పుత్రుడైన అశ్వత్థామ పాలకొరకు ధేనువును వేడబోయి, ప్రియసఖుడైన ద్రుపదునిచే పరాభవం పొందినాడు. అతడు హస్తినాపురికి వచ్చి కురుకుమారులకు గురువై, తన వద్ద విలువిద్య నేర్చిన పాండవ కౌరవులతో తన్ను అవమానించిన ద్రుపదుడి నోడించి పట్టుకొని తెండని పలుకగా అర్జునుడు మహాయుద్ధంలో

ద్రుపదుడిని ఓడించి పట్టుకొని వచ్చి గురున కొప్పగించాడు. ద్రోణుడు ఎత్తిపొడుపు మాటలతో అతడిని గేలి చేసి విడిచిపుచ్చాడు. అవమానతప్తుడైన ద్రుపదుడు రణరంగంలో ద్రోణుడిని వధించునట్టి కొడుకును, అర్జుగనుకు దేవి అగునట్టి కొమార్తెను పడయనెంచి గంగాతీరంలో వానప్రస్థులుగా నున్న యాజోపయాజులనే అన్నదమ్ములలో పిన్నవాడైననూ తపోమహిమాఢ్యుడైన ఉపయాజుని ఆశ్రయించాడు. 'నీకు లక్షధేనువు లిస్తాను. నాకు సత్సంతాన మొదవించే క్రతువు చేయించు'మని అర్థించాడు. తనకు ఫలాశ లేదని చెపుతూ 'మా అన్న యాజుడు నీ అభిమతం నెరవేరుస్తాడు వెళ్ళు'మని ఉపయాజుడు చెప్పాడు. పాంచాలుడు యాజుని దర్శించి - 'మునీంద్రా! భారద్వాజుడు నాకు అపాయ మొనరించాడు. ఘోరయుద్ధంలో అతడి నోర్చే అపార పరాక్రముడైన సుతుడినీ, పార్థుని పతిగా బడయునట్టి సుతనూ వాంఛిస్తున్నాను నా కోరిక తీర్చు'మని ప్రార్థించాడు. యాజుడు యాజకత్వానికి అంగీకరించి ద్రుపదుడిచేత పుత్రకామేష్టి చేయించాడు. మంత్రాహుతులతో సంతృప్తుడైన అగ్నిదేవునివలన ద్రుపద మహారాజుకు అగ్నికుండంలోనుండి ఖడ్గచాపాలు ధరించినవాడు; కవచ కిరీటాలంకారుడు, రథారూఢుడు, అగ్నిజ్వాలవంటి శరీరం కలవాడు - ఒక కుమారుడు జనించాడు. అట్లాగే అగ్నికుండం నుండి దివ్యతేజంతో దీపిస్తూ ఒక కుమారి జనించింది. ఇట్లా జన్మించిన ద్రుపద కుమారునకు ధృష్టద్యుమ్నుడనీ, కొమార్తెకు కృష్ణ అనీ ఆకాశవాణి నామకరణం చేసింది. తరువాత ద్రుపదుడు ధృష్టద్యుమ్నుడిని ధనుర్వేద పారంగతుడిని కావించాడు.

**వ. అనవుడు ధర్మనందనుండు గోవిందుం జూపి 'యితండు సకల చరాచర తారతమ్య సంవేది; విశేషించి మనకు నితని మాటలు విజయ మూలంబు; గావున నిమ్మహాత్ముండు నిరూపించినవాడు వరూథినీ ముఖ్యుండు.' 102**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పార్థుడు పలుకగా; ధర్మనందనుండు= ధర్మరాజు; గోవిందున్+చూపి= తమ్ములకు శ్రీకృష్ణుడిని చూపి; ఇతండు= ఈ మహనీయుడు; సకల చర+అచర తారతమ్యసంవేది= సమస్తమైన జంగమ స్థావరాల యొక్క ఎక్కువ తక్కువలు చక్కగ తెలిసినవాడు; విశేషించి= ప్రత్యేకించి; మనకున్; ఇతని మాటలు; విజయమూలంబు= జయానికి ఆధారం; కావునన్; ఈ మహాత్ముండు= ఈ మహానుభావుడు; నిరూపించినవాఁడు వరూధినీ ముఖ్యుండు= నిర్ణయించినవాడే సేనలకు అధిపతి. (వరూధిని= వాహిని, సేన.)

**తాత్పర్యం:** అర్జునుడి పలుకు లాలకించి ధర్మరాజు తన తమ్ములకు భగవంతుడైన శ్రీకృష్ణుడిని చూపుతూ 'ఈ మహనీయుడు సమస్తమైన జంగమ స్థావరాల యొక్క ఎక్కువ తక్కువలు చక్కగా ఎరిగినవాడు. ముఖ్యంగా ఈయన వచనాలు మన గెలుపునకు కారణాలు. కనుక ఈ మహానుభావుడు నిర్ణయించిన పురుషుడే మన ఏడక్షౌహిణుల సేనలకు అధిపతి అవుతాడు.'

**క. అనుటయు దామోదరుఁ డి। ట్లను 'ధృష్టద్యుమ్నుఁ డర్హుఁ డగు నభిషేకం
బొనరింపుము పేరోలగ। మున నక్షోహిణుల కెల్ల ముఖ్యుఁడు గాఁగన్. 103**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధర్మనందనుడు పలుకగా; దామ+ఉదరుఁడు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనున్= ఈ రీతిగా అన్నాడు; ధృష్టద్యుమ్నుఁడు; అర్హుఁడు+అగున్= సైన్యాధిపత్యానికి తగును; అక్ష+ఊహినులకున్+ఎల్లన్= అక్షౌహిణు లన్నింటికి; ముఖ్యుఁడు కాఁగన్= ప్రధానాధికారి అయ్యేటట్లు; పేరోలగమునన్= నిండుసభలో; అభిషేకంబు+ఒనరింపుము= సర్వసేనాధిపత్యానికి అభిషిక్తుడిని చేయుము.

**తాత్పర్యం:** ధర్మజుని మాటలు విని శ్రీ కృష్ణుడు ఇట్లా అన్నాడు. 'ధృష్టద్యుమ్నుడు సేనాధ్యక్షుడుగా ఉండదగినవాడు. ఇతనిని ఏడక్షౌహిణులకు నాయకుడిగా నిండు కొలువులో అభిషేకించుము.

**విశేషం:** అక్షోహిణి, అక్షౌహిణి= 21870 రథాలు, అన్ని ఏనుగులు, 65610 గుర్రాలు, 109350 పదాతులు కలిగిన సేన - దీనినే చతురంగ బలం అంటారు.

**క. సురగంధర్వ ఖచర కిం। పురుషాది సమస్త దివ్యభూతంబుల బం**
**ధుర భూరి వ్యూహంబుల। విరచనముల నెఱుఁగు నతఁడు వీరోత్తముఁడున్. 104**

**ప్రతిపదార్థం:** సుర గంధర్వ ఖచర కింపురుష+ఆది= దేవతలు, గంధర్వులు, ఖేచరులు, కింపురుషులు మున్నుగాగల; సమస్త దివ్యభూతంబుల= సకల దేవతా వర్గాల యొక్క; బంధుర= సాంద్రమైన; భూరివ్యూహంబుల విరచనములన్= గొప్ప మొగ్గరాల యొక్క పన్నుగడలు; ఎఱుఁగున్= ఇతనికి తెలుసు; అతఁడు= ధృష్టద్యుమ్నుడు; వీర+ఉత్తముఁడున్= శూరులలో శ్రేష్ఠుడౌతాడు.

**తాత్పర్యం:** సురలు, గంధర్వులు, ఖేచరులు, కింపురుషులు మొదలైన దేవయోనులు పన్నే సేనావ్యూహాల కల్పన లన్నింటినీ తెలిసినవాడు ధృష్టద్యుమ్నుడు. వ్యూహరచనలో నేర్పు కలవాడే కాదు; వీరులలో కూడ శ్రేష్ఠుడు.

**క. నీ యొద్దిరాజు లందఱు। ధీయుక్తులు విక్రమ ప్రదీప్తుల యైనన్**
**వేయేటికి ధృష్టద్యు। మ్నా యత్తము చేయు సైన్యమంతయు నధిపా!' 105**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; నీయొద్దిరాజులు+అందఱున్= నీ దగ్గరనున్న భూపతులందరున్నూ; ధీయుక్తులు= బుద్ధిమంతులు; విక్రమ ప్రదీప్తులు+అ+ఐనన్= శౌర్యంతో దీపించేవారే అయినప్పటికీ; వేయు+ఏటికిన్?= పలుమాట లెందుకు?; సైన్యము+అంతయున్= నీ సేనలన్నిటినీ; ధృష్టద్యుమ్న+ఆయత్తము+చేయు(ము)= ధృష్టద్యుమ్నుడి అధీనం కావించుము.

**తాత్పర్యం:** నీ చెంతనున్న భూపతులంతా బుద్ధిమంతులు, ప్రతాపంతో ప్రజ్వలించువారే. సందేహం లేదు. అయినప్పటికినీ నీ సేనలన్నింటినీ ధృష్టద్యుమ్నుడి వశంలో ఉంచుము.'

**వ. అనిన విని యుధిష్ఠిరుం 'డక్షోహిణులకుం బ్రత్యేక నాయకులను నీవ నిర్దేశింపు' మనుటయు నతండు. 106**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; యుధిష్ఠిరుండు; అక్షోహిణులకున్; ప్రత్యేక నాయకులను= విడివిడిగా అధిపతులను; నీవు+అ= నీవే; నిర్దేశింపుము= నిర్ణయించుము; అనుటయున్; అతండు= శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి వాక్యాలు విని ధర్మజుడు 'ఏడక్షోహిణులకున్నూ విడివిడిగా అధిపతులను నీవే నిర్ణయించు' మని కోరగా వాసుదేవుడు.

**తే. 'సేన దమకును గలవారు లేనివారు। ననక తగువారిఁ జెప్పెద నఖిల సమర**
**పండితుల నేఱి, వారి నీ బలము లేడు। నడపఁ జాలించి యభిషేచనం బొనర్పు.' 107**

**ప్రతిపదార్థం:** సేన= సైన్యం; తమకును= తమకు; కలవారు= ఉన్నవారు; లేనివారు= లేనట్టివారు; అనక= అనే భేదం పాటించక; తగువారిన్= అర్హులను; అఖిల సమర పండితులన్= సమస్త యుద్ధాలలో విశారదులైనవారిని; ఏరి= ఎన్ని; చెప్పెదన్= నీకు తెలుపుతాను; వారిన్= అట్టివారలను; నీ బలములు+ఏడున్= నీ ఏడక్షౌహిణులను; నడపన్= నడపటానికి; చాలించి= సమర్థులను చేసి; అభిషేచనంబు+ఒనర్పు= అభిషేకం చేయుము.

**తాత్పర్యం:** 'తమకు సైన్యం కలవారు లేనివారు అనే భేదం లేక సకల యుద్ధాలలో కోవిదులైనవారును, అర్హులును అయినవారిని పేర్కొంటాను. నీ బలము లేడింటిని నడపటానికి సమర్థులైన వారికి ప్రత్యేక నాయకులుగా నీవు అభిషేకించుము.'

**వ. అనిన 'నట్ల చేయుదు; వారెవ్వ రెవ్వరు? నిరూపింపు'మని యడిగినఁ గుంతీనందనునకు దేవకీనందనుం డిట్లనియె. 108**

**ప్రతిపదార్థం:** అనినన్; అట్లు+అ= అట్లే; చేయుదున్; వారు; ఎవ్వరు+ఎవ్వరు= ఎవరెవరు; నిరూపింపుము= నిశ్చయించుము; అని అడిగినన్; కుంతీనందనునకున్= ధర్మజునకు; దేవకీనందనుండు= దేవకీతనయుడైన శ్రీకృష్ణమూర్తి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి మాటలు విని ధర్మజుడు 'నీవు చెప్పినట్లే చేస్తాను. వా రెవరో నిశ్చయింపు'మని అడుగగా దేవకీపుత్రుడు ఇట్లా అన్నాడు:

**సీ. 'పటుపరాక్రమనిధి పాంచాలపతియు, న । మానుష తేజుండు మత్స్యవిభుఁడు,**
**శత్రుభీకరమూర్తి సాత్యకియును, జరా । సంధాగ్ర తనయుండు శౌర్యఘనుఁడు**
**సహదేవుఁడును, ధైర్యశాలి యాదవశిరో । మణి చేకితానుండు, మహితవిభవ**
**ఖని యగు శిశుపాల తనయుండు దోర్దర్ప । ధుర్యుండు ధృష్టకేతుండు, సమర**

**తే. లంపటుండు శిఖండియు లావు వెరవు । గలరు, నీయెడ ననురక్తిఁగలరు, సాలఁ**
**బెంపుగల, రుక్కు ముట్టిన తెంపుగలరు । కోరి పతులుగఁ జేయు మక్షోహిణులకు. 109**

**ప్రతిపదార్థం:** పటు పరాక్రమనిధి= దృఢమైన శౌర్యానికి ఆశ్రయమైనవాడు; పాంచాల పతియున్= పాంచాలదేశాధీశుడు ద్రుపదుడు; అమానుష తేజుండు= మానవశక్తికి మీరిన ప్రతాపంకలవాడు; మత్స్యవిభుఁడు= మత్స్యదేశ ప్రభువు విరాటుడును; శత్రుభీకరమూర్తి, సాత్యకియును= విరోధులకు వెరపు గలిగించే స్వరూపం గల సాత్యకియున్నూ; శౌర్యఘనుఁడు= పరాక్రమంచేత గొప్పవాడు; జరాసంధ+అగ్రతనయుఁడు= జరాసంధుడి పెద్దకొడుకు; సహదేవుఁడును= సహదేవుడనేవాడున్నూ; ధైర్యశాలి= ధైర్యంకలవాడు; యాదవ శిరోమణి= యాదవులలో శ్రేష్ఠుడు; చేకితానుండున్= చేకితానుడనేవాడును; మహిత విభవఖని= గొప్ప వైభవాలకు గనివంటివాడును; దోః+దర్పధుర్యుండు= భుజబలమునందు మిన్న అయిన; శిశుపాల తనయుండున్= శిశుపాలుడి పుత్రుడు; అగు= అయినట్టి; ధృష్టకేతుండున్= ధృష్టకేతువనేవాడును; సమరలంపటుండు= యుద్ధాలందు అత్యాసక్తికలవాడు; శిఖండియున్= భీష్ముడిని వధించటానికి ఈశ్వరుడి వరం వలన ద్రుపదుడికి ముందు కూతురై పుట్టి పిదప కొడుకుతనమును పొందిన శిఖండి అనేవాడును; లావున్= బలం; వెరవున్= ఉపాయాన్ని; కలరు= కలిగి ఉన్నారు; నీ యెడన్= నీపట్ల; అనురక్తిన్= అనురాగాన్ని; కలరు= కల్గినవారు; చాలన్= మిక్కిలి; పెంపు+కలరు= గొప్పతనం కలవారు; ముట్టినన్= తాకితే; తెంపు+కలరు= సాహసం చూపగలవారు; అక్షోహిణులకున్= నీ సేనలకు; కోరి= ఇష్టపడి; పతులుగన్+చేయుము= నాయకులుగా నియమించుము.

**తాత్పర్యం:** గొప్ప పరాక్రమరాశిఅయిన ద్రుపదుడు, మానవాతీత ప్రతాపంగల విరాటుడు, శత్రువులకు భయం కలిగించే స్వరూపంగల సాత్యకి, మిక్కిలి శౌర్యవంతుడైన జరాసంధుడి పెద్ద కుమారుడగు సహదేవుడు, యాదవులలో ఉత్తముడును, ధైర్యవంతుడును అయిన చేకితానుడు, గొప్ప వైభవాలకు నెలవైనవాడు, భుజబలం కలిగినవాడు, శిశుపాలుడి నందనుడు అయిన ధృష్టకేతువు, యుద్ధములందు మిక్కిలి ఆసక్తిగల శిఖండి బలసంపన్నులు,

ఉపాయశాలులు. నీయెడ ప్రేమగలవారు, చాల గొప్పతనంగలవారు, సాహసోపేతులు. అట్టి వీరిని ఏడ్గురినీ నీ అక్షౌహిణులకు అధిపతులను గావించుము.

**విశేషం:** ధృష్టకేతుడి వృత్తాంతము:

శిశుపాలుడు చేదివంశంలో దమఘోషుడనే రాజుకూ, సాత్వతికీ నాల్గు చేతులతో, ఫాలనేత్రంతో పుట్టి గార్దభ స్వరంతో ఏడుస్తుండగా తలిదండ్రులు భయాశ్చర్య నిమగ్నులైనారు. అప్పుడు అశరీరవాణి 'ఇతడిని ఇతరులు చంపలేరు. ఎవడు వీడిని ఎత్తుకొన్నప్పుడు ఎక్కువగానున్న రెండు చేతులూ, నొసటి కన్నూ అణగిపోతాయో అతడే వీడి పాలిటికి అంతకుడు' అని చెప్పింది. జననీజనకులు చూడవచ్చినవారికెల్ల తమ కుమారుడిని ఎత్తుకొనటానికి ఇస్తూ వచ్చారు. ఒకసారి బలరామకృష్ణులు తమ మేనత్త సాత్వతిని చూడదలచి ఆమె ఇంటికి వచ్చారు. సాత్వతి తన కొడుకును ముందు బలరాముడికీ, తరువాత శ్రీకృష్ణుడికీ ఎత్తుకొనటానికి ఇచ్చింది. అచ్యుతుడు బాలునెత్తుకొనగానే వాని మిక్కిలి చేతులు, మిక్కిలి కన్ను మాయమయ్యాయి. సాత్వతి భయపడింది. మురవైరి వలన తన సుతునకు ముప్పు తప్పదని గ్రహించి' 'నారాయణా! వీడు మున్ముందు దుర్మార్గుడయి నీకు అప్రియాలు ఆచరించినప్పటికీ, నన్ను జూచి వీని శతాపరాధములు మన్నించవలసినదిగా' వేడింది. కృష్ణు డంగీకరించాడు. శిశుపాలుడు కృష్ణుడి పట్ల అకారణ ద్వేషం వహించి అతడు లేని సమయంలో ద్వారకాపురిని దహించాడు. భోజవంశ ప్రభువులు తమ భార్యలతో రైవతకాద్రిలో విహరిస్తూ ప్రమత్తులై ఉండగా వారిని నిర్దయుడై వధించాడు. వసుదేవుడి యాగహయాన్ని అపహరించి అతడి అశ్వమేధమునకు విఘ్నం కల్గించాడు. ఇంతేకాక వాగ్విషయాలైన అపచారాలెన్నో చేశాడు. ధర్మజుడు రాజసూయ యాగ సమయంలో భీష్మాది వృద్ధుల అనుమతితో శ్రీకృష్ణుడిని పూజిస్తూ ఉండగా అతడు అగ్రపూజకు అనర్హుడని నిండుసభలో నానా దుర్భాషలాడాడు. అత్తకిచ్చిన మాటప్రకారం నూరు తప్పులు సహించి మరి భరించలేక శౌరి చక్రంతో అతడి తల ఖండించాడు. శిశుపాలు నట్లా సంహరించి మాధవుడు వాడి కొడుకును చేది రాజ్యానికి అభిషిక్తుడిని చేశాడు. అతడే ధృష్టకేతుడు. పాండవులకు హితుడై, కురుక్షేత్ర సంగ్రామ రంగంలో పాండవ పక్షం వహించాడు.

**వ. అని దండనాథుల నిశ్చయించి వెండియు. 110**

**ప్రతిపదార్థం:** అంటూ ఏడక్షౌహిణులకు దండనాయకులను నిర్ధారించాడు కృష్ణుడు. మరల. (ఇట్లా అన్నాడు:)

**క. 'కురుసైన్యము నిస్సారం । బరయఁగ మన బలము లెల్ల నతిదృఢములు; నీ**
**వరవాయి గొనక నడపుము । ధరణీశ్వర! సేన మొగము దైవమ నీకున్. 111**

**ప్రతిపదార్థం:** ధరణీ+ఈశ్వర!= భూవల్లభా!; కురుసైన్యము= కౌరవసేన; నిస్సారంబు= శక్తిహీనమైనది; అరయఁగన్= ఆలోచించగా; మన బలములు+ఎల్లన్= మన సైన్యాలన్నియు; అతి దృఢములు= మిక్కిలి గట్టివి; నీవు= నీవు; అరవాయి+కొనక= వెనుదీయక; నడపుము= సైన్యమును కదలించుము; నీకున్= నీకు; సేనమొగము= సేనాగ్రభాగమునందు; దైవము+అ= దేవుడే నిలిచి ఉంటాడు.

**తాత్పర్యం:** 'ధర్మజా! కౌరవసేన శక్తిహీనం. ఆలోచించగా మనబలాలు మిక్కిలి చేవగలవి. నీవు సంకోచించక సేనలను నడుపుము. నీ సేనకు అగ్రభాగాన దేవుడే నిలిచి ఉంటాడు.

**క. నీ యనుజులు దివిజులకు న । జేయులు ధృతరాష్ట్రసుతులఁ జెఱుచుట వ్రేఁగే?**
**తోయజనాశము గజలీ । లాయత్తము గాదె! యెత్తు మాహవమునకున్.' 112**

**ప్రతిపదార్థం:** నీ+అనుజులు= నీ తమ్ములు; దివిజులకున్= దేవతలకు కూడ; అజేయులు= జయింపరానివారు; ధృతరాష్ట్ర సుతులన్= ధృతరాష్ట్రుడి కుమారులను; చెఱుచుట= నాశం చేయటం; వ్రేఁగే?= భారమా?; (కాదనిభావం) తోయజనాశము= పద్మాలను పాడుచేయటం; గజలీలా+ఆయత్తము+కాదె!= ఏనుగు యొక్క క్రీడలకు అధీనమైనదే కదా! ఆహవమునకున్= యుద్ధానికి; ఎత్తుము= బయలుదేరుము.

**తాత్పర్యం:** నీ తమ్ములు వేల్పులకు సైతం గెలువరానివారు. కౌరవులను నాశనం చేయటం వారికి భారం కాదు. తామరల గుంపులను ధ్వంసం చేయటం గజక్రీడలకు లోబడినదే కదా! నీవు యుద్ధానికి బయలుదేరుము.'

**విశేషం:** అలం: నిదర్శన.

**వ. అని నిర్ణయించి నారాయణుఁడు నిజనివాసంబునకుం జనియె; ధర్మతనయుండు దమ్ములుం దానును బ్రియంబంది యారాత్రి సుఖనిద్ర సేసిరి; రేపకడయ పాండవాగ్రజుం డనుజతనుజ దనుజాంతక సామంత మంత్రి పురోహిత సహితంబుగాఁ బేరోలగంబున నుండి సమస్త పరివారంబును వినఁ గార్యంబు నిశ్చయంబుఁ దెలియంబలికి, తగువారలతో సముచిత సంభాషణంబులు సేసి, మహనీయ మహిమ వెలయం బుండరీకాక్షుండు పనిచినట్ల పాంచాలనాథ ప్రముఖుల నక్షౌహిణులకు నధిపతులుగా వేఱువేఱ యభిషేకించి, శ్వేతవంశజాతుం డగుటంజేసి శ్వేతుండనం బ్రఖ్యాతుం డగు ధృష్టద్యుమ్నునకు నుత్కృష్ట ప్రకారంబున నభిషేకం బొనర్చి సర్వసేనాధిపత్యంబునకుం బట్టంబుగట్టి, యయ్యేనమండ్రను దక్కటి దొరలను గనుంగొని మధురవాక్యంబుల నగ్గించి కౌరవులతోడి కయ్యంబునకుం గురుక్షేత్రంబునకు విడియం బోద'మని చెప్పి వారినెల్ల ధనంజయునకుం జూపి. 113**

**ప్రతిపదార్థం:** అని, నిర్ణయించి= కార్యం నిశ్చయించి; నారాయణుండు; నిజ నివాసంబునకున్= తనదైన యింటికి; చనియెన్= వెళ్ళాడు; ధర్మతనయుండున్; తమ్ములున్; తానును; ప్రియంబు+అంది= సంతోషం పొంది; ఆ రాత్రి; సుఖనిద్ర చేసిరి= హాయిగా నిదురపోయారు; రేపకడ+అ= ఉదయముననే; పాండవ+అగ్రజుండు= పాండవులలో తొలుత జన్మించిన ధర్మజుడు; అనుజ= తమ్ములు; తనుజ= కుమారులు; దనుజ+అంతక= రాక్షసులను అంతమొందించిన శ్రీకృష్ణుడు; సామంత= సామంత రాజులు; మంత్రి= సచివులు; పురోహిత సహితంబుగాన్= పురోహితులతో కూడ; పేరు+ఓలగంబునన్+ ఉండి= నిండు సభలో ఉన్నవాడై; సమస్త పరివారంబును వినన్= సకల పరిజనం వింటూ ఉండగా; కార్యంబు నిశ్చయంబు= యుద్ధ కార్య నిర్ణయాన్ని; తెలియన్+పలికి= వారందరికీ తెలిసేటట్లు చెప్పి; తగువారలతోన్= తగినవారితో; సముచిత సంభాషణంబులు చేసి= మిక్కిలి తగిన మాటలు మాటాడి; మహనీయ మహిమ= గొప్ప సంపదలు; వెలయన్= మెరయగా; పుండరీక+అక్షుండు= శ్రీకృష్ణుడు; పనిచిన+అట్ల= ఆజ్ఞాపించినట్లే; పాంచాల నాథ ప్రముఖులన్= ద్రుపదుడు మున్నగువారిని; అక్షౌహిణులకున్= సేనా విభాగాలకు; అధిపతులుగాన్= నాయకులుగా; వేఱువేఱ= ప్రత్యేకంగా; అభిషేకించి; శ్వేత వంశజాతుండు+అగుటన్+చేసి= శ్వేతుడి వంశంలో జన్మించినవాడు కావటంవలన; శ్వేతుండు+అనన్= శ్వేతుడనే నామంతో; ప్రఖ్యాతుండు+అగు= ప్రసిద్ధిగాంచిన; ధృష్టద్యుమ్నునకున్= ద్రుపద మహీపతి కుమారునకు; ఉత్కృష్ట ప్రకారంబునన్= శ్రేష్ఠమైన పద్ధతితో; అభిషేకంబు+ఒనర్చి; సర్వసేనా+ఆధిపత్యంబునకున్= సకల సైన్యాల దొరతనానికి; పట్టంబు+కట్టి= పట్టాన్నిచ్చి; ఆ+ఏనమండ్రను= ఆ ఎనిమిదిమందిని అనగా సర్వ సైన్యాధ్యక్షుడైన ధృష్టద్యుమ్నుడినీ; అక్షౌహిణీ నాయకులగు ద్రుపద, విరాట, సాత్యకి, సహదేవ, చేకితాన, ధృష్టకేతు, శిఖండులనూ; తక్కటి దొరలను= మిగిలిన రాజులనూ; కనుంగొని; మధుర వాక్యంబులన్= ప్రియమైన వచనాలతో; అగ్గించి= కొనియాడి; కౌరవులతోడి కయ్యంబునకున్; కురుక్షేత్రంబునకున్;

విడియన్+ పోదము= దిగుటకు వెళ్ళుదాము; అని చెప్పి; వారిన్+ఎల్లన్= వారందరినీ; ధనంజయునకున్+చూపి= అర్జునుడికి చూపి.

**తాత్పర్యం:** ఇట్లా నిర్ణయం చేసి కృష్ణుడు తన నివాసానికి వెళ్ళాడు. ధర్మరాజు, అతడి తమ్ములు సంతోషం పొంది ఆ రాత్రి సుఖంగా నిద్రపోయారు. తెల్లవారగనే యుధిష్ఠిరుడు తమ్ములతో, కుమారులతో, శ్రీకృష్ణుడితో, సామంత రాజులతో, మంత్రులతో, పురోహితులతో కూడి నిండు కొలువుండి పరిజనులందరూ వినేటట్లు యుద్ధం నిర్ణయమైనట్లు తెలియబలికాడు. తన వారలతో తగు మాటలాడి, సమున్నత వైభవంతో శ్రీకృష్ణుడు ఆజ్ఞాపించిన విధంగా ద్రుపదుడు మొదలైనవారిని వేర్వేరుగా అక్షౌహిణులకు నాయకులను కావించాడు. విశేషించి ధృష్టద్యుమ్నుడికి ఉత్తమ పద్ధతిలో అభిషేకం చేసి, సర్వసేనాధిపత్యానికి పట్టం కట్టాడు. పిదప ఆ ఎనిమిది మందిని, మిగిలిన రాజులనూ చూచి, ప్రియవచనాలతో వారిని శ్లాఘించి, కౌరవులతో యుద్ధం చేయటానికి కురుక్షేత్రానికి మనం తరలి వెళ్ళుదా' మని చెప్పి వారినందరినీ అర్జునుడికి చూపి (ఇట్లా అన్నాడు:)

**ఉ. 'ఎప్పుడు నెయ్యెడం బొదివి యిందఱకుం దగ నీవు కంటికిన్**
**ఱెప్పయుఁ బోలె మాటయి నెఱిం బను లారసి యొజ్జచాడ్పునం**
**జెప్పుచు వీరిబుద్ధిఁగొని చేయుము కార్యము; నీకు రక్షగా**
**నిప్పరమేశ్వరుండు గలఁ; డిచ్చు శుభం' బని చూపెఁ గృష్ణునిన్. 114**

**ప్రతిపదార్థం:** ఎప్పుడున్= ఎల్లవేళల; ఏ+యెడన్= ఎల్లచోటుల; పొదివి= క్రమ్ముకొని; ఇందఱకున్= ఇచ్చటివారందరికీ; తగన్= ఒప్పిదంగా; నీవు= నీవు; కంటికిన్= కంటికి; ఱెప్పయున్+పోలెన్= రెప్పవలె; మాటు+అయి= అడ్డమై; నెఱిన్= చక్కగా; పనులు+ఆరసి= కార్యాలు విచారిస్తూ; ఒజ్జ చాడ్పునన్= గురుడి చందంగా; చెప్పుచున్= హితవు గరపుతూ; వీరిబుద్ధిన్+కొని= వీరి అభిప్రాయం మన్నించి; కార్యము చేయుము= కర్తవ్యం నిర్వహించుము; నీకున్= నీకు; రక్షగాన్= రక్షకుడుగా; ఈ+పరమ+ఈశ్వరుండు కలఁడు= ఈ దేవాధిదేవుడే ఉన్నాడు; శుభంబు+ఇచ్చున్= శుభం కలిగిస్తాడు; అని+కృష్ణునిన్+చూపెన్= అంటూ శ్రీకృష్ణుడిని చూపాడు.

**తాత్పర్యం:** 'అర్జునా! ఎల్లవేళలందునూ ఎల్లతావులందునూ క్రమ్ముకొని వీరందరినీ కంటిని రెప్పవలె కాపాడుతూ, పనులన్నింటినీ పరిశీలిస్తూ గురునివలె హితం గరపుతూ, వీరి తాత్పర్యం మన్నిస్తూ కర్తవ్యం సల్పుము. ఈ పరమ పురుషుడే నీకు రక్షకుడు. శుభాలు అనుగ్రహించగలడు' అని శ్రీకృష్ణుడిని చూపాడు.

**వ. ఇట్లు గాంభీర్య మాధుర్య ధుర్యుండైన యుధిష్ఠిరుండు వరిష్ఠ ప్రభువుల చిత్తంబు లారాధించి సర్వజన సమ్మతంబుగా సమరోత్సాహంబు చేసి మహోల్లాసంబునం బ్రస్థాన భేరి సఱవంబంచిన. 115**

**ప్రతిపదార్థం:** ఇట్లు; గాంభీర్య మాధుర్య ధుర్యుండు= గాంభీర్య మాధుర్య గుణములు వహించేవాడు; (గాంభీర్యమనగా కోపం దుఃఖం మొదలైన వాటిచేత వికారం పొందకుండటం; మాధుర్యమంటే దయ, సౌశీల్యం, సౌజన్యం); ఐన= అయినట్టి; యుధిష్ఠిరుండు; వరిష్ఠ ప్రభువుల చిత్తంబులు= శ్రేష్ఠులైన రాజుల మనస్సులు; ఆరాధించి= పూజించి; సర్వజన సమ్మతంబుగాన్= సకల జనులకు ఇష్టమయ్యేటట్లు; సమర+ఉత్సాహంబు చేసి= యుద్ధం చేసే పూనిక వహించి; (రాజునకు ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి ఉండవలెను. ఈ మూడు శక్తులు ధర్మజుడిలో ముప్పిరిగొన్నవి); అతడు మహా+ఉల్లాసంబునన్= మిక్కిలి సంతోషంతో; ప్రస్థాన భేరి= ప్రయాణ (యుద్ధ) వేళ మ్రోగించే ఢంకా; చఱవన్+పంచినన్= మ్రోగించటాని కాజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా గాంభీర్య మాధుర్య గుణ ధురీణుడైన ధర్మజుడు ఉత్తమ ప్రభువుల మనస్సులు ఆరాధించి సకల జనులకు అంగీకారమయ్యేటట్లు యుద్ధంచేయటానికి పూనిక వహించినవాడై, పరమ సంతోషంతో ప్రస్థాన భేరి మ్రోగించండని ఆజ్ఞాపించాడు.

**సీ.** **బిఱెండ తాఁకున బీఁటలు వాఱిన । పచ్చిగోడల మాడ్కిఁ బగిలె దిశలు,**
**కాఁగిన యెసరుల కరణిఁ బొరిం బొరి । శరనిధు లుప్పొంగి పొరలఁబడియెఁ,**
**గలముపైఁ గీలించి గాలి కెత్తిన చాఁప । వోలె మిన్నంతయు బూరటిల్లెఁ,**
**గులపర్వతావళి కులిశభయంబున । బెదరి వాపోవున ట్లెదురుసెలఁగె,**

**తే.** **ధాత్రి కుమ్మరి సారె విధమునఁ దిరిగెఁ । జిత్రరూపులభంగి నిశ్చేష్టితంబు**
**లయ్యె సర్వభూతములుఁ బ్రయాణభేరి । భూరి నిష్ఠుర ఘోరభాంకార మడర.** **116**

**ప్రతిపదార్థం:** ప్రయాణ భేరి= యుద్ధ ప్రయాణ సమయంలో మ్రోగించబడిన భేరి యొక్క; భూరి= గొప్పదైన; నిష్ఠుర= కఠినమైన; ఘోర= భయంకరమైన; భాంకారము+అడరన్= భాంకారం వ్యాపించగా; బిఱు+ఎండ తాఁకునన్= మిక్కుటమైన ఎండ తగులగా; బీఁటలు+పాఱిన= పగుళ్ళు విడిచిన; పచ్చి గోడల మాడ్కిన్= మట్టి ముద్దలతో పెట్టిన పచ్చి గోడలవలె; దిశలు= దిక్కులు; పగిలెన్= బ్రద్దలయ్యాయి; కాఁగిన్+ఎసరులకరణిన్= తెర్లిన ఎసళ్ళవలె; శరనిధులు= సముద్రములు; పొరిన్+పొరిన్= అత్యంతం; ఉప్పొంగి= పైకి ఉబికి; పొరలన్+పడియెన్= క్రిందికి పొరలినవి; కలముపైన్= పడవమీద; కీలించి= అమర్చి; గాలికిన్+ఎత్తిన చాప+పోలెన్= గాలి కొరకు పైకెత్తిన తెరచాపవలె; మిన్ను+అంతయున్= ఆకాశమంతా; బూరటిల్లెన్= నిండుగా ఉబ్బింది; కులపర్వత+ఆవళి= ఏడు కులగిరులు; కులిశభయంబునన్= ఇంద్రుడి వజ్రాయుధం వలని భీతిచేత; బెదరి= జంకి; వాపోవునట్లు= ఆక్రోశిస్తూ ఉన్న విధంగా; ఎదురు+చెలఁగెన్= ప్రతిధ్వని ఒప్పింది; కుమ్మరి సారె విధమునన్= కుమ్మరిచక్రం వలె; ధాత్రి= పుడమి; తిరిగెన్= భ్రమించింది; సర్వభూతములు= సకల ప్రాణులు; చిత్రరూపుల భంగిన్= పటంలో లిఖించబడిన బొమ్మలవలె; నిశ్చేష్టితంబులు+అయ్యెన్= కదలిక లేకుండినవి.

**తాత్పర్యం:** ధర్మజుడి యుద్ధ ప్రయాణభేరియొక్క దారుణమైన కఠిన భాంకారం వ్యాపించగా మిక్కిలి ఎండకాసినపుడు మట్టి ముద్దలతో పెట్టిన పచ్చి గోడలమాదిరి దిక్కులు బ్రద్దలయ్యాయి. తెర్లిన ఎసరు నీళ్ళవలె సముద్రాలు అంతకంతకూ ఉప్పొంగి గట్లమీదికి పొర్లిపారాయి; పడవపై అమర్చి గాలికెత్తిన తెరచాపవలె ఆకసమంతా నిండిపోయింది; ఇంద్రుడి వజ్రాయుధపు వ్రేటుకు భయపడి సప్తకుల పర్వతాలు ఆక్రోశిస్తున్నవో అన్నట్లు ప్రతిధ్వని చెలరేగింది. కుమ్మరివాడి చక్రం మాదిరి భూమి గిరగిరా తిరిగింది. పటంలో లిఖించబడిన బొమ్మలవలె సకల ప్రాణులు నిశ్చలంగా నిలిచిపోయాయి.

**విశేషం:** కుల పర్వతాల సంఖ్య ఏడు-మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం.

### పాండవులు కౌరవులతోడి యుద్ధంబునకు వెడలుట (సం. 5-149-49)

**వ.** **ఇట్లు ప్రస్థాన భేరి చెలంగిన సకల సైన్యంబులు దండనాథ సహితంబుగా సన్నద్ధంబులయ్యె; మఱునాఁడు.** **117**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ప్రస్థాన భేరి= ప్రయాణభేరి; చెలంగినన్= మ్రోగగా; సకల సైన్యంబులు= సమస్త సేనలు; దండనాథ సహితంబుగాన్= సేనానాయకులతో కూడ; సన్నద్ధంబులు+అయ్యెన్= యుద్ధానికి సంసిద్ధమయ్యాయి; మఱునాఁడు= మరుసటి దినం.

**తాత్పర్యం:** ప్రయాణభేరి మ్రోగగానే యుద్ధ యాత్రకు సమస్త సైన్యాలు, దండనాయకులతో సంసిద్ధమయ్యాయి. ఆ మరుసటి రోజు.

**ఉ. భూరి విభూతిఁ బెండ్లికిని బోవు తెఱంగునఁ బాండునందనుల్**
**దారును బుత్త్రులున్ హరియుఁ దమ్ముఁడు నుజ్జ్వల చారులీల శృం**
**గారము చేసి, సమ్మద వికాస మెలర్పఁగ వీర సంభ్రమో**
**దార సముద్ధతిం జనిరి ద్రౌపది యున్నెడ కందఱుం దగన్.** **118**

**ప్రతిపదార్థం:** భూరి విభూతిన్= అధిక వైభవంతో; పెండ్లికిని+పోవు తెఱంగునన్= పెండ్లికి వెళ్ళే విధంగా; పాండు నందనుల్= పాండవులు; తారును= తామున్నూ; పుత్త్రులున్= తమ కుమారులున్నూ; హరియున్= గోవిందుడూ; తమ్ముఁడున్= అతడి అనుజుడైన సాత్యకీ; ఉజ్జ్వలచారులీలన్= సొంపారు సుందర విలాసంతో; శృంగారము+చేసి= అలంకరించుకొని; సమ్మద వికాసము+ఎలర్పఁగన్= సంతోషకళ అతిశయించగా; వీర సంభ్రమ+ఉదార సముద్ధతిన్= వీరులయొక్క త్వరతో కూడిన గొప్పదైన దర్పంతో; ద్రౌపది+ఉన్న+ఎడకున్= పాంచాలిఉన్న ప్రదేశానికి; తగన్= ఒప్పుగా; అందఱున్= ఎల్లరు; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** మహా వైభవంతో పెళ్ళికి వెళ్ళే విధంగా పాండుకుమారులు తామూ తమ పుత్రులూ, శ్రీకృష్ణుడూ అతడి తమ్ముడైన సాత్యకీ సుందర విలాసాలు సొంపారే తీరున అలంకారాలు కావించుకొని సంతోష కళలు మొగ్గలు తొడుగగా, వీరుల యొక్క త్వరతో గూడిన గొప్ప దర్పంతో పాంచాలిఉన్న ప్రదేశానికి అందరూ వెళ్ళారు.

**వ. ఇట్లుచని యమ్మహాదేవి నామంత్రణంబు సేసి తత్ప్రభృతి పుణ్యస్త్రీ కరకలితలలితాక్షతంబులు గైకొని, విప్రాశీర్వాదంబులాదరించుచు, భద్రపాఠక శ్లోకంబు లాకర్ణించుచు, శోభన పదార్థంబులు గనుంగొనుచు, నాంగిక మాంగల్య సూచకంబులు సేకొనుచు వెడలునప్పుడు.** **119**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; చని= వెళ్ళి; ఆ+మహాదేవిన్= ఆ ద్రౌపదిని; ఆమంత్రణంబు చేసి= వెళ్ళివస్తామని చెప్పి వీడ్కొని; తద్ ప్రభృతి పుణ్యస్త్రీ కరకలిత లలిత+అక్షతంబులు= పాంచాలి మున్నుగాగల సువాసినుల యొక్క చేతుల యందలి ఇంపైన అక్షతలు; కైకొని= స్వీకరించి; విప్ర+ఆశీర్వాదంబులు= బ్రాహ్మణుల యొక్క దీవనలు; ఆదరించుచున్= గౌరవ పూర్వకంగా గ్రహిస్తూ; భద్ర పాఠక శ్లోకంబులు= మంగళ పాఠకుల యొక్క పద్యాలు; ఆకర్ణించుచున్= వింటూ; శోభన పదార్థంబులు కనుంగొనుచున్= ఎదురుగా వచ్చే చందనాది మంగళ ద్రవ్యాలను దర్శిస్తూ; ఆంగిక మాంగల్య సూచకంబులు= తమ శరీరంలో పొడముచున్న శుభ నిమిత్తాలు; చేకొనుచున్; వెడలునప్పుడు= కదలే సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండుకుమారులు పట్టపురాణిఅయిన ద్రౌపదితో వెళ్ళి వస్తామని చెప్పి, ఆమె దగ్గర వీడ్కోలు పొందారు. పాంచాలి మున్నగు ముత్తైదువల చేతులలోని మంగళాక్షతలు స్వీకరించి, భూసురులిచ్చే దీవనలు గ్రహిస్తూ, మంగళ పాఠకుల యొక్క పద్యాలు ఆలకిస్తూ, శుభసూచకాలై ఎదురుగా వస్తున్న మంగళ

వస్తువులను వీక్షిస్తూ, తమ దేహములందు కలుగుతున్న శుభ నిమిత్తాలను కనుగొని మెచ్చుతూ తరలి వెళ్ళే సమయంలో

**క. తగ శంఖ కాహళాదిక । మగు మంగళ తూర్యసంచయము గంభీరం**
**బుగ మ్రోసె జయముఁ దెలుపుచు । జగతీశ్వరు మ్రోల నాకసము దీటుకొనన్. 120**

**ప్రతిపదార్థం:** తగన్= ఒప్పిదమైనట్లు; శంఖ కాహళ+ఆదికము+అగు= శంఖములు, బాకాలు మొదలుగా గల్గిన; మంగళ తూర్య సంచయము= ఢక్క మొదలైన మంగళ వాద్యాల యొక్క సమూహం; ఆకసము దీటుకొనన్= ఆకాశం నిండగా; జయమున్+తెలుపుచున్= గెలుపున్ సూచిస్తూ; జగతీ+ఈశ్వరు మ్రోలన్= భూవల్లభుడి యెదుట; మ్రోసెన్= మ్రోగింది.

**తాత్పర్యం:** శంఖాలు బాకాలు మొదలైన మంగళవాద్యాల సమూహం గగనతలం నిండగా విజయసూచకమై ప్రభువైన ధర్మజుడి మ్రోల మ్రోగింది.

**క. మనుమని జయప్రయాణం । బనుమోదింపంగ నా సుధాంశుఁడు సనుదెం**
**చినకరణి గొడుగు కుంతీ । తనయాగ్రజుమ్రోల నతిసితప్రభ నొప్పెన్. 121**

**ప్రతిపదార్థం:** మనుమని జయప్రయాణంబు= తన మనుమడి యొక్క యుద్ధ ప్రయాణాన్ని; అనుమోదింపంగన్= అంగీకరించటానికి; ఆ సుధా+అంశుఁడు= అమృతకిరణుడైన ఆ చంద్రుడు; చనుదెంచిన కరణిన్= వచ్చినాడేమో అన్న విధంగా; గొడుగు= ఛత్రం; కుంతీ తనయ+అగ్రజుమ్రోలన్= కుంతి కొడుకులలో పెద్దవాడైన ధర్మజుడి ఎదుట; అతిసితప్రభన్= మిక్కిలి తెల్లని కాంతితో; ఒప్పెన్= శోభిల్లింది; (అమృతము తెల్లనిది; అమృత కిరణుఁడు గనుక చంద్రుడు తెల్లనివాడు; ధవళచ్ఛత్రానికి పోలికగా చంద్రుడిని చెప్పటం రుచిరం; ధర్మజుడు చంద్రవంశంలో జన్మించాడు కనుక చంద్రునికి మనుమడు; మనుమడు ప్రయాణమవుతుండగా తాతగారు వచ్చి చూచి సంతోషించటం సహజం, సమంజసం.)

**తాత్పర్యం:** తన మనుమడు కురుక్షేత్రానికి పయనం కాగా, అతడి యుద్ధయాత్రను అంగీకరించటానికి అమృత కిరణుడైన చంద్రుడు వచ్చాడేమో అన్నట్లుగా కుంతీ తనయులలో తొలుతటి వాడైన ధర్మపుత్రుడి యెదుట మిక్కిలి ధవళకాంతితో గొడుగు ప్రకాశించింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అట్టి యెడ నమ్మహీవల్లభుండు. 122**

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆ ధర్మరాజు.

**క. ఉచితగతిఁ జేరి వంది । ప్రచయముఁ గీర్తింప నెక్కె రథమం దొనరన్**
**ఖచియించిన వజ్రంబుల । రుచులను బొలుపారు సీవిరులు బెరయంగన్. 123**

**ప్రతిపదార్థం:** ఉచితగతిన్+చేరి= యుక్తమగు విధాన తన దగ్గరకు వచ్చి; వంది ప్రచయము= స్తోత్ర పాఠకుల యొక్క సమూహం- బట్టువారు; కీర్తింపన్= పొగడగా; ఒనరన్= చక్కగా; ఖచియించిన= పొదిగినట్టి; వజ్రంబుల రుచులను= వజ్రాల

కాంతులతో; పొలుపారు= ప్రకాశించు; సీవిరులు= వింజామరలు; బెరయంగన్= పార్శ్వములందు ఆవరించగా; రథమందున్+ ఎక్కెన్= ధర్మజుడు తేరిలో ఎక్కాడు.

**తాత్పర్యం:** బట్టువారు గారవంగా తన చెంతకు జేరి స్తుతించగా, వజ్రాలు పొదుగుటచేత కాంతులీనే వింజామరలు ఇరుపార్శ్వములందు ఆవరించగా ధర్మరాజు రథాన్ని అధిరోహించాడు.

**వ. తదనంతరంబ. 124**

**తాత్పర్యం:** అటు తరువాత.

**సీ. వక్ష స్థ్సలంబున వనమాల క్రాలంగ । వెలిమావు గెడల వాగెలు ధరించి**
**నొగలపై హరియొప్ప నగచరకేతువు । మెఱయంగ నరదంబు మెఱుఁగు లడర**
**దివ్యకిరీటంబు దీప్తులు భూనభో । తరమెల్లఁ గలయంగఁ బరఁగుచుండ**
**గాండీవతూణ యుగ్మములు పూర్వాపర । భాగంబులకు నవాభరణములుగఁ**

**తే. దెలి మొగంబుతో నల్ల నేతెంచి యొక్క। పార్శ్వమునఁ బొడసూపి భూపతికి మ్రొక్కి**
**దేవదత్తంబు పూరించె దేవదేవు । పాంచజన్యంబునకు మున్న ఫల్గునుండు. 125**

**ప్రతిపదార్థం:** వక్షః+స్థలంబునన్= గుండెమీద; వనమాల= మోకాళ్ళ వరకు వ్రేలాడే పూలదండ; క్రాలంగన్= ఒప్పుతుండగా; వెలిమావు= తెల్లగుర్రాల యొక్క; గెడల వాగెలు= నోటి కళ్ళాలకు తగిలించి జతకూర్చబడిన పగ్గాలు; ధరించి= చేతబట్టి; నొగలపైన్= రథము యొక్క నొగల మీద; హరి+ఒప్పన్= శ్రీకృష్ణుడు విరాజిల్లుతుండగా; నగచర కేతువు= కపిధ్వజం; మెఱయంగన్= ప్రకాశించగా; అరదంబు మెఱుఁగులు+అడరన్= స్యందనం యొక్క కాంతులు వ్యాపించగా; దివ్య కిరీటంబు దీప్తులు= వేల్పులచేత ఒసగబడిన మకుటము యొక్క వెలుగులు; భూనభః+అంతరము+ఎల్లన్= భూమ్యాకాశాల మధ్యప్రదేశమంతటను; కలయంగన్+పరఁగుచున్+ఉండన్= ఎడము లేక నిండగా; గాండీవ= గాండీవమనే విల్లు; తూణయుగ్మములు= అమ్ముల పొదులయొక్క జత; పూర్వ+అపరభాగంబులకున్= తన కుడి యెడమ భుజాలకు; నవ+ఆభరణములుగన్= క్రొత్త సొమ్ములు కాగా; తెలి మొగంబుతోన్= వికాసంతో కూడిన ముఖంతో; అల్లన్= మెల్లగా; ఏతెంచి= వచ్చి; ఒక పార్శ్వంబునన్= ఒక ప్రక్కగా నిలిచి; పొడసూపి= కనబడి; భూపతికిన్= విభుడైన ధర్మజుడికి; మ్రొక్కి= నమస్కరించి; ఫల్గునుండు= అర్జునుడు; దేవదేవు పాంచజన్యంబునకున్= దేవాధిదేవుడైన శ్రీకృష్ణుడి పాంచజన్యమనే పేరుగల శంఖమునకు; మున్న= ముందుగానే; దేవదత్తంబు పూరించెన్= దేవదత్తమనే పేరుగల తన శంఖాన్ని ఒత్తాడు.

**తాత్పర్యం:** వాసుదేవుడు తన వక్షఃస్థలంలో వనమాల విరాజిల్లుతుండగా తెల్లని గుర్రాల నోటి కళ్లెములకు తగిలించిన పగ్గాలను చేత ధరించి రథం నొగల మీద కూర్చొని ఉన్నాడు. రథంమీద హనుమద్ధ్వజం రెపరెపలాడుతోంది. రథ కాంతులు దిక్కుల వ్యాపిస్తున్నాయి. ఇంద్రదత్తమైన తన మకుట దీప్తులు రోదసీ కుహరమందు సందులేక నిండిపోయాయి. గాండీవం, అక్షయ తూణీర ద్వయం తన కుడి యెడమ భుజాలకు క్రొత్త సొమ్ములుకాగా. వికసించిన ముఖంతో ఫల్గునుడు మెల్లగా వచ్చి ఒక ప్రక్కగా నిలిచి, తనను కనబరచుకొని, నరేంద్రుడైన ధర్మజుడికి నమస్కరించాడు. దేవదేవుడైన శ్రీకృష్ణుడి పాంచజన్య శంఖంకంటె ముందుగానే పార్థుడు దేవదత్తమనే తన శంఖాన్ని ఒత్తాడు.

**శా. భీముండుం గవలుం గుమారులును సంప్రీతిన్ గదాద్యాయుధో**
**ద్దామ స్ఫీత రుచుల్ వెలుంగ, రథ సంతానంబు రమ్యోజ్జ్వల**
**శ్రీ మీఱన్ దగ వచ్చి శంఖములు గర్జిల్లంగఁ బూరించుచున్**
**భూమీశుం గని యగ్రభాగమున కొప్పుం బెంపునుం జేయుచున్. 126**

**ప్రతిపదార్థం:** భీముండున్= వృకోదరుడూ; కవలున్= అమడలైన నకుల సహదేవులు; కుమారులును= అభిమన్యుడు, ఉపపాండవులు మున్నగు పుత్రులును; సంప్రీతిన్= మిక్కిలి హర్షంతో; గదా+ఆది= గద మొదలైన; ఆయుధ= ఆయుధాలయొక్క; ఉద్దామ= అధికమైన; స్ఫీతరుచుల్= స్వచ్ఛమైన కాంతులు; వెలుంగన్= ప్రకాశించగా; రథసంతానంబు= రథాలగుంపు; రమ్య= మనోహరమైన; ఉజ్జ్వల శ్రీమీఱన్= ప్రకాశవంతమైన శోభతో అతిశయిల్లగా; తగన్= ఒప్పిదంగా; వచ్చి; శంఖములు; గర్జిల్లంగన్= రొదచేయగా; పూరించుచున్= ఊదుతూ; భూమీ+ఈశున్+కని= ధర్మరాజును చూచి; అగ్రభాగమునకున్= సేనలయొక్క ముందుభాగానికి; ఒప్పున్= అందమున్నూ; పెంపున్= గౌరవమున్నూ; చేయుచున్= కలిగిస్తూ. (నిలబడిరి - అని తరువాతి పద్యంలోని క్రియతో అన్వయం).

**తాత్పర్యం:** భీమసేనుడు, నకుల సహదేవులు, అభిమన్యుడు, ఉపపాండవులు, హర్షంతో గద మొదలైన ఆయుధాల యొక్క మిక్కుటమైన స్వచ్ఛ కాంతులు వెలుగుతుండగా, రథాల యొక్క మనోహర శోభలు అతిశయిల్లగా శంఖాలు పూరిస్తూ చనుదెంచి ధరణీవల్లభుడైన ధర్మజుడిని దర్శించారు. సైన్యాగ్ర భాగానికి అందం, గౌరవం సమకూరుస్తూ (నిలబడ్డారు.)

**క. నిలిచిరి, తక్కటి దొరలును । బలుమానుసులును మహోగ్రభంగి సవరణల్**
**సెలువొంద నధిపు చుట్టుల । నలంకరించిరి విభూషణాంశుచ్ఛటలన్. 127**

**ప్రతిపదార్థం:** నిలిచిరి= అభిమన్యుడు మొదలైన కుమారులు నిలబడ్డారు; తక్కటి దొరలును= మిగిలిన ప్రభువులును; బలుమానుసులును= యుద్ధం సల్పగల దొడ్డ మనుష్యులును; మహా+ఉగ్రభంగిన్= మిక్కిలి భయంకరమైన రీతులలో; సవరణల్= యుద్ధ సన్నాహాలు; చెలువు+ఒందన్= వన్నెమీరగా; విభూషణ+అంశు+ఛటలన్= తాము ధరించిన విశిష్టఆభరణాల యొక్క దీప్తి సమూహం చేత; అధిపుచుట్టులన్= ధర్మజుడి నలువైపులను; అలంకరించిరి= సింగారించారు.

**తాత్పర్యం:** తక్కిన రాజులును, వీరగ్రామణులును మిక్కిలి భయంకరంగా రణసన్నాహకలితులై తాము ధరించిన ఆభరణ కాంతిపుంజంతో ధర్మజుడిని నలువైపుల సింగారిస్తూ నిలిచారు.

**వ. అప్పుడు పాండవాగ్రజున కభిముఖంగాఁ జనుదెంచి. 128**

**ప్రతిపదార్థం:** అప్పుడు; పాండవ+అగ్రజునకున్= పాండవులలో పెద్దవాడైన ధర్మనందనునకు; అభిముఖంబుగాన్= ఎదురుగా; చనుదెంచి= వచ్చి.

**తాత్పర్యం:** అపుడు ధృష్టద్యుమ్నుడు ధర్మనందనుడికి అభిముఖంగా వచ్చి.

**క. సాష్టాంగ మెఱఁగి సమరా । వష్టంభం బొప్ప దివ్యవాహన లీలో**
**త్కృష్టగతిన్ ముంగలియై । ధృష్టద్యుమ్నుండు వొలిచెఁ దేజో మహిమన్. 129**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నుండు= (ద్రుపద తనయుడు); స+అష్ట+అంగము+ఎఱఁగి= దండాకారంగా ఎనిమిది అవయవాలు నేలకు తగిలేటట్లు నమస్కరించి; సమర+అవష్టంభంబు= యుద్ధగర్వం; ఒప్పన్= అతిశయించగా; దివ్యవాహన లీలా+ఉత్కృష్టగతిన్= దివ్యమైన అశ్వము యొక్క విలాసముచేత ప్రశస్తమైన గమనంతో; ముంగలి ఐ= ముందున్నవాడై; తేజో మహిమన్= ప్రతాప వైభవంతో; పొలిచెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ధర్మరాజుకు సాగిలపడి నమస్కరించి, రణదర్పం మేరమీరగా, అశ్వము నధిరోహించి విలాసగమనంతో సేనలకు ముందున్నవాడై ప్రతాపదీప్తితో ప్రజ్వలించాడు.

**వ. ఇవ్విధంబునం జారుభీషణంబుగా సన్నద్ధుండై యుధిష్ఠిరుండు గదలి శుభసూచకంబులు గైకొనుచు నడచె; నట్టిసమయంబున నెల్లవారి పరిచారకులును శకటాది సకల సాధనంబులును బటగృహంబులును మొదలుగా వలయు సమస్త వస్తువు లొడఁగూర్చి వెడలిన దండు పఱపై సముద్రంబు గాఁపువోవు చందంబయ్యె; నిట్లరిగి ధర్మపుత్త్రుండు కురుక్షేత్రంబు దఱియంజొచ్చి ఋష్యాశ్రమంబులకు దేవతాయతనంబులకు నలజడి గాకుండం బరిహారంబు సేయుచుం జని తృణకాష్ఠ జలసమృద్ధంబై తగియెడు సమస్థలంబున హిరణ్వతి యను పుణ్యనది పొంత విడిదలగా నిరూపించి యచ్చో నిలిచెఁ; దదనంతరంబ. 130**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; యుధిష్ఠిరుండు; చారుభీషణంబుగాన్= రమ్యంగానూ, భయానకంగానూ; సన్నద్ధుండై= యుద్ధమునకు సంసిద్ధుడై; కదలి; శుభసూచకంబులు గైకొనుచున్= శుభ శకునములు స్వీకరిస్తూ; నడచెన్= గమనం సాగించాడు; అట్టి సమయంబునన్; ఎల్లవారి పరిచారకులును= రాజులందరి సేవకులును; శకట+ఆది= బండ్లు మొదలైన; సకల సాధనంబులును= సమస్త పరికరాలున్నూ; పటగృహంబులు= గుడారాలు-డేరాలు; మొదలుగాన్= మున్నగు; వలయు= కావలసిన; సమస్త వస్తువులు; ఒడగూర్చి= ప్రోగుచేసి; వెడలిన దండు= బయలుదేరిన సైన్యం; పఱపు+ఐ= విశాలమై - దట్టమై; సముద్రంబు; కాఁపు+పోవు చందంబు+అయ్యెన్= నివసించడానికి వెళుతున్నట్లయింది; ఇట్లు+అరిగి; ధర్మపుత్త్రుండు; కురుక్షేత్రంబు; తఱియన్+చొచ్చి= సమీపించి; ఋషి+ఆశ్రమంబులకున్= మునుల ఆశ్రమాలకూ; దేవతా+ఆయతనంబులకున్= దేవాలయాలకూ; అలజడి+కాకుండన్= బాధ కలుగకుండా; పరిహారంబు చేయుచున్= విడిచిపెట్టి; చని= వెళ్ళి; తృణ కాష్ఠ జలసమృద్ధంబు+ఐ= పశువులకు గడ్డి, వంటచేసికొనటానికి కట్టెలు, త్రాగటానికి నీరు అనునని కలిగినదై; తగియుండు= తగినట్టి; సమస్థలంబునన్= గుంటమిట్టలు లేక చదునైన ప్రదేశంలో; హిరణ్వతి+అను; పుణ్యానది పొంతన్= పావనమైన నదీతీరంలో; విడిదలకాన్= దండు విడిసే చోటుగా; నిరూపించి= నిర్ణయించి; అచ్చోన్+నిలిచెన్= అక్కడ ఆగాడు; తద్+అనంతరంబు+అ= ఆ పిదప.

**తాత్పర్యం:** ధర్మరాజు రమణీయ భయానకంగా యుద్ధ సన్నద్ధుడైనాడు. శుభ శకునాలను గైకొంటూ నడచాడు. ఆ సమయంలో ఆయా రాజుల సేవకులు బండ్లు మొదలైన ప్రయాణ సాధనాలు, డేరాలు మొదలైన కావలసిన సకల వస్తువులూ సమకూర్చుకొని బయలుదేరారు. అట్లా కదలిపోతున్న విశాలమైన ఆ దండు సముద్రమే కాపురం పెట్టటానికి కురుక్షేత్రానికి తరలిపోతున్నదా అన్నట్లుంది. ఇట్లా వెళ్ళి ధర్మపుత్త్రుడు కురుక్షేత్రాన్ని సమీపించాడు. మునీశ్వరుల ఆశ్రమాలకూ, దేవాలయాలకూ ఎట్టి అలజడి కలుగకుండా వాటికి దూరంగా దండు నడిచింది. అట్లా యుధిష్ఠిరు డరిగి గడ్డి వంటచెరకు జలం సమృద్ధిగా లభించే చదునైన ఒక ప్రదేశంలో హిరణ్వతి అనే పేరుగల ఒక పవిత్ర నది ఒడ్డున ఆగాడు. అది దండు విడియడానికి తగిన చోటుగా నిర్ధారణ చేశాడు.

**తే. విడియుటకు సూచకంబుగ విష్ణుఁ డొత్తెఁ । బాంచజన్యంబు; ధర్మజపార్థులాది**
**గాఁగఁ దమతమ వీరశంఖంబు లెల్ల । దొరలు నొత్తిరి దివి మ్రోఁతఁ దూఁటుగట్ట. 131**

**ప్రతిపదార్థం:** విడియుటకున్= దండు దిగుటకు; సూచకంబుగన్= గుర్తుగా; విష్ణుఁడు= శ్రీకృష్ణుడు; పాంచజన్యంబున్+ఒత్తెన్; ధర్మజ పార్థులు+ఆది గాఁగన్= ధర్మపుత్రుడు అర్జునుడు మున్నుగా; ఎల్ల దొరలున్= రాజులందరూ; దివి= ఆకాశం; మ్రోఁతన్= ధ్వనిచేత; తూఁటు+కట్టన్= చిల్లిపడగా; తమ తమ వీరశంఖంబులు+ఒత్తిరి= పౌరుషం ప్రకటించే తమ తమ శంఖాలను ఊదారు.

**తాత్పర్యం:** హిరణ్వతీ నదీతీరాన దండు దిగుటకు గుర్తుగా శ్రీ మహావిష్ణువు పాంచజన్యమనే తన శంఖాన్ని పూరించాడు. ధర్మజుడు అనంతవిజయమనే శంఖాన్నీ, అర్జునుడు దేవదత్తాన్నీ, భీముడు పౌండ్రమనే శంఖాన్నీ, నకులుడు సుఘోషాన్నీ, సహదేవుడు మణిపుష్పకాన్నీ పూరించగా యుద్ధం చేయవచ్చిన ప్రభువులందరూ మగటిమి చాటే తమ తమ వీరశంఖాలను ఊదారు.

**విశేషం:** ఇక్కడ ఇంచుక వివరణ:

**"తత శ్ర్వేతై ర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,**
**మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః,**
**పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,**
**పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః।.**
**అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,**
**నకుల స్సహదేవ శ్చ సుఘోష మణిపుష్పకౌ॥,**
**కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః,**
**ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః.**
**ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,**
**సౌభద్రశ్చ మహా బాహుః శంఖాన్ దధ్ముః పృథక్పృథక్."**

అని సంజయుడు ధృతరాష్ట్రుడితో అంటాడు.

'అప్పుడు కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తంబులును, భీమసేనుండు పౌండ్రంబును, యుధిష్ఠిరుం డనంతవిజయంబును, నకుల సహదేవులు సుఘోష మణిపుష్పకంబులును, పాంచాల విరాట సాత్యకి ధృష్టద్యుమ్న శిఖండి ప్రముఖ దండనాయకులు దమతమ శంఖంబులుఁ బూరించి''రని తిక్కనగారి అనువాదం. భీష్మపర్వం - ప్రథమాశ్వాసం 176. శ్రీకృష్ణార్జునుల శంఖనామములు ప్రసిద్ధాలు. ధర్మజ భీమ నకుల సహదేవుల శంఖముల పేర్లు వరుసగా అనంత, విజయ, పౌండ్ర, సుఘోష, మణిపుష్పకములని వ్యాసులవారు పేర్కొన్నారు.

**వ. తదనంతరంబ యొక్క రమ్యప్రదేశంబున రాజమందిరంబును నుచిత స్థానంబుల సమస్తజన నివాసంబులునై రమణీయబంధురంబును సింధురాశ్వశాలా మాలికా మనోహరంబునుంగా వీడెల్ల విడిసె; వీటి చుట్టునుం దిరిగి ధృష్టద్యుమ్నుండు సురక్షితంబు చేసివచ్చె; రాజును దొరలును దమ్ములును సకల పరివారంబును దగిన తెఱంగున నుండిరి. నానావస్తు బహుళ సంభారంబుల మహోదారం బగుచుఁ బాండవ స్కంధావారంబు మహనీయాకారంబున నొప్పె; నంత నక్కడ. 132**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబ= ఆ పిదప; ఒక రమ్య ప్రదేశంబునన్= ఒక మనోహరమైన చోట; రాజమందిరంబును= రాజభవనమును; ఉచిత స్థానంబులన్= తగిన తావులలో; సమస్త జన నివాసంబులును+ఐ= జనులందరికీ నివాస గృహాలు కలిగి; రమణీయ బంధురంబును= మనోహరము, ఒప్పినవియునై; సింధుర+అశ్వశాలా మాలికా మనోహరంబునున్+కాన్= ఏనుగుల, గుర్రాల సాలల యొక్క వరుసలచే ఇంపు గొల్పునది కాగా; వీడు+ఎల్లన్+విడిసెన్= సైన్యమంతయూ బస చేసింది; ధృష్టద్యుమ్నుండు; వీటి చుట్టునున్= సైన్యం విడిసిన చోటు చుట్టూ; తిరిగి= ప్రదక్షిణించి; సురక్షితంబు చేసివచ్చెన్= మిక్కిలి రక్షింపబడినట్టిదిగా చేసి వచ్చాడు; రాజును= ధర్మజుడును; దొరలును= ప్రభువులును; తమ్ములును= భీమాదులు; సకల పరివారంబును= సమస్త పరిజనమున్నూ; తగిన తెఱంగునన్+ఉండిరి= ఉచిత విధంగా ఉన్నారు; నానావస్తు బహుళ సంభారంబులన్= పలు తెఱగులైన వస్తువులు, అధికమైన పదార్థ సంచయం అనే వాటిచే; మహా+ఉదారంబు+అగుచున్= మిక్కిలి దొడ్డదై; పాండవస్కంధావారంబు= పాండవుల యొక్క దండు విడిసిన చోటు; మహనీయ+ఆకారంబునన్= గొప్ప స్వరూపంతో; ఒప్పెన్; అంతన్; అక్కడన్.

**తాత్పర్యం:** ఒక అందమైన ప్రదేశంలో రాజగృహం, తగిన తావులందు సకల జన నివాసాలూ, గజశాలలూ, అశ్వశాలలూ చూడటానికి సొగసుగా ఉండగా దండు దిగింది. ధృష్టద్యుమ్నుడు పాండవ స్కంధావారం చుట్టూ తిరిగి దానిని సురక్షితం కావించి వచ్చాడు. ధర్మజుడు, అతని తమ్ములు, ప్రభువులు, సమస్త పరిజనులు అర్హ విధాల ఆయా తావులలో ఉన్నారు. నానావస్తుసామగ్రులతో మిక్కిలి దొడ్డదైన ఆ పాండవ స్కంధావారం సమున్నతాకారంతో భాసిల్లింది. ఇక హస్తినాపురంలో.

**క. చారులచే నంతయు విని । కౌరవపతి విననియట్ల కర్ణాదులతోఁ**
**బేరోలగమున విగత వి । కారుండై యిట్టు లనియె గర్వ మెలర్పన్. 133**

**ప్రతిపదార్థం:** కౌరవపతి= కౌరవులకు నాయకుడైన దుర్యోధనుడు; చారులచేన్= వేగులవారిచేత; అంతయున్ విని= పాండవులు దండు విడిసినారని తెలిసి; వినని+అట్ల= తనకేమీ ఆ విషయం తెలియని చందంగా; కర్ణ+ఆదులతోన్= రాధేయుడు మున్నగు వారితో; పేరు+ఓలగమునన్= పెద్దసభలో; విగత వికారుండు+ఐ= మారుపాటు లేనివాడై; గర్వము+ ఎలర్పన్= అహంకారం అతిశయించగా; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** వేగులవారి వలన పాండవులు దండు విడిసినారని విని, తానేమీ విననివాడి మాదిరి దుర్యోధనుడు తన ఆకార స్వభావాలందు ఏమార్పు లేనివాడై పెద్ద సభలో రాధేయుడు మొదలైనవారితో అహంకార మతిశయించగా ఇట్లా అన్నాడు:

**క. 'తన వచ్చిన కార్యము మన । మనుకూలతఁ జేయకున్న హరి యలుకమెయిన్**
**జని యప్పాండు తనూజులు । మనములఁ గిను కూనునట్టి మాటలు సెప్పున్. 134**

**ప్రతిపదార్థం:** హరి= శ్రీకృష్ణుడు; తన వచ్చిన కార్యమున్= తాను చనుదెంచిన పనిని; మనము; అనుకూలతన్= తన సంకల్పానికి అనుగుణంగా; చేయక+ఉన్నన్= చేసినవాళ్ళం కానందున; అలుక మెయిన్= కోపంతో; చని= వెళ్ళి; ఆ+ పాండుతనూజులు= ఆ పాండు కుమారులు; మనములన్= తమ చిత్తములందు; కినుక= కోపం; ఊను+అట్టి మాటలు= పొందునట్టి పలుకులు; చెప్పున్= వారికి చెపుతాడు.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణుడు తాను వచ్చిన పనిని మనం అనుకూలంగా నెరవేర్చనందువలన మన మీద కోపంతో వెళ్ళి, పాండవులకు క్రోధం కలిగించే మాటలు చెప్పుతాడు.

**చ. మును మనచేత భంగపడి ముచ్చిరి యుండుటఁ జేసి పాండునం**
**దనులును నెత్తివత్తు రుచితంబుగ; సంగర మెట్లుఁ గల్గుఁ; బే**
**ర్చిన బహుసైన్యముల్ బయలఁ జేరఁ దగన్ విడియింత; మెల్లి దం**
**డని పురిఁ జాటఁ బంచి దొరలందఱకున్ బడిసేయుఁ డేడ్తెఱన్.** 135

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; మనచేతన్= మనవలన; భంగపడి= అవమానించబడి; ముచ్చిరి+ఉండుటన్+చేసి= పరితపిస్తున్నందువలన; పాండునందనులును= పాండుపుత్రులు కూడ; ఉచితంబుగన్= తగిన విధంగా; ఎత్తివత్తురు= యుద్ధం చెయ్యటానికి వస్తారు; సంగరము= యుద్ధం; ఎట్లున్+కల్గన్= ఏ విధంగానైనా జరిగి తీరుతుంది; పేర్చిన= అతిశయించిన; బహుసైన్యముల్= పెక్కు సేనలు; బయలన్+చేరన్= బయలునకు చేరగా; తగన్= చక్కగా; విడియింతము= దిగేటట్లు చేద్దాము; ఎల్లి= రేపు; దండు+అని= దండయాత్ర అని; పురిన్= పట్టణంలో; చాటన్+పంచి= చాటించి; దొరలు+ అందఱకున్= రాజులందరికీ; ఏడ్తెఱన్= శీఘ్రంగా; పడి చేయుఁడు= ఆజ్ఞలివ్వండి.

**తాత్పర్యం:** పూర్వం మనచేత అవమానించబడి పరితపిస్తున్న వారు కనుక పాండవులు తగిన విధంగా యుద్ధం చెయ్యటానికి తరలివస్తారు. సమరం జరగక మానదు. ఏపుమీరిన మన సేనలు విశాలమైన బయలుకు చేరుకొనగానే అక్కడ దిగేటట్లు చేద్దాము. రేపే దండయాత్ర అని నగరంలో చాటించండి. రాజు లందరికీ శీఘ్రమే ఆజ్ఞలివ్వండి.

**వ. మనకు విడిదల కురుక్షేత్రం'బని పలికి దుశ్శాసనుం జూచి, నీవును గర్ణుండును గాంధారపతియును సమస్తంబును సమకట్టుం' డనుటయు వారలు ప్రియంబునం బనిపూని వెడలి దండు సాటించి, తగు వారలకెల్ల నెఱింగించి పుచ్చిన, సకల పరివారంబును బ్రమోదంబు నొందె; భూవల్లభుండును గొలిచియున్నవారలం బోవంబంచి, వలయు నెడకుం జని తగిన వర్తనంబున నుండె; నట్టి సమయంబునఁ బ్రయాణోచితంబులగు బహుప్రకార వ్యాపారంబులయందుఁ దత్పరులయిన దొరల నానాచేష్టితంబులను, గరితురగ రథంబులకు సవరణలు సమకూర్చు చతుర పరిచారకుల సంభ్రమంబునను, వివిధాయుధంబులు రవణంబులుగా నాయితంబులు సేయఁ బ్రవర్తించు పదాతి వర్గంబుల సంరంభంబునను నయ్యైసరకులు పయనంబున కనువు సేయ బలుమానుసుల తిరుగుడు వడుటనుం బురంబు సమరోత్సాహ చంద్రోదయంబునకు మహార్ణవంబై ఘూర్ణిల్లుచుండె; నపరదిన ముఖంబున.** 136

**ప్రతిపదార్థం:** మనకున్; విడిదల= విడియు చోటు; కురుక్షేత్రంబు; అని; పలికి దుశ్శాసనున్ చూచి నీవును; కర్ణుండును; గాంధార పతియున్= శకునియు; సమస్తంబును సమకట్టుండు= అన్ని ఏర్పాట్లు చెయ్యండి; అనుటయున్= అని చెప్పగా; వారలు; ప్రియంబునన్= సంతోషంతో; పనిపూని; వెడలి; దండు చాటించి= యుద్ధయాత్రను పట్టణంలో చాటించి; తగువారలకున్+ఎల్లన్= తగిన వారికందరికీ; ఎఱింగించి= తెలిపి; పుచ్చినన్= పంపగా; సకల పరివారంబును= బలగ మంతయున్నూ; ప్రమోదంబున్+ఒందెన్= సంతోషించింది; భూవల్లభుండును= దుర్యోధనుడు; కొలిచి+ఉన్న వారలన్= తనను సేవిస్తున్నవారిని; పోవన్+పనిచి= వెళ్ళండని చెప్పి; వలయు+ఎడకున్+చని= ఇష్టప్రదేశానికి వెళ్ళి; తగిన వర్తనంబునన్+ ఉండెన్= తన పనిలో తానున్నాడు; అట్టి సమయంబునన్; ప్రయాణ+ఉచితంబులగు= పయనమునకు తగినట్టి; బహుప్రకార

వ్యాపారంబులయందున్= అనేక విధాలైన పనిపాటులలో; తత్పరులు+ఐన= శ్రద్ధగలవారైన; దొరల= రాజుల యొక్క; నానా చేష్టితంబులను= పలు తెరగులైన పనులచేతను; కరి తురగ రథంబులకున్= ఏనుగులకు, గుర్రాలకు, రథాలకు; సవరణలు సమకూర్చు= అలంకారాలు సల్పు; చతుర పరిచారకుల= నేర్పుగల భృత్యులయొక్క; సంభ్రమంబునను= వేగిరపాటు చేతను; వివిధ+ఆయుధంబులు= రకరకాలైన ఆయుధాలు; రవణంబులుగాన్= ఆభరణాలుగా; ఆయితంబులు+చేయన్= సిద్ధపరచుటకు; ప్రవర్తించు= తిరుగుతున్న; పదాతివర్గంబుల= కాలిబంటుల యొక్క (నడజోదులయొక్క); సంరంభంబునను= సన్నాహం చేతనూ; అయ్యై సరకులు= ఆయాపదార్థాలు; పయనంబునకున్= యుద్ధయాత్రకు; అనువు చేయు= సిద్ధం గావించే; బలుమానిసుల= బలిష్ఠులైనవారి యొక్క; తిరుగుడు+పడుటనున్= తిరుగుచుండటం చేతను; పురంబు= హస్తినాపురి; సమర+ఉత్సాహ చంద్ర+ఉదయంబునకున్= యుద్ధ ప్రయత్నమనెడు చంద్రోదయానికి; మహా+అర్ణవంబు+ఐ= గొప్ప సముద్రమై; ఘూర్ణిల్లుచున్+ఉండెన్= మ్రోగుతుండింది; అపరదిన ముఖంబునన్= మరునాటి ప్రభాత సమయంలో-

**తాత్పర్యం:** మనము విడియవలసిన చోటు కురుక్షేత్ర'మని పలికి దుర్యోధనుడు దుశ్శాసనుడిని చూచి, 'నీవూ కర్ణుడూ, శకునీ అన్ని పనులు చూడండి' అని చెప్పగా వారు మహాసంతోషంతో కార్యోన్ముఖులై వెళ్ళారు. నగరంలో దండయాత్ర చాటించారు. తగిన వారందరికీ యుద్ధయాత్రను గురించి తెల్పటానికి సేవకులను నియోగించారు. దుర్యోధనుని పరివారమంతా సంతోషం పొందింది. రాజరాజు తనను కొలిచిఉన్న వారిని వెళ్ళండని పలికి వారికి సెలవొసంగి తనపాటికి తాను తగిన వర్తనంతో ఉండిపోయాడు. ఆ సమయాన ప్రయాణానికి అనుకూలమైన పలు విధాలైన పనులలో మునిగిన రాజుల చేష్టితాలూ, ఏనుగులను, గుర్రాలను, రథాలను అలంకరించే నేర్పుగల పరిచారకుల సందడీ, పలురకాలైన ఆయుధాలు అనే సొమ్ములను సంసిద్ధపరచడానికి తిరుగుతున్న కాలిబంటుల యొక్క సంరంభం, ప్రయాణానికి తగిన వస్తుసామగ్రిని సమకూరుస్తున్న బలిష్ఠులైన మనుషుల తిరుగుళ్ళూ కలిగి హస్తినాపురం యుద్ధోత్సాహమనే చంద్రోదయ వేళ ఆటుపోటుల్లో ఉన్న మహాసముద్రంవలె ఉన్నది. అంత మరునాటి ప్రభాతసమయంలో-

**విశేషం:** సమరోత్సాహ చంద్రోదయంబునకుఁబురంబు మహార్ణవంబై - అలంకారం రూపకం.

**క. త్వరితగతి సమయ సముచిత । కరణీయము లాచరించి కమనీయాలం**
**కరణోజ్జ్వలుఁడై యెలమిం । గురురా జేతెంచెఁ గొలువు కూటంబునకున్. 137**

**ప్రతిపదార్థం:** త్వరితగతిన్= శీఘ్రంగా; సమయ సముచిత= ఆ వేళకు తగిన; కరణీయములు= చేయవలసిన పనులు; ఆచరించి= చేసి; కమనీయ+అలంకరణ+ఉజ్జ్వలుఁడు+ఐ= మనోహరమైన అలంకారాల చేత మిక్కిలి ప్రకాశిస్తున్నవాడై; ఎలమిన్= సంతోషంతో; కురురాజు= కౌరవపతి సుయోధనుడు; కొలువుకూటంబునకున్= సభామందిరానికి; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** మరునాటి ప్రభాత సమయంలో తొందరగా తత్కాలోచితాలైన కృత్యాలు నిర్వర్తించి మనోజ్ఞాలైన అలంకారాలతో ప్రకాశిస్తూ కొలువుకూటానికి కురురాజైన సుయోధనుడు సంతోషంతో వచ్చాడు.

**వ. వచ్చి దుశ్శాసన ప్రముఖ నిఖిలసహోదర పరివృతుండై యుండి. 138**

**ప్రతిపదార్థం:** వచ్చి; దుశ్శాసన ప్రముఖ= దుశ్శాసనుడు మొదలైన; నిఖిల సహోదర= సమస్త సోదరులతో; పరివృతుండు+ ఐ+ఉండి= చుట్టబడినవాడై ఆసనమునందు అధివసించి.

**తాత్పర్యం:** వచ్చి, దుశ్శాసనుడు మొదలైన అనుజవర్గంచేత చుట్టబడినవాడై ఉండి రాజరాజు.

### దుర్యోధనుఁడు ద్రోణప్రభృతుల సేనాపతులం జేయుట (సం. 5-152-27)

**సీ.** **అరిభయంకరుఁడు ద్రోణాచార్యుఁడును, రణో । త్సాహ లంపటుఁడు రాధాసుతుండు,**
**శరతత్త్వవేది యశ్వత్థామయును, భూరి । బాహా విలాసుండు బాహ్లికుండు,**
**శౌర్య వైభవశాలి శల్యుండు, ధైర్యసం । పన్నిధి కృపుఁడును, బ్రకటశక్తి**
**సార దుర్జయమూర్తి భూరిశ్రవుండును, । దర్పోజ్జ్వలుండు గాంధారపతియు,**

**తే.** **నుగ్రతేజుండు గృతవర్మయును, బ్రతాప । ఘనుఁడు కాంభోజుఁడును, బరాక్రమధనుండు**
**సింధురాజును బతులుగాఁ జేయఁగోరి । కొనఁగఁ దగువార లగుదు రక్షోహిణులకు.'** 139

**ప్రతిపదార్థం:** అరిభయంకరుఁడు= శత్రువులకు భయం గలిగించునట్టి; ద్రోణ+ఆచార్యుఁడును= గురువైన ద్రోణుఁడును; రణ+ఉత్సాహలంపటుఁడు= యుద్ధంచేయటంలో మిక్కిలి ఆశ గల్గిన; రాధాసుతుండు= రాధ కొడుకు కర్ణుడును; శరతత్త్వవేది= బాణాల యొక్క స్వరూప స్వభావాలెరిగిన; అశ్వత్థామయును= గురుపుత్త్రు డశ్వత్థామయూ; భూరిబాహావిలాసుండు= గొప్ప భుజసౌందర్యంగల (అనగా అధిక భుజశక్తి గలిగిన); బాహ్లికుండు= శంతను మహారాజు తమ్ముడైన బాహ్లికుడును; శౌర్యవైభవశాలి= పరాక్రమ విభవము గల్గినట్టి; శల్యుండున్= మద్రరాజు శల్యుడును; ధైర్యసంపద్+నిధి= ధైర్యసంపదకు నిలయమైన; కృపుఁడును= కృపాచార్యులున్నూ; ప్రకట శక్తిసార దుర్జయమూర్తి= ప్రఖ్యాతమైన బలవిక్రమముల చేత జయించరాని స్వరూపంగల; భూరిశ్రవుండును= భూరిశ్రవుడనేవాడును; దర్ప+ఉజ్జ్వలుండు= గర్వరేఖచేత వెలుగునట్టి; గాంధార పతియున్= శకునియూ; ఉగ్రతేజుండు= భయంకర ప్రతాపంగల (రుద్రుని ప్రతాపం వంటి ప్రతాపం గలిగినవాడని భావం); కృతవర్మయును= (భోజకులాగ్రణి) కృతవర్మయున్నూ; ప్రతాపఘనుఁడు= విక్రమంచేత గొప్పవాడైన; కాంభోజుఁడును= కాంభోజ దేశరాజున్నూ; పరాక్రమధనుఁడు= శౌర్యమే ధనంగా కలిగిన; సింధురాజును= సింధుదేశాధిపతి సైంధవుడున్నూ; అక్షోహిణులకున్= పదకొండు అక్షౌహిణుల సేనలకు; పతులుగాన్+చేయన్= నాయకులుగా చేయటానికి; కోరికొనఁగన్+తగువారలు+అగుదురు= వరించటానికి అర్హులైనవారవుతారు.

**తాత్పర్యం:** శత్రుభయంకరుడైన ద్రోణాచార్యులు, యుద్ధోత్సాహశీలిఅయిన రాధేయుడు, బాణ స్వరూప స్వభావాలెరిగిన అశ్వత్థామ; అధిక భుజశక్తి గలిగిన బాహ్లికుడు, పరాక్రమ వైభవోపేతుడు శల్యుడు, ధైర్య సంపదకు నిలయమైన కృపాచార్యుడు, విఖ్యాత వీర్యంచేత జయించరానట్టి భూరిశ్రవుడు, దర్పంచేత దీపించే శకుని, దారుణ ప్రతాపశాలి కృతవర్మా, విక్రమాఢ్యుడు కాంభోజరాజు, శౌర్యధన సంపన్నుడు సైంధవుడు మన పదకొండక్షోహిణులకు నాయకులుగా కోరదగినవారు.

**చ.** **అని మది నిశ్చయించి తగ నందఱఁ బిల్వఁగఁ బంచి వారితో**
**నని పని మాటలాడి వినయంబునఁ బ్రార్థన చేసి 'మీర లీ**
**యొనరిన సైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ**
**చ్చిన సకలంబు నొప్పు నభిషేకముఁ గైకొనుఁ డుత్సవంబునన్.** 140

**ప్రతిపదార్థం:** అని; మదిన్= తన మనస్సులో; నిశ్చయించి= నిర్ధారించుకొని; తగన్= ఒప్పుగా; అందఱన్= వీరినందరినీ; పిల్వఁగన్+పంచి= పిలువనంపి; వారితోన్= ఆ వచ్చిన ద్రోణ ప్రముఖులతో; అని పని మాటలు+ఆడి= యుద్ధ సంబంధి

విషయాలను చర్చించి; వినయంబునన్= అడకువతో; ప్రార్థన చేసి= వేడికొని; మీరలు= మీరు; ఈ+ఒనరిన సైన్యముల్= కూడిన ఈ సేనలు; పదునొకొంటికిన్= పదకొండక్షౌహిణులకు; ప్రాభవము+ఆచరింపన్+చొచ్చినన్= ఆధిపత్యం చేయటానికి పూనుకొంటే; సకలంబున్+ఒప్పున్= అంతా సవ్యంగా జరుగుతుంది; ఉత్సవంబునన్= వైభవంగా; అభిషేకము+కైకొనుఁడు= అభిషిక్తులు కండి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఈ ప్రకారంగా తన మనసులో నిర్ణయం చేసికొని చక్కగా వారి నందరినీ సభకు రప్పించి వారితో యుద్ధ విషయాలు ముచ్చటించి, అణకువతో వారినందరినీ స్తుతి చేసి, 'కూడిన ఈ పదకొండక్షోహిణుల సేనలకు మీరు ఆధిపత్యం వహించటానికి పూనుకొంటే అంతా సవ్యంగా జరిగి పోతుంది. వైభవంగా సేనాపతిత్వానికి అభిషిక్తులు కండి.'

**క. అనవుడు నందఱు నౌఁగా । కని సంతసమంద నధిపుఁ డభిషేకించెన్**
**జనులెల్ల సంప్రమోదం । బునఁ బొందఁగ నప్పు డతివిభూతి దలిర్పన్. 141**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని సుయోధనుడు వేడగా; అందఱున్= వారంతా; ఔన్+కాక+అని= అట్లేఅని; సంతసము+ అందన్= హర్షించగా; అధిపుఁడు= ప్రభువైన దుర్యోధనుడు; జనులు+ఎల్లన్= జనులందరూ; సంప్రమోదంబునన్+పొందగన్= మిక్కిలి సంతోషం చెందగా; అప్పుడు= ఆ సమయాన; అతి విభూతి= మిక్కిలి వైభవం; తలిర్పన్= ఒప్పగా; అభిషేకించెన్= అభిషిక్తులను చేశాడు.

**తాత్పర్యం:** సుయోధనుడి మాటలకు వారందరూ సంతోషంగా అంగీకరించారు. జనులంతా పరమానందభరితులుకాగా అపుడు దుర్యోధనుడు ఆ రాజులను మిక్కిలి వైభవంతో అక్షౌహిణీపతులుగా అభిషిక్తులను చేశాడు.

**వ. ఇట్లు మహామహిమ వెలయ నక్షోహిణీ నాయకుల సమకట్టి రారాజు పితామహుపాలికి వారిం దోడ్కొని చని సవినయంబుగా నతనికిఁ బ్రణామంబుసేసి, వారలం జూపి 'వీరల మన యక్షోహిణులు పదునొకొంటికిం బతులఁ గావించితి; నిన్నిసైన్యంబులు నొక్కలావున వర్తించు చందంబు సూచికొనవలయు' నని చెప్పుచుఁ జేతులు మొగిచి యిట్లనియె. 142**

**ప్రతిపదార్థం:** ఇట్లు, మహామహిమ వెలయన్= మిక్కిలి ప్రాభవమొప్పగా; అక్షోహిణీ నాయకులన్; సమకట్టి= కూర్చుకొని; రారాజు= రాజులకు రాజైన సుయోధనుడు; పితామహుపాలికిన్= భీష్మడి చెంతకు; వారిన్= వారలను; తోడ్కొనిచని= వెంటబెట్టుకొని వెళ్ళి; సవినయంబుగాన్= విధేయతతో; అతనికిన్; ప్రణామంబు చేసి= వందన మాచరించి; వారలన్ చూపి= ద్రోణాదులను కనబరిచి; వీరలన్= వీరిని; మన అక్షోహిణులు పదునొకొంటికిన్ పతులన్ కావించితిన్; ఇన్ని సైన్యంబులు; ఒక్క లావునన్= ఒక్క శక్తితో; వర్తించు చందంబు= మెలగు విధానం; చూచికొనవలయున్; అని చెప్పుచున్; చేతులు మొగిచి= హస్తాలు జోడించి; ఇట్లు+అనియెన్-

**తాత్పర్యం:** ఈ రీతిగా మహావైభవం మెరయగా అక్షౌహిణీ నాయకులను కూర్చుకొని రాజరాజు భీష్మడి చెంతకు వారిని వెంటబెట్టుకొనివెళ్ళాడు. అణకువతో నమస్కరించాడు. వారినందరినీ కనబరిచి- 'వీరిని మన పదకొండు అక్షోహిణులకు అధిపతులను చేశాను. ఇన్ని సేనలు ఏకముఖంగా మెలగే మార్గం చూడవలసి ఉన్నది' అని చెప్తూతూ హస్తాలు ముకుళించి ఇట్లా అన్నాడు:

**చ. 'నెటిఁబడి యాజి నీ మొనలు నేరవు కూడి తగం జరింప నిం**
**దఱ మన సొక్కఁడై చనక తప్పుఁగదా బహుదేశవాసు లం**
**దఱొకటి సేయుచో వెరవు దప్పక చెల్లుట యెట్లు గల్గు? ని**
**త్తెఱఁగొక చాలు వాని బలుతీర్పునఁ గాక పొసంగ నేర్చునే? 143**

**ప్రతిపదార్థం:** ఈ+మొనలు= ఈ సేనలు; నెటిన్+పడి= కుదురుపడి; కూడి= కలసి; తగన్= ఒప్పుగా; ఆజిన్= యుద్ధమందు; చరింపన్+నేరవు= మెలగజాలవు; ఇందఱ మనసు= ఈ జోదులందరి చిత్తం; ఒక్కఁడు+ఐ చనక= ఒకటిఅయి వర్తింపకుంటే; తప్పున్+కదా!= కార్యం చెడును గదా!; అందఱున్= వీరెల్లరు; బహుదేశవాసులు= అనేక దేశాలలో నివసిస్తున్నవారు; ఒకటి చేయుచోన్= ఒక పనిని చేస్తున్నప్పుడు; వెరవు= నేర్పు; తప్పక= చెడకుండ; చెల్లుట= సాగటం; ఎట్లు+కల్గున్= ఏరీతిగా సమకూడగలదు?; ఈ తెఱఁగు= ఈ సంవిధానం; ఒక చాలువాని= ఒకానొక సమర్థుడియొక్క; బలుతీర్పునన్+కాక= గొప్ప సవరింతవలనగాని; పొసంగన్+నేర్చున్= కలుగగలదా?; (కలుగదని భావం.)

**తాత్పర్యం:** 'పితామహా! మన ఈసేనలన్నీ యుద్ధంలో కుదిరికగా కలసి మెలసి చరించగలవా? ఇందరి మనస్సు ఏకముఖంగా వర్తించకుంటే కార్యం తప్పిపోతుంది గదా! చేరిన యోధులందరూ బహుదేశస్థులు. ఒక పని చేసేటప్పుడు అందరి నేర్పు ఏకోన్ముఖం కావలె. అప్పుడే కార్యం సఫలం కాగలదు. లోటుపాటులు సరిదిద్దగల ఒక సమర్థుడి ఆధిపత్యం సేనలకు లభించినపుడే సంకల్పించిన పని సానుకూల మవుతుంది.

**ఆ. అమరసేనలును దమంతన వర్తింప । నేర కునికి నా కుమారు మొగము**
**గానొనర్ప వలసెఁగాదె! సమస్తసే । నలను నీవ యరసి నడపవలయు. 144**

**ప్రతిపదార్థం:** అమర సేనలును= దేవతల సైన్యాలు కూడ; తమంతన= తమకు తామే; వర్తింపన్+నేరక+ఉనికిన్= ప్రవర్తింప జాలకుండటంచేత; ఆ కుమారున్= ఆ కుమారస్వామిని; మొగముగాన్+ఒనర్పన్+వలసెన్+కాదె!= సేనాగ్రమున నిలుపవలసి వచ్చింది కదా!; (కనుక;) సమస్త సేనలను= మన సైన్యాలన్నింటినీ; నీవు+అ= నీవే; అరసి= పరామర్శిస్తూ; నడపన్+వలయున్= నడిపించాలి.

**తాత్పర్యం:** దేవతాసేనలు కూడ తమకు తామే వ్యవహరించ లేవు కనుక కుమారస్వామిని సైన్యాధిపతిని చేయవలసి వచ్చింది. కావున నా సైన్యాలన్నింటికీ నీవే నాథుడవై నడిపించాలి.

**క. తారలకుం జంద్రునిగతిఁ । గౌరవులకు మేటి వీవ; కావున నీవీ**
**భారంబు పూని మముఁ గడ । చేరుపఁదగు నెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా! 145**

**ప్రతిపదార్థం:** ప్రసిద్ధచరిత్రా!= ప్రఖ్యాతమైన నడవడిగల పితామహా!; తారలకున్= చుక్కలకు; చంద్రునిగతిన్= సోముడివలె; కౌరవులకున్= కురుకుమారులకు; ఈవు+అ= నీవే; మేటివి= అధికుడవు; కావునన్= కాబట్టి; నీవు; ఈ భారంబు పూని= ఈ యుద్ధభారాన్ని వహించి; మమున్= మమ్ము; ఏ+మెయిన్= ఏ రీతిగానైనా; కడచేరుపన్= ఒడ్డుకు చేర్చటానికి; తగున్= యుక్తం.

**తాత్పర్యం:** పితామహా! నీవు సుప్రసిద్ధ చరిత్రుడవు. చుక్కలకు జాబిల్లివలె కౌరవులందరికీ నీవే శరణ్యుడివి. కనుక ఈ రణభారం వహించి ఎట్లాగైనా మమ్ము ఒడ్డుకు చేర్చు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప । నీవు దక్క నిం దొక్కరు నీవ యరసి**
**చెప్పుమా కలఁడేని; రక్షింపు మమ్ముఁ, । బూని పట్టంబుఁ దాల్పుము, పొడిచి గెలుము.' 146**

**ప్రతిపదార్థం:** సర్వసేనా+ఆధిపత్యంబు= సమస్త సేనలయొక్క నాయకత్వాన్ని; నిర్వహింపన్= నెరవేర్చటానికి; నీవు తక్కన్= నీవు కాక; ఇందున్= మన పక్షంలో; ఒక్కరున్= ఒకడిని; నీవు+అ= నీవే; అరసి= పరికించి; కలఁడు+ఏనిన్= ఉంటే; చెప్పుమా?= వచింపుము; మమ్మున్= మమ్ము; పూని= పూనిక వహించి; రక్షింపు(ము)= కాపాడుము; పట్టంబు+తాల్పుము= సర్వసైన్యాధ్యక్ష పదవి పరిగ్రహించుము; పొడిచి గెలుము= రణమొనర్చి విజయం సాధించు.

**తాత్పర్యం:** పితామహా! సర్వసైన్యాధిపత్యం నిర్వహించుటకు నీవు దప్ప ఇక్కడ మరెవ్వరూ లేరు. ఉంటే నీవే చెప్పు. పూనికతో మమ్ము కాపాడు. యుద్ధంచేసి విజయం సాధించుము.'

**వ. అనిన విని గాంగేయుండు గాంధారేయున కిట్లనియె : 147**

**ప్రతిపదార్థం:** అనినన్ విని; గాంగేయుండు= భీష్ముడు; గాంధారేయునకున్= గాంధారి కొడుకు దుర్యోధనుడితో; ఇట్లు+ అనియెన్-

**తాత్పర్యం:** ఆ మాటలు విని భీష్ముడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'మీరుఁ బాండుసుతులు నారయ నా కొక్క । రూప; కార్య మున్నరూపు వలుక**
**వలయుఁ; గయ్యమైన వత్తు మీలోన నా । యునికి చందమునకు నుచిత మిదియ. 148**

**ప్రతిపదార్థం:** ఆరయన్= తలపోయగా; మీరున్= మీరును; పాండుసుతులున్= పాండవులూ; నాకున్= నాకు; ఒక్క రూప= సమానులే; కార్యము= పనియొక్క; ఉన్నరూపు= ఉన్నట్టి చందము; పలుకన్ వలయున్= చెప్పవలసి ఉంటుంది; మీలోనన్= మీలోపలనే; నా+ఉనికి+చందమునకున్= నేనున్నందులకు; కయ్యము+ఐనన్= యుద్ధం సంభవిస్తే; వత్తున్= మీ పక్షం వహిస్తాను; ఇది+అ ఉచితము= ఇదే తగింది.

**తాత్పర్యం:** 'మీరున్నూ పాండుకుమారులున్నూ నాకు సమానులే. కాని ఉన్న విషయం చెప్పవలె. వారితో మీకు యుద్ధమేర్పడినపుడు నేను మీ పక్షం వాడనే. ఏలన, నేను మీ వద్దనే ఉన్నాను. కనుక నా కిదే సముచితం.

**క. సేనాధిపత్యమును దగఁ । బూనెద; నను మార్కొనంగఁ బురుషుల నుర్విం**
**గానఁ; గిరీటికి నొక్కని । కే నోర్వ; నతండు శరము లెక్కు డెఱుంగున్. 149**

**ప్రతిపదార్థం:** సేనా+ఆధిపత్యమును= సేనా నాయకత్వాన్ని; తగన్= ఒప్పిదంగా; పూనెదన్= వహిస్తాను; ననున్= నన్ను; మార్కొనంగన్= ఎదిరించటానికి; పురుషులన్= వీరులను; ఉర్విన్= పుడమిలో; కానన్= చూడను; కిరీటికిన్+ఒక్కనికిన్= ఒక్క అర్జునుడికి; ఏను= నేను; ఓర్వన్= ఎదురు నిలువలేను; అతండు= అర్జునుడు; ఎక్కుడు= నాకంటె అధికంగా; శరములు= బాణాలు; ఎఱుంగున్= తెలిసినవాడు.

**తాత్పర్యం:** నేను సర్వసేనాధిపత్యం వహిస్తాను. నన్ను ఎదుర్కొనగల పురుషులెవ్వరూ ఈ పుడమిలో లేరు. కాని నేను కిరీటిని మాత్రం ఎదుర్కొనలేను. ఏలన, అతడికి నాకంటె ఎక్కువ బాణాలు తెలుసు.

**క. పెఱవారినెల్లఁ దరమిడి । నఱకుదుఁ; బాండుక్షితీశ నందనులను రూ**
**పఱసేయం జేయాడదు; । తఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్. 150**

**ప్రతిపదార్థం:** పెఱవారిన్+ఎల్లన్= ఇతరుల నందరినీ; తరము+ఇడి= వరుసపెట్టి (మునుము బట్టి); నఱకుదున్= ఖండిస్తాను; పాండుక్షితి+ఈశ నందనులను= పాండురాజు కుమారులను; రూపు+అఱచేయన్= నిర్మూలించటానికి; చే+ఆడదు= చేయిరాదు; వారున్= కౌంతేయులుకూడ; అతి+ఉదగ్రతన్= మిక్కిలి భయంకరంగా; నా మీఁదన్= నాపైకి; తఱుమరు= కవియరు.

**తాత్పర్యం:** ఇతరులందరినీ వరుసపెట్టి నఱికివేస్తానుగాని పాండుకుమారులను సంహరించటానికి నాకు చేతులాడవు. వారు కూడా ఉద్ధతులై నా మీదికి దూకరు.

**వ. అప్పటికిఁ దగిన భంగి యయ్యెడు; నది యట్లుండె' నని పలికి మఱియు నిట్లనియె. 151**

**ప్రతిపదార్థం:** అప్పటికిన్= ఆ సమయానికి; తగిన భంగి+అయ్యెడున్= తగినట్లు జరుగుతుంది; అది+అట్లుండెన్= ఆ విషయం అట్లా ఉంచుము; అని పలికి; మఱియున్; ఇట్లు+అనియెన్-

**తాత్పర్యం:** ఆ సమయానికి జరుగవలసిందేదో జరుగుతుంది. ఆ సంగతి అట్లా ఉండనీ' అంటూ భీష్ముడు మళ్ళీ ఇట్లా అన్నాడు:

**ఆ. 'మున్ను కర్ణునొండె నన్నొండెఁ గయ్యంబు । చేయఁ బనుపు; మిట్లు సేయువాఁడ**
**వైనఁ గాని సకల సేనాధిపత్యంబుఁ । బూన నేరఁ జుమ్ము భూపవర్య!' 152**

**ప్రతిపదార్థం:** భూపవర్య!= రాజవరేణ్యా!; మున్ను= ముందుగా; కర్ణున్+ఒండెన్= కర్ణుడినిగాని; నన్నున్+ఒండెన్= నన్నుగాని; కయ్యంబు చేయన్= యుద్ధం చేయటానికి; పనుపుము= పంపుము; ఇట్లు చేయువాఁడవు+ఐనన్+కాని= ఇట్లా నీవు చేయగల్గినపుడే; సకల సేనా+ఆధిపత్యంబు= సర్వసేనలకు నాయకత్వం; పూనన్ నేరన్ చుమ్ము!= వహించుటకు అంగీకరించను సుమా!

**తాత్పర్యం:** 'రాజవర్యా! ముందు నన్నుగాని, లేదా కర్ణుడినిగాని యుద్ధం చేయటానికి నియోగించుము. ఇట్లా నీవు చేయగలిగితే తప్ప నేను సర్వసేనాధిపత్యం వహించటానికి సమ్మతించను సుమా!'

**వ. అనినం గర్ణుండు కౌరవపతితో నిట్లనియె : 153**

**తాత్పర్యం:** భీష్మ డట్లనగా కర్ణుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**క. 'ఇప్పుడు క్రొత్తగ దీనిం । జెప్పంగా నేల? మున్న చెప్పితిఁగాదే!**
**యెప్పుడు భీష్ముండు వడు నే । నప్పు డనికి వచ్చువాఁడ నని సభలోనన్.' 154**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు; క్రొత్తగన్; దీనిన్= ఈ విషయాన్ని; చెప్పంగాన్+ఏల?= చెప్పుటెందుకు?; ఎప్పుడు= ఏ వేళ; భీష్ముఁడు పడున్= భీష్ముడు నేలగూలునో; అప్పుడు= ఆ వేళ; నేను; అనికిన్= యుద్ధానికి; వచ్చువాఁడన్+అని= రాగలనని; సభలోనన్= సభలో; మున్ను+అ= మునుపే; చెప్పితిన్+కాదే!= చెప్పానుగదా!

**తాత్పర్యం:** ఇపు డీవిషయం క్రొత్తగా చెప్పటమెందుకు? ఎపుడు రణరంగంలో భీష్ముడు నేలగూలుతాడో అపుడు నేను యుద్ధం చేయవస్తానని మునుపే సభలో చెప్పాను కదా!

ఆ. అనిన 'నట్ల కాక' యని సర్వసేనాధి। పత్యభార పట్టబంధమునకు
నియ్యకొనియె భీష్ముఁ; డయ్యగ్గలికఁ గొని। యాడె విభుఁడు ప్రముదితాత్ముఁ డగుచు. 155

**ప్రతిపదార్థం:** అనినన్= అని కర్ణుడు పలుకగా; అట్లకాక+అని= సరేనని; భీష్ముఁడు= గాంగేయుడు; సర్వసేనా+ఆధిపత్యభార= సకలసేనా విభుత్వభారం వహించటం అనెడు; పట్టబంధమునకున్= పట్టం గట్టుకొనుటకు; ఇయ్యకొనియన్= అంగీకరించాడు; విభుఁడు= రాజగు దుర్యోధనుడు; ప్రముదిత+ఆత్ముఁడు+అగుచున్= సంతుష్టచిత్తుడై; ఆ+అగ్గలికన్= భీష్ముడి సమరోత్సాహాన్ని; కొనియాడెన్= మెచ్చాడు.

**తాత్పర్యం:** అని కర్ణుడు పలుకగా 'అట్లే అగుగాక' అని భీష్ముడు సర్వసేనాధిపతిగా పట్టం కట్టుకొనటానికి అంగీకరించాడు. దుర్యోధనుడు సంతోషించిన మనస్సుకలవాడై ఆతడి యుద్ధోత్సాహాన్ని ప్రస్తుతించాడు.

క. 'భేరీ మృదంగ శంఖ మ। హారవములు సెలఁగఁ జేయుఁ'డని పనిచి, మహో
దార పతాకా ద్యుత్సవ। గౌరవములు నడపె నెల్లకడలం బురిలోన్. 156

**ప్రతిపదార్థం:** భేరీ మృదంగ శంఖ= ఢంకాలు, మద్దెలలు, శంఖములు అనువాటియొక్క; మహా+ఆరవములు= గొప్పధ్వనులు; చెలఁగన్+చేయుఁడు+అని= వ్యాపించేటట్లు చేయండని; పనిచి= ఆజ్ఞాపించి; మహా+ఉదార పతాకా+ఆది= మిక్కిలి గొప్పటెక్కెములు మున్నగువాటియొక్క; ఉత్సవ గౌరవములు= ఊరేగింపులు; పురిలోన్= నగరంలో; ఎల్లకడలన్= అన్నివైపుల; నడపెన్= జరిపించాడు.

**తాత్పర్యం:** ఢంకాలు, మద్దెలలు, శంఖాలు మ్రోగుతుండగా, మిక్కిలి ఎత్తయిన జెండాల ఊరేగింపులు నగరంలో అన్నిచోట్ల దుర్యోధనుడు జరిపించాడు.

వ. అట్లు పట్టణాలంకారంబు సంఘటించి, రత్నకాంచన కలధౌతమయంబులగు కలశంబులఁ దీర్థజలంబులు దెప్పించి, మణిప్రకరంబునఁ గుసుమ నికరంబున మంగళ తరు త్వక్పల్లవ ప్రచయంబున మహౌషధి నిచయంబున విహిత మంత్రంబుల నుచిత తంత్రంబుల ఋత్విక్పురోహిత సహితుండై త త్సంస్కార ప్రకారం బాచరించి. 157

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; పట్టణ+అలంకారంబు సంఘటించి= పట్టణమును శృంగారింపజేసి; రత్న కాంచన కలధౌతమయంబులు+అగు= రత్నములు, బంగారం, వెండి అనువాటితో చేయబడిన; కలశంబులన్= పాత్రలలో; తీర్థ జలంబులు తెప్పించి= పవిత్రములైన నదులయందలి ఉదకములు తెప్పించి; మణిప్రకరంబునన్= రత్నాల సమూహం చేతను; కుసుమ నికరంబునన్= పూలమొత్తం తోడను; మంగళతరు త్వక్+పల్లవ= శోభనకరాలైన చెట్లపట్టలయొక్క, చిగురుటాకులయొక్క; ప్రచయంబునన్= సముదాయంతో; మహా+ఓషధి నిచయంబునన్= మందుల కుపయోగించే గొప్ప మూలికలయొక్క రాశితో; విహిత మంత్రంబులన్= ఈ సన్నివేశమునకు శాస్త్రములందు చెప్పబడిన మంత్రాలతో; ఉచిత తంత్రంబులన్= కార్యసాధకాలైన క్రియలతో; ఋత్విక్+ పురోహిత+సహితుండు+ఐ= ఋత్విజులతో పురోహితులతో కూడినవాడై; తద్‌సంస్కార ప్రకారంబు+ఆచరించి= కలశాలలోని పుణ్యనదీ జలాలను పరిశుద్ధపరిచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** దుర్యోధనుడు పట్టణాన్ని అలంకరింపజేశాడు. రత్న కలశాలతో, బంగారు కలశాలతో, వెండి కలశాలతో పవిత్ర నదీ జలాలను తెప్పించాడు. వాటికి మణులతో, పూలతో, పవిత్రములైన వృక్షముల యొక్క బెరడులతో,

చిగుళ్ళతో, గొప్ప ఓషధులతో, వేదవిహితాలైన మంత్రాలతో, తంత్రాలతో ఋత్విక్పురోహితులతో కూడినవాడై సుయోధనుడు సంస్కారం కలుగజేశాడు.

**క. గురుఁడును గృపుఁడును లోనగు । గురు లనుమోదింప, బాహ్లికుండు మొదలుగాఁ**
**గురుజాతి యెలర్పఁగ న । న్నరపతి భీష్మాభిషేచనం బొనరించెన్. 158**

**ప్రతిపదార్థం:** గురుఁడును= ద్రోణాచార్యులు; కృపుఁడున్= కృపాచార్యులు; లోనగు= మున్నుగాగల; గురులు= పెద్దలు; అనుమోదింపన్= అంగీకరించగా; బాహ్లికుండు మొదలుగాన్= బాహ్లికుడు మున్నుగాగల; కురుజాతి= కురువంశస్థులు - కౌరవులు; ఎలర్పఁగన్= సంతోషించగా; ఆ+నరపతి= ప్రభువైన సుయోధనుఁడు; భీష్మ+అభిషేచనంబు+ఒనరించెన్= భీష్ముడికి సర్వసేనా విభుత్వమునకై మంగళస్నానం చేయించాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు కృపుడు మొదలైన గురువులు అంగీకరించగా, బాహ్లికుడు మొదలైన కురువంశ సంజాతులు సంతోషించగా సుయోధనుడు పుణ్యనదీజలాలతో సర్వసేనాధిపత్యానికి భీష్ముడిని అభిషేకించాడు.

**తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి । పరమభక్తి నక్షోహిణీపతులఁ జూపి**
**'వీరికిని సైన్యములకును మీర యొడయ' । లనుచుఁ బట్టంబుఁ గట్టె శంతనుతనూజు. 159**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈవిధంగా; ఎలమిన్= సంతోషంతో; అభిషేకము చేసి; పరమభక్తిన్= మిక్కిలి భక్తితో; అక్షోహిణీపతులన్+చూపి= అక్షౌహిణీ నాయకులను కనబరిచి; వీరికిని= ఈ సేనాధిపతులకు; సైన్యములకును= సేన లన్నింటికిని; మీరు+అ= మీరే; ఒడయలు= అధికారులు; అనుచున్= అని నుడువుచు; శంతను తనూజున్= శంతను మహారాజ పుత్రుడైన భీష్ముడిని; పట్టంబు+కట్టెన్= సర్వసేనాధ్యక్షుడిని కావించాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా భీష్మునకు అభిషేకం చేసి మిక్కుటమైన భక్తితో అక్షోహిణీ నాయకులను ఆయనకు కనబరచి 'వీరికినీ, సేనలన్నింటికినీ మీరే అధికారు'లని భీష్ముడికి సర్వ సైన్యాధ్యక్ష పదవి అప్పగించాడు.

**క. అత్తఱిఁ బాషాణంబులు । నెత్తురు నెమ్ములను గురిసె, నిష్ఠుర నినదా**
**యత్తమయి నభము పిడుగుల । మొత్తంబులు వడియె నగరమున నెల్లెడలన్. 160**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ సమయాన; నభము= ఆకాశం; పాషాణంబులు= రాళ్ళు; నెత్తురున్= రక్తం; ఎమ్ములను= ఎముకలను; నిష్ఠుర= కర్కశమైన; నినద= ధ్వనులకు; ఆయత్తము+అయి= అధీనమై; కురిసెన్= వర్షించింది; నగరమునన్= హస్తినాపురిలో; ఎల్ల+ఎడలన్= అన్నిచోట్ల; పిడుగుల మొత్తంబులు= పిడుగులయొక్క గుంపు; పడియెన్= రాలాయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు భీష్ముడిని సర్వసేనాధిపతిగా చేసే సమయంలో ఆకాశం భయంకరంగా గర్జిస్తూ రాళ్ళు నెత్తురు ఎముకలు వర్షించింది. నగరంలో అన్నిచోట్ల పిడుగులు రాలాయి.

**క. దానికి జను లుత్సాహ వి । హీనతఁ బొందంగఁ, గౌరవేంద్రుఁడు నానా**
**దానాదు లయిన శాంతి వి । ధానము లొనరించి యానతత్పరమతియై. 161**

**ప్రతిపదార్థం:** దానికిన్= అట్టి దుర్నిమిత్తాలకు; జనులు= ప్రజలు; ఉత్సాహ విహీనతన్+పొందంగన్= ఉత్సాహం లేనివారు కాగా; కౌరవ+ఇంద్రుఁడు= కురురాజైన సుయోధనుడు; నానా దాన+ఆదులు+అయిన= అనేక దానాలు చేయటం మొదలైన;

శాంతి విధానములు= దోష పరిహారానికైన శాంతి క్రియలను; ఒనరించి= సలిపి; యాన తత్పర మతియై= యుద్ధానికి వెడలుటయందు లగ్నమైన మనస్సుకలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అటువంటి దుర్నిమిత్తాలు చూచి ప్రజలు ఉత్సాహహీను లయ్యారు. కురురాజు తద్దోష పరిహారార్థం దానాలివ్వటం మొదలైన శాంతిక్రియలు సల్పి, యుద్ధప్రయాణంలో మనస్సును లగ్నంచేశాడు.

**క. తల్లియుఁ దండ్రియు వెఱఁగునఁ। బుల్లవడన్ వారికడకుఁ బోయి తడయఁగా**
**నొల్లక పయనపు వీడ్కో। లెల్లను దనయిచ్చ నడపి యేడ్తెఱ వెడలెన్. 162**

**ప్రతిపదార్థం:** తల్లియున్= గాంధారియు; తండ్రియున్= ధృతరాష్ట్రుడును; వెఱఁగునన్= ఆశ్చర్యంచేత; పుల్లవడన్= స్తంభించిపోగా; వారికడకున్= వారి దగ్గరకు; పోయి= వెళ్ళి; తడయఁగాన్= ఆలసించటానికి; ఒల్లక= ఇష్టపడక; పయనపు వీడ్కోలు= యుద్ధ ప్రయాణానికి అనుమతి; ఎల్లను= అంతయు; తన+ఇచ్చన్+నడపి= తన కోరిక ప్రకారం తెల్పి; ఏడ్తెఱన్= పరాక్రమంతో; వెడలెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన తల్లిదండ్రులైన గాంధారీ ధృతరాష్ట్రులు ఆ దుర్నిమిత్తాలుగని భీతితో నిశ్చేష్టులై ఉండగా, వారి దగ్గరకు వెళ్ళి అక్కడ ఆలసించటానికి ఇష్టపడక, యుద్ధానికి వెళ్ళుతున్నాను అంగీకరించండని తానేపలికి సాతిశయంగా అక్కడనుండి బయలుదేరాడు.

**తే. వెడలి తమ్ములుఁ దగువారు వివిధభృత్య। గణముఁ దానును నేల గ్రక్కదలఁ గదలి**
**రాజరాజు గాంగేయుఁ బురస్కరించి। కొని సముద్ధతి నడచె దిక్కులు వడంక. 163**

**ప్రతిపదార్థం:** వెడలి= తల్లిదండ్రుల చెంతనుండి బయలుదేరి; తమ్ములున్; తగువారున్= తగినవారలు; వివిధ భృత్యగణమున్= నానాసేవక సమూహం; తానును= తానున్నూ; నేల= పుడమి; గ్రక్కదలన్= మిక్కిలి కంపించగా; కదలి= బయలువెడలి; రాజరాజు= దుర్యోధనుడు; గాంగేయున్= భీష్ముడిని; పురస్కరించికొని= ముందుంచుకొని; దిక్కులు వడంకన్= దిశలు చలించగా; సముద్ధతిన్= మిక్కిలి గర్వంతో; నడచెన్= ముందుకుసాగాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన తలిదండ్రుల దగ్గర నుండి కదలి, తమ్ములూ, తగినవారూ, నానాసేవక సమూహమూ తనను అనుసరించగా పుడమి వణకగా కదలాడు. అతడు భీష్ముడిని ముందిడుకొని దిక్కులు కంపించేటట్లు మిక్కిలి గర్వంతో కురుక్షేత్రానికి నడిచాడు.

**వ. నడచి కురుక్షేత్రంబు దఱియం జొచ్చి యం దొక్క రమణీయ ప్రదేశంబు విడిదలగా నిరూపించి నిలిచి, భానుసూనుండునుం దానును మెలంగి యెల్లవారిని విడియించి, నడుమ నిజనివాసంబు గావించినఁ, గౌరవేశ్వరు స్కంధావారంబు వారణపురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు రాచందంబున నందంబై యొప్పె; నిట్లు రెండు వీళ్ళును సన్నద్ధంబులైన సమయంబున. 164**

**ప్రతిపదార్థం:** నడచి; కురుక్షేత్రంబున్; తఱియన్+చొచ్చి= ప్రవేశించి; అందున్; ఒక్క రమణీయ ప్రదేశంబున్= ఒక ఇంపైన తావును; విడిదలగాన్+నిరూపించి= విడిదిచోటుగా నిర్ణయించి; భానుసూనుండునున్= సూర్యపుత్రుడైన కర్ణుడునూ; తానును; మెలంగి= సంచరించి; ఎల్లవారినిన్= అందఱను; విడియించి= అక్కడ బసచేయించి; నడుమ= ఆ ప్రదేశంయొక్క మధ్యలో;

నిజనివాసంబున్= తానుండు చోటును; కావించినన్= ఏర్పరచగా; కౌరవ+ఈశ్వరు స్కంధావారంబు= దుర్యోధనుడి దండు విడిసిన చోటు; వారణ పురంబునన్= హస్తినాపురిలో; ఎవ్వరు; ఏ+ఎడన్= ఎక్కడ; వసియింతురు= నివాసముంటారో; ఆ చందంబునన్= ఆ విధంగా; అందంబు+ఐ= సుందరమై; ఒప్పెన్; ఇట్లు= ఈ విధంగా; రెండు వీళ్ళును= కురు పాండవ స్కంధావారములు; సన్నద్ధంబులు+ఐన సమయంబునన్= యుద్ధానికి సంసిద్ధాలై ఉన్నవేళ.

**తాత్పర్యం:** సుయోధనుడు కురుక్షేత్రంలో ప్రవేశించి అక్కడ ఒక మనోహరమైన ప్రదేశాన్ని చూచి, తన సేనలు నిలువదగిన చోటు అదిగా నిర్ణయించాడు. తానూ, కర్ణుడూ ఆ ప్రదేశమంతా కలయదిరిగి అందరూ ఉండవలసిన తావులకు నడుమ తన నివాసం ఏర్పాటు చేసికొన్నాడు. హస్తినాపురంలో ఎవ్వరు ఎక్కడ నివసించారో ఆ విధంగానే దుర్యోధనుడి స్కంధావారం అమరి అందంగా రూపుదిద్దుకొన్నది. ఈ రీతిగా కురుక్షేత్రంలో కౌరవ పాండవ స్కంధావారాలు ఏర్పడి, యుద్ధానికి సంసిద్ధంగా ఉన్నాయి. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. సంధికి నేఁగి కార్యము పొసంగక కృష్ణుఁడు రాకయున్, సుహృ**
**ద్బాంధవ సంఘయుక్తముగఁ బాండవ కౌరవ వీరు లష్ట ది**
**క్సింధుర కంధరంబు లడఁగించు బలంబుల పెల్లుతోడ గ**
**ర్వాంధత నాజికెత్తుటయు నా బలభద్రుఁ డెఱింగి యార్తుఁడై. 165**

**ప్రతిపదార్థం:** సంధికిన్+ఏఁగి= సంధిచేయటానికై పోయి; కార్యము పొసంగక= వెళ్ళిన పని నెరవేరక; కృష్ణుఁడు రాకయున్= శ్రీకృష్ణుడు తిరిగిరావటమూ; పాండవ కౌరవ వీరులు= శూరులైన పాండవులూ, కౌరవులూ; సుహృద్+బాంధవ సంఘయుక్తముగన్= స్నేహితులయొక్క, చుట్టాలయొక్క సమూహాలతో కూడ; అష్టదిక్+సింధుర= ఎనిమిది దిక్కులందున్న ఏనుగులయొక్క; కంధరంబులు= మెడలు; అడఁగించు= వంచునట్టి; బలంబుల పెల్లుతోడన్= సేనలయొక్క ఆధిక్యంతో; గర్వ+అంధతన్= మదంచేత కన్నుగాననివారై; ఆజికిన్= యుద్ధానికి; ఎత్తుటయున్= పూనిక వహించటమూ; ఆ బలభద్రుఁడు= ఆ బలరాముడు; ఎఱింగి= విన్నవాడై; ఆర్తుఁడు+ఐ= దుఃఖితుడై.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు సంధికార్యం విఫలమై తిరిగిరాగా పాండవ కౌరవ వీరులు తమ తమ మిత్ర బంధు సమూహాలతో అష్టదిగ్గజాల మెడలు క్రుంగజేసే మిక్కుటమైన సేనల భారంతో, గర్వంవలన కన్నుగానక యుద్ధానికి సంసిద్ధులై ఉన్నట్లు బలరాముడు విని దుఃఖం పొంది.

**విశేషం:** అలం: అతిశయోక్తి. దిగ్గజములు: దిక్కులందలి ఏనుగులు ఐరావతం, పుండరీకం, వామనం, కుముదం, అంజనం, పుష్పదంతం, సార్వభౌమం, సుప్రతీకం ఇవీ అష్టదిగ్గజాలు.

బలరాముఁడు పాండవుల వీడ్కొని తీర్థయాత్ర వోవుట. (సం. 5-154-15)

**వ. కతిపయ పరివారంబు పరివేష్టింప రయంబునం జనుదెంచి సముచిత ప్రకారంబున ధర్మనందనుం బేరోలగంబునం గని సంభ్రమాలింగనాసనార్ఘ్య పాద్యంబుల నతనిచేత సంభావితుండయి, దామోదర భీమార్జున నకుల సహదేవుల యభివాదనంబు లాదరించి, పాంచాల విరాట ప్రముఖులగు తగువారల వినయంబుల నభినందించి, యా దొరలతోఁ దత్కాలయోగ్య మితసంభాషణంబులు సేసి, యనంతరంబ వారల కిట్లనియె: 166**

**ప్రతిపదార్థం:** కతిపయ పరివారంబు= కొద్ది మంది పరిజనం; పరివేష్టింపన్= చుట్టిరాగా; రయంబునన్= శీఘ్రంగా; చనుదెంచి= వచ్చి; సముచిత ప్రకారంబునన్= తగినవిధంగా; ధర్మనందనున్= ధర్మజుడిని; పేరు+ఓలగంబునన్= నిండుకొలువులో; కని= చూచి; సంభ్రమ+ఆలింగన+ఆసన+అర్ఘ్య పాద్యంబులన్= హర్షంతో కౌగిలించుకొనటం; కూర్చుండుటకు పీఠం వేయటం, అర్ఘ్యమివ్వటం, పాద్యమివ్వటం అనే పనులతో; అతనిచేతన్= ధర్మజుడిచేత; సంభావితుండు+అయి= గౌరవించబడినవాడై; దామోదర+భీమ+అర్జున నకుల సహదేవుల= శ్రీకృష్ణుడి యొక్క; భీమార్జున నకుల సహదేవులయొక్క; అభివాదనంబులు= వందనములు; ఆదరించి= ప్రేమతో స్వీకరించి; పాంచాల విరాట ప్రముఖులు+అగు= ద్రుపదుడు; విరాటుడు మున్నగు; తగువారల= గౌరవపాత్రులయొక్క; వినయంబులన్= అణకువలను; అభినందించి= ప్రశంసించి; ఆ దొరలతోన్= ఆ ప్రభువులతో; తద్+కాలయోగ్య= ఆ సమయానికి తగిన; మిత సంభాషణంబులు చేసి= పరిమితమైన పలుకులు పలికి; అనంతరంబు+అ; వారలకున్; ఇట్లనియెన్.

**తాత్పర్యం:** బలరాముడు కొంతమంది పరిజనం తనను కొలిచిరాగా శీఘ్రమే వచ్చి తగినవిధంగా ధర్మపుత్రుడిని ఒడ్డోలగంలో చూచాడు. యుధిష్ఠిరుడు బలరాముడిని సంతోషంతో కౌగిలించుకొని, ఆసనమొసగి, అర్ఘ్యపాద్యాదులిచ్చి గౌరవించాడు. శ్రీకృష్ణ భీమార్జున నకుల సహదేవులు తనకు నమస్కరించగా బలదేవుడు ఆదరంతో స్వీకరించాడు. ద్రుపదుడు, విరాటుడు మొదలైనవారు అణకువతో వర్తించగా మెచ్చుకొని, ఆ ప్రభువులతో ఆ సమయానికి తగినట్లు పరిమిత సంభాషణం చేసి, పిదప వారితో ఇట్లా అన్నాడు:

**క. 'కౌరవ పాండవు లెంతయుఁ । గ్రూరత వాటించి బంధుకోటికి నిఖిలో**
**ర్వీ రమణులకుం జేటుగఁ । బోరికిఁ దెగి; రిట్టి ఘోరపుంబని యగునే? 167**

**ప్రతిపదార్థం:** కౌరవపాండవులు= కౌరవులు, పాండవులు; ఎంతయున్= మిక్కిలి; క్రూరత+పాటించి= కరకుతనం వహించి; బంధుకోటికిన్= చుట్టాల సమూహానికి; నిఖిల+ఉర్వీరమణులకున్= సకల రాజులకు; చేటుగన్=కీడు మూడేటట్లు; పోరికిన్+ తెగిరి= యుద్ధానికి సాహసించారు; ఇట్టి ఘోరపున్+పని+అగునే?= ఇంతటి దారుణకృత్యం తగునా?

**తాత్పర్యం:** 'కౌరవులూ, పాండవులూ మిక్కిలి క్రూరులై బంధుజనములకూ, పుడమి దొరలకూ కీడు వాటిల్లేటట్లు యుద్ధానికి పూనారు. ఇట్టి దారుణ కృత్యం వారికి తగునా?

**తే. ఇట్టిదానికి నోర్వక యెన్నఁడేనిఁ । గృష్ణుతోడ నేఁ జెప్పితిఁ, గినిసి యిరు దె**
**ఱంగువారికిఁ దగఁ జెప్పి సంగతంబు । సేయు మని యెంత సెప్పినఁ జేయఁడయ్యె. 168**

**ప్రతిపదార్థం:** ఇట్టిదానికిన్= ఇట్లు జరగటానికి; ఎన్నఁడు+ఏనిన్= ఎప్పుడైనను; ఓర్వక= సహించలేక; కినిసి= కోపించి; ఇరు తెఱంగువారికిన్= ఉభయపక్షాలవారికి; తగన్+చెప్పి= అనుకూలంగా బోధించి; సంగతంబు= సంధిని; చేయుము+అని= కుదుర్చుమని; కృష్ణుతోడన్= మాధవుడితో; నేన్= నేను; చెప్పితిన్= చెప్పాను; ఎంతచెప్పినన్= నే నెంత చెప్పినప్పటికీ; చేయఁడు+అయ్యెన్= అతడు చేసినవాడు కాడు.

**తాత్పర్యం:** దారుణమైన యుద్ధం కురుపాండవుల మధ్య సంభవించటానికి నే నెన్నడూ సహించలేను. అందుచేత కోపించి అయినా రెండు పక్షాలవారికి తగిన విధంగా నచ్చజెప్పి సంధి సమకూరేటట్లు చూడుమని నేను శ్రీకృష్ణుడితో చెప్పాను. నే నెంత చెప్పినప్పటికిన్నీ అతడు సంధి పొసగేటట్లు చూడలేదు.

**క. పలుకుల పొం దెఱుఁగని వా । రలఁ బూజావాక్యములఁ దిరంబై తనకుం**
**దెలుపం దగదే? యే మని । యలుకమెయిన్ సంధి సెఱిచి హరి యేతెంచెన్? 169**

**ప్రతిపదార్థం:** పలుకుల పొందు= మాటలపొందిక; ఎఱుఁగని వారలన్= తెలియని మూఢులను; పూజా వాక్యములన్= బుజ్జగింపు పలుకులతో; తిరంబు+ఐ= గట్టిగా నిలబడి; తనకున్= గోవిందుడికి; తెలుపన్+తగదే= చెప్పటం యుక్తంకదా!; అలుకమెయిన్= కోపంతో; సంధిచెఱిచి= సంధికార్యం చెడగొట్టి; హరి= శ్రీకృష్ణుడు; ఏమి+అని+ఏతెంచెన్?= ఏమి సంకల్పించి వచ్చాడు?

**తాత్పర్యం:** మాటాడేతీరు తెలియని పరమ మూర్ఖులకు మంచిమాటలతో హితవు గరపవలసిన శ్రీహరి అలా చేయక వారిపై క్రోధం వహించి సంధికార్యం చెడగొట్టి ఏమి చేయటానికి వచ్చినట్లు?

**తే. వీరు వారును సంబంధ విషయబంధు । లగుట సరిగాదె హరికిఁ; దా నర్జునునకుఁ**
**బక్షపాతంబు చేయుటఁ బాండవులను । బెట్టుచోటులు గానక పట్టి క్రాలు. 170**

**ప్రతిపదార్థం:** వీరున్= పాండవులూ; వారును= కౌరవులూ; సంబంధవిషయబంధులు+అగుటన్= సంబంధవిషయమై చుట్టాలగుటవలన; హరికిన్= శ్రీకృష్ణుడికి; సరి+కాదె= సమానులే కదా!; తాన్= తాను; అర్జునునకున్; పక్షపాతంబుచేయుటన్= మిక్కిలి అభిమానం చూపటంచేత; పాండవులను= పాండుకుమారులను; పెట్టుచోటులుకానక= కుదురుగా ఒక్కచోట నుంచక; పట్టిక్రాలున్= పట్టుకొని ఊరేగుతుంటాడు.

**తాత్పర్యం:** పాండవులు కౌరవులు సంబంధ విషయమై చుట్టాలు కావటంచేత తనకు ఉభయులూ సమానులే కదా! కాని, అతడికి అర్జునుడిపట్ల అభిమానం మెండు. అందువలన కౌంతేయులను కుదురుగా ఒకచోట నుంచక, తన ఇచ్చకొలదీ వెంట బెట్టుకొని త్రిప్పుతుంటాడు.

**ఉ. కావున వీరికిన్ జయము గల్గుట నిశ్చయ; మెల్ల భంగులం**
**జావు నిజంబు వారికి; నసంశయమై యిటులుండ దీని నె**
**ట్లే వినఁ జూడ నేర్తుఁ? దగ నింత ప్రవీణుల నేన చేసితిం**
**జూవె! సుయోధనుం బవనసూనుని నొండొరుఁ జంపఁ జూతునే? 171**

**ప్రతిపదార్థం:** కావునన్= అట్లగుటచే; వీరికిన్= పాండుకుమారులకు; జయము కల్గుట= గెలుపు సమకూడడం; నిశ్చయము= తప్పదు; వారికిన్= కౌరవులకు; ఎల్లభంగులన్= అన్నివిధాల; చావు నిజంబు= మరణం తథ్యం; అసంశయము+ఐ= సందేహము లేనిదై; ఇటులు+ఉండన్= విషయమిట్లా ఉండగా; దీనిన్= ఈ పరిణామాన్ని; ఎట్లు= ఎట్లా; ఏన్= నేను; వినన్చూడన్+నేర్తున్?= వినగలను, చూడగలను?; తగన్= ఒప్పుగా; సుయోధనున్= దుర్యోధనుడిని; పవనసూనునిన్= వాయుపుత్రుడిని; ఇంతప్రవీణులన్= ఇంతటి నేర్పరులుగా; నేను+అ= నేనే; చేసితిన్+చూవె!= చేశాను సుమా! ఒండు+ఒరున్= ఒకడిని మరొకడు; చంపన్+చూతునే?= చంపుతుండగా కనుగొనగలనా?

**తాత్పర్యం:** పాండవులకు విజయం తథ్యం. అన్ని విధాల కౌరవులకు చావు తప్పదు. ఇందులో సందేహం లేదు. కనుక దీనిని నే నెట్లా చెవులతో వింటూ, కనులతోచూస్తూ భరించగలను? దుర్యోధనుడిని, వృకోదరుడిని గదాయుద్ధంలో ఇంత నేర్పరులను నేనే చేశాను. భీమ సుయోధనులు పరస్పరం చంపుకొంటుండగా ఎట్లా చూడగలను?

క. **హరి యెఱుఁగని చక్కటియుం । బురుషార్థము నా కెఱుంగఁ బోలునె? యీ ని**
**ష్ఠురత వినఁ జూడఁ జాలక । సరస్వతీ తీర్థమునకుఁ జనియెడు బుద్ధిన్.** **172**

**ప్రతిపదార్థం:** హరి= శౌరి; ఎఱుఁగని= తెలియని; చక్కటియున్= న్యాయం, ధర్మం; పురుష+అర్థము= పురుష ప్రయోజనం; నాకున్= నాకు; ఎఱుంగన్+పోలునె?= తెలియ శక్యమౌతుందా? (కాదని భావం); ఈ నిష్ఠురతన్= ఈ కర్కశత్వమును; వినన్= వినటానికి; చూడన్= చూడటానికీ; చాలక= సహించలేక; సరస్వతీ తీర్థమునకున్= సరస్వతీ నదికి; చనియెడు బుద్ధిన్= వెళ్ళేతలంపుతో.

**తాత్పర్యం:** గోవిందుడికి తెలియని న్యాయం, పురుషార్థం నాకు తెలియశక్యంగాదు. ఈ కర్కశత్వాన్ని వినలేక చూడలేక సరస్వతీ తీర్థానికి వెళ్ళే తలంపుతో.

వ. **మీకుం జెప్పిపో వచ్చితిఁ; బోయి వచ్చెద' నని పలికి బలదేవుండు వాసుదేవ ధర్మపుత్త్రు లొడంబడి యనుపఁ దీర్థయాత్ర వోయెఁ; దదనంతరంబ.** **173**

**ప్రతిపదార్థం:** మీకున్= మీకు; చెప్పిపోన్+వచ్చితిన్= చెప్పివెళ్ళుదామని వచ్చాను; పోయివచ్చెదన్= వెళ్ళివస్తాను; అని పలికి; బలదేవుండు= బలరాముడు; వాసుదేవ ధర్మపుత్త్రులు= శ్రీకృష్ణుడు, ధర్మరాజు; ఒడంబడి= సమ్మతించి; అనుపన్= తనను సాగనంపగా; తీర్థయాత్ర+పోయెన్; తద్+అనంతరంబు+అ= అటుపిమ్మట.

**తాత్పర్యం:** మీకు చెప్పి వెళ్ళుదామని వచ్చాను. పోయివస్తాను' అని బలదేవు డన్నాడు. అందుకు అంగీకరించి శ్రీకృష్ణుడు ధర్మనందనుడు సాగనంపగా ఆయన తీర్థయాత్రకు వెళ్ళాడు. అటు పిమ్మట.

### రుక్మి వృత్తాంతము (సం. 5-155-1)

సీ. **కృష్ణుని దేవి రుక్మిణి సోదరుఁడు రుక్మి । యను రాజు బలవిక్రమాన్వితుండు**
**శార్ఙ్గగాండీవ విజయములు నాఁగల । దివ్య చాపములఁ దృతీయమైన**
**చాపంబు గలవాఁడు సైన్య సమేతుఁడై । చనుదెంచి ధర్మజుఁ గని తదీయ**
**సత్కారములు గాంచి సముచితాసనమున । నుండి యక్కొలువున నున్న వీరు**

ఆ. **లెల్ల వినఁ గిరీటి కిట్లను 'సమరంబు । సేయ వెఱచితేనిఁ జెప్పు; నాకు**
**నెదురు లేరు జగతి నెవ్వరు; నీకుఁ దో । డ్పడి జయింతు నెట్టి పగఱనైన.'** **174**

**ప్రతిపదార్థం:** కృష్ణుని దేవి= శ్రీకృష్ణుడి పత్నిఅయిన; రుక్మిణి= రుక్మిణీదేవికి; సోదరుఁడు= తోడబుట్టినవాడు; రుక్మి అనురాజు= రుక్మి అనే పేరుగల దొర; బలవిక్రమ+అన్వితుండు= బలం పరాక్రమం అనువాటితో కూడినవాడు; శార్ఙ్గ గాండీవ విజయములు నాన్+కల= శార్ఙ్గం, గాండీవం, విజయం అనే పేర్లుగలిగిన; దివ్యచాపములన్= శ్రేష్ఠములైన ధనుస్సులలో; తృతీయము+అయిన= మూడవదైన; చాపంబు+కలవాఁడు= విల్లు కలిగినవాడు; సైన్య సమేతుఁడు+ఐ= సేనలతో కూడినవాడై; చనుదెంచి= వచ్చి; ధర్మజున్+కని= ధర్మనందనుడిని దర్శించి; తదీయ సత్కారంబులు+కాంచి= అతనివలన గౌరవాలు పడసి; సముచిత+ఆసనంబునన్+ఉండి= అర్హపీఠంమీద అధివసించి; ఆ+కొలువునన్+ఉన్నవీరులు+ఎల్లన్= ఆ సభలో నుండిన శూరులందరూ; వినన్= వినుచుండగా; కిరీటికిన్= అర్జునుడికి; ఇట్లు+అనున్= ఇట్లా చెప్పాడు; సమరంబు చేయన్= యుద్ధం

చేయటానికి; వెఱచితి(వి)+ఏనిన్= భయపడితే; చెప్పుము= తెలుపుము; నాకున్= నాకు; జగతిన్= పుడమిలో; ఎవ్వరున్= ఎట్టివారున్నూ; ఎదురులేరు= అడ్డంలేరు; నీకున్ తోడ్పడి= నీకు సాయం చేసి; ఎట్టి పగఱన్+ఐనన్= ఎంతటి విరోధులనయినా; జయింతున్= గెలుస్తాను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి దేవేరి రుక్మిణి. ఆమె అన్నపేరు రుక్మి. అతడు బలం పరాక్రమం కలవాడు. శ్రీకృష్ణుడికి శార్ఙ్గం, అర్జునుడికి గాండీవం అనే ధనుస్సులున్నట్లుగా తనకూ విజయం అనే పేరుగల దొడ్డవిల్లు ఉన్నది. అతడు సేనాపరివృతుడై ధర్మజుడి దగ్గరకు వచ్చి దర్శించాడు. యుధిష్ఠిరుడు అతడికి సముచిత సత్కారాలు జరిపించాడు. అట్లా సమ్మానితుడై రుక్మి అర్ఘ్యపీఠం మీద అధివసించి, ఆ సభలోని వీరులంతా వింటుండగా అర్జునుడితో ఇట్లా పలికాడు: 'అర్జునా! యుద్ధం చెయ్యటానికి నీకు భయంగా ఉంటే చెప్పు. నీకు సాయంగా నిల్చి ఎంతటి శత్రువులనైనా గెలుస్తాను. నాకీ ఇలలో ఎవ్వరూ ఎదురులేరు.'

**వ. అని తన్ను నాక్రమించి తన తోఁబుట్టువు రుక్మిణిం గొనివచ్చిన యా కృష్ణు సన్నిధిని సిగ్గులేక యాడిన మాటలు విని, చిఱునవ్వు నవ్వుచుం గవ్వడి యతని యాననం బాలోకించి. 175**

**ప్రతిపదార్థం:** అని; తన్నున్= తనను; ఆక్రమించి= అలమి; తన తోఁబుట్టువు= తన చెల్లెలు; రుక్మిణిన్; కొనివచ్చిన= తీసికొని వెళ్ళిన; ఆ కృష్ణు సన్నిధిన్+అ= ఆ శ్రీకృష్ణుడి సమక్షంలోనే; సిగ్గులేక= లజ్జవీడి; ఆడినమాటలు= పలికిన పలుకులు; విని; చిఱునవ్వు నవ్వుచున్; కవ్వడి= రెండు చేతుల వడిగల అర్జునుడు; అతని; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి

**తాత్పర్యం:** తనను అతిక్రమించి తన చెల్లెలైన రుక్మిణిని వెంటగొనిపోయిన ఆ శ్రీకృష్ణుడి ఎదుట రుక్మి సిగ్గులేక మాటాడిన మాటలు విని చిరునవ్వు నవ్వుతూ అర్జునుడు అతడి ముఖం చూచి ఇట్లా అన్నాడు:

**తే. 'చెనసి గంధర్వసేన నిర్జించునపుడు । మత్స్యనాథు గోవర్గంబు మరలఁ దెచ్చు
నెడను దప్పె; నీకందువ యెఱుఁగనైతి । నింక నౌఁగాని తోడుగ మ్మెచటి కైన.' 176**

**ప్రతిపదార్థం:** చెనసి= ఎదిరించి; గంధర్వసేనన్= చిత్రసేనుడి సైన్యాన్ని; నిర్జించునపుడున్= జయించేవేళలో; మత్స్యనాథు గోవర్గంబున్= మత్స్యదేశాధీశుడైన విరాటుడి యొక్క ఆలమందలను; మరలన్+తెచ్చు+ఎడను= కౌరవుల బారినుండి మరలించుకొని వచ్చునపుడును; తప్పెన్= అవకాశం జారిపోయింది; నీకందువ+ఎఱుఁగన్+ఐతిన్= నీ ఉనికి ఎక్కడో తెలియనైతిని; ఇంకన్= ఇక; ఔన్+కాని= చాలు గాని; ఎచటికిన్+ఐనన్= నీ సాయం అవసరమైనచోటికి; తోడు+కమ్ము= సాయపడుము.

**తాత్పర్యం:** 'గంధర్వ సైన్యాన్ని ఎదిరించి చిత్రసేనుడి చెరజిక్కిన సుయోధనుడిని భార్యాపుత్రమిత్ర బంధుసహితంగా బంధవిముక్తుని కావించే టప్పుడూ; కురువీరులందరూ మొత్తమై విరాటుడి గోవులను తోలుకొని కరిపురికి అరుగునప్పుడు, వారిబారినుండి ఆలమందలను మరలించుకొని వచ్చునప్పుడు నీ జాడ నాకు తెలియలేదు. అపుడు నీవెక్కడ ఉన్నావో నాకు తెలియదు. ఇక నీమాటలు కట్టిపెట్టి, అక్కర గల్గినచోటికి సాయపడటానికి వెళ్ళు.'

**విశేషం:** అర్జునుడు గంధర్వ సేనను నిర్జించుట: పాండవులు ద్వైతవనంలో నివసిస్తున్నారు. తన డాబు దర్పం వారిముందు ప్రదర్శించి మరీ ఏడ్పించవలెనని దుర్యోధనుడికి దుర్బుద్ధి పుట్టింది. కర్ణ శకునులతో మంతనం జరిపాడు. ఘోషయాత్ర

నెపంతో అక్కడికి వెళ్ళదలచాడు. అందుకు ఎట్లాగో ధృతరాష్ట్రుడి అనుమతి సంపాదించాడు. సుయోధనుడు చతురంగబలంతో, అంగనాజనంతో అనుజ బంధు మంత్రి గాయక నర్తక సమూహంతో వందిమాగధ బృందంతో కర్ణ శకునులను వెంటబెట్టుకొని వైభవోపేతంగా తమ గోగణమున్న ద్వైతవనానికి తరలివెళ్ళాడు.

సుయోధనుడు ఆ వనంలో విహరించి అక్కడి మృగాలను వేటాడుతూ ఒక సరస్సు చెంతకు వచ్చాడు. ఆ సమీపంలోనే మునిజన సహాయంతో సద్యస్కందమనే యాగం సల్పుతున్నాడు ధర్మజుడు. ఆ కొలని గట్టున క్రీడా గృహాలను నిర్మించటానికి దుర్యోధనుడు భృత్యవర్గాన్ని నియమించాడు. చిత్రసేనుడనే గంధర్వరాజుకు క్రీడార్థం కల్పితమైన సరస్సు గనుక ఇక్కడనుండి తొలగిపొండని గంధర్వులు కౌరవసేవకులను హెచ్చరించారు. దుర్యోధనుడు దుర్మదాంధులైన సైనికులను గంధర్వుల నెదిరించటానికి పంపాడు. తానూ తన తమ్ములూ కర్ణశకునులూ పోరాటంలో పాల్గొన్నారు. పోరు ఘోరమైంది. కర్ణుడు విరథుడై వికర్ణుడి రథమెక్కి రణరంగంనుండి తప్పుకొన్నాడు. దుర్యోధనుడు గంధర్వులతో తలపడ్డాడు. చిత్రసేనుడు అతడి రథాన్ని భగ్నం చేయించి జుట్టుపట్టి నేలకీడ్చి పెడరెక్కలు గట్టి సింహనాదం చేశాడు. అప్పుడే గంధర్వులు దుర్యోధనుడి వనితలనూ, అతడి సోదరులనూ, తనయులనూ, వాని మంత్రులనూ పట్టి బంధించి చిత్రసేనుడి కొప్పగించారు.

అంతట సుయోధనుడి పరిజనం పరుగెత్తి పోయి ధర్మజుడి పాదాల వ్రాలి, నీ తమ్ముళ్ళనూ, నెలతలనూ రక్షించుమని వేడుకొన్నారు. 'కాగల కార్యం గంధర్వులే తీర్చారు. క్రూరాత్ముని దెస కృప చూపవ'ద్దని అన్నతో అన్నాడు అనిలజుడు హర్షంతో **'శరణం బని వచ్చిన భీకర శత్రువునైన ప్రీతిగావగవలయున్ కరుణాపరుల తెఱంగిది యిరవుగ సరిగావు దీని కేధర్మంబుల్'** అని ధర్మజుడు పలు విధాల భీమసేనుడిని అనునయించాడు. "నేను యజ్ఞదీక్షితుడిని గనుక వెళ్ళరాదు. మీరు వెళ్ళి సామవాక్యాలకు సాధ్యపడకుంటే ఎదిరించిఅయినా గంధర్వుల చెరనుంచి సుయోధనుడిని విడిపించండి" అని ధర్మపుత్రుడు తమ్ముళ్ళ నడిగాడు. అగ్రజుడి ఆజ్ఞ ననుసరించి భీమార్జున నకుల సహదేవులు కదలిపోయి గంధర్వుల నెదుర్కొన్నారు.

దారుణ సంగ్రామం జరిగింది. పాండవుల చిత్తవృత్తి చిత్రసేనుడికి విస్మయం కలిగించింది. అతడు వెంటనే యుద్ధం విరమించి అర్జునుడిని చేరబోయాడు. ఆ వచ్చినవాడిని ఆత్మసఖుడిగా గుర్తించి సవ్యసాచి సంగ్రామం చాలించాడు.

"పరమ ధార్మికులైన మిమ్ము పరాభవింప దలచి, పరిహసించి ఇక్కడికి వచ్చిన సుయోధనుడిని భార్యా భ్రాతృ పుత్ర బంధుయుతంగా పట్టి తెమ్మని దేవేంద్రునాజ్ఞ. అందుకే వచ్చా'నని చిత్రసేనుడు అర్జునుడితో అన్నాడు. 'తానెంత దుర్మార్గుడయినా మాకు సహోదరుడు గనుక దుర్యోధనుడిని విడిచిపెట్టవలసినది. ధర్మజుడిని దర్శించి అతడు చెప్పినట్లు చేయవలసినది" అని పాండవ మధ్యముడు పలికాడు. చిత్రసేనుడు అజాతశత్రుడి దగ్గరకు వచ్చాడు. అతడు ధర్మజుడి ప్రార్థనతో దుర్యోధనాదు లందరినీ విడిచిపెట్టి ఇంద్రుని కడకు వెళ్ళాడు. 'ఇకమీదట ఇట్లాంటి సాహసాలు చేయవద్దు. గుట్టుగ పట్టణానికి వెళ్ళుము" అని బుద్ధులు చెప్పి ధర్మజుడు దుర్యోధనుడికి వీడ్కోలిచ్చాడు. ఈ విషయం అరణ్యపర్వ పంచమాశ్వాసంలో ఉన్నది.

**వ. అని యతని యుత్తరమునకుఁ దగిన యట్ల పలికి, మఱియును. 177**

**తాత్పర్యం:** అంటూ రుక్మి మాటలకు సరియైన సమాధానమిచ్చి అర్జునుడు మళ్ళీ (ఇట్లా అన్నాడు:)

**క. 'ము న్నే నసహాయుఁడనై । చన్న గతిం జనఁగ నైన చందం బయ్యెన్;**
**వెన్నుఁడు తోడుగలఁడు; వెఱ । పెన్నండును వలవ దింక నేమిటికైనన్. 178**

**ప్రతిపదార్థం:** మున్ను= పూర్వం; ఏను= నేను; అసహాయుఁడను+ఐ= తోడ్పాటు లేనివాడనై; చన్నగతిన్+చనఁగన్= అరిగిన మార్గంలో అరుగగా; ఐన చందంబు+అయ్యెన్= జరుగవలసిన దేదో జరిగిపోయింది; వెన్నుఁడు= విష్ణుమూర్తి; తోడు+

కల(డు= నాకిప్పుడు సాయంగా ఉన్నాడు; ఇంకన్= ఇటుపై; ఏమిటికిన్+ఐనన్= ఏ విషయానికైననూ; వెఱపు= భీతి; ఎన్నండును వలవదు= ఎప్పుడూ నాకు కలుగదు.

**తాత్పర్యం:** 'పూర్వం నేను ఎవ్వరి తోడ్పాటూ లేనివాడనై అనుకొన్న దారిలో నరుగగా జరుగవలసిన దేదో జరిగింది. నేడు నాకు విష్ణుదేవుడి సాయమున్నది. ముమ్ముందు ఏమి జరిగిననూ నాకు ఎవ్వరి వల్లా భయంలేదు.

**చ. వెఱచితి రాఁగదే యనిన వెండికదా పగఁదీర్తు వీవు; నా**
**వెఱపెటులున్న నీ రథిక వీరులు వాపెద; రొల్ల నిన్ను; నీ**
**యుఱుకడ కేఁగి తోడుపడు మొడ్లకు నెవ్వరికేని' నన్న నే**
**డ్తెఱ నతఁ డేఁగి కౌరవపతిం గని యట్టుల బెట్టుపల్కినన్. 179**

**ప్రతిపదార్థం:** వెఱచితిన్= యుద్ధానికి భయపడ్డాను; రాన్+కదే= తోడుపడటానికి రావయ్యా; అనినన్= అని నేను వేడుకొంటే; వెండికదా= అప్పుడుగదా; ఈవు= నీవు; పగన్+తీర్తువు= వైరం బాపగలవు; నా వెఱపు= నా భీతి; ఎటులు+ఉన్నన్= ఎట్లున్నప్పటికినీ; ఈ రథిక వీరులు= వీరులైన ఈ రథికులు; పాపెదరు= తొలగించగలరు; నిన్నున్+ఒల్లన్= నీ సాయం అంగీకరించును; నీ+ఉఱుకడకున్+ఏఁగి= నీకు ఉచితమైన చోటికి వెళ్ళి; ఒడ్లకున్+ఎవ్వరికిన్+ఏనిన్= ఇతరులెవ్వరికైననూ; తోడుపడుము= సాయపడుము; అన్నన్= అని అర్జునుడు పలుకగా; ఏడ్తెఱన్= వెంటనే; ఆతఁడు+ఏఁగి= రుక్మి వెళ్ళి; కౌరవపతిన్+కని= కురువిభుడైన సుయోధనుడిని వీక్షించి; అట్టుల= ధర్మజుడి ఎదుట పలికినట్లుగానే; బెట్టుపల్కినన్= బిగువుగా మాట్లాడగా.

**తాత్పర్యం:** 'నాకు యుద్ధమంటే భయంగా ఉన్నది, రావయ్యా' అని నేను అడిగినప్పుడు గదా నీవు వచ్చి పగ తొలగిస్తావు. నాకంతగా భయమేర్పడితే దానిని తొలగించటానికి ఈ రథిక శ్రేష్ఠులున్నారు. నీతోడ్పాటు నాకు అక్కరలేదు. నీకిష్టమైన చోటికి వెళ్ళి ఇతరులెవ్వరికైనా సాయపడుమని అర్జునుడు పల్కగా రుక్మి శీఘ్రమే కదలి వెళ్ళి దుర్యోధనుడిని చూచి ఉద్ధతుడై ఈ విధంగానే మాట్లాడగా.

**క. ఆతఁడివి యేటిమాటలు । నీ తోడగు టొల్లఁ బొ'మ్మనిన రుక్మి వృథా**
**యాతాయాస విషణ్ణుం । డై తన పురమునకు మగుడ నరిగెం బెలుచన్. 180**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= దుర్యోధనుడు; ఇవి+ఏటిమాటలు= ఏమి టీ పలుకులు?; నీతోడు+అగుట= నీ యొక్క సహాయం; ఒల్లన్= ఇష్టపడను; పొమ్ము= వెళ్ళుము; అనినన్= అని పలుకగా; రుక్మి= రుక్మిణియొక్క అన్న; వృథా+ఆయాత+ఆయాస+ విషణ్ణుండు+ఐ= వ్యర్థంగా తన పట్టణం నుండి వచ్చుటచే కలిగిన శ్రమవలన దుఃఖితుడై; తన పురమునకున్= తన నగరానికి; పెలుచన్= వడిగా; మగుడన్= మరల; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు రుక్మియొక్క తలబిరుసు మాటలు విని 'ఇవేటి మాటలు? నీ సాయం నాకు అక్కరలేదు; పొ'మ్మన్నాడు. కుండినపురినుండి తనరాక వృథా ప్రయాస అయిందిగదా అని బాధపడుతూ రుక్మి తన నగరానికి అక్కడనుంచి వెంటనే తిరిగి వెళ్ళాడు.

**తే. ఇట్లు బలదేవ రుక్ముల కిద్దఱకును । గయ్యమునకు సన్నాహంబు గలుగదయ్యెఁ**
**గాని తక్కులోకమ్మునఁ గలుగు నృపతి । కోటి యిరువాఁగు నందును గూడె ననికి. 181**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; బలదేవ రుక్మలకున్+ఇద్దఱకును= బలరాముడు, రుక్మి అనే ఇరువురకునూ; కయ్యమునకున్= యుద్ధానికి; సన్నాహంబు= అవసరం; కలుగదు+అయ్యెన్= లభించలేదు; కాని= కాని; తక్కులోకమ్మునన్+ కలుగు= మిగిలిన జగతియందున్నట్టి; నృపతి కోటి= రాజసమూహం; అనికిన్= యుద్ధానికి; ఇరువాఁగునందును+కూడెన్= రెండు పక్షాలందు చేరింది.

**తాత్పర్యం:** ఈ రీతిగా బలరాముడు, రుక్మి అనే ఈ ఇద్దరికీ కురుపాండవ యుద్ధంలో పాల్గొనే అవకాశం చిక్కలేదు. కాని, జగతిలోని మిగిలిన రాజులందరూ పోరాటానికై రెండు పక్షాలలో చేరిపోయారు.

**వ. అట్టియెడ నిశాసమయంబున ధృతరాష్ట్రుండు సంజయు రావించి యిట్లనియె. 182**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= అటువంటి తరుణంలో; నిశా సమయంబునన్= రాత్రి వేళ; ధృతరాష్ట్రుండు; సంజయున్; రావించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు రాత్రివేళ ధృతరాష్ట్ర మహారాజు సంజయుడిని తన చెంతకు రప్పించుకొని ఇట్లా అన్నాడు:

**క. 'బవరము గీడని యెఱుఁగుదు । నవినీతుండైన కొడుకు నదలిచి యుడుపం**
**దివిరియు నోరాడమి దై । వ వశం; బప్పనికి మనకు వగ పింకేలా? 183**

**ప్రతిపదార్థం:** బవరము= పోరు; కీడు+అని+ఎఱుఁగుదున్= చేటు కలిగిస్తుందని తెలుసు; అవినీతుండు+ఐన= అడకువలేనట్టి; కొడుకున్= నా కుమారుడిని; అదలిచి= బెదిరించి; ఉడుపన్+తివిరియున్= సంక్షోభం నివారించటానికి పూనియు; నోరు+ఆడమి= నాకు నోరాడకుండటం; దైవ వశంబు= దైవాధీనమే; ఆ+పనికిన్= అలా జరిగినందుకు; మనకున్= మనకు; వగపు= విచారం; ఇంకన్+ఏలా?= మరెందుకు?

**తాత్పర్యం:** 'యుద్ధం అనర్థాలకు మూలమని నాకు తెలుసు. అవిధేయుడైన నా కుమారుడిని తర్జించి భర్జించి కుటుంబ సంక్షోభం మాన్పడానికి యత్నించి కూడ నాకు నోరు రాకుండటం విధి వైపరీత్యం. అట్లా జరిగినందుకు ఇప్పుడు విచారించి లాభం లేదు.

**క. ఎయ్యది గానున్నది యది । యయ్యెడుఁ; జేయునది గలదె? యవనీశులకుం**
**గయ్యానఁ జచ్చుటయు మే; । లయ్యొప్పుట లెస్సగాక! యది యట్లుండెన్. 184**

**ప్రతిపదార్థం:** ఎయ్యది= ఏది; కానున్నది= జరుగనున్నదో; అది+అయ్యెడున్= అది జరుగగలదు; చేయునది+కలదె?= ఇప్పుడు మనం చేయగల్గింది ఏమీలేదు; అవనీ+ఈశులకున్= రాజులకు; కయ్యానన్= రణంలో; చచ్చుటయున్+మేలు= మరణించటమే శ్రేయస్కరం; ఆ+ఒప్పుట= అందు కంగీకరించటం; లెస్సగాక!= మంచిదే సుమా!; అది+అట్లు+ఉండెన్= ఆ విషయమట్లా ఉండనిమ్ము.

**తాత్పర్యం:** ఏది జరుగవలసి ఉన్నదో అది జరుగక మానదు. మనం చేయగల్గింది ఏమీ లేదు. రాజులు రణరంగంలో చావడమే మంచిది. అందుకు అంగీకరించటమే యుక్తం. ఆ విషయ మట్లా ఉండనీ.

**వ. రెండు వీళ్ళును గురుక్షేత్రంబున విడిసిన పిదపం బుట్టిన విశేషంబులు గలవేని నెఱింగింపుము.' 185**

**ప్రతిపదార్థం:** రెండు వీడు+లును= ఉభయ సేనలును; కురుక్షేత్రంబునన్; విడిసిన పిదపన్= దిగిన తర్వాత; పుట్టిన విశేషంబులు= కలిగిన వింతలు; కలవు+ ఏనిన్= ఉంటే; ఎఱింగింపుము= తెలుపుము.

**తాత్పర్యం:** ఉభయ సైన్యాలూ కురుక్షేత్రంలో దిగిన తరువాత జరిగిన విశేషము లేమైనా ఉంటే నాకు చెప్పు.'

**సంజయుండు ధృతరాష్ట్రుని కులూకుఁడు పాండవుల నాడిన మాటలు చెప్పుట (సం. 5-157-1)**

**తే.** **అనిన సంజయుఁ డిట్లను 'నకట! కొడుకు । మీఁదఁ దప్పు పెట్టెదవు నీ మీఁది కొఱఁత**
**నీకుఁ గానంగ వచ్చునె? నీ వెఱుంగ । కుండఁ బఱచెనె యాతండు పాండుసుతుల?** **186**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధృతరాష్ట్రుడు అడుగగా; సంజయుఁడు= సంజయుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అకట!= ఔరా!; కొడుకుమీఁదన్= కుమారుడిపై; తప్పు+పెట్టెదవు= నిందమోపెదవు; నీమీఁది కొఱఁత= నీయందున్నలోటు; నీకున్= నీకు; కానంగన్+వచ్చునె?= కనబడునా?; నీవు+ఎఱుంగకుండన్= నీకు తెలియకుండ; ఆతండు= సుయోధనుడు; పాండుసుతులన్= పాండవులను; పఱచెనె?= బాధించాడా?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి మాటలకు సంజయు డిట్లా బదులు పలికాడు: 'ఔరా! నీ కొడుకు మీద దోషం ఆరోపిస్తావు గాని, నీలోని లోపం నీవు గుర్తించకున్నావు. నీకు తెలియకుండ సుయోధనుడు పాండునందనులను కష్టపెట్టాడా?

**వ.** **ఆ పని గడవంబడియె; వార్తలు వినియెదవేని వినుము; దుర్యోధనుండు దుశ్శాసన శకుని కర్ణులతో విచారించి యులూకుం బిలిపించి నీవు వోయి పాండవులంగని వాసుదేవు సన్నిధిని బాంచాల విరాట ప్రముఖులు వినఁ బలుకు'మని పరుసని మాటలు గఱపి పుచ్చిన నతండును.** **187**

**ప్రతిపదార్థం:** ఆ పని= ఆ కార్యం; కడవన్+పడియెన్= జరిగిపోయింది; వార్తలు వినియెదవు+ఏనిన్= సంగతులు వినదలచుకొంటే; వినుము= ఆలకించుము; దుర్యోధనుండు దుశ్శాసన శకుని కర్ణులతోన్; విచారించి= ఆలోచించి; ఉలూకున్; పిలిపించి= ఉలూకుడనెడి శకుని కుమారుడిని రప్పించి; నీవు పోయి, పాండవులన్‌కని; వాసుదేవు సన్నిధిని= శ్రీకృష్ణుడి సమక్షంలో; పాంచాల విరాట ప్రముఖులు= ద్రుపదుడు, విరాటుడు మున్నగువారు; వినన్; పలుకుము; అని; పరుసని మాటలు= కఠినవాక్యాలు; కఱపి= చెప్పి; పుచ్చినన్= పంపగా; అతండును= ఆ ఉలూకుడుకూడ.

**తాత్పర్యం:** ఆ కార్యం గడచిపోయింది. సంగతులు వినదలిస్తే వినుము. దుర్యోధనుడు దుశ్శాసన శకుని కర్ణులతో మంతనమాడి ఉలూకుడనే శకుని పుత్రుడిని పిలిపించి, నీవు వెళ్ళి పాండవులను చూచి, అక్కడ శ్రీకృష్ణుడి సమ్ముఖంలో ద్రుపదుడు విరాటుడు మొదలైనవారు వింటుండగా ఈ పలుకులు పలుకుము అని కొన్ని కఠిన వాక్యాలు అతడికి చెప్పి పంపగా వాడు (వెళ్ళాడు.)

**క.** **చని కొలువున ధర్మసుతుం । గని 'దుర్యోధనుఁడు చెప్పఁగా నను నియమిం**
**చిన మాటలు గొన్ని గలవు । విను మలుగక' యనిన నతఁడు విని యిట్లనియెన్.** **188**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; కొలువునన్= సభలో; ధర్మసుతున్+కని= ధర్మజుడిని చూచి; దుర్యోధనుఁడు= సుయోధనుడు; చెప్పఁగాన్= మీకు తెలుపుటకై; ననున్= నన్ను; నియమించిన మాటలు= ఆజ్ఞాపించిన పలుకులు; కొన్ని కలవు= కొన్ని

ఉన్నాయి; అలుగక= నాపై కోపించక; వినుము= ఆలకించుము; అనినన్= అని ఉలూకుడు పలుకగా; అతఁడు విని= ధర్మపుత్రుడు ఆకర్ణించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఉలూకుడు వెళ్ళి సభలో ధర్మపుత్రుడిని చూచి 'దుర్యోధనుడు మీకు చెప్పుమని నన్ను ఆజ్ఞాపించిన మాటలు కొన్ని ఉన్నాయి. నాపై కోపగించక వాటిని వినుము' అని పలుకగా ధర్మజుడు విని ఇట్లా అన్నాడు:

**ఆ. 'నీకు వెఱవనేల? నిన్ను నా బుద్ధిమం । తుండు చెప్పు మనిన తులువమాట**
**లెన్ని గలవు వాని నన్నింటి ననుమాన । మింత లేక యాడు మెల్ల వినఁగ. 189**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; వెఱవన్+ఏల?= భయపడటమెందుకు?; నిన్నున్= నిన్ను; ఆ బుద్ధిమంతుండు= ఆ ప్రజ్ఞావంతుడు; చెప్పుము+అనిన= పలుకుమనిన; తులువమాటలు= తుంటరికూతలు; ఎన్ని కలవు= ఎన్ని ఉన్నాయో; వానిన్+అన్నింటిన్= ఆ మాటలన్నీ; అనుమానము= సందేహం; ఇంత లేక= రవంతయు లేకుండా; ఎల్లన్+వినఁగన్= అందరూ ఆలకిస్తుండగా; ఆడుము= పలుకుము.

**తాత్పర్యం:** 'ఉలూకా! నీవు భయపడనక్కరలేదు. నిన్ను ఆ బుద్ధిమంతుడు పలుకుమన్న తుంటరి మాటలు ఎన్ని ఉన్నాయో వాటి నన్నింటిని సందేహం కొంచెం కూడా లేకుండ ఈ కొలువులోని వారెల్లరు ఆలకించగా పలుకుము.'

**వ. అనిన నులూకుం డిట్లనియె : 190**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధర్మజు డనగా; ఉలూకుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మజు డట్లా పలుకగా ఉలూకు డిట్లా అన్నాడు:

**సీ. 'కయ్యంబునకుఁ బెద్ద కాలమేనియుఁ బూఁచి । పట్టి వచ్చితి కడు బరవసమున;**
**సంజయుతో మీరు శంకలే కాడిన । యెక్కుడు మాటలు పెక్కు గలవు;**
**భూమి భాగము గోలుపోయిన యలుకకు । ద్రౌపదిఁ బఱచిన దైన్యమునకుఁ**
**దగ మంచిబంటవై తఱి యిది బాహుబ । లాస్త్ర విద్యలు చూపనని తలంచి**

**ఆ. నిలువ వలయు నీకుఁగలవారి నెల్లను । గూర్చి మోహరించికొని కడంగి**
**నడవు సమరమునకు; వెడజంకఁబోదింకఁ । దప్పఁ గ్రుంకలేదు తఱికిఁ జొరుము. 191**

**ప్రతిపదార్థం:** కయ్యంబునకున్= యుద్ధానికి; పెద్దకాలము+ఏనియున్= దీర్ఘకాలమైనను; పూఁచి పట్టి= పూనిక వహించి; కడున్ బరవసమునన్= మిక్కిలి ధైర్యంతో; వచ్చితి(వి)= వచ్చావు; సంజయుతోన్= సంజయుడితో; మీరు; శంకలేక= జంకు వహించక; ఆడిన= పలికిన; ఎక్కుడు మాటలు= మీ యోగ్యతను మించిన పలుకులు; పెక్కు కలవు= అనేకములున్నవి; భూమిభాగమున్= రాజ్యభాగాన్ని; కోలుపోయిన+అలుకకున్= పోగొట్టుకొన్న కోపానికి; ద్రౌపదిన్= పాంచాలిని; పఱచిన దైన్యమునకున్= అవమానించిన చిన్నతనానికి; తగన్= చక్కగా; మంచి బంటవు+ఐ= గొప్ప వీరుడవై; బాహుబల+అస్త్రవిద్యలు చూపన్= భుజబలమును, బాణ విద్యా నైపుణ్యమును చూపటానికి; తఱి+ఇది= ఇది తగిన సమయం; అని తలంచి= అని భావించి; నిలువన్ వలయున్= నిలబడవలెను; నీకున్+కలవారిన్+ఎల్లను= నీకున్న వారినందరినీ; కూర్చి= చేర్చుకొని; మోహరించికొని= వ్యూహము లేర్పరచుకొని; కడంగి= పూని; సమరమునకున్= కయ్యానికి; నడవు(ము)= కదలుము; వెడ

జంకన్+బోదు= ఇంచుక జంకితే పోవదు, ఏ మాత్రం జంకినా లాభం లేదు; ఇంకన్= మరి; తప్పన్+క్రుంకన్‌లేదు= తప్పించుకోవడానికి వీలుకాదు; తఱికిన్= సమయానికి; చొరుము= ప్రవేశించుము, పూనుకొమ్ము.

**తాత్పర్యం:** 'యుద్ధం చేయటానికి బహుకాలం వేచియుండి మిక్కిలి ధైర్యంతో వచ్చావు. సంజయుడితో మీ యోగ్యతకు మించి పల్కిన మాట లెన్నో ఉన్నవి. రాజ్యభాగం పోగొట్టుకొన్నందుకు, ద్రౌపదిని భంగపెట్టినందుకు పగదీర్చుకొనే సమయ మాసన్నమైనదని తలంచి మీ బాహుబలం, మీ బాణ విద్యా కౌశలం చూపటానికి కదనరంగంలో మేటి వీరుడవై నిలబడుము. నీకున్న వారి నందరినీ కూర్చుకొని, వ్యూహా లమర్చుకొని కదనానికి కదలిరమ్ము. ఇక జంకి లాభంలేదు. తప్పించుకొనటానికి వీలుగాదు. సమయానికి రమ్ము.

**క. ఆతతబలుఁ డగు భీష్ముని । చేతి బలువు ద్రోణు నంపసెల లవియుటయుం**
**జూతు రటురండు కృష్ణుని । చేతన సకలంబుఁ జక్కఁ జేసికొనుండీ! 192**

**ప్రతిపదార్థం:** ఆతత బలుఁడు+అగు= అధికబలంగల వాడయిన; భీష్ముని= పితామహుడి యొక్క; చేతి బలువు= బాహుశక్తి; ద్రోణు+అంపసెలలు= ద్రోణాచార్యుల బాణపు ములుకులు; అవియుటయున్= గ్రుచ్చుకొనటమున్నూ; చూతురు= చూస్తారు; అటురండు= యుద్ధానికి రండి; కృష్ణునిచేతన= కృష్ణుడి వలననే; సకలంబున్= అంతయు; చక్కఁజేసికొనుండీ= చక్కబరచుకొనండి.

**తాత్పర్యం:** పోరాటానికి రండి. అధిక బలసంపన్నుడైన భీష్ముడి భుజశక్తినీ, ద్రోణాచార్యుల బాణాగ్రాల పోటులనూ కనుగొనగలరు. మీరు శ్రీకృష్ణుడిచేతనే అంతా చక్కబెట్టుకొనండి.

**క. వారిద్దఱ వాలమ్ముల । బారింబడి యర్జునునకు బ్రదుక వశమె? మీ**
**వారెల్ల నెఱుంగరె య । వ్వీరుల దివ్యాస్త్రశస్త్ర విభవ సమృద్ధుల్?' 193**

**ప్రతిపదార్థం:** వారి+ఇద్దఱవాలు+అమ్ములు= ఆ భీష్మ ద్రోణుల నిడుదలైన శరాలయొక్క; బారిన్+పడి= పాలై (హింసకులోనై;) అర్జుననకున్= పార్థుడికి; బ్రదుకన్ వశమె?= జీవించటానికి శక్యమౌతుందా? మీవారు+ఎల్లన్= మీ వారందరూ; ఆ+వీరుల= ఆ శూరులిద్దరియొక్క; దివ్య+అస్త్రశస్త్ర విభవ సమృద్ధుల్= శ్రేష్ఠములైన శరములయొక్కయు, ఆయుధముల యొక్కయు శక్తి సంపన్నతలు; ఎఱుంగరె?= తెలియరా?

**తాత్పర్యం:** భీష్మ ద్రోణు లిద్దరి దీర్ఘములైన బాణాల బారిన పడి అర్జునుడు బ్రతకటం సాధ్యమా? మీ వారందరు ఆ మేటి శూరులయొక్క దివ్యాస్త్రాల ఆయుధాల శక్తి సంపన్నతను తెలియరా ఏమి?'

**వ. అని భీమసేనుం జూచి. 194**

**తాత్పర్యం:** అని ఉలూకుడు పలికి భీమసేనుడిని చూచి.

**క. 'ఈ వాయుపుత్త్రుఁ డాజిం । ద్రావుదు నే దుస్ససేను రక్తం బనియెం;**
**ద్రావఁగ శక్యం బేనిం । ద్రావు మనన్ రాదె? యింకఁ దడ వేమిటికిన్? 195**

**ప్రతిపదార్థం:** ఈ వాయు పుత్త్రుఁడు= ఈ భీముడు; దుస్ససేను రక్తంబు= దుశ్శాసనుడి నెత్తురు; ఆజిన్= యుద్ధంలో; నేన్= నేను; త్రావుదున్+అనియెన్= నేను త్రాగుతానని అన్నాడు; త్రావఁగన్= త్రాగటానికి; శక్యంబు+ఏనిన్= వీలయితే; త్రావుము+అనన్ రాదె?= త్రాగుమని చెప్పరాదా?; ఇంకన్= మరి; తడవు+ఏమిటికిన్?= ఆలస్య మెందుకు?

**తాత్పర్యం:** 'ఈ భీముడు దుశ్శాసనుడి నెత్తురు యుద్ధంలో నేను త్రాగుతానని ప్రతిజ్ఞ చేశాడు. త్రాగటానికి తనకు శక్యమైతే త్రాగుమని చెప్పుము. మరి జాగు చేయటమెందుకు?

**క.** **విను నూతి కప్ప విధమున । నిను నీవ యెఱుంగు; దెఱుఁగ నేరవు గర్వం**
**బున నావలి కొలఁది రణం । బున నొకమరి పెట్టువడక పోనేర్చెదవే?'** 196

**ప్రతిపదార్థం:** విను= భీమసేనా, వినుము; నూతికప్పవిధమునన్= బావిలోని మండూకం వలె; నినున్= నిన్ను మాత్రమే; నీవ+ ఎఱుంగుదు(వు)= నీవు తెలియుదువు; గర్వంబునన్= పొగరుచేత; ఆవలి కొలఁదిన్= ఇతరుల బల పరిమాణాన్ని; ఎఱుఁగన్ నేరవు= తెలియజాలవు; రణంబునన్= సంగ్రామంలో; ఒకమరి= ఒకసారి; పెట్టువడక= దెబ్బతినక; పోన్+నేర్చెదవే?= తప్పించుకొని పోగలవా?

**తాత్పర్యం:** భీమసేనా! వినుము. బావిలోని కప్పవలె నిన్ను మాత్రమే నీ వెఱుగుదువు. మదంవలన ఎదుటివారి బల పరిమాణ మేమిటో తెలియకున్నావు. సంగ్రామంలో ఒకసారి మా చేత జిక్కి పెట్టులు (దెబ్బలు) తినకుండ తప్పించుకొని పోలేవు సుమా!'

**వ.** **అని పలికి సవ్యసాచిం జూచి.** 197

**తాత్పర్యం:** అని పలికి అర్జునుడిని చూచి.

**తే.** **'వినుము గాండీవ మనునొక విల్లు తాటి । పొడవు గలిమియుఁ, గృష్ణుండు పూని తోడు**
**గూడుకొని వచ్చుటయు నెఱుంగుదుము; వీని । కెల్ల శంకించి భూమి పా లీము గాని.** 198

**ప్రతిపదార్థం:** వినుము= అర్జునా, ఆలకించుము; గాండీవము+అను= గాండీవమనే పేరుగల; ఒక విల్లు= ఒక చాపం; తాటిపొడవు+కలిమియున్= తాటిచెట్టంత పొడవు గలిగి ఉండుటయు; కృష్ణుండు= శౌరి; పూని= పూనిక వహించి; తోడు కూడుకొని వచ్చుటయున్= నీకు సాయంగా వెంబడిరావటం; ఎఱుంగుదుము= మాకు తెలుసు; వీనికిన్+ఎల్లన్= వీటినన్నిటిని చూచి; శంకించి= జంకి; భూమిపాలు+ఈము+కాని= మేము పుడమిలో భాగం మీ కీయము సుమా!

**తాత్పర్యం:** 'అర్జునా! తాటిచెట్టంత పొడవు గలిగిన గాండీవ మనే విల్లు నీకున్నదనీ, కృష్ణుడు నీకు సాయంగా నీవెంట ఉన్నాడనీ మాకు బాగా తెలుసు. ఈ ఆర్భాటాలకు బెదరిపోయి మీకు పుడమిలో పాలుపంచి మే మొసగం సుమా!

**క.** **పవనజు గదయును నీ గాం । డివమును నెట వోయె నంగడికిఁ బాంచాలిం**
**దివిచికొని వచ్చునెడఁ బలి । భవ మెఱుఁగవె బీర మేల పలుకుదు తోడ్తోన్?** 199

**ప్రతిపదార్థం:** పాంచాలిన్= ద్రౌపదిని; అంగడికిన్= సభలోనికి; తివిచికొనివచ్చు+ఎడన్= ఈడ్చుకొని వచ్చేటప్పుడు; పవనజు గదయున్= భీముడి గదయు; నీ గాండివమును= నీ గాండీవమును; ఎట+పోయెన్?= ఎక్కడికి పోయాయి?; పరిభవము= జరిగిన అవమానం; ఎఱుఁగవె?= తెలియవా?; తోడ్తోన్= వెంటవెంటనే; బీరము+ఏల+పలుకుదు(వు)?= పౌరుష వచనాలు ఎందుకు పలుకుతావు?

**తాత్పర్యం:** ద్రౌపదిని ఒడ్డోలగం లోనికి ఈడ్చి తెచ్చేటప్పుడు భీముడి గద, నీ గాండీవం ఎక్కడికి వెళ్ళాయి? జరిగిన అవమానం మరచావా? మాటి మాటికి బింకపు మాటలు ఎందుకు పలుకుతావు?

**చ. వలలుఁ డనన్ విరాటుకడ వంటలవాఁడయి భీముఁడున్, బృహ**
**న్నల యన నాఁడు పేడివయి నాన యొకింతయు లేక నీవు న**
**గ్గలమగు దైన్యమొంది కడుఁ గాఱియ వొందితి రుర్వియేలునా**
**సలఁబడి; సవ్యసాచి! యిది శౌర్యమొ? బాహుబలంబొ? చెప్పుమా! 200**

**ప్రతిపదార్థం:** వలలుఁడు+అనన్= వలలుడనే మారుపేరుతో; వంటలవాఁడు+అయి= బానసీడై; భీముఁడున్= భీముడున్నూ; బృహన్నల+అనన్= బృహన్నల అనగా; నాఁడు= అజ్ఞాతవాస సమయంలో; పేడివి+అయి= నపుంసకుడవై; నాన= సిగ్గు; ఒక+ ఇంతయున్ లేక= ఇంచుకంతైనలేక; నీవున్= నీవునూ; ఉర్వి+ఏలు+ఆసలన్+పడి= పుడమిని పాలించవలెననే ఆశకు వశులై; అగ్గలము+అగు= అధికమైన; దైన్యము+ఒంది= దీనదశ జిక్కి; కడున్= మిక్కిలి; కాఱియ పొందితిరి= కష్టాలు అనుభవించారు; సవ్యసాచి!= ఓ అర్జునా!; ఇది శౌర్యమొ= ఇది శూరత్వమో; బాహు బలంబొ= భుజబలమో; చెప్పుమా= వచింపుము.

**తాత్పర్యం:** అర్జునా! వలలుడనే పేరుతో వంటలవాడై భీముడూ, బృహన్నల నామంతో షండుడవై నీవూ సిగ్గు రవంతైనా లేక, రాజ్యం పాలించవలెననే ఆశకు వశులై, విరాటుడి కొలువులో దీనులై నానాకష్టాల పాలైనారు కదా! ఇది శూర లక్షణమో, బాహు విక్రమమో నీవే చెప్పవలె.

**ఉ. మాయలు నింద్రజాలములు మాధవుఁ డిందును గొన్ని వన్ననన్**
**బాయవు రజ్జు లెప్పుడు నవారణ నీ వెటు లాడితేనియున్**
**వేయును నేల? పార్థులును విష్ణులు నేఁబదివేలు వచ్చినం**
**జేయుదు మేము గయ్య మొకచీఱియు సంపదఁ బంచియిత్తుమే?' 201**

**ప్రతిపదార్థం:** మాధవుఁడు= శ్రీకృష్ణుడు; మాయలున్= టక్కులు; ఇంద్రజాలములు= కనుకట్టు విద్యలు; ఇందును= ఇక్కడ; కొన్ని పన్నినన్= కొన్ని చేసిననూ; పాయవు= తీరవు; రజ్జులు= ఆత్మస్తుతులతో కూడిన వ్యర్థ సంభాషణలు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; అవారణన్= అడ్డం లేకుండా; నీవు+ఎట్టులు+ఆడితి+ఏనియున్= నీవెట్లా పల్కినప్పటికినీ; వేయును+ఏల?= పలుమాటలెందుకు? పార్థులును= అర్జునులు(కౌంతేయులు); విష్ణులు= శ్రీకృష్ణులు; ఏబదివేలు వచ్చినన్= ఏబదివేల మంది వచ్చినప్పటికిన్నీ; ఏము= మేము; కయ్యము చేయుదుము= యుద్ధం చేస్తాము; సంపదన్= రాజ్యసంపత్తిలో; ఒక చీరియున్= ఒకింత చీల్చి; పంచి+ ఇత్తుమే= మీకు పంచి ఇస్తామా? (ఇవ్వమని అభిప్రాయం.)

**తాత్పర్యం:** మాధవుడు టక్కుటమారాలు, ఇంద్రజాలాలు కొన్ని పన్నినప్పటికీ, గాలిలో కలిసిపోయే ప్రగల్భవచనాలు నోటికడ్డం లేకుండ నీ వెలా ప్రేలినప్పటికీ, ఏబది వేలమంది అర్జునులు శ్రీకృష్ణులు వచ్చినప్పటికీ మేము యుద్ధం చెయ్యకమానము. పలుమాట లెందుకు? పుడమిలో రవంతకూడా చీల్చి మీకు పంచి ఇవ్వం.'

**వ. అనిన భీమార్జున నకుల సహదేవు లొండొరుల మొగంబులు సూచుచు నాసనంబులు చలింప, మొగంబులు జేవుఱింపఁ గ్రోధాయత్తచిత్తులై యున్నం గనుంగొని నవ్వుచు నారాయణుం డులూకున కిట్లనియె 'నీవు వోయి సుయోధనుతో నెల్లవారును విన నిట్లనుము: 202**

**ప్రతిపదార్థం:** అనినన్; భీమ+అర్జున నకుల సహదేవులు; ఒండు+ ఒరుల మొగంబులు చూచుచున్= ఒకరి ముఖం మరొక్కరు చూచుకొంటూ; ఆసనంబులు చలింపన్= పీఠాలు కదలగా; మొగంబులు జేవుఱింపన్= ముఖాలు ఎఱ్ఱపడగా; క్రోధ+ఆయత్త చిత్తులు+ఐ= కోపానికి వశమైన మనస్సులు కలవారై; ఉన్నన్= ఉండగా; కనుంగొని= చూచి; నవ్వుచున్; నారాయణుండు; ఉలూకునకున్; ఇట్లనియెన్; నీవుపోయి; సుయోధనుతోన్; ఎల్లవారును వినన్; ఇట్లు+ అనుము= ఈ రీతి పలుకుము.

**తాత్పర్యం:** ఉలూకుడి పలుకులు విని భీమార్జున నకుల సహదేవులు ఒకరిముఖం మరొకరు చూస్తూ, కూర్చున్న తమ ఆసనాలు కదలగా, ముఖాలు ఎఱ్ఱదనం పొందగా కోపానికి అధీనమైన మనస్సులు కలవారై ఉండగా శ్రీకృష్ణుడు చూచాడు. చూచి నవ్వుతూ ఉలూకుడితో 'నీవు వెళ్ళి అక్కడ అందరూ వింటుండగా దుర్యోధనుడితో ఇట్లా చెప్పు.

**తే. బవర మెల్లియ బిరుదవై బరవసంబు । గలిగి చావుము; చావక తొలఁగ రాదు**
**కృష్ణ సారథికంబగు జిష్ణురథము । తొడరి నీ వెందుఁ జొచ్చినఁ దోన చొచ్చు. 203**

**ప్రతిపదార్థం:** బవరము= యుద్ధం; ఎల్లి+అ= రేపే; బిరుదవు+ఐ= శూరుడవై; బరవసంబు+కలిగి= ధైర్యం వహించి; చావుము= మరణించుము; చావక= మరణం పాలుగాక; తొలఁగన్+రాదు= యుద్ధరంగం నుండి తప్పించుకొనలేవు; కృష్ణ సారథికంబు+అగు= శ్రీకృష్ణుడు సారథిగా కలిగిన; జిష్ణు రథము= జయశీలుడైన పార్థుడి అరదం; తొడరి= ఎదిరించి; నీవు+ ఎందున్+చొచ్చినన్= నీవెక్కడ ప్రవేశించినప్పటికీ; తోన్+అ చొచ్చున్= వెంబడే ప్రవేశిస్తుంది.

**తాత్పర్యం:** యుద్ధం రేపే. వీరుడవై ధైర్యమూని మరణించుము. మరణించక తప్పించుకొనిపోలేవు. శ్రీకృష్ణుడు సారథ్యం వహించగా వెడలిన విజయుడి తేరు ని న్నెదిరించి నీ వెక్కడ దూరితే వెంటనే తానూ అక్కడ దూరుతుంది.

**క. రిత్తలు రజ్జెడువాఁడే । మత్తగజాయుతబలుండు మారుతి యని మ**
**ద్వృత్తుఁడగు దుస్ససేనుని । నెత్తు రురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్. 204**

**ప్రతిపదార్థం:** మత్తగజ+అయుతబలుండు= మదించిన పదివేల యేనుగుల బలం గలిగిన; మారుతి= వాయుపుత్రుడు భీముడు; రిత్తలు= వట్టిమాటలు; రజ్జెడువాఁడే= వాగునట్టివాడా? అనిన్= కదనంలో; ఉద్వృత్తుఁడు+అగు= గర్విఅయిన; దుస్ససేనుని= దుశ్శాసనుడి యొక్క; నెత్తురు= నెత్తురును; ఉరము వ్రచ్చి= గుండె చీల్చి; నీవున్= నీవు; చూడన్= చూస్తూ ఉండగా; త్రావున్= త్రాగగలడు.

**తాత్పర్యం:** భీముడు పదివేల యేనుగుల సత్తువగలవాడు. అత డెప్పుడూ వట్టిమాటలు వదరెడువాడు కాడు. కదనంలో దుశ్శాసనుడి వక్షం చీల్చి నీవు చూస్తుండగనే రక్తం త్రాగగలడు.'

**వ. అని యిట్లు హరి పలికిన యనంతరంబ యర్జునుం డులూకున కిట్లనియె:** 205

**తాత్పర్యం:** ఇట్లా కృష్ణుడు పలికిన తరువాత అర్జునుడు ఉలూకుడితో ఇట్లా అన్నాడు:

**క. 'వారు గలరు వీరు గలరు। పోరికి నని చెప్పె దీవు పొంగారుచు మీ**
**వారిని మిమ్మును రేపు గ। దా రూ పేర్పడఁగఁ జూచెదం గితవసుతా!** 206

**ప్రతిపదార్థం:** కితవసుతా!= ఓ జూదరికొడుకా!; పోరికిన్= యుద్ధానికి; వారు కలరు= వారున్నారు; వీరు కలరు= వీరున్నారు; అని= అంటూ; పొంగారుచున్= నిక్కుతూ; ఈవు= నీవు; చెప్పెదవు= చెపుతున్నావు; మీవారినిన్= మీకు సాయంగా ఉన్నవారినీ; మిమ్మును= బింకాలాడుతున్న మిమ్మునూ; రేపు+కదా= రేపటి దినంగదా; రూపు+ఏర్పడఁగన్+చూచెదను= మీ విధమెట్టిదో తేటతెల్లంగా కనుగొంటాను.

**తాత్పర్యం:** 'మాకు యుద్ధంలో సాయపడటానికి వారున్నారు. వీరున్నారు' అని నీవు నిక్కుతూ చెప్పుతున్నావు. మీకు సాయంగా ఉన్నవారినీ, బింకాలాడుతున్న మిమ్ములనూ రేపుగదా స్పష్టంగా చూస్తాను.

**చ. తన భుజశక్తి లేక యొరుదర్పము యూఁది పరాక్రమింప వ**
**చ్చిన నది సెల్లునే? కులవిశిష్టుని సువ్రతు వృద్ధు నార్యు భీ**
**ష్మని నెసకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీవని యుబ్బఁజేసి యీ**
**సునఁ దలపెట్టి చంపికొనఁజూచె సుయోధనుఁ డింత నేమగున్?** 207

**ప్రతిపదార్థం:** తన భుజశక్తి లేక= తనకు బాహుబలం లేకుండా; ఒరుదర్పము+అ= పరులశక్తినే; ఊఁది= ఆధారం చేసికొని; పరాక్రమింపన్+వచ్చినన్= శౌర్యం చూపవస్తే; అది చెల్లునే= అది సాగుతుందా?; కుల విశిష్టునిన్= కురువంశంలో సదాచార సంపన్నుడునూ; సువ్రతున్= మంచి నియమాలు కలవాడునూ; వృద్ధున్= ముసలివాడునూ; ఆర్యున్= పూజ్యుడునూ అయిన; భీష్మునిన్= పితామహుడిని; ఎసకొల్పి= పురికొలిపి; సేనలకున్+ముఖ్యుఁడవు+ఈవు+అని= సైన్యాలన్నింటికీ ప్రధానాధికారివి నీవేఅని; ఉబ్బన్+చేసి= ఉప్పొంగించి; ఈసునన్+తలపెట్టి= ద్వేషంతో సంకల్పించి; సుయోధనుఁడు= దుర్యోధనుడు; చంపికొనన్+చూచెన్= చంపుకొనటానికి యత్నించాడు; ఇంతన్+ఏమి+అగున్?= భీష్ముడు సర్వసైన్యాధిపతి అయినంత మాత్రాన తాను గట్టెక్కినట్లా?

**తాత్పర్యం:** తనకు బాహుబలం లేకుండా పరులశక్తి నాశ్రయించి పరాక్రమం ప్రకటింపజూస్తే సాగదు. కురుకులంలో విశిష్టుడూ, మంచి నియమ నిష్ఠలు కలవాడూ, ముసలివాడూ, పూజ్యుడూ అయిన భీష్ముడిని పురికొల్పి సేనలన్నింటికి నీవే అధిపతివని ఉబ్బించి ఈర్ష్యతో అతడిని చంప దలపెట్టాడు సుయోధనుడు. భీష్ముడిని నమ్ముకొన్న మాత్రాన తాను ఒడ్డుకు చేరినట్లా?

**చ. తన తలఁ పిట్లు భీష్ముభుజదర్పము లోకముకంటె నెక్కు డీ**
**తని నొకభంగి నండగొని తప్పుదుఁ జావున కంచునున్నవాఁ**
**డనిఁ దొలుముద్ద గొందుము రయంబున నాతని, వెండి ద్రోణులం**
**దునుముదు, మప్ప సూతసుతుఁ దోలుదు, మంతట నాస మాలెడున్.** 208

**ప్రతిపదార్థం:** తన తలఁపు+ఇట్లు= తన ఉద్దేశ మిది; భీష్మభుజ దర్పము= గాంగేయుడి బాహు పరాక్రమం; లోకముకంటెన్= లోకంలోనివారి శౌర్యంకంటె; ఎక్కుడు= అధికం; ఈతనిన్= భీష్ముడిని; ఒక భంగిన్= ఒక విధంగా; అండ+కొని= ఆధారంగా చేసికొని; చావునకున్+తప్పుదున్= మరణం గడచెదను; అంచున్= అని; ఉన్నవాఁడు= దుర్యోధను డాశతో ఉన్నాడు; అనిన్= పోరాటంలో; రయంబునన్= శీఘ్రంగా; ఆతనిన్= ఆ భీష్ముడిని; తొలుముద్ద కొందుము= మొదటి ముద్దగా ఆరగిస్తాం; వెండిన్= ఆతడి తర్వాత; ద్రోణులన్= గురువైన ద్రోణాచార్యుని; తునుముదుము= నరకివేస్తాము; అప్డు= ఆ వెంటనే; సూతసుతున్= కర్ణుడిని; తోలుదుము= రణరంగమునుంచి తరిమి వేస్తాము; అంతటన్= అప్పుడు; ఆసమాలెడున్= దుర్యోధనుడు ఆశ వదలుకొంటాడు.

**తాత్పర్యం:** సుయోధనుడి ఉద్దేశమిది- లోకంలోని వారందరికంటె భీష్ముడి భుజబలం ఎక్కువని. అది వట్టి భ్రమ. గాంగేయుడిని ఆధారంగా చేసికొని మరణం పాలుగాకుండ మనవలెనని దుర్యోధనుడు భావిస్తున్నాడు. కాని, అతడు విశ్వసించిన గాంగేయుడినే తొలిముద్దగా దిగమ్రింగుతాము. ఆ పిదప గురువైన ద్రోణాచార్యులను మట్టుపెడతాం. అవతల సూతపుత్రుడైన కర్ణుడిని తరుమగొడతాం. అప్పటికికాని సుయోధనుడు ఆశ వదలుకోడు.

**క. అనుజుల తనుజుల చావులు । కనుఁగొని మఱి తాను భీము గదచే నిలఁ గూ**
**లిన యప్పుడైన దుర్యో । ధనుఁడు మదిం దలఁచుఁగాక తన దుష్కృతముల్. 209**

**ప్రతిపదార్థం:** అనుజుల= తమ్ముల యొక్కయు; తనుజుల= పుత్త్రుల యొక్కయు; చావులు= మరణాలు; కనుఁగొని= చూచి; మఱి= తరువాత; తాను= తాను; భీము గదచేన్= భీమసేనుడి గదాఘాతంతో; ఇలన్+కూలిన+ అప్పుడు+ఐనన్= నేలపై కూలినప్పుడైనా; దుర్యోధనుఁడు= సుయోధనుడు; తన దుష్కృతముల్= తన పాపములు; మదిన్= మనసులో; తలఁచున్+కాక!= భావించుకొనగలడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన తమ్ముల, కుమారుల మరణాలు చూచి, భీముడి గదాఘాతంతో ధరణిపై కూలినప్పుడైనా తన పాపకార్యాలను స్మరించగలడు.

**వ. అది యట్లుండె; నీవు వేగపోయి రేపకడయ మీ రాజుం గలనికి నడపింపు'మనియె; నప్పుడు ధర్మనందనుం డులూకునకుం దాంబూలాభరణంబు లిచ్చి వీడుకొలిపి, ధృష్టద్యుమ్ను నవలోకించి 'యెల్లి కయ్యంబని మన సైన్యంబులకెఱింగించి సర్వసమరసన్నాహంబులు సమకట్టు'మని పనిచి కొలువు విరిసి చనియె; ధృష్టద్యుమ్నుండును ద్రోణులం దొడరం బడసితినని యుబ్బుచు వెడలి, భీష్ముం దలపడఁగంటి నని పొంగు శిఖండి తోడుగా రాజు శాసనంబు నిర్వర్తించె; నిట యులూకుండు వచ్చి దుర్యోధనుం బేరోలగంబునం గని యతనికిఁ గృష్ణార్జునుల పలుకు లున్న రూపు విన్నవించిన, నతండు కర్ణుదెసఁ గనుంగొని 'సమస్త సేనలకు రేపు బవరం బని చెప్పి పుచ్చుము; సకల సాధనంబులు నాయితంబులు సేయు' మని పనిచిన నతండు నట్లచేసె; నిట్లు భయకటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి యుల్లసిల్లె' ననిన ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె: 210**

**ప్రతిపదార్థం:** అది+అట్లు+ఉండెన్= ఆ విషయం అట్లా ఉంచుము; నీవు; వేగన్= శీఘ్రంగా పోయి; రేపకడయ= ఉదయమే; మీ రాజున్; కలనికిన్= యుద్ధానికి; నడపింపుము; అనియెన్; అప్పుడు ధర్మనందనుండు; ఉలూకునకున్; తాంబూల+

ఆభరణంబులు+ఇచ్చి; వీడుకొలిపి= వెళ్ళుటకు అనుమతినిచ్చి; ధృష్టద్యుమ్నున్; అవలోకించి= చూచి; ఎల్లి= రేపు; కయ్యంబు+అని; మన సైన్యంబులకున్; ఎఱింగించి; సర్వ సమర సన్నాహంబులు= అన్ని రకాలైన యుద్ధ ప్రయత్నాలు; సమకట్టుము+అని= చేయుమని; పనిచి= ఆజ్ఞాపించి; కొలువు విరిసి= సభ చాలించి; చనియెన్; ధృష్టద్యుమ్నుండును; ద్రోణులన్; తొడరన్+పడసితిన్= ఎదిరింపగంటినని; ఉబ్బుచున్= సంతోషిస్తూ; వెడలి; భీష్మున్+తలపడన్+కంటిని= భీష్మతో పోరాడనోచితిని; అని; పొంగు= సంతసిల్లే; శిఖండి; తోడుగాన్= సహాయుడు కాగా; రాజు శాసనంబు= రాజాజ్ఞను; నిర్వర్తించెన్= నెరవేర్చాడు; ఇటన్; ఉలూకుండున్ వచ్చి దుర్యోధనున్; పేరు+ఓలగంబునన్= పెద్ద సభలో; కని; అతనికిన్; కృష్ణ+అర్జునుల పలుకులు; ఉన్నరూపు= ఉన్నవి ఉన్నట్లుగా; విన్నవించినన్= మనవి చేయగా; అతండు= సుయోధనుడు; కర్ణుదెసన్; కనుంగొని; సమస్త సేనలకున్; రేపు; బవరంబు= యుద్ధం; అని చెప్పి; పుచ్చుము= పంపుము; సకల సాధనంబులు= అన్ని యుద్ధోపకరణాలు; ఆయితంబులు= సంసిద్ధాలు; చేయుము; అని; పనిచినన్= పంపగా; అతండు= రాధేయుడు; అట్ల చేసెన్; ఇట్లు; ఉభయకటకంబులు= రెండు సైన్య పక్షాలు; రణంబునకున్; ఉత్సహించి= ఉద్యోగించి; విజృంభించి= చెలరేగి; ఉల్లసిల్లెన్= ప్రకాశించాయి; అనినన్; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+ అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విషయ మట్లుంచు. నీవు తొందరగా వెళ్ళి ఉదయమే మీ రాజును యుద్ధానికి పంపుమని అర్జునుడు పలికాడు. ధర్మరాజు ఉలూకుడికి తాంబూలాభరణాలు ఇచ్చి వెళ్ళుమని చెప్పాడు. అవతల ధృష్టద్యుమ్నుడిని చూచి 'రేపే యుద్ధమని మన సైన్యాలకు తెలిపి యుద్ధ సన్నాహాలన్నీ చేయుమని ఆజ్ఞాపించి కొలువు చాలించి వెళ్ళాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని ఎదిరించే అవకాశం తనకు లభించినందుకు సంతోషించాడు. భీష్ముడిని ఎదుర్కొనే భాగ్యం తనకు కల్గినందుకు శిఖండి పొంగిపోయాడు. ధృష్టద్యుమ్నుడు శిఖండిని తోడుగా చేసికొని రాజాజ్ఞను నిర్వర్తించాడు. పాండవులకడనుండి తిరిగివచ్చిన ఉలూకుడు దుర్యోధనుడిని ఒడ్డోలగంలో చూచి, కృష్ణార్జునులు పలికిన పలుకులు ఉన్నవి ఉన్నట్లుగా మనవి చేశాడు. దుర్యోధనుడు కర్ణుడి వైపు చూచి, 'మన సేనలన్నింటికి రేపే సంగ్రామమని చెప్పి పంపుము; సకలసాధనాలను సమాయత్తం చేయవలసిం'దని పంపగా అతడు అట్లా చేశాడు. ఈ రీతిగా రెండు పక్షాలు చెలరేగి యుద్ధోత్సాహంతో ఉల్లసిల్లాయి' అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు విని మళ్ళీ అతడితో ఇట్లా అన్నాడు:

**క. 'వినుము హరి తోడుగల య । ర్జును గెలువ నదీసుతునకుఁ జొప్పడునే? యా**
**పని నిలుపు; ములూకుని చె । ప్పిన మాటల కేమి యనిరి పిదపఁ గొలువునన్?' 211**

**ప్రతిపదార్థం:** వినుము= సంజయా! నా మాటలు వినుము; హరితోడు+కల= శ్రీకృష్ణుడి సహాయం కలిగిన; అర్జునున్= అర్జునుడిని; గెలువన్= జయించటానికి; నదీసుతునకున్= భీష్ముడికి; చొప్పు+పడునే?= శక్యమౌతుందా?; ఆ పని నిలుపుము= ఆ విషయం అలాఉంచు; ఉలూకుని చెప్పిన మాటలకున్= ఉలూకుడు పలికిన పలుకులకు; పిదపన్= తరువాత; కొలువునన్= సభలో; ఏమి+అనిరి?= ఎవ్వరేమన్నారు?

**తాత్పర్యం:** 'సంజయా! శ్రీహరి సహాయం కలిగిన అర్జునుడిని జయించటానికి భీష్ముడికి సాధ్యమౌతుందా? ఆ విషయం అట్లా ఉంచు. ఉలూకుడు చెప్పిన మాటలు విన్న తరువాత సభలో ఎవ రేమి పలికారో? నాకు తెలుపుము.'

**వ. అనిన విని యంబికానందనునకు సూతనందనుం డిట్లనియె : 212**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అంబికానందనునకున్= అంబిక కొడుకైన ధృతరాష్ట్రుడితో; సూతనందనుండు= సూతజాతివాని కొడుకైన సంజయుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి మాటలకు సంజయు డిట్లా బదులు చెప్పాడు:

**ఆ. 'అయ్యులూకు పలుకు లన్నియు విని భవ । త్తనయుతోడ నిట్టులనియె భీష్ముఁ**
**'డేనుగలుగ వెఱవ నేటికి? సేనలఁ । గాతు నీవు మెచ్చఁ గౌరవేంద్ర! 213**

**ప్రతిపదార్థం:** ఆ+ఉలూకుపలుకులు= ఆ ఉలూకుడి మాటలు; అన్నియున్ విని= అన్నిటినీ ఆలకించి; భవత్+తనయుతోడన్= నీ కుమారునితో; భీష్ముఁడు= గాంగేయుడు; ఇట్టులు+ అనియెన్= ఈ ప్రకారం చెప్పాడు; కౌరవ+ఇంద్ర= కురునాథా!; ఏను= నేను; కలుగన్= ఉండగా; వెఱవన్+ఏటికిన్?= భయపడటం ఎందుకు?; నీవు మెచ్చన్= నీవు శ్లాఘించగా; సేనలన్+కాతున్= సైన్యాలను రక్షిస్తాను.

**తాత్పర్యం:** ఉలూకుడు చెప్పినమాట లన్నీ విని భీష్ముడు నీ కుమారుడితో ఇట్లా వచించాడు: 'కురురాజా! నేనుండగా నీకు భయమెందుకు? నీవు మెచ్చేటట్లు సేనలన్నింటినీ సంరక్షిస్తాను.

**క. నడిపింపఁగఁ బొడిపింపఁగ । నెడమడువై కలఁగినప్పు డేర్పఱుపఁగ నేఁ**
**గడునేర్తుఁ బేర్చు నాదగు । కడిమియ నీ సైన్యమునకు గొౕసెన కాదే?' 214**

**ప్రతిపదార్థం:** నడిపింపఁగన్= సేనలను నడిపించటానికి; పొడిపింపఁగన్= యుద్ధం చేయించటానికి; ఎడమడువు+ఐ= తారుమారై; కలఁగిన+అప్పుడు= చెదరిపోయినప్పుడు; ఏర్పఱుపఁగన్= చక్కబరచటానికి; ఏన్= నేను; కడున్= మిక్కిలి; నేర్తున్= తెలియుదును; పేర్చు= అతిశయించే; నాదగు= నాయొక్క; కడిమి+అ= పరాక్రమమే; నీ సైన్యమునకున్= నీ సేనకు; గొౕసెన+కాదే!= గలీబు(కవచం) సుమా!

**తాత్పర్యం:** దుర్యోధనా! సేనలను నడిపించటానికి, యుద్ధం చేయించటానికి, సైన్యం తారుమారై చెదరిపోయినప్పుడు కలతమాన్పి చక్కబరచటానికి నేను మిక్కిలి సమర్థుణ్ణి. అతిశయించే నా పరాక్రమమే సైన్యానికి రక్షాకవచమని గ్రహించుము.'

**క. అనినన్ గురురా జిట్లను । 'వినుము పితామహ! మహాస్త్రవిత్తము లనఁగాఁ**
**జను నీవును నాచార్యుం । డును గలుగఁగ నాకు నెన్నఁడును వెఱపేలా? 215**

**ప్రతిపదార్థం:** అనినన్= అని భీష్ముడు చెప్పగా; కురురాజు= దుర్యోధనుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; పితామహా!= తాతా!; వినుము= ఆలకించుము; మహా+అస్త్ర విత్తములు+అనఁగాన్+చను= మహాస్త్రా లెఱింగిన వారిలో శ్రేష్ఠులు అనగా ఒప్పునట్టి; నీవును= నీవూ; ఆచార్యుండును= గురువగు ద్రోణుడును; కలుగఁగన్= లభించగా; నాకున్= నాకు; ఎన్నఁడును= ఎప్పటికినీ; వెఱపు+ఏలా?= భయమెందుకు?

**తాత్పర్యం:** భీష్ము డారీతి ధైర్య వచనాలు పల్కగా విని సుయోధనుడు, 'తాతా! నీవూ, గురుడైన ద్రోణాచార్యులూ మహాస్త్రా లెరిగిన వారిలో పరమశ్రేష్ఠులు. మరి మీరుండగా నాకు భయమెందుకు?

**తే.** **ఏను గంధర్వ కిన్నర దానవాది । దివ్య భూతంబులకును భీతిల్ల ననినఁ**
**బాండుపుత్త్రుల మాత్రకు భయము నాకు । నెక్కడిది? వ్రేల్మిడిన వారి యుక్కు మడఁతు.'** **216**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; గంధర్వ= గంధర్వులు; కిన్నర= కిన్నరులు; దానవ= రాక్షసులు; ఆది= మొదలైన; దివ్య భూతంబులకును= దేవతా జాతులకూ; భీతిల్లన్+అనినన్= భయపడ నన్నప్పుడు; పాండుపుత్త్రుల మాత్రకున్= కేవలం అల్పులైన పాండవుల గురించి; నాకున్= నాకు; భయము+ఎక్కడిది?= భీతి లేనేలేదు; వ్రేల్మిడిన్+అ= చిటిక వేసినంతలో; వారి+ఉక్కు మడఁతున్= వారల పొగరు అణుస్తాను.

**తాత్పర్యం:** నేను గంధర్వ కిన్నర దానవాది దేవతా వర్గానికే భయపడనప్పుడు అల్పులైన పాండవుల విషయమై నాకు భయమెక్కడిది? చిటికవేసినంతలో వారి మద మణగిస్తాను.'

**భీష్ముఁడు గౌరవసేనలో నతిరథ మహారథాదుల నిరూపణంబు సేయుట (సం. 5-162-15)**

**వ.** **అని పలికి మఱియు నిట్లనియె :** **217**

**తాత్పర్యం:** అని పలికి దుర్యోధనుడు అంతటితో ఆగక మరల ఇట్లా పలికాడు :

**క.** **'నీ యందు వారి యందుం । జేయంగల మానుసుల విశేషంబులఁ జి**
**త్తాయత్తంబుగఁ జెప్పుము । నీ యెఱుఁగని యవియు లేవు నిక్కపుఁ దరముల్.'** **218**

**ప్రతిపదార్థం:** నీ యందున్= నీ ఆధిపత్యంలో ఉన్న సేనలందును; వారియందున్= పాండవ పక్షంలో ఉన్న సేనలలో; చేయన్+కల= యుద్ధం సల్పగల; మానుసుల విశేషంబులన్= వీరుల ప్రత్యేకతను; చిత్త+ఆయత్తంబుగన్+చెప్పుము= నా మనసున కెక్కునట్లు తెలుపవలసినది; నిక్కము+తరముల్= వాస్తవమైన హెచ్చు తక్కువలు; నీ+ఎఱుఁగని+అవియున్+లేవు= నీకు తెలియనట్టివి లేవు.

**తాత్పర్యం:** 'పితామహా! నీ పక్షంలో, పాండవుల పక్షంలో యుద్ధంచేయగల వీరుల ప్రత్యేకతలు నా మదికెక్కేటట్లు చెప్పుము. ఆ వ్యక్తుల తారతమ్యాలు నీకు తెలియనివి కావు.'

**క.** **అనవుడు 'నీ విట్లడిగిన । విని యూరక యుండఁ దగదు విను మేర్పడ నె**
**ల్లను నున్న రూపు సెప్పెద । మన వారల వారి వారి మానము లధిపా!'** **219**

**ప్రతిపదార్థం:** అనవుడున్= సుయోధనుడట్లా పలుకగా; నీవు= నీవు; ఇట్లు+అడిగినన్= వీరులలో గల హెచ్చు తక్కువలు తెలుపుమని నన్ను కోరినప్పుడు; విని= ఆలకించి; ఊరక+ఉండన్+తగదు= మిన్నకుండటం న్యాయంగాదు; అధిపా!= రాజా!; ఏర్పడన్= విశదమయ్యేటట్లు; మనవారల= మన పక్షంలోని వారియొక్కయు; వారి వారి= పాండవ పక్షానికి చెందిన వారియొక్కయు; మానములు= బలపరిమాణాలు; ఉన్నరూపు+ఎల్లను= ఉన్న విధమంతయు; చెప్పెదన్= తెలుపుతాను; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** 'సుయోధనా! వీరులలోని తారతమ్యాలు తెలుపుమని నన్ను కోరినప్పుడు తెలుపక ఊరకుండటం న్యాయం కాదు. మనవారియొక్క పాండవ పక్షంలోని వారియొక్క శక్తులలోని హెచ్చుతక్కువలు ఉన్నవి ఉన్నట్లుగా చెపుతాను విను.'

వ. అని గాంగేయుం డిట్లనియె : 220

**తాత్పర్యం:** అని భీష్ముడిట్లా అన్నాడు:

సీ. 'నీ వతిరథుఁడవు, నీ తమ్ములందఱు । సమరథశ్రేష్ఠులు సమరమునకుఁ
బరుసని వీరులు పాంచాలసేన ని । ర్జింతురు; నను నేన చెప్పికొనఁగ
నేర; నా యేడ్తెఱ మీరెఱుంగుదురు; భో । జాగ్రణి కృతవర్మ యతిరథుండు
దృఢవేధి యీతండు దీర్చునెంతటి పని । యైనఁ గైకొని; శల్యుఁ డతిరథుండు;

ఆ. వాసుదేవుతోడి యీసువాఁ, డల్లుర । విడిచె నిన్నుఁ గూడి; విక్రమమునఁ
బేరుకొనఁగఁ జాలు భూరిశ్రవుం డతి । రథుల మొదలి; యనికి రక్కసుండు. 221

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; అతిరథుఁడవు= అనేక రథికులతో ఒంటరిగా పోరాడగల ఉత్తమ రథికుడవు; నీ తమ్ములు+ అందఱున్= నీ అనుజులెల్లరు; సమరథశ్రేష్ఠులు= సమరథులయందు శ్రేష్ఠులు; సమరమునకున్= యుద్ధానికి; పరుసని వీరులు= కరకుతనం కలిగిన శూరులు; పాంచాలసేనన్= ద్రుపదుడి సైన్యమును; నిర్జింతురు= గెలువగలరు; ననున్ నేన చెప్పికొనఁగన్ నేరన్= నన్ను గూర్చి నేనే వెల్లడించుకొనలేను; నా+ఏడ్తెఱ= నా పరాక్రమం; మీరు+ఎఱుంగుదురు= మీకు తెలుసు; భోజ+అగ్రణి= భోజవంశస్థులలో మేటి; కృతవర్మ= కృతవర్మ అనువాడు; అతిరథుండు= అతిరథుడు; ఈతండు= ఈ కృతవర్మ; దృఢవేధి= గట్టిగా లక్ష్యాన్ని భేదించగలవాఁడు; ఎంతటి పని+ఐనన్+కైకొని= ఎట్టి సంకట కార్యాన్నైనా గ్రహించి; తీర్చున్= చక్కబెట్టగలడు; శల్యుఁడు= మద్రపతి; అతిరథుండు= అతిరథుడు; వాసుదేవుతోడి+ఈసువాఁడు= శ్రీకృష్ణుడిపై అసూయ కల్గినవాడు; నిన్నున్+కూడి= నీతోచేరి; అల్లురన్+విడిచెన్= తన మేనల్లుళ్ళైన పాండవులను వదలివేశాడు; విక్రమమునన్= శూరత్వంచేత; పేరుకొనఁగన్+చాలు= పొగడదగినవాడైన; భూరిశ్రవసుడు; అతిరథుల మొదలి= అతిరథులలో అగ్రేసరుడు; అనికిన్= యుద్ధానికి; రక్కసుండు= రాక్షసుడు సుమా!

**తాత్పర్యం:** 'సుయోధనా! నీ వతిరథుడవు. నీ తమ్ములందరు సమరథులలో ఉత్తములు. యుద్ధం చేయటంలో గడుసుతనం గలవారు. ద్రుపదుడి సేనలను జయించగలరు. ఇక నన్ను గూర్చి నేను చెప్పికొనటం బాగుండదు. నా చేవ ఎలాంటిదో మీకు తెలుసు. భోజులలో మేటి అయిన కృతవర్మ అతిరథుడు. అతడు లక్ష్యాన్ని భేదించగలవాడు. ఎట్టి దుర్ఘటకార్యాన్నైనా చక్కబెట్టగలడు. శల్యుడు అతిరథుడు. అతడికి శ్రీకృష్ణుడిపై ఈర్ష్య. తన మేనల్లుళ్ళైన పాండవులను విడిచి నీతో చేరాడు. పరాక్రమంలో ప్రఖ్యాతి వహించిన భూరిశ్రవుడు అతిరథోత్తముడని గ్రహించుము. ఆతడు రణరంగంలో నిజంగా రాక్షసుడే సుమా!

**విశేషం:** ఆ కాలంలో రథ సారథ్యంలో నిపుణులు శ్రీకృష్ణుడు, శల్యుడు. ఉత్తరుడు కూడ తేరు నడపటంలో ప్రగల్భుడంటారు. రథచోదకత్వంలో మాధవుడి విఖ్యాతికి శల్యుడు మాత్సర్యగ్రస్తుడయి ఉండవచ్చును. అంతకంటె అతడికి వాసుదేవుడిపై గల ఈసుకు మరొక్క కారణం కనిపించదు. అసలు మేనల్లుళ్ళ పక్షం వహించవలసిన శల్యుడు దుర్యోధనుడి కుతంత్రంవలన కౌరవులతో కలియవలసి వచ్చింది. ఆ కథ యిది.

పాండవులు సమరసహాయం కోరి శల్యుడి పాలికి దూతలను పంపగా అతడు పుత్ర మిత్ర సమేతంగా నానా సేనలతో కదలి పాండవులున్నచోటికి నిత్య ప్రయాణాలతో నడచివస్తున్నాడు. ఈ విషయం తెలిసి దుర్యోధనుడు మద్రపతి

వచ్చే మార్గంలో వారికి అన్ని సౌకర్యాలూ కలిగించాడు. అందుకు సంతుష్టుడై శల్యుడు 'ఇంత చతురంగా ఇన్ని ఏర్పాట్లు చేసిన ధర్మజుడి అమాత్యులెవరో తోడ్కొని రండి. అభినందించాలి' అన్నాడు. పలుతెరగుల పనులు చేస్తున్న తన ఆప్తులలో మరుగున నున్న దుర్యోధనుడు తన కిది తగిన సమయమని వచ్చి వినయంతో శల్యుడిని సందర్శించాడు. ఇదంతా దుర్యోధనుడి యత్నఫలమని 'శల్యుడు గ్రహించి ఉబ్బి తబ్బిబ్బై' నీకేది యిష్టమో కోరుకో, ఇస్తా నన్నాడు. 'నీవు యుద్ధంలో నా పక్షం వహించి నన్ను ఉద్ధరించు' మని సుయోధనుడు అర్థించాడు. మానధనుడైన శల్యుడు మాట తిరుగలేక, 'నేను ఉపప్లావ్యపురికి వెళ్ళి, పాండవులను చూచి, తప్పక హస్తినాపురికి వస్తాను', వెళ్ళుమన్నాడు.

శల్యుడు కౌంతేయులను కలుసుకొన్నాడు. దుర్యోధనుడు తనను దర్శించి సాయమర్థించటం, అందుకు తాను సమ్మతించటం చెప్పి వేశాడు. ధర్మజుడు ఆశ్రితుల అభీష్టం నెరవేర్చటం పెద్దల గుణమని శల్యుడిని ప్రశంసించి 'మామా! పంకజాక్షుడు పార్థుడికి భండనంలో సారథ్యం వహిస్తాడు. కర్ణుడు అర్జునుడితో మచ్చరిస్తుంటాడు గదా! వీరిద్దరికీ పోరు జరిగేటప్పుడు కౌరవ పక్షంలో శ్రీకృష్ణుడికి ప్రతిసారథ్యం చేయగల నేర్పు మరొక్కరికి లేనందున నీకు కర్ణ సారథ్యం తప్పదు. సమరసమయంలో తృణీకరించి పలికి రాధేయుడి మనసుకు కలక పుట్టించి క్రీడిని సంరక్షింపవలసిన'దని వేడుకొన్నాడు. అందుకు శల్యు డంగీకరించాడు.

ధర్మజుడి వేడికోలునుబట్టి చూస్తే, శల్యుడికి సారథి కృత్యంలో గల కౌశలం ఏపాటిదో విశదమవుతుంది.

**క. విను సైంధవుఁడు మహారథుఁ । డనిఁ బోక పెనంగు; నతని నా ద్రౌపదికై**
**పెనుపఱఁ బఱిచిరి కుంతీ । తనయులు వారల కెదుర్పఁ దపముం జేసెన్. 222**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించుము; సైంధవుఁడు= సింధుదేశపతి, నీ చెల్లెలు దుస్సలకు పెనిమిటి; మహారథుఁడు= మహారథుడు; అనిన్= యుద్ధంలో; పోక= వెనుదీయక; పెనంగున్= పోరాడుతాడు; అతనిన్= ఆ సైంధవుడిని; ఆ ద్రౌపదికై= పాంచాలిపట్ల చేసిన తప్పునకై; పెనుపు+అఱన్= మదమణగేటట్లు; కుంతీతనయులు= పాండవులు; పఱిచిరి= అవమానపరచారు; వారలకున్= వారికి; ఎదుర్పన్= ఎదురుతిరగటానికి; తపమున్+చేసెన్= (ఈశ్వరుడి గురించి) తపస్సు చేశాడు.

**తాత్పర్యం:** సుయోధనా! సింధుదేశాధీశుడూ, నీ చెల్లెలు దుస్సల మగడూ అయిన జయద్రథుడిని గురించి వినుము. అతడు మహారథుడు. యుద్ధంలో వెనుకంజవేయక పోరాడుతాడు. ద్రౌపది విషయంలో చేసిన తప్పిదానికి కౌంతేయులు వాడిని మదమణగేటట్లు మర్దించారు. ఆ కోపంతో వారి నెదుర్కొనటానికి అతడు ఈశ్వరుడిని గురించి తపస్సు కూడా చేశాడు.

**విశేషం:** పాండవులు కామ్యకవనంలో తృణబిందుమహాముని ఆశ్రమంలో కాలం గడుపుతున్నారు. ఒకనాడు వారైదుగురూ పాంచాలి నక్కడ ఉంచి మృగయార్థం వనంలోకి వెళ్ళారు. సాల్వకన్యను పెండ్లాడటానికి సైంధవుడు చతురంగ బలాలతో ఆ దారిని వెళ్ళుతూ ఆశ్రమద్వారంలో ద్రౌపదిని చూచి మోహించి రథమెక్కి తనతో రమ్మని నిర్బంధించాడు. ఆమె భీతిల్లి పురోహితుడైన ధౌమ్యుడిని కేకవేసింది. జయద్రథుడు ఆమెను బలాత్కారంగా రథంలో ఉంచుకొని వెళ్ళుతుంటే పురోహితుడు ఆక్రోశిస్తూ వారి వెంబడి పరుగెత్తసాగాడు.

పాండవులు మృగాలను వేటాడి ఆశ్రమాభిముఖులై వస్తూ పరిచారిక ధాత్రేయివల్ల సంగతి తెలిసి తత్క్షణమే జయద్రథుడిని వెంటనంటారు. ఆక్రోశిస్తూ అరుగుతున్న ధౌమ్యుడిని ఓదార్చి త్రిగర్త శిబిసింధు సౌవీర సైన్యంపై కవిశారు. తుముల యుద్ధం జరిగింది. జయద్రథుడు ద్రౌపదిని దిగవిడిచి పారిపోయి ఒక పొదలోకి దూరాడు. భీముడు సైంధవుడిని వెలికిలాగి పిండిపిండిగా పొడుస్తుంటే, మన అన్న చెప్పినట్లు దుస్సలను తలంచిఅయినా వీనిని చంపవద్దన్నాడు పార్థుడు.

భీమసేనుడు అతడి తల చెక్క లెగసేటట్లు గొరిగి, పెడకేలు గట్టి తెచ్చి ధర్మజుడి ముందు పడవేశాడు. వీడే పాండవదాసు డన్నాడు. అట్లా అయితే ప్రాణాలతో విడిచిపెట్టండని పాంచాలి పలికింది. మున్ముందు ఇట్లాంటి పాపపు పనులు చేయక బుద్ధిగలిగి బ్రతుకుమని నిరసించి ధర్మజుడు వదలిపెడితే వాడు గంగాద్వారంలో శివుడిని గురించి కఠోరతపం చేశాడు.

శంభుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మంటే, 'పంచపాండవులను సైన్యయుతంగా జయించేటట్లు అనుగ్రహించు'మని వేడుకొన్నాడు. 'ఒక్క విజయుడిని తప్ప నలుగురు కౌంతేయులను ఒకనాటి యుద్ధంలో జయిస్తావు పో'మ్మని రుద్రు డంతర్ధానమయ్యాడు. అర్జునుడు లేని సమయంలో ద్రోణుడు ధర్మజుడిని బంధించటానికి పన్నిన పద్మవ్యూహాన్ని భేదించటానికి ధర్మరాజు అభిమన్యుడిని నియోగిస్తాడు. అతడు వ్యూహాన్ని భేదించి కౌరవ సేనతో ఒంటరిగా పోరాడుతున్నప్పుడు ధర్మపుత్రుడు వాడికి తోడ్పడటానికి తమ్ములతో సకల సైన్యంతో ఉరవడిస్తాడు. కాని, ఈశ్వరదత్త వర ప్రభావం వలన సైంధవుడు వారిని అడుగు ముందుకు వేయకుండా అడ్డుకొన్నాడు. అక్కడ అభిమన్యుడు యుద్ధంలో ఒంటరిగా పోరి పోరి పెక్కంద్ర చేత హతుడయ్యాడు. ఆ తరువాత అర్జునుడు పాశుపతాస్త్ర మహిమచేత సైంధవుడిని సంహరిస్తాడు.

**వ. కాంభోజరాజగు సుదక్షిణుండు సమరథుం; డితనిపాల రథబృందంబులు మేలు గలుగుఁ, బాండవ బలంబులం గలంచు; మాహిష్మతీపతి యగు నీలుం డర్ధరథుం డితనికి సహదేవునకుఁ దెగని పగయై యుండు; దానం జేసి యాలంబున నోలమాసగొనం; డవంతిదేశాధీశులగు విందానువిందు లర్ధరథులు; పరస్పర స్నేహంబున సాహసికులై యొకళ్ళొకళ్ళం బెట్టి పోవక పోరుదురు; త్రిగర్త పతులు తోడంబుట్టువులేవురును మహారథులు; గోగ్రహణంబునం బడిన బన్నంబుఁ బాపికొనం గడంగుదురు; వీరికి భుజబలం బగ్గలంబై యుండు. 223**

**ప్రతిపదార్థం:** కాంభోజరాజు+అగు, సుదక్షిణుండు; సమరథుండు= ఒక విలుకాడితో సరిగా నిలచి యుద్ధం చేసే యోధుడు; ఇతనిపాలన్= ఇతడి దగ్గర; రథబృందంబులు= రథ సమూహాలు; మేలు+కలుగున్= మంచివి కలవు; పాండవబలంబులన్= పాండవుల సేనలను; కలంచున్= కలతనొందించగలవు; మాహిష్మతీపతి+అగు నీలుండు; అర్ధరథుండు; ఇతనికిన్ సహదేవునకున్; తెగని పగ+ఐ= మానని విరోధమై; ఉండున్; దానన్+చేసి= ఆ కారణంచేత; ఆలంబునన్= యుద్ధంలో; ఓలము+ఆస+కొనండు= వెనుదీయడు(మరుగుచోటున ప్రవేశించడు); అవంతి దేశ+అధీశులు+అగు= అవంతిదేశానికి అధిపతులైన; వింద+ అనువిందులు= విందుడు, అనువిందుడు అనేవారు; అర్ధరథులు; పరస్పర స్నేహంబునన్= ఒకరిపై మరొక్కరికి గల చెలిమి చేత; సాహసికులు+ఐ= తెంపరులై; ఒకళ్ళు+ ఒకళ్ళన్+ పెట్టిపోవక= ఒకరిని మరొక్కరు దిగవిడిచి వెళ్ళక; పోరుదురు= పోరాటం సల్పుతారు; త్రిగర్త పతులు= త్రిగర్త దేశాధీశులు; తోడంబుట్టులు+ఏవురును= ఐదుగురు సహోదరులు; మహారథులు; గోగ్రహణంబునన్= దక్షిణ గోగ్రహణకాలమందు; పడిన బన్నంబు= చెందిన భంగపాటు; పాపికొనన్= తొలగించు కొనటానికి; కడంగుదురు= పూనుకొంటారు; వీరికిన్; భుజబలంబు= బాహువిక్రమం; అగ్గలంబు+ఐ+ఉండున్= అధికంగా ఉన్నది.

**తాత్పర్యం:** కాంభోజ దేశానికి రాజైన సుదక్షిణుడు సమరథుడు. ఇతడి దగ్గర మంచి రథాలున్నాయి. అవి పాండవసేనలను సంక్షోభమొందిస్తాయి. మాహిష్మతీ నాయకుడైన నీలుడు అర్ధరథుడు. ఇతడికీ సహదేవుడికీ మానని విరోధం. అందువలన నీలుడు రణరంగంలో వెనుదీయక పోరాడుతాడు. అవంతిదేశపతులైన విందానువిందులిద్దరూ అర్ధరథులు. అన్యోన్య స్నేహం కలవారు. కనుక ఒకరినొకరు వదలిపెట్టక సాహసంతో పోరు సల్పుతారు. త్రిగర్త దేశపురాజులు అన్నదమ్ములైదుమంది కూడా మహారథులు. దక్షిణ గోగ్రహణకాలంలో పాండవుల వలన పొందిన భంగపాటు తొలగించుకొనటానికి ఉద్యమిస్తారు. వీరు అధిక బాహుపరాక్రమం కలవారు.

**క. సమరథుఁడు బిరుదు లక్ష్మణ । కుమారకుం డేచి మొనలఁ గోల్తల సేయున్**
**మిమునెల్ల మిగులు భుజగ । ర్వము మదముం గలఁడు కొనఁ డరాతుల నధిపా! 224**

**ప్రతిపదార్థం:** అధిపా= రాజా!; లక్ష్మణ కుమారకుండు= నీ తనయుడైన లక్ష్మణకుమారుడు; సమరథుఁడు= సమరథుడై ఉన్నాడు; బిరుదు= శూరుడు; ఏచి= చెలరేగి; మొనలన్= సేనలను; కోల్తలచేయున్= యుద్ధానికి ప్రోత్సహిస్తాడు; మిమ్ముమ్+ఎల్లన్= మిమ్మందరినీ; మిగులున్= మించుతాడు; భుజగర్వము= బాహుదర్పం; మదమున్+కలఁడు= పొగరు కలవాడు; అరాతులన్= శత్రువులను; కొనఁడు= లెక్కచేయడు.

**తాత్పర్యం:** దుర్యోధనా! నీ తనయుడైన లక్ష్మణకుమారుడు సమరథుడు. మంచివీరుడు. విజృంభించి సేనలను యుద్ధానికి ప్రోత్సహించి నడుపగలవాడు. మిమ్మందరినీ మించినవాడు. బాహుబలం, దర్పం కలవాడు. విరోధులను లక్ష్యపెట్టడు.

**వ. బృహద్బలుండు సమరథుండు కోసల బలంబుతోడం గడంగి చిచ్చునుం గరువలియునుంగొని తాఁకు; దండధారుం డర్ధరథుండు సేన పఱపు గలండు, బెట్టిదంబుగాఁ గయ్యంబు సేయు. 225**

**ప్రతిపదార్థం:** బృహద్బలుండు; సమరథుండు; కోసలబలంబుల తోడన్= కోసలదేశపుసైన్యాలతో; కడంగి= పూనుకొని; చిచ్చునున్= అగ్నిని; కరువలియునున్= గాలిని; కొని తాఁకున్= ఎదిరిస్తాడు; దండధారుండు; అర్ధరథుండు; సేనపఱపు+కలండు= విస్తారమైన సైన్యంకలవాడు; బెట్టిదంబుగాన్= కఠోరంగా; కయ్యంబు+చేయున్= యుద్ధం చేయగలడు.

**తాత్పర్యం:** బృహద్బలుడు సమరథుడు. అతడు కోసల దేశ సైన్యాలతో కూడి, అగ్ని వాయువులు జతపడినట్లు శాత్రవ సేనలను ఎదిరిస్తాడు. దండధారుడు అర్ధరథుడు, ఎక్కువ సైన్యం కలవాడు. దారుణంగా పోరాడుతాడు.

**తే. అతిరథోత్తముఁ డివ్వీటియందు మేటి । కృపుడు; తన పెంపు వాటించి గెలుచుఁ జిచ్చుఁ**
**గాని నాలుగు దెఱఁగుల సేనలకును । దివియఁ డించుకయును నరదేవముఖ్య! 226**

**ప్రతిపదార్థం:** నరదేవముఖ్య!= రాజోత్తమా!; కృపుఁడు= కృపాచార్యుడు; అతిరథ+ఉత్తముడు= అతిరథులలో మిన్న; ఈ+వీటియందున్= ఈ మన దండులో; మేటి= గొప్పవాడు; తన పెంపు+పాటించి= తన గొప్పతనం ప్రకటించి; గెలుచున్= విజయము గైకొంటాడు; చచ్చున్+కాని= (లేదా) మరణిస్తాడు కాని; నాలుగు తెఱఁగుల సేనలకును= చతుర్విధములైన సైన్యాలకు - అనగా రథగజతురగ పదాతులకు; ఇంచుకయును= కొంచెమైనా; తివియఁడు= వెనుదీయడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడు అతిరథులలో శ్రేష్ఠుడు. మనదండులో మిన్న. తన ప్రశస్తి చాటుతూ గెలవనైనా గెలుస్తాడు, చావనైనా చస్తాడు గాని చతుర్విధ సైన్యాలకు పోరాటంలో రవంతైనా వెనుదీయడు.

**క. శకుని విను సమరథుఁడు పాం । డు కుమారులతోడ నెప్పుడుం బగఁగొని వా**
**రికిఁ గీడురోయు; భృత్యులు । ప్రకట బలులు గలరు; నేర్చు బవరంబునకున్. 227**

**ప్రతిపదార్థం:** విను(ము)= ఆలకించు; శకుని= నీ మేనమామ; సమరథుఁడు= సమరథుడు; పాండుకుమారులతోడన్= పాండవులతో; ఎప్పుడున్= ఎల్లవేళల; పగన్+కొని= శత్రుత్వం వహించి; వారికిన్= కౌంతేయులకు; కీడు= హానిని; రోయున్=

వెదకుతాడు; ప్రకటబలులు= గొప్ప బలం కలిగిన; భృత్యులు= సేవకులు; కలరు= అతడి కున్నారు; బవరంబునకున్+నేర్చున్= యుద్ధంచేయటం శకుని ఎరుగును.

**తాత్పర్యం:** శకుని సమరథుడు. పాండునందనులతో ఎల్లప్పుడు విరోధం వహించి వారి చేటునకు దారులు వెదకుతుంటాడు. అతడికి బలాఢ్యులైన సేవకులున్నారు. శకుని చక్కగా యుద్ధం చేయగలడు.

**మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ గాండీవితోఁ**
**బురుడింపందగువాఁడు; వీని కెన యీ భూలోక సంచారు లె**
**వ్వరులే; రీతఁడు బ్రాహ్మణుం డనని భావం బూనఁగా నోర్వమిం**
**దర మూహింపఁగ లేదకాని జముచందం బయ్యెడుం బోరులన్. 228**

**ప్రతిపదార్థం:** వరదివ్య+అస్త్రవిదుండు= శ్రేష్ఠాలైన దివ్యాస్త్రాలెరింగినవాడూ; బాహు ఘనుఁడు= భుజశక్తిచేత గొప్పవాడూ అగు; అశ్వత్థామ= ద్రోణుని పుత్రుడు; గాండీవితోన్= అర్జునుడితో; పురుడింపన్+తగువాఁడు= పోల్చదగినవాడు; వీనికిన్= ఇతడికి; ఎన= సాటి; ఈ భూలోక సంచారులు+ఎవ్వరున్+లేరు= ఈ పుడమియందు తిరిగే వారిలో ఎవ్వరూ లేరు; ఈతఁడు= అశ్వత్థామ; బ్రాహ్మణుండు+అనని భావంబు= బ్రాహ్మణుడు కాడు అనే తలంపు; ఊనఁగాన్= వహించుటకు; ఓర్వమిన్= సహించలేనందున; తరము= కొలది, స్థాయి; ఊహింపఁగన్+లేద= అతడి తరమిట్టిదని నిర్ణయించటానికి వీలుకాదు; కాని= ఐననూ; పోరులన్= పోరాటాలలో; జముచందంబు+అయ్యెడున్= యముడి విధంగా ఉంటాడు.

**తాత్పర్యం:** శ్రేష్ఠాలూ, దివ్యాలూ అయిన అస్త్రాలు తెలిసినవాడూ, భుజ బలాధికుడూ అయిన అశ్వత్థామ అర్జునుడితో సాటి అనదగినవాడు. ఈతడితో సమానులు ఈ భూలోక వాసులలో ఒక్కడు కూడా లేడు. ఇతడు బ్రాహ్మణుడుకాడనే భావం తలపున బారుట సహించరాని విషయమే. అందువలన ఈతడి కొలది నూహించటానికి వీలులేదు. కాని, యుద్ధాలలో ఇతడు యముడిలా విజృంభిస్తాడు.

**విశేషం:** కొంచెం ఇబ్బంది పెట్టే తిక్కన పద్యాలలో ఇదికూడా ఒకటి. 'ఈతఁడు బ్రాహ్మణుండనిన భావం బూనఁగా నోర్వమిం - దరమూహింపఁగ లేద - ఈ పాఠం సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'తరము' శబ్దమునకు అర్థము చెప్పునప్పుడు ఉన్నది. ఇదే గ్రహించబడింది. 'బ్రాహ్మణుం డనని భావం బూనఁగా నోర్వమిం - దరమూహింపఁ లేద - బ్రాహ్మణుండు+అననిభావం బూనఁగా ..............ఈ విభాగం అర్థం కావటంలేదు. 'బ్రాహ్మణుండన్+అని భావం బూనగా నోర్వమిన్+తర......... ఇదికూడా అంత సుకరంగా లేదు. 'బ్రాహ్మణుండనని భావం బూనఁగా నోర్వము - ఇందర మూహింపఁగ లేద అని విడదీద్దామంటే - 'ఇందఱము' లోనిది శకట రేఫము. యతిప్రాసల విషయంలో కవిత్రయం వారు రేఫ శకట రేఫలకు మైత్రి పాటించలేదు. అందుచేత ఆ విభాగం త్యాజ్యం.

**సీ. అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ; డందలి । యిందలి విలుకాండ్ర కెల్ల గురుఁడు,**
**హితుఁడు నీ కెంతయు, నేర్చిన మొన లితం। డడరినఁ జమరినయట్ల ద్రుందు;**
**వృద్ధని యితని భావింపరా; దనిలోన । నంగ విస్ఫురణంబు భంగి చూడ**
**నర్జునుపైఁ గూర్మి నతని నో నేయఁడు । సచరాచరంబైన జగము లెల్ల**

**తే. నొక్క మొగమై కడంగినఁ జిక్కువఱుచు । దివ్యబాణ జాలంబుల దీటు కొలిపి**
**ప్రాణములు డాఁపఁ; డీతని పాటి దొరలఁ । గాన మే రాజ్యములయందుఁ గౌరవేంద్ర! 229**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర= సుయోధనా!; ద్రోణ+ఆచార్యుఁడు= గురుడగు ద్రోణుడు; అతిరథ+ఉత్తముఁడు= అతిరథులలో వరిష్ఠుడు; అందలి+ఇందలి విలుకాండ్రకున్+ఎల్లన్= పాండవ కౌరవులనెడి ఉభయ పక్షాలలో ఉన్న ధానుష్కులందరికీ; గురుఁడు= ఒజ్జ; నీకున్= నీకు; ఎంతయున్+హితుఁడు= మిక్కిలి మేలు కోరేవాడు; ఏర్చిన మొనలు= పన్నిన వ్యూహాలు; ఇతండు= ఈయన; అడరినన్= విజృంభిస్తే; చమరిన+అట్లు+అ= నేలబెట్టి రాచిన విధంగానే; మ్రందున్= నశించిపోతాయి; అనిలోనన్= కయ్యమునందు; అంగ విస్ఫురణంబు+భంగిన్= శరీర విజృంభణం యొక్క విధమును; చూడన్= కనుగొన్నప్పుడు వృద్ధు+అని= ముసలివాడని; ఇతనిన్ భావింపన్‌రాదు= ఇతడిని తలంచటానికి వీలుగాదు; అర్జునుపైన్+కూర్మిన్= అర్జునుడి మీది వాత్సల్యంతో; అతనిన్= పార్థుడిని; నొనేయఁడు= నొచ్చేటట్లు బాణాలు ప్రయోగించడు; సచర+అచరంబు+ఐన= జంగమ స్థావరాలతో కూడిన; జగములు+ఎల్లన్= లోకాలన్నీ; ఒక మొగము+ఐ= ఏకమై; కడంగినన్= తన మీదికి కవిసిననూ; దివ్యబాణజాలంబులన్= దివ్యములైన శరసమూహాలను, దీటుకొల్పి= పరగించి; చిక్కు పఱుచున్= కష్టాలపాలు కావిస్తాడు; ప్రాణములు డాఁపఁడు= ప్రాణాలమీద తీపిలేనివాడు ప్రాణాలు దాచుకోడు; ఈతనిపాటి దొరలన్= ఇతడితో సమానులైన శూర ప్రభువులను; ఏ రాజ్యములఅందున్= ఏ దేశాలలోనూ; కానము= చూడబోము.

**తాత్పర్యం:** కురుపతీ! ద్రోణాచార్యులు అతిరథులలో శ్రేష్ఠుడు. ఉభయ పక్షాలలోని ధానుష్కులందరికినీ గురువు. నీకు మిక్కిలి మేలు కోరేవాడు. ఏర్చి కూర్చిన వ్యూహాల మీదకు ఇతడు విజృంభించినపుడు అవి చేత నలిపినట్లు నిర్మూలమవుతాయి. యుద్ధంలో ఈయన దేహకాంతి కనుగొంటే ముసలివాడని భావించటానికి శక్యం కాదు. అర్జునుడిపై ప్రేముడి కలవాడు గనుక అతడిని శరాలతో నొప్పించడు. స్థావర జంగమాత్మకమైన జగమంతా ఏకంగా తనమీదికి ఉరికినా దివ్యశర సమూహం ప్రయోగించి చీకాకు పరుస్తాడు. కయ్యంలో ప్రాణాలు పోతాయన్న జంకు ఇతడికి లేదు. ఇతడితో సమానులైన శూర ప్రభువులను ఏ రాజ్యంలోనూ చూడలేము.

**క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను । మతులిత బలుఁ; డితని యట్ల యాత్మజుఁడును వి**
**శ్రుతశక్తి సోమదత్తుం; । డితనికి, నీతనికి సమర మెన పెండిలికిన్. 230**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలింపుము; బాహ్లికుఁడు= కురువంశస్థులలో పెద్దవాడు; అతిరథుఁడు; అతులిత బలుఁడు= సాటిలేని శక్తికలవాడు; ఇతనిఅట్లు+అ= ఈతడివలెనే; ఆత్మజుఁడును= కుమారుడగు; సోమదత్తుండు= సోమదత్తుడు; విశ్రుతశక్తి= ప్రఖ్యాతమైన బలం కలవాడు; ఇతనికిన్= బాహ్లికుడికి; ఈతనికిన్= సోమదత్తుడికి; సమరము= సంగ్రామం; పెండిలికిన్= వివాహంతో; ఎన= సాటి;

**తాత్పర్యం:** బాహ్లికుడు అతిరథుడు. సాటిలేని బలం కలవాడు. అతడి వలెనే ఆతడి కుమారుడు సోమదత్తుడు కూడా ప్రసిద్ధమైన బలం కలిగినవాడు. తండ్రికీ, కుమారుడికీ యుద్ధమంటే పెళ్ళితో సమానం.

**క. అసురవరుఁ డీ యలంబుషుఁ । డసమాన బలుండు సమరథాగ్రణి; విను పాం**
**డు సుతులయెడ రోషము గలఁ । డసంఖ్య మాయా బలమున నరులఁ గలంచున్. 231**

**ప్రతిపదార్థం:** అసురవరుఁడు= రాక్షసశ్రేష్ఠుడైన; ఈ+అలంబుషుఁడు= అలంబుషుడు అను పేరుగల ఇతడు; అసమానబలుండు= సాటిలేని శక్తికలవాడు; సమరథ+అగ్రణి= సమరథులలో ఉత్తముడు; విను= సుయోధనా, ఆలకించు; పాండుసుతులయెడన్= పాండుకుమారుల యందు, రోషము కలఁడు= కోపం కలవాడు; అసంఖ్య మాయాబలమునన్= గణింపరాని మాయలయొక్క మహిమచేత; అరులన్= శాత్రవులను; కలంచున్= బాధిస్తాడు.

**తాత్పర్యం:** రాక్షసులలో శ్రేష్ఠుడైన ఈ అలంబుషుడు సాటిలేని బలం కలిగినవాడు. సమరథుడు. ఇతడికి పాండవులంటే కోపం. అగణితమైన తన మాయా బలంతో విరోధులను బాధిస్తాడు.

**విశేషం:** అలంబుషుని వృత్తాంతము: అలంబుషుడు అనే పదానికి అలంబుసుడు అనే పాఠాంతరం ఉన్నది. గంధమాదన పర్వతంలో పాండవులుంటున్నారు. జటాసురుడు అనే రాక్షసుడు బ్రాహ్మణరూపం ధరించి తాను పరశురామ శిష్యుడిని అని చెప్పి పాండవులను సేవిస్తుంటాడు. భీము డొకనాడు మృగయా వినోదార్థం అడవికి వెళ్ళిన సమయంలో అతడు రాక్షసరూపం ధరించి ద్రౌపదిని ధర్మజుడిని నకులునీ ఎత్తుకొని శీఘ్రంగా ఆకాశ మార్గంలో వెళుతున్నాడు. సహదేవుడు భీముడిని గొంతెత్తి పిలుస్తూ వనంలోకి పరుగెత్తాడు. 'విశ్వసించినవారికీ, కుడువబెట్టినవారికీ ఎగ్గుచేయటం మహాపాపం. ఆయుధాలతో మమ్ము వదలిపెట్టి మాతో యుద్ధం చెయ్యి. ఇట్లా వెళ్ళటం నీకు తగదు' అంటూ ధర్మజుడు తన చేతులతో వాడిని గట్టిగా అదుముతూ అతడి గమనవేగం తగ్గించాడు. సహదేవుడు అడ్డంవచ్చి నిలునిలుమని అతడిని అదలించాడు. భీముడు అతివేగంగా వచ్చి గగన మార్గంలో వెళుతున్న జటాసురుడిని వారించి 'నీకు బుద్ధి ఉంటే వీరిని వదలిపెట్టి నీ ప్రాణాలు రక్షించుకో, లేదా బక హిడింబ కిమ్మీరులకు పట్టిన దుర్గతి నీకూ పడుతుంది' అన్నాడు. ఆ మాటతో జటాసురుడు భూమికి దిగి భీముడితో తలపడ్డాడు. ఇద్దరికీ పోరు ఘోరమయింది. వృక్షాలతో శిలలతో వారు పోరాడారు. ముష్టాముష్టియుద్ధం చేశారు. జటాసురుడు హీనసత్త్వు డయ్యాడు. భీముడు వాని మెడమీద పొడిచి పుడమిపై పడగొట్టాడు. వాడి కాయమెత్తి ఒక విశాల పాషాణం మీద బాది, యమసదనానికి పంపించాడు. ఆతడి కుమారుడే అలంబుషుడు. బక కిమ్మీరులకు అనుజుడు. పాండవులతో తమకున్న పూర్వ వైరాన్ని పురస్కరించుకొని దుర్యోధనుడి పక్షంలో చేరి పోరాడుతాడు. ఇతడిని ఘటోత్కచుడు సంహరిస్తాడు. భుజంగకన్య ఉలూచికి అర్జునునకు జన్మించిన ఇరావంతుడిని కురుక్షేత్ర సంగ్రామంలో అలంబుషుడు వధిస్తాడు.

**విశేషం:** మూలంలో అలంబుషుడని ఉన్నది. "అలమ్బుషో రాక్షసేన్ద్రః క్రూరకర్మా మహారథః, హనిష్యతి పరాన్ రాజన్ పూర్వ వై ర మనుస్మరన్" - ముల్నంగిశర్మ పరిష్కృత ప్రతిలో - 'అసురవరుఁడీ హలాయుధుఁ డసమాన బలుండు ---' అని ఉన్నది.

**తే.** **వినుము ప్రాగ్జ్యోతిషాధీశుఁ డనుపమాన। శక్తి యీ భగదత్తుండు సమరథుండు;**
**గజము నెక్కి తా నేనిక కయ్యమైన। నేర్చు నైరావణము మీఁది యింద్రుఁ బోలి.** **232**

**ప్రతిపదార్థం:** వినుము; ప్రాగ్జ్యోతిష+అధీశుఁడు= ప్రాగ్జ్యోతిష పురాధీశ్వరుడైన; ఈ భగదత్తుండు= ఈ భగదత్తుడనేవాడు; సమరథుండు= సమరథుడు; అనుపమానశక్తి= సాటిలేని బలంకలవాడు; ఏనిక కయ్యము+ఐనన్= ఏనుగులతో పోరాటం జరుగుతున్నప్పుడు; తాన్= తాను; గజమున్+ఎక్కి= ఏనుగును ఎక్కి; ఐరావణముమీఁది= ఐరావతం అనే దిగ్గజం పైనున్న; ఇంద్రున్+పోలి= దేవేంద్రుడికి సాటి అవుతూ; ఏర్చున్= విజృంభిస్తాడు.

**తాత్పర్యం:** సుయోధనా! వినుము. ప్రాగ్జ్యోతిష నగరాధిపతిఅయిన ఈ భగదత్తుడు సమరథుడు. సాటిలేని బలం కలవాడు. ఏనుగులతో పోరాటం జరిగేటప్పుడు ఐరావత గజము నధిష్ఠించిన ఇంద్రుడికి సరిపోలుతూ ఇతడు ఏనుగునెక్కి చెలరేగుతాడు.

**విశేషం:** భగదత్తుని వృత్తాంతం: భగదత్తుడు నరకాసురుడి పుత్రుడు. ఇతడు ప్రాగ్జ్యోతిష పురాధీశ్వరుడు. అర్జునుడు దిగ్విజయానికి వెళ్ళినపుడు ఇతడు ఎనిమిది రోజులు పోరి గెలువలేక 'నేనింద్రసఖుడను; నీవింద్ర పుత్రుడవు. మనలో మనకు పోరాటమెందు' కని పల్కి అర్జునుడితో సంధి చేసికొని కానుకలిచ్చి పంపాడు. భారత సంగ్రామంలో ఇతడు దుర్యోధనుడి

పక్షం వహించి పోరాడాడు. నరకుడు తాను గడించిన వైష్ణవాస్త్రాన్ని ఈతనికిచ్చాడు. దానిని భగదత్తుడు అర్జునుడిమీద ప్రయోగించాడు. వైష్ణవాస్త్రమును ఎవ్వరూ సహించలేరు గనుక ఆ సమయంలో శ్రీకృష్ణుడు తన వక్షఃస్థలాన్ని అడ్డుపెట్టి ధరించాడు. అస్త్రం విఫలం కాగానే భగదత్తుడు సుప్రతీకమనే ఏనుగునెక్కి అర్జునుడితో తలపడ్డాడు. విజయుడు ఏనుగుతో కూడా భగదత్తుడిని సంహరించాడు.

### భీష్ముఁడు కర్ణుని నర్ధరథుండని చెప్పుట (సం. 5-165-3)

**వ. గాంధార రాజులగు వృక్షుండును, నచలుండును సమరథులు; మానిసితనంబును మానుసులుం గలవారు; వీరి సమరోత్సాహం బజేయంబైయుండు. 233**

**ప్రతిపదార్థం:** గాంధారరాజులు+అగు= గాంధార దేశ ప్రభువులైన; వృక్షుండును అచలుండును సమరథులు; మానిసితనంబును= పౌరుషమును; మానుసులును= మనుష్యులను కలవారు; వీరి; సమర+ఉత్సాహంబు= యుద్ధోత్సాహం; అజేయంబు+ఐ+ఉండున్= జయించరానిదై ఉంటుంది.

**తాత్పర్యం:** గాంధార రాజులైన వృక్షుడు, అచలుడు అనువారు సమరథులు. మగటిమి, మంది కలిగినవారు. వీరి యుద్ధపు పన్నుగడ జయించటానికి శక్యం కాదు.

**సీ. నీకుఁ బ్రెగ్గడయును నెయ్యంపుఁ జెలియునై । కయ్యంబునకు నెప్డుఁ గాలు ద్రవ్వుఁ**
**బాండుపుత్త్రుల తోడి పగకు ని న్నెసకొల్పుఁ । గొలువున రజ్జులు పలుకునట్టి**
**రాధాసుతుం డర్ధరథుఁడు; కుండలములుఁ । గవచంబుఁ బోవుట కారణముగ**
**బీఱువాఱినవాఁడు, వీఱిఁడి, కృపఁ బెద్ద । పరశురాముండు శాపమున వీని**

**తే. యస్త్రవీర్యంబుఁ జెఱిచె; నట్లగుట వీఁడు । పార్థు మార్కొని మానంబుఁ బ్రాణములును**
**దనకు సొమ్ముగఁ దక్కించుకొనఁగ లేమి । యెల్లవారికి నెంతయుఁ దెల్ల మధిప!" 234**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నీకున్= నీకు; ప్రెగ్గడయును= మంత్రియు; నెయ్యంపుఁ జెలియున్+ఐ= అనురాగపు మిత్రుడై; కయ్యంబునకున్= కలహానికి; ఎప్డున్= నిరంతరం; కాలుద్రవ్వున్= సిద్ధపడతాడో; పాండుపుత్త్రుల తోడి పగకున్= పాండునందనులతో విరోధానికి; నిన్నున్= నిన్ను; ఎసకొల్పున్= పురికొల్పుతుంటాడో; కొలువునన్= సభలో; రజ్జులు పలుకున్= వ్యర్థపు పలుకులు (దుర్భాషలు, డంబాలు) పల్కుతుంటాడో; అట్టి= అటువంటి; రాధాసుతుండు= కర్ణుడు; అర్ధరథుడు= అర్ధరథుఁడు సుమా!; కుండలములు= సహజకుండలాలు; కవచంబున్= కవచం; పోవుట కారణముగన్= కోల్పడిన హేతువుచేత; బీఱువాఱినవాఁడు= నిస్సారమైపోయినవాడు; వీఱిఁడి= బుద్ధిలేనివాడు; కృపన్= కరుణయందు; పెద్ద= దొడ్డవాడు(అధికుడు); పరశురాముండు= భృగురాముడు; శాపమునన్= శాపంతో; వీని అస్త్రవీర్యంబు చెఱిచెన్= ఇతడియొక్క అస్త్రబలాన్ని పోగొట్టాడు; అట్లు+అగుటన్= అందువలన; వీఁడు= ఈ కర్ణుడు; పార్థున్+ మార్కొని= అర్జునుడిని ఎదిరించి; మానంబున్= గౌరవాన్ని; ప్రాణములును= అసువులును; తనకున్+సొమ్ముగన్= తన హక్కుగా; దక్కించుకొనఁగన్+లేమి= నిలుపుకొనలేకపోవటం; ఎల్లవారికిన్= అందరికినీ; ఎంతయున్= మిక్కిలి; తెల్లము= స్పష్టం.

**తాత్పర్యం:** రాజా! నీకు మంత్రీ, గారాబు నెచ్చెలికాడూ అయిన కర్ణుడు ఎల్లప్పుడూ కలహానికి కాలుద్రవ్వుతుంటాడు. పాండవులమీద నీ కున్న విరోధాన్ని చల్లారనీయక రగులుకొలుపుతుంటాడు. సభలో కొరమాలిన మాటలు

మాటాడుతుంటాడు. ఇట్లాంటి రాధేయుడు అర్ధరథుడని గ్రహించుము. జన్మసిద్ధాలైన కవచకుండలాలు కోల్పోయిన హేతువుచేత ఇతడు శక్తిహీను డయ్యాడు. పైపెచ్చు ఇతడు అవివేకి. కాని, అధికమైన కరుణగలవాడు. పరశురాముడు శాపంపెట్టి ఈతని అస్త్రశక్తిని నాశనం చేశాడు. అందువలన వీడు ఫల్గునుడిని భండనంలో ఎదుర్కొని తన మాన ప్రాణాలు తన సొమ్ముగా దక్కించుకొనలేడన్నది లోకులందరికీ తేటతెల్లం.'

**క. అనవుడు గురుఁ డిట్లనుఁ 'గ । ర్ణునిచందము మున్ను కడఁగు రోయఁడు పాఱన్**
**వినుమేమఱి యుండుంగా । వున నీతం డర్ధరథుఁ డవుం దలపోయన్.' 235**

**ప్రతిపదార్థం:** అనవుడున్= భీష్ముడట్లా పల్కిన తర్వాత; గురుఁడు= ద్రోణుడు; కర్ణునిచందమున్= రాధేయుడి తీరు; ఇట్లు+అనున్= ఈ విధంగా తెల్పాడు; మున్ను కడఁగున్= కర్ణుడు అందరికంటే ముందుగా తలపడుతాడు; పాఱన్= పరుగెత్తి పోవటానికి; రోయఁడు= సంకోచించడు; వినుము= సుయోధనా, వినుము; ఏమఱి+ఉండున్= పరాకుగా ఉంటాడు; కావునన్= కనుక; తలపోయన్= ఆలోచించగా; ఈతండు+అర్ధరథుఁడు+అవున్= కర్ణుడు అర్ధరథు డవుతాడు.

**తాత్పర్యం:** భీష్ముడు మాటలాడిన తరువాత కర్ణుడి స్వభావాన్ని ద్రోణు డీరీతిగా చెప్పాడు. 'ఇతడు అందరికంటె ముందుగా ఉద్యమిస్తాడు. పిరికితనంతో రణరంగమునుండి పారిపోవటానికి సంకోచించడు. పరాకుగా ఉంటాడు. కాబట్టి ఆలోచించి చూస్తే రాధేయుడు అర్ధరథుడే.'

**వ. అనిన విని రాధేయుండు క్రోధతామ్రాక్షుం డగుచు గాంగేయున కిట్లనియె: 236**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; రాధేయుండు; క్రోధతామ్ర+అక్షుండు+అగుచున్= కోపంచేత ఎర్రబడిన కన్నులుకలవాడై; గాంగేయునకున్= భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్మద్రోణుల మాటలు విని కర్ణుడు కోపంతో కన్నులు జేవురించగా భీష్ముడితో ఇట్లా అన్నాడు:

**క. 'ఒంటమిని లేని యొంటర । మింటరములు వల్కు టుచితమే? యర్ధరథుం**
**డంటి నను; నేమి తక్కువ । గంటి చెపుము; దీన నీవు గన్నది కలదే? 237**

**ప్రతిపదార్థం:** ఒంటమిని= నామీది పగతో(ద్వేషంతో); లేని= లేనిపోని; ఒంటరమింటరములు= పరుష వచనాలు; పల్కుట= మాటాడటం; ఉచితమే?= నీకు తగునా?; ననున్= నన్ను; అర్ధరథుండు+అంటి(వి)= అర్ధరథుడని చెప్పితివి; ఏమితక్కువ+కంటి(వి)= నాలో ఏ లోపం కనుగొన్నావు?; చెపుము!= పల్కుమా! దీనన్= ఇట్లా నన్ను తక్కువ చేసి మాటాడినందువలన; నీవు+కన్నది+కలదే?= నీవు పొందిన ప్రయోజన మున్నదా?

**తాత్పర్యం:** 'నామీది ద్వేషంతో పరుషవచనాలు పల్కటం నీకు తగునా? నన్ను అర్ధరథుడని చెప్పావు. నాలో ఏ లోపం కనుగొన్నావో చెప్పు. ఇట్లా నన్ను తక్కువచేసి మాటలాడినందువల్ల నీకు కల్గిన లాభ మేమిటి?

**తే. నొవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వకొల్ల । కేను గురుపతిఁ జూచి సహించి పోదు;**
**సురనదీపుత్ర! విను నాకుఁ జూడ నర్ధ । రథుఁడ వగుదీవు లావు బీరంబు నరయ" 238**

**ప్రతిపదార్థం:** సురనదీపుత్ర!= గంగాసుతా భీష్మా!; సభలోనన్= కొలువులోపల; నొవ్వన్= నేను బాధపడేటట్లు; పలుకుదు(వు)= మాటాడుతుంటావు; ఏను= నేను; చివ్వకున్+ఒల్లక= నీతో పోట్లాటకు ఇష్టపడక; కురుపతిన్+చూచి= కౌరవేశ్వరుడిని గాంచి; సహించిపోదున్= ఓర్చుకొని వెళుతుంటాను; విను(ము)= నేను చెప్పేది ఆలకించుము; ఈవు= నీవు; లావు= శక్తి; బీరంబు= పరాక్రమం; అరయన్= పరికించగా; నాకున్+చూడన్= నాకు చూడగా; అర్ధరథుఁడవు+అగుదు(వు)= అర్ధరథుడవే అవుతావు.

**తాత్పర్యం:** గంగాపుత్రా! బాధపడేటట్లు నన్ను గురించి కొలువులో మాట్లాడుతావు. దుర్యోధనుడిని చూచి నీతో పోట్లాటకు దిగక ఓర్చుకొని వెళుతుంటాను. నీ శక్తినీ, పరాక్రమాన్నీబట్టి నీవు నా దృష్టిలో అర్ధరథుడవే.'

**వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని. 239**

**ప్రతిపదార్థం:** అని పలికి; కొలువున్= సభను; కలయన్+కనుంగొని= నలుమూలల జూచి-

**తాత్పర్యం:** రాధేయుడు అట్లా పలికి సభను నలువంకల కలయజూచి.

**చ. 'హితుఁడని నమ్మఁగాఁ దగునె యీతనిఁ? గార్యపు మాట లిట్టివే?**
**పతిదెసకూర్మి వాపుటకుఁ బట్టుగ నెక్కువ తక్కువంచు ను**
**న్నతులగు మేదినీశులకు నానగఁ బల్కుట గాక, యిట్టివా**
**రితవులు తండ్రికిన్ సుతుల; కేమన నేర్తుము పెద్ద రాజులన్?' 240**

**ప్రతిపదార్థం:** ఈతనిన్= ఈ భీష్ముడిని; హితుఁడు+అని= మేలు చేసేవాడని; నమ్మగాన్+తగునె?= విశ్వసించవచ్చునా?; కార్యపుమాటలు+ఇట్టివే?= పని సాధించుకొనే మాటలు ఇట్లాగే ఉంటాయా?; పతిదెసన్= ప్రభువైన సుయోధనుడి ఎడ; కూర్మి= అనురాగం; పాపుటకున్+పట్టుగన్= తొలగించటానికి వీలుగా; ఎక్కువ తక్కువ+అంచున్= ఇత డెక్కువ, అతడు తక్కువంటూ; ఉన్నతులు+అగు= దొడ్డవారైన; మేదినీ+ఈశులకున్= భూవల్లభులకు; నానగన్= లజ్జకలుగునట్లు; పల్కుటగాక= మాటలాడటంకాక మరేమున్నది?; తండ్రికిన్= ధృతరాష్ట్రుడికి; సుతులకున్= కుమారులైన సుయోధనాదులకు; ఇట్టివారు= ఇటువంటివారు; ఇతవులు= హితులైయున్నారు; పెద్దరాజులన్= దొడ్డ ప్రభువులను; ఏమి+అనన్+నేర్తుము?= మనము ఏమనగలం?'

**తాత్పర్యం:** ఈ భీష్ముడిని మేలు గూర్చేవాడని విశ్వసించవచ్చునా? పనులు సాధించుకొనే మాటలతీరులు ఇట్లా ఉంటాయా? రాజైన దుర్యోధనుడి పట్ల ఉన్న ప్రేమ పోవటానికి వీలుగా, ఇత డెక్కువ, అతడు తక్కువ అంటూ అధికులైన అవనీపతులకు సిగ్గు కలిగేటట్లు ఇతడు పలుకుతున్నాడు. ఇట్లాంటివారు తండ్రికీ కుమారులకూ హితులై ఉన్నారు. పెద్దలగు దొరలను మన మేమనగలం?'

**వ. అని దుర్యోధనుం జూచి యిట్లనియె : 241**

**తాత్పర్యం:** రాధేయుడు దుర్యోధనుడి వైపు చూచి ఇట్లా అన్నాడు :

**ఉ. 'కర్జము దప్పె నీ యెదురఁ గష్టపు మాటల కేల యోర్తు రీ**
**దుర్జనుఁడైన శాంతనవు దోర్బల మేటిది? యీతఁ డొక్కఁడున్**
**వర్జితుఁడైన నేమి? నృపవర్గము కుందుట యొంటఁ బాయునే?**
**యర్జున పక్షపాతి యితఁ డాలము మేకొని చేయఁడుంజుమీ! 242**

**ప్రతిపదార్థం:** కర్జము తప్పెన్= పని చెడిపోయింది; నీ+ఎదురన్= నీ సమక్షంలో; కష్టపుమాటలకున్= బాధ కలిగించే పలుకులకు; ఏల+ఓర్తురు?= ఏ విధంగా సహించగలరు?; ఈ దుర్జనుఁడు+ఐన= ఈ దుష్టుడైన; శాంతనవు దోః బలము+ఏటిది?= భీష్మడి భుజశక్తి ఏపాటిది?; ఈతఁడు+ఒక్కఁడున్= ఇతఁడొక్కడు; వర్జితుఁడు+ఐనన్+ఏమి?= విడువబడితే కలిగే నష్టమేమి?; నృపవర్గము కుందుట= రాజసమూహం బాధచెందటం; ఒంటన్+పాయునే?= భీష్మడిని త్యజించకుండా మరొక్క విధంగా తొలగిపోగలదా?; ఇతఁడు= ఈ గాంగేయుడు; అర్జునపక్షపాతి= అర్జునుడి మీద అభిమానం కలవాడు; మేకొని= పూనుకొని; ఆలము= కయ్యం; చేయఁడున్+చుమీ!= సలుపడు సుమా!

**తాత్పర్యం:** వ్యవహారం చెడిపోయింది. నీ సముఖంలో భీష్మ డాడిన మనసు నొప్పించే మాటలు విని సహించటం ఎట్లా? దుష్టుడైన ఈ గాంగేయుడి భుజశక్తి ఏపాటిది? ఇతడిని మనపక్షం నుండి తొలగిస్తే కలిగే నష్టమేమి? ఈ విధంగాకాక మరోవిధంగా ఈ రాజసమూహం మనోబాధ తీరదు. ఇతడు అర్జునుడి పట్ల పక్షపాతం కలవాడు. పూనికతో యుద్ధం చేయడు సుమా!

**తే. చాలఁ గాలంబు పోవక చతురులైన । వృద్ధ జనముల బుద్ధులు విండ్రుగాక!**
**ముదియ మతిదప్పి నోరికి నొదవినట్లు । పలుకు వెడఁగుల మాటలు పాడి యగునె? 243**

**ప్రతిపదార్థం:** చాలన్+కాలంబు పోవక= బహుకాలం గడవక; చతురులు+ ఐన= నేర్పరులైన; వృద్ధజనముల బుద్ధులు= పెద్దలైన వారి మాటలు; విండ్రుగాక= ఆలకిస్తారుగాని; ముదియన్= ముసలితనం రాగా; మతి+తప్పి= బుద్ధిచెడి; నోరికిన్+ఒదవినట్లు= నోటికి వచ్చినట్లు; పలుకు= మాటాడునట్టి; వెడఁగుల మాటలు= వివేకం లేనివారి పల్కులు; పాడి+అగునె?= ధర్మమౌతుందా?; (ఆదరింపదగినవి కావని భావం.)

**తాత్పర్యం:** పండు ముసలివాళ్ళుగాక నేర్పరులైన వృద్ధులయొక్క బుద్ధులు ఆదరించదగినవేకాని ముదిమివలన మదిదప్పి నోటికి వచ్చినట్లు వదరే అవివేకుల వాక్యాలు ప్రమాణంగా స్వీకరించదగినవి కావు.

**క. సేనమొగ మీతఁ డైనం । బూని మహీశ్వరులు నీకుఁ బొడిచెదరే? దు**
**ర్మాని యనిగాదె యీతని । తో నడచుట కొల్లనైతి దురమున కధిపా!' 244**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; సేనమొగము+ఈతఁడు+ఐనన్= సేనలకు అగ్రభాగంలో (సేనాధిపతిగా) ఇతడుంటే; పూని= శ్రద్ధవహించి; మహీ+ఈశ్వరులు= ధరణిపతులు; నీకున్= నీకుగా; పొడిచెదరే?= పోరాడెదరా?; దుర్మాని+అని+కాదె= దురహంకారుడని తలంచికదా; ఈతనితోన్= ఈ భీష్మడితో; దురమునకున్= యుద్ధానికి; నడచుటకున్= కదలటానికి; ఒల్లన్+ఐతిన్= అంగీకరించలేకపోయాను.

**తాత్పర్యం:** ఈ భీష్మడు గనుక సేనాగ్రభాగంలో ఉంటే రాజులు శ్రద్ధతో నీకై పోరాడుతారా? ఇతడు దురహంకారి కావటం వలన ఇతడితో చేరి యుద్ధం చేయటానికి నేను అంగీకరించలేదు.'

**వ. అనిన భీష్ముండు సూతసూనున కిట్లనియె: 245**

**ప్రతిపదార్థం:** అనినన్; భీష్ముండు; సూతసూనునకున్= సూతపుత్రుడైన కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అందులకు భీష్ముడు కర్ణుడితో ఇట్లా అన్నాడు:

**చ. 'ముదుకఁడనైన నాదు బలమున్ జలమున్ వివిధాస్త్రశస్త్ర సం**
**పదయును బోయి నీ గురుఁడు భార్గవుచే విను, మాజిభూమి నా**
**కెదిరినవారు పెక్కెడల నేమయిరో యెఱుఁగున్ జగంబు; నా**
**ముదిమియు నీ కుమారుతనమున్ వరుసన్ విజయుం డెఱింగెడున్. 246**

**ప్రతిపదార్థం:** ముదుకఁడను+ఐన= ముసలివాడనైన; నాదు బలమున్= నా శక్తిని; చలమున్= పట్టుదలను; వివిధ+అస్త్రశస్త్ర సంపదయును= పలురకాలైన అస్త్రశస్త్ర విద్యలలోని ప్రావీణ్యాన్నీ; పోయి= వెళ్ళి; నీ గురుఁడు= నీకు గురువైన; భార్గవుచేన్= పరశురాముడి వలన; వినుము= తెలిసికొనుము; ఆజిభూమిన్= యుద్ధప్రదేశంలో; నాకున్+ఎదిరినవారు= నాతో మార్కొన్నవారు; పెక్కు+ఎడలన్= పలుచోట్ల; ఏమి+అయిరో= ఏమై పోయారో; జగంబు+ఎఱుఁగున్= లోకానికి తెలుసు; నా ముదిమియున్= నా వార్ధక్యం; నీ కుమారుతనమున్= నీయొక్క కౌమారం; వరుసన్= క్రమంగా; విజయుండు= అర్జునుడు; ఎఱింగెడున్= తెలియగలడు.

**తాత్పర్యం:** 'కర్ణా! నన్ను ముసలివాడని తూలనాడావు. వృద్ధుడనైన నా శక్తి ఎటువంటిదో, పంతం ఏపాటిదో, సకల శస్త్రాస్త్ర సంపన్నత ఎట్టిదో వెళ్ళి నీ గురువైన భార్గవరాముడిని అడిగి తెలిసికొనుము. పలుచోట్ల యుద్ధ రంగాలలో నన్నెదుర్కొన్నవారు ఏమై పోయినారో లోకానికి తెలుసు. నా వార్ధక్యం, నీ కౌమారం క్రమంగా పాండవమధ్యముడు ఎరుగగలడు.

**క. అనుమానింపక సభలో । నను నేఁ జెప్పికొనవలసె నా కిమ్మెయి దు**
**ర్జనితుఁడ వగు నీ యెడ నీ । సున నా కిటు వలుక వలసె సూతతనూజా! 247**

**ప్రతిపదార్థం:** సూత తనూజా!= సూతపుత్రా కర్ణా!; అనుమానింపక= సంకోచించక; సభలోన్= కొలువులో; నాకున్= నాకు; ననున్ నేన్= నన్నుగురించి నేనే; చెప్పికొనన్ వలసెన్= తెల్పుకొనవలసి వచ్చినది; దుర్జనితుఁడవు+ అగు= తల్లికడుపు చెడబుట్టినవాడవైన; నీ ఎడన్= నీయందుగల; ఈసునన్= ద్వేషంచేత; నాకున్+ఇటు+పలుకన్ వలసెన్= నాకిట్లా పలుకవలసి వచ్చింది.

**తాత్పర్యం:** సూతపుత్రా! సందేహించక సభలో నన్నుగురించి నేనే ఈ విధంగా చాటుకొనవలసి వచ్చింది. తల్లి కడుపు చెడబుట్టిన నీ యెడ గల ద్వేషంచేత నా కిట్లా ఆత్మశ్లాఘ చేసుకొనవలసి వచ్చింది.

**తే. కార్యమును ఖడ్గమును నింత గలుగు నీవు । గలుగఁ జేటువాటిల్లె నిక్కౌరవులకు;**
**దీని మముబోఁటు లెల్లను దీర్పనెట్లు । చాలెదము? మంచిబంటవు చక్కనగుము. 248**

**ప్రతిపదార్థం:** కార్యమును ఖడ్గమును= కార్యాలోచనకూ, ఖడ్గాలోచనకూ; ఇంత+కలుగు= ఇంత దుర్గుణములు గల; నీవు కలుగన్= నీవు మంత్రిగా లభించగా; ఈ+కౌరవులకున్= ఈ దుర్యోధనాదులకు; చేటు+పాటిల్లెన్= ముప్పు మూడింది;

దీనిన్= వీరి కేర్పడిన విపత్తును; మముబోఁటులు+ఎల్లను= మావంటి వాళ్ళమందరం; తీర్పన్= తొలగించటానికి; ఎట్లు చాలెదము?= ఏరీతి శక్తులమవుతాము?; మంచిబంటవు= నీవు మేటి వీరుడవుగాని; చక్కనగుము= యుద్ధానికి సంసిద్ధం కమ్ము.

**తాత్పర్యం:** కార్యఖడ్గాలోచనలకు మంత్రిగా నీవు కౌరవులకు లభించావు. కనుక వారికి కీడు సంప్రాప్తమయింది. వారి కేర్పడిన ఈ విపత్తు తొలగించటానికి మావంటివారందరికీ శక్తి చాలదు. నీవు మహావీరుడవే గాని, ముందు యుద్ధంలో చక్కగా నిలిచి నీ ప్రతాపం చూపించు.

**చ. నెపమిడి యోహటించి యిటు నీవు తొలంగినఁ బోవ వచ్చునే?**
**కుపితమనస్కుఁడై నరుఁడు కూల్పఁ గ్రమంబున దొడ్డలెల్లఁ జ**
**న్న పిదప, నెట్లుఁ జొచ్చెదు రణంబున, నప్పుడు చావకున్న దై**
**న్యపుఁ బరివారముం బతియునైన నెఱింగెద రెల్ల చందముల్.' 249**

**ప్రతిపదార్థం:** నెపము+ఇడి= నామీద సాకుపెట్టి; ఓహటించి= యుద్ధం చేయుటకు జంకి; ఇటు నీవు తొలంగినన్= ఈ రీతిగా నీ విప్పటికి తప్పించుకొన్నను; పోవన్+వచ్చునే?= మున్ముందు తప్పించుకొనిపోగలవా?; కుపిత మనస్కుఁడు+ఐ= కోపించిన మనస్సుకలవాడై; నరుఁడు= అర్జునుడు; కూల్పన్= పడగొట్టగా; క్రమంబునన్= వరుసగా; దొడ్డలు+ఎల్లన్= పెద్దలంతా; చన్నపిదపన్= చచ్చిన తరువాత; ఎట్లున్= ఏ విధంగానైనా; రణంబునన్+చొచ్చెదు(వు)= యుద్ధంలో ప్రవేశించకమానవు; అప్పుడు= అట్టి తరుణంలో; చావక+ఉన్న= మరణించక మిగిలిన; దైన్యపుఁ బరివారమున్= దీన దశలో నున్న బలగమూ; పతియున్+ఐనన్= రాజగు దుర్యోధనుడయిననూ; ఎల్లచందముల్= అన్నివిధాలు; ఎఱింగెదరు= తెలియగలరు.

**తాత్పర్యం:** యుద్ధానికి జంకి నాపై నెపం మోపి నీ విపుడు తప్పించుకొన్నప్పటికీ మున్ముందు తప్పించుక తిరుగలేవు. క్రోధపరీత చిత్తుడైన అర్జునుడు కూలుస్తూ ఉండగా వరుసగా మహావీరులంతా వెళ్ళిపోయిన తరువాత నీకు కదనరంగ ప్రవేశం తప్పదు. అపుడు చావక మిగిలి దీనదశలో నున్న పరివారమూ, సుయోధనుడూ నీ చందమెటువంటిదో తెలిసికొనగలరు.'

**విశేషం:** ఎట్లుఁ జొచ్చెదు రణంబున - అనుదానికి 'ఎట్లుఁ జచ్చెదు రణంబున' అను పాఠాంతరము గలదు. నరుఁడు- కూల్పన్= అర్జునుడు చంపఁగా, అప్పుడు, చావక+ఉన్నన్= చావకపోతే, దొడ్డలు+ఎల్లన్, చన్న-పిదపన్, రణంబునన్= యుద్ధంలో, చచ్చెదు(వు)= చస్తావు - నరుడు కూల్చినప్పుడు చావకపోతే యుద్ధంలో ఎట్లాగూ చస్తావు. - అని భావం.

**వ. అని పలికి దుర్యోధను నుపలక్షించి కర్ణుతో వెండియు. 250**

**ప్రతిపదార్థం:** అని పలికి; దుర్యోధనున్; ఉపలక్షించి= చూచి; కర్ణుతోన్; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అని పలికి దుర్యోధనుడిని కనుగొని భీష్ముడు కర్ణుడితో మళ్ళీ ఇట్లా అన్నాడు:

**ఆ. 'సూతపుత్త్ర! యితఁడు నా తలఁ బెద్ద మో । పెత్తి నమ్మియున్న యట్టి చోటఁ**
**గ్రందుసేయ నాకుఁ గాదని సైరించి । యున్న బ్రదికి; తింక నూరకుండు.' 251**

**ప్రతిపదార్థం:** సూతపుత్ర!= కర్ణా!; ఇతఁడు= ఈ సుయోధనుడు; నా తలన్= నా శిరస్సు మీద; పెద్ద మోపు+ఎత్తి= పెనుభారం మోపి; నమ్మి+ఉన్న+అట్టి చోటన్= విశ్వసించిఉన్న తావులో; క్రందు+చేయన్= కలహమొనర్చుట; నాకున్= నాకు; కాదు+అని= తగదని; సైరించి+ఉన్నన్= క్షమించి ఉన్నందున; బ్రదికితి(వి)= ప్రాణాలతో ఉన్నావు; ఇంకన్+ఊరకుండు(ము)= ఇక నోరుమూసుకొనుము.

**తాత్పర్యం:** 'సూతనందనా! ఈ దుర్యోధనుడు నా తలపై పెనుభారం మోపాడు. ఇతడు నన్ను గట్టిగా నమ్ముకొని ఉన్నాడు. ఇట్టిచోట వివాదం తగదని సహించాను. అందుచేత నీవు బ్రతికిపోయావు. ఇక నోరెత్తవద్దు.'

**వ. అనియాడి మొగంబు గంటు వెట్టుకొనియున్న సురనదీసూను దిక్కు మొగంబై సుయోధనుండు 'నీకుం గోపింప నగునె; నన్నును గార్యభారంబునుం జూచి నా బ్రదుకునకై సర్వంబును సహింపలయు'నని తేర్చి యంగ రాజుం గనుంగొని 'మీ రిద్దఱు నొక్కటియై భరంపడి యిప్పని సక్కంజేసి కాక మీలోన నిట్టి యెరవు మాటలేల?' యని పొదివి పలికి, తదనంతరంబ పాండవ పక్షంబు వారల తారతమ్యంబులు వినువాఁడై యమ్మాట పుట్టించిన నతనికి భీష్ముం డిట్లనియె: 252**

**ప్రతిపదార్థం:** అని+ఆడి= అనిపలికి; మొగంబు; గంటుపెట్టుకొని+ఉన్న= ముడుచుకొని ఉన్న; సురనదీసూనుదిక్కుమొగంబు+ఐ= గంగానదీపుత్రుడి వైపు ముఖం త్రిప్పి; సుయోధనుండు; నీకున్; కోపింపన్+అగునె?= కినుక వహించటం న్యాయమా?; నన్నును; కార్యభారంబునున్‌చూచి; నా బ్రదుకునకున్+ఐ= నా జీవితంకొరకు; సర్వంబును= అన్నిటినీ; సహింపన్ వలయున్; ఓర్చుకొనాలి; అని; తేర్చి= భీష్ముడిని ప్రసన్నుడిని గావించి; అంగరాజున్= కర్ణుడిని; కనుంగొని= చూచి; మీరు+ఇద్దఱున్+ ఒక్కటి ఐ; భరంపడి= భారం వహించి; ఈ+పనిన్= ఈ యుద్ధకార్యాన్ని; చక్కన్+చేసి= చక్కబరిచి; కాక; మీలోనన్; ఇట్టి; ఎరవుమాటలు= పొరపొచ్చెపు పలుకులు; ఏల?= ఎందుకు?; అని; పొదివిపలికి= క్రమ్ముకొని మాటాడి; తద్+అనంతరంబ= అటు తరువాత; పాండవ పక్షంబువారల= పాండవుల వైపున్నవారియొక్క; తారతమ్యంబులు= ఎచ్చుతగ్గులు; వినువాఁడు+ఐ= వినదలంచినవాడై; ఆ+మాట+పుట్టించినన్= ఆ ప్రస్తావన తీసికొనిరాగా; ఆతనికిన్; భీష్ముండు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ము డట్లా పలికి ముఖం ముకుళించుకొని ఉండగా సుయోధనుడు గాంగేయుడి వైపు చూచి 'పితామహా! నీకు కోపించదగునా? నన్నూ, కార్యభారాన్నీ గమనించి నా జీవితానికై నీ వన్నిటినీ సహించవలె' అని పలికి అతడిని ప్రసన్నుడిని కావించాడు. అంగరాజును అవలోకించి 'రాధేయా! మీ రిద్దరూ ఒకటై యుద్ధభారం వహించి కార్యమును గట్టెక్కించక మీలో మీకు ఈ పొరపు మాటలెందుకు?' అని పొందికగా పలికి, అవతల పాండవ పక్షమందున్న వీరుల తారతమ్యములు తెలిసికొనటానికై ఆ మాట ప్రస్తావించగా భీష్ముడిట్లా అన్నాడు:

**తే. 'పాండుపుత్త్రుల నద్దెస దండిమగలఁ। గలనిజంబేను జెప్పినఁ గర్ణు మనసు**
**నొచ్చు; నీ చిత్త మెట్లగునో యెఱుంగ;। నాకు నిదియేమి పని రిత్త నడుమనుండి?' 253**

**ప్రతిపదార్థం:** పాండుపుత్త్రులన్= పాండు నందనులను గురించి; ఆ+దెస+దండిమగలన్= ఆ పక్షమందున్న బిరుదుశూరులను గురించి; కలనిజంబు= ఉన్నసత్యం; ఏను చెప్పినన్= నేను పలికితే; కర్ణుమనసు నొచ్చున్= కర్ణుడి హృదయం బాధపడుతుంది; నీ చిత్తము= నీ మనస్సు; ఎట్లు+అగునో+ఎఱుంగన్= ఏ విధంగా ఉంటుందో తెలియదు; రిత్తన్= వ్యర్థంగా; నడుమనుండి= మధ్యలో; నాకున్+ఇది+ఏమిపని?= నాకు ఎందుకు వచ్చిన అక్కర?'

**తాత్పర్యం:** 'పాండుకుమారుల పక్షంలో ఉన్న మేటి వీరుల వాస్తవమైన శక్తి సామర్థ్యాలను గురించి నేను వివరిస్తే కర్ణుడి మనస్సునకు కష్టం కలుగుతుంది. నీ మనస్సు ఎట్లా ఉంటుందో తెలియదు. మధ్యలో అనవసరంగా నాకీ పని ఎందుకు?'

**వ. అనిన, మఱియు దుర్యోధనుండు తఱిమి యడుగుటయు నిట్లనియె: 254**

**ప్రతిపదార్థం:** అనినన్= అని భీష్ముడు పలుకగా; మఱియున్; దుర్యోధనుండు; తఱిమి అడుగుటయున్= బలాత్కరించి చెప్పుమని అడుగగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు నిర్బంధించి అడుగగా భీష్మ డిట్లా అన్నాడు:

**భీష్ముండు పాండవవీరులం దతిరథ మహారథాదుల నిరూపించి చెప్పుట (సం. 5-166-14)**

**తే. 'అతిరథుండు యుధిష్ఠిరుం డగ్నికల్పుఁ । డాహవంబున నప్రతిహతుఁడు; భీముఁ**
**డతిరథ శ్రేష్ఠుఁ; డతని మహాబలం బ । మానుషము, విక్రమం బసమాన మధిప! 255**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; అతిరథుండు= అతిరథుడు; అగ్నికల్పుఁడు= అగ్నితో సమానుడు; ఆహవంబునన్= యుద్ధంలో; అప్రతిహతుఁడు= అడ్డం లేనివాడు; భీముఁడు= భీమసేనుడు; అతిరథ శ్రేష్ఠుఁడు= అతిరథులలో ఉత్తముడు; ఆతని మహాబలంబు= ఆతడి పెనుశక్తి; అమానుషంబు= మానవాతీతం; విక్రమంబు= పరాక్రమం; అసమానము= పోలికలేనిది.

**తాత్పర్యం:** 'రాజా! అగ్నితో సమానుడైన ధర్మజుడు అతిరథుడు. యుద్ధరంగంలో అతడికి ఎదురులేదు. భీముడు అతిరథులలో మేటి. అతడు మానవాతీత దేహబలసంపన్నుడు. అతడి పరాక్రమానికి పోలిక చెప్ప వీలుగాదు.

**క. సమరథులు కవలు భుజగ । ర్వము పటు విక్రమము దుర్నివారంబులు; వా**
**రి మనంబులు నిర్భయములు; । తమ మొనలకు మించి బెట్టు దాఁకుదు రధిపా! 256**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; కవలు= అమడలైన నకుల సహదేవులు; సమరథులు= సమరథులైఉన్నారు; భుజగర్వము= వారల బాహు దర్పం; పటువిక్రమము= దృఢ శౌర్యం; దుర్నివారంబులు= అడ్డగించరానివి; వారి మనంబులు= వారి హృదయాలు; నిర్భయములు= భీతిలేనివి; తమ మొనలకున్ మించి= తమ సేనలకు ముందు మిగిలి; బెట్టుదాఁకుదురు= శత్రువులతో గట్టిగా పోరాటం సాగిస్తారు.

**తాత్పర్యం:** నకుల సహదేవులు సమరథులు. వారి బాహుబలం, దృఢమైన శౌర్యం అడ్డగించరానివి. వారి హృదయాలు భయరహితాలు. వారు తమ సేనలకు ముందు మిగిలి విరోధులతో గట్టిగా పోరాడగలరు.

**సీ. వారందఱును ధర్మవైభవంబునఁ, దప । స్సంపద నెక్కుడు జనులకెల్ల**
**ధనువు నాఱంగంబులను బరిణతులు దాఁ । కోర్తురు; పరులకు నోర్వరాని**
**కోల్తల గలరు; పెక్కులు పరాక్రమములు । వేర్వేఱ చేసిన వీరు లొక్క**
**మొగ మయి తాఁకిన వెగడంద కుండునే? । మనసేన ము న్నవమాన పాటు**

**ఆ. దుఃఖపాటు గలిగి తొడరంగ వచ్చిన। వారుగాన నలఁతిఁ బోరు; ప్రాణ**
**మాసపడక యోపినంతయుఁ బెనఁగుదు। రది సహించి నిలుచు టరిది మనకు. 257**

**ప్రతిపదార్థం:** వారు+అందఱును= వారెల్లరును; ధర్మవైభవంబునన్= సుకృతాతిశయం వలనను; తపస్+సంపదన్= తపస్సమృద్ధిచేతను; జనులకున్+ఎల్లన్= జనులందరికంటె; ఎక్కుడు= అధికులు; ధనువు+ఆఱు+అంగంబులను= షడంగాలతో కూడిన ధనుర్వేదమునందు; పరిణతులు= పరిపక్వమైనవారు; తాఁకు+ఓర్తురు= శాత్రవుల తాకిడికి తట్టుకొనగలరు; పరులకున్= విరోధులకు; ఓర్వన్+రాని= సహించరానంతటి; కోల్తల కలరు= యుద్ధసన్నాహం కలవారు; పరాక్రమములు పెక్కులు= అనేక విక్రమములు; వేర్వేఱన్+చేసిన వీరులు= వేఱువేఱుగా ప్రదర్శించిన శూరులు; ఒక్కమొగము+అయి= ఏకముఖమయి; తాఁకినన్= వారు ఎదిరిస్తే; మన సేన= మన సైన్యం; వెగడు+అందక+ఉండునే?= తడబాటు చెందక మానదు; మున్ను= పూర్వం; అవమానపాటు= భంగపాటు; దుఃఖపాటు= దుఃఖానుభవం; కలిగి= పొంది; తొడరంగన్ వచ్చినవారుకానన్= ఎదిరించటానికి వచ్చినవారు కనుక; అలఁతిన్ పోరు= అంత తేలికగా మరలరు; ప్రాణము+ఆసపడక= ప్రాణముల కాశింపక; ఓపినంతయున్+పెనఁగుదురు= శక్తిఉన్నంతమేరకు పోరాడుతారు; మనకున్= మనకు; అది సహించి= వారి విజృంభణాన్ని ఓర్చి; నిలుచుట= యుద్ధంలో చెదరక నిలబడటం; అరిది= అశక్యం.

**తాత్పర్యం:** పాండవులు పుణ్యాతిశయంవల్ల, తపోబలంవల్ల జనులందరికంటె గొప్పవారు. ధనుర్వేదాన్ని ఆరు అంగాలతో అభ్యసించారు. ధనుర్విద్యలో ప్రవీణులు. శత్రుధాటికి తాళగలరు. వైరులు వారి యుద్ధసన్నాహాలకు తట్టుకొనలేరు. వేరువేరుగా తమ తమ ప్రతాపాలెట్టివో ప్రదర్శించిన వీరులు. వీరందరు ఏకంగా తాకినట్లయితే మన సైన్యం తల్లడిల్లిపోతుంది. పూర్వం పొందిన పరాభవంతో, అనుభవించిన దుఃఖాలతో మనల్ని నెదిరింపవచ్చినవారు గనుక అంత తేలికగా వెళ్ళరు. ప్రాణాలను లెక్కించక శక్తి ఉన్నంతవరకూ పెనగులాడుతారు. వారి దాడికి తట్టుకొని రణరంగంలో కాలూని నిలబడటం మనకు అశక్యం.

**మ. నరుఁ డీ మానమువాఁ డనంగ వశమే? నా కంతవా రెందు నె**
**వ్వరులే; రింకను బుట్ట; రాపులికి దుర్వారోద్యముండైన యా**
**హరియుం దోడటె! యేమి చెప్పుదు? నతం డా సేనలం గాచు నొ**
**క్కరుఁడుం, గీటడఁగించు నీ బలములన్ గాండీవదుర్దాంతుఁడై. 258**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; ఈ మానమువాఁడు= ఈ కొలదివాడు; అనంగన్= అని చెప్పటానికి; నాకున్= నాకు; వశమే?= తరమా?; అంతవారు= అర్జునుపాటివారు; ఎందున్+ఎవ్వరున్ లేరు= ఎక్కడా ఎవ్వరూలేరు; ఇంకను పుట్టరు= ముమ్ముందు కలుగబోరు; ఆ పులికిన్= ఆ బెబ్బులికి; దుర్వార+ఉద్యముండ+ఐన= అడ్డగించరాని యత్నములుగల; హరియున్= ఆ నారాయణుడును; తోడు+అటె!= సహాయుడై ఉన్నాడట!; ఏమిచెప్పుదున్= ఏమనగలం? ఇక వేరే చెప్పాలా?; అతండు= అర్జునుడు; ఆ సేనలన్+కాచున్= పాండవసైన్యాన్ని రక్షిస్తాడు; ఒక్కరుఁడున్= తానొక్కడే; నీ బలములన్= నీ సేనలన్నింటినీ; గాండీవ దుర్దాంతుఁడు+ఐ= గాండీవముచేత అణచరానివాడై; గీటడఁగించున్= సంహరిస్తాడు.

**తాత్పర్యం:** సుయోధనా! ఫల్గును డీపాటి వాడని నాకు చెప్పశక్యం కాదు. అంతటివాడు ఎప్పుడూ ఎక్కడా కనిపించటం లేదు. ముమ్ముందు అట్టివారు కలుగరుకూడా. ఆ బెబ్బులికి అడ్డగించరాని యత్నపరుడైన శ్రీహరి తోడ్పాటున్నదట. ఇక చెప్పవలసినదేముంది? గాండీవం అనే వింటిచేత అణచరానివాడై అత డొక్కడే తన సేనలన్నింటినీ కాపాడుకొంటాడు; నీ సేనలన్నింటినీ నిర్మూలిస్తాడు.'

**విశేషం:** ఆ హరియున్ దోడ(టె-ఇచ్చట 'హరి' శబ్దమునకు సింహమని కూడా అర్థం. హరి= కృష్ణుడనెడి సింహము-శ్లిష్టరూపకం. అలం: రూపకం. పులికి సింహం తోడయితే ఇక చెప్పేదేమున్నది? - అనే విశేషార్థం ఇందులో సూచితం.

**వ. అనిన విని యక్కొలువున నున్న రాజుల మనంబు లెల్లను జేవ సెడియె; భీష్ముండు వెండియు నిట్లనియె : 259**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ+కొలువునన్+ఉన్న; రాజుల మనంబులు; ఎల్లను; చేవ చెడియెన్= సత్తువ కోల్పోయాయి; భీష్ముండు; వెండియున్= మరల; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడి పలుకులు విని ఆ సభలో ఉన్నవారి మనస్సులు దిగాలుపడిపోయాయి. మరల భీష్ముడిట్లా చెప్పసాగాడు.

**సీ. 'ద్రౌపదేయులు మహారథు లేవురును; వారి । తరమ యుత్తరుఁడును ధరణినాథ!**
**యతిరథవర్యుఁ డయ్యభిమన్యుఁ; డర్జున । వాసుదేవుల కెనవచ్చువాఁడు;**
**లఘుచిత్రములు నేర్చు లావును దాల్మియుఁ । గలఁడు తండ్రులపాటు తలఁచుచుండుఁ**
**గావున బెడిదంబుగాఁ బోరు; సాత్యకి । యతిరథోత్తముఁడు శౌర్యాన్వితుండు;**

**తే. పాండవ స్నేహసక్తుఁడై యుండుఁ గాన । నలుక మనమీఁదఁ బెద్దయుఁ గలిగి పెనఁగు;**
**వీర లిరువురుఁ బరుసనివారు సమర । పరుల నొప్పింతు రీ యోధవరులనెల్ల. 260**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= దుర్యోధన మహారాజా!; ద్రౌపదేయులు= ద్రౌపదికుమారులైన ఉపపాండవులు; ఏవురును= ఐదుమందికూడ; మహారథులు= మహారథులని చెప్పదగినవారు; ఉత్తరుఁడును= విరటుడి కొడుకైన ఉత్తరుడుకూడా; వారి తరమ= ఉపపాండవులవలె మహారథుడు; ఆ+అభిమన్యుఁడు= ఆ యభిమన్యుడు; అతిరథవర్యుఁడు= అతిరథోత్తముడు; అర్జున వాసుదేవులకున్= పార్థునకు, శ్రీకృష్ణునకు; ఎనవచ్చువాఁడు= సాటివచ్చేవాడు; లఘుచిత్రములు నేర్చున్= వింతవింతలాఘవములు అతడెరుంగును; లావును= బలం; తాల్మియున్= సహనం; కలఁడు= కల్గిఉన్నాడు; తండ్రులపాటు= తనతండ్రు లనుభవించిన కష్టాలను; తలఁచుచున్+ఉండున్= స్మరిస్తూ ఉంటాడు; కావునన్= కాబట్టి; బెడిదంబుగాన్= దారుణంగా; పోరున్= యుద్ధం చేస్తాడు; సాత్యకి= వృష్ణి వంశస్థుడైన సాత్యకి; అతిరథ+ఉత్తముఁడు= అతిరథులలో శ్రేష్ఠుడు; శౌర్య+అన్వితుండు= పరాక్రమంతో కూడినవాడు; పాండవ స్నేహసక్తుఁడు+ఐ= పాండవుల చెలిమియందు కోరిక గలవాడై; ఉండున్+కానన్= ఉంటాడు కనుక; మనమీఁదన్= మనయెడ; అలుక= కోపం; పెద్దయున్+కలిగి= మిక్కిలి కలిగి; పెనఁగున్= మనతో పోరాడుతాడు; వీరలు+ఇరువురున్= అభిమన్యు సాత్యకులిద్దరు; పరుసనివారు= పారుష్యం కలవారు; సమరపరులన్= యుద్ధమునందు ఆసక్తిగల; ఈ యోధవరులన్+ఎల్లన్= మన వీర యోధులందరినీ; నొప్పింతురు= బాధిస్తారు.

**తాత్పర్యం:** ఉప పాండవులు ఐదుమందీ మహారథులు. వారితో సమానుడు ఉత్తరుడు. అభిమన్యుడు అతిరథులలో అగ్రేసరుడు. శ్రీకృష్ణార్జునులకు సాటియైనవాడు. యుద్ధపు మెలకువ లెన్నింటినో నేర్చినవాడు. శక్తిమంతుడు. సహనయుక్తుడు. అతడు తన తండ్రులు పడిన కష్టపరంపరలను తలపోసుకొంటూ ఉంటాడు. కనుక ఘోరంగా పోరాటం సాగిస్తాడు. సాత్యకి అతిరథులలో సిగబంతి. శౌర్యంతో కూడినవాడు. పాండవస్నేహమునందు సక్తమనస్కుఁడుగాన మన మీద అతడికి కోపం మెండు. ఆ కారణంతో మనతో లెస్సగా పోరాడుతాడు. అభిమన్యు సాత్యకు లిద్దరూ గండరగండలు. సంగ్రామలంపటులైన మన మేటి జోదులందరినీ వేధించక విడువరు.

**విశేషం:** ద్రౌపదేయులు: పాంచాలి కుమారులు ఐదుగురు. వీరు ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు అనేవారు. వీరినే ఉపపాండవు లంటారు.

**మ. అలఁతింబోరు మహారథుల్ ద్రుపద మత్స్యాధీశు లుద్యద్భుజా**
**బలశౌర్యాఢ్యులు పాండురాజసుత సంబంధ ప్రియస్నేహముల్**
**కలిమింజేసి తదీయ దైన్యమునకుంగా నొచ్చియుం జచ్చియున్**
**గెలిపింపం దమకించి చొత్తు రని కేకీభూతచేతస్కులై. 261**

**ప్రతిపదార్థం:** ద్రుపద మత్స్య+అధీశులు= ద్రుపదుడు, మత్స్యదేశాధిపతి విరాటుడు అనువారు; ఉద్యత్= పెంపారుతున్న; భుజాబల= బాహుబలం చేతను; శౌర్య= విక్రమంచేతను; ఆఢ్యులు= సంపన్నులు; అలఁతిన్+పోరు= తేలికగా పోరాటంలో మనలను వదలరు; పాండురాజసుత= పాండవులతోడి; సంబంధ= చుట్టరికం; ప్రియస్నేహముల్= ప్రేమము, చెలిమి అనునవి; కలిమిన్+చేసి= కలిగినవారవటంచేత; తదీయదైన్యమునకున్+కాన్= పాండవుల దీనస్థితికై; నొచ్చియున్= బాధపడియూ; చచ్చియున్= మరణించటానికి సిద్ధపడియూ; ఏకీభూత చేతస్కులు+ఐ= ఒకటిగాఉన్న మనస్సుకలవారై; గెలిపింపన్+తమకించి= విజయం సమకూర్చటానికి త్వరపడుతూ; అనికిన్+చొత్తురు= యుద్ధరంగంలో ప్రవేశిస్తారు.

**తాత్పర్యం:** పాంచాల దేశపు ప్రభువైన ద్రుపదుడు, మత్స్యదేశాధిపతి విరటుడు పెంపారు భుజశక్తితో, విక్రమంతో ఉద్దీపించే మహారథులు. పాండవులతో సఖ్యసంబంధాలు కలవారవటం వల్ల కౌంతేయుల కష్టపాటు తలంచుకొని వారికొరకు తాము నొచ్చిఅయినా, చచ్చిఅయినా వారిని గెలిపించటానికి ఏకమనస్సుతో యుద్ధరంగంలోనికి ఉరుకుతారు.

**ఆ. వీరగుణము బలము వీఁకయుఁగలఁడు మ । హారథుఁడు శిఖండి; యతని తమ్ముఁ**
**డతిరథుండు దర్పయుతుఁడు ధృష్టద్యుమ్నుఁ । డుగ్రతేజుఁ డనికి నుగ్రునట్ల. 262**

**ప్రతిపదార్థం:** శిఖండి= ద్రుపదుడి తనయుడైన శిఖండి అనేవాడు; మహారథుఁడు= మహారథుడు; వీరగుణము= శూరత్వం; బలము= శక్తి; వీఁకయున్= పట్టుదల; కలఁడు= కలవాడు; అతని తమ్ముఁడు= శిఖండి అనుజుడైన; ధృష్టద్యుమ్నుఁడు; అతిరథుండు= అతిరథుడు; దర్పయుతుఁడు= గర్వంతో కూడినవాడు; అనికిన్= యుద్ధానికి; ఉగ్రు+అట్ల= రుద్రుడివలె; ఉగ్రతేజుఁడు= భయంకరమైన ప్రతాపం కలవాడు.

**తాత్పర్యం:** శిఖండి మహారథుడు. శౌర్యం, శక్తి, పట్టుదల కలవాడు. అతడి తమ్ముడు ధృష్టద్యుమ్నుడు అతిరథుడు. బాహుదర్పం కలవాడు. యుద్ధంలో రుద్రుడివలె అతడు దారుణమైన ప్రతాపం చూపగలడు.

**క. అతని సుతుఁ డర్ధరథుఁ డా । ధృతవర్ముఁడు పిన్నవాఁడు త్రిమ్మటకాఁడై**
**మతిహీనత శస్త్రా స్త్ర । ప్రతతి పరిశ్రమములేక పాలసుఁ డగుటన్. 263**

**ప్రతిపదార్థం:** అతని సుతుఁడు= ఆ ధృష్టద్యుమ్నుని కుమారుడు; ఆ ధృతవర్ముఁడు= ధృతవర్ముడనేవాడు; పిన్నవాఁడు= పసివాడు; త్రిమ్మటకాఁడై= ఇచ్చవచ్చినట్లు తిరుగుచూ; మతిహీనతన్= తెలివితక్కువచేత; శస్త్ర+అస్త్రప్రతతి పరిశ్రమములేక= శస్త్రాస్త్ర విద్యాభ్యాసం లేక; పాలసుఁడు+అగుటన్= మూర్ఖుడయినందున; అర్ధరథుఁడు= అర్ధరథుడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడి కుమారుడు ధృతవర్ముడు చిన్నతనంనుండి దేశముల వెంట ఇచ్చవచ్చినట్లు తిరుగుతూ తెలివిలేక శస్త్రాస్త్ర విద్యాపరిశ్రమంలేక పాలసుడైనందున అర్ధరథుడయ్యాడు.

**ఆ. చేది భూవిభుండు శిశుపాల తనయుండు । ధృష్టకేతుఁ డధిక ధీరమతి మ**
**హారథుండు; భోజుఁ డజుఁ డనురాజులు । నట్టివార తెంపు నలవుఁ గలరు. 264**

**ప్రతిపదార్థం:** చేది భూ విభుండు= చేదిదేశాధిపతిఅయిన; శిశుపాలతనయుండు= శిశుపాలుడి యొక్క కుమారుడు; ధృష్టకేతుఁడు= ధృష్టకేతుడనేవాడు; అధిక ధీరమతి= మిక్కిలి ధైర్యంతో కూడిన మనస్సుకలవాడు; మహారథుండు= మహారథుడై ఉన్నాడు; భోజుఁడు అజుఁడు+అను రాజులు= భోజుడు, అజుడు అను పేర్లుకల నరపతులు; అట్టివారు+అ= మహారథులే; తెంపున్= సాహసమూ; అలవున్= బలమూ; కలరు= కలిగి ఉన్నారు.

**తాత్పర్యం:** చేది దేశపురాజు శిశుపాలుడి యొక్క కుమారుడు ధృష్టకేతుడు. అతడు మిక్కిలి ధైర్యంతో గూడిన మనస్సుకలవాడు. అతడు మహారథుడు. భోజుడు అజుడు అనే పేర్లుగల నరపతులు కూడ మహారథులే. వారు బలసాహసాలు కలవారు.

**వ. ఉత్తమౌజుండును యుధామన్యుండును క్షత్త్ర దేవుండును జయంతుండును నమితౌజుండును విరాటుండును సత్యజితుండును ననం బరఁగు పాంచాల కుల ప్రదీపకులు మహారథులు; మత్తమాతంగ బృందంబు చందంబునం బ్రతిబలంబు పయిం గవిసి కోలాహల బహుళంబుగాఁ గలంపం జాలుదురు; కేకయపతు లేవురు సహోదరులు మహారథులు, కడింది మగలు, కెంపు రథంబుల మొత్తంబులతోఁ గార్చిచ్చు పగిదిం బొదువుదురు; కాశీశుండు నీలుండు సూర్యదత్తుండు మదిరాక్షుండు శంఖుండు విరాటజ్ఞాతులు మహారథులు వివిధాయుధ విద్యా విశారదులు; వారి పోరు భరంబై యుండు. 265**

**ప్రతిపదార్థం:** ఉత్తమౌజుండును; యుధామన్యుండును; క్షత్త్రదేవుండును; జయంతుండును; అమితౌజుండును; విరాటుండును; సత్యజితుండును; అనన్+పరఁగు= అనే పేర్లతో ఒప్పారుతున్న; పాంచాలకుల ప్రదీపకులు= పాంచాల వంశమును వెలిగించేవారు; మహారథులు= మహారథులై ఉన్నారు; మత్తమాతంగ బృందంబు+చందంబునన్= మదించిన గజసమూహంవలె; ప్రతిబలంబుపయిన్= శత్రుసేనమీదికి; కవిసి= దుమికి; కోలాహలబహుళంబుగాన్= కలకలధ్వని చెలరేగేటట్లుగా; కలపన్+చాలుదురు= కలతనొందింప సమర్థులు; కేకయపతులు= కేకయ రాజ్యాధీశులు; ఏవురు సహోదరులు= ఐదుమంది అన్నదమ్ములు; మహారథులు= మహారథులై ఉన్నారు; కడిందిమగలు= వారు శూరులు; కెంపురథంబుల మొత్తంబులతోన్= కెంపులతో నిర్మించిన రథసమూహాలతో; కార్చిచ్చుపగిదిన్= దావానలంవలె; పొదువుదురు= క్రమ్ముకొంటారు; విరాటజ్ఞాతులు= విరాటమహారాజు దాయాదులైన; కాశీశుండు; నీలుండు; సూర్యదత్తుండు; మదిరాక్షుండు; శంఖుండు - ఈ ఏవురూ; మహారథులు= మహారథులై ఉన్నారు; వివిధ+ఆయుధ విద్యా విశారదులు= పలు తెరగులైన శస్త్రవిద్యలలో ప్రవీణులు; వారి పోరు భరంబు+ఐ+ఉండున్= వీరు సల్పు పోరాటం భరింపశక్యంకానిదై ఉంటుంది.

**తాత్పర్యం:** తమ పుట్టుకచేత పాంచాల వంశాన్ని ప్రకాశింపజేస్తున్న ఉత్తమౌజుడు యుధామన్యుడు క్షత్త్రదేవుడు జయంతుడు అమితౌజుడు విరాటుడు సత్యజితుడు అనే ఏడుగురున్నూ మహారథులు. వారు మదించిన ఏనుగుల గుంపువలె విరోధిసేనలపై దూకి కలకలధ్వని చెలరేగేటట్లు చీకాకు పరుస్తారు. కేకయ దేశాధిపతులు అయిదుమంది అన్నదమ్ములు మహారథులు. వారు మేటి వీరులు. కెంపురథాలతో దావానలం మాదిరి శత్రుసైన్యాలను చుట్టుముట్టుతారు. విరాటుడి దాయాదులైన కాశీశుడు నీలుడు సూర్యదత్తుడు మదిరాక్షుడు శంఖుడు అనేవారు మహారథులు. అనేక విధాలైన ఆయుధ విద్యలలో వారు నేర్పరులు. వారు సాగించే పోరాటం సహింపశక్యంకాదు.

**సీ. చిత్రాయుధుండును జేకితానుండు మ । హారథు లిద్దఱు నర్జుననకుఁ**
**గూర్తురు, కయ్యాన కోర్తురు, నేర్తు, రా । యుధముల కెల్ల నత్యుగ్రు; లవ్వి**
**ధము వార; చంద్రదత్త వ్యాఘ్రదత్తులు । వినుము సేనాబిందుఁడను నృపాలుఁ**
**డతిరథోత్తముఁడు మారుత పుత్త్రు నెన యతం । డొక్కరుండును వారి యుఱిది లావు**

**ఆ. పాండ్యుఁ డతిరథుండు బలఁగంబుఁ గలవాఁడు । సమరథుండు కాశ్యుఁ డమితబలుఁడు**
**కుంతిభోజుఁ డాజికోవిదుఁ డతిరథుం । డతని యొద్దిజోదు లధికబలులు.** 266

**ప్రతిపదార్థం:** చిత్రాయుధుండును= చిత్రాయుధుడనేవాడును; చేకితానుండున్= యాదవరాజైన చేకితానుడును; మహారథులు= మహారథులై ఉన్నారు; ఇద్దఱున్= వీరిరువురును; అర్జుననకున్; కూర్తురు= ఇష్టులై ఉన్నారు; కయ్యానకున్+ఓర్తురు= యుద్ధం చేయటానికి సమర్థులు; ఆయుధములకున్+ఎల్లన్+నేర్తురు= సకలాయుధాలతో పోరుసల్పడం తెలియుదురు; అతి+ఉగ్రులు= మిక్కిలి భయంకరులు; చంద్రదత్త వ్యాఘ్రదత్తులు= చంద్రదత్తుడు, వ్యాఘ్రదత్తుడు; ఆ+విధమువారు+అ= చిత్రాయుధ చేకితానులవంటివారే; వినుము!; సేనాబిందుఁడు+అను నృపాలుఁడు= సేనాబిందుడనేరాజు; అతిరథ+ఉత్తముఁడు= అతిరథులలో శ్రేష్ఠుడు; మారుతపుత్త్రు+ఎన= భీమసేనుడికి సమానుడు; అతండు+ఒక్కరుండును= ఆ సేనాబిందు డొక్కడే; వారి+ఉఱిదిలావు= వారి గొప్పబలం; పాండ్యుఁడు= పాండ్యభూపతి; అతిరథుండు= అతిరథుడు; బలఁగంబున్+కలవాఁడు= పరివారమున్నవాడు; కాశ్యుఁడు; సమరథుండు= సమరథుడై ఉన్నాడు; అమితబలుఁడు= అతడు మిక్కిలి శక్తి కలవాడు; కుంతి భోజుఁడు= కాశ్యుడి మేనత్త కుమారుడున్నూ, యాదవరాజున్నూ అయిన కుంతిభోజుడనేవాడు; అతిరథుడు; ఆజికోవిదుఁడు= యుద్ధ ప్రావీణ్యం కల్గినవాడు; అతని+ఒద్ది+జోదులు= అతడి వద్ద ఉండే శూరులు; అధికబలులు= మిక్కుటమైన శక్తికలవారు.

**తాత్పర్యం:** చిత్రాయుధుడు చేకితానుడు మహారథులు. వీరిద్దరూ అర్జునుడిపై ప్రేమగలవారు. యుద్ధ క్రీడయందు సమర్థులు. సకల శస్త్రాస్త్రాలెరింగినవారు. మిక్కిలి భయంకరులు. అట్లాంటి మహారథులే చంద్రదత్తుడు, వ్యాఘ్ర దత్తుడు. సేనాబిందుడనేరాజు అతిరథుడు. అతఁ డొక్కడే వీరందరి శక్తి సామర్థ్యాలు కల్గినవాడు. పాండ్యరాజు అతిరథుడు. సేన కలవాడు. కాశ్యుడు సమరథుడు. మిక్కిలి బలశాలి. కుంతిభోజుడు అతిరథుడు. యుద్ధం చేయటంలో నేర్పుగలవాడు. అతడి కడనున్న యోధులందరూ మిక్కిలి శక్తి సంపన్నులు.

**వ. రోచమానుండు మహారథుండు దేవసమానుండు.** 267

**ప్రతిపదార్థం:** రోచమానుండు= రోచమానుడనేవాడు; మహారథుండు; దేవసమానుండు= దేవతాతుల్యుడు.

**తాత్పర్యం:** రోచమానుడనేవాడు మహారథుడు. అతడు వేల్పులతో సమానుడు.

**తే. అతిరథుల కెల్లఁ దల, తండ్రియట్టివాఁడ । యసురవిభుఁడు ఘటోత్కచుం; డా హిడింబ**
**కొడుకు మాయాబలంబున నొడుచుఁ బగఱ । నతనికడ దానవానీక మగ్గలంబు.** 268

**ప్రతిపదార్థం:** ఆ హిడింబకొడుకు= హిడింబయనే దానవకాంతకు పుట్టిన; ఘటోత్కచుండు; అతిరథులకున్+ఎల్లన్+తల= అతిరథులందరికంటె మిన్న; తండ్రిఅట్టివాఁడు+అ= తన జనకుడైన భీమసేనుడి వంటివాడే; అసురవిభుఁడు= రాక్షసులకు నాయకుడు; మాయాబలంబునన్= తనకున్న మాయాశక్తిచేత; పగఱన్= శత్రువులను; ఒడుచున్= జయిస్తాడు; అతనికడన్= వాడిదగ్గర; దానవ+అనీకంబు= రాక్షస సమూహం; అగ్గలంబు= మిక్కుటం.

**తాత్పర్యం:** హిడింబ అనే దైత్యకాంతకు జనించిన ఘటోత్కచుడు అతిరథుడు. అతడు తన జనకుడైన భీముడితో సమానుడు. రాక్షసులకు నాయకుడు. తన మాయామహిమచేత శత్రువులను ఓడించగలడు. వాడికడ రాక్షస సైన్యం మెండు.

**విశేషం:** ఘటోత్కచుడి జన్మవృత్తాంతం: లాక్షాగృహదహనానంతరం భీమసేనుడు అర్ధరాత్రంలో తల్లితో సహోదరులతో బిలద్వారంనుండి వెలువడి గంగానదిని దాటి సాయం సమయానికి హిడింబాసురుడు నివసించే వనం చేరాడు. అక్కడొక మఱ్ఱిచెట్టు క్రింద గమనాయాసంతో అందరూ నేలపరుండి నిద్రపోయారు. భీముడు వారిని కనిపెట్టుకొని మేల్కొని ఉన్నాడు. ఆ సమీపంలో మామిడి గున్నల మధ్యనున్న మండపంలో నుండి హిడింబాసురుడు వారినందరినీ చూచాడు. ఇన్నాళ్ళకు మానవమాంసం లభించిందని సంతోషపడి వారిని చంపి తెచ్చుటకై తన చెల్లెలు హిడింబను పంపాడు. ఆమె మనుజస్త్రీ స్వరూపంతో వచ్చింది. భీమసేనుడిని చూచి మోహించింది. విషయమంతా అతడికి తెలిపింది. హిడింబాసురుడు తడవోర్వక వచ్చి భీముడితో మాటాడుతున్న చెల్లెలిమీద నిప్పులు గ్రక్కాడు. ఆమె భయంతో భీముడి మరుగు జొచ్చింది. తల్లికి సోదరులకు నిద్రాభంగమవుతుందని వృకోదరుడు హిడింబుడిని దూరంగా ఈడ్చుకొని పోయాడు. హోరాహోరీగా వారు పోరాడుతుండగా ధర్మజాదులు మేల్కొన్నారు. హిడింబ వారికి నమస్కరించి తాను రాక్షసకాంతననీ, తనకు త్రైకాలికజ్ఞానం కలదనీ, భీముడిని వలచాననీ, తన్ను రక్షింపుడనీ వారిని వేడుకొన్నది. ఇంతలో హిడింబుడిని సంహరించి వచ్చిన భీముడితో కుంతీదేవి, 'ఈమె పరమసాధ్వి, వేరుగా తలంపక పరిగ్రహించు'మని పల్కి అతడిని ఒడబరిచింది. పగళ్ళు యథేచ్ఛగా విహరిస్తూ రాత్రులు మా యొద్ద ఉండండని వారిని కోరింది. 'పుత్రుడు కలిగేవరకూ ఈమెను పరిగ్రహిస్తా'నని భీముడు తల్లికి మాట ఇచ్చాడు. అక్కడికి వ్యాసభగవానుడు వచ్చి 'దీని పేరు కమలపాలిక. మహాసత్త్వుడైన కొడుకును కంటుంది. ఆపద్విషయంలో అతడు మిమ్ము కాపాడుతాడు' అని చెప్పి వెళ్ళిపోతాడు. పాండవులు వ్యాసమునీంద్రుడి వచనానుసారంగా అచటినుండి శాలిహోత్రుడి ఆశ్రమానికి తరలివెళ్ళుతారు. వారక్కడ వసిస్తున్న కాలంలో భీముడివలన హిడింబకు సద్యోగర్భంలో కామరూపధరుడైన ఘటోత్కచుడు ఉద్భవిస్తాడు. పుట్టగనే అతడు నవయౌవనశాలి, సకలాస్త్రశస్త్ర కుశలుడు, అపరిమిత రాక్షస పిశాచ బలసమేతుడు అయి, తలిదండ్రులకు కుంతీదేవికి నమస్కరిస్తాడు. తమకు పెద్దకొడుకని వారందరూ ముచ్చట పడుతుండగా కొన్నాళ్ళు వారితోఉండి తండ్రులతో అతడు 'నేను నా బలగంతో వెళ్ళి ఇష్టమైన చోట నివసిస్తాను. పనిగల్గినపుడు నన్ను స్మరించండి. వెంటనే వస్తా'నని పల్కి తల్లిని తోడ్కొని ఉత్తరదిశాభిముఖుడై వెళ్ళుతాడు. కురుక్షేత్ర యుద్ధం మొదలయింది. ఘటోత్కచుడు సంగ్రామంలో కురుసైన్యాన్ని నిర్మూలించసాగాడు. అప్పుడు కౌరవవీరులు కర్ణుడితో- 'ఇంద్రదత్తమైన శక్తిని ఇతని మీద ప్రయోగించు. భీమార్జునులు నిన్నేమిచేస్తారు?' అని ప్రోత్సహించారు. ఆ తరుణంలో ఘటోత్కచుడు విజృంభించి కర్ణుడి రథరథ్యాలను గదాఘాతంతో కూల్చివేశాడు. అతడిని నొప్పించాడు. వీడి చేతిలో తనకు చావు తప్పదని రాధేయుడు నిర్ణయించుకొన్నాడు. వాసవు డిచ్చిన ఆ ఘోర శక్తిని భీమనందనుడిపై వేశాడు. ఘటోత్కచుడు భయంకర మరణం పాలయ్యాడు. పాండవులు దుఃఖితులయ్యారు. శ్రీకృష్ణుడు సింహనాదం చేసి శంఖాన్ని పూరించి ఆనందంతో నాట్యంచేస్తూ, రథస్థుడైన అర్జునుడిని కౌగిలించుకొని వెన్ను చరిచాడు. 'మేమంతా విలపిస్తుంటే బావా! ఏమిటీ విచిత్ర వర్తనం?' అని అర్జునుడు ప్రశ్నించాడు. శౌరి ఇట్లా అన్నాడు: 'ఇంద్రు డిచ్చిన శక్తి కర్ణుడి దగ్గరుండగా నిన్ను బ్రతికించుకొనటం దుష్కరమని భావిస్తూ వచ్చాను. ఆ చింత తీరింది, కర్ణుడికి కవచకుండలాలు మునుపే పోయాయి. ఇపుడు ఇంద్రదత్త సాధనమూ పోయింది. ఇక రాధేయుడిని నీవు సుకరంగా గెలుస్తావు. ఈ ఘటోత్కచుడు కిమ్మీర బక హిడింబాసురుల కోవలోనివాడు. ధర్మద్వేషం, రోషం కల్గి ఉండటంవలన ఒకప్పుడు ఒప్పమి రావచ్చు. ఆ దానవుల మాదిరి వీడూ నశించటం నాకు అభిమతం. వీడు రావణుడి వంటివాడు. ఇపుడు చావకపోతే తరువాతనైనా నేను చంపవలసివచ్చేది. అందుచేత అర్జునా! నాకిది సంతోషకాలంగాని శోకసమయం కా'దన్నాడు. ఆ మాటలు వింటున్న సాత్యకి అన్నగారి నడిగాడు- ఇన్నాళ్ళు ఈ శక్తిని కర్ణుడు విజయుడి మీద ఎందుకు ప్రయోగించలేదని.

'అతనివారంతా ఈ పని చేయుమని కర్ణుడికి బోధిస్తూనే ఉంటారు. తాను అట్లా తప్పక చేస్తానని అతడు చెపుతూనే ఉంటాడు. తీరా పోరాడే సమయంలో వారంతా ఆ విషయం మరచిపోయేటట్లు నేను చేస్తుంటాను' అంటూ శ్రీకృష్ణుడు ధృష్టద్యుమ్నుడిని పేర్కొని సాత్యకిని చూచి 'మీరూ, నా ప్రాణాలూ, ఈ త్రిలోకీరాజ్యమూ పార్థుడివలె నా కూర్మికి పాత్రాలు కావు. ఆ శక్తి ఘటోత్కచుడి ప్రాణాలు హరించి వమ్మయిపోయింది. ఈ రాత్రి నేను హాయిగా నిద్రపోతాను' అన్నాడు.

**వ. నాకుం దోఁచినవారిం బేరుకొంటి; నింతియకాని, రెండు వీళ్లను మంచి మగలు పెక్కండ్రు గల'రని చెప్పి గాంగేయుండు. 269**

**ప్రతిపదార్థం:** నాకున్; తోఁచినవారిన్= జ్ఞప్తికివచ్చినవారిని; పేరుకొంటిన్= చెప్పాను; ఇంతియకాని= ఇంతేతప్ప; రెండువీళ్లను= ఉభయ సైన్యాలందును; మంచిమగలు= మేటి వీరులు; పెక్కండ్రు కలరు= పలువురున్నారు; అనిచెప్పి; గాంగేయుండు= భీష్ముడు.

**తాత్పర్యం:** నాకు జ్ఞప్తికి వచ్చినవారిని గురించి చెప్పాను. ఇంతేకాని, ఉభయ పక్షాలందు మేటి వీరులెంతోమంది ఉన్నా'రని భీష్మ డింకా ఇట్లా పలికాడు:

**క. 'పాండవుల దిక్కు రథికు ల । ఖండిత బలులైన నా మొగంబునఁబడి యు**
**ద్దండత చూపఁగ లేరు శి । ఖండిని నొక్కరునిఁ జంపఁగాని కుమారా!' 270**

**ప్రతిపదార్థం:** కుమారా!= వత్సా, సుయోధనా!; పాండవులదిక్కు రథికులు= పాండవ పక్షమందున్న రథికులు; అఖండితబలులు+ ఐనన్= సంపూర్ణమైన శక్తిగలవారైనప్పటికినీ; నా మొగంబునన్+పడి= నా బారినబడి; ఉద్దండతన్+చూపఁగన్+లేరు= విజృంభించలేరు; కాని= ఐననూ; శిఖండిని+ఒక్కరునిన్= ఒక్క శిఖండిని మాత్రం; చంపన్= సంహరించలేను.

**తాత్పర్యం:** 'పాండవ పక్షమందలి రథికులు అకుంఠిత బలవంతులైనప్పటికీ నా ముందు విజృంభించలేరు కాని, నేను శిఖండిని మాత్రం చంపలేను.'

**క. అనవుడు దుర్యోధనుఁ 'డా । తని మీరు వధింపమికిఁ గతం బేమియొకో!**
**విన దుగనేనిం జెపుఁడా' । యనుటయు నిట్లనియె భీష్ముఁ డతనికి నెమ్మిన్. 271**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని భీష్ముడు పలుకగా; దుర్యోధనుఁడు= సుయోధనుడు; మీరు= మీరు; ఆతనిన్= శిఖండిని; వధింపమికిన్= చంపకుండుటకు; కతంబు= కారణం; ఏమి+ఒకో!= ఏమో!; వినన్+తగున్+ఏనిన్= నేను వినటానికి తగినవిషయమైతే; చెపుఁడా= చెప్పండి; అనుటయున్= అని అడుగగా; అతనికిన్= దుర్యోధనుడికి; నెమ్మిన్= ప్రీతితో; భీష్ముఁడు= దేవవ్రతుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** భీష్ముడి మాటలు విని దుర్యోధనుడు 'మీ రా శిఖండిని చంపకుండటానికి హేతువేమో తెలియదు. నేను వినదగినదయితే చెప్పండి' అని అడుగగా పితామహు డిట్లా అన్నాడు:

**వ. 'ఏ నా శిఖండినిఁ జంపమికి మూలంబు సాలం గలదు; తత్ప్రపంచం బంతయు వివరించెద నాకర్ణింపుము: 272**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఆ శిఖండిని; చంపమికిన్= సంహరించకుండటానికి; మూలంబు చాలన్+కలదు= కారణ మెంతో ఉన్నది; తద్+ప్రపంచంబు+అంతయున్= ఆ వివరాలన్నీ; వివరించెదన్= విశదపరుస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** నేను శిఖండిని చంపకుండటానికి కారణం చాలా ఉన్నది. ఆ విషయమంతా వివరిస్తాను వినుము:

**భీష్ముఁడు దుర్యోధనున కంబోపాఖ్యానంబు సెప్పుట (సం. 5-170-1)**

**సీ. శంతను పిమ్మట సత్యవతీ దేవి । యనుమతితోడఁ జిత్రాంగదునకు**
**సామ్రాజ్యపట్టంబు సమ్మతిఁ గట్టితి; । నల్పకాలంబున నతఁడు దీఱెఁ;**
**దత్పరోక్షావస్థఁ దదనుసంభవుని వి । చిత్రవీర్యుని రాజుఁ జేసి, పెండ్లి**
**సేయంగఁ దివిరి, కాశీపతి కూఁతులు । కన్యలు ముప్పురు గలుగుటయును**

**తే. నాత డర్థిఁ దదీయ స్వయంవరమున । కఖిల నృపతులఁ బిలిపించె ననియు నెఱిఁగి**
**తల్లి కెఱిఁగించి యొంటిమైఁ దత్పురమున । కాయితం బయిపోయితి నరద మెక్కి. 273**

**ప్రతిపదార్థం:** శంతనుపిమ్మటన్= శంతనుమహారాజు తరువాత; సత్యవతీదేవి+అనుమతితోడన్= సత్యవతీ దేవియొక్క అంగీకారంతో; చిత్రాంగదునకున్= ఆమె పుత్రుడైన చిత్రాంగదుడికి; సమ్మతిన్= ఇచ్ఛతో; సామ్రాజ్యపట్టంబు+కట్టితిన్= హస్తినాపుర సామ్రాజ్యానికి అభిషిక్తుడిని చేశాను; అల్పకాలంబునన్= పట్టాభిషిక్తుడైన కొద్దికాలానికే; అతఁడు+తీఱెన్= అతడు మరణించాడు; తద్+పరోక్ష+అవస్థన్= చిత్రాంగదుడి పరోక్షంలో; తద్+అనుసంభవునిన్= ఆతడి తమ్ముడైన; విచిత్రవీర్యునిన్= విచిత్రవీర్యుడిని; రాజున్+చేసి= ప్రభువుగాచేసి; పెండ్లి+చేయంగన్= పెండ్లిచేయుటానికి; తివిరి= పూనుకొని; కాశీపతికూఁతులు= కాశీరాజుయొక్క పుత్రికలు; ముప్పురు కలుగుటయును= ముగ్గురుండుటయు; ఆతఁడు= ఆ+కాశీరాజు; అర్థిన్= ప్రీతితో; తదీయస్వయంవరమునకున్= తన కొమార్తెల స్వయంవరానికి; అఖిల నృపతులన్= రాజులందరినీ; పిలిపించెన్= ఆహ్వానించాడు; అనియున్+ఎఱిఁగి= అనికూడా తెలిసికొని; తల్లికిన్+ఎఱిఁగించి= నా జననికి తెల్పి; ఒంటిమైన్= ఒంటరిగా; అరదము+ఎక్కి= రథ మారోహించి; ఆయితంబు+అయి+పోయితిన్= సన్నాహంతో వెళ్ళాను.

**తాత్పర్యం:** శంతను మహారాజు తరువాత సత్యవతీ దేవి అంగీకారంతో ఆమె పుత్రుడైన చిత్రాంగదుడికి సామ్రాజ్యపట్టం కట్టబెట్టాను. రాజయిన కొద్దికాలానికే అతడు అంతరించాడు. ఆతడి పరోక్షంలో అతడి తమ్ముడైన విచిత్రవీర్యుడిని రాజును చేసి, వివాహం జరిపించటానికి పూనుకొన్నాను. కాశీరాజుకు ముగ్గురు కొమార్తెలు కలరనీ, అతడు తన పుత్రికల స్వయంవరానికి రాజులందరినీ ఆహ్వానించాడనీ తెలిసి, ఆ విషయం మా తల్లికి తెలిపి నేనొక్కడనే రథమెక్కి కాశీనగరానికి సన్నాహంతో వెళ్ళాను.

**విశేషం:** హస్తినాపురాధీశ్వరుడైన శంతను మహారాజు పరమానురాగంతో దాశరాజుకూతురు సత్యవతిని వివాహమై, ఆమెయందు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు అనే ఇద్దరు కుమారులను కన్నాడు. వాళ్ళు సంప్రాప్త యౌవనులు కాకమునుపే శంతనుడు పరలోక గతుడైనాడు. భీష్ముడు తండ్రికి పరలోక క్రియలు నిర్వర్తించి చిత్రాంగదుణ్ణి రాజ్యాభిషిక్తుడిని కావించాడు. అతడు గర్వంతో ఊరక సుర దనుజ మనుజ గంధర్వులను ఆక్షేపిస్తూ వచ్చాడు. అందుకు కోపించి చిత్రాంగదుడు అనే గంధర్వుడు అతడిపై యుద్ధానికి వచ్చాడు. కురుక్షేత్రంలో నరాధిపతి చిత్రాంగదుడు గంధర్వపతి చిత్రాంగదుడితో తలపడ్డాడు. హోరాహోరీగా పోరాటం సాగింది. మాయాయుద్ధంలో అతిదక్షుడైన గంధర్వుడు రవితేజుడైన చిత్రాంగదుడిని సంహరించాడు. ఇలా చిత్రాంగదుడు గంధర్వ నిహతుడు కాగా, అతడి పరోక్షంలో భీష్ముడు విచిత్రవీర్యుడిని కౌరవరాజ్యానికి అభిషిక్తుడిని చేశాడు.

## విచిత్రవీర్యుడి వృత్తాంతం:

విచిత్రవీర్యుడు ఆరూఢయౌవనుడు కాగానే భీష్ముడు అతడికి వివాహం చేయసంకల్పించాడు. కాశీరాజు తన పుత్రికలకు స్వయంవరం చాటించడం విని గాంగేయుడు అక్కడికి వెళ్ళి స్వయంవరానికి మూగిన రాజులంతా వెరచి వెరగుపడి చూస్తుండగా కాశీరాజు దుహితలను ముగ్గురినీ రథమెక్కించుకొని, 'నా తమ్మునికి వివాహం చేయటానికి వీరిని గొంపోతున్నాను. బ్రాహ్మము మొదలైన అష్ట వివాహాలలో క్షత్రియులకు గాంధర్వ, రాక్షసాలు ఉత్తమాలు. స్వయంవరంలో జయించి వివాహం కావటం అంతకంటే ఉత్తమం. ఇక్కడ చేరిన రాజలోకాన్ని జయించి ఈ కన్యలను తోడ్కొని చనడం ధర్మం. అడ్డుపడేవారుంటే అడ్డగించండి చూస్తాను' అని కాశీరాజుతో పలికి, వస్తూ ఉండగా అతడిని రాజులెదిరించి పరాజితులయ్యారు. భీష్ముడు ఏకవీరుడై కన్యలతో ఏగుతుంటే సాళ్వుడు వెంటనంటాడు. భీష్ముడు మార్కొని అతడి రథాన్ని రథ్యాలను సారథిని కూల్చివేశాడు. భగ్నరథుడు, భగ్నమనోరథుడు అయి సాళ్వుడు తన పట్టణానికి వెళ్ళిపోయాడు.

అంబ, అంబిక, అంబాలిక అనే ఆ ముప్పురు కన్యలతో భీష్ముడు పురం చేరగానే, వారిలో అంబ తనను సాల్వపతి ప్రేమించగా తండ్రిచే అతడికి పూర్వదత్తనైనాను అన్నది. భీష్ము డామెను విడిచి, మిగిలిన ఇద్దరినీ తమ్ముడికిచ్చి పెళ్ళిచేశాడు. విచిత్రవీర్యుడు సకలవ్యాపారాలు వదలి కాశీరాజు యొక్క దుహితలతో విహరిస్తూ అధిక కామాసక్తివలన శోషించి మరణించాడు. అతడికి పరలోక విధులు జరిపి గాంగేయుడు తల్లిని, మరదళ్ళను ఓదార్చి అరాజకమయిన రాజ్యాన్ని అకలంకంగా ప్రతిపాలిస్తూ వచ్చాడు. ఆ తర్వాత శంతనువంశం నిల్పటానికి సత్యవతీదేవి నియోగం వలన అంబిక, అంబాలికలు వ్యాస ప్రసాదం వలన ధృతరాష్ట్రునీ పాండురాజునూ కన్నారు. వీరిద్దరూ విచిత్రవీర్యుడికి క్షేత్రజులైన కొడుకులు.

**వ. ఇవ్విధమునం జని యమ్మహోత్సవంబున నలంకృతలై యున్న యంబయు నంబికయు నంబాలికయు ననుముద్దియల ముప్వురంబట్టి రథంబుపయిఁబెట్టి కొనిరా నచ్చటి రాజులెల్లను జతురంగ బలంబులతో వచ్చి నన్నుం బొదివినఁ, బటువిశిఖానల శిఖా కలాపంబున వేఁడిమి చూపి వారి నిలువరించి, యరుగుదెంచి సత్యవతికి నప్పాలంతుల నొప్పించిన నద్దేవి విచిత్రవీర్యునకు వారల వివాహంబు సేయ నుద్యోగించె; నట్టియెడ నమ్ముప్వురయందుం బెద్దయదియైన యంబయను కన్యక నాతో నిట్లనియె: 274**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; చని; ఆ+మహా+ఉత్సవంబునన్; అలంకృతలు+ఐ= అలంకరించబడినవారై; ఉన్న; అంబయున్; అంబికయున్; అంబాలికయున్ అను; ముద్దియలన్= కాంతలను; ముప్పురన్; పట్టి; రథంబుపయిన్+పెట్టికొని; రాన్= రాగా; అచ్చటి రాజులు+ఎల్లను; చతురంగబలంబులతోన్; వచ్చి; నన్నున్; పొదివినన్= క్రమ్ముకొనగా, ఆవరించగా; పటువిశిఖ+ అనలశిఖా కలాపంబునన్= తీవ్రములైన బాణాలనెడి అగ్నిజ్వాలల యొక్క సముదాయంతో; వేఁడిమి చూపి= ప్రతాపం నెరపి; వారిన్; నిలువరించి= అడ్డగించి; అరుగుదెంచి= వచ్చి; సత్యవతికిన్; ఆ+పొలంతులన్= ఆపడతులను; ఒప్పించినన్= అప్పగించగా; ఆ+దేవి= ఆ సత్యవతి; విచిత్రవీర్యునకున్; వారలన్, వివాహంబు చేయన్; ఉద్యోగించెన్= యత్నించింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ+ముప్వుర అందున్; పెద్ద+అది= పెద్దది; ఐన; అంబ; అను కన్యక; నాతోన్; ఇట్లు+అనియెన్= ఇట్లు అన్నది.

**తాత్పర్యం:** నేను కాశీనగరానికి వెళ్ళి స్వయంవరోత్సవంలో అలంకరించబడి ఉన్న అంబ, అంబిక, అంబాలిక అనే ముగ్గురు కన్యలను పట్టుకొని రథంలో పెట్టుకొని వస్తుండగా అక్కడ జేరిన రాజులంతా చతురంగ బలాలతో వచ్చి నన్ను చుట్టుముట్టారు. నేను తీవ్ర శరాలనెడి అగ్నిజ్వాలల తాపం చూపి వారిని ముందడుగు వేయకుండా నిలిపివేసి హస్తినకు వచ్చి ఆ అతివలను మా అమ్మకు అప్పగించాను. ఆమె వారి నిచ్చి విచిత్రవీర్యుడికి పెళ్ళి చేయాలని యత్నిస్తుండగా ఆ ముగ్గురిలో పెద్దది అయిన అంబ అనే కన్య నాతో ఇట్లా అన్నది:

**తే. 'సౌంభపురవల్లభుండైన సాళ్వుమీఁదఁ । దలఁపు గలదు నా; కతఁడును దగులు గలిగి**
**యుండు నాదెస; నీవు ధర్మోత్తరుండ; । వతని పాలికిఁ దగ నన్ను ననుపవయ్య!' 275**

**ప్రతిపదార్థం:** సౌంభపురవల్లభుండు+ఐన= సౌంభపట్టణప్రభువైన; సాళ్వుమీఁదన్= సాళ్వుడిపై; నాకున్= నాకు; తలఁపు కలదు= ఉద్దేశమున్నది; అతఁడును= సాళ్వుడుకూడ; నాదెసన్= నాపట్ల; తగులు కలిగి+ఉండున్= మమకారం కలిగి ఉన్నాడు; నీవు= నీవు; ధర్మ+ఉత్తరుండవు= ధర్మమెఱింగినవారిలో శ్రేష్ఠుడవు; అతనిపాలికిన్= ఆతడి చెంతకు; తగన్= ఒప్పుగా; నన్నున్= నన్ను; అనుపవు+అయ్య!= పంపుమయ్యా!

**తాత్పర్యం:** 'సౌంభపట్టణాధీశ్వరుడైన సాళ్వుడిమీద నాకు అనురాగమున్నది. అతడుకూడ నాయెడ మమత కలవాడు. నీవు ధార్మికులలో అగ్రగణ్యుడవు కనుక, అతడి చెంతకు నన్ను సాదరంగా పంప వేడుకొంటున్నాను.'

**క. అనవిని సత్యవతికిఁ జె । ప్పిన నాయమ వనుప నంబఁ బెంపుగ వృద్ధాం**
**గనలం దోడుగ నప్పడ । పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతిసేయన్. 276**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అని అంబ చెప్పగా ఆలకించి; సత్యవతికిన్+చెప్పినన్= నేను ఆ విషయాన్ని సత్యవతీదేవి కెరిగించగా; ఆయమ= ఆమె; పనుపన్= పంపగా; అంబన్= అంబను; పెంపుగన్= వైభవంగా; వృద్ధ+అంగనలన్= ముదుసలి స్త్రీలను; తోడుగన్= తోడిచ్చి; అప్పుడ= వెంటనే; పనిచి= నియమించి; జనంబు ప్రస్తుతి చేయన్= జనులు మిక్కిలికొనియాడుతుండగా; అనిచితిని= పంపాను.

**తాత్పర్యం:** అంబ పలుకులు విని నేను ఆ విషయం సత్యవతికి తెలిపాను. ఆమె అంబను సాళ్వుడిపాలికి పంపటానికి సమ్మతించింది. ప్రజలు నన్ను ప్రస్తుతిస్తూ ఉండగా, వెంటనే నేను వృద్ధాంగనలను తోడిచ్చి ఆమెను వైభవంగా సాళ్వుని కడకు పంపాను.

**వ. ఇట్లు పనిచి తక్కిన కన్నెల నిరువురం బాణిగ్రహణంబు చేయించితి. 277**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పనిచి= పంపి; తక్కిన కన్నెలన్= మిగిలిన కన్యలైన అంబికను, అంబాలికను; ఇరువురన్= ఇద్దరినీ; పాణిగ్రహణంబు చేయించితిన్= నా తమ్ముడి కిచ్చి వివాహం చేయించాను.

**తాత్పర్యం:** ఇట్లా అంబను సాళ్వుడికడకు పంపివేసి, అంబిక అంబాలిక అనే ఇరువురు కన్యలను విచిత్రవీర్యుడికిచ్చి పరిణయం జరిపించాను.

**క. అంబయు నట సాళ్వుని కడ । కుం బోయిన నతఁడు 'భీష్ము కొనిపోయిన దా**
**నిం బరచుం గైకొన ధ । ర్మంబే? కన్యాత్వ మెడలె మగువా నీకున్. 278**

**ప్రతిపదార్థం:** అంబయున్= అంబయూ; అట= అక్కడ; సాళ్వుని కడకున్= సాళ్వుడి దగ్గరకు; పోయినన్= వెళ్ళగా; అతఁడు= ఆ సాళ్వుడు; భీష్ముకొనిపోయినదానిన్= భీష్ముడు బలాత్కారంగా తీసికొని వెళ్ళినట్టి; పరచున్= దుష్టురాలిని; కైకొనన్= పత్నిగా గ్రహించటం; ధర్మంబే?= న్యాయమా?; మగువా!= ఓ కాంతా!; నీకున్= నీకు; కన్యాత్వము+ఎడలెన్= కన్యాత్వం తొలగిపోయింది.

**తాత్పర్యం:** అంబ సాళ్వుడి దగ్గరకు పోగా అతడు 'నీవు భీష్ముడిచేత అపహరించబడిన కులటవు. నిన్ను పత్నిగా స్వీకరించటం న్యాయంకాదు. నీకు కన్యాత్వం పోయింది.

**వ. ఇంక నిన్ను భార్యగా వరియింపం దగునే?' యనినఁ గామశరపీడిత యగుచు నక్కామిని యతని కిట్లనియె: 279**

**ప్రతిపదార్థం:** ఇంకన్; నిన్నున్; భార్యగాన్; వరియింపన్; తగునే?= యుక్తమా?; అనినన్; కామశరపీడిత+అగుచున్= మన్మథబాణాలతో బాధింపబడినదై; ఆ+కామిని= ఆకాంత; ఆతనికిన్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** ఇక నిన్ను భార్యగా వరించటం తగదు' అని సాళ్వుడు పలుకగా మన్మథబాణ బాధితఅయి అంబ అతడితో ఇట్లా అన్నది:

**తే. 'తమ్మునికిఁ గాఁగ భీష్ముఁ డుదగ్రవృత్తిఁ । గన్నియలఁ గొనిపోయెడుఁ గాన బలిమి**
**నన్నుఁ గొనిపోయె; నాచేత నిన్ను వినిన । యపుడె పుత్తెంచె దూషింప ననఘ! తగునె? 280**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడా!; తమ్మునికిన్+కాఁగన్= తన తమ్ముడైన విచిత్రవీర్యుడికొరకై; భీష్ముఁడు= గాంగేయుడు; ఉదగ్రవృత్తిన్= గర్వప్రవృత్తితో; కన్నియలన్= కన్యలను; బలిమిన్= బలాత్కారంగా; కొనిపోయెడున్+కానన్= తీసికొనివెళుతున్నాడు గనుక; నన్నున్+కొనిపోయెన్= నా చెల్లెళ్ళతో నన్నుగూడ తోడ్కొని వెళ్ళాడు; నాచేతన్= నావలన; నిన్నున్+వినిన+అపుడె= నినుగూర్చి నేను చెప్పిన వెంటనే; పుత్తెంచెన్= నన్ను నీ చెంతకు పంపాడు; దూషింపన్+తగునె?= నిందించటం న్యాయమా?

**తాత్పర్యం:** 'పుణ్యాత్ముడా! భీష్ముడు తన తమ్ముడి కొరకై బలాత్కారంగా కన్యలను గొనిపోతుండటం వలన నన్నుగూడ వారితోపాటు తీసికొనివెళ్ళాడు. నావలన నిన్ను నే వలచిన సంగతి వినిన వెంటనే, నన్ను నీకడకు పంపి వేశాడు. మరి దూషింపదగిన విషయం ఇందులో ఏముంది?

**వ. మా తండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించిన కతంబున నింత వుట్టె; భీష్ముండు నా చెలియండ్రం దన తమ్మున కిచ్చి నన్ను నీకడకుం దగ ననిచె; దీన నేమి త?'ప్పని మఱియు ననేకప్రకారంబులం బలికిన వినక తన్నుం జేకొనక సాళ్వుండు. 281**

**ప్రతిపదార్థం:** మా తండ్రి; ఎఱుంగక; స్వయంవర+అలంకారంబు= స్వయంవరానికైన శృంగారం; నాకున్; చేయించిన; కతంబునన్= కారణంచేత; ఇంత పుట్టెన్= ఇంత జరిగింది; భీష్ముండు; నా చెలియండ్రన్= అంబికను, అంబాలికను; తన తమ్మునకున్; ఇచ్చి; నన్నున్; నీకడకున్; తగన్+అనిచెన్= మర్యాదగా పంపించాడు; దీనన్= ఇందులో; తప్పు+ఏమి?; అని; మఱియున్; అనేక ప్రకారంబులన్= పలువిధాల; పలికినన్; వినక; సాళ్వుండు; తన్నున్= తనను; చేకొనక= గ్రహించక.

**తాత్పర్యం:** నేను నిన్ను వలచుట మా తండ్రి ఎరుగడు. అందుచేత నాకు స్వయంవరాలంకారం చేయించాడు. ఆ కారణంచేత ఇంతపని జరిగింది. భీష్ముడు నా చెల్లెళ్ళిద్దరినీ తన తమ్మున కిచ్చి, నన్ను నీ దగ్గరకు మర్యాదగా పంపాడు. ఇందులో తప్పేముంది?' అని బహువిధాల అంబ చెప్పినప్పటికీ సాళ్వుడు ఆమెను స్వీకరించలేదు.

**క. కరుణంబుగ నేడ్చు తలోదరిఁ । 'బోపొ మ్మిచట నింకఁ దడయకు' మని మం**
**దిరము వెడలంగ నడిచిన । నరిగె నదియు నార్తచిత్తయై వికలగతిన్. 282**

**ప్రతిపదార్థం:** కరుణంబుగన్= జాలికలిగేటట్లు; ఏడ్చు= విలపించు; తలోదరిన్= అంబను; పోపొమ్ము= వెంటనే వెళ్ళిపొమ్ము; ఇచటన్= ఇక్కడ; ఇంకన్= మరి; తడయకుము+అని= ఆలసించవద్దని; మందిరమున్ వెడలంగన్+అడిచినన్= తన భవనం విడిచిపోయేటట్లు తరుమగా; అదియున్= అంబయు; ఆర్తచిత్త+ఐ= దుఃఖిత మనస్కురాలై; వికలగతిన్= తడబడే నడకతో; అరిగెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** అంబ జాలి కలిగేటట్లు విలపించింది. 'ఇక నిక్కడ నిలువ వద్దు పోపొ'మ్మని ఆమెను సాళ్వుడు గద్దించి తన భవనంనుంచి తరిమివేశాడు. ఆమె తడవాటుతో దుఃఖపూరిత హృదయంతో వెళ్ళిపోయింది.

**వ. చనిచని యవ్వెలంది యిట్లని వితర్కించు. 283**

**ప్రతిపదార్థం:** చని చని= వెళ్ళి వెళ్ళి; ఆ+వెలంది= ఆ మగువ; ఇట్లు+అని; వితర్కించున్= ఆలోచించింది.

**తాత్పర్యం:** అంబ సాళ్వపురినుండి కదలి వెళ్ళి వెళ్ళి తనలో తాను ఇట్లా వితర్కించుకొన్నది.

**తే. 'సాళ్వునకుఁ గాని యపుడ సంసారమునకుఁ । బాసితిన; యింక భీష్ముని పాలి కేల**
**యరుగ? నాతండు మూల మీ హానికెల్లఁ । గాన నాతని సాధింతుఁగాక యేను. 284**

**ప్రతిపదార్థం:** సాళ్వునకున్= సాళ్వభూపతికి; కాని+అపుడు+అ= పనికిరానప్పుడే; సంసారమునకున్= సంసారసౌఖ్యాలకు; పాసితిన్+అ= దూరమయ్యాను; ఇంకన్= ఇక; భీష్ముడి పాలికిన్= భీష్ముని దగ్గరకు, అరుగన్+ఏల?= వెళ్ళటెందుకు?; ఈ హానికిన్+ఎల్లన్= ఈ కీడునకంతకు; మూలము= కారణం; ఆతండు+ ఆ భీష్ముడే; కానన్= కాబట్టి; ఏను= నేను; ఆతనిన్= గాంగేయుడిని; సాధింతున్+కాక= సాధించి తీరుతాను.

**తాత్పర్యం:** 'సాళ్వుడికి నేను ఇల్లాలుగా పనికిరానప్పుడు మరెవ్వరికినీ కొరగాను. నా బ్రదుకు చట్టు బండలయింది. ఇప్పుడు నేను భీష్ముడి దగ్గరకు వెళ్ళి మాత్రం ఏమి ప్రయోజనం? ఈ చేటున కంతకు మూలం భీష్ముడే కనుక, అతడిని సాధించి తీరుతాను.

**క. గాంగేయు గెల్వ నెవ్వరి । కిం గొలఁదియె? తపముపేర్మి గెలిచెదఁగా' కం**
**చుం గాంత చనియె సంయమి । పుంగవు లొక కొందఱున్న పుణ్యస్థలికిన్. 285**

**ప్రతిపదార్థం:** గాంగేయు గెల్వన్= భీష్ముడిని జయించటం; ఎవ్వరికిన్= ఎట్టివారికిన్నీ; కొలఁదియె?= శక్యమా; తపముపేర్మిన్= తపస్సుయొక్క ఆధిక్యంచేత; గెలిచెదన్+కాక= జయిస్తాను సుమా!; అంచున్= అని; కాంత= అంబ; సంయమి పుంగవులు= మునిశ్రేష్ఠులు; ఒక కొందఱు= కొంతమంది; ఉన్న పుణ్యస్థలికిన్= ఉన్నట్టి పవిత్ర ప్రదేశానికి; చనియెన్= వెళ్ళింది.

**తాత్పర్యం:** గంగాపుత్రుడిని గెలవటం ఎవరికినీ తరంకాదు; కనుక అతణ్ణి తపస్సుచేత గెలుస్తా'నని నిశ్చయించుకొని అంబ మునీశ్వరులు కొందరున్నట్టి ఒక పావన ప్రదేశానికి వెళ్ళిపోయింది.

**వ. చని వారలకుం దనవృత్తాంతం బెఱింగించిన వా 'రిది రాజులు చేసిన పని సాధులచేతఁ జక్కంబడునే' యనిన నవ్వనిత 'తపశ్చరణంబునకు వచ్చితి' ననుటయు, 'నీవు సుకుమారవు; నీకిది సొప్పడునే? తండ్రి పాలికిం బొ; మ్మదియ పరమ ధర్మం'బని పలికిన వారి కన్నారీరత్నం బిట్లనియె; 286**

**ప్రతిపదార్థం:** చని; వారలకున్+తన వృత్తాంతంబు= తన సమాచారం; ఎఱింగించినన్; వారు; ఇది రాజులు చేసిన పని; సాధులచేతన్; చక్కన్+పడునే?= అనుకూలించ గలదా? అనినన్; ఆ+వనిత= ఆమె; తపస్+చరణంబునకున్= తపస్సు సలుపుటకు; వచ్చితిన్; అనుటయున్= అని పలుకగా; నీవు సుకుమారవు= మృదువైన దానవు; నీకున్ ఇది; చొప్పడునే?= సాధ్యమగునా?; తండ్రిపాలికిన్+పొమ్ము; ఇదియ పరమధర్మంబు= ఉత్తమ ధర్మం; అని పలికినన్; వారికిన్; ఆ+నారీరత్నంబు= ఆ తరుణీమణి; ఇట్లు+ అనియెన్= ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అంబ వెళ్ళి ఆ మునీశ్వరులకు తన కథ సమస్తం చెప్పింది. వారు విని, 'ఇది రాజులు చేసినపని; సాధువుల చేత చక్కబడగలదా?' అని సమాధాన మిచ్చారు. అప్పుడు అంబ తాను తపస్సు చేయటానికి ఇక్కడికి వచ్చానని చెప్పింది. 'నీవు పరమ సుకుమారవు. తపస్సు చేయటం నీకు శక్యం కాదు. నీ తండ్రి దగ్గరకు వెళ్ళుము. ఇదే పరమ ధర్మం' అని మునులు చెప్పారు. వారికి ఆ వనితామణి ఇట్లా అన్నది:

**క. 'ఎవ్వరు నెఱుఁగక యుండఁగ । నివ్వనమునఁ దపముసేఁత యిది నిర్ణయ మే**
**నెవ్వారి కడకు నేమని । యెవ్విధిఁ బోనేర్చుదాన? నేటికి బంధుల్? 287**

**ప్రతిపదార్థం:** ఎవ్వరున్+ఎఱుఁగక+ఉండఁగన్= ఎవ్వరికీ తెలియకుండా; ఈ వనమునన్= ఈ అరణ్యంలో; తపముచేఁత= తపస్సు చేయటం; ఇది= ఇదే; నిర్ణయము= నా నిశ్చయం; ఏను= నేను; ఎవ్వారికడకున్= ఎవ్వరి దగ్గరకు; ఏమి+అని= ఏ మొగం పెట్టుకొని; ఏ+విధిన్= ఏ రీతిగా? పోన్+నేర్చుదానన్?= పోగలను? బంధుల్+ఏటికిన్?= చుట్టాలతో నాకు ఇక పనేముంది?

**తాత్పర్యం:** 'ఎవ్వరికీ తెలియకుండ ఈ అరణ్యంలో తపస్సుచేయటమే నా నిశ్చయం. నేను ఎవ్వరిదగ్గరకు ఏ మొగం పెట్టుకొని ఎట్లా వెళ్ళగలను? ఇక చుట్టాలతో నా కేమిపని?

**వ. అని చెప్పు నవసరంబున నయ్యాశ్రమంబునకు హోత్రవాహనుండను రాజర్షి వచ్చిన నమ్మును లభ్యాగత పూజలు చేసిన యనంతరంబ యంబం గనుంగొని 'యిక్కన్నియ యెక్కడిది? దీని విషాదంబునకుం గారణం బే?'మని యడిగి, వారివలన దాని జన్మప్రకారంబును దద్వృత్తాంతంబును విని, తన కూఁతుకూఁతు రగుట యెఱింగి యయ్యంగన వినం దపస్విజనంబులకుఁ జెప్పి, యప్పాలంతిం దన యంకతలంబున నునిచికొని వెండియు నడుగ సవిస్తరంబుగా నచ్చేడియ చెప్పిన విని, శోకించి యవ్విషమ ప్రకారంబునకు నిస్తారంబుఁ జింతించి. 288**

**ప్రతిపదార్థం:** అని చెప్పు+ అవసరంబునన్= అని చెప్పే సమయంలో; ఆ+ఆశ్రమంబునకున్= ఆ తపోవనమునకు; హోత్రవాహనుండు; అను; రాజ+ఋషి వచ్చినన్= రాజర్షి రాగా; ఆ+మునులు; అభ్యాగత పూజలు= అతిథి పూజలు; చేసిన; అనంతరంబ= పిమ్మట; అంబన్; కనుంగొని; ఈ+కన్నియ= ఈ బాల; ఎక్కడిది?= ఎక్కడనుంచి వచ్చింది?; దీని; విషాదంబునకున్= దుఃఖమునకు; కారణంబు; ఏమి+అని; అడిగి= హోత్రవాహనుడు ప్రశ్నించి; వారివలనన్= ఆ మునులవలన; దాని జన్మ ప్రకారంబును= ఆమె కాశీరాజ పుత్రిక అంబ అన్న విషయం; తద్+వృత్తాంతంబునున్= ఆమె భీష్ముడిచేత హస్తినకు కొనిరాబడి; సాళ్వునిచేత తిరస్కృతఅయి తపస్సు చేసికొనటానికి ఆ వనానికి వచ్చిన సంగతి; విని; తన కూఁతు కూఁతురు+అగుట= తన కొమార్తె బిడ్డ కావటం; ఎఱింగి; ఆ+అంగన వినన్= అంబ వినేటట్లు; తపస్వి జనంబులకున్+చెప్పి= మునుల కెఱింగించి; ఆ+పాలంతిన్= ఆ పడతిని; తన+అంకతలంబునన్+ఉనిచికొని= తన ఒడిలో కూర్చుండబెట్టుకొని;

వెండియున్ అడుగన్= మరల ఆమెనే అడుగగా; ఆ+చేడియ= ఆ చెలువ; సవిస్తరంబుగాన్= విపులంగా; చెప్పినన్= తన వృత్తాంతము తెల్పగా; విని; శోకించి= దుఃఖించి; ఆ+విషమ ప్రకారంబునకున్= ఆ విపరీత విధానానికి; నిస్తారంబున్+చింతించి= తరణోపాయం ఆలోచించి.

**తాత్పర్యం:** అని అంబ చెపుతున్న సమయంలో ఆ మునుల ఆశ్రమానికి హోత్రవాహనుడనే రాజర్షి వచ్చాడు. వారు ఆ మహాభాగునకు అతిథిపూజలు చేశారు. పిమ్మట హోత్రవాహనుడు అంబను చూచి 'ఈ కన్య ఎవరు? ఈమె దుఃఖానికి కారణమేమి?' అని మునులను ప్రశ్నించాడు. వారు ఆమె కాశీరాజ పుత్రికఅనీ, సాళ్వుడిని వరించినదనీ, భీష్ముడిచే బలాత్కారంగా హస్తినాపురికి కొనిరాబడిన కారణంవలన సాళ్వుడిచేత తిరస్కృతయై తపస్సు చేయటానికి ఇక్కడికి వచ్చినదనీ తెలిపారు. ఆ సంగతి విని అంబ తన దౌహిత్రి అని ఆమెతోపాటు మౌనులు ఆలకించగా హోత్రవాహనుడు చెప్పి, ఆ బాలామణిని తన ఒడిలో నిడుకొని మరల ఆమె వృత్తాంత మడిగాడు. ఆమె విపులంగా తన విషయం తెల్పగా విని అతడు దుఃఖించాడు. ఆమెను ఆ విషమ పరిస్థితినుండి తప్పించుటకు ఉపాయం ఆలోచించి.

**ఉ. 'నీ కిది యేటికిం దప? మనింద్యచరిత్రవు నీవు; నిన్ను నేఁ**
**చేకొని కాతు; నొక్క గతిఁ జెప్పెద, భార్గవరాము నాశ్రిత**
**శ్రీకరుఁ గాన్పు; మాపదలు చెందఁగనీఁ డతఁ డాశ్రయించినన్;**
**శోకము దక్కు' మన్న విని సుందరి యల్లన యత్తపస్వితోన్. 289**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; తపము+ఇది+ఏటికిన్?= ఇట్లా తపం చేయటమెందుకు?; నీవు అనింద్య చరిత్రవు= నీవు దూషింపదగని నడవడి కలదానవు; నిన్నున్= నిన్ను; నేన్= నేను; చేకొని= స్వీకరించి; కాతున్= రక్షిస్తాను; ఒక్కగతిన్= ఒక మార్గమును; చెప్పెదన్= నీకు తెలుపుతాను; ఆశ్రిత శ్రీకరున్= ఆశ్రయించినవారికి శుభములు కలిగించునట్టి; భార్గవరామున్= భృగువంశాన జనించిన పరశురాముడిని; కాన్పుము= దర్శించుము; అతఁడు= ఆ మహాత్ముడు; ఆశ్రయించినన్= తనను శరణు జొచ్చినచో; ఆపదలు చెందఁగన్+ఈఁడు= కష్టాలు పొందనియ్యడు; శోకము+తక్కుము= దుఃఖం వదలుము; అన్నన్= అని హోత్రవాహనుడు చెప్పగా; విని= ఆలకించి; సుందరి= అందగత్తెయగు అంబ; అల్లన= తిన్నగా; ఆ+తపస్వితోన్= ఆ మునీంద్రుడితో

**తాత్పర్యం:** 'నీవు తపస్సు చేయటమెందుకు? దోషంలేని నడవడి గలదానవు. నిన్ను నేను రక్షిస్తా. ఇందు కొకమార్గం చెపుతా. ఆశ్రయించినవారికి శుభాలిచ్చే భృగుకుల సంజాతుడైన పరశురాముడిని దర్శించు. తనను ఆశ్రయించిన వారికి కష్టాలు కలుగనివ్వక కాపాడుతాడు. అమ్మా! చింత మానుము' అని హోత్రవాహనుడు పలుకగా విని ఆ రాజర్షితో అంబ ఇట్లా అన్నది.

**ఆ. 'పరశురాముఁ గానఁబడయుట యెక్కడఁ । గలుగు? నాతఁ డెట్లు కరుణసేయు?'**
**ననఁ దపస్వి యిట్టు లను 'మహేంద్రంబను । పర్వతమునఁ జేయు పరమతపము. 290**

**ప్రతిపదార్థం:** పరశురామున్= పరశురాముడిని; కానన్+పడయుట= దర్శించ గలగటం; ఎక్కడన్= ఎచ్చోట; కలుగున్= సంప్రాప్తిస్తుంది? ఆతఁడు+ఎట్లు+కరుణ చేయున్?= భార్గవరాముడెట్లా కరుణిస్తాడు?; అనన్= అని అంబ అడుగగా; తపస్వి=

ఆ మౌని; ఇట్టులు+అనున్= ఈ విధంగా చెప్పాడు; మహేంద్రంబు+అను పర్వతమునన్= మహేంద్రగిరిలో; పరమ తపమున్+చేయున్= ఆయన గొప్ప తపస్సు చేస్తుంటాడు.

**తాత్పర్యం:** 'పరశురాముడిని ఎక్కడ దర్శించటానికి వీలవుతుంది? అతడు న న్నెలా కరుణించగలడు?' అని హోత్రవాహనుడిని అంబ అడుగగా, 'అతడు మహేంద్రశైలంలో ఘనతపశ్చర్యలో ఉంటాడు' అని ఆ రాజర్షి సమాధాన మిచ్చాడు.

**వ. నన్ను మన్నించుం గావున మదీయ దౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు; నందుఁ బొ'మ్మను సమయంబునం బరశురామశిష్యం డగు నకృతవ్రణుండను ముని వచ్చి, యతిథి సత్కారంబులం బూజితుండై యున్నఁ, బ్రియపూర్వకంబుగా నా హోత్రవాహనుండు 'భార్గవుం డెయ్యెడ నున్నవాఁ?'డని యడిగిన. నతం డిట్లనియె: 291**

**ప్రతిపదార్థం:** నన్నున్; మన్నించున్= ఆదరిస్తాడు; కావునన్= కనుక; మదీయ దౌహిత్రివి+ అగుటన్= నీవు నా కొమార్తె బిడ్డవని; ఎఱింగినన్= తెలిసికొంటే; నిన్నున్; రక్షించున్; అందున్+పొమ్ము= అక్కడికి వెళ్ళుము; అనుసమయంబునన్= అని హోత్ర వాహనుడు చెప్పేవేళకు; పరశురామ శిష్యుండు+అగు అకృతవ్రణుండు; అను ముని వచ్చి; అతిథి సత్కారంబులన్; పూజితుండు+ఐ= గౌరవింపబడి; ఉన్నన్; ప్రియపూర్వకంబుగాన్= ప్రేమపురస్సరంగా; ఆ హోత్రవాహనుండు; భార్గవుండు= పరశురాముడు; ఏ+ఎడన్= ఎచ్చోట; ఉన్నవాఁడు?= ఉన్నాడు; అని; అడిగినన్; అతండు= అకృతవ్రణుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'అమ్మా! పరశురాముడు నన్ను ఆదరిస్తాడు. నీవు నా కొమార్తె బిడ్డవు అని అతడు తెలిసికొంటే చాలు, తప్పక నిన్ను కాపాడుతాడు; కనుక అచటికి వెళ్ళుము' అని హోత్రవాహనుడు చెపుతున్న సమయంలో పరశురాముడి శిష్యుడైన అకృతవ్రణుడు అనే ముని అక్కడికి వచ్చాడు. అతిథి సత్కారాలు అందుకొన్న తరువాత స్నేహపూర్వకంగా హోత్రవాహనుడు 'భార్గవరాముడు ఇప్పు డెక్కడున్నాడు?' అని ప్రశ్నించగా అకృతవ్రణుడు ఇట్లా అన్నాడు:

**క. 'తన ప్రియసఖుఁడవు నీవని । మునిజనులకుఁ జెప్పుచుండు ముదమున నిన్నుం**
**గనుఁగొనఁగ నెల్లి యిచటికిఁ । జనుదెంచు ననేక శిష్య సంఘము తోడన్.' 292**

**ప్రతిపదార్థం:** నీవు; తన ప్రియసఖుఁడవు+అని= తనకు అనుంగు నెచ్చెలికాడవని; ముదమునన్= సంతోషంతో; మునిజనులకున్= మునీశ్వరులకు; చెప్పుచున్+ఉండున్= నిను గూర్చి చెపుతూ ఉంటాడు; నిన్నున్= నిన్ను; కనుఁగొనఁగన్= చూడటానికి; ఎల్లి= రేపు; అనేక శిష్య సంఘముతోడన్= పెక్కుమంది శిష్యులయొక్క సమూహంతో; ఇచటికిన్= ఇక్కడికి; చనుదెంచున్= వస్తాడు.

**తాత్పర్యం:** 'నీవు తనకు గారాబు మిత్రుడవని ఆయన మునీశ్వరులందరికీ సంతోషంతో చెపుతుంటాడు. నిన్ను చూడటానికి రేపు పలువురు శిష్యులతో బయలుదేరి వా రిక్కడికి వస్తారు.'

**తే. అనిన విని యెల్లవారును నధిక హర్ష । మెసఁగ నున్నంత మఱునాఁడ యేగుదెంచె**
**భార్గవుం; డమ్మునీంద్రులు పరమభక్తి । నర్చ లిచ్చిరి హోత్ర వాహనుఁడు గనియె. 293**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అకృతవ్రణుడు చెప్పగా ఆలకించి; ఎల్లవారును= అందరు; అధికహర్షము+ఎసఁగన్= మిక్కిలి సంతోషం అతిశయించగా; ఉన్న+అంతన్= ఉంటుండగా; మఱునాఁడు+అ= ఆ మరుసటిదినమే; భార్గవుండు= పరశురాముడు; ఏగుదెంచెన్= విచ్చేశాడు; ఆ ముని+ఇంద్రులు= అచ్చట ఉన్న మునీశ్వరులు; పరమభక్తిన్= మిక్కుటమైన భక్తితో; అర్చలు+ ఇచ్చిరి= పూజలు చేశారు; హోత్రవాహనుడు; కనియెన్= భృగురాముడిని చూచాడు.

**తాత్పర్యం:** అకృతవ్రణుడు పల్కినమాటలు విని అందరూ మిక్కిలి సంతోషించారు. వారట్లా ఆనందంతో ఉండగా మరునాడు పరశురాము డక్కడికి వచ్చాడు. వారు మిక్కిలి భక్తితో ఆయనకు అతిథి పూజలు సలిపారు. ఆ పిదప హోత్రవాహనుడు ఆయనను దర్శించాడు.

**వ. కని పరశురాముని సంభావనంబును సంభాషణంబును బడసి కాశిరాజు కన్యకం జూపి, 'యిది నా దౌహిత్రి; దీని వృత్తాంతం బంతయు విను' మని య మ్మానినిం గానిపించిన నదియును. 294**

**ప్రతిపదార్థం:** కని= చూచి; పరశురాముని సంభావనంబును= పరశురాముడి యొక్క ఆదరాన్ని; సంభాషణంబును= ప్రియపూర్వకమైన సల్లాపాన్ని; పడసి= పొంది; కాశిరాజు కన్యకన్+చూపి= భృగురాముడికి కాశీరాజుయొక్క పుత్రికను చూపి; ఇది= ఈమె; నా దౌహిత్రి= నా కొమార్తె బిడ్డ; దీని వృత్తాంతంబు= దీని సమాచారం; అంతయున్= సమస్తం; వినుము+ అని= ఆలకించుమని; ఆ+మానినిన్= ఆ నారీమణిని; కానిపించినన్= చూపగా; అదియును= అంబయు.

**తాత్పర్యం:** హోత్రవాహనుడు పరశురాముడిని సందర్శించి ఆతడి మన్ననలు పొందాడు. ప్రియపూర్వక సంభాషణ అయిన తరువాత కాశీరాజపుత్రికను చూపి, 'ఇది నా మనుమరాలు; కొమార్తెబిడ్డ. ఈమె కథనంతా ఆలకించు' మని అంబను చూపగా.

**చ. కనుఁగవ నశ్రుధార లొలుకం జరణానతయైన, రాముఁ డి**
**ట్లను 'విను హోత్రవాహనుని యట్టుల యేనును నీకు; నీ మనం**
**బునఁ గల చింతయంతయును బుచ్చెద; నాకడఁ జేరి తింక నీ**
**వనటఁ దొలంగఁబెట్టి గరువంబుగఁ జెప్పుము దీని మూలమున్. 295**

**ప్రతిపదార్థం:** కనుఁగవన్= రెండు కనులనుండి; అశ్రుధారలు+ఒలుకన్= కన్నీటి ధారలు కారగా; చరణ+ఆనత+ఐనన్= తన పాదాలపై వ్రాలగా; రాముఁడు= పరశురాముడు; ఇట్లు+అనున్= ఈ రీతిగా పలికాడు; విను(ము)= అమ్మా! ఆలకించు; నీకున్= నీకు; ఏనును= నేనుకూడ; హోత్రవాహనుని+అట్టుల= హోత్రవాహను డెట్లో అట్లే తాతనని తలంచుము; నీ మనంబునన్+కల= నీ హృదయంలో ఉన్న; చింత+అంతయును= విచారాన్నంతా; పుచ్చెదన్= తొలగిస్తాను; నా కడన్+ చేరితి(వి)= నా దగ్గరకు వచ్చావు; ఇంకన్= ఇక; నీ వనటన్+తొలంగన్+పెట్టి= నీ దుఃఖాన్ని దూరంగా ఉంచి; గరువంబునన్= ధైర్యంగా; దీనిమూలమున్= నీ విషాదానికి గల కారణాన్ని; చెప్పుము= నా కెరిగింపుము.

**తాత్పర్యం:** రెండు కనులనుండి కన్నీటిధారలు కారుతుండగా తన పాదాలపై వ్రాలిన అంబను జూచి పరశురాము డిట్లా అన్నాడు: 'తల్లీ! నీకు హోత్రవాహను డెట్లో నేనూ అట్లే. నీవు నన్నాశ్రయించావు. నీ మదిలో నెలకొన్న దుఃఖమంతా తొలగిస్తాను. ఇక విచారం వీడి ధైర్యంతో నీ మనస్తాపానికి హేతువైన వృత్తాంతం నాకు చెప్పు.'

**వ. అనిన విని యమ్మహాత్మునకు నంబ దనవృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పి 'నీ వార్తశరణ్యుండవు; నా పరిభవంబు దీర్చి నన్ను రక్షింపు'మనవుడు నతం డిట్లనియె: 296**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఆ+మహా+ఆత్మునకున్; అంబ; తన వృత్తాంతంబు+అంతయున్= తనచరిత్రనంతా; సవిస్తరంబుగాన్+చెప్పి= విపులంగా నుడివి; నీవు; ఆర్త శరణ్యుండవు= ఆర్తులకు రక్షకుడవు; నా పరిభవంబు+తీర్చి= నా అవమానమును తొలగించి; నన్నున్; రక్షింపుము; అనవుడున్= అని అంబ చెప్పగా; అతండు= పరశురాముడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పరశురాముడి పల్కులు విని అంబ ఆ మహానుభావుడికి తన సంగతి అంతా విపులంగా వెల్లడించి, 'దేవా! నీవు దీనరక్షకుడవు. నా అవమానం బాపి నన్ను కాపాడు'మని పల్కింది. అపుడు పరశురాము డిట్లాఅన్నాడు.

**క. 'పరిభవము రెండు దెఱఁగులఁ । దరుణీ తోఁచినది; సాళ్వుఁ దగఁ దేర్తునొ? యు**
**ద్ధురుఁ డగు భీష్మునిఁ దీర్తునొ; । కరము ప్రియంబెద్ది హృదయగతముం జెపుమా!' 297**

**ప్రతిపదార్థం:** తరుణీ!= అంబా!; పరిభవము= నీకు కల్గిన అవమానం; రెండు తెఱఁగులన్= రెండు విధాలుగా; తోఁచినది= నాకు గోచరించింది; సాళ్వున్= సాళ్వుడిని; తగన్= తగినట్లు; తేర్తునొ?= శిక్షింతునో?; ఉద్ధురుఁడు+అగు= గర్వితుడైన; భీష్మునిన్= గాంగేయుడిని; తీర్తునొ?= దండింతునో?; కరము ప్రియంబు+ఎద్ది= నీ కీ రెండు విధాలైన చర్యలలో మిక్కిలి ఇష్టమైన దేదో; హృదయగతమున్+చెపుమా!= నీ మనసులోని విషయం నాకు తెలుపుము.

**తాత్పర్యం:** 'అంబా! నీకు గల్గిన అవమానమునకు రెండు కారణాలు నాకు తోచాయి. సాళ్వుని శిక్షించుమంటావా? భీష్ముని దండించుమంటావా? ఈ రెంటిలో ఏది నీ మనసుకు మిక్కిలి ఇష్టమో దానిని చెప్పు'.

**చ. అనవుడు నింతి యిట్లను 'మహాపురుషా! నను సాళ్వుఁ డింకఁ గై**
**కొనఁ; డది సాలు; భీష్ముదెసఁ గోపము నా మది గల్గియుండు; నా**
**తని వధియింపఁ బూని యిటు తాపసవృత్తికి వచ్చి యిచ్చటన్**
**నినుఁ గని యీ పరాభవము నీఁగఁగ నీ శరణంబుఁ జొచ్చితిన్. 298**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పరశురాముడు పలుకగా; ఇంతి= అంబ; ఇట్లు+అనున్= ఈరీతిగా చెప్పింది; మహాపురుషా!= ఓ మహానుభావా!; ననున్= నన్ను; సాళ్వుఁడు= సాళ్వభూపతి; ఇంకన్+కైకొనఁడు= ఇక నన్ను భార్యగా స్వీకరించడు; అది చాలు= కనుక అతడిని దండించనక్కరలేదు; భీష్ముదెసన్= భీష్ముడి విషయంలో; కోపము= క్రోధం; నా మదిన్= నా హృదయంలో; కల్గి+ఉండున్= కలిగిఉన్నది; ఆతనిన్= గాంగేయుడిని; వధియింపన్+పూని= చంపటానికి నిశ్చయించి; ఇటు తాపసవృత్తికిన్ వచ్చి= ఈ రీతిగా తపస్సు చేయాలని వచ్చి; ఇచ్చటన్= ఈ ఆశ్రమంలో; నినున్+కని= నిన్ను దర్శించి; ఈ పరాభవమున్+నీఁగఁగన్= ఈ అవమానం తొలగించుకొనుటకై; నీ శరణంబున్+చొచ్చితిన్= నిన్ను రక్షకుడిగా ఆశ్రయించాను.

**తాత్పర్యం:** పరశురాముడి పలుకులు విని అంబ ఇట్లన్నది: 'మహాత్మా! నన్ను సాళ్వు డిక పత్నిగా స్వీకరించడు. అతడిని దండించి ఫలం లేదు. నన్ను బలాత్కారంగా హస్తినకు తెచ్చిన భీష్ముడిపై నాకు మనసులో కోపముంది. అతడిని చంపటానికై తపస్సు చేయవలెనని ఇక్కడికి వచ్చాను. నిన్ను దర్శించి ఈ అవమానం తొలగించు కొనటానికి నీ శరణు జొచ్చాను.'

**తే. అనిన 'నా చెప్పినట్ల గంగాత్మజుండు । సేయుఁ; జేయక తక్కిన శితశరముల**
**నతనిఁ బడవైతు; నూఱడు మబల! నీకుఁ । దపము సేయంగ నేటికిఁ దనువు డయ్య?' 299**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అంబ పలుకగా; నా చెప్పిన+అట్లు+అ= నేను వచించినవిధంగా; గంగా+ఆత్మజుండు= గంగకొడుకు భీష్ముడు; చేయున్= ఆచరిస్తాడు; చేయక తక్కినన్= ఆచరించకుంటే; శితశరములన్= వాడి బాణాలతో; అతనిన్+పడన్+వైతున్= వాడిని నేలగూలుస్తాను; ఊఱడుము= ఓర్చుకో! అబల!= అంబా!; తనువు డయ్యన్= శరీరం బడలిపోగా; నీకున్= నీకు; తపము చేయంగన్+ఏటికిన్= తపస్సు చేయటం ఎందుకు?

**తాత్పర్యం:** 'నేను చెప్పినట్లు గాంగేయుడు చేస్తాడు. చేయకపోతే వాడిబాణాలతో వాడిని కూల్చివేస్తాను. ఓర్చుకో. శరీరం శుష్కించగా నీవు తపస్సు చేయవలసిన అక్కర లేదు.'

### పరశురాముఁ డంబం దోడుకొని భీష్ముని యొద్దకు వచ్చుట (సం. 5-178-23)

**క. అని పలికి పరశురాముఁడు । సనుదెంచెను మునిజనంబు సమ్మదమునఁ దోఁ**
**జనుదేరఁ గురుక్షేత్రం । బున కుద్ధతిఁ గాశిరాజపుత్రిం గొనుచున్. 300**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వచించినవాడై; పరశురాముఁడు= భార్గవరాముడు; మునిజనంబు= మునీశ్వరులు; సమ్మదమునన్= సంతోషంతో; తోన్+చనుదేరన్= తన వెంబడి రాగా; కాశిరాజపుత్రిన్+కొనుచున్= కాశీరాజు కొమార్తెను తీసికొని; కురుక్షేత్రంబునకున్= కురుక్షేత్రమనే ప్రదేశానికి; ఉద్ధతిన్= దర్పంతో; చనుదెంచెను= వచ్చాడు.

**తాత్పర్యం:** అట్లా అంబతో పలికి పరశురాముడు మునీశ్వరులు హర్షంతో తనవెంట రాగా, కాశీరాజకుమారిని తోడ్కొని దర్పంతో కురుక్షేత్రానికి వచ్చాడు.

**వ. వచ్చి సరస్వతీతీరంబున విడిసి, తనరాక నా కెఱింగించిన, నేను ఋత్విక్పురోహిత ప్రభృతి విశిష్ట బ్రాహ్మణ సమేతంబుగాఁ బూజాద్రవ్యంబులు గొని తత్ప్రదేశంబున కరిగిన, నమ్మహాత్ముండును మదీయ భక్తి వినయ సంభ్రమంబులు సంప్రీతి నభినందించి యర్చనలు గైకొని కాశిరాజకన్యకం జూపి నాతో నిట్లనియె: 301**

**ప్రతిపదార్థం:** వచ్చి; సరస్వతీ తీరంబునన్= సరస్వతీ నది ఒడ్డున; విడిసి= నిలిచి; తనరాక; నాకున్; ఎఱింగించినన్; నేను; ఋత్విక్+పురోహిత ప్రభృతి= ఋత్విజులు పురోహితులు మున్నగు; విశిష్ట= ఆచార సంపన్నులైన; బ్రాహ్మణసమేతంబుగాన్= బ్రాహ్మణులతోకూడ; పూజాద్రవ్యంబులు కొని= పూజకొరకై వస్తువులు తీసికొని; తద్+ప్రదేశంబునకున్= పరశురాము డున్న చోటికి; అరిగినన్; ఆ+మహా+ఆత్ముఁడు= ఆ మహానుభావుడు; మదీయభక్తి వినయ సంభ్రమంబులు= నా యొక్క భక్తి, అణకువ, హర్షము; సంప్రీతిన్= మిక్కిలి తృప్తితో; అభినందించి= కొనియాడి; అర్చనలు కైకొని= నా చేయు పూజలు స్వీకరించి; కాశిరాజ కన్యకన్+చూపి; నాతోన్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పరశురాముడు అట్లా బయలుదేరి వచ్చి సరస్వతీ నదీతటంలో దిగి తాను వచ్చినట్లు నాకు చెప్పి పంపాడు. నేను ఋత్విజులు, పురోహితులు మొదలైన సదాచార సంపన్నులైన బ్రాహ్మణులతో పూజాద్రవ్యాలు తీసుకొని అక్కడికి వెళ్ళాను. ఆ మహానుభావుడు నా భక్తిని, వినయమును, సంతోషమును మిక్కిలి ప్రీతితో మెచ్చి నేను చేసే పూజలు స్వీకరించాడు. ఆ తరువాత కాశీరాజ కన్యఅయిన అంబను చూపి ఇట్లా అన్నాడు:

**తే. 'బలిమి మున్నేల తెచ్చి తిప్పడఁతి? మగుడఁ । ద్రోచిపుచ్చంగఁదగునయ్య నీచవృత్తి?**
**వచ్చె దీనిఁ దమ్మునికి వివాహమింక । నైనఁ జేయుము; చేయమి యనుచితంబు.' 302**

**ప్రతిపదార్థం:** బలిమిన్= బలవంతంగా; మున్ను= పూర్వం; ఈ+పడఁతిన్= ఈ కోమలిని; ఏల తెచ్చితి(వి)= ఎందుకు తీసుకువచ్చావు? నీచవృత్తిన్= అల్పుని చందంగా; మగుడన్= మరల; త్రోచిపుచ్చంగన్+తగును+అయ్య!= తిరస్కరించటం ఉచితమా?; వచ్చెన్= ఈ కన్య వచ్చినది; దీనిన్= ఈమెను; తమ్మునికిన్= విచిత్రవీర్యుడికి; వివాహము= పెండ్లి; ఇంకన్+ఐనన్+ చేయుము= ఇకనైనా చేయవలసింది; చేయమి= పెండ్లి చేయకుండటం; అనుచితంబు= తగనిపని.

**తాత్పర్యం:** 'బలాత్కారంగా ఈ కన్యను మొదట ఏల తెచ్చావు? తెచ్చితివిపో అల్పుడివలె మరల నీమెను తిరస్కరించటం న్యాయమా? ఈమె తిరిగి వచ్చింది. నీ తమ్ముడికి ఈమె నిచ్చి ఇకనైనా పెండ్లి కావించు. ఇట్లా పెళ్ళి చేయకుండటం సముచితం కాదు.'

**క. అనుటయు 'ననఘా! తెలియన్ । విను మిది నాతోడ 'సాళ్వవిభునకు నేఁ గూ**
**ర్చినదాన నతనిపాలికి । ననుపుము న' న్ననినఁ గాదె యనిచితి మగుడన్. 303**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పరశురాముడు పలుకగా; అనఘా!= పుణ్యాత్ముడా!; తెలియన్ వినుము= నా మాటలు స్పష్టంగా ఆలకించుము; ఇది= ఈమె; నాతోడన్= నాతో; సాళ్వవిభునకున్= సాళ్వపతికి; నేన్+కూర్చినదానన్= నేను ఇష్టురాలను; అతని పాలికిన్= అతడి దగ్గరకు; నన్నున్= నన్ను; అనుపుము= పంపుము; అనినన్+కాదె= అని చెప్పటం వలన కదా; మగుడన్= తిరిగి; అనిచితిన్= పంపాను?

**తాత్పర్యం:** పరశురాముడి పలుకులు విని నేను, 'మహాత్మా! నా మాటలు చక్కగా విను. ఈమె నాతో 'సాళ్వవిభుడికి నేను ఇష్టురాలను, అతడి దగ్గరకు నన్ను పంపుము' అని అడిగినందువల్ల గదా నే నీమెను తిరిగి అతడి కడకు పంపాను.

**తే. ఇంక నా తమ్మునికి దీని నెట్లు పెండ్లి । సేయ నేరుతు?' ననుడు 'నా చెప్పినట్లు**
**సేయ వైతేని నిన్ను నీ చెలులఁ జుట్ట । ములను జంపుదు' ననియె నమ్మునివరుండు. 304**

**ప్రతిపదార్థం:** ఇంకన్= మఱి; నా తమ్మునికిన్= నా అనుజుడైన విచిత్రవీర్యుడికి; దీనిన్= ఈమెను; ఎట్లు పెండ్లి చేయన్ నేరుతున్?= ఎట్లా వివాహం చేయగలను?; అనుడున్= అని నేననగా; ఆ+మునివరుండు= ఆ మునీశ్వరుడు; నా చెప్పినట్లు= నేను చెప్పిన విధంగా; చేయవైతి(వి)+ఏని= నీవు చేయకపోతే; నిన్నున్= నిన్నును; నీ చెలులన్= నీ మిత్రులను; చుట్టములను= బంధువులను; చంపుదున్+అనియెన్= సంహరిస్తా నన్నాడు.

**తాత్పర్యం:** మరి నా తమ్ముడికి ఈమె నిచ్చి ఎట్లా పెళ్ళి చేయగలను?' అని నేనన్నాను. అందుకు ఆ మునీంద్రుడు 'నేను చెప్పినట్లు నీవు చెయ్యకపోతే నిన్నూ, నీ స్నేహితులనూ, నీ చుట్టాలనూ చంపుతా'నన్నాడు.

**వ. ఏను వినయంబు వదలక వినతుండ నగుచు వివిధ వాక్యంబులం దెలుప, నంతకంతకు నతనికిఁ గోపం బగ్గలంబైన వెండియు. 305**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; వినయంబున్ వదలక= అణకువను వీడక; వినతుండన్+అగుచున్= నమస్కారాలు చేస్తూ; వివిధ వాక్యంబులన్= అనేక వచనాలతో; తెలుపన్= నా అభిప్రాయం చెప్పగా; అంతకున్+అంతకున్= క్షణ క్షణానికి; కోపంబు; అగ్గలంబు+ఐనన్= మిక్కుటం కాగా; వెండియున్= మరల.

**తాత్పర్యం:** నేను వినయం వీడక అణకువతో నమస్కరిస్తూ పలు రకాలైన మాటలతో మనవి చేసుకొన్నాను. కాని, ఆయనకు అంతకంతకూ ఆగ్రహం హెచ్చింది.

**ఆ. 'గురుఁడవై సమగ్ర కోదండ విద్యా మ । హత్త్వ మిచ్చినాఁడ వలుగఁ దగునె**
**కారణంబు లేక యీరసమెత్తి యి?' । ట్లనినఁ బరశురాముఁ డాగ్రహమున. 306**

**ప్రతిపదార్థం:** గురుఁడవు+ఐ= నాకు ఆచార్యుడవై; సమగ్ర= పరిపూర్ణమైన; కోదండ విద్యా మహత్త్వము= ధనుర్విద్యయందలి గొప్పతనం; ఇచ్చినాఁడవు= అనుగ్రహించావు; కారణంబు లేక= హేతువు లేకుండ; ఈరసము+ఎత్తి= ఈర్ష్య వహించి; అలుగన్+తగునె?= నాపై కోపమూనటం యుక్తమా?; అనినన్= అని నేననగా; పరశురాముఁడు= భార్గవరాముడు; ఆగ్రహమునన్= కినుకతో.

**తాత్పర్యం:** 'నీవు నాకు గురుదేవుడవు. పరిపూర్ణమైన ధనుర్విద్యాపాండిత్యం ప్రసాదించావు. అట్టి నీవు నిష్కారణంగా ద్వేషం పూని నాపై కోపం వహించటం తగునా?' అని నే నన్నాను. అపుడు పరశురాము డాగ్రహిస్తూ.

**చ. 'గురుఁడని నన్నెఱుంగు దనఘుండవు నా వచనంబునం దనా**
**దరణము సేసి తెన్నియొ విధంబులఁ బల్కెదు భక్తితోడ, నీ**
**వెరవులు దక్కు మీ! యబల వేగమ పెండిలిసేయు మంతతో**
**మరలు మదీయ కోప శిఖి; మానదు వేఱొక వేయుఁ జేసినన్? 307**

**ప్రతిపదార్థం:** గురుఁడు+అని= ఆచార్యుడనని; నన్నున్+ఎఱుంగుదు= నన్ను తెలుసు; అనఘుండవు= పాపమెరుగనివాడవు; నా వచనంబునందున్= నా మాటయెడ; అనాదరణము చేసితి(వి)= అగౌరవం చూపితివి; భక్తితోడన్= భక్తితో; ఎన్నియొ విధంబులన్+పల్కెదు(వు)= ఎన్నో రకాలుగా మాట్లాడుతున్నావు; నీ వెరవులు తక్కుము= నీ యుక్తులు మానుకొమ్ము. ఈ+అబలన్= ఈ మగువను; వేగమ= శీఘ్రమే; పెండిలి చేయుము= నీ తమ్మునకిచ్చి వివాహం చేయుము; అంతతోన్= అంతటితో; మదీయ కోపశిఖి= నా క్రోధాగ్ని; మరలున్= చల్లారుతుంది; వేఱు+ఒకవేయున్+చేసినన్= ఇందుకు భిన్నంగా వేయి పనులు చేసినప్పటికినీ; మానదు= శమించదు.

**తాత్పర్యం:** 'నేను నీకు గురువునని తెలుసు. ఏ దోషమెరుగని వాడవైననూ నా మాటను అలక్ష్యం చేశావు. భక్తితో ఎన్నో రీతుల మాటాడుతున్నావు. ఈ ఉపాయాలన్నీ కట్టిపెట్టు. ఈమెను వెంటనే నీ తమ్ముడి కిచ్చి పెండ్లి చేయుము. అంతటితో నా కోపాగ్ని చల్లారుతుంది. నీ వీ పనిచేయక మరి వేయిపనులు చేసినా నా క్రోధానలం శమించదు.'

**వ. అనిన విని 'యధర్మాచరణంబున కింతవట్టి పెనంగనగునె? పరానురక్తచిత్తయగు మగువ నిల్లాలిం జేయువారుం గలరె? యిట్టి యకృత్యం బాచరించుకంటె నీచేత నెట్లయినను లెస్స; తొల్లి పెద్దలు సెప్పిన చొప్పవధరింపు' మని యిట్లంటి. 308**

**ప్రతిపదార్థం:** అనినన్ విని; అధర్మ+ఆచరణంబునకున్= అధర్మం ఆచరించటానికి; ఇంత+పట్టి పెనంగన్+అగునె?= ఇంతగా పట్టుకొని పెనగులాడవలెనా?; పర+అనురక్త చిత్త+అగు= ఇతరుడి యందు మమత నిండిన మనస్సుగల; మగువన్= పడతిని; ఇల్లాలిన్ చేయువారున్ కలరె= గృహిణిని కావించువారున్నారా?; ఇట్టి; అకృత్యంబు= చేయరానిపని; ఆచరించుకంటెన్= చేయటంకంటె; నీచేతన్= నీవలన; ఎట్లు+అయినన్ లెస్స= ఎట్లా జరిగినా మంచిదే; తొల్లి= పూర్వం; పెద్దలు చెప్పినచొప్పు= పెద్దలు నుడివిన మార్గం; అవధరింపుము= చిత్తగించుము; అని ఇట్లు+ అంటిన్= పరశురాముడితో ఇట్లా పలికాను.

**తాత్పర్యం:** పరశురాముడు పలికిన పలుకులు విని నేను 'అధర్మాచరణనిమిత్తమై ఇంత గట్టిగా పట్టుకొని పెనగులాడటం మీ కేమి న్యాయం? పరపురుషుడి యందు మనసు తగిలిన మగువను మరొకడి కిచ్చి పెండ్లి చేసేవారు ఎక్కడైనా ఉన్నారా? ఇట్లాంటి చేయరాని పని చేసేదానికన్నా, మీ వల్ల ఏమి జరిగినా మంచిదే. వెనుకటికి పెద్దలు చెప్పిన విధ మొకటున్నది. చెపుతాను వినండి' అని నే నిలా అన్నాను.

**తే. 'గర్వియై కార్య మిట్టి దకార్యమిట్టి । దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ**
**దిరుగ కున్మదవృత్తి వర్తించునట్టి । వాని గురునైన దండింప వలయు నండ్రు.' 309**

**ప్రతిపదార్థం:** గర్వి ఐ= అహంకారం కలవాడై; కార్యము+ఇట్టిది= చేయదగిన పని ఇట్లాంటిది; అకార్యము+ఇట్టిది= చేయదగనిపని ఇటువంటిది; అని+ఎఱుంగక= అని తెలియక; లోకంబు చను పథమునన్= లోకులు నడచే మార్గంలో; తిరుగక= మెలగక; ఉన్మదవృత్తిన్= వెర్రితనంతో; వర్తించునట్టి వానిన్= మెలగునట్టివాడిని; గురున్+ఐనన్= గురువునైనను; దండింపన్+వలయున్+ అంద్రు= శిక్షించవలెనని పెద్దలు చెపుతారు.

**తాత్పర్యం:** 'అహంకారంతో ఇది చేయదగినపని, ఇది చేయరానిపని అని తెలిసికొనకుండా ప్రజలు నడిచే మార్గంలో నడవక, వెర్రియై ఎవడు ప్రవర్తిస్తాడో అతడు గురువైనా దండనార్హుడని పెద్దలు చెపుతారు.'

**క. అను మాటకుఁ గాలానల । మును బోలెను మండి 'కయ్యమున కాయితమై**
**మొనలేర్చి వేగ యిచటికిఁ । జనుదెమ్మని భార్గవుండు సంరంభమునన్. 310**

**ప్రతిపదార్థం:** అనుమాటకున్= అని నేనన్న మాటకు; భార్గవుండు= పరశురాముడు; కాల+అనలమును+పోలెను= ప్రళయకాలములోని అగ్నివలె; మండి= ప్రజ్వలించి; సంరంభమునన్= ఆటోపంతో; కయ్యమునకున్= యుద్ధానికి; ఆయితము+ఐ= సిద్ధమై; మొనలు+ఏర్చి= వ్యూహాలను సిద్ధపరిచి; ఇచటికిన్= ఇక్కడికి (యుద్ధానికి వ్యూహం సిద్ధంచేసిన చోటుకు); వేగ= త్వరగా; చనుదెమ్ము+అని= రమ్మని.

**తాత్పర్యం:** నేనాడిన మాటకు పరశురాముడు ప్రళయాగ్ని వలె మండిపడ్డాడు. యుద్ధానికి సిద్ధమై సేనా వ్యూహాలు పన్నుకొని ఆటోపం ప్రదర్శించి, 'శీఘ్రమే ఇక్కడికి రా' అంటూ.

**వ. పలికిన నేనును. 311**

**ప్రతిపదార్థం:** అట్లా పరశురాముడు పలుకగా నేనున్నూ.

**క. 'చులుకఁదనంబున విప్రున । కలుగంగాఁ దగదు; గురుఁడునై యున్నాఁ డం**
**చలయక తలఁచితిఁ గా కిటు । నిలుమీ! నీ రణము సేఁత నిజమగునేనిన్. 312**

**ప్రతిపదార్థం:** చులుక+తనంబునన్= గౌరవహీనంగా; విప్రునకున్= బ్రాహ్మణుడికి; అలుగంగాన్+తగదు= కోపించరాదు; గురుఁడును+ఐ+ఉన్నాఁడు= గురువుగా కూడ ఉన్నాడు; అంచున్= అని; అలయక= కోపింపక; తలఁచితిన్+కాక= భావించితినేగాని; నీ రణముచేఁత= నీవు నాతో యుద్ధం చేయటం; నిజము+అగునేనిన్= సత్యమైతే; ఇటు నిలుమీ!= నా మ్రోల ధైర్యంగా నిలబడుమా?

**తాత్పర్యం:** 'గౌరవహీనంగా బ్రాహ్మణులయెడ కోపించటం పనికిరాదు. అందునా గురుడవై ఉన్నావని విసువక భావించాను. అంతేకాని భయంవల్ల కాదు. నీవు యుద్ధంచేయటం నిజమైతే ఇక నిలబడు.

**క.** **క్షత్రియులఁ దొల్లి యలుకకుఁ। బాత్రము సేసితటె? నాఁడు బలియుఁడు గంగా**
**పుత్త్రుఁడు పుట్టమిఁగా కిది। యీ త్రయి నింకేల చెల్లు? నెఱుఁగవె నన్నున్!** **313**

**ప్రతిపదార్థం:** క్షత్రియులన్= రాచవారిని; తొల్లి= మునుపు; అలుకకున్= నీ ఆగ్రహానికి; పాత్రము చేసితి(వి)+అటె!= గురి కావించావని చెపుతారు; నాఁడు= అప్పుడు; బలియుఁడు= బలవంతుడైన; గంగా పుత్త్రుఁడు పుట్టమిన్+కాక= గాంగేయుడు జన్మించని కారణాన చెల్లింది; ఇది= ఈ క్షత్రియవంశ విధ్వంసనం; ఈ త్రయిన్= ఈ ముల్లోకాలలో; ఇంకన్= ఇకమీదట; ఏల చెల్లున్?= ఎట్లు సాగుతుంది?; నన్నున్= నన్ను; ఎఱుఁగవె?= తెలియవా?

**తాత్పర్యం:** పూర్వం నీవు రాచవారిని నీ క్రోధానికి గురి కావించావని చెపుతారు. ఆనాడు గాంగేయుడు జన్మించని కారణంతో అట్లా జరిగిఉంటుంది. ఇపుడు భీష్ము డున్నాడు. ఇక ముల్లోకాలలో నీ ఆగడం సాగదు. నా బలవిక్రమా లెలాంటివో నీ వెరుగవా?

**క.** **ఏ నొకరుండన వచ్చెదఁ। గాని బలము దేను; నీవు గఱపిన శస్త్రా**
**స్త్రానేక విధవిలాసము। దాన వలయు సేన గాదె! తథ్యం బరయన్'.** **314**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఒకరుండన్+అ= ఒక్కడనే; వచ్చెదన్+కాని= వస్తానేతప్ప; బలము+తేను= సైన్యాన్ని వెంటబెట్టుకొనిరాను; తథ్యంబు+అరయన్= వాస్తవం పరికిస్తే; నీవు కఱపిన= నీవు నేర్పిన; శస్త్ర+అస్త్ర= శస్త్రాస్త్రములయొక్క; అనేకవిధవిలాసము= పెక్కు తెఱగులైన క్రీడ; తాన్+అ= తానే; వలయుసేన కాదె!= కావలసిన సైన్యమౌతుంది కదా!

**తాత్పర్యం:** నిజము గమనిస్తే నీవు నేర్పిన శస్త్రాస్త్రవిద్యా విశేషమే నాకు కావలసినంత సైన్యమై ఉండగా, నేను బలగాన్ని వెంటబెట్టుకొనిరాను. యుద్ధానికి ఒక్కడనే వస్తాను.'

**వ.** **అని పలికి యతనికిం బ్రణమిల్లి చనుదెంచి, సత్యవతి కింతయు విన్నవించి, యద్దేవి యనుమతి వడసి, సర్వసన్నాహ సమేతంబగు రథం బెక్కి విప్రాశీర్వాదంబులు చెలంగ వెడలి వచ్చి కురుక్షేత్రంబు దఱియం జనునెడ, భాగీరథి భామినీ రూపంబున నరుగుదెంచి 'తన్నెఱింగించి, మదీయభక్తి నభినందించి యే నాయితంబై పోవుటకుఁ గారణం బడిగి, నా చేత నత్తెఱం గెఱింగినదియై నన్నుం గినిసి, భార్గవుపాలికిం జని 'నీ శిష్యుండు నిరపరాధుండు నా కొడుకున కలుగం దగునే?' యని చెప్పి, యతని యందుఁ బిక్కు గానక మగుడ నేతెంచి, నావలనను మెత్తంబాటులేకున్నం జనియె; నప్పుడు సిద్ధ విద్యాధర ముని గణంబులు గౌతుకంబునం గనుంగొనుచుండ నేను జమదగ్ని తనయున కనతిదూరంబునం దేరుడిగి వినతుండనై**

**నిలిచి 'నీవు భూచారివై యున్నవాఁడవు; రథికుండనైన నాకు నీతోడ సమరంబు చేయనగునే?' యనిన యనంతరంబ యతండు దివ్యంబులగు రథ రథ్యంబులు శస్త్రాస్త్రంబులునుం గలిగి యకృతవ్రణుండు సారథిగా సమర సన్నద్ధుండై తోఁచినం జూచి రథారోహణంబు చేసి శంఖంబు పూరించి గుణంబు సారించి సూతు నగ్గించి తనకు నమస్కరించి కడంగిన నప్పరశురామదేవుండు. 315**

**ప్రతిపదార్థం:** అని పలికి; అతనికిన్= పరశురాముడికి; ప్రణమిల్లి= నమస్కరించి; చనుదెంచి= వచ్చి; సత్యవతికిన్; ఇంతయున్= ఈ విషయమంతా; విన్నవించి; ఆ+దేవి+అనుమతి; పడసి= పొంది; సర్వసన్నాహసమేతంబు+అగు= సర్వసన్నాహాలతో కూడిన; రథంబు+ఎక్కి; విప్ర+ఆశీర్వాదంబులు; చెలంగన్= అతిశయించగా; వెడలివచ్చి; కురుక్షేత్రంబు; తఱియన్+చను+ఎడన్= సమీపించే సమయంలో; భాగీరథి= గంగానది; భామినీ రూపంబునన్= స్త్రీ రూపంతో; అరుగుదెంచి; తన్నున్+ఎఱింగించి= తాను గంగనని చెప్పి; మదీయభక్తిన్= నా భక్తిని; అభినందించి= మెచ్చి; ఏను= నేను; ఆయితంబు+ఐ= సిద్ధమై; పోవుటకున్+ కారణంబు+అడిగి; నాచేతన్; ఆ+తెఱంగు= ఆ విషయం; ఎఱింగినది+ఐ; నన్నున్; కినిసి= కోపించి; భార్గవుపాలికిన్+చని; నీ శిష్యుండు; నిరపరాధుండు= తప్పులేనివాడు; నా కొడుకునకున్; అలుగన్+తగునే; అని చెప్పి; అతని యందున్= ఆ భార్గవరాముడిలో కూడ; పిక్కు+కానక= వెనుదీయటం చూడక; మగుడన్= మరల; ఏతెంచి; నా వలనను= నా వైపు కూడ; మెత్తంబాటు లేకున్నన్= మృదుత్వము లేనందున; చనియెన్= ఆమె వెళ్ళింది; అప్పుడు; సిద్ధ విద్యాధర ముని గణంబులు= సిద్ధులు విద్యాధరులు మౌనులు అనువారియొక్క సమూహాలు; కౌతుకంబునన్= కుతూహలంతో; కనుంగొనుచున్+ఉండన్; నేను; జమదగ్ని తనయునకున్= జమదగ్ని కుమారుడైన పరశురామునికి; అనతి దూరంబునన్= సమీపమందు(చేరువలో); తేరుదిగి; వినతుండను+ఐ= నమస్కరించినవాడనై; నిలిచి= ఆగి; నీవు భూచారివి+ఐ+ఉన్నవాఁడవు= నీవు నేలమీద సంచరిస్తున్నావు; రథికుండన్+ఐన+నాకున్= రథమెక్కిఉన్న నాకు; నీతోడన్= నీతో; సమరంబు+చేయన్+అగునే?= యుద్ధం చేయదగునా? అనినన్+అనంతరంబ= అని నేను పల్కిన పిమ్మట; అతండు; దివ్యంబులు+అగు= దేవ సంబంధములైన; రథ రథ్యంబులు= రథం, గుర్రాలు; శస్త్ర+అస్త్రంబులున్+కలిగి; అకృతవ్రణుండు= పరశురాముడి శిష్యుడు; సారథి కాన్= రథం నడపేవాడు కాగా; సమరసన్నద్ధుండు+ఐ తోఁచినన్= యుద్ధానికి సంసిద్ధుడై కనబడగా; రథ+ఆరోహణంబు చేసి= నేను రథమెక్కి; శంఖంబు; పూరించి= ఊది; గుణంబు సారించి= నారి మొరయించి; సూతున్= నా రథసారథిని; అగ్గించి= కొనియాడి; తనకున్= పరశురామునికి; నమస్కరించి; కడంగినన్= యుద్ధానికి పూనుకోగా; ఆ+పరశురామదేవుండు= భగవంతుడైన భార్గవరాముడు.

**తాత్పర్యం:** అని పరశురాముడితో పలికి ఆయనకు నమస్కరించి కదలివచ్చి మా తల్లి సత్యవతీదేవికి జరిగిన విషయం విజ్ఞప్తి చేశాను. ఆ దేవి అనుమతి పొంది సర్వసన్నాహాలతో రథమెక్కి బ్రాహ్మణాశీస్సులు గైకొని కురుక్షేత్రం సమీపిస్తుండగా గంగాదేవి స్త్రీరూపంతో వచ్చి, తానెవరో చెప్పింది. నా భక్తిని మెచ్చి నేను యుద్ధాయత్తుడనై బయలుదేరటానికి కారణమడిగింది. నేను చెప్పగా విని నాపై కోపించి, పరశురాముడి వద్దకు వెళ్ళింది. 'నీ శిష్యుడు ఏతప్పూ చేయనివాడు. అట్టి నా కుమారుడిపై నీవు కినుకవహించ దగునా? అని అన్నది. అతని వల్ల ప్రయోజనం సిద్ధించక మళ్ళీ నా దగ్గరకు వచ్చింది. నా విషయంలోనూ పట్టుదల సడలని కారణంవల్ల తిరిగి వెళ్ళిపోయింది. అప్పుడు సిద్ధ విద్యాధర మునిసమూహాలు కుతూహలంతో చూస్తూ ఉండగా జమదగ్ని మహర్షి తనయుడైన మా గురువుగారికి చేరువలో రథం దిగి వినయంతో నిలిచి 'నీవు నేలపై నుండగా నేను రథస్థుడనై నీతో సంగ్రామం సల్పటం న్యాయం కా'దన్నాను. అనంతర మతడు దివ్యమైన రథం, అశ్వములు, శస్త్రాస్త్రాలు కలిగి, తన శిష్యుడైన

అకృతవ్రణుడు సారథిగా యుద్ధానికి ఆయత్తమై గోచరించాడు. నేను రథ మెక్కి, శంఖం పూరించి, వింటినారిని మొరయించి సూతుడిని శ్లాఘించి రణ సంసిద్ధుడనై పరశురాముడికి నమస్కరించగా, అతడు.

### భీష్ముఁడు పరశురామునితో యుద్ధము సేయుట (సం. 5-180-18)

**క. శరవర్షము నామీఁదం। గురిసిన నే నాకసమునఁ గుదియించితి నా**
**యరదంబు పొంతకును న। చ్చెరువుగ నొక బాణమైనఁ జేరకయుండన్. 316**

**ప్రతిపదార్థం:** శరవర్షమున్= బాణాలనెడి వానను; నామీఁదన్= నాపై; కురిసినన్= పరశురాముడు వర్షించగా; నా+అరదంబు పొంతకును= నా రథముయొక్క చేరువకు; అచ్చెరువుగన్= వింతగా, ఒక బాణము+ ఐనన్= ఒక శరమైనను; చేరక+ఉండన్= రాకుండునట్లు; నేను= నేను; ఆకసమునన్= అంతరిక్షములోనే; కుదియించితిన్= ఆ బాణములను అణచివేశాను.

**తాత్పర్యం:** పరశురాముడు నామీద శరవర్షం కురిశాడు. ఆ బాణాలను నా రథం చెంతకు కూడా చేరకుండా ఆశ్చర్యం కలిగేటట్లు అంబరతలంలోనే అన్నింటినీ అణచివేశాను.

**క. ఒక మొగి నఱువది యమ్ములఁ। బ్రకటబలుండైన పరశురాముఁడు నా యం**
**గకములు దాఁకఁగ నశ్వ। ప్రకరము నోనాఁట సూతుపైఁ బడ నేసెన్. 317**

**ప్రతిపదార్థం:** ప్రకటబలుండు+ఐన= ప్రసిద్ధబలవంతుడైన; పరశురాముడు= భార్గవరాముడు; ఒకమొగిన్= ఒక్కసారిగా; అఱువది+అమ్ములన్= అరవై బాణాలను; నా+అంగకములు= నా అవయవాలకు; తాఁకఁగన్= తగిలేటట్లును; అశ్వప్రకరము నోనాటన్= గుర్రాల గుంపునకు నొవ్వు కలుగ గ్రుచ్చుకొనేటట్లును; సూతుపైన్+పడన్= రథసారథిపై పడేటట్లునూ; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ప్రఖ్యాత బలశాలి అయిన పరశురాముడు నా అవయవాలకు తగిలేటట్లు, నా గుర్రాలగుంపునకు గ్రుచ్చుకొని నొవ్వు కలిగేటట్లు, నా సారథిపై పడేటట్లు ఒక్కసారి అరవై బాణాలు ప్రయోగించాడు.

**క. దానికి నవ్వుచు వేగం। బే నొక భల్లంబు దొడిగి యేసితి సాంద్ర**
**జ్యానాద భరిత రోదసి। యైన తదీయోగ్ర చాప మఱిముఱిఁ దునియన్. 318**

**ప్రతిపదార్థం:** దానికిన్= అందుకు; నవ్వుచున్= నవ్వుతూ; వేగంబు= శీఘ్రమే; ఏను= నేను; ఒక భల్లంబున్= ఒక బాణాన్ని; తొడిగి= వింట సంధించి; సాంద్ర జ్యానాద= నిబిడమైన నారి మ్రోతచేత; భరిత= నిండిన; రోదసి+ఐన= భూమ్యాకాశాల మధ్య ప్రదేశం కలదైన; తదీయ+ఉగ్రచాపమున్= ఆతడి భయంకరమైన ధనుస్సును; అఱిముఱిన్= వెంటనే; తునియన్= విరిగేటట్లు; ఏసితిన్= విడిచాను.

**తాత్పర్యం:** అందుకు నేను నవ్వుతూ శీఘ్రమే ఒక బాణాన్ని వింటదొడిగి భూమ్యాకాశాల నడిమి ప్రదేశాన్నంతటినీ తన అల్లెత్రాటి మ్రోతచే నిండిస్తున్న పరశురాముడి భయంకరమైన విల్లు విరిగేటట్లు ప్రయోగించాను.

**ఉ. ఒండొక విల్లు పుచ్చికొని యుజ్జ్వల రోష మహానలార్చు లొం**
**డొండ మొగంబుపై నెగయ నుర్వి చలింప గుణధ్వనిన్ సము**
**ద్దండతఁ దీవ్ర మార్గణ శతంబున నా యరదంబు ముంచె రా**
**ముండు వియచ్చరప్రకరముల్ వెఱఁగందుచుఁ బ్రస్తుతింపఁగన్.** **319**

**ప్రతిపదార్థం:** రాముండు= పరశురాముడు; ఒండొకవిల్లు= మరొక చాపం; పుచ్చికొని= చేతబట్టి; ఉజ్జ్వల= మిక్కిలి మండుతున్న; రోష= రోషమనెడు; మహా+అనల+అర్చులు= గొప్ప నిప్పుమంటలు; ఒండొండన్= ఒక్కటొక్కటిగా; మొగంబుపైన్+ఎగయన్= ముఖంమీద వ్యాపించగా; గుణధ్వనిన్= అల్లెత్రాటిమ్రోతచేత; ఉర్వి చలింపన్= భూమి కంపించగా; వియత్+చర ప్రకరముల్= గగన చారులైన వేల్పుల గుంపులు; వెఱఁగు+అందుచున్= విస్మయం చెందుతూ; ప్రస్తుతింపఁగన్= తనను కొనియాడగా; సముద్దండతన్= మిక్కిలి భయంకరంగా; తీవ్ర మార్గణ శతంబునన్= వాడియైన నూరు బాణాలతో; నా+అరదంబున్+ముంచెన్= నా రథాన్ని మునిగేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** పరశురాముడు వేరొక విల్లు గ్రహించి, చెలరేగుతున్న క్రోధమనే గొప్ప నిప్పుమంటలు అంతకంతకూ తన మొగంమీద వ్యాపించగా, వింటినారి మ్రోతచేత పుడమి వణకగా, మిక్కిలి ఘోరంగా నూరు వాడి బాణాలతో నా రథాన్ని ముంచివేశాడు. ఆ మహాటోపాన్ని చూచి గగనంలో నిలిచిఉన్న దేవతాగణం విస్మయం చెందుతూ అతడిని శ్లాఘించారు.

**క. ఉఱక మదీయాంగంబులు । గిఱికొన నట్లేయుటయును గినుక గదిరినన్**
**మెఱుఁగారు నారసమ్ములు । దఱచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్.** **320**

**ప్రతిపదార్థం:** ఉఱక= లక్ష్యపెట్టక; మదీయ+అంగంబులు= నా అవయవాలు; గిఱికొనన్= చుట్టుకొనేటట్లు; అట్లు+ ఏయుటయును= ఆ విధంగా శరాలు ప్రయోగించగా; కినుక గదిరినన్= నాకు కోపంకలుగగా; మెఱుఁగారు నారసమ్ములు= వాడిదేరిన బాణాలు; తఱచుగన్= దట్టంగా; కడంగి= పూని; తద్+గాత్రంబునన్= ఆతడి శరీరమునందు; నించితిన్= నాటాను.

**తాత్పర్యం:** లక్ష్యపెట్టకుండా, నా అవయవాలను క్రమ్ముకొనేటట్లు పరశురాముడు తూపులు వేయగా నాకు కోపం కలిగింది. నేను వాడిదేరిన శరాలను ఆయన దేహంనిండా దట్టంగా నాటాను.

**తే. ఉచ్చిపోయిన యేటుల నొలుకు శోణి । తమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పెఁ**
**జిగురుఁదఱుచునఁ గెంజాయ మిగిలి చెలువు । వడయు క్రొమ్మావిచాడ్పున భార్గవుండు.** **321**

**ప్రతిపదార్థం:** ఉచ్చిపోయిన= గ్రుచ్చుకొని ఆవలికి వెడలిన; ఏటులన్= బాణఘాతాలచేత; ఒలుకు= కారుతున్న; శోణితమునన్= రక్తంతో; సర్వ+అంగకంబులు= ఎల్ల అవయవాలు; తడిసి= తడిసినవై; చిగురు+తఱచునన్= దట్టమైన చిగుళ్ళవలన; కెంజాయ (కెంపు+చాయ)మిగిలి= ఎర్రని వన్నెతో అతిశయించి; చెలువు+పడయు= అందగించిన; క్రొమ్మావి (క్రొత్త+మావి) చాడ్పునన్= వసంత ఋతువునందలి క్రొత్తమామిడి చెట్టువలె; భార్గవుండు= పరశురాముడు; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** నేను ప్రయోగించిన బాణాలు పరశురాముడి అవయవాలలోదిగి అవతలకు వెళ్ళబారాయి. ఆ గాయాలనుండి కారే రక్తంతో అతడి అంగాలు తడిసి ముద్దఅయ్యాయి. దట్టమైన చిగుళ్ళవల్ల అరుణకాంతులు విరజిమ్ముతూ సౌందర్య మెగబోసే క్రొత్త మామిడి చెట్టువలె అప్పుడు పరశురాముడు ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. నెత్తురు వడిసిన మూర్ఛా। యత్తుండై సొగయుటయును నాతనిఁగని యు**
**ద్వృత్త క్షత్రియ ధర్మో। పాత్తంబగు తేజ మొల్లఁబాటై తోఁచెన్. 322**

**ప్రతిపదార్థం:** నెత్తురు వడిసినన్= రక్తం కారగా; మూర్ఛా+ఆయత్తుండు+ఐ= మూర్ఛకు అధీనుడై; సొగయుటయును= సొమ్మసిల్లగా; ఆతనిన్+కని= పరశురాముడిని చూచి; ఉద్వృత్త= గర్వముతో కూడిన; క్షత్రియధర్మ= రాజధర్మంచేత; ఉపాత్తంబు+అగు= పొందబడిన; తేజము= ప్రతాపం; ఒల్లఁబాటై= అపేక్షించరానిదై; తోఁచెన్= నాకు గోచరించింది.

**తాత్పర్యం:** రక్తం కారడం వలన మూర్ఛ పొంది ఒడలెఱుగకున్న నా గురువు పరశురాముడిని చూడగానే గర్వంగల క్షత్రియవృత్తిచేత లభించిన ప్రతాపం నాకు అనపేక్షితంగా కనబడింది.

**వ. అప్పుడు మనంబున నన్ను నేన గర్హించుకొనుచుండితి. 323**

**ప్రతిపదార్థం:** అప్పుడు; మనంబునన్= మనసులో; నన్నున్; నేను+అ= నేనే; గర్హించుకొనుచున్= నిందించుకొంటూ; ఉండితిన్= ఉండిపోయాను.

**తాత్పర్యం:** పరశురాముడు మూర్ఛలో మునిగిఉండగా చూచి నన్ను నేనే ఎంతపని చేశానని నిందించుకొంటూ ఉండిపోయాను.

**ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁడై। యేఱువాఱుతెంచు నెసకమెసఁగ**
**నప్రమేయశరము లడరించె; నవి సత్వ। రముగ నేను బ్రతిహతములు సేసి. 324**

**ప్రతిపదార్థం:** అంతన్= అటు తరువాత; తెలిసి= ఒడలెరిగి; రాముఁడు= పరశురాముడు; అతికుపిత+ఆత్ముఁడు+ఐ= మిక్కిలి కోపంతో కూడిన మనసుకలవాడై; ఏఱు= నది; పాఱుతెంచు+ఎసకము= ప్రవహించే విజృంభణం; ఎసఁగన్= ఒప్పగా; అప్రమేయశరములు= తెలిసికొనటానికి అశక్యములైన బాణాలు; అడరించెన్= నాపై ప్రయోగించాడు; అవి= వాటిని; సత్వరముగన్= వెనువెంటనే; నేను= నేను; ప్రతిహతములు చేసి= త్రిప్పికొట్టి.

**తాత్పర్యం:** ఆ తరువాత పరశురాముడు మూర్ఛనుండి తేరుకొని, మిక్కిలి కోపంతో నది ప్రవహిస్తున్నదో అనునట్లు అవిచ్ఛిన్నంగా ఇవి ఇట్లాంటివని ఊహించనలవిగాని శరాలు నామీద ప్రయోగించాడు. వాటిని నేను వెంటనే త్రిప్పికొట్టి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. మరుదస్త్ర మేయ గుహ్యక। శరమున వారించె నతఁడు; సరభసముగ ను**
**ద్ధుర శిఖి బాణం బేసిన। గురుఁడు వరుణ విశిఖ నిహతిఁ గుదియం జేసెన్. 325**

**ప్రతిపదార్థం:** మరుత్+అస్త్రము+ఏయన్= వాయవ్యాస్త్రం నేను ప్రయోగించగా; అతఁడు= పరశురాముడు; గుహ్యక శరమునన్= గుహ్యకాస్త్రంతో; సరభసముగన్= సత్వరంగా; వారించెన్= అడ్డగించాడు; ఉద్ధురశిఖిబాణంబు= దృఢమైన ఆగ్నేయాస్త్రం;

ఏసినన్= నేను వేయగా; గురుఁడు= పరశురాముడు; వరుణ విశిఖ నిహతిన్= వారుణాస్త్రంయొక్క పెట్టుచేత; కుదియన్+ చేసెన్= ఆగిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** నేను మారుతాస్త్రం ప్రయోగించగా గురుడు గుహ్యకాస్త్రంతో దానిని నివారించాడు. దృఢమైన ఆగ్నేయాస్త్రం నేను వేయగా ఆయన వారుణాస్త్రంయొక్క దెబ్బతో దానిని ఆగిపోయేటట్లు చేశాడు.

**క. ఇమ్మెయి నతఁడును దివ్యా । స్త్రమ్ములు నామీఁద నేయ రయమునఁ బ్రతి ఘా**
**త మ్మొనరించితి దివిజగ । ణ మ్మంబర వీథిఁ గీర్తన మ్మొనరింపన్. 326**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; అతఁడును= పరశురామ దేవుడు కూడ; దివ్య+అస్త్రమ్ములు= దేవతాకములైన బాణాలు; నామీఁదన్= నాపై; ఏయన్= ప్రయోగించగా; రయమునన్= శీఘ్రంగా; దివిజగణమ్ము= దేవతావర్గం; అంబరవీథిన్= ఆకాశమార్గంలో నుండి; కీర్తనమ్ము+ ఒనరింపన్= నన్ను పొగడగా; ప్రతిఘాతమ్ము+ఒనరించితిన్= నివారించాను.

**తాత్పర్యం:** ఈ రీతిగా పరశురాముడు దివ్యాస్త్రాలు నామీద ప్రయోగించగా నేను కూడ శీఘ్రంగా వాటిని వారించాను. ఆకాశపథంలో నిలిచి దేవతాసమూహం నన్ను ప్రశంసించింది.

**తే. రాముఁ డంత్యకాలానలో ద్దామ లీల । మండి నా యురస్థ్సలి యొక్క మార్గణమున**
**నేసె నంతంత నున్న మునీశ్వరులును । గాశిరాజ కన్యకయును గడఁగి యార్వ. 327**

**ప్రతిపదార్థం:** అంతన్+అంతన్+ఉన్న= అక్కడక్కడ నున్న; ముని+ఈశ్వరులును= మునీంద్రులున్నూ; కాశిరాజ కన్యకయును= కాశీరాజపుత్రి అంబయున్నూ; కడఁగి= పూని; ఆర్వన్= అరవగా; రాముఁడు= భార్గవరాముడు; అంత్యకాల= ప్రళయకాలమందలి; అనల= అగ్నివలె; ఉద్దామలీలన్+మండి= అడ్డులేని విధంగా జ్వలిస్తూ; నా= నాయొక్క; ఉరస్+స్థలిన్= వక్షఃస్థలంమీద; ఒక్కమార్గణమునన్= ఒక బాణంతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** అక్కడక్కడ నిలిచి చూస్తున్న మునీంద్రులు, కాశీరాజు కుమారి అంబ ఉత్సహించి అరవగా పరశురాముడు ప్రళయకాలానలజ్వాలవలె మండుతూ నా గుండెపై ఒక బాణం వేశాడు.

**క. ఆ నిశితాస్త్రం బెయ్యది । యో నాకుం దెలియ; దది మహోగ్రత నాఁటం**
**గా నొచ్చి పడితి నరదము । పై; నప్పుడు సూతుఁ డచటు వాపె రథంబున్. 328**

**ప్రతిపదార్థం:** ఆ నిశిత+అస్త్రంబు= ఆ వాడి బాణం; ఏ+అదియో= ఏదో; నాకున్+తెలియదు= నాకు తెలియదు; అది మహా+ఉగ్రతన్= అది మిక్కిలి దారుణంగా; నాటంగాన్= నా గుండెలో దిగబడగా; నొచ్చి= బాధనొంది; అరదముపైన్+పడితిన్= రథంలో కూలిపోయాను; అప్పుడు= ఆ సమయాన; సూతుఁడు= నా రథసారథి; రథంబున్= రథాన్ని; అచటు పాపెన్= అక్కడ నుండి మరలించాడు.

**తాత్పర్యం:** పరశురాముడు ప్రయోగించిన ఆ వాడి బాణమేదో నాకు తెలియదు. అది మిక్కిలి భయంకరంగా నా గుండెలో దిగబడగా బాధతో రథంలో కూలిపోయాను. అప్పుడు సూతుడు నా తేరును అక్కడినుండి తొలగించాడు.

**తే.** **చేతనుఁడ నయి యేను మత్సూతుఁ గినిసి । రాముఁ డున్నెడ కప్పుడు గ్రమ్మఱంగ**
**రథముఁ దోలించి బాణపరంపరా ని । మగ్నుఁ జేసితి నంబ నెమ్మనము దలఁక.** 329

**ప్రతిపదార్థం:** చేతనుఁడన్+అయి= తెలివివచ్చిన వాడనయి; ఏను= నేను; మత్+సూతున్= నా సారథిని; కినిసి= కోపించి; రాముఁడు+ఉన్న+ఎడకున్= పరశురాముడున్న చోటికి; అప్పుడు= ఆ సమయంలో; క్రమ్మఱంగన్= మరల; రథమున్+తోలించి= రథాన్ని నడిపించి; అంబ నెమ్మనము= అంబయొక్క హృదయం; తలఁకన్= భీతి నొందగా; బాణ పరంపరా నిమగ్నున్+ చేసితిన్= పరశురాముడిని శరసమూహమందు ముంచివేశాను.

**తాత్పర్యం:** నేను మూర్ఛనుండి తేరుకొన్నపిదప రథం మరలించుక వచ్చినందుకు నా సారథిని కోపించి రాముడున్న చోటికి మరల ఆ రథాన్ని నడిపించాను. అంబ గుండె భయంతో వణకగా పరశురాముడిని బాణసమూహంలో ముంచివేశాను.

**వ.** **ఇట్లు బహు ప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దు గ్రుంకినప్పుడు రణం బుపసంహరించుచు, రేపకడ దొడంగుచుం బెనంగ నిరువది దినంబులు చెల్లిన, మఱునాఁటి కయ్యంబున నేనునుం గడంగి.** 330

**ప్రతిపదార్థం:** ఇట్లు; బహు ప్రకారంబులన్= అనేకవిధాల; పోరుచున్= పోరాడుతూ; ప్రొద్దు+క్రుంకిన+అప్పుడు= సూర్యుడస్తమించినపుడు; రణంబు+ఉపసంహరించుచున్= పోరాటం చాలిస్తూ; రేపకడ= ఉదయమే; తొడంగుచున్= ప్రారంభిస్తూ; పెనంగన్= మేము పోరాడుతుండగా; ఇరువది రెండు దినంబులు; చెల్లినన్= కడవగా; మఱునాఁటి కయ్యంబునన్; నేనునున్; కడంగి= పూని.

**తాత్పర్యం:** ఇట్లా అనేక విధాల పోరాడుతూ ప్రొద్దు గ్రుంకినప్పుడు రణం చాలిస్తూ, తెల్లవారగానే ఆరంభిస్తూ గురుశిష్యుల మిద్దరమూ పెనగులాడుతుండగా ఇరవైరెండు రోజులు గడిచిపోయాయి. మరునాడు మళ్ళీ యుద్ధానికి పూనుకొన్నాను.

**క.** **కడు బెట్టిదముగఁ గదియం । బడి హయములు నొవ్వ ధనువు భగ్నంబుగఁ జే**
**డ్పడి సారథి దెరలఁగఁ దన । యొడలు సిరుఁగ నేసినను మహోద్ధతి గురుఁడున్.** 331

**ప్రతిపదార్థం:** కడున్ బెట్టిదముగన్= మిక్కిలి భయంకరంగా; కదియన్+పడి= కలియబడి; హయములు నొవ్వన్= గుర్రాలు బాధ చెందగా, ధనువు భగ్నంబుగన్= విల్లు విరుగగా; చేడ్పడి= వ్యాకులతచెంది; సారథి= రథ చోదకుడు; తెరలఁగన్= చలించగా; తన+ఒడలు= తన దేహం; చిరుఁగన్= చీలేటట్లు; ఏసినను= నేను శరములు వేయగా; మహా+ఉద్ధతిన్= మిక్కిలి విజృంభణంతో; గురుఁడున్= గురువైన పరశురాముడును.

**తాత్పర్యం:** మిక్కిలి భయంకరంగా నేను కలియబడి శరాలు ప్రయోగించి రథాశ్వాలను నొప్పించాను. వింటిని విరిచివేశాను. సారథిని వ్యాకులపాటుతో చలించేటట్లు చేశాను. గురుడి శరీరాన్ని చీల్చాను. అప్పుడు నా ధనురాచార్యుడు చెలరేగి.

**క.** **ఒక శక్తి వైవ నఱకితి, । నకుటిలముగ శక్తి దశక మడరించిన స్రు**
**క్కక త్రుంచితి, బహుశక్తుల । నికరము పరఁగించినం దునిమితిం బెలుచన్.** 332

**ప్రతిపదార్థం:** ఒక శక్తి వైవన్= పరశురాముడు నాపై ఒక శక్తిని ప్రయోగించగా; నఱకితిన్= దానిని ఖండించాను; అకుటిలముగన్= నిర్వక్రంగా; శక్తి దశకమున్= పది శక్తులు; అడరించినన్= వేయగా; స్రుక్కక= గాసిచెందక; త్రుంచితిన్= నరకివేశాను; బహుశక్తుల నికరము= అనేక శక్త్యాయుధాల సమూహాన్ని; పరఁగించినన్= ప్రయోగించగా; పెలుచన్= వెంటనే; తునిమితిన్= ఖండించివేశాను.

**తాత్పర్యం:** పరశురాముడు ఒక శక్త్యాయుధాన్ని నామీద వేయగా, దానిని నరకివేశాను. పిదప ఆతడు పదింటిని ప్రయోగించగా ఏమాత్రం గాసిచెందక వాటిని తునిమివైచాను. అనేక శక్త్యాయుధాల సముదాయాన్ని ఆతడు ప్రయోగించగా వెంటనే వాటినికూడా ఖండించివేశాను.

**క. విస్మయము నొందు భార్గవు । నస్మత్కర మపుడు లాఘవారూఢముగా**
**సస్మితుఁడ నగుచుఁ బటు దీ । ప్తి స్మేరాస్త్రముల నేసితిం బరవశుఁగాన్. 333**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; అస్మత్+కరము= నా హస్తము; లాఘవ+ఆరూఢముకాన్= నేర్పుగలది కాగా; సస్మితుఁడన్+అగుచున్= నేను చిరునవ్వుతో కూడిన వాడనవుతూ; విస్మయమున్+ఒందు= ఆశ్చర్యపడుతున్న; భార్గవున్= భృగురాముడిని; పటుదీప్తి స్మేర+అస్త్రములన్= మిక్కిలి తేజోవికాసం గల అస్త్రాలచేత; పరవశున్+కాన్+ఏసితిన్= సొమ్మసిల్లేటట్లు కొట్టాను.

**తాత్పర్యం:** ఆ సమయంలో నా హస్తం అమితలాఘవాన్ని పుంజుకొన్నది. పరశురాముడు ఆశ్చర్యపడుతుండగా నేను చిరునవ్వుతో మిక్కిలి దీప్తి వికాసం కలిగిన అస్త్రాలు ప్రయోగించి ఆయనను మూర్ఛితుణ్ణి చేశాను.

**వ. ఇట్లతండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధిక శోకసమాకులత్వంబు నొంది హాహా కారంబులు సెలంగఁ బొదివి రంత. 334**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అతండు; మూర్ఛిల్లినన్; ముని జనంబులును; అంబయున్; అధికశోక సమాకులత్వంబున్+ఒంది= మిక్కుటమైన దుఃఖంచేత కలతనొంది; హాహాకారంబులు చెలంగన్= అయ్యో అయ్యో అనే అరపులు సందడించగా; పొదివిరి= అతడి చుట్టూ మూగారు; అంతన్= తరువాత.

**తాత్పర్యం:** పరశురాముడు మూర్ఛిల్లాడు. మునీశ్వరులు, అంబ దుఃఖవ్యాకుల మనస్కులయినారు. వారు హాహాకారాలుచేస్తూ అతడి చుట్టూ క్రమ్ముకొన్నారు. తరువాత

**ఆ. తెలిసి భార్గవుండు దృఢ తీవ్ర నారాచ । పంక్తి గురిసి నన్నుఁ బారవశ్య**
**మంది నేల కొఱగునట్లుగాఁ జేసి మ । త్సూతు మస్తకంబుఁ దునియ నేసె. 335**

**ప్రతిపదార్థం:** తెలిసి= ఒడలెరిగి; భార్గవుండు= పరశురాముడు; దృఢతీవ్ర నారాచ పంక్తిన్= గట్టివి, వాడివి అయిన బాణాలయొక్క శ్రేణిని; కురిసి= నాపై వర్షించి; నన్నున్= నన్ను; పారవశ్యము+అంది= స్మృతికోల్పోయి; నేలకున్+ఒఱగునట్లుగాన్+చేసి= నేలమీదికి వ్రాలేటట్లు కావించి; మత్‌సూతుమస్తకంబున్= నా రథసారథి శిరస్సును; తునియన్+ఏసెన్= తెగేటట్లు బాణం వేశాడు.

**తాత్పర్యం:** ఒడలు తెలిసి పరశురాముడు పటిష్ఠములైన వాడి బాణాలు గుప్పించి, నేను స్మృతి దప్పి నేలకు వ్రాలేటట్లు చేశాడు. శరంతో నా రథసారథి తలను ఖండించాడు.

**వ. అట్టియెడ నెనమండ్రు విప్రులు సమానవయోరూపంబుల నొప్పు వారలు నన్నెత్తి, సేదదీర్చి రథంబు పయింబెట్టి, గగన గమనంబునం బోయి; రంతకు మున్న మందాకిని మున్ను నాకన్న చందంబున నొగలపయినుండి మదీయ రథ్యంబుల పగ్గంబులు ధరియించి యున్న నేనునుం గనుంగొని నమస్కరించిన దీవించి చనియె; వెండియు. 336**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= అటువంటి సమయంలో; ఎనమండ్రు విప్రుల= ఎనిమిదిమంది బ్రాహ్మణులు; సమానవయః+ రూపంబులన్= నాతో సమానమైన ప్రాయం, ఆకారాలతో; ఒప్పువారలు= ప్రకాశించేవారు; నన్నున్+ఎత్తి= నన్ను నేలనుండి పైకి లేవదీసి; సేద+తీర్చి= బడలిక వాపి; రథంబు పయిన్+పెట్టి= రథంమీదకూర్చుండబెట్టి; గగనగమనంబునన్+పోయిరి= ఆకాశ మార్గాన వెళ్ళిపోయారు; అంతకున్+మున్న= వారు నన్ను రథంలో కూర్చోబెట్టటానికి పూర్వమే; మందాకిని= గంగాదేవి; నా+కన్న+చందంబునన్= నేను చూచిన రూపంతోనే; నొగలపయిన్+ఉండి; మదీయ రథ్యంబుల= నా రథాశ్వములయొక్క; పగ్గంబులు= పగ్గాలు; ధరియించి+ఉన్నన్= చేతదాల్చి ఉండగా; ఏనునున్= నేనును; కనుంగొని; నమస్కరించినన్; దీవించి; చనియెన్= వెళ్ళింది; వెండియున్= మరియు.

**తాత్పర్యం:** నేను మూర్ఛలో మునిగి ఉన్న సమయంలో ఎనిమిది మంది బ్రాహ్మణులు నాతో సమానమైన వయస్సు, రూపం కలవారు నన్ను నేలనుండి లేవదీసి, శ్రమ తొలగించి రథంలో కూర్చోబెట్టి ఆకాశగమనంలో వెళ్ళారు. అంతకుమునుపే గంగాదేవి పూర్వం నేను చూచిన రూపంతో రథం నొగల మీద కూర్చుండి గుర్రాల పగ్గాలు చేత ధరించి ఉండింది. నేను నమస్కరించగా నన్ను దీవించి తన దారిని తాను వెళ్ళింది. ఆ తరువాత.

**క. సారథ్యంబును జేయుచు । ధీరత వాటించి రామదేవుని తోడం**
**గ్రూరాస్త్రంబుల సమర వి । హారం బొనరించితిని సురావలి వొగడన్. 337**

**ప్రతిపదార్థం:** సారథ్యంబును+జేయుచున్= రథం నడుపుతూ; ధీరత+పాటించి= ధైర్య మవలంబించి; సుర+ఆవలి= దేవతాసమూహం; పొగడన్= శ్లాఘించగా; రామదేవునితోడన్= భృగురాముడితో; క్రూర+అస్త్రంబులన్= దారుణమైన అస్త్రాలతో; సమరవిహారంబు+ఒనరించితిని= యుద్ధక్రీడ చేశాను.

**తాత్పర్యం:** నేనే రథం నడుపుకొంటూ; ధైర్యం వహించి అంబరతలంలో నిలిచి దేవగణం మెచ్చగా భార్గవరాముడితో ఘోరములైన అస్త్రాలతో రణక్రీడ సలిపాను.

### భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట (సం.5-184-1)

**వ. ఇవ్విధంబునం బోరి సూర్యాస్తమయం బగుటయు నెప్పటియట్ల చని యే నా రాత్రి యేకాంతంబున దర్భశయనంబున నుండి సురభూసుర వర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు సేసి 'పరశురాముని జయింపరా దయ్యెడు, దినంబులు పెక్కులు సనియె, నతని నాజి జయించుటఁ గలుగునేని మీరు నాకుం**

**దోఁచి యూఱడింపవలయు' నని ప్రార్థించి నిద్రించుచుండం బవలు నన్నెత్తి రథంబుపయిం బెట్టిన యెనమండ్రునుం బ్రభాత సమయంబునం గలలోన వచ్చి. 338**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; పోరి= పోరాడి; సూర్య+అస్తమయంబు+అగుటయున్= ప్రొద్దుగ్రుంకగా; ఎప్పటి+అట్ల చని= మునుపటి వలె యుద్ధం చాలించి వెళ్ళి; ఏను= నేను; ఆ రాత్రి; ఏకాంతంబునన్= ఒంటరిగా; దర్భశయనంబునన్+ఉండి= దర్భమీద పరుండి ఉండి; సురభూసుర వర్గంబులన్+తలంచి= దేవతలను బ్రాహ్మణులను ధ్యానించి; భక్తిన్; ప్రణామంబులు చేసి= నమస్కరించి; పరశురామునిన్; జయింపన్‌రాదు+అయ్యెడున్= గెలుచుటకు వీలుకావటంలేదు; దినంబులు; పెక్కులు= చాల, చనియెన్= కడచినవి; అతనిన్; ఆజిన్= యుద్ధంలో; జయించుట కలుగున్+ఏనిన్= గెలుచుటకు శక్యమైతే; మీరు; నాకున్; తోఁచి= గోచరించి; ఊఱడింపన్+వలయున్= ఓదార్చవలెను; అని, ప్రార్థించి= వేడుకొని; నిద్రించుచున్+ ఉండన్; పవలు= పగటి పూట; నన్నున్+ఎత్తి; రథంబుపయిన్+పెట్టిన; ఎనమండ్రునున్= ఎనిమిదిమంది; ప్రభాతసమయంబునన్= ఉదయవేళ; కలలోనన్+వచ్చి= స్వప్నంలో కనబడి.

**తాత్పర్యం:** ఈ రీతి పగలంతా పరశురాముడితో పోరాడి ప్రొద్దు గ్రుంకగనే ఎప్పటివలె నా నివాసానికి వెళ్ళాను. ఆ రాత్రి నేను ఏకాంతంగా దర్భలపై పరుండి దేవతలను బ్రాహ్మణులను ధ్యానించి భక్తితో వారికి నమస్కారాలు చేసి 'పరశురాముడిని జయించటం శక్యంగాకున్నది. ఎన్నో రోజులు గడిచాయి. అతడిని రణంలో నేను జయించగలిగితే మీరు నాకు కనిపించి నన్నూరడించాలి' అని వేడుకొని నిదురించాను. భృగురాముడి శరాహతితో మూర్ఛపొందిన నన్ను ఎత్తి రథంలో కూర్చుండపెట్టి వెళ్ళిన ఆ ఎనమండుగురు ఉదయవేళ నాకు కలలో కన్పించి.

**తే. నీవు నేమును నొక్కటి; నీకు వెఱవ । నేల గాంగేయ! రాము జయించునట్టి**
**శరము సుమ్మని మోహనాస్త్రంబు నాకు । నిచ్చిపోయిరి క్రమ్మఱ నెక్కడేని. 339**

**ప్రతిపదార్థం:** గాంగేయ!= భీష్మా!; నీవున్= నీవును; ఏమును= మేమును; ఒక్కటి= ఒక్కటేసుమా; నీకున్= నీకు; వెఱవన్+ఏల= భయపడటమెందుకు? రామున్= పరశురాముడిని; జయించునట్టి= గెలువగలిగిన; శరముసుమ్ము+అని= బాణం సుమా అని; మోహన+అస్త్రంబున్= మోహనాస్త్రాన్ని; నాకున్= నాకు; ఇచ్చి= ఒసగి; క్రమ్మఱన్= తిరిగి; ఎక్కడ+ఏనిన్+పోయిరి= ఎక్కడికో వెళ్ళిపోయారు.

**తాత్పర్యం:** 'భీష్మా! నీవూ మేమూ ఒక్కటే. నీవు భయపడనక్కరలేదు. పరశురాముడిని జయించగల బాణమిది సుమా!' అని మోహనాస్త్రం నాకు ప్రసాదించి, తిరిగి ఎక్కడికో వారు వెళ్ళిపోయారు.

**విశేషం:** అష్టవసువులు: ఇక్ష్వాకు వంశస్థుడైన మహాభిషుడు ఎన్నో యజ్ఞాలు చేసి దేవలోకం చేరి బ్రహ్మదేవుడిని కొలుస్తుండినాడు. గంగాదేవి స్త్రీ రూప ధారిణిఅయి బ్రహ్మసభకు వచ్చింది. వాయు వశాన ఊరుమూలం కనిపించేటట్లు ఆమె చీర తొలగింది. దానిని మహాభిషుడు సాభిలాషంగా చూశాడు. అందుకు విరించి కోపించి 'నీవు మనుష్యయోనిలో జన్మించు'మని శాపం పెట్టాడు. అతడు రాజర్షిఅయిన ప్రతీపుడి కొడుకుగా పుట్టాడు. అతడే శంతనుడు. అష్టవసువులు ఒకనాడు వసిష్ఠుని తపోవనానికి వచ్చారు. అక్కడ నందిని అనే హోమధేనువును చూచారు. కోరిన వస్తువులు కురిసే ఆ గోవును అష్టమ వసువైన ప్రభాసుని పత్ని ఉశీనరపతి కూతురూ తన స్నేహితురాలూ అయిన జితవతికి బహూకరింపదలచింది. అందుకు ప్రభాసుడి సోదరులు కూడా సుముఖత చూపారు. వసిష్ఠుడు యోగదృష్టితో వసువులు హోమధేనువును కొనిపోయారని తెలిసి, మనుజయోనిలో

పుట్టండని వారికి శాపమిచ్చాడు. చిరకాలం మానవలోకంలో ఉండకుండేటట్లు అనుగ్రహించుమని వారు వేడుకున్నారు. ప్రభాసుడే పెద్ద అపరాధం చేశాడు గనుక అతడు మాత్రమే బహుకాలం మర్త్యలోకంలో ఉంటాడని వసిష్ఠు డనుగ్రహించాడు.

శంతనుడై జన్మించిన మహాభిషుడి సమాగమం కోసం గంగాదేవి వస్తుండగా వసువులు చూచారు. ఆమెకు వసిష్ఠుడి శాపం తెలిపి - నీ గర్భంలో జన్మిస్తాము. పుట్టినప్పుడే మమ్మల్ని నీళ్ళలో వేసి ఎక్కువకాలం పుడమిలో ఉండకుండేటట్లు చేయవలసిందని కోరుతూ, మాలో అష్టమ వసువు మాత్రం దీర్ఘాయుష్మంతుడై నీకు సంతోషం కలిగిస్తాడని చెప్పుకొన్నారు. సంప్రాప్త యౌవనుడైన కుమారుడికి రాజ్యమప్పగించి, గంగాతటంలో నీకు కన్పించిన కన్య కులగోత్రనామాలు అడగకుండ ఆమె అభీష్టం సల్పుమని తెల్పి ప్రతీపుడు తపోవనానికి వెళ్ళాడు. తండ్రి చెప్పినట్లుగా శంతనుడు స్త్రీ రూపంలో ఉన్న గంగను ప్రేమించాడు. 'నే నేది చేసినా నీవు సమ్మతించాలి. వారించరాదు. అప్రియం పల్కరాదు. ఇందుకు భిన్నంగా వ్యవహరిస్తే నిన్ను విడిచి వెళ్ళుతాను' అన్నది గంగ. శంతనుడు సమ్మతించి ఆమెతో కలిసి కాపురం చేస్తున్నాడు. ఆపుడు, ధ్రువుడు, సోముడు, ధరుడు, అనిలుడు, అనలుడు, ప్రత్యూషుడు, ప్రభాసుడు అనే అష్టవసువులు ఒకరివెంట ఒకరుగా గంగ కడుపున పుడుతూ వచ్చారు. పుట్టినవారిని పుట్టినట్లుగా తీసికొనివెళ్ళి భాగీరథి గంగనీళ్ళలో వేస్తూ వచ్చింది. అష్టమపుత్రుడినికూడా గంగలో కలపటానికి ఆమె పూనుకోగా శంతనుడు వారించి నిందించాడు. అపుడు గంగ తన కథ చెప్పి ఇతడు ధర్మమూర్తిఅయి మనుజలోకంలో పెద్దకాల ముంటాడు. పెరిగేవరకు నావద్ద ఉంటాడు' అని చెప్పి కొడుకును తోడ్కొని వెళ్ళింది. భీష్ముడు సాంగములైన వేదాలు వసిష్ఠుడి దగ్గర, ధనుర్విద్య పరశురాముడి వద్ద అభ్యసించాడు. గంగాదేవి తేజస్వియైన కుమారుడిని శంతనున కొప్పగించింది. సత్యవతిని వివాహమాడదలచిన జనకుడి కోరిక తీర్చుటకై భీష్ముడు పెళ్ళి మానుకొన్నాడు. రాజ్యం వదలుకొన్నాడు. బ్రహ్మచర్యం స్వీకరించాడు. అతిమానుషమైన ఆ మహనీయుడి సత్యవ్రతానికి సంతసిల్లిన శంతనుడు అతడికి స్వచ్ఛందమరణం వరంగా ఇచ్చాడు. ఆ వసువులే విప్రరూపాలలో భీష్ముడికి కలలో కనిపించారు.

**వ. ఏను మేలుకాంచి సంతోషించి తన్మంత్ర స్వరూపంబును బ్రయోగోపసంహార ప్రకారంబులును జిత్తంబున నిలిపికొనుచుఁ గాలోచితకృత్యంబు లాచరించి యొక్క సారథి నంగీకరించి, యరదంబు పూన్పించి, సన్నద్ధుండనై సత్వరంబుగా సమరంబున కరిగినం బరశురామదేవుండు. 340**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; మేలుకాంచి= మేలుకొని; సంతోషించి; తద్+మంత్రస్వరూపంబును= ఆ మోహనాస్త్రంయొక్క మంత్ర విధానాన్ని; ప్రయోగ+ఉపసంహార ప్రకారంబులును= ప్రయోగించే తీరు, వెనుకకు మరలించే రీతి; చిత్తంబునన్= మనస్సులో; నిలిపికొనుచున్; కాల+ఉచిత కృత్యంబులు= ఉదయవేళలో ఆచరించవలసిన పనులు; ఆచరించి= నిర్వర్తించి; అరదంబు; పూన్పించి= సిద్ధపరిచేటట్లుచేసి; సన్నద్ధుండను+ఐ= సిద్ధపడినవాడనై; సత్వరంబుగాన్= శీఘ్రంగా; సమరంబునకున్= కయ్యానికి; అరిగినన్; పరశురామదేవుండు.

**తాత్పర్యం:** నేను నిద్రనుండి లేచి సంతోషించి మోహనాస్త్రపు మంత్రవిధానాన్ని, ప్రయోగోపసంహార రీతులను జ్ఞప్తిలో ఉంచుకొని ప్రాతఃకాల కృత్యాలు నిర్వర్తించి ఒక్క సారథిని ఏర్పాటు చేసికొని రథాన్ని ఆయత్తపరచుకొని సంసిద్ధుడనై శీఘ్రమే కదనరంగానికి వెళ్ళాను. అప్పుడు పరశురాముడు.

**క. నిన్న యఱసచ్చి పోయితి । వున్న యఱయు నేఁడు దీర్చి యుడిపెద నీ గ**
**ర్వోన్నతి; యిం కెట వోయెదు । నన్ను నెఱుఁగ వెట్టు?'లనుచు నాపైఁ గవిసెన్. 341**

**ప్రతిపదార్థం:** నిన్న= నిన్నటిరోజు; అఱ+చచ్చిపోయితి(వి)= సగం చచ్చి వెళ్ళావు; ఉన్న+అఱయున్= మిగిలిన సగం ప్రాణం; నేఁడు= ఈ రోజు; తీర్చి= తొలగించి; నీ గర్వ+ఉన్నతిన్= నీ మదాతిశయాన్ని; ఉడిపెదన్= మాపెదను; ఇంకన్= మరి;

ఎట+పోయెదు(వు)?= ఎక్కడికి తప్పించుకొని వెళ్ళుతావు? నన్నున్= నన్ను; ఎఱుఁగవు+ఎట్టులు?= ఎట్లు తెలియకున్నావు?; అనుచున్= అని పలుకుతూ; నాపైన్+కవిసెన్= నామీదికి దూకాడు.

**తాత్పర్యం:** 'నిన్న సగం చచ్చి వెళ్ళావు. ఈ దినం ఆ ఉన్న సగం కూడ హరించి నీ మద మణచి వేస్తాను. ఇంకెక్కడికి తప్పించుకు పోగలవు? నన్నెరుగవా?' అంటూ (పరశురామదేవుడు) నా మీదికి విజృంభించాడు.

**క. కవిసినఁ గడంగి పెల్లుగఁ । గవియించితి నంపవెల్లిఁ గడుఁ గ్రూరత భా**
**ర్గవుఁడును మద్గాత్రంబున । వివిధాస్త్ర ప్రతతి నించి వెగ డొందించెన్. 342**

**ప్రతిపదార్థం:** కవిసినన్= నాపైకి దుముకగా; కడంగి= పూని; పెల్లుగన్= అధికంగా; అంపవెల్లిన్= బాణప్రవాహాన్ని; కవియించితిన్= పరపాను; కడున్= మిక్కిలి, క్రూరతన్= కనికరం లేకుండా; భార్గవుఁడును= పరశురాముడు; మత్+గాత్రంబునన్= నా శరీరమునందు; వివిధ+అస్త్రప్రతతిన్+నించి= పలు తెరగులైన అస్త్ర సమూహాలను నిండించి; వెగడు+ఒందించెన్= తల్లడపరిచాడు.

**తాత్పర్యం:** పరశురాముడు నామీదికి కవియగా నేను పూనికతో బాణ ప్రవాహాన్ని అతడిపై ప్రసరింపజేశాను. ఆయన రవంతకూడా కనికరం లేకుండా నా శరీరమునందు పలువిధాలైన అస్త్రాలను నాటి భీతి కలిగించాడు.

**వ. ఏనుం గోపించి. 343**

**ప్రతిపదార్థం:** ఏనున్= నేనుకూడ; కోపించి= రోషించి-

**తాత్పర్యం:** నేను కూడా రోషపడి.

**తే. రయము మెఱయంగ నొక్క నారసము ఫాల । దేశమునయందు నాఁ టించి తీవ్ర శక్తి**
**నురము వైచినఁ దూఁగాడి యొఱగ నూఁది । పట్టి యకృతవ్రణుఁడు తేర్చెఁ బరశురాము. 344**

**ప్రతిపదార్థం:** రయము+మెఱయంగన్= వేగం మించగా; ఒక్క నారసమున్= ఒక తూపును; ఫాలదేశమున అందున్= నిటలభాగంలో; నాటించి= దిగేటట్లు చేసి; తీవ్రశక్తిన్= దారుణమైన శక్తిని; ఉరమున్ వైచినన్= రొమ్ముపై వేయగా; తూఁగాడి= చలించి; ఒఱగన్= ప్రక్కకు వ్రాలగా; అకృతవ్రణుఁడు= సారథ్యం సల్పుతున్న అకృతవ్రణుడు; ఊదిపట్టి= వ్రాలకుండా గట్టిగా పట్టుకొని; పరశురామున్+తేర్చెన్= పరశురాముడిని స్మృతికి వచ్చేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** వేగం మీరేటట్లు నేనొక్క తూపును ఆయన నిటలభాగంలో దిగబడే విధంగా నాటాను. తరువాత తీవ్రమైన శక్త్యాయుధాన్ని ఆయన గుండెపై వేశాను. అంతట పరశురాముడు చలించి ప్రక్కకు వ్రాలగా, పడకుండా గట్టిగా పట్టుకొని అకృతవ్రణుడనే ఆయన సారథి అతడిని స్మృతికి వచ్చేటట్లు చేశాడు.

**క. అప్పుడు దెప్పిఱి కన్నుల । నిప్పులు రాలంగ నన్ను నిశ్చల దృష్టిం**
**దప్పక చూచి యలఁతి న । వొప్పఁగ బ్రహ్మాస్త్ర మాతఁ డుగ్రత నేసెన్. 345**

**ప్రతిపదార్థం:** అప్పుడు= అంతట; ఆతఁడు= పరశురాముడు; తెప్పిఱి= తేరుకొని; కన్నులన్= నేత్రములనుండి; నిప్పులు రాలంగన్= అగ్నికణాలు రాలుతుండగా; నన్నున్= నన్ను; నిశ్చలదృష్టిన్= చలించని చూపులతో; తప్పక చూచి= మానకుండా

కనుగొని; అలఁతి నవ్వు= చిరునవ్వు; ఒప్పఁగన్= మెరయగా; ఉగ్రతన్= భయంకరంగా; బ్రహ్మ+అస్త్రమున్+ఏసెన్= బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు.

**తాత్పర్యం:** అంతట పరశురాముడు తేరుకొని తన కనులనుండి అగ్ని కణాలు రాలుతుండగా నన్ను కన్నార్పకుండా క్రూరంగా చూచి చిరునవ్వు దీపించగా బ్రహ్మాస్త్రాన్ని దారుణంగా నాపై ప్రయోగించాడు.

**క. తెగఁగొని బ్రహ్మాస్త్రమ యేఁ । దగ నేసిన నొకటి నొకటి దార్కొని రెండున్**
**గగనంబంతయుఁ దేజ । స్థగితముగాఁ జేసె సురలు దైత్యులుఁ దలఁకన్. 346**

**ప్రతిపదార్థం:** ఏన్= నేను; తెగన్+కొని= నారిసారించి; బ్రహ్మ+అస్త్రము+అ= బ్రహ్మాస్త్రమునే; తగన్= చక్కగా; ఏసినన్= ప్రయోగించగా; ఒకటిన్+ఒకటి= ఒకదాని నొకటి; తార్కొని= మార్కొని; సురలు= దేవతలు; దైత్యులు= రక్కసులు; తలఁకన్= భీతిల్లగా; రెండున్= ఆ రెండు బ్రహ్మాస్త్రాలు; గగనంబు+అంతయున్= ఆకాశము నంతటినీ; తేజస్+స్థగితముగాన్+ చేసెన్= కాంతితో ఆచ్ఛాదించబడినదానినిగా చేశాయి.

**తాత్పర్యం:** నేను కూడా నారి సారించి బ్రహ్మాస్త్రమునే ప్రయోగించాను. ఈ రెండు బ్రహ్మాస్త్రాలు ఒకదాని నొకటి ఎదుర్కొని దేవదానవులు భీతిల్లగా ఆకాశాన్నంతటినీ కాంతితో ఆచ్ఛాదింపజేశాయి.

**తే. సకల భూత సంక్షోభ సంజనకమైన । యట్టియెడఁ గని యిది తఱి యని తలంచి**
**మోహనాస్త్రంబు నంచితావాహనంబు । సేయుటయును జరాచర శ్రేణి మ్రోసె. 347**

**ప్రతిపదార్థం:** సకలభూత సంక్షోభ సంజనకము+ఐన= సర్వప్రాణులకు కలతను గలిగించుచున్నదైన; అట్టియెడన్= ఆ సమయంలో; కని= గమనించి; ఇది తఱి+అని= ఇది అదనని; తలంచి= భావించి; మోహన+అస్త్రంబు= మోహనాస్త్రముయొక్క; అంచిత+ఆవాహనంబు= ఒప్పిదమైన ఆహ్వానాన్ని; చేయుటయును= చేయగా; చర+అచరశ్రేణి= జంగమస్థావరాలయొక్క సమూహం; మ్రోసెన్= ఆక్రోశించింది.

**తాత్పర్యం:** సకలజీవులకు సంక్షోభం కలిగించే ఆ సమయం చూచి ఇది శర ప్రయోగానికి తగిన వేళ అని తలంచి, నేను మోహనాస్త్రాన్ని ఆవాహనం చెయ్యగా చేతనములు, అచేతనములు ఆక్రందించాయి.

**వ. తదవసరంబున. 348**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. ఉడుగుడుగు మోహనాస్త్రము । విడువకు మను నెలుఁగుతోడ వేగంబున న**
**య్యెడ కేఁగుదెంచి నారదుఁ । డెడమడు గించుకయు లేక యిట్లను నాతోన్. 349**

**ప్రతిపదార్థం:** ఉడుగు+ఉడుగు(ము)= మానుము మానుము; మోహన+అస్త్రమున్= మోహనాస్త్రాన్ని; విడువకుము= ప్రయోగించవద్దు; అను+ఎలుఁగు తోడన్= అను కంఠధ్వనితో; వేగంబునన్= త్వరితంగా; అయ్యెడకున్= మేము పోరాడుతున్న ప్రదేశానికి; ఏఁగుదెంచి= వచ్చి; నారదుఁడు= నారద మహర్షి; ఎడమడుగు+ఇంచుకయున్ లేక= అరమరిక రవంతకూడా లేకుండ; నాతోన్+ఇట్లు+అనున్= నాతో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** 'వద్దు వద్దు. మోహనాస్త్రాన్ని ప్రయోగించవద్దు' అని కేకలిడుతూ నారదమహర్షి సత్వరంగా అక్కడికి వచ్చాడు. అరమరిక లేకుండా నాతో ఇట్లా అన్నాడు:

**క. 'గురునకు నవమానము ని । ష్ఠుర వృత్తిం జేసెదీవు సూచితిమే యి**
**ప్పరుసునఁ బరుసపు నడవడిఁ । గురువంశప్రవర యిట్లుఁ గూడునె చేయన్?' 350**

**ప్రతిపదార్థం:** కురువంశప్రవర!= కురువంశస్థులలో శ్రేష్ఠుడా!; గురునకున్= విద్య గరపిన ఆచార్యునకు; అవమానమున్= పరాభవాన్ని; నిష్ఠుర వృత్తిన్= క్రూరవర్తనంతో; ఈవు చేసెదు(వు)= నీవు చేస్తున్నావు; ఈ+పరుసునన్= ఈరకంగా; పరుసపు నడవడి= క్రూరమైన ప్రవర్తన; చూచితిమే= లోకంలో కనుగొన్నది లేదు; ఇట్లు చేయన్= ఈ విధంగా సల్పడం; కూడునె?= నీవంటివాడికి తగునా?

**తాత్పర్యం:** 'కురువంశ శ్రేష్ఠుడా! కర్కశ బుద్ధితో గురునకు పరాభవం చేస్తున్నావు. ఇట్టి కఠినమైన నడవడి లోకంలో చూచిందిలేదు. ఇట్లా చేయటం నీవంటి వానికి ఉచితం కాదు.'

**వ. అని సువ్యక్తంబుగాఁ జెప్పి. 351**

**ప్రతిపదార్థం:** అని; సువ్యక్తంబుగాన్= స్పష్టంగా; చెప్పి= తెలిపి.

**తాత్పర్యం:** అని సుస్పష్టంగా నారదుడు పలికి.

**క. 'వీరె సుర లాకసంబున । గారవమున బుద్ధి సెప్పఁగా నీకడకుం**
**దా రేగు దెంచి'రని క । న్నారంగాఁ జూపె నాకు నయ్యెనమండ్రన్. 352**

**ప్రతిపదార్థం:** ఆకసంబునన్= గగనంలో; వీరె సురలు= అరుగో దేవతలు; గారవమునన్= గౌరవంతో; బుద్ధి చెప్పఁగాన్= నీకు నీతులు గఱపుటకై; నీ కడకున్= నీ దగ్గరకు; తారు= తాము; ఏగుదెంచిరి= వచ్చిఉన్నారు; అని= అనుచు; కన్ను+ ఆరంగాన్= కనులార; నాకున్= నాకు; ఆ+ఎనమండ్రన్= ఆ యెనిమిదిమందిని; చూపెన్= చూపాడు.

**తాత్పర్యం:** 'అరుగో! ఆకాశంలో దేవతలు. వీరు గౌరవంగా నీకు బుద్ధులు గరపవలెనని నీ దగ్గరకు వచ్చి ఉన్నారు' అంటూ నారదుడు కనులారా నాకు ఆ యెనిమిదిమందిని చూపించాడు.

**వ. ఇవ్విధంబున నెప్పటి విప్రవరులు సన్నిధిసేసి నన్నుం జూచి నగుమొగంబులతో నెఱుఁగని వారపోలె నిట్లనిరి; 353**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఎప్పటి విప్రవరులు= నిన్న రణంలో మూర్ఛితుడనై నేలబడిఉండగా రథంమీద కూర్చుండబెట్టి చనినవారూ, రాత్రి స్వప్నంలో తోచి మోహనాస్త్రం ఇచ్చినవారూ అయిన ఆ యెనిమిదిమంది బ్రాహ్మణులు; సన్నిధిచేసి= నా సమ్ముఖమున నిల్చి; నన్నున్+చూచి= నను గాంచి; నగు మొగంబులతోన్= నవ్వుతో నిండిన వదనాలతో; ఎఱుఁగని వార పోలెన్= ఏమియు తెలియనివారివలె; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు:

**తాత్పర్యం:** పరశురామ శరాహతుడనై నేలబడియుండగా నన్నెత్తి రథంలో కూర్చోబెట్టి వెళ్ళినవారూ, వేకువజామున నాకు కలలో కనిపించి మోహనాస్త్రము నిచ్చినవారూ అయిన ఆ యెనమండుగురు బ్రాహ్మణోత్తములు నాచెంత జేరి నవ్వుతున్న ముఖాలతో ఏమీ తెలియనివారివలె నాతో ఇట్లా అన్నారు:

**క. 'నారదముని త్రైలోక్య స । మారాధ్యుం డితని పలుకు లాగమ వాక్యో**
**దారములు వినుము వీనిం । గ్రూరత వాటింపఁ దగదుగురు విషయమునన్.' 354**

**ప్రతిపదార్థం:** నారదముని= నారద మహర్షి; త్రైలోక్య సమారాధ్యుఁడు= ముల్లోకాలవారిచేత పూజించదగినవాడు; ఇతని పలుకులు= ఈ మహనీయుడి మాటలు; ఆగమవాక్య+ఉదారములు= వేదవాక్కులవలె గొప్పవి; వీనిన్+వినుము= ఈ మహాత్ముడి మాటలు ఆలకించు; గురువిషయమునన్= ఆచార్యుడి విషయములో; క్రూరత= కాఠిన్యం; పాటింపన్+తగదు= వహించరాదు.

**తాత్పర్యం:** 'నారద మహర్షి ముల్లోకాలవారిచే పూజింపదగినవాడు. ఈ మహానుభావుడి మాటలు వేదవచనాలవలె దొడ్డవి. ఈ మునీంద్రుడి పలుకులు వినుము. గురునకు సంబంధించిన విషయంలో కర్కశత్వం కూడదు.'

**వ. అనిన విని యేను సమ్మోహనాస్త్రం బేయుట యుడిగి బ్రహ్మాస్త్రంబు దీపింపఁజేసితి; నప్పుడు జామదగ్న్యుం డది యెల్ల నెఱింగి, యోటమి యెక్కించుకొని చలంబు మిగిలియున్నం దజ్జనకుండు జమదగ్నియుఁ దదీయ పితృవర్గంబును నతనికి సన్నిధి సేసి వేఁడికొని శాంతవచనంబులం దేర్చి యిట్లనిరి: 355**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; ఏను= నేను; సమ్మోహన+అస్త్రంబు; ఏయుట= ప్రయోగించటం; ఉడిగి= మాని; బ్రహ్మ+అస్త్రంబున్; దీపింపన్+చేసితిన్= ప్రజ్వలింపజేశాను; అప్పుడు; జామదగ్న్యుండు= జమదగ్ని తనయుడైన పరశురామదేవుడు; అది+ఎల్లన్+ఎఱింగి= నారదాదులు వచ్చి నాకు హితం చెప్పటం; నేను మోహనాస్త్రమును విడువకుండటం; తెలిసి; ఓటమి+ఎక్కించుకొని= తాను అపజయం పాలైనట్లుగానే భావించి; చలంబు+మిగిలి+ఉన్నన్= ద్వేషాతిశయంతో ఉండగా; తద్+జనకుండు= నా గురువు తండ్రి; జమదగ్నియున్; తదీయ పితృవర్గంబును= ఆయన పితరుల సమూహమునూ; అతనికిన్; సన్నిధిచేసి= ప్రత్యక్షమై; వేఁడికొని= అర్థించి; శాంతవచనంబులన్= చల్లటి మాటలతో; తేర్చి= కలతబాపి(ప్రసన్నుడిని కావించి); ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు.

**తాత్పర్యం:** ఎనమండుగురు భూసుర పుంగవుల మాటలు విని, నేను సమ్మోహనాస్త్రం విడవటం మానుకొన్నాను. బ్రహ్మాస్త్రమునే ప్రకాశింపజేశాను. అపుడు జమదగ్నిసుతుడు నారదాదులు వచ్చి నాకు హితోపదేశం చేయటం; నేను సమ్మోహనాస్త్ర ప్రయోగం విరమించటం తెలిసికొని, తాను అపజయం పొందినట్లు భావించి, నాపై ద్వేషం పెంచుకొన్నాడు. అంతట అతడి తండ్రి జమదగ్ని మహర్షి, ఆయన పితరులు పరశురాముడికి ప్రత్యక్షమై వేడుకొని చల్లటి మాటలతో అతడిని ప్రసన్నుడిని కావించి ఇట్లా పలికారు:

**క. 'వినుము వసుమూర్తి యీతం । డనన్య సామాన్య తేజుఁ డాహవభూమిన్**
**మనకు జయింప వశమె భీ । ష్మని? విపున కగునె రోషమును మత్సరమున్?' 356**

**ప్రతిపదార్థం:** వినుము= పరశురామా! మా మాటలు ఆలకించుము; ఈతఁడు= ఈ భీష్ముడు; వసుమూర్తి= వసు స్వరూపుడు; అనన్య సామాన్య తేజుఁడు= పరుల కెవ్వరికి లేని ప్రతాపం కలవాడు; ఆహవ భూమిన్= యుద్ధరంగంలో;

మనకున్= మనకు; భీష్మని జయింపన్ వశమె?= భీష్ముడిని గెలువ శక్యమా?; (కాదనుట); విప్రునకున్= బ్రాహ్మణుడికి; రోషమును= కోపమూ; మత్సరమున్= ద్వేషమూ; అగునె?= తగునా?

**తాత్పర్యం:** 'పరశురామా! మా పలుకు లాలకించుము. ఈతడు వసువు. ఇతరుల కెవ్వరికినీ లేనట్టి ప్రతాపం కలవాడు. యుద్ధంలో ఇతడిని గెలువ మనతరమా? బ్రాహ్మణుడికి క్రోధం, ఈర్ష్య తగవు సుమా!

**తే. సమర ముడుగు నారాయణసఖుఁడు నరుఁడు । సవ్యసాచి నా నింకొక జన్మమొంది**
**యితని వధియించుఁగాని తక్కితర జనము । లకు నసాధ్యుండు భీష్ముఁ డాలంబులోన. 357**

**ప్రతిపదార్థం:** సమరము+ఉడుగు(ము)= యుద్ధం మానుము; నారాయణసఖుఁడు= నారాయణుడికి చెలికాడైన; నరుఁడు= నరుడు; సవ్యసాచి నాన్= అర్జునుడనే పేరుతో; ఇంకొక జన్మము+ఒంది= మరొక్క పుట్టువుపొంది; ఇతనిన్= ఈ భీష్ముడిని; వధియించున్ కాని= చంపునే తప్ప; తక్కు+ఇతరజనములకున్= మిగిలిన వేరే మనుష్యులకు; ఆలంబులోనన్= కదనంలో; భీష్ముఁడు= దేవవ్రతుడు; అసాధ్యుండు= సాధింపరానివాడు.

**తాత్పర్యం:** రామా! యుద్ధం విరమించుము. నారాయణుడి చెలికాడైన నరుడు అర్జునుడనే పేరుతో వేరొక జన్మమెత్తి వీనిని సంహరించగలడు. అంతే కాని ఇతరులు భీష్ముడిని కదనంలో జయించలేరు సుమా!

**వ. అనిన నతండు పోక పెనంగిన వెండియు ననేక ప్రకారంబులం జెప్పి యమ్మునులు నాకడకుం జనుదెంచి యుపశమన వాక్యంబులు పలికి జామదగ్న్యుతోడం దమయాడిన మాటలు తేటపఱిచి యప్పుడు పొడసూపిన జాహ్నవియుం దారు బహు విధంబుల నన్ను ననునయించి భార్గవుపాలికి నమ్మహాదేవిం దోడ్కొని యరిగియుం గ్రమ్మఱ మత్సమీపంబునకు వచ్చియు నెట్టకేలకుం జలం బుడిపిన నే మిరువురమును దివ్యాస్త్రంబులుప సంహరించి సమరం బుడిగితి; మట్టియెడ నయ్యేనమండ్రు విప్రులుం జేరి నాతో నిట్లనిరి: 358**

**ప్రతిపదార్థం:** అనినన్= అని వారు చెప్పినప్పటికినీ; అతండు; పోక= వెనుదీయక; పెనంగినన్= పోరాడగా; వెండియున్= మరల; అనేక ప్రకారంబులన్= పలువిధాల; చెప్పి; ఆ+మునులు; నా కడకున్; చనుదెంచి; ఉపశమనవాక్యంబులు= శాంతివచనాలు; పలికి; జామదగ్న్యుతోడన్= జమదగ్ని తనయుడైన పరశురాముడితో; తమ+ఆడిన మాటలు; తేటపఱిచి= వెల్లడించి; అప్పుడు= ఆ సమయమందే; పొడచూపిన= సాక్షాత్కరించిన; జాహ్నవియున్= గంగాదేవియు; తారున్= తామును; బహువిధంబులన్= పెక్కురీతుల; నన్నున్; అనునయించి= బుజ్జగించి; భార్గవుపాలికిన్= పరశురాముడికడకు; ఆ+మహాదేవిని= ఆ భాగీరథిని; తోడ్కొని+అరిగియున్= వెంటబెట్టుకొని వెళ్ళియు; క్రమ్మఱన్= మరల; మత్+సమీపంబునకున్= నా దగ్గరకు; వచ్చియున్; ఎట్టకేలకున్= చివరకు; చలంబు= పంతం; ఉడిపినన్= మాన్పగా; ఏము+ఇరువురము= గురుశిష్యులమైన మే మిద్దరమూ; దివ్య+అస్త్రంబులు= బ్రహ్మాస్త్రములు రెంటినీ; ఉపసంహరించి= ఉపశమిల్లజేసి; సమరంబు; ఉడిగితిమి= మానినాము; అట్టి+ఎడన్= ఆ తరుణంలో; ఆ+ఎనమండ్రు విప్రులున్; చేరి= నా కడకు వచ్చి; నాతోన్; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు:

**తాత్పర్యం:** తన జనకుడూ, పితృదేవతలూ చెప్పినప్పటికిన్నీ పరశురాముడు వెనుదీయక పెనగుతుండగా వారింకనూ అనేక విధాల చెప్పి చెప్పి నాకడకు వచ్చారు. నాతో శాంతి వచనాలు పలికి పరశురాముడితో తామన్న మాటలు వెల్లడించారు. ఆ సమయంలో అక్కడ ప్రత్యక్షమైన గంగతో తామూ చేరి నన్ను పలువిధాల బుజ్జగించారు. తరువాత

వారు గంగాదేవిని వెంటబెట్టుకొని పరశురాముడి చెంతకు వెళ్ళారు. మళ్ళీ నా దగ్గరకు వచ్చారు. ఇట్లా వారు మా ఉభయుల చుట్టూ పెక్కు సారులు తిరిగి తిరిగి తుట్టతుదకు మా పంతాలు మాన్పించారు. మేమిద్దరమూ బ్రహ్మాస్త్రాలను ఉపసంహరించి యుద్ధం చాలించాము. అట్టి సమయంలో ముందు కన్పడిన ఆ యెనిమిది మంది భూసురులు నన్ను జేరి నాతో ఇట్లా అన్నారు:

**ఆ. 'గురుఁడు బ్రహ్మవిదుఁ డకుంఠిత తేజుండు। పరశురాముఁ డతని పాలి కీవు**
**భక్తి మెఱయ నేఁగి ప్రణమిల్లి తదనుగ్ర। హంబు వడయవలయు ననఘ! యిపుడు.' 359**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యాత్ముడా!; పరశురాముడు= భార్గవరాముడు; గురుఁడు= నీకు ఆచార్యుడు; బ్రహ్మవిదుఁడు= బ్రహ్మతత్త్వమెరిగినవాడు; అకుంఠిత తేజుండు= మొక్కవోని ప్రతాపం కలవాడు; అతని పాలికిన్= ఆ భృగురాముడి చెంతకు; ఈవు= నీవు; భక్తి మెఱయన్= భక్తి వెల్లడియగునట్లు; ఏఁగి= వెళ్ళి; ప్రణమిల్లి= నమస్కరించి; తద్+అనుగ్రహంబున్= ఆయన కారుణ్యమును; ఇపుడు= ఇప్పుడు; పడయన్ వలయున్= పొందవలెను.

**తాత్పర్యం:** 'భీష్మా! పరశురాముడు నీకు గురువు. తత్త్వవేత్త. అమోఘమైన ప్రతాపం కలవాడు. ఆ మహామహుడి చెంతకు నీ విప్పుడే వెళ్ళి, నీ భక్తి ప్రకటమయ్యేటట్లు ప్రణామం సలిపి, వారి అనుగ్రహం ఇపుడే పొందవలెను సుమా!'

**వ. అని చెప్పి యతని కడకుం దారును నారదమునీశ్వరుండును జమదగ్ని ప్రముఖులును భాగీరథియును జని 'నీ శిష్యుండు దేవవ్రతుండు; వాని యెడ నలుగం దగునె? వాఁడు తగవు మాలిన పనిఁ జేయంజాలక పెనంగె; నింతియకాని విరోధి గాఁడు; వానిం గరుణింపు' మని తెలిపి, నన్నుం బిలిచినం బోయి యే నమ్మహాత్మునకు సాష్టాంగదండ ప్రణామంబు సేసిన నతండు దీవనతో గ్రుచ్చి యెత్తి కౌఁగిలించికొని 'గాంగేయా! నీశక్తికి భక్తికిం బ్రీతుండనైతి' నని సస్నేహంబుగా సంభావించి, యంబ నవలోకించి; నన్ను భీష్ముండు గెలిచె 'నా వలన నయ్యెడుపని యింతియ; నీవింక నీకుం జూడం బోలిన గతిం బొమ్మ'నిన నమ్మానిని 'దేవా యిది యిట్టిద; నీ యోపినంతయుం జేసితి; నీ చేతం బోకున్న నేమి సేయుదు? నేను దపంబు పెంపున భీష్ముని వధించెద జన్మాంతరంబున నైననుం జలంబు సాధ్యంబు చేయుదు; నటు సూడు' మని పలికిపోయెఁ; దదనంతరంబ యమ్మునిజన పితృదేవతా సమూహంబును భృగు నందను నన్ను నామంత్రణంబు చేసి యంతర్ధానంబు సేసె; భార్గవుండును నన్నువీడ్కొలిపి మున్ను దనతో వచ్చిన తపోధనవర్గముం దానును మహేంద్ర శైలంబునకుం జనియె; నేను మగిడి యెడనెడ నుర్వీసురుల యాశీర్వాదంబులు సంభావన వచనంబులుఁ బ్రస్తుతి వాక్యంబులుఁ గర్ణంబుల కింపుసేయ నిటవచ్చి సత్యవతికి నమస్కారపూర్వకంబుగా నంతయు నెఱింగించిన నద్దేవి యభినందించె. 360**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; అతనికడకున్= పరశురాముడి చెంతకు; తారును= ఆ యెనమండుగురు భూసురులను; నారద ముని+ఈశ్వరుండును; జమదగ్ని ప్రముఖులను= జమదగ్ని మున్నగువారును; భాగీరథియును= నా జననిఅయిన గంగాదేవియు; చని; నీ శిష్యుండు; దేవవ్రతుండు= భీష్ముడు; వానియెడన్= అతనిపట్ల; అలుగన్+తగునె?= కోపగించుకొనవచ్చునా?; వాఁడు= భీష్ముడు; తగవు మాలిన పని= న్యాయం తప్పిన పని; చేయన్+చాలక= చేయటానికి ఇష్టపడక; పెనంగెన్= నీతో కలహించాడు;

ఇంతియకాని= ఇంతేతప్ప; విరోధికాఁడు= నీకు శత్రువు కాడు; వానిన్; కరుణింపుము; అని తెలిపి; నన్నున్ పిలిచినన్= నన్ను రమ్మనగా; పోయి; ఏను= నేను; ఆ మహాత్మునకున్; స+అష్ట+అంగ+దండ ప్రణామంబు= ఎనిమిది అవయవాలు నేలకు సోకేటట్లు కర్రవలె పడి చేసే నమస్కారం; చేసినన్= చేయగా; అతండు= పరశురాముడు; దీవనతోన్= ఆశీస్సుతో; గ్రుచ్చి ఎత్తి= దృఢంగా నేలనుండి మీదికెత్తి; కౌఁగిలించికొని; గాంగేయా; నీ శక్తికిన్= నీ బలానికి; భక్తికిన్; ప్రీతుండన్+ఐతిన్= హర్షించాను; అని; సస్నేహంబుగాన్= ప్రేమయుక్తంగా; సంభావించి= ఆదరించి; అంబన్; అవలోకించి= చూచి; నన్నున్; భీష్ముండు; గెలిచెన్; నావలనన్; అయ్యెడు పని= జరుగు పని; ఇంతియ= ఇంతే; నీవు+ఇంకన్; నీకున్+ చూడన్+పోలినగతిన్+పొమ్ము= ఆలోచించుకొని నీకు తగిన దారి నీ వనుసరించుము; అనినన్; ఆ+మానిని= అంబ; దేవా!= ప్రభూ!; ఇది+ఇట్టిద= నా ప్రాప్తమింతే; నీ+ఓపినంతయున్+చేసితి(వి)= నీకు శక్తి ఉన్నంతవరకు చేశావు; నీచేతన్+పోకున్నన్+ ఏమిచేయుదు?= నీకు శక్యము కానిదానికి నీవేమి చేయగలవు?; నేను తపంబు పెంపునన్= తపశ్శక్తిచేత; భీష్ముని వధించెదన్; జన్మ+అంతరంబునన్+ఐనన్= మరొక జన్మలోనైనా; చలంబు సాధ్యంబు చేయుదున్= పంత మీడేర్చుకుంటాను; అటుచూడుము= నీవు చూస్తూ ఉండుము; అని పలికిపోయెన్; తద్+అనంతరంబ= అంబ వెళ్లిన తరువాత; ఆ మునిజన+ పితృదేవతా సమూహంబును= ఆ జమదగ్ని, పితృదేవతా వర్గం; భృగునందనున్= పరశురాముడిని; నన్నున్= నన్ను; ఆమంత్రణంబు చేసి= పోయి వస్తామని మమ్మ వదలి; అంతర్ధానంబు చేసెన్= మరుగైపోయారు; భార్గవుండును= పరశురాముడునూ; నన్నున్; వీడ్కొలిపి= పోయిరమ్మని చెప్పి; మున్ను= పూర్వం; తనతో వచ్చిన; తపోధన వర్గమున్= మునిసమూహమును; (తపోధనుడు - తపమే ధనంగా కలవాడు= ఋషి); తానును; మహేంద్ర శైలంబునకున్ చనియెన్; నేను; మగిడి= మరలి; ఎడన్+ఎడన్= అక్కడక్కడ, ఉర్వీసురుల= బ్రాహ్మణుల యొక్క; ఆశీర్వాదంబులున్= దీవనలు; సంభావన వచనంబులున్= ఆదరంతో కూడిన పలుకులు; ప్రస్తుతి వాక్యంబులున్= పొగడ్తమాటలు; కర్ణంబులకున్= చెవులకు; ఇంపుచేయన్= ఆహ్లాదం కూర్చగా; ఇటవచ్చి= హస్తినాపురికి చనుదెంచి; సత్యవతికిన్; నమస్కారపూర్వకంబుగాన్= తొలుత నమస్కరించి; అంతయున్; ఎఱింగించినన్; ఆ+దేవి; అభినందించెన్= నన్ను మెచ్చుకొన్నది.

**తాత్పర్యం:** అని పలికి పరశురాముడి దగ్గరకు ఎనమండుగురు భూసురోత్తములు, నారదమునీంద్రుడు, జమదగ్ని, పితృదేవతా వర్గం, గంగాదేవి వెళ్ళారు. వెళ్ళి భీష్ముడు నీకడ విద్యనేర్చుకొన్నాడు. అతడు నీ శిష్యుడు. వాని యెడ నీకు కోపం తగునా? అతడు న్యాయవిహీనమైన పని చేయటాని కిష్టపడక నీతో కలహించాడు. అంతేకాని, నీకు పగవాడు కాడు. వాడిని కృపతో చూడుమని భృగురాముడికి చెప్పి అతడి చెంతకు రమ్మన్నారు. నేను వెళ్ళి ఆ మహానుభావుడికి సాష్టాంగంగా సాగిలపడి నమస్కరించాను. ఆయన దీవించి నన్ను గ్రుచ్చి లేవనెత్తి కౌగిలించుకొన్నాడు. 'గాంగేయా! నీ శక్తికీ భక్తికీ సంతోషించాను' అంటూ స్నేహయుక్తంగా పలికి నన్ను మన్నించాడు. ఆ తరువాత అంబను జూచి 'నన్ను భీష్ముడు జయించాడు. నేను చేయగల్గిన దింతే. నీ వింక నీకు తోచినదారి చూచుకో. వెళ్ళు' మని చెప్పాడు. ఆమె పరశురాముడితో 'దేవా! నా ప్రాప్తమింతే. నీ చేతనైనంతవరకు చేశావు. నీవలన కానిదానిని నీవు మాత్రమేమి చేయగలవు? నేను తపోబలంచేత భీష్ముడిని వధిస్తాను. మరొక జన్మలోనైనా నా పగ తీర్చుకొంటాను చూడు'మని పలికి అక్కడ నుండి వెళ్ళిపోయింది. అటు తరువాత నారదాది మునులు, జమదగ్ని, పితృదేవతలు పరశురాముడినీ, నన్నూ చూచి వెళ్ళివస్తామని పలికి మాయమయ్యారు. భృగురాముడు నన్ను ఆగుమనిచెప్పి, తనతో వచ్చిన ఋషి సమూహంతో మహేంద్రగిరికి వెళ్ళాడు. నేనున్నూ అక్కడ నుండి బయలుదేరి, దారిలో అక్కడక్కడ బ్రాహ్మణుల ఆశీర్వాదాలు, ఆదరపూర్వక వచనాలు, పొగడ్త మాటలు వీనులకు విందుసేయగా హస్తినకు వచ్చి, మా జనని సత్యవతీ దేవికి నమస్సులర్పించి జరిగినదంతా విన్నవించాను. అందుకు ఆ దేవి సంతోషించింది.

నారదుఁడు భీష్మున కంబవృత్తాంతం బంతయుఁ జెప్పుట (సం. 5-187-16)

**తే.** **అంబ వృత్తాంత మరయంగ ననుదినంబుఁ। దగిన వారలఁ బుచ్చుచుఁ దలఁకుచుందు**
**నేను నది యాదిగాఁ జింత నేపు దక్కి। స్రుక్కియుండియు రాజుల నుక్కుమడఁతు.** **361**

**ప్రతిపదార్థం:** అంబవృత్తాంతమున్= అంబయొక్క సమాచారాన్ని; అరయంగన్= తెలిసికొనటానికి; అనుదినంబున్= ప్రతిదినం; తగిన వారలన్= అర్హులను; పుచ్చుచున్= పంపుతూ; తలఁకుచున్+ఉందున్= భయపడుతుంటాను; నేనున్= నేను; అది+ఆదిగాన్= అది మొదలుకొని; చింతన్= విచారంచేత; ఏపు+తక్కి= ఉత్సాహం కోల్పోయి; స్రుక్కి+ఉండియున్= తగ్గిపోయినప్పటికినీ; రాజులన్= భూపతులను; ఉక్కు మడఁతున్= పొగరణగిస్తాను.

**తాత్పర్యం:** అంబ వృత్తాంతం తెలిసికొనటానికై ప్రతిదినం తగినవారిని పంపుతూ భయపడుతుంటాను. ఆమె తపోబలంతో నన్ను నిర్మూలిస్తానని పల్కిందిమొదలు నేను చింతతో కృశించినప్పటికినీ శత్రురాజుల మదమణగిస్తూనే ఉన్నాను.

**వ.** **ఒక్కనాఁడు పారాశర్య నారదులంగని యక్కార్యంబు భయంబు దోఁప విన్నవించిన వారలు 'దైవాధీనంబగు దాని మానుషంబున మానిపింప వశంబుగా; దా చింత విడువు'మని రందు నారదుం 'డక్కాశీశ్వర కన్యక తెఱంగు విను'మని యిట్లనియె.** **362**

**ప్రతిపదార్థం:** ఒక్కనాఁడు; పారాశర్య; నారదులన్= పరాశరముని పుత్త్రుడైన వ్యాసునీ, నారదునీ; కని= చూచి; ఆ కార్యంబు భయంబు+తోఁపన్= అంబ తలపెట్టిన తపము వలన భీతి కలుగగా; విన్నవించినన్= నేను మనవి చేయగా; వారలు; దైవ+అధీనంబు+అగుదానిన్= దైవము చేతిలోనున్న పనిని; మానుషంబునన్= మనుష్య యత్నముచే; మానిపింపన్ వశంబు+కాదు; ఆ చింతన్ విడువుము; అనిరి; అందున్= వారిలో; నారదుండు; ఆ+కాశీ+ఈశ్వర కన్యక+తెఱంగు= ఆ కాశీరాజు పుత్రిక యొక్క వైనము; వినుము; అని ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** నే నొకనాడు వ్యాస నారద మునీంద్రులను చూచి అంబవిషయమై నాకు భయమగుచున్నదని మనవి చేశాను. వారు దైవము తలపెట్టిన పనిని మానవ యత్నంతో మరలించడం శక్యం కాదు. నీవు ఈ విచారం విడిచిపెట్టుమని చెప్పారు. కాని నారద మహర్షి నాకు ఆ కాశీరాజపుత్రి విధం వినుమని ఇట్లా చెప్పినాడు:

**సీ.** **'ఆ తన్వి యమునా నదీ తీరమున కేఁగి। యత్యుగ్రమగు తప మాచరించి**
**యందుండి కౌశికు నావాస మాదిగాఁ। గలుగు సిద్ధాశ్రమంబులకు నెల్లఁ**
**జని చని తత్త్వదేశంబుల నిష్ఠుర। వ్రతములు సలుపంగ వచ్చి నీదు**
**జనని జాహ్నవి 'యిట్లు వనితల కతి దుష్క। రములగు బహునియమములు నీకు**

**తే.** **నడపఁ గత మేమి?' యనుడు నన్నాతి పలుకుఁ। 'దద్ద యవమాన పడితి శాంతనవు చేత;**
**నపరజన్మంబునం దైన నతనిఁ జంప। నేను జాలుటకై యిట్టిదాన నైతి.** **363**

**ప్రతిపదార్థం:** ఆ+తన్వి= ఆ తరుణి; యమునా నదీ తీరమునకున్= యమునా నది యొక్క తటమునకు; ఏఁగి= వెళ్ళి; అతి+ఉగ్రము+అగు+తపము= మిక్కిలి ఘోరమైన తపస్సు; ఆచరించి= చేసి; అందున్+ఉండి= ఆ యమునా తీరమునుండి;

కౌశికు+ఆవాసము= విశ్వామిత్ర మహర్షి నివసించే ప్రదేశం; ఆదిగాన్+కలుగు= మొదలుగా ఉన్నటువంటి; సిద్ధ+ఆశ్రమంబులకున్+ఎల్లన్= తపస్సు ఫలించునట్టి ఆశ్రమాలన్నింటికినీ; చని చని= వెళ్ళి వెళ్ళి; తద్+ప్రదేశంబులన్= ఆయా తావులందు; నిష్ఠురవ్రతములు= కఠిన నియమాలతో కూడిన వ్రతాలు; చలుపంగన్= చేస్తూ ఉండగా; నీదు జనని జాహ్నవి వచ్చి= నీ తల్లిఅయిన గంగాదేవి అంబ కడకువచ్చి; ఇట్లు= ఈ విధంగా; వనితలకున్= ఆడువారికి; అతి దుష్కరములు+అగు= మిక్కిలి శ్రమతో చేయవలసిన; బహునియమములు= అనేకములైన నీమములను; నీకున్= నీకు; నడపన్+కతము+ఏమి?= సాగించడానికి కారణమేమి?; అనుడున్= అని ప్రశ్నించగా; ఆ+నాతి+పలుకున్= ఆ అంబ చెప్పింది; శాంతనవుచేతన్= శంతను పుత్రుడైన భీష్మడి వలన; తద్ద= మిక్కిలి; అవమానపడితిన్= పరాభవం పొందాను; అపర జన్మంబునందున్+ఐనన్= మీదటి పుట్టువులోనైనా; అతనిన్+చంపన్= అతడిని వధించడానికి; నేను చాలుటకై= నేను సామర్థ్యం కలదాననగుటకై; ఇట్టిదానన్+ఐతిన్= ఇట్లా తపోవృత్తి నవలంబించాను.

**తాత్పర్యం:** 'అంబ యమునానదీతీరానికి వెళ్ళి అక్కడ ఘోరతపం సాగించింది. అక్కడ నుండి విశ్వామిత్ర మహర్షి నివాసం మొదలుగా ఉన్న సిద్ధాశ్రమాలన్నింటికీ వెళ్ళి వెళ్ళి, ఆయా ప్రదేశాలలో కఠిన నియమాలతో కూడిన వ్రతాలు సల్పుతూ ఉండింది. నీ తల్లి అయిన గంగాదేవి ఒకనా డామె దగ్గరకు వచ్చి 'ఆడువారికి అతి దుష్కరాలైన నియమ వ్రతాలు నీవు నెరపుతున్నావు. కారణమేమి?' అని ప్రశ్నించింది. నేను భీష్మడిచేత మిక్కిలి పరాభవం పాలైనాను. మరుజన్మలోనైనా అతడిని చంపి పగతీర్చుకొనే సామర్థ్యం సంపాదించాలని ఇట్లా తపోవృత్తి నవలంబించాను' అని అంబ సమాధాన మిచ్చింది.

**వ. అనిన విని భాగీరథి 'కుటిల ప్రచారవగుట నీవీ తనువు విడిచి యేఱయి పాఱంగల దాన; వింతియకాని యొండు గానేర' వనిన న వ్వెలంది నవ్వుచు సరకు చేయక యరిగి తొంటికంటెను దీవ్రంబగు తపశ్చరణంబునం బ్రవర్తిల్లుచు మత్స్యదేశ వాసినియై యుండి నాఁడు నిజవ్రత ఫలంబులో సగంబున నంబయను పేర నదియై య మ్మండలంబునం బరఁగియున్న సగంబునను దనరూపు చెడకుండ వహించికొని జాహ్నవీ ప్రభావంబు నాత్మీయ ప్రభావంబున గెలిచి వెండియు. 364**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అంబ పల్కులు ఆలించి; భాగీరథి= గంగాదేవి; కుటిల ప్రచారవు+అగుటన్= నీవు వక్రమైన వర్తనం కలదానవు కావటం వలన; నీవు; ఈ+తనువున్ విడిచి= ఈ శరీరమును వదలి; ఏఱు+అయి+పాఱన్+కలదానవు= నదివై ప్రవహించగలవు; ఇంతియకాని ఒండు కానేరవు= ఇంత దప్ప ఇంకేమీ నీవు చెయ్యలేవు; అనినన్= అని గంగ పలుకగా; ఆ+వెలంది= ఆ మగువ (అంబ); నవ్వుచున్; సరకు చేయక= గంగ మాటలు లెక్కించక; తిరిగి; తొంటి కంటెన్= మునుపటి కంటె; తీవ్రంబు+అగు= కఠినమైన; తపస్+చరణంబునన్= తపస్సు చేయటంలో; ప్రవర్తిల్లుచున్= మెలగుతూ; మత్స్యదేశవాసిని+ఐ+ఉండి= మత్స్యదేశంలో నివసిస్తూ ఉన్నదై; ఒక్కనాఁడు; నిజవ్రత ఫలంబులోన్= తన వ్రతాల యొక్క ఫలమునందు; సగంబునన్= అర్ధభాగంతో; అంబ+అను పేరన్= అంబ అనే నామంతో; నదియై; ఆ+మండలంబునన్= ఆ భూమి భాగంలో; పరఁగి= ఒప్పుతూ; ఉన్న సగంబునను= మిగిలిన తపోమహిమ యొక్క అర్ధభాగంతో; తన రూపు చెడకుండన్= తన స్వరూపం నశించిపోకుండా; వహించుకొని= కాపాడుకొని; జాహ్నవీ ప్రభావంబున్= గంగాదేవి యొక్క మహిమను; ఆత్మీయ ప్రభావంబునన్= తన తపోమహిమ చేత; గెలిచి= జయించినదై; వెండియున్= మరియు.

**తాత్పర్యం:** అంబ పల్కులు విని గంగాదేవి 'నీవు, వక్రప్రవర్తన కలదానవు కనుక ఈ దేహం వీడి నదివై ప్రవహించగలవు. ఇంతేకాని నీవు మరేమీ చెయ్యలేవు' అని పలికింది. అంబ నవ్వుతూ గంగ మాటలు లక్ష్యపెట్టక

మళ్ళీ మునుపటికంటె తీవ్రమైన తపోవృత్తిలో మెలగుతూ మత్స్యదేశ నివాసినిఅయి ఉండి, ఒకరోజు తన వ్రతఫలంలో అర్థభాగమున అంబ అనే నామంతో నదిఅయి మత్స్యధరణీ మండలంలో ప్రవహించింది. మిగిలిన సగం తపోబలంతో తన స్వరూపం చెడకుండా నిలుపుకొని గంగాదేవి మహిమను తన తపోమహిమ చేత జయించింది. గంగాదేవి శాపం వలన తన స్వరూపం పూర్తిగా కోల్పోయి ఏరై పారవలసిన అంబ నిజ తపోబలంచేత ఆకారం కోల్పడనందున గంగను గెలువగలిగింది.

**క. పుణ్యాశ్రమ దేశముల న । గణ్యంబగు తపము చేయఁగా రుద్రుఁడు గా**
**రుణ్యము వాత్సల్యము దా । క్షిణ్యము మెఱయంగ నింతికిం బొడసూపెన్. 365**

**ప్రతిపదార్థం:** పుణ్య+ఆశ్రమ దేశములన్= పావనాలైన ఆశ్రమ స్థలాలలో; అగణ్యంబు+అగు= లెక్కింపరానట్టి; తపము చేయఁగాన్= తపస్సు సల్పగా; రుద్రుఁడు= శంభుడు; కారుణ్యము= దయ; వాత్సల్యము= ప్రేమ; దాక్షిణ్యము= సామర్థ్యం; మెఱయంగన్= ప్రకాశించగా; ఇంతికిన్= అంబకు; పొడసూపెన్= ప్రత్యక్షమయ్యాడు.

**తాత్పర్యం:** అంబ పవిత్రములైన ఆశ్రమ స్థలాలలో లెక్కించలేనంత తపస్సు సల్పుతుండగా దయ, ప్రేమ, సామర్థ్యం ప్రకటమయ్యేటట్లు శంకరుడు ఆమెకు ప్రత్యక్షమయ్యాడు.

**క. మును లచ్చెరు వంది కనుం । గొన శంభుఁడు నిల్చి 'వరముఁ గోరు' మనుడు 'భీ**
**ష్ముని నాకుఁ జంపఁగా దొర । కొను నట్లుగ నొసఁగు' మనియెఁ గోమలి యెలమిన్. 366**

**ప్రతిపదార్థం:** మునులు= ఋషులు; అచ్చెరువు+అంది= ఆశ్చర్యం పొంది, కనుంగొనన్= వీక్షిస్తూ ఉండగా; శంభుఁడు నిల్చి= ఈశ్వరుడు ఎదుట ప్రత్యక్షమై; వరమున్ కోరుము= వరం కోరుకొమ్ము; అనుడున్= అని పలుకగా; కోమలి= వనితఅయిన అంబ; ఎలమిన్= సంతోషంతో; నాకున్= నాకు; భీష్మునిన్+చంపఁగాన్= భీష్ముడిని వధించటానికి; దొరకొనునట్లుగాన్= పూనుకొనేటట్లు; ఒసఁగుము+అనియెన్= వరం దయచేయు మని పలికింది.

**తాత్పర్యం:** మును లాశ్చర్యపడి కనుగొనుచుండగా శంకరుడు అంబ యెదుట ప్రత్యక్షమై వరం కోరుకొమ్మన్నాడు. అంబ భీష్ముడిని తాను చంపుట సమకూడేటట్లు వరం అనుగ్రహించు'మని సంతోషంతో వేడింది.

**వ. అనవుడు నద్దేవుం 'డట్ల కాక' యని యనుగ్రహించిన, నంబ 'యెత్తెఱంగున నది యయ్యెడు?' నని యడిగిన- 367**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అంబ అట్లు వరం వేడగా; ఆ+దేవుండు= ఆ పరమేశ్వరుడు; అట్లకాక+అని= అట్లే ఇచ్చానని; అనుగ్రహించినన్= దయచూపగా; అంబ; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; అది+అయ్యెడున్+అని+అడిగినన్= భీష్మవధ జరుగగలదని అడుగగా.

**తాత్పర్యం:** అంబ అట్లా వరం వేడగా పరమేశ్వరుడు 'అట్లే అగుగాక' అని అనుగ్రహించాడు. ఆమె ఆ పని ఎట్లా జరుగగలదని ప్రశ్నించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. ఈ మేను విడిచి నీ వేఁగిన యప్పుడు । ద్రుపద భూవిభునకుఁ దొల్త పుత్రి**
**వై పుట్టి పిదపఁ బుత్త్రాకృతిఁగాంచి శి । ఖండినామమున నుద్దండబాహు**
**బలమునఁ గోదండ పాండిత్యమును బటు । శౌర్యంబు నొప్పఁ బ్రశస్తి కెక్కి**
**యనిఁ జంపఁ గలదాన వాతని; నా మాట । దప్ప దూఱడు' మని చెప్పి హరుఁడు**

**తే. సనియె; నా ప్రొద్దు సమిధలు చాలఁ గూడ । వైచి యనలంబుఁ గూర్చి యవ్వనిత క్రోధ**
**దీప్తమూర్తియై 'భీష్ము వధించు దాన' । ననుచు సొదఁ జొచ్చె మునులకు నద్భుతముగ. 368**

**ప్రతిపదార్థం:** ఈ+మేను విడిచి= ఈ శరీరం వదలి; నీవు+ఏఁగిన+అప్పుడు= నీవు వెళ్ళిన సమయంలో; ద్రుపద భూ విభునకున్= ద్రుపద మహారాజునకు; తొల్తన్= మొదట; పుత్రివి+ఐ+పుట్టి= కూతురుగా జన్మించి; పిదపన్= తరువాత; పుత్త్ర+ఆకృతిన్+కాంచి= కుమార స్వరూపాన్ని ధరించి; శిఖండి నామమునన్= శిఖండి అనే పేరుతో; ఉద్దండ బాహు బలమునన్= మిక్కుటమైన భుజశక్తితోనూ; కోదండ పాండిత్యమును= ధనుర్విద్యయందు నైపుణ్యమునూ; పటు శౌర్యంబున్= దృఢమగు పరాక్రమమునూ; ఒప్పన్= ప్రకాశించగా; ప్రశస్తికిన్+ఎక్కి= ఖ్యాతిగడించి; అనిన్= యుద్ధంలో; ఆతనిన్= దేవవ్రతుడిని; చంపన్+కలదానవు= సంహరించగలవు; నా మాట తప్పదు= నా పలుకు వమ్ముగాదు; ఊఱడుము= ఉపశమించుము; అని చెప్పి= అని పలికి; హరుఁడు= రుద్రుడు; చనియెన్= అంతర్ధానమయ్యాడు; ఆ ప్రొద్దు= ఆ దినం; సమిధలు= కట్టెలు; చాలన్= మిక్కిలి; కూడవైచి= ఒక చోట చేర్చి (ప్రోగుచేసి) అనలంబున్+కూర్చి= అగ్గినంటించి; ఆ+వనిత= ఆ చెలువ; క్రోధ దీప్తమూర్తి ఐ= కోపంచేత ప్రకాశిస్తున్న ఆకారం కలదై; భీష్మున్ వధించుదానన్= భీష్ముడిని నేను సంహరిస్తాను; అనుచున్= అని పలుకుతూ; మునులకున్= అక్కడి ఋషులకు; అద్భుతముగన్= ఆశ్చర్యం కలిగేటట్లు; సొదన్+చొచ్చెన్= చితిలో ప్రవేశించింది.

**తాత్పర్యం:** నీవు శరీరం విడిచి వెళ్ళేటప్పుడు ద్రుపద భూపతికి మొదట కూతురుగా పుట్టుతావు. తరువాత కుమారుడ వవుతావు. శిఖండి అనే పేరుతో మిక్కుటమైన భుజశక్తి, ధనుర్విద్యా నైపుణ్యం, దిట్టమైన పరాక్రమం అనే వాటితో ప్రకాశిస్తూ ప్రఖ్యాతి గడించి యుద్ధంలో భీష్ముడిని సంహరిస్తావు. నా మాట వ్యర్థం కాదు. ఓర్మి వహించు' అని చెప్పి రుద్రుడు అంతర్ధానమయ్యాడు. ఆ దినమే అంబ కట్టియలు ఒకచోట ప్రోగుగా పేర్చి నిప్పంటించి క్రోధంతో తన రూపం జ్వలిస్తుండగా, అక్కడి మునులు ఆశ్చర్యపడుతుండగా, 'నేను భీష్ముడిని వధిస్తా'నంటూ ఆ చితిమంటలలో ప్రవేశించింది.

**వ. అట్టియెడ ద్రుపదుం డనపత్య యగు తన మహిషి విషాదంబు దీర్పం దివురుటను గాంగేయు తోడి రోషంబునను శివుని నుద్దేశించి తపంబు సేసిన నద్దేవుండు ప్రత్యక్షంబయి 'వరంబు వేఁడు' మనిన 'భీష్ము వధియించు నట్టివాని నొక్క పుత్త్రుని నొసంగవలయు' ననుడు. 369**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ తరుణంలో; ద్రుపదుండు; అనపత్య+అగు= బిడ్డలులేని; తన మహిషి విషాదంబు= తన పట్టపురాణి దుఃఖమును; తీర్పన్= తొలగించటానికి; తివురుటను= పూనుకొనటం వలననూ; గాంగేయు తోడి రోషంబునను= భీష్ముడిపై తనకు గల క్రోధంవల్లనూ; శివునిన్+ఉద్దేశించి= శంకరుడి గురించి; తపంబు చేసినన్= తప మొనర్పగా; ఆ+ దేవుండు= పరమేశ్వరుడు; ప్రత్యక్షంబు+అయి= గోచరించి; వరంబు వేఁడుము+అనినన్; భీష్మున్ వధియించునట్టివానిన్= గాంగేయుడిని చంపగలవాడిని; ఒక్క పుత్త్రునిన్= ఒక కుమారుని; ఒసంగవలయున్= నాకీయవలెను; అనుడున్= అని కోరగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** అంబ చిత్యగ్నిలో ప్రవేశించిన తరుణంలో ద్రుపదుడు బిడ్డలు లేని తన పట్టపురాణి కోకిలాదేవి దుఃఖం తొలగించటానికై పూనిక వహించిన వాడగుట వల్లనూ, గంగాపుత్రుడైన భీష్ముడిపై తనకు గల కోపం వల్లనూ శివుడిని గురించి తపస్సు చేశాడు. పరమశివుడు ప్రత్యక్షమై వరం వేడుమని ద్రుపదుడిని అడిగాడు. అపుడు పాంచాలరాజు భీష్ముడిని చంపగల ఒక కుమారుడిని అనుగ్రహించుమని ప్రార్థించాడు. అందుకు ఈశ్వరు డిట్లా అన్నాడు:

**తే. 'కూఁతురై పుట్టి పదపడి కొడుకుఁదనము । గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు**
**నట్టి యుజ్జ్వలాపత్యంబు వుట్టు నీకుఁ । దప్ప దిది' యని రుద్రుండు సెప్పి చనియె. 370**

**ప్రతిపదార్థం:** కూఁతురు+ఐ+పుట్టి= మొదట కుమార్తెగా జన్మించి; పదపడి= పిదప; కొడుకుఁదనమున్+కాంచి= కుమారత్వమును పొంది; భీష్మనిన్= శాంతనవుడిని; ఆజిరంగమునన్= రణభూమిలో; చంపునట్టి= వధించగల్గిన; ఉజ్జ్వల+అపత్యంబు= వెలిగిపోయే బిడ్డ; నీకున్= నీకు; పుట్టున్= జన్మిస్తుంది; ఇది తప్పదు= ఇది జరిగి తీరుతుంది; అని= అంటూ; రుద్రుఁడు= ఈశ్వరుడు; చెప్పి చనియెన్= వచించి మరుగయ్యాడు.

**తాత్పర్యం:** మొదట నీకు పుత్రికగా జన్మించి, ఆ తరువాత కొడుకుగా మారి, భీష్ముడిని యుద్ధభూమిలో చంప గల్గిన చక్కని సంతానం నీకు కల్గుతుంది. నా వచనం అమోఘం' అని నుడివి మహేశ్వరుడు అంతర్ధానమయ్యాడు.

**వ. ద్రుపదుండును బ్రీతుండయి నిజప్రియకు నవ్విధం బెఱింగించెఁ; దదనంతరంబ కాశీశ్వరకన్యక చైతన్యం బుదరంబు ప్రవేశించిన. 371**

**ప్రతిపదార్థం:** ద్రుపదుండును; ప్రీతుండు+అయి= ఆనందించినవాడై; నిజప్రియకున్= తన భార్యఐన కోకిలాదేవికి; ఆ+విధంబు+ఎఱింగించెన్= ఈశ్వరుడు పలికిన పలుకులు తెలిపాడు; తద్+అనంతరంబ= ఆ తరువాత; కాశీ+ఈశ్వర కన్యక చైతన్యంబు= కాశీరాజపుత్రి అంబ యొక్క చైతన్యం (ప్రాణం); ఉదరంబు ప్రవేశించినన్= ద్రుపద పత్ని గర్భంలో చొరబడగా.

**తాత్పర్యం:** ద్రుపద మహారాజు సంతోషించి తన ప్రియురాలైన కోకిలాదేవికి ఈశ్వరుడు వరాన్ని అనుగ్రహించిన వైనం తెలియజెప్పాడు, తరువాత కాశీరాజు కూతురైన అంబ యొక్క చైతన్యం రాజమహిషి గర్భంలో ప్రవేశించగా.

**క. పాంచాల రాజభార్య స । మంచిత గర్భంబు దాల్చి, మఱువడఁ గూఁతుం**
**గాంచి, నిజపతియుఁ దానును । వంచనఁ గొడు కనిరి యెల్లవారును వినఁగన్. 372**

**ప్రతిపదార్థం:** పాంచాల రాజభార్య= ద్రుపద మహారాజు పత్ని; సమంచిత గర్భంబున్+తాల్చి= ఒప్పిదంగా కడుపుతో ఉండి; మఱువడన్= రహస్యంగా; కూతున్+కాంచి= కుమార్తెను కని; నిజపతియున్= తన భర్త అగు ద్రుపదుడున్నూ; తానును= తానున్నూ; వంచనన్= కపటంగా; ఎల్లవారును వినఁగన్= లోకులందరూ వినేటట్లు; కొడుకు+అనిరి= తమకు పుత్రుడు కలిగాడని అన్నారు.

**తాత్పర్యం:** పాంచాల భూవల్లభుడైన ద్రుపదుడి పట్టమహిషి చక్కగా గర్భం ధరించి రహస్యంగా కొమార్తెను కన్నది. తానూ, తన మగడూ కపటంగా తమకు పుత్రు డుదయించాడని లోకులందరికి చెప్పారు.

**వ. ఇట్లు పుట్టిన బిడ్డకుఁ బుత్త్ర ప్రకారంబున జాతకర్మాది కృత్యంబులు నిర్వర్తించి శిఖండి యనుపేరుపెట్టి యతి ప్రచ్ఛన్నంబుగాఁ బెనిచి రహస్యంబు తెఱంగా కన్నియకుం జెప్పి యక్షర శిక్షాదు లాచరించి ద్రోణాచార్యుకడ శస్త్రాస్త్ర పరిశ్రమంబు సేయించుచుండ జవ్వనంబు చేరువకుం దఱియగుటయు నమ్మగువం జూచి వగచి తల్లిదండ్రులు తమలో విచారించి 'వేగంబ వివాహంబు సేయవలయుఁ; బరమేశ్వరు వరంబు కొఱంత వడునె? తన నెఱసినప్పుడు నెఱయుంగాక!' యని నిశ్చయించి దశార్ణ దేశాధీశుండగు హేమవర్మ యను రాజు కన్యకం దగిన తెఱంగునఁ బాణిగ్రహణంబు సేయించి తెచ్చియున్నంత. 373**

**ప్రతిపదార్థం:** ఇట్లు పుట్టిన బిడ్డకున్; పుత్త్రప్రకారంబునన్= కుమారున కెట్లో అట్లు; జాతకర్మ+ఆది+కృత్యంబులు+నిర్వర్తించి= బిడ్డపుట్టినప్పుడు చేయవలసిన శాస్త్రోక్త విధులు చేసి; శిఖండి; అనుపేరు పెట్టి; అతి ప్రచ్ఛన్నంబుగాన్= మిక్కిలి రహస్యంగా; పెనిచి= పెంచి; రహస్యంబు తెఱంగు= ఈ రహస్యానికి గల కారణం; ఆ కన్నియకున్ చెప్పి= ఆ బాలిక కెరిఁగించి; అక్షర శిక్షా+ఆదులు+ఆచరించి= విద్యాభ్యాసాదులు జరిపించి; ద్రోణాచార్యుకడన్= గురువగు ద్రోణుడి దగ్గర; శస్త్ర+అస్త్ర పరిశ్రమంబు చేయించుచున్+ఉండన్= శస్త్రాస్త్ర విద్యలందు శిక్షణ ఇప్పిస్తుండగా; జవ్వనంబు చేరువకున్= యౌవనం సమీపించుటకు; తఱి+అగుటయున్= సమయ మాసన్నంకాగా; ఆ+మగువన్ చూచి= ఆ పడతినికని; తల్లిదండ్రులు; వగచి= దుఃఖించి; తమలోన్ విచారించి= తమలో తాము ఆలోచించి; వేగంబు+అ= శీఘ్రమే; వివాహంబు చేయన్ వలయున్= పెండ్లి చేయాలి; పరమేశ్వరువరంబు కొఱంత పడునె?= ఈశ్వరుడిచ్చిన వరం లోపించునా?; తన నెఱసినప్పుడు నెఱయున్+కాక= గుట్టు బట్టబయలగునప్పు డగుగాక; అని నిశ్చయించి= అని నిర్ణయం చేసి; దశార్ణ దేశ+అధి+ఈశుండు+అగు= దశార్ణ దేశానికి అధిపతి ఐన; హేమవర్మ+అను= హేమవర్మ అనే పేరు గలిగిన; రాజు కన్యకన్= రాజుయొక్క కొమార్తెను; తగిన తెఱంగునన్= అర్హమైన రీతిలో; పాణిగ్రహణంబు చేయించి= శిఖండి కిచ్చి పెళ్ళి చేయించి; తెచ్చి+ఉన్నంతన్= కోడలిని ఇంటికి కొనివచ్చి ఉండగా.

**తాత్పర్యం:** ద్రుపద మహారాజు తనకు ఆడుబిడ్డ పుట్టినప్పటికీ మగబిడ్డకు చేయించవలసిన సంస్కార విశేషాలన్నీ చేయించి శిఖండి అనే పేరు పెట్టి అతిరహస్యంగా పెంచుతూ వచ్చాడు. రహస్యానికి గల కారణాన్ని ఆ కన్యకు తెలిపాడు. శిఖండికి అక్షరాభ్యాసం జరిపించి, ద్రోణాచార్యుల దగ్గర క్షత్రియోచితమైన శస్త్రాస్త్ర విద్యాపరిశ్రమ చేయిస్తూ ఉన్నాడు. ఇంతలో యౌవనం చేరువ అయిన తమ బిడ్డను చూచి జననీ జనకులు చింతించారు. వారు తమలో తాము వితర్కించుకొన్నారు. 'తొందరగా కన్యకు పెళ్ళి చేయాలి. ఈశ్వరుడు ప్రసాదించిన వరం వమ్ము కాదు. ఈమెకు మగతనం వచ్చినప్పుడు వచ్చుగాక' అని నిర్ణయించుకొని దశార్ణ దేశాధిపతిఅయిన హేమవర్మ పుత్రితో శిఖండికి ఉపాయంతో పెళ్ళి చేయించి కోడలిని ఇంటికి తెచ్చుకొనగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. అక్కుమారి చతుర యగుట శిఖండి వ । ర్తనము నెడఁ బ్రమాదమున నెఱింగి**
**యుగ్గడింప నొల్ల కూరక యెఱుఁగని । యదియ పోలె నుండె నాత్మ నొచ్చి. 374**

**ప్రతిపదార్థం:** ఆ+కుమారి= దశార్ణ దేశాధిపతి కూతురు; చతుర+అగుటన్= నేర్పుగలది కావటం వలన; శిఖండి వర్తనము+ఎడన్= శిఖండి యొక్క ప్రవర్తన పట్ల; ప్రమాదమునన్+ఎఱింగి= అతడి యొక్క పరాకు వలన గ్రహించి; ఆత్మన్+నొచ్చి= మనసులో బాధపడి; ఉగ్గడింపన్+ఒల్లక= చెప్పటానికి ఇష్టపడక; ఊరక= మౌనంగా; ఎఱుఁగన్+అదియ పోలెన్= ఏమీ తెలియని దానివలెనే; ఉండెన్= ఉండింది.

**తాత్పర్యం:** దశార్ణ దేశ విభుడి పుత్రిక నేర్పుగలది. కనుక శిఖండి వర్తనం అతడు ఏమరి ఉన్నప్పుడు తెలిసికొని మనస్సులో బాధపడి, అతడు పడతి అని గ్రహించికూడా ఇతరు లెవ్వరికినీ చెప్పటానికి ఇష్టపడక ఏమీ ఎరుగనిదానివలెనే ఉండిపోయింది.

**వ. ఇట్లు దశార్ణ విభుపుత్రి యెఱింగి శిఖండి పురుషుండు గామి దన దాసికిం జెప్పిన నదియు నప్పు డన్నరనాథున కెఱింగించి, పుచ్చిన, నతండు విషాద రోషంబుల నొంది దూతం బుత్తెంచిన, వాఁడు వచ్చి పాంచాలపతిం గాంచి యిట్లనియె : 375**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; దశార్ణ విభు పుత్రి= దశార్ణరాజకుమారి; ఎఱింగి= గ్రహించి; శిఖండి; పురుషుండు కామిన్= మగవాడు కాడని; తన దాసికిన్; చెప్పినన్= తెలుపగా; అదియున్= ఆ దాసి; అప్పుడు= అపుడే; ఆ+నరనాథునకున్= ఆ దశార్ణపతికి; ఎఱింగించి పుచ్చినన్= తెలియజెప్పి పంపగా; అతండు= ఆ రాజు; విషాద రోషంబులన్+ఒంది= తన కూతురు ఆడుదానికి ఆలయినందుకు దుఃఖాన్నీ, తన పుత్రికను పుత్రుడని చెప్పి తనను వంచించినందుకు కోపాన్నీ పొందినవాడై; దూతన్= దూతను; పుత్తెంచినన్= పంపగా; వాఁడు వచ్చి పాంచాలపతిన్; కాంచి= కనుగొని; ఇట్లు+అనియెన్:

**తాత్పర్యం:** దశార్ణపతి పుత్రిక శిఖండి మగవాడు కాడని ఎరిగి తన దాసికి చెప్పింది. ఆ పరిచారిక ఆ సంగతి దశార్ణ విభుడికి తెలియజేసింది. అతడు దుఃఖ క్రోధాలను పొంది దూతను పంపగా, వాడు ద్రుపదుడిని చూచి ఇట్లా అన్నాడు:

**చ. కొడుకని చెప్పి యిట్లగునె కూఁతు వివాహము చేయ దీన నీ**
**పడసిన లాభమేమి? నగుఁబాటగు నింతియ కాక యెల్ల నే**
**ర్పడ నెఱుఁగంగ వచ్చితి; నరాతిభయంకరు హేమవర్మ నా**
**గడమున గాసిచేసితి మగంటిమి నీదెసనైనఁ జూపుమా! 376**

**ప్రతిపదార్థం:** కొడుకు+అని చెప్పి= కుమారుడని పలికి; కూఁతున్= కొమార్తెను తీసికొనివచ్చి; ఇట్లు+వివాహము చేయన్+అగునె?= ఇట్లా పెండ్లి చేయటం తగునా?; నగుఁబాటు+అగున్= నీకు తలవంపులౌతుంది; ఇంతియకాక= ఇంతకుమించి; దీనన్= ఇట్లు చేసినందువలన; నీ పడసిన లాభము+ఏమి?= నీవు పొందిన ప్రయోజనమేముంది?; ఎల్లన్= ఉన్న విషయమంతయు; ఏర్పడన్= తెల్లముగా; ఎఱుఁగంగన్+వచ్చితిన్= తెలిసికొనటానికి వచ్చాను; అరాతి భయంకరున్= శాత్రవులకు భీతి గొలుపునట్టి; హేమవర్మన్= హేమవర్మను; ఆగడమునన్= అకార్యముచే; గాసి చేసితి(వి)= బాధపెట్టావు; నీ దెసన్+ఐనన్= నీ విషయంలోనైనను; మగంటిమి= మగతనం; చూపుమా= కనబరచుము.

**తాత్పర్యం:** కొడుకని చెప్పి కొమార్తెను తీసుకొనివచ్చి నా పుత్రికతో వివాహం జరిపించావు. ఇట్లా చేయటం వల్ల తలవంపులు దప్ప నీవు సాధించిన ప్రయోజన మేముంది? ఈ విషయమెల్ల విస్పష్టంగా తెలిసికొనటానికి వచ్చాను. హేమవర్మ శత్రు భయంకరుడని నీకు తెలియదా? అకార్య మొనర్చి ఆయనకు బాధ కల్గించావు. పోనీ నీ విషయంలోనైనా మగతనం చూపవలసినది. (రణరంగంలో ఆతన్నెదుర్కొని నీ పౌరుషం ప్రకటించవలసినదని చమత్కారం.)

**విశేషం:** మగంటిమి నీ దెసనైనఁ జూపుమా - నీ సంతానానికి ఎట్లాగూ మగతనం లేదు. నీకయినా మగతనం ఉంటే మా రాజుతోడి యుద్ధంలో ప్రదర్శించుము - అని దూతవాక్యంలో చమత్కారం.

**ఆ. అనిన నగుచు వాని కను ద్రుపదుం 'డివి । యేటిమాట? లిట్టు లేల చేయ**
**వచ్చు? నింత వెట్టివారును గలరె? యి । త్తెఱఁగు వొసఁగ కునికి యెఱుఁగ రాదె?' 377**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దూత పలుకగా; ద్రుపదుండు= ద్రుపద మహారాజు; నగుచున్= నవ్వుతూ; వానికిన్+అనున్= వాడితో ఇట్లా అన్నాడు; ఇవి+ఏటి మాటలు?= ఇవెట్టి మాటలు?; ఇట్టులు= ఈ ప్రకారం; ఏల చేయన్ వచ్చున్?= ఎందుకు చేస్తాము?; ఇంత వెట్టివారును కలరె?= లోకంలో ఇంత పిచ్చివారుంటారా?; ఈ+తెఱఁగు= నీవు నుడివిన విధం; పొసఁగక+ ఉనికి= అసంభవమని; ఎఱుఁగన్+రాదె?= తెలియవలదా?

**తాత్పర్యం:** దూత మాటలకు ద్రుపదుడు నవ్వుతూ- 'ఆహా! ఇవేటి మాటలు? ఇట్లా ఎందుకు చేస్తాము? ఇంత వెర్రి వారుంటారా? ఇట్లా ఎక్కడా జరగదని గ్రహించుము.'

**వ. అని వెండియు నేర్పునం దీర్పుమాట లనేకంబులాడి నిక్కం బరయం జూచిన వానికిం జొరవ యీక త్రోపుసేసి వీడ్కొలిపి పుచ్చినం బోయి వాఁడును నిజనాథున కవ్విధంబు విన్నవించిన. 378**

**ప్రతిపదార్థం:** అని; వెండియున్= మరల; నేర్పునన్= చాతుర్యంతో; తీర్పుమాటలు= పొందిక మాటలు; అనేకంబులు+ఆడి= పెక్కువచించి; నిక్కంబు+అరయన్= నిజం గ్రహించటానికి; చూచినన్= దూత యత్నించగా; వానికిన్= అతడికి; చొరవ+ ఈక= అవకాశం కల్గించక; త్రోపుచేసి= త్రోసిపుచ్చి; వీడ్కొలిపి పుచ్చినన్= పోయిరమ్మని పలికి పంపగా; పోయి= వెళ్ళి; వాఁడును= ఆ దూత; నిజనాథునకున్= తన ఏలికయైన హేమవర్మకు; ఆ+విధంబు= ద్రుపదుడు పల్కిన తీరు; విన్నవించినన్= విజ్ఞప్తి చేయగా.

**తాత్పర్యం:** అని మళ్ళీ ద్రుపదుడు నేర్పుతో పెక్కు పొందిక మాటలు పలికాడు. నిజం వెలికి తీయటం కొరకు దూత యత్నించగా అట్టి అవకాశ మీయక త్రోసివేసి అతడికి వీడ్కోలిచ్చాడు. వాడు వెళ్ళి తన ఏలిక హేమవర్మకు పాంచాలు డాడిన పలుకులన్నీ విన్నవించగా.

**క. కోపోద్రేకంబున నతఁ । డా పాంచాలపతిమీఁద నతులిత సైన్యా**
**టోపమున వచ్చి పురి పరి । ఖా పరిసర తలము చుట్టుఁ గైకొని విడిసెన్. 379**

**ప్రతిపదార్థం:** అతఁడు= హేమవర్మ; కోప+ఉద్రేకంబునన్= క్రోధావేశంతో; ఆ పాంచాల పతి మీఁదన్= ఆ ద్రుపద మహారాజు మీద; అతులిత= సాటిలేని; సైన్య+ఆటోపమునన్= సేనల యొక్క విజృంభణంతో; వచ్చి= చనుదెంచి; పురి పరిఖా పరిసర తలము చుట్టున్= రాజధానీ నగరం యొక్క అగడ్త సమీప భూమి చుట్టూ; కైకొని= ఆక్రమించి; విడిసెన్= దండు దిగినాడు.

**తాత్పర్యం:** హేమవర్మ కోపావేశంతో ద్రుపదుడి మీదికి సైన్యసన్నాహంతో వచ్చి అతడి పట్టణపు అగడ్త చుట్టూ ఉన్న ప్రదేశాన్ని ఆక్రమించి ముట్టడి చేశాడు.

**వ. ఇట్లు విడిసిన. 380**

**తాత్పర్యం:** హేమవర్మ తన సేనలతో ద్రుపదుడి పట్టణాన్ని ముట్టడించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. పట్టు వడ్డ మ్రుచ్చు పగిదిఁ బాంచాల భూ । నాయకుండు తనకు నానచేటు**
**రాక కుమ్మలించి యేకాంతమునఁ బత్ని । యొక్కతియును గొల్వ నూరకుండె. 381**

**ప్రతిపదార్థం:** పాంచాల భూనాయకుండు= పాంచాల దేశాధీశుడైన ద్రుపదుడు; పట్టు+పడ్డ= దొరకి పోయిన; మ్రుచ్చు పగిదిన్= దొంగవలె; తనకున్= తనకు; నానచేటు రాకకున్= సిగ్గుచేటు స్థితి దాపురించినందుకు; ఉమ్మలించి= దుఃఖించి; ఏకాంతమునన్= ఒంటరిగా; పత్ని+ఒక్కతియును= భార్య ఒక్కతియే; కొల్వన్= సేవిస్తుండగా; ఊరక+ఉండెన్= మౌనంగా ఉన్నాడు.

**తాత్పర్యం:** ద్రుపద మహారాజు దొరకిపోయిన దొంగవలె తనకు సిగ్గుచేటు దుర్దశ దాపురించినందుకు దుఃఖించి, భార్య యొక్కతే తనను సేవిస్తుండగా ఒంటరిపాటున ఒకచోట మౌనంగా ఉండిపోయాడు.

**వ. తదీయ దండనాథులు సమరోత్సాహంబునం బ్రవర్తిల్లి; రంత సూర్యాస్తమయ సమయం బగుటయు రెండు వీళ్లును భండనంబు తోడి వేడుకం జేసి వేగుటకు వేచియుండె. 382**

**ప్రతిపదార్థం:** తదీయ దండనాథులు= ద్రుపదుడి సేనాపతులు; సమర+ఉత్సాహంబునన్= యుద్ధమునందలి పూనికతో; ప్రవర్తిల్లిరి= మెలగినారు; అంతన్= అంతట; సూర్య+అస్తమయ సమయంబు+అగుటయున్= ప్రొద్దుగ్రుంకేవేళ ఆసన్నం కాగా; రెండు వీళ్లును= ఉభయ సేనాపక్షాలు; భండనంబుతోడి వేడుకన్+చేసి= సంగ్రామం సల్పటంలోని ఉత్సాహంతో; వేగుటకున్= తెల్లవారుటకు; వేచియుండెన్= కనిపెట్టుకొని ఉన్నవి.

**తాత్పర్యం:** ద్రుపదుడి సేనానాయకులు రణసన్నాహంలో ఉండగా సూర్యు డస్తమించాడు. ఇరు పక్షాలవారు యుద్ధం చేసే కౌతుకంతో ఎప్పుడు తెల్లవారుతుందా అని కాచుకొని ఉన్నారు.

**క. అప్పుడు శిఖండి మరణము । దప్పఁగ సడి కొండు ప్రతివిధానము సేయుం**
**జొప్పడమిఁ దలఁచి యొరులకుఁ । జెప్పక వెస నరిగెఁ బురము చెంత యడవికిన్. 383**

**ప్రతిపదార్థం:** అప్పుడు= అట్టి సమయంలో; శిఖండి= శిఖండి; మరణము తప్పఁగన్= చావు వినా; సడికిన్= నిందకు; ఒండు ప్రతివిధానము= మరొకమారు చేత; చేయన్= చేయటానికి; చొప్పడమిన్= వీలులేమి; తలఁచి= భావించి; ఒరులకున్+చెప్పక= ఇతరులకు ఎవ్వరికీ చెప్పకుండా; పురము చెంత+అడవికిన్= పట్టణ సమీపంలోని అరణ్యమునకు; వెసన్+అరిగెన్= శీఘ్రంగా వెళ్ళాడు.

**తాత్పర్యం:** అప్పుడు శిఖండి తనకు మరణం వినా నిందను పోగొట్టుకొనటానికి మరో మార్గం లేకుండటం గ్రహించి ఇతరు లెవ్వరికీ చెప్పకుండ గుట్టు చప్పుడుకాకుండా నగరం చెంతనున్న అరణ్యంలోనికి శీఘ్రంగా వెళ్ళాడు.

శిఖండి యక్షునివలనఁ బురుషత్వంబునొందిన వృత్తాంతము (సం. 5-192-20)

**వ. అవ్విపినంబు స్థూలకర్ణుం డను నొక్క యక్షునికి నివాసంబై యునికిం జేసి నిర్జనంబై యుండు; శిఖండియు నత్తెఱం గెఱుంగుం గావున నతని నుద్దేశించి యందుఁ జొచ్చి తత్ప్రదేశంబున మహనీయ సుందరంబగు తదీయ మందిరంబున కరిగి, యచ్చటఁ బ్రాణవియోగం బగు విధం బాచరింపం బూనిన. 384**

**ప్రతిపదార్థం:** ఆ+విపినంబు= ఆ వనం; స్థూలకర్ణుండు అను ఒక్క యక్షునికిన్; నివాసంబు+ఐ; ఉనికిన్+చేసి= ఉండటం వలన; నిర్జనంబు+ఐ+ఉండున్= మనుషులు లేనిదై ఉంటుంది; శిఖండియున్; ఆ+తెఱంగు+ఎఱుంగున్= ఆ విషయం తెలిసిన వాడు; కావునన్; అతనిన్+ఉద్దేశించి= ఆ యక్షుడిని దృష్టిలో ఉంచుకొని; అందున్+చొచ్చి= ఆ కాననంలో ప్రవేశించి; తద్+ప్రదేశంబునన్= ఆ అరణ్య భూమిలో; మహనీయ సుందరంబు+అగు= గొప్పది, అందమైనది అయిన; తదీయ మందిరంబునకున్= ఆ యక్షుని సౌధంలోనికి; అరిగి= వెళ్ళి; అచ్చటన్; ప్రాణ వియోగంబు+అగు విధంబు= ప్రాణాలతో ఎడబాటు కలిగే సంవిధానం; ఆచరింపన్+పూనినన్= చేయటానికి పూనుకొనగా.

**తాత్పర్యం:** ఆ వనం స్థూలకర్ణుడనే ఒకయక్షుడు కాపురముండే చోటు. కనుక అక్కడ మనుష్య సంచారం ఉండదు. శిఖండికి ఆ విషయం తెలుసు. కనుక యక్షుడిని ఉద్దేశించి శిఖండి ఆ కానలో ప్రవేశించాడు. మహనీయమూ, మనోహరమూ అయిన స్థూలకర్ణుడి మందిరానికి వెళ్ళి అక్కడ తన ప్రాణం తీసికొనే ప్రయత్నంలో శిఖండి ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. యక్షుఁ డెఱింగి వచ్చి 'యిటు లాఱడి చావఁగ నేల చెప్పు మ**
**బ్జాక్షి! భవన్మనోరుజకు నౌషధ మే నొనరింతు' నన్న 'ఫా**
**లాక్షుఁడు దక్క నొడ్లకును నా పని సేయఁగరాదు; నాదు చి**
**త్తక్షతి పుంస్త్వ మేను దగఁ దాల్పక మానదు గుహ్యకోత్తమా!' 385**

**ప్రతిపదార్థం:** యక్షుఁడు= స్థూలకర్ణుడు; ఎఱింగి= శిఖండి ప్రయత్నం తెలిసికొని; వచ్చి= అక్కడి కేతెంచి; ఇటులు= ఈ ప్రకారం; ఆఱడి చావఁగన్+ఏల?= వ్యర్థంగా చనిపోవటమెందుకు?; అబ్జ+అక్షి!= తామర రేకుల వంటి కన్నులు గల కాంతా!; చెప్పుము= తెల్పుము; భవత్+మనః+రుజకున్= నీ మనోవ్యాధికి; ఔషధము= మందు; ఏన్= నేను; ఒనరింతున్= సమకూరుస్తాను; అన్నన్= అని గుహ్యకుడు పలుకగా; గుహ్యక+ఉత్తమా!= యక్షులలో శ్రేష్ఠుడా!; ఫాల+అక్షుఁడు+తక్కన్= నొసట కన్నుగల పరమేశ్వరుడికి తప్ప; ఒడ్లకును= ఇతరులకు; ఆ+పని చేయఁగన్+రాదు= ఆ కార్యం సంఘటింప శక్యము కాదు; పుంస్త్వము= మగతనం; ఏను= నేను; తగన్= చక్కగా; తాల్పక= ధరించక; నాదు చిత్తక్షతి= నా మనస్సునందలి గాయం; మానదు= తొలగదు.

**తాత్పర్యం:** శిఖండి ప్రాణాలు తీసికొనటానికి ప్రయత్నిస్తున్నాడని యక్షుడు తెలిసికొని అక్కడికి వచ్చి, 'ఓ కాంతా! ఈ విధంగా నీవు వ్యర్థంగా మరణించటానికి కారణమేమో చెప్పు. నీ మనోవ్యాధికి తగుమందు నే నిస్తాను' అని పలికాడు. అందుకు శిఖండి మహేశ్వరునకు తప్ప ఇతరులకు ఈ కార్యం సంఘటింప సాధ్యం కాదు. నాకు మగతనం లభిస్తేగాని నా మనసులోని గాయం మానదు.

**క. అని తన వృత్తాంతం బా । తని కెఱిఁగించుటయు, నతఁడుఁ దనదగు చిత్తం**
**బునఁ గరుణ పుట్టి 'యెంతటి । పని యిది? యే నిత్తు సమయపరిపాలనతోన్. 386**

**ప్రతిపదార్థం:** అని; తన వృత్తాంతంబు= తన సంగతి; ఆతనికిన్= ఆ స్థూలకర్ణుడికి; ఎఱిఁగించుటయున్= తెలుపగా; అతఁడు= ఆ యక్షుడు; తనది+అగు+చిత్తంబునన్= తన మనస్సులో; కరుణ+పుట్టి= దయ జనించి; ఇది+ఎంతటి పని?= ఇదేమి ఘనకార్యం? సమయ పరిపాలనతోన్= ఒడంబడికను పాటించే నియమంతో; నేను+ఇత్తున్= నా పుంస్త్వం నీకిస్తాను.

**తాత్పర్యం:** శిఖండి తన విషయమంతా యక్షుడికి నివేదించాడు. అతడు తన మనసులో దయ జనించగా 'ఇదెంత పని? నా మగతనం నీకిస్తాను. అందుకు గడువు పెడతాను.

**క. నా పురుషత్వము గైకొని । వే పోయి దశార్ణపతికి వెలయించిన మీ**
**యాపదలు దొలఁగి చనఁ, బొడ । సూపుము పదినాళ్లయంత సూనృత మొప్పన్. 387**

**ప్రతిపదార్థం:** నా పురుషత్వము= నా మగతనం; కైకొని= స్వీకరించి; వే పోయి= శీఘ్రంగా వెళ్ళి; దశార్ణపతికిన్= హేమవర్మకు; వెలయించినన్= నీ పురుషత్వం నిరూపిస్తే; మీ+ఆపదలు= మీకు వచ్చిన కష్టాలు; తొలఁగి చనన్= తీరిపోగా; సూనృతము+ఒప్పన్= సత్యం తప్పకుండా; పది నాళ్ళ అంత= పది దినాల వ్యవధి గడవగనే; పొడచూపుము= నాకు కనిపించుము.

**తాత్పర్యం:** శిఖండీ! నా మగతనం స్వీకరించి వెంటనే వెళ్ళి దశార్ణ విభునకు నేను పురుషుడనని రుజువుపరిచి మీ కష్టాలు తీరిన తర్వాత పది రోజులు గడవగనే మాట తప్పకుండా వచ్చి నాకు కనిపించు.

**క. అంతవునంతకు నీదగు । కాంతారూపంబు నేను గైకొనియెద; ని**
**శ్చింతమున మగుడఁ జను' మని । యింతికిఁ బురుషత్వ మిచ్చె నెంతయు వేడ్కన్. 388**

**ప్రతిపదార్థం:** అంత+అవునంతకున్= ఆ పది నాళ్ళ మితివరకు; నీదగు= నీదైన; కాంతా రూపంబున్= స్త్రీ రూపాన్ని; నేను= నేను; కైకొనియెదన్= గ్రహిస్తాను; నిశ్చింతమునన్= నిర్విచారంగా; మగుడన్+చనుము+అని= మరల ఇంటికి వెళ్ళుమని; ఇంతికిన్= శిఖండి నామంతో ఉన్న ద్రుపద పుత్రికి; ఎంతయున్+వేడ్కన్= మిక్కిలి ప్రీతితో; పురుషత్వము+ఇచ్చెన్= యక్షుడు తన పుంస్త్వము నిచ్చాడు.

**తాత్పర్యం:** నేటినుండి పది దినాల వరకు నేను నీ కాంతాస్వరూపాన్ని గైకొంటాను. నీవు నిర్విచారంగా నీ గృహానికి వెళ్ళు'మని యక్షుడు మిక్కిలి సంతోషంతో శిఖండికి తన మగతన మనుగ్రహించాడు.

**తే. ఇచ్చి తాను భామాకృతి నెలమిఁ దాల్చి । వీడుకొల్ప శిఖండియు వీటి కేఁగు**
**దెంచి నిజమందిరంబు సొత్తెంచి తల్లి । దండ్రులకు మ్రొక్కి నిలిచి ముదం బెలర్ప. 389**

**ప్రతిపదార్థం:** ఇచ్చి= తన పురుషత్వ మొసగి; తాను= యక్షుడు; భామా+ఆకృతిన్= స్త్రీ రూపాన్ని; ఎలమిన్= సంతోషంతో; తాల్చి= ధరించి; వీడుకొల్పన్= సాగనంపగా; శిఖండియున్= శిఖండియూ; వీటికిన్= నగరానికి; ఏఁగుదెంచి= వచ్చి; నిజమందిరంబు+చొత్తెంచి= తన భవనానికి చేరి; తల్లిదండ్రులకున్= మాతాపితలకు; ముదంబు+ఎలర్పన్= సంతోషం అతిశయించగా; మ్రొక్కి నిలిచి= నమస్కరించి నిలబడి.

**తాత్పర్యం:** యక్షుడు తన పురుషత్వ మొసగి తాను స్త్రీరూపం గైకొని అతనిని సాగనంపాడు. శిఖండి నగరం ప్రవేశించి తన మందిరానికి వచ్చి, అచ్చట జననీ జనకులకు ఆనంద మతిశయించగా నమస్కరించి నిలిచి.

**క. తన తెఱఁ గంతయు నెఱిఁగిం । చిన నద్భుత హర్షమగ్న చేతసులై త**
**జ్జననీ జనకులు బహువిధ । వినుతులఁ గొనియాడి; రంత వేకువ యయ్యెన్. 390**

**ప్రతిపదార్థం:** తన తెఱఁగు+అంతయున్= తన విషయమంతా; ఎఱిఁగించినన్= తెలుపగా; అద్భుత హర్షమగ్న చేతసులు+ఐ= ఆశ్చర్యంలో ఆనందంలో మునిగిన మనసులు కలవారై; తద్+జననీ జనకులు= ఆతడి తల్లిదండ్రులు; బహువిధ వినుతులన్= అనేక రీతులైన పొగడ్తలతో; కొనియాడిరి= తమ బిడ్డను మెచ్చుకొన్నారు; అంతన్= అంతట; వేకువ+అయ్యెన్= వేగుజామైనది.

**తాత్పర్యం:** శిఖండి జరిగిన వృత్తాంతమంతా తన తలిదండ్రులకు తెలిపాడు. వారు సంతోషాశ్చర్య మగ్న హృదయులై అనేక విధాల అతడిని ప్రశంసించారు. ఇంతలో వేకువ జామైనది.

**వ. తదనంతరంబ సూర్యోదయం బగుటయుఁ గాలోచిత కరణీయంబులు నిర్వర్తించి, పాంచాల విభుండు సంబంధితో వలయు మాట లాడందగు వారలం బనిచి, రావించి సంభ్రమంబు లేక వేగిరపడక నాగరిక ప్రకారంబున శిఖండి పురుషత్వంబు దేటపఱిచి యతని మాట గీడ్పఱిచి, సపరివారంబుగా నద్దశార్ణపతికి విందువెట్టి కట్టనిచ్చి, యతని యనునయాలాపంబు గైకొని యనిచి పుచ్చిన, నతండు తన్నుందాన నిందించు కొనుచు నిజపురంబునకుం బోయె; నట్టియెడ నయ్యక్షవరుమందిరంబు చక్కటికిం గ్రీడార్థంబు గిన్నర విభుండు విమానారూఢుం డయి చని దాని యొప్పు గనుంగొని యగ్గించుచు నిల్చి యొక్కింత సేపునకుం జుట్లనున్న గుహ్యకులతో నిట్లనియె. 391**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మటనే; సూర్య+ఉదయంబు+అగుటయున్= ప్రొద్దు పొడువగా; కాల+ఉచిత కరణీయంబులు= ప్రాతఃకాలకృత్యాలు; నిర్వర్తించి= నెరవేర్చి; పాంచాల విభుండు= ద్రుపద మహారాజు; సంబంధితోన్= వియ్యంకుడితో; వలయు మాటలు= తగిన మాటలు; ఆడన్+తగువారలన్= పలుకగలవారిని; పనిచి= పంపి; రావించి= హేమ వర్మను రప్పించి; సంభ్రమంబు లేక= తొట్రుపాటు నొందక; వేగిరపడక= తొందరపడక; నాగరిక ప్రకారంబునన్= సభ్యతతో; శిఖండి పురుషత్వంబు= శిఖండి యొక్క మగతనం; తేటపఱిచి= స్పష్టమొనరించి; అతని మాట= శిఖండి పురుషుడు కాడు, ఆడుది అనినట్టి హేమవర్మ వాక్యం; కీడ్పఱిచి= తప్పని నిరూపించి (అనుచిత మని తేల్చి); సపరివారంబుగాన్= పరిజనంతో కూడ; ఆ+దశార్ణపతికిన్= హేమవర్మకు; విందుపెట్టి= భోజనమిడి; కట్టన్+ఇచ్చి= ధరించటానికి నూత్నవస్త్రాలొసగి; అతని+అనునయ+ఆలాపంబులు= హేమవర్మ యొక్క ప్రార్థనాపూర్వకాలైన వాక్యాలు; కైకొని= గ్రహించి; అనిచి పుచ్చినన్= సాగనంపగా; అతండు= హేమవర్మ; తన్నున్+తాన; నిందించు కొనుచున్= దూషించుకొంటూ; నిజపురంబునకున్ పోయెన్; అట్టి+ఎడన్; ఆ యక్షవరుమందిరంబు చక్కటికిన్= ఆ స్థూలకర్ణుడి సౌధం దగ్గరకు; క్రీడా+అర్థంబు= వినోదం కొరకై; కిన్నర విభుండు= కుబేరుడు; విమాన+ఆరూఢుండు+అయి= విమానం ఎక్కినవాడై; చని= వెళ్ళి; దాని+ఒప్పున్= స్థూలకర్ణుడి భవనము యొక్క అందాన్ని; కనుంగొని; అగ్గించుచున్= శ్లాఘిస్తూ; నిల్చి= ఆగి; ఒక్కింత సేపునకున్= కొంచెం సేపటికి; చుట్లన్+ఉన్న= తన చుట్టూ చేరిఉన్న; గుహ్యకులతోన్= యక్షులతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అంతట ప్రొద్దు పొడువగా ద్రుపదుడు కాలకృత్యాలు నిర్వర్తించి, వియ్యంకుడితో తగుమాట లాడగల వారిని పంపి అతడిని రప్పించి, ఏమాత్రం తొట్రుపాటు చెందక, తొందరపడక సభ్యంగా శిఖండి పురుషత్వం

స్పష్టపరచి, వియ్యంకుడి మాట తప్పని తేల్చి, పరిజనంతో ఆయనకు విందొసగి, ధరించుటకు దుకూలాలిచ్చి దశార్ణపతి వేడికోలు మాటలు మన్నించి సాగనంపాడు. హేమవర్మ తాను శిఖండిపై మోపిన నిందకు తనను తాను దూషించుకొంటూ నిజపురికి వెళ్ళాడు. అట్టి సమయంలో స్థూలకర్ణుడి భవన సమీపానికి క్రీడార్థంగా విమానారూఢుడై కుబేరుడు వచ్చాడు. స్థూలకర్ణుడి సౌధ సౌందర్యానికి మెచ్చుతూ కుబేరుడు కొంచెంసేపు అచ్చట నిలిచి తన చుట్టునున్న యక్షులతో ఇట్లా అన్నాడు:

**క. 'మన మిచట నిలిచియుండఁగ । మనమున శంకింప కిట్లు మసలిన వాఁ డీ**
**తని గర్వ మేల యిక్కడఁ । జనుదేరఁగనిచ్చు నెట్లు సైపఁగ వచ్చున్?' 392**

**ప్రతిపదార్థం:** మనము= మనం; ఇచటన్= ఇక్కడ; నిలిచి+ఉండఁగన్= తనకొరకై వేచిఉండగా; మనమునన్= హృదయంలో; శంకింపక= జంకక; ఇట్లు మసలినవాఁడు= ఈ రీతిని స్థూలకర్ణుడు ఆలసిస్తున్నాడు; ఈతని గర్వము= ఇతడి పొగరు; ఇక్కడన్= ఇక్కడికి; ఏల చనుదేరఁగన్+ఇచ్చున్= ఎందుకు రానిస్తుంది; ఎట్లు= ఏ విధంగా; సైపఁగన్+వచ్చున్?= ఇతడిని క్షమింపవచ్చును?

**తాత్పర్యం:** మనం ఇక్కడ తన కొరకు వేచియుండగా మదిలో జంకులేక తాను జాగు చేస్తున్నాడు. ఇతడి కింత పొగ రెందుకు? ఈ పొగరు అతడి నిక్కడి కెట్లా రానిస్తుంది? ఇతడి తప్పు సహించట మెట్లా?

**వ. అని పలికి యలుక మొగంబున ముడివడ నున్నంతఁ గిన్నరు లా గుహ్యకు నరసి తద్వృత్తాంతం బంతయు నెఱింగించి 'దేవా! సిగ్గుపెంపున రానేరకున్నవాఁ' డని విన్నవించిన. 393**

**ప్రతిపదార్థం:** అలుక= కోపం; మొగంబునన్; ముడి+పడన్= వ్యాపించగా; ఉన్న+అంతన్= ఉండగా; కిన్నరులు(కించిత్+ నరులు)= కొంచెం నరాకారం కలవారు (గుఱ్ఱం ముఖం కలవారు); ఆ గుహ్యకున్= యక్షుడైన స్థూలకర్ణుడిని; అరసి= విచారించి; తద్+వృత్తాంతంబు+అంతయున్= ఆతడి సమాచార మంతయూ; ఎఱింగించి= కుబేరుడికి తెలిపి; దేవా; సిగ్గుపెంపునన్= లజ్జాతిశయంవలన; రానేరక+ఉన్నవాఁడు= మీ సముఖమునకు రాజాలకున్నాడు; అని; విన్నవించినన్= మనవి చేయగా.

**తాత్పర్యం:** అని పలికి కుబేరుడు తన ముఖంలో క్రోధ మావరింపగా అక్కడ నిల్చిఉండగా, కిన్నరులు భవనంలోనికి వెళ్ళి స్థూలకర్ణుడి వృత్తాంతం తెలిసికొన్నారు. వారు అతడి సంగతినంతా కుబేరుడికి నివేదించి, ప్రభూ! 'స్థూలకర్ణుడు లజ్జాభరంతో మీ దగ్గరకు రాలేకున్నా' డని మనవి చేయగా.

**ఆ. 'అయిన నేమి పిలువుఁ' డని పిలిపించిన । వచ్చి మ్రొక్కుటయును వనితయైన**
**యతనిఁ జూచి 'యింక నవుదాని కిట్టుల । యుండుఁగాక'! యని విభుండు పలికె. 394**

**ప్రతిపదార్థం:** అయినన్+ఏమి= ఆడుది అయిన అవుగాక; పిలువుఁడు= వాడి నిక్కడికి పిలుచుక రండి; అని పిలిపించినన్= అని కుబేరుడు పిలిపించగా; వచ్చి= స్థూలకర్ణ డేతెంచి; మ్రొక్కుటయును= నమస్కరించగా; వనిత+ఐన= ఆడుదిగా మారిన; అతనిన్+చూచి= స్థూలకర్ణుడిని కనుగొని; ఇంకన్= ముమ్ముందు; అవుదానికిన్= జరుగనున్న కార్యానికి; ఇట్టుల+ ఉండున్+కాక!= ఇతడిట్లే ఆడుదిగా నుండుగాక!; అని= అంటూ; విభుండు= కుబేరుడు; పలికెన్= వచించాడు.

**తాత్పర్యం:** 'ఆడుది అయిన మాత్రాన నేమి? వాడిని పిలవండి' అని కుబేరుడు పిలిపించగా, స్థూలకర్ణుడు వచ్చి నమస్కరించాడు. ఆడుదిగా మారిన అతడిని చూచి యక్షరాజు 'జరుగబోయే పనికి అనుకూలంగా ఇత డిట్లే వనితగా ఉండుగాక!' అని పలికాడు.

### స్థూలకర్ణునకుఁ గుబేరుని వలన స్త్రీత్వము గలుగుట (సం. 5-193-39)

**వ. స్థూలకర్ణుండును దలరి దండప్రణామంబులు సేసియుండె; నప్పుడు గొలిచియున్న దొరలు ధనదునకుం గృప వుట్ట నల్లన తెలిపిన నట్లేని 'వీడు శిఖండి యాయువు గలంతకాలంబున గాంతాకృతియై యుండి, పదంపడి నిజరూపంబు దాల్చుంగాక!' యని యనుగ్రహించి యరిగిన. 395**

**ప్రతిపదార్థం:** స్థూలకర్ణుండును; తలరి= దుఃఖపడి; దండప్రణామంబులు చేసి= సాగిలపడి నమస్కరించి; ఉండెన్= మౌనంగా ఉండిపోయాడు; అప్పుడు; కొలిచియున్న దొరలు= కుబేరుడిని సేవిస్తున్న నాయకులు; ధనదునకున్= కిన్నరేశ్వరునకు; కృప+ పుట్టన్= కరుణ కలిగేటట్లు; అల్లన= మెల్లగా; తెలిపినన్= చెప్పగా; అట్లు+ఏనిన్= అట్లయితే; వీఁడు= ఇతడు; శిఖండి+ఆయువు+ కల+అంతకాలంబును= శిఖండికి ఆయుష్యమున్నంత వరకూ; కాంతా+ఆకృతి+ఐ= స్త్రీ రూపం కలవాడై; ఉండి; పదంపడి= ఆ తరువాత; నిజరూపంబున్= తాల్చున్+కాక= తన సహజస్వరూపాన్ని ధరించగలడు; అని; అనుగ్రహించి= శాపావసానమును ప్రసాదించి; అరిగినన్= అలకాపురికి వెళ్ళగా.

**తాత్పర్యం:** స్థూలకర్ణుడు దుఃఖపడి కుబేరుడికి సాగిలబడి నమస్కరించి మౌనంగా ఉండిపోయాడు. అప్పుడు కిన్నరేశ్వరుని కొలిచియున్న నాయకులు అతడికి కరుణ కలిగేటట్లు నెమ్మదిగా మంచి మాటలు చెప్పారు. అట్లయితే వీడు ఆ శిఖండి బ్రతికిఉన్నంతకాలం పడతిగానే ఉండి, ఆ పిదప నిజస్వరూపం గైకొనగలడు' అని శాపవిముక్తి ప్రసాదించి తన అలకాపురికి వెళ్ళిపోయాడు.

**తే. గుహ్యకుండు విషాదంబు గూరియుండ । నచ్చటికిఁ గొన్ని దినముల కరుగుదెంచెఁ**
**దల్లిదండ్రుల కెఱిఁగించి తగవు మెఱయ । సమయనిష్ఠ వాటించి పాంచాలసుతుఁడు. 396**

**ప్రతిపదార్థం:** గుహ్యకుండు= కుబేరుని అనుచరుడు; విషాదంబు+కూరి+ఉండన్= దుఃఖభరితుడై ఉండగా; అచ్చటికిన్= ఆతడి నివాసానికి; కొన్ని దినములకున్= కొన్నాళ్ళకు; పాంచాల సుతుఁడు= ద్రుపదుడి పుత్రుడైన శిఖండి; తల్లిదండ్రులకున్= జననీ జనకులకు; ఎఱిఁగించి= తెలిపి; తగవు మెఱయన్= న్యాయం వెలయగా; సమయనిష్ఠ+పాటించి= ప్రతిజ్ఞ యొక్క నియమాన్ని ఆదరించి; అరుగుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** స్థూలకర్ణుడు కుబేరుడిశాపంతో చింతాక్రాంతుడై ఉన్నాడు. శిఖండి తన తల్లిదండ్రులకు చెప్పి న్యాయం తప్పక, ఏర్పరచుకొన్న నియమం ప్రకారం పదిరోజులు ముగియగానే అతడి మగతనం అతడికి తిరిగి ఇచ్చి వేయటం కోసం స్థూలకర్ణుడి గృహానికి వచ్చాడు.

**క. వచ్చినఁ గనుఁగొని 'నీ దెసఁ । బొచ్చెము లేే; దిట్ల మగిడి పొఃమ్మిది విధి నీ**
**కిచ్చిన రూ'పని గుహ్యకుఁ । డచ్చుపడం బలికి యెల్ల నతనికిఁ జెప్పెన్. 397**

**ప్రతిపదార్థం:** వచ్చినన్= శిఖండిరాగా; కనుఁగొని= చూచి; నీ దెసన్= నీ యెడ; పొచ్చెము లేదు= దోషం లేదు; ఇట్లు+అ= వచ్చినవాడవు వచ్చినట్లుగానే; మగిడి పొమ్ము= తిరిగి వెళ్లుము; ఇది; విధి= దైవం; నీకున్= నీకు; ఇచ్చిన రూపు= అనుగ్రహించిన రూపం; అని= అనుచు; గుహ్యకుఁడు= యక్షుడు; అచ్చుపడన్+పలికి= విస్పష్టంగా వచించి; ఎల్లన్= జరిగినదంతయూ; అతనికిన్= శిఖండికి; చెప్పెన్= తెలిపాడు.

**తాత్పర్యం:** సమయ నిష్ఠ పాటించి తన దగ్గరకు వచ్చిన శిఖండిని చూచి గుహ్యకుడు 'నీయెడ ఏ దోషం లేదు. వచ్చినవాడివి వచ్చినట్లుగానే ఇంటికి మరలిపొమ్ము. ఇది దైవం నీ కనుగ్రహించిన రూపం' అంటూ జరిగిన విషయం తేటతెల్లంగ అతడికి తెలిపాడు.

**వ. చెప్పి వీడుకొలిపిన శిఖండి యత్యంత ప్రమోదంబునం దండ్రి కడకు వచ్చి యత్తెఱం గెఱింగించిన నాతండు ప్రీతుండయి దేవగురుద్విజపూజనంబు లాచరించి ద్రోణాచార్యుపాల సవిశేషంబుగా శిష్యభావంబు ప్రతిష్ఠించె'. 398**

**ప్రతిపదార్థం:** చెప్పి= స్థూలకర్ణు డట్లా పలికి; వీడుకొలిపినన్= సాగనంపగా; శిఖండి; అత్యంత ప్రమోదంబునన్= మిక్కిలి హర్షంతో; తండ్రి కడకున్; వచ్చి; ఆ+తెఱంగు= అక్కడ జరిగిన సంగతి; ఎఱింగించినన్; ఆతండు= ద్రుపదుడు; ప్రీతుండు+అయి= సంతోషించినవాడై; దేవగురు ద్విజ పూజనంబులు= దేవతలకు, గురువులకు, విప్రులకు పూజలు; ఆచరించి= చేసి; ద్రోణాచార్యుపాలన్= ద్రోణుడి దగ్గర; సవిశేషంబుగన్= అసాధారణంగా; శిష్యభావంబున్= శిష్యత్వమును; ప్రతిష్ఠించెన్= స్థిరంగా నెలకొల్పాడు.

**తాత్పర్యం:** స్థూలకర్ణు డట్లా తెలిపి సెలవొసంగగా, శిఖండి మిక్కిలి సంతోషంతో తన తండ్రి దగ్గరకు వచ్చి జరిగిన విషయమంతా తెల్పాడు. ద్రుపదుడు హర్షించి, దేవతలను గురువులను బ్రాహ్మణులను పూజించి, తన పుత్రుడైన శిఖండిని ద్రోణాచార్యులవారికి అసాధారణ శిష్యుణ్ణి కావించాడు.'

**క. అని చెప్పి నారదుఁడు దా। నును సత్యవతీ సుతుండునుం దమ యిచ్చం**
**జనిరి; శిఖండి చరిత్రము। జనకర్ణ పరంపరం బ్రశస్తం బయ్యెన్. 399**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= ఇట్లు తెలిపి; నారదుఁడున్= నారద మహర్షి; తానును= తానూ; సత్యవతీ సుతుండునున్= సత్యవతీ దేవి కుమారుడైన వ్యాసుడూ; తమ+ఇచ్చన్+చనిరి= తమ దారిని తాము వెళ్ళారు; శిఖండి చరిత్రము= శిఖండి కథ; జనకర్ణపరంపరన్= లోకులు ఒకరికొకరు చెప్పుకొంటూఉండగా; ప్రశస్తంబు+అయ్యెన్= వెల్లడైనది.

**తాత్పర్యం:** భీష్ముడికి నారదు డిట్లా చెప్పి, తానూ వ్యాసుడూ తమ దారిని తాము వెళ్ళారు. లోకులు ఒకరికొకరు చెప్పుకొనగా శిఖండి వృత్తాంతం వెల్లడి అయింది.

**వ. ఇవ్విధంబునఁ గాశీపతికన్యక సిద్ధమూర్తి యయి నెగడె; నేను నంగనల నంగనాపూర్వుల నంగనాభిధానుల నంగనాకారులను వధియింపకుండ వ్రతంబు పూనినవాఁడం గావున నంగనాపూర్వుండగు శిఖండి నాకు భండనంబునం గోదండపాండిత్యంబు మెఱసినను జంపను నొంపనుఁ; గడంగితిన యేని నింతకంటె దుర్యశంబు గలదె? యెట్లయిన నగుదుంగాని భగ్నవ్రతుండ నగుట కోర్వ నిది నా తెఱంగు.' 400**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; కాశీపతి కన్యక= కాశీరాజపుత్రి అంబ; సిద్ధమూర్తి+అయి+నెగడన్= తపస్సిద్ధి కలిగినదై విరాజిల్లింది; నేనున్; అంగనలన్= స్త్రీలను; అంగనాపూర్వులన్= తొలుత ఆడువారిగా ఉన్నవారిని; అంగనా+అభిధానులన్= ఆడుపేరులు కలవారిని; అంగనా+ఆకారులను= ఆడువారి ఆకారమువంటి ఆకారం కలవారిని; వధియింపకుండన్= చంపకుండేటట్లు; వ్రతంబు పూనినవాఁడన్= నియమం వహించాను; కావునన్= కాబట్టి; అంగనాపూర్వుండు+అగు= ముందు ఆడుదిగాఉన్న; శిఖండి; నాకున్; భండనంబునన్= యుద్ధమునందు; కోదండ పాండిత్యంబు= ధనుర్విద్యాకౌశలం; మెఱసినను= ప్రకటించినను; చంపను= సంహరించటానికీ; నొంపను= బాధించుటకును; కడంగితిన+ఏనిన్= పూనుకొంటినేని; ఇంతకంటెన్; దుర్యశంబు+కలదె?= అపకీర్తి ఉన్నదా?; ఎట్లు+అయినన్+అగుదున్+కాని= నేనేమైపోతే పోతానుకాని; భగ్న వ్రతుండన్= నియమం చెరచుకొన్నవాడను; అగుటకున్+ఓర్వన్= కావటానికి సహించలేను; ఇది నా తెఱంగు= నా పద్ధతి యిది.

**తాత్పర్యం:** ఈ విధంగా కాశీరాజకుమారి అంబ తపశ్శక్తిచేత నన్ను సాధించేదిగా వెలసింది. నేను ఆడువారిని, మొదట ఆడువారిగా ఉండినవారిని, ఆడువారి పేరులు పెట్టుకొన్నవారిని, ఆడువారివంటి ఆకారం కలిగిన వారిని చంపనని నియమం వహించి ఉన్నాను. శిఖండి మొదట ఆడుదిగా ఉండి పురుషుడైనాడు గనుక అతడు యుద్ధంలో నామీద తన కోదండ పాండిత్యం ఎంత ప్రకటించినా అతడిని నేను వధించను, బాధించను. అట్లా చేస్తే అంతకన్న నాకు అపకీర్తి వేరే ఉండదు. నేనేమైపోతే పోతానుగాని వ్రతభంగం మాత్రం చేసుకోలేను. ఇది నా నిశ్చయం.'

**క. అని చెప్పిన దేవవ్రతు । వినుత వచనములు విభుండు విని తన చిత్తం**
**బున నొక్కింత వగచి' యీ । తనికి మగతనంబు పూన్కి తగు'నని పలికెన్. 401**

**ప్రతిపదార్థం:** అని చెప్పిన= అని పల్కిన; దేవవ్రతు వినుత వచనములు= భీష్ముడి యొక్క కొనియాడబడిన మాటలు; విభుండు= దుర్యోధనుడు; విని= ఆలించి; తన చిత్తంబునన్= తన మనస్సులో; ఒక్క+ఇంత వగచి= ఇంచుక చింతించి; ఈతనికిన్= ఈ భీష్మునికి కొక్కడికే; మగతనంబు పూన్కి= పౌరుషం చెల్లించుకొనటం; తగున్+అని+పలికెన్= తగియున్నదని పలికాడు.

**తాత్పర్యం:** అని చెప్పిన భీష్ముడి మెచ్చదగిన పలుకులు దుర్యోధను డాలకించాడు. తన మనసులో ఇంచుక దుఃఖించి, 'మగటిమి నిలుపుకొనటం ఈ మహనీయుడి కొక్కడికే చెల్లిన'దని పలికాడు.

**వ. తదనంతరంబ కొలువునం గలయ సమర విషయంబు లయిన సల్లాపంబులు సెలుచుండఁ గొండొకసేపు వినుచుండి సుయోధనుండు సురనదీసూనున కిట్లనియె: 402**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట; కొలువునన్= సభలో; కలయన్= అంతట; సమర విషయంబులు+అయిన= యుద్ధానికి సంబంధించిన; సల్లాపంబులు= పరస్పర సంభాషణలు; చెల్లుచున్+ఉండన్= సాగుతుండగా; కొండొకసేపు= ఒకించుక తడవు; వినుచున్+ఉండి= ఆలిస్తూ ఉన్నవాడై; సుయోధనుండు; సురనదీసూనునకున్= మందాకినీ కుమారుడైన భీష్మునితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అటు పిమ్మట సభలో యుద్ధానికి సంబంధించిన విషయాలను గూర్చి వీరులు పరస్పరం సంభాషించుకొనుచుండగా దుర్యోధనుడు కొంచెంసేపు ఆలకించి గాంగేయుడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'పాండవులకుఁ గలుగు బలము లన్నియు సమ। యింప నీకు దినము లెన్నివట్టు**
**గురుఁడుఁ గృపుఁడు గురుని కొడుకుఁ గర్ణుండు నెం। తెంత మానమున వధింతు రనఘ?' 403**

**ప్రతిపదార్థం:** అనఘ!= పుణ్యుడా!; పాండవులకున్= పాండునందనులకు; కలుగు బలములు= ఉన్న సేనలు; అన్నియున్= అన్నింటినీ; సమయింపన్= చంపటానికి; నీకున్= నీకు; ఎన్ని దినములు+పట్టున్?= ఎన్ని రోజులు సరిపోతాయి?; గురుఁడున్= ద్రోణుడు; కృపుఁడున్= కృపాచార్యుడు; గురుని కొడుకున్= ద్రోణపుత్రుడైన అశ్వత్థామ; కర్ణుండున్= రాధేయుడు; ఎంత+ఎంత మానమునన్= ఎంతెంత కాలంలో; వధింతురు?= చంపగలరు?

**తాత్పర్యం:** 'పితామహా! పాండవుల కున్న సేనలన్నింటినీ చంపటానికి నీ కెన్ని రోజులవుతాయి? ద్రోణాచార్యులు, కృపాచార్యులు, అశ్వత్థామ, కర్ణుడు ఎంతెంత కాలంలో కౌంతేయుల సేనలను సంహరించగలరో చెప్పుము.'

**వ. అనిన విని గాంగేయుం డతని కిట్లనియె : 404**

**తాత్పర్యం:** అట్లా దుర్యోధనుడు అడుగగా విని భీష్ము డిట్లా అన్నాడు:

**క. 'అనిఁ బాండవ సేనలఁ జం। పను జెఱుపను నేము చాలు భంగుల నీ కి**
**ట్లనుమానము వాయఁగ నడు। గన తగుఁ; గడు లెస్స! విందు గాక నరేంద్రా! 405**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధంలో; పాండవ సేనలన్= పాండవుల సైన్యాలను; చంపను= చంపటానికి; చెఱుపను= భగ్నం చేయటానికి; ఏము= మేము; చాలు భంగులన్= శక్తి గలిగినతీరులను; నీకున్= నీకు; అనుమానము+పాయఁగన్= ఏర్పడిన సందేహం తొలగటానికై; ఇట్లు+అడుగన+తగున్= ఇట్లా అడగటం ఉచితమే; కడున్ లెస్స= అది మిక్కిలి మంచిది; నర+ఇంద్రా!= ఓ రాజా!; విందు(వు)కాక= ఆలకించుము.

**తాత్పర్యం:** 'పాండవ సేనలను యుద్ధ భూమిలో వధించటానికి, చెరచటానికి మాకు గల శక్తియుక్తు లెట్టివో సందేహం తొలగించుకొనటానికై నీ వడగటం సముచితమే. రాజా! నే చెప్పేది బాగా విను.

**వ. ఏను నా సాలెడు కొలంది సెప్పెదఁ; దక్కటివారుఁ దమ తమ చాలుటలు దార చెప్పెద; రది యెల్లను బిదప విందుగాని; మున్ను నీ కొక్క బాస యిచ్చెద నాకర్ణింపుము. 406**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నా చాలెడు కొలంది+చెప్పెదన్= నా సామర్థ్యం యొక్క ప్రమాణమెంతో చెప్పుతాను; తక్కటివారున్= మిగిలిన ద్రోణాదులు; తమ తమ చాలుటలు= తమ తమ సామర్థ్యాలు; తారు+అ= తామే; చెప్పెదరు; అది+ఎల్లను; పిదపన్; విందు(వు)కాని; మున్ను= ముందుగా; నీకున్; ఒక్క బాస+ఇచ్చెదన్= ఒక్క ప్రతిజ్ఞ చేస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** నేను నా సామర్థ్యపు ప్రమాణమెంతో చెప్పుతాను. మిగిలినవారు తమ తమ సమర్థతలను గురించి వారే చెప్పుకొంటారు. అన్నీ నీవు విందువుగాని, ముందుగా నా ప్రతిజ్ఞ వినిపిస్తాను. వినుము.

**క. మీఁటుగల రాజరథికుల। నాఁటికి వేవుర వధింతు; నరుశరములు నో**
**నాఁటి పడవైచునంతకు। వేఁటాడెదఁ బ్రతిబలంబు వీరుల నెల్లన్. 407**

**ప్రతిపదార్థం:** మీఁటు+కల= పెంపు వహించిన; రాజరథికులన్= రథికులైన రాజులను; నాఁటికిన్= దినానికి; వేవురన్= వెయ్యిమందిని; వధింతున్= చంపగలను; నరుశరములు= అర్జునుడి బాణాలు; నోనాఁటి= నొచ్చునట్లు నా శరీరంలో గ్రుచ్చుకొని; పడన్+వైచునంతకున్= నన్ను నేలగూల్చేదాక; ప్రతిబలంబు వీరులన్+ఎల్లన్= శత్రు సైన్యంలోని శూరు లందరినీ; వేఁటాడెదన్= వధిస్తాను.

**తాత్పర్యం:** నేను పెంపుగల రథికులను రోజుకు వెయ్యిమందిని చంపుతాను. అర్జునుడి శరాలు నొచ్చేటట్లు నా అవయవములందు నాటుకొని నన్ను నేలమీద పడవేసేవరకు శాత్రవసేనలోని శూరులను వధిస్తాను.

**వ. అట్లుగాక నా కయ్యంబు సేయు దివసంబులోన.** **408**

**ప్రతిపదార్థం:** అట్లుగాక= అంతేకాక; నా కయ్యంబు+చేయు= నేను యుద్ధం చేసే; దివసంబులోనన్= దినంలో.

**తాత్పర్యం:** సుయోధనా! ఆ విధంగా నేను యుద్ధం చేసే రోజులలో.

**క. పదివేలఁ జంపఁగా నో । పుదు నే నను నెత్తికోలు పుట్టిన యది నీ**
**పదునొకఁ డక్షౌహిణులను । జదురున నడపింతు నెదిరి సైన్యము గలఁతున్.'** **409**

**ప్రతిపదార్థం:** పదివేలన్= పదివేల మందిని; నేను= నేను; చంపఁగాన్+ఓపుదున్= సంహరింపజాలుదును; అను= అనునట్టి; ఎత్తికోలు= సంకల్పం; పుట్టిన అది= కలుగుతున్నది; నీ పదునొకఁడు+అక్షౌహిణులను= నీ కున్న పదకొండక్షౌహిణుల సేనను; చదురునన్+నడపింతున్= నేర్పుతో యుద్ధం చేసేటట్లు చేస్తాను; ఎదిరి సైన్యము= శత్రుసేనను; కలఁతున్= చీకాకు పరుస్తాను.

**తాత్పర్యం:** దినమునకు వెయ్యిమందినిగాదు, పదివేల మందిని చంపగలుగుదుననే సంకల్పం కలుగుతున్నది. నీ పదకొండక్షౌహిణుల సైన్యాన్ని చాతుర్యంతో నడిపించగలను. శాత్రవ సేనలను సంక్షోభింపచేయగలను.'

**వ. అని పలికి వెండియు.** **410**

**తాత్పర్యం:** అని సుయోధనునిడితో పలికి మరల భీష్ము డిట్లా అన్నాడు.

**క. 'నీ వడిగిన పని యేర్పడఁ । గా విను "మేనొక్క నెలఁ' దెగంజేయుదు నా**
**నావిధ దివ్యాస్త్రంబుల । లావున నప్పాండవుల బలంబుల నెల్లన్.'** **411**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; అడిగినపని= నన్నడిగిన కార్యాన్ని; ఏర్పడఁగాన్ వినుము= స్పష్టంగా తెలిసికొనుము; నానా విధ= పలు రకాలైన; దివ్య+అస్త్రంబుల లావునన్= దివ్యశరాల శక్తిచేత; ఆ+పాండవుల బలంబులన్+ఎల్లన్= ఆ పాండు నందనుల సేనల నన్నింటినీ; ఏను= నేను; ఒక్కనెలన్= ఒక నెలరోజులలో; తెగన్+చేయుదున్= నరికి వేయగలను.'

**తాత్పర్యం:** 'నీవు నన్నడిగిన పనిని గూర్చి స్పష్టంగా వినుము. పలు రకాలైన దివ్యాస్త్రాల శక్తిచేత ఆ పాండు కుమారుల బలగాల నన్నింటినీ ఒక నెలరోజులలో ఖండించి వేయగలను.'

**వ. అనవుడు గురుకృపాశ్వత్థామ కర్ణులం గలయం గనుంగొని గాంధారీనందనుండు 'మీమీ చందంబులెట్లు? నిన నాచార్యుండు మందస్మితాననుం డగుచు నిట్లనియె. 412**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని భీష్ముడు పలుకగా; గురుకృప+అశ్వత్థామ కర్ణులన్; కలయన్+కనుంగొని= తేరిపారచూచి; గాంధారీ నందనుండు= గాంధారి కొడుకు సుయోధనుడు; మీమీ చందంబులు+ఎట్లు= మీమీ శక్తి సామర్థ్యాలు ఎట్టివి; అనినన్= అని ప్రశ్నించగా; ఆచార్యుండు= ద్రోణుడు; మందస్మిత+ఆననుండు+అగుచున్= చిరునవ్వుతో కూడిన మొగం కలవాడౌతూ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భీష్ముడు పలికిన తరువాత సుయోధనుడు ద్రోణ కృపాశ్వత్థామ కర్ణులను కలయ జూచి, మీమీ సామర్థ్యా లెటువంటివో తెలపం'డని ప్రశ్నించగా, మొగాన చిరునవ్వు మోసులెత్తగా ద్రోణాచార్యు డిట్లా అన్నాడు:

**తే. 'ఏను ముదిసిన వాఁడ మహీశ! యెట్టు । లయిన నోపిన భంగి నీ యనుఁగుఁ దాత**
**సాలి నన్నిదినంబులఁ జాలవచ్చు । నబ్బలంబుల నని సమయంగఁ జేయ.' 413**

**ప్రతిపదార్థం:** మహీ+ఈశ!= భూపతీ!; ఏను= నేను; ముదిసిన వాఁడన్= ముసలి వాడిని, ఎట్టులు+అయినన్= ఎట్లాగయినా; ఓపిన భంగిన్= శక్తి ఉన్నంతమేరకు; ఆ+బలంబులన్= ఆ పాండవుల సేనలను; అనిన్= యుద్ధంలో; సమయంగన్+చేయన్= సంహరించుటకు; నీ+అనుఁగున్+తాత= నీ యందు ప్రేమగల్గిన పితామహుడు; చాలిన+అన్ని దినంబులన్= చంపగలనన్న నెలరోజులలో; చాలన్+వచ్చున్= నేను చంపవచ్చును.

**తాత్పర్యం:** 'రాజా! నేను ముసలి వాడిని. ఎట్లాగయినా శక్తి ఉన్నంతమేరకు పోరాడుతాను. నీయెడ ప్రేముడిగల నీ తాతకు పట్టినట్లు నాకూ పాండవ సేనలను నిర్మూలించటానికి నెల రోజులు పట్టవచ్చు.'

**క. అనినఁ గృపాచార్యుం 'డీ । యినుమడి దివసములఁ దీర్ప నేనోపుదు' నా**
**విని గురుతనూభవుఁడు 'పది । దినములఁ గడతేర్తు' ననియె ధీరవిచారా! 414**

**ప్రతిపదార్థం:** ధీరవిచారా!= ధైర్యంతో కూడిన ఆలోచనగల జనమేజయ మహారాజా!; అనినన్= అని ద్రోణుడు పలుకగా; కృప+ఆచార్యుండు= కృపాచార్యులవారు; ఈ+ఇనుమడి దివసములన్= భీష్మ ద్రోణులు తెల్పిన దినాలకు రెట్టింపు దినాలలో; ఏన్= నేను; తీర్పన్+ఓపుదున్= శాత్రవ సేనలను కడతేర్చగలను; నాన్= అని చెప్పగా; విని= ఆలించి; గురు తనూభవుఁడు= ద్రోణపుత్రుడైన అశ్వత్థామ; పది దినములన్= పది రోజులలో; కడతేర్తున్+అనియెన్= సమయించగలనని పలికాడు.

**తాత్పర్యం:** జనమేజయ మహారాజా! ఆకర్ణింపు మని వైశంపాయన మహర్షి పలుకుతున్నాడు: 'ద్రోణుడు నెలరోజులలో పాండవసైన్యాన్ని పరిమార్చగల' నని పలికిన తరువాత కృపాచార్యులు అంతకు రెట్టింపు దినాలలో సమయిస్తా నన్నాడు. కృపుడు చెప్పిన తర్వాత అశ్వత్థామ తాను పది రోజులలో పాండవ సైన్యాన్ని హతమార్చగలనన్నాడు.

**వ. అందఱ పలుకు లాకర్ణించి కర్ణుండు. 415**

**ప్రతిపదార్థం:** కర్ణుండు; అందఱ పలుకులు; ఆకర్ణించి= విని.

**తాత్పర్యం:** అందరి మాటలు విన్న తరువాత కర్ణుడు. (ఇట్లా అన్నాడు:).

**క. 'నానాస్త్ర శస్త్ర చయ బల । బానలముం గవియఁ జేసి యత్యుగ్రత నే**
**నేనాళ్లన యప్పాండవ । సేనా సాగరము నివురఁ జేయుదు నధిపా!" 416**

**ప్రతిపదార్థం:** అధిపా!= దుర్యోధన మహారాజా!; నానా+అస్త్ర శస్త్ర చయ= పలు రకాలైన అస్త్రముల యొక్క, ఆయుధాల యొక్క సముదాయమనెడు; బడబా+అనలమున్= బడబాగ్నిని; కవియన్+చేసి= క్రమ్ముకొనేటట్లు చేసి; అతి+ఉగ్రతన్= మిక్కిలి భయంకరత్వంతో; నేను; ఏనాళ్ళన్+అ= ఐదు దినాలలోనే; ఆ+పాండవ సేనా సాగరమున్= పాండవుల సేనఅనే సముద్రాన్ని; ఇవురన్+చేయుదున్= ఇంకిపోయేటట్లు చేస్తాను.

**తాత్పర్యం:** పలు రకాలైన దివ్యాస్త్రాలు, ఆయుధాలు అనే బడబాగ్నిని క్రమ్ముకొనజేసి అతి భయంకరంగా నేను ఐదు రోజులలో పాండవుల సేన లనెడు సాగరాన్ని ఇంకిపోయేటట్లు చేస్తాను.'

**విశేషం:** అలం: రూపకం.

**వ. అని ప్రతిన సేసినఁ గలకల నవ్వి గాంగేయుండు. 417**

**ప్రతిపదార్థం:** అని; ప్రతిన చేసినన్= ప్రతిజ్ఞ చేయగా; కలకల నవ్వి= పకపక నవ్వి; గాంగేయుండు= భీష్ముడు.

**తాత్పర్యం:** అని కర్ణుడు ప్రతిజ్ఞ చేయగా పకపక నవ్వుతూ భీష్ముడు.

**చ. 'పలికిన నేమి యన్నియును బల్కఁ నగున్ మనరాజు నొద్ద మా**
**ర్పలికెడు వారు లేరు విను పాండవమధ్యము గాండివంబు దీ**
**ప్తుల మిఱుమిట్లుఁ గొన్న కనుదోయి గుణధ్వని వ్రయ్యలైన వీ**
**నులు నయినన్ బలే పలుకు నూల్కొనకుండుదు సూతనందనా! 418**

**ప్రతిపదార్థం:** సూతనందనా!= సూతపుత్రా! కర్ణా!; మనరాజు+ఒద్దన్= మన ప్రభువు దగ్గర; పలికినన్+ఏమి?= చెప్పగానే సరిపోయిందా?; అన్నియును పల్కన్+అగున్= ఎన్ని మాటలైనా నుడువ వచ్చును; మార్పలికెడువారు లేరు= బదులు చెప్పేవారెవ్వరూ లేరు; విను= నా మాట లాలకించుము; పాండవ మధ్యము= పాండవులలో నడిమివాడైన విజయుడి యొక్క; గాండివంబు దీప్తులన్= గాండీవ చాపము యొక్క కాంతులచేత; మిఱుమిట్లు కొన్న= చీకిలించుక పోయిన; కనుదోయి= కన్నుల జంట; గుణధ్వనిన్= అల్లెత్రాటి మ్రోతచేత; వ్రయ్యలు+ఐన= బ్రద్దలైన; వీనులున్+అయినన్= చెవులు కలవాడ వైనప్పుడు; బలే= అవురా; పలుకు నూల్కొనక+ఉండుదు= మాట్లాడటానికి ప్రయత్నం చెయ్యవు. (అంతవరకూ ఇట్లాగే వాగుతుంటావు అని భావం.)

**తాత్పర్యం:** 'సూతపుత్రా! చెప్పగానే సరిపోయిందా? ఎన్ని మాటలైనా పలుకవచ్చు. మన రాజు దగ్గర బదులు పలికేవారు లేరు గదా! ఈ మాట వినుము. అర్జునుడి గాండీవ కాంతులతో కనులు చీకిలించుకపోయినప్పుడు, అల్లెత్రాటి మ్రోతచేత చెవులు బ్రద్దలైనప్పుడు గాని, నీవు ఇట్లా మాటాడటం మానుకోవు. అందాకా ఇట్లానే వాగుతుంటావు.

**వ. అనియె; నివ్విధంబున నీ కొడుకు కడం బుట్టిన విశేషంబులు ధర్మతనయుండు చారులవలన విని తమ్ముల రాఁబనిచి వారలతో నిట్లనియె. 419**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని భీష్ము డన్నాడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; నీ కొడుకు కడన్= నీ కుమారుడి దగ్గర; పుట్టిన విశేషంబులు= కలిగిన వింతలు; ధర్మతనయుండు; చారుల వలనన్= వేగులవారివలన; విని; తమ్ములన్= రాన్+పనిచి= రప్పించుకొని; వారలతోన్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** భీష్ము డిట్లా కర్ణుడిని వారించాడు. నీ కొడుకు దగ్గర ఇట్లా జరిగిన విశేషాలన్నీ వేగుల వలన విని ధర్మజుడు తన తమ్ములను చెంతకు పిలిపించుకొని వారితో ఇట్లా అన్నాడు:

**సీ. 'మన చారు లిప్పుడు చనుదెంచి రావీట । నుండి; దుర్బుద్ధి సుయోధనుండు**
**గొలువున గాంగేయ కుంభసంభవ కృపా । శ్వత్థామ కర్ణుల వలను చూచి**
**యనిఁ బాండవుల బల మంతయు సమయింపఁ । జాలుదు రెంతేసి కాలమాన**
**మున? నన్న భీష్ముండు దన కొక్క నెలవట్టు । ననియాడె; ద్రోణుండు నట్ల పలికెఁ;**

**ఆ. గృపుఁడు రెట్టి సెప్పెఁ; గృపి కొడు కోపుదుఁ । బది దినముల ననియె బాహువీర్య**
**ఘనుఁడు గాన సూతతనయుఁ డేనాళ్లన । తీర్ప నేర్తు నని ప్రతిజ్ఞ చేసె.' 420**

**ప్రతిపదార్థం:** మన చారులు= మన వేగులవారు; ఆ వీటన్+ఉండి= కౌరవుల స్కంధావారం నుండి; ఇప్పుడు చనుదెంచిరి= ఇప్పుడే వచ్చారు; దుర్బుద్ధి సుయోధనుండు= చెడు బుద్ధిగల దుర్యోధనుడు; కొలువునన్= సభలో; గాంగేయ; కుంభ సంభవ కృప+అశ్వత్థామ కర్ణుల వలను= గంగాపుత్రుడైన భీష్ముడు, కలశం నుండి జనించిన ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, కర్ణుడు అనేవారలవైపు; చూచి= కనుంగొని; అనిన్= రణంలో; పాండవుల బలము+అంతయున్= పాండవుల సైన్యం అంతటినీ; ఎంతేసి కాలమానమునన్= ఎంతెంత కాలంలో; సమయింపన్+చాలుదురు?= చంపే శక్తి కల్గి ఉన్నారు? అన్నన్= అని ప్రశ్నించగా; భీష్ముండు= గాంగేయుడు; తనకున్+ఒక్క నెల పట్టును! అని+ఆడెన్= తన కొక మాసం పట్టుతుందని పలికాడు; ద్రోణుండున్= ద్రోణాచార్యుడు; అట్ల పలికెన్= భీష్ముడు చెప్పినట్లే నెలపడుతుందని చెప్పాడు; కృపుఁడు= కృపాచార్యుడు; రెట్టి చెప్పెన్= (రెట్టింపు కాలం)రెండు మాసములౌతుందని అన్నాడు; కృపి కొడుకు= అశ్వత్థామ; పది దినములకున్= పది రోజులకు; ఓపుదున్= చాలుదును; అనియెన్= అన్నాడు; బాహువీర్య ఘనుఁడు కానన్= భుజవిక్రమంచేత దొడ్డవాడు గనుక; సూతతనయుఁడు= కర్ణుడు; ఏనాళ్లన= ఐదు రోజులలోనే; తీర్పన్+నేర్తున్= నిర్మూలించజాలుదును; అని+అనుచు; ప్రతిజ్ఞ చేసెన్= ప్రతిన చేశాడు.

**తాత్పర్యం:** 'మన వేగులవారు ఇపుడే దుర్యోధనుడి స్కంధావారం నుండి వచ్చారు. దుష్టచిత్తుడైన దుర్యోధనుడు కొలువులో భీష్ముడిని, ద్రోణుడిని, కృపుడిని, అశ్వత్థామను, కర్ణుడిని చూచి 'మీ రెంతెంత కాలంలో పాండవ సేననంతటినీ ప్రత్యేకంగా నిర్మూలించగల?'రని ప్రశ్నించాడట. అందుకు సమాధానంగా భీష్ముడు తన కొక నెల పడుతుందన్నాడు. ద్రోణాచార్యుడు అట్లే ఒక మాస మన్నాడు. కృపాచార్యుడు రెండునెల లన్నాడు. అశ్వత్థామ పదిరోజులన్నాడు. భుజవిక్రమాఢ్యుడైన కర్ణుడు మాత్రం ఐదు రోజులలో మన బలాలనన్నింటినీ సంహరించగలనని ప్రతిజ్ఞ చేశాడట.'

**వ. అని చెప్పి యర్జునుం గనుంగొని 'వారు తమ తమ యోపిన చందంబులు సెప్పిరి; నీచేతం గౌరవ బలంబు లెంత దడవునకుం దెగు? నాకుం జెప్పు' మనిన నతం డిట్లనియె. 421**

**ప్రతిపదార్థం:** అని చెప్పి; అర్జునున్; కనుంగొని; వారు; తమ తమ; ఓపిన చందంబులు= చాలినరీతులు; చెప్పిరి; నీ చేతన్= నీ వలన; కౌరవ బలంబులు= కురుసేనలు; ఎంత తడవునకున్= ఎంత కాలంలో; తెగున్= నశించునో; నాకున్; చెప్పుము; అనినన్= అని ధర్మజు డనగా; అతండు= అర్జునుడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని ధర్మజుడు పలికి పార్థుడిని కనుంగొని, 'వారు తమ తమ శక్తులు ఏపాటివో చెప్పారు. నీచేత కురుసైన్యం ఎన్నాళ్ళలో హతం కాగలదో నాకు తెల్పు'మని అడుగగా అర్జును డిట్లా అన్నాడు:

**తే. 'వార లంతకుఁ జాలని వారె? నీ బ । లముల సమయింపఁ జాలెడు లావు వెరవుఁ**
**గలర కాక! యా రాజుతోఁ బలికి బాస । దప్పవచ్చునె వారికి ధరణినాథ!' 422**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= రాజా!; వారలు= భీష్మాదులు; అంతకున్+చాలనివారె?= చెప్పినట్లు చేయలేనివారా?; నీ బలములన్= నీ సేనలను; సమయింపన్= వధించటానికి; చాలెడు= కావలసిన; లావున్= బలమూ; వెరవున్= ఉపాయమూ; కలరకాక= ఉన్నవారే అగుదురుగాని; ఆ రాజుతోన్= తమ ప్రభువైన దుర్యోధనుడితో; పలికి= చెప్పి; వారికిన్= వారలకు; బాస= ప్రతిజ్ఞ; తప్పన్ వచ్చునె?= నెరవేర్చకుండటం న్యాయమా? (వారు తమ బాసను ఏనాటికీ నిలబెట్టుకోలేరని భావం.)

**తాత్పర్యం:** 'భీష్మాదులు గొప్ప శక్తియుక్తులు కలవారే. నీ సేనలను కూల్చదగిన పరాక్రమం ఉపాయం ఉన్నవారే అగుదురుగాక! కాని ఏలిక కిచ్చిన మాట నెరవేర్చుకొనాలి గదా!' (అది వారి తరం కాదని తాత్పర్యం.)

**వ. అని దరహాసోల్లాస భాసిత వదనుండై. 423**

**ప్రతిపదార్థం:** అని; దరహాస+ఉల్లాస+భాసిత వదనుండై= చిరునగవు యొక్క ప్రకాశంచేత ఒప్పుతున్న ముఖంకలవాడై.

**తాత్పర్యం:** అని అర్జునుడు చిరునవ్వుతో ఒప్పుతున్న ముఖంకలవాడై.

**మ. 'అనుమానం బదియేల? నీమది మదీయ స్ఫార బాహాబలం**
**బు నిరూపింప దలంచి తేని విను; మేపుం జేవయుం జూపి కృ**
**ష్ణుని తోడ్పాటునఁ బేర్చి యేఁ గడగినం జూర్ణంబు గావింతు నొ**
**క్కనిమేషంబున దేవదానవులతోఁ గూడం ద్రిలోకంబునున్. 424**

**ప్రతిపదార్థం:** నీ మదిన్= నీ మనస్సులో; అనుమానంబు+అది+ఏల?= సందేహ మెందుకు?; మదీయ= నా యొక్క; స్ఫార= అధికమైన; బాహాబలంబు= భుజ శక్తి; నిరూపింపన్= నిరూపణ చేయవలెనని; తలంచితి(వి)+ఏనిన్= నీవు భావించినట్లయితే; వినుము= చెప్పుతున్నాను ఆలకించుము; ఏపున్= విజృంభణం; చేవయున్= ధైర్యం; చూపి= కనబరచి; కృష్ణుని తోడ్పాటునన్= గోపాలదేవుడి సహాయంతో; పేర్చి= చెలరేగి; ఏన్= నేను; కడఁగినన్= పూనుకొంటే; ఒక్క నిమేషంబునన్= ఒక నిముసంలో; దేవదానవులతోన్+కూడన్= దేవతలతో రాక్షసులతో కూడ; త్రిలోకంబునన్= ముజ్జగాలను; చూర్ణంబు కావింతున్= పిండి చేస్తాను.

**తాత్పర్యం:** 'నీ మనసులో సందేహ మెందుకు? నా విస్తారమైన భుజశక్తి ఏపాటిదో తెలియవలెనని నీవు భావిస్తే చెప్పుతున్నాను వినుము. నా విజృంభణం, ధైర్యం కనబరచి శ్రీకృష్ణుడి సాయంతో చెలరేగి నేను కయ్యానికి పూనుకొంటే ఒక్క నిముసంలో సురాసురులతో కూడ మూడులోకాలను పిండిచేస్తాను.

**వ. అది యెట్లంటే నీఁ గృత్రిమ కిరాతుండైన పశుపతి మెచ్చి జగత్సంహార సమయంబునం దాను బ్రయోగించునట్టి పాశుపత మహాస్త్రంబు నాకిచ్చె; నది నాయందు సన్నిహితంబయి యున్నయది గావున శత్రునిరాసం బనాయాసంబై యుండు; నప్పాశుపత మహనీయ ప్రభావంబు భీష్ముండున్నరూపెఱుంగఁడు, ద్రోణ కృపాశ్వత్థామలు నెఱుంగరు, కర్ణున కెఱుంగ నెంతదవ్వట్టి ఘోర సాధనంబున సమస్తంబును సమయించుట యుక్తంబు గాదు తక్కిన యాయుధంబులం బోరి వైరులం బరిమార్చినం బౌరుషంబు దీపించు నని తలంచెద; నప్పటికి వలయు విధం బయ్యెడు; నది యట్లుండె; నీవా రక్కడి వారికిం దక్కువవారే? భీమసేనుండు కవ లభిమన్యుండు ద్రౌపదేయులు సాత్యకి విరాట ద్రుపదులు ధృష్టద్యుమ్నుండు శిఖండి యుత్తమౌజుండు యుధామన్యుండు ఘటోత్కచుండు మొదలైన జగజెట్లున్నవారు; మఱియు ననేకులు వీరల యట్టివారలు కలరు; వారల నందఱం జెప్పనేల? యేనుంగువోలె నీలావు నీవెఱుంగవు దివిజులకు నజేయుండవు నీయొక్కనికిఁ ద్రిభువనంబు నెదురె నీవు నిక్కం బలుగవుగాక; నీ వలిగిన నెవ్వ రెట్లయ్యెదరో యటు సూడుము; నీ సైన్యంబుల నెవ్వరికి నేమి చేయవచ్చు మనకు విజయానందంబు సులభంబ' యని పలికె నని సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె' నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పుటయు. 425**

**ప్రతిపదార్థం:** అది ఎట్లు+అంటేనిన్= ఎట్లా చూర్ణం చేయగలవని నీ వడిగితే; కృత్రిమ కిరాతుండు+ఐన= మాయాకిరాతుడైన (కపట కిరాత వేషంలో వచ్చిన); పశుపతి= పరమేశ్వరుడు; మెచ్చి= ప్రీతినొంది; జగత్+సంహార సమయంబునన్= లోకాలను సంహరించే ప్రళయకాలంలో; తాను; ప్రయోగించునట్టి; పాశుపత మహా+అస్త్రంబు; నాకున్; ఇచ్చెన్; అది; నాయందున్; సన్నిహితంబు+అయి+ఉన్నయది= సమీపించి ఉన్నది; కావునన్; శత్రునిరాసంబు= విరోధులను వధించటం; అనాయాసంబు+ఐ+ఉండున్= నాకు శ్రమలేనిదై ఉంటుంది; ఆ+పాశుపత మహనీయ ప్రభావంబున్= ఆ పాశుపతాస్త్రం యొక్క గొప్ప మహిమను; భీష్ముండు; ఉన్నరూపు+ఎఱుంగఁడు= కలరూపు తెలిసినవాడు కాడు; ద్రోణ కృప+అశ్వత్థామలున్; ఎఱుంగరు; కర్ణునకున్; ఎఱుంగన్+ఎంత దవ్వు?= తెలియుట అశక్యం; అట్టి; ఘోరసాధనంబునన్= భయంకరమైన అస్త్రంచేత; సమస్తంబును; సమయించుట= నిర్మూలించడం; యుక్తంబు+కాదు= సమంజసం కాదు; తక్కిన= మిగిలిన; ఆయుధంబులన్= యుద్ధోపకరణాల చేత; పోరి= పోరాడి; వైరులన్= విరోధులను; పరిమార్చినన్= చంపితే; పౌరుషంబు దీపించున్= నా పరాక్రమం ప్రకాశిస్తుంది; అని తలంచెదన్; అప్పటికిన్= ఆ సమయానికి; వలయు విధంబు+అయ్యెడున్= జరుగవలసినదేదో జరుగుతుంది; అది+అట్లుండెన్= ఆ విషయం ఆట్లా ఉండనీ; నీవారు= నీ సేనలోని వారు; అక్కడి వారికిన్= కౌరవసేనలో ఉన్న వారికంటె; తక్కువవారె?; భీమసేనుండు; కవలు= నకుల సహదేవులు; అభిమన్యుండు; ద్రౌపదేయులు= ద్రౌపది కొడుకులు; సాత్యకి; విరాట ద్రుపదులు; ధృష్టద్యుమ్నుండు; శిఖండి; ఉత్తమౌజుండు; యుధామన్యుండు; ఘటోత్కచుండు; మొదలైన; జగజెట్లు+ఉన్నవారు= శూరాగ్రేసరులున్నారు; మఱియున్; అనేకులు= పలువురు; వీరల అట్టివారలు కలరు= భీమాదుల వంటివారున్నారు; వారలన్+అందఱన్+చెప్పన్+ఏల?= వారందరినీ పేరు పేరున పేర్కొనట మెందుకు?; ఏనుంగు పోలెన్= గజంవలె; నీ లావు= నీ శక్తి; నీవు+ఎఱుంగవు; దివిజులకున్= వేల్పులకు; నీవు అజేయుండవు= గెలువరానివాడవు; నీ+ఒక్కనికిన్; త్రిభువనంబు= ముజ్జగాలు; ఎదురె?= అడ్డమా?; నీవు; నిక్కంబు= నిజంగా; అలుగవు+కాక; అలిగినన్= కోపిస్తే; ఎవ్వరు+ఎట్లు+అయ్యెదరో+అటు+చూడుము= ఎవరు ఎట్లా నాశనమవుతారో ఆ తరువాత చూడుము; నీ సైన్యంబులన్; ఎవ్వరికిన్; ఏమి చేయన్వచ్చున్;

మనకున్; విజయ+ఆనందంబు= గెలుపు వలని సంతోషం; సులభంబ= తేలికగా సమకూడగలదు; అని పలికెన్+అని= అర్జునుడు ఇట్లా పలికినాడని; సంజయుండు ధృతరాష్ట్రునకున్; ఎఱింగించెన్ అని; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= పరీక్షిన్మహారాజ పుత్రుడైన జనమేజయుడికి; చెప్పుటయున్= చెప్పగా.

**తాత్పర్యం:** విజయానందం తేలికగా మన కెట్లా కలుగుతుందని నీవు సందేహిస్తే చెప్పుతాను వినుము. 'కపట కిరాతుడై వచ్చిన ఈశ్వరుడు నాతో పోరాడి మెచ్చి, సకల భువనాలను సంహరించటానికి ప్రళయ కాలంలో ప్రయోగించే పాశుపతాస్త్రాన్ని నా కనుగ్రహించాడు. అది నా దగ్గర సిద్ధంగా ఉన్నది. కనుక శత్రు నిర్మూలనానికి నేను శ్రమపడనక్కర లేదు. పాశుపతాస్త్ర మహా మహిమ ఎట్లాంటిదో భీష్మడికి తెలియదు. ద్రోణాచార్యులకూ, కృపుడికీ, అశ్వత్థామకూ తెలియదు. కర్ణుడికి అసలే తెలియదు. అంత భయంకరమైన ఆ మహాస్త్రంతో అందరినీ దగ్ధం చేయటం సమంజసం కాదు. తక్కిన ఆయుధాలతో విరోధుల నెదిరించి చంపితే మన పరాక్రమ మెటువంటిదో లోకానికి వెల్లడవుతుంది అని నా అభిప్రాయం. ఆ సమయానికి జరగవలసిన దేదో జరుగుతుంది. ఇపు డా విషయ మెందుకు? నీ సైన్యంలోని వీరులు కురుసేనలోని శూరుల కంటె తక్కువ వారని తలంచవద్దు. భీమసేనుడు, నకుల సహదేవులు, అభిమన్యుడు, ద్రౌపది కుమారులు, సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, ఉత్తమౌజుడు, యుధామన్యుడు, ఘటోత్కచుడు మొదలైనవారంతా జగజెట్టి. వీరివంటి వారెందరో మన పక్షంలో ఉన్నారు. అందరినీ పేరు పేరున పేర్కొనలేను. ఏనుగువలె నీ శక్తి ఏమిటో నీ వెరుగవు. నిన్ను దేవతలు కూడా జయించలేరు. ముల్లోకాలు నీముందు నిలిచి నిన్నెదిరించలేవు. నీకు నిజంగా కోపం రాదు. వస్తే ఎవరేమవుతారో చెప్పనక్కరలేదు. మనకు విజయానందం సులువుగా చేకూరుతుంది' అని అర్జునుడు ధర్మజుడితో పలికాడని సంజయుడు ధృతరాష్ట్రుడికి వినిపించిన విషయం వైశంపాయన మహర్షి జనమేజయుడికి చెప్పాడు.

**విశేషం:** పాశుపతాస్త్ర లాభం: పాండవులు ద్వైతవనంలో నివసిస్తుండగా వ్యాసమునీంద్రుడు వచ్చి 'ప్రతిస్మృతి' అనే యోగవిద్యను ధర్మజుడికి ఉపదేశించి, ఈ విద్యవలన అర్జునుడు అధిక తపోవీర్యవిభవుడై ఇంద్రవరుణ కుబేరాది దేవతలనూ, ఈశ్వరుడినీ ప్రత్యక్షం చేసికొని, వారి వలన దివ్యాస్త్రాలు పొంది శత్రువులను జయిస్తాడని చెప్పాడు. పాండవులు ద్వైతవనం విడిచి కామ్యక వనం చేరారు. ధర్మజుడక్కడ అర్జునుడికి ప్రతిస్మృతి నుపదేశించి ఉత్తర దిశగా వెళ్ళి తపోయోగ బలంతో ఇంద్రుడిని ప్రత్యక్షం చేసికొని ఆయుధాలను గడించి ఈశ్వరుడిని ఆరాధించుమని బోధించి పంపాడు. అర్జునుడు ఇంద్రకీలాద్రి మీద ఇంద్ర దర్శనం చేశాడు. పరమాస్త్ర లాభానికై పరమేశ్వరుడిని ప్రసన్నుడిని చేసికొనుమని సురపతి చెప్పగా విజయుడు తపశ్చర్యకై హిమశైల శిఖరానికి వెళ్ళాడు. అక్కడ పాండవ మధ్యముడు కఠోరతపం సాగిస్తుండగా మునులు విస్మయపడి పార్థుడి కోరిక తీర్చి తపోభారాన్ని వారించుమని శంకరుడిని వేడుకొంటారు.

వెంటనే పరమేశ్వరుడు మాయా కిరాతుడయ్యాడు. పార్వతి బోయతగా మారుతుంది. భూతగణాలు ఎరుకలయ్యారు. వేట నెపంతో వారు అర్జునుడి ఆశ్రమ భూమిలో ప్రవేశించారు. ఈశ్వరచోదితుడై మూకాసురుడు సూకరమై సవ్యసాచిని చంపటానికి రాగా అతడా పందిపై బాణం విడిచాడు. అపుడే కిరాతరాజు కూడా ఆ వరాహం మీద అదే సమయంలో బాణం విడిచాడు. ఇరుశరాలు నాటగా మూకాసురుడు సూకరరూపం వదలి అదృశ్యమయ్యాడు. అర్జునుడు ఆశ్చర్యపడుతుండగా కపట కిరాతుడు ఎదుట నిలిచాడు. 'నేను కొట్టిన పందిని కొట్టి మృగయాధర్మం అతిక్రమించావు కనుక నిన్ను నా నిశిత శరాల పాటు చేస్తా'నని అర్జును డన్నాడు. 'నేనే ఆ మృగాన్ని ముందు కొట్టాను. అది నా బాణం చేతనే నిహతమైంది. ముందు కొట్టానని లేని శౌర్యం ఎందుకు ప్రకటించుకొంటావు? వీరుడివైతే నాతో కదనం సల్పు' మంటూ పినాకి కిరీటి మీద బాణాలు

వేశాడు. అర్జునుడు ఎన్నో వాడి సాయకాలు కిరాతుడి మీద ప్రయోగించాడు. బోయ ఏమాత్రం చలించలేదు. మరెన్నో దివ్యబాణాలు పార్థుడు వర్షించాడు. అన్నీ వ్యర్థమయ్యాయి. అగ్నిదేవు డిచ్చిన అక్షయ బాణతూణీరాలలో అతడికి అమ్ములు కనిపించలేదు. గాండీవ మెత్తుకొని కపర్దిపైకి దుమికాడు. అది కూడా మాయమైంది. ఖడ్గంతో బోయ తలపై వ్రేటు వేశాడు. నిరుపయోగమయింది. వృక్షాలతో రాళ్ళతో తలపడ్డాడు. ప్రయోజనం లేకపోయింది. కడకు కపట కిరాతుడిని పెనగి పట్టుకొని ముష్టియుద్ధానికి దిగాడు. ఈశ్వరుడు తన దివ్యదేహంతో అర్జునుడి దేహాన్ని మర్దించాడు. పార్థుడు నేలబడి మూర్ఛిల్లాడు. చంద్రధరుడు నిజరూపంతో సవ్యసాచిమ్రోల నిలిచి 'నీవంటి శౌర్య ధైర్యవంతులు క్షత్రియులలో మరెవ్వరూ లేరు. నీ తపస్సుకు మెచ్చి వరమివ్వటానికి వచ్చాను. కోరుకొమ్మ'న్నాడు. అర్జునుడు పరమ శివుడిని ప్రస్తుతించి 'పాశుపతాన్ని ప్రసాదిస్తే దానితో దైత్యదానవ యక్షరాక్షసగణాన్నీ, భీష్మద్రోణాదులనూ జయిస్తాను. కర్ణుడిని వధిస్తాను. అనుగ్రహించు' మని వేడుకొన్నాడు. విశుద్ధచిత్తుడైన పార్థునకు సంధాన మోక్షణ సంహార సహితంగా పశుపతి పాశుపతాస్త్రమిచ్చి 'అర్జునా! దీనికి ఎక్కడా అసాధ్యం లేదు. అల్పుల మీద ప్రయోగిస్తే జగత్సంహారం చేస్తుంది. ఈ దివ్యాస్త్రంతో నీవు సమస్త లోకాలను జయిస్తా' వని చెప్పి అంతర్ధానమయ్యాడు.

## ఆశ్వాసాంతము

**చ. కమల భవాది దైవత ముఖ స్ఫుట నిర్గళిత ప్రశస్త వా**
**గమృత రసప్రసార కలితాంచిత సేకవిధి ప్రకర్ష సం**
**గమ సముదీరితోల్లసన కందళిత ప్రహసద్దయాలతా**
**సుమహ దుపాశ్రయ ప్రమద శోభిత విశ్వజగన్మధువ్రతా! 426**

**ప్రతిపదార్థం:** కమలభవ+ఆది= నారాయణుడి నాభి పద్మం నుండి జన్మించిన బ్రహ్మదేవుడు మొదలుగాగల; దైవత= వేల్పుల యొక్క; ముఖ= మోముల నుండి; స్ఫుట= విశదంగా (నిరర్గళంగా); నిర్గళిత= వెడలిన; ప్రశస్తవాక్= ప్రసిద్ధిగాంచిన వచనము లనెడి; అమృతరసప్రసార= సుధాద్రవం యొక్క ప్రవాహంతో; కలిత= కూడినట్టి; అంచిత సేకవిధి= చక్కగా తడుపుట అనేపనియొక్క; ప్రకర్ష= విశేషమైన; సంగమ= పొందికతో; సముదీరిత= లెస్సగా వెలువడిన; ఉల్లసన= వికాసంతో; కందళిత= అంకురించినట్టి; ప్రహసత్= పూస్తున్నట్టి; దయాలతా= కారుణ్యమనెడు తీగకు; సుమహత్+ఉపాశ్రయ= మిక్కిలి గొప్ప ఆధారంగా ఉండటం వలన కలిగిన; ప్రమద= సంతోషంచేత; శోభిత= అలరారుతున్న; విశ్వజగత్= సమస్త ప్రపంచమనెడు; మధువ్రతా!= తుమ్మెదగలవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! పరమేష్ఠి ప్రముఖులైన దేవతలు శ్రేష్ఠములైన తమ వాక్కులతో నిన్ను కొనియాడుతుంటారు. వారొనరించే స్తోత్రాలు సుధాద్రవరూపాలు. వారి వచనామృతంతో మిక్కిలి తడుపబడటం వలన నీ కరుణ అనే తీగ అంకురించి, వికసించి, విరబూస్తుంది. కారుణ్యలతకు నీవు ఆధారభూతుడవైనందున సమస్త ప్రపంచము తుమ్మెదవలె నిన్ను ఆశ్రయించి, సేవించి సంతోషంతో అలరారుతుంది.

**విశేషం:** లత అంకురించి పుష్పించటానికి జలసేచనం ముఖ్యం. హరిహరనాథుడి కరుణాలత బ్రహ్మాది దేవతల స్తోత్రవచనాలనే అమృతరస సేకంతో పెంపొందుతుంది. పుష్పాల యొక్క సౌగంధ్య మకరందాదులచేత తుమ్మెదలు ఆకర్షించబడి లతను ఆశ్రయించినట్లు సకల లోకాలు హరిహరనాథుడి కృపనాశ్రయించి ఆనందంతో విలసిల్లుతున్నవని మనోజ్ఞమైన రూపకంతో తిక్కన సోమయాజి హరిహరాత్మకమైన పరబ్రహ్మను కీర్తించాడు.

**క. సమయ బహుత్వారణ్య । భ్రమణ పరిశ్రామ్య దంతరంగ నితాంతో**
**త్తమ సరళమార్గ దర్శన । సమర్థ పుణ్యాభిధాన సకృదుచ్చరణా! 427**

**ప్రతిపదార్థం:** సమయ బహుత్వ= బహుళాచారాలనెడి (నియమాల యొక్క విస్తృతి అనే); అరణ్య= అడవులలో; భ్రమణ= సంచరించటంచేత; పరిశ్రామ్యత్= అలసట చెందిన; అంతరంగ= హృదయానికి; నితాంత= అధికమైన; ఉత్తమ= శ్రేష్ఠమైన; సరళమార్గ దర్శన= ఋజువైనదారిని చూపటంలో; సమర్థ= శక్తిగలిగిన; పుణ్య+అభిధాన= పావనమైన నామముయొక్క; సకృత్+ఉచ్చరణా!= ఒకే ఒకసారి ఉచ్చరించుట కలవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! పరమ పురుషార్థమైన ముక్తిని సాధించటానికి అనేక సిద్ధాంతాలు, శాస్త్ర నియమాలు అనే అరణ్యాలలో సంచరించి సంచరించి నా హృదయం బడలిక చెందింది. చిట్టచివరకు నీ నామం ఒక్కసారి నోటితో పలకటమే ముక్తికి సులభోపాయమని తోచింది.

**విశేషం:** అనేక శాస్త్ర నియమాలను అనుసరించటం శ్రమతో కూడినపని. ఒక్కసారి హరిహరనాథ నామమును నోటితో ఉచ్చరిస్తే చాలు. మనుజుడు ముక్తుడౌతాడనీ, ఆ నామాని కంతటి మహిమ కలదనీ, నామోచ్చారణ మాత్రాననే దైవం ప్రసన్నుడగుననీ, భవసంతరణానికి నామస్మరణకంటె అన్యమగు సులభోపాయం లేదని తిక్కన విశ్వసించాడు.

**మాలిని.**

**అవగమిత రహస్యాష్టాంగ సమ్యక్ప్రకారో**
**త్సవ గురుకరుణా విస్తార గాఢ ప్రశాంతి**
**ప్రవణ హృదయ పద్మోద్భాసి విజ్ఞానసారా**
**వ్యవహిత పరమానందానుభూత్యేకరూపా! 428**

**ప్రతిపదార్థం:** అవగమిత= తెలియజేయబడిన; రహస్య= గూఢమైన; అష్ట+అంగ= యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధులను ఎనిమిదంగాలతో కూడిన యోగం యొక్క; సమ్యక్+ప్రకార= చక్కని విధమనెడు; ఉత్సవ= ఆనందంకల; గురుకరుణా= గురువు యొక్క దయచేత; విస్తార= మిక్కుటమైన; గాఢప్రశాంతి= పరమశాంతికి; ప్రవణ= ఉన్ముఖమైన; హృదయ పద్మ= మనఃకమలమందు; ఉద్భాసి= లెస్సగా వెలుగొందునట్టి; విజ్ఞానసార= అనుభవసహితమైన జ్ఞానసారమునకు; అవ్యవహిత= ఎడం లేని; పరమ+ఆనంద= బ్రహ్మానందము యొక్క; అనుభూతి= అనుభవమే; ఏకరూపా!= ముఖ్యమైన స్వరూపంగా కలవాడా!

**తాత్పర్యం:** దేవా! యోగివర్యులు ఆచార్యుడి అనుగ్రహ విశేషం వల్ల అష్టాంగ విద్యారహస్యాలను చక్కగా గ్రహించిన వెంటనే వారి హృదయాలలో పరమ శాంతి, పరమ విజ్ఞానం నెలకొంటాయి. ఆ వెంటనే వారు నీ స్వరూపమైన అవ్యయానందాన్ని అనుభవిస్తారు.

**విశేషం:** అష్టాంగయోగానుష్ఠానం వలన గాఢమైన హృదయశాంతి ఏర్పడి పరమాత్మ యొక్క విజ్ఞానానందస్వరూపానుభూతి లభిస్తుంది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబున నుద్యోగ పర్వమునందు సర్వంబును జతుర్థాశ్వాసము.**

**శ్రీ మదాంధ్ర మహాభారతము ఉద్యోగపర్వము సమాప్తము; ఆదిపంచకము సంపూర్ణము.**

**తాత్పర్యం:** శ్రీమంతులైన సంస్కృతాంధ్ర కవులకు చెలికాడు, కొమ్మన మంత్రికి కుమారుడు, పండితులను పూజించటంచేత ప్రకాశించేవాడు అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శుభకరమైన మహాభారతంలోని ఉద్యోగపర్వంలోని నాల్గవ ఆశ్వాసం ముగిసింది. ఉద్యోగపర్వం సమాప్తమయింది.

ఉద్యోగపర్వంలోని చతుర్థాశ్వాసం సమాప్తం.

శ్రీమదాంధ్రమహాభారతంలోని ఉద్యోగపర్వం ముగిసింది.

ఆదిపంచకం సంపూర్ణం.

- - -

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఉద్యోగపర్వము

## పద్య - గద్య ప్రథమపాద సూచి

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ( సరళ వ్యాఖ్యాన సహితం )

సంపుటము - 8

**భీష్మపర్వము**


కృతికర్త

**తిక్కన సోమయాజి**

వ్యాఖ్యాతలు

డాక్టర్ నందూరి రామకృష్ణమాచార్యులు

కవి చెరుకూరి జయచంద్రశాస్త్రి

ప్రధానసంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం






ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATAM**

With Commentary
Bhishmaparvamu of Tikkana Somayaji
Vol.VIII .

Commentary by
**Dr. Nanduri Ramakrishnamacharyulu-**1,2 Cantos
**Kavi Cherukuri Jayachandra Sastri -** 3rd Cantos

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Publications Series No.607
First Edition : August 2004
First Re-print : 2006

Second Edition: 2013
Copies : 5,000



Published by
**Sri. M.G. Gopal, I.A.S.**
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507

D.T.P. Type Setting
**Editor-In-Chief Office**
T.T.D., Tirupati.

Cover Design:

Printed at:

ఒక ప్రయోజనం కొరకు సాగించి మరల దేవలోకం చేరే నిర్ణీత ప్రణాళికతో, గంగాదేవి అనుగ్రహంతో శంతనుడి పుత్రుడుగా పుట్టాడు. అంటే - ఆయన జాతకం ఆయన విధి సంకల్ప ఫలమే.

శప్తుడైనవాడు సామాన్యంగా శుద్ధప్రవృత్తి కలిగి ఉండడు. మిశ్రప్రవృత్తి కలిగి ఉంటాడు. భీష్ముడు స్వయంగా ఉదాత్తుడైన త్యాగవీరుడు. కాని, ఆయన జీవితం ఉదాత్తులు కాని రాజుల కొరకు ఉంకువపెట్టబడింది. వారిని కాపాడటమే జీవన వ్రతమైపోయింది. వారికొరకు యుద్ధాలు చేశాడు. మాటలు పడ్డాడు. చివరకు శిఖండి రూప మృత్యువును సంపాదించుకొన్నాడు. జీవితమంతా మిశ్రప్రవృత్తితో, అంతస్సంఘర్షణతో, విధిప్రేరితమైన జీవనస్థితితో గడపవలసి వచ్చింది. కలి పేర్కొన్నట్లుగా భీష్ముడు దైవప్రవృత్తి కలిగిన ఉత్తముడైనా, అధర్మ ప్రవర్తకులైన ధృతరాష్ట్ర దుర్యోధనులను సరిదిద్దలేడు. నీతులు చెప్పినా వారిని నీతిమంతులను చేయలేడు. దానితో  తాను పెంచిన బిడ్డలే తనను అవజ్ఞ చేస్తున్నారని తెలిసినా ప్రభుత్వం తన చేతిలో లేదు కాబట్టి వారిని శాసించలేని నిస్సహాయ స్థితిలో ఉండిపోయాడు. అట్లని హస్తినాపురాన్ని వదలి వెళ్ళలేకపోయాడు. దుర్యోధనుడి పక్షాన యుద్ధం చేయకుండా ఉండలేకపోయాడు. దానికి కారణం ఎంత శక్తిమంతుడైనా అతడు హస్తినాపుర సింహాసనానికి అంగభూతుడే అంగరక్షకుడే అన్న వాస్తవం. అది అతడి జీవితంలో నిండిన ఎంతటి ధర్మమో అంతటి విషాదరేఖ. దానికి దైవికమైన కారణం అతడిలోని రాక్షసావేశం. కలి చెప్పిన కథనం దానికి సాక్ష్యం. 'భీష్మ ద్రోణ కృపాదులు గొందఱు దేవాంశ సంభవులైనను దదీయ భావంబులు రాక్షసావేశంబు నొందెడు. దానంజేసి వారు నిర్దయులై విమూఢులుం బోలె నన్యోన్య పరుషంబులు పలుకుచు నలుక మిగులం బుత్రపౌత్ర మిత్ర భ్రాతృ శిష్యగురు బాల వృద్ధజన భేదంబులు విచారింపక సమరంబు సేసి దివ్యంబులు మానుషంబులు నైన వివిధాస్త్ర శస్త్రంబులఁ బాండవపక్ష క్షయంబు గావింపంగలవారు' (ఆరణ్య. 6.46) ఈ రాక్షసావేశం భీష్ముడి గంభీర విషాద పాత్రలోని సహజలోపం (ట్రాజిక్ ఫ్లా). దానివలననే అతడికి విషాదాంతం కలిగింది.

భీష్మజీవితంలో ధర్మం గ్రీష్మర్తువువలె అతడికి అనంత తాపాన్ని కలిగించింది. దానికి కారణం అతడిలో అప్పుడప్పు డావేశించే రాక్షసావేశమే. దానివలన అతడిలోని దేవాంశకు మబ్బుక్రమ్ముతుంది.  దేవాంశ సంభూతులు ఎవరైనా అతడిలోని దేవాంశను జాగృతం చేస్తే అతడు మరల దేవచైతన్య ప్రకృతిని ప్రదర్శిస్తాడు. భారత కథలోని భీష్మజీవిత ఘట్టాలన్నీ ఇందుకు తార్కాణాలే. భీష్మపర్వం ఆయన జీవితంలో సాగిన చరమ యుద్ధవీర ఘట్టాన్ని విస్తృతంగా ఆవిష్కరించిన వీరగాథ.

కురుసభలో శ్రీకృష్ణుడి రాయబారం జరిగినప్పుడు శుద్ధధర్మ చైతన్యాన్ని త్రికరణశుద్ధిగా ప్రదర్శించిన దేవాంశ సంభూతుడుగా భీష్ముడు కనపడతాడు. దుర్యోధనుడిని మందలించాడు, కౌరవులకు న్యాయాన్ని బోధించాడు. ధర్మాలను వివరించాడు. హితవును మిత్రుడివలె చెప్పాడు, కులవృద్ధుడుగా వంశక్షేమాన్ని గురించి ప్రజాక్షేమాన్ని గురించి ప్రబోధించాడు. అయినా అధర్మవర్తనుడై, పాండవులపై యుద్ధాన్ని ప్రకటించిన దుర్యోధనుడినుండి దూరం కాలేకపోయాడు. దుర్యోధనుడు తనను సర్వసైన్యాధ్యక్షుడవు కమ్మని కోరినప్పుడు అధర్మ యుద్ధానికి సారథ్యం వహించలేనని మొగమాటం లేకుండా చెప్పలేకపోయాడు. కర్ణుడి దొక విధమైన సేవాధర్మం. భీష్ముడి దొక బంధుధర్మం. భీష్ముడు ధృతరాష్ట్రుడు పెట్టిన కూడు తిన్నాడు కాబట్టి, అన్నం పెట్టినవాడు అన్యాయం చేయమన్నా చేయకతప్పదన్నట్లు పోషకుడికి దాసుడై యుద్ధం చేయటానికి అంగీకరించాడు. దుర్యోధనుడితో ఆతడన్న మాటలు-

ఆ. ' మీరు పాండుసుతులు నారయ నా కొక్క । రూప; కార్య మున్న రూపు వలుక
వలయుఁ; గయ్యమైన వత్తు; మీలోన నా । యునికి చందమునకు నుచిత మిదియ.

క. సేనాధిపత్యమును దగఁ । బూనెద; నను మార్కొనంగఁ బురుషుల నుర్విం
గానఁ గిరీటికి నొక్కని । కే నోర్వ; నతండు శరము లెక్కు డెఱుంగున్.

క. పెఱవారి నెల్లఁ దరమిడి । నఱకుదుఁ ; బాండుక్షితీశనందనులను రూ
పఱసేయం జేయాడదు; । దఱుమరు నా మీఁద నత్యుదగ్రత వారున్.' **(ఉద్యో. 4. 148 - 150)**

దుర్యోధన పక్షంలో ఉండటం ఉచితమని భావించి, కౌరవసైన్యాధ్యక్షపదవిని చేపట్టాడు భీష్ముడు. అయితే కిరీటితో సమంగా పోరలేననీ, పాండవులను చంపటానికి మనసు రాదనీ పేర్కొన్నాడు. కాగా, ఇక భీష్ముడి చేతిలో చనిపోయే వారెవరు? కౌరవపాండవులు కాక మిగిలిన పాండవపక్షంలోని వీరులు, సైనికులు. వారెవరూ భీష్ముడితో సరిరారు కాబట్టి పోరిలో వారిని నిర్దాక్షిణ్యంగా చంపటం భీష్ముడి యుద్ధ ప్రయోజనం. ఇందులో పాండవులను చంపనని చెప్పటం దేవప్రవృత్తి. కౌరవుల పక్షాన యుద్ధంలో దిగి పాండవసైన్యాన్ని చంపే తీవ్రయత్నం చేయటం రాక్షసావేశం.

## 6. భీష్ముడిలోని దేవప్రవృత్తి, రాక్షసావేశం

భీష్ముడిలో సహజసిద్ధంగా అమరి ఉన్న దేవరాక్షస ప్రవృత్తులు అప్పుడప్పుడు తమ అస్తిత్వాలను ఒకదానికంటె మరొకటి అధికంగా ప్రదర్శితం చేసికొనటం భీష్మపర్వంలో కానవచ్చే వెలుగునీడలు. ఉభయపక్ష నాయకులలో ధర్మరాజు దైవీప్రవృత్తి కలవాడు గాబట్టి అతడితో కూడినప్పుడు గాని, అతడి ప్రసక్తి వచ్చినప్పుడు గాని భీష్ముడిలో దేవప్రవృత్తి సాత్త్విక చైతన్యంతో ఉదాత్తంగా లేస్తుంది. దుర్యోధనుడు ఆసురీప్రవృత్తి కలవాడు కాబట్టి అతడితో కూడినప్పుడు భీష్ముడిలోని రాక్షసావేశం ఉవ్వెత్తున ఎగిరిపడుతుంది.

భీష్మపర్వంలో ధర్మరాజు భీష్ముడిని దర్శించే రెండు ఘట్టాలూ చరిత్రగతిని మార్చగలిగినంత శక్తిమంతాలైనవి. దైవీప్రవృత్తుల సంయోజనం వలన గలిగే దివ్యవిభూతుల వంటివి.

పాండవులను చంపలేను, అర్జునుడిని జయించలేను, అయినా యుద్ధం చేస్తానని పూనుకొన్న తాతగారి మనఃప్రవృత్తిని ధార్మికంగా, రాజనీతిపరంగా విశ్లేషించగలిగిన వివేకవంతుడు ధర్మరాజు. పాండవులకు అండగా నిలిచినవాడు శ్రీకృష్ణుడు. అతడు సాక్షాన్నారాయణావతారమని తెలిసిన నాటి ఆత్మజ్ఞానులలో భీష్ముడు ఒకడు. రాక్షసప్రవృత్తుల నడుమ నివసిస్తూ కూడా తన దేవప్రవృత్తిని రక్షించుకొన్న సాత్త్విక రాజసమూర్తి భీష్ముడు. పాండవులను చంపలేక పోవటానికి పాండురాజు మీది మమకారం ఒక కారణం కావచ్చును. అతడికి ప్రతిబింబమైన అర్జునుడిని చూస్తే అందుకే అంతటి అభిమానం. చిన్నప్పుడు మట్టిలో ఆడుకొంటున్న పార్థుడిని ఎత్తుకొని ఆ మట్టిని తన కంటించుకొని, బిడ్డల నెత్తలేని తన అంతస్తాపం తీరేటట్లు పాండురాజు గుణగణాలను స్మరించుకొంటూ ముద్దుపెట్టుకొనేవాడట! అట్టి తాతను చంపవలసి వస్తే అర్జునుడి మనసు మాటిమాటికీ కటకటపడింది. అది ముగ్ధమైన మమకారం. ధర్మరాజును చూస్తే అపరిమితమైన గౌరవంతో కూడిన వాత్సల్యం భీష్ముడికి. ధర్మజుడి హృదయంలోని లోతు తాతకు తెలుసు. మనుమడు తాతకు దగ్గులు నేర్పగలడని కూడా తెలుసు. పాండవాగ్రజుడు పితామహుడికి ధార్మికపథంలో వారసుడు. పాండవమధ్యముడు పితామహుడి వీరరసపథంలో వారసుడు. అందుకే వారిని భీష్ముడు చంపలేడు. వారిని చంపితే భీష్ముడు తనను తాను చంపుకొన్నట్లే. ఏ అవిచ్ఛిన్న ధర్మవీర సంప్రదాయ రక్షణకొరకు భీష్ముడు నిలిచాడో దానిని హస్తినలో స్థాపించి ముందుకు తీసికొని పోగలిగినవారు పాండవులే. అందువలననే భీష్ముడు పాండవులను చంపడు. ఈ లోతును దుర్యోధనుడు తెలియలేడు. కొంత తెలిసికొన గలిగినవాడు కర్ణుడు. కాని, కర్ణుడు బైటపడడు. భీష్ముడు బైటపడతాడు కాని, దుర్యోధనుడిని వదలలేడు. ఇందులోని సూక్ష్మాన్ని తెలిసికొని, దానివలన లాభాన్ని కొల్లగొట్టగలవాడు ధర్మరాజే.

కురుక్షేత్ర యుద్ధం ప్రారంభం కానున్నది. ధర్మరాజు పాదచారియై కౌరవ సైన్యవ్యూహంలో ప్రకాశించే పితామహుడికి నమస్కరించాడు.

ఆ. ' అనఘ! నీ కెదిర్చి యనిసేయువాఁడనై । ము న్ననుజ్ఞ గొనఁగ నిన్నుఁ గాన
నెమ్మి వచ్చినాఁడ నీచేత దీవన । పడసి చనిన నేను బగఱ గెలుతు.' **(భీష్మ. 1. 156)**

అని ప్రార్థించాడు. శ్రీకృష్ణుడు వ్యాఖ్యానించినట్లుగా అది లోకమర్యాద కావచ్చును. విజయం పొందే ఒక ధర్మమర్యాద కావచ్చును. లేదా, 'మెత్తని పులి' అయిన ధర్మజుడి రాజనితిలోని ఒక ఎత్తుగడ కావచ్చును. ధర్మజుడి యుద్ధ తంత్రం ఫలానుమేయం కాబట్టి లోతైనది.

భీష్ముడు భోలాశంకరుడు. నమస్కరించిన మనుమడిని చూచి ఆయన హిమవన్నగమంతా చెమ్మగిల్లినట్లు ఆర్ద్రుడయ్యాడు. సమకాలీనులైన ధర్మవీరులలో ప్రథమ గణ్యుడైన యుధిష్ఠిరుడు సమరాంగణంలో, శత్రుపక్షంనుండి వచ్చి, సామోపాయంతో, సాష్టాంగం చేయటమంటే సామాన్యం కాదు. అట్లా చేసిన మనుమడు తనకు ధర్మపథంలో వారసుడైన ధర్మరాజే. చేసినందుకు లోన ఉప్పొంగిపోయాడు. ఒకవేళ అట్లా చేసి ఉండకపోతే శాపమిచ్చి ఉండేవాడట! అది ఆయనలోని రాక్షసావేశం. దానిని గుర్తించి ధర్మరాజు దానికి విరుగుడు పెట్టాడు. ఆ తరువాత ధర్మరాజు కోరింది యుద్ధానికి అనుజ్ఞ, శత్రువులను గెలవటానికి దీవెన. ఇట్లా అడగగలిగింది మెత్తనిపులి మాత్రమే. కోదండ మెత్తితే పాండవులను నిర్జీవులను చేయగలిగిన పరాక్రమం కలవాడు భీష్ముడు. అత డిచ్చే అనుజ్ఞ వలన పాండవులకు ప్రాణాపాయం తప్పుతుంది. పగరను జయించే దీవెనవలన కౌరవపక్షంమీద గెలుపు సిద్ధిస్తుంది. దానిని తాత కరుణావేశంలో ఇచ్చాడు. అయితే భీష్ము డుండగా పాండవులకు శత్రువిజయం సాధ్యం కాదు. దానిని వరంతో పూరించదలచుకొన్నాడు భీష్ముడు. పాండవపక్షంలో యుద్ధం చేయుమని కాకుండా ఏదైనా వరాన్ని ప్రసాదించదలచాడు పితామహుడు. ధర్మజుడు ఆ అవకాశాన్ని అర్థవంతంగా సాధించుకొన్నాడు.

'రారాజు పక్షమై రణము సేయుము! నాకు హితమగు కార్యంబు మతిఁ దలంచుము' అని గడుసుగా అడిగాడు. 'హితమయ్యే కార్యం' లో గూఢార్థం ఇమిడిఉన్నది. దానిని భీష్ముడే తెలిసికొన దలచాడు. వివరించుమన్నాడు. 'నిన్నుఁ బోరఁ గెల్చు విధము బోధింపు' మని ధర్మరాజు తన మనసులోని గోప్యాన్ని తాతముందు పెట్టాడు. అందులో ఔచిత్యం కూడా పాటించాడు. తాత చావకుండ తాము గెలిచే ఉపాయాన్ని కోరాడు. కౌరవులు హతులైనా భీష్ముడు జీవించి ఉండాలన్న కోరిక అందులో ధ్వనిమయంగా ఉన్నది. తాను జీవించి ఉండగా విజయం రాదని తాతగారు భావిస్తే వధోపాయం చెప్పుమని గూఢార్థం. భీష్ముడు గంభీరంగా నవ్వి ఊరుకోకుండా 'నే నెదిరించి యుద్ధం చేస్తే దేవతలకు కూడా విజయం అసాధ్యం' అని రాక్షసావేశంతో అనేశాడు. ధర్మజుడు సమయోచితంగా 'అందుకే కదా నిన్ను నేను వేడటం' అని గంభీరంగా గడుసుగా అన్నాడు. మనుమడి గాంభీర్యం చూచిన తరువాత తాతకూడ గంభీరుడైనాడు. మనుమడి నేర్పరితనంతో మనసు కరిగిపోతున్నా బిగబట్టుకొన్నాడు. బింకంగా ఇట్లా పలికాడు:

ఉ. ' చుట్టరికంబునన్ మనసు సొచ్చి ననుం గరఁగించి వేఁడినన్
దిట్టతనంబుఁ బోవిడిచి తీవ్రరణంబు కడంక దక్కి నేఁ
బట్టిన యాయుధంబు పెడఁబాపినఁ గాని వధింపఁ బోల; ద
ట్టిట్టన కేఁగు; మిప్పరుస యింతక కాలము గాదు దానికిన్'. **(భీష్మ. 1. 159)**

దుర్యోధనుడి చేత ప్రేరితుడైన భీష్ముడు తనలోని రాక్షసావేశాన్ని పెంచుకొని తీవ్రరణ కౌతూహలాన్ని ప్రదర్శించాడు. ఆ ఆవేశాన్ని అణచుకొనేది దేవభావం. అది దైవీప్రవృత్తి అయిన ధర్మరాజు చేత జాగృతిచెంది ప్రసన్నమయింది. అంటే కౌరవ విజయానికి మూలమైన భీష్మప్రవృత్తిలోని రాక్షసమైన యుద్ధోన్మాదం ధర్మజుడి కిచ్చిన వరమనే దివ్యౌషధంచేత క్రమంగా ప్రాణత్యాగోత్సాహంగా మారి దైవీప్రవృత్తి యొక్క ఉన్నత శిఖరాన్ని అందుకొనాలి. ఆ సాధనతో భీష్ముడిలో పరివర్తన రావాలి. దానికి పదిరోజులు కావాలి. ఆ పరిణామ దశా దశకమే భీష్ముడి దశదిన యుద్ధ క్రమం. దానికి నాంది పలికింది ధర్మరాజుయత్నం.

### 7. పదిరోజుల పోరు : పది పరిణామాల తీరు

మొదటినాటి యుద్ధంలో భీష్ముడు రెండు రకాల ఒత్తిడుల మధ్య తరతమ భేదాన్ని నిర్ణయించుకొని వ్యవహరించాడు. మొదటి ఒత్తిడి దుర్యోధన పక్షానికి సంబంధించింది. అతడు భీష్ముడిని సర్వసైన్యాధ్యక్షుడిగా చేసి బాధ్యతల నొప్పగించాడు. కర్ణుడు యుద్ధంలో పాల్గొనగూడదని నియమం పెట్టినా కిమ్మనకుండ అంగీకరించి, అది భీష్ముడి మహావీర లక్షణమని ప్రశంసించాడు. అది భీష్ముడి అహాన్ని సంతోషపెట్టి ఉండవచ్చును. దానికి మించి దుర్యోధనుడు వ్యూహంలో భాగంగా భీష్ముడి రక్షను గురించి శ్రద్ధ తీసికొంటూ దుశ్శాసనుడి కిచ్చిన ఆజ్ఞలతో ఆయన మనసు ఆనందంలో మునిగిపోయింది. పిల్లలు చూపించే ఆప్యాయత ఆ బ్రహ్మచారి హృదయాన్ని ఆర్ద్రం చేసివేసింది.

క. 'కన్నాకు మనకు భీష్ముం । డిన్నరవరుఁ గావవలయు నెమ్మెయి నైనం
దన్నుం గాచిన నితఁడు జ । గన్నుతముగ రణమునం బగఱ నడఁగించున్.

ఆ. ఎల్లవారఁ గాచు నితఁ డని యెప్పుడుం । దలఁతు మితనిఁ గావవలయు టేమి
యని తలంచెదేని విను మిందఱకు నిది । వినఁగవలయునట్టిపని కుమార!

వ. సత్యవ్రతుం డగు నిమ్మహానుభావుండు

క. 'వినుఁ డన్యు లెవ్వరును నా । మునుమునఁ బడి బ్రదుక రాలమున; నేను శిఖం
డిని నోర్వఁజాలఁ జుండీ' । యని మన యుద్యోగవేళ యప్పుడ చెప్పెన్.

ఉ. ఏమఱి రక్షసాలని మృగేంద్రుని నక్కయుఁ గోలుపుచ్చు; సం
గ్రామములోనఁ గన్గలిగి కానక తక్కిన నా శిఖండిచే
నీ మనుజేంద్రుఁ గోల్పడమె? యట్టిది గోల్పులి నిద్రవోవ ను
ద్దామ బలంబుమై గొఱియ దాఁకి వధించిన యట్టు లుండదే!

క. కావున నీ యుద్భట రథి । కావలి నివ్విభునిఁ గాచునట్లుగఁ బనుపం
గావలయు; మీర లందఱు । నేవలఁ జూచిన శిఖండి కెదురుం డెపుడున్.' **(భీష్మ. 1. 76-81)**

ఇంత మధురంగా ఎప్పుడో కాని దుర్యోధనుడు మాట్లాడడు. భీష్ముడు కౌరవసేనకు కన్నాకు. పాండవసేనకు ప్రళయం. అందువలన ఆయనను రక్షించుకొనటం కౌరవుల కర్తవ్యం. శత్రువులందరినీ సంహరించే పితామహుడిని కౌరవులందరు కలిసి రక్షించుకొనాలి. రక్షించుకొనే మార్గం భీష్ముడే చెప్పాడు. 'ఒక్క శిఖండిని మాత్రం నే నెదుర్కొనను. మిగిలినవారెవరైనా నా యెదుటబడి బ్రదుకలేరు' అని ఉద్యోగసమయంలో అన్నాడు. శిఖండి గొప్పవీరుడని కాదు. రక్ష లేని సింహానికి నక్కకూడా కీడు చేస్తుంది. నిద్రపోతున్న పెద్ద పులిని పొట్టేలు కూడా పొడిచి చంపుతుంది. అందువలన రక్షలేకపోతే భీష్ముడుకూడా శిఖండి చేతులలో కీడు పొందవచ్చును. కాబట్టి మహారథికులందరూ భీష్ముడిని రక్షిస్తూ ఉండండి. శిఖండిని ఆయన ముందుకు రానీయకండి' అన్నాడు సుయోధనుడు.

ఇవి రారాజు మాటలా? లేక భీష్ముడి మనసులోని ఊసులా? అని పఠితలకు అనుమానం కలిగేటంత కమనీయంగా ఉన్నాయి. ఇవి దైవీప్రవృత్తి కలవాడు పలికే మాటలవలె ఉన్నాయి. అయినా అవి రణవ్యూహంలో భాగాలే. ఏయే వీరుడిని ఎట్లా ఉత్తేజపరిచి యుద్ధంలో విజయం సాధించాలో తెలిసి పలికే తెలివిగల వాడి మాటలు. ఆ మాటలు విన్న భీష్ముడు తన నంతగా అభిమానిస్తున్న ప్రభువుకొరకు శక్తివంచన లేకుండ శత్రుసంహారం చేసి కృతజ్ఞతలు తెలుపుకొనాలనే సహజోత్సాహం ఉరకలు

పెట్టుతుంది. అట్లా యుద్ధోత్సాహమూర్తి అయి సైన్యముఖంలో నిలువబడిన ఆయన పాండవసేనను యమదృష్టితో చూచి ఉంటాడు. దానికి విరుగుడు పెట్టిన ధర్మరాజు వినయాన్ని చూచి 'నీ విట్లా రాకపోయి ఉన్నట్లయితే శపించేవాడి' నని బయటపడ్డాడు.

'నీవు కౌరవపక్షంలోనే యుద్ధం చేయుమనీ, అయినా, పాండవపక్షానికి హితం చేయు' మనీ ధర్మరాజు కోరినప్పుడు భీష్ముడు పాండవులను సంహరించకుండా సైన్యాలను మట్టుపెట్టటమే వారికి చేసే హితంగా భావించాడు. అందుకే మొదటి నాటి యుద్ధంలో అపారసేనావాహినిని అమరపురికి పంపాడు. మధ్య మధ్య సుయోధనుడు భీష్ముడిని ప్రేరేపించగా ఆ పితామహుడు విజృంభించి వీరవిహారం చేశాడు. ఎండిన అడవిని కార్చిచ్చు కాల్చినట్లు పాండవసేనను దహించాడు. దుర్యోధనుడూ, అతడి తమ్ములూ, రాజులూ భీష్మప్రతాపానికి సంతోషించారు. ధర్మరాజు చింతాక్రాంతుడై గోవిందుడి ముందు చిన్నబోయి నిర్వేదంతో యుద్ధాన్ని చాలించి అడవులకు పోతానన్నంత వరకు వెళ్ళాడు.

చ. ' అలవి యెఱుంగనేరక మహాత్ముని లోకముతోడి పాటిగాఁ
దలఁచితి; బేలనైతి; శరతాడన పీడితు లైరి నీ మఱం
దులు; నమరాపగాతనయుతోడి రణంబునకున్ దిశాధి నా
థులు నఱుమంగఁ జాల రని తోఁచుచున్నది నా మనంబునన్.'

చ. ' అతని జయించు నంచు మన మర్జును నెంతయు నమ్మియుండఁగా
నితఁడును సంగరంబున నుపేక్షకుఁ డయ్యెఁ; వృకోదరుం డొకం
డ తఱికి ( జొచ్చి దోర్బలము దాఁపక పోరెడు; నేమి సేయు నా
కితనిని నీతనిం దడవ నేటికిఁ గయ్యము జోలి మానెదన్.'

క. ' నరపతుల నెల్ల భీష్మున । కెరగా నొప్పింపఁజాల; నే నడవులకున్
మరలం బోయెద, నచటం । దిరిగెదఁ గూరాకు గోసి తినియెద ననఘా!' **(భీష్మ. 2. 6 - 8)**

ధర్మరాజు వైరాగ్యానికి భీష్ముడి కోపోద్రేకం కారణం. మొదటినాటి కోపోద్రేకం అర్జునుడిమీద ఒత్తిడిని పెంచింది.

అతడు రెండవనాడు విజృంభించాడు. భీష్ముడికి కూడ అబ్బురపాటు కలిగేటట్లు భీషణంగా పోరాడాడు.

తే. ' కృష్ణసారథ్యమున నొప్పు క్రీడి యిపుడు । కౌరవానీకముల నెల్లఁ గసిమసంగి
కృష్ణసారథ్యమున నొప్పు క్రీడియైన । నెట్లు సేయంగ వలయుఁ దా నట్లు సేసె.' **(భీష్మ. 2. 92)**

'విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్' - అనే సూక్తి భీష్ముడిపట్ల సార్థకమైనది. పరశురాముడిని జయించిన పరమధానుష్కుడు పరవశించి ప్రశంసించదగిన ఆదర్శవీరుడిని అద్భుతంగా దర్శించి ఆనందించాడు.

మూడవనాటి యుద్ధంలో అర్జునుడు రణోత్సాహంతో కౌరవవీరులను భంగపరిచాడు. భీముడు విజృంభించి దుర్యోధనుడిని మూర్ఛలో ముంచాడు. అభిమన్యుడు శకునిని నొప్పించాడు. ఆ అవమానాన్ని భరించలేక దుర్యోధనుడు భీష్మద్రోణులను నిష్ఠురాలాడాడు.

ఉ. ' ఉక్కున మూఁడు లోకములు నొక్కటఁ దాఁకెన యేనిఁ బోర మీ
రొక్కఁ డొకండ గెల్చుటకు నోపుదు రశ్రమవృత్తి; నట్టి మీ
ముక్కున నూర్పు గల్గ మన మోహర మీ దురవస్థఁ బొందునే?
యక్కట! మున్న పాండవుల కల్గఁగ నొల్లమి సెప్పరైతిరే?' **(భీష్మ. 2. 119)**

ఆ మాటలలో భీష్మద్రోణులు కుహనా వీరులని తేల్చి చెప్పినట్లయింది. ఆ సత్యం ముందే కర్ణుడు చెప్పగా నమ్మలేకపోయాననీ, ఇప్పుడు తెలిసికొని భంగపడ్డాననీ పితామహుడిని ఎత్తి పొడిచాడు దుర్యోధనుడు.

దుర్యోధనుడు దుష్టప్రభువు. అతడికి ఎదుటివారి గుణవిశేషాలు తెలియవు. తనకు మెప్పు గలిగించే వారినే గౌరవిస్తాడు. ఎంతటి ఉత్తముడినైనా శంకించటం అతడి స్వభావం. భీష్మద్రోణులు ప్రభువుల యోగక్షేమం కోరే ఉత్తమవీరులు. వారు అర్జునుడిని నిర్జించే ప్రయత్నం చేసి, శ్రీకృష్ణసారథ్యంలో ఉన్న మహిమాతిశయం చేతా, పార్థుడి దివ్యశస్త్రాస్త్ర ప్రాభవం చేతా ఆ పని చేయలేకపోయారు. దానిని పాండవపక్షపాతంగా అనుమానించి దుర్యోధనుడు ఆ వృద్ధవీరుల నిజాయితీని శంకిస్తూ నిష్ఠురా లాడాడు. మొన్న పొగిడాడు, ఈనాడు తెగడుతున్నాడు. అతడి అవివేక ప్రవృత్తికి గంభీరుడైన భీష్ముడు నవ్వుతూ, తెలిసి తెలియని సుయోధనుడితో ప్రియభాషణం చేశాడు.

క. ‘ పురుహూత సహిత మగు ని । ర్జర బలమునకైన గెలువ శక్యమె? సమర
స్థిరులగు పాండు తనూజుల । నరనాయక! నీకు నిట్లనం దగ వగునే?

క. వృద్ధులు గతాయువులు దు । ర్బుద్ధులు నగువారిచేతఁ బోదురె శస్త్రా
స్త్రోద్ధతియు బాహుగర్వ స౹మృద్ధియుఁ గల పాండుసుతు లమిత్త్రధ్వంసీ!’ **(భీష్మ. 2. 123. 124)**

ఇవి పైకి సత్యవాక్యాలు. లోన గమనిస్తే అధిక్షేపోక్తులు. భీష్ముడు తన ఎదుటపడిన వాడెవడైనా బ్రదకటం కష్టమన్నా డిదివరలో. అందులో అర్జునుడిని మినహాయించా డిప్పుడు. ఇంద్రాదులే అర్జునుడి నెదిరించి గెలవలేరన్నప్పుడు మే మెంత? అని తేల్చి చెప్పాడు. పాండుతనూజులు సమరస్థిరులని చెప్పి దుర్యోధనుడి ఒడలు మండించాడు. ‘నీ విట్లా మమ్ముల ననటం న్యాయమా?’ అని మందలించాడు. వృద్ధులు, గతాయువులు అని తమను తక్కువచేసి మాట్లాడటమే కాక దుర్బుద్ధులైన దుర్యోధనాదులను గూడ ఆ వరుసలో చేర్చాడు. ఇటువంటి వారందరి చేతులలో పాండవులు చావరనీ, వారి చేతులలో వీరు పోవటం తథ్యమనీ ధ్వనింపజేశాడు. ఉత్తములను శంకించటం ఎంత తప్పో, వారిని నిందించటం అంత తప్పు. ఈ రెండూ చేసి నిండు నమ్మకంతో, బంధుత్వంతో పోరుతున్న తన చిత్తశుద్ధిని గుర్తించలేని ఆ దుర్యోధనుడి శంకాప్రవృత్తికి భీష్ముడు లోలోన బాధపడి, తన కర్తవ్య నిష్ఠ అపాత్రుడికి అంకితమైనదని అంతర్నిర్వేదాన్ని పొందాడు.

అయినా, నమ్మిన రాజు అనగూడని మాటలన్నందుకు, తన నిజాయితీని నిరూపించుకొనటానికి భీష్ముడు పాండవ సైన్యంమీద, అర్జునుడిమీద తిరుగులేని యుద్ధాన్ని చేశాడు. పార్థుడు యుద్ధం చేయలేక తూలిపోయాడు. శ్రీకృష్ణుడు ఆ దృశ్యం చూచి మండిపడి భీష్ముడిమీదికి చక్రాయుధంతో విక్రమించాడు. పార్థుడి ప్రార్థనతో భీష్మవధ యత్నాన్ని శ్రీకృష్ణ డుపసంహరించుకొన్నాడు. శత్రుమర్దన మహాకోపావేశ మగ్నుడైన భీష్ముడు శ్రీకృష్ణుడు చక్రాయుధంతో తనపై లంఘించినప్పుడు వినయంతో చేతులు జోడించి ‘పరమేశ్వరా! నన్ను ఈ విధంగా కృతార్థుడిని చేస్తావా? నీవు వచ్చి ఇప్పుడే, నీ ఇష్టం వచ్చినట్లు ఏ విధంగానైనా చేయుము. నేను సిద్ధం. ఆలస్యం వద్దు. నీ చర్య నాకవశ్యం యోగ్యం’ అని వేడుకొన్నాడు. భీష్మ రౌద్రోద్రేకం శ్రీకృష్ణభక్తి సముద్రంలో మునిగిపోయింది. భీష్ముడి ప్రతాపం మందగించింది. అర్జునుడి పరాక్రమం విజృంభించింది. కౌరవసైన్యం విస్తారంగా నేల కొరిగింది. ఆనాటి యుద్ధం ముగిసింది.

శ్రీకృష్ణవిజృంభణం భీష్ముడిలోని రౌద్ర విజృంభణానికి విరుగుడుగా తోచింది. చావు తప్పదన్న దివ్యసంకేతం తెలిసికొనటానికి తోడ్పడింది. స్వీయమరణాన్ని గురించి సౌముఖ్యాన్ని మనసులో సంతరించుకొనాలని స్ఫురించింది. శ్రీకృష్ణుడి సంరక్షణలో ఉన్న పాండవులకు విజయం చేకూరటం ధర్మవిజయమని అనిపించింది.

పాండవుల విజయానికి అనుకూలమైన ప్రవృత్తి మొదటినాడు బీజావస్థలో తోచింది. రెండవరోజు దానికి విఘాతం కలిగించే కోపోద్రేకం కలిగింది. మూడవరోజు శ్రీకృష్ణమేఘదర్శనం వలన పాండవానుకూలత అంకురావస్థ నందుకొన్నది. నాల్గవనాడు భీష్మడి ప్రతాపం ప్రకాశించటం మాని, పాండవ సానుభూతి పల్లవావస్థ నందుకొనేటట్లు పరిణమింపజేసింది.

నాల్గవనాడు పాండవులదే పైచేయి. కౌరవులు చిన్నబోయారు. దుర్యోధనుడు భీష్ముడిని అడిగాడు. 'మీవంటి మహావీరులు మా పక్షాన ఉన్నా పాండవులు మన కంటె మిన్నగా ప్రకాశిస్తున్నారు. దానికి కారణం ఏమిటి? అని (భీష్మాదుల ఉపేక్షయా? అనే అనుమానంతో) అడిగాడు.

భీష్ముడు పాండవబలంలోని మూలతత్త్వాన్ని దుర్యోధనుడికి తెలియచెప్పాడు. 'దుర్యోధనా! నేను నీకు ఎన్నోసార్లు చెప్పాను. పాండవులకు వాసుదేవుడు సహాయకుడై ఉన్నాడు. అందువలన వారికి అసాధ్యమనేది లేదు. ఆ పరమేశ్వరుడి అసలు స్వరూపం తెలిసినవారు పెక్కుమంది లేరు. తెలిసినవారికి ఆపదలు ఉండవు. పాండవులు అతడి తత్త్వాన్ని తెలిసికొని ఆశ్రయించారు. నీవు శ్రీకృష్ణుడిని లెక్కచేయవు' అని నిర్ద్వంద్వంగా చెప్పాడు.

శ్రీకృష్ణ చక్రాయుధం భీష్ముడిమీద భౌతికంగా పడకపోయినా, దాని ప్రభావం భీష్ముడిలో ఒక వెలుగుబాటను ఆవిష్కరించి దుర్యోధనుడికి బోధింపచేసింది. దానివలన ఎందరెన్ని విధాల పోరినా పాండవులకు విజయం తథ్యమని స్పష్టమయింది. శ్రీకృష్ణుడు ప్రత్యక్షంగా సహాయం చేసే పాండవులకు తాను పరోక్షంగా నైనా సాయం చేయాలన్న సౌముఖ్యభావం లోలోన పల్లవించింది.

అయిదవనాడు దుర్యోధనుడు భీష్ముడిని ప్రత్యక్షంగా ఏమీ అనలేకపోయాడు. ద్రోణుడిని సంబోధించి భీష్ముడినీ కలిపి అధిక్షేపించాడు.

తే. ' పట్టి పాలార్చెదరు మీరు పాండుసుతుల; । నీవు భీష్ముడు నలిగిన దేవతలకు
నైన మార్కొనవచ్చునే? సేన నరుఁడు । నొంపఁగా నిట్టు లొప్పరికింపఁ దగునె? **(భీష్మ.2. 280)**

అర్జునుడు కౌరవసేనను నుగ్గు చేస్తున్నా గురుభీష్ములిద్దరూ అతడిమీది అభిమానంతో తటస్థ వైఖరిని ప్రదర్శిస్తున్నారనీ, వారిద్దరూ పాండవపక్షపాతులైన తోడుదొంగల వలె వ్యవహరిస్తున్నారనీ దుర్యోధనుడు వ్యాఖ్యానించటం వలన వారిద్దరి మనస్సులు కటకటపడ్డాయి. దానితో భీష్ముడికి దుర్యోధనుడిపై వైముఖ్య మేర్పడింది. పాండవ సౌముఖ్యం అతడిలో కుట్మలావస్థకు చేరుకొన్నది.

ఆరవనాడు అర్జునుడు ప్రచండంగా ప్రతాపాన్ని ప్రదర్శించాడు. కౌరవసేన దీనదశ పొందింది. దుర్యోధనుడు ఖిన్నుడై ఆ రాత్రి భీష్ముడితో నిర్మొగమాటంగా, నిష్ఠురంగా మాట్లాడాడు.

ఆ. ' మనము పూఁచి పట్టి మొన లేర్చికొని పోవఁ । బాండురాజ సుతుల బలము గవిసి
గాసి చేయునదియుఁ గాక నీ ముందటఁ । బవన తనయు చేత భంగపడితి.'

క. ' నినుఁ గొని గెలిచెదఁ గుంతీ । తనయుల నని యున్న తలఁపు దప్పించెదు నీ
వనిమిషులనైనఁ జేకొన । వనిమొన వారింత బలియు రగు టేమియొకో!' **( భీష్మ. 3.5,6)**

ఎన్నివిధాల దృఢ వ్యూహాలను పన్నుకొని వెళ్ళినా పాండవుల ముందు అవి పటాపంచలౌతున్నాయి. భీష్ముడి ముందటే భీముడు దుర్యోధనుడిని భంగపరిచాడు. అది దుర్యోధనుడి మనసులో అనుమానపు పొగలు సెగలు రేపింది. భీష్మ డొక్కడు చాలు పాండవులను జయించటానికి - అనే ఆశతో వచ్చిన దుర్యోధనుడు నిరాశపడ్డాడు. పైపెచ్చు దేవతలుకూడా ఎదుర్కొనలేని భీష్మ ద్రోణులు యుద్ధం చేస్తున్నా, పాండవులు రోజు రోజుకు బలపడుతున్నారు. ఈ వైరుధ్యం తెలియలేక వెర్రిగా అడిగాడు రారాజు. ఆ ప్రశ్న వెనుక ఉన్న

అనుమానం భీష్ముడి మనసు విరిచింది. రోషంతో నవ్వుతూ అన్నాడు - 'దుర్యోధనా! నీ విన్నిమాటలు నన్ననవద్దు. యుద్ధంలో నా ఒడలు దాచుకొంటున్నానా? వెనుకా ముందూ చూచుకొనకుండా శత్రువులను వెంటాడుతున్నాము కదా! పాండవులను జయించటం సాధ్యంకాదని నీ కెప్పుడూ చెప్పుతుంటాను' అని విసుగుతో అని, 'నీ కివన్నీ అర్థంకావు. నీకు కావలసింది నా శరీరం పడిపోయేంత వరకు యుద్ధం చేయటమేగా! సరే - నీ జయం కొరకు దాపరికం లేకుండా యుద్ధం చేస్తాను' అని తెగించి రణరంగంలో ప్రవేశించాడు.

దుర్యోధనుడు భీష్ముడి మనసు గాయపరిచాడు. అతడు శరీరం మీద స్పృహ వదలి యుద్ధానికి బయలుదేరాడు. అతడి ప్రాణాలు పాండవులవైపు ప్రసన్నమయ్యాయి. అనుమానించి అధిక్షేపించే రాజుకంటె శరీరం ఉన్నంత వరకు యుద్ధం చేసి, ధర్మం నిర్వహించి, కన్నుమూయటం మేలనే నిర్ణయానికి వచ్చాడు. అది పాండవులపట్ల సాగే సౌముఖ్య ప్రవృత్తిలతకు పుష్పవికాస దశగా భాసించింది.

ఏడవరోజు భీష్ముడి శరీరం యుద్ధం చేసింది. మనసు నిమిత్తంగా నిలిచింది. ఎనిమిదవనాడు భీముడు దుర్యోధనుడి తమ్ములను మట్టుబెట్టాడు. భీష్ముడు అతడిని వారించలేకపోయాడు. దుర్యోధనుడు మండిపడుతూ భీష్ముడిని నిష్ఠురవాక్యాలతో నిందించాడు.

దుర్యో: 'ఈ విధంగా వరుసబెట్టి నా తమ్ములను భీముడు చంపుతూ ఉంటే చూస్తూ ఊరుకొంటావా? రోషశోకాలు నీకు లేవా? తోడుపడకూడదనే మిన్నక ఉండిపోయావా? ఉన్నవారందరూ ఒక్కసారి చావాలన్న కోరికతోనే ఊరకున్నావా?

భీష్మ: (కంటతడిపెట్టి) ఆ సంగతి నీకు ముందే నేనూ, ద్రోణుడూ, విదురుడూ విశదంగా చెప్పాము. పాండవులకు ఎదురై నిలిచి గెలవటం మా వశమా? ఆ భీముడి పాలపడిన కురు కుమారులను కాపాడటం ఎవరికీ సాధ్యం కాదు. దీనికి దుఃఖించి ఇప్పుడేమీ ప్రయోజనంలేదు. వీరస్వర్గమే సంపదగా భావించి నీ వింక యుద్ధం చేయుము. నేనూ నాకు చేతనైనంత యుద్ధం చేస్తాను. మనకు విజయం కలిగితే త్రోసివేసి కొంటామా?'

ఈ మాటలలో భీష్ముడు దుర్యోధనుడితో విడివడిపోతున్న వైఖరిని ప్రదర్శించాడు. చావు తప్పదని హెచ్చరించాడు. ఒప్పుకొన్నందుకు నాకు చేతనైనంత వరకు పోరాడతానని ఒప్పగింతలు పెట్టినట్లు మాట్లాడాడు. ఇది పాండవులకు మంచి అనుకూల దశ.

దుర్యోధనుడు అంతటితో ఆగక ఆనాటి అర్ధరాత్రి పితామహుడి మందిరానికి పోయి నిష్ఠురోక్తులతో అతడి మనసును మరీ బాధపెట్టే సంభాషణ చేశాడు. చేతకాకపోతే సర్వసేనాధిపత్యం వదలి కర్ణుడికి యుద్ధం చేసే అవకాశ మిమ్మని కర్ణప్రేరితుడై దుర్యోధను డడిగాడు.

చ. ' అనిమొన దేవదానవుల కైనను మార్కొనరాదు నిన్ను నేఁ
డెనిమిది నాళ్ళు లయ్యె సమయింపవు నొంపవు సవ్యసాచి; న
ప్పని యటులుండ నిమ్ము; నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టు నా
చనవునఁ బోవ నిచ్చి నృపసత్తమ! పోరికిఁ గర్ణుఁ బంపవే!' **(భీష్మ. 3. 171)**

ఆ మాటలు ఈటెలుగా భీష్ముడి హృదయానికి గ్రుచ్చుకొన్నాయి. అమితమైన విషాదం ఆయనను ఆవరించింది. తల వంచుకొన్నాడు. కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయాడు. నిట్టూర్పులు నిగిడించాడు, ఎట్టకేలకు మరల ముఖాన్ని పైకెత్తుకొని దుర్యోధనుడితో వేదనపడుతూ ఇట్లా అన్నాడు:

క. ' తలకొని నీకుం బ్రాణం । బులు డాపక యోపినట్లు పోరఁగ నిమ్మైఁ
బలుకఁ దగునె? యక్కట! నా । వలనం గల భక్తి యెల్ల వమ్మునఁ గలయన్.' **(భీష్మ. 3. 175)**

'నీ కొరకు ప్రాణాలర్పించటానికి సిద్ధమై యుద్ధం చేస్తుంటే కృతఘ్నుడివలె ఇట్లా పలకటం న్యాయమా? అయ్యో! నాప్రభుభక్తి భావం బూడిదలో పోసిన పన్నీరయింది' అని వాపోయాడు. విలువ తెలియకుండ నిందించే దుర్యోధనుడిపట్ల కోపం వచ్చింది. అర్జునుడితో యుద్ధమంటే ఆషామాషీ కాదు. అతడు సామాన్యుడా! అలనాడు ఇంద్రాదులను జయించి ఖాండవవనాన్ని దహించలేదా? గంధర్వులచేతిలో ఓడిన కర్ణుడినీ, నిన్నూ, నీ తమ్ములనూ చెరనుండి విడిపించుకొనలేదా? నన్నూ, ద్రోణుడినీ, అశ్వత్థామనూ, కృపుడినీ, కర్ణుడినీ గెలిచి విరాటుడి గోవులను మరల్చుకొనలేదా? ఇంకెన్నో విజయాలను సాధించిన మహావీరుడు అర్జునుడు. అటువంటి జగజెట్టితో ఇన్నాళ్ళు, ఈ విధంగా యుద్ధం చేసికూడా నీ చేత ఈనాడు ఇటువంటి వేడిమాటలు వినవలసి వచ్చింది. అజేయులైన పాండవులతో తగనిపని అని తలంచకుండా పగ సాధించబూనావు. ఇకమీద నీవే సాహసించి యుద్ధంలో పౌరుషాన్ని ప్రదర్శించుము. నీకే తెలిసివస్తుంది. ఇక ఇటువంటి పనికిమాలిన మాటలనటం చాలించుము. మరల చెప్పుతున్నాను వినుము.

క. ' గాండీవి గెలువరాదు; శిఖండిని జంపంగ నాకుఁ గాదు; వినుము! న
నొ్రండు మగలు మార్కొనినం । జెండుదు నుగ్రముగ; మున్న చెప్పితి నీకున్.'

క. ' ఏనును నాదళమున ద్రుప । దానీక విరాట సైన్య యాదవబల సం
తానములతోడఁ బెనఁగెదఁ; । బూనుఁడు మీరెల్లఁ బాండుపుత్రుల గెలువన్.' **(భీష్మ.3.180,181)**

అని నిష్ఠురంగా నిలదీసి చెప్పాడు. 'అర్ధరాత్రి వచ్చి ఇట్లా నా మనసు బాధ పడేటట్లు పలికితే నీకు జయం కలుగుతుందా?' అని శపించినట్లు పలికాడు.

అర్జునుడు క్రూరాస్త్రాలు వేసి కూలగొట్టటానికి పూర్వమే దుర్యోధనుడు వాఙ్మయవిషబాణాలను సంధించి భీష్ముడి చిత్తాన్ని మూర్ఛితం చేశాడు. ఇక భీష్ముడు యుద్ధరంగంలో ఎవరికొరకు, ఎవరి విజయం కొరకు పోరాడాలి? దుర్యోధనుడు అవివేకంతో, రాజ్యకాంక్షతో ఎదుట నున్న మహావీరకల్పవృక్షాన్ని పరుష వచనాల గొడ్డళ్ళతో నరుకుకొన్నాడు. తొమ్మిదవనాడు భీష్ముడు తన వ్యక్తిత్వాన్ని గుర్తించలేని వ్యక్తుల మధ్య పరాయివాడై పోయాడు. ఆ అంతర్విషాదం ఆయన యుద్ధంలో కోపాగ్నిగా ప్రజ్వలించింది. కృతఘ్నులు సైతం కృతజ్ఞతలు చెప్పుకొనదగినంత ఘోరమైన యుద్ధం చేశాడు. ప్రళయకాల రుద్రుడిగా విజృంభించి పార్థుడి ప్రాణాలను హరించేటట్లు పోరు సాగించాడు.

నారాయణుడే ఆ నరుడిని ఆదుకొనవలసిన అవసరం ఏర్పడింది. దారుణకోపంతో దామోదరుడు రథంమీదినుండి ధరణిపైకి దూకాడు.

మ. ' ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణి కం
ధరముల్ మ్రొగ్గఁ బడన్ దిశావలయ ముత్కంపంబుగా నీ బలం
బురులన్ బాఱఁగ భీష్ముపైఁ గవిసె రౌద్రోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహు ఘోరాకృతిన్.

తే. లలిత పీతాంబరంబు విలాస మొప్ప । సింహనాదోద్భటం బగు చెలువుతోడ
మెఱుఁగు వెలుఁగును గర్జయు మెఱయవచ్చు । కారుమొగిలనఁగృష్ణునాకార మొప్పె.'

**(భీష్మ.3.263, 264)**

భీష్ము డిక చచ్చాడని కౌరవసైనికులందరూ జీవాలు పోయినట్లు వెలవెలలాడే ముఖాలతో చూస్తూ నిలిచిపోయారు.

చ. 'కనుఁగొని భీష్ముఁ డుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ 'జనుదెమ్ము వేగమ మహాత్మ! వికస్వర పుండరీక లో
చన! యిది లెస్స; నా కిచట శాశ్వతమైన యశంబు, నచ్చట
న్వినుతికి నెక్కు సద్గతియు నీదయఁ జేకుఱఁ జేయు మిష్టమున్'. **(భీష్మ. 3. 267)**

అని వేడుకొన్నాడు. అంతలో అర్జునుడు పరుగు పరుగున వచ్చి పురుషోత్తముడిని ప్రాధేయపడి వెనుకకు తీసికొని పోయాడు. భీష్ముడు బ్రతికిపోయాడు.

భీష్ముడికి దర్శన మిచ్చింది చక్రధారియే కావచ్చును. కాని, అది భీష్మావతారోపసంహరణానికి పరమాత్ముడిచ్చిన హెచ్చరిక! చక్రి చంపక వదలిన భీష్ముడు పాండవసేనను చంపి పోగులు పెట్టాడు. ఊబిలో దిగబడిన గోవువలె ఉన్న తన సేనను చూచి ధర్మజుడు చింతాక్రాంతుడయ్యాడు. ఆరిపోయేముందు దీపం భగ్గుమన్నట్లు భీష్ముడు తొమ్మిదవనాడు ప్రతాపం ప్రదర్శించాడు.

భీష్ముడు పాండవసైన్యాన్ని పరిమార్చినా, పాండవులపట్ల లోలోన ప్రసన్నుడై ఉన్నాడు. ఇక మరికొన్ని రోజులు యుద్ధం సాగితే పాండవులు బ్రతికి బైటపడటం కష్టమని ధర్మరాజు భావించాడు. ఇంకెన్నినాళ్ళు గుర్తింపులేని ఘోరయుద్ధం చేయాలని భీష్ముడు లోలోన తపించిపోయాడు. ఈ రెండు సమాంతరరేఖలు కలిసే తరుణం తొమ్మిదవనాటి రాత్రి తారసిల్లింది.

ధర్మజుడు శ్రీకృష్ణాదులను వెంటబెట్టుకొని సామాన్య వేషాలతో భీష్ముడి మందిరానికి వచ్చారు. అప్పుడు భీష్ముడు అంతరాంతరాలలో ఆర్ద్రుడై ముఖంలో వెలుగులు చిమ్మగా ఇట్లా ప్రసన్నంగా పలికాడు.

క. 'ఇచ్చటికి మీరలందఱు । వచ్చిన పని యేమి? యేది వలసిన నడుగుం
డిచ్చెద; దుష్కరమైనను । జెచ్చెరఁ దలకొని ఘటింపఁ జేసెదఁ బ్రీతిన్'. **(భీష్మ. 3. 295)**

అని మనసారా సుముఖత్వాన్ని ప్రకటించాడు. స్వీయవధోపాయాన్ని అడిగినా చిరునవ్వుతో ఇచ్చే స్నిగ్ధత ఆయన మాటలలో తొంగిచూచింది. దుర్యోధనుడి కొరకు యుద్ధం చేసి పాండవుల కొరకు ప్రాణాల నివ్వటానికి సిద్ధమైనట్లు కనపడ్డాడు. ధర్మరాజు ఆ సన్నివేశాన్ని పూర్తిగా వినియోగించుకొన్నాడు. వారిద్దరి నడుమ సంభాషణ ఈ విధంగా సాగింది.

ధర్మ: (దీనంగా) మాకు ఏ విధంగా సామ్రాజ్యం సమకూరుతుందో, ఏ విధంగా సేనలు చావటంవలన కలిగే వ్యథలేకుండా ఉంటుందో, ఆ మార్గాన్ని దయతో వెంటనే చెప్పాలి.

భీష్మ: అనఘా! నేను యుద్ధం చేస్తుంటే మీ సైన్యం నశించక తప్పదు. సామ్రాజ్యం కూడా మీకు దక్కదు. కాబట్టి నన్ను జయిస్తే మీకు శుభాలన్నీ కలుగుతాయి.

ధర్మ : మహాత్మా! మూడవకన్ను మూసికొని, త్రిశూలాన్ని దాచుకొని అవతరించిన రుద్రుడివలె నీవు రణరంగంలోకి దిగుతావు. ఎటువంటి వీరులకైనా నిన్ను ఎదిరించటం సాధ్యమా? కాబట్టి నీ దయను ఆశ్రయించటానికి వచ్చాను. ని న్నేవిధంగా గెలవటానికి వీలుంటుందో మాకు తేటతెల్లమయ్యేట్లు తెలుపుము.

భీష్మ : నీ వన్నది నిజం. నా చేతిలో ధనువుండగా దేవతలు కూడా నన్ను గెలువలేరు. అటువంటి వాడినిగా మీరు నన్ను గుర్తించి, ఇంతమంది ఇక్కడికి వచ్చి, ఈ విధంగా అడుగుతుంటే మీకు ప్రియమైన కార్యం చేయటం కంటె నాకు వేరే పుణ్యమేముంటుంది? నేను ఆయుధాలను ప్రయోగించటం మానినప్పుడే నన్ను జయించవీలవుతుంది. జోడు పుచ్చినవాడిని,

ఆయుధం క్రింద పెట్టినవాడిని, జెండా దించినవాడిని, స్త్రీని, మొదట స్త్రీగా ఉండినవాడిని, ఆడువారి పేరు పెట్టుకొన్నవాడిని, తలగుడ్డను తీసివేసినవాడిని, సోదరులు లేనివాడిని, పుత్రులు లేనివాడిని చూస్తే వారితో నేను యుద్ధం చేయను. నాకు మరొక నియమం కూడా ఉన్నది. పుట్టినప్పుడు లేకుండా నడుమ దైవమిచ్చిన పురుషత్వం కలవాడితో యుద్ధం చేయను. కాబట్టి మీకు ఒక ఉపాయం చెప్పుతాను. ద్రుపద సంతానమైన శిఖండి అటువంటివాడని మీకు తెలుసు. వాడు పూర్వజన్మలో స్త్రీ కావటం చేత వాడికి ఎదురుగా ఉండి బాణాలను ప్రయోగించను. అందువలన అర్జునుడు అతడిని ముందు పెట్టుకొని వస్తే, నేను బాణప్రయోగం మానితే, నన్ను నొప్పించి పడవేయండి. ఆ తరువాత బంధుమిత్రులతో కూడిన కౌరవులను జయించటం సులభమౌతుంది. ఇది నా ఆజ్ఞ. నేను చెప్పినట్లు చేయండి.

ఆసురీ శక్తులు అడిగితే భీష్ముడు కోపావేశాన్ని ప్రదర్శించాడు. దైవీశక్తులు అర్థిస్తే కృపావేశాన్ని ప్రకటించాడు. స్వీయవధోపాయాన్ని స్నేహదీప్తితో చెప్పిన భీష్ముడు పాండవులపట్ల ప్రసరించే సౌముఖ్యానికి ఫలావస్థను కల్పించాడు.

పదవనాటి యుద్ధంలో పాండవులు ఫలానుభవాన్ని పరిపూర్ణంగా పొందుతారు. అట్లా పొందటానికి పాండవులలో భీష్ముడిలో కలిగే పరిణామాలే ప్రధానకారణాలు. వాటిని సంగ్రహంగా ఇట్లా పేర్కొనవచ్చును.

1. ఫలప్రాప్తికి అనుకూలంగా దైవికమైన చైతన్యం పనిచేస్తుందనీ, దానిని ఆయా ఘట్టాలలో చూచి ఆశ్చర్యపోవలసిందే అనీ దైవస్వరూపుడైన శ్రీకృష్ణుడు చెప్పాడు. కథాంతం దైవమూలం, అద్భుతం అని భావం.

2. దానికి అనుకూలంగా మొదట అర్జునుడిలో మార్పు కనపడింది. తాతను చంపలేనని విషాదయోగాన్ని ప్రదర్శించిన అతడు శిఖండిని ముందు బెట్టుకొని, అతడి వింటికి వెనుక తన గాండీవాన్ని ఉంచి, శిఖండి వేస్తున్నట్లే బాణాలు సంధించి భీష్ముడిని సంహరించటానికి శ్రీకృష్ణ ప్రబోధంతో సిద్ధమైనాడు.

3. శిఖండి ప్రతాపోక్తులతో భీష్ముడిని ఎదిరించాడు. ఆయన అతడిపై బాణాలు ప్రయోగించకుండా ప్రక్కకు పోయాడు. శిఖండి వీరప్రవృత్తిని చూచి అర్జునుడు ఆశ్చర్యపోయి, భీష్ముడు అస్తమించే దైవికమైన సూచనగా భావించి శిఖండిని భీష్మవధకు ప్రోత్సహించాడు.

4. ఆ సమయంలో అర్జునుడు కౌరవసేనను నుగ్గు చేశాడు. దుర్యోధనుడు రోషంతో 'పితామహా! నీవుండగా మనసైన్యం ఇంత దీనంగా మారటం తగునా?' అని నిష్ఠురమాడాడు. భీష్ముడి మనస్సుమీద దుర్యోధనుడు కొట్టిన చివరిదెబ్బ అది. దానికి పితామహుడు తీవ్రంగా స్పందించాడు. 'దుర్యోధనా! పదివేలమందిని చంపుతానని మాటఇచ్చాను. నా మాట నిలబెట్టుకొన్నాను. నీ ఋణం తీర్చుకొన్నాను. నా శరీరంలో ఇంక బలం తగ్గుతున్నట్లు తోస్తున్నది. ఈనాడు పాండవులు నన్నైనా చంపాలి, లేదా నేనైనా వారిని చంపాలి. అమర్త్యులు మర్త్యులచేత చస్తారా?' అని అంటూ ఆ రోజు తన మరణాన్ని సూచించాడు.

5. భీష్ముడికి యుద్ధంలో సాయం చేయాలని భావించిన ద్రోణుడికి శరీరం కంపించింది. బాణ ప్రయోగం చేయలేక అశ్వత్థామను సాయం చేయుమన్నాడు. కాని, అతడి సాయం కూడా భీష్ముడికి అందలేదు.

6. ధర్మరాజు ముఖంలో క్రోధం తాండవించింది. మధ్యాహ్నందాకా ప్రచండంగా యుద్ధం చేసిన భీష్ముడికి, అంతటితో తన శరీరాన్ని చాలించాలనే సంకల్పం కలిగింది. ఆ సంకల్పం లేకపోతే అతడికి సంకల్ప మరణానికి మార్గం తెరుచుకొనదు. ఆయనే అమర పదవిని పొందటానికి ముందుకు వచ్చాడు. పాండవప్రయత్నం ఫలోన్ముఖం కాజొచ్చింది.

7. ఆ తరువాతి పరిణామం అద్భుతం. భీష్ముడు నిజంగా యుద్ధం చేయటం మానాడు. దుర్యోధనుడు దుఃఖించకుండా నాటకమాడాడు. మధ్యాహ్నమయింది. యమతనయుడైన ధర్మరాజును సమీపించాడు. తన చివరి యాత్రకు దారి చూపుమని ఆత్మీయంగా అడిగాడు.

క. ‘ జనియించినంత నుండియు । జనపతులం గ్రూరవృత్తిఁ జంపుచు నుండం
జనియెం గాలము; విసివితి । ననఘా! యే నింకఁ జాల నాసుర విధికిన్?

ఆ. ‘ మీరు నా హితంబు గోరుదురేని శి । ఖండి మున్నుగాఁగఁ గడఁగి యంత
వట్టువారు నొక్కపెట్ట కాఁ బైఁ బడి । యేయుఁ; డింక దడవు సేయవలదు’. **(భీష్మ. 3. 366, 367)**

ధర్మరాజు కిచ్చిన వరాన్ని అతడే నిర్వహించుకొనాలని పేర్కొన్నాడు. తనను పడగొట్టటానికి ఉపాయంతోపాటు అనుమతిని కూడ నిచ్చాడు భీష్ముడు. కార్యం నిర్వహణ సంధిలో ప్రవేశించింది. ఇంక కథ అద్భుతంగా ముగియటమే తరువాయి. భీష్ముడి జీవిత నాటకంలో చివరిరంగం చెల్లబోతున్నది. అది దుర్యోధనుడి దురదృష్టం. ధర్మరాజు అదృష్టం.

8. చివరికి పోరు దేవదానవ యుద్ధం వలె సాగింది. అర్జునుడు భీష్ముడి విల్లు విరుగగొట్టాడు, అప్పుడు పితామహు డిట్లా మనసులో తలపోశాడు. ‘పాండవుల నందరినీ నా ఒక్కవింటితో గెలువలేనా? శ్రీకృష్ణుడు వీరికి అండగా ఉన్నాడు కాబట్టి బ్రతికిపోయారు. అది అట్లా ఉండగా పాండవులు కీడుపడి శ్రీకృష్ణుడిని వెంటబెట్టుకొని నా వద్దకు రాగా నా వధవిధానం చెప్పాను. ఇక యుద్ధం మాని శాంతంగా ఉంటాను. ఈ ఆర్భాటం ఎందుకు? అని అస్త్ర సన్న్యాసానికి సిద్ధమయ్యాడు.

9. భీష్ముడు రాజస సాత్త్విక ప్రవృత్తికలవాడు. పాండవులను అనుగ్రహించి, ధర్మవిజయాన్ని లక్షించి తన తనువును ఉపసంహరించుకొంటున్నా, అది బలహీనత కాదని లోకానికి చాటటానికి ఆయన చివరిగడియలలో బాగా తాపత్రయపడ్డాడు. అర్జునుడినీ దుర్యోధనుడినీ చూస్తూ దుర్యోధనుడితో చెప్పిన ఈ పద్యం ఆయన యుద్ధవీరాహంకారానికి అద్దం పట్టింది.

మ. ‘ అని దేవాసుర కోటికైనను నశక్యం బిమ్మహావీరు మా
ర్కొన వీఁ డల్గిన మర్త్యులే యెదు రుదారుండైన యీ క్రీడి ద
క్కిన నిప్పాండవ సైన్య మింతయును బ్రుగ్గింపంగ నేఁ జాలుదున్;
విను సత్యం బిది వీనివింటి కెదురన్ విల్లెత్తలేఁ డెవ్వఁడున్ ’ **(భీష్మ. 3. 403)**

10. శరతల్పగతుడైన భీష్ముడు కౌరవపాండవుల శాంతిని కోరుకొన్నాడు. పితామహుడిని చేజేతులా చంపుకొన్న కౌరవపాండవులు భవిష్యత్తులో జరుగబోయే వీరవధను స్మరించి, వైరప్రవృత్తి మాని, శాంతిపథంలో పయనిస్తారేమో అని ఆశించాడు. కలిసి ఉండటానికి కలిసి రానివాడు దుర్యోధనుడు. అందువలన ఆతడికి ఇచ్చిన సందేశ మిది -

మ. ‘ నరుఁ డత్యద్భుత విక్రముం డతని కానారాయణుం డాప్తుఁ; డె
వ్వరికిన్ వీరి జయింపరాదు; సమరావష్టంభముం దక్కి ధ
ర్మరతుండైన యజాతశత్రునకు నింద్రప్రస్థ మి; మ్మర్ధరా
జ్యరమం బొందుము మీరు గొందఱయినం జాకున్న నీకొప్పదే?’ **(భీష్మ. 3. 436)**

భీష్ముడు జీవితమంతా ఇదే సందేశాన్ని ఇంటాబయటా కౌరవులకు ఇస్తూనే ఉన్నాడు. వంశహితాన్ని కోరి లోక హితాన్ని భావించి ఆ మహాత్ముడు ఆశించిన వన్నీ కౌరవులు బూడిదలో పోసిన పన్నీరుగా మార్చారు. హస్తినాపురంలో ఒకప్పుడు రాచరికానికి రక్షగా నిలిచిన మహావీరుడు భీష్ముడు ఇప్పుడు మంచి చెప్పినా వినే నాథుడు లేని విపరీత దశలో అస్తమించవలసి వచ్చింది. చివరకు కౌరవపాండవు లిరువురూ ఆయన కోరికను నిర్లిప్తంగా విన్నారు. మౌనంగా వెళ్ళిపోయారు.

భీష్ముడి సంకల్ప మరణం ఆయన ప్రభావం కౌరవ పాండవులపై అంతరించిన స్థితికి సంకేతం. అదే ఆ మహావీరుడి గంభీర విషాదాంతం.

**8. కావ్యకళాశిల్పం:**

మహాభారతంలో యుద్ధషట్కమని ప్రసిద్ధి గాంచిన ఆరు యుద్ధపర్వాలలో (భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వాలు) భీష్మపర్వం మొదటిది. యుద్ధఘట్టాన్ని రచించే ఉభయ కావ్యకళా శిల్పానికి కూడ ఈ పర్వం ఒజ్జబంతి. తిక్కన మహామంత్రిగా, మహాదండనాయకుడుగా, వేదాంతిగా, మహాకవిగా తన ప్రతిభను యుద్ధపర్వాల రచనలో ప్రసిద్ధంగా ప్రదర్శించాడు. ధర్మజ శ్రీకృష్ణుల యుద్ధనీతి చిత్రణంలో మహామంత్రి ప్రజ్ఞ గోచరిస్తుంది. యుద్ధవ్యూహ చిత్రణంలో, యుద్ధరంగ ప్రదర్శనంలో తిక్కనగారి మహాదండనాయక ప్రతిభ ప్రకటితమౌతుంది. భగవద్గీతాది ఘట్టాలలో వేదాంత పరిపాకం వెల్లడి ఔతుంది. ఉభయకవి మిత్రుడుగా కావ్యాన్ని తీర్చిదిద్దటంలో మహాకవి వ్యక్తిత్వం తేటపడుతుంది. ఆరుపర్వాల యుద్ధకథను ఆసక్తి తగ్గకుండా రచించిన తిక్కన నేర్పు అనన్యసామాన్యం.

**9. సంజయకథనం:**

వేదవ్యాసుడి కరుణతో సంజయుడికి దివ్యదృష్టి, దివ్యశ్రవణం, దివ్యగమనం, శస్త్రాస్త్రాలకు గురికాకుండా ఉండటం అనే వరాలు సిద్ధించాయి. కురుక్షేత్ర యుద్ధాన్ని స్వయంగా చూచి వచ్చి, ధృతరాష్ట్రుడికి వినిపించే మహాకథన పద్ధతిని సంజయుడి పాత్రద్వారా కథకు కల్పించటం జరిగింది. దానితో సాక్షాత్తుగా చూచి వచ్చినట్లు చెప్పేగుణం, గ్రుడ్డివాడుసైతం సాక్షాత్తు చూస్తున్నట్లుగా అనుభవించే గుణం కావ్యకథనానికి ఏర్పడింది. యుద్ధకథకు ఈ పద్ధతి జవసత్త్వాలను కలిగించింది.

**10. కావ్యేతిహాస లక్షణం:**

ఇతిహాసంలో శ్రోత అడిగిన ప్రశ్నల నాధారంగా చేసికొని కథకుడు కథను విస్తరిస్తాడు. ఇతిహాసం పురాణం నుండి పుట్టింది కాబట్టి జగద్విజ్ఞానానికి సంబంధించిన అంశాలను సమయోచితంగా సంతరించుకొంటుంది. అయితే, అది కావ్యకళాసుందరంగా ఉండేటట్లు అమర్చటం కవిప్రౌఢిమ. యుద్ధషట్కం రాజ్యం కొరకు రాజులు యుద్ధం చేసిన కథను చెప్పేది. భూమిమీద రాజులకుండే ప్రీతి యుద్ధాలకు మూలం. ఆ సత్యాన్ని యుద్ధషట్కానికి నాందీపద్యంగా నిలపటం రచనాశిల్పం:

ఉ. 'భూమికిఁ గాఁగఁ బ్రాణముల పోక దలంపక రౌద్ర ఘోరసం
గ్రామము సేయుచుండుదురు రాజులు దొల్లియు నెంత దీపోకో
భూమి మునీంద్ర సంగతి సుబుద్ధము నీకు జగంబు నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము ప్రబోధ నిగూఢముగా సమస్తమున్'. **(భీష్మ. 1. 15)**

**11. స్మృతి కావ్యరేఖ:**

సంజయుడు సమరభూమికి పోయి సర్వసేనాపతి పడిపోయినప్పుడే తిరిగి హస్తినాపురానికి వచ్చి ధృతరాష్ట్రుడికి ఆ కథనంతా చెప్పుతాడు. అంటే ఒక పర్వకథ చెప్పటానికే సంజయుడు పూనుకొంటా డన్నమాట! ఆ కథలో మొదటివార్త సర్వసేనాపతి విషాదవార్తగా ఉండటం సహజం. ఆ మహితాత్ముడి మరణానికో, పతనానికో ధృతరాష్ట్రుడు దుఃఖించటంతో పర్వం మొదలు కావటం పర్వారంభ శిల్పమౌతున్నది.

భీష్ముడు అంపశయ్యపై ఒరిగిన తరువాత సంజయుడు వచ్చి ఆ సంగతి ధృతరాష్ట్రుడికి చెప్పాడు. అప్పు డా గ్రుడ్డిరాజు భీష్ముడిని గురించి పరితపించిన విధం ఒక స్మృతికావ్య కళారేఖవలె భాసిస్తుంది. 10 పద్యాలలో సాగిన ఆ సన్నివేశం భీష్ముడికి కన్నీటి వీడుకోలే కాక, వీర నీరాజనం కూడా! ఉదాహరణకు.

క. ' ఆ శౌర్యం బా సత్త్వం । బా శీలం బా పరాక్రమాఖీలత్వం
బా శుద్ధవ్రత మెందు న । నాశము లని భీష్ముఁ బెద్ద నమ్మితిమి గదే!' **(భీ. 1. 56)**

ఈ పద్యం ధృతరాష్ట్రుడు బావురుమని దుఃఖించినట్లూ, భీష్మ పరాక్రమాన్ని కీర్తించినట్లూ ఉండి స్మృతికావ్య రచనా మర్యాదను గౌరవిస్తున్నది.

ఉ. ' నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా
కట్టిఁడి వీను లేమి విను కాఱియ కోర్వవు? దుర్వినీతికిం
బుట్టిన యిల్లనై వినకపోవఁగ వచ్చునె యింక నాకు? నే
దిట్టగ నైతి; నెల్లవియుఁ దెల్లముగా విననేర్తు సంజయా!' **(భీష్మ. 1. 65)**

ఆత్మనిందాత్మకంగా సాగిన ఈ మాటలలో ధృతరాష్ట్రుడి శోకతీవ్రత గోచరించి సహజ కరుణారస స్ఫూర్తి ప్రకాశించింది.

**12. భీష్ముడి నోట గండం:**

తొలినాటి యుద్ధం మొదలయ్యే ముందు భీష్ముడు రాజవీరుల నందరినీ ఉద్దేశించి ఇట్లా ఉత్తేజపరిచాడు.

క. ' ఆరయ వివృత స్వర్గ । ద్వారము రాజులకు నాహవం; బందు మహో
దారులు దొల్లియు నరిగిరి । మీ రీ మార్గమున నడవ మెయికొను టొప్పున్.'

క. ' ఇంటం దెవులునఁ జచ్చుట । కంటెను బాపంబు లొండు గలవె నృపులకున్?
బంటకలను పొలికల నిది । గంట నిధానంబు గంట గాదే మనకున్.' **(భీష్మ. 1. 98, 99)**

యుద్ధవీరులను ఉత్తేజపరిచే మాటలు ఎన్నోరకాలుగా ఉండవచ్చును. ఉత్తేజపరిచే వీరుడి స్వభావాన్ని బట్టి కూడా అవి మారుతుండవచ్చును. కావ్యాలలో భావికథార్థవ్యంజకంగా పతాకలుగానో, గండాలుగానో అవి నిబద్ధించబడుతూ ఉండటం శిల్పమర్యాద. భీష్ముడి పలుకులలో గండస్ఫూర్తి సార్థకంగా స్ఫురించింది. యుద్ధంలో విజయాన్ని సాధించటానికి పూనుకొనండని చెప్పటం శుభారంభం. యుద్ధం విస్తృత స్వర్గద్వారం అని ప్రారంభించటం యుద్ధంలో వీరస్వర్గం పొందటమే రాజులకు ధ్యేయమంటూ ప్రబోధించటం ఎందుకో ఒక అపశ్రుతివలె వినిపిస్తుంది. దీనినిబట్టి కౌరవసేనలోని వీరులందరూ యుద్ధంలో స్వర్గప్రాప్తి పొందనున్నారనీ, విజయం పాండవులకు తథ్యమనీ ధ్వనించబడుతున్నది.

పాండవపక్షంలో ధర్మరాజు వీరులనందరినీ ఉద్దేశించి అన్న మాటలు భీష్మ వచనాలకంటె విశిష్టంగా ఉన్నాయి. 'మనమీ రణంబునందు ధరణీరాజ్యంబు వడసెద మొండెఁ బూజ్యంబగు నాకలోక నివాసంబు గనియెద మొండె' (భీష్మ. 1. 122) అన్నమాటలు ఔచిత్య శోభితాలు; సామ్రాజ్యలాభ సూచకాలు; భావికథార్థ వ్యంజకాలు; పతాకాస్థానాలు. నాయకుల తొలిపిలుపులలోనే భావికథ ధ్వనిత మయ్యేటట్లు రచించటం ఆఖ్యానశిల్పం.

**13. సంగ్రామాలు : సంభాషణలూ :**

పదిరోజుల యుద్ధాన్ని వర్ణించే భీష్మపర్వ కథనం ఎక్కడా విసుగు కలిగించకపోగా ఉత్కంఠావహంగా సాగుతుంది. దానికి రచనా నిర్మాణ పరమైన ఎన్నో కారణాలు ఉన్నాయి. వాటిలో మొదట పేర్కొనదగింది వర్ణనల సంభాషణల మేలికలయికతో కూడికొన్న మిశ్రకథనం, మొత్తంమీద యుద్ధకథనం ఎంత ఉందో పాత్రల సంభాషణలతో కూడిన కథ అంత ఉండటం ఈ పర్వవిశేషం. సంగ్రామ ఘట్టాలు మిక్కిలివేగంతో కూడిన క్రియాశీలాలై ఉంటాయి. సంభాషణ ఘట్టాలు సమస్యల సమీక్షాత్మకంగా సాగి పాత్రల స్వభావాలకు అద్దం పట్టుతాయి. ఈ వైవిధ్యం పర్వరచనా వైభవం.

### 14. మాట్లాడే పాత్రలు: పోట్లాడే పాత్రలు :

భీష్మపర్వంలో మాట్లాడే పాత్రలు కొందరే. పాండవులలో ధర్మజ కృష్ణార్జునులు, శిఖండి, కౌరవులలో భీష్మ ద్రోణ దుర్యోధన దుశ్శాసన కర్ణాదులు. వీరు తప్ప మిగిలిన రణవీరులందరూ పోరులో వీరకార్యాలు చేస్తారే కాని మాటలాడవలసిన అవసరం ఉండదు.

యుద్ధభూమికి సంబంధించనివారు ధృతరాష్ట్ర సంజయులు. వీరు సమీక్షకులుగా గోచరిస్తారు. ఈ మూడు రకాల పాత్రల వలన కథకు ముప్పేట బిగువు ఏర్పడింది. యుద్ధపర్వాలలో ఈ శిల్పం రసరమ్యం.

### 15. పాత్రల ప్రవృత్తులను బట్టి మాటలతీరు :

పాత్రల మనసులు, మాటలు, చేష్టలు వర్ణనాంశాలలో కీలకపాత్ర నిర్వహిస్తాయి. వాటివలన వారి తీరులు మారుతుంటాయి. తిక్కన ఆ పాత్రల ప్రత్యేకత అచ్చుపడేటట్లు సంభాషణలను తీర్చిదిద్దటం ఈ పర్వంలోని రచనాశిల్పం.

భీష్మపర్వంలోని పాత్రలను దాదాపు తొమ్మిది రకాలుగా వింగడించటానికి వీలుంది. లోకం త్రిగుణాత్మకం. 'త్రైగుణ్యోద్భవ మత్ర లోకచరితం నానారసం దృశ్యతే' అని కాళిదాససూక్తి. లోకంలో శుద్ధగుణ సమన్వితులు ఉండటం అరుదు. మిశ్రగుణాన్వితులు ఉండటం బహుళం, మిశ్రగుణపాత్రలు తొమ్మిది రకాలు. అవి: 1. సాత్త్విక సాత్త్వికాలు, 2. సాత్త్విక రాజసికాలు, 3. సాత్త్విక తామసికాలు, 4. రాజససాత్త్వికాలు, 5. రాజస రాజసికాలు, 6. రాజస తామసికాలు, 7. తామస సాత్త్వికాలు, 8. తామస రాజసికాలు, 9. తామస తామసికాలు. ఈ రకమైన పాత్రలు మహాభారతంలో దండిగా కనపడతాయి. భీష్మపర్వంలో మాట్లాడే పాత్రలలో వ్యాసమహర్షి సాత్త్విక సాత్త్వికుడు. ధర్మజ కృష్ణార్జునులు సాత్త్విక రాజసికులు. భీమ ధృష్టద్యుమ్నులు సాత్త్విక తామసికులు. భీష్ముడు రాజస సాత్త్వికుడు. కర్ణుడు రాజస రాజసికుడు. దుర్యోధనుడు రాజసతామసికుడు. ధృతరాష్ట్రుడు తామససాత్త్వికుడు. శిఖండి తామస రాజసికుడు. దుశ్శాసనుడు తామస తామసికుడు. వారి మాటల తీరు కూడా అట్లాగే ఉంటాయి.

1. వ్యాసమహర్షి శుద్ధతపశ్శీలి. సుఖదుఃఖాది ద్వంద్వాలకు అతీతుడు. లోకకళ్యాణాకాంక్షి. కౌరవుల పాండవుల కథలో తానొక పాత్ర అయి కూడా కామక్రోధాలకు లోనుగాక వలసినప్పుడెల్లా పిలిచినా పిలవకపోయినా వచ్చి వలసినవారికి హితాన్నిగాని, ధైర్యాన్నిగాని, శుభాశుభఫలాలను గాని, భవిష్యత్పరిణామాలను గాని చెప్పటం తన ధర్మంగా భావించాడు. ఎదుటివారు వినినా వినకపోయినా చెప్పదగింది చెప్పటం ఆ మహర్షిశీలం. నిర్మలస్ఫటికం వంటిది ఆయన మనసు, మాట. యుద్ధం మొదలు గాకముందే ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి

క. ' కాలం బగుటయు నృపులకు । నాలము సమకూరె దీని కడలకు; మది; నీ
వాలోకింపఁగ వలసిన । నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్రా! ' **(భీష్మ. 1.6)**

అని అవ్యాజంగా పలికాడు. మొదటివాక్యం యోగులు తెలిసికొనదగింది. రెండవవాక్యం సంసారలంపటులు కోరుకొనేది. ఈ రెండింటిని ధృతరాష్ట్రుడి ముందుంచాడు. అతడు సాత్త్విక గుణప్రధానమైన మొదటి వాక్యాన్ని పట్టించుకొనలేదు. రెండవ వాక్యంలోని దివ్యదృష్టి అలవడితే అన్నదమ్ములు క్రూరంగా పోరాడి పరస్పరం చంపుకొనే ఘోర దృశ్యాలను చూచే ధైర్యం లేకపోయింది. అయితే సర్వం వినాలని కోరుకొన్నాడు. ప్రత్యక్షంగా చూడగలగటం రాజసం. దానికి చాలక వినగలగటం సాత్త్వికం. రాజులకు కాలం దాపురించింది. కాబట్టి యుద్ధం వచ్చింది అన్న సత్యం తెలిసికొంటే సాత్త్వికుడయ్యేవాడు. అప్పుడు ధృతరాష్ట్రుడికి శోకాదులు కలిగేవికావు. ఆ స్థితిని పొందలేక తామసికుడయ్యాడు. వినాలని కోరుకొని సాత్త్వికతను ప్రకటించి తామస సాత్త్వికు డనిపించుకొన్నాడు.

'ఇది ప్రాప్తకాలంబై వచ్చిన భూప్రళయంబు; దీనికి వగవం బనిలేదు; ధర్మో జయ తనుచు నిశ్చింతంబుగ నుండు; మేనును గురుపాండవుల కీర్తిఁ బ్రకటింపం గలవాఁడ' - (భీష్మ. 1. 8) నని వ్యాసమహర్షి తాను భారతేతివృత్తాన్ని మహేతిహాసంగా నిర్మించ సంకల్పించిన ద్రష్ట, స్రష్ట అయిన సాత్త్విక సాత్త్వికుడయ్యాడు.

2. సాత్త్విక రాజసులైన శ్రీకృష్ణ ధర్మరాజార్జునులు ముగ్గురూ మూడు రకాల ప్రవృత్తులకు ముచ్చటైన ఉదాహరణలు. పార్థసారథిగా రణరంగంలో ప్రవేశించి, విషాదమగ్నుడైన విజయుడిని వివేకవంతుడిని చేసి, ధర్మయుద్ధాన్ని అతడిచేత చేయించి, అడుగడుగున పాండవులకు మంత్రి అయి, గురువయి, దైవమయి దివ్యజీవితాన్ని సాగించిన కృష్ణుడు సాత్త్వికుడుగా కనపడతాడు. భక్తరక్షణ కళా ప్రవీణుడైన శ్రీకృష్ణుడు అర్జున రక్షణార్థమై పట్టనని చెప్పిన చక్రాన్ని ధరించి భీష్ముడి మీదకు రెండుసార్లు లంఘించాడు. మూడవనాటి యుద్ధంలో మొదటిసారి ప్రళయరుద్రాకారంతో విజృంభించాడు.

శా. ' అంహోమర్దనుఁ డా జనార్దనుఁడు మాద్యద్భీష్మ కుంభీంద్రుపై
సింహోల్లాస విభాసియై కవియు నుత్సేకంబు నాటోపమున్
రంహస్స్ఫూర్తియు దీప్తమూర్తియును సంరంభంబుఁ జూడన్ జగ
త్సంహారోన్ముఖుఁడైన రుద్రుగతి రౌద్ర ప్రక్రియం బొల్చినన్'. **( భీష్మ. 2. 156)**

తొమ్మిదవనాటి యుద్ధంలో కారుమేఘం వలె పైకి లేచాడు.

తే. ' లలిత పీతాంబరంబు విలాస మొప్ప । సింహనాదోద్భటం బగు చెలువుతోడ
మెఱుఁగు వెలుఁగును గర్జయు మెఱయ వచ్చు । కారు మొగిలనఁ గృష్ణు నాకార మొప్పె'.
**(భీష్మ. 3. 264)**

ప్రసన్నుడుగా శ్రీకృష్ణుడు సాత్త్వికుడు. యుద్ధ రౌద్రోద్రేకంలో రాజసికుడు. భక్తులైన పాండవుల పట్ల ప్రసన్నుడు. కౌరవపక్ష వీరులపట్ల కాలయముడు.

శ్రీకృష్ణుడు దివ్యలీలా విలాసుడు. ధర్మరాజు రాజనీతి కళావిశారదుడు. సహజప్రవృత్తి వలన ధర్మజుడు సాత్త్వికుడు. సత్యధర్మాలను సామ్రాజ్యం కంటె ఎక్కువగా భావించేవాడు. కాని ధర్మబద్ధంగా తనకు రావలసిన రాజ్యం కొరకు యుద్ధవ్యూహాన్ని పన్నిన రాజసికుడు. యుద్ధం ప్రారంభం కాక పూర్వం పెద్దల ఆశీస్సులను పొందితే శత్రువులను సులభంగా జయించవచ్చుననే లోకనీతిని పాటించి భీష్మాదుల వధోపాయాలను తెలిసికొనటానికి భీష్మాదుల వద్దకు నడచిపోయాడు. తొమ్మిదవనాటి రాత్రి పితామహుని వద్దకు పోయి వధోపాయాన్ని తెలిసికొన్నాడు. స్వీయ ధర్మ ప్రవర్తనతో పెద్దల గౌరవాదరాలను పొందాడు. శ్రీకృష్ణభక్తుడై అతడి వలన యోగక్షేమాలను పొందగలిగాడు. ధర్మనీతివర్తనంలో ధర్మరాజు సాత్త్వికుడు. శత్రు సంహార యత్నంలో కనపడని కాఠిన్యం కలవాడు. కార్యసాధనకై తాతను బలిపెట్టటానికైనా వెనుకాడడు. అందుకే అతడు సాత్త్విక రాజసికుడు. శ్రీకృష్ణుడిలో రాజసంకంటె సాత్త్వికం పాలెక్కువ. ధర్మజుడిలో సాత్త్వికం కంటె రాజసికం పాలెక్కువ.

అర్జునుడు శ్రీకృష్ణుడిపట్లా, ధర్మరాజు చెంత సాత్త్వికుడు. అతడు ఒంటరిగా ఉంటే రాజసికుడు. బంధుమిత్రులను చంపలేనని విషాదయోగముద్రను తాల్చిన అర్జునుడు లోకదృష్టిలో కారుణ్యమూర్తి అయిన సాత్త్వికుడు. కాని, తనకు నిర్దేశించబడిన ధర్మాన్ని ఆచరించకుండా విషాదాన్ని పొందటం ధర్మదృష్టిలో తామసికం. శ్రీకృష్ణుడి ప్రబోధం వలన తామసికావస్థనుండి రాజసికావస్థకు చేరుకొని, కాలపురుషుడి లీల వలననే శిఖండిని ముందుంచుకొని భీష్మసంహార కర్మను విధ్యుక్త ధర్మంగా నిర్వహించిన సాత్త్వికుడయ్యాడు. కృష్ణధర్మజ పార్థులలో పార్థుడు మూడవ తరగతికి చెందిన వాడనక తప్పదు. అయినా మహాభారతయుద్ధంలో

త్రిమూర్తుల వంటివారు వీరు. యుద్ధ సృష్టి ధర్మరాజనే బ్రహ్మది. యుద్ధ నిర్వహణ శ్రీకృష్ణుడనే విష్ణువుది. శత్రుసంహార రూపమైన రుద్రకర్మ అర్జునుడిది. వీరి ముగ్గురిలో సాత్త్వికానికి పోషణంగా రాజసం తరతమభేదాలతో రాణిస్తుంది.

భీష్ముడిపై శ్రీకృష్ణుడు చక్రంతో లంఘించిన రెండుసార్లు కూడా అర్జునుడు శ్రీకృష్ణుడిని ప్రార్థించి ఉపసంహరింపజేశాడు. ఆ మాటలలో అర్జునుడి సాత్త్విక రాజసతేజం సమృద్ధిగా ప్రకాశించింది.

ఉ. 'కోపము సంహరింపు యదుకుంజర ! పాండవకోటి కెల్లనుం
దేపవు గావె నీ; విటు లధీరతఁ బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుఁడైన ధర్మసుతు శౌర్యము ధైర్యము బాహువీర్యమున్
రూపఱి పోక కాదె! యనురూపమె నీ కిది లోకనాయకా!' **(భీష్మ. 2. 160)**

తిక్కనగారి రచనలో మిక్కిలి ప్రసిద్ధి కెక్కిన పద్యమిది. దీనిలో ఈ త్రిమూర్తుల స్వభావసంపుటి త్రివేణీ సంగమం వలె రాణించింది.

3. భీమ ధృష్టద్యుమ్నులు సాత్త్విక తామసికులు. మునుమును చూపిస్తే నరుక్కొని పోయేవాడు భీముడు. అతడికి సలహా లవసరంలేదు. చాలవరకు సహాయం కూడా అవసరం లేదు. సమయానుకూలంగా సమరంలో వీరవిహారం చేస్తూ శత్రుసంహారంలో అతడు దిట్ట. భీష్మాది మహావీరులను సైతం జంకులేకుండ ఎదుర్కొన్నాడు. సాయశక్తుల వారిని నిగ్రహించాడు. ధర్మరా జన్నట్లు అప్పుడప్పు డర్జునుడైనా భయపడతాడేమో కాని భీముడికి జంకు గొంకులు లేవు.

చ. 'అతని జయించునంచు మన మర్జును నెంతయు నమ్మియుండఁగా
నితఁడును సంగరంబున నుపేక్షకుఁ డయ్యెఁ; వృకోదరుం డొకం
డ తఱికిఁ జొచ్చి దోర్బలము డాఁపక పోరెడు; నేమి సేయు నా
కితనిని నీతనిం దడవ నేటికిఁ? గయ్యపు జోలి మానెదన్!' **(భీష్మ . 2. 7)**

అన్న మాటను పాలించటంలో భీముడు సాత్త్వికుడు. యుద్ధక్రీడలో తామసికుడు.

ధృష్టద్యుమ్నుడు పాండవ సర్వసైన్యాధ్యక్షుడు. అయినా కౌరవపక్షంలోని సైన్యాధ్యక్షుడు భీష్ముడివలె ఏనాటి సైన్య వ్యూహాన్ని ఆనాడు స్వతంత్రించి పన్నలేడు. అతడికి అర్జునుడో, ధర్మరాజో వ్యూహాన్ని సూచిస్తే, దానిని పన్ని నిర్వహిస్తాడు. అందువలన ఆతడు స్వతంత్ర ప్రవృత్తి గలిగినవాడుగా కనపడడు. అంతేకాదు. అతడు ఎన్నిరోజులు, ఎన్ని ఘట్టాలలో యుద్ధం చేసినా తనను దేవుడు పుట్టించింది ద్రోణుడిని సంహరించటానికే అని ముడిపెట్టికొని ఆలోచిస్తాడు. తదితర వీరులతో యుద్ధం చేస్తే సరిపోతుం దనుకొంటాడు.

చ. 'జగమెఱుఁగంగ ద్రోణు నని జంపుటకై సృజియించె ధాత న
న్మగఁటిమి గాఁగ దీని ( బలుమాఱు నమంబనిలేదు; భీష్ముఁ డా
దిగఁ గురుసేనలోన గణుతింపఁగఁ బేర్చిన యోధకోటి నా
మొగమునఁ బడ్డ నెట్లడరి ముట్టెదనో యటుసూచుచుండుమీ! **(భీష్మ. 2. 17)**

అని ధర్మరాజుతో పలికిన మాటలు అతడి స్వభావాన్ని తేటపరుస్తున్నాయి. సాత్త్విక తామసిక వీరులలో భీముడుత్తముడు. ధృష్టద్యుమ్నుడు మధ్యముడు.

4. భీష్మపర్వ కథానాయకుడైన భీష్ముడు రాజస సాత్త్వికుడు. కౌరవులలో మేటివీరుడు. తన పరాక్రమం మీద గాఢమైన నమ్మకం ఉన్నవాడు. వ్రతదీక్షతోపాటు వీరదీక్ష కలవాడు. యుద్ధంలో పడిపోయే ముందు కూడా తన పరాక్రమాన్ని చెప్పుకొన్నవాడు.

తాను విల్లెత్తితే దేవాసురులలో ఎవ్వరూ ఎదిరించి విల్లెత్తలేరని ప్రకటించుకొన్న రాజసమూర్తి ఆయన. అయితే ఆయన మెచ్చుకొనే వీరుడు అర్జునుడు. ఆయన నమస్కరించే వీరుడు శ్రీకృష్ణుడు. వారిరువురు నరనారాయణ ఋషుల అవతారమని తెలిసిన విజ్ఞుడు. శ్రీకృష్ణుడి చక్రాయుధంచేత చంపబడే అదృష్టాన్ని మనసారా ఆహ్వానించిన మనస్వి. నారాయణుడైన కృష్ణుడిచేత కాకపోతే నరుడైన అర్జునుడి చేత నేలగూలటానికి సిద్ధమైన ఉచితజ్ఞుడు. పదిరోజుల యుద్ధం అతడిలోని రాజసాన్ని రాణింపజేసింది. పాండవులకు కంటనీరు పెట్టించింది. తాను బ్రతికి ఉండగా పాండవులకు విజయం లేదనిపించింది. అతడి రాజస స్వభావం కౌరవుల పక్షాన యుద్ధం చేయించింది. అతడి సాత్త్విక స్వభావం పాండవ విజయానికీ, స్వీయపతనానికీ దారితీసింది.

5. దుర్యోధనుడు దురహంకారి. కర్ణుడు సాహంకారి. కర్ణుడికి ప్రకట జీవితం ఎంత ఉన్నదో రహస్యజీవితం అంతే ఉన్నది. అర్జునుడిని సంహరిస్తానని దుర్యోధనుడిని ఉబ్బిస్తుంటాడు. కాని, ఎన్నడూ అతడిమీద విజయం సాధించలేకపోయాడు. భీష్ముడు తాను పార్థుడిని జయించలేనని ఒప్పుకొంటాడు కాని కర్ణుడు ఎన్నడూ ఆ మాట అనడు. ఎనిమిదవనాటి రాత్రి దుర్యోధనుడు కర్ణశకుని దుశ్శాసనులతో ఏకాంత సమావేశం జరిపి, భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు మనసుపెట్టి పాండవసేనలను మట్టుపెట్టటంలేదనీ, దానివలన కౌరవసేనలు క్రమంగా క్షీణించి పోతున్నాయనీ చెప్పి, కర్తవ్యాన్ని గురించి వారిని సలహా అడిగాడు. కర్ణుడు వెంటనే తాను యుద్ధం చేసి రాజును మెప్పించాలనే రాజసభావంతో -

క. ' నరనాథ! యింక భీష్ముని । దురమునకుం దేకు; మేను దోర్బల విభవో
ద్ధురతం బాండుకుమారో । త్కరముం దత్సేనలన్ మదం బడఁగింతున్'. **(భీష్మ. 3. 167)**

అని ప్రగల్భాలాడాడు. దుర్యోధనుడికి అతడి సలహా వేదవాక్యం. భీష్ముడివద్దకు పోయి భీష్ముడికి చేతకాకపోతే కర్ణుడికి అవకాశ మిమ్మని అడిగాడు. ఆ మాటలు భీష్ముడి మనసును తీవ్రంగా నొప్పించాయి. దానికి కారణం కర్ణుడి రాజస ప్రవృత్తియే.

అంపశయ్యమీద పరుండి ఉన్న భీష్ముడిని కర్ణుడు దర్శించాడు. భీష్ముడు ఆతడిని కురుపాండవులు కలిసి రాజ్యసంపద ననుభవించేటట్లు చూడుమని కోరాడు. ఆ యత్నం అతడి ప్రవృత్తికి విరుద్ధం. అందువలన రాజసంతో ఆ ప్రతిపాదనను త్రోసిరాజని తన యత్నానికి ఆశీస్సు లిమ్మని కోరాడు.

శా. ' దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపఁగా వచ్చునే?
నీ వింకన్ నను నొండు పల్కక పరానీకంబుపైఁ బంపు; మ
త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబు సం
భావింపన్ విహరించెదన్ మురరిపుం బార్థుం దలంకించెదన్.' **(భీష్మ. 3. 450)**

కర్ణుడు 'దైవాధీనము సర్వమున్' అన్న దానిని నమ్మే వేదాంతి కాదు. తన మతిని పెద్దల బోధలతో మార్చుకొనలేని సాహంకారి. భీష్ముడి సలహాను నిరాకరించిన నిర్మొగమాటి. శత్రుసేనలను చంపటంలో సాటిలేని మేటి వీరుడు భీష్ముడు ఆశీస్సులందిస్తే తానూ పాండవులనూ వారి సేనలనూ సంహరించగలననే ధైర్యం కలవాడు. ఇవన్నీ స్వీయ బల ప్రయోగానికి లోకం మెచ్చుకొనేందుకే చేయాలని ఆతడి అభిప్రాయం. ఈ మాటలన్నీ రాజసరాజసికు డనేవే.

6. దుర్యోధనుడు రాజస తామసికుడు. భీష్మపర్వంలో ఆ స్వభావం ముమ్మార్లుగా గోచరిస్తుంది. దుర్యోధను డెంతటి మహావీరుడో కాని, భీష్మద్రోణాది మహావీరులను స్వప్రయోజనం కొరకు ఉపయోగించుకొనే ఉద్ధతుడు. కౌరవవీరులను పాండవ పక్షపాతులేమో అని శంకిస్తాడు. అయినా, వారి చేతనే పాండవులను చంపించాలని భావిస్తాడు. ఏనాడైనా, ఏ ఘట్టంలోనైనా పాండవుల ధాటికి కౌరవసైన్యం బడలిపోతే, నిర్మొగమాటంగా భీష్మాదులను నిష్ఠురాలాడుతాడు. వారు మనసులో కటకటపడినా లెక్కచేయడు. వారిని రెచ్చగొట్టిగానీ, నిందించిగాని, నిష్ఠురాలాడిగానీ పాండవులను పరిమార్చటమే అతడి ధ్యేయం.

మూడవనాటి యుద్ధంలో దుర్యోధనుడు భీముడిచేతిలో భంగపడ్డాడు. అందుకు అతడు సిగ్గుపడటానికి మారుగా భీష్మద్రోణాదులను నిష్ఠురా లాడాడు.

ఉ. ‘ ఉక్కున మూఁడులోకములు నొక్కటఁ దాఁకెన యేనిఁ బోర మీ
రొక్క ( డొకండ గెల్చుటకు నోపుదు రశ్రమవృత్తి; నిట్టి మీ
ముక్కున నూర్పు గల్గ మన మోహర మీ దురవస్థఁ బొందునే?
యక్కట! మున్న పాండవుల కల్గఁగ నొల్లమి సెప్ప రైతిరే!

వ. అని పలికి గాంగేయుం గనుంగొని

ఆ. నాఁడె చెప్పఁగన్న నాకు రాధేయున । కెట్లు సూడఁ బోలె నట్లు వోలెఁ
బడిన పాటుఁ బడుదు మడియాస నీ చేత । భంగపడితి మింకఁ బలుకు లేల?’ **(భీష్మ.2.119-121)**

‘మీ ముక్కున నూర్పు గల్గ’ (మీరు బ్రతికి ఉండగా) అనటం, భీష్మడిని కర్ణుడితో కలిపి చెప్పి నిందించటం దురహంకార పూరిత రాజసం.

ఆరవనాటి యుద్ధంలో కూడా భీష్మడి కట్టెదుట దుర్యోధనుడు భీముడి చేతిలో భంగపడ్డాడు. అప్పుడూ భీష్మడిని అనుమానంతో నిష్ఠురా లాడాడు.

ఆ. ‘ మనము పూఁచి పట్టి మొన లేర్చికొని పోవఁ బాండురాజ సుతులబలము గవిసి
గాసి చేయునదియుఁ గాక నీ ముందటఁ బవనతనయుచేతఁ భంగపడితి.’

క. ‘ నినుఁ గొని గెలిచెదఁ గుంతీ । తనయుల నని యున్న తలఁపు దప్పించెదు; నీ
వనిమిషులనైనఁ జేకొన । వనిమొన; వా రింత బలియు రగు టేమి యొకో!’ **( భీష్మ. 3.5,6)**

దుర్యోధనుడు భీముడిచేత భంగపడినప్పుడెల్లా భీష్మడిమీద విరుచుకుపడటం అతడి రాజసస్వభావం. ఎన్ని నీతులు చెప్పినా, పాండవులను జయించటం అసాధ్యమని ఎన్నిసార్లు చెప్పినా దానిని తలకెక్కించుకొనలేకపోవటం రాజసస్వభావం. ఈ రెండూ కలిసిన రాజరాజు వ్యక్తిత్వం రాజసరాజసికం.

7. ధృతరాష్ట్రుడు తామస సాత్త్వికుడు. అతడి అదృష్ట మేమంటే వ్యాసభట్టారకుడు, శ్రీకృష్ణుడు మొదలైన మహామహులు నీతులు బోధించారు, దివ్యదర్శనా లిచ్చారు. వాటిని వినేవాడు. కాని, పుత్రవ్యామోహంతో వాటిని పాటించేవాడు కాడు. యుద్ధం ప్రారంభమయింది. వ్యాసాదులు పాండవవిజయాన్ని సూచించారు. కౌరవమరణం తప్పదని హెచ్చరించారు. అయినా, ఏదో ఆశ కౌరవవిజయం కొరకు మనసులో వెలుగొందుతుండేది. యుద్ధంలో జరిగే పరిణామాలు విని ఆశ్చర్యపోయేవాడు. దుర్యోధనుడివలెనే ధృతరాష్ట్రుడుకూడా భీష్మద్రోణులు అజేయులు కాబట్టి వారిని ప్రయోగించి పాండవులను సంహరించాలని దురాశపడ్డారు. ఆశలన్నీ అడియాసలు కావటం మొదలయ్యాయి. పెద్దలతోడ సత్సంగం చేసి హితోక్తులు ఓపికతో వినేలక్షణం అతడిలో ఎక్కడో మినుకు మినుకు మంటున్న సాత్త్వికం. పెద్దల మాటలను తెలిసి తెలిసి తిరస్కరించటం తామసికం.

ధృతరాష్ట్రుడు సంజయుడి నడిగే ప్రశ్నలు అతడి స్వభావానికి నిలువుటద్దాలు. మచ్చు కొకటి.

ధృత: ‘సంజయా! మనవైపు సైన్యం చచ్చిందనీ, నొచ్చిందనీ తరచుగా చెప్పుతావు. పాండవబలాలు తరుగక యుద్ధం చేయటం పలుమారులు చెప్పుతావు. అకటా! ఇదేమి మాయయో!’ అని సంజయుడినే అనుమానించగల తామసికుడు.

సంజ: మహారాజా! మనవారు తమ తమ సామర్థ్యాలకు తగినట్లు పోరాడుతున్నారు. అయినా నదులు సముద్రంలో కలిసినట్లు మన సేనలు పాండవసేనలో ప్రవేశించి వెలుపలికి రాలేకపోతున్నాయి. దీనిని నీవు తప్పుగా భావించకుము. నీవు చేసిన తప్పులవలన కలిగిన ఈ చేటుకు శోకించి లాభం లేదు.

సంజయుడి మాటలు విన్న తరువాత కూడా విజయాన్ని మనసులో ఆశించే ధృతరాష్ట్రుడు అక్షరాలా తామసికుడే.

8. శిఖండి తామస రాజసికుడు. భీష్మవధకొరకు పంతంపట్టి యుద్ధంలో పాల్గొన్న శిఖండికి స్వయంగా ఆయనను చంపే సామర్థ్యం లేదు. తనను చూచి భీష్ముడు నవ్వుతూ ఊరకుంటే, తన వెనుక నిలువబడి అర్జునుడు బాణాలు సంధించి భీష్ముడిని కూలద్రోశాడు. పేరు శిఖండిది ప్రతాపం పార్థుడిది. అయినా, ఆతడి పౌరుషోక్తులు కోటలు దాటుతుంటాయి. మొదటినాటి యుద్ధంలో భీష్ముడి పరాక్రమ ప్రదర్శనానికి ధర్మరాజు దీనుడై శ్రీకృష్ణుడి వద్దకు వచ్చి, నిరాశతో యుద్ధం చాలించి అడవులకు వెళ్ళుతానని పలికినప్పుడు శ్రీకృష్ణుడు పాండవవీరుల ప్రశంస చేసి అతడికి ధైర్యం చెప్పాడు. ఆ వీరులలో శిఖండి శ్రీకృష్ణుడి ప్రక్కనే చెప్పబడటం విశేషం.

కృష్ణ: ఉ.' నెవ్వగ యింత యేల? విను, నీ కెదు రెవ్వరు? నీదు తమ్ములం
దెవ్వరు సూచినన్ జగము లిన్నియు గెల్వఁ గలారు లావునం;
గ్రొవ్విన భీష్ము నోర్చు రణకోవిదుఁడైన శిఖండి యేను నీ
కొవ్వనివారి నెల్లఁ గ్రమయుక్తి లయం బొనరింతు నెమ్మెయిన్.' **(భీష్మ. 2. 11)**

భీష్ముడిని ఎదిరించి చంపాలన్న సంకల్పం రాజసికం. శిఖండి వెనుక నిలబడి బాణాలు వేసింది పార్థుడనీ, శిఖండి కా పరాక్రమ మెక్కడున్నదనీ భీష్ముడు దుశ్శాసనుడికి చెప్పిన తీరు అతడిని నవ్వులపాలు చేసింది.

సీ. ' అశనికల్పము లివి యర్జును బాణముల్ । గాని శిఖండివి గావు సుమ్ము!
కర్కటి గర్భంబుకరణి గాత్రము వ్రచ్చు । నిట్టివి వీనికి నెందుఁ గలవు?
బ్రహ్మదండంబుల పాటియై మర్మంబు । లిట్టు నో నాఁటునే యితనిచేత!
జముదూత లట్ల ప్రాణముల వెలార్పంగ । నీ ద్రుపదాత్మజుఁ డెన్నఁ డేసె?

ఆ. దృఢ విముక్తములును, దీప్తాకృతులు, లక్ష్య । శుద్ధిమంతములును, సునిశితములు
నైన నారసంబు లతనివి గాక యీ । తనివి యగునె యెవ్విధమునఁ జూడ! ' **(భీష్మ. 3. 405)**

అందుకే కాబోలు భీష్ముడు శిఖండి ఎదురుపడగా ఒక నవ్వు నవ్వాడు. ప్రతాపం కంటె మించిన ప్రసిద్ధి వచ్చిన అదృష్టవంతుడు శిఖండి. తన శక్తి తాను తెలిసికొనలేకపోవటం తామసికం, అయినా భీష్మవధకై జీవితాన్ని అంకితం చేయటం రాజసికం.

9. తామసిక తామసికుడు దుర్యోధనుడి తమ్ముడు దుశ్శాసనుడు. అన్నగారి ఆజ్ఞను అక్షరాలా పాటించటమే ఆతడి జీవితవ్రతం. అందుకే ఆజ్ఞలన్నీ అన్న అతడికే ఇస్తాడు. భీష్మపర్వంలో దీనికి సంబంధించిన కావ్యకళాశిల్పం ఒకటి ప్రస్ఫుటంగా కనపడుతుంది. యుద్ధారంభంలో దుర్యోధనుడు భీష్మరక్షణ బాధ్యత దుశ్శాసనుడికి అప్పగించాడు. పదిరోజులూ భీష్ముడి చుట్టూ తానుగానీ, మహారథికులను గానీ రక్షగా నిలిపాడు. చివరినాడుకూడా చివరివరకు భీష్మరక్షణలో నిలిచి అన్నతోపాటు చివరిగడియలలో ఆయన వద్దనే ఉన్నాడు. ఆయన బాణాలకు గురియై నేలపై ఒరిగే సన్నివేశానికి ఆయనే సాక్షిగా నిలిచాడు. అన్నమాట జవదాటని తమ్ముడే అయినా స్వతంత్ర వ్యక్తిత్వం లేనివాడు కావటంతో తామసికుడైనాడు. భీష్మరక్షణం చేయలేక తామసికు డనిపించుకొన్నాడు. ఆయన చరిత్రనంతా గమనిస్తే ముమ్మాటికి తామస తామసికుడే.

మాట్లాడే పాత్రలలో గల ఈ వైవిధ్యం కథకు వైవిధ్యంతో కూడికొన్న చైతన్యశక్తిని ప్రసాదించింది.

## 16. ధర్మజ దుర్యోధనుల సాధింపు మాటలు :

నాయక ప్రతినాయకులైన ధర్మజ దుర్యోధనులు ఎదుటి వారి చెవులు పిండి పనిచేయించుకొనే దిట్టలు. అయితే, వారు పాటించే పద్ధతులు, మాట్లాడే మాటలు వారి వారి స్వభావాలకూ, వ్యూహాలకూ అనుగుణంగా ఉంటాయి. భీష్మాదులను శ్రీకృష్ణసహాయంతో అర్జునుడు సంహరించి విజయాన్ని చేకూరుస్తాడని నమ్మికతో యుద్ధానికి ధర్మజుడు దిగాడు. అందువలన భీష్మాదులవలన పాండవసైన్యం భంగపడితే ధర్మజుడు బాధపడేవాడు. అంతటితో ఆగక శ్రీకృష్ణుడికి నివేదించుకొనేవాడు. ధర్మరాజుకు కోపంవస్తే మొదట రాజ్యాన్ని వదలుకొంటానంటాడు, యుద్ధాన్ని మానేస్తానంటాడు. చివరకు అడవులకు పోయి ఆకులలాలు తిని తపోవృత్తితో జీవిస్తానంటాడు. ఇవన్నీ ధర్మజుడి సాత్త్విక నిష్ఠురాలు. శ్రీకృష్ణుడో, అర్జునుడో, చివరకు ధృష్టద్యుమ్నుడో ధర్మరాజుకు ధైర్యం చెప్పి, మరునాడు యుద్ధం చేసి ఆయనకు ధైర్యం కలిగించేవారు. వారు కూడా చాలరనుకొంటే భీష్ముడి వద్దకే పోయి మనవిచేసికొనేవాడు. ఎప్పుడైనా ఎక్కడైనా ధర్మరాజు సాధింపుమాటలు కార్యసాధన వ్యూహానికి పరోక్షపోషకాలుగా ఉండేవి. వాటివలన సత్ఫలితాలు సాధించబడేవి. అందుకే ధర్మరాజు ధర్మనీతివర్తనుడయ్యాడు. మెత్తని పులిగా పేరుగాంచాడు. ధర్మరాజు మెత్తని పులి అయితే దుర్యోధనుడు బెబ్బులి. అతడు భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలను నమ్మి యుద్ధంలోకి దిగాడు. వారివలన పాండవనాశనం జరుగుతుందని కర్ణుడిని యుద్ధం చేయటానికి భీష్ముడు అంగీకరించకపోయినా ధైర్యంగా ఉన్నాడు. అయితే, భీష్మాదులందరూ ప్రతి దినం పాండవుల ప్రాణాలు తీసే యత్నం చేసేవారు కారు. పాండవులతో యుద్ధం చేసినా వారిని దయతో వదలిపెడుతున్నట్లుగా దుర్యోధనుడికి తోచేది. పైపెచ్చు భీమాదులతో దుర్యోధనుడు భంగపడినప్పుడు కూడ ప్రతీకారం తగినంత మోతాదులో ఉండేది కాదు. ఈ కారణాలకు తోడు, అనుమాన జాడ్యం తోడై దుర్యోధనుడు భీష్ముడిని నిష్ఠురాలాడేవాడు. అట్లా అతడు పలికినప్పుడెల్లా భీష్ముడిని ఒక్కొక్క అడుగు దూరం చేసికొనేవాడు. చివరకు కర్ణుడిమీద అభిమానంతో భీష్ముడిని సేనాసారథ్యం వదలుకొమ్మని అవమానంగా మాట్లాడాడు. క్రూరమైన మాటలతో భీష్ముడిని దుర్యోధనుడే మొదట కూల్చాడు. ఆ తరువాత భీష్ముడు అతడి మాటలు భరించలేక మరణించటానికి ఉద్యుక్తుడయ్యాడు. మరణరహస్యం ధర్మరాజుకు చెప్పి 'చంపి పుణ్యం కట్టుకొనం'డని బ్రతిమలాడుకొన్నాడు. అతడి అంగీకారంతోనే అర్జునుడు భీష్ముడిని అంపశయ్య నెక్కించాడు.

మాట లన్నా మనసులు దోచుకొనే నేర్పు ధర్మరాజుది. మాటలతో మమతలను దూరం చేసికొనే తొందరపాటు దుర్యోధనుడిది. ఇద్దరూ కార్యసాధకులే. కాని ఒకరు సాధించినట్లు మాట్లాడినా ఫలసాధన చెడకుండ చూచుకొంటారు. మరొకరు తిట్టి పెట్టించుకొందామని ప్రయత్నించి అసలుకే మోసం తెచ్చికొంటారు. ఈ రెండు ప్రధాన పాత్రల స్వభావ సహజ వైరుధ్యంవలన కథకు తులనాత్మక శిల్పం సాధించబడింది.

## 17. దశవిధ వర్ణనలు :

యుద్ధపర్వాలు సాధారణంగా వర్ణన ప్రధానాలు. వినేవారి కన్నులకు కట్టేటట్లు చెప్పటంలో వర్ణనం బలమైన వాహికగా తోడ్పడుతుంది. పదిరోజుల యుద్ధం ప్రవర్తిల్లే భీష్మపర్వంలో పదిరకాల వర్ణనలను గుర్తించవచ్చును. వాటిని ఈ విధంగా పేర్కొనవచ్చును.

| | | |
|---|---|---|
| 1. సహజ వర్ణనలు | 2. రసానుగుణ వర్ణనలు | 3. అలంకృత వర్ణనలు |
| 4. వీరపురుష వర్ణనలు | 5. వ్యూహ వర్ణనలు | 6. రణరంగ వర్ణనలు |
| 7. సన్నివేశ వర్ణనలు | 8. వీరోక్తుల వర్ణనలు | 9. అభినయ వర్ణనలు |

10. ప్రకృతి వర్ణనలు వీటిని సహృదయులు ఆయా సందర్భాలలో గుర్తించటం సులభం. అయినా మచ్చుకొకటి రెండు ఉదాహరణలు.

**18. సహజ వర్ణనలు:**

యుద్ధ క్రియా వర్ణనలు సహజ వర్ణనలుగా నిబంధించినప్పుడే పఠితలకు దృశ్యమానాలౌతాయి. ఇటువంటివి భీష్మపర్వంలో కోకొల్లలు. మచ్చుకు - వికర్ణాభిమన్యుల యుద్ధం.

చ. ‘ తఱిమి వికర్ణుఁ డప్డు తనుఁ దాఁకిన నా యభిమన్యుఁ డల్గి బి
ట్టఱ విలు ద్రుంచి, సారథి వడం దురగంబులఁ జావమోది క్రొ
మ్మెఱుఁగులతోడఁ దద్ధ్వజము మేదినిఁ గూలగఁ జేసి యంగముల్
గిఱికొన బాణముల్ నినిచెఁ గేలిమెయిన్ బటుదర్ప మేర్పడన్’. **(భీష్మ. 2. 402)**

అభిమన్యుడు వికర్ణుడిని నిరాయుధుడిని చేసిన క్రమాన్ని సహజంగా వర్ణించాడు తిక్కన. విలు త్రుంచటం, సారథిని పడగొట్టటం, గుర్రాలను చావమోదటం, ధ్వజాన్ని కూల్చటం, బాణాలను మేన నాటటం - అనే క్రియలలోని విరుపు సవ్వడులను శకటరేఖ ప్రాసలో ధ్వనింపజేయటం రచనాశిల్పం.

**19. రసానుగుణ వర్ణనలు :**

యుద్ధ ఘట్టాలలో సాధారణంగా వీర రౌద్ర భయానక బీభత్సాద్భుత కరుణ రసాలు ప్రవర్తిల్లుతూ ఉంటాయి. ఆ రసవిభావానుభావాదుల వర్ణనం కావ్యరసపోషకం. మచ్చుకొక్క ఉదాహరణం.

**వీరరసం**: రెండవనాటి యుద్ధంలో అర్జునుడు భీష్ముడిపై విజృంభించటం:

మ. ‘ మనసేనం గలగంగఁ జేయుచు మదిన్ మందాకినీ నందనుం
డు ననుం గైకొనకున్నవాఁ డితని యాటోపం బడంగించెదన్
నిను మెప్పించెదఁ జూడు ఖేచరులు వర్ణింపన్ విజృంభించెదన్
దనుజధ్వంసి! రథంబు వే పఱపు ముద్య ద్విక్రమ ప్రక్రియన్’. **(భీష్మ. 2. 31)**

**రౌద్రరసం:** శ్రీకృష్ణుడు భీష్ముడిపై లంఘించటం

మ. ‘ ధరణీ చక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణి కం
ధరముల్ మ్రొగ్గఁబడన్ దిశావలయ ముత్కంపంబుగా నీ బలం
బురులం బాఱఁగ భీష్ముపైఁ గవిసె; రౌద్రోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహుఘోరాకృతిన్’. **(భీష్మ. 3. 263)**

**భయానకం:** శ్రీకృష్ణుడి భయానకమైన విశ్వరూపం దర్శించిన అర్జునుడి మాటలు.

మ. ‘ అనలజ్వాలలు పర్వు నీ ముఖములం దా ధార్తరాష్ట్ర ప్రజం
బును భీష్మాదులు నిద్దెసం గలుగు నీ భూపాలలోకంబు గ్ర
క్కున నొక్కుమ్మడి వచ్చి చొచ్చెదరు నాకుం జెప్పవే! యెవ్వరో
యని శంకించెద నిన్ను భూరి కరుణాయత్తైక చిత్తుండవై.’ **(భీష్మ. 1. 214)**

**బీభత్సం :**

తే. 'ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ । శస్త్రఖండ జాలంబులఁ జాల నొప్పెఁ
బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు । దెఱఁగు తొడవులు దొడిగిన తెఱవవోలె'.
**(భీష్మ.3. 162)**

బీభత్స దృశ్యాలను శృంగారోపమలతో రమణీయంగా మార్చటం తిక్కన వర్ణన శిల్పం.

**అద్భుతం:** అర్జునుడు అద్భుతమైన శ్రీకృష్ణుడి విశ్వరూపం దర్శించి ఆశ్చర్యపడటం.

సీ. దేవ! నీదగు దివ్య దేహంబునందు సు । రాసురగంధర్వు లాది గాఁగఁ
గల దేవయోనులుఁ గమలాసనుండును । సచరాచరంబైన జగము నాకుఁ
దోఁచె, మొగంబులు దోర్దండములును బా । దములుఁ గన్నులు ననేకములు గంటి
మకుటాది భూషణ నికరంబుఁ జక్రగ । దాద్యాయుధములు మాల్యాంబరములుఁ

ఆ. బెక్కు గానవచ్చె నక్కజమై యిది । నడుము మొదలు దుది యనంగరాదు
తేజ మప్రమేయ దేదీప్యమాన ని । ర్వికృతి మహిమ దుర్నిరీక్ష్యమయ్యె!' **( భీష్మ. 1. 211)**

**కరుణరసం:** భీష్ముడి మరణవార్త విని ధృతరాష్ట్రుడు శోకించాడు.

సీ. ' అతఁడు నొచ్చినతఱి నడ్డంబు సొచ్చెద మని వచ్చువారు లేరైరె యచట?
నడరి పోరాడక యన్ని యక్షౌహిణు । లొప్పరికించెనె యొకనిఁ గలన?
నతని నోర్వఁగఁ జాల వని నిశ్చయించితి । మంతకు నోపెనే యరిబలములు?
ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును । శల్యుండుఁ గ్రేడించి చనిరె యపుడు?

తే. పాండుసుతులు శిఖండియుఁ జండశక్తి । మెఱయ నొక్కటఁ పైఁ బడ్డ వెఱచి తాత
విడిచి నా పుత్త్రులందఱు విఱిగి యడవిఁ । గలిసిరొకొ యాతనికిఁ బడవలసె నకట!' **(భీష్మ. 1. 58)**

**20. అలంకృత వర్ణనలు :**

తిక్కన ఉపమ, రూపకం మొదలైన అలంకారాలలో వర్ణ్యవస్తువును రమణీయంగానూ, ఆస్వాదమధురంగానూ మారుస్తాడు. సంజయుడు భీష్ముడి మరణాన్ని సూర్యాస్తమయంగా రూపకం చేసి చెప్పి శోకించాడు.

ఆ. ' తీవ్ర బాణజాల దీప్తులు పరఁగించి । పాండుతనయ సైన్య బహుళ తమము
లీలఁ బదిదినంబు లోలి వినోదించి । యధిప! భీష్మభానుఁ డస్తమించె'. **(భీష్మ. 1. 47)**

తే. ' చాపవక్త్రుండు భల్లదంష్ట్రావితాన । ఘోరమూర్తి నారాచనఖుండు ఖడ్గ
జిహ్వాకా భీషణుఁడు నరసింహమూర్తి । గాక కేవల నరుఁడె గంగాసుతుండు!' **(భీష్మ. 1. 48)**

' ఇట్టిది భీష్మ మహాభ్ర; మెట్లడంగించెనొకో శిఖండి యను కృత్రిమ వాయువు దాఁకి దైవమా! '
**(భీష్మ. 1.52)**

'భీష్ముఁడను సాగరముం గడవంగ, నీఁదఁగా నేరిమి యెట్లొకో కలుగనేర్చె శిఖండికి?'-

**(భీష్మ. 1. 54)**

రూపకానుప్రాణిత ఉపమాలంకారం:

తే. జలరుహంబులు పాండవ సైనికుల మొ। గంబు లట్టుల విన్ననై కాంతి దఱిఁగె;
వారి మనముల భీత్యంధకార మడరు। కరణిఁ జీఁకటి యెడనెడఁ గవియుదెంచె.'

ఉపమాలంకారం: క్రౌంచవ్యూహాన్ని భీష్ముడు భేదించిన విధం.

ఉ. 'ఱెక్కలు సించి కంఠమున ఱేకులు వాపి శిరంబు వ్రచ్చి పే
రుక్కునఁ గ్రౌంచ చందమగు నొడ్డు గలంగఁగఁజేసి భీష్ముఁ డే
దిక్కునఁ దానయై దిశలు దీటుకొనన్ శరకోటి నింపఁ గెం
పెక్కిన కంటిక్రేవ చెలు వెక్కుడు సేయఁగఁ గ్రీడి కృష్ణుతోన్'. **(భీష్మ. 2.30)**

తే. 'ఆపగానందనుండు మురారియురము। బాణ వితతిని భేదింప శోణితమునఁ
దోఁగి యతఁ డొప్పెఁ దలిరాకు దుఱగలింప। మెఱయు నవపారిజాతంబు తెఱఁగు దాల్చి'.

**(భీష్మ. 2. 43)**

ఇట్లు యుద్ధ వర్ణనలను అలంకృతం చేసి పఠితలకు దర్శనీయం చేశాడు తిక్కన. (వివరాలకు వ్యాఖ్య చూడండి).

**21. వీరపురుష వర్ణనలు:**

యుద్ధ పర్వాలలో వీరపురుష వర్ణనం ఒక ప్రత్యేక వైభవం. వారు సజీవవీర రౌద్రరస విభావాలు. వారి వర్ణన రసోన్నిద్రం. ప్రతాప ప్రదర్శనం చేసిన వీరులను సహజంగానో, అలంకృతంగానో వర్ణించక తిక్కన వదలలేదు. ఆ వర్ణనలు పద్యరత్నాలు. ఉదాహరణకు కొన్ని.

1. భీమపరాక్రమం. (క్రియా రమణీయం)

శా. 'కుంతీసూనుఁడు సింహనాదమున దిక్కుల్ పిక్కటిల్లంగ దు
ర్దాంత స్ఫారగతిం గరిం గదిసి రౌద్రస్ఫూర్తి లంఘించి త
ద్దంతంబుల్ వెస నెక్కి త్రొక్కి తునిమెన్ ధారాళరక్త చ్ఛటా
క్రాంతంబై నభ మొప్ప వానిఁ బటు ఖడ్గ స్ఫార ధారాహతిన్'. **(భీష్మ. 2. 68)**

2. అలంబసుడు ఇరావంతుడిని చంపటం

చ. 'అడరిన దానవుండు గరుడాకృతిఁ గైకొని మాయతోడ లోఁ
బడ భుజగంబులం బొదివిపట్టి రయంబున మ్రింగి యప్డు చే
డ్పడు నరుపట్టికంఠము గృపాణమునం దెగవైవ మేదినిం
బడి మొగమొప్పెఁ బూర్ణశశిభాతి వికారము లేని చెన్నునన్ '. **(భీష్మ. 3. 105)**

3. భీష్మ ప్రతాపం.

ఉ. ' శాంతనవుం డనేక బలసంతతి నుద్భట శౌర్యసారదు
ర్దాంత పరాక్రమ స్ఫురణ దాఁకి సముజ్జ్వల శాతసాయక
క్రాంత పరీత నిర్మథిత కంపిత పాతితమూర్తిఁ జేసి య
త్యంత రయంబునం దన రథంబు గతుల్ మెఱయం బ్రదీప్తుఁడై '. **(భీష్మ. 3. 246)**

**22. వ్యూహ వర్ణనలు:**

యుద్ధాలలో వ్యూహాలు ఆయువు పట్టులు. వాటిని వర్ణించేటప్పుడు తిక్కన తీసికొనే జాగ్రత్తలు సవ్యంగా ఆయన అనుభవం నుండి పుట్టుకొని వచ్చినట్లుంటాయి. భీష్మపర్వంలో ఉభయపక్షాలు పన్నిన వ్యూహాలు:

| | కౌరవులు | | పాండవులు |
|---|---|---|---|
| మొదటినాడు: | మానుషవ్యూహం | - | అచల వ్యూహం |
| రెండవనాడు: | త్రిశాఖావ్యూహం | - | క్రౌంచవ్యూహం |
| మూడవనాడు : | గరుడ వ్యూహం | - | అర్ధచంద్రాకార వ్యూహం |
| నాల్గవనాడు: | తుముల యుద్ధవ్యూహం | - | తుముల యుద్ధవ్యూహం |
| ఐదవనాడు: | మకరవ్యూహం | - | శ్యేన వ్యూహం |
| ఆరవనాడు: | క్రౌంచ వ్యూహం | - | మకర వ్యూహం |
| ఏడవనాడు: | మండల వ్యూహం | - | వజ్ర వ్యూహం |
| ఎనిమిదవనాడు: | కూర్మ వ్యూహం | - | శృంగాట వ్యూహం |
| తొమ్మిదవనాడు: | సర్వతోభద్ర వ్యూహం | - | దృఢ వ్యూహం |
| పదవనాడు: | శిఖండి వ్యూహం | - | భీష్మ వ్యూహం |

వ్యూహరచన విజయ సోపానాలలో మొదటిది. ఇరుపక్షాల వారు విజయావకాశాలను అన్వేషించే పద్ధతులకు వ్యూహాలు సూచికలు. వ్యూహాలకు వివిధాకృతు లుంటాయి; వాటికి తగిన ప్రకృతు లుంటాయి, వాటిని సంవిధానం చేసే పద్ధతులూ, భేదించే విధానాలూ ఉంటాయి. ఒకరు తమకున్న శక్తియుక్తులను బట్టి ఒక వ్యూహం పన్నితే, మరొకరు దానిని భేదించగలిగిన మరొక వ్యూహాన్ని తమకున్న వనరులతో నిర్మించి ప్రతిఘటిస్తారు. ఒక్కొక్క వ్యూహానికి ఒక రూపప్రణాళిక ఉంటుంది. అందులో ముఖ్యస్థానా లుంటాయి. వాటిలో ముందుగా దాడిచేసే వీరులు, ఆ తరువాత రక్షచేసేవీరులు, సాయం చేసే వీరులు, అండగా నిలిచే వీరులు, పోరును ఉద్ధృతం చేసేవీరులు, పారిపోయే వారిని గూడగట్టే వీరులు అని విభాగాలు గోచరిస్తుంటాయి. వారిని ఎన్నిక చేసి ఆయా కీలక స్థానాలలో నిలపటం, వారి సహాయకులను ఆయా ప్రాంతాలలో కేంద్రీకరింపచేయటం, అవసరం వస్తే వ్యూహంలోని వివిధ కేంద్రాలకు వేగంగా వెళ్ళగలిగినవారిని సమన్వయదృష్టితో సన్నద్ధం చేయటం వ్యూహాకృతి నిర్మాణంలో ముఖ్యాంశాలు. స్వీయపక్ష బల ప్రదర్శనానికి అనువైన పద్ధతికి ప్రాధాన్య మివ్వటమే వ్యూహస్వభావం. ఈ దృష్టితో వ్యూహాలు ప్రధానంగా రెండు విధాలుగా కనపడతాయి. ఒకటి - దాడికి పనికి వచ్చేది. రెండవది - రక్షణకు పనికివచ్చేది. కౌరవ పాండవులు వ్యూహరచనలో ఈ అంశాన్ని కూడా లెక్కకు తీసికొన్నారు. ఏ విధమైన వ్యూహమైనా శత్రువ్యూహాన్ని భేదించే లక్ష్యంతోనే సంవిధానం

చేయబడుతుంది. ఒక్కొక్కసారి బలమైన వ్యూహం కూడా బలహీనవ్యూహకర్తలు ప్రదర్శించే నేర్పరితనంవలనకాని, యుద్ధక్రీడా ప్రయోగంవలనకాని సత్ఫలితాలను సాధించలేక వీగిపోవచ్చును. అంతమాత్రాన యుద్ధవీరులు అశాంతికి గురికాకుండ మరునాడు ఎత్తుకు పైయెత్తు వేసికొంటారు. యోగ్యమైన వ్యూహాన్ని కూర్చుకొంటారు. యుద్ధంలో వ్యూహం రక్షాకవచం వంటిది. దానిని తాల్చవచ్చును, చీల్చవచ్చును. వీరుల పౌరుషం కవచంలో ఉండదు కదన పాండిత్యంలో ఉంటుంది.

కౌటిల్యుడి అర్థశాస్త్రంలోని దశమాధికరణంలో సాంగ్రామికాంశాల వివరణం ఉన్నది. ఆ సందర్భంలో వ్యూహాలను గురించి విశేషాలెన్నో చెప్పబడిఉన్నాయి. వాటిని కొన్నింటిని అన్వయించుకొంటే భీష్మ పర్వంలోని వ్యూహాల ప్రయోగ ప్రయోజన ఫలితాంశాలను గ్రహించవచ్చును.

శ్లో. " ఏకం హన్యాన్న వా హన్యాదిషుః క్షిప్తో ధనుష్మతా।
ప్రాజ్ఞేన తు మతిః క్షిప్తా హన్యా ద్గర్భగతా నపి॥". **(కౌటిలీయార్థశాస్త్రమ్. పుట. 788)**

(ధానుష్కుడు విడిచిన బాణం ఒకనిని చంపవచ్చును, చంపకపోవచ్చును. కాని బుద్ధిమంతుడు విసిరిన మతి (ఆలోచన) మాత్రం గర్భంలో ఉన్నవాళ్ళని కూడ చంపివేస్తుంది). (డా. పుల్లెల శ్రీరామచంద్రుడిగారి బాలానందిని వ్యాఖ్య: పుట. 788)

అనే కౌటిల్యుడి సూక్తి ప్రకారం సైన్యవ్యూహం ప్రాజ్ఞుడైన వీరుడి ఆలోచనకు యుద్ధ క్రీడాకృతి. కౌరవపక్షంలో భీష్ముడు వ్యూహకర్త. పాండవ పక్షంలో అర్జున ధర్మజ కృష్ణ ధృష్టద్యుమ్నులు కర్తలు. కౌరవపక్షంలో ఒక్క రాలోచించి వ్యూహం పన్నితే పాండవపక్షంలో నలుగు రాలోచించి ప్రతివ్యూహం రూపొందించేవారు. ఆ క్రమం ఆలోచనా క్రమం కూడా.

"సర్వ దేశకాల ప్రహరణమ్ ఉపాంశు దణ్డ శ్చేతి పత్తియుద్ధాని" (కౌటి. అర్థ. పు. 781) (అన్ని దేశాలలోనూ, అన్ని కాలాలలోనూ శత్రువులను సంహరించటం, ఉపాంశుదండం (రహస్యోపాయాలచేత చంపటం) ఇవి పత్తియుద్ధ విధానాలు. పాండవ కౌరవవ్యూహాలలో వీటికి సంబంధించిన ఆలోచనలూ, వ్యూహరచనలూ సాగాయి.

'1. పక్షౌ ఉరస్యం, ప్రతిగ్రహః ఇత్యౌశనసో వ్యూహవిభాగః పక్షౌ, కక్షౌ, ఉరస్యం, ప్రతిగ్రహః ఇతి బార్హస్పత్యః' (కౌటి. అర్థ. పు. 783) (1-వ్యూహంలో రెండు పక్షాలు, ఉరస్యం (మధ్యప్రదేశం), ప్రతిగ్రహం (సైన్యపృష్ఠ దేశం) - ఈ నాలుగు అవయవాలు ఉంటాయి అని శుక్రాచార్య సంమతమైన వ్యూహవిభాగం. రెండు పక్షాలు, రెండు కక్షాలు, ఉరస్యం, ప్రతిగ్రహం అనే ఆరు అవయవాలు ఉంటాయని బృహస్పతి సమ్మతమైన వ్యూహవిభాగం). భీష్మపర్వంలో ఉభయపక్షాలూ బృహస్పతి మతాన్నే అనుసరించి వ్యూహరచన చేసినట్లు స్పష్టమౌతున్నది.

వ్యూహ స్వరూప స్వభావాలను గురించి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగా రిట్లా పేర్కొన్నారు: ' వ్యూహస్తు బలవిన్యాసః' - సైన్యముల విశిష్ట రచన - లేక - ఏర్పాటు వ్యూహమగును. 'విశేషేణ ఊహ్యతే ఇతి వ్యూహః' దీర్ఘముగ ఆలోచింపబడునది వ్యూహము. ఈ రెండర్థములును వ్యూహ నిర్మాణమునందు ఇమిడియే యున్నవి. సేనాధ్యక్షుడు తన సైన్యమును మోహరించుటకు ముందు నిశితముగ ఆలోచించును. ఆలోచించి విజయము తనకు కలుగు రీతిని తన వాహినిని పన్నించును. వ్యూహమును ఆంగ్లములో Military Tactics అనుచున్నారు. దీనికి సంబంధించినదే యుద్ధయుక్తి (Strategy). ఆంగ్ల విజ్ఞాన సర్వస్వములో ఈ రెండింటిని ఇట్లు నిర్వచించి యున్నారు. 'Strategy is the art of protected movement from which tactics, the art of protected offensive action is developed. Whilst the one places the army in the last position to overcome the enemy's resistance; the other has for its object the economical development of pressure so that movement into the derived direction may be maintained.' యుద్ధయుక్తి అనగా సంరక్షితయానము. దీనినుండి సంరక్షిత విక్రమ విధానము అనబడు వ్యూహము పరిణమించుచున్నది. మొదటిది శత్రువు యొక్క నిరోధకశక్తిని కుంచించుటకు

ఉపయోగించును. రెండవది తన సైన్యశక్తిని పొదుపుగా వాడుకొనుటకు ఉద్దిష్ట దిశయందు విజృంభణమును నిర్వహించుటకు ఉపయోగించును.' (ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణ: భీష్మ ద్రోణపర్వ పీఠిక: పుట 19)

మొదటినాడు భీష్ముడే మొదట వ్యూహం పన్నాడు. అది మానుషవ్యూహం. అంటే పదాతులను ముందుంచుకొని పన్నిన వ్యూహం కావచ్చును. 'పత్త్యశ్వ రథ ద్విపానాం పూర్వం పూర్వమ్ ఉత్తరేణ ఘాతయేత్. హీనాఙ్గమ్ అధికాఙ్గేన చేతి" అని కౌటిల్యుడి అర్థశాస్త్రం (పుట 786). కౌరవసైన్యం పాండవసైన్యం కంటె సంఖ్యలో అధికం. దానిలో పదాతుల సంఖ్య బహుళం. ఎక్కువబలమైన పదాతులతో తక్కువమంది పదాతులున్న పాండవ బలాన్ని హతమార్చాలన్నది భీష్ముడి ఆలోచన. దానికితోడు "యత్ పరస్య దుర్బలం వీత హస్త్యశ్వం, దూష్యాత్మకం కృతోపజాపం వా, తత్ ప్రభూత సారేణాభిహన్యాత్. యద్వాపరస్య సాధిష్ఠం తద్ ద్విగుణసారేణాభిహన్యాత్, యదఙ్గ మల్పసార నూత్మనః తద్ బహునా ఉపచినుయాత్, యతః పరస్పరాపచయః తతో వ్యూహేత,యతోవా భయం స్యాత్." (శత్రువుయొక్క ఏ సైన్యం హస్త్యశ్వాలు లేనిదై దూష్యులు అధికంగా ఉండి, లేదా, ఉపజాపం చేయబడి దుర్బలంగా ఉంటుందో దానిని అత్యధికమైన సారంగల సైన్యంచేత నశింపచెయ్యాలి. పరుని ఏ సైన్యం చాలసారం కలదై ఉంటుందో దానిని రెట్టింపు సారం ఉన్న స్వసైన్యం చేత నశింప చెయ్యాలి. తన సైన్యంలో ఏ అంగం తక్కువసారం గలదిగా ఉంటుందో దానికి ఎక్కువ సంఖ్య చేర్చి వృద్ధి చెయ్యాలి. ఎటువైపు శత్రువు దుర్బలంగా ఉంటాడో లేదా ఎటువైపునుండి భయానికి అవకాశం ఉంటుందో దాని దగ్గర వ్యూహం పన్నుకోవాలి') (కౌటిల్యుడి అర్థశాస్త్రం పు. 780) అనే యుద్ధవ్యూహనీతి ననుసరించి కూడా భీష్ముడు మానుషవ్యూహాన్ని పన్ని ఉండాలి. అంతేకాక 'దూష్యామిత్రాటవీ బలై ర్వా పూర్వం యోధయిత్వా శ్రాన్త మశ్రాన్తః పరమభిహన్యాత్ "దూష్యబలేన వా స్వయం భఙ్గం దత్త్వా జితమితి విశ్వస్తమ్ అవిశ్వస్తః సత్రాపాశ్రయః అభిహన్యాత్.' (ముందుగా శత్రువును దూష్య బలాలతోను, ఆటవిక బలాలతోను యుద్ధం చేయించి, తాను అలసిపోకుండా ఉంటూ, అలసిపోయిన శత్రువును చంపాలి. ముందుగా తన దూష్యబలాన్ని యుద్ధం చేయించి, అది ఓడిపోయేటట్లు చేసి, 'జయించాను' అని విశ్వాసంతో ఉన్న శత్రువును తాను మాత్రం విశ్వసించకుండా జాగరూకుడై ఉంటూ సత్రాన్ని(అపాయకరమైన స్థితిని) కల్పించి చంపివేయాలి). (అర్థశాస్త్రం పు. 762 - 763) అనే యుద్ధనీతిని కూడ ఆలోచించి ఉండి ఉంటాడు.

దీనికంటె మరొక రెండు ఆలోచనలు కూడ భీష్ముడు చేసి ఉండవచ్చును. 1. భీష్ముడు పాండవపక్షంలో ఉన్న పార్థుడిని జయించటం సాధ్యంకాదనీ, పాండవులను చంప చేతులు రావనీ చెప్పి మిగిలిన రాజలోకాన్ని నిష్ఠురంగా చంపుతానని దుర్యోధనుడికి మాట ఇచ్చాడు. అందువలన అతడి వధ పదాతి సైన్యంతో మొదలౌతుంది. 2. దుర్యోధనుడు తొందరపెట్టటంచేత పాండవులకంటె ముందు భీష్ముడే వ్యూహాన్ని పన్నవలసి వచ్చింది. అందువలన సర్వసాధారణమైన మానుష వ్యూహంతో మొదలుపెట్టి ఉంటాడు.

మూలవ్యూహాలు నాలుగు రకాలు. అవి: దండం, భోగం (సర్పం), మండలం, అసంహితం. అడ్డంగా పన్నేది దండవ్యూహం. నాలుగు లేదా ఆరు పక్షాలను ఒకదాని వెనుక ఒకటి అడ్డంగా పన్నేది దండవ్యూహం. నాలుగు లేదా ఆరు పక్షాలను ఒకదాని వెనుక ఒకటి మెలికలు తిరిగి సర్పాకారంలో ఉండేటట్లు పన్నేది సర్ప(భోగ) వ్యూహం. శత్రుసైన్యానికి ఎదురుగా ఉండి ఒక్కుమ్మడిగా అన్ని వైపులా ప్రసరించేటట్లు పన్నేది మండల వ్యూహం. ప్రత్యేక వ్యూహరచన లేకుండా శత్రువులపై దొమ్మిగా విరుచుకొనిపడేటట్లు అమర్చేది అసంహితం. ఈ నాలుగు రకాల వ్యూహాలకు మూలప్రకృతులు. వీటినుండి అనేక శాఖలు కాలక్రమంగా, అవసరం కొద్ది ఏర్పడ్డాయి.

వాటిలో మానుషవ్యూహం ప్రసిద్ధంగా చెప్పబడలేదు. కాని, భీష్మపర్వంలో దాని నిర్మాణప్రశంస స్పష్టంగా తెలుస్తున్నది. దుర్యోధనుడు 'నిబిడ చారు సన్నాహంగా' వ్యూహం ఉండాలని కోరటంతో భీష్ముడు మానుష వ్యూహాన్ని రచించాడు. అది దట్టంగానూ, అందంగానూ, అమర్చినట్లుగానూ ఉన్నది. ఆ వ్యూహంలో భీష్మద్రోణులు ముందు నిలిచారు. కృపాశ్వత్థామలు వలపట, కృతవర్మ మద్రేశ్వరులు దాపట, బాహ్లిక సోమదత్త, భూరిశ్రవసులు వెనుక, దుర్యోధనుడు కురు కుమారవర్గంతో కలిసి మధ్యభాగంలో

నిలిచారు. అతడికి ముందుగా పదివేలమంది సంశప్తకులు సుశర్మను ముందుంచుకొని 'మేము అర్జునుడిని చంపుతాము లేదా చస్తాము' అని శపథం చేస్తూ సన్నద్ధమయ్యారు. మిగిలిన రాజులు ఆయాచోట్ల పదిలంగా నిలిచి, 'ఇంతకు పూర్వం ఇంతటి దృఢవ్యూహాన్ని ఎన్నడూ చూడలే' దని అందరూ ఆశ్చర్యపోయేటట్లు వ్యూహం సిద్ధమయింది. నిబిడ సుందరంగా వీరుల తీరు శోభిల్లింది. దీనికి తోడు సైన్యాల మోహరింపు సన్నాహరీతిని సంక్లిష్టం చేసింది. ఆయాసైన్యాలకు ఏనుగులనూ, ఏనుగులకు రథాలనూ, రథాలకు గుర్రాలనూ, గుర్రాలకు విలుకాండ్రనూ, విండ్లనారికి నద్ధాయుధులనూ అడ్డంగా ఉండేటట్లు నిలువబెట్టాడు. అది అపూర్వ దృఢవ్యూహంగా కీర్తించబడింది.

దృఢవ్యూహం దండవ్యూహభేదం. పక్షాలు, కక్షాలూ, ఉరస్యం, ప్రతిగ్రహం - ఇవన్నీ ఉండవలసిన స్థానంలో ఉంటే దండవ్యూహం. అందులోని కక్షాలు శత్రుబలానికి ఎదురుగా వెళ్ళితే ప్రదరవ్యూహం ఔతుంది. దండవ్యూహంలోని పక్షాలు కక్షంవైపు వస్తున్న శత్రుబలాన్ని ఎదుర్కొనటం కొరకు వెనుకకు వస్తే అది దృఢకవ్యూహం. దృఢకంలోని పక్షాలు శత్రుబలం లోనికి చొచ్చుకొని పోతే అది అసహ్యవ్యూహం. రెండు పక్షాలను వాటిస్థానంలో ఉంచి ఉరస్యం శత్రుబలం వైపు ముందుకు వెళ్ళితే శ్యేనవ్యూహం. 'అపూర్వ దృఢవ్యూహం' అనే ప్రశంస పొందేది, దండవ్యూహంలోని ద్వితీయ భేదం కావచ్చును. లేదా మిగిలిన దండవ్యూహ భేదాలను కూడ ప్రవర్తిల్ల జేయగల దృఢ వ్యూహం కావచ్చును. దానికి మానుష వ్యూహమని పేరుండి ఉండవచ్చును.

మానుషవ్యూహ స్వభావానికి ప్రతిగా పార్థుడి సూచన మేరకు ధృష్టద్యుమ్నుడు అచల వ్యూహాన్ని పన్నాడు. పదాతులు, గుర్రాలు, రథాలు, ఏనుగులు - ఒకటి వెనుక మరొకటి ఉండేటట్లు పన్నేది అచలవ్యూహం. పాండవ వీరులు నిలిచిన తీరు ఆ వ్యూహ నిర్మాణాన్ని తెలుపుతున్నది. సర్వసేనానులు ఉభయులూ సైన్యముఖంగా నిలవటం సంప్రదాయం. అందువలన దానిని వ్యూహాంగంగా చెప్పరు. అయితే, సైన్యాధ్యక్షుడు కాక మరొకవీరుడు అగ్రభాగంలో నిలిచినప్పుడది వ్యూహరచనలో ప్రత్యేకతనూ, ప్రాధాన్యాన్నీ సంతరించుకొంటుంది. భీష్ముడు కౌరవసేనకు కన్నాకు. ధృష్టద్యుమ్నుడు పాండవసేనకు మారాకు. వారు సేనాముఖాలుగా ప్రత్యర్థులై నిలవటం సహజం. అతడి వెనుక పాండవబలంలో పదాతి వర్గాన్ని ఎక్కువగా తనవెంట నిలుపుకొనే భీముడు నిలిచాడు. అతడికి అండగా రథికులైన అభిమన్యు ప్రభృతి కుమారవర్గం, నకుల సహదేవులూ ఉన్నారు. సాత్యకి సమేతులై పాంచాల మాత్స్య దేశాధిపతులు దక్షిణోత్తర పార్శ్వాలలో క్రమ్ముకొన్నారు. నడిమిభాగంలో గజసైన్య సహితుడై ధర్మజుడు నిలిచి విజయాశీర్వాదాలు పొందుతున్నాడు. ముందట అర్జునుడిచేత రక్షించబడుతున్న శిఖండి భీష్ముడికి ఎదురుగా నిలిచాడు. అపరభాగంలో మాగధ సహదేవ ధృష్టకేతులు ససైన్యులై విజృంభించి ఉన్నారు.

ఉభయ వ్యూహ సన్నాహాలను బట్టి గమనిస్తే మానుషవ్యూహం దాడికి పనికివచ్చేదనీ, అచలవ్యూహం దాడికి తట్టుకొని ఎదురు దాడికి తోడ్పడేదనీ తేలుతున్నది. అంతేకాదు మానుషవ్యూహంలో ఏకవీర విజృంభణం, బహువీర విజృంభణం విడివిడిగా ఎక్కువగా ఉండవచ్చుననీ, ఆచలవ్యూహంలో బహువీరుల సంఘటిత విజృంభణం ప్రాధాన్యం వహించవచ్చుననీ తోస్తున్నది. ఆ నాటి యుద్ధం తీరు ఈ స్వభావాలను తేటపరుస్తుంది.

ప్రథమ దివస యుద్ధంలో భీష్మ విజృంభణం భయంకరంగా సాగింది. భీమార్జునులు తదితరవీరులు భీష్ముడిని నిలువరించటానికి, ఎదురుదాడులలో వెనుకకు పంపటానికీ ఎంతో యత్నించి సాఫల్యం పొందలేకపోయారు. చివరకు పాండవసైన్యంలో భీష్ముడిని ఎదుర్కొనే వీరులు లేక బెండువడిన సన్నివేశాలు పెక్కులు గోచరించాయి. మానుషవ్యూహ ప్రభావం పిడుగుపాటుగా ఉండటంతో పాండవుల అచలవ్యూహం పర్వతంవలె బ్రద్దలయింది. మొదటినాటి యుద్ధంలో మొనలోని సైనికులు చనిపోవటం ఎక్కువ, మహావీరుల మరణం తక్కువ. ఇది మానుషవ్యూహ స్వభావం. అయితే, మానుష వ్యూహం వలన మహావీర సంహారం కాకుండా సాధ్యమైనంతవరకు శత్రుసంహారం చేసి మూలబలాలను రక్షించుకొని స్థిరంగా నిలిచి ఉండటం అచల వ్యూహరచనా ఫలితం. ధర్మజు డా రాత్రి సేనా వినాశనానికి ఖిన్నుడై యుద్ధం మాని అడవులకు పోతానని శ్రీకృష్ణుడితో చెప్పికొని

వైరాగ్యాన్ని ప్రదర్శించగా అతడు పాండవ మూలబలంగా అచలంగా ఉన్న మహావీరుల ప్రతాపాలను ప్రశంసించి భీష్మ విజృంభణం వలన భీతిల్ల వలసిన అవసరం అంతగా లేదని ధైర్యం చెప్పటం గమనార్హం. ఈ విధంగా సమీక్షించుకొంటే వ్యూహవర్ణనలను తిక్కన చేసిన పద్ధతిలో ఒక తీరు కనపడుతుంది. చర్యాప్రధానమైన యుద్ధఘట్టాల వెనుక ఆలోచనా ప్రధానాలైన వ్యూహరచన లుంటాయి. ఆహవ ఘట్టాలు వర్ణ్య రమణీయాలుగా, వ్యూహ నిర్వహణలు వ్యంగ్య గంభీరాలుగా రచనలో రాణిస్తాయన్నమాట. ఈ తీరు యుద్ధపర్వాల అనుశీలనంలో అనుసరణీయం.

ముందుగా వ్యూహాన్ని నిర్మించుకొనేవారు శత్రు విజయానికి తగిన దాడికి సిద్ధం కావచ్చనీ, ఆలస్యంగా పన్నితే స్వీయ రక్షణ విపత్తులో పడవచ్చనీ భావించిన ధర్మరాజు తానే క్రౌంచవ్యూహాన్ని సూచించి ధృష్టద్యుమ్నుడి చేత పన్నించాడు. ముక్కుగా అర్జునుడు, కన్నులుగా కుంతిభోజుడు, శైబ్యుడు, శిఖగా ద్రుపదుడు, కంఠంగా దశార్ణ శూరసేన కిరాత దేశాధిపతులు, కుడి రెక్కగా భీముడు, ఎడమరెక్కగా ధృష్టద్యుమ్నుడూ ఉన్నారు. మిగిలిన వీరులు ధృష్టద్యుమ్నుడికి అండగా నిలిచారు. జఘనభాగంగా కేకయ కాశిరాజులతో కలిసి విరాటుడూ, వెన్నుగా హూణప్రభువులు పరివేష్టించి ఉన్న ధర్మరాజూ నిలిచారు.

సమతలం మీద ఎదురుదాడి చేసే యుద్ధయుక్తికి తోడ్పడే మానుషవ్యూహం కంటె పక్షిరూపాన ఉండే క్రౌంచవ్యూహం విలక్షణమైనది. క్రౌంచపక్షి ఎగురుతుంది రెక్కలబలంతో. ఆ రెండు రెక్కలు భీమధృష్టద్యుమ్నులు. వారు కౌరవ వ్యూహంలో ఎక్కడైనా వాలి వీరవిహారం చేయవచ్చును. పక్షి ముక్కుతో పొడిచి సర్వత్రా హింసిస్తుంది. అట్లా సర్వసైన్య సంహారానికి పూనుకొన్న ముక్కు అర్జునుడు. ఈ సైన్య వ్యూహంలోని ముందు భాగంలో సర్వసైన్యాధ్యక్షుడుండడు. శత్రుసేనను చెండాడే ఏకవీరుడు ఉంటాడు. వెన్ను విరుగకుండ పక్షి నేల కూలకుండ చూచే వెన్నుబలం ధర్మరాజు. మిగిలినవారు ఈ ముగ్గురికి అండదండలుగా ఆహవం చేసేవారు. అంటే ధర్మరాజు శత్రు వ్యూహంలో పక్షివలె వాలి సైన్యాన్ని ముక్కుతో పొడిచి చీకాకు పెట్టాలని ఆలోచించాడన్నమాట! భీష్ముడి సంఘర్షణ వ్యూహానికి ప్రతిగా ఎదురుదాడి పథకాన్ని ధర్మజుడు రూపొందించాడు.

భీష్ముడు అనుభవజ్ఞుడు. పక్షి నేలమీద వాలితే ఒకవిధం కొమ్మమీద వాలితే ఒక విధం. భీష్ముడు ప్రతివ్యూహాన్ని ప్రత్యేకంగా పన్నలేదు కాని తన సేనలను మూడు శాఖలుగా విభజించి నిలిపాడు. దీనికి పేరేమీ లేదు కాని సౌకర్యం కొరకు త్రిశాఖావ్యూహం అన్నాను. నడిమిభాగంలో బలమైన కొమ్మగా భీష్ముడు నిలిచాడు. దానికి ఒక ప్రక్కన దుశ్శాసన వికర్ణ విందానువిందులూ, శూరసేన యవన త్రిగర్త కురుదేశాలవారూ నిలిచారు. మరొకప్రక్కన ద్రోణుడూ, కుంతల దశార్ణ విదర్భ గాంధార సింధు సౌవీర పతులు గుమికూడారు. ఇది భీష్ముడు పన్నిన ప్రతివ్యూహం.

క్రౌంచపక్షి రెక్కలార్చుకొంటూ వస్తుంది. ముక్కును ముందుకు సాచి దిగుతుంది. ముక్కుతో వేటను పొడుస్తూ రెక్కలు విదిలిస్తూ కొమ్మమీద వాలుతుంది. రెక్కలు విరుగగొట్టితే ఎగురలేకపోతుంది. చివరకు వేటకే వేటగా మారిపోవలసి వస్తుంది. భీష్ముడి ఆలోచన ఇది.

అందువలననే రెండవనాటి యుద్ధంలో భీష్ముడు ప్రతాపంతో ప్రకాశించినా అర్జునుడు మేఘంవలె అడ్డుకొన్నాడు. అతడి ధాటికి కౌరవసేన తట్టుకొనలేకపోయింది. దుర్యోధనుడు కటకటపడి భీష్ముడిని నిష్ఠురాలాడాడు. చేతకాకపోతే కర్ణుడిని యుద్ధానికి అనుమతించుమని అధిక్షేపించాడు. భీష్ముడు అర్జునుడి ముక్కుపోట్ల కంటె దుర్యోధనుడి పుల్లపోట్లకు ఎక్కువగా బాధపడ్డాడు. తిరుగబడి పాండవసేనమీద, ప్రత్యేకించి అర్జునుడిమీద, పోరు ఘోరంగా చేశాడు. రెక్కలుగా నిలిచిన భీమధృష్టద్యుమ్నులు భీష్మోద్ధతిని అణచి పీడించారు. కౌరవపక్షంలోని శాఖలవారు అభిమన్యుముఖ్యులను నొప్పించారు. ముక్కుగా నిలచిన అర్జునుడు ఆగ్రహించాడు. రెక్కలతో ఎగురుతూ, భీష్మ విజృంభణాన్ని భీషణంగా ఎదిరించి మూడు కొమ్మలను ముక్కలు ముక్కలుగా చేశాడు. అందుకే రెండవనాడు అర్జునుడు త్రిపురసంహారం నాటి రుద్రుడుగా ప్రశంస లందుకొన్నాడు.

మూడవనాడు ముందుగానే భీష్ముడు గరుడవ్యూహాన్ని పన్నాడు. అది కూడా పక్షి జాతిదే కాని క్రౌంచం కంటె గరుడపక్షి బలమైనది. క్రిందటిరోజు క్రౌంచపక్షి ముక్కుగా భీష్ముడిని బాధించిన అర్జునుడినీ అతడికి రక్షగా నిలిచిన శ్రీకృష్ణుడినీ గరుడపక్షి ముక్కుగా పొడిచి బాధిద్దామని వ్యూహం పన్నినట్లున్నాడు. ఆ వ్యూహంలో భీష్ముడే ముక్కుగా నిలిచాడు. ద్రోణ కృపవర్మలు కన్నులుగానూ, కృపాశ్వత్థామలు శిరస్సుగానూ, భూరిశ్రవసుడు, శల్యుడు, భగదత్త, సౌవీర జయద్రథులు కంఠంగానూ, దుర్యోధనుడూ అతడి తమ్ముడూ వెన్నుగానూ, విందానువిందులు కాంభోజశూరసేనులు తోకగానూ, మాగధ కళింగాదులు దక్షిణపక్షంగానూ, కర్ణాటకోసల ప్రముఖులు వామపక్షంగానూ నిలిచారు.

దీనికి ప్రతిగా అర్జునుడిచేత ప్రబోధితుడైన ధృష్టద్యుమ్నుడు అర్ధచంద్రాకారవ్యూహం పన్నాడు. పాండ్యమగధ బలాలతో కలిసి భీమసేనుడు దక్షిణశృంగంగా నిలిచాడు. ఆ తరువాత విరాట ప్రముఖులున్నారు. శిఖండి సహితుడైన ధృష్టద్యుమ్నుడిని తోడుగా నిలిపికొని ధర్మరాజు మధ్యభాగంలో ఉన్నాడు. మిగిలిన రాకుమారులందరూ శ్రీకృష్ణ సారథ్యంలో సాగే అర్జునుడి వెంట ఒక కొమ్ము కాశారు.

గరుడవ్యూహం శ్యేనవ్యూహంకంటె బలిష్ఠమైనది కావచ్చును. రెండు పక్షాలను వాటి స్థానంలో ఉంచి ఉరస్యం శత్రుబలంవైపు ముందుకు వెడితే శ్యేనవ్యూహమని కౌటిల్యుడి లక్షణం. ఈ లక్షణం ఆనాటి యుద్ధానికి చాలావరకు సరిపోయింది. ఉరస్యంలో ఉన్నది అనుజసహితుడైన దుర్యోధనుడు. భీష్మద్రోణులకంటె, రెండు పక్షాలలో ఉన్నవారికంటె దుర్యోధనుడు దూసికొని వచ్చి దక్షిణ శృంగంగా ఉన్న భీముడితో తలపడి ఘోరయుద్ధం చేసి మూర్ఛపోయాడు. భీష్మ ద్రోణులు భీముడితో పోరి అతడిని బాధించారు. దుర్యోధనుడు తేరికొని భీముడితో పోరలేక భీష్మద్రోణుల వద్దకు వెళ్ళి వారిని నిష్ఠురాలాడి, తాతవద్ద కర్ణుడి ఊసెత్తి కర్ణ కఠోరంగా మాట్లాడాడు. అంటే ఉరస్యం ముందుకు వెళ్ళే ఆ వ్యూహంలో దుర్యోధనుడు ముందుకు వచ్చి భంగపడ్డాడన్నమాట! కౌరవవ్యూహం దానితో దెబ్బతిన్నది. అందుకే దుర్యోధనుడి మనసు మండింది.

పాండవపక్షం పన్నిన అర్ధచంద్రాకారవ్యూహం శత్రువిజయానికి అనువుగా తోడ్పడింది. గరుడపక్షిని కూల్చాలంటే విల్లయినా కావాలి. బాణమైనా కావాలి. అందుకే కౌటిల్యుడు 'శ్యేనం చాపేన ఘాతయేత్' అన్నాడు ఒకచోట. (పు. 786) శ్యేనవ్యూహాన్ని చాపవ్యూహంతో భేదించాలట. బాణాలలో అర్ధచంద్రాకార బాణం పక్షికంఠాన్ని గాని, కడుపునుగాని, చీల్చటానికి అనువుగా ఉంటుంది. కౌటిల్యుడు అర్ధచంద్రవ్యూహాన్ని, అర్ధచంద్రికా వ్యూహమన్నాడు. అర్ధచంద్రిక కర్కట శృంగంవలె వంగి ఉంటుంది. సేనలను మూడింటిని (రెండు పక్షాలను, ప్రతిగ్రహోరస్యాలలో ఒకదానిని) ఒక విధమైన వంకర ఆకారంలో నిలబెడితే అది అర్ధచంద్రికా వ్యూహమని కౌటిల్యమతం. ఆ లక్షణం పాండవ వ్యూహానికి అన్వయిస్తుంది.

దుర్యోధనుడిచేత నిష్ఠురాలు పలికించుకొన్న భీష్ముడు గరుత్మంతుడి వలె లేచాడు. రెండు రెక్కలుగా నిలిచిన వీరులకంటె గరుడపక్షి ముక్కు వంటి భీష్ముడు తీక్ష్ణబాణాలతో పాండవసైన్యాన్నే కాక శ్రీకృష్ణార్జునుల నొప్పించాడు. అది గరుడవ్యూహ రచనా ప్రభావం. శ్రీకృష్ణుడు చక్రప్రయోగం చేయవలసినంత అవసరం ఏర్పడింది. దానిని అర్జునుడు వారించి క్రోధంతో భీష్ముడిపై విరుచుకుపడ్డాడు. అతడిని చిక్కుపరిచాడు. కౌరవసైన్యాన్ని పెంట కుప్పలుగా మార్చాడు. పాండవవ్యూహం సఫలమయింది.

బాణముఖం రెండు శిఖలతో వాడిగా అర్ధచంద్రాకారంగా ఉంటుంది. పాండవవ్యూహంలో ఆ ముఖాలు భీమార్జునులు. వారిద్దరూ శత్రువీర వ్యూహగర్భస్థుడైన దుర్యోధనుడినీ, ముక్కుగా ఉన్న భీష్ముడినీ గ్రుచ్చి నొప్పించి గరుడవ్యూహాన్ని గాయపరిచారు. దుర్యోధన భీష్ములు బాణశిఖలను మొక్కపోగొట్టలేకపోగా డొక్కలలో గ్రుచ్చుకొనకుండ రక్షించుకొనలేకపోయారు. బాణ ప్రయోగనిపుణుడైన పార్థుడు వ్యూహప్రయోగ నిపుణుడని పేరొందాడు.

వ్యూహరచన చేసినా రెండుసార్లు వికలమైన కౌరవసైన్యాన్ని మరునాడు వ్యూహరచన చేయకుండానే భీష్ముడు రణరంగంలో నిలిపాడు. అంటే ఆ నాడు అనియత వ్యూహ యుద్ధానికి గానీ, తుముల యుద్ధానికి గానీ సిద్ధమని ప్రకటించాడన్నమాట! పాండవులు

కూడా దానిని సవాలుగా తీసికొని తుములయుద్ధానికే ముందుకు వచ్చారు. అందుకే ఆనాటి యుద్ధంలో దొమ్మియుద్ధాలు ఎక్కువగా సాగాయి. భీమ నాయకమైన సేనకూ, దుర్యోధన ప్రేరితమైన సేనకూ పోరు విపరీతంగా సాగింది. భీమ ఘటోత్కచులు భీష్మ ద్రోణుల కంటె తుముల యుద్ధంలో భయంకరంగా భాసించారు. ఒక విధంగా తుముల యుద్ధ వ్యూహం కూడా కౌరవులకు తోడుపడలేదు. అర్జునుడిని ఎదుర్కొనటం ఎంత కష్టమో భీముడిని నిర్జించటం కూడా అంత దుష్కరమని నాల్గవనాటి పోరు నిరూపించింది. శ్రీకృష్ణ పార్థులున్న వైపు ఏ వ్యూహమైనా విఫలం కాదని వారి నెదిరించే శత్రువ్యూహాలు ఓడిపోక తప్పదనీ భీష్మాదులు గ్రహించి నిష్ఠురాలాడే దుర్యోధనుడికి ఆ సత్యాన్ని తెగించి చెప్పటం జరిగింది.

అయిదవనాడు భీష్ముడు మకరవ్యూహం పన్నాడు.'పురస్తా దభ్యాఘాతే మకరేణ యాయాత్' (కౌటి. అర్థ. పు. 758) అని కౌటిల్యుడు. ఎదుటినుండి శత్రువు ఆక్రమించే భయం ఉన్నప్పుడు మకర వ్యూహంతో ముందుకు వెళ్ళాలని యుద్ధనీతి చెప్తుతున్నది కాబట్టి మకరవ్యూహం పన్నటంలో రహస్యం బయటపడుతూనే ఉన్నది. పాండవులు శ్యేనవ్యూహం పన్నారు. మకరానికి కాళ్ళు అందించకుండా శ్యేనం వలె కౌరవసేనను ముక్కుతో పొడిచి, రెక్కలతో కొట్టి పార్థుడు పిండి చేశాడు. భీష్ముడు చేపట్టి చేజార్చుకొన్న గరుడవ్యూహం వంటి సజాతీయ వ్యూహాన్ని తాను చేపట్టి విజయుడ ననిపించుకొన్నానని పార్థుడు తాతకు వీరగుణపాఠాన్ని నేర్పాడు.

తాత మనుమళ్ళకు గూఢాభిమానాలతో కూడుకొన్న వ్యూహ రచనల పోటీలు పెరిగాయి. ఒకరు పన్ని విడిచిన దానిని మరొకరు పన్ని నెగ్గించుకొనే పట్టుదలలు పొడసూపాయి. ఆరవనాడు అర్జునుడు మకరవ్యూహాన్ని పన్నించాడు. దాని కెదురుగా భీష్ముడు క్రౌంచవ్యూహం నిర్మించాడు. మకరవ్యూహంలో శిరస్సు అర్జునుడు కావటంతో కౌరవసేన అతడి బాణాల కోరల పాలబడింది. భీష్మద్రోణులు క్రౌంచతుండం కావటంతో పాండవసేన తూట్లు పడింది. భీమాదు లొకవైపూ, దుర్యోధనాదు లొకవైపూ తుండకంఠస్థానీయులై పరస్పర పీడనకు తలపడ్డారు. కౌరవుల వ్యూహంగా విఫలమైన మకరం పాండవుల బలంతో నెగ్గింది. దానిని స్వయంగా చూచిన దుర్యోధనుడూ విన్న ధృతరాష్ట్రుడూ కారణం తెలియక ఆశ్చర్యపోయారు. కౌరవుల దురహంకారం, తండ్రి ఉపేక్షా దానికి కారణాలని తెలిసికొని తెల్లబోయారు.

ఏడవనాడు భీష్ముడు మండలవ్యూహం పన్నాడు. దానికి ప్రతిగా ధర్మజుడు వజ్రవ్యూహాన్ని సన్నద్ధం చేశాడు. ఎత్తు భీష్ముడిది పైయెత్తు పాండవులదిగా వ్యూహ రచన సాగింది. పక్షాలు, కక్షాలు, ఉరస్యాలు చాల దగ్గర దగ్గరగా ఉంటే అది మండలవ్యూహ మంటారు. శత్రు సైన్యానికి అభిముఖంగా సమస్త సైన్యాలూ కలిసి ఒక్కుమ్మడిగా అన్ని వైపుల ప్రసరించటం మండలం అని కౌటిల్యుడు. "సరతాం సర్వతోవృత్తిః మణ్డలః" (పుట. 783). భీష్ముడు పాండవసైన్యాన్ని చుట్టుముట్టి మట్టుపెట్టాలన్న ఆలోచనతో సప్తమదివస యుద్ధం సాగించుమన్నాడని వ్యూహం వ్యాఖ్యానించి చెప్పింది.

'పార్శ్వాల నుండి ఆక్రమణం జరుగుతుందనే భయం ఉన్నప్పుడు వజ్రవ్యూహం'లో ప్రస్థానం చేయటం యుద్ధనీతి అని కౌటిల్యరాజనీతి. దాని ననుసరించి ధర్మరాజు వజ్రవ్యూహాన్ని పన్నాడు. అందువలన పార్శ్వాల నాశ్రయించి పాండవసైన్యాన్ని చుట్టుముట్టి ఆక్రమించే భీష్మయుద్ధ వ్యూహాన్ని నూరుముఖాల విజృంభించి దానిపై పిడుగులు కురిపించి స్వీయరక్షణకు సమర్థమైన వజ్రవ్యూహం విజయపథాన నడిపించింది.

ఎనిమిదవనాడు కూర్మవ్యూహాన్నీ భీష్ముడూ, శృంగాట వ్యూహాన్ని ధృష్టద్యుమ్నుడూ పన్నారు. శత్రువులు పైకి ఉరికినప్పుడు తాబేలు వలె స్వీయరక్షణోపాయాలను అమలుపరచటంలో కూర్మవ్యూహం తోడ్పడుతుంది. శత్రువ్యూహ మర్మాలను బట్టబయలు చేసి బాహాటంగా నట్టనడిగడ్డలపై శత్రువీరులను సంహరించే నేర్పు ప్రకటించేది శృంగాటవ్యూహం. ఆనాడు భీష్మభీముల యుద్ధం ప్రబలపాత్ర నిర్వహించింది. భీముడు దుర్యోధనుడి సోదరులను మహావీరులు చూస్తుండగానే శృంగాటకంలో వలె వరుసగా సంహరించిన ఘట్టం అద్భుతాన్ని సృష్టించింది. దుర్యోధనుడు భీష్ముడిని సర్వసైన్యాధిపత్యం వదలి కర్ణుడి కప్పగించుమని అడిగేటంత ఆవేగాన్ని కౌరవులకు కలిగించింది.

తొమ్మిదవనాడు భీష్ముడు సర్వతోభద్రవ్యూహాన్ని పన్నగా పాండవులు దృఢవ్యూహాన్ని అమర్చారు. నలువైపులనుండి ఆక్రమణభయం ఉన్నప్పుడు మాత్రమే సర్వతోభద్ర వ్యూహాన్ని పన్నటం యుద్ధ వ్యూహ రచనలో పరిపాటి. భీష్ముడి మానసిక స్థితికి ఆ వ్యూహం బహిఃప్రతీక. పాండవుల యుద్ధ క్రియా పాటవానికి అది ప్రతిఘటన సూచిక. దానికి విరుగుడు అన్నివైపులనుండి శత్రువులను ఆక్రమించటమే. దానికి తోడ్పడేదే సర్వతోభద్రవ్యూహం. అది భీకరమైన దాడిని సూచించే వ్యూహం కాబట్టి దానిని గట్టిగా తట్టుకొన గలిగిన దృఢవ్యూహం పాండవులు ఎన్నుకొనవలసి వచ్చింది. ఇది పాండవులకు పరీక్ష. తిక్కనగారు వ్యూహానికి పేరు చెప్పలేదు కాని గట్టివ్యూహం అన్నాడు. అది దృఢవ్యూహానికి తెలుగురూపం కావచ్చును. ఎంతటి దృఢవ్యూహమైనా మండలవ్యూహంలో మునిగిపోయింది. భీష్మప్రతాపంలో మ్రగ్గిపోయింది. శ్రీకృష్ణార్జునులకే భీష్మాగ్నిని ఆర్పటానికి సాధ్యం కాకపోయింది. శ్రీకృష్ణుడు భీష్ముడిపై చక్రప్రయోగం చేయబోయేంత తీవ్రస్థితి కలిగింది. పితామహుడు బ్రతికిఉంటే పాండవులు బ్రతికిఉండే ఆశలు దూరమయ్యాయి. పాండవసైన్యం దీనమై దీప్తి కోల్పోయింది. ధర్మజు డా రాత్రి భీష్ముడి వధోపాయాన్ని అర్థించవలసి వచ్చింది. కౌరవ విజయకేతనం మింట నిలిచిన రోజది. సర్వతోభద్ర వ్యూహం సఫలమైన దిన మది.

పదవనాడు ప్రత్యేక వ్యూహాలు లేవు. కౌరవపక్షంలో భీష్ముడి చివరినాటి ప్రతాపాగ్ని ప్రజ్వలనానికి ప్రదర్శనరంగంగా నిలిచే వ్యూహం. ఆయన సేనాముఖంలో నిలిచి ఆయనయే సేనా సర్వస్వమై సర్వతోముఖ సమర పాండిత్యాన్ని ప్రదర్శించి, విరక్తిని భజించి, అంపశయ్యమీద ఒరిగిపోయే యుద్ధం. ఆయన స్వయంగా తన విషాదాంతం కొరకు ఏర్పాటు చేసికొన్న ఆత్మవధవ్యూహం. అందుకే దానిని భీష్మవ్యూహం అన్నాను. ఆ నాడు పాండవ పక్షంలో శిఖండి సేనాముఖంలో నిలిచిన మహావీరుడు. అతడిని ముందు పెట్టుకొని, భీష్ముడి ముందు నిలిపి, అతడు బాణాలు వేస్తున్నట్లే అర్జునుడు బాణవర్షం కురిపించి, యుద్ధ విముఖుడౌతున్న భీష్ముడిని పడవేసే సన్నివేశానికే ప్రాముఖ్యాన్ని కల్పించిన వ్యూహాన్ని శిఖండి వ్యూహమన్నాను. పూర్వ సంకల్పిత నిర్ణయాలను వ్యూహపరంగా అమలుపరచిన ఒక యుద్ధనాటక మది. ఒక మహావీరుడి సాహసగాథకు సార్థక చరమాంకం.

భీష్మపర్వంలో వ్యూహాలన్నీ ఆయా యుద్ధ ప్రయోజనాలను సాధించటానికి అమర్చిన యుద్ధయుక్తులే, సంరక్షితయానాలే, సంరక్షిత విక్రమ విధానాలే. తిక్కన వాటిని వర్ణనాత్మకంగా తీర్చి దిద్ది భారతీయ రణనీతికీ, తెలుగువారి యుద్ధకళకూ కావ్యగౌరవాన్ని కలిగించాడు.

## 23. రణరంగ వర్ణనలు :

రణవీరులు చేసిన యుద్ధ చిత్రాలను రణరంగ వర్ణనలతో రంగరించి చెప్పటం తిక్కనకు పరిపాటి. సామాన్యంగా ప్రతిదినం మధ్యాహ్న సమయంలోనూ యుద్ధావసాన దశలోనూ రణరంగ వర్ణనం చేసి ముగించే విధానం కనపడుతుంది. అందులో తిక్కన బాణభట్టును తలపింపజేస్తాడు. ప్రథమ దివస మధ్యాహ్న సమయంలో తుముల యుద్ధంతో రణరంగం వీరవిహార భూమిగా రాణించిన వర్ణనం దీర్ఘవచనంలో నిబద్ధించబడింది. (చూడు: 1.267); రెండవనాటి యుద్ధ సమాప్తిలో అర్జునుడి పరాక్రమానికి కౌరవసైన్యం పొందిన పాటు వచనంలో వివరించబడింది (291); తృతీయ దివసాంతంలో 'అర్జునుడు కేశకలాపంబు శైవాలంబును బ్రేవుల ప్రోవులు ఫేనపుంజంబులును మేదోమాంస సమస్త మస్తిష్క పటలంబు పంకంబును నగు రక్త నదీ ప్రవాహంబు భవదీయ సేనామధ్యంబునం బఱపి బేతాళ క్రవ్యాదాది భూతంబుల నోలలార్చె' (2.166) నని జుగుప్సారమణీయంగా రూపకంలో తిక్కన నిర్వహించాడు. పదిరోజుల సమరంలో తిక్కన మధ్యాహ్న సాయంకాల సమయాలలో వీర విజృంభణాలను గాని, రణరంగ దృశ్యాలనుగాని వర్ణించి యుద్ధ వర్ణనలకు సమయ సూచనాత్మకమైన ఒక కళాపద్ధతిని అలవరచాడు. ఉదాహరణకు ఏడవరోజు మధ్యాహ్న సాయంకాల రణరంగ వర్ణనలు: 'ఆ సంక్రందన నందనుండు రాజుల గములకుం గవిసి కేతనంబులు నఱకియు, సారథి రథిక రథ్యంబుల ప్రాణంబులు వెఱికియు, నాతపత్ర చామరంబులు పొడి సేసియుఁ జాపంబులు రూపఱఁజేసియు,

జర్మంబులు వ్రచ్చియు, మర్మంబుల మార్గణంబులు గ్రుచ్చియు, సర్వాంగంబులు నొంచియుఁ దలలు ద్రుంచియు విహరించుచుండ నపరాహ్ణంబయ్యె' (3.50) నన్నది సహజ సుందరం. 'ఇనుఁడు దర్శనీయ మండలుండగుచు నపరశైల శిఖర గతుండయ్యె; నయ్యెడ సంజ కెంజాయ నెఱయ నెత్తురు టేఱులపయి వడిం దేలిపోవు పీనుంగులం దివిచికొని చను భూత బేతాళ సమ్మర్దంబులను, సమర తల ప్రాంత పతితంబులైన శవంబులం గైకొని చెలంగు సృగాలంబుల రవంబులను దత్సమయం బతిఘోరం బగుటయు' (3.65) అన్నది బీభత్స రమణీయం. స్థిరచరవస్తు చిత్రణం రణరంగ వర్ణనలోని వైవిధ్యం.

**24. సన్నివేశ వర్ణనలు :**

యుద్ధాలలో వీరుల నడుమ జరిగే ద్వంద్వ యుద్ధ సన్నివేశాలు కాని, మూక ఉమ్మడి సన్నివేశాలు గాని, వ్యూహక్రీడా చతురంగ గతులుగాని ఉత్సాహంతో పాటు ఉత్కంఠనూ, ఉద్వేగాన్నీ కూడా కలిగిస్తాయి. విసుగు పుట్టని వినోదాన్ని పుట్టిస్తాయి. అటువంటి వాటిని సహజ సుందరంగా సన్నివేశ బంధురంగా తిక్కన సంఘటించి శిల్పాన్ని ప్రదర్శించటం యుద్ధ పర్వాలలో పెక్కుచోట్ల కనపడుతుంది. భీష్మపర్వంలో పదిరోజుల యుద్ధం మూడాశ్వాసాలలో చెప్పటంచేత వర్ణన నాతివిస్తారం గానూ, నాతిక్లిష్టంగానూ సన్నివేశాలు చకచక సాగిపోతున్నట్లుంటాయి. ఇటువంటి సంగ్రహకథనంలో తిక్కన జిలుగు వెలుగులను చిత్రించటం మహాకవిలక్షణం. ఉదాహరణకు ద్వితీయ దివసంలోని ధృష్టద్యుమ్న ద్రోణాచార్యుల యుద్ధం, భీమసేన భానుమంతుల యుద్ధం, దుర్యోధన భీమసేనుల యుద్ధం, చతుర్థ దివసంలో ఘటోత్కచుడి మాయాయుద్ధం, పంచమదివస యుద్ధంలో అభిమన్యు లక్ష్మణ కుమారుల యుద్ధం, షష్ఠ దివసంలో ధృష్టద్యుమ్న ద్రోణుల యుద్ధం, అష్టమదివసంలో అలంబస ఇరావంతుల యుద్ధం, నవమదివసంలో అర్జున ద్రోణుల యుద్ధం, దశమ దివసంలో భీష్మశతానందుల యుద్ధం పేర్కొన దగినవి. మచ్చుకు భీష్ముడు శతానీకుడిని చంపిన ఘట్టం ముచ్చటగా మూడు పద్యాలలో చెప్పింది చకచక జరిగిన దృశ్యం కంటికి కట్టించేది.

క. ' సేనల నిమ్మెయి భీష్ముఁడు । దీనతఁ బొందింప నలిగి ధీరత్వము వీ
రానీకం బగ్గింప శ । తానీకుఁ డెదిర్చె నతని నాసురభంగిన్.

వ. ఇట్లు దాఁకి విరటుతమ్ముండు వాలమ్ముల నొప్పించినం గోపించి.

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి సూతు వెస నుర్విం గూల్చి రథ్యంబులన్
డొల్లం దీవ్రత నేసి యాతఁడు భుజాటోపంబు శౌర్యంబు శో
భిల్లన్ వైచిన శక్తియుం దునిమి యాభీలద్యుతి ప్రస్ఫుర
ద్భల్లం బొక్కటి భీష్ముఁ డేసి నఱకెం దన్మస్తకం బుగ్రతన్.' **(భీష్మ. 3. 390 - 392)**

ఈ రచనలో ప్రతిపదం సార్థకం. పొల్లు పదంలేని రచన. భీష్ముడు సేనలను దీనత్వంలోకి దింపాడు. శత్రుకృతమైన ఆ క్రూరకర్మకు వీరుడైన శతానీకుడికి కోపం వచ్చింది. ఎదిరించటానికి అతడి ముందున్న మహావీరుడు భీష్ముడు. అతడిపై దాడి చేయాలంటే ధీరత్వం కావాలి. శతానందుడు తెగించి ధైర్యంతో యుద్ధానికి తలపడ్డాడు. ఆ పరిస్థితులలో శతానీకుడు ఆ ప్రయత్నం చేయటమే ఘనం. అందుకు వీరులందరూ అతడిని ప్రశంసించారు. వారి ప్రోత్సాహంతో అతడు ఉబ్బిపోయాడు. రాక్షసుడివలె విజృంభించి భీష్ముడిపై విరుచుకుపడ్డాడు. వాలమ్ములతో అతడిని నొప్పించాడు. ఆ చర్యకు భీష్ముడు కోపించాడు. శతానీకుడిమీద శరపరంపర సంధించాడు. వరుసగా విల్లును, కేతువును, సూతుడిని, గుర్రాలనూ నేలగూల్చాడు. విరథుడైన శతానందుడు వీగిపోక, మండిపడి శౌర్యమూర్తి అయి, భుజబలాన్నంతా ఉపయోగించి శక్తిని భీష్ముడిపై సంధించాడు. అందుకు భీష్ముడు ఆగ్రహించి శక్తిని మధ్యలోనే త్రుంచివేశాడు. భయంకరమై, కాంతిచ్ఛటలతో ప్రకాశించే భల్లాన్ని ప్రయోగించి శతానీకుడి శిరస్సును త్రుంచి చంపాడు.

సన్నివేశం చిన్నది. కాని ఎన్ని వివరాలు పొందు పరిచాడు తిక్కన! శతానీకుడికి కలిగింది కోపం అనే స్థాయిభావం. దానివలన ధీరత్వం ఉప్పొంగింది. భీష్ముడిపై విజృంభింపజేసింది. మూడుమాటలలో రసభావానుభావదీప్తి ముప్పిరిగొనేటట్లు రచన రాణించింది. అతడు భీష్ముడిపై బాణాలను, శక్తిని ప్రయోగించి చంపాలనే సూటిచూపు తప్ప దానిలో ఒక క్రమాన్ని పాటించాలన్న నేర్పు కనపడదు. క్రమంలేని పరాక్రమం శతానందుడి విక్రమం. భీష్ముడు మహాయోధుడు. ఎదుటి వీరుడి స్వరూప స్వభావాలను వెంటనే పసిగట్టి తగిన పద్ధతిని ఎన్నుకొని, శాస్త్రబద్ధంగా యుద్ధంచేసి, శత్రుసంహారాన్ని నిర్వహించగల దక్షు డాయన. అందుకే ముందు శతానందుడి విల్లువిరిచి బాణ ప్రయోగాన్ని అరికట్టాడు. చివరకు విరథుడిని చేసి నేలమీదకు దించాడు. అంతటితో ఆగి శతానందుడు తలదాచుకొంటాడేమో అని అవకాశం ఇచ్చాడు. కాని, అతడు శూరుడివలె విరథుడైనా భీష్ముడితో తలపడటానికి సిద్ధమై శక్తిని ప్రయోగించాడు. తన శక్తి నెరుగకుండ భీష్ముడిని వధించే శక్తిని ప్రదర్శింప దలచుకొన్న శతానందుడిని భయంకరంగా (మహాకోపంతో) భల్లంతో తల నరికి చంపాడు. భీష్ముడి పరిణతిని, శతానందుడి ఆవేశాన్నీ అక్షరాలా చిత్రించే ఈ చిన్న ఘట్టం తిక్కన సన్నివేశ చిత్రణకు చక్కని మచ్చుతునక!

## 25. వీరోక్తుల వర్ణనలు :

యుద్ధ ఘట్టాలకు రసప్రకాశం రంగరించేవి వీరుల పౌరుషోక్తులతో కూడికొన్న ప్రసంగాలు. అయితే, భీష్మపర్వంలో రణరంగాలలో వీరుల రౌద్ర ప్రసంగాలు తక్కువ. యుద్ధ క్రియా ప్రదర్శనలు ఎక్కువ. అయినా, కృష్ణార్జున సంవాదం వంటి భగవద్గీతా ఘట్టాలూ, పరస్పర వీర పరాక్రమ ప్రశస్తులున్న ప్రసంగాలూ, వీర పరాక్రమాలను సమీక్షించే సంభాషణలూ ఎక్కువ. మచ్చుకొకటి రెండు.

శ్రీకృష్ణుడు అర్జునుడితో (భగవద్గీతలో)

చ. ‘ వగవఁగ నేమియుం దగని వారికి నై హృదయంబు గుందఁగా
వగచెదు బుద్ధిమాటలును వావిరి నాడెదు నీవు; పండితుల్
వగతురె యున్నవారికి నవశ్య విధేయతఁ జన్నవారికిం;
దెగు వగలెల్లఁ జిత్తము ప్రదీప్త వివేకమయత్వ మొందినన్’. **(భీష్మ. 1. 195)**

భీష్ముడు దుర్యోధనుడితో చేసిన పార్థ పరాక్రమ ప్రశంస:

సీ. ‘ కాల్పఁడే మహనీయ ఖాండవం బింద్రుని । నమరగణంబుతో విముఖుఁ జేసి,
బహుదివ్య శరములు వడయఁడే యెక్కటి । బవరాన మెప్పించి శివునిచేత,
గంధర్వులకు నోడి కర్ణుండు నీ తమ్ము । లును బాఱ విడిపించికొనఁడె నిన్ను,
నిను నను ద్రోణు నాతని పుత్రుఁ గృపుఁ గర్ణు । గెలిచి విరాటు గోవులఁ గొనండె?

ఆ. తక్కు పెక్కు లెడలఁ బెక్కండ్ర నే మేమి । సేసె వినమె? యట్టి జెట్టి నిన్ని
దినము లిట్లు దొడరి పెనఁగియు నీ చేత । నేఁడు వినఁగవలసె వేఁడి పలుకు.’ **(భీష్మ. 3. 177)**

ధర్మరాజు భీష్ముడితో -

ఉ. ‘ చిచ్చఱకన్ను మూసికొని చేతి త్రిశూలము డాఁచి లీలమై
వచ్చిన రుద్రు చందమున వ్రాలుదు వీ వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టి మగవారికి? నీ కృప నాశ్రయింపఁగా
వచ్చితి; మెవ్విధిన్ గెలువవచ్చు? మహాత్మ! యెఱుంగఁ జెప్పవే.’ **(భీష్మ. 3. 300)**

**26. అభినయ వర్ణనలు :**

నానారసాభ్యుదయోల్లాసి అయిన విరాటపర్వంలో తిక్కన ప్రదర్శించిన అభినయ వర్ణన మరే పర్వంలోనూ ప్రత్యక్షం కాదు. భీష్మపర్వం వీరరౌద్ర కరుణ రసభావాల సమ్మేళనం. యుద్ధక్రియలలో వీరులు ప్రదర్శించే భావాలను శబ్దమాత్రంగా సూచించి వాటి భావనను పఠితలకు వదలిపెట్టాడు తిక్కన. ఉదాహరణకు - శ్రీకృష్ణుడు భీష్ముడి మీదకు విజృంభించుమని అభినయబంధురంగా ప్రబోధించిన తీరు విశేషం:

చ. ‘ గజిబిజి లేక, యుబ్బక, యఖండిత శౌర్యము, నస్త్రవీర్యమున్
భుజబలముం బొగడ్తవడ భూరిపరాక్రమశాలి భీష్మ న
క్కజముగఁ దాఁకి యద్దెస నకంపితులై నడతెంచు శల్య కుం
భజకురురాజు లచ్చెరువుపాటు భయంబును బొందఁ జేయుమీ!’ **(భీష్మ. 2. 33)**

ఇందులో అర్జునుడు శౌర్యాస్త్ర ప్రదర్శనంలో తడబాటు పడగూడదట! ఉబ్బితబ్బిబ్బు కాకూడదట! భుజబల ప్రకటనం పరులు పొగడేటట్లు ఉండాలట! పరాక్రమశాలి అయిన భీష్ముడే ఆశ్చర్యపడేట్లు ఆయనమీద దాడి చెయ్యాలట! అకంపితులై వస్తున్న శల్యద్రోణులు ఆశ్చర్యంతో కూడిన భయం పొందేటట్లు ఎదురుదెబ్బ తీయాలట! శ్రీకృష్ణ డిచ్చిన ఈ సూచన అభినయాత్మకమైన యుద్ధకార్యశిక్షగానూ ఉన్నది. నటులకు అభ్యాసం నేర్పుతున్న ఆచార్యుడి నాట్యశిక్షగానూ తోస్తున్నది. ఉభయకవిమిత్రుడి శిల్పమిది!

విభావానుభావసాత్త్విక భావావేశాలను ఒక్కెడ పేర్చి ఒక రసభావస్థితిని అభినయాత్మకంగా ఆవిష్కరించటం తిక్కనకు కొట్టినపిండి. అటువంటి రచనను అక్కడక్కడ అమర్చా డీ పర్వంలో. మచ్చుకు - రణరంగంలో మృతుడై పడిఉన్న తన కుమారుడైన ఇరావంతుడిని చూచి అర్జునుడు శోకభావావేశానికి గురి అయ్యాడు. ఆ వర్ణన ఇది -

చ. ‘ ఘనతరశోక వేగమునఁ గన్నుల నీళులు నించి యా సుయో
ధను నవినీతియుం బిదప ధర్మతనూజుఁడు సంధి గోరి ప
ల్కిన తగవుం, గడంగి యనికిం దలకొన్న నిజోద్యమంబుఁ దోఁ
చిన మదిఁ దిట్టుచున్, వినుతి సేయుచు, రోయుచునుండె నయ్యెడన్ ’. **(భీష్మ. 3. 156)**

ఇందులో పుత్రశోకభావావేశం భావం. కన్నులవెంట నీళ్ళు నిండటం సాత్త్వికభావం, అతడి మృతికి కారణమైన యుద్ధానికి దారితీసిన పూర్వ సంఘటనలు జ్ఞాపకం రావటం స్మృతి. వితర్కం మొదలైన సంచారిభావాల సంచారం. పుత్రమరణానికి మూలకారణమని భావించిన దుర్యోధనుడిని తిట్టటం, కుమారుడి గుణగణాలను పేర్కొంటూ ఆవేదనపడటం వాచికాభినయం. ఈ పద్యం సహజవర్ణనంగా సమకూరిన అభినయవర్ణనం!

మాట మనసు చేసే అభినయం. ఆ సత్యాన్ని భీష్మ పాత్రద్వారా నిరూపించిన ఒక ముత్యమంత పద్యం హృద్యం. భీష్ముడి వింటిని వివ్వచ్చుడు విరిచాడు. మరొక వింటిని ఎత్తుకొంటుండగానే దానిని కూడ త్రుటిలో విరిచాడు.

క. ‘ అతఁ డొండొక విల్లెత్తిన । నతిరయమున నదియుఁ దునుమ నాతం ‘డౌరా!
శతమఖనందన!’ యనుచును । ధృతి వేఱొకవింట శరతతిం బరగించెన్’. **(భీష్మ. 3. 258)**

‘ఔరా! శతమఖనందన!’ అనే మాట పలికించి ‘ఔరా! తిక్కన సోమయాజి!’ అనిపించుకొన్నాడు.

భీష్మపర్వంలో మూడు విషాదాభినయా లున్నాయి. ఒకటి - ధృతరాష్ట్రుడు భీష్ముడి మరణవార్త వినగానే 'చిత్తంబు జల్లని యొల్లంబోయి మూర్ఛిల్లి కొండొకసేపునకు శిశిర విధానంబుల సేదదేఱి, గన్నీరు దొరంగ గద్గదకంఠుండై' (భీష్మ. 1.50) నట్లు తిక్కన వర్ణించాడు.

భీష్ముడు ఎనిమిది నాళ్ళయినా సవ్యసాచిని చంపలేదని దుర్యోధనుడు నిష్ఠురాలాడి కర్ణుడిని యుద్ధం చేయటానికి అనుమతించుమని అన్నప్పుడు.

క. ' అమ్మాట మనమునకు వా । లమ్మై తాఁకుటయు భీష్ముఁ డత్యంత విషా
దమ్మున నించుకవడి మౌ । నమ్ము దగం దాల్చియుండె నతవదనుండై.

వ. పదంపడి నిట్టూర్పు నిగిడించి మొగం బెగయించి భూపాలు నాలోకించి,' **(భీష్మ. 3. 173, 174)**

మారు పల్కనట్లు తిక్కన అభినయ వర్ణనం చేశాడు.

అర్జునుడు విషాదయోగాన్ని భజించినప్పుడు స్వీయవిషాద స్థితిని వర్ణించుకొంటూ చెప్పిన పద్యం మరొక అభినయ వర్ణన పద్ధతికి నిదర్శనం.

చ. ' సరసిజనాభ! బంధుజనసంతతిఁ గయ్యపునేలఁ జూడఁగా
విరవిరఁ బోయి మేను నిడువెండ్రుక వెట్టుచుఁ గంప మొందెఁ, జే
నిరతము గాదు గాండివము, నిల్వఁగ నోర్వవు గాళ్ళు; నేను ని
ష్ఠురతకుఁ జాలనొల్ల; నొకఁడున్ మహి యేలుట యేటి సౌఖ్యముల్?' **(భీష్మ. 1. 181)**

విషాదత్రయాన్ని వివిధ వర్ణన పద్ధతులలో వర్ణించటం శిల్పం!

**27. ప్రకృతి వర్ణనలు :**

ప్రత్యేకంగా ప్రకృతిని వర్ణించిన ఘట్టాలు భీష్మపర్వంలో కానరావు. అయితే కథాసందర్భంతో సంవదించిన కాలాన్ని ప్రకృతితో సమన్వయించి ఆలంకారికంగా వర్ణించటం తిక్కన పరిపాటి. ఉదా:

క. ' సోమాన్వయ ప్రదీపకుఁ । డీ మెయి ( దేజోవిశేష మెసకం బెసఁగం
గా మెఱయుటఁ గనుఁగొని సి । గ్గై మఱువడు మాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్'.

తే. ' జలరుహంబులు పాండవసైనికుల మొ । గంబులట్టుల విన్ననై కాంతి దఱిఁగె;
వారి మనముల భీత్యంధకార మడరు । కరణిఁ జీఁకటి యెడనెడఁ గవియుదెంచె.'

**(భీష్మ. 1. 299, 300)**

క. ' కిరణంబు లడఁగి యంతకు । నరుణత్వము మెఱయఁ దరణి యపరాద్రి శిరః
స్ఫురణను నధిక రణాలం । కరణం బొనరించుటయును గాంగేయుఁ డెడన్.'

క. ' శ్రాంతం బయ్యెను వాహన । సంతానం బెల్ల నిపుడు సంధ్యాసమయం
బింతట నేఁటికి నని సా । లింతముగా కింకఁ బోర లెస్సై యున్నే! ' **(భీష్మ. 2. 339-340)**

క. ' తా నస్తశిఖరి మఱువడఁ । బోనియపుడు పాండురాజపుత్త్ర విరాజ
త్సేన పాడ వడఁగు ననుకృప । నో నలినాప్తుండు గ్రుంకె నుర్వీనాథా! ' **(భీష్మ. 3. 271)**

వ్యాస తిక్కనల దయవలన మహాభారత యుద్ధకాలంలో సూర్యుడు సైతం నిష్కారణంగా నిష్క్రమించలేదు.

## 28. తెలుగుభారతంలో పరచుకొని ఉన్న భగవద్గీత

ఆంధ్రమహాభారత భీష్మపర్వంలో పండితుల మధ్య ఒక ప్రధాన వివాదాంశం ఉన్నది. అది భగవద్గీతకు సంబంధించింది. సంస్కృత మహాభారతంలోని భగవద్గీతను తిక్కన పూర్తిగా తెలుగులోకి తేలేదు. సంక్షిప్తంగా కొన్ని అంశాలను మాత్రమే తీసికొన్నాడు. దానివలన మూలగౌరవం కంటె తెలుగు రచనకు మర్యాద తరిగిందని భావించేవారు కొందరున్నారు. శాస్త్రేతిహాసంలో ఉన్న భగవద్గీతను కావ్యేతిహాస నిర్మాత అయిన తిక్కన కావ్యకళాదృష్టితో దానిని తగ్గించాడనీ, అది ఉచితమే అనీ మరికొందరు తలుస్తారు. భగవద్గీతలో ప్రతిపాదించబడిన అంశాలు తిక్కన ఒక్కచోట చెప్పకపోయినా, అవి భారతమంతా పరచుకొని ఉన్నవి కాబట్టి తిక్కన భగవద్గీతను తెలుగులో వదలినట్లు కాదనీ, దోషం చేసినట్లు కాదనీ, ఎంతవరకు అవసరమో అంతవరకే తిక్కన గ్రహించాడనీ పేర్కొన్నారు. ఈ అంశాన్ని వివరించే డా॥ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రిగారి మాటలు ప్రస్తుతాలు:

'అర్జునుని యుద్ధ విముఖతను నివారించుట సందర్భముగా భారతమున గీత ప్రసక్తించినది. అనగా రణోత్సాహ కారణముగా స్వధర్మావలంబనము వదలదగమిని అర్జునుడు తెలిసికొనుట కేయే విషయములు శ్రీకృష్ణుడు చెప్పినాడో అదంతయు భగవద్గీత. పదునెనిమిది అధ్యాయములలోని ఏడువందల శ్లోకముల తాత్పర్యమును అదియే కావలయును. కేవలము శ్రీకృష్ణపరమాత్మ చేసిన ఉపదేశము ఐదువందల డెబ్బది నాల్గు శ్లోకముల మేర వ్యాపించియున్నది. కాని, యథార్థమునకు గీత ఒక్క కర్మ ప్రాధాన్యమునే చెప్పుటలేదు. 'లోకేzస్మిన్ ద్వివిధా నిష్ఠా, పురా ప్రోక్తా మయానఘ జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్' (3-3) కర్మజ్ఞానములు రెండింటిని గీత చెప్పినది. భాష్యకారులు నిష్కామమైన కర్మను జ్ఞానసాధనముగా చెప్పినారు. మరి అర్జునుని విషయమునను ఈ యర్థమునే భావించినచో వాని యుద్ధమున ప్రవర్తించుట జ్ఞానమునకు సాధనము కావలయును కాని కాలేదు. మహాభారతమున గీతకు అర్జునుడు యుద్ధమున ప్రవర్తించుటయే ఫలము. అశ్వమేధపర్వమున అర్జునుడు శ్రీకృష్ణునితో ఇట్లనినాడు:

' అనికిఁ దొడంగునప్పుడు మదాత్మ కలంగిన కొన్ని తత్త్వబో
ధన మహనీయ వాక్యము లుదాత్తకృపం దగ నీవు సెప్పి తే
మనమున వాని యర్థములు మాధవ! నిల్పఁగఁ జాలనైతి'. **(అశ్వ. 1. 153)**

శ్రీకృష్ణుని ఉపదేశము పూర్తిగా అర్జునున కప్పుడు పట్టలేదు. స్వధర్మమునందు ప్రవర్తించుట ఒక్కటే అర్జునున కానాడు పట్టినది. తదనుగుణముగా ప్రవర్తించినాడు. అట్టిచో భగవద్గీతను మొత్తము యథాతథముగా భీష్మపర్వమున తిక్కనగారు వ్రాసియున్నచో అర్జునుని యందు ఫలమునకు రాని అనగా వాని బుద్ధి కెక్కని విషయముకూడ వ్రాయబడినట్లగును కదా! ప్రయోజన రహితమైన విషయము నంతగా నేల వ్రాయవలయును? అందువలన తిక్కనగారు భీష్మపర్వమున భగవద్గీతను మొత్తమునకు మొత్తముగా అనువదించలేదు.

అయినచో భగవద్గీతా గత బహువిషయములు తెనుగు భారతమున లేకుండపోయినట్లే కదా అనవచ్చును. ఎక్కడకును పోలేదు. శాంత్యనుశాసనాశ్వమేధ పర్వములయందు గీతార్థము రకరకములుగా వ్యాపించియున్నది. మొదలు స్త్రీపర్వమున ధృతరాష్ట్రుని ఉపశమింపజేయుటకు విదురుడు చెప్పిన మాటలయందే గీతార్థము గుబాళించుచున్నది. ఎట్లును తరువాతి పర్వములలో ప్రయోజనసహితముగా జ్ఞానబోధ జరుగబోవునప్పుడు ప్రయోజన రహితముగా పదునెనిమిది అధ్యాయముల గీతను ఏడువందల శ్లోకముల తోడి దానిని తుచ తప్పక వ్రాయవలసిన పనిలేదు. అందుకే తిక్కనగారు వ్రాయలేదు.

భగవద్గీత ముఖ్యముగా సాంఖ్యయోగమును గూర్చి చెప్పినది. శాంతిత్రయమున గల వేదాంత విషయమంతయు నదియే. భారతమున శాంతిత్రయాదికమునందున్న సాంఖ్యయోగ విషయములను పరిశీలించినచో అవి గీతయందలివే అని తెలియగలదు. గీతకు అతిరిక్తములు కావు. అందువల్ల తిక్కన్నగారి భారతమున గీతార్థము లేకుండ పోయినదన్న చింత అక్కరలేదు. అర్జునుడు యుద్ధమున ప్రవర్తించుటకు భగవద్గీతలోని ఏ భాగము మిక్కిలిగా తోడ్పడినదని తిక్కన్నగారి కనిపించినదో ఆ భాగమునే ఆయన వ్రాసెను.

లౌకికముగా చూచినచో శ్రీకృష్ణుడు చెప్పినమాట అర్జునుడు వినుటయే జరిగినది. ఆయన యుద్ధము చేయుమనగా ఈయన చేసెను. నిత్యజీవితములో మనము చూచుచునే యున్నాము. ఒకడు చెప్పును. ఇంకొకడు చేయును. చేయువానికి చెప్పినవానియందు భయభక్తులుగాని, గౌరవమర్యాదలు గాని ఉండవలయును. ఒకనిమాట నొకడు చేయుటకు భయభక్తులే ముఖ్యకారణము. గీతోపదేశ సందర్భమున శ్రీకృష్ణుడు విశ్వరూపమును ప్రదర్శించి అర్జునునియం దాభావములను కల్పించినాడు. ఏకాదశాధ్యాయము నందున్న అర్జునుని మాటలను నిదానముగా విచారించినచో ఆ విషయము స్పష్టము కాగలదు. విశ్వరూపమును చూచి చూచి అర్జునుడు చివర కనినాడు గదా 'న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్' (11-31). ఈ ఘోరరూపముతో నీవు ప్రవర్తించుటలోని యాంతర్యము నాకు బోధపడుట లేదు - అని. అప్పుడు నేను లోకనాశనము కొరకు వృద్ధినొందిన యముడనని చెప్పుచు శ్రీకృష్ణుడు 'ఉత్తిష్ఠ యశో లభస్వ జిత్వా శత్రూన్' (33) లెమ్ము! శత్రువులను జయించి యశము పొందుము - అని అర్జునుని హెచ్చరించాడు. శ్రీకృష్ణుడు విశ్వరూపమును ప్రదర్శించినది అర్జునుడు శత్రువులను జయించుట కొరకు. అదియే శ్రీకృష్ణుని ఆంతర్యము. అర్జునుడు యుద్ధమున ప్రవర్తించుటకు పదునొకండవ అధ్యాయము ప్రబలమైన హేతువు.

'ధర్మక్షేత్రే కురుక్షేత్రే' - యత్ర యోగీశ్వరః కృష్ణో' - అను ఈ మొదలైన భగవద్గీతయొక్క ఆద్యంతశ్లోకములను యథాతథముగా తిక్కనగారు భీష్మపర్వమున గీతోపదేశమున కాద్యంతములుగా నిక్షేపించిరి. అందువల్ల ఆద్యంతములుగా వ్యాపించిన భగవద్గీతయొక్క తాత్పర్యము ఇందు మాచేతను నిక్షిప్తమగుచున్నదన్న సూచనను మనము భావించవచ్చును. మరియు జాగ్రత్తగా పరిశీలించినచో తిక్కన్నగారు వ్రాసిన గీతోపదేశమున ఎక్కువగా ఏకాదశాధ్యాయమందలి శ్లోకముల యర్థమునే మనము చూడగలము. అర్జునుడు యుద్ధమున ప్రవర్తించుటకు శ్రీకృష్ణుని మాట వినుట కే యధ్యాయము ముఖ్యమో ఆ అధ్యాయమునందలి శ్లోకార్థముల నెక్కువగా గ్రహించి వ్రాసెను. మొత్తము గీతనుండి రెండు మూ డటునిటుగా నూరు శ్లోకముల యర్థమును తిక్కన్నగారు తెనుగున వ్రాసిరి. అందు నలువది శ్లోకముల యర్థ మొక్క ఏకాదశాధ్యాయము నుండి గ్రహింపబడినది. ఈ భగవద్గీతానువాద విషయము నెంత సూక్ష్మముగా విచారించి తిక్కన్నగారు సర్వతంత్ర స్వతంత్రముగా ప్రవర్తించినదియు ఇక బుద్ధిమంతు లూహించవచ్చును. కనుక గీతను మొత్తము భీష్మపర్వమున తిక్కన్నగా రనువదించలేదు. అనువదించకపోవుటయే ఔచిత్యవంతముగా నున్నది. మరియు నక్కడక్కడ గీతాశ్లోకముల కివి అనువాద పద్యములా అన్నట్లున్నవి కొన్ని తిక్కన్నగారి భారతమున కనిపించుచున్నవి.

1. 'శ్రేయా న్స్వధర్మో విగుణః' (3.35) ఇత్యాది శ్లోకమునకు 'ఒప్పకున్నను నాత్మకులోక్త కర్మ మూర్ధ్వగతిఁ జేర్చు' (శాంతి. 1.279) అని తిక్కనగారి పద్యము.

2. 'యదృచ్ఛాలాభ సంతుష్టో' (4.22) ఇత్యాది శ్లోకమునకు శాంతిపర్వమున

తే. ' అనఘ! సుఖదుఃఖములు వచ్చినపుడు మద వి । షాదములు లేక సంప్రాప్త సముపభోగ
రతుఁడు నప్రాప్యవాంఛా నిరాసకుండు । నగుట సారతపోరూప మండ్రు బుధులు.'

**(శాంతి. 5.501)**

3. 'విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని' (5-18) ఇత్యాది శ్లోకమునకు తిక్కన్నగారి తెనుగు పద్యము.

చ. 'వినయము విద్యయుం గలుగు విప్రునియందును గోవునందు నొ
ప్పు నెఱయు హస్తియందు నొకపోకకుఁ బోవని కుక్కయందు దా
ని నడఁచి తెచ్చి వండి తిను నీచపు మాలనియందు తుల్యద
ర్శనము తదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్'. **(5. 109)**

4. 'సర్వతః పాణిపాదం' (13.14) ఇత్యాది శ్లోకమునకు తిక్కన్నగారి పద్యమును అశ్వమేధ పర్వమున (1.223) '(కలయంగ నెల్లయెడలం దలలును' అను ఈ మొదలైన పద్యమును చూచునది.

ఈ విధముగా మరికొన్ని శ్లోకములు పద్యములు ఏరి చూపించవచ్చును. ఇంతకును ఫలితార్థ మేమనగా భీష్మపర్వమున తిక్కన్నగారు భగవద్గీతను మొత్తముగా వ్రాయకపోవుటయే సముచితముగా నున్నదనియు, గీతార్థము తెలుగుభారతమున నష్టమై పోలేదనియు, అది తరువాతి శాంత్యాది పర్వములలో నిక్షిప్తమై యున్నదనియును.

భగవద్గీత ఏ అధ్యాయమునుండి ఏ యే శ్లోకములను గ్రహించి తిక్కన్నగారు వ్రాసినదియు ఇక్కడ చూపబడుచున్నది.

| శ్రీమద్భగవద్గీత | | భీష్మపర్వము | | శ్రీమద్భగవద్గీత | | భీష్మపర్వము | |
|---|---|---|---|---|---|---|---|
| అధ్యా. | శ్లోకములు | ఆశ్వా. | పద్యము | అధ్యా. | శ్లోకములు | ఆశ్వా. | పద్యము |
| 1 | 1 | 1 | 171 | 11 | 5 | 1 | 208 |
| 1 | 3 | 1 | 173 | 11 | 8 | 1 | 209 |
| 1 | 4 - 13 | 1 | 174 | 11 | 9, 12, 14 | 1 | 210 |
| 1 | 15 - 18 | 1 | 176 | 11 | 15 - 25 | 1 | 211 - 213 |
| 1 | 19 | 1 | 177 | 11 | 26, 27, 31 | 1 | 214 |
| 1 | 20 | 1 | 178 | 11 | 33 - 35 | 1 | 215 |
| 1 | 21 - 23 | 1 | 179 | 11 | 38 - 39 | 1 | 216 |
| 1 | 24 - 27 | 1 | 180 | 11 | 41, 42 | 1 | 217 |
| 1 | 29 - 32 | 1 | 181 | 11 | 44 | 1 | 218 |
| 1 | 33 | 1 | 182 | 11 | 46 | 1 | 219 |
| 1 | 34 - 42 | 1 | 183 - 187 | 11 | 48, 53, 54 | 1 | 220 |
| 1 | 45 - 46 | 1 | 188 | 11 | 55 | 1 | 221 |
| 2 | 1 | 1 | 189 | 11 | 66 | 1 | 224 |
| 2 | 2 | 1 | 190 | 11 | 67 | 1 | 226 |
| 2 | 4, 5 | 1 | 193 | 11 | 72 | 1 | 227 |
| 2 | 7 | 1 | 194 | 11 | 73 | 1 | 228 |
| 2 | 11 | 1 | 195 | 11 | 74, 77 | 1 | 229 |
| 2 | 13, 17, 20 - 23 | 1 | 196 | 11 | 78 | 1 | 231 |
| 2 | 31, 32 | 1 | 201 | | | | |

(శ్రీ ఆంధ్రమహా భారతము - భీష్మపర్వము - ఉపోద్ఘాతము. డాక్టర్ కేతవరపు వేంకటరామకోటి శాస్త్రి - పుటలు xvi - xx (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ 1971)

## 29. స్తోత్రాలు తిక్కన తెలుగు చేయలేదు

యుధిష్ఠిరుడు యుద్ధయాత్రకు పూనుకొన్నప్పుడు శ్రీకృష్ణుడి సలహా మేరకు అర్జునుడు దుర్గాదేవిని స్తుతించినట్లు కొన్ని ప్రతులలో ఉన్నది.

"నమస్తే సిద్ధసేనాని । ఆర్యే మందరవాసిని।
కుమారి కాళి కాపాలి । కపిలే కృష్ణపింగళే॥"

అని ఆరంభించిన స్తుతి 13 శ్లోకాలలో సాగింది. ఆ తరువాత దుర్గాస్తోత్ర ఫలశ్రుతి కూడా నాలుగు శ్లోకాలలో ఉన్నది.

"సంగ్రామే విజయే న్నిత్యం । లక్ష్మీం ప్రాప్నోతి కేవలామ్।
ఆరోగ్య బలసంపన్నో । జీవేద్వర్ష శతం తథా॥"

అని ముగుస్తుంది. ఇది అంతా మూలంలో ఒక అధ్యాయం (ఇరవైమూడో అధ్యాయం). శ్రీకృష్ణుడే దుర్గాస్తుతి చేయుమని చెప్పటం అసంబద్ధం. నిజానికి శ్రీకృష్ణుడు ఆయననే శరణువేడుమని చెప్పాడు. అందువలన తిక్కన దీనిని గ్రహించి ఉండడు. అట్లా చేయటం ఉచితమే.

ఇట్లాగే అరవై ఏడవ అధ్యాయంలో వర్ణించబడిన శ్రీకృష్ణభగవానుని మహిమను, అరవై ఎనిమిదవ అధ్యాయంలోని పంచభూత స్తోత్రాన్నీ తిక్కన తెలుగు చేయకపోవటం కూడా సముచితమే.

## 30. కవిత్రయ మహాభారతం : వ్యాఖ్యానం

ఆదికావ్యమైన ఆంధ్రమహాభారతం తెలుగులో అవతరించి దాదాపు వెయ్యేళ్ళు కావస్తున్నా, ఇంతవరకు దానికి సమగ్ర వ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామి వారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్టవ్యావహారిక భాషలో సరళవ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి ఆనందించే అపూర్వ సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానం వారు భారతీయ వైదిక ధర్మప్రచార మహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమవేద వ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండల రాయడు మాత్రమే చేపట్టి, ధర్మరక్షణ కళాప్రావీణ్యంతో ఈ బృహత్తర ధర్మకార్యాన్ని ప్రజలకు ప్రసన్నంగా ప్రసాదించగలిగిన పరమదయాళువు. ఆ దేవదేవుడి కృపాకటాక్షంతో పండితులు పదునెనిమిది పర్వాల ఈ దివ్య ప్రబంధ మండలిని పరిష్కరించి, ప్రతిపద్యానికి వ్యాఖ్యానం వెలయించి, సవిమర్శకమైన పీఠికలు సమకూర్చి కథాసారాదులతో సర్వార్థ సాధకంగా సంతరించి, సర్వాంగ సుందరంగా ప్రచురించి, సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీతిరుమలేశుడి పక్షాన బాధ్యత వహించి, అభ్యుదయ పరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి. బోర్డు ఛైర్మన్, సభ్యులు, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, సప్తగిరి సంపాదకులూ, వారి సహకారులూ, సంపాదక సలహామండలుల సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ఎడిటోరియల్ సెల్ సభ్యులూ, పలురకాలుగా ఈ కార్యక్రమంలో తోడ్పడుతున్న అధికార, అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. అది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపు దిద్దుకొన్నది. విస్తృతమైన ఆరణ్యపర్వం మూడవ సంపుటిగా రెండుభాగాలలో ప్రచురించబడింది. మొదటిభాగం నన్నయ

రచించిన ఆరణ్యపర్వభాగం. రెండవభాగం ఎఱ్ఱాప్రెగ్గడ పూరించిన ఆరణ్యపర్వశేషం. ఈ విధంగా ఆరణ్యపర్వం విభజించబడి ప్రచురించబడటం తెలుగులో ప్రథమం. నాల్గవ, అయిదవ సంపుటులుగా విరాట, ఉద్యోగపర్వాలు వెలువడ్డాయి. ఇప్పటి ఈ ఆరవసంపుటి భీష్మపర్వం.

భీష్మపర్వ వ్యాఖ్యానంలో ఇద్దరు మహాపండితులు పాల్గొన్నారు. మొదటి రెండాశ్వాసాలకు డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్యులుగారూ, మూడవ ఆశ్వాసానికి శ్రీ చెరుకూరి జయచంద్రశాస్త్రిగారూ వ్యాఖ్యానం వ్రాశారు. వీరిరువురూ సాహిత్య సముద్రాన్ని మథించిన మనీషులు కావటంతో వ్యాఖ్యానం అమృతతుల్యంగా ఉన్నది. ఈ పర్వానికి పీఠికను నేను సంతరించాను. ఇవి ఆంధ్రుల ఆమోదాన్ని పొందుతాయని ఆశిస్తున్నాను.

ఈ సంపుటి ఈ విధంగా రూపొందటానికి తోడ్పడిన మిత్రులు విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారికీ, శ్రీ. కె. సత్యరామప్రసాదుగారికీ, శ్రీమతి జె. రామసుబ్బలక్ష్మిగారికీ, శ్రీ జి. రాధాకృష్ణగారికి, శ్రీమతులు సుశీలా లక్ష్మీవిద్యానాథులకూ, డాక్టర్ వి. యస్. లక్ష్మిగారికీ నా హార్దిక కృతజ్ఞతలు.

పరమ కల్యాణ భద్రమూర్తి అయిన శ్రీ పద్మావతీసహిత శ్రీ వేంకటేశ్వరస్వామివారు వేదవేద్యులు, వేదాంతగమ్యులు. పరతత్త్వరూపులు. అయినా భక్తసులభులు, సాహిత్యసంగీత ప్రియులు, రసానందమూర్తులు. ఆ స్వామికి ఈ పంచమవేదం అక్షరమైన తోమాలసేవ. వ్యాఖ్యానం సుగంధ పరిమళసేవ. భీష్మ పర్వ విశేషాంశాలు ఉజ్జ్వలాలంకారసేవ. పీఠిక విరాణ్మూర్తికి మంగళనీరాజనం. ఈ పర్వం స్వామివారికి సారస్వతమైన అక్షరార్చనం.

సత్య శివ సుందరరూపుడైన స్వామి దివ్య సన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలోని భాగంగా పుణ్య పూజా కుసుమ మంజరిగా సమర్పించుకొంటున్నాను. విశ్వశ్రేయస్సును ప్రసాదించుమని స్వామిని వేడుకొంటున్నాను.

హైదరాబాదు
స్వభాను శ్రీ రామనవమి
11. 4. 2003

**జి.వి. సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు,
కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు,
తిరుమల తిరుపతి దేవస్థానం.

# భీష్మపర్వ కథాసారం

పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రంలో పాండవ కౌరవులు ఒకరి నొకరు గెలిచే తలంపుతో సైన్యాలను మోహరించి కయ్యానికి కాలుత్రవ్వుతూ ఉన్నారు. ధృతరాష్ట్రుడు కొడుకుల దుర్వినయానికి దుఃఖిస్తూ సంజయుడితో మాట్లాడుతూ ఉండగా వేదవ్యాసమహర్షి వచ్చాడు. ఆయన ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: 'రాజులకు కాలం చెల్లింది. అందువలననే ఈ యుద్ధం వచ్చింది. దీనికి నీవు విచారించకుము. నీ వా యుద్ధాన్ని చూడటానికి దివ్యదృష్టి నిస్తాను. చూడుము'. అన్నాడు. అన్నదమ్ములు దారుణంగా క్రూరంగా యుద్ధం చేసే ఆ దృశ్యాలను తాను చూడలేనని ధృతరాష్ట్రుడు పలికాడు. అయితే, ఆ యుద్ధాన్ని చూచి, ఎవరైనా వర్ణించి చెపితే వినాలని ఉన్నదని కోరిక వ్యక్తం చేశాడు. వేదవ్యాసుడు యుద్ధవార్తలు తెలియచెప్పటానికి సంజయుడిని నియోగించాడు. రెండువైపులవారు రాత్రింబవళ్ళు ప్రవర్తించే పద్ధతులు తెలిసికొనటానికీ, రహస్య సంభాషణలు వినటానికీ, మనోభావాలను గ్రహించటానికీ తగిన శక్తిని వరంగా అతడికి ప్రసాదించాడు. అతివేగంగా వెళ్ళే శక్తినీ, యుద్ధరంగంలో తిరిగేటప్పుడు శస్త్రాస్త్రాలు తగలకుండా ఉండే ప్రభావాన్నీ, దివ్యుల మాటలు, రూపాలు, తలపులు తేటపడేటట్లు దివ్యబోధను ప్రసాదించాడు. భూప్రజకు ప్రళయకాలం వచ్చింది కాబట్టి కురుక్షేత్ర యుద్ధం వచ్చిందనీ, ధర్మమే జయిస్తుందనీ నిశ్చింతగా ఉండుమనీ ధృతరాష్ట్రుడికి చెప్పాడు. కురుపాండవుల కీర్తిని తానే కీర్తించి ప్రకటిస్తానని వేదవ్యాసుడు ప్రకటించి ధృతరాష్ట్రుడిని ఊరటపరిచాడు. కౌరవసైన్యంలో కనపడుతున్న అనేక దుర్నిమిత్తాలను పేర్కొని కులక్షయం, అనేకరాజుల మరణం తప్పదని హెచ్చరించాడు. దుర్యోధనాదులను వారించి పాండవులకు న్యాయంగా రావలసిన రాజ్యభాగ మిచ్చి శాంతిని నెలకొల్పి, మావంటి వారికి సంతోషాన్ని కలిగించుమనీ, నీకీ రాజ్యకాంక్ష ఎందు? కని హితవు చెప్పాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు. 'మహర్షీ! మీరు హితాన్నీ, ధర్మాన్నీ మనసులో పెట్టుకొని ఇట్లా చెప్పారు. నేను కూడా నా కొడుకులకు ఇదివరలో తరచి తరచి చెప్పి చూచాను. వారిని అదుపులో పెట్టే నైపుణ్యంగాని, ప్రభుత్వంగాని నాకు లేవు. ఈ అంశాన్ని మీరు తలపోసి నా కిటువంటి సలహా చెప్పటం మానండి. పరిస్థితులు పాకం తప్పాయి.' ఈ మాటలు విని వ్యాసుడు పెదవి విరిచాడు. 'యుద్ధంలో గెలుపు ఎవరిదో తెలుపు' మని ధృతరాష్ట్రుడు అడిగాడు. అప్పుడు కనపడుతున్న కొన్ని శుభశకునాలను పేర్కొంటూ వ్యాసుడు 'జయం దైవాధీన' మనీ, 'పెద్దలు యుద్ధాన్ని మెచ్చ' రనీ, చెప్పి అంతర్ధానమయ్యాడు.

'లోకంలో రాజులు భూమికొరకు అనాదిగా యుద్ధాలు చేస్తూనే ఉన్నారు. రాజ్యమంటే రాజులకు ఎంత తీపియో?' అని ధృతరాష్ట్రుడు భావించి భూపరిమాణాన్ని గురించి చెప్పమని సంజయుడిని అడిగాడు. నానావిధ చరాచరాలన్నీ భూమిమీద పుట్టుతాయి, పెరుగుతాయి, చనిపోతాయి కాబట్టి భూమి అన్నిటికీ ఆధారమైనది. పంచమహాభూతాలలో భూమి గొప్పది - అని భూమండల విశేషాలనూ, భారత వర్ష స్వరూప స్వభావాలనూ సంజయుడు వివరించి చెప్పాడు. ఆ తరువాత యుద్ధ విశేషాలను దర్శించటానికి అతడు రణరంగానికి వెళ్ళి, కొన్ని రోజుల తరువాత తిరిగివచ్చి, ధృతరాష్ట్రుడికి నమస్కరించి, భీష్ముడు యుద్ధంలో అంపశయ్యపై ఒరిగిపోయిన వృత్తాంతాన్ని చెప్పాడు.

ధృతరాష్ట్రు డా దుర్వార్త విని బావురుమని ఎలుగెత్తి ఏడ్చాడు. 'భీష్ముడు సాక్షాన్నరసింహమూర్తి వంటివాడు. చాపమే అతడి నోరు. భల్లాలు అతడి క్రూరదంతాలు. బాణాలే అతని గోళ్ళు. ఖడ్గమే అతడి నాల్క. భీష్ముడు కేవలం నరుడు కాదు. పదివేలమంది రాజులకు ఎదురు నిలిచి యుద్ధం చేయగల మహావీరుడు. అతడు శిఖండి చేతిలో ఒరిగిపోయాడా? విధి బలీయం' - అని అనేక రకాలుగా ధృతరాష్ట్రుడు శోకించాడు. కొంతసేపు మూర్ఛపోయి తేరుకొన్నాడు. కన్నీరు పెట్టుతూ గద్గద కంఠంతో ఇట్లా అడిగాడు: 'సంజయా! దేవతలూ రాక్షసులూ ఒక్కటై వచ్చినా వారిని ఓడించగల ధీరుడు భీష్ముడు. శిఖండి బాణాల బారిన ఎట్లా పడ్డాడు? ఇక ఏమి అనటానికి వీలుంది? పరశురాముడిని సైతం నిగ్రహించగలిగిన భీష్ముడిని అర్జునుడు శిఖండిని ఎదురుగా నిలిపి సాధించాడా? ఆ శౌర్యం, ఆ బలం, ఆ శీలం, ఆ పరాక్రమం, ఆ నియమవ్రతం - చూచి భీష్ముడికి నాశం ఉండదని గట్టిగా నమ్మాను. నా నమ్మిక

వమ్మయింది. అయినా, ఆ యుద్ధంలో భీష్ముడా దురవస్థకు లోనైనప్పుడు ఆయనను ఆదుకొనటానికి మనలోని మహావీరు లెవ్వరూ దగ్గరలేరా? అందరూ కలిసి అడవిలో కలిసిపోయారా? ఒంటరిగా ఆ మహావీరుడు నేలపై పడవలసిన స్థితి ఎట్లా ఏర్పడింది? ఆయన పోతే మిగిలిన యుద్ధవీరులంతా పోయినట్లే అని అనుకొంటున్నాను. కులవృద్ధుడైన భీష్ముడిని చంపి రాజ్యం చేయాలనుకొంటున్న పాండవులకే దైవం సహాయం చేస్తున్నాడు. ధర్మానికి కీడు చేసి అధర్మం పెరిగినట్లున్నది. భీష్ముడిని చంపి రాజ్యం పొందాలనుకొని సంపదకై సమరం చేసే ఈ రాచకులంలో పుట్టటమే దురదృష్టం. భీష్ముడు నాయకుడుగా లేని కౌరవసైన్యం మగడులేని మగువవలె మనస్తాపం పొంది ఉంటుంది. ఆ తరువాత కౌరవులు ఎవరిని సైన్యాధ్యక్షుడిగా చేశారు? భీష్ముడి పదిరోజుల యుద్ధం ఎట్లా సాగింది? ఆ విపత్తును గడచి కౌరవులు ఏ విధంగా పురోగమించారు? వివరాలన్నీ తెలుపుము' . అని ఆవేగంతో అడిగాడు ధృతరాష్ట్రుడు. సంజయు డిట్లా పలికాడు:

'ప్రభూ! నీ అవినీతి వలన ధర్మనిరతులైన పాండవులు పడరాని పాట్లు పడ్డారు. దానివలన ఇంత ముప్పు వచ్చిపడింది. కీడు చేసేవారికి కీడు కలుగుతుంది. మంచి చెడులను సమీక్షించకుండా యుద్ధరంగంలో జరిగిన విశేషాలను వినుము.' అని అంటూ వేదవ్యాస మహర్షి పాదాలను తలంచి మ్రొక్కి, భక్తిరసానందంతో దివ్యమతియుతుడై యుద్ధ విశేషాలను వివరించటం ప్రారంభించాడు.

భీష్మాది కురువీరులు పరివేష్టించి ఉండగా దుర్యోధనుడు తన స్కంధావారంలో ఒక సమావేశం ఏర్పాటు చేశాడు. ఆ సమయంలో సంజయుడు అక్కడికి దివ్యగమనంతో చేరుకొన్నాడు. అప్పుడు సుయోధనుడు దుశ్శాసనుడిని ఇట్లా ఆజ్ఞాపించాడు.

'చాలాకాలం నుండి ఎదురుచూస్తున్న కౌరవుల పాండవుల మధ్య యుద్ధం ఇన్నాళ్ళకు సిద్ధించింది. భీష్ముడు మనకు రక్ష. మనమందరం ఏ విధంగానైనా ఆయనను రక్షించాలి. మన మాయనను కాపాడితే ఆయన మన శత్రువులను చెండాడుతాడు. యుద్ధోద్యోగ సమయంలో భీష్ముడు తన నెవ్వరు ఎదుర్కొన్నా వారిని సంహరించగలననీ, శిఖండిని మాత్రం జయించలేననీ పేర్కొన్నాడు. రక్షణలేని సింహానికి నక్కకూడ హాని చేయగలుగుతుంది. అట్లాగే మనం భీష్ముడికి రక్షణ కలిగించకపోతే ఆయన శిఖండిపాలుగాక తప్పదు. పెద్దపులి నిద్రిస్తుంటే బలంతో పొట్టేలు క్రుమ్మి చంపినట్లుగా రక్షలేని భీష్ముడిని శిఖండి చంపకుండా మనం అప్రమత్తులమై ఉండాలి. కాబట్టి రథికులందరూ కలిసి భీష్ముడిని రక్షించాలి. శిఖండి ఆయనకు ఎదురుపడకుండా చూడాలి'. అన్నాడు.

తెల్లవారింది. యుద్ధ యాత్రాసంరంభం ఉద్ధృతమైంది. కౌరవులవైపు - భీష్ముడు తేరుపై ముందు సాగగా మహావీరులందరూ వారి వారి సైన్యబలాలతో కదలి మహాసముద్రంవలె భయంకరంగా రణరంగంలో నిలిచారు. భీష్ముడు రాజులనందరినీ ఉద్దేశించి ఈ విధంగా పలికాడు:

'యుద్ధం రాజులకు తెరిచి ఉన్న స్వర్గద్వారం వంటిది. పూర్వమెందరో ఆ మార్గాన నడిచారు. మీరూ ఆ మార్గాన నడవటం న్యాయం. ఇళ్ళల్లో రోగాలతో చనిపోవటంకంటె పాపం మరొకటి లేదు. రాజులకు యుద్ధభూమిలో చావటం పెన్నిధిని పొందటం వంటిది.'

ఈ మాటలు విని రాజులందరు ఉప్పొంగి భీష్ముడి ముందు వివిధ ప్రమాణాలు చేశారు. భీష్ముడు కర్ణుడిని పుత్ర మిత్రామాత్య సహితంగా యుద్ధానికి రాకూడదని దుర్యోధనుడితో హెచ్చరించాడు. 'ఇతరులను వద్దని తానొక్కడే వెళ్ళటం బలవంతుల లక్షణం కదా!' అని దుర్యోధనుడు ప్రశంసించాడు. రారాజు కోరికపై భీష్ముడు మానుషవ్యూహాన్ని పన్నాడు.

ఆ వ్యూహంలో భీష్మద్రోణులు ముందు నిలిచారు. కృపాశ్వత్థామలు వలపట, కృతవర్మ మద్రేశ్వరులు దాపట, బాహ్లీక సోమదత్త భూరిశ్రవసులు వెనుక, దుర్యోధనుడు కురుకుమారవర్గంతో కలిసి మధ్యభాగంలో నిలిచారు. అతడికి ముందుగా పదివేలమంది సంశప్తకులు సుశర్మను ముందుంచుకొని 'మేము అర్జునుడిని చంపుతాము. లేదా, చస్తాము' అని శపథం చేస్తూ సన్నద్ధమయ్యారు. మిగిలిన రాజులను ఆయాచోట్ల పదిలంగా నిలిపి 'ఇంతకుపూర్వం ఇంతటి దృఢవ్యూహాన్ని ఎన్నడూ చూడలేదు'

అని అందరూ ఆశ్చర్యపోయేటట్లు ఏర్పరిచారు. దేవతలు, స్వర్గవాసులైన పూర్వరాజులు - అనేకమంది ఆకసంలో నిలబడి ఆసక్తితో యుద్ధాన్ని చూడటానికి సిద్ధమై ఉన్నారు. ఇది కౌరవపక్ష సన్నాహం.

అంతకుముందే పాండవపక్షం యుద్ధానికి ఆయత్తమై ఉన్నది. వెలిగొడుగుల వెలుగుతో యుధిష్ఠిరుడు ముందుగా యుద్ధభూమికి సాగాడు. భుజాస్తంభ విజృంభణంతో భీముడూ, కదులుతున్న రోహణాద్రివలె శ్రీకృష్ణ సారథికమైన రథాన్ని అధిరోహించి అర్జునుడూ ధర్మజుడి వెంట నడిచారు. ఆ తరువాత నకుల సహదేవులూ, అభిమన్యుడూ, ద్రౌపదేయులూ యుద్ధోత్సాహంతో వెడలారు. వారి వెంట ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు, సౌభద్రుడు, మొదలైనవారు వెంట నడిచారు. పాంచాల మత్స్య దేశాధిపతులూ, సాత్యకీ, చేకితానుడూ, శిఖండి, మగధ దేశాధిపతి అయిన సహదేవుడు, అతడి తమ్ముడు, ధృష్టకేతుడు, అతడి సోదరుడు, ఘటోత్కచుడు, పాండ్యరాజు, కేకయరాజ పంచకం, శైబ్యుడు, కాశ, కరూశాది బహుదేశాధీశులు మొదలైన మహావీరులు సైన్యాలతో సహా రణరంగంలో నిలిచారు. పాండవసేనకు ముఖతిలకం వలె సర్వసైన్యాధ్యక్షుడైన ధృష్టద్యుమ్నుడు రాణించాడు. పాండవసేనలు కదలి కురుక్షేత్రంలోని శమంతక పంచక సమీపంలో సాగిపోతున్నప్పుడు ధర్మరాజుకు కుడికన్ను అదరటం వంటి శుభశకునాలు తోచాయి. అతడు సంతోషిస్తూ తూర్పు మొగమై కౌరవసైన్యానికి ఎదురుగా నిలిచి అందరితో ఇట్లా అన్నాడు: ' మన మీ యుద్ధంలో రాజ్యలాభాన్ని పొందుదాం. లేదా పవిత్రమైన వీరస్వర్గాన్ని చేరుదాం-' అని శపథం చేశాడు. రాజులందరూ అతడి యెదుట విజయశపథాలు చేసి, విజయతిలకాలు ధరించారు.

పాండవసైన్యంకంటె కౌరవసైన్యం అధికసంఖ్యలో ఉండి విస్తారంగా కనపడుతున్నది. దానిని చూచి ధర్మరాజు నివ్వెరపోయి అర్జునుడికి ఆ సైన్యాన్ని చూపాడు. పార్థుడు చిన్ననవ్వు నవ్వి అన్నతో ఇట్లా అన్నాడు: 'ధర్మాన్ని నాశనం చేసేవారికి విస్తారమైన సైన్యం ఉన్నా, ధర్మపాలకులకు సైన్యబలం తక్కువగా ఉన్నా, విజయం రెండవవారినే వరిస్తుం'దని నారదు డొకసారి నేనూ, ద్రోణాచార్యుడూ, పితామహుడూ, వేదవ్యాసులవారూ వినేటట్లు చెప్పాడు. కాబట్టి గోవింద రక్షితమైన పాండవపక్షానికి విజయం తథ్యం.' అని పలికి పాండవవీరుల పరాక్రమాన్ని ప్రశంసించి చెప్పాడు. ఏనుగువలె తన బలాన్ని తానెరుగడని ధర్మరాజును పొగిడాడు. అత డలిగితే లోకం దద్దరిల్లుతుందని కీర్తించి ధర్మజుడిలో ఉత్సాహాన్ని ఉద్దీపింపజేశాడు.

ఆ తరువాత అర్జున ప్రేరితుడైన ధృష్టద్యుమ్నుడు పాండవ సైన్యబలంతో అచలవ్యూహాన్ని పన్నాడు. ఆ వ్యూహానికి అగ్రభాగంలో ధృష్టద్యుమ్నుడు నిలిచాడు. అతడికి బాసటగా అభిమన్యుడు మొదలైన కుమారవర్గం, నకుల సహదేవ సహితంగా భీముడూ నిలిచారు. చేకితాన, సాత్యకి సమేతులై పాంచాల మాత్స్యదేశాధిపతులు దక్షిణోత్తర పార్శ్వాలలో క్రమ్ముకొన్నారు. నడిమిభాగంలో గజసైన్యసహితుడై ధర్మజుడు నిలిచి విజయాశీర్వాదాలు పొందుతున్నాడు. ముందట అర్జునుడిచేత రక్షించబడుతున్న శిఖండి భీష్ముడికి ఎదురుగా నిలిచాడు. అపరభాగంలో మాగధ సహదేవ ధృష్టకేతులు ససైన్యులై విజృంభించి ఉన్నారు.

ఆ సమయంలో ఉభయసేనలూ ఉజ్జ్వలంగా ఉన్నాయి. అయినా, పాండవపక్షంలో నరనారాయణులు ఉండటం చేత పాండవసేన కౌరవసేనకంటె బలోపేతంగా చూపట్టింది. దుర్యోధనుడు యుద్ధాకాంక్షతో తన వైభవాన్ని ప్రదర్శిస్తూ తెగించి వచ్చాడు. పాండవేయులు పెళ్ళికి వెళ్ళినట్లుగా యుద్ధానికి తరలివచ్చారు. కౌరవులది రోషమయ మహావిజృంభణం. పాండవులది ధర్మమయ ధీరవీర విహారం.

అప్పుడు శ్రీకృష్ణార్జునులు పాంచజన్య దేవదత్త శంఖాలు పూరించారు. పాండవసైన్యం ఉప్పొంగింది. కౌరవసైన్యం ఉలికింది. కౌరవపక్షాన నెత్తురువాన కురిసింది. భీష్మద్రోణాశ్వత్థామలు యుద్ధానికి వెడలేటప్పుడు 'పాండవులకు విజయం తథ్యం' అని సంకల్పిస్తుంటారు. ఇట్లా ఉండగా దుర్యోధనుడు అశుభసూచనలు లెక్కచేయకుండా తూర్యనాదాలు మ్రోయింపజేశాడు. ప్రళయకాలంలో పొంగి పొరలే మహాసముద్రాలవలె ఉభయసైన్యాలూ రణోత్సాహంతో సందడి చేస్తున్నాయి. ఆ సందడిలోనే కొన్ని యుద్ధ నియమాలు చేసికొన్నారు. పూలతో విలసిల్లే తోటలు కదలక మెదలక నిలిచి ఉన్నాయా అన్నట్లు యుద్ధప్రారంభ సంకేతం కొరకు ఉభయసేనలు ఎదురుచూస్తూ ఉన్నాయి. యుద్ధాన్ని చూడాలనే ఆసక్తితో ఆకసాన దేవసమూహాలు నిలిచిఉన్నాయి.

ఆ సమయంలో ఒక ఉత్కంఠావహమైన సన్నివేశం జరిగింది. ఉన్నట్టుండి ధర్మరాజు కవచం విడిచి, ఆయుధాలు రథంలో పెట్టి రథం దిగి, పాదచారియై, మౌనంతో భీష్ముడివైపు పోవటం ప్రారంభించాడు. ఆ దృశ్యాన్ని చూచి భీమార్జునాదులు ఆశ్చర్యపోయారు. 'ఆయన కంత అవసరం ఏమి వచ్చిం?' దని మథనపడ్డారు. ఆయన వెంట నడిచి పరిపరివిధాల ఆయనను ప్రశ్నించారు. కాని, ధర్మరాజు మారుపల్కక తన నడక సాగిస్తూనే పోయాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజు మనసు నెరిగి, 'యుద్ధానికి వెళ్ళేముందు పెద్దల ఆశీస్సులు తీసికొంటే విజయం తప్పక లభిస్తుందని పెద్దలంటారు కాబట్టి ధర్మజుడు భీష్మాదుల అనుమతిని కోరటానికి పోతున్నా'డని వ్యాఖ్యానించాడు. పాండవముఖ్యులందరూ ధర్మరాజును అనుసరిస్తున్నారు. ఆ దృశ్యాన్ని చూచి కౌరవవీరులు కూడా ఆశ్చర్యపోయారు. ధర్మరాజు అంత అధైర్యపడవలసిన అవసరం ఏమి కలిగిందని పలురకాలుగా తలపోశారు.

ధర్మరాజు కౌరవసైన్యవ్యూహంలో ప్రవేశించాడు. భీష్ముడిని సమీపించాడు. వారిరువురి నడుమ ఇట్లా సంభాషణ సాగింది.

ధర్మ: పుణ్యాత్మా! నిన్ను ఎదిరించి యుద్ధం చేయటానికి నీ అనుజ్ఞను ముందుగా తీసికొనటానికి, నిన్ను దర్శించాలని ప్రీతితో వచ్చాను. నీ దీవెన పొంది వెళ్ళితే నేను శత్రువులను జయించగలను.

భీష్మ: ధర్మజా! నీ వీ విధంగా రాకపోయినట్లయితే శాపమిచ్చి ఉండేవాడిని. వచ్చావు. మేలయింది. నీవు శత్రువులను జయింపుము. ఇంతేకాక ఏదైనా వరం కోరుకో; నన్ను నీ పక్షంలో యుద్ధం చేయాలని మాత్రం కోరకు.

ధర్మ: తాతా! నీవు రారాజు పక్షానే యుద్ధం చేయుము. నాకు మేలయ్యే పనిని మనస్సులో తలంచుము.

భీష్మ: అట్లాగే చేస్తాను. నీ మనసులోని మాట ఏమిటో చెప్పుము.

ధర్మ: నిన్ను యుద్ధంలో గెలిచే మార్గం తెలియచెప్పుము.

భీష్మ: (నవ్వుమొగంతో) న న్నెదుర్కొని గెలవటం ఆ దేవతలకు కూడా సాధ్యం కాదు.

ధర్మ: అందుకే కదా! నిన్ను వేడుకొంటున్నది.

భీష్మ: (దయతో) బంధుత్వాన్ని నా మనసులో చొప్పించి. నా హృదయాన్ని కరిగించి వేడితే నా మనోధైర్యాన్ని కోల్పోయి యుద్ధాన్ని మాని ఆయుధాన్ని వదలిపెడితే తప్ప నన్ను చంపటం సాధ్యం కాదు. ఇక ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపొమ్ము. ఇది సమయం కాదు. నీవు కోరినదానిని పొందటానికి మరల వత్తువులే.

ఆ మాటలు విని ధర్మజుడు తాతకు నమస్కరించి ముందుకు సాగాడు. కృష్ణార్జునులు వెంటరాగా ద్రోణుడికీ, కృపాచార్యుడికీ, శల్యుడికీ నమస్కరించి వారినుండి యుద్ధానికి అనుమతి పొందాడు. తనకు జయం కలిగేటట్లు ఆశీర్వదించండని అడిగాడు. అప్పుడు ద్రోణు డిట్లా అన్నాడు: 'నీకు కృష్ణుడు మంత్రియై ఉండగా మరొకరిని జయంకొరకు అడగనవసరం లేదు. ధర్మం ఏ వైపున ఉంటే కృష్ణుడు ఆ వైపున ఉంటాడు. జయం కూడా ఆ వైపే కలుగుతుంది!' ఆ మాటలు విని ధర్మజుడు ఆచార్యుడి వధోపాయాన్ని తెలుపుమని వేడాడు. ద్రోణు డిట్లా చెప్పాడు: ' నా చేతిలో ఆయుధమున్నంత సేపూ నన్నెవ్వరూ చంపలేరు నేను ప్రాయోపవేశం చేసి అస్త్రశస్త్రాలను వదలిపెట్టినప్పుడు మాత్రమే నన్ను చంపటం సాధ్యమౌతుంది. నమ్మదగిన వ్యక్తి వలన మిక్కిలి దుస్సహమైన కీడుమాట విన్నప్పుడు నేను అస్త్రశస్త్రాలను సన్న్యసిస్తాను అప్పుడు శత్రువులు సంహరించవచ్చును'. ఆ తర్వాత కృపాచార్యుడిని అడిగాడు. ఆయన అవధ్యుడు కావటం చేత వధోపాయం చెప్పలేదు. కాని, విజయం కలిగేటట్లు దీవించాడు. ఆ పైన శల్యుడిని సమీపించి 'నీవు కర్ణరథ సారథ్యం చేసేటప్పుడు అతడిని నొవ్వబలికి చిక్కుపరచి మాకు మేలు చేయు' మని కోరాడు. అత డిదివరకే మాట ఇచ్చినట్లు సాయం చేస్తానని హామీ పలికాడు. ఈ విధంగా ధర్మరాజు అందరి అనుమతి పొంది తమ్ములందరు వెంటరాగా తన రథంవైపు నడిచి వచ్చాడు.

ఆ సమయంలో సేనలను చూడటానికి వినోదంగా వచ్చిన కర్ణుడు కనపడ్డాడు. శ్రీకృష్ణుడు అతడిని సమీపించి, 'భీష్ముడిపై కోపం వచ్చి యుద్ధంలో పాల్గొనన్నావట. అట్లయితే ఆయన చచ్చేంతవరకు పాండవపక్షంలో చేరి యుద్ధం చేయటం బాగుంటుంది

కదా!' అని అన్నాడు. వెంటనే కర్ణుడు 'భీష్ముడి మీది కోపంతో యుద్ధంలో పాల్గొనకుండ తొలగి ఉన్నానే కాని, దుర్యోధనుడికి అంకితమైన ఈ ప్రాణాన్ని మరొకప్రక్కకు చేర్చటం న్యాయంకాదు' అని తేల్చి చెప్పాడు. శ్రీకృష్ణుడు సంతోషించి వెడలి వచ్చాడు.

ధర్మరాజు తన సైన్యంలో నిలిచి కౌరవసైన్యం వైపు మొగం పెట్టి ఎలుగెత్తి ఇట్లా ప్రకటించాడు: 'మా యందు ప్రీతితో మా పక్షంలో చేరాలని ఎవరైనా అనుకొంటుంటే, వారికి ఆహ్వానం పలుకుతున్నాను. మాలో చేరినవారిని నా తమ్ములవలెనే గౌరవిస్తాను' అని. ఆ ప్రకటన విని యుయుత్సుడు దుర్యోధనాదులను దూషిస్తూ, ధర్మరాజును ప్రశంసిస్తూ బంధుమిత్ర సైన్య సమేతంగా పాండవపక్షంలో ప్రవేశించాడు. ధర్మరాజు అతడిని ఆదరంతో సమ్మానించాడు.

## శ్రీకృష్ణుడి గీతా ప్రబోధం, విశ్వరూప ప్రదర్శనం

ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో యుద్ధానికి సిద్ధమైన కురుపాండవ సైన్యాలు మోహరించి ఏమి చేశాయో చెప్పుమని ధృతరాష్ట్రుడు సంజయుడిని అడిగాడు. సంజయుడు చెప్ప నారంభించాడు.

దుర్యోధనుడు ద్రోణుడి వద్దకు పోయి పాండవ వ్యూహాన్ని చూపించి, కౌరవవీరులను పేరు పేరున పేర్కొని, భీష్మాభిరక్షితమైన కౌరవసైన్యాన్ని ప్రశంసించి, భీష్మరక్షణకు అందరిని ప్రేరేపించాడు. దానితో పితామహుడు పొంగిపోయి సింహనాదం చేసి శంఖం పూరించాడు. కురువీరులందరు కూడా శంఖాలు పూరించారు.

అప్పుడు పాండవపక్షంలో కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తాలు పూరించారు. భీమాదులు కూడా శంఖనాదాలు చేశారు. సింహనాదాలు చేశారు. ఆ శబ్దానికి కౌరవుల హృదయాలు దద్దరిల్లాయి. పాండవవీరుల ఒడళ్ళు పొంగిపోయాయి. ఇక బాణప్రయోగ సమయం ఆసన్నమయింది.

అర్జునుడు గాండీవమెత్తి నారి సారించి కౌరవులను చూచి, శ్రీకృష్ణుడితో తన రథాన్ని ఉభయసేనల నడుమ నిలుపుమన్నాడు. కృష్ణుడు రథాన్ని అట్లాగే నిలిపాడు. అర్జునుడు ఉభయసేనలలోని వీరులను కలయచూచాడు. అందులో తాతలు, తండ్రులు, సోదరులు, సుతులు, బంధువులు, మిత్రులు, ఆచార్యులు, శిష్టజనులు అయిన తనవారిని చూచి పరమకృపావేశం చెంది, అత్యంత విషాదం పొంది గోవిందుడి మొగం చూచి, 'దుర్మదాంధుడయిన దుర్యోధనుడి దుర్వినయంతో ఎంత కీడు పుట్టిందో చూచావా?' అన్నాడు.

'కృష్ణా! యుద్ధభూమిలో ఈ బంధుజనసంతతిని చూడగా నాకు తొట్రుపాటు కలుగుతున్నది. శరీరం వణకుతున్నది. చేతులు కంపిస్తున్నాయి. గాండీవం చేతిలో నిలవటంలేదు. కాళ్ళమీద నిలబడలేకపోతున్నాను. వీరిని చంపే నిష్ఠురత్వానికి నేను ఒడిగట్టలేను. యుద్ధం చేయలేను. రక్తపాతం వలన వచ్చే రాజ్యంగాని, దానివలన కలిగే సుఖాలుగాని నాకు వద్దు. ఎవరికొరకు ఈ రాజ్యాన్నీ, సంపదలనూ కోరుతున్నామో వారందరూ ప్రాణాలు కోల్పోతే, సంపదలు మరెందుకు? తాతలను, మామలను, సుతులను, తండ్రులను, తమ్ములను, అన్నలను, గురువులను, బంధువర్గాలను తుచ్ఛమైన దుర్నీతితో చంపి, నేను పొందే నెత్తుట తడిసిన భోగాలు నాకు సంతోషాన్ని కలిగిస్తాయా? కీర్తినిస్తాయా? పెంపుదల కూరుస్తాయా? బంధుసంహారం వలన పాపం కలుగుతుంది. లోకాల నేలటానికైనా ఇంతటి క్రూరకర్మ నేను చేయలేదు. ఎదుటి వారేమి చేసినా నాకు మారు చేయటానికి మనసురాదు.'

'అయ్యో! మిక్కిలి లోభగుణంతో తరువాత కలిగే కీడును గమనించలేక కౌరవకులక్షయానికి ఓర్చి యుద్ధానికి తెగించి వచ్చారనే అపవాదు కలుగుతుంది. దీనిని తెలిసికూడా మనం వీరిని చంపితే ఫలమేమి వస్తుంది? కులనాశనం వలన కులధర్మాలు చెడిపోతాయి. దానివలన సాంకర్యం ఏర్పడుతుంది. కులనాశకులు నరకకూపంలో పడతారు. రాజ్యలోభంతో బంధుజనుల నందరినీ చంపి, ఇంతపాపం చేయటానికి ఎట్లా పూనుకొంటాం?' అని రథంమీద చేయి ఊతంగా చేసికొని కూలబడ్డాడు. శోక నిమగ్నుడయ్యాడు. విషాద విహ్వలుడై పరమకరుణాభరితు డయ్యాడు. శరశరాసనాలు వదలి కన్నులవెంట నీరుకారుస్తూ కదలకుండా ఉండిపోయాడు.

కృష్ణ : అర్జునా! పరాక్రమం ప్రదర్శించవలసిన సమయంలో ఈ అనువుగాని పద్ధతి ఎక్కడినుండి వచ్చింది? వినుము. ఈ రకంగా అవివేకులు వ్యవహరిస్తారు. ఈ దీనస్థితి సద్గతినీ, సత్కీర్తినీ దూరం చేస్తుంది. కాబట్టి ఈ ఆడుతనం వదలిపెట్టుము. ధీరుడవై లెమ్ము! మనసులోని పిరికితనాన్ని దూరం చేయుము.

అర్జు : అక్కటా! పూజించదగిన భీష్మద్రోణులను బాణాలతో బాధించటం న్యాయమా? మాన్యులను చంపటం పౌరుషం కాదు. దానికంటె బిచ్చమెత్తుకొనటం సుఖం. ఎవ్వరిని చంపితే పెద్ద కీర్తి వస్తుందని అనుకొంటారో అది నాకు ఉత్తమ జీవన పద్ధతి కాదు. ఈ సేనాముఖంలో ఉన్నవారు కౌరవులే కదా! వీరిని చంపి ఇంద్రపదవి పొందినా శోకవహ్ని నా మనసులో చల్లారదు. కాబట్టి నేను యుద్ధం చేయను. పెద్దలను నొప్పించలేను. వారిని గెలిపించినా, నేను గెలిచినా పెద్దగా మేలేమి కలుగుతుంది? నేను కార్పణ్యదోషోపహత స్వభావుడను, ధర్మసమ్మూఢ చేతస్కుడను. నేను నీ శిష్యుడను. శరణుపొంది అడుగుతున్నాను. నన్ను శాసించుము.

కృష్ణ : (కలకల నవ్వి) విచారించగూడని వారిని గూర్చి విచారించటం బుద్ధిమంతుల లక్షణం కాదు. నీవు పండితుడివలె మాట్లాడుతున్నావు. వివేకవంతమైన చిత్తం కలవాడవైతే ఉన్నవారిపై మక్కువ, చనిపోయినవారికై చింత అనేవి ఉండవు.

అని ప్రబోధిస్తూ అర్జునుడికి పరమజ్ఞానానికి కారణాలైన అనేక వాక్యాలను వినిపించాడు. దేహంలో బాల్యం, యౌవనం, వార్ధకం అనే అవస్థలు కలిగినట్లుగానే, చినిగిన వస్త్రాలను వదలి నూతన వస్త్రాన్ని ధరించినట్లు దేహాంతర గమనం చేసే ఆత్మకు నాశనం లేదు. పుట్టుట గిట్టుటలు శరీరానికే. ఆత్మకు శరీరానికి వలె అస్త్రశస్త్ర బాధలుండవు అంటూ ఇటువంటి అనేక వాక్యాలు చెప్పి, ఆత్మతత్త్వాన్ని తెలిపాడు.

'ఆత్మకు మరణం లేదు కాబట్టి ఎవరికొరకునూ శోకించటానికి కారణం కానరాదు. జీవుడు నశించడు కాబట్టి, దుఃఖించ నవసరంలేదు. పురుషుడు చెరపడు, చెడడు. పురుషుడంటే ఎవరో కాదు. పురుషోత్తముడనైన నేనే. ఆత్మకు బాధ్యతా బాధకత్వాలు లేవు. కృపాశోకాలకు మూలం అహంకారాదులు. వాటిని వారించుకొనటం కర్తవ్యం. రాజులకు యుద్ధం ఉత్తమకర్మము. అది అపావృత స్వర్గద్వారం. లెమ్ము! యుద్ధం చేయుము. అనుమానించకుము. కర్మను చేయటానికి నీవు అధికారివి. ఫలాన్ని బ్రహ్మార్పణభావంతో వదలి కర్మచేయటం కర్మయోగం. తత్త్వజ్ఞానం కలిగితే కర్మశమం తనంతట తానే సిద్ధిస్తుంది. ఇటువంటి వాక్యా లెన్నో చెప్పి అర్జును డడిగిన ప్రశ్నలకు సమాధానాల నిచ్చాడు.

అర్జు : జగన్నాథా! అతి గుహ్యమైన ఈ తత్త్వాన్ని పరమకృపతో అనుగ్రహించి, ఆధ్యాత్మిక అనుభవాన్ని ప్రసాదించావు. దీనివలన నాకు కొంత భ్రమ తొలగింది. యోగి హృదయాలకు మాత్రమే గమ్యమైనదీ, అతులైశ్వర్య విభూతితో ఒప్పారేదీ అయిన నీ రూపాన్ని చూడాలనే కోర్కె బలంగా ఉన్నది. నాకు చూప గలిగిందయితే దయతో చూపించి నాకు కన్నులపండుగ చేయుము.

కృష్ణ : వివిధ వర్ణాలతో, నానావిధాలుగా ఉండే నా రూపంలో ఆశ్చర్యకరమైన అనేకాంశాలు చూడవచ్చును. అవి ప్రకాశమయ్యేటట్లు చూపుతాను. నా రూపాన్ని మానుషమైన కన్నులతో చూడలేవు కాబట్టి దివ్య చక్షువులను ప్రసాదిస్తున్నాను.

అని అర్జునుడికి దివ్యదృష్టిని శ్రీకృష్ణుడు ఇచ్చాడు. యోగీశ్వరుడైన లక్ష్మీశ్వరుడు తన దివ్యరూపాన్ని చూపాడు. ఆ విశ్వరూపం వేయి సూర్యుల కాంతికంటె మించినది. వర్ణనాతీతమయింది. ఆ మహామూర్తిని చూచి అర్జునుడు ఆశ్చర్యంతో కూడిన గగుర్పాటుతో అత్యంతానందంతో దండప్రణామాలు చేసి, నిలిచి చేతులు జోడించి ఇట్లా అన్నాడు:

అర్జు : దేవా! నీ దివ్యదేహంలో సురాసుర గంధర్వాదులైన దేవమౌనులు, బ్రహ్మ, చరాచరజగత్తు నాకు కనపడుతున్నవి. భయంకరమైన ముఖాలు, భుజాలు, పాదాలు, కన్నులు అనేకాలను చూస్తున్నాను. కిరీటాలు, ఆభరణాలు, చక్రగదాదులైన ఆయుధాలు, పూలదండలు, వివిధ వస్త్రాలు, మొదలైన అనేక దృశ్యాలు చూస్తున్నాను. ఈ రూపం పరమాద్భుతంగా

ఉన్నది. ఇది మొదలు, ఇది నడుము, ఇది తుది అని తెలిసికోలేకపోతున్నాను. ఆ ప్రకాశం అప్రమేయం, దేదీప్యమానం. నిర్వికారం. మహిమాన్వితం. నేను చూడలేకపోతున్నాను. ఈ లోకాల కన్నిటికి మూలకారణమైన పరతత్త్వానివి నీవే. భూమి, ఆకాశం, దిగంతాలు అన్నీ నీలోనే కనపడుతున్నాయి. నీ కన్నులు సూర్యచంద్రులు, నీ ముఖం భయంకర దంష్ట్రలమయం, జ్వాలాతోరణసంయుతం. రుద్రాదిత్యులూ, మరుద్వసువులూ నీలో ప్రవేశిస్తున్నారు. మహామునులు గుంపులు గుంపులుగా వచ్చి, నిన్ను స్తుతి చేస్తున్నారు. సిద్ధులు, సాధ్యులు, ఆకాశచరులు భయంతో నిన్ను చూస్తున్నారు. నీ ఆకారం దేదీప్యమానంగా భయంకరంగా ఉన్నది. దీనిని చూస్తున్న నాకు భయం వేస్తున్నది.ధైర్యం తూలిపోతున్నది. సంక్షోభపడుతున్నాను. ప్రసన్నుడవై నన్ను రక్షించుము.

అగ్ని శిఖలు వెలువడే నీ ముఖాలలోకి కౌరవులు, భీష్మాదులు, ఇక్కడ ఉన్న రాజులందరూ ఒక్కసారిగా ప్రవేశిస్తున్నారు. దేవా! నీవెవ్వరివో తెలియక సతమతమౌతున్నాను. దయామయుడవై నీవెవరో నాకు తెలియచెప్పుము.

కృష్ణ : నేను లోకాన్ని లయం చేసే కాలుడను. ఇక్కడి జనులను హరించటానికి పూనుకొన్నాను. నీవు యుద్ధంలో వీరిని చంప నవసరం లేదు. భీష్మాదులందరూ నాచేత చంపబడినవారే. నా చేత చచ్చినవారిని నీవు జయించబోతున్నావు. నీవు నిమిత్తమాత్రుడవే. కాబట్టి ఇక లెమ్ము. రాజ్యాన్ని గ్రహించుము.

అర్జు : (వడవడవణకుతూ, చేతులు మోడ్చి, గద్గదకంఠంతో) పుండరీకాక్ష! జలవాయు సూర్యచంద్రాది వివిధ తత్త్వాలకు నీవే ప్రవర్తకుడవు, శాశ్వతుడవు, అచ్యుతుడవు. నిన్ను తెలియక యాదవుడని, మిత్రుడని, మేనబావ అని భావించి కలిసి భోజనం చేయటం, ప్రియసంభాషణలు చేయటం, ఎగతాళి చేయటం, మొదలైన లోకసామాన్య చర్యలు ఆచరించాను. తల్లిదండ్రులు పిల్లలను మన్నించినట్లు నా తప్పులన్నీ క్షమించుము. అపూర్వమైన నీరూపం చూడటం వలన ఆనందం, ఇప్పటి నీ భయంకర రూపదర్శనం వలన భయం, బాధ కలుగుతున్నాయి. ఇక ఈ రూపం చాలించి నీ పూర్వ సౌమ్యాకారాన్ని ధరించి నిలిచి నాకు ఆహ్లాదాన్ని కలిగించుము.

కృష్ణ : (దయార్ద్రచిత్తంతో) పార్థా! ఎన్నోతపస్సులు చేసి, వేదాధ్యయనం చేసిన మహామునులు కూడా దర్శించలేనిది నా దివ్యపరమాకృతి. సమాహిత భక్తిభావం కలవారికి మాత్రమే ఈ రూపం గోచరిస్తుంది. సామాన్యజనులు ఈ రూపాన్ని చూడలేరు. అటువంటి ఈ విశ్వరూపాన్ని నీకు దర్శింపచేశాను. నీవు మానసిక వ్యథ పొందటమెందుకు? మూఢత్వాన్ని వదలి, భయాన్ని వీడి, సంప్రీత హృదయుడవు కమ్ము. (అని పూర్వ ప్రకారరూపం ధరించి ప్రశాంతంగా నిలిచాడు.)

అర్జు : కృష్ణా! నేను చైతన్యవంతుడనయ్యాను. ప్రకృతిస్థుడనయ్యాను.

కృష్ణ : మత్కర్మపరుడు, మద్భక్తుడు అయినవాడు నన్ను పొందగలుగుతాడు. బ్రహ్మవిద్యకు సంబంధించిన నీ అనుమానాల నన్నింటిని నేను తీర్చాను. నేను ఉపదేశించింది అతి గుహ్యమైన జ్ఞానం. దానిని నీవు సముచిత రీతిని గ్రహించి వ్యవహరించుము. ఇంతకంటె పరమ రహస్యమైన మరొక విషయం చెపుతాను. సర్వధర్మాలను పరిత్యజించి నన్నొకడినే శరణు వేడుము. సర్వపాపాలను తొలగించి మోక్షాన్ని ప్రసాదిస్తాను. నీకు బోధింపబడిన ఈ గీతాశాస్త్రము నియమనిష్ఠలు, తపస్సు, భయభక్తులు, నిశ్చయజ్ఞానం గలవారికి మాత్రమే బోధింప తగింది. లేనివారికి ఎన్నడూ బోధింప తగినది కాదు. ఇక నీకు అజ్ఞానసంమోహమంతా తొలగిందా?

అర్జు : కేశవా! మోహమనే చీకటి తొలగింది. నీ దివ్యరూపాన్ని దర్శించి భక్తి ప్రపత్తులు కలవాడనైనాను. నా సందేహాలన్నీ తీరాయి. బోధతో కూడుకొన్న నిరామయమైన స్థిరమనఃస్థితిని పొందాను. నీవు బోధించినట్లు నేను నడచుకొంటాను.

అని ఆ పరమపురుషుడికి భక్తి పురస్సరంగా సాష్టాంగ నమస్కారం చేసి దృఢచిత్తంతో గాండీవాన్ని చేపట్టి యుద్ధోత్సాహంతో పొంగులువారాడు. ఆ దృశ్యాన్ని చూచి, వారి సంభాషణలు వినిన అదృష్టం సంజయుడికి దక్కింది. యోగీశ్వరేశ్వరుడైన కృష్ణుడు, ధనుర్ధారి అయిన అర్జునుడు ఎక్కడ నిలిచి ఉంటారో అక్కడ విజయం, నీతి, సిరిసంపదలు నిత్యమై నిలిచిఉంటాయని

సంజయుడు తన తలపును ప్రకటించాడు.

## భీష్ముడి తొలినాటి యుద్ధం

దుర్యోధనుడు ఆగ్రహంతో ఆజ్ఞాపించగా, దుశ్శాసనుడు పురికొల్పగా కౌరవసైన్యం శంఖభేరీమృదంగాది స్వనాలు చెలరేగగా గాంగేయుడు మొదట ముందుకు సాగగా వేగంగా పాండవసైన్యాన్ని కవిసింది.

పాండవులు భీముడు ముందు నడువగా భీష్ముడు వచ్చే తీరుకు ఎదురుగా పోయి కౌరవసేనను ఎదిరించి గజసైన్యాన్ని గడ్డిపరకవలె నిర్వికారంగా నరికివేయటం మొదలుపెట్టారు. ఆకాశభాండం తూటుపడేటట్లు తూర్యనాదాలను మించి గర్జనలు చేస్తూ భీముడు సింహనాదం చేశాడు. యుద్ధం ప్రారంభమయింది.

భీమసేనుడిని దుశ్శాసనుడు, దుర్ముఖుడు, దుస్సహుడు, దుర్మర్షణుడు, వివింశతి, వృషసేనుడు, చిత్రసేనుడు, వికర్ణుడు, పురుమిత్రుడు ఒక్కుమ్మడిగా ఎదుర్కొన్నారు. దుర్యోధనుడు ఆ సన్నివేశాన్ని కన్నులపండువుగా దర్శించాడు. భీముడికి తోడుగా క్రమ్ముకొని ముందుకు సాగి అభిమన్యుడు ఉద్ధృతంగా విజృంభించాడు. అతడికి ఉపపాండవులు అండగా నిలిచారు. వారు చేసే యుద్ధానికి సైనికులందరు అబ్బురపడి వారివైపే చూస్తూ కొంతకాలం నిలిచిపోయారు.

దుర్యోధనుడు ఉన్మదుడై తరుముతూ, ధర్మరాజు జయాస్పదంగా పురికొల్పుతూ తమ తమ సైన్యాలను డీకొనచేశారు. దుమ్ములు రేగేటట్లు తొలిపోరు మొదలయింది.

భీష్ముడు విజృంభించి పాండవసైన్యం మీద దాడిచేసి మధ్యందిన మార్తాండుడివలె వెలిగాడు. అతడిని అర్జునుడు అద్భుతంగా ఎదుర్కొన్నాడు. మహోగ్రశస్త్రాస్త్రాలు దిక్కులు పిక్కటిల్లేటట్లు వ్యాపించి రౌద్రస్ఫూర్తిని ప్రదర్శించాయి.

ఆ రణరంగంలో వివిధ వీరులు ఒకరికొకరు ఎదుర్కొని యుద్ధం చేయనారంభించారు. అభిమన్యుడు కోసలరాజయిన బృహద్బలుడిని, భీష్ముడు భీమసేనుడిని, దుశ్శాసనుడు నకులుడిని, దుర్ముఖుడు సహదేవుడిని, ధర్మరాజు శల్యుడిని, ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని, మాగధ సహదేవుడు భూరిశ్రవసుడిని, ధృష్టకేతుడు బాహ్లికుడిని, ఘటోత్కచుడు అలంబసుడిని, శిఖండి అశ్వత్థామను, భగదత్తుడు విరాటుడిని, బృహత్ క్షత్రవిభుడు కృపాచార్యుడిని, చేకితానుడు సుశర్మను, ద్రుపదుడు జయద్రథుడిని, వికర్ణుడు యుధామన్యుడిని, శకుని ప్రతివింధ్యుడిని, సుదక్షిణుడు శ్రుతసోముడిని, ఇరావంతుడు శ్రుతాయువును, విందానువిందులు గుంతిభోజుడినీ, అతడి కొడుకునూ, కైకేయులేవురు గాంధారరాజు లేవురిని, శతానీకుడు ఉలూకుడిని, ఎదుర్కొని వీరోచిత యుద్ధం చేశారు. రణరంగం రక్తసిక్తమై భీకర రమణీయంగా రాణించింది.

## భీష్మ విజృంభణం

దుర్యోధనుడు ప్రేరేపించగా భీష్ముడు ప్రళయతాండవం చేసే పరమేశ్వరుడివలె పాండవసైన్యం మీదకు దాడిచేశాడు. అతడి చుట్టూ పంచాగ్నులవలె దుర్ముఖుడు, కృపుడు, కృతవర్మ, మద్రపతి, వివింశతీ ప్రకాశిస్తూ వెంటనడిచారు. తాళకేతనం ధగధగలాడగా భీష్ముడు విజృంభించాడు. సైన్యంలో చీలికలు కలిగేటట్లు, వంపులుగా, కోణాకారాలుగా, వలయాలుగా రథాన్ని నడిపిస్తూ సైన్యాన్ని చెండాడాడు. శత్రువీరుల తలలు రాలాయి. విండ్లు విరిగాయి. మేనులు నేలకు వాలాయి. టెక్కాలు కూలాయి. పాండవబలాలు నెత్తురు టేరులలో పొర్లాయి. భీష్ముడిని ఎదుర్కొనే వీరులు లేక పాండవసైన్యం బెండుపడింది. అప్పుడు అభిమన్యుడు వారిని ఆదుకొన్నాడు.

శల్యుడిని అయిదు బాణాలతో కొట్టాడు. కృతవర్మను ఒకబాణంతో గ్రుచ్చాడు. ఈటెతో దుర్ముఖుడి సారథిని చంపాడు. వివింశతి వింటిని విరుగగొట్టాడు. కృపుడి గుర్రాలను నాలుగు బాణాలతో కూల్చాడు. భీష్ముడిపై తొమ్మిదిబాణాలు సంధించి కలతపరచి సింహగర్జన చేశాడు. దేవతలు మెచ్చారు. 'వీడు విచ్చుడివంటివాడు కాని సామాన్యుడు కాడు' అని మెచ్చుకొన్నారు.

అప్పుడు భీష్ముడు అభిమన్యుడి మీదకు లంఘించాడు. అయిదు బాణాలతో అతడి టెక్కాన్ని విరుగగొట్టాడు. మరొకఅస్త్రం

ప్రయోగించే లోపల పాండవవీరులు భీష్ముడిమీద బాణాల వర్షం కురిపించారు. భీష్ముడు పర్వతంవలె భాసించాడు. అతడు తిరిగి బాణాలు గుప్పించాడు. అభిమన్యుడు వాటిని తిరుగగొట్టి భీష్ముడి తాళధ్వజాన్ని విరుగగొట్టాడు. ఆ దృశ్యాన్ని చూచి పాండవసైన్యం ఉప్పొంగింది, కౌరవసేన చిన్నబోయింది.

భీముడు అభిమన్యుడికి అండగా వచ్చాడు. భీష్ముడి నెదుర్కొన్నాడు. అతడు భీముడి సింహకేతనాన్ని విరిచాడు. భీముడు కోపించి భీష్ముడిని మూడు బాణాలతో బలంగా కొట్టాడు. అంతటితో ఆగక కృపుడిని, కృతవర్మను, మద్రేశుడిని బాణాలలో ముంచాడు. వారి అనుయాయులు భీముడిపై దాడి చేయగా వారిని అతడు నుగ్గు నుగ్గు చేశాడు.

భీముడికి అండగా సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, కేకయ రాజపంచకం, విరాటుడు, అతడి కొడుకులు వచ్చి యుద్ధం చేయసాగారు. భీష్ముడు వారందరి శరీరాలపై మూడేసి చొప్పున బాణాలు నాటాడు. ఆ తరువాత శల్యుడికీ ఉత్తరుడికీ పోరు బాగా సాగింది. శల్యుడి చేతిలో ఉత్తరుడు చనిపోయాడు. ఆ తరువాత శల్యుడు కృతవర్మ రథంమీదకు కొండపైకి సింగం దూకినట్లు దూకాడు. ఉత్తరుడి తమ్ముడైన శంఖుడు అన్నను చంపిందన్న కోపంతో కౌరవసైన్యం మీద రౌద్రంగా విరుచుకుపడ్డాడు. భీష్ముడతడిపై దాడి చేసి బాణాలలో ముంచెత్తాడు. అర్జును డాసమయంలో అక్కడికి వచ్చి భీష్మబాణాలను - గాలి మేఘాలను ఎగురగొట్టినట్లు దూరంగా తొలగింపజేశాడు. భీష్మార్జునులు రెండు పెద్ద కొరవులు ఢీకొన్నట్లు యుద్ధం చేసి అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తారు. అప్పటికి మధ్యాహ్నమయింది.

శల్యుడు కృతవర్మ రథం దిగి శంఖుడి రథాన్ని కూల్చాడు. విరథుడైన శంఖుడు కత్తితో యుద్ధం చేస్తూ సమీపంలో ఉన్న అర్జునుడి రథాన్ని చాటు చేసికొని దూరంగా తొలగిపోయాడు. భీష్ముడు నలుదిక్కుల బాణాలు సారించి అర్జునుడి రథాన్ని వదలి ద్రుపదుడివైపు రథాన్ని నడిపించాడు. ఎండిన అడవిని కార్చిచ్చు కాల్చినట్లు పాండవసైన్యాన్ని బరిమార్చాడు. అప్పుడు చంద్రవంశజుడైన భీష్ముడు సూర్యుడివలె వెలుగొందుతుండగా చూచి సిగ్గుపడి సూర్యుడు అస్తమించాడు. పాండవసైనికుల ముఖాలలో కాంతి తగ్గింది. వారి హృదయాలలో భయాంధకారం అలముకొన్నది. అప్పుడు కయ్యం చాలించి, ఉభయసేనలు తమ తమ ఉనికిపట్లకు పోయాయి. భీష్మపరాక్రమాన్ని స్మరిస్తూ దుర్యోధనుడూ, అతడి తమ్ములూ మిక్కిలి సంతోషించారు.

ఆ రాత్రి ధర్మరాజు విషణ్ణచిత్తుడై తమ్ములతో, తగినవారితో కలిసి శ్రీకృష్ణుడి వద్దకు వెళ్ళి ఈ విధంగా అన్నాడు: 'కార్చిచ్చు అడవినంతా ఒక్కపెట్టున కాల్చినట్లు భీష్ముడు బలదర్పమహోగ్రతతో మన సేననంతా మునుంపెట్టి చంపాడు. మహానీలమేఘంగా విజృంభించి ఎవ రాతడిని చంపగలుగుతారు? ఆయన శక్తిని అంచనా వేయలేక అందరివలె సామాన్యవీరుడిగా భావించి యుద్ధానికి దిగి వెర్రివాడనయ్యాను. నీ మరదులందరూ ఆయన బాణాలకు గురి అయ్యారు. ఆయనతో దిక్పాలురు కూడా ఎదుర్కొని గెలవగలుగుతారని నేననుకోవటంలేదు. భీష్ముడిని మన అర్జునుడు జయించగలడని బాగా నమ్మి ఉండగా అతడు కూడా యుద్ధంలో ఉపేక్ష వహించాడు. భీముడు మాత్రం భుజబలం దాచుకొనకుండా పోరాడాడు. ఇక అతడనీ, ఇతడనీ పేర్కొనటం దేనికి? నేను యుద్ధాన్ని మానుతాను. రాజులనందరినీ భీష్ముడికి ఎరలుగా వేయలేను. నేను మరల అడవులకు పోతాను. అక్కడే ఉంటాను. కూరాకు కోసి తింటాను. దామోదరా! నీ మాటనే మేము ఎప్పుడూ పాటిస్తాము. మాకు అశుభాలు కలుగకుండా ఉండటానికీ, శుభాలు కలగటానికీ ఈ మహిమయే కారణం. ఇప్పుడు మేమేమి చేయాలో ఆజ్ఞాపించుము.'

శ్రీకృష్ణు డిట్లా సమాధానం చెప్పాడు: 'ధర్మరాజా! నీ కింత చింత ఎందుకు? నీ కెదురు ఎవ్వరున్నారు? నీ తమ్ములలో ఒక్కొక్కరు బలంలో లోకాల నన్నిటినీ గెలువగలిగిన సమర్థులు. గర్వితుడైన ఆ భీష్ముడిని శిఖండి చంపుతాడు. నీ శత్రువుల నందరినీ నేను క్రమంగా సంహరిస్తాను. సాత్యకి సత్యపరాక్రముడు. అతడి అస్త్రపాండిత్యం శత్రువీరులకు అశనిపాతం. మహాపరాక్రమవంతులైన విరాట ద్రుపదులు నీ కొరకు ప్రాణాల నివ్వటానికైనా సిద్ధంగా ఉన్నారు. ఇందరు నీకు అండగా ఉండగా దిగులెందుకు? నీ పక్షంలో

ఉన్న ధృష్టద్యుమ్ను డొక్కడు చాలు శత్రువుల నందరినీ మట్టుపెట్టటానికి.

## భీష్ముడి రెండవనాటి యుద్ధం

ఆ మాటలు విని ధర్మరాజు ధృష్టద్యుమ్నుడితో ఇట్లా అన్నాడు: 'పాండవ సైన్యాన్ని ఇతడు పాలిస్తాడని శ్రీకృష్ణుడు చెప్పగా నిన్ను సర్వసైన్యాధ్యక్షుడిగా అభిషేకించాము. మేమందరం నీవెంట రాగా శత్రుసైన్యాన్ని చంపటం నీ బాధ్యత కాదా?' అని ప్రశ్నించాడు. 'ధర్మజా! బ్రహ్మ నన్ను ద్రోణుడిని చంపటానికే సృష్టించాడని లోకానికంతటికి తెలుసు. దీనిని పెక్కుసార్లు చెప్పనవసరం లేదు. కౌరవవీరులు నా కెదురైతే వారిని వరుసగా మట్టుపెడతాను. ఇక చూడుము' అని ధృష్టద్యుమ్నుడు ప్రతిజ్ఞ చేశాడు. ధర్మజుడి సూచన మేరకు క్రౌంచవ్యూహాన్ని పన్నాడు. మరునాడు సూర్యోదయానికి అందరూ సిద్ధమయ్యారు. క్రౌంచవ్యూహంలో ముక్కుగలచోట అర్జునుడు నిలిచాడు. కుంతిభోజుడు,శైబ్యుడు కన్నులచోట్లలోనూ, ద్రుపదుడు శిఖాస్థానంలోనూ, దశార్ణ శూరసేన కిరాతదేశాధిపతులు కంఠస్థానంలోనూ, భీముడు, ధృష్టద్యుమ్నుడు కుడి ఎడమ ప్రక్కలలోనూ, మిగిలిన వీరులు ధృష్టద్యుమ్నుడి దిక్కుననూ నిలబడ్డారు. కేకయ కాశీరాజులతో కలిసి విరాటుడు జఘన భాగంలోనూ, హూణప్రభువులు పరివేష్టించి ఉండగా ధర్మరాజు వెన్నుగా నిలిచి ఒప్పారాడు.

కౌరవపక్షంలో దుర్యోధనుడు భీష్మ ద్రోణాశ్వత్థామ కృపశల్య కృతవర్మల పరాక్రమాలను కీర్తిస్తూ వారిని పురికొల్ప పాండవులు పన్నిన క్రౌంచవ్యూహానికి ప్రతిగా మరొక వ్యూహాన్ని పన్నండని ప్రేరేపించాడు. కౌరవసైన్యాన్ని మూడుభాగాలుగా విభజించారు. ఒక దిక్కున దుశ్శాసన వికర్ణ విందానువిందులు, శూరసేన యవన త్రిగర్త కురు దేశాలవారు నిలిచారు. మరొకదిక్కున ద్రోణుడు, కుంతల దశార్ణ విదర్భ గాంధార సింధు సౌవీర పతులు గుమిగూడారు. భీష్ముడు మహాసైన్యంతో నడిమి భాగంలో నిలిచాడు. ఇట్లా మూడు మోహరాలయ్యాయి. పాండవ కౌరవ పక్షాలు యుద్ధానికి తలపడ్డాయి.

భీష్ముడు విజృంభించాడు. పాండవసైన్య మహాసాగరాన్ని మథిస్తున్న మందర పర్వతం వలె సంక్షోభపరిచాడు. అర్జునుడు భీష్మ ప్రతాపాన్ని అడ్డుకొన్నాడు. శల్యద్రోణ దుర్యోధనాదులు భయకంపితులను చేయటానికి పూనుకొన్నాడు. కౌరవవీరులు అర్జునుడిని ఎదుర్కొన్నారు కాని, అతడి ధాటికి ఎదురుదాడి చేసి నిలువలేకపోతున్నారు. అప్పుడు దుర్యోధనుడు భీష్ముడితో ఇట్లా నిష్ఠురంగా పలికాడు. 'తాతా! అర్జునుడు ఉక్కుమిగిలి మన వీరుల నందరినీ అవలీలగా మించి సైన్యాన్ని త్రుంచివేస్తున్నాడు. నీవిట్లా చూస్తూ ఊరుకొనటం న్యాయమా? పైపెచ్చు నీవు కర్ణుడిని యుద్ధంలో పాల్గొనవద్దని నిషేధించావు. అట్లా చేసి అన్యాయం చేశావు.' ఈ ఒప్పనిమాటలు విని భీష్ముడు మనసులో కటకట పడ్డాడు. కుత్సితుడై అర్జునుడిపై దాడికి వెడలాడు. దుర్యోధన వికర్ణులు కుడివైపున, అశ్వత్థామ ఎడమవైపున బాణాల వానలు కురిపించారు. అర్జునుడికి బాసటగా అన్నదమ్ములందరూ కూడి నిలిచారు. పోరు ఘోరంగా సాగింది. అర్జునుడి బాణాలు మహాగ్నులవలె వ్యాపించాయి. భీష్ముడి శరపరంపర మహాసముద్రంవలె పొంగి వాటిని ఆర్పింది. ఈ విధంగా ఇద్దరూ సమయుద్ధం చేశారు. అప్పటికి మధ్యాహ్నమయింది.

ఆ వరుసలో ఆ యుద్ధంలో పాల్గొన్న వీరుల వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

1. ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడి నెదుర్కొన్నాడు. ఉభయులు విజృంభించి విండ్లు త్రుంచుకొన్నారు. శక్తులను ప్రయోగించుకొన్నారు. అయినా ద్రోణుడి బాణ ప్రవాహాన్ని ధృష్టద్యుమ్నుడు ఎదుర్కొనలేకపోయాడు. అంతలో భీము డతడికి సాయం వచ్చాడు. ద్రోణుడిని క్రూరాస్త్రాలతో నొప్పించాడు.
2. దుర్యోధనుడు భీమసేనుడిని డీకొనటానికి కళింగపతిని మహాసైన్యంతో ప్రేరేపించాడు.
3. ద్రోణుడు విరాట ద్రుపదులపై విజృంభించాడు.
4. ధర్మరాజు ధృష్టద్యుమ్నుడికి సహాయంగా నిలిచి పోరు సాగించాడు.
5. కళింగ రాజయిన శ్రుతానందుడు భీముడిని విపుల బలంతో చుట్టుముట్టాడు. భీము డా సైన్యాన్ని నేలమట్టం చేశాడు.

ఆ పయి కేతుమంతుడు భీముడిపై విరుచుకుపడ్డాడు. అతడిసేన మంటలో పడ్డ మిడుతల దండువలె భీమపరాక్రమంవలన హతమై పోయింది. కేతుమంతుడి కొడుకు శక్రదేవుడు కోపించి భీముడి రథాశ్వాలను కూల్చాడు. భీముడు కోపించి పెనుగదను ప్రయోగించి శక్రదేవుడిని చంపాడు. శ్రుతాయువు మండిపడి భీముడిపై లంఘించాడు. అంతలో శ్రుతాయువు తమ్ముడైన భానుమంతుడు గజసైన్యంతో భీముడిని ఎదిరించాడు. భానుమంతుడి మదగజం భీముడిపై దుమికింది. భీముడు సింహనాదం చేసి దానిని చంపి, భానుమంతుడిని యమపురికి పంపాడు. గజసైన్యాన్ని హతమార్చాడు. అంతలో శ్రుతాయువు భీముడి మీదకు సైన్యాన్ని పురికొల్పాడు. చతురంగ బలాలు భీముడిని చుట్టుముట్టాయి. భీముడు మేనుపెంచి గదాఖడ్గాది ఆయుధాలతో సైన్యాన్ని నురుమాడాడు. ఇంతలో సారథి తెచ్చిన రథాన్ని మరల ఎక్కి కళింగపతి మీదకు దాడి సాగించాడు. ఆ దాడిలో శతాయువు మూర్ఛపోయాడు. అతడి సారథి ఆ రథాన్ని దూరంగా తోలుకొనిపోయాడు. భీముడు మిన్నుముట్టేటట్లు సింహనాదం చేశాడు. కౌరవసైన్యం చుక్కాని పట్టే నావికుడు లేని నావవలె తిరుగుడుపడింది. భీముడు శంఖం పూరించాడు.

6. ఆ శంఖనాదం విని భీష్ముడు విజృంభించాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సాత్యకి, భీముడికంటె ముందుగా భీష్ముడిని ఎదిరించారు. శిఖండిని తప్ప మిగిలినవారిపై బాణాలు సంధించి భీష్ముడు భీముడి రథాన్ని విరుగగొట్టాడు. అతడు రథంమీద నుండి దూకి శక్తి విసిరాడు. దానిని భీష్ముడు భగ్నం చేశాడు. సాత్యకి భీష్ముడి రథసారథిని చంపాడు. భీష్ముడి రథాశ్వాలు వాయువేగంతో అతడి రథాన్ని దూరంగా తీసికొనిపోయాయి. భయంకరాకారుడైన భీముడిని చూచి కౌరవసైన్యం పరుగెత్తింది. ధృష్టద్యుమ్నుడు భీముడిని తన రథంమీద ఎక్కించుకొన్నాడు. సాత్యకి భీమ విజృంభణాన్ని కీర్తించాడు.

7. ధృష్టద్యుమ్నుడు శల్య కృపాశ్వత్థామలతో యుద్ధంచేసి అశ్వత్థామ రథ్యాలను చంపాడు. శల్యుడు ధృష్టద్యుమ్నుడిమీద బాణాలు నాటాడు. కృపాశ్వత్థామలు అతడిపై దాడిచేశారు. అప్పుడు ధృష్టద్యుమ్నుడిని అభిమన్యుడు ఆదుకొని ఆ ముఎవ్వరు వీరులను నొప్పించాడు.

8. లక్ష్మణకుమారుడు అభిమన్యుడి నెదుర్కొని విల్లువిరిచాడు. అభిమన్యుడు కూడ లక్ష్మణకుమారుడి విల్లు త్రుంచాడు. లక్ష్మణకుమారు నాదుకొనటానికి భీష్మద్రోణాదులు పూనుకొన్నారు. వారినందరినీ అభిమన్యుడు శరపరంపరతో నిలువరించాడు.

9. ఆ సంగతి పసిగట్టి అర్జునుడు భీష్మాదులపై ప్రభంజనంవలె చుట్టుముట్టాడు. ధర్మరాజు స్వయంగా సైన్యాలను పురికొల్పి అర్జునుడికి అండగా నిలిపాడు. భీష్ముడు దుమ్ములు రేగేటట్లు విజృంభించి పాండవసైన్య రక్తపాతంతో దానిని అణచేటట్లు చేశాడు. అర్జునుడు కౌరవసైన్యాన్ని ముక్కలు ముక్కలుగా చేసి రణరంగాన్ని బీభత్సం చేశాడు. చతురంగబలాలను చదును చేశాడు. భీష్ము డా దృశ్యం చూచి, కృష్ణసారథ్యంలో యుద్ధం చేసే అర్జునుడి పరాక్రమానికి మురిసిపోయాడు. అర్జునుడు త్రిపురసంహారివలె రౌద్రమూర్తితో వెలుగొందాడు. 'పోరు నేటికి చాలిద్దాము' అని భీష్ముడు రెండవనాటి యుద్ధాన్ని చాలించాడు.

## భీష్ముడి మూడవనాటి యుద్ధం

మూడవనాడు భీష్ముడు గరుడవ్యూహం పన్నాడు. తాను ముక్కుగా నిలిచాడు. ద్రోణ కృపవర్మలు కన్నులుగానూ, కృపాశ్వత్థామలు శిరస్సుగానూ, భూరిశ్రవసుడు, శల్యుడు, భగదత్త సౌవీర జయద్రథులు కంఠంగానూ, దుర్యోధనుడూ అతడి తమ్ముడూ వెన్నుగానూ, విందానువిందులు కాంభోజశూర సేనులు తోకగానూ, మాగధ కళింగాదులు దక్షిణపక్షంగానూ, కర్ణాటకోసల ప్రముఖులు వామపక్షంగానూ నిలిచారు.

పాండవపక్షాన అర్జునుడు అర్ధచంద్రాకార వ్యూహాన్ని పన్నుమని ధృష్టద్యుమ్నుడికి సూచించాడు. అత డట్లాగే చేశాడు. పాండ్యమగధ బలాలతో కలిసి భీమసేనుడు దక్షిణశృంగంలో ఉన్నాడు. ఆ తరువాత విరాట ప్రముఖులు నిలిచారు. శిఖండి సహితుడైన ధృష్టద్యుమ్నుడిని తోడుగా తీసికొని ధర్మరాజు మధ్యభాగంలో ఉన్నాడు. మిగిలిన రాకుమారులందరూ శ్రీకృష్ణ

సారథ్యంలో సాగే అర్జునుడివెంట ఒక కొమ్ము కాచారు.

ఇరువైపుల వీరులు పోరు సాగించారు.

1. భీష్మద్రోణులు, సైంధవసౌబలులు మొదలైనవారు కలిసి ఒక్కుమ్మడిగా పాండవసేనపై విరుచుకుపడ్డారు. పాండవపక్షంలో భీమఘటోత్కచులు, సాత్యకి శైబ్యచేకితాన ద్రౌపదేయులు కలిసి వారిని ఎదుర్కొన్నారు. యుద్ధం సంకులంగా సాగింది.

2. దుర్యోధనుడు భీముడిపై యుద్ధానికి వచ్చాడు. అతడిపై బాణాలు సంధించాడు. భీముడు దుర్యోధనుడిమీద బలమైన బాణం నాటాడు. దుర్యోధనుడు మూర్ఛపోయాడు. అతడి సారథి రథాన్ని దూరంగా తీసికొనిపోయాడు. భీమాదులు విజృంభించగా కౌరవసైన్యం పారిపోవజొచ్చింది. శకుని అడ్డగించబోయి అభిమన్యుడి చేత భంగపడ్డాడు. దుర్యోధనుడు మూర్ఛనుండి తేరుకొని, సారథిని చెడతిట్టి, రథాన్ని భీష్మద్రోణుల వద్దకు తోలుమన్నాడు. అప్పుడు భీష్ముడితో సుయోధనుడిట్లా అన్నాడు:

దుర్యో: మూడులోకా లొక్కుమ్మడి కూడి పోరుకు దిగినా మీలో ఒక్కొక్కరు అవలీలగా గెల్వగలవారు. అటువంటి మీరుండగా మనసేన ఇంతటి దురవస్థ పాలుకావాలా? మీరు పాండవులపై అలుక వహించనున్న విషయం ముందుగానే నాకెందుకు చెప్పలేదు. ఆనాడే కర్ణుడు చెప్పాడు. అట్లాగే నేడు పాటుపడ్డాము. నీవల్ల అడియాసపాలయ్యాము. ఇంక వేరే మాటలెందుకు?

భీష్మ: ఇంద్రాదులతో కూడుకొన్న దేవబలాలు సైతం పాండవులను ఎదిరించి నిలువగలవా? తెలిసి తెలిసి నీ విట్లా అనటం న్యాయమా? శస్త్రాస్త్రోద్ధతి, బాహుగర్వ సమృద్ధిగల పాండవులు - వృద్ధులు, ఆయువు చెల్లినవారు, దుర్బుద్ధులు అయినవారిచేత పోతారా? అయినా, నాకు చేతనైనంతవరకు పాండవసైన్యాన్ని చంపుతాను. నీవూ, నీ బంధువులూ సమీపంలో ఉండి చూస్తూ ఉండండి.

అప్పటికి మధ్యాహ్నమయింది. భీష్ముడు మధ్యందిన మార్తాండుడివలె తేజోవంతుడై విజృంభించాడు. సుయోధనాదులు అతడి వెంట సాగారు. భీష్ముడు రౌద్రాకారుడై పాండవసేనను పీనుగుపెంటలుగా మార్చాడు. మిగిలిన సైన్యం భయభ్రాంతమై దీనదశకు వచ్చింది. అప్పుడు శ్రీకృష్ణుడు రథపు పగ్గాలు పట్టుకొని అర్జునుడితో ఇట్లా అన్నాడు:

కృష్ణ: అర్జునా! కృపద్రోణ భీష్మాదులతో కూడుకొన్న కౌరవసైన్యాన్ని పరాక్రమంతో గెలవాలని ఎప్పుడూ కోరుకొంటూ ఉంటావు. ఇపుడు ప్రళయరుద్రుడై భీష్ముడు మన సైన్యాన్ని చెండాడుతుంటే నీ భుజబలాన్ని ప్రదర్శించకుండ ఇట్లా మిన్నకుండటం తగునా?

అర్జు: కృష్ణా! ఇన్నిమాట లెందుకు? భీష్ముడిమీదకు రథం పోనిమ్ము. అతడి గర్వాన్ని భంజిస్తాను.

ఆ మాట విని కృష్ణుడు తేరును భీష్ముడివైపు నడిపాడు. భీష్ముడు వడిగా బాణాలతో గుర్రాలను, కృష్ణుడినీ, అర్జునుడినీ నొప్పించాడు. శ్రీకృష్ణుడు తాను ధీరుడై, గుర్రాలను తేర్చి, అర్జునుడిని పురికొల్పాడు. ఫల్గునుడు గాండీవాన్ని సారించి భీష్ముడి విండ్లను రెండుసార్లు విరుగగొట్టాడు. భీష్ముడు కార్చిచ్చు వలె బాణాలను ప్రయోగించాడు. అర్జునుడు బాణాలను ప్రయోగిస్తున్నాడు. కాని, భీష్ముడు విడవకుండా కృష్ణుడిపై, గుర్రాలమీద, అర్జునుడిమీద బాధ కలిగేటట్లు బాణాలతో క్రమ్ముతున్నాడు. అప్పుడు శ్రీకృష్ణ డిట్లా భావించాడు.

'పాండవ వీరులు సిగ్గువదలి పరుగెత్తుతున్నారు. వీరిలో ఒక్కడు కూడ భీష్ముడిని ఎదిరించి పరాక్రమం ప్రదర్శించలేరు. అర్జునుడు కూడ బాధపొంది తూగుతున్నాడు. ఇట్లాగే సాగితే భీష్ముడు నేడే దుర్యోధనుడి కోర్కెలన్నీ తీర్చేటట్లున్నాడు. యాదవ కేకయ పాంచాలాదులు వెన్నిచ్చి పరుగెత్తుతున్నారు. జయోన్మాదంతో కౌరవసైన్యాలు అన్ని దిక్కులా పెచ్చుపెరుగుతున్నాయి. ఇప్పుడు నే నూరకుండటం తగదు. భీష్ముడిని చంపి ధర్మరాజుకు విజయం చేకూరుస్తాను' అని తలపోశాడు.

అంతలో భీష్ముడు క్రూరబాణాలతో అర్జునుడిని కొట్టాడు. అర్జునుడు బడలిక చెందాడు. ఆ అదను చూచి కృపుడు, కృతవర్మ,

అశ్వత్థామ, భూరిశ్రవసుడు, సైంధవుడు, వికర్ణుడు ఒక్కసారిగా అర్జునుడిపై దాడిచేశారు. అప్పుడు సాత్యకి గజసైన్యంతో అర్జునుడికి

సాయంగా వచ్చి పాండవవీరులను ఇట్లా పురికొల్పాడు. 'చేసిన ప్రతిజ్ఞలు మరచారా? వెన్నుచూపి పరుగెత్తటం తగునా? బెదరక భీష్ముడినీ గీష్ముడినీ ఎదిరించి తరమండి. నే నుండగా మీకెందుకు భయం? అని అంటూ అర్జునుడిని మించి ముందుకు సాగగా శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు:

కృష్ణ: తిరిగిపోయే పందలను పురికొల్పట మెందుకు? ఉన్నవారే ఎదిరిస్తారులే. దుర్యోధనుడు జయించి రాజ్యం ఏలటం నేనుండగా జరుగని పని. నా మాట వినుము. అవక్రమైన నాచక్ర పరాక్రమాన్ని ప్రదర్శించి భీష్ముడిని నేలకూలుస్తాను. ద్రోణుడిని చక్కజేస్తాను. కౌరవవీరులను నురుమాడుతాను. సేనలను చెండాడుతాను. ఈ భూవలయాన్ని పాండవుల హస్తగతం చేస్తాను.

అని పలికి సుదర్శనాన్ని స్మరించాడు. ఆ చక్రాయుధం అతడి చేతిలో నిలిచింది. దానిని కుడిచేతి వ్రేల నిలిపాడు. పగ్గాలు రథానికి ముడివేశాడు. రథంనుండి దూకాడు. భూమి కంపించింది. చక్రకాంతులు పిక్కటిల్లాయి. క్రోధభయంకరంగా కృష్ణుడు సింహనాదం చేశాడు. మదించిన ఏనుగుయొక్క కుంభస్థలంపై దూకే సింహంవలె, ప్రళయరౌద్రాకారంతో భీష్ముడివైపు ఉరికాడు. కౌరవసైన్యంతోపాటు దుర్యోధనాదులు కూడా భయంతో నిశ్చేష్టులై నిలబడిపోయారు.

భీష్మ: (వినయంతో చేతులు జోడించి) పరమేశ్వరా! నన్ను ఈ విధంగా కృతార్థుడిని చేస్తావా? నీవు వచ్చి ఇప్పుడే నీ ఇష్టం వచ్చినట్లు ఏ విధంగానైనా చేయుము. నేను సిద్ధం. ఆలస్యం వద్దు. నీ చర్య నా కవశ్యం యోగ్యం.

అంటూ ఉండగానే అర్జునుడు రథంనుండి దూకి పరుగెత్తి శ్రీకృష్ణుడి వెంట వెళ్ళి అతడిని తన పొడుగైన చేతులతో పట్టి వారించాడు. కాని, పెనుగాలికి కదిలే చెట్టుకొమ్మవలె కొంతదూరం ఈడ్వబడినా పది అడుగుల తర్వాత నిలదొక్కుకొని, ఈడిగిలబడి మాధవుడిని నిలవబెట్టి ఇట్లా ప్రార్థించాడు.

అర్జు: 'యదుసింహా! కోపాన్ని ఉపసంహరించుకొమ్ము. నీవు పాండవుల కందరికీ రక్షవు. అట్టి నీవే ప్రతిజ్ఞను తప్పితే, ప్రతిజ్ఞాపరుడైన ధర్మరాజు శౌర్యం, ధైర్యం, బాహువీర్యం నశించిపోవా? ఈ చర్య నీకు తగిందేనా? కాబట్టి ఈ పని చేయబోకుము. కృష్ణా! నీవు అడుగు ముందుకు వేస్తే సాత్యకిని చంపినంత ఒట్టు. నీవు పూనుకొంటే కౌరవసేనను రూపుమాపటం తేలిక. కాని, నా పరాక్రమం వృథా ఔతుంది. అట్లా చేయటం నీకు తగునా? నాకు అపకీర్తి తేవటానికి నీవు చక్రం పట్టుతావా?

సవ్యసాచి సమయనిష్ఠకు శ్రీకృష్ణుడు సంతోషించి కోపాన్ని తగ్గించుకొని, నొగలెక్కి దిక్కులు పిక్కటిల్లగా పాంచజన్యాన్ని పూరించాడు. అర్జునుడు దేవదత్తాన్ని ఒత్తాడు. అర్జునుడు దూదికొట్టంలో పడ్డ కార్చిచ్చువలె కౌరవసైన్యం మీద దాడి చేశాడు. భీష్మాది కురువీరులను క్రూరబాణాలతో, వివిధాయుధాలతో వివిధ గతుల నొప్పించాడు. రణరంగంలో రథాన్ని కలయదిప్పాడు. కౌరవసైన్యాన్ని పెంటకుప్పలుగా మార్చాడు. రణరంగాన్ని రక్తసిక్తం చేశాడు. అంతలో సూర్యాస్తమయం అయింది. యుద్ధాన్ని చాలించారు. ఆనాటి రాత్రంతా అర్జునుడి పరాక్రమాన్ని గురించి ఉభయ స్కంధావారాలలో అందరూ చెప్పుకొన్నారు.

## భీష్ముడి నాల్గవనాటి యుద్ధం

తెల్లవారింది. భీష్ముడు యుద్ధానికి సిద్ధమయ్యాడు. సముద్రతరంగాలవలె ద్రోణాది వీరులు వేగంగా వెంటసాగారు. కౌరవసైన్యం మేఘమాలవలె తోచింది. పాండవసైన్యం వీరరసవిస్ఫారమై మెరిసింది. నరనారాయణులు చంద్రసూర్యులవలె తోచారు. సైనికులు తలపడ్డారు. పలుచోట్ల పలురకాల పోరు సాగింది. భీష్ముడు అర్జునుడితో తలపడ్డాడు. భీష్ముడికి సాయంగా వస్తున్న ద్రోణ వివింశతి కృప సోమదత్త శల్యులను అభిమన్యుడు అడ్డగించాడు. భీష్మార్జునుల యుద్ధం భీకరంగా మొదలయింది. అభిమన్యుడు అశ్వత్థామాది వీరులతో వీరోచితంగా యుద్ధం సాగించాడు. పలువురితో ఒంటరిగా పోరుతున్న కొడుకును చూచి

అర్జునుడు వచ్చి అందరినీ అనేక భంగుల నొప్పించాడు. త్రిగర్తులు, కృతవర్మ, కేకయులు, మరికొందరు రథికులు కలిసి అభిమన్యుడిని చుట్టుముట్టారు. ధృష్టద్యుమ్ను డా సన్నివేశాన్ని గమనించి అభిమన్యుడికి తోడుగా వచ్చాడు. శల్యనందనుడిపై దాడిచేసి అతడిని చిత్రయుద్ధంలో సంహరించాడు. కొడుకు చావును చూచి రోషంతో శల్యుడు విజృంభించి ధృష్టద్యుమ్నుడి విల్లువిరిచి అతడిని చీకాకు పరిచాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడిని అభిమన్యుడు ఆదుకొన్నాడు. శల్యుడిని డీకొన్నాడు. దుర్యోధనుడు దానిని గమనించి దుర్ముఖ, దుస్సహ, దుర్మర్షణ, సత్యవ్రత, చిత్రసేన, పురుమిత్ర, వివింశతి, వికర్ణులను పురికొల్పి పంపాడు. వారు అభిమన్యుడిని ఎదుర్కొనటానికి భయపడి ధృష్టద్యుమ్నుడిని చుట్టుముట్టారు. వారందరితో అతడు సమర్థంగా పోరుతున్నాడు.

నకుల సహదేవులు మద్రపతిమీద దాడి చేశారు. వారికి పాంచాలమత్స్యపతులు సాయం వచ్చారు. మధ్యాహ్నం వరకు పోరు సాగింది.

ఇవ్వేళ అటో ఇటో తేలాలని భీముడు కౌరవులమీద పోరు ముమ్మరం చేశాడు.దుర్యోధనుడు కలతచెంది మగధరాజును అపార గజసైన్యంతో భీముడిపైకి పంపాడు. మదేభాలను చూచి భీము డుప్పొంగిపోయి, యుద్ధవీరాన్ని ప్రదర్శించాడు. భీముడికి బాసటగా ఉపపాండవులు, అభిమన్యుడు, ధృష్టద్యుమ్నుడు వచ్చి క్రమ్ముకొన్నారు. మాగధుడిని అభిమన్యుడు క్రూరభల్లంతో చంపాడు. శతానీకుడు ఏనుగుల కుంభస్థలాలను పగులగొట్టాడు. ధృష్టద్యుమ్నుడూ, భీముడూ ఏనికవేట చేశారు. ఉభయసేనాపతులు పురికొల్పగా సేనలు సంకుల సమరంలోకి దిగాయి. భీముడు విజృంభించి సైన్యాన్ని నేలమట్టం చేశాడు. అప్పుడు భీముడిపై భీష్ముడు దాడిచేశాడు. భీష్ముడిని సాత్యకి ఎదుర్కొన్నాడు. అలంబసుడు భీష్ముడికి సాయంగా వచ్చి సాత్యకిని ఎదిరించాడు. అత డాతడిని నాలుగు బాణాలతో చంపాడు. దానిని గమనించి భూరిశ్రవసుడు విజృంభించాడు. పాండవులు సాత్యకికి అండగా నిలిచారు. పరస్పర యుద్ధంలో భీముడు భయంకరంగా పోరి దుర్యోధనుడి తమ్ములను చంపాడు. తమ్ములను చంపిన భీముడిపై మండిపడి దుర్యోధనుడు ఆర్చుతూ భీముడితో తలపడ్డాడు. భీముడు నవ్వి కన్నుల నిప్పులు రాల దుర్యోధనుడిపై బాణాలు సంధించాడు. ఇద్దరూ సములై పోరాడారు. దుర్యోధను డేసిన బలమైన బాణం భీముడి రొమ్మును తాకగా అతడు మూర్ఛపోయాడు.

అప్పుడు అభిమన్యుడూ, ధృష్టద్యుమ్నుడూ, ఉపపాండవులూ కలిసి దుర్యోధనుడిపై దూసికొని వచ్చి క్రమ్ముకొన్నారు. భీముడు సేదతేరి విలయాంతకుడివలె లేచి శల్యుడిని నొప్పించాడు. సింహాన్ని చూచిన ఏనుగులవలె భీముడిని చూచి కౌరవసేనలు పరుగెత్తాయి. అప్పటికి మధ్యాహ్నమయింది.

దుర్యోధన ప్రేరితులై సుషేణాదులైన పెక్కురు సేనాపతులు భీముడితో దొమ్మిపోరు సాగించారు. ఆ భీమసేనుడు పెద్దపులి లేడి పిల్లలను చూచి లంఘించే విధంగా దూకి సుషేణుడిని, భీమబాహుడిని, ఉగ్రుడిని, భీమ భీమరథులను, సులోచనుడిని బాణాలతో చంపివేశాడు. ఈ విధంగా రాజకుమారులను చంపుతున్న భీముడిపై భీష్ముడు కౌరవవీరులను పురికొల్పాడు. భగదత్తుడు మదగజాన్ని అధిరోహించి భీముడిపై లంఘించాడు. అభిమన్యు ప్రభృతులు ఆ ఏనుగును గాయపరిచారు. నెత్తురు ఏరులుగా కారుతుండగా ఆ యేనుగు పాండవసైన్యంపై పిచ్చిగా తిరగబడింది. పాండవసైన్యం భయపడింది. దుర్యోధనుడు ఉప్పొంగి భీముడిపై బాణాలు కురిపించి గుండె మీద బలమైన బాణం నాటి ప్రక్కకు ఒరిగేటట్లు చేశాడు. అప్పుడు ఘటోత్కచుడు తండ్రి బాధ చూచి మాయాయుద్ధంతో విజృంభించి భగదత్తుడి గజబలాన్ని తరిమి దుర్యోధనుడిపై దాడి చేశాడు. అప్పుడు భీష్మ ద్రోణులు సుయోధనుడిని ఆదుకొని ఘటోత్కచుడిపై బాణవర్షం కురిపించాడు. ఘటోత్కచుడికి తోడుగా యుధిష్ఠిరాదులు వచ్చారు. పోరు ఘోరంగా సాగింది. భీష్ముడు పాండవసైన్యానికి గణుపుకొట్టాడు. ఘటోత్కచుడు విక్రమ సింహనాదం చేశాడు. ఆ నాదానికి భయపడిన మదగజాలు నీ సైన్యాన్నీ త్రొక్కుతూ బీభత్సాన్ని సృష్టించాయి. దానితో సూర్యాస్తమయం కూడా కావటంతో భీష్ముడు ఆనాటి యుద్ధాన్ని చాలిస్తున్నట్లు ప్రకటించాడు. పాండవసైన్యం సింహనాదాలు చేస్తూ శిబిరాలకు చేరింది. కౌరవసైన్యం చిన్నబోయి తిరిగిపోయింది. అందరినోటా ఘటోత్కచుడి పరాక్రమ ప్రశంసలే మారుమ్రోగాయి.

నాల్గవనాటి కౌరవుల పాటు విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

ధృత: రణరంగ వార్తలలో నీ వెప్పుడూ పాండవులకు మేలు జరిగిందనీ, నా కొడుకులకు పరాక్రమంలో తక్కువతనం కలిగిందనీ

ప్రకటిస్తూ ఉంటావు. భీష్మద్రోణ శల్యాది వీరులు మా ప్రక్కనుండగా ఈ తక్కువతనానికి కారణమేమిటో నాకు చెప్పుము.

సంజ: ఔషధగుణం మంత్రవీర్యం మాయాజనిత సమగ్రోద్ధతి కాదు. ఈ సంగతి నీకు మున్నెన్నిసార్లో చెప్పాను. పాండవులు న్యాయాన్నీ, సత్యాన్నీ తప్పరు. నీ కొడుకులు వాటికి జంకరు. ఆ విధంగా నీ కొడుకులు పాపం చేస్తుంటే తెలిసి తెలిసి చూస్తూ ఉండిపోయావు. దానివలన కలిగే కీడు అనుభవించక తప్పుతుందా? మరి ధర్మం గెలువదా? పాండవులు గెలవటం, కౌరవులు ఓడటం తప్పదు. విదురుడు చెప్పగా మనం విన్నాం గదా! నీ వడిగినట్లే నీ కొడుకు భీష్ముడిని అడిగాడు.

భీష్ముడిట్లా చెప్పాడు

భీష్మ: నే నెన్నోసార్లు నీకు చెప్పాను. పాండవులకు వాసుదేవుడు సహాయకుడై ఉన్నాడు. అందువలన వారికి అసాధ్యమనేది లేదు. ఆ పరమేశ్వరుడి అసలు స్వరూపం తెలిసినవారు పెక్కుమంది లేరు. తెలిసినవారికి ఆపదలు ఉండవు(రావు). పాండవులు ఆతడి తత్వాన్ని తెలిసికొని ఆశ్రయించారు. నీవు శ్రీకృష్ణుడిని లెక్కచేయవు. వినుము. నీకు మరొక విషయం చెపుతాను.

మానస సరోవరం ఉత్తరాన గల పర్వతంమీద బ్రహ్మదేవుడు సర్వదేవగణాలతో కొలువై ఉన్నాడు. అప్పు డొక మణిమయోజ్జ్వలమైన విమానమొకటి ఆకసాన కనపడింది. అందులో సర్వాత్ముడైన పరమాత్ముడిని దర్శించి అందరూ నిలిచి నమస్కరించి, స్తుతించారు.

బ్రహ్మ: నారాయణా! నీకు జన్మించి, నేను ఈ లోకాలను సారమతితో సృష్టించాను. నీ రక్ష ఎల్లప్పుడూ వీటికి ఉన్నది. ఇప్పుడు మానవలోకంలో అసురదుర్వృత్తాలు ఎక్కువయ్యాయి. కావున, నీవు యదువంశంలో పుట్టి, నీ సఖుడైన నరుడు కూడ భరతవంశంలో జనించేటట్లుగా చేసి, దైత్యులను సంహరించి, భూభారాన్ని మాన్పుము.

సంజ: అని ప్రార్థించగా ఆ దేవు డంగీకరించాడు. ఆ ప్రార్థనలందుకొన్నవారు నరనారాయణ మహర్షులు. 'నరుల హితం కోరి వారు భూమిపై పుట్టుతారు. వారిని కేవల మర్త్యులుగా భావించేవారు చెడిపోతారు. తెలిసి భక్తితో సేవించేవారు శుభాలను పొందుతారు.' అని చెప్పి బ్రహ్మ తన లోకానికి పోయాడు. మిగిలినవారు వారి వారి లోకాలకు పోయారు. ఈ కథను నారద, జామదగ్న్య, వ్యాసాదులచేత నేను విన్నాను. పూర్వం మహర్షులు నరనారాయణులతో వైరం వద్దని ఎన్నిసార్లు వారించినా మదాంధుడవై వినలేదు. ఇప్పటికైనా కృష్ణుడి నాశ్రయించి, పాండవులతో పొత్తు కలిపికొని బ్రతుకుము - అని భీష్ముడు హితవు చెప్పి ఊరకున్నాడు. నీ కొడుకు ఆ హితోపదేశాన్ని పెడచెవిని పెట్టాడు. మంచివారి మాటలు మీకు రుచించవు కదా!

## భీష్ముడి అయిదవనాటి యుద్ధం

అయిదవనాటి ఉదయం భీష్ముడు మకరవ్యూహం పన్నాడు. పాండవులు శ్యేనవ్యూహం తీర్చారు. ముఖస్థానంలో భీముడు, నయనస్థానంలో ధృష్టద్యుమ్న శిఖండులు, శిరస్స్థానంలో సాత్యకి, కంఠస్థానంలో అర్జునుడు, వామపక్షంలో విరాట ద్రుపదులు, దక్షిణపక్షంలో సేనాసహితుడైన ధర్మరాజు నిలిచారు. భీముడు మకరవ్యూహాన్ని భేదించి లోనికి ప్రవేశించి భీష్ముడిని ఎదుర్కొన్నాడు. భీష్ముడు భీముడిని నొప్పించాడు. అర్జునుడు వచ్చి అతడికి బాసటగానిల్చి భీష్ముడి ప్రతాపాన్ని తగ్గించి కౌరవవీరులను గ్రీష్మాదిత్యుడివలె తపింపజేశాడు.

అప్పుడు దుర్యోధనుడు ద్రోణుడితో ఇట్లా అన్నాడు: 'నీవూ, భీష్ముడూ కోపిస్తే దేవతలు కూడా ఎదుర్కొనలేరు. మీరు తలచుకొంటే పాండవులను పట్టి పాలార్చగలరు. అర్జునుడు మన సేనను మట్టుపెట్టుతుంటే ఇట్లా చూస్తూ ఊరుకోవటం న్యాయమా?' ఈ మాటలకు ద్రోణుడు మనసులో కటకటపడ్డాడు. 'ఎన్నడూ పాండవుల బలాన్ని మనం ఓర్చుకొనలేము. సముద్రంలో సొరకాయ బుర్రను వేస్తే అది పట్టేంత నీటినే తీసికొంటుంది. వారిని గెల్వటం మాకు సాధ్యంకాదు. ఊరక ఈ కాని మాట లెందుకు?' అంటూ పాండవసైన్యం మీద విరుచుకపడ్డాడు.

సాత్యకి ద్రోణుడిని ఎదుర్కొన్నాడు. ద్రోణు డాతడిని నొప్పించాడు. అర్జునుడు గురువుపై బాణవర్షం కురిపించాడు. శల్య

భీష్ములు ద్రోణుడికి అండగా వచ్చారు. భీముడిపై దాడి చేశారు. ఉపపాండవులూ, అభిమన్యుడూ భీముడికి బాసటగా నిలిచారు. ఆ సమయంలో శిఖండి భీష్ముడిపై పెనుదాడి చేశాడు. ద్రోణుడు త్రిప్పికొట్టాడు. భీమ భీష్ములు తమ తమ సేనలకు రక్షకులుగా ఉంటూ, అర్జున ద్రోణులకు తోడ్పడ్డారు. దుర్యోధనుడు భీముడిమీదికి కళింగదేశ గజసేనను పురికొల్పాడు. వాటిని భీముడు మర్దించాడు. సైనికులు భయపడి భీష్ముడి ప్రాపున చేరారు. ఆ తరువాత తుముల యుద్ధం జరిగింది. విందానువిందులు కాశిరాజు సైంధవుడు కలిసి భీముడి నెదుర్కొన్నారు. వికర్ణుడు సహదేవుడిని, చిత్రసేనుడు శిఖండిని, దుర్యోధనుడు విరటుడినీ, త్రిగర్తులు, నకులుడిని, ద్రోణుడు చేకితాన సాత్యకులనూ, కృపాచార్యాదులు ధృష్టద్యుమ్నుడినీ, అభిమన్యుడు సాల్వకేకయులనూ, ధృష్టకేతు ఘటోత్కచులు ధార్త రాష్ట్రులను, యుధిష్ఠిరుడు శల్యుడిని ఢీకొన్నారు. పోరు తీవ్రంగా సాగింది. రక్తపుటేరులు పారాయి. భీమభీష్ముల విజృంభణం హెచ్చుగా సాగింది. వివిధ వీరుల మధ్య వీరోచిత రణోత్సాహం వెల్లివిరిసింది. అంతలో అభిమన్యుడూ లక్ష్మణకుమారుడూ ద్వంద్వ యుద్ధంలో పాల్గొన్నారు. ఇరువురికీ వీరులు తోడ్పడ్డారు. పోరు ఘోరంగా సాగింది. అభిమన్యుడు వార్ష్ణేయులను చంపాడు. వృష్ణి వీరుడిని నేలపై పడవేశాడు. మధ్యాహ్నమయింది. అర్జునుడు ప్రచండంగా పరవళ్ళు త్రొక్కాడు. మంటలో పడే మిడుతలవలె కౌరవసైన్యం అర్జునుడి బాణాగ్నులకు ఆహుతి కాజొచ్చింది. అప్రతిహతంగా సాగిన అతడి యుద్ధ యాత్ర సాయంత్రం కావటంతో ఆనాటికి ఆగింది.

## భీష్ముడి ఆరవనాటి యుద్ధం

ఆరవనాటి ఉదయం అర్జునుడు మకరవ్యూహం పన్నుమని సేనాపతికి చెప్పాడు. పార్థుడు పాంచాలపతి శిరస్సుగానూ, నకుల సహదేవులు కన్నులుగానూ, భీమసేనుడు తుండంగానూ, అభిమన్యుడు, ఉపపాండవులు, ఘటోత్కచుడు గండస్థలంగానూ, సాత్యకితో కూడిన ధర్మరాజు కంఠంగానూ, ధృష్టద్యుమ్నుడితో కలిసి ద్రుపదుడు వెన్నుగానూ, కేకయులు వామభాగంలోనూ, ధృష్టకేతుడు మొదలైనవారు దక్షిణభాగంలోనూ, కుంతిభోజశతానీకులు జఘనంగానూ, శిఖండీ, ఇరావంతుడూ తోకగానూ వ్యూహంలో నిలిచారు.

భీష్ముడు పాండవవ్యూహానికి ప్రతిగా క్రౌంచవ్యూహం రచించాడు. ముక్కుగా భీష్మద్రోణులు, నేత్రాలుగా కృపాశ్వత్థామలు, శిరోభాగంగా కృతవర్మ, కాంభోజ బాహ్లికులు, గొంతుగా శూరసేన పరివృతుడైన దుర్యోధనుడు, ఉరోభాగంగా సౌవీర సమేతుడైన భగదత్తుడు, వీపున విందానువిందులు, వామపక్షంలో సుశర్మ, దక్షిణ పక్షంలో యవనపతి, అపరభాగంలో శ్రుతాయువుతో కలిసి భూరిశ్రవసుడు నిలిచారు.

భీముడు ద్రోణుడిని ఎదిరించి అతడి సారథిని చంపాడు. అయినా, ద్రోణుడు తానే రథాన్ని నడుపుకొంటూ యుద్ధం సాగించాడు. భీష్ముడు ద్రోణుడికి తోడై చుట్టూ ఉన్న రాజులను దూరంగా పంపాడు. భీముడు మాత్రం వెనుకాడకుండ కౌరవసైన్యాన్ని నురుమాడాడు. కౌరవవీరులైన దుశ్శాసన, దుర్విషహ, దుర్మద, దుస్సహ, జయ, జయత్సేన, వికర్ణ, చిత్రసేన, సుదర్శన, చారుచిత్ర, సువర్మ, దుష్కర్ణాదులు ఒకచోట ఉండటం చూచి భీముడు వారిపై లంఘించాడు. వారందరు కసితో భీముడిని చుట్టుముట్టారు. భీముడు తన రథంమీదనుండి నేలపైకి దూకి పెనుగదతో వారందరిని ముప్పుతిప్పలు పెట్టాడు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిపైకి దూసికొని వచ్చాడు. భీమసేనుడికి తోడుగా నిలిచి సైన్యాన్ని నురుమాడాడు.

దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడి మీదికి రథికవరులను పురికొల్పి పంపాడు. ధృష్టద్యుమ్నుడు సమ్మోహన బాణాన్ని ప్రయోగించి వారందరిని నిశ్చేష్టులను చేశాడు. ఆ సమయంలో భీముడు ఒక సరోవరంలో నీరుత్రాగి దప్పిక తీర్చికొని మరల యుద్ధం ప్రారంభించాడు. ద్రోణుడు ద్రుపదుడిని నొప్పించాడు. సమ్మోహితులై ఉన్న వీరులకు తెలివి తెప్పించాడు. మరల విజృంభించాడు.

ఆరవనాటి యుద్ధంలో ద్రోణభీష్మ ప్రతాపం పాండవ వీరులకు గట్టి ఎదురు తాకిడి నిచ్చింది. భీముడు, ధృష్టద్యుమ్నుడు, ద్రుపదుడు, అభిమన్యుడు మొదలైన వీరుల పోరాటం, పాండవుల విజయరేఖలను ప్రదర్శించింది. కౌరవపక్షంలో దుర్యోధనుడు, పాండవపక్షంలో ధర్మరాజూ సమయోచితంగా వీరులను ప్రేరేపిస్తూ ఆయా వీరుల రణక్రీడలకు దోహదం చేస్తూ వచ్చారు. అర్జునుడు రణరంగంలో వీరవిహారం చేశాడు. ఉభయపక్షాల వీరులూ పగతో పోరాడి పరాక్రమాలు ప్రదర్శించారు. అంతలో

సూర్యాస్తమయం అయింది. పోరు చాలించారు.

కథా కథన మధ్యభాగంలో సంజయ ధృతరాష్ట్రుల మధ్య ఈ సంభాషణం జరిగింది.

ధృత: సంజయా! మన బలంలో మేటిమగలు చాలామంది ఉన్నప్పటికీ గెలవలేకపోవటం దైవకృతమే కదా! ఆలోచిస్తే ఆశ్చర్యం కల్గుతుంది. ఇది ఇట్లాగే ఔతుందని విదురుడు ఎప్పుడో చెప్పాడు. ఆత డెంత చెప్పినా దుర్యోధనుడు వినడు, కీడు చేయటం మానడు. కర్మఫలం అనుభవించక తీరుతుందా? విధి నెవ్వరూ దాటలేరు. కానున్నది కాకమానదు.

సంజ: నీ కొడుకు తెలియక చేయనీ, తెలిసి తెలిసి నీవు ఆనాటి జూదాన్ని ఉపేక్షించావు. ఆ ఉపేక్షయే నేటి యుద్ధంగా మారింది. ఇక పశ్చాత్తాపం మాని ధైర్యంతో యుద్ధక్రమాన్ని వినుము.

ఆరవనాటిరాత్రి దుర్యోధనుడు భీష్ముడితో ఇట్లా అన్నాడు:

దుర్యో: మనం వ్యూహాన్ని వికాసవంతంగా పన్నుకొని వెళ్ళగా పాండవులు దానిని పాడు చేశారు. పైపెచ్చు భీముడి చేతిలో నేను భంగపడ్డాను. నిన్ను వెంటబెట్టుకొంటే పాండవులను జయించగలననే ఆశ ఉండేది. దానిని తొలగిస్తున్నావు. నీవు దేవతలనైనా లెక్కచేయవు. కాగా, పాండవులు రణరంగంలో ఇంతటి బలవంతులుగా ఎట్లా రాణిస్తున్నారు?

భీష్మ: దుర్యోధనా! నీవిన్నిమాటలు నన్ననవద్దు. యుద్ధంలో నా ఒడలును ఎప్పుడైనా దాచుకొన్నట్లున్నదా? శత్రువులను వెనుకాముందూ చూచుకొనకుండా వెంటాడుతున్నాను కదా! పాండవులను జయించటం సాధ్యంకాదని నీకెప్పుడూ చెప్పుతుంటాను. అయినా, నేను ఎటువంటి దాపరికం లేకుండా నీకు జయాన్ని కోరుతూ యుద్ధం చేస్తాను.

ఆ మాటలు విని దుర్యోధనుడు ఊరడిల్లి ఆ రాత్రి సుఖంగా నిద్రపోయాడు.

## భీష్ముడి ఏడవనాటి యుద్ధం

మరునాడు ఉదయం భీష్ముడు మండలవ్యూహం పన్నాడు. దానిని గమనించి ధర్మరాజు వజ్రవ్యూహాన్ని సన్నద్ధం చేశాడు.

అప్పుడు - ద్రోణుడు విరాటుడిని, అశ్వత్థామ శిఖండిని, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడిని, శల్యుడు నకుల సహదేవులను, విందానువిందులు యుధామన్యుడిని, పెక్కండ్రురాజులు అర్జునుడిని, భీమసేనుడు కృతవర్మను, అభిమన్యుడు చిత్రసేన దుశ్శాసన వికర్ణులను, ఘటోత్కచుడు భగదత్తుడిని, సాత్యకి అలంబసుడిని, ధృష్టకేతుడు భూరిశ్రవసుడిని, పలువురు రాజులు కలిసి భీష్ముడిని రోషాలతో ఎదుర్కొన్నారు.

తనమీద బాణవర్షం కురిపిస్తున్న రాజలోకం మీద అర్జునుడు ఇంద్రాస్త్రం ప్రయోగించాడు. వారు భయంతో పరుగెత్తి భీష్ముడి నాశ్రయించారు. భీష్ముడు పాండవ వీరులపై క్రూరబాణాలు వేసి నిలువరించాడు. ఆ వీరుల పోరుతో ద్రోణుడు శంఖుడిని సంహరించాడు. విరాటుడు భయంతో పరుగెత్తాడు. అప్పుడు శిఖండి అశ్వత్థామతో డీకొన్నాడు. అశ్వత్థామ శిఖండి రథాన్ని కూల్చాడు. అతడు సాత్యకి రథమెక్కి వెళ్ళాడు. ఆ తరువాత దుర్యోధనుడిపై దాడిచేసి అతడి రథాన్ని భగ్నం చేశాడు. విరథుడైన దుర్యోధనుడిని సౌబలుడు తన రథంమీద కెక్కించుకొని పోయాడు. సాత్యకి అలంబసుడి మాయాయుద్ధాన్ని ఇంద్రాస్త్రంతో మాయించి అతడిని దూరంగా తరిమివేశాడు. భీముడు కృతవర్మను విరథుడిని చేశాడు. అతడు వృషకుడి రథమెక్కిపోయాడు.

ధృత: సంజయా! మనవైపు సైన్యం చచ్చిందనీ, నొచ్చిందనీ తరచుగా చెప్పుతావు. పాండవబలాలు తరుగక యుద్ధం చేయటం పలుమారు చెప్పుతావు. అకటా! ఇదేమి మాయయో!

సంజ: మహారాజా! మనవారు తమకు తగినట్లు పోరాడుతున్నారు. అయితే మనసేనలు పాండవసేనలో - నదులు సముద్రంలో

ప్రవేశించినట్లు - ప్రవేశించి వెలుపలికి రాలేకపోతున్నాయి. దీనిని నీవు తప్పుగా భావించరాదు. నీ తప్పు వలన కలిగిన ఈ చేటుకు శోకించి లాభంలేదు. సమరప్రకారం వినుము.

భగదత్తుడికీ, ఘటోత్కచుడికీ భీకరమైన పోరు సాగింది. అందులో ఘటోత్కచుడు ఓడి పరుగెత్తాడు. నకుల సహదేవులు కలిసి శల్యుడి మీద దాడి చేయగా అతడు నకులుడి రథాన్ని విరుగగొట్టాడు. నకులుడు తమ్ముడి రథమెక్కి యుద్ధం చేశాడు. సహదేవుడు శల్యుడిని మూర్ఛపడేట్లు కొట్టాడు. ధర్మరాజు శ్రుతాయువును ఓడించి కాలికి బుద్ధి చెప్పించాడు. చేకితానుడికీ కృపాచార్యులకూ నడుమ గట్టిపోరు చెలరేగింది. వారిరువురు పరస్పరం విరథులను చేసికొని నేలమీది కురికి యుద్ధంచేసి ఇద్దరూ మూర్ఛిల్లారు. ధృష్టకేతుడు భూరిశ్రవసుడిపై తొంభై బాణాలు వేసి నొప్పించాడు. దుశ్శాసన వికర్ణ చిత్రసేనులతో అభిమన్యుడికి మహాయుద్ధమయింది. అభిమన్యుడు వారందరిని విరథులను చేసి తండ్రుల ప్రతిజ్ఞలను తలచికొని వారిని ప్రాణాలతో వదిలాడు.

అర్జునుడు తన రథాన్ని పెక్కురు భూపతులతో కలిసి పోరుతున్న భీష్ముడివైపు పోనిచ్చాడు. నడుమ త్రిగర్తపతి అడ్డుపడి పోరు సాగించాడు. అతడి చక్ర రక్షకులు ముప్పది ఇద్దరు అర్జునుడిపై గుమిగూడి దాడి చేయగా వారిని అరువది నాలుగు బాణాలతో అర్జునుడు సంహరించాడు. అర్జునుడికి దుర్యోధన సైంధవులు సమీపంలో ఉన్నా, శల్యుడు తనవైపు ఎదుర్కొనటానికి వస్తున్నా లెక్కచేయక భీష్ముడివైపు ముందుకు సాగాడు. ధర్మరాజు తమ్ములందరితో కలిసి అర్జునుడికి బాసటగా నిలిచాడు. పాండవులందరితో పోరు సాగిస్తున్న భీష్ముడిని గమనించి దుర్యోధనుడూ, సైంధవుడూ పాండవులపై దాడి చేశారు. కృపుడు శల శల్య చిత్రసేనులతో కలిసి పాండవులమీద విరుచుకుపడ్డారు. శిఖండి సూటిగా భీష్ముడి ఎదుటబడి పోరాడబోగా అతడు మిన్నకున్నాడు. అందుచేత అతడి విల్లు విరిచి వెనుకకు పంపాడు. ధర్మరాజు శిఖండి ప్రతిజ్ఞను జ్ఞాపకం చేశాడు. శిఖండి విజృంభించి అడ్డం వచ్చి మహానలాస్త్రాన్ని ప్రయోగించిన శల్యుడిని వారుణాస్త్రంతో తిప్పికొట్టాడు. భీష్ముడు ధర్మరాజు విల్లును టెక్కాన్ని విరిచాడు. భీముడు రెచ్చిపోయి నేలపైకి దూకి గదతో దుర్యోధనుడిపై లంఘించాడు. జయద్రథుడు భీముడిని అయిదువందల బాణాలతో ఆపటానికి యత్నించాడు. అయినా ఆగక అతడి రథాశ్వాలను చావమోదాడు. అతడు మరొకరథం మీదికి పరుగెత్తాడు. అప్పుడు చిత్రసేనుడు భీముడి నడ్డగించి పెనుగదను విసిరాడు. భీముడు తనగదాఘాతంతో దానిని వారించాడు. భీముడి గదతో చిత్రరథుడి గుర్రాలు కూలాయి. అతడు విరథుడై వికర్ణుడి రథమెక్కి తొలగిపోయాడు.

భీష్ముడు ధర్మరాజుయొక్క రథాశ్వాలను కూల్చాడు. అతడి సర్వాంగాలను నొప్పించాడు. ధర్మరాజు ఆగ్రహించి శక్తిని ప్రయోగించగా అతడు దానిని మధ్యలోనే త్రుంచాడు. ధర్మరాజు నకుల సహదేవుల రథాల నెక్కి యుద్ధం చేయ నారంభించాడు. భీష్ముడు వారి రథాలను కూల్చాడు. ధర్మరాజు ఉమ్మలికతో రాజులను భీష్ముడిపైకి ఉసికొల్పాడు. పెక్కు మృగాలు చుట్టుముట్టగా చెలరేగే సింహంవలె చుట్టుముట్టిన రాజలోకాల్ని భీష్ముడు మండలాకార సంచారంతో చెండాడాడు. నిపుణంగా తాటికాయలను నేలరాల్చే వాడివలె రాజులతలలను నేలవ్రాలేటట్లు చేశాడు. అంతలో శిఖండి కోదండపాండిత్యం ప్రకటిస్తూ వచ్చాడు. అక్కడి మేటి వీరుల మధ్య పోరు బాగా చెలరేగింది. అర్జునుడు సమయానికి వచ్చి ధర్మరాజు సేనను ఆదుకొన్నాడు. ద్రోణుడు అర్జునుడిని బాణాల వర్షంతో కప్పాడు. వాటి నతడు ఛేదించాడు. ధర్మరాజు సూచనతో పార్థుడు విజృంభించి కౌరవసేనలను చిక్కుపరిచాడు. రణరంగం పీనుగు కుప్పలతో బీభత్సమైంది. శత్రువీరులను చిక్కుపెట్టిన భీముడూ ధర్మరాజును సమీపించారు. అప్పటికి సూర్యాస్తమయం కావటంతో అందరూ యుద్ధం చాలించి విడుదలకు తిరిగిపోయారు.

## భీష్ముడి ఎనిమిదవనాటి యుద్ధం

భీష్ముడు కూర్మవ్యూహం పన్నాడు. ధృష్టద్యుమ్నుడు శృంగాట వ్యూహం రచించాడు.

భీష్ముడు సింహనాదం చేస్తూ బయలుదేరాడు. పాండవసేనలు భయపడి ముందుకు నడవలేకపోయాయి. భీముడు ఒక్కడే భీష్ముడిని ఎదిర్చి అతడి సారథిని చంపాడు. గుర్రాలు భీష్ముడి రథాన్ని దూరంగా లాగికొని పోయాయి. పాండవసేన ఉత్సాహంతో ఉరకలు వేసింది. సునాభుడు భీముడి నెదుర్కొన్నాడు. ఒక్క గదాఘాతంతో భీము డతడి తల వ్రయ్యలు చేసి చంపాడు. అతడి చావును చూచి అతడి సోదరులు ఏడుగురు భీముడిపై దాడిచేశారు. సంకుల సమరంలో భీముడు వారినందరినీ చంపాడు.

మిగిలినవారు భయపడి భీముడివైపు రాకుండ ఆగిపోయారు. 'ఆనాడు కౌరవ సభలో చేసిన ప్రతిజ్ఞలన్నీ తీర్చేటట్లుగా ఉన్నాడు భీము'డని అందరూ భయపడ్డారు. కౌరవుల దుర్ణయానికి ఫలంగా వారికి చావు తప్పదని అనుకొన్నారు.

దుర్యో: భీష్మా! ఈ విధంగా భీముడు వరుసపెట్టి నా తమ్ములను చంపుతూ ఉంటే చూస్తూ ఊరకుంటావా? రోషశోకాలు నీకు లేవా? తోడుపడకూడదనే మిన్నక నిలిచావా? ఉన్నవారందరూ ఒక్కసారి చావాలన్న కోరికతోనే ఊరకున్నావా? (అని ఏడ్చాడు దుర్యోధనుడు.)

భీష్మ: (కంటతడిపెట్టి) ఈ సంగతి నీకు ముందే నేనూ ద్రోణుడూ, విదురుడూ విశదంగా చెప్పాము. పాండవులకు ఎదురై నిలిచి గెలవటం మా వశమా? ఆ భీముడి పాలబడిన మన కుమారులను కాపాడటం ఎవరికీ సాధ్యం కాదు. దీనికి దుఃఖించ నవసరంలేదు. వీరస్వర్గమే సంపదగా భావించి నీవింక యుద్ధం చేయుము. నేనూ నాకు చేతనైనంత సమరం చేస్తాను. మనకు విజయం కలిగితే త్రోసివేసికొంటామా?

ధృత: (సంజయుడు చెప్పిన ఆ మాటలు విని) ద్రోణ భీష్ము లుండగానే కురుకుమారు లట్లా చనిపోతారా? ఇదంతా గాంధారీ నేనూ చెప్పినా ఆ దుర్యోధనుడు వినలేదు. దాని ఫలాన్ని ఇప్పుడు అనుభవిస్తున్నాడు. ఇక ఇప్పు డేమనుకొన్నా అది గతజలసేతుబంధనం. (అని ఊరుకొన్నాడు. సంజయుడు కథసాగించాడు)

భీష్ముడు భయంకరంగా భీముడివైపు రథాన్ని నడిపించాడు. అంతకుముందే పాండవసైన్యం మూడు గట్టిగుంపులుగా చేరి ఉన్నది. ఒక మొత్తం చేకితాన ద్రౌపదేయ సహితంగా సవ్యసాచి నాయకత్వంలో ఉన్నది. మరొకటి అభిమన్యుడు ఇంకొకటి ఘటోత్కచుడు నాయకులుగా కల్గి ఉన్నది. ఏడవనాడు ఈ మూడు మొత్తాలు చేసిన వీరవిహారమే కథాసారం. ఆ విహారాలలో పేర్కొనదగినవి. 1. ద్రోణుడు ద్రుపదుడితో చేసిన యుద్ధం, 2. అలంబసుడి చేత ఇరావంతుడు మృతుడైన యుద్ధం, 3.ఘటోత్కచుడు ద్రోణాచార్య ప్రభృతులతో చేసిన యుద్ధం, 4. ఇరావంతుడి మృతికి అర్జునుడు శోకించి శ్రీకృష్ణ ప్రబోధితుడై విజృంభించి చేసిన యుద్ధం. సాయంకాలం కావటంతో ఆనాటి యుద్ధం ఆగింది.

దుర్యోధనుడు నగరు ప్రవేశించి కర్ణశకునులను దుశ్శాసనుడిని పిలిపించుకొని ఏకాంతంలో వారితో రహస్య సంభాషణం చేశాడు.

దుర్యో: భీష్మ ద్రోణ కృపాశ్వత్థామలు మధ్యస్థులై పాండవబలాలను మట్టుపెట్టే విజృంభణం చేయటంలేదు. మన సేనలా నానాటికి సన్నగిల్లుతున్నాయి. ఇప్పుడు మనం ఏమి చేయగలం?

కర్ణ: ప్రభూ! ఇక భీష్ముడిని రణరంగానికి రప్పించబోకుము. నేను నా భుజబలంతో పాండవుల మదాన్నీ, వారి సేనల ఔద్ధత్యాన్నీ మాన్పుతాను.

దుర్యో: (దుశ్శాసనుడితో) మనం పోయి భీష్ముడిని యుద్ధంనుండి మాన్పించివద్దాం.

అని చెప్పి రథమెక్కి భీష్ముడి వద్దకు సుయోధనుడు వెళ్ళాడు. చేతులు మోగిడ్చి ఈ విధంగా అన్నాడు:

దుర్యో: కురుముఖ్యా! నిను నమ్మి పాండవ ప్రాభవాన్ని నేను లెక్కచేయలేదు. అయితే, నీ విప్పుడు చేస్తున్న యుద్ధ వైఖరులను ఎన్నింటినో గమనించాను. నీవు పాండవులను యుద్ధంలో సమీపిస్తావు, కాని చనువిచ్చి వారిని చంపవు. వారు యుద్ధం చేస్తే పట్టి పాలారుస్తున్నావు. ఇంక నేనేమని అనేది? ఇంక - ఇప్పటినుండి నీవు యుద్ధం చాలించుము. నిన్ను యుద్ధంలో దేవతలు కూడా గెలువలేరు. ఇప్పటికి ఎనిమిదినాళ్ళయింది. అర్జునుడిని చంపవు, ఓడించవు. ఆ పని అట్లా ఉండనీ. ఇప్పటికైనా నామీద ఉన్న మమకారంతో, నా ప్రార్థన మన్నించి, కర్ణుడిని యుద్ధం చేయటానికి అనుమతించుము.

భీష్మ: (ఆ మాటలు ఈటెలుగా మనసుకు తాకాయి. అత్యంత విషాదంలో మునిగి కొంతసేపు తలవాల్చుకొని కూర్చుండి, నిట్టూర్చి, చివరకు తలయెత్తి) భూపాలా! నీకొరకు ప్రాణాలు తాకట్టుపెట్టి యుద్ధం చేస్తున్నా నీ విట్లా మాట్లాడటం తగునా?

నా రాజభక్తి అంతా బూడిదలో పోసిన పన్నీరయింది. (కోపంతో) ఆ అర్జునుడు సామాన్యుడా! అలనాడు ఇంద్రాదులను జయించి ఖాండవవనాన్ని దహించలేదా? గంధర్వుల చేతిలో ఓడిన కర్ణుడినీ, నిన్నూ, నీ తమ్ములనూ చెరనుండి విడిపించుకొనలేదా? నన్నూ, ద్రోణుడినీ, అశ్వత్థామనూ, కృపుడినీ, కర్ణుడినీ గెలిచి విరాటుడి గోవులను మరల్చుకొనలేదా? ఇంకెన్నో మహావిజయాలు సాధించిన మహావీరుడు అర్జునుడు. అటువంటి జగజెట్టితో ఇన్నాళ్ళు ఈ విధంగా యుద్ధం చేసికూడా నీచేత ఈనాడు ఇటువంటి వేడిమాటలు వినవలసి వచ్చింది. అజేయులైన పాండవులతో తగనిపని అని తలంచకుండా, పగ సాధించ బూనావు. నీవు సాహసించి యుద్ధంలో పౌరుషాన్ని ప్రదర్శించుము. ఇటువంటి పనికిరాని మాటలాడటం చాలించుము. మరల చెప్పుతున్నాను వినుము. నేను గాండీవిని గెలువలేను. శిఖండిని చంపలేను. మరెవరినైనా యుద్ధంలో ఉగ్రంగా చెండాడుతాను. ఈ సంగతి ముందే చెప్పాను నీకు. నేనూ, నా సేనలూ కలిసి ద్రుపద, విరాట, యాదవాదుల సైన్యాలతో యుద్ధం చేస్తాము. మీరందరూ పాండవులను జయించటానికి పూనుకొనండి. అర్ధరాత్రి వేళ వచ్చి ఈ విధంగా నన్ను నొవ్వబలకటం వలన నీకు జయం కలుగుతుందా? పూనుకొని నీవే యుద్ధాన్ని నడుపుము. రేపు మా చేతి బలుపేమిటో చూస్తావు గాక! ఇక వేయి మాటలెందుకు?

## భీష్ముడి తొమ్మిదవనాటి యుద్ధం

దుర్యోధనుడు ఆ రాత్రి సుఖంగా నిద్రించి మరునాడు రాజలోకాన్ని సంబోధిస్తూ ఇట్లా పలికాడు:

'భీష్ముడు పాంచాలురు మొదలుగా పాండవబలాలనన్నింటిని చంపి, యుద్ధంలో పాండవులను జయిస్తానని రాత్రి ప్రతిజ్ఞ చేశాడు. ఈనాడు మన బలపరాక్రమాలు ప్రకటితం కావాలి.' దుర్యోధనుడి తులువ మాటలు విని భీష్ముడు వెగటు పొందాడు. సిగ్గుతో కుంచించుకొనిపోయాడు. విషాదంతో విలవిలలాడాడు. అయినా, తనను తాను నిగ్రహించుకొని ఉన్నాడు. ఆ స్థితిని గమనించి దుర్యోధనుడు దుశ్శాసనుడితో ఇట్లా అన్నాడు:

దుర్యో: మనమంతా పితామహుడి వద్దనే ఉందాం. అంతేకాక శత్రుమర్దనులైన ఇరవై రెండువేల మంది రథికులను ఆయనకు తోడుగా నిలుపుదాం. శిఖండి కనపడితే యుద్ధం చేయనని చెప్పాడు. అందువలన ఆ నీచుడు ఎదుటపడకుండా మనం చూడాలి.

ఆ తరువాత భీష్ముడు సర్వతోభద్ర వ్యూహం పన్నాడు.

భీష్ముడి వెంట కృపాచార్య, కృతవర్మ, శల్య, శకుని, సుదక్షిణ, సైంధవులూ, కురుకుమారులూ కలిసి ముందట నిలిచారు. ద్రోణ, భూరిశ్రవో, భగదత్తులు వలపట నిలిచారు. సోమదత్త, అశ్వత్థామ, విందానువిందులు దాపట నిలిచారు. హలాయుధ, అలంబస, శ్రుతాయువులు వెనుక నిలిచారు. దుర్యోధనుడు త్రిగర్తులు పరివేష్టించి ఉండగా నడుమన నిలిచాడు.

పాండవపక్షం శిఖండిని అగ్రస్థానంలో నిలిపే ఒక గట్టి వ్యూహాన్ని రచించింది. శిఖండి అగ్రస్థానంలో ఉండగా అతడి కొకప్రక్క భీమసేన ఘటోత్కచులు, మరొకవంక అర్జున, ధృష్టద్యుమ్నులు మోహరించారు. సాత్యకి విరాటులు వలపటను, అభిమన్యు పాంచాల కేకయులు దాపటను, నకుల సహదేవ ద్రౌపదేయులను ముందుగా నుంచుకొన్న ధర్మరాజు నడుమను, చేకితాన కుంతిభోజులు వెనుకభాగాన నిలిచారు.

ఆనాడు జరిగిన యుద్ధ ఘట్టాల క్రమ మిది:

1. అభిమన్యుడి విజృంభణం - అభిమన్యుడు కౌరవసైన్యంమీద దూదికొండ మీద చిచ్చు పాకినట్లుగా దాడి చేశాడు. కొరవి త్రిప్పినట్లు మండలచారియై తిరిగాడు. అడ్డులేని విధంగా తిరుగుతున్న అతడిని చూచి దుర్యోధనుడు రెండవ అర్జునుడుగా భావించి భీతిచెందాడు. అలంబసుడనే రాక్షసరాజును అతడిపై పురికొల్పాడు. అతడు మాయాయుద్ధంతో అభిమన్యుడిని ఎదిరించాడు. అతడి మాయల నన్నిటిని అస్త్రాలతో భేదించి అతడిని ఓడించి రణవిముఖుడిని చేశాడు. కౌరవసైన్యం అభిమన్యుని పరాక్రమానికి వికావికలై పోయింది.

భీష్ముడు అనేకమంది రథికులతో కలిసి అభిమన్యుడిని ఎదిరించాడు. అతడు భీష్మాదులను ధైర్యంతో ఎదుర్కొన్నాడు.

సంకుల సమరం సాగింది.

2. అర్జునుడు ద్రోణాచార్యులతో భీకరయుద్ధం చేశాడు. భీష్ముడు ధర్మరాజుతో తలపడ్డాడు. ధర్మరాజుకు పోరు భారంకాగా ధృష్టద్యుమ్న శిఖండి విరాట ద్రుపదులు అతనికి సాయం వచ్చారు. ఉభయ సైన్యాలలో మిక్కుటంగా నష్టాలు జరిగాయి. కౌరవసైనికులు ఆ యుద్ధానికి కారకులైన ధృతరాష్ట్రుడిని, దుర్యోధనాదులను నిందించనారంభించారు.

భీష్ముడిని పాండవవీరులు చుట్టుముట్టారు. దుర్యోధనుడు శకుని దుశ్శాసనులను భీష్ముడికి సహాయంగా పంపాడు. మధ్యాహ్నం వరకు ఒకరిపై నొకరు యుద్ధ తీవ్రతను ప్రకటించారు.

3. మధ్యాహ్నంనుండి భీష్ముడు ప్రచండభానుడివలె విజృంభించాడు. వరుసగా భీష్ముడు ధర్మరాజును, భీముడిని, నకుల సహదేవులను, సాత్యకిని, ధృష్టద్యుమ్నుడిని నొప్పించి ఆర్చాడు. అప్పుడు మాత్స్య, పాండ్య, సోమక, మగధ వీరుల బలాలూ భీష్ముడిని చుట్టుముట్టాయి. భీష్ముడు వారందరినీ చిక్కుపరిచి ప్రచండ పరాక్రమాన్ని ప్రదర్శించాడు. పాండవసైన్యం తునాతునకలై కుప్పలు కుప్పలుగా పడింది. గగ్గోలు పెట్టారు సైనికులు. ఆ దయనీయ దృశ్యాన్ని శ్రీకృష్ణుడు అర్జునుడికి చూపించి పార్థుడికి రణోత్సాహాన్ని కలిగించ యత్నించాడు. కాని, అర్జునుడు విచారంతో, నిరుత్సాహంగా ఉండిపోయాడు. శ్రీకృష్ణుడు విరాట నగరంలో సంజయుడి ఎదుట పలికిన అర్జునుడి పలుకులను అతడికి జ్ఞాపకం చేశాడు. అయినా 'బంధువుల నందరినీ చంపి కౌరవహీనమైన రాజ్యాన్ని పొంది నేనేమి పుణ్యం చేసినవాడ నౌతాను? అందువలన నా మనసు యుద్ధంవైపు మొగ్గటంలేదు. అయినా, నీతో అప్పుడప్పుడు ఈ మాటలెందుకులే! భీష్ముడిని చంపుతాను. ఇక రథాన్ని ఆయనవైపు పోనిమ్ము' అని అన్నాడు. శ్రీకృష్ణుడు అట్లాగే చేశాడు.

4. అర్జునుడు చెదరిపోతున్న సైన్యాన్ని కూడగట్టుకొని భీష్ముడిని సమీపించాడు. అతడు మహాస్త్రాలతో సైన్యాన్ని నిలువరించి గుర్రాలను, సారథిని, అర్జునుడిని నొప్పించాడు. పార్థుడు కోపించి భీష్ముడి విల్లు విరిచాడు. అతడు మరొక విల్లెత్తాడు. దానిని కూడా అర్జునుడు త్రుంచాడు. 'ఔరా! శతమఖనందన!' అని అబ్బురపడుతూ మరొక వింటితో శరపరంపర గుప్పించి పార్థుడిని నొప్పించాడు. అయినా అతడు బింకంతో పోరు సాగించాడు. భీష్ముడు విజృంభించి పార్థుడిని బాధిస్తూ ఉండగా ఎవ్వరూ ఆ దరికే రాలేకపోయారు.

అప్పుడు శ్రీకృష్ణుడు దారుణమైన రోషంతో ఓర్పును కోల్పోయి వెంటనే నొగలుకు పగ్గాలు ముడివేసి, మునికోల చేతబట్టి రథంనుండి నేలమీదకు దూకాడు. భూచక్రం కంపించింది. దిగ్గజాల మెడలు వంగాయి. దిశావలయాలు వణికాయి. కౌరవబలాలు పరుగెత్తాయి. భయంకరాకారంతో చేతులు కదిలిస్తూ దేవతలు భయపడగా రౌద్రోద్రేకంతో భీష్ముడిపైకి ఉరికాడు. లలిత పీతాంబరం విలాసంగా ఒప్పారగా, సింహనాదంతో కూడిన అందంతో మెరుపుకాంతితో, ఉరుములతో కూడుకొన్న నల్లనిమేఘంవలె శ్రీకృష్ణుడి ఆకారం భాసించింది. 'భీష్మ డిక చచ్చా'డని కౌరవసైనికులందరూ జీవాలు పోయినట్లు వెలవెలలాడే ముఖాలతో చూస్తూ నిలిచిపోయారు.

భీష్ముడా నారాయణమూర్తిని చూచాడు. మనసు వికాసం పొందగా అల్లన నవ్వాడు. 'మహాత్మా! వేగంగా రమ్ము. ఓ పుండరీకాక్షా! ఇది నాకెంతో మేలు. నాకు శాశ్వతమైన కీర్తి వస్తుంది. అక్కడ శాశ్వత సద్గతి లభిస్తుంది. నీ ఇష్టం వచ్చినట్లు చేయుము' అని పలికాడు.

అప్పుడు అర్జునుడు వేవేగంగా రథంమీదనుండి దూకి శ్రీకృష్ణుడిని వెన్నంటి వెళ్ళి చేతులతో కౌగిలించుకొని గట్టిగా పట్టుకొన్నాడు. ఆత డీతడిని పది అడుగుల దూరం లాగికొనిపోయాడు. అర్జునుడు అడుగులు బిగబట్టి, బాహువుల బలం పెట్టి, నేలమీద తన్నిపట్టి శ్రీకృష్ణుడిని నిలువం బెట్టి, నిట్టూర్పులు నిగుడించి, జనార్దనుడితో ఇట్లా అన్నాడు:

'నేను యుద్ధం చేయ' నని నిర్మలబుద్ధితో ప్రతిజ్ఞ చేసి, నీ విప్పుడు మాట తప్పితే జగ మేమంటుందో తెలుసుకదా! యుద్ధాలలో కొంతసేపు అలసిపోవటం తప్పా? నాపై యుద్ధానికి పూనుకొన్న భీష్ముడిపతనం చూతువుగాని రావయ్యా! రథంమీదికి ఎక్కుము. నిన్నాశ్రయించినవారిని ఈ విధంగా వృథాపుచ్చటం న్యాయమా?' అనగా కృష్ణుడు ప్రియమంది తిరిగివచ్చి రథమెక్కాడు. కృష్ణార్జునుల రథం ప్రళయకాలమేఘంవలె రాణించింది. భీష్ముడు భయంకరంగా నిలిచి పరిక్రాంతులైన కృష్ణార్జునులను, భీతులైన భీమాదులను ఏమీ చేయలేక చూస్తూ ఉండిపోయాడు. అంతలో సూర్యు డస్తమించాడు. ఘోరమైన సంధ్యాసమయంలో బురదలో దిగబడ్డ ఆవువలె ఉన్న తన సేనను చూచి ధర్మరాజు చింతించాడు. భీష్ముడిచేత భంగపడ్డామనే దుఃఖంతో వీరులు వెంటరాగా విడిదులకు తిరిగిపోయాడు. కౌరవవీరులు భీష్ముడి పరాక్రమాన్ని ప్రశంసిస్తూ విలసిల్లిన మొగాలతో విడిదులకు వెళ్ళారు.

ధర్మరాజు తొమ్మిదవనాటి యుద్ధంలో సైన్యం బలహీనపడినందుకు విషాదం చెందుతూ రాత్రివేళ రహస్యంగా తమ్ములతో కలిసి కృష్ణుడి మందిరానికి వెళ్ళి తమగోడు ఇట్లా చెప్పుకొన్నాడు.

ధర్మ: కార్చిచ్చు చుట్టుముట్టి లేళ్ళగుంపును కాల్చే విధంగా ఈనాడు భీష్ముడు విజృంభించటం చూచావుకదా! మనవారెవ్వరూ అతడిని జయించలేరు. దురభిమానంతో ఆ సత్యాన్ని ఇదివరలో గుర్తించలేకపోయాను. నిర్మూలంగా యుద్ధంలో చస్తే సామ్రాజ్యం పొందినట్లవుతుందా? కాబట్టి, తమ్ములతో కూడి నిశ్చింతగా అడవులకు పోయి తపస్సు చేస్తూ గౌరవంగా ఉంటాను. పూర్వం నా కారణంగా నా తమ్ములు ఎన్నో కష్టాలు పడ్డారు. అటువంటి వారిని కన్నారా చూచుకొంటూనైనా ఉంటాను గాని వారిని భీష్ముడికి బలిపెట్టలేను. నీకు మాయందు దయ ఉంటే యుద్ధం మానటానికి ధర్మవిరోధం లేని ఒక మార్గం చూపించుము.

కృష్ణ: (సానునయంగా) ధర్మరాజా! నీవు సత్యప్రతిజ్ఞుడవు. నీ తమ్ములు అద్భుత బాహుబల సంపన్నులు. నీకు దుర్గతి ఎందుకు కలుగుతుంది? నీకు మంత్రినై రాజ్యవైభవాన్ని నేను సమకూరుస్తాను. నీవు విచారించకుము. పార్థుడు సాహసించి యుద్ధం చేయలేకపోతే నేనే భీష్ముడిని చంపి పగసాధిస్తాను. నీవు చూస్తూ ఉండుము. నాకు సవ్యసాచి చెలికాడు, ఆత్మీయుడు, శిష్యుడు. ప్రేమతో అతడి కొరకు నేను కండలు కోసి ఇస్తాను. నాకు అత డంటే అంత అభిమానం. ఉపప్లావ్యంలో సంజయుడితోనూ, ఆ తరువాత ఉలూకుడితోనూ అతడు పలికిన మాటలకు తగినంత నేను కూడా చేయవలసి ఉన్నది. నేను మీ రెండువైపుల పలికిన వాడిని. అందరి మాటలు నేను కూడా పాటించాలి.

ధర్మ: కృష్ణా! యుద్ధం చేయకుండా సముచితమైన సహాయం చేస్తానని నీవు పలికావు. అట్టి నిన్ను ఇప్పుడు అబద్ధమాడేటట్లు చేస్తానా? దైవం నాకెందుకు ఇంత దీనస్థితిని తెచ్చిందో తెలియటంలేదు. నాకూ భీష్ముడికీ ఒక ఒప్పందం ఉన్నది. ఆ మహాత్ముడు కౌరవులకొరకు యుద్ధం చేయటానికీ, నాకు రాజ్యం ఇవ్వటానికీ అంగీకరించాడు. (కంటతడిపెట్టుతూ) అయ్యో! మా తండ్రి చనిపోయిన నాటినుండి మమ్ములను దగ్గరకి తీసి రక్షించిన ప్రియమైన తాతను చంపటానికి మనసులో భావించే సాహసం చూచావా? రాజధర్మం ఎంత క్రూరమైనదో!

కృష్ణ: (తనలో) ఇతడు భీష్ముడి వద్దకు వెళ్ళాలని భావిస్తున్నాడు. (ప్రకాశంగా) మంచిది వెళ్ళి రమ్ము. నీ ఆలోచన బాగున్నది. నీవు ముందు అన్నట్లుగా భీష్ముడు కోపించి యుద్ధంలో చక్కగా చూస్తే శత్రువులు చావటం నిజం. అందువలన ఇప్పుడు అతడి పాలికి వెళ్ళుము. నీవు భీష్ముడిని అడిగితే నిజ వధోపాయాన్ని తప్పక చెప్పుతాడు. మనమందరం రహస్యంగా వెళ్ళి భక్తితో మ్రొక్కి, హితకార్యాన్ని గురించి వినయంతో ప్రార్థించి అడిగితే అతడు దయతో మనకు ఆ మంత్రోపదేశం చేయగలడు. ఇది తప్పక చేయదగినపని.

ధర్మరాజు, అతడి తమ్ములు, శ్రీకృష్ణుడు సామాన్యవేషాలు ధరించి అతి రహస్యంగా భీష్ముడి మందిరంలో ప్రవేశించారు. అతడిని దర్శించి, భక్తితో స్తుతిస్తూ పాదాభివందనం చేశారు. భీష్ముడు వారందరినీ పేరుపేరున క్షేమ మడిగాడు.

భీష్మ: ఇక్కడికి మీరందరూ కలిసి వచ్చిన పని ఏమిటి? మీ కేది కావాలో అడగండి. ఇస్తాను. ఎంతటి అసాధ్యమైనా వెంటనే సాధించి ఇచ్చి మిమ్ములను సంతోషపెట్టుతాను.

ధర్మ: (దీనంగా) మాకు ఏ విధంగా సామ్రాజ్యం సమకూరుతుందో, ఏ విధంగా సేనలు చావటం వలన కలిగే వ్యథ లేకుండా ఉంటుందో, ఆ మార్గాన్ని దయతో వెంటనే చెప్పాలి.

భీష్మ: అనఘా! నేను యుద్ధం చేస్తుంటే మీ సైన్యం నశించక తప్పదు. సామ్రాజ్యం కూడా దక్కదు. కాబట్టి, నన్ను జయిస్తే మీకు శుభాలన్నీ కలుగుతాయి.

ధర్మ: మహాత్మా! మూడవకన్ను మూసికొని, త్రిశూలాన్ని దాచుకొని అవతరించిన రుద్రుడివలె నీవు రణరంగంలోకి దిగుతావు. ఎటువంటి వీరులకైనా నిన్ను ఎదిరించటం సాధ్యమా? కాబట్టి నీ దయను ఆశ్రయించటానికి వచ్చాను. నిన్నేవిధంగా గెలవటానికి వీలుంటుందో మాకు తేటతెల్లమయ్యేటట్లు తెలుపుము.

భీష్మ: నీ వన్నది నిజం. నా చేతిలో ధనువుండగా దేవతలు కూడా నన్ను గెలువలేరు. అటువంటి వాడినిగా మీరు నన్ను గుర్తించి, ఇంతమంది ఇక్కడికి వచ్చి ఈ విధంగా అడుగుతుంటే మీకు ప్రియమైన కార్యం చేయటం కంటె నాకు వేరే పుణ్యమేముంటుంది? నేను ఆయుధాలను ప్రయోగించటం మానినప్పుడే నన్ను జయించ వీలవుతుంది. జోడు పుచ్చినవాడిని, ఆయుధం క్రిందపెట్టినవాడిని, జెండా దించినవాడిని, స్త్రీని, మొదట స్త్రీగా ఉండినవాడిని, ఆడువారి పేరు పెట్టుకొన్నవాడిని, తలగుడ్డను తీసివేసినవాడిని, సోదరులు లేనివాడిని, పుత్రులు లేనివాడిని చూస్తే వారితో నేను యుద్ధం చేయను. నాకు మరొక నియమం కూడా ఉన్నది. పుట్టినప్పుడు లేకుండా నడుమ దైవమిచ్చిన పురుషత్వం కలవాడితో యుద్ధం చేయను. కాబట్టి, మీకు ఒక ఉపాయం చెప్తాను. ద్రుపద సంతానమైన శిఖండి అటువంటివాడని మీకు తెలుసు. వాడు పూర్వజన్మలో స్త్రీ కావటంచేత వాడికి ఎదురుగా ఉండి బాణాలను ప్రయోగించను. కాబట్టి, అర్జునుడు అతడిని ముందు పెట్టుకొని వస్తే, నేను బాణప్రయోగం మానితే, నన్ను నొప్పించి పడవేయండి. ఆ తరువాత బంధుమిత్రులైన కౌరవులను జయించటం తేలికపని ఔతుంది. ఇది నా ఆజ్ఞ. నేను చెప్పినట్లు చేయండి.

అని భీష్ముడిచేత అనుజ్ఞాతులై, అతడికి నమస్కరించి బయలుదేరారు. త్రోవలో అర్జునుడు విషాదాన్ని ప్రకటించాడు. భీష్ముడిని పరలోక గతుడిని చేయటానికి కృత్రిమపద్ధతిని అనుసరించి చంపవలసి వస్తున్నందుకు బాధపడుతూ శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

అర్జు: గురువు, ప్రజ్ఞావంతుడు, ధర్మవ్రతుడు, వయోవృద్ధుడు, లోకమాన్యుడు, దయాళువు అయిన భీష్ముడిని వంచనతో చంపటానికి నాకు బుద్ధి పుట్టటంలేదు. నా చిన్నప్పుడు మట్టిలో ఆడుకొంటున్న నన్ను ఎత్తుకొని, నా ఒంటిపై నున్న దుమ్ము ఆయన కంటేటట్లు ప్రేమతో కౌగిలించి, మా తండ్రి పాండు రాజ గుణాలను స్మరించుకొంటూ కంటతడి పెట్టుకొనేవాడు. తండ్రిలేని మమ్మల్ని తండ్రివలె పెంచిన మాతాతను ఈ విధంగా చంపరాదు. ఆయన యుద్ధంలో తన భుజబలంతో సైన్యాన్నంతా చంపినా నేనుచూస్తూ ఊరకుంటాను కాని ధర్మం తప్పను. ధర్మరాజు తమ్ములు క్రూరకర్ములౌతారా?

కృష్ణ: క్రూరత్వాన్ని సహించి, ఏ మాత్రమూ అసహ్యించుకొనకుండా, పూని, అన్ని విధాలా శత్రువులను చంపి, ప్రజలకు అభ్యుదయం కలిగించటం, న్యాయంగా సుంకాలు తీసికొని, వాటిని సద్వినియోగం చేయటం రాజ ధర్మమని బృహస్పతి ఇంద్రుడికి బోధించిన సంగతి లోక ప్రసిద్ధమే కదా! అంతేకాక, యుద్ధంలో భీష్ముడిని చంపుతానని నీవు చేసిన ప్రతిజ్ఞ లోకమంతా వ్యాపించింది. కాబట్టి పంతంతో ఏ విధంగానైనా అతడిని చంపక తప్పదు. అది రాజధర్మ పరిపాలనమే ఔతుంది కాని క్రూరకర్మకాదు. భీష్ముడిని చంపటానికే బ్రహ్మదేవుడు నిన్ను పంపాడు. కాబట్టి భీష్ముడిని చంపటానికి ఇంకా మీనమేషాలు లెక్కపెట్టట మెందుకు?

అర్జు: ఆ శిఖండి పుట్టుక భీష్ముడిని వధించటానికే అని అంటారు. అది తప్పదు. భీష్ముడు శిఖండిపై బాణాలు వేయడు. నాపై వేస్తాడు. నేను శిఖండి వేస్తున్నట్లుగా పూనుకొని బాణాలు ఇతరులపై వేసినట్లు వేసి వధించటానికి అనువుకాని భీష్ముడిని కోపంతో శిఖండియే వధించినట్లు చేయాలి.

కృష్ణ: (నవ్వి) అవక్ర పరాక్రమశాలి అయిన భీష్ముడిని పడగొట్టటానికి నీకు తప్ప మరెవ్వరికీ సాధ్యంకాదు. నీ ఆలోచనలు దైవమే

కలిగిస్తున్నట్లు వింతగా పరిణతి చెందాయి! అది అట్లా జరగవలెనని ఉంటే మనం దానిని త్రోసి వేయటానికి వీలౌతుందా? నీవే చూస్తూ ఉండుము. అది జరుగుతుంది.

అని అన్న శ్రీకృష్ణుడి మాటలు విని 'అప్పటికి ఎట్లా అయితే, అట్లా ఔతుం'దని అర్జునుడు అంగీకరించాడు. శ్రీకృష్ణుడూ, ధర్మరాజాదులూ సంతోషించారు. నిజమందిరాలకు వెళ్ళి ఆ రాత్రి నిదురపోయారు.

## భీష్ముడి పదవనాటి యుద్ధం

మరునాడు సూర్యోదయ సమయంలో పాండవులు సేనావ్యూహాన్ని రచించారు. శిఖండిని ముందు నిలిపారు. అతడికి ఇరుప్రక్కల భీమార్జునులనూ, వెనుక అభిమన్యు ద్రౌపదేయులనూ, వారి కిరుప్రక్కలా చేకితాన శైనేయులనూ నిలిపారు, వారి వెనుక ధృష్టద్యుమ్నాది పాంచాల కుమారులను ముందుంచుకొనిన నకుల సహదేవులనూ రెండువైపుల నిలుపుకొని ధర్మరాజు, వీరిని పరివేష్టించి విరాట ద్రుపదాది రాజ సమూహం నిలిచి ఉన్నారు.

కౌరవపక్షం అంతకుముందే తమ వ్యూహాన్ని సమకూర్చింది. భీష్ముడు అగ్రభాగంలో ఉన్నాడు. కౌరవులు ఆయనను పరివేష్టించి నిలిచారు. ద్రోణ, అశ్వత్థామలు కుడి ఎడమల నిలిచారు. మధ్యభాగంలో దుర్యోధనుడు కృపకృతవర్మ భగదత్తులచేత పరిరక్షితుడై ఉన్నాడు. బృహద్బలాదులు అతడి చుట్టూ రక్షగా వలయం ఏర్పరచారు. త్రిగర్తులు అపరభాగంలో నిలిచారు.

ఉభయసేనలూ తలపడ్డాయి. ఆ యుద్ధం దేవాసురులయుద్ధంవలె అపూర్వంగా తోచింది. ఒకవైపు నకుల సహదేవులు, మరొకవైపు భీముడూ ఔద్ధత్యంతో పోరు మొదలు పెట్టారు. భీష్ముడు ప్రళయకాల భైరవుడివలె భయంకరంగా బాణాలు గుప్పిస్తున్నాడు. శిఖండి భీష్ముడిమీద క్రూరాస్త్రాలు ప్రయోగించ నారంభించాడు. భీష్ముడు అతడివైపు చూడక తల ప్రక్కకు త్రిప్పి ఇట్లా అన్నాడు:

భీష్మ: శిఖండినీ! నిన్ను బ్రహ్మ ఆడుదానిగా సృష్టించాడు. నీవు మగవాడవని నేను అనుకొనటం లేదు కాబట్టి స్త్రీవయిన నిన్ను నేను బాణాలతో కొట్టను. నా మీద నీవు పౌరుషంతో శతకోటి బాణాలు వేసినా నేను నవ్వుతానే కాని కోపించను.

శిఖండి: నీవు రాజుల నెందరినో గెలిచావు. పరశురాముడికి ప్రతివీరుడవై పేరుపొందావు. అటువంటి నీ బలాన్ని నామీద చూపజాలవా? నామీద బాణాలు ప్రయోగించుము. లేదా విలాసంగా వెళ్ళిరమ్ము. నేను ఎవ్వతెనైతేనేమిటి? బాణాలతో నిన్ను పడగొట్టుతాను. నీకు దమ్ములుంటే యుద్ధం చేయుము. ఇవ్వేళ ఎట్లాగైనా నీ పొగరు అణుస్తాను. నిన్ను బాధిస్తాను. మహావీరుడవనే నీ బిరుదు పగలగొట్టుతాను. పరాక్రమంతో అస్త్రవిద్యను నీమీద ప్రయోగిస్తాను.

అర్జు: (తనలో) ఈనాడు శిఖండి వింతగా మాట్లాడుతున్నాడు. భీష్ముడికి చివరి గడియలు సమీపించినట్లున్నాయి. శిఖండిది దైవదత్తమైన ఉత్సాహంగా కనపడుతున్నది. అతడిని నేను ప్రోత్సహిస్తాను. (ప్రకాశంగా) శిఖండీ! నీ వింతగా ప్రతిజ్ఞచేసి దానిని తీర్చకపోతే లోకం నవ్వుతుంది. నే నుండగా ని న్నెవరూ ఏమీ చేయలేరు. కానిమ్ము! భీష్ముడిమీద దాడి సాగించుము.

అని అంటూ ఉండగా భీష్ముడు ప్రక్కకు తిరిగి పాంచాల బలం మీద దృష్టి మళ్ళించాడు. అర్జునుడికి అవకాశం దొరికింది. కౌరవసేనను నుగ్గు నుగ్గు చేశాడు. సేనలు తిరిగి పారిపోవటం మొదలుపెట్టాయి.

దుర్యో: పితామహా! నీవుండగా మన సైన్యం ఇంత దీనంగా మారటం తగునా?

భీష్మ: దుర్యోధనా! పదివేలమందిని చంపుతానని నీకు మాట ఇచ్చాను. నా మాట నిలబెట్టుకొన్నాను. నీ ఋణం తీర్చుకొన్నాను. నా శరీరంలో ఇంక బలం తగ్గుతున్నట్లు తోస్తున్నది. ఈనాడు పాండవులు నన్నైనా చంపాలి లేదా నేనైనా వారిని చంపాలి. అమర్త్యులు మర్త్యులచేత చస్తారా? అయినా నా బలం చూడుము.

అని భీష్ముడు పాండవులమీద విజృంభించాడు. కౌరవులు అతడికి అండగా నిలిచి పోరాడటం మొదలుపెట్టారు. అటు పాండవులు మత్స్య, పాంచాల యాదవ, పాండ్య, కేకయాదులందరు కలిసి ఒక్కుమ్మడిగా వారి నెదుర్కొన్నారు. పోరు ఘోరంగా సాగింది.

అప్పుడు అర్జునుడు శిఖండిని చూచి, 'నీవు భీష్ముడికి భయపడవద్దు. నేనుండగా భయమెందుకు? అతడిమీద దాడి చేయుము. నేను పూనుకొని బాణాలు గుప్పించి అతడిని కూలుస్తాను' అని ప్రోత్సహించాడు. ఆ మాటలు ధృష్టద్యుమ్నుడు విని ఇట్లా ప్రకటించాడు. 'మన వైపు వీరులందరూ భీష్ముడిపై దాడి చేయండి. అర్జునుడు ఉండగా అనుమానించ నవసరంలేదు.' ఆ ప్రకటన విని పాండవపక్షంలోని మేటి వీరులందరు భీష్ముడిపై మూకుమ్మడిగా విరుచుకుపడ్డారు. వారిని మధ్యలోనే అశ్వత్థామాది కౌరవవీరులు అడ్డగించి మహాయుద్ధం చేశారు. దేవతలు  తమకున్న అనిమిషత్వం సఫలమయిందని సంతోషించారు.

అర్జునుడు శిఖండిని ముందుంచుకొని ముందుకు సాగుతుండగా దుశ్శాసనుడు సముద్రానికి చెలియలికట్టవలె అడ్డుపడ్డాడు. పార్థుడు కఠినబాణాలతో అతడిని నొప్పించి మూర్ఛిల్లచేశాడు.  అతడి సారథి రథాన్ని భీష్ముడి రథం చాటుకు పోనిచ్చాడు. అంతలో అతడు తేరికొని మరల పోరుకు సిద్ధమయ్యాడు. ఆ సమయంలో ఉభయపక్షాల వీరుల మధ్య భీకరసంగ్రామం చెలరేగింది. అర్జునుడు దుశ్శాసనుడిని బాణాలతో దూరంగా తరిమికొట్టాడు.  ఆ తరువాత భీష్ముడి ముందున్న సైన్యాన్ని వర్తులాకారంగా తిరుగుతూ చెండాడటం మొదలుపెట్టాడు. ద్రోణు డతడికి అడ్డపడపోయాడు. అతడిని ధర్మరాజు అడ్డగించాడు. అప్పుడు ద్రోణుడు అశ్వత్థామతో ఇట్లా ఎలుగెత్తి పలికాడు:

ద్రోణు: పుత్రకా! నాకు దివ్యబాణతంత్రాలు తడబడుతున్నాయి. విల్లు వణకుతున్నది. మనస్సు వశంలో లేదు. శరీరం కంపిస్తున్నది. ఇవ్వేళవైఖరి చూస్తే అర్జునుడు తన ప్రతిజ్ఞ తీర్చుకొనేటట్లున్నాడు. అర్జునుడు సేనలను చెండాడుతున్నాడు చూడుము.కురుసేనమీద గ్రద్ద లాడుతున్నాయి. ఉల్కలు రాలుతున్నాయి. నక్కలు కూస్తున్నాయి. భీష్ముడికి కీడు కలుగవచ్చును. ధర్మరాజు ముఖంలో క్రోధం తాండవిస్తున్నది.  నకుల సహదేవులు అతడిని పరివేష్టించి ఉన్నారు. ఆ వైపు పో రాకున్నది. కాబట్టి నీవు వెంటనే భీష్ముడికి అండగా నిలువుము. ఇది ప్రాణాలు దాచుకొనే సమయంకాదు.

అని హెచ్చరించాడు. అంతలో భీముడు భీష్ముడి ముందు సైన్యాన్ని నుగ్గు చేయనారంభించాడు. భగదత్తాదులు భీముడినెదిరించారు. నొప్పించారు. అయినా భీముడు లెక్కచేయక యుద్ధం సాగించాడు. అర్జునుడు కూడా అతడితో కలిశాడు. దుర్యోధనుడు సుశర్మాదులను భీమార్జునుల మీదకు పురికొల్పాడు. ఈ విధంగా అనేక కౌరవవీరులు క్రమ్ముకొనే సరికి భీమార్జునులకు పోరు భారమైపోయింది. అప్పుడు అభిమన్యుడూ, సాత్యకీ మొదలైన యోధులు అర్జునుడికి సహాయంగా త్రోసికొని వచ్చారు. భీష్ముడు ప్రచండుడై వీరవిహారం చేశాడు. అప్పటికి మధ్యాహ్నమయింది. అతడు తనలో ఇట్లా భావించాడు.

'ఈ పదినాళ్ళబట్టి ఉత్తమ క్షత్రియుల నెందరినో నావాడి బాణాలకు బలిచేశాను. అలసినట్లయినాను. ఇక ఈ శరీరంతో పొత్తు మానాలని అనిపిస్తున్నది.' అని మనసులో తలచి యుద్ధం చేస్తున్నట్లుగా నటిస్తూ ధర్మరాజును సమీపించి, మెల్లగా ఇట్లా అన్నాడు:

'అనఘా!  పుట్టినప్పటినుండి క్రూరంగా రాజులను చంపుతూనే ఇంతకాలం గడిచిపోయింది. ఇక నేను హింసతో విసిగిపోయాను. ఈ రాక్షసవృత్తిని నేను సాగించలేను. మీరు నా మేలు కోరేవారైతే, శిఖండిని ముందు పెట్టుకొని,  అందరూ కలిసి ఒక్కుమ్మడిగా నామీద దాడి చేయండి.' అని చెప్పి పాంచాల సైన్యంమీదికి రథం పోనిచ్చాడు.

ధర్మరాజు భీష్ముడు చెప్పిన విధంగా చేయుమని ధృష్టద్యుమ్నుడికి చెప్పాడు. అతడు భీమార్జునులను హెచ్చరించాడు. మాత్స్య కైకేయాదులను, అభిమన్యుడు మొదలైన వారిని ఒక్కసారిగా భీష్ముడిపై విజృంభింపచేశాడు. పోరు దారుణంగా సాగింది.

సింహం సింహం మీదకు లంఘించినట్లు అర్జునుడు భీష్ముడిపై పోరు ముమ్మరం చేశాడు. అంతలో దుశ్శాసనుడు అర్జునుడికి అడ్డుతగిలాడు. అతడిని అడ్డం తొలగించాడు. భగదత్తు డడ్డం పడితే అతడిని వారించాడు. శిఖండిని ముందుకు తెచ్చి,

తెరపి కలిగించి, భీష్ముడిపై బాణాలు వేయుమని పురికొల్పాడు. అంతలో కౌరవసైన్యం అర్జునుడిని చుట్టుముట్టింది. అతడు ఆ సైన్యాన్ని వాయువు పిల్లమేఘాలను పారదోలినట్లు దూరం చేశాడు. శిఖండి విజృంభించాడు. భీష్ముడి భుజామధ్య ప్రాంతంలో బాణాలు వేశాడు. భీష్ముడు మంత్రించిన వాడివలె నవ్వుతూ ఉండిపోయాడు. అయితే, శిఖండిని మాని అర్జునుడిపై బాణాలు సారించాడు. దుశ్శాసనుడు, కళింగమాళవ బాహ్లిక విదేహ శూరసేన ప్రముఖులు అర్జునుడిని ఎదుర్కొన్నారు. వారందరిని పార్థుడు దివ్యాస్త్రాలతో తరిమి, చతురంగ బలాలను రూపుమాపి శిఖండికి తెరిపిచూపాడు. శిఖండి బాణాలు సారించాడు. ఆలోగా భీష్ముడిని రక్షించటానికి కృపశల్య వివింశతి వికర్ణాదులు యత్నించారు. అర్జునుడు ఆ అయిదుగురిని విరథులను చేశాడు. మరల వారు విజృంభించారు. పాండవులు ఎదిరించారు. అంతలో భీష్ముడు దివ్యాస్త్రాన్ని శత్రుబలంమీద ప్రయోగించాలని అనుకొన్నాడు. ముందున్న శిఖండిని చూచి మిన్నక ఉండిపోయాడు. అప్పుడు సోమక మాత్స్య ప్రముఖులు అతడిపై దాడి చేశారు. భీష్ముడు వారి సైన్యాలను చంపటమే కాక విరాటరాజు తమ్ముడైన శతానీకుడిని సంహరించాడు.

భీష్ముడు మధ్యందిన మార్తాండుడి వలె వెలిగిపోతున్నాడు. 'అర్జునా! భీష్ముడి ధాటికి మన బలాలు వికావికలౌతున్నాయి. నీవు పూనుకొని ఆతడిని ఎదుర్కొనాలి.' పట్టుదలతో గెలవాలి' అని కృష్ణుడు హెచ్చరించాడు. అర్జునుడు భీష్ముడిపై విజృంభించి బాణాలతో కప్పాడు. శిఖండికూడా బాణాలతో భీష్ముడిని నొప్పించాడు. అయినా భీష్ముడు శిఖండిపై బాణాలు వేయలేదు. ఆ సందు చూచి అర్జునుడు భీష్ముడివిల్లు త్రుంచాడు; బాణాలు గుప్పించాడు. ఆ తరుణంలో శల, శల్య, కృప, కృతవర్మ, చిత్రసేన, భూరిశ్రవో ముఖ్య వీరులందరూ కలిసి భీష్ముడిని క్రమ్ముకొని అతిలోక దివ్యాస్త్రాలు అర్జునుడిపై ప్రయోగించారు. పెద్దపెట్టున బొబ్బలు పెట్టారు. అది గమనించి భీమ, సాత్యకి, సౌభద్ర, విరాట, ద్రుపద, ఘటోత్కచ ప్రముఖులు రంగంలోకి దూకి వారినందరినీ చెదరగొట్టారు. అయినా, రెండు వైపుల సైన్యాన్ని కూర్చుకొని వీరులు యుద్ధం సాగించారు. అది దేవదానవ యుద్ధం వలె సాగింది. అర్జునుడు కౌరవవీరులపై ఐంద్రవారుణాగ్నేయాది మహాస్త్రాలను ప్రయోగించి, వారిని తరిమికొట్టి, శిఖండిని పురికొల్పి భీష్ముడిపై బాణాలు గుప్పింపచేశాడు. భీష్ముడు ఎత్తిన వింటిని వెంటనే విరువసాగాడు. భీష్ముడు అర్జునుడిపై ఉగ్రశక్తిని ప్రయోగించాడు. అతడు దానిని త్రుంచి, భీష్ముడి రథసారథిని, కేతనాన్ని కూల్చాడు. అప్పుడు భీష్ముడు మనసులో ఇట్లా తలపోశాడు.

'పాండవులనందరినీ నా ఒక్కవింటితోనే గెలువలేనా? శ్రీకృష్ణుడు వీరికి అండగా ఉన్నాడు కాబట్టి బ్రతికిపోయారు. అది అట్లా ఉండగా, పాండవులు కీడుపడి శ్రీకృష్ణుడిని వెంటపెట్టుకొని నా వద్దకు రాగా నా వధవిధానం చెప్పాను. ఇక యుద్ధం మాని శాంతంగా ఉంటాను. ఈ ఆర్భాటం ఎందుకు?- అని అనుకొంటూ ఉండగా ఆకాశంలోని దేవతలు అతడి తలంపునకు అంగీకారం తెలిపారు. అది అతడికి మాత్రం వినపడింది. సంజయుడికి మాత్రం వినపడింది. భీష్ముడిమీద మందపవనం వీచింది. దేవతలు పూలవాన కురిశారు. వాటిని సంజయుడు మాత్రమే చూడగలిగాడు.

అట్లా నిశ్చయించుకొన్న భీష్ముడు ఊరక ఉండిపోయినట్లు ఎదుటి వారికి తోచకుండా అర్జునుడి మీద బాణాలు వేశాడు. శిఖండిని ఉల్లంఘించాడు. అర్జునుడు ఆ బాణాలను త్రుంచి అదనెరిగి తెరిపిలేకుండా భీష్ముడిపై బాణపరంపర సంధిస్తూ అతడి విల్లు మరల విరిచాడు. పొరలు చీల్చి శరీరంలో నాటుకొనే బాణాలను అనుసంధించాడు. మహాసముద్రంవలె పొంగి వస్తున్న అర్జునుడిని ఒకవైపూ, తనను వీడకుండ ప్రక్కన ఉన్న దుర్యోధనాదులను మరొకవైపూ కలయచూచి రారాజుతో భీష్ముడిట్లా అన్నాడు:

'ఈ మహావీరుడిని (భీష్ముడిని) దేవాసురకోటికి సైతం ఎదుర్కొనటం సాధ్యంకాదు. ఇక మర్త్యులు ఒక లెక్కా? ఉదారుడైన ఈ అర్జునుడు తప్పితే మిగిలిన పాండవ సైన్యాన్నంతా నేను దగ్ధం చేయగలుగుతాను. నా మాట నిజం. వినుము. వీడి వింటికి ఎదురు ఎవ్వరూ విల్లెత్తలేరు.'

అని అంటున్న సమయంలో శిఖండి విల్లు వెనుక తన విల్లు ఉంచి అతడే వేస్తున్నట్లు అర్జునుడు దొడ్డబాణాలను భీష్ముడిపై సంధించాడు. అప్పుడు భీష్ముడు దుశ్శాసనుడితో ఇట్లా అన్నాడు:

'ఈ బాణాలు పిడుగులవలె ఉన్నాయి. ఇవి శిఖండివి కావు అర్జునుడివే సుమా! ఎండ్రకాయ కడుపువలె నా శరీరాన్ని

ప్రక్కలు చేస్తున్న ఈ బాణాలు శిఖండి కెక్కడున్నాయి? బ్రహ్మదండాలవలె నా మర్మాలను ఎట్లా గ్రుచ్చుకొంటున్నవో చూడుము. యమదూతలవలె ప్రాణాలను లాగే ఈ బాణాలు శిఖండి ఎన్నడు వేశాడు? ఈ బాణాలు దృఢమైనవి, ప్రకాశవంతాలైనవి, లక్ష్యశుద్ధి కలవి. ఇటువంటి బాణాలు అర్జునుడికి కాక శిఖండి కెక్కడివి? అని అంటూ ఒక పెద్ద శక్తిని పార్థుడిమీద విసిరాడు. దానినతడు మధ్యలోనే ముక్కలు చేశాడు. భీష్ముడు డాలూ కత్తీ తీసికొని రథం దిగటానికి ప్రయత్నించాడు. అర్జునుడు డాలునూ, కత్తినీ ముక్కలు చేసి, 'నే నుండగా భయమెందుకు? భీష్ముడిని చుట్టుముట్టండి' అన తన యోధులను ఎలుగెత్తి పిలిచాడు. వారందరూ 'వేయండి, పొడవండి, నరకండి' అంటూ భీష్ముడిని సమీపించారు. అంతలో కౌరవ సైనికులు కేకలు పెట్టుతూ వారితో తలపడ్డారు. పోరు ఘోరమయింది. గాండీవి, పాండవవీరులు విజృంభించి భీష్ముడి శరీరంలో ఎడమింత లేకుండ నిష్ఠురమైన అస్త్రశస్త్రాలు నింపారు. అంతలో సూర్యుడు అస్తగిరికి చేర నారంభించాడు. అర్జునుడు భీష్ముడిపై క్రూరబాణాలు వేసి అతడిని పడద్రోశాడు. సూర్యుడు అస్త్రాద్రిమీద వాలినట్లు దర్పోజ్జ్వలుడైన భీష్ముడు కౌరవులు చూస్తూ ఉండగానే తూర్పు దిక్కు తలకాగా పడ్డాడు. అతడి శరీరం నేలమీద పడకుండ బాణాలే పాన్పుగా అమరాయి.

అట్లా శరతల్పంమీద ఉన్న ఆ మహానుభావుడికి దేవభావం కలిగింది.

ఆకాశంలో దేవతలు 'అయ్యో! పుణ్యాత్ముడైన భీష్ముడు దక్షిణాయనంలో చనిపోతున్నాడే' అని విచారించారు. 'దేవతలారా! నా కాలగతి మనస్సులో నేను కోరుకొన్నదే. నా ప్రాణాలను శరీరంలో ఉంచుకొన్నాను. బాధపడకండి. సత్యవతీ వివాహ సమయంలో నా తండ్రి నన్ను మెచ్చి నాకు 'అవధ్యత్వం' 'స్వచ్ఛంద మరణం' వరాలుగా ఇచ్చాడు. వాటి ప్రభావం వలన నా వధ నేను అంగీకరించకపోతే కలగదు. ప్రాణత్యాగం కూడా నా వశమై ఉన్నది' అని పలికాడు. దేవతలు సంతోషించారు. గంగామాత కొందరు మునులను హంసల రూపంలో పంపి దక్షిణాయనాన్ని గురించి భీష్ముడికి తెలియచెప్పింది. దుర్యోధనుడు భీష్ముడు పడిన వృత్తాంతాన్ని ద్రోణుడికి, దుశ్శాసనుడితో తెలియపంపాడు. ఆ వార్త విని ద్రోణుడు మూర్ఛపోయి, కొంతసేపటికి తేరుకొని, దీనమైన ముఖంతో దుర్యోధనుడి వద్దకు వెళ్ళాడు. పాండవసైన్యం హర్షధ్వానాలు చేసింది. కౌరవసైన్యం హాహాకారాలు చేసింది. ఆ నాదాలతో ఆకసం పిక్కటిల్లింది.

పాండవులకు కాళ్ళు చేతు లాడలేదు. కళ్ళవెంట కన్నీరు కారుతుండగా, మనసులు దుఃఖింపగా వారు చూస్తూ అట్లాగే నిలిచిపోయారు. యుద్ధం ఆగిపోయింది. సూర్యుడు అస్తమించాడు.

కౌరవపాండవులందరూ కవచాలు వదలి, ఆయుధాలు వదలి పగలు మాని, భీష్ముడి చుట్టూ చేరారు. అట్లాగే బంధుమిత్రులు సమకూడారు. అర్జునుడు మాత్రం గాండీవధారియై వెళ్ళాడు. అన్యోన్య రోషాలు మాని తన చుట్టూ చేరి ఉన్న వారందరిని చూచి భీష్ముడు అభినందించాడు.

'నాకు క్రిందుతలగా ఉన్న'దని భీష్ముడు సూచించాడు. దుర్యోధనుడు ఎత్తుగా ఉండటానికి తలగడలు తెండని తనవారిని పంపాడు. భీష్ముడు చిరునవ్వు నవ్వి అర్జునుడిని పిలిచాడు. తలగడగా బాణాలను అమర్చుమని కోరాడు. పార్థుడు కన్నీరొలుకగా దగ్గరికి పోయాడు. పెడతలను చేతితో ఎత్తిపెట్టి, మూడు బాణాలను అభిమంత్రించి నేలపై నిలుచునట్లు అమర్చి బాణాల తలగడను సమకూర్చాడు. భీష్ముడు 'తగిన తలగడను అమర్చా'వని అతడిని కొనియాడాడు. మనుమలనూ, రాజులనూ చూచి ఇట్లా అన్నాడు: 'సూర్యుడిని ధ్యానిస్తూ ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేంతవరకు ఈ అంపశయ్యమీదనే సంతోషంతో శయనించి ఉంటాను. ఈ రోజులలో నాకు గట్టి రక్షణను కల్పించండి. పరిఖలతో ప్రాకారం ఏర్పరచండి. తగినవారిని కాపలాపెట్టండి.' అనగానే కౌరవపాండవులు ఆ ఏర్పాట్లు తమ తమ వారితో చేయించారు. చికిత్సకులు వచ్చి గాయాలకు మందువేస్తామని పూనుకొనగా భీష్ముడు వారిని వారించి కాన్కలిచ్చి పంపించాడు. గీతవాద్య నృత్త ప్రవీణులు ఆయనకు వినోదం కలిగిస్తూ ఉన్నారు.

అప్పుడు భీష్ముడు తనకు దాహమౌతున్నట్లు సూచించి నీటిని అడిగాడు. దప్పిక తీర్చగల పలురకాల జలాలను కౌరవులు తెప్పించారు. భీష్ముడు 'వినండి, శరతల్పంమీద శయనించి ఉన్న నేను సామాన్య జలాలు త్రాగటం సముచితం కాదు. తేజోమయమైన అస్త్రప్రయోగం వలన భూమినుండి పుట్టిన పుణ్యజలాలను త్రాగటమే సముచితం' అని ప్రకటించాడు. కౌరవులు

ఒకరిమొగం మరొకరు చూచుకొంటూ భయపడుతూ ఉండిపోయారు. అప్పుడు భీష్ముడు అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'బాణాల బాధతో నా శరీరమంతా నొప్పులు పుట్టుతున్నాయి. పెదవు లెండుతున్నాయి. పెనుదప్పిక కలిగింది. దానిని తీర్చగలిగిన దివ్యజలాలను నీవే తేనేర్తువు. తెమ్ము' అనగానే పార్థుడు తాతకు ప్రదక్షిణం చేసి పర్జన్యమంత్రంతో ఒక బాణాన్ని అభిమంత్రించి భూమి చీలేటట్లు ప్రయోగించాడు. వెంటనే భూమిలోనుండి కాంతిగల నీళ్ళు దివ్యగంధంతో కూడి ధారలుగా పైకి లేచి భీష్ముని నోటిలో ప్రశాంతంగా వాలి అతడి దప్పికను తీర్చాయి. కౌరవు లా దృశ్యం చూచి భయంతో వణికిపోయారు. పాండవులు పొంగిపోయారు. అప్పుడు భీష్ముడు అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'నారదుడు చెప్పగా నిన్ను మునినాథుడవని తెలిసికొన్నాను. కృష్ణుడూ, నీవూ కలిస్తే సాధించలేని పనులేవీ లేవు. దుర్వార పరాక్రముడవైన నీతో వైరం పెట్టుకొంటే కీడు తప్పదని ఎన్నిసార్లు చెప్పినా ఈ కౌరవరాజు మానడు. సాహసిస్తే ఇకముందు భీముడి చేతిలో చెడక తప్పదు' అనిపలికి, చిన్న బుచ్చుకొన్న దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు: 'అర్జునుడు అతి పరాక్రమశాలి. అతడికి నారాయణుడు ఆప్తుడు. ఎవ్వరూ వీరిని జయించలేరు. యుద్ధాటోపం మాని ధర్మరాజుకు ఇంద్రప్రస్థం ఇచ్చి, మిగిలిన అర్ధరాజ్యం నీవు అనుభవించుము. మీలో మరికొందరు చావకుండా ఉన్నప్పుడే ఈ మంచిపని చేయటం శ్రేయస్కరం' అని పలికి ఊరకున్నాడు. కౌరవపాండవులు కూడా మారుపలుకక అతడికి నమస్కరించి వెళ్ళారు.

దారిలో శ్రీకృష్ణుడూ, ధర్మరాజూ ఇట్లా మాట్లాడుకొన్నారు.

కృష్ణ: ధర్మరాజా! దేవతలకు కూడా సాధ్యుడు గాని భీష్ముడిని ఈ విధంగా గెలవటం అద్భుత పరికరాలు గల మీకే చెల్లింది.

ధర్మ: కృష్ణా! మే మొక మనుషులమా? వీరులమా? తిరుగులేని పరాక్రమం గల నిన్ను పొంది ఇంతటి పనులు సాధించటానికి సమర్థులమయ్యాము. నీవు భక్తాధీనుడవు కదా!'

అందరూ వారి వారి శిబిరాలకు పోయి ఆ రాత్రి విశ్రాంతి తీసికొన్నారు.

ఆ రాత్రి కర్ణుడు భీష్ముడి వద్దకు పోయి భక్తి వినయాలతో పాదాలకు నమస్కరించాడు. వారిరువురి నడుమ సంభాషణ ఇట్లా సాగింది.

కర్ణ: మహాత్మా! నామీద కోపం చాలించి, వాత్సల్యాన్ని చూపి, తగినమాటలు మాట్లాడుము.

భీష్మ: (గౌరవంగా దగ్గరకు పిలిచి) నీ పట్ల నాకు కోపం ఎందుకు? కులభేదాన్ని కలిగించే మాటలతో మా బిడ్డలను పాడుచేస్తావేమిటని చాలసార్లు మందలించాను. అనరాదు కాని, అప్పుడప్పుడు నిష్ఠురాలతో బెదిరించాను కూడ. అది కోపంకాదు, నీకు మంచిని బోధించటమే. నీ పుట్టుక దైవిక గర్భాయత్తం. నిను బోలిన మానవు లరుదు. నీవు కౌంతేయుడవు కాని రాధేయుడవు కావు. నాకీ విషయం వేదవ్యాసుడు రహస్యంగా తెలిపాడు. నేనుకూడ నీ తేజస్సును గమనించి అట్లాగే భావించాను. పాండవుడవైన నీమీద నాకు వాత్సల్యమే కాని మాత్సర్యం లేదు. ఒక్కమాట చెప్పతాను వినుము. నేను కురుపాండవుల వైరాన్ని మాన్పి పంపాను. ఆ పాండవులకు అజయ్యుడు, అప్రమేయుడు అయిన కృష్ణుడు వారికి విధేయుడు. కాబట్టి వారితో విరోధం తగదు. నీవుకూడా మరొకమాట మాని పాండవులతో కలిసి ఉండుము.

కర్ణ: మహాత్మా! నేను కౌంతేయుడనని పూర్వమే ఆర్యుల వలన విన్నాను. ఇంత తెలిసి ఆ పాండవులతో కలిసి ఉండటం నాకు తగునా? పాండవులు మహాబలవంతులు. శ్రీకృష్ణుడి అండ వారికున్నది. వారిని యుద్ధంలో గెలవటం సాధ్యం కాదని కూడా నే నెరుగుదును. అయినా, దుర్యోధన మహారాజు నా పట్ల చూపే గౌరవాదరాలను తలచి చూస్తే, అతడిని విడిచి పోవటం ధర్మమా? వీరకర్మమా? అంతేకాక - నేను పాండవులను దుర్భాషలాడాను. అనుమానం లేకుండా నిండుసభలో వారిని అవమానాల పాలు చేశాను. అన్నివేళలా వారికి అన్యాయం చేసి వైరాన్ని పెంచాను. అందువలన ఈ వీటికీ ఆ వీటికీ పొత్తు పొసగదు. యుద్ధమే తగినకార్యం. అంతా దైవాధీనమే. మనం దేనినీ తప్పించలేము. నీవింక మారు పల్కకుండా శత్రువులమీదకు నన్ను పంపుము. నా కర్తవ్యమైన సేవాధర్మాన్ని నిర్వర్తిస్తాను. లోకం నా బలాన్ని మెచ్చుకొనేటట్లు విహరిస్తాను. కృష్ణార్జునులను నిర్జిస్తాను.

భీష్మ: కర్ణా! నీవు అంతకు సమర్థుడవే. నాకు తెలియదా? దుర్యోధనుడికి నీ భుజబలమే కదా సహాయం. అతడి కేది ప్రియమైతే దానిని సంతోషంగా చేస్తావు. అట్లా చేసి నీవు సంతోషించుము. అనుమానం వదలుము. అనుజ్ఞ ఇచ్చాను వెళ్ళుము.

అని పలికాడు. భీష్ముడి బంధుభావానికి కర్ణుడు పరమానందం పొంది తన నివాసానికి తిరిగివెళ్ళాడు.



జి.వి. సుబ్రహ్మణ్యం

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము

# ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము





శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీ సంపాది పదాంబుజ! । నాసాగ్ర నివాస రసిక! నాదామృత ధా**
**రాసారరూప! వేద । వ్యాస వ్యంజిత విహార! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీ, సంపాది, పద+అంబుజ!= ఉత్తమమైన ఐశ్వర్యాన్ని కలుగజేసే పద్మాలవంటి పాదాలు కలవాడా! లేదా, శ్రీ అంటే మోక్షం. మోక్షాన్ని కలుగజేసే పాదపద్మాలు కలవాడా! - పరమేశ్వర పాదపద్మధ్యానం చేత మోక్షం కలుగుతుందని భావం; నాసా+అగ్ర, నివాస, రసిక!= యోగనిష్ఠాగరిష్ఠుని ముక్కుయొక్క కొనయందు నివసించు రసజ్ఞుడా! - యోగనిష్ఠా గరిష్ఠుడికి నాసాగ్రదృష్టి విధించబడింది. దానికి హేతువు మనస్సుకు స్థిరమైన ఆత్మనిష్ఠ కలగటం. ఇట్లా నాసాగ్రదర్శనం ఆత్మనిష్ఠా ప్రతిష్ఠితం కావటంచేత పరమేశ్వరుడు నాసాగ్ర నివాస రసికు డని చెప్పబడింది; నాద+అమృత, ధారా+ఆసార, రూప!= నాదమనే అమృతధార యొక్క జడి రూపం కలవాడా! నాదం అమృతధారా సార రూపమగు పరమేశ్వరుడు, లేదా పరమేశ్వరుడు నాదరూపుడనీ, అమృత ధారా సారరూపుడనీ రెండువిధాల రూపత్వం చెప్పవచ్చును; వేదవ్యాస, వ్యంజిత, విహార!= వేదవ్యాసమహర్షి చేత సుస్పష్టం చేయబడిన విహారం కలవాడా! -పరమేశ్వర విహార స్థానాలైన శ్రుతులు సంకీర్ణాలుగా ఉండగా వాటిని వ్యాసుడు అసంకీర్ణాలుగా చేసి పరమేశ్వర విహారాలను శాస్త్రాల రూపంలోనూ, మహాభారతాది గ్రంథరూపంలోనూ సుస్పష్టం కావించాడని భావం; హరిహరనాథా!= శివకేశవులకు అభేదాధ్యవసాయి అయిన భగవంతుడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! శ్రేష్ఠమైన ఐశ్వర్యాన్ని కలుగజేసే పాదపద్మాలు కలవాడా! ముక్కుకొసయందు నివాసం కలవాడా! నాదమనే అమృతధార యొక్క జడిరూపం కలవాడా! వేదవ్యాసమహర్షి చేత సుస్పష్టం చేయబడిన విహారం కలవాడా!

**విశేషం:** ఇది భీష్మపర్వంలో- మొదటి ఆశ్వాసంలోని మొట్టమొదటి పద్యం. కృతిపతి సంబోధన. తిక్కన భారతానికి కృతిపతి హరిహరనాథుడు.

(ii) నాసాగ్రరసికుడు - ఆ హరిహరనాథుడు. భగవద్గీతలోని శ్లోకం ఇచ్చట అనుసంధించవలసి ఉంటుంది.

**సమం కాయ శిరో గ్రీవం । ధారయ న్నచలం స్థిరః,**
**సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం । దిశశ్చానవ లోకయన్.** (అధ్యాయం 6, శ్లోకం 13)

అని శ్రీకృష్ణుడు అర్జునుడితో చెప్పి ఉన్నాడు. అనుభవైకవేద్యమైన యోగాభ్యాస రహస్యం ఇందులో ఇమిడి ఉంది. యోగి నాసికాగ్రమునందు ఉపాసనాదృష్టి కేంద్రీకరించవలసి ఉంది.

(iii) హరిహరనాథుడు - 'నాదామృత ధారాసారరూపుడు!' "వేదానాం సామవేదోఽస్మి"- ఇది భగవద్గీతా వాక్యం. భగవంతుడు సామవేద స్వరూపుడు. నాదోపాసకులు మాత్రమే ఇందలి గూఢార్థం గ్రహించగలరు. ఎడతెగని 'అమృతధార' వలె ఆ నాదం అభివ్యక్తం కావాలి. ఇది శ్రుతిలయలకు అతీతమైన సన్నివేశం.

(iv) హరిహరనాథుడు- 'వేదవ్యాస వ్యంజిత విహారుడు.' హరిహరనాథోపాసన - 'విష్ణురూపాయ శివాయ నమః' మాత్రమే కాదు. తిక్కన మాటలలో చెప్పాలంటే - అది "ధర్మాద్వైత" కళోపాసన. దీనిని తిక్కన ఆరంభించినట్లు లోకప్రతీతి. కాని ద్రోణపర్వంలో సంస్కృత మహాభారతంలో సైంధవవధకుముందు అర్జునుడు తాను ఆ కృష్ణుడి మెడలో వేసిన పూలదండను, తనకు స్వప్నంలో సాక్షాత్కరించిన శివుని కంఠంలో చూస్తాడు. శివుడు తనకూ శ్రీకృష్ణుడికీ భేదం లేదని కంఠోక్తిగా ప్రకటిస్తాడు.

అంతేగాక, ఇచట వేదవ్యాస మహర్షి ఉపాసించిన 'వ్యంజన శక్తి' ప్రసక్తి ఉంది. వ్యంజనం - వాచ్యార్థంకంటె అతీతమైనట్టిది. వ్యాస శబ్దానికి సమన్వయత అనే అర్థం ఉంది. వేద వ్యాసుడు, తిక్కన సమన్వయ సిద్ధాంత ప్రవక్తలు. వ్యాసప్రోక్తమైవ మహాభారతం - వ్యంజనాదృష్టితో చూస్తే - సమన్వయ వేదాంత విహారం.

### ధృతరాష్ట్రుని కడకు వేదవ్యాసుండు వచ్చుట (సం.6-2-1)

**క. దేవా! జనమేజయ వసు। ధా వల్లభుఁ డధిక వినయ తత్పరుఁడై సం**
**భావించి కుతూహలమునఁ। దా వైశంపాయనునకుఁ దగ ని ట్లనియెన్. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ పరమేశ్వరా! (హరిహరనాథా! జనమేజయ, వసుధా, వల్లభుఁడు= జనమేజయుడు అనే పేరుగల రాజు (భూభర్త); అధిక, వినయ, తత్పరుఁడు+ఐ= మిక్కుటమైన నమ్రతతో కూడినవాడై; సంభావించి= మన్నన చూపి; కుతూహలమునన్= వేడుకతో; తాన్= తాను; వైశంపాయనునకున్= వైశంపాయనుడితో; తగన్= సముచితంగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! జనమేజయ మహారాజు మిక్కిలి నమ్రతతో కూడినవాడై, మన్నన చూపి వైశంపాయనుడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం**: (1) తిక్కన మహాకవి - తాను వ్రాసిన మహాభారతాన్ని హరిహరనాథదేవునకు అంకితం ఇచ్చాడు. కృతిపతి - కృతికి మొదటి శ్రోత. ఇది సాహితీ సంప్రదాయం.

(2) మహాభారత కథను - (సంస్కృత మూలభారతం ప్రకారం) జనమేజయ మహారాజు చేసిన సర్పయాగంలో వైశంపాయన మహర్షి మహాభారత కథ ఆ రాజుకు వినిపించాడు. జనమేజయుడు - పరీక్షితుడి కొడుకు. పంచపాండవ మధ్యముడైన అర్జునుడి మునిమనుమడు. అభిమన్యుడి మనుమడు.

**క. ఒండొరుల గెలుచు తలఁపునఁ। బాండవులును గౌరవులును బాహా గర్వో**
**ద్దండత నెట్లు దొడంగిరి?। భండన మెప్పాటఁ జెల్లెఁ బరమమునీంద్రా!' 3**

**ప్రతిపదార్థం:** పరమ, ముని+ఇంద్రా= గొప్పవాడవైన మునిశ్రేష్ఠుడా! (ఇంద్ర శబ్దం శ్రేష్ఠవాచకం); ఒండొరులన్= ఒకరినొకరిని; గెలుచు, తలఁపునన్= జయించవలయుననెడి ఆలోచనతో; పాండవులును, కౌరవులును= పాండురాజు కొడుకులు (ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడును) దుర్యోధనుడును అతని తమ్ములును; బాహా+గర్వ+ఉద్దండతన్= భుజబలం వలని అహంకారం యొక్క అతిశయంతో; ఎట్లు= ఏ రీతిగా; తొడంగిరి?= పూనుకొన్నారు?; భండనము= యుద్ధం; ఏ+పాటన్= ఏ రీతిగా; చెల్లెన్?= జరిగింది?

**తాత్పర్యం:** మునులలో శ్రేష్ఠుడవైన ఓ వైశంపాయన మహర్షీ! ఒకరినొకరు జయించాలనే అభిప్రాయంతో పాండవులు, కౌరవులు ఏ విధంగా ప్రయత్నించారు? యుద్ధం ఏ రీతిగా జరిగింది? వివరించి తెలుప వేడుతున్నాను.

**విశేషం**: 1. కౌరవులు అనగా కురురాజు సంతతివారని అర్థం. అనగా పాండవులు కూడా నిజానికి కౌరవులే. పాండురాజు కొడుకులైన వారూ, ధృతరాష్ట్రుడి పుత్రులైన దుర్యోధనుడూ అతడి తమ్ములూ - కురుసంతతివారే. అయితే- వివక్ష కోసం ప్రజలు ఇటు వారిని పాండవులు అన్నారు. అటు వారిని కౌరవులు అన్నారు. అంతే.

2. భీష్మపర్వంలో ఇది కథకు సంబంధించిన మొదటి పద్యం. మహాభారత యుద్ధం - భీష్మపర్వంలోనే ఆరంభమైంది. విశ్వవిఖ్యాతిని ఆర్జించిన మహాభారత యుద్ధం గూర్చి పాండవవంశంలోని వాడైన జనమేజయ మహారాజు ఎంతో ఆసక్తితో అడుగుతున్నాడు.

**క. అనుటయు వైశంపాయనుఁ । డనుమోద రసార్ద్రహృదయుఁడై యిట్లనియెన్**
**జనమేజయు మనమున సం । జనితంబగు కౌతుకంబు సఫలతఁ బొందన్. 4**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పిన పిదప; వైశంపాయనుఁడు= (మహాభారత కథకుడు); అనుమోద, రస+ఆర్ద్ర, హృదయుఁడు+ఐ= అంగీకారం అనెడి ద్రవంతో తడిసినట్టి గుండె కలవాడై, సంతోషంతో సమ్మతించినవాడై; జనమేజయు; మనమునన్= జనమేజయుడి యొక్క మనస్సులో; సంజనితంబు+అగు= పుట్టినట్టి; కౌతుకంబు= వేడ్క; సఫలతన్+పొందన్= నెరవేరేటట్లుగా; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా అన్నాడు.

**తాత్పర్యం:** జనమేజయుడు ఆ విధంగా ప్రశ్నించగా, వైశంపాయన మహర్షి మిక్కిలి సంతోషించి, అతడి మనసులోని ఆసక్తి తీరేటట్లుగా ఈ విధంగా బదులు చెప్పాడు.

**విశేషం:** ఇచ్చట "రస" శబ్ద ప్రయోగం గమనించాలి. జనమేజయుడి ప్రశ్న - వైశంపాయనుడికి మిక్కుటమైన ఆనందం కలిగించింది. శ్రోతయైన రాజు యొక్క జిజ్ఞాస కథకుడైన మునికి నచ్చింది. అతడి హృదయం 'అనుమోద రసంతో' తడిసింది అని కవి వర్ణన. రసములు తొమ్మిది ఆలంకారికుల దృష్టిలో. అందులో "అనుమోదం" ఒకటికాదు. అయితే- "అనంతో వై రసాః." రసములు అనంతాలు అనే మాట కూడా ఉంది. 'రసం' అంటే హృదయాన్ని కదలింపగల భావం. దానికి గుండెను తడుపగల శక్తి ఉంటుంది.

తిక్కన మహాకవికి - రసశబ్ద ప్రయోగం అంటే మిక్కిలి మక్కువ. కొందరు విమర్శకులు తిక్కన రసశబ్దాన్ని పలుచోట్ల ప్రయోగించి చులకన చేశాడని అధిక్షేపించారు గూడ. అయితే- తిక్కనకు ఇష్టమైన "రసం" హృదయాన్ని తడిపే భావావేశంగా స్వీకరించాలి గాని ఆలంకారికులు ప్రపంచించిన నవరసాలలో చేర్చరాదు.

**వ. పుణ్యక్షేత్రోత్తమం బయిన యాకురుక్షేత్రంబున నారెండు దెఱంగుల వారి కటకంబులును విడిసి కయ్యంబునకుఁ గాలు ద్రవ్వునట్టి సమయంబున ధృతరాష్ట్రుండు గొడుకుల దుర్వినయంబునకు నిర్వేదనంబు నొంది, సంజయద్వితీయుండై చింతించుచున్న యెడకుం బ్రికాలవేదియగు వేదవ్యాసుండు విజయం చేసి యమ్మహీపతి సేయు నర్చనంబులం గైకొని యతని కిట్లనియె: 5**

**ప్రతిపదార్థం:** పుణ్య క్షేత్ర+ఉత్తమంబు+అయిన= పుణ్యమైన ప్రదేశాలలో శ్రేష్ఠమైనది అయిన; ఆ, కురుక్షేత్రంబునన్= ఆ కురుక్షేత్రం అని పేరు వడసిన ప్రదేశంలో; ఆ, రెండు, తెఱంగులవారి= ఆ రెండు పక్షాలవారి (పాండవుల యొక్కయు, కౌరవుల యొక్కయు); కటకంబులును= శిబిరాలు (సేనలు గుమిగూడిన కేంద్ర ప్రదేశం "కటకం"); విడిసి= ఒకచోట చేరి; కయ్యంబునకున్= పోరుకు, యుద్ధానికి; కాలు, త్రవ్వు+అట్టి= సంసిద్ధత చూపించే; సమయంబునన్= తరుణంలో; ధృతరాష్ట్రుండు; కొడుకుల దుర్వినయంబునకున్= తన పుత్రుల యొక్క గర్వానికి (నమ్రత లేకపోవటానికి); నిర్వేదనంబున్+ఒంది= దుఃఖాన్ని పొంది; సంజయ, ద్వితీయుండు+ఐ= సంజయుడు తన చెంత ఉండటం చేత రెండవవాడై- సంజయుడితో కూడినవాడై;

చింతించుచున్+ఉన్న; ఎడకున్= ఆలోచన చేస్తున్న చోటికి; త్రికాల; వేది+అగు= మూడు కాలాలు తెలిసినవాడైన; వేదవ్యాసుండు; విజయం చేసి= వచ్చి; ఆ+మహీపతి= ఆ రాజు (ధృతరాష్ట్రుడు); చేయు, అర్చనంబులన్= చేసే పూజలను; కైకొని= స్వీకరించి; అతనికిన్+ఇట్లు+అనియెన్= ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పుణ్యస్థలమైన ఆ కురుక్షేత్రంలో కౌరవులు పాండవులు గుడారాలు నిర్మించి సేనలతో యుద్ధానికి సన్నద్ధమైన సమయంలో ధృతరాష్ట్రుడు సంజయునితో కూడియుండి తన కొడుకుల గర్వానికి దుఃఖించటం గమనించి మూడు కాలాల పోకడ తెలిసినట్టి వ్యాసమహర్షి అక్కడికి వచ్చి అతడితో ఈ విధంగా అన్నాడు:

**విశేషం:** భారతదేశంలో కొన్ని స్థలాలు 'పుణ్యక్షేత్రాలుగా' ప్రసిద్ధి చెందాయి. ఆయా స్థలాలకు వెళ్ళేవారికి సుకృతం (పుణ్యం) లభిస్తుందని నమ్మకం. అందులో ఒకటి కురుక్షేత్రం. అక్కడ యుద్ధంలో మరణించినవారికి 'పుణ్యం' లభించగలదనే విశ్వాసం ప్రజలలో ఏర్పడింది. వ్యాసమహర్షి వేదాలకు ఒక అనుక్రమణిక ఆకార రేఖలు స్థిరీకరించాడు గనుక అతడికి వేదవ్యాసుడు అనే బిరుదు ఏర్పడింది. వ్యాసుడు అనే పేరుగల మహర్షులు పలువురు ఉండవచ్చును. 'వేదవిద్యాధురంధరుడైన' వ్యాసుడికి ప్రత్యేకత ఏర్పడింది. త్రికాలవేది - అనగా భూత, వర్తమాన, భవిష్యత్ కాలములు, వాటిలో జరిగింది, జరుగుతున్నది, జరుగబోయేది తెలిసినవాడు. సంజయుడు- ధృతరాష్ట్రుడికి ఆంతరంగిక సచివుడు.

**క. ' కాలం బగుటయు నృపులకు । నాలము సమకూరె; దీని కడలకు మది నీ**
**వాలోకింపఁగ వలసిన । నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్త్రా!' 6**

**ప్రతిపదార్థం:** పుత్త్రా= ఓ కొడుకా! (ఓ ధృతరాష్ట్రా); కాలంబు+అగుటయున్= ఆయుస్సు తీరటం చేత; నృపులకున్= రాజులకు; ఆలము= యుద్ధం; సమకూరెన్= ఏర్పడింది; మదిన్= మనస్సులో; దీనికిన్= (ఈ యుద్ధం దాపురించినందుకు); అడలకు(ము)= దుఃఖించవద్దు; నీవు+ఆలోకింపఁగన్, వలసినన్= నీవు చూడాలనే అవసరం ఉంటే (నీవు చూడాలని కోరితే); ఏన్= నేను; (నీకు) లోనికిన్= లోపలికి; దివ్య, దృష్టిన్= భగవత్ కృపవలన ఏర్పడే చూపు; ఇచ్చెదన్= ఇస్తాను.

**తాత్పర్యం:** 'కుమారా! పోయేకాలం దగ్గరపడి రాజులకు యుద్ధం దాపురించింది. దీనికి నీవు విచారించకుము. ఆ యుద్ధాన్ని చూడాలని కోరికగా ఉంటే, నీకు దివ్యదృష్టినిస్తాను.'

**విశేషం**: 1. ధృతరాష్ట్రుడు వేదవ్యాస మహర్షి వలన అంబికకు జన్మించిన కొడుకు. అందుచే 'పుత్త్రా!' అనే సంబోధన. దివ్యదృష్టి: చర్మచక్షువులకు సాధ్యంకాని చూపు.

2. కాలంబగుట, కాలము తీరుట, కాలము మూడుట అనే ప్రయోగాలు గమనించదగినవి. ప్రాచీన భారతీయులలో ప్రబలిన విశ్వాసం - ఎవరికైనా భగవంతుడిచేత నిర్ణయించబడిన ఆయుర్దాయం ఉంటుంది. ఆ గడువు అయిపోగానే మరణం సంభవించటం తథ్యం. ఇంతమంది రాజులకు విధినిర్ణీతమైన ఆయుస్సు తీరింది కాబట్టి యుద్ధం సంప్రాప్తించింది. దీనికి దుఃఖించవలసిన అవసరం లేదని వేదవ్యాస మహర్షి ఊరడింపు. ధృతరాష్ట్రుడు పుట్టుకచే గ్రుడ్డివాడేగాన వేదవ్యాసమహర్షి అతడికి 'దివ్యదృష్టి'ని వరంగా అనుగ్రహిస్తానన్నాడు.

**చ. అనుడు నతండు 'ఘోరముగ నన్నలుఁ దమ్ములుఁ బోరు క్రూరతం**
**గనుఁగొనఁజాల, నేను వినఁగా వలతుం; దదనుగ్రహంబు సే**
**సినఁ గడు లెస్స'యన్న ముని చిత్తమునం గరుణించి సంజయుం**
**బనిచె మహారణంబు పరిపాటిమెయిన్ సకలంబుఁ జెప్పఁగన్. 7**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని (వేదవ్యాసుడు) చెప్పిన పిదప; అతండు= (ధృతరాష్ట్రుడు); ఘోరముగన్= భయంకరంగా; అన్నలున్, తమ్ములున్= సోదరులు; పోరు= యుద్ధం చేయు; క్రూరతన్= చెడ్డతనమును; కనుఁగొనన్+చాలన్= చూడలేను; ఏను= నేను

(ధృతరాష్ట్రుడు); వినఁగాన్, వలతున్= విన కోరుతున్నాను; తత్+అనుగ్రహంబు+చేసినన్= ఆ దయ చూపితే; కడు, లెస్స= మిక్కిలి మంచిది; అన్నన్= అని చెప్పగా; ముని= ఋషి (వ్యాసుడు); చిత్తమునన్= మనస్సునందు; కరుణించి= దయకలిగి; మహా, రణంబు= గొప్ప యుద్ధం; పరిపాటి మెయిన్= సక్రమంగా; సకలంబున్= అంతా; చెప్పఁగన్= చెప్పటానికి; సంజయున్+పనిచెన్= సంజయుడిని నియమించాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా వేదవ్యాస మహర్షి చెప్పిన పిదప, ధృతరాష్ట్రుడు ఈ రీతిగా బదులు పలికాడు: 'అన్నదమ్ములు చేసే ఘోర యుద్ధం నేను చూడలేను. వినగలను అంతే. నేను వినే ఏర్పాటు చేస్తే చాలు.' ఆ మాటలకు వేదవ్యాసుడు కరుణించి, యుద్ధ విషయాలను జరిగినవి జరిగినట్లుగా (యథాతథంగా) చెప్పుమని సంజయుడిని నియోగించాడు.

**వ. ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబు తెఱంగు వినిపింప నియోగించి యా సూతనందనునకు నా రెండు తెఱంగులవారి, దివారాత్ర ప్రవర్తనంబులు గనునట్లును, రహస్య ప్రకార భాషణంబులు వినునట్లును మనోవృత్తంబు లెఱుంగు నట్లునుంగా వరం బిచ్చి, యతి శీఘ్ర గమనంబు నొసంగి, భారత సమర ధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాకకుండు నట్టి ప్రభావంబుఁ బ్రసాదించి, దివ్యుల యాలాపంబులు రూపంబులుం దలంపులుం దేటపడునట్టి మహనీయ బోధంబును గలుగ ననుగ్రహించి, యావైచిత్ర వీర్యు నాలోకించి 'యిది ప్రాప్తకాలంబై వచ్చిన భూప్రజాక్షయంబు; దీనికి వగవం బని లేదు 'ధర్మోజయ' తనుచు నిశ్చింతంబున నుండు; మేనును గురుపాండవుల కీర్తిఁ బ్రకటింపంగలవాఁడ' నని యతని నాశ్వాసించి సాత్యవతేయుండు వెండియు. 8**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ధృతరాష్ట్రునకున్; కయ్యంబు తెఱంగు= యుద్ధం జరిగే తీరు; వినిపింపన్; నియోగించి= ఏర్పాటు చేసి; ఆ సూతనందనునకున్= ఆ సూతుడి కొడుకుకు- (సంజయుడికి) ఆ రెండు తెఱంగులవారి= ఆ రెండు పక్షాలవారి (కురుపాండవుల యొక్క); దివా, రాత్ర, ప్రవర్తనంబులు= పగలు, రేయి జరిగే సంగతులు; కనునట్లును= చూచేట ట్లున్నూ; రహస్య, ప్రకార, భాషణంబులు= ఒరులకు తెలియరానట్లుగా జరిగే మాటలు; వినునట్లును; మనస్+వృత్తంబులు= మనస్సులోని తలపులు; ఎఱుంగునట్లును= తెలిసేటట్లున్నూ; వరంబు+ఇచ్చి= దైవబలముచే తీరే కోరిక= వరము; అతిలోకశక్తిని అనుగ్రహించి; అతి, శీఘ్ర, గమనంబును= మిక్కిలి వేగంగా పోగలశక్తిని ఒసంగి= ఇచ్చి; భారత, సమర, ధరణిన్+తిరిగినను= భారత యుద్ధభూమిలో సంచరించినప్పటికినీ; శస్త్ర+అస్త్రంబులు+ఎవ్వియున్= శస్త్రాలు అస్త్రాలు ఏవైనప్పటికినీ; (ఆయుధము లేవియు) తాకక+ఉండు+అట్టి; ప్రభావంబు= మహిమ; ప్రసాదించి= ఇచ్చి; దివ్యుల+ఆలాపంబులు= వేల్పుల మాటలు; రూపంబులున్+తలంపులున్= ఆకారాలు, భావాలు; తేటపడు+అట్టి= తెలిసేటటువంటి; మహనీయ, బోధంబును= గొప్ప జ్ఞానాన్ని; కలుగన్+అనుగ్రహించి; ఆ+వైచిత్ర వీర్యున్= ఆ విచిత్ర వీర్యుడి కొడుకైన (ధృతరాష్ట్రుడిని); ఆలోకించి= చూచి; ఇది= (ఈ యుద్ధం); ప్రాప్తకాలంబు+ఐ= కాలం వలన ఏర్పడినట్టిదై; వచ్చిన, భూ, ప్రజా, క్షయంబు= భూమిమీది ప్రజల వినాశం; దీనికిన్ (ఈ యుద్ధానికి); వగవన్+పనిలేదు= దుఃఖించవలసిన అవసరం లేదు; ధర్మో జయతు= ధర్మః జయతు= ధర్మం జయించుగాక!; అనుచున్; నిశ్చింతంబునన్+ఉండుము= చింత లేకుండా ఉండుము; ఏనును= నేనుకూడా (వ్యాసుడు); కురు, పాండవుల కీర్తిన్= కౌరవుల యొక్కయు పాండవుల యొక్కయు కీర్తిని; ప్రకటింపన్+కలవాఁడను= తెలియచేయగలను; అని, అతనిన్= ధృతరాష్ట్రుడిని; ఆశ్వాసించి= ఓదార్చి; సాత్యవతేయుండు= సత్యవతి కొడుకు (వ్యాసుడు); వెండియున్= మరియు.

**తాత్పర్యం:** వ్యాసుడు ఈ విధంగా ధృతరాష్ట్రుడికి, యుద్ధ విశేషాలు వినిపించే ఏర్పాటు చేశాడు. అంతేకాక- వార్తాహరుడైన సంజయుడికి కొన్ని అతిలోకశక్తులు ప్రసాదించాడు. సంజయుడు యథేచ్ఛగా యుద్ధభూమిలో అతి

వేగంగా విహరించవచ్చును. అతడిని ఏ ఆయుధాలు తాకజాలవు. అతడు ఇతరుల మనస్సులను పసిగట్టగలడు. వేల్పుల రూపాలు చూడగలడు; మాటలు వినగలడు. ఇట్టి వరాలను అనుగ్రహించి వ్యాసమహర్షి ధృతరాష్ట్రుడిని చూచి, 'ఈ యుద్ధం విధివిలాసం వలన వచ్చింది. భూభారం తగ్గగలదు. దీనికోసం దుఃఖింపవద్దు' అని ఊరడించి 'ధర్మం జయించుగాక! చింత వీడి ప్రశాంతంగా ఉండుము. నేను కురుపాండవుల కీర్తి ప్రకటించగలను' అని చెప్పి మరియు... (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం**: (1) ప్రాచీన భారతీయ సాహిత్యంలో సంస్కృతిలో పేర్కొనబడిన విశేషం - వరం. వేల్పులు మహనీయులు వరం అనుగ్రహించటం కద్దు. అమానుషశక్తివలన, కోరికలు ఈడేరటం, అతిలోక సన్నివేశాలు జరగటం వరంలోని ముఖ్యమైన అంశాలు. అట్టిదే దివ్య దృష్టి.

(2) మహాభారతంలో యుద్ధ వృత్తాంతాలు సేకరించిన వాడు సంజయుడు. శాంతి సమయంలోనైనా వార్తా సంకలనం ఒక ప్రత్యేక ప్రజ్ఞ. ఇక యుద్ధవార్తా సంకలనం బహుళ ప్రమాదభూయిష్ఠం. దానికి కావలసిన విశేష ప్రజ్ఞలు ఇందు ఉగ్గడించబడ్డాయి.

(3) సమకాలీనుడైన వ్యాసుడు తాను కురుపాండవ చరిత్ర వ్రాయగలనని ఇందులో సూచించాడు.

**క. ' మొగుళులు లేకయు నుఱుములు । గగనక్షోభంబు సేసెఁ; గరి హయ తతిఁ బె**
**ల్లుగ నశ్రు లురలఁ జొచ్చెను; । మృగములు పక్షులను, బసులు మృగముల నీనెన్. 9**

**ప్రతిపదార్థం:** మొగుళులు, లేకయున్= మబ్బులు లేకుండానే; ఉఱుములు; గగన, క్షోభంబు= ఆకాశంలో గందరగోళం; చేసెన్= చేశాయి; కరి, హయతతిన్= ఏనుగులయందును, గుఱ్ఱాలయందును; పెల్లుగన్= మిక్కుటంగా; అశ్రులు= కన్నీళ్ళు; ఉరలన్+చొచ్చెను= కారసాగాయి; మృగములు= జంతువులు; పక్షులను; పసులు= ఆవులు; మృగములన్= జంతువులను; ఈనెన్= కన్నాయి.

**తాత్పర్యం:** మబ్బులు లేకుండానే ఆకాశంలో ఉఱుములు సంక్షోభం రేకెత్తించాయి. ఏనుగులూ, గుర్రాలూ మిక్కుటంగా కన్నీరు కార్చాయి. జంతువులు పక్షులను కన్నాయి. ఆవులు జంతువులను కన్నాయి.

**విశేషం**: భారతంలో పలు తావులలో ప్రకృతి వైపరీత్యాలు అపశకునాలుగా ప్రజాక్షయ సూచనలుగా వర్ణించబడ్డాయి.

**క. నలువురు నేవురు బిడ్డలు । గలిగెద రొక్కొక్క వనిత గర్భంబున; వా**
**రలు పుట్టినపుడ యాడుచుఁ । గలకల నవ్వుచుఁ జెలంగఁ గనియెద మెందున్. 10**

**ప్రతిపదార్థం:** నలువురున్= నల్గురు; ఏవురు= అయిదుగురు; బిడ్డలు= సంతానం; ఒక్కొక్క; వనిత; గర్భంబునన్= ఒక్కొక్క స్త్రీ కడుపునుండి; కలిగెదరు= పుడతారు; వారలు= (ఆ బిడ్డలు) పుట్టిన+అపుడు+అ= పుట్టినపుడే; ఆడుచున్= ఆటలాడుతూ; కలకల నవ్వుచున్= పకపక నవ్వుతూ; చెలంగన్= ఒప్పగా; ఎందున్= ఎచ్చటనైనా; కనియెదము= చూస్తాము.

**తాత్పర్యం:** ఒకే స్త్రీ గర్భం నుండి ఒకేసారి నలుగురైదుగురు బిడ్డలు పుట్టుతారు. వారు పుట్టగానే ఆడతారు, కలకల నవ్వుతారు. అట్టి అద్భుతాలు మనం చూడగలం.

**తే. అర్కు నుదయాస్తమయములయందుఁ గృష్ణ । కాంతి ఘోరకబంధంబు గప్పఁ జొచ్చె;**
**నిందు లాంఛన స్థితి తలక్రిందుగాఁగ । దోఁచుచున్నది ప్రజ యెల్లఁ ద్రుంగకున్నె. 11**

**ప్రతిపదార్థం:** అర్కు+ఉదయ+అస్తమయముల అందున్= సూర్యుడు ఉదయించేటప్పుడు; ప్రొద్దుగ్రుంకేవేళలలో; కృష్ణ, కాంతి= నల్లని కాంతిచేత; ఘోర= భయంకరమైన; కబంధంబు= మబ్బు (కబంధ శబ్దానికి మొండెం, మబ్బు, సముద్రం అనే అర్థాలున్నాయి; ఇక్కడ మబ్బు అనే అర్థం స్వీకరించటం లెస్స); కప్పన్+చొచ్చెన్= ముసురుకొనసాగింది; ఇందు లాంఛన స్థితి= చంద్రుడిలోని మచ్చ యొక్క ఉనికి; తల, క్రిందు, కాఁగన్+తోచుచున్నది= తలక్రిందుగా కనపడుతున్నది; ప్రజ+ఎల్లన్= జనమంతా; త్రుంగక+ ఉన్నె= నాశనం కాదా!

**తాత్పర్యం:** ప్రొద్దుపొడుపు వేళ ప్రొద్దుగ్రుంకేటప్పుడు నల్లని కాంతితో భయంకరమైన మబ్బులు క్రమ్ముతున్నాయి. చంద్రుడిలోని మచ్చ తలక్రిందులుగా కన్పిస్తున్నది. ఇది ప్రజాక్షయ సూచన కాదా!

**విశేషం:** రామాయణంలో కబంధుడు - తలలేని మొండెము చేతులుగల రాక్షసుడు. ఇచ్చట వ్యాపించిన చీకట్లు గూడ అట్టివే.

**వ. విశేషించియుం గౌరవ నికేతనంబులఁ గేతనంబులఁ బొగ లెగయుటయు, నాయుధంబులు మండుటయు, నివి మొదలుగా ననేక దుర్నిమిత్తంబులు పుట్టుచున్నయవి; కులక్షయంబును నానా నరేంద్ర నాశంబును నగు; నుపేక్షింపం దగదు; దుష్పథవర్తులగు దుర్యోధనాది కుమారుల వారించి నీ తమ్మునిపా లతని కొడుకుల కొసంగి శాంతి సేయుట మేలు; మము బోంట్ల మనంబులకుం బ్రియంబు గాని యీ రాజ్యంబు నీ కేటి?' కనిన విని యమ్మనుజేంద్రుం డమ్మునీంద్రున కిట్లనియె: 12**

**ప్రతిపదార్థం:** విశేషించియున్= మరియును; కౌరవనికేతంబులన్= కౌరవులయొక్క గృహాలలో; కేతనంబులన్= జెండాలలో; పొగలు ఎగయుటయున్= పొగలు వ్యాపించటమూ; ఆయుధంబులు మండుటయున్= కత్తులు మున్నగు యుద్ధసాధనాలు మండటం; ఇవి మొదలుగాన్= ఇటువంటివి; అనేక+దుస్+నిమిత్తంబులు= పెక్కు చెడు శకునాలు; పుట్టుచున్నయవి= కలుగు తున్నవి; కుల, క్షయంబును= వంశ నాశనం; నానా నర+ఇంద్ర, నాశంబును= పలువురు మేటి రాజుల; వినాశం, అగున్= జరుగు తుంది; ఉపేక్షింపన్+తగదు= చూస్తూ ఊరకుండరాదు; దుష్పథ వర్తులు+అగు= చెడుమార్గంలో నడుస్తున్న వారైన; దుర్యోధన+ఆది, కుమారులన్= దుర్యోధనుడు మొదలైన కొడుకులను; వారించి= అడ్డగించి, నీ, తమ్ముని, పాలు= నీ తమ్ముడికి చెందవలసిన (రాజ్య) భాగం; అతని కొడుకులకు= అతడి పుత్రులకు; ఒసంగి= ఇచ్చి; శాంతి+చేయుట= సంధి చేయటం; మేలు= మంచిది; మముబోంట్ల= మావంటివారి; మనంబులకున్= మనస్సులకు; ప్రియంబు కాని= ఇష్టంకాని; ఈ రాజ్యంబు; నీకున్+ఏటికిన్+అనినన్= నీకు ఎందుకు అని అనగా; విని= ఆలకించి; ఆ+మనుజ+ఇంద్రుండు= ఆ రాజు (ధృతరాష్ట్రుడు); ఆ+ముని+ఇంద్రునకున్= మునులలో గొప్పవాడైన ఆతడితో (వ్యాసుడితో); ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** 'కౌరవుల ఇళ్ళ నుండి జెండాల నుండి పొగలు రేగుతున్నాయి. ఆయుధాలు మండుతున్నాయి. ఇట్టి అపశకునాలు ఎన్నో కన్పిస్తున్నాయి. స్వకులస్థులు, పెక్కుమంది రాజులు మరణించటం చూస్తూ ఊరుకోదగింది కాదు. చెడుమార్గంలో నడుస్తున్న దుర్యోధనాది కురుకుమారులను వారించి నీ తమ్ముని పాలు అతని కొడుకుల కిచ్చి శాంతిచేయడం మంచిది. మావంటి వారికి ఇష్టం కాని ఈ రాజ్యం నీకు ఎందుకు?' అని ధృతరాష్ట్రుడితో వ్యాసమహర్షి చెప్పాడు. ధృతరాష్ట్రుడు వ్యాసుడితో ఈ విధంగా సమాధానం చెప్పాడు:

**చ. ' హితమును ధర్మముం దలఁచి యిమ్మెయిఁ జెప్పితి రిట్లు మున్ను; నా**
**సుతుల నయంబుమైఁ దఱిమి చూచితి; వారలఁ బంపు సేయ నేఁ**
**జతురుఁడఁ గాను; బ్రాభవము సాలదు; నాదెసఁ దప్పులేమి మీ**
**మతిఁ దలపోసి యీ పలుకు మానుఁడు పాకము దప్పెఁ గార్యముల్.' 13**

**ప్రతిపదార్థం:** హితమును= నాకు మేలైనట్టి దానినీ; ధర్మమున్= చేయదగిన కర్తవ్యాన్నీ; తలఁచి= ఆలోచించి; ఈ+మెయిన్= ఈరీతిగా; చెప్పితిరి= చెప్పారు; ఇట్లు= ఈ విధంగా; మున్ను= లోగడ; నా సుతులన్= నా కొడుకులను; నయంబుమైన్= సాత్త్విక పద్ధతిలో; తఱిమి చూచితిన్= లోతుగా నచ్చచెప్పజూచాను; వారలన్= నా కొడుకులను; పంపు+చేయన్= ఆజ్ఞాపించటానికి (లోబరచుకొనటానికి); నేన్+చతురుఁడన్+కాను= నేను నేర్పరిని కాను; ప్రాభవము+చాలదు= (వారిపై) (నాకు) అధికారం సరిపోవునంతగా లేదు; నా దెసన్= నా యెడ; తప్పు లేమి= దోషం లేకపోవటం; మీ+మతిన్= మీ బుద్ధియందు; తలపోసి= ఆలోచించి; ఈ+పలుకు+మానుఁడు= ఈ మాటలు (ఈ హితోపదేశం) చేయటం మానండి (మీ ఈ బహువచన ప్రయోగం - వ్యాసునియెడ ధృతరాష్ట్రుడికి గల గౌరవాన్ని సూచిస్తుంది); కార్యముల్= పనులు (కర్తవ్యాలు); పాకము+తప్పెన్= పరిపక్వత కోలుపోయాయి అనగా ఇప్పుడు చేయిమించి పోయిందని భావం.

**తాత్పర్యం:** 'ఓ వ్యాసమహర్షీ! మీరు నామీదగల ప్రేమతో పూర్వం కూడా ఈ విధంగా నాకు హితోపదేశం చేశారు. కర్తవ్యం బోధించారు. ఇదివరలో నేను కూడా నా కొడుకులకు బుద్ధి చెప్పాలని ఎంతో ప్రయత్నించాను. వారు నా అదుపు తప్పిపోయారు. వారిని ఆజ్ఞాపించగల శక్తిసామర్థ్యాలు నాకు లేవు. నా యెడ తప్పులేదని మీరు గ్రహించ ప్రార్థన. దయచేసి నాకు హితవు చెప్పవద్దు. చెప్పి లాభం లేదు. నేను ఇప్పుడు ఇంక చేయగలిగింది ఏమీ లేదని తమకు మనవి చేస్తున్నాను.'

**విశేషం:** 'పాకము తప్పె కార్యముల్' చక్కని చిక్కని పదగుంఫనం. శాంతి చేకూర్చటం - మంచి పనే. కానీ అది జరిగే పనికాదు అని ధృతరాష్ట్రుడు వ్యాసుడితో అన్నాడు. ధృతరాష్ట్రుడి శీలానుశీలనానికి ఈ పద్యం తోడ్పడుతుంది. ధృతరాష్ట్రుడు తెలిసిన మూర్ఖుడు. మహాభారతంలోని విచిత్రపాత్ర.

**వ. అనిన విని పరాశరసూనుండది యట్లుండ నిమ్మింక నేనేమియుం జెప్పవలయు నది గలదే?' యని పలికిన నాంబికేయుండు గయ్యంబున గెలుపుఁ దెలుపు నిమిత్తంబు లడిగిన మ్మునివరేణ్యుండు వహ్నులు హోమకాలంబునం బుణ్యగంధములతోఁ బ్రదక్షిణార్చు లగుటయు భేరీ ప్రముఖంబులు గంభీర ఘోషంబు లగుటయు వాయువు లనుకూల మృదు మనోహర ప్రచారంబు లగుటయు నివి మొదలుగాఁ గొన్ని శుభ సూచకంబులు నిర్దేశించి, 'కొంచెంబు పెద్ద యన లేదు; సమరంబున జయంబు దైవాధీనంబు గావునం బెద్దలు పెనఁకువ లొప్పవని చెప్పుదు; రేను బోయివచ్చెద నని చెప్పి సముచిత ప్రకారంబున నంతర్ధానంబు సేసెఁ; దదనంతరంబ యక్కౌరవేంద్రుండు గొండొకసేపు చింతించి నిట్టూర్పు నిగుడించి సంజయున కిట్లనియె.** **14**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అని (ధృతరాష్ట్రుడు) చెప్పగా విని; పరాశరసూనుండు= పరాశరుడి కొడుకు (వ్యాసుడు); అది+అట్లు+ఉండనిమ్ము= ఆ విషయం వదలిపెట్టుము; ఇంకన్= ఇకమీద; నేను+ఏమియున్+చెప్పవలయునది+కలదు+ఏ?= నేను చెప్పవలసింది ఏమైనా ఉన్నదా?; అని+పలికినన్= అని చెప్పగా; ఆంబికేయుండు= అంబిక కొడుకైన ధృతరాష్ట్రుడు; కయ్యంబునన్= యుద్ధంలో; గెలుపు+తెలుపు+నిమిత్తంబులు= విజయాన్ని సూచించే శకునాలు; అడిగినన్= ప్రశ్నించగా; ఆ+ముని+వరేణ్యుండు= మునులలో శ్రేష్ఠుడైన వాడు- వ్యాసుడు; వహ్నులు= అగ్నులు; హోమ+కాలంబునన్= హోమం చేసే సమయంలో; పుణ్య+గంధంబులతోన్= మంచి వాసనలతో; దక్షిణ+అర్చులు+అగుటయున్= కుడివైపునకు వ్యాపించే మంటలుగలవి కావటం; భేరీ ప్రముఖంబులు=భేరి మున్నగు యుద్ధ వాద్యాలు; గంభీర+ఘోషంబులు+అగుటయున్= ప్రస్ఫుటమైన ధ్వనులతో కూడినవి కావటం; వాయువులు= గాలులు; అనుకూల+మృదు+మనోహర+ప్రచారంబులు+అగుటయున్= వాలుగా మెల్లగా చల్లగా వీస్తూ ఉండటం. ఇవి+మొదలుగాన్= ఇటువంటివి; కొన్ని శుభసూచకంబులు= కొన్ని మంచి శకునాలను; నిర్దేశించి= ప్రత్యేకంగా చెప్పి; కొంచెంబు పెద్ద+అనన్ లేదు=

(సంఖ్యలో) కొంచెం ఎక్కువ అనే తేడా ముఖ్యం కాదు; సమరంబునన్= యుద్ధంలో; జయంబు= గెలుపు; దైవ+అధీనంబు= భగవంతుడి చేతిలో ఉన్నట్టిది; కావునన్= కాబట్టి; పెద్దలు= వృద్ధులు (జ్ఞానులు); పెనఁకువలు= కలహాలు; ఒప్పవు+అని= మంచివి కావని; చెప్పుదురు= అంటారు; ఏను+పోయివచ్చెదన్= నేను వెళ్ళుతున్నాను; అని+చెప్పి= అని వచించి; సముచిత+ప్రకారంబునన్= ఉచిత రీతిని; అంతర్ధానంబు+చేసెన్= మాయమయ్యాడు; తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట; ఆ కౌరవ+ఇంద్రుండు= కౌరవులలో శ్రేష్ఠుడు= ధృతరాష్ట్రుడు; కొండొకసేపు= కొంత కాలం; చింతించి= ఆలోచించి; నిట్టూర్పు నిగుడించి= దీర్ఘ నిశ్వాసంచేసి; సంజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ధృతరాష్ట్రుడు చెప్పగా వ్యాసుడు 'అది అట్లా ఉంచుము, ఇంక నేను చెప్పవలసింది ఏమైనా ఉన్నదా?' అని అడిగాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు 'యుద్ధంలో గెలుపును సూచించే శకునాలను తెలుపు' మని అడిగాడు. వ్యాసుడు చెప్పిన మాటలు: 'హోమకాలంలో అగ్నులు పుణ్యపరిమళాలు వెదచల్లుతూ సవ్యప్రదక్షిణంగా చక్కగా వెలుగొందుతాయి. వాలుగాలులు మనోహరంగా వీస్తాయి. భేరీలవంటి యుద్ధ వాద్యాల నుండి చక్కని చిక్కని ధ్వనులు వినిపిస్తాయి' అని చెప్పాడు. 'అంతేగాక- యుద్ధంలో విజయం సంఖ్యాబలం మీదకాక దైవానుగ్రహం మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి కలహం మంచిది కాదని పెద్దల ప్రవచనం' అని చెప్పి అతడు అంతర్ధానమైనాడు. ధృతరాష్ట్రుడు కొంతసేపు చింతిస్తూ వేడి నిట్టూర్పులు విడిచి సంజయుడితో ఈ విధంగా అన్నాడు:

**ఉ. భూమికిఁ గాఁగఁ బ్రాణముల పోక దలంపక రౌద్ర ఘోర సం**
**గ్రామము సేయుచుండుదురు రాజులు దొల్లియు; నెంత దీపొకో**
**భూమి; మునీంద్రసంగతి సుబుద్ధము నీకు జగంబు; నాకు నీ**
**భూమి తెఱంగు సెప్పుము ప్రబోధ నిరూఢముగా సమస్తమున్. 15**

**ప్రతిపదార్థం:** తొల్లియున్= పూర్వకాలంలోకూడా; రాజులు= ప్రభువులు; భూమికిన్+కాఁగన్= భూమిని సంపాదించటం కోసమై; ప్రాణముల+పోక+తలంపక= ప్రాణాలు పోతాయి అనే జంకు లేకుండా; రౌద్ర+ఘోర+సంగ్రామమున్= భయంకరమూ, దారుణమూ అయిన యుద్ధాన్ని; చేయుచుండుదురు= సలుపుతూ ఉంటారు; భూమి= పుడమి; ఎంత+తీపి+ఒకో!= ఎంత ఇష్టమైనదో; ముని+ఇంద్ర+సంగతిన్= శ్రేష్ఠులైన ఋషులతో నీకుగల పరిచయం వలన; జగంబు= ప్రపంచం; నీకున్= నీకు; సుబుద్ధము= బాగుగా తెలిసినటువంటిది; నాకున్= నాకు (ఇది ధృతరాష్ట్రుడు చెప్పుతున్న మాట); ఈ+భూమి+తెఱంగు= భూమి తీరుతెన్నులు; సమస్తమున్= సర్వమును; ప్రబోధ+నిరూఢముగాన్= తేటతెల్లమయ్యేట్లుగా; చెప్పుము= వివరించుము.

**తాత్పర్యం:** 'ఓ సంజయా! రాజులు భూమి కోసమై ప్రాణాలకు తెగించి, భయంకరమైన పోరాటాలు చేస్తారు. ఇది పూర్వకాలంనుండి సాగుతున్న జరుగుతున్న విషయం. భూమి అంటే రాజులకు ఎంత తీపియో కదా! నీకు ఋషివరేణ్యులతో గాఢపరిచయం ఉంది. నీ కీ జగత్తులోని విశేషాలన్నీ తెలుసు. కాబట్టి నాకు ఈ భూమి విషయాలు అన్నీ తేటతెల్లంగా వివరించి చెప్పుము.

**విశేషం**: (1) సంజయుడు ధృతరాచిష్ట్రుడికి భూమి విశేషాల వివరాలు చెప్పుతాడు. అనగా సంస్కృత మహాభారత రచనా కాలం నాటి భూమిని గూర్చిన పరిజ్ఞానం మనకు తెలుస్తుంది. పందొమ్మిదవ శతాబ్దినాటికిగాని- మానవులకు - భూ పరిపూర్ణ పరిజ్ఞానం లభించలేదు. సంస్కృత మహాభారత రచనా కాలం నాటికే భారతీయులకు ఏర్పడిన భూ పరిజ్ఞానం ఎన్నదగినది. ఆనాడు ఇతర దేశీయులకు అంతటి పరిజ్ఞానం లేదనే చెప్పవచ్చును.

(2) ఇక రెండవ అంశం. మహాభారత సంగ్రామం జరుగబోతున్నది. అది అవశ్యం. తత్క్షణం వినవలసినది కదా! పానకంలో పుడకవలె ఈ భూగోళ వర్ణనం ఏమిటి? అని పలువురు చేసే విమర్శ సమంజసమైనదే. అయితే మహాభారతం సమకాలీన విజ్ఞాన సర్వస్వంగా తీర్చిదిద్దాలనే రచయిత ఆకాంక్షకు ఈ ఘట్టం ఒక ఉదాహరణ. కథకు తాత్కాలికమైన అంతరాయం కలిగిన మాట నిజమే కాని మహాభారతానికి ఇది విజ్ఞాన పుష్టి కలిగించింది.

**వ. అనిన విని సంజయుం డతని కిట్లను 'నా యెఱింగి నంతయు నెఱింగించెద భూతత్త్వప్రకారం బవధరింపుము.' 16**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని ధృతరాష్ట్రుడు వేసిన ప్రశ్న ఆలకించి; సంజయుండు; అతనికిన్+ఇట్లు+అనున్= ధృతరాష్ట్రుడికి ఈ విధంగా చెప్పాడు; నా+ఎఱింగిన+అంతయున్= నాకు తెలిసిన మేరకు; భూ+తత్త్వ+ప్రకారంబు= భూమికి సంబంధించిన స్వభావాల తెరగు; అవధరింపుము= శ్రద్ధగా వినుము.

**తాత్పర్యం:** ఆ విధంగా ధృతరాష్ట్రుడు వేసిన ప్రశ్న విని, సంజయుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! నాకు తెలిసిన మేరకు నీకు భూగోళ విషయాల నన్నీ తేటతెల్లంగా వివరించి చెప్పగలను. శ్రద్ధగా వినుము.'

**విశేషం:** (1) భూమి సువిశాలమైనది. మహాభారత రచనా కాలంలో భూగోళపరిజ్ఞానం తక్కువ. అయితే ప్రజలలో ఆసక్తి ఎక్కువ అని ధృతరాష్ట్రుని ప్రశ్న వలన తెలుస్తున్నది. కౌరవులు పాండవులు భూమి కోసమే యుద్ధం చేస్తున్నారు. నిజమే. అయితే వారు చేరింది కురుక్షేత్రంలో. వారి రాజ్య విస్తీర్ణం - భూగోళంతో పోల్చిచూస్తే - అత్యల్ప భాగమే కదా. ఆ విషయం ధృతరాష్ట్రునకు - సంజయుడికీ కూడా తెలుసు. కురుక్షేత్రంలో యుద్ధం చేసింది ఆనాడు కౌరవ పాండవ సేనలు మాత్రమే కాదు. భూగోళంలోని పలు ప్రదేశాల నుండి సేనలు అక్కడకు చేరాయి. ఈ ఘట్టంవలన రెండు విషయాలు తెలుస్తున్నవి. (1) ఆనాటి ప్రజలలో భూగోళ విజ్ఞానంపై గల జిజ్ఞాస. (2) ఆనాటి విజ్ఞులకు భూగోళ విషయకంగా గల పరిమిత పరిజ్ఞానం.

**సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూపరిమాణంబు సెప్పుట (సం.6-5-9)**

**తే. ' అధిప! నానా ప్రకార చరాచరంబు । లింద వేర్వేఱ జనియించు, నింద పెరుఁగుఁ,**
**బిదప నింద యడంగు; నీ పృథ్వి దాన । సకలమునకుఁ బరాయణస్థాన మరయ. 17**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ఓ ధృతరాష్ట్ర!); ఇంద= ఇందే (ఈ భూమియందే); నానా+ప్రకార+చర+అచరంబులు= పెక్కు తెరగులైనవి- కదిలేవి, కదలనట్టివి; వేర్+వేఱ= వేరువేరుగా; జనియించున్= పుట్టుతాయి; ఇందున్+అ= ఈ భూమిమీదనే; పెరుఁగున్= అభివృద్ధి చెందుతున్నవి; పిదపన్= తరువాత; ఇంద= ఈ భూమియందే; అడంగున్= నశిస్తున్నవి; అరయన్= విచారించగా ఈ+పృథ్వి= ఈ భూమి; సకలమునకున్= అన్నింటికిని; పరాయణ+స్థానము= ఆధారమైన చోటు.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ భూమిమీదనే చరాచరాలన్నీ పుట్టుతూ ఉంటాయి, పెరుగుతూ ఉంటాయి, నశిస్తూ ఉంటాయి. ఈ భూమియే అన్నిటికీ ఆధారమైన చోటు.

**విశేషం:** భూమిమీది భూతకోటిని పూర్వికులు (1) చరములు (2) అచరము లని విభాగించి ఉన్నారు. చరములు ప్రాణికోటి మనుష్యులు, జంతువులు మున్నగు భూతాలు. అచరములు - కొండలు చెట్లు నదులు - మొదలైనవి అచరాలుగానే పరిగణించ బడ్డాయి.

**వ. అదియునుంగాక విను మాకాశంబునకు గుణంబు శబ్దంబు, వాయువునకు శబ్ద స్పర్శంబులును, దేజంబునకు శబ్ద స్పర్శ రూపంబులును, నప్పులకు శబ్ద స్పర్శరూప రసంబులును గుణంబులు; పృథివికి శబ్ద స్పర్శ రూప రసగంధాత్మకం బైన గుణసముదయం బంతయుం గలదు గావున నిమ్మహా భూతంబు లేనింటిలోనం బృథివి యెక్కుడు; దీని యున్న విధంబు వివరించెద నాకర్ణింపుము. 18**

**ప్రతిపదార్థం:** అదియున్+కాక= అంత మాత్రమేకాక; వినుము; ఆకాశంబునకున్= నింగికి; గుణంబు= లక్షణం; శబ్దంబు= నాదం; వాయువునకున్= గాలికి; శబ్ద, స్పర్శంబులును= నాదం మరియును తాకుడు; తేజంబునకున్= ప్రకాశానికి; శబ్ద, స్పర్శ, రూపంబులును= నాదం, తాకుడు, ఆకారమున్నూ; గుణంబులు= లక్షణాలు; అప్పులకున్= నీళ్ళకు; శబ్ద స్పర్శరూపరసంబులును= నాదం, తాకుడు, ఆకారము, ద్రవం, గుణంబులు= లక్షణాలు; పృథివికిన్= భూమికి; శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ+ ఆత్మకంబు+ అయిన= నాదం, తాకుడు, ఆకారం, ద్రవం, వాసనలతో కూడిన; గుణ, సముదయంబు+ అంతయున్= లక్షణాల సముదాయం అంతా; కలదు= ఉన్నది; కావునన్= కాబట్టి; ఈ+మహా+భూతంబులు+ఏనింటిలోనన్= ఈ పంచభూతాలలో; పృథివి= భూమి; ఎక్కుడు= అధికమైనది; దీని+ఉన్న+విధంబు= ఈ భూమి యొక్క యదార్థమైన తెరగు; వివరించెదన్= తెల్లముగా చెప్పగలను; ఆకర్ణింపుము= ఆలకించుము.

**తాత్పర్యం:** అంతేకాక ఆకాశానికి లక్షణం శబ్దం; వాయువునకు లక్షణాలు రెండు. అవి- శబ్దం తాకుడు; తేజానికి లక్షణాలు శబ్ద స్పర్శ రూపాలు; నీటికి లక్షణాలు శబ్దస్పర్శరూపాలేకాక ద్రవత్వంగూడ. భూమికి శబ్దస్పర్శరూప రసాలతోపాటు వాసన గూడ ఉన్నది. అనగా పంచభూతాల లక్షణాలు అన్నీ భూమికి ఉన్నాయి. అందుచేత భూతాలలో పంచభూతాలు ఎన్నదగినవి. పంచభూతాలలో భూమి ఎన్నదగినది. గొప్పది.

**సీ. ధాత్రీశ! మేరువు దక్షిణంబున సుద । ర్శన మను నభిధానమునఁ బ్రభూత**
**విస్తార మై రెండువేలు నేనూఱు యో । జనముల పొడవునై సరస మధుర**
**విపుల శాశ్వత ఫలవితతి సమేతమై । యొక్క జంబూతరు వొప్పియుండు**
**దాని పండులు మహీస్థలి మహారవముగ । ననిశంబుఁ బడి రాలి యవియుచుండు**

**ఆ. వానిరసము పొంగి వాహినీ మూర్తి న । న్నగమునకుఁ బ్రదక్షిణంబు గాఁగ**
**నొరసికొనుచుఁ దిరిగి యుత్తరకురు భూము । లందుఁ జొచ్చి పాఱు నంబునిధికి. 19**

**ప్రతిపదార్థం:** ధాత్రీ+ఈశ!= ఓ రాజా!; మేరువు= మేరువు అనే పేరుగల పర్వతానికి; దక్షిణంబునన్= దక్షిణ దిక్కున; సుదర్శనము+అను+అభిధానమునన్= సుదర్శనం అనే పేరుతో; ప్రభూత+విస్తారము+ఐ= మిక్కిలి నిడివి కలిగినదై రెండువేల, యేనూఱు, యోజనముల; పొడవును+ఐ= రెండువేల అయిదు నూర్ల ఆమడల పొడవు గలిగిందై; సరస+మధుర+ విపుల+శాశ్వత+ఫల+వితతి+సమేతము+ఐ= తియ్యని ద్రవాలతోనూ; ఎల్లప్పుడు ఉండే పెక్కు పండ్ల సముదాయంతో కూడి ఉండే; ఒక్క+జంబూ+తరువు= ఒక నేరేడు చెట్టు; ఒప్పి+ఉండున్= వర్ధిల్లుతుంటుంది; దాని+పండులు= ఆ (నేరేడు) చెట్టు పండ్లు; మహీ+స్థలిన్= భూభాగంమీద; మహా+రవమున్= పెద్ద ధ్వనితో; అనిశంబున్= ఎల్లప్పుడును; పడి+రాలి+అవియుచున్+ ఉండున్= క్రిందపడి చెల్లాచెదరై పగిలిపోతూ ఉంటాయి; వాని+రసము+పొంగి= ఆ పండ్ల ద్రవం పొంగిపోయి; వాహినీ+మూర్తిన్= ఏరు ఆకారంలో; ఆ+నగమునకున్= ఆ చెట్టుకు; ప్రదక్షిణముగన్= కుడినుండి ఎడమ వైపునకు చుట్టు దిరిగి; ఒరసి కొనుచున్= రాసుకొంటూ; తిరిగి= (మలుపు) తిరిగి; ఉత్తర+కురు+భూములందున్= కురుభూమికి ఉత్తరంగా ఉన్న ప్రదేశాలలో; చొచ్చి= ప్రవేశించి; అంబునిధికిన్= సముద్రంలో చేరేటట్లు; పాఱున్= ప్రవహిస్తుంది.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! మేరుపర్వతానికి దక్షిణంగా 'సుదర్శనం' అనే పేరుగల పెద్ద ప్రదేశం ఉన్నది. అది మిక్కిలి విస్తీర్ణం కలది. దాని పొడవు రెండు వేల ఏబది నూర్ల యోజనాలు. అందులో ఒక జంబూ వృక్షం

(నేరేడు చెట్టు) ఉన్నది. ఆ చెట్టు నుండి పండ్లు పెద్ద చప్పుడుతో నేలమీదపడి విచ్చుతాయి. ఆ పండ్ల రసం పెద్ద ఏరుగా తయారయి ఆ చెట్టు చుట్టూ ప్రదక్షిణం చేసి, పొంగి పొరలి ఉత్తర కురుభూముల గుండా ప్రవహించి తుదకు సముద్రాన్ని చేరుకుంటుంది.

**విశేషం:** 1. యోజనము అనగా సుమారు ఎనిమిది మైళ్ళు అని నేటి పండితుల అంచనా.

2. "భరత వర్షే భరతఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే జంబూద్వీపే" ఇది సంకల్పంలోని భాగం. మేరు పర్వతం - ఉత్తర ధ్రువ ప్రాంతంలోనిది. సూర్యచంద్రాది గ్రహాలు మేరువుచుట్టూ ప్రదక్షిణం చేస్తాయని వర్ణన. అనగా ప్రాచీన భారతీయులకు ఉత్తర ధ్రువప్రాంతం తెలిసినట్లే.

**వ.** **జంబూనది యనం బరఁగిన యా తరంగిణి నీరు సోఁకిన చోటెల్లను సువర్ణం బగుటం జేసి కనకంబునకు జాంబూనదం బను నామంబునుం గలిగెఁ; దదీయ జలపానంబు సేసిన మానవులకు ముదిమియుం దెవులును దప్పియు లే వని చెప్పుదు; రయ్యేటి పడమటం బెరిఁగి పఱపు గలిగి శరనిధిచందంబున జంబూషండంబు గాఱుకొనుచుండు; నింతటికిం గారణంబయిన యాజంబూవృక్షంబు పేర నీ ద్వీపంబు జంబూ ద్వీపంబు; జంబూద్వీపంబును సుదర్శన ద్వీపంబు నన నెగడి లవణ సముద్ర ముద్రితం బయి పొలుచు నద్దీవియందు.** **20**

**ప్రతిపదార్థం:** జంబూనది+అనన్+పరఁగిన= జంబూనది అనే పేరుతో ఒప్పిన; ఆ+తరంగిణి= ఆ నది; నీరు= జలం; సోఁకిన+చోటు+ఎల్లను= పారినస్థలం అంతా; సువర్ణంబు+అగుటన్+చేసి= బంగారుగా మారటంచేత; కనకంబునకున్= బంగారానికి; జాంబూనదంబు= 'జాంబూనదం' అనే నామంబు= పేరు కలిగెన్= ఏర్పడింది; తదీయ+జలపానంబు+చేసిన= ఆ నది నీరు త్రాగిన; మానవులకున్= మనుజులకు; ముదిమియున్= ముసలితనం; తెవులును= రోగమును; దప్పియున్= దాహమును; లేవు+అని+చెప్పుదురు= ఉండవు అని (ప్రజలు) చెప్పుతూ ఉంటారు; ఆ+ఏటి+పడమటన్= ఆ నదియొక్క పడమటి దిక్కున; పెరిఁగి= విస్తరించి; పఱపు+కలిగి= వైశాల్యం ఉండి; శరనిధి+చందంబునన్= సముద్రంవలె; జంబూ షండంబు= నేరేడు చెట్ల గుంపు; కాఱుకొనుచుండున్= విస్తరించి ఉంటుంది; ఇంతటికిన్+కారణంబు+అయిన= ఇంతటికి హేతువయిన; ఆ జంబూ+వృక్షంబు= ఆ నేరేడు చెట్టు; పేరన్= పేరుమీద; ఈ+ద్వీపంబు= ఈ దీవి; జంబూ+ద్వీపంబు= జంబూద్వీపము అను పేరుగలదియును; సుదర్శన ద్వీపంబు+అనన్+నెగడి= సుదర్శన ద్వీపం అనే పేరుతో విలసిల్లి; లవణ+సముద్ర+ముద్రితంబు+అయి= ఉప్పునీటి సముద్రంతో చుట్టబడి; పొలుచున్= విలసిల్లుతుంది; ఆ+దీవియందున్= ఆ (జంబూద్వీపంలో).

**తాత్పర్యం:** జంబూనది అనే పేరుగల ఆ నది ప్రవహించే చోటులు అన్నీ బంగారంగా మారిపోవటం చేత బంగారానికి 'జాంబూనదము' అనే పర్యాయపదం ఏర్పడింది. ఆ నదీ జలం త్రాగిన వారికి ముసలితనం రాదు. ఏ రోగం రాదు, దాహం ఉండదు అని అంటారు. ఆ నదికి పశ్చిమదిక్కున నేరేడు చెట్ల గుంపు విస్తరించి ఉంటుంది. ఆ చెట్టు పేరుమీద ఆ ప్రాంతానికి జంబూద్వీపం అనే పేరు ఏర్పడింది. దానికే సుదర్శన ద్వీపం అని మారుపేరు. ఆ ద్వీపానికి చుట్టూ ఉప్పునీటి సముద్రం ఉంటుంది. ఆ ద్వీపంలో.

**సీ.** **నిడుపునఁ దూర్పును బడమర నై రెండు । గడలు నంభోనిధి గదిసి యుండు**
**రత్నమయంబులు రమణీయములు సాధ్య । సిద్ధ చారణ గణసేవితములు**
**నై హిమాచలమును, నావల హేమకూ । టంబును, నట నిషధంబు నొప్పు;**
**లలితంబు లైన నీల శ్వేత శృంగవం । తంబులు గ్రమమునఁ దనరి పొలుచు;**

**ఆ. నివుల మూఁటి కవల నవుల యమ్మూఁటికి । నివలఁ దేజరిల్లు దివిజ నగము
గమలకర్ణికానుకారియై కాంచన । మణిమయత్వ మహిమ మహిత మగుచు. 21**

**ప్రతిపదార్థం:** నిడుపునన్= పొడగున; తూర్పును+పడమరను+ఐ= తూరుపు దిక్కున, పడమటి దిక్కున; రెండు+కడలున్= రెండు వైపుల; అంభోనిధి= సముద్రం; కదిసి+ఉండున్= వ్యాపించి ఉంటుంది; రత్నమయంబులు= రత్నాలతో కూడినవి; రమణీయములు= అందమైనవి; సాధ్య, సిద్ధ, చారణ, గణ, సేవితములు+ఐ= సాధ్యులు, సిద్ధులు, చారణులు అనే దేవతా సమూహాల చేత సేవించబడునవి అయి; హిమ+అచలము= హిమవత్పర్వతం; ఆవల= ఆపైన; హేమకూటంబును= హేమకూటం అనే కొండ; అట= ఆ ప్రదేశంలో; నిషధంబున్= నిషధమనే కొండ; ఒప్పున్= విలసిల్లుతూ ఉంటుంది; లలితంబులు+ఐన= సుకుమారాలైన; నీల, శ్వేత, శృంగవంతంబులు= నల్లని తెల్లని శిఖరాలుగల కొండలు; క్రమమునన్= వరుసగా; తనరి= ఒప్పి; పొలుచున్=వెలుగొందుతాయి; ఇవులన్= ఇటువైపు; మూఁటికిన్+అవల= మూడు (పర్వతాలకు) అవలి వైపు; ఆ+మూఁటికిన్+ఇవల= ఆ మూడు కొండలకు ఇవతలి వైపు; దివిజనగము= వేలుపు కొండ (మేరుపర్వతం); కమల+కర్ణికా+అనుకారి+ఐ= పసిడి తామరలను పోలు దుద్దులవలె భాసిస్తూ; కాంచన+మణిమయత్వ+మహిమన్= బంగారంతో, మణులతో పొదుగబడిన గొప్పదనంతో; మహితము+అగుచున్= గొప్పది అవుతూ; తేజరిల్లున్= ప్రకాశిస్తుంది.

**తాత్పర్యం:** ఆ దీవికి తూర్పు, పడమర దిక్కులందు పొడవుగా సముద్రం వ్యాపించి ఉంటుంది. ఇక ఇరువైపుల దేవతా జాతులతో కూడిన హిమాలయ పర్వతాలు హేమ కూట పర్వతం నిషధ పర్వతాలు ఉంటాయి. అవి నల్లని తెల్లని శిఖరాలతో విరాజిల్లుతూ ఉంటాయి. ఆ మూడింటికి ఇటు అటు వేల్పుకొండ తామరపువ్వునందలి దుద్దువలె సువర్ణమణిమయమై వెలుగొందుతుంటుంది.

**విశేషం:** సిద్ధులు, సాధ్యులు, చారణులు దేవతలలోని జాతులు. సిద్ధులు అణిమాది మహిమలు గలవారు. సాధ్యులు (పన్నిద్దరు); మనువు రాజమంతుడు, విష్ణువు, ధర్ముడు, నారాయణుడు మున్నగువారు పరిణామశీలురు. చారణులు: నానా ప్రదేశాలలో సంచరించేవారు. వీరు లోకోత్తరుల చరిత్రలు గానం చేస్తూ సంచరిస్తూ ఉంటారు.

**తే. అతిదృఢం బగుపాఁతు పదాఱువేల । యోజనము లంద్రు; దానికి రాజముఖ్య
విందు మెనుబదినాలుగువేల యోజ । నంబులని హేమధాత్రీధరంబు పొడవు. 22**

**ప్రతిపదార్థం:** రాజముఖ్య!= రాజులలో గొప్పవాడా, (ఓ ధృతరాష్ట్ర) మహారాజా!; దానికిన్= ఆ మేరుపర్వతానికి; అతి దృఢంబు+అగు+పాఁతు= మిక్కిలి బలంగల పునాది; పది+ఆఱు+వేల+యోజనములు+అంద్రు= పదారువేల యోజనాలు అని అంటారు; హేమ+ధాత్రీధరంబు+పొడవు= బంగారుకొండ నిడివి; ఎనుబది+నాలుగువేల+యోజనంబులు= ఎనభైనాలుగు వేల యోజనాలు; అని= అని; విందుము= వింటాము.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రమహారాజా! ఆ మేరుపర్వతపు పునాది మిక్కిలి లోతైనది, బలమైనది. దాని లోతు పదారువేల యోజనాలు అని అంటారు. ఆ మేరుపర్వతం పొడవు ఎనభైనాలుగువేల యోజనాలు అని వింటాం.

**వ. ఇవ్విధంబున భూమధ్యంబున నున్న యమ్మేరుమహీధరంబున దేవతలును, దేవమునులును, గంధర్వ కింపురుషాది దేవయోనులును, దేవేంద్ర ప్రముఖ దిక్పతులును, బరమేష్ఠియుం దత్తత్ప్రదేశంబులఁ బుణ్య వర్తనంబులం బరమ సుఖంబు లనుభవింతు; రుత్తరతటంబునం గర్ణికారవనంబున గౌరీసమేతుండై సిద్ధగణంబులు పరివేష్టింప విశ్వేశ్వరుండు విహరించుచుండు. 23**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; భూ+మధ్యంబునన్+ఉన్న= భూమికి మధ్యగా ఉన్న; ఆ+మేరు+మహీధరంబున= ఈ మేరు పర్వతంమీద; దేవతలును= వేల్పులు; దేవమునులు= దేవలోకంలోని ఋషులు; గంధర్వ, కింపురుష+ఆది, దేవ

యోనులును= గంధర్వులు, కింపురుషులు మున్నగు దేవతల సంతతులూ; దేవ+ఇంద్ర ప్రముఖదిక్+పతులును= దేవేంద్రుడు మొదలుగాగల దిక్పాలకులూ; పరమేష్ఠియును= బ్రహ్మదేవుడూ; తత్+తత్+ప్రదేశంబులన్= ఆయా స్థలాలలో; పుణ్యవర్తనంబులన్= మంచి కార్యాలను చేస్తూ; పరమ+సుఖంబులు+అనుభవింతురు= మిక్కిలి గొప్పవైన సౌఖ్యాలను అనుభవిస్తారు; తత్+తీర+తటంబున్= ఆ సానువులలో; కర్ణికార, వనంబునన్= కొండ గోగుపూల తోటలలో; గౌరీ+సమేతుండు+ఐ= పార్వతీదేవితో కూడినవాడై; సిద్ధ+గణంబులు= సిద్ధులు అనెడి దేవతల గుంపులు; పరివేష్టింపన్= చుట్టూ చేరి కొలువగా; విశ్వేశ్వరుండు= శివుడు; విహరించుచుండున్= తిరుగుతూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా భూమికి మధ్యలో ఉన్న మేరుపర్వతంపై దేవతలు వివిధ వర్గాలు, దేవేంద్రుడు, బ్రహ్మ మున్నగువారు తిరుగాడుతూ ఉంటారు. ఆ కొండ సానువులలో పార్వతీ సమేతుడై శివుడు విహరిస్తూ ఉంటాడు.

**విశేషం:** గంధర్వులు దేవతలలో ఒక తెగ. సంగీత పరాయణులు. కింపురుషులు, అశ్వముఖం, నరశరీరంగల దేవతలు.

**క. తొమ్మిది ఖండములై వ । ర్షమ్ము లనం జాల నొప్పెసఁగు జంబూద్వీ**
**పమ్మున జనపదములు విను । మమ్మహితాంశములు దెలియ ననువర్ణింతున్. 24**

**ప్రతిపదార్థం:** తొమ్మిది+ఖండములు+ఐ= తొమ్మిది భాగాలుగా ఏర్పడి; వర్షమ్ములు+అనన్= వర్షములు అనే పేరుమీద; చాలన్+ఒప్పు+ఎసఁగు= మిక్కిలి బాగుగా ఉండే; జంబూద్వీపమ్మునన్= జంబూద్వీపంలో; జనపదములు= జనులు నివసించే చోటులు (గ్రామాల సముదాయాలు); ఆ+మహిత+అంశములు= గొప్పవైన అందలి విశేషాలు; తెలియన్= తెలిసేటట్లుగా; అనువర్ణింతున్= వివరించి చెప్పగలను; వినుము= ఆలకింపుము.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆలకించుము. తొమ్మిది భాగాలుగా ఏర్పడిన జంబూద్వీపమును, అందలి జనపదాలను నీకు తెలిసేటట్లు వర్ణించి చెప్పగలను.

**వ. ఉత్తర సముద్రంబు శృంగవంతంబు మధ్యమం బైరావతవర్షం బన నొప్పు; శ్వేత పర్వత శృంగవంతంబుల నడుము హైరణ్మయ వక్షం బనం బొలుచు నీలశైలోత్తర దక్షిణదేశంబులు గ్రమంబున రమణక వర్షంబును నసం జెలువమరు; మేరువునకుం బ్రాచ్య ప్రతీచ్యంబు లగు భాగంబులు వరుసన భద్రాశ్వ వర్షంబును గేతుమాలా వర్షంబును ననం బొగడొందు; హేమకూటోత్తర భూమి హరివర్షం బన నెగడు; హిమవంతంబు నక్కడయు నిక్కడయు నోలిన కింపురుష వర్షంబును భారత వర్షంబును ననం బెంపారు; ని ట్లున్న దీనియందు. 25**

**ప్రతిపదార్థం:** ఉత్తర సముద్రంబు= ఉత్తర దిశలో ఉన్న సముద్ర ప్రాంతం నుండి; శృంగవంతంబు= శృంగవంతం; మధ్యమంబు= మధ్యనున్న ప్రదేశం; ఐరావత వర్షంబు+అనన్+ఒప్పున్= ఐరావత వర్షం అనే పేరుతో విలసిల్లుతుంది; శ్వేతపర్వత+శృంగవంతంబుల నడుము= శ్వేతపర్వతం శృంగవంత పర్వతం రెంటికి మధ్య; హైరణ్మయ వర్షంబు+అనన్= హైరణ్మయ వర్షం అనే పేరున; పొలుచున్= విలసిల్లుతుంది; నీల, శైల+ఉత్తర, దక్షిణదేశంబులు= నీలశైలానికి అటు ఉత్తరం, ఇటు దక్షిణంగా ఉన్న ప్రదేశం క్రమంబునన్= వరుసగా; రమణక+వర్షంబును+అనన్= రమణక వర్షం అనే పేరుతో; చెలువు+అమరున్= శోభిల్లుతుంది; మేరువునకున్= మేరుపర్వతానికి; ప్రాచ్య+ప్రతీచ్యంబులు+అగు= తూరుపున పడమట ఉన్న ప్రదేశాలు; వరుసన= క్రమంగా; భద్రాశ్వవర్షం - కేతుమాలా వర్షం; అనన్+పొగడు+ఒందున్= అనే పేరులతో శోభిల్లుతున్నవి; హేమకూట+ఉత్తర భూమి= హేమకూట పర్వతానికి ఉత్తర దిక్కున ఉన్న ప్రదేశం; హరి వర్షంబు+అనన్= హరివర్షం అనే పేరు మీద; నెగడున్= విలసిల్లుతుంది; హిమవంతంబు= హిమాలయ పర్వత ప్రదేశం; అక్కడయు+ఇక్కడయు= ఆ ప్రదేశంలో మరియు ఈ ప్రదేశంలో; ఓలిన= వరుసగా; కింపురుష+వర్షంబును= కింపురుష వర్షం అనే పేరుమీద;

భారత+వర్షంబును అనన్= భారత వర్షం అనే పేరుమీద; పెంపారున్= వర్ధిల్లుతున్నాయి; ఇట్లు+ఉన్న= ఈ విధంగా ఉన్న; దీనియందున్= ఈ భూమియందు.

**తాత్పర్యం:** ఉత్తర సముద్రానికీ శృంగవంతం అనే పర్వతానికీ మధ్యలో గల ప్రదేశానికి ఐరావతవర్షం అని పేరు. శ్వేతపర్వతం శృంగవంత పర్వతాల మధ్యలోగల ప్రదేశం హైరణ్మయ వర్షం. నీల శైలానికి ఉత్తర దిక్కున దక్షిణ దిక్కునగల ప్రదేశం రమణక వర్షం. మేరు పర్వతానికి తూర్పు దిక్కులో ఉన్న ప్రదేశం భద్రాశ్వవర్షం. మేరు పర్వతానికి పడమర దిక్కులో ఉన్న ప్రదేశం కేతుమాలా వర్షం. హేమకూట పర్వతానికి ఉత్తర దిక్కున గల ప్రదేశం హరి వర్షం. హిమాలయ పర్వతానికి అవ్వలి గట్టున ఉన్న ప్రదేశం కింపురుష వర్షం. హిమాలయ పర్వతానికి ఇవ్వలివైపున ఉన్న ప్రదేశం భారత వర్షం. ఈ విధంగా ఉన్న భూమియందు.

**విశేషం:** మిక్కిలి ప్రాచీన కాలంలోనే భారతీయులు భూమి సువిశాలమైనదనీ విపుల విస్తీర్ణమైనదనీ గుర్తించారు.

**క. ' భారతవర్షముఁ దొడఁగి మ । హీరమణ! యుదీచ్యము లను నెక్కుడు బలస**
**త్త్వారోగ్యాయుస్సుఖపు । ణ్యా రంభ గుణంబు లంతకంతకు నరయన్.' 26**

**ప్రతిపదార్థం:** మహీరమణ!= భూమిని రంజింపజేసేవాడా - ఓ రాజా! ధృతరాష్ట్ర మహారాజా!; భారత వర్షమునన్= భారత వర్షం అనే పేరుగల ప్రదేశంలో (జంబూద్వీప ఖండమునందు); ఉదీచ్యములను= ఉత్తరదిశయందున్న ప్రదేశాలలో; తొడఁగి= పూని; బల సత్త్వ+ఆరోగ్య+ఆయుస్+సుఖపుణ్య+ఆరంభ+గుణంబులు= శక్తిసామర్థ్యం, ఆరోగ్యం, ఆయుస్సు, సౌఖ్యం, పుణ్యకార్యాలు చేసే లక్షణాలు; అరయన్= పరీక్షించి చూడగా; అంతకున్+అంతకున్= ఒకదానికంటె మరియొక దానికి; ఎక్కుడు= హెచ్చుగా ఉంటాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భారతవర్షంలో ఉత్తర దిక్కుననున్న ప్రదేశాలలో ఉత్తరోత్తరంగా శక్తి, సామర్థ్యం, ఆరోగ్యం, ఆయువు, సౌఖ్యం, పుణ్య కార్య నిర్వహణలు ఎక్కువగా కనుపిస్తాయి.'

**విశేషం:** భారతదేశంలో ఉత్తర ప్రదేశాలు సంస్కృతికి నాగరకతకు కాణాచులు అని మహాభారత నిర్దేశం. ఆర్య నాగరికత, ఆర్షసభ్యత ఉత్తర ప్రదేశాలలో ఉద్భవిల్లి వికసించి దక్షిణానికి విస్తరించటం చరిత్రవేత్తలకు తెలిసిన విషయమే.

**వ. అనిన విని వైచిత్రవీర్యుండు 'సమస్తద్వీపంబులు సకలజలనిధులు నున్న పరిపాటియుం బ్రమాణంబులుం బ్రకాశంబుగ నెఱిఁగింపు, మనుటయు, సూతసూనుండు జంబూద్వీప విష్కంభంబు కొలఁది యెనుబదివేలు నాఱు నూఱు యోజనంబులు; దీని రెం డంతలు దొడంగి లవణేక్షు సురాఘృత దధి క్షీరశుద్ధ జలమయంబు లయిన మహార్ణవంబుల విష్కంభంబులు గ్రమంబున నొకటి కొకటి రెట్టి యై యుండుఁ; బ్లక్షద్వీప శాల్మలద్వీప క్రౌంచద్వీప కుశద్వీప శాకద్వీప పుష్కర ద్వీపంబుల విష్కంభంబులు జంబూద్వీప విష్కంభ ద్విగుణ ప్రమాణంబు మొదలుగా నోలి నొకటి కొకటి యినుమడి యై యుండు; నయ్యాఱు దీవులును జంబూ ద్వీపంబుకంటె నెల్లదానను బొగడ్త వడి యనేక పర్వతంబులను నానా నదులను బహు జనపదంబులను నొప్పి వరుస నొండొంటికి గుణవిశేషంబుల నధికంబు లై యుండు; నింతకుం గర్తయు భర్తయు హర్తయునై దుగ్ధాంబుధి యుత్తరంబునం గనకమయం బై యష్టచక్రంబును బ్రభూతభూతయుక్తంబును మనోజవంబును నగు మహనీయ శకటంబున వినోద పరాయణుం డైన నారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభిధా నంబున విఖ్యాతుండై విహరించుచుండు, నని చెప్పుటయు నతండు. 27**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని చెప్పగా విని; వైచిత్రవీర్యుండు= (విచిత్రవీర్యుడి కుమారుడైన) ధృతరాష్ట్రుడు; సమస్త ద్వీపంబులు= అన్ని ద్వీపాలు; సకల+జలనిధులు= అన్ని సముద్రాలు; ఉన్న; పరిపాటియున్= అనుక్రమం; ప్రమాణంబులున్= కొలత(దు)లు; ప్రకాశంబుగన్= తేటతెల్లమయ్యేటట్లుగా; ఎఱిఁగింపుము+అనుటయున్= తెలుపుము అని చెప్పగా; సూతసూనుండు= సూతుని కొడుకు సంజయుడు; జంబూద్వీప+విష్కంభంబు+కొలఁది= జంబూద్వీపము యొక్క విస్తీర్ణం; ఎనుబదివేలు నాఱునూఱు యోజనంబులు= ఎనభై వేల ఆరువందల యోజనాలు; దీని+రెండు+అంతలు= దీనికి రెండు రెట్లు; తొడంగి= పూని; లవణ+ఇక్షు, సురా+ఘృత, దధి, క్షీర, శుద్ధ జలమయంబులు+అయిన= ఉప్పునీరు, చెరకు, కల్లు, నేయి, పెరుగు, పాలు, మంచినీళ్ళతో కూడిన; మహా+అర్ణవంబుల+విష్కంభంబులు= పెద్ద సముద్రాల విస్తీర్ణాలు; క్రమంబునన్= వరుసగా; ఒకటికి+ఒకటి= ఒకదాని కంటె ఒకటి; రెట్టి+ఐ+ఉండున్= రెండింతలుగా ఉంటాయి, ప్లక్షద్వీప, శాల్మల ద్వీప, క్రౌంచద్వీప, కుశద్వీప, శాక ద్వీప, పుష్కరద్వీప విష్కంభంబులు= ప్లక్ష, శాల్మల, క్రౌంచ, కుశ, శాక, పుష్కరాలు అనే పేరులుగల ద్వీపాల విస్తీర్ణాలు; జంబూద్వీప+ విష్కంభ+ద్విగుణ+ప్రమాణాలు= జంబూద్వీప ప్రమాణానికి రెట్టింపు; మొదలుగాన్+ఓలిన్= మొదలైన వరుసలో ఒకటికి+ఒకటి= ఒకదానికి ఒకటి; ఇనుమడి+ఐ= రెండింతలు అయి; ఉండున్= ఉంటాయి; ఆ+ఆఱుదీవులును= ఆ ఆరు దీవులూ; జంబూద్వీపంబుకంటెన్ ఎల్లదానను= అన్ని రీతులలో; పొగడ్త+పడి= పేరుకు ఎక్కి; అనేక+పర్వతంబులను= పెక్కుకొండలతో; నానానదులను= పెక్కు ఏరులతో; బహు+జనపదంబులను= జనులు నివసించే పెక్కు ప్రదేశాలతో; ఒప్పి= విలసిల్లి; వరుసన్= క్రమంగా; ఒండు+ఒంటికిన్= ఒకదానికంటె ఒకటి; గుణ+విశేషంబులన్= మంచి లక్షణాలతో; అధికంబులు+ఐ+ఉండున్= అతిశయిల్లుతూ ఉంటాయి; ఇంతకున్= ఇన్నిటికి; కర్తయున్= నిర్మించేవాడును; భర్తయున్= పోషించేవాడును; హర్తయున్= లయించేవాడును; ఐ= అయి; దుగ్ధ+అంబుధి+ఉత్తరంబునన్= పాలకడలి ఉత్తరపు దిక్కున; కనకమయంబు+ఐ= బంగారముతో నిండిన; అష్టచక్రంబును= ఎనిమిది అంచులు గల చక్రమునూ; ప్రభూత+భూత+యుక్తంబును= పెక్కు భూతములతో కూడినది; మనోజవంబును= మనస్సుతో సమానమైన వేగం కలిగినదియు; అగు= అయిన; మహనీయ శకటంబున్= గొప్ప వాహనంతో; వినోద+పరాయణుండు+ఐ= క్రీడాసక్తుడై; వికుంఠ నిధానుండు= వికుంఠమునందు ఉండే వాడు; వైకుంఠ+అభిధానంబునన్= వైకుంఠుడు అనే పేరు గలిగినవాడై; విఖ్యాతుండు+ఐ= పేరుకెక్కినవాడై; నారాయణుండు విహరించుచుండున్= ఆనందంతో తిరుగుతూ ఉంటాడు; అని+చెప్పుటయున్= అని వచింపగా; అతండు= అతడు (ధృతరాష్ట్రుడు).

**తాత్పర్యం:** "ధృతరాష్ట్రుడు తనకు సమస్త ద్వీపాల విస్తీర్ణాలు సమస్త సాగరాలున్న వరుసక్రమమంతా తెలుపుమని సంజయుడిని కోరినాడు. సంజయుడు, "జంబూద్వీప విస్తీర్ణము ఎనభైవేల ఆరునూరు యోజనములు", దీనికి రెండింతలుగా లవణ, ఇక్షు, సుర, ఘృతదధి, క్షీర, శుద్ధజలమయంబులైన మహాసముద్రాల వైశాల్యాలు. జంబూ ద్వీప వైశాల్యానికి ఒకదానికొకటి రెండింతలుగా పక్షద్వీప, శాల్మలద్వీప, క్రౌంచద్వీప, కుశద్వీప, శాక ద్వీప, పుష్కర ద్వీప వైశాల్యాలుంటాయి. ఈ ఆరు ద్వీపాలు జంబూ ద్వీపం కంటె అన్నింటిలోనూ పొగడబడుతూ అనేక పర్వతాలతో నానానదులతో బహుజనపదాలతో కూడి వరుసగా ఒకదాని కంటె మరొకటి గుణవిశేషంలో అధికమై ఉంటాయి. వీటన్నిటికి కర్తయై, భర్తయై, హర్తయై, క్షీర సాగరానికి ఉత్తరంలో కనకమయమైన ఎనిమిది చక్రాలతో పెక్కు భూతములతో కూడినది, మనోజవమైనది అయిన మహనీయ శకటం మీద నారాయణుడు వైకుంఠవాసుడై వైకుంఠుడను పేరుతో విహరించుచుండునని చెప్పినాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** 1. ద్వీపం అనగా నాలుగు వైపులా సముద్రంతో పరివృతమైన భూభాగం.

2. ద్వీపాలపేర్లు సార్థకాలు. వాచ్యార్థం కాకపోవచ్చును. ప్లక్ష= జువ్వి, రావి; శాల్మల= బూరుగు చెట్టు, క్రౌంచము= ఒకానొక పక్షి; కుశ= దర్భ; శాక= టేకుచెట్టు; పుష్కర= మెట్టతామర; అట్లే సముద్రాల పేరులు- లవణ= ఉప్పు; ఇక్షు= చెరకు; సురా=

కల్లు; ఘృత= నెయ్యి; దధి= పెరుగు; క్షీర= పాలు. ఈ పేరులు అన్నింటిని ఆలంకారికంగా ఔపచారికమైన అర్థాలలో స్వీకరింపవలెనని కొందరు పండితుల వాదం. ద్వీపాల పేరులు - అందలి వృక్ష విశేష ప్రాముఖ్య సూచకాలు అనీ సముద్రాల పేరులు వైవిధ్య సూచకాలు అనీ కొందరు పండితుల అభిప్రాయం. అలనాటి భూగోళ పరిజ్ఞానం పరిమితమైనదే కాని ప్రాచీనుల ఏతద్విస్తీర్ణ వైవిధ్యాలను నిశితంగా ఊహించారు.

**క. ' భారతవర్షమునకుఁ గాఁ । గౌరవులును బాండవులును గాంక్షం గడుఁ బె**
**ల్లై రాసి యొండొరులతోఁ । బోరం దెగి రిట్టి లుబ్ధబుద్ధులు గలరే?' 28**

**ప్రతిపదార్థం:** భారత వర్షమునకున్+కాన్= భారతవర్షం అనెడు భూభాగం కోసమే కదా; కౌరవులును (దుర్యోధనుడు మున్నగువారు); పాండవులును (పాండురాజు కొడుకులు); కాంక్షన్= కోరికతో; కడున్+పెల్లు+ఐ, రాసి= మిక్కిలి కలహించి; ఒండొరులతోన్+పోరన్+తెగిరి= ఒకరితో ఒకరు యుద్ధం చేయటానికి తెగించారు; ఇట్టి= ఈ విధమైన; లుబ్ధ బుద్ధులు= పిసినారి బుద్ధిగలవారు; కలరు+ఏ?= ఉన్నారా?

**తాత్పర్యం:** 'భారతవర్షం అనే భూభాగం కోసమే కదా కౌరవులు పాండవులు ఒకరితో ఒకరు పోరాడి వినాశనానికి పాల్పడ్డారు. ఇట్టి లోభబుద్ధి కలవారు ఎక్కడైనా ఉన్నారా?' అని ధృతరాష్ట్రుడు వాపోయాడు.

**వ. అనిన విని యమ్మనుజపతికి సంజయుం డిట్లనియె. 29**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా (ధృతరాష్ట్రుడు చెప్పగా విని); ఆ+మనుజపతికిన్= ఆ రాజుకు (ధృతరాష్ట్రుడికి) సంజయుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అప్పుడు ధృతరాష్ట్రుడి మాటలు విని సంజయుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**ఆ. ' అధిప! పాండుసుతుల కరయంగ నతికాంక్ష । లేదు; లుబ్ధబుద్ధి నీదు సుతుఁడు**
**శకుని కఱపు విని యసన్మార్గవృత్తికిఁ । జొచ్చి యిట్టి యెడరు దెచ్చికొనియె. 30**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ధృతరాష్ట్ర మహారాజా); అరయంగన్= పరీక్షించి చూస్తే; పాండుసుతులకున్= పాండవులకు; అతికాంక్ష= అత్యాశ; లేదు= లేదు; లుబ్ధ బుద్ధి= పిసినారిఅయిన; నీదు+సుతుఁడు= నీ కొడుకు (దుర్యోధనుడు); శకుని+కఱపు+విని= శకుని బోధ ఆలకించి; అసత్+మార్గవృత్తికిన్+చొచ్చి= చెడు దారికిపోయి; ఇట్టి+ఎడరున్= ఈ కష్టస్థితిని; తెచ్చికొనియెన్= తెచ్చికొన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! పాండవులకు అత్యాశలేదు. నీ కొడుకు దుర్యోధనుడు సహజంగా లోభి. పైపెచ్చు శకుని చెప్పుడు మాటలు విని చెడ్డదారిని పట్టి ఇట్టి ఆపదను తెచ్చికొన్నాడు.

**సంజయుండు ధృతరాష్ట్రునకు భారత వర్షంబునం గల విశేషంబులు సెప్పుట (సం. 6-10-1)**

**క. తమ తమ దేశంబులకై । మిముఁ గొని పాండవుల గెలుచు మెయికోలున భూ**
**రమణులుఁ గొందఱు వచ్చిరి । సమగ్ర సఖ్యమునఁ గూడు చందమునఁ దగన్. 31**

**ప్రతిపదార్థం:** తమ+తమ+దేశంబులకై= తమ తమ రాజ్యాలను రక్షించుకోవాలనే ఉద్దేశంతో; మిమున్+కొని= మీ పక్షం వహించి; పాండవులన్+గెలుచు+మెయికోలునన్= పాండవులను జయించాలనే ఆలోచనతో; భూరమణులు కొందరు= కొంతమంది రాజులు; సమగ్ర+సఖ్యమునన్= పరిపూర్ణ స్నేహం చొప్పున; కూడు+చందమునన్= చేరేటటువంటి రీతిలో; తగన్= తగినట్లు; వచ్చిరి= (మీపక్షంలో) వచ్చి చేరారు.

**తాత్పర్యం:** కొందరు రాజులు తమ తమ రాజ్యాలు సంరక్షించుకోవాలనే స్వార్థబుద్ధితో మీమీద పరిపూర్ణ స్నేహం ఉన్నట్లుగా పైకి నటిస్తూ మీ పక్షంలో వచ్చి చేరి పాండవులను గెలువదలచారు.

**ప్రతిపదార్థం:** వారిన్= (మీ పక్షంలో చేరిన రాజులను); అనన్+ఏల?= విమర్శించటమెందుకు?; తొల్లియున్= పూర్వకాలంలో కూడ; వసుధకై= భూమికోసం; అనేక+నృపతులు= పెక్కుమంది రాజులు; ఇట్లు= ఈ విధంగా; పోరాడి= యుద్ధాలు చేసి; నేల+వ్రాలి= భూమి మీద పడి (మరణించి); భగీరథ, రఘు, యయాతి, నహుష, ముఖ్యులు= భగీరథుడు, రఘువు, యయాతి, నహుషుడు మున్నగువారు; విశ్రుత+ఉన్నతులు= కీర్తితో గూడిన గొప్పదనాలు; కనిరి= పొందారు.

**తాత్పర్యం:** ఇప్పుడు మీ పక్షంలో చేరిన రాజులను విమర్శించటం న్యాయం కాదు. పూర్వకాలంలో కూడ భూరాజ్య సంపాదన కోసమేకదా- భగీరథుడు, రఘువు, యయాతి, నహుషుడు మున్నగు మహారాజులు యుద్ధాలు చేసి గొప్ప యశస్సు అభ్యుదయం సాధించగలిగారు.

**వ. భారత వర్షంబున నుదార విభూతి విలాసంబున కాసపడి యీసునం బెనంగ కుండుదురె? దీని విస్తారంబు విను వివరించెద. 33**

**ప్రతిపదార్థం:** భారత వర్షంబునన్= భారతదేశమందు; ఉదార+విభూతి+విలాసంబునకున్+ఆసపడి= గొప్పదయిన ఐశ్వర్యం యొక్క వైభవానికి ఆశించి; ఈసునన్= ఈర్ష్యతో; పెనంగక+ఉండుదురె?= పోరాడకుందురా?; దీని= ఈ భారత వర్షం యొక్క; విస్తారంబు= విస్తీర్ణం; వివరించెదన్= వివరాలతో నీకు చెప్పగలను; విను= ఆలకించుము.

**తాత్పర్యం:** భారత వర్షంలో రాజ్యకాంక్షతో భోగలాలసతతో ఎందరో రాజులు పెక్కు యుద్ధాలు చేశారు. వారికంత ఆసక్తి కలిగించిన భారతవర్ష విస్తీర్ణం నీకు వివరించగలను. వినుము.

**ఆ. మలయ మనఁగ శుక్తిమంతంబు నా వింధ్య। మనఁగఁ బారియాత్ర మన మహేంద్ర**
**మనఁగ ఋక్షవంత మన సహ్య మన నిందుఁ। గులనగంబు లేడు వొలుచు నధిప! 34**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ధృతరాష్ట్ర మహారాజా); ఇందున్= ఈ భరతవర్షంలో; మలయము+అనఁగన్= మలయమనే పేరుగల పర్వతం; శుక్తిమంతంబు+నాన్= శుక్తిమంతం అనే పేరుతో; పారియాత్రము+అని= పారియాత్రం అనే పేరుతో; ఋక్షవంతము+అనన్= ఋక్షవంతము అనే పేరుతో; సహ్యము+అనన్= సహ్యము అనే పేరుతో; కుల+నగంబులు+ఏడు= ఏడు కులపర్వతాలు; పొలుచున్= విలసిల్లుతున్నవి.

**తాత్పర్యం:** మలయం, శుక్తిమంతం, వింధ్యం, పారియాత్రం, మహేంద్రం, ఋక్షవంతం, సహ్యం అనే ఏడు గొప్ప పర్వతాలు ఈ భారతవర్షంలో కులపర్వతాలుగా ఉన్నాయి.

**విశేషం:** 1. ఏడు కుల పర్వతాలు భూమిని మోస్తున్నాయని పురాణ కథనం.

**"మహేంద్రో మలయ స్సహ్యో శ్శుక్తిమాన్ గంధమాధనః ।**
**వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైతే కుల పర్వతాః - త్రికాండశేషం ।"**

కుల పర్వతాలు ప్రధాన పర్వతాలు. గంధమాదనం - ఋక్షవంతం పర్యాయ పదాలు.

**వ. వీనియందు వివిధ మణిగణంబులు సమకూర్పవచ్చు ననిన ఖనివిశేషంబులు సెప్పనేల? మఱియు నుపమహీధరంబు లనేకంబులు గలిగి యుండు; వానియందు. 35**

**ప్రతిపదార్థం:** వీనియందున్= ఈ పర్వతాలలో; వివిధ+మణి+గణంబులు= పెక్కు రకాలైన మణుల సముదాయాలు; సమ కూర్పవచ్చున్= సేకరింపనగు; అనినన్; ఖని+విశేషంబులు+చెప్పన్+ఏల?= గనులలో దొరికే లోహాలు మున్నగు వాటిని గూర్చి చెప్పనవసరం లేదు గదా! మఱియున్+ఉపమహీధరంబులు= ఇంకా పర్వత శాఖలు; అనేకంబులు= పెక్కులు; కలిగి+ఉండున్

వానియందున్= ఆ ఉప పర్వతాలలో.

**తాత్పర్యం:** ఈ పర్వత పంక్తులలో ఎన్నో రకాలైన మణులు సంపాదించవచ్చునంటే- ఇక గనులలో దొరికే లోహాల గూర్చి వేరే చెప్పనవసరం లేదు గదా! ఇంకను ఉపపర్వతాలు పెక్కులు ఉన్నాయి. వాటిలో -

**క. ఇనుమును రాగియుఁ దగరం। బును వెండియుఁ బసిఁడియుం బ్రభూతములై పే**
**ర్చిన సిరిఁ జేయఁగ నొప్పెడు। ఖను లెడనెడఁ బెక్కు గలవు కౌరవనాథా! 36**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఇనుము, రాగియు, తగరంబును, వెండియున్; పసిడియున్= బంగారమును; ప్రభూతములు+ఐ= మిక్కుటములై; పేర్చిన, సిరిన్+చేయఁగన్+ఒప్పెడున్= ప్రోగుచేసిన సంపద వలె భాసించే; ఖనులు= గనులు; ఎడన్+ఎడన్= పలుతావుల; పెక్కు+కలవు= ఎన్నో ఉన్నాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ ఉపపర్వతాలలో ఇనుము, వెండి, రాగి, తగరం, బంగారం కుప్పవోసిన సంపదవలె పలుచోట్ల దొరుకుతాయి.

**క. వెండియు ధనార్జనంబులు। గొండల వలనన ఘటించికొన నగు నేర్పున్**
**దండితనంబును బాడియు। నొండొంటికి మిగులఁ గలిగి యున్న ట్లయినన్. 37**

**ప్రతిపదార్థం:** వెండియున్= మఱియును; కొండల వలనన్+అ= పర్వతాలవలన; ధన+ఆర్జనంబులు= డబ్బు సేకరించుకొనటం; ఘటించుకొనన్+అగున్= సమకూర్చుకొనవచ్చును; నేర్పున్= సామర్థ్యం; దండితనంబును= గొప్పతనం; పాడియున్= న్యాయం; ఒండు+ఒంటికిన్= ఒకదానిలో ఒకటికి; మిగులన్= మిక్కుటంగా; కలిగి ఉన్నట్లు+అయినన్= కలిగి ఉన్నట్లయితే.

**తాత్పర్యం:** అంతేకాక, కొండలవలన మిక్కుటమైన ధనం ఆర్జించవచ్చును. నేర్పు, పట్టుదల, న్యాయం అనే గుణాలు ఒకదానితో ఒకటి సంఘటించుకోగలిగితే చాలు.

**వ. గంగయుఁ దుంగభద్రయు వేత్రవతియు వేదవతియుఁ గృష్ణవేణియుఁ బెన్నయు యమునయుఁ దమసయు శిరావతియుఁ గావేరియు గోదావరియు నర్మదయు బాహుదయును సరయువును శతద్రువును వితస్తయు విపాశయుఁ దామ్రపర్ణియు నను మహానదులు మఱియు ననేక సరిద్విశేషంబులునుం గలిగి వీనివలన నానాముఖంబులు ధనధాన్యాది సంపదాగమంబులు సొంపు మిగిలి యుండు. 38**

**ప్రతిపదార్థం:** గంగయున్+తుంగభద్రయున్+వేత్రవతియున్+వేదవతియున్+కృష్ణవేణియున్+పెన్నయున్+యమునయున్+తమసయున్+శిరావతియున్+కావేరియున్+గోదావరియున్+నర్మదయున్+బాహుదయును+సరయువును+శతద్రువును+వితస్తయున్+విపాశయున్+తామ్రపర్ణియున్ అను; మహానదులు; మఱియున్; అనేక+సరిత్+విశేషంబులునున్+కలిగి= పెక్కు విధాలైన నదులు కలిగి; వీనివలనన్= ఈ నదుల వలన; నానాముఖంబులు= పెక్కు విధాలైన; ధన+ధాన్య+ఆది సంపద్+ఆగమంబులు= ధనములు ధాన్యములు మొదలగు ఐశ్వర్యాల రాకడలు; సొంపు, మిగిలి+ఉండున్= అందాలు అతిశయిస్తూ ఉంటాయి.

**తాత్పర్యం:** గంగ, తుంగభద్ర, వేత్రవతి, వేదవతి, కృష్ణవేణి, పెన్న, యమున, తమస, శిరావతి, కావేరి, గోదావరి, నర్మద, బాహుద, సరయువు, శతద్రువు, వితస్త, విపాశ, తామ్రపర్ణి అనే పేరులుగల మహానదులు, మరికొన్ని చిరుప్రవాహాలు ఈ పర్వతాల నుండి పుట్టుతున్నవి. వీని వలన పెక్కు తెరగుల ధనాలు, ధాన్యాలు, సంపదలు లభిస్తాయి.

**విశేషం:** గంగ భారత వర్షములో పేరుకెక్కిన పెద్ద నది. తుంగ-భద్ర అనే రెండు నదులు దక్షిణాపథంలోనివి కలిసి తుంగభద్ర అయినవి. తుంగభద్ర కృష్ణవేణికి ఉపనది. అయితే తుంగభద్రకు కూడా కృష్ణవేణితోపాటు "పుష్కరం" ఉంది. 'గంగాస్నానం

- తుంగాపానం' అనే సామెత ఏర్పడింది. గంగ హిమాలయ పర్వతాలలో పుట్టి ఋషీకేశ హరిద్వారాల కడ, మైదాన తలం చేరి ఉత్తరప్రదేశ్, బీహార్, బెంగాల్ ద్వారా తూర్పు సముద్రం చేరుతున్నది. వేత్రవతి కృష్ణవేణి, కావేరి, గోదావరి దక్షిణాపథంలోని నదులు. పెన్న, దక్షిణా పథంలోని ఒక చిరునది. ఇది తిక్కన వ్రాసిన తెలుగు మహాభారతంలో- "మహానదుల" పట్టికలో చేరటానికి కారణం ఆ నదీతీరంలో ఉన్న నెల్లూరి వాస్తవ్యుడు ఆ కవి కావటం. నర్మద- వింధ్య పర్వతాలలో ప్రవహించి గుజరాత్‌లో సముద్రంలో కలిసిన పశ్చిమ వాహిని. బాహుద - ఉత్కళలోనిది. సరయువు అయోధ్య ప్రదేశంలోనిది. వితస్త, విపాశ, శతద్రువు పంజాబులోని నదులు. వాల్మీకి తమసాతీరంలోని ఆశ్రమవాసి. నదుల ప్రాచీననామాలు నేడు కొన్నిటిని గుర్తు పట్టటం కష్టం. శిరావతి అట్టి వాటిలో ఒకటి. శతద్రునదిని నేటి సట్లెజ్‌గా గుర్తిస్తున్నారు. కొందరు పండితులు. మూల సంస్కృత మహాభారతంలో 'పెన్న' పేరు లేదు. గంగవలెనే యమున హిమాలయాలలో పుట్టి గంగకు పలుచోట్ల సమాంతరంగా ప్రవహించి ప్రయాగవద్ద గంగానదిలో కలుస్తున్నది. గంగతోపాటు యమునకు కూడా పుష్కరం ఉన్నది.

**క. ఎడనెడఁ బఱపై యొప్పెడి । యడవు లనేకములు; వానియం దర్థము సే**
**రెడు వెరవులు పెక్కులు సా । ప్పడి యుండు నయంబుతోడి బలిమి గలిగినన్. 39**

**ప్రతిపదార్థం:** ఎడన్+ఎడన్= అక్కడక్కడ (ఒకచోట మరియు మరియొకచోట); పఱపు+ఐ= దట్టంగా; ఒప్పెడి= వర్ధిల్లెడి; అడవులు+అనేకములు= పెక్కు అడవులు (ఉంటాయి); వానియందున్= ఆ అడవుల నుండి; అర్థము= ధనం; చేరెడు+వెరవులు= లభించే ఉపాయాలు; పెక్కులు= ఎన్నియో; చొప్పడి+ఉండున్= అనువుగా ఉంటాయి; నయంబుతోడి బలిమి కలిగినన్= సామంతో కూడిన శక్తి సామర్థ్యాలు (రాజులకు) ఉంటే.

**తాత్పర్యం:** ఈ నదులేకాక, అక్కడక్కడ ఎన్నో అడవులు ఉంటాయి. ఆ అడవుల నుండి ధనం ఆర్జించే ఉపాయాలు ఎన్నో ఉన్నాయి. అయితే రాజులు సామంతో కూడిన శక్తిసామర్థ్యాలు ప్రయోగించాలి.

**విశేషం:** అడవుల నుండి ధనార్జన చేయటానికి రాజులకు సామంతో కూడిన శక్తిసామర్థ్యాలు ఉండాలి. ఎందుకు? అడవులలో అనాగరికులైన ఆటవికులు నివసిస్తూ ఉంటారు. వారు బలప్రయోగానికి సులువుగా లొంగరుగాని నయనీతికి లొంగుతారు. అమాయకులైన ఆటవికులు ప్రేమపాత్రులు. వారు కష్టజీవులు. నాగరికులు అడవులలోని సంపదను అంతటి శరీర శ్రమకు ఓర్చి సేకరించలేరు. ఆటవికులకే అడవులలోని సంపద సేకరించే సహజశక్తి ఉంటుంది.

**వ. పాంచాల బర్బర వత్స మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ కుకురు కోంకణ టేంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన సుదేష్ణ సుహ్మ కురు కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్ర పాండ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిళ దశార్ణ కర్ణాట గౌళాంగ వంగ వరాట లాట బాహ్లిక బహుదాన కిరాత కేకయాశ్మంత కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంత లావంతి కానూపాది జనపదంబులు సమస్త వస్తు సంపత్సంపాదనంబు లయిన గుణవిశేషంబుల వెలసి పురుషార్థంబులగు ధర్మార్థ కామంబులకుం గారణంబులై కమనీయంబు లగుచుండు. 40**

**ప్రతిపదార్థం:** పాంచాల, బర్బర, వత్స, మత్స్య, మగధ, మళయాళ, కళింగ, కుళింగ, కుకురు, కోంకణ, టేంకణ, త్రిగర్త, సాముద్ర, సాళ్వ, శూరసేన, సుదేష్ణ, సుహ్మ, కురు, కరూశ, కాశ, కోసల, యవన, యుగంధర+ఆంధ్ర, సింధు, చేది, చోళ, పుళింద, పుండ్ర, పాండ్య+అభీర, సౌవీర, సౌరాష్ట్ర, మహారాష్ట్ర, విదేహ, విదర్భ, ద్రవిళ, దశార్ణ, కర్ణాట, గౌళ+అంగ, వంగ, వరాట, లాట, బాహ్లిక, బహుదాన, కిరాత, కేకయ+అశ్మంత, కాశ్మీర, గాంధార, కాంభోజ, కేరళ, మాళ్వ, నేపాళ, ఘూర్జర, కుంతల+అవంతి, కానూప+ఆది జనపదంబులు (ఇవి అన్నీ భారత వర్షంలోని, ఆనాటి, జనపదాల పేరులు); సమస్త, వస్తు, సంపత్+సంపాదనంబు అయిన=

అన్ని వస్తువులతో సంపదలతో కూడిన, గుణవిశేషంబులన్= గొప్ప లక్షణాలలో, వెలసి= వర్ధిల్లి; పురుషార్థంబులు అగు= (మానవ జీవిత కర్తవ్యాలయిన); ధర్మ+అర్థ+కామంబులకున్= ధర్మమునకు; ధనమునకు కోరికలకును; కారణంబులు+ఐ= హేతువులై; కమనీయంబులు= సుందరములు; అగుచు.

**తాత్పర్యం:** పాంచాల బర్బర వత్స మత్స్య మగధ, మళయాళ, కళింగ, కుకురు, కోంకణ, టేంకణ, త్రిగర్త, సాముద్ర, సాళ్వ, శూరసేన, సుదేష్ణ, సుహ్మ, కురు, కరూశ, కాశ, కోసల, యవన, యుగంధర, ఆంధ్ర, సింధు, చేది, చోళ, పుళింద, పుండ్ర, పాండ్య, ఆభీర, సౌవీర, సౌరాష్ట్ర, మహారాష్ట్ర, విదేహ, విదర్భ, ద్రవిళ, దశార్ణ, కర్ణాట, గౌళ, అంగ, వంగ, వరాట, లాట, బాహ్లీక, బహుదాన, కిరాత, కేకయ, అశ్మంత, కాశ్మీర, గాంధార, కాంభోజ, కేరళ, మాళవ, నేపాళ, ఘూర్జర, కుంతల, అవంతి, కామరూపం మొదలైన భారత వర్షాలలోని జనపదాలు. అవి పెక్కు సంపదలకు ఆలవాలాలు. పురుషార్థాలలో ధర్మం, అర్థం, కామం అనుష్ఠానానికి పేరెన్నిక గన్నవి. సుందరములు.

**విశేషం:** 1. మహాభారతం - నేపాళమును - గాంధారము (నేటి ఆఫ్ఘనిస్థానము) కాంభోజము (నేటి కంబోడియా) భారత వర్షంలోని జనపదాలుగా అభివర్ణించటం గమనింపదగిన అంశం.

2. ఈ జనపదాలలో వర్థిల్లిన పురుషార్థాలలో మోక్షం చేర్చలేదు మహాభారతం.

**క. వినికి గలిగి రక్షించుచు । ననువున దయతోడిపాడి నాయతు లెల్లం**
**గొనుచుఁ దగ నేలి పొగ డొం । దిన రాజున కుర్వి గామధేనువు గాదే! 41**

**ప్రతిపదార్థం:** వినికి+కలిగి= (ప్రజలు చెప్పే మాటలు) వినే ఓర్పు కలిగి; రక్షించుచున్= కాపాడుతూ; అనువునన్= వెరవుతో; దయతోడి పాడి= కరుణతో రంగరించిన న్యాయం; ఆయతులు+ఎల్లన్= అన్ని రాబడులను; కొనుచున్= స్వీకరిస్తూ; తగన్= ధర్మంతో; ఏలి= పరిపాలించి; పొగడు+ఒందిన= పేరు కెక్కిన; రాజునకున్= ప్రభువుకు; ఉర్వి= భూమి; కామధేనువు= వేల్పుటావు (కోరికలను ఈడేర్చే ఆవు); కాదు+ఏ?= కాదా?

**తాత్పర్యం:** రాజు అన్ని విషయాలు విని తెలుసుకొనాలి. ప్రజలను రక్షించాలి. కేవలం న్యాయమేకాక ఆ న్యాయం కరుణతో రంగరించి రాబడులను స్వీకరిస్తూ పరిపాలించాలి. ఆ విధంగా పేరు కెక్కిన రాజుకు భూమి కామధేనువై వర్తిల్లగలదు.

**విశేషం:** 1. ఈ పద్యం తెలుగు మహాభారతంలో మిక్కిలి ప్రశస్తికి ఎక్కింది. భూమి రాజుకు కామధేనువు. ఎట్టి రాజుకు? న్యాయాన్ని దయతో రంగరించి రాబడులను స్వీకరిస్తూ పాలించే రాజునకు. ప్రజల నివేదనలు విని దయతో పరిపాలించే రాజుకు.

కామధేనువు= వేల్పుటావు స్వర్గలోకంలో ఉంటుంది. కోరికలను ఈడేర్చగలది. కామధేనువు, చింతామణి, కల్పవృక్షం స్వర్గంలోనివి. ఏ కోరికలైనా తీర్చగలవి. ఇది ప్రాచీన భారత సంస్కృతి సృష్టించిన మనోహర కల్పన.

**ఆ. వెరవు లావుఁ గలుగు నరనాథు లింత దే । శంబు గలదు తమకుఁ జాలు ననరు;**
**దండ్రి బిడ్డ యన్న తమ్ముఁడు నా కెత్తి । పోయి పోటులాడి పుడమిఁ గొండ్రు. 42**

**ప్రతిపదార్థం:** వెరవు= ఉపాయం; లావున్= బలము; కలుగు= ఉన్నట్టి; నరనాథులు= రాజులు; ఇంత+దేశంబు= ఎక్కువ విస్తీర్ణంగల భూమి; కలదు= ఉంది; తమకున్= తమకు; చాలున్+అనరు= సరిపోతుంది అని చెప్పరు; తండ్రి; బిడ్డ= పుత్రుడు; అన్న= అగ్ర సోదరుడు; తమ్ముఁడు= (తన తరువాత తల్లిదండ్రులకు పుట్టినట్టివాడు); నాక= అనక; ఎత్తిపోయి= ఎదిరించి; పోటులు+ఆడి= యుద్ధాలు చేసి; పుడమిన్+కొండ్రు= భూమిని జయించిలాగుకుంటారు.

**తాత్పర్యం:** శక్తిసామర్థ్యాలు, ఉపాయం కల రాజులు, తమకు ఎంతో విశాలమైన రాజ్యం ఉన్నప్పటికీ తృప్తి చెందక, తండ్రి, కొడుకు, అన్న తమ్ముడు అనే విచక్షణ లేకుండా యుద్ధం చేసి భూమిని వారినుండి బలవంతంగా లాగుకొంటారు.

**క. కావునఁ గౌరవ పాండవు । లీ వసుధకునై పెనంగు టెగ్గే? దైవం**
**బే వంక వ్రాలె వారిక । పోవుం గా కిది; నరేంద్ర! పొగులకు మింకన్.' 43**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్ర!= ఓ రాజా! (ధృతరాష్ట్ర మహారాజా!); కావునన్= కాబట్టి; కౌరవ పాండవులు= కౌరవులును పాండవులును; ఈ వసుధకున్+ఐ= ఈ భూమి కోసం; పెనంగుట= యుద్ధం చేయటం; ఎగ్గు+ఏ?= తప్పిదమా?; దైవంబు= అదృష్టం; ఏ వంకన్+వ్రాలెన్= ఏవైపు మొగ్గు చూపిస్తుందో; వారికిన్+అ= వారికే; ఇది= (ఈ భూరాజ్యం); పోవున్+కాక= పోతుంది కదా; ఇంకన్= ఇకమీద; పొగులకుము= దుఃఖించవద్దు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! పూర్వకాలం నుండీ రాజులు భూమికోసం పోరాడుతూనే ఉన్నారు గదా. ఇప్పుడు కౌరవులతో పాండవులు భూరాజ్యం కోసం పోరాడటం వెనుకటి పరిపాటి మాత్రమేకాని క్రొత్త తప్పు కాదు. దైవం ఏ వైపు అనుకూలిస్తుందో అటు వారు యుద్ధంలో విజయం పొందగలరు. నీవు ఇంక దుఃఖించవలసింది ఏమీ లేదు.

**వ. అనిన విని యాంబికేయుండు సంజయుతో 'నీ వింక సంగరంబుఁ జూడం బొ'మ్మని సముచితంబుగ వీడు కొలిపినం బోయి భారత రణ ప్రకారం బనుసంధించి, యతండు కతిపయ దినంబులకుం జనుదెంచి తగిన తెఱంగునం గాంచి. 44**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= (సంజయుడు చెప్పిన మాటలు ఆలకించి); ఆంబికేయుండు= అంబిక కొడుకు ధృతరాష్ట్రుడు; సంజయుతోన్; నీవు+ఇంక= నీవు ఇకమీద; సంగరంబున్= యుద్ధాన్ని; చూడన్+పొమ్ము+అని= చూడటానికి వెళ్లుము అని చెప్పి; సముచితంబుగన్= మర్యాద ప్రకారం; వీడుకొలిపినన్= వీడ్కోలు ఇవ్వగా; పోయి= (సంజయుడు) వెళ్ళి; భారత+రణప్రకారంబు+ అనుసంధించి= భారత యుద్ధం జరిగిన తీరు ఆకళింపు చేసుకొని; అతండు= (సంజయుడు); కతిపయదినంబులకున్= కొన్ని రోజులు గడచిన పిదప; చనుదెంచి= వచ్చి; తగిన+తెఱంగునన్+కాంచి= మర్యాద తీరు ప్రకారం (ధృతరాష్ట్రుడి దగ్గరకు వచ్చి) చూచి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు సంజయుడి మాటలు విన్నాడు. సంజయుడు భూగోళ విషయాలతోపాటు దుర్యోధనుడిని ప్రత్యక్షంగా నిందించాడు. అది ధృతరాష్ట్రుడిపై పరోక్ష నిందయే. అందుచేత- ధృతరాష్ట్రుడు లోలోపల కోపగించి 'ఓ సంజయా! ఇక నీవు సముచితంగా యుద్ధం చూచి వచ్చి నాకు జరిగిన విషయాలు వివరించుము' అని చెప్పాడు. అందులో అంతర్గర్భితమైన మందలింపు ఇమిడి ఉన్నది.

**క. కొడుకుల దెస నెవ్వగఁ జే । డ్పడి వందురి యున్న యా నృపాలు నడుగులం**
**బడి, భీష్మపాటు సెప్పుచు । నడలి కరుణనాద మెసఁగ నాక్రందించెన్. 45**

**ప్రతిపదార్థం:** కొడుకుల దెసన్= పుత్రుల యెడ (దుర్యోధనాదుల యెడ); నెఱ+వగన్= మిక్కుటమైన శోకంతో; చేడ్పడి= వ్యాకులపడి; వందురి+ఉన్న= బాధపడుతున్న; ఆ+నృపాలు+అడుగులన్+పడి= ఆ ధృతరాష్ట్రుడి పాదాలపై వ్రాలి; భీష్మపాటు= భీష్ముడి పతనం; చెప్పుచున్, అడలి= దుఃఖించి; కరుణ+నాదము= శోకంతో కూడిన గొంతు; ఎసఁగన్= వ్యాపించగా; ఆక్రందించెన్= ఏడ్చాడు.

**తాత్పర్యం:** కొడుకుల కోసం మిక్కుటమైన శోకంతో వ్యాకులపడియున్న ధృతరాష్ట్రుడి దగ్గరకు వచ్చి సంజయుడు ఆతని పాదాలపైబడి విలపించి భీష్ముడు యుద్ధభూమిలో పడిపోయినట్లు చెప్పాడు. ఆ సంజయుని విలాపం ఈ విధంగా సాగింది.

**వ. అయ్యేడ్పుతో నిట్లని విలాపంబు సేయు.** 46

**ప్రతిపదార్థం:** ఆ+ఏడ్పుతో+ఇట్లు+అని= ఈ విధంగా; విలాపంబు+చేయు= ఏడవటం మొదలుపెట్టాడు.

**తాత్పర్యం:** ఆ యేడ్పు గొంతుతో బావురుమంటూ ఇట్లా అన్నాడు.

**సీ. ఆత్మయోధుల కెల్ల నాధార మగునట్టి । తనకు నస్త్రంబు లాధార మయ్యెఁ;**
**బరశురామునకు మే ల్సరి యైన తన యందుఁ । గలిగె భంగంబు శిఖండిచేత;**
**జనపతి దను నచ్చి మును జూద మొనరించె । దాను గయ్యంపు జూదమున నోడెఁ;**
**దనయార్పు టెలుఁగునఁ దలఁకు వైరులు వొంగ । నొఱలుచు నేలకు నొఱగె నేఁడు;**

**ఆ. తీవ్ర బాణజాల దీప్తులు పరఁగించి । పాండుతనయ సైన్య బహుళ తమము**
**లీలఁ బది దినంబు లోలి వినోదించి । యధిప! భీష్మభానుఁ డస్తమించె.** 47

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్రమహారాజా!; ఆత్మ+యోధులకు+ఎల్లన్= తన నాయకత్వంలో యుద్ధం చేసే వీరులకు అందరకు; ఆధారము+అగు+అట్టి= ఆదరువు- రక్షకుడు అయినట్టి; తనకున్= భీష్మునకు; అస్త్రంబులు= ఆయుధాలు (శరతల్పం); ఆధారము+అయ్యెన్= ఆలంబనం అయినవి; పరశురామునకున్= గండ్రగొడ్డలి ఆయుధంగా పేరు పొందిన రామునకు; మేల్+సరి+ఐన= గొప్ప ఈడు అయిన; తన యందున్= (భీష్మునకు); శిఖండి చేతన్= శిఖండి అను వాడిచేత (పేడిరూపంలో ఉన్న వీరమ్మన్యుడి చేత; భంగంబు+కలిగెన్= ఓటమి సంభవించింది; జనపతి= రాజు (దుర్యోధనుడు); తనున్+నచ్చి= (భీష్ముడి) పరాక్రమం మెచ్చుకొని; మును= లోగడ; జూదము+ఒనరించెన్= జూదం ఆడాడు; తాను= (ఇపుడు భీష్ముడు); కయ్యంపు+జూదమునన్= యుద్ధం అనే జూదంలో; ఓడెన్= ఓటమి చెందాడు; తన+ఆర్పు+ఎలుఁగునన్= తనదైన సింహనాదం యొక్క చప్పుడు చేతనే; తలకు+వైరులు= భయపడే శత్రువులు; పొంగన్= సంతోషించగా, ఒఱలుచున్= మూల్గుతూ; నేఁడు= ఈ రోజున (భీష్ముడు); ఒఱగెన్= నేలపై వ్రాలాడు; తీవ్రబాణ+జాల+దీప్తులు= మిక్కుటమైన బాణాల సమూహాల కాంతులు; పరఁగించి= వ్యాపింపచేసి; పాండు తనయ సైన్యబహుళ తమము= పాండవుల సైన్యం అనే దట్టమైన చీకటి; లీలన్= వినోదప్రాయంగా; పదిదినంబులు= పది రోజులు; ఓలి= వరుసగా; వినోదించి= ఆనందంతో విహరించి; భీష్మభానుఁడు= భీష్ముడు అనే సూర్యుడు; అస్తమించెన్= క్రుంకినాడు.

**తాత్పర్యం:** ఆహా! ఏమిటీ విధివైపరీత్యం! జగదేకవీరుడైన భీష్ముడా ఈ విధంగా నేలమీద పడిపోవటం! తన నాయకత్వంలో పోరాడే వీరులు అందరికీ తాను ఆలంబనమై ఉన్న భీష్ముడికి ఇప్పుడు బాణాలే ఆలంబనమైపోయాయి. (అనగా శరతల్పగతుడైనాడు). రాజలోకాన్ని ఇరువది ఏడు మారులు ఎత్తిన గండ్రగొడ్డలి దించకుండా నరికి విజయాలు సాధించిన పరశురాముడికి లొంగకుండా నిలిచి అతడికి మేల్సరియైన వీరుడు అని పేరుకెక్కిన ఆ భీష్ముడా నేడు మగసిరిలేని పేడి శిఖండి చేత జయించబడ్డాడు. దుర్యోధనుడు ఒకనాడు తనను నమ్ముకొని పాండవులను జూదంలో ఓడించి నిశ్చింతగా ఉన్నాడు. ఇప్పుడు యుద్ధం అనే జూదంలో దుర్యోధనుడు ఓడిపోయాడు గదా! తన సింహనాదము చేత శత్రువులను కంపించేటట్లు చేయగలిగినట్టి భీష్ముడు శత్రువులు ఉత్సాహంతో ఉప్పొంగిపోతూ ఉండగా నేలకువ్రాలాడు. పాండవుల సేనలు అనే చీకట్లను తన బాణాలు అనే కిరణాలతో సులువుగా అవలీలగా పోగొట్టిన భీష్ముడు అనే సూర్యుడు పదిదినములు వినోదించి అస్తమించాడు. కటకటా! ఇది విధివైపరీత్యం కాక మరేమిటి?

**విశేషం:** 1. భీష్ముడు పరశురాముడి శిష్యుడు. ఒకసారి కాశీరాజపుత్రికలయిన అంబ, అంబిక, అంబాలికలు అనే కన్యకలను, స్వయంవర వేదికనుండి రాజులందరినీ జయించి భీష్ముడు తన తమ్ములకు వివాహం చేయాలని తీసికొనిపోయాడు. అంబ తాను సాళ్వుడు అనే రాజును వరించినట్లు చెప్పింది. భీష్ముడు ఆమెను సాళ్వుడి కడకు పంపాడు. సాళ్వుడు నిరాకరించాడు. అప్పుడు ఆమె భీష్ముడి దగ్గరకు వచ్చి, తనను వివాహం చేసుకోమని కోరింది. భీష్ముడు తన ప్రతిజ్ఞ ప్రకారం ఆజన్మ బ్రహ్మచర్యం పాటిస్తానన్నాడు. అంబ పరశురాముడిని ఆశ్రయించింది. పరశురాముడు అంబ పక్షం వహించి భీష్ముడితో యుద్ధానికి దిగాడు. గురుశిష్యుల పోరు చాలారోజులు జరిగింది. తుదకు సమయుద్ధంగా పరిణమించింది. పరశురాముడు శిష్యుడిని అభినందించి నిష్క్రమించాడు.

2. భీష్మభానుడు= భీష్ముడికి సూర్యుడికి అభేదాధ్యవసాయం. ఈ సీసపద్యం చివరి ఆటవెలదిలో కన్పిస్తున్నది. ఇది రూపకాలంకారం.

**క. పదివేవురు రాజులు దన । కెదిరి పొలిసి రా శిఖండి యేమిటివాఁడై**
**తుదిఁ బోయి తన్ను నాజిం । గదియుచుఁ బొలియించె; నియతిఁ గడవఁగ వశమే! 48**

**ప్రతిపదార్థం:** పదివేవురు రాజులు= పదివేలమంది రాజులు; తనకున్+ఎదిరి= తన్ను ఎదిరించి; పొలిసిరి= మరణించారు; ఆ+శిఖండి= ఆ శిఖండి; ఏమిటివాడై?= ఏమంత ఘనుడై? తుదిన్= చివరకు; పోయి= ఎదురైవచ్చి; తన్నున్= (భీష్ముడిని); ఆజిన్= యుద్ధంలో; కదియుచున్= ఎదిరిస్తూ; పొలియించెన్= పడగూల్చాడు,(నశింపజేశాడు) నియతిన్= (విధి) నిర్ణయం; కడవఁగన్= దాటగా; వశమే?= శక్యమా?

**తాత్పర్యం:** పదివేలమంది రాజులు భీష్ముడిని ఎదిరించి మరణించారు. ఎంత ఆశ్చర్యం! ఈ శిఖండి ఏపాటివాడు? యుద్ధంలో భీష్ముడిని ఎదిరించి పడగూల్చగలిగాడు! విధినిర్ణయం ఎవరికైనా అతిక్రమించటం సాధ్యం కాదు.

**తే. చాపవక్త్రుండు భల్లదంష్ట్రావితాన । ఘోరమూర్తి నారాచనఖుండు ఖడ్గ**
**జిహ్వికాభీషణుఁడు నరసింహమూర్తి । గాక కేవల నరుఁడె గంగాసుతుండు!' 49**

**ప్రతిపదార్థం:** చాపవక్త్రుండు= విల్లు అనెడి నోరు గలవాడు; భల్ల,దంష్ట్రా,వితాన,ఘోర,మూర్తి= బల్లెములనే కోరల సమూహం చేత భయంకరాకారుడు; నారాచ+నఖుండు= బాణాలనెడి గోళ్ళు కలవాడు; ఖడ్గ జిహ్వికా, భీషణుఁడు= కత్తి అనెడు నాలుకచేత భయం గొలిపేవాడు; నరసింహమూర్తి+గాక= మానవుడు సింహం కలిసిన ఆకారం కలవాడు- విష్ణుదేవుడి అవతారం కాక; గంగాసుతుండు= గంగ కొడుకు- భీష్ముడు; కేవల+నరుఁడు+ఎ?= మానవమాత్రుడా? కాదని అర్థము.

**తాత్పర్యం:** ధనుస్సు అనెడి నోరు గలవాడు, బల్లెములనెడు పలువరుసలచేత భయంకరాకారుడు, బాణాలు అనెడు గోళ్ళు గలవాడు, కత్తి అనెడు నాలుకతో భీతి కలిగించేవాడు, విష్ణుమూర్తి అవతారమైన నృసింహమూర్తియే భీష్ముడు - కేవలం మానవమాత్రుడు కాడు.

**విశేషం:** 1. దశావతారాలలో నృసింహాకారం మిక్కిలి భయంకరమైనది. భీష్ముడు యుద్ధభూమిలో అపర నృసింహావతారమే. హిరణ్యకశిపుడిని సంహరించి ప్రహ్లాదుడిని రక్షించిన పౌరాణిక గాథ ఇట స్మరించదగింది. భారత రచన నాటికే నృసింహగాథ బహుళ ప్రచారంలోకి వచ్చింది అనటానికి ఈ పద్యం ఒక నిదర్శనం. నృసింహ పురాణం సంస్కృత మహాభారతం తరువాతనే రచించబడినదని వాదించేవారు ఉన్నారు. అయితే పురాణ గాథలు లోకంలో పురాణాలు రచించబడక పూర్వమే వ్యాపించి ఉన్నట్లు భావించవచ్చును.

## ధృతరాష్ట్రుఁడు భీష్మ మరణంబు విని విలపించుట (సం. 6-14-1)

**వ. అని సంజయుండు పలవించు పలుకులకుఁ జిత్తంబు జల్లని యొల్లంబోయి మూర్ఛిల్లి కొండొక సేపునకు శిశిర విధానంబుల సేద దేఱి ధృతరాష్ట్రుండు గన్నీరు దొరంగ గద్గదకంఠుండై. 50**

**ప్రతిపదార్థం:** అని సంజయుండు, పలవించు పలుకులకున్= దుఃఖంతో ఆకులుడై చెప్పిన మాటలకు; చిత్తంబు= మనస్సు; జల్లు+అని= సంచలించి, కొట్టుకొని; ఒల్లన్+పోయి= స్వాస్థ్యం తప్పి, అదరిపడి; మూర్ఛిల్లి= స్పృహ తప్పి; కొండొక+సేపునకున్= కొంత సమయము గడచిన పిమ్మట; శిశిర విధానంబులన్= చల్లదనం చేకూర్చే ఉపచారముల వలన; సేద+తేఱి= కోలుకొని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; కన్నీరు= కంటినీరు; తొరంగన్= కారగా; గద్గదకంఠుండు+ఐ= డగ్గుత్తిక పడిన కంఠం కలవాడై, (బొంగురు వోయిన గొంతుగలవాడై)

**తాత్పర్యం:** భీష్మపతనమునకు కలతచెంది, దుఃఖంతో వ్యాకులత చెంది పలవిస్తూ ఉన్న సంజయుడి మాటలు విని ధృతరాష్ట్రుడు స్పృహతప్పి పడిపోయాడు. అతడికి శీతలోపచారాలు చేసిన పిమ్మట కోలుకొని కన్నీరు కారుస్తూ.

**క. ' దేవాసురవరు లొక్కటి । యై వచ్చినఁ జిక్కువఱుచు నాహవమున నా**
**దేవవ్రతుఁడు శిఖండి శ । రావలి పాలయ్యె; నేమి యనఁగల దింకన్! 51**

**ప్రతిపదార్థం:** దేవ+అసురవరులు+ఒక్కటి+ఐ= దేవతలలో రాక్షసులలో గొప్పవారు ఏకమై; వచ్చినన్= (యుద్ధానికి) వచ్చినప్పటికిని; ఆహవమునన్= యుద్ధంలో; ఆ దేవవ్రతుఁడు= ఆ భీష్ముడు; చిక్కుపఱచున్= చీకాకుపడేటట్లు చేసి ఓడించగలడు (అట్టివాడు); శిఖండి, శరావలి, పాలు+అయ్యెన్= శిఖండి బాణాల బారిని పడ్డాడు; ఇంకన్= ఇకమీద; ఏమి+అనన్+కలదు?= చెప్పటానికి ఏముంది?

**తాత్పర్యం:** దేవతలలో రాక్షసులలో ఉన్న గొప్ప వీరులు కలిసి ఏకమై దండెత్తి వచ్చినప్పటికీ వారిని యుద్ధంలో ఓడించగల శక్తిగలవాడు భీష్ముడు. అట్టివాడు ఒక సామాన్య వీరుడైన శిఖండి చేత నిర్జింపబడటం వింతలలో వింత కదా!

**ఉ. అంచిత తాలకేతుకిరణాళి మెఱుంగులు గాఁగ, మౌర్వి మ్రో**
**యించుట గర్జచందముగ నేచి విరోధిదవానలంబు మా**
**యించు శితాస్త్రవర్షమున నిట్టిది భీష్మమహాభ్ర; మె ట్లడం**
**గించెనొకో శిఖండి యను కృత్రిమ వాయువు దాఁకి దైవమా! 52**

**ప్రతిపదార్థం:** అంచిత= ఒప్పినట్టి; తాలకేతుకిరణ+ఆళి= తాడిచెట్టు జెండా నుండి వెలువడే వెలుగు రేకల గుంపుల తళతళలు; మెఱుంగులు కాఁగన్= మెఱుపులు కాగా; మౌర్విన్= అల్లె త్రాటిని; మ్రోయించుట= నినదింప చేయటం; గర్జ, చందముగన్= ఉరుముగా; ఏచి= విజృంభించి; విరోధి దవ+అనలంబున్= శత్రువులు అనే కార్చిచ్చును; శిత+అస్త్రవర్షమునన్= వాడి బాణములు అనే వానచేత; మాయించున్= అణగింపచేయును; ఇట్టిది= ఇటువంటిది; భీష్మ మహా+అభ్రము= భీష్ముడు అనే గొప్ప మేఘం; దైవమా!= ఓ భగవంతుడా!; శిఖండి+అను= శిఖండి అనెడి; కృత్రిమ, వాయువు= కపటమైన గాలి; తాఁకి= ఎదిర్చి; సోకి, ఎట్లు= ఏవిధంగా; అడంగించెను+ఒకో!= ఏ విధంగా అణగగొట్టిందో!

**తాత్పర్యం:** భీష్ముడి రథంపై ఒప్పునట్టి తాడిచెట్టు జెండా వెలుగొందుతూ ఉంటుంది. దాని వెలుగుల మొత్తమే మెరుపు తీగలై మిరుమిట్లుగొలుపుతుంది. అతడి ధనుస్సుకు పొదిగిన అల్లెత్రాటి ధ్వని ఉరుములవలె వినిపిస్తుంది.

శత్రువులు అనే కార్చిచ్చును అతడి బాణవర్షం ఆర్పివేస్తుంది. అయితే- శిఖండి అనే కృతక వాయువు భీష్మ మేఘాన్ని ఏ విధంగా అణగ గొట్టగలిగిందో ఆ దైవానికే తెలియాలి.

**విశేషం:** అలం: రూపకం. తాళకేతు కిరణాళి మెరుపులుగా, అల్లెత్రాటి మ్రోత గర్జగా, విరోధులు దావాగ్నిగా శితాస్త్రాలు వర్షంగా భీష్ముడు గొప్ప మేఘంగా, శిఖండి కృత్రిమవాయువుగా రూపింపబడ్డారు.

**తే.** **పెరిఁగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు । నిలువ నిమ్మగు దీవిగా నిన్నుఁ దలఁచి**
**యుండ నత్యంతతుచ్ఛ శిఖండి పల్వ । లాక్రమంబున మునిగితే యకట తండ్రి!** 53

**ప్రతిపదార్థం:** పాండవ+అంబుధి= పాండవులు అనే సముద్రం; పెరిఁగి, వెల్లివిరిసినపుడు= పొంగి పొరలి విజృంభించినపుడు; నిలువన్+ఇమ్ము+అగు+దీవిగాన్= నిలిచియుండటానికి తగిన ద్వీపంగా; నిన్నున్+తలఁచి+ఉండన్= నిన్ను భావించి ఉండగా; అత్యంత+తుచ్ఛ+శిఖండి+పల్వల+ఆక్రమంబునన్= మిక్కిలి నీచుడైన శిఖండి అనే గుంట వశమై; తండ్రి!= ఓ భీష్ముడా!; అకట= అయ్యో!; మునిగితి(వి)+ఏ?= మునిగిపోయావా?

**తాత్పర్యం:** పాండవులు అనే సముద్రం పొంగి పొరలి విజృంభించినప్పుడు, ఓ తండ్రి! భీష్ముడా! కౌరవులు నిలిచేందుకు తగిన దీవిగా నిన్ను భావించాము. కాని, మిక్కిలి అల్పుడైన శిఖండి అనే చిన్న గుంతకువశమై మునిగి పోయావా?

**విశేషం:** అలం: రూపకం. పాండవాంబుధి - పాండవులనెడి సముద్రం, నిన్ను దీవిగా, శిఖండి అనెడి పల్వలం. ద్వీపం. నాలుగు వైపులా నీటిచేత చుట్టబడిన భూప్రదేశం.

**ఉ.** **వీరరసాంబుపూరమును విశ్రుతబాహు మహోగ్ర సత్త్వముం**
**జారుగదాధ్వజాచలవిశాలము నంబకజాలవీచికా**
**స్ఫారము నైన భీష్ముఁడను సాగరముం గడవంగ నీఁదఁగా**
**నేరిమి యెట్లొకో కలుగ నేర్చె శిఖండికి? నేమి సేయుదున్!** 54

**ప్రతిపదార్థం:** వీరరస+అంబు+పూరమును= వీరరసం అనే నీటి ప్రవాహమూ; విశ్రుత, బాహు, మహా+ ఉగ్ర, సత్త్వమున్= పేరుకెక్కిన భయంకరమైన క్రూరమృగాలు కలదియు; చారు, గదా, ధ్వజ+ అచల విశాలము= అందమైన, గదలు జెండాలనెడి కొండలచేత విస్తీర్ణమై నట్టిదియు; అంబక, జాల, వీచికా, స్ఫారము= బాణాల సమూహాలు అనెడి కెరటాలతో వెలుగొందునట్టి; భీష్ముఁడు+అను+సాగరమున్= భీష్ముడు అనెడి సముద్రాన్ని; కడవంగన్+ఈఁదఁగా- అవ్వలి ఒడ్డుచేరేటట్లు ఈదగా; శిఖండికిన్; నేరిమి= నేర్పు, సామర్థ్యం; ఎట్లు+ఒకో= ఏ విధంగా; కలుగనేర్చెన్= చేకూరింది; ఏమి+చేయుదున్?= ఏం చేస్తాను?

**తాత్పర్యం:** భీష్ముడనే సముద్రాన్ని దాటటానికీ, ఈదటానికీ ఎవరికీ శక్యం కాదు. అది వీరరసమనేజల సమూహం కలదీ, ప్రసిద్ధికెక్కిన బాహుబలమనే భయంకర జలజంతువులు కలదీ, అందమైన గదలు ధ్వజాలు మొదలైన వాటి చేత మహాపర్వతాలతో విశాలమైనదీ బాణ సమూహాలనే అలల పొంకం గలది. అటువంటి భీష్మసాగరాన్ని శిఖండి ఎట్లా దాటగలిగాడు? ఈదగలిగాడు? ఆశ్చర్యంగా ఉన్నది? ఇప్పుడేమి చేసేది? అసహాయుడనయ్యాను.

**విశేషం:** ఈ పద్యంలో భీష్ముడికీ సముద్రానికీ అభేదాధ్యవసాయం కల్పించబడింది. వీరరసంలో భీష్ముడికి రసాంబుపూరం సముద్రానికి, విశ్రుత బాహు పరాక్రమం భీష్ముడికి, మహోగ్రసత్వం సముద్రానికి (సత్త్వము= బలం అని ఒక అర్థం- జంతువు అని మరో అర్థం) గదాధ్వజములు భీష్ముడికి అచలములు సముద్రమునకు అంబక జాలములు భీష్ముడికి, అంబక జాలముల

వంటి కెరటాలు సముద్రానికి అన్వయం. ఇది రూపకాలంకారం. వీరరసం అంబుపూరంగా, బాహువులు మహోగ్రసత్త్వాలుగా గదాధ్వజములు అచలాలుగా, అంబక జాలాలు కెరటాలుగా భీష్ముడు సముద్రంగా రూపించబడ్డాయి.

**తే. అంబకై పూని వచ్చి బలాధికుండు । జామదగ్న్యుండు సాధింపఁ జాలకున్న**
**వాని భీష్ముఁ బాండవులకై పూని వచ్చి । కడిమి సాధించి తౌర! శిఖండి పోర. 55**

**ప్రతిపదార్థం:** అంబకై= అంబకోసం (కాశీరాజు పుత్రికకై); పూని= కడగి; వచ్చి= యుద్ధానికి వచ్చి; బల+అధికుండు= అధికమైన బలంచేత గొప్పవాడు; జామదగ్న్యుండు= జమదగ్ని కొడుకు - పరశురాముడు; సాధింపన్+చాలక+ఉన్నవానిన్= ఓడింపలేకపోయిన వాడిని; అనగా అట్టి గొప్ప వీరుడిని; భీష్మున్= భీష్ముని, పాండవులకై+పూని= పాండవుల కొరకు కడగి; వచ్చి= (యుద్ధానికి) వచ్చి; కడిమిన్= పరాక్రమంతో; పోరన్= యుద్ధంలో; సాధించితి(వి)= సాధించావు; శిఖండి!= ఓ శిఖండీ!; ఔర!= ఆహా!.

**తాత్పర్యం:** ఓ శిఖండీ! అంబ కోసం దండెత్తి వచ్చి, పరశురాముడు వంటి మహావీరుడు భీష్ముడిని జయించలేక పోయాడు కదా! నీవు పాండవుల కోసం యుద్ధం చేసి ఆ జగదేకవీరుడిని జయించావు. ఎంతటి ఆశ్చర్యం!

**విశేషం:** అంబ వృత్తాంతం- 47వ పద్య వ్యాఖ్యానం చూడవచ్చును.

**క. ఆ శౌర్యం బా సత్త్వం । బా శీలం బా పరాక్రమాభీలత్వం**
**బా శుద్ధవ్రత మెందు న । నాశము లని భీష్ముఁ బెద్ద నమ్మితిమి గదే. 56**

**ప్రతిపదార్థం:** ఆ శౌర్యంబు= ఆ పరాక్రమం; ఆ సత్త్వంబు= ఆ బలం; ఆ శీలంబు= ఆ సత్ ప్రవర్తన; ఆ పరాక్రమ+ఆభీలత్వంబు= ఆ పరాక్రమంచేత కూడా భయంకరత్వం; ఆ శుద్ధ+వ్రతము= ఆ మంచినిష్ఠ; ఎందున్= ఎచ్చట అయినా; అనాశములు= నశించనట్టివి; అని; భీష్మున్= భీష్ముడిని; పెద్ద= ఎక్కువగా; నమ్మితిమి+కదే!= విశ్వసించాం కదా!

**తాత్పర్యం:** ఆహా! ఆ పరాక్రమం, ఆ బలం, ఆ సత్ప్రవర్తన, ఆ భయంకర ప్రతాపం, ఆ మంచి నిష్ఠ ఎప్పుడూ నాశనం కావని ఆ భీష్ముడిని అమితంగా విశ్వసించాము కదా!

**విశేషం:** భీష్ముడి అసలు పేరు దేవవ్రతుడు. తండ్రియైన శంతనుడు సత్యవతి అనే కన్యకను మోహించాడు. సత్యవతి తన తండ్రిని అడుగుమన్నది. సత్యవతి తండ్రి దాశరాజు తన కూతురు కొడుకుకే రాజ్యం సంక్రమించాలని అన్నాడు.

దేవవ్రతుడు తండ్రికోసం - తాను ఆ జన్మ బ్రహ్మచర్య దీక్షను వహిస్తానని "భీష్మ" ప్రతిజ్ఞ చేశాడు. ఆనాటి నుండి దేవవ్రతుడికి భీష్ముడు అనే బిరుదనామం సంక్రమించింది. శుద్ధవ్రతుడుగా సారస్వతంలో భీష్ముడు సుప్రసిద్ధుడైనాడు.

**వ. అని బహుప్రకారంబులం బలవించి యా సూతనందను చేసేతం గీలించి. 57**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; బహుప్రకారంబులన్= పలురకాలుగా; పలవించి= దుఃఖంతో కూడిన మాటలు పలికి; ఆ సూతనందను= ఆ సూతపుత్రుడి- సంజయుడి; చే+చేతన్+కీలించి= (తన చేతితో ఆతడి) చేతిని పట్టుకొని.

**తాత్పర్యం:** ఆ విధంగా చెప్పి, ధృతరాష్ట్రుడు తన చేతితో ఆ సంజయుడి చేయి పట్టుకొని ఈ విధంగా అన్నాడు.

**సీ. 'అతఁడు నొచ్చిన తఱి నడ్డంబు సొచ్చెద । మని వచ్చువారు లేరైరె యచట?**
**నడరి పోరాడక యన్ని యక్షౌహిణు । లొప్పరికించెనె యొకనిఁ గలన?**
**నతని నోర్వఁగఁ జాలవని నిశ్చయించితి । మంతకు నోపెనే యరిబలములు?**
**ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును । శల్యుండుఁ గ్రేడించి చనిరె యపుడు?**

**తే. పాండుసుతులు శిఖండియుఁ జండశక్తి । మెఱయ నొక్కటఁ బైఁ బడ్డ వెఱచి తాత**
**విడిచి నా పుత్రులందఱు విఱిగి యడవిఁ । గలిసిరొకొ? యాతనికిఁ బడవలసె నకట! 58**

**ప్రతిపదార్థం:** అతఁడు= (భీష్ముడు); నొచ్చిన+తఱిన్= బాధపొందినపుడు; అడ్డంబు+చొచ్చెదము+అని= (అతడికి శత్రువులకు) మధ్య నిలువగలమని అని; వచ్చువారు= (ముందుకు వచ్చి) పూనువారలు; అచటన్= అక్కడ; లేరు+ఐరె?= లేకపోయారా?; కలనన్= యుద్ధమునందు; అడరి= పూని; పోరాడక= యుద్ధం చేయక; అన్ని+అక్షౌహిణులు= అన్ని వేల మంది భటులతో కూడిన సేనలు, ఒకనిన్= ఒకనిని ఒంటరిగా చేసి; ఒప్పరికించెను+ఎ= ఉపేక్షించాయా?; అతనిన్= భీష్ముడిని; అరి+బలంబులు= శత్రుసేనలు; ఓర్వఁగన్+చాలవు+అని= గెలువనేరవు; అని; నిశ్చయించితిమి= నిశ్చయించాము; అంతకున్+ఒపెనే?= అంత పనిచేశాయా?- అనగా ఆ భీష్ముడిని జయించగలిగాయా?; అపుడు= ఆ సమయంలో; ద్రోణుండున్=ద్రోణుడున్నూ; కృపుడును=కృపాచార్యుడున్నూ; ద్రోణసుతుండును=ద్రోణాచార్యుడి పుత్రుడు అశ్వత్థామయున్నూ; శల్యుండున్= శల్యుడును; క్రేడించి+చనిరె?= ఉపేక్షించి వెళ్ళిపోయారా?; పాండుసుతులు= పాండవులు; శిఖండియున్= శిఖండియు; చండ+శక్తిన్= తీవ్ర బలం; మెఱయన్= వెలుగొందుతుండగా; ఒక్కటన్+పైన్+పడ్డ= ఏకమై మీదపడగా; వెఱచి= భయపడి; తాత+విడిచి= పితామహుడైన భీష్ముడిని వదలిపెట్టి; నా పుత్రులు+అందఱున్= నా కొడుకులు ఎల్లరు (దుర్యోధనాదులు); విఱిగి= ఓడిపోయి; అడవిన్= అడవిలో; కలిసినారు+ఒకొ?= కలిసిపోయారా! ఏమి?; ఆతనికిన్= భీష్ముడికి; అకట!= అయ్యో!; పడవలసెన్= (నేలమీద) పడవలసి వచ్చింది.

**తాత్పర్యం:** భీష్ముడు యుద్ధంలో అలసటచెంది బాధపడేటప్పుడు, శత్రువులను ఎదిరించి అడ్డం నిల్చినవారు అక్కడ లేకపోయారా? యుద్ధంలో అక్షౌహిణులలో వేలకొలది భటులు చేరి పోరాడుతున్నారుగదా; భీష్ముడిని ఏకాకిగా చేసి వారందరూ ఊరకున్నారా? భీష్ముడిని శత్రువులు గెలవ లేరనే నమ్మకంతో వారందరూ ఉండగా వారు ఆతడిని పడగొట్టగల్గారా? ద్రోణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, శల్యుడు ఏమయ్యారు? అక్కడ లేరా? ఉంటే ఉపేక్షించి వేరే చోటికి పారిపోయారా? దేదీప్యమానమైన బలంతో పాండవులు శిఖండితో కూడి భీష్ముడిపై పడినపుడు నా కొడుకులు దుర్యోధనుడు మున్నగువారు భయపడి అడవిలోకి పారిపోయారా? అయ్యో! భీష్ముడు నేలపై పడిపోవలసి వచ్చింది?

**వ. దేవవ్రతుండు దెగినయప్పుడ తక్కినయంతవట్టునుం దెగియనకాఁ దలంచెద' నని మఱియు నిట్లనియె. 59**

**ప్రతిపదార్థం:** దేవవ్రతుండు= భీష్ముడు; తెగిన+అప్పుడు+అ= ఓడిపడిపోయినప్పుడే; తక్కిన+అంత+పట్టును= మిగిలిన మేర అంతా (మిగిలిన సేనలోని వారందరూ); తెగి+అన+కాన్= ఓడిపడిపోయినట్లే; తలంచెదన్= భావిస్తాను; అని మఱియున్+ఇట్లు+అనియెన్= అని చెప్పి, తిరిగి ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** భీష్ముడు పడిపోయినప్పుడే తక్కిన అందరూ పడిపోయినట్లే భావిస్తాను.

**సీ. ' కులగురు వృద్ధు నిర్మలచిత్తు గాంగేయుఁ । జంపి రాజ్యము సేయ సమ్మతించి**
**తొడరిన పాండుపుత్రులకును దైవంబుఁ । దోడయ్యె; ధర్మంబు గీడుపఱిచి**
**పరఁగి యధర్మంబు పెరిఁగిన ట్లున్నది; । వార లాతనిఁ గూల్చి వసుధఁ గొనఁగ**
**నిశ్చయించుట గడు నిష్ఠురత్వము; దాని । కంటెను బాపంబు గాదె మనకు**

**తే. సంగరంబున నాతండు సచ్చు టోర్చి । సంపదకుఁ గాఁ బెనంగిన చంద మరయఁ;**
**గులములం దెల్ల నీ రాచకులము సాల । బెట్టిదం; బిక్కులంబునఁ బుట్ట నగునె?' 60**

**ప్రతిపదార్థం:** కులగురు వృద్ధున్= వంశంలో పెద్దవాడు ముసలివాడిని; నిర్మల+చిత్తున్= పరిశుద్ధమైన మనస్సు గలవాడిని; గాంగేయున్= గంగకొడుకైన భీష్ముడిని; చంపి= సంహరించి; రాజ్యంబు+చేయన్+సమ్మతించి తొడరిన= ప్రభుత్వం చేయటానికి అంగీకరించి పూనిన; పాండుపుత్రులకును= పాండవులకు; దైవంబు= అదృష్టం; తోడు+అయ్యెన్= సాయం చేసింది; ధర్మంబున్= ధర్మాన్ని; కీడుపఱిచి= చెరిచి; అధర్మంబు= అధర్మం; పరఁగి= ఒప్పి; పెరిఁగినట్లు+ఉన్నది= అభివృద్ధి చెందినట్లు ఉన్నది; పరఁగి= విలసిల్లు; వారలు= (పాండవులు); ఆతనిన్= భీష్ముడిని; కూల్చి= పడగొట్టి; వసుధన్= భూమిని; కొనఁగన్+నిశ్చయించుట= స్వీకరించాలని నిర్ణయించుకొనటం; కడున్= మిక్కిలి; నిష్ఠురత్వము= కఠినమైనపని; దానికంటెను= (పాండవులు భీష్ముడిని పడగొట్టటంకంటె); సంగరంబునన్= యుద్ధంలో; ఆతండు= (భీష్ముడు); చచ్చుట+ఓర్చి= మరణించటం సహించి; సంపదకున్+కాన్= ఐశ్వర్యం కోసం; పెనంగిన= పోరాడిన; చందము= విధం; అరయన్= చూడగా; మనకున్= మనకు (కౌరవులకు); పాపంబు+కాదె?= పాపం కదా?; ఈ రాచకులము= ఈ క్షత్రియ కులం; కులములందున్+ఎల్లన్= అన్ని కులాలలో?; చాల= మిక్కిలి; బెట్టిదంబు= క్రూరమైనది. ఈ+కులంబునన్= (ఈ రాచకొలంలో); పుట్టన్+అగునె?= పుట్టటం మంచిదా?

**తాత్పర్యం:** ' కౌరవవంశంలో గౌరవపాత్రుడు వయోవృద్ధుడు అయిన భీష్ముడిని సంహరించి రాజ్యం చేయాలని సంకల్పించిన పాండవులకు భగవంతుడు సాయం చేయటం వింతగా ఉన్నది. ధర్మమును అణగద్రొక్కి, అధర్మం అభివృద్ధి చెందినట్లుంది. సరే. భీష్ముడిని చంపి, రాజ్య మేలాలని చూచిన పాండవుల మాట అటుంచి, భీష్ముడుయుద్ధంలో చావడానికి ఓర్చుకొని సంపదకై పోరాడటం దానికంటె పాపం కాదా? అన్ని కులాలలో రాచకొలం మిక్కిలి కఠినమైనది. ఈ క్షత్రియకులంలో పుట్ట వచ్చునా?' అన్నాడు ధృతరాష్ట్రుడు.

**వ. అని పలుమాట లాడి వెండియు. 61**

**తాత్పర్యం:** ఆ విధంగా పెక్కు పలుకులు పలికి, ధృతరాష్ట్రుడు మరల ఈ విధంగా మాటాడాడు.

**ఆ. మగఁడు లేని మగువ మాడ్కి గాకున్నె నా । సేన భీష్ము లేమిఁ జేసి నేఁడు;**
**కురుకుమారు లెంత గుందిరో? యెవ్వరే । మైరొ? యింక నెట్టు లగుదు రొక్కొ! 62**

**ప్రతిపదార్థం:** నేఁడు= ఈ దినమునందు; నా సేన= నా సైన్యం; భీష్మ+లేమిన్+చేసి= భీష్ముడు లేకపోవటం చేత; మగఁడు, లేని, మగువ, మాడ్కి= భర్తలేని భార్యవలె (విధవవలె); కాక+ఉన్నె?= కాకుండునా?; కురుకుమారులు= కౌరవులు; ఎంత+కుందిరి+ఓ?= ఎంత దుఃఖించినారో; ఎవ్వరు+ఏమి+ఐరొ?= ఎవ్వరు ఏ విధంగా వర్తించారో; ఇంకన్= ఇకమీద; ఎట్టులు= ఏ రీతిగా; అగుదురు+ఒక్కొ!= అవుతారో గదా!

**తాత్పర్యం:** ఈనాడు, భీష్ముడు లేని నా సైన్యం, భర్త లేని భార్యవలె కాలేదా? ఇక కౌరవులు ఏ విధంగా దుఃఖంలో మునిగిపోయారో? ఏమయ్యారో? ఇకమీద ఏమౌతారో కదా!

**క. రాజులు మంత్రులు ననియెడు । నా జూదరు లాత్మ నేమి యని తలఁచిరొ? యే**
**యోజం బలికిరొకో! తమ । కాజికి నిట మీఁద నెవ్వ రాధారంబో?' 63**

**ప్రతిపదార్థం:** రాజులు= ప్రభువులు (యుద్ధం చేసే రాజులు); మంత్రులు= రాజులకు హితవు బోధించేవారు; అనియెడు= అని చెప్పబడే ఆ జూదరులు (ఆ జూదం ఆడేటటువంటివారు); ఆత్మన్= మనస్సులో; ఏమి+అని= ఏమని; తలఁచిరొ= ఆలోచించారో; ఏ+ఓజన్= ఏ రీతిగా; పలికిరి+ఒకో= మాటాడారో గదా; తమకున్= ఆ రాజులకు, మంత్రులకు; ఆజికిన్= యుద్ధానికి; ఇటమీదన్= ఇకపై; ఎవ్వరు= ఎవరు; ఆధారంబు+ఓ?= ఆలంబనమో?

**తాత్పర్యం:** రాజులు (దుర్యోధన దుశ్శాసనులు) మంత్రులు (కర్ణ శకునులు) అనే జూదరులు మనసులో ఏమనుకొన్నారో? ఏ రీతిగా మాట్లాడారో? ఇక మీదట యుద్ధానికి ఆధారమెవ్వరో?

**వ. అని పలికి సంజయుకరంబు విడిచి 'కయ్యం బెయ్యెడం బొడిచిరి? పది దినంబులు నుభయబలంబుల వారును నెవ్విధంబున మోహరించి? రెవ్వ రెవ్వ రెప్పు డెప్పు డేమి సేసి? రిన్నాళ్ళు గాంగేయుఁ డెబ్బంగుల సంగరంబు సేసెఁ దుది నెత్తెఱంగునం దెగియె? నంతయు వివరించి పరిపాటిం దేటపడం జెప్పుము. 64**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; సంజయుకరంబు= సంజయుడి చేయి; విడిచి= వదలి; కయ్యంబు= యుద్ధం; ఏ+ఎడన్=ఎక్కడ; పొడిచిరి= చేశారు. పది+దినంబులున్= పదిరోజులు; ఉభయ+బలంబులవారును= రెండు సేనలలోని వారును (కురుపాండవ సేనలలోనివారు); ఏ+విధంబునన్= ఏ రీతిగా; మోహరించిరి= వ్యూహాలు పన్నారు?; ఎవ్వరు+ఎవ్వరు= ఎవరెవ్వరు; ఎప్పుడు+ఏమి, చేసిరి?= ఎప్పుడు ఏమేమి చేశారు?; ఇన్నాళ్ళు= ఇన్నిరోజులు; గాంగేయుఁడు= భీష్ముడు; ఏ+భంగులన్= ఏవిధంగా; సంగరంబు+చేసెన్?= యుద్ధం చేశాడు?; తుదిన్= చివరకు; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; తెగియెన్?= పడిపోయాడు?; అంతయున్= అంతా; వివరించి= వివరాలతో చెప్పి; పరిపాటిన్= వరుసగా; తేటపడన్= తెల్లమయ్యేటట్లుగా; చెప్పుము= చెప్పుము.

**తాత్పర్యం:** అని చెప్పి, ధృతరాష్ట్రుడు సంజయుడి చేతిని విడిచిపెట్టి, పిదప ఈ విధంగా ప్రశ్నించాడు. యుద్ధం ఎక్కడ చేశారు? 'ఈ పది రోజులు యుద్ధం ఏ విధంగా జరిగింది? కౌరవ పాండవ సేనలలోనివారు ఏ విధంగా వ్యూహాలు పన్నారు? ఎవ్వ రేమేమి చేశారు? ఇన్ని దినాలు భీష్ముడు ఏ విధంగా యుద్ధం చేశాడు? చివరకు ఏ విధంగా కూలిపోయాడు? అంతా సవిస్తరంగా నాకు వివరించి చెప్పుము?

**విశేషం:** భీష్ముడు యుద్ధభూమిలో పడిపోయిన సంగతి సంజయుడు చెప్పినపుడు - ధృతరాష్ట్రుడు మూర్ఛపోయాడు. తెప్పిరిల్లిన పిదప ఆతడు సంజయుడి చేయిపట్టుకొని దుఃఖించాడు. 57వ పద్యంలో ధృతరాష్ట్రుడు సంజయుడి చేయిపట్టుకున్నట్లు ఉన్నది 64వ పద్యంలో అతడు సంజయుని చేయి వదలినట్లు ఉన్నది. పదినాళ్ళ యుద్ధంలోని వివరాలు ధృతరాష్ట్రుడు సంజయుడికి దూరంగా కూర్చొని విశ్రాంతిగా విన్నాడు. కథాకథనంలో తిక్కన నిశితదృష్టికి ఇది ఒక చక్కని ఉదాహరణం.

**ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా**
**కట్టిఁడి వీను లేమి వినుకాఱియ కోర్వవు? దుర్వినీతికిం**
**బుట్టినయిల్లనై వినక పోవఁగ వచ్చునె? యింక నాకు నే**
**దిట్టఁడ నైతి; నెల్లవియుఁ దెల్లముగా విననేర్తు సంజయా!' 65**

**ప్రతిపదార్థం:** నెట్టన= పూనికతో; ఆపగాసుతుడు= నదీనందనుడు- భీష్ముడు; నేలకున్+వ్రాలెను+అనంగన్= భూమిమీద పడిపోయాడు అని చెప్పగా; విన్న= ఆలకించిన; నా+కట్టిఁడి+వీనులు= కఠినమైన నా చెవులు; ఏమి కాఱియకున్ ఓర్వవు?= ఏ కష్టమును విన సహించవు? (ఎట్టి దుర్వార్తలు ఐనా వినగలవు); దుర్+వినీతికిన్= చెడ్డవిధానానికి; పుట్టిన+ఇల్లను+ఐ= జన్మస్థానమునై; వినక పోవఁగన్ వచ్చునె+ఇంక+నాకున్= ఇకమీద నాకు వినకుండా తప్పుతుందా?; సంజయా= ఓ సంజయా!; నే+దిట్టఁడన్+ఐతి= నేను ధైర్యవంతుడను అయినాను; అనగా నా మనస్సు గట్టిపడింది అని అర్థం; ఎల్ల+అవియున్= అన్నిటిని; తెల్లముగాన్= సుస్పష్టంగా; విననేర్తున్= ఆలకించగలను.

**తాత్పర్యం:** దీక్షతో యుద్ధం చేసిన- భీష్ముడు యుద్ధభూమిలో పడిపోయాడన్న వార్త విన్న నా చెవులు ఎట్టి దుర్వార్తలనైనా వినగలవు. దుష్టమైన నీతికి నేను పుట్టినిల్లును. నా మనస్సు బండబారింది. ఓ సంజయా! నీవు వెనుకాడక, ఏ విధంగా యుద్ధం జరిగిందో- అంతా నాకు తేటతెల్లంగా తెలియచెప్పుము. సందేహించవద్దు.

**వ. అనిన విని సంజయుం డతని కిట్లనియె 66**

**తాత్పర్యం:** అనగావిని, సంజయుడు ధృతరాష్ట్రుడితో ఈ విధంగా అన్నాడు.

**ఆ. అధిప! నీవు సెప్పినట్టిద; నీ యవి । నీతిఁ జేసి ధర్మనిరతు లైన**
**పాండుసుతుల కన్ని పాటులు వాటిల్లె; । నింత దెచ్చికొంటి వంత సేసి. 67**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! (ధృతరాష్ట్ర మహారాజా!); ఈవు= నీవు; చెప్పిన+అట్టిది+అ= చెప్పిన విషయం వాస్తవం; నీ+అవినీతిన్+చేసి= నీ అవినీతి చేత; ధర్మనిరతులు+ఐన= ధర్మము ఆచరించుటయందు దీక్ష గలిగినట్టి; పాండుసుతులకున్= పాండవులకు; అన్ని+పాటులు= అన్ని దురవస్థలు; పాటిల్లెన్= ఏర్పడ్డాయి; అంత+చేసి= అంత అవినీతి నీవు చేయటం చేత; ఇంత= ఈ దురవస్థ (అనగా భీష్మడి పతనం); తెచ్చుకొంటివి= తెచ్చుకొన్నావు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీవే ఒప్పుకొన్నావుగదా! నీ అవినీతి వలననే ధార్మికులైన పాండవులకు ఇన్ని బాధలు కలిగాయి. నీవు అవివేకం వలన ఇంతటి దురవస్థ తెచ్చుకున్నావు. నీది స్వయం కృతాపరాధం. నీ కర్మ నిన్ను కట్టికుడుపుతున్నది.

**క. కీ డొనరించినవారికిఁ । గీ డగు టరుదయ్య? మేలు గీ డేమియు నీ**
**వాడక విను; ననుఁ గయ్యముఁ । జూడఁగఁ బుచ్చుట వినంగఁ జూచియ కాదే! 68**

**ప్రతిపదార్థం:** కీడు= అపకారం; ఒనరించిన వారికిన్= చేసినవారికి; కీడు= అశుభం (నష్టం); అగుట= సంభవించటం; అరుదు+అయ్య?= అరుదా?- అరుదుకాదు- తరచుగా సంభవిస్తుంది; మేలు- కీడు+ఏమియున్= ఇది ఉపకారం; అది అపకారం అనే మాటలు; నీవు+ఆడక= నీవు చెప్పకుండా; విను(ము)= నేను చెప్పే మాటలు వినుము; ననున్= నన్ను; కయ్యమున్= యుద్ధాన్ని; చూడఁగన్+పుచ్చుట= చూడుమని పంపటం; వినంగన్+చూచియు+అ, కాదే?= వినాలనే ఉద్దేశం తోడనే కదా!

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అపకారం చేసినవారికి తిరిగి కీడు జరిగితీరుతుంది. అది లోకంలో తరచు చూస్తూనే ఉన్నాం గదా. నీవు ఇది కీడు అది మేలు అని చెప్పకుండా (మధ్య మధ్య ఆపకుండా) నేను చెప్పే మాటలు ఆలకించుము. నీవేకదా యుద్ధం చూచి ఆ వార్తలు నీకు చెప్పుమని నన్ను నియోగించింది. (వినటానికే కదా! ఈ చెప్పటం)

**క. వేదవ్యాస మునీశ్వరు । పాదంబులు దలఁచి మ్రొక్కి భక్తిరసైకా**
**స్వాదన సుకరానందో । త్పాదన దివ్యమతి నగుచుఁ దగ నెఱిఁగింతున్. 69**

**ప్రతిపదార్థం:** వేదవ్యాస, ముని+ఈశ్వరు, పాదంబులు= వేదములను వర్గీకరించి వ్యాసుడనే పేరుపొందిన గొప్ప ఋషి అడుగులు; తలఁచి= స్మరించి; మ్రొక్కి= నమస్కరించి; భక్తి+రస+ఏక+ఆస్వాదన+సుకర+ఆనంద+ఉత్పాదన+దివ్య+మతిన్+అగుచున్= భక్తి అనే 'రసము'నే ఆస్వాదించటం ద్వారా లభ్యమైన ఆనందం పుట్టే దివ్యమైన బుద్ధితో కూడినవాడను ఔతూ; తగన్= తగినట్టుగా (ఔచిత్యంతో); ఎఱిఁగింతున్= తెలుపగలను.

**తాత్పర్యం:** వేదవ్యాస మహర్షి శ్రీపాదాలను స్మరించి నమస్కరించి భక్తిరసమునందు ఓలలాడే బుద్ధికలవాడనై యుద్ధ వృత్తాంతం తెలుపగలను.

**విశేషం:** ఇది యుద్ధ కథనానికి మొదలు. భక్తి నవరసాలలో ఒకటి కాదు. ఇచ్చట 'రస' శబ్దాన్ని తిక్కన ఏ అర్థంలో వాడినట్లు? 'రసం' బ్రహ్మానంద సదృశమని ఆలంకారికుల నిర్దేశం. తిక్కనకు రస శబ్దంపై ఆనంద శబ్దంపై మక్కువ ఎక్కువ. యుద్ధ వర్ణన ఆనందదాయకం కాగలదా? రసం ఆనంద పర్యవసాయి. యుద్ధ వర్ణనకు వీరరసం ఆధారం. వీర రసోపాసనకు సంజయుడు వేదవ్యాస పాదాలను ఆలంబంగా చేసికొన్నాడు. ఇది ఉదాత్త భావ కల్పన.

**వ. అనిన నాంబికేయుండు 'నట్లకాక యెఱింగింపు' మనుటయు సంజయుండు. 70**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పిన; ఆంబికేయుండు= అంబికా పుత్రుడు- ధృతరాష్ట్రుడు; అట్ల+కాక= అటులే అగుగాక; ఎఱింగింపుము= తెలుపుము; అనుటయున్= అని చెప్పగానే; సంజయుండు= సంజయుడు.

**తాత్పర్యం:** అని సంజయుడు చెప్పాడు. ధృతరాష్ట్రుడు ఆతడి మాటలు అంగీకరించి సరే చెప్పుమన్నాడు. అంతట సంజయుడు చెప్పసాగాడు.

**సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధంబు సెప్పఁబూనుట (సం. 6-16-7)**

**ఉ. 'ప్రాంశుఁ బయోదనీలతనుభాసితు నుజ్జ్వల దండధారుఁ బిం**
**గాంశు జటాచ్ఛటాభరణు నాగమపుంజపదార్థతత్త్వ ని**
**స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ**
**వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్.' 71**

**ప్రతిపదార్థం:** ప్రాంశున్= ఉన్నతుడిని; పయోద, నీల, తను, భాసితున్= మేఘంవలె నల్లనైన శరీరంచేత వెలుగొందేవాడిని; ఉజ్జ్వల, దండ, ధారున్= ప్రకాశించే దండం ధరించేవాడిని; పింగ+అంశు జటా+ఛటా+ఆభరణున్= గోరోజనం రంగు గల జడల సముదాయమనే సొమ్ములు ధరించిన వాడిని; ఆగమ, పుంజ, పద+అర్థ, తత్త్వ, నిస్సంశయకారున్= వేదాల సముదాయమునందలి పదాల యొక్క భావాల యొక్క యాథార్థ్యమును సంశయం లేకుండా నిరూపించినవాడిని; కృష్ణమృగచర్మకృత+అంబరకృత్యున్= జింక చర్మాన్ని బట్టగా చేసికొన్నవాడిని; భారతీ వంశ వివర్ధనున్= భారత రాజవంశమును వృద్ధి చేసిన వాడిని; త్రిదశ+వందితున్= దేవతలచే నమస్కరించబడినవాడిని, సాత్యవతేయున్= సత్యవతి కొడుకును; కొల్చెదన్= ఆరాధించగలను.

**తాత్పర్యం:** ఉన్నతుడిని, మేఘంవలె నల్లనైన శరీరకాంతితో వెలుగొందే వాడిని, ప్రకాశించే దండం ధరించే వాడిని, గోరోజనపు వర్ణంగల జడల మొత్తం ధరించిన వాడిని, వేదాలలోని పదాల భావాన్ని సంశయాలు లేకుండా నిరూపించిన వాడిని, కృష్ణాజినం వస్త్రంగా ధరించే వాడిని, భారత వంశాన్ని వర్ధిల్లేటట్లు చేసిన వాడిని, దేవతలచేత నమస్కరించబడిన వాడిని, సత్యవతి కొడుకును ఆరాధిస్తాను.

**విశేషం:** ఈ పద్యం వేదవ్యాసస్తుతి. తిక్కనకు సంస్కృత మహాభారత కర్త అయిన వేదవ్యాసుడిపైగల, భక్తి ప్రపత్తులు ప్రతిఫలించే పద్యం ఇది.

**వ. అని పలికి పారాశర్యుం జిత్తంబున నిలిపి నమస్కరించి ధృతరాష్ట్రున కిట్లనియె. 72**

**ప్రతిపదార్థం:** అని, పలికి= అని వచించి; పారాశర్యున్= పరాశరుడి కొడుకగు వ్యాసుడిని; చిత్తంబునన్= మనస్సులో; నిలిపి= ప్రతిష్ఠించి; నమస్కరించి= మ్రొక్కి; ధృతరాష్ట్రునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పి సంజయుడు వేదవ్యాస మహర్షిని మనస్సులో ధ్యానించి, మ్రొక్కి ధృతరాష్ట్రుడితో ఈ విధంగా అన్నాడు:

**క. ' వినినదియును, నెయ్యెడ నేఁ । గనినదియును, మునికృపం బ్రకాశంబై తోఁ**
**చిన యదియును, విశదంబుగ । వినిపించెద మొదలుకొని సవిస్తారముగన్. 73**

**ప్రతిపదార్థం:** వినినదియును= ఆలకించినట్టిదీ; ఏ+ఎడన్= ఎచ్చట; నేన్+కనిన+అదియును= నేను చూచినట్టిదీ; ముని+కృపన్= (వేదవ్యాస) ఋషిదయ వలన; ప్రకాశంబు+ఐ, తోచిన+అదియును= తెల్లమై స్ఫురించినట్టిదీ; మొదలుకొని= యుద్ధం ఆరంభించిన సమయం నుండి; స, విస్తారముగన్= వివరాలు అన్నింటినీ కలిపి; వినిపించెదన్= నీకు చెప్పగలను.

**తాత్పర్యం:** అని చెప్పి సంజయుడు వేదవ్యాస మహర్షిని మనస్సులో ధ్యానించి, మ్రొక్కి ఈ విధంగా చెప్పాడు. 'నేను విన్న సంగతులు, నేను కళ్ళార చూచిన విషయాలు, వేదవ్యాస మహర్షి కృపవలన నాకు తెలిసిన అంశాలు, యుద్ధం మొదలుపెట్టినప్పటినుండి జరిగిన విశేషాలు అన్నీ నీకు వివరాలతో చెప్పగలను.

**వ. ఆ రాత్రి నిన్ను వీడుకొని మన దండునకుం జని, నీ కొడుకు నగరు సముచిత ప్రకారంబునం బ్రవేశించు నప్పుడతండు గాంగేయాది కౌరవులును దగు రాజులును బరివేష్టింపం బరిమిత స్థానంబున నుండ, నేనును బొడసూపి,యతని యాదరణంబు వడసి కొలిచి యుండితిం; బదంపడి సమర విషయంబులైన సంభాషణంబుల సమయంబున నమ్మేదినీశ్వరుండు దుశ్శాసనుం గనుంగొని యిట్లనియె. 74**

**ప్రతిపదార్థం:** ఆ రాత్రి= ఆ రేయి; నిన్నున్= (ఓ ధృతరాష్ట్ర మహారాజా) నిన్ను; వీడుకొని= నీ దగ్గర సెలవు పుచ్చుకొని; మన, దండునకున్+చని= మన సైన్యం విడిసిన చోటికి వెళ్ళి; నీ కొడుకు= నీ పుత్రుని యొక్క (దుర్యోధనుని); నగరున్= అంతఃపురాన్ని; సముచిత ప్రకారంబునన్= యథావిధి (రాజమర్యాద ప్రకారం); ప్రవేశించు+అప్పుడు= చేరేటప్పుడు; అతండు= (దుర్యోధనుడు); గాంగేయ+ఆది, కౌరవులును= భీష్ముడు మున్నగు కౌరవులును; తగు రాజులును= (కొలువుకూటాన్ని ప్రవేశించే అర్హత గల) తగిన దొరలును; పరివేష్టింపన్= చుట్టూచేరియుండగా; పరిమితస్థానంబునన్+ఉండన్= రాజుగారు కూర్చుండడానికి ఏర్పాటు చేయబడిన చోటులో (కొలదిమందితో కలిసి) ఉండగా; ఏనును= నేను గూడ (సంజయుడనైన నేను); పొడ+చూపి= కన్పించి; అతని= దుర్యోధనుడి యొక్క; ఆదరణంబు+పడసి= మన్ననను పొంది, కొలిచి+ఉండితిన్= కొలువు కూటంలో కూర్చొని ఉన్నాను; పదంపడి= పిమ్మట; సమర, విషయంబులు+ఐన= యుద్ధానికి సంబంధించిన అంశాలు గల; సంభాషణంబుల సమయంబునన్= మాటాడేటప్పుడు; ఆ+మేదినీ+ఈశ్వరుండు= ఆ రాజు- దుర్యోధనుడు; దుశ్శాసనున్+కనుంగొని= దుశ్శాసనుడిని చూచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! ఆ రాత్రి నీదగ్గర సెలవు తీసికొని నేను మన సేనలు విశ్రమించిన చోటు చేరాను. నీ కొడుకు దుర్యోధనుడి నగరులోకి పోయేసరికి అతడు భీష్ముడు మొదలైన కౌరవులూ ఆంతరంగికులైన రాజులూ పరివేష్టించి ఉండగా నేను కన్పించాను. దుర్యోధన మహారాజు నన్ను మన్నించగా కొలిచి ఉన్నాను. తరువాత యుద్ధవిషయాలు మాట్లాడేటప్పుడు దుర్యోధన మహారాజు దుశ్శాసనుడితో ఈ విధంగా చెప్పాడు.

**క. ' మనకుఁ బాండురాజ తనయవర్గమునకుఁ । గయ్యు మయ్యెఁ; బెద్ద కాలమేని**
**నెదురు చూచుచుండ నొదవె నివ్విధ, మిందుఁ । బూని చేయవలయుదాని వినుము. 75**

**ప్రతిపదార్థం:** మనకున్= (కౌరవులకును); పాండురాజ, తనయ, వర్గమునకున్= పాండవుల పక్షానికి; కయ్యము+అయ్యెన్= యుద్ధం వచ్చింది; ఏను= నేను; పెద్ద కాలము+ఏని= చాలాకాలం నుండి; ఎదురు చూచుచుండన్= ఎదురు చూస్తూ ఉండగా;

ఈ+విధము= ఈ రీతి; ఒదవెన్= ఏర్పడింది; ఇందున్= ఈ యుద్ధంలో; చేయవలయుదానిన్= కర్తవ్యాన్ని; ఆచరించ వలసినదానిని గూర్చి; వినుము= ఆలకించుము.

**తాత్పర్యం:** ఎంతోకాలంనుండి ఎదురు చూస్తున్న యుద్ధం మనకూ పాండవ పక్షానికీ ఈ నాటికి ఈ రీతిగా సిద్ధించింది. ఇక ఇప్పుడు మనం చేయవలసినపనిని గురించి, సాధించవలసిన కార్యం గురించి వినుము.

**క. కన్నాకు మనకు భీష్ముం; । డిన్నరవరుఁ గావవలయు నెమ్మెయి నైనం;**
**దన్నుం గాచిన నితఁడు జ । గన్నుతముగ రణమునం బగఱ నడఁగించున్. 76**

**ప్రతిపదార్థం:** మనకున్= మన కౌరవ సేనలకు; భీష్ముండు= భీష్ముడు; కను+ఆకు= కనురెప్పవలె రక్ష - నాయకుడు;; ఈ+నరవరున్= నరులలో శ్రేష్ఠుడైన ఈతడిని; ఏ+మెయిన్= ఏ రీతిగా అయినా సరే; కావవలయున్= కాపాడాలి; తన్నున్+కాచినన్= తనను రక్షిస్తే; ఇతఁడు= ఈ భీష్ముడు; జగత్+నుతముగన్= ప్రపంచం చేత ప్రస్తుతించబడే రీతిగా; రణమునన్= యుద్ధంలో; పగఱన్= శత్రువులను; అడఁగించున్= నాశం చేస్తాడు.

**తాత్పర్యం:** భీష్ముడు మన సేనకు ముఖ్యుడు మనకు రక్ష. శ్రేష్ఠుడైన ఈ వీరుడిని మనం రక్షిస్తే, ఈతడు మనలను అందరినీ రక్షిస్తాడు. అంతేకాక, యుద్ధంలో ప్రపంచం అంతా ప్రస్తుతించే విధంగా ఇతడు శత్రువులను ధ్వంసం చేస్తాడు.

**విశేషం:** కన్నాకు= కన్ను+ఆకు, తమలపాకు కట్టలో మొదటనుండే పెద్దఆకు అనగా అగ్రేసరుడు= శ్రేష్ఠుడు అని భావం.

**ఆ. ఎల్లవారిఁ గాచు నితఁ డని యెప్పుడుఁ । దలఁతు; మితనిఁ గావవలయు టేమి**
**యని తలంచె దేని విను; మిందఱకు నిది । వినఁగవలయు నట్టి పని కుమార! 77**

**ప్రతిపదార్థం:** కుమార!= చిన్నవాడవైన ఓ దుశ్శాసనా?; ఎల్లవారిన్= అందరినీ; ఇతఁడు= (భీష్ముడు); కాచున్= రక్షిస్తాడు అని; ఎప్పుడున్= ఎప్పుడూ; తలఁతుము= భావిస్తాము; ఇతనిన్= (భీష్ముడిని); కావన్‌వలయుట+ఏమి?= రక్షించటం ఏమిటి; అని తలంచెదు+ఏని= అని ఆలోచిస్తున్నావేమో; వినుము= ఆలకించుము; ఇందఱకున్= ఇంతమందికీ; ఇది= ఇపుడు నేను చెప్పునది; వినఁగన్ వలయున్+అట్టి+పని= వినవలసిన విషయం.

**తాత్పర్యం:** ఎల్లవారిని ఇతడు (భీష్ముడు) యుద్ధంలో రక్షిస్తాడని ఎప్పుడూ అనుకొంటాము గదా! అట్లాంటి ఈయనను రక్షించటమేమిటని అనుకుంటే దుశ్శాసనా! వినుము. ఇది అందరూ వినవలసినట్టి విషయం.

**విశేషం:** భీష్ముడు చేసిన ప్రతిజ్ఞ ప్రకారం ఆ మానవాతీతుడు ఆడవారితో పోరాడడు. అంతేగాక- ఆడంగి లేకివారితో గూడా పోరాడడు. శిఖండి ఆకృతిచేత స్త్రీ. అందుచేత భీష్ముడు ఆతడితో పోరాడడుగాని, శిఖండి భీష్ముడితో పోరాడుతాడు. బాణాలు ప్రయోగిస్తాడు. ఆడిన మాట తప్పనివాడు భీష్ముడు. సాయుధుడైన శిఖండి, నిరాయుధుడైన భీష్ముడిపై విజృంభించే అవకాశం ఉంది. జాగ్రత్త.

**వ. సత్యవ్రతుం డగు నిమ్మహానుభావుండు. 78**

ప్రతిపదార్థం: సత్యవ్రతుండు+అగు= ఎల్లప్పుడూ నిజమే మాటాడే దీక్షగల; ఈ+మహానుభావుండు= ఈ గొప్పవాడు (భీష్ముడు).

**తాత్పర్యం:** సత్యమే జీవితవ్రతంగా కలిగిన ఈ గొప్పవాడు.

**క. వినుఁ డన్యు లెవ్వరును నా । మునుమునుఁ బడి బ్రదుక రాలమున; నేను శిఖం**
**డిని నోర్వఁ జాలఁ జుండీ! । యని మన యుద్యోగవేళయప్పుడ చెప్పెన్. 79**

**ప్రతిపదార్థం:** వినుఁడు= ఆలకించండి; అన్యులు= ఇతరులు; ఎవ్వరును= ఎవ్వరుగానీ; నా మునుమున్+పడి= నా యెదురున నిలిచి; ఆలమునన్= యుద్ధంలో; బ్రదుకరు= జీవించలేరు; ఏను= నేను; శిఖండిని; ఓర్వన్+చాలన్+చుండీ!= గెలువలేను సుమా అని; మన ఉద్యోగ వేళ= మనం (యుద్ధ) ప్రయత్నాలు చేసే సమయంలో; అప్పుడు+అ= ఆ సమయంలోనే; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** మనం యుద్ధ ప్రయత్నాలు చేసే సమయంలో, ఆనాడే భీష్ముడు ఒక మాట ఖండితంగా చెప్పాడు. 'నా ముందు యుద్ధంలో ఇంకెవ్వరూ నిలువలేరు. నిలిచి యుద్ధం చేస్తే జీవించలేరు. అయితే, నేను శిఖండితో పోరాడలేను.'

**ఉ. ఏమఱి రక్ష సాలని మృగేంద్రుని నక్కయుఁ గోలుపుచ్చు; సం**
**గ్రామములోనఁ గన్గలిగి కావక తక్కిన నా శిఖండిచే**
**నీ మనుజేంద్రుఁ గోల్పడమె? యిట్టిది గోల్పులి నిద్రవోవ ను**
**ద్దామ బలంబుమై గొఱియ దాఁకి వధించినయట్టు లుండదే. 80**

**ప్రతిపదార్థం:** ఏమఱి= మైమరచి ఉపేక్షవహించి; రక్ష+చాలని= రక్షణ సరిపోని; మృగ+ఇంద్రునిన్= (మృగములలో శ్రేష్ఠమైన) సింహాన్ని; నక్కయున్= నక్క కూడా; కోలుపుచ్చున్= చెడగొట్టగలదు; సంగ్రామములోనన్= యుద్ధంలో; కన్+కలిగి= జాగ్రత్తగా చూస్తూ; కావక, తక్కినన్= కాపాడటం మానివేస్తే; ఆ+శిఖండిచేన్= ఆ శిఖండిచేత; ఈ+మనుజ+ఇంద్రున్= మనుజులలో శ్రేష్ఠుడైన ఈ భీష్ముడిని; కోల్పడమె?= పోగొట్టుకోమా?; ఇట్టిది= ఇటువంటిది; కోల్+పులి= పెద్దపులి; నిద్ర+పోవన్= నిదురిస్తూ ఉండగా; ఉత్+దామ+బలంబుమైన్= అరికట్టలేని శక్తితో; గొఱియ= గొఱ్ఱె; తాఁకి= ఎదిరించి; వధించిన+అట్టులు= చంపివేసినట్లు; ఉండదే= ఉండదా?

**తాత్పర్యం:** ఏమరి రక్షణచాలని సింహాన్ని నక్కసైతం చంపుతుంది. జాగ్రత్తగా కనులు మూయకుండా భీష్ముడిని కాపాడాలి. లేకపోతే శిఖండిచేత ఈ మహావీరుడు నిర్జింపబడవచ్చును. పెద్దపులి నిదురిస్తూ ఉండగా, గొఱ్ఱె వచ్చి పైబడి పెద్దపులినే సంహరించినట్లు ఔతుంది.

**క. కావున నీ యుద్భటరథి । కావలి నివ్విభునిఁ గాచునట్లుగఁ బనుపం**
**గావలయు మీర లందఱు । నేవలఁ జూచిన శిఖండి కెదురుం డెపుడున్.' 81**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; ఈ+ఉద్భట+రథిక+ఆవలిన్= గొప్పవీరులైన ఈ రథికుల సమూహాన్ని; ఈ+విభునిన్= ఈ నాయకుడిని (భీష్ముని); కాచున్+అట్లుగన్= కాపాడేటట్లుగా; పనుపంగాన్ వలయున్= ఏర్పాటు చేయాలి; మీరలు+అందఱున్= మీరందరూ; ఏవలన్+చూచినన్= ఏవైపు చూచినా; ఎపుడున్= ఎల్లప్పుడు; శిఖండికిన్= శిఖండికి; ఎదురుండు= ఎదిరి పోరాడండి.

**తాత్పర్యం:** కాబట్టి గొప్పవీరులైన ఈ రథికులగుంపును నాయకుడైన భీష్ముని రక్షించడానికి పంపాలి. మీరందరూ ఏ వైపు చూచినా ఎప్పుడూ శిఖండిని ఎదిరించండి.

**వ. అని నియమించి కొలువు విరిసి చని యుచిత విధంబున నుండె; నంతఁ బ్రభాతం బగుటయు నమ్మహీపతి పడవాళ్ళం బనిచి బలుమానిసులను బలంబులను బవరంబునకు వెడల నియోగించిన, శంఖ దుందుభి ప్రముఖ మంగళ తూర్య నిస్వనంబులను నయ్యై సాధనంబులు సమకట్ట సముచిత పరివారంబునకుంజెప్పెడు దొరల పలుకుల గంభీర నాదంబులను, గట్టుమట్లు కదలఁ దిగిచినం జెలంగు కరితురంగంబుల బృంహిత హేషిత ఘోషంబులను బూన్పం దిగుచు రథంబుల నేమిస్వనంబులను, బెలుచ నొండొరులం బిలుచు**

**పదాతుల యెలుంగుల విపులధ్వనులనుం, బేర్చిన మహారవంబున శిబిరంబు చంద్రోదయ ఘూర్ణమాన మహార్ణవంబును గ్రేణి సేయుచుండ సూర్యోదయంబైన సైన్యంబులు సెలంగుచు వెడలునప్పుడు. 82**

**ప్రతిపదార్థం:** అని+నియమించి= అని చెప్పి, ఏర్పాటు చేసి; కొలువు+విరిసి= కొలువు చాలించి; ఉచిత+విధంబునన్+ఉండెన్= తగిన రీతిని ఉన్నాడు; అంతన్= పిదప; ప్రభాతంబు+అగుటయున్= తెల్లవారుటచేత; ఆ+మహీపతి= ఆ రాజు- దుర్యోధనుడు; పడవాళ్ళన్+పనిచి= చిన్న దండనాథులను ఆజ్ఞాపించి; బలుమానిసులను= బలముకల మనుష్యులను, సేనకు ముందు నడిచేవారిని; బలంబులను= సేనలను; బవరంబునకున్= యుద్ధానికి; వెడలన్= వెళ్ళటానికి; నియోగించినన్= ఆజ్ఞాపించగా; శంఖ+దుందుభి+ప్రముఖ+ మంగళ+తూర్య+నిస్వనంబులను= శంఖాలు దుందుభులు, మొదలైన శుభప్రదమైన వాద్యాల ధ్వనులు; అయ్యై= ఆయా; సాధనంబులు= పరికరాలు; సమకట్టన్= సిద్ధం చేయటానికి; సముచిత+పరివారంబునకున్= తమ తమ అనుచరులకు; చెప్పెడు= ఆజ్ఞాపించే; దొరల+పలుకుల= ప్రభువుల వాక్యాల; గంభీర+నాదంబులు= ఠీవితో కూడిన శబ్దాలు, కట్టుమట్లు= ఉండేచోటులు; కదలన్+తిగిచినన్= కదిలేటట్లు లాగగా; చెలంగు= ధ్వనించే; కరి+తురంగంబుల= ఏనుగుల గుర్రాల; బృంహిత+హేషిత+ ఘోషంబులును= ఘీంకారముల, సకిలింపుల పెద్ద ధ్వనులు; పూన్పన్+తిగుచు రథంబులనేమి స్వనంబులును= కట్టటానికి ఆయత్తం చేసే రథచక్రాల ధ్వనులూ; పెలుచన్= పెద్దగా; ఒండు+ఒరులన్= ఒకరిని ఒకరు, పిలుచు= రమ్మని కేకలు వేసే; పదాతుల+ఎలుంగుల= కాలిభటుల కంఠస్వరముల; విపుల+ధ్వనులన్+పేర్చిన= సంకుల నినాదాలతో అతిశయిల్లిన; మహా+రవంబునన్= పెద్ద సంకులశబ్దంచేత; శిబిరంబు= యుద్ధభూమి దరి వేసిన డేరా; చంద్ర+ఉదయ, ఘూర్ణమాన, మహా+అర్ణవంబును= చంద్రుడు ఉదయించే సమయంలో తిరుగుడుపడే గొప్ప సముద్రాన్ని; క్రేణి+చేయుచుండన్= పరిహసించే విధంగా ఉండగా; సూర్య+ఉదయంబు+ఐనన్= ప్రొద్దు పొడువగా (సూర్యుడు ఉదయించగా); సైన్యంబులు= సేనలు; చెలంగుచున్= ధ్వనిచేస్తూ; వెడలు+అప్పుడు= వెళ్ళే సమయంలో.

**తాత్పర్యం:** అని ఏర్పాట్లు చేసి, కొలువు చాలించి, వెళ్ళి తగిన రీతిని ఉన్నాడు. అంతట తెల్లవారింది. దుర్యోధనుడు చిరుదండనాథులను బలముగల వారినీ సేనలను యుద్ధభూమికి తరలించండని నియోగించాడు. శంఖాలు దుందుభులు మున్నగు వాద్యాలు మ్రోగాయి. అంతవరకు నిశ్శబ్దంగా ఉన్న ఆ మైదానాలలో పెద్ద గోల గందరగోళం ఏర్పడింది. దొరలు తమ తమ పరివారాలకు ఆజ్ఞలు ఇస్తున్నారు. ఏనుగులు గీపెట్టుతున్నవి. గుర్రాలు సకిలిస్తున్నవి. కదిలే రథాల చక్రాలు ఘోషిస్తున్నవి. భటులు ఒకరినొకరు రమ్మని పిలుస్తున్నారు. ఇన్ని స్వరాలు ఇన్ని శబ్దాలు కలిస్తే, చంద్రోదయ సమయంలో ఘోషించే సముద్రంవలె సేనా శిబిరం కన్పించింది. అంతట సూర్యోదయమయింది. సైన్యాలు ఉత్సాహంతో బయలుదేరేటప్పుడు-

**విశేషం:** బృంహితం ఏనుగు ఘీంకారానికి మాత్రమే పరిమితమైన శబ్దం. హేష: గుర్రం చేసే సకిలింపునకు మాత్రమే వాడబడేశబ్దం.

**తే. కనకభూషణజాలంబుకతన గజము । లెరవళులు వోవు కొండల నెనసి యొప్పె;**
**వల్గనంబుల హేషలవలన నబ్ధి । ఘనతరంగంబు లనఁ దురంగములు వొలిచె. 83**

**ప్రతిపదార్థం:** కనక, భూషణ, జాలంబు, కతనన్= బంగారు ఆభరణ సముదాయాల కారణంగా; గజములు= ఏనుగులు; ఎరవళులు+పోవు= కార్చిచ్చులతో కూడిన; కొండలన్= పర్వతాలను; ఎనసి+ఒప్పెన్= పోలి కన్పించాయి; వల్గనంబులన్= ఏకగతి వేగంలో నడవటం వలన; హేషలవలనన్= సకిలింతలచేత; అబ్ధి, ఘన, తరంగంబులు+అనన్= సముద్రంలోని పెద్ద కెరటాలు అనేటట్లుగా; తురంగములు= గుర్రాలు; పొలిచెన్= వెలుగొందాయి.

**తాత్పర్యం:** బంగారు ఆభరణాలు ఉండటం చేత ఏనుగులు మంటలు చెలరేగిన కొండలవలె కన్పించాయి; అడుగులు క్రమబద్ధంగా వేస్తూ నడవటం చేత సకిలింతల చేత గుర్రాలు సముద్రంలో చెలరేగే పెద్ద పెద్ద కెరటాలవలె భాసించాయి.

**విశేషం:** 1. వల్గనం: గుర్రం నడక. ఆ నడకలో ఒక వేగం కాళ్ళు ముందుకు పెట్టి దూకుడుగా నడవటం. ఇది పరుగెత్తటం కాదు, వల్గనం అనే శబ్దం ఒకానొక అశ్వగతికి మాత్రమే వాడబడుతుంది. అట్లే హేష - గుర్రం చేసే సకిలింపు సవ్వడికి మాత్రమే వాడబడుతుంది.

**క. అరదములు సవరణలతోఁ । బరపై యొక్కొక్క యూరి పరపున నరిగెం**
**బరుసని పలుకుల నాకృతి । పరుషత నసురాలివోలె భటతతి మెఱసెన్. 84**

**ప్రతిపదార్థం:** అరదములు= రథాలు; సవరణలతోన్= అలంకారాలతో; పరపు+ఐ= నిడివిగలట్టివై; ఒక్కొక్క= ఒక ఒక; ఊరి+పరపునన్= విస్తరించిన గ్రామం వలె; అరిగెన్= వెళ్ళాయి; భటతతి= భటుల సమూహం; పరసని పలుకులన్= కఠోరమైన మాటలచేత; ఆకృతి పరుషతన్= ఆకారముల కర్కశత్వముచేత; అసుర+ఆళి+పోలెన్= రాక్షసుల గుంపువలె; మెఱసెన్= వెలుగొందింది.

**తాత్పర్యం:** సవరణలతో గూడిన రథాలు మిక్కుటమై ఒక్కొక్క ఊరు కదలిపోతున్నదా అన్నట్లు వెళ్ళాయి. పరుషవాక్యాలతో, కఠినాకారాలతో రక్కసుల గుంపువలె, భటులగుంపు వెలుగొందింది. అనగా విస్తరించిన గ్రామాలవలె, రథాలు అలంకరింపబడిన గుర్రాలతోపాటు కదలి వెళ్ళాయి.

**వ. అట్టియెడ. 85**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**మ. పరిధానంబును దేరు నశ్వములుఁ జాపంబుం బరిస్ఫీత వ**
**జ్రరుచివ్యాప్త సువర్ణతాళమయ చంచత్కేతువున్ వర్మముం**
**గర మొప్పం దెలుపారు వెల్గొడుగుతో గంగాసుతుం డా సుధా**
**కరుఁడుంబోలె వెలింగె దర్ప మెసఁగం గౌరవ్యసైన్యాబ్ధికిన్. 86**

**ప్రతిపదార్థం:** పరిధానంబును= (ధరించిన) వస్త్రాలు; తేరున్= రథం; అశ్వములున్= గుర్రాలు; చాపంబున్= ధనుస్సు; పరిస్ఫీత, వజ్ర, రుచి, వ్యాప్త, సువర్ణ, తాళమయ, చంచత్, కేతువున్= అధికమైన వజ్రాల కాంతితో ప్రకాశించే బంగారు తాడిచెట్టుతో కూడి కదలి ఆడే జెండా; వర్మమున్= కవచం; కరము+ఒప్పన్= మిక్కుటంగా విలసిల్లగా; తెలుపారు= తెల్లనైన; వెల్‌గొడుగుతోన్= తెల్లని ఛత్రంతో; గంగాసుతుండు= గంగకొడుకు= భీష్ముడు; కౌరవ్య, సైన్య+అబ్ధికిన్= కౌరవుల సేన అనే సముద్రానికి; ఆ+సుధాకరుఁడున్+పోలెన్= ఆ చంద్రుడివలె; దర్పము+ఎసఁగన్= గర్వం,ఠీవి విలసిల్లగా; వెలింగెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** సేనాపతి అయిన భీష్ముడు కౌరవసేన అనే సముద్రానికి చంద్రునివలె ఒప్పారినాడు. భీష్ముడికి చెందిన అంశాలు అన్నీ విలక్షణాలైనవే. ఆతడి ఆహార్యం- ధరించిన వస్త్రాలు నిగనిగలాడిపోతున్నాయి. రథమా? అది సేనాధిపతి రథం అనిపిస్తున్నది. ఇక ఆ రథానికి కట్టిన గుర్రాలు, కదం త్రొక్కుతున్నవి. ధనుస్సు - వజ్రాలు పొదగబడి వెలుగొందుతున్నది. జెండా బంగారు తాడిచెట్టుతో రెపరెపలాడుతున్నది. కవచం కాంతులీనుతున్నది రథంపై తెల్లగొడుగు ప్రకాశిస్తున్నది.

**విశేషం:** తెలుపారు వెల్గొడుగుతో= తెల్లనగు తెల్లని గొడుగుతో అని తిక్కన వ్రాస్తారా? అనే సందేహం విజ్ఞులకు కల్గవచ్చు. కాని అన్ని పుస్తకాలలో ఇలాగే ఉన్నది. తెలుపారునకు బదులు పొలుపారు వెల్గొడుగుతో అన్నప్పుడు ఈ పునరుక్తి దోషం పరిహారమౌతుంది.

**సీ. కాంచనమయ వేదికా, కనత్కేతనో । జ్జ్వల విభ్రమం బొప్పఁ గలశజుండుఁ,**
**గనక గోవృషసాంద్ర కాంతి కాంతధ్వజ । విభవ విలాసంబు వెలయఁ గృపుఁడుఁ,**
**మణిసింహ లాంగూల మహితకేతుప్రభా । స్ఫురణంబు మెఱయంగ గురుసుతుండు,**
**రత్నశిలారశ్మి రాజిత కదళికా । మహిమ శోభిల్లంగ మద్రవిభుఁడు**

**తే. వెడలి తమ తమ చతురంగ వితతు లెల్ల । నుచిత గతి నూల్కొనంగఁ జేయుచుఁ గడంగి**
**సంగరోత్సవ సంభృతోత్సాహు లగుచు । నగుచుఁ దగుమాట లాడుచు నడచి రెలమి. 87**

**ప్రతిపదార్థం:** కాంచన మయ, వేదికా, కనత్+కేతన+ఉజ్జ్వల, విభ్రమంబు+ఒప్పన్= బంగారుతో నిర్మించబడిన అరుగుతో ప్రకాశించే జెండా యొక్క వైభవం విలసిల్లుతుండగా; కలశజుండు= ద్రోణుడు; కనక+గోవృష+సాంద్ర+కాంతి+కాంత+ ధ్వజ+విభవ+విలాసంబు= బంగారు ఆబోతు యొక్క దట్టమైన వెలుగులచేత ప్రకాశించే జెండా వైభవం యొక్క విలాసం; వెలయన్= విలసిల్లగా; కృపుఁడు= కృపాచార్యుడు; మణి, సింహ, లాంగూల, మహిత, కేతు, ప్రభా, స్ఫురణంబు= మణులచేత నిర్మించబడిన సింహంతోకతో గొప్పదైన జెండా కాంతుల అతిశయము; మెఱయంగన్= మిరుమిట్లు గొల్పగా; గురుసుతుండు= (ఆచార్యుడి పుత్రుడైన) అశ్వత్థామ; రత్న, శిలా, రశ్మి, రాజిత, కదళికా, మహిమ= రత్నాల రాళ్ళ వెలుగులతో భాసించే అరటిచెట్టు గొప్పదనం; శోభిల్లంగన్= విలసిల్లగా; మద్రవిభుఁడు= మద్రదేశరాజు- శల్యుడు; వెడలి= వెళ్ళి; తమ తమ, చతురంగ, వితతులు+ఎల్లన్= తమకు తమకు, సంబంధించిన (రథ, గజ, తురగ, పదాతి సమూహాలు అన్నీ); ఉచిత రీతిన్= తగు విధంగా; నూల్కొనంగన్+చేయుచున్= పురికొలుపుతూ; సంగర+ఉత్సవ+సంభృత+ఉత్సాహులు+అగుచున్= యుద్ధపు పండుగలో నిండిన ఉత్సాహం కలవారు ఔతూ; నగుచున్= నవ్వుకొంటూ; తగు, మాటలు+ఆడుచున్= తగిన పలుకులు పలుకుతూ; ఎలమిన్= సంతోషంతో; నడచిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యులవారు స్వీకరించిన జెండా బంగారంతో నిర్మింపబడిన వేదిక (యజ్ఞం ఆస్థానం) కృపాచార్యుల వారి జెండా పసిడి వన్నె చిన్నెలుగల గొప్ప ఆబోతు చిహ్నం గలది. అశ్వత్థామ జెండాపై వెలుగొందే గుర్తు మణి నిర్మితమైన సింహం తోక. రత్నాలు పొదిగి అమర్చిన అరటిచెట్టు మద్రరాజు అయిన శల్యుడి జెండాపై వెలుగొందుతుంది. ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, శల్యుడు వారి వారి జెండాలు ఆకాశంలో మిరుమిట్లుగొలుపుతూ వెలుగొందుతుండగా చతురంగ బలాలతో కదలి ఉత్సాహ సంభరితులై యుద్ధభూమికి తరలి వెళ్ళారు పరిహాస వచనాలు వెదజల్లుకొంటూ.

**విశేషం:** 1. కలశజుడు= కలశంలో పుట్టినవాడు. ఇరవై శతాబ్దిలో 'కలశజుడిని' ఉత్పత్తి చేయాలనే ప్రయత్నాలు జరుగుతున్నవి. ద్రోణుడు స్త్రీ పురుష సంగమం వలన ఉద్భవించినవాడు కాడట. 'కలశజుడు'. ఈ భావన ప్రాచీనతమ కావ్యమైన సంస్కృత మహాభారతంలోకి ఎట్లా చొరబడింది? ఇది భావి పరిశోధనల వలన తేలవలసిన అంశం.

2. అలనాటి వీరులు పతాకా ప్రియులు. దూరం నుండి జెండా చూచి ఆ రథంలో ఉన్న వీరుడిని గుర్తించగలిగేవారు.

3. వీరులు - నవ్వుతూ ఆడుతూ పాడుతూ, వినోదకేళీ విహారానికి వెళ్ళేటట్లు యుద్ధభూమికి వెళ్ళేవారట!

**క. సమరక్రీడా సన్నా । హము లొప్పఁగఁ దక్కుఁ గలుగునట్టి దొరలు ద**
**ర్పము పల్లవింప వెడలిరి । తమ తమ కేతువులు గ్రాల ధరణీనాథా! 88**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= ఓ రాజా! ధృతరాష్ట్ర మహారాజా; సమర, క్రీడా, సన్నాహములు+ఒప్పఁగన్= యుద్ధం అనే ఆటకు చేయవలసిన ప్రయత్నాలు అన్నీ వర్ధిల్లుతుండగా; తక్కు+కలుగు+అట్టి, దొరలు= మిగిలిన ప్రభువులు; దర్పము= ఆటోపం;

పల్లవింపన్= చిగురించగా; తమ తమ కేతువులు= తమ తమ జెండాలు; గ్రాలన్= మిరుమిట్లు గొలుపుతూ వెలుగొందగా; వెడలిరి= వెళ్ళారు (యుద్ధభూమికి బయలుదేరి నడిచారు).

**తాత్పర్యం:** సమర క్రీడా సన్నాహంతో మిగిలిన దొరలు యుద్ధభూమికి తమ తమ గొప్పదనం చూపిస్తూ పటాటోపంతో తమ జెండాలు మిరుమిట్లు గొలిపి వెలుగులు వెలారుస్తూ ఉండగా బయలుదేరి వెళ్ళారు.

**విశేషం:** 1. యుద్ధమును, సంస్కృతభారతంలో తిక్కన తెలుగు భారతంలో 'క్రీడ' గ అభివర్ణించటం కనిపిస్తుంది. యుద్ధం ఒక ఆట, వినోదం ఎట్లా అవుతుంది? అని నవీనులు ప్రశ్నించవచ్చును. అయితే- ఆనాటి వారు యుద్ధాన్ని మారణహోమం క్రింద పరిగణించలేదు. అయితే అది హత్యాకాండ కూడా కాదు. వీరుడు హంతకుడు కాడు. యుద్ధం రమణీయ భయానకమైన ఆట. 'మధ్యవర్తి' (రిఫరీ) లేనట్టి క్రీడా విశేషం. వీరుడును, చంపవచ్చును, లేక చావవచ్చు అక్కడ ముఖ్యమైన అంశం.

2. యుద్ధంలో రంగురంగుల జెండాలు కన్నుల పండువుగా రెపరెపలాడేవి. ప్రతివీరుడూ ప్రత్యేకమైన జెండా ఎన్నుకొనేవాడు. ఆ జెండాను, దూరం నుండి చూచి ఆ రథం ఏవీరుడిదో చెప్పగలిగేవారు. బహుశః రంగు రంగుల జెండాలు, గుర్రాలకు, ఏనుగులకు చేసిన ఆహార్యాలు యుద్ధ బీభత్సాన్ని భటులు మానసికంగా భావింపగలిగేటట్లు చేసేవి.

**వ. వా రెవ్వ రంటేని వినుము. 89**

**ప్రతిపదార్థం:** వారు= (ఆ విధంగా యుద్ధభూమికి బయలు వెడిలినవారు); ఎవరు+అంటి(వి)+ఏని= ఎవరని ప్రశ్నిస్తే; వినుము= వినుము.

**తాత్పర్యం:** వా రెవ రంటావా? చెప్పుతాను వినుము.

**క. కల్పితదృఢచతురంగా । నల్పం బై గండు మిగిలి యాదవబల మా**
**కల్పోజ్జ్వలతఁ గొలువ నవి । కల్పుఁడు గృతవర్మ సనియె గాఢస్ఫూర్తిన్. 90**

**ప్రతిపదార్థం:** కల్పిత+దృఢ+చతురంగ+అనల్పంబు+ఐ= ఏర్పాటు చేయబడిన శక్తిగల (రథ గజ అశ్వపదాతులను) నాలుగు అంగాలతో గొప్పదై; గండు మిగిలి= పరాక్రమంతో అతిశయించి; యాదవ+బలము= యాదవజాతికి చెందిన సైన్యం; ఆ కల్ప+ఉజ్జ్వలతన్= ధగధగ మెరిసే ఆహార్యంతో; కొలువన్= పరివారమై వెంటరాగా; అవికల్పుఁడు= మొక్కవోని పరాక్రమం కలవాడు- కృతవర్మ; గాఢస్ఫూర్తిన్= మిక్కిలి దర్పంతో వెలుగొందుతూ; చనియెన్= (యుద్ధభూమికి) వెళ్ళాడు.

**తాత్పర్యం:** కృతవర్మ మొక్కవోని పరాక్రమంగల మహావీరుడు. అతడి పరివారమైన యాదవ సైన్యం రథ, గజ, తురగ, పదాతులలో మిక్కిలి దృఢమైనది. ఆ భటుల ఆహార్యం, ధరించిన దుస్తులు మిల మిల మెరిసిపోతూ కన్పిస్తున్నవి. ఆతడు ఆ ప్రచండ సేనా సమూహంతో యుద్ధభూమికి కదలి వెళ్ళాడు.

**విశేషం:** యాదవులలో ప్రముఖుడు శ్రీకృష్ణుడు పాండవుల పక్షంలో ఉన్నాడు. కృతవర్మ యాదవుడే అయినప్పటికీ కృష్ణుడితో పాటు చేరలేదు. అంతేకాక అతడికి శ్రీకృష్ణుడిపైగల ద్వేషమే దుర్యోధనుడి యెడగల ప్రేమకంటె హెచ్చు. శత్రువునకు శత్రువు తనకు మిత్రుడు అనే రాజనీతి చొప్పున కృతవర్మ కౌరవ పక్షం వహించాడు. మహాభారత యుద్ధం జరిగిన తర్వాత, కౌరవ సేనలో చావక మిగిలిన వారు - రథికత్రయం, కృతవర్మ, కృపాచార్యుడు, అశ్వత్థామ. మహాభారత యుద్ధానంతరం కూడ ఆ విద్వేషాలు సమసిపోలేదు. సుమారు ముప్పదిఆరు సంవత్సరాల పిదప యాదవులలో అంతఃకలహాలు చెలరేగాయి. పాండవ పక్షాన పోరాడిన సాత్యకి, దుర్యోధన పక్షాన పోరాడిన కృతవర్మ ఆ అంతఃకలహంలో మరణించారు.

**క. రథములు దఱచై చెలువగు । పృథుసైన్యముతోడ బంధుబృందముఁ దానుం**
**బ్రథనోత్సుకవృత్తి మహా । రథుఁడు జయద్రథుఁడు వొలిచెఁ బ్రస్ఫురితగతిన్. 91**

**ప్రతిపదార్థం:** రథములు= రథాలు; తఱచు+ఐ= మిక్కిలి దట్టమై; చెలువు+అగు= అందంగా కనిపించే; పృథుసైన్యము తోడన్= పెద్ద సేనతో; బంధు+బృందము= చుట్టాల సమూహం; తానున్; ప్రథన+ఉత్సుక+వృత్తిన్= యుద్ధం చేయాలనే ఉత్సాహంతో; జయద్రథుఁడు (సైంధవుడు - సింధు దేశాధిపతి)= జయద్రథుడునే పేరుగల; మహారథుఁడు= గొప్ప రథికుడు, మహావీరుడు; ప్రస్ఫురిత గతిన్=ప్రకాశించే నడకతో; పొలిచెన్= వెలుగొందాడు.

**తాత్పర్యం:** సింధుదేశాధిపతి మహావీరుడు జయద్రథుడు తాను తన చుట్టాలతో కలిసి, క్రిక్కిరిసిన రథాలతో కూడి సుందరంగా భాసించే సైన్యంతో యుద్ధం చేయాలనే ఉత్సాహంతో బయలుదేరి వెళ్ళాడు.

**విశేషం:** 'మహారథుడు' వాచ్యార్థం గొప్ప రథం కలవాడు. అయితే మహాభారత కాలంలో వీరుల వర్గీకరణం గమనించ దగింది. 'రథికుడు' ఒక సేనాంగానికి అధినేత. అతడికి బాసటగా చతురంగ బలాలు (రథ గజ తురగ పదాతులు) ఉంటాయి. రథానికి చక్రరక్షకులు ఉంటారు. అనేక రథికులకు నాయకుడు మహారథుడు. అంతకుమించిన సైన్యం గలవాడు అతిరథుడు. అంతకంటె గొప్పవాడు అతిరథశ్రేష్ఠుడు.

**మ. చలదుర్వీధరలీలఁ గ్రాలు మదవత్సామోద్భవస్తోమ మ**
**గ్గలమై యేచిన సేన లొప్పఁగ దిశల్ గంపింప విందానువిం**
**దులుఁ గాళింగ మహీవిభుండు భగదత్తుండున్ భవత్సేనయో**
**ధులకుం గన్నుల పండువై నడచి రుత్తుంగాంగ సంరంభులై. 92**

**ప్రతిపదార్థం:** చలత్+ఉర్వీధర+లీలన్= నడిచే కొండలవలె; క్రాలు= వెలుగొందే; మదవత్+సామోద్భవ, స్తోమము= దానజలధారలుగల ఏనుగుల గుంపులు; అగ్గలము+ఐ= అతిశయించి; ఏచిన= విజృంభించిన; సేనలు= సైన్యాలు; ఒప్పఁగన్= విలసిల్లగా; దిశల్= దిక్కులు; కంపింపన్= కదలగా; వింద+అనువిందులు= విందుడు, అనువిందుడు అనేవారు (అన్నదమ్ములు); కాళింగ+మహీవిభుండు= కళింగ దేశం పరిపాలించే రాజు; భగదత్తుండున్= భగదత్తుడును; భవత్+సేన+యోధులకున్= నీ సేనలలోని వీరులకు; కన్నుల+పండువు+ఐ= చూడటానికి అందంగా; ఉత్తుంగ+అంగ+సంరంభులు+ఐ= ఎత్తైన దేహాల సంరంభం కలవారలై; నడచిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** నీ సేనలలోని వీరులు అందరూ కన్నుల పండువుగా చూస్తూ ఉండగా, విందుడు అనువిందుండు అనే రాజ సోదరులు, కళింగరాజు భగదత్తుడు, నడచే కొండలవలె భాసించే ఏనుగుగుంపులతో పొంగారే ఉత్సాహంతో యుద్ధభూమికి బయలుదేరి వెళ్ళారు.

**విశేషం:** 1. మదించిన ఏనుగుల కుంభస్థలం నుండి పరిమళ పూరితమైన మదజలం స్రవిస్తూ ఉంటుందని కవులు వర్ణించారు.

2. విందానువిందులు, కళింగ ప్రభువు, భగదత్తుడు మత్తేభయూధాలకు ప్రసిద్ధి చెందినవారు. వారు అంగసౌష్ఠవం గల ఆజానుబాహులు. భగదత్తుడి ఏనుగు పేరు సుప్రతీకం.

3. మహాభారత సంగ్రామం - సమకాలీన వీరులకు తమ పరాక్రమ ప్రాభవాలు ప్రదర్శించుకొనేందుకు అవకాశం కల్పించింది. అక్కడ ముఖ్యమైనని జయాపజయాలు కాదు. తమ తమ పరాక్రమ ప్రదర్శనమే. కళింగదేశం పౌరాణిక కాలంలోనేకాక చారిత్రక కాలంలో గూడ ఏనుగులకు ప్రసిద్ధి కెక్కింది. కళింగరాజు 'గజపతి'గా చరిత్రలో సుప్రసిద్ధుడు.

**క. కొడుకులుఁ దమ్ములు గుఱ్ఱపు । దడములుఁ బెక్కైన బలవితానముఁ దగుమై**
**నడపించుచు మెలుపున సం । గడములతో నరుగు శకుని గడు నొప్పారెన్. 93**

**ప్రతిపదార్థం:** కొడుకులున్= పుత్రులు; తమ్ములున్= తనకంటె వయస్సులో చిన్నవారైన సోదరులు; గుఱ్ఱపు దడములు= అశ్వసేనలు; పెక్కు+అయిన+బలవితానము= ఎక్కువ అయిన సేనాసమూహం; తగుమైన్= తగినట్లుగా, క్రమబద్ధంగా; నడపించుచున్= వెడల చేస్తూ; మెలుపునన్= ఒడుపుతో; సంగడములతోన్= స్నేహితులతో; అరుగు= వెడలే; శకుని= శకుని (దుర్యోధనాదుల మేనమామ); కడున్= ఎక్కువగా; ఒప్పారెన్= వెలుగొందాడు.

**తాత్పర్యం:** తన కొడుకులతో, గుర్రపు దళాలతో; పెద్ద సైన్యంతో - క్రమబద్ధంగా నడిపిస్తూ, సపరివారంగా యుద్ధభూమికి వెడలే శకుని వెలుగొందాడు.

**విశేషం:** శకుని గాంధార దేశాధిపతి. జూదం ఆటలో గడుసరి. దుష్టచతుష్టయంగా ప్రసిద్ధికెక్కిన వారు (దుర్యోధనుడు, దుశ్శాసనుడు, శకుని, కర్ణుడు), గాంధార దేశం గుర్రాలకు పేరు కెక్కింది. గుర్రాల నడక క్రమబద్ధంగా భాసిస్తుంది.

**మ.** **తనతోఁ గాల్బురు సాలఁ గల్గు బలసంతానంబుతోఁ బ్రీతిఁ బు**
**త్రుని వీరోత్తము సోమదత్తు విలసద్దోర్దర్ప దుర్దాంతుఁ బౌ**
**త్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు నింద్రుం గ్రేణి సేయంగ నే**
**చిన పెంపొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునం బోరికిన్.** 94

**ప్రతిపదార్థం:** తనతోన్= తనకు తోడుగా (బాహ్లికుడికి బాసటగా); కాల్బురు= పదాతి భటులు; చాలన్= మిక్కుటంగా; కల్గు= ఉన్న; బల+సంతానంబుతోన్= సేనల సమూహాలతో; ప్రీతిన్= ఇష్టంగా; పుత్రుని= కొడుకును; వీర+ఉత్తమున్= శూరులలో గొప్పవాడైన; సోమదత్తున్= సోమదత్తుడు అనే పేరుగలవాడిని; విలసత్+దోః+దర్ప+దుర్దాంతున్= ప్రకాశించే భుజపరాక్రమంయొక్క ఆటోపం చేత దుస్సహుడు అయిన వాడిని; పౌత్రునిన్= కొడుకు కొడుకును; భూరిశ్రవసున్= భూరిశ్రవసుడు అనే పేరుగల వాడిని; కనుంగొనుచున్= చూస్తూ; ఇంద్రున్= వేల్పుదొరను (స్వర్గలోకాధిపతిని); క్రేణి+చేయంగన్+ఎంచిన= పరిహసింప జాలిన; పెంపు+ఒప్పఁగన్= గొప్పదనము విలసిల్లగా; బాహ్లికుండు= బాహ్లికుడు; పోరికిన్= యుద్ధానికి; నిశ్చితంబునన్= జంకులేకుండగా; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** మిక్కుటమైన కాల్బలముగల సైన్యంతో బాహ్లికుడు వీరోత్తముడైన కుమారుడు సోమదత్తునితో, ప్రకాశించే భుజపరాక్రమాటోపంచేత అణచరానివాడైన తన మనుమడు భూరిశ్రవునితో-దేవేంద్రుని పరిహసించగల గొప్పతనంతో యుద్ధభూమికి నిశ్చింతగా వెళ్ళాడు.

**విశేషం:** 1. బాహ్లికుడు యుద్ధానికి వెళ్ళటాన్ని తిక్కన ఒక చక్కని చిక్కని మత్తేభవృత్తంలో వర్ణించాడు. మహాభారత సంగ్రామంలో పాల్గొన్న వృద్ధవీరులలో ప్రముఖులు బాహ్లికుడు, భీష్ముడు, భగదత్తుడు. బాహ్లికుడిలో ఇంకో విశేషం ఉన్నది. మూడు తరాల వారు ఆతడి సేనలో ఉన్నారు. బాహ్లికుడూ, అతడి కొడుకు సోమదత్తుడూ, సోమదత్తుడి కొడుకు భూరిశ్రవసుడూ. ముగ్గురూ పేరుకెక్కిన వీరాధివీరులే.

**వ.** **కాంభోజరా జగు సుదక్షిణుం డక్షీణ విభవంబున వెడలె; మఱియుం గోసలపతి యగు బృహద్బలుండును, మాహిష్మతీ పురనాథుం డగు నీలుండును, త్రిగర్తేశ్వరుం డగు సుశర్మయు, నసురేంద్రులగు నలంబస హలాయుధులును, సాల్వ సౌవీర శూరసే నాభీర యవన వసుధాధిపులును లోనుగా ననేక దేశాధీశు లాత్మీయ చతురంగ బలసమన్వితులును నిజధ్వజ విరాజమానులును నానాభరణోజ్జ్వలాంగులును నయి సంగర కౌతుకంబు మొగంబులం దొంగలింప నరిగి ; రివ్విధంబునం బది యక్షౌహిణులు నడవం బదునొకండవ యక్షౌహిణితోఁ గురుక్షోణీవల్లభుండు విస్ఫురిత భూషణభూషితం బైన గంధ సింధురంబు నెక్కి వెలి గొడుగులు మెఱయం దొడవులం దఱచైన వజ్రంబుల యుద్దామంబు లగు**

**దీధితిస్తోమంబులును జామరంబులుం గలయం బొలయ బహురత్నప్రభా విభాసితం బయిన భుజంగకేతనంబు గ్రాలఁ గెలంకుల దుశ్శాసన దుర్మర్షణ వివింశతి వికర్ణాదు లగు సోదరులు వాహన వల్గనంబులు మెఱసి మెఱుఁగారు తమ తమ సిడంబు లుల్లసిల్లం జెలువు మిగిలి చనుదేరం జనియె; నిట్లు కౌరవసైన్యంబు గూడికొని కోదండ గదాదండ కుంత క్షురికా ముసల ముద్గర తోమర పరశు భిందిపాల శూల ప్రముఖ నిఖిల హేతివ్రాతంబులను భర్మపరికర్మ నిర్మాణశోభిత వర్మంబులును వివిధవర్ణ విచిత్ర తనుత్రాణంబులును, మణిగణోజ్జ్వలజ్వాలాజటిల కేతనంబులం బరమాభీలసుందర సమ్మర్దం బయ్యె; న ట్లున్న యప్పుడు. 95**

**ప్రతిపదార్థం:** కాంభోజ+రాజు+అగు= కాంభోజ దేశానికి పరిపాలకుడు అయిన; సుదక్షిణుండు= సుదక్షిణుడు; అక్షీణ, విభవంబునన్= గొప్ప ఐశ్వర్యంతో; వెడలెన్= వెళ్ళాడు; మఱియున్= అంతేకాక; కోసల+పతి+అగు= కోసల దేశానికి రాజు అయిన; బృహద్బలుండును= బృహద్బలుడూ; మాహిష్మతీ, పుర, నాథుండు+అగు= మాహిష్మతీ నగరం ఏలే రాజు; నీలుండును= నీలుడూ; త్రిగర్త+ఈశ్వరుండు+అగు= త్రిగర్త దేశాధిపతి అయిన; సుశర్మయు; అసుర+ఇంద్రులు+అగు= రాక్షస ప్రముఖులు అయిన అలంబస హలాయుధులును; సాల్వ, సౌవీర, శూరసేన+ఆభీర, యవన, వసుధా+అధిపులును= సాల్వసౌవీర శూరసేన ఆభీర, యవన రాజులును; లోనుగాన్= మొదలగు; అనేక దేశ+అధీశులు= పెక్కు దేశాలను పరిపాలించే రాజులూ; ఆత్మీయ, చతురంగ, బల, సమన్వితులును= తమకు చెందిన నాలుగు అంగాలుగల సేనలతో కూడిన వారూ; నిజ, ధ్వజ, విరాజమానులును= తమకు ప్రత్యేకమైన జెండాలతో భాసించే వారూ; నానా+ఆభరణ+ఉజ్జ్వల+అంగులును= పెక్కు రకాల భూషణాలలో వెలుగొందే శరీరాలు గలవారూ; అయి; సంగర+కౌతుకంబు= యుద్ధమునందలి కుతూహలంతో; మొగంబులన్= ముఖాలపై; తొంగలింపన్= ప్రతిఫలించగా; అరిగిరి= (యుద్ధభూమిని) వెళ్ళారు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; పది+అక్షౌహిణులు= పది అక్షౌహిణులు నిర్ణీత సంఖ్యలో చతురంగబలాలు గల సేనలు; నడవన్= తరలగా; పదునొకండవ+అక్షౌహిణితోన్- పదకొండో అక్షౌహిణితో; కురుక్షోణీ వల్లభుండు= కురురాజ్యనేత- దుర్యోధనుడు; విస్ఫురిత, భూషణ, భూషితంబు+ఐన= దేదీప్యమానంగా ఆభరణాలతో అలంకరించబడిన; గంధ+సింధురంబున్= మదపుటేనుగును; ఎక్కి= అధిరోహించి; వెలిగొడుగులు= తెల్లగొడుగులు; మెఱయన్= ప్రకాశించగా; తొడవులన్= ఆభరణాలందు; తఱచు+ఐన= దట్టమైన; వజ్రంబుల= రవ్వలతోను; ఉద్దామంబులు+అగు= గొప్పవి అగు; దీధితి స్తోమంబులన్= వెలుగుల సముదాయాలతో; చామరంబులున్+కలయన్+పొలయన్= చమరీమృగం వెంట్రుకలతో గూర్చిన వీవెనల కలిసి మెలిసి; బహు రత్న ప్రభా విభాసితంబు+అయిన= పెక్కురత్నాల కాంతులతో వెలుగొందుతున్న; భుజంగ, కేతనము= పాము బొమ్మ ఉన్న జెండా; క్రాలన్= మిరుమిట్లతో ప్రకాశించుండగా; కెలంకులన్= ఇరువైపుల; దుశ్శాసన దుర్మర్షణ వివింశతి వికర్ణ+ఆదులు+అగు= దుశ్శాసనుడు, దుర్మర్షణుడు, వివింశతి, వికర్ణుడు మున్నగు; సోదరులును= తమ్ములూ; వాహన+వల్గనంబులు= గుర్రాల గిట్టల చప్పుడు నడకలు; మెఱసి+మెఱుఁగారు= మిరుమిట్లు గొలిపే; తమతమ సిడంబులు= జెండాలు; ఉల్లసిల్లన్= శోభిల్లగా; చెలువు, మిగిలి= అందం అతిశయించి; చనుదేరన్= రాగా; చనియెన్= యుద్ధభూమికి వెళ్ళాడు; ఇట్లు= ఈ రీతిగా; కౌరవ+సైన్యంబు= కౌరవుల సేనతో; కూడికొని= కలిసి; కోదండ, గదాదండ, కుంత, క్షురికా, ముసల, ముద్గర, తోమర, పరశు, భింది పాల, శూల, ప్రముఖ, నిఖిల, హేతి, వ్రాతంబులన్= ధనుస్సు, నడికట్టు, ఈటె, చిన్న కత్తి, రోకలి, ఇనుపగుదియ, చిల్లకోల, గండ్రగొడ్డలి, రెండు మూడు నాల్కలుగల పెద్దసూది, ఈటె మొదలైనటువంటి అన్ని ఆయుధాలగుంపుతో; భర్మ, పరికర్మ, నిర్మాణ, శోభిత, వర్మంబులును= బంగారుతో చేయబడి శరీరమందలి మురికి పోగొట్టేటట్లు తయారు చేయబడిన కవచాలూ; వివిధ, వర్ణ, విచిత్ర, తనుత్రాణంబులును= పెక్కురంగులతో ఆశ్చర్యకరంగా కనుపించే శరీర రక్షలును; మణి, గణ, ఉజ్జ్వల, జ్వాలా, జటిల, కేతనంబులన్= మణుల సముదాయాల యొక్క కాంతుల మంటలతో దట్టమైన జెండాలతో; పరమ+ఆభీల, సుందర, సమ్మర్దంబు+అయ్యెన్= మిక్కిలి భయంకరంగానూ అందంగాను దట్టంగాను కన్పించింది; అట్లు+ఉన్న+అప్పుడు= ఆ రీతిగా ఉన్నప్పుడు.

**తాత్పర్యం:** కాంభోజ దేశాన్ని పరిపాలించే రాజు సుదక్షిణుడు గొప్ప వైభవంతో యుద్ధభూమికి తరలివెళ్ళాడు. కోసల దేశరాజు, బృహద్బలుడు, మాహిష్మతీ నగరాన్ని ఏలే ప్రభువు నీలుడు, త్రిగర్తదేశాధిపతి సుశర్మ, రాక్షస నాయకులగు అలంబసుడు, హలాయుధుడు, సాల్వ, సౌవీర, శూరసేన, ఆభీర, యవన, రాజులు మున్నగు అనేక దేశాలను పరిపాలించే ప్రభువులు రథ, గజ, తురగ భట బలాలతో తమ జెండాలు కన్నుల పండువుగా శోభిలుతుండగా, అనేకాలైన ఆభరణాలు శరీరాలపై వెలుగొందుతుండగా యుద్ధం చేయాలనే ఉత్సాహం మొగాలలో తాండవిస్తూ ఉండగా యుద్ధభూమికి వెడలసాగారు.

ఈ విధంగా పది అక్షౌహిణుల సైన్యం తరలి వెళ్లగా, పదకొండో అక్షౌహిణిబలంతో కురుపతి దుర్యోధనుడు ఆభరణాలతో శోభిల్లే మదపు టేనుగును అధిరోహించి యుద్ధానికి తరలివెళ్ళాడు. తెల్లని గొడుగులు అతడి శిరసుపై ప్రకాశించాయి. వజ్రాల తళతళలతో మిరుమిట్లు గొలిపే చామరాలు అతడికి వీస్తున్నారు. రత్నాలు పొదిగిన భుజంగకేతనంతో అతడు ప్రకాశించాడు. అతడి తమ్ములు దుశ్శాసనుడు, దుర్మర్షణుడు, వివింశతి, వికర్ణుడు మొదలైనవారు తమ తమ వాహనాలలో జెండాలతో అతడి వెంట వెళ్ళారు.

ఈ విధంగా యుద్ధానికి సన్నద్ధుడై తరలి వెళ్ళే ఆ కురుసేనలో ధనువులు, గదలు, ఈటెలు, వంకర కత్తులు, రోకళ్ళు, ఇనుపగుదియలు, చిల్లకోలలు, గండ్రగొడ్డళ్ళు, రెండు మూడు నాల్కలుగల పెద్ద సూదులు, బల్లెములు అన్ని ఆయుధాలు కన్పించాయి. బంగారు కవచాలు రంగు రంగుల తనుత్రాణాలు మణులతో పొదగబడిన జెండాలు గల ఆ కౌరవసైన్యం సుందరంగా భయంకరంగా దట్టంగా కనుపించింది.

**విశేషం:** 1. మహాభారత యుద్ధంలో నేటి భారత దేశం ఎల్లలు దాటిన కాంభోజదేశం నుండి సేనలు యవనులు రాక్షసులు కూడా పాల్గొనటం ఒక విశేషం. ఒక విధంగా అది తొలి ప్రపంచ యుద్ధం.

2. అలనాటి వీరులు యుద్ధాన్ని ఒక వినోద విహార క్రీడగా భావించారు.

3. ఆనాటి ఆయుధ విశేషాలు ధనువులేగాక ఎన్నో రకాలు ఉన్నాయి.

4. ఇక కవచాలు. కవచాల వంటి తను త్రాణాలు. కవచం కడుపును, వక్షఃస్థలాన్నీ రక్షిస్తుంది. మిగిలిన అవయవాలను రక్షించేవి తను త్రాణాలు. శిరస్కం, ముఖత్రాణం, దలపం, ఉదరత్రాణం, నాగోదం, జంఘాత్రాణం, మంఖుణం, బాహుత్రాణం, బాహులం, అంగుళీత్రాణం, గోధ.

5. అక్షౌహిణి: ఇరవై ఒక్కవేల ఎనిమిది వందల రథాలు, అన్ని యేనుగులు, అరవై వేల ఆరువందల గుర్రాలు, లక్షా తొమ్మిదివేల మూడు వందల ఏభైమంది కాల్బలం కలిస్తే ఒక అక్షౌహిణి అని గణితం. ప్రతి రథానికి నలుగురు చక్రరక్షకులు ఉంటారు. అట్టి 18 అక్షౌహిణులు కురుక్షేత్రంలో చేరాయి.

**తే.** **అమరు తొడవుల వజ్రాంశు లంచపిండు । కరణి హరినీలములఁ బేర్చుకాంతి యళుల**
**పగిది మాణిక్యరుచి పద్మభంగి మెఱయఁ । గురుబలంబు గెందామర కొలనిఁ బోలె.** **96**

**ప్రతిపదార్థం:** అమరు, తొడవుల= పొందిక పడిన ఆభరణాలయొక్క; వజ్ర+అంశులు= రవలకాంతులు; అంచ, పిండు, కరణిన్= హంసల సముదాయాలవలె; హరినీలములన్+పేర్చు, కాంతి= ఇంద్రనీలమణుల అధికమైన వెలుగు; అళుల పగిదిన్= తుమ్మెదలవలె; మాణిక్య+రుచి= కెంపుల కాంతి; పద్మభంగిన్= పద్మాలవలె; మెఱయన్= వెలుగొందగా; కురు+బలంబు= కౌరవసేన; కెందామర కొలనిన్= ఎర్ర దామర పువ్వులతో కూడిన సరస్సును; పోలెన్= పోలింది.

**తాత్పర్యం:** ఆభరణాలలోని వజ్రాల కాంతులు హంసలవలె ఉన్నాయి. ఇంద్రనీలమణుల వెలుగులు తుమ్మెదలవలె ఉన్నాయి. కెంపుల కాంతులు పద్మాలవలె భాసించాయి. కౌరవసేన ఎర్రతామరలు వికసించిన సరోవరం వలె వెలుగొందింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టియెడ భీష్ముండు భూవల్లభులనెల్లం గూడం బిలిపించి వారలతో నిట్లనియె. 97**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; భీష్ముండు= భీష్ముడు; భూవల్లభులన్+ఎల్లన్= రాజులను అందరను; కూడన్+పిలిపించి= సమావేశం అయ్యేటట్లు ఆహ్వానించి; వారలతోన్= వారితో; ఇట్లు అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో సేనాపతి అయిన భీష్ముడు రాజులను అందరను ఒక చోట సమావేశపరచి ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** భీష్ముడు సేనాధిపతి గనుక వీరులకు ప్రబోధం చేయటం అతడి ప్రథమ కర్తవ్యం.

**భీష్ముఁడు నిజయోధులకెల్ల నుత్సాహంబుగాఁ దెగువ సెప్పుట (సం. 6-17-7)**

**క. 'ఆరయ వివృతస్వర్గ । ద్వారము రాజులకు నాహవం; బందు మహో**
**దారులు దొల్లియు నరిగిరి; । మీ రీ మార్గమున నడవ మెయికొనుటొప్పున్. 98**

**ప్రతిపదార్థం:** ఆరయన్= పరీక్షించి చూడగా; ఆహవంబు= యుద్ధం; రాజులకున్= ప్రభువులకు; వివృత, స్వర్గ, ద్వారము= తెరచబడిన స్వర్గం యొక్క తలుపు- అనగ ప్రవేశమార్గం; మహా+ఉదారులు=గొప్పవారు; తొల్లియున్=పూర్వంకూడా; అందున్= (ఆ ద్వారమునందు); అరిగిరి= వెళ్ళారు; మీరు= రాజులైన మీరు; ఈ మార్గమునన్= ఈ దారినే; నడవన్, మెయికొనుట+ఒప్పున్= నడవటానికి ఇష్టపడటం మంచిది.

**తాత్పర్యం:** ఆలోచించి చూస్తే, రాజులకు యుద్ధం స్వర్గంలో ప్రవేశించటానికి తెరువబడిన ద్వారం. పూర్వకాలంలో ఎందరో గొప్పవారు ఈ దారినే వెళ్లారు. మీరు ఈ మార్గంలో నడవడానికి ఇష్టపడటం తగినది.

**విశేషం:** యుద్ధభూమిలో మరణించిన వీరులు (వీరుల ఆత్మలు) స్వర్గలోకంలోకి వెళ్ళగలవు అనే నమ్మకం ప్రాచీనకాలంలో వీరులకు ఉండేది.

**క. ఇంటం దెవులునఁ జచ్చుట । కంటెను బాపంబు లొండు గలవె నృపులకున్?**
**బంటకలను పొలిగల నిది । గంట నిధానంబు గంట గాదే మనకున్?' 99**

**ప్రతిపదార్థం:** నృపులకున్= రాజులకు; ఇంటన్= గృహంలో; తెవులునన్= జబ్బుతో; చచ్చుట కంటెను= మరణించటం కంటె; పాపంబులు= పాపాలు; ఒండు= వేరు; కలవు+ఎ?= ఉన్నాయా?; పొలిగలను= యుద్ధభూమి; పంటకలను= పంటభూమి; ఇది= ఇది; కంట= చూడటం; మనకున్= మనకు; నిధానంబు= ధననిధిని; కంట= చూడటం; కాదు+ఏ?= కాదా?

**తాత్పర్యం:** ఇంటిలో జబ్బు చేసి మంచమెక్కి బాధపడుతూ మరణించటం కంటే రాజులకు వేరే పాపం ఏమీ ఉండదు. రణరంగమే రాజులకు పంట చేను. యుద్ధభూమిని దర్శించటం అంటే రాజులు పెన్నిధిని పొడగాంచినట్లే.'

**తే. అనిన విని వార లందఱు నగ్గలికలు । నెఱయు మాటలఁ దనతన తెఱఁగు మెఱయ**
**బహువిధంబుల నతనికి బాస యిచ్చి । యేచి నిజసైన్యములలోని కేఁగి రథిప! 100**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (భీష్ముడు) పలుకగా; విని= ఆలకించి; వారలు+అందఱున్= ఆ రాజులు అందరూ; అగ్గలికలు= ఉత్సాహాలు; నెఱయు+మాటలన్= అతిశయించే పలుకులతో; అతనికిన్= సేనాపతి అయిన భీష్ముడికి; బహువిధంబులన్= ఎన్నో రీతుల; బాస+ఇచ్చి= ప్రతిజ్ఞలు చేసి; అధిప!= ఓరాజా! (ధృతరాష్ట్ర మహారాజా!); ఏచి= పూని; నిజ+సైన్యములలోనికిన్= తమ సేనలలోనికి; ఏఁగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సేనాపతి అయిన భీష్ముడు ఆ విధంగా ప్రబోధించగా విని, యుద్ధం చేయటానికి వచ్చిన ఆ రాజులు అందరూ ఉత్సాహంతో పొంగి పోయి అతడి యెదుట ఎన్నో విధాలుగా శపథాలు చేసి తమ తమ సేనలలోనికి వెళ్ళి నిలిచారు.

**వ. అయ్యవసరంబున గాంగేయుండు గాంధారేయు నాలోకించి 'మదీయ సంగర సమయంబునఁ గర్ణుండు పుత్త్రమిత్త్రామాత్యబంధు సహితంబుగాఁ గయ్యంబునకు రాకుండం గలవాడని తేటపడం బలికిన. 101**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; గాంగేయుండు= గంగ కొడుకు- భీష్ముడు; గాంధారేయున్= గాంధారి కొడుకును దుర్యోధనుడిని; ఆలోకించి= చూచి; మదీయ, సంగర, సమయంబునన్= నేను యుద్ధం చేసే కాలంలో; కర్ణుండు= కర్ణుడు; పుత్త్ర మిత్ర అమాత్య బంధు సహితంబుగాన్= కొడుకులతో, స్నేహితులలో, మంత్రులలో, చుట్టాలతోపాటు; కయ్యంబునకున్= యుద్ధానికి; రాకుండన్+కలవాఁడు= రాగూడదు; అని= అని; తేటపడన్+పలికినన్= సుస్పష్టంగా చెప్పిన.

**తాత్పర్యం:** ఆ సమయంలో భీష్ముడు దుర్యోధనుతో ఈ విధంగా అన్నాడు. 'ఓ దుర్యోధనా! నీ మిత్రుడైన కర్ణుడు నేను యుద్ధం చేసేటప్పుడు తాను యుద్ధంలో పాల్గొనరాదు. అట్లే అతడి కొడుకులు స్నేహితులు మంత్రులు, చుట్టాలు సయితం యుద్ధంలో పాల్గొనరాదు.

**విశేషం:** 1. దుర్యోధనుడు భీష్ముడిని సేనాపతిగా నియమించి, ఉభయ పక్షాలలోని యోధుల శక్తిసామర్థ్యాల తారతమ్యాలు వెలకట్టి చెప్పుమని అర్థించాడు. భీష్ముడు వీరులందరినీ పొగడి కర్ణుడిని 'అర్ధరథుడు' అని చెప్పాడు. అనగా వీరులలో రథుడు, మహారథుడు, అతిరథుడు, అతిరథశ్రేష్ఠుడు ఉత్తరోత్తర బలీయములైన పదవులు. వీరులలో అందరి కంటె తక్కువ వాడు రథుడు. ఇక అర్ధరథుడు అంతకంటె మిక్కిలి అధముడు అన్నమాట. అప్పుడు కర్ణుడు కోపించి భీష్ముని నాయకత్వంలో తాను యుద్ధం చేయనని ప్రతిజ్ఞ చేశాడు.అందుచేత భీష్ముడు ఈ మాట చెప్పవలసి వచ్చింది దుర్యోధనునితో.

2. అయితే భీష్మ పతనానంతరం కర్ణుడు రహస్యంగా భీష్ముడిని కలిసికొని అతడికి తన మన్నన తెలిపాడు. భీష్ముడు గూడ కర్ణుని లోకోత్తర వీరుడిగా ప్రశంసించాడు! ఒకనాడు ఆ భీష్ముడేకదా కర్ణుడిని అర్ధరథుడు అని అన్నది!? భీష్ముడిని తూలనాడిన ఆ కర్ణుడే భీష్ముడికి పాదాభివాదం చేశాడు. మానవ మనస్తత్వాన్ని మథించిన మహాభారతంలోనే ఇట్టి విచిత్ర విరోధాభాసం వర్ణించబడింది.

**క. ' చలముకొని యొరుల నుడుపుట । బలియుండై తెంపు సేసి బవరమునకుఁ దాఁ**
**దెలియుట గాదే!' యని కురు । కులముఖ్యుఁడు వొంగి యతనిఁ గొనియాడెఁ దగన్. 102**

**ప్రతిపదార్థం:** చలము+కొని= మిషపెట్టి; ఒరులన్= ఇతరులను; ఉడుపుట= నిగ్రహించటం; బలియుండు+ఐ= బలంకలవాడై; తెంపు+చేసి= చొరవ వహించి; బవరమునకున్= యుద్ధానికి; తాన్= తానై; తెలియుట+కాదే!= పూనిక వహించటమే కదా!; అని= అని పల్కి; కురు కుల ముఖ్యుఁడు= కౌరవ శ్రేష్ఠుడు- దుర్యోధనుడు; పొంగి= (ఉత్సాహంతో) అతిశయించి; అతనిన్= (భీష్ముడిని); తగన్= తగునట్లుగ (యథోచితంగా); కొనియాడెన్= ప్రశంసించాడు.

**తాత్పర్యం:** 'నెపం పన్ని ఇతరులను ప్రక్కకు నెట్టివేయటం అంటే యుద్ధంలో తానే బలవంతుడై బాధ్యత వహించి పోరాడటానికీ సంసిద్ధం కావటమేగదా' అని దుర్యోధనుడు భీష్ముడిని పొగిడాడు.

**విశేషం:** 1. దుర్యోధనుడికి కర్ణుడికిగల మైత్రి జగత్ప్రసిద్ధం. అయితే, సేనాపతి అయిన భీష్ముడు కర్ణుడిని- యుద్ధంలోకే రాకూడదు అని నిషేధించాడు. ఇది దుర్యోధనునికి బాధ కలిగించే అంశమే. అయినప్పటికీ, ఆతడు భీష్ముడిని ప్రశంసించాడు. 'కర్ణుడిని రావద్దంటే - భీష్ముడే యుద్ధ బాధ్యత సర్వం తనమీద వేసుకొన్నట్లేకదా!' అన్నాడు తెలివిగా పరిపాలనాదక్షుడైన దుర్యోధనుడు.

2. చలము అన్న మాట ఇక్కడ మిక్కిలి అర్థవంతమైనది. వాది ఒక అర్థంలో ప్రయోగించిన శబ్దానికి ప్రతివాది, మరి యొక అర్థం కల్పించి చేయు దూషణ. ఇది జల్ప దోషాలలో ఒకటి. ఛల శబ్దప్రయోగంవలన కర్ణుడిపై దుర్యోధనుడికి గల ఆంతరంగిక సానుభూతి స్వయం వ్యక్తమైంది.

**వ. ఇట్లు పితామహు నెత్తికోలునకుం జిత్తంబు వికసిల్ల ననుజసహితంబుగా నతనిం బరివేష్టించి యన్నరపతి 'నిబిడచారుసన్నాహంబుగా నుచితవ్యూహం బమర్పు' మని యతనికిం జెప్పిన, నతండును బడమరమొగం బయి తానును ద్రోణుండును దాలధ్వజంబును వేదికాకేతనంబును గ్రాలుచుండ ముందఱ నిలిచి వలపటఁ గృపాశ్వత్థామలును దాపటం గృతవర్మమద్రేశ్వరులును వెనుక బాహ్లిక సోమదత్త భూరిశ్రవసులును నడుమం గురుకుమారసమేతంబుగా నమ్మహీనాథుండును, నతని యగ్రభాగంబున 'నర్జునుం జంపుదుము చత్తు మింతియ కాని యొండులే' దని శపథంబులు పలికి సంశప్తకు లనం బ్రఖ్యాతు లయిన సుశర్మ మొదలుగాఁ గల పదివేవురు రథిక ముఖ్యులును గలయ నెడనెడం దక్కిన యోధవీరులును నిలుచునట్లుగా నియమించి, తగ నయ్యైసైన్యంబుల కేనుంగులు నేనుంగుల కరదంబులు నరదంబులకుం దురంగంబులుఁ దురంగంబులకు విండ్లవారు విండ్లవారికి నద్దాయుధులు నడ్డం బగు తెఱంగున నిలువ నియోగించి, మానుషవ్యూహంబు సమకట్టిన, నెన్నండును నిట్టి దృఢవ్యూహంబు గనియును వినియు నెఱుంగమని యెల్లవారు నచ్చెరువునం బొరయుచుఁ బ్రియంబందుచుండిరి; బృందారక ప్రముఖ దేవయోనులును దివంబున నున్న పురాతన ధరారమణులును భారత రణంబు గనుంగొను కుతూహలంబున వివిధ విమానారూఢులై యేతెంచి; రంతకు మున్న యక్కడ. 103**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పితామహు+ఎత్తికోలునకున్= తాతగారి నిర్ణయానికి, భీష్ముడి నిర్ధారణకు; చిత్తంబు= మనస్సు; వికసిల్లన్= వికసించగా; అనుజ, సహితంబుగాన్= తమ్ములతో గూడ; అతనిన్= భీష్ముడిని; పరివేష్టించి= చుట్టూ వినయంగా చేరికొలిచి; ఆ+నరపతి= ఆ రాజు - దుర్యోధనుడు; నిబిడ, చారు, సన్నాహంబుగాన్= దట్టమైన, అందమైన, యుద్ధ ప్రయత్నాలతో కూడినదై; ఉచిత, వ్యూహంబు+అమర్పుము+అని= తగిన వ్యూహం ఏర్పాటు చేయుము అని; ఆతనికిన్= (భీష్ముడికి); చెప్పినన్; అతండును= (భీష్ముడును); పడమర+మొగంబు+అయి= పడమటి దిక్కువైపు ముఖము కన్పించునట్లుగా; తానును= (భీష్ముడును); ద్రోణుండును= ద్రోణుడును; తాల+ధ్వజంబును= తాడిచెట్టు జెండా; వేదికా+కేతనంబును= యజ్ఞంకోసం అమర్చబడిన తిన్నెగల జెండా; క్రాలుచుండన్= మిరుమిట్లు గొలుపుతూ వెలుగొందుతుండగా; ముందరన్+నిలిచి= అగ్రభాగంలో నిలిచి; వలపటన్= కుడివైపు; కృప+అశ్వత్థామలును= కృపాచార్యుడును, అశ్వత్థామయును; దాపటన్= ఎడమ ప్రక్కగా; కృతవర్మ, మద్ర+ఈశ్వరులున్= కృతవర్మ, శల్యుడును; వెనుకన్= వెనుకభాగంలో; బాహ్లిక, సోమదత్త, భూరిశ్రవసులును= బాహ్లికుడు, (అతని కొడుకు సోమదత్తుడు) సోమదత్తుని కొడుకు భూరి శ్రవసుడును; నడుమన్= మధ్యభాగమందు; కురు, కుమార, సమేతంబుగాన్= కురుకుమారులతోపాటుగా; ఆ+మహీనాథుండును= ఆ రాజు (దుర్యోధనుడు); అతని+అగ్రభాగంబునన్= ఆతడిముందు; అర్జునున్= అర్జునుడిని; చంపుదుము= సంహరిస్తాము; చత్తుము= మరణిస్తాము; ఇంతియ కాని= ఇంతేకాని; ఒండు+తెఱంగు= వేరుమార్గం; లేదు+అని= లేదంటూ; శపథంబులు= ప్రతిజ్ఞలు; పలికి= వచించి; సంశప్తకులు+అనన్= సంశప్తకులు అనే పేరుమీద;

ప్రఖ్యాతులు+అయిన= పేరుకెక్కిన; సుశర్మ+మొదలుగాన్+కల= సుశర్మ మున్నగువారలైన; పదివేవురు, రథిక, ముఖ్యులును= పదివేల మంది గొప్ప రథికులూ; కలయన్+ఎడన్+ఎడన్= అక్కడ అక్కడ కలిసిపోయేటట్లుగా; తక్కిన= మిగిలిన; యోధ+వీరులును= యుద్ధం చేసే శూరులును; నిలుచు+అట్లుగాన్= నిలబడేటట్లుగా, నియమించి= ఆజ్ఞాపించి; తగన్ తగురీతిగా, అయ్యై+సైన్యంబులన్= ఆయాసేనలను; ఏనుంగులన్= ఏనుగులను; ఏనుంగులకున్+అరదంబులు= ఏనుగులకు రథాలు; అరదంబులకున్+తురంగములు= రథాలకు గుర్రాలు; తురంగబులకున్= గుర్రాలకు; విండ్లవారున్= ధనుస్సులు ధరించేవారు (ధానుష్కులు); విండ్లవారికిన్= చాపములు ధరించేవారికి; నద్ధాయుధులు= కట్టబడిన ఆయుధాలు కలవారు; అడ్డంబు+అగు+తెఱంగున్= అడ్డంగా (రక్షగా) ఉండేటట్లు; నిలువన్= నిలుచున్నట్లు; నియోగించి= ఏర్పాటు చేసి; మానుష, వ్యూహంబు= మనిషి ఆకారంగా వ్యూహం; సమకట్టినన్= ఏర్పాటు చేసినప్పుడు; ఎన్నండును= ఏకాలంలో గూడ; ఇట్టి= ఇటువంటి; దృఢ, వ్యూహంబున్= గట్టిదైన వ్యూహాన్ని; కనియున్+వినియున్+ఎఱుంగము= చూడలేదు, వినలేదు; అని= అని; ఎల్లవారున్= అందరూ; అచ్చెరువునన్+పొరయుచున్= ఆశ్చర్యానికి లోనయి; ప్రియంబు+అందుచుండిరి= సంతోషిస్తూ ఉన్నారు; బృందారక, ప్రముఖ, దేవయోనులును= దేవతలు మున్నగు వేల్పుల తెగలవారూ; దివంబునన్+ఉన్న= స్వర్గలోకంలో ఉన్న; పురాతన, ధరారమణులును= పూర్వకాలంలోని రాజులూ; భారత+రణంబు= భారత యుద్ధాన్ని; కనుంగొను= చూడాలి అనీ; కుతూహలంబునన్= కోరికతో; వివిధ, విమాన+ఆరూఢులు+ఐ= వేరు వేరు విమానాలను ఎక్కి వచ్చినవారై; ఏతెంచిరి= వచ్చారు; అంతకుమున్ను+అ= అంతకు ముందే; అక్కడన్= ఆచట (ఆ యుద్ధభూమియందు).

**తాత్పర్యం:** ఈ విధంగా భీష్ముడి విజృంభణ సంకల్పానికి, మనస్సు వికసించగా దుర్యోధనుడు తమ్ములతోపాటు అతడి చుట్టుచేరి చక్కని చిక్కని వ్యూహం పన్నుమని అర్థించాడు. భీష్ముడు మనుష్యాకారమైన ఒక గొప్ప వ్యూహాన్ని అమర్చాడు. ముఖం పడమర దిక్కుగ ఉన్నది. ముఖద్వారం కడ తాను. తాడిచెట్టు జెండాతో, యజ్ఞవేదిక ఉన్న జెండాతో ద్రోణాచార్యుడూ నిలిచారు. కుడివైపున కృపాచార్యుడు అశ్వత్థామ, ఎడమ వైపున కృపవర్మ, శల్యుడు నిలిచారు. వెనుక బాహ్లికుడు, అతడి కొడుకు సోమదత్తుడు, సోమదత్తుడి కొడుకు భూరిశ్రవసుడు నిలిచారు. మధ్యలో దుర్యోధనుడు తమ్ములతో పాటు నిలబడ్డాడు.

దుర్యోధనుడి ముందు సంశప్తకులు వారి నాయకుడు సుశర్మ నిలిచారు. 'అర్జునుని చంపుతాము లేదా అర్జునుడి చేత చస్తాము. అంతేగాని ఇక వెనుదిరిగే ప్రసక్తియే లేదు, అనేది వారి ప్రతిజ్ఞ. వారి సంఖ్య పదివేలు . ఇక ఎడనెడ మిగిలిన యోధులు నిలబడ్డారు.

ఆ వ్యూహంలో ఇంకో విశేషం ఉన్నది. ఆయా సైన్యాలను కాపాడేందుకు రక్షగా ఏనుగులు అమర్చబడ్డాయి. ఏనుగులకు ముందు రక్షగా రథాలు, రథాలకు రక్షగా అశ్విక బలాలు, ఆశ్విక బలాలకు రక్షగా విలుకాండ్రు, విలుకాండ్రకు రక్షగా తగిన ఆయుధాలు కత్తులు కటారులు ధరించినవారు నిలిచే ఏర్పాటు జరిగింది. ఇట్లాంటి దృఢమైన వ్యూహాన్ని కనీవినీ ఎరుగమంటూ అందరూ ఆశ్చర్యం చెందుతూ ఆనంద పడుతున్నారు.

భారత యుద్ధాన్ని చూడటానికి, దేవతలు, దేవతా జాతులు, స్వర్గలోకంలో ఉన్న పురాతన మహారాజులు తమ తమ విమానాలలో వచ్చారు. అంతకు ముందే అక్కడ

**విశేషం:** 1. వ్యూహాలు భారతయుద్ధంలో మిక్కిలి ప్రాముఖ్యం వహించినట్టివి. 'వ్యూహాలు.' ఇవి పలు ఆకారాలలో సేనాపతులు ఏర్పాటు చేసేవారు. 'వ్యూహం' సమరక్రీడలో అంతర్భాగం.

2. విమానాలు: ఆధునిక నాగరకత, విజ్ఞానశాస్త్రం ప్రసాదించిన అద్భుతాలలో విమానం ఒకటి. అయితే భారత రామాయణాలు చదివిన భారతీయులకు 'విమానాలు' సుపరిచితాలు. ఆకాశయానం- విమానయానం ప్రాచీన భారతీయుల ఆలోచనలను - కావ్యకథలను విశేషంగా తీర్చిదిద్దాయి.

3. ఆత్మ - మరణానంతరం ఉంటుందనీ, కర్మానుగుణంగా స్వర్గలోకవాసం, నరకలోకవాసం ఏర్పడుతుందని ప్రాచీన భారతీయులలో అధిక సంఖ్యాకులు విశ్వసించారు. 'ఆత్మ' నిత్యం; శరీరం అనిత్యం అనే భావాన్ని బహుళ ప్రచారంలోకి తీసికొనివచ్చింది. మహాభారతంలో అంతర్భాగమైన భగవద్గీత.

### పాండవయోధులు యుద్ధంబునకు వెడలుట

**సీ. ఏనిక మదమున కెలయు తేఁటుల మొత్త । ములు వెలిగొడుగుల చెలువు గెలువఁ,**
**దురగఖురోద్ధూతధూళి యప్సరసల । యలక పూవులతోడఁ జెలిమిసేయఁ,**
**గేతనంబుల మణివ్రాతంబు రోచులు । రవికిరణంబుల నవలఁ ద్రోవ,**
**జైత్రభేరుల మహాస్వనములు సకల ప । ర్వతములఁ బ్రతివిరావముల నీన,**
**తే. నంబరము రథఘోష భీమాభిరామ । కింకిణీ గణఝుణఝుణత్కృతిమయముగఁ**
**బటు పదాతిహేతిప్రభా పటలియెల్ల । దిశలు వెలిఁగింప వెడలె యుధిష్ఠిరుండు. 104**

**ప్రతిపదార్థం:** ఏనిక, మదమునకున్= ఏనుగుల యొక్క దానజలమునకు; ఎలయు= వ్యాపించే; తేఁటుల+మొత్తము= తుమ్మెదలగుంపు; వెలిగొడుగుల+చెలువున్= తెల్లగొడుగుల అందాన్ని; గెలువన్= జయించగా; తురగ ఖుర+ఉద్ధూత ధూళి= గుర్రాల గిట్టలచేత పైకి లేపబడిన దుమ్ము; అప్సరసల= దేవతాస్త్రీల యొక్క; అలక+పూవుల తోడన్= ముంగురుల యందలి పుష్పాలతో; చెలిమి+చేయన్= స్నేహం చేయగా; కేతనంబుల= జెండాల యొక్క; మణి(వ్రాతంబు+రోచులు= మణుల సముదాయాల కాంతులు; రవి+కిరణంబులన్= సూర్యుడి వెలుగులను; అవలన్+త్రోవన్= దూరానికి నెట్టివేయగా; జైత్ర, భేరుల, మహా, నిస్వనములు= విజయసూచకములైన, పెద్ద డోళ్ళ నుండి వెలువడే గొప్ప శబ్దాలు; సకల, పర్వతములన్= అన్ని కొండలలో; ప్రతి రావములన్+ఈనన్= మారుమ్రోగగా; అంబరము= ఆకాశం; రథఘోషన్= రథాల నుండి వెలువడే ధ్వనితో; భీమ+అభిరామ, కింకిణీ, గణ, ఝుణఝుణత్+కృతిమయముగన్; భయంకరం సుందరం అయిన చిరుగంటల సవ్వడులతో నిండి ఉండగా; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; పటు+పదాతి+హేతి+ప్రభా+పటలి= మిక్కుటములైన కాలి భటుల కత్తి తళతళల వెలుగు గములు, ఎల్ల దిశలు= దిక్కులు అన్నిటిని; వెలిఁగింపన్= వెలుగొందచేయగా; వెడలెన్= యుద్ధభూమికి తరలి వెళ్ళెను.

**తాత్పర్యం:** ధర్మరాజు యుద్ధభూమికి తరలి వెళ్ళాడు. ఏనుగుల మదం వలన ఏర్పడే సువాసనకు ఆకర్షించబడిన తుమ్మెదల గుంపులు తెల్లగొడుగుల సొగసును జయిస్తున్నట్లు గుమిగూడాయి. గుర్రాల గిట్టలవలన చెలరేగిన దుమ్ము కణాలు, ఆకాశం వరకు వ్యాపించి, దేవతాస్త్రీల ముంగురులలో అలంకరించబడిన పువ్వులతో స్నేహం చేశాయి. జెండాలపై గుర్తులుగా ఉన్న బొమ్మలలో పొదగబడిన మణులయొక్క కాంతులు సూర్యకిరణాలను మించి ప్రకాశించాయి. విజయభేరిధ్వనులు అన్ని కొండలలో మారుమ్రోగాయి. ఆకాశం, రథచక్రాల ధ్వనులతో వెరపు గొలుపుతూ సొగసులు చిందుతూ మారుమ్రోగుతున్న చిరుగంటల సవ్వడులతో నిండిపోయింది. కాల్బలం పట్టుకొన్న కత్తుల యొక్క తళతళల వెలుగులు దిక్కులన్నిటినీ వెలుగొందచేశాయి. ధర్మరాజు యుద్ధానికి తరలి వెళ్ళటం శోభాయమానంగా పరిణమించింది.

**విశేషం:** మదధారలు ఏనుగుల కుంభస్థలాలనుండి స్రవించటం, ఆ మదధారల పరిమళానికి తుమ్మెదలు ఆకర్షించబడటం హృదయంగమమైన 'కవిసమయం'. వెలిగొడుగులంటే బహిశ్చత్రాలని కొందరు అన్వయించారు.

**మ. ప్రమదం బాననకాంతిఁ గ్రొత్తవలుపం బాదాతిభూయిష్ఠ సై**
**న్యముతో భీముఁడు భూషణద్యుతి నికాయంబున్ గదాద్యాయుధో**
**గ్ర మరీచి ప్రకరంబునుం గలిసి చిత్రస్ఫూర్తి శోభిల్లఁ గా**
**సమరక్రీడకు వచ్చె జృంభిత భుజాస్తంభోజ్జ్వలాకారుఁడై. 105**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీముడు; ప్రమదంబు= సంతోషం; ఆననకాంతిన్= ముఖంలోని వెలుగును; క్రొత్త, పఱుపన్= కొత్తదిగా చేయగా; పాదాతి, భూయిష్ఠ, సైన్యముతోన్= కాల్బలాలతో కూడిన సేనతో; భూషణ, ద్యుతి, నికాయంబున్= ఆభరణాల కాంతుల పుంజము; గదా+ఆది+ఆయుధ+ఉగ్ర, మరీచి, ప్రకరంబునున్= గద మున్నగు ఆయుధాల యొక్క భయంకరమైన కాంతుల సమూహమూ; కలిసి= కలిసి; చిత్ర స్ఫూర్తిన్+శోభిల్లఁగాన్= చిత్రవర్ణ స్ఫూర్తితో; విలసిల్లగా; జృంభిత, భుజా, స్తంభ+ ఉజ్జ్వల+ ఆకారుఁడు+ఐ= విస్తరిల్లిన కంబముల వంటి భుజములతో మెరిసే ఆకారం కలవాడై; సమర+క్రీడకున్= యుద్ధం అనే ఆటకు; వచ్చెన్= (తరలి) వచ్చాడు.

**తాత్పర్యం:** సంతోషం మొగమందు వెలుగొందుతుండగా, వెంట గొప్ప కాల్బలంతో కూడిన సేన రాగా, ఆభరణాలు గద మున్నగు ఆయుధాల నుండి వెలువడే భయంకరమైన కాంతులు కలిసి చిత్రవిచిత్రమైన శోభ ఏర్పడగా కంబములవంటి భుజాలతో ప్రకాశించే దేహ సౌష్ఠవం కలవాడై యుద్ధ వినోద విహారానికి సన్నద్ధుడై భీముడు వచ్చాడు.

**సీ. దివ్యరథస్ఫారదీప్తిజాలంబులు । పద్మరాగోజ్జ్వలప్రభలు గాఁగ,**
**మహనీయ రథ్యవిగ్రహముల జిగిసొంపు । ఘనవజ్ర వసు సముత్కరము గాఁగ,**
**నొగలపై నున్న కృష్ణుని మేని నునుఁజాయ । హరినీల కాంతివిస్ఫురణ గాఁగఁ,**
**బ్రస్ఫీత కేతనాగ్రస్థిత కపిదేహ । రోచులు గరుడాశ్మరుచులు గాఁగ**

**ఆ. నంపపొదుల నిగుడు నంశువితానంబు । దీప్రమరకతముల దీధితులుగఁ**
**దాలిమియును బెంపుఁ దనకు నైజములుగ । విజయరోహణాద్రి వెడలి వెలిఁగె. 106**

**ప్రతిపదార్థం:** దివ్య, రథ, స్ఫార, దీప్తి, జాలంబులు= దేవతా సంబంధమైన రథంయొక్క విస్తారమైన కాంతి సమూహాలు; పద్మ, రాగ, ఉజ్జ్వల, ప్రభలు, కాఁగన్= కెంపులనుండి వెలువడు మెరపు వెలుగులు కాగా; మహనీయ, రథ్యవిగ్రహముల, జిగి, సొంపు= గొప్పవైన గుర్రాల శరీరాల యొక్క వెలుగుల సొగసు; ఘన, వజ్ర, వసు, సముత్కరము, కాఁగన్= గొప్ప రవ్వల సంపదల సమూహంకాగా; నొగలపైన్= రథం ముంగలి భాగంపై; ఉన్న= (కూర్చొని) ఉన్న; కృష్ణుని, మేని, నును, చాయ= ఆ కృష్ణుడి దేహము యొక్క జిలుగు వన్నెల రంగు; హరినీల, కాంతి, విస్ఫురణ, కాఁగన్= ఇంద్రనీలమణుల ప్రకాశ ప్రకటనకాగా, ప్రస్ఫీత, కేతన, అగ్ర, స్థిత, కపి, దేహ, రోచులు= ప్రకాశించే జెండాపైన ఉన్న కోతి (ఆంజనేయుడి) శరీర కాంతులు; గరుడ+అశ్మరుచులు కాఁగన్= ఆకుపచ్చ వన్నెగల మాణిక్యకాంతులు కాగా; అంపపొదులన్= బాణాలు పెట్టుకునే పొదులలో; నిగుడు= వ్యాపించు; అంశు వితానంబు= కాంతిపుంజం; దీప్ర, మరకతముల, దీధితులుగన్= ప్రకాశించే పచ్చల వెలుగులు కాగా; తాలిమియును+పెంపు= ఓర్పు గొప్పతనము; తనకున్= తనకు (అర్జునుడికి); నైజములుగన్= స్వభావసిద్ధములుగ; విజయ రోహణ+అద్రి= అర్జునుడు అనే రోహణపర్వతం - లేదా - పరాక్రమం రూపొందిన పర్వతం; వెడలి= (యుద్ధానికి) బయలుదేరి; వెలిఁగెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** కరుడు గట్టిన పరాక్రమంవలె, వెలుగొందే నడగొండవలె అర్జునుడు యుద్ధభూమికి బయలుదేరి వెళ్ళాడు. దివ్యమైన రథం నుండి వ్యాపించిన కాంతులు కెంపు రవ్వ వెలుగులు విస్తరిస్తూండగా, గొప్పవైన గుర్రాల ఆకారరేఖలు వజ్రాల వెలుగులు వ్యాపింప చేయుచుండగా, రథంముందు సారథి స్థానంలో కూర్చొని ఉన్న శ్రీకృష్ణుడి శరీరకాంతి ఇంద్రనీలమణుల వెలుగులు చిమ్ముతుండగా దేదీప్యమానంగా ప్రకాశించే జెండామీద ఉన్న ఆంజనేయుడి శరీర కాంతులు గరుడపచ్చల వెలుగులు వెల్లివిరియ చేయగా, తూణీరంలో మిరుమిట్లు గొలిపే బాణాల కాంతులు ప్రకాశించే పచ్చల వెలుగులు వెలార్చగా, ఓర్పు గొప్పతనం తనకు పుట్టుకతో అలవడిన గుణాలుగా అర్జునుడు యుద్ధభూమికి బయలుదేరి వెళ్ళాడు.

**విశేషం:** 1. రోహణ+అద్రి= రోహణ పర్వతం. లంకానగరంలో పేరుకెక్కిన కొండ- ఒక అర్థం. రోహణ= వీర్యం, పరాక్రమం. రోహణాద్రి అంటే వీర్యం మానవశరీర రూపం ధరించి కొండవలె కన్పించటం అని రెండో అర్థం. ఇచ్చట రెండవ అర్థమే సందర్భోచితం అని చెప్పాలి.

2. అలం: రూపకం. విజయ రోహణాద్రి= అర్జునుడు అనే రోహణ పర్వతం. ఇక్కడ రోహణ పర్వతానికి, అర్జునుడికి అభేదం కల్పించబడింది. అలంకారం రూపకం. అర్జునుని రథం అతిలోక దీప్తి కలది. అగ్నిదేవుడిచే అతడికి బహూకరించబడినట్టిది. మహాభారత యుద్ధం ముగిసిన పిమ్మట శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి రథం దిగమన్నాడు. అర్జునుడు రథం దిగిన తదుపరి అది అగ్నికి దగ్ధమైపోయింది. దివ్యరథం కాబట్టి శత్రువులు ప్రయోగించిన అస్త్రాల శక్తిని ఆ రథం తనలో ఇముడ్చుకున్నదని అంతరార్థం.

**క. అతులితరథప్రతానో । ద్ధతసైన్యము గొలువ దేవదత్తం బంగీ**
**కృత సకల తూర్యనాదో । ద్గతి యగుచుఁ జెలంగఁ గ్రీడి గడు నొప్పారెన్.** **107**

**ప్రతిపదార్థం:** అతులిత, రథ, ప్రతాన+ఉద్ధత, సైన్యము= సాటిలేని రథాల సమూహాలతో అతిశయించిన సేన; కొలువన్= సేవిస్తూ ఉండగా; దేవదత్తం= దేవదత్తము (దేవతలచేత ఇవ్వబడిన శంఖం); అంగీకృత, సకల, తూర్య, నాద+ఉద్గతి+అగుచున్= ఢక్కా, బూరా, పటాహం మున్నగు వాద్యాల మ్రోతల సమాహారంగా అందరిచేత అంగీకరించబడినదిగా; చెలంగన్= శోభిల్లగా; క్రీడి= అర్జునుడు; కడున్= మిక్కిలి; ఒప్పారెన్= విలసిల్లాడు.

**తాత్పర్యం:** సాటిలేని రథసైన్యసమూహం తనను సేవిస్తూ, అర్జునుడు దేవదత్తం అనే శంఖం పూరిస్తూ మిక్కిలి శోభతో వెలుగొందాడు.

**విశేషం:** అర్జునుడి శంఖానికి దేవదత్తం అనిపేరు. భారత వీరులు తమ తమ శంఖాలకు ప్రత్యేకమైన పేరులు పెట్టుకొనేవారు. (శ్రీకృష్ణుడి శంఖంపేరు పాంచజన్యం, ధర్మరాజు శంఖం పేరు అనంత విజయం, భీముడి శంఖం పేరు పౌండ్రం; నకుల సహదేవుల శంఖాలపేర్లు సుఘోష, మణిపుష్పకములు.

2. యుద్ధంలో భేరి మున్నగు వాద్యాలు మ్రోయించేవారు. ఢక్క, పటహం, కాహళ, తిరుచిన్నం-ఇలా ... ఎన్నెన్నో- దేవదత్తం నుండి వెలువడే నాదం సకల వాద్య విశేష శబ్ద సమాహారంగా ప్రసిద్ధి కెక్కింది. యోధుడుగా అర్జునుడికీ దేవదత్తానికీ అవినాభావ సంబంధం ఏర్పడింది. అట్లే అర్జునుడి ధనుస్సు గాండీవం.

**తే. గాండివం బింద్రచాపంబుకరణి నొప్ప । మెఱసి దివ్యకిరీటంబు మెఱుఁగు లడర**
**జ్యానినాదంబు గర్జగా మేని కృష్ణ । కాంతిఁ బొలిచెఁ గవ్వడి యను కారుమొగులు.** **108**

**ప్రతిపదార్థం:** గాండివంబు= (అర్జునుడి ధనుస్సు); ఇంద్రచాపంబు, కరణిన్= ఆకాశంలో నీటికణాలలో సప్త వర్ణ శబలితంగా ఏర్పడే విల్లును పోలి; ఒప్పన్, మెఱసి= శోభిల్లి; దివ్యకిరీటంబు= అతిలోకమైన కిరీటం; మెఱుఁగులు+అడరన్= మిరుమిట్లు గొల్పగా; జ్యా+నినాదంబు= అల్లెత్రాటిమ్రోత; గర్జగాన్= (మేఘ) ఘోషగా; (ఉఱుముగా); మేని= దేహానికి సంబంధించిన; కృష్ణ, కాంతి= నల్లని కాంతితో; కవ్వడి+అను, కారు, మొగులు= అర్జునుడు అనే నల్లని మబ్బు; పొలిచెన్= శోభించింది.

**తాత్పర్యం:** అర్జునుడు అనే నల్లని మేఘం శోభిల్లింది. అనగా అర్జునుడు నల్లని మబ్బువలె భాసించాడు. అతడి ధనుస్సు ఇంద్రచాపంవలె శోభిల్లింది. అతడి దివ్యకిరీట కాంతి మెఱపు తీగల వెలుగులుగా మిరుమిట్లు కొల్పింది. అతడి వింటి అల్లెత్రాటి మ్రోత మేఘగర్జనవలె విన్పించింది. అతడి నల్లని శరీరం మేఘవర్ణాన్ని పోలింది.

**విశేషం:** అలం: ఉపమానుప్రాణితం. కవ+వడి= రెండు వేగాలు కలవాడు- సవ్యసాచి; అర్జునుడు తన రెండు చేతులతో బాణాలు ప్రయోగించే సామర్థ్యం సంపాదించాడు.

**మ. వివిధోద్దామ హయావళీబహుళ మై విక్రాంతి కేళీ సము**
**త్సవ కౌతూహల సుందరం బగు మహాసైన్యంబుతో మేదినీ**
**ధవ సందోహము ప్రీతిఁ బొంద మహిమోదాత్తోగ్రయానంబులం**
**గవ లేతెంచిరి వేడ్క నొండొరులకుం గయ్యంబుమైఁ జెప్పుచున్. 109**

**ప్రతిపదార్థం:** వివిధ+ఉద్దామ హయ+ఆవళీ+బహుళము+ఐ= పెక్కు రకాల భయంకరాలు అయిన గుర్రాల గుంపులతో దట్టమై; విక్రాంతి, కేళీ, సముత్సవ, కౌతూహల, సుందరంబు+అగు= పరాక్రమక్రీడ అనే సంబరాన్ని సందర్శించుటచే అందగించిన; మహా+సైన్యంబుతోన్= గొప్ప సేనతో; మేదినీధవ, సందోహము= రాజుల సమూహం; ప్రీతిన్+పొందన్= సంతోషించగా; మహిమ+ఉదాత్త+ఉగ్రయానంబులన్= గొప్పదనంతో అతిశయించి భయంకరంగా కనిపించే వాహనాలతో; కవలు= (జంట) నకుల సహదేవులు; వేడ్కన్= సంతోషంతో; ఒండొరులకున్= ఒకరితో ఒకరు; కయ్యంబుమైన్+చెప్పుచున్= యుద్ధం గూర్చి మాటాడుతూ; ఏతెంచిరి= యుద్ధానికి వచ్చారు.

**తాత్పర్యం:** అమడ బిడ్డలైన నకుల సహదేవులు ఒకరితో ఒకరు యుద్ధాన్ని గూర్చి సల్లాపాలు ఆడుకొంటూ బయలుదేరి యుద్ధరంగానికి వచ్చారు. వారితోపాటు గొప్ప సైన్యం ఉన్నది. ఆ సైన్యంలో పెక్కు రకాలయిన వాహనాలు ఉన్నాయి. అవి శత్రువులకు భయంకరంగా కన్పించాయి; కదన కుతూహలంతో ఉత్సాహంతో సైన్యాలు కదలసాగాయి. కవలు అధిరోహించిన వాహనాలు గంభీరంగా భాసించాయి.

**విశేషం:** 1. యానములు: అనగా వాహనాలు. బండి, రథం, పల్లకి, గుర్రం, ఏనుగు మొదలైనవి. ప్రాచీన యుద్ధ తంత్రం అయిదు విధాలయిన 'యానములను' పేర్కొన్నది. 1. సంధానయానం 2. ప్రసంగయానం 3. నిగృహ్యయానం 4. సంభూయయానం 5. ఉపేక్ష్యయానం.

**మ. రభసక్షోభితమేదినీతలముపై రథ్యప్రచారంబు లొ**
**ప్ప భుజాగర్వము నెమ్మొగంబులఁ దలిర్పం గన్నెకయ్యంబు న**
**ర్థి భవత్పుత్రులమీఁది కోపమున నుద్దీపింప నేతెంచి ర**
**య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్దంతియూథాకృతిన్. 110**

**ప్రతిపదార్థం:** రభస, క్షోభిత, మేదినీ, తలముపైన్= వేగముచేత కలతపెట్టబడిన భూప్రదేశంమీద; రథ్యప్రచారంబులు+ఒప్పన్= గుర్రాల కదలికలు ఒప్పగా; భుజా+గర్వము= పరాక్రమం యొక్క దర్పం; నెఱ+మొగంబులన్= నిండు మొగాల అందు; తలిర్పన్= శోభిల్లగా; కన్నె, కయ్యంబున్+అర్థిన్= మొదటిసారిగా యుద్ధం చేయాలని కోరుతూ; భవత్+పుత్రులమీది కోపమునన్= నీ కొడుకులమీది ఆగ్రహంతో; ఉద్దీపింపన్= వెలుగొందగా; ఆ+అభిమన్యుండును= ఆ అభిమన్యుడును (అర్జుననకు సుభద్రకు పుట్టినవాడు); ద్రౌపదేయులును= ద్రౌపదికి పుట్టిన వారున్నూ; మాద్యత్+దంతి, యూథ+ఆకృతిన్= మదించిన ఏనుగుల గుంపు యొక్క ఆకారముతో; ఏతెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** భూమి దద్దరిల్లిపోయేటట్లుగా గుర్రాలను నడిపిస్తూ పరాక్రమాతిశయం ముఖాలలో ప్రతిబింబిస్తుండగా, నీ కొడుకుల మీది కోపం ప్రేరేపించగా కన్నెకయ్యం చేయాలనే కోరికతో అభిమన్యుడు, ద్రౌపదీపుత్రులు మదించిన ఏనుగుల గుంపువలె రణరంగానికి బయలుదేరి వచ్చారు.

**విశేషం:** కన్నె కయ్యము= ప్రథమ సంగ్రామం. సుభద్ర కొడుకైన అభిమన్యుడు అందరికంటె చిన్నవాడు - వయసులో ద్రౌపది కొడుకులు యువకులు. వారు ఇంత వరకు యుద్ధంలో పాల్గొనలేదు. కురుక్షేత్ర సంగ్రామమే వారికి ప్రప్రథమ యుద్ధం. అదే వారికి మొదటి అవకాశం కాబట్టి వారి ఉత్సాహం పేర్కొనదగింది. కన్నె= పెండ్లికాని అమ్మాయి. కన్నెకు మొదటిరాత్రి అనుభూతి ఎట్టిదో - అట్టిదే ఈ యువకులకు ప్రప్రథమ యుద్ధం 'కన్నెకయ్యము' ప్రౌఢ ప్రయోగం.

"కన్నె కయ్యంబనగ - ప్రథమ యుద్ధాఖ్య"- ఆంధ్ర భాషార్ణవం 2-222.

**వ. ఇవ్విధంబునం బ్రతివింధ్యుండును, శ్రుతసోముండును, శ్రుతకీర్తియు, శతానీకుండును, శ్రుతసేనుండును సౌభద్రుండును దమకుం గన్నాకుగాఁ జెన్నుమిగిలి చనుదేరం గనుంగొని కౌంతేయ బలంబులు సంతసంబునం బొదలె; నప్పుడు. 111**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ప్రతివింధ్యుండును= ప్రతివింధ్యుడును; శ్రుతసోముండును= శ్రుతసోముడును; శ్రుతకీర్తియున్= శ్రుతకీర్తియు; శతానీకుండును= శతానీకుడును; సౌభద్రుండును= సుభద్ర కొడుకు అభిమన్యుడును; తమకున్= తమకు; కన్నాకుగాన్= నాయకులుగా; చెన్ను+మిగిలి= అందం అతిశయించగా; చనుదేరన్+కనుంగొని= రావటం చూచి; కౌంతేయ+బలంబులు= కుంతీసుతులైన పాండవుల సేనలు; సంతసంబునన్+పొదలెన్= సంతోషంతో వర్ధిల్లాయి; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ రీతిగా, ద్రౌపది కొడుకులైన ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడును మరియు సుభద్ర కొడుకు అగు అభిమన్యుడు తమకు నాయకులుగా రావటం చూచి పాండవుల సేనలు సంతోషంతో ఒప్పారాయి. ఆ సమయంలో-

**విశేషం:** ధర్మరాజుకు, ద్రౌపదికి పుట్టిన కొడుకు - ప్రతివింధ్యుడు. భీముడికి ద్రౌపదికి పుట్టిన కొడుకు - శ్రుతసోముడు.అర్జునుడికి ద్రౌపదికి పుట్టిన కొడుకు - శ్రుతకీర్తి. నకులుడికి ద్రౌపదికి పుట్టిన కొడుకు - శతానీకుడు. సహదేవుడికి ద్రౌపదికి పుట్టిన కొడుకు - శ్రుతసేనుడు. అర్జునుడికి సుభద్రకు పుట్టిన కొడుకు - అభిమన్యుడు.

**సీ. కరుల సందడి నొప్పు ఘనసేన దుర్దమ । లీలఁ దో నడవఁ బాంచాలవిభుఁడుఁ**
**దనుజులు ననుజులు దర్పదుర్జయసైన్య । మహిమఁ దో నేతేర మత్స్యపతియు**
**యాదవానీకంబు లవని గ్రక్కదలఁ దోఁ । జనుదేరఁ బొలుపారి సాత్యకియును**
**యోధవీరులు ప్రతాపోగ్ర వాక్యములతోఁ । దనుఁ జుట్టిరాఁ జేకితానవిభుఁడు**

**తే. బాసటై వీరరథికులు బలసి యెలమి । నొండొరుల గరువంబుగ నుల్లసంబు**
**లాడుచును జేరి నడతేర నత్యుదార । గతి శిఖండియు నడచిరి కౌరవేంద్ర! 112**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; కరుల సందడిన్+ఒప్పు= ఏనుగుల సంరంభంతో విలసిల్లే; ఘన+సేన= గొప్ప సైన్యం; దుర్దమ లీలన్= నిర్జించటానికి వీలులేని విధంగా; తోన్+నడవన్= కూడి కదలగా; పాంచాలవిభుఁడున్= పాంచాల రాజు ద్రుపదుడూ; తనుజులు+అనుజులు= కొడుకులును తమ్ముళ్ళూ; దర్ప, దుర్జయ, సైన్య, మహిమన్= గర్వం కలిగి, జయింపరానట్టి సేనయొక్క గొప్పదనంతో; తోన్+ఏతేరన్= వెంట రాగా; మత్స్యపతియున్= మత్స్యదేశానికి రాజు (విరాటుడును); యాదవ+అనీకంబులు= యదుకులమునకు సంబంధించిన సేనలు; అవని= భూమి; క్రక్కదలన్= దద్దరిల్లగా; తోన్+చనుదేరన్= వెంబడి రాగా; పొలుపారి= ఒప్పుతూ; సాత్యకియును= సాత్యకియును; యోధ+వీరులు= యుద్ధం చేసే శూరులు; ప్రతాప+ఉగ్ర వాక్యములతోన్= పరాక్రమంతో కూడిన భయంకరములైన మాటలతో; తనున్= తనను; చుట్టిరాన్= పరివేష్టించి రాగా; చేకితానవిభుడు= చేకితాన రాజు; బాసట+ఐ= తోడై; వీర+రథికులు= వీరులైన రథికులు (రథము నెక్కి యుద్ధం చేసేవారు); బలసి= దట్టంగా చేరి; ఎలమిన్= ప్రీతితో; ఒండొరులన్= ఒకరితోనొకరు; గరువంబుగన్= దర్పంతో; ఉల్లసంబులు+ఆడుచున్+చేరి= సల్లాపాలు చేస్తూ కూడి; నడతేరన్= నడచిరాగా; అతి+ఉదార+గతిన్= మిక్కిలి గొప్పదనం గోచరించే విధంగా; శిఖండియున్= శిఖండియు; నడచిరి= తరలి వెళ్ళారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఏనుగుల సంరంభంతో విలసిల్లే గొప్ప సేనతో, జయించటానికి వీలులేని విధంగా పాంచాలప్రభువైన ద్రుపదుడూ, తన కొడుకులూ, తమ్ముళ్ళూ తమను ఎవరూ నిర్జించలేరనే ధైర్యంతో

తన వెంట వచ్చే సైన్యంతో మత్స్యరాజు అయిన విరాటుడూ, యాదవ సైన్యాలు భూమి దద్దరిల్లేటట్లు తనతో రాగా సొగసుగా సాత్యకీ, యుద్ధం చేయాలనే ఉత్సాహంతో పరాక్రమం వెల్లివిరిసే సల్లాపాలు ఆడుతూ తన వెంట యోధవీరులు రాగా చేకితానుడూ, తోడై ఒకరితో ఒకరు దర్పం ఉట్టిపడే విధంగా మాటాడుతూ వీరులు తమ వెంట శిఖండీరాగా, రణభూమికి నడిచారు.

**చ. బధిరిత దిఙ్ముఖంబగుచు బంధుర తూర్య నికాయనాద మం**
**బుధియును బోలె సేనకు విభూతి యొనర్పఁగ నేఁగుదెంచె మా**
**గధ సహదేవుఁ డప్డు రణకౌతుక సల్లపనంబు నుజ్జ్వలా**
**యుధ విభవంబుఁ జెన్నొసఁగ నొప్పెడు తమ్మునిఁ బ్రీతిఁ జూచుచున్. 113**

**ప్రతిపదార్థం:** బధిరిత, దిక్+ముఖంబు+అగుచున్= చెవుడుపరచబడిన దిక్కుల యొక్క అగ్రభాగాలు కలది ఔతూ;; బంధుర+తూర్య+నికాయనాదము= దట్టమైన యుద్ధవాద్య సముదాయం యొక్క ధ్వని; అంబుధియును+పోలెన్= సముద్రాన్ని పోలుతూ; సేనకున్= సైన్యానికి; విభూతి+ఒనర్పఁగన్= సంపద చేకూర్చగా; మాగధ, సహదేవుఁడు= మగధ దేశానికి ప్రభువైన సహదేవుడు; అప్డు= అపుడు; రణ, కౌతుక, సల్లపనంబున్= యుద్ధం చేయటంలోగల ఉత్సాహాన్ని తెలిపే సంభాషణలును; ఉజ్జ్వల+ఆయుధ, విభవంబున్= ప్రకాశించే ఆయుధాల గొప్పదనమూ; చెన్ను+ఒసఁగన్= సొగసు నింపగా; ఒప్పెడు= విలసిల్లెడు; తమ్మునిన్= సోదరుడిని; ప్రీతిన్= వేడ్కతో; చూచుచున్= చూస్తూ; ఏగుదెంచెన్= (యుద్ధానికి) తరలివచ్చాడు.

**తాత్పర్యం:** మగధ దేశరాజు అయిన సహదేవుడు తన తమ్ముడితో కలిసి యుద్ధభూమికి తరలి వచ్చాడు. ఆతడి సేననుండి వెలువడిన భేరీ పటహకాహళాలు మున్నగు యుద్ధ వాద్యాల ధ్వనులు దిక్కులు పిక్కటిల్ల చేశాయి. ఆ సేన సముద్రం వలె ఉప్పొంగిపోతూ కదలింది. రణకౌతూహలం తెలిపే ఆతని సంభాషణలూ ధగధగా మెరిసే ఆయుధాలూ ఆ దండయాత్రకు శోభను చేకూర్చాయి.

**విశేషం:** ఆనాడు మగధ సామ్రాజ్యం భారతదేశంలో సువిశాలమైనది. సహదేవుడు ఆ మహాసామ్రాజ్యపాలకుడు. అతడి తండ్రి జరాసంధుడు. శ్రీకృష్ణుడిపై పలుమారులు దండెత్తాడు. ఆతడి ధాటికి ఓర్వలేక శ్రీకృష్ణుడు తన రాజధానిని మధుర నుండి ద్వారకకు తరలించాడు. రాజసూయయాగ సందర్భంలో శ్రీకృష్ణుడు అర్జునుడిని, భీముడిని వెంటపెట్టుకొని వెళ్ళి జరాసంధుడి ఎక్కటి కయ్యంలో భీముడిచే చంపించాడు. అయితే శ్రీకృష్ణుడు పాండవులు మగధసామ్రాజ్యాన్ని జరాసంధుని కొడుకు సహదేవునికే ఇచ్చి పట్టాభిషిక్తుడిని చేసి అతడిని మిత్రుడిగా చేసికొన్నారు. మగధ ప్రభువు మహాభారత యుద్ధంలో కృతజ్ఞతతో పాండవపక్షంలో చేరి పోరాడాడు.

**ఉ. చండ భుజాబలంబుఁ బటుశౌర్యసముల్లసనంబుఁ దోఁప ను**
**ద్దండత నాత్మ సైనికుల దర్ప మెలర్పఁగ నెమ్మిఁ బల్కుచున్**
**బాండవకోటి చూడ్కులకుఁ బండువుగాఁ జనుదెంచె ధృష్టకే**
**తుండు సహోదరుండు దనతో నడతేరఁ బరాక్రమోద్ధతిన్. 114**

**ప్రతిపదార్థం:** చండ, భుజా, బలంబున్= తీవ్రమైన పరాక్రమమూ; పటు శౌర్య సముల్లసనంబున్= మిక్కిలి గొప్పదైన వీరత్వంయొక్క ఉత్సాహమూ; తోఁపన్= కన్పిస్తుండగా; ఉద్దండతన్= మిక్కుటంగా; ఆత్మ, సైనికుల, దర్పము+ఎలర్పఁగన్= తన భటుల గర్వం అతిశయించగా; నెమ్మిన్+పల్కుచున్= ప్రీతితో చెప్తూ; పాండవ, కోటి, చూడ్కులకున్+పండువుగాన్= పాండవసేనా సమూహాల కన్నులకు పండుగగా; ధృష్టకేతుండు= ధృష్టకేతుడు (అనే పేరుగల రాజు); సహోదరుఁడు= సోదరుడు (తమ్ముడు); తనతోన్= తన వెంట; నడతేరన్= రాగా; పరాక్రమ+ఉద్ధతిన్= శౌర్యం యొక్క ఆటోపంతో; చనుదెంచెన్= (యుద్ధభూమికి) వచ్చాడు.

**తాత్పర్యం:** ధృష్టకేతుడు అనే రాజు తన తమ్ముడితోపాటు యుద్ధభూమికి తరలివచ్చాడు. తీక్ష్ణమైన పరాక్రమం యుద్ధం చేయటంలో చాకచక్యం వెల్లడించే సంభాషణలతో అతడు తన సైనికులకు ప్రోత్సాహం కల్పించాడు. అతడి దండయాత్ర పాండవసేనలలోని భటులకు కన్నుల పండువుగా భాసించింది.

**మ. విచలద్దండధరోపమాశ్రయ వపుర్విస్ఫార మై దానవ**
**ప్రచయం బుద్ధత లీలఁ గొల్వఁగఁ దమోరాశిప్రతీకాశ ఘో**
**రచలద్రూపము భంగికిం దగిన దంష్ట్రాయుగ్మ మొప్పన్ ఘటో**
**త్కచుఁ దేతెంచెఁ గరస్థ శూల రుచు లాకాశంబునన్ బర్వఁగన్. 115**

**ప్రతిపదార్థం:** విచలత్+దండధర+ఉపమ+ఆశ్రయ, వపుః+విస్ఫారము+ఐ= చలించేటటువంటిదియును; యముడితోడి పోలికకు ఆశ్రయమైన శరీరకాంతి కలిగినట్టిదియు అయిన; దానవ, ప్రచయంబు= రాక్షసులమూక; ఉద్ధతలీలన్= దర్పం వెల్లివిరిసే రీతిగా; కొల్వఁగన్= ఆరాధిస్తూ వెంటరాగా; తమః+రాశి, ప్రతీకాశ, ఘోర, చలత్+రూపము+భంగికిన్= చీకటి ప్రోగులకు సమానమై భయంకరంగా కదిలే ఆకారం రీతికి; తగిన= సరిపోయే; దంష్ట్ర, యుగ్మము= కోరల జత; ఒప్పన్= విలసిల్లగా; ఘటోత్కచుఁడు= ఘటోత్కచుడు (అనే పేరుగల రాక్షసుడు); కరస్థ, శూల, రుచులు= చేతియందు ఉన్న బల్లెం వెలుగులు; ఆకాశంబునన్= ఆకసంలో; పర్వఁగన్= వ్యాపించగా; ఏతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు అనే రాక్షసుడు చేతిలో ఉన్న త్రిశూలం ఆకాశంలో వెలుగులు విరజిమ్మేటట్లు త్రిప్పుతూ యుద్ధభూమికి వచ్చాడు. కదలే చీకటి రాశికి సరిపోయే ఆకారానికి తగినట్లుగా అతడి నోటి నుండి భయంకరమైన రెండు కోరలు కనుపిస్తున్నాయి. అతడి వెంట, యమధర్మరాజు శరీరచ్ఛాయతో సమానమైన దేహాలు కల రాక్షసుల మూకలు అతడిని ఆరాధిస్తూ తరలివచ్చాయి.

**విశేషం:** ఘటోత్కచుడు హిడింబాభీముల కొడుకు. ఈతడు మహాభారత యుద్ధంలో పాండవ పక్షాన పోరాడి శత్రు విధ్వంసం చేశాడు. మాయాయుద్ధ నిపుణుడైన ఈతడిని కర్ణుడు తనకు దేవేంద్రుడు (సహజ కవచకుండలాలు అతనికి దానం చేసినపుడు) ఇచ్చిన శక్తిని ప్రయోగించి సంహరించాడు.

**వ. పాండ్యపతియునుఁ గేకయపంచకంబును శైబ్యుండును మఱియుం గాశకరూశాది బహుదేశాధీశులును దమతమ బలంబుల దళంబుల సవరణల యొప్పును గయ్యంపుఁ గడంకయు నెఱయం గేతనంబులు మెఱయం దోఁతెంచి; రిత్తెఱంగునం గూడి సప్తాక్షౌహిణీ బంధురంబుగాఁ బేర్చిన పాండవసేన మొగంబునకుం దిలకం బై. 116**

**ప్రతిపదార్థం:** పాండ్యపతియును= పాండ్యరాజూ; కేకయ పంచకంబును= కేకయ రాజ్యాధిపతులైన అయిదుగురు రాజులూ; శైబ్యుండును= శిబి వంశానికి చెందిన రాజూ; మఱియున్, కాశ+కరూశ, ఆది, బహు, దేశ+అధీశులును= కాశదేశం కరూశదేశం మున్నగు పెక్కు దేశాలను పరిపాలించే రాజులును; తమ+తమ+బలంబుల= తమ తమ సేనల; దళంబుల= సేనా సమూహాల; సవరణల+ఒప్పును= అలంకారాల అందచందాలు; కయ్యంపు+కడంకయున్= యుద్ధము నందలి పూనికయు; నెఱయన్= ప్రకాశించగా; కేతనంబులు= జెండాలు; మెఱయన్= ప్రకాశించగా; తోఁతెంచిరి= వచ్చారు; ఈ+తెఱంగున్= ఈ రీతిగా; కూడి= కలిసి; సప్త+అక్షౌహిణీ బంధురంబుగాన్= ఏడు అక్షౌహిణులతో కూడినదై, పేర్చిన= అతిశయించిన; పాండవ సేన మొగంబునకున్=పాండవుల సైన్యం యొక్క అగ్రభాగానికి (నుదుటికి); తిలకంబు+ఐ= బొట్టువలె వెలిగొందుతూ (ధృష్టద్యుమ్నుడు).

**తాత్పర్యం:** పాండవుల సైన్యం ఏడు అక్షౌహిణులు అయింది. అందులో పాండ్యరాజు, శిబి వంశీయుడైన రాజు, కాశ కరూశాది రాజులు, పంచ కేకయులు తమ తమ సేనలతో ఆయుధాలతో వెలుగొందుతూ వచ్చి చేరారు.

**విశేషం:** 1. శిబి కథ - ప్రాచీన భారత సారస్వతంలో బౌద్ధ వాఙ్మయంలో సుప్రసిద్ధం. 'పరోపకారార్థ మిదం శరీరం' అనే ఆదర్శం ఆచరణలో అనువదించి శరణార్థియైన పావురం కోసం తన శరీర మాంసాన్ని కోసి ఇచ్చిన వదాన్యుడు శిబి.

2. భారతదేశంలో దక్షిణపు కొస ఉన్న దేశం పాండ్యరాజ్యం. ఆ రాజు కూడా మహాభారత యుద్ధంలో పాల్గొన్నాడు.

**శా. పుష్టోదంచిత సారవీరరససంపూర్ణాంగమున్ సంగరా**
**వష్టంభోజ్జ్వల వీరరేఖయును భాస్వద్వాహ సంవల్గనో**
**త్కృష్ట స్యందనముం గనద్ధనువు నుద్దీప్త ధ్వజంబుం దగన్**
**ధృష్టద్యుమ్నుఁడు వొల్చె నైజవిలసత్తేజోవిరాజద్గతిన్. 117**

**ప్రతిపదార్థం:** పుష్ట+ఉదంచిత, సార, వీర రస, సంపూర్ణ+అంగమున్= ప్రకాశించే నిండుదనం యొక్క నిగ్గుగా వీరరసంతోనూ అంగాలతో ఉపాంగాలతో సమృద్ధమైన శరీరమై; సంగర+అవష్టంభ+ఉజ్జ్వల, వీర, రేఖయును= యుద్ధగర్వంతో చేసికొన్న వీరత్వ చిహ్నితమైన ఆకారమూ; భాస్వత్+వాహ, సంవల్గన+ఉత్కృష్ట, స్యందనమున్= ప్రకాశించే గుర్రాల యొక్క దౌడు తీయటంచేత గొప్పదైన రథమూ; కనత్+ధనువు= ప్రకాశించే విల్లు; ఉద్దీప్త ధ్వజంబున్= దేదీప్యమానంగా వెలుగొందే జెండా; తగన్= ఒప్పగా; నైజ, విలసత్+తేజస్+విరాజత్+గతిన్= స్వభావసిద్ధంగా వెలుగొందే ప్రభుశక్తితో ప్రకాశించే రీతిగా; ధృష్టద్యుమ్నుఁడు= (పాండవ సర్వసేనాధిపతి, ద్రుపద మహారాజు కొడుకు ద్రౌపది అన్నగారు); పొల్చెన్= విలసిల్లాడు.

**తాత్పర్యం:** పాండవ పక్షంలో సర్వసేనాధిపతి అయిన ధృష్టద్యుమ్నుడు దేదీప్యమానంగా వెలుగొందాడు. అతడి శరీరం కరడుగట్టిన వీరరసంగా కనుపించింది. నిండైన ఆతడి విగ్రహం పరాక్రమసారంగా భాసించింది. యుద్ధగర్వం తోడి వీరరేఖ ఆతడి ముఖంలో వెలిగింది. ఆతడి రథం క్రమశిక్షణతో దౌడు తీయగల గుర్రాలతో పూన్చబడింది. నాయకత్వ లక్షణాలు, ప్రభుశక్తి ఆతడికి స్వభావసిద్ధాలుగా భాసించాయి.

**విశేషం:** ధృష్టద్యుమ్నుడు కారణజన్ముడుగా మహాభారతంలో అభినుతుడు. ద్రోణుడు ద్రుపద మహారాజూ శైశవంలో సహపాఠకులు. తదుపరి ద్రుపదుడు రాజైనప్పుడు ఆతడు అర్థిగా తనవద్దకు వచ్చిన ద్రోణుడిని మన్నించలేదు. ద్రోణుడు గురుదక్షిణగా అర్జునుడిని కోరి, ద్రుపద రాజును బందీకృతుడిని చేయించాడు. అవమానఖిన్నుడైన ద్రుపదుడు తపస్సు చేసి ద్రోణుడిని సంహరించగల కొడుకుగా ధృష్టద్యుమ్నుడిని పడశాడు.

**వ. ఇట్లొప్పి సేనాపతి యగు నా ద్రుపదసుతుండు ముంగలియై నడపించుచుండ. 118**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఒప్పి= ఈ విధంగా విలసిల్లి; సేనాపతి+అగు= సేనకు నేత అయిన; ఆ+ద్రుపద+సుతుండు= ఆ ద్రుపద రాజు కొడుకు- ధృష్టద్యుమ్నుడు; ముంగలి+ఐ= సైన్యమునకు ముందున్న వాడై; నడపించుచుండన్= సేనలను నడిపించుచుండగా.

**తాత్పర్యం:** ఈ విధంగా విలసిల్లుతూ ధృష్టద్యుమ్నుడు ముందుండి పాండవ సైన్యాన్ని నడిపిస్తూ ఉండగా.

**సీ. ఇల ధూళి యెగసినఁ బలుచగాకుండంగ । రాసిన తొడవుల రజము దొరఁగు,**
**సమరవికాసంబు చెమట నొప్పఱకుండ । హేతి దీధితులు రేయెండ నొడుచు,**
**భేరీధ్వనుల నింగి బీఁటలు వోకుండఁ । గరికర శీకరోత్కరము దడుపు,**
**దర్పంబు గనుఁజాటు దాఁకకుండఁగ గొడు । గులపెల్లు ఖచర దృక్కోటి నాఁగు,**

**తే. ననిన నిజమైనయట్లుండె మనుజనాథ! । ధరణి వడవడ వడఁకె దిక్తటము లద్రువ**
**భూరి చతురంగ చండ విస్ఫూర్తిఁ బాండు । నందనులసేన గలనికి నడచునవుడు. 119**

**ప్రతిపదార్థం:** ఇల+ధూళి+ఎగసినన్= భూమి మీది దుమ్ముపైకి వ్యాపించగా; పలుచగాకుండంగన్= పలచనైపోకుండా; రాసిన, తొడవుల, రజంబు= రాపిడిపొందిన ఆభరణాల కణాలు; తొరఁగున్= పడతాయి; సమర, వికాసంబు, చెమటన్= యుద్ధం గూర్చిన శ్రమవలన ఏర్పడిన చెమటచేత; ఒప్పఱకుండన్= ఒప్పుచెడకుండా; హేతి+దీధితులు= కత్తుల కాంతులు; రే+ఎండన్= లేతయెండను; ఒడుచున్= వ్యాపింపచేస్తున్నాయి; భేరీ, ధ్వనులన్= యుద్ధవాద్యమైన భేరీ నాదాలచేత; నింగి= ఆకసం; బీటలు+పోకుండన్= బ్రద్దలు కాకుండగా; కరికర, శీకర+ఉత్కరము= ఏనుగుల తుండాల నుండి వెలువడే నీటి చిరుజల్లుల సముదాయం; తడుపున్= (నీటితో) చెమ్మగిల్ల చేస్తుంది; దర్పంబు= అహంకార గర్వం; (పాండవసేన యొక్క అతిశయానికి) కనుబాటు+కాకుండన్= (దిష్టి) దృష్టిదోషం తగులకుండా; గొడుగుల పెల్లు= ఎక్కువ గొడుగులు ఉండటం (గొడుగుల గుంపు); ఖచర దృక్+కోటిన్+అఁగున్= ఆకాశంలో సంచరిస్తున్న వారి దృష్టులను అరికట్టుతుంది; అనినన్= అని అభివర్ణిస్తే; నిజము+ఐన+అట్లు+ఉండెన్= అది సత్యమే అయినట్లు తోస్తున్నది.; మనుజనాథ!= (ఓ ధృతరాష్ట్ర మహారాజా!); పాండునందనుల+సేన= పాండవుల సైన్యం; భూరి, చతురంగ, చండ, విస్ఫూర్తిన్= ఎక్కువైన, నాలుగు అంగాల (రథ, గజ, తురగ, పదాతి); చండ+విస్ఫూర్తిన్= తీవ్రమైన ప్రకాశంతో; దిక్+తటములు+అద్రువన్= దిక్కుల అంచులు అదిరిపోగా; ధరణి= భూమి; వడవడ= గజగజ (ఎక్కువగా); వడఁకెన్= చలించింది.

**తాత్పర్యం:** ఈ పద్యం పాండవసేన కురుక్షేత్రానికి తరలివెళ్లటం అభివర్ణిస్తున్నది. భూమిమీద ధూళి ఎగసింది. సేనలోని భటులు, వాహనాలు కదిలి వెళ్ళుతుండగా వీరులు ధరించిన ఆభరణాల రాపిడి వలన ఏర్పడిన రజం ఆ ధూళిని ఇనుమడింపచేసింది. యుద్ధ సన్నద్ధులయిన వీరులకు చెమట పట్టింది. ఆ చెమట ఆరిపోయేటట్లు వీరుల కత్తుల తళతళలు లేతయెండ ప్రసరింపచేశాయి. భేరీ ధ్వనులు ఆకాశాన్ని అంటాయి. ఆకాశం బీటలు వారకుండ ఏనుగుల తొండాల నుండి నీటితుంపురులు విస్తరిల్లాయి. దర్పంతో విజృంభించే పాండవ సైన్యానికి ఆకాశంలో విమానాల నుండి చూచే దేవతల, పితరుల 'దృష్టిదోషం' తగులకుండగా, వెల్లగొడుగులు అడ్డు వచ్చాయి. పాండవ సైన్యం చతురంగబలాలతో దండయాత్ర ఆరంభించినపుడు ధరణి గజగజ వణికింది అనీ, దిక్కులు దద్దరిల్లి పోయాయి అనీ సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పాడు.

**విశేషం:** అలం: అతిశయోక్తి. ఈ సీసపద్యం- తిక్కన విరాటపర్వంలో ధర్మరాజును గూర్చి 'ఎవ్వాని వాకిట నిభమద పంకంబు। రాజభూషణరజో రాజి నణఁగు' అనే పద్యాన్ని జ్ఞప్తికి తెస్తుంది.

**వ. ఇట్లు నడచి కురుక్షేత్రంబులోన నుత్తమప్రదేశం బగు శమంతపంచక సమీప స్థలంబు సేరు సమయంబున ధర్మనందనునకు దోఁచు దక్షిణాక్షిస్పందనాది శుభసూచకంబులకు మెఱుంగు వెట్టిన చందంబున. 120**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నడచి= (దండెత్తి) వెళ్ళి; కురుక్షేత్రంబులోనన్= కురుక్షేత్రంలో; ఉత్తమ,ప్రదేశంబు+అగు= మంచిచోటఅయిన; శమంతపంచక, సమీప, స్థలంబునన్= శమంతపంచకం అనే పేరుగలచోటుకు దగ్గరగా; చేరు+సమయంబునన్= చేరిన వేళ; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; తోఁచు= స్ఫురించే; దక్షిణ+అక్షి, స్పందన+ఆది+శుభ సూచకంబులకున్= కుడికన్ను అదరటం మొదలైన మంచి శకునాలకు; మెఱుంగున్+పెట్టిన+చందంబునన్= అతిశయమైన దీప్తిని కలిగించిన రీతిగా.

**తాత్పర్యం:** ఉత్సాహం పెల్లుబుకుతూ పాండవ సైన్యం ఈ విధంగా కురుక్షేత్రంలో గొప్ప చోటుగా ప్రసిద్ధికి ఎక్కినట్టి శమంతపంచకం అనే చోటికి దగ్గరగా చేరినప్పుడు, ధర్మరాజునకు కుడికన్ను అదరటం మొదలైన శుభశకునాలు తోచాయి. అంతేకాక- (మరికొన్ని మంచి శకునాలు ఏర్పడ్డాయి. తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** 1. శమంతపంచకం- కురుక్షేత్రంలో భారతసంగ్రామ సమయంలో మిక్కిలి పేరుకెక్కిన ప్రదేశం. అయిదు సరస్సులతో కూడిన ప్రదేశం అది. పరశురాముడు, క్షత్రియులను నిర్జించిన పిదప, తన గండ్రగొడ్డలిని ఈ సరస్సులలో కడుగుకున్నాడని పురాణ కథనం.

2. ప్రాచీనకాలంలో విరోధిసేనలు - ఇరుపక్షాలకు అనువైనచోట చేరి యుద్ధం చేసేవి. అట్టి యుద్ధస్థలాలలో పురాణ ప్రసిద్ధమైనది "కురుక్షేత్రం." భౌగోళికంగా కురుక్షేత్రం కీలకమైన చోటు అని చెప్పవచ్చు. చారిత్రక కాలంలో గూడ ఎన్నో యుద్ధాలు కురుక్షేత్ర సమీపంలో ఉన్న పానిపట్టు ప్రదేశంలో జరగటం వేత్తలకు తెలిసినట్టి అంశమే.

**క. ఏనుఁగుల మదము తావియు। సైనిక నికరానులేపసౌరభ్యములుం**
**దా నుపలాలించుచుఁ బవ। మానుం డనుకూల మృదు గమనమునఁ బొలసెన్. 121**

**ప్రతిపదార్థం:** పవమానుండు= గాలిదేవుడు; ఏనుఁగుల, మదము, తావియున్= ఏనుగుల కుంభస్థలాల నుండి కారే మదజలము వలన ఏర్పడే పరిమళము; సైనిక, నికర+అనులేప, సౌరభ్యములున్= భటుల సమూహాలు చేసికొన్న మైపూతల నుండి వ్యాపించిన సుగంధములును; తాన్= తాను (గాలిదేవుడు); ఉపలాలించుచున్= నిమిరి బుజ్జగిస్తూ; అనుకూల, మృదు, గమనమునన్= సరిపడి సాయం చేసే మందగమనంతో, పొలసెన్= వ్యాపించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో చక్కని చల్లని గాలులు కమ్మని తెమ్మెరలు వీచాయి. ఏనుగుల కుంభస్థలాల నుండి స్రవించే మదజలానికి సంబంధించిన పరిమళం, వీరులు తమ శరీరాలకు అలదుకొన్న మైపూతల సుగంధం ఆ గాలిలో కలిసిపోయి తేలియాడుతూ, పాండవులకు శుభసూచకమైన మంచి శకునంగా పరిణమించాయి.

**వ. దానికయ్యుధిష్ఠిరుండుప్రముదితచిత్తుండగుచుఁబ్రీతచేతస్కులగుతమ్ములుంబాంచాలమాత్స్యాధిపతులును సకలజనంబులును పరివేష్టింపం దూర్పుమొగంబై కౌరవులున్న చక్కటికిం గట్టెదురుగా నిలిచి, యెల్లవారి సైన్యంబులుం గ్రమంబునఁ గొలంది వెట్టుకొనుచు , నందఱకు సంజ్ఞలు నడియాలంబులుం గల్పించి, దొరలదెసం గనుంగొని, మన మీ రణంబునందు ధరణీ రాజ్యంబు వడసెద మొండెఁ బూజ్యం బగు నాకలోకనివాసంబు గనియెద మొండె' నని నిశ్చయించి, నా కెలంకుల నిలువుం డని పలికిన, విని, వారలు ధీరోదాత్తంబులగువివిధవాక్యంబులంబ్రతిజ్ఞలుసేసి, నిజశంఖంబులుపూరించి, తమతమబలంబులలోనికిం జని; రజ్జనపతియును దన కమర్చిన కజ్జంబులును బుష్పఫల కర్పూర కస్తూరికాదులును వారలకుం బుచ్చుచుండె.' 122**

**ప్రతిపదార్థం:** దానికిన్= (ఆ శుభ శకునాలకు); యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ప్రముదిత, చిత్తుండు+అగుచున్= సంతోషించిన మనస్సుకలవాడై; ప్రీత, చేతస్కులు+అగు= సంతోషించిన మనస్సులుకలవారైన; తమ్ములున్= తమ్ములును (భీమార్జున నకుల సహదేవులు); పాంచాల, మాత్స్య+అధిపతులును= పాంచాల రాజు (ద్రుపదుడు), మత్స్యరాజు (విరాటుడు)ను; సకల+జనంబులును= అందరూ; పరివేష్టింపన్= కొలువగా; తూర్పు+మొగంబు+ఐ= తూరుపు దెసకు మొగం పెట్టినవాడై; కౌరవులు+ఉన్న= (దుర్యోధనాదులు చేరిన); చక్కటికిన్= ప్రదేశానికి, చోటునకు; కడు+ఎదురుగాన్= మిక్కిలి ఎదురుగా; నిలిచి= నిలిచి; ఎల్లవారి+సైన్యంబులన్= అందరి సేనలనూ; క్రమంబునన్= వరుసగా; కొలంది+పెట్టుకొనుచున్= లెక్కలు కట్టుకొంటూ; అందరకున్= ఎల్లవారలకు; సంజ్ఞలు= గుర్తులు; అడియాలంబులున్= రాజలాంఛనాలు; కల్పించి= ఏర్పరిచి; దొరల, దెసన్+కనుంగొని= నాయకులవైపు చూచి; మనము= మనం; ఈ రణంబునందున్= ఈ యుద్ధంలో; ధరణీ రాజ్యంబు= భూపరిపాలన; పడసెదము= పొందగలం; ఒండు+ఎ= ఒకటి (అనగా పక్షాంతరము); రెండింటిలో ఒకటి (లేదా) (మరి యొకటి). పూజ్యంబు+అగు= పూజింప దగినది అయిన; నాక లోక నివాసంబున్+కనియెదము= స్వర్గలోకంలో ఉండటం అనేది పొందుదాము; అని= అని; నిశ్చయించి= నిర్ణయించి; నా కెలంకులన్= నాప్రక్కల; నిలువుండు= ఉండండి; అని+పలికిన= చెప్పిన; విని= ఆలకించి; వారలు= (పాండవ సేనలోని నాయకులు); ధీర+ఉదాత్తంబులు+అగు= ధైర్యసాహసాలతో కూడిన; వివిధ+వాక్యంబులన్= పెక్కుమాటలతో; ప్రతిజ్ఞలు= శపథాలు; చేసి= (పలికి); నిజ, శంఖంబులు+పూరించి= తమ తమ శంఖాలు ఊది; తమ తమ, బలంబులలోనికిన్+చనిరి= తమ తమ సేనలలోనికి వెళ్ళారు; ఆ+జనపతియును= ఆ రాజును (ధర్మరాజును); తనకున్+అమర్చిన= తనకు ఏర్పరచిన;

కజ్జంబులును= భక్ష్యములను; పుష్ప, ఫల, కర్పూర, కస్తూరిక+ఆదులును= పువ్వులు, పండ్లు, కర్పూరం, కస్తూరి మున్నగువాటిని; వారలకున్= ఆ దొరలకు; పుచ్చుచుండెన్= పంపుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ శుభశకునాలు చూచి ధర్మరాజు సంతోషించాడు. అతని తమ్ములు, పాండవ సేనలోని దొరలు కూడా సంతోషించారు. అప్పుడు ధర్మరాజు, ద్రుపద విరాటాదులైన రాజులనందరినీ కొలువుకూటానికి పిలిపించి ఈ విధంగా అన్నాడు: 'యుద్ధంలో మనం గెలుస్తామా, ఈ భూరాజ్యాన్ని ఏలుకుందాము. లేదా స్వర్గలోక సౌఖ్యం అనుభవించగలం. ఏదైన మనకు మంచిదే. దీనికి మీరు సిద్ధమై నా పక్షంలో చేరండి.' రాజులు అందరూ ఏకగ్రీవంగా ధర్మరాజు చెప్పిన మాటలు ఆమోదించి ధైర్యసాహసాలతో ఆ విధంగా ప్రవర్తించటానికి ప్రతిజ్ఞలు చేసి తమ తమ సేనలలోనికి వెళ్ళారు. వెళ్ళుతూ ఉత్సాహంతో శంఖాలు ఊదారు. ధర్మరాజు వారందరకు అభినందన చందనం, కర్పూరం, పూవులు ఫలాలు భక్ష్యాలు పంచిపెట్టాడు.

**విశేషం:** అడియాలములు, తిక్కన ఈ శబ్దాన్ని విరివిగా ప్రయోగించాడు. అడియాలాలు రాజలాంఛనాలు. గొడుగులు, అందలాలు, చామరాలు, మేల్కట్టులు, ముద్రికలు మున్నగునవి.

**క. అనిన విని యాంబికేయుఁడు । మనమొన 'గడుఁ బెద్ద దీని మార్కొనఁ గుంతీ**
**తనయులు గొంచెంబయ్యును । ననుమానింపక కడంగు టది యెట్లొక్కో!' 123**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని (సంజయుడు చెప్పగా ఆలకించి); ఆంబికేయుఁడు= అంబిక కొడుకు- ధృతరాష్ట్రుడు; మనమొన= మనసేన; కడున్+పెద్ద= మిక్కిలి గొప్పది; దీనిన్= (ఈ కౌరవసేనను); మార్కొనన్= ఎదిరించి యుద్ధం చేయటానికి; కుంతీతనయులు= కుంతి కొడుకులైన పాండవులు; కొంచెంబు+అయ్యును= (తమసేన) మిక్కిలి చిన్నది అయినప్పటికిని; అనుమానింపక= సందేహించక; (పరాజయం కలుగుతుంది అనే సందేహం లేకుండగా); కడంగుట= పూనటం (యుద్ధం చేయటానికి పూనటం); అది= అది; ఎట్లు+ఒక్కో!= ఏ విధంగా జరిగిందో (ఆశ్చర్యంగా ఉందే)!

**తాత్పర్యం:** పాండవ సైన్యం ఉత్సాహంతో యుద్ధం చేయటానికి కురుక్షేత్రం చేరింది' అని సంజయుడు చెప్పగా ఆలకించి, ధృతరాష్ట్రుడు ఒక ఎదురు ప్రశ్న వేశాడు. 'ఓ సంజయా! కౌరవుల సేన చాలా పెద్దది కదా! అంతటి పెద్ద సైన్యాన్ని ఎదిరించి యుద్ధం చేస్తే ఓడిపోతామేమో అని పాండవులకు ఎందుకు సందేహం కలగలేదు? అంత ధైర్యంతో యుద్ధానికి ఏ విధంగా పూనుకున్నారు?'

**వ. అనుటయు సంజయుం 'డదియునుం జెప్పెద విను' మని యతని కిట్లనియెఁ: 'గౌంతేయాగ్రజుండు కురుబలంబు గనుంగొని కొండొక విన్ననై వివ్వచ్చు నాలోకించి. 124**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని (ధృతరాష్ట్రుడు చెప్పగా); సంజయుండు= సంజయుడు; అదియునున్+చెప్పెద, వినుము= దానిని గూడ నీకు చెప్పగలను ఆలకించవలసింది; అని+అతనికిన్+ఇట్లు+అనియెన్= అని ధృతరాష్ట్రుడికి ఈ విధంగా చెప్పాడు; కౌంతేయ+అగ్రజుండు= కుంతీకుమారులలో పెద్దవాడు- ధర్మరాజు; కురు+బలంబున్= కౌరవసేనను; కనుంగొని= చూచి; కొండొక+విన్ననై= కొంత దైన్యం చెంది; వివ్వచ్చున్= అర్జునుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడికి సంజయుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు: 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీకు ఆ సంగతి కూడా వివరించి చెప్పగలను. కుంతీకుమారులలో పెద్దవాడైన ధర్మరాజు పెద్దదైన కౌరవ సైన్యాన్ని చూచి, కొంత మేర భయపడి, ఆందోళన చెంది, అర్జునుడిని చూచి (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. ' ఘన మయి తోఁచుచున్నయది కౌరవసైన్యము చూడ్కి కందు శాం**
**తనవుని తాలకేతన ముదగ్రత ముందటఁ బొల్చెఁ జూచితే'**
**యనవుడుఁ బిన్ననవ్వు నగి యన్నరుఁ డన్నమొగంబుఁ జూచి నె**
**ట్టన బలుమాట లాడఁగఁ గడంగఁగ నొల్లక యత్యుదాత్తతన్. 125**

**ప్రతిపదార్థం:** చూడ్కికిన్= చూపునకు (స్థూలదృష్టికి); కౌరవ+సైన్యము= (దుర్యోధనాదులైన) కౌరవుల సైన్యం; ఘనము+అయి, తోఁచుచున్నఅది= చాలా పెద్దదిగా కన్పిస్తున్నది; అందున్= (ఆ కురుసేనలో); శాంతనవుని, తాల, కేతనము= శంతనుడి కొడుకు అయిన భీష్ముడి తాడిచెట్టు జెండా; ఉదగ్రతన్= భయంకరంగా; ముందటన్= ముందుగా (అగ్ర భాగంలో); పొల్చెన్= విలసిల్లుతున్నది; చూచితి+ఏ= చూచావుగదా!; అనవుడున్= అని (ధర్మజుడు) చెప్పగా; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; పిన్న+నవ్వు+నగి= చిరునవ్వునవ్వి; అన్న+మొగంబున్+చూచి= అన్నగారి (ధర్మరాజు) ముఖం ఆలోకించి; నెట్టన= పూనికతో; పలు, మాటలు+ఆడఁగన్= పెక్కు మాటలు చెప్పటానికి; కడంగఁగన్+ఒల్లక= పూనుకొనుటకు ఇష్టపడక; అతి+ఉదాత్తతన్= మిక్కిలి గొప్పదనంతో.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! చూచావుగదా. స్థూలదృష్టికి కౌరవ సైన్యం చాలా పెద్దదిగా కనిపిస్తున్నది. ఆ సేనలో ముందర నిలిచిన భీష్ముడి జెండా చూడుము. ఎంత ఎత్తుగా కన్పిస్తున్నదో తాడిచెట్టు బొమ్మతో. ఎంత భయంకరంగా ఉన్నదో. అని ధర్మరాజు చెప్పగా, చిరునవ్వు చిందిస్తూ అర్జునుడు అన్నగారి ముఖం చూచి, అధిక ప్రసంగం చేయటానికీ ఇష్టం లేక, సముచితంగా సమాధానం చెప్పాడు.

**విశేషం:** తిక్కన ప్రయోగించిన నవ్వులు పేర్కొనదగినవి. అందులో 'పిన్న నవ్వు' ఒకటి. నవ్వు నవరసఖని. నవ్వు అగాధ హృదయ విషయసూచిక. ఇచ్చట అర్జునుడు మాటలలో చెప్పిన సమాధానం ఒక యెత్తు. అతడు చేసిన మందహాసం మరియొక ఎత్తు. మాటల మాటున - మాటలు చెప్పలేని భావం - మందహాసంలో దాగి ఉంటుంది.

### ధర్మజునకు నర్జునుఁ డుత్సాహంబు గలిగించుట (సం. 6.1.93)

**వ. అతనితో నిట్లనియె. 126**

**తాత్పర్యం:** ధర్మరాజుతో అర్జునుడు ఈ విధంగా చెప్పాడు:

**చ. ' మునివరుఁ డైన నారదుఁడు మున్నొకయప్పుడు సెప్పె 'ధర్మ నా**
**శను లగు వారలం బ్రబలసైన్యము గల్గెనయేనిఁ గొంచె మై**
**నను రిపుసేన గెల్చు' నని నాకు గురుండును దేవతానదీ**
**తనయుఁడు నేర్పడన్ వినఁగఁ దాను బరాశరసూనుఁడుం గృపన్. 127**

**ప్రతిపదార్థం:** మునివరుఁడు+ఐన+నారదుఁడు= ఋషులలో శ్రేష్ఠుడు అయిన నారదుడు; మున్ను+ఒక+అప్పుడు= పూర్వకాలంలో ఒకసారి; నాకున్= నాకు; గురుండును= ద్రోణాచార్యుడును; దేవతా నదీ తనయుఁడున్= దేవలోకంలోని నది (గంగ) కొడుకును; తాను= తాను; పరాశర, సూనుఁడున్= పరాశరుడి కొడుకు అయిన వ్యాసుడు; ఏర్పడన్+వినఁగన్= స్పష్టంగా ఆలకిస్తుండగా; ధర్మనాశనులు+అగు+వారలన్= ధర్మాన్ని పాడుచేసేవారలకు; ప్రబల+సైన్యము= పెద్దసేన; కల్గెన+ఏనిన్= ఉన్నప్పటికీ; రిపుసేన= శత్రుసైన్యం; కొంచెము+ఐనను= మిక్కిలి తక్కువే అయినప్పటికి; గెల్చున్= జయిస్తుంది; అని= అని; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మరాజుతో అర్జునుడు ఈ విధంగా చెప్పాడు: 'మునుపు మునిశ్రేష్ఠుడు అయిన నారద మహర్షి

ఒకసారి నాతో 'ధర్మనాశకులకు పెద్ద సైన్యం ఉండవచ్చునుగాని యుద్ధంలో వారిని చిన్నసేన ఉన్నప్పటికి శత్రువులే గెలుస్తారు అనిచెప్పాడు. నాతోపాటు ఈ మాటలు అన్నప్పుడు ద్రోణాచార్యులు, భీష్ముడు, వేదవ్యాసమహర్షి కూడా స్పష్టంగా విన్నారు.

**విశేషం:** ప్రాచీన భారతీయ సారస్వతంలో- మహాభారతంలో 'ధర్మ' శబ్ద ప్రయోగం చాల చోట్ల కన్పిస్తుంది. ధర్మ శబ్ద నిర్వచనం - మిక్కిలి కష్టం. స్థూలంగా 'ధర్మం' అంటే మంచిపని అనీ, కర్తవ్య సూత్రం అనీ చెప్పవచ్చు. "యతో ధర్మః తతో జయః' ' మహాభారత సారసంగ్రహం. అయితే ఏది ధర్మం. ధర్మాన్ని గుర్తించటానికి మనుధర్మ శాస్త్రం - పది లక్షణాలు పేర్కొన్నది.

**"ధృతిః క్షమా దమోऽస్తేయం । శౌచ మింద్రియనిగ్రహః,**

**ధీ ర్విద్యా సత్య మక్రోధో । దశకం ధర్మలక్షణమ్"**

**వ. అది య ట్లుండె నమానుషశక్తిసముద్దామం బగు భీము గదావిహారంబు వైరిదుస్సహంబు; ధృష్టద్యుమ్న శిఖండి ప్రముఖ పాంచాలవర్గం బనర్గళ విక్రమంబు, విరాట శంఖ ముఖ్య మాత్స్యనికరం బరిభయంకరంబు; సాత్యకి చేకితానాది యాదవ నివహంబు భవజ్జ యావహం; బభిమన్యు హైడింబ ప్రభృతి కుమారలోకం బలోకసామాన్య బలశౌర్యధుర్యంబు; నీ కటాక్షంబును గృష్ణు సంరక్షణంబునుం గలిగి గాండివం బను పామునకు ఱెక్కలు వచ్చిన ట్లున్నయది; యట్లుంగాక యేనుఁగుంబోలె నీ లావు నీ వెఱుంగవు; దివిజులకు నజయ్యుండవు; నీ వలిగిన నెవ్వరె ట్లయ్యెదరో యటు సూడు' మనినం దెలివొంది సంక్రందననందనునకు ధర్మనందనుం డిట్లనియె. 128**

**ప్రతిపదార్థం:** అది= (నారద మహర్షి చెప్పినమాట); అట్లు+ఉండెన్= ఆ విధంగా ఉన్నది= (దానికేమిగాని); అమానుష, శక్తి, సముద్దామంబు+అగు= మనుజులకు అతీతమైన బలంతో భయంకరమైన; భీము, గదా, విహారంబు= భీమసేనుడి యొక్క గద త్రిప్పులాట; వైరి, దుః+సహంబు= శత్రువులు సహించలేనిది; ధృష్టద్యుమ్న, శిఖండి, ప్రముఖ, పాంచాల, వర్గంబు= ధృష్టద్యుమ్నుడు శిఖండి మున్నగు పాంచాల పక్షం; అనర్గళ విక్రమంబు= అడ్డులేని పరాక్రమం (కలది); మాత్స్య+నికరంబు= మత్స్యదేశానికి సంబంధించిన సేనాసమూహం; అరి+భయంకరంబు= శత్రువులకు భయం కలుగజేసేది; సాత్యకి+చేకితాన+ఆది, యాదవ, నివహంబు= సాత్యకి చేకితానుడు మున్నగు యాదవుల బలగం; భవత్+జయ+ఆవహంబు= నీకు జయం కలిగించేది; అభిమన్యు, హైడింబ, ప్రభృతి, కుమార, లోకంబు= అభిమన్యుడు, హిడింబ కొడుకైన ఘటోత్కచుడు మున్నగు కొడుకుల గుంపు; అలోక సామాన్య, బల, శౌర్య, ధుర్యంబు= లోకంలో సాధారణంగా కనుపించనట్టి శక్తి పరాక్రమాలతో కూడినది; నీ కటాక్షంబును= నీ(క్రీగంటిచూపు) దయ; కృష్ణు, సంరక్షణంబును+కలిసి= శ్రీకృష్ణుడి రక్షణ కలిసి; గాండివంబు+అను, పామునకున్= గాండీవం (ధనుస్సు) అనే పామునకు; రెక్కలు, వచ్చినట్లు+ఉన్న+అది= రెక్కలు మొలిచినట్లు ఉన్నది; అట్లు+కాక= ఆ రీతిగా కాక; ఏనుఁగున్+పోలెన్= ఏనుగువలె; నీలావు= నీ బలం; నీవు+ఎఱుంగవు= నీవు తెలిసికోలేవు; దివిజులకున్= దేవతలకు; అజయ్యుండవు= జయింపశక్యంకానివాడవు; నీవు+అలిగినన్= నీవు కోపిస్తే; ఎవ్వరు+ఎట్లు+అయ్యెదరో= ఎవరు ఏ విధంగా ఔతారో; అటు+చూడుము= ఆ దృక్పథంతో వీక్షించుము; అనినన్= అని అర్జునుడు చెప్పగా; తెలివి+ఒంది= జ్ఞానం చేకూర్చుకొన్నవాడై; సంక్రందన నందనునకున్= (దేవేంద్రుడి కుమారుడైన) అర్జునుడికి; ధర్మనందనుండు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు:

**తాత్పర్యం:** అది అట్లా ఉండనీ, అమానుషశక్తి సంపన్నుడగు భీముడి గదా విహారం శత్రువులు సహించలేనిది. ధృష్టద్యుమ్నుడు, శిఖండి మొదలైన పాంచాల వర్గం అడ్డులేని పరాక్రమం కలది. విరాటుడు, శంఖుడు మొదలైన మత్స్యదేశ సేనాసమూహం శత్రుభయంకరం. సాత్యకి చేకితానుడు మొదలైన యాదవుల బలగం నీకు జయం కలిగించేది. అభిమన్యుడు, ఘటోత్కచుడు మొదలైన కొడుకుల గుంపు లోకంలో సాధారణంగా కనిపించనట్టి పరాక్రమాలతో కూడినది. నీ దయా వీక్షణం, కృష్ణు రక్షణ కలిగి గాండీవం అనే పాముకు రెక్కలు వచ్చినట్లున్నది.

అంతేగాక ఏనుగుకువలె నీశక్తి నీకు తెలియదు. నీవు దేవతలకు కూడ జయింపరానివాడవు. నీవు కోపగిస్తే ఎవ్వరెట్లౌతారో చూడు అనగా విని వికాసం పొంది అర్జునుడితో ధర్మరాజిట్లన్నాడు.

**విశేషం:** 1. పాము సహజంగా ప్రమాదం కలిగించే శక్తి కలది. అసలే చురుకైనది పాము. పాముకూ రెక్కలు వస్తే ఇంకేముంది! ఇది ఒక గొప్ప ఉత్ప్రేక్ష.

2. ఏనుగు భూమిమీదగల జంతువులలోకెల్ల బలమైనట్టిది. అయితే అది క్రూరజంతువు కాదు. ఏనుగులు విచ్చలవిడిగా ప్రకోపించి విహరిస్తే ఏనుగునకుగల సహజ సాధుత్వం లోకోపకారకం, ధర్మరాజు తన శక్తి తెలియని ఏనుగు వంటివాడు. మంచి ఉపమ.

**తే. కౌరవవ్యూహమునకుఁ దగంగ నొక్క । బంధురవ్యూహ మొనరింపఁ బంపు' మనిన**
**నతఁడు ద్రుపదాత్మజుని నచలాఖ్యమైన । ఘనతర వ్యూహ మొనరింపఁ బనుచుటయును. 129**

**ప్రతిపదార్థం:** కౌరవ, వ్యూహమునకున్= కౌరవులు పన్నిన వ్యూహానికి; తగంగన్= అనువుగా; ఒక్క, బంధుర, వ్యూహము= ఒక చిక్కని వ్యూహాన్ని; ఒనరింపన్= ఏర్పాటు చేయటానికి; పంపుము= ఏర్పాటు చేయుము; అనినన్= అని ధర్మరాజు చెప్పగా; అతఁడు= (అర్జునుఁడు); ద్రుపద+ఆత్మజునిన్= ద్రుపదుడి కొడుకైన ధృష్టద్యుమ్నుడిని; అచల+ఆఖ్యము+ఐన= అచలము (కొండ) అనే పేరుగల; ఘనతర, వ్యూహంబు= మిక్కిలి గొప్పదైన వ్యూహాన్ని; ఒనరింపన్= ఏర్పరుప; పనుచుటయును= ఆజ్ఞాపించుటయు.

**తాత్పర్యం:** కౌరవసేనాపతి భీష్ముడు 'నర' వ్యూహం పన్నాడు. దానిని దేవతలు గూడ అద్భుతమని మెచ్చుకొన్నారు. ధర్మరాజు అర్జునుడితో 'కౌరవుల వ్యూహానికి అనురూపమైన గొప్ప వ్యూహాన్ని పన్నాలని కోరాడు. అర్జునుడు పాండవ సేనాధిపతి అయిన ధృష్టద్యుమ్నుడిని పిలిచి 'అచల' వ్యూహాన్ని పన్నుమని ఆదేశించాడు.

**వ. ఆ ధృష్టద్యుమ్నుండును గలయ మెలంగి మోహరం బమర్చె; నయ్యచలవ్యూహమ్మునందు దా నగ్రభాగంబున నభిమన్యు ప్రభృతి కుమార నకుల సహదేవ సహితంబుగా భీమసేన పరిపాలితుండై నిలిచెఁ; దమతమ బంధువులకును బలంబులకును బలువుతోడి చెలువు గలుగఁ జేకితాన సాత్యకి సమేతంబుగాఁ బాంచాల మాత్స్యాధిపతులు దక్షిణోత్తర భాగంబుల నిలిచిరి; నడుమ నడగొండగమియుం బోని గజరాజితో రాజు రథారూఢుండై ధవళచ్ఛత్ర చామరంబులు మెఱయ విప్రవర్గంబునకు నంబర జాంబూనదంబు లొసంగుచు విజయాశీర్వాదంబు లాదరించుచుండె; ముందటఁ బురందరనందన సంరక్షితుండై శిఖండి గాంగేయునకుఁ గట్టెదురుగా నిలిచి గండు మిగిలి యొప్పె; నపరభాగస్థులై మాగధ సహదేవ ధృష్టకేతు లవష్టంభ విజృంభణంబునఁ బొలిచి; రివ్విధంబునం జారుభీషణం బై. 130**

**ప్రతిపదార్థం:** ఆ ధృష్టద్యుమ్నుండును= ఆ ధృష్టద్యుమ్నుడున్నూ; కలయన్ మెలంగి= (సేన) అంతటను పూర్ణంగా తిరిగి; మోహరంబున్+అమర్చెన్= వ్యూహాన్ని ఏర్పాటు చేశాడు; ఆ+అచల+వ్యూహమ్మునందున్= 'అచల'మనే పేరుగల్గిన ఆ వ్యూహంలో; తాన్= తాను (ధృష్టద్యుమ్నుడు); అగ్రభాగంబునన్= మొదటనే; అభిమన్యు, ప్రభృతి, కుమార, నకుల, సహదేవ, సహితంబుగాన్= అభిమన్యుడు మున్నగు పాండవుల కుమారులతోపాటుగా, నకులుడు సహదేవుడుకూడి ఉండగా; భీమసేన+పరిపాలితుండు+ఐ= భీముడి రక్షణకు లోనైన వాడై; నిలిచెన్= నిలిచాడు; తమ తమ+బంధువులకును= తమ తమ చుట్టాలకు; బలంబులకును= సేనలకు; బలువు తోడిచెలువు= శక్తితో కూడిన సౌందర్యం; కలుగన్= ఏర్పడేటట్లుగా; చేకితాన, సాత్యకి, సమేతంబుగాన్= చేకితానుడు సాత్యకి అనే యాదవ వీరులతోపాటుగా; పాంచాల, మత్స్య, అధిపతులు= పాంచాల రాజు ద్రుపదుడును- మత్స్యరాజు

విరాటుడును; దక్షిణ+ఉత్తర భాగంబులన్= దక్షిణంవైపు, ఉత్తరంవైపు; నిలిచిరి= నిలబడ్డారు; నడుమన్= మధ్యలో; నడకొండ గమియున్+పోలి= నడిచే కొండల గుంపు వలె ఉన్న; గజరాజితోన్= ఏనుగుల సమూహంతో; రాజు= (ధర్మరాజు); రథ+ఆరూఢుండు+ఐ= రథాన్ని ఎక్కినవాడై; ధవళ, ఛత్ర, చామరంబులు= తెల్లని గొడుగులు వీవనలు; మెఱయన్= ప్రకాశించగా; విప్రవర్గంబునకున్= బ్రాహ్మణ సమూహానికి; అంబర+జాంబూనదంబులు= వస్త్రాలు, బంగారు కాసులు; ఒసంగుచున్= ఇస్తూ; విజయ+ఆశీర్వాదంబులు= గెలుపుపొందే దీవనలు; ఆదరించుచుండెన్= మన్నిస్తూ ఉన్నాడు; ముందరన్= ముందు భాగంలో; పురందర నందన, సంరక్షితుండు+ఐ= అర్జునుడి చేత కాపాడబడినవాడై; శిఖండి, గాంగేయునకున్= భీష్ముడికి; కడు+ఎదుటన్= కట్టెదుటనే- ఎదురు బొదురుగా; నిలిచి= నిల్చుండి; గండు, మిగిలి ఒప్పెన్= వీరత్వంతో మిక్కిలి వెలుగొందాడు; అపర భాగస్థులు+ఐ= వెనుకభాగంలో ఉన్నవారై; మాగధ+సహదేవ+ధృష్టకేతులు= మగధదేశానికి సంబంధించిన సహదేవ మహారాజు అతని తమ్ముడు ధృష్టకేతుడు; అవష్టంభ+విజృంభణంబునన్= గర్వాతిశయంతో పొలిచిరి= శోభిల్లారు; ఆ+విధంబునన్= ఆ రీతిగా; చారు, భీషణంబు+ఐ= రమణీయ భయానకంగా (అందంగానూ, భయంకరంగాను).

**తాత్పర్యం:** పాండవసేనాపతి అయిన ధృష్టద్యుమ్నుడు తన సేనలలో నలువైపుల తిరిగి, 'అచల వ్యూహం' అమర్చాడు. ఆ అచలవ్యూహంలో మునుముందు తాను అభిమన్యుడు మున్నగు పాండవకుమారులు నకుల సహదేవులు నిలిచారు. అక్కడే, తనకు బాసటగా భీమసేనుడు నిలిచాడు. ఉత్తరంవైపు దక్షిణంవైపు తమ బలాలకు చుట్టాలకు బలం చేకూరుస్తూ విరాటుడు - ద్రుపదుడూ నిలిచారు. వ్యూహం మధ్యభాగంలో, జంగమ పర్వతాలవలె శోభిల్లే ఏనుగుల గుంపు మధ్య ధర్మరాజు రథం మీద ఉన్నాడు, ఛత్రచామరాలతో. బ్రాహ్మణులు ఆశీర్వదించారు. ధర్మరాజు వారికి వస్త్రాలూ, బంగారు కాసులు బహూకరించాడు. ముందు అర్జునుడిచేత కాపాడబడుతూ శిఖండి, అటు కౌరవసేనలోని భీష్ముడికి ఎదురుబొదురుగా నిలిచాడు. వెనుకభాగంలో మగధదేశానికి చెందిన సహదేవుడు, ధృష్టకేతుడు గర్వాతిశయంతో శోభిల్లారు. ఈ విధంగా అందంగానూ, భయంకరంగానూ పాండవులసైన్యం విలసిల్లిందని మీది పద్యంతో అన్వయం.

**క. అరదములు దీవు, లున్నత । కరులు గిరులు, హరులు వీచికలు, సుభటసము**
**త్కర ముగ్రసత్త్వములుగా । శరనిధి గతిఁ బాండుపుత్త్ర సైన్యం బొప్పెన్. 131**

**ప్రతిపదార్థం:** అరదములు= రథాలు; దీవులు= ద్వీపాలు; ఉన్నత, కరులు= ఎత్తైన ఏనుగులు; గిరులు= పర్వతాలు; హరులు= గుర్రాలు; వీచికలు= కెరటాలు; సుభట, సముత్కరము= మంచి భటుల సముదాయం; ఉగ్ర, సత్త్వములుగాన్= భయంకరమైన జంతువులుగా; పాండుపుత్త్ర, సైన్యంబు= పాండవుల సేన; శరనిధి గతిన్= సముద్రంవలె; ఒప్పెన్= విలసిల్లింది.

**తాత్పర్యం:** పాండవుల సేన సముద్రం వలె శోభిల్లింది. రథాలు దీవులుగా, ఎత్తైన ఏనుగులు కొండలుగా, గుర్రాలు కెరటాలుగా, భటుల సముదాయం భయంకరమైన జంతువులుగా భాసించాయి.

**విశేషం:** అలం: ఉపమ (రూపకానుప్రాణితం).

**క. ఉభయబల దీప్తకేతు । ప్రభలం గీడ్పఱిచి కురుధరావల్లభ సై**
**న్య భయంకరమై శక్ర। ప్రభవు కపిధ్వజము వెలిఁగె బ్రకటస్ఫురణన్. 132**

**ప్రతిపదార్థం:** ఉభయ, బల, దీప్త, కేతు, ప్రభలన్= రెండు సేనలలో ప్రకాశించే జెండాల కాంతులను; కీడ్పఱిచి= తక్కువ చేసి; కురు, ధరావల్లభ, సైన్య, భయంకరము+ఐ= కురురాజు అయిన దుర్యోధనుడి సేనలకు భయం కలిగించేదై; శక్రప్రభవు, కపిధ్వజము= దేవేంద్రుడి కొడుకు అయిన అర్జునుడి యొక్క కోతి జెండా; ప్రకట+స్ఫురణన్= దేదీప్యమాన కాంతితో; వెలిఁగెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** అర్జునుడి రథంపై వెలుగొందే కోతి జెండా, రెండు సేనలలోని జెండాలన్నిటినీ మించి, దుర్యోధనుడి సేనలకు భయం కలిగిస్తూ దేదీప్యమానంగా ప్రకాశించింది.

**తే. అరుణములును సితంబులు నసితములును । నైన జోడులతో దొరలందు నిందు**
**నాలలోని యాఁబోతులఁ బోలి పొలిచి । రెసఁగు బెడిదంపుమాట లాకసము ముట్ట. 133**

**ప్రతిపదార్థం:** అరుణములును= ఎఱ్ఱనైనట్టి; సితంబులును= తెల్లనివి; అసితములును= నల్లనైనట్టివి; ఐన= ఐనట్టి; జోడులతోన్= కవచాలతో; దొరలు= దండనాయకులు; అందున్+ఇందున్= ఆ కౌరవ సేనలోను పాండవసేనలోనూ; ఆలలోని= ఆవులమధ్య ఉన్న; ఆఁబోతులన్+పోలి= ఆబోతులరీతిగా; ఎసఁగు బెడిదంపు మాటలు= అతిశయంతో కూడిన గొప్ప మాటలు; ఆకసము, ముట్టన్= ఆకాశాన్ని తాకగా; పొలిచిరి= శోభిల్లారు.

**తాత్పర్యం:** పాండవసైన్యంలోనూ కౌరవసైన్యంలోనూ గల దండనాయకులు ఎఱ్ఱని, తెల్లని, నల్లని కవచాలు ధరించి ఆవుల మధ్య ఉన్న ఆబోతులవలె అతిశయించిన గొప్పమాటలు ఆకసమంటగా శోభిల్లారు.

**తే. కొన్ని భూముల బలములు గురునృపాలుఁ । బాండవులఁ గొన్ని భూముల బలము లీసు**
**గలిగి పాయలై కొన్ని భూముల బలములు । రెండు దిక్కులయందుఁ జేరినవి యధిప! 134**

**ప్రతిపదార్థం:** కొన్ని, భూముల, బలములు= కొన్ని ప్రదేశాలకు చెందిన సేనలు; కురు, నృపాలున్= కురురాజు దుర్యోధనుడి; కొన్ని, భూముల, బలములు= కొన్ని ప్రదేశాలలోని సేనలు; పాండవులన్= పాండవులను; ఈసు+కలిగి= అసూయచేత; పాయలు+ఐ= చీలిపోయి; కొన్ని+భూముల+బలములు= కొన్ని ప్రదేశాలకు చెందిన సేనలు; రెండు దిక్కులయందున్= రెండువైపులయందు; అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; చేరినవి= చేరాయి.

**తాత్పర్యం:** కొన్ని ప్రదేశాలలోని సేనలు కౌరవపక్షంలో చేరాయి. కొన్ని ప్రదేశాలలోని సేనలు పాండవ పక్షంలో చేరాయి. కొన్ని ప్రదేశాలలోని సేనలు వారిలో వారికి గల అసూయ వలన చీలిపోయి, రెండు పక్షాలలో కూడా ఒక చీలిక కౌరవపక్షంలోనూ, మరియొక చీలిక పాండవ పక్షంలోనూ చేరాయి.

**విశేషం:** కురుక్షేత్రంలో జరిగింది కౌరవులకు పాండవులకు మధ్య కలహం. అయితే ఆ యుద్ధంలో చాలా ప్రదేశాలలోని సేనలు రెండు పక్షాలలో చేరి, పోరాడాయి. ఒక ప్రదేశంలోని సేనలు కౌరవపక్షంలో చేరితే, వారి శత్రుపక్షం సేనలు పాండవ సైన్యంలో చేరాయి. అనగా వారికీ వారికీగల పూర్వవైరాలు తీర్చుకునేందుకు- చిన్న చిన్న ప్రదేశాలలోని వారు- రెండు పక్షాలలో చేరారన్నమాట. విశేషించి, ఉదాహరణకు యాదవులలో సాత్యకి శ్రీకృష్ణుల పక్షం పాండవ పక్షం వహించింది. కృతవర్మ పక్షం కౌరవ సేనలో చేరింది.

**వ. కావున. 135**

**తాత్పర్యం:** కాబట్టి.

**క. బాలురు వృద్ధులుఁ దక్కఁగ । వ్రాలి యిలం గలుగు పురుషవర్గంబు జయ**
**శ్రీలోలత నేతెంచుట । నేల యవిసి మూఁగినట్లు నెఱసె బలంబుల్.' 136**

**ప్రతిపదార్థం:** బాలురు= చిన్న పిల్లవాండ్రు; వృద్ధులున్= ముసలివారు; తక్కఁగన్= తప్ప; వ్రాలి= చేరి; ఇలన్+కలుగు= భూమిమీద ఉండే; పురుష+వర్గంబు= మగవారందరూ; జయ, శ్రీ, లోలతన్= గెలుపు అనే గొప్ప సంపదయందలి ప్రీతితో; ఏతెంచుటన్= రావటం మూలాన; (యుద్ధంలో చేరటం వలన); నేల= భూమి; అవిసి= పొంగి; మూఁగిన+అట్లు= ఒకచో చేరినట్లుగా, బలంబుల్= సేనలు; నెఱసెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** చిన్న పిల్లలు ముసలివాళ్ళు తప్ప మగవాళ్ళు అందరూ విజయశ్రీని కాంక్షిస్తూ నేల పిగిలిన, ఈనిన రీతిగా ఒక చోటికి సేనలు చేరాయి.'

**వ. అనిన విని ధృతరాష్ట్రుం 'డప్పుడప్పాండవ కౌరవ సైన్యంబులలో నెయ్యది యుబ్బు గలిగి యుండె'నని యడిగిన సంజయుం డతని కిట్లనియె. 137**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (సంజయుడు చెప్పగా); విని= ఆలకించి; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+పాండవ, కౌరవ, సైన్యంబులలోన్= ఆ పాండవసేనలో మరియు ఆ కౌరవ సేనలో; ఏ+అది= ఏది; ఉబ్బు కలిగి= అతిశయం కలిగి; ఉండెన్= ఉన్నది; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; సంజయుండు= సంజయుడు; అతనికిన్= ధృతరాష్ట్రుడికి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** సంజయుడి మాటలు ఆలకించిన పిదప ధృతరాష్ట్రుడు ఒక ప్రశ్న వేశాడు. 'ఓ సంజయా! ఆ సమయంలో పాండవుల సైన్యం కౌరవ సైన్యం ఏది ఎక్కువ ఉత్సాహంతో ఓలలాడింది?' ఈ ప్రశ్నకు సంజయుడు ధృతరాష్ట్రుడితో ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**క. రెండు బలంబుల వారలు । నొండొరువులకంటెఁ జాల నుక్కు మిగిలి యొం**
**డొండ కడంగుచు నుజ్జ్వల । చండస్థితి నొప్పి రపుడు జగతీనాథా! 138**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= (ఓ ధృతరాష్ట్రమహారాజా!); రెండు+బలంబుల వారలు= ఉభయసేనలలోనివారు (కౌరవులలో చేరినవారు పాండవులలో చేరినవారు) ఒండు+ఒరువుల కంటెన్= ఒకరికంటె ఒకరు (ఒకరిని మించి మరి యొకరు); చాలన్= మిక్కిలి; ఉక్కు+మిగిలి= బలంచేత అతిశయించి; ఒండు+ఒండ, కడంగుచున్= ఒకరితో ఇంకొకరు పూనుతూ; అపుడు= ఆ సమయంలో; ఉజ్జ్వల, చండ స్థితిన్= భయంకరంగా ప్రకాశించే విధంగా; ఒప్పిరి= శోభిల్లారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అపుడు కౌరవసైన్యంలోనివారూ- పాండవసేనల్లోని వారూ, ఒకరిని మించి మరొకరు బలంచేత అతిశయించి పరస్పరం ఎదురుకొంటూ భయంకరంగా ప్రకాశించారు.

**వ. అని వెండియు. 139**

**తాత్పర్యం:** అని చెప్పి, ఇంకా ఇట్లా అన్నాడు.

**క. ఆ రెండు బలములందును । దోరం బైయున్న యట్లు దోఁచెం బాండు**
**క్ష్మారమణసుతు బలము నర । నారాయణు లునికిఁ జేసి నాకుం జూడన్. 140**

**ప్రతిపదార్థం:** ఆ+రెండు, బలములందును= ఆ కౌరవ పాండవ సేనలలో; పాండుక్ష్మారమణసుతు బలము= పాండు రాజు కొడుకు సైన్యం; నర, నారాయణుల+ఉనికిన్+చేసి= నరుడు నారాయణుడు (ఇద్దరూ ఉండటం చేత); తోరంబు+ఐ= అధికమై; ఉన్న+అట్లు; నాకున్+చూడన్= నా దృష్టికి; తోఁచెన్= తోచింది.

**తాత్పర్యం:** 'కౌరవుల సేనలో పాండవుల సేనలో పాండవుల సేనయే నా దృష్టికి బలవత్తరంగా తోచింది. ఎందుకంటే- పాండవసేనలో నరనారాయణులు ఉన్నారు.

**విశేషం:** 1. నరుడు - నారాయణుడు పురాణ ప్రసిద్ధులైన గొప్ప మునులు. నరుడు - మానవ ప్రతీక, మానవమాత్రుడు, నారాయణుడు- అధిమానవ ప్రతీక. విజయం= పురుషకారం+దైవం అనగా మానవ ప్రయత్నం+దైవానుగ్రహం. అర్జునుడు నరాంశసంభూతుడు, శ్రీకృష్ణుడు నారాయణాంశ సంభూతుడు. వారు ఇద్దరు ఉన్నచో విజయం తథ్యం. భగవద్గీతలోని శ్లోకం ఇట స్మరించ దగినది.

**"యత్ర యోగీశ్వరః కృష్ణో । యత్ర పార్థో ధనుర్ధరః,**
**తత్ర శ్రీ ర్విజయో భూతిః । ధ్రువా నీతి ర్మతిర్మమ". (18-78)**

**క. ఎలసి పయివారి దంతిఘ । టల మదములఁ దావి వెట్టుటయుఁ గౌరవసే**
**నల యేనుంగుల మదధా । రలు డొంకెం బొలయు మధుకరములుబ్బడఁగన్. 141**

**ప్రతిపదార్థం:** ఎలసి= అతిశయించి; పయివారి= పైన చెప్పబడిన (నరనారాయణులకు చెందిన); దంతి, ఘటల, మదముల తావి+పెట్టుటయున్= ఏనుగుల గుంపుల దాన జలములు; తావి, పెట్టుటయున్= సువాసన లీనుటయున్ను; కౌరవ, సేనల, ఏనుంగుల, మద, ధారలు= కౌరవసేనలలోని ఏనుగుల దాన జలములు; పొలయు= చేరే; మధుకరములు= తుమ్మెదలు; ఉబ్బు+అడఁగన్= ఉత్సాహం తగ్గిపోయేటట్లుగా; డొంకెన్= తగ్గిపోయాయి (ముసలితనం చెందాయి).

**తాత్పర్యం:** పాండవసైన్యంలోని ఏనుగుల మదజలాలు పరిమళాలు వెదజల్లాయి. కౌరవుల సైన్యంలోని ఏనుగుల మదం ఇంకిపోయింది. అందుచేత వాటిపై చేరే తుమ్మెదల గుంపు యొక్క ఉత్సాహం అణగిపోయింది.

**విశేషం:** 1. 140, 141, 142 సంఖ్యలుగల పద్యాలలో 143 సంఖ్యగల వచనంలోగూడ. కృష్ణార్జునులను గూర్చియే వర్ణన ఉన్నది. అందుచేత 141 పద్యంలోని పయివారి- అనగా కృష్ణార్జునుల యొక్క అని అర్థం చెప్పటం సమంజసం.

2. 'దంతి పుటల మదముల రాహువెట్టుటయు' అని ముద్రిత పాఠం. ఆ గ్రంథంలోనే పాఠాంతరం 'తావి' వెట్టుటయు 'గాలి' వెట్టుటయు అని ఉన్నది. మత్తేభాల మదము యొక్క పరిమళానికి తుమ్మెదలు వచ్చి వ్రాలటాన్ని - తిక్కన పలుసారులు భారతంలో వర్ణించాడు. అందుచే 'తావి'- పరిమళం అనే పాఠమే గ్రహించటం మంచిది. దానికి అర్థం సరిపోతుంది. అంతేగాక- ఆ క్రింది పద్యంలో ఉత్తరార్ధంలో కౌరవసేనలలోని ఏనుగుల మదం తగ్గటం - అందుచేత తుమ్మెదల ఉబ్బు అణగటం వర్ణింపబడింది. అందుచే ఈ క్రింది పద్యంలో పూర్వార్ధంలో 'తావి' పెట్టుట= పరిమళించటం అనే అర్థం చక్కగా సరిపోతున్నది. అందుచే 'తావి' వెట్టు అనే పాఠం-స్వీకరించబడింది.

**తే. అధిప! నీ తనయుండు గయ్యంబు వొడుచు । తెంపు వదలక విభవంబు పెంపు మెఱసె;**
**సారసానకు వచ్చిన చందమునను । నెలమిఁ బొందిరి పాండవేయులును హరియు. 142**

**ప్రతిపదార్థం:** అధిప!= (ఓ ధృతరాష్ట్ర మహారాజా!); నీ+తనయుండు= నీ కొడుకు- దుర్యోధనుడు; కయ్యంబు+పొడుచు తెంపు= యుద్ధం ప్రారంభించే తెగువ; వదలక= విడిచిపెట్టక; విభవంపు+పెంపు+మెఱసెన్= (తన) వైభవం యొక్క అతిశయం వెలుగొంద చేశాడు; సారసానకున్= వినోదానికి; వచ్చిన+చందముననుం= వచ్చిన రీతిగా; పాండవేయులును= పాండవులును; హరియున్= శ్రీకృష్ణుడును; ఎలమిన్+పొందిరి= సంతోషం పొందారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ కొడుకైన దుర్యోధనుడు యుద్ధాన్ని చేసే తెగువ వదలక అత్యంతవైభవంతో వెలుగొందాడు. పాండవులును, శ్రీకృష్ణుడూ వినోదానికై వచ్చినట్లు సంతోషించారు. (అనగా వారికి యుద్ధం చేయటం వినోదప్రాయమైనది అని భావం).

**వ. అట్టియెడఁ గృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తంబులు పూరించిన. 143**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; కృష్ణ+అర్జునులు= శ్రీకృష్ణుడును, అర్జునుడును; పాంచజన్య+దేవత్తంబులు= పాంచజన్యం, దేవదత్తం (అనే శంఖాలను); పూరించినన్= మ్రోగించగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో సంతోష పారవశ్యంతో శ్రీకృష్ణుడు పాంచజన్యం అనే శంఖాన్ని, అర్జునుడు దేవదత్తం అనే శంఖాన్ని పూరించగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆ నినదము విని పాండవ । సేన లలరె; ధార్తరాష్ట్ర సేనాగత యో**
**ధానీక ములికె; నెత్తురు । వాన గురిసె నంతఁ గౌరవవ్యూహమునన్. 144**

**ప్రతిపదార్థం:** ఆ+నినదము= ఆ ధ్వని; విని= ఆలకించి; పాండవ, సేనలు= పాండవుల సైన్యాలు; లలరెన్= సంతోషించాయి; ధార్తరాష్ట్ర సేనా+గత, యోధ+అనీకము= ధృతరాష్ట్రుడి కొడుకులకు చెందిన సేనలో ఉన్న వీరుల సమూహం; ఉలికెన్= భయపడ్డది; కౌరవ+వ్యూహమునన్= కౌరవుల వ్యూహంలో; అంతన్= అంతట; నెత్తురు+వాన= రక్తవర్షం; కురిసెన్= కురిసింది.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు పూరించిన పాంచజన్య శంఖారావం, అర్జునుడు పూరించిన దేవదత్త శంఖనినాదం విని పాండవుల సేనలు సంతోషంతో ఉప్పొంగిపోయాయి. కౌరవసేనలు భయపడ్డాయి. కౌరవ వ్యూహంపై నెత్తురు వాన కురిసింది.

**విశేషం:** 1. యుద్ధంలో కత్తులు, కటార్లు, విండ్లు బాణాలు సముచిత పాత్ర నిర్వహిస్తాయి. అది సహజం. అయితే- జెండాలు కనుల పండువుగా ఆకసంలో రెపరెపలాడటం యుద్ధ వాద్యాలు ఎన్నెన్నో భేరీ కాహళ తూర్యనినాద పరంపరలు మ్రోగటం ఏదో ఒక వర్ణనాతీతమైన వాతావరణాన్ని సృష్టిస్తాయి. ఇక- ముఖ్యంగా పేర్కొనదగింది శంఖనినాదం. ప్రతి వీరుడి చేతిలో విల్లు, కత్తి, డాలు ఉండటం ఒక యెత్తు; శంఖం ఉండటం ఒక యెత్తు, వీరుడు శంఖం ఊదే నేర్పు; అతడి పరాక్రమ ప్రాభవానికి భారమితిగా భాసించింది భారత మహేతిహాస కావ్యంలో.

**వ. మఱియు ననేక దుర్నిమిత్తంబులు పుట్టెఁ; బుట్ట కేల తక్కు? దేవవ్రతుండును గురుండును గురునందనుండును గృపుండును నిచ్చలుఁ గయ్యంబునకు వెడలు నప్పుడు 'పాండవులకు జయం బవశ్యంబు నయ్యెడు' మనుచు వెడలుదు; రది యట్లుండె నయ్యశుభసూచకంబులకు ధార్తరాష్ట్రులు దలంకక తూర్యంబులు మొరయింప నియోగించిన. 145**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; అనేక, దుర్నిమిత్తంబులు= పెక్కు చెడ్డ శకునాలు; పుట్టెన్= అగుపించాయి; పుట్టక+ఏల, తక్కున్?= అగుపించకుండా ఎందుకు ఉంటాయి?; దేవవ్రతుండును= భీష్ముడూ; గురుండును= ద్రోణాచార్యుడూ; గురు+నందనుండును= అశ్వత్థామయు; కృపుండును= కృపాచార్యుడును; నిచ్చలున్= ఎల్లప్పుడు; కయ్యంబునకున్= యుద్ధానికి; వెడలు+అప్పుడు= వెళ్లేటప్పుడు; పాండవులకున్; జయంబు= గెలుపు; అవశ్యంబు+అయ్యెడున్= తప్పకుండా కలుగుతుంది; అనుచున్= అని తలపోయుచు; వెడలుదురు= వెళ్ళుతుంటారు; అది+అట్లు+ఉండెన్= అది ఆ విధంగా ఉండనీ; ఆ+అశుభ, సూచకంబులకున్= ఆ చెడ్డశకునాలకు; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుడి కొడుకులు- కౌరవులు; తలంకక= చలించక; తూర్యంబులు= (మంగళ సూచకములు అయిన) వాద్యాలు; మొరయింపన్= మ్రోగించటానికి; నియోగించినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఇంకా ఎన్నో చెడ్డ శకునాలు దాపురించాయి. ఎందుకు దాపురించవు? అపజయం రాక తప్పుతుందా? భీష్ముడు, ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు పాండవులే గెలుస్తారు అని రోజూ అనుకుంటూనే యుద్ధానికి తరలివెళ్ళారు. దానికేమిగాని, కౌరవులు మాత్రం ఆ దుశ్శకునాలకు జంకకుండా, యుద్ధ వాద్యాలు మ్రోగించేందుకు ఆజ్ఞ ఇచ్చారు.

**ఉ. అప్పుడు రెండు సైన్యములు నాహవకేళికి నుత్సహించి పె**
**ల్లొప్పెఁ జెలంగి యుబ్బినసముద్ధతిఁ బొల్పగు తొంటి చందముల్**
**దప్పి యుగాంతకాలచలితత్వము నొంది పరస్పరాకృతుల్**
**గప్ప నెదుర్చు నంబుధియుగంబు మహోగ్రతఁ గ్రేణిసేయుచున్. 146**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; రెండు, సైన్యములున్= (కౌరవుల సైన్యం, పాండవుల సైన్యం); ఆహవ, కేళికిన్= పోరాటమనే ఆటకు; ఉత్సహించి= ఉత్సాహంతో పూనుకొని; పెల్లు+ఒప్పెన్= అతిశయించి శోభించాయి; చెలంగి, ఉబ్బిన, సముద్ధతిన్= చెలరేగిన ఉత్సాహంతో అతిశయించిన గర్వంతో; పొల్పు+అగు= సొగసుగా ఉన్న; తొంటి+చందముల్= మునుపటి విధాలు; తప్పి= మారిపోయి; యుగ+అంతకాల+చలితత్వమున్+ఒంది= ప్రళయకాలంలో వచ్చే మార్పు పొంది; పరస్పర+ఆకృతుల్+కప్పఁగన్+ఎదుర్చు= తమకు తమకు నైసర్గికంగా ఉన్న ఆకారాలు కనిపించకుండా చేయటానికి మీదికి దూకే; అంబుధి+యుగంబున్= రెండు సముద్రాలను; మహా+ఉగ్రతన్= మహాభయంకరంగా; క్రేణి+చేయుచున్= పరిహసిస్తూ.

**తాత్పర్యం:** ఆ సమయంలో పోరాటం అనే ఆటకు కౌరవ పాండవ సేనలు ఉత్సాహంతో పూనుకొన్నాయి. ఆ రెండు సేనలు ఏ విధంగా ఉన్నాయంటే ప్రళయకాలంలో తొల్లిటి సౌమ్యరూపం వదలిపెట్టి, భయంకరంగా మారిపోయి ఒకదాని ఆకారం ఇంకొకటి పూర్తిగా మారిపోయేటట్లు చేయటానికి ఉప్పొంగే రెండు సముద్రాల వలె కన్పించాయి.

**వ. తదవసరంబున నుభయ బలంబులవారును. 147**

**తాత్పర్యం:** ఆ తరువాత కౌరవ పాండవుల రెండు పక్షాలవారు.

**చ. బవరము సేయుచుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా**
**నవినయవృత్తి మై వలవ దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై**
**దువు వడినం దొలంగినను దోర్బల మేది భయంబుఁ బొందినం**
**గవియక బీఱువోయినను గాదు వధింపఁగ నెట్టి శత్రునిన్. 148**

**ప్రతిపదార్థం:** బవరము+చేయుచుండియును= యుద్ధం చేస్తూ కూడా; భాషణముల్+తగన్+పల్కుచుండఁగాన్= మాటలాడుచుండగా, సమయోచిత సంభాషణ సలుపు చుండగా; అవినయ+వృత్తిమైన్= ఉద్ధతితో; ఆయుధము+ఆర్చుట= ఆయుధం ప్రయోగించటం; వలవదు= కూడదు; తాకి+పడ్డన్= ఎదిరించి పడిపోయినచో; కైదువు= కత్తి; పడినన్= పడిపోయినా; దోర్బలము+ఏది= భుజబలం నశించి; తొలంగినన్= ప్రక్కకు తప్పుకొన్నా; భయంబు+పొందినన్= పిరికితనంతో భయపడితే; కవియక= యుద్ధం చేయకుండా; బీఱు+పోయినను= పారిపోతే; ఎట్టి+శత్రునిన్= ఎటువంటి శత్రువైనప్పటికీ; వధింపఁగన్+కాదు= చంపరాదు.

**తాత్పర్యం:** యుద్ధం చేస్తూనే అవసరానికి తగిన మాటలు మాటాడుతున్న శత్రువుపై సందు చూచుకొని ఆయుధ ప్రయోగం చేయరాదు. యుద్ధం చేసేటప్పుడు క్రింద పడిపోయిన వాడి జోలికి పోరాదు; చేతిలోని కత్తి జారి నేలమీద పడినప్పుడు భుజబలము నశించి యుద్ధమునకు తొలగినా ఆ శత్రువును చంపరాదు. పిరికితనంతో యుద్ధం వదలిపెట్టి పారిపోయేవారిని భయపడిన వారిని - ఎట్టి శత్రువునైనా సంహరించరాదు.

**వ. అని సమయంబుసేసి; రా సమయంబున. 149**

**ప్రతిపదార్థం:** అని= అని; సమయంబు+చేసిరి= ఒడంబడిక చేసుకొన్నారు.; ఆ సమయంబున్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని ఆ విధంగా ఆ సమయంలో శపథం చేశారు. (ఇరుపక్షాల వారూ కలిసి)

**క. పలు చాయల నొప్పిన యా। బలము లొకటి కొకటి కెదురఁ బల్లవ పుష్పా**
**వలి గల వనములక్రియ ని। శ్చలత నిలిచి పొలిచె నసమసమధైర్యములన్.** 150

**ప్రతిపదార్థం:** పలు, చాయలన్= పెక్కు కాంతులతో; ఒప్పిన= శోభిల్లిన; ఆ+బలములు= ఆ సైన్యాలు; ఒకటికి+ఒకటికిన్+ఎదురన్= ఒకదానికి మరి యొకటి ఎదురు బొదురుగా నిలువగా; (ఆరెండు సేనలు); పల్లవ, పుష్ప+ఆవళి= చిగురుటాకులు పువ్వుల సముదాయాలు; కల= ఉన్నట్టి; వనముల క్రియన్= తోటలవలె; నిశ్చలతన్= ధైర్యంగా; అసమ, సమ, ధైర్యములన్= సాటిలేనట్టి మరియు సమానమైన ధైర్యసాహసాలతో; నిలిచి= నిలబడి; పొలిచెన్= శోభిల్లాయి.

**తాత్పర్యం:** అలం: ఉపమ. రంగురంగులతో శోభిల్లిన ఆ రెండు సేనలూ సాటిలేని సమాన ధైర్యాలతో ఒకదానికి మరి యొకటి ఎదురుగా నిలబడినప్పుడు చిగురాకులతో పువ్వులతో విలసిల్లే తోటలవలె నిశ్చలంగా నిల్చి శోభిల్లాయి.

**క. అత్తఱి సురఖచరాదుల। చిత్తము లనిఁ జూచువేడ్కఁ జిడిముడి పడఁగా**
**నొత్తొరవున నిరుదెఱఁగుల। యుత్తమవీరులును దాఁక నుంకింపంగన్.** 151

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ సమయమునందు; సుర, ఖచర+ఆదుల, చిత్తములు= దేవతలు, ఆకాశమునందు సంచరించేవారు మొదలైనవారి మనస్సులు; అని, చూచు, వేడ్కన్= యుద్ధాన్ని చూడాలనే కోరికతో; చిడిముడి+పడఁగాన్= తొందరపడగా; ఒత్తొరవునన్= రాపిడితో; ఇరు+తెఱఁగుల+ఉత్తమ, వీరులు= రెండు పక్షాలలోని గొప్ప యోధులు; తాఁకన్= యుద్ధంలో మార్కొనటానికి; ఉంకింపంగన్= పూనుకొనగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో దేవతలు మున్నగు ఆకాశ సంచారులు కురుక్షేత్రంలో జరిగే ఆ మహాసంగ్రామాన్ని చూడాలని వేడుకతో తహతహలాడుతుండగా, ఉభయ పక్షాలలోని యోధులు యుద్ధాన్ని ప్రారంభించాలని ఉత్సాహపడుతుండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

ధర్మరాజు పాదచారియై భీష్ముని యొద్దకుఁ బోవుట (సం. 6.41.6)

**తే. సమరకౌతుకి యైన యజాతశత్రుఁ। డొప్పు మిగిలెడు మైమఱువూడ్చి యాయు**
**ధములతోఁ గూడఁ దనయరదమునఁ బెట్టి। యిలకు డిగి మౌనియై కరంబులు మొగిడ్చి.** 152

**ప్రతిపదార్థం:** సమర, కౌతుకి+ఐన= యుద్ధం చేయాలనే అభిలాషకలవాడైన; అజాత శత్రుఁడు= పుట్టని శత్రువులు కలవాడు - శత్రువులు లేనివాడు; ధర్మరాజు; ఒప్పు, మిగిలెడు= శోభాయమానమైన; మైమఱువు+ఊడ్చి= కవచాన్ని తీసివేసి; ఆయుధములతోన్+కూడన్= యుద్ధ పరికరాలతోకూడ; తన+అరదమునన్+పెట్టి= రథం మీద ఉంచి; ఇలకున్= నేలకు; డిగి= దిగి; మౌని+ఐ= మాటలాడటం మానివేసినవాడై; కరంబులు+మొగిడ్చి= చేతులు జోడించి.

**తాత్పర్యం:** అజాతశత్రువుగా పేరుకెక్కిన ధర్మరాజు చిట్టచివరకు యుద్ధం చేయటానికి సంసిద్ధుడై కురుక్షేత్రానికి వచ్చాడు. ఉన్నట్లుండి కవచం తీసివేసి ఆయుధాలతోపాటు రథంమీద పెట్టి, తాను రథం దిగి, మౌనవ్రతం పూని అంజలి ఘటించి.

**వ. భీష్ము దెసకుం జనుచున్నం గనుంగొని యమ్మహీవల్లభు తమ్ములును శౌరి సాత్యకులును బరమాప్తు లగు ధరణీశులు నతని చేతోవృత్తం బెఱుంగమి నుత్తలపడు చిత్తంబులతో వాహనంబులు డిగ్గి యతనిం గూడం జని యప్పుడు.** 153

**ప్రతిపదార్థం:** భీష్ము దెసకున్+చనుచున్నన్= భీష్ముడున్న వైపునకు వెళ్ళుతుండటం; కనుంగొని= చూచి; ఆ+మహీవల్లభు+తమ్ములును= ఆ(ధర్మ)రాజు తమ్ములూ; శౌరి, సాత్యకులును= శ్రీకృష్ణుడూ- సాత్యకీ; పరమ+ఆప్తులు+అగు= హృదయానికి మిక్కిలి దగ్గరివారైన స్నేహితులు అయిన; ధరణీ+ఈశులును= రాజులూ; అతని+చేతస్+వృత్తంబు= ధర్మరాజు మనస్సులో ఉన్నది; ఎఱుంగమి= తెలియకపోవటం చేత; ఉత్తలపడు+చిత్తంబులతోన్= కలత చెందిన మనస్సులతో; వాహనంబులు+డిగ్గి= వాహనాలను (రథ, గజ తురగాదులు) దిగి; అతనిన్+కూడన్+చని= ధర్మరాజు దరికి చేరబోయి; అప్పుడు= ఆ సమయమునందు.

**తాత్పర్యం:** ధర్మరాజు భీష్ముడు ఉన్నచోటికి వెళ్ళటం చూచి, అతడి తమ్ములు, శ్రీకృష్ణుడు, సాత్యకి, అతడికి మిక్కిలి దగ్గర స్నేహితులైన రాజులు, అతడి మనస్సులో ఏమున్నదో తెలియక కంగారు పడ్డారు. అయితే వారు గూడ వాహనాలు దిగి, ధర్మరాజును అనుసరించసాగారు. ఆ సమయంలో వారు ధర్మరాజుతో పలికిన మాటలు.

**సీ.** **'ఏ మెల్ల నుండ నీ విట్లొంటి గాల్నడ । నేఁగుచున్కికిఁ గత మెద్దియొక్కొ?**
**పన్నిన పగఱపై సన్నాహ మంతయు । నెడలించి నడచుట యెట్టులొక్కొ?**
**రిపులు దేఁకువ సెడఁ గృపణత దుర్బలు । చాడ్పునఁ జను టేమి చంద మొక్కొ?**
**యడరి పోరాటకు నదనైనచో నొప్పు । పొలివోవఁ బోవుట పోలు నొక్కొ?**

**తే.** **యని క్రమంబున నా మరుత్తనయ విజయ । నకుల సహదేవు లడుగ భూనాథుఁ డొక్క**
**పలుకుఁ బలుకక యరుగంగఁ బద్మనాభుఁ । డక్కుమారులతో నిట్టులనియె నగుచు.** 154

**ప్రతిపదార్థం:** ఏము+ఎల్లన్+ఉండన్= మేము అందరం ఉండగా; ఈవు= నీవు; ఇట్టు= ఇట్లు; ఒంటి= ఒంటరిగా; కాల్నడన్= కాలి నడకతో; ఏగుచున్కికిన్= వెళ్ళటానికి; కతము= కారణం; ఎద్ది+ఒక్కొ= ఏది అయి ఉంటుంది?; పన్నిన- పగఱపైన్+సన్నాహము+అంతయున్= శత్రువులపై చేసిన యుద్ధ ప్రయత్నమంతా; ఎడలించి= విడిచిపెట్టి; నడచుట= వెళ్ళటం; ఎట్టులు+ఒక్కొ?= ఏ విధంగా సమంజసం?; రిపులు= శత్రువులు; తేఁకువ+చెడన్= జంకు పోయేటట్లుగా; కృపణతన్= దైన్యంతో; దుర్బలు+చాడ్పునన్= బలహీనుడి వలె; చనుట= వెళ్ళటం; ఏమి చందము+ఒక్కొ?= ఏవిధంగా సమంజసం?; అడరి= ప్రజ్వలించి; పోరాటకున్= యుద్ధానికి; అదను= సరియైన సమయం; ఐనచోన్= ఐనప్పుడు; ఒప్పు= శోభ; పొలి+పోవన్+పోవుట= క్షీణించునట్లు వెడలుట; పోలును+ఒక్కొ?= సరియైనదా?; అని= అని; క్రమంబునన్= వరుసగా; ఆ+మరుత్+తనయ, విజయ, నకుల, సహదేవులు= భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు; అడుగన్= ప్రశ్నింపగా; భూనాథుఁడు= రాజు (ధర్మరాజు); ఒక్క పలుకు పలుకక= ఒక మాట గూడ మాటాడక; అరుగంగన్= వెళ్ళగా; పద్మనాభుఁడు= (పద్మం నాభియందు కల) విష్ణువు- శ్రీకృష్ణుడు; ఆ+కుమారులతోడన్= ఆ పాండవ కుమారులతో; ఇట్లు= ఈ విధంగా; నగుచున్= నవ్వుతూ; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు నిరాయుధుడై మౌనం వహించి నమస్కారముద్రతో పాదచారియై నడచి వెళ్ళటం చూచి అతడి తమ్ములు ఈ విధంగా ప్రశ్నించారు. భీముడు: 'మే మందరం ఉండగా అన్నయ్యా! నీవు ఒంటరిగా పాదచారివై ఎక్కడకు ఎందుకు వెళ్లుతున్నావు?' అర్జునుడు: 'శత్రువులను ఎదిరించటానికి, ఓడించటానికి మనం ఎన్నో వ్యూహాలు పన్నాము. వాటిని అన్నిటినీ ఉజ్జగించి నీవు ఎక్కడకు ఎందుకు వెళ్ళుతున్నట్లు?' నకులుడు: 'శత్రువులు జంకుపడకుండగా, దైన్యంతో బలహీనుడి వలె ఎందుకు నడచి వెళ్ళుతున్నట్లు?' సహదేవుడు: 'ఉత్సాహంతో ప్రజ్వరిల్లి యుద్ధం చేయవలసిన సమయం ఇది. ఎందుకు ఒప్పు తరుగునట్లు వెళ్ళడం?' ఈ ప్రశ్నలు అడుగుతూ ఉంటే ధర్మరాజు ఒక మాటకూడా మాట్లాడక పోతూఉండగా వారితో శ్రీకృష్ణుడు నవ్వుతూ ఈ విధంగా అన్నాడు.

వ. 'ఇతని తలం పే నెఱింగితి; నితండు భీష్మద్రోణ కృప శల్యులకు నమస్కరించి, వారలచేత ననుజ్ఞాతుండై భండనంబు సేయువాఁడు గాఁ దలంచి చనియెడుఁ; బెద్దల యనుజ్ఞఁ గొని కయ్యంబు సేసిన జయం బగుట నిశ్చయం బని యార్యులు సెప్పుదురు, గావున నా సుకర్మం బాచరించుట మేల కాక, యనిన విని యజాతశత్రు వెనుక నప్పు డరిగినవారలు పలుకు లుడిగి నిలిచి వెఱగుపడి చిత్రరూపంబుల చందంబై చూచుచుండిరి; కృష్ణార్జునులును భీముండును గవలును దోన చనం గౌంతేయాగ్రజుండు గాంగేయు తేరు సేరంబోవం, గౌరవ సైన్యజనంబు లేపు మిగిలి మెడ లెత్తి కనుంగొని; రయ్యవసరంబున నందలి యోధవీరు 'లితం డింత వెఱచునే' యనువారును 'వెఱవ నిప్పు డితని కేమి వచ్చె' ననువారును, 'వృకోదరుండు వివ్వచ్చుండు గవలు సౌభద్రుండు సాత్యకి విరాటుండు ద్రుపదుండు ధృష్టద్యుమ్నుండు శిఖండియుం గలుగఁ దన కింత యేల?' యనువారును 'ధర్మతనయుండు భీతుండు గాఁ' డేమి తలంపున వచ్చెనో? యనువారును; మఱియు ననేక ప్రకారంబులం బలుకు వారునునై యుండిరి; పాండవ సైనికులు 'మానధనుండగు నిమ్మానవనాథుండు నదీనందనుతో నేమనువాఁ? డతం డితని నేమిభంగి సమ్మానించు? మాధవ ధనంజయు లెట్లు పలుకువారు? మారుతసుతుండును మాద్రీసూనులును నెత్తెఱంగున మాటలాడుదురు? వీరేమిటి కివ్విధంబునకుం దొడంగి రనుచు వగచి వెండియు వివిధ వచనముఖరు లగుచుండి; రయ్యుధిష్ఠిరుండు సముద్యత నానాయుధ బహుళంబైన కురువ్యూహంబు దఱిసి, పితామహుపాలికిం బోయి తత్పాదంబులకుఁ, బ్రణామంబు సేసి సవినయంబుగా నతని కిట్లనియె. 155

**ప్రతిపదార్థం:** ఇతని, తలంపున్= ఇతడి (ధర్మరాజు) అభిప్రాయం; ఏను= నేను; ఎఱింగితిన్= తెలిసికొన్నాను; భీష్మ, ద్రోణ, కృప, శల్యులకున్= భీష్ముడికి, ద్రోణుడికి, కృపుడికి, శల్యుడికి నమస్కరించి= వందనం సమర్పించి; వారలచేతన్= భీష్మ, ద్రోణ, కృప, శల్యులచేత; భండనంబు+చేయువాఁడుగాన్= యుద్ధం చేసేవాడుగా; తలంచి= ఆలోచించి; చనియెన్= వెళ్ళుతున్నాడు; పెద్దల+అనుజ్ఞన్= పెద్దవారి అనుమతి; కొని= పొంది; కయ్యంబు+చేసినన్= యుద్ధం చేస్తే; జయంబు+అగుట= గెలుపు లభించటం; నిశ్చయంబు+అని= తథ్యం అని; ఆర్యులు= పూజ్యులు; చెప్పుదురు= వచిస్తారు; కావునన్= కాబట్టి; ఆ+సుకర్మంబు= ఆ మంచి పని; ఆచరించుట= చేయటం; మేలు+అ+కాక+అనినన్= శుభం కదా! అని చెప్పగా; విని= ఆలకించి; అజాత శత్రు, వెనుకన్= ధర్మరాజు వెంట; అప్పుడు= ఆ సమయంలో; పలుకులు+ ఉడిగి= మాటలు మాట్లాడటం ఉజ్జగించి; నిలిచి= ఆగి; వెఱగు పడి= ఆశ్చర్యం చెంది; చిత్ర, రూపంబుల, చందంబు+ఐ= చిత్రలేఖనంలో ఉన్న బొమ్మల మాదిరిగా అయి (కదలకుండగా మెదలకుండగా నిలిచి); చూచుచున్+ఉండిరి= చూస్తూ ఉండిపోయారు; కృష్ణ+అర్జునులును= శ్రీకృష్ణుడూ, అర్జునుడూ; భీముండును= భీముడూ; కవలును= (నకుల సహదేవులూ); తోన+చనన్= వెనువెంట రాగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతి పెద్ద కొడుకు- ధర్మరాజు; గాంగేయు, తేరు+చేరన్+పోవన్= భీష్ముడి రథాన్ని సమీపించగా; కౌరవ, సైన్య, జనంబు= కౌరవసేనలోని ప్రజ; ఏపు, మిగిలి= అతిశయించి; మెడలు+ఎత్తి= తలపైకిఎత్తి; కనుంగొనిరి= చూచారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; అందలి= (ఆ కౌరవ సైన్యంలోని); యోధవీరులు= యుద్ధం చేసే శూరులు; ఇతండు= (ఈ ధర్మరాజు); ఇంత+వెఱచునే!= ఇంతగా భయపడుతున్నాడే!; అనువారును= అనేవారూ; వెఱవన్= భయపడటానికి; ఇప్పుడు= ఈ సమయంలో; ఈతనికిన్+ఏమి, వచ్చెన్?= ఈ ధర్మరాజుకు ఏ అవసరం కలిగింది; అనువారును= అనేవారూ; వృకోదరుండు= భీముడు; వివ్వచ్చుండు= అర్జునుడు; కవలు= నకుల, సహదేవులు; సౌభద్రుండు= అభిమన్యుడు; సాత్యకి, విరాటుడు; ద్రుపదుండు= ద్రుపదుడు; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; శిఖండియున్= శిఖండీ; కలుగఁగన్= ఉండగా; తనకున్?= (ధర్మరాజుకు); ఇంత+ఏల?= ఇంత (భయం) ఎందుకు? అనువారును= అనేవారూ; ధర్మతనయుండు= ధర్మరాజు; భీతుండు+కాఁడు= భయపడేవాడుకాడు; ఏమి, తలంపునన్= ఏ అభిప్రాయంతో; వచ్చెనో?= వచ్చాడో?; అనువారును= అనేవారూ; మఱియున్= ఇంకా; అనేక+ప్రకారంబులన్=

పెక్కు విధాలుగా; పలుకువారును+ఐ= మాటలాడేవారై; ఉండిరి= ఉన్నారు. పాండవ+సైనికులు= పాండవసేనలోని భటులు; మానధనుండు+అగు= అభిమానమే ధనంగా గల వాడగు; ఈ+మానవనాథుండు= ఈ రాజు; నదీ+నందనుతోన్= భీష్ముడితో (గంగా కొడుకుతో); ఏమి+అనువాఁడు?= ఏమి మాటాడునో?; అతండు= ఆ భీష్ముడు; ఇతనిన్= ధర్మరాజును; ఏమి, భంగిన్= ఏ రీతిగా; సమ్మానించున్?= గౌరవిస్తాడు?; మాధవ, ధనంజయులు= శ్రీకృష్ణుడు, అర్జునుడూ; ఎట్లు+పలుకువారు?= ఏ విధంగా మాటాడుతారు?; మారుత సుతుండును= భీముడు; మాద్రీసూనులు= మాద్రి కొడుకులు- నకుల సహదేవులు; ఏ+తెఱంగునన్= ఏమార్గంలో; మాటలాడుదురు?= మాటాడగలరో; వీరు= వీరు (ధర్మజాదులు); ఏమిటికిన్= ఎందుకు; ఈ+విధంబునకున్= ఈ రీతికి; తొడంగిరో= పాల్పడ్డారో?; అనుచున్+వగచి= అని విచారించి; వెండియున్= మరల; వివిధ, వచన, ముఖరులు+అగుచుండిరి= పెక్కు మాటలు ధ్వనించినవారు అయ్యారు; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; సముద్యత, నానా, ఆయుధ, బహుళంబు+ఐన= ఎన్నో విధాలైన ఆయుధాలతో కూడిన; కురు, వ్యూహంబున్= కౌరవులు పన్నిన వ్యూహాన్ని; దఱిసి= సమీపించి; పితామహు పాలికిన్ పోయి= తాతగారి దగ్గరకు వెళ్ళి (భీష్ముని దరికి వెళ్ళి); తద్+పాదంబులకున్= ఆతని చరణాలకు; ప్రణామంబు+చేసి= నమస్కారం చేసి; సవినయంబుగాన్= నమ్రతతో; అతనికిన్= భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ధర్మరాజు అభిప్రాయం నేను పసికట్టాను. ఇతడు భీష్ముడికీ, ద్రోణుడికీ, కృపుడికీ, శల్యుడికీ నమస్కరించి యుద్ధం చేయటానికి ముందు పెద్దలు పూజ్యులు అయిన వారి అనుమతి పొందాలని వెళ్ళుతున్నాడు. పెద్దల ఆశీస్సుల వలన విజయం సిద్ధిస్తుందని ఆర్యుల ప్రవచనం.' అంత అజాతశత్రువైన ధర్మరాజు వెంట వెళ్ళేవారు మౌనం వహించి చిత్రపటంలోని బొమ్మలవలె ఆశ్చర్యంతో చూస్తూ నిలబడ్డారు. కృష్ణుడు అర్జునుడు భీముడు, నకులసహదేవులు అనుసరించి తన వెనుక రాగా, కుంతి పెద్ద కొడుకు ధర్మరాజు భీష్ముడి రథం దగ్గరకు చేరేటప్పుడు కౌరవసేనలోని వారు తలలెత్తి చూచారు. అప్పుడు ఆ కౌరవసేనలో నుండి వినిపించిన మాటలు- 'అయ్యో ధర్మరాజు ఎందుకు ఇంత భయపడుతున్నాడు?' 'అసలు భయపడటానికి మూలకారణం ఏమిటి?' 'భీముడు అర్జునుడు నకుల సహదేవులు అభిమన్యుడు. ద్రుపదుడు, విరాటుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి వంటి ఎందరో వీరులు తన పక్షంలో ఉండగా ధర్మరాజుకు ఈ పిరికితనం ఎందుకు?' 'ధర్మరాజు పిరికివాడు కాడు. అతడు రావటానికి ఏదో కారణం ఉండి ఉంటుంది.' 'అతడి మనస్సులో అసలు ఏముందో' - అని ఇంకా అనేక విధాలైన మాటలు వినిపించాయి. పాండవ సేనలో, 'ధర్మరాజు అభిమానవంతుడు. అతడు భీష్ముడితో ఏమి సంభాషిస్తాడో? భీష్ముడు ధర్మరాజును ఏ విధంగా మన్నిస్తాడో? చూడాలి. శ్రీకృష్ణుడు ఏమంటాడో? అర్జునుడు ఏమంటాడో? భీముడు నకుల సహదేవులు ఏ విధంగా సంభాషిస్తారో? వీరందరు ఈ విధంగా ప్రవర్తించటానికి కారణం ఏమిటో? చూడాలి.' 'ఈ విధంగా ఎన్నో మాటలు వెలువడ్డాయి. ధర్మరాజు ప్రౌఢ సన్నాహాలతో చక్కగా చిక్కగా అమర్చబడిన కౌరవవ్యూహాన్ని చేరి, పితామహుడైన భీష్ముడి దగ్గరకు పోయి, అతడి పాదాలకు నమస్కారం చేసి, నమ్రతతో అతడితో ఈ విధంగా అన్నాడు:

**ఆ. ' అనఘ! నీ కెదిర్చి యని సేయువాఁడనై । ము న్ననుజ్ఞ గొనఁగ నిన్నుఁ గాన**
**నెమ్మి వచ్చినాఁడ; నీచేత దీవన । వడసి చనిన నేను బగఱ గెలుతు.' 156**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ఓ భీష్మ పితామహా!; నీకున్+ఎదిర్చి= నిన్ను ఎదిరించి; అని+చేయువాడను+ఐ= యుద్ధం చేసేవాడినై; మున్ను= మొదట; అనుజ్ఞన్+కొనఁగన్= అనుమతి పుచ్చుకొనాలని; నిన్నున్= నిన్ను; కానన్= చూడటానికి; నెమ్మిన్= ప్రీతితో; వచ్చినాఁడన్= వచ్చాను; నీచేతన్= నీ చేత; దీవన= ఆశీస్సు; పడసి= పొంది; చనినన్= వెళ్ళితే; పగఱన్= శత్రువులను; ఏను= నేను; గెలుతున్= జయిస్తాను.

**తాత్పర్యం:** 'పుణ్యపురుషుడవైన ఓ భీష్మపితామహా! నీవు అన్ని విధాలా పెద్దవాడవు. పూజనీయుడవు. దురదృష్టవశాత్తు నిన్ను యుద్ధంలో ఎదిరించవలసిన అవసరం ఏర్పడింది మాకు. అయితే, ముందుగా నీ అనుమతిని అర్థించి నీ దీవనలు పొంది, తదుపరి యుద్ధం చేయాలని నేను నీ దగ్గరకు ప్రాంజలినై వచ్చాను. నీ ఆశీర్వచనం లభిస్తే నేను శత్రువులను జయించగలను.'

**విశేషం:** ఇది ధర్మరాజు శీలానికి గీటురాయి. పరాక్రమ ప్రాభవాలలో ధర్మరాజుకంటె అతడి తమ్ములే అధికులు. అయితే, శక్తి సామర్థ్యాల కంటె సౌశీల్యమే గొప్పది. ప్రపంచ చరిత్రలో 'అజాత శాత్రవుడు' అనిపించుకొన్న వ్యక్తి ఉన్నాడా? ఇక మానవ సాహిత్యం మానవ వేదాంతం అటువంటి ఆదర్శ వ్యక్తి కోసం అన్వేషిస్తూనే ఉన్నాయి. ప్రపంచ సాహితీజగత్తులో ఆదర్శ వ్యక్తి అజాతశత్రువు. మహాభారతంలో 'ధర్మరాజు' పాత్రలో సాక్షాత్కరిస్తున్నాడు.

**సీ. ' అన విని గాంగేయు! డక్కట! నీ విట్లు । సనుదేక తక్కిన శాపమిత్తు;**
**వచ్చితి మేలయ్యె; వైరుల నిర్జింపు, । మిది గాకయును వర మెద్దియైన**
**నడుగుము, నీకుఁగా ననిసేయు టొక్కటి । దక్కంగ' నావుడు ధర్మసుతుఁడు**
**' రారాజు పక్షమై రణము సేయుము; నాకు । హిత మగు కార్యంబు మతిఁ దలంపు'**

**ఆ. మనుడు 'నట్ల కాక యట నీతలం పేమి?' । యనిన భీష్ముతోడ నతఁడు 'నిన్నుఁ**
**బోర గెలుచు విధము బోధింపు' మనుటయు । సస్మితాస్యుఁ డగుచు శాంతనవుఁడు. 157**

**ప్రతిపదార్థం:** అనన్= అని ధర్మరాజు చెప్పగా; విని= ఆలకించి; గాంగేయుఁడు= గంగకొడుకు- భీష్ముడు; అక్కట!= ఆహా!; నీవు+ఇట్లు+చనుదేక+తక్కినన్= నీవు ఈ రీతిగా రాకపోతే; శాపము+ఇత్తున్= శాపం ఇచ్చేవాడిని; వచ్చితి(వి)= వచ్చావు; మేలు+అయ్యెన్= మంచిదయింది; వైరులన్= శత్రువులను; నిర్జింపుము= జయించుము; ఇది+కాకయును= ఇంతేకాక; నీకున్+కాన్+అని+చేయుట+ఒక్కటి+తక్కంగన్= నీ పక్షం చేరి యుద్ధం చేయమనటం ఒకటి తప్ప; వరము+ఎద్ది+ఐనన్= ఏదైన కోరిక; అడుగుము= కోరుకొమ్ము; నావుడున్= అని (భీష్ముడు) చెప్పగా; ధర్మసుతుఁడు= ధర్మరాజు; రారాజు+పక్షమై= దుర్యోధనుడివైపు; రణము+చేయుము= యుద్ధం చేయుము; మతిన్= (నీ) మనస్సులో; నాకున్+హితము+అగు+కార్యంబునన్= నాకు మేలు గలిగే పనిని; తలంపుము= యోజించుము; అనుడున్= అని (ధర్మరాజు) చెప్పగా; అట్లు+అ+కాక= సరే ఆ విధంగానే జరుగుగాక; అటన్= అచట; నీ, తలంపు+ఏమి?= నీ మనస్సులోని ఆలోచన ఏమిటి?; అనినన్= అని చెప్పగా; భీష్ముతోడన్= భీష్ముడితో; అతఁడు= ధర్మరాజు; నిన్నున్= నిన్ను (భీష్ముడా! నిన్ను); పోరన్= యుద్ధంలో; గెలుచు+విధము= జయించే ఉపాయం; బోధింపుము= తెల్పుము; అనుటయున్= అని చెప్పగా; సస్మిత+ఆస్యుఁడు+అగుచున్= చిరునవ్వుతో కూడిన మొగం కలవాడు అవుతూ; శాంతనవుండు= శంతనుడి కొడుకు- భీష్ముడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు పలుకగా, భీష్ముడు ఈ విధంగా సమాధానం చెప్పాడు: 'ఓ ధర్మరాజా! నీవు రావటం మంచిది అయింది. నీవు ఈ విధంగా నా దగ్గరకు రాకపోతే నాకు నీమీద కోపం వచ్చి ఉండేది. నిన్ను శపించి ఉండేవాడిని. నీకు నా ఆశీస్సులు. నీవు శత్రువులను జయిస్తావు. అంతేకాదు, నీకు నేను ఒక వరం ఇవ్వదలిచాను. కోరుకో. నీవైపు నన్ను యుద్ధం చేయుమనే కోరిక తప్ప, ఇంకేది కోరినా నీమాట చెల్లిస్తాను' అన్నాడు. ఆ మాటలకు ధర్మరాజు ఈ విధంగా బదులు పలికాడు. "ఓ భీష్మపితామహా! నీవు రాజరాజు అయిన దుర్యోధనుడివైపే యుద్ధం చేయుము. అయితే- నీ మనస్సులో మాత్రం నా మేలు తలపోయుము' అని కోరాడు. 'అట్లాగే; అయితే అసలు నీ మనస్సులో ఉన్న మాట నీవు విప్పి చెప్పుము' అని అడిగాడు. ధర్మరాజు 'మహానుభావా! నిన్ను యుద్ధంలో మేము గెలిచే ఉపాయం దయచేసి చెప్పు'మని అన్నాడు. ఆ మాటలు విని భీష్ముడు చిరునవ్వు చిందే ముఖంతో ఈ విధంగా పలికాడు:

**విశేషం:** ధర్మరాజు (తిక్కన మాటలలో) 'మెత్తని పులి.' 'పితామహా! మేము కోరుకునేది నీ మరణం' అన్నాడన్నమాట ధర్మరాజు. భీష్ముడికి ఆ మాట ఆగ్రహం కలిగించలేదు. పైగా ఆతడు సుందర మందహాస మండన ముఖారవిందుడైనాడట! అప్పుడు భీష్ముడి ముఖంలో విరిసిన చిరునవ్వును ఏ చిత్రకారుడైనా చిత్రించగలడా?

**క. ' నను మార్కొని గెలువఁగ న । య్యనిమిషులకు నరిది' యనుడు 'న ట్లగుటఁగదా**
**నిను వేఁడెద' నని కుంతీ । తనయుఁడు వలుకుటయు విని పితామహుఁడు గృపన్. 158**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను (భీష్ముడిని); మార్కొని= ఎదిరించి; గెలువఁగన్= జయించగా; ఆ+అనిమిషులకున్= ఆ దేవతలకు కూడ; అరిది= అపురూపం (దుర్లభం); అనుడున్= అని భీష్ముడు చెప్పగా; అట్లు+అగుటన్+కదా= అందు చేతనే గదా; నినున్= నిను; వేడెదను= ప్రార్థిస్తున్నాను; అని= అని; కుంతీ+తనయుఁడు= కుంతి కొడుకు- ధర్మరాజు; పలుకుటయును= చెప్పగా; విని= ఆలకించి; కృపన్= దయతో; పితామహుఁడు= తాత - భీష్ముడు.

**తాత్పర్యం:** 'నన్ను జయించటం ఆ దేవతలకు కూడా సాధ్యం కాదు. ఇక మానవుల మాట చెప్పటం ఎందుకు?' అన్నాడు భీష్ముడు. 'అందుచేతనేగదా, నిన్ను ఈ విధంగా ప్రార్థించవలసి వచ్చింది' అని సమాధానం చెప్పాడు ధర్మరాజు. ధర్మరాజు చెప్పిన సమాధానం విని, పితామహుడు అయిన భీష్ముడు దయగలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. ' చుట్టరికంబునన్ మనసు సొచ్చి ననుం గరఁగించి వేఁడినన్**
**దిట్టతనంబు వో విడిచి తీవ్రరణంబు కడంక దక్కి నేఁ**
**బట్టిన యాయుధంబు పెడఁబాసినఁ గాని వధింపఁ బోల ద**
**ట్టిట్టన కేఁగు; మిప్పరుస యింతక కాలము గాదు దానికిన్. 159**

**ప్రతిపదార్థం:** చుట్టరికంబునన్= బంధుత్వంచేత; మనసు+చొచ్చి= నా మనస్సులో దూరి; ననున్= నన్ను; కరఁగించి (నా హృదయం) కరగించి; వేఁడినన్= ప్రార్థిస్తే; దిట్టతనంబు+పోన్+విడిచి= శక్తిసామర్థ్యాలు విడిచి పెట్టి; తీవ్రరణంబు+కడంక+తక్కి= ఘోర యుద్ధమందలి పూనిక విడనాడి; నేన్= నేను; పట్టిన+ఆయుధంబు+పెడన్+పాసినన్+కాని= చేతపట్టిన యుద్ధ పరికరాన్ని ప్రక్కకు వదలివేస్తే తప్ప; వధింపన్+పోలదు= (నన్ను) చంపటానికి వీలులేదు; ఈ+పరుస= ఈ విధంగా; అట్టు+ఇట్టు+అనక= ఇది అది అనక (ఎదురు మాటలు చెప్పకుండా); ఏఁగుము= వెళ్లిపొమ్ము; ఇంతకు+అ= ప్రస్తుతం; దానికిన్= నన్ను గెలిచే ఉపాయం ఏదో నీకు చెప్పటానికి; కాలము+కాదు= సమయం కాదు.

**తాత్పర్యం:** బంధుత్వం చొప్పున నా మనస్సులో దూరి నా హృదయం కరగించి ప్రార్థిస్తే, నా శక్తిసామర్థ్యాలు విడిచి పెట్టి, ఘోర యుద్ధంమీద పూనిక సడలించి, నేను పట్టిన ఆయుధం ప్రక్కకు పెట్టివేస్తే తప్ప, నన్ను ఎవరూ సంహరించలేరు. నాతో అది ఇది అని వాదానికి దిగవద్దు. ప్రస్తుతానికి మారు మాటాడకుండా వెళ్లిపొమ్ము. నన్ను జయించే ఉపాయం చెప్పటానికి ఇది తగిన సమయం కాదు.

### ధర్మరాజు గురుకృపశల్యులచేత యుద్ధమున కనుజ్ఞాతుం డగుట (సం. 6.41.43)

**తే. క్రమ్మఱంగ నేతెంచెదు గాక!' యనుడు । నతిముదంబునఁ బ్రణమిల్లి, యతని వాక్య**
**మపుడు దల నిడుకొనినవాఁ డగుచు నప్పి । తామహుని నెమ్మి వీడ్కొని ధర్మసుతుఁడు. 160**

**ప్రతిపదార్థం:** క్రమ్మఱంగన్= మరల; ఏతెంచెదు(వు)+కాక= వచ్చెదవు రాక; అనుడున్= అని చెప్పగా; ధర్మసుతుడు= ధర్మరాజు; అతి+ముదంబునన్= మిక్కిలి సంతోషంతో; ప్రణమిల్లి= నమస్కరించి; అపుడు= ఆ సమయంలో; అతడి+వాక్యము= అతడి (భీష్ముని మాట); తలన్= శిరస్సుపై; ఇడికొనినవాడు+అగుచున్= పెట్టుకొన్నవాడై; ఆ+పితామహునిన్= ఆ తాతగారిని (భీష్ముని); నెమ్మిన్= ప్రీతితో; వీడ్కొని= సెలవు గైకొని.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీవు మరల నన్ను సందర్శించు' అని భీష్ముడు చెప్పగా. ధర్మరాజు మిక్కిలి సంతోషించి, అతడి మాట శిరసావహించి తాతగారైన భీష్ముడి కడ సెలవు పుచ్చుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. కృష్ణార్జునాదులుం దోడన చనుదేర గురుకృపశల్యుల కడకుం గ్రమంబున నరిగి పాదప్రణామంబు లాచరించి, వారలచేత రణంబునకు ననుజ్ఞ వడసి, యమ్మనుజపతి దనకు జయం బాశాసింపుమని యభ్యర్థించిన నయ్యాచార్యుండు 'నీకుం గృష్ణుండు మంత్రి యై యుండ నొరుల జయం బాశాసింపు మననేల? ధర్మం బేవలనం గలుగు నవ్వలన కృష్ణుండు గైకొను; నవ్వలనికి జయం బగు' ననియె; నిజవధోపాయంబు వేఁడిన నతండు 'నాచేత నాయుధం బున్నంతసేపు నన్నుం జంప నెట్టివారికి నశక్యం; బేను బ్రాయోపవేశంబున సన్న్యస్తశస్త్రుండ నైనం జంపుటకు నోపు నట్టివారికి నది దొరకొనుఁ; బెద్దయు నమ్మఁగలవాఁడు సెప్ప నత్యంతదుస్సహం బైన కీడుమాట వింటినేని నట్టివాఁడ నగుదు; నప్పు డట్టి పగఱకు నప్పని దీర్ప ననువై యుండు ' నని చెప్పినఁ గృపాచార్యునిం బరిమార్చు తెఱంగు నడుగం దొడంగి యేర్పడం బలుకనేరకున్న , నతం డెఱింగి తాను వధ్యుండు గామి యెఱింగించి 'గెలువు' మని దీవించె మద్రపతితో 'నీవు రాధేయునకు సారథి వగుట సంభవింప నోపు నని చెప్పి కయ్యంబు నప్పుడు కర్ణతేజంబు దూలం బలికి యతనిఁ జిక్కువఱుపవలయు' నని వరంబు గోరిన 'నతం; డవ్విధంబు నీ యుద్యోగ సమయంబున నియ్యకొనినయది గాదే' యట్ల చేయుదు' నని పలికె నిత్తెఱంగున నందఱ వీడ్కొని యజాతశత్రుం డనుజవర్గానుగతుండై మరలె నయ్యవసరంబున 161**

**ప్రతిపదార్థం:** కృష్ణ+అర్జున+ఆదులున్= కృష్ణుడు; అర్జునుడు మున్నగువారు; తోడన్+అ+చనుదేరన్= తోడుగా వెనువెంట రాగా; గురు, కృప, శల్యుల, కడకున్= గురువైన ద్రోణాచార్యుడి కడకు; కృపుడి కడకు, శల్యుడి కడకు; క్రమంబునన్= వరుసగా; అరిగి= వెళ్ళి; పాద+ప్రణామంబులు= పాదాలకు నమస్కారాలు; ఆచరించి= చేసి; వారలచేతన్= (గురు కృప శల్యుల చేత); రణంబునకున్= యుద్ధానికి; అనుజ్ఞ= అనుమతి; పడసి= పొంది; ఆ+మనుజపతి= ఆ రాజు- ఆ ధర్మరాజు; తనకున్= తనకు; జయంబు= గెలుపు; ఆశాసింపుము+అని= ఆశీర్వదించుమని; అభ్యర్థించినన్= కోరగా; ఆ+ఆచార్యుండు= ఆ గురుడు- ద్రోణుడు; నీకున్= నీకు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; మంత్రి+ఐ+ఉండన్= మంత్రిగా ఉండగా; ఒరులన్= ఇతరులను; జయంబు= గెలుపు; ఆశాసింపుము+అనన్+ఏల?= ఆశీర్వదించుమని కోరనేల; ధర్మంబు= ధర్మం; ఏవలనన్+కలుగున్= ఏవైపు ఉంటుందో; ఆ+వలనన్= ఆ వైపే; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; కైకొనున్= స్వీకరిస్తాడు; ఆ+వలనికిన్= ఆ పక్షానికి; జయంబు+అగున్= గెలుపు వస్తుంది; అనియెన్= అని చెప్పాడు; నిజ, వధ+ఉపాయంబున్= తనను సంహరించే తెరువు; వేఁడినన్= అర్థించగా (చెప్పుమని ప్రార్థింపగా); అతండు= ద్రోణుడు; నా చేతన్= నా హస్తమునందు; ఆయుధంబు+ఉన్నంత సేపు= యుద్ధ పరికరం ఉన్నంత కాలం; నన్నున్+చంపన్= నన్ను చంపేందుకు; ఎట్టివారికిన్= ఎవ్వరికైనా సరే; అశక్యంబు= సాధ్యం కాదు; ఏను= నేను; ప్రాయోపవేశంబునన్= ఉపవాసవ్రతంతో (అన్నపానాలు త్యజించి); సన్న్యస్త+శస్త్రుండన్+ఐనన్= విడిచి పెట్టిన ఆయుధాలు కలవాడను అయితే (అనగా శస్త్ర సన్న్యాసం చేస్తే); చంపుటకున్+ఓపు= సంహరించటానికి సామర్థ్యం కల్గిన; అట్టివారికిన్= అటువంటివారికి అది= నన్ను చంపటం; దొరకొనున్= వీలుపడుతుంది; పెద్దయున్= మిక్కిలి; నమ్మన్+తగువాఁడు=

విశ్వసింపదగినవాడు; చెప్పన్= చెప్పగా; అత్యంత, దుస్సహంబు+అయిన కీడుమాట= మిక్కిలిగా భరించలేని చెడుమాట; వింటిన్+ఏనిన్= ఆలకిస్తే; అట్టివాఁడన్+అగుదున్= అటువంటి వాడను= (శస్త్ర సన్యాసం చేసినట్టివాడను); కాగలను; అప్పుడు= ఆసమయంలో; అట్టి+పగఱకున్= అటువంటి శత్రువులకు; ఆ+పని= ఆకార్యం (నన్ను వధించటం); తీర్పన్+అనువు+ఐ ఉండున్= నెరవేర్చటానికి వీలుకలుగుతుంది; అని చెప్పినన్= అని ద్రోణుడు చెప్పగా; కృపాచార్యునిన్= కృపుడిని; పరిమార్చు+తెఱంగు= చంపదగిన ఉపాయం; అడుగన్+తొడంగి= ప్రశ్నించటానికి పూని; ఏర్పడన్= స్పష్టంగా; పలుక నేరక+ఉన్నన్= చెప్పజాలకపోవటం చేత; అతండు= కృపుడు; ఎఱింగి= తెలిసికొని; తాను= తాను (కృపుడు); వధ్యుండు+కామి= చంపుటకు వీలైన వాడు కాకపోవటం; ఎఱింగించి= తెలిపి (ధర్మరాజునకు చెప్పి); గెలువుము+అని= విజయం పొందుము అని; దీవించెన్= ఆశీర్వదించాడు; మద్రపతితోన్= మద్రరాజుతో- శల్యుడితో; నీవు= నీవు; రాధేయునకున్= రాధ కొడుకునకు - కర్ణుడికి; సారథివి+అగుట= రథచోదకుడవు కావటం; సంభవింపన్+ఓపున్= జరుగవచ్చును; అని చెప్పి= అని పలికి; కయ్యంబు+అప్పుడు= యుద్ధం చేసే సమయంలో; కర్ణు+తేజంబు= కర్ణుడి యొక్క దీప్తి; తూలన్+పలికి= పడిపోయేటట్లుగా మాటలాడి; అతనిన్= (కర్ణుడిని); చిక్కుపఱుపవలయున్= చీకాకు పెట్టవలెను; అని; వరంబు= వరమును; కోరినన్= అర్థించగా; అతండు= (శల్యుడు); ఆ+విధంబునన్= ఆ రీతిని; నీ+ఉద్యోగ, సమయంబునన్= నీవు యుద్ధ ప్రయత్నాలు చేస్తున్న సమయంలో; ఇయ్యకొనిన+అది= ఒప్పుకొన్నదే; కాదే= అవును గదా; అట్లు+అ= ఆ రీతిగా; చేయుదున్= చేస్తాను; అని పలికెన్= అని చెప్పాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; అందఱన్+వీడ్కొని= అందరి దగ్గర సెలవు తీసికొని; అజాతశత్రుండు= ధర్మరాజు; అనుజ, వర్గ+అనుగతుండు+ఐ= తమ్ములగుంపుచేత అనుసరించబడినవాడై; మరలెన్= వెనుకకు తిరిగి వెళ్ళాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** తనతోపాటు శ్రీకృష్ణుడూ అర్జునుడూ - అనుసరించి రాగా, ధర్మరాజు ముందుకు సాగి, ద్రోణుడు కృపుడు శల్యుడు ఉన్న చోట్లకు వెళ్ళి, వారి పాదాలకు నమస్కారాలు చేసి, తాను వారితో యుద్ధం చేయటానికి అనుమతి ప్రసాదించండని అర్థించాడు. తనకు విజయం చేకూరవలెనని ఆశీర్వదించుమన్నాడు. అప్పుడు ద్రోణుడు - 'ధర్మరాజా! నీకు భగవంతుడైన శ్రీకృష్ణుడే మంత్రిగా ఉన్నాడు. ఇంకొకరి దీవనలు నీకు ఎందుకు? ధర్మం ఎక్కడ ఉంటుందో అక్కడ శ్రీకృష్ణుడు ఉంటాడు; శ్రీకృష్ణుడు ఎక్కడ ఉంటాడో అక్కడే విజయం సిద్ధిస్తుంది' అని ద్రోణుడనగా అది విన్న ధర్మరాజు ద్రోణుడిని మిమ్ములను ఏ రీతిగా చంపటానికి వీలు అవుతుందో చెప్పుమన్నాడు. అందులకు ద్రోణుడు చెప్పిన సమాధానం 'నా చేతిలో ఆయుధం ఉన్నంతవరకూ, నన్ను ఎవరూ చంపలేరు. నేను ఉపవాసవ్రతం స్వీకరించి, శస్త్రాలను విసర్జిస్తే, పిదప నన్ను చంపవచ్చును. ఎంతో నమ్మదగిన వాడు, నా గుండె భరించలేని కీడుమాట వినిపిస్తే నేను శస్త్ర సన్యాసం చేస్తాను. అట్టి సమయాన శత్రువులు నన్ను సంహరింపవచ్చు.' పిదప ధర్మరాజు కృపాచార్యుడిని అడిగాడు ఆయనను ఏ విధంగా సంహరించటానికి వీలౌతుందో తెలుపుమని. కృపాచార్యుడు తాను వధ్యుడు కాడనీ, అయితే యుద్ధంలో ధర్మరాజు గెలవాలని తాను దీవిస్తున్నట్లు చెప్పాడు. తరువాత- ధర్మరాజు శల్యుడితో, 'మామా! నీవు రాధేయుడైన కర్ణుడికి రథసారథివి కావచ్చును. అప్పుడు అతడి తేజస్సు మాసిపోయేటట్లు చూడుము' అని అర్థించాడు. శల్యుడు ఇట్లా సమాధానం చెప్పాడు. 'ధర్మరాజా! నేను నీవు యుద్ధ సన్నాహాలు చేసేటప్పుడే నీకు వాగ్దానం చేశాను కదా!. ఆ విధంగానే చేస్తాను.' అని ఈ విధంగా అందరి దగ్గర సెలవు తీసికొని ధర్మరాజు తన తమ్ములతో కలిసి మరలి వెళ్ళాడు. ఆ సమయంలో.

**విశేషం:** 1. మంత్రి= మంత్రం తెలిసినవాడు. హితవు తెలిపేవాడు. చతురుడు. రాజ్యతంత్రజ్ఞుడు.

2. ధర్మం- నిర్వచించటం కష్టం. స్థూలంగా ధర్మం అంటే మంచి పని - కర్తవ్యం అని చెప్పవచ్చును. 'ధర్మంబు బహు మార్గ దృష్టంబు' అని భారతంలోనే చెప్పబడింది. పురుషార్థాలలో 'ధర్మం' మొదటిది. మానవ జీవితానికి పరమ ధ్యేయం ధర్మం.

'ధారయతీతి ధర్మః' జగత్తును ధరించేది ధర్మం.

**శ్లో॥ "ధృతిః క్షమా దమోऽస్తేయం । శౌచ మింద్రియనిగ్రహః,**

**ధీ ర్విద్యా సత్య మక్రోధో । దశకం ధర్మలక్షణమ్."** (మనుస్మృతి-6-92)

3. మహాభారత మహేతిహాస సారసంగ్రహంగా చెప్పదగిన వాక్యం- "యతో ధర్మ స్తతో జయః." ఎక్కడ ధర్మం ఉంటుందో అక్కడే విజయం ఉంటుంది. ఈ మాటకు ఎవరూ ఎట్టి అభ్యంతరం పెట్టనక్కరలేదు. ఈ వాక్యం గాంధారి అన్నట్లు సుప్రసిద్ధం. అయితే "యతో ధర్మ స్తతో జయః" అన్న వాక్యం భారతంలో పెక్కు చోట్ల కన్పిస్తుంది. ఇక్కడ- ద్రోణుడు ఆ మాటే అంటాడు. అయితే ఈ వాక్యానికి పూర్వ వాక్యం- "యతో ధర్మ స్తతో కృష్ణః," ఎక్కడ ధర్మం ఉంటుందో అక్కడే శ్రీకృష్ణుడు ఉంటాడు. ఈ వాక్యం కూడ నిరభ్యంతరమైనదే. కాని- సుప్రసిద్ధ పాఠం-

**"యతః కృష్ణ స్తతో ధర్మః । యతో ధర్మ స్తతో జయః"** శ్రీకృష్ణుడు ఎక్కడ ఉంటే- అక్కడే ధర్మం ఉంటుంది. ధర్మం ఎక్కడుంటే విజయం అక్కడ ఉంటుంది.

ధర్మం నిత్యచైతన్యవంతం అనీ, దేశకాల పాత్రలనుబట్టి ధర్మస్వరూపం మారుతుందనీ- ఈ విషయాన్ని నిరూపించేందుకే మహాభారతం అవతరించింది అనీ ఒక వాదం ఉన్నది. 'ఒకే నదిలో - మానవుడు రెండుసార్లు స్నానం చేయలేడు' అనే వాక్యం ఉదాహరించవచ్చును. సతత ప్రవాహిని నది. నరుడు నదిలో రెండవసారి స్నానం చేసేటప్పుడూ అది మొదట నది కాదు. నది మారుతుంది. నరుడు కూడా మారిపోవచ్చును.

శ్రీకృష్ణుడు మూర్తీభవించిన ధర్మం. ద్రోణుడు సంహరించబడింది- ధర్మరాజు "అశ్వత్థామా హతః (కుంజరః)" అని అబద్ధమాడటం చేత. అసత్యం చెప్పుమని అతడిని ప్రేరేపించింది శ్రీకృష్ణుడు. అది ధర్మమా? 'ఆచార్య దేవో భవ' 'సత్యమేవ జయతే' 'సత్యం వద' అనే వేదవాక్యాలు ఏమైనట్లు? ద్రోణుడి చేతిలో ధనుస్సు ఉన్నంత సేపు అతడు అవధ్యుడు. పాండవ సైన్యం సర్వనాశనం కావలసిందేనా? శ్రీకృష్ణుడు "సత్యం వద" అనే వేదవాక్యానికి - విప్రతిపత్తి చూపించాడు 'ప్రతిసూత్రానికి ఏదో ఒక అపవాదం ఉంటుంది.' అది దేశకాల పాత్రలనుబట్టి ఏర్పడుతుంది. ఆ పరిస్థితులలో అసత్యవాక్యం సత్యంతో సమానం. 'భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చు.' ఇది భారతంలోని వాక్యం.

'యతః కృష్ణ స్తతో ధర్మః" "యతో ధర్మ స్తతః కృష్ణః" అనే వాక్యాలు స్థూలదృష్టికి విప్రతిపన్నాలుగా కన్పించవచ్చు. సూక్ష్మదృష్టికి, 'ధర్మసూక్ష్మవేత్తలకు' అవి సమానార్థకాలే. మహాభారతం- 'ధర్మసూక్ష్మ సారసంగ్రహం.'

**క. మొనల వినోదంబునకుం । గనుఁగొన నేతెంచియున్న కర్ణునికడకుం**
**జని హరి యిట్లను నొండొరుఁ । గని యప్పటి యుచితభంగి గడతేర్చి తగన్. 162**

**ప్రతిపదార్థం:** మొనలన్=సేనలను; వినోదంబునకున్= వేడుక కోసం; కనుఁగొనన్+ఏతెంచి+ఉన్న= చూడటానికి వచ్చి నట్టి; కర్ణుని+కడకున్+చని= కర్ణుడి వద్దకు వెళ్ళి; హరి= శ్రీకృష్ణుడు; ఒండొరున్+కని= ఒకరి నొకరు చూచి; అప్పటి+ఉచిత+భంగిన్= ఆ సందర్భానికి సరిపోయే మర్యాదలు తీరు తీయాలు జరిపి; తగన్= తగిన రీతిని; ఇట్లు+అనున్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో అచటికి సేనల విన్యాసాలను చూడాలనే వేడుకతో కర్ణుడు వచ్చి ఉన్నాడు. శ్రీకృష్ణుడు కర్ణుడి దగ్గరకు వెళ్ళి, తగిన మర్యాదగా పలుకరించి ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** 1. భీష్ముడు యుద్ధం చేసేటపుడు తాను యుద్ధం చేయనని కర్ణుడు ప్రతిజ్ఞ చేశాడు. మరి యుద్ధభూమిలో కర్ణుడు

ఎట్లా ఉన్నాడు? అనే ప్రశ్న రావచ్చును. కర్ణుడు యుద్ధంలో పాల్గొనటానికి రాలేదు. ప్రేక్షకుడుగా మాత్రమే, వినోద కాలక్షేపానికి మాత్రమే వచ్చాడు అనేది తిక్కన చేర్చిన వివరణ, సమాధానం.

**తే. ' అమరతటినీతనూజుపై నలుకఁ జేసి । యనికిఁ జొర వటె! యట్లైన నతఁడు సచ్చు**
**నంతదాఁకఁ బాండవులకై కొంత సమర । కేలి వేడుకఁ జలుపుట వోలదొక్కొ!' 163**

**ప్రతిపదార్థం:** అమర+తటినీ+తనూజుపైన్= దేవతానదియైన గంగ కొడుకు భీష్ముడిపై; అలుకన్+చేసి= కోపం చేత; అనికిన్= యుద్ధానికి; చొరవు+అటె!= నీవు యుద్ధంలో చేరవట కదా!; అట్లు+ఐనన్= అట్లా అయితే; అతఁడు= భీష్ముడు; చచ్చునంతదాకన్= మరణించు వరకూ; పాండవులకై= పాండవ పక్షంలో చేరి; కొంత= కొంత; సమర కేలి= పోరాటం అనే ఆట; వేడుకన్= వినోదంగా; చలుపుట= చేయటం; పోలదు+ఒక్కొ!= సరిపోదా!

**తాత్పర్యం:** 'ఓ కర్ణా! భీష్ముడిపై కోపంచేత నీవు యుద్ధంలో పాల్గొనటం లేదని తెలిసింది. అయితే, ఆ భీష్ముడు మరణించే వరకు నీవు సరదాగా పాండవపక్షంలో చేరి యుద్ధం చేయగూడదా? భీష్ముడిపై నీవు పగదీర్చుకొనేందుకు ఇది మంచి అవకాశం.

**విశేషం:** శ్రీకృష్ణుడి రాజనీతి చతురతకు ఈ వాక్యం ఒక ఉదాహరణ. కార్యసాధనకు సామ, దాన, భేద, దండోపాయాలు నీతిజ్ఞులు ప్రవచించారు. ఇది భేదనీతి.

**వ. అనిన విని దేవకీనందనునకు రాధానందనుం డిట్లనియె. 164**

**ప్రతిపదార్థం:** అనిన= శ్రీకృష్ణుడు ఆ విధంగా చెప్పగా; విని= ఆలకించి; దేవకీనందనునకున్= దేవకి కొడుకైన శ్రీకృష్ణుడికి; రాధానందనుండు= రాధ కొడుకు కర్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు;

**తాత్పర్యం:** అనిన ఆలకించి, శ్రీకృష్ణునితో కర్ణుడు ఈ విధంగా చెప్పాడు.

**క. ' కినుక వొడమి గంగాపు । త్రుని కయ్యమునప్పు డనికిఁ దొలఁగితి నేనిం**
**జనుఁగా; కేఁ గురుపతికి । చ్చిన ప్రాణం బొండువలనఁ జేర్పం దగునే?' 165**

**ప్రతిపదార్థం:** కినుక+పొడమి= కోపం వచ్చి; గంగాపుత్రుని+కయ్యము+అపుడు= గంగ కొడుకు భీష్ముడు యుద్ధం చేసేటపుడు; అనికిన్= యుద్ధానికి; తొలఁగితిన్+ఏనిన్= తప్పుకొంటే; చనున్+కాక= సరిపోవచ్చు; ఏన్= నేను; కురుపతికి+ఇచ్చిన= దుర్యోధనునకు సమర్పించిన; ప్రాణంబు= ప్రాణము- ఉసురు; ఒండువలనన్= వేరొక చోటికి; చేర్పన్+తగును+ఏ= చేర్చటం తగునా?

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! నాకు ఏదో కోపం వచ్చి భీష్ముడి నాయకత్వంలో ఆతడు యుద్ధం చేసేటప్పుడు నేను యుద్ధం చేయనని శపథం చేశాను. అంతేకాని రారాజు అయిన దుర్యోధనుడికి ఏనాడో నా ప్రాణం సమర్పించాను. ఇక వేరే పక్షంలో చేరను. చేరే ప్రసక్తి లేదు. చేరటం న్యాయం కాదు.

**విశేషం:** కర్ణుడి స్వామిభక్తికి ఈ మాట ఉదాహరణ ప్రాయం. ఇంతేకాక- తాత్కాలిక కోప ప్రకోపానికేమి కాని- కర్ణుడికి భీష్ముడిపై అపారగౌరవం ఉన్నది. భీష్మ పతనానంతరం కర్ణుడు భీష్ముడికి అభివాదం చేసి అతడి మన్ననలు అందుకొన్నాడు.

**వ. అనవుడు నప్పలుకులకు సంతోషించినవాఁడయి వాసుదేవుండు గౌంతేయులం గూడఁ జనుదెంచె నివ్విధంబున ధర్మనందనుండు గౌరవసైన్యంబు వెడలి నిలిచి యద్దిక్కు మొగంబు సేసి యెలుం గెత్తి యిట్లనియె: 166**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (కర్ణుడు) చెప్పగా; ఆ+పలుకులకున్= ఆ మాటలకు; సంతోషించినవాఁడు+ఐ= ఆనందం చెందినవాడై; వాసుదేవుండు= వసుదేవుడి కొడుకు- శ్రీకృష్ణుడు; కౌంతేయులన్+కూడన్+చనుదెంచెన్= కుంతీపుత్రులైన పాండవులను చేరేందుకు వచ్చాడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; ధర్మనందనుండు= ధర్మరాజు; కౌరవ సైన్యంబు వెడలి= కౌరవసేననుండి బయటకు వచ్చి; నిలిచి= నిలబడి; ఆ+దిక్కు, మొగంబు, చేసి= ఆ వైపు తన ముఖం పెట్టి; ఎలుంగు+ఎత్తి= కంఠస్వరం పెద్దదిగా చేసి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని కర్ణుడు పలుకగా, అతడి స్వామిభక్తికి సంతోషించి శ్రీకృష్ణుడు, పాండవులను చేరటానికై మరలి వచ్చాడు. ఈ విధంగా ధర్మరాజు కౌరవసేన నుండి వెడలి వచ్చి, ఆ సేనవైపు తన ముఖం పెట్టి, తన కంఠస్వరం పెద్దదిగా చేసి ఈ విధంగా ప్రకటించాడు.

**తే.** **' మమ్ము నెమ్మిమైఁ గలయఁ జిత్తంబు గలుగు । వార లెవ్వరు గలిగిన వచ్చి కలయుఁ;**
**డట్టివారిని నా తమ్ము లంతవారి । గాఁగఁ బాటింతు నెంతయు గారవమున.'** **167**

**ప్రతిపదార్థం:** మమ్మున్= మమ్ము (మా పాండవ పక్షాన్ని); నెమ్మిమైన్= ప్రీతితో; కలయన్= చేరటానికి; చిత్తంబు+కలుగువారలు= మనస్సు ఉన్నవారు; ఎవ్వరు+కలిగినన్= ఎవ్వరైనా ఉన్నట్లయితే; వచ్చి+కలయుఁడు= రండి చేరండి; అట్టివారిని= (ఆ విధంగా మా పక్షంలో చేరే వారిని); నాతమ్ములు+అంతవారిన్+కాఁగన్= నా తమ్ములతో సమానులనుగా; ఎంతయున్, గారవమునన్= మిక్కిలి గౌరవంతో; పాటింతున్= చూస్తాను (అనుసరిస్తాను).

**తాత్పర్యం:** 'కౌరవపక్షంనుండి మా పక్షంలోకి ఎవరయినా వచ్చి చేరితే వారికి నా హృదయపూర్వకమైన స్వాగతం. అట్టివారిని నేను నా తమ్ములతో సరిసమానంగా చూస్తానని వాగ్దానం చేస్తున్నాను.'

**వ.** **అనిన విని నీ పుత్త్రుండు యుయుత్సుం 'డేను వచ్చెద నన్నుం గలపికొను' మని పలికిన దానికిం బాండవాగ్రజుండు ప్రియంబందిన పలుకులు పలుకుటయును నతండు దుర్యోధనాదుల దుశ్చేష్టితంబు లుగ్గడించుచుఁ గౌంతేయుల గుణంబు లగ్గించుచు నిజసేనాసమేతంబుగా నిస్సాణాది రావంబులు సెలంగం జని ధర్మనందను బలంబులం గలసె; నది యట్టిద కాక సవతాలి ప్రజలు పొంద నేర్తురే? యది యట్లుండె; నిట్లు దన్నుం గలసిన సంతుష్టాంతరంగుం డగుచు నయ్యుధిష్ఠిరుండు యుయుత్సునకు నత్యుపచార సమాచారంబులం బ్రమోదం బొనరించి.** **168**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని (ధర్మరాజు) చెప్పగా ఆలకించి; నీ+పుత్త్రుండు= నీ కొడుకు; యుయుత్సుండు= యుయుత్సుడు; ఏను= నేను; వచ్చెదన్= వస్తాను; నన్నున్= నన్ను; కలిపికొనుము+అని= నన్ను మీపక్షంలో చేర్చుకొనవలసింది; అని; పలికినన్= చెప్పగా; దానికిన్= ఆ మాటకు; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడు ధర్మరాజు; ప్రియంబు+అందిన= ప్రీతితో కూడిన; పలుకులు+పలుకుటయున్= మాటలు చెప్పుట చేత; అతండు= (యుయుత్సుడు); దుర్యోధన+ఆదుల+దుస్ చేష్టితంబులు= దుర్యోధనుడు మున్నగు వారు చేసిన చెడ్డపనులు; ఉగ్గడించుచున్= పేర్కొంటూ; కౌంతేయుల+గుణంబులు= కుంతీకుమారుల మంచి లక్షణాలు; అగ్గించుచున్= పొగడుతూ; నిజ సేనా సమేతంబుగాన్= తనయొక్క సైన్యంతోపాటుగా; నిస్సాణ+ఆది రావంబులు+చెలంగన్= పెక్కు చర్మవాద్యాల ధ్వనులు విస్తరిల్లగా; చని= వెళ్ళి; ధర్మనందను+బలంబులన్= ధర్మరాజు సైన్యంలో; కలసెన్= చేరాడు; అది+అట్టిది+అ+కాక= అది అంతే; సవతి+ఆలి+ప్రజలు= సవతులకు పుట్టిన సంతానం; పొందన్+నేర్తురు+ఏ?= కలిసి పొత్తుగా ఉంటారా?; అది= ఆ విషయం; అట్లు ఉండెన్= ఆ విధంగా ఉండుగాక; ఇట్లు= ఈ రీతిగా; తన్నున్+కలసినన్= తనతో చేరగా; సంతుష్ట+అంతరంగుండు+అగుచున్= తృప్తిపొందిన మనస్సు కలవాడై; ఆ+యుధిష్ఠిరుండు=

ఆ ధర్మరాజు; యుయుత్సునకున్; అత్యుపచార+సమాచారంబులన్= మిక్కిలి మర్యాదతో గూడిన సేవలతో; ప్రమోదంబున్+పొనరించి= సంతోషము కల్గించి

**తాత్పర్యం:** ధర్మరాజు ఆ విధంగా ప్రకటించ, నీ కొడుకు యుయుత్సుడు 'నేను వస్తాను. నన్ను మీ పక్షంలో చేర్చుకొనండి' అని పలికిన దానికి ధర్మరాజు సంతోషించి ప్రియ వాక్యాలతో అతడికి స్వాగతం చెప్పాడు. యుయుత్సుడు దుర్యోధనాదులు మున్నగువారు చేసిన చెడ్డపనులను ఉద్ఘాటిస్తూ పాండవుల సద్గుణాలను కీర్తిస్తూ తన సేనలతోపాటు పాండవ సైన్యంలో చేరిపోయాడు. అప్పుడు పెక్కు వాద్యాలు ఘోషించాయి. సవతి బిడ్డలు - సామరస్యంగా కలిసి మెలిసి ఉండలేరు గదా అది అట్లా ఉంచుము. యుయుత్సుడు ఈ విధంగా తన పక్షంలో చేరినందుకు సంతోషించి, అతడికి ఎన్నో మర్యాదలు చేసి ధర్మరాజు అతడిని మన్నించాడు.

**విశేషం:** 1. యుయుత్సుడు- ధృతరాష్ట్రుడికి వైశ్యభార్యవలన కలిగిన కొడుకు.

**తే. ' రథముమీఁదికిఁ జనుదెంచి పృథులసైన్య । హర్షభాషణధ్వనులుఁ దూర్యస్వనములు**
**నెగసి దివి ముట్ట మైమఱు విడి తలిర్చు । నెలమిఁ గోదండ తూణీరములు ధరించె. 169**

**ప్రతిపదార్థం:** రథము మీఁదికిన్+చనుదెంచి= (ధర్మరాజు) రథాన్ని అధిరోహించి; పృథుల, సైన్య, హర్ష, భాషణ, ధ్వనులున్= గొప్పదైన సేనలో సంతోషమును తెలిపే మాటల సవ్వడులూ; తూర్య స్వనములు= మంగళ వాద్యధ్వనులు; దివి ముట్టన్= ఆకాశాన్ని తాకుతూ; ఎగసెన్= వ్యాపించాయి; మైమఱువు+ఇడి= కవచాన్ని ధరించి; తలిర్చు+ఎలమిన్= చిగిర్చే సంతోషంతో; కోదండ+తూణీరములు= విల్లు అమ్ములూ; ధరించెన్= తాల్చాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు రథం ఎక్కి కవచం ధరించాడు. అప్పుడు ఆ గొప్పసేనలో మంగళవాద్యాలు మ్రోగాయి. అతడు సంతోషంతో కవచం తొడిగి ధనుస్సు అమ్ముల పొదులు తాల్చాడు.

**విశేషం:** ధర్మరాజు పాదచారియై భీష్మ ద్రోణ కృప శల్యుల కడకు వెళ్ళే ముందు కవచం తీసివేశాడు. నిరాయుధుడై నడచి వెళ్ళాడు. ఇప్పుడు కవచం ధరించి ఆయుధాలు చేపట్టి యుద్ధానికి సిద్ధం అయ్యాడు. కథాచిత్రణలో తిక్కన మహాకవికి గల సమ్యక్‌దృష్టికి ఇది ఒక ఉదాహరణం.

**వ. తదవసరంబున నితని తమ్ములుం దక్కటి దొరలును దమతమ రథంబు లెక్కి యెప్పటి నెలవుల నిలిచినం, దదీయవ్యూహంబు పూర్వప్రకార సన్నాహం బై యొప్పె నట్టియెడ రెండు బలంబులవారును బాండవులు దొల్లి పడినపాట్లు సెప్పికొని వగచుచు వారు సంధికై చేసిన యత్నంబు వాక్రుచ్చి మెచ్చుచు నప్పుడు గురుజనంబులయెడఁ బాటించిన వినయంబు వర్ణించి యనురాగించుచుండి'రని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 170**

**ప్రతిపదార్థం:** తత్+అవసరంబునన్= ఆ సమయంలో; ఇతని, తమ్ములున్= ధర్మరాజు తమ్ములూ; తక్కటి దొరలును= తక్కిన దండనాథులూ; తమ, తమ, రథంబులు+ఎక్కి= తమ తమ రథాలు అధిరోహించి; ఎప్పటి+నెలవులన్= ఇదివరకు ఉన్నచోటులలో; నిలిచినన్= నిలబడగా; తదీయ+వ్యూహంబు= ఆ వ్యూహం (పన్నుగడ); పూర్వ, ప్రకార, సన్నాహంబు+ఐ= ఇది వరకు మాదిరిగానే సన్నద్ధమై; ఒప్పెన్= విలసిల్లింది; అట్టి+ఎడన్= అప్పుడు; రెండు, బలంబులవారును= (కౌరవుల యొక్కయు పాండవుల యొక్కయు సేనలు); పాండవులు; తొల్లి= పూర్వం; పడినపాట్లు= అనుభవించిన అవస్థలు; చెప్పికొని= మాటలాడి; వగచుచున్= విచారిస్తూ; వారు= పాండవులు; సంధికై= శాంతికై; చేసిన యత్నంబు= చేసిన ప్రయత్నాలు; వాక్రుచ్చి= వచించి; మెచ్చుచున్= పొగడుతూ; అప్పుడు= ఆ సమయంలో; గురు జనంబుల+ఎడన్= పెద్దల యెడ; పాటించిన= అవలంబించిన; వినయంబు=

నమ్రత; వర్ణించి= పొగడి; అనురాగించుచున్+ఉండిరి= ప్రేమను వెదజల్లారు; అని చెప్పినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్+ఇట్లు అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో ధర్మరాజు తమ్ముళ్లు మిగిలినవారూ తమ తమ రథాలు అధిరోహించి లోగడ తాము ఉన్న చోటులకు పోయి నిలిచారు. అప్పుడు పాండవుల వ్యూహం మునుపటిలాగానే సన్నద్ధమై విలసిల్లింది. ఇరు పక్షాలలోని సైనికులు - లోగడ పాండవులు పడిన పాట్లు చెప్పుకొని చింతిస్తూ వారు సంధి కోసం చేసిన ప్రయత్నాలు స్మరించి పాండవులను ప్రశంసించారు. ఇప్పుడు పాండవులు శత్రుపక్షంలో ఉన్నపెద్దలు భీష్మ ద్రోణ కృప శల్యుల యెడ చూపిన పూజ్యభావాన్ని వర్ణిస్తూ ప్రేమను వెదజల్లారు' అని సంజయుడు చెప్పగా అతడితో ధృతరాష్ట్రుడు ఈ విధంగా అన్నాడు.

**క. ' మానుగ ధర్మక్షేత్రం । బైన కురుక్షేత్రమున మహాహవమునకుం**
**బూని మన బలముఁ బాండవ । సేనయు నిటు వన్ని యేమి సేసెం జెపుమా!' 171**

**ప్రతిపదార్థం:** మానుగన్= ప్రశస్తంగా (లెస్సగా); ధర్మక్షేత్రంబు+ఐన= ధర్మానికి కుదురైన నేల అయిన; కురుక్షేత్రమునన్= కురుక్షేత్రం అనే పేరుగల ప్రదేశంలో; మహా+ఆహవమునకున్= గొప్ప యుద్ధానికి; పూని= సిద్ధమై; మన+బలమున్= మన సేనయు; పాండవ సేనయున్= పాండవుల సైన్యమూ; ఇటు= ఈ రీతిగా; వన్ని= తలపడి (సిద్ధమై); ఏమి+చేసెన్+చెపుమా!= ఏ విధంగా ప్రవర్తించాయో చెప్పుము.

**తాత్పర్యం:** ఓ సంజయా! మన సేనలు పాండవుల సేనలు ధర్మక్షేత్రంగా సుప్రసిద్ధమైన కురుక్షేత్రం చేరి, యుద్ధానికి సంసిద్ధములై ఏమి చేశాయో నాకు వివరించి చెప్పుము.

**విశేషం:** కురుక్షేత్రము= ప్రస్తుతం హర్యానాలో ఉన్న ప్రదేశం. ఢిల్లీకి ఉత్తరదిశగా, సుమారు 120 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. రైలుస్టేషను ఉన్నది. ఢిల్లీకి కురుక్షేత్రానికి మార్గమధ్యంలో పానిపట్టు ఉన్నది. పౌరాణిక యుగాలలో 'కురుక్షేత్రం' సుప్రసిద్ధ రణరంగం. అట్లే చారిత్రక కాలంలో పానిపట్టు. కురు అనే పేరు గల రాజు పరిపాలించిన ప్రాంతం కురుక్షేత్రం. 'క్షేత్రం' అనే శబ్దానికి ప్రదేశం అని అర్థం అయినా, 'క్షేత్రం' అంటే పుణ్యప్రదేశం అనే రూఢ్యర్థం ఏర్పడింది. పెద్ద సంఖ్యలో జనులు చేరాలంటే అక్కడ కొన్ని వసతులు ఉండాలి. జలతృణకాష్ఠ సమృద్ధి ఉండి, విస్తీర్ణం గలిగి ఉండాలి. అట్టి ప్రదేశం యజ్ఞవాటికకు అనువైనది. అట్లే సంగ్రామరంగంగా ఉండదగింది. కురుక్షేత్రంలో పౌరాణిక కాలంలో యజ్ఞాలు జరిగాయి. అందుచేత అది 'పుణ్య క్షేత్రం' అయింది. తదుపరి ఆ ధర్మక్షేత్రం - కురుక్షేత్రంగా - సంగ్రామ రంగంగా ప్రసిద్ధికెక్కింది. 'మానుగ ధర్మక్షేత్రంబైన కురుక్షేత్రమున' అనే తిక్కన ప్రయోగం. 'ధర్మ క్షేత్రే - కురుక్షేత్రే' అనే పదగుంఫనంతోనే సంస్కృతంలో భగవద్గీత ప్రారంభమౌతుంది.

ఈ పద్యం నుండి భగవద్గీత ప్రారంభం. సంస్కృత భారతంలోని భగవద్గీతలో 700 శ్లోకాలు ఉన్నాయి. తిక్కన తెలుగు సేతలో ఉన్న పద్యాలు 60 మాత్రమే. దీనినిబట్టి తిక్కన - భగవద్గీతను యథాతథంగా అనువదించ లేదని స్పష్టంగా తెలుస్తున్నది. మూల సంస్కృత మహాభారతం - ఏకలక్ష శ్లోక సంభృతమైన మహేతిహాసం. యావత్ ప్రపంచంలో అంత పెద్ద కావ్యం ఇంకోటి లేదు. కవిత్రయ తెలుగు భారతం మూల భారతానికి అనుసృజనమేకాని అనువాదం కాదు. తిక్కన ఆధ్యాత్మిక భాగాలను చాలా చోట్ల సంక్షేపించాడు. సనత్సుజాతీయాన్ని పూర్తిగా వదలివేశాడు. భగవద్గీతను వదలి పెట్టలేదుగాని - మదించి మదించి - చిన్నదిగా చేశాడు. తిక్కన తెలుగు గీత - సంస్కృత భగవద్గీతా సారసంగ్రహం అని చెప్పవచ్చు. తిక్కన వ్రాసిన భగవద్గీతా భాగంలో ఉన్న 60 పద్యాలలో 20 పద్యాలు సంస్కృత మహాభారతంలో కథాభాగానికి సంబంధించి మొదటి అధ్యాయం అర్జున విషాదయోగానికి చెందినట్టివే. అనగా గీతాప్రబోధాన్ని - తిక్కన కేవలం 40 పద్యాలలో సంక్షేపించినాడన్న మాట.

**వ. అనిన విని సంజయుం డతని కి ట్లను: 'దుర్యోధనుండు పాండవవ్యూహంబు గనుంగొని గురుని కడకుం బోయి 172**

**ప్రతిపదార్థం:** అనినన్= (ధృతరాష్ట్రుడు) చెప్పగా; విని; సంజయుండు; అతనికిన్+ఇట్లు+అనున్= ధృతరాష్ట్రుడితో ఈ విధంగా చెప్పాడు; దుర్యోధనుండు= దుర్యోధనుడు; పాండవ+వ్యూహంబున్= పాండవులు ఏర్పరచిన సైనిక విన్యాసాన్ని; కనుంగొని= చూచి; గురుని+కడకున్+పోయి= ద్రోణాచార్యుడి దగ్గరకు వెళ్లి.

**తాత్పర్యం:** అనగా విని సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: దుర్యోధనుడు పాండవుల వ్యూహాన్ని చూచి, గురువైన ద్రోణుని దగ్గరకు వెళ్లాడు.

**తే.** **' చూడు మాచార్య! నీదు శిష్యుండు ద్రుపద । సుతుఁ డమర్చినయది పాండుసుతుల సేన**
**పెంపు బలుపును గలిగి యొప్పినది: యందు । భీము నర్జునుఁ బోలిన బిరుదుమగలు. 173**

**ప్రతిపదార్థం:** ఆచార్య!= ఓ ద్రోణాచార్య గురుదేవ!; చూడుము; నీదు+శిష్యుండు= నీ విద్యార్థి; ద్రుపద+సుతుఁడు= ద్రుపదుడి కొడుకు- ధృష్టద్యుమ్నుడు; అమర్చిన+అది= పన్నినట్టిది; పాండు సుతుల సేన= పాండవుల సైన్యం; పెంపు= అతిశయం; బలుపును= బలం కూడ; కలిగి= ఉండి; ఒప్పినది= శోభిల్లింది; అందున్= ఎచట చూచినా సరే; భీమున్= భీముడిని; అర్జునున్= అర్జునుడిని; పోలిన= సాటి అయ్యే; బిరుదు మగలు= శక్తి సామర్థ్యాలుగల వీరులు.

**తాత్పర్యం:** 'ఓ ద్రోణాచార్య! గురుదేవా! నీ శిష్యుడైన ధృష్టద్యుమ్నుడు - ద్రుపద మహారాజు కొడుకు, పన్నిన వ్యూహం - పాండవ సేనా విన్యాసం వీక్షించుము. ఎంత గొప్పగా, బలంగా శోభిల్లుతున్నదో. ఆ సేనలోని వీరులు శక్తి సామర్థ్యాలుగలవారు. భీముడికీ అర్జునుడికీ దీటైనవారు.

**వ.** **సాత్యకి విరాటుండు ద్రుపదుండు ధృష్టకేతుండు చేకితానుండు గాశిరాజు పురుజిత్తు కుంతిభోజుండు శైబ్యుండు యుధామన్యుండు నుత్తమౌజుండు నభిమన్యుండు ద్రౌపదేయులు వార లందఱుం జాలు మానిసుల యిట్లు గూడి భీమాభిరక్షితంబగు నబ్బలంబు సాల సమర్థంబునుం బోలె మెఱసె; మన సేనా నాయకులం జెప్పెద; నిన్నును భీష్ముని నెన్న నేల? కృపాచార్యుం డశ్వత్థామ శల్యుండు వికర్ణుండు భూరిశ్రవసుండు మఱియుం బెక్కండ్రు రథికులు గలరు; నానాస్త్ర కోవిదులు, వివిధయుద్ధవిశారదులు, వీర లందఱు నాకై ప్రాణంబులు విడిచెద మని యున్నవా రిట్లు బెరసి భీష్మపరిపాలితం బయిన యీ సైన్యంబు పెద్దయు సమర్థం బై తోఁచుచున్నయది; మీరెల్లను వలయునెడల నిలిచి భీష్మునకుఁ గావలి గావలయు' ననిన ద్రోణుం' డట్ల కాక! యింత సెప్పనేమిటి? కనియె; నప్పలుకులు విని యమ్మహీపతికిఁ బ్రియంబు వుట్ట శాంతనవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించిన. 174**

**ప్రతిపదార్థం:** సాత్యకి, విరాటుండు, ద్రుపదుండు, ధృష్టకేతుండు, చేకితానుండు, కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుండు, యుధామన్యుండు, ఉత్తమౌజుండు, అభిమన్యుండు, ద్రౌపదేయులు= సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతుడు; చేకితానుడు, కాశిరాజు అయిన పురజిత్తు, కుంతి భోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ద్రౌపది కొడుకులు; వారలు+అందరున్= వారు అందరూ; చాలు+మానిసులు+అ= సమర్థులైన మనుష్యులే; ఇట్లు= ఈ రీతిగా; కూడి= కలసి; భీమ+అభి రక్షితంబు+అగు= భీముడిచే లెస్సగా కాపాడబడిన; ఆ+బలంబు= ఆ సేన; చాలన్= మిక్కిలి; సమర్థంబునున్+పోలెన్= మిక్కిలి బలం కలిగి నట్టిదిగా; మెఱసెన్= వెలుగొందుతున్నది; మన+సేనా+నాయకులన్= మన పక్షాన ఉన్న సేనాధిపతులను; చెప్పెదన్= చెప్పుతాను; నిన్నునున్= నిన్ను (ద్రోణుని); భీష్మునిన్= భీష్ముడిని; ఎన్నన్+ఏల?= ప్రత్యేకంగా ఎంచనేల?; కృపాచార్యుండు= కృపాచార్యుడు, అశ్వత్థామ, శల్యుండు, వికర్ణుండు, భూరిశ్రవసుండు; మఱియున్= ఇంకా; పెక్కండ్రు= పెక్కుమంది; రథికులు= రథములపై యుద్ధం చేసే వీరులు; కలరు= ఉన్నారు; నానా+అస్త్ర, కోవిదులు, వివిధ+యుద్ధ+విశారదులు= పెక్కు మంత్రపూతములైన

ఆయుధాలు తెలిసిన వారు, పెక్కు రకములైన యుద్ధాలు చేయటంలో ఆరితేరినవారు; వీరలు+అందఱున్= వీరంతా; నాకై= నా కోసమై; ప్రాణంబులు= అసువులు; విడిచెదము= త్యాగం చేస్తాము; అని; ఉన్నవారు= ఉన్నారు; ఇట్లు= ఈ రీతిగా; బెరసి= సమకూడి; భీష్మపరిపాలితంబు+అయిన= భీష్ముడిచే నడుపబడుచున్న; ఈ సైన్యంబు= ఈ సేన; పెద్దయున్= ఎక్కువగా; సమర్థంబు+ఐ= శక్తి కలదై; తోఁచుచున్నయది= మనస్సుకు అనిపిస్తున్నది; మీరు+ఎల్లరున్= మీరు అందరూ; వలయు+ఎడలన్= అవసరమైన స్థలాలలో; నిలిచి= నిలబడి; భీష్మునకున్= భీష్మునకు; కావలి+కావలయున్= రక్షణ చేకూర్చవలసింది; అనినన్= అని దుర్యోధనుడు; చెప్పగా; ద్రోణుండు= ద్రోణుడు; అట్ల+కాక= అట్లే అగుగాక; ఇంత+చెప్పన్+ఏమిటికిన్?= ఇంతగా నొక్కి వక్కాణించటం ఎందుకు?; అనియెన్= అని ద్రోణుడు పలికాడు; ఆ+పలుకులు= ఆ మాటలు; విని= ఆలకించి; ఆ+మహీపతికిన్= రాజునకు- దుర్యోధనుడికి; ప్రియంబు+పుట్టన్= ప్రీతి కలిగేటట్లుగా; శాంతనవుండు= శంతనుడి కొడుకు- భీష్ముడు; సింహనాదంబు= సింహగర్జన; చేసి= ఒనరించి; శంఖంబు+పూరించినన్= శంఖం ఒత్తగా.

**తాత్పర్యం:** సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, ధృష్టకేతుడు, చేకితానుడు, కాశీరాజగు పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, అభిమన్యుడు, ఉపపాండవులు, శక్తిసామర్థ్యాలు గల రథికులు. భీముడిచే కాపాడబడుతున్న ఈ సేన మిక్కిలి బలం కలదిగా కన్పిస్తున్నది. మన పక్షంలోని సేనానాయకులను చెప్తాను. నిన్ను గూర్చి భీష్ముడి గూర్చి చెప్పే అవసరం లేదు కదా? కృపుడు, అశ్వత్థామ, శల్యుడు, వికర్ణుడు, భూరిశ్రవసుడు ఇంకా ఎందరో రథికులు ఉన్నారు. వీరందరు అస్త్ర నిపుణులు. పెక్కు యుద్ధాలలో ఆరితేరిన యోధులు - నాకై ప్రాణాలు త్యాగం చేయటానికి సంసిద్ధులు. ఈ విధంగా సమకూడి, భీష్ముడి నాయకత్వంలోని మన సైన్యం మిక్కిలి బలంగా మనస్సుకు తోస్తున్నది. మీరందరు పూని, భీష్ముడికి రక్షణ చేకూర్చాలి. అని దుర్యోధనుడు చెప్పగా ద్రోణుడు సరే నీవు ఇంతగా నొక్కి వక్కాణించే అవసరం లేదు అన్నాడు. ఆ మాటలు విని, భీష్ముడు సంతోషించి సింహనాదం చేసి తన శంఖాన్ని ఒత్తాడు.

**విశేషం:** 1. సంస్కృత భారతంలో దుర్యోధనుడు కౌరవవీరుల గూర్చి చెప్పేటప్పుడు "భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ" అని కర్ణుడిని కలిసి చెప్పాడు. తిక్కన కర్ణుడి పేరు చేర్చలేదు. తాత్కాలికంగా శస్త్ర సన్యాసం చేసిన కర్ణుడి పేరు ఎత్తకపోవటమే మంచిది అనిపిస్తుంది.

2. సాత్యకి - కృష్ణుడి తాతగారి మనుమడు. కృష్ణుడికి వరుసకు తమ్ముడు. అర్జునుడికి శిష్యుడు. విరాటుడు - మత్స్యదేశరాజు. అజ్ఞాతవాస సమయంలో పాండవులకు ఆశ్రయ ప్రదాత. అభిమన్యుడికి పిల్లనిచ్చిన మామగారు. ధృష్టకేతుడు- రాజసూయ యాగంలో శ్రీకృష్ణుడు సంహరించిన శిశుపాలుడి కొడుకు. చేకితానుడు - యాదవవీరులలో ఒకడు. పురుజిత్తు - కాశీరాజు, కుంతిభోజుడి తమ్ముడు. కుంతిభోజుడు - యాదవ ప్రభువు. కుంతికి పెంపుడు తండ్రి. శైబ్యుడు - ధర్మరాజునకు రెండవ భార్య దేవికకు తండ్రి. ఉత్తమౌజుడు పాంచాలరాజు కొడుకు.

**క. తనతన శంఖంబును ద । క్కును గల దొరలెల్ల ననికి గొనకొని పూరిం**
**చిన వివిధతూర్యనాదం । బును జెలఁగె నభంబు దిశలుఁ బూర్ణంబులుగాన్. 175**

**ప్రతిపదార్థం:** తన, తన, శంఖంబును= తన తన శంఖాలను; తక్కున్+కల+దొరలు+ఎల్లన్= మిగిలిన దండనాథులు అందరూ; అనికిన్+గొనకొని= యుద్ధానికి సిద్ధమై; పూరించినన్= ఊదగా; నభంబు= ఆకాశమూ; దిశలున్= దిక్కులు; పూర్ణంబులు+కాన్= నిండిపోగా; వివిధ, తూర్య, నాదంబును= బూరాలు మొదలైన పెక్కు వాద్యాల ధ్వని; చెలఁగెన్= అతిశయించింది.

**తాత్పర్యం:** సేనాపతి అయిన భీష్ముడు సింహనాదం చేసి శంఖం ఊదగా, తక్కిన దండనాథులు తమ తమ శంఖాలు పూరించి యుద్ధానికి తమ సంసిద్ధత వ్యక్తం చేశారు. ఆకాశం- దిక్కులు పిక్కటిల్లగా యుద్ధవాద్యాల నాదంతో నిండిపోయింది.

**వ. అప్పుడు కృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులును భీమసేనుండు పౌండ్రంబున యుధిష్ఠిరుం డనంతవిజయంబును నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును పాంచాల విరాట సాత్యకి ధృష్టద్యుమ్నశిఖండి ప్రముఖ దండనాయకులు దమతమ శంఖంబులుఁ బూరించిన. 176**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కృష్ణార్జునులు= శ్రీకృష్ణుడూ, అర్జునుడూ; పాంచజన్య+దేవదత్తంబులు= పాంచజన్యం అనే శంఖం, దేవదత్తం అనే శంఖం; భీమసేనుండు= భీముడు; పౌండ్రంబును= పౌండ్రం అనే శంఖం; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అనంత విజయంబును= అనంత విజయం అనే శంఖాన్ని; నకుల సహదేవులు= నకులుడు, సహదేవుడు; సుఘోషం, మణిపుష్పకం అనే శంఖాలను; పాంచాల, విరాట, సాత్యకి, ధృష్టద్యుమ్న, శిఖండి, ప్రముఖ, దండనాయకులు= ద్రుపదుడు, విరాటుడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, శిఖండి మొదలైన రథికులు; తమ తమ+శంఖంబులున్+పూరించినన్= శంఖాలను ఊదగా.

**తాత్పర్యం:** అప్పుడు శ్రీకృష్ణుడు పాంచజన్యం అనే శంఖాన్ని ఊదాడు. అర్జునుడు దేవదత్తం పూరించాడు. ధర్మరాజు అనంతవిజయం అనే శంఖాన్ని ఊదాడు. అట్లే భీముడు పౌండ్రం, నకుల, సహదేవులు సుఘోషం, మణిపుష్పకం ఊదారు. ద్రుపదుడు, విరాటుడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, శిఖండి మున్నగు రథికులు తమ తమ శంఖాలు ఊదారు.

**విశేషం:** 1. సింహనాదాలు, శంఖాలు పరాక్రమ ప్రకటనలో అంతర్భాగాలు.

2. అటు భీష్ముడు - కౌరవ వీరులు సింహనాదాలు చేసి శంఖాలు పూరించారు. ఇటు పాండవ వీరులు శంఖాలు ఒత్తారు. ఈ విధంగా యుద్ధవాతావరణం ఏర్పడింది.

మహాకవులు కథను నడపటం, పాత్రల శీలాలు చిత్రించటం మాత్రమేకాక 'వాతావరణ కల్పన'కు మిక్కిలి ప్రాధాన్యం ఇస్తారు. భగవద్గీతోపదేశానికి ఈ వాతావరణ కల్పన పూర్వరంగాన్ని సృష్టించింది. ముసలివాడై సర్వసంగపరిత్యాగి అయిన మునీశ్వరుడు - వేరే పనిలేక తీరికగా తన పాద సన్నిధిని చేరిన శిష్యుడికి కన్నులు మూసికొని ఏకాంతంగా అందించిన సందేశం కాదు 'భగవద్గీత'. యుద్ధ సన్నద్ధమై పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యం మధ్య తాత్కాలిక నిర్వేదంతో కుమిలిపోయిన వీరుడు అర్జునుడికి చేసిన కర్తవ్యోపదేశం భగవద్గీత. మూల సంస్కృత భారతంలోనూ తెలుగు భారతంలోనూ కూడా భగవద్గీతోపదేశానికి అనువైన వాతావరణ కల్పన చేయబడింది. తిక్కన 'భగవద్గీత సందేశాన్ని' సంక్షేపించాడుగాని వాతావరణ కల్పనను యథాతథంగా తెలుగులో నిర్వహించాడు.

**క. అనయము నుగ్రం బగు త । ద్ధ్వని గాంధారేయహృదయదారణ మై పాం**
**డునరేంద్ర పుత్రసైనిక । మనోరమం బగుచుఁ జెలఁగె మనుజాధీశా! 177**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= ఓ రాజా!; అనయమున్= అత్యంతము, మిక్కిలి; ఉగ్రంబు+అగు= భయంకరం అయిన; తత్+ధ్వని= ఆ శబ్దం; గాంధారేయ, హృదయ, దారణము+ఐ= గాంధారి కొడుకులగు కౌరవుల గుండెలను చీల్చునట్టిదై; పాండు నరేంద్ర పుత్ర, సైనిక, మనస్+రమంబు+అగుచున్= పాండురాజు కొడుకుల సేనలలోని వారి మనస్సులను రంజింప చేసేది అగుచు; చెలంగెన్= ఒప్పినది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణుడు పాండవులు పూరించిన శంఖాల ధ్వని, కౌరవుల గుండెలను చీల్చి, పాండవుల సేనల మనస్సులను రంజింప చేసింది.

**వ. తదనంతరంబ శస్త్రసంపాతంబునకు సమయం బగుటయుఁ గపిధ్వజుండు గాండీవంబు వుచ్చికొని గుణంబు సారించి బాణపాణియై నీ కొడుకులం జూచి కృష్ణునితో నిట్లనియె. 178**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటుపిమ్మట; శస్త్ర+సంపాతంబునకున్= ఆయుధాలు ప్రయోగించటానికి; సమయంబు+అగుటయున్= అదను ఏర్పడగా; గాండీవంబు+పుచ్చికొని= గాండీవం అనే పేరుగల విల్లు చేతిలో పట్టుకొని; గుణంబున్+సారించి= అల్లెత్రాటిని మ్రోగించి; బాణపాణి+ఐ= బాణాలు (అమ్ములు) చేత గల వాడై; నీ కొడుకులన్= నీ పుత్రులైన దుర్యోధనుడు మున్నగు వారిని; చూచి= అరసి; కృష్ణునితోన్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అటు పిమ్మట, ఇంక ఆయుధాలు ప్రయోగించి, యుద్ధం ప్రారంభించవలసిన సమయం ఆసన్నం కావటం చేత అర్జునుడు తన విల్లు గాండీవాన్ని గ్రహించి, అల్లెత్రాటిని మ్రోగించి, బాణములు చేతిలో నిడుకొని కౌరవులగు దుర్యోధనుడు మున్నగు వారిని చూచి, శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు:

**తే.** **' కౌరవులలోన నిప్పు డెవ్వారితోడ । ననికిఁ గడఁగుదునో చూచికొనఁగవలయు**
**నరద మల్లన యుభయసైన్యముల నడిమి । నేల కటు వోవఁగా నిచ్చి నిలుపు మచట.'** **179**

**ప్రతిపదార్థం:** కౌరవులలోనన్= కురుసేనలో ఉన్నవారిలో; ఇప్పుడు= ఇపుడు; ఎవ్వారితోడన్= ఎవరితో; అనికిన్= యుద్ధానికి; కడఁగుదునో= పూనవలసి వస్తుందో; చూచి కొనఁగ+వలయున్= పరీక్షించి చూడాలి; అరదము= రథాన్ని; అల్లన= మెల్లగా; ఉభయ+సైన్యముల+నడిమి+నేలకున్= రెండు సైన్యాల మధ్య ప్రదేశానికి; అటు= అదుగో ఆ వైపుగా; పోవగాన్+ఇచ్చి= పోయేటట్లు చేసి; అచటన్= అక్కడ; నిలుపుము= ఆపుము.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! ఇప్పుడు కౌరవ సేనలో ఎవ్వరితో నేను యుద్ధం చేయాలో నిర్ణయించుకొనాలి. రథాన్ని రెండు సేనలు నాకు కనిపించేటట్లుగా మధ్య ప్రదేశం చేర్చి అక్కడ నిలుపగోరుతున్నాను.

**అర్జునుఁడు స్వజన సంహారంబునకు శంకించి మోహావిష్టుం డగుట (సం. 6.23.30)**

**వ.** **అనిన గుడాకేశు పలుకులకు హృషీకేశుండు భీష్మద్రోణప్రముఖ యోధవీరులు గనుంగొనుచుండ నత్తెఱంగున రథోత్తమంబు నిలిపి యతనితో 'నీ వీ కూడిన కౌరవులం జూడు' మనవుడు నప్పార్థుండు రెండు బలంబుల యందు నున్న సోదర సుత మాతులాచార్యాదు లగు బంధు శిష్టజనంబుల నాలోకించి పరమకృపావేశంబున నత్యంత విషాదంబు నొంది, గోవిందు మొగంబు గనుంగొని 'దుర్మదాంధుం డయిన దుర్యోధను దుర్వినయంబున నింత వుట్టెం జూచితే!' యని పలికి వెండియు.** **180**

**ప్రతిపదార్థం:** అనినన్= అని (అర్జునుడు) చెప్పగా; గుడాకేశు+పలుకులకున్= అర్జునుడి మాటలకు; హృషీకేశుండు= శ్రీకృష్ణుడు; భీష్మ, ద్రోణ, ప్రముఖ, యోధవీరులు= భీష్ముడు, ద్రోణుడు మున్నగు వీరులు; కనుంగొనుచుండన్= చూస్తూ ఉండగా; ఆ+తెఱంగునన్= ఆ రీతిగా; రథ+ఉత్తమంబున్= శ్రేష్ఠమైన రథాన్ని; నిలిపి= ఆపి; అతనితోన్= అర్జునుడితో; ఈవు= నీవు; ఈ+కూడిన, కౌరవులన్+చూడుము= ఈ విధంగా చేరిన కౌరవులను వీక్షించుము; అనవుడున్= అని చెప్పగా; ఆ+పార్థుండు= ఆ అర్జునుడు; రెండు+బలంబులయందున్+ఉన్న= రెండు సేనలలో ఉన్నట్టి; సోదర, సుత, మాతుల+ఆచార్య+ఆదులను= సహోదరులు, కొడుకులు, మేనమామలు, గురువులు మొదలైన వారిని; బంధు, శిష్ట, జనంబులన్= చుట్టములు గొప్ప వారగు జనులను; ఆలోకించి= చూచి; పరమ, కృపా+ఆవేశంబునన్= మిక్కుటమైన దయ తనలో ప్రవేశించడం చేత; అత్యంత విషాదంబున్+ఒంది= మిక్కుటమైన దుఃఖాన్ని పొంది; గోవిందు+మొగంబు+కనుంగొని= శ్రీకృష్ణుడి ముఖాన్ని చూచి; దుర్మ దాంధుండు= చెడ్డగర్వంతో గ్రుడ్డివాడు; అయిన; దుర్యోధను+దుర్వినయంబునన్= దుర్యోధనుడి యొక్క గర్వంవలన; ఇంత పుట్టెన్= ఇటువంటి అనర్థం దాపురించింది అనగా దారుణ యుద్ధం ఏర్పడింది; చూచితి+ఏ= చూచావా!; అని పలికి= అని వచించి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** అర్జునుడి మాటలు విని, శ్రీ కృష్ణుడు రథాన్ని రెండు సేనలమధ్య- భీష్ముడు ద్రోణుడు మొదలైన వీరులు చూస్తుండగా- నిలిపి 'అర్జునా! నీ కోరిక మేరకు రథాన్ని నిలిపినాను. కౌరవ వీరులను అందరినీ నీవు చూడవచ్చును' అన్నాడు. అర్జునుడు రెండు సేనలలో ఉన్న సోదరులను, సుతులను, బంధువులను, మేనమామలను, గురువులను, మిత్రులను అందరినీ చూచి, కృపావేశంతో మిక్కిలి దుఃఖానికి లోనై శ్రీకృష్ణుడి మొగం తేరిపార చూచి, ఇట్లా అన్నాడు: 'శ్రీకృష్ణా! చూచావుకదా! దురాశతో కన్నులుండి కూడ గ్రుడ్డివాడైన దుర్యోధనుడి మూలాన ఈ మహాయుద్ధం దాపురించింది' అని, ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. ఇంతవుట్టె- అనే ప్రయోగం మిక్కిలి అర్థవంతమైనది. అందులో 'ఇంతటి ఘోర యుద్ధం దాపురించింది, దాని వలన ఏర్పడే దుష్పరిణామాలు వర్ణనాతీతాలు' అనే భావం ఉన్నది. ఆ భావం అర్జునుడి గుండెను కరగించింది. అందులో అగ్ని పర్వత విజృంభణాలు, భూకంపాలు ఎన్నెన్నో ఇమిడి ఉన్నాయి.

**చ.** **సరసిజనాభ! బంధుజన సంతతిఁ గయ్యపునేలఁ జూడఁగా**
**విరవిరఁ బోయి మేను నిడువెండ్రుక వెట్టుచుఁ గంప మొందెఁ, జే**
**నిరతము గాదు గాండివము, నిల్వఁగ నోర్వవు గాళ్లు, నేను ని**
**ష్ఠురతకుఁ జాల నొల్ల, నొకఁడున్ మహియేలుట యేటి సౌఖ్యముల్?** **181**

**ప్రతిపదార్థం:** సరసిజనాభ!= పద్మం బొడ్డులో కలవాడా! విష్ణుడవైన ఓ శ్రీకృష్ణా!; బంధు+జన+సంతతిన్= చుట్టాలు పక్కాలు అందరినీ; కయ్యపు+నేలన్= యుద్ధభూమిలో; చూడఁగాన్= వీక్షించగా; విరవిరన్ పోయి= కూలుటకు సిద్ధమై పరవశించి; మేను= శరీరం; నిడు+వెండ్రుక+పెట్టుచున్= నిక్కబొడుచుకొన్న వెండ్రుకలతో; కంపము+ఒందెన్= వణకింది; చేన్= చేతిలో; గాండివము= గాండివము అను పేరుగల విల్లు; నిరతము+కాదు= స్థిరంగా ఉండదు; కాళ్ళు= పాదాలు, నిల్వఁగన్+ఓర్వవు= నిలబడటం లేదు; ఏను= నేను; నిష్ఠురతకున్= కఠినత్వానికి; చాలన్= మిక్కిలి; ఒల్లన్= సమ్మతింపలేను; ఒకఁడున్= ఒక్కడు (ఒంటరిగా); మహిన్= భూమిని; ఏలుట= పరిపాలించటం; ఏటి+సౌఖ్యముల్= ఏ విధంగా సౌఖ్యాలు కలిగిస్తుంది?

**తాత్పర్యం:** ఓ శ్రీకృష్ణా! యుద్ధభూమిలో పోరాటానికి చేరిన కావలసిన చుట్టాలను అందరినీ చూడటం నాకు దుఃఖంగా ఉన్నది. శరీరం విడిపోయినట్లు అయి, గగురుపాటు కలిగింది. వెంట్రుకలు నిక్కబొడుచుకొన్నాయి. గాండీవం చేతిలో నుండి జారిపోతున్నది. కాళ్ళు నిలబడటం లేదు. ఈ క్రౌర్యానికి నేను ఒడిగట్టలేను. ఇంత మంది చచ్చిపోయాక, ఒంటరిగా ఈ భూమిని పరిపాలిస్తే కలిగే సౌఖ్యాలు ఏపాటివి?

**విశేషం:** కవిత యుగళకళ. శబ్దార్థ సమ్మేళనం. అర్ధనారీశ్వర యోగంలో పార్వతీ పరమేశ్వరులవలె శబ్దం అర్థం అభేద దాంపత్యం నిర్వహించాలి. ఇక తెలుగు కవిత - యుగళకళలో యుగళ కళ. తెలుగు పదాలు సంస్కృత పదాలు చక్కగా చిక్కగా కలిసిపోవాలి. అతుకులు కన్పించకుండా. ఈ పద్యంలో శబ్దార్థాలు 'పొసగ ముత్తెపు సరుల్ పోహళించిన లీల' కలిసి మెలిసి కన్పిస్తున్నాయి.

2. తిక్కన కవితా శిల్పంలోని వైలక్షణ్యం పాత్రల ఆంగిక సాత్త్వికాభివర్ణన. చిత్తవృత్తి నిరూపణ. ప్రసన్న కథాకవితార్థయుక్తి నన్నయ శైలి. తిక్కనది నాటకీయ శైలి. పద్యంలో తిక్కన వర్ణించిన 'అర్జునుని మూర్తి' ఏ చిత్రలేఖకుడు చిత్రపటంలో చూపించగలడు? అయితే- ఈ వర్ణన అంతా సంస్కృతమూలంలో ఉన్నట్టిదే. ఇష్టమైన ఈ సన్నివేశం లభించింది. తిక్కన గంటం చిందులు త్రొక్కింది. తెలుగు భారతంలో మరువరాని మధురమైన మంచి పద్యం అవతరించింది.

3. విరవిర: త్రెళ్లుట యందలి ధ్వన్యనుకరణ.ఇతరములైన ఉదాహరణలు: ఎండ విరవిర కాసె; కటాక్ష జ్యోత్స్న విరవిర. కరగుచుండ; విరవిరఁ ద్రెల్లి నొవ్వ... దశకంఠుడు

. (తిక్కన నిర్వచనోత్తర రామాయణం.)

**తే. ఎవ్వరికిఁ గాఁగ ధరణియు నెల్లసుఖముఁ । గోరెదము వార లందఱు వీరె వచ్చి**
**ప్రాణములు నర్థములు నొల్లఁబాటు సేసి । కయ్యమునఁ జావ నఱుముట గంటి గాదె! 182**

**ప్రతిపదార్థం:** ఎవ్వరికిన్+కాఁగన్= ఎవరి కోసమై; ధరణియున్= భూమియును; ఎల్ల+సుఖమున్= సర్వసౌఖ్యం; కోరెదము= కావాలి అనుకుంటామో; వారలు+అందఱున్= అంత మందీ; వీరె= వీరే; వచ్చి= అరుగుదెంచి; ప్రాణములు= అసువులు; అర్థములు= సంపదలు; ఒల్లఁబాటు+చేసి= ఉపేక్షించి (నిరసించి); కయ్యమునన్= యుద్ధంలో; చావన్+అఱుముట= మరణించటానికి; ప్రతీక్షించడం, ఎదురుచూడ్డం; కంటి(వి)+కాదె!= చూస్తున్నావు కదా!

**తాత్పర్యం:** ఎవరిని మెప్పించటానికై ఈ భూమిని సమస్త సౌఖ్యాలను కోరుకుంటామో, వారందరు పోరాటానికి రావటం. ప్రాణాలు సంపదలు ఒడ్డటం, చూస్తున్నావుకదా!

**ఉ. తాతల, మామలన్, సుతులఁ, దండ్రులఁ, దమ్ముల, నన్నలన్, గురు**
**వ్రాతము, శిష్టకోటి, సఖివర్గముఁ, దుచ్ఛజనానురూప దు**
**ర్నీతి వధించి యేఁ బడయు నెత్తుటఁ దోఁగిన రాజ్యభోగముల్**
**ప్రీతి యొనర్చునే? యశము పెల్లొడఁగూర్చునె? పెం పొనర్చునే? 183**

**ప్రతిపదార్థం:** తాతలన్= పితామహులను మాతామహులను; మామలన్= తల్లికి సోదరులను (పిల్లనిచ్చిన వారిని); సుతులన్= కొడుకులను, తండ్రులన్= పితృవర్గాన్ని; తమ్ములన్+అన్నలన్= సోదరులను; గురు+వ్రాతమున్= గురువుల సమూహాన్ని; శిష్టకోటిన్= మంచివారిని; సఖి+వర్గమున్= మిత్రుల సముదాయాన్ని; తుచ్ఛ, జన+అనురూప, దుర్నీతిన్= నీచులైనవారి చెడ్డ ప్రవర్తనను అనుసరించి; వధించి= చంపి; ఏన్= నేను; పడయు= సంపాదించే; నెత్తుటన్+తోఁగిన= రక్తంతో తడిసిన; రాజ్యభోగముల్= రాజ్యపరిపాలన వలన సంక్రమించే సౌఖ్యాలు; ప్రీతి= సంతోషం; ఒనర్చును+ఏ?= కలిగిస్తాయా?; యశము= కీర్తి; పెల్లు= మిక్కుటంగా; ఒడన్+కూర్చును+ఎ?= చేకూర్చగలవా?; పెంపు= గొప్పదనం; ఒనర్చునే?= కలుగ చేస్తాయా?

**తాత్పర్యం:** తాతలను, మామలను, కొడుకులను, తండ్రులను, సహోదరులనూ, గురువుల సముదాయాన్ని గొప్పవారిని, మిత్ర బృందాన్ని నీచమైన స్వార్థ ప్రవృత్తితో సంహరించి, నేను పొందే రాజ్యసౌఖ్యాలు - రక్తంతో తడిసినట్టివి నాకు ఏ సంతోషం కలిగిస్తాయి? ఎట్టి కీర్తిని తెచ్చిపెట్ట గలవు? ఏ అభ్యున్నతిని చేకూర్చగలవు?

**క. అక్కడి బంధులఁ జంపుచు, । నిక్కడి బాంధవులు సచ్చు టియ్యకొనుచు, నిం**
**దెక్కడి పెం పొందెదఁ? దుదిఁ । ద్రెక్కొను పాపంబు రణము తెరు వే నొల్లన్. 184**

**ప్రతిపదార్థం:** అక్కడి+బంధులన్= ఆ ఎదిరిపక్షంలో ఉన్న చుట్టాలను; చంపుచున్= సంహరిస్తూ; ఇక్కడి+బాంధవులు= ఇక్కడి చుట్టాలు; చచ్చుట= మరణించటానికి; ఇయ్యకొనుచున్= ఇష్టపడుతూ; ఇందున్+ఎక్కడి+పెంపు= ఏ చోటగల అభ్యుదయం; ఒందెదన్?= సంపాదించగలను?; తుదిన్= చివరకు; పాపంబు= పాపం; త్రెక్కొనున్= వస్తుంది; రణము+తెరువు= యుద్ధమార్గం; ఏను+ఒల్లన్= నేను సమ్మతించను.

**తాత్పర్యం:** ఎదిరిపక్షంలో ఉన్న చుట్టాలను చంపటం, ఈ పక్షంలో ఉన్న చుట్టాలు చచ్చిపోవటానికి సమ్మతించటం - ఇది మంచిది కాదు. దీనివలన నాకు ఏ అభ్యున్నతి రాదు. చివరకు మిగిలేది పాపం. యుద్ధమార్గం నేను అంగీకరింపలేను.

**విశేషం:** పాపము, పుణ్యము అనే ప్రాతిపదికలు ప్రాచీన భారతీయ సంస్కృతి సృష్టించిన భావదీపికలు. పుణ్యం= సుకృతం కలది. శుభదృష్టియగు ధర్మం కలది. పవిత్రత- ధర్మము పుణ్యానికి బొమ్మ బొరుసులు. పుణ్యానికి వ్యతిరేకపదం పాపం. ఆ పదంలో నీచత్వం అన్యాయం ఇమిడి ఉన్నవి. పుణ్యంచేస్తే మరణానంతరం స్వర్గం. పాపం చేస్తే మరణానంతరం నరకం. పుణ్యపాపాలు పునర్జన్మలో కర్మసిద్ధాంతంలో ముడివడి ఉంటాయి. ఇవి వ్యాఖ్యాన నిరపేక్షాలు. అక్షరాలలో నిర్వచించటం కష్టమేగాని, పుణ్యపాపాలు కర్మసిద్ధాంతం పాటించే భారతీయులకు సులువుగా అర్థం అయ్యే పదాలు. అణువులో బ్రహ్మాండం ఇమిడి ఉన్నట్లు విత్తనంలో చెట్టు అదృశ్యంగా ఉన్నట్లు పుణ్యం పాపం అనే శబ్దాలలో విశ్వజనీనమైన విపుల వేదాంతం ఇమిడి ఉన్నది.

**ఆ.** **ఎల్ల భువనములను నేలుట కైనను । నిట్టి క్రూరకర్మ మెట్లు సేయ**
**వచ్చుఁ గడఁగి? యెదిరివా రేమి సేసిన । మాఱుసేయ నాకు మనసురాదు.** **185**

**ప్రతిపదార్థం:** ఎల్ల+భువనములను= అన్ని లోకాలను; ఏలుటకున్+ఐనను= పరిపాలించుట కోసమే అయినప్పటికిని; ఇట్టి= ఇటువంటి; క్రూర+కర్మ=కనికరం లేని కఠోర కార్యం= (యుద్ధం); ఎట్లు, చేయన్+వచ్చున్= ఏవిధంగా ఆచరించవచ్చును; కడఁగి= పూని; ఎదిరివారు+ఏమి చేసినన్= శత్రువులు ఏమి చేసినా సరే; మారుచేయన్= ప్రతీకార చర్య చేయటానికి; నాకున్= నాకు; మనసు+రాదు= మన సొప్పదు.

**తాత్పర్యం:** ఈ భూలోకంలో ఒక భాగమైన కౌరవ రాజ్యం కోసమేగాక అన్ని లోకాలూ పరిపాలించటానికైనా ఇటువంటి క్రూరకర్మ- ఘోర యుద్ధం- చేయలేను. ఒక వేళ శత్రువులు ఏమి చేసినప్పటికీ నాకు మారు చేయటం కూడా మనస్కరించదు.

**చ.** **అకట! నితాంతలోభమున నావలఁ బాటిలు కీడు గానఁ జా**
**లక ధృతరాష్ట్రసూనులు కులక్షయ మయ్యెడుదాని కోర్చి పో**
**రికిఁ దెగి వచ్చి రన్కలుచ రెండు నెఱింగెడు నీవు నేను దీ**
**నికిఁ జొర నేల? వీరి నిటు నిర్దయఁ జంపిన నేమి యయ్యెడున్?** **186**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; నితాంత, లోభమునన్= అధికమైన దురాశతో; ఆవలన్= తరువాత; పాటిలు= వచ్చే; కీడు= నష్టం; కానన్+చాలక= చూడకుండగా; ధృతరాష్ట్ర సూనులు= ధృతరాష్ట్రుడి కొడుకులు- దుర్యోధనుడు మున్నగువారు; కుల+క్షయము= వంశనాశనం; అయ్యెడు దానికిన్+ఓర్చి= జరిగే దానికి ఇష్టపడి; పోరికిన్= యుద్ధానికి; తెగి= సాహసించి; వచ్చిరి+అన్= వచ్చారనే; కలుచ= తప్పు; రెండున్= రెండింటిని; ఎఱింగెడు= తెలిసికొనగలిగిన; నీవు= నీవు; ఏను= నేను (ఓ కృష్ణా నీవు నేనూ= అర్జునుడు); దీనికిన్= దీనిలోనికి (యుద్ధంలోనికి); చొరన్+ఏల?= ప్రవేశించటం ఎందుకు?; వీరిన్= వీరిని (కౌరవులను); నిర్దయన్= దయ లేకుండగా; చంపినన్= సంహరించినా; ఏమి+అయ్యెడున్?= ఏమి జరుగుతుంది?

**తాత్పర్యం:** అయ్యో! దుర్యోధనాదులు తరువాత వచ్చే నష్టం గూర్చి, వంశనాశం అవుతుందని గుర్తించకుండా; ఈ ఘోర యుద్ధానికి సాహసించి వచ్చారు. వారి దోషం పూర్తిగా తెలిసిన నీవూ నేనూ ఇట్టి యుద్ధానికి పూననేల? పూని దయలేకుండగా వారిని చంపి వేసినా ఏమి లాభం చేకూరుతుంది?

**క.** **కులనాశము సేసినఁ ద । త్కులధర్మము లడఁగు నష్టకులధర్ములకుం**
**గలుగును దుస్సంకర; మ । క్కులఘ్ను లేఁగుదురు నరకకూపంబులకున్.** **187**

**ప్రతిపదార్థం:** కుల నాశము+చేసినన్= కులమును నాశనం చేస్తే; తత్+కుల, ధర్మములు= ఆ కులానికి సంబంధించిన (ధర్మాలు); కర్తవ్యాలు; అడఁగున్= అణగిపోతాయి; నష్టకులధర్ములకున్= కులధర్మాలు నష్టమైన వారికి; దుస్సంకరము+అ= చెడు సంయోగం; కలుగును= ఏర్పడుతుంది; ఆకులఘ్నులు= కులానికి కీడు చేసినవారు; నరక కూపంబులకున్= నరకంలోని గోతులలోనికి; ఏఁగుదురు= వెళ్ళుతారు.

**తాత్పర్యం:** కులనాశనం జరిగితే, కులధర్మాలు నశిస్తాయి. కులధర్మాలను నాశనం చేస్తే, సాంకర్యం ఏర్పడుతుంది. కులానికి కీడు చేసినవారు (మరణానంతరం) నరకకూపంలో పడిపోతారు.

**విశేషం:** ప్రాచీన భారతదేశంలో సమాజంలో నాలుగు ముఖ్యకులాలు ఉండేవి. బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రుల కులాలు. దానికి వర్ణవ్యవస్థ అనిపేరు. బ్రాహ్మణులు - విద్య, క్షత్రియులకు యుద్ధ పరాక్రమం, వైశ్యులకు వాణిజ్యం పశుపాలన శూద్రులకు సేవ కులధర్మాలుగా ఎంచబడ్డాయి. వర్ణసాంకర్యం వలన సమాజ శ్రేయస్సుకు భంగం అని పలువురు భావించేవారు. అర్జునుడు ఆ అభిప్రాయాలనే వ్యక్తం చేశాడు.

2. పుణ్యం, పాపం, నరకం, స్వర్గం గూర్చి భారతంలో పలుచోట్ల ప్రసక్తి వస్తుంది.

3. మహాభారతకాలంనాటికే వర్ణ వ్యవస్థ బీటలు వారింది. ద్రోణుడు పుట్టుకచేత బ్రాహ్మణుడు. చేపట్టింది క్షాత్రం. అట్లే అతడి కొడుకు అశ్వత్థామ, బావమరది కృపుడు. ఉపకులాలు ఏర్పడ్డాయి. ఉదాహరణకు సూతకులం. వ్యాసుడు, పరాశర మహర్షికి పల్లెల ఱేడగు దాశరాజు కూతురు సత్యవతికి సుతుడు.

**తే. ఇంత పాపంబు సేయంగ నెత్తికొందు । మయ్య? రాజ్యలోభంబున నఖిలబంధు**
**జనుల వధియింపఁ దొడఁగితి మని' రథంబు । మీఁదఁ గూర్చుండఁ బడియెఁ జే యూఁదికొనుచు. 188**

**ప్రతిపదార్థం:** ఇంత+పాపంబు+చేయంగన్= ఇంతటి పాపం చేసేందుకు; ఎత్తికొందుము+అయ్య?= పూనుకొంటామా?; రాజ్య+లోభంబునన్= రాజ్యంమీది దురాశచేత; అఖిల+బంధుజనులన్= అందరు చుట్టాలను; వధియింపన్+తొడఁగితిమి= చంపటానికి పూనుకొన్నాము; అని= అని చెప్పి; రథంబుమీదన్= రథంపైన; చేయి+ఊఁదికొనుచున్= చేతిని ఆలంబంగా చేసికొంటూ; (అర్జునుడు) కూర్చుండన్+పడియెన్= కూలబడి కూర్చున్నాడు.

**తాత్పర్యం:** 'ఇంతటి పాపం చేయటానికి పూనుకొనటమా? రాజ్యంమీద దురాశతో అందరు బంధువులను చంపివేయటానికి సిద్ధమయ్యామే!' అని అర్జునుడు పలుకుతూ, రథం మీద తన చేతిని ఆసరాగా చేసుకొని కూలబడి కూర్చున్నాడు.

**విశేషం:** 1. అర్జునుడు మహావీరుడుగదా. ఇది పిరికితనం కాదా? అతడి శీలానికి- ఈ 'విషాదయోగం' ఒక కళంకం కాదా? అనే ప్రశ్న ఉదయించడం సహజం. దానికి ఒక సమాధానం మహాభారత రచయిత - జరిగిన దానిని జరిగినట్లు చెప్పాడు. అందులోని మంచిచెడ్డలు వేరే విషయం. మహాభారతాన్ని ఇతిహాసం అనటానికి ఇది ఒక కారణం. ఏతద్రచయిత రంగుపూసి సన్నివేశాలు మార్చలేదు. ఇక అర్జునుడి శీలానికి ఇది కళంకం కాదా? కాదు అని సమాధానం చెప్పవచ్చును. జీవితంలో ఎట్టివారికైనా సందేహాలు ఏర్పడటం సహజం. అవి జీవలక్షణాలు. బలచిహ్నాలు వాటిని దాటగలవాడే వీరుడు. రాయి, రప్పకు, మూఢులకు ఏ సందేహాలు రావు. బాగోగులు గుర్తించి స్థిర నిశ్చయం చేసికొనగలవాడే వీరుడు. ధైర్యశాలి. అర్జునుడు మహావీరుడేకాని ఘోర హంతకుడు కాదు. అర్జున విషాదయోగం - అతడు ఎట్టి సుకుమార హృదయుడో నిరూపిస్తున్నది. లోకోత్తర పరాక్రమంలో కరుణార్ద్ర హృదయం మారురూపంలో దాగి ఉంటుంది.

**వ. ఇవ్విధంబున శోకసంవిగ్నమానసుండును విషాదవిహ్వలుండును బరమకరుణాభరితుండును నై శరశరాసనంబులు విడిచి కన్నీరు దొరంగ నూరకున్న, సవ్యసాచిం జూచి మధుసూదనుం డిట్లనియె. 189**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; శోక+సంవిగ్న+మానసుండును= దుఃఖంచేత కలతచెందిన మనస్సుగలవాడును; విషాద+విహ్వలుండును= శోకంచేత వశం తప్పిన వాడును; పరమ+కరుణా+భరితుండును+ఐ= గొప్ప దయతో కూడిన వాడును అయి; శర, శరాసనంబులు= విల్లు, అమ్ములు; విడిచి= వదలిపెట్టి; కన్నీరు+తొరంగన్= కంటినీరు కారుతుండగా; ఊరకున్నన్= కదలక మెదలక కూర్చుండగా; సవ్యసాచిన్= అర్జునుడిని; చూచి= వీక్షించి; మధుసూదనుండు= మధువు అనే రాక్షసుని సంహరించినవాడు- శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఈ విధంగా దుఃఖంచేత కలతచెందిన మనస్సుగలవాడూ శోకంచేత వశం దప్పినవాడూ, పరమ కరుణాపూరిత హృదయుడూ అయి విల్లూ బాణాలు వదలి కన్నీరు కారుచుండగా ఊరకున్న అర్జునుడిని చూచి శ్రీకృష్ణుడు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** 1. భగవద్గీతలో ఇంత వరకు అర్జున విషాదయోగం. 2. ఇక్కడనుండి భగవద్గీతోపదేశం ప్రారంభం.

**క. ' దెప్పరపుఁ జోట నీ కీ। యొప్పని విధ మెచటినుండి యొదవెను? విను మీ**
**చొ ప్పవివేకులయది; యిది। దప్పించును సద్గతియు నుదాత్తయశంబున్.' 190**

**ప్రతిపదార్థం:** దెప్పరపున్+చోటన్= ఆపద సంభవించినప్పుడు; నీకున్= నీకు; ఈ+ఒప్పని విధము= ఇటువంటి సరిపడని తీరు; ఎచటన్+ఉండి= ఎక్కడ నుండి; ఒదవెను?= ఏర్పడింది?; వినుము= ఆలకింపుము; ఈ+చొప్పు= ఈ తీరు; అవివేకుల+అది= మూర్ఖులది; ఇది= ఈ అవివేకం; సద్గతియున్= మంచి తీరును (ఉత్తమగతిని); ఉదాత్త+యశంబున్= గొప్పది పవిత్రమునైన కీర్తిని; తప్పించును= చెందకుండా చేస్తుంది.

**తాత్పర్యం:** కానిచోట నీకు ఈ సరిపడని తీరు ఎట్లా ఏర్పడింది? ఇది అవివేకుల తీరు. నీకు తగనిది. ఈ అవివేకం నిన్ను సద్గతి నుండి (సరియైన మార్గం నుండి) పవిత్రమైన కీర్తి నుండి తప్పిస్తుంది.

**వ. అని మఱియును. 191**

**తాత్పర్యం:** అని ఆగక శ్రీకృష్ణుడు మరల ఈ విధంగా అన్నాడు.

**తే. ' తగునె యర్జున! యీ పెంటితనము నీకు? । దండివై లెమ్ము' మనసు పేదఱిమి విడిచి;**
**యనిన నట్లున్న భంగిన యల్ల నిట్టు । లనియె నాతండు పుండరీకాక్షుతోడ. 192**

**ప్రతిపదార్థం:** అర్జున!= ఓ అర్జునా; ఈ+పెంటితనము= ఈ ఆడంగితనం; నీకున్= నీకు; తగును+ఎ?= తగునా?; మనసు, పేదఱిమి, విడిచి= మానసిక దారిద్ర్యాన్ని వదలిపెట్టి; దండివి+ఐ= గొప్పవాడవై; లెమ్ము= లేచి నిలబడు (ఉత్సాహంతో కర్తవ్య నిర్వహణకు ఉద్యుక్తుడవుకమ్ము); అనినన్= అని శ్రీకృష్ణుడు చెప్పగా; అట్లు+ఉన్న, భంగిని+అ= ఎట్లా ఉన్నాడో అట్లాగే ఉండి- అనగా చేయి ఊతగా రథంమీద కూలబడినవాడు అట్లే ఉండి; అల్లన్= మెల్లగా; పుండరీక+అక్షు తోడన్= తెల్ల తామర పువ్వుల వంటి కన్నులుగలవాడితో- శ్రీకృష్ణుడితో; ఆతండు= అర్జునుడు; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ఇట్లా అన్నాడు. 'ఓ అర్జునా! నీకు ఇట్టి ఆడంగితనం కూడదు. మనస్సులోని తక్కువ భావం విడిచిపెట్టి, గొప్పవాడవై లెమ్ము' అని హెచ్చరించాడు. అర్జునుడు విషాద తన్మయత్వంతో రథంమీద కూలబడి కూర్చుండి ఉండే, పుండరీకాక్షుడైన శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** పెంటి= పశుపక్ష్యాదులలో ఆడుది. మూలంలో ఉన్న మాటలు. 'క్లైబ్యం మాస్మగమః పార్థ!= క్షుద్రం హృదయ దౌర్బల్యమ్' 'నపుంసకత్వం' వదలుమన్నాడు. ఒకనాడు అజ్ఞాతవాసంలో అర్జునుడు ధరించిన భూమిక అది. తెలుగులో పెంటితనం- అనే

మాటలో మనుష్యజాతిలోని స్త్రీత్వం కంటె పశుపక్ష్యాదుల లోనిది మరీ హేయమైనది అనే ధ్వని ఉన్నది. 'దండివై లెమ్ము' అనే తెలుగులో క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వా ఉత్తిష్ఠ పరంతప' అనే సంస్కృతంలోని ఘాటు లేదు.

**సీ. ' అక్కట! పూజార్హు లగు ద్రోణ భీష్ముల । నమ్ముల నొప్పింప నగునె చెపుమ!**
**మాన్యులఁ జంపుట మగపాడి గాదు; భి । క్షాశనం బైన నత్యంత సుఖము;**
**కడఁగి యెవ్వరిఁ జంపఁగాఁ బెద్ద బ్రదుకయ్యు । నూహింప బ్రదుకు గాకుండు నాకు;**
**విను మట్టి ధృతరాష్ట్ర తనయులు గారె యీ । యొడ్డిన మొనలలో నున్నవార;**

**ఆ. లింద్రియముల నెల్ల నివురంగఁ జేయుచు । నడరు శోకవహ్ని యాఱ నేర**
**దింద్రపదవి సేరె నేనియుఁ; గావున । భండనంబు సేయకుండువాఁడ. 193**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; పూజా+అర్హులు+అగు= పూజించదగినవారైన; ద్రోణ భీష్ములన్= ద్రోణాచార్యుడినీ, భీష్ముడినీ, అమ్ములన్= బాణాలతో; నొప్పింపన్+అగునె?= బాధింపతగునా?; చెపుము+అ= నీవే చెప్పుము; మాన్యులన్= గౌరవించదగినవారిని; చంపుట= సంహరించటం; మగపాడి+కాదు= పరాక్రమం ఉన్నవారికి న్యాయం కాదు; భిక్షా+అశనము= ముష్టి ఎత్తుకొని సంపాదించే కూడు; ఐనన్= అయినను; అత్యంత+సుఖము= మిక్కిలి సంతోషం; కడఁగి= పూని; ఎవ్వరిన్= ఎవరిని; చంపగాన్= సంహరించగా; పెద్ద+బ్రదుకు+అయ్యున్= గొప్ప జీవితమే అయినప్పటికి; ఊహింపన్= ఆలోచిస్తే; బ్రదుకు= జీవితం; నాకున్+కాకుండున్= నాకు కాకుండా ఉంటుందో; వినుము; అట్టి= అటువంటి; ధృతరాష్ట్ర తనయులు+కారె= ధృతరాష్ట్రుడి కొడుకులు కారా; ఈ+ఒడ్డిన, మొనలలోన్= ఈ పన్నిన సేనలలో; ఉన్నవారలు= ఉన్న వారు; ఇంద్రియములన్+ఎల్లన్= అన్ని ఇంద్రియాలను; ఇవురంగన్+చేయుచున్= శుష్కింపజేయుచు; అడరు= వ్యాపించే; శోక వహ్ని= దుఃఖమనే అగ్ని; ఇంద్రపదవి+చేరెన్+ఏనియున్= ఇంద్రపదవి వచ్చిపుడు గూడ; ఆఱన్‌నేరదు= ఆరిపోదు; కావునన్= కాబట్టి; భండనమ్ము= యుద్ధం; చేయక+ఉండువాఁడన్= చేయకుండా ఉంటాను.

**తాత్పర్యం:** అయ్యో! పూజార్హులైన ద్రోణభీష్ములను బాణాలతో బాధించ తగునా చెప్పుము? మాన్యులను చంపడం పరాక్రమం కాదు. అంతకంటె భిక్షాన్నమయినా మిక్కిలి సుఖకరం. పూనుకొని ఎవరినిచంపితే గొప్ప జీవితం అవుతుందో ఆలోచిస్తే నాకది బ్రతుకే కాదనిపిస్తుంది. వినుము! అట్లా చంపదగని, ధృతరాష్ట్ర పుత్రులే గదా ఈ పన్నిన సేనలో ఉన్నవారు? అన్ని ఇంద్రియాలను శుష్కింపజేస్తూ వ్యాపించే శోకాగ్ని ఇంద్ర పదవి లభించినా చల్లారదు. కనుక నేను యుద్ధం చెయ్యలేను.

**విశేషం:** ఇంద్రియాలు ఐదు. జ్ఞానేంద్రియాలు: త్వక్కు (చర్మం), చక్షువు (కన్ను) శ్రోత్రం (చెవి), జిహ్వ (నాలుక), ఘ్రాణము (ముక్కు). కర్మేంద్రియాలు: వాక్కు, పాణి, పాదం, పాయువు, ఉపస్థ; మనస్సు- పదకొండో ఇంద్రియం. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు ఇంద్రియార్థాలు.

**వ. ఎల్ల భంగుల గురుజనంబుల నొప్పించుటకుం జాల వారిని గెలిపించుటయును మనము వారల గెలిచినవారల మగుటయు నను నీరెంటియందును బెద్ద మే లెయ్యది యేను గార్పణ్య దోషోపహత స్వభావుండను, ధర్మసమ్మూఢచేతస్కుండనునై నిన్ను శరణు సొచ్చి యడిగెద నీశిష్యుండ నగు నన్ను శాసింపు, మనిన విని కలకల నవ్వి నారాయణుండు నరున కిట్లనియె. 194**

**ప్రతిపదార్థం:** ఎల్లభంగులన్= అన్ని విధాల; గురు+జనంబులన్= పెద్దలను; నొప్పించుటకున్= బాధించటానికి; చాలన్= సమర్థుడనుగాను; వారిని+గెలిపించుటయును= వారు జయించేటట్లు చేయటం; మనము, వారలన్+గెలిచిన వారలము+అగుటయున్=

వారిని మనం జయించటం; అను= అనే; ఈ రెంటిలోన్= ఈ రెండింటిలో; పెద్ద మేలు+ఎయ్యది= ఏదీ గొప్ప మేలుకాదు; ఏను= నేను; కార్పణ్య, దోష+ఉపహత, స్వభావుండను= నేను దీనుడను (కార్పణ్యం అనే దోషంచేత కొట్టబడిన స్వభావం గలవాడను); ధర్మ సమ్మూఢ+చేతస్కుండను= ధర్మం తెలియని మూఢ మనస్సుకలవాడను; ఐ= అయి; నిన్నున్= కృష్ణా నిన్ను; శరణు+చొచ్చి= ఆశ్రయించి; అడిగెదన్= ప్రశ్నిస్తాను; నీ శిష్యుండన్+అగు= నీ దగ్గర చేరి జ్ఞానం ఆర్జించే వాడిని; నన్నున్= నన్ను; శాసింపుము= ఆజ్ఞాపించుము; అనినన్= అని (అర్జునుడు) చెప్పగా; విని; కలకల+నవ్వి= పక పక నవ్వి; నారాయణుండు= విష్ణువు- శ్రీకృష్ణుడు; నరునకున్= అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'అన్ని విధాలా ఆలోచించి చూస్తే, పెద్దలను నొప్పించటం మంచిది కాదు. వారు మనలను జయించినా, లేదా మనం వారిని జయించినా, రెంటిలో పెద్ద తేడా లేదు. రెండూ దుఃఖకారణాలే. నేను దీనుడను. నేను నీ శిష్యుడను. జిజ్ఞాసువను. ధర్మం తెలియని మూఢుడను. నాకు జ్ఞానోపదేశం చేసి కర్తవ్యం తెలుపవలసినది' అని అర్జునుడు అనగా విని శ్రీకృష్ణుడు కలకల నవ్వి ఈ విధంగా అన్నాడు:

**విశేషం:** 1. నవ్వులలోని వైవిధ్యం గుర్తించి ప్రయోగించిన కవి తిక్కన. 2. కలకల- నవ్వుకు ధ్వన్యనుకరణం.

**చ. ' వగవఁగ నేమియుం దగనివారికినై హృదయంబు గుందఁగా**
**వగచెదు; బుద్ధి మాటలును వావిరి నాడెదు నీవు, పండితుల్**
**వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిం;**
**దెగు వగలెల్లఁ జిత్తము ప్రదీప్త వివేకమయత్వ మొందినన్.' 195**

**ప్రతిపదార్థం:** వగవఁగన్+ఏమియున్+తగని వారికిన్+ఐ= ఏమాత్రం దుఃఖించవలసిన అవసరం లేనివారి కోసం; హృదయంబు= గుండె; కుందఁగాన్= విషాదం చెందగా; వగచెదు= దుఃఖిస్తున్నావు; బుద్ధి+మాటలును= (ప్రజ్ఞావాదములను) తెలివితేటలతో మెరసే పలుకులు; వావిరిన్= అధికంగా; ఆడెదు= పలుకుతున్నావు; పండితుల్= తెలిసినవారు (జ్ఞానం కలవారు); ఉన్నవారికిన్= జీవించి ఉన్నవారికోసం; అవశ్య+విధేయతన్= తప్పనిసరిగా; చన్నవారికిన్= మరణించిన వారి కోసం; వగతురు+ఎ= దుఃఖిస్తారా? (దుఃఖించరు); చిత్తము= మనస్సు; ప్రదీప్త, వివేకమయత్వము+ఒందినన్= వెలుగొందే ప్రాజ్ఞతతో కూడింది అయితే; వగలు+ఎల్లన్= దుఃఖాలన్నీ; తెగున్= తొలగి పోతాయి.

**తాత్పర్యం:** ఏ మాత్రం దుఃఖించదగని, వారి కోసం హృదయం క్రుంగగా దుఃఖిస్తున్నావు. నీవు తెలివైన మాటలు ఎక్కువగా మాట్లాడుతున్నావు. ఉన్నవారికి (బ్రతికున్నవారికి), విధివశంచేత తప్పనిసరిగా చన్నవారికి (చనిపోయినవారికి) పండితులు దుఃఖిస్తారా? మనసు ఉజ్జ్వలమైన వివేకంతో కూడిన దయితే దుఃఖాలన్నీ నశిస్తాయి.

**విశేషం:** సంస్కృత భగవద్గీతలో ఉన్న 'ప్రజ్ఞావాదము' అన్న పదాన్ని తిక్కన 'బుద్ధి మాటలు' అని తెనిగించాడు. అర్జునుడి మాటలలో 'తెలివి తేటలు' ఉన్నాయి. చిత్తమునకు కావలసింది వెలుగు. ఆ వెలుగు 'వివేకం'. చిత్తం ప్రదీప్తమైనప్పుడు వివేకపూరితమైన జ్ఞానం లభిస్తుంది. అతడే అచ్చమైన జ్ఞాని. పండితుడు.

**వ. అని పలికి పార్థునిం బరమ జ్ఞానంబునకుఁ గారణంబు లగు వాక్యంబులు వినుటకుం జొనిపి, యద్దేహంబునందు బాల్యంబు యౌవనంబు వార్ధకంబుననం గలుగు నవస్థలం బొందినట్లు జీర్ణంబులైన వస్త్రంబులు విడిచి నూతనంబు లైన వానిం గైకొనిన చాడ్పుననుంగాని దేహాంతరగమనం బాత్మహానిం జేయదనియుఁ బుట్టువుఁ జావు నను నివి లేమిం జేసి శరీరంబు వోలె శస్త్రచ్ఛేదనంబు మొదలైన వికృతికారణంబులకు నాత్ముండు లోను గాఁ డనియు నప్పురుషుండు నొప్పించువాఁడును నొప్పింప**

**బడియెడు వాఁడును గాఁ డనియుం జెప్పి మఱియు ననేక వాక్యంబుల నాత్మకు నభావంబును శరీరంబునకు భావంబును గలుగమి దెలిపి యాత్మతత్త్వంబు శాశ్వతం బగుట యెఱింగించి యిట్లనియె. 196**

**ప్రతిపదార్థం:** అని, పలికి= అని (శ్రీకృష్ణుడు) చెప్పి; పార్థునిన్= అర్జునుడిని (పృథాకుమారుడిని); పరమ+జ్ఞానంబునకున్= అన్నిటి కంటె మిక్కుటమైన జ్ఞానానికి; కారణంబు+అగు= మూలహేతువులైన; వాక్యంబులు= సార్థకమైన పలుకులు; వినుటకున్+చొనిపి= ఆలకించేటట్లు చేసి; ఈ+దేహంబునందున్= ఈ శరీరంలో; బాల్యంబు= చిన్నతనం (శైశవం); యౌవనంబు= పడుచుతనం; వార్ధకంబును= ముసలితనం; అనన్+కలుగు+అవస్థలన్= అని చెప్పదగిన శారీరక స్థితిగతులను; పొందినట్లు= అనుభవించేటట్లు; జీర్ణంబులు+ఐన, వస్త్రంబులు= చినిగిపోయిన బట్టలు; విడిచి= వదలిపెట్టి; నూతనంబులు+ఐన= క్రొత్తవి అయిన; వానిన్= వాటిని; కైకొనిన+చాడ్పుననున్= స్వీకరించిన విధంగా; దేహ+అంతరగమనంబు= ఇంకొక శరీరాన్ని (పొందటం, చేరటం); ఆత్మ+హానిన్+చేయదు+అనియున్= ఆత్మకు కీడు చేయదు అనియును; పుట్టువు, చావు+అను+ఇవి+లేమిన్+చేసి= జననం మరణం అనేవి లేవు కాబట్టి; శరీరంబు+పోలెన్= దేహంవలె; శస్త్ర+ఛేదనంబు= ఆయుధాల వలన చీల్చబడటం; మొదలు+ఐన= మొదలైన (మున్నగునట్టి); వికృతి+కారణంబులకున్= వికారహేతువులకు; ఆత్ముండు= ఆత్మ; లోను+కాఁడు+అనియున్= బద్ధుడు కాడనీ; ఆ+పురుషుండు= ఆ ఆత్మ(ఆత్ముండు); నొప్పించువాఁడును= బాధించేవాడున్నూ; నొప్పింపన్+పడువాఁడును= బాధించబడే వాడున్నూ; కాడు+అనియున్= కాదు అనీ; చెప్పి= పలికి; మఱియున్= ఇంకా; అనేక+వాక్యంబులన్= పెక్కు వాక్యాలతో; ఆత్మకున్= ఆత్మకు; అభావంబును= లేకపోవటం; శరీరంబునన్= దేహానికి; భావంబును= అస్తిత్వమునూ (ఉండటమూ); కలుగమి= కలగకపోవటం; తెలిపి= తెలియచేసి; ఆత్మతత్త్వంబు= ఆత్మయొక్క స్వరూపం; శాశ్వతంబు+అగుట= స్థిరంకావటం; ఎఱింగించి= తెలిపి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అర్జునుడికి తత్త్వజ్ఞానం ఉపదేశించాడు. మానవదేహం బాల్యం, యౌవనం, వార్ధకం అనే అవస్థలు పొందినట్లుగా చినిగిపోయిన పాత బట్టలు విడిచి క్రొత్త బట్టలు ధరించినట్లు ఆత్మ ఒక దేహాన్ని విడిచి మరియొక దేహాన్ని పొందుతుంది. ఆత్మ దేహాంతరగమనం వలన నశించదు. నశించేది శరీరం మాత్రమే. ఆత్మకు పుట్టుక, చావు అనేవి లేవు. ఆయుధాలు శరీరానికే తప్ప ఆత్మకు హాని చేయలేవు. ఆత్మ (పురుషుడు) బాధించేవాడు కాడు; బాధను పొందేవాడూ కాడు.' ఆత్మకు అభావం లేదు. ఆత్మ శాశ్వతం. శరీరం నశించేది. దానికి అస్తిత్వం లేదు. ఈ విధంగా పెక్కు భంగుల శ్రీకృష్ణుడు ఆత్మతత్త్వం అర్జునుడికి వివరించి చెప్పాడు.

**విశేషం:** 1. మూల సంస్కృత భారతంలో చాలా విపులంగా ఉన్న ఆత్మ తత్త్వం తిక్కన తెలుగులో ఎంతో కుదించివేశాడు.

2. 'పురుషుడు' అనే శబ్దం ఈ ప్రకరణంలో ఆత్మకు పర్యాయపదంగా చెప్పబడింది.

3. అవస్థలు పెక్కు రకాలు. ఈ పద్యంలో చెప్పబడినట్టివి బాల్యం, యౌవనం, వార్ధకం మాత్రమే.

బాల్యం- పుట్టినప్పటి నుండి అయిదేండ్ల వరకు.

కౌమారం- ఆరేండ్ల నుండి ముప్పయి ఏండ్ల వరకు.

యౌవనం- ముప్పైఏండ్ల నుండి యాభై సంవత్సరాల పర్యంతం.

వార్ధకం- ఏబదేండ్ల పిదప వయసు.

## శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞానోపదేశంబు సేయుట (సం. 6-24-19)

**ఆ. ఇట్టు లగుటఁ జేసి యెవ్వరి దెసకు శో । కంబుఁ బొందఁ గారణంబు లేదు;**
**జీవుఁ డెల్లభంగిఁ జెడియెడువాఁడు గాఁ । దలఁచితేని వగవవలదు మున్న. 197**

**ప్రతిపదార్థం:** ఇట్టులు+అగుటన్+చేసి= ఈ విధంగా ఉన్నది కాబట్టి; ఎవ్వరి+దెసకున్= ఎవరి యెడలను; శోకంబున్= దుఃఖాన్ని; పొందన్= అనుభవించటానికి; కారణంబు+లేదు= హేతువు లేదు; జీవుఁడు= ఆత్మ; ఎల్లభంగిన్= ఏ విధంగానూ; చెడియెడువాఁడు+కాన్= చెడిపోయేవాడు అని; తలచితి(వి)+ఏని= అనుకుంటే; మున్ను+అ= మున్నే; వగవన్‌వలదు= దుఃఖించవలసిన అవసరం లేదు.

**తాత్పర్యం:** ఈ కారణం చేత, ఎవరి కోసమూ శోకించవలసిన అవసరం లేదు. ఒకవేళ జీవుడు చెడేవాడే అని అంగీకరించినా శోకించవలసిన అగత్యం అసలే లేదు. అది సహజ పరిణామం అని సరిపెట్టుకొనాలి.

**విశేషం:** ఈ పద్యానికి సంస్కృత మూల శ్లోకం

**శ్లో॥ "అథ చైనం నిత్యజాతం । నిత్యంవా మన్యసే మృతమ్,**
**తథాఽపి త్వం మహాబాహో । నైవం శోచితు మర్హసి." (భ.గీ.2.26)**

ఎల్లప్పుడు ఆత్ముడు పుట్టేవాడనీ, గిట్టేవాడనీ నీవు తలపోస్తే ఇక అటువంటప్పుడు దుఃఖానికి తావే లేదు కదా. ఇది మాట వరుసకు, వాదం కోసం అంగీకరించిన ప్రాతిపదిక మాత్రమే. ఆత్మ, నిత్యం, శాశ్వతం అని నిష్కర్షగా భగవద్గీతా ప్రోక్తమైన అభిప్రాయం.

**క. పురుషుఁడు సెడు ననువాఁడును, । బురుషుఁడు సెఱుచు నని పలుకు పురుషుండును న**
**య్యిరువురు నవివేకుల; య । ప్పురుషుఁడు సెఱుపండు సెడఁడు భుజవీర్యనిధీ! 198**

**ప్రతిపదార్థం:** భుజ+వీర్య+నిధీ!= బాహుపరాక్రమానికి నెలవైనవాడా! ఓ అర్జునా!; పురుషుఁడు= ఆత్ముఁడు; చెడును+అనువాఁడును= నశిస్తాడు అని చెప్పేవాడున్నూ; పురుషుఁడు= ఆత్ముడు; చెఱుచున్= నశింప చేస్తాడు; అని+పలుకు= అని చెప్పే; పురుషుండును= మానవుడున్నూ; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరూ; అవివేకులు+అ= అవివేకులే! మూఢులే; ఆ+పురుషుఁడు= ఆత్ముడు; చెఱుపండు= నాశనం చేయడు; చెడఁడు= నశించడు.

**తాత్పర్యం:** ఓ అర్జునా! ఆత్ముడు నశిస్తాడు అనేవాడూ, ఆత్ముడు నశింపచేస్తాడు అనేవాడూ- ఇరువురూ అవివేకులే. ఆత్మ నశించదు, ఎవరినీ నాశనం చేయదు.

**విశేషం:** ఈ పద్యంలో పురుషుడు అనే శబ్దం - మనుష్యుడు అనే అర్థంలో ఒకచోట- ఆత్మ అని మూడుచోట్ల ప్రయోగించబడింది. మొదటి పంక్తిలో పురుషుడు అంటే ఆత్మ. రెండవ పాదంలో పురుషుడు మొదటి పదానికి అదే అర్థం. రెండవ పాదంలో యతిస్థానంలో ఉన్న పురుషుడు అనే శబ్దానికి మనుష్యుడు అని అర్థం. నాలుగో పాదం మొదటి శబ్దం - పురుషుడు అనే మాటకు ఆత్మ అని అర్థం.

**క. పురుషుఁ డన వే ఱొకండే । పురుషోత్తముఁ డైన యేన; పురుషోత్తమతా**
**స్ఫురణకుఁ బురుషత్వం బను । మెరమెర గల; దదియ కాదె మెయికొనుఁ గ్రియకున్. 199**

**ప్రతిపదార్థం:** పురుషుఁడు+అనన్= ఆత్ముడు అనగా; వేఱు+ఒకండే?= వేరే ఇంకొకడా?; పురుష+ఉత్తముఁడు+ఐన= పురుషులలో గొప్పవాడైన; ఏను+అ= నేనే; పురుషోత్తమతా+స్ఫురణకున్= పురుషోత్తమత్వం అభివ్యక్తం అయ్యేందుకు; పురుషత్వంబు= ఆత్మత్వం; అను+మెరమెర= అనే తళతళల కాంతి; కలదు= ఉన్నది; అది+అ= అదియ- అదే; క్రియకున్= పనిచేయటానికి; మెయికొనున్+కాదె!= పూనుకొంటుంది కదా!

**తాత్పర్యం:** పురుషుడు, ఆత్మ అంటే నేనే; వేరొకడు కాడు. పురుషోత్తమత్వం అభివ్యక్తం కావటానికి ఆత్మత్వస్ఫూర్తి ఉంటుంది. అదే సర్వక్రియలకూ పూనుకొంటుంది.

**విశేషం:** 1. పురుషుడు- పురుషోత్తముడు అనేది శాబ్దిక వ్యత్యాసమేగాని పురుషుడు- పురుషోత్తముడు అనేది అభేదాధ్యవసాయమే అని ఈ పద్యం చెపుతోంది. అంతేగాక- ఆ పురుషోత్తముడు ఎవరు? తానే అని శ్రీకృష్ణుడు నొక్కివక్కాణించాడు.

తిక్కన - అద్వైతి అని చెప్పవచ్చు. భగవద్గీతలోని శ్రీకృష్ణ వాక్యాలకూ, మతత్రయకర్తలు ఎవరికి అనుకూలమైన వ్యాఖ్యలు వారు చేశారు.

**వ. అని వెండియు వివిధవాక్యంబుల నాత్మునకు బాధ్యబాధకత్వంబులు లే కునికి వివరించి వివ్వచ్చునకుం గృపాశోకంబులకు మూలంబు లగు నహంకారంబులు వారించి, యతనికి రణోత్సాహంబునకుం గారణం బైన స్వకర్మావలంబనంబు వదలం దగమి దెలియుటకు వలయు వాక్యంబులు పెక్కు లుపన్యసించి.200**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; వెండియున్= మరియు; వివిధ+వాక్యంబులన్= పెక్కు వాక్యాలలో; ఆత్మునకున్= పురుషుడికి; బాధ్య, బాధకత్వంబులు= బాధను పొందటం బాధను కలిగించటం; లేకునికి= లేకపోవటం; వివరించి= ప్రస్ఫుటంగా చెప్పి; కృపా+శోకంబులకున్= దయకు దుఃఖానికి; మూలంబులు+అగు= కారణాలు అయిన; అహంకారంబులు= అహంకార మమకారాలు; వారించి= తొలగించి; అతనికిన్= (అర్జునుడికి); రణ+ఉత్సాహంబునకున్= యుద్ధం చేయాలనే ఆవేశంతో కూడిన అభిలాషకు; కారణంబు+ఐన= హేతువైన; స్వకర్మ+అవలంబనంబు= కర్తవ్య నిర్వహణం; వదలన్+తగమి= వదలి పెట్టటం మంచిది కాదని; తెలియుటకున్= తెలిసికొనేందుకు; వలయు= అవసరమైన; వాక్యంబులు= సార్థకమైన మాటలు; పెక్కులు= అనేకాలు; ఉపన్యసించి= వివరించి చెప్పి.

**తాత్పర్యం:** అని మరల ఎన్నో వాక్యాలతో శ్రీకృష్ణుడు అర్జునుడికి జ్ఞానోపదేశం చేశాడు. 'ఆత్మకు బాధింపబడటం లేదు. బాధించటమూ లేదు అని వివరించాడు. అర్జునుడి కృపావేశానికీ దుఃఖానికీ మూలం అతడి అహంకార మమకారాలే గనుక వాటిని తొలగించాడు. అర్జునుడు చేయవలసిన పని యుద్ధానికి తగిన స్వకర్మావలంబనం.' దానిని వదలరాదు అని తెలియటానికి తగిన వాక్యాలు ఎన్నో శ్రీకృష్ణుడు అర్జునుడికి ఉపన్యసించాడు.

**విశేషం:** 'అని వెండియు వివిధ వాక్యంబులన్' అని తిక్కన వ్రాశాడు. అయితే ఆ వివిధ వాక్యాలు ఏమిటో తిక్కన చెప్పలేదు. అవి అన్నీ అర్జునుడిని కర్తవ్యోన్ముఖుడిని గావించాయి అని మాత్రం చెప్పాడు. దీనిని బట్టి తిక్కన బుద్ధిపూర్వకంగానే భగవద్గీతను సొంతంగా అనువదించలేదని తేలుతున్నది.

**క. సమరంబు రాజులకు ను । త్తమకర్మం బది; యపావృతస్వర్గ ద్వా**
**రము సుమ్ము; లెమ్ము! దగఁ గ । య్యము సేయుము; దీనికేల యనుమానింపన్? 201**

**ప్రతిపదార్థం:** సమరంబు= యుద్ధం; రాజులకున్= క్షత్రియులకున్; ఉత్తమ+కర్మంబు= మంచి పని -మేటి కర్తవ్యం; అది= యుద్ధం; అపావృత, స్వర్గ, ద్వారము= తెరువబడిన స్వర్గం యొక్క తలుపు; సుమ్ము= సుమా!; లెమ్ము= లేచి నిలబడుము; (కర్తవ్యానికి పూనుకో); తగన్= తగునట్లుగా; కయ్యము+చేయుము= యుద్ధం చేయుము; దీనికిన్= ఈ విధంగా యుద్ధం చేయటానికి; ఏల+అనుమానింపన్?= సందేహం ఎందుకు?

**తాత్పర్యం:** క్షత్రియులకు ముఖ్యకర్తవ్యం యుద్ధం. దానివలన స్వర్గం లభిస్తుంది. లెమ్ము. యుద్ధం చెయ్యి. సందేహించవద్దు.

**విశేషం:** 1. యుద్ధంలో మరణించేవారు (అనగా వారి ఆత్మలు) స్వర్గంలోకి చేరుతాయనే ఆ ప్రాచీన విశ్వాసాన్ని భగవద్గీత అంగీకరించిందా? అసలు స్వర్గనరకాలు ఉన్నాయా?; అథర్వ వేదంలో:

**శ్లో॥ "న మోక్షో నభసః పృష్ఠే । న పాతాళే న భూతలే,**
**సర్వాశా సంక్షయే చేతః । క్షయో మోక్ష ఇతీర్యతే. "**

మోక్షం అనేది ఆకాశం వెనుక గాని పాతాళ లోకంలోగాని భూమి మీద గాని ఉండే ఒక స్థాన విశేషం కాదు. ఆశాపరివృతమైన చిత్తవృత్తి నశించటమే నిజమైన మోక్షం. - **'మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః'**- అని చెప్పబడింది. భగవద్గీతలో చెప్పబడిన "స్వర్గ నరకాలు'', స్థాన విశేషాలుగా కాకుండా వాచ్యార్థంలో కాకుండా, ఔపచారికంగా యౌగికార్థంలో మానసికమైన అనుభూతులుగా స్వీకరించవచ్చును.

**క. ఫలముల యెడ బ్రహ్మార్పణ । కలనపరుం డగుచుఁ గార్యకర్మము నడపన్**
**వలయుం దత్త్వజ్ఞానము । తలకొనినం గర్మశమము దానై కలుగున్. 202**

**ప్రతిపదార్థం:** ఫలముల+ఎడన్= ఫలితాల పట్ల; బ్రహ్మ+అర్పణ, కలన, పరుండు+అగుచున్= పరమాత్మకు అంకితం చేసినవాడు అవుతూ; కార్య+కర్మము= కర్తవ్యమును; నడపన్+వలయున్= నెరవేర్చాలి; తత్త్వజ్ఞానము= ఆధ్యాత్మిక విద్య; తలకొనినన్= ఏర్పడితే; కర్మశమము= కర్మ వినాశనం; తాను+ఐ+కలుగున్= దాని అంతట అదే ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** ఫలితాల యెడ మమకారం విడిచి కర్తవ్యాలను నిర్వహించాలి. ఫలితాలు జయాపజయాలు భగవదర్పితం చేయాలి. తత్త్వజ్ఞానం లభిస్తే ఇక కర్మనాశనం తానంతట అదే కలుగుతుంది.

**విశేషం:** ఈ పద్యం - తిక్కన వ్రాసిన భగవద్గీతకు కేంద్ర గరిమనాభి. ఇది భగవద్గీతాసారసంగ్రహం అన దగిన పద్యం. ఇందులోని అంశాలు:

1. కార్యకర్మము= చేయవలసినపని- ధర్మం= కర్తవ్యం చేయాలి. అయితే జయాపజయాలతో కర్తవ్యానికి సంబంధం లేదు. ఉండకూడదు. నిజానికి నరుడు కర్తవ్యం చేయగలడుగాని- ఆశించిన ఫలం- విజయం చేకూరవచ్చును. చేకూరక పోవచ్చును. చేయవలసిన పని చేస్తే చాలు. ఆ తృప్తి చాలు. అదే పరమార్థం. అట్టివాడే కర్మయోగి. జయం వచ్చినా, అపజయం సంప్రాప్తించినా, అతడు కృతకృత్యుడే.

ఇక కర్మ చేయకుండా ఏ మానవుడూ ఉండలేడు గదా!. ఏ పనీ చేయని వాడు - అనుకొన్న వాడు కూడా ఏదో పని చేయక తప్పదు. ఊపిరి పీల్చటం కూడా ఒక పనే కదా. ఎన్ని పనులు చేసినా, ఏ పనీ చేయనివాడే యోగి. దోషికి మరణ శిక్ష విధించాడు అనుకుందాం ఒక న్యాయమూర్తి. అతడు హంతకుడా? కాడు. అట్లే యుద్ధం చేసి ఎంత మందిని చంపినా సరే - కర్తవ్యం నిర్వహించిన వీరుడు కారకుడు కాడు. ఎవరినీ చంపనట్లే. ఈ పద్యంలో ఇంకో చక్కని చిక్కని పదగుంఫన ఉన్నది. అది 'కర్మశమము'.

కర్మ అనే శబ్దానికీ - పని చేసే క్రియ అని వ్యావహారికమైన అర్థం. భగవద్గీత పరిభాషలో- "కర్మ సిద్ధాంతం''లో కర్మకు విపులమైన అర్థం ఉంది. భగవద్గీతలో కర్మ మూడు విధాలుగా వింగడింపబడింది.

**శ్లో॥ "కర్మణో హ్యపి బోద్ధవ్యం । బోద్ధవ్యం చ వికర్మణః,**
**అకర్మణ శ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః" (భ.గీ.4-17)**

కర్మరీతులు గ్రహించటం కష్టం. అన్ని పనులు చేసే గృహస్థుడు, సర్వసంగపరిత్యాగియైన సన్న్యాసి సమానులే. "తత్త్వజ్ఞానం' ' తలకొన్న యెడల. ఇక్కడ వినోభా భావేగారి వ్యాఖ్యానం సంగ్రహింప దగినట్టిది. "కర్మ - వికర్మ - అకర్మ, ఈ మూడు శబ్దములును నాల్గవ అధ్యాయంలో చాలా మహత్త్వం కలవి. కర్మ అనగా స్వధర్మాచరణ యొక్క స్థూలరూపం. ఈ బాహ్యకర్మలో చిత్తమును లగ్నం చేయటమే వికర్మ. మనం ఎవరికైనా నమస్కరించినపుడు శిరమువంచే బాహ్యక్రియతోపాటే లోపలి మనస్సును కూడా వినయంతో వంచక పోతే ఆ బాహ్యక్రియ వ్యర్థం.

'తత్త్వజ్ఞానము తలకొనిన' యెడల అనగా- **"జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి । భస్మసాత్కురుతే తథా"** - భ.గీ. 4-37 జ్ఞానాగ్ని, సర్వకర్మలను భస్మం చేయగలదు. ఉదాహరణకు కట్టె ఉన్నది. అది అగ్నిదగ్ధమైనపుడు మిగిలేది బూడిద. కఱ్ఱ కాదు.

'తత్త్వ జ్ఞానం తలకొనిన యెడల' అర్జునుడు చేసే యుద్ధకర్మ - కర్మ కాదు. అది జ్ఞానాగ్ని అనే వికర్మ వలన - 'అకర్మ' ఐపోతుంది. అర్జునుడు అప్పుడు ఏ పనీ చేయనట్టి సర్వసంగపరిత్యాగియైన సన్న్యాసితో సముడు. తత్త్వజ్ఞానం వలన 'కర్మ శమము' కర్మవినాశనం సంభవిస్తుంది. ఈ విధంగా జ్ఞాని పుణ్యాపాపాలకు అతీతుడు కాగలడు.

**వ. అని మఱియు నీదృశంబు లగు వాక్యంబు లనేకంబు లనుగ్రహించుచు వివిధప్రకారంబుల వికల్పించి విజయుం డడిగిన వాని కెల్ల సదుత్తరంబు లిచ్చి సందేహంబు వాపుచు. 203**

**ప్రతిపదార్థం:** అని మఱియున్= అని చెప్పి మరల; ఈదృశంబులు+అగు= ఈ రీతి వయిన; వాక్యంబులు+అనేకంబులు= పెక్కు వాక్యాలు; అనుగ్రహించుచున్= దయతో చెప్పుతూ; వివిధ+ప్రకారంబులన్= పెక్కురీతుల; వికల్పించి= ఇది అదీ అని విభజించి చెప్పి; విజయుండు= అర్జునుడు; అడిగిన వానికిన్+ఎల్లన్= వేసిన ప్రశ్నలు అన్నింటికీ; సత్+ఉత్తరంబులు= మంచి సమాధానాలు; ఇచ్చి= చెప్పి; సందేహంబు+పాపుచున్= అనుమానాలు పోగొట్టుతూ.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు మరల ఈ విధమైన వాక్యాలను పెక్కింటిని దయతో చెప్పి, అనేక మార్గాలు వివరించి, అర్జునుడు అడిగిన ప్రశ్నలకు సరియైన సమాధానాలు చెప్పి, అతడి అనుమానాల నన్నిటినీ పోగొట్టాడు.

**విశేషం:** 1. వివిధ ప్రకారంబులు, వికల్పించి= ఎన్నో మార్గాలు తాత్త్విక దర్శనాలు వివరించి అని అర్థం; భగవద్గీత మూలంలో 18 అధ్యాయాలు. అర్జున విషాదయోగం - సాంఖ్యయోగం-కర్మయోగం మున్నగునవి మూలంలో ఉన్నాయి. తిక్కన అన్నిటినీ పృథక్కరించి చెప్పలేదు. భగవద్గీత ముముక్షువులు అందరికీ ఏకైక తరణోపాయం ప్రవచించలేదు. అందుచే 'వివిధ ప్రకారంబులు' వికల్పించి అనే తిక్కన ప్రయోగం ఎంతో అర్థవంతమైనది.

2. అర్జునుడు మూఢ భక్తుడు కాడు. శ్రీకృష్ణుడు అర్జునుడి ప్రశ్నలకు, కొన్ని చిక్కు ప్రశ్నలకు సమాధానం చెప్పవలసివచ్చింది. అర్జునుడు వేసిన ప్రశ్నలుగాని శ్రీకృష్ణుడు చెప్పిన సమాధానాలుగాని తిక్కన వివరించలేదు.

**క. భారమున నులిచి త్రెంపక । కారాకులు డుల్లినట్లు కర్మము లెల్లం**
**దార పెడఁబాయ వలయుట । సారకృపం దెలియఁ జెప్పె శౌరి యతనికిన్. 204**

**ప్రతిపదార్థం:** భారమునన్+నులిచి+త్రెంపక= కష్టయాతన చొప్పున ఊడదీసి, త్రుంచివేయకుండా; కారాకులు= పండుటాకులు; డుల్లినట్లు= క్రిందకు పడిపోయినట్లుగా; కర్మములు+ఎల్లన్= అన్ని కర్మలూ; తార+పెడన్+పాయ వలయుట= తమంతట తామే ప్రక్కకు తప్పుకొనుట; సార+కృపన్= మిక్కిలి దయతో; అతనికిన్= అర్జునుడికి; శౌరి= శ్రీకృష్ణుడు; తెలియన్+చెప్పెన్= తెలిసేటట్లు విశదీకరించి చెప్పాడు.

**తాత్పర్యం:** కర్మలు అన్నీ ఎంతో కష్టపడి త్రుంచి వేయనక్కరలేదు. పండిపోయిన ఆకులు చెట్టు నుండి నేలమీద రాలిపోయేటట్లుగా, సహజంగా ఎట్లా విడిపోగలవో, ఆ విషయం అంతా దయతో శ్రీకృష్ణుడు అర్జునుడికి వివరించి చెప్పాడు.

**విశేషం:** 1. 202వ పద్యం వ్యాఖ్యానంలో కర్మ ఏ విధంగా అకర్మగా పరిణమిస్తుందో చెప్పబడింది. ఈ పద్యంలో తిక్కన చక్కని ఉపమానం ప్రయోగించాడు. ఎట్లా 'పండిపోయిన ఆకులు చెట్ల నుండి సహజంగా రాలిపోతాయో. అట్లాగే కర్మలు కూడ జ్ఞానిని వీడిపోతాయి. జ్ఞానిని కర్మలు అంటిపెట్టుకొని ఉండవు. జ్ఞానయోగంవలన కర్మలు ఎండిన ఆకులవలె మారిపోయి క్రిందికి రాలిపోతాయి. కర్తకు మరి కర్మలతో అనుబంధం ఉండదు- ఎండిన ఆకులకూ చెట్లకూ సంబంధం ఉండనట్లే.

2. ఈ పద్యంలో మొదటి పదం- 'వైరమున' అని ఉన్నది. పాఠాంతరం 'భారమున' అని ఇవ్వబడింది. ఎండిన ఆకులు సులభంగా సహజంగా రాలిపోతాయి. 'భారంగా' త్రుంచవలసిన అవసరం లేదు అనే పాఠం సుగమంగా ఉన్నది.

'వైరమున' అనే పాఠం అన్వయక్లిష్టతకు గురి చేస్తున్నది. 'సారమతిం దెలియ' అనే పాఠం బాగానే ఉన్నది కాని- నాలుగోపాదంలో 'సారకృపం' - అని ఉన్నది కాబట్టి అది పునరుక్తి దోషం అవుతుంది శాబ్దికంగా. కావున భారమున అనే పాఠమే స్వీకరించబడింది.

**వ. ఇవ్విధంబునం జెప్పిన విని కవ్వడి సముత్థితుం డై జగన్నాథున కిట్లనియె. 205**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; చెప్పినన్= చెప్పగా; విని= ఆలకించి; కవ్వడి= సవ్యసాచి= అర్జునుడు; సముత్థితుంప+ఐ= లేచినిల్చినవాడై; జగత్+నాథునకున్= జగతికి ప్రభువైన శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా శ్రీకృష్ణుడు చెప్పగా ఆలకించి అర్జునుడు లేచి నిల్చి ఆ జగన్నాథునితో ఈ విధంగా అన్నాడు:

**మ. ' అతిగుహ్యం బిది; నీవు భూరికృప నీ యధ్యాత్మముం గానఁ జే**
**సితి; నా కిమ్మెయి విన్కిఁ గొంత భ్రమ వాసెన్; యోగిహృద్ధ్యేయ మై**
**యతులైశ్వర్యవిభూతి నొప్పు భవదీయం బైన రూపంబు సూ**
**చు తలం పెత్తెడుఁ; బోలునేని దయఁ జక్షుఃప్రీతిఁ గావింపవే.' 206**

**ప్రతిపదార్థం:** అతి, గుహ్యంబు+ఇది= ఇది మిక్కిలి రహస్యమైనది; నీవు= నీవు (ఓ శ్రీకృష్ణా నీవు); భూరి+కృపన్= మిక్కుటమైన దయతో; ఈ+అధ్యాత్మమున్= ఆ ఆత్మతత్త్వాన్ని; కానన్+చేసితి(వి)= కనిపించేటట్లు చేశావు; నాకున్= నాకు; ఈ+మెయిన్= ఈ రీతిగా; విన్కి= వినటం వలన; కొంత= కొంత; భ్రమ+పాసెన్= భ్రమ తొలగింది; యోగి+హృత్+ధ్యేయము+ఐ= యోగుల హృదయాలకు లక్ష్యమై; అతుల+ఐశ్వర్య+విభూతిన్+ఒప్పు= సాటిలేని సంపద మహత్త్వంతో శోభిల్లే; భవదీయంబు+ఐన= నీదైన; రూపంబు= ఆకారం; చూచు= వీక్షించవలెననే; తలంపు+ఎత్తెడున్= కోరిక కలిగింది; పోలున్+ఏనిన్= అది తగినదైతే; దయన్= కరుణతో; చక్షుః ప్రీతిన్= కన్నులకు వేడుకను; కావింపవు+ఏ?= చేయవా?

**తాత్పర్యం:** నీవు నాకు అందించిన సందేశం చేసిన ఉపదేశం మిక్కిలి రహస్యమైనవి. నామీద నీకు ఎంతో దయ ఉన్నది కాబట్టి ఈ ఆత్మజ్ఞానం నాకు కలిగించావు. ఈ ఆధ్యాత్మికతత్త్వం వినటంచేత నాకు కొంత భ్రమ తొలగింది. యోగీశ్వరులు నీ రూపం చూడాలని తహ తహలాడుతూ ఉంటారు. సాటిలేని విభూతితో వెలుగొందే నీ ఆకారం వీలైతే దయచేసి నన్ను కన్నుల పండువుగా దర్శింపజేయుము.

**విశేషం:** 1. భ్రమ అంటే చలనం. లేనిది ఉన్నట్లు తోచటం. అర్జునుడు అన్నాడు శ్రీకృష్ణుడి ఉపదేశం విని 'శ్రీకృష్ణా నాకు 'కొంత' భ్రమ తొలగింది' అని. భ్రమ పూర్తిగా ఎందుకు తొలఁగలేదు అనే ప్రశ్న ఉద్భవిస్తుంది. వినుకలి= వినటం కంటె కనుకలి= కన్నులార చూడటం శ్రుతికంటె ప్రత్యక్ష ప్రమాణం గొప్పది అని కాదు. సిద్ధాంత జ్ఞానం వలన కొంత వరకే భ్రమ తొలగుతుంది. ప్రత్యక్షానుభూతి సిద్ధాంత జ్ఞానాన్ని బలపరుస్తుంది. సిద్ధాంతం కంటె అనుభూతి గొప్పది. అంతే కాదు. జ్ఞానం పరిమిత గమనం కలది. తర్కం ఆగిపోయే చోట అనుభూతి ప్రారంభిస్తుంది. తర్క సిద్ధాంత జ్ఞానం పరిధి కొంత మేర వరకే. "అనుభవైక వేద్య మధ్యాత్మ యోగంబు, తర్క పరిధులెల్ల దాటిపోవు. అర్జునుడు తనకు విశ్వరూప సందర్శనం అనుగ్రహించి 'చక్షుః ప్రీతి గావింపవే' అని ప్రార్థించాడు. అయితే శ్రీకృష్ణుడు, అది మానవుల కన్నులకు అతీతమైనది అని అతడికి 'దివ్యదృష్టి' ప్రసాదించాడు.

3. యోగి= యోగం కలవాడు. యోగశబ్ద నిర్వచనం - భీష్మ అశ్వాసం 110 పద్యం చూడవచ్చు.

**వ. అనిన విని యచ్యుతుం డతని కిట్లనియె. 207**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని అర్జునుడు పలుకగా ఆలకించి; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; అతనికిన్= అర్జునునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అర్జునునితో శ్రీకృష్ణుడు ఈ విధంగా చెప్పాడు:

**క. ' నానాస్ఫుట వర్ణంబులు । నానాభంగులును గలుగు నారూపములో**
**నానాశ్చర్యవిధంబులు । గానఁగ నగుఁ జూపెదం బ్రకాశస్ఫూర్తిన్. 208**

**ప్రతిపదార్థం:** నానా, స్ఫుట, వర్ణంబులు= పెక్కు విధాలుగా భాసించే రంగులు; నానా, భంగులును= పెక్కు రీతులును; కలుగు= ఉన్న; నా రూపములోన్= నా ఆకారంలో; నానా+ఆశ్చర్యవిధంబులు= పెక్కు విచిత్రాలైనవి, భిన్నములైన తీరుతెన్నులు; కానఁగన్+అగున్= కనుపిస్తాయి; ప్రకాశ+స్ఫూర్తిన్= మిరుమిట్లు గొలిపే వెలుగుతో; చూపెదన్= చూపిస్తాను.

**తాత్పర్యం:** పెక్కు రంగురంగులు పెక్కు రీతులు ఉన్న నా రూపంలో పెక్కు ఆశ్చర్యకరాలైన తీరుతెన్నులు కనిపిస్తాయి. వెలుగువెల్లువతో కూడిన నా రూపం చూపిస్తాను. చూడుము.

**క. విను మానుషచక్షుర్గతి । గనుఁగొన శక్యంబు గాదు గావున దానిం**
**గనుట కయి దివ్యచక్షు । ర్జననం బొనరింతు నీకు శత్రువిదారీ!' 209**

**ప్రతిపదార్థం:** శత్రు విదారీ!= శత్రువులను ఖండించగల వాడా! ఓ అర్జునా!; వినుము= ఆలకించుము; మానుష చక్షుః+గతిన్= మనుజులకున్న నేత్ర దృష్టి ప్రసారంతో; కనుంగొనన్= చూడటానికి; శక్యంబు+కాదు= శక్తి చాలదు; కావునన్= కాబట్టి; దానిన్= విశ్వరూపాన్ని; కనుటకున్+అయి= చూడటం కోసం; నీకున్= నీకు (ఓ అర్జునా నీకు); దివ్య+చక్షున్+జననంబు= అతిలోకమైన కన్నులు పుట్టేటట్లు; ఒనరింతున్= చేస్తాను.

**తాత్పర్యం:** శత్రుసంహారం చేయగల సామర్థ్యం ఉన్న ఓ అర్జునా! ఆలకించుము. మనుజులకు సహజంగా ఉండే చర్మచక్షువులతో నా విశ్వరూపాన్ని వీక్షించే వీలు లేదు. కాబట్టి నీకు దివ్యదృష్టి ప్రసాదించగలను.

**వ. అని యతనికి దివ్యదృష్టి యొసంగి యోగీశ్వరేశ్వరుం డైన యాలక్ష్మీశ్వరుండు దనదివ్యరూపంబు సూపె; నా విశ్వరూపుని దివ్యతేజంబు సహస్రసూర్యప్రభానిభం బనుటయుం జాలకుండుం గావున వాక్రువ్వం గొలఁది గా; దట్టి మహామూర్తిఁ గనుంగొని ధనంజయుండు విస్మయరోమహర్షణప్రహర్షోత్కర్షంబులతో దండప్రణామంబులు సేసి నిలిచి కేలు మొగిడ్చి యి ట్లనియె. 210**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా చెప్పి; దివ్య+దృష్టి= అతిలోకమైన చూపు; (అర్జునునకు); ఒసంగి=ఇచ్చి; యోగి+ఈశ్వరుండు+అయిన= యోగులలో శ్రేష్ఠుడు అయిన; ఆ+లక్ష్మీ+ఈశ్వరుండు= లక్ష్మీదేవికి భర్త- శ్రీకృష్ణుడు; తన+దివ్య+రూపంబు+చూపెన్= తనదైన అతిలోకమైన ఆకారాన్ని ప్రదర్శించాడు; ఆ+దివ్య+రూపుని= లోకాతీతమైన రూపంగల ఆ శ్రీకృష్ణుడియొక్క; దివ్య+తేజంబు= దైవానికి సంబంధించిన పెను వెలుగు; సహస్ర, సూర్య, ప్రభా, నిభంబు= వేయి సూర్యుల వెలుగుతో సమానం; అనుటయున్+చాలకుండున్= అని వర్ణించటం గూడ తక్కువే అని చెప్పాలి; కావునన్= కాబట్టి; వాక్రువ్వన్= వర్ణించటానికి; కొలఁది+కాదు= అలవి కాదు; అట్టి= అటువంటి; మహా+మూర్తిన్= గొప్ప ఆకృతిని; కనుంగొని= చూచి; ధనంజయుండు= అర్జునుడు; విస్మయ, రోమహర్షణ, ప్రహర్ష+ఉత్కర్షంబులతోన్= ఆశ్చర్యం, గగుర్పాటుతో కూడిన ఆనందాతిశయాలతో; దండ, ప్రణామంబులు చేసి= సాగిలపడి నమస్కారాలు ఆచరించి; నిలిచి= నిలబడి; కేలుమోడ్చి= చేతులు జోడించి; అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అర్జునుడికి దివ్యదృష్టి అనుగ్రహించాడు. యోగీశ్వరుడూ లక్ష్మీవల్లభుడూ అయిన శ్రీకృష్ణుడి విశ్వరూపాన్ని అర్జునుడు సందర్శించాడు. ఆ విశ్వరూపుడి లోకాతీతమైన తేజస్సు వేయి సూర్యుల వెలుగును మించింది అని చెప్పవచ్చును. అది వర్ణనాతీతం. ఆ విశ్వరూపాన్ని దర్శించి, అర్జునుడు ఆశ్చర్యం చెంది, రోమాంచంతో పులకించిన దేహం కలవాడై ఆనందంతో పరవశించిపోయి, చేతులు మోడ్చి నమస్కరించి ఈ విధంగా అన్నాడు:

**విశేషం:** 1. యోగీశ్వరుడు శ్రీకృష్ణుడు . భగవద్గీత శ్రీకృష్ణుడికి ప్రసాదించిన బిరుదు "యోగీశ్వరుడు." యోగి అనగా యోగం కలవాడు. యోగం అంటే? యోగ శబ్దానికి ఎన్నో అర్థాలు ఉన్నాయి. సనాతన భారతీయ సాహిత్యంలో విపుల ప్రయుక్తమైన శబ్దం - యోగం.

1. యోగశబ్దానికి వ్యావహారికమైన అర్థం కలయిక= పొందిక.

2. సారస్వతార్థం - సామరస్య సంధానం.

3. శ్రీకృష్ణుడు - అర్జునుడిని కర్మవీరుడవు కమ్మని ఉద్బోధిస్తూ ఇట్లా అంటాడు-

**శ్లో॥ "యోగస్థః కురు కర్మాణి । సంగం త్యక్త్వా ధనంజయ!**

**సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా । సమత్వం యోగ ఉచ్యతే" (భగవద్గీత - 2-48)**

"యోగస్థుడవై కర్మలు చేయుము. సంగముక్తుడవై జయాపజయాలు సమంగా భావించుము. 'సమత్వం' అని యోగం చెప్పబడింది.

4. భగవద్గీత అభిప్రాయంలో- యోగి, తపస్వి కంటె గొప్పవాడు - భగవద్గీత 4-46.

5. యోగం అంటే శ్రీకృష్ణుడు ఇచ్చిన నిర్వచనం- 'యోగః కర్మసు కౌశలం' యోగం అంటే క్రియా కౌశలం. నిర్వహణ పాటవం - సమబుద్ధికి గీటురాయి. నిర్వహణచాతురి నిస్సంగత్వం వల్లనే సిద్ధిస్తుంది. ఫలాపేక్షతో పనిచేసేవాడు నిరంతరం అపజయ భయ ప్రేరితుడు కాక తప్పదు. అందుచేత భగవద్గీత ప్రకారం యోగం అంటే - సమతా భావం, క్రియా కౌశలం. ఈ రెండు నిర్వచనాలు బొమ్మ బొరుసులే.

యోగి అంటే భిన్నత్వంలో ఏకత్వం చూడగల ద్రష్ట. క్రాంతదర్శి. యోగశబ్దానికి వ్యావహారిక జగత్తులో కలయిక - పొందిక అనే అర్థం స్ఫురిస్తుంది. సాహిత్య ప్రపంచంలో సామరస్య సంధానం స్ఫురిస్తుంది. ద్వంద్వబద్ధమైన ప్రాణికోటి, వికారమయమైన జీవితం, అవ్యక్త స్థితమైన సృష్టిలో సతమతమయ్యే మానవుడు తన ఆంతర్యంలో సామరస్య సంధానం సాధింపగల్గినపుడు అతడే యోగి కాగలడు. యోగికి యావత్ సృష్టి, 'సత్యం శివం సుందరంగా' భాసిస్తుంది. అతడు "ఏకమే వాద్వితీయం బ్రహ్మ' అనీ 'ఏకం సత్ విప్రాః బహుధా వదంతి' అనీ అనగలడు. ఇది అనుభవైకవేద్యం. అవాఙ్మానస వేద్యమైన ఈ అనుభూతిని వేత్తలు 'యోగం' అనే పరిభాషతో నిర్దేశించారు. వేదాంతపరంగా యోగం అంటే జీవాత్మ, పరమాత్మల సమ్మేళనం. ఐహికాముష్మికాల సమన్వయం. శ్రీకృష్ణుడు యోగీశ్వరుడు అని మహాభారతం అభివర్ణించింది. పతంజలి- "యోగః చిత్తవృత్తి నిరోధః" అని నిర్వచించాడు. పతంజలి - యోగసాధనను 'అష్టాంగ మార్గం'గా విశ్లేషించాడు.

1. యమం 2. నియమం 3. ఆసనం 4. ప్రాణాయామం 5. ప్రత్యాహారం 6. ధారణ 7. ధ్యానం 8. సమాధి.

పతంజలి అష్టాంగ యోగంలోని ప్రాథమిక దశలు రెండు- యమం, నియమం సౌశీల్యసంబంధాలు.

యోగసాధనకు సౌశీల్యమే పునాది.

1. **యమం:** 1. అహింస 2. సత్యం 3. అస్తేయం 4. బ్రహ్మచర్యం 5. అపరిగ్రహం.

**2. నియమం:** 1. శౌచం 2. సంతోషం 3. తపస్సు 4. స్వాధ్యాయం 5. ఈశ్వర ప్రణిధానం

**3. ఆసనం:** శారీరక మానసిక వ్యాయామం. యోగసాధన చిరకాల సాధన కాబట్టి, చిరసుఖప్రదమైన శరీర భంగిమ కుదుర్చుకొనాలి. శీర్షం, కంఠం, వక్షఃస్థలం ఒకే ఋజురేఖలో ఉండాలి. ఈ ఆసనశాఖ హఠయోగంగా పరిణమించింది.

**4. ప్రాణాయామం:** ఈ ప్రక్రియ ఊపిరి పీల్చటంతో ప్రారంభిస్తుంది. నిశ్చల మనస్సును సాధించేందుకు - నాసాగ్రంపై ధ్యాస నిలిపి సాధన చేయాలి.

**5. ప్రత్యాహారం:** మనోనిగ్రహం ద్వారా, ఇంద్రియ నిగ్రహసాధన.

**6. ధారణ:** చిత్తవృత్తిని ఏకాగ్రం చేయటం ధారణ. మనస్సును కేంద్రీకరించి ఒక బిందువుపై పెట్టవచ్చును. ఉదాహరణకు ఆయా అవయవాలపై దృష్టి కేంద్రీకరించవచ్చును. ముక్కు చెవి కన్నులు మాత్రమేగాక గుండెకాయ కూడా యోగి ఇష్టానుసారం కొట్టుకునేటట్లు చేయవచ్చును.

**7. ధ్యానం:** యోగసాధనకూ హేతువాదానికీ వ్యతిరేకత ఏమీ లేదు.

**శ్లో॥ "ఇంద్రియాణి పరాణ్యాహుః । ఇంద్రియేభ్యః పరం మనః,**
**మనసస్తు పరా బుద్ధిః । యో బుద్ధేః పరతస్తు సః. (భగవద్గీత - 23-42)"**

దేహం కంటె ఇంద్రియాలు గొప్పవి. ఇంద్రియాలకంటె మనస్సు గొప్పది. బుద్ధి మనస్సు కంటె శ్రేష్ఠం. అయితే బుద్ధికంటె గొప్పది ఆత్మ.

మానవబుద్ధికి అతీతమైన అంశాలు ఏ విధంగా గ్రహించాలి? అది యోగసాధన వల్లనే సాధ్యం. జంతువులకు తార్కికమైన బుద్ధి ఉండదు. జంతువులకు మనస్సు మాత్రమే ఉంటుంది. హేతువాద తర్కం ఆగిపోయే చోటు నుండి, సమ్యక్ స్ఫూర్తి ప్రారంభిస్తుంది. ఈ అనుభూతి ధారణవలన చేకూరుతుంది. మౌన ప్రబోధం వాక్ ప్రకర్షకంటె గొప్పది. గురువు మౌనమే వ్యాఖ్యాన భరితం అవుతుంది.

8. సమాధి: యోగసాధనలో తుది మెట్టు సమాధి. నిర్వికల్ప సమాధి ఏర్పడిన పిదప - యోగి చైతన్యసముద్రుడే. ధారణ, ధ్యాన, సమాధులు మూడింటిని కలిపి సంయమం అని పేరు పెట్టారు యోగులు. సంయమ చిత్తవృత్తులు నిరోధించిన పిదప యోగి తరంగాలు లేని సచ్చిదానంద సముద్రుడు, జీవన్ముక్తుడు. ప్రతి అధ్యాయం చివర- ఉపనిషద్ విద్యగా- యోగశాస్త్రంగా భగవద్గీత అభివర్ణితం. భగవద్గీత ప్రోక్త శ్రీకృష్ణుడు యోగీశ్వరుడు.

**అర్జునుఁడు శ్రీకృష్ణుని విశ్వరూపంబు గనుంగొని స్తుతించుట (సం. 6-33-5)**

**సీ. 'దేవ! నీదగు దివ్యదేహంబునందు సు । రాసురగంధర్వు లాది గాఁగఁ**
**గల దేవమౌనులుఁ గమలాసనుండును । సచరాచరం బైన జగము నాకు**
**దోఁచె; మొగంబులు దోర్దండములును బా । దములుఁ గన్నులు ననేకములు గంటి,**
**మకుటాది భూషణనికరంబుఁ జక్రగ । దాద్యాయుధములు మాల్యాంబరములుఁ**

**ఆ. బెక్కు గానవచ్చె; నక్కజమై యిది । నడుము మొదలు తుది యనంగ రాదు;**
**తేజ మప్రమేయదేదీప్యమాన ని । ర్వికృతి మహిమ దుర్నిరీక్ష మయ్యె.** **211**

**ప్రతిపదార్థం:** దేవ!= ఓ పరమాత్మా! శ్రీకృష్ణా!; నీది+అగు+దివ్య+దేహంబునందున్= నీదైన అతిలోకశరీరంలో; సుర+అసుర, గంధర్వులు+ఆది, కాఁగన్= వేల్పులు, రాక్షసులు, గంధర్వులు మొదలైనవారు; కల= ఉన్నట్టి; దేవ+మౌనులు= దేవతా ఋషులు; కమల+ఆసనుండును= పద్మం ఆసనంగా గలవాడు- బ్రహ్మదేవుడును; స+చర+అచరంబు+ఐన= కదిలేది కదలలేనట్టి వాటితో

కూడిన; జగము= ప్రపంచం; నాకున్= నాకు; తోఁచెన్= కన్పించింది; మొగంబులు= ముఖాలు; దోర్దండములున్= భుజస్కంధాలు; పాదములున్= చరణాలు; కన్నులున్= నేత్రాలు; అనేకములు= పెక్కు; కంటిన్= చూచాను; మకుట+ఆది, భూషణ, నికరంబున్= కిరీటాలు మున్నగు అలంకారాల సముదాయాలూ; చక్ర, గదా+ఆది+ఆయుధములు= చక్రములు గదలు మొదలగు యుద్ధపరికరాలు; మాల్య+అంబరములు= పూలదండలు వస్త్రాలు; పెక్కు= ఎన్నో; అక్కజము+ఐ= ఆశ్చర్యాన్ని కలిగిస్తూ; కానవచ్చెన్= కన్పించాయి. ఇది= ఇది; నడుము= మధ్యది; మొదలు= మొదటిది; తుది= చివర ఉన్నట్టిది; అనంగన్+రాదు= చెప్పటానికి వీలు లేదు; తేజము= ప్రకాశం; అప్రమేయ, దేదీప్యమాన, నిర్వికృతి, మహిమన్= మితిలేని కాంతితో వెలుఁగొందుతూ మార్పులేని గొప్పదనంతో; దుర్నిరీక్షము+అయ్యెన్= చూడటానికి అలవి కానిది అయింది.

**తాత్పర్యం:** 'ఓ పరమాత్మా! శ్రీకృష్ణా! లోకాతీతమైన నీ శరీరంలో, దేవతలు రాక్షసులు గంధర్వులు మొదలైన వారూ, దివ్యమునులు, బ్రహ్మదేవుడు, చరాచరమైన సర్వప్రపంచం నాకు కనిపించింది. మొగాలు, భుజాలు, పాదాలు, కన్నులు ఎన్నో కన్పించాయి. కిరీటాలు మున్నగు ఆభరణాలు, చక్రం గద మొదలైన ఆయుధాలు, రకరకాల పూలదండలు, వస్త్రాలు కన్పించాయి. ఆశ్చర్యంలో మునిగి తేలాను. నీ దివ్య దేహమునకు మొదలు ఏదో మధ్య ఏదో, తుది ఏదో నాకు తెలియలేదు. నీ తేజస్సు మితిలేనిది. ఊహకు అతీతం. దేదీప్యమానం, ఎల్లప్పుడు వెలుగొందేది. నాకు చూడటానికి అలవి కాకుండా ఉన్నది.

**విశేషం:** గంధర్వులు, దేవతలలో ఒక తెగవారు. సంగీతప్రియులు.

**క.** **జగములకు నాది కారణ। మగు పరమజ్ఞేయ మీవ యని కనియెద భూ**
**గగనదిగంతర మంతయు। నగణితమూర్తీ! భవన్మయం బై తోఁచెన్.** **212**

**ప్రతిపదార్థం:** అగణితమూర్తీ!= లెక్కకు మిక్కిలియైన ఆకారం కలవాడా! శ్రీకృష్ణా; జగములకున్= ప్రపంచాలకు; ఆది, కారణము+అగు= మూలహేతువు అగు; పరమ, జ్ఞేయము= చిట్టచివరిగా తెలిసికొదగిన లక్ష్యం; ఈవు+అ= నీవే; అని+కనియెదన్= అని గ్రహిస్తాను; భూ, గగన, దిక్+అంతరము+అంతయున్= భూమి ఆకాశం దిక్కుల మధ్యభాగం అంతా; భవత్+మయంబు+ఐ= నీవే అయి; తోఁచెన్= కన్పించింది.

**తాత్పర్యం:** 'ఓ శ్రీకృష్ణా! నీ ఆకారం ఏ లెక్కలకు అందేది కాదు. ఈ సమస్త సృష్టికీ మూలకారణం నీవే అని గ్రహించగలిగాను. తెలిసికొనదగింది నీవు మాత్రమే. ఈ భూమి, ఆకాశం దిక్కులు అన్నీ నీ రూపంలో అంతర్భాగాలే.

**వ.** **చంద్రార్కులు లోచనంబులు గాఁ గలిగి దంష్ట్రాకరాళంబులైన నీ ముఖంబులు ప్రజ్వరిల్లుచున్నయవి; నిన్ను రుద్రాదిత్య మరుద్వసువులు ప్రవేశించెదరు; సంఘంబు లై వచ్చి మహామునులు ప్రస్తుతించెదరు సిద్ధసాధ్యవియచ్చరులు వెఱఁగంది వీక్షించెద; రిట్లు దీప్తోగ్రంబగు భవదీయ దివ్యరూపంబు గనుంగొని నాకు విభ్రాంతి వొడమి ధృతి దూలి సుఖంబు వడయ నేరక చిక్కువడి యున్నవాఁడ; బ్రసన్నుండ వగుము రక్షింపుము.** **213**

**ప్రతిపదార్థం:** చంద్ర+అర్కులు= చంద్రుడూ, సూర్యుడూ; లోచనంబులున్= కన్నులు; కాన్= అగునట్లుగా; కలిగి= ఉండి; దంష్ట్రా, కరాళంబులు+ఐన= కోరలతో భయంకరాలు అయిన; నీ+ముఖంబులు= నీ మొగాలు; ప్రజ్వరిల్లుచున్నవి= దేదీప్యమానంగా వెలుగొందుతున్నవి; నిన్నున్= నిను; రుద్ర+ఆదిత్య, మరుత్, వసువులు= రుద్రుడు, సూర్యుడు, మరుత్తులు, వసువులు ప్రవేశిస్తారు; మహా+మునులు= గొప్ప ఋషులు; సంఘంబులు+ఐ= గుంపులు గూడి; వచ్చి= ఏతెంచి; ప్రస్తుతించెదరు= పొగడ గలరు; సిద్ధ, సాధ్య, వియత్+చరులు= సిద్ధులు సాధ్యులు అనే వేల్పు తెగల వారు ఆకాశంలో సంచరించేవారు;

వెఱఁగు+అంది= ఆశ్చర్యం పొంది; వీక్షించెదరు= చూస్తారు; ఇట్లు= ఈ విధంగా; దీప్త+ఉజ్జ్వలంబగు= ధగధగలతో వెలుగొందే; భవదీయ+దివ్య+రూపంబు= నీదైన లోకోత్తరమైన ఆకారం; కనుంగొని= చూచి; నాకున్= నాకు; విభ్రాంతి+పొడమి= కలవరపాటు కలిగి; ధృతి+తూలి= ధైర్యం సడలిపోయి; సుఖంబు+పడయన్+నేరన్= సంతోషం పొందలేక; చిక్కుపడి, ఉన్నవాఁడన్= బయటపడలేక కష్టాలలో కూరుకొని ఉన్నాను; ప్రసన్నుండవు+అగుము= సౌమ్యతతో కూడిన దయగల వాడవు కమ్ము; రక్షింపుము= నన్ను కాపాడుము.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! చంద్రుడూ, సూర్యుడూ కన్నులుగా గలిగి నీ ముఖాలు దేదీప్యమానంగా వెలుగొందుతున్నాయి. నీయందు రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు ప్రవేశిస్తున్నారు. గుంపులు గుంపులుగా వచ్చి, మహర్షులు నిన్ను కీర్తిస్తున్నారు. వేల్పులు, సిద్ధులు, సాధ్యులు, ఆకాశంలో చరించేవారు ఆశ్చర్యంతో నిన్ను చూస్తున్నారు. 'లోకోత్తరమైన నీ విశ్వరూపం చూస్తే నాకు మతిపోతున్నది. ధైర్యం సడలింది. భయం వేస్తున్నది. ఇటు అటు కదలలేక మెదలలేక బాధపడుతున్నాను. నీవు దయగలిగి సౌమ్యుడవై నన్ను అనుగ్రహించి కాపాడుము.'

**విశేషం:** 1. రుద్రులు: శివమూర్తి భేదాలు. వీరు పదకొండుమంది. 1. అజైకపాదుడు 2. అహిర్బుధ్న్యుడు 3. విరూపాక్షుడు 4. సురేశ్వరుడు 5. జయంతుడు 6. బహురూపుడు 7. త్ర్యంబకుడు 8. అపరాజితుడు 9. వైవస్వతుడు 10. హరుడు 11. రుద్రుడు.
2. సాధ్యులు - పన్నిద్దరు గణదేవతలలో ఒక తెగ. సిద్ధులు- అణిమాది సిద్ధులుగల వారు; దేవతలలో ఒక తెగవారు.

**చ. అనలజ్వాలలు పర్వు నీ ముఖములం దా ధార్తరాష్ట్రవ్రజం**
**బును భీష్మాదులు నిద్దెసం గలుగు నీ భూపాలలోకంబు గ్ర**
**క్కున నొక్కుమ్మడి వచ్చి చొచ్చెదరు; నాకుం జెప్పవే యెవ్వరో**
**యని శంకించెద నిన్ను భూరికరుణాయత్తైకచిత్తుండవై.' 214**

**ప్రతిపదార్థం:** అనల+జ్వాలలు= అగ్నిమంటలు; పర్వు= వ్యాపించే; నీ+ముఖములందున్= నీమొగాల యందు; ఆ+ధార్తరాష్ట్ర వ్రజంబును= ఆ దుర్యోధనాదుల సముదాయమూ; భీష్మ+ఆదులున్= భీష్ముడు మొదలైనవారూ; ఈ+దెసన్+కలుగు= ఈ వైపున ఉన్న (పాండవ పక్షంలోని); భూపాల+లోకంబు= రాజుల సమూహం; గ్రక్కునన్= వెంటనే; ఒక్కుమ్మడిన్= ఏకంగా కలిసి; వచ్చి= వచ్చి; చొచ్చెదరు= ప్రవేశిస్తున్నారు; నిన్నున్+ఎవ్వరో+అని, శంకించెదన్= నీవు ఎవరవా అని సందేహిస్తున్నాను; భూరి, కరుణా+ఆయత్త+ఏక+చిత్తుండవు+ఐ= గొప్ప దయతో కూడిన మనస్సుగలవాడవై; నాకున్+చెప్పవు+ఏ= నాకు తెలియజేయవా.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! అగ్నిజ్వాలలు నీ ముఖాలలోనుండి వెలువడుతున్నాయి. ఆ వైపున ఉన్న దుర్యోధనుడు మున్నగు వారలేగాక, ఈ వైపున ఉన్న రాజులు గుంపులు గుంపులుగా వచ్చి నీ ముఖంలో ప్రవేశించి మ్రగ్గుతున్నారు. నీవు ఎవ్వరవో అని నేను సందేహిస్తున్నాను. అధిక, కరుణ గలిగిన చిత్తంగలవాడవై అసలు నీ వెవ్వరో నాకు చెప్పవా?

**విశేషం:** 1. ఈ పద్యంలో అర్జునుడు తన దిగ్భ్రాంతి వ్యక్తం చేస్తున్నాడు. ఇది మత్తేభవృత్తం. 'భూరికరుణాయత్తైకచిత్తుండవై' అనే ఆ సమాసంలోని గంభీర గమనం - అక్షరాల పరిధిని దాటిన మహత్త్వాన్ని ప్రతిబింబిస్తున్నది.

**వ. అనవుడు నప్పరమేశ్వరుం 'డేను లోకక్షయకర్త యగు కాలుండ; నిచ్చో జనసమాజ సమాహరణంబునకుం బ్రవృత్తుండ నైతి; నీవు సంపవలయు, నని లే; దీ గురుభీష్మాదు లెట్లును లేకుండువార; నాచేతం జచ్చిన వీరి నెల్లను జయించినవాఁడ వగుటకు నిమిత్తమాత్రమ్ము గమ్ము; లెమ్ము! రాజ్యమ్ము గైకొను!' మనిన విని వడవడ వడంకుచుం జేతులు మొగిడ్చి గద్గదకంఠంబుతో గాండీవి యిట్లనియె. 215**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని (అర్జునుడు) చెప్పగా; ఆ+పరమ+ఈశ్వరుండు= ఆ పరమాత్మ (శ్రీకృష్ణుడు); ఏను= నేను; లోక, క్షయ, కర్త, అగు, కాలుండన్= లోకాలను నాశనం చేసేటటువంటి యముడను; ఈ+చోన్= ఈచోట (ఈ కురుక్షేత్ర సంగ్రామరంగంలో); జన, సమాజ, సమాహరణంబునకున్= మనుజుల గుంపుల వినాశానికి; ప్రవృత్తుండన్+ఐతిన్= పూనుకొనిన వాడను అయ్యాను; ఈవు= ఓ అర్జునా! నీవు; చంపవలయున్+అని+లేదు= సంహరించాలని లేదు; ఈ+గురు, భీష్మ+ఆదులు= ఈ గురువుగారైన ద్రోణుడు భీష్ముడు మున్నగువారు; ఎట్లును= తప్పకుండా ఏదో రీతిగా; లేకుండు వారు+అ= ఉండకుండా పోయేవారే; నా చేతన్= నా చేతనే; చచ్చిన= మరణించిన; వీరిన్+ఎల్లన్= వీరందరినీ; జయించినవాడవు+అగుటకున్= గెలిచినట్లు కనిపించే వాడవు అవటానికి; నిమిత్తమాత్రుండవు+కమ్ము= (పైకి కనిపించే) కారణానివి కావలసింది; లెమ్ము= లే (యుద్ధం చేయుము); రాజ్యమ్మున్= పరిపాలించే భూమిని; కైకొనుము= స్వీకరించుము; అనినన్+విని= అని శ్రీకృష్ణుడు చెప్పగా ఆలకించి; గాండీవి= అర్జునుడు (గాండీవం కల వాడు); వడవడ+వడంకుచున్= గజగజ కంపిస్తూ; చేతులు+మొగిడ్చి= చేతులు జోడించి నమస్కరించి; గద్గద+కంఠంబుతోన్= డగ్గుత్తిక వడిన గొంతుకతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా చెప్పగా, పరమాత్మ అయిన శ్రీకృష్ణుడు అతడితో ఈ విధంగా పలికాడు. 'నేను లోకాల నన్నిటినీ నాశనం చేసే యముడను సుమా.'' ఇప్పుడు ఈ కురుక్షేత్ర సంగ్రామ రంగంలో ఈ జనసందోహాన్ని సంహరించటానికి ఉద్యుక్తుడను అయ్యాను. నీవు చంపుతున్నట్లు భ్రమలో పడనవసరం లేదు. ఈ ద్రోణుడు భీష్ముడు మొదలైన వారు అందరూ అవశ్యం చావవలసిందే. నేను చంపే వీరిని అందరినీ నీవు చంపినట్లుగా కనిపించి విజయం గైకొని, రాజ్యాన్ని ఏలుకొమ్ము. నీవు నిమిత్తమాత్రుడవు సుమా! లే. ఇక యుద్ధం చేయుము.'' ఆ మాటలు ఆలకించి, అర్జునుడు వడవడ వణకుతూ చేతులు జోడించి శ్రీకృష్ణుడికి నమస్కారం చేసి, డగ్గుత్తికవడ్డ గొంతుతో ఈ విధంగా అన్నాడు.

**తే. అంబు పవమాన సూర్య చంద్రానలాది । వివిధ తత్త్వంబులును నీవ; విశ్వలోక**
**సంప్రవర్తనకరుఁడవు శాశ్వతుండ । వచ్యుతుండవు పుండరీకాక్ష! నీవు.** **216**

**ప్రతిపదార్థం:** పుండరీక+అక్ష!= తెల్లని పద్మాలవంటి కన్నులు కలవాడా! శ్రీకృష్ణా!; నీవు; అంబు, పవమాన, సూర్య, చంద్ర+ అనల+ఆది, వివిధ తత్త్వంబులును= నీరు, గాలి, సూర్య, చంద్ర, అగ్ని, మొదలైన పెక్కురూపాలు (యాథార్థ్యాలు); నీవు+అ= నీవే; విశ్వలోక, సంప్రవర్తన, కరుఁడవు= సర్వ లోకాలను నడపేవాడవు; శాశ్వతుండవు= ఎల్లప్పుడూ ఉండేవాడవు; అచ్యుతుండవు= పతనం లేని విష్ణుడవు.

**తాత్పర్యం:** తెల్లని తామరపూవుల వంటి కన్నులు గల శ్రీకృష్ణా! నీరు, గాలి, సూర్యచంద్రులు, అగ్ని మున్నగు తత్త్వాలన్నీ నీవే. అన్ని లోకాలను నడిపేవాడవు నీవే. నీవు ఎల్లప్పుడు ఉండేవాడవు. ఎన్నడూ పతనం లేని వాడవు.

**విశేషం:** తత్త్వములు: అనగా సత్యాలు: యథాస్థితాకారాలు. సృష్టికి ప్రథమావయమైన ప్రకృతి మొదటి పదార్థం. 'భిన్నమతాలు' 'తత్త్వాలను' భిన్నభిన్నాలుగా ప్రతిపాదించాయి.

| మతాలు | తత్త్వములు |
|---|---|
| 1.బౌద్ధం | శూన్యం |
| 2. చార్వాకులు | పృథివి, నీరు, తేజస్సు, వాయువు |
| 3. అర్హతులు-ఒక వర్గం | జీవం, అజీవం |
| 4. అర్హతులు- ఇంకో వర్గం | జీవం, ఆకాశం, ధర్మం, అధర్మం, పుద్గలం |

| | |
|---|---|
| 5. అర్హతులు - ఒక వర్గం | జీవం, అజీవం, అస్రతం, బంధం, సంవదం, నిర్జరం, మోక్షం |
| 6. ద్వైతం | స్వతంత్రం, అస్వతంత్రం |
| 7. విశిష్టాద్వైతం | చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు |
| 8. పాశుపతులు | పశువు, పతి, పాశం |
| 9. సాంఖ్యం | అవ్యక్తం, బుద్ధి, అహంకారం, పంచతన్మాత్రలు, పంచభూతాలు, ఏకాదశేంద్రియాలు, ఆత్మ. |
| 10. యోగులు | సాంఖ్యుల 25 తత్త్వాలు + ఈశ్వరుడు, వెరసి 26 |
| 11. అద్వైతం | బ్రహ్మం |

పలువురు తాత్త్వికులు పెక్కు తత్త్వాలను ప్రతిపాదించారు.

**క. నిను నెఱుఁగకుండి యాదవుఁ । డని సఖుఁడని మేనబావ యని యే సహభో**
**జనములు సల్లాపంబులు । నొనరించుచు మేలమాడుచుండుదు నెపుడున్. 217**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను (ఓ శ్రీకృష్ణా! నిన్ను); ఎఱుఁగకుండి= తెలియక; యాదవుఁడు+అని= యదువంశీయుడవు అని; సఖుఁడు= మిత్రుడు; అని= అనీ; మేనబావ+అని= మేనత్త కొడుకు అనీ; ఏన్= నేను; సహభోజనములు= కలిసి ఆహారం స్వీకరించటం; సల్లాపంబులున్= పరస్పర సంభాషణలు; ఒనరించుచున్= చేస్తూ; ఎపుడున్= ఎల్లప్పుడు; మేలము+ఆడుచుండుదున్= వేళాకోళం చేస్తూ ఉంటాను.

**తాత్పర్యం:** ఓ శ్రీకృష్ణా! పరమాత్మా! నిను తెలియక యదువంశంలో జన్మించిన మానవమాత్రుడిగా, స్నేహితునిగా, మేనబావగా భావించి, కలిసి తిండి తినటం, వేళాకోళం ఆడటం చేశాను. నన్ను క్షమించుము.

**తే. మఱియుఁ బెక్కులు లోకసామాన్యభంగు । లాచరించితి నీదెస, నంతవట్టుఁ**
**దల్లిదండ్రులు ప్రజలకుఁ దప్పుదారు । లెల్ల సైరించునట్లు సహింపవలయు.' 218**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; పెక్కులు= ఎన్నో; లోక+సామాన్య+భంగులు=లోకంలో సాధారణంగా జరిగే రీతులు; నీదెసన్= నీ యెడల; ఆచరించితిన్= చేశాను; అంత+పట్టున్= వాటిని అన్నిటినీ; తల్లిదండ్రులు= మాతాపితలు; ప్రజలకున్= కన్నబిడ్డలకు; తప్పు+దారులు+ఎల్లన్= దోషముల తీరులు అన్నీ; సైరించునట్లు= క్షమించేటట్లుగా; సహింపన్‌వలయున్= క్షమించవలసింది.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! నీ యెడ నేను ఎన్నో తప్పులు చేశాను. వాటిని అన్నిటినీ తల్లిదండ్రులు తమ బిడ్డలు చేసే తప్పులను క్షమించేటట్లుగా క్షమించ ప్రార్థన.'

**వ. అని సంప్రార్థనంబు సేసి పార్థుండు వెండియు నిట్లను 'నదృష్టపూర్వం బైన భవదీయరూపంబు గనుంగొనం బడయుటం బ్రమోదంబును, బిట్టు చూచిన వెక్కసంబును, హృదయవ్యథయునుం బుట్టియున్నయది; నీతొంటి సౌమ్యాకారంబు గైకొని నిలిచి నాకు నాహ్లాదంబు సేయుము.' 219**

**ప్రతిపదార్థం:** అని, సంప్రార్థనంబు+చేసి= అని హృదయపూర్వకంగా ప్రార్థించి; పార్థుండు= అర్జునుడు; వెండియున్= మరల; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అదృష్ట పూర్వంబు+ఐన= ఇంతవరకు చూడబడనట్టి; భవదీయ+రూపంబున్= నీ ఆకృతిని; కనుంగొనన్+పడయుటన్= చూడటం చేత; ప్రమోదంబును= సంతోషమూ; బిట్టు+చూచిన్= ఎక్కువగా చూచిన; వెక్కసంబును= సహింపరాని స్థితియు; హృదయ+వ్యథయును= గుండెలోని బాధయూ; పుట్టి+ఉన్న+అది= కలిగింది; నీతొంటి+సౌమ్య+ఆకారంబున్=

మొదటినుండీ ఉన్న నీ శాంతమైన ఆకృతిని; కైకొని= స్వీకరించి; నిలిచి= నిలబడి; నాకున్= నాకు; ఆహ్లాదంబు+చేయుము= ఆనందాన్ని కలిగించుము.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ రీతిగా శ్రీకృష్ణుడిని ప్రార్థించి, ఇంకా ఈ రీతిగా అన్నాడు: 'శ్రీకృష్ణా! లోగడ నేను చూడని నీ విశ్వరూపాన్ని చూచి ఆనందించాను. కాని ఎక్కువ సేపు చూస్తే భరించలేని బాధ కలుగుతుంది. కాబట్టి, ఎప్పటి రీతిగా నీ శాంతస్వరూపం ధరించి నాకు సంతోషం చేకూర్చుమని నిన్ను మరల వేడుకొంటున్నాను.'

**చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగు నప్పరమేశ్వరుఁ డక్కిరీటి కి**
**ట్లనుఁ 'దపమాచరించి నిగమాధ్యయనం బొనరించి కానరా**
**దనఘ! మదీయదివ్యపరమాకృతి; పేర్చిన ఏకభక్తి భా**
**వనమునఁ దోఁచు; దీని జనవర్గము గానదు; నీక చూపితిన్. 220**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని (అర్జునుడు) చెప్పగా; దయా+ఆర్ద్ర, చిత్తుడు+అగు= దయతో తడిసిన మనస్సు కలవాడు అయిన; ఆ+పరమ+ఈశ్వరుఁడు= ఆ పరమాత్మ- శ్రీకృష్ణుడు; ఆ+కిరీటికిన్= ఆ అర్జునుడికి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; తపము+ఆచరించి= తపస్సు చేసి; నిగమ+అధ్యయనంబు+ఒనరించి= వేదాలు చదివి; అనఘ!= ఓ పాపరహితుడైన అర్జునా!; మదీయ, దివ్య, పరమ+ఆకృతి= నాదైన లోకాతీతమైన గొప్ప ఆకారం; కానన్‌రాదు= దర్శింపవీలుగాదు; పేర్చిన= అతిశయించిన; ఏక+భక్తి+భావమునన్= ఏకాంత భక్తిపూర్వకమైన తలంపుతో; తోఁచున్= కన్పిస్తుంది; దీనిన్= ఈ నా విశ్వరూపాన్ని; జన+వర్గము= జనసందోహం; కానదు= చూడలేదు; నీకున్+అ= నీకు మాత్రమే; చూపితిన్= చూపించాను.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ మాటలు పలుకగా, దయతో నిండిన చిత్తం కలవాడై శ్రీకృష్ణ పరమాత్మ ఆతడితో ఈ విధంగా చెప్పాడు: 'వేదాలు పఠించిన విద్వాంసులుగానీ కఠోర తపస్సులు చేసిన మహర్షులుగానీ సమాహిత భక్తిభావంతో మాత్రమే చూడగలిగిన నా విశ్వరూపాన్ని సాధారణ జనులు దర్శించలేదు. నీకు మాత్రమే చూపాను.

**వ. నీకు హృదయవ్యథం బొంద నేల? మూఢత్వంబు విడిచి విగతభయుండ వై సంప్రీతచేతస్కుండవు గ' మ్మని చెప్పి పూర్వప్రకారరూపంబు దాల్చి నిల్చినం గనుంగొని , కౌంతేయుం డా సౌమ్యరూపంబు సూచి 'సచేతనత్వంబు నొందితిఁ బ్రకృతిస్థుండ నైతి, నని పలుకుటయు, వాసుదేవుండు 'మత్కర్మపరుండును మద్భక్తుండును నైనవానికి నన్నుఁ బడయవచ్చు' నని యతని నాశ్వాసించి. 221**

**ప్రతిపదార్థం:** నీకున్= ఓ అర్జునా నీకు; హృదయ, వ్యథన్+పొందన్+ఏల?= మనసులో బాధ అనుభవించనేల?; మూఢత్వంబు+విడిచి= బుద్ధిమాంద్యం వీడి; విగత, భయుండవు+ఐ= పోయిన భీతి గల వాడవై; సంప్రీత, చేతస్కుండవు, కమ్ము= సంతోషంతో కూడిన మనస్సు గలవాడవుగా మారుము; అని చెప్పి= అని పలికి; పూర్వప్రకారరూపంబున్+తాల్చి= మునుపటి రూపం ధరించి; నిల్చినన్= నిలబడగా; కనుంగొని= చూచి; కౌంతేయుండు= కుంతీ కుమారుడు - అర్జునుడు; ఆ+సౌమ్య, రూపంబు+చూచి= ప్రశాంతంగా కనిపించే ఆ ఆకారం చూచి; సచేతనత్వంబున్+ఒందితిన్= కదలికతో కూడిన వాడను అయినాను; ప్రకృతిస్థుండన్+ఐతిన్= సహజస్థితిని పొందాను; అని+పలుకుటయున్= అని చెప్పగా; వాసుదేవుండు= వసుదేవుడి కొడుకు- శ్రీకృష్ణుడు; మత్+కర్మపరుండును= నాదైన కర్మలు చేసేవాడున్నూ (అనగా నాకు ఇష్టమైన సత్క్రియలు చేసేవాడును); మత్+భక్తుండును= నా భక్తుడైన వాడున్నూ (నన్ను ప్రేమతో ఆరాధించే వాడూ); ఐనవానికిన్= ఐనట్టివానికి; నన్నున్+పడయన్+వచ్చున్= నన్ను పొందవచ్చును (మోక్షం అందుకొనవచ్చును); అని= అని; అతనిన్= అర్జునుడిని; ఆశ్వాసించి= ఓదార్చి.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! నీవు బాధపడవద్దు. ఆ అవసరం లేదు. నీ అజ్ఞానాన్ని విడిచిపెట్టి భయంలేనివాడవై, ఆనందం పొందిన వాడవై ఉండుము' అని శ్రీకృష్ణుడు చెప్పి, వెనుకటి ఆకారం ధరించి, ప్రశాంతమూర్తిగా కన్పించాడు. ఆ సౌమ్య స్వరూపం చూచి, అర్జునుడు ఈ విధంగా అన్నాడు. 'ఓ శ్రీకృష్ణా! నీ విశ్వరూపం చూచినప్పుడు నేను కొయ్యబారిపోయాను. ఇప్పుడు ఆ భయం పోయింది. నేను తిరిగి యథాప్రకారంగా కదలిక మెదలిక కల మనిషిని కాగలిగాను.' అర్జునుడు చెప్పిన ఆ మాటలు విని, శ్రీకృష్ణుడు అతడిని ఓదార్చి ఈ విధంగా చెప్పాడు. 'నాకు ఇష్టమైన మంచి పనులు చేసేవాడూ. నాకు భక్తుడు అయినవాడూ నన్ను పొందగలడు.'

**విశేషం:** 1. మద్భక్తుండు అని మాత్రమేగాక, మత్ కర్మపరుండును అని శ్రీకృష్ణుడు చెప్పాడు. అనగా కర్మయోగం - భక్తియోగం వేరుకావని - రెండూ కలిసే ఉంటాయని శ్రీకృష్ణుడి సందేశం.

**తే. అతఁడు మఱియును బ్రహ్మవిద్యాన్వయమునఁ । దనకు సందిగ్ధ మైనట్టి దాని నెల్ల**
**నడుగఁగా నమ్మహాత్ముఁ డత్యంతకరుణఁ । దెలియఁ జెప్పుచు హృదయసంచలత మాన్చె. 222**

**ప్రతిపదార్థం:** అతఁడు= శ్రీకృష్ణుడు; మఱియును= ఇంకా; బ్రహ్మ+విద్యా+అన్వయమునన్= పరమాత్మకు సంబంధించిన జ్ఞానాన్ని అనుసంధించటంలో; తనకున్= అర్జునునకు; సందిగ్ధము+ఐనట్టి+దానిన్+ఎల్లన్= సందేహములు ఏర్పడిన వాటిని అన్నింటినీ; అడుగఁగాన్= ప్రశ్నింపగా; ఆ+మహా+ఆత్ముడున్= ఆ మహాత్ముడు- గొప్ప ఆత్మగలవాడు; అత్యంత+కరుణన్= మిక్కిలి దయతో; తెలియన్+చెప్పుచున్= వివరించి చెప్పుతూ; (అర్జునుడి) హృదయ+సంచలతన్= హృదయానికి సంబంధించిన కలతను; మాన్చెన్= పోగొట్టాడు.

**తాత్పర్యం:** అంతేకాక, శ్రీకృష్ణుడు ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని అర్జునుడికి బోధించాడు. అర్జునుడికి కలిగిన సందేహాలను అతడు అడుగగా, ఆ సందేహాలు అన్నిటినీ పోగొట్టాడు. అర్జునుడి గుండెలో ఉన్న కలతను పోగొట్టాడు.

**విశేషం:** 1. ఈ పద్యం వలన తిక్కన భగవద్గీతను సంక్షేపించినట్లు సుస్పష్టం.

2. 'బ్రహ్మవిద్యా+అన్వయమున' అనే ప్రయోగం గమనించదగ్గది. స్థూల దృష్టికి భగవద్గీతలోని వాక్యాలలో విప్రతిపత్తి కన్పించవచ్చును. సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే ఆ వైరుద్ధ్యాలు తొలగిపోతాయి. అర్జునుడికి శ్రీకృష్ణుడు ఉపదేశించింది - బ్రహ్మవిద్య మాత్రమేకాదు. 'అన్వయం'గూడ. ఈ వాక్యంలోని నిష్ఠ, విద్య మీదగాక 'అన్వయం' మీద ఉన్నది.

**వ. ఇవ్విధంబునఁ బార్థున కుపనిషదర్థజాతం బవగతంబు సేసి, మనసుకసటు వాపి, వివేకంబునకుం జేవ గలిగించి కృష్ణుం 'డీ గుహ్యతరజ్ఞానం బుపదేశించితి; దీని నెఱింగికొని నీ కెట్లు సూడం బోలె నట్లు ప్రవర్తింపు మను పలుకు పలికి, యింతకంటెం బరమరహస్యం బొక్కటి సెప్పెద విను' మని యతని కిట్లనియె. 223**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; పార్థునకున్= అర్జునుడికి; ఉపనిషత్+అర్థ+జాతంబు= ఉపనిషత్తులకు సంబంధించిన భావ సముదాయం; అవగతంబు+చేసి= వివరించి చెప్పి; మనసు+కసటు+పాపి= మనస్సులోని సందేహాలు అన్నీ తీర్చి; వివేకంబునకున్+చేవ కలిగించి= ఆత్మజ్ఞానానికి గట్టిదనం కలిగించి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; ఈ+గుహ్య, తర, జ్ఞానంబు= మిక్కిలి రహస్యమైన జ్ఞానాన్ని; ఉపదేశించితిన్= తెలియచేశాను; దీనిన్= ఈ రహస్య జ్ఞానాన్ని; ఎఱింగికొని= తెలిసికొని; నీకున్+ఎట్లు= నీకు ఏరీతిగా; చూడన్+పోలెన్= కనిపిస్తుందో; అట్లు= ఆ రీతిగా; ప్రవర్తింపుము= ఆచరించుము; అను+పలుకు+పలికి= అను మాటలు చెప్పి; ఇంత కంటెన్= దీని కంటెను; పరమ+రహస్యంబు= గొప్పదైన రహస్యం; ఒక్కటి+చెప్పెదన్= ఒకటి చెప్పగలను; వినుము+అని= ఆలకింపుము అని; అతనికిన్= అర్జునుడికి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా అర్జునుడికి ఉపనిషత్తులలోని సారం అనదగిన సందేశం అందించి, శ్రీకృష్ణుడు ఇట్లా చెప్పాడు. 'ఓ అర్జునా! నీకు మిక్కిలి రహస్యమైన జ్ఞానాన్ని అందించాను. నీవు ఈ సందేశాన్ని అవగాహన చేసికొని, నీకు నచ్చిన రీతిగా ప్రవర్తించుము. ఇంకో మాట. ఇంత కంటె గూడ గొప్ప రహస్యం ఒకటి ఉన్నది. దానిని చెప్పగలను. జాగ్రత్తగా ఆలకించుము.

**విశేషం:** వివేకం= రెండు వస్తువుల సూక్ష్మభేదం గుర్తించి వేరుపరచటం; ఆత్మ- అనాత్మ భేదం తెలుసుకొనటం, మిథ్యా ప్రపంచం నుండి పరమాత్మను వేరుగా గుర్తించటం.

**తే.** **' క్రందుకొను సర్వధర్మవికల్పములను । నెడల విడిచి దృఢంబుగ నే నొకండ**
**శరణముగ నాశ్రయింపుము సకలదురిత । ములకుఁ దొలఁగింతు నిన్నుఁ బ్రమోద మొంద.** **224**

**ప్రతిపదార్థం:** క్రందుకొను= గుమిగూడే; సర్వ+ధర్మ+వికల్పములను= అన్ని ధర్మాల ప్రత్యామ్నాయాలను; ఎడలన్+విడిచి= తొలగునట్లుగా విడిచిపెట్టి; దృఢంబుగన్= గట్టిగా- ఏకైక దీక్షతో; ఏన్+ఒకండన్= నేను ఒకడను మాత్రమే; శరణముగన్= ఏకైక రక్షణగా; ఆశ్రయింపుము= ఆధారంగా చేసికొనుము; నిన్నున్= నిన్ను; సకల, దురితములకున్= అన్ని పాపాలకు; ప్రమోదము+ఒందన్= సంతోషం చెందేటట్లుగా; తొలఁగింతున్= పోగొట్టగలను.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! ఇది అన్నిటిని మించినట్టి గొప్ప సందేశం. ఆలకించుము. ధర్మాలు ఎన్నో ఉండవచ్చును. ధర్మాలకు ప్రత్యామ్నాయాలు ఉండవచ్చును. వాటిని అన్నిటినీ వదలిపెట్టి, రక్షించేవాడను నేను ఒకడనే అని నమ్మి నన్ను శరణుపొందుము చాలు. నీ పాపాలు అన్నీ పోగొట్టి నీకు సంతోషం చేకూర్చగలను.

**విశేషం:** 1. ఈ పద్యానికి భగవద్గీతలో- మాతృక అనదగిన సంస్కృత శ్లోకం ఇది.

**శ్లో॥ 'సర్వధర్మాన్ పరిత్యజ్య । మా మేకం శరణం వ్రజ,**
**అహం త్వా సర్వపాపేభ్యో । మోక్షయిష్యామి మా శుచః'.(భ.గీ. 18-66)**

దీనికి లోకంలో చరమశ్లోకం అని ప్రఖ్యాతి ఏర్పడింది. ఈ శ్లోకంతో గీతా సందేశం సమాప్తి అవుతుంది.

మూల సంస్కృత శ్లోకంలో. సర్వ ధర్మాన్ పరిత్యజ్య; అన్ని ధర్మాలనూ పరిత్యజించి అని ఉన్నది. తిక్కన తెలుగుసేతలో వ్యాఖ్యాన ప్రాయంగా (క్రందుకొను) సర్వధర్మ వికల్పములను విడిచిపెట్టుమని ఉన్నది. భగవద్గీతా సందేశంలో ఎన్నో ధర్మాలు క్రందుకొని కన్పిస్తాయి. భగవద్గీత - ఏకైక ధర్మాన్ని ప్రబోధించలేదు. ధర్మం వైకల్పికము - అని భగవద్గీత ప్రబోధిస్తున్నది. అందుచేతనే సాంఖ్యయోగం, కర్మయోగం, జ్ఞానయోగం, కర్మ సన్న్యాసయోగం, ఆత్మసంయమయోగం మొదలైనవి ఎన్నో ఉన్నాయి. సంసారతరణోపాయాలు ఎన్నోఉన్నాయి. చిట్టచివరకు శ్రీకృష్ణపరమాత్మ అందించిన సందేశం 'సరే, తరణోపాయాలు ఎన్నో చెప్పాను కదా. అవి అన్నీ ఆచరణీయాలే. అయితే, ఏ కారణం చేతనైనా నీవు వాటిని వేటినీ ఆచరించలేకపోతే దిగులుపడ నవసరం లేదు. అందరకూ సులభ సాధ్యమైన ఒక ఉపాయం ఉన్నది. అది శరణాగతి. నన్ను (భగవంతుని) శరణు వేడితే చాలు. నేను నిన్ను పాపాలనుండి విముక్తుడిని చేసి మోక్షం ఇస్తాను.

శాంతిపర్వంలో 'క్రందుకొను ధర్మవికల్పములను' తిక్కన పేర్కొన్నాడు. భీష్ముని ఉపదేశం చివర.

**"కొందఱు బ్రహ్మచర్యమునఁ గొందఱు భవ్యగృహస్థ ధర్మముం**
**బొందుటఁ, గొంద ఱిద్ధ తపమున్ వనభూమిఁ దగం జరించుటం**
**గొందఱు నిష్క్రియత్వమునఁ, గొందఱు యజ్ఞ విధానశాలితం**

**గొంద అనూన దానమును గోరి యొనర్తురు నిత్య సౌఖ్యమున్."**
**జననీజనకారాధన । మున గురుభక్తిని సువృత్తమున శాంతిని దాం**
**తిని సత్యమున నహింసను । విను కాంతురు మోక్షపదము వేర్వేఱ జనుల్"** - (శాంతిపర్వం 6 అశ్వా - పద్యం 553) భగవద్గీతలో... శ్రీకృష్ణపరమాత్మ చిట్టచివరకు చెప్పిన మాట 'శరణాగతి'. ఇది భక్తిమార్గం. భక్తి చాలు. భక్తితో సర్వపాపాలు నశించిపోతాయి.

హిందూమతంపై కొందరు పాశ్చాత్యులు చేసే విమర్శ ఒకటి ఉన్నది. 'హిందువులు కర్మ సిద్ధాంతం ప్రతిపాదించారు. మంచి కర్మలు చేస్తే పుణ్యం వస్తుంది. చెడ్డపనులు చేస్తే పాపం వస్తుంది. ఇక దేవుడు చేసేది ఏముంది? జీవుడు హైందవ వేదాంతం ప్రకారం - ఈ కర్మ చక్రబంధంలో సదా పరిభ్రమించవలసిందే అనేక జన్మలు ఎత్తుతూ.''

ఈ చరమ శ్లోకంలో సుస్పష్టంగా చెప్పబడింది. శరణాగతి చేస్తే చాలు భగవంతుడు సర్వపాపాలను పోగొట్టి మోక్షం ప్రసాదించగలడు. వైష్ణవులు ఈ చరమ శ్లోకం గీతా సందేశానికి కేంద్ర గరిమనాభి అని అంటారు. 'ముక్తికి - భక్తి చాలు.' ఇది శ్రీవైష్ణవ వేదాంతం.

విశిష్టాద్వైత మతప్రోక్తుయైన రామానుజాచార్యుడు చరమ శ్లోకానికి ప్రత్యేక ప్రాముఖ్యం ఇచ్చారు. అయితే పఠితలు గుర్తుంచుకోవలసిన అంశం - ఇది చరమ శ్లోకమేగాని ప్రథమ శ్లోకమూ కాదు. ఏకైక శ్లోకమూ కాదు.

రామానుజాచార్యుల తరువాత, ఈ భక్తిమార్గం - 1. మార్జాల కిశోర న్యాయం 2. మర్కట కిశోర న్యాయం అని రెండు మార్గాలుగా చీలింది. భగవంతుడే భక్తుడిని తల్లిపిల్లి పిల్లలను మోసికొని పోతుంది మార్జాల కిశోర న్యాయంలో. తల్లికోతి పొట్టకు అంటిపెట్టుకొని చెట్టునుండి ఇంకో చెట్టుకు పోతాయి మర్కట కిశోరాలు.

భగవద్గీత కేవలం శరణాగతికి ఏకాంత భక్తికి మాత్రమే ప్రాముఖ్యం ఇచ్చియుంటే ఈ ఒక్క శ్లోకం చాలు. ఇన్ని అధ్యాయాలు ఇన్ని శ్లోకాలు ఉన్నాయి కదా. ముక్తికి ఎన్నో ఉపాయాలను భగవద్గీత పేర్కొన్నది. 'శరణాగతి' పరమోపాయం అని తిక్కన స్పష్టీకరించి, ఇది అన్నిటి కంటే గొప్ప రహస్యం అని కూడా చెప్పియున్నాడు.

**వ. ఇప్పరమోపాయంబు.** **225**

**తాత్పర్యం:** మిక్కిలి గొప్పది అయిన ఈ వెరవు.

**క. నియతియుఁ దపమును నా దెస । భయభక్తులు గలిగి నాకు భక్తుం డై ని**
**శ్చయనిపుణుఁ డయినవానికిఁ । బ్రియమున నెఱిఁగింపు వలదు పెఱవారలకున్.'** **226**

**ప్రతిపదార్థం:** నియతియున్= ఇంద్రియ నిగ్రహమును; తపమును= శరీర క్లేశమునకు జంకక పాటించే ఆధ్యాత్మిక చింతన; నా దెసన్= నా యెడల; భయ+భక్తులు= భీతి గౌరవ పురస్సరమైన ప్రేమ; కలిగి= ఉండి; నాకున్= నాకు; భక్తుండు+ఐ= ఆరాధించేవాడయి; నిశ్చయ+నిపుణుండు+అయిన వానికిన్= దృఢమైన మనస్సు గలవాడికి; ప్రియమునన్= ప్రీతితో; ఎఱిఁగింపుము= ఉపదేశించుము; పెఱ+వారలకున్= ఇతరులకు (అనగా భక్తులు కాని వారలకు); వలదు= ఎరిగించవద్దు.

**తాత్పర్యం:** ఇంద్రియ నిగ్రహం, నీతినియమాలు గల సౌశీల్యవంతుడు, నా యెడ భక్తి కలిగినవాడికి మాత్రమే నేను నీకు చేసిన ఈ సందేశం అందించుము. అంతేకాని, దృఢమైన మనస్సు లేనివాడికి తదితరులకు ఈ సందేశం వినిపించవద్దు సుమా!

**విశేషం:** 1. సత్యమూ జగద్విదితమూ అయిన భగవద్గీతా సందేశం రహస్యంగా ఉంచమనటంలో శ్రీకృష్ణుడి ఆంతర్యం ఏమిటి? జిజ్ఞాస లేనివారికి - యోగ్యత లేనివారికి ఈ సందేశం అందించరాదు. ఎందుచేతనంటే- అది నిష్ఫలం కావటం మాత్రమే గాక ప్రమాదాలకు దారితీయవచ్చును.

**వ. అని వెండియుఁ బుండరీకాక్షుండు 'నాచెప్పిన యది లెస్సగా నాకర్ణించితే? నీయజ్ఞాన సమ్మోహం బంతయుం బాసెనే?' యనవుడు నర్జునుండు. 227**

**ప్రతిపదార్థం:** అని, వెండియున్= అని చెప్పి - మరల; పుండరీక+అక్షుండు= తెల్లతామర పువ్వుల వంటి కన్నులు గలవాడు - శ్రీకృష్ణుడు; నా+చెప్పిన+అది= నేను చెప్పినట్టిది; లెస్సగాన్= బాగుగా; ఆకర్ణించితి(వి)+ఏ= విన్నావుగదా; నీ, అజ్ఞాన, సమ్మోహంబు= నీ తెలివి లేకుండటం - భ్రాంతి; అంతయున్= సర్వమూ; పాసెను+ఏ?= పోయినదా?; అనవుడున్= అని చెప్పగా; అర్జునుండు= అర్జునుడు.

**తాత్పర్యం:** అని మరల శ్రీకృష్ణుడు తన సందేశం అందించగా అర్జునుడు విన్నాడు. చివరకు శ్రీకృష్ణుడు అర్జునుడికి ఒక ప్రశ్న వేశాడు. 'అర్జునా! నీకు చెప్పిన విషయాలు అన్నీ విన్నావు గదా. నీ అజ్ఞానం తొలగిపోయిందా? నీ భ్రాంతి అంతా పోయింది కదా!' అని అడిగాడు. అప్పుడు అర్జునుడు ఈ విధంగా చెప్పాడు:

**విశేషం:** అనవుడు అనగా, నావుడు అనగా అని చెప్పగా అని అర్థం. తెలుగు భారతంలో ఈ పదాలు చాలా చోట్ల ప్రయోగించబడ్డాయి. భారత కథ చాలా భాగం సంభాషణ రూపంలో నడిచింది. 'వైశంపాయనుండు జనమేజయునకు ఇట్లనియె' 'సూతుండు శౌనకాది మహర్షులకు ఇట్లనియె', శ్రీకృష్ణుడు అర్జునుడితో ఇట్లనియె, సంజయుండు ధృతరాష్ట్రునకు ఇట్లనియె - ఈ విధంగా.

అందుచే అనవుడు- నావుడు శబ్దాలు విరివిగా వాడబడ్డాయి. ఇవి డుకారాంతాలుగదా! తెలుగులో "డు" ప్రథమా విభక్తి ప్రత్యయం. పురుషనామాల చివర 'డు' తరచుగా వస్తుంది. ఒక శ్రోత అడిగాడట- "అనవుడుకు నావుడు ఏమౌతాడని'. ఇంకో శ్రోత చెప్పిన సమాధానం- 'అనవుడు నావుడు అన్నదమ్ములు'. ఈ చమత్కార కథ తెలుగు సీమలో ఎక్కువ ప్రచారంలో ఉండేది.

**ఉ. ' మోహ తమంబు వాసెఁ; దుది ముట్టిన నీదు ప్రపత్తి వీత సం**
**దేహుఁడనైతి; గాఢపరిదీప్త మహాకృతిఁ గాంచి బోధ స**
**న్నాహనిరామయస్థిరమనస్థ్సితిఁ బొందితి; సర్వలోక ని**
**ర్వాహవినోద! నీ విమల వాక్యము చొప్పున నెల్లఁ జేసెదన్.' 228**

**ప్రతిపదార్థం:** మోహ+తమంబు+పాసెన్= మోహం అనే చీకటి తొలగిపోయింది; తుదిన్+ముట్టిన= చివరి భాగాన్ని తాకిన, పరిపూర్ణత చెందిన; నీదు+ప్రపత్తిన్= నీ యందలి భక్తిచేత; వీత+సందేహుఁడన్+ఐతిన్= పోయిన అనుమానాలు గలవాడను అయ్యాను; గాఢ, పరిదీప్త, మహా+ఆకృతిన్= గొప్పగా దేదీప్యమానంగా వెలుగొందిన ఆకృతిని (నీ విశ్వరూపాన్ని); కాంచి= చూచి; బోధ+సన్నాహ+నిరామయ+స్థిర+మనస్+స్థితిన్= జ్ఞానంతో నిండిన ఆరోగ్యంతో కూడి చలించనట్టి మనస్సు యొక్క ఉనికిని; పొందితిన్= సంపాదించాను; సర్వ, లోక, నిర్వాహ వినోద!= అన్ని లోకాలను నడపటమే క్రీడగా గలవాడా!- శ్రీకృష్ణా!; నీ, విమల, వాక్యము, చొప్పునన్= నీవు చెప్పిన మాటల ప్రకారం; ఎల్లన్= అంతా; చేసెదన్= చేస్తాను.

**తాత్పర్యం:** 'భ్రాంతి అనే చీకట్లు నానుండి తొలగిపోయాయి. నీయెడ నాకు కుదిరిన పరిపూర్ణ భక్తి విశ్వాసం చేత అన్ని అనుమానాలు నాకు తొలగిపోయాయి. నీ విశ్వరూప సందర్శనం చేత నా జ్ఞానం దృఢంగా పాదుకున్నది. సర్వలోకాలను నడపటమే క్రీడగాగలవాడా, ఓ శ్రీకృష్ణా, నీవు చెప్పినట్లుగా నేను నడచుకోగలను.'

**విశేషం:** 1. ఇక్కడ శ్రీకృష్ణుడి ప్రబోధం - అర్జునుడి అనుభూతి రెండూ కలిశాయి. ఒకటి శాస్త్రం. అది సిద్ధాంత భాగం. రెండవది కళ. అనుష్ఠానం. సిద్ధాంతం అనుభూతి వలన ధ్రువీకరించబడుతుంది.

2. భగవద్గీత బోధించే వేదాంతం ఏమిటి? వేదాంత తత్త్వం ఐహిక కర్మ విదూరం కాదు; కర్తవ్య ఆచరణ అందులో ఇమిడి ఉన్నది ఎందుచేతనంటే గీతా ప్రబోధం విన్న తదుపరి అర్జునుడు గాండీవాన్ని పట్టి యుద్ధం చేశాడు. కాషాయాంబరాలు ధరించి అడవికి పోలేదు. అడవికి పోవటం తప్పని కాదు. కర్తవ్యం నిర్వహించటం ఒప్పు అని చెప్పటమే.

**వ. అని పలికి యప్పరమపురుషునకు సభక్తిక సాష్టాంగ దండ ప్రణామంబు సేసి పార్థుండు గృతార్థుండై ధృతాయుధుండయ్యె' నని చెప్పి సంజయుండు వెండియు నిట్లనుం 'గురుకులేశ్వరా! యేను మునిగణేశ్వరుండైన పారాశర్యు కారుణ్యంబునఁ గృష్ణార్జునుల యద్భుతపుణ్యసంవాదంబు వినుటకు మహాయోగీంద్ర హృదయానందకరుం డైన యద్దేవుని దివ్యరూపంబు గనుటకుం బాత్రభూతుండ నైతి; నమ్మహాత్ముండు దన మధురవాక్యంబుల నుపదేశింప నత్యంతగుహ్యం బైన యోగప్రకారంబు విశదంబుగా ననుసంధించితి; నమ్మహానుభావుల సంభాషణములు నవ్విశ్వరూపుని మహనీయాకారంబునుం దలంచి తలంచి యచ్చెరు వందుచుఁ బ్రియం బందుచు నుండుదు' నని మఱియును. 229**

**ప్రతిపదార్థం:** అని+పలికి= అని (అర్జునుడు చెప్పి); ఆ+పరమ, పురుషునకున్= ఆ (కృష్ణ) పరమాత్మకు; స, భక్తిక, స+అష్టాంగ దండ, ప్రణామంబు+చేసి= భక్తితో కూడిన ఎనిమిది అవయవాలు భూమిని సోకు నమస్కారం చేసి; పార్థుండు= అర్జునుడు (పృథ= కుంతి); కృత+అర్థుండు+ఐ= ధన్యుడై; ధృత+ఆయుధుండు+అయ్యెన్= ఆయుధాన్ని ధరించినట్టి వాడయ్యె; అని+చెప్పి= అని వచించి; సంజయుండు= సంజయుడు; వెండియున్= మరల; ఇట్లు+అనున్= ఈవిధంగా చెప్పాడు; కురు+కుల+ఈశ్వరా!= కురు వంశానికి అధిపతీ- ఓ ధృతరాష్ట్రా!; ఏను= నేను; ముని, గణ+ఈశ్వరుండు+ఐన= మునుల సముదాయంలో శ్రేష్ఠుడు ఐన; పారాశర్యు+కారుణ్యంబునన్= పరాశర మహర్షి కొడుకైన వ్యాసుడి దయవలన; కృష్ణ+అర్జునుల= శ్రీకృష్ణుడికి అర్జునుడికి మధ్య జరిగిన; అద్భుత+పుణ్య+సంవాదంబు= ఆశ్చర్యకరమైనట్టిదియు, సుకృతమును చేకూర్చునట్టిదియును అయిన సంభాషణ; వినుటకున్= వినటానికి; మహా, యోగి+ఇంద్ర, హృదయ, ఆనందకరుండు+ఐన= గొప్ప ఋషులలో శ్రేష్ఠులైనవారి హృదయాలకు సంతోషం చేకూర్చేవాడైన; ఆ+దేవుని= ఆ భగవంతుడి; దివ్య+రూపంబు= లోకోత్తరమైన ఆకారం; కనుటకున్= చూడటానికి; పాత్ర, భూతుండన్+ఐతిన్= యోగ్యుడను కాగలిగాను; ఆ+మహా+ఆత్ముండు= గొప్ప ఆత్మగల ఆతడు- శ్రీకృష్ణుడు; తన+మధుర+వాక్యంబులన్+ఉపదేశింపన్= తియ్యనైన తన మాటలు చెప్పగా; అత్యంత+గుహ్యంబు+ఐన= మిక్కిలి రహస్యమైనట్టి; యోగ+ప్రకారంబు= యోగ పద్ధతి; విశదంబుగాన్= తేటతెల్లం అయ్యే రీతిలో; అనుసంధించితిన్= తగినట్లుగా కూర్చి చెప్పాను; ఆ+మహా+అనుభావుల+సంభాషణములు= ఆ మహాత్ముల మాటలు; ఆ+విశ్వరూపుని= విశ్వమే తన ఆకారంగా గల ఆ శ్రీకృష్ణుడి; మహనీయ+ఆకారంబున్= గొప్ప ఆకృతిని; తలంచి; తలంచి= మరల మరల స్మరించి; అచ్చెరువు+అందుచున్= ఆశ్చర్యం అనుభవిస్తూ; ప్రియంబు+అందుచున్= ప్రీతిని అనుభవిస్తూ; ఉండుదున్= ఉంటాను; అని మఱియును= అని చెప్పి మరల.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు శ్రీకృష్ణుడికి భక్తితో సాష్టాంగ నమస్కారం చేసి గాండీవం ధరించి నిలిచాడు, అని సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పి, మరల ఈ విధంగా అన్నాడు. 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! నేను ఋషివరేణ్యుడైన వ్యాసుడి కరుణవలన కృష్ణార్జునుల సంభాషణ విన్నాను. యోగీశ్వరుల హృదయానికి ఆనందం కలిగించే శ్రీకృష్ణుడి విశ్వరూపం సందర్శించగలిగాను. అంతేకాక మహానుభావుడైన శ్రీకృష్ణుడు అర్జునుడికి అందించిన దివ్య సందేశం యోగ విద్యా సారసంగ్రహం ఆలకించాను. ఆ మహానుభావుల సంభాషణలు- ప్రపంచస్వరూపుడైన శ్రీకృష్ణుడి మహనీయస్వరూపం మాటి మాటికి తలపోసి ఆశ్చర్యము, ఆనందము చెందుతూ ఉంటాను.

**విశేషం:** 1. భగవద్గీత ప్రత్యక్షంగా విన్నది, శ్రీకృష్ణుడి విశ్వరూపం సందర్శించింది అర్జునుడు. అయితే అతడితోపాటు ప్రత్యక్షంగా వినే అవకాశం చూచే అవకాశం సంజయుడికి సంక్రమించింది గదా వ్యాసమహర్షి దయవలన. అటు అర్జునుడి మాట అటుంచి- ఇటు సంజయుడు ఆనందతన్మయుడై ఉప్పొంగి పోతున్నాడు.

2. సాష్టాంగదండప్రణామం: దండాకారంగా ఎనిమిది అంగాలు, అవయవాలు నేలకు తగిలేటట్లుగా చేసే నమస్కారం. 1. మోకాళ్ళు 2. పాదాలు 3. చేతులు 4. రొమ్ము 5. బుద్ధి 6. తల 7. మాట 8. చూపు- ఇవి అష్టాంగాలు.

**తే. ' అధిప! యోగీశ్వరేశ్వరుం డైన కృష్ణుఁ । డును ధనుర్ధరవర్యుఁ డర్జునుఁడు నెచట**
**నిలిచి రచ్చట విజయంబు నీతి సిరియు । భూతి నిత్యంబు లగు; నిది నా తలంపు.' 230**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఓ ధృతరాష్ట్ర మహారాజా!; యోగి+ఈశ్వర+ఈశ్వరుండు+ఐన= ఉత్తమ యోగులలో గొప్పవాడు అయిన; కృష్ణుఁడును= శ్రీకృష్ణుడూ, ధనుస్+ధర+వర్యుఁడు= ధానుష్కులలో- ధనువు ధరించే వారలలో శ్రేష్ఠుడైన; అర్జునుఁడు= అర్జునుడును; ఎచటన్= ఏ స్థలంలో; నిలిచిరి= నిలబడ్డారో; అచ్చటన్= ఆ స్థలంలో; విజయంబు= గెలుపు; నీతి= మంచి నడవడి తీరు; సిరియున్= ఐశ్వర్యం; భూతి= ప్రాభవం; నిత్యంబులు+అగున్= సర్వదా ఉంటాయి; ఇది= ఇది; నా+తలంపు= నా అభిప్రాయం.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! యోగీశ్వరుడైన శ్రీకృష్ణుడూ, విలుకాండ్రలో శ్రేష్ఠుడైన అర్జునుడూ, ఎచ్చట కలిసి మెలిసి ఉంటారో అచ్చట నీతి, సిరిసంపదలు, విజయం సర్వదా ఉంటాయి.

**విశేషం:** 1. శ్రీకృష్ణుడు యోగీశ్వరుడుగా భారతంలో భగవద్గీతలో అభివర్ణితుడు.

2. ఆధ్యాత్మిక శక్తికి ప్రతీక శ్రీకృష్ణుడు, ఐహికశక్తికి ప్రతీక అర్జునుడు. శ్రీకృష్ణుడు దైవశక్తికి, పురుషకార శక్తికి అర్జునుడూ ప్రతీకలు. యోగం+పురుషకారం= విజయం అని సంజయుడి వ్యాఖ్యానం.

**వ. అనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 231**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని (సంజయుడు చెప్పగా) ఆలకించి; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని సంజయుడు చెప్పగా ఆలకించి ధృతరాష్ట్రుడు ఈ రీతిగా చెప్పాడు.

**క. ' ఇవ్విధమున నాయిత మై । క్రొ వ్వెలరారంగ నిలిచి కురుపాండవులం**
**దెవ్వరు మును గడఁగిరి? రణ । మెవ్విధి నూలుకొని చెల్లె? నెఱిఁగింపు తగన్.' 232**

**ప్రతిపదార్థం:** ఈ+విధమునన్= ఈ రీతిగా; ఆయితము+ఐ= సంసిద్ధమై; క్రొవ్వు+ఎలరారంగన్= గర్వం అతిశయించగా; నిలిచి= నిలబడి; కురు+పాండవులందున్+ఎవ్వరు= కౌరవులలో పాండవులలో ఎవ్వరు; మును= ముందుగా; కడఁగిరి= పూనిరి; రణము= యుద్ధం; ఏ+విధిన్= ఏ రీతిగా; నూలుకొని= ప్రారంభించి; చెల్లెన్= జరిగింది; తగన్= తగినట్లుగా; ఎఱిఁగింపు(ము)= తెలియజేయుము.

**తాత్పర్యం:** 'ఈ విధంగా యుద్ధానికి సంసిద్ధమై, గర్వంతో కురు పాండవులు నిలిచారు గదా! ఉభయ పక్షాలలో మునుముందుగా యుద్ధం ఎవరు ప్రారంభించారు? యుద్ధం ఏ విధంగా జరిగింది? వివరించి చెప్పుము.'

**భీష్ముని ప్రథమ దివస యుద్ధము (సం. 6-42-1)**

**వ. అనుటయు సంజయుం డతని కి ట్లనియె భవదగ్రనందనుం డత్యంతోదగ్రవ్యగ్రుండై యాగ్రహంబునం బనిచినం బ్రకటదోర్గర్వదుర్దముం డగు దుశ్శాసనుండు పురి కొలుపం గురుసైన్యంబులు శంఖ భేరీ మృదంగాది నిస్వనమ్ములు సెలంగ గాంగేయుండు దొలుతం గదలఁ గేతుశోభాభిరాముం డగుచు నుద్దామ గతిం గవిసినం గనుంగొని. 233**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని (ధృతరాష్ట్రుడు) చెప్పగా; సంజయుండు= సంజయుడు; అతనికిన్+ఇట్లు+అనియెన్= ధృతరాష్ట్రుడికి, ఈ విధంగా చెప్పాడు; భవత్+అగ్ర నందనుండు= నీ పెద్ద కొడుకు (దుర్యోధనుడు); అత్యంత+ఉదగ్ర

వ్యగ్రుండు+ఐ= మిక్కిలి భయంకరమైన స్ఫూర్తితో చలించినవాడై; ఆగ్రహంబునన్= కోపంతో; పనిచినన్= ఆజ్ఞాపింపగా; ప్రకట, దోర్గర్వ, దుర్దముండు+అగు= పైకి వెల్లడి అయిన భుజబలంచేత అడపరానివాడగు; దుశ్శాసనుండు= దుశ్శాసనుడు; పురికొలుపన్= ప్రోత్సహించగా; కురు, సైన్యంబులు= కౌరవ సేనలు; శంఖ, భేరీ, మృదంగ+ఆది, నిస్వనమ్ములు= శంఖాలు, పెద్దమూతి ఒకటిగల డోళ్లు; మద్దెళ్లు మొదలుగా గల వాద్యాల మ్రోతలు; చెలంగన్= ధ్వనించగా; గాంగేయుండు= గంగ కొడుకు- భీష్ముడు; తొలుతన్= మొదట; కదలన్= నడవగా; కేతు, శోభా+అభిరాముండు+అగుచున్= జెండా యొక్క వైభవంచేత అందంగా కనిపిస్తూ; ఉద్దామ+గతిన్= భయంకరమైన రీతిగా, కవిసినన్= మార్కొనగా; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రుడితో ఈ రీతిగా చెప్పాడు- 'నీ పెద్ద కొడుకు మిక్కిలి కోపంతో ఆజ్ఞాపించగా పరాక్రమ గర్వంతో దుశ్శాసనుడు ప్రోత్సహించగా, కౌరవసేనలు శంఖాలు, భేరులు, మద్దెలలు మున్నగు వాద్యాలు మ్రోగించి, ముందు భీష్ముడు సేనాధిపతిగా ఎత్తైన జెండా ఆకాశంలో అందంగా వెలుగొందుతూ ఉండగా, భయం కరంగా మార్కొనటం చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. పాండునృపాలనందనులు పావని మున్నుగ నేచి యప్డు భీ**
**ష్ముండు గడంక మై నడచు చోటికిఁ జక్కటి గాఁగఁ ద్రోచి యొం**
**డొండ కడంగి సేన తమ యుబ్బున కుబ్బఁగ నన్యసైన్య వే**
**దండ ముఖాంగముల్ దృణ వితానముగాఁ గొని నిర్వికారులై. 234**

**ప్రతిపదార్థం:** పాండు, నృపాల, నందనులు= పాండురాజు కొడుకులు పాండవులు; పావని= భీముడు; మున్నుగన్= ముందుండగా; ఏచి= విజృంభించి; అప్డు= అపుడు; భీష్ముండు= భీష్ముడు; కడంకమైన్= పూనికతో; నడచుచోటికిన్= కదలి వెళ్ళే స్థలానికి; చక్కటి+కాఁగన్= చేరువ అయ్యేటట్లుగా; త్రోచి= ముందుకు చేరి; ఒండొండ= ఒకరితో ఒకరు; కడంగి= పూని; సేన= సైన్యం; తమ+ఉబ్బునకున్+ఉబ్బఁగన్= తమ అతిశయానికి ఉప్పొంగగా; అన్య, సైన్య, వేదండ, ముఖ+అంగముల్= శత్రుసైన్యంలోని ఏనుగుల ముందున్న బారులు; తృణ+వితానముగాన్= గడ్డి పోచలవలె; కొని= భావించి; నిర్వికారులు+ఐ= వికారం లేనివారలై ధైర్యంతో ఉన్నవారై.

**తాత్పర్యం:** పాండవులు భీముడిని ముందు పెట్టుకొని, భీష్ముడు నడుస్తున్న చోటుకు చేరువగా తమ సైన్యాలను తరలించారు. పాండవుల ఉత్సాహం చూచి, ఆ సేనలు ఉప్పొంగాయి. ఉప్పొంగి శత్రుసైన్యంలోని గజబలాన్ని గడ్డిపోచలుగా భావించి ధైర్యంతో (ముందుకు సాగి).

**వ. ఉరవడించు సమయంబున. 235**

**ప్రతిపదార్థం:** ఉరవడించు+సమయంబునన్= వేగిరపడే వేళలో.

**తాత్పర్యం:** వేగిరపడే వేళలో.

**క. ఘనతరగర్జా ధ్వనులును, । ఘనపథమఖిలంబుఁ దూఁటు కట్టెడు తూర్య**
**స్వనములునుం గబళించుచు । ననిలతనయు సింహనాద మడరెం బెలుచన్. 236**

**ప్రతిపదార్థం:** ఘన, తర, గర్జా, ధ్వనులును= మిక్కిలి గొప్పదైన మదపుటేనుగులు చేసే ధ్వనులూ; ఘనపథము+అఖిలంబున్= ఆకాశం అంతయు; తూఁటు+కట్టెడు= చిల్లులు పడచేసే; తూర్య+స్వనములున్= బూరాలు మున్నగు వాద్యాల ధ్వనులునూ; కబళించుచున్= మ్రింగి వేస్తూ; అనిల తనయు, సింహనాదము= వాయుపుత్రుడు అయిన భీముడు చేసిన సింహనాదం; పెలుచన్= ఎక్కువగా; అడరెన్= అతిశయించింది.

**తాత్పర్యం:** ఉభయసైన్యాలు తలపడాలని వేగిరపడే ఆ వేళలో, భీమసేనుడు సింహనాదం చేశాడు. మదపు టేనుగుల గర్జా నినాదాలను, ఆకాశాన్ని చిల్లులుపడేటట్లు చేసే తూర్యరావాలను భీముడి సింహనాదం కబళించివేసింది.

**విశేషం:** సింహనాదం: ప్రాచీనకాలంలో యుద్ధవీరుడి నోటి నుండి వెలువడే గర్జన. అది సింహగర్జన సదృశం. అలనాడు వీరులు చేసే సింహనాదాలు 'పూరించే శంఖాలు' భేరీ కాహళ తూర్యాది రావాలు యుద్ధ పరాక్రమంలో అంతర్భాగాలే.

**వ. ఇట్లు ప్రతిభటతురంగమాతంగంబుల గుండియ లవియ నందంద యార్చి పేర్చిన భీము నెదిర్చి దుశ్శాసనుండును దుర్ముఖుండును దుష్ప్రహుండును దుర్మర్షణుండును వివింశతియు వృషసేనుండును జిత్రసేనుండును వికర్ణుండును బురుమిత్రుండును దుర్యోధను చూడ్కికి వేడ్క సేయుచుం దాఁకిన. 237**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ప్రతిభట, తురంగ, మాతంగంబుల, గుండియలు+అవియన్= శత్రువుల గుర్రాలు ఏనుగుల దండుల గుండెలు బ్రద్దలయ్యేటట్లుగా; అందంద= అక్కడికక్కడే; ఆర్చి, పేర్చిన= అతిశయించి విస్తరిల్లిన; భీమున్= భీమసేనుడిని; ఎదిర్చి= మార్కొని; దుశ్శాసనుండును= దుశ్శాసనుడూ; దుర్ముఖుండును= దుర్ముఖుడూ; దుష్ప్రహుండును= దుష్ప్రహుండూ; దుర్మర్షణుండును= దుర్మర్షణుడూ; వివింశతియున్= వివింశతీ; వృషసేనుండును= వృషసేనుడూ; చిత్రసేనుండును= చిత్రసేనుడూ; వికర్ణుండును= వికర్ణుడూ; పురుమిత్రుండును= పురుమిత్రుడూ; దుర్యోధను చూడ్కికిన్= దుర్యోధనుడి దృష్టికి; వేడ్క= సంతోషం; చేయుచున్=కలిగిస్తూ; తాఁకినన్= మార్కొనగా.

**తాత్పర్యం:** ఈ విధంగా శత్రువులకు చెందిన గుర్రాల ఏనుగుల దండుల గుండెలు అదిరిపోయేటట్లు సింహనాదం చేసి విజృంభించిన భీముడిని, దుశ్శాసనుడు, దుర్ముఖుడు, దుష్ప్రహుడు, దుర్మర్షణుడు, వివింశతి, వృషసేనుడు, చిత్రసేనుడు, వికర్ణుడు (దుర్యోధనుడి తమ్ములు) ఎదిరించి, దుర్యోధనుడికి కన్నుల పండువుగా మార్కొన్నారు.

**క. ఉద్యతులై కవలును ధృ। ష్టద్యుమ్నుఁడుఁ గడఁగఁ దోన సౌభద్రుండున్**
**మాద్యద్గతిఁ గవియుడు నే। కోద్యోగత ద్రౌపదీసుతోత్కర మడరెన్. 238**

**ప్రతిపదార్థం:** ఉద్యతులు+ఐ= ఉత్సాహంతో విజృంభించినవారై; కవలును= నకుల సహదేవులు - కవల జంట; ధృష్టద్యుమ్నుఁడు= ద్రుపదుడి పెద్ద కొడుకు- పాండవ సేనాపతి; కడఁగన్= పూనికతో విజృంభించగా; తోన= వెంటనే; సౌభద్రుండున్= సుభద్ర కొడుకు అభిమన్యుడు; మాద్యత్+గతిన్= మదించిన రీతిలో; కవియుడున్= మార్కొనగా; ఏక+ఉద్యోగతన్= ఒకే యత్నంతో; ద్రౌపదీ, సుత+ఉత్కరము= ద్రౌపది పుత్రుల సముదాయం; అడరెన్= విజృంభించింది.

**తాత్పర్యం:** యుద్ధ సన్నద్ధులై నకులుడు, సహదేవుడు, ధృష్టద్యుమ్నుడు విజృంభించారు. వారితోపాటు అభిమన్యుడు కూడా విజృంభించాడు. అట్లే ద్రౌపది కొడుకులూ చెలరేగారు.

**వ. ఇవ్విధంబున వృకోదరునకుం దలకడచి తాఁకి వజ్రనిభమ్ములగు వాలమ్ములు శైలోపములగు కౌరవవీరుల పయిం గురియ నక్కుమారవర్గంబు ననర్గళప్రసారం బగు శరాసారంబుల వారలఁ గప్పె; నట్టియెడం గొండొకసేపు. 239**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; వృకోదరునకున్= భీముడికి; తలకడచి= అతిక్రమించి; తాఁకి= మార్కొని; వజ్ర, నిభమ్ములు+అగు= వజ్రంతో సమానములు అయిన; వాలు+అమ్ములు= వాడి బాణాలు; శైల+ఉపములు+అగు= కొండలతో సాటి అయిన; కౌరవ, వీరులపయిన్+కురియన్= కౌరవ వీరులపై (ధార్తరాష్ట్రులపయి) వర్షించగా, ఆ+కుమార+వర్గంబు= ఆ

కుమారుల సముదాయం (ధార్తరాష్ట్రులు); అనర్గళ+ప్రసారంబులు+అగు= అడ్డు లేకుండా ప్రయోగించబడిన; శరాసారంబులన్= బాణాల జడులతో; వారలన్+కప్పెన్= పాండవ కుమారులను కప్పింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; కొండొక+సేపు= కొంతసేపు.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవ కుమారులు భీమసేనుడికంటె ముందుకురికి వజ్రాయుధాలవంటి వాడిబాణాలను పర్వతాల వంటి కౌరవవీరులమీద కురిపించారు. కౌరవ కుమారులు కూడా ఎడతెరిపి లేకుండా బాణాల వరుసలతో పాండవ కుమారులను కప్పివేశారు. ఆ సమయంలో కొంతసేపు.

**విశేషం:** యుద్ధం ప్రారంభిస్తూ కౌరవుల పక్షంలో ముందుకు దూసుకు వచ్చింది దుశ్శాసనుడు. పాండవుల పక్షంలో భీముడు. దుశ్శాసనుడికి బాసటగా నిలిచింది ధృతరాష్ట్రుడి యువకుమారులు. భీముడికి అండగా చేరింది పాండవ యువ కుమారులు. అనగా యుద్ధానికి ముందున్నది ఉభయ పక్షాలలో యువకులే.

**క. ఱిచ్చవడి యుభయబలములు । నచ్చెరువుగఁ జిత్రరూపు లట్లుండ శర**
**ప్రోచ్చలితచండదీప్తి స । ముచ్చయములు పెలుచఁ బరఁగె ముసుఁగువడంగాన్. 240**

**ప్రతిపదార్థం:** ఉభయ, బలములున్= రెండు సేనలూ; ఱిచ్చవడి= మ్రాన్పడి - కొయ్యబారిపోయి; అచ్చెరువుగన్= ఆశ్చర్యకరముగా; చిత్రరూపులు+అట్లు+ఉండన్= చిత్రపటంలోని బొమ్మల వలె (కదలక, మెదలక) ఉండగా; శర, ప్ర+ఉచ్చలిత, చండ, దీప్తి, సముచ్చయములు= బాణాలచేత ప్రజ్వలింపచేయబడిన గొప్ప కాంతుల సముదాయం; ముసుఁగు+పడంగాన్= విస్తరించేటట్లుగా; పెలుచన్+పరఁగెన్= ఎక్కువగా వర్ధిల్లాయి.

**తాత్పర్యం:** పాండవ కుమారులూ, కౌరవ కుమారులూ ఆ రీతిగా ఒకరిపై నొకరు బాణాల వర్షం కురిపించగా, ఉభయ పక్షాలలోని సేనలూ రిచ్చవడి ఆశ్చర్యకరంగా చిత్రలేఖనంలోని బొమ్మలవలె కన్పించారు. కురు కుమారులు, పాండు కుమారులు ప్రయోగించిన బాణాల సముదాయముల వెలుగు వెల్లువ విస్తరించింది.

**క. పదపడి దుర్యోధనుఁ డు । న్మదుఁడై తఱుమంగ ధర్మనందనుఁడు జయా**
**స్పదముగఁ బురికొల్పఁగ బె । ట్టిదముగ నొండొంటిఁ దలపడియె సైన్యంబుల్. 241**

**ప్రతిపదార్థం:** పదపడి= పిమ్మట; దుర్యోధనుఁడు= సుయోధనుడు; ఉత్+మదుఁడు+ఐ= అతిశయించిన గర్వం కలవాడై; తఱుమంగన్= పురికొల్పగా; ధర్మనందనుఁడు= ధర్మరాజు; జయ+ఆస్పదముగన్= గెలుపు కలిగేటట్లుగా; పురికొల్పఁగన్= ప్రోత్సహించగా; సైన్యంబుల్= ఉభయ సేనలు; బెట్టిదముగన్= ఎక్కువగా; ఒండు ఒంటిన్= ఒక దానితో ఒకటి; తలపడియెన్= ఎదుర్కొన్నాయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు గర్వాతిశయంతో తన సేనలను ప్రోత్సహించాడు. గెలుపుమీద దృష్టిని కేంద్రీకరించి, ధర్మరాజు తన సేనలను పురికొల్పాడు. ఆ రెండు సేనలు అతిశయించిన పూనికతో ఒకదానిని మరొకటి మార్కొని విజృంభించాయి.

**సీ. కప్పారు రేణువు గమలాప్తబింబంబు । రాహుమండలమున రమణఁ గప్పఁ,**
**దెల్లని రజము శోభిల్లు సంగ్రామరం । గమునకుఁ దగు మేలుకట్టునట్లు,**
**ఖచరకాంతల యలకములందుఁ గెందూళి । యళులపై పుప్పొడి ననుకరించు,**
**నడరి పచ్చని పాంశు వమరు దిశాభిత్తి । తలములఁ గనకంపుఁ దగడు పగిదిఁ,**

**తే.** **బాండవానీకమును గురుబలము నొక్క। పెట్ట రథ గజ హయ భటాభీలచటుల**
**గతిఁ బరిక్షుణ్ణ సంగరక్షితితలముగ। వీఁక బెరసిన యత్తొలుతాఁకు నపుడు** **242**

**ప్రతిపదార్థం:** పాండవ+అనీకమును= పాండవుల సేనయును; కురు+బలమున్= కౌరవులసేనా; ఒక్కొ+పెట్టన్= ఒకేసారిగా; రథ+గజ+హయ+భట+ఆభీల+చటుల+గతిన్= రథాలు, ఏనుగులు, గుర్రాలతో, కాల్బలంతో భయంకరంగా కదలు పద్ధతిలో; పరిక్షుణ్ణ, సంగర, క్షితి, తలముగన్= ఎక్కువగా నలగగొట్టబడిన యుద్ధభూమి అగుచు; వీఁకన్= ఉత్సాహంతో; బెరసిన= వ్యాపించిన; ఆ+తొలు, తాకు+అపుడు= ఆ మొదటి తాకిడి ఏర్పడినప్పుడు; కప్పారు= నల్లనైనట్టి; రేణువు= దుమ్ము; కనుల+ఆప్త, బింబమ్ము= సూర్యగోళం; రాహు, మండలము+అనన్= రాహుగోళం అనునట్లుగా; రమణన్+కప్పున్= శోభిల్లి కప్పివేసింది; తెల్లని+రజము= తెల్లగా ఉన్న దుమ్ము; సంగ్రామ, రంగమునకున్= యుద్ధభూమికి; తగు= తగిన; మేలు కట్టు+అట్లు= ఉల్లెడ (వితానం)వలె; శోభిల్లున్= విలసిల్లింది; కెంపు, దూళి= ఎర్రని దుమ్ము; ఖచర, కాంతల+అలకములందున్= ఆకాశంలో సంచరించే వేలుపు స్త్రీల ముంగురులలో; అళులపై+పుప్పొడిన్= తుమ్మెదలపై; పుష్పపరాగాన్ని; అనుకరించున్= పోలుతుంది; పచ్చని, పాంశువు= పచ్చని రంగు దుమ్ము; అడరి= వ్యాపించి; దిశా, భిత్తి, తలములన్= దిక్కులు అనెడి గోడలపైభాగాలపై; కనకంపు, తగడు, పగిదిన్= బంగారు రేకు తొడుగు వలె; అమరున్= ఏర్పడుతుంది.

**తాత్పర్యం:** పాండవ కౌరవసేనలు ఒక్కసారిగా రథగజ హయభటావళి భయంకరంగా కదలగా భూమి నలగగొట్టబడేటట్లు విస్తరించిన ప్రతాపాలతో ఆతొలితాకు ఏర్పడినప్పుడు రకరకాల దుమ్ములు ఆకసానికి ఎగశాయి. నల్లని దుమ్ము కప్పటం చేత సూర్యబింబం రాహుమండలం కప్పినట్లుగా కన్పించింది. తెల్లని దుమ్ము యుద్ధభూమిపై వితానంవలె (మేలుకట్టుగా) భాసించింది. కెంపు వన్నె దుమ్ము, దేవతాస్త్రీల ముంగురులనే తుమ్మెదలపై పుప్పొడి వలె శోభిల్లింది. పచ్చని వన్నెగల దుమ్ము దిశాభిత్తికలమీది బంగారు రేకు తొడుగు వలె విలసిల్లింది.

**విశేషం:** 1. చతురంగబలములు: రథ+గజ+హయ+భట వర్గాలు. ప్రాచీన భారతదేశంలో సేన చతురంగబలముగ అభివర్ణితం.

2. కమలములకు ఆప్తుడు సూర్యుడు. ఇది కవి సమయం.

3. రాహు మండలం: అసలు లేనే లేదు. రాహువు ఒక బిందువు. ఈ బిందు సంచలనం క్రాంతి వలయంలో వక్రగతిని సంచరిస్తుంది. రాహు గ్రస్తమైనపుడు సూర్యునకు గ్రహణం ఏర్పడుతుంది. ఇట్లే కేతుగ్రస్తమైనపుడు చంద్రునకు. రాహు, కేతువులు గ్రహాలు కావు. రాహు మండలం నల్లగా ఉండటం కవి సమయం.

రాహు కేతువులను ఛాయాగ్రహాలుగా ప్రాచీనులే గుర్తించారు. అసలు రాహు, కేతు సంకేతాలను భారతీయులు ప్రాచీన కాలంలోనే గుర్తించటం విశేషం. ప్రాచీన భారతీయుల ఖగోళ పరిజ్ఞానానికి రాహుకేతు ప్రస్తారం ఒక నిదర్శనం. రాహుగ్రస్తమైనప్పుడు సూర్యబింబం నల్లగా మారటం - అనే వర్ణన ఖగోళ పరిజ్ఞానానికి నిదర్శనం. సూర్యగోళం గ్రహణంనాడు మాత్రమే నల్లనౌతుంది. మహాభారత యుద్ధం అమావాస్యనాడు ఆరంభించినదనీ ఆనాడు గ్రహణం పట్టిందనీ ఒక వాదం ఉన్నది.

**మ.** **కరిఘంటానిచయస్వనంబులుఁ దురంగస్ఫీతహేషా సము**
**త్కరనాదంబులు హేతిపంక్తిపటుసంఘట్టోత్థరావంబులున్**
**ధరణీభాగనభోంతరం బడరి యుద్యత్తూర్యనానాధ్వని**
**స్ఫురణం బేమియుఁ దోఁప నీవ మొనలన్ భూపాలచూడామణీ!** **243**

**ప్రతిపదార్థం:** భూపాల చూడామణీ!= రాజులలో శ్రేష్ఠుడవైనవాడా ధృతరాష్ట్ర మహారాజా!; కరి, ఘంటా, నిచయ, స్వనంబులున్= ఏనుగులకు కట్టిన గంటల సముదాయం వలన ఏర్పడిన ధ్వనులు; తురంగ, స్ఫీత, హేషా, సముత్కర, నాదంబులున్= గుర్రాల

నుండి వ్యాపించిన సకిలింతల వలన ఏర్పడిన సామూహిక ధ్వనులు; హేతి, పంక్తి, పటు, సంఘట్ట+ఉత్థ, రావంబులున్= కత్తుల వరుసల పలు రాపిడుల వలన పైకి లేచిన ధ్వనులూ; ధరణీ, భాగ, నభస్+ అంతరంబు= భూమి ఆకాశాల మధ్యభాగం; అడరి= వ్యాపించి; మొనలన్= సేనలలో; ఉద్యత్+తూర్య, నానా, ధ్వని, స్ఫుర+ణంబు= పైకి విస్తరించిన తూర్యములు మున్నగు వాటివలన ఏర్పడిన ధ్వనులు విస్తరించటం వలన; ఏమియున్+తోఁప నీవ= ఏమీ ఆలోచించటానికి వీలులేకుండా చేశాయి.

**తాత్పర్యం:** రాజోత్తమా! ఏనుగులకు కట్టిన గంటల సముదాయాలు మ్రోగుటవలన కల్గిన ధ్వనులూ, గుఱ్ఱాల గుంపుల సకిలింపుల వల్ల ఏర్పడిన ధ్వనులూ, కత్తుల రాపిడుల వల్ల పై కెగసిన ధ్వనులూ భూనభోంతరాళాలలో వ్యాపించి సైన్యంలోని తూర్యాది యుద్ధవాద్యాల మ్రోతలు ఏమీ వినిపించనీయవు.

**వ. తదనంతరంబ.** **244**

**తాత్పర్యం:** అటు పిమ్మట.

**క. కరికరశీకర తురగో । త్కరలాలాజాల రక్తధారాపటలీ**
**పరిషిక్తంబై సంగర । ధరణీ రజ మడఁగె నద్భుతం బలరారన్.** **245**

**ప్రతిపదార్థం:** కరి, కర, శీకర, తురగ+ఉత్కర, లాలా, జాల, రక్త, ధారా, పటలీ, పరిషిక్తంబు+ఐ= ఏనుగుల తుండాల నుండి జారిన నీటి తుంపురలచే, గుఱ్ఱాల గుంపుల నోళ్ళ నుండి వెలువడే జొల్లు మొత్తం వలన, రక్తధారల సముదాయాల వలన తడుపబడినట్టిదై; అద్భుతంబు+అలరారన్= ఆశ్చర్యం శోభిల్లునట్లుగా; సంగర, ధరణీ, రజము= యుద్ధభూమిలోని దుమ్ము; అడఁగెన్= తగ్గిపోయింది.

**తాత్పర్యం:** రెండు సేనలు మొట్టమొదట ఢీకొనినప్పుడు 'దుమ్ము'' చెలరేగి భూమ్యాకాశాలను చుట్టుముట్టింది. అంతకంటె ఆశ్చర్యకరమైన అంశం, ఏనుగుల తుండాల నుండి కమ్మిన నీటి తుంపురుల వలన; గుఱ్ఱాల నోటినుండి కారిన చొంగవలన, యుద్ధభూమిపై పడిన నెత్తుటి ధారల వలన ఆ దుమ్ము అణగిపోయింది.

**విశేషం:** 1. నలిగిన యుద్ధభూమి నుండి చెలరేగిన దుమ్ము భూమ్యాకాశాలను క్రమ్మటం ఆశ్చర్యం కాదు.

2. ఆకాశం వరకు ఎగసిన దుమ్ము అణగిపోవటమే ఆశ్చర్యం. దానికి కారణం ఏనుగుల తుండాల నుండి వెలువడిన నీటి తుంపురులు, గుఱ్ఱాల చొంగ, కారిన నెత్తురు. ఎన్ని ఏనుగులు!! ఎన్ని గుఱ్ఱాలు!! ఎంతమంది భటులు!!?

**క. కురుపాండవసైన్యంబుల । దొర లడియాలముల నొప్పుతో మెఱయు సము**
**ద్ధురవీరధ్వజములఁ బొలి । చిరి శౌర్యస్ఫూర్తి మూర్తి సేకొన్నక్రియన్.** **246**

**ప్రతిపదార్థం:** కురు, పాండవ, సైన్యంబుల, దొరలు= కౌరవుల సేనలోని రాజులు పాండవుల సేనలోని రాజులు; అడియాలముల+ఒప్పుతోన్= రాజలాంఛనాల శోభతో; మెఱయు= ప్రకాశించే; సముద్ధర, వీర, ధ్వజములన్= మిక్కుటంగా ప్రజ్వరిల్లే - శౌర్య సూచనలైన జెండాలతో; శౌర్య+స్ఫూర్తి= పరాక్రమ ప్రాభవం; మూర్తి, చేకొన్న, క్రియన్= ఆకారం ధరించినట్లుగా; పొలిచిరి= శోభిల్లారు.

**తాత్పర్యం:** కౌరవ సేనలోని రాజులు, పాండవ సేనలోని రాజులు రాజచిహ్నాలతో భాసించే జెండాలతో, శౌర్యం మూర్తీభవించినట్లు విలసిల్లారు.

**విశేషం:** 1. అలం: ఉత్ప్రేక్ష. 'అడియాలములు' - తిక్కన నాటి సమాజంలో సుప్రసిద్ధమైన పదం. కేతన- తన దశకుమార చరిత్రలో తిక్కన గూర్చి వ్రాసిన పద్యం.

**"అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు**
**చామరములు జమిలి శంఖములును**
**గంబకట్లు భూమి కానిక గాఁగ - పెం**
**పెసఁగు రాచపదవులెల్లఁ బడసె."**

నేడుగూడ సేనలోని దండనాథుల ఆహార్యంలో అడియాలాలు - వర్మప్రకర్ష కనిపిస్తాయి. భారతయుద్ధపు అడియాలాలు - వర్మప్రకర్ష కనిపిస్తాయి. భారత యుద్ధ కాలంలో ఆ చిహ్నాలు ఆయా వీరుల పతాకాలపై ప్రదర్శించేవారు అని తిక్కన వర్ణన.

**వ. అట్టియెడ. 247**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. మీతండ్రి భవత్సుతులకుఁ । జేతోముద మొదవఁ గడఁగి సేన మిగిలి ప్ర**
**ద్యోతనుఁడు నభోమధ్య । స్ఫీతుం డైనట్లు వెలిఁగె భీషణమూర్తిన్. 248**

**ప్రతిపదార్థం:** మీతండ్రి= భీష్ముడు; భవత్+సుతులకున్= నీ కొడుకులకు; చేతస్+ముదము+ఒదవన్= మనస్సునకు ఆనందం కలిగేటట్లుగా; కడఁగి= పూని; సేనన్+మిగిలి= సైన్యంలో అధికుడై; ప్రద్యోతనుఁడు= సూర్యుడు; నభస్, మధ్య, స్ఫీతుండు+ఐన+అట్లు= ఆకాశమధ్యంలో ప్రకాశించేవాడై ఉన్నట్లుగా; భీషణమూర్తిన్= భయంకరమైన ఆకారంతో; వెలిఁగెన్= వెలుగొందాడు.

**తాత్పర్యం:** మీ తండ్రి నీకుమారులకు ఆనందం కలుగగా పూని సైన్యంలో అధికుడై ఆకాశమధ్యంలో ప్రకాశించే సూర్యుడివలె భయంకరమైన ఆకారంతో వెలుగొందాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు మెఱసిన. 249**

**తాత్పర్యం:** ఈ రీతిగా ప్రకాశించగా.

**ఉ. అర్జునుఁ డప్డు భీష్ముఁ గని యగ్గలికన్ గుణరావ సంగమ**
**స్ఫూర్జిత దేవదత్తరవశోభితుఁ డై రణకేళి కౌతుకా**
**వర్జితచిత్తవృత్తి ననివార్యపరాక్రమలీలఁ దాఁక న**
**త్యూర్జితరౌద్ర మయ్యె బహుళోగ్రమహాస్త్ర గతాగతంబులన్. 250**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు= అర్జునుడు; భీష్మన్+కని= భీష్ముని చూచి; అగ్గలికన్= అతిశయంతో; గుణ, రావ, సంగమ, స్ఫూర్జిత, దేవదత్త, రవ, శోభితుడు+ఐ= అల్లెత్రాటి మ్రోతతో కలిసి వ్యాపించే దేవదత్తం అనే పేరుగల శంఖనాదంతో విలసిల్లేవాడై; రణ, కేళి, కౌతుక, ఆవర్జిత, చిత్త, వృత్తిన్= పోరాటం అనే ఆటయందుగల వేడుక విస్తరించిన మనస్సుయొక్క ప్రసారంతో; అనివార్య, పరాక్రమ, లీలన్= వారించటానికి వీలులేని శౌర్యంతో భాసించే క్రీడతో; తాఁకన్= మార్కొనగా; బహుళ+ఉగ్ర, మహా+అస్త్ర, గత+ఆగతంబులన్= పెక్కు భయంకరములైన గొప్ప అస్త్రముల రాక పోకలతో; అత్యూర్జిత+రౌద్రము+అయ్యెన్= మిక్కిలి భయంకరమైన పోరాటం జరిగింది.

**తాత్పర్యం:** ఆ సమయంలో అర్జునుడికి భీష్ముడికి మధ్య భీకరమైన పోరాటం జరిగింది. అర్జునుడు గాండీవ ధనుస్సు యొక్క అల్లెత్రాటిని మ్రోగించాడు. తన శంఖం దేవదత్తం పూరించాడు. ఆ రెండు ధ్వనులు కలిసి దిక్కులు పిక్కటిల్లచేశాయి. అర్జునుడు యుద్ధక్రీడయందు వేడ్కకలవాడై, అడ్డులేని పరాక్రమంతో భీష్ముడిని తాకాడు. వారి ఇద్దరి మధ్య రౌద్రరసం తాండవించింది.

**విశేషం:** రౌద్రరసమునకు స్థాయి భావం కోపం. భీష్ముడు అర్జునుడు ఆగ్రహావేశంతో యుద్ధం చేశారు.

**తే.** **తటిమి సాత్యకి గృతవర్మఁ దాఁక నతఁడు । నేచి మార్కొన నిరుమేను పూచి యొప్పు**
**మిగులు మోదుగు మ్రాఁకుల పగిది గాఁగ । నడరె మార్కొన్న రెండువా లంపగములు.** **251**

**ప్రతిపదార్థం:** తటిమి= ఉత్సాహంతో తలపడి; సాత్యకి= సాత్యకి; కృతవర్మన్= కృతవర్మను; తాఁకన్= ఎదిరింపగా; అతఁడున్= ఆ కృతవర్మ; ఏచి= అతిశయించి; మార్కొనన్= ఎదిరించి యుద్ధం చేయగా; ఇరు+మేను= రెండు శరీరాలు; పూచి= పుష్పించి; ఒప్పుమిగులు= మిక్కుటంగా శోభిల్లే; మోదుగు మ్రాఁకుల, పగిదిన్+కాఁగన్= మోదుగుచెట్లు మాదిరిగా తోచగా; మార్కొన్న రెండు+వాలు+అంపగములు= ఎదురుకొనిన రెండు విధములైన వాడి బాణాల గుంపులు (అనగా ఉభయులూ ఒకరిపై ఒకరు ప్రయోగించిన బాణాల మార్పిడి ఇటువి అటు, అటువి ఇటు చేరి) అడరెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** ఉత్సాహం పొంగి పొరల సాత్యకి, కృతవర్మతో యుద్ధం చేయటానికి తలపడ్డాడు. కృతవర్మగూడ సాత్యకిని ఎదిరించి యుద్ధం చేశాడు. ఇరువురూ ఒకరిపై ఒకరు బాణాలు ప్రయోగించుకొన్నారు. ఆ బాణాలు ఇరువురి శరీరాలను గాయపరచాయి. ఇద్దరి శరీరాల నుండి నెత్తురు కారజొచ్చింది. ఆశరీరాలు పూచిన మోదుగు చెట్లవలె శోభిల్లాయి.

**విశేషం:** అలం: ఉపమ. మోదుగు చెట్టు పువ్వులు ఎఱ్ఱగా ఉంటాయి. అంతేకాదు. మోదుగు చెట్టు పుష్పించినప్పుడు- ఆకులు మిక్కిలి తక్కువ పువ్వులు ఎక్కువగా కన్పిస్తాయి. చెట్టునిండా పువ్వులే. అట్లే సాత్యకి కృతవర్మల శరీరాల నిండా నెత్తురు కన్పించింది.

**చ.** **మదమునఁ గోసలేంద్రు నభిమన్యుఁడు దాఁకిన నా బృహద్బలుం**
**డెదిరి కడంగి సూతుఁ బడ నేసి హయంబులఁ జంపఁ జూడ్కిఁ గెం**
**పొదవఁగఁ బార్థసూనుఁడు మహోగ్రత నట్టుల చేసి, కేతనం**
**బు దునిమి విల్లుఁ ద్రుంచి శరపూరితగాత్రునిఁ జేసె నాతనిన్.** **252**

**ప్రతిపదార్థం:** అభిమన్యుఁడు= అర్జునుడి కొడుకు- యువవీరుడు; మదమునన్= గర్వంతో; కోసల+ఇంద్రున్= కోసల దేశరాజును; తాఁకినన్= తలపడగా; ఆ+బృహద్బలుఁడు= బృహద్బలుడు అనే ఆ కోసల రాజు; ఎదిరి+కడంగి= ఎదిరించి పూని; సూతున్= సారథిని; పడన్+ఏసి= చంపి; హయంబులన్= గుర్రాలను; చంపన్= వధింపగా; చూడ్కిన్= చూపునందు; కెంపు+ఒదవఁగన్= ఎర్రతనం భాసించగా (అనగా కోపించి); పార్థసూనుఁడు= అర్జునుడి కొడుకు అభిమన్యుడు; మహా+ఉగ్రతన్= మిక్కిలి భీకరంగా; అట్టుల+చేసి= ఆ విధంగానే చేసి (సారథిని గుర్రాలను చంపి); కేతనంబు+తునిమి= జెండాను ముక్కలు చేసి; విల్లున్+త్రుంచి= ధనుస్సును ముక్కలు చేసి; ఆతనిన్= ఆ బృహద్బలుడిని; శర, పూరిత, గాత్రున్= బాణాలతో నిండిన శరీరం కలవాడిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు గర్వంతో కోసలరాజైన బృహద్బలుడిని మార్కొన్నాడు. ఆ బృహద్బలుడు కోపించి, అభిమన్యుడి రథసారథిని చంపి అశ్వాలను సంహరించాడు. అంతట అర్జునుడి కొడుకు అభిమన్యుడు ఆ విధంగానే

ఆ బృహద్బలుడి రథసారథిని అశ్వాలను చంపటమే కాకుండా ఆతడి ధనుస్సును ముక్కలు చేసి, అతడి శరీరాన్ని బాణాలతో నింపాడు.

**తే. భీమసేనునిపై మనభీష్ముఁ డలుక । నడరె నక్కురుముఖ్యుల యస్త్రశస్త్ర**
**కౌశలంబులు సూడ నక్కజము లైన । నచ్చెరువు నొంది సేనలు పిచ్చలింప. 253**

**ప్రతిపదార్థం:** భీమసేనునిపైన్= భీముడిమీద; మన భీష్ముఁడు= (మన కౌరవసేనాపతియైన భీష్ముడు); అలుకన్= కోపంతో; అడరెన్= విజృంభించాడు; ఆ+కురు+ముఖ్యుల= కురువంశంలో గొప్పవారైన ఆ ఇరువురి యొక్క అనగా భీమ భీష్ముల యొక్క; అస్త్ర+శస్త్ర+కౌశలంబులు, చూడన్= బాణాలు, మంత్ర పూర్వకములైన బాణాల ప్రయోగంలోని నేర్పులు అరయగా; అక్కజములు+ఐనన్= ఆశ్చర్యకరములుకాగా; అచ్చెరువున్+ఒంది= ఆశ్చర్యం చెంది; సేనలు= పాండవుల సేన మరియు కౌరవుల సేన; పిచ్చలింపన్= భయపడగా.

**తాత్పర్యం:** భీమసేనుడిపై భీష్ముడు కోపంతో విజృంభించాడు. కురుముఖ్యులిద్దరి (భీమభీష్ముల) అస్త్రశస్త్ర ప్రయోగనైపుణ్యాలు అచ్చెరువు గొల్పగా ఇటు కౌరవ సేన, అటు పాండవసేన ఆశ్చర్య చకితాలు అయ్యాయి.

**విశేషం:** 1. భీష్ముడు ఆరితేరిన ధానుష్కుడు. అతడికి భీముడు ఎంత? విలువిద్యలో. ఇచ్చట భీముడు గద పట్టక ధనుస్సు పూని భీష్ముడితో యుద్ధం చేయటం ఒక విశేషం. అంతేకాక, భీష్ముడితో సమయుద్ధం చేయగల్గటం వింత.

2. కౌరవులు కురువంశీయులే. పాండవులు గూడ కురువంశీయులే గదా. అయితే దుర్యోధనాదులు రూఢ్యర్థంలో కౌరవులు. ఈ పద్యంలో భీష్ముడు- భీముడు గూడ 'కురుముఖ్యులు'గా అభివర్ణింపబడ్డారు. ఇది గమనించదగిన అంశం.

**సీ. వీఁకమై నకులునిఁ దాఁకి దుశ్శాసనుఁ । డత్యుగ్రబాణచయమునఁ బొదివె,**
**నక్కుమారుఁడు దరహాసాభిరాముఁ డై । భల్ల మొక్కటి దొడ్గి విల్లు దునిమి**
**యేడ్తెఱ నిరువదియేనుదూపులు వడి । నడరింప రయమున నతఁడు నొండు**
**విల్లెత్తికొని శరవితతి నంతంతన । నఱకి పాండవుకేతనంబు ద్రుంచె;**

**తే. దుర్ముఖుఁడు సహదేవునితోడఁ దొడరి । మెఱుఁగు వాలమ్ము లేసిన నుఱక యాతఁ**
**డన్నియును మగిడించి రథ్యముల నొంచి, । యతని సారథిఁ దెగటార్చి యార్చి పేర్చె. 254**

**ప్రతిపదార్థం:** దుశ్శాసనుఁడు= దుర్యోధనుడి పెద తమ్ముడు; వీఁకమైన్= ఉత్సాహంతో; నకులునిన్+తాఁకి= నకులుడిని యుద్ధంలో మార్కొని; అతి+ఉగ్ర+బాణ+చయమునన్= మిక్కిలి భయంకరమైన అమ్ముల సముదాయంతో; పొదివెన్= కప్పాడు; ఆ+కుమారుడు= ఆ (పాండు కుమారుడు) నకులుడు; దరహాస+అభిరాముఁడై= చిరునవ్వుచే అందం చిందినవాడై; భల్లము= బాణం; ఒక్కటి= ఒకటి; తొడిగి= సంధించి; విల్లున్+తునిమి= ధనువును ఖండించి; ఏడ్తెఱన్= విజృంభించి; ఇరువది+ఏను+తూపులు= ఇరవై అయిదు బాణాలు; వడిన్= వేగంగా; అడరింపన్= ప్రయోగించగా; రయమునన్= వేగంగా; అతఁడు= అతడు (దుశ్శాసనుడు); ఒండు+విల్లు+ఎత్తికొని= ఇంకో ధనువు పుచ్చుకొని; శర వితతిన్= బాణాల సముదాయాన్ని; అంతంతన= క్రమక్రమంగా; నఱకి= ఖండించి; పాండవు+కేతనంబు= పాండవుని జెండాను (నకులుడి పతాకాన్ని); త్రుంచెన్= ఖండించాడు; దుర్ముఖుఁడు= దుర్ముఖుడు (దుర్యోధనుడి తమ్ములలో ఒకడు); సహదేవునితోడన్= సహదేవుడితో; తొడరి= పూని; మెఱుఁగు+వాలు+అమ్ములు+ఏసినన్= వెలుగొందే కఠినమైన బాణాలను ప్రయోగింపగా; ఆతఁడు= అతడు (సహదేవుడు); ఉఱక= లక్ష్యపెట్టక; అన్నియును= అన్ని బాణాలు; మగిడించి= తిరుగగొట్టి; రథ్యములన్+నొంచి= గుర్రాలను నొప్పించి, నొవ్వజేసి; అతని+సారథిన్= దుర్ముఖుడి రథం తోలేవాడిని; తెగటార్చి= చంపి; ఆర్చి= సింహనాదం చేసి; పేర్చెన్= అతిశయించాడు.

**తాత్పర్యం:** ఈ పద్యంలో దుర్ముఖుడికీ సహదేవుడికీ మధ్య జరిగిన యుద్ధం వర్ణించబడింది. ఉత్సాహంతో దుశ్శాసనుడు నకులుడితో తలపడ్డాడు. అతడిపై మిక్కిలి భయంకరాలైన వాడి బాణాలు ప్రయోగించాడు. నకులుడు చిరునవ్వుతో ఆ బాణాలను అన్నిటినీ ఖండించి వేసి దుశ్శాసనుడి ధనుస్సును ఒక్క బాణంతోనే ఖండించాడు. ఇరువది అయిదు బాణాలు ఆ రకంగా ప్రయోగించాడు. దుశ్శాసనుడు వేగంగా ఇంకో విల్లు ధరించి, నకులుడి బాణాలు నరికి, అతడి జెండాను కూలద్రోశాడు. దుర్ముఖుడు సహదేవుడితో యుద్ధానికి మార్కొన్నాడు. ప్రకాశమానమైన వాడి బాణం ప్రయోగించాడు. సహదేవుడు దుర్ముఖుడి బాణాలు అన్నీ తుత్తునియలు చేసి, అతడి రథం గుర్రాలను నొప్పించి, సారథిని గూల్చి సింహనాదం చేసి విజృంభించాడు.

**విశేషం:** 1. దరహాసాభిరాముడయ్యాడట నకులుడు - దుశ్శాసనుడు తనపై బాణాలు ప్రయోగించినపుడు. ఆ నవ్వులో ఎంతో అంతరార్థం ఇమిడివుంది. నకులుడి దృష్టిలో దుశ్శాసనుడు తనకు సరియైన ఉజ్జీకాడు. అంతేకాక యుద్ధభూమిలో, దారుణ సంగ్రామం మధ్య చిరునవ్వు చిందించగల వీరులను చిత్రించాడు తిక్కన. తరువాతి పద్యంలో కూడ ధర్మరాజు శల్యుడితో యుద్ధం చేసేటప్పుడు తన విల్లును శల్యుడు ఖండించినపుడు 'కన్నుల నవ్వు' వెలయించాడట. పెదవుల మీది నవ్వు వేరు. కన్నుల నవ్వు వేరు. నకులుడిది పెదవుల మీది నవ్వు. ధర్మరాజు అంతకంటె ప్రగల్భుడు. అతని నవ్వు కన్నులలో మెరిసింది.

**చ.** **సరభసుఁ డై యుధిష్ఠిరుఁడు శల్యునిఁ దాఁకుడు నాతఁ డమ్మహీ**
**శ్వరు మహనీయచాప మనివారణఁ ద్రుంచిన, నొండు విల్లు భీ**
**కరతరశీఘ్రలీలఁ గొని కన్నుల నవ్వుచుఁ బాండవాగ్రజుం**
**డరిబల ముక్కు దక్క వడి నాతనిపైఁ గురిసెన్ శితాస్త్రముల్.** **255**

**ప్రతిపదార్థం:** ఈ పద్యంలో- ధర్మరాజ శల్యుల మధ్య జరిగిన యుద్ధం వర్ణించబడింది. స+రభసుఁడు+ఐ= వేగిరపాటుతో కూడిన వాడై; యుధిష్ఠిరుఁడు= ధర్మరాజు; శల్యునిన్+తాఁకుడున్= శల్యుడిని మార్కొనగా; ఆతఁడు= ఆ శల్యుడు; ఆ+మహీ+ఈశ్వరు, మహనీయచాపము= రాజు (ధర్మరాజుయొక్క) గొప్పవిల్లు; అనివారణన్= అడ్డగించటానికి వీలులేకుండగా; త్రుంచినన్= ఖండించగా; ఒండు+విల్లు= ఇంకో ధనుస్సు; భీకర, తర, శీఘ్ర, లీలన్= మిక్కిలి భయంకరమైన వేగంతో; కొని= పరిగ్రహించి; కన్నులన్, నవ్వుచున్= కన్నులతో నవ్వుతూ; పాండవ+అగ్రజుండు= పాండవుల అన్నగారు- ధర్మరాజు; అరి+బలము= శత్రుసేన; ఉక్కు+తక్కన్= బలమును కోలుపోయేటట్లుగా; వడిన్= శీఘ్రంగా; శిత+అస్త్రముల్= వాడి అయిన బాణాలు; ఆతనిపైన్= శల్యుడిపై; కురిసెన్= వర్షించాడు.

**తాత్పర్యం:** ఉత్సాహవేగంతో ధర్మరాజు శల్యుడిని మార్కొన్నాడు. శల్యుడు నకుల సహదేవులకు సాక్షాత్తు మేనమామ. బహుముఖప్రజ్ఞా ధురీణుడు అయిన వీరుడుగా సుప్రసిద్ధుడు. అతడు- ధర్మరాజు విల్లును ఖండించాడు. ధర్మరాజు కన్నులలో చిరునవ్వు మెరిసింది. మరొక విల్లు చేబూని ధర్మరాజు శల్యుడిపై వాడి బాణాలు వర్షించాడు.

**విశేషం:** 1. ధర్మరాజు ధైర్యంగా శల్యుడిపైకి విజృంభించగలడు. అంత ధైర్యంగా శల్యుడు ధర్మరాజు మీదికి విజృంభించలేడు. శల్యుడు స్వీయాంతరాత్మ పీడితుడు. అతడు దుర్యోధనుడి పక్షంలో చేరటం, తెలిసి చేసిన తప్పు. ఆతడనేక యుద్ధాలలో ఆరి తేరిన వృద్ధవీరుడు. శల్యుడు తన తల నరుక లేడని ధర్మరాజుకు తెలుసు. అది అతడి కన్నుల నవ్వులోని ఆంతర్యం. తిక్కన - నవ్వుల గూర్చి 254 పద్య వ్యాఖ్యానం చూడవచ్చు.

సీ. ఏచి ధృష్టద్యుమ్నుఁ డేడ్తెఱ ద్రోణుపై । నడరిన నవలీల నాతఁ డతని
ఘనశరాసనముఁ ద్రిఖండంబుగాఁ జేసి । నారాచ మొక్కటి నాటె మేన;
వేఱొక్క విల్లెత్తి వెసఁ బదునాలుగు । శాతబాణములఁ బాంచాలసుతుఁడు
గలశజు నేసె; మాగధసహదేవుండు । భూరిశ్రవునిఁ దాఁకి భుజశిఖరము
తే. మెఱుఁగుటమ్ముల నొంచిన నుఱక యతఁడు । వానియురు ముగ్రశరమున వ్రయ్యఁజేయ,
వార లిరువురు వృత్రుండు వాసవుండుఁ । బోలెఁ బోరిరి సేనలు వొగడుచుండ. 256

**ప్రతిపదార్థం:** ఏచి= విజృంభించి; ధృష్టద్యుమ్నుఁడు= ధృష్టద్యుమ్నుడు (పాండవసేనాని ద్రుపద మహారాజు కొడుకు); ఏడ్తెఱన్= పరాక్రమంతో; ద్రోణుపైన్= ద్రోణాచార్యుడిపై; అడరినన్= చెలరేగి మార్కొనగా; అవలీలన్= సులువుగా; ఆతఁడు= ద్రోణుడు; అతని= ఆ ధృష్టద్యుమ్నుడి యొక్క; ఘన, శర+అసనమున్= గొప్ప వింటిని; త్రి+ఖండంబుగాన్+చేసి= మూడు ముక్కలు చేసి; నారాచము+ఒక్కటి= ఒక బాణాన్ని; మేనన్= శరీరంలో (ధృష్టద్యుమ్నుని శరీరంలో); నాటెన్= గ్రుచ్చుకొనునట్లు ప్రయోగించాడు; పాంచాల+సుతుఁడు= పాంచాల దేశరాజుకొడుకు- ధృష్టద్యుమ్నుడు; వేఱు+ఒక్క+విల్లు+ఎత్తి= ఇంకో ధనుస్సు సమకూర్చుకొని; వెసన్= శీఘ్రంగా; పదు నాలుగు, శాత, బాణములన్= పద్నాలుగు వాడి అమ్ములతో; కలశజున్= ద్రోణుడిని; ఏసెన్= కొట్టాడు; మాగధ సహదేవుండు= మగధ దేశాధిపతి అయిన సహదేవుఁడు; భూరిశ్రవునిన్+తాఁకి= భూరిశ్రవునితో తలపడి; భుజ శిఖరమున్= అతని మూపును; మెఱుఁగు+అమ్ములన్= ప్రకాశించే బాణాలతో; నొంచినన్= నొప్పిచేయగా; ఉఱక+అతఁడు= లక్ష్యపెట్టక; అతఁడు(భూరిశ్రవుడు); వాని+ఉరము= అతని (మగధ సహదేవుడి) వక్షఃస్థలం; ఉగ్ర+శరమునన్= భీకరమైన బాణంతో; వ్రయ్యన్+చేయన్= పగులగొట్టగా; వారలు+ఇరువురున్= మాగధ సహదేవుడూ భూరిశ్రవుడూ; వృత్రుండు+వాసవుండున్+పోలెన్= వృత్రుడు అనే రాక్షసుడు మరియు దేవేంద్రుడు వలె; సేనలు+పొగడుచుండన్= పాండవ కౌరవ సైన్యాలు ప్రశంసిస్తూ ఉండగా; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** పాండవ సేనాపతి అయిన ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని తాకాడు ఉత్సాహంతో. ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి ధనుస్సును మూడు ముక్కలు చేశాడు. అంతేకాక అతడి శరీరంలో గ్రుచ్చుకొనేటట్లుగా బాణం వేశాడు. పాంచాల రాజు ద్రుపదుడి కొడుకు ధృష్టద్యుమ్నుడు ఇంకొక ధనుస్సు ఎత్తి పద్నాలుగు వాడి బాణాలు ద్రోణుడిపై ప్రయోగించాడు. మగధ దేశాధిపతి అయిన సహదేవుడు, భూరిశ్రవుడిని తాకి అతడి మూపును ఛేదించాడు. భూరిశ్రవుడు సహదేవుడి వక్షఃస్థలం ఛేదించేటట్లుగా బాణాలు వేశాడు. వారు ఇద్దరూ అలనాడు వృత్రుడు దేవేంద్రుడు పోరాడినట్లుగా యుద్ధం చేశారు. ఇరుపక్షాలలోని సైనికులు ఆ ద్వంద్వయుద్ధం చూచి ప్రశంసించారు.

**విశేషం:** 1. కలశజుఁడు= కలశంలో పుట్టినవాడు= ద్రోణుడు- మహాభారతంలోని వర్ణనలు కొన్నిటిని నవీనవిజ్ఞానశాస్త్రం ఋజువు పరిచింది. ఇరవయ్యో శతాబ్దంలో టెస్ట్‌ట్యూబ్ సంతానం గూర్చి ప్రయోగాలు జరుగుతున్నాయి. ఫలించాయి కూడా. ద్రోణుడు అయోనిజుడు. ఈ విషయం భావిశాస్త్ర పరిశోధనల వలన ఇంకా తేలవలసి ఉన్నది.

2. పౌరాణిక కాలంలో సుప్రసిద్ధమైన యుద్ధం ఇంద్రుడికీ వృత్రునకు మధ్య జరిగిన ఘోర సంగ్రామం. ఉభయులూ వీరాధివీరులే. మాగధ సహదేవుడు, భూరిశ్రవుడు వీరాధివీరులే.

తే. ధృష్టకేతుండు కౌరవోత్కృష్టుఁ డైన । బాహ్లికుని మాఱుకొని తీవ్రబాణనవక
మేసె; నాతండు లాఘవ మెసక మెసఁగ । ఘనశరంబులు పదినవకములు గురిసె. 257

**ప్రతిపదార్థం:** కౌరవ+ఉత్కృష్టుఁడు+ఐన= కౌరవులలో గొప్పవాడైన బాహ్లికుని; ధృష్టకేతుండు= ధృష్టకేతుడు; మాఱుకొని= తలపడి; తీవ్ర, బాణ, నవకము+ఏసెన్= వాడి బాణాలు తొమ్మిది ప్రయోగించాడు; ఆతండు= బాహ్లికుడు; లాఘవము+ఎసకము+ఎసఁగన్= సౌలభ్యం శోభిల్లగా; ఘన+శరంబులు= గొప్ప బాణాలు; పది+నవకములు= తొంబై; కురిసెన్= వర్షించాడు.

**తాత్పర్యం:** ధృష్టకేతుడు కౌరవులలో వృద్ధుడూ వీరుడూ అయిన బాహ్లికుడిపై తలపడ్డాడు. తలపడి వాడి అయిన తొమ్మిది బాణాల వరుస బాహ్లికుడిపై ప్రయోగించాడు. బాహ్లికుడు ధృష్టకేతుడిపై తొంభై బాణాలు ప్రయోగించాడు.

**విశేషం:** 1. మహాభారత యుద్ధంలో పాల్గొనిన వృద్ధవీరులలో పేర్కొనదగినవాడు బాహ్లికుడు. అతడు శంతనుడి (భీష్ముడి తండ్రికి) తమ్ముడు. అతడితోపాటు భారత యుద్ధంలో అతని కొడుకు సోమదత్తుడు, మనుమడు భూరిశ్రవుడు గూడ పాల్గొన్నారు.

2. ధృష్టకేతుడు శిశుపాలుడి కొడుకు.

**క.** **అచలనిభుఁ డగు నలంబసుఁ । బ్రచలితభూభాగుఁ డగుచుఁ బఱతెంచి ఘటో**
**త్కచుఁడు దలపడిన నా రజ । నిచరేంద్రుల పోరు కీర్తనీయం బయ్యెన్.** **258**

**ప్రతిపదార్థం:** అచలనిభుఁడు+అగు= కొండతో సమానుడైన; అలంబసున్= అలంబసుడు అనే పేరుగల వాడిని; ఘటోత్కచుఁడు= ఘటోత్కచుడు; ప్రచలిత, భూభాగుఁడు+అగుచున్= కంపించిన భూభాగం కలవాడౌతూ (నడుస్తుంటే భూమి కంపించేటట్లుగా దాడి చేసిన వాడౌతూ అని భావం) పఱతెంచి= వచ్చి; తలపడినన్= మార్కొనగా; ఆ+రజనిచర+ఇంద్రుల+పోరు= ఆ రాక్షసుల మధ్య జరిగిన యుద్ధం; కీర్తనీయంబు+అయ్యెన్= పొగడదగినది అయింది.

**తాత్పర్యం:** కొండలాంటి అలంబసుణ్ణి భూమి కంపించేటట్లు ఘటోత్కచుడువచ్చి మార్కొనగా ఆ రాక్షసుల పోరు ప్రశంసనీయ మయింది.

**విశేషం:** 1. తిక్కన యుద్ధాన్ని ఒక పరాక్రమ యజ్ఞంగా భావించాడు. ఒక్క చోట కూడా దానిని మారణహోమంగా నరమేధంగా భావించి నిరసించలేదు. యుద్ధభూమి 'రమణీయ' భయానకమని అభివర్ణించాడు తిక్కన. ఇచ్చట రాక్షసవీరుల మధ్య యుద్ధం కీర్తనీయం అని తిక్కన అభివర్ణన.

**సీ.** **గర్వంబు మెఱయ శిఖండి యశ్వత్థామ । నెదిరిన, నాతండు మద మెలర్ప**
**నారాచ మురమున నాటింప, నొచ్చియు । ద్రుపదనందనుఁ డతిక్రూరశరముఁ**
**దద్వక్షమునఁ గీలితము సేసె; భగదత్తుఁ । డుఱక విరాటుపై నురవడించి**
**కదిసిన గగనంబు గప్పె బాణాసార । యుగమును బెరసి మహోగ్రభంగిఁ**

**తే.** **గైకయాధీశుఁ డగు బృహత్ క్షత్రవిభుఁడు । గృపుఁడు దలఁపడి యొండొరు కేతనముల**
**హరుల ధనువులఁ దునిమి నిష్ఠురకృపాణ । దారుణాకారు లై యరదములు డిగ్గిరి.** **259**

**ప్రతిపదార్థం:** శిఖండి= ద్రుపదుడి కొడుకు; గర్వంబు+మెఱయన్= మదం వెలుగొందగా; అశ్వత్థామన్= (ద్రోణుడి కొడుకైన) అశ్వత్థామను; ఎదిరినన్= తాకగా; ఆతండు= (అశ్వత్థామ); మదము+ఎలర్పన్= గర్వం శోభిల్లగా; నారాచము= బాణం; ఉరమునన్= వక్షఃస్థలంపై; నాటింపన్= గ్రుచ్చుకొనేటట్లు చేయగా; నొచ్చియున్= బాధపడికూడా; ద్రుపద నందనుఁడు= ద్రుపదుని కొడుకు- శిఖండి; అతిక్రూర శరము= మిక్కిలి కఠినమైన బాణం; తద్+వక్షమునన్= ఆతడి (అశ్వత్థామ) ఉరమందున; కీలితము+చేసెన్= నాటేటట్లు చేశాడు; భగదత్తుఁడు= భగదత్తుడు (అనే వృద్ధవీరుడు); ఉఱక= లెక్కచేయక; విరాటుపైన్= విరాట రాజు మీద; ఉరవడించి= విజృంభించి; కదిసినన్= తాకగా; బాణ+ఆసార యుగమును= ఉభయులు ప్రయోగించిన బాణాల వర్షం; బెరసి= కూడి; మహా+ఉగ్రభంగిన్= మిక్కిలి భయంకరమైన విధంగా; గగనంబున్+కప్పెన్= ఆకాశాన్ని ఆవరించింది; కైకయ+అధీశుఁడు+అగు= కేకయ దేశ ప్రజలకు రాజు అయిన; బృహత్క్షత్ర+విభుఁడు= బృహత్క్షత్రుడు అనే రాజు; కృపుఁడున్= కృపాచార్యుడు; తలపడి= యుద్ధం చేసి; ఒండు+ఒరుల= ఒకరిదింకొకరు; కేతనములన్= జెండాలను; ధనువులన్= విండ్లను; తునిమి= ఖండించి; నిష్ఠుర, కృపాణ, దారుణ+ఆకారులు+ఐ= కఠినమైన కత్తులు ధరించటంచేత భయంకరమైన ఆకారాలు కలవారై; అరదములు డిగిరి= రథాలనుండి నేలపైకి దిగారు.

**తాత్పర్యం:** గర్వం వెలుగొందగా శిఖండి అశ్వత్థామ నెదిరించాడు. అశ్వత్థామ దర్పం శోభిల్లగా బాణాన్ని అతడి గుండెలో గుచ్చాడు. దెబ్బతిని కూడ శిఖండి మిక్కిలి కఠినమైన బాణాన్ని అశ్వత్థామ వక్షాన నాటేటట్లు వేశాడు. భగదత్తుడు లక్ష్యపెట్టకుండా విరాటుడిపై విజృంభించి తాకగా వారిద్దరి బాణవర్షం ఆకాశాన్ని మహాభయంకంగా ఆచ్ఛాదించింది. కేకయరాజైన బృహత్ క్షత్రవిభుడూ, కృపుడూ తలపడి ఒకరొకరి కేతనాలు, గుఱ్ఱలు, విండ్లూ త్రుంచుకొని భయంకరాకారాలతో కఠినమైన కత్తులు గైకొని రథాలు దిగారు.

**విశేషం:** 1. శిఖండి- ద్రుపదుడి కొడుకు. మొదట స్త్రీగా ఉద్భవించి పిదప లింగంమారి పురుషవీరుడైనాడు. పాంచాల ప్రభువు ద్రుపదుడికి ద్రోణాచార్యుడికీగల వైరం సుప్రసిద్ధం. అందుచేత ద్రోణుడి కొడుకు అశ్వత్థామ ద్రుపదుడి కొడుకు శిఖండి ద్వంద్వ యుద్ధానికి పూనుకొన్నారు.

2. భగదత్తుడు- వృద్ధవీరుడు. ఇతడి వాహనం సుప్రతీకం అనే పేరుగల ఏనుగు. అది భయంకరమైనది. భారత యుద్ధంలో భగదత్తుడినీ, అతని ఏనుగు సుప్రతీకాన్నీ అర్జునుడు సంహరిస్తాడు.

**ఉ. అట్టియెడం గనుంగొని జయద్రథుఁడున్ ద్రుపదుండు వచ్చి యా**
**కట్టుపకాసు లిద్దఱకు గ్రక్కున నడ్డము సొచ్చి యొండొరున్**
**బెట్టుగఁ దాఁకి తీవ్రశరపీడితదేహులఁ జేసి, రెట్టి లా**
**వెట్టిపరాక్రమస్ఫురణ యెట్టిరయం బని పిచ్చలింపఁగన్. 260**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో (కృపాచార్యుడు - బృహత్ క్షత్ర విభుడూ విరథులూ, నేలకు దిగి కత్తులతో తలపడి యుద్ధం చేసే సమయంలో); జయద్రథుడున్= సైంధవుడూ; ద్రుపదుండు= ద్రుపదుడు; వచ్చి= చేరి; ఆ+కట్టుపకాసులు+ఇద్దరకున్= ఆ వీరులు ఇద్దరకు; గ్రక్కునన్= వేగంగా; అడ్డము+చొచ్చి= మధ్యగా నిలబడి; ఒండు+ఒరున్= ఒకరితో ఒకరూ; బెట్టుగన్+తాకి= తీవ్రంగా మార్కొని; ఎట్టి+లావు= ఎటువంటి బలము; ఎట్టి+పరాక్రమ+స్ఫురణ= ఎటువంటి శౌర్య ప్రదర్శనం; ఎట్టి+రయంబు= ఎటువంటి వేగం; అని= అని (సేనలు); పిచ్చలింపగన్= భయపడునట్లుగా (ఆశ్చర్య చకితంకాగా); తీవ్ర+శర+పీడిత+దేహులన్= మిక్కుటముగా బాణాలచే పీడింపబడిన శరీరాలు కలవారినిగా; చేసిరి= చేశారు;

**తాత్పర్యం:** ఆ సమయంలో చూచి జయద్రథుడు ద్రుపదుడూ ఆ వీరులిద్దరికీ వేగంగా అడ్డుపడి ఎట్టి బలం, ఎట్టి శౌర్య ప్రదర్శనం, ఎట్టి వేగం అని సేనలు రెండూ భీతి చెందే విధంగా వారు ఒకరినొకరు తీవ్రంగా ఎదుర్కొని మిక్కుటమైన బాణాలతో ఒకళ్ళొకళ్ళ దేహములను గాయపరచుకొన్నారు.

**విశేషం:** కట్టు పకాసి: కట్టుప కాసుడు= వీరుడు అని శబ్దరత్నాకర నిఘంటువులోని అర్థం. బ్రౌను దొర నిఘంటువులో గట్టుపకాసు- గట్టు= పర్వతము, వంటివాడు - ధీరుడు అని అర్థం ఉన్నది. ఈ శబ్ద స్వరూపంపై ఇంకా పరిశోధన జరగాలి. 'గట్టుపకాసి'యే సాధురూపంగా గ్రహించాలి అని నా అభిప్రాయం.

**ఉ. మన్యుసముజ్జ్వలుండు నభిమానియు నైన వికర్ణుఁడున్ యుధా**
**మన్యుఁడు నేచి యొండొరుల మార్కొని రౌద్రరసం బలోక సా**
**మాన్యము గాఁగ నస్ఖలితమత్సరముల్ మెఱయంగఁ బోరి ర**
**న్యోన్యనిశాతసాయక నిరంతరవర్షములన్ మునుంగుచున్. 261**

**ప్రతిపదార్థం:** మన్యు+సమ్+ఉజ్జ్వలుండు= రోషంతో కూడి వెలుగొందే వాడు; అభిమానియున్+ఐన= ఆత్మగౌరవం కలవాడూ అయిన; వికర్ణుఁడున్= వికర్ణుడు; యుధామన్యుఁడున్= యుధామన్యుడూ; ఏచి= విజృంభించి; ఒండొరులన్= ఒకరి నొకరు; మార్కొని= ఎదిరించిపోరాడి; రౌద్రరసం= కోపంతో నిండిన రోషం; అ+సామాన్యము+కాఁగన్= సాటిలేనిది అయ్యేటట్లుగా; న+స్ఖలిత, మత్సరముల్= జారిపోని ద్వేషములు; మెఱయంగన్= ప్రకాశించేటట్లుగా, అన్యోన్య, నిశాత, సాయక, నిరంతర, వర్షములన్= ఒండొరులపై ప్రయోగించిన వాడి బాణాల వానతో ఎల్లప్పుడు తడిసిపోతూ; మునుంగుచున్= మునకలువేస్తూ (నిమగ్నులౌతూ); పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** రోషంతో- ఆత్మగౌరవంతో కూడిన వికర్ణుడూ, యుధామన్యుడూ, విజృంభించి ఒండొరులను ఎదిరించి, అలోక సామాన్యమైన రౌద్రరసంతో తగ్గిపోవని పగతో వారిద్దరు ఒకరిపై వొకరు ప్రయోగించుకొన్న ఎడతెరిపి లేని బాణవర్షాలలో మునుకలు వేశారు.

**విశేషం:** రౌద్రము - నవరసాలలో ఒకటి. రౌద్రానికి స్థాయి భావం - క్రోధం.

**ఆ. ధరణినాథ! చేకితానుండు గడఁగి సు । శర్మమీఁద నిశితశరచయంబు**
**గురియ, నితఁడు నతనిఁ గ్రూరాస్త్రనికర సం । పిహితగాత్రుఁ జేసి పేర్చి యార్చె. 262**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= ఓరాజా! (ఓ ధృతరాష్ట్ర మహారాజా!); చేకితానుండు= చేకితానుడు; కడఁగి= పూని; సుశర్మ మీఁదన్= సుశర్మ (అనే రాజు) మీద; నిశిత+శర+చయంబున్= వాడి బాణాల సముదాయమును; కురియన్= వర్షింపగా; ఇతఁడు= సుశర్మ; అతనిన్= ఆ చేకితానుడిని; క్రూర+అస్త్ర, నికర, సంపిహిత+గాత్రున్+చేసి= కఠోరములైన మంత్ర బాణ సముదాయంచేత పీడించబడిన శరీరంగల వాడినిగా చేసి; పేర్చి= అతిశయించి; ఆర్చెన్= సింహనాదం చేశాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! చేకితానుడు సుశర్మపై వాడియైన బాణాలను ప్రయోగించాడు. అంతట సుశర్మ చేకితానుడి శరీరాన్ని తీవ్రమైన బాణాల సముదాయంతో కప్పివైచి సింహనాదం చేశాడు.

**క. శకుని ప్రతివింధ్యుఁ దాఁకిన । బ్రకటబలుం డా యుధిష్ఠిరప్రియసుతుఁ డు**
**ద్భృకుటి యగుచుఁ గవిసెను సిం । హ కిశోరము గజముఁ బొదువున ట్లతనిపయిన్. 263**

**ప్రతిపదార్థం:** శకుని= శకుని (సుయోధనుడి మేనమామ); ప్రతివింధ్యున్= ధర్మరాజు కొడుకును; తాఁకినన్= మార్కొనగా; ప్రకట+బలుండు= కనిపించిన పరాక్రమం కలవాడు; ఆ+యుధిష్ఠిర, ప్రియ, సుతుఁడు= ధర్మరాజు అనుగు కొడుకు; సింహ+కిశోరము= సింగపు పిల్ల; గజమున్= ఏనుగును; పొదువు+అట్లు= పట్టుకొనినట్లు; అతనిపయిన్= ఆ శకునిపై; ఉద్+భృకుటి+అగుచున్= పైకెత్తిన కనుబొమలు కలవాడౌతూ; కవిసెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** ప్రతివింధ్యుడిని శకుని మార్కొన్నాడు పరాక్రమంతో భాసిల్లే ధర్మరాజు ప్రియ పుత్రుడైన ప్రతివింధ్యుడు కొదమసింగం ఏనుగుపై పడినట్లు కనుబొమలు పైకెత్తి ఆ శకునిపై పడ్డాడు.

**తే. భీమనందనుఁ డగు శ్రుతసోముఁ గడిమిఁ । దాఁకెఁ గాంభోజనృపతి సుదక్షిణుండు**
**వార లిరువురు నొండొరుం గ్రూరబాణ । జాలముల నెట్లుఁ దెరలుపఁ జాలరైరి. 264**

**ప్రతిపదార్థం:** కాంభోజ+నృపతి= కాంభోజ దేశం పాలించేరాజు; సుదక్షిణుండు= సుదక్షిణుడు అనే పేరుగలవాడు; భీమ+నందనుఁడు+అగు= భీముడి కొడుకైన; శ్రుతసోమున్= శ్రుతసోముడిని; కడిమిన్= పౌరుషంతో; తాఁకెన్= మార్కొన్నాడు; వారలు+ఇరువురున్= వారు ఇద్దరు (సుదక్షిణుడూ, శ్రుతసోముడూ); ఒండొరులన్= ఒకరి నొకరు; క్రూర, బాణ, జాలములన్= కఠినములైన అమ్ముల సముదాయాలతో; ఎట్లు= ఏ విధంగానూ; తెరలుపన్+చాలరు+ఐరి= చెదర గొట్టలేకపోయారు.

**తాత్పర్యం:** కాంభోజరాజు భీముడి కొడుకైన శ్రుతసోముడిని మార్కొన్నాడు. ఉభయులు ఒకరిపై ఒకరు వాడి బాణాలు ప్రయోగించుకొన్నారు. ఒకరి ధాటిని ఒకరు అరికట్ట లేకపోయారు. సమయుద్ధం కొనసాగింది.

**ఉ. అంతకవిక్రముండు మహిమాస్పదమూర్తి భుజంగకన్యకా**
**సంతతకీర్తనీయబలశాలి గిరీటితనూభవుం డిరా**
**వంతుఁడు బాహుగర్వధనవంతు శ్రుతాయువుఁ దాఁకె వార ల**
**త్యంతరయంబునన్ విరథు లైరి పరస్పరబాణఘట్టనన్. 265**

**ప్రతిపదార్థం:** అంతక+విక్రముండు= యముడి పరాక్రమం వంటి పరాక్రమం కలవాడు; మహిమ+ఆస్పద, మూర్తి= గొప్పతనానికి నెలవైన ఆకృతి గలవాడు; భుజంగ, కన్యకా, సంతత, కీర్తనీయ, బలశాలి= నాగకన్యక ఉలూచి చేత ఎడతెగకుండ పొగడదగిన బలము గలవాడు; కిరీటి, తనూ, భవుండు= అర్జునుడి కొడుకు; ఇరావంతుఁడు= ఇరావంతుడనే పేరుగలవాడు; బాహు+గర్వ, ధనవంతున్= భుజబల పరాక్రమం అనే గొప్ప ధనంతో కూడినవాడిని; శ్రుతాయువున్= శ్రుతాయువు అనే పేరుగలవాడిని; తాఁకెన్= మార్కొన్నాడు; వారలు= ఆ ఇరువురూ - ఇరావంతుడూ, శ్రుతాయువూ; అత్యంత+రయంబునన్= మిక్కిలి వేగంగా; పరస్పర, బాణ ఘట్టనన్= ఒకరి బాణాలచేత మరియొకరు కొట్టబడి; విరథులు+ఐరి= రథాలు పోగొట్టుకొన్నవారైనారు.

**తాత్పర్యం:** యముడివంటి పరాక్రమం కలవాడూ, గొప్పతనానికి చోటైన ఆకృతి కలవాడూ,నాగకన్యక ఉలూచి చేత ఎల్లప్పుడు కొనియాడదగిన బలముగల వాడునూ అయిన అర్జునుడి కొడుకు ఇరావంతుడు, ధృతరాష్ట్రుడి కుమారుడైన శ్రుతాయువును మార్కొన్నాడు. వారు ఇరువురూ పోరాడారు. ఇరువురి రథాలు కూలిపోయాయి.

**విశేషం:** అర్జునుడికి నాగకన్యక అయిన ఉలూచికి పుట్టినవాడు ఇరావంతుడు.

**సీ. విందానువిందులు గ్రందుగ వెసఁ గుంతి। భోజుని నాతనిపుత్రుఁ దాఁకి**
**రా పురజిత్తు బాణాసారమున విందుఁ। బొదివె నుగ్రతఁ గుంతిభోజుఁ డేయు**
**తూపులు పెనుగద దొలఁగంగ జడియుచు। ననువిందుఁ డతనిపై నడరె బెలుచఁ;**
**గైకేయు లేవురు గాంధారరాజు లే। వురతోడఁ గ్రూరసంగర మొనర్చి;**

**తే. రుత్తరునిమీఁద నీ తనయుండు దీర్ఘ। బాహుఁ డురవడిఁ గదిసి యుత్సాహలీల**
**నెఱపె; నకులాత్మజుఁడు శతానీకుఁ డేచి। వడి నులూకునిఁ దలపడి కడిమి మెఱసె. 266**

**ప్రతిపదార్థం:** వింద+అనువిందులు= విందుడూ అనువిందుడూ (అనేవారు); క్రందుగన్+వెసన్= ఒక్కుమ్మడిగా- వేగంగా; కుంతిభోజునిన్+ఆతని పుత్రున్= కుంతిభోజుడిని అతడి కుమారుని; తాఁకిరి= తలపడిరి; ఆ+పురజిత్తు= ఆపురజిత్తు అనేవాడు; బాణ+అసారమునన్= అమ్ముల జడివానచేత; విందున్= విందుని; పొదవెన్= కప్పాడు; ఉగ్రతన్= భయంకరంగా; కుంతి భోజుఁడు+ఏయు= కుంతిభోజుడు ప్రయోగించే; తూపులు= బాణాలు; పెను+గదన్= పెద్ద గదతో; తొలఁగంగన్+జడియుచున్= తొలగిపోయేటట్లు చలింపజేస్తూ; అనువిందుఁడు= అనువిందుడనే వాడు (విందుడి తమ్ముడు); పెలుచన్= అతిశయించి; అతనిపైన్+అడరెన్= అతడిపై విజృంభించాడు; కైకేయులు+ఏవురు= కేకయ దేశానికి చెందిన రాజులు అయిదుగురు; గాంధార, రాజులు+ఏవుర తోడన్= గాంధార రాజ్యానికి చెందిన అయిదుగురు రాజులతో; క్రూర, సంగరము+ఒనర్చిరి= భీకరమైన యుద్ధం చేశారు; ఉత్తరునిమీఁదన్= ఉత్తరుడిపైన; నీ+తనయుండు= నీ కొడుకు; దీర్ఘబాహుఁడు= దీర్ఘబాహుడు; ఉరవడిన్= మిక్కిలి వేగంగా; కదిసి= మార్కొని; ఉత్సాహ, లీలన్+నెఱపెన్= ఆవేశపూరితమైన యుద్ధం చేశాడు; నకుల+ఆత్మజుఁడు= నకులుడి కొడుకు; శతానీకుఁడు= శతానీకుడనేవాడు; ఏచి= విజృంభించి; వడిన్= వేగంగా; ఉలూకునిన్= ఉలూకుడు అనువాడిని; తలపడి= మార్కొని; కడిమి+మెఱసెన్= పరాక్రమంతో వెలుగొందాడు.

**తాత్పర్యం:** విందుడు అనువిందుడు అనే వీరులు కుంతిభోజుడినీ, అతడి పుత్రుడినీ మార్కొన్నారు. పురజిత్తు విందుడితో తలపడి బాణవర్షంతో అతడిని ముంచెత్తాడు. కుంతిభోజుడు ప్రయోగించిన బాణ పరంపరలను తన గదతో ఎదుర్కొని అనువిందుడు అతడిపై విజృంభించాడు. కేకయ రాజ్యానికి ప్రభువులైన ఐదుగురు వీరులూ గాంధార రాజులు అయిదుగురితో తలపడ్డారు. దీర్ఘబాహుడు (ఓ ధృతరాష్ట్ర మహారాజా, నీ కొడుకు) ఉత్తరుడి మీదికి విజృంభించాడు. నకులుడి కొడుకు శతానీకుడు విజృంభించి ఉలూకుడిని మార్కొన్నాడు.

**విశేషం:** 1. భారతయుద్ధంలో 'ఎక్కటి కయ్యం' ఒకే వీరుడు మరో వీరుడితో మాత్రమే పోరాడటం. అది ఒక పద్ధతి. ఇద్దరు మరో ఇద్దరితో, ఐదుగురు ఐదుగురితో క్రందడిపోరు. ఇంకొక పద్ధతి. విందానువిందులు కుంతిభోజుడితో ఆతని కొడుకులతో యుద్ధం చేశారు. అట్లే కేకయ పంచకం గాంధారరాజ పంచకంతో.

2. ఉత్తరుడు విరాటరాజు కొడుకు. ఉలూకుడు శకుని కొడుకు. శకుని దుర్యోధనుడి మేనమామ.

**వ. ఇవ్విధంబున వెండియు రెండు సేనలం జేయంగల దండి మగ లొండొరులం దాఁకిన, నధికసంరంభ ద్వంద్వయుద్ధంబు సిద్ధచారణఖేచరులు సూచి పొగడుచుండ నిగిడి, చతురంగంబులుం దనతన జాతిం బదులు పదులును నూఱులు నూఱులును, వేలు వేలును, బెక్కులు పెక్కులునుం దలపడి,యెడనెడంగలయన్ బెరయం గ్రమంబున సందడి కయ్యంబు నూలుకొనినఁ గ్రందునం దమకించి యుభయ సైనికు లున్మత్తుల గతిం గవియ బాణంబులుఁ గృపాణంబులుఁ గరిదంతంబులు నరదంబుల నొగలు నొండొంటిం దాఁకి తుత్తుమురులయిన తుములంబు కతన భయంకరం బగు నతిసంకులంబున సామజవాజిరథంబుల యురవడికి నోసరింపని కాలు బలంబులు, నుత్తుంగమాతంగస్యందన సందోహంబుల పయిం బఱపు రాహుతులును, గరటిఘటావిఘటనంబు గావించు రథికులును, నిది యది యనక యెల్ల బలంబులం జొచ్చిన మొగంబునఁ జిందఱవందఱ సేయు గజారోహకులు నగుచు నిర్మర్యాదంబుగాఁ బెనంగు సైన్యద్వితయంబు మందరక్షుభితాంబుధిచందం బగుటకుం దగి, యుచ్చి పోయెడు శరంబులు నిరుమెయిన్ గెలిచిన కుంతక్షురి కాదులును, బ్రవాళజాలంబులుం బోలి బొలుపు మిగులుచుండ విశిఖంబులు ముఖంబులన్ బెట్టు నాటిన జిఱ్ఱనం దిరుగుశుండాలంబులు ప్రళయకాలంబున సురకరువలిచే దిర్దిరం దిరిగెడు కులనగంబులఁ గ్రేణిసేయఁ గరవాలగదాభల్లప్రముఖంబు లగు శస్త్రాస్త్రంబులఁ గుంభికుంభతురంగముఖ భటకపాలాదు లవియు చప్పుళ్ళును, వివిధాయుధ ప్రహతుల నొఱలు హరినరనాగంబుల రావంబులును, దారుణప్రకారంబున దిక్తటదారణంబు సేయుచుం జెలంగఁ, జేయి దునిసినం దక్కటిచేతం గైదువు గొని కవియువారును, గాలు దునిసిన నెదిరి మీఁదికి లంఘించువారును, దల దునిసినం దారు మును గన్నిడినవారిం బొడిచిపడువారును, దెగిపడియు నవుడు గఱచుటయు బొమముడి వడుటయును సడలని తలల నొప్పువారును, మావంతులు నేనుంగులు వికలంబు లైన సమీపవర్తుల వాహనంబుల సమారోహణంబు సేసి పరాక్రమించువారును, నొచ్చియు నీడం బోక చెలులకుం జుట్టంబులకు నడ్డపడువారును మార్బలంబునం జేరి చుట్టం బని తప్పింపక నొప్పించువారును సుభటులు సొచ్చి చెండిన వండం దఱిగినట్లుండు వేదండహయచయంబులును నాశ్వికులు పైకొని మీఁది మానిసులం దునిమిన మ్రోడుపడు రథంబులును, రథనేమి ఘట్టనంబున దట్టంబు లగు పదాతిగాత్రంబులును, నిభంబులు వొదివి నేలతో వ్రేసియుఁ గాలం జమరియుఁ దూల వైచియుఁ గొమ్ముల గ్రుచ్చి యెత్తియు బారిసమరిన**

**వికటాకారంబు లగు ఘోటకంబులునై ఘోరభంగి యుగు నంగరంబు సెల్లుచుండ మధ్యాహ్నసమయంబున. 267**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; వెండియున్= మరియునూ; రెండు, సేనలన్= ఉభయ సైన్యాలలో; చేయన్+కల= కార్యశూరులైన - సమర్థులైన; దండి, మగలు= గొప్ప వీరులు; ఒండు+ఒరులన్= ఒకరిని ఒకరు; తాఁకినన్= తలపడగా; అధిక, సంరంభ, ద్వంద్వ, యుద్ధంబు= మిక్కిలి ఉత్సాహంతో కూడుకొనిన ఎక్కటి కయ్యము; సిద్ధ, చారణ, ఖేచరులు= సిద్ధులు, చారణులు, ఖేచరులు అనే వేల్పుతెగలు; చూచి= అరసి; పొగడుచుండన్= ప్రశంసిస్తూ ఉండగా; నిగిడి= అతిశయించి; చతురంగంబులున్= నాలుగు తెగలు (రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాలిభటులు); తన+తన జాతిన్= తమ వర్గాలకు చెందిన (అనగా రథాలు రథాలను, ఏనుగులు ఏనుగులను, గుర్రాలు, గుర్రాలను, కాల్బలంలోని భటులు ఆ భటులను); పదులు పదులును= పది సంఖ్యలు ఆ సంఖ్యలో ఉన్న వాటిని; నూఱులు నూఱులును= వందలు వందలను; వేలు వేలును= నూరుపదుల సంఖ్య- ఆ సంఖ్యలో ఉన్న సమూహాన్ని; పెక్కులు+పెక్కులునున్= పెక్కు సంఖ్యలో ఉన్న అట్టి సంఖ్యాసమూహాన్ని; తలపడి= మార్కొని; ఎడన్+ఎడన్= అప్పుడప్పుడు; కలయన్+బెరయన్= కలసికొంటూ- తారసిల్లుతూ; క్రమంబునన్= వరుసగా; సందడి+కయ్యంబు= సంకుల సమరం; నాలుకొనినన్= విస్తరించగా; క్రందునన్= వేగంగా; తమకించి= ఉత్సహించి; ఉభయ, సైనికులు= రెండు వర్గాలలోని భటులు, కౌరవ పాండవ సేనలలోని భటులు; ఉన్మత్తుల గతిన్= పిచ్చివారివలె; కవియన్= తాకగా; బాణంబులున్= అమ్ములు; కృపాణంబులున్= కత్తులు; కరి, దంతంబులున్= ఏనుగుల దంతాలు; అరదంబుల, నొగలున్= రథాల ముందు భాగాలు; ఒండు+ ఒంటిన్+తాకి= ఒక దానితో మరియొకటి ఎదుర్కొని; తుమురులు+తుమురులు= ముక్కచెక్కలు; అయిన, తుములంబు+కతవన్= సంకుల సమరం కావటం చేత; భయంకరం+బగు= భీకరమైన; అతిసంకులంబునన్= మిక్కిలి దట్టమైన సందడి యుద్ధంలో; సామజ, వాజి, రథంబుల+ఉరవడికిన్= ఏనుగుల యొక్క, గుర్రాలయొక్క, రథాలయొక్క మిక్కిలి వేగానికి; ఓసరింపని= తప్పుకొనలేని; కాలు బలంబులున్= పదాతులు, కాలిభటులును; ఉత్తుంగ, మాతంగ, స్యందన, సందోహంబులపయిన్= ఎత్తైన ఏనుగులు, రథాల గుంపులపై; పఱపు= పరుగెత్తించే; రాహుతులును= రౌతులు (గుర్రాలపై స్వారీ చేసే భటులు); కరటి, ఘటా, విఘటనంబు+కావించు= ఏనుగుల సమూహాలను ముక్కలు ముక్కలుగా చేసే; రథికులును= రథాలపై యుద్ధం చేసే వీరులూ; ఇది+అది+అనక= ఇటు అటు అడ్డులేకుండా లెక్కచేయకుండగా; ఎల్ల+బలంబులన్= అన్ని సైన్యాలలో; చొచ్చిన= ప్రవేశించిన; మొగంబునన్= ముందలి భాగంలో; చిందఱ వందఱ+చేయు= ముక్కలు ముక్కలుగా చీల్చి వేసే, గజ+ఆరోహకులు= ఏనుగులపై ఎక్కి యుద్ధం చేసే వారూ; అగుచున్= అవుతూ; నిస్+మర్యాదంబుగాన్= హద్దు లేకుండగా; పెనంగు= యుద్ధం చేసే; సైన్య+ద్వితయంబు= రెండు సేనలూ; మందర, క్షుభిత+అంబుధి+చందంబు+అగుటకున్= మందర పర్వతంచేత తరచబడిన సముద్రంవలె కావటానికి; తగి= ఒప్పి; ఉచ్చి+పోయెడు+శరంబులు= నాటి వెడలే బాణాలు; ఇరు+మెయిన్= రెండు వైపుల; గెలిచిన= చెలరేగిన; కుంత+క్షురిక+ఆదులును= ఈటెలు చిరుకత్తులు మొదలైనవిన్నూ; ప్రవాళ+జాలంబులన్+పోలి= చివుళ్ళను పోలుతూ; పొలుపు+మిగులు= అందంతో అతిశయించే; చండ+విశిఖంబులు= వాడి బాణాలు (బాణాలు); ముఖంబునన్= మొగంపై (కుంభస్థలంపై); బెట్టు+నాటినన్= గట్టిగా గ్రుచ్చుకొనిన; జిఱ్ఱనన్= వేగంగా వెనుకకు; తిరుగు= తిరిగే; శుండాలంబులు= ఏనుగులు; ప్రళయ+కాలంబునన్= ప్రళయం దాపురించిన సమయంలో; సుర+కరువలిచేన్= సుడిగాలిచేత; దిర్దిరన్+తిరిగెడు= చుట్టూ తిరిగే; కుల+నగంబులన్= కులపర్వతాలను; క్రేణి+చేయన్= పరిహసిస్తూ ఉండగా; కరవాల+గదా+భల్ల+ప్రముఖంబులు అగు= కత్తులు, గదలు, ఈటెలు మొదలైనవి అగు; శస్త్ర+అస్త్రంబులన్= ఆయుధాలు మంత్రాయుధాల చేత; కుంభి, కుంభ, తురంగ+ముఖ+భట+కపాల+ఆదులు= ఏనుగు కుంభస్థలాలు, గుర్రాల ముఖాలు, సేనలలోని భటుల తలలు మున్నగునవి; అవియు+చప్పుళ్ళను= పగిలే ధ్వనులూ; వివిధ+ఆయుధ ప్రహతులన్= పెక్కు విధాలైన ఆయుధాల వలన తగిలిన దెబ్బలచేత; ఒఱలు= వ్యాపించే; హరి, నర, నాగంబుల, రావంబులును= గుర్రాల యొక్కయు భటుల యొక్కయు; ఏనుగుల యొక్కయు ధ్వనులు; దారుణ ప్రకారంబునన్= భయంకరమైన విధంగా; దిక్+తట+దారణంబు+చేయుచున్= దిక్కుల యొక్క అంచులు చీలేటట్లుగా చేస్తూ; చెలంగఁగాన్= ధ్వనించగా; చేయి+తునిసినన్= చేయి తెగిపడిపోయినప్పటికీ; తక్కటి+చేతన్= మిగిలిన చేతితో;

కైదువు+కొని= కత్తిపట్టి; కవియు వారును= యుద్ధం చేసేవారూ; కాలు+తునిసినన్= పాదం విరిగిపోయినప్పటికీ; ఎదిరి మీఁదికిన్= శత్రువుపైకి; లంఘించువారును= దూకేవారూ; మును= మునుపు; కన్ను+ఇడిన వారిన్= చూచినవారిని- గురిపెట్టిన వారిని; తల+తునిసినన్= తన తలకాయ తెగిపడిపోయినప్పటికీ; పొడిచి+పడువారును= పొడిచి పడిపోయే వారునూ; తెగిపడియున్= ఖండింపబడి క్రింద పడిపోయినప్పటికీ; అవుడు+కరచుటయున్= పెదవి కరచుటా; బొమముడి+పడుటయును= కనుబొమ్మలు దగ్గరగా చేర్చటం; సడలని= తప్పని; తలల= శిరస్సులతో; ఒప్పువారును= శోభిల్లే వారూ; ఏనుంగులు= ఏనుగులు; వికలంబులు+ఐన= చెడిపోయినప్పటికీ (కూలిపోయినప్పటికీ, చచ్చిపోయినప్పటికీ); సమీప, వర్తుల, వాహనంబులు= దగ్గరగా ఉన్నవారి వాహనాలను; సమారోహణంబు+చేసి= ఎక్కి; పరాక్రమించువారును= వీరత్వం చూపేవారు; నొచ్చియున్= తనకు దెబ్బతగిలి బాధగా ఉన్నప్పటికీ; ఈడంబోక= వెనుదీయక; చెలులకున్= స్నేహితులకూ; చుట్టంబులకున్= బంధువులకు; అడ్డుపడు వారలు= సాయం చేసేవారు (శత్రువుల దెబ్బలు తాకకుండా అడ్డగించేవారు); మార్+బలంబునన్+చేరి= శత్రుసైన్యంలోకి చొచ్చుకొనిపోయి; చుట్టంబు+అని+తప్పింపక= తనకు బంధువు అనే ఆలోచనతో విడువకుండా; నొప్పించు వారును= ఎదిరించి యుద్ధం చేసే వారూ; సుభటులు+చొచ్చి= వీరులు ప్రవేశించి; చెండినన్= ఖండించగా; వండన్+తతిగినట్లు+ఉండు= వండటానికి ముక్కలుగా తరిగినట్లు పడియున్న; వేదండ, హయ, చయంబులును= ఏనుగుల, గుర్రాల సముదాయాలు; ఆశ్వికులు = రౌతులు; పైకొని= విజృంభించి; మీఁది మానిసులన్+తునిమిన= పైనున్న (వీరులను) సంహరింపగా; మ్రోడు, పడిన, రథంబులును= ఆకులులేని చెట్ల కాండంవలె ఉన్న రథాలూ; రథ, నేమి, ఘట్టనంబునన్= రథచక్రాల తాకిడిచేత; దట్టంబులు+ అగు= దళసరిగా అయిన; పదాతి+గాత్రంబులును= కాలిబంటుల కళేబరాలూ; ఇభంబులు= ఏనుగులు; పొదివి= డీకొని; నేలతోన్+వ్రేసియున్= నేలపై రాయటం; తూలవైచియున్= విసరివేయటం; కొమ్ములన్+గ్రుచ్చి= దంతాలతో పొడిచి; ఎత్తియున్= పైకి విసరి; బారి సమరిన= హింసించగా; వికట+ఆకారంబులు అగు= వికారమైన రూపాలు ఏర్పడిన; ఘోటకంబులును= గుర్రాలూ; ఐ= కలిగి; ఘోరభంగి+అగు= భయంకరవిధం కలదైన; సంగరంబు+చెల్లుచుండన్= యుద్ధం జరుగుతూ ఉండగా; మధ్యాహ్న+సమయంబునన్= మధ్యాహ్నవేళ.

**తాత్పర్యం:** "ఈ విధంగా కౌరవపాండవసేనల్లోని గొప్పవీరులు ఒకరితో ఒకరు తలపడగా జరిగిన మిక్కిలి సంరంభంతో కూడిన ద్వంద్వ యుద్ధమును ఆకాశంలో సంచరించే వేల్పు తెగలు సిద్ధులు, చారణులు, ఖేచరులు ప్రశంసించారు. చతురంగబలాలు ఒండొంటిని తాకాయి. రథాలు రథాలతో, ఏనుగుల బలాలు ఏనుగుల బలాలతో, అశ్వికులు అశ్వికులతో, కాలి బంటులు కాలి బంటులతో డీకొనడం జరిగింది. ఆ నాలుగు రకాల జాతులూ, తమ తమ జాతులతో పదింటితో పదియూ, వందింటితో వందయూ, వేయింటితో వేయియున్నూ పెక్కింటితో పెక్కులున్నూ అక్కడక్కడా కలసిపోతూ విడిపోతూ తలపడగా క్రమంగా సంకుల సమరం ఏర్పడింది. ఉభయసేనలలోని భటులు పిచ్చివారి వలె పోరాడారు. బాణాలు, కత్తులు, ఏనుగుల దంతాలు, రథాల నొగలూ ఒకదానితో నొకటి కొట్టుకొని తుత్తునియలై యుద్ధభూమిపై పడ్డాయి. ఆ భయంకరయుద్ధంలో ఏనుగుల,గుర్రాల రథాలధాటికి ఓర్వని కాలిబంటులు, ఎత్తైన ఏనుగుల రథాలపై విజృంభించిన రౌతులు, ఏనుగుల గుంపులను చీల్చి చెండాడే రథికులు ఇది అది అనకుండా అన్ని రకాల శత్రు సేనలను ప్రవేశించిన మొనలను చిందరవందర చేసిన గజారోహకులు కలిగి హద్దులేకుండా యుద్ధంచేసే ఆ రెండు సేనలు మందర పర్వతం చిలికిన సముద్రాల వలె కనిపించాయి. దూరిపోయే బాణాలు ఇరువైపుల నుండి ప్రయోగింపబడిన ఈటెలు, వంకర కత్తులూ, రక్తసిక్తమై ప్రవాళజాలంబులను పోలి అందంతో అతిశయించాయి. ముఖాలలో బాణాలు గట్టిగా నాటుకోగా వేగంగా వెనుదిరిగి పోయే ఏనుగులు ప్రళయకాలంలో సుడిగాలి చేత దిర్దిరతిరిగే కుల పర్వతాలవలె కనిపించాయి. కత్తులు గదలు బల్లెములు మొదలగు శస్త్రాస్త్రములచే ఏనుగుల కుంభస్థలాలు, తురంగ బలాల తలలు భటుల పుర్రెలు

పగిలేటప్పుడయ్యే ధ్వనులూ మరియు వివిధా యుధముల చేత దెబ్బతిని పడిపోయే గుర్రాలు భటులు ఏనుగుల ధ్వనులు దారుణంగా దిక్ప్రదేశాలను చీల్చుచు చెలరేగాయి ఒక చేయి తెగిపోయిననూ రెండవచేతితో ఆయుధము పట్టి మీదికి దుముకువారునూ, కాలుతెగిననూ, ఎదుటివాని మీదికి లంఘించువారునూ, తల తెగిననూ, మునుపు కన్నిడినవారిని పొడిచి నేలగూలువారునూ, ఖండింపబడినప్పటికిని పెదవులు కొరుకుతూ ముడివీడని కనుబొమలతో, తలలతో వెలుగువారునూ, తమ వాహనములైన గుర్రాలు, ఏనుగులు నేలగూలినప్పుడు చెంతనున్నవారి వాహనా లెక్కి పరాక్రమించేవారునూ, బాధచెందినప్పటికీ వెనుదీయక స్నేహితులకూ, బంధువులకూ సాయపడేవారూ, శత్రు పక్షంలో నున్నవారు తనకు చుట్టమని వదలకుండా నొప్పించేవారూ, ఇట్లు వీరభటులు చొచ్చుకొని పోయి ఏనుగుల గుజ్జాల గుంపులను చెండగా వంటకొరకు తరిగినకూరలట్లు అవి కన్పించాయి. ఆశ్వికులు పైబడి రథాలమీది యోధులను చంపగా రథాలు శూన్యాలైనాయి. రథ చక్రాల క్రిందబడినలిగిన భటుల కళేబరాలు దట్టంగా గుట్టలు గుట్టలుగా పడిపోయాయి. ఏనుగులు విజృంభించి గుజ్జాలను నేలపై పడవేసి కాళ్లతో త్రొక్కాయి, విసరివేశాయి, దంతాలతో పొడిచాయి. ఆ గుజ్జాల కళేబరాలు రూపుమాసి తీవ్ర వికారంగా కనిపించాయి. యుద్ధం ఈ రీతిగా మధ్యాహ్న సమయం వరకు సాగింది.

**విశేషాలు:** 1. ఆ యుద్ధం దేవతలు చూడగోరారు. 2. ఏనుగులు కులపర్వతాలవలె ఉన్నాయి. కులపర్వతాలు భూమిని మోస్తాయి అని పురాణకథనం. మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తి మంతము, గంధమాదనము - వింధ్యము - పారియాత్రము ఈ ఏడు కులపర్వతాలు. 3. ఈ యుద్ధ వర్ణన మహాభారత కాలం నాటిదా? తిక్కన కాలం నాటిదా? తిక్కన తాను కనులార గాంచిన యుద్ధభూమిని వర్ణించినట్లు కన్పిస్తున్నది. (రథాల వర్ణన విడిచిపెడితే) 4. కోపతాపాల వలన బొనుముడిపాటు మొగంపై ఏర్పడటం కద్దు. ఆ ముద్ర వీరుల శవాల ముఖాలలో స్తంభించి కన్పించటం విశేషం. అట్లే ఇరువురు భటుల కత్తి యుద్ధంలో తలతెగిన మొండెం ముందుకు కొన్ని అడుగులు వేసి శత్రువును పొడిచి చంపటం! బహుశః ఇవి అతిశయోక్తులు కావేమో! యుద్ధభూమిని ప్రత్యక్షంగా చూచిన తిక్కన చేసిన వర్ణనలు.

**భీష్ముఁడు దుర్యోధన ప్రేరితుండై విజృంభించి పాండవవీరుల నొప్పించుట (సం. 6-45-1)**

**సీ. మనుజేంద్ర! వినుము నీ తనయుండు వనుపంగ। దుర్ముఖ కృప కృతవర్మ మద్ర**
**పతి వివింశతులు విస్ఫారబాణార్చులఁ। బంచాగ్నులును బోలెఁ బ్రజ్వరిల్ల**
**తన కెలంకులఁ గోలుతలసేసి తఱుమంగఁ। దాలకేతువు మహోత్తాలమూర్తి**
**నాభీల మై క్రాల నడరి పాండవసేనఁ। దఱిసి మందాకినీతనయుఁ డేచి**
**తే. చేది పాంచాల కేకయు లాది గాఁగఁ। గల్గు భూపాల కోటి మొగ్గరము లెల్లఁ**
**గలఁగఁ దిరుగుడువడ నోరగిలఁగఁ బెల్ల। గిల్లఁ దల్లడపడ రణక్రీడ సల్పె. 268**

**ప్రతిపదార్థం:** మనుజ+ఇంద్ర!= మనుజేంద్ర!; ఓ రాజా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; వినుము= ఆలకించుము; నీ+తనయుఁడు= నీ కొడుకు; అనుపంగన్= పంపగా; దుర్ముఖ, కృప, కృతవర్మ, మద్రపతి, వివింశతి= దుర్ముఖుడు, కృపాచార్యుడు, కృతవర్మ, శల్యుడూ; వివింశతీ; విస్ఫార, బాణ+అర్చులన్= ప్రకాశించే బాణాలయొక్క జ్వాలలతో; పంచ+అగ్నులును+పోలెన్= ఐదు నిప్పులవలె; ప్రజ్వరిల్లన్= ప్రకాశించగా; తన+కెలంకులన్= తన ప్రక్కల; కోలుతల+చేసి= యుద్ధం చేయటానికి సంసిద్ధమై; తఱుమంగన్= ప్రోత్సహించగా; తాలకేతువు= తాడిచెట్టు జెండా కలవాడు (భీష్ముడు); మహా+ఉత్తాలమూర్తి= మిక్కిలి పొడుగైన ఆకృతి కలవాడు; ఆభీలము+ఐ= భయంకరంగా; క్రాలన్= మిరుమిట్లు గొలిపి వెలుగొందగా; అడరి= విజృంభించి; పాండవ+

సేనన్+తఱిసి= పాండవుల సైన్యాన్ని సమీపించి; మందాకినీ తనయుఁడు= గంగ కొడుకు(భీష్ముడు); ఏచి= అతిశయించి; చేది, పాంచాల, కేకయులు+ఆదిగాఁగన్= చేది దేశం, పాంచాల దేశం, కేకయ దేశం ఏలే ప్రభువులు; కల్గు= ఉన్న; భూపాలకోటి= రాజుల సమూహాలయొక్క; మొగ్గరాలు= వ్యూహాలు; ఎల్లన్= అన్నిటినీ; తిరుగుడు+పడన్= తారుమారగునట్లుగా; ఓరగిలఁగన్= వ్రాలేటట్లుగా; పెల్లగిల్లన్= అడుగునుండి పైకి వచ్చేటట్లుగా; తల్లడ+పడన్= చీకాకుపడగా; రణ+క్రీడ= యుద్ధం అనే ఆట; సల్పెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! వినుము. నీ కొడుకు దుర్యోధనుడు పంపగా, దుర్ముఖుడు, కృపాచార్యుడు, కృతవర్మ, శల్యుడు, వివింశతి భీష్ముడికి బాసటగా నిలిచి ప్రకాశించే బాణాల మంటలతో పంచాగ్నులవలె ప్రజ్వరిల్లి అతడికి ప్రక్కల నిల్చి శత్రుసైన్యాన్ని తరుముతూ తాటిచెట్టు జెండాతో వెలుగొందేవాడూ, ఎత్తైన విగ్రహం కలవాడూ అయిన భీష్ముడు భయంకరుడై విజృంభించి పాండవసేనదరిజేరి చెలరేగి పాంచాల కేకయ రాజులు మొదలైనవారు పన్నిన వ్యూహాలను అన్నింటిని చెదరిపోయేటట్లు, పారిపోయేటట్లు, ఒరిగిపోయేటట్లు, పెల్లగిలేటట్లు, చీకాకుపడేటట్లు, రణక్రీడ సలిపాడు.

**విశేషాలు:** 1. పంచాగ్నులు: దక్షిణాగ్ని, ఆహవనీయం, గార్హపత్యం - సభ్యం - అవసథ్యం. 2. రణక్రీడ : యుద్ధాన్ని ఆటగా అభివర్ణించటం తిక్కనకు ఇష్టం.

**క. పాయవడఁ జొచ్చు గుంపులు । సేయును మలఁకలఁ జరించి చించును గోణ**
**వ్యాయామ గతుల వలయము । లై యుండం దిరిగి కలఁచు నరి సైన్యంబున్. 269**

**ప్రతిపదార్థం:** గుంపులు= మూకలు; పాయ+పడన్= చీలికలు ఏర్పడేటట్లుగా; చొచ్చున్= లోపలికి చేరుకొంటాడట; మలకలన్+చరించి= వంకరటింకరగా తిరిగి; చించున్= విడగొట్టుతాడు; అరి సైన్యంబుల్= శత్రువుల సేనలు; కోణ వ్యాయామ గతులన్+వలయములై+ఉండన్= రెండు రేఖలు కలిసే రీతిని యుద్ధం చేస్తూ, చక్రాకారం సృష్టించి; తిరిగి= చరించి; కలఁచున్= కలతపెట్టుతాడు.

**తాత్పర్యం:** భీష్ముడు యుద్ధ విద్యలో గొప్ప నేర్పరి. శత్రుసేనలను చీలికలు చేస్తూ లోపలికి దూరుతాడు. గుంపులు చేస్తాడు. వంకర టింకరగా తిరిగి చించుతాడు. కోణాలు ఏర్పడేటట్లు, వృత్తాలు ఏర్పడేటట్లు తిరుగుతూ కలత పెడతాడు.

**విశేషం:** శత్రుసేనలు గుమిగూడి వలయాకారంగా మోహరించవచ్చు, భీష్ముడు 'కోణవ్యాయామ గతి' తిరిగి శత్రుసేనను చెండాడాడు. కోణము: రెండు రేఖలు కలిసేచోటు. వలయము: చక్రాకారము.

**క. డొల్లెడు తలయును దునిసెడు । విల్లును ధర కొఱగు మేను విఱిగెడు సిడముం**
**బెల్లు దొరఁగు నెత్తురు నై । పల్లటిలం దొడఁగె నపుడు పాండవ బలముల్. 270**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో (భీష్ముడు యుద్ధం చేసే సమయంలో); డొల్లెడు= ఊడి క్రిందపడే; తలయును= శిరస్సు; తునిసెడు+విల్లు= ముక్క చెక్కలయ్యే ధనువూ; ధరకున్+ఒఱగు మేను= నేలమీద పడే శరీరం; విఱిగెడు, సిడమున్= ముక్కలయ్యే జెండా; పెల్లు, తొరఁగు, నెత్తురు= మిక్కుటంగా కారే నెత్తురు; ఐ= కలవై; పాండవ+బలముల్= పాండవుల సైన్యాలు; పల్లటిలన్+తొడఁగెన్= చెల్లా చెదురై పోసాగాయి.

**తాత్పర్యం:** భీష్ముడు యుద్ధం చేసిన సమయంలో పాండవుల సైన్యాలు తల్లడిల్లిపోయాయి. ఎక్కడ చూచినా, డొల్లిన శిరస్సులు, విరిగిన ధనువులు, భూమిపై పడిపోయే శరీరాలు, విరిగిన జెండాలు, మిక్కుటంగా స్రవించే నెత్తురు కన్పించాయి.

**వ. ఇట్లు ప్రళయకాలతాండవంబునం బ్రచండమూర్తి యగు నష్టమూర్తియుం బోలె విజృంభించిన భీష్ము మార్కొను మగలు లేక పాండవసైన్యంబు బెండువడియున్న యెడ నభిమన్యుండు గనకవర్ణ తురంగంబులుం గర్ణికారధ్వజంబును మెఱయం దాఁకి. 271**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ప్రళయ+కాల+తాండవంబునన్= ప్రళయకాలంలో నాట్యం చేసే; ప్రచండ+మూర్తి+అగు= భయంకరమైన ఆకృతిగల వాడైన; అష్టమూర్తియున్+పోలెన్= ఎనిమిది ఆకృతులుగల శివుడివలె; విజృంభించిన= అతిశయించిన= చెలరేగిన; భీష్మున్= భీష్ముడిని; మార్కొను= ఎదిరించే; మగలు= వీరులు; లేక= కనిపించక; పాండవ+సైన్యంబు= పాండవులసేన; బెండుపడి+ఉన్న+ఎడన్= నీరసించి, శుష్కించి ఉన్న వేళ; అభిమన్యుండు= అభిమన్యుడు (అర్జునుడి కొడుకు యువవీరుడు); కనక, వర్ణ, తురంగంబులన్= బంగారు రంగు గల గుర్రాలనూ; కర్ణికార+ధ్వజంబును= కొండగోగు పువ్వు గుర్తుగల జెండా; మెఱయన్= ప్రకాశించగా; తాఁకి= మార్కొని.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రళయకాలంలో నాట్యం చేస్తూ చెలరేగే ఎనిమిది ఆకృతులుగల శివుడివలె విజృంభించే భీష్ముడిని ఎదుర్కొనే వీరులు లేక, పాండవసైన్యం చెదరి శుష్కించిపోయిన సమయంలో, అభిమన్యుడు బంగారు రంగుగల గుర్రాలు పూన్చిన రథంపై కొండగోగు పువ్వు గుర్తుగల జెండా వెలుగొందుతుండగా కౌరవసేనను మార్కొన్నాడు.

**విశేషం:** అష్టమూర్తి : శివుడు - ఎనిమిది ఆకృతులు గలవాడు, పంచభూతాలు, సూర్యచంద్రులు, యజ్ఞంచేసినవాడు వెరసి శివుడి అష్టమూర్తులు.

**సీ. శల్యు నారాచ పంచకమున నొప్పించి । యొకకోలఁ గృతవర్మయురము నొంచి,**
**క్రూరభల్లమున దుర్ముఖు సూతు తల ద్రుంచి । తఱిమి వివింశతి ధనువుఁ దునిమి**
**వెడఁద యమ్మున నేసి వెండియు మూఁడు వా । లికయమ్ము లొడలఁ గీలించి కృపుని**
**హయముల శరచతుష్టయతాడనమున ను । బ్బడఁగించి భీష్ముపై నడరి మేన**

**తే. విశిఖ నవకంబు నాటించి వెగడు పఱిచి । పేర్చి యార్చిన సురకోటి పిచ్చలించె;**
**మెచ్చి భీష్మాదు లెల్ల వివ్వచ్చుఁ బోలు । నెక్కు డగుఁ గాని యసదుగాఁ డీతఁ డనిరి. 272**

**ప్రతిపదార్థం:** నారాచ+పంచకమునన్= అయిదు బాణాలతో; శల్యున్= శల్యుడిని; నొప్పించి= బాధపడేటట్లు చేసి; ఒక+కోలన్= ఒక బాణంతో; కృతవర్మ+ఉరమున్= కృతవర్మ వక్షాన్ని; నొంచి= బాధించి; క్రూర+భల్లమునన్= కఠినమైన బాణంతో; దుర్ముఖు, సూతు, తలన్+త్రుంచి= దుర్ముఖుడి యొక్క రథసారథి శిరసు తునిమి; తఱిమి= ఉత్సాహంతో పూని; వివింశతి, ధనువు, తునిమి= వివింశతి విల్లు ముక్కలు చేసి; వెండియున్= మరల; వెడఁద+అమ్మునన్= వాడి బాణంతో; ఏసి= కొట్టి; మూఁడు+వాలిక+అమ్ములన్= మూడు వాడి బాణాలతో; ఒడలన్= దేహమునందు; కీలించి= సంధించి; కృపుని, హయములన్= కృపుడి గుర్రాలను; శర, చతుష్టయ, తాడనమునన్= నాలుగు బాణాల తాకిడితో; ఉబ్బు+అడఁగించి= అతిశయం అణగగొట్టి; భీష్మపైన్= భీష్మునిపై; అడరి= విజృంభించి; మేనన్= శరీరంపై; విశిఖ+నవకంబు= తొమ్మిది బాణాలు; నాటించి= గ్రుచ్చుకొనేటట్లుగా చేసి; వెగడు+పఱిచి= తల్లడిల్లచేసి; పేర్చి= విజృంభించి; ఆర్చినన్= సింహనాదం చేయగా; సురకోటి= (ఆకాశంలో విమానాలు అధిరోహించి చూచే) వేల్పుల సముదాయం; పిచ్చలించెన్= ఆశ్చర్య చకితం అయింది; భీష్మ+ఆదులు+ఎల్లన్= భీష్ముడు మొదలైన వారు అందరూ; ఈతఁడు= ఈ అభిమన్యుడు; వివ్వచ్చున్+పోలున్= అర్జునుడితో సరితూగుతాడు; ఎక్కుడు+అగున్= అధికుడు అవుతాడు; కాని= అంతేగాని; అసదు+కాడు= తక్కువ కాఁడు; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** ఈ సీస పద్యంలో అభిమన్యుడి పరాక్రమం వర్ణించబడింది. అభిమన్యుడు శల్యుడిపై అయిదు బాణాలు ప్రయోగించి నొప్పించాడు. కృతవర్మ రొమ్మును ఒక బాణంతో నొప్పించి వాడిబాణంతో దుర్ముఖుని రథసారథిని సంహరించాడు. తరిమి వివింశతి విల్లు దునిమి వెడలైన బాణంతో కొట్టి ఇంకా మూడు వాడిబాణాలు శరీరమునందు నాటి, నాల్గు బాణాలతో కృపుని గుర్రాలను కొట్టి అతడి ఉత్సాహాన్ని చెరిచాడు. తరువాత భీష్ముడిపై విజృంభించి అతని దేహమునందు తొమ్మిది అమ్ములు నాటి తల్లడపరచి చెలరేగిసింహనాదం చేశాడు. అభిమన్యుడి పరాక్రమప్రాభవమునకు దేవతలు ఆశ్చర్యచకితులయ్యారు. భీష్ముడు మొదలగు వీరాధివీరులు ఈ అభిమన్యుడు అర్జునుడికి సాటివస్తాడు. అతడి కంటే అధికుడేగాని, తక్కువ వాడుకాడు అని ప్రశంసించారు.

**చ.** **అమరతరంగిణీ తనయుఁ డర్జుననందనుసూతుఁ గేతుదం**
**డము నిరు మూఁడు దూపులఁ బడం గడు బెట్టిదమేసి యుజ్జ్వలా**
**స్త్రము లడరింపఁ గూడికొని తక్కటి యేవురుఁ బెక్కులమ్ము లొ**
**క్కమొగి రయంబునం గురియఁగా గిరి వోలె నతం డుదగ్రుఁడై.** 273

**ప్రతిపదార్థం:** అమర, తరంగిణీ, తనయుఁడు= దేవనదీసూనుడు (భీష్ముడు); అర్జును, నందను, సూతున్= అర్జునుడి కొడుకుయొక్క రథసారథిని; కేతు, దండమున్= జెండా కర్రను; ఇరుమూఁడు తూపులన్= ఆరు బాణాలతో; పడన్= పడిపోయేటట్లుగా; కడు, బెట్టిదము+ఏసి= మిక్కిలి గట్టిగా కొట్టి; ఉజ్జ్వల+అస్త్రములు= ప్రకాశవంతములైన మంత్ర బాణాలను; అడరింపన్= ప్రయోగించగా; కూడికొని= కలిసి; తక్కటి+ఏవురు= మిగిలిన ఐదుగురు= శల్యుడు, కృతవర్మ, దుర్ముఖుడు, వివింశతి, కృపుడు; పెక్కులు+అమ్ములు= అనేక బాణాలు; ఒక్క+మొగిన్= ఒకేసారి; రయంబునన్= వేగంగా; కురియఁగాన్= వర్షించగా; అతండు= అభిమన్యుడు; గిరి+పోలెన్= పర్వతంవలె; ఉదగ్రుఁడు+ఐ= భయంకరుడై.

**తాత్పర్యం:** గంగాసుతుడు భీష్ముడు అర్జునుడి కొడుకైన అభిమన్యుడి రథసారథిని, జెండాకర్రను ఆరు బాణాలతో ఖండించి వెలుగొందే మంత్ర బాణాలను ప్రయోగించాడు. అంతలో శల్యుడు, కృతవర్మ, దుర్ముఖుడు, వివింశతి, కృపుడు కూడుకొని పెక్కు బాణాలు అభిమన్యుడిపై వర్షించారు. అయితే అభిమన్యుడు పర్వతంవలె చలించక నిలిచాడు.

**క.** **వారల శరవర్షంబులు । వారించుచు వేఱవేఱ వాలంపగముల్**
**వారలపైఁ గురియుచుఁ గురు । వీరుని తాలధ్వజంబు విఱుగఁగ నేసెన్.** 274

**ప్రతిపదార్థం:** వారల, శర, వర్షంబులు= వానవలె (కురువీరులు) కురిపించిన బాణాలను; వారించుచున్= నిరోధిస్తూ; వేఱ+వేఱన్= వేరువేరుగా (అనగా ఆయా వీరులందరిపై వేరుగా); వాలు+అంపగముల్= వాడియైన బాణాల గుంపులు; కురియుచున్= వర్షిస్తూ; కురు+వీరుని= కౌరవులలో వీరుడైన భీష్ముడి యొక్క; తాల+ధ్వజంబు= తాడిచెట్టు గుర్తుగల జెండా; విఱుగఁగన్= తునకలు అయ్యేటట్లుగా; ఏసెన్= బాణాలు ప్రయోగించాడు.

**తాత్పర్యం:** వారు తనపై వర్షించిన బాణాలన్నింటినీ నిరోధిస్తూ, వారి వారిపై వేరు వేరుగా బాణాల గుంపులు కురిపిస్తూ, కురువీరుడైన భీష్ముని తాటి చెట్టు జెండా పడిపోయేటట్లు శరాలు ప్రయోగించాడు.

**ఆ.** **తాటిసిడము విఱిగి ధరణిపైఁ గూలినఁ । బాండురాజ సుతుల బలము లెల్ల**
**నొక్కపెట్ట యార్చె నుక్కఱి కౌరవ । సేన జోదుపిండు చిన్నఁబోయె.** 275

**ప్రతిపదార్థం:** తాటి+సిడము= తాడిచెట్టు గుర్తుగా గల జెండా; విఱిగి= ముక్కలై; ధరణిపైన్+కూలినన్= భూమిమీద పడేసరికి; పాండురాజ, సుతుల, బలములు+ఎల్లన్= పాండవుల సేనలు అన్నీ; ఒక్క+పెట్ట= ఒకేసారిగా; ఆర్చెన్= సింహనాదాలు చేశాయి; ఉక్కు+అఱి= బలం క్షీణించి; కౌరవ, సేన, జోదు, పిండు= కౌరవుల సేనలోని యోధుల సమూహం; చిన్నఁబోయెన్= క్రుంగిపోయింది.

**తాత్పర్యం:** తాటిచెట్టు గుర్తుగల జెండా విరిగి నేలమీద పడిపోయింది. పాండవ సేనలన్నీ ఒక్కసారిగా సింహనాదాన్ని చేశాయి. బలం తగ్గి కౌరవసేనలోని యోధావళి చిన్న వోయింది.

**విశేషం:** అలనాటి యుద్ధ విద్యలో జెండాను కాపాడుకొనటం వీరుడి కర్తవ్యం; పరాక్రమంలో అంతర్భాగం. జెండా పడిపోవటం అవమానమే. అభిమన్యుడు సేనాపతినే అవమానించగలిగాడు.

**తే. సింహనాదంబుతో భీమసేనుఁ డప్పు। డనుజ తనయునిఁ జేకొని యరిబలంబు**
**దరలఁ దాఁకిన నతని యుత్తాల సింహ। కేతనముఁ గూల్చె సురనదీసూతి యలిగి. 276**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; భీమసేనుఁడు= భీముడు; సింహనాదంబుతోన్= సింహగర్జనవంటి కేకతో; అనుజ, తనయునిన్= తమ్ముడి కొడుకును (అభిమన్యుడిని); చేకొని= స్వీకరించి (అనగా బాసటగా తాను వచ్చి నిలిచి); అరి+బలంబు= శత్రువుల సేన; తరలన్= వెనుకంజవేసేటట్లుగా;తాఁకినన్= తలపడగా; అతని= ఆ భీమసేనుడియొక్క; ఉత్తాల, సింహ, కేతనమున్= ఎత్తైనది సింహం గుర్తు గలది అయిన జెండాను; అలిగి= కోపంతో; సుర, నదీ, సూతి= భీష్ముడు (వేల్పు నది కొడుకు); కూల్చెన్= క్రిందపడేటట్లు (బాణాలు ప్రయోగించి) చేశాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు భీష్ముడి జెండా కూల్చి, వీర విహారం చేసేటప్పుడు భీముడు సింహనాదం చేస్తూ అక్కడకు వచ్చి, తన తమ్ముడి కొడుకుకు బాసటగా నిలిచి, శత్రుసేనలు వెనుకంజ వేసేటట్లుగా తలపడ్డాడు. ఆ భీముడిపై కోపించి, గంగాసుతుడైన భీష్ముడు ఎత్తుగా సింహం గుర్తుతో ఎగిరే ఆతడి జెండాను నేలపై కూల్చాడు.

**క. పవనజుఁడు మూఁడు శరముల। దివిజనదీసూను నేసి దృఢగతిఁ గృపు మే**
**నవియ నొకటఁ గృతవర్మని। యవయవతతి నెనిమిదింట నార్చుచు నేసెన్. 277**

**ప్రతిపదార్థం:** పవనజుఁడు= వాయుపుత్రుడు (భీముడు); మూఁడు+శరములన్= మూడు బాణాలతో; దివిజ, నదీ, సూనున్= గంగానదీ పుత్రుడిని (భీష్ముడిని); ఏసి= కొట్టి; దృఢగతిన్= గట్టిగా; ఒకటన్= ఒక బాణంతో; కృపుమేను= కృపునిశరీరం; అవియన్= నొచ్చునట్లుగా; ఎనిమిదింటన్= ఎనిమిది(అమ్ములు)తో; కృతవర్మని+అవయవతతిన్= కృతవర్మ యొక్క దేహంలోని అంగాలను; ఆర్చుచున్= సింహనాదం చేస్తూ; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** భీముడు భీష్ముడిపై మూడు బాణాలు వేశాడు. కృపాచార్యుడి శరీరం నొచ్చేటట్లుగా ఒక్క బాణంతో గట్టిగా కొట్టాడు. ఎనిమిది బాణాలు వేసి కృతవర్మ అవయవాలను నొప్పించి సింహనాదం చేశాడు.

**వ. మఱియు నమ్మారుతతనయుండు. 278**

**ప్రతిపదార్థం:** మఱియున్= వెండియు; ఆ+మారుత+తనయుండు= వాయుపుత్రుడైన ఆ భీముడు.

**తాత్పర్యం:** అంతేకాక వాయుపుత్రుడైన ఆ భీముడు.

**శా. మద్రేశున్ వెగడొంద నేసె; నతనిన్ మన్నించు జోదుల్ ప్రతా**
**పోద్రేకంబున నొక్కపెట్ట రథవేగోద్దీప్తులై తాఁకినన్**
**రౌద్రం బాకృతిఁ బొంద సూతహయగాత్రంబుల్ వెసం ద్రుంచి చం**
**చద్రక్తోదకవీచులం దడిపె నాశ్చర్యంబుగా నందఱన్. 279**

**ప్రతిపదార్థం:** మద్ర+ఈశున్= మద్రదేశరాజు శల్యుడిని; వెగడొందనన్+ఏసెన్= సొమ్మసిల్లి పోయేటట్లుగా బాణాలతో కొట్టాడు; అతనిన్+మన్నించు+జోదుల్= ఆ శల్యుడిని గౌరవించే వీరులు; ప్రతాప+ఉద్రేకంబునన్= పరాక్రమం పొంగి పొరలిపోయేటట్లుగా; ఒక్కపెట్టన్= ఒకేసారిగా (ఒక్కుమ్మడిగా); రథ, వేగ, ఉత్+దీప్తులు+ఐ= రథాల వేగాలతో వెలుగొందే వారై; తాఁకినన్= మార్కొనగా; భీముడు; రౌద్రంబు+ఆకృతిన్+పొందన్= మూర్తీభవించిన రోషమో అనునట్లుగా; సూత, హయ, గాత్రంబుల్= సారథులయొక్కయు, గుర్రాల యొక్కయు శరీరాలు; వెసన్= వేగంగా; త్రుంచి= ఖండించి; అందఱన్= ఆ యోధుల నందరినీ; ఆశ్చర్యంబుగాన్= అబ్బురం కలిగేటట్లు; చంచత్+రక్త+ఉదక, వీచులన్= చలించే నెత్తురుఅనే నీటి కెరటాలతో; తడిపెన్= తడిసేటట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** భీముడు శల్యుడిని సొమ్మసిల్ల చేశాడు. ఆ శల్యుడి మీద గౌరవంతో తన మీదకు ఉరికివచ్చిన యోధులను పరాక్రమ వేగంతో రథాలను తనపైకి మళ్ళించిన వారిని అందరినీ కరడుగట్టిన రోషమో అన్నట్లుగా విజృంభించి, వారి రథసారథులను, గుర్రాలను చీల్చి చెండాడి, ప్రవహించే నెత్తురు అనే నీటి కెరటాలతో తడిపి వేశాడు.

**వ. తదనంతరంబ సాత్యకియు ధృష్టద్యుమ్నుండును గేకయ పంచకంబును విరాటుండు నతని కొడుకులుం దలకడచి యురవడించిన. 280**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటుపిమ్మట; సాత్యకియున్= సాత్యకీ; ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడూ; కేకయ, పంచకంబును= కేకయదేశానికి ప్రభువులైన అయిదుగురు రాజులూ; విరాటుండు= విరాటుడు; అతని, కొడుకులున్= అతడి పుత్రులూ; తలకడచి= ముందుకు వచ్చి; ఉరవడించినన్= విజృంభించగా.

**తాత్పర్యం:** అటు పిమ్మట (అభిమన్యుడికీ, భీముడికీ బాసటగా) సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, కేకయరాజులు అయిదుగురు, విరాటరాజు, అతని కొడుకులు ముందుకు వచ్చి నిలిచి విజృంభించారు.

**విశేషం:** మొట్టమొదట ఒంటరిగా అభిమన్యుడు కురుసేనలో ప్రవేశించాడు. భీష్ముడు మున్నగు వారితో పోరు సలిపి వారిని అవమానించగలిగాడు. అట్లా ఎంతకాలం నిలువగలడు? భీముడు వచ్చి ఆదుకొన్నాడు అభిమన్యుడిని అంతమంది కురువీరుల మధ్య 'ఇద్దరు' మాత్రం ఏం చేయగలరు? ఆ సంగతి గ్రహించి ఇంతలో పాండవ వీరులు పలువురు అక్కడకు చేరారు.

**క. అందఱ మేనుల గంగా । నందనుఁడు శరత్రయములు నాటించెను; శ**
**ల్యుం దాఁకె నుత్తరుఁడు గరి । సందోహముతోడ నధిక సంరంభమునన్. 281**

**ప్రతిపదార్థం:** గంగానందనుఁడు= గంగకొడుకు (భీష్ముడు); అందఱు+మేనులన్= అందరి శరీరములయందు (అనగా సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, కేకయ పంచకం, విరాటుండు, అతని కొడుకుల శరీరాలను); శర+త్రయములు= మూడు బాణాల చొప్పున; నాటించెను= గ్రుచ్చుకొనేటట్లుగా చేశాడు; కరి, సందోహముతోడన్= ఏనుగుల సముదాయంతో; అధిక+సంరంభమునన్= మిక్కుటమైన సన్నాహంతో; ఉత్తరుఁడు= విరాటుడి కొడుకు; శల్యున్+తాఁకెన్= శల్యుడితో తలపడ్డాడు.

**తాత్పర్యం:** భీష్ముడు తనను మార్కొనిన వీరులు అందరిపై అనగా సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, కేకయపంచకం, విరాటుడు, అతడి కొడుకులపై, ఒక్కొక్కరిపై మూడేసి బాణాలు వారి శరీరాలు నొచ్చేటట్లుగా ప్రయోగించాడు. అంతట ఏనుగుల గుంపుతోపాటుగా ఉత్తరుడు శల్యుడిని మార్కొన్నాడు.

**విశేషం:** ఉత్తర గోగ్రహణ యుద్ధంలో ఉత్తరుడు పిరికి పందగా కన్పిస్తాడు. నిజమే. ఆనాడు అతడు ఒంటరిగా అంతటి కౌరవ సైన్యాన్ని ఎదిరించటం అసాధ్యం అని భావించాడు. అది మానవసహజమైన భావన. ఇప్పుడు మహాభారతంలో మహావీరుల గుంపులో ఒకడు. తనచుట్టూ ఎందరో వీరులు ఉన్నారు. ఈ సమయంలో అతడికి వచ్చే ఉత్సాహం, కలిగే ధైర్యం వేరు. వ్యక్తిగతంగా ధైర్యహీనులుగూడా, పదిమందితో కూడినపుడు పెద్ద సంఘంలో కలిసిపోయినపుడూ, ఎక్కడ లేని ధైర్యసాహసాలు ప్రదర్శించగలుగుతారు. అట్లాగే. ఉత్తరుడు ఇపుడు ధైర్యంగా, మహావీరుడైన శల్యుడితో తలపడటం మనోధర్మవేత్తలకు ఆశ్చర్యం కలిగించదు.

**క. నిజ ఘటకు మిగిలి, యుత్తరు । గజ మమ్మద్రేశు రథము గదిసి తురంగ**
**వ్రజము పయి కడరి కడు న । క్కజముగ వెస నేలఁ బెట్టి కాలం జమరెన్. 282**

**ప్రతిపదార్థం:** ఉత్తరు, గజము= ఉత్తరుడి ఏనుగు; నిజ, ఘటకున్+మిగిలి= తన తక్కిన ఏనుగు గుంపును మించి; ఆ+మద్రేశు, రథము= ఆ మద్రరాజు (శల్యుడి) రథాన్ని; కదిసి= సమీపించి; తురంగ, వ్రజముపయికిన్= గుర్రాల సముదాయంపైకి; అడరి= విజృంభించి; కడున్= మిక్కిలి; అక్కజముగన్= ఆశ్చర్యకరంగా; వెసన్= శీఘ్రంగా; నేలన్+పెట్టి= భూమిపై పడగొట్టి; కాలన్= కాలితో; చమరెన్= రాసింది.

**తాత్పర్యం:** ఉత్తరుడి ఏనుగు తక్కిన ఏనుగుల గుంపును మించి శల్యుడి రథాన్ని సమీపించి, గుర్రాల గుంపు పైకి విజృంభించి ఆశ్చర్యకరంగా గుర్రాలను నేలపై పడవేసి తన కాలితో రాసింది.

**తే. శల్యుఁ డుగ్రకోపంబున శక్తి యెత్తి । రయము మెఱయ వైరాటి యురఃస్థలంబు**
**దూఱ వైచిన నంకుశ తోమరములు । విడిచి నడుమన చచ్చుచుఁ బుడమిఁ బడియె. 283**

**ప్రతిపదార్థం:** శల్యుఁడు= శల్యుడు; ఉగ్ర+కోపంబునన్= భయంకరమైన ఆగ్రహంతో; శక్తి+ఎత్తి= శక్తి అనే ఆయుధాన్ని ఎత్తి; రయము+మెఱయన్= వేగం వెలుగొందగా; వైరాటి+ఉరఃస్థలంబున్= విరాటరాజు కొడుకు ఉత్తరుడి వక్షఃస్థలం; దూఱన్+వైచినన్= లోనికి చొచ్చుకొని పోయేటట్లుగా విసరగా; (ఉత్తరుడు) అంకుశ, తోమరములు= ఏనుగును అదుపులో పెట్టి నడిపే కొరముట్టు - ఇనుపగుదియలు; నడుమన= మధ్యలో; విడిచి= వీడి; చచ్చుచున్= మరణిస్తూ; పుడమిన్= భూమిపై; పడియెన్= కూలాడు.

**తాత్పర్యం:** తాను విరథుడు కావటంచేత ఆగ్రహించి శల్యుడు, ఉత్తరుడి వక్షఃస్థలం చొచ్చుకొని పోయేటట్లు 'శక్తి' అనే ఆయుధాన్ని ప్రయోగించాడు. అంకుశం తోమరం ఏనుగు మీదనే విడిచిపెట్టి ఉత్తరుడు చచ్చి నేలమీద పడిపోయాడు.

**విశేషం:** 1.శక్తి - ఈటెవంటి ఇనుప ఆయుధం. గురి తప్పకపోతే - ఎదుటివాడి చావు తప్పదు. కత్తి, బల్లెం, బాణం కలిసినట్టి ఆయుధ విశేషం.

**క. మద్రేశుఁ డంత నిలువక । రౌద్రంబున వాలు వెఱికి రయము మెఱయ న**
**త్యుద్రేకత డాసి యుఱికి । భద్రకరిం గరముఁ దునిమి పదవైచె నిలన్. 284**

**ప్రతిపదార్థం:** మద్ర+ఈశుఁడు= మద్రరాజు(శల్యుడు); అంతన్= అంతట; నిలువక= ఆగక; రౌద్రంబునన్= రోషంతో; వాలు+వెఱికి= కత్తిదూసి; రయము+మెఱయన్= వెలుగొందే వేగంతో; అతి+ఉద్రేకతన్= మిక్కుటమైన ఆవేశంతో; డాసి+ఉఱికి=

సమీపించి గంతువేసి; భద్ర+కరిన్= మదించిన ఏనుగుయొక్క; కరమున్+తునిమి= తొండాన్ని ఖండించి; ఇలన్= నేలపై; పడవైచెన్= విసరివేశాడు.

**తాత్పర్యం:** ఉత్తరుడిని సంహరించటంతో ఆగకుండా, శల్యుడు రోషంతో తన కత్తిదూసి, వేగంగా ముందుకు దూకి, గొప్ప ఆవేశంతో ఆ ఏనుగు తొండం నరికి నేలపైకి విసరివేశాడు.

**క. తన విక్రమంబు సేనలు । వినుతింపఁగ నిట్లు సేసి వేగమ కృతవ**
**ర్మని రథము పైకి లంఘిం । చెను శల్యుఁడు గిరికి దాఁటు సింగము భంగిన్. 285**

**ప్రతిపదార్థం:** తన+విక్రమంబు= తన పరాక్రమం; సేనలు= సైన్యాలు; వినుతింపఁగన్= పొగడుతుండగా; ఇట్లు+చేసి= ఈ విధంగా చేసి; వేగము+అ= శీఘ్రంగా; కృతవర్మని+రథముపైకిన్= కృతవర్మ రథం మీదికి; శల్యుఁడు= శల్యుడు; గిరికిన్+దాఁటు= పర్వతానికి లంఘించే; సింగము+భంగిన్= సింహంరీతిగా; లంఘించెను= దూకాడు.

**తాత్పర్యం:** తన పరాక్రమాన్ని సేనలు పొగడుతుండగా, ఈ విధంగా చేసి (ఉత్తరుడిని 'శక్తి'తో చంపి ఏనుగుతుండం తన కత్తితో నరికి) శల్యుడు, దాపున ఉన్న కృతవర్మ రథంపైకి కొండ మీదికి లంఘించే సింహంవలె చేరుకొన్నాడు.

**చ. అనుజుఁడు వడ్డ శంఖుఁడు మహాగ్రహవృత్తిఁ గడంగి శల్యుపైఁ**
**దన రథరాజితోఁ గవియు దారుణ దర్పముఁ జూచి దంతి ము**
**ట్టినఁ బరికాఱ మొత్తము వడిం బఱతెంచిన మాడ్కి నాపగా**
**తనయుఁడు లోనుగా రథికదంబము బిట్టడరెన్ సముద్ధతిన్. 286**

**ప్రతిపదార్థం:** అనుజుఁడు= సోదరుడు; పడ్డన్= పడిన (ఈ యుద్ధభూమి యందు పడి మరణించగా); శంఖుఁడు= శంఖుడు, విరటుడి కొడుకు; మహా+ఆగ్రహ, వృత్తిన్= మిక్కుటమైన కోప స్వభావంతో; కడంగి= పూని; శల్యుపైన్= శల్యుడిపై; తన రథరాజితోన్= తన రథాల సమూహంతో; కవియు= మార్కొనే; దారుణ, దర్పము= ఘోరమైన పరాక్రమాడంబరం; చూచి= అరసి; దంతిన్= ఏనుగును; ముట్టినన్= తాకగా; పరికాఱ+మొత్తము= తెగకు ముఖ్యమైన ఏనుగుల సమూహాలు; వడిన్= వేగంగా; పఱతెంచినమాడ్కిన్= పరుగెత్తుకొని వచ్చే తీరుగా; ఆపగా తనయుఁడు= నదీపుత్రుడు= భీష్ముడు; లోనుగా+రథికదంబము= మున్నగు రథికుల సముదాయం; సముద్ధతిన్= మిక్కుటమైన గర్వంతో; బిట్టు+ అడరెన్= ఎక్కువగా విజృంభించింది.

**తాత్పర్యం:** ఉత్తరుడు యుద్ధభూమిపై కూలిపోగా, అతడి సోదరుడైన శంఖుడు మిక్కుటమైన కోపంతో శల్యుడిని తాకటం చూచి, యేనుగును ఎదుర్కొంటే, ఏనుగుల గుంపుకు నాయకత్వం వహించే పెద్ద యేనుగు, తక్కిన ఏనుగులు పరుగెత్తుకొని వచ్చే విధంగా కౌరవసేనాపతి భీష్ముడు, తదితర రథికులు గర్వంతో కూడుకొని (శంఖుడిపై) విజృంభించారు.

**తే. భీష్మునంపఱ కోర్వక పెల్లగిల్లి । శంఖుతోడి రథావళి జలదపంక్తి**
**భూరిమారుతహతిఁ దూలపోవునట్లు । వఱచెఁ గని క్రీడి యడ్డంబు వఱపెఁ దేరు. 287**

**ప్రతిపదార్థం:** భీష్మ+అంపఱకున్= భీష్ముడు ప్రయోగించిన బాణపరంపరకు; ఓర్వక= తాళజాలక; పెల్లగిల్లి= క్షోభించి; శంఖుతోడి= శంఖునితో కూడిన; రథ+ఆవళి= రథాలగుంపు; జలదపంక్తి= మబ్బుల దొంతర; భూరి+మారుత+హతిన్= గొప్పగాలి తాకిడిచే; తూలపోవునట్లు= దూరంగా నెట్టివేయబడునట్లు; పఱచెన్= పారిపోయింది; కని= (దానిని) చూచి; క్రీడి= అర్జునుడు; తేరు= తన రథం; అడ్డంబు+పఱపెన్= అడ్డంగా త్రిప్పించి చేరాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ప్రయోగించిన బాణాలకు తాళజాలక శంఖుడి రథ సమూహం, పెద్దగాలి తాకిడికి చెదరిపోయే మబ్బు దొంతరవలె చెదరిపోయింది. ఆ దృశ్యం చూచి అర్జునుడు తన రథాన్ని అడ్డం తిప్పి ఆ చోటికి చేరుకొన్నాడు.

**క. కొఱవియుఁ గొఱవియుఁ దాఁకిన । తెఱఁగున నర్జునుఁడు సురనదీ సూనుఁడుఁ జూ**
**పఱు వొగడఁ దాఁకుటయు ని । ద్దఱ దిక్కుల సైన్యములును దలపడియె వడిన్. 288**

**ప్రతిపదార్థం:** కొఱవియున్+కొఱవియున్+తాఁకిన+తెఱఁగునన్= మండేకర్ర మండే కర్రతో మార్కొనిన రీతిగా; అర్జునుఁడు= అర్జునుఁడూ; సుర+నదీ+సూనుఁడు= గంగకొడుకు(భీష్ముడూ); చూపఱు= చూచేవారలు; పొగడన్= కీర్తించగా; తాకుటయున్= తలపడగా; ఇద్దఱ, దిక్కుల, సైన్యములును= ఇరువైపుల సేనలూ; వడిన్= వేగంగా; తలపడియెన్= ఎదుర్కొన్నాయి.

**తాత్పర్యం:** కొఱవీ కొఱవీ మార్కొన్న మాదిరిగా, అర్జునుడూ భీష్ముడూ ఒకరిపై ఒకరు విజృంభించారు. అంతట ఇరుపక్షాల సేనలు సయితం వేగంగా ఒకదానితో ఒకటి ఢీకొన్నాయి.

**వ. అంత నపరాహ్ణం బయ్యె నట్టియెడ; 289**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; అపర+అహ్ణంబు+అయ్యెన్= మధ్యాహ్నం అయింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో;

**తాత్పర్యం:** అంత మధ్యాహ్నసమయం అయింది. ఆ సమయంలో.

**క. కృతవర్మ రథము డిగ్గి యు । ద్ధతుఁ డై మద్రపతి ఘనగదామండితహ**
**స్తత మెఱయఁ గవిసి రథ్య । ప్రతతిన్ ధరఁ గూల్చె శంఖుబలము దలంకన్. 290**

**ప్రతిపదార్థం:** కృతవర్మ+రథము+డిగి= కృతవర్మయొక్క రథంనుండి క్రిందికిదిగి; మద్రపతి= మద్రదేశరాజు (శల్యుడు); ఉద్ధతుఁడు+ఐ= అతిశయించినవాడై; ఘన, గదా, మండిత, హస్తత, మెఱయన్= గొప్ప గదచేత శోభిల్లిన చేయిగలవాడై ప్రకాశించగా; కవిసి= విజృంభించి; రథ్యప్రతతిన్= గుర్రాల సముదాయాన్ని, శంఖు+బలము= శంఖుడిసేన; తలంకన్= తల్లడిల్లునట్లుగా; ధరన్+కూల్చెన్= భూమిపై పడగొట్టాడు.

**తాత్పర్యం:** కృతవర్మరథం నుండి శల్యుడు క్రిందికి దూకి, గద చేత బట్టి ప్రకాశిస్తూ విజృంభించి, శంఖుడి సేన తల్లడిల్లేటట్లుగా అతడి గుర్రాలను నేలపై పడగొట్టారు.

**క. విరథుఁడయి మాత్స్యపుత్త్రుఁడు । గరవాలము గొని రథంబు గ్రక్కున డిగి యా**
**తురత సురరాజనందను । నరదము మాటునకు నతిరయంబున నరిగెన్. 291**

**ప్రతిపదార్థం:** మాత్స్యపుత్త్రుఁడు= మత్స్యదేశరాజ పుత్రుడు శంఖుడు; విరథుడు+అయి= రథం లేనివాడయి; కరవాలమున్+కొని= కత్తిని పట్టుకొని; రథంబు, గ్రక్కునన్+డిగి= వేగంగా రథంనుండి దూకి; ఆతురతన్= తొట్రుపాటుతో కూడిన వేగంతో; సుర, రాజ, నందను+అరదము+మాటునకున్= దేవేంద్రుడి కొడుకు అగు అర్జునుడి రథం చాటునకు; అతి రయమునన్= మిక్కుటమైన వేగంతో; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** మత్స్య దేశ రాజు కొడుకు శంఖుడు విరథుడై, కత్తి చేతపట్టుకొని, రథం నుండి దూకి వేగంగా అర్జునుడి రథం వెనుకకు పోయి దాగుకొన్నాడు.

**క. దిక్కులఁ దనబాణంబులు । పిక్కటిలఁగ నుల్లసిల్లి భీష్ముఁడు నరు తే**
**రక్కడ డించి ద్రుపదవిభుఁ । డుక్కఱఁ దత్సేనమీఁద నురవడిఁ గవిసెన్. 292**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు= భీష్ముడు; దిక్కులన్= దెసలయందు; తన+బాణంబులు= తన అమ్ములు; పిక్కటిలంగన్= నిండగా; ఉల్లసిల్లి= శోభిల్లి; నరు+తేరు= అర్జునుని రథం; అక్కడన్= ఆ చోట; డించి= విడిచిపెట్టి; ద్రుపదవిభుఁడు= ద్రుపదరాజు; ఉక్కు+అఱన్= బలం తగ్గగా; తద్+సేనమీఁదన్= ఆతడి సైన్యంపై; ఉరవడిన్= మిక్కుటమైన వేగంతో; కవిసెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు తన బాణాలు దెసలలో నిండగా శోభిల్లి, అర్జునుడి రథం విడిచిపెట్టి, ద్రుపదరాజు బలం కోలుపోయి నిస్పృహాయుడై చూస్తూ ఉండగా అతడి సేనను మిక్కిలి వేగంతో మార్కొన్నాడు.

**వ. ఇట్లు గవిసి. 293**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; కవిసి= విజృంభించి.

**తాత్పర్యం:** భీష్ముడు ఈ విధంగా విజృంభించి.

**క. ఎండిన యడవిన్ దరికొని । మండెడు కార్చిచ్చు మాడ్కి మారి మసఁగిన**
**ట్లొండొండ నేచి హయవే । దండ స్యందన పదాతి తతిఁ బొడ వడఁచెన్. 294**

**ప్రతిపదార్థం:** ఎండిన+అడవిన్= ఎండిపోయిన చెట్లతో కూడిన అడవిని; దరికొని మండెడు=కాలుస్తూ, ప్రజ్వలించే; కార్చిచ్చు మాడ్కిన్= దావాగ్నివలె; మారి+మసగినట్లు= విజృంభించినట్లు; హయ, వేదండ, స్యందన, పదాతితతిన్= గుర్రాలు, ఏనుగులు, రథాలు, కాలిభటుల మొత్తమును; ఒండుఒండన్= ఒకదాని పిదప ఒకదానిని; ఏచి= విజృంభించి; పొడవు+అడఁచెన్= రూపుమాపినాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ఈ విధంగా విజృంభించి, ఎండిపోయిన చెట్లతో కూడిన అడవిని కార్చిచ్చు తగులబెట్టే రీతిగా, చతురంగ బలాలను ఒకదాని తరువాత ఒకదానిని వరుసగా నాశనం చేశాడు.

**క. కేకయు లేవుర బలములు । నాకులతం బొంద మార్గణాసారమునం**
**జీకాకు పఱిచె భీష్ముఁ డ । నేక గతులఁ దన రథంబు నేడ్తెర మెఱయన్. 295**

**ప్రతిపదార్థం:** కేకయులు+ఏవుర+బలములు= కేకయరాజులు అయిదుగురిసేనలు; ఆకులతన్+పొందన్= చీకాకుపడునట్లుగా; మార్గణ+ఆసారమునన్= బాణాల జడివానచేత; భీష్ముఁడు= భీష్ముడు; అనేక గతులన్= పెక్కు రీతుల; తన రథంబు= తన తేరుయొక్క; ఏడ్తెఱ+మెఱయన్= విజృంభణము ప్రకాశింపగా; చీకాకు+పఱిచెన్= ఆకుల పరిచాడు.

**తాత్పర్యం:** కేకయరాజులు అయిదుగురి సేనలు చీకాకు పడేటట్లుగా భీష్ముడు తన రథం యొక్క విజృంభణం వెలయగా బాణ వృష్టిలో వారిని ముంచెత్తాడు.

**క. ఉఱక విరాటుబలముపై । గొఱియల పిండునకుఁ గవియు కోల్పులిక్రియ బి**
**ట్టఱఁ గవిసి నదీసూనుఁడు । నుఱుమాడె వియచ్చరులు వినుతి సేయంగన్. 296**

**ప్రతిపదార్థం:** ఉఱక= లెక్కచేయక; విరాటు, బలముపైన్= విరటుడి సేనపై; గొఱియల పిండునకున్= గొర్రెల మందమీదికి; కవియు= విజృంభించే; కోల్పులి+క్రియన్= పెద్దపులివలె; బిట్టు+అఱన్+కవిసి= పెద్దపెట్టున మార్కొని; నదీ+సూనుఁడు= నదికొడుకు(భీష్ముడు); వియత్+చరులు= ఆకాశ సంచారులు(దేవతలు); వినుతి+చేయంగన్= ప్రస్తుతింపగా; నుఱుమాడెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** గొర్రెలమందమీద పడే పెద్దపులివలె భీష్ముడు లక్ష్య పెట్టకుండా విరాటుడి సైన్యాలపై పెద్ద పెట్టున దుమికి ఆకాశ సంచారులు పొగడే విధంగా సంహరించాడు.

**తే. ఇట్లు పాండవ సైన్యంబు లెల్లఁ గలఁగి । యిక్కడక్కడఁ బడుచుండ నక్కజంపుఁ**
**గడిమి కచ్చెరువడి యొక్క కడకు వచ్చి । పాండుసూనులు నివ్వెఱపాటు నొంద. 297**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; పాండవ+సైన్యంబులు+ఎల్లన్= పాండవుల సేనలు అన్నీ; కలఁగి= చీకాకై; ఇక్కడన్+అక్కడన్= ఇచట అచట; పడుచుండన్= కూలుతుండగా; అక్కజంపు+కడిమికిన్= అద్భుతమైనభీష్ముడి పరాక్రమానికి; అచ్చెరువడి= ఆశ్చర్యం చెంది; ఒక్క, కడకున్, వచ్చి= ఒకేచోటికి వచ్చి; పాండుసూనులు= పాండవులు; నివ్వెఱపాటున్+ఒందన్= మిక్కిలి వెఱగు పొందగా.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవ సేనలు అన్నీ కలతచెంది, ఇక్కడ అక్కడ కూలిపోతూ ఉండగా, భీష్ముడి అద్భుతపరాక్రమానికి ఆశ్చర్య చకితులై పాండవులందరూ ఒక చోటికి వచ్చి నివ్వెరపాటు పొందగా (తరువాతి పద్యంతో అన్వయం)

**క. శాంతనవుఁడు దేజోదు । ర్దాంతుం డై నావెలుంగు ధరకెల్లను జా**
**లింతు నినుఁ డస్తశైలో । పాంతమునకుఁ జనిన నేమి యనిన ట్లుండెన్. 298**

**ప్రతిపదార్థం:** శాంతనవుఁడు= శంతనుడి కొడుకు భీష్ముడు; తేజస్+దుః+దాంతుండు+ఐ= తేజస్సుచేత అణచరాని వాడవుతూ; నావెలుంగు= నా ప్రకాశం; ధరకున్+ఎల్లను= భూమికి అంతటికిని; చాలింతున్= సరిపోయేటట్లుగా చేయగలను; ఇనుఁడు= సూర్యుడు; అస్త, శైల, ఉపాంతమునకున్= అస్తగిరి ప్రాంతానికి(అస్తమించే కొండదరికి); చనినన్+ఏమి= వెళ్ళితే ఏమిలే; అనిన+అట్లు= అనినరీతిగా; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు సూర్యుడి మాదిరిగా తేజస్సుతో వెలుగొందాడు. 'నా వెలుగు చాలు. ఈ భూమిని అంతటిని ప్రకాశించేటట్లు చేయటానికి. ఇక ఇప్పుడు సూర్యుడు అస్తమిస్తే మాత్రం ఏ లోటు ఉంటుంది?' అని చెప్పేటట్లుగా ఉన్నది. అనగా భీష్ముడు సూర్యుడివలె దేదీప్యమానంగా వెలుగొందాడు.

**క. సోమాన్వయ ప్రదీపకుఁ । డీ మెయి దేజో విశేష మెసకం బెసఁగం**
**గా మెఱయుట గనుఁగొని సి । గ్గై మఱువడుమాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్. 299**

**ప్రతిపదార్థం:** సోమ+అన్వయ, ప్రదీపకుఁడు= చంద్రవంశాన్ని వెలుగొంద చేసేవాడు(భీష్ముడు); ఈ మెయిన్= ఈ విధంగా; తేజస్+విశేషము+ఎసకంబు+ఎసఁగన్= గొప్ప తేజస్సు అతిశయిల్లగా; మెఱయుట+కనుఁగొని= ప్రకాశించటం చూచి; సిగ్గు+ఐ= సిగ్గుకలిగి, లజ్జతో; మఱుఁగు పడు మాడ్కిన్= చాటగు రీతిగా; అంతన్= ఆ సమయంలో; అర్కుండు= సూర్యుడు; క్రుంకెన్= అస్తమించాడు.

**తాత్పర్యం:** చంద్రవంశాన్ని ప్రకాశమానం చేసే భీష్ముడు ఈ విధంగా గొప్ప తేజస్సుతో వెలుగొందటం చూచి, సూర్యుడు సిగ్గుపడి తాను కనిపించకుండా వెళ్ళిపోయాడా అన్నట్లు అస్తమించాడు.

**తే. జలరుహంబులు పాండవసైనికుల మొ । గంబు లట్టుల విన్ననై కాంతి దఱిఁగె;**
**వారి మనముల భీత్యంధకార మడరు । కరణిఁ జీఁకటి యెడనెడఁ గవియుఁదెంచె. 300**

**ప్రతిపదార్థం:** జలరుహంబులు= నీటిలో పుట్టినవి(కమలాలు); పాండవ+సైనికుల+మొగంబులు+అట్టులన్= పాండవసేనలోని భటుల మొగాలవలె; విన్ననై= వెలవెలబోయి; కాంతి+తఱిఁగెన్= తేజస్సును కోల్పోయాయి; వారి+మనములన్= పాండవసైనికుల

మనస్సులలో; భీతి+అంధకారము= భయం అనే చీకటి; అడరు+కరణిన్= వ్యాపించే రీతిగా; చీఁకటి= అంధకారం; ఎడన్+ఎడన్= ఆయా చోటులందు; కవియుఁదెంచెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** సూర్యుడు అస్తమించాడు. పద్మాలు పాండవసేనలలోని భటుల మొగాలవలె ముడుచుకుపోయాయి. వారి మనస్సులలో భయం అనే చీకట్లు క్రమ్ముకొన్నట్లుగా ఆయా చోటులలో చీకట్లు వ్యాపించసాగాయి.

**విశేషం:** అలం: ఉపమ, ఉత్ప్రేక్ష. 1. పద్మాలు సూర్యాస్తమయంతో ముడుచుకొనిపోతాయి అని కవిసమయం. 2. ప్రబంధ యుగంలో - ఇట్టి ఉత్ప్రేక్షలు తామర తంపరలు. వీటికి తిక్కన ఒజ్జబంతులు తీర్చాడని చెప్పవచ్చును. అయితే తిక్కన వీటిని చాలా అరుదుగా వాడాడు. 3. మహాభారత యుద్ధంలో ఇరుపక్షాల ఒడంబడిక సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు పోరాటం జరగాలి. (ఈ నియమాన్ని అతిక్రమించటం ఒకేసారి జరిగింది. పదునాల్గవ రోజు సైంధవవధా నంతరం రాత్రి యుద్ధం జరిగింది.)

**వ. అప్పడు గయ్యంబు సాలించి. 301**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కయ్యంబు= యుద్ధం; చాలించి= విరమించి.

**తాత్పర్యం:** అప్పుడు యుద్ధం ఆపివేసి.

**తే. ఉభయసేనలుఁ దమతమ యునికిపట్ల । కరిగెఁ దాత పరాక్రమ స్ఫురణమునకుఁ**
**గురువిభుండును దమ్ములుఁ బరమహర్ష । భరితహృదయులై యుండిరి భరతముఖ్య! 302**

**ప్రతిపదార్థం:** భరత ముఖ్య!= భరతవంశంలో ముఖ్యుడైనవాడా, ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఉభయ+సేనలున్= రెండుసైన్యాలూ; తమతమ+ఉనికిపట్లకున్= తమ తమ నివాసాలకు; అరిగెన్= వెళ్ళాయి; తాత, పరాక్రమ, స్ఫురణమునకున్= భీష్ముడి శౌర్య ప్రసారానికి; కురు+విభుండును= కురురాజు(దుర్యోధనుడు); తమ్ములు= అతని సోదరులు; పరమ, హర్ష, భరిత, హృదయులు+ఐ= మిక్కిలి సంతోషంతో నిండిన గుండెలు కలవారై; ఉండిరి= ఉన్నారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భరతవంశంలో ముఖ్యుడైనవాడా! అప్పుడు యుద్ధం ఆపివేసి రెండు సేనలలోనివారు తమ తమ ఆవాసాలకు వెళ్ళిపోయారు. తమ తాత భీష్ముడి శౌర్య ప్రసారానికి దుర్యోధనుడూ అతడి తమ్ములూ ఆనందంతో నిండిన హృదయాలు కలవారై ఉన్నారు.'

**వ. అని సంజయుండు భీష్మాటోపంబు సెప్పెనని పలుకుటయుఁ 'దొలునాఁటి కయ్యంబున గాంగేయుచేత**
**నట్లయినఁ బాండునందనులు పదంపడి యేమి సేసి?'రని యడిగిన 303**

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; సంజయుండు= సంజయుడు; భీష్మ+ఆటోపంబు= భీష్ముడియొక్క విజృంభణం; చెప్పెన్+అని= చెప్పాడు; అని; పలుకుటయున్= అని చెప్పటం; తొలునాటి కయ్యంబునన్= మొదటిరోజు యుద్ధంలో; గాంగేయుచేతన్= భీష్ముడిచేతిలో; అట్లు+అయినన్= ఆ విధంగా కాగా (ఆ రీతిగా పరాజయం అనుభవించిన); పాండునందనులు= పాండవులు; పదంపడి= పిదప; ఏమి+చేసిరి?= ఏం చేశారు?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా.

**తాత్పర్యం:** భీష్ముడి పరాక్రమ విజృంభణం గూర్చి సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు. 'మొదటిరోజు యుద్ధంలో ఆ విధంగా తల్లడిల్లిపోయిన పాండవులు పిదప ఏమి చేశారు?' అని ధృతరాష్ట్రుడు ప్రశ్నించాడు.

**ఆశ్వాసాంతము**

**చ.** **నిగమశిఖా విహారమహనీయ! మునీశ్వర భావనీయ! స**
**ర్వగురు మహానుభావ! మధురప్రకటాప్రతిమ స్వభావ! దే**
**వగణనిషేవ్య! వారిగిరి వాస వినోద విభావ్య! విశ్వలో**
**కగతవపుర్వికస్వర! వికారవిదూర విలాస భాస్వరా!** **304**

**ప్రతిపదార్థం:** నిగమ, శిఖా, విహార, మహనీయ!= ఉపనిషత్తులు విహారరంగాలుగా కలిగిన గొప్పవాడా!; ముని+ఈశ్వర+భావనీయ!= గొప్ప ఋషులచేత భావింపబడదగినవాడా!; సర్వ, గురు, మహానుభావ!= అందరు దేశికుల గొప్ప అనుభవం కలవాడా!; మధుర, ప్రకట+అప్రతిమస్వభావ!= తియ్యగా అభివ్యక్తమయ్యే సాటిలేని స్వభావం కలవాడా!; దేవ, గణ, నిషేవ్య!= వేల్పుల సమూహం చేత సేవింపతగినవాడా!; వారి, గిరి, వాస, వినోదభావ్య!= నీటియందును పర్వతమునందును నివసించి ఆనందించేవాడా!; విశ్వ, లోక, గత, వపుః+వికస్వర!= సమస్త లోకాలకు వ్యాపించిన దేహ వికాసం గలవాడా!; వికార, విదూర, విలాస, భాస్వరా!= స్వభావంలో మార్పులేని భోగములందు ప్రకాశించేవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! ఉపనిషత్తులలో విహరించేవాడా! ముని శ్రేష్ఠులచేత భావించబడేవాడా! గురువులందరి గొప్పతనానికి ఆకారమైనవాడా! సాటిలేని మధురమైన ఆంతర్యం కలవాడా! దేవతల సముదాయంచేత సేవింపబడేవాడా! సముద్రంలో ( క్షీరసాగరంలో) (హరి) కొండపై (కైలాసగిరిపై) (హర) నివసించేవాడా! యావత్ ప్రపంచం దేహంగా పరిణమించినవాడా! చెరుపులేని భోగాలలో ప్రకాశించేవాడా!

**క.** **దూరాంతిక దుర్గమ వి । స్తార! సుగమసన్నివేశ! తావదచల స**
**ర్వారంభక నిష్క్రియ! సం । స్కారోజ్జ్వల విశ్వసంప్రకాశనమూర్తీ!** **305**

**ప్రతిపదార్థం:** దూరాంతిక+దుర్గమ+విస్తార!= దవ్వుల ఉండటం, దగ్గరగా ఉండటం, చేరలేకపోవటం, వ్యాపనం కలవాడా!; సుగమ, సన్నివేశ!= సులువుగా పొందదగినవాడా!; తావత్, అచల, సర్వ+ఆరంభక+నిస్+క్రియ= అంతమాత్రమే కదలకుండగా అన్ని ప్రయత్నాల యందు తటస్థంగా ఉండేవాడా! అనగా అన్ని కార్యముల యెడ సాక్షీభూతుడవుగా ఉండేవాడా!; సంస్కార+ఉజ్జ్వల!= పరిశుద్ధతతో ప్రకాశించేవాడా!, విశ్వ సంప్రకాశన మూర్తీ!= సృష్టిని వెలుగొందజేసే ఆకృతి కలవాడా!

**తాత్పర్యం:** దవ్వుల ఉండటం, దగ్గరగా ఉండటం, చేరలేకపోవటం అనే విభిన్న గుణాలకు సమన్వయ కేంద్రమైనవాడా! సులువుగా పొందదగినవాడా! సర్వకార్యాలకు సాక్షీభూతుడవైన వాడా! పరిశుద్ధతతో ప్రకాశించేవాడా! సర్వసృష్టిని ప్రకాశమానంగా చేసేవాడా!

**విశేషం:** హరిహరనాథుడు - తిక్కన సమన్వయం వేదాంత తత్త్వానికి ప్రతీక.

**మాలిని.**

**నిరతిశయమహత్త్వోన్మేష! నిర్ధూతదోషా!**
**విరతి హృదయ రమ్యావేశ! నిత్యప్రకాశా!**
**భరితభువన తేజోభవ్య యోగానుభావ్యా!**
**స్ఫురితగుణ నమశ్శ్రీ పుణ్య నైర్గుణ్య గణ్యా!** **306**

**ప్రతిపదార్థం:** నిరతిశయ+మహత్వ+ఉత్+మేష= సాటిలేని గొప్పతనంచేత మిరుమిట్లు గొలిపేవాడా!; నిర్ధూతదోషా!= చెదరగొట్టబడిన తప్పులు కలవాడా, పవిత్రుడా!; విరతి+హృదయ+రమ్య+ఆవేశా= కోరికలు లేనిగుండెలలో అందమైన పొందిక కలవాడా!; నిత్యప్రకాశా= ఎల్లప్పుడు వెలుగొందేవాడా!; భరిత+భువన+తేజస్+భవ్య+యోగ+అనుభావ్య!= నిండిన లోకప్రకాశంచేత వెలిగే పవిత్రమైన యోగంచేత తెలియదగినవాడా!; స్ఫురిత+గుణ+నమశ్రీ= ప్రకాశించే గుణాలచేత గొప్పతనం చెందినవాడా!; పుణ్యా నైర్గుణ్యాగణ్యా!= ఏ గుణాలు లేకపోవటం చేత గొప్పదనం పొందినవాడా.

**తాత్పర్యం:** సాటిలేని గొప్పతనంచేత దేదీప్యమానంగా వెలుగొందేవాడా! దోషరహితుడా! నిష్కామ హృదయాలలో స్ఫూర్తిని కలిగించేవాడా! ఎల్లప్పుడు ఉండేవాడా! సర్వలోకాలలో ప్రకాశించే యోగంవలన తెలిసికొనదగినవాడా! వెలుగొందే గుణాలవలన గొప్పదనం పొందినవాడా! నిర్గుణతత్త్వమునకు లక్ష్యమైనవాడా!

**గద్యము.**

**శ్రీమదుభయకవిమిత్త్ర, కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** శ్రీమత్= మంగళకరమైన; ఉభయకవిమిత్త్ర= సంస్కృత ఆంధ్రభాషలకు చెందిన రెండు రకాల కవులకు-మిత్రుడైనవాడూ; కొమ్మన+అమాత్యపుత్త్ర= కొమ్మనామాత్యుని కుమారుడు; బుధ+ఆరాధన, విరాజి= పండితులను సేవించటం చేత ప్రకాశించేవాడు, లేదా, పండితులు (తమను) సేవించటం చేత ప్రకాశించేవాడు; తిక్కన సోమయాజి; ప్రణీతంబు+అయిన= రచించబడిన; శ్రీమత్+మహాభారతంబునన్= శుభప్రదమైన మహాభారతంలో; భీష్మపర్వంబునందున్= భీష్మపర్వంలో; ప్రథమ+ఆశ్వాసము= మొదటి అశ్వాసం.

**తాత్పర్యం:** ఉభయ కవిమిత్రుడూ, కొమ్మనామాత్యుడి కుమారుడూ, పండితులచేత ఆరాధించబడుతూ ప్రకాశించేవాడూ, (పండితుల ఆరాధనంచేత ప్రకాశించేవాడూ) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీమహాభారతంలోని భీష్మపర్వంలో ప్రథమాశ్వాసం.

**భీష్మపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము - ద్వితీయాశ్వాసము

**శ్రీ నిర్మాణ విచక్షణతా । నిష్ఠాపర కటాక్ష! ధర్మసరోజా**
**సీన ! నిరంజన భక్తో । ద్యాన వసంతాయమాన! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీ నిర్మాణ+విచక్షణతా నిష్ఠా+పర కటాక్ష= సంపద చేకూర్చటంలో వివేకంతో కూడిన దీక్ష వహించిన దృష్టి కలవాడా! ; హరిహరనాథా!= విష్ణు శివతత్త్వాలు సంగమించిన దేవా!; ధర్మ సరోజ+ఆసీన!= ధర్మం అనే పద్మం కూర్చొనే చోటుగ చేసికొన్నవాడా!; నిరంజన= ప్రాపంచిక విషయాలందు వైరాగ్యం గల; భక్త+ఉద్యాన, వసంతాయమాన!= భక్తులు అనే తోటకు, ఆమని వంటివాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! సంపదలను ప్రసాదించటంలో యుక్తాయుక్త పరిజ్ఞానం కలవాడా! ధర్మం అనే పద్మాన్ని ఆసనంగా చేసికొన్నవాడా! ప్రాపంచిక విషయ విరక్తిగల భక్తులు అనే తోటకు అభ్యుదయ పరంపరాభివృద్ధులు చేకూర్చే వసంత ఋతువు వంటివాడా!

**విశేషాలు:** 1. శ్రీ శబ్దానికి సంపద, కాంతి మున్నగు ఎన్నో అర్థాలు ఉన్నాయి. 2. పద్మాసనం వేసికొని యోగులు తపస్సు చేస్తారు. హరిహరనాథుడు ధర్మ పద్మాసనుడుగా వర్ణించబడ్డాడు. 3. వసంతఋతువులో చెట్లు చిగిరించి మొగ్గతొడిగి కన్నుల పండువుగా కన్పిస్తాయి. భక్తులు అనే చెట్లకు హరిహరనాథుడు వసంతఋతువు వంటివాడు. 4. భక్తుడు= భక్తి కలవాడు - దేవునియందు ఎడతెగని భక్తి కలవాడు భక్తుడు 5. ధర్మము= పురుషార్థాలలో మొదటిది. భారతీయ సంస్కృతికి ఆత్మ ధర్మం. ధర్మ నిర్వచనం చేయటం మిక్కిలి కష్టం.

ధర్మనిర్వచనం చేసిన సుప్రసిద్ధ ప్రాచీన సంస్కృత శ్లోకం :

**- "ధృతిః క్షమా దమోz స్తేయం శౌచమింద్రియ నిగ్రహః,**

**ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణమ్" - (మనుస్మృతి - 6-92)**

6. 'భక్తోద్యాన వసంతాయమాన' అన్న ప్రయోగంలో ఎంతో విశాలమైన అర్థం ఇమిడిఉన్నది. భక్తిలో సౌశీల్యం కూడా ఇమిడి ఉన్నది.

**" అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ**

**నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ" - (భగవద్గీత 12-13)**

ఇతరులను ద్వేషించనివాడు, సర్వభూతాల యెడ స్నేహభావం కలవాడు, నిరహంకారుడు, సుఖదుఃఖాతీతుడు, క్షమా బుద్ధిగలవాడు మాత్రమే భక్తుడు.

## ధర్మజుఁడు గోపాలదేవు పాలికిం జనుట (సం. 6-46-1)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ పరమాత్మా! హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయనుడు అనే మహర్షి; జనమేజయునకున్= జనమేజయుడు అనే రాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వైశంపాయన మహర్షి జనమేజయ మహారాజుతో ఈ విధంగా అన్నాడు.

**తే. అట్లు దనవారు మేలు చే యైన భంగి వినిన ధృతరాష్ట్రుఁ డా సూత తనయుతోడ**
**నెలమి నటమీఁది వృత్తాంత మెట్లు సెప్పు మనినఁ గురువంశవర్య యిట్లనియె నతఁడు. 3**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; తనవారు= తనకు సంబంధించినవారు(ధృతరాష్ట్రుడు, అతడికి సంబంధించిన వారు- కౌరవులు) మేలుచేయి+ఐనభంగి= పై చేయిగా ఉన్నరీతిని (యుద్ధంలో పాండవులను మించుతున్న రీతిని); వినిన= ఆలకించిన; ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; ఆ సూత+తనయుతోడన్= (తనకు యుద్ధవృత్తాంతం వినిపిస్తున్న సంజయుడితో) సూతుడి కుమారుడితో; ఎలమిన్= ఉత్సాహంతో; అటమీఁదివృత్తాంతము= ఆపైన జరిగిన సంగతి; ఎట్లు+చెప్పుము+అనినన్= ఏ విధంగా జరిగిందో వచింపుము అని అడుగగా; కురువంశవర్య!= కురువంశంలో శ్రేష్ఠుడవైనవాడా(ఓ జనమేజయ మహారాజా)!; అతఁడు= ఆ సంజయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా కౌరవులు యుద్ధంలో పాండవులకంటె పైచేయిగా ఉండటం విని, ధృతరాష్ట్రుడు ఉత్సాహపడి, ఆ తరువాత జరిగిన వృత్తాంతాన్ని వినిపించుమని సంజయుడిని కోరాడు. జనమేజయమహరాజా! అప్పుడు సంజయుడు ఈ విధంగా చెప్పాడు.

**వ. ఆ రాత్రి ధర్మతనయుండు విషణ్ణచిత్తుండై తమ్ములం దగువారలం గూర్చికొని గోపాలదేవుపాలికిం జని యతనితో నిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** ఆ+రాత్రి= ఆ రేయి,(కురుక్షేత్ర సంగ్రామం జరిగిన మొదటినాటి రాత్రి); ధర్మతనయుండు= ధర్మరాజు; విషణ్ణ చిత్తుండు+ఐ= దుఃఖంతో కూడిన మనస్సు కలవాడై; తమ్ములన్= తమ్ములను; తగువారలన్+కూర్చుకొని= తగినవారిని వెంటపెట్టుకొని; గోపాలదేవుపాలికిన్+చని= శ్రీకృష్ణుడి దగ్గరకు వెళ్ళి; అతనితోన్= ఆ శ్రీకృష్ణుడితో; ఇట్లు+ అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** కురుక్షేత్ర సంగ్రామంలో మొదటి రోజు యుద్ధంలో కౌరవులు పాండవులను మించారు. అందుచేత ధర్మరాజు మనస్సు దుఃఖభరితమై పోయింది. తన తమ్ములను, మరికొందరు ఆప్తులను వెంటబెట్టుకొని, ధర్మరాజు శ్రీకృష్ణుడి దగ్గరకు వెళ్ళి ఈ విధంగా తన మనోవేదన విన్నవించుకొన్నాడు.

**విశేషాలు:** తిక్కన తెలుగు మహాభారతానికి శ్రోతలు. 1. కృతిపతి హరిహరనాథ దేవుడు, 2. శౌనకుడు - నైమిశారణ్యంలో సూతుడు చెప్పాడు. 3. జనమేజయుడు - సత్రయాగంలో వైశంపాయన ప్రోక్తం. అంతేకాక, యుద్ధ కథనంలో, 4.ధృతరాష్ట్రుడు- యుద్ధ వృత్తాంతం ధృతరాష్ట్రుడికి నివేదించింది సూతసుతుడు అయిన సంజయుడు. యావద్భారతం నైమిశారణ్యంలో పంద్రెండేండ్లు జరిగిన సత్రయాగంలో శౌనకాది మహర్షులకు వినిపించినది ఉగ్రశ్రవసుడు అనే పేరుగల సూతసూనుడు.

**చ. ' ఎరగలి చిచ్చు గాఁడవి యెల్లను బెల్లుగ నొక్కపాయగా**
**దరికొని రూపడంచిన విధంబున నిక్కడిసేన యంతయుం**
**దరమిడి చంపె భీష్ము బలదర్ప మహోగ్రతఁ గంటె? నింక నే**
**బిరుదొకో నీలమేఘ మనఁ బేర్చి యనిం దెగటార్చు నాతనిన్? 5**

**ప్రతిపదార్థం:** ఎరగలి+చిచ్చు= దావాగ్ని(కార్చిచ్చు); కాఱు+అడవి= దట్టమైన అరణ్యం; ఎల్లను= అంతటిని; పెల్లుగన్= మిక్కుటంగా; ఒక్క+పాయగాన్= ఏకమొత్తంగా; దరికొని= కాల్చి; రూపు+అడంచిన, విధంబునన్= నాశనం చేసిన రీతిగా; ఇక్కడి, సేన+అంతయున్= ఈ పక్షంలో ఉన్న సైన్యాన్ని అంతటినీ; తరము+ఇడి,చంపెన్= హెచ్చు తగ్గులు లేకుండా సంహరించాడు; భీష్మ, బల, దర్ప, మహా+ఉగ్రతన్= భీష్ముని యొక్క పరాక్రమము యొక్క గొప్ప తీవ్రతను; కంటె!= చూచావుగద!; ఇంకన్= ఇకమీద; అనిన్= యుద్ధంలో; ఆతనిన్= ఆ భీష్ముడిని; నీల,మేఘము+అనన్=నల్లని మబ్బు అనేటట్లుగా; పేర్చి= అతిశయించి; ఏ బిరుదు+ఒకో= ఏ పరాక్రమవంతుడో; తెగటార్చున్?= సంహరింపగలడు?

**తాత్పర్యం:** దట్టమైన అడవిని అంతటినీ కార్చిచ్చు ఒకేసారిగా నాశనం చేసే రీతిగా, ఈ సేనను అంతటినీ విచక్షణలేకుండా భీష్ముడు సంహరించాడు గదా! భీష్ముడి ప్రతాపం మిక్కుటమైనది చూశావుగదా! ఇంక కారుమబ్బుతో సమానమైన ఏ శూరుడు అతడిని యుద్ధంలో సంహరింపగలడు?

**విశేషాలు:** i).ఎరగలి+చిచ్చు - దావాగ్నికి చక్కని చిక్కని తెలుగు పలుకుబడి. ii). ఈ పద్యంలో తెలుగు నుడికారపు సొంపులు, ప్రౌఢ సంస్కృత పదములు తిక్కన అతుకులు కనిపించకుండా చక్కగా సంధించాడు. భావానుగుణమైన భాషకు భావోచితమైన ఛందస్సు ప్రయోగించటంలో తిక్కన నేర్పరి. అలంకారం ఉపమ.

**చ. అలవి యెఱుంగ నేరక మహాత్ముని లోకముతోడి పాటిగాఁ**
**దలఁచితి; బేలనైతి; శరతాడనపీడితు లైరి నీ మఱఁ**
**దులు; నమరాపగా తనయుతోడి రణంబునకున్ దిశాధినా**
**థులు నఱుమంగఁ జాల రని తోఁచుచున్నది నా మనంబునన్. 6**

**ప్రతిపదార్థం:** అలవి= పరిమితి (శక్తి సామర్థ్యముల కొలది); ఎఱుంగ+నేరక= తెలియజాలక; మహా+ఆత్మునిన్= గొప్ప ఆత్మగల (భీష్ముడిని); లోకము+తోడి+పాటిగాన్= భూలోకంలో నున్న మానవులతో సరిపోలే వాడిగా; తలఁచితిన్= అనుకొన్నాను; బేలన్+ఐతిన్= అవివేకిని అయ్యాను; నీ+మఱఁదులు= నీ బావలు; శర,తాడన,పీడితులు+ఐరి= (భీష్ముడి) బాణాల తాకిడిచేత బాధింపబడిన వారు అయ్యారు; అమర+ఆపగా,తనయు,తోడి, రణంబునకున్= దేవనదీసూనుడితోడి (భీష్ముడితోడి) యుద్ధానికి; దిశా+అధినాథులున్= దిక్పాలకులుకూడ; అఱుమంగన్+చాలరు+అని= ఎదుర్కొనటానికి సమర్థులు కారు అని; నా+మనంబునన్= నా మనసుకు; తోఁచుచున్+ఉన్నది= తట్టుతున్నది.

**తాత్పర్యం:** భీష్ముడు మహానుభావుడు, జగదేకవీరుడు. ఏదో లోకంలోని వీరులసాటివాడు అని భ్రమించి ఉన్నాను. అది నా అవివేకం. ఇప్పుడు ఆతని శౌర్యం పరిమితి ఎట్టిదో తెలిసికొనగలిగాను. నీ బావలు అతడి బాణాల తాకిడికి తట్టుకోలేక బాధ చెందారు. మరి దిక్పాలకులు గూడ భీష్ముడితో యుద్ధం చేయటానికి సమర్థులు కారు అని నా అభిప్రాయం.

**విశేషాలు:** i). దిశాధినాథులు= అష్టదిక్పాలకులు - 1. ఇంద్రుడు, 2. అగ్ని, 3. యముడు, 4. నిరృతి, 5.వరుణుడు, 6. మరుత్తు, 7. కుబేరుడు, 8. ఈశుడు.

**చ. అతని జయించు నంచు మన మర్జును నెంతయు నమ్మి యుండఁగా**
**నితఁడును సంగరంబున నుపేక్షకుఁ డయ్యె; వృకోదరుం డొకం**
**డ తఱికిఁ జొచ్చి దోర్బలము డాఁపక పోరెడు; నేమి సేయు? నా**
**కితనిని నీతనిం దడవ నేటికిఁ? గయ్యపుజోలి మానెదన్? 7**

**ప్రతిపదార్థం:** అతనిన్= (భీష్ముడిని); జయించున్+అంచున్= గెలువగలడు అని; మనము+అర్జునున్= మనము అర్జునుడిని; ఎంతయున్= మిక్కుటంగా; నమ్మిఉండఁగాన్= విశ్వసించి ఉండగా; ఇతఁడును= అర్జునుడుకూడా; సంగరంబునన్= యుద్ధమునందు; ఉపేక్షకుఁడు+అయ్యెన్= ఉదాసీనుడైనాడు (లెక్కచేయనివాడైనాడు); వృకోదరుండు+ఒకండ= భీముడు ఒక్కడే; తఱికిన్+చొచ్చి= సమయానికి పూనుకొని; దోస్+బలము-దోర్బలము= భుజపరాక్రమం; డాఁపక= దాచుకొనకుండా; పోరెడున్= యుద్ధం చేశాడు; ఏమి+చేయున్?= అంతకుమించి ఏమి+చేయగలడు?; నాకున్= నాకు; ఇతనినిన్+ఈతనిన్= ఇతడినీ, ఇతడినీ; తడవన్+ఏటికిన్?= విమర్శించటం ఎందుకు?; కయ్యపు, జోలి+మానెదన్= యుద్ధం చేసే ప్రసక్తిని విరమించుకొంటాను.

**తాత్పర్యం:** మన అర్జునుడు భీష్ముడిని జయించగలడని ఆశలు పెంచుకొన్నాము కాని ఆతడు యుద్ధరంగంలో ఏమీ చేయలేకపోయాడు. భీష్ముడి ధాటిని ఎదుర్కొనలేక ఉదాసీనుడైపోయాడు. భీమసేనుడు ఒక్కడు మాత్రమే యుద్ధంలో తన శక్తి వంచన లేకుండ పోరాడాడు. అంతకంటె ఏమి చేయగలడు? వీరినీ వారినీ నేను ఎందుకు నిందించాలి? యుద్ధం విరమించాలని నాకు అనిపిస్తున్నది.

**విశేషం:** ఈ పద్యం - ధర్మరాజ - భీమ అర్జునుల శీలానుశీలనానికి ఉపకరిస్తుంది. ధర్మరాజు శాంతి ప్రియుడు. యుద్ధ విముఖుడు. అర్జునుడు వివేకి. వివేకం పరాక్రమంలో అంతర్భాగమే. అసమయ సాహస ప్రదర్శన మంచిది కాదు. అది బూడిదలో పోసిన పన్నీరు. (కర్ణ పర్వంలో చండమార్తాండుడుగ వెలుగొందుతున్న కర్ణుడి వర్చస్సు చూచి, 'మాధవా మన రథమింక మరలనిమ్ము। బ్రతికి యుండిన శుభములు పడయవచ్చు' అని , అప్పుడు యుద్ధము చేయలేదు. సరియైన సమయం చూచుకొని కర్ణుడిని సంహరించాడు. భీముడిలో ఆవేశం ఎక్కువ. ఆలోచన తక్కువ. చిత్తశుద్ధి పరాక్రమానికి గాని వివేకానికి గాని పర్యాయపదం కాదు.

మహా భారతం- మానవ స్వభావ వైవిధ్యాన్ని హృదయంగమంగా చిత్రించింది. కురుక్షేత్ర సంగ్రామంలో తొలి దినమందు - ధర్మరాజు దృష్టిలో - అర్జునుడు 'ఉపేక్షకుఁడయ్యె'. అది ఉపేక్ష కాదు. అర్జునుడు ఎంత పోరాడినప్పటికీ, భీష్ముడి విజృంభణాన్ని అరికట్ట సాధ్యం కాలేదు. సర్వసైన్యాధిపతి భీష్ముడు. అది తొలిదినం. అతడు జగదేక ధనుర్ధరుడు. అర్జును డెంత పరాక్రమోపేతుడైనప్పటికీ ఏమి చేయగలడు? ఒకనాడు - ధర్మజ, భీమ, నకుల సహదేవులు నలుగురు కలిసి, జయద్రథుడి విజృంభణ మరికట్టలేకపోయారు.

అర్జునుడు 'పట్టపగటింటి సూర్యుని పగిది' వెలుగొందే కర్ణుడిని - అప్పుడే మూర్ఖంగా ఎదుర్కొని ఉంటే ఏమయ్యేవాడో ఎవరు చెప్పగలరు? మానవ మానస క్షీర సాగర మథనం మహాభారతంలో కన్పిస్తుంది.

**క. నరపతుల నెల్ల భీష్మున । కెరగా నొప్పింపఁజాల; నే నడవులకున్**
**మరలం బోయెద; నచటం । దిరిగెదఁ; గూరాకు గోసి తినియెద ననఘా! 8**

**ప్రతిపదార్థం:** నరపతులన్+ఎల్లన్= రాజులను అందరనూ; భీష్మనకున్= భీష్ముడికి; ఎరగాన్= ఆహారంగా; ఒప్పింపన్+చాలన్= పడవేయ నేరను; ఏన్= నేను; అడవులకున్= అరణ్యాలకు; మరలన్= మళ్ళీ; పోయెదన్=వెళ్ళిపోతాను; అనఘా! పాపరహితుడైనవాడా!= ఓ కృష్ణా!; అచటన్= (ఆ అడవులలో); తిరిగెదన్= తిరుగుతాను; కూర+ఆకు= కూరలు, ఆకులు; కోసి= త్రుంచి; తినియెదన్= తింటాను.

**తాత్పర్యం:** శ్రీ కృష్ణా! నా పక్షాన యుద్ధం చేయటానికి వచ్చిన రాజులను అందరినీ భీష్ముడికి ఎరగా సమర్పించలేను. నేను తిరిగి అడవులకు పోయి అక్కడే కూరలూ, ఆకులూ తింటూ ఉంటాను.

**విశేషాలు:** 1. ఎర వాచ్యార్థంలో వానపాము. చేపలను పట్టేందుకు గాలానికి చివర సూదికి 'ఎర' గ్రుచ్చుతారు. చేప ఆ ఎరను తినటానికి వచ్చి సూదికి గ్రుచ్చుకొని పోతుంది. ఎర అనగా పశుపక్ష్యాదులకు వేసే ఆహారం. ఇచ్చట 'ఎర' అనే మాట చాటున చాలా అర్థం దాగుకొని ఉన్నది. ఎర ఒక భ్రమ కల్పిస్తుంది. అట్లాగే, పాండవపక్షంలో పోరాడే రాజులను ఎరగా చూపి భీష్ముడు వచ్చినపుడు ఈ పాచిక పారాలి. ఆతడిని అర్జునుడు పట్టుకొనాలి.

ఈ విధంగా భీష్ముడిని మోసగించటానికి వీలు కాలేదు. మాయోపాయాలు పన్ని యుద్ధం చేయటం కంటె అడవులలో కూరాకు తిని బ్రదకటమే మంచిది అని ధర్మరాజు అభిప్రాయం.

2. లోగడ ధర్మరాజు పండ్రెండు ఏండ్లు వనవాసం చేసి ఉన్నాడు గదా! అందుకే 'మరలన్' అనటం.

**క. నీ మాట మెయిన చేయుదు । మే మెయ్యది యైన నెందు నెప్పుడు మాకున్**
**దామోదర! యశుభస్థితి । లేమి శుభము కలిమి నీదు లీలయ కాదే! 9**

**ప్రతిపదార్థం:** దామోదర!= ఓ శ్రీకృష్ణా!, నీ,మాట, మెయిన్+అ= నీమాట చొప్పున, చేయుదుము= చేయగలం; ఏ+అది+ఐనన్= ఏదైననూ; ఎందున్= ఏ చోటనైనా; ఎప్పుడున్= ఏ సమయంలో అయినా; మాకున్= మాకు; అశుభ+స్థితి+లేమి= అమంగళ పరిస్థితి లేకపోవటం; శుభము= మంచిస్థితి; కలిమి= కలగడం; నీదులీల+అ= నీ ఆట మాత్రమే; కాదు+ ఏ!= కాదా!(అవును)

**తాత్పర్యం:** ఓ శ్రీకృష్ణా! మేము నీవు చెప్పినట్లుగానే నడచుకొంటున్నాం. ఎప్పుడైనా, ఎచటనైనా, దేనినైనా నీ ఇష్టాన్నే పాటిస్తున్నాం. మాకు అశుభం లేకపోవడం, శుభం కలగడం అది అంతా నీ లీలామహిమ మాత్రమే!

**వ. చేయం గల పని యెయ్యది? పనుపు' మనినం బద్మనాభుండు పాండవాగ్రజున కిట్లనియె. 10**

**ప్రతిపదార్థం:** చేయన్+కల పని= చేయవలసిన క్రియ- కర్తవ్యం; ఏది+అది=ఎయ్యది= ఏది; పనుపుము= ఆజ్ఞాపించుము; అనినన్= అని అనగా; పద్మనాభుండు= నాభియందు పద్మం కలిగినవాడు, విష్ణువు= శ్రీ కృష్ణుడు; పాండవ+అగ్రజునకున్= పాండవులలో మొదట పుట్టినవాడికి- ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇక కర్తవ్యం ఏది? దయచేసి తెలుపుము' అని ధర్మరాజు అడుగగా శ్రీకృష్ణుడు అతడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషాలు:** 1. పద్మనాభుఁడు= పద్మం నాభియందు కలవాడు శ్రీవిష్ణువు. ఆతడి నాభి కమలం నుండి బ్రహ్మదేవుడు ఉద్భవించాడు. ఇది పురాణ కథ. శ్రీకృష్ణుడు విష్ణుదేవుడి అవతారం అని పురాణ కథనం. సంస్కృత మహాభారత రచనా కాలం నాటికే అందలి పాత్ర అయిన శ్రీకృష్ణుడు, విష్ణువు అవతారంగా సుప్రసిద్ధుడు. 'విష్ణు ర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాః' - అని అమరకోశం. ఇక తిక్కన తెలుగు మహాభారత కాలం నాటికి ఆ కృష్ణుడికి విష్ణువుకు అభేదం సిద్ధించి యుగయుగాంతరాలయింది.

**ఉ. ' నెవ్వగ యింత యేల? విను! నీ కెదు రెవ్వరు? నీదు తమ్ములం**
**దెవ్వరు సూచినన్ జగము లిన్నియు గెల్వఁ గలారు; లావునం**
**గ్రొవ్విన భీష్ము నోర్చు రణకోవిదుఁ డైన శిఖండి; యేను నీ**
**కొవ్వనివారి నెల్లఁ గ్రమయుక్తి లయం బొనరింతు నెమ్మెయిన్. 11**

**ప్రతిపదార్థం:** నెవ్వగ (నెఱ+వగ)= పూర్ణమైన అనగా మిక్కుటమైన దుఃఖం; ఇంత+ఏల?= ఇంతగా నీకు ఎందుకు? (అనగా ఇంతటి ఆవేదన నీకు అనవసరం అన్నమాట); విను= ఆలకించుము; నీకున్+ఎదురు+ఎవ్వరు?= నీకు వ్యతిరేకంగా ఎవరు నిలువగలరు?; నీ+తమ్ములందున్= నీ సహోదరులలో ఎవరైన; చూచినన్= చూడగా; జగములు= లోకాలు; ఇన్నియున్= అన్నింటినీ; గెల్వన్+కలారు= జయించగలరు; లావునన్= పరాక్రమంతో; క్రొవ్విన= గర్వించిన; భీష్మున్= భీష్ముడిని; ఓర్చు= జయించగల; రణ+కోవిదుఁడు+ఐన= యుద్ధమునందు నేర్పుగల; శిఖండి; ఓర్చున్= జయింపగలడు; నేను; నీకున్+ ఒవ్వనివారిన్+ఎల్ల= నీకు ఇష్టులు కాని వారిని అందరినీ; క్రమ+యుక్తిన్= వరుసగా; ఎమ్మెయిన్= ఏదో విధంగా, తప్పకుండా; లయంబు+ఒనరింతున్= సంహరించగలను.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! నీకు ఇంత ఆవేదన ఎందుకు? నీ కెదురెవ్వరు? నీ తమ్ములలో ఎవరినిచూచినా లోకాలన్నిటినీ జయించగలసమర్థులు. బలగర్వితుడైన భీష్మణ్ణి రణకోవిదుడైన శిఖండి జయిస్తాడు. నీకు ఇష్టులు కాని వారినందరినీ నేను వరుసగా ఏదో ఒక తీరున సంహరిస్తాను.

**విశేషం:** శిఖండి - ద్రుపద మహారాజు పుత్రుడు. పుట్టినపుడు అతడు ఆడశిశువు. పిదప మగవాడైనాడు. పూర్వజన్మంలో అతడు అంబ. ఆమె భీష్ముడిపై పగ వహించి, శివుడిని గూర్చి తపస్సు చేసి, అతడిని సంహరించేటట్లు వరం పొంది, పునర్జన్మలో శిఖండిగా జన్మించినట్లు పూర్వగాథ. ఉస్మానియా ముద్రిత ప్రతిలో పై పద్యములోని రెండవ చరణంలో యతి తప్పింది. 'జగములన్నియు' అనటానికి మారుగా 'జగములిన్నియు' - అనే వారిళ్ళ ప్రతిపాదం సమంజసం.

క. **సత్య పరాక్రముఁ డగు నీ । సాత్యకి బాహాబలంబు సమరవిహారౌ**
**ద్ధత్యముఁ జూచెదు గాదే । యత్యాశ్చర్యంబు లితని యస్త్రవిధంబుల్.** 12

**ప్రతిపదార్థం:** సత్య, పరాక్రముఁడు+అగు= యథార్థమైన గొప్ప శౌర్యం కలవాడైన; ఈ+సాత్యకి= ఈ సాత్యకి; బాహా,బలంబు= భుజబలం - శౌర్యం; సమర,విహార+ఔద్ధత్యము= యుద్ధమునందు విచ్చలవిడిగా సంచరించే అతిశయత్వము; చూచెదు+కాదు+ఏ!= నీవే చూస్తావుగదా!; ఇతని= (ఈ సాత్యకి యొక్క); అస్త్ర+విధంబుల్= మంత్రబాణాలు ప్రయోగించే తీరు తెన్నులు; అతి+ఆశ్చర్యంబుల్= మిక్కిలి వింత గొలిపేవి.

**తాత్పర్యం:** సత్యపరాక్రముడైన ఈసాత్యకి భుజబలం, ఇతని సమరవిహారంలోని గడుసుతనం చూస్తున్నావుగదా! ఈతని అస్త్ర ప్రయోగనైపుణ్యం అత్యాశ్చర్యకరమైనది.

**విశేషం:** 1. రామాయణంలో వాల్మీకి పలుసార్లు శ్రీరాముడిని "సత్య పరాక్రముడు'' అని అభివర్ణిస్తాడు. ఆ ప్రౌఢ సంస్కృత ప్రయోగాన్ని తిక్కన తెలుగు భారతములో ఇచ్చట ప్రయోగించినాడు. 2. సాత్యకి యాదవవీరుడు. వరుసకు శ్రీకృష్ణుడికి తమ్ముడు, ద్రోణ శిష్యుడు. అర్జునుడికి సతీర్థ్యుడు. కురుక్షేత్ర సంగ్రామంలో చావకుండా మిగిలిన వీరులలో ఒకడు. ఇతడు భారతయుద్ధానంతరం 36 సంవత్సరాలకు సంభవించిన అంతఃకలహంలో కృతవర్మ (కౌరవ పక్షంలో చేరిన యాదవ వీరుడు)తో జరిగిన ద్వంద్వయుద్ధంలో మరణించాడు.

శా. **ఉద్యద్విక్రము లైన యీ ద్రుపద మత్స్యోర్వీపతుల్ నిన్ను సం**
**పద్యోగోజ్జ్వలుఁ జేయఁ బూని కడఁకం బ్రాణంబు లీనున్న ని**
**ట్లుద్యోగం బెడలంగ నేమిటికి? నీ కుర్వీశ! వే యేల? ధృ**
**ష్టద్యుమ్నుం డొకరుండ విద్విషదవష్టంభంబు మాన్పింపఁడే?'** 13

**ప్రతిపదార్థం:** ఉద్యత్,విక్రములు+ఐన= ప్రకాశించే శౌర్యం కలిగినవారు అయిన; ఈ+ద్రుపద,మత్స్య+ఉర్వీపతుల్= ఈ ద్రుపదరాజు మరియు విరాటరాజూ; నిన్నున్= నిన్ను; సంపద్+యోగ+ఉజ్జ్వలున్+చేయన్+పూని= ఐశ్వర్యంతో కూడిన యోగంతో మిక్కుటంగా ప్రకాశించేవాడినిగా చేసేదీక్ష గొని; కడఁకన్= పూనికతో; ప్రాణంబులు+ఈన్+ఉన్నన్= అసువులు అర్పించటానికి సిద్ధమై ఉండగా; ఉర్వీ+ఈశ!= రాజా! ధర్మరాజా!; నీకున్= నీకు; ఇట్లు= ఈ విధంగా (నిరుత్సాహం చెంది); ఉద్యోగంబున్= యుద్ధప్రయత్నాన్ని; ఎడలంగన్= వదలటం, విరమించటం; ఏమిటికిన్?= ఎందుకు?; వేయి+ఏల?= వేయిమాటలెందుకు?(ఇన్నిమాటలు అనవసరమని భావం); ధృష్టద్యుమ్నుండు+ఒకరుండు+ అ= ఒక్క ధృష్టద్యుమ్నుడు ఒక్కడే; విద్విషత్+అవష్టంభంబు= శత్రువుల విజృంభణ; మాన్పింపఁడు+ఏ?= అరికట్టడా?

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీ కోసం తమ ప్రాణాలను అర్పించటానికి సంసిద్ధులై, గొప్ప పరాక్రమంతో ప్రకాశించే ద్రుపద మహారాజు, మత్స్య దేశాధీశుడు విరాటరాజు బాసటగా నిలిచి నీకు రాజ్యసంపద కలిగించాలని యత్నిస్తూ ఉండగా నీ విప్పుడు యుద్ధప్రయత్నం మానటమెందుకు? వేయిమాటలెందుకు? జగదేక వీరుడైన ధృష్టద్యుమ్నుడు ఒకడే చాలు, శత్రువుల విజృంభణం అంతా అరికట్టే సమర్థుడు ఆతడు.

**విశేషం:** 1. ధృష్టద్యుమ్నుడు - ద్రుపద మహారాజు కొడుకు - పాండవుల సర్వసేనాపతి.

**వ. అనవుడు ధర్మతనయుండు ధృష్టద్యుమ్ను నాలోకించి. 14**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని శ్రీకృష్ణుడు చెప్పగా; ధర్మతనయుండు= ధర్మసుతుడు= ధర్మరాజు; ధృష్టద్యుమ్నున్+ఆలోకించి= ధృష్టద్యుమ్నుడిని చూచి.

**తాత్పర్యం:** అని అనగా ధర్మరాజు ధృష్టద్యుమ్నుడివైపు చూచి.

**ఉ. పాండవ సైన్య సంఘ పరిపాలన సేయు నితండ యంచుఁ గృ**
**ష్ణుం డభిషేక సంపదుపశోభితుఁ జేయఁగ, నాధిపత్య ము**
**ద్దండతఁ బూని తీ నృపులుఁ దమ్ములు నేనును జుట్టి రాఁ; జమూ**
**మండలి నూలుకొల్పికొని మార్తుర నోర్చినఁ గాక యొప్పునే!' 15**

**ప్రతిపదార్థం:** పాండవ,సైన్య,సంఘ,పరిపాలన,చేయున్= పాండవుల సేనాసమూహాల నెల్లను చేర్చి ఆధిపత్యం వహించగలడు; ఇతండు+అ= ఇతడు(ధృష్టద్యుమ్నుడు); అంచున్= అని చెప్పుతూ; కృష్ణుండు= శ్రీ కృష్ణుడు; అభిషేక+సంపద్+ఉపశోభితున్+చేయఁగన్= శిరస్సుపై శుభజలాలు ప్రోక్షించి-శ్రీమంతుడిని చేసి నిన్ను ప్రకాశమానుడిని చేయగా; ఆధిపత్యము= (సేనపై) అధికారం; ఉద్దండతన్+పూనితి(వి)= గొప్పగా వహించావు; ఈ నృపులు= ఈ రాజులు; తమ్ములు+నేనును= సహోదరులూ, నేనూ; చుట్టిరాన్= పరివేష్టించి యుండగా; చమూ+మండలిన్= సేనా సమూహమును; నూలు కొల్పికొని= ప్రోత్సహించి; మార్తురన్= శత్రువులను; ఓర్చినన్+కాక+ఒప్పును+ఏ?= జయిస్తే తప్ప (నీ సామర్థ్యం) సార్థకం కాదుకదా!

**తాత్పర్యం:** 'ఓ ధృష్టద్యుమ్నుడా! పాండవసైన్య సమూహాన్ని పరిపాలించగల సమర్థుడితడే - అని శ్రీకృష్ణుడు నిన్ను చూపి సర్వసైన్యాధ్యక్ష పదవిలో అభిషిక్తుడిని చేయగా అధికారాన్ని గొప్పగా వహించావు. ఈ రాజులూ, నా తమ్ములూ, నేనూ కలిసి నిన్ను పరివేష్టించిరాగా సేనాసమూహాన్ని పురికొల్పుకొని శత్రువులను జయించకపోతే ఆ పదవికి వన్నెలభిస్తుందా?

**వ. అని యగ్గించినం బొంగి పృషతపౌత్త్రుండు గుంతీపుత్త్రున కిట్లనియె. 16**

**ప్రతిపదార్థం:** అని+అగ్గించినన్= అని పొగడగా, పొంగి= ఉత్సాహాన్ని పొంది, పృషతపౌత్రుండు= పృషతరాజు మనుమడు- ధృష్టద్యుమ్నుడు; కుంతీ పుత్త్రునకున్= ధర్మరాజునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు తనను పొగడగా, ఆ ధృష్టద్యుమ్నుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**చ. ' జగ మెఱుఁగంగ ద్రోణు ననిఁ జంపుటకై సృజియించె ధాత న;**
**న్మగఁటిమి గాఁగ దీనిఁ బలుమాఱు ననం బని లేదు; భీష్ముఁ డా**
**దిగఁ గురుసేనలోన గణుతింపఁగఁ బేర్చిన యోధకోటి నా**
**మొగమునఁ బడ్డ నె ట్లడరి ముట్టెదనో యటు సూచుచుండుమీ!' 17**

**ప్రతిపదార్థం:** జగము+ఎఱుఁగంగన్= ప్రపంచమంతా తెలిసేటట్లుగా; అనిన్= యుద్ధంలో; ద్రోణున్= ద్రోణుడిని; చంపుటకున్+ఐ= సంహరించటం కోసమే; ధాత= బ్రహ్మదేవుడు; నన్= నన్ను సృజియించెన్= సృష్టించాడు; మగటిమి+కాఁగన్= శౌర్యమే కాగా; దీనిన్= ఈ విషయాన్ని; పలుమాఱు= చాలాసార్లు; అనన్+పని+లేదు= చెప్ప నవసరం లేదు; భీష్ముఁడు+ఆది+కన్= భీష్ముఁడు మొదలుకొని; కురు+సేనలోనన్= కౌరవుల సైన్యంలో; గణుతింపఁగన్+పేర్చిన= లెక్కపెట్టగా అతిశయించిన; యోధకోటి= వీరుల సముదాయం; నా+మొగమునన్+పడ్డన్= నాకు ఎదురైనప్పుడు; ఎట్లు+అడరి= ఏ విధంగా అతిశయించి; ముట్టెదనో= పోరాటం చేస్తానో; అటు= ఆ రీతిని; చూచుచుండుమా!= చూస్తూ ఉండుము!

**తాత్పర్యం:** 'ద్రోణుడిని చంపటానికై నన్ను బ్రహ్మదేవుడు సృష్టించాడన్న సంగతి లోకానికి తెలుసు. దీనిని నా పరాక్రమ సూచకంగా పలుసార్లు పేర్కొన పనిలేదు. అది అట్లా ఉండగా, కౌరవసేనలో భీష్మాదులవంటి పేరుమోసిన యోధులందరూ నాకెదురై నిలిచినప్పుడు ఏ విధంగా విజృంభించి ఎదిరిస్తానో గమనించి చూస్తూ ఉండుము!'

**తే. పృషతకులముఖ్యుఁ డిమ్మెయిఁ బేర్చి పలుకు । సంగరోత్సాహకరవాక్యభంగి కపుడు**
**పాండుసుతులును సకల భూపతులు సంత । సంబు నొందిరి, హరియుఁ బ్రియంబు నొందె. 18**

**ప్రతిపదార్థం:** పృషతకులముఖ్యుఁడు= పృషతుడి వంశంలో జనించిన వారిలో పేర్కొనదగినవాడు- ధృష్టద్యుమ్నుడు; ఈ+మెయిన్= ఈ రీతిగా; పేర్చి= అతిశయించి; పలుకు= మాటలాడే; సంగర+ఉత్సాహకర, వాక్య,భంగికిన్= యుద్ధం చేయటానికి ప్రేరేపణ కలిగించే మాటల తీరుకు; అపుడు= ఆ సమయంలో; పాండు సుతులును= పాండవులును; సకల+భూపతులున్= అందరు రాజులును; సంతసంబున్+ఒందిరి= సంతోషించారు; హరియున్= శ్రీ కృష్ణుడును; ప్రియంబున్+ఒందెన్= ప్రీతిచెందాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పృషత వంశస్థులలో ముఖ్యుడైన ధృష్టద్యుమ్నుడు అతిశయించి యుద్ధోత్సాహాన్ని కలిగించే పౌరుషవాక్యాల పద్ధతికి, పాండవులు సంతోషించారు, అచటి రాజులు అందరూ ఆనందించారు. శ్రీకృష్ణుడు కూడ మిక్కిలి ప్రీతిచెందాడు.

**వ. తదనంతరంబ యుధిష్ఠిరుండు ధృష్టద్యుమ్నున కిట్లనియె. 19**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ధృష్టద్యుమ్ననకున్= ధృష్టద్యుమ్ననకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అటు పిమ్మట యుధిష్ఠిరుడు ధృష్టద్యుమ్నుడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. ' తొల్లి గురుండు దానవులతోడి రణంబున వజ్రపాణికిన్**
**దెల్లమి గాఁగఁ జెప్పె నది దీప్తతరం బగు నొడ్డనంబు శో**
**భిల్లుచు వైరి దృష్టులకు భీకరమై చనుఁ గ్రౌంచనామకం**
**బెల్లి ఘటింపు నీదు వెర వేర్పడ నమ్మొన యద్భుతంబుగన్.' 20**

**ప్రతిపదార్థం:** తొల్లి= పూర్వకాలమునందు; గురుండు= ఒజ్జ(బృహస్పతి); దానవులతోడి+ రణంబునన్= రాక్షసులతోడి యుద్ధంలో; వజ్రపాణికిన్= దేవేంద్రుడికి; తెల్లమి+కాఁగన్= స్పష్టంగా తెలిసేటట్లు; చెప్పెన్= వచించాడు; అది= అది; దీప్త+ తరంబు+అగు= మిక్కుటంగా ప్రకాశించేటటువంటి; ఒడ్డనమ్ము= వ్యూహం; శోభిల్లుచున్= విలసిల్లుతూ; వైరిదృష్టులకున్= శత్రువుల చూపులకు; భీకరము+ఐ= భయం కలిగించేదై; చనున్= ఒప్పును; క్రౌంచ+నామకంబు= క్రౌంచము అనే పేరు గలది; ఎల్లి= రేపు; నీదు,వెరవు+ఏర్పడన్= నీ నేర్పరితనం ప్రస్ఫుటమయ్యేటట్లుగా; అమ్మొన= ఆ వ్యూహం; అద్భుతంబుగన్= ఆశ్చర్యకరంగా; ఘటింపుము= నిర్మించుము.

**తాత్పర్యం:** పూర్వకాలంలో రాక్షసులకూ దేవతలకూ యుద్ధం జరిగింది. అప్పుడు దేవతల గురువైన బృహస్పతి దేవేంద్రుడితో 'క్రౌంచ వ్యూహం మిక్కిలి గొప్పది; శత్రువుల దృష్టికి భయం కలిగించగలదు.' అని స్పష్టం చేశాడు. నీవు రేపు ఆ క్రౌంచ వ్యూహాన్ని నిర్మించి నీ తెలివితేటలు చూపించుము. అది అద్భుతంగా ఉండాలి.'

**వ. అనిన విని యతండట్ల చేయువాఁడ నని పలికె నట్లు గలంక దేఱి కృష్ణు వీడ్కొని యెల్లవారల నిజనివాసం బులకుం బోవం బనిచి ధర్మతనయుం డభ్యంతరావాసంబున కరిగెఁ; బ్రభాతం బగుటయుఁ బాండవసైనికుల డెందంబులతోడన యరవిందంబులు వికాసంబు నొందెం 'బదంపడి తదీయ ప్రతాపోదయసహవర్తి యగుచు మార్తాండోదయంబు వెలుంగుటయుం గాలోచిత కృత్యంబులు నిర్వర్తించి కౌంతేయాగ్రజుండు వెడలెఁ; గ్రౌంచవ్యూహంబు సంఘటించు నెడం జంచుత్వంబు భజించి ఫల్గునుండు గాండీవకపిధ్వజంబులు మెఱయం బొలిచి నిలిచెఁ; గుంతిభోజుండును శైబ్యుండును జక్షుస్థ్సానంబులం దేజరిల్లిరి; ద్రుపదుండు శిఖకు నమరె; దశార్ణ శూరసేన కిరాత దేశాధీశులు కంఠాకారంబుఁ దాల్చిరి భీమసేనుండును ధృష్టద్యుమ్నుండును దక్షిణవామపక్షంబు లయిరి; సౌభద్ర సాత్యకి ద్రౌపదేయ పౌండ్ర చోళపాండ్యులు భీమసేను వలను నకుల సహదేవ హైడింబశంబర వత్సమహీపతులు ధృష్టద్యుమ్ను దిక్కునం బన్నిరి; కేకయ కాశిరాజులతోడం గూడి విరాటుండు జఘన భాగభంగికిం దగియుండె; హూణపతి ప్రముఖులు పరివేష్టింప వెన్నయి యుధిష్ఠిరుం డొప్పెఁ; నివ్విధంబున మోహరించిన యప్పుడు . 21**

**ప్రతిపదార్థం:** అనినన్= అని(ధర్మరాజు) చెప్పగా; విని= ఆలకించి; అతండు= అతడు(ధృష్టద్యుమ్నుడు); అట్లు= ఆ రీతిగా; చేయువాఁడన్= చేయగలను; అని+పలికెన్= అని చెప్పాడు; అట్లు= ఆ రీతిగా; కలంకన్+తేఱి= కలతవీడి,(స్వాస్థ్యం చెంది); కృష్ణున్+వీడ్కొని= శ్రీకృష్ణుడిచే సెలవు గైకొని; ఎల్లవారలున్= అందరూ; నిజ+నివాసంబులకున్= తమ తమ విడిదులకు; పోవన్+పనిచి= పంపి; ధర్మతనయుండు= ధర్మరాజు; అభ్యంతర+ఆవాసంబునకున్+అరిగెన్= లోపలనున్న నివాస గృహానికి వెళ్ళాడు; ప్రభాతంబు+అగుటయున్= తెల్లవారగా; పాండవ+సైనికుల+డెందంబులతోడన్+అ= పాండవసేనలలోని భటుల హృదయాలవలెనే; అరవిందంబులు= పద్మాలు; వికాసంబున్+ఒందెన్= వికసించాయి; పదంపడి= పిదప; తదీయ, ప్రతాప+ఉదయ, సహవర్తి+అగుచున్= వారి యొక్క పరాక్రమంతో సాటియైనది అవుతూ; మార్తాండ+ఉదయంబు= సూర్యోదయం; వెలుంగుటయున్= ప్రకాశించింది కాగా; కాల+ఉచిత,కృత్యంబులు= కాలమునకు సరియగు కార్యములు (ఉదయం నిర్వర్తించే పనులు); నిర్వర్తించి= చేసి; కౌంతేయ+అగ్రజుండు= కుంతీ కుమారులలో మొదటివాడు- ధర్మరాజు; వెడలెన్= వెళ్ళాడు; క్రౌంచ+వ్యూహంబు= క్రౌంచము

అనే పేరుగల ఒడ్డనం; సంఘటించు+ఎడన్= నిర్మించే పట్టున; ఫల్గునుండు= అర్జునుడు; చంచుత్వంబు+భజించి= ముక్కు అయి; గాండీవ, కపిధ్వజంబులు, మెఱయన్= గాండీవం అనే విల్లు, కోతి జెండా వెలుగొందుతుండగా; పొలిచి, నిలిచెన్= విలసిల్లాడు; కుంతిభోజుండును= కుంతిభోజుడు; శైబ్యుండును= శైబ్యుడును; చక్షుఃస్థానంబులన్= కన్నులుగా ఉండేచోటులో; తేజరిల్లిరి= వెలుగొందారు; ద్రుపదుండు= ద్రుపదుడు(పాంచాలరాజు); శిఖకున్+అమరెన్= నెత్తిమీది తురాయిగా ఏర్పడ్డాడు; దశార్ణ+శూరసేన+కిరాత+దేశ+అధీశులు= దశార్ణరాజు; శూరసేనరాజు; కిరాతరాజు; కంఠ+ఆకారంబున్= గొంతుక భాగంగా; తాల్చిరి= ధరించారు(ఏర్పడ్డారు); భీమసేనుండును+ధృష్టద్యుమ్నుండును= భీముడు, ధృష్టద్యుమ్నుడు; దక్షిణ,వామ,పక్షంబులు+అయిరి= కుడి ఎడమ రెక్కలవలె ఏర్పడ్డారు; సౌభద్ర,సాత్యకి, ద్రౌపదేయ, పౌండ్ర, చోళ,పాండ్యులు= అభిమన్యుడు, సాత్యకి, ద్రౌపది కొడుకులు, పౌండ్రరాజు, చోళరాజు, పాండ్యరాజు; భీమసేను+వలను= భీముడివైపు; నకుల+సహదేవ+హైడింబ+శంబర+ వత్స+మహీపతులు= నకులుడు, సహదేవుడు, ఘటోత్కచుడు(హిడింబి కొడుకు), శంబరరాజు, వత్సరాజు; ధృష్టద్యుమ్ను దిక్కునన్+పన్నిరి= ధృష్టద్యుమ్నుడి దగ్గర నిలిచి వ్యూహంలో ఒక భాగంగా ఏర్పడ్డారు; కేకయ, కాశిరాజులతోడన్+కూడి= కేకయరాజు కాశీరాజులతో కూడి; విరాటుండు= విరాటరాజు; జఘన,భాగ,భంగికిన్+తగియుండెన్= మొలచోటుగా చేరి ఉన్నాడు; హూణపతి+ప్రముఖులు= హూణరాజు మున్నగు వారిలో ముఖ్యులు; పరివేష్టింపన్= చుట్టుచేరి ఉండగా; వెన్ను+అయి= వెనుకభాగంలో; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఒప్పెన్= విలసిల్లాడు; ఇవ్విధంబునన్= ఈ విధంగా; మోహరించిన+అప్పుడు= వ్యూహం ఏర్పరచిన సమయంలో.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు - తాను ధర్మరాజు చెప్పినట్లే చేస్తానన్నాడు. ధర్మరాజు ఆవేదన తొలగింది. అతడు అందరినీ, వారి వారి నివాసాలకు వెళ్ళండని ఆదేశించి తాను తన లోపలి మందిరానికి వెళ్ళాడు. పిదప తెల్లవారింది. పాండవ సైనికుల హృదయాల వలె, పద్మాలు వికసించాయి. సూర్యుడు పాండవభటుల పరాక్రమం వలె ప్రచండ కిరణాలతో వెలుగొందాడు. ధర్మరాజు కాలకృత్యాలు నిర్వర్తించి, బయలుదేరాడు. ధృష్టద్యుమ్నుడు క్రౌంచ వ్యూహం ఏర్పాటు చేశాడు. అర్జునుడు గాండీవ ధనుస్సుతో కోతి జెండాతో వ్యూహానికి 'ముక్కు'గా నిలిచాడు. కుంతిభోజుడు, శైబ్యుడు కన్నులుగా అమరారు. ద్రుపదుడు తురాయి అయ్యాడు. దశార్ణరాజు, శూరసేనరాజు, కిరాతరాజు కుత్తుకగా ఏర్పడ్డారు. భీముడు, ధృష్టద్యుమ్నుడు కుడి ఎడమ రెక్కలయ్యారు. అభిమన్యుడు, సాత్యకి, ద్రౌపది కొడుకులు పౌండ్ర చోళ పాండ్యులు భీముడి దగ్గరకు చేరారు. నకుల సహదేవులు, ఘటోత్కచుడు, శంబర వత్స రాజులు ధృష్టద్యుమ్నుడి కడ చేరారు. కేకయరాజు కాశిరాజులతో కూడి విరాటుడు మొలస్థానంలో నిలిచారు. హూణపతి మున్నగు వారు ధర్మరాజు చుట్టూచేరి వెనుక ఉన్నారు. ఈ విధంగా ఆ వ్యూహం ఏర్పడింది.

**విశేషాలు:** 1. కురుక్షేత్ర సంగ్రామంలో హూణులు మున్నగు పాశ్చాత్యులు కూడా పాల్గొనినట్లు మహాభారత కథనం. 2. క్రౌంచము= కొంగను పోలిన ఒకానొక పక్షి. 3. భారత యుద్ధంలోని ఒక విశిష్టత - భటులను వ్యూహంగా తీర్చిదిద్ది నిలపటం. వ్యూహాలు - వివిధ మనుజ జంతు పక్షుల ఆకారాలలో ఉండవచ్చును.

### భీష్ముని ద్వితీయదివస యుద్ధక్రమము (సం. 6-47-1)

**తే.** **పుండరీకంబు లుద్దండపుండరీక । చారుభంగి లేయెండ కెంజాయ నొప్పె**
**నంత నక్కడఁ గురుబల మధికరభస । తుములముగఁ ద్రోచి నడతెంచె సమరమునకు.** **22**

**ప్రతిపదార్థం:** పుండరీకంబులు= తెల్లతామరపువ్వులు; ఉద్దండ, పుండరీక, చారు, భంగిన్= గొప్పవైన తెల్ల గొడుగుల వలె అందంగా; లేఁత+ఎండ, కెంపు, చాయన్= లేత ఎండలోని అరుణోదయం రంగుతో; ఒప్పెన్ = విలసిల్లాయి; అంతన్= పిమ్మట; అక్కడన్= ఆ స్థలంలో; కురు+బలము= కౌరవుల సైన్యం; అధిక,రభస, తుములముగన్= మిక్కుటమైన తొందరపాటుతో కూడిన సందడితో; సమరమునకున్= యుద్ధానికి; త్రోచి= ముందుకు దూకి; నడతెంచెన్= వచ్చింది.

**తాత్పర్యం:** ఆ సూర్యోదయ సమయంలో తెల్లతామర పువ్వులు తెరచిన తెల్లగొడుగులవలె మనోజ్ఞంగా శోభిల్లాయి. కౌరవ సైన్యం మిక్కుటమైన ఉత్సాహంతో ముందుకు త్రోసుకొంటూ సంరంభంతో యుద్ధభూమికి చేరింది.

**విశేషాలు:** i. ఈ పద్యంలో 'అంతన్' - 'అక్కడ' అనే చిన్న పదాలలో పెద్ద భావం ఇమిడి ఉంది. అంతన్= సూర్యోదయ సమయంలో. కురుపాండవసేనలు రెండూ కురుక్షేత్ర సంగ్రామంలో సూర్యోదయ సమయంలో యుద్ధం ప్రారంభించేవి. అక్కడ= ఇంతవరకు, అనగా ఈ తేటగీతిపద్యానికి వెనుకనున్న గద్యంలో పాండవసేన వర్ణన ఉన్నది. అది 'ఇక్కడ' నున్న పాండవసేన వర్ణన. ఇక ఈ పద్యంలో 'అక్కడ' - అనగా ఎదురుగా ఉన్న కౌరవసేన వర్ణన ఉన్నది. ii.. సూర్యోదయ సమయంలో తామర పూవులు వికసిస్తాయి. ఇది కవి సమయం.

**వ. అయ్యవసరంబున దుర్యోధనుండు భీష్మ ద్రోణాశ్వత్థామ కృప శల్య కృతవర్మల నాలోకించి. 23**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; దుర్యోధనుండు= దుర్యోధనుడు; భీష్మ, ద్రోణ, అశ్వత్థామ, కృప, శల్య, కృతవర్మలన్= భీష్ముడిని, ద్రోణుడిని, అశ్వత్థామను, కృపుడిని, శల్యుడిని, కృతవర్మను; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఆ సమయంలో దుర్యోధనుడు తన పక్షాన ఉన్న వీర ప్రముఖులు - భీష్ముడిని - ద్రోణుడిని, అశ్వత్థామను, కృపుడిని, శల్యుడిని, కృతవర్మను చూచి (ఇట్లు పలికాడు). (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఒకఁ డొకఁడ పాండుపుత్త్రుల। సకల బలంబులను గెలువఁ జాలుదు రుగ్రా**
**ధిక శౌర్య సత్త్వులందఱు! నొకతల యటె। మిమ్ము నోర్వ నోపునె హరుఁడున్? 24**

**ప్రతిపదార్థం:** ఒకఁడు+ఒకఁడు+అ= ఒకడు ఒకడే; పాండు పుత్త్రుల, సకల, బలంబులను= పాండవుల యొక్క సేనలను అన్నింటినీ; గెలువన్+చాలుదురు= జయించగలరు; ఉగ్ర,అధిక,శౌర్య,సత్త్వులు+అందఱున్= భయంకరమూ, మిక్కుటమూ అయిన పరాక్రమం బలం కలవారు మీరు అందరూ; ఒక, తల+అటె!= (మీరు) ఒక్కటైనారంటే; హరుఁడున్= శివుడు గూడ; మిమ్మున్= మిమ్ము; ఓర్వన్+ఓపును+ఎ= జయించగలడా?(జయించలేడు).

**తాత్పర్యం:** మీలో ఒక్కొక్కడే పాండవుల సేనలను అన్నింటినీ జయించగలడు. మిక్కిలి భయంకరపరాక్రమము గల్గిన ఇంతమంది మహావీరులు ఒక్కటైనారంటే శివుడు గూడ మిమ్ము యుద్ధంలో జయింపలేడు.

**క. ఐనను గ్రౌంచవ్యూహవి। ధానంబున మోహరించి దారుణచారు**
**స్థానక మై కుంతీసుత। సేన వొలిచె మనము నిర్విశేషంబునకున్. 25**

**ప్రతిపదార్థం:** ఐనను= (మీరు అందరునూ జగదేకవీరులే అయినప్పటికి;) క్రౌంచ, వ్యూహ, విధానంబునన్= క్రౌంచపక్షి ఆకారం ఒనగూడేటట్లుగ ఒడ్డనం; మోహరించి= తీర్చి దిద్ది; దారుణ, చారు, స్థానకము+ఐ= భయంకరమును సుందరమును అయిన తీరుగా; కుంతీ, సుత, సేన= పాండవుల సేన(కుంతి కొడుకుల సైన్యం); పొలిచెన్= శోభిల్లింది; మనము= మనం; నిర్విశేషంబునకున్= సమానంగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** మీరందరు జగదేకవీరులు అయినప్పటికీ, పాండవులు రమణీయ భయానకమైన క్రౌంచవ్యూహంగా తమ సేనలను అమర్చారు. మనం కూడా ఆ వ్యూహానికి తీసిపోనట్లుగా. (ప్రతివ్యూహం ఏర్పరచుకోవాలి). (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** మహాభారత యుద్ధకాలంలో పోరాటంలో "వ్యూహ" నిర్మాణానికి మిక్కుటమైన ప్రాధాన్యం ఉండేది. వ్యూహాలలో క్రౌంచ వ్యూహం గొప్పది.

**క. అనురూపము లగు మాఱొ ౹ డ్డనముల్ ప్రస్ఫురితములు ధృఢంబులుగాఁ దీ**
**ర్చినఁ గాక తెఱం గగునే?' యని మొన లేర్పఱిచెఁ గౌరవాన్వయముఖ్యా! 26**

**ప్రతిపదార్థం:** కౌరవ+అన్వయ,ముఖ్యా!= కురువంశంలో ప్రధానుడైనవాడా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా! అనురూపములు+అగు= సరిపోయే (క్రౌంచ వ్యూహానికి సరితూగునటువంటివి); మాఱు+ఒడ్డనముల్= ప్రతివ్యూహాలు; ప్రస్ఫురితములు= ప్రకాశమానాలు; ధృఢంబులుగాన్= గట్టివి అగునట్టివిగా; తీర్చినన్+కాక= ఏర్పాటు చేస్తే తప్ప; తెఱంగు+అగును+ఏ?= పద్ధతి అవుతుందా?; అని= అని పలికి; మొనలు= వ్యూహాలు; ఏర్పఱిచెన్= ఏర్పాటు చేశాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! పాండవులు యుద్ధ విద్యలో గొప్పదిగా పేరు కెక్కిన 'క్రౌంచవ్యూహం' ఏర్పాటు చేశారు కదా! మనం గూడ ఆ వ్యూహానికి సరిపోయే మరికొన్ని బలమైన వ్యూహాలు ప్రకాశమానా లైనవి నిర్మించాలి కదా!' అని ఆ విధంగా వ్యూహాలు ఏర్పరిచాడు.

**వ. దుశ్శాసన వికర్ణవిందాను విందులును శూరసేనయవన త్రిగర్త కుకురు దేశంబులవారు నొక్కవలనను ద్రోణాచార్యుండును గుంతల దశార్ణ విదర్భులును గాంధార సింధుసౌవీరపతులు నొక్కదిక్కునను భీష్ముండు మహాసైన్యంబుతో నడుమనుం గా మూఁడు మోహరంబులయ్యెఁ; గృతవర్మయు శల్యుండును నశ్మంత కాశ్మీరులు గొందఱు దమ్ములుం దానును మానవేంద్రుండును వెనుక దెస నిలిచె నిత్తెఱంగున రెండు బలంబులు నాయితంబులై శంఖభేరీ మృదంగాది తూర్యస్వనంబులు సెలంగ నొండొంటిం గదియ నడచె' ననిన విని ధృతరాష్ట్రుం 'డివ్విధంబునం గదిసి యెవ్వరెట్లు గయ్యంబు సేసి?' రని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె. 27**

**ప్రతిపదార్థం:** దుశ్శాసన,వికర్ణ,వింద, అనువిందులును= దుశ్శాసనుడు, వికర్ణుడు, విందుడు, అనువిందుడున్నూ, శూరసేన, యవన,త్రిగర్త, కుకురు దేశంబులవారున్= శూరసేన దేశీయులు, యవనులు, త్రిగర్తులు కుకురు దేశీయులు, ఒక్క+వలనను= ఒకచోటను; ద్రోణ+ఆచార్యుండును= ద్రోణాచార్యుడూ; కుంతల, దశార్ణ, విదర్భులును= కుంతల దేశీయులూ, దశార్ణ దేశీయులూ; విదర్భ దేశీయులూ; గాంధార,సింధు,సౌవీరపతులు= గాంధార రాజు, సింధురాజు; సౌవీరరాజును; ఒక్కదిక్కునను= ఒకవైపున; భీష్ముండు= భీష్ముడు; మహాసైన్యంబుతోన్= గొప్పసేనతో; నడుమనున్+కాన్= మధ్యగా; మూఁడు+మోహరంబులు= మూడు వ్యూహాలు; అయ్యెన్= (కురుసేన) ఏర్పడింది; కృతవర్మయున్+శల్యుండును= కృతవర్మ మరియు శల్యుడు; అశ్మంత, కాశ్మీరులు= అశ్మంత దేశీయులు మరియు కాశ్మీర దేశీయులు; కొందఱు= కొందరు;తమ్ములున్+తానును= సహోదరులు, తానును,(దుర్యోధనుడు); వెనుక+దెసన్+నిలిచెన్= వెనుక భాగమందు నిలిచారు; ఆ+తెఱంగునన్= ఆ విధంగా; రెండు+బలంబులు= రెండుసేనలు (కురు, పాండవ సేనలు); ఆయితంబులు+ఐ= సంసిద్ధాలు అయి, శంఖ,భేరీ,మృదంగ+ఆది+తూర్య+స్వనంబులు= శంఖాలు, భేరులు, మద్దెలలు, మున్నగు శుభవాద్య స్వరాలు; చెలఁగన్= మ్రోయగా; ఒండు+ఒంటిన్= ఒక దానిని ఒకటి; కదియన్+నడచెన్= ఎదుర్కోవటానికి వెళ్ళాయి; అనినన్+విని= అని(సంజయుడు) చెప్పగా విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; కదిసి= ఎదుర్కొని; ఎవ్వరు+ఎట్లు= ఎవరెవరు ఏ విధంగా; కయ్యంబు+చేసిరి?= పోరాడారు?; అని+అడిగినన్= అని ప్రశ్నించగా; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; సంజయుండు= సంజయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు, వికర్ణుడు, విందుడు, అతని తమ్ముడు అనువిందుడు, శూరసేన, యవన, త్రిగర్త దేశపురాజులు వారి సైన్యము, ఒకవైపున నిల్చారు. ద్రోణాచార్యుడు, కుంతలరాజు, దశార్ణరాజు, విదర్భరాజు తమ తమ సేనలతో ఒకచోట నిలబడ్డారు. వీరు ఇరువురికి మధ్యగా గొప్ప సైన్యంతో భీష్ముడు నిలబడ్డాడు. ఈ విధంగా కౌరవసైన్యం మూడు వ్యూహాలుగా ఏర్పడింది. దుర్యోధనుడు తన తమ్ములతో వెనుక నిలిచాడు. అతనికి తోడుగ అశ్మంత కాశ్మీర రాజులు నిలిచారు. కురు పాండవ సేనలు రెండూ, యుద్ధానికి సన్నద్ధాలై, శంఖాలు, భేరులు, మద్దెలలు మున్నగు తూర్య రావాలు చేశాయి అని సంజయుడు చెప్పగా విని, ఇక, 'ఆ రెండు సేనలు ఏ విధంగా పోరాటం కొనసాగించాయో వివరంగా చెప్పుమని ధృతరాష్ట్రుడు కోరగా, సంజయుడు ఈ రీతిగా సమాధానం చెప్పాడు.

**తే.** **'ఏచి దుర్యోధనుండు చేవీచి యెలుఁగు । సూపి పురికొల్ప నెంతయు నేపు మిగిలి**
**మనబలంబులు పాండు కుమారసైన్య । సమితితోఁ దాఁకె నత్యంత సంకులముగ.** **28**

**ప్రతిపదార్థం:** ఏచి= విజృంభించి; దుర్యోధనుండు= దుర్యోధనుడు; చే,వీచి= చేయి ఊపి; ఎలుఁగు+చూపి= గొంతెత్తి; పురికొల్పన్= ప్రోత్సహించగా; ఎంతయున్= మిక్కుటంగా; ఏపు+మిగిలి= అతిశయించి; మన+బలంబులు= మన సేనలు(కౌరవసేనలు); పాండు కుమార+సైన్య+సమితితోన్= పాండవుల సేనా సమూహంతో; అత్యంత+సంకులముగన్= మిక్కుటమైన సందడితో; తాఁకెన్= ఎదుర్కొన్నాయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఉత్సాహంతో తన చేయి వీస్తూ గొంతెత్తి పురికొల్పగా, మనసేనలు గొప్ప సంరంభంతో పాండవ సైన్యాలను ఢీకొన్నాయి.

**వ.** **అట్టి యెడ.** **29**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**ఉ.** **ఱెక్కలు సించి, కంఠమున ఱేకులు వాపి, శిరంబు వ్రచ్చి పే**
**రుక్కునఁ గ్రౌంచచంద మగు నొడ్డు గలంగఁగఁ జేసి భీష్ముఁ డే**
**దిక్కునఁ దానయై దిశలు దీటుకొనన్ శరకోటి నింపఁ గెం**
**పెక్కిన కంటిక్రేవ చెలువెక్కుడు సేయఁగఁ గ్రీడి కృష్ణుతోన్.** **30**

**ప్రతిపదార్థం:** (ఆ క్రౌంచపక్షి ఆకారంలో ఉన్న వ్యూహానికి) ఱెక్కలు+చించి= రెక్కలు కత్తిరించి; కంఠమునన్= కుత్తుకలో; ఱేకులు+పాపి= ఈకలు పోగొట్టి; శిరంబు+వ్రచ్చి= తల బ్రద్దలు కొట్టి; క్రౌంచచందమగు= క్రౌంచపక్షి ఆకారంలో ఉన్న; ఒడ్డు= వ్యూహం; కలంగఁగన్+చేసి= కలతపొందించి; భీష్ముఁడు= భీష్ముడు; ఏ+దిక్కునన్= ఎటువైపు చూచినా; తాన+ఐ= తానే అయి; దిశలు+దీటుకొనన్= దెసలందు వ్యాపించగా; శర+కోటి= బాణాల సముదాయం; నింపన్= నిండునట్లు చేయగా; క్రీడి= అర్జునుడు; కెంపు+ఎక్కిన= ఎఱ్ఱబడిన; కంటి+క్రేవ= కన్నుల కొసలు; చెలువు= అందాన్ని; ఎక్కుడు+చేయఁగన్= అతిశయింప చేయగా; కృష్ణుతోన్= శ్రీ కృష్ణుడితో.

**తాత్పర్యం:** భీష్ముడు పాండవసేనాని పన్నిన క్రౌంచపక్షి ఆకారంలోని ఆ వ్యూహపు రెక్కలు ఛేదించాడు. కంఠంలోని రేకులు ఊడగొట్టాడు. తలను బ్రద్దలు చేశాడు. వ్యూహాన్ని కలచివేశాడు. ఏ వైపు చూచినా తానే కన్పించాడు. దిక్కులు అన్నీ నిండేటట్లుగా బాణాల సమూహాలు ప్రయోగించాడు. భీష్ముడి విజృంభణ చూచి అర్జునుడు ఆగ్రహించాడు.అతడి

కన్నులు ఎర్రబడ్డాయి. అవి అతడి ముఖానికి అందంపెంచాయి. అప్పుడు అర్జునుడు శ్రీకృష్ణుడితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**అర్జునుఁడు భీష్మునిమీఁదికి రథంబు దోలించి విజృంభించుట (సం-6-48-2)**

**మ. మన సేనం గలగంగఁ జేయుచు మదిన్ మందాకినీ నందనుం**
**డు ననుం గైకొనకున్నవాఁ; డితని యాటోపం బడంగించెదన్;**
**నిను మెప్పించెదఁ జూడు! ఖేచరులు వర్ణింపన్; విజృంభించెదన్**
**దనుజధ్వంసి! రథంబు వే పఱపు ముద్యద్విక్రమప్రక్రియన్.' 31**

**ప్రతిపదార్థం:** దనుజధ్వంసి!= రాక్షసులను నాశనం చేసేవాడా! శ్రీకృష్ణా!; మందాకినీ+నందనుండు= గంగ కొడుకు భీష్ముడు; మన+సేనన్= మన సైన్యాన్ని; కలగంగన్+చేయుచున్= కలతపెట్టుతూ; మదిన్(తన) మనసులో; ననున్= నన్ను(అర్జునుడిని); కైకొనక+ఉన్నవాఁడు= లెక్కచేయటంలేదు; ఇతని= ఈ భీష్ముడి; ఆటోపంబు= విజృంభణ; అడంగించెదన్= అణచివేస్తాను; నినున్+మెప్పించెదన్= నిన్ను మెప్పిస్తాను; చూడు(ము)= వీక్షించుము; ఖేచరులు= ఆకాశచరులు; వర్ణింపన్= పొగడేటట్లుగా; విజృంభించెదన్= అతిశయిస్తాను; ఉద్యత్+విక్రమ, ప్రక్రియన్= ప్రకాశించే శౌర్యం ప్రతిఫలించేటట్లుగా; రథంబు= రథాన్ని; వే= వేగంగా; పఱపుము= తోలుము.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! చూడుము. గంగాపుత్రుడైన భీష్ముడు మన సేనను ఛేదించి విజృంభిస్తున్నాడు. నన్ను లెక్కచేయటంలేదు. ఈతడి విజృంభణ ఇంక నేను అరికట్టాలి. నేను గూడ విజృంభిస్తాను. నిన్ను మెప్పిస్తాను. చారణులు నా శౌర్యం పొగడేటట్లు పోరాడుతాను. రథాన్ని వేగంగా భీష్ముడిపైకి పోనిమ్ము.'

**విశేషం:** లోకోత్తరమైన పరాక్రమం ఎవరైనా ప్రదర్శిస్తే, ఆకాశంలో సంచరించే దేవతా చారణులు ప్రశంసాగీతాలు పాడుతూ ఆ వీరుని కీర్తి వ్యాపింప చేస్తారు అని కవి సమయం.

**క. అనిన విని విష్ణుఁ డా జి । ష్ణునిఁ గనుఁగొని 'యేను నీ మనోరథము తెఱం**
**గునకుఁ దగ రథముఁ గడపెద । విను! తిరమై నాదు పలుకు వీరవినోదీ! 32**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని అర్జునుడు చెప్పగా ఆలకించి; విష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఆ+జిష్ణునిన్= జయశీలుడైన ఆ అర్జునుడిని; కనుఁగొని= చూచి; ఏను= నేను; నీ+మనోరథము= నీ కోరిక; తెఱంగునకున్= తీరునకు; తగన్= అనువుగా; రథము= తేరు; కడపెదన్= నడుపుతాను; వీర+వినోదీ!= పరాక్రమమునందు విహరించటం ఇష్టమైనవాడా!= ఓ అర్జునా!; తిరము+ఐ= స్థిరంగా (జాగ్రత్తగా); నాదు+పలుకు= నామాట; విను!= ఆలకించుము.

**తాత్పర్యం:** అనగా విని శ్రీకృష్ణుడు అర్జునుడిని చూచి ఇట్లా అన్నాడు: 'ఓ వీరవినోదీ, నీ కోరిక మేరకు నేను తేరు నడుపుతాను. ముందుగా నేను చెప్పే మాటలు జాగ్రత్తగా వినుము.

**చ. ' గజిబిజి లేక, యుబ్బక, యఖండిత శౌర్యము నస్త్రవిద్యయున్**
**భుజబలముం బొగడ్త వడ, భూరిపరాక్రమశాలి భీష్ము న**
**క్కజముగఁ దాఁకి యద్దెస నకంపితులై నడతెంచు శల్య కుం**
**భజ కురురాజు లచ్చెరువుపాటు భయంబును బొందఁ జేయుమీ!' 33**

**ప్రతిపదార్థం:** గజిబిజి+లేక= కలవరం లేకుండా; ఉబ్బక= పొంగిపోకుండగా; అఖండిత,శౌర్యము= మొక్కవోని పరాక్రమం; అస్త్ర+విద్యయున్= మంత్ర బాణాలు ప్రయోగించటంలో గల నేర్పు; భుజబలమున్= పరాక్రమం; పొగడ్త+పడన్= పేరు కెక్కేటట్లుగా; భూరి+పరాక్రమశాలి= గొప్ప శౌర్యం గలవాడు; భీష్మున్= భీష్ముడిని; అక్కజముగన్= ఆశ్చర్యం కలిగేటట్లుగా; తాఁకి= ఎదిరించి; ఆ+దెసన్= ఆతడి వైపు(అతడికి తోడ్పడేందుకు); నడతెంచు= వచ్చునటువంటి; శల్య,కుంభజ,కురురాజులు= శల్యుడు, ద్రోణుడు, దుర్యోధనుడు; అచ్చెరువుపాటు= ఆశ్చర్యం; భయంబును= వెఱపును; పొందన్+చేయుము+ఈ= పొందేటట్లు చేయుము.

**తాత్పర్యం:** 'నీవు తొట్రుపాటు చెందకుండా, ఉప్పొంగిపోకుండా, మొక్కవోని పరాక్రమాన్నీ, అస్త్రవిద్యనూ, భుజబలాన్నీ ప్రశంసనీయంగా ప్రదర్శించి, మహాపరాక్రమశాలి అయిన భీష్ముడిపై అద్భుతంగా దాడి చేయాలి. అతడికి బాసటగా నిలిచి నిర్భయంగా వచ్చే శల్యుడికీ, ద్రోణుడికీ, దుర్యోధనుడికీ, ఆశ్చర్యం, భయం కలిగేటట్లు చేయాలి.'

**విశేషాలు:** 1. ఈ పద్యంలో శ్రీకృష్ణుడు చేసిన హెచ్చరిక గమనించదగింది. శ్రీకృష్ణుడు కేవలం సారథిమాత్రుడే కాడు.2. కుంభజుడు= కుంభమునందు పుట్టినవాడు= ద్రోణుడు. ఇరువదియవ శతాబ్ది చివరిభాగమున శోధన నాళికలలో గర్భోత్పత్తి కోసం వినూత్న ప్రయోగాలు జరుగుతున్నవి గదా! 'కుంభజ' ప్రయోగం మరికొంతకాలం గడచాక సుబోధం కావచ్చు.

**వ. అని పలికి యచ్యుతుం డుచితరయంబున రథంబు నడప ధనంజయుండు తన కడ్డం బైన శూరసేన సేనా కాననంబు పటుబాణపరంపర యనుమహావాతవేగంబున బడలుపడంజేయుచుఁగవిసినంగని గాంగేయుం డెదిర్చి పేర్చి డెబ్బదేడు క్రూర నారాచంబు లేసిన నప్పుడు గూడుకొని ద్రోణుం డిరువదేనింటను శారద్వతుం డేనూటను వికర్ణుండు మూఁటను శల్యుండు తొమ్మిదింటను దుర్యోధనుం డఱువది నాల్గింటను రభసోల్లాసంబున నేసిన. 34**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; ఉచిత+రయంబునన్= తగిన వేగంతో; రథంబు= తేరు; నడపన్= నడపగా; ధనంజయుండు= అర్జునుడు; తనకున్+అడ్డంబు+ఐన= తనకు ఎదురైన; శూరసేన, సేనా, కాననంబు= శూరసేన దేశానికి సంబంధించిన సైన్యం అనే అరణ్యాన్ని; పటు, బాణ, పరంపర+అను= మిక్కుటమైన అమ్ముల సముదాయం అనే; మహా, వాత, వేగంబునన్= గొప్ప గాలియొక్క త్వరవలన; బడలుపడన్+చేయుచున్= నేలమట్టంగా పడేటట్లు చేస్తూ; కవిసినన్= ఎదుర్కొనగా; కని= చూచి; గాంగేయుండు= భీష్ముడు; ఎదిర్చి= ఎదుర్కొని; పేర్చి= విజృంభించి; డెబ్బది+ఏడు= డెబ్బైయేడు; క్రూర, నారాచంబులు= కఠినమైన బాణాలు; ఏసినన్= ప్రయోగించగా; అప్పుడు= ఆ సమయంలో; కూడుకొని= కలిసి; ద్రోణుండు; ద్రోణుడు; ఇరువదేనింటను= ఇరువది ఐదు(బాణాల)చేతను; శారద్వతుండు= కృపాచార్యుడు; ఏనూటను= ఐదువందల బాణాలతోనూ; వికర్ణుండు= వికర్ణుడు; మూఁటను= మూడు(బాణాలతో); శల్యుండు= శల్యుడు; తొమ్మిదింటను= తొమ్మిది బాణాలతోనూ; దుర్యోధనుండు= దుర్యోధనుడు; అఱువది+నాల్గింటను= అరవై నాలుగు బాణాలతోనూ; రభస+ఉల్లాసంబునన్= సంరంభంతో కూడిన ఉత్సాహంతో; ఏసినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** ఆ విధంగా శ్రీకృష్ణుడు హితోపదేశం చేసి, రథం తగిన వేగంతో నడపాడు. అర్జునుడు తనకు అడ్డంగా వచ్చిన శూరసేన దేశానికి సంబంధించిన సేనలను అవలీలగా జయించాడు. అంత భీష్ముడు అర్జునుడిని ఎదిర్చి విజృంభించి డెబ్బై ఏడు కఠినబాణాలు ప్రయోగించాడు. భీష్ముడికి సాయంగా వచ్చి, ద్రోణుడు అర్జునుడిపై ఇరువది బాణాలు, కృపాచార్యుడు అయిదునూర్ల బాణాలు, వికర్ణుడు మూడింటిని, శల్యుడు తొమ్మిదింటిని, దుర్యోధనుడు అరవై నాల్గింటిని ఉద్వేగపూరితంగా ప్రయోగించారు.

**క. అవి యెల్లను బైఁ గురియఁగ । నవికలమూర్తి యగు ననిమిషాధిపతనయుం**
**డవిరళ వర్షము మీఁదం । గవియంగా నొప్పు నగము కరణిం బొలిచెన్. 35**

**ప్రతిపదార్థం:** అవి+ఎల్లను= ఆ బాణాలు అన్నీ; పైన్= తనపైన; కురియఁగన్= వర్షించగా; అవికలమూర్తి+అగు= చలించని దేహం కలిగినట్టి; అనిమిష+అధిప, తనయుండు= దేవేంద్రుడి కొడుకు- అర్జునుడు; అవిరళ+వర్షము= ఎడతెగని వాన; మీఁదన్+కవియంగాన్+ఒప్పు= మీద కురిసేటప్పుడు శోభిల్లే; నగము, కరణిన్= కొండవలె; పొలిచెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** భీష్ముడూ, అతడికి తోడుగా వచ్చిన కౌరవ వీరులు అందరూ ప్రయోగించిన బాణాలు అన్నీ తనమీద పడినప్పుడు, ఎడతెగని వాన కురిసేటప్పుడు శోభిల్లే కొండవలె అర్జునుడు శోభిల్లాడు.

**వ. ఇట్లు సుస్థిరుండై. 36**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; సుస్థిరుండు+ఐ= చలింపని వాడుగా నిలిచి.

**తాత్పర్యం:** ఈ విధంగా చలించనివాడై.

**సీ. ఇరువదేనమ్ముల సురనదీనందను, । ద్రోణుని నఱువది బాణములను,**
**తొమ్మిది సునిశితాస్త్రమ్ములఁ గృపుని, । వికర్ణశల్యుల విశిఖత్రయముల,**
**రారాజు నైదు నారసముల నొప్పించె । నప్పుడు గడఁగి సాత్యకియు మత్స్య**
**జనపాలకుండు ధృష్టద్యుమ్నుఁడును ద్రౌప । దీ సూనులును సుభద్రాసుతుండు**

**తే భీష్మునకుఁ దోడుపడువారి బెట్టుదాఁక । నతఁడు ఫల్గును నేఁబది శితశరముల**
**నేసి పేర్చినఁ గౌరవు లెల్ల నార్వ । నుఱక యాతఁడు కురుసేనఁ దఱియఁ జొచ్చె. 37**

**ప్రతిపదార్థం:** ఇరువది+ఏను+అమ్ములన్= ఇరువది అయిదు బాణాలతో; సురనదీ, నందనున్= గంగకొడుకు అయిన భీష్ముడిని; అరువది+బాణములన్= అరువది అమ్ములతో; ద్రోణునిన్= ద్రోణుడిని; కృపునిన్= కృపాచార్యుడిని; తొమ్మిది, సునిశిత+అస్త్రమ్ములన్= తొమ్మిది వాడి అమ్ములతోనూ; విశిఖ, త్రయములన్= మూడేసి బాణాలతో; కర్ణ, శల్యులన్= కర్ణుడిని, శల్యుడిని; రారాజున్= రాజులకు రాజైన దుర్యోధనుడిని; ఐదు, నారసములన్= అయిదు బాణాలతో; నొప్పించెన్= బాధించాడు; అప్పుడు= ఆ సమయంలో; కడఁగి= పూని; సాత్యకియున్= సాత్యకి; మత్స్య జనపాలకుండు= మత్స్య దేశానికి రాజైన విరాటుడు; ధృష్టద్యుమ్నుఁడును= ధృష్టద్యుమ్నుడూ; ద్రౌపదీ, సూనులును= ద్రౌపది కొడుకులును; సుభద్రా, సూనుండు= సుభద్ర కొడుకు అభిమన్యుడును; భీష్మునకున్+తోడు పడువారిన్= భీష్ముడికి సాయం చేసేవారిని; బెట్టు, తాఁకన్= తీవ్రంగా ఎదుర్కొనగా; అతఁడు= ఆ భీష్ముడు; ఫల్గునున్= అర్జునుడిని; ఏఁబది,శిత,శరములన్+ఏసి= ఏభై వాడి బాణాలు ప్రయోగించి; పేర్చినన్= అతిశయించగా; కౌరవులు+ఎల్లన్= కురుసేనలోనివారు అందరూ; ఆర్వన్= పెద్ద ధ్వని చేయగా; ఉఱక= లెక్క చేయకుండగా ; ఆతఁడు= అర్జునుడు; కురుసేనన్= కౌరవ సైన్యాన్ని; తఱియన్+చొచ్చెన్= సమీపించాడు.

**తాత్పర్యం:** అప్పుడు పలువురు కౌరవవీరులు తన మీదకు వచ్చిపడి యుద్ధం చేసినా అర్జునుడు చలించలేదు. అర్జునుడు భీష్ముడిపై ఇరువది అయిదు బాణాలు ప్రయోగించాడు. ద్రోణుడిపై అరవైబాణాలు వేశాడు. కృపుడిపై, వికర్ణుడిపై, శల్యుడిపై మూడేసి అమ్ములు విసరాడు. రాజరాజు అయిన దుర్యోధనుడిని ఐదు బాణాలతో కొట్టాడు. ఆ సమయంలో అసహాయ శూరుడుగా భీష్ముడితో అతడికి తోడుగా వచ్చిన వీరులతోనూ అర్జునుడు పోరాడుతుండగా చూచి, పాండవ పక్షంలోని వీరులు సాత్యకి, విరాటుడు, ధృష్టద్యుమ్నుడు, ద్రౌపదీ పుత్రులు,

అభిమన్యుడు అర్జునుడికి బాసటగా వచ్చి, భీష్ముడికి సాయం చేసేవారిని తాకారు. అప్పుడు భీష్ముడు అర్జునుడిని ఏభై బాణాలతో కొట్టగా, కౌరవులందరు సింహనాదాలు చేసి సంతోషం వ్యక్తం చేశారు. అర్జునుడు వారిని అందరినీ లెక్కచేయకుండా కౌరవసేనలోకి చొచ్చుకొని పోయాడు.

**వ. ఇట్లు క్రీడించి గాంగేయు డించి గాండీవి దనయరదంబు రయంబున. 38**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; క్రీడించి= లెక్క చేయకుండా ఉపేక్షించి; గాంగేయున్= భీష్ముడిని; డించి= విడిచిపెట్టి; గాండీవి= అర్జునుడు(గాండీవం అనే విల్లు తాల్చినట్టివాడు); తన+అరదంబున్= తన రథాన్ని; రయంబునన్= వేగంగా.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు భీష్ముడిని లెక్కచేయక, ఆతడిని విడిచిపెట్టి తన రథాన్ని వేగంగా.

**క. పఱపి రథికులను సూతుల। నఱకిన మ్రోడుపడియుండె నానారథముల్**
**వెఱచఱచిరి కురువీరులు। పఱిపఱి యై మనబలంబు భయముం బొందెన్. 39**

**ప్రతిపదార్థం:** పఱపి= నడపి; రథికులను= రథంపై యుద్ధం చేసే వీరులను; సూతులన్= సారథులను; నఱకినన్= చంపగా; నానారథముల్= పెక్కు తేరులు; మ్రోడుపడి+ఉండెన్= మోడుపడిన చెట్లవలె కనుపించాయి; కురువీరులు= కురుసేనలోని వీరులు; పఱిపఱి+ఐ= చెల్లా చెదరై; వెఱ చఱచిరి= భీతిచెందారు; మన+బలంబు= మన సైన్యం; భయమున్+పొందెన్= భయపడింది.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు భీష్ముడిని సరకుగొనక, ఆతడిని విడిచిపెట్టి తన రథాన్ని వేగంగా తోలించి కౌరవసేనమీద విజృంభించాడు. రథికులను సంహరించాడు, సారథులను చంపివేశాడు, రథాలు మ్రోడులవలె కన్పించాయి. కౌరవ వీరులు చెల్లాచెదరైనారు. మనసైన్యం భయపడింది.

**వ. అట్టియెడ నీ కొడుకు నీ తండ్రితో నిట్లనియె. 40**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; నీ కొడుకు= దుర్యోధనుడు; నీ తండ్రితోన్= భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో నీ కొడుకైన దుర్యోధనుడు నీ తండ్రిఅయిన భీష్ముడితో ఈ విధంగా అన్నాడు:

**చ. తన భుజసార మేర్పడఁగ దర్పితుఁడై మనయందుఁ జేయఁగ**
**ల్గిన నృపకోటి నెల్ల నవలీలమెయిన్ మును మించి త్రుంచె న**
**ర్జునుఁ డదె నీవు సూడ ననురూపమె నీ కిది? మున్ను కర్ణు భం**
**డనము దొలంగఁ జేసి తకటా! యిటు లొప్పరికింపఁ బాడియే?' 41**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు= అర్జునుడు; అదె= అదిగో; నీవు+చూడన్= నీవు చూస్తూ ఉండగనే తన, భుజ, సారము+ఏర్పడఁగన్= తన పరాక్రమం సుస్పష్టంగా వెల్లడి కాగా; దర్పితుఁడు+ఐ= గర్వం కలవాడై; మన+అందున్= మన సేనలో; చేయన్+కల్గిన= పోరాటం చేయగల్గిన; నృప+కోటిన్+ఎల్లన్= రాజుల సమూహాన్ని అంతటినీ; అవలీల+మెయిన్= సులువుగా; మును, మించి, త్రుంచెన్= ముందు అతిశయించి సంహరించాడు; నీకున్+ఇది= నీ కనుల యెదుట ఈ విధంగా జరగటం; అనురూపము+ఎ?= తగినదేనా?; మున్ను= లోగడ; కర్ణున్= కర్ణుడిని; భండనము= యుద్ధం; తొలంగన్+చేసితి(వి)= విడిచి పోయేటట్లుగా చేశావు; అకటా!= అయ్యో!; ఇటులు= ఈ విధంగా; ఒప్పరికింపన్= ఉపేక్షించటం; పాడియే?= న్యాయమా?

**తాత్పర్యం:** అదిగో! అర్జునుడు నీవు చూస్తుండగా తన పరాక్రమం స్పష్టంగా వెల్లడికాగా గర్వంతో మనవైపు పోరాడగల్గిన రాజులందరినీ అవలీలగా మునుముపట్టి చంపినాడు. నీ కిదిసమ్మతమా! కర్ణుడిని యుద్ధంచేయకుండాచేసి అకటా ఈ విధంగా ఉపేక్షించడం నీకు న్యాయమా?

**వ. అనిన విని యనిమిషనదీ నందనుం 'డితం డింత యొప్పని పల్కు వల్కునే?' యని మనంబునం గుత్సించుచు బీభత్సు దెసకు నడరుటయు, దుర్యోధన వికర్ణులు వలపటను గురుపుత్రుండు దాపటను గూడుకొని యా క్రీడిపైఁ బటు శరపరంపరలు పరఁగించి; రతనికి నన్నలుఁ దమ్ములు బాసట యయి కడంగి కవిసి రిట్లు దొరలు దలపడిన నిరువాఁగును జిందమ్ములు గర్జిల్ల సందడికయ్యంబుగాఁ బెనంగిన గాండీవి గాంగేయు లొండొరుల చండబాణంబులఁ ద్రుంచుచు వర్మంబులు సించుచు నొకళ్ళొకళ్ళ వెలిమావులం బడగలం దాఁక నేయుచుం జేరి పోరు సమయంబున. 42**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= (అని దుర్యోధనుడు చెప్పగా ఆలకించి); అనిమిష+నదీ+నందనుండు= గంగకొడుకు-భీష్ముడు; ఇతండు= (దుర్యోధనుడు); ఇంత+ఒప్పని,పల్కు= ఇంతగా సరిగాని మాట; పల్కును+ఏ?= అంటాడా?; అని= అని; మనంబునన్= మనస్సులో; కుత్సించుచున్= చెడ్డ బాధ పొందుతూ; బీభత్సు,దెసకున్= అర్జునుడు ఉన్న వైపునకు; అడరుటయున్= విజృంభించగా; దుర్యోధన+వికర్ణులు= దుర్యోధనుడు, వికర్ణుడు; వలపటను= కుడివైపున; గురుపుత్రుండు= గురువైన ద్రోణాచార్యుడి కొడుకు అశ్వత్థామ; దాపటను= ఎడమవైపున; కూడుకొని= కలిసి; ఆ క్రీడిపైన్= ఆ అర్జునుడిపై; పలు,శర,పరంపరలు= మిక్కుటమైన అమ్ముల సముదాయాలు; పరఁగించిరి= ప్రయోగించారు; అతనికిన్= ఆ అర్జునుడికి; అన్నలున్+తమ్ములున్= సహోదరులు; బాసట+అయి= తోడు అయి; కడంగి= పూని; కవిసిరి= (శత్రువులపై)విజృంభించారు; ఇట్లు= ఈ రీతిగా; దొరలు, తలపడినన్= ప్రభువులు డీకొనగా; ఇరువాగును= ఇరువైపుల; చిందమ్ములు= శంఖాలు; గర్జిల్లన్= పెద్ద ధ్వని చేయగా; సందడి+కయ్యంబుగాన్= సంకుల సమరంగా; పెనంగినన్= పోరాడగా; గాండీవి, గాంగేయులు= అర్జునుడు, భీష్ముడు; ఒండు+ఒరులన్= పరస్పరం (ఒకరిపై ఇంకొకరు వేసే; చండ+బాణంబులన్= తీవ్రమైన అమ్ములను; త్రుంచుచున్= నడుమ నరకుచు; వర్మంబులు= కవచాలు; చించుచున్; ఒకళ్ళొకళ్ళ= ఒక్కొకళ్ళ, వెలిమావులన్ పడగలన్= తెల్ల గుర్రాలను, జెండాలను; తాఁకన్+ఏయుచున్= తాకేటట్లుగా (బాణాలు) వేస్తూ; చేరి= సమీపించి; పోరు సమయంబునన్= యుద్ధం చేసేటప్పుడు.

**తాత్పర్యం:** ఆ విధంగా దుర్యోధనుడు అధిక్షేపించగా, 'ఇతడు ఇటువంటి అనుచితమైన మాటలంటాడా?' అని భీష్ముడు తన మనస్సులో నొచ్చుకొన్నాడు. వెంటనే భీష్ముడు అర్జునుడు ఉన్న చోటికి తన రథాన్ని తరలించాడు. దుర్యోధనుడు, వికర్ణుడు భీష్ముడికి కుడివైపున చేరారు. అశ్వత్థామ ఎడమవైపున చేరాడు. వారు అందరూ అర్జునుడిపై అమ్ములు ప్రయోగించారు. అర్జునుడికి తోడుగా అతడి అన్నదమ్ములు చేరారు. ఈ విధంగా ఇరుపక్షాలలోని వీరులు శంఖాలు పూరించి ఉత్సాహంతో యుద్ధం చేశారు. అది దొమ్మియుద్ధంగా పరిణమించింది. భీష్ముడూ, అర్జునుడూ ఒండొరులపై వాడి అమ్ములు ప్రయోగించుకొన్నారు. ఒకరు ఇంకొకరి గుర్రాలను జెండాలను బాణాలతో కొట్టారు. ఆ సమయంలో.

**విశేషం:** మహాభారత యుద్ధంలో "సందడి కయ్యము" అనగా ఇరు పక్షాలలోని వీరులు ఒకరిపై ఒకరు వివక్షలు లేకుండా బాణాలు ప్రయోగించి యుద్ధం చేయటం. ద్వంద్వ యుద్ధం అనగా ఒక వీరుడు మరొక వీరుడితో పోరాడటం. ఆ పోరాటంలో ప్రక్క యోధులు జోక్యం కల్పించుకోరు. ఇది అలనాటి కట్టుబాటు.

**తే. ఆపగానందనుండు మురారి యురము । బాణవితతిని భేదింప శోణితమునఁ**
**దోఁగి యతఁ డొప్పెఁ దలిరాకు దుఱఁగలింప । మెఱయు నవపారిజాతంబు తెఱఁగు దాల్చి. 43**

**ప్రతిపదార్థం:** ఆపగా, నందనుండు= నదీపుత్రుడు(భీష్ముడు); మురారి+ఉరమున్= శ్రీకృష్ణుని వక్షఃస్థలాన్ని; బాణ వితతిని= అమ్ముల సముదాయంతో; భేదింపన్= గాయం చేయగా; అతఁడు= ఆ శ్రీకృష్ణుడు; శోణితమునన్+దోఁగి= నెత్తుటిలో తడిసి; తలిరాకు= చిగురాకు; తుఱఁగలింపన్= పొటమరించగా; మెఱయు= ప్రకాశించే; నవ, పారిజాతంబు, తెఱఁగు+తాల్చి= నూత్నమైన పారిజాత వృక్షంతీరు ధరించి; ఒప్పెన్= శోభిల్లాడు.

**తాత్పర్యం:** భీష్ముడు అనేక బాణాలు ప్రయోగించి అర్జునుడి రథసారథి అయిన శ్రీకృష్ణుడి వక్షఃస్థలం ఛేదించాడు. అప్పుడు శ్రీష్ణుడు రక్తంతో తడిసి, ఎర్రని చిగురుటాకులతో శోభిల్లే నవ పారిజాత వృక్షంవలె వెలుగొందాడు.

**విశేషాలు:** 1. మురారి= ముర+అరి= మురుడు అనే రాక్షసుడికి శత్రువు- విష్ణువు, విష్ణువు అవతారం శ్రీకృష్ణుడు. 2. సారథిని సంరక్షించుకోవలసిన బాధ్యత రథికుడిదే. భీష్ముడు శ్రీకృష్ణుడిని వక్షఃస్థలం ఛేదించటం అంటే - అది అతడు సాధించిన ఘనకార్యంగానే చెప్పవచ్చును. శ్రీకృష్ణుడు, సారథి. నిరాయుధుడు. రాయబారిగా సంధికై యత్నించి, తాను ఆయుధం ధరించనని ప్రతిజ్ఞ చేసినవాడు. రెండవనాటి యుద్ధంలో శ్రీకృష్ణుడు గాయపడ్డాడు. మూడవనాడు శ్రీకృష్ణుడు, ప్రతిజ్ఞాభంగం చేసికొని, చక్రధారియై భీష్ముడిపైకి ఉరికాడు. శ్రీకృష్ణుడి ప్రతిజ్ఞా భంగానికి ఇది పునాదియై పూర్వరంగం సృష్టించింది.

**క. కనుఁగొని కోపంబున న । ర్జునుఁ డమరనదీ తనూజు సూతుని నొప్పిం**
**చిన నాతఁ డతని య । రదము మునుగంగాఁ జేసె బాణముల వెల్లువలన్. 44**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి= (శ్రీకృష్ణుడు గాయపడటం చూచి); కోపంబునన్= ఆగ్రహంతో; అర్జునుఁడు= అర్జునుడు; అమర నదీ, తనూజు, సూతునిన్= గంగానది కొడుకు భీష్ముడి రథసారథిని; నొప్పించినన్= బాణాలతో కొట్టగా; ఆతఁడు= ఆ భీష్ముడు; అతని+అరదము= అర్జునుడి తేరును; బాణముల+వెల్లువలన్= అమ్ముల వరదలతో; మునుఁగంగన్+చేసెన్= మునిగిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ఆ విధంగా తన రథసారథియైన శ్రీకృష్ణుడిని గాయపరచటం చూచి అర్జునుడు ఆగ్రహంతో భీష్ముడి సారథిని నొప్పించాడు. భీష్ముడు గూడ అర్జునుడి రథం కనిపించకుండా అమ్ముల వరదలలో- మునిగిపోయేటట్లు చేశాడు.

**క. ఆ వెల్లువ శరజిహ్వలఁ । ద్రావి ధనంజయ మహాగ్ని దరికొని కవియం**
**గా వెగ డొందెడు కురుబల । దావము శాంతనవుఁ డంబుదము క్రియఁ గాచెన్. 45**

**ప్రతిపదార్థం:** ధనుంజయ-మహ్+అగ్ని= అర్జునుడనే గొప్ప అగ్ని; ఆ-వెల్లువన్= ఆ(బాణ) ప్రవాహాన్ని; శర-జిహ్వలన్= బాణాలనెడి నాలుకలతో; త్రావి= త్రాగి; దరికొని= సమీపించి; కవియంగాన్= చుట్టుముట్టగా; వెగడు+ఒందెడు= భయపడునట్టి; కురుబల దావమున్= కౌరవసేన అనెడి కార్చిచ్చును; శాంతనవుఁడు= భీష్ముడు; అంబుదము క్రియన్= మేఘంవలె; కాచెన్= రక్షించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ప్రయోగించిన బాణాల వరదను అర్జునుడు అనే మహాగ్ని బాణాలనే జిహ్వలతో త్రాగి వెలుగొందింది. ఆ అగ్ని కురుసేనలను కార్చిచ్చువలె బాధించింది. అయితే భీష్ముడు మేఘం వలె బాణవర్షం కురిపించి ఆ కార్చిచ్చు నుండి కౌరవసేనలను రక్షించాడు.

**విశేషం:** అలం: రూపకం. ఈ పర్వంలో రూపకాలంకారాన్ని, ఉపమాలంకారాన్ని ప్రయోగించి తిక్కన - భీష్మార్జునుల యుద్ధ కౌశలాన్ని అభివర్ణించాడు. అర్జునుడు-మహాగ్ని వంటివాడయితే, భీష్ముడు - మేఘంవలె ఆ అగ్నిని ఆర్పగలిగాడు.

**వ. ఇత్తెఱంగున నెక్కువ దక్కువలు లేక యక్కజంబుగాఁ బోరువారిం జారణ సిద్ధ గంధర్వాదులు గనుంగొనుచుండి తమలో నిట్లనిరి: 46**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ రీతిగా; ఎక్కువ+తక్కువలు+లేక= సరిసమానంగా; అక్కజంబుగాన్= ఆశ్చర్యకరంగా; పోరు వారిన్= యుద్ధం చేసేవారిని(భీష్ముడిని-అర్జునుడిని); చారణ, సిద్ధ, గంధర్వ+ఆదులు= చారణులు, సిద్ధులు, గంధర్వులు మున్నగువారు; కనుంగొనుచుండి= చూస్తూ; తమలోన్= వారిలో వారు; ఇట్లు+అనిరి= ఈ విధంగా అనుకొన్నారు.

**తాత్పర్యం:** ఈ రీతిగా, ఒకరికి ఒకరు తీసిపోకుండా, గొప్ప సమయుద్ధం చేసే భీష్ముడిని, అర్జునుడిని వేల్పు తెగలకు చెందిన వారు చూచి తమలో తాము ఈ విధంగా అనుకొన్నారు.

**విశేషం:** లోకోత్తరమైన ప్రతాప ప్రాభవాలు ప్రదర్శించినవారి కీర్తిని పొగడుతూ వేల్పు తెగలకు చెందిన చారణులు సిద్ధులు గంధర్వులు గానం చేస్తారని పురాణకథనం. కవి సమయం.

**ఉ. ఒండొరు చండవిక్రమము లోర్తురు వీరల కాక వీరితో**
**నొండొకరుండు మార్కొనఁగ నోపునె? పూని కృతాంతుఁడైన నా**
**ఖండలుఁ డైన నివ్విధపుఁ గయ్యము లెక్కడ నైనఁ గంటిమే!**
**పాండవ కౌరవోత్తముల బాహు విలాసము లిట్టులుండునే!' 47**

**ప్రతిపదార్థం:** ఒండు+ఒరు= ఒకరొకరు; చండ,విక్రమములు+ఓర్తురు= తీవ్రమైన పరాక్రమాలను సహించగలరు; వీరల+కాక= వీరులు ఇర్వురు కాకుండా; వీరితోన్= (ఈ భీష్ముడితో, అర్జునుడితో); ఒండు+ఒకరుండు= మరి ఇంకొకడు; మార్కొనఁగన్+ఓపునె?= యుద్ధం చేయటానికి సమర్థుడు ఉన్నాడా?; పూని= కడగి; కృతాంతుఁడు+ఐనన్= యముడే కావచ్చు; ఆఖండలుడు+ఐనన్= దేవేంద్రుడే కావచ్చు; ఇవ్విధపు+కయ్యములు= ఈ రీతిని జరిగే యుద్ధాలు; ఎక్కడన్+ఐనన్= ఏ స్థలంలో అయినా; కంటిమే?= చూశామా?; పాండవ, కౌరవ+ఉత్తముల,బాహు, విలాసములు= పాండవులలో శ్రేష్ఠుడైన అర్జునుడి యొక్కయు, కౌరవులలో శ్రేష్ఠుడైన భీష్ముడి యొక్కయు పరాక్రమ ప్రాభవాలు; ఇట్టులు= ఈ రీతిగా; ఉండున్+ఏ?= ఉంటాయా?

**తాత్పర్యం:** 'ఈ భీష్ముడు, అర్జునుడు ఒకరికి ఒకరు దీటైనవారు. ఇతరులు వీరితో సమానులు లేనే లేరు. భీష్ముడితో పోరాడగలవాడు అర్జునుడు ఒక్కడే. అట్లే అర్జునుడితో యుద్ధం చేయగల సమర్థుడు మరి భీష్ముడు ఒక్కడే. వీరితో యముడుగాని దేవేంద్రుడుగాని యుద్ధం చేయలేడు. పాండవోత్తముడైన అర్జునుడి పరాక్రమం, కౌరవ ప్రముఖుడైన భీష్ముడి పరాక్రమం ఇంత గొప్పగా ఉంటాయని అనుకొన్నామా?'

### ధృష్టద్యుమ్న ద్రోణాచార్యుల యుద్ధము (సం. 6-49-1)

**వ. అని యగ్గించి రంత మార్తాండుండు గగనమధ్యవర్తి యయ్యెఁ; నప్పుడు ధృష్టద్యుమ్నుండు ద్రోణాచార్యు పయిం గవిసిన నతండు. 48**

**ప్రతిపదార్థం:** అని+అగ్గించిరి= అని పొగడారు; అంతన్= పిదప; మార్తాండుండు= సూర్యుడు; గగన,మధ్యవర్తి+అయ్యెన్= ఆకాశంలో మధ్యకు చేరాడు; అప్పుడు= ఆ మధ్యాహ్న కాలంలో; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; ద్రోణాచార్య, పయిన్= గురువైన - ద్రోణుడిపై; కవిసినన్= తాకగా; అతండు= ద్రోణుడు.

**తాత్పర్యం:** ఆ విధంగా చారణులు, సిద్ధులు, గంధర్వులు భీష్ముడిని, అర్జునుడిని ప్రశంసించారు. అంతలో - మధ్యాహ్నం అయింది. ఆకాశమధ్యంలో సూర్యుడు ప్రకాశించాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడిని మార్కొన్నాడు.

**తే. సూతు నొక్క వాలమ్మున స్రుక్క నేసి । యశ్వముల నాలుగింట నుబ్బడఁగఁ జేసి,**
**సిడము నడిమికి వెసఁ ద్రుంచె వెడఁదవాతి । దొడ్డ తూపునఁ గురుసేన దొంగలింప. 49**

**ప్రతిపదార్థం:** సూతున్= సారథిని(ధృష్టద్యుమ్నుడి సారథిని); వాలు+అమ్మునన్= వాడి బాణంతో; స్రుక్కన్+ఏసి= నొవ్వచేసి; అశ్వములన్= గుర్రాలను; నాలుగింటన్= నాలుగు బాణాలతో; ఉబ్బు+అడఁగన్+చేసి= అతిశయం అణగగొట్టి; వెసన్= వేగంగా; సిడమున్= జెండా; నడిమికిన్= మధ్యకు; వెడద, వాతి, దొడ్డ+తూఁపునన్= నిడివి నోరుగల గొప్ప బాణంతో; కురుసేన= కౌరవ సైన్యం; తొంగలింపన్= అతిశయించగా; త్రుంచెన్= విరుగగొట్టాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు విజృంభించి, ధృష్టద్యుమ్నుడి సారథిని ఒక్క బాణంతో నొవ్వచేశాడు. నాలుగు బాణాలతో గుర్రాలను పడగొట్టాడు. ఒక పెద్ద బాణంతో జెండాను మధ్యకు రెండు ముక్కలు చేశాడు. కౌరవసేన ఉత్సాహంతో ఉరకలు వేసింది.

**క. ఆ ధృష్టద్యుమ్నుఁడు స । క్రోధుండై బాణవితతి గురిసిన దృఢ సం**
**వేధం బగు నారస మ । య్యోధాగ్రణి యేసి నఱకె నుఱక యతండున్. 50**

**ప్రతిపదార్థం:** ఆ+ధృష్టద్యుమ్నుఁడు; సక్రోధుండు+ఐ= కోపంతో కూడినవాడై; బాణ+వితతిన్= అమ్ముల సముదాయాన్ని; కురిసినన్= వర్షించగా; ఆ+యోధ+అగ్రణి= వీరులలో శ్రేష్ఠుడు(ద్రోణుడు); దృఢసంవేధంబు+అగు= గట్టిగా పీడించే శక్తిగల; నారసము= బాణం; ఏసి= ప్రయోగించి; నఱకెన్= తునియలు చేశాడు. అతండున్= (ఆ ధృష్టద్యుమ్నుడు); ఉఱక= లెక్కచేయక; (మీది పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఆ ధృష్టద్యుమ్నుడు ఆగ్రహించి ద్రోణాచార్యుడిపై బాణాలవాన కురిపించాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుడిపై గొప్ప బలమైన బాణాలు ప్రయోగించాడు. ద్రోణుడు వేసిన బాణాలను ధృష్టద్యుమ్నుడు తునియలు చేశాడు.

**క. ఆచార్యుఁ దీవ్ర ఘన నా । రాచము లేయంగఁ ద్రుంచె గ్రక్కున; నవి వ**
**మ్మై చెడిపోయిన నార్చెం । జూచి భవద్బలముఁ బాండుసుతసైన్యంబున్. 51**

**ప్రతిపదార్థం:** ఆచార్యున్= గురుడిని(ద్రోణుడిని); తీవ్ర, ఘన,నారాచములు= వాడిమిగల గొప్ప బాణాలు; ఏయంగన్= ప్రయోగించి; కొట్టగా, (ద్రోణుడు); గ్రక్కునన్= వెంటనే; త్రుంచెన్= ఖండించాడు; అవి= ఆ వాడి వేడి గల అమ్ములు; వమ్ము+ఐ= వ్యర్థాలై; చెడిపోయినన్= పాడైపోవగా; చూచి= అరసి; భవత్+బలమున్= నీ సేన; పాండుసుత+ సైన్యంబున్= పాండవుల సేన; ఆర్చెన్= పెద్ద పెట్టున ధ్వని చేశాయి.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడిపై మిక్కిలి వాడిమి గల గొప్ప బాణాలు ప్రయోగించాడు. ద్రోణుడు ఆ బాణాలను అన్నిటినీ ఖండించాడు. అట్టి గొప్ప అమ్ములు వమ్మైపోవటం చూచి, కౌరవసేన పాండవసేన పెద్దపెట్టున నినాదాలు చేశాయి.

**విశేషం:** ఆచార్యుడు అనగా గురువు అని అర్థం. అయితే ఆచార్య శబ్దం ద్రోణుడికి సార్థకమైన బిరుదుగా సమకాలీన సమాజంలో ప్రచారానికి వచ్చింది. ఆచార్యుడు అన్నా, గురుడు అన్నా, ధనుర్విద్యా గురుడు అన్నా అర్థం- ద్రోణుడే మహాభారతంలో.

**వ. ద్రోణుండలిగి శరాసనంబు ద్రుంచిన . 52**

**ప్రతిపదార్థం:** ద్రోణుండు= ద్రోణుడు; అలిగి= కోపించి; శర+అసనంబున్= విల్లును; త్రుంచినన్= ఖండించగా.

**తాత్పర్యం:** ద్రోణుడు కోపించి ధృష్టద్యుమ్నుడి విల్లు ఖండించివేయగా.

**ఆ. పార్షతుండు శక్తిఁ బరఁగింప నతఁడు ము । త్తునియఁ జేసె మఱియు ద్రుపదసుతుఁడు**
**పెక్కుశక్తు లొక్కపెట్ట వైచినఁ దును । మాడె రయము మెఱయ నగ్గురుండు. 53**

**ప్రతిపదార్థం:** పార్షతుండు= (పృషతుని వంశీయుడు) ధృష్టద్యుమ్నుడు; శక్తిన్= శక్తి అనే పేరుగల ఒక గొప్ప ఆయుధాన్ని; పరఁగింపన్= ప్రయోగించగా; అతఁడు= (ద్రోణుడు); ముత్తునియన్= మూడు చిన్న చిన్న ముక్కలు; చేసెన్= చేశాడు; మఱియున్= ఇంకను; ద్రుపద+సుతుఁడు= ద్రుపదుడి కొడుకు ధృష్టద్యుమ్నుడు; పెక్కు+శక్తులు= అనేక శక్తులను; ఒక్క+పెట్టన్= ఒకేసారి; వైచినన్= ప్రయోగించగా; ఆ+గురుండు= ఆ గురుడు ద్రోణుడు; రయము+మెఱయన్= వేగం వెలుగొందేటట్లుగా (శీఘ్రముగా); తునుమాడెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిపై 'శక్తి' ఆయుధాన్ని ప్రయోగించాడు. ద్రోణుడు ఆ 'శక్తి' ని మూడుముక్కలుగా చేశాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడు ఎన్నో శక్తులను ద్రోణుడిపై ప్రయోగించాడు. ఆ శక్తులను అన్నిటినీ ద్రోణుడు ఖండించాడు.

**విశేషం:** 1. మహాభారత యుద్ధకాలంలో 'శక్తి' అనే ఆయుధ విశేషం గూర్చి పలుచోట్ల వర్ణన ఉన్నది. పేరును బట్టే అది బాణం కంటె గొప్పది అని చెప్పవచ్చును. కర్ణుడి సహజ కవచ కుండలాలు మాయాబ్రాహ్మణ వేషంలో దానంగా పరిగ్రహించిన దేవేంద్రుడు ప్రత్యామ్నాయంగా 'శక్తి' అనే ఆయుధ విశేషం అతడికి ఇచ్చాడు. దీనినిబట్టి 'శక్తి' ఎంతటి గొప్ప ఆయుధమో ఊహించవచ్చును.

**తే. పృషతపౌత్రుండు గద వైవఁ బిడుగుఁ బోలె । నడరునెడఁ బొడిగాఁ జేసె నస్త్రగురుఁడు**
**భల్లముల గట్టి మైమఱు వెల్లఁ జించి । యతని నెత్తుటిలో ముంచె శితశరముల. 54**

**ప్రతిపదార్థం:** పృషత+పౌత్రుండు= పృషతుడి మనుమడు - ధృష్టద్యుమ్నుడు; గద= గద అనే ఆయుధాన్ని; వైవన్= విసరగా; (అది); పిడుగు+పోలెన్= పిడుగువలె; అడరు+ఎడన్= భయంకరంగా విజృంభించే సమయంలో; అస్త్ర గురుఁడు= ద్రోణుడు; (దానిని= ఆ గదను); పొడిగాన్+ చేసెన్= అణువులుగా ఖండించాడు.(అంతేకాక); భల్లములన్= ఈటె బాణాలతో; మైమఱువు+ఎల్లన్= కవచాన్ని అంతటినీ; చించి= ఖండించి; అతనిన్= ఆ ధృష్టద్యుమ్నుడిని; శిత శరములన్ =వాడి బాణాలతో; నెత్తుటిలోన్+ముంచెన్= రక్తంలో తడిపి వేశాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడిపై గద విసరాడు. పిడుగువలె మీదకు వచ్చే ఆ గదను ద్రోణుడు పొడి పొడి చేశాడు. అంతేకాక ఈటె బాణాలలో ధృష్టద్యుమ్నుడి కవచం ఛేదించి, వాడి బాణాలు ప్రయోగించి ఆతడిని నెత్తుటిలో ముంచివేశాడు.

**విశేషం:** గద - ఆయుధ విశేషం. బాణం కంటె బలవత్తరమైనదే. అయితే 'శక్తి' - గదకంటె కూడా గొప్పది. గద - ఆకారరేఖలు నేటివారికి తెలిసినట్టివే కాని 'శక్తి' స్వరూప స్వభావాలు ఊహకు అందనట్టివే.

**ఉ. ఒండొక చాప మెత్తికొని యుగ్రత నా పృషతాన్వయాగ్రగ**
**ణ్యుం డడరించు నారసము లుచ్చి చనంగ గురుండు గ్రొవ్విరుల్**
**నిండిన కింశుకంబు రమణీయతఁ జూడఁగ నొప్పి వాని వి**
**ల్వెండియు రెండు సేసి యవలీల హయంబుల సూతుఁ జంపినన్. 55**

**ప్రతిపదార్థం:** ఒండు+ఒక= ఇంకొక; చాపము= విల్లు; ఎత్తికొని= తీసికొని గ్రహించి; ఆ పృషత+అన్వయ+అగ్రగణ్యుండు= ఆ పృషతుని వంశంలో మొదట పరిగణించ దగినవాడు- ధృష్టద్యుమ్నుడు; అడరించు= ప్రయోగించే; నారసములు= బాణాలు; ఉచ్చి చనంగన్= చీల్చుకొనిపోగా; గురుండు= ద్రోణాచార్యుడు; క్రొవ్విరుల్-క్రొత్త+విరుల్= కొత్తగా పూచిన పూవులు; నిండిన= దట్టంగా వ్యాపించిన; కింశుకంబు+రమణీయతన్= చిలుకముక్కురంగు పువ్వులు పూచే మోదుగు వృక్షంయొక్కఅందంతో; చూడఁగన్+ఒప్పి= చూచేందుకు శోభిల్లి; వాని= ఆ ధృష్టద్యుమ్నుడి; విల్= ధనుస్సును; వెండియున్= మరల ఇంకోసారి; రెండు+చేసి= ఖండించి; అవలీలన్= సులువుగా; హయంబులన్= గుర్రాలను; సూతున్= రథసారథిని; చంపినన్= చంపగా.

**తాత్పర్యం:** ఒకసారి ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి విల్లు ఖండించాడు. ఇంకో విల్లు ఎత్తుకొని ధృష్టద్యుమ్నుడు అమ్ములు వేయగా, ద్రోణుడు గాయపడ్డాడు. ఆ గాయాలలో నుండి నెత్తురు పైకి స్రవించి వచ్చింది. అప్పుడు ద్రోణుడు క్రొత్త పూవులు పూచిన మోదుగ చెట్టువలె అందంగా కనుపించాడు. అయితే ద్రోణుడు ఇంకోసారి ధృష్టద్యుమ్నుడి విల్లు ఖండించి, అతడి రథసారథినీ గుర్రాలను సంహరించాడు.

**విశేషం:** కింశుక వృక్షం= మోదుగుచెట్టు. దాని పువ్వులు చిలుక ముక్కు రంగువలె ఎర్రగా ఉంటాయి.

**మ. విరథుండై పొలివోని బంటుతనమున్ వేగంబు నొప్పంగ బి**
**ట్టరదంబున్ డిగునప్డు చేతిగద నుగ్గైరాల నేసెన్ ధను**
**ర్గురుఁ డవ్వీరుఁడు వాలునుం బలుకయున్ ఘోరాకృతిం బుచ్చికొం**
**చు రయంబారఁ గడంగి బె ట్టడర సంక్షోభించె నీ సైన్యముల్. 56**

**ప్రతిపదార్థం:** విరథుండు+ఐ= రథం లేనివాడై; పొలి+పోని+బంటుతనమున్= మొక్కవోని పరాక్రమంతో; వేగంబున్= తీవ్రతా; ఒప్పంగన్= శోభిల్లగా; బిట్టు= మిక్కుటంగా; అరదంబున్+డిగు+అప్డు= తేరునుండి క్రిందికి దిగే సమయంలో; చేతి+గద= చేతిలో ఉన్న ఆయుధ విశేషం- గద; నుగ్గు+ఐ= పొడి పొడి అయిపోయి; రాలన్= క్రింద పడేటట్లుగా; ధనుస్+గురుఁడు= ధనురాచార్యుడు- ద్రోణుడు; ఏసెన్= బాణాలు ప్రయోగించాడు; ఆ+వీరుడు= ధృష్టద్యుమ్నుడు; వాలునున్+పలుకయున్= కత్తి,డాలు; ఘోర+ఆకృతిన్= భయంకరమైన రూపంతో; పుచ్చికొంచున్= పట్టుకొంటూ; రయంబు+ఆరన్= వేగంగా; కడంగి= పూని; బెట్టు+అడరన్= మిక్కుటంగా విజృంభించగా; నీ సైన్యముల్= నీ సేనలు (కౌరవ సైన్యాలు); సంక్షోభించెన్= వ్యాకులతచెందాయి.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు - ధృష్టద్యుమ్నుడిని విరథుడిని చేశాడు. కాని ధృష్టద్యుమ్నుడు జంకు గొంకులు లేకుండగా పరాక్రమోపేతుడై గద చేబూని క్రిందికి దూకుతుండగా, ద్రోణుడు ఆ గదను నుగ్గు నుగ్గు చేశాడు. అయినా, ఆ మహావీరుడు - ధృష్టద్యుమ్నుడు - కత్తి డాలు పట్టుకొని నేలమీదికి ఉరికి - విజృంభించాడు. ఆతని రౌద్రాకృతి చూచి కౌరవ సైన్యం గజగజ వణకిపోయింది.

**క. గురుఁడను నురుతర గిరి ని । ష్ఠుర భంగిం బుట్టి వచ్చు సునిశితబాణో**
**త్కరచండవేగనదికి నె । దురు చన రాదయ్యె నపుడు ద్రుపదసుతునకున్. 57**

**ప్రతిపదార్థం:** గురుఁడు+అను= ద్రోణాచార్యుడు అనే; ఉరుతర, గిరి= గొప్ప కొండ; నిష్ఠురభంగిన్+పుట్టి,వచ్చు= కఠినరీతిలో ఉద్భవించి వచ్చే; సునిశిత బాణ+ఉత్కర చండవేగ నదికిన్= మిక్కిలి వాడియైన అమ్ముల సముదాయం అనే గొప్ప వేగంతో కూడిన ఏటికి; అపుడు= ఆ సమయంలో; ద్రుపద సుతునకున్= ద్రుపదుడి కొడుకు ధృష్టద్యుమ్నుడికి; ఎదురు చన రాదు+అయ్యెన్= ఎదురుగా వెళ్ళటానికి శక్యం కాలేదు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడి ధాటికి, ధృష్టద్యుమ్నుడు ఆగలేకపోయాడు. ద్రోణుడు ఒక పెద్ద కొండవలె ఉన్నాడు. అతడు ప్రయోగించే బాణాలు కొండనుండి అతివేగంతో క్రిందికి దూకే నదివలె ఉన్నాయి. ఆ ఏటికి ధృష్టద్యుమ్నుడు ఎదురీదలేకపోయాడు.

**విశేషం:** అలం: రూపకం. గురుడు ఉపమేయం. ఉరుతరగిరి - ఉపమానం. చండవేగనది - ఉపమానం. సునిశిత బాణోత్కరము - ఉపమేయం. పెద్ద కొండనుండి ప్రవహించే నదికి ఎవరు ఎదురేగగలరు?

కొందరు ఇట్లా అన్వయం చెప్పారు: ఇందు గురుఁడు ఉరుతరగిరి. అది ధృష్టద్యుమ్నుడి సునిశిత బాణోత్కర మనెడి చండవేగ నదికి ఎదుర్కొనరానిదయింది.

**క. గతి గుందియుఁ బైఁ దొరఁగెడు । శితశరములు పలక జడియఁజేయుచు ద్రుపద**
**క్షితిపతిసుతుండు మెఱయఁగ । నతిరయమున ననిలతనయుఁ డడ్డము సొచ్చెన్. 58**

**ప్రతిపదార్థం:** గతి= గమనము - వేగము; కుందియున్= తగ్గినప్పటికిని; పైన్+తొరఁగెడు= పైనవచ్చిపడే; శిత+ శరములు= వాడిబాణాలు; పలకన్= డాలుతో; జడియన్+చేయుచున్= ఆపుకొంటూ; ద్రుపద+క్షితిపతి+సుతుండు= ద్రుపద రాజు కొడుకు-ధృష్టద్యుమ్నుడు; మెఱయఁగన్= వెలుగొందగా; అతి+రయమునన్= మిక్కుటమగు వేగంతో; అనిలతనయుఁడు= వాయుసుతుడు(భీముడు); అడ్డము+చొచ్చెన్= అడ్డుపడ్డాడు; అనగా ద్రోణునకు - ధృష్టద్యుమ్నునకు మధ్య వచ్చి నిలబడ్డాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు విరథుడై - గతిలేనివాడయినప్పటికీ - తనపై బడే వాడి బాణాలను తన చేతి డాలుతో నివారించుకొంటూ, ధైర్యంగా నిలబడినప్పుడు - మిక్కుటమైన వేగంతో భీమసేనుడు అతడి దగ్గరకు చేరి, అతడిని ఆదుకోగలిగాడు.

**విశేషం:** కురుక్షేత్ర సంగ్రామంలో ఇది ఒక అద్భుతఘట్టం. ద్రోణాచార్యుడికి - ద్రుపదుడికి గల వైరం జగత్ ప్రసిద్ధం. ద్రుపదసుతుడు, పాండవసేనాధిపతీ అయిన ధృష్టద్యుమ్నుడు యుద్ధంలో మొట్టమొదటిసారి ద్రోణుడిని మార్కొని - పోరాటంలో పొందిన అవమానం - ఈ ఘట్టంలో తిక్కన హృదయంగమంగా వర్ణించాడు.

**వ. ఇట్లు సొచ్చి వృకోదరుండు గురుం గ్రూరాస్త్రసప్తకంబున నొప్పించి పాంచాలపతిసుతు నొండొకయరదం బెక్కించుటయుఁ గనుంగొని నీకొడుకు కళింగపతికిం జేయి వీచి వాయుతనయుం దలపడ నియోగించిన నతండు మహాసైన్యసహాయత్వంబునం బేర్చి భీమసేనుపై నురవడించి నడచెఁ గుంభసంభవుండును విజృంభితుం డై విరాటద్రుపదులం దాఁకె ధర్మతనయుండు ధృష్టద్యుమ్నుం గలిసికొని వెన్నుదన్ని నిలిచెఁ జేదికరూశదేశంబులబలంబులు మహాబలనందను ముందటికి వచ్చె నట్టియెడ. 59**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వృకోదరుండు= భీముడు; చొచ్చి= ప్రవేశించి; గురున్= ద్రోణుని; క్రూర+అస్త్ర+సప్తకంబున్= కఠినమైన ఏడు బాణాలతో; నొప్పించి= బాధించి; పాంచాలపతి+సుతున్= పాంచాలరాజపుత్రుని= ధృష్టద్యుమ్నుని; ఒండొక+అరదంబు+ఎక్కించుటయున్= వేరొక రథంపైకి ఎక్కించటాన్ని; కనుంగొని= చూచి; నీకొడుకు= దుర్యోధనుడు; కళింగపతికిన్= కళింగదేశ రాజునకు; చేయి+వీచి= చేతితో సైగచేసి; వాయుతనయున్= భీముడిని; తలపడన్= మార్కొనటానికి; నియోగించినన్= ఆజ్ఞాపించగా; అతండు= ఆ కళింగ దేశరాజు;

మహాసైన్య సహాయత్వంబునన్= గొప్పసేన యొక్క తోడ్పాటుతో; పేర్చి= విజృంభించి; భీమసేనుపైన్= భీమునిపై; ఉరవడించి+నడచెన్= ఉత్సాహంతో మార్కొన్నాడు; కుంభసంభవుండును= ద్రోణాచార్యుడును; విజృంభితుండై= అతిశయించినవాడై; విరాటద్రుపదులన్= విరాటరాజును, ద్రుపదరాజును; తాఁకెన్= మార్కొన్నాడు; ధర్మతనయుండు= ధర్మరాజు; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుని; కవిసికొని; వెన్ను+ తన్ని+నిలిచెన్= బాసటగా నిలబడ్డాడు; చేది, కరూశ, దేశంబుల బలంబులు= చేది దేశానికి. కరూశదేశానికి చెందిన సేనలు; మహాబల నందను ముందటికిన్= భీమసేనుని ముందుకు; వచ్చెన్; అట్టి+ఎడన్= ఆ సమయమందు.

**తాత్పర్యం:** అప్పుడు భీముడు మిక్కిలి వేగంతో ఆ స్థలానికి వచ్చి ద్రోణుడికీ ధృష్టద్యుమ్నుడికీ మధ్య నిలబడి ద్రోణుడిపై ఏడు వాడి బాణాలు ప్రయోగించి, ధృష్టద్యుమ్నుడిని వేరే రథంపైకి ఎక్కించాడు. అప్పుడు దుర్యోధనుడు-భీమసేనుడు విరథుడైన ధృష్టద్యుమ్నుడిని రక్షించటం చూచి, చేతిసన్నతో కళింగదేశ రాజును అక్కడకు రమ్మని ఆజ్ఞాపించాడు. కళింగదేశ రాజు గొప్పసైన్యంతో వచ్చి, భీమసేనుడిని మార్కొన్నాడు. ద్రోణుడు విజృంభించి విరాటరాజును ద్రుపద రాజును మార్కొన్నాడు. ధర్మరాజు ఆ చోటికి సత్వరం ఏతెంచి, ధృష్టద్యుమ్నుడికి బాసటగా నిలబడ్డాడు. చేది, కరూశ దేశాల సేనలు భీమసేనుడికి బాసటగా చేరి నిలిచాయి. ఆ సమయంలో.

**విశేషం:** తిక్కన యుద్ధ వర్ణన- ఆంధ్ర వాఙ్మయ జగత్తులో పేరుకెక్కింది. ఈ ఘట్టం ఉదాహరణప్రాయమైనట్టిది. ద్రోణ ధృష్టద్యుమ్నుల మధ్య జరిగిన పోరాటం కన్నులకు కట్టేటట్లు తిక్కన వర్ణించాడు. ఈ తరుణంలో వచ్చి ఆదుకొని భీముడు ధృష్టద్యుమ్నుడిని రక్షించాడు.

**తే. అడరెఁ గాళింగనాయకుం డగు శ్రుతాయు । వునకుఁ దో డయి వీఁకమైఁ దననిషాద**
**సైన్యమును దాను భీముపై సరభసముగఁ । గేతుమంతుండు ఫణిరాజకేతుఁ డలర. 60**

**ప్రతిపదార్థం:** కళింగ నాయకుండు+అగు= కళింగదేశాధీశుడైన; శ్రుతాయువునకున్= శ్రుతాయువు అను పేరుగల రాజునకు; తోడు+అయి= సాయం చేసేందుకు చేరినవాడై; కేతుమంతుండు= కేతుమంతుడు అనే పేరుగల రాజు; తన+నిషాద+ సైన్యమును= ఆటవికులతో కూడిన తన సైన్యాన్ని; తాను= తాను; వీఁకమైన్= ఉత్సాహంతో; ఫణిరాజకేతుఁడు= పాముగుర్తు జెండాయందు కలవాడు, దుర్యోధనుడు; అలరన్= సంతసించునట్లుగా; సరభసముగన్= వేగిరపాటుతో, అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు చేసన్నతో నియోగించగా, కళింగదేశరాజు సేనాసమేతంగా వచ్చి భీమసేనుడిని మార్కొన్నాడు. అప్పుడు కేతుమంతుడు అనే వీరుడు - ఆటవిక సైన్య నాయకుడు, వేగంగా వచ్చి - కళింగరాజు శ్రుతాయువునకు బాసటగా నిలిచాడు. దుర్యోధనుడు ఆ దృశ్యం చూచి ఎంతో సంతోషించాడు.

**క. భీమునిముందటి బల ము । ద్దామతఁ గాళింగసేనఁ దలపడి హేతి**
**స్తోమావృత మై వ్రాలెను । భూమిపయిన్ సగముసగము పొలుపఱి విఱిగెన్. 61**

**ప్రతిపదార్థం:** భీముని+ముందటి+బలము= భీమునకు బాసటగా ముందునకు చేరి నిలిచిన సేన(చేది కరూశ దేశములకు సంబంధించిన సేనలు); ఉద్దామతన్= అతిశయంతో; కాళింగ+సేనన్= కళింగదేశానికి సంబంధించిన సేనను; తలపడి= మార్కొని; హేతి+స్తోమ+ఆవృతమై= కత్తుల సముదాయంలో కూడుకొని; భూమిపయిన్= నేలమీదకు; వ్రాలెను= పడిపోయాయి; సగము+సగము= సగానికి సగం; పొలుపు+అఱి= శోభ తరిగిపోయి; విఱిగెన్= పారిపోయింది.

**తాత్పర్యం:** భీమసేనుడికి బాసటగా ముందుకు వచ్చి నిలిచిన సేనలు- చేది కరూశ దేశాలకు సంబంధించిన సేనలు- కళింగసేనలను తీవ్రంగా మార్కొని, తమ తమ కత్తులతో గూడ సగం సేననేల కూలింది. మిగిలిన సగం శోభ తిరిగి పారిపోయింది.

**ఆ. మదము మిగిలి కేతుమంతుఁడు గౌంతేయు । పైకిఁ గవిసి యతని బాణశిఖల**
**మ్రందిపోయెఁ గడఁగి మంటలో నుఱికిన । మిడుతవోలె మెలఁగ మిడుక లేక. 62**

**ప్రతిపదార్థం:** మదము+మిగిలి= గర్వం అతిశయించి; కేతుమంతుండు= కేతుమంతుడు; కౌంతేయుపైకిన్= భీమునిపైకి; కవిసి= మార్కొని; అతని బాణ శిఖలన్= భీమునియొక్క బాణ జ్వాలలలో; మంటలోన్= అగ్నిలో; ఉఱికిన= దూకిన; మిడుత+పోలెన్= శలభం వలె; మెలఁగన్= తిరుగ; మిడుక+లేక= వీలులేక; మ్రంది+పోయెన్= నశించిపోయాడు.

**తాత్పర్యం:** కేతుమంతుడు భీమునిపైకి విజృంభించాడు. కాని, అగ్నిలోపడి తప్పించుకోలేని శలభంవలె భీముని బాణాగ్నిలో పడి నశించిపోయాడు.

**విశేషం**1. శలభం= (ఒకకీటకం, చిన్న పురుగు - మిడుత) అగ్ని కనిపిస్తే చాలు అందులో పడిపోతుంది. ఇది సుస్పష్టమైన ఆత్మహత్య. శలభం ఎందుకు అగ్నిలోకి దూకుతుంది? అది సృష్టిస్వభావ రహస్యం. కేతుమంతుడు భీమునితో మార్కొనటం అటువంటిదే. అంతేకాదు- మానవ హృదయ కుహరాంతరాల దొంతరలలో ఎక్కడో ఆత్మహత్యా సదృశమైన యుద్ధప్రీతి బహుశః - శలభ స్వభావ సన్నిభమైనట్టిది రహస్యంగా దాగి ఉందేమో! లేకపోతే ప్రపంచ చరిత్రలో - ఎన్నెన్ని యుద్ధాలు జరిగాయి? ఎందరు మరణించారు? ఈ చిన్ని పద్యంలో తిక్కన ఈ అత్యద్భుత సృష్టి రహస్యాన్ని పొందు పరచాడా? తిక్కన ప్రత్యక్షంగా ఎన్నో యుద్ధాలు చూచినట్టివాడు. తిక్కన యుద్ధవర్ణనలలో ఆతని ప్రత్యక్ష పరిజ్ఞానం కనిపిస్తుంది.

**చ. పవనసుతుం గళింగనరపాలసుతుం డగు శక్రదేవుఁ డు**
**గ్రవిశిఖవృష్టిఁ దేల్చి తురగంబులఁ గూల్చినఁ గ్రోధదీప్తుఁ డై**
**యవిహతభంగి భూరిగద నాతఁడు వైచినఁ గూలె వాఁడు వ**
**జ్ర విహతిఁ గూలు శైల మన సారథికేతుయుతంబుగా నిలన్. 63**

**ప్రతిపదార్థం:** కళింగ+నరపాల+సుతుండు+అగు= కళింగరాజు కొడుకైన; శక్రదేవుఁడు= శక్రదేవుడు అను పేరుగలవాడు; పవన+సుతున్= వాయుపుత్రుడైన భీముని; ఉగ్ర విశిఖ వృష్టిన్ తేల్చి= భయంకరమైన బాణవర్షంలో తేలునట్లుగా చేసి; తురగంబులన్= గుర్రాలను; గూల్చినన్= సంహరించగా; ఆతఁడు= భీమసేనుడు; క్రోధ దీప్తుఁడు+ఐ= కోపంచే వెలుగొందినవాడై; అవిహత భంగిన్= ఎదురులేని రీతిగా; భూరి+గదన్= పెద్ద గదను; వైచినన్= విసరగా; వాఁడు= ఆ శక్రదేవుడు; వజ్ర+విహతిన్= వజ్రం యొక్క దెబ్బవలన; కూలు= నేలమీదకు పడిపోయే; శైలము+అనన్= కొండ అనునట్లుగా; సారథి కేతు యుతంబుగాన్= సారథితో, జెండాతో పాటుగా; ఇలన్= నేలయందు; కూలెన్= పడిపోయాడు.

**తాత్పర్యం:** కళింగరాజపుత్రుడు - శక్రదేవుడు భీమసేనుని మార్కొని, భయంకరములైన బాణాలు ప్రయోగించి - గుర్రాలను చంపివేశాడు. భీముడు కోపించి పెద్ద గదను ఆతనిపై విసిరాడు. ఆ దెబ్బకు శక్రదేవుడు సారథితోపాటు, జెండాతోపాటు- వజ్రాయుధం తాకిడికి కూలే కొండ వలె - నేలపై కూలిపోయాడు.

**విశేషం:** మిక్కలి ప్రాచీన కాలంలో కొండలకు రెక్కలుండేవట. అవి, ఇచ్ఛ వచ్చిన చోట నేలపై వ్రాలి - అపార జననష్టం కలిగించేవట. అప్పుడు దేవేంద్రుడు - కొండల రెక్కలు తన వజ్రాయుధం చేత నరికివేశాడని, అప్పటినుండీ కొండలు కదలికలేకుండా 'నగము' లై నేలమీద పడి ఉన్నాయనీ పురాణకథ.

**వ. ఇవ్విధంబున నద్భుతభయావహం బగు పరాక్రమంబునం బేర్చి భీమసేనుండు ఘటితకాంచన బిందు సందోహసుందరంబును దృఢవిశాలంబును నగు పలకయుం గల్పాంతకృతాంతజిహ్వాభీలం బగు కరవాలంబును బుచ్చికొని హతహయం బగు నరదంబు డిగ్గిన. 64**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; అద్భుత+భయ+ఆవహంబు+అగు= ఆశ్చర్యకరమూ, భయముతో కూడినట్టిదీ అగు; పరాక్రమంబునన్= శౌర్యంతో; పేర్చి= అతిశయించి; భీమసేనుండు; ఘటిత కాంచన+బిందు+సందోహ+సుందరంబును= పొదగబడిన బంగారు చిరువలయ సముదాయంతో అందమైనట్టిదీ; దృఢ విశాలంబును+అగు= గట్టిగా ఉండి నిడివిగా ఉన్నట్టిదీ; పలకయున్= డాలును; కల్ప+అంత+కృతాంత+జిహ్వా+ఆభీలంబు+ అగు= కల్పము చివర(ప్రళయకాలంలో) యముని నాలుకవలె భయంకరమైనదీ అయిన; కరవాలంబును= కత్తిని; పుచ్చికొని= గ్రహించి; హత+హయంబు+అగు= చచ్చిపోయిన గుర్రాలుగల; అరదంబున్= రథమును; డిగ్గినన్= దిగిపోగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా (విరథుడైన) భీమసేనుడు, ఆశ్చర్యకరమూ భయంకరమూ అయిన శౌర్యాన్ని ప్రదర్శించాడు. భీముడు ఒక చేతితో డాలు పట్టుకున్నాడు. ఆ డాలు దృఢమైనదీ, విశాలమైనదీ. మధ్యలో బంగారు బిందువులు ఎన్నో పొదగబడి ఉన్నాయి. ఇంకోచేతితో కత్తి పట్టుకున్నాడు. ఆ కత్తి ప్రళయకాలంలో యమధర్మరాజు నాలుకవలె భయంకరంగా ఉంది. ఆ రీతిగా -గుర్రాలు చచ్చిపోయిన రథం విడిచిపెట్టి భీముడు క్రిందికి దిగాడు.

**ఆ. కొడుకుపాటుఁ జూచి కోపించి కాళింగ। పతి రయమునఁ దేరు వఱపి భీముఁ**
**బొదివి పిడుగుఁ గొదమ వోని నారసము బి। ట్టేసె నది యతండు వేసెఁ దునియ. 65**

**ప్రతిపదార్థం:** కొడుకు+పాటున్= పుత్రుని పతనం; చూచి= కాంచి; కోపించి; కాళింగపతి= కళింగదేశరాజు; రయమునన్= వేగంగా; తేరు+వఱపి= రథాన్నితోలి; భీమున్+పొదివి= భీముని మార్కొని; పిడుగు+కొదమ+పోని నారసము= చిన్న పిడుగువంటి బాణం; బిట్టు+ఏసెన్= గొప్పగా ప్రయోగించాడు; అది= దానిని(ఆ బాణాన్ని); అతండు= భీముడు; తునియన్= ముక్కలుగా; వేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** తన కొడుకైన శక్రదేవుడు మరణించడం చూచి, ఆగ్రహించి, కళింగదేశరాజైన శ్రుతాయువు వేగంగా తన రథాన్ని భీమునిపైకి తరలించాడు. భీమునిపై పిడుగువంటి బాణం ప్రయోగించాడు. అయితే భీముడు ఆ బాణాన్ని తునియలుగా ఖండించాడు.

**క. మదమున శ్రుతాయు వొక్కటఁ। బదునాలుగు తోమరములు వరఁగించిన నే**
**ర్పొదవఁగఁ బవనజుఁ డన్నిటిఁ। జిదురుపలుగఁ జేసె ఖడ్గచిత్రనిహతులన్. 66**

**ప్రతిపదార్థం:** మదమునన్= గర్వంతో, శ్రుతాయువు= శ్రుతాయువు అను పేరుగల కళింగదేశరాజు; ఒక్కటన్= ఒకేసారి; పదునాలుగు+ తోమరములు= పధ్నాలుగు చిల్లకోలలు; పరఁగించినన్= ప్రయోగింపగా; నేర్పు+ఒదవఁగన్= సామర్థ్యం బయటపడేటట్లుగా; పవనజుఁడు= వాయుసుతుడు(భీముడు); అన్నిటిన్= ఆ పదునాలుగు చిల్లకోలలనూ; చిదురుపలుగన్= చిన్ని చిన్ని ముక్కలుగా; ఖడ్గ+చిత్ర+నిహతులన్= ఆశ్చర్యకరంగా కత్తితో కొట్టబడిన వాటినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** మిక్కుటమగు గర్వంతో, శ్రుతాయువు ఒకేసారి పదునాలుగు చిల్లకోలలు భీమునిపై ప్రయోగించాడు. భీముడు చాకచక్యంతో అన్నిటినీ చిన్నిచిన్ని ముక్కలుగా ఆశ్చర్యకరంగా తన చేతికత్తితో ఖండించాడు.

**భీమసేనునిచేత భానుమంతుండు సచ్చుట (సం-6-50-30)**

**వ. అప్పుడా కళింగపతియనుజుం డగు భానుమంతుండు దంతి నికరంబుతో నగ్రజునకుం దలమిగిలి పవమాన సూనుపై నడరి నిజఘటలకుం దలకడచి యతనిమేన నారాచంబులు నాటించుచుఁ గదిసి తన యెక్కిన యేనుంగు నేపునం బురికొల్పిన. 67**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ఆ కళింగపతి+అనుజుండు అగు= ఆ కళింగరాజైన శ్రుతాయువు యొక్క తమ్ముడు అయిన; భానుమంతుండు= భానుమంతుడు అను పేరుగలవాడు; దంతి+నికరంబుతోన్= ఏనుగుల గుంపుతో; అగ్రజునకున్+తల+మిగిలి= అన్నగారిని అతిక్రమించి; పవమాన సూనుపైన్= భీమునిపై; అడరి= విజృంభించి; నిజ+ఘటలకున్+తలకడచి= తన ఏనుగుల సముదాయాన్ని దాటి; అతని+మేనన్= భీముని శరీరమందు; నారాచంబులు= బాణాలు; నాటించుచున్= గ్రుచ్చుతూ; కదిసి= పూని; తన+ఎక్కిన+ఏనుంగున్= తాను అధివసించిన ఏనుగును; ఏపునన్+పురికొల్పినన్= మిక్కుటముగా ప్రోత్సహించగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో కళింగరాజు శ్రుతాయువు తమ్ముడు భానుమంతుడు, ఏనుగుల సముదాయంలో అన్నను అతిక్రమించి, భీమునిపై వాడిబాణాలు నాటేటట్లు చేశాడు. అంతేగాక - తాను ఎక్కిన ఏనుగును పురికొల్పగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** పురాణాలలో, చరిత్రలో కూడా కళింగదేశం ఏనుగులకు ప్రసిద్ధి కెక్కింది. భీముడు ఏనుగులను చంపటంలో సిద్ధహస్తుడు. అందుచే కళింగులకూ భీముడికీ సహజవైరం ఏర్పడింది.

**శా. కుంతీసూనుఁడు సింహనాదమున దిక్కుల్ పిక్కటిల్లంగ దు**
**ర్దాంతస్ఫారగతిం గరిం గదిసి రౌద్రస్ఫూర్తి లంఘించి త**
**ద్దంతంబుల్ వెస నెక్కి త్రొక్కి తునిమెన్ ధారాళరక్తచ్ఛటా**
**క్రాంతంబై నభమొప్ప వానిఁ బటుఖడ్గస్ఫారధారాహతిన్. 68**

**ప్రతిపదార్థం:** కుంతీసూనుఁడు= కుంతికొడుకు - ఈ సందర్భంలో భీముడు; సింహనాదమునన్= సింహగర్జన వంటి అరుపుతో; దిక్కుల్= దెసలు; పిక్కటిల్లంగన్= మారుమ్రోగగా; దుర్దాంత+స్ఫార+గతిన్= అదుపులో పెట్టుటకు వీలులేకుండా విస్తరించిన నడకతో; రౌద్ర స్ఫూర్తిన్= తీవ్రకోపం భాసించగా; లంఘించి= దూకి; తద్+దంతంబుల్= ఆ ఏనుగు దంతాలు; వెసన్= వేగంగా; ఎక్కి; త్రొక్కి; ధారాళ+రక్త+ఛటా+ఆక్రాంతంబు+ఐ= మిక్కిలి ఎక్కువగా స్రవించే నెత్తుటి ధారల సముదాయంతో కూడి; నభము+ఒప్పన్= ఆకాశం శోభిల్లేటట్లుగా; పటు ఖడ్గ స్ఫార+ధారా+హతిన్= మిక్కుటమగు కత్తికొనల అంచుల దెబ్బలతో; వానిన్= ఆతనిని; తునిమెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** అంతట భీముడు సింహనాదం చేశాడు. దిక్కులు మారుమ్రోగేటట్లుగా, వెనువెంటనే శీఘ్రగమనంతో ఆ ఏనుగు దంతాల మీదికి ఎక్కి, మర్దించాడు తీవ్ర కోపంతో. పిమ్మట ఆకాశంలో రక్తధారలతో చిమ్మేటట్లుగా, అతనిని తన కత్తి అంచులు తళతళ మెరిసేట్లు సంహరించాడు.

**వ. ఇట్లు భానుమంతు నంతకుపురికిం బనిచి. 69**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ రీతిగా; భానుమంతున్= భానుమంతుని; అంతకుపురికిన్= యముని పట్టణానికి; పనిచి= పంపించి. (అనగా చంపి) (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** భీముడు ఆ విధంగా భానుమంతుని యమలోకానికి పంపించి.

**తే. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగ నుఱికి । కెంపు దళుకొత్త వాలుతోఁ గ్రేళ్ళువాఱు**
**నా వృకోదరుపైఁ గవియంగఁ జేయు । వీచె సేనకుఁ గాళింగవిభుఁడు గడఁగి. 70**

**ప్రతిపదార్థం:** మలఁగి= తిరిగి; గజ+కంధరము= ఏనుగు మెడను; త్రుంచి= ఖండించి; తొలఁగన్+ఉఱికి= తప్పించికొని దూకి; కెంపు+తళుకు+ఒత్తన్= ఎఱ్ఱదనం మెరయగా; వాలుతోన్= ఖడ్గముతో; క్రేళ్ళువాఱు= దుముకు; ఆ+వృకోదరుపైన్= ఆ భీమునిపై;

కవియంగన్= మార్కొనటానికి; కాళింగ+విభుఁడు= కళింగరాజు; కడఁగి= పూని; సేనకున్= సేనవైపు; చేయివీచెన్= తన చేతిని ఎత్తి సన్న చేశాడు.

**తాత్పర్యం:** భీముడు తిరిగి విజృంభించి, ఏనుగు మెడ ఖండించి, అటునుండి తొలగి క్రిందికి ఉరికి, ఎర్రదనంతో వెలుగొందు కత్తితో ముందుకు ఉరుకుతున్న ఆ భీముని మార్కొనుమని కళింగరాజు తన చేయివీచి సైనికులను పురికొల్పాడు.

**వ. ఇట్లు శ్రుతాయువు సేయి వీచినఁ దచ్చతురంగంబులు వొదివినం బవనతనయుండు నిజభుజశిఖరంబులు వెఱుగం దాను బాదచారి యగుటయు నొంటియైన తెఱంగునుం దలంపని దర్పంబునం బేర్చి రణక్రీడకుం జొచ్చి కరవాలంబు శుండాలకుంభస్థలంబులు పగుల వ్రేసిన మెదడంటి మొదుక నైనం గేతుదండంబులు నఱికి, చులుకం జేయుచు రథికసారథి సహితంబుగా నరదంబులు చక్కడంచి, మొక్కలు వోయిన నస్థి సారంబులగు నశ్వశరీరంబులు గోసి, పాఱవైచి, వాఁడి సేయుచు నుబ్బున గుఱ్ఱంబుల కుఱికి బడలుపడ నఱిముఱి విసరిన నోర వోయిన సురియం జెరివి, యవలీలం గాలుబలంబులపైఁ బడి చక్కంజేయుచు మఱియు నానాప్రకారంబులగు చిత్రవధవిహారంబుల నమ్మోహరంబు విఘటితవిభ్రాంతపలాయితంబు గావించి యపరాహ్ణంబునం గళింగపతిం గవియు నవసరంబున. 71**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; శ్రుతాయువు= శ్రుతాయువు(కళింగభూపతి); చేయివీచినన్= చేయి ఊపి పురికొల్పగా; తద్+చతురంగంబులు= ఆతని చతురంగబలములు; పొదివినన్= చుట్టుముట్టగా; పవన తనయుండు= వాయుపుత్రుడు(భీముడు); నిజ భుజ శిఖరంబులు+పెఱుగన్= తన యొక్క మూపులు ఉబ్బగా; తాను; పాదచారి+అగుటయున్= నేలమీద తిరిగేవాడు కావటం; ఒంటి+ఐన+తెఱంగునున్= ఏకాకియైన తీరును; తలంపని= ఆలోచింపని; దర్పంబునన్= గర్వంతో; పేర్చి= విజృంభించి; రణ+క్రీడకున్+చొచ్చి= ఆటవలె యుద్ధం చేయటానికి పూని; కరవాలంబు= కత్తి; శుండాల+కుంభస్థలంబులు= ఏనుగుల కుంభములు; పగుల+వ్రేసినన్= బ్రద్దలు కొట్టగా; మెదడు+అంటి= తలలోపలి మాంసపు గుజ్జు సోకి; మొదుకన్+ఐనన్= మొద్దుబారగా; కేతు దండంబులు= జెండా కొయ్యలు; నఱికి= ఖండించి; చులుకన్+చేయుచున్= అవమానిస్తూ; రథిక+సారథి+సహితంబుగాన్= రథికులతో సారథులతోపాటుగా; అరదంబులు= రథాలు; చక్కడంచి= నాశనంచేసి; మొక్కలు+పోయిన= మోడుపడిన(శిథిలములు అయిన); అస్థిసారంబులు+అగు= ఎముకలు మాత్రమే మిగిలిన; అశ్వ+శరీరంబులు= గుఱ్ఱాల కంకాళాలు; కోసిపాఱవైచి= ఖండించి విసరివేసి; వాఁడి+చేయుచున్= పదను పెట్టుచూ; ఉబ్బునన్= ఉత్సాహంతో; గుఱ్ఱంబులకున్+ఉఱికి= గుఱ్ఱాలపై బడి; బడలుపడన్= శ్రమపడేటట్లుగా; అఱిముఱి+విసరినన్= వేగంగా విసరగా; ఓరవోయిన= మొద్దుబారిన; సురియన్= చిరుకత్తిని; చెరివి= త్రిప్పి; అవలీలన్= సులువుగా; కాలు బలంబులపైన్+పడి= పాదచారులగు భటులపైబడి; చక్కంజేయుచున్= సరిపరచుచూ; మఱియున్= ఇంకను; నానా ప్రకారంబులు+అగు= పెక్కు విధములైన; చిత్రవధ విహారంబులన్= వింతగొలిపే సంహార సంచారములచేత; ఆ+మోహరంబున్= ఆ వ్యూహాన్ని; విఘటిత,విభ్రాంత, పలాయితంబు+ కావించి= చీలిపోవునట్లుగా, కలతచెందునట్లుగా, పారిపోయేటట్లుగా, చేసి; అపర+అహ్ణంబునన్= మధ్యాహ్నకాలమున; కళింగ పతిన్+కవియు+సమయంబునన్= కళింగరాజును మార్కొన్న వేళలో.

**తాత్పర్యం:** ఈ రీతిగా శ్రుతాయువు చేయివిసరగా చతురంగబలాలు భీమసేనుడిని చుట్టు ముట్టాయి. అపుడు భీముడు మూపులు ఉబ్బగా తాను పాదచారి అగుటనూ, ఏకాకియైన తీరునూ, ఆలోచించని దర్పంతో విజృంభించి యుద్ధం అనే ఆటకు పూనుకున్నాడు. అతడు తన చేతి ఖడ్గంతో ఏనుగుల కుంభస్థలాలను పగుల వేశాడు. ఏనుగుల మెదడు కత్తికి అంటుకొని మొద్దుబారగా జెండాల కొయ్యలను నరికి మొద్దుబారిన కత్తికి పదును

బెట్టుకొన్నాడు. రథికులు సారథులతో కూడ రథాలను నాశనం చేశాడు. అట్లా చేయడం వల్ల కత్తి మొక్క పోయింది. మొక్కవోయిన కరవాలాన్ని ఎముకలతో గూడ గుఱ్ఱాల శరీరాలను కోసిపారవైచి తిరిగి వాడి అయ్యేటట్లు చేస్తూ ఉత్సాహంతో గుఱ్ఱాలమీదికి ఉరికి అవిబడలుపడేటట్లు అడ్డదిడ్డంగా విసరగా మొద్దుబారిన తనకత్తిని త్రిప్పి అవలీలగా కాల్బలంపైబడి పదును బెట్టుకుంటూ ఇంకా రకరకాల చిత్రవధ విహారాలతో ఆ కౌరవ వ్యూహాన్ని చెల్లాచెదరయేట్లుగా, కలతచెందేటట్లుగా, పారిపోవునట్లుగా చేసి అపరాహ్ణకాలంలో కళింగపతి శ్రుతాయువును మార్కొన్న సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషాలు:** 1. ఇది భీముడి వీరవిహార వర్ణన.

ఏ యోధుడైనా విరథుడు అయితే - ఇక అతడు నిర్వీర్యుడయినట్లే. కాని భీమసేనుని తీరువేరు. మహాబలవంతుడైన భీమునికి అది తన చేవ- బలం చూపించటానికి ఒక గొప్ప అవకాశం. తాను రథంమీద నిలిచి -విల్లు, అమ్ములు ధరించి- ఎదుటి రథికుడితో యుద్ధం చేయటం కంటె- క్రిందికి దిగి - శత్రువీరుని రథం - సారథితో గుఱ్ఱాలతోపాటు విసరివేయటం - భీమసేనునికి సులువు! రథంమీద విల్లుచేత పట్టిన భీముని కంటె, కత్తి ,డాలు పట్టుకొని పాదచారియైన భీముడు ఎక్కువ బలవంతుడు. 2.చతురంగబలము: రథ-గజ-తురగ-భటులు - రథాలు - ఏనుగులు-గుఱ్ఱాలు-పాదచారులైన భటులు నాలుగు అంగాలుగా ప్రాచీనకాలంలో భారతీయ సేనలో విభజింపబడ్డాయి.

**తే.** **వివిధ సన్నాహయుతముగాఁ బవనతనయు। తేరు దగురథ్యములఁ బూన్చి తెచ్చి సూతుఁ**
**డతనిముందట నిలిపిన నతఁడు వాని। నాదరంబునఁ గనుగొని యరదమెక్కె.** 72

**ప్రతిపదార్థం:** వివిధ+సన్నాహ+యుతముగాన్= పెక్కు పరికరములతో కూడిన;పవనతనయు+తేరు= భీముని రథం; తగు= యోగ్యములైన; రథ్యములన్= గుఱ్ఱాలను; పూన్చి= జతచేసి; తెచ్చి; సూతుఁడు= రథసారథి(భీముని సారథి); అతని ముందటన్= భీముని ఎదురుగా; నిలిపినన్= నిలబెట్టగా; అతడు= ఆ భీముడు; వానిన్= సారథిని; ఆదరంబునన్+కనుఁగొని= గౌరవముతో చూచి; అరదమున్= రథాన్ని; ఎక్కెన్= అధిరోహించాడు.

**తాత్పర్యం:** భీముని సారథి, క్రొత్తతేరును అన్నిహంగులతో సమకూర్చి, గుఱ్ఱాలు పూన్చి తీసికొనివచ్చి అతని ముందట నిలిపాడు. భీముడు సంతోషించి, సగౌరవంగా సారథిని చూచి ఆ తేరు ఎక్కాడు.

**ఉ.** **చాపము వేడ్కఁ బుచ్చికొని సజ్యము సేయునెడం గళింగుఁ డ**
**ష్టాపద దీప్తపుంఖనవశాతశరంబులు నాట నేసినం**
**గోపితుఁడై కడంగి బరిగోలలపోటుల నుగ్రవారణా**
**టోపము పేర్చునట్లుగఁ గడున్ వెస డగ్గఱి భీముఁ డుద్ధతిన్.** 73

**ప్రతిపదార్థం:** చాపమున్= విల్లును; వేడ్కన్= ప్రీతితో; పుచ్చికొని= తీసికొని; సజ్యము+చేయు+ఎడన్= అల్లెత్రాటిని పూన్చే తరుణంలో; కళింగుఁడు= కళింగరాజు; అష్టాపద, దీప్త, పుంఖ, నవ, శాత, శరంబులు= బంగారంవలె మెరిసే ఎనిమిది కొనలుగల క్రొత్త వాడి అమ్ములు; నాటన్+ఏసినన్= భీముడిపై ప్రయోగించగా; కోపితుఁడు+ఐ= భీముడు ఆగ్రహం చెందినవాడై; కడంగి= పూని; బరిగోలల+పోటులన్= అర్ధచంద్రాకారముగల బాణాల ప్రయోగంవల్ల; ఉగ్ర+వారణ+ఆటోపము= మదించిన ఏనుగు విజృంభణ; పేర్చునట్లుగన్= అతిశయించేటట్లుగా; కడున్= మిక్కిలి; వెసన్= శీఘ్రంగా; డగ్గఱి= సమీపించి; ఉద్ధతిన్= గర్వంతో; భీముడు.

**తాత్పర్యం:** భీముడు ప్రీతితో ధనుస్సు చేత పట్టుకొని, అల్లెత్రాటిని బిగించేటప్పుడు, కళింగరాజు ఎనిమిది పుంఖాలుగల మెరిసేకొంగ్రొత్త బాణాలు ప్రయోగించాడు. భీముడికి కోపం వచ్చింది. అతడు బరిగోలలు ప్రయోగించినపుడు రెచ్చిపోయే ఏనుగువలె విజృంభించాడు. భీముడు అతిశీఘ్రంగా శ్రుతాయువును సమీపించి గర్వంతో (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అష్టాపదదీప్త= బంగారుతో దీపించిన; పుంఖ= చివరిభాగాలు కల క్రొత్త వాడిబాణాలు అని కొందరు అర్థం చెప్పారు. 1. బరిగోల= బరి+కోల - ఏనుగులను తోలేటపుడు పొడిచెడి అర్ధచంద్రాకృతిగల అలుగుగల వేణుదండం. 'బరిగోల చేత మదసింధురముం గదలించినట్లు' భారతం - అరణ్య. 1- 283. బరిగోలల పోటునకు రెచ్చిపోయే మత్తేభంవలె భీముడు కోపించి విజృంభించాడు.

**ఆ. అయిదు నారసముల నాతనిఁ జదికిలఁ। బడఁగ నేసి మూర్ఛపాలు సేసి**
**యతని చక్రరక్షు లైన సత్యుని సత్య। దేవుఁ జంపి నభము దివుర నార్చె. 74**

**ప్రతిపదార్థం:** అయిదు+నారసములన్= అయిదుబాణాలతో; ఆతనిన్= కళింగప్రభువు శ్రుతాయువును; చదికిలన్+పడఁగన్= పిర్రలు నేలమీద ఆనేటట్లుగా; ఏసి= బాణాలు ప్రయోగించి; మూర్ఛపాలు+చేసి= స్పృహతప్పేటట్లు చేసి; అతని= కళింగప్రభువుయొక్క; చక్ర+రక్షకులు+ఐన= రథచక్రాలను కాపాడే వారలైన; సత్యునిన్= సత్యుడు అనుపేరు గలవానిని; సత్యదేవున్= సత్యదేవుడు అనే పేరుగలవానిని; చంపి= సంహరించి; నభము= ఆకాశం; తివురన్= మారుమ్రోగేటట్లుగా; ఆర్చెన్= సింహనాదం చేశాడు.

**తాత్పర్యం:** భీముడు- కళింగభూపతి శ్రుతాయువుపై అయిదు బాణాలు ప్రయోగించి ఆతనిని చతికిలబడవేశాడు. శ్రుతాయువు స్పృహతప్పి రథంపై పడిపోయాడు. భీముడు అతని రథచక్ర రక్షకుడైన సత్యుడిని, సత్యదేవుడిని సంహరించి, ఆకాశం దద్దరిల్లేటట్లుగా సింహనాదం చేశాడు.

**వ. అట్లు శ్రుతాయువు మూర్ఛిల్లినం దదీయ సారథి రథంబు దొలంగం దోలికొనిపోయినఁ గర్ణధారుండు లేని యానపాత్రంబునుం బోలెఁ దద్బలంబు దిరుగుడు వడియె నప్పుడు కిమ్మీరవైరి శంఖంబు పూరించిన. 75**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ రీతిగా; శ్రుతాయువు= కళింగప్రభువు; మూర్ఛిల్లినన్= స్పృహకోలుపోగా; తదీయ రథ సారథి= ఆతని తేరు తోలువాడు; రథంబున్= తేరును; తొలంగన్+తోలికొని పోయినన్= రణభూమిని తొలగి బయటికి తీసికొనిపోగా; కర్ణధారుండు= చుక్కాని పట్టువాడు; లేని= లేనట్టి; యానపాత్రంబునున్+పోలెన్= పడవవలె; తద్+బలంబు= ఆతనిసేన(కళింగసైన్యం); తిరుగుడు+పడియెన్= కలత చెందింది; అప్పుడు= ఆ సమయంలో; కిమ్మీర+వైరి= భీముడు; శంఖంబు పూరించినన్= శంఖము నూదగా

**తాత్పర్యం:** ఆ విధంగా శ్రుతాయువు మూర్ఛపోయాడు. ఆతని రథసారథి రథాన్ని యుద్ధభూమినుండి తరలించి బయటకు తీసికొనివెళ్ళాడు. అప్పుడు చుక్కాని పట్టేవాడు లేని పడవవలె, కళింగసైన్యం సంక్షోభించింది. భీముడు విజయోత్సాహంతో శంఖం పూరించగా - (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** కిమ్మీర వైరి= భీముడు; భీముడు సంహరించిన రాక్షసులలో పేర్కొనదగినవాడు బకాసురుడు. అతడి సహోదరుడే కిమ్మీరుడు, భీముడు, అరణ్యవాస సమయంలో కిమ్మీరుని ఎదుర్కొని అతడిని సంహరించాడు.

**క. విని గాంగేయుం డడరినఁ। గని ధృష్టద్యుమ్నుఁడును శిఖండియు నరిభం**
**జనుఁ డగు సాత్యకియు మరు త్తనయుఁ। గడచి యతనిఁ దాఁకి దర్ప మెలర్పన్. 76**

**ప్రతిపదార్థం:** విని= ఆలకించి (భీముడు శ్రుతాయువును మూర్ఛిల్లచేసినట్లు ఆలకించి); గాంగేయుండు= గంగకొడుకు(భీష్ముడు); అడరినన్(భీముని) మార్కొనిన; కని= చూచి; ధృష్టద్యుమ్నుఁడును= ధృష్టద్యుమ్నుడును; శిఖండియున్= శిఖండియు; అరి+భంజనుఁడు అగు= శత్రువులను సంహరించు; సాత్యకియున్= సాత్యకియును; మరుత్+తనయున్= వాయుసుతుడగు భీముని; కడచి= దాటి; అతనిన్= భీష్మునిని; దర్పము+ఎలర్పన్= గర్వం అతిశయింపగా; తాఁకి= మార్కొని.

**తాత్పర్యం:** భీముడు కళింగ భూపతిని మూర్ఛిల్ల చేసిన శంఖారావాన్ని సేనాపతి అయిన భీష్ముడు విన్నాడు. వెంటనే భీముని మార్కొన్నాడు. అంతట ధృష్టద్యుమ్నుడు, శిఖండి, శత్రుభంజనుడయిన సాత్యకి భీమునిదాటి, గర్వోత్సాహంతో భీష్ముని తాకి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. బెడిదముగ నేయ రథములపిండు మఱియుఁ । గవిసి తోడ్పడ నతఁడు శిఖండి యొకడు**
**దక్క నందఱ తనువులఁ బెక్కు నిశిత । విశిఖములు నాటి బకరిపు వెగడుపఱిచి . 77**

**ప్రతిపదార్థం:** బెడిదముగన్+ఏయన్= మిక్కుటముగ(బాణాలు) ప్రయోగింపగా; రథముల+పిండు= తేరుల సముదాయం; మఱియున్= ఇంకా; కవిసి= చేరి; తోడ్పడన్= సాయం చేయగా; అతఁడు= భీష్ముడు; శిఖండి+ఒకఁడు+తక్కన్= శిఖండిని ఒకనిని మినహాయించి; అందఱ+తనువులన్= అందరి శరీరాలయందు; పెక్కు= ఎన్నో(అనేక); నిశిత+విశిఖములు= వాడిబాణాలను; నాటి= గ్రుచ్చుకొనేటట్లు చేసి; బక+రిపున్= భీముని(బకాసురుని శత్రువును); వెగడు+పఱిచి= కలచి.

**తాత్పర్యం:** వారు మిక్కుటంగా బాణాలు ప్రయోగింపగా, రథముల సముదాయం, ఇంకా తనకు సాయం చేయగా, భీష్ముడు శిఖండిపై తప్ప మిగిలినవారందరిపై వాడిబాణాలు ప్రయోగించి, భీముడిని కలత పెట్టాడు.

**విశేషం:** భీముడు చంపిన రాక్షసవీరులలో పేర్కొనదగినవారు బకుడు, ఏకచక్రపురంలో పాండవులు అజ్ఞాతంలో ఉన్నప్పుడు - సంఘకంటకుడైన బకుని సంహరించి పేరుకెక్కాడు.

**వ. అతని యరదంబు గుఱ్ఱంబులం గూల నేసిన నతండు కోపించి. 78**

**ప్రతిపదార్థం:** అతని+అరదంబు గుఱ్ఱంబులన్= అతని తేరుకు కట్టిన అశ్వాలను; కూలన్+ఏసినన్= సంహరింపగా; అతండు= భీముడు; కోపించి.

**తాత్పర్యం:** భీముడిని కలతచెందించి, అతడి తేరుకు కట్టిన గుర్రాలను సంహరించాడు. భీముడికి కోపం వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఘనశక్తి వైవ నది శాం । తనవుఁడు ముత్తునియ సేయ దానం గోపం**
**బినుమడిగా నుజ్జ్వలగదఁ । గొని యరదము డిగ్గి కవిసె ఘోరాకృతియై. 79**

**ప్రతిపదార్థం:** ఘనశక్తివైవన్= గొప్పశక్తిని ప్రయోగింపగా; అది= దానిని; శాంతనవుఁడు= (శంతనుని కొడుకైన) భీష్ముడు; మూఁడు+తునియలు+చేయన్= మూడు ముక్కలు చేయగా; దానన్= దానివలన; కోపంబు; ఇనుమడిగాన్= రెండురెట్లు కాగా; ఉజ్జ్వల+గదన్+కొని= ప్రకాశించే గదను చేతపట్టుకొని; అరదము+డిగ్గి= రథం దిగి; ఘోర+ఆకృతి+ఐ= భయంకరమైన రూపం కలవాడై; కవిసెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు భీముడు గొప్ప 'శక్తి' ని భీష్ముడిపై విసరాడు. అయితే ఆ శక్తిని భీష్ముడు మూడు ముక్కలు చేశాడు. దానితో భీముడి కోపం రెండింతలు అయింది. అతడు గదను చేతబూని, రథం దిగి, భయంకరమైన ఆకారంతో, భీష్ముని మార్కొన్నాడు.

**విశేషం:** 1. విల్లమ్ములు ధరించిన 'ధానుష్కుడు' గా భీముని భూమిక కంటె, గదాధారియైన భీముని భూమిక గొప్పది. 71వ పద్య వ్యాఖ్యాన విశేషాలు అనుశీలించవచ్చు. 2. శక్తి ఆయుధ విశేషం. 53వ పద్య వ్యాఖ్యాన విశేషములు అనుశీలించవచ్చును.

**క. తదవసరంబున సాత్యకి । మదమునఁ గౌంతేయుఁ గడచి మంత్రంబున బె**
**ట్టిదముగఁ బడవైచిన యొ । ప్పిదమున నస్త్రమునఁ గూల్చె భీష్ముని సూతున్. 80**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; సాత్యకి; మదమునన్= గర్వంతో; కౌంతేయున్= కుంతీపుత్రుడైన భీముని; కడచి= దాటి; మంత్రంబునన్= మంత్రముతో; బెట్టిదముగన్= గొప్పగా; పడవైచిన+ఒప్పిదమునన్= పడగొట్టిన సొగసుతో; అస్త్రమునన్= బాణంతో; భీష్ముని సూతున్= భీష్ముని రథసారథిని; కూల్చెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో సాత్యకి, భీముడినిదాటి, మంత్రప్రయోగంతో గొప్పగా పడగూల్చిన సొగసుతో అస్త్రం ప్రయోగించి భీష్ముని సారథిని కూల్చినాడు.

**వ. ఇట్లు సారథి వడుటయు. 81**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; సారథి= భీష్ముడి రథంతోలేవాడు; పడుటయున్= నేలగూలి మరణించగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా భీష్ముడి సారథి హతుడు కాగా.

**తే. వాయువేగంబు లైన తద్వాహనములు । భీష్మతే రెత్తికొని పాఱెఁ బృథివి యద్రువ**
**నపుడు మనసైనికులు గీచకారి నెదుర । నలికి పాసిన బయలయ్యె నతని మునుము. 82**

**ప్రతిపదార్థం:** వాయువేగంబులు+ఐన= గాలితో సమానమైన వేగం గలవిఐన; తద్+వాహనములు= ఆ గుర్రాలు; భీష్మ+తేరు= భీష్ముడి రథాన్ని; పృథివి+అద్రువన్= భూమి కంపింపగా; ఎత్తికొని+పాఱెన్= తమతో తీసికొని వెళ్ళిపోయాయి; అపుడు; మనసైనికులు; కీచక+అరిన్= భీముడిని, ఎదురన్+అలికి= మార్కొనటానికి భయపడి; పాసినన్= పారిపోగా; అతని మునుము= భీముడి ఎదుటి చోటు; బయలు+అయ్యెన్= శూన్యం అయింది.

**తాత్పర్యం:** గాలివేగంతో సరియైన వేగంగల భీష్ముని గుర్రాలు, ఆతడి రథాన్ని ఎత్తుకొని పారిపోయాయి. ఆ ధాటికి భూమి అదిరిపోయింది. అపుడు మన సేనలోని భటులు పారిపోయారు. భీముడి పురోభాగం వెలితిపడింది.

**విశేషం:** అద్రువ అనగా అదరుట అని అర్థం. ఇచ్చట ఒక ఛందో విశేషం - తెలుగులో అపురూపమైనట్టిది ఉన్నది. అద్రువ శబ్దంలోని మూడు అక్షరాలూ లఘువులే. ఇందలి 'ద్రు' సంయుక్తాక్షరం కాదు. దీనికి 'శిథిల ద్విత్వం' అని ఛందస్సులో పేరు. ఉచ్చారణలో 'అద్రువ' 'అ' తేల్చి పలకాలి.

**వ. అట్టియెడ ధృష్టద్యుమ్నుండు గారవంబున నమ్మారుతిం దనరథం బెక్కించుకొనియె నంతఁ గృష్ణానుజుండు దన తేరు సేరం దెచ్చి యా వృకోదరు నుపలక్షించి. 83**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ తరుణంలో; ధృష్టద్యుమ్నుండు; గారవంబునన్= ప్రేమతో కూడిన ఆదరణతో; ఆ+మారుతిన్= వాయుదేవుని కొడుకైన ఆ భీముని; తన+రథంబు= తనతేరిని; ఎక్కించుకొనియెన్; అంతన్= అటుపిమ్మట; కృష్ణ+అనుజుండు= శ్రీకృష్ణుని తమ్ముడైన సాత్యకి; తన+తేరు= తన రథం; చేరన్+తెచ్చి= (భీముడి) దగ్గరకు చేరేటట్లు చేసి; ఆ+వృకోదరున్+ఉపలక్షించి= ఆ భీముని మన్నించే దృష్టితో చూచి.

**తాత్పర్యం:** భీముడి వీరవిహారం, భీష్ముడి పరాజయం పాండవుల సేనాని యైన ధృష్టద్యుమ్నుడికి సంతోషం కలిగించాయి. ఆ క్షణంలో కౌరవసేనాపతి భీష్ముడు యుద్ధభూమిలో లేడు. ధృష్టద్యుమ్నుడు భీముడిని తన రథంమీదికి ఎక్కించుకున్నాడు. సాత్యకి కూడా కొంతవరకు భీష్ముని తాత్కాలిక పరాజయానికి కారకుడు. అతడు తన రథాన్ని ధృష్టద్యుమ్నుడు, భీముడు కలిసి ఉన్న రథం దగ్గరకు చేర్చి, భీముడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. ' ఒంటిమైఁ గళింగు నురవడిఁ దలపడి । పుత్రసోదరాప్త భూరిసైన్య**
**హీనుఁ జేసి కౌరవానీకములు సూడ । నుఱక భంగపెట్టి పఱపు టొప్పె.' 84**

**ప్రతిపదార్థం:** ఒంటిమైన్= ఒంటరిగా; కళింగున్= కళింగరాజును; ఉరవడిన్+తలపడి= అతివేగంగా మార్కొని; పుత్రసోదర+ఆప్త భూరి సైన్యహీనున్+చేసి= కొడుకులు, తమ్ములు; దగ్గర బంధువులు, పెద్దసేనలు లేనివానిని చేసి; కౌరవ+అనీకములు= కౌరవుల సేనలు చూడన్= చూస్తూ ఉండగా; ఉఱక= సులువుగా; భంగపెట్టి; పఱపుట+ఒప్పెన్= అవమానపరచి తరమడం జరిగింది.

**తాత్పర్యం:** సాత్యకి భీముడిని ఈ విధంగా అభినందించాడు. 'ఓ భీమసేనా! నీవు ఎంతో గొప్ప కార్యం నెరవేర్చావు. ఏకాకివై పోరాడి, కళింగ ప్రభువు శ్రుతాయువును జయించి అవమానించి తరమగలిగావు. అతడి తమ్ముడిని, పుత్రుడిని, ఆప్తులను కౌరవసేనలు చూస్తూ ఉండగా సంహరించావు.

**వ. అని యగ్గించె నంతఁ గడంగి వచ్చు శల్యకృపాశ్వత్థామలం గని పార్షతుండు దనయరదంబున నున్న భీమసేనుని సవినయంబుగా డించి 'నీవు నన్ను వెన్ను దన్ని చూడు' మని పలికి యద్దెసం దేరు వఱపి యశ్వత్థామరథ్యంబులం బదిబాణంబులం బడ నేసిన నతండు శల్యుని రథంబుపైకిం బోయి పాంచాలపతి సూనుమేన నిశితాస్త్రంబులు నినిచెఁ దక్కటి యిరువురు నట్ల చేసి రివ్విధంబున నమ్ముఫ్వురచేత నతం డొక్కరుండును బొదువం బడియుంట దవ్వులంజూచి విజయనందనుండు నిజ స్యందనంబు దోలికొని వచ్చి కృపాశ్వత్థామలం దొమ్మిదేసి యమ్ముల నొప్పించి మద్రపతి యంగమునఁ బంచవింశతి విశిఖంబులు నాటించె వారును నతనిఁ బండ్రెండు శరంబు లేసి రా సమయంబున భవదీయపౌత్త్రుం డగులక్ష్మణకుమారుం డయ్యభిమన్యుం దలపడి మర్మభేదులయిన నారాచమ్ముల నొప్పించిన నతం డక్కుమారుఁ బంచాశత్సాయకంబులం గప్పి తన హస్తలాఘవంబు ప్రకటించిన. 85**

**ప్రతిపదార్థం:** అని+అగ్గించెన్= అని ప్రస్తుతించాడు; అంతన్= అటుపిదప; కడంగివచ్చు= మార్కొనటానికి పూనివచ్చే; శల్య+కృప+అశ్వత్థామలన్+కని= శల్యుడిని; కృపుడిని; అశ్వత్థామను చూచి; పార్షతుండు= ధృష్టద్యుమ్నుడు; తన+అరదంబునన్+ఉన్న= తన రథంమీద ఉన్న; భీమసేనుని; సవినయంబుగాన్= మన్ననతో; డించి= దించి; నీవు+నన్నున్; వెన్ను+తన్ని+చూడుము= వెనుకతట్టుగా నిలిచి వీక్షించుము; అని+పలికి; ఆ+దెసన్= ఆ వైపుగా; తేరు= రథం; పఱపి= నడిపించి;అశ్వత్థామ+రథ్యంబులన్= అశ్వత్థామ రథానికి పూన్చిన గుఱ్ఱాలను; పదిబాణంబులన్= పది అమ్ములతో; పడన్+ఏసినన్= కూల్చగా; అతండు= ఆ అశ్వత్థామ; శల్యుని+రథంబు+పైకిన్+పోయి= శల్యుని తేరుపైకి ఎక్కి; పాంచాలపతి సూను+మేనన్= పాంచాల రాజపుత్రుడైన ధృష్టద్యుమ్నుని శరీరంపై; నిశిత+అస్త్రంబులు= వాడి బాణాలు; నినిచెన్= నిండించాడు; తక్కటి= మిగిలిన; ఇరువురును= ఇద్దరును(కృపుడు, శల్యుడు); అట్ల+చేసిరి= ఆ విధంగానే చేశారు; (అనగా బాణాలు ప్రయోగించారు); ఈ+విధంబునన్= ఈవిధంగా; ఆ+ముఫ్వురచేతన్= ముగ్గురిచేత; అతండు= ధృష్టద్యుమ్నుడు; ఒక్కరుండును= ఒక్కడే; పొదువంబడియుంట= మార్కొనబడి ఉండటం; దవ్వులన్+చూచి= దూరమునుండి వీక్షించి; విజయనందనుండు= అర్జునుడి కొడుకు - అభిమన్యుడు; నిజ+స్యందనంబు= తన రథాన్ని; తోలికొనివచ్చి= తోడ్కొని అరుదెంచి; కృప+అశ్వత్థామలన్= కృపుడిని, అశ్వత్థామను; తొమ్మిది+ఏసి అమ్ములన్=

తొమ్మిదిబాణాల చొప్పున; నొప్పించి= ప్రయోగించి బాధించి; మద్రపతి+అంగమునన్= శల్యుని దేహమునందు; పంచవింశతి విశిఖంబులు= ఇరువది ఐదు బాణాలు; నాటించెన్= గ్రుచ్చుకొనేటట్లు చేశాడు; వారును= కృపుడూ అశ్వత్థామా; అతనిన్= అభిమన్యుడిపై; పంద్రెండు+శరంబులు+ఏసిరి= పన్నెండు అమ్ములు వేశారు; ఆ సమయంబునన్; భవదీయ+పౌత్రుండు+అగు= నీ మనుమడైన; లక్ష్మణ+కుమారుండు= లక్ష్మణకుమారుడు అను పేరుగలవాడు; ఆ+అభిమన్యున్+తలపడి= ఆ అభిమన్యుడిని ఎదుర్కొని; మర్మభేదులు+అయిన+నారాచంబులన్= ఆయువుపట్టులు చీల్చే బాణాలతో; నొప్పించినన్= బాధించగా; అతండు= అభిమన్యుడు; ఆ+కుమారున్= ఆ లక్ష్మణకుమారుని; పంచాశత్+సాయకంబులన్= ఏబదిబాణాలతో; కప్పి; తన+హస్త+లాఘవంబున్= తన చేతి చొరవను; ప్రకటించినన్= వెల్లడిచేయగా.

**తాత్పర్యం:** సాత్యకి భీముడిని ప్రశంసించాడు. ఇంతలో శల్యుడు, కృపుడు, అశ్వత్థామ మార్కొనటానికి వచ్చారు. అదిచూచి ధృష్టద్యుమ్నుడు తన రథంమీద ఉన్న భీముడిని సగౌరవంగా క్రిందికి దించాడు. అతడితో 'నీవు వెనుక నిలిచి చూస్తూ ఉండుమని' చెప్పాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడు వారలవైపు రథం మళ్ళించి, అశ్వత్థామ రథానికి పూన్చిన గుర్రాలను పది బాణాలతో కూల్చాడు. అతడు శల్యుడి తేరునెక్కి, ధృష్టద్యుమ్నుడి శరీరంపై వాడి బాణాలు ప్రయోగించాడు. శల్యుడు, కృపుడు అట్లే బాణాలు గుప్పించారు.

ఈ విధంగా ధృష్టద్యుమ్నుడు ఒక్కడూ ముగ్గురు వీరులతో పోరాడటం దూరం నుంచి చూచి, అభిమన్యుడు తన రథాన్ని తోలుకొని వచ్చి, కృపుడిపై, అశ్వత్థామపై తొమ్మిదేసి అమ్ములు గుప్పినొప్పించారు. శల్యుడి శరీరంపై ఇరువది ఐదు బాణాలు నాటించాడు. వారు కూడ అభిమన్యునిపై పన్నెండు బాణాలు ప్రయోగించారు. ఆ సమయంలో నీ మనుమడు లక్ష్మణ కుమారుడు వచ్చి అభిమన్యుడిని మార్కొని, ఆయువుపట్టులు భేదించే బాణాలు అతడిపై గుప్పించినొప్పించాడు. అభిమన్యుడు - ఏభై అమ్ములు అతనిపై ప్రయోగించి తన చేతి ఒడుపును ప్రకటించాడు.

**తే.** **లస్తకంబున కొలఁదికి లక్ష్మణుండు । వెడఁదయమ్మున నభిమన్యువిల్లు దునియ**
**నేసి యార్చినఁ గౌరవు లెల్ల నార్వ । నతఁడు వేఱొకబలువింట నతని నొంచె.** 86

**ప్రతిపదార్థం:** లస్తకంబున కొలఁదికి= విల్లు మధ్యభాగాన్ని పిడికిలితో గట్టిగా పట్టుకొని అల్లెత్రాటిని లాగి; లక్ష్మణుండు= లక్ష్మణ కుమారుడు; వెడఁద+అమ్మునన్= నిడివిగల బాణంతో; అభిమన్యు+విల్లు= అభిమన్యుని ధనుస్సు; తునియన్+ఏసి= ఖండించి; ఆర్చినన్= సింహనాదం చేయగా; కౌరవులు+ఎల్లన్+ఆర్వన్= కౌరవులందరు గూడ సింహనాదాలు చేయగా; అతఁడు= అభిమన్యుడు; వేఱు+ఒక= ఇంకొక; బలువింటన్= బలమైన ధనుస్సుతో; అతనిన్= ఆ లక్ష్మణకుమారుని; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** లక్ష్మణకుమారుడు వెడల్పయిన బాణంతో అభిమన్యుడి వింటిని లస్తకము వద్ద తునిగేటట్లుచేసి - సింహనాదం చేశాడు. కౌరవులందరూ గూడ సింహనాదాలు చేశారు. అభిమన్యుడు వేరొక గట్టి వింటితో లక్ష్మణకుమారుని నొప్పించారు.

**విశేషం:** శత్రువీరుని విల్లు ఖండించడం ఘనకార్యంగా అందరూ భావించేవారు.

**క.** **తనయుఁడు నొచ్చిన దుర్యో । ధనుఁ డర్జునతనయుమీఁదఁ దనతే రలుకం**
**జన నిచ్చుట గనుఁగొని శాం । తనవద్రోణముఖ రథికతతి వెసఁ గవిసెన్.** 87

**ప్రతిపదార్థం:** తనయుఁడు= కొడుకు; నొచ్చినన్= దెబ్బతినటంచేత; దుర్యోధనుఁడు= దుర్యోధనుడు(లక్ష్మణుడితండ్రి); అర్జున+తనయుమీఁదన్= అభిమన్యునిపై; అలుకన్= కోపంతో; తన+తేరు= తన రథాన్ని; చననిచ్చుట= వెళ్ళేటట్లు చేయటం;

కనుఁగొని= చూచి; శాంతనవ ద్రోణ ముఖ రథిక తతి= భీష్ముడు, ద్రోణుడు, మున్నగు రథికుల సమూహం; వెసన్= శీఘ్రముగా; కవిసెన్= మార్కొనెను.

**తాత్పర్యం:** తన కొడుకు నొచ్చిన సంగతి తెలిసికొని తండ్రియైన దుర్యోధనుడు అర్జునుని కుమారుడైన అభిమన్యునిపైకి తన రథాన్ని తరలించాడు. దానిని చూచి, భీష్ముడు, ద్రోణుడు మున్నగు వీరులందరూ శీఘ్రంగా అభిమన్యుని మార్కొన్నారు.

**క. అతిముతి నడరిన రథికుల । తఱచునకు సుభద్ర కొడుకు దలఁకక తా నం**
**దఱ కన్నిరూపులై యే । డ్తెఱ నవ్వుచు నేటులాడె ధీరత మెఱయన్. 88**

**ప్రతిపదార్థం:** అతిముతిన్+అడరిన= వేగంగా విజృంభించిన; రథికుల+తఱచునకున్= రథికుల సమూహానికి; సుభద్రకొడుకు= అభిమన్యుడు; తలఁకక= జంకక; తాన్= తాను; అందఱకున్= అందరకు; అన్ని+రూపులు+ఐ= అన్ని ఆకారాలుగా అయి; ఏడ్తెఱన్+నవ్వుచున్= విజృంభణతో నవ్వుతూ; ధీరత+మెఱయన్= ధైర్యం వెలుగొందగా; ఏటులాడెన్= పోరాడాడు.

**తాత్పర్యం:** వీరాధివీరులు అందరూ చేరి గుంపుగా వచ్చి తన పైబడినప్పటికీ - అభిమన్యుడు ధైర్యంతో వారినందరినీ మార్కొని నవ్వుతూ పోరాటం కొనసాగించాడు.

**వ. తదవసరంబున. 89**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**మ. కని తే రుప్పరవీదిఁ దోలుకొని యాకౌరవ్యసైన్యంబు న**
**జ్జననాథుం దటినీతనూజు గురుఁ జంచద్బాణ వర్షంబులన్**
**మునుఁగం జేయుచు దేవదత్త మెలమిన్ మ్రోయించుచున్ సంగరా**
**వని యల్లాడ వియచ్చరుల్ వొగడ వివ్వచ్చుండు వచ్చెన్ వడిన్. 90**

**ప్రతిపదార్థం:** కని= చూచి; తేరు= రథము; ఉప్పర+వీదిన్= ఆకాశమార్గాన; తోలుకొని= నడిపి; ఆ+కౌరవ్య+సైన్యంబున్= ఆ కౌరవసేనను; ఆ+జననాథున్= ఆ రాజునూ(దుర్యోధనుని); తటినీ+తనూజున్= నదీసూనునీ(భీష్ముని); గురున్= ద్రోణాచార్యునీ; చంచత్+బాణ+వర్షంబులన్= చలించే అమ్ములవానలో; మునుఁగన్+చేయుచున్= మునిగేటట్లు చేస్తూ; దేవదత్తము= దేవదత్తం అనే పేరుగల శంఖాన్ని; ఎలమిన్= సంతోషంతో; మ్రోయించుచున్= పూరిస్తూ; సంగర+అవని= రణరంగం; అల్లాడన్= కంపింపగా; వియత్+చరుల్= ఆకాశసంచారులు; పొగడన్= ప్రస్తుతించగా; వడిన్= వేగంగా; వివ్వచ్చుండు= అర్జునుడు; వచ్చెన్= అరుదెంచాడు.

**తాత్పర్యం:** అభిమన్యుని అనేకవీరులు చుట్టుముట్టడం చూచి, తండ్రియైన అర్జునుడు తన రథాన్ని ఆకాశవీథిలో తోలించుకొని రణరంగానికి వచ్చాడు. వస్తూ వస్తూ కౌరవ సైన్యంపై, దుర్యోధనునిపై, సేనాపతి భీష్మునిపై పలుమారులు బాణవర్షం కురిపించాడు. దేవదత్త శంఖం పూరించాడు. ఆతని ధాటికి రణరంగం కంపించింది. ఆకాశసంచారులు అతనిని కీర్తించసాగారు.

**విశేషం:** 1. భావాన్ని బట్టి భాషను సంఘటిస్తాడు తిక్కన. 2. అట్లే భావానుగుణంగా ఛందస్సును కూడా ఎన్నుకుంటాడు మహాకవి తిక్కన. ఇక్కడ మత్తేభంలో అర్జునుని రణరంగప్రవేశం వర్ణించటం ఉదాహరణప్రాయం.

వ. **అంతయుఁ గనుంగొని యుధిష్ఠిరుండు గడంగి సేనల కెల్లను జేయివీచిన నొక్కపెట్ట యురవడించి కురుసైన్యంబు దలంకం దలపడియె నప్పు డాదిత్యుం గప్పి ధరణీరేణువులు చీఁకట్లు గవియింపం గరితురగనరగాత్ర గళితరుధిరధారాసారం బది యడంగునట్లు సేసె నంత నర్జును వివిధ బాణపాతంబులఁ గౌరవానీకంబునం దునియ లైన శరాసనశరకరవాలపరిఘపరశ్వధాదులును బఱియ లయిన హరిశిరః కుంభికుంభపదాతి కపాలప్రభృతులును దుమురు లైన రథాంగధ్వజచ్ఛత్రచామర ప్రముఖంబులుం గలిగి కయ్యంపునేల కరంబు ఘోరం బయ్యె నట్టియెడఁ దమమీఁది మానుసులు వడినం జెడి తిరిగెడు హయగజస్యందనంబులును దురంగమాతంగస్యందనంబులు రూపఱిన నేపఱి మెలంగునయ్యె యారోహకులును నై యాకులతం బొంది మనబలంబు దెరలి మరల వెఱచఱచి కనుకనిం బఱచినం గృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తంబులు పూరించిన మందాకినీనందనుండు గుంభసంభవున కిట్లనియె.** 91

**ప్రతిపదార్థం:** అంతయున్= సమస్తం; కనుంగొని= చూచి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; కడంగి= పూని; సేనలకున్+ఎల్లను= సైన్యాలకు అన్నిటికీ; చేయి+వీచినన్= చేతిని ఇటునటుకదల్చగా= ప్రోత్సహించగా; ఒక్క+పెట్ట= ఒక్కసారిగా; ఉరవడించి= అతిశయించి; కురు+సైన్యంబు= కౌరవసేన; తలంకన్+తలపడియెన్= చలింపగా మార్కొన్నవి (పాండవసేనలు); అప్పుడు; ఆదిత్యున్+కప్పి= సూర్యుని మరుగుపరచి; ధరణీ రేణువులు= భూమినుండి చెలరేగిన ధూళికణాలు; చీఁకట్లు+కవియింపన్= అంధకారం వ్యాపింపచేయగా; కరి, తురగ, నర, గాత్ర, గళిత, రుధిర, ధారా, ఆసారంబు= ఏనుగులు -గుర్రాలు, మనుజుల కళేబరాల నుండి జారిన నెత్తుటి చాళ్ళ జడివాన అది= ఆ ధూళిని; అడంగు+అట్లు= సమసిపోయేటట్లుగా; చేసెన్; అంతన్= పిదప; అర్జును, వివిధ, బాణ, పాతంబులన్= అర్జునుని యొక్క పెక్కు అమ్ముల ప్రయోగం వల్ల; కౌరవ+అనీకంబునన్= కౌరవులసేనలో; తునియలు+ఐన= ముక్కలు అయిన; శరాసన, శర, కరవాల, పరిఘ, పరశ్వధ, ఆదులును= ధనువులు, బాణాలు, కత్తులు,ఇనుపగుదియలు, గండ్రగొడ్డళ్ళూ మొదలైనవి; పఱియలు+ఐన= ముక్కలు అయిన; హరి శిరస్+కుంభి కుంభ పదాతి కపాల, ప్రభృతులును= గుర్రాల తలలు, ఏనుగుల తలలు కాల్బలముల పుర్రెలు, మొదలయినవి; తుమురులు+ఐన= చిన్న చిన్న ముక్కలు అయిన; రథాంగ ధ్వజ చత్ర చామర ప్రముఖంబులున్= రథచక్రాలు, జెండాలు, ఛత్రాలు, చామరలు మున్నగునవి; కలిగి= ఉండి; కయ్యంపునేల= రణరంగం; ఘోరంబు+అయ్యెన్= భయంకరంగా కనిపించింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; తమ+మీఁది+మానుసులు= తమపై ఎక్కిన మనుష్యులు; పడినన్= కూలగా; చెడి= పాడయి; తిరిగెడు= సంచరించునట్టి; హయ, గజ, స్యందనంబులును= గుర్రాలు, ఏనుగులు, రథాలున్నూ; తురంగ మాతంగ స్యందనంబులు= గుర్రాలు, ఏనుగులు, రథాలు; రూపు+అఱినన్= నశించగా; ఏపు+అఱి= అతిశయం నశించి; మెలంగు= తిరుగాడు; అయ్యె= ఆయా; ఆరోహకులును= ఎక్కినవారు; ఐ= అయి; ఆకులతన్+పొంది= కలతచెంది; మన+బలంబు= మన సైన్యం; తెరలి= కలతచెంది; మరలన్= ఇంకను; వెఱచఱచి= భయపడి; కనుకనిన్+పఱచినన్= సంభ్రమంతో పరుగెత్తగా; కృష్ణ+అర్జునులు= కృష్ణుడును, అర్జునుడును; పాంచజన్య+దేవదత్తంబులు= పాంచజన్యం, దేవదత్తం అనే శంఖాలు; పూరించినన్= ఒత్తగా; మందాకినీ నందనుండు= భీష్ముడు; కుంభసంభవునకున్= ద్రోణునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు చేయెత్తి తనసేనలను పురికొల్పాడు. పాండవసేనలు ఒక్కపెట్టున ఉత్సాహంతో విజృంభించి కౌరవ సేనలను మార్కొన్నాయి. అప్పుడు నేలమీది నుండి రేగిన దుమ్ము సూర్యబింబాన్ని కప్పివేసింది. చీకట్లు క్రమ్మినట్లయింది. అయితే-చనిపోయిన ఏనుగులు, గుర్రాలు, భటుల దేహాలనుండి స్రవించిన నెత్తుటి ధారలవలన, ఆ దుమ్ము అణగిపోయింది. తరువాత, అర్జునుడు ప్రయోగించిన బాణ పరంపరల వలన కౌరవసేనలో ఖండఖండాలు అయిన విల్లులు, అమ్ములు, కత్తులు, ఇనుపగుదియలు, గండ్రగొడ్డళ్ళు - మరియు ముక్కచెక్కలయిన గుర్రాల తలలు, ఏనుగుల కుంభస్థలాలు, కాలిభటుల పుర్రెలు, దట్టంగాపడిపోయిన చక్రాలు, జెండాలు, గొడుగులు, చామరాలు మున్నగు వాటితో రణరంగం భయంకరంగా కన్పించింది.

ఆ సమయంలో, తమమీది మనుష్యులు కూలిపోవటంతో చెడి తిరిగే గుఱ్ఱాలు, ఏనుగులు, రథాలు - గుఱ్ఱాలు, ఏనుగులు, రథాలు చెడిపోతే, దీనులై తిరిగే ఆరోహకులు కలిగి మనసేన భీతితో వెనుకంజ వేసి పారిపోవటం చూచి, కృష్ణుడు, అర్జునుడు విజయగర్వంతో తమ శంఖాలు పాంచజన్యం, దేవదత్తం పూరించారు. అప్పుడు, భీష్ముడు కౌరవసేన దుఃస్థితి గమనించి ద్రోణుడితో ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** శ్రీకృష్ణుడి శంఖంపేరు పాంచజన్యం. అర్జునుడి శంఖంపేరు దేవదత్తం. వీరులు యుద్ధం చేసేది విల్లు అమ్ములు గదలు మొదలైన ఆయుధాలలో అయినప్పటికీ, శంఖాలు, తప్పెట్లు, భేరులు మొదలైన వాద్యాలు- యుద్ధంలోని ఉత్సాహానికి భారమితులుగా గోచరించేవి. వివిధ వాద్య విశేషాలు పరాక్రమ ప్రతీకలై శౌర్యసంరంభానికి దోహదం కల్పించేవి.

**తే.** **' కృష్ణసారథ్యమున నొప్పుక్రీడి యిపుడు । కౌరవానీకముల నెల్లఁ గసిమసంగి**
**కృష్ణసారథ్యమున నొప్పుక్రీడి యైన । నెట్లు సేయంగవలయుఁ దానట్లు సేసె.** **92**

**ప్రతిపదార్థం:** కృష్ణ+సారథ్యమునన్= శ్రీకృష్ణుడు తన రథాన్ని నడుపుతున్నప్పుడు, ఒప్పు= శోభిల్లు; క్రీడి= అర్జునుడు; ఇపుడు= ఈ సమయంలో; కౌరవ+అనీకములన్+ఎల్లన్= కౌరవసేనలను అన్నింటినీ; కసిమసంగి= సంహరించి; కృష్ణ+సారథ్యమునన్= శ్రీకృష్ణుని నాయకత్వంలో; ఒప్పు= శోభిల్లు; క్రీడి= క్రీడించునట్టివాడు; అయినన్= అయినప్పుడు; ఎట్లు= ఏ రీతిగా; చేయంగవలయున్= చేయాలో; తాను= అర్జునుడు; అట్లు= అదేరీతిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు తన రథానికి సారథియై యుండగా, అర్జునుడు కౌరవసేనలను సంహరించాడు. ఆనాడు- రథం నడపటంలో శ్రీకృష్ణుని మించిన నేర్పుగల సారథి లేడని ప్రసిద్ధి. అంతగొప్ప సారథి లభించటంచేత రథికుడుగా రాణించి అర్జునుడు కౌరవసేనలను చీల్చి చెండాడగలిగాడు. అంతేగాక - శ్రీకృష్ణుని నాయకత్వంలో రథిక వీరుడైన అర్జునుడు గొప్ప ఆటగాడుగా మారిపోయి - ఘోర యుద్ధభూమిని క్రీడారంగంగా చేసికొని వీరవినోద విహారం చేశాడు.

**విశేషం:** 1. ఈ పద్యంలో మొదటి రెండు పాదాలలో క్రీడి= అర్జునుడు రథికుడు. మూడు నాలుగు పాదాలలో అర్జునుడు= క్రీడి. పద్య పూర్వార్ధంలో కృష్ణుడు - అర్జున విధేయుడు. ఉత్తరార్ధంలో అర్జునుడు శ్రీకృష్ణ విధేయుడు. ఈ మాటలు అన్నది ఎవరు? భీష్ముడు. భీష్ముడి దృష్టిలో శ్రీకృష్ణుడు జగన్నాటక సూత్రధారి. సాక్షాత్తు పరమాత్మ, అవతారమూర్తి. ఆనాడు జగదేక ధనుర్ధరుడుగా ప్రసిద్ధికెక్కిన తాను కౌరవసేనాపతి యైనప్పటికీ - అర్జునుడు తాను చూస్తూ ఉండగనే కౌరవసేనలను చీల్చి చెండాడగలిగాడు. భీష్ముని దృష్టిలో - అర్జునుడికి ఆ శక్తి సామర్థ్యాలు కలగటానికి కారణం శ్రీకృష్ణ సారథ్యం.

2. శ్రీకృష్ణుడు ఆదర్శకర్మయోగి. అతని దృష్టిలో - నీచకర్మ లేనేలేదు. ఉదాహరణకు ఆతడు సారథి భూమికను ధరించేవాడు. గుఱ్ఱాలకు దాణా వేసేవాడు. వాటికి స్నానం చేయించేవాడు. రాజసూయయాగ సూత్రధారి శ్రీకృష్ణుడు. జరాసంధ కథకు హేతువు భీముని శక్తికంటె శ్రీకృష్ణుని యుక్తియే ఎక్కువ కారణం అని చెప్పవచ్చు. రాజసూయయాగంలో అతిథులు భోజనం ముగించిన పిమ్మట శ్రీకృష్ణుడు ఎంగిలి విస్తళ్ళు ఎత్తినట్లు జనశ్రుతిలో ప్రచారంలో ఉన్న జానపద గాథ.

**క.** **విను మలుక వొడమి మిక్కిలి । కనుదెఱచిన త్రిపురవైరి కైవడి యీ య**
**ర్జునునందుఁ దోఁచుచున్నది । మనమొనలున్ వశముగావు మరలుపు మింకన్.** **93**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకింపుము; అలుక+పొడమి= కోపంవచ్చి; మిక్కిలి+కను+తెఱచిన= అధికమైన కన్ను అనగా మూడవకన్ను విప్పిన; త్రిపుర+వైరి+కైవడి= పరమశివుడి రీతి; ఈ+అర్జును+అందున్= ఈ అర్జునుడిలో; తోఁచుచున్నది= కనపడుతున్నది; మన+మొనలున్= మన సేనలు; వశము+కావు= మన అధీనంలో లేవు; ఇంకన్+ఇకమీద; మరలుపుము= (పారిపోయే) సేనలను మళ్ళించునది.

**తాత్పర్యం:** అర్జునుడినిచూస్తే, అతడు మూడవకన్ను విప్పిన పరమ శివుడుగా కనిపించుతున్నాడు. మన సేనలు మన అధీనంలో లేవు. పారిపోయే సేనలను మళ్ళించుము.

**విశేషం:** 1. త్రిపుర+వైరి= శివుడు -'త్రిపుర'ములు నాశనం చేసినట్లు పురాణకథనం. కొందరు పండితులు 'త్రిపురములు' హరప్పా నాగరికతకు చెందినవనీ, ఆర్యుల దేవుడు శివుడు వాటిని నాశనం చేశాడనీ, ఆర్యులు గ్రామీణ నాగరికతకు చెందినవారనీ ఒకవాదం లేవదీశారు. ఈవాదంలోని సత్యాసత్యాలు భావి పరిశోధనల వలన తేలవలసినట్టివే. 2. శివుడు ఫాలనేత్రుడనీ - ఆతని మూడవ కన్ను ప్రళయాగ్ని సదృశమనీ పురాణకథనం.

**వ.** **పోక నిలిచిన బలు మానుసులుం బెద్దయు డస్సి యోహటించినయట్లున్నవారు వారిజ మిత్త్రుండు నపరగిరిశిఖరంబునకుం జేరె' నేఁటికిఁ గయ్యంబు సాలింత మని చెప్పి యతం డియ్యకొన నెల్లవారలం దివియ నియమించి నడపించె నప్పుడు పాండవులు పాంచాల మాత్స్యాది పరివార సహితంబుగా నార్పులు సెలంగి నింగి ముట్ట మరలి రిట్లు రెండవనాఁటి సంధ్యాసమయంబున రెండుదెఱంగులవారును దమతమ శిబిరంబులకుం జనిరి; మఱునాఁడు.** **94**

**ప్రతిపదార్థం:** పోక+నిలిచినన్= పారిపోకుండా నిలువగా; బలుమానుసులు= గొప్ప భటులు; పెద్దయున్= మిక్కుటముగా; డస్సి+ఓహటించిన+అట్లు+ఉన్నవారు= బడలి వేసారినట్లు కన్పించుతున్నారు; వారిజమిత్త్రుండు= పద్మమిత్రుడు, సూర్యుడు; అపర గిరి శిఖరంబునకున్= పడమటికొండ కొసకు; చేరెన్; నేఁటికిన్= ఈరోజుకు; కయ్యంబు+చాలింతము= యుద్ధం విరమించుదాము; అని+చెప్పి; అతండు= ద్రోణుడు; ఇయ్యకొనన్= అంగీకరించగా; ఎల్లవారలన్= అందరినీ; తివియన్+నియమించి= మరలుటకు ఆజ్ఞాపించి; నడపించెన్= సైన్యమును నడపించాడు; అప్పుడు= ఆ సమయంలో; పాండవులు; పాంచాల మాత్స్య+ఆది+పరివార, సహితంబుగాన్= పాంచాలురు, మత్స్యదేశానికి సంబంధించినవారు మున్నగు అనుచరులతో పాటు; ఆర్పులు+చెలంగి+నింగి+ముట్టన్= సింహనాదాలు మ్రోగి ఆకాశం అంటగా; మరలిరి= తమతమ నివాసాలకు వెనుదిరిగి వెళ్ళారు; ఇట్లు= ఈ విధంగా; రెండవనాఁటి= రెండవరోజు; సంధ్యా+సమయంబున్= సంజవేళ(సూర్యాస్తమయ సమయం పిమ్మట); రెండు+తెఱంగుల వారును= రెండు పక్షాలవారును, కౌరవ పాండవసేనలలోని వారలు; తమ తమ శిబిరంబులకున్= తమ తమ స్కంధావారాలకు, తాము విడిదిచేసిన చోట్లకు; చనిరి= వెళ్ళారు; మఱునాఁడు= ఆపై దినమున.

**తాత్పర్యం:** "పారిపోకుండా రణరంగంలో నిలిచిన పోటరులైన భటులుకూడా, బడలి వేసారి ఉన్నారు. సూర్యుడు అస్తమించుతున్నాడు. నేడు ఇంక యుద్ధం ఆపటం మంచిది' అని భీష్ముడు చెప్పాడు. ద్రోణుడు అతని మాటకు అంగీకరించాడు. అప్పుడు భీష్ముడు అందరినీ యుద్ధభూమి నుండి నిష్క్రమించమని ఆజ్ఞాపించి కౌరవసేనలను మరలించాడు. పాండవులు పాంచాల సేనలు, మత్స్యసేనలు మున్నగు అనుచరులతోపాటు సింహనాదాలు చెలరేగి ఆకాశం అంటుతుండగా తమ తమ శిబిరాలకు తరలివెళ్ళారు. ఇది రెండవనాటి సాయంకాలం జరిగిన యుద్ధంతీరు. మరునాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

## భీష్ముని తృతీయ దివస యుద్ధము (సం. 6-52-1)

**క.** **రేపకడ రభసమున గం। గాపుత్త్రుఁడు సేనఁ గూర్చి గరుడవ్యూహం**
**బేపారఁ దీర్చికొని ము। క్కై పొలుపును బలుపు మెఱయునట్లుగ నిలిచెన్.** **95**

**ప్రతిపదార్థం:** రేప+కడ= ప్రొద్దుపొడుపు వేళ; రభసమునన్= తొందరగా; గంగా పుత్రుడు= భీష్ముడు; సేనన్+కూర్చి= సేనను ప్రోగుచేసి; గరుడ వ్యూహంబు+ఏపారన్= గరుడాకారంగా ఉండే వ్యూహాన్ని అతిశయించేటట్లు; తీర్చికొని= తీర్చిదిద్ది; ముక్కు+ఐ=

తాను ఆ గరుడ వ్యూహానికి "ముక్కు" స్థానంలో నిలిచి; పొలుపును+బలుపు+మెఱయు+అట్లుగన్= అందమూ బలమూ ప్రకటమగునట్లుగా; నిలిచెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** తెల్లవారగానే, భీష్ముడు కౌరవసేనలను అన్నిటినీ ప్రోగుచేసి 'గరుడవ్యూహం'గా తీర్చిదిద్దాడు. తాను ఆ గరుడాకారంలో ఉన్న ఆ వ్యూహానికి 'ముక్కు'గా నిలబడ్డాడు. భీష్ముడు 'ముక్కు' స్థానంలో నిలబడడం చేత ఆ వ్యూహానికి అందం, బలం కూడా చేకూరాయి.

**వ. దానికి ద్రోణకృతవర్మలు కన్ను లయిరి కృపాశ్వత్థామలు శిరం బయి నిలిచిరి త్రిగర్తులతోఁ గూడి భూరి శ్రవశ్శల్య భగదత్తులును సౌవీరజయద్రథులును గంఠత్వంబు నొందిరి మనుజపతి యనుజులుం దానును వెన్నయ్యె విందానువిందులుం గాంభోజుండును శూరసేనుండునుం బుచ్ఛం బైరి మాగధకళింగాదిగణంబులు దక్షిణపక్షం బయ్యెను గర్ణాటకోసలప్రముఖనికాయంబులు వామపక్షం బయ్యెను బొలిచిరి తక్కునుం గలవారలుఁ గలయం బన్ని రంతం బాండవబలంబులును భండనంబునకు వెడలె నయ్యవసరంబున నర్జునుండు. 96**

**ప్రతిపదార్థం:** దానికిన్= ఆ గరుడవ్యూహానికి; ద్రోణ+కృతవర్మలు= ద్రోణుడు కృతవర్మ; కన్నులు+అయిరి= నేత్రాలు అయ్యారు; కృప+అశ్వత్థామలు= కృపాచార్యుడు, అశ్వత్థామ;శిరంబు+అయి= తల అయి; నిలిచిరి= నిలబడ్డారు, త్రిగర్తులతోన్+కూడి= త్రిగర్తులు అనేవారితో కలిసి; భూరిశ్రవస్+శల్య భగదత్తులును= భూరిశ్రవుడు, శల్యుడు, భగదత్తుడు, సౌవీర, జయద్రథులును= సౌవీరరాజు; (సింధురాజు); జయద్రథుడు; కంఠత్వంబున్+ఒందిరి= కుత్తుకభావం పొందారు; మనుజపతి= రాజు(దుర్యోధనుడు); తానును+అనుజులున్= తాను తన తమ్ములు; వెన్ను+అయ్యెన్= వీపుగా అయ్యారు; వింద+అనువిందులున్= విందుడును, అనువిందుడును; కాంభోజుండును= కాంభోజరాజూ; శూరసేనుండునున్= శూరసేన రాజూ; పుచ్ఛంబు+అయిరి= తోక అయినారు; మాగధ కళింగాది గణంబులు= మగధకు, కళింగానికి చెందిన సేనలు; దక్షిణ+పక్షంబు+అయ్యెను= కుడి రెక్కగాను; కర్ణాట కోసల ప్రముఖ నికాయంబులు= కర్ణాటదేశం, కోసలదేశం - మున్నగు దేశాలకు సంబంధించిన సేనా సమూహాలు, వామపక్షంబు+అయ్యెను= ఎడమ రెక్కగాను; పొలిచిరి= శోభిల్లారు; తక్కునున్+కలవారలున్= మిగిలినట్టివారు; కలయన్+పన్నిరి= ఇటూ, నటూ కలిసి పోయేట్లుగా చేరారు; అంతన్= పిమ్మట; పాండవ+బలంబులును= పాండవుల సేనలును; భండనంబునకున్= యుద్ధానికి; వెడలెన్= వెళ్ళాయి; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; అర్జునుండు.

**తాత్పర్యం:** గరుడాకారంలో ఏర్పడిన ఆ వ్యూహానికి ద్రోణుడు, కృతవర్మ కన్నులుగా నిలిచారు. కృపుడు, అశ్వత్థామ శిరస్సు అయ్యారు. త్రిగర్తులు - భూరిశ్రవుడు - శల్యుడు - భగదత్తుడు సౌవీరరాజు సింధుభూపతి జయద్రథుడు కంఠంగా అయ్యారు. దుర్యోధనుడు - తమ్ములు వీపు అయ్యారు. విందుడు, అనువిందుడు, కాంభోజరాజు, శూరసేనరాజు తోక అయ్యారు. మాగధరాజు - కళింగరాజు మున్నగువారు కుడి రెక్క అయ్యారు. కర్ణాట కోసల సేనలు మున్నగునవి ఎడమరెక్క అయ్యాయి. తక్కినవారు ఇటు అటు సర్దుకున్నారు. అప్పుడు పాండవసేనలు కూడా, యుద్ధభూమికి తరలివెళ్ళాయి. ఆ సమయంలో అర్జునుడు (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మనమొనఁ గని ధృష్టద్యు । మ్నున కిట్లనుఁ బన్నఁబంపు మోహర మర్ధేం**
**దుని చందంబున దుర్యో । ధనుసైన్యముఁ బొదువుననువు దలకొనవలయున్. 97**

**ప్రతిపదార్థం:** మన+మొనన్= మన సైన్యాన్ని; కని= చూచి; ధృష్టద్యుమ్ననకున్= ధృష్టద్యుమ్నునితో; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; మోహరము= వ్యూహాన్ని; అర్ధ+ఇందుని+చందంబునన్= అర్ధచంద్రుని ఆకారంలో; పన్నన్+పంపు= పన్నుట కాజ్ఞాపించుము; దుర్యోధను+సైన్యమున్= దుర్యోధనుని సైన్యమును; పొదువు= మార్కొనే; అనువు+తలకొనన్+వలయున్= అనుకూలత ఏర్పడాలి.

**తాత్పర్యం:** అర్జునుడు కౌరవసేనను చూచి ధృష్టద్యుమ్నుడితో ఈ రీతిగా చెప్పాడు. 'అర్ధచంద్రాకారంలో మన వ్యూహాన్ని అమర్చవలసింది. ఎందుకంటే దుర్యోధనుడి వ్యూహాన్ని ఛేదించే ఉపాయం మనం అనుసరించాలి గదా!'

**విశేషం:** వ్యూహాన్ని బట్టి - ప్రతివ్యూహం ఉంటుంది. కౌరవులు గరుడవ్యూహం పన్నారుకదా! పాండవులు అర్ధచంద్రాకార వ్యూహం పన్నితే-గరుడపక్షి కుత్తుక ఉత్తరించటానికి వీలు కలుగుతుంది.

**వ. అనిన విని యతం డట్ల చేసినం బాండ్యమగధబలపరివృతుం డై భీమసేనుండు దక్షిణశృంగంబున నిలిచెం దదనంతరంబ విరాటద్రుపదులును మఱియు నీలుండును గాశకరూశగణసమేతుండై ధృష్టకేతుండును నిలిచిరి శిఖండి సహితుం డగు ధృష్టద్యుమ్ను మున్నిడికొని యుధిష్ఠిరుండు శుండాలమాలికాభీలంబుగా మధ్యప్రదేశం బలంకరించె నవ్వలన సాత్యకి మొదలుకొని యోలిన కవలును ద్రౌపదేయులు నభిమన్యుండు ఘటోత్కచుండుం గేకయపతులుం బన్నిరి సకలలోకంబులకు రక్షకుండైన రాజీవాక్షుం డెవ్వానికి రక్షణం బొనర్చు నట్టి రథికశ్రేష్ఠుండు డాపలికొమ్మునం బన్నెఁ దక్కటి దొరలుం గలయమోహరించి రిట్లుభయసైన్యంబులు సన్నద్ధంబు లయి నడచి నిస్సాణాదుల రావంబులు సెలంగ రౌద్రంబు దలకొనం దార్కొనియెఁ దత్సమయంబున ధనంజయుండు మన పదాతులు బడలువడం దనరథంబు వఱపించి శరంబులు నిగిడించి. 98**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని అర్జునుడు చెప్పగా ఆలకించి; అతండు= ధృష్టద్యుమ్నుడు; అట్లు+అ+చేసినన్= ఆ విధంగా చేయగా; పాండ్య, మగధ, బల పరివృతుండు+ఐ= పాండ్య మగధ సేనలు తన చుట్టూచేరగా; భీమసేనుండు; దక్షిణ+శృంగంబునన్= దక్షిణమునను న్న కొసకు; నిలిచెన్; తద్+అనంతరంబు+అ= అటుపిమ్మట; విరాట ద్రుపదులును= విరాటుడు, ద్రుపదుడును; మఱియున్= అదనంగా; నీలుండును= నీలుడును; కాశ కరూశ గణ సమేతుండు+ఐ= కాశీదేశానికి, కరూశదేశానికి సంబంధించిన సేనలతో కూడినవాడై; ధృష్టకేతుండును= ధృష్టకేతుడును; నిలిచిరి; శిఖండి సహితుండగు= శిఖండితో కూడుకొనిన; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుని; మున్ను+ఇడికొని= ముందుపెట్టుకొని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; శుండాల+మాలికా+ఆభీలంబుగా= ఏనుగుల గుంపువలె భయంకరంగా; మధ్య+ప్రదేశంబు= నడిమిచోటును; అలంకరించెన్= అందముగా చోటు చేసుకున్నాడు; ఆవలనన్= అటువైపు; సాత్యకి+మొదలుకొని= సాత్యకి మొదలగువారు; ఓలిన్+ఆ= వరుసగా; కవలును= కూడిన నకుల సహదేవులును; ద్రౌపదేయులు= ద్రౌపది కొడుకులు; అభిమన్యుండు; ఘటోత్కచుండున్; కేకయపతులున్= కేకయరాజులును; పన్నిరి= వ్యూహంలో చేరారు; సకల లోకంబులకున్= అన్ని లోకాలకు; రక్షకుండు+ఐన= కాపాడే వాడైన; రాజీవాక్షుండు= పద్మనయనుడు, శ్రీకృష్ణుడు; ఏ+వానికిన్+రక్షణంబు+ఒనర్చున్= ఎవనిని కాపాడుచుండునో; అట్టి= అటువంటి; రథిక+శ్రేష్ఠుండు= తేరెక్కి యుద్ధం చేసేవారిలో గొప్పవాడు, అర్జునుడు; డాపలి+కొమ్మునన్+పన్నెన్= ఎడమకొసగా చేరాడు; తక్కటి+దొరలున్= మిగిలినరాజులు; కలయన్+మోహరించిరి= కలిసిపోయేటట్లుగా వ్యూహంలో చేరారు; ఇట్లు= ఈ రీతిగా; ఉభయ సైన్యంబులున్= రెండుసేనలు; సన్నద్ధంబులు+ఐ= సంసిద్ధమై; నడచి= దండు వెడలి; నిస్సాణ+ఆదుల+రావంబులు= బూరాలు మొదలగు వాద్యాల ధ్వనులు; చెలంగన్= ధ్వనించగా; రౌద్రంబు= అధికకోపం; తలకొనన్= వ్యాపింపగా; తార్కొనియెన్= మార్కొన్నాయి; తద్+సమయంబునన్= ఆ కాలంలో; ధనంజయుండు= అర్జునుడు; మన పదాతులు= మన కాలిబంటులు; బడలు+పడన్= డస్సిపోవునట్లుగా; తన+రథంబు= తన తేరు; పఱపించి= నడిపించి; శరంబులు= బాణాలు; నిగిడించి= ప్రయోగించి.

**తాత్పర్యం:** అర్జునుని సూచన మేరకు ధృష్టద్యుమ్నుడు పాండవ సేనను అర్ధచంద్రవ్యూహంగా అమర్చాడు. భీముడు- పాండ్య మగధ సేనలతో కూడిన వాడై, కుడి కొసను నిలిచాడు. అటుపిమ్మట విరాటుడు, ద్రుపదుడు నిలిచారు. నీలునితోపాటుగా ధృష్టకేతుడు కాశీదేశ కరూశదేశ సేనలతో పాటు నిలిచాడు. శిఖండితోపాటు ధృష్టద్యుమ్నుని ముందు పెట్టుకొని, యుధిష్ఠిరుడు తన చుట్టూ ఏనుగుల దండును కాపుగా పెట్టుకొని వ్యూహానికి

మధ్యగా నిలిచాడు. అటు ప్రక్కగా సాత్యకి, నకుల సహదేవులు, ద్రౌపది కొడుకులు, అభిమన్యుడు, ఘటోత్కచుడు, కేకయరాజులు వ్యూహంలో భాగంగా నిలిచారు. జగద్రక్షకుడైన శ్రీకృష్ణుడు రథసారథిగా గల అర్జునుడు ఎడమ కొసను నిలిచాడు. మిగిలిన రాజులు యథోచిత స్థానాలలో నిలిచారు. ఆ విధంగా ఉభయసేనలూ యుద్ధానికి సంసిద్ధమై బూరాలు మొదలైన వాద్యాల ధ్వనులు మిన్నుముట్టగా, మిక్కిలి రోషంతో మార్మోన్నాయి. ఆ సమయంలో అర్జునుడు విజృంభించి, కౌరవసేనలలోని కాల్బలాన్ని చీకాకు పరచాడు.

**విశేషం:** 1.ఈ వ్యూహ రచనలో గమనింపవలసిన అంశాలు: ఇది కౌరవులు పన్నిన గరుడవ్యూహానికి ప్రతివ్యూహం. గరుడాకృతి వ్యూహంలో కుత్తుక ఉత్తరించటానికి - అర్ధచంద్రవ్యూహం అమర్చబడింది. ఒక కొసలో ధృష్టద్యుమ్నుడు, మరియొక కొసలో అర్జునుడు సుదూరంలో ఉన్నారు. ఇక - మధ్యభాగం ఏమికావాలి? అక్కడ ధర్మరాజు నిలిచాడు. అతనికి తగిన రక్షణ కావాలి. చుట్టూ ఏనుగులు. వాటికి చుట్టు సాత్యకి - కవలు - ద్రౌపదేయులు- అభిమన్యుడు - ఘటోత్కచుడు. 2. ఉపపాండవులు - ఒకేచోట ఉంటారు ఏ వ్యూహంలో అయినా - అట్లే నకుల సహదేవులుకూడా. 3. ఏ దేశానికైనా - ఒక ప్రభువు ఉంటాడు. ఉదాహరణకు విరాటుడు, ద్రుపదుడు మొదలుగా కేకయ దేశానికి మాత్రం కేకయ రాజులు అని బహువచన ప్రయోగమే భారతంలో అన్ని చోట్లా కన్పిస్తుంది. అది 'బహురాజుల' ఆధిపత్యంగల గణతంత్ర రాజ్యాంగం కావున.

**క. అరదములు రథికవరులును । హరి సారథి కేతుసహిత మై పొడిపొడిగాఁ**
**గరులును జోదులు డొల్లఁగఁ । దురగంబులు రావుతులును దుత్తునియలుగన్. 99**

**ప్రతిపదార్థం:** అరదములు= రథాలు; రథిక వరులును= తేరెక్కి యుద్ధం చేసే వీరులు; హరి సారథి కేతు సహితము+ఐ= గుర్రాలు, తేరు నడిపే సూతులు= జెండాలతో కూడ; పొడిపొడిగాన్= చూర్ణము అయ్యేటట్లుగా; కరులును= ఏనుగులు; జోదులు= భటులు; డొల్లఁగన్= కూలిపోగా; తురగంబులు= గుర్రాలు; రావుతులును= గుర్రాలపై ఎక్కి యుద్ధంచేసే భటులూ; తునియలు+తునియలుగాన్= ముక్కలు ముక్కలుకాగా; (అర్జునుడు యుద్ధం చేయగా)

**తాత్పర్యం:** రథాలు, రథాలపై ఎక్కి యుద్ధం చేసే వీరులూ, గుర్రాలు - సారథులు జెండాలతోపాటు పొడిపొడి అయ్యేటట్లు అర్జునుడు అమ్ములు ప్రయోగించాడు. ఏనుగులు- భటులు కూలారు. గుర్రాలు, గుర్రాలను ఎక్కి యుద్ధం చేసేవాళ్ళూ. ముక్కలుగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. చేయఁ దొడంగిన గాంధా । రేయులు వెస నొక్కపెట్ట రేఁగి యతనిపైఁ**
**గో యని కవిసినఁ గని కౌం । తేయులు నందఱుఁ గడంగి తేరులు పఱపన్. 100**

**ప్రతిపదార్థం:** చేయన్+తొడంగినన్= ముక్కలు చేయసాగిన; గాంధారేయులు= గాంధారి కొడుకులు(కౌరవులు); వెసన్= వేగంగా; ఒక్క+పెట్ట+రేఁగి= ఒకేమారు విజృంభించి; అతనిపైన్= అర్జునుడిపై; 'కో'+అని+కవిసినన్= గోల చేస్తూ మార్మోనగా; కౌంతేయులు+అందరు= పాండవులు అందరూ; కడంగి= పూని; తేరులు= రథాలు; పఱపన్= తోలగా.

**తాత్పర్యం:** అర్జునుడు కౌరవసేనను విధ్వంసం చేయగా, కౌరవులు అందరూ ఏకమై అతనిపై మార్మోన్నారు. దానితో పాండవులు అందరూ ఏకమై వారిపైకి తమరథాలను మళ్ళించగా.

**విశేషాలు:** 'కోయని కవిసిన' - అది ఎక్కటి కయ్యం కాదు. అది సంకుల సమరం. అందరూ కలిసి- శత్రుసేనను తాకేటప్పుడు అది మౌనంగా అమ్ములు ప్రయోగించడం కాదు. ఆ దొమ్మి సంరంభంలో హెచ్చరికతో కూడిన 'నినాదం' వహించే భూమిక అర్థం చేసుకోవాలి. 'కో' అని మార్మోనిన అనే ప్రయోగం సార్థకం. 'కో' ధ్వని అనుకరణ.

**వ. కని తమకించి బలంబులు రెండును గలయన్ బెరయఁ గెందూళి యెగసిన. 101**

**ప్రతిపదార్థం:** కని= చూచి; తమకించి= ఉత్సహించి; బలంబులు రెండును= ఉభయసైన్యాలు, కౌరవపాండవసేనలు రెండూ; కలయన్ బెరయన్= మార్కొనగా; కెంపు+దూళి= కెందూళి(ఎర్రని దుమ్ము); ఎగసినన్= ఎగురగా;

**తాత్పర్యం:** కురు పాండవుల సేనలు రెండు తారసిల్లి యుద్ధం చేస్తుండగా కెందూళి ఎగరగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నామములఁ బితృపితామహ । నామంబుల నుగ్రబిరుదనామంబుల సాం**
**గ్రామికు లెఱిఁగింతురు దము । నా మొన నీ మొనను జూపు లడరక యున్నన్. 102**

**ప్రతిపదార్థం:** నామములన్= పేరులతో; పితృ+పితామహ+నామంబులన్= తండ్రి తాతల పేరులతో; ఉగ్ర+బిరుద+నామంబులన్= భయంకరములైన బిరుదుల పేరులతో; సాంగ్రామికులు= యుద్ధం చేసేవారు; తమున్= తమ్ము; ఆ మొనన్+ఈ మొనన్= ఆ సేనయందు ఈ సేనయందు, (పాండవుల సేనయందు , కౌరవసేనయందు); చూపులు+అడరక+ఉన్నన్= కన్నులు కనుపించక ఉన్నప్పుడు; ఎఱిఁగింతురు= తెలియచేసుకుంటారు.

**తాత్పర్యం:** ఎవరెవరో - ఎవరికీ తెలియని ఆ సమయంలో యుద్ధం చేసేవారు తామెవరో తెలిసేటట్లుగా - బిగ్గరగా తమ పేరులు - తమ తండ్రుల పేరులు, తాతల పేరులు తమ బిరుదులు ప్రకటించుకుంటారు.

**విశేషం:** తిక్కన కాలంలో, తదుపరి భారతదేశ చరిత్రలో మధ్యయుగాలలో 'బిరుదావళులు' మిక్కిలి ప్రాముఖ్యం వహించాయి. 'గండరగండ', 'మూరురాయరగండ' ఉదాహరణప్రాయాలు.

**తే. ఇవ్విధంబునఁ గ్రందుపా టింతయైన । భీష్ము కడఁక నీ సైన్యంబు భీముబలిమిఁ**
**జేసి యా సేనయును నప్డు సిక్కు వడక । పోరె నేమని చెప్పదుఁ గౌరవేంద్ర! 103**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవ శ్రేష్ఠుడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఈ+విధంబునన్= ఈ రీతిగా; క్రందుపాటు= సమ్మర్దం; ఇంత+ఐన= ఇంతగా విస్తరించగా; భీష్ము+కడఁకన్= భీష్ముని యొక్క పూనికచే; నీ+సైన్యంబు= నీ సేన; భీము+బలిమిన్+చేసి= భీముని యొక్క శక్తిచేత; ఆ+సేనయును= ఆ పాండవుల సైన్యం; అప్డు= ఆ సమయంలో; చిక్కు+పడక= చీకాకుకాకుండా; పోరెన్= యుద్ధం చేశాయి; ఏమి+అని+చెప్పుదున్= ఇంక ఏమి చెప్పగలను?

**తాత్పర్యం:** ఈ రీతిగా సమ్మర్దం ఇంతగా సాగింది. భీష్ముడి నాయకత్వంలో కౌరవసేన, భీముడి నాయకత్వంలో పాండవసేన - ఒకరినొకరు మార్కొన్నారు. ఏ పక్షమూ వెనుకంజ వేయలేదు, జంకలేదు. ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఉభయపక్షాల పరాక్రమమూ వర్ణనాతీతం.

**విశేషం:** 'ఏమని చెప్పుదు' అనే ప్రయోగంలోని సారస్యం గమనింపదగినట్టిది. ఘోరమైన పోరాటంలో ఉభయసేనలు చూపిన తెగువ, తెంపు - చూపరియైన సంజయుడికి ఆశ్చర్యావహాలుగా కనుపించాయి.

**క. శోణితము వెల్లి గవిసిన । రేణు వడంగుటయు మొనలు ప్రియపడి వెస గీ**
**ర్వాణాసురసమరము క్రియ । బాణాదినిశాతహేతిపంక్తులు మెఱయన్. 104**

**ప్రతిపదార్థం:** శోణితము+వెల్లి= నెత్తుటి ప్రవాహం; కవిసినన్= క్రమ్మగా; రేణువు= దుమ్ము; అడంగుటయున్= అణగిపోవుటయు; మొనలు= సేనలు; ప్రియపడి= సంతోషించి; వెసన్= వేగంగా; గీర్వాణ+అసుర+సమరము క్రియన్=

దేవతల రాక్షసుల యొక్క యుద్ధంవలె; బాణ+ఆది+నిశాత+హేతి+ పంక్తులు= అమ్ములు మొదలైన వాడి కత్తుల వరుసలు; మెఱయన్= ప్రకాశింపగా.

**తాత్పర్యం:** కురు పాండవసేనల తాకిడికి దుమ్ము చెలరేగింది. అంత దుమ్ము ఏ విధంగా అణగారగలదు? యుద్ధంలో ప్రవహించిన నెత్తుటి ధారలచే ఆ దుమ్ము అణగింది. కురు పాండవ సేనల యుద్ధం - దేవతలు రాక్షసులు చేసిన యుద్ధంవలె ఉన్నది. బాణాలు మొదలైన వాడి ఆయుధాల వరుసలు ప్రకాశించాయి.

**విశేషం:** ఈ పద్యంలో 'ప్రియపడి' అనే ప్రయోగం గమనింపదగినట్టిది. ఘోర సంగ్రామంలో 'ప్రియపడటం' ఏమిటి? దట్టంగా క్రమ్మిన దుమ్ము అణగారటం వీరులకు సంతోషదాయకమే. ఇక నెత్తురు ప్రవాహం మాట ఏమిటి? అది యుద్ధం. వీరులు చావుకు తెగించినవారు. వారికి నెత్తురు అన్న భయంలేదు.

**వ. పెనంగునట్టియెడ గాంగేయుండును గురుండును బురుమిత్త్రుండును సైంధవుండును సౌబలుండును వికర్ణుండును బాండవసేనపయి నడరిన భీమసేన ఘటోత్కచసాత్యకిశైబ్యచేకితానద్రౌపదేయులు వారిం దలపడినం బోరు ఘోరం బయ్యె నప్పుడు రథబృందంబులతో భవదగ్రనందనుండు వాయునందన తదీయనందను లున్నయెడకు నురవడించినం గని భీష్మద్రోణు లతని మించి వారలం దాఁకినం జూచి సవ్యసాచి యగ్రజు నగ్రభాగంబునకు వచ్చి. 105**

**ప్రతిపదార్థం:** పెనంగునట్టి+ఎడన్= పోరాడేటపుడు; గాంగేయుండును= భీష్ముడును; గురుండును= ద్రోణుడును; పురుమిత్త్రుండును= పురుమిత్రుడును; సైంధవుండును= సింధురాజును; సౌబలుండును= శకునియు; వికర్ణుండును; పాండవ సేనపయిన్= పాండవుల సైన్యంపై; అడరినన్= విజృంభించగా; భీమసేన ఘటోత్కచ సాత్యకి శైబ్య చేకితాన ద్రౌపదేయులు= భీముడు, ఘటోత్కచుడు, సాత్యకి, శైబ్యుడు, చేకితానుడు, ద్రౌపది కొడుకులూ; వారిన్= కౌరవులను; తలపడినన్= మార్కొనినపుడు; పోరు= యుద్ధం; ఘోరంబు+అయ్యెన్= భీకరం అయింది; అప్పుడు= ఆ సమయంలో; రథ+బృందంబులతోన్= తేరుల గుంపులతో; భవత్+అగ్ర+నందనుండు= నీ పెద్ద కొడుకు(దుర్యోధనుడు);వాయునందన+తదీయనందనులు+ఉన్న+ఎడకున్= భీముడు-అతని కొడుకు ఘటోత్కచుడు ఉన్న చోటికి; ఉరవడించినన్= ఉత్సాహంతో తరలివెళ్ళగా; కని= చూచి; భీష్మ ద్రోణులు= భీష్ముడు, ద్రోణుడు; అతనిన్ మించి= ఆ దుర్యోధనుని దాటి; వారలన్= పాండవపక్షంలోని వీరులను; తాఁకినన్= మార్కొనగా; చూచి; సవ్యసాచి= కవ్వడి(అర్జునుడు); అగ్రజు+అగ్రభాగంబునకున్= అన్నగారైన భీముని ముందునకు; వచ్చి.

**తాత్పర్యం:** కురుపాండవసేనలు యుద్ధం చేస్తున్నప్పుడు, భీష్ముడు, ద్రోణుడు, పురుమిత్రుడు, సైంధవుడు, శకుని, వికర్ణుడు పాండవసేనపై విజృంభించారు. భీముడు, ఘటోత్కచుడు, సాత్యకి, శైబ్యుడు, చేకితానుడు, ద్రౌపదీపుత్రులు వారిని మార్కొన్నారు. ఘోర యుద్ధం జరిగింది. అప్పుడు, రథసమూహాలతో దుర్యోధనుడు భీముడూ అతడి కొడుకు ఘటోత్కచుడూ ఉన్న చోటికి ఉత్సాహంతో తరలి వెళ్ళటం చూచి, భీష్ముడూ ద్రోణుడూ అతనిని దాటి వెళ్ళి వారిని మార్కొన్నారు. అదిచూచి, అర్జునుడు భీముని ముందర చేరి.

**క. భూరిశరాసారంబునఁ। గౌరవుల కడంక యుడిపె గాంధారబలాం**
**భోరాశిఁ దఱియఁ జొచ్చిరి । వీరాగ్రణి సాత్యకియును విజయసుతుండున్. 106**

**ప్రతిపదార్థం:** భూరి+శర+ఆసారంబునన్= గొప్పదైన అమ్ముల జడివానచే; కౌరవుల+కడంక+ఉడిపెన్= కౌరవుల విజృంభణ అరికట్టెను; గాంధార+బల+అంభస్+రాశిన్= గాంధారసేన అనే సముద్రాన్ని; వీర+అగ్రణి= వీరులలో శ్రేష్ఠుడు; సాత్యకియును= సాత్యకీ; విజయ+సుతుండున్= అర్జునుని కొడుకు అయిన అభిమన్యుడూ; తఱియన్+చొచ్చిరి= మథించసాగారు.

**తాత్పర్యం:** గొప్ప అమ్ముల జడివాన కురిపించి, కౌరవుల విజృంభణ అరికట్టాడు అర్జునుడు. వీరులలో శ్రేష్ఠుడు అయిన సాత్యకి, అభిమన్యుడు గాంధార సేనతో పరాక్రమం చూపి పోరాడారు.

**క. పొదివికొని శకునిబల ము । న్మదగతి సాత్యకి రథంబు నఱకిన నాతం**
**డది దిగ్గదాఁటి ధైర్యా । స్పదమతి నభిమన్యుతేరిపైకిం జనియెన్. 107**

**ప్రతిపదార్థం:** పొదివికొని= చుట్టుముట్టి; శకుని బలము= శకునిసేన; ఉన్మదగతిన్= గర్వంతో; సాత్యకి+రథంబు= సాత్యకి తేరు; నఱకినన్= ఖండింపగా; ఆతండు= సాత్యకి; దిగ్గదాఁటి= దిగిపోయి; ధైర్య+ఆస్పద+మతిన్= ధైర్యంతో కూడిన బుద్ధితో; అభిమన్యు+తేరిపైకిన్= అభిమన్యుని రథంమీదికి; చనియెన్= వెళ్ళాడు(అధిరోహించాడు).

**తాత్పర్యం:** శకునిసేన - సాత్యకి రథాన్ని చుట్టుముట్టి ధ్వంసం చేసింది. సాత్యకి రథం దిగి, ధైర్యం విడువకుండా, ఉపాయంగా తప్పించుకొని - అభిమన్యుడి రథం ఎక్కాడు.

**క. వా రిరువురుఁ జలమున గాం । ధారపతి ప్రముఖ రథికతతులను జంచ**
**న్నారాచతతుల నొంచిరి । క్రూరతఁ గవిసెన్ యుధిష్ఠిరుఁడు భీష్ముపయిన్. 108**

**ప్రతిపదార్థం:** చలమునన్= పట్టుదలతో; వారు+ఇరువురున్= వారు ఇద్దరును- అభిమన్యుడు, సాత్యకి; గాంధారపతి ప్రముఖ రథిక తతులన్= శకుని మున్నగు వీరుల సముదాయాన్ని; చంచత్ నారాచ తతులన్= చలించే అమ్ముల గుంపులతో; నొంచిరి= నొవ్వజేశారు; యుధిష్ఠిరుఁడు= ధర్మరాజు; క్రూరతన్= కఠినత్వంతో; భీష్ము+పయిన్= భీష్మునిమీద; కవిసెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** సాత్యకి, అభిమన్యుడు, మిక్కుటమగు పట్టుదలతో శకుని మున్నగు వీరులపై వాడి అమ్ములు ప్రయోగించి యుద్ధం చేశారు. ధర్మరాజు - క్రౌర్యంతో భీష్ముని మార్కొన్నాడు.

**క. భూరిబలఘోర మగు నా । భూరమణుని కోలుతలకుఁ బోవక భీష్మ**
**స్ఫారబలము ద్రోణుని దో । స్సారంబును నచ్చి నీదుసైన్యము పెనఁగెన్. 109**

**ప్రతిపదార్థం:** భూరి బల ఘోరము+అగు= గొప్ప సైన్యముతో భయంకరమైన; ఆ+భూరమణుని= ఆ రాజుయొక్క(ధర్మరాజుయొక్క); కోలుతలకున్+పోవక= ప్రత్యక్ష యుద్ధమునకు జంకక; భీష్మ, స్ఫార, బలమున్= భీష్ముని యొక్క విస్తారమైన శక్తిని; ద్రోణుని; దోఃసారంబును= భుజబలమును(పరాక్రమమును); నచ్చి= ఇష్టపడి, నమ్మి; నీదు+సైన్యము=నీ సేన; పెనఁగెన్= పోరాడింది.

**తాత్పర్యం:** గొప్ప సేనతో కూడి ధర్మరాజు -భీష్ముడిపైబడి ప్రత్యక్షయుద్ధం ప్రారంభించాడు. కౌరవసేన- ధర్మరాజు ధాటికి తట్టుకొని పోరాడింది. కౌరవసేన ఆ విధంగా నిలవటానికి కారణం - భీష్ముని యొక్క విస్తారమైన శక్తి, - ద్రోణుడి భుజబలం మీద కౌరవసేనకు గల గౌరవం.

**విశేషం:** కోలుతల: ఎదుట నిలిచి యుద్ధం చేయటం. ఇది ప్రత్యక్ష యుద్ధం. సంకుల సమరము దొమ్మియుద్ధం.

### దుర్యోధనుఁడు భీమునితో యుద్ధము సేసి మూర్ఛిల్లుట (సం. 6-54-15)

**చ. తదవసరంబునం బతి యుదగ్రత భీమునిఁ దాఁకి విస్ఫుర**
**త్ప్రదరము లేసినన్ నగుచుఁ బాండవవీరుఁడు రాజుమేన బె**
**ట్టిద మగుబాణ మొక్కటి వడింగొని తూఱఁగ నేయఁ దేరిపైఁ**
**జదికిలఁ బడ్డ మూర్ఛ నృపసత్తము లేవఁగనీక కప్పినన్. 110**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; పతి= రాజు(దుర్యోధనుడు); ఉదగ్రతన్= భీకరంగా; భీమునిన్+తాఁకి= భీముని మార్కొని; విస్ఫురత్+ప్రదరములు= ప్రకాశమానములైన అమ్ములు; ఏసినన్= ప్రయోగింపగా; నగుచున్= నవ్వుచు; పాండవ+వీరుఁడు= భీముడు; రాజు+మేన= దుర్యోధనుని శరీరంపై; బెట్టిదము+అగు= కఠినము అయిన; బాణము+ఒక్కటి= ఒక అమ్ము; వడిన్+కొని= వేగంగా గ్రహించి; తూఱఁగన్+ఏయన్= తూట్లుపడేటట్లు ప్రయోగింపగా; తేరిపైన్= రథముమీద; చదికిల+పడ్డ= కూలబడగా; మూర్ఛ= స్పృహలేని స్థితి; నృప+సత్తమున్= రాజశ్రేష్ఠుడిని - దుర్యోధనుడిని; లేవఁగనీక= నిలుచుండేందుకు వీలు కాకుండా; కప్పినన్= ఆవరింపగా

**తాత్పర్యం:** ఆ సమయంలో దుర్యోధనుడు భీముని మార్కొని, వెలుగొందే అమ్ములు విసిరాడు. భీముడు నవ్వుతూ - ఒక కఠినమైనబాణంతో దుర్యోధనుని శరీరం తూట్లు పడేటట్లు కొట్టాడు. దుర్యోధనుడు రథముపై చదికిలబడి లేవలేకుండేటట్లుగా మూర్ఛక్రమ్ముకోగా.

**ఆ. సంభ్రమమున నపుడు సారథి యచ్చోటు । దొలఁగ బెలుచఁ దేరు దోలుటయును**
**గని భయంబు నొంది కలఁగి యొక్కుమ్మడి । బలములెల్లఁ దెరలి పాఱఁ జొచ్చె. 111**

**ప్రతిపదార్థం:** సంభ్రమమునన్= తొట్రుపాటుతో; అపుడు= ఆ సమయంలో; సారథి= దుర్యోధనుని రథ చోదకుడు; ఆ+చోటు= ఆ స్థలం; తొలఁగన్= వీడునట్లుగా; పెలుచన్= వేగంగా, తేరు= రథము; తోలుటయును= నడిపించుటయు; కని= చూచి; భయంబున్+ఒంది= భీతిచెంది; కలఁగి= చీకాకై; బలములు+ఎల్లన్= సేనలు అన్నీ, ఒక్కుమ్మడిన్= ఒక్కసారిగా; తెరలి+పాఱన్+చొచ్చెన్= మరలి పారిపోసాగాయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు మూర్ఛపోవటం చూచి, సంభ్రమంతో అతని సారథి రథాన్ని వేగంగా తోలుకొని, యుద్ధభూమిని వదలిపోవటం చూచి, కౌరవసేనలు కలతచెంది, భీతిచెంది, వెనుదిరిగిపోయాయి.

**క. వెనుకొని విఱిగిన సైన్యము । గనుకనిఁ బాఱంగఁ జేసి క్రౌర్యోద్రేకం**
**బున ధృష్టద్యుమ్నుండును । దన కెలనం దఱుమ వాయుతనయుం డెగిచెన్. 112**

**ప్రతిపదార్థం:** వెనుకొని= వెనుకకు మరలి; విఱిగిన+సైన్యమున్= ఓడిపోయిన సేనను; కనుకనిన్= సంభ్రమంతో; పాఱంగన్+ చేసి= పారిపోయేటట్లు చేసి; క్రౌర్య+ఉద్రేకంబునన్= క్రూరమైన ఆవేశంతో; ధృష్టద్యుమ్నుండును; తనకెలనన్+తఱుమ= తన పార్శ్వాలతో తఱిమి కొట్టగా; వాయు తనయుండు= భీముడు; ఎగిచెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** ఓడిపోయిన కౌరవసేన - వెనుదిరిగి పారిపోతూ ఉండగా, క్రూరత్వంతో కూడిన ఆవేశంతో తన ప్రక్క ధృష్టద్యుమ్నుడు తరిమికొట్టగా, భీముడు విజృంభించాడు.

**క. అదలిచి ద్రోణుఁడు భీష్ముఁడు । మదమున నిలునిలు మనంగ మఱియును మొగ క**
**ట్టద సేన భీమసేనుఁడు । గదిసి పిఱుఁద నంట నార్వఁ గౌరవనాథా! 113**

**ప్రతిపదార్థం:** కౌరవ+నాథా!= కౌరవరాజా!(ధృతరాష్ట్రమహారాజా); ద్రోణుఁడు= ద్రోణుడు; అదలిచి= బెదరించి; భీష్ముఁడు= భీష్ముడు; మదమునన్= గర్వంతో; నిలునిలుము= ఆగు, మాగుముఅని; అనంగన్= అని చెప్పగా; భీమసేనుఁడు= భీముడు; గదిసి= చేరి; పిఱుఁదన్+అంటన్= వెనుకచేరి తరుమగా; ఆర్వన్= కేకలు వేయగా - సింహనాదం చేయగా; మఱియును= ఇంకను; సేన= సైన్యం; మొగకట్టదు+అ= మూగదు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! కౌరవసేన పారిపోతూ ఉండగా, ద్రోణుడూ భీష్ముడూ మరలించటానికి ప్రయత్నించారు. అయినా - కౌరవ సేన- నిలువ లేకపోయింది. భీముడు పారిపోయే సేనను వెంబడించి తరిమి కొట్టి సింహనాదం చేసినప్పుడు- కౌరవసేన ఎదురుతిరిగి ప్రతిస్పందన చేయక నోరు మూసికొని పారిపోయింది.

**విశేషం:** మొగకట్టు= మూగు; మొగకట్టదు - అంటే మౌనంగా ఎట్టి ప్రతిస్పందననూ చూపకపోవటం. భీముడు వెన్నాడి తరిమినప్పుడు కౌరవసేన మొగకట్టలేదు. అంటే - భీముడికి అభిముఖంగా కూడి నిలబడలేకపోయిందని భావం.

**క. సభయ మయి శకుని సైన్యం । బభిమన్యుఁడు సాత్యకియు రయంబునఁ దోలం**
**బ్రభ సెడి పఱచుట గని యా । ప్రభువు చలం బెడలి విఱిగె బంధులుఁ దానున్. 114**

**ప్రతిపదార్థం:** అభిమన్యుఁడు= అభిమన్యుడు; సాత్యకియున్; రయంబునన్= వేగంగా; తోలన్= వెన్నాడగా; సభయమయి= భీతిల్లి; శకుని+సైన్యంబు= శకుని సైన్యం(గాంధారసేన); ప్రభ+చెడి= తేజము నశించి, వెలవెలపోయి; పఱచుటన్+కని= పారిపోవటం చూచి; ఆ ప్రభువు= ఆ రాజు(శకుని); చలంబు+ఎడలి= పట్టుదల చెదరి; బంధులు= చుట్టాలు; తానున్= తానును; విఱిగెన్= ఓడిపోయాడు.

**తాత్పర్యం:** సాత్యకి, అభిమన్యుడు కలిసి వెన్నాడగా, శకుని సైన్యం ధైర్యం కోల్పోయి పారిపోయింది. ఆ సన్నివేశం చూచి, శకుని బంధువులతోపాటు పట్టుదల చెదరి ఓటమికి లోనయ్యాడు.

**క. ఊర్జితశాత్రవసేనా । దుర్జయుఁ డగునర్జునుండు దోర్బల లీలా**
**స్ఫూర్జితుఁ డై యొక్క దెసన్ । గర్జారౌద్రముగఁ దోలెఁ గౌరవబలమున్. 115**

**ప్రతిపదార్థం:** ఊర్జిత, శాత్రవ, సేనా, దుర్జయుఁడు, అగు= పూనికగల శత్రువులసేన చేత జయించుటకు శక్యముగాని; అర్జునుండు= అర్జునుడు; దోస్ బల, లీలా స్ఫూర్జితుఁడు+ఐ= భుజబలము యొక్క అనగా పరాక్రమము యొక్క ఆటచే వెలుగొందునట్టివాడై, మిఱుమిట్లు గొలిపే గొప్ప పరాక్రమము కలవాడై; కౌరవ+బలమున్= కౌరవుల సేనను; ఒక్క+దెసన్= ఒక్కవైపుగ; గర్జా రౌద్రముగన్= భయంకరంగా గర్జించుతూ, భయంకర సింహనాదం చేస్తూ; తోలెన్= తరిమికొట్టాడు.

**తాత్పర్యం:** అర్జునుని శాత్రవులు - ఎంత పట్టుదలతో మార్కొనినప్పటికీ అతడిని జయింపలేరు. అతడు దుర్జయుడు. అతడు - ఒక ఆటలోవలె పరాక్రమం ప్రదర్శించి సింహనాదం చేస్తూ కౌరవసేనను ఒక వైపునకు చేర్చి - వెన్నాడి తరిమికొట్టాడు.

**తే. అంతఁ దెప్పిఱి నీ కొడు కనికి రథము । దొలఁగఁ దెచ్చుట గనుఁగొని యలిగి సూతుఁ**
**బలికి సరభసముగ నడుకలని కేఁగి । యెలుఁగు సూపిన బలములు నిలిచి పొదివె. 116**

**ప్రతిపదార్థం:** అంతన్= పిదప; తెప్పిరి= సేదతీరి; నీ కొడుకు= నీ పుత్రుడు= దుర్యోధనుడు; అనికిన్+రథము+తొలఁగన్+తెచ్చుట+కనుఁగొని= యుద్ధభూమినుండి తేరును తరలించి తీసికొని రావటం తెలిసికొని; సూతున్= సారథిని; అలిగి= కోపగించి; పలికి= మాటాడి; సరసభసముగన్= తొట్రుపాటుతో; నడు+కలనికిన్+ఏఁగి= యుద్ధ మధ్యమునకు వెళ్ళి; ఎలుఁగు+చూపిన= సింహనాదం చేయగా(కేకవేయగా); బలములు= సేనలు; నిలిచి+పొదివెన్= ధైర్యంతో విలసిల్లి నిలిచాయి.

**తాత్పర్యం:** అంతట - దుర్యోధనుడు మూర్ఛనుండి తేరుకొన్నాడు. రణరంగంనుండి తేరు తరలించి తనను తెచ్చినందుకు అతడు సారథిని కోపంతో మందలించి, సంభ్రమంతో తిరిగి యుద్ధభూమికి చేరుకొని సింహనాదం చేశాడు. కౌరవసేనలు ధైర్యం పుంజుకొని నిలబడ్డాయి.

**తే. ఉన్నచోటన కదలకయున్న ద్రోణ । భీష్ములును గోలుతలసేయఁ బెఱిగి సేన**
**చంద్రుఁ డుదయింపఁ బెఱిగిన శరధియట్లు । దోడుతోడుతఁ బొంగారి చూడనొప్పె. 117**

**ప్రతిపదార్థం:** ఉన్న+చోటన్+అ= నిలిచియున్న స్థలమునందే; కదలక+ఉన్న= చలింపకుండా నిలిచిన; ద్రోణ+భీష్ములును= ద్రోణుడును, భీష్ముడును; కోలుతల+చేయన్= కట్టెదురుగ నిలిచి యుద్ధం చేయగా; సేన= సైన్యం(కౌరవసేన); పెఱిగి= అతిశయించి; చంద్రుడు+ఉదయింపన్= చంద్రుడు పొడిచినప్పుడు; పెఱిగిన= పొంగిన; శరధి+అట్లు= సముద్రం వలె; తోడు+తోడుతన్= క్రమక్రమంగా; పొంగారి= అతిశయించి; చూడన్+ఒప్పెన్= శోభిల్లింది.

**తాత్పర్యం:** ద్రోణుడు, భీష్ముడు (దుర్యోధనుడు మూర్ఛితుడైనప్పటికీ) చలించకుండా ఉన్న చోటులోనే నిలిచి, కట్టెదురుగా ఉన్న పాండవసేనపై విజృంభించారు. అప్పుడు కౌరవసేన- చంద్రుడు ఉదయంచేటప్పుడు పొంగే సముద్రంవలె - అతిశయించి, క్రమక్రమంగా శక్తి పుంజుకొని శోభిల్లింది.

**వ. ఇట్లు బలంబుల నిలిపి సుయోధనుండు సత్వరంబుగా భీష్మద్రోణుల పాలికిం జని వారలతో నిట్లనియె. 118**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; బలంబులన్= సేనలను; నిలిపి= ఆపి; సుయోధనుండు; సత్వరంబుగాన్= శీఘ్రంగా; భీష్మద్రోణుల పాలికిన్+చని= భీష్ముడు, ద్రోణుడు ఉన్న చోటికి పోయి; వారలతోన్= భీష్మ ద్రోణులతో; ఇట్లు అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా సేనలను కూడగట్టుకొని, వేగంగా భీష్మద్రోణులు ఉన్న చోటికి వెళ్ళి దుర్యోధనుడు ఈ విధంగా అన్నాడు.

**ఉ. ' ఉక్కున మూఁడు లోకములు నొక్కటఁ దాఁకెన యేనిఁ బోర మీ**
**రొక్కఁ డొకండ గెల్చుటకు నోపుదు రశ్రమవృత్తి నిట్టి మీ**
**ముక్కున నూర్పు గల్గ మనమోహర మీ దురవస్థఁ బొందునే?**
**యక్కట మున్న పాండవుల కల్గఁగ నొల్లమిసెప్ప రైతిరే!' 119**

**ప్రతిపదార్థం:** ఉక్కునన్= పరాక్రమంతో; మూఁడులోకములున్= త్రిభువనాలు; ఒక్కటన్= ఏకమై; తాఁకెన+ఏనిన్= మార్కొనినప్పటికీ; పోరన్= యుద్ధంలో; మీరు; ఒక్కఁడు+ఒకండు+అ= ఒకడు ఒక్కడే; అశ్రమవృత్తిన్= సులువుగా; గెల్చుటకున్; ఓపుదురు= చాలుదురు; ఇట్టి= ఇటువంటి; మీ+ముక్కునన్+ఊర్పు+కల్గన్= మీరు బ్రదికి ఉండగానే - మీరు ఊపిరి పీల్చుచుండగానే; మన+మోహరము= మన మొగ్గరము, మన సేనా వ్యూహము; ఈ+దురవస్థన్+పొందునే?= ఈ చెడ్డ స్థితికి వస్తుందా?; అక్కట!= అయ్యో!; మున్ను+అ= ముందుగానే; పాండవులకున్+అల్గఁగన్+ఒల్లమి= పాండవులమీద ఆగ్రహించటం ఇష్టం లేకపోవటం; చెప్పరు+ఐతిరే!= చెప్పలేదుకదా!

**తాత్పర్యం:** 'మూడు లోకాలు కలిసి ఒక్కపెట్టున మీమీదకు దండెత్తి వచ్చినప్పటికీ- మీలో ఒకడు చాలు వారిని జయించటానికి. మీరు సజీవులై ఉండగా మనసేన ఈ దురవస్థను పొందటం శోచనీయం. పాండవులపై మీకు పక్షపాతం ఉంది. ఆ విషయం మీరు ముందుగానే చెప్పి ఉంటే బాగుండేది కదా!'

**విశేషం:** మూడు లోకాలు-భూలోకం; పైలోకం - స్వర్గలోకం; క్రిందిలోకం - పాతాళలోకం.

**వ. అని పలికి గాంగేయుం గనుంగొని. 120**

**ప్రతిపదార్థం:** అని+పలికి= అని చెప్పి; గాంగేయున్= గంగ కొడుకును= భీష్ముని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** అని చెప్పి దుర్యోధనుడు భీష్ముడిని చూచి.

**ఆ. ' నాఁడె చెప్పఁగన్న నాకు రాధేయున । కెట్లు సూడఁ బోలె నట్లు వోలెఁ**
**బడినపాటుఁ బడుదు మడియాస నీచేత । భంగపడితి మింకఁ బలుకు లేల?' 121**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; నాఁడె= ఆ దినమే(యుద్ధానికి ముందు- కర్ణుని నిరసించిన నాడే); చెప్పన్+కన్నన్= చెప్పి ఉంటే; రాధేయునకున్= కర్ణునకు; ఎట్లు= ఏ విధంగా; చూడన్+పోలెన్= చూచినట్లుగానే; అట్లుపోలెన్= ఆ విధంగానే; పడినపాటు, పడుదుము= మా పాట్లు మేము పడియుండే వాళ్ళము; అడియాసన్= వ్యర్థమైన ఆశతో; నీచేతన్= నీవలన; భంగపడితిమి= మోసపోయాము; ఇంకన్= ఇక; పలుకులు+ఏల?= మాటలు ఎందుకు?

**తాత్పర్యం:** ఆనాడే (యుద్ధానికి ముందే) ఆవిషయం (పాండవులపై ఆగ్రహించజాలననే విషయం) చెప్పి ఉంటే నాకూ కర్ణుడికీ ఏది తోస్తే ఆ విధంగా మా పాట్లు మేము పడియుందుము. వ్యర్థమైన ఆశచేత నీ వల్ల భంగపడ్డాము. ఇక మాటలెందుకు?

**విశేషం:** యుద్ధానికి ముందు భీష్ముడు కర్ణుని ' అర్ధరథుడు' అని నిర్ణయించి అధిక్షేపించాడు. అప్పుడు భీష్ముడు దుర్యోధనుడితో చెప్పినమాట 'నీవు కర్ణుని వదలుకొంటావా? నన్ను వదలుకొంటావా?' దుర్యోధనుడు కర్ణుని వదలుకొని భీష్ముడికి, కౌరవ సర్వసేనాధిపతిగా పట్టం కట్టాడు. ఈ పర్వంలో దుర్యోధనుడు ఆ ప్రసక్తి తెచ్చాడు.

**వ. అనిన విని చిఱునవ్వు నవ్వుచు మీతండ్రి నీ కొడుకును బ్రియభాషణంబులం దేర్చి యిట్లనియె. 122**

**ప్రతిపదార్థం:** అనిన+విని= అని దుర్యోధనుడు చెప్పగా ఆలకించి; మీ తండ్రి= మీ తండ్రి(భీష్ముడు); నీ కొడుకును= నీ పుత్రుని, దుర్యోధనుడిని; ప్రియ+భాషణంబులన్= ప్రీతి కలిగించే మాటలతో; తేర్చి= సంతృప్తి పరిచి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు;

**తాత్పర్యం:** అనగా విని చిరునవ్వుతో భీష్ముడు దుర్యోధనుడిని ప్రీతి కల్గించే మాటలతో సంతృప్తి పరచియిట్లన్నాడు.

**క. పురుహూతసహితమగు ని । ర్జరబలమున కైన గెలువ శక్యమె? సమర**
**స్థిరులగు పాండుతనూజుల । నరనాయక! నీకు నిట్లనం దగ వగునే? 123**

**ప్రతిపదార్థం:** నరనాయక!= ఓ రాజా; దుర్యోధనా!; పురుహూత సహితము+అగు= దేవేంద్రునితో కూడిన; నిర్జర+బలమునకున్= దేవతలసేనకు; ఐనన్= కూడా; సమర+స్థిరులు+అగు= యుద్ధంలో కదలకుండా నిలబడే; పాండు తనూజులన్= పాండవులను; గెలువన్+శక్యము+ఎ?= జయింప సాధ్యమా?; నీకున్; ఇట్లు+అనన్= ఈ విధంగా మాటాడుట; తగవు+అగును+ఏ?= న్యాయం అవుతుందా?

**తాత్పర్యం:** 'దేవేంద్రునితో పాటు దేవతల సేన దండెత్తి వచ్చినా సరే, యుద్ధభూమిలో పాండవులు నిలబడితే జయింప సాధ్యం కాదు. ఓ దుర్యోధనా! నీవు - ఈ విధంగా మాటాడటం న్యాయం కాదు సుమా!

**క. వృద్ధులు గతాయువులు దు । ర్బుద్ధులు నగువారిచేతఁ బోదురె శస్త్రా**
**స్త్రోద్ధతియు బాహుగర్వ సమృ । ద్ధియుఁ గల పాండు సుతు? లమిత్రధ్వంసీ! 124**

**ప్రతిపదార్థం:** అమిత్ర+ధ్వంసీ!= శత్రువులను నాశనము చేసేవాడా - దుర్యోధనా!; వృద్ధులు= ముసలివారు; గత+ఆయువులు= గతించిన ఆయుస్సు కలవారలు; దుస్+బుద్ధులు= చెడ్డబుద్ధిగలవారు; అగువారిచేతన్= అయినట్టి వారిచేత; శస్త్ర+అస్త్ర+ఉద్ధతియున్= బాణముల మంత్రబాణముల గొప్పతనం; బాహు+గర్వ+సమృద్ధియున్= భుజబలము ఉన్నదనే గర్వం ఎక్కువగా; కల= ఉన్న; పాండు+సుతులు= పాండురాజు కొడుకులు; పోదురె?= ఓడిపోతారా?

**తాత్పర్యం:** శత్రువులను ధ్వంసం చేయగల ఓ దుర్యోధనా! శస్త్రములలో, అస్త్రములలో నిపుణులు, పరాక్రమోపేతులు అయిన పాండవులు, ముసలివారు ఆయువు క్షీణించిన వారిచే ఓడిపోతారా?

**విశేషం:** మహాభారతంలో - భీష్మపర్వంలో పేర్కొనదగిన పద్యాలలో ఇది ఒకటి. ఈ మాటలు పలికినది భీష్ముడు. ఇందులో- కొంత వ్యంగ్య ధోరణి ఎత్తి పొడుపు ఉంది. భీష్ముడు అంటున్నాడు. 'వృద్ధులు - గతాయువులు' (దుర్బుద్ధులు)పాండవులను గెలువగలరా? ఈ మాటలు భీష్ముడు తనను గూర్చి, ద్రోణుని గూర్చి చేసికొన్న ఆత్మనింద కాజాలదు. ఆ మాటలు దుర్యోధనాదులు, కర్ణుడు లోగడ అన్నవే. ఇప్పుడు దుర్యోధనుడు - ద్రోణుడిని, భీష్ముడిని ఆకాశానికి ఎత్తి పొగడుతున్నాడు. "మిమ్ము దేవతలు గూడ గెలువలేరు - అంటాడు. ఎందుచేత ఇప్పుడు పొగడవలసి వచ్చింది? కౌరవ సేనలు పాండవుల చేత ఓడిపోయి, పారిపోయాయి కాబట్టి. భీష్ముడు - దుర్యోధనుడిని 'అమిత్రధ్వంసీ' అని సంబోధిస్తున్నాడు. ఈ సంబోధనలోని ఎత్తిపొడుపు సుస్పష్టం. ప్రస్తుతం దుర్యోధనుడు మూర్ఛపోయి తిరిగివచ్చాడు. సేనలు పారిపోయాయి. పారిపోకుండా నిలిచింది- ద్రోణుడు, భీష్ముడు మాత్రమే. దుర్యోధనుడు 'అమిత్రధ్వంసి' కానే కాదు. అతనికి ఆ శక్తి లేదని తేలిపోయింది!

తదుపరి దుర్యోధనుడికి భీష్ముడు చీవాట్లు పెట్టాడు. పాండవులు దుర్జయులు అని చెప్పాడు. తాము ఆ విషయం అంతకు ముందే పలుసారులు చెప్పి ఉన్నారు. ఆ విషయం జ్ఞాపకం చేశాడు - భీష్ముడు మరల దుర్యోధనుడికి. 'అయినా ఇక చూడు - శక్తివంచన లేకుండా యుద్ధం చేసి విజృంభించి పాండవసేనను హతమార్చగలను' అని ప్రతిజ్ఞ చేశాడు భీష్ముడు. అయితే భీష్ముడు అంతకుముందే - తన శక్తిని ఎందుకు చూపలేదు? ఒక సమాధానం - పాండవుల శక్తి సామర్థ్యాలు లోకోత్తరాలు. ఆకస్మికంగా వారు విజృంభించారు. ఇంకో సమాధానం:

దుర్యోధనుడు గర్వాంధుడు. అతనికి పాండవుల శక్తి సామర్థ్యాలు తెలియటం మంచిదే. అప్పుడు గాని అతడు భీష్మద్రోణుల గొప్పతనం గుర్తింపలేడు. అందుకని వారు ఉపేక్ష చేసి ఉండవచ్చు. మరియొక సమాధానం - మనోధర్మవేత్తలు సూచించేది. భీష్మ ద్రోణులకు - వారి మనస్సులలో - అంతరాంతరాలలో పాండవులపై అభిమానం, గౌరవం ఉన్నాయి. అంతేగాక - తాము అధర్మపక్షం, వహించి యుద్ధం చేస్తున్నామనే అపరాధశంక వారి హృదయాలను వారికి తెలియకుండానే వేధించుతూ ఉండవచ్చును.

మహాభారతంలో మానవహృదయ క్షీరసాగరమథనం కన్పిస్తుంది.

**క. ఐనను నోపిన భంగిని । భూనాయక! పాండు రాజపుత్ర సముద్య**
**త్సేనలఁ గూల్చెదఁ గనుఁగొను । మీ! నీవును బంధులును సమీపస్థులరై. 125**

**ప్రతిపదార్థం:** భూనాయక!= ఓ రాజా(దుర్యోధనా)!; ఐనను= ఐనప్పటికీ(పాండవులు దుర్జయులు అయినప్పటికీ); పాండురాజపుత్ర+ సముద్యత్+సేనలన్= పాండవులయొక్క ఉద్యమించుచున్న సైన్యాలను; నా+ఓపిన భంగిన్= నా శక్తివంచన లేకుండగా; కూల్చెదన్= సంహరింపగలను; నీవును= నీవూ; బంధులును= చుట్టాలూ; సమీపస్థులరు+ఐ= దగ్గరగా ఉన్నట్టివారై; కనుఁగొనుము+ఈ!= చూడవయ్యా!

**తాత్పర్యం:** ఓ దుర్యోధన మహారాజా! పాండవులు దుర్జయులే అయినప్పటికీ, నా శక్తివంచన లేకుండా పాండవుల సేనలను సంహరింపగలను. నీవూ నీ బంధువులూ దగ్గరగా నిలిచి చూడవచ్చు.

**విశేషం:** భీష్ముడు దుర్యోధనుని 'భూనాయక' అని సంబోధించాడు. దుర్యోధనుడు రాజు. భీష్ముడు ఇపుడు 'పితామహుడు కాడు. దుర్యోధనుడు మనుమడూ కాడు. దుర్యోధనుడు రాజు, భీష్ముడు రాజ సేనాధిపతి. భీష్ముడు - తన విధ్యుక్త ధర్మాన్ని 'శక్తివంచన లేకుండా' 'ఓపినభంగి' నిర్వహించగలనని పునరుద్ఘాటించాడు.

**వ. అని పలికి సంరంభంబున విజృంభించిన ధార్తరాష్ట్రులు ముదితమానసులై శంఖంబులు పూరింప భేరీ మృదంగాదితూర్యస్వనంబులుసెలంగుటయును. 126**

**ప్రతిపదార్థం:** అని+పలికి= అనిచెప్పి; సంరంభంబునన్= ఆవేశంతో; విజృంభించినన్= అతిశయించగా; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుని కొడుకులు; ముదిత+మానసులు+ఐ= సంతోషించిన మనస్సులు కలవారై; శంఖంబులు+పూరింపన్= శంఖాలు మ్రోగింపగా; భేరీ, మృదంగ+ఆది, తూర్య, స్వనంబులు= భేరులు, (మద్దెలలు మున్నగు బూరాల మ్రోతలు; చెలంగుటయును= మ్రోయగా.

**తాత్పర్యం:** భీష్ముడు ఆ విధంగా పలికి, విజృంభించాడు. దుర్యోధనుడు మున్నగువారు - సంతోషించిన మనస్సులు కలవారై శంఖాలు పూరించారు. సైనికులు ఉప్పొంగిపోయి భేరులు- మద్దెలలు-తూర్యాలు మున్నగు జంత్రవాద్యాలను మ్రోగించారు.

**క. విని పాండు నందనులు శం। ఖ నినాదము లుల్లసిల్లగా బహుతూర్య**
**ధ్వను లడరఁగఁ దిరమై తమ। మొన నిరతముగా నొనర్చి ముదము దలిర్పన్. 127**

**ప్రతిపదార్థం:** విని= కౌరవుల శంఖరావములు మున్నగు హర్షధ్వానాలు ఆలకించి; పాండు నందనులు= పాండవులు; శంఖ+ నినాదములు= శంఖముల ధ్వనులు; ఉల్లసిల్లఁగాన్= చెలరేగగా; బహు తూర్య ధ్వనులు= పెక్కు బూరాల ధ్వనులు; అడరఁగన్= వ్యాపింపగా; తమ+మొన= తమసేన; తిరము+ఐ= స్థిరమై; నిరతముగాన్= ఎల్లపుడు ఉండేటట్లుగా; ఒనర్చి= చేసి; ముదము+ తలిర్పన్= సంతోషం అతిశయింపగా.

**తాత్పర్యం:** కౌరవుల శంఖనాదాలు, భేరీమృదంగాది తూర్యస్వనాలు విని, పాండవులు శంఖ నాదాలు చేలరేగగా బహుతూర్య నాదాలు వ్యాపింపగా స్థిరంగా తమ సేన ఎల్లప్పుడుండేటట్లుచేసి సంతోషం ఒప్పగా (తరువాతి వచనంతో అన్వయం)

పాండవులు కూడా- శంఖాలు పూరించి హర్షోద్వేగంతో సేనలను పురికొల్పి వెడలారు.

**వ. నడచి రనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 128**

**ప్రతిపదార్థం:** నడచిరి+అనినన్= వెడలిరి అని చెప్పగా; సంజయునకున్; ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**క. దుర్యోధనుమాటకు భుజ। వీర్యోద్ధతి భీష్ముఁడేచి విక్రమలీలా**
**ధుర్యతఁ గడఁగినఁ గయ్యం। బార్యస్తవనీయ! యెట్టులయ్యెం జెపుమా.' 129**

**ప్రతిపదార్థం:** ఆర్యస్తవనీయ!= ఆర్యుల (ఉత్తముల)చేత కీర్తింపబడిన సంజయా!; దుర్యోధను మాటకున్= దుర్యోధనుని పలుకులకు; భుజ+వీర్య+ఉద్ధతిన్= భుజబల పరాక్రమ ప్రకర్షచే; భీష్ముఁడు; ఏచి= విజృంభించి; విక్రమ+లీలా+ధుర్యతన్= శౌర్యం అనే క్రీడను వహించటం చేత; కడఁగినన్= పూనగా; కయ్యంబు= యుద్ధము; ఎట్టులు+అయ్యెన్= ఏ విధంగా అయింది; చెపుమా!= చెప్పవయ్యా!

**తాత్పర్యం:** పూజ్యుల ప్రశంసలకు పాత్రుడవైన ఓ సంజయా!, దుర్యోధనుడి పలుకులు విని, భీష్ముడు ఏ విధంగా విజృంభించి, తన పరాక్రమం ప్రదర్శించాడో, ఆతడి యుద్ధం ఎట్లా సాగిందో వివరించి చెప్పవయ్యా!'

**వ. అనిన విని సంజయుం డతని కి ట్లనియె నప్పుడు ప్రభాకరుండు నభోమధ్యంబునకు వచ్చి వెలుంగుచున్న నతనితోడిపురుడునం దేజోమహిమ దలకొన్న తెఱంగునం దనమెఱుంగువాలమ్ము లనుకిరణమ్ములు వరఁగించుచుఁ బ్రతాపదీపితుండగు దేవవ్రతుండు దేవేంద్రసుతుం దాఁకిన . 130**

**ప్రతిపదార్థం:** అనినన్+విని; సంజయుండు; అతనికిన్= ధృతరాష్ట్రునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అప్పుడు= ఆ సమయంలో; ప్రభాకరుండు= సూర్యుడు; నభస్+మధ్యంబునకున్= నభోమధ్యమునకు= ఆకాశం మధ్యకు; వచ్చి= అరుదెంచి; వెలుంగుచున్నన్= ప్రకాశించుచుండగా; అతనితోడి+పురుడునన్= ఆ సూర్యునితో సమానత్వంతో; తేజస్+మహిమ= ప్రభాప్రభావం; తలకొన్న+తెఱంగునన్= ఏర్పడిన రీతిగా; తన+మెఱుంగు+వాలు+అమ్ములు= తనవైన ప్రకాశించే వాడి బాణాలు; అను+కిరణమ్ములు= అనే మయూఖములు(వెలుగులు); పరఁగించుచున్= ప్రసరిస్తూ; ప్రతాప+దీపితుండు= పరాక్రమంతో వెలుగొందే; దేవవ్రతుండు= భీష్ముడు; దేవేంద్ర+సుతున్= దేవేంద్రుని కొడుకు అర్జునుడిని; తాఁకెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రునితో ఈ విధంగా చెప్పాడు. 'అప్పుడు సూర్యుడు ఆకాశమధ్యానికి వచ్చి ప్రకాశించాడు. ఆ సూర్యుడితో తేజోమహిమలో సమానుడు అయినట్లుగా భీష్ముడు, వాడి బాణాలు అనే తీక్ష్ణ కిరణాలను ప్రసరించాడు. ఈ విధంగా ప్రతాపంతో వెలుగొందుతూ, భీష్ముడు అర్జునుని మార్కొన్నాడు.

**విశేషం:** దేవవ్రతుడు= భీష్ముని ఔరస నామధేయం. దేవవ్రతుడు తండ్రికోసం - ఆజన్మ బ్రహ్మచర్య దీక్ష వహిస్తానని ప్రతిజ్ఞ చేయటం చేత అతడికి 'భీష్ముడు' అనే బిరుదనామం సంక్రమించింది.

**చ.** **కడఁగి సుయోధన ప్రభృతి కౌరవవీరులు భీష్మతోన బె**
**ట్టడరిన భీమముఖ్యులగు నక్కడి యోధులు నొక్క యుమ్మడిన్**
**వడిఁ దలపడ్డ సైన్యము లవారణ రెండును నేచి త్రోచి య**
**ప్పుడు రభసంబునన్ బెరసి పోరె వియచ్చరకోటి మెచ్చఁగన్.** **131**

**ప్రతిపదార్థం:** కడఁగి= పూని; సుయోధన ప్రభృతి కౌరవవీరులు= దుర్యోధనుడు మున్నగు కౌరవ శూరులు; భీష్మతోన్+అ= భీష్మునితోపాటుగనే; బెట్టు+అడరినన్= మిక్కుటముగ విజృంభించగా; అక్కడి+యోధులు= అక్కడ పాండవపక్షంలోని వీరులు; ఒక్క ఉమ్మడిన్= ఒకే మారుగా; వడిన్= వేగంగా; తలపడ్డన్= మార్కొనగా; సైన్యములు+రెండును= రెండు సేనలూ; అవారణన్= వారించుటకు వీలులేకుండా; త్రోచి= ముందునకు వచ్చి; అప్పుడు; రభసంబునన్+బెరసి= ఉద్రేకంతో తాకి; వియత్+చర+కోటి= ఆకాశంలో సంచరించే దేవతల సమూహం; మెచ్చఁగన్= ప్రశంసించగా; పోరెన్= యుద్ధం చేశాయి.

**తాత్పర్యం:** కౌరవవీరులు - సుయోధనుడు మున్నగువారు - భీష్మునితోపాటుగా విజృంభించారు. అటు పాండవ యోధులూ విజృంభించారు. రెండు సేనలూ ఒక్కుమ్మడి తారసిల్లగా ఘోరయుద్ధం జరిగింది. ఉభయ సేనలలోని యోధుల పరాక్రమాన్నీ ఆకాశంలో సంచరించే దేవతాగణాలు ప్రస్తుతించాయి.

**విశేషం:** యుద్ధంలో వీరులు ప్రదర్శించే పరాక్రమాన్ని ఖేచరులైన చారణులు మెచ్చుకోవటం తిక్కన పలుచోట్ల వర్ణించాడు.

**వ.** **అట్టియెడ.** **132**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో, యుద్ధభూమిలో.

**క.** **హుంకారములు నదల్పులు । జంకెలు ధిక్కరణములును సంస్తుతులును వీ**
**రాంకోక్తులు నిస్సాణజ । ధాంకృతులును గలిసి యుద్ధటంబుగఁ బెటిగెన్.** **133**

**ప్రతిపదార్థం:** హుంకారములు= హుం అనే ధ్వనులు (రా- నీ ప్రతాపం చూస్తాను అని అర్థం వచ్చేటట్లు యుద్ధవీరులు చేసే నినాదం); అదల్పులు= మందలింపులు; జంకెలు= బెదరింపులు; ధిక్కరణములు= నిరసనలు; సంస్తుతులును= పొగడ్తలు; వీర+అంక+ఉక్తులు= వీరులకు చిహ్నములైన మాటలు; నిస్సాణజ+ఢాంకృతులును= జంత్ర వాద్య విశేషమునుండి పుట్టిన 'ఢాం' శబ్దాలు; కలిసి; ఉద్భటముగన్= భయంకరంగా; పెఱిగెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** ఆ సమయంలో - యుద్ధభూమిలో హుంకారాలు - మందలింపులు - నిరసనలు - పొగడ్తలు వీరోచితమైన పలుకులు - జంత్రవాద్యాల ఢాంకృతులతో కలసి భయంకరంగా వ్యాపించాయి.

**విశేషం:** మూల సంస్కృత భారతంలో శంఖరావాలు మున్నగునవి అక్కడక్కడ యుద్ధంలో అంతర్భాగంగా పేర్కొనబడ్డాయి. ఈ పద్యంలో వర్ణింపబడినవన్నీ - తిక్కన సమకాలీన యుద్ధవృత్తాలుగానే ఎంచవచ్చును.

**క. తునిసిన బాహామస్తక । తనుచరణంబులును బాణ తరవారి గదా**
**ధనువులుఁ గిరీట కంకణ । కనదంగదములును దఱచుగా ధరఁ దొరఁగెన్. 134**

**ప్రతిపదార్థం:** తునిసిన= ముక్కలు ముక్కలయిన; బాహా, మస్తక+తను, చరణంబులును= చేతులు, తలలు, శరీరాలు, పాదాలు; బాణ తరవారి గదా ధనువులున్= అమ్ములు, కత్తులు, గదలు, చాపాలు; కిరీట కంకణ కనత్ అంగదములును= కిరీటాలు, చేతికడియాలు, ప్రకాశించే భుజకీర్తులును; తఱచుగాన్= దట్టముగా; ధరన్= భూమిపై; తొరఁగెన్= పడ్డాయి.

**తాత్పర్యం:** ఖండింపబడిన చేతులు, తలలు, శరీరాలు, పాదాలు, బాణాలు, కత్తులు, గదలు, విండ్లు, కిరీటాలు, చేతికడియాలు, భుజకీర్తులు దట్టంగా యుద్ధభూమిపై పడ్డాయి.

**తే. సగము సచ్చిన యొడళులు జలచరములు । రక్త పూరంబు తోయంబు ప్రచురమాంస**
**పటలి పంకంబుగాఁగల బహునదీ ప్ర । వాహములు పాఱె సంగరావని నృపాల! 135**

**ప్రతిపదార్థం:** నృపాల!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; సగము+చచ్చిన= సగము మరణించిన; ఒడళులు= కళేబరాలు; జలచరములు= చేపలు; రక్తపూరంబు= నెత్తురు వరద; తోయంబు= నీరు; ప్రచుర, మాంస, పటలి పంకంబుగాన్= అధికమైన మాంసపు ముక్కల బురద సమూహంగా; కల= ఉన్న; బహు+నదీ+ప్రవాహములు= పెక్కు నదుల ప్రవాహాలు; సంగర+అవనిన్= యుద్ధభూమిలో; పాఱెన్= ప్రవహించాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సగము చచ్చిన శరీరాలు చేపలుకాగా, నెత్తురు వెల్లువ జలము కాగా, అధికమైన మాంసఖండముల సముదాయం బురదకాగా పెక్కు నదీప్రవాహాలు యుద్ధభూమిలో ప్రవహించాయి.

**క. అఱవఱ లైన రథంబులు । నెఱిదప్పఁగఁ బడిన యశ్వనికరంబులుఁ బెం**
**దఱచుగఁ గూలిన కరులు । న్గిఱిగొనియెన్ సమరమేదినీతల మెల్లన్. 136**

**ప్రతిపదార్థం:** అఱవఱలు+ఐన+రథంబులు= చిన్న చిన్న ముక్కలయిన తేరులు; నెఱి+తప్పఁగన్+పడిన= ఆకారము మారిపోయి పడిన; అశ్వ+నికరంబులున్= గుర్రాల గుంపులూ; పెన్+తఱచుగన్= మిక్కిలి దట్టంగా; కూలిన= పడిపోయిన; కరులున్= ఏనుగులూ; సమర+మేదినీ+తలము+ఎల్లన్= యుద్ధభూమి స్థలము అంతటినీ; గిఱికొనియెన్= ఆవరించాయి.

**తాత్పర్యం:** చిన్న చిన్న ముక్కలైన తేరులు, ఆకారం మారిపోయిన గుఱ్ఱాలు. మిక్కిలి దట్టంగా మారిన ఏనుగులు - యుద్ధభూమిని ఆవరించాయి.

**వ. ఇవ్విధంబున విషమం బగు రణభూభాగంబునం జరియింపం జతురులు గాక రథికజనుఁ లంతంత గుంపులు గట్టిరి గాంగేయుండు ప్రతియోధులం బేరువేరం బిలుచుచు నుక్కుమిగిలి దిక్కు లమ్ములం బిక్కటిల్లం జేయుచు నెక్కడఁ జూచినం దానయై మెఱుంగు మెఱసిన తెఱంగునం గొఱవి ద్రిప్పిన యొప్పన నింద్రజాలంబు సూపిన చందంబునం దన రథంబు నెఱయ శక్తి శౌర్యంబులు నెఱయ నెవ్వరికి నిలువరింపరాక యెదిరిన రూపంబులం బెక్కింటి నొక్కబాణంబునం బెక్కుబాణంబుల నొక్కంటిఁ గూల్చి కేళి సలుపుచు నటిమి పయింబడినవీరులం గీలెడలినజంత్రంబులుం బోలె నేలం గూల నేయుచు దృఢత్వలక్ష్యశుద్ధిలాఘవంబులకు వియచ్చరులు పిచ్చలింప ననేక ప్రకారంబు లగు క్రూరశరంబులఁ జతురంగంబులుం దునియలుం బఱియలుం దుమురులుం గుదులు నై బడలువడం జేయుచుం గార్చిచ్చు పొదివిన పోలిక మాయ గావించిన మాడ్కి మంత్రించి పడవైచిన పగిదిం గసిమసంగి కౌంతేయసేనం గనుపుకొట్టుచుఁ బ్రళయ కాలతాండవ ప్రవర్తి యైన ఫాలలోచనులీల నాజిరంగంబునం బరాక్రమనృత్యంబు సేయుచున్నం బాంచాలయాదవాదియోధులు వెఱఁగుపడి చూచుచుండఁ బాండవులునుం జేయునదిలేక చేష్టలు దక్కినం దదీయసైన్యంబులు రూపఱి భయభ్రాంతంబు లై దీనదశకు వచ్చె నప్పడు శౌరి యుగ్యంబుల పగ్గంబులఁ బట్టి పార్థునితో ని ట్లనియె.** **137**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; విషమంబు+అగు= అడ్డదిడ్డంగా ఉన్న; రణ+భూ+భాగంబునన్= యుద్ధభూమిమీద; చరియింపన్= తిరుగుటకు, చతురులు+కాక= తెలివితేటలు గలవారుగాక; రథిక+జనులు= యోధులు; అంతంతన్= అక్కడక్కడ; గుంపులు+కట్టిరి= మూగారు; గాంగేయుండు= గంగకొడుకు(భీష్ముడు); ప్రతియోధులన్= శత్రువులను; పేరుపేరన్+పిలుచుచున్= వారి వారి పేరులతో పేర్కొనుచు; ఉక్కు+మిగిలి= పరాక్రమం అతిశయించి; దిక్కులు= దెసలు; అమ్ములన్= బాణాలతో; పిక్కటిల్లన్+చేయుచున్= నిండిస్తూ; ఎక్కడన్+చూచినన్= ఏ చోటున అరసినా; తాను+ఐ= తానే కన్పించి; మెఱుంగు+ మెఱసిన+ తెఱంగునన్= మెరపుతీగె మిరుమిట్లు గొల్పినట్లు; కొఱవి+త్రిప్పిన+ఒప్పునన్= మండేకట్టె గిఱగిఱా త్రిప్పినట్లుగా; ఇంద్రజాలంబు+చూపిన+చందంబునన్= గారడీ చేసినట్లుగా; తన+రథంబు+నెఱయన్= తనతేరు మెరయగా; తన+శక్తి+శౌర్యంబులు నెఱయన్= తన బలము పరాక్రమము నిండార భాసింపగా; ఎవ్వరికిన్; నిలువరింపన్ రాక= ఆపవీలుగాక; ఎదిరిన+రూపంబులన్= మార్కొనిన ఆకారాలను; పెక్కింటిన్= చాలావాటిని; ఒక్క+బాణంబునన్= ఒకే అమ్ముతో; పెక్కు+బాణంబులన్= పలు అమ్ములతో; ఒక్కంటిన్= ఒకదానితో; కూల్చి= క్రిందపడవేసి; కేళి సలుపుచున్= ఆట ఆడుచు; అటిమి+పయింబడిన= ఆర్చిపై బడిన; వీరులన్= యోధులను; కీలు+ఎడలిన+జంత్రంబులున్+పోలె= (తిరుగుటకు బొమ్మలలో ఏర్పరచిన); మర సడలిన యంత్రాలవలె; నేలన్= భూమిపై; కూలన్+ఏయుచున్= పడిపోయేటట్లు చేస్తూ; ధృఢత్వ లక్ష్య శుద్ధి, లాఘవంబులకున్= గట్టిగా (లక్ష్యాన్ని) సులువుగా గురిని కొట్టడంలో తప్పని సూటిదనాన్ని; వియత్+చరులు= ఆకాశంలో సంచరించే దేవతలు; పిచ్చలింపన్= భయపడగా; అనేక+ ప్రకారంబులు+అగు= పెక్కు విధాలుగా ఉన్న; క్రూర శరంబులన్= భయంకరమైన బాణాలలో; చతుః+అంగంబులున్= నాలుగు అంగాలు(రథ-గజ-తురగ-పదాతులు); తునియలున్= ముక్కలు; పఱియలున్= బ్రద్దలును; తుమురులును= ముక్కలును; గుదులును+ఐ= గుత్తులుగానై; బడలు+పడన్+చేయుచున్= నొవ్వజేస్తూ; కార్చిచ్చు+పొదివిన పోలికన్= దావానలము క్రమ్ముకున్న రీతిగా; మాయ, కావించిన, మాడ్కిన్= భ్రాంతి కలిగించినట్లుగా; మంత్రించి పడవైచిన పగిదిన్= మంత్రంతో అద్భుతం సృష్టించినట్లుగా; కసిమసంగి= విజృంభించి; కౌంతేయ+సేనన్= పాండవసేనను(కుంతీ పుత్రుల సైన్యాన్ని); కనుపుకొట్టుచున్= పోరాటంలో ముంచుతూ; ప్రళయ కాల తాండవ ప్రవర్తి+ఐన= ప్రళయం ఏర్పడిన సమయంలో

నృత్తం చేసే; ఫాలలోచనులీలన్= ముక్కంటివలె; ఆజి రంగంబునన్= యుద్ధక్షేత్రమునందు; పరాక్రమ+నృత్యంబు+చేయుచున్నన్= శౌర్యనాట్యం చేయుచుండగా; పాంచాల యాదవ+ఆది యోధులు= పాంచాల దేశానికి, యాదవజాతికి చెందిన వీరులు; వెఱఁగుపడి= భయపడి; చూచుచుండన్= వీక్షింపగా; పాండవులు; చేయునదిలేక= చేయగల ప్రక్రియలేక; చేష్టలు+తక్కినన్= నివ్వెఱగంది చూడగా; తదీయ+సైన్యంబులు= వారి సేనలు; రూపఱి= ఆకారములు తప్పి; భయ భ్రాంతంబులు+ఐ= భీతితో సమ్మోహితులై; దీన+దశకున్+వచ్చెన్= హీనస్థితికి చేరాయి; అప్పుడు; శౌరి= శ్రీకృష్ణుడు; యుగ్యంబుల= అశ్వముల; పగ్గంబులన్= గుర్రాలకు వేసిన; త్రాళ్ళు; పట్టి; పార్థునితోన్= అర్జునునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా - అడ్డదిడ్డంగా ఉన్న యుద్ధభూమిలో చరించటానికి వీలుగాక, యోధులు అక్కడక్కడ గుంపులు గూడారు. భీష్ముడు పరాక్రమంతో విజృంభించాడు. దిక్కులు పిక్కటిల్లేటట్లుగా అమ్ములు ప్రయోగించాడు. ఎక్కడ చూచినా భీష్ముడే కన్పించాడు. కొఱవి త్రిప్పిన చందంబున - ఇంద్రజాలము వలె - తన రథం తోలించాడు. అతని ధాటికి ఎవ్వరూ ఆగలేకపోయారు. ఎదిరించిన పెక్కు ఆకారాలను ఒక్క బాణంతో ఛేదించాడు. ఒక్క ఆకృతిని పెక్కు బాణాలతో కూల్చాడు. ఆ విధంగా సంగ్రామ క్రీడ సాగించాడు. తన మీదకు వచ్చి పడిన యోధులను - కీలెడలిన జంత్రాల వలె చేసి క్రింద పడవేశాడు. భీష్ముడి దృఢత్వం - లక్ష్యశుద్ధి - సులువుగా అమ్ములు ప్రయోగించటంలో గల నేర్పు దీనినంతటినీ ఆకాశ సంచారులయిన చారణులు ప్రశంసించారు. శాత్రవుల చతురంగ బలాలను భీష్ముడు నేలమట్టం చేశాడు. అతని క్రూరబాణాలకు - రథాలు విరిగాయి, ఏనుగులు చచ్చాయి. అశ్వాలు ముక్కచెక్కలయ్యాయి. పదాతులు నేలగూలారు. కార్చిచ్చు అడవిని దహించినట్లు అతడు విలయతాండవం చేశాడు. అతడు బాణాలను అభిమంత్రించి వదలాడా? అన్నట్లు ప్రళయకాల రుద్రుడివలె పరాక్రమనృత్యం చేశాడు. పాంచాలయాదవ వీరులు చేష్టలు దక్కి నివ్వెఱగంది చూచారు. పాండవులు ఏమీ చేయలేకపోయారు. పాండవసేనలు భయభ్రాంతితో అలమటించి పోయాయి. అప్పుడు శ్రీకృష్ణుడు తేరుకు కట్టిన గుఱ్ఱాల పగ్గాలు చేతితో పట్టుకొని, అర్జునుడితో ఈ విధంగా అన్నాడు:

**చ. కృపగురుభీష్మయుక్తముగ గెల్తు సుయోధనుసేన నంచు నీ**
**వపరిమితోగ్రశక్తి మెఱయం దఱి గోరుచు నుండు దెప్పడుం**
**గుపితయుగాంతరుద్రుగతిఁ గోలుమసంగినవాఁడు భీష్ముఁ డే**
**చి పటుభుజాబలంబు విలసిల్లఁగ మార్కొన కున్కి యొప్పనే?' 138**

**ప్రతిపదార్థం:** కృప, గురు, భీష్మ, యుక్తముగన్= కృపుడు - ద్రోణుడు - భీష్ముడు కలిసియుండగా; సుయోధను సేనన్= దుర్యోధనుని సైన్యాన్ని; గెల్తున్+అంచున్= జయింపగలను అని చెప్తుతూ; నీవు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; తఱిన్= అవకాశమును; కోరుచున్; ఉండుదు= ఉంటావు; అపరిమిత ఉగ్ర శక్తి మెఱయన్= అంతులేని భయంకరమైన సామర్థ్యం వెలుగొందునట్లుగా; భీష్ముఁడు= భీష్ముడు; కుపిత యుగ అంత రుద్రుగతిన్= యుగముల చివరి భాగ సమయంలో కోపించిన ఈశ్వరునివలె; కోలుమసంగిన వాఁడు= మిక్కుటంగా విజృంభించాడు; ఏచి= అతిశయించి; పటు భుజా బలంబు= గొప్పదైన పరాక్రమం; విలసిల్లఁగన్= ప్రకాశించగా; మార్కొనక+ఉన్కి= తాకకుండా ఉండటం; ఒప్పునే?= న్యాయమా?(మంచిదా?)

**తాత్పర్యం:** 'ఓ అర్జునా!, కృపాచార్యుడు -ద్రోణుడు, భీష్ముడు కలిసియున్న కౌరవ సేనను ఓడించగలనని నీవు ఎన్నోసారులు చెప్పి ఉన్నావుగా! ఇదిగో. ఇప్పుడు అట్టి అవకాశం వచ్చింది. ఇప్పుడు ప్రళయ సమయంలో రుద్రునివలె భీష్ముడు విజృంభించాడు. నీవు నీ పరాక్రమం చూపి అతనిని మార్కొనక యుండటం మంచిదికాదు.

## అర్జునుఁడు శ్రీకృష్ణప్రేరితుం డై భీష్మనిపైఁ గవియుట (సం. 6-55-40)

**క. ' అనిన విని యర్జునుం డి। ట్లను 'నీ విం తనఁగ నేల? యాతనిమీఁదన్**
**మనరథముఁ బఱపు మిప్పడ। సునిశితబాణముల నతని సొం పడఁగింతున్.' 139**

**ప్రతిపదార్థం:** అనినన్= అని శ్రీకృష్ణుడు చెప్పగా; విని; అర్జునుండు; ఇట్లు; అనున్= చెప్పాడు; నీవు; ఇంత+అనఁగన్+ఏల?= నీవు ఇంతగా నొక్కి చెప్పాలా?; ఆతనిమీఁదన్= ఆ భీష్మని మీదకు; మనరథమున్; పఱపుము= తోలునది; ఇప్పుడు+అ= ఈ సమయంలోనే; సు నిశిత బాణములన్= మిక్కిలి వాడిగల అమ్ములతో; అతని+సొంపు= ఆ భీష్మని అందము; అడఁగింతున్= పోగొట్టగలను.

**తాత్పర్యం:** అని- శ్రీకృష్ణుడు చెప్పగా విని - అర్జునుడు ఈ విధంగా అన్నాడు. 'నీవు ఇంతగా నొక్కి వక్కాణింపవలెనా? వెంటనే మనరథం భీష్మనిపైకి తరలించుము. నేను మిక్కిలి వాడి అమ్ములు ప్రయోగించి అతని గొప్పదనం - అణగారునట్లు చేయగలను.'

**చ. అనుటయు 'నట్లకాక' యని యచ్యుతుఁ డుద్ధతిఁ దేరు వోవని**
**చ్చినఁ గని పొంగి యా రథికసింహుఁ డుదంచితసింహనాదుఁడై**
**నినిచెఁ దురంగదేహముల నీరజనాభునిమేనఁ బాండునం**
**దను నొడలం బ్రదీప్త ఘనదారుణమార్గణపుంజముల్ వడిన్. 140**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; అట్లు+అ= ఆ విధంగానే; కాక+అని= అగునుగాక అని చెప్పి; అచ్యుతుడు= శ్రీకృష్ణుడు; ఉద్ధతిన్= గర్వంగా; తేరు= రథం, పోవనిచ్చినన్= తోలగా; కని= చూచి; ఆ+రథిక+సింహుఁడు= యోధులలో సింహమువంటివాడు (భీష్ముడు); ఉదంచిత+సింహనాదుఁడు+ఐ= గొప్ప సింహనాదం చేసినవాడై; తురంగ+దేహములన్= గుఱ్ఱాల శరీరాలపై; నీరజనాభుని మేనన్= శ్రీకృష్ణుని శరీరంపై; పాండు నందను+ఒడలన్= పాండురాజు కొడుకు అయిన అర్జునుని దేహంపై; వడిన్= వేగంగా; ప్రదీప్త ఘన దారుణ మార్గణ పుంజముల్= మిక్కిలి ప్రకాశంగల, గొప్పవైన, భయంకరములైన అమ్ముల గుంపులు; నినిచెన్= గ్రుచ్చుకొనునట్లు ప్రయోగించాడు.

**తాత్పర్యం:** అని అర్జునుడు చెప్పగా, శ్రీకృష్ణుడు రథాన్ని భీష్మనిపైకి తరలించాడు. రథికశ్రేష్ఠుడైన భీష్ముడు - సింహనాదం చేసి, గుఱ్ఱాల శరీరాలపై, శ్రీకృష్ణుడిపై, అర్జునుడిపై వెలుగొందే గొప్ప బాణసమూహాలను ప్రయోగించాడు.

**తే. తనదు నొవ్వున కలుకక ధైర్యవృత్తి। నయ్యుపేంద్రుండు నొచ్చిన హయచయంబుఁ**
**దడవి తేర్చి యుదగ్రతఁ దఱుముటయును। గుణరవం బుల్లసిల్ల ఫల్గునుఁడు గడఁగి. 141**

**ప్రతిపదార్థం:** తనదు+తనయొక్క; నొవ్వునకున్= వేదనకు; అలుకక= భయపడక; ధైర్య వృత్తిన్= దీమసముతో, ఆ+ఉపేంద్రుండు= ఆ కృష్ణుడు; నొచ్చిన= దెబ్బతిన్న; హయ చయంబున్= గుఱ్ఱాల సముదాయమును; తడవి= నిమిరి; తేర్చి= సేదదీర్చి; ఉదగ్రతన్ భయంకరంగా; తఱుముటయును= తోలుటతో; ఫల్గునుఁడు= అర్జునుడు; గుణ రవంబు= వింటి అల్లెత్రాటినుండి వెలువడే ధ్వని; ఉల్లసిల్లన్= వ్యాపింపగా; కడఁగి= పూని.

**తాత్పర్యం:** భీష్ముడు శ్రీకృష్ణుని రథాశ్వాలను, అర్జునుడిని నొప్పించాడు. శ్రీకృష్ణుడు తన బాధ మరచిపోయి, గుఱ్ఱాలను నిమిరి వాటి బాధ పోగొట్టి - రథాన్ని భయంకరంగా తోలాడు. అర్జునుడు అల్లెత్రాటి ధ్వని ఒప్పగా పూని.

**విశేషం:** శ్రీకృష్ణుడు కర్మయోగి. అతని దృష్టిలో హేయమైన పనిలేదు. సారథిగా ఉండటానికి సమ్మతించడమే గాక - గుర్రాలకు బాధ కలిగినపుడు, తన బాధను కూడా మరచిపోయి వాటికి సేవచేశాడు. సేవాధర్మములోని పవిత్రత గుర్తించిన మహానుభావుడు శ్రీకృష్ణుడు.

**క. భల్లంబొకటఁ బితామహు । విల్లు దునుమ వేఱొకండు వెస నెత్తిన న**
**వ్విల్లును దునిమినలాఘవ । ముల్లంబునఁ బొగడి యేసె నొండొకవింటన్. 142**

**ప్రతిపదార్థం:** భల్లంబు+ఒకటన్= ఒక ఈటె బాణంతో; పితామహు+విల్లు= భీష్ముని ధనుస్సు; తునుమన్= ఖండింపగా; వేఱు+ఒకండు= ఇంకో విల్లు; వెసన్= వేగంగా; ఎత్తినన్= తీసుకోగా; ఆ+విల్లును= ఆ ధనువునుగూడా(అర్జునుడు); తునిమిన లాఘవము= ఖండించిన నేర్పును; ఉల్లంబునన్= మనస్సులో; పొగడి;(భీష్ముడు); ఒండొక+వింటన్= ఇంకో ధనుస్సుతో; ఏసెన్= అమ్ములు వేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఒక ఈటె బాణంతో భీష్ముడి విల్లు తునిమాడు. భీష్ముడు మరియొక ధనుస్సు పుచ్చుకున్నాడు. మరల ఆ ధనువును ఖండించాడు అర్జునుడు. అర్జునుని ప్రయోగనైపుణ్యాన్నీ శక్తి సామర్థ్యాలనూ భీష్ముడు తన మనస్సులో మెచ్చుకొంటూ - మరియొక విల్లుతో అమ్ములు ప్రయోగించాడు.

**విశేషం:** ఒకండు= ఒకటి - రెండూ గ్రాంథికాలే. ఏడార్థకమైన ఒకఁడు మహదమహదుభయార్థకంగా ప్రయోగింపబడుతుంది. ఇక్కడ అమహదర్థంగా ప్రయోగించబడింది. పురుషుఁడొక్కడు - ఇక్కడ మహత్తు. పుస్తకమొకఁడు - ఇక్కడ అమహత్తు.

**తే. ఇట్లు గాంగేయుఁ డేయుననేక విశిఖ । వితతి యసురారి రథచిత్రగతుల దప్పి**
**పోవఁ జేయంగ నతఁ డంతఁ బోక నొంచె । నరుని నారాయణుని బలునారసముల. 143**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; గాంగేయుఁడు= గంగకొడుకు(భీష్ముడు); ఏయు= వేసే; అనేక+విశిఖ+వితతి= పెక్కు బాణాల సముదాయం; అసుర+అరి= రాక్షసుల విరోధి, శ్రీకృష్ణుడు; రథ+చిత్ర+గతులన్= అచ్చెరువు గొలిపేటట్లు తేరు నడిపి; తప్పి+పోవన్+చేయంగన్= తప్పిపోయేటట్లు చేయగా; అతండు= భీష్ముడు; అంతన్+పోక= అంతటితో ఆగక; నరునిన్= అర్జునుని; నారాయణునిన్= శ్రీకృష్ణుని; బలు+నారసములన్= గొప్ప అమ్ములతో; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా భీష్ముడు బాణాలు ప్రయోగించగా రథాన్ని చిత్ర విచిత్రంగా నడిపి - ఆ బాణాలు తప్పిపోయేటట్లుగా చేశాడు సారథియైన శ్రీకృష్ణుడు. భీష్ముడు అంతటితో ఊరుకోకుండా కృష్ణుడినీ - అర్జునుడినీ అమ్ములతో నొప్పించాడు.

**క. నొచ్చియు భీష్మునిపై వి । వ్వచ్చుఁడు బెడిదముగఁ గురిసె వాలమ్ము లతం**
**డచ్చెరువుతోడ వెసఁ గా । ర్చిచ్చు గవిసినట్లు పొదివె శితవిశిఖములన్. 144**

**ప్రతిపదార్థం:** నొచ్చియున్= బాధపడుతూనే; భీష్మునిపైన్; వివ్వచ్చుఁడు= అర్జునుడు; బెడిదముగన్= ఎక్కువగా; వాలు+అమ్ములు= వాడి బాణాలు; కురిసెన్= వర్షించాడు; అతండు= భీష్ముడు; అచ్చెరువుతోడన్= ఆశ్చర్యంతో, వెసన్= వేగంగా; కార్చిచ్చు= దావానలం; కవిసినట్లు= పైబడినట్లుగా; శిత+విశిఖములన్= వాడి అమ్ములను; పొదివెన్= చుట్టూ ప్రయోగించాడు.

**తాత్పర్యం:** తాను బాధపడుతూనే, అర్జునుడు భీష్మునిపై గట్టిబాణాలు గుప్పాడు. భీష్ముడు - ఆశ్చర్యంతో మరలా వాడి బాణాలతో అర్జునుడిని కప్పాడు.

**వ. అంత నపరాహ్ణం బయ్యె నట్టియెడ. 145**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; అపర+అహ్ణంబు= మధ్యాహ్న సమయం; అయ్యెన్= ఏర్పడింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అంత మధ్యాహ్నమయింది, ఆ సమయంలో.

**క. హరి దాను నొచ్చి నొచ్చిన । నరునితెఱం గెఱిఁగి భీష్మునకు నించుకయుం**
**గరలాఘవ మెడలమియుం । దిర మై పరికించి తనమదిం దలపోయున్. 146**

**ప్రతిపదార్థం:** హరి= శ్రీకృష్ణుడు; తాను నొచ్చి= బాధింపబడి; నొచ్చిన+నరుని+తెఱంగు= బాధపడుచున్న అర్జునునితీరు; ఎఱిఁగి= తెలిసికొని; భీష్మనకున్= భీష్మనకు; ఇంచుకయున్= ఏ మాత్రమూ; కర+లాఘవము= చేతులందలి సులువు; ఎడలమియున్= తగ్గకపోవటం; తిరము+ఐ+పరికించి= బాగుగా అరసి; తన మదిన్= తన మనస్సులో; తలపోయున్= ఆలోచించాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు తాను దెబ్బతిన్నాడు. అర్జునుడు కూడా దెబ్బతిన్నట్లు తెలుసుకున్నాడు. అయితే భీష్మని 'కరలాఘవము' (చేతుల ఒడుపు) ఏ మాత్రం తగ్గలేదని గ్రహించి - తన మనస్సులో ఈ విధంగా అనుకున్నాడు.

**ఉ. ' పాండవసైన్యముల్ గలఁగి పాఱెడు సిగ్గఱి వీరిలోన నొ**
**క్కండును భీష్మమార్కొని మగంటిమి సూపఁగ లేఁడ యింద్ర పు**
**త్త్రుండును జాల నొవ్వడరి తూఁగెడు నిట్టిద యైన నేఁడ తీ**
**ర్పండె? యితండు కౌరవనృపాలుసమస్తమనోరథంబులున్. 147**

**ప్రతిపదార్థం:** సిగ్గు+అఱి= సిగ్గులేకుండా; పాండవ+సైన్యముల్= పాండవుల సేనలు; కలఁగి= నొచ్చి; పాఱెడున్= పారిపోతున్నాయి; వీరిలోనన్= ఈ పాండవసైనికులలో; ఒక్కండును= ఒక్కడుగూడ; భీష్మన్= భీష్ముని; మార్కొని= ఎదిరించి; మగంటిమి= పౌరుషం; చూపలేడు+అ= చూపించలేకుండా ఉన్నాడు కద!; ఇంద్రపుత్త్రుండును= ఇంద్రుని కొడుకు(అర్జునుడుకూడా); చాలన్= మిక్కిలి; నొవ్వు+అడరి= నొప్పి అతిశయించి; తూఁగెడున్= వ్రాలుచున్నాడు; ఇట్టిది+అ+ఐనన్= ఈ విధంగానే అయితే; నేఁడు+అ= ఈ దినమే; ఇతండు= ఈ భీష్ముడు; కౌరవ నృపాలు సమస్త మనోరథంబులన్= కౌరవరాజు దుర్యోధనుని కోరికలు అన్నీ; తీర్పండు+ఎ?= నెరవేర్చడా?

**తాత్పర్యం:** 'పాండవసేనలు సిగ్గులేకుండా పారిపోతున్నాయి. భీష్ముని ఎదిరించి పౌరుషం చూపగల వీరుడు వీరిలో ఒక్కడూ లేడుకదా! అర్జునుడు గూడా వేదనతో తూలిపోతున్నాడు. ఇక - ఈ స్థితిలో దుర్యోధనుడి కోరికలు అన్నీ భీష్ముడు నేడే నెరవేర్చేటట్లు అనిపిస్తున్నది.

**క. యాదవకేకయ పాంచా । లాదులు వాఱుటలు సూచి యస మెక్కి జయో**
**న్మాదంబునఁ గురుసైన్యము । లే దిక్కునఁ దామ యగుచు నేడ్తెఱఁ బొదివెన్. 148**

**ప్రతిపదార్థం:** యాదవ+కేకయ+పాంచాల+ఆదులు= యాదవులు; కేకయ దేశస్థులు; పాంచాల రాజ్యానికి చెందిన వారు-మొదలగు వారు; పాఱుటలు+చూచి= పారిపోవటం వీక్షించి; అసము+ఎక్కి= గర్వం పొంది; జయ+ఉన్మాదంబునన్= విజయం వల్ల వచ్చే పిచ్చితో; కురుసైన్యములు= కౌరవుల సేనలు; ఏ+దిక్కునన్= ఏ వైపున అయినను; తాము+అ+అగుచున్= తామే ఉంటూ; ఏడ్తెఱన్= పరాక్రమంతో; పొదివెన్= చుట్టుముట్టాయి.

**తాత్పర్యం:** పాండవుల పక్షంలో యుద్ధం చేస్తున్న యాదవుల కేకయుల, పాంచాలుర సేనలు పారిపోవటం చూచి, పొగరెక్కిన విజయోన్మాదంతో కురుసైన్యం అన్నివైపులా చేరి పాండవుల సేనలను చుట్టుముట్టింది.

**వ. ఇప్పు డే నూరకున్నం బోవ దీ దేవవ్రతుం జంపి ధర్మతనయు గెలిపింపవలయు' నని యిట్లు దలపోయునెడ మఱియు మందాకినీనందనుండు బెట్టిదమ్ములగు నారసమ్ములు గురియం దేఁకువ సెడి క్రీడి యున్నంగని కృప కృతవర్మాశ్వత్థామలును భూరిశ్రవస్సైంధవ వికర్ణులును నొక్కమొగంబై రథమ్ముల మొత్తమ్ములతోడం గడంగి వచ్చి కవ్వడిపయిం బడి రాసమయంబున సాత్యకి సామజఘటలతో నురవడించి యిరుగెలంకుల యోధుల నాలోకించి. 149**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు, ఏను= నేను(శ్రీకృష్ణుడు); ఊరకున్నన్= ఉపేక్షిస్తే; పోవదు= సరిపోదు; ఈ+దేవవ్రతున్+చంపి= ఈ భీష్ముని సంహరించి; ధర్మతనయున్= ధర్మపుత్రుని; గెలిపింపవలయున్= నెగ్గేటట్లు చేయాలి; అని= అని ఈ రీతిగా; తలపోయు+ఎడన్= ఆలోచించేటపుడు; మఱియున్= ఇంకను; మందాకినీ+నందనుండు= గంగకొడుకు(భీష్ముడు); బెట్టిదమ్ములు+అగు= కఠినములు అయిన; నారసమ్ములు= బాణాలు; కురియన్= వర్షింపగా; తేఁకువ+చెడి= ధైర్యం చెడి; క్రీడి+ఉన్నన్+కని= అర్జునుడు ఉండటం చూచి; కృప కృతవర్మ అశ్వత్థామలును= కృపుడు,కృతవర్మ, అశ్వత్థామ; భూరిశ్రవస్ సైంధవ వికర్ణులును= భూరిశ్రవుడు -సింధురాజు జయద్రథుడు; వికర్ణుడు; ఒక్క+మొగంబు+ఐ= ఏకమై; రథమ్ముల+మొత్తమ్ములతోడన్= తమ రథాలు అన్నిటితోపాటు; కడంగి+వచ్చి= పూని అరుదెంచి; కవ్వడి పయిన్+పడిరి= అర్జునునిపై మార్కొన్నారు; ఆ సమయంబునన్= ఆ సమయంలో; సాత్యకి= సాత్యకి; సామజ+ఘటలతోన్= ఏనుగుల యూథాలతో, ఉరవడించి= వేగంగా చేరి; ఇరు+కెలంకుల యోధులన్= ఇరుపక్షాల వీరులను; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఇపుడు నేను ఉపేక్షిస్తే వీలులేదు - భీష్ముడిని చంపి ధర్మతనయునికి జయం చేకూర్చాలి' అని శ్రీకృష్ణుడు ఆలోచించాడు. ఇదిగాక, భీష్ముడు వాడి బాణాలు ప్రయోగించటం చేత అర్జునుడు వాడిపోయాడు. కృపుడు - కృతవర్మ - అశ్వత్థామ -భూరిశ్రవుడు, జయద్రథుడు, వికర్ణుడు, కౌరవ పక్షంలోని గొప్ప వీరులు అందరూ ఏకమై రథారూఢులై వచ్చి అర్జునుని మార్కొన్నారు. ఆ సమయంలో సాత్యకి ఏనుగుల గుంపులతో - వేగంగా చేరి ఇరుపక్షాల వీరులను సమీక్షించి.

**విశేషం:** యుద్ధంలో ఎంతటి వీరులకైనా ఒక్కొక్కసారి వేసట ఏర్పడవచ్చు. ఈ పట్టున జగదేకవీరుడు కావచ్చు, అర్జునుడు క్రుంగిపోయాడు మానసికంగా. మహాభారతం ఇట్టి మానసికమైన అవస్థా విశేషాల్ని గుర్తించింది. కవ్వడి = కవ+వడి= జోడువడులు కలవాడు ఈ అచ్చతెలుగు పదానికి సంస్కృత పర్యాయపదం - 'సవ్యసాచి' -రెండు చేతులతో వింటినుండి బాణాలు గుప్పింపగలవాడు.

**క. ' మఱతురె? యాడిన మాటలు । పిఱుసనిపోఁ దగునె? మీకు బెదరక యెదురై**
**తఱుముఁడు భీష్ముని గీష్ముని । నెఱుఁగరె? ము న్నేను గలుగ నేలా వెఱవన్?' 150**

**ప్రతిపదార్థం:** ఆడిన+మాటలు= చేసిన బాసలు; మఱతురె= మరచిపోయారా?; మీకున్= మీకు; పిఱుసనిపోన్+తగునె?= వెనుకంజవేయదగునా? బెదరక= భయపడక; ఎదురు+ఐ= ఎదిరించి; భీష్మునిన్+గీష్మునిన్= భీష్ముని(సరకుగొనక); తఱుముఁడు= వెనుకకు తిరిగి పోయేటట్లు త్రిప్పికొట్టండి; ఎఱుఁగరె?= మీకు తెలియదా?; మున్ను+ఏను+కలుగన్= ముందు నేనుండగా; ఏలా+వెఱవన్?= భయం ఎందుకు?.

**తాత్పర్యం:** 'మీరు చేసిన వాగ్దానాలు - ప్రతిజ్ఞలు మరచిపోయారా? మీరు వెనుకంజ వేయవచ్చా? భీష్ముడు గాని గీష్ముడుగాని ఎవరైనా సరే మీరు బెదరకుండా, ఎదిరించండి - నేనున్నాను - మీకు భయం ఎందుకు?'

**విశేషం:** భీష్ముడు -గీష్ముడు, నిజానికి గీష్ముడంటూ ఎవడూ లేడు. రాముడు - గీముడు - నిందను తెలిపేటప్పుడు 'గీ' అక్షరం తెలుగులో ముందుకు వస్తుంది. అంతే.

**వ. అనుచు నేచి యెదిరిన బలంబుల నిలునిలుమని యదల్చుచు నర్జును తేరికిం దలకడచి వచ్చునతనికి దనుజాంతకుండిట్లనియె : 151**

**ప్రతిపదార్థం:** అనుచున్=అని చెప్పుచు; ఏచి= విజృంభించి; ఎదరిన+బలంబులన్= ఎదిరించిన సేనలను; నిలునిలుము+అని= ఆగు మాగు మని; అదల్చుచున్= మందలించుచు; అర్జును+తేరికిన్= అర్జునుని రథానికి; తల కడచి వచ్చు+అతనికిన్; దాటి ముందునకు వచ్చే అతనికి= సాత్యకికి; దనుజాంతకుండు= రాక్షసులను చంపువాడు= శ్రీకృష్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని విజృంభించి ఎదిరిన సేనలను నిలు నిలుమని అదలించి అర్జును రథానికి ముందుకు వచ్చి చేరిన సాత్యకితో శ్రీకృష్ణుడు ఈ విధంగా అన్నాడు:

**క. ' తిరిగినపందల నేటికిఁ । బురికొల్పఁగనున్నవారు వోదురు గా; కేఁ**
**గురుపతి జయంబు గొని యి । ద్ధరయేలం జూడ నేర్చెదనె? విను నన్నున్. 152**

**ప్రతిపదార్థం:** తిరిగిన= వెనుకంజవేసిన; పందలన్= పారుబోతులను; ఏటికిన్= ఎందుకు; పురికొల్పఁగన్= ప్రోత్సహించాలి?; ఉన్నవారు= నిలిచినవారు; పోదురుగాక= సరిపోతారుగాక; కురుపతి+జయంబున్+కొని= కురురాజు దుర్యోధనుడు జయించి; ఈ+ధరన్= ఈ భూమిని; ఏలన్= పరిపాలించటం; చూడ+నేర్చెదను+ఎ?= చూడజాలుదునా?; నన్నున్+విను= నేను చెప్పే మాటలు విను.

**తాత్పర్యం:** 'పారిపోయే పిరికిపందలను నిలవండని ఎందుకు హెచ్చరిస్తున్నావు? మిగిలిన వారు గూడ పారిపోతే పోదురు గాక! దుర్యోధనుడు జయించి ఈ భూమిని ఏలుకోవటం చూచి నేను సహించగలనా? నా మాట ఆలకించుము.

**శా. గంగానందనుఁ గూల్చి ద్రోణుపని సక్కంజేసి కౌరవ్య వీ**
**రాంగమ్ముల్ నుఱుమాడి తత్ప్రబలసైన్యం బెల్ల మాయించి యి**
**త్తుం గౌంతేయుల కిమ్మహీవలయమున్ దుర్దాంతచంచద్భుజా**
**సంగస్ఫూర్జితచక్రవిక్రమకళాసంక్రీడనోన్మాది నై.' 153**

**ప్రతిపదార్థం:** గంగా+నందనున్+కూల్చి= గంగకొడుకు భీష్ముని సంహరించి; ద్రోణు+పని+చక్కంజేసి= ద్రోణుని పని సరిదిద్ది; కౌరవ్య+వీర+అంగమ్ముల్= కౌరవయోధుల అవయవాలను; నుఱుమాడి= నాశనం చేసి; తద్+ప్రబల+సైన్యంబు+ఎల్లన్= ఆ కౌరవుల గొప్ప సేనను అంతటినీ, మాయించి= నశింపచేసి; కౌంతేయులకున్= కుంతీపుత్రులకు(పాండవులకు); ఈ+మహీ+వలయమున్= ఈ భూమండలాన్ని; దుర్దాంత చంచత్ భుజా సంగ స్ఫూర్జిత చక్ర విక్రమ కళా సంక్రీడన+ఉన్మాదినై= అణచరానిదై కదలుచున్న నా బాహువునందు నెలకొన్న చక్రాయుధము యొక్క వీరవిహారమనే క్రీడయందు, మత్తెక్కిన వాడనై; ఇత్తున్= ఇవ్వగలను.

**తాత్పర్యం:** భీష్ముడిని సంహరిస్తాను. ద్రోణుడిని పనిబట్టగలను, కౌరవ యోధుల అవయవాలను చీల్చి చెండాడగలను. కౌరవసేనలను నాశనం చేయగలను. ఈ భూరాజ్యాన్ని కుంతీపుత్రులైన పాండవులకు కట్టబెట్టగలను. నా భుజ పరాక్రమాన్ని చూపి, చక్రాయుధాన్ని ప్రయోగించి, విక్రమ వీరవిహారం చేస్తాను.'

**విశేషం:** ఇంతవరకు తేటగీతలు వ్రాసిన తిక్కన - ఇక్కడ శ్రీకృష్ణుని ప్రతిజ్ఞ శార్దూల వృత్తంలో చెప్పించాడు. ఈ పద్యం చివర - సుదీర్ఘ సంస్కృత సమాస ప్రయోగం గమనించదగింది. వీర రసోచితంగా - భావానుగుణంగా తిక్కన మహాకవి భాషను వాడటం గుర్తించవచ్చు.

## శ్రీకృష్ణుఁడు చక్రంబు ధరించి భీష్మునిమీఁది కుఱుకుట (సం- 6-55-84)

**వ. అని పలికి సుదర్శనంబుం దలంచినం దత్క్షణంబ యది సన్నిహితం బగుటయుం బద్మనాభుండు సునాభంబగు నా చక్రంబు గైకొని దక్షిణకరంబున నమర్చి పేర్చి యుగ్యంబుల పగ్గంబులు నొగల ముడిచి యరదంబు డిగ్గ నుఱికి. 154**

**ప్రతిపదార్థం:** అని+పలికి; సుదర్శనంబున్= సుదర్శనం అనే పేరుగల 'చక్ర' ఆయుధాన్ని; తలంచినన్= స్మరింపగా; తద్+క్షణంబు+అ= ఆ క్షణమునందే; అది= ఆ 'సుదర్శన చక్రం'; సన్నిహితంబు+అగుటయున్= దరిచేరగా; పద్మనాభుండు= శ్రీకృష్ణుడు(పద్మం నాభియందుగల విష్ణుదేవుడు); సునాభంబు+అగు= శీఘ్రగమనముగల; ఆ చక్రమున్= ఆ చక్రమును; కైకొని= చేతబట్టి; దక్షిణ+కరంబునన్= కుడిచేత; అమర్చి= పెట్టి; పేర్చి= అతిశయించి; యుగ్యంబుల పగ్గంబులు= గుర్రాల కళ్ళాలు; నొగలన్= రథం నొగమీద; ముడిచి= ముడిపెట్టి; అరదంబు+డిగ్గన్+ఉఱికి= రథంనుండి క్రిందికి దుమికి

**తాత్పర్యం:** అని చెప్పి- శ్రీకృష్ణుడు తన ఆయుధమైన సుదర్శన చక్రాన్ని సంస్మరించాడు. వెంటనే ఆ చక్రం అతని దగ్గరకు వచ్చింది. శ్రీకృష్ణుడు శీఘ్రగమనం గల ఆ చక్రాయుధాన్ని తన కుడి చేతికి అమర్చుకున్నాడు. గుర్రాల కళ్ళాలు తేరునొగలమీద జాగ్రత్తగా ముడిచి క్రిందికి దూకాడు.

**తే. అవని గంపింప లలిత పీతాంబరంబు । చెఱఁగు దూలఁ జక్రాంశులు దుఱఁగలింప**
**సింహనాదంబు క్రోధరంజితభయంక । రాననంబునఁ జెలఁగంగ నడరుఁ బెలుచ. 155**

**ప్రతిపదార్థం:** అవని+కంపింపన్= భూమి దద్దరిల్లునట్లుగా; లలిత+పీత+అంబరంబు= మృదువైన పట్టుబట్ట; చెఱఁగు+తూలన్= అంచు చెదరిపోగా; చక్ర+అంశులు= చక్రము యొక్క కాంతులు; తుఱఁగలింపన్= మిరుమిట్లు గొలుపగా; క్రోధ రంజిత భయంకర+ఆననంబునన్= కోపముతో ఎర్రనైన వెరపుగొలిపే ముఖమునందు; సింహనాదంబు= సింహనాదము, చెలఁగంగన్= ధ్వనింపగా; పెలుచన్= ఎక్కువగా; అడరున్= విజృంభించాడు.

**తాత్పర్యం:** భూమి దద్దరిల్లగా, కోమలమైన పట్టుబట్ట అంచులో చలింపగా, చక్రాయుధం కాంతులు వెల్లివిరియగా కోపంతో ఎర్రనైన భయంకర ముఖం నుండి సింహనాదం శోభిల్లగా విజృంభించాడు.

**శా. అంహోమర్దనుఁ డాజనార్దనుఁడు మాద్యద్భీష్మకుంభీంద్రుపై**
**సింహోల్లాసవిలాసి యై కవియు నుత్సేకంబు నాటోపమున్**
**రంహఃస్ఫూర్తియు దీప్తమూర్తియును సంరంభంబుఁ జూడన్ జగ**
**త్సంహారోన్ముఖుఁ డైన రుద్రుగతి రౌద్రప్రక్రియం బొల్చినన్. 156**

**ప్రతిపదార్థం:** అంహస్+మర్దనుఁడు= పాపాలను పోగొట్టువాడు; ఆ+జనార్దనుఁడు= ఆ శ్రీకృష్ణుడు; మాద్యత్+భీష్మ+కుంభి+ఇంద్రు పైన్= మదించిన భీష్ముడు అనే గజరాజుపై; సింహ+ఉల్లాస+విలాసియై= సింహం యొక్క ఉత్సాహ పూరితమైన లాలిత్యం కలవాడై; కవియు+ ఉత్సేకంబు= మార్కొనే ఉద్రేకము; ఆటోపమున్= దర్పమును; రంహస్+స్ఫూర్తియున్= వేగోద్వేగం; దీప్తమూర్తియును=

వెలుగొందే ఆకారం; సంరంభంబున్= ఆ వేగం, చూడన్= అరయగా; జగత్+సంహార+ఉన్ముఖుఁడైన= ప్రపంచాన్ని సంహరించటానికి పూనుకున్న; రుద్రుగతిన్= శివునివలె; రౌద్ర+ప్రక్రియన్= రోషముతో కూడిన ప్రవృత్తితో; పొల్చినన్= శోభిల్లగా.

**తాత్పర్యం:** పాపాలను పొగొట్టునట్టి శ్రీకృష్ణుడు గర్వించి ఉన్న భీష్ముడు అనే మదపుటేన్గుపై సింహం చూపే ఉద్వేగంతో సౌందర్యపుఠీవితో మార్కొన్నప్పుడు స్వయంవ్యక్తమయ్యే ఉద్రేకం - దర్పం- వేగోద్ధతి - వెలుగొందే ఆకృతి - దీనినంతా చూడగా - ప్రపంచాన్ని నాశనం చేయటానికి ఉద్యుక్తుడైన లయకాలరుద్రుని ప్రవృత్తితో ఆయన శోభిల్లుతున్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. రూపకానుప్రాణితం. తెలుగు పద్య శిల్ప సౌష్ఠవమునకు ఈ పద్యం ఉదాహరణప్రాయమైనది. బిందుపూర్వక హకార ప్రాసము యతులు - ప్రౌఢ సంస్కృత సమాసాలు చక్రం చేతపట్టి భీష్మునిపైకి లంఘించిన శ్రీకృష్ణుని ఆకృతిని హృదయంగమంగా సహృదయుల కన్నులకు కట్టిస్తున్నాయి.

**చ. పులిఁ బొడగన్న లేళ్ళగమివోలె సుయోధను నగ్రసైనికుల్**
**దలఁకి కలంగి నివ్వెఱఁగు దక్కినఁ జేష్టలు దక్కి చిత్రరూ**
**పులక్రియ నుండి రక్కురువిభుండును మాఱు దలంపలేని కొం**
**దలమునఁ బొందుడెందమునఁ దానును రూపఱియుండె వెల్ల నై. 157**

**ప్రతిపదార్థం:** పులిన్= పెద్దపులిని; పొడగన్న= చూచిన; లేళ్ళ+గమి+పోలెన్= లేళ్ళ గుంపువలె; సుయోధను+అగ్రసైనికుల్= దుర్యోధనుని ముందు ఉన్న భటులు; తలఁకి= భయపడి; కలంగి= కలతచెంది; నివ్వెఱఁగు దక్కినన్= ఆశ్చర్యం కలుగగా; చేష్టలు దక్కి= కదలిక లేక; చిత్ర రూపుల క్రియన్= చిత్ర లేఖనమునందలిఆకృతుల వలె; ఉండిరి= ఉన్నారు; ఆ+కురు+విభుండును= ఆ కురురాజు (దుర్యోధనుడు); మాఱు+తలంపన్‌లేని= మారు ఆలోచించలేని; కొందలమునన్= ఆవేదనను; పొందుడెందమున్= అనుభవించే గుండెతో; తానును= తానుకూడా; వెల్లనై= వెలవెలబోయి; రూపు+అఱి+ఉండెను= మారిన ఆకృతి గలవాడై ఉన్నాడు.

**తాత్పర్యం:** పులినిచూచిన లేళ్ళగుంపువలె దుర్యోధనుని యోధముఖ్యులు, భయపడి, కలతచెంది నివ్వెఱగున చేష్ట దక్కి చిత్రరూపములవలె వున్నారు. ఆ దుర్యోధనుడు కూడ మారు ఆలోచించలేని ఆవేదన చెందిన హృదయంతో తానుకూడ వెలవెలపాటుతో మారిపోయిన రూపు కలవాడైనాడు.

**ఉ. అప్పుడు భీష్ముఁ డెంతయుఁ బ్రియంబున నిట్లను సంభ్రమంబు లే**
**కప్పరమేశుతో నిటు కృతార్థునిఁ జేయుదెఁ నీవు వచ్చి న**
**న్నిప్పుడు నీకుఁ బోలినటు లెల్లను జేయుదు గాని వేగ ర**
**మ్మెప్పదె నాకు నిట్టి తెఱఁ గుజ్జ్వలపుల్లసరోజలోచనా?' 158**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; భీష్ముడు= భీష్ముడు; ఎంతయున్+ప్రియంబునన్= మిక్కిలి ప్రీతితో; ఆ+పరమేశుతోన్= ఆ కృష్ణుడితో; సంభ్రమంబులేక= తొట్రుపాటు లేక; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; ఇటు= ఈ రీతిగా; కృతార్థునిన్+చేయుదె?= ధన్యుని చేస్తున్నావా; నీవు; వేగన్= శీఘ్రంగా, వచ్చి; నన్నున్; ఇప్పుడు= ఈ సమయంలో; నీకున్+పోలిన+అటులు+ఎల్లను= నీకు తోచినట్లుగా అంతయు; చేయుదుకాని= చేయుదువు కాని; వేగరమ్ము= శీఘ్రమే రమ్ము ఉజ్జ్వల పుల్ల సరోజ లోచనా!= ప్రకాశించేటటువంటి, వికసించినట్టి పద్మముల వంటి కన్నులు గలవాడా; నాకున్= నాకు; ఇట్టి= ఈ విధమైన; తెఱఁగు= రీతి; ఒప్పదు+ఎ?= సరికాదా?

**తాత్పర్యం:** అప్పుడు భీష్ముడు మిక్కిలి ప్రీతితో తొట్రుపాటు లేకుండా ఆ శ్రీకృష్ణుడితో ఇట్లన్నాడు. ప్రకాశించే, వికసించిన పద్మములవంటి కన్నులుగలవాడా! ఈ విధంగా నన్ను ధన్యుని చేస్తున్నావా? నీవు వచ్చి నన్నిప్పుడు నీకు తోచిన విధంగా చేతువుగాని శీఘ్రంగా రమ్ము. ఈ రీతి నాకు తగినదే గదా!

**విశేషం:** భీష్ముడు శ్రీకృష్ణుడిని ఎదిరించలేదు - సరికదా వినయంతో స్వాగతం పలికి అర్చించాడు.

**వ. అను నట్టియెడ నర్జునుండు రయంబున రథంబు డిగ్గనుఱికి పఱచి పురుషోత్తము పిఱిందిదెసం గ్రుచ్చి పట్టిన నతండు దీర్ఘబాహుం డగునతని నాయతశాఖం బగువిపులశాఖిం గొనిపోవు మహావాతంబునుం బోలెఁ గొనిపోవ నాతండు పదియడుగులకొలఁది నిలాతలంబు చిక్కం ద్రొక్కి యీడిగిలంబడి నిలువం బట్టి యిట్లనియె. 159**

**ప్రతిపదార్థం:** అను+అట్టి+ఎడన్= భీష్ముడు అట్లా పలుకుతున్నప్పుడు; అర్జునుండు; రయంబునన్= వేగంగా; రథంబు+డిగ్గి= తేరునుండి దిగి; పఱచి= పరుగెత్తి; పురుషోత్తము= శ్రీకృష్ణుని; పిఱింది+దెసన్+(గుచ్చి+పట్టిన= వెనుకనుండి గట్టిగా బంధించి పట్టగా; అతండు= శ్రీకృష్ణుడు; దీర్ఘ+బాహుండు+ అగు= ఆజానుబాహుడు అయిన(పొడుగు చేతులుగల); అతనిన్= అర్జునుడిని - ఆయత+శాఖంబగు= పొడుగు కొమ్మలుగల; విపుల+శాఖిన్= పెద్ద చెట్టును; కొనిపోవు= తీసికొనిపోవు; మహా+వాతంబునున్+పోలెన్= గొప్ప వాయువువలె; కొనిపోవన్= తీసికొని పోగా; ఆతండు= ఆతడు(అర్జునుడు); పది అడుగుల కొలఁది= పది అడుగుల మేర; ఇలాతలంబు= భూమిభాగం; చిక్కన్+త్రొక్కి= గట్టిగా త్రొక్కిపట్టి; ఈడిగిలంబడి= మొండితనంతో కూర్చుండగా; నిలువన్+పట్టి= నిలువబెట్టి; ఇట్లు; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** భీష్ముడట్లా అంటూండగానే అర్జునుడు వేగంగా రథంనుంచి క్రిందికి దుమికి పరుగెత్తి పోయి పురుషోత్తముని వెనుక వైపునుంచి గట్టిగా పట్టుకున్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు పొడవైన చేతులు గల అర్జునుణ్ణి పొడవైన కొమ్మలతో కూడిన పెద్ద వృక్షాన్ని లాగుకొని పోయే పెనుగాలిమాదిరి ఈడ్చుకొని పోయాడు. అంతట అర్జునుడు పది అడుగులమేర నేలను కాళ్ళతో త్రొక్కిపట్టి మొండికేసి కూర్చుండి నిలువరించి శ్రీకృష్ణుడితో ఇట్లన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. 1. మహాభారతంలో ఈ సన్నివేశం ప్రత్యేక ప్రాముఖ్యం సంతరించుకున్నది. శ్రీకృష్ణుడు ఆయుధం ధరించనని ప్రతిజ్ఞ చేశాడు కదా! మరి చక్రాయుధం ధరించి - భీష్ముని మీదికి లంఘించటం ప్రతిజ్ఞా భంగం కాదా? ప్రతిజ్ఞాభంగమే! ఇది మూడవనాటి యుద్ధంలో - ఒకసారి మాత్రమే గాదు శ్రీకృష్ణుడు తొమ్మిదవనాడు కూడ ఈ విధంగానే ప్రవర్తించాడు. అంతేకాదు 'అశ్వత్థామ' చచ్చిపోయినట్లు ధర్మరాజును అసత్యమాడుమని ఉద్బోధించాడు శ్రీకృష్ణుడు తదుపరి.

'ధర్మం' నిత్య చైతన్య స్రవంతి. స్తబ్ధసూత్రంగాదు. మహాభారతసారంగా చెప్పబడే శ్లోకంలో ధర్మం ఎక్కడ ఉంటే అక్కడ శ్రీకృష్ణుడు ఉంటాడని లేదు సరికదా 'కృష్ణుడు ఎక్కడ ఉంటే అక్కడే ధర్మం ఉంటుంది, అని ఉంది. **'యతో కృష్ణ స్తతో ధర్మః యతో ధర్మస్తతో జయః'** శ్రీకృష్ణుడు శాంతి ప్రియుడు- సంగ్రామ ప్రియుడు కాడు. అందుచే ఆతడు - అచ్చమైన శాంతి సంధాతగా' ఆయుధ విసర్జన చేసి అస్త్రసన్న్యాసం చేశాడు. శ్రీకృష్ణుడు చక్రం పట్టింది - ప్రతిజ్ఞ మీరటానికి కాదు. అర్జునుడికి ప్రోత్సాహం కల్పించటానికే. అది శ్రీకృష్ణుడి తత్క్షణ కర్తవ్యం. అయితే - ప్రతిజ్ఞ - ఉత్తమ లక్ష్యంగా ఉండవలసిందేగాని తప్పించుకోలేని 'బంధం' కాకూడదు. ప్రతిజ్ఞాపాలన గొప్పదే. అయితే - జగద్ధితం కోసం ప్రతిజ్ఞాభంగం చేయటం అహంకార పరిత్యాగమే. ప్రతిజ్ఞకు దాస్యం చేయటం అవివేకమే. భీష్ముడు అధర్మపక్షంలో చేరిన జగదేకవీరుడు. భీష్ముడు ప్రతిజ్ఞకు దాస్యం చేశాడు. తన తండ్రి కోసం - తాను బ్రహ్మచర్య నిష్ఠ స్వీకరించాడు. ఎందుకంటే - తండ్రి వలచిన సత్యవతి సంతానానికి రాజ్యం సంక్రమించేటందుకు. విధి వైపరీత్యం వలన, సత్యవతి సంతానం మరణించి, సింహాసనానికి వారసులు లేకపోయారు.

భీష్మడి ప్రతిజ్ఞకు కాలదోషం పట్టింది. అయినాసరే - అతడు భీష్ముడై సార్థక బిరుదాంకితుడై ప్రతిజ్ఞనే పాటించాడు. అందుచేత అతడు ప్రతిజ్ఞకు దాసుడేగాక- ధృతరాష్ట్రుడికి - తదుపరి దుర్యోధనుడికీ గూడ దాసుడు కావలసివచ్చింది. బహుశః భీష్ముడికి ఆ విషయం తెలియుననే అనుకోవచ్చు. భీష్ముడు శ్రీకృష్ణుడిని అధిక్షేపించలేదు ప్రతిజ్ఞాభంగం చేసినందుకు. అంతేగాక - శ్రీకృష్ణుడికి భక్తితో స్వాగతం పలికి జేజేలు చెప్పాడు. ధర్మసూక్ష్మం వేరు - అది నిత్య చైతన్యపూరితం. గ్రాంథిక జడధర్మం వేరు. శ్రీకృష్ణుడు అనుష్ఠాన వేదాంతి.

2. ఇంక రెండవ అంశం: ఈ ఘట్టాన్ని తిక్కనా వ్రాశాడు, పోతన్నకూడా వ్రాశాడు. 'కుప్పించి ఎగసిన కుండలమ్ముల కాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ' - శ్రీకృష్ణుడు 'కరికి లంఘించు సింహమ్ము కరణి' భీష్ముడి మీదికి ఉరికినట్లు మనోజ్ఞంగా ఆపాతమధురమైన శైలిలో పోతన ఈ సన్నివేశం అభివర్ణించాడు. పోతన్న శైలి - భక్తిరసతుందిలం. తిక్కన తీర్చిదిద్దిన శ్రీకృష్ణుడు లీలా మానుష వేషధారి. 'ధర్మాద్వైతమూర్తి', అనుష్ఠాన వేదాంతి. పోతన్న శ్రీకృష్ణుడు ఆ మహానుభావుడి ఇష్టదైవము.

**ఉ. కోపము సంహరింపు యదుకుంజర! పాండవకోటి కెల్లనుం**
**దేపవు గావె నీ విటు లధీరతఁ బూనికి దప్పినం బ్రతి**
**జ్ఞాపరుఁడైన ధర్మసుతు శౌర్యము ధైర్యము బాహువీర్యమున్**
**రూపఱిపోక కాదె యనురూపమె నీకిది లోకనాయకా! 160**

**ప్రతిపదార్థం:** కోపము= ఆగ్రహం; సంహరింపు(ము)= విడువుము; యదు+కుంజర!= యదువంశీయులలో ఏనుగువంటివాడా= యాదవ శ్రేష్ఠా!; పాండవ+కోటికిన్+ఎల్లనున్= పాండవులకు పాండవుల అనుయాయులకు; తేపవు+కావె= నావవుకాదా?; నీవు+ఇటులు= నీవు ఈ రీతిగా; అధీరతన్= అధైర్యంతో; పూనిక+తప్పినన్= ప్రతిజ్ఞను ఉల్లంఘించినచో; ప్రతిజ్ఞా+పరుఁడైన= ఆడినమాట తప్పనట్టి, శపథము మీరనట్టి; ధర్మ+సుతు= ధర్మపుత్రుని; శౌర్యము= పరాక్రమం; ధైర్యము= ధీరత్వం; బాహువీర్యమున్= భుజబలం; రూపు+అఱి+పోకకాదె= నశించటమే కదా!; లోక+నాయకా!= లోకాలకు అధినేతా(శ్రీకృష్ణా)!; నీకున్+ఇది= నీకు ఈ విధమైన ప్రవర్తన; అనురూపము+ఎ?= తగినట్టిదా?

**తాత్పర్యం:** 'యదువంశంలో శ్రేష్ఠుడవైన ఓ శ్రీకృష్ణా! నీ కోపం ఉపశమింప చేసుకోవయ్యా! నీవే కదా పాండవులకు అందరకూ సంరక్షకుడవు! నీవే ప్రతిజ్ఞను తప్పితే - ఇక ప్రతిజ్ఞను పాలించే ధర్మరాజు మాట ఏమిటి? ధర్మరాజు పరాక్రమం ఏమి కావాలి? శౌర్యము, ధైర్యము, బాహు వీర్యము అన్నీ నశించి పోవా? ఓ లోకనాయకా - ఈ చర్య నీకు తగినదా?

**చ. ఇటు దగునయ్య? కృష్ణ! శమియింపుము సాత్యకిఁ జంపినాఁడ విం**
**కట చనితేని నీదగు సహాయతఁ గౌరవసేన రూపు మా**
**పుట యవలీల నాకు ననుఁ బొల్లుగఁ జేయుట నీకుఁ బాడియే?**
**కటకట! నా పరాక్రమము గాసిగ చక్రము చేతనంటితే! 161**

**ప్రతిపదార్థం:** కృష్ణ!= ఓ శ్రీకృష్ణా!; ఇటు= ఈ విధంగా చేయటం; తగును+అయ్య!= మంచిదా?; శమింపుము= శాంతించునది; ఇంకన్= ఇకమీద; అట+చనితి+ఏనిన్= అక్కడకు (రణరంగానికి) వెళ్ళితే ; సాత్యకిన్= సాత్యకిని చంపినాఁడవు= చంపినట్లే సుమా!; నీది+అగు+సహాయతన్= నీ సాయంవలన; కౌరవ+సేన= కౌరవుల సైన్యాన్ని; రూపు+మాపుట= నశింపచేయటం; నాకున్= నాకు; అవలీల= సులువు; ననున్= నన్ను; పొల్లుగన్+చేయుట= వ్యర్థుడిగ చేయటం; నీకున్= నీకు; పాడియే?= న్యాయమా?; కటకట!= అయ్యో!; నా పరాక్రమము; గాసిగన్= పాడయిపోయేటట్లుగా; చక్రమున్= చక్రమును; చేతన్+అంటితే!= చేతితో పట్టుకున్నావుకదా!

**తాత్పర్యం:** ఓ శ్రీకృష్ణా! ఈ విధంగా ఆయుధం పట్టుకొని - ప్రతిజ్ఞమీరి యుద్ధం చేయటం నీకు తగునయ్యా?, శాంతించుము. ఇక నీవు భీష్ముని మీదకుపోతే సాత్యకిని చంపినట్లే సుమా! నీ సహాయంతో కౌరవసేనను రూపుమాపడం నాకు సులువు. నన్ను దండుగమారిని చేయడం నీకు న్యాయమా! అయ్యయ్యో! నా పరాక్రమము పొలిపోవునట్లుగా చక్రాన్ని చేత ధరిస్తావా?

**వ. అనిన సవ్యసాచి సమయనిష్ఠకు శౌరి సంతోషించి రోషం బుడిపికొని యతనికిం బ్రియంబుగా మగిడి నొగలపైకి వచ్చి దిక్కులు పిక్కటిల్లఁ బాంచజన్యంబు పూరింప నాధనంజయుండును దేవదత్తం బొత్తి గాండీవ గుణ చండనిస్వనం బొండొండ నిగిడించుటయుం గౌరవబలంబులు భేరీమృదంగాదితూర్యనాదంబులు సెలంగ మార్కొని కడంగిన. 162**

**ప్రతిపదార్థం:** అనినన్;సవ్యసాచి+సమయ+నిష్ఠకున్= అర్జునునకు ప్రతిజ్ఞపై గల దీక్షకు; శౌరి= శ్రీకృష్ణుడు; సంతోషించి; రోషంబు+ఉడిపికొని= క్రోధము మాని; అతనికిన్= అర్జునునకు; ప్రియంబుగాన్= ప్రీతిగా; మగిడి= వెనుకకు తిరిగి; నొగలపైకిన్= రథమునకు ముందు భాగానికి (సారథి స్థలమునకు); వచ్చి; దిక్కులు+ పిక్కటిల్లన్= దెసలు మారు మ్రోగగా; పాంచజన్యంబు= శ్రీకృష్ణుడి శంఖం; పూరింపన్= ఒత్తగా; ఆ+ధనంజయుండును= ఆ అర్జునుడు కూడా; గాండీవ+ గుణ+చండ+నిస్వనంబు= గాండీవము(అర్జునుని విల్లు) యొక్క అల్లె త్రాటి భయంకర ధ్వని; ఒండు+ఒండ= క్రమంగా; నిగిడించుటయున్= వర్తిల్ల చేయుటయు; కౌరవ+ బలంబులు= కౌరవుల సేనలు; భేరీ+మృదంగ+ఆది+ తూర్యనాదంబులు= భేరులు, మద్దెలలు, మున్నగు బూరాల ధ్వనులు; చెలంగన్= మ్రోయగా; మార్కొని= తాకి; కడంగినన్= పూనిన.

**తాత్పర్యం:** అర్జునుడికి శపథంపై గల దీక్షకు శ్రీకృష్ణుడు సంతోషించాడు. క్రోధం పోగొట్టుకొని శ్రీకృష్ణుడు వెనుకకు మరలి, తేరు చేరి, సారథి పీఠం మీద కూర్చుని, దెసలు మారు మ్రోగేటట్లుగా పాంచజన్యం పూరించాడు. అర్జునుడు కూడా అదే రీతిలో తన శంఖం దేవదత్తం పూరించి తన విల్లు గాండీవం యొక్క అల్లెత్రాటిని భయంకరంగా మ్రోగించాడు. కౌరవసేనలు కూడా- భేరులు మ్రోగించి, మద్దెలలు వాయించి, బూరాలు ఊది, ఉత్సాహం ప్రకటించారు.

**క. అగ్గలిక దూది దరికొను । నగ్గి తెఱం గమర నప్పుడర్జునుఁడు గడున్**
**డగ్గఱి మెఱుంగుటమ్ముల । మ్రగ్గించె వియచ్చరోత్కరం బగ్గింపన్. 163**

**ప్రతిపదార్థం:** అగ్గలికన్= పూనికతో; అప్పుడు= ఆ సమయంలో; అర్జునుఁడు= అర్జునుడు; దూదిన్+దరికొను= దూదిని కాల్చు; అగ్గి+తెఱంగు+అమరన్= అగ్నిరీతి తోచునట్లుగా; కడున్= మిక్కుటముగ; డగ్గఱి= సమీపానికివచ్చి; వియత్+చర+ఉత్కరంబు= ఆకాశంలో సంచరించే దేవతాచారణ గణములు; అగ్గింపన్= ప్రశంసింపగా; మెఱుంగు+అమ్ములన్= మిరుమిట్లు గొలిపే బాణాలతో; మ్రగ్గించెన్= మాడేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు కౌరవసేనను తాకి, పూనికతో, దూదిని దహించే అగ్ని వలె సమీపించి, మిరుమిట్లు గొలిపే బాణాలు ప్రయోగించి ఆ సేనను కూల్చివేశాడు. ఆతడి పరాక్రమాన్ని ఆకాశంలో సంచరించే దేవతాచారణగణాలు ప్రస్తుతించాయి.

**విశేషం:** చారణులు చేసే ప్రశంస గూర్చి తిక్కన పలుమారులు వర్ణించాడు.

**వ. ఆ సేనకుం దలకడచి భీష్మ భూరిశ్రవశ్శల్యదుర్యోధను లడరి యర్జునుపై శక్తిగదాసప్తనారాచతోమరంబులు ప్రయోగించిన నతండు శక్తియు గదయును దోమరంబును నొక్కొక్కభల్లంబునను నేడునారాచంబు లేడింటను**

**దునిమి పేర్చి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది నానా ప్రకారక్రూరశరకలాపరూపంబునం గవిసి కౌరవ సైన్యంబు నొప్పింపమఱియును దాను మందాకినీనందను నిశిత నారాచజాలంబునం బొదివి భూరి శ్రవసుని చాపంబు ద్రుంచి తొమ్మిదివాలమ్ములు శల్యుమేనం గీలించి కురుపతి వక్షంబు వెడందవాతి యమ్మున ఛేదించె నప్పడు పాంచాలపతివిరాటప్రముఖులగు జోదులు గోలుతల సేసిరి మన బలంబులు గాండీవ గుణనిష్ఠుర నినదంబునం జేడ్పడి యొల్లంబోయి వెల్ల నయి యుండ భవదీయ సుతులు శౌర్యోద్రేకంబున నాకేశనందను నరదంబుఁ బొదివి రట్టి సంకులసమరంబున మహేంద్రబాణంబుచేత మనదిక్కున. 164**

**ప్రతిపదార్థం:** ఆ+సేనకున్= ఆ సైన్యానికి; తలకడచి= దాటి ముందునకు వచ్చి; భీష్మ+భూరిశ్రవస్+శల్య+దుర్యోధనులు= భీష్ముడు; భూరిశ్రవుడు; శల్యుడు; దుర్యోధనుడు; అడరి= విజృంభించి; అర్జునుపైన్= అర్జునుడిపైన; శక్తి+గదా+సప్త+నారాచ+తోమరంబులును=శక్తి; గద; ఏడు బాణాలు ఇనుప గుదియలును; ప్రయోగించినన్= వేయగా; అతండు= అర్జునుడు; శక్తియున్= శక్తిని; గదను= గదను; తోమరంబును= ఇనుపగుదియను; ఒక్క+ఒక్క భల్లంబునకున్= ఒక్కొక్క ఈటె బాణంతో; ఏడు+నారాచంబులున్= ఏడు బాణాలను; ఏడింటను= ఏడు బాణాలతో; తునియన్= ఖండించి; పేర్చి= అతిశయించి; ఇంద్ర+అస్త్రంబు= ఇంద్రునకు సంబంధించిన మంత్రబాణం; ప్రయోగించినన్= వేయగా; అది= ఆ ఇంద్రాస్త్రము; నానా+ప్రకార+క్రూర+శర+కలాప+ రూపంబునన్= పెక్కు విధములైన భయంకర బాణ సమూహాల రూపంతో; కవిసి= మార్కొని; కౌరవ+సైన్యంబు= కౌరవసేనను; నొప్పింపన్= బాధింపగా; మఱియును= ఇంకను; తాను= అర్జునుడు; మందాకినీ+నందనున్= గంగకొడుకును; నిశిత+నారాచ+జాలంబునన్= వాడియైన బాణాల సముదాయం చేత; పొదివి= చుట్టుముట్టి; భూరిశ్రవసుని+చాపంబు+త్రుంచి= భూరి శ్రవసుని విల్లును తునిమి; తొమ్మిది+వాలు+అమ్ములు= తొమ్మిది వాడి బాణాలు; శల్య+మేనన్= శల్యుని దేహంపై; కీలించి= హత్తుకొనజేసి; కురు+పతి+వక్షంబున్= కురురాజు దుర్యోధనుని ఉరము; వెడంద+వాతి+అమ్మునన్= పెద్ద నోరుగల బాణంతో; ఛేదించెన్= త్రుంచాడు; అప్పుడు= ఆ సమయంలో; పాంచాలపతి+విరాట+ప్రముఖులు+అగు= ద్రుపదుడు విరాటుడు మున్నగు జోదులు= యోధులు; కోలుతల+చేసిరి= కౌరవసేనకు; ఎదురుబొదురుగా నిలిచి యుద్ధం చేశారు; మన+బలంబులు= కౌరవసేనలు; గాండీవ+గుణ+నిష్ఠుర నినదంబులనన్= గాండీవము యొక్క అల్లె త్రాటినుండి వెలువడిన కఠిన శబ్దంచే; చేడ్పడి= నివ్వెరబోయి; ఒల్లంబోయి= కలగి; వెల్లన్+అయి= వెలవెలబోయి; ఉండెన్= ఉండగా; భవదీయ+సుతులు= నీ కొడుకులు; శౌర్య+ఉద్రేకంబునన్= పరాక్రమంతో కూడిన ఉత్సాహంతో; నాక+ఈశ+నందను= అర్జునుని; అరదంబు= తేరు; పొదివిరి= చుట్టుముట్టారు; అట్టి+సంకుల+సమరంబునన్= అటువంటి దొమ్మి యుద్ధంలో, మహేంద్ర బాణంబు చేతన్= ఐంద్రాస్త్రం చేత; మన+దిక్కునన్= మన పక్షంలో.

**తాత్పర్యం:** కౌరవసేనకు ముందుకువచ్చి భీష్ముడు, భూరిశ్రవసుడు, శల్యుడు, దుర్యోధనుడు విజృంభించి అర్జునుడి మీద శక్తి, గద, ఏడు బాణాలు, ఇనుప గుదియలు ప్రయోగించారు. అర్జునుడు శక్తి, గద, ఇనుప గుదియలకు ఒక్కొక్క బాణంతో, ఏడు బాణాలను ఏడు బాణాలతో ఖండించి - విజృంభించి ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. ఆ ఐంద్రాస్త్రం - పెక్కు ఆకారాలుగల భయంకర బాణసముదాయంక్రింద మారి, కౌరవసైన్యాన్ని చీకాకు చేసింది. అంతేకాక, అర్జునుడు భీష్ముడిపై వాడి బాణాలు ప్రయోగించి మార్కొన్నాడు. మరియు భూరిశ్రవసుడి విల్లు ఖండించి, శల్యుడి దేహంపై తొమ్మిది అమ్ములు నాటి, దుర్యోధనుడి, ఉరము ఛేదించి, విక్రమించాడు. అప్పుడు ద్రుపదుడు - విరాటుడు మున్నగు వీరులు కౌరవసేనకు ఎదురుగా నిలిచి పోరాటం సాగించారు. కౌరవసేనలు - అర్జునుడి విల్లు గాండీవం యొక్క నారి నుండి వెలువడిన భీకరధ్వనికి

తట్టుకొనలేక నివ్వెరపాటు చెందారు. నీ కొడుకులు పరాక్రమప్రకర్షతో, అర్జునుడి రథాన్ని చుట్టుముట్టారు. ఆ దొమ్మి యుద్ధంలో-ఐంద్రాస్త్రం చేత మన పక్షంలో -

**ఆ. కెడసె హయము లొడ్డగెడ వయ్యె రథములు । చాఁపకట్టు వడియె సామజములు**
**చదిసెఁ గాలుబలము చామరచ్ఛత్రకే । తువులు నాయుధములుఁ దునియలయ్యె. 165**

**ప్రతిపదార్థం:** హయములు= గుఱ్ఱములు; కెడసెన్= నశించాయి; రథములు+ఒడ్డగెడవు+అయ్యెన్= తలక్రిందులయ్యాయి; సామజములు= ఏనుగులు; చాఁపకట్టు వడియెన్= నేలమీద చాపపరిచినట్లు కూలి పడిపోయాయి; కాలు+బలము= పదాతి; చదిసెన్= నలిగిపోయాయి; చామర+ఛత్ర+కేతువులు= వీవనలు- గొడుగులు-జెండాలు; ఆయుధములు= యుద్ధ పరికరాలు; తునియలు+ అయ్యెన్= ముక్కలై పోయాయి.

**తాత్పర్యం:** గుఱ్ఱాలు నాశనమై పోయాయి. రథాలు ఒరగిపోయాయి. ఏనుగులు నేలమీద కూలిపోయాయి. కాలుబలము నలిగిపోయింది. చామరలు - గొడుగులు - జెండాలు ముక్కలైపోయాయి.

**విశేషం:** 1.చామరములు = చమరీమృగం జూలుతో చేయబడిన వీవన. 2. ఛత్ర చామరములు= రాజలాంఛనాలు. యుద్ధంలో ఆయుధాలుగదా కావలసినది. అయితే ఆయుధాలకంటె ఈ రాజలాంఛనాలకే ఎక్కువ ప్రాముఖ్యం ఉంది ఆనాటి యుద్ధ సంప్రదాయంలో.

**వ. అప్పు డర్జునుండు కేశకలాపంబు శైవాలంబును బ్రేవుల ప్రోవులు ఫేనపుంజంబులును మేదోమాంసమస్తిష్క పటలంబు పంకంబును నగురక్తనదీప్రవాహంబు భవదీయసేనామధ్యంబునం బఱపి బేతాళక్రవ్యాది భూతంబుల నోలలార్చె నతండు దేవదత్తంబును దామోదరుండు పాంచజన్యంబును బూరించి సింహనాదంబులు సేసి రంత నరుణగభస్తి యస్తగిరి మస్తకాంతరితుం డయ్యె నాసంధ్యాసమయంబున నిజసైన్యంబు నొవ్వునుం గవ్వడి దివ్యబాణజాలంబుల దుర్నివారత్వంబును విచారించి భీష్మద్రోణబాహ్లికదుర్యోధనులు బలంబులఁ దివియం బంచి మరలి కరదీపికలు వెలుంగ విడిదలకు వచ్చిరి పాండవులును గృష్ణసహితంబుగా నుబ్బునం బొంగుచు వందిజనకీర్తనంబులు సెలంగ మగిడి శిబిరంబునకుంజని రమ్మ్యోడవనాఁటి రాత్రి గురుపతివీటి జనంబులు గిరీటిపరాక్రమప్రకారంబులందమదెసనానాదేశంబులచతురంగంబులు వొలిసినపెల్లును నంతంతం గుములుగట్టి చెప్పికొనుచుండ. 166**

**ప్రతిపదార్థం:** అప్పుడు; కేశ కలాపము= వెండ్రుకల సముదాయం; శైవాలంబును= నీటి పాచిగా; ప్రేవుల+ప్రోవులు= ప్రేగుల గుట్టలు, కడుపులోని పేగుల సముదాయం; ఫేన పుంజంబులును= నురుగుల సముదాయములుగా; మేదస్+మాంస+మస్తిష్క+పటలంబు= క్రొవ్వు మాంసం మెదడు వీని సముదాయం; పంకంబును= బురదగా; అగు= అయిన; రక్త+నదీ+ప్రవాహంబు= నెత్తుటి ఏటి వెల్లువ; భవదీయ+సేనా+మధ్యంబునన్= నీ సైన్యం నడుమగా; పఱపి= ప్రవహింపజేసి; బేతాళ+క్రవ్యాత్+ఆది+భూతంబులన్= మృత కళేబరాలను ఆవేశించే పిశాచములను రాక్షసులు మున్నగు దయ్యాలను; ఓలలార్చెన్= మునుగునట్లుచేశారు; అతండు= అర్జునుడు; దేవదత్తంబును= దేవదత్తం అనే శంఖాన్ని; దామోదరుండు= శ్రీకృష్ణుడు; పాంచజన్యంబును= పాంచజన్యం అనే శంఖాన్ని; పూరించి= ఒత్తి; సింహనాదంబులు= సింహగర్జనల వంటి కేకలు; చేసిరి= పెట్టారు; అంతన్= తరువాత; అరుణ+గభస్తి= సూర్యుడు(ఎఱ్ఱని కిరణములు కలవాడు); అస్తగిరి+మస్తక+అంతరితుండు+అయ్యెన్= పడమటి కొండ శిఖరంలో దూరినవాడు అయ్యాడు(అనగా అస్తమించాడు.); ఆ+సంధ్యా+సమయంబున్= ఆ సంజవేళ; నిజ+సైన్యంబు+నొవ్వునున్= తమ సేనలు పడిన బాధను; కవ్వడి దివ్య బాణ జాలంబుల దుస్+నివారత్వంబును= అర్జునుడు ప్రయోగించిన వేల్పుటమ్ముల సముదాయం యొక్క అడ్డరానితనమును;

విచారించి= ఆలోచించి; భీష్మ ద్రోణ బాహ్లిక దుర్యోధనులు= భీష్ముడు, ద్రోణుడు, బాహ్లికుడు, దుర్యోధనుడు; బలంబులన్= సేనలను; తివియన్+పంచి= యుద్ధం ఆపించుటకు ఆజ్ఞాపించి; మరలి= వెనుకకు తిరిగి; కర దీపికలు= చేతి దీపాలు(కాగడాలు); వెలుంగన్= ప్రకాశింపగా; విడిదలకున్= నివాస స్థలాలకు; వచ్చిరి; పాండవులును= పాండవులుగూడ; కృష్ణ+సహితంబుగాన్= శ్రీకృష్ణునితో పాటుగా; ఉబ్బునన్+పొంగుచున్= ఉత్సాహంతో అతిశయించుచు; వంది+ జన+ కీర్తనం బులు+చెలంగన్= వృత్తిగా ప్రస్తుతి చేసే వారి ప్రశంసలు ఒప్పగా; మగిడి= తిరిగి; శిబిరంబునకున్+చనిరి= స్కంధా వారములకున్= విడిదులకు వెళ్ళారు; ఆ+మూఁడవ+నాఁటి+రాత్రి; కిరీటి+పరాక్రమ+ప్రకారంబులన్= అర్జునుడు విక్రమం ప్రదర్శించిన రీతులను; కురుపతి వీటి జనంబులు= కురురాజైన దుర్యోధనుడి పక్షానికి సంబంధించిన వారు; తమ+దెసన్= తమ ఎడ; నానా దేశంబుల చతురంగ బలంబులు= వివిధ దేశాలకు సంబంధించిన నాలుగు సైన్య విభాగాలు (రథ - గజ- తురగ -పదాతులు); పొలిసిన పెల్లును= చచ్చిన మొత్తాన్ని; అంతంతన్= అంత అంతగా; గుములు+కట్టి= గుంపులుగా చేరి; చెప్పికొనుచుండన్= మాటాడుకొనుచుండగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో అర్జునుడు నీ సేనల మధ్య నెత్తురు ఏటి వరదలు ప్రవహింప చేశాడు. అందులో వెండ్రుకలు నీటి పాచిగా ఏర్పడ్డాయి. తలకాయల్లోని క్రొవ్వు మాంసం మెదడు అనువాని సముదాయం బురదగా తయారయింది. ఆ రక్తనదిలో పిశాచాలు - రాక్షసులు- దయ్యాలు ఓలలాడాయి. అర్జునుడు దేవదత్తం పూరించాడు. శ్రీకృష్ణుడు పాంచజన్యం ఒత్తాడు. పిమ్మట వారిరువురు సింహనాదాలు చేశారు. అప్పుడు సూర్యుడు పడమటి కొండలలో చేరాడు. ఆ మలిసంజలో - తమ సైన్యాలు పొందిన దీనావస్థ ఆపటానికి సాధ్యం కానట్టి అర్జునుని విజృంభణ - దివ్యాస్త్రప్రయోగం గూర్చి విచారించి, భీష్ముడు ద్రోణుడు బాహ్లికుడు - తమ సేనలను ఉపసంహరించి - కాగడాల వెలుగులో తమ విడిదులకు వెళ్ళారు. పాండవులు శ్రీకృష్ణునితోపాటు, తమ్ములందరు ప్రస్తుతించుతుండగా, ఉత్సాహంతో ఉప్పొంగిపోయి తమ తమ నివాసస్థానాలకు వెళ్ళారు. ఆ మూడవనాటి కురుక్షేత్ర సంగ్రామ విశేషాలను గూర్చి, గుంపులు గుంపులుగా చేరి కౌరవభటులు ముచ్చటించసాగారు. ఆనాడు అర్జునుడు చూపిన పరాక్రమం, అతడు ప్రయోగించిన ఐంద్రాస్త్రం గూర్చి, తమ సైన్యంలో వివిధ దేశాలకు సంబంధించిన చతురంగబలాలు చెడిన తీరు తెన్నుల గూర్చి, వారు చర్చించుకున్నారు. అటు పిమ్మట.

**విశేషం:** 1. ఐంద్రాస్త్ర ప్రయోగం : మహాభారతంలో పలుచోట్ల -అస్త్రప్రయోగ ప్రస్తావన ఉన్నది. ఇవి అత్యద్భుత మారణాయుధాలు. చాలాకాలం క్రిందట జరిగిన కురుక్షేత్ర సంగ్రామం ఏమిటి? ఇటువంటి మారణాస్త్రాలు ఏమిటి? ఇవి కవి కల్పితాలు మాత్రమేనా? కవుల ఊహలకు కూడా అందనట్లు తోచే ఈ అస్త్రాలు మహాభారతంలో (రామాయణంలో కూడా) ఎట్లా చేరాయి? జల ప్రళయానికి ముందు పెరిగిన నాగరికత అంశాలు కొన్నివేల సంవత్సరాల తదుపరి మానవజాతి భద్రపరచుకొన్న జ్ఞాపక శకలాలు ఇట్టి రచనలకు ఆధారం కావచ్చునని కొందరు విద్వాంసుల అభిప్రాయం.

2. వంది: ప్రస్తుతి వృత్తిగా స్వీకరించినవాడు. రాజులను ఆశ్రయించుకొని వారు బ్రదికేవారు.

3. బేతాళ క్రవ్యాదాది భూతంబులు: మృతశరీరాన్ని ఆవేశించే పిశాచం బేతాళుడు. పీనుగులను తినే రాక్షసులు క్రవ్యాత్తులు.

భూతాలు : మృతశరీరాలను కబళించే పిశాచాలు - అని పురాణ వాఙ్మయ వర్ణన.

4. భీష్మ ద్రోణ బాహ్లిక దుర్యోధనుల మంతనం: భీష్ముడు సేనాపతి. ద్రోణుడు గురువు. దుర్యోధనుడు రాజు. బాహ్లికుడు కౌరవ పక్షంలోనే గాక కురుక్షేత్రంలో చేరిన పదునెనిమిది అక్షౌహిణీబలాల వీరులలో వృద్ధతముడు. అతడు శంతనుని తమ్ముడు. భీష్ముడికి పినతండ్రి. అందుచే ఆ ముగ్గురకు పూజనీయుడు.

## భీష్ముని చతుర్థ దివస యుద్ధము (సం. 6-56-1)

**క. వేగుటయు సత్వరంబుగ । నా గాంగేయుండు మించి యనికి నడచినన్**
**సాగరతరంగములగతి । వేగమ తరతరమ మొనలు వెడలఁ దొడంగెన్. 167**

**ప్రతిపదార్థం:** వేగుటయున్= తెల్లవారుటయు; సత్వరంబుగన్= వేగంగా; ఆ+గాంగేయుండు= ఆ భీష్ముడు; మించి= అతిశయించి; అనికిన్= యుద్ధానికి; నడచినన్= వెడలగా; సాగర తరంగముల గతిన్= కడలి కెరటాల వలె; వేగము+అ= శీఘ్రముగా; తరతరమ= క్రమంగా; మొనలు= సేనలు; వెడలన్+తొడంగెన్= వెళ్ళటానికి మొదలుపెట్టాయి.

**తాత్పర్యం:** తెల్లవారగానే శీఘ్రంగా - సేనాధిపతియైన భీష్ముడు ముందు నడచివెళ్ళాడు రణరంగానికి. అతని వెంట సముద్రపు కెరటాలవలె - కౌరవ సేనలు వరుసగా బారులు తీర్చి కదలి వెళ్ళాయి.

**క. అతిరయమున గురుఁడు భవ । త్సుతుఁడును బాహ్లికుఁడు నెయిది తోడ్తో బలసం**
**తతి గూడికొనఁగఁ బటుబృం । హితహేషానేమి రవము లెసఁగెం దఱచై. 168**

**ప్రతిపదార్థం:** అతి+రయమునన్= మిక్కిలి వేగంతో; గురుఁడు= ద్రోణుడు; భవత్+సుతుఁడును= నీ కొడుకు(దుర్యోధనుడును); బాహ్లికుఁడు= శంతనుని తమ్ముడు, భీష్ముని పినతండ్రి అయిన బాహ్లికుడు; ఎయిది తోడ్తోన్= చుట్టుముట్టి; వెనువెంటనే; బల+సంతతిన్= సేనలను; కూడికొనఁగన్= కలుసుకోగా; పటు+బృంహిత+హేషా+నేమి+రవములు= గొప్పవైన ఏనుగుల ఘీంకారములు; గుర్రాల సకలింపులు; రథచక్రాల ధ్వనులు; తఱచు+ఐ= సాంద్రములై; ఎసగెన్= వర్ధిల్లాయి.

**తాత్పర్యం:** మిక్కిలి శీఘ్రంగా, ద్రోణుడు - నీ కొడుకు దుర్యోధనుడు, బాహ్లికుడు వెనువెంట కదలి సేనలను కలిసికొన్నారు. ఏనుగుల ఘీంకారాలు, గుర్రాల సకిలింపులు రథచక్రాల ధ్వనులు - దట్టంగా విలసిల్లాయి.

**క. కారుకొని మేఘమాలా । కారంబునఁ జాల నొప్పెఁ గౌరవసైన్యం**
**బారూఢవీరరసవి । స్ఫారం బై యంతఁ దోఁచెఁ బాండవ బలమున్. 169**

**ప్రతిపదార్థం:** కారుకొని= నల్లగా క్రమ్ముకొని; మేఘ+మాలా+ఆకారంబునన్= మబ్బుల దొంతర దండవంటి ఆకారంతో; కౌరవ+సైన్యంబు= కురుసేన; చాలన్= మిక్కుటముగా; ఆరూఢ వీర రస విస్ఫారంబు+ఐ= ప్రసిద్ధమైన పరాక్రమ రసంతో విస్తరించినట్టిదై; ఒప్పెన్= శోభిల్లింది; పాండవ+బలమున్= పాండవసేనకూడా; అంతన్= అంతట; తోఁచెన్= కన్పించింది.

**తాత్పర్యం:** దట్టమైన మబ్బుల దొంతరవలె కౌరవసేన ప్రసిద్ధమైన వీరరసంతో విస్తరిల్లినదై శోభిల్లినదై అంతటా కన్పించింది.

**క. కురుసేనఁ జూచి యప్పుడు । నర నారాయణులు దమ మొనకు మిగిలి సము**
**ద్ధురలీల సూర్య చంద్ర । స్ఫురణము లొక్కెడన మెఱయుపోలిక నమరన్. 170**

**ప్రతిపదార్థం:** కురుసేనన్= కౌరవసేనను; చూచి; అప్పుడు; నర+నారాయణులు= అర్జునుడు మరియు శ్రీకృష్ణుడు; తమ+మొనకున్= తమసేనకు; మిగిలి= అతిశయించి; సమ్+ఉద్ధుర+లీలన్= మిక్కిలి పట్టరాని విధంగా; సూర్య చంద్ర స్ఫురణములు= సూర్య,చంద్ర ప్రకాశములు; ఒక్క+ఎడమ+అ= ఒకేచోటనే; మెఱయు+పోలికన్= ప్రకాశించే రీతిగా; అమరన్= పొందికపడగా

**తాత్పర్యం:** కౌరవసేనను చూస్తూ, అప్పుడు అర్జునుడు, శ్రీకృష్ణుడు ఒకేచోట సూర్యుడు, చంద్రుడు కూడి ప్రకాశించినట్లు కన్పించారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఈ పద్యంలో 'నరనారాయణులు - సూర్యచంద్రుల పోలిక నమరన్' అని అసమాపక క్రియ ఉంది. తరువాతి పద్యంలో (171 పద్యంలో) వెలిగిరి అనే క్రియ ఉంది. దానితో అన్వయించుకోవాలి.

**క. వెలిఁగిరి; బలములు దూర్యం । బులు నార్పులుఁ జెలఁగ రెండుఁ బురికొని చతురం**
**గలసద్గతు లొప్పఁగ వడిఁ । దలపడియెం గైదువులు నదరు లెగయంగన్. 171**

**ప్రతిపదార్థం:** వెలిఁగిరి= ప్రకాశించారు; బలములు+రెండున్= రెండుసేనలూ; తూర్యంబులు= జంత్రనాదాలు; ఆర్పులు= సింహనాదాలు; చెలఁగన్= మ్రోయగా; పురికొని= ఉత్సహించి; చతురంగ+లసత్+గతులు+ఒప్పఁగన్= నాలుగు అంగములకు తగిన ప్రకాశమానమైన రీతులు విలసిల్లగా; వడిన్= వేగంగా; కైదువులు= కత్తులు; అదరులు= మిడుగురులు, నిప్పురవ్వలు; ఎగయంగన్= పైకిలేవగా; తలపడియెన్= మార్కొన్నాయి.

**తాత్పర్యం:** వెలిగారు. (కృష్ణార్జునులు సూర్యచంద్రుల వలె - వెనుకటి పద్యంతో అన్వయం.) కురు పాండవుల రెండు సేనలు - జంత్ర వాద్య నినాదాలతో - సింహనాదాలతో - కత్తుల నుండి నిప్పురవ్వలు పైకిలేవగా-ఒకరి నొకరు మార్కొని యుద్ధం చేశారు.

**వ. ఇట్లు దాఁకి తోమరప్రాసప్రముఖంబులం డొల్లవైచుచుఁ గుంతక్షురికాదులఁ గూలం బొడుచుచుం గరవాల పరశ్వథ ప్రభృతులం దునియవ్రేయుచు గదాముసలముద్గరంబులఁ జదియ మోఁదుచు నఖర ప్రాసంబులం బగులవ్రచ్చుచు. 172**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; తాఁకి= మార్కొని; తోమర+ప్రాస+ప్రముఖంబులన్= ఇనుపగుదియలు, ఈటెలు మొదలైన ఆయుధాలను; డొల్లవైచుచున్= నశింపజేస్తూ; కుంత+క్షురిక+ఆదులన్= బల్లెములు-చిరుకత్తులు మొదలైన వాటిచేత; కూలన్+పొడుచుచున్= కూలవేస్తూ; కరవాల+పరశ్వథ+ప్రభృతులన్= కత్తులు, గండ్రగొడ్డళ్ళు మొదలైన వాటిచేత; తునియవ్రేయుచున్= ముక్కలు చేస్తూ; గదా+ముసల+ముద్గరంబులన్= గదలు; రోకళ్ళు, గుదియలచేత; చదియన్+మోఁదుచున్= నేల కూల్చుచూ; నఖర+ప్రాసంబులన్= నఖరం అనే ఆయుధము ఈటెలతో; పగులవ్రచ్చుచున్= శత్రువులను పగులునట్లుగా గ్రుచ్చుతూ.

**తాత్పర్యం:** ఈ విధంగా మార్కొని తోమర ప్రాసప్రముఖములైన ఆయుధాలచేత తమతమ శత్రువులను పడవైచుచూ, కుంత క్షురి కాదులచేత కూలబొడుస్తూ, కరవాల పరశ్వధాదులతో ముక్కలు చేస్తూ, గదా ముసల ముద్గరాలతో పడమోదుతూ, నఖర ప్రాసములతో పగులగొడుతూ (తరువాతి పద్యంతో అన్వయం)

**క. పురికొనుచుం దెరలుచు నో । హరిసాహరి నొక్కచోట నలవడు నొకచో**
**విరియు నొకచోటఁ దిరుగుం । దిరుగక యొకచోట రెండుదెఱఁగులు నొచ్చున్. 173**

**ప్రతిపదార్థం:** పురికొనుచున్= ఉత్సహిస్తూ; తెరలుచున్= తొలగిపోతూ; ఓహరిసాహరిన్= తండోపతండాలుగా; ఒక్కచోటన్= ఒక స్థలంలో; అలవడున్= చేరును; ఒకచోన్= ఒకచోట; విరియున్= చెదరును; ఒకచోటన్= ఒకచోటను; తిరుగున్= మరలును; ఒకచోటన్= మరోచోట; తిరుగక; రెండు తెఱఁగులు= రెండు పక్షాలు; నొచ్చున్= బాధ చెందుతాయి.

**తాత్పర్యం:** ఉత్సహిస్తూ - తొలగిపోతూ, తండోపతండాలుగా ఒకచోట చేరుతూ, ఒకచోట విడిపోతూ, ఒకచోట మరలిపోతూ ఇంకోచోట మరలిపోక, రెండు పక్షాలూ నొచ్చాయి.

**క. పలుచోటులఁ బలుభంగులఁ । బలుమొన లిమ్మాడ్కిఁ బోరఁ బార్థునిపై న**
**గ్గలిక నడరెఁ దాటిసిడము । తలతల మని మెఱయఁ గురుపితామహుఁ డధిపా ! 174**

**ప్రతిపదార్థం:** పలు+చోటులన్= ఎన్నో స్థలాలలో; పలు+భంగులన్= ఎన్నో విధాలుగా; పలు+మొనలు= పెక్కు సైన్యాలు; ఈ+మాడ్కిన్= ఈ రీతిగా; పోరన్= యుద్ధం చేయగా; అధిపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; తాటి+సిడము= తాడిచెట్టు పతాకం; తలతలమని+ మెఱయన్=వెలుగు చిమ్ముతూ ప్రకాశింపగా; కురు+పితామహుఁడు= కురువంశానికి చెందిన తాతగారు(భీష్ముడు); పార్థునిపైన్= అర్జునునిపై; అగ్గలికన్= అధికంగా; అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** ఎన్నో తావులలో - ఎన్నో రీతులలో ఎన్నో సేనలు ఈ విధంగా పోరాటం సాగించగా, ఓ ధృతరాష్ట్ర మహారాజా! కురువంశానికే తాతగారైన భీష్ముడు, తాళధ్వజం ప్రకాశించగా అర్జునుడిపై అధికంగా విజృంభించాడు.

**క. పతియును ద్రోణుండు వివిం । శతియుం గృపసోమదత్తశల్యులు గంగా**
**సుతుతోడఁ గడఁగి రర్జున । సుతుఁ డయ్యేడ్వురను దాఁకె సురలు నుతింపన్. 175**

**ప్రతిపదార్థం:** పతియును= రాజును(దుర్యోధనుడును); ద్రోణుండున్= ద్రోణుడు; వివింశతియున్; కృప+సోమదత్త+శల్యులున్= కృపుడు-సోమదత్తుడు-శల్యుడు; గంగాసుతుతోడన్= భీష్మునితో చేరి; కడఁగిరి= పూనిరి(పోరాటం సాగించారు); ఆ+ఏడ్వురను= ఆ ఏడుమందిని; సురలు+నుతింపన్= వేల్పులు అగ్గించునట్లుగా; అర్జునసుతుఁడు= అర్జునుని కొడుకు(అభిమన్యుడు); తాఁకెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు, ద్రోణుడు, వివింశతి - కృపుడు, సోమదత్తుడు - శల్యుడు - భీష్ముడితో కలిసి పూనుకొనగా అభిమన్యుడు - ఆ ఏడుగురినీ దేవతలు ప్రశంసించేటట్లుగా మార్కొన్నాడు.

**క. వారల శరనిచయము దు । ర్వార విశిఖపంక్తిఁ దునిమి వాసవపౌత్రుం**
**డారూఢతేజుఁడై వెలుఁ । గారెను హుతవహ్ని క్రియ రణాంగణవేదిన్. 176**

**ప్రతిపదార్థం:** వారల శర నిచయమున్= వారల అమ్ముల సముదాయమును; దుర్వార విశిఖపంక్తిన్= వారించటానికి వీలులేని తన బాణాల గుంపుతో; తునిమి= ఖండించి; వాసవ+పౌత్రుండు= దేవేంద్రుని మనుమడు, అర్జునుని పుత్రుడు, అభిమన్యుడు; ఆరూఢ+తేజుఁడై= అధికమైన తేజస్సుగలవాడై; హుతవహ్ని క్రియన్= హోమద్రవ్యమును స్వీకరించు అగ్ని హోత్రుడివలె; రణ+అంగణ+వేదిన్= యుద్ధభూమి అనెడు యజ్ఞ వేదికపై; వెలుఁగారెను= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ఆ ఏడ్గురు వీరుల బాణసముదాయాన్ని - అభిమన్యుడు వారించుటకు వీలులేని తన బాణాలతో ఖండించి, హోమద్రవ్యమును గ్రసించు అగ్నిహోత్రుని వలె ఆ యుద్ధభూమి అనెడు యజ్ఞవేదికపై ప్రకాశించాడు.

**తే. భీష్ముఁ డభిమన్యుఁ గడచి యాభీలబాణ । జాలములు తీవ్రతరముగ సవ్యసాచి**
**మీఁదఁ గురియంగ నాతఁ డమేయభల్ల । తతుల నన్నింటిఁ దునుమాడెఁ దరతరంబ. 177**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు; అభిమన్యున్+కడచి= అభిమన్యుని దాటి వెళ్ళి; ఆభీల+బాణ+జాలములు= భయంకరములైన బాణ సముదాయం; తీవ్రతరముగన్= మిక్కిలి తీక్ష్ణముగా; సవ్యసాచిమీఁదన్= అర్జునుడిపై; కురియంగన్= వర్షింపగా; ఆతఁడు= అర్జునుడు; అమేయ+భల్ల+తతులన్+అన్నింటిన్= సాంద్రమైన ఆ బాణసమూహాలను అన్నింటినీ; తరతరంబ= వరుసగా; తునుమాడెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు అభిమన్యుడిని దాటి వెళ్ళి, భయంకరమైన బాణాలు అర్జునుడిపై ప్రయోగించాడు. అర్జునుడు ఆ దట్టమైన బాణసమూహాలను అన్నింటినీ వరుసగా ఖండించాడు.

**వ. ఇట్లు దొడంగి యుద్భటప్రకారంబునఁ బెల్లు సెల్లు భీష్మార్జునులకయ్యం బయ్యిరువాఁగును గొండొకసేపు నివ్వెఱపడి చూచుచుండె నశ్వత్థామభూరిశ్రవశ్శల్యపుత్రచిత్రసేనులు మత్తమాతంగంబులు సింగంబు కొదమం బొదువుపోలిక నభిమన్యుం బొదివిన నతండు. 178**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; తొడంగి= పూని; ఉద్భట+ప్రకారంబునన్= పరాక్రమోపేతంగా; పెల్లు+చెల్లు= మిక్కుటముగా కొనసాగే; భీష్మ+అర్జునుల+కయ్యంబు= భీష్ముని యొక్కయు, అర్జునుని యొక్కయూ పోరాటం; ఆ+ఇరు+వాఁగును= ఆ రెండు పక్షాలూ; కొండొక+సేపు= కొంత తడవు; నివ్వెఱపడి= ఆశ్చర్యపడి; చూచుచుండెన్; అశ్వత్థామ+భూరిశ్రవస్+శల్యపుత్ర+చిత్రసేనులు= అశ్వత్థామ - భూరిశ్రవుడు - శల్యపుత్రుడు - చిత్ర సేనుడును; మత్తమాతంగంబులు= మదపుటేనుగులు; సింగంబుకొదమన్= కొదమసింహాన్ని, లేత వయస్సులో ఉన్న సింహాన్ని; పొదువు+పోలికన్= చుట్టుముట్టే రీతిగా; అభిమన్యున్+పొదివినన్= అభిమన్యుని చుట్టుముట్టగా; అతండు= అభిమన్యుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పరాక్రమోపేతుడైన భీష్ముడు, అర్జునుడు పోరాడుతున్నప్పుడు - ఉభయ పక్షాలలోని వీరులు ఆశ్చర్యం పొంది కొంతసేపు (తాము యుద్ధం చేయటం మాని) వారిని వీక్షించారు. అప్పుడు అశ్వత్థామ , భూరిశ్రవుడు, శల్యపుత్రుడు, చిత్రసేనుడు మదపుటేన్గులు పిల్ల సింగాన్ని చుట్టుముట్టినట్లు అభిమన్యుడిని చుట్టుముట్టారు.

**క. కని యల్లన నవ్వుచు గురు। తనయుని యుర మేసి శల్యతనయుని సిడముం**
**దునిమి వెస నీదుతనయుని। ధనువు నఱకి సోమదత్తతనయుని నొంచెన్. 179**

**ప్రతిపదార్థం:** కని= చూచి; అల్లన+నవ్వుచున్= తిన్నగా నవ్వుతూ; గురు+తనయుని+ఉరము+ఏసి= అశ్వత్థామ వక్షంపై బాణం నాటి; శల్యతనయుని సిడమున్+తునిమి= శల్యుని కొడుకు జెండా త్రుంచి, వెసన్= వేగంగా; నీదు+తనయుని+ధనువు= నీ కుమారుని విల్లు; నఱకి= ఖండించి; సోమదత్త+తనయునిన్= సోమదత్తుని పుత్రుడైన భూరి శ్రవసుని; నొంచెన్= నొవ్వ చేశాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు - తన్ను చుట్టుముట్టిన వారిని చూచి, చిరునవ్వుతో అశ్వత్థామ వక్షంమీద బాణం గ్రుచ్చాడు. శల్యుని కొడుకు జెండా త్రుంచాడు. వేగంగా నీ కొడుకు విల్లు నరికాడు. భూరిశ్రవసుడిని నొప్పించాడు.

**క. వారును ముందటి యార్వురు। నీరసమున నొక్కపెట్ట యేయఁగఁ బటుదో**
**స్సారుండగు సౌభద్రుఁ డు। దార స్ఫురణమున నద్భుతంబుగఁ బోరెన్. 180**

**ప్రతిపదార్థం:** వారును= ఆ వీరులును; ముందటి ఆర్వురు= ముందు అతనిని మార్కొనిన ఆరుగురు; ఈరసమునన్= కోపంతో; ఒక్క+పెట్ట= ఒకేసారి; ఏయఁగన్= బాణాలు వేయగా; పటు+దోస్+సారుండగు= మిక్కిలి భుజపరాక్రమం కలిగిన; సౌభద్రుఁడు= సుభద్రకొడుకు(అభిమన్యుడు); ఉదార+స్ఫురణమునన్= గొప్ప స్ఫూర్తితో; అద్భుతంబుగన్= ఆశ్చర్యకరంగా; పోరెన్= పోరాటం సాగించాడు.

**తాత్పర్యం:** ఆ వీరులు - అంతకుముందు మార్కొనిన ఆరుగురూ కోపంతో ఒక్కపెట్టున అభిమన్యునిపై బాణాలు వేశారు. అప్పుడు మిక్కిలి భుజ పరాక్రమం గలిగిన సుభద్రా తనయుడు గొప్పస్ఫూర్తితో ఆశ్చర్యకరంగా యుద్ధం చేశాడు.

**విశేషం:** ఉదారస్ఫురణన్= ఉదారత కనిపించేటట్లుగా. అటు కౌరవవీరులు పదిమంది వచ్చి తనమీద పడ్డారు. 'కోపంతో' - 'ఈర్ష్యతో'. అభిమన్యుడు 'అల్లన నవ్వుచు' ఆత్మ సంరక్షణకోసం గొప్పగా యుద్ధం చేశాడు. ఉదారతతో. అనగా వారిని ఎవరినీ సంహరించకుండా యుద్ధం చేశాడన్నమాట.

**ఆ. హస్తలాఘవమున నతులబలంబున । శౌర్య మహిమ నధికధైర్యమునను**
**సవ్యసాచితనయు సరి గార యమ్మహా । వీరు లంతవట్టుఁ గౌరవేంద్ర! 181**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= కౌరవులలో శ్రేష్ఠుడవైన ఓ ధృతరాష్ట్రమహారాజా!; హస్తలాఘవమునన్= చేతుల సౌలభ్యంలో; అతుల+బలంబునన్= గొప్ప శక్తిలో; శౌర్య+మహిమన్= పరాక్రమ మహత్త్వంలో; అధిక+ధైర్యమునను= మిక్కుటమగు ఆత్మవిశ్వాసంలో; ఆ+మహా+వీరులు= ఆ మహాశూరులు; అంత+పట్టు= అంతవరకు; సవ్యసాచి+తనయు= కవ్వడి కొడుకు అభిమన్యునితో; సరిగారు+అ= సమానం కారు సుమా!

**తాత్పర్యం:** కౌరవులలో శ్రేష్ఠుడవైన ఓ ధృతరాష్ట్రమహారాజా! చురుకుగా, సులువుగా చేతినుండి అమ్ములు గుప్పటంలో, మిక్కుటమైన ఆత్మవిశ్వాసంలో అంతగొప్ప వీరులునూ కవ్వడి కొడుకు అభిమన్యునితో సరిగారు.

**వ. ఇట్లు పెక్కండ్రతోడం బెనంగుపుత్త్రుం గనుంగొని యర్జునుం డంట నార్చి యడరి యందఱ కన్నిరూపులై నొప్పించి చిక్కువఱిచె నప్పుడు నీ కొడుకు పంపునం ద్రిగర్తులుఁ గృతవర్మయుఁ గేకయులును ముప్పదేనువేల రథంబులవారునుఁ గవిసి కిరీటిం గొడుకునుం బొదివి రట్టియెడ. 182**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; పెక్కండ్రతోడన్= పెక్కుమందితో; పెనంగు= పోరాడే; పుత్తున్= కొడుకును; కనుంగొని=చూచి; అర్జునుండు= అర్జునుడు; అంటన్+ఆర్చి= దద్దరిల్లునట్లుగా సింహనాదంచేసి; అడరి= విజృంభించి; అందఱకు; అన్ని+రూపులు+ఐ= ఒక్కొక్కడుగా కన్పించే ఆకృతి గలవాడై; నొప్పించి ; చిక్కు+పఱచెన్= చీకాకు నొందించాడు; అప్పుడు; నీ+కొడుకు+పంపునన్= నీ పుత్తుని ఆనతిచే(దుర్యోధనుని ఆజ్ఞచే); త్రిగర్తులు; కృతవర్మయున్= యాదవవీరుడు కృతవర్మయు; కేకయులును= కేకయ దేశ ప్రభువులును; ముప్పది+ఏను+వేల+రథంబులవారును= ముప్పది అయిదువేల తేరుల వీరులును కలిసి; మార్కొని= ఎదుర్కొని; పొదివిరి= చుట్టుముట్టారు; అట్టి+ఎడన్= ఆ సమయమందు.

**తాత్పర్యం:** ఈ విధంగా, పెక్కుమందితో యుద్ధం చేసే కొడుకును చూచి, అర్జునుడు సింహనాదం చేసి విజృంభించాడు. కౌరవ వీరులు అందరూ, ఎవరికి వారే తాము అర్జునునితో పోరాడుతున్నట్లుగా భ్రమ కల్పించి అర్జునుడు వారిని అందరినీ చీకాకు పరచాడు. అప్పుడు దుర్యోధనుని పంపున త్రిగర్తులు, కృతవర్మ, కేకయులు ముప్పది అయిదువేల రథికులతోపాటు అర్జునుడిని, అతని కొడుకు అభిమన్యుడిని చుట్టుముట్టారు.

**మ. తఱికిం జొచ్చి కడంగి పోరు విజయున్ దౌదవ్వులం జూచి యే**
**డ్తెఱఁ బాంచాలసుతుండు సత్వరగతిం దే రద్దెసన్ సారథిం**
**బఱపం బంచి నిశాతబాణపటలీపాతంబునన్ వైరు లు**
**క్కఱఁ దాఁకెం దమసైన్యముల్ సెలఁగ శౌర్యస్ఫూర్తి శోభిల్లఁగన్. 183**

**ప్రతిపదార్థం:** తఱికిన్= అదనులో; చొచ్చి= చేరి; కడంగి= పూని; పోరు= యుద్ధం చేసే; విజయున్= అర్జునుని; దౌదవ్వులన్+చూచి= దూరదూరంలో చూచి; ఏడ్తెఱన్= వేగంగా; పాంచాల+సుతుండు= ద్రుపదరాజు కొడుకు(ధృష్టద్యుమ్నుడు); సత్వర+గతిన్= వేగంగా; తేరు+అద్దెసన్= రథం ఆవైపుగా;సారథిన్; పఱపన్+పంచి= నడుపుమని ఆజ్ఞాపించి; నిశాత బాణపటలీ పాతంబునన్= వాడి అమ్ముల

సముదాయం ప్రయోగించటం చేత; వైరులు= శత్రువులు; ఉక్కు+అఱన్= బలం నశించగా; తమ+సైన్యముల్= తమసేనలు; చెలఁగన్= సొంపార; శౌర్య స్ఫూర్తి= పరాక్రమ ప్రకటన; శోభిల్లఁగన్= విలసిల్లగా; తాకెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** అదనులో కౌరవసేనను ఎదిర్చి పూని పోరాడే అర్జునుడిని దూరం నుండి చూచి, పాంచాల రాజు పుత్రుడు ధృష్టద్యుమ్నుడు - వేగంగా రథం అచటికి తరలించమని సారథిని ఆజ్ఞాపించాడు. శత్రువుల బలం చెదరిపోగా తన సేనలు ఉప్పొంగగా ధృష్టద్యుమ్నుడు వాడి అమ్ముల గుంపులు ప్రయోగించాడు. పరాక్రమ ప్రకర్షతో శోభిల్లాడు.

**వ. ఇట్లు ధృష్టద్యుమ్నుండు పురందరనందనునకుం దలకడచి తాఁకి. 184**

**ప్రతిపదార్థం:** ఇట్లు; ధృష్టద్యుమ్నుండు; పురందర+నందనునకున్= దేవేంద్రుని కొడుకైన అర్జునుడిని; తలకడచి= ముందుదాటి (అతిక్రమించి); (కౌరవసేనను మార్కొన్నాడు.)

**క. శరములు మూఁటం గృపుఁ బది । శరముల మద్రేశు నొంచి శరమొక్కట ను**
**ద్ధురగతి యగు కృతవర్మని । యరదముఁ దురగముల నొకట నవనిం గూల్చెన్. 185**

**ప్రతిపదార్థం:** శరములు మూఁటన్= మూడు బాణాలతో; కృపున్= కృపాచార్యుని; పదిశరములన్= పదిబాణాలతో; మద్ర+ఈశున్= మద్రరాజు శల్యుని; నొంచి= నొప్పించి; శరము+ఒక్కటన్= ఒక బాణంతో; ఉద్ధుర+గతి+అగు కృతవర్మని= శీఘ్రగమనం గల కృతవర్మయొక్క; అరదమున్= రథాన్ని; ఒకటన్= మరొకబాణంతో; తురగములన్= గుర్రాలను; ఒకటన్= ఒక బాణంతో; అవనిన్= భూమిపై; కూల్చెన్= పడవేశాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ధృష్టద్యుమ్నుడు అర్జునుడిని దాటి కౌరవ వీరుల్ని మార్కొన్నాడు. మూడు బాణాలతో కృపుడిని, పదిబాణాలతో మద్ర ప్రభువు శల్యుడిని నొప్పించి, ఒక బాణంతో కృతవర్మను అతని రథాన్ని, గుర్రాలను భూమిపై పడవేశాడు.

**వ. అప్పుడు శల్యనందనుండు. 186**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; శల్య+నందనుండు= శల్యుని కొడుకు.

**తాత్పర్యం:** ఆ సమయంలో శల్యుడికొడుకు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పదిటన్ ధృష్టద్యుమ్నునిఁ । బదియమ్ముల నతని సూతుఁ బటురయమున ను**
**న్మదుఁడై నొప్పించినఁ గెం । పొదవిన మో మలఁతి నవ్వు నొప్పన నొప్పెన్. 187**

**ప్రతిపదార్థం:** పదిటన్= పది బాణాలతో; ధృష్టద్యుమ్నునిన్= ధృష్టద్యుమ్నుని; పది+అమ్ములన్= పది బాణాలతో; అతని+సూతున్= అతని రథసారథిని; ఉన్మదుఁడై= మిక్కిలి గర్వించినవాడై; పటు+రయమమునన్= మిక్కుటమగు వేగంతో; నొప్పించినన్; కెంపు+ఒదవిన +మోము= ఎర్రబడిన ముఖం; అలఁతి+నవ్వు= మందహాసము యొక్క; ఒప్పునన్+ఒప్పెన్= శోభతో శోభిల్లింది.

**తాత్పర్యం:** శల్యుడి కొడుకు ధృష్టద్యుమ్నుడిని పదిబాణాలతో, మరో పదిబాణాలతో అతని రథసారథిని - గర్వంతో మిక్కుటమైన వేగంతో నొప్పించాడు. అప్పుడు అతని ముఖం ఎర్రబారింది. అతడి పెదవులపై మందహాసం విరిసింది.

**క. ఆ పృషతపౌత్రుఁ డుద్ధత । కోపానలుఁ డగుచు శల్యుకొడుకుధనువు నా**
**టోపమునఁ దునిమి ఫణిరా । జోపమితాస్త్రంబు లతనియొడలం జొనిపెన్. 188**

**వ. ఇవ్విధంబున 189**

**ప్రతిపదార్థం:** ఆ+పృషత+పౌత్రుఁడు= పృషతుని మనుమడగు ధృష్టద్యుమ్నుడు; ఉద్ధత+కోప+అనలుఁడు+అగుచున్= మిక్కుటమగు ఆగ్రహము అనే అగ్ని గలవాడగుచు; ఆటోపమునన్= దర్పముతో; శల్యు+కొడుకు+ధనువు= శల్యుని కొడుకుయొక్క విల్లు; తునిమి= ఖండించి; ఫణి+రాజ+ఉపమిత+అస్త్రంబులు= శేషునితో సరిపోల్చదగిన బాణాలను; అతని+ఒడలన్= అతని శరీరము నందు; చొనిపెన్= నాటాడు.

**తాత్పర్యం:** పృషతుని మనుమడైన ధృష్టద్యుమ్నుడు మిక్కుటమగు ఆగ్రహమనే అగ్ని గలవాడై దర్పముతో శల్యుని కొడుకు వింటిని విరిచి శేషుడితో సమానమైన అస్త్రాలను అతని శరీరంలోనికి నాటాడు.

**విశేషం:** ఫణిరాజోపమితాస్త్రంబు - సాధారణ బాణమే - వాడి నాలుక గలది. ఫణిరాజు= శేషుడికి వేయి నాల్కలు ఉంటాయని ప్రసిద్ధి.

**క. నోనేసి సూతు హయసం । తానముఁ జంపుటయు శల్యతనయుఁడు విరథుం**
**డై నిరుపమాన మగు తన । మానమ వాహనము గాఁగ మద మెలరారన్. 190**

**ప్రతిపదార్థం:** నోన్+ఏసి= నొచ్చునట్లుగా వేసి; సూతున్= రథసారథిని; హయ+సంతానమున్= గుఱ్ఱాల సముదాయాన్ని; (ధృష్టద్యుమ్నుడు) చంపుటయున్= సంహరించుటయు; శల్య+తనయుఁడు= శల్యుని కొడుకు; విరథుండు+ఐ= రథములేనివాడై; నిరుపమానము+అగు= సాటిలేని; తన+మానము+అ= తన ఆత్మగౌరవమే; వాహనము+కాఁగన్= వాహనముకాగా (తనను మోసి నడపునట్టిదిగా); మదము+ఎలరారన్= గర్వం అతిశయింపగా.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు - శల్యతనయుడిని నొప్పించి, అతని రథసారథినీ - గుఱ్ఱాలనూ సంహరించాడు. శల్యుడి కొడుకు - విరథుడై సాటిలేని తన ఆత్మాభిమానమే తనకు వాహనంగా చేసికొని గర్వంతో నిలబడ్డాడు.

**శల్య నందనుఁడు ధృష్టద్యుమ్నునితో యుద్ధంబు సేసి చచ్చుట (సం.6-57-25)**

**క. పలకయు వాలును గొని ఱె । క్కలు గల పెనుఁబాము పగిదిఁ గవిసినఁ గౌంతే**
**యులు సూచి వెఱగుపడి రా । బలమును నీ బలముఁ బొగడెఁ బటు శౌర్యంబున్. 191**

**ప్రతిపదార్థం:** పలకయున్, వాలును+కొని= డాలును, కత్తినీ పట్టుకొని; ఱెక్కలు కల పెను పాము, పగిదిన్= రెక్కలు ఉన్న పెద్ద సర్పంవలె; కవిసినన్= విజృంభించగా; కౌంతేయులు= పాండవులు; చూచి; వెఱగుపడిరి= ఆశ్చర్యం చెందారు; పటు+శౌర్యంబున్= గొప్ప పరాక్రమాన్ని; ఆ బలము= అటు పాండవుల సేన; నీ బలమున్= నీ సేనయు; పొగడెన్= ప్రశంసించాయి.

**తాత్పర్యం:** శల్యుడి కొడుకు - విరథుడైనప్పటికీ జంకుగొంకులు లేకుండా చేతులలో కత్తిని, డాలును పుచ్చుకొని రెక్కలు మొలిచిన పెద్ద పామువలె విజృంభించాడు. ఆతడి ధైర్యసాహసాలకు ఆశ్చర్యపడి అటు పాండవసేన, ఇటు కౌరవసేన అతడిని ప్రశంసించాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. ఇట్లు గవిసి. 192**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కవిసి= ఎదుర్కొని.

**తాత్పర్యం:** ఈ విధంగా ఎదుర్కొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 1. భారతంలో అభిమన్యుడు అసాధారణంగా శౌర్యం చూపించిన బాలవీరుడు - అర్జునుడి కొడుకు. అటువంటి వాడే శల్యుడి కొడుకు కూడా. ఇతనిపేరు కూడా ప్రకటించలేదు భారత రచయిత. ఇతడు అభిమన్యుడి వలె తండ్రికి పేరు తెచ్చిన తనయుడు.

2. యుద్ధంలో అంత సులువుగా చావరు పెద్దలు! అయితే మహాభారతంలో చిత్తశుద్ధితో చావుకు తెగించి పోరాడినది యువవీరులు. చరిత్రకూడా బాలవీరులే సృష్టించారు. మరో ఉదాహరణ పలనాటి వీరయుద్ధంలో బాలచంద్రుడు.

**క. వెరవున ధృష్టద్యుమ్నుని । శరనికరం బెల్లఁ బలక జడియుచుఁ గిరణ**
**స్ఫురణాతిభీషణం బై । కరవాలము మెఱయఁ జిత్రగతులం గవిసెన్. 193**

**ప్రతిపదార్థం:** వెరవునన్= ఉపాయంతో; ధృష్టద్యుమ్నుని శర నికరంబు+ఎల్లన్= ధృష్టద్యుమ్నుని బాణ సమూహాలను అన్నింటినీ; పలకన్+జడియుచున్= డాలుతో నివారిస్తూ; కిరణ+స్ఫురణ+అతి భీషణంబు+ఐ= సూర్యరశ్మి ప్రకాశంవలె మిక్కిలి భయంకరమైన; కరవాలము= కత్తి; చిత్ర+గతులన్= ఆశ్చర్యకరముగ; మెఱయన్= వెలుగొందగా; కవిసెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** శల్యుడి కొడుకు - ధృష్టద్యుమ్నుడు ప్రయోగించిన బాణాలను అన్నిటినీ తన డాలుతో త్రోసివేస్తూ సూర్య కిరణాల వంటి కాంతులు వెదజల్లే తన కత్తి ప్రకాశిస్తూ ఉండగా విజృంభించాడు.

**తే. కవిసి వ్రేసిన గ్రక్కున గద యమర్చి । యాఁగి వజ్రప్రహారంబు ననుకరింప**
**ద్రుపదనందనుఁ డడిచినఁ దునియలయ్యెఁ । బలక రెండవవాటునఁ బగిలె శిరము. 194**

**ప్రతిపదార్థం:** కవిసి= ఎదుర్కొని; వ్రేసినన్= వేయగా; గద; గ్రక్కునన్= శీఘ్రంగా; అమర్చి; ఆఁగి; వజ్ర ప్రహారంబున్= వజ్రము యొక్క దెబ్బను; అనుకరింపన్= పోలునట్లు; ద్రుపద నందనుఁడు= ద్రుపదరాజు కొడుకు (ధృష్టద్యుమ్నుడు); అడిచినన్= కొట్టగా; పలక= శల్యుడి కొడుకు చేతి డాలు; తునియలు+అయ్యెన్= ముక్కలయింది; రెండవ+వాటునన్= రెండవ దెబ్బతో, శిరము= తలకాయ; పగిలెన్= బ్రద్దలయింది.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు విజృంభించి, గద అమర్చికొని - వజ్ర ప్రహారమును అనుకరిస్తూ కొట్టగా - శల్యనందనుడి డాలు ముక్కలై పోయింది. రెండవ దెబ్బకు- అతని శిరస్సు పగిలిపోయింది.

**విశేషం:** వజ్రము= దేవేంద్రుని ఆయుధం.

**క. తల వ్రయ్య లైనఁ బ్రాణం । బులును గృపాణంబు విడిచి భువిఁ ద్రెళ్ళె నతం**
**డలుకొంది కురుబలం బా । కులతం బొందఁగఁ గొండ గూలినభంగిన్. 195**

**ప్రతిపదార్థం:** కురుబలంబు= కౌరవసేన; అలుకు+ఒంది= భయపడి; ఆకులతన్+పొందంగన్= కలతచెందగా; తల= శిరము; వ్రయ్యలు+ఐనన్= ముక్కలైపోగా; ప్రాణంబులును; కృపాణము= కత్తి; విడిచి= వదలి; అతండు= శల్యుని కొడుకు; కొండ+కూలిన+భంగిన్= పర్వతం విరిగి పడిపోయినట్లుగా; భువిన్+త్రెళ్ళెన్= నేలమీద కూలాడు.

**తాత్పర్యం:** శల్యుడి కొడుకు ప్రాణాలు పోయేవరకు తల ముక్కలై పోయేవరకు చేతిలోని కత్తి వదలకుండా పోరాటం సాగించాడు! అతడు కొండ విరిగి నేలమీద పడిపోయేటట్లుగా కూలిపోవటం చేత - కౌరవసేన కలత చెందింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**తే. ఇత్తెఱంగున నిజపుత్రుఁ డీల్గుటయును । గ్రోధదీప్తుఁ డై శల్యుండు ద్రుపదసూతి**
**మీఁదఁ గవిసిన నాతఁ డమేయ బాణ । పంక్తి వరఁగించె నుజ్జ్వల ప్రభలు నిగుడ. 196**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ రీతిగా; నిజ+పుత్రుఁడు= తన సొంత కొడుకు; ఈల్గుటయును= మరణించటం చేత; క్రోధ+దీప్తుఁడు+ఐ= ఆగ్రహంతో భాసించేవాడయి; శల్యుండు; ద్రుపదసూతిమీఁదన్= ద్రుపదుని కొడుకుమీద; కవిసినన్= విజృంభింపగా; ఆతడు= ఆ ధృష్టద్యుమ్నుడు; ఉజ్జ్వల+ప్రభలు= గొప్ప కాంతులు; నిగుడన్= వ్యాపించగా; అమేయ+బాణ+పంక్తిన్= దట్టమైన అమ్ముల వరుసను; పరఁగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తన పుత్రుడు మరణింపగా, ఆగ్రహావేశ పరవశుడై శల్యుడు - ధృష్టద్యుమ్నుని మీద విజృంభించాడు. ధృష్టద్యుమ్నుడు - దట్టమైనట్టి మిక్కిలి దీప్తి గలిగినటువంటి అమ్ముల గుంపు శల్యునిపై ప్రయోగించాడు.

**వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె: 197**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని చెప్పగా ఆలకించి; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడికి; ఇట్లు+అనియెన్= ఈరీతిగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని చెప్పగా విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఈ విధంగా చెప్పాడు:

**క. ' మానుష మేటికిఁ దైవా । ధీనము సర్వంబు నస్మదీయస్ఫాయ**
**త్సేనలఁ బాండునృపాలక । సూనులు గెల్చెదరు కంటె? సూతతనూజా! 198**

**ప్రతిపదార్థం:** సూత+తనూజా!= ఓ సంజయా!, మానుషము+ఏటికిన్?;= మానవ ప్రయత్నం దేనికి?; సర్వమ్మున్= అంతా; దైవ+అధీనము= భగవంతునికి లోబడి ఉన్నట్టిదే; అస్మదీయ+ స్ఫాయత్+సేనలన్= మిక్కిలి విస్తరించియున్న నా సేనలను; పాండు నృపాలక సూనులు= పాండురాజు కొడుకులు; గెల్చెదరు= జయింపగలరు; కంటె= చూస్తున్నావా?

**తాత్పర్యం:** 'ఓ సంజయా, మనుష్య ప్రయత్నం దేనికి? అంతా దైవాధీనమే. చూస్తున్నావుగా. సంఖ్యాబలంలో ఎక్కువై, మిక్కిలి విస్తరించి ఉన్న నా సేనను పాండవులు జయింపగలరు.

**విశేషం:** విజయసిద్ధికి - మానవ ప్రయత్నం పురుషకారం ముఖ్యమా? దైవబలం ముఖ్యమా? అనే చర్చ మిక్కిలి పురాతనమైనది. ధృతరాష్ట్రుడి అభిప్రాయంలో దైవం మానుషం కంటె బలమైనట్టిది.

**క. చావును నోవును మన యో । ధావలికిన్ గెలుపునుబ్బు నావలికిని నీ**
**చే వినియెదఁ దుది నెట్టులు । శ్రీవిభవము పాండవకులకుఁ జేపడున కదే! 199**

**ప్రతిపదార్థం:** చావును= మరణం; నోవును= నొప్పి; మన+యోధ+ఆవళికిన్= మన వీరుల సముదాయానికి (చెల్లుతుంది). గెలుపు+ఉబ్బు= జయము; అతిశయము, ఆవలికిని= అవతలివారికి; నీచేన్; వినియెదన్= వింటున్నాను గదా; తుదిన్= చివరకు; ఎట్టులున్= తప్పకుండా; శ్రీ+విభవము= శుభము, సంపద; పాండవులకున్= పాండవులకు; చేపడును+అ+కదే!= చేకూరగలదు కదా!

**తాత్పర్యం:** ఇప్పుడే తేలిపోయింది. చావు, బాధ - మన వీరుల సముదాయానికి తప్పదు. చిట్టచివరకు జయము, శుభము, సంపద పాండవులకు చేకూరగలదు కదా!

**వ. దుర్యోధను దుర్ణయంబున నేను దుర్వార్తలు వినుచు దుఃఖంబులనుభవించువాఁడ నైతిఁ గౌంతేయుల గెలుచునుపాయం బెద్దియుం గన్నవారముగా' మనిన సంజయుం 'డది యట్టిద నీసైన్యంబుల సేనాంగంబు లనేకంబులు వొలిసె దొరలు మడిసెదరు దిర మై విను' మని యి ట్లనియె నట్లు శల్యుచేత బహుబాణంబులం బొదువంబడి పార్షతుం డతని నపరిమిత నిశితశరంబులం బొదువ నతం డతనివిల్లు దునిమి వివిధాస్త్రంబుల వెగడు వఱచిన నాధృష్టద్యుమ్నుండు నొచ్చుటయుఁ జూచి సుభద్రాసూనుండు మద్రపతిం దాఁకె నప్పుడు కురుపతి పురికొల్ప దుర్ముఖుండును దుస్సహుండును దుర్మర్షణుండును సత్యవ్రతుండును జిత్రసేనుండును బురుమిత్త్రుండును వివింశతియును వికర్ణుండును నయ్యభిమన్యు మార్కొనుట కలికి పాంచాల నందనుపై నడరి యొక్కొక్కండ పెక్కమ్ము లేసిన నా పృషతపౌత్రుండు చలింపక యొక్కొక్కరినిం బెక్కమ్ము లేసి కరలాఘవంబు నెఱపి యందఱకుం జాలి సమరంబు సేయుచుండె. 200**

**ప్రతిపదార్థం:** దుర్యోధను+దుర్ణయంబునన్= దుర్యోధనునియొక్క దుర్నీతివలన; నేను; దుర్వార్తలు= చెడ్డ సమాచారములు; వినుచు; దుఃఖంబులు; అనుభవించువాఁడను+ఐతిన్= భరింపవలసినట్టి వాడను అయ్యాను; కౌంతేయులన్= కుంతీపుత్రులను (పాండవులను); గెలుచు= జయించే; ఉపాయంబు; ఎద్దియున్= దేనిని; కన్నవారము+కాము= అరసినట్టివారము కాము; అనినన్= అని చెప్పిన; సంజయుండు= సంజయుడు; అది= పాండవులను జయించే వెరవు కన్పించకపోవటం; అట్టిది+అ= అట్టిదే; నీ సైన్యంబుల సేనా+అంగంబులు= నీ సేనలోని శాఖలు; అనేకంబులు= పెక్కులు; పొలిసెన్= నశించాయి; దొరలు= వీరులు(ప్రభువులు); మడిసెదరు= చనిపోగలరు, తిరము+ఐ= దిట్టముగా (మనస్సు స్థిరంగా ఉంచికొని); వినుము; అని; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అట్లు= ఆ రీతిగా; శల్యుచేతన్= శల్యునిచేత; బహు బాణంబులన్= పెక్కు అమ్ములచేత; పొదువంబడి= ఆక్రమించబడి; పార్షతుండు= పృషతుని వంశీయుడు(ధృష్టద్యుమ్నుడు); అతనిన్= శల్యుడిని; అపరిమిత నిశిత శరంబులన్+పొదువన్= అసంఖ్యాకమైన వాడి అమ్ముల నొప్పింపగా; అతండు= శల్యుడు; అతని+విల్లు+తునిమి= ధృష్టద్యుమ్నుని ధనువు ఖండించి; వివిధ+అస్త్రంబులన్= పెక్కు బాణాలతో; వెగడు+ పఱచినన్= తల్లడిల్ల చేయగా; ధృష్టద్యుమ్నుండు; నొచ్చుటయున్= నొప్పి చెందుటయు; చూచి; సుభద్రా సూనుండు= సుభద్ర కొడుకు - అభిమన్యుడు; మద్ర+పతిన్= మద్రరాజును(శల్యుని); తాఁకెన్= మార్కొన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; కురుపతి= కురురాజు(దుర్యోధనుడు); పురికొల్పన్= ప్రోత్సహించటంచేత; దుర్ముఖుండును; దుస్సహుండును; దుర్మర్షణుండును; సత్యవ్రతుండును; చిత్రసేనుండును; పురుమిత్రుండును; వివింశతియును; వికర్ణుండును; ఆ+అభిమన్యున్= ఆ అభిమన్యుని; మార్కొనుటకున్= తాకుటకు; అలికి= భయపడి; పాంచాల నందనుపైన్= పాంచాల రాజు ద్రుపదుని కొడుకైన ధృష్టద్యుమ్నునిపై; అడరి= విజృంభించి; ఒక్కొక్కండు+అ= ఒక్కొక్కడే; పెక్కు+అమ్ములు+ఏసిన్= ఎక్కువ బాణాలు ప్రయోగింపగా; ఆ పృషత+పౌత్రుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; చలింపక= కదలక(సరకుచేయక); ఒక్కొక్కరినిన్= ఒక్కొక్కరినే; పెక్కు+అమ్ములు+ఏసి= ఎన్నో బాణాలు ప్రయోగించి; కరలాఘవంబు నెఱపి= చేతి నైపుణ్యం చూపి; అందఱకున్+చాలి= ప్రతివీరులు అందరకు సరిపోయి; సమరంబు+చేయుచుండెన్= యుద్ధం చేస్తున్నాడు.

**తాత్పర్యం:** 'దుర్యోధనుడి చెడు నిర్ణయం వలన, నేను చెడు వార్తలు వినవలసి వస్తోంది. దుఃఖం అనుభవించవలసి వస్తోంది. పాండవులను జయించే వెరవు ఏదీ కన్పించటంలేదు'. అని ధృతరాష్ట్రుడు పలుకగా సంజయుడు ఈ విధంగా చెప్పాడు - 'నిజమే- నీ సైన్యాంగములు ఎన్నో నశించాయి. దొరలు మరణించారు - గుండె దిటవు చేసుకొని ఆలకింపుము' - అని చెప్పి, మరల ఈ విధంగా అన్నాడు.

'ఆ విధంగా శల్యుడు వేసిన బాణాలచే నొచ్చి, ధృష్టద్యుమ్నుడు అతడిమీద పెక్కు వాడి బాణాలు ప్రయోగించాడు. శల్యుడు ధృష్టద్యుమ్నుడి ధనువు ఖండించాడు. పెక్కు బాణాలు వేశాడు. ఆ సమయంలో

ధృష్టద్యుమ్నుడు డస్సిపోవటం చూచి అభిమన్యుడు వచ్చి శల్యుని మార్కొన్నాడు. ఆ సమయంలో దుర్యోధనుడు ప్రోత్సహింపగా దుర్ముఖుడు - దుస్సహుడు- దుర్మర్షణుడు - సత్యవ్రతుడు - చిత్రసేనుడు - పురుమిత్రుడు - వివింశతి - వికర్ణుడు ఆ అభిమన్యుడిని ఎదిరించటానికి జంకి - ధృష్టద్యుమ్నుడిపై విజృంభించి - పెక్కువాడి బాణాలు ఒకేసారిగా ప్రయోగించారు. పృషతుని మనుమడైన ఆ ధృష్టద్యుమ్నుడు ఏ మాత్రం చలింపక, ఒక్కొక్కరిమీద పెక్కు బాణాలు ప్రయోగించి తన చేతి నైపుణ్యం ప్రదర్శించాడు. ధృష్టద్యుమ్నుడు - అంతమందికీ సరిపోయి సంగ్రామం చేశాడు.

**విశేషం:** 1. 'సేనాంగంబులు అనేకంబులు' - సేన రథ గజ తురగ పదాతులు అనే చతురంగములుగా విభజింపబడినప్పటికీ అవిగాక ఎన్నో అంగాలు ఉన్నట్లుగా తిక్కన గుర్తించాడు. తిక్కన సప్తాంగములను గూర్చి నిర్వచనోత్తరరామాయణంలో ప్రస్తావించాడు. సేనాంగములు కాలక్రమంగా పెరిగాయి. 2. కరలాఘవము - లాఘవము అనే మాటకు లఘుత్వము అని తప్పు అర్థం చెప్పకూడదు.

హస్త లాఘవము - అనుమాట ఇంద్రజాలకుని పరంగా లోక వ్యవహారంలో ఉంది. కరలాఘవంలో అంతర్లీనంగా ఉండే అంశాలు - చురుకుదనం - సులువు. అయితే - కరలాఘవం అద్భుతరస పర్యవసాయి.

**క. నకులుఁడు సహదేవుఁడు మా । మకు నచ్చెరువాటుఁ బ్రియము మదిఁ దలకొన నం**
**బకవృష్టి గురియ నస్త్ర । ప్రకరంబునఁ బొదివె మద్రపతియును వారిన్. 201**

**ప్రతిపదార్థం:** నకులుఁడు+సహదేవుఁడు; మామకున్= మామయైన శల్యునకు; అచ్చెరువాటు= ఆశ్చర్యము; ప్రియము= సంతోషం; మదిన్= మనస్సులో; తలకొనన్= కలుగగా; అంబక+వృష్టి= బాణాల వాన; కురియన్= కురిపించగా; వారిన్= ఆ నకుల సహదేవులను; మద్రపతియును= (మద్రదేశానికి రాజు అయిన) శల్యుడును; అస్త్రప్రకరంబునన్= మంత్ర బాణాల సముదాయంతో; పొదివెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** ఆ సంగ్రామంలో నకులుడు, సహదేవుడు తమ మేనమామైన శల్యుడితో మార్కొనవలసి వచ్చింది. శల్యుడు కౌరవ పక్షంలో యుద్ధం చేస్తున్నాడు. ఆ నకుల సహదేవుల పరాక్రమం చూచి, మేనమామగారైన శల్యుడికి ఆశ్చర్యంతో పాటు ఆనందం కలిగింది. ఆశ్చర్యం ఎందుకంటే, వయస్సులో నకుల సహదేవులు చాలా చిన్నవారు. శల్యుడు బహుముఖ ప్రజ్ఞాధురీణుడు. మహావీరుడు. అంతటివాడిని వయస్సులో చిన్నవారైన నకుల సహదేవులు ఎదుర్కొన్నారు. ఆనందం ఎందుకంటే - తన మేనల్లుళ్ళు అంతటి శౌర్యం ప్రదర్శిస్తున్నారు గదా! అని.

**విశేషం:** మానవజీవితం - విచిత్ర విరోధాభాస సంయుతం. అందులో యుద్ధం - వింత సన్నివేశాలకు ఆలవాలం. పూజనీయుడైన మేనమామపై ప్రేమ చూపించటానికి బదులు మేనల్లుళ్ళు బాణవర్షం కురిపించవలసి వచ్చింది!

**వ. వారికి బాసట యై పాంచాల మత్స్యపతులు సైన్యోపేతంబుగాఁ దఱిమిన మనయందుఁ గలదండిమగలు శల్యునకు సాహాయ్యంబు సేసి రంత దినమణి యంబరమధ్యం బలంకరించె నట్టియెడ. 202**

**ప్రతిపదార్థం:** వారికిన్= ఆ నకుల సహదేవులకు; బాసట+ఐ= తోడై; పాంచాల మత్స్య పతులు= పాంచాలరాజైన ద్రుపదుడు, మత్స్యరాజైన విరాటుడు; సైన్య+ఉపేతంబుగాన్= సేనలతోపాటుగా; తఱిమినన్= విజృంభించిన; మనయందున్+కల= మన పక్షంలో ఉన్నట్టి; దండి+మగలు= గొప్ప వీరులు; శల్యునకున్= నకుల సహదేవుల మేనమామ, మద్ర దేశరాజు అగు శల్యుడికి;

సాహాయ్యంబు+చేసిరి= తోడుపడ్డారు; అంతన్; దిన మణి= సూర్యుడు; అంబర+మధ్యంబు+ అలంకరించెన్= ఆకాశ మధ్యంలో ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ఆ నకుల సహదేవులకు సాయంగా ద్రుపదుడు విరాటుడు వచ్చి చేరారు. వారు విజృంభించి కౌరవ సేనలను తరిమి తరిమి కొట్టగా, కౌరవసేనలోని వీరులు పలువురు శల్యుడికి తోడుపడి యుద్ధం చేశారు. అప్పుడు మధ్యాహ్నం అయింది. సూర్యుడు ఆకాశమధ్యంలో ప్రకాశింపసాగాడు.

**విశేషం:** మహాభారత సంగ్రామం పద్దెనిమిది రోజులు జరిగింది. ప్రతి రోజు సూర్యోదయం పోరాటం ఆరంభమై, సూర్యాస్తమయ సమయంలో ముగిసేది. ఉదయంనుండి మధ్యాహ్నం వరకు - మరల మధ్యాహ్నం నుండి సాయంకాలం వరకు యుద్ధం సాగేది. మహాభారతంలోని యుద్ధవర్ణనలో - మధ్యాహ్నసమయ సూచన కనిపిస్తోంది.

అయితే - మధ్యాహ్న సమయంలో ఆగకుండానే యుద్ధం జరిగేది. మధ్యాహ్నవిరామం గూర్చిగాని, భోజన ప్రస్తావనగాని కన్పించటం లేదు. అనగా నిర్విరామంగా నిరాహారంగా యుద్ధం జరిగినట్లు భావించాలి.

**తే. భీమసేనుండు నేఁడు సంగ్రామమునకుఁ । దీఱుదల యగుఁ గా కని తీవ్రకోప**
**దీప్తుఁడై గద సూచుచుఁ దేరు నీదు । తనయునకు సమ్ముఖంబుగఁ దఱుముటయును. 203**

**ప్రతిపదార్థం:** భీమసేనుండు; నేడు; సంగ్రామమునకున్= యుద్ధానికి; తీఱుదల+అగున్+గాక+అని= అంతము అగుగాక అని పలికి; తీవ్ర కోప దీప్తుఁడు ఐ= మిక్కుటమగు ఆగ్రహముతో వెలుగొందువాడగుచు; గద+చూచుచున్= గదను పరికిస్తూ; తేరు= రథం; నీదు+తనయునకున్= ఓ ధృతరాష్ట్రా - నీ కొడుకైన దుర్యోధనునకు; సమ్ముఖంబుగన్= ఎదురుగా( దగ్గరగా); తఱుముటయును= త్వరితపరచటంతో.

**తాత్పర్యం:** భీమసేనుడు విజృంభించాడు. గద పట్టుకున్నాడు. తన రథాన్ని దుర్యోధనుని దగ్గరకు - ఎదురుగా తోలించాడు. 'నేడు ఈ యుద్ధం సమాప్తి కావాలి' అన్నాడు. మిక్కుటమగు రోషంతో కౌరవులను మార్కొన్నాడు.

**క. నీ కొడుకు లందఱును వెఱ । నాకులతం బొంది రప్పు డగ్రజుఁడు గదా**
**నీకఘను మగధు వీరో । ద్రేకంబునఁ బనిచె మారుతిం దలపడఁ గన్. 204**

**ప్రతిపదార్థం:** నీ కొడుకులు+అందఱును; వెఱన్= భయముతో; ఆకులతన్+పొందిరి= కలత చెందారు, అప్పుడు; అగ్రజుడు= నీ పెద్ద కొడుకు (దుర్యోధనుడు); గదా+అనీక+ఘనున్= వివిధములగు గదా యుద్ధాలలో ఆరితేరినవాడైన; మగధున్= మగధరాజును; మారుతిన్+తలపడఁగన్= భీముని మార్కొనుటకై; వీర+ ఉద్రేకంబునన్= శౌర్యము విజృంభించునట్లుగా; పనిచెన్= నియమించాడు.

**తాత్పర్యం:** భీముని విజృంభణ చూచి నీ కుమారులందరు ఆకులత చెందారు. నీ పెద్ద కొడుకు దుర్యోధనుడు వివిధ గదా యుద్ధాలలో ఆరితేరిన మగధుని భీముడిని మార్కొనుటకై నియమించాడు.

**వ. పనుచుటయు నతం డురవడించిన. 205**

**ప్రతిపదార్థం:** పనుచుటయున్= ఆజ్ఞాపించగా; అతండు= ఆ మగధుడు; ఉరవడించినన్= విజృంభించగా.

**తాత్పర్యం:** మగధుడు-తన్ను దుర్యోధనుడు కోరి ఎన్నుకొని పంపటంచేత, ఉత్సాహం ఉరకలు వేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. గజఘటలం గనుంగొని వికాసము మోమునఁ బల్లవింపఁగా**
**భుజశిఖరంబునందు గద పూన్చి మదంబునఁ దేరు డిగ్గి వా**
**యుజుఁడు గడంగి భీషణసముద్ధతిమైఁ దలపడ్డఁ బర్వత**
**వ్రజముపయిన్ వెసం గవియు వాసవుచందము దోఁచె నత్తఱిన్. 206**

**ప్రతిపదార్థం:** గజ+ఘటలన్+కనుంగొని= ఏనుగుల గుంపులను చూచి; వికాసము= సంతోషం; మోమునన్= ముఖమునందు; పల్లవింపఁగా= చిగురించగా; భుజ శిఖరంబునందున్= మూపు కొసయందు; గద+పూన్చి= గదను అమర్చి; మదంబునన్= గర్వంతో; తేరు= రథం; డిగ్గి= దిగి; వాయుజుఁడు= భీముడు(వాయుదేవుని పుత్రుడు); కడంగి= పూనుకొని; భీషణ+సం+ఉద్ధతిమైన్= భయంకరమైన విజృంభణతో; తలపడ్డన్= మార్కొనగా; పర్వత వ్రజము= కొండల సముదాయము; పయిన్= పైన; వెసన్=వేగంగా; కవియు= మార్కొను; వాసవు+చందము= దేవేంద్రుని పోలిక; ఆ+తఱిన్= ఆ సమయంలో; తోఁచెన్= కన్పించింది.

**తాత్పర్యం:** ఏనుగుల గుంపులపై భీముడు విజృంభించాడు. అతడు తన గదను మూపుపై అమర్చి, గర్వంగా రథం దిగి భయంకరంగా కౌరవసేనలోని ఏనుగులను మార్కొనినపుడు, అతడు కొండలపై మార్కొన్న దేవేంద్రుడి వలె కన్పించాడు.

**విశేషం:** అలం: ఉపమ. పూర్వకాలంలో కొండలకు రెక్కలుండి - ఆకాశ మార్గంలో విహరించి, క్రిందికి దిగి నేలమీది జనపదాలను ధ్వంసం చేసేవట. అప్పుడు దేవేంద్రుడు వజ్రాయుధంతో కొండల రెక్కలు తునిమేవాడని పురాణకథనం. ఇప్పుడు - కొండలవంటి ఏనుగులను భీముడు ధ్వంసం చేయసాగాడు.

**క. నిజసింహనాదమున న । గ్గజములు గుండియలు వగిలి కలగుండువడన్**
**విజయాగ్రజుఁ డి ట్లేచి ది । విజవర్గము పిచ్చలింప విస్ఫురితగతిన్. 207**

**ప్రతిపదార్థం:** నిజ+సింహనాదమునన్= తాను చేసిన సింహనాదం చేత; ఆ గజములు= ఆ ఏనుగులు; గుండియలు+పగిలి= గుండెలు వ్రక్కలై; కలగుండు+ పడన్= కలత చెందగా; విజయ+అగ్రజుఁడు= అర్జునుని అన్న(భీముడు); ఇట్లు= ఈ విధంగా; విస్ఫురిత గతిన్= ప్రకాశమానమైన రీతిలో; ఏచి= విజృంభించి; దివిజ వర్గము= వేల్పులగుంపు; పిచ్చలింపన్= ప్రశంసించగా.

**తాత్పర్యం:** తన సింహనాదం వలన, కౌరవసేనలోని ఏనుగులు గుండెలు పగిలి కలత చెందగా. దేవతలు ప్రశంసించగా ప్రకాశమానమైన రీతిలో ఈ విధంగా విజృంభించి (మీది వచనంతో అన్వయం)

**విశేషం:** 1. ఏనుగులకు సింహం అంటే భయం. సింహస్వప్నం - అంటే కలలో సింహం కన్పించినా సరే ఏనుగులు భయపడతాయట. ఇక సింహగర్జన పట్టపగలే వినిపిస్తే? 2. సింహనాదం : సింహము చేసే గర్జన అని వాచ్యార్థం. కానీ మహాభారతంలో 'సింహనాదం' అంటే సంగ్రామసమయంలో ఉత్సాహంతో వీరులు పెట్టే పెద్ద కేక. అది సింహగర్జనవలె ఉంటుంది. పరాక్రమంలో ఆయుధ విద్యాపాటవానికి ఉన్న ప్రాముఖ్యం - సింహనాదానికి కూడా ఉంది.

**వ. విక్రమవిహారంబునకుం జొచ్చె నప్పుడు ద్రౌపదేయులు నభిమన్యుండును గవలును ధృష్టద్యుమ్నుండును గరిసముత్కరంబుపై శరనికరంబులు నిగిడించుచు భీముని నిరుగెలంకులం జేరి కవిసి రందు నకుల నందనుండగు శతానీకుండు హస్తికులమస్తకంబులు భల్లంబుల డొల్ల నేయుచు నడరె నట్టియెడ. 208**

**ప్రతిపదార్థం:** విక్రమ విహారంబునకున్+చొచ్చెన్= శౌర్యము ప్రకటించుచు సంతోషముతో విహరింపసాగాడు; అప్పుడు; ద్రౌపదేయులు= ద్రౌపది కొడుకులూ; అభిమన్యుండును= అభిమన్యుడూ (సుభద్రకొడుకు); కవలును= నకుల సహదేవులూ; ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడూ; కరి+సమ్+ఉత్కరంబుపైన్= ఏనుగుల పెనుగుంపులపై; శర+నికరంబులు= అమ్ముల

సముదాయాలు; నిగిడించుచున్= వ్యాపింపచేయుచు; భీమునిన్+ఇరు+కెలంకులన్+చేరి= భీముడికి ఇరువైపులకు చేరి; కవిసిరి= మార్కొన్నారు; అందున్= వారిలో; నకుల+నందనుండు+అగు= నకులుని కొడుకు అయిన; శతానీకుండు అనెడువాడు; హస్తి, కుల, మస్తకంబులన్= ఏనుగుల సమూహాల తలలు; భల్లంబులన్= ఈటెబాణాలతో; డొల్లన్+ఏయుచున్= కూలునట్లు ప్రయోగిస్తూ; అడరెన్= విజృంభించాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** భీముడు యుద్ధరంగంలో విహరింపసాగాడు. అతనికి ఇరు ప్రక్కల - నకుల సహదేవులు, అభిమన్యుడు, ధృష్టద్యుమ్నుడు, ద్రౌపది కొడుకులు చేరి ఏనుగుల గుంపులపై బాణాలు ప్రయోగించారు. నకులుడి కొడుకు శతానీకుడు ఏనుగుల తలకాయలు నేలపై పడేటట్లు ఈటె బాణాలు ప్రయోగించాడు.

**చ. మగధమహీశుఁ డేచి యభిమన్యునిపైఁ గరిఁ గొల్ప నుజ్జ్వలం**
**బగు నొక నారసంబు దొడి యాతఁ డుదగ్రత ఫాలకుంభ సం**
**ధిగతము గాఁగ నేయ నది దీనత మ్రొగ్గఁగ నప్పడక్కజం**
**బుగ వెస మాగధుం దునిమె భూస్థలి నయ్యిరు పీనుఁగుం బడన్. 209**

**ప్రతిపదార్థం:** మగధ+మహీశుఁడు= మగధరాజు; ఏచి= విజృంభించి; అభిమన్యునిపైన్= అభిమన్యుని మీద; కరిన్= ఏనుగును; కొల్పన్= పురికొల్పగా; ఉజ్జ్వలంబు+అగు= తీవ్రమైన; ఒక+నారసంబు+తొడి= ఒక బాణాన్ని ప్రయోగించి; ఆతఁడు= అభిమన్యుడు; ఉదగ్రతన్= ఉత్సాహంతో; ఫాల కుంభ సంధిగతము+కాఁగన్= ఆ యేనుగుయొక్క తల, కుంభస్థలం కలిసేచోట ఉండేదిగా; ఏయన్= బాణాలు ప్రయోగింపగా; అది= ఆ ఏనుగు; దీనతన్= బాధతో; మ్రొగ్గఁగన్= నేలకూలగా; అప్పుడు; అక్కజంబుగన్= ఆశ్చర్యకరముగా; వెసన్= వేగంగా; మాగధున్= మగధరాజును; ఆ+ఇరు+పీనుఁగున్= ఆ రెండు పీనుగులు (మాగధుడి పీనుగు - ఏనుగు పీనుగు); భూస్థలిన్= భూతలముమీద; పడన్= కూలగా; తునిమెన్= సంహరించెను.

**తాత్పర్యం:** మగధరాజు విజృంభించి - తన ఏనుగును పురికొల్పి అభిమన్యుడిని మార్కొన్నాడు. అభిమన్యుడు ఒక భయంకరమైన బాణంతో ఆ ఏనుగు కుంభస్థలాన్ని ఛేదించాడు. ఆ ఏనుగు కలగి నేలకూలింది. అప్పుడు ఆశ్చర్యకరంగా అభిమన్యుడు ఒక వాడి బాణంతో మగధరాజును సంహరించాడు. అప్పుడు - ఏనుగు పీనుగు, మగధరాజు పీనుగు నేలమీదకు కూలాయి.

**క. ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల । దష్టాపదపుంఖ మార్గణావళి నయ్యు**
**త్కృష్టగజఘటలఁ గలఁచె న । వష్టంభ విజృంభణంబు వైరులు వొగడన్. 210**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నుఁడున్= ధృష్టద్యుమ్నుడును; ఉజ్జ్వలత్ అష్టాపద పుంఖ మార్గణ+ఆవళిన్= ప్రకాశించే; బంగారు కొనలుగల బాణముల యొక్క సమూహముతో; ఆ+ఉత్కృష్టగజ ఘటలన్= ఆ గొప్ప ఏనుగుల గుంపులను; అవష్టంభ+విజృంభణంబు= గర్వాతిశయం; వైరులు+పొగడన్= శత్రువులు ప్రశంసించేటట్లుగా; కలఁచెన్= నొప్పించాడు, చీకాకు పరచాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ప్రకాశించే బంగారు ములుకులు గల బాణముల సమూహముతో శ్రేష్ఠములయిన ఆ ఏనుగుల గుంపును చీకాకుపరచాడు. అతడి దర్పముతో కూడిన విజృంభణను శత్రువులు ప్రశంసించారు.

**విశేషం:**. ధృష్టద్యుమ్నుడు ప్రయోగించినట్టివి మామూలు బాణాలు కావు. అవి అష్టాపదపుంఖములు కలవి. అష్టాపద= బంగారు, ఏనుగుల స్థూలకాయాలు చీల్చేందుకు ప్రత్యేకంగా ఉపకరించేవి 'అష్టాపద పుంఖ' బాణాలు. అనగా ఎనిమిది మొనలు గల బాణాలు.

**ఉ. కొన్నిటి హస్తముల్ సదియఁ గొన్నిటిఁ గొమ్ములు దుమ్ము ధూళిగాఁ**
**గొన్నిటిఁ గుంభముల్ వగులఁ గొన్నిటిఁ గాళులు నుగ్గునూచగాఁ**
**గొన్నిటిఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటి వీఁపులు పిండుపీఁచుగా**
**నన్నిటి భీముఁ డుద్భటగదాహతి నేనికవేఁట లాడఁగన్. 211**

**ప్రతిపదార్థం:** కొన్నిటిన్= కొన్ని ఏనుగులను; హస్తముల్= తుండములు; చదియన్= నలుగగా; కొన్నిటిన్=కొన్ని ఏనుగులను; కొమ్ములు= దంతాలు; దుమ్ము+ ధూళిగాన్= రేణువులు, అణువులుకాగా; కొన్నిటిన్= కొన్నింటిని; కుంభముల్= ఫాలభాగాలు; పగులన్; కొన్నిటిన్= కొన్నింటిని; కాళులు= కాళ్ళు; నుగ్గు నూచగాన్= ముక్కలు చెక్కలుకాగా; కొన్నిటిన్= కొన్నింటిని; పార్శ్వముల్= కడుపు ప్రక్క భాగాలు, నలియన్= పగిలిపోగా; కొన్నిటిన్= కొన్నింటిని, వీఁపులు; పిండు+పీఁచుగాన్= సన్నని దారపు పింజెలుగా; అన్నిటిన్= అన్ని ఏనుగులను; భీముఁడు= భీముడు; ఉద్భట+గదా+ఆహతిన్= భయంకరములైన గద యొక్క వ్రేటులచేత; ఏనిక+వేఁటలు= ఏనుగుల సంహరించటం అనే వినోద విహారం; ఆడఁగన్= చేయగా.

**తాత్పర్యం:** భీముడు - భయంకరమైన గదాదండం చేతపూని, ఏనుగులను వేటాడాడు - కొన్నిఏనుగుల తుండాలు నరికివేశాడు. కొన్నిటి దంతాలు పొడి పొడి చేశాడు. కొన్ని ఏనుగుల కుంభస్థలాలు పగులకొట్టాడు. కొన్ని ఏనుగుల కాళ్ళు విరుగ గొట్టాడు. కొన్నిటి వీపులు పింజలుపింజలుగా చేశాడు. కొన్నిటి కడుపు ప్రక్క భాగాలు ముక్కలు చేశాడు.

**విశేషం:** యుద్ధంలో ఏనుగులను సంహరించటంలో భీముడు సిద్ధహస్తుడుగా ప్రఖ్యాతిని ఆర్జించాడు.

**క. అభిమన్యుద్రుపదసుత । ప్రభృతు లతనితోన మెలఁగి బడలువడఁగ న**
**య్యిభచయము నిశితవిశిఖ । క్షుభితముగాఁ జేసి రేపు సొంపారంగన్. 212**

**ప్రతిపదార్థం:** అభిమన్యు ద్రుపద సుత ప్రభృతులు= అభిమన్యుడు, ద్రుపదుడి కొడుకులు మున్నగువారలు; అతనితోన+ మెలఁగి, = భీముడితో సహకరించి; బడలువడఁగన్= శ్రమపడగా; ఆ+ఇభ+చయమున్= ఆ ఏనుగుల గుంపును; నిశిత, విశిఖ, క్షుభితము గాన్= వాడి అయిన బాణములు సోకుట చేత కలత చెందినట్టివిగా; ఏపు+సొంపారన్= తమ విజృంభణ అందము చిందులాడు నట్లుగా; చేసిరి= చేశారు.

**తాత్పర్యం:** భీముడు గదపుచ్చుకొని విజృంభించి ఏనుగులను వేటాడుతుండగా, అభిమన్యుడు, ద్రుపదునికొడుకులు అతనితో సహకరించి చెలరేగి ఆ యేనుగుల గుంపును వాడియైన బాణాలచేత మిక్కిలి కలత నొందించారు.

**విశేషం:** భీముడు - సాహసంతో పాదచారియై గద చేత పుచ్చుకొని ఏనుగుల గుంపులలోనికి చొరబడ్డాడు. అభిమన్యుడు - ద్రుపదపుత్రులు దూరమున రథాలపై నిలిచి - బాణాలు ప్రయోగించి ఏనుగుల గుంపును సంక్షోభింప జేశాడు.

**క. ద్విరదము లొఱగెడివియు నె । త్తురు గ్రక్కుచుఁ గూలెడివి గదుపు లై కలయం**
**దిరుగుడువడియెడివియు భువిఁ । బొర లెడివియు నయ్యెఁ బవనపుత్త్రు మునుమునన్. 213**

**ప్రతిపదార్థం:** ద్విరదములు= ఏనుగులు (రెండు దంతములు గలవి); ఒఱగెడివియున్= ప్రక్కకు వాలి పడిపోవునట్టివియును; నెత్తురు= రక్తము; క్రక్కుచున్+కూలెడివి= నోటి నుండి వెలువడ చేయుచు చచ్చిపోవునట్టివియు; కదుపులు+ఐ= గుంపులు గుంపులుగా ఏర్పడి; కలయన్+తిరుగుడు+పడియెడివియున్= కలిసిపోవుచు, విడిపోవుచు, మరలిపోయెడివియు అగుచు; భువిన్= భూమిమీద; పొరలెడివియున్= పొరలాడునట్టివియునై; పవన పుత్త్రు+మునుమునన్= భీముని మునుములో; అయ్యెన్= అయ్యాయి.

**తాత్పర్యం:** భీముడి మునుములో ఏనుగులు కొన్ని ఒరగెడివి, కొన్ని నెత్తురు గ్రక్కుతూ కూలెడివీ, కొన్ని గుంపులై త్రొక్కిసలాటలో తిరుగుడుపడేవి. కొన్నినేలపై పొరలాడేవి అయినాయి.

**క. ఏనుఁగు నెత్తుట గదయుం । దానుఁ దడిసి విలయ కాలదండధరుని చం**
**దానం బావని మాగధ । సేనం బీనుంగుపెంటఁ జేసి చెలంగెన్. 214**

**ప్రతిపదార్థం:** పావని= వాయుపుత్రుడు(భీముడు); ఏనుఁగు+నెత్తుటన్= ఏనుగుల రక్తంలో; తాను= తానును; గదయున్= గదయును; తడిసి= తడిసిపోయి; విలయ కాల దండధరుని చందానన్= ప్రళయ సమయమునందలి యముని వలె; మాగధ సేనన్= మగధ దేశానికి చెందిన సైన్యాన్ని; పీనుఁగు+పెంటన్+చేసి= మృతకళేబరాల కుప్పగా చేసి; చెలంగెన్= విలసిల్లాడు.

**తాత్పర్యం:** భీముడు ఏనుగుల నెత్తుటిలో తానూ, తన గదాదండం తడిసి, ప్రళయకాలమందలి యముడివలె- మగధసేనను చీల్చి చెండాడుతూ ప్రకాశించాడు.

**విశేషం:** 'ప్రళయం' - కల్పాంత కాలంలో సంభవిస్తుందనీ అప్పుడు సృష్టి సమస్తం - సర్వనాశనం అయిపోతుందనీ ప్రాచీన భారతీయ పురాణ కథనం. అప్పుడు ప్రకృతిలోని సర్వశక్తులు - విజృంభించి సర్వనాశనం చేయగలవు సృష్టి అంతటినీ. దానికి ' ప్రళయము-ప్ర+లయము= విశేషమైన లయము (నాశనము) అని వ్యపదేశము. 'వి+లయము' ప్రళయమునకు పర్యాయపదం. యముడు సంహారకారుడు. ఇక 'ప్రళయకాలంలో' యముడి మాట వేరే చెప్పాలా?

**క. శరములవేగంబున గద । పరుసదనంబునను గలఁగఁబడి చేడ్పడ నా**
**కరులం దోలెను భీముఁడు । వెరవున గోపకుఁడు గదుపు వెలిచిన మాడ్కిన్. 215**

**ప్రతిపదార్థం:** శరముల వేగంబునన్= వడిగా వేయబడిన అమ్ములచేతను; గద+పరుసదనంబునను= గదయొక్క కఠినత్వమువలనను; కలఁగన్+పడి= కలత చెంది; చేడ్పడన్= దెబ్బతినగా; భీముఁడు; కరులన్= ఏనుగులను; గోపకుఁడు= ఆవుల కాపరి; కదుపు+వెలిచిన+మాడ్కిన్= గోవుల గుంపును మరలించిన విధముగా; వెరవునన్= ఉపాయముతో; తోలెను= తరిమికొట్టాడు.

**తాత్పర్యం:** అటు అభిమన్యుడు, ద్రుపదరాజు కొడుకులు వేగంగా ప్రయోగించిన బాణాలవల్లను, తన గదా ప్రహరణాల వల్లను కలత చెందిన ఏనుగులను భీముడు గోపాలుడు ఆవులమందను అదలించినట్లుగా ఉపాయంతో మరలించి తరిమికొట్టాడు.

**క. పెనుగాలిఁ దూలు మొగిళులొ । యన నిభములు విఱిగి నిజబలావలి సదియం**
**దనమీఁదఁ బాఱ దుర్యో । ధనుఁ డదలిచి సర్వసైన్యతతిఁ బురికొల్పెన్. 216**

**ప్రతిపదార్థం:** ఇభములు= ఏనుగులు; పెనుగాలిన్= పెద్ద వాయువుచే; తూలు= చెదరిపోవు; మొగిళులు+ఒ= మబ్బులో అనునట్లుగా; విఱిగి= దెబ్బతిని; నిజ+బల+ఆవలి= తనయొక్క సైన్య సమూహము; చదియన్= గలిగిపోగా; తనమీఁదన్+పాఱన్= తన మీదికి పరుగెత్తుకొని రాగా; దుర్యోధనుఁడు; అదలిచి= అదలించి; సర్వ సైన్య తతిన్= తన సేనా సమూహము నంతటినీ; పురికొల్పెన్= క్రమ్ముకొనజేశాడు.

**తాత్పర్యం:** పెద్ద గాలి దుమారం వలన చెల్లాచెదరైన మబ్బులవలె, ఏనుగులు దెబ్బతిని, తన సైన్యం వైపునకు పారిపోగా, దుర్యోధనుడు, ఆ ఏనుగులను అదలించి తన సైన్యాల గుంపు లన్నింటిని ప్రోత్సహించాడు. (క్రమ్ముకొనునట్లు చేశాడు)

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

క. పతి పురికొలిపిన నమవస । నతిశయముగఁ బొంగు జలధి యనఁ గ్రమ్మిన యు
ద్ధతబలము నిలిపె నమ్మా । రుతి సెలియలికట్టక్రియ నిరూఢస్థితి యై. 217

**ప్రతిపదార్థం:** పతి= రాజు(దుర్యోధనుడు); పురికొలిపినన్= ప్రోత్సహింపగా; అమవసన్= అమావాస్యనాడు; అతిశయముగన్= ఎక్కువగా; పొంగు= పొంగే; జలధి+అనన్= సముద్రమో అనునట్లుగ; క్రమ్మిన= ఆవరించిన; ఉద్ధత+బలమున్= అతిశయించిన సేనను; ఆ+మారుతి= వాయుపుత్రుడైన ఆ భీముడు; చెలియలికట్ట క్రియన్= చెలియలికట్టవలె; నిరూఢ+స్థితి+ఐ= స్థిరమైన నిలుకడ కలవాడై; నిలిపెన్= అడ్డగించాడు-వారించాడు.

**తాత్పర్యం:** రాజు అయిన దుర్యోధనుడు ప్రోత్సహించగా, అమావాస్యనాడు ఉప్పొంగే సముద్రమో అనునట్లుగా విజృంభించిన కౌరవసేనలను అరికట్టి చెలియలికట్టగా భీముడు నిలిచాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. 1. చెలియలికట్ట: సముద్రము ఆటు పోటులతో కెరటాలతో ఎల్లపుడు చెలువొందు చున్నప్పటికి - ఒక 'మేర' మీరదు. ఆ రేఖకు చెలియలికట్ట అని పేరు. 2. అమావాస్యనాడు, పౌర్ణమినాడు సముద్రం ఉప్పొంగటం అందరకూ తెలిసినట్టిదే.

వ. ఇట్లు నిలిపి యార్చి తఱియం జొచ్చువృకోదరునకుం దోడయి ధృష్టద్యుమ్న సౌభద్ర ప్రముఖులగు రథికజనంబులు. 218

**ప్రతిపదార్థం:** ఇట్లు; నిలిపి; ఆర్చి= పెద్దకేకవేసి (సింహనాదం చేసి); తఱియన్+చొచ్చు= తరిమికొట్టే; వృకోదరునకున్= భీముడికి; ధృష్టద్యుమ్న, సౌభద్ర ప్రముఖులు+అగు= ధృష్టద్యుమ్నుడు; అభిమన్యుడు మొదలైన; రథికజనంబులు= రథాన్నెక్కి యుద్ధం చేసే వీరులు; తోడు+అయి= సాయంగా నిలిచి.

**తాత్పర్యం:** ఈ విధంగా సింహనాదం చేస్తూ, కౌరవసేనలను ఎదిర్చిన భీముడికి ధృష్టద్యుమ్నుడు, అభిమన్యుడు మొదలైన రథికులు సహాయంగా నిలిచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

క. విడువక దాపట వలపటఁ । గడిమి మెఱయ నిలిచి యపుడు కౌరవ సేనం
గడుఁ జిక్కు వఱిచి రొక్కు । మ్మడి నమ్ములవానఁ గురిసి మదమెలరారన్. 219

**ప్రతిపదార్థం:** విడువక= వదలిపెట్టక; దాపటన్= ఎడమ ప్రక్కను; వలపటన్= కుడి ప్రక్కను; కడిమి+మెఱయన్= పరాక్రమం ప్రకాశింపగా; నిలిచి= నిలబడి; అపుడు; కౌరవ+సేనన్= కౌరవ సైన్యాన్ని; ఒక్కుమ్మడిన్= ఏకంగా; అమ్ములవానన్= బాణముల వర్షంతో; మదము+ఎలరారన్= గర్వము విలసిల్లునట్లుగా; కడున్+చిక్కు+పఱిచిరి= ఎక్కువగా చీకాకు చేశారు.

**తాత్పర్యం:** కుడివైపున ఒకరు - ఎడమ ప్రక్క ఇంకొకరు నిలబడి, పరాక్రమం చూపించి, కౌరవసేనపై బాణాలు కురిపించి చీకాకు పరచారు. (వీరు ఎవరు?) అటు ధృష్టద్యుమ్నుడు - ఇటు అభిమన్యుడు అని సమాధానం చెప్పుకోవాలి - వెనుకటి గద్యనుబట్టి.

క. అడవి దరికొనిన పావకు । వడువున భీముండు గౌరవవ్యూహంబుం
బొడిసేయుచుఁ బేర్చెం దన । యొడలు మనము నంతకంత కుబ్బుచునుండన్. 220

**ప్రతిపదార్థం:** భీముండు; అడవిన్+దరికొనిన= అడవిని చుట్టుముట్టిన; పావకు+వడువునన్= అగ్నివలె; కౌరవ+వ్యూహంబున్= కౌరవులు పన్నిన సేనను; పొడి+చేయుచున్= పిండిచేయుచు, అణువులుగా కొట్టి అణగార చేయుచు; తన+ఒడలు= తన శరీరము; మనము= మనస్సు; అంతకున్+అంతకున్= మాటిమాటికి; ఉబ్బుచున్+ఉండన్= అతిశయించుచుండగా; పేర్చెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** అడవిని చుట్టుముట్టి దహించే అగ్నిహోత్రుడివలె, భీముడు కౌరవసేనను నాశనం చేశాడు. అతడి శరీరం, మనస్సు అంతకంతకు ఉత్సాహం పుంజుకొన్నాయి.

**క. ఉరమునఁ గటిమైఁ దొడలం । జరణములం గౌరవేంద్రు చతురంగంబుల్**
**ధరఁ జాఁపకట్టు వడ ని । ష్ఠురగతిఁ దాఁకుచు సమీరసుతుఁడు చరించెన్. 221**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్రు, చతురంగంబుల్= దుర్యోధనుడి చతురంగ బలాలు; ధరన్= భూమియందు; చాఁపకట్టు+పడన్= చాపవలె పరుచుకొన్నట్లు పడిపోగా; సమీర సుతుఁడు= వాయునందనుడు - భీముడు; ఉరమునన్= వక్షముతో; కటిమైన్= మొలతో; తొడలన్= తొడలతో; చరణములన్= పాదములతో; నిష్ఠురగతిన్= పరుషమైన విధంగా; తాఁకుచున్= కొట్టుతూ; చరించెన్= విహరించాడు.

**తాత్పర్యం:** కురురాజు బలాలు నేలపై చాపకట్టుగా సాగిలపడేటట్లు భీముడు రొమ్ముతో, మొలతో, తొడలతో, పాదాలతో పరుషంగా తాకుతూ విహరించాడు.

**తే. తుంగ మడుపున నాడు మాతంగవిభుని । భంగి భవదీయసైన్యంబు బడలువడఁగ**
**లీల నిస్సంభ్రముం డయి కేలి సలిపె । గాలిచూ లప్డు గగనచరాలి వొగడ. 222**

**ప్రతిపదార్థం:** తుంగ+మడువునన్= తుంగ మొక్కలు దట్టముగా మొలిచియున్న చెరువులో; ఆడు= వినోదవిహారం చేసే; మాతంగ+విభుని+భంగిన్= ఏనుగులరాజువలె; భవదీయ+ సైన్యంబు= నీ సేన; బడలు+పడఁగన్= డస్సిపోవునట్లుగా; లీలన్= సులువుగా ఆటవలె; నిస్+సంభ్రముండు అయి= తొట్రుపాటు లేనివాడయి; గాలిచూలు= వాయునందనుడు, భీముడు; గగన+చర+ఆలి= ఆకాశ సంచారులగు దేవతల సమూహం; పొగడన్= ప్రశంసింపగా; అప్డు= ఆ సమయాన; కేలి+సలిపెన్= ఆట ఆడాడు.

**తాత్పర్యం:** తుంగతో నిండిన చెరువులో విహరించే మదపుటేనుగు వలె భీముడు తొట్రుపాటు ఏమాత్రం లేకుండగా - నీ సేనను చీకాకు పరచాడు. భీముని శౌర్యధైర్యసాహసాలు చూచి, చారణులు ప్రశంసించారు.

**విశేషం:** 1.తుంగ= పెద్ద గడ్డికాడలు గల మొక్క. దానిని పడగొట్టేందుకు కుక్కపిల్ల చాలు. ఇక మదపుటేనుగు మాట చెప్పనక్కరలేదు. 2. గగనచరులు= చారణులు. ఆకాశంలో ఒక తెగకు చెందిన దేవతలు సంచరిస్తారని, వారు గొప్ప సహృదయులు అని - గొప్పతనం ఎక్కడ కన్పించినా వారు గుర్తించి దేశదేశాలలో సంచరించి పొగడగలరని - ప్రాచీన భారతీయ సంప్రదాయం.

**క. వెఱచఱచి వెగడువడి ని । వ్వెఱఁగందుచుఁ గురుబలంబువీరు లతని డ**
**గ్గఱ కంతనంతఁ జూడఁగ । నుఱక నదీసుతుఁడు దాఁకె నుద్భటభంగిన్. 223**

**ప్రతిపదార్థం:** వెఱచఱచి= భయపడి; వెగడు+పడి= ఆశ్చర్యమునంది; నివ్వెఱఁగు+అందుచున్= భ్రాన్పడి(మిక్కిలి అచ్చెరువుతో స్తంభించి పోయి); కురు+బలంబువీరులు= కౌరవసైన్యంలోని శూరులు; అతని+డగ్గఱక= భీముడిని సమీపించలేక; అంతన్+అంతన్+చూడఁగన్= దూర దూరమునుండియే చూచుచుండగా; నదీసుతుఁడు= గంగాపుత్రుడు= భీష్ముడు; ఉఱక= లక్ష్యపెట్టక; ఉద్భటభంగిన్= భయంకర రీతితో(అతడిని); తాఁకెన్= ఎదిరించాడు.

**తాత్పర్యం:** భీమసేనుడి విజృంభణం చూచి కురుసేనలోని వీరులు ఆశ్చర్యచకితులై నివ్వెరపాటుతో అతడిని సమీపించక దూరమునుండియే చూస్తుండగా అప్పుడు సేనాధిపతి అయిన భీష్ముడు వచ్చి, ఉద్రేకంతో భీముడిని లక్ష్యపెట్టక మార్కొన్నాడు.

**క. అరదంబురవము సెలఁగఁగ । శరములు వాయుజునిమీఁద సాంద్రముగ వెసం**
**గురియుచు నడరెడు భీష్ముని । సరభసముగ మాఱుకొనియె సాత్యకి గడిమిన్. 224**

**ప్రతిపదార్థం:** అరదంబు+రవము= రథము యొక్క ధ్వని; చెలఁగఁగన్= మ్రోయగా; వాయుజుని మీఁదన్= భీముడిపై; శరములు= బాణాలు; సాంద్రముగన్= దట్టముగా; వెసన్=వేగముగా; కురియుచున్= ప్రయోగించుచూ; అడరెడు= విజృంభించెడు; భీష్మునిన్ సరభసముగన్= వేగముగా; సాత్యకి; కడిమిన్= పరాక్రమంతో; మాఱుకొనియెన్= తాకాడు.

**తాత్పర్యం:** భీష్ముడు తన రథధ్వని మ్రోయుచుండగా భీముడిపై దట్టంగా వేగంగా బాణాలు కురిపిస్తూ విజృంభించే భీష్ముడిని పాండవసేనలోని వీరులలో ప్రముఖుడైన సాత్యకి - వేగంగా పరాక్రమంతో ఎదిరించాడు.

**వ. ఇట్లెదిర్చినం జూచి. 225**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఎదిర్చినన్= మార్కొనగా; చూచి= వీక్షించి.

**తాత్పర్యం:** ఈ విధంగా సాత్యకి భీస్ముడిని ఎదుర్కొనటం గమనించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అంబరము వగుల నార్చి జ । నంబు వొగడఁ గృష్ణుననుజునకు మార్కొని తీ**
**వ్రాంబకములు పదియింట న । లంబుసుఁడు దదంగకం బులం గీలించెన్. 226**

**ప్రతిపదార్థం:** అంబరము+పగులన్+ఆర్చి= ఆకాశం చిల్లులు పడేటట్లుగా కేకవేసి; జనంబు+పొగడన్= అందరూ ప్రశంసించుతూ ఉండగా; అలంబుసుడు= కౌరవ పక్షంలోని ఒక రాక్షస వీరుడు; కృష్ణ+అనుజునకున్= శ్రీకృష్ణుని తమ్ముడు అయిన సాత్యకికి; మార్కొని= ఎదురొడ్డి; తీవ్ర+అంబకములు= వాడియైన అమ్ములు; పదియింటన్= పది సంఖ్యగలవాటితో; తద్+అంగకంబులన్= ఆతనియొక్క(సాత్యకియొక్క) శరీరమునందలి అవయవాలలో; కీలించెన్= గ్రుచ్చుకొనునట్లు చేశాడు;

**తాత్పర్యం:** కౌరవ సేనలోని రాక్షసవీరుడు అలంబుసుడు ఆకాశము పగులునట్లు గొప్ప కేకవైచి, అందరూ ప్రశంసించుతుండగా, కృపుని తమ్ముడైన సాత్యకిని ఎదిరించి పది బాణాలు ఆతని అవయవములందు గ్రుచ్చాడు.

**వ. ఇవ్విధంబునఁ దాఁకి బెట్టు నొప్పించినం గోపించి. 227**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబున్= ఈ రీతిగా; తాఁకి= మార్కొని; బెట్టు= ఎక్కువగా; నొప్పించినన్= బాధింపగా; కోపించి= ఆగ్రహించి.

**తాత్పర్యం:** ఈ విధంగా అలంబుసుడు మార్కొని మిక్కిలి నొప్పించగా సాత్యకికి కోపం వచ్చి (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. శినిమనుమండు నద్దనుజు శీఘ్రుమ నాలుగు నారసంబులన్**
**వెనుక కొదుంగఁజేసి పటువిక్రమ మొప్పఁగ నార్చె నార్చినన్**
**విని కనుఁగ్రేవఁ గెంపడర వీరరసోద్ధతిఁ జూచి సోమద**
**త్తునితనయుండు బి ట్టతనితోఁ దలపడ్డ నుతించె సైన్యముల్. 228**

**ప్రతిపదార్థం:** శిని+మనుమండు= శిని అనేయాదవవీరుని మనుమడైన సాత్యకి; ఆ+దనుజున్=ఆ రాక్షసుని; శీఘ్రము+అ= వేగంగా; నాలుగు+నారసంబులన్= నాలుగు బాణాలతో; వెనుకకున్+ఒదుంగన్+చేసి= వెనుకకు తిరుగునట్లు చేసి; పటు, విక్రమము ఒప్పఁగన్= గొప్ప పరాక్రమం విలసిల్లేటట్లుగా; ఆర్చెన్= సింహనాదం చేశాడు; ఆర్చినన్= అట్లా సింహనాదం చేయగా; విని;

కను+క్రేవన్+కెంపు+అడరన్= నేత్రాంచలములు ఎర్రపడగా; వీర రస+ఉద్ధతిన్+చూచి; పరాక్రమోద్రేకముతో వీక్షించి; సోమదత్తుని+తనయుండు= సోమదత్తుడు అను కౌరవవీరుని కొడుకు - భూరిశ్రవుడు; బిట్టు= ఎక్కువగా; అతనితోన్= ఆ సాత్యకితో; తలపడ్డన్= మార్కొనగా; సైన్యముల్= సేనలు; నుతించెన్= ప్రశంసించాయి.

**తాత్పర్యం:** సాత్యకి నాలుగు బాణాలు ప్రయోగించి, రాక్షస వీరుడైన అలంబుసుని వెనుకకు మరలేటట్లు చేశాడు. చేసి - విజయగర్వంతో సింహనాదం చేశాడు. ఆ సింహనాదం విని, కురువీరులలో ప్రముఖుడు, సుప్రసిద్ధ రథికుడు అయిన సోమదత్తుడి కొడుకు - భూరిశ్రవుడు - కడకన్ను ఎర్రబడగా పరాక్రమోద్రేకంతో చూచి సాత్యకిని మార్కొనగా సేనలు అతడిని స్తుతించాయి.

**వ. ఇత్తెఱంగునం దలపడి. 229**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; తలపడి= మార్కొని

**తాత్పర్యం:** ఈ విధంగా సాత్యకి - భూరిశ్రవుడు ఒకరినొకరు మార్కొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. భూరిశ్రవుండు దొమ్మిది । నారాచము లతనిమేన నాటించిన నా**
**కౌరవ్యునిఁ బటు విశిఖా । సారంబున ముంచి నొంచె శైనేయుండున్. 230**

**ప్రతిపదార్థం:** భూరిశ్రవుండు= భూరిశ్రవుడు; తొమ్మిది+నారాచములు= తొమ్మిదిబాణాలు; అతని+మేనన్= సాత్యకి యొక్క శరీరమందు; నాటించినన్= గ్రుచ్చుకొనేటట్లు చేయగా; శైనేయుండున్= శినివంశానికి చెందిన సాత్యకియు; ఆ కౌరవ్యునిన్= కౌరవ పక్షానికి చెందిన ఆ భూరిశ్రవుడిని; పటు+విశిఖ+ఆసారంబునన్= పెక్కు బాణాల వర్షంలో; ముంచి= మునుగునట్లు చేసి; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా సాత్యకి, భూరిశ్రవుడు ఒకరినొకరు మార్కొని యుద్ధం చేశారు. భూరిశ్రవుడు తొమ్మిది బాణాలు ప్రయోగించి సాత్యకి శరీరంపై గ్రుచ్చుకొనేటట్లు చేశాడు. సాత్యకి బాణవర్షంలో భూరిశ్రవుని ముంచి నొప్పించాడు.

**విశేషం:** కురుక్షేత్రం - కురుపాండవుల మధ్య జరిగిన యుద్ధానికి నిలయమేగాక ఇరుపక్షాలలోని వీరులూ - తమ తమ పూర్వ వైరాలను తీర్చుకునేందుకు అవకాశంగా పరిణమించింది. (తదుపరి పలుసారులు సాత్యకి భూరిశ్రవుల మధ్య ద్వంద్వ యుద్ధాలు - చూపరులకు కనులపండువైనవి జరిగాయి. చివరకు - భూరిశ్రవుడు సాత్యకిని ఓడించి - క్రిందపడ చేసి అతడిపైకెక్కి కత్తి గ్రుచ్చే సమయంలో - అర్జునుడు - శ్రీకృష్ణ ప్రేరితుడై భూరిశ్రవుని చేతిని ఖండించాడు. అది ద్వంద్వయుద్ధనీతికి విరుద్ధం. సాత్యకి - క్రిందపడినవాడు లేచి, నిరాయుధుడైన భూరిశ్రవుని సంహరించాడు.

**ఉ. ఈసునఁ దానుఁ దమ్ములు నరేంద్రుఁడు గ్రందుగ సౌమదత్తికిన్**
**బాసట యై కడంగ నట పాండవులున్ హరితమ్ముఁ గూడి పె**
**ల్లేసిరి వారిపై నధిప! యేడ్తెఱమీఱ బకారి యప్డు సం**
**త్రాసన భాసురుం డగుచుఁ దాఁకి తెరల్చె భవత్కుమారులన్. 231**

**ప్రతిపదార్థం:** ఈసునన్= కోపంతో; నరేంద్రుఁడు= దుర్యోధనుడును, తానున్+తమ్ములున్= తాను, తమ్ములును; క్రందుగన్= దట్టముగా; సౌమదత్తికిన్= సోమదత్తుని కొడుకునకు(భూరిశ్రవునకు); బాసటయై= సాయమై; కడంగన్= పూనగా; అట= ఆవైపున; పాండవులున్; హరితమ్మున్= కృష్ణుని సోదరుని(సాత్యకిని); కూడి= కలిసి; వారిపైన్= ఆ కౌరవులపై; పెల్లు+ఏసిరి= మిక్కుటముగా

బాణాలు ప్రయోగించారు; అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అప్డు= ఆ సమయంలో; బక+అరి= బకునకు విరోధి (భీముడు); ఏడ్తెఱ+మీఱన్= పరాక్రమం అతిశయింపగా; సంత్రాసన+భాసురుండు+అగుచున్= భయోత్పాతం కలిగిస్తూ ప్రకాశించునట్టివాడై; భవత్+కుమారులన్= నీ కొడుకులను; తాఁకి= మార్కొని; తెరల్చెన్= మరలించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయంలో దుర్యోధనుడు, తమ్ములు కోపంతో యుద్ధంలో చేరి భూరిశ్రవుడికి తోడుగా నిలిచారు. అటు పాండవపక్షంలో పాండవులు - సాత్యకికి సాయంగా నిలిచి, కౌరవులపై మిక్కుటంగా బాణాలు ప్రయోగించారు. భీముడు భయంకర స్వరూపం ధరించి, నీ కుమారులను అందరినీ వెనుకకు పారద్రోలాడు.

**విశేషం:** భీముడు అని చెప్పటానికి - 'బకారి' అని ఉల్లేఖించటం వలన - అలనాడు ఏకచక్రపురంలో ఒంటరిగా వెళ్ళి బకుడు అనే రాక్షసుని సంహరించిన వృత్తాంతం - భీముని ఏకాంత పరాక్రమం ప్రస్ఫుటమైనది.

### దుర్యోధనుఁడు భీముని మార్కొని మూర్ఛఁ బొందించుట (సం. 6-60-7)

**ఉ.** **తమ్ములు వీఁగినం బతి యుదగ్రత భీము నెదిర్చి యార్చుచుం**
**దొమ్మిది యమ్ములం దనువు దూఁటులు సేసిన సూతుఁ బిల్చి వే**
**గమ్మ రథమ్ముపై కరిగి కన్నుల నిప్పలు రాల నవ్వి యొ**
**క్కుమ్మడి నాతఁ డేసె నృపు నుగ్రగతిం బది నారసంబులన్.** **232**

**ప్రతిపదార్థం:** తమ్ములు= సోదరులు; వీఁగినన్= యుద్ధమునుండి పారిపోగా; పతి= రాజు(దుర్యోధనుడు); ఉదగ్రతన్= భయంకరముగా; భీమున్= భీముని; ఎదిర్చి= మార్కొని; ఆర్చుచున్= సింహనాదం చేస్తూ; తొమ్మిది+అమ్ములన్= తొమ్మిది బాణాలతో; తనువు= శరీరం; తూఁటులు+చేసినన్= గ్రుచ్చుకొని గాయాలు ఏర్పడేటట్లు చేయగా; సూతున్+పిల్చి= సారథిని పిలిచి; వేగమ్ము+అ= మిక్కిలి తొందరగా; రథమ్ము పైకిన్+అరిగి= తేరునెక్కి; కన్నుల+నిప్పులు+రాలన్= నేత్రాల నుండి విస్ఫులింగాలు రాలునట్లుగా; నవ్వి; ఒక్కుమ్మడిన్= ఏకంగా(ఒకేసారి); ఆతఁడు= భీముడు, నృపున్= రాజును(దుర్యోధనుని); పది నారసమ్ములన్= పది బాణాలతో; ఉగ్రగతిన్= భయంకరంగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** తన తమ్ముడు యుద్ధంలో ఓడిపోయి పారిపోగా, దుర్యోధనుడు మాత్రం ధైర్యంగా నిలబడి భీముడిని ఎదిరించి, ఆతడిపై తొమ్మిది బాణాలు ప్రయోగించి ఆతడి శరీరం చిల్లులు పడేటట్లు చేశాడు. అంతట భీముడు కన్నుల నుండి నిప్పులు రాలగా నవ్వి, సూతుని పిలిచి వేగంగా రథాన్ని ఎక్కి, పదిబాణాలు ప్రయోగించి దుర్యోధనుడిని కొట్టాడు.

**విశేషం:** ఇంతవరకు - భీముడు నేలమీద దిగి - గద పుచ్చుకొని వీరవిహారం చేశాడు. దుర్యోధనుడి తమ్ములు పారిపోయారు. అయితే దుర్యోధనుడు రథియై తనమీద తొమ్మిది అమ్ములు తన శరీరం తూట్లు పడేటట్లు కొట్టగా, ఇక భీముడు గూడ రథం ఎక్కి విల్లు ధరించవలసివచ్చింది.

**సీ.** **అంతఁబోవక సూతుఁడగు నందకుని మూఁడుశరముల నేసిన ధరణినాథుఁ**
**డరువది యమ్ముల నతని నాతనిరథచోదకుం డైనవిశోకు మూఁట**
**నఱిముఱి నో నేసి మఱియు నొక్కమ్మున ఘనశరాసనముఁ ద్రుంచినఁ బ్రదీప్త**
**కోపుఁ డై యొండొక చాపంబు గైకొని యుగ్రభల్లమున వృకోదరుండు**

**ఆ. విల్లు దునుముటయును వేఱొక్క వింట వ। జ్రంబుఁ బోని నారసంబు దొడిగి**
**రాజరాజు వెస నురం బాడ నేసిన। మూర్ఛవచ్చి యతఁడు మ్రొగ్గె నధిప! 233**

**ప్రతిపదార్థం:** అంతన్+పోవక= అంతటితో ఆగక; సూతుఁడు+అగు= సారథి అయిన; నందకుని= నందకుడు అను పేరు గల వాడిని; మూఁడు శరములన్= మూడు బాణాలతో; ఏసినన్= కొట్టిన; ధరణినాథుఁడు= రాజు(దుర్యోధనుడు); అరువది+అమ్ములన్= అరవై బాణాలతో; ఆతనిన్= భీముని; ఆతని+రథ+చోదకుండు+అయిన విశోకున్= భీముడి రథాన్ని తోలే విశోకుడిని; మూఁటన్= మూడు బాణాలతో; ఆటిముటిన్= సంభ్రమంతో; నోన్+ఏసి= నాటునట్లుగా ప్రయోగించి; మఱియున్; ఒక్క+అమ్మునన్= ఒక బాణంతో; ఘన+శరాసనమున్= పెద్దవిల్లు; త్రుంచినన్= ఖండించగా; వృకోదరుండు= భీముడు; ప్రదీప్త+కోపుఁడు+ఐ= హెచ్చయిన ఆగ్రహము కలవాడై; ఒండు+ఒక= మరియొక; చాపంబు= విల్లు; కైకొని= పుచ్చుకొని; ఉగ్ర+భల్లమునన్= భయంకరమైన ఈటె బాణంతో; విల్లు; తునుముటయును= ఖండించుటయు; వేఱు+ఒక్క+వింటన్= మరియొక ధనుస్సుతో; వజ్రంబున్+పోని= వజ్రంతో సమానమయిన; నారసంబు= బాణము; తొడిగి= సంధించి; రాజరాజు= దుర్యోధనుడు; వెసన్= వేగంగా; ఉరంబు= వక్షము; ఆడన్+ఏసినన్= నాటేటట్లు ప్రయోగించగా; అతఁడు= భీముడు; అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; మూర్ఛవచ్చి= స్పృహ కోల్పోయి; మ్రొగ్గెన్= వాలిపోయాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీముడు అంతటితో ఊరుకొనక, దుర్యోధనుడి సారథియైన నందకుని మూడు బాణాలతో కొట్టాడు. దుర్యోధనుడు భీముడి రథసారథియైన విశోకుడిని మూడు బాణాలతో కొట్టి, భీముడిపై అరవై అమ్ములు ప్రయోగించాడు. అంతేకాక ఒక బాణం ప్రయోగించి భీముడి విల్లు ఖండించాడు. భీముడు ఆగ్రహించినవాడై వేరొక విల్లు ధరించి, ఒక ఈటె బాణంతో దుర్యోధనుడి విల్లు త్రుంచాడు. రాజరాజైన దుర్యోధనుడు - ఇంకో విల్లు పూని, వజ్రంతో సమానమైన ఒక బాణంతో భీముడి వక్షాన్ని కొట్టాడు. ఆ అమ్ము తాకిడికి - భీముడు స్పృహ తప్పి పడిపోయాడు.

**క. కని కడు నలిగి సుభద్రా। తనయుఁడుఁ బాంచాలరాజతనయుఁడు గృష్ణా**
**తనయులు నొక్కుమ్మడి నీ। తనయునిఁ బొదివిరి పటుప్రదరపుంజములన్. 234**

**ప్రతిపదార్థం:** సుభద్రా+తనయుఁడున్= సుభద్ర కొడుకగు అభిమన్యుడూ; పాంచాలరాజతనయుఁడున్= ద్రుపదపుత్రుడు ధృష్టద్యుమ్నుడు; కృష్ణాతనయులున్= ద్రౌపది కొడుకులు; కని= చూచి(భీముడు మూర్ఛిల్లుట చూచి); ఒక్కుమ్మడిన్= అందరును ఏకమై; నీ+తనయునిన్= నీ కొడుకును(దుర్యోధనుని); పటు ప్రదర పుంజములన్= పెక్కు అమ్ముల సముదాయాలతో; పొదివిరి= చుట్టు ముట్టినారు.

**తాత్పర్యం:** అభిమన్యుడు, ధృష్టద్యుమ్నుడు, ద్రౌపదీపుత్రులు మూర్ఛపోవటం చూచి, అందరూ ఏకమై నీ కొడుకైన దుర్యోధనుడిపై పెక్కుబాణాలు ప్రయోగించి చుట్టుముట్టారు.

**ఉ. అంతకు సేద దేఱి విలయాంతకు నాకృతి భీముఁడేచి దు**
**ర్దాంతపరాక్రమస్ఫురణఁ దాఁకి నరేంద్రతనూజు శల్యు న**
**త్యంతరయంబునం బటుశరావలి నొంచిన నీదుసైనికుల్**
**సెంతలఁ జేర రైరి బలు సింగముఁ గన్న గజంబులట్ల యై 235**

**ప్రతిపదార్థం:** అంతకున్= కొంతసేపటికి; సేద+తేఱి= స్పృహ వచ్చి; భీముఁడు; విలయ+అంతకు+ఆకృతిన్= ప్రళయ కాలమునందలి యముని రూపంతో; ఏచి= విజృంభించి; దుర్దాంత+పరాక్రమ+స్ఫురణన్= ఎదుర్కొనుటకు వీలులేని శౌర్య

ప్రకటనతో; నరేంద్ర తనూజున్= రాజకుమారుడైన; శల్యున్= శల్యుడిని (మద్రరాజును); అతి+అంత+రయంబునన్= మిక్కిలి వేగంతో; పటు+శర+ఆవలిన్= మిక్కుటమగు అమ్ముల సముదాయంతో; నొంచినన్= నొప్పించగా; నీదు+సైనికుల్= నీ భటులు; బలు+సింగమున్= బలముగల సింహాన్ని; కన్న= చూచిన; గజంబులు+అట్ల+ఐ= ఏనుగుల వలె అయి; చెంతలన్+చేరరు+ఐరి= చేరువకు చేరలేకపోయారు.

**తాత్పర్యం:** కొంతసేపటికి భీముడు మూర్ఛనుండి తేరుకొన్నాడు. తేరుకొని, ప్రళయకాలమందలి యముడివలె విజృంభించి, మిక్కిలి వేగంగా, పరాక్రమం ప్రకటించి శల్యుడిని మార్కొని ఆతడిపై బాణవర్షం కురిపించాడు. నీ సైనికులు భీముడి ధాటికి జంకి, సింహాన్ని చూచిన ఏనుగుల వలె అతడి సమీపానికి వెళ్ళటానికి జంకారు.

**విశేషం:** అలం: ఉపమ. ప్రాచీన భారతీయ సారస్వతంలో సింహం ఏనుగును సంహరించగల శక్తి గలదని వర్ణింపబడింది. ఈ వర్ణన ఒక కవి సమయంగా పరిణమించింది. అయితే వాస్తవజగత్తులో సింహానికి - ఏనుగును చంపే శక్తి లేదని తేలిపోయింది.

**వ. అప్పు డపరాహ్ణం బయ్యెఁ దత్సమయంబున భవత్సూనులు సేనాపతి సుషేణ జలసంధ సులోచనులు భీమ భీమరథ భీమబాహు దుష్ప్రధర్ష దుర్ముఖులును వివిత్సు వికటోగ్రాలోలు పసములు నీ పదునలువురు బహుశరంబు లడరించుచు నతనిం బొదివిన నజ్జరాసంధమర్దనుండు ఘనశార్దూలంబు బాలమృగంబులం గని కవియు చందంబున నెదుర్కొని సేనాపతి శిరంబు భల్లంబునం ద్రుంచి బాణ త్రయంబున జలసంధు నంతకాలయంబున కనిచి సుషేణువక్షస్స్థలంబున వలుఁదనారసంబు నాటించి పడవైచి భీమబాహు నస్త్రపంచకంబునం జంపి యుగ్రునుత్తమాంగంబు వెడఁదవాతియమ్మునం గుండలమ్ములతోఁ గూల్చి భీమ భీమరథుల నొక్కుమ్మడిం బెక్కమ్ములం గూల నేసి నగుచు మిక్కుటమ్మగు నాలుగమ్ముల సులోచనుం గీ టడంగించిన. 236**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయమున; అపర+అహ్ణంబు+ అయ్యెన్= సాయంకాలం అయింది, తద్+సమయంబునన్= ఆ సమయంలో; భవత్+సూనులు= నీ కొడుకులు; సేనాపతి సుషేణ జలసంధ సులోచనులు= భీమ, భీమరథ, భీమబాహు, దుష్ప్రదర్ష దుర్ముఖులును; ఈ+పదునలువురు= ఈ పధ్నాలుగు మంది; బహు+శరంబులు= పెక్కుబాణాలు; అడరించుచున్= ప్రయోగించుతూ; అతనిన్+పొదివినన్= అతడిని (భీముడిని) కవియగా; ఆ+జరాసంధ+మర్దనుండు= ఆ జరాసంధుని సంహరించినవాడు, భీముడు; ఘన+శార్దూలంబు= గొప్ప పెద్ద పులి; బాల మృగంబులన్+కని= చిన్న లేడిపిల్లలను చూచి; కవియు+చందంబునన్= మీద పడునట్లుగా; ఎదుర్కొని; సేనాపతి+శిరంబు= సేనాపతియను పేరుగల వాని తల; భల్లంబునన్= ఈటె బాణంతో; త్రుంచి= ఖండించి; బాణత్రయంబునన్= మూడు బాణాలతో; జలసంధున్= జలసంధుడు అను పేరు గలవానిని; అంతక+ఆలయంబునకున్= యముని గృహానికి; అనిచి= పంపి; సుషేణు+వక్షస్+స్థలంబునన్= సుషేణుని యొక్క ఉరమున; వలుఁద+నారసంబు= పొడుగు పాటి బాణం; నాటించి= గ్రుచ్చుకొనునట్లు చేసి; పడవైచి= కూల్చి; భీమబాహున్= భీమబాహుడు అను పేరు గలవాని; అస్త్రపంచకంబునన్= అయిదు బాణాలతో; చంపి; ఉగ్రు+ఉత్తమ+అంగంబు= ఉగ్రుడు అనువాని తల; వెడఁద+వాతి+అమ్మునన్= విశాలమగు నోరుగల బాణంతో; కుండలమ్ములతోన్= కుండలాలతోపాటు; కూల్చి= సంహరించి; భీమ, భీమరథులన్= భీముడు, భీమరథుడు అను పేరుగల వారిని; ఒక్కుమ్మడిన్= ఏకంగా; పెక్కు+అమ్ములన్= పలుబాణాలతో; కూలన్+ఏసి= చంపి; నగుచున్= నవ్వుచు; మిక్కుటమ్ము+అగు+అ= గొప్పవి అయిన; నాలుగు+అమ్ములన్= నాలుగు బాణాలతో; సులోచనున్= సులోచనుడు అనువానిని; గీటు+అడంగించినన్= సంహరించగా.

**తాత్పర్యం:** అప్పుడు అపరాహ్ణ సమయం అయింది. ఆ సమయంలో నీ కొడుకులుపదునాలుగు మంది 1. సేనాపతి, 2. సుషేణుడు, 3. జలసంధుడు, 4. సులోచనుడు, 5. భీముడు, 6. భీమరథుడు, 7. భీమబాహుడు, 8. దుష్ప్రధర్షుడు,

9. దుర్ముఖుడు, 10. వివిత్సుడు, 11. వికటుడు, 12 . ఉగ్రుడు, 13. ఆలోలుపుడు, 14. సముడు అనే వారలు పెక్కుబాణాలు భీమునిపై ప్రయోగిస్తూ అతడిని చుట్టుముట్టారు. అంతట జలసంధుడిని సంహరించిన భీముడు, చిన్న లేడిపిల్లల గుంపుపై బడిన పెద్దపులి వలె వారిని అందరినీ ఎదుర్కొన్నాడు. సేనాపతి తల ఒక ఈటె బాణంతో ఖండించాడు. జలసంధుడిని మూడుబాణాలు ప్రయోగించి సంహరించాడు. పొడుగు బాణంతో సుషేణుడి ఉరము చీల్చాడు. అయిదు బాణాలతో భీమబాహుడిని చంపాడు. కుండలాలతో మెరిసిపోయే ఉగ్రుడి శిరస్సును విశాలమగు నోరుగల ఒక బాణంతో కూల్చాడు. పలు బాణాలు ప్రయోగించి భీముడిని, భీమరథుడిని, చంపాడు. అట్లే, గొప్ప బాణాలతో సులోచనుడిని వధించాడు.

**క. పెఱవార లధికభీతిన్ । విఱిగి చనిరి భీష్ముఁ డేచి వీరరథికు లం**
**దఱఁజూచి రాచకొడుకుల । నఱుమాడెడు భీముఁ డిట్లు నడుఁకం దగునే?' 237**

**ప్రతిపదార్థం:** పెఱవారలు= ఇతరులు; అధికభీతిన్= మిక్కుటమగు భయముతో; విఱిగి+చనిరి= ఓడిపోయి పారిపోయారు; భీష్ముఁడు+ఏచి= భీష్ముడు విజృంభించి; వీర+రథికులు+అందఱన్+చూచి= శూరులైన రథికులలో శ్రేష్ఠులను అందరను చూచి; భీముఁడు+ఇట్లు= భీముడు ఈ విధంగా; రాచకొడుకులన్= రాజపుత్రులను; నఱుమాడెడున్= నశింపచేస్తున్నాడు; నడుఁకన్+తగును+ఏ?= మీరు కంపించదగునా?

**తాత్పర్యం:** భీముడు దుర్యోధనుడి తమ్ములైన రాజపుత్రులను ఆ విధంగా సంహరించటంచేత - ఇతరులు భయపడి పారిపోయారు. సేనాపతియైన భీష్ముడు ముందరకు వచ్చి 'భీముడు రాజపుత్రులను సంహరిస్తూ ఉండగా, రథికులు భయపడి పారిపోవటం న్యాయమా?'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని పురికొల్పికొని తొడరునట్టియెడ. 238**

**ప్రతిపదార్థం:** అని= పలికి; పురికొల్పికొని= ఉత్సాహం కల్పించి; తొడరు+అట్టి+ఎడన్= మార్కొనే సమయంలో.

**తాత్పర్యం:** అని సేనలోని వీరులకు ఉత్సాహవాక్యాలు పలికి, సైన్యాన్ని కూడగట్టుకొని ఎదిరించే సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మిగిలి పవమానసుతుపై । భగదత్తుఁడు మత్తగజముఁ బఱపి యతని నా**
**శుగములఁ బొదవిన నమ్మెయి । మొగిళులు రవిఁ బొదువు దర్పముం దలఁపించెన్. 239**

**ప్రతిపదార్థం:** మిగిలి= అతిశయించి; పవమాన+సుతుపైన్= వాయునందనునిపై(భీమునిపై); భగదత్తుఁడు; మత్త+గజమున్= మదించిన ఏనుగును; పఱపి= తోలి; అతనిన్= భీముని, ఆశుగములన్= బాణాలతో; పొదివినన్= క్రమ్మిన; ఆ+మెయిన్= ఆ రీతి; మొగిళులు= మేఘాలు; రవిన్= సూర్యుని; పొదువు+దర్పమున్= కప్పివేయు ఆటోపమును; తలఁపించెన్= స్మరింపచేసింది.

**తాత్పర్యం:** భగదత్తుడు భీముడిపై తన మదపుటేనుగును తోలి, బాణాలతో అతడిని ముంచెత్తాడు. ఆ సన్నివేశం మబ్బులు ప్రకాశించే సూర్యుడిని కప్పివేసే విధాన్ని తలపించింది.

**విశేషం:** అలం: ఉపమ. 1.భీముడు - సూర్యుడివలె ప్రకాశించాడు. అయితే - ఎంతటి సూర్యుడినయినా మబ్బులు క్రమ్మి సూర్యరశ్మి ప్రసరించకుండా చేయగలవు. అనగా సూర్యరశ్మి తగ్గదు గాని - తగ్గినట్లుగా పైకి కనిపిస్తుంది.

2. ఏనుగులను మార్కొనటంలో భీముడు సుప్రసిద్ధుడు. ఏనుగులను రణరంగంలో నడిపించటంలో అనుభవజ్ఞుడు అయిన వృద్ధవీరుడు భగదత్తుడు. (భగదత్తుడి ఏనుగు పేరు సుప్రతీకం. కురుక్షేత్ర సంగ్రామంలో సుప్రతీకం నిర్వహించిన భూమిక చిరస్మరణీయం. భగదత్తుడికి సుప్రతీకానికి గల అవినాభావ సంబంధం మహాభారత పఠితలకు మరవరానట్టిది. చిట్టచివరకు భగదత్తుడి సుప్రతీకాన్ని అర్జునుడు సంహరిస్తాడు.)

**చ. కని యభిమన్యుముఖ్యు లవికంపితవృత్తిఁ గడంగి యేసినం**
**దనువున నెల్ల రక్తజలధారలు గ్రమ్మఁగ వారణేంద్రుఁ డే**
**పున సెలయేఱు లొక్కమొగి బోరనఁ బెక్కడరంగ లీలఁ గై**
**కొని ఘనకేళి సల్పు నడగొండగతిన్ సముదగ్రమూర్తి యై. 240**

**ప్రతిపదార్థం:** కని= చూచి (భగదత్తుడు - ఏనుగును భీముడిపైకి తోలటం చూచి); అభిమన్యు+ముఖ్యులు= అభిమన్యుడు మొదలైనవారు; న+వికంపిత వృత్తిన్= చలింపనట్టి నిలకడగల పరాక్రమంతో; కడంగి= పూని; ఏసినన్= బాణాలు ప్రయోగింపగా; వారణ+ఇంద్రుఁడు= ఏనుగులలో శ్రేష్ఠమైన సుప్రతీకం; తనువునన్+ఎల్లన్= శరీరము నందు అంతటా; రక్త జల ధారలు= నెత్తుటి ప్రవాహాలు; ఒక్క మొగిన్= ఒకే విధంగా, ఆగని ధారగా; క్రమ్మఁగన్= వ్యాపింపగా; ఏపునన్= మిక్కుటముగా; సెల+ఏఱులు= కొండవాగులు; బోరనన్= వేగంగా; పెక్కు+అడరంగన్ లీలన్= మిక్కుటముగా అతిశయించే రీతిగా; కైకొని= పూని; ఘన+కేళి+సల్పు= గొప్ప వినోద విహారం చేసే; నడ+కొండ+గతిన్= నడిచేటటుంటి పర్వతం వలె+ సమ్+ఉదగ్ర+మూర్తి+ఐ= మిక్కిలి భయంకరమైన ఆకృతిగలదియై.

**తాత్పర్యం:** అభిమన్యుడు మున్నగు వీరులు భగదత్తుడి ఏనుగుపై బాణాలు ప్రయోగించారు. భగదత్తుడి ఏనుగు శరీరంపై రక్త ధారలు ప్రవహించాయి. ఆ ఏనుగు - సెలయేళ్ళు స్రవించే నడకొండవలె మిక్కిలి భయంకరంగా భాసించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కవిసి బలముఁ జంపఁగఁ బాం । డవ యోధులు నిల్వరించుటకుఁ జాలక టీ**
**చ్చ వడినఁ గని పెల్లుగఁ గౌ । రవ సైన్యము లడరె నుద్ధురస్ఫురణమెయిన్. 241**

**ప్రతిపదార్థం:** కవిసి= మార్కొని; బలమున్+చంపఁగన్= సేనను సంహరింపగా; పాండవ యోధులు= పాండవుల పక్షములోని వీరులు; నిల్వరించుటకున్+చాలక= ఆపుటకు శక్యముగాక; టీచ్చ+పడినన్= బ్రాన్పడగా; కని= చూచి; పెల్లుగన్= మిక్కుటముగా; ఉద్ధుర స్ఫురణ మెయిన్= భయంకరత్వం భాసించునట్లుగా; కౌరవ+సైన్యములు= కౌరవుల సేనలు; అడరెన్= విజృంభించాయి.

**తాత్పర్యం:** భగదత్తుడి ఏనుగు మార్కొని పాండవసేనలను చంపివేసింది. దానిని ఆపుటకు శక్యం కాక పాండవసేనలు బ్రాన్పడగా చూచి భయంకరస్ఫురణ భాసించేటట్లు కౌరవసేనలు విజృంభించాయి.

**తే. అప్పు డుబ్బి దుర్యోధనుఁ డతిరయమునఁ । దేరు వఱపించి మారుతిఁ దెగువతోడఁ**
**గదిసి బలునారసంబు వక్షమున నాట । నొల్లఁ బోవుచు సిడ మతఁ డూఁత గొనియె. 242**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; దుర్యోధనుఁడు= దుర్యోధనుడు; అతి+రయమునన్= మిక్కిలి వేగంతో, తేరు= రథం; పఱపించి= త్రోలి; మారుతిన్= భీముడిని; తెగువతోడన్= సాహసంతో; కదిసి= మార్కొని; బలు+నారసంబు= పెద్దబాణం; వక్షమునన్= ఉరమున; నాటన్= గ్రుచ్చగా; ఒల్లన్+పోవుచు= వ్రాలి పడిపోతూ; సిడము= జెండా(కొయ్య); అతఁడు= భీముడు; ఊఁత+కొనియెన్= ఆధారంగా చేసికొన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో దుర్యోధనుడు తన రథం తోలించి, భీముడిని మార్కొని, పెనుబాణాన్ని అతని ఉరమున నాటాడు. భీముడు ఆ ధాటికి తట్టుకోలేక జెండా కొయ్యను ఆధారంగా చేసికొనవలసి వచ్చింది.

**విశేషం:** 1.భీముడు దుర్యోధనుడి బాణఘాతానికి తట్టుకోలేక జెండా కొయ్యను ఆధారంగా చేసికొని రథంమీద కూలబడిపోయాడు. తండ్రి దెబ్బతినటం చూచి - కొడుకైన ఘటోత్కచుడు కౌరవసేనను మార్కొని విజృంభించాడు. కురుక్షేత్ర సంగ్రామంలో వీరుల అసాధారణ విజృంభణకు మానసిక హేతువులు తిక్కన చక్కగా నిరూపించాడు. తిక్కన - గొప్ప మనో ధర్మ పరిజ్ఞాత.

**వ. అయ్యవసరంబున. 243**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

### ఘటోత్కచుండు మాయాబలంబునఁ గౌరవసేనపై విజృంభించుట (సం. 6-68-40)

**క. మనసేన పేర్చి పెల్లా। ర్చినఁ జూచి ఘటోత్కచుండు సెలఁగి జనకుఁ జే**
**కొని 'యిది మాయ ఘటింపఁగ। ననురూపం బైన వేళ' యని తలఁచి వెసన్. 244**

**ప్రతిపదార్థం:** మన+సేన= కౌరవసైన్యం; పేర్చి= అతిశయించి; పెల్లు+ఆర్చినన్= పెద్దకేకలు వేయటం(సింహనాదాలు చేయటం); చూచి; ఘటోత్కచుండు; చెలఁగి+జనకున్+చేకొని= పూని,తండ్రిని చేరి; ఇది= ఈ సమయం; మాయ+ఘటింపఁగన్= విభ్రాంతిని కల్పించటానికి; అనురూపంబు+ఐన+వేళ= తగిన సమయం; అని తలఁచి; వెసన్= వేగంగా.

**తాత్పర్యం:** కౌరవసేన విజయగర్వంతో సింహనాదాలు చేసింది. ఘటోత్కచుడు వెంటనే తండ్రియైన భీముడిని చేరాడు. 'ఇది 'మాయ' చేసి - కౌరవసేనలను ఓడించటానికి తగిన సమయం' అని అతడు తలపోశాడు.

**విశేషం:** 1. ఘటోత్కచుడు - హిడింబ అనే రాక్షస వనితకు భీముడి వలన పుట్టిన కొడుకు. రాక్షసులు మాయాఘటన విశారదులు.

2. మాయ= లేనిది ఉన్నట్లుగా భ్రాంతిని కలుగజేయటం

**వ. కైలాస శైలాకారంబును జతుర్దంతసారోదారంబును నుద్దామ గమన దుర్వారంబును నగు వారణంబు నెక్కి వజ్రజ్వాలాభీల బాహుదండుం డగుచు నయనసహస్రంబొప్ప నప్పాండవులకుం దోడుపడ నైరావణారూఢుండై యింద్రుండు చనుదెంచె ననుబుద్ధి వైరులకుం బుట్టునట్టుగా నంజనవామనాది దిగ్గజంబు లెట్టెట్టివి యని వినంబడు నాభంగి మత్తేభంబుల నెక్కితక్కటి దిక్పాలురపోలికం దోడి దానవులు గెలంకుల నేతేరం గురుపతిపైఁ దోఁతెంచి యతని కడ్డుపడుభగదత్తుదంతిం బొదివి. 245**

**ప్రతిపదార్థం:** కైలాస+శైల+ఆకారంబును= కైలాసపర్వతము వంటి రూపం కలిగినట్టిదియు; చతుః+దంత, సార+ఉదారంబును= నాలుగు దంతాల బలంతో గొప్పది అయినట్టిదియు; ఉద్దామ గమన+దుస్+వారంబును= గొప్పదైన నడక చేత అడ్డగించుటకు వీలుకానట్టిదయును; అగు= అయిన; వారణంబున్+ఎక్కి= ఏనుగును అధిరోహించి; వజ్ర జ్వాలా+ఆభీల బాహు దండుండు+అగుచున్= వజ్రపు జ్వాలలవలె భయంకరమైన పెక్కుదండములు గలవాడు అవుతూ; నయన+సహస్రంబు+ఒప్పన్= వేయి కన్నులు విరాజిల్లగా; ఆ+పాండవులకున్; తోడుపడన్= సాయం చేయటానికి; ఐరావణ+ఆరూఢుండు+ఐ= ఐరావతము అను పేరుగల ఏనుగును ఎక్కినవాడై; ఇంద్రుండు; చనుదెంచెన్= వచ్చెను; అను+బుద్ధి= అను అభిప్రాయం; వైరులకున్= శత్రువులకు; పుట్టునట్లు; అంజన - వామన+ఆది+దిక్+గజంబులు= అంజనము- వామనము మున్నగు దిగ్గజాలు; ఎట్టు+ ఎట్టివి+ అని+వినన్+

పడున్+ఆ+భంగిన్= ఏ రీతిగా ఉంటాయని వింటామో ఆ రీతిగా ఉన్న; మత్త+ఇభంబులన్= మదపుటేనుగులను; ఎక్కి; తక్కటి= మిగిలిన; దిక్+పాలుర+పోలికన్= దిక్కులు పరిపాలించే వారి ఆకారముతో; దానవులు= రాక్షసులు; కెలంకులన్= పార్శ్వములందు; ఏతేరన్= రాగా; కురుపతిపైన్= కురురాజైన దుర్యోధనునిపై; తోఁతెంచి= వచ్చి మార్కొని; అతనికిన్+అడ్డుపడు= దుర్యోధనుడికి; తనకు మధ్యగా వచ్చే; భగదత్తు+ దంతిన్= భగదత్తుడి ఏనుగును; పాదివి= మార్కొని.

**తాత్పర్యం:** కైలాసపర్వతం వంటి ఆకారంతోనూ, నాలుగు దంతాలతోనూ, నిలువరించటానికి వీలుగాని గొప్పనడకతోనూ ఉన్న ఏనుగునెక్కి వజ్రజ్వాలలవలె భయంకరములైన భుజదండములు కలవాడై, వేయికండ్లతో విరాజిల్లుతూ, పాండవులకు సాయపడటానికి ఐరావతదిగ్గజాన్ని ఎక్కి ఇంద్రుడే వచ్చాడేమో అన్న అభిప్రాయం కౌరవులకు కలిగేటట్లు ఘటోత్కచుడు వచ్చాడు. అంజనము, వామనము మొదలైన దిగ్గజాలు ఎట్లా వుంటాయో అట్లాంటి మదగజాలనెక్కి ఇంద్రుని వెంట తక్కిన దిక్పాలకులలాగా తన తోటి రాక్షసులు ఇరువైపులరాగా అతడు దుర్యోధనుని పైకి వచ్చాడు. అతడు దుర్యోధనునికి అడ్డుపడే భగదత్తుడి ఏనుగును ఆక్రమించి (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలం: ఉపమ. 1. ఐరావతం - ఇంద్రుడి తెల్ల ఏనుగు. 2. దిగ్గజములు: ఎనిమిది అవి: ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము.

**క. అమ్ముల నేనుఁగు కొమ్ముల । నమ్మత్తగజమ్ము నొంచి యఱిముఱి మనసై**
**న్యమ్మెల్లఁ జదియఁ బఱచె భ । యమ్మున మొగతిరిగి దిక్కు లద్రువ నొఱలుచున్. 246**

**ప్రతిపదార్థం:** అమ్ములన్= బాణాలతో; ఏనుఁగు+కొమ్ములన్= ఏనుగు దంతాలతో; ఆ+మత్త+గజమ్మున్+నొంచి= ఆ మదపు టేనుగును లొంగదీసికొని; అఱిముఱిన్= వేగంగా; మన+సైన్యమ్ము+ఎల్లన్= మన(కౌరవ) సైన్యం అంతా; చదియన్= నలగగా; భయమ్మునన్= భీతితో; దిక్కులు; అద్రువన్= అదరగా; మొగతిరిగి= వెనుదీసి; ఒఱలుచున్= అరుస్తూ; పఱచెన్= పారిపోయినది.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు బాణాలతో, తన ఏనుగు దంతాలతో, భగదత్తుడి మదపుటేన్గును నొప్పించాడు. మన సైన్యం నలిగిపోగా అది భయంతో దిక్కులు అదిరేటట్టు అరుస్తూ పారిపోయేటట్లు తరిమాడు.

**విశేషం:** ఈ కంద పద్యంలో 'అద్రువ' నగణమే. తెలుగు ఛందస్సులోని విశేషం ఇది. 'ద్రు' తేల్చి పలకాలి. దీనికి 'శిథిల ద్విత్వం' అని పేరు.

**వ. ఇట్లాభీలంబుగా భగదత్తుశుండాలంబుఁ దోలి యురవడించి. 247**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఆభీలంబుగాన్= భయంకరముగా; భగదత్తు+ శుండాలంబున్= భగదత్తుని ఏనుగును; తోలి= పోవునట్లుచేసి; ఉరవడించి= విజృంభించి.

**తాత్పర్యం:** పై విధంగా భగదత్తుడి మత్తేభాన్ని ఘటోత్కచుడు పారద్రోలి, ఉత్సహించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. దనుజపతి యేచి దుర్యో । ధనుదెస కడరుటయుఁ దత్పితామహుఁ డాచా**
**ర్యున కిట్లనుఁ హైడింబుఁడు । దనమాయా గర్వమున నుదగ్రుం డయ్యెన్. 248**

**ప్రతిపదార్థం:** దనుజపతి= రాక్షసరాజు(ఘటోత్కచుడు); ఏచి= విజృంభించి; దుర్యోధను+దెసకున్= దుర్యోధనుని వైపునకు; అడరుటయున్= ఉత్సహించుటతో; తద్+పితామహుఁడు= అతడి తాత(భీష్ముడు); ఆచార్యునకున్+ఇట్లు+అనున్= ద్రోణుడితో ఈ విధంగా అన్నాడు; హైడింబుఁడు= హిడింబ కొడుకు(ఘటోత్కచుడు); తన మాయా గర్వమునన్= ఇతరులకు భ్రాంతిని కొలిపే తన శక్తిచేత; ఉదగ్రుండు+అయ్యెన్= భయం కలిగించేవాడు అయ్యాడు.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు విజృంభించి దుర్యోధనుడి వైపు తన దృష్టి ఉత్సాహంతో సారించాడు. భీష్ముడు ద్రోణుడితో ఈ విధంగా చెప్పాడు. "హిడింబ కొడుకు మాయా యుద్ధ విశారదుడు కావున గర్వించి ఇతరులకు భయోత్పాతం కలిగిస్తున్నాడు.'

**విశేషం:** 1. ఆచార్యుడు అనగా గురువు అని అర్థం. మహాభారతంలో ఆచార్యశబ్దం ద్రోణరూఢం అయింది. ద్రోణుడు కురుపాండవ రాజ పుత్రులకు ధనుర్విద్యాగురువు కాబట్టి.

**క. భగదత్తు నెగిచి కౌరవ । జగతీశ్వరుమీఁదఁ గవిసె సరభసవృత్తిం**
**దగ నడ్డపడక తడయుట । మగఁటిమియే? పొదువవలయు మనుజాశనునిన్. 249**

**ప్రతిపదార్థం:** భగదత్తున్+ఎగిచి= భగదత్తుని తరిమివేసి; కౌరవ+జగత్+ఈశ్వరుమీఁదన్= కౌరవ రాజుమీద(దుర్యోధనునిపై); సరభస+వృత్తిన్= ఆటోపముతో;(ఘటోత్కచుడు);కవిసెన్= మార్కొన్నాడు; తగన్= సరిగా(యథోచితముగా); అడ్డపడక+తడయుట= అడ్డుకోకుండా ఆలసించటం; మగఁటిమి+ఏ?= పౌరుషమా?; మనుజ+అశనునిన్= మనుష్యులను తినేవానిని, రాక్షసుని, ఘటోత్కచుని; పొదువన్ వలయున్= మార్కొనవలెను.

**తాత్పర్యం:** భగదత్తుని పారద్రోలి, ఈ ఘటోత్కచుడు - కౌరవరాజు అయిన దుర్యోధనుడిపైకి లంఘించాడు గర్వంతో. ఈ రాక్షసుడి విజృంభణ అరికట్టకపోవటం పౌరుషంకాదు. ఈ ఘటోత్కచుడి విజృంభణం ఆపివేయాలి.

**చ. తలఁ కెడువాఁడు గాఁడు భగదత్తుఁడు భీమతనూజుతోడ ని**
**ట్టలముగఁ బోరఁ జాలు నకటా కరి యోరువదేమి సేయు? వి**
**చ్చలవిడి భూవిభుం గవిసె సామజమున్ వెసనేయుఁ' డంచు జో**
**దులకును జేయి వీచి మును దోలె నతండు రథంబు బల్విడిన్. 250**

**ప్రతిపదార్థం:** భగదత్తుఁడు= భగదత్తుడు; తలఁకెడువాఁడు కాఁడు= వెనుతీసెడివాడు కాడు; భీమ+తనూజుతోడన్= భీముని యొక్క కొడుకుతో= ఘటోత్కచునితో; నిట్టలముగన్= అధికముగా; పోరన్+చాలున్= యుద్ధం చేయగలడు; అకటా!= అయ్యో!; కరి= ఏనుగు; ఓరువదు= ఓర్చుకోలేదు (తట్టుకోలేకపోయింది.); ఏమి+చేయున్?= భగదత్తుడు ఏమి చేయగలడు?(ఘటోత్కచుడు); భూవిభున్= దుర్యోధనుడిని; విచ్చలవిడిన్= ఎదురులేకుండగా; కవిసెన్= మార్కొన్నాడు; సామజమున్= ఏనుగును(ఘటోత్కచుని ఏనుగును); ఏయుఁడు+అంచున్= బాణాలతో కొట్టండి అని; జోదులకును= యోధులకు; మును= ముందు; చేయి+వీచి= హస్తము ఊపి; అతండు= భీష్ముడు; బల్విడిన్= గొప్ప పరాక్రమంతో - కోపంతో; రథంబు; ; తోలెన్= నడపించాడు.

**తాత్పర్యం:** భగదత్తుడు మహావీరుడు. ఆతడు ఘటోత్కచుడిని ఓడించగల సమర్థుడే కాని ఆతడి ఏనుగు వెనుకంజ వేసింది. అయ్యో! పాపం అతడేమి చేయగలడు? ఆ అదను చూచుకొని ఘటోత్కచుడు గర్వంతో రాజైన దుర్యోధనుడి మీదికే లంఘించాడు. 'ఆతడి ఏనుగును ఎదుర్కొనండి' అని భీష్ముడు తన వీరులను ఉత్సాహపరిచి రథాన్ని కోపంతో ముందుకు తోలాడు.

**వ. ఆచార్యప్రభృతులగు రథికవరులునుం గూడికొని కురుభూపతి కడ్డపడి హిడింబానందనుపైఁ గ్రందుకొని వివిధాస్త్రంబులు పరఁగించి రంత నక్కడ నతనికిఁ దోడై యుధిష్ఠిరాది పాండవులును బాంచాలమాత్స్య ప్రముఖదండనాయకులును బ్రతివీరులపై ననేక విశిఖంబులు గురియ నప్పుడు పోరు ఘోరంబయ్యెనందు మందాకినీనందనుం డమంద పరాక్రమ క్రీడం గౌంతేయబలంబులం గనుపు గొట్టె నట్టియెడ నా ఘటోత్కచుం డుత్కటోద్దామవిక్రమాభిరాముం డగుచు సింహనాదంబు సేయ బృంహితోదాత్తంబు లైన తదీయ దంతావళంబులు నలిరేఁగి నీ సైన్యంబుల బడలువడం జేసినం గని గాంగేయుండు గుంభసంభవున కిట్లనియె. 251**

**ప్రతిపదార్థం:** ఆచార్య+ప్రభృతులు+అగు= ద్రోణుడు మున్నగు; రథికవరులునున్= రథములపై నెక్కియుద్ధం చేసే శ్రేష్ఠులగు వీరులును; కూడికొని= కలిసికట్టుగా చేరి; కురు+భూపతికిన్= కురురాజుకు(దుర్యోధనునకు); అడ్డుపడి= అడ్డంగా నిలిచి(ఘటోత్కచుని బారినుండి కాపాడుటకై); హిడింబా+నందనుపైన్= హిడింబయొక్క కొడుకుపై(ఘటోత్కచుడిపై); క్రందుకొని= మూగి; వివిధ+అస్త్రంబులు= ఎన్నో విధములైన బాణాలు; పరఁగించిరి= ప్రయోగించారు; అంతన్; అక్కడన్= అక్కడ (అనగా పాండవపక్షంలో); అతనికిన్+తోడై= ఘటోత్కచుడికి బాసటగా నిలిచి; యుధిష్ఠిర+ఆది+పాండవులును= ధర్మరాజు మున్నగు పాండవులును; పాంచాల మాత్స్య ప్రముఖ దండనాయకులును= ద్రుపదరాజు-విరాటుడు మున్నగు సేనాపతులూ; ప్రతివీరులపైన్= శత్రుయోధులపై; అనేక+విశిఖంబులు= పెక్కుబాణాలు; కురియన్= వర్షింపగా; అప్పుడు= ఆ సమయంలో; పోరు= యుద్ధం; ఘోరంబు+అయ్యెన్= తీవ్రంగా భయంకరంగా సాగింది; అందున్= ఆ యుద్ధంలో; మందాకినీ+నందనుండు= గంగకొడుకు(భీష్ముడు); అమంద+పరాక్రమక్రీడన్= తక్కువకాని మిక్కుటమగు యుద్ధం అనే ఆటలో; కౌంతేయ+బలంబులన్= పాండవసేనలను; కనుపు+కొట్టెన్= ఖండించాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ+ఘటోత్కచుండు= ఆ ఘటోత్కచుడు; ఉత్కట+ఉద్దామ+విక్రమ+అభిరాముండు+అగుచున్; మిక్కిలి ఎక్కువైన పరాక్రమంచే అందగించినవాడగుచు; సింహనాదంబు+ చేయన్= సింహము గర్జించునట్లు పెనుకేకవేయగా; బృంహిత+ఉదాత్తంబులు+ఐన ఘీంకార రావములచే గొప్పవైన; తదీయ+దంతావళంబులు= ఆతని(ఘటోత్కచుని) ఏనుగులు; నలిరేఁగి= విజృంభించి; నీ సైన్యంబులన్= నీ సేనలను; బడలుపడన్+చేసినన్= డస్సిపోవునట్లుగా చేయగా; కని= చూచి; గాంగేయుండు= భీష్ముడు; కుంభసంభవునకున్= ద్రోణుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు:

**తాత్పర్యం:** భీష్ముడు ద్రోణాచార్యుడు మున్నగు రథికులను కలుపుకొని, దుర్యోధనుడికి ఘటోత్కచుడికి మధ్యగా చేరాడు. వారు అందరూ ఘటోత్కచుడిపై పెక్కు బాణాలు ప్రయోగించారు. ఇక, అటు పాండవపక్షంలో ధర్మరాజు మున్నగు పాండవులు, ద్రుపదుడు విరాటుడు మున్నగు సేనాపతులు శత్రువులైన కౌరవులపై బాణవర్షం కురిపించారు. ఆ విధంగా ఘోరయుద్ధం జరిగింది. కౌరవసేనాధిపతి భీష్ముడు పాండవసేనలను చీల్చి చెండాడాడు. అప్పుడు ఘటోత్కచుడు సింహనాదం చేసి విజృంభించాడు. ఆతడి కేకకు ఉప్పొంగిన అతడి ఏనుగులు ఘీంకారాలు చేసి కౌరవసేనలను చీకాకు పరిచాయి. అప్పుడు భీష్ముడు కౌరవసేనల దీనావస్థను గుర్తించి ద్రోణుడితో ఈ విధంగా చెప్పాడు.

**విశేషం:** 1. బృంహితము= ఏనుగులు చేసే ఘీంకారానికి బృంహితం అని పేరు. 2. కుంభసంభవుడు : కుంభమునందు జన్మించిన వాడు, ద్రోణుడు. శోధన నాళికలలో - శిశువుల ఉత్పత్తి కోసం ప్రయత్నం జరుగుతోంది. కాబట్టి భవిష్యత్ కాలంలో శాస్త్రజ్ఞుల పరిశోధన ఈ విషయంపై కొంత క్రొత్త వెలుగు వెలార్చవచ్చు. 3. తిక్కన పలుచోట్ల - యుద్ధాన్ని క్రీడగా కల్పించటం కద్దు. ఘోరయుద్ధం చేసే ఘటోత్కచుడు - వాస్తవ జగత్తులో రాక్షసస్వరూపుడే ఐనప్పటికి 'పరాక్రమాభిరాముడు' అని తిక్కన వర్ణించాడు. 'ఘోర' సంగ్రామంలో కూడా తిక్కనకు సౌందర్యస్ఫూర్తి కన్పించటం విశేషం. తిక్కన వర్ణననుబట్టి - ఆ మహాకవికి ప్రత్యక్ష రణరంగపరిచయం ఉన్నట్లు గుర్తింపవచ్చు.

**క. ' ఈయనతో రణ మిప్పుడు । సేయఁగ మది గొల్ప దస్తశిఖరికిఁ జేరెం**
**దోయజమిత్రుఁడు నేఁటికిఁ । బోయి మనము వత్త మెల్లిప్రొద్దున ననికిన్.' 252**

**ప్రతిపదార్థం:** ఈయనతోన్= ఘటోత్కచునితో; రణము= యుద్ధం; ఇప్పుడు; చేయఁగన్; మది+కొల్పదు= మనస్సు అంగీకరించటలేదు; తోయజ+మిత్రుఁడు= సూర్యుడు (పద్మములకు స్నేహితుడు); అస్తశిఖరికిన్+చేరెన్= అస్త్రాద్రికి చేరాడు - అస్తమించాడు; మనము; నేఁటికిన్+పోయి= ఈ దినమునకు వెళ్ళి (యుద్ధం విరమించి); ఎల్లి+ప్రొద్దునన్= రేపు ఉదయం; అనికిన్= యుద్ధానికి; వత్తము= తిరిగి వద్దాం.

**తాత్పర్యం:** 'ఈ ఘటోత్కచుడితో ఇప్పుడు యుద్ధం చేయటానికి మనస్సు అంగీకరించటంలేదు. సూర్యుడు అస్తమించాడు. నేటికి యుద్ధం విరమించి తిరిగి రేపు ఉదయం మనం యుద్ధం ప్రారంభిద్దాం.'

**విశేషం:** 1.భీష్ముడు యుద్ధం చాలించటంలో ఆంతర్యం ఉంది. మొదటిది తాత్కాలికంగా ఓటమి నుండి కౌరవసేనను తప్పించవచ్చును. సాయంసమయానికి యుద్ధవిరమణ చేయాలనే ఒప్పందం ఉభయపక్షాలు అంగీకరించినట్టిదే కదా! ఇక రెండవ ఆంతర్యం - సూర్యాస్తమయం తరువాత రాక్షసులకు బలం ఎక్కువౌతుంది. అందుకని వారికి నిశాచరులనే పేరు వచ్చింది.

**ఆ. అనిన నట్లకాక యని ధనురాచార్యుఁ । డప్పు డాత్మపక్షమైన రథిక**
**కోటి కెఱుఁగఁ జెప్పికొని యని సేయుట । నిలిపి తివియఁ బంచె బలము నెల్ల. 253**

**ప్రతిపదార్థం:** అనినన్= అని(భీష్ముడు) చెప్పగా; అట్లు+అ+కాక+అని= సరే అటులే జరుగుగాక అని; ధనుః+ఆచార్యుఁడు= ధనురాచార్యుడు(ద్రోణుడు); ఆత్మ+పక్షము+ఐన= తన పక్షమునకు చెందిన; రథిక+కోటికిన్= వీరులకు; ఎఱుఁగన్+చెప్పికొని= తెలియచేసి; అని+చేయుట= యుద్ధం చేయటం; నిలిపి; బలమున్+ఎల్లన్= సేనను అంతటినీ; తివియన్+పంచెన్= వెనుకకు మరలుటకు ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** భీష్ముని ప్రతిపాదనను ద్రోణుడు అంగీకరించి కౌరవపక్షంలోని వీరులను అందరినీ యుద్ధం నిలుపుదల చేయుమని ఆజ్ఞాపించాడు.

**వ. ఇవ్విధంబున. 254**

**ప్రతిపదార్థం:** ఇవ్విధంబునన్= ఈ రీతిగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కౌరవ బలములు దిరిగిన । భేరీ శంఖాది తూర్య భీషణరావో**
**దారపటు సింహనాద । స్ఫారవిలాసంబు లయ్యెఁ బాండవ బలముల్. 255**

**ప్రతిపదార్థం:** కౌరవ+బలములు= కౌరవసేనలు; తిరిగినన్= తిరోగమించగా(వెనుకకు మరలగా); పాండవ+బలముల్= పాండవులసేనలు; భేరీ శంఖ+ఆది+తూర్య భీషణ+ఆరావ+ఉదార+పటు సింహనాద స్ఫార విలాసంబులు+అయ్యెన్= భేరులు శంఖములు మొదలైన జంత్రవాద్యనాదాలతో, భయంకర నాదాలతో, గొప్పవైన పెక్కు సింహనాదాలతో వ్యాపించిన ఉత్సాహంతో ఉప్పొంగినట్టివి అయ్యాయి.

**తాత్పర్యం:** కౌరవసేనలు యుద్ధం విరమించి వెనుకంజ వేయగా పాండవసేనలు సంతోష తన్మయత్వంలో మునిగి, భేరులు, శంఖాలు మొదలగు వాద్య నినాదాలలో చెలరేగిన సింహనాదాలతో ఉత్సాహం ప్రకటించాయి.

**తే. చిన్నఁబోయి నీకొడుకులు సేయఁగలుగు । దొరలు విడిదల కరిగిరి పరఁగభీమ**
**సేనుకొడుకు నగ్గించుచుఁ జెలఁగి వారు । చెన్ను సొంపారఁ జని రాత్మశిబిరములకు.' 256**

**ప్రతిపదార్థం:** నీ కొడుకులు= నీ పుత్రులు(దుర్యోధనుడు మున్నగువారు); చిన్నఁబోయి= దీనత్వం చెంది; చేయగలుగు+దొరలు= సమర్థులైన ప్రభువులు; విడిదలకున్= తమ నివాస స్థలాలకు; అరిగిరి= వెళ్ళారు; పరఁగన్= ఒప్పునట్లుగ; భీమసేను+కొడుకున్= భీముడి పుత్రుడగు ఘటోత్కచుడిని; అగ్గించుచున్= ప్రశంసిస్తూ; చెలఁగి= ఉత్సహించి; వారు= పాండవుల సేనలు; చెన్ను+సొంపారన్= అందం అతిశయించేటట్లు; ఆత్మ+శిబిరములకున్= తమ విడిదులకు; చనిరి= వెళ్ళారు;

**తాత్పర్యం:** నీ కొడుకులు చిన్నబోయి తమ విడిదులకు వీరులతో కలిసి వెళ్ళిపోయారు. ఘటోత్కచుడిని ప్రశంసిస్తూ పాండవ సేనలు తమ తమ శిబిరాలకు వెళ్ళాయి.

**వ. అని యిట్లు నాలవనాఁడు ధార్తరాష్ట్రులు దూలపోవుట సెప్పిన విని సంజయునకు నాంబికేయుం డిట్లనియె. 257**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ విధంగా; నాలవనాఁడు= నాలుగవరోజున; ధార్తరాష్ట్రులు= ధృతరాష్ట్రుని కొడుకులు; తూలపోవుట= చిన్నపోవటం; చెప్పినన్+విని; సంజయునకున్; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని నాలుగవ దినం జరిగిన యుద్ధ వృత్తాంతం చెప్పిన సంజయుడితో ధృతరాష్ట్రుడు ఈ రీతిగా అన్నాడు.

**చ. ' అనితల నీవు పాండుతనయావలి కెప్పుడు మేలుచేయు నా**
**తనయులకుం బరాక్రమము తక్కువయుం బ్రకటింప విందు; భీ**
**ష్ముని గురు శల్యుఁ దక్కుఁగల శూరుల నెల్లను వారు సీరికిం**
**గొన కిటు లింతవా రగుటకుం గత మెయ్యది? నాకుఁ జెప్పుమా.' 258**

**ప్రతిపదార్థం:** అని+తలన్= రణరంగంలో; నీవు= ఓ సంజయా! నీవు; పాండు+తనయ+ఆవలికిన్= పాండురాజు కొడుకుల సముదాయానికి, ఎప్పుడున్; మేలు= ఆధిక్యం; చేయున్= కలిగించటం; నా తనయులకున్+పరాక్రమము+తక్కువయున్+ప్రకటింపన్= నా పుత్రులకు శౌర్యలోపమూ వెలువరించటం; విందున్= ఆలకిస్తున్నాను; భీష్మునిన్ గురున్ శల్యున్= భీష్ముని- ద్రోణుని-శల్యుని; తక్కన్+గల+శూరులను+ఎల్లను= మిగిలిన యోధులను అందరినీ; వారు= పాండవులు; మేలుచేయన్-మేలుచే(యి) యున్= ఆధిక్యమును; చీరికిన్ కొనక= లెక్కసేయక; ఇటులు= ఈ విధంగా; ఇంతవారు+అగుటకున్ = ఇంత గొప్ప వారు కావటానికి; కతము= హేతువు; ఎయ్యది?= ఏది?; నాకున్+చెప్పుమా= నాకు తెల్లము చేయుము.

**తాత్పర్యం:** 'యుద్ధరంగంలో నీవు ఎప్పుడూ పాండవుల ఆధిక్యాన్ని, పౌరుష పరాక్రమాలనూ ఎక్కువగా అభివర్ణించి చెప్పటం, నా కొడుకులను తక్కువ చేస్తూండటం వింటున్నాను. ఆ పాండవులు భీష్ముడిని, ద్రోణుడిని, శల్యుడిని తక్కుంగల శూరులను ఏ మాత్రం సరకు చేయకుండా విజృంభించటానికి గల కారణం నాకు తేటతెల్లంగా తెలియచేయుము.

**క. అనుటయు నాతం డిట్లను । విను మౌషధగుణము మంత్రవీర్యము మాయా**
**జనితసమగ్రోద్ధతి గా । దనఘా! నీ కేను మున్న యది యెఱిఁగింతున్. 259**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధృతరాష్ట్రుడు చెప్పగా; ఆతండు= సంజయుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; వినుము; ఔషధ+గుణము= మందుల ప్రభావం; మంత్ర+వీర్యము= మంత్రాల బలం; మాయా+జనిత+సమగ్ర+ఉద్ధతి= మాయవలన పుట్టిన గొప్ప ఆధిక్యం; కాదు; అనఘా!= పాపరహితుడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నీకున్; ఏను= నేను; మున్ను+అ= ముందే; అది; ఎఱిఁగింతున్= చెప్పాను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు అడిగిన ప్రశ్నకు సంజయుడు సమాధానం చెప్పాడు. 'పాపరహితుడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా! పాండవుల ఆధిక్యం ఔషధాల మహిమ వలన, మంత్రాల బలం వలన ఉద్భవించింది కాదు ఈ విషయం నేను ముందుగానే నీకు చెప్పాను.

**విశేషం:** అనఘా!= అనేది మర్యాద తెలిపే సంబోధన. దానిని యథాక్షరంగా వాచ్యార్థంలో స్వీకరించనక్కరలేదు.

**ఉ. పాడియు సత్యముం గలరు పాండుతనూజులు నీదుపుత్త్రు ల**
**ప్పాడికి నోడ; రత్తెఱఁగు పాపము సేయఁగఁ జూచితీవు; న**
**క్కీడిటు సేయ కే లుడుగు? గెల్వదె ధర్మువు? వారిగెల్పు మీ**
**యోడుటయున్ ధ్రువంబు విదురోక్తులు వింటిమి గాదె! యేర్పడన్. 260**

**ప్రతిపదార్థం:** పాండు తనూజులు= పాండవులు; పాడియున్= న్యాయము; సత్యమున్+కలరు= సత్యము కలవారు; నీదు+పుత్త్రులు= నీ కొడుకులు; అ+పాడికిన్= ఆ న్యాయానికి; ఓడరు= లోబడరు; ఆ+తెఱఁగు= ఆ రీతిగా; పాపము చేయఁగన్ చూచితి+ఈవు= పాపం చేస్తుండగా నీవు చూస్తూ ఊరకున్నావు; ఆ+కీడు= ఆ పాపం; ఇటు+చేయక= ఈ విధంగా చేయక; ఏల+ఉడుగున్?= ఏ విధంగా ఊరుకుంటుంది?; ధర్మువు= ధర్మం; గెల్వదు+ఎ?= జయింపదా? (జయిస్తుంది); వారి+గెల్పు= వారి(పాండవుల) విజయం; మీ+ఓడుటయున్= మీరు ఓడిపోవటం; ధ్రువంబు= నిశ్చయం; ఏర్పడన్= స్పష్టముగా; విదుర+ఉక్తులు= విదురుని మాటలు; వింటిమి+కాదె!= విన్నాము గదా!

**తాత్పర్యం:** పాండవులు న్యాయమూ సత్యమూ కల్గినవారు. నీ పుత్రులు న్యాయమునకు లోబడరు. వారు అంతటి పాపం చేస్తుంటే నీవు చూస్తూ ఉండినావు. ఆ పాపం ఇట్లా చేయక ఎందుకుంటుంది? ధర్మంజయించదా? వారుగెలవడం, మీరు ఓడడం నిశ్చయం. విదురుడిమాటలు స్పష్టంగా విన్నాము గదా?

**క. నీయడిగిన భంగిన గాం । గేయు నడిగె నట్లు వారు గెలిచి చనిన యా**
**రేయి కురునాథుఁ; డాతని । కాయన సెప్పినవిధంబు నభివర్ణింతున్. 261**

**ప్రతిపదార్థం:** నీ+అడిగిన+భంగిన్+అ= నీవు ప్రశ్నించిన తీరుగనే; కురునాథుఁడు= దుర్యోధనుడు; గాంగేయున్= గంగకొడుకును(భీష్ముడిని); అట్లు= ఆ విధంగా; వారు= పాండవులు; గెలిచి; చనిన= వెళ్ళిన; ఆ రేయి= ఆ రాత్రి; అడిగెన్= ప్రశ్నించాడు; ఆతనికిన్= ఆ దుర్యోధనునకు; ఆయన= భీష్ముడు; చెప్పిన+విధంబు= చెప్పిన తీరును; అభివర్ణింతున్= వివరించి చెప్పగలను.

**తాత్పర్యం:** నీవు నన్ను అడిగిన ప్రశ్ననే దుర్యోధనుడు నాలుగవ నాటి యుద్ధం ముగిసిన పిదప, రాత్రి భీష్ముడిని అడిగాడు. భీష్ముడు చెప్పిన సమాధానాన్నే నేను తిరిగి నీకు వివరించి చెప్పుతాను.

వ. భీష్ముండు దుర్యోధనున కి ట్లనియెఁ దొల్లియుం బలుమాఱుంజెప్పదుఁ బాండవులకు వాసుదేవుండు సహాయుండై యుండు నట్లగుట నెయ్యదియు నసాధ్యంబు లే దప్పరమేశ్వరు మహత్త్వం బున్నరూ పెఱింగెడు వారు పెక్కండ్రు లే రెఱింగినవారల కాపదలు లేవు కౌంతేయు లతని నెఱింగి యాశ్రయింతురు నీవు సరకుసేయవు వినుము చెప్పెద మానససరస్సు నుత్తరపర్వతంబు నగ్ర ప్రదేశంబున దేవతామునిగంధర్వాప్సరోగణంబులు గొలువం గొలువుండి కమలసంభవుండు. 262

**ప్రతిపదార్థం:** భీష్ముండు; దుర్యోధనునకున్; ఇట్లు+అనియెన్; తొల్లియున్= పూర్వమే; పలుమాఱున్= పెక్కుసారులు; చెప్పుదున్ = చెప్పి యున్నాను; పాండవులకున్; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; సహాయుండు+ఐ= బాసటయై; ఉండున్= ఉంటాడు; అట్లు+ అగుటన్= ఆ విధంగా ఉండటంచేత; ఏ+అదియున్= ఏదీ; అసాధ్యంబు+లేదు= సాధించలేనిది ఉండదు; ఆ+పరమ+ఈశ్వరు మహత్త్వంబు= ఆ దేవుడి గొప్పదనం; ఉన్నరూపు+ఎఱింగెడువారు= నిజము తెలిసికొనేవారు; పెక్కండ్రులేరు= ఎక్కువమంది లేరు; ఎఱింగినవారలకున్= తెలిసినవారికి; ఆపదలు= విపత్తులు; లేవు= ఉండవు; కౌంతేయులు= కుంతి కొడుకులు(పాండవులు); అతనిన్= శ్రీకృష్ణుని; ఎఱింగి; ఆశ్రయింతురు= శరణు పొందుతారు; నీవు= ఓ దుర్యోధనా! నీవు; సరకు+చేయవు= లెక్కపెట్టవు; వినుము; చెప్పెదన్= చెప్పగలను; మానస సరస్సు+ఉత్తర పర్వతంబు= మానస సరోవరం ఒడ్డున ఉత్తర దిక్కున ఉన్న కొండయొక్క; అగ్ర ప్రదేశంబునన్= శిఖరంపై; దేవతా, ముని, అప్సరస్+గణంబులు= దేవతలు, మునులు, అప్సరసల సమూహాలు; కొలువన్= అర్చింపగా; కొలువు+ఉండి= సభ తీర్చి; కమల+సంభవుండు= పద్మం నుండి పుట్టినవాడు= బ్రహ్మదేవుడు.

**తాత్పర్యం:** భీష్ముడు దుర్యోధనుడికి ఈ విధంగా చెప్పాడు. 'నీకు ఇదివరకే ఎన్నో సారులు చెప్పి ఉన్నాను. పాండవులకు బాసటగా శ్రీకృష్ణుడు ఉన్నాడు. అందుచే వారు సాధించలేనిది ఏదీ ఉండదు. శ్రీకృష్ణుడు పరమాత్మ అవతారం. ఆతడిని తెలుసుకోగలిగిన వారికి విపత్తులు రావు. పాండవులకు ఆతని మహత్తు తెలియును. వారు ఆతడిని శరణు పొందారు. నీవు శ్రీకృష్ణుడిని లెక్కపెట్టవు. నీకు ఒక రహస్యం చెప్పగలను. వినుము. మానస సరోవర తీరంలో ఉత్తర దిక్కున ఉన్న కొండ శిఖరంపై ఒకసారి దేవతలు, మునులు, అప్సరసలు మున్నగువారు కొలువగా బ్రహ్మదేవుడు సభ తీర్చాడు.

**విశేషం:** 1. మానస సరోవరం : భారతదేశానికి ఉత్తర దిక్కున హిమాలయ పర్వతశ్రేణుల మధ్య ఉన్న ఒక పెద్ద సరస్సు. ప్రస్తుతం - భారతదేశం - టిబెట్టు సరిహద్దులలో ఉంది. తిక్కన కాలంనాటికి అనగా 13వ శతాబ్దం నాటికే గాక సంస్కృత మహాభారత రచనా కాలం నాటికే క్రీస్తుపూర్వం పలు శతాబ్దులకు పూర్వమే మానససరోవరం సుప్రసిద్ధమైన క్షేత్రం. భారతీయుల ప్రాచీన భూగోళ పరిజ్ఞానానికి ఇది ఒక నిదర్శనం. మానససరోవర ప్రాంతం దేవతలకు ఆటపట్టు అని పురాణ కథనం. 2. ఉత్తరదిశ పవిత్రమైనదని ప్రాచీన భారతీయుల పరిగణన. నదులు ఉత్తర వాహినులు అయిన చోటులు పవిత్ర క్షేత్రాలుగా పరిగణింపబడినాయి. బ్రహ్మాండము ఉత్తరదిశగా పయనిస్తున్నట్లు నవీన ఖగోళజ్ఞుల అభిప్రాయం. మానస సరోవరం ఉత్తరాన్నే ఉంది. బ్రహ్మ కొలువుదీర్చిన కొండ మానససరోవరానికి ఉత్తర దిక్కున ఉంది.

తే. మణిగణోజ్జ్వలమైన విమాన మొకటి । యంబరంబునఁ గాంచి సర్వాత్ముఁ డందు
సన్నిహితుఁ డగు టెఱిఁగి హర్షంబు సంభ్ర । మంబుఁ దలకొన లేచి నమస్కరించి. 263

**ప్రతిపదార్థం:** మణి+గణ+ఉజ్జ్వలము+ఐన= మణుల సముదాయం చేత మిరుమిట్లు గొలిపే; విమానము+ ఒకటి= ఆకాశంలో సంచరించే వాహనము ఒకటి; అంబరంబునన్= ఆకాశమందు; కాంచి= చూచి; సర్వ+ఆత్ముడు= పరమాత్మ(విష్ణుదేవుడు); అందున్= ఆ విమానంలో; సన్నిహితుఁడు+అగుట= ఉండటం; ఎఱిఁగి= తెలిసికొని; హర్షంబు= సంతోషం; సంభ్రమంబున్= తొట్రుపాటును; తలకొనన్= కూడుకొనగా; లేచి= నిలబడి; నమస్కరించి.

**తాత్పర్యం:** మణులతో దేదీప్యమానంగా ప్రకాశించే విమానం బ్రహ్మదేవుడు ఆకాశంలో ఉండటాన్ని చూశాడు. ఆ విమానంలో పరమాత్మ ఉన్నట్లు తెలిసికొని సంతోషంతో తొట్రుపాటుతో లేచి నిలబడి వందనం సమర్పించి (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ' లోకోత్పత్తి స్థితి విల । యాకలనవినోద! మునిగణార్చిత! గుణర**
**త్నాకల్ప! నిర్గుణాత్మక! । శోకభయాపహపదాబ్జ! శుభకరమూర్తీ!' 264**

**ప్రతిపదార్థం:** లోక+ఉత్పత్తి+స్థితి+విలయ+ఆకలన+వినోద!= జగత్తులను సృష్టించటం - రక్షించటం - నాశనం చేయటం అనే క్రియలయందు వినోదం కలవాడా! ముని+గణ+అర్చిత!= ఋషుల సముదాయాల చేత ఆరాధింపబడేవాడా!; గుణరత్న+ఆకల్ప!= గొప్ప గుణములు అనెడి రత్నాభరణములు కలవాడా!; నిర్గుణ+ఆత్మక!= గుణరహిత స్వరూపుడా!; శోక+భయ+అపహ+పద+అబ్జ!= దుఃఖము భయాల నుండి విముక్తి కల్గించే పద్మములవంటి పాదాలు గలవాడా!; శుభకరమూర్తీ!= మంగళకరమైన ఆకారము గలవాడా!

**తాత్పర్యం:** 'జగత్తులను సృష్టించడం-కాపాడటం- నాశనం చేయటం అనే క్రియలయందు వినోదించేవాడా! ఋషుల సముదాయం చేత ఆరాధింపబడేవాడా! గొప్ప గుణాభరణాలు కలవాడా! గుణరహితమూర్తీ! దుఃఖములను, భయాలను పోగొట్టే పాదపద్మాలు కలవాడా! శుభము కలుగ చేసే ఆకారము గలవాడా!'

**విశేషం:** 1. పరమాత్మ స్వరూపం గూర్చి వేదాంతులలో తెగని చర్చ - అతడు నిర్గుణుడా? సగుణుడా? తిక్కన పరమాత్మ స్వరూపం 'సగుణము' - 'నిర్గుణము' అని చెప్పి సమన్వయ సంధాతగానే నిలబడ్డాడు. తిక్కన దృష్టిలో సగుణోపాసన - నిర్గుణోపాసన - ఒకే నాణానికి బొమ్మ - బొరుసు వంటివి.

**వ. అని మఱియు ననేక ప్రకారంబుల సంస్తుతించి యి ట్లని విన్నవించె. 265**

**ప్రతిపదార్థం:** అని; మఱియున్; అనేక+ప్రకారంబులన్; సంస్తుతించి= పొగడి; ఇట్లు+అని= ఈ రీతిగా; విన్నవించెన్= విజ్ఞప్తి చేశాడు.

**తాత్పర్యం:** అని, ఇంకా పెక్కు రీతుల ఆ పరమాత్మను ప్రస్తుతించి - ఈ విధంగా విజ్ఞప్తి చేశాడు.

**క. ' నారాయణ! నీకేఁ గడు । గారవమునఁ బుట్టి యిజ్జగము లన్నింటిన్**
**సారమతిం గావించితి । నీ రక్షణ వీని కెల్ల నిలుపై యుండున్. 266**

**ప్రతిపదార్థం:** నారాయణ!= ఓ విష్ణుదేవా!; నీకున్+ఏన్= నీకు నేను; కడున్+గారవమునన్= మిక్కుటమగు గొప్పతనముతో; పుట్టి= ఉద్భవించి; ఈ+జగములు= ఈ ప్రపంచాలు; అన్నింటిన్= అన్నిటినీ; సారమతిన్= గొప్పదనముతో; కావించితి(న్)= ఏర్పాటు చేశాను; వీనికిన్+ఎల్లన్= వీటి కన్నింటికి; నీ రక్షణ= నీవు కాపాడుట; నిలుపు+ఐ+ఉండున్= ఆధారమై ఉంటుంది.

**తాత్పర్యం:** నారాయణా! నీకు నేను గౌరవంతో పుట్టి ఈ లోకాలనన్నింటినీ సారవంతమైన బుద్ధితో గావించాను. నీ రక్షణ వీటికాధారం, (బ్రహ్మ సృష్టికర్త, విష్ణువు పోషణకర్త కదా!)

**క. ఇత్తఱి మనుష్య భువనం । బుత్తలపడుచున్నయది మహోగ్రాసురదు**
**ర్వృత్తముల నీవు కరుణా । యత్తమతిం బుట్టవయ్య! యదువంశమునన్. 267**

**ప్రతిపదార్థం:** ఈ+తఱిన్= ఈ అదనులో; మనుష్య+భువనంబు= మనుష్యులు ఉండే లోకము, భూమి(భూలోకం); మహా+ఉగ్ర+అసుర+దుస్ వృత్తములన్= మిక్కుటముగ భయంకరమైన రాక్షసుల చెడు పనుల చేత; ఉత్తల పడుచున్న+అది= చీకాకయి పోవుచున్నది; కరుణా+ఆయత్త+మతిన్= దయగలబుద్ధితో కూడినవాడవై; యదు+వంశమునన్= యాదవకులంలో; పుట్టవయ్య!= జన్మింపవయ్యా!

**తాత్పర్యం:** ఈ సమయంలో భూలోకం రాక్షసులు చేసే చెడ్డపనుల వలన మిక్కిలి కలత చెందినది. నీవు దయచేసి యదువంశంలో జన్మించవయ్యా.

**విశేషం:** లోకంలో ధర్మం నశించినపుడు - విష్ణుదేవుడు అవతరించి ధర్మ సంస్థాపన చేయగలడని భగవద్గీతా ప్రవచనం. 'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' - అని శ్రీకృష్ణుడు. (భగవద్గీతలో.)

**క. నరసఖుఁడ! నీవు సఖుఁడును । నరలోకమునన్ జనించి నానాదైత్యే**
**శ్వరుల దెసఁ బీడ లుడుపుము । ధరణీభారంబు వాయఁ దాత్పర్యమునన్.' 268**

**ప్రతిపదార్థం:** నర+సఖుఁడ!= 'నరుడు' అనే ఋషికి మిత్రుడా!; నీవున్; సఖుఁడును= మిత్రుడును; నర లోకమునన్= మనుష్యలోకంలో; జనించి; నానా దైత్య+ఈశ్వరుల+దెసన్= పెక్కుమంది గొప్ప రాక్షసుల యొక్క; పీడలు= బాధలు; ధరణీ భారంబు= భూభారము; పాయన్= తొలగునట్లుగా; తాత్పర్యమునన్= తదేకదీక్షతో(నిష్ఠతో); ఉడుపుము= పోగొట్టుము.

**తాత్పర్యం:** నరుడికి మిత్రుడవైన ఓ విష్ణుదేవా! నీవూ, నీ మిత్రుడితో పాటు భూలోకంలో పుట్టి గొప్ప రాక్షసుల వలని బాధలు పోగొట్టి, భూభారాన్ని తీసివేయవయ్యా.'

**వ. అని వేఁడికొని వినతుండయి యద్దేవుని తోడినీడయుం బోని నరనామధేయుం డగు మహాపురుషుం బ్రార్థించిన నన్నారాయణుండునుం గారుణ్యార్ద్రకటాక్షంబున వీక్షించి యట్ల యయ్యెడుం గాక! యని యానతిచ్చి యంతర్ధానంబు సేసిన నక్కొలువువా రెల్ల నచ్చెరువంది. 269**

**ప్రతిపదార్థం:** అని+వేఁడికొని= అని ప్రార్థించి; వినతుండు+అయి= నమస్కరించినవాడై; ఆ+దేవుని తోడి నీడయున్+పోని= ఆ దేవుని వెంట నీడవలె ఉండే; నర నామధేయుండు+అగు= నరుడు అని పేరు గలిగినట్టి; మహా+పురుషున్= గొప్పవాడిని; ప్రార్థించినన్= వేడుకొనగా; ఆ+నారాయణుండునున్= ఆ విష్ణుదేవుడును; కారుణ్య+ఆర్ద్ర+కటాక్షంబునన్= దయతో తడిసిన క్రీగంటి చూపుతో; వీక్షించి= చూచి; అట్లు+అ= అదే రీతిగా (నీవు ప్రార్థించిన తీరుగనే); అయ్యెడున్+కాక!= జరుగుగాక!; అని+ఆనతిచ్చి= అని ఆజ్ఞాపించి; అంతర్ధానంబు+చేసినన్= మాయంకాగా; ఆ+కొలువువారు+ ఎల్లన్= ఆ సభలోని వారు అందరు; అచ్చెరువు+అంది= ఆశ్చర్యం పొంది.

**తాత్పర్యం:** ఆ విధంగా బ్రహ్మదేవుడు విష్ణుదేవుడిని, ఆతడికి తోడు నీడగా ఉన్న నరుడు అను పేరుగల మహాత్ముని ప్రార్థించాడు. ఆ నారాయణుడు దయతో కూడిన క్రీగంటి చూపులతో బ్రహ్మదేవుడిని చూచి 'సరే - నీ ప్రార్థన ప్రకారమే జరుగుగాక' అన ఆనతిచ్చి, మాయమయ్యాడు. ఆ బ్రహ్మదేవుడిని చూచి కొలువు కూటంలోని వారందరూ ఆశ్చర్యం పొందారు.

**క. ' పరమేష్ఠి! నీవు గడుఁ ద । త్పరతను వినయంబు సేసి ప్రార్థించితి వె**
**వ్వరొకో వీరలు? నావుడు । సరసిరుహాసనుఁడు సెప్పె సంప్రీతిమెయిన్. 270**

**ప్రతిపదార్థం:** పరమేష్ఠి!= ఓ బ్రహ్మదేవుడా!; నీవు; కడున్+తత్పరతను= మిక్కుటమగు నిష్ఠతో; వినయంబు+చేసి= గౌరవం చూపించి; ప్రార్థించితివి= వేడుకొన్నావు; ఎవ్వరు+ఒకో+వీరలు?= వీరు ఎవ్వరు?(ఈ ఇరువురు); నావుడున్= అని (కొలువు వారలు) అడుగగా; సంప్రీతిమెయిన్= మిక్కుటమగు తృప్తితో; సరసిరుహ+ఆసనుఁడు= పద్మం ఆసనంగా కలవాడు, బ్రహ్మదేవుడు; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓ బ్రహ్మదేవుడా! నీవు మిక్కిలి వినయం చూపించి భక్తితో ప్రార్థించిన వారు ఎవరు?' అని కొలువు కూటంలోనివారు ప్రశ్నించగా, మిక్కిలి సంతృప్తితో బ్రహ్మదేవుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**క. ' పరమమును లాదిపురుషులు । నరనారాయణులు వీరు నా కారాధ్యుల్**
**నరహితముగఁ బ్రార్థించితి । ధరఁ బుట్టం డనుచు దానిఁ దలకొనిరి దయన్. 271**

**ప్రతిపదార్థం:** పరమ+మునులు= గొప్ప ఋషులు; ఆది+పురుషులు= మొదటినుండీ ఉన్నవారు; నర+నారాయణులు= నరుడును, నారాయణుడును అనువారలు; వీరు; నాకున్= నాకు(బ్రహ్మదేవునకు); ఆరాధ్యుల్= అర్చింప దగినవారు; నర+హితముగన్= ప్రజలమేలు కొరకు; ధరన్= భూమిపై; పుట్టుండు+అనుచున్= జన్మింపుడు అని; ప్రార్థించితిన్= వేడుకొన్నాను; దానిన్= ఆ ప్రార్థనకు; దయన్= కరుణతో; తలకొనిరి= అంగీకరించారు.

**తాత్పర్యం:** వీరు గొప్ప ఋషులు, వీరు ఆది పురుషులు. నరనారాయణులు. నాకు పూజనీయులు. ప్రజల మేలు కొరకై - వీరిని భూలోకంలో పుట్టుడని నేను ప్రార్థించాను. వారు దయతో నా ప్రార్థన అంగీకరించారు.

**క. ఇలఁ గ్రీడగఁ బుట్టిన వీ । రలఁ గేవల మర్త్యులని సరకు సేయనివా**
**రలు సెడుదు రెఱిఁగి భక్తిం । గొలిచిన వారలకు శుభ మగును వినుఁ డెందున్.' 272**

**ప్రతిపదార్థం:** ఇలన్= భూమిపై; క్రీడగన్= వినోదముగా(ఆటగ); పుట్టిన= జన్మించిన; వీరలన్= వీరిని(శ్రీకృష్ణుని - అర్జునుని); కేవల+మర్త్యులు+అని= పూర్తిగా మానవ మాత్రులు అని; సరకు+చేయనివారలు= లెక్కచేయకుండా ప్రవర్తించేవారు; చెడుదురు= పాడైపోతారు; ఎఱిఁగి= తెలిసి; భక్తిన్= పూజ్యభావంతో; కొలిచిన+వారలకున్= అర్చించిన వారలకు; ఎందున్= ఎచటనైనను; శుభము= మేలు; అగును= కలుగుతుంది; వినుఁడు= ఆలకింపుడు.

**తాత్పర్యం:** వినండి. భూమి మీద వినోదంగా పుట్టిన వీరిని కేవలం మానవులని లెక్కచేయనివారు చెడిపోతారు. తెలుసుకొని భక్తితో కొలిచిన వారికి ఎచ్చటకైనా శుభం కలుగుతుంది.

**వ. అని యెఱింగించి బ్రహ్మ దనలోకంబున కరిగెఁ గొలువువారలు నిజస్థానంబులకుం జని రిక్కడ నీకథ నారదజామదగ్న్యవ్యాసాదులచేత వింటిం దొల్లియు మహామునులు నిన్ను నరనారాయణుతోడి వైరంబు వలవ దని వారించిర కాదే? నీవు మదాంధుండవై మానవైతి వింకనైనను గృష్ణు నాశ్రయించి పాండవులతోడి పొత్తున మెలంగి బ్రదుకుమని చెప్పి భీష్ముం డూరకుండెఁ గౌరవపతియు నప్పలుకులు పెడచెవులం బెట్టె మీరు దగువారు సేయు హితోపదేశంబు లాచరించెదరె?' యని పలికి సంజయుం డమ్మహీపతి కిట్లనియె. 273**

**ప్రతిపదార్థం:** అని+ఎఱింగించి; బ్రహ్మ; తన+లోకంబునకున్= తన భువనమునకు(అనగా సత్యలోకానికి); అరిగెన్= వెళ్ళిపోయాడు; కొలువువారలు= సభలోనివారు; నిజ+స్థానంబులకున్= తాము నివసించే స్థలాలకు; చనిరి= వెళ్ళారు; ఈ+కడన్= ఇక్కడ; ఈ కథ= ఈ వృత్తాంతం; నారద+ జామదగ్న్య వ్యాసాదుల చేతన్= నారదుడు- పరశురాముడు-వ్యాసుడు మున్నగు

వారిచే; వింటిన్; తొల్లియున్+మహా+మునులు= పురాణకాలం నాటి గొప్ప ఋషులు; నిన్నున్; నర+నారాయణులతోడి+ వైరంబు= నరుడితో, నారాయణుడితో శత్రుత్వం; వలవదు+అని= వద్దు; అని వారించిరి+అ+కాదు+ఏ?= అడ్డుకున్నారు గదా; నీవు; మద+అంధుండవు+ఐ= గర్వంచే గ్రుడ్డివాడవై; మానవు+ఐతివి= ఆవైరం విడనాడలేదు; ఇంకన్+ఐనను= ఇకమీదట అయినప్పటికీ; కృష్ణున్+ఆశ్రయించి= శ్రీకృష్ణుని శరణువేడి; పాండవులతోడి+పొత్తునన్= పాండవులతోడి స్నేహంతో; మెలంగి= సంచరించి; బ్రదుకుము= జీవింపుము; అని+చెప్పి; భీష్ముఁడు; ఊరకుండెన్; కౌరవపతియున్= కౌరవుల రాజును(దుర్యోధనుడును); ఆ+పలుకులు= భీష్ముని మాటలు; పెడ+చెవులన్ పెట్టెన్= నిర్లక్ష్యం చేశాడు; మీరు= మీరు (నీవు, నీ కొడుకులు దుర్యోధనాదులు); తగువారు= తగినవారు; చేయు= చెప్పే; హిత+ ఉపదేశంబులు= మేలైన మాటలు; ఆచరించెదరె?= అనుష్ఠిస్తారా?; అని పలికి; సంజయుండు; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు( ఆ ధృతరాష్ట్రునకు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** అని తెలియజేసి బ్రహ్మ తనలోకానికి పోయాడు. కొలువులోని వారందరూ వారివారిస్థానాలకు వెళ్లారు. ఇక్కడ ఈ వృత్తాంతము నారదుడు, పరశురాముడు, వేదవ్యాసుడు మొదలైన వారిచేత విన్నాను. ఇంతకుముందే నరనారాయణులతో శత్రుత్వం వద్దని నిన్ను మహా మునులు వారించలేదా? నీవు మదాంధుడవై శత్రుత్వాన్ని మానలేదు. ఇకనైనా కృష్ణుని ఆశ్రయించి పాండవులతోటి పొత్తుతో మెలగి బ్రతుకము అనిచెప్పి భీష్ముడు ఊరకున్నాడు. దుర్యోధనుడు ఆ మాటలను నిర్లక్ష్యంచేశాడు. నీవు, నీ కొడుకులు తగినవారు చేసే హితోపదేశాలు ఆచరిస్తారా? అని చెప్పి సంజయుడు ధృతరాష్ట్రుడితో మళ్ళీ ఇట్లన్నాడు.

### భీష్ముని పంచమదివసయుద్ధక్రమము (సం. 6-65-1)

క. **వేగినఁ గౌరవసేనలు । వేగమ కైసేసి యనికి వెడలెం దీవ్రో**
**ద్యోగత భీష్ముని మున్నిడి । సాగరములు మేరదప్పచందం బొందన్.** 274

**ప్రతిపదార్థం:** వేగినన్= సూర్యోదయం కాగానే; కౌరవ+సేనలు= కౌరవుల సైన్యాలు; వేగమ= శీఘ్రంగా; కైసేసి= అలంకరించుకొని; తీవ్ర+ఉద్యోగతన్= పెద్ద ప్రయత్నంతో; భీష్ముని+మున్ను+ఇడి= భీష్ముని ముందు పెట్టుకొని; సాగరములు= సముద్రాలు; మేర+తప్పు+చందంబు+ఒందన్= చెలియలికట్టనుదాటి విజృంభించే విధంగా; అనికిన్= యుద్ధరంగానికి; వెడలెన్= వెళ్ళాయి.

**తాత్పర్యం:** ప్రొద్దు పొడవగానే కౌరవసేనలు అలంకారాలు చేసికొని - భీష్ముడి నాయకత్వంలో సముద్రాలు చెలియలికట్టను దాటి ఉప్పొంగి పొరలేటట్లు యుద్ధానికి సన్నద్ధమై వెళ్ళాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. యుద్ధరంగానికి - భటులు - 'కైసేసి' వెళ్ళేవారని తిక్కన వర్ణిస్తాడు. భటులు యుద్ధానికి వెళ్ళేటప్పుడు 'పెండ్లి కొడుకుల ఆహార్యం' ధరించేవారట. బహుశ : ఇది తిక్కన - తాను ప్రత్యక్షంగా చూచిన సమకాలీన వృత్తం కావచ్చు.

వ. **ఇట్లు వెడలి మకరవ్యూహం బమర్చుకొని నిలిచె నంతఁ బాండవులును శ్యేనవ్యూహంబుగా మోహరించి రందు ముఖంబున భీమసేనుండును నయనంబుల ధృష్టద్యుమ్న శిఖండులును శిరంబున సాత్యకియును గంఠంబునం గిరీటియు వామపక్షంబున విరాటద్రుపదులును దక్షిణపక్షంబునఁ గేకయులును వీఁపున నభిమన్యు ద్రౌపదేయులును బుచ్ఛంబున నకులసహదేవసహితుం డయి యుధిష్ఠిరుండును నిలిచి రివ్విధంబున సన్నద్ధంబు లయిన యుభయవ్యూహంబులు మేదురతూర్యనినాదంబులు రోదసీకుహరంబు నిండ నొండొంటిం గదిసిన.** 275

**ప్రతిపదార్థం:** ఇట్లు+వెడలి= ఈ విధంగా వెళ్ళి; మకర+ వ్యూహంబు= మొసలి ఆకారంగా భటులను ఏర్పరచిన పన్నుగడ; అమర్చుకొని+నిలిచెన్= ఏర్పాటు చేసికొని నిలిచాయి; అంతన్= అటుపిమ్మట; పాండవులును= పాండవులుకూడ; శ్యేన+వ్యూహంబుగాన్= డేగ ఆకారంలో; మోహరించిరి= సేనను పన్నారు; అందున్= ఆ వ్యూహంలో; ముఖంబునన్= మొగమునందు; భీమసేనుండును= భీముడును; నయనంబులన్= కన్నుల దగ్గర; ధృష్టద్యుమ్న శిఖండులును= ధృష్టద్యుమ్నుడును; శిఖండియు; శిరంబునన్= తలవద్ద; సాత్యకియున్; గండంబునన్= చెక్కిలివద్ద; కిరీటియున్= అర్జునుడును; వామపక్షంబునన్= ఎడమప్రక్కగ (ఎడమరెక్కగా); విరాట+ద్రుపదులును= విరాటుడు, ద్రుపదుడును; దక్షిణ+పక్షంబునన్= కుడిప్రక్క(కుడిరెక్కగా); కేకయులును= కేకయ రాజ్యాధిపతులును; వీఁపునన్; అభిమన్యు+ ద్రౌపదేయులును= అభిమన్యుడును ద్రౌపది యొక్క కొడుకులును; పుచ్ఛంబునన్= తోక దగ్గర; నకులుడు+సహదేవ సహితుండు+అయి= నకులుడును, సహదేవుడును తోడుగా గలవాడయి; యుధిష్ఠిరుండును= ధర్మరాజును; నిలిచిరి= నిలబడ్డారు; ఈ+విధంబునన్= ఈ రీతిగా; సన్నద్ధంబులు+అయిన= యుద్ధ ప్రయత్నములు చేసికొన్న; ఉభయ+వ్యూహంబులున్= రెండు మోహరములును, (కురుపాండవసైన్య వ్యూహాలురెండూ); మేదుర+తూర్య నినాదంబులు= దట్టమైన బూరాల ధ్వనులు; రోదసీ+కుహరంబు= భూమి ఆకాశాల మధ్యస్థలం; నిండన్= పూర్తిగా వ్యాపింపగా; ఒండు+ఒంటిన్= ఒకదానిని ఒకటి; కదిసినన్= మార్కొనగా.

**తాత్పర్యం:** కౌరవసేన మొసలి మోహరంగా ఏర్పడింది. పాండవసేన 'డేగ' ఆకారంగా ఏర్పడింది. పాండవవ్యూహంలో- డేగ ఆకృతి పన్నాగంలో భీముడు ముఖస్థానంలో ఉన్నాడు. ధృష్టద్యుమ్నుడు - శిఖండి రెండు కన్నులుగా ఏర్పడ్డారు. సాత్యకి తల అయ్యాడు. కంఠస్థానంలో అర్జునుడు నిలిచాడు. ఎడమరెక్కగా విరాట ద్రుపదులు, కుడి రెక్కగా కేకయులు ఉన్నారు. వీపున అభిమన్యుడు - ద్రౌపదీపుత్రులు నిలిచారు. తోకగా నకుల సహదేవులతో పాటు ధర్మరాజు నిలిచాడు. ఈ విధంగా కురు పాండవ బలాలు యుద్ధమునకు సన్నద్ధములై నిలిచాయి. భూమి ఆకాశం మధ్య భాగాన్ని, తూర్యరావాలు నిండుగా ఆవరించాయి. ఉభయసేనలూ ఒండొంటిని మార్కొన్నాయి.

**క.** **మకరవ్యూహం బనియెడు । మకరాలయ మపుడు దర్పమహిమోజ్జ్వలుఁడై**
**మకరక్రీడం జండత । మకరాభీలముగఁ జొచ్చె మారుతి యధిపా!** 276

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధృతరాష్ట్రమహారాజా!; మారుతి= వాయుపుత్రుడు (భీముడు); మకర+వ్యూహంబు+అనియెడు= మొసలి మొగ్గరము అనే; మకరాలయము= సముద్రము; అపుడు= ఆ సమయంలో; దర్ప+మహిమ+ఉజ్జ్వలుఁడు+ఐ= గర్వాటోపంతో, ప్రకాశించే వాడై; మకర+క్రీడన్= మొసలి వలె ఆడుతూ; చండతన్= తీక్ష్ణతతో; మకర+ఆభీలముగన్= మొసలివలె భయంకరత్వం చూపిస్తూ; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీముడు మకరవ్యూహంలో ఆటోపంగా మిరుమిట్లు గొలిపే గర్వంతో ప్రవేశించి చేరాడు. ఆ మకరవ్యూహం సముద్రం వలె ఉన్నది. సముద్రంలో వినోదించే మొసలివలె భీముడు భయంకర స్వరూపంతో అందులో ప్రవేశించాడు.

**ఉ.** **చొచ్చి పితామహుంగని యిషుప్రచయంబునఁ గప్పె నాతఁడుం**
**జిచ్చున నేయి వోసినవిశేషము దోఁపఁగ భీము నొంచి ము**
**చ్చిచ్చున నేర్చునట్టులుగఁ జేసెఁ దదూర్జితసేన నంత వి**
**వ్వచ్చుఁడు వచ్చి దివ్యశరవర్గనిరర్గళవిక్రమంబునన్.** 277

**ప్రతిపదార్థం:** చొచ్చి= ప్రవేశించి; పితామహున్+కని= భీష్ముడిని చూచి; ఇషు+ప్రచయంబునన్= బాణాల సముదాయంతో; కప్పెన్= ముంచాడు; ఆతఁడున్= ఆ భీష్ముడూ; చిచ్చునన్= అగ్గిలో; నేయి+పోసిన, విశేషము+తోఁపఁగన్= ఆజ్యం పోసినట్టి గొప్పతనం కనిపించేటట్లుగా; భీమున్= భీముడిని; నొంచి= నొవ్వచేసి; తద్+ఊర్జిత+సేనన్= ఆతడి గొప్ప సైన్యాన్ని; ముచ్చిచ్చును+ ఏర్చునట్టులుగన్= మూడు అగ్నులతో దహించేటట్లుగా; చేసెన్; అంతన్= అటు పిమ్మట; వివ్వచ్చుఁడు= అర్జునుడు; దివ్య శర వర్గ నిరర్గళ విక్రమంబునన్= దేవతలకు సంబంధించిన అమ్ముల సముదాయంతో అడ్డులేని పరాక్రమంతో.

**తాత్పర్యం:** భీముడు కౌరవులు పన్నిన మకర వ్యూహంలోనికి చొరబడి భీష్ముడిని అమ్ముల గుంపుతో కప్పివేశాడు. భీష్ముడు నేయి పోసిన అగ్గివలె ప్రజ్వలించి, పాండవసేనను ముచ్చిచ్చులో ముంచాడు. అప్పుడు అర్జునుడు వచ్చి, దేవతలు తనకు బహూకరించిన బాణాలు ప్రయోగించి, అడ్డులేని పరాక్రమంతో భీష్ముడిని మార్కొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. 1. భీముడు - భీష్మునిపై బాణాలు ప్రయోగిస్తే - అది అగ్నిలో ఆజ్యం పోసినట్లు అయింది. భీష్ముడు ప్రజ్వరిల్లాడు. 2. ముచ్చిచ్చు= మూడు అగ్నుల సమాహారం. త్రేతాగ్నులు. 1. ఆహవనీయం - గార్హపత్యం - దక్షిణాగ్ని.

**క. భీష్ముని గర్వం బుడిపి మ । హోష్మలుఁడై కౌరవేంద్రుయోధుల కెల్లన్**
**గ్రీష్మాదిత్యుని క్రియ న । ర్చిష్మత్త్వము సూపి యడరె సేనలు దెరలన్. 278**

**ప్రతిపదార్థం:** భీష్ముని+గర్వంబు+ఉడిపి= భీష్ముని మదము పోగొట్టి; మహా+ఉష్మలుఁడు+ఐ= గొప్ప వేడిమి గలవాడై; కౌరవ+ఇంద్రు యోధులకున్+ఎల్లన్= దుర్యోధనుడి వీరులందరకు; గ్రీష్మ+ఆదిత్యుని+క్రియన్= ఎండాకాలపు సూర్యునివలె; అర్చిష్మత్త్వము= మండుటెండ; చూపి=ప్రదర్శించి; సేనలు+తెరలన్= (కౌరవ) సేనలు వెనుకంజ వేయునట్లుగా; అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వచ్చి మార్కొని భీష్ముడిని అరికట్టాడు. మండుటెండవలె ప్రకాశించి, కౌరవవీరుల నందరను వేసవికాలంలో సూర్యుడివలె వేడిమి చూపి, కౌరవసేనలను వెనుకంజ వేసేటట్లు చేసి విజృంభించాడు.

**వ. అట్టియెడ నీకొడుకు గురునిం గదిసి యతని కి ట్లనియె. 279**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; నీ+కొడుకు= నీ పుత్రుడు(దుర్యోధనుడు); గురునిన్= ఆచార్యుడిని (ద్రోణుని); కదిసి= చేరి; అతనికిన్= ద్రోణునకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో నీ కొడుకు దుర్యోధనుడు - గురువైన ద్రోణుడి దగ్గరకు చేరి ఈ విధంగా అన్నాడు.

**తే. ' పట్టి పాలార్చెదరు మీరు పాండుసుతుల । నీవు భీష్ముండు నలిగిన దేవతలకు**
**నైన మార్కొనవచ్చునే? సేన నరుఁడు । నొంపఁగా నిట్టు లొప్పరికింపఁ దగునె?' 280**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు పాండుసుతులన్= పాండవులను; పట్టి పాలార్చెదరు= ఉపేక్షిస్తున్నారు; నీవు= ఓ ద్రోణాచార్యా!; భీష్ముండు= భీష్ముడును; అలిగినన్= కోపిస్తే; దేవతలకున్+ఐనన్= వేల్పులకు అయినా; మార్కొనన్‌వచ్చునే?= ఎదిరించసాధ్యం అవుతుందా? సేనన్= సైన్యమును; నరుఁడు= అర్జునుడు; నొంపఁగాన్= చీకాకు పరచగా; ఇట్టులు= ఈ విధంగా; ఒప్పరికింపన్+ తగును+ఎ?= ఉపేక్షింపవచ్చునా?

**తాత్పర్యం:** ఓ ద్రోణాచార్యా! మీరు (నీవూ, భీష్ముడూ) పాండవులను ఉపేక్షిస్తున్నారు. నీవు భీష్ముడు, కోపిస్తే- మిమ్ము దేవతలు గూడ ఎదిరించలేరుకదా! అర్జునుడు మన కౌరవసేనను చీకాకు పరుస్తూ ఉంటే - మీరు చూస్తూ ఊరకుంటున్నారేమిటి?'

**వ. అనిన విని కుంభసంభవుండు గటకటం బడి యతనితో ని ట్లనియె. 281**

**ప్రతిపదార్థం:** అనినన్+విని; కుంభసంభవుండు= ద్రోణుడు; కటకటంబడి= నొచ్చుకొని; అతనితోన్= దుర్యోధనునితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడు పలుకగా మనస్సులో ఎంతో బాధపడి ద్రోణుడు ఈ విధంగా అన్నాడు.

**తే. ' ఎన్నఁడును మున్నువారలయేపు నోపఁ। గానమెట్లు సముద్రంబులోన బుఱ్ఱ**
**వైవఁ గొన్నంత గొనుఁగాక వారిగెల్వ। మాకు శక్యంబె చవిగాని మాటలేల?' 282**

**ప్రతిపదార్థం:** ఎన్నఁడును+మున్ను= మునుపెప్పుడూ; వారల= పాండవులయొక్క; ఏపు= ఆధిక్యం; ఎట్లున్= ఏ విధంగానూ; ఓపన్+కానము= తట్టుకొనటం చూడలేదు; సముద్రంబులోనన్; బుఱ్ఱవైవన్= సొరకాయబుర్రను వేయగా; కొన్నంత+కొను= అందులో పట్టేటంత నీటిని మాత్రమే అది తీసికొనగలదు; కాక; వారిన్+గెల్వన్+మాకున్= మాకు వారిని గెలవటానికి; శక్యంబె?= సాధ్యమా?; చవి+కానిమాటలు+ఏల?= రుచించని పలుకులు ఎందుకు?

**తాత్పర్యం:** మునుపెన్నడూ పాండవుల ఆధిక్యాన్ని తట్టుకోవడం చూడలేదుగదా! సముద్రంలో ఒకసొరకాయబుర్ర వేస్తే అదిగ్రహించగలిగినంత నీటినే గ్రహిస్తుంది. అంతేగాని సముద్రపు నీటినంతటనీ గ్రహించలేదు. మా శక్తి ఆ పాటిదే. ఈ రుచిలేని మాటలెందుకు?

**విశేషం:** 'మాకు' 'కానము' అను బహువచన ప్రయోగం ద్రోణుడి మాటలలోనిది - గమనింపదగును. అతడు భీష్ముడినికూడా తనతోపాటు కలిపికొని మాటాడాడు.

**క. అనుచు మొన గడచి నడచినఁ। గని పాండుతనూజు సైనికవ్రాతంబుల్**
**గనుకని విచ్చిన సాత్యకి। యనిలజవం బెసఁగఁ దాఁకె న స్త్రాచార్యున్. 283**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని చెప్పుచు; మొన+కడచి+నడచినన్= కౌరవ సేనను దాటి ముందుకు సాగి రాగా; కని= ద్రోణుని చూచి; పాండు తనూజు సైనిక వ్రాతంబుల్= పాండవుల సేనా సమూహాలు; కనుకనిన్+విచ్చిన= చెల్లాచెదరై పోయిన; సాత్యకి అనిల+జవంబు+ఎసఁగన్= వాయు వేగం అతిశయించగా; అస్త్ర+ఆచార్యున్= ద్రోణుని; తాఁకెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ద్రోణుడు దుర్యోధనునితో పలికి, కౌరవసేనను దాటి ముందరకు రాగా, చూచి పాండవసేనలు తొట్రుపాటుతో చెల్లాచెదరైపోయాయి. అప్పుడు సాత్యకి వాయువేగంతో విజృంభించి ద్రోణాచార్యుడిని మార్కొన్నాడు.

**ద్రోణుండు దుర్యోధన ప్రేరితుండై పాండవ సైన్యంబుపైఁ గవియుట (సం-6-65-21)**

**సీ. తాఁకి యుజ్జ్వల బాణతతి గవియించిన నవ్వుచు బెడిదంపు నారసములు**
**గురుఁడు శైనేయుపైఁ గురిసిన నొచ్చియుఁ దెరలక యాతండు తీవ్రభంగిఁ**
**బెనఁగంగఁ జూచి పావని యేచి గురునిపై నిశితాస్త్రసంతతి నించి నొంచె**
**నంత శల్యుండును శాంతనవుండును నతనికిఁ దోడ్పడి యదరి భీము**

**ఆ. నేయఁ దొడఁగుటయును నేడ్తెఱ ద్రౌపదే। యులును దానుఁ గవిసి యుగ్రలీలఁ**
**బటురయంబుమై సుభద్రాసుతుండు దు। ర్వార విశిఖతతుల వారిఁ బొదివె. 284**

**ప్రతిపదార్థం:** తాఁకి= మార్కొని; ఉజ్జ్వల బాణ తతిన్= ప్రకాశించే అమ్ముల సముదాయం; కవియించినన్= ప్రయోగించగా; నవ్వుచున్; బెడిదంపు+నారసములు= గొప్ప బాణాలు; గురుఁడు= ద్రోణుడు; శైనేయుపైన్= సాత్యకిపై; కురిసినన్= అమ్ముల వాన వర్షింపగా; నొచ్చియున్= బాధపడి కూడ; తెరలక= వెనుకంజ వేయక; ఆతండు= సాత్యకి; తీవ్ర+భంగిన్= మిక్కుటముగా; పెనఁగంగన్+చూచి= పోరాడటం చూచి; పావని= భీముడు; ఏచి= విజృంభించి; గురునిపైన్= ద్రోణుడిపై; నిశిత+అస్త్ర+సంతతిన్= వాడియైన అమ్ముల సముదాయాన్ని; నించి+నొంచెన్= నిండించి నొప్పించాడు; అంతన్= అటుపిమ్మట; శల్యుండును శాంతనవుండునున్= శల్యుడును, భీష్ముడును; అతనికిన్= ద్రోణాచార్యునకు; తోడ్పడి= సాయం చేసి; అడరి= విజృంభించి; భీమున్= భీముని; ఏయన్+తొడఁగుటయును= బాణాలు వేయడానికి పూనుకొనగా; ఏడ్తెఱన్= పరాక్రమంతో; ద్రౌపదేయులును= ద్రౌపదీ పుత్రులును; తాను= తాను(అభిమన్యుడు); కవిసి= మార్కొని; ఉగ్ర+లీలన్= భయంకరంగా; పటు+రయంబుమైన్= గొప్ప వేగంతో; సుభద్రా+సుతుండు= అభిమన్యుడు; దుర్వార విశిఖ తతులన్= అడ్డగించటానికి వీలులేని అమ్ముల సముదాయంతో; వారిన్= వారిని(ద్రోణుడిని, భీష్ముడిని, శల్యుడిని); పొదివెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** సాత్యకి ద్రోణుడిని మార్కొని, వెలుగొందే అమ్ములు అతడిపై గుప్పించాడు. ద్రోణుడు సాత్యకి సాహసానికి నవ్వుకొంటూ గొప్ప బాణంతో అతడిని కొట్టాడు. సాత్యకి దెబ్బతిని కూడా జంకకుండా యుద్ధం చేయటం గమనించి - భీముడు అతడికి సాయం చేయటానికి వెళ్ళాడు. వెళ్ళి ద్రోణుడిపై వాడిబాణాలు కురిపించాడు. అంతట భీష్ముడు, శల్యుడు ద్రోణాచార్యుడికి బాసటగా నిలిచి, భీముడిని మార్కొన్నారు. అప్పుడు భీముడికి బాసటగా ద్రౌపదీసుతులూ అభిమన్యుడూ వచ్చి వాడిబాణాలు ద్రోణుడిపైనా - అతనికి బాసటగా నిల్చిన భీష్మునిపైనా, శల్యుడిపైనా ప్రయోగించారు.

**విశేషం:** తిక్కన మనఃఫలకంపై - కురుక్షేత్ర సంగ్రామ క్రమం హత్తుకొనినట్లుగా కన్పిస్తుంది - అతడు చేసిన యుద్ధవర్ణనను బట్టి. భీష్మ - ద్రోణ - కర్ణపర్వాలలో ఎచ్చట చూచినా - చెప్పినది చెప్పక - ఒక్కచోటగూడా తబ్బిబ్బు లేకుండగా తిక్కన - చదువరుల కన్నులకు కట్టినట్లుగా వర్ణించడం - గుర్తింప దగినట్టి విశేషం.

**చ. కడువడితోడ నప్పుడు శిఖండి ధనుర్గుణ నిస్వనంబు పె**
**ల్లడరఁగ బాణజాలము వియత్తటిఁ గప్పఁగ నీదు సైన్యముల్**
**సుడివడ భీష్ముఁ దాఁకుటయుఁ జూచి మనంబున నాఁటదానితోఁ**
**బొడుతునె? యంచు మార్కొనక పోయెఁ దొలంగి యతండు భూవరా! 285**

**ప్రతిపదార్థం:** భూవరా!= ఓ మహారాజా; కడువడితోడన్= మిక్కిలి వేగంతో; అప్పుడు= ఆ సమయంలో; శిఖండి; ధనుస్+గుణ+నిస్వనంబు= విల్లుయొక్క అల్లెత్రాటి మ్రోత; పెల్లు+అడరఁగన్= ఎక్కువగా విజృంభింపగా; బాణ జాలము= అమ్ముల గుంపు; వియత్+తటిన్= ఆకాశ ప్రదేశాన్ని; కప్పఁగన్= కప్పగా; నీదు+సైన్యముల్= నీ సేనలు; సుడి+పడన్= గుండ్రముగా తిరుగగా; భీష్మున్= భీష్ముడిని; తాఁకుటయున్= మార్కొనుట; చూచి= పరికించి; మనంబునన్= మనస్సులో; ఆటదానితోన్= ఆడుదానితో(స్త్రీతో); పొడుతునె?= ఎదుర్కొంటానా?; అంచున్= అని అంటూ; అతండు= భీష్ముడు; తొలంగి పోయెన్= దూరంగా తొలగి వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అప్పుడు శిఖండి మిక్కుటమగు వేగంతో, తన వింటినారితో పెద్ద రొద చేస్తూ, ఆకాశం అంతా తన బాణాలతో కప్పుతూ వచ్చి నీ సేనలు సుడిపడేటట్లు చేస్తూ భీష్ముడిని మార్కొన్నాడు. 'ఒక ఆడదానితో నేను యుద్ధం చేస్తానా?' అని తన మనస్సులో భావించి, భీష్ముడు తొలగిపోయాడు.

**క. కనుఁగొని కురుపతి యాచా । ర్యునిఁ బురికొలుపుటయు నాతఁ డుద్దామగతిం**
**జని కడిమి మెఱయ నుజ్జ్వల । ఘనమార్గణపుంజముల శిఖండిఁ దెరల్చెన్. 286**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; కురుపతి= కురురాజు(దుర్యోధనుడు); ఆచార్యునిన్= గురుని(ద్రోణుని); పురికొల్పుటయున్= ప్రోత్సహించగా; ఆతఁడు= ద్రోణుడు; ఉద్దామగతిన్+చని= భయంకరమైన రీతిగా వెళ్ళి; కడిమి+మెఱయన్= పరాక్రమము వెలుగొందగా; ఉజ్జ్వల ఘన మార్గణ పుంజములన్= ప్రకాశమానములైన గొప్పవైన బాణముల సముదాయంతో; శిఖండిన్= శిఖండిని; తెరల్చెన్= మరలునట్లు చేశాడు.

**తాత్పర్యం:** శిఖండితో యుద్ధం చేయటానికి ఇష్టంలేక - భీష్ముడు వెళ్ళిపోవటం చూచి, దుర్యోధనుడు ద్రోణాచార్యుడిని పురికొల్పాడు. ద్రోణుడు పరాక్రమం ప్రకాశించగా, భయంకరంగా వెళ్ళి, వెలుగొందే అమ్ముల సముదాయం ప్రయోగించి శిఖండిని మరలించాడు.

**క. అమ్మెయిఁ గౌరవులును ద। ర్ప మ్మలరఁగఁ జెలఁగుటయును బాండవబలముల్**
**సమ్ముఖమునఁ దలఁపడినను। సమ్మర్దం బుగ్ర మయ్యె సంగ్రామమునన్. 287**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆరీతిగా; కౌరవులును= కౌరవులు కూడా; దర్పమ్ము+అలరఁగన్= గర్వము విలసిల్లగా; చెలఁగుటయును= ఒప్పుటయును; పాండవ బలముల్= పాండవులసేనలు; సమ్ముఖమునన్+తలపడినను= ప్రత్యక్షంగా మార్కొనటం చేత; సంగ్రామమునన్= యుద్ధమందు; సమ్మర్దంబు= సంకులత్వం; ఉగ్రము+అయ్యెన్= భయకరం అయింది.

**తాత్పర్యం:** ఆ రీతిగా కౌరవులు కూడా దర్పంగా యుద్ధం చేశారు. పాండవ సేనలు వారిని ఎదిరించాయి. ఇక ఘోరమైన సంకుల సంగ్రామం చెలరేగింది.

**క. ధూళుల మేఘంబులుఁ గర। వాలాదినిశాతహేతివర్గాంశుతటి**
**న్మాలయు గుణరవగర్జలుఁ। గీలాలపువృష్టికిం దగియె నట్టియెడన్. 288**

**ప్రతిపదార్థం:** ధూళుల మేఘంబులు= దుమ్ములు అనే మబ్బులు; కరవాల+ఆది నిశాత హేతి వర్గ అంశు తటిత్+మాలయున్= కత్తులు మొదలైన వాడియైన కత్తుల సమూహాల కాంతులు అనే మెరుపు తీగల దండ; గుణ రవ గర్జలున్= విల్లుకు కట్టిన అల్లె త్రాటి మ్రోతలు అనే (మేఘ) గర్జలు; కీలాలపు+వృష్టికిన్= రక్తము అనే వర్షానికి; అట్టి+ఎడన్= ఆ సమయంలో; తగియెన్= తగినట్టిదిగా కన్పించింది.

**తాత్పర్యం:** రణరంగంలో చెలరేగిన దుమ్ములే మబ్బులు, కత్తులు మొదలయిన వాడియైన ఆయుధాల నుండి వెలువడే ధగద్ధగలే మెరుపు తీగల దండలు. అల్లెత్రాటి మ్రోతలే మేఘగర్జనలు. ఇక - నెత్తుటి వర్షం కురియటానికి అప్పుడు- అంతా తగినట్లుగా ఉంది.

**విశేషం:** అలం: రూపకం. కీలాలపు వృష్టి - శ్లిష్టరూపకం. 1. కీలాలము= అనగా నెత్తురు అని ఒక అర్థం. రెండవ అర్థం నీరు. నెత్తురు వాననీరు మాదిరిగా కురవటానికి ఈ సంగ్రామం రంగంగా ఏర్పడింది.

**క. ప్రోవులు గట్టిన గుఱ్ఱపుఁ। బ్రేవులు నేనుఁగుల తఱచుఁబీనుంగులు ర**
**క్తావిలత వెల్లచీరలుఁ। గావులు నై భటనికాయకాయంబులునై. 289**

**ప్రతిపదార్థం:** ప్రోవులు+కట్టిన= గుట్టలుగా ఏర్పడిన; గుఱ్ఱపు+ప్రేవులు= అశ్వాల రక్తనాళాలు; ఏనుఁగుల+తఱచు+పీనుంగులు= ఏనుగుల దట్టమైన మృతకళేబరాలు; రక్త+ఆవిలతన్= రక్తంతో కూడు కొనటంచేత; వెల్ల+చీరలున్= తెల్ల వస్త్రాలు; కావులును+ఐ= కాషాయపు రంగుతో కూడినవై; భట నికాయ కాయంబులును+ఐ= భటుల సముదాయాలయొక్కశరీరాలు అయి.

**తాత్పర్యం:** గుట్టలుగా పడిపోయాయి గుర్రాల ప్రేవులు. ఏనుగుల మృతకళేబరాలు దట్టంగా కూడుకున్నాయి. తెల్లని వస్త్రాలు నెత్తుటిలో తడిసి జేగురు రంగువిగా మారిపోయాయి. అట్లే భటసముదాయాల శరీరాలు కూడా పడి ఉన్నాయి.

**క. సమరాంగణంబు కడుఘో । రముగా నిరువాఁగుఁ బోరురభసంబున ది**
**క్సమితి వడఁకాడెఁ బొగడెడు । నమరులయులి వడరెఁ జదల నతినిబిడముగాన్. 290**

**ప్రతిపదార్థం:** సమర+అంగణంబు= రణరంగం(పొలికలను); కడున్= మిక్కిలి; ఘోరముగాన్= భయంకరముగా; ఇరువాఁగున్= రెండు పక్షాలు(కౌరవ,పాండవసేనలు); పోరు+రభసంబునన్= యుద్ధంచేసే ఉద్రేకంలో; దిక్+సమితి= దిక్కుల సముదాయం; వడఁకు+ఆడెన్= కంపించింది; చదలన్= ఆకాశమునందు; అతి నిబిడముగాన్= మిక్కిలి దట్టముగా; పొగడెడు= ప్రశంసించే; అమరుల+ఉలివు= వేల్పుల మాటల సవ్వడి; అడరెన్= అతిశయించింది.

**తాత్పర్యం:** కురుపాండవులు ఇరుపక్షాలు పోరుతున్నప్పుడు రణరంగం మిక్కిలి భయంకరంగా మారింది. దిక్కులు కంపించాయి. చారణుల ప్రశంసాగీతాలతో ఆకాశం మారుమ్రోగింది.

**విశేషం:** అమరుల ఉలివు= దేవతల ప్రశంసా నినాదం, లోకోత్తరమైన ప్రతిభ-పరాక్రమం ప్రదర్శించినపుడు వేల్పులు - చారణులు ఉప్పొంగిపోయి ప్రశంసాగీతాలు పాడుతారట! ఇది హృదయంగమమైన కవి సమయంగా ప్రాచీన భారతీయ సాహిత్యంలో అవతరించి కన్పిస్తుంది.

**క. అనిలజభీష్ములు దమతమ । మొనలకుఁ గన్నాకు లగుచు మునుకొని వడి న**
**ర్జునకుంభసంభవుల ప్రా । పునఁ జూపిరి విక్రమంబు భూరిబలంబున్. 291**

**ప్రతిపదార్థం:** అనిలజ+భీష్ములు= భీముడు, భీష్ముడు; తమ+తమ+మొనలకున్= తమ తమ సేనలకు; కన్నాకులు+అగుచున్= నాయకులు అగుచు; మునుకొని= ముందున కేగుదెంచి; వడిన్= వేగముగా; అర్జున+కుంభసంభవుల+ప్రాపునన్= అర్జునుడు-ద్రోణుడు తోడ్పడగా; విక్రమంబు= పరాక్రమం; భూరి+బలంబున్= మిక్కుటమగు శక్తిని; చూపిరి= ప్రదర్శించారు.

**తాత్పర్యం:** భీముడు, భీష్ముడు తమ తమ సేనలకు నాయకత్వం వహించారు. భీముడికి, అర్జునుడు సాయం చేశాడు. భీష్ముడికి ద్రోణుడు తోడైనాడు. వారు ఇరువురూ తమ పరాక్రమం - గొప్పబలం చూపించి పోరాడారు.

**విశేషం:** అలం: యథాసంఖ్యం.

**క. భీమునిదెసఁ గాళింగో । ద్దామగజానీక సంగతత్వస్ఫురణా**
**భీమగతిం దఱిమెం గురు । భూమీశుఁడు భీష్మగురులు పోరెడు బలిమిన్. 292**

**ప్రతిపదార్థం:** భీష్మగురులు= భీష్ముడును, ద్రోణుడును; పోరెడు+బలిమిన్= యుద్ధం చేసేటప్పుడు ఏర్పడిన బలముతో; భీమునిదెసన్= భీముడివైపునకు; కాళింగ+ఉద్దామ+గజ+అనీక+సంగతత్వ+స్ఫురణా+భీమ+గతిన్= కళింగదేశానికి సంబంధించిన భయంకరమైన ఏనుగుల గుంపు కలయికతో ఏర్పడే భయోత్పాతంతో; కురు+భూమీశుఁడు= కురురాజు(దుర్యోధనుడు); తఱిమెన్= భీముని మార్కొన్నాడు.

**తాత్పర్యం:** భీముడు, అర్జునుడు ఒకవైపు, వారికి ఎదురుగా భీష్ముడు, ద్రోణుడు పోరాడుతున్నారు. ఆ సమయం చూచి, అది మంచి అదను అని ఎంచి దుర్యోధనుడు భీముడిని మార్కొన్నాడు. కళింగ మత్తేభ యూథాలు భీముడిపై

ఒక్కుమ్మడి పైబడి యుద్ధం చేయటం పరిపాటి. ఒక్క దుర్యోధనుడు ఆ మత్తేభయూధాల సంకుల శక్తిని మేళవించికొని భీముడిపై దాడి చేశాడు.

**చ. అతిముతి నీ కుమారవరు ల । త్తతి నందఱు నాబకారిపై**
**నుఱక రథంబులం బఱప నుజ్జ్వలశైలము మేఘబృందముల్**
**గిఱికొనఁ గప్పిన ట్లయినఁ గ్రీడి గుణస్వన ముల్లసిల్ల నే**
**డ్తెఱ విశిఖప్రతాప మనుతీవ్రసమీరము నేపు సూపినన్. 293**

**ప్రతిపదార్థం:** అతిముతిన్= సంభ్రమంతో; నీ+కుమారవరులు= నీ పుత్రరత్నములు(నీ కొడుకులలో శ్రేష్ఠులు, గొప్పవారైన నీ పుత్రులు); అందఱున్= అందరునూ; ఆ+తఱిన్= ఆ సమయమున; ఆ+బక+అరిపైన్= ఆ భీమునిపై; ఉఱక= లక్ష్యపెట్టక; రథంబులన్= రథాలను; పఱపన్= తోలగా; ఉజ్జ్వల శైలమున్= ప్రకాశించే కొండను; మేఘ+బృందముల్= మబ్బులగుంపులు; గిఱికొనన్= కూడి; కప్పినట్లు+అయినన్= క్రమ్మినట్లుగా కాగా; క్రీడి= అర్జునుడు; గుణ+స్వనము+ఉల్లసిల్లన్= అల్లెత్రాటి మ్రోత విలసిల్లగా; ఏడ్తెఱన్= పరాక్రమంతో; విశిఖ+ప్రతాపము+అను= బాణాల పరాక్రమం అనే; తీవ్ర+సమీరము+ఏపు+చూపినన్= గొప్ప గాలి విజృంభణ ప్రదర్శించగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడు భీముడిని తాకటం తోడనే నీ కుమారులు అందరూ రథాలను తోలి భీముడిని మార్కొన్నారు. కొండను మబ్బుల దొంతర ఆవరించినట్లయింది. అప్పుడు అల్లెత్రాటిని మ్రోగించి, అర్జునుడు వేగమైన గాలి ఏపు వంటి అమ్ముల సముదాయం ప్రయోగించాడు.

**విశేషం:** అలం: ఉపమ రూపకం. భీముడు కొండవలె నిలిచాడు. దుర్యోధనుడు, అతడి తమ్ములు మబ్బులవలె ఆ కొండను క్రమ్మారు. అర్జునుడు పెనుగాలి వంటి బాణాలు ప్రయోగించాడు. పెనుగాలి వీచేటప్పుడు చెలరేగే ధ్వనివలె - అర్జునుని వింటినారి మ్రోత (గుణధ్వని) వినిపించింది.

**క. ఆరథనివహంబులు న । వ్వారణములుఁ దెరలి మరలి వడిఁ బఱచుటయుం**
**గౌరవబల మెల్లను రణ । శూరుఁడు గాంగేయుమఱువు సొచ్చె వికలమై. 294**

**ప్రతిపదార్థం:** ఆ+రథ+నివహంబులు= ఆ తేరుల గుంపులు; ఆ+వారణములు= ఆ ఏనుగులు; తెరలి+మరలి= వెనుదిరిగి; వడిన్= వేగంగా; పఱచుటయున్= పారిపోవటంచేత; కౌరవ+బలము+ఎల్లను= కౌరవసేన అంతా; వికలము+ఐ= చీకాకు చెంది; రణ శూరుఁడు= యుద్ధం చేయుటలో వీరుడైన; గాంగేయు+మఱువు+చొచ్చెన్= భీష్ముడి వెనుకకు చేరింది.

**తాత్పర్యం:** కౌరవ సైన్యంలోని ఆ రథాలు, ఏనుగులు అన్నీ వెనుకంజ వేసి వేగంగా పారిపోయాయి. ఇక మిగిలిన కౌరవసేన అంతా చీకాకై చిట్టచివరకు రణశూరుడూ, సేనాపతీ అయిన భీష్ముడి వెనుకకు చేరి నిలిచింది.

**వ. ఇట్లు సేన మొగతిరిగినం గని సుయోధనుండు బరవసంబునం బురికొల్పి చేయి వీచుచు నగ్గలిక నడచినం గాంభోజ గోపాల సింధుగాంధార సౌవీర త్రిగర్త కళింగ ప్రముఖ బలసంగతు లై శకుని సైంధవులు దుశ్శాసనుం బురస్కరించికొని యురవడించి భీమపార్థులం బొదివిన ధర్మనందనుండు వెన్నుదన్ని యదల్చినం జేది కాశకరూశపాంచాల సైన్యంబులతో ధృష్టద్యుమ్నపురోగములగు రథికముఖ్యులు గడంగి కవిసి రప్పుడు విందానువిందులు గాశిరాజును సైంధవుండు భీమసేనుని వికర్ణుండు సహదేవునిఁ జిత్రసేనుండు శిఖండిని**

**దుర్యోధనుండు విరటునిఁ ద్రిగర్తులు నకులుని ద్రోణుండు చేకితానసాత్యకులను గృపహార్దిక్యులు ధృష్టద్యుమ్నుని సౌభద్రుండు సాల్వకేకయులను ధృష్టకేతుఘటోత్కచులు నీకొడుకులం దలపడిరి యుధిష్ఠిరుండు దాను మద్రేశ్వరుం దాఁకె నిట్లు సంకులసమరం బైన నస్త్రశస్త్ర సంఘట్టనంబున వెడలుమంటలు మింట నడరి మధ్యాహ్నప్రచండంబు లై యున్న చండకిరణకిరణంబుల మగిడింప నరదంబులు దాఁకి పడి పొరలు కరులును కరిహస్తాకర్షణవిధ్వస్తంబు లగు రథంబులును దురగఖురపుటవిఘట్టితగాత్రు లగు పదాతులును బదాతి వర్గానర్గళప్రహారధారాళ రక్తసిక్తంబు లగు ఘోటకంబులు నై చూచుఖేచరులకు వెక్కసం బయ్యె నట్టియెడ.** 295

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; సేన= సైన్యం; మొగతిరిగినన్= వెనుకకు మరలటం చేత; సుయోధనుండు; బరవసంబునన్+పురికొల్పి= ధైర్యంతో ప్రోత్సహించి; చేయి+వీచుచున్= హస్తం ఇటునటు త్రిప్పుతూ - ప్రోత్సహిస్తూ; అగ్గలికన్= శౌర్యంతో; నడచినన్; కాంభోజ గోపాల సింధు గాంధార సౌవీర త్రిగర్త కళింగ ప్రముఖ బలసంగతులై= కాంభోజము గోపాలము - సింధువు - గాంధారము; సౌవీరము- త్రిగర్తము కళింగము మున్నగు దేశాలకు సంబంధించిన సేనలతో కూడినవారై; శకుని సైంధవులు= శకుని సైంధవులు; దుశ్శాసనున్= దుశ్శాసనుని; పురస్కరించికొని= ముందు పెట్టుకొని; ఉరవడించి= విజృంభించి; భీమ, పార్థులన్= భీముడిని, అర్జునుడిని; పొదివినన్= మార్కొనగా; ధర్మనందనుండు; వెన్ను+తన్ని+అదల్చినన్= వెనుకనుండి ప్రోత్సహించగా; చేది, కాశ, కరూశ, పాంచాల+సైన్యంబులతోన్= చేది - కాశ - కరూశ - పాంచాల దేశాలకు సంబంధించిన సేనలతో; ధృష్టద్యుమ్న+పురస్+గములు+అగుచున్= ధృష్టద్యుమ్నుని ముందు పెట్టుకొని కదలిన వారగుచు; రథికముఖ్యులు= వీర శ్రేష్ఠులు; కడంగి= పూని; కవిసిరి= మార్కొన్నారు; అప్పుడు; వింద+అనువిందులు; కాశీరాజును సైంధవుండు; భీమసేనుని వికర్ణుండు, సహదేవుడిని చిత్రసేనుండు; శిఖండిని దుర్యోధనుడు; విరటుని; త్రిగర్తులు; నకులుని ద్రోణుండు; చేకితాన సాత్యకులను= చేకితానుని మరియు సాత్యకిని; కృప, హార్దిక్యులు= కృపుడు, హార్దిక్యుడు(కృతవర్మ); ధృష్టద్యుమ్నుని సౌభద్రుండు= అభిమన్యుడు; సాల్వ, కేకయలను= సాల్వుని కేకయులను; ధృష్టకేతు ఘటోత్కచులు= ధృష్టకేతుడు, ఘటోత్కచుడును; నీ కొడుకులన్= నీ కుమారులను; తలపడిరి= మార్కొన్నారు; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; తాను; మద్రేశ్వరున్= శల్యుని; తాఁకెన్= ఎదిరించాడు; ఇట్లు; సంకుల+సమరంబు+అయినన్= సందడి యుద్ధం జరుగగా; అస్త్ర+శస్త్ర+సంఘట్టనంబునన్= మంత్రబాణాలు బాణాల ఒరపిడి చేత; వెడలు+మంటలు= ఏర్పడిన అగ్నిజ్వాలలు; మింటన్= ఆకాశమందు; అడరి= విజృంభించి; మధ్యాహ్న+ప్రచండంబులై+ఉన్న= పట్టపగలు తీక్ష్ణంగా వెలుగొందే; చండకిరణ+కిరణంబులన్= సూర్యుడి కిరణాలను; మగిడింపన్= పారద్రోలగా; అరదంబులున్= రథాలును; తాఁకి= స్పృశించి; పడి+పొరలు= నేలమీదపడి ఇటునటు కదలు; కరులును= ఏనుగులును; కరి హస్త+ఆకర్షణ+విధ్వస్తంబులు+అగు= ఏనుగుల తొండాలచే ఆకర్షింపబడి - చెడిపోయిన రథంబులును; తురగ ఖుర పుట విఘట్టిత గాత్రులు+అగు= గుర్రాల గిట్టలచే త్రొక్కబడిన కళేబరాలు గల; పదాతులును= కాలి భటులును; పదాతి వర్గ+అనర్గళ ప్రహార ధారాళ రక్త సిక్తంబులు అగు= కాలిభటుల సమూహాల యొక్క ఎడతెగని దెబ్బలచే బాగుగ కారిన నెత్తురుతోతడిసిన; ఘోటకంబులున్+ఐ= గుర్రాలును అయి; చూచు; ఖేచరులకున్= ఆకాశంలో సంచరించే వేల్పులకు; వెక్కసంబు+అయ్యెన్= మిక్కిలిదుస్సహమైంది; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కౌరవసైన్యం వెనుకకు మరలింది. దుర్యోధనుడు ధైర్యంతో ముందుకు వచ్చి, చేయి ఊపి - తన సేనకు ప్రోత్సాహం కల్పించాడు. శకుని - సైంధవుడు సింధు గాంధార సౌవీర త్రిగర్త కళింగాది దేశాల సేనలను తరలించుకొని వచ్చారు. వారు దుశ్శాసనుడి నాయకత్వంలో భీముడిని, అర్జునుడిని మార్కొన్నారు. ధర్మరాజు - చేది కాశ కరూశ పాంచాల సైన్యాలను ప్రోత్సహించగా, ధృష్టద్యుమ్నుడు ఆ సేనలకు నాయకత్వం వహించాడు. ఆ సంగ్రామంలో విందానువిందులు - కాశీరాజును సైంధవుడు - భీమసేనుడిని వికర్ణుడు, సహదేవుడిని,

చిత్రసేనుడు, శిఖండిని - దుర్యోధనుడు, విరాటుడిని - త్రిగర్తులు, నకులుడిని - ద్రోణుడు, చేకితాన సాత్యకులను - కృపుడు - కృతవర్మ, ధృష్టద్యుమ్నుడిని - అభిమన్యుడు, సాల్వుడిని, కేకయులను - ధృష్టకేతువు, ఘటోత్కచుడు - కౌరవరాజు పుత్రులను కృతవర్మ యుధిష్ఠిరుడు - శల్యుడిని ఎదిరించి యుద్ధం చేశారు. ఈ విధంగా సంకుల సమరం మధ్యాహ్నం వరకు సాగింది. అస్త్రశస్త్రాల తాకిడి వలన రేగిన మంటలు పట్టపగలు ప్రకాశించే సూర్యుని వేడి కిరణాలను మరపింప చేశాయి! ఇక - రథాలను తాకి, నేలకు ఒరిగిన ఏనుగుల పీనుగులు, ఏనుగుల తొండాల తాకిడికి నుగ్గునుగ్గు అయిన తేరులు - గుర్రాల గిట్టల సందుల నలిగి చచ్చిపోయిన కాలి భటులు - కాలిభటుల తాకిడికి ఆగకుండా కారిన నెత్తురు ధారలలో పొరలే గుర్రాలు - ఆకాశంలో చరిస్తూ చూచే వేల్పులకు దుస్సహంగా కనిపించాయి.

**విశేషం:** ఇంతటి సంకుల సమరంలో కూడా - ఉభయ పక్షాలలోని వీరులూ తమ ప్రతివీరులను ఎన్నుకోవటంలో గల నేర్పు గమనింపదగినట్టిది. ఉదాహరణకు ధర్మరాజు శల్యుడిని మార్కొన్నాడు.

**క. భీముని పోరుట గడును । ద్దామం బై మెఱయుటయుఁ బితామహుఁడు శర**
**స్తోమవిదారితుఁ జేసె మ । హామర్షోత్కర్షుఁ డగుచు నతనిం బెలుచన్. 296**

**ప్రతిపదార్థం:** భీముని పోరుట= భీముని యొక్క పోరాటం; కడున్= మిక్కిలి; ఉద్దామంబు+ఐ= భయంకరమై; మెఱయుటయున్= ప్రకాశించటంచేత; పితామహుఁడు= తాతగారు(భీష్ముడు); అతనిన్= భీముని; పెలుచన్= మిక్కుటముగా; మహా+అమర్ష+ఉత్కర్షుఁడు+అగుచున్= మిక్కుటమగు కోపముచే విజృంభించిన వాడు అగుచు; శర స్తోమ విదారితున్ చేసెన్= బాణముల చేత గాయములు పొందినవాడినిగా చేశాడు.

**తాత్పర్యం:** భీముడి పోరాటం మిక్కిలి భయంకరంగా సాగింది. భీష్ముడికి మిక్కుటమైన కోపం వచ్చి విజృంభించి- భీముడిపై పెక్కు బాణాలు ప్రయోగించి అతని శరీరం తూట్లు పడేటట్లు చేశాడు.

**విశేషం:** భీష్ముడికి పాండవులమీద ప్రేమ ఉంది. అయితే భీముడికి భీష్ముడిపై ఏమంత ప్రేమలేదు. అందుచే లోకువ చేసి భీముడు విజృంభించి భీష్ముడిని లెక్కచేయలేదు. ఇక - భీష్ముడికి కోపం వచ్చింది. అతడు ప్రేమాభిమానాలు ప్రక్కకు నెట్టి - భీముని గాయపరచాడు. భీష్ముడు అంతపని చేస్తాడని ఎవరూ ఊహించలేదు. సాత్యకికి పట్టరాని కోపం వచ్చింది.

**క. కనుఁగొని సాత్యకి యేనుం । గునకు సిడులు సూపినట్లు కోపంబున భీ**
**ష్మునిమీఁదఁ గవిసి యుజ్జ్వల । సునిశిత భల్లంబు లేసె సురలు నుతింపన్. 297**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి(భీష్ముడు భీముడిని గాయపరచటం చూచి); సాత్యకి; ఏనుంగునకున్= ఏనుగును; సిడులు+చూపినట్లు= బరికోలలు చూపినట్లు; కోపంబునన్= ఆగ్రహంతో; భీష్మునిమీఁదన్= భీష్ముడిమీద; కవిసి= మార్కొని; ఉజ్జ్వల సునిశిత భల్లంబులు= ప్రకాశమానమైన వాడియైన ఈటె బాణాలు; సురలు= దేవతలు; నుతింపన్= ప్రస్తుతింపగా; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** తాతయైన భీష్ముడు - భీముడిపై - మనుమడు అనే అభిమానం ఏమాత్రం లేకుండా వాడి బాణాలు ప్రయోగించి అతని శరీరాన్ని తూటులు పడేటట్లు చేయటం చూచేసరికి సాత్యకి ఒళ్ళుమండిపోయింది. బరికోల చూసిన ఏనుగువలె ఆతడు భీష్ముడిపై - దేవతలు ప్రస్తుతింపగా, గొప్ప వాడి బాణాలు గుప్పించాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఏనుగునకు సిళ్ళు చూపినట్లు . సిళ్ళు అనగా ఏనుగును పొడిచే బరిగోల. సిళ్లు చూస్తే - ఏనుగు రెచ్చిపోతుంది. ఈ ప్రయోగంలోని సారస్యం గమనింపదగినట్టిది.

**ఆ. అలిగి యతఁడు సూతుతలఁ దెగనేసిన । నధిప! వృష్ణివీరునరద మిట్టు**
**నట్టుఁ దిగిచె నప్పు డాకుల గతి ఘోట । కములుఁ దద్బలంబు గలఁగఁ బడఁగ. 298**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అతఁడు= భీష్ముడు; అలిగి= కోపించి; సూతు+తలన్= సాత్యకి యొక్క సారథి తలను; తెగన్+ఏసినన్= తెగేటట్లు బాణం ప్రయోగింపగా; వృష్ణి+వీరు+అరదము= వృష్ణివంశానికి చెందిన వీరుని రథం-సాత్యకి తేరు; అప్పుడు; ఆకుల+గతిన్= కలత చెందిన రీతిగా; ఘోటకములు= గుర్రాలు; తద్+బలంబున్= సాత్యకి సేన; కలఁగన్+పడఁగన్= చీకాకు చెందగా; ఇట్టున్+అట్టున్= ఇటు అటు; తిగిచెన్= మరలిపోయింది;

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు కోపంతో సారథి తలను త్రుంచగా సైన్యం కలత చెందింది. భయంతో గుర్రాలు సాత్యకి రథాన్ని అటూ ఇటూ ఈడ్చాయి.

**క. మరలుపుఁడు పట్టుఁ డిట తెం । డరదమునకు వేగవేగ యడ్డము సనుఁ డా**
**తురుఁ డయ్యెను సాత్యకి సె । చ్చెరఁ జొరుఁ డనునులివు వారిసేనఁ జెలంగెన్. 299**

**ప్రతిపదార్థం:** మరలుపుఁడు= మరలించండి; పట్టుఁడు= పట్టుకోండి; ఇటు+తెండు= ఇక్కడకు తీసికొనిరండి; అరదమునకున్= తేరుకు; వేగవేగ= శీఘ్రంగా; అడ్డము+చనుఁడు= అడ్డంగా నిలవండి; సాత్యకి= సాత్యకి; ఆతురుఁడు+అయ్యెను= ఆపన్నుడు అయినాడు; చెచ్చెరన్= వేగంగా; చొరుఁడు= లోపలికి వెళ్ళండి; అను+ఉలివు= అనే ధ్వని; వారిసేనన్= పాండవసేనలో; చెలంగెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** 'సాత్యకి ఆపదలో చిక్కుకొన్నాడు. అతడిని ఆదుకోండి; రథాన్ని మరలించండి; పట్టుకోండి; ఇక్కడకు తీసికొనిరండి. అతడి రథానికి అడ్డం నిలవండి. వేగంగా లోపలికి చొరబడండి' అనే అరుపులు పాండవసేనలో వినిపించాయి.

**తే. వికలరథుఁడగు నావృష్ణివీరు మీఁద । నేయ నొల్లక మీ తండ్రి యెసక మెసఁగ**
**బాహుబలమునఁ బాండవవ్యూహవిదళ । నంబు సేయఁ దొడంగె భూనాథముఖ్య! 300**

**ప్రతిపదార్థం:** భూనాథముఖ్య!= ఓ రాజ శ్రేష్ఠుడా, ధృతరాష్ట్ర మహారాజా!; వికల+రథుఁడు+అగు= పాడైపోయిన తేరు గలవాడగు; ఆ+వృష్ణి+వీరుమీఁదన్= సాత్యకిమీద; ఏయన్+ఒల్లక= బాణాలు ప్రయోగించటానికి ఇష్టంలేక; మీ+తండ్రి= భీష్ముడు; ఎసకము+ఎసఁగన్= విజృంభించి; బాహు+బలమునన్= పరాక్రమ శక్తితో; పాండవ+వ్యూహ+విదళనంబు= పాండవులు పన్నిన మొగ్గరమును ఖండించటం; చేయన్+తొడంగెన్= సలుపసాగాడు.

**తాత్పర్యం:** రాజులలో శ్రేష్ఠుడైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!, విరథుడైన సాత్యకి మీద బాణాలు వేయడం ఇష్టపడక, నీ తండ్రియైన భీష్ముడు విజృంభించి పాండవులు పన్నిన వ్యూహాన్ని భుజ బలంతో ఛేదింపసాగాడు.

**విశేషం:** విరథుడిపై ఆయుధ ప్రయోగం చేయుటం వీరమర్యాద కాదు. జగదేకవీరుడు కౌరవ సేనాపతియైన భీష్ముడు- ఆ వీర మర్యాద పాటించటం చేత సాత్యకి సజీవుడై బయటపడ్డాడు.

**క. అంత విరాటుఁడు లయకా । లాంతకుఁడుం బోలెఁ బేర్చి యతిరభసమునన్**
**శాంతనవుఁ గదిసి యేసెం । గుంతీసుతు లలర మూఁడు క్రూరాస్త్రములన్. 301**

**ప్రతిపదార్థం:** అంతన్= పిదప; విరాటుఁడు= విరాటరాజు; లయకాల+అంతకుఁడున్+పోలెన్= ప్రళయకాలము నందలి యమునివలె; అతి+రభసమునన్= మిక్కుటమగు ఆటోపంతో; పేర్చి= అతిశయించి; శాంతనవున్= శంతనుకొడుకును(భీష్ముని);

కదిసి= మార్కొని; కుంతీసుతులు= కుంతీపుత్రులు(పాండవులు); అలరన్= సంతోషించగా; మూఁడు+క్రూర+అస్త్రములన్= మూడు క్రూరములైన మంత్రబాణాలను;ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** పిదప - విరాటరాజు ప్రళయ సమయంలో యముడివలె విజృంభించి - మిక్కుటమైన సంరంభంతో తాకి - పాండవులు సంతోషించేటట్లుగా మూడు ఘోర బాణాలు భీష్ముడిపై ప్రయోగించాడు.

**క. ఏసి తురంగంబుల నో। నేసినఁ గోపించి భీష్ముఁ డిషుదశకమునం**
**జేసె నతని రక్తజలో। ద్భాసితగాత్రుఁడుగ రెండుబలములుఁ బొగడన్. 302**

**ప్రతిపదార్థం:** ఏసి=వేసి; తురంగంబులన్= గుర్రాలను; నోన్+ఏసినన్ = నొచ్చునట్లుగా కొట్టగా; కోపించి= ఆగ్రహం చెంది; భీష్ముఁడు= భీష్ముడు; ఇషు+దశకమునన్= పది బాణాలతో; రక్తజల+ఉద్భాసిత+గాత్రుఁడుగన్= రక్తధారలతో మిక్కుటంగా ప్రకాశించే శరీరంగలవాడిగా; రెండు+బలములున్= ఉభయసేనలు (కౌరవుల సేనలు+పాండవుల సేనలు); పొగడన్= ప్రశంసించేటట్లుగా; అతనిన్= విరాటరాజును; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** విరాటుడు భీష్ముడి గుర్రాలను నొప్పింపగా, ఆయనకు కోపం వచ్చింది. ఆయన విరాటుడిపై పది బాణాలు గుప్పించి, అతడి శరీరంపై రక్తధారలు ప్రకాశించేటట్లు బాణాలు ప్రయోగించాడు. భీష్ముడి శరప్రయోగ విన్యాసం చూచి, కౌరవ సేనలే గాక పాండవ సేనలు కూడా ప్రశంసించాయి.

**వ. అట్టి యెడ. 303**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అప్పుడు.

**శా. గంగానందనుఁ దాఁక నర్జునుఁడు వోఁగా నడ్డమై రాజు మె**
**చ్చం గేలీగతి యుల్లసిల్లఁ జని యశ్వత్థామ షడ్బాణవి**
**ద్ధాంగుం జేసెఁ గిరీటి నవ్వుచుఁ దదీయంబైనచాపంబు ద్రుం**
**చెం గోదండము వే ఱొకండు గొని యేసెన్ ద్రౌణి పె క్కమ్ములన్. 304**

**ప్రతిపదార్థం:** గంగా+నందనున్= గంగకొడుకును(భీష్ముని); తాఁకన్= మార్కొనుటకు; అర్జునుఁడు= అర్జునుడు; పోఁగాన్= వెళ్ళగా; అడ్డమై= అడ్డుపడుటకు; రాజు= దుర్యోధనుడు; మెచ్చన్= ప్రశంసించేటట్లుగా; కేలీ+గతి= ఆటరీతి; ఉల్లసిల్లన్= శోభిల్లగా; చని= వెడలి; అశ్వత్థామ= అశ్వత్థామ; షట్+బాణ విద్ధ+అంగున్+చేసెన్= ఆరు బాణాలు గ్రుచ్చుకొన్న దేహం గలవానినిగా; చేసెన్= చేశాడు; కిరీటి= అర్జునుడు; నవ్వుచున్; తదీయంబు+ఐన= ఆతని; చాపంబు= విల్లు; త్రుంచెన్= ఖండించాడు; ద్రౌణి= ద్రోణుని కొడుకు; వేఱు+ఒకండు= ఇంకొక; కోదండంబు= విల్లు; కొని= గ్రహించి; పెక్కు+అమ్ములన్= అనేక బాణాలను; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** భీష్ముడిని మార్కొనేటందుకు అర్జునుడు వెళ్ళుతుండగా - ప్రభువైన దుర్యోధనుడు సంతోషించేటట్లుగా; మధ్యలో అశ్వత్థామ అతడిని మార్కొని, ఆరు బాణాలు ప్రయోగించాడు. ఆ ఆరుబాణాలూ అర్జునుడి శరీరంపై గ్రుచ్చుకొన్నాయి. అయితే నవ్వుతూ, అశ్వత్థామ యొక్క విల్లును ఖండించాడు అర్జునుడు. అశ్వత్థామ మరో విల్లు గ్రహించి అర్జునుడిపై ఎన్నో బాణాలు గుప్పించాడు.

**క. గురుసుతు బెడిదపుటంపఱ । నరనారాయణులు నొచ్చినన్ నరుకడ క**
**న్నరుణం బగుటయుఁ దద్రుచి । పరంపరలతోన నిగిడె బాణచయంబుల్. 305**

**ప్రతిపదార్థం:** గురు+సుతు+బెడిదపు+అంపఱన్= అశ్వత్థామ యొక్క కఠినములైన బాణాలసమూహం చేత; నర+నారాయణులు= అర్జునుడు, శ్రీకృష్ణుడు; నొచ్చినన్= దెబ్బతినగా, నరు+కడకన్ను= అర్జునుని కన్ను చివరిభాగం; అరుణంబు అగుటయున్= ఎఱ్ఱబడుటయు; తద్+రుచి+పరంపరలతోన= ఆ ఎఱ్ఱని కాంతుల వరుసలతోనే; బాణచయంబుల్= అమ్ములగుంపులు; నిగిడెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** అశ్వత్థామ ప్రయోగించిన గట్టి బాణాలచేత అర్జునుడు, శ్రీకృష్ణుడు కలత చెందారు. అర్జునుడికి ఆగ్రహం వచ్చి అతని కన్నులు ఎఱ్ఱపడ్డాయి. ఆ ఎఱ్ఱని కన్నుల కాంతులతోనే అమ్ముల గుంపులు అశ్వత్థామపై ప్రసరించాయి.

**క. ఉఱక నరుఁ డట్టు మైమఱు । వఱువుళ్ళుగఁ జేసి లీల నంగము లెల్లం**
**బఱియలుగఁ జేయ నాతం । డఱుమెడలక మఱియు నేసె నధికరయమునన్. 306**

**ప్రతిపదార్థం:** ఉఱక= లెక్కచేయక; నరుఁడు= అర్జునుడు; అట్టు= ఆవిధంగా; మైమఱువు= కవచము; అఱువుళ్ళుగన్= శిథిలముగా; చేసి= ఒనరించి; లీలన్= ఆటగా; అంగములు+ఎల్లన్= అవయవాలు అన్నీ; పఱియలుగన్+చేయన్= బ్రద్దలు కొట్టగా; ఆతండు= అశ్వత్థామ; అధిక+రయమునన్= మిక్కుటమగు వేగంతో; మఱియున్= మరల; అఱుము+ఎడలక= ప్రతిఘటనము వదలక; ఏసెన్= బాణాలు ప్రయోగించాడు.

**తాత్పర్యం:** నరుడు- లెక్కచేయక, ఆవిధంగా అశ్వత్థామ కవచాన్ని ఛేదించి, ఆటాడు మాదిరిగా, అవయవాలను బీటలువారేటట్లుగా చేశాడు. అశ్వత్థామ ప్రతిఘటన వీడక, మరల మిక్కిలి వేగంగా అమ్ములు అర్జునుడిపై ప్రయోగించాడు.

**క. నొచ్చియుఁ బెనఁగినఁ గృపయును । మెచ్చు గదిరి విప్రుతోడ మెయికొని పో రి**
**ట్లచ్చుపడ నేటి కని వి । వ్వచ్చుఁడు గ్రేడించి యొండువలనికి నడచెన్. 307**

**ప్రతిపదార్థం:** నొచ్చియున్= నొప్పికలిగినప్పటికీ(విడువక); పెనఁగినన్= పోరాడగా; కృపయును= కరుణయు; మెచ్చు= గౌరవభావము; కదిరి= పెరిగి; విప్రుతోడన్= బ్రాహ్మణుడితో; మెయికొని= పూని; పోరు= పోరాటం; ఇట్లు= ఈ విధంగా; అచ్చుపడన్+ఏటికిన్+అని= ఏర్పడనేటికి అని భావించి; వివ్వచ్చుఁడు= అర్జునుడు; క్రేడించి= ప్రక్కకుతొలగి; ఒండు+వలనికిన్= వేరుచోటికి; నడచెన్= వెళ్ళాడు;

**తాత్పర్యం:** తాను దెబ్బతిని బాధపడుతున్నప్పటికీ, పోరాటం విరమించకుండా కొనసాగించిన అశ్వత్థామపై దయ, గౌరవం కలిగి, అర్జునుడు బ్రాహ్మణుడితో తీవ్రంగా యుద్ధం చేయటం ఎందు కని, లీలగా మరొకచోటికి వెళ్ళిపోయాడు.

**వ. తదనంతరంబ. 308**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= అటు పిమ్మట.

**తాత్పర్యం:** ఆ తరువాత.

**ఉ. భీముఁ డుదగ్రదర్పమున భీష్మునిపైఁ జన నడ్డమై కురు**
**గ్రామణి భల్లపంచకయుగంబున నాతని మేను సించుడున్**
**భీమదృఢక్షురప్రచయభిన్నతనుండుగఁ జేసె నాతఁ డా**
**భూమిపు నిట్లు నీదు ప్రియపుత్రకు లొండొరుతోడఁ బోరఁగన్. 309**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీముడు; ఉదగ్ర+దర్పమునన్= భయంకర గర్వంతో; భీష్మునిపైన్+చనన్= భీష్మునిమీదికి వెళ్ళగా; అడ్డము+ఐ= మధ్య నిలిచి; కురు+గ్రామణి= కురుపతి(దుర్యోధనుడు); భల్ల+పంచక+యుగంబునన్= పది బాణాలతో; ఆతని+మేను= భీముని శరీరం; చించుడున్= ఛేదింపగా; ఆఁతడు= భీముడు; ఆ భూమిపున్= ఆ రాజును( ఆ దుర్యోధనుడిని); భీమ+దృఢ+క్షుర+ప్రచయ+ భిన్న+తనుండుగన్= భయంకరములు, గట్టివియైన చుర కత్తి బాణాల సముదాయంతో గాయములు పడిన శరీరం గలవాడినిగా; చేసెన్= చేశాడు; ఇట్లు; నీ ప్రియ+పుత్రకులు= నీకు ప్రేమపాత్రులైన భీమదుర్యోధనులు; ఒండు+ఒరుతోడన్= ఒకరితో ఒకరు; పోరఁగన్= యుద్ధం చేయగా.

**తాత్పర్యం:** భీముడు భయంకరమైన గర్వంతో భీష్ముడిని మార్కొన్నాడు. దుర్యోధనుడు అడ్డం వచ్చి, పది బాణాలతో భీముడి శరీరం తూట్లు పడేటట్లు చేశాడు. భీముడు దుర్యోధనుడి శరరీం తూట్లు పడేటట్లు భయంకరమైన చురకత్తి బాణాలతో కొట్టాడు. ఈ విధంగా భీముడు - దుర్యోధనుడు భీకరమైన పోరాటం కొనసాగించుచుండగా.

**వ. కనుంగొను జనంబులు. 310**

**ప్రతిపదార్థం:** కనుంగొను= చూస్తున్న; జనంబులు= జనులు;

**తాత్పర్యం:** చూస్తున్న జనులు (ఇట్లా అనుకొన్నారు.)

**క. ' చండవిరోధితిమిరమా । ర్తాండు లనఁగఁదగినవీరు దమలో ని ట్లు**
**ద్దండతఁ బెనఁగుట ధృతరా । ష్ట్రుండవినయలోభముష్కరుం డగుటఁ జుమీ!' 311**

**ప్రతిపదార్థం:** చండ+విరోధి+తిమిర+మార్తాండులు= కోపంతో విజృంభించే శత్రువులు అనే చీకటిని పోగొట్టే సూర్యులు; అనఁగన్+తగిన= అని చెప్పదగిన; వీరు= వీరలు; తమలోన్= ఒకరితో ఒకరు; ఇట్లు; ఉద్దండతన్= ఘోరంగా; పెనఁగుట= విడువకుండా పోరాటం కొనసాగించటం; ధృతరాష్ట్రుండు; అవినయ లోభ ముష్కరుండు+అగుటన్ చుమీ!= గర్వంతో, దురాశతో కూడిన మూఢుడు, చెడ్డవాడు కావటంచేత సుమా!

**తాత్పర్యం:** విజృంభించే విరోధులనే చీకటిని పారద్రోలే సూర్యులనదగిన వీరిద్దరూ ఈ విధంగా ఘోరంగా పోరాడటం ధృతరాష్ట్రుడు గర్వంతో దురాశతో కూడిన మూఢుడు కావడం చేతనే సుమా!

**వ. అని రట్టియెడ. 312**

**ప్రతిపదార్థం:** అనిరి= అన్నారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. కురుపతికిఁ జిత్రసేనుఁడుఁ । బురుమిత్త్రుఁడు వేల్పుటేటి పుత్త్రుఁడుఁ బ్రా పై**
**యురవడిఁ దటిమిన వారికి । నరనందనుఁ డెదురుపడె గుణధ్వని సెలఁగన్. 313**

**ప్రతిపదార్థం:** కురుపతికిన్= దుర్యోధనునకు; చిత్రసేనుఁడున్+పురుమిత్రుఁడున్= చిత్రసేనుడు మరియు పురుమిత్రుడు; వేల్పు+ఏటి+పుత్రుఁడున్= మందాకినీ సుతుడు(భీష్ముడు); ప్రాపు+ఐ= తోడై; ఉరవడిన్= మిక్కుటమగు వేగంతో; తఱిమినన్= తోలగా; వారికిన్= వారికి; నర+నందనుఁడు= అర్జునుడి కొడుకు(అభిమన్యుడు); గుణ+ధ్వని= అల్లెత్రాటి మ్రోత; చెలఁగన్= ఒప్పగా; ఎదురుపడెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడికి చిత్రసేనుడు - పురుమిత్రుడు భీష్ముడు తోడుపడ్డాడు. వారు మిక్కిలి వేగంతో, సేనలను తరిమికొట్టగా, వారిని అర్జునకుమారుఁడు అభిమన్యుడు తన వింటి నారిని మ్రోగిస్తూ ఎదుర్కొన్నాడు.

**క. పురుమిత్త్రుని నే డుజ్జ్వల। శరముల గంగాతనూజు సప్తతి బాణ**
**స్ఫురణమునఁ జిత్రసేనునిఁ। బరమాంబకదశకమున విపాటితుఁ జేసెన్. 314**

**ప్రతిపదార్థం:** పురుమిత్త్రునిన్; ఏడు+ఉజ్జ్వల+శరములన్= ఏడు వాడిబాణాలతో; గంగాతనూజున్= భీష్ముడిని; సప్తతి,బాణ,స్ఫురణమునన్= డెబ్బది బాణాల తాకిడితో; చిత్రసేనునిన్; పరమ+అంబక+దశకమునన్= పదిగొప్ప బాణాలతో; విపాటితున్+చేసెన్= నొవ్వ చేశాడు.

**తాత్పర్యం:** ఏడు బాణాలతో పురుమిత్రుడిని, డెబ్భై అమ్ములతో భీష్ముడిని, పది వాడి బాణాలతో చిత్రసేనుడిని అభిమన్యుడు బాధించాడు.

**తే. ఎన్ని శరముల నభిమన్యుఁ డేసెఁ దమ్ముఁ। దారు నన్నియు శరములఁ దఱిమి చిత్ర**
**సేనపురుమిత్త్రు లతని నేసిరి నవోగ్ర। విశిఖములు నాటె భీష్ముఁ డవ్వీరు మేన. 315**

**ప్రతిపదార్థం:** తమ్మున్= తమను; అభిమన్యుఁడు= అభిమన్యుడు; ఎన్ని+శరములన్= ఎన్నిబాణాలతో; ఏసెన్= కొట్టాడో; తారున్= తాముకూడ; అన్నియు+శరములన్= అన్ని అమ్ములతో; చిత్రసేన, పురుమిత్త్రులు= చిత్రసేనుడు, పురుమిత్రుడును, అతనిన్= అతనిని, అభిమన్యుని; తఱిమి= ఎదుర్కొని; ఏసిరి= కొట్టారు; భీష్ముఁడు; ఆ+వీరు+మేనన్= ఆ వీరుని శరీరంపై; నవ+ఉగ్ర+విశిఖములు= భయంకరమైన తొమ్మిది బాణాలు; నాటెన్= గ్రుచ్చుకొనేటట్లు ప్రయోగించాడు.

**తాత్పర్యం:** తమను ఎన్ని బాణాలతో కొట్టాడో, అన్ని బాణాలతో చిత్రసేనుడు, పురుమిత్రుడు అభిమన్యుడిని ఎదుర్కొన్నారు. భయంకరములైన తొమ్మిది అమ్ములు బీష్ముడు అభిమన్యుడిపై ప్రయోగించాడు.

**ఉ. ఆతఁడు చిత్రసేనుని శరాసన మేడ్తెఱఁ ద్రుంచి ఘోటక**
**వ్రాతము నొంచి మైమఱువు వ్రచ్చి శరంబులు మేనఁ గ్రుచ్చి యు**
**ద్ద్యోతితుఁ డైనఁ జూచి కర ముద్ధతి రాజతనూజవర్గముల్**
**వే తఱియంగఁ జొచ్చి పొదివెం బటుమార్గణవృష్టి నాతనిన్. 316**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= అభిమన్యుడు; చిత్రసేనుని+శరాసనము= చిత్రసేనుని విల్లు; ఏడ్తెఱన్= పరాక్రమంతో; త్రుంచి= ఖండించి; ఘోటక+వ్రాతమున్= గుర్రాల సముదాయాన్ని; నొంచి= నొవ్వచేసి; మైమఱువు= కవచం; వ్రచ్చి= తూట్లుపడునట్లుగా చేసి; శరంబులు= బాణాలు; మేనన్= శరీరంలో; గ్రుచ్చి= నాటి; ఉద్ద్యోతితుఁడు+ఐనన్= ప్రకాశించుచుండగా; చూచి; కరము= మిక్కిలి; ఉద్ధతిన్= ఉరవడితో; రాజ తనూజ వర్గముల్= రాజపుత్రుల సముదాయం (చిత్రసేనుడు మున్నగు వారు); వే+తఱియంగన్+చొచ్చి= వేగంగా సమీపించి; ఆతనిన్= అభిమన్యుడిని; పటుమార్గణ+వృష్టిన్= గొప్ప అమ్ముల వానతో; పొదివెన్= ముట్టడించాయి.

**తాత్పర్యం:** అభిమన్యుడు - చిత్రసేనుడి ధనుస్సు వేగంగా ఖండించి, తేరు గుర్రాలను నొప్పించి, అతడి కవచాన్ని తూట్లు పడేటట్లుగా చేసి, శరీరాన్ని గాయపరచి ప్రకాశించటం చూచి, మిక్కిలి భయంకరంగా ఇతర రాజపుత్రులు వేగంగా సమీపించి, గొప్ప అమ్ముల వాన అతడిపై కురిపించారు.

**క. ఆ సౌభద్రుం డుగ్రపు । వేసవి దావాగ్ని శుష్కవిపినమ్ము నిరా**
**యాసంబుగ దరికొనుగతి । భాసితశరశిఖలు వారిపైఁ బరగించెన్. 317**

**ప్రతిపదార్థం:** ఆ+సౌభద్రుండు= ఆ అభిమన్యుడు(సుభద్రకొడుకు); ఉగ్రపు+వేసవి+దావాగ్ని= మండువేసవిలోని కార్చిచ్చు; శుష్క+విపినమ్మున్= ఎండిపోయిన అడవిని; నిస్+ఆయాసంబుగన్= ఆయాసం లేకుండా (సులువుగా); దరికొను గతిన్= కాల్చేటట్లుగా; భాసిత శర శిఖలు= ప్రకాశించే అమ్ములు అనే అగ్నిజ్వాలలు; వారిపై= చిత్రసేనుడు మున్నగు రాజకుమారులపై; పరగించెన్= వ్యాపింప జేశాడు.

**తాత్పర్యం:** ఆ అభిమన్యుడు మండు వేసవి కార్చిచ్చు ఎండిపోయిన అడవిని సులువుగా క్రమ్ముకొని కాల్చేటట్లుగా, ప్రకాశమానములు అయిన బాణాగ్ని జ్వాలలు ఆ కౌరవరాజ పుత్రులపై వ్యాపింప జేశాడు.

**క. రంగత్ప్రధనస్తుత్య తు । రంగముఁ డై తాండవాభిరతుఁ డగు హరులీ**
**లం గడఁగి వీరనృత్యము । సంగరరంగమునఁ జేసె శత్రులు మెచ్చన్. 318**

**ప్రతిపదార్థం:** రంగత్+ప్రధన+స్తుత్య+తురంగముఁడు+ఐ= ప్రకాశించే యుద్ధంలో పొగడదగిన గుర్రాలు కలవాడై; తాండవ+అభిరతుఁడు+అగు= నృత్యమందు ఇష్టం గలవాడైన; హరులీలన్= శివునివలె; కడఁగి= పూని; వీర+నృత్యము= పరాక్రమంతో కూడిన నాట్యం; శత్రులు+మెచ్చన్= శత్రువులు మెచ్చేటట్లుగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** యుద్ధభూమిలో అందరూ పొగడే ప్రకాశమానములు అయిన గుర్రాలు గల అభిమన్యుడు నాట్యకేళీ లోలుడు అయిన శివుడి వలె విజృంభించి శత్రువులు మెచ్చునట్టుగా సంగరరంగంలో పరాక్రమంతో కూడిన నృత్యం చేశాడు.

**వ. ఇట్లు పేర్చి కురుబలంబు నేర్చు నభిమన్యుఁ జూచి జనితమన్యుండై శుభలక్షణుండగు లక్ష్మణుండు. 319**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; పేర్చి= విజృంభించి; కురు+బలంబున్= కౌరవసేనను; ఏర్చు= దహించే; అభిమన్యున్+చూచి= అభిమన్యుని చూచి; జనిత+మన్యుండు+ఐ= పుట్టిన రోషం కలవాడై; శుభ+లక్షణుండు= మంగళప్రదమైన లక్షణాలు కలవాడగు; లక్ష్మణుండు= లక్ష్మణకుమారుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా విజృంభిస్తూ, కౌరవసేనను బాధిస్తున్న అభిమన్యుడిని చూచి, రోషంతో శుభలక్షణములు గల లక్ష్మణకుమారుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**అభిమన్యు లక్ష్మణకుమారుల యుద్ధము (సం. 6-69-30)**

**క. తలపడి నానాస్త్రము ల । గ్గలికం గురియుటయు నతఁడు కాండము లా టి**
**ట్టలమైన యలుక నాతని । లలితోరస్ స్థలమునం గలయ నాటించెన్. 320**

**ప్రతిపదార్థం:** తలపడి= మార్కొని; నానా+అస్త్రములు= పెక్కు మంత్రబాణాలు; అగ్గలికన్= ఉత్సాహంతో; కురియుటయున్= వర్షించగా; అతఁడు= అభిమన్యుడు; కాండములు+ఆఱు= ఆరు బాణాలు; ఇట్టలము+అయిన= గొప్పదైన; అలుకన్= కోపంతో; ఆతని= లక్ష్మణ కుమారుని యొక్క; లలిత+ ఉరస్+స్థలమునన్= కోమలమైన వక్షమునందు; కలయన్= వ్యాపించేటట్లుగా; నాటించెన్= గ్రుచ్చుకొనేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** లక్ష్మణకుమారుడు అభిమన్యుని మార్కొని పెక్కు మంత్ర బాణాలను ఉత్సాహంతో వర్షించాడు. అభిమన్యుడు - ఆరుబాణాలను అతిశయించిన కోపంతో లక్ష్మణకుమారుని కోమలమైన ఉరమును నాటునట్లుగా ప్రయోగించాడు.

**చ. తెరలక లక్ష్మణుండు దృఢదీప్తశరావలి పార్థపట్టిపైఁ**
**దొరఁగఁగఁజేసినం గినిసి తొల్త హయంబులఁ జంపి సారథిన్**
**ధరఁ బడ నాతఁ డేసె విరథత్వము నొందియు నీదు మన్మఁ డు**
**ద్ధురగతి శక్తి వైవ నది ద్రుంచె మహేంద్రునిమన్మఁ డమ్ములన్. 321**

**ప్రతిపదార్థం:** తెరలక= మరలక; లక్ష్మణుండు= లక్ష్మణకుమారుడు; పార్థ+పట్టిపైన్= అర్జునుడి పుత్రుడిపై(అభిమన్యుడిపై); దృఢ+దీప్త+శర+ఆవలి= గట్టివి ప్రకాశించునట్టివి అయిన అమ్ముల గుంపులు; తొరఁగఁగన్+ చేసినన్= తాకునట్లు చేయగా; కినిసి= కోపగించి; తొల్తన్= ముందుగ; హయంబులన్+చంపి= గుర్రాలను సంహరించి; సారథిన్; ధరన్+పడన్= భూమిమీద పడునట్లు; ఆతఁడు= అభిమన్యుడు; ఏసెన్= బాణాలు ప్రయోగించాడు; విరథత్వమున్+ఒందియున్= రథము లేకపోయినప్పటికీ; నీదు+మన్మఁడు= నీ పౌత్రుడు(లక్ష్మణకుమారుడు); ఉద్ధురగతిన్= వేగముగా; శక్తి= శక్తి అనే ఆయుధాన్ని; వైవన్= వేయగా; అది= ఆ శక్తిని; మహేంద్రుని+మన్మఁడు= దేవేంద్రుని పౌత్రుడు(అభిమన్యుడు); అమ్ములన్= బాణాలతో; త్రుంచెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** లక్ష్మణకుమారుడు - వెనుకంజ వేయక, అర్జునకుమారుడైన అభిమన్యుడిపై గట్టివాడిబాణాలు వేశాడు. అభిమన్యుడు ఆగ్రహంతో లక్ష్మణకుమారుడి గుర్రాలను మొదట సంహరించి తదుపరి సారథిని కూల్చివేశాడు. నీ మనుమడు లక్ష్మణకుమారుడు విరథుడైకూడా జంకక, 'శక్తి' ని అభిమన్యుడిపై విసిరాడు. ఆ శక్తిని దేవేంద్రపౌత్రుడైన అభిమన్యుడు తన బాణాలతో ఖండించాడు.

**ఆ. శక్తిఁ ద్రుంచి తీవ్రసాయక హతదేహుఁ । జేయఁ దొడఁగు నతని చేతి బలుపు**
**సూచి కృపుఁడు రాజసుతుఁ దన తేరిపై । నిడి తొలంగఁ దెచ్చె నెల్లఁ జూడ. 322**

**ప్రతిపదార్థం:** శక్తిన్+త్రుంచి= శక్తి అనే ఆయుధాన్ని ఖండించి; (లక్ష్మణకుమారుడిని-అభిమన్యుడు); తీవ్ర+సాయకహత+ దేహున్+చేయన్+తొడంగు= తీవ్రమైన శరాలతో కొట్టబడిన శరీరం గలవానిగా చేయటం మొదలు పెట్టిన; అతని చేతి బలుపు+చూచి= ఆ అభిమన్యుడి చేతిబలం చూచి; కృపుఁడు= కృపాచార్యుడు; రాజసుతున్= రాజపుత్రుని (లక్ష్మణ కుమారుని); ఎల్లన్+చూడన్= అందరూ చూస్తూ ఉండగా; తొలంగన్+తెచ్చెన్= అక్కడనుండి తప్పించి తెచ్చాడు.

**తాత్పర్యం:** శక్తిని ఖండించి, లక్ష్మణకుమారుని దేహం తూట్లు పడేటట్లుగా అభిమన్యుడు అమ్ములు గుప్పాడు. అభిమన్యుడి చేతి బలం కౌశలం చూచి, కృపుడు రాజకుమారుడైన లక్ష్మణకుమారుని తన రథం మీదికి ఎక్కించుకొని, ఆ స్థలం నుండి తప్పించి తెచ్చాడు.

**విశేషం:** ఎల్లఁజూడ - ఎల్ల అనునది సర్వశబ్ద అమహద్రూపము. ఇక్కడ అందఱు అనే అర్థంలో మహద్బహువచనరూపం సముచితం. ఎల్లరు - అని. ఇక్కడ 'నృపుఁడు చూడ' అనే పాఠాంతరం ఉన్నది. అది లెస్స.

**క. కురురాజు యోధవీరులఁ । బురికొలుపుచు భీష్ముఁ డపుడు పోరికి నడరం**
**గరిహయనరశరనిబిడత । ధరణి జలదనిబిడగగనతలముం బోలెన్. 323**

**ప్రతిపదార్థం:** కురురాజు యోధ వీరులన్= కౌరవరాజు యొక్క సేనలో యుద్ధం చేసే శూరులను; పురికొలుపుచున్= ప్రోత్సహిస్తూ; భీష్ముఁడు= భీష్ముడు; పోరికిన్= యుద్ధానికి; అడరన్= విజృంభింపగా; కరి, హయ, నర, శవ నిబిడతన్= ఏనుగులయొక్క, గుఱ్ఱాలయొక్క, మనుష్యులయొక్క కళేబరాల సాంద్రతచేత; ధరణి= (యుద్ధ) భూమి; జలదనిబిడ గగనతలమున్= మబ్బులతో దట్టంగా నిండిన ఆకాశ ప్రదేశమును; పోలెన్= అనుకరించింది.

**తాత్పర్యం:** కౌరవసేనలోని యోధవీరులను ప్రోత్సహిస్తూ భీష్ముడు అపుడు పోరాటంలో విజృంభింపగా, ఏనుగుల గుఱ్ఱాల, మనుష్యుల పీనుగులతో దట్టమైన నేల మబ్బులతో దట్టంగా కన్పించే ఆకాశంవలె అగుపడింది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. సాత్యకి యప్పు డేచి శరజాలము చిత్రలఘుస్ఫుటత్వ సాం**
**గత్య విరాజమానముగఁ గౌరవసేనఁ గలంగఁ జేసి యౌ**
**ద్ధత్యమునం దనర్చిన నుదాత్తమనస్కుఁడు సౌమదత్తి యా**
**హుత్యభిరామవహ్ని క్రియ నుజ్జ్వలుఁ డై వెసఁ దాఁకె నాతనిన్.** 324

**ప్రతిపదార్థం:** అప్పుడు; సాత్యకి; ఏచి= విజృంభించి; శర+జాలము= అమ్ముల సముదాయం; చిత్ర లఘు స్ఫుటత్వ సాంగత్య విరాజమానముగన్= అచ్చెరువుగ, తేలికగా, లక్ష్యశుద్ధితో వెలుగొందునట్లుగా; కౌరవ+సేనన్= కౌరవసేనను; కలంగన్+చేసి= కలతనొందునట్లు చేసి; ఔద్ధత్యమునన్+తనర్చినన్= గర్వముతో విజృంభించగా; ఉదాత్త+మనస్కుఁడు= గొప్ప మనస్సు కలవాడు; సౌమదత్తి= భూరిశ్రవసుడు; ఆహుతి+అభిరామ వహ్నిక్రియన్= హోమంలో ఆహుతి వేయగా అందగించిన అగ్నివలె; ఉజ్జ్వలుఁడు+ఐ= ఎక్కువగా మండినవాడై= మిక్కుటముగా ప్రకాశించినవాడై; ఆతనిన్= సాత్యకిని; వెసన్= వేగంగా; తాఁకెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు సాత్యకి విజృంభించి బాణసముదాయాన్ని కౌరవసేనపై గుప్పించాడు. అతని బాణప్రయోగ విన్యాసం - ఆశ్చర్యకరం. లక్ష్యములను సులువుగా స్ఫుటంగా తాకి, కౌరవసేనను కలచివేశాయి. గొప్ప మనస్సుగల భూరిశ్రవసుడు కూడా ఆహుతి వేల్చబడిన అగ్నివలె మిక్కుటంగా జ్వలించి, సాత్యకిని మార్కొన్నాడు.

**విశేషం:** 1. ఆహుతి లేసినపుడు అగ్ని ప్రజ్వలిస్తుంది. అదే విధంగా సాత్యకి వేసిన బాణాలు - భూరిశ్రవసుడిని ప్రజ్వలింపచేశాయి. ఇక్కడ 'క్రియ' ఉపమావాచకం. ఆ అర్థం తెలుగులోనే ఉన్నది. అందుచే 'హ్ని' గురువు కాదు.

**చ. తలపడి యంత్య కాల శిఖిదారుణభంగి నమేయమార్గణా**
**ర్చులు వరగించుడున్ భయము సొచ్చి జనార్దనుతమ్ముతోడి యో**
**ధులు పిఱుసన్నఁ దత్సుతులు దోర్బలదుర్దములై పదుండ్రు న**
**గ్గలి నెదిర్చి యి ట్లనిరి కౌరవసత్తముతో నుదగ్రతన్.** 325

**ప్రతిపదార్థం:** తలపడి= ఎదుర్కొని; అంత్య కాల శిఖి దారుణ భంగిన్= ప్రళయకాలమునందలి అగ్నివలె భయంకరంగా; అమేయ+మార్గణ+అర్చులు= అపరిమిత బాణాల జ్వాలలు; పరగించుడున్= వ్యాపింప చేయగా; జనార్దనుతమ్ముతోడి యోధులు= సాత్యకి సహచరులైన వీరులు; భయము+చొచ్చి= వెరచి; పిఱు+సన్నన్; వెనుకకు మరలిపోగా; తద్+సుతులు= ఆతని కొడుకులు; దోర్బల+దుర్దములు+ఐ= అడ్డగింప లేని పరాక్రమం కలవారలై; పదుండ్రు= పదిమంది; అగ్గలికన్+ఎదిర్చి= ఉత్సాహంతో మార్కొని; కౌరవ+సత్తముతోన్= కురు వీరులలోని శ్రేష్ఠుడితో- భూరిశ్రవుడితో; ఉదగ్రతన్= గర్వంతో; ఇట్లు+అనిరి= ఈ విధంగా చెప్పారు.

**తాత్పర్యం:** భూరిశ్రవసుడు - ప్రళయకాలమందలి అగ్నివలె విజృంభించి, అమ్ములనే అగ్నిజ్వాలలు ప్రవర్తిల్లచేయగా భయపడి, సాత్యకితో పాటు యుద్ధం చేస్తున్న యోధులు వెనుకకు మరలారు. అప్పుడు సాత్యకి కొడుకులు పదిమంది - వారింపరాని పరాక్రమంతో ఉత్సహించి, కౌరవశ్రేష్ఠుడైన భూరిశ్రవసుడితో గర్వంగా ఇట్లు అన్నారు:

**క. ' భూరిశ్రవసుఁడ! యెక్కటి వీర । వినోదంబు సలుపు వేడుకమెయి దు**
**ర్వారత వచ్చితి మొక్కరుఁ గోరి । కొనుము సంగరమునకున్ మాలోనన్.' 326**

**ప్రతిపదార్థం:** భూరిశ్రవసుఁడ!= ఓ భూరి శ్రవసుడా!; ఎక్కటి+వీర+వినోదంబు= ఏకాంతయుద్ధమును ప్రీతితో; సలుపు+ వేడుక+మెయిన్= చేయాలనే ఉత్సాహంతో; దుర్వారతన్= అడ్డగించటానికి వీలులేని విధంగా; వచ్చితిమి= అరుదెంచాము; మాలోనన్= మా పదిమందిలో; ఒక్కరున్= ఒకడిని; సంగరమునకున్= యుద్ధానికి; కోరుకొనుము= ఎన్నుకో.

**తాత్పర్యం:** 'ఓ భూరిశ్రవసుడా! మేము 'ఎక్కటికయ్యం' చేయాలనే సరదాతో వచ్చాము. ఎవరూ మమ్మ అడ్డగించలేరు. మాలో ఎవరో ఒకరిని నీవు ఎన్నుకొని యుద్ధం చేయవచ్చు.'

**విశేషం:** ఎక్కటి కయ్యము= ద్వంద్వ యుద్ధం. ఒక వీరుడు - మరొక వీరుడితో చేసే ఏకాంత యుద్ధం. వారిరువురి మధ్య జరిగే పోరాటంలో ఇతరులు పాల్గొనరు. ఇది మహాభారత కాలంనాటి వీరమర్యాద.

**చ. ' అన విని నవ్వి యొక్కఁడు మదస్త్రబలంబున కోర్వఁ డోపినన్**
**సునిశిత బాణముల్ వఱపి సూరెల నందఱు నొక్కపెట్ట యే**
**పు నెఱపుఁ'డన్న నా రథికపుంగవు లేయ నతండు నమ్ము లె**
**ల్లను దునుమాడి వారిఁ జటులస్ఫురితాంబక వృష్టి ముంచినన్. 327**

**ప్రతిపదార్థం:** అనన్+విని+నవ్వి= అని చెప్పగా ఆలకించి, నవ్వి; ఒక్కఁడు= ఒకడు; మత్+అస్త్ర+బలంబునకున్= నాయొక్క మంత్రబాణశక్తికి; ఓర్వఁడు= సరిపోడు; ఓపినన్= మీకు చేతనైతే; సునిశిత+బాణముల్= మిక్కిలి వాడిఅమ్ములు; వఱపి= ప్రయోగించి; సూరెలన్= ప్రక్కల; అందఱున్= అందరును; ఒక్క+పెట్టన్= ఒకేసారి; ఏపు నెఱపుఁడు+అన్నన్= మీ విజృంభణ చూపుడు అని చెప్పగా; ఆ రథిక పుంగవులు= ఆ వీరవరులు; ఏయన్= బాణాలతో కొట్టగా; అతండు= ఆ భూరిశ్రవసుడు; అమ్ములు+ఎల్లను= ఆ బాణాలను అన్నింటినీ; తునుమాడి= త్రుంచి; వారిన్= వారిని; చటుల+స్ఫురిత+అంబక వృష్టిన్= గాఢత ప్రకటించే అమ్ముల వానలో; ముంచినన్= ముంచగా.

**తాత్పర్యం:** అని చెప్పగా విని భూరిశ్రవసుడు నవ్వి ఈ రీతిగా అన్నాడు. 'మీలో ఏ ఒక్కరుగాని నా బాణధాటికి ఆగలేరు. మీకు చేతనైతే - మీరందరూ నా చుట్టుప్రక్కల చేరి - నా మీద వాడి బాణాలు ప్రయోగించి పోరాడండి.' అనగా వారు కౌరవ శ్రేష్ఠుడైన భూరిశ్రవసుడిపై బాణాలు ప్రయోగించారు. భూరిశ్రవసుడు వారి బాణాలను ఖండించి వారినందరిని అమ్ముల వానలో ముంచాడు.

**క. పొలి వోని శౌర్య రేఖం । జెలఁగుచు వార్ష్ణేయు లతనిఁ జేడ్పడఁ బెక్క**
**మ్ముల నొవ్వ వేసినం గడు । నలిగి శరాసనము లెల్ల నాతఁడు ద్రుంచెన్. 328**

**ప్రతిపదార్థం:** పొలివోని= మొక్కవోవని (పొలి+పోని); శౌర్య+రేఖన్+చెలఁగుచున్= పరాక్రమ స్ఫూర్తితో ఒప్పుతూ; వార్ష్ణేయులు= వృష్ణివంశానికి చెందిన వారు(సాత్యకి కొడుకులు); అతనిన్= భూరిశ్రవుని; చేడ్పడన్= నొచ్చునట్లుగా; పెక్కు+అమ్ములన్=

బహుబాణాలతో; నొవ్వన్+ఏసినన్= కలత చెందింపగా; ఆతఁడు= భూరి శ్రవసుడు; కడున్+అలిగి= మిక్కిలి కోపించి; శరాసనములు+ఎల్లన్= (వారి); ధనుస్సులను అన్నింటినీ; త్రుంచెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** వృష్ణి వంశీయులు - సాత్యకి కొడుకులు మొక్కవోని పరాక్రమంతో శోభిల్లుతూ, కురువీరుడు భూరిశ్రవసుడిపై పెక్కు బాణాలు వర్షించారు. భూరిశ్రవుడు మిక్కుటమైన కోపంతో వారి ధనువులు అన్నింటినీ ఖండించాడు.

**క. కోదండదశకశీఘ్ర । చ్ఛేదం బొనరించి యపుడ శిరములు పదియున్**
**భూదేవికి బలిగా ని । ష్పాదించెన్ గౌరవేంద్రబలములు సెలఁగన్. 329**

**ప్రతిపదార్థం:** కోదండ దశక శీఘ్ర+ఛేదంబు+ఒనరించి= వేగంగా పది ధనుస్సులు ఖండించి; అపుడు+అ= అప్పుడే; శిరములు+పదియున్= పది తలకాయలు; భూదేవికిన్= నేలతల్లికి; బలిగాన్= పూజార్పణంగా; కౌరవ+ఇంద్రు+బలములు= కురురాజుసేనలు; చెలఁగన్= శోభిల్లగా; నిష్పాదించెన్= సిద్ధింపజేశాడు.

**తాత్పర్యం:** పది ధనుస్సులను ఖండించి వెనువెంటనే పదితలకాయలు ఖండించి భూరి శ్రవసుడు - భూదేవికి 'బలి'గా సమర్పించాడు. కౌరవ సేనలు ఉప్పొంగిపోయాయి.

**విశేషం:** 'బలి' దేవతల ప్రీతి కోసం - సమర్పించే కానుక. మొదట పూజా విశేషంగా ఆరంభించిన 'బలి' ప్రదానం 'జంతుబలిగా' 'నరబలి'గా కూడా యుగయుగాంతరాలలో పరిణమించింది.

**వ. ఇట్లు వడిన కొడుకులం గని వృష్ణివీరుండు. 330**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; పడిన= కూలినట్టి; కొడుకులన్= పుత్రులను; కని= చూచి; వృష్ణి+వీరుండు= వృష్ణిజాతికి చెందిన వీరుడు= సాత్యకి.

**తాత్పర్యం:** ఈ విధంగా నేలకూలిన కొడుకులను సాత్యకి చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. వగపును గోపముం గదుర వైరిబలంబు దలంకఁ దేరు పై**
**నొగనొగ దాఁకఁగాఁ బఱపి నుగ్గుగఁ గౌరవసూతు నేసి బె**
**ట్టుగఁ దురగంబులం దునుముడున్ వెస నాతఁడు నట్ల చేసెఁ బా**
**టిగఁ గరవాలముల్ గొని వడిన్ దిగి నేలకు దాఁటి రిద్దఱున్. 331**

**ప్రతిపదార్థం:** వగపును= దుఃఖమూ, కోపమున్= ఆగ్రహమూ; కదురన్= కూడగా; వైరి బలంబు= శత్రుసేన; తలంకన్= కలత చెందగా; తేరుపైన్= రథంపై; నొగ+నొగ+తాఁకగాన్= కూబరములు ఒకదానితోనొకటి రాపిడి చెందగా(తన రథమును శత్రు రథముతో ఒరయునట్లుగా); పైన్= మీదికి; పఱపి= తోలి; కౌరవ+సూతున్= కౌరవుని సూతుని (భూరిశ్రవసుడి సారథిని); నుగ్గుగన్+ఏసి= చిన్ని ఖండాలుగా చేసి - సంహరించి; బెట్టుగన్= అధికముగా; తురగంబులన్= గుర్రాలను; తునుముడున్= సంహరించగానే; వెసన్= వేగంగా; ఆతఁడున్= భూరిశ్రవుడుగూడ; అట్లు+అ= అదే విధంగా; పాటిగన్= సరిగా; చేసెన్= చేశాడు; కరవాలముల్+కొని= కత్తులు పట్టి; వడిన్= వేగంగా; నేలకున్ దిగి= భూమిపైకి దిగి; ఇద్దఱున్= ఇరువురును; దాఁటిరి= లంఘించారు.

**తాత్పర్యం:** కోపమూ, దుఃఖమూ పిరిగొనగా, శత్రుసేన కలత చెందగా, భూరిశ్రవసుడి పైకి రథం తోలించాడు సాత్యకి. రెండు రథాలూ ఒక దానితో మరొకటి ఢీకొన్నాయి. సాత్యకి భూరిశ్రవసుడి సారథిని, గుర్రాలను

సంహరించాడు. భూరిశ్రవుడుగూడా అట్లాగే చేశాడు. ఇద్దరూ విరథులై నేలకు లంఘించి కత్తులు దూసి ఒకరినొకరు మార్కొన్నారు.

**వ. అట్టి సమయంబున. 332**

**ప్రతిపదార్థం:** అట్టి+సమయంబునన్= అట్టి తరుణంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**ఆ. వేగ మెయిది వృష్ణివీరు భీముఁడు గురు । వీరుఁ గురువిభుండు గారవమున**
**వెనుకఁ జనఁగఁ దివిచి తనతన రథముపైఁ । బెట్టికొనుచుఁ దొలఁగఁ బ్రీతిఁ జనిరి. 333**

**ప్రతిపదార్థం:** వేగము+ఎయిది= వేగం పుంజుకొని; వృష్ణి+వీరున్= సాత్యకిని; భీముఁడు; కురు+వీరున్= భూరిశ్రవసుని; కురు+విభుండు= దుర్యోధనుడు; గారవమునన్= గౌరవంగా; వెనుకన్+చనఁగన్+తివిచి= వెనుకకు చేర్చి మరలించి; తన+తన+ రథముపైన్+పెట్టికొనుచున్= తమ తమ రథాలపైకి ఎక్కించుకొని; తొలఁగన్= ఆచోటు తప్పించి; ప్రీతిన్= సంతోషంతో; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** సాత్యకి, భూరిశ్రవసుడు - ఇరువురును విరథులై కత్తులతో నిలబడగా, భీముడు వచ్చి సాత్యకిని తన రథం మీదికి ఎక్కించుకొని పోయాడు. అట్లే భూరిశ్రవసుడిని కురురాజైన దుర్యోధనుడు గౌరవంగా తనరథం మీదికి ఎక్కించుకొన్నాడు. అందరూ సంతోషంగా వెళ్ళారు.

**వ. అంత. 334**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** అప్పుడు.

**క. ' అపరాహ్ణసంగతుండగు । తపనుంగని పొద్దు గ్రుంకెఁ దడ వేఁగుదు రీ**
**రిపు లని కడంగి నరుఁ డ । స్త్ర పరంపర వఱపి నీదు రథికుల నెల్లన్. 335**

**ప్రతిపదార్థం:** అపర+అహ్ణ+సంగతుండు+అగు= సాయం సంధ్యతో కూడినవాడగు; తపనున్+కని= సూర్యుడిని చూచి; ప్రొద్దు+క్రుంకెన్= సూర్యుడు అస్తమించుతున్నాడు; రిపులు= ఈ శత్రువులు; తడవు+ఏఁగుదురు= వ్యవధి చూచుకొని వెళ్ళిపోతారు; అని= అని యోచించి; కడఁగి= పూని; నరుఁడు= అర్జునుడు; అస్త్ర+పరంపర+పఱపి= మంత్రబాణాలను ప్రయోగించి; నీదు+రథికులను+ఎల్లన్= తేరెక్కి పోరాడే నీ వీరులను అందరనూ.

**తాత్పర్యం:** 'మలిసంజలో కలిసే సూర్యుణ్ణి చూచి ప్రొద్దు గ్రుంకుతున్నది. ఈ శత్రువులు యుద్ధం విడిచి శిబిరాలకు వెళ్ళి పోతారు- అనుకొని పూని అర్జునుడు నీ రథికులందరిపై మంత్ర బాణాలు ప్రయోగించి. (తరువాతి గద్యంతో అన్వయం.)

**వ. నిహతులం జేయుచు విహరించుచున్నం గనుంగొని. 336**

**ప్రతిపదార్థం:** నిహతులన్+చేయుచున్= చంపుతూ; విహరించుచున్నన్+కనుంగొని= వినోదంగా తిరుగుచుండటం చూచి.

**తాత్పర్యం:** అర్జునుడు కౌరవ సైనికులను సంహరించటం చూచి.

**క. సైరింపక యేడ్తెఱఁ గురు । వీరాగ్రణి యిరువదేనువేల రథంబుల్**
**పోరికిఁ బురికొలిపిన వి । స్ఫారగతిం గూడి కవిసెఁ బార్థునిమీఁదన్. 337**

**ప్రతిపదార్థం:** సైరింపక=తాళజాలక; ఏడ్తెఱన్= పరాక్రమంతో; కురు+వీర+అగ్రణి= కౌరవవీరులలో మొదటివాడు (భీష్ముడు);ఇరువది+ఏను+వేల+ రథంబుల్= ఇరవై ఐదువేల రథాలను, రథికులగు వీరులను; పోరికిన్= యుద్ధానికి; పురికొల్పినన్= ప్రోత్సహించగా; విస్ఫారగతిన్= ఎక్కువగ విస్తరించి; కూడి= కలిసి; పార్థునిమీఁదన్= అర్జునునిపైన; కవిసెన్= మార్కొన్నాయి.

**తాత్పర్యం:** అర్జునుడు కౌరవసైనికులను సంహరించటం చూచి, సహింపలేక సేనాపతి భీష్ముడు - ఇరవై అయిదువేల రథాలను పోరాటానికి ప్రోత్సహించాడు. ఆ రథికులు కలిసి, విస్తారంగా వ్యాపించి అర్జునుడిని మార్కొన్నారు.

**క. కడు వెసఁ గవిసినయవి గ । వ్వడి బాణజ్వాల లడర వడి దావాగ్నిన్**
**మిడుతలు వొలిసిన క్రియఁ బొడి । పొడి యయ్యెం గురుబలంబు పొం గడఁగంగన్. 338**

**ప్రతిపదార్థం:** కడు+వెసన్= మిక్కుటము అగు వేగంతో; కవిసినయవి= మార్కొనినట్టివి ( ఇరవై వేల రథాలు); కవ్వడి+బాణజ్వాలలు= అర్జునుడి అమ్ముల అగ్ని జ్వాలలు; అడరన్= విజృంభింపగా; వడిన్= వేగంగా; దావాగ్నిన్= కార్చిచ్చులో; మిడుతలు= శలభాలు; పొలిసిన+క్రియన్= చచ్చిపోయే రీతిగా; కురు బలంబు పొంగు+అడఁగంగన్= కౌరవ సేనయొక్క అతిశయం అణగారిపోయేటట్లుగా; పొడి+పొడి+అయ్యెన్= చూర్ణం చూర్ణం అయిపోయాయి.

**తాత్పర్యం:** వేగంగా ఆ ఇరువది అయిదువేల రథాలు మార్కొన్నాయి. కాని అవి అర్జునుని అమ్ములనే అగ్నిలో కార్చిచ్చులో బడి మరణించే శలభాలవలె మాడి పొడిపొడి అయ్యాయి. కౌరవసేన అతిశయం అణగారిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కిరణంబు లడఁగి యంతకు । నరుణత్వము మెఱయఁ దరణి యపరాద్రిశిర**
**స్ఫురణను నధికరణాలం । కరణం బొనరించుటయును గాంగేయుఁ డెదన్. 339**

**ప్రతిపదార్థం:** కిరణంబులు+అడఁగి= వెలుగురేకలు తగ్గి; అంతకున్= అప్పటికీ; అరుణత్వము= ఎర్రదనం; మెఱయన్= ప్రకాశించటంచేత; తరణి= సూర్యుడు; అపర+అద్రిశిరస్+స్ఫురణను= పడమటి కొండనెత్తిపై ప్రకాశించటంచేత; అధికరణ+అలంకరణంబు+ ఒనరించుటయును= మిక్కుటమైన యుద్ధాలంకరణం చేకూర్చినట్లుండగా; గాంగేయుఁడు= భీష్ముడు; ఎదన్= తన హృదయంలో.

**తాత్పర్యం:** రశ్మి తగ్గి, అంతకుముందే ఎర్రదనం శోభిల్లగా, సూర్యుడు పడమట కొండ శిరస్సున మెరుస్తూ రక్తసిక్తమైన యుద్ధభూమికి మిక్కిలి అలంకారం చేకూర్చాడు. అది సాయంకాల సమయసూచకం. దానితో భీష్ముడు తన హృదయంలో ఈ విధంగా అనుకొన్నాడు.

**విశేషం:** అపరాద్రి శిరస్సును (ఎర్రనిపూలతో) శృంగారనాయకుడు అయిన సూర్యుడు అలంకరించినట్లుగా ఉందట.

**క. ' శ్రాంతం బయ్యెను వాహన । సంతానం బెల్ల నిపుడు సంధ్యాసమయం**
**బింతట నేఁటికి నని సా । లింతము గా కింకఁ బోర లెస్సె యున్నే?' 340**

**ప్రతిపదార్థం:** వాహన+సంతానంబు+ఎల్లన్= గుర్రాల సముదాయం అంతా; శ్రాంతంబు+అయ్యెను= బడలిపోయింది; ఇపుడు; సంధ్యాసమయంబు= సంజప్రొద్దు, సాయం సమయం; ఇంతటన్= ఈ మేరకు; నేఁటికిన్= ఈ దినమునకు;

అని= పోరాటం; చాలింతముగాక!= విరమించటం మంచిది; ఇంకన్= ఇకమీద; పోరన్= యుద్ధం చేయటం; లెస్స+ఐ+ఉన్నే?= మంచిది అవుతుందా?

**తాత్పర్యం:** 'వాహనాలు అన్నీ బడలిపోయాయి. సాయంకాలం అవుతోంది. ఇక యుద్ధం చేయటం ఎందుకు? విరమించటం మంచిది.'

**విశేషం:** వాహన సంతానంబు - గుఱ్ఱాల గుంపు - వాహనములు అంటే వహించేవి - మోసేవి. గుఱ్ఱములు.

**వ. అని తలంచి కుంభసంభవాది యోధముఖ్యుల కెఱింగించి బలంబులఁ దివియ నియమించి. 341**

**ప్రతిపదార్థం:** అని తలంచి= అని యోచించి; కుంభసంభవ+ఆది+యోధముఖ్యులకున్= ద్రోణుడు మున్నగు వీరులకు; ఎఱింగించి= తెలిపి; బలంబులన్= సేనలను; తివియన్+నియమించి= మరలింప ఆజ్ఞాపించి.

**తాత్పర్యం:** అని ఆలోచించి, ఆ విషయాన్ని ద్రోణాదులకు తెలిపి, సేనలను పోరు చాలింపజేయుటకు

**క. సమరక్రీడన లీలం । దమక తమక తనిసి మరలి తమతమ యావా**
**సములకు నరిగి రుభయసై । న్యములజనంబులును దీవియలు వెలుఁగంగన్. 342**

**ప్రతిపదార్థం:** సమర+క్రీడన్+అ= యుద్ధక్రీడయందే; లీలన్= విలాసంగా; తమక తమక= తమకుతామే; తనిసి= తృప్తిపొంది; మరలి= వెనుదిరిగి; తమ+తమ= ఆవాసములకున్= తమ తమ విడిదులకు; ఉభయసైన్యముల+జనంబులును= రెండు సేనలలోని భటులూ; దీవియలు= దివిటీలు(కాగడాలు); వెలుఁగంగన్= ప్రకాశింపగా; అరిగిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** యుద్ధక్రీడయందే తమకు తామే తహతహ తృప్తి చెంది వెనుకకు తిరిగి రెండు సేనలలోని భటులు కాగడాల కాంతులలో తమ తమ విడుదులకు చేరారు.

**తే. రెండు వీళ్ళ జనంబులు రేలు వివిధ । హృద్యసంగీతములను సాహిత్యమధుర**
**లలితగోష్ఠీ వినోదంబులను బ్రమోద । భరితు లై ప్రొద్దు పుత్తురు భరతముఖ్య! 343**

**ప్రతిపదార్థం:** భరత ముఖ్య!= భరతవంశంలో ముఖ్యమైనవాడా! ఓ ధృతరాష్ట్ర మహారాజా!; రెండు+వీళ్ళ+జనంబులున్= రెండు శిబిరాల మనుష్యులూ; రేలు= రాత్రులయందు; వివిధ హృద్య సంగీతములను= హృదయమును అలరించే పెక్కు గానములచేతను, సాహిత్య మధుర లలిత గోష్ఠీ వినోదంబులను= వాఙ్మయమునకు సంబంధించిన కోమలమైన, మృదువైన, సంతోషదాయకములగు చర్చలచేతను; ప్రమోద, భరితులు+ఐ= సంతోషంతో నిండినవారై; ప్రొద్దు+పుత్తురు= కాలం గడపుతారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! రాత్రులందు కురు పాండవ పక్షాలు రెండింటికీ సంబంధించిన భటులు హృదయానికి ఆనందం కలిగించే సంగీత సభలలో సాహిత్య గోష్ఠులలో కాలక్షేపం చేస్తూ ఉంటారు.

## భీష్ముని షష్ఠదివస యుద్ధక్రమము (సం. 6-71-1)

**వ. ఏనవనాఁటి రాత్రి సనుటయుఁ దెలతెల వేగునప్పుడు ధనంజయుండు సేనాపతి రావించి మకరవ్యూహంబు సంఘటింపు మని నియమించిన నఖిలజనంబులకుఁ బ్రీతి నెక్కొన నతం డమ్మోహరంబు దీర్చునెడ దానికిఁ బార్థపాంచాలపతులు శిరంబును గవలు గన్నులును భీమసేనుండు దుండంబును సౌభద్రద్రౌపదేయ**

**ఘటోత్కచులు గండస్థలంబులును సాత్యకిసహితుండై యుధిష్ఠిరుండు గంఠంబును ధృష్టద్యుమ్న పురస్సరంబుగా విరాటుండు వెన్నును గేకయులు వామపార్శ్వంబును ధృష్టకేతుండును గరూశపతియును దక్షిణపార్శ్వంబును గుంతిభోజశతానీకులు జఘనంబును శిఖండియు నిరావంతుండును బుచ్ఛంబును నై పన్నిరి; భీష్ముండు దానికిఁ బ్రతివ్యూహం బూహించి క్రౌంచవ్యూహం బమర్చి యందుఁ జంచువునం దాను గురు సహాయుం డైనిలిచి నేత్రంబులఁ గృపగురుపుత్త్రులును మస్తకంబునఁ గృతవర్మయుఁ గాంభోజ బాహ్లికులును గళంబున శూరసేనపరివృతుండై సుయోధనుండును నురంబున సౌవీర సమేతుండై భగదత్తుండును వీఁపున విందానువిందులును వామపక్షంబున సుశర్మయు దక్షిణపక్షంబున యవనపతియు నపరభాగంబున శ్రుతాయురుపేతుండై భూరిశ్రవసుండును నిలిచి రిట్లుభయసైన్యంబులు సన్నద్ధంబు లై నడచి శంఖభేరీ ప్రముఖ తూర్యనాదంబులు సెలంగం దలపడియె నట్టిసమయంబున. 344**

**ప్రతిపదార్థం:** ఏనవ+నాఁటి+రాత్రి= అయిదవరోజు యొక్క రాత్రి; చనుటయున్= వెళ్ళుటయు; తెల+తెల+వేగునప్పుడు= తెల్లవారునప్పుడు; ధనంజయుండు= అర్జునుడు; సేనాపతిన్+రావించి= సేనాపతి ధృష్టద్యుమ్నుని రప్పించి; మకర+వ్యూహంబు= మొసలి మొగ్గరము; సంఘటింపుము+అని+నియమించినన్= ఏర్పరచుము అని ఆజ్ఞాపించగా; అఖిల+జనంబులకున్= అందరు ప్రజలకూ; ప్రీతి= సంతోషము; నెక్కొనన్= ఏర్పడగా; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; ఆ+మోహరంబున్= ఆ వ్యూహమును; తీర్చు+ఎడన్= ఏర్పాటు చేసేటప్పుడు; దానికిన్= ఆ మొగ్గరమునకు; పార్థ+పాంచాల పతులు= అర్జునుడు, ద్రుపదరాజు; శిరంబును= తలగా; కవలు= జంటలు(నకులసహదేవులు); కన్నులును= నేత్రాలుగా; భీమసేనుండు; తుండంబును= నోరు మొదటి భాగముగా; సౌభద్ర ద్రౌపదేయ+ఘటోత్కచులు= అభిమన్యుడు, ఉపపాండవులు, ఘటోత్కచుడు; గండ+స్థలంబులును= కపోల భాగములుగా; సాత్యకి+సహితుండు+ఐ= సాత్యకితో కూడిన వాడై; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; కంఠంబును= కుత్తుకగా; ధృష్టద్యుమ్న+ పురస్సరంబుగాన్= ధృష్టద్యుమ్నుడు ముందుగా గలవాడుగ; విరాటుండు= విరాటరాజు; వెన్నును= వీపుగా; కేకయులు= కేకయ రాజులు; వామపార్శ్వంబును= ఎడమ ప్రక్కయు; కుంతి భోజ,శతానీకులు= కుంతి భోజుడు, శతానీకుడు; జఘనంబును= మొలగా; శిఖండియున్+ఇరావంతుండును= శిఖండి మరియు ఇరావంతుడును; పుచ్ఛంబును= తోకయు; ధృష్టకేతుఁడు+ కరూశ+పతియును= ధృష్టకేతుడు, కరూశరాజు; దక్షిణ+పార్శ్వంబును= కుడి ప్రక్కయు; పన్నిరి= వ్యూహం ఏర్పాటు చేశారు; భీష్మండున్= భీష్ముడుకూడా; దానికిన్= ఆ మకర వ్యూహానికి; ప్రతి వ్యూహంబు= దీటగు మొగ్గరము; ఊహించి= ఆలోచించి; క్రౌంచ+వ్యూహంబు= క్రౌంచ పక్షిని పోలు మొగ్గరము; అమర్చి= ఏర్పాటు చేసి; అందున్= ఆ క్రౌంచ వ్యూహమునందు; చంచువునన్= ముక్కు దగ్గర; తాను= తాను(భీష్ముడు); గురు+సహాయుండు+ఐ= ద్రోణుడు తోడుగా; నిలిచి= నిలబడి; నేత్రంబులన్= కనులందు; కృప+గురుపుత్త్రులును= కృపుడును, అశ్వత్థామయు; మస్తకంబునన్= శిరస్సుదగ్గర; కృతవర్మయున్= కృతవర్మయు; కాంభోజ, బాహ్లికులును= కాంభోజరాజు, బాహ్లికుడును; గళంబునన్= కుత్తుక దగ్గర; శూరసేన+పరివృతుండు+ఐ= శూరసేనునిచే చుట్టబడినవాడై; సుయోధనుండును= దుర్యోధనుడును; ఉరంబునన్= వక్షమునందు; సౌవీర+సమేతుండు+ఐ= సౌవీర రాజుతో కూడి; భగదత్తుండును= భగదత్తుడును; వీఁపునన్= వెన్నునందును; వింద+అనువిందులు= విందుడు మరియు అనువిందుడును; వామపక్షంబునన్= ఎడమరెక్కగా; సుశర్మయున్; దక్షిణ+పక్షంబునన్= కుడిరెక్క దగ్గర; యవనపతియున్= యవనరాజును; అపరభాగంబునన్= వెనుక భాగమున; శ్రుతాయుః+ఉపేతుండు+ఐ= శ్రుతాయువుతో కూడినవాడై; భూరిశ్రవసుండును; నిలిచిరి= నిలబడ్డారు; ఇట్లు+ఈరీతిగా; ఉభయ సైన్యంబులున్= రెండు సేనలు(కురు పాండవ సైన్యాలు); సన్నద్ధంబులు+ఐ= యుద్ధానికి సంసిద్ధములై; నడచి= వెడలి; శంఖ, భేరీ, ప్రముఖ, తూర్యనాదంబులు= శంఖములు, భేరులు మొదలగు జంత్ర వాద్యాలు; చెలంగన్= మ్రోయగా; తలపడియెన్= మార్కొన్నాయి; అట్టి సమయంబునన్.

**తాత్పర్యం:** కురుక్షేత్రంలో ఏడవనాటి రాత్రి జరిగిపోయింది. తెల్లవారేటప్పుడు, అర్జునుడు ధృష్టద్యుమ్నుడిని, రావించి 'మొసలి మొగ్గరం' ఏర్పాటు చేయుమన్నాడు. ధృష్టద్యుమ్నుడు అందరూ సంతోషించేటట్లుగా మకరవ్యూహం

తీర్చిదిద్దాడు. అర్జునుడు, ద్రుపదరాజు తలగా ఏర్పడ్డారు. నకుల సహదేవులు నేత్రములు అయ్యారు. భీముడు నోరు చివర నిలబడ్డాడు. అభిమన్యుడు, ద్రౌపది కొడుకులు, ఘటోత్కచుడు - కపోలములు అయ్యారు. సాత్యకితోపాటుగా ధర్మరాజు కంఠం దగ్గర నిలిచాడు. ధృష్టద్యుమ్నుడితోపాటు విరాటరాజు వెన్నుదగ్గర ఉన్నాడు. కేకయరాజులు ఎడమ ప్రక్కగా, ధృష్టకేతుడు కరూశరాజును కుడిప్రక్కగా నిలబడ్డారు. కుంతిభోజుడు, శతానీకుడు మొల దగ్గర ఉన్నారు. శిఖండి, ఇరావంతుడు - తోకగా అయ్యారు.

భీష్ముడు మొసలిమొగ్గరానికి సాటిగా 'క్రౌంచవ్యూహం' ఏర్పాటు చేశాడు. తాను ద్రోణుడితోపాటు ముక్కు దగ్గర నిలిచాడు. కృపుడు, అశ్వత్థామ, కన్నులు అయ్యారు. శిరస్సు దగ్గర కృతవర్మ, కాంభోజుడు, బాహ్లికుడు నిలిచారు. కుత్తుక దగ్గర శూరసేన రాజుతోపాటుగా దుర్యోధనుడు నిలబడ్డాడు. వక్షం దగ్గర సౌవీరరాజుతోపాటు, భగదత్తుడు ఉన్నాడు. వీపున విందుడు, అనువిందుడు నిలబడ్డారు. ఎడమప్రక్క సుశర్మ, కుడిప్రక్క యవనరాజు నిలిచారు. వెనుకగా శ్రుతాయువుతో కలిసి భూరిశ్రవసుడు నిలిచాడు.

ఈ విధంగా కురుసేన పాండవసేన యుద్ధానికి సమాయత్తమై వెళ్ళారు. శంఖాలు - భేరులు మొదలగు జంత్రవాద్యాల ధ్వనులు మిన్నుముట్టాయి. ఆ సమయంలో.

**విశేషం:** 1. క్రౌంచము= ఒక పౌరాణిక పక్షి. కొంగవంటి ఆకారం కలది.

**క. తలకడచి నడచు ద్రోణుని । యలవుఁ బలంబును సహింప కనిలతనయుఁ డి**
**ట్టలమగు రోషంబునఁ ద । ద్బలముపయిం బఱపె రథముఁ బటువేగమునన్. 345**

**ప్రతిపదార్థం:** తలకడచి+నడచు= పైకి ఉప్పొంగి విజృంభించే; ద్రోణుని= ద్రోణాచార్యుడి; అలవున్+బలంబును= శక్తిని, సామర్థ్యమును; సహింపన్= ఓర్వలేక; అనిల+తనయుఁడు= వాయుసుతుడు(భీమసేనుడు); ఇట్టలము+అగు= అతిశయించిన; రోషమ్మునన్= కోపంతో; తద్+బలముపయిన్= ఆతనియొక్క సేనపై; పటువేగమునన్= మిక్కిలి శీఘ్రముగా; రథమున్= తేరును; పఱపెన్= తోలించాడు.

**తాత్పర్యం:** పైకి ఎగిరి వెల్లి విరిసే ద్రోణుడి శక్తిసామర్థ్యాలకు ఓర్వలేక, భీముడు మిక్కుటమైన కోపంతో ద్రోణుడి సేన వైపునకు తన రథం వేగంగా నడపించాడు.

**విశేషం:** కౌరవులు పన్నింది క్రౌంచవ్యూహం. ముక్కుదగ్గర ఉన్నది ద్రోణుడు. ముక్కుకు పొడిచే స్వభావం సహజసిద్ధం. ఇక పాండవులు పన్నింది మొసలిమొగ్గరం. తుండం అంటే నోరు మొదటి భాగం. దానిదగ్గర ఉన్నది భీముడు. ఆ విధంగా భీముడికీ ద్రోణుడికీ సంఘర్షణ తప్పనిసరి అయింది.

**వ. ఇట్లు వఱపిన నతనికోల్తలకుం గాక. 346**

**ప్రతిపదార్థం:** ఇట్లు+పఱపినన్= ఈ విధంగా రథాన్ని నడుపగా; అతని కోల్తలకున్+కాక= అతడి ఎదుట నిలిచి యుద్ధం చేయలేక.

**తాత్పర్యం:** భీముడు ఈ విధంగా రథాన్ని నడిపించగా, అతడికి ఎదురు నిలువలేక. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. తనముందటి యోధులు పిఱు । సనుటయుఁ గుంభజుఁడు గినిసి శరనవకము భీ**
**మునిమేన నాట నాతఁడు । సునిశితభల్లమున నతని సూతుం దునిమెన్. 347**

**ప్రతిపదార్థం:** తన ముందటి యోధులు= తనకు ముందుగా నిలిచిన వీరులు; పిఱు+చనుటయున్= వెనుకంజ వేయటం చేత; కుంభ+జుఁడు= కుండలో పుట్టినవాడు(ద్రోణుడు); కినిసి= కోపించి; శర+నవకము= తొమ్మిది అమ్ములు; భీముని+మేనన్+నాటన్= భీముని శరీరంపై గ్రుచ్చుకొనేటట్లు వేయగా; ఆతఁడు= ఆ భీముడు; సునిశిత+భల్లమునన్= మిక్కిలివాడియైన ఈటె బాణంతో అతని+సూతున్= ద్రోణుని సారథిని; తునిమెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** తన ముందుగా నిలిచిన వీరులు వెనుకకు తిరిగి పారిపోగా, ద్రోణుడు ఆగ్రహంతో భీముడి శరీరంపై తొమ్మిది అమ్ములు నాటవేశాడు. భీముడు మిక్కిలి వాడియైన ఈటెబాణంతో ద్రోణాచార్యుడి సారథిని సంహరించాడు.

**విశేషం:** మహాభారత యుద్ధంలో పలుచోట్ల- వీరులు ప్రతివీరుల సారథులను సంహరించటం వర్ణింపబడింది. సారథులు నిరాయుధులే కదా! వారిని సంహరించటం ఏమి న్యాయం? అనిపిస్తుంది. సారథిని సంరక్షించటం - వీరుడి అవశ్యకర్తవ్యం. సారథి సంహరింపబడటం - రథికునకు -పరాభవం. ఇంచుమించు ఓటమితో సమానం. అప్పుడు రథికుడు - సారథ్యం కూడా నడపటం ద్విపాత్రాభినయం నెరపటమే., ద్రోణుడు అప్పుడు అట్లా లోకోత్తర శక్తి ప్రదర్శించాడు..

**క. వాహనముఁ దాన నడపుచు । సాహసికత్వమున గురుఁడు సమరక్రీడో**
**త్సాహము వదలక వైరి । వ్యూహము దలఁకంగ భుజసముద్ధతి గవిసెన్. 348**

**ప్రతిపదార్థం:** వాహనమున్= రథమును; తాను+అ= తానే; నడపుచున్= నడిపిస్తూ; గురుఁడు= ద్రోణుడు; సాహసికత్వమునన్= ప్రమాదంతో కూడిన ధైర్యంతో; సమర+క్రీడా+ఉత్సాహము= యుద్ధం అనే ఆటలోని ఉల్లాసము; వదలక= విడిచి పెట్టకుండా; వైరి వ్యూహము= శత్రువుల సమూహము; తలఁకంగన్= కలత చెందునట్లుగా; భుజ+సముద్ధతిన్= బాహు పరాక్రమంతో (భుజముల+గర్వంతో); కవిసెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** సారథి సంహరింపబడగా తానే తన రథాన్ని నడపుతూ అనగా గుర్రాలను తోలుకొంటూ, యుద్ధ క్రీడ యందలి ఉత్సాహం విడిచిపెట్టకుండా పరాక్రమం చూపిస్తూ, శత్రువుల వ్యూహాన్ని చెదరగొట్టుతూ యుద్ధం కొనసాగించాడు.

**క. మీ తండ్రి ద్రోణునకుఁ దో । డై తఱిమినఁ గేకయులు భయాకులత మరు**
**ద్ధూతాంబుదగతిఁ దెరలఁగ । నాతత సృంజయబలంబు లఱిముఱి విరిగెన్. 349**

**ప్రతిపదార్థం:** మీ తండ్రి= భీష్ముడు; ద్రోణునకున్= ద్రోణునకు; తోడు+ఐ= బాసటగా నిలిచినవాడై; తఱిమినన్= తరిమివేయగా; కేకయులు= కేకయరాజు సేనలు; భయ+ఆకులతన్= భయంతో ఆందోళనతో; మరుత్+ధూత+అంబుద+గతిన్= గాలిచే చెదరగొట్టబడిన మబ్బులవలె; తెరలఁగన్= మరలగా; ఆతత+సృంజయ బలంబులు= విస్తీర్ణమైన సృంజయసేనలు; అఱిముఱిన్= శీఘ్రంగా; విరిగెన్= ఓడిపోయాయి.

**తాత్పర్యం:** నీ తండ్రి అయిన భీష్ముడు ద్రోణుడికి తోడుగా నిలిచి తరుమగా కేకయులు భయంతో, ఆందోళనతో, గాలిచేత చెదరగొట్టబడిన మబ్బులవలె - వెనుకకు తరలారు. విస్తీర్ణాలయిన సృంజయసేనలు వెనువెంటనే ఓడిపోయాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. అధిప! భీమసేనుఁ డడరినఁ గౌరవ । సైన్య మతనిచేతఁ జాఁపకట్టు**
**వడియెనపుడు ధరణిపతు లిద్దఱును జేయి । వీచి తఱిమి రధిక విక్రమమున. 350**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా(ఓ ధృతరాష్ట్ర మహారాజా)!; భీమసేనుఁడు= భీముడు; అడరినన్= విజృంభింపగా; కౌరవ+సేన= కౌరవులసైన్యం; అతనిచేతన్= ఆ భీమునిచేత; చాపకట్టు+పడియెన్= నేలమట్టమయింది; అపుడు; ధరణిపతులు+ఇద్దరును= ఇద్దరు రాజులు(అటు కౌరవపతి దుర్యోధనుడును, ఇటు పాండవనేత ధర్మరాజును); చేయి+వీచి= హస్తమును ఊపి; అధిక+విక్రమమునన్= గొప్ప పరాక్రమంతో; తఱిమిరి= ప్రోత్సహించారు.

**తాత్పర్యం:** రాజా! భీముడు విజృంభించిన కారణంగా కౌరవసేనకు విపరీతంగా నష్టం కలిగింది. ఇటు దుర్యోధనుడు, అటు ధర్మరాజు - తమసేనలను ప్రోత్సహించసాగారు.

**వ. ఇవ్విధంబున ధర్మనందన దుర్యోధను లగ్గలికం బురికొలుప మొగ్గరంబులు రెండును గండు మిగిలి తలపడియె' ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 351**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ధర్మనందన, దుర్యోధనులు; అగ్గలికన్= పూనికతో; పురికొలుపన్= ప్రోత్సహింపగా; మొగ్గరంబులు+రెండును= ఉభయవ్యూహాలును; గండు+మిగిలి= పరాక్రమించి; తలపడియెన్= మార్కొన్నాయి; అనినన్+విని= అని సంజయుడు చెప్పగా ఆకర్ణించి; ధృతరాష్ట్రుడు; సంజయునకున్; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఈ రీతిగా ధర్మరాజును దుర్యోధనుడు పూనికతో ప్రోత్సహించగా, మకరవ్యూహంగా క్రౌంచ వ్యూహంగా- ఏర్పడిన పాండవ - కౌరవ సేనలు రెండూ, పరాక్రమంతో మార్కొన్నాయి' అని చెప్పగా విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఈ విధంగా అన్నాడు:

**ఆ. ' మనబలంబునందు మంచి మగల్ సాల । గలిగి యా బలంబు గెలువలేమి**
**దైవకృతము గాదె! తలఁపఁ జోద్యము మున్న! యెఱుఁగఁ జెప్పె విదురుఁ డిట్టు లగుట. 352**

**ప్రతిపదార్థం:** మన+బలంబునందున్= మనసేనలో; మంచి+మగల్= గొప్పవీరులు; చాలన్+కలిగి= ఎందరో ఉండి; ఆ బలమ్మున్= ఆ పాండవసేనను; గెలువన్+లేమి= జయించలేకపోవటం; దైవ+కృతము+కాదె!= దైవము చేసిన పనియే కదా!; తలఁపన్= యోచింపగా; చోద్యము= ఆశ్చర్యం; మున్ను+అ= ముందుగానే; విదురుఁడు; ఇట్టులు+అగుట= ఈ విధంగా జరుగగలదని; ఎఱుఁగన్= తెలిసేటట్లు; చెప్పెన్= వచించాడు.

**తాత్పర్యం:** 'మన సేనలో గొప్ప యోధులు ఎక్కువగా ఉన్నారుగదా! అయినా ఆ పాండవ సేనను జయింపలేకుండా ఉన్నారు. ఇది దైవకృతమే కదా! పైగా ఆశ్చర్యకరమైనది గదా! ఈ విధంగా జరుగగలదని విదురుడు ముందే చెప్పాడు.

**క. అతఁ డెంత సాటి చెప్పిన । మతి హితముగఁ గొనఁడు కీడు మానఁడు కడు దు**
**ర్మతి యైన నా తనూజుఁడు । మతి కర్మము వెనుకఁ జనక మానునె? యెందున్. 353**

**ప్రతిపదార్థం:** అతఁడు= దుర్యోధనుడు; ఎంత+చాటి+చెప్పినన్= ఎంతగా బహిరంగంగా చెప్పినప్పటికీ; మతి+హితముగన్= బుద్ధికి మంచిదిగా; కొనఁడు= స్వీకరింపడు; కడున్= మిక్కిలి; దుర్మతి+ఐన= చెడ్డబుద్ధి కలవాడైన; నా+తనూజుఁడు= నా కొడుకు; కీడు+మానఁడు= అపాయం తొలగించుకోడు; మతి= బుద్ధి; 'కర్మము' వెనుకన్= కర్మము వెనువెంట; చనన్+మానునె?+ఎందున్= ఎందైనా వెళ్ళక మానుతుందా?

**తాత్పర్యం:** ఎంతగా నొక్కి వక్కాణించినప్పటికీ దుర్యోధనుడు వినలేదు. కీడు తెచ్చుకున్నాడు. నా కొడుకు చెడ్డవాడు. అయితే - అది వాడి కర్మ. దైవకృతం ఎవరు తప్పించగలరు?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'బుద్ధిః కర్మానుసారిణీ' అనుదానికి తెలుగు: 'మతి కర్మము వెనుకఁ జనక మానునె?'

**వ. విధికృతం బెవ్వరికి నుడుప వచ్చు నెట్లు గా నున్నది యట్లయ్యెడుం గాక ' యనిన సంజయుం డతని కి ట్లనియె. 354**

**ప్రతిపదార్థం:** విధి+కృతంబు= దైవము చేసినది; ఎవ్వరికిన్= ఎవరికి; ఉడుపవచ్చున్= తప్పించటానికి వీలు అవుతుంది?; ఎట్లు+కాన్+ఉన్నది= ఏ విధంగా జరగాలో; అట్లు+అ= అట్ల= ఆ విధంగానే; అయ్యెడున్+కాక= జరుగుగాక; అనిన; సంజయుండు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఎంతగా నొక్కి వక్కాణించినప్పటికి దుర్యోధనుడు వినలేదు. కీడు తెచ్చుకొన్నాడు. నా కొడుకు చెడ్డవాడు. అయితే, అది వాడి కర్మ. దైవకృతం ఎవరు తప్పించగలరు? బుద్ధి కర్మను అనుసరిస్తుంది. అంతే. ఏ విధంగా జరుగగలదో ఇక ఆ విధంగానే జరుగుగాక! ' - అని ధృతరాష్ట్రుడు బాధపడుతూ అనగా, సంజయు డిట్లా అన్నాడు:

**ఆ. ' నీ తనూభవుండు నెఱిగుఱి యెఱుఁగమి । యెఱిఁగియెఱిఁగి యతని నేలచెప్ప ?**
**మన యుపేక్షవలన విను నాఁటి జూదంబ । నేఁడు గయ్య మయ్యె నృపవరేణ్య! 355**

**ప్రతిపదార్థం:** నీ+తనూభవుండు= నీ కొడుకు దుర్యోధనుడు; నెఱి గుఱి= మంచినిండులక్ష్యం; ఎఱుఁగమి= తెలియకపోవటం; ఎఱిఁగి+ఎఱిఁగి= తెలిసి తెలిసి; అతనిన్= ఆతనిని; ఏల చెప్పన్?= చెప్పనేల(ఎందుకు నిందించాలి)?; మన+ఉపేక్ష+వలనన్= మన ఔదాసీన్యం వల్ల; నృప+వరేణ్య!= రాజశ్రేష్ఠుడా! (ఓ ధృతరాష్ట్ర మహారాజా); నాఁటి+జూదంబు+అ= అలనాటి జూదమే; నేఁడు= ఈ దినమునకు; కయ్యము= యుద్ధము; అయ్యెన్.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీవు దుర్యోధనుడిని నిందిస్తున్నావు. ఆ నింద వలన ప్రయోజనం ఏముంది? ఈనాడు జరుగుతున్న యుద్ధానికి నీ ఉపేక్షయే కారణం. ఆనాటి జూదమే ఈనాటి యుద్ధంగా పరిణమించింది.

**విశేషం:** కుహనాకర్మ సిద్ధాంతవాదులకు ఇది చక్కని సమాధానం. అంతా దైవంమీద బాధ్యత నెట్టివేయడం సమంజసం కాదు. ఆనాడు జూదమే జరగకపోతే ఈనాడు కురుక్షేత్ర సంగ్రామమే లేదు. ఆ నాడు జూదం ఆపకపోయిన బాధ్యత ఎవరిది? ధృతరాష్ట్రునిదే కదా! ధృతరాష్ట్రుడు చెప్పింది పరాజయవేదాంతం. పశ్చాత్తాపం కూడా కాదు. సంజయుడు దానికి చక్కని సమాధానం చెప్పాడు.

**వ. ఇంకఁ బశ్చాత్తాపం బుడిగి ధీరుండ వై సమర ప్రకారంబు విను మట్టియెడ భీమసేనుండు భవత్సేనాసాగరంబు పాయ వడం దఱిమి చొచ్చి దుశ్శాసనుండును దుర్విషహుండును దుర్మదుండును దుస్సహుండును జయుండును జయత్సేనుండును వికర్ణుండును జిత్రసేనుండును సుదర్శనుండును జారుచిత్రుండును సువర్ముండును దుష్కర్ణుండును నొక్కచో నున్నం గనుంగొని యక్కుమారులం దాఁకిన. 356**

**ప్రతిపదార్థం:** ఇంకన్= ఇకమీద; పశ్చాత్తాపంబు= తరువాత పడే ఆవేదన, చేసిన తప్పునకు చింతించి పడే వేదన; ఉడిగి= మాని; ధీరుండవు+ఐ= ధైర్యం కలిగిన వాడవు అయి (ఓర్పు కలిగినవాడివై); వినుము; అట్టి+ఎడన్= ఆ సమయంలో; భీమసేనుండు; భవత్+సేనా+సాగరంబు= నీ సేన అనే సముద్రం; పాయ+పడన్= చీలికకాగా; తఱిమి= తోలి; చొచ్చి= లోపల ప్రవేశించి; దుశ్శాసనుండును; దుర్విషహుండును; దుర్మదుండును; దుస్సహుండును; జయుండును; జయత్సేనుండును; వికర్ణుండును; చిత్రసేనుండును; సుదర్శనుండును; చారుచిత్రుండును; సువర్మండును; దుష్కర్ణుండును (వీరందరూ ధృతరాష్ట్రుని కొడుకులు);

ఒక్కచోన్= ఒక స్థలంలోనే; ఉన్నన్+కనుంగొని= ఉండటం చూచి; ఆ+కుమారులన్= ఆ రాచ కొడుకులను, తాఁకినన్= మార్కొనగా.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇక నీవు పశ్చాత్తాపం విడిచిపెట్టి ఆకర్ణించుము. ఆ సమయంలో భీముడు నీ సేనాసాగరాన్ని పాయలు చేసి ఒక్కచోట పలువురు నీ కుమారులు - దుశ్శాసనుడు, దుర్విషహుడు, దుర్మదుడు, దుస్సహుడు, జయుడు, జయత్సేనుడు, వికర్ణుడు, చిత్రసేనుడు, సుదర్శనుడు, చారుచిత్రుడు, సువర్మ్ముడు, దుష్కర్ణుడు - ఒక్కచోట కన్పించగా, మంచి అవకాశం దొరికినట్లు సంతోషించి వారిని మార్కొన్నాడు.

**తే.** **వారలందఱు నొండొరుఁ బేరువేరఁ । బిలిచికొని వీఁడె సనుదెంచె భీముఁ డీతఁ**
**డొంటి యగపడ్డ చోటన యుక్కడంగఁ । బొదివి చంపుద మని యతిస్ఫురణ సేసి. 357**

**ప్రతిపదార్థం:** వారలు+అందఱున్= కౌరవరాజకుమారులు అందరూ; ఒండొరున్= ఒకరినొకరిని; పేరు పేరునన్+పిలిచి+కొని= పేరులు పెట్టి ఆహ్వానించికొని; వీఁడు+ఎ= వీడె(ఇతడే); భీముఁడు; చనుదెంచెన్= వచ్చాడు; ఒంటి= ఒంటరిగా; అగపడ్డ+చోటన్= కనుపించిన స్థలమునందే; ఉక్కు+అడఁగన్= పరాక్రమం అణగారిపోగా; పొదివి= చుట్టుముట్టి; చంపుదము= సంహరిద్దాము; అని= అని చాటుతూ; అతి+స్ఫురణ+చేసి= ఎక్కువగా ఆలోచించి.

**తాత్పర్యం:** కౌరవ రాజ కుమారులు అందరు 'భీముడు ఒక్కడు ఏకాంతంగా ఒకచోట కనుపించాడు కదా! ఇప్పుడు ఇతడిని వదలరాదు. ఇది మంచి అవకాశం. మనమందరం ఇతడిని ఇప్పుడు చుట్టుముట్టి చంపుదాము' అని ప్రత్యక్షంగా దొరకిన సన్నివేశాన్ని సంగ్రహించి, పేరు పేరున ఒకరినొకరు హెచ్చరించుకొన్నారు.

**క.** **ఉగ్రగ్రహములు లయకా । లగ్రహపతిఁ బొదువు క్రియ నలఘువిక్రమగ**
**ర్వాగ్రహమున ముట్టిరి రిపు । నిగ్రహలంపటుని భీమునిం జటులగతిన్. 358**

**ప్రతిపదార్థం:** ఉగ్ర గ్రహములు= భయంకరమైన గ్రహాలు(ఆకాశంలో తిరిగే గోళాలు); లయకాల+గ్రహపతిన్= ప్రళయకాలంలో సూర్యుడిని; పొదువు+క్రియన్= చుట్టుముట్టేటట్లుగా; అలఘు విక్రమ గర్వ+ఆగ్రహమునన్= తక్కువగాని అనగా గొప్పదైన పరాక్రమంతో కూడిన మదముతో(కోపంతో); రిపు+ నిగ్రహ+లంపటునిన్= శత్రువులను జయించాలనే కోరిక గలవాడైన; భీముని; చటుల+గతిన్= వేగంగా; ముట్టిరి= మార్కొన్నారు.

**తాత్పర్యం:** భయంకరమైన ఆకాశ గోళాలు, ప్రళయకాలంలో సూర్యుని ముట్టడించేటట్లుగా, కౌరవ రాజకుమారులు గొప్ప పరాక్రమమంతో, గర్వంతో, ఆటోపంతో, శత్రువులను జయించాలనే కోరికతోనే మెలగే భీముడిని వేగంగా మార్కొన్నారు.

**విశేషం:** అలం: ఉపమ. గ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతాయి. అందుకని సూర్యుడికి గ్రహరాజు అని పేరు. అయితే ప్రళయకాలంలో - గ్రహాలు - గతులు తప్పుతాయని అంటారు.

**వ.** **ఇట్లు నీ కొడుకులు చతురంగబలంబుతోడం జుట్టుముట్టిన వృకోదరుండు సంతసంబునం బొదలి సారథిం గనుంగొని 'నీ వీరథం బిచ్చట నిలిపికొని యుండు' మని నియోగించి గద వుచ్చికొని ధరణికి లంఘించి. 359**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నీ కొడుకులు; చతుః+అంగ+బలంబులతోడన్= నాలుగు సేనాంగాలతో; చుట్టుముట్టినన్; వృకోదరుండు= భీముడు (తోడేలు పొట్టవంటి పొట్టగలవాడు); సంతసంబునన్+పొదలి= సంతోషంతో ఒప్పి; సారథిన్+కనుంగొని=

సూతుని చూచి; నీవు; ఈ +రథంబు; ఇచ్చటన్= ఈ స్థలంలో; నిలిపికొని యుండుము= ఆపి ఉంచుము; అని+నియోగించి= అని ఆజ్ఞాపించి; గద+పుచ్చికొని= గద చేతపట్టు కొని; ధరణికిన్+లంఘించి= నేల మీదికి ఉరికి.

**తాత్పర్యం:** ఈ విధంగా నీ కొడుకులు తమ చతురంగ బలాలతో భీముడిని చుట్టుముట్టారు. భీముడికి - మంచి అవకాశం వచ్చినందుకు సంతోషం కలిగింది. అతడు సారథిని 'నీవు ఈ రథాన్ని ఇక్కడే భద్రంగా పెట్టుకొని ఉండుము' అని ఆజ్ఞాపించి, నేలమీదికి ఉరికాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 1. భీముడు ఒంటరిగా రథంమీద ఉంటే ఏం జరుగుతుంది? కౌరవరాజ కుమారులు పదిమంది చుట్టుముట్టారు. ఒక్కడు అందరితో - వారి చతురంగ బలాలతో యుద్ధం చేయాలి. అప్పుడు రథం భీముడికి మిక్కిలి ప్రమాదకరమైన చెరసాల అవుతుంది. రథంమీద విల్లుపట్టుకున్న భీమునికంటె - నేలమీద గద పుచ్చుకున్న భీముడే బలవంతుడు. స్వేచ్ఛాజీవి. రథంమీద ఉన్న భీముడిని గురిపెట్టి కొట్టవచ్చు. కానీ, నేలమీద ఉన్న భీముడు ఎక్కడ ఉన్నదీ ఎవరికీ తెలియదు. నేలమీద - భీముడు తన గొప్ప శారీరక బలాన్ని - అత్యద్భుతంగా వినియోగించుకోవచ్చు. అందుచేతనే అతడు రథం మీద నుండి నేలమీదకు దూకాడు.

**చ. కవిసి యుగాంతదండధరుకైవడిఁ గోలుమసంగి కుంభముల్**
**పవులఁగఁ దుండముల్ దునియఁ బ్రక్కలు వ్రక్కలు గాఁగ దర్పముం**
**జవము బలంబు నొప్పఁగ గజంబుల వ్రేసిన నెత్తురొల్కఁగా**
**నవి వడె ధాతునిర్ఝ రమయాచలపంక్తులఁ బోలి మేదినిన్. 360**

**ప్రతిపదార్థం:** కవిసి= మార్కొని; యుగ+అంత+దండధరుకైవడిన్= ప్రళయకాలంలోని యమునివలె; కోలుమసంగి= అతిశయించి; కుంభముల్= ఏనుగుల తలకాయలు; పవులఁగన్= బ్రద్దలైపోవునట్లుగా; తుండముల్=హస్తములు; తునియన్= ముక్కలుకాగా, ప్రక్కలు= కడుపు పార్శ్వములు; వ్రక్కలు+కాఁగన్= బీటలువారగా; దర్పమున్= ఆటోపము; జవమున్= శక్తి; బలంబున్= బలిమి; ఒప్పఁగన్= శోభిల్లగా; గజంబులన్= ఏనుగులను; వ్రేసినన్= కొట్టగా; నెత్తురు+ఒల్కఁగాన్= రక్తము కారగా; అవి= ఆ ఏనుగులు; ధాతు+నిర్ఝుర+మయ+అచల+పంక్తులన్+పోలి= గైరికాది ధాతువులతో కూడిన సెలయేళ్ళతో కూడిన పర్వతాల వరుసల వలె కన్పించి; మేదినిన్= భూమిమీద; పడెన్= కూలాయి.

**తాత్పర్యం:** భీముడు ప్రళయకాలంలోని యముడి వలె విజృంభించి, ఏనుగుల కుంభస్థలాలు పగులగొట్టాడు. తుండాలు నరికివేశాడు. కడుపులు వ్రక్కలు వ్రక్కలు చేశాడు. తన జవసత్త్వాలు చూపాడు. రక్తం స్రవించి అవి గైరికాది ధాతువులతో సెలయేరులతో కూడిన పర్వతాలుగా భాసించాయి. ఆ ఏనుగులు నేలమీద కూలిపడి పోయాయి.

**విశేషం:** అలం: ఉపమ. ఏనుగులు నేలమీద నెత్తురులు కారుతూ కొండలవలె పడి ఉన్నాయి. కొండలలో ధాతువులు ఉంటాయి. కొండలనుండి సెలయేరులు - ఎర్రని గైరికాది ధాతువులు కలిసి ప్రవహిస్తాయి. ఆ సెలయేళ్ళ వలె ఉన్నాయి ఏనుగుల శరీరాల నుండి కారే నెత్తురు ప్రవాహాలు.

**క. అరదంబులు పొడిపొడి యై । హరుల గములు నుగ్గునూచ మై మొత్తపుఁగా**
**ల్బురు సిదురుప లై పడ ని । ష్ఠురగతి విహరించె వాయుసూనుఁడు గదతోన్. 361**

**ప్రతిపదార్థం:** అరదంబులు= రథాలు; పొడి+పొడి+ఐ= చూర్ణమై; హరుల+గమి+లు= గుర్రాల గుంపులు; నుగ్గునూచము+ఐ= ముక్కలు చెక్కలై; మొత్తము+కాల్బురు= కాలుబలము అంతయు; చిదురుపలు+ఐ= చిన్న చిన్న ముక్కలై; పడన్= నేలమీద పడిపోగా; వాయు+సూనుఁడు= భీముడు; గదతోన్= గద చేతపట్టుకొని; నిష్ఠుర+గతిన్= మిక్కిలి కఠినంగా; విహరించెన్= ఇష్టానుసారం తిరిగాడు.

**తాత్పర్యం:** రణరంగంలో భీముడు వీరవిహారం చేశాడు. గదాయుధం ధరించి రథం రణరంగంలో వెళ్ళలేని చోట్లకు భీముడు వెళ్ళగలిగాడు. రథాలను చూర్ణం చేశాడు. గుర్రాలను సూక్ష్మఖండాలుగా చేశాడు. కాల్బలం ముక్క చెక్కలైపోయింది. పాదచారియైన భీముడి ధాటికి ఎదురులేకపోయింది.

**క. పెక్కండ్రతోడ నిమ్మెయి । నొక్కరుఁడ రథమ్ము డిగ్గి యురవడిఁ జని పే**
**రుక్కునఁ బోరుట సూడఁగ । నక్కజమై యుండెఁ గౌరవాన్వయముఖ్యా! 362**

**ప్రతిపదార్థం:** కౌరవ+అన్వయ+ముఖ్యా!= కౌరవవంశంలో శ్రేష్ఠుడవైన వాడా!; ఓ ధృతరాష్ట్ర మహారాజా!; పెక్కండ్రతోడన్= పలువురితో; ఈ+మెయిన్= ఈ విధంగా; ఒక్కరుఁడు+అ= ఒక్కడే; రథమ్ము+డిగ్గి= తేరును దిగి; ఉరవడిన్+చని= వేగముగా వెళ్ళి; పేరు+ఉక్కునన్= గొప్ప పరాక్రమంతో; పోరుట= యుద్ధం చేయటం; చూడఁగన్= వీక్షింపగా; అక్కజము+ఐ+ఉండెన్= ఆశ్చర్యంగా ఉంది.

**తాత్పర్యం:** భీముడు - రథందిగి - ఒక్కడే పలువురితో పోరాడాడు. ధృతరాష్ట్ర మహారాజా! అతడి గొప్ప పరాక్రమం - చూచేవారికి మిక్కిలి ఆశ్చర్యం కలిగించింది.

**ఆ. భీమసేను నపుడు పెక్కుబలంబులు । పొదువు టెఱిఁగి ద్రుపదపుత్త్రకుండు**
**శస్త్రగురునితోడ సరభసవృత్తి మైఁ । బోరిపోరి యుడిగి బుద్ధి గలఁగఁ. 363**

**ప్రతిపదార్థం:** భీమసేనున్= భీముని; అపుడు; పెక్కు+బలంబులు= పెక్కుసేనలు; పొదువుట= చుట్టుముట్టటం; ఎఱిఁగి= తెలుసుకొని; ద్రుపద+పుత్త్రకుండు= ద్రుపదరాజు కొడుకు(ధృష్టద్యుమ్నుడు); శస్త్రగురునితోడన్= ద్రోణునితో; పోరి+పోరి= పోరాడి పోరాడి; ఉడిగి= విరమించి; బుద్ధి+కలఁగన్= మతి కలత చెందగా.

**తాత్పర్యం:** భీముడిని పలువురు కౌరవరాజుసుతులు తమ సేనలతో పాటు మార్కొనటం విని, అంతవరకూ ద్రోణుడితో ఎడతెగని పోరాటం కొనసాగించిన ధృష్టద్యుమ్నుడు - ఆ పోరాటం విరమించి, కలత చెందిన బుద్ధితో (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. భూరిరయంబున నద్దెసఁ । దేరు వఱపఁ బనిచి యతని తేరిపయిం ద**
**త్సారథిన కాంచి శోకము । గూరన్ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్. 364**

**ప్రతిపదార్థం:** భూరి+రయంబునన్= గొప్పవేగంతో; ఆ+దెసన్= ఆవైపు(భీముడు ఉన్న దిక్కుగా); తేరు= రథము; పఱపన్+పనిచి= నడుప నియమించి; అతని+తేరిపయిన్= భీముని రథంపై; తద్+సారథిన్+అ= భీముడి సూతుడిని మాత్రమే; కాంచి= చూచి; శోకము+కూరన్= దుఃఖం నిండగా; గద్గదికన్= డగ్గుత్తికతో; ఎలుఁగు= స్వరం; కుత్తుకన్+తగులన్= గొంతుకలో పొరాడగా.

**తాత్పర్యం:** గొప్పవేగంతో రథం భీముడు ఉన్న దిక్కుగా తోలుమని ధృష్టద్యుమ్నుడు ఆజ్ఞాపించాడు. తేరు ఆ దిక్కుగా తరలింది. అయితే భీముడి రథంమీద భీముడు లేడు - అంతేగాక భీముడి సారథి మాత్రమే ఆ రథం మీద కన్పించాడు. ధృష్టద్యుమ్నుడు దుఃఖంతో డగ్గుత్తిక పడిన కంఠస్వరంతో (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'ఆర్తుఁ డై యవ్విశోకుని నడిగె భీముఁ । డెచట నున్నాఁడు? నాయొడ లెట్లు ప్రాణ**
**సహిత మై యుండు? నతఁడొకచందమైన । నేమిగతిఁ బోదు? నక్కట! యెఱుఁగఁ జెపుమ.' 365**

**ప్రతిపదార్థం:** ఆర్తుఁడు+ఐ= దుఃఖపరవశుడై; ఆ+విశోకుని= ఆ విశోకుడు అను పేరుగల భీముని సారథిని; అడిగెన్= ప్రశ్నించాడు; భీముఁడు; ఎచటన్= ఎక్కడ; ఉన్నాడు; నా+ఒడలు= నా శరీరం; ఏ విధంగా; ప్రాణ+సహితము+ఐ+ఉండున్?= ప్రాణంతో కూడి ఉంటుంది?; అతఁడు= భీముడు; ఒక+చందము= ఒక విధం; ఐనన్= అయితే (ఒకవేళ భీముడు మరణించి ఉంటే - నా శరీరంలో ప్రాణం ఉంటుందా?); ఏమిగతిన్+పోదున్?= ఏ విధంగా నేను ఎక్కడకు వెళ్ళగలను?; అక్కట!= అయ్యో!; ఎఱుఁగన్+చెపుమ= తెలిసేటట్లు చెప్పవయ్యా.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు దుఃఖపరవశుడై విశోకుని ఇట్లా ప్రశ్నించాడు. 'భీముడు ఎక్కడ ఉన్నాడు? అతడు ఏమయినా అయితే నా శరీరంలో ప్రాణాలు నిలుస్తాయా? అకటా! నేనేమి కావాలి? ఏమి జరిగింది చెప్పవయ్యా?'

**విశేషం:** ఈ సన్నివేశం నాటకీయంగా ఉంది. తిక్కనది నాటకీయ శైలి అని విమర్శకులు అంటున్నారు. కథను సంభాషణ పూర్వకంగా నడపటం మాత్రమే గాక నాటకీయ సన్నివేశాలు సమకూర్చి, సహృదయుల ఉత్కంఠను పెంచటంలో తిక్కన సిద్ధహస్తుడు.

**వ. అనిన విశోకుండు ధృష్టద్యుమ్నున కి ట్లనియె. 366**

**ప్రతిపదార్థం:** అనినన్; విశోకుండు; ధృష్టద్యుమ్నునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్ను డీవిధంగా విశోకుడిని ప్రశ్నించగా - విశోకు డీవిధంగా సమాధానమిచ్చాడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. గొదగొని ధార్తరాష్ట్రు లతిఘోరవిధంబునఁ జుట్టుముట్టినన్**
**మదమునఁ దేరు డిగ్గి హరిణంబులపైఁ జను సింహమో యనన్**
**గదఁ గొని నన్ను నియ్యెడ నకంపితసుస్థితి నిల్వఁ బంచి బె**
**ట్టిదముగఁ జొచ్చె నాహవ పటిష్ఠుఁడు భీముఁడు వారి సైన్యమున్. 367**

**ప్రతిపదార్థం:** గొద+కొని= గుమిగూడి; ధార్తరాష్ట్రులు; అతి ఘోర విధంబునన్= మిక్కిలి భయంకరంగా; చుట్టు+ముట్టినన్ ; మదమునన్= గర్వంతో; తేరు+డిగ్గి= రథందిగి; హరిణంబులపైన్ చను సింహమో+అనన్= లేళ్ళమీదకు ఉరికే సింహమా? అనేటట్లుగా; గదన్+కొని= గద తీసికొని; నన్నున్; ఈ+ఎడన్= ఈ స్థలంలో; అకంపితసుస్థితిన్= కదలకుండగా; నిల్వన్+పంచి= నిలువుమని ఆజ్ఞాపించి; బెట్టిదముగన్= గొప్పగా; ఆహవ+పటిష్ఠుఁడు= యుద్ధ విశారదుడు(యుద్ధం చేయుటలో గొప్ప సామర్థ్యం కలవాడు; భీముఁడు= భీమసేనుడు; వారి+సైన్యమున్= కౌరవసేనను; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర రాజకుమారులు గుమిగూడి మిక్కిలి భయంకర రీతిలో భీముడిని చుట్టుముట్టారు. భీముడు గర్వంతో గద చేత పట్టుకొని - లేడి గుంపుపై దూకే సింహమో అనునట్లుగా రథం దిగి నన్ను ఇక్కడే కదలకుండా ఉండుమని ఆజ్ఞాపించి - యుద్ధం చేయటంలో శక్తి సామర్థ్యాలు కల భీముడు వారి సైన్యంలో దారుణంగా ప్రవేశించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అని యవ్వల నెఱింగించిన నతండు. 368**

**ప్రతిపదార్థం:** అని; అవ్వలను= భీముడుండే ఆ వైపు; ఎఱింగించినన్= తెలుపగా; అతండు= ధృష్టద్యుమ్నుడు.

**తాత్పర్యం:** విశోకుడు భీముడున్న వైపు తెలుపగా, ధృష్టద్యుమ్నుడు (తరువాతి పద్యంతో అన్వయం.)

## ధృష్టద్యుమ్నుఁడు భీమసేనునకుఁ దోడ్పడుట (6-73-31)

**క. కడువడిఁ జని యంతంతం। బుడమిఁ బడిన కరులగములు పొరలుటకతనన్**
**వడముడి యరిగిన తెరు వే। ర్పడఁ గని వేవేగ రథము పఱపెం గదియన్. 369**

**ప్రతిపదార్థం:** కడు+వడిన్+చని= మిక్కిలి వేగంగా వెళ్ళి; అంత+అంతన్= అక్కడక్కడ; పుడమిన్= నేలమీద; పడిన= కూలిన; కరుల+గములు= ఏనుగుల గుంపులు; పొరలుటకతనన్= పడి దొర్లటం చేత; వడముడి= భీముడు; అరిగిన+ తెరువు+ ఏర్పడన్= వెళ్ళిన మార్గం స్పష్టంగా; కని= అరసి; వే+వేగన్= మిక్కిలి శీఘ్రంగా; కదియన్= సమీపించుటకై (భీముని దరి చేరుటకై); రథము+ పఱపెన్= రథం నడిపాడు.

**తాత్పర్యం:** విశోకుడు చూపిన వైపు మిక్కిలి వేగంగా వెళ్ళి అంతంత నేలమీదపడిన యేనుగుల గుంపులు దొర్లుతూ ఉండడంవల్ల భీముడు పోయిన దారి తెలుసుకొని అతడిని సమీపించడానికి శీఘ్రంగా రథాన్ని నడిపాడు.

**వ. ఇట్లు భీమసేనుఁ జేరం బోయి. 370**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఈ విధంగా; భీమసేనున్= భీముని; చేరన్+పోయి= సమీపించి.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముని సమీపించి (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'ఇదె యేనుఁ గూడ వచ్చితిఁ। బదిలుఁడ వై పోరు మింక బకమర్దన! యీ**
**కదిసిన వీరులనెల్లం। గుదియించెద' ననుచుఁ గవిసెఁ గురువితతిపయిన్. 371**

**ప్రతిపదార్థం:** బక+మర్దన!= బకుడు అనే రాక్షసుని సంహరించినవాడా! ఓ భీమా!; ఇదె= ఇదిగో; ఏను= నేను (నిను); కూడన్, వచ్చితిన్= కలిసికొని తోడు పడాలని వచ్చాను; పదిలుడవు+ఐ= క్షేమంగా ఉన్న వాడవు అయి; ఇంకన్+పోరుము= ఇంక యుద్ధం చేయుము; ఈ+కదిసిన+వీరులను+ఎల్లన్= నిన్ను మార్కొనిన ఈ యోధులను అందరనూ; కుదియించెదన్= అణచగలను; అనుచున్= అని చెప్పుచు; కురు+వితతిపైన్= కౌరవుల సమూహంపై; కవిసెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** 'బకాసురుడిని సంహరించిన ఓ భీమా! నిన్ను కలుసుకొని నీకు తోడు పడవలెనని నేను వచ్చాను. ఇంక నీవు క్షేమంగా యుద్ధం చేయవచ్చు. నిన్ను మార్కొనిన ఈ యోధులను అందరినీ నేను అణగగొట్టగలను.' అంటూ కౌరవుల సమూహాన్ని ఎదుర్కొన్నాడు.

**క. అత్తఱి నీ తనయుం డెలుఁ। గెత్తి రథికవరులతోడ నిట్లను నీదు**
**ర్వృత్తునిఁ బొదువుఁడు భీముని। యుత్తలపా టుడుపుకడఁక నుడుపుఁడు గడిమిన్.' 372**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ తరుణమునందు; నీ+తనయుండు= నీ కొడుకు దుశ్శాసనుడు; ఎలుఁగు+ఎత్తి= కంఠస్వరం పెద్దదిగా చేసి; రథిక+వరులతోడన్= యోధ శ్రేష్ఠులతో; ఇట్లు+అనున్= ఈ విధంగా చెప్పాడు; ఈ దుః+వృత్తునిన్= ఈ దుర్మార్గుని- ధృష్టద్యుమ్నుని; పొదువుఁడు= చుట్టుముట్టండి; భీముని+ఉత్తలపాటు= భీముని ఆవేదన; ఉడుపు+కడఁకన్= పోగొట్టే పూనికను; కడిమిన్= పరాక్రమంతో; ఉడుపుఁడు= పోగొట్టండి.

**తాత్పర్యం:** ఆ తరుణంలో, నీ కొడుకు దుశ్శాసనుడు, కంఠస్వరం పెద్దదిగా చేసి, యోధ వీరులతో ఈ విధంగా అన్నాడు. 'ఈ దుర్మార్గుని చుట్టుముట్టండి. భీముడి ఉత్తలపాటు పోగొట్టే పూనికను మీరు పరాక్రమంతోమాన్పించండి.

**వ. అనిన విని యోధవీరులగు కుమారులు నొకపెట్ట ధృష్టద్యుమ్నుం బొదివిన నతండుఁ ద్రోణదత్తప్రమోహన బాణంబున వారి నందఱ నిశ్చేష్టితులం జేసిన నప్పుడు దప్పి దీర్చుకొన నెడగని యనిలనందనుం డొక్క మడువున మధురశిశిర జలంబులఁ బానంబు సేసి యుల్లసిల్లి యా ద్రుపదపుత్త్రుం గూడికొనియె నట్టియెడ నాచార్యుండు గయ్యంబు సేయుమునుమున ధృష్టద్యుమ్నుండు దొలంగిన తెఱపిం గదియఁ బాంచాలపతిఁ దఱిమిన నప్ప డగ్గురుండు నవ్వుచు. 373**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అని చెప్పిన ఆకర్ణించి; యోధ+వీరులు+అగు= యుద్ధం చేసే శూరులలో శ్రేష్ఠులైన; కుమారులు= రాజపుత్రులు; ఒక్క+పెట్టన్= ఒకేసారిగా; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; పొదివినన్= చుట్టుముట్టగా; అతండు= ధృష్టద్యుమ్నుడు; ద్రోణ దత్త+ప్రమోహన బాణంబునన్= ద్రోణునిచే ఇవ్వబడిన 'ప్రమోహన' బాణంతో; (మూర్ఛ కలిగించే అమ్ముచే); వారిన్+అందఱన్= వారిని అందరినీ; నిస్+చేష్టితులన్+చేసినన్= చేష్టలు లేనివారిగ(మూర్ఛితులుగా) ఒనరించగా; అప్పుడు; ఒక్క మడువునన్= ఒక చెరువులో; దప్పి తీర్చుకొనన్= దాహం తీర్చుకొనటానికి; మధుర+శిశిర+జలంబులన్= తియ్యని చల్లని మంచినీళ్ళను; పానంబు+చేసి= త్రాగి; ఉల్లసిల్లన్= శోభిల్లగా; ఎడన్+కని= వ్యవధి ఏర్పరచుకొని; అనిలనందనుండు= భీముడు; ఆ ద్రుపద+రాజ+పుత్త్రున్= ఆ ధృష్టద్యుమ్నుని (ద్రుపదరాజు పుత్రుని);కూడికొనియెన్= కలిశాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆచార్యుండు= ద్రోణుడు; కయ్యంబు+చేయు+మునుమునన్= యుద్ధం చేసే సేనా ముఖమున; ధృష్టద్యుమ్నుండు; తొలఁగిన; తెఱపిన్+కదియన్= వ్యవధి ఏర్పరచికొని; పాంచాల+పతిన్= పాంచాల రాజును (ద్రుపదుని); తఱిమినన్= తోలగా; అప్పుడు; ఆ+గురుండు= ఆ ద్రోణుడు; నవ్వుచు.

**తాత్పర్యం:** అని దుశ్శాసనుడు చెప్పగా విని, యోధులలో శ్రేష్ఠులు అయిన ఆ కౌరవ రాజకుమారులు ఒకేసారిగా అందరూ కలిసి ధృష్టద్యుమ్నుడిని చుట్టుముట్టారు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిచే తనకు ఇవ్వబడిన 'ప్రమోహన బాణము' ప్రయోగించి రాజపుత్రులను మూర్ఛలో మునిగేటట్లు చేశాడు. భీముడు ఆ వ్యవధిని పురస్కరించుకొని - ఒక మడువులో చల్లని తియ్యని మంచినీరు త్రాగి, సేదతీరి, ధృష్టద్యుమ్నుని కలుసుకున్నాడు. అప్పుడు - ద్రోణుడు సేనాముఖంలో ధృష్టద్యుమ్నుడు కనిపించక, లభించిన వ్యవధిలో ద్రుపద రాజుపై విజృంభించి అతనిని తరిమికొట్టగా - అలవోకగా నవ్వుతూ.

**విశేషం:** 1. ధృష్టద్యుమ్నుడు ద్రోణుని శిష్యుడే. గురువుగారు ప్రసాదించిన 'ప్రమోహన' బాణమునే అతడు కౌరవులపై ప్రయోగించాడు. 2. అవకాశం దొరికితే చాలు - తన్ను అవమానించిన ద్రుపదుడిపైకి ఉరుకుతాడు ద్రోణుడు. 3. ఒంటరిగా చాలాసేపు యుద్ధం చేయటం చేత భీముడికి దాహం అయింది. ప్రమోహన బాణం ప్రసాదించిన తెరపిలో ఆతడు దాహం తీర్చుకున్నాడు. అనగా భీముడు ఆకలి దప్పులు మరచి యుద్ధం చేసే వీరుడు అన్నమాట.

**తే. అస్త్రవర్షంబుఁ గురియంగ నతఁడు పూర్వ । వైరబంధంబుకతన దుర్వార మైన**
**యతని రోషంబు సైరింప నలవిగాక । జడిసి పోయిన నాతండు శంఖమొత్తె. 374**

**ప్రతిపదార్థం:** అస్త్ర+వర్షంబున్+కురియంగన్= మంత్ర బాణముల వాన వర్షింపచేయగా; అతఁడు= ద్రుపదరాజు; పూర్వ వైర బంధంబు కతనన్= లోగడ ఏర్పడిన శత్రుత్వం అనే బంధం వలన; అతని+రోషంబు= ద్రోణుడి కోపం; సైరింపన్= ఓర్చి కొనుటకు; అలవి కాక= శక్యంగాక; జడిసి= భయపడి; పోయినన్= వెడలిపోగా; ఆతండు= ద్రోణుడు; శంఖము+ఒత్తెన్= శంఖాన్ని పూరించాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు ద్రుపదుడిపై బాణవర్షం కురిపించాడు. ద్రుపదుడు - లోగడ తనకు ద్రోణుడికి ఏర్పడిన శత్రుత్వం వలన ఆతని కోపం భరించలేక భయపడి అక్కడ నుండి వెళ్ళిపోయాడు. విజయగర్వంతో ద్రోణుడు తన శంఖం పూరించాడు.

**విశేషం:** ద్రుపద మహారాజు, ద్రోణుడు బాల్య మిత్రులు. సతీర్థ్యులు. ఒకే గురువు దగ్గర విలువిద్య నేర్చుకున్నారు. తదుపరి ద్రుపదుడు సింహాసనం ఎక్కి పాంచాలరాజు అయ్యాడు. ద్రోణుడు బీద బ్రాహ్మణుడిగా మిగిలిపోయాడు. తదుపరి తన కొడుకు అశ్వత్థామ పాలకోసం గోదానం అభ్యర్థిస్తూ ద్రోణుడు పాంచాలరాజు దగ్గరకు వెళ్ళి, బాల్య స్నేహం ఉదాహరిస్తాడు. ద్రుపదుడు తన్ను యాచన చేయటానికి వచ్చిన నిర్భాగ్యుడు బాల్య సఖుడుగా తన్ను సంబోధించటం ఇష్టంలేక అతడిని అవమానించి పొమ్మన్నాడు. ఆనాటి నుండి ద్రోణుడు ద్రుపదుడిపై పగబట్టాడు. తదుపరి, అర్జునుడిచేత గురుదక్షిణగా ద్రుపదుడిని తన వద్దకు బందీకృతుడిగా తెప్పించుకొన్నాడు. అంతేగాక, కురురాజులకు పాంచాల ప్రభువులకు తరతరాల నుండీ శత్రుత్వం ఉన్నది. దుర్యోధనుడికి - పాంచాల రాజుపై ఏర్పడిన శత్రుత్వం కలిసివచ్చింది - (చిట్టచివరకు ద్రోణుడి కంఠం ఉత్తరించినది.. ధృష్టద్యుమ్నుడు. ద్రోణుని చంపగల పుత్రుడు కావాలని వరం కోరుకొన్నాడు. ద్రుపదుడి తపఃఫలంగా. కారణజన్ముడైన ధృష్టద్యుమ్నుడు కలిగాడు.)

**వ. ఇట్లు ద్రోణుండు ద్రుపదుం దెరల్చి ధృష్టద్యుమ్ను చనినవల నరసి తదీయ ప్రమోహనమార్గణమూర్ఛితం బయిన శూరలోకంబు నాలోకించి కరంబు రయంబునఁ బోయి. 375**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ద్రోణుండు; ద్రుపదున్= ద్రుపదరాజును; తెరల్చి= ఓడించి (మరలించి); ధృష్టద్యుమ్ను+చనిన+వలను+అరసి= ధృష్టద్యుమ్నుడు పోయిన దిక్కు చూచి; తదీయ ప్రమోహన బాణ మూర్ఛితంబు+అయిన= ఆతనియొక్క ప్రమోహన బాణంచే మూర్ఛపోయిన; శూర లోకంబున్= వీరుల సముదాయాన్ని; ఆలోకించి= చూచి; కరంబు+రయంబునన్= మిక్కుటమగు వేగంతో; పోయి.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రోణుడు ద్రుపదుడిని మరల్చి, ధృష్టద్యుమ్నుడు వెళ్ళిన తెరువుచాలు అరసి, ఆతడి ప్రమోహన బాణంచేత మూర్ఛితులైన యోధులను చూచి, వేగంగా అక్కడకు వెళ్ళి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వినుతప్రజ్ఞాబాణం । బున మోహనబాణశక్తి వోఁ జేసిన సం**
**జనిత ప్రాణోజ్జ్వలు లై । యనికిం గ్రమ్మఱ గడంగి రయ్యోధవరుల్. 376**

**ప్రతిపదార్థం:** వినుత ప్రజ్ఞా బాణంబునన్= పొగడబడిన ప్రజ్ఞాబాణంతో; మోహన బాణ శక్తి= మోహన బాణము యొక్క శక్తిని; పోన్+చేసినన్= పోగొట్టగా; సంజనిత+ప్రాణ+ఉజ్జ్వలులు+ఐ= తిరిగి అవతరించిన ప్రాణాలచేత ప్రకాశించునట్టివారై; ఆ+యోధవరుల్= ఆ వీరశ్రేష్ఠులు; అనికిన్= యుద్ధానికి; క్రమ్మఱన్= తిరిగి; కడంగిరి= పూనిక వహించారు.

**తాత్పర్యం:** ద్రోణుడు ప్రజ్ఞాబాణం ప్రయోగించి, మోహనబాణ శక్తిని పోగొట్టారు. అప్పుడు తిరిగి కోలుకొన్న ప్రాణాలతో ఆ కౌరవరాజపుత్రులు మళ్ళీ యుద్ధం ప్రారంభించారు.

**విశేషం:** మోహన బాణానికి విరుగుడు ప్రజ్ఞాబాణం.

**వ. ఇవ్విధంబున నాచార్యు ప్రాపునం జేసి యేచి నీ కొడుకులు పవనద్రుపదుల కొడుకులపై నడరినం గని యుధిష్ఠిరుండు గేకయు లేవురను ద్రౌపదేయులను ధృష్టకేతునిం జూచి మీ రభిమన్యుండు ముంగలిగా రథంబులు వఱపి భీమసేన ధృష్టద్యుమ్నులకుఁ దోడుపడుం డని పంచిన. 377**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఆచార్యు+ప్రాపునన్+చేసి= ద్రోణుని సాయం వలన; ఏచి= విజృంభించి; నీ కొడుకులు= నీ పుత్రులు; పవన ద్రుపదుల కొడుకులపైన్= వాయు పుత్రుడైన భీముడిపై, ద్రుపదపుత్రుడైన ధృష్టద్యుమ్నుడిపై; అడరినన్= విజృంభింపగా, కని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; కేకయులు+ఏవురను= కేకయ ప్రభువులు అయిదుగురును; ద్రౌపదేయులను= ఉపపాండవులను ఐదుగురిని; ధృష్టకేతునిన్+చూచి= ధృష్టకేతుని వీక్షించి; మీరు; అభిమన్యుండు; ముంగలిగాన్=

ముందుండువాడుగా; రథంబులు+పఱపి= ఆ రథాలు తోలించి; భీమసేన+ధృష్టద్యుమ్నులకున్= భీముడికీ, ధృష్టద్యుమ్నునకు; తోడుపడుండు= సాయము చేయండి; అని పంచినన్= అని నియమించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రోణుని సాయం వలన, నీ కొడుకులు భీముడిపై ధృష్టద్యుమ్నుడిపై విజృంభించారు. దానిని చూచి - ధర్మరాజు కేకయులను అయిదుగురిని - ద్రౌపది కొడుకులు అయిదుగురిని - అభిమన్యుడి ముందు పెట్టుకొని వెళ్ళి భీముడికీ ధృష్టద్యుమ్నుడికీ సాయం చేయండి అని ఆదేశించాడు.

**క. ఆ పన్నిద్దఱు సైన్యా । టోపసమేతముగఁ గవియుడును బాంచాల**
**క్ష్మా పాలుసుతుఁడు భీముఁడు । నేపారిరి నీదుసేన యెసకం బడఁగన్. 378**

**ప్రతిపదార్థం:** ఆ+పన్నిద్దఱు= ఆ పన్నెండుమంది; సైన్య+ఆటోప+సమేతముగాన్= తమ సైన్యాలతోపాటు గర్వంగా; కవియుడును= మార్కొనగా; పాంచాల క్ష్మాపాల సుతుఁడు= పాంచాల రాజపుత్రుడు (ధృష్టద్యుమ్నుడు); భీముఁడు; నీదు+సేన+ ఎసకంబు= నీ సేన అతిశయం; అడఁగన్= అణగారునట్లుగా; ఏపారిరి= విజృంభించారు.

**తాత్పర్యం:** ఆ పంద్రెండుగురు అనగా ఐదుమందికేకయులూ, అయిదుగురు ఉపపాండవులు, అభిమన్యుడూ, ధృష్టకేతుడూ తమ సైన్యాలతో సహా గర్వంగా మార్కొనగా, ద్రుపదరాజ పుత్రుడు ధృష్టద్యుమ్నుడు, మరియు భీముడు నీ సేన యొక్క అతిశయం అణగారి పోయేటట్లుగా విజృంభించారు.

**వ. తదవసరంబున. 379**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**తే. 'క్రందుఁ గయ్యంబులోన నరాతిభయద । బాహువిక్రమ! నీ విట్లు పాదచారి**
**వగుట వల దని కేకయునరద మెక్కఁ' బనిచె భీమునిఁ బాంచాలపతిసుతుండు. 380**

**ప్రతిపదార్థం:** క్రందు+కయ్యంబులోనన్= అతిశయించుతున్న యుద్ధంలో(సందడి యుద్ధంలో); అరాతి+భయద+బాహు+విక్రమ!= శత్రువులకు భయం కలిగించే బాహు పరాక్రమం గలవాడా - భీమసేనా!; నీవు; ఇట్లు; పాదచారివి+అగుట= కాలినడక చేసే వాడివి అగుట; వలదు= కూడదు; అని= అని చెప్పి; పాంచాల పతి సుతుండు= పాంచాల రాజు కొడుకు ధృష్టద్యుమ్నుడు; కేకయు= కేకయ రాజు యొక్క; అరదము= రథం; భీమునిన్ ఎక్కన్+పనిచెన్= ఎక్కుమన్నాడు.

**తాత్పర్యం:** 'శత్రువులకు భయం కలిగించే భుజ పరాక్రమం కల ఓ భీమసేనా! ఇది దొమ్మియుద్ధం. నీవు ఈ రీతిగా పాదచారివి కాకూడదు' అని చెప్పి, ధృష్టద్యుమ్నుడు భీముడిని కేకయుని రథంమీదికి ఎక్కుమన్నాడు.

**క. అప్పుడు మధ్యందినమున । నొప్పినయినుతోడఁ జాల నొర వచ్చి గురుం**
**డప్పాండవబలములపైఁ । దెప్పదెరలఁ గురిసె శరతతిం దీవ్రముగన్. 381**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; మధ్యందినమునన్= మట్టమధ్యాహ్నకాలమున; ఒప్పిన= శోభిల్లిన; ఇనుతోడన్= సూర్యుడితో; చాలన్; ఒర+వచ్చి= సామ్యం గలవాడై, సమానుడై; గురుండు= ద్రోణుడు; ఆ+పాండవ+బలములపైన్= ఆ పాండవు ల సేనలపై; శర తతిన్= బాణాల సముదాయమును; తీవ్రముగాన్= ఉగ్రముగా; తెప్పతెరలన్= అతివేగంగా; కురిసెన్= వర్షించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో ద్రోణుడు - మధ్యాహ్న కాలంలోని సూర్యుని పోలుతూ, ఆ పాండవసేనలపై తీవ్రమైన బాణాల సముదాయాన్ని అతివేగంగా ప్రయోగించాడు.

**చ. కనుఁగొని పార్షతుం డపుడు గట్టుపకాసయి వీఁకఁ దాఁకినం**
**దునిమె నతండు తద్ధనువుఁ దోడన పెక్కు శరంబు లేసె నా**
**తని మెయి నొండువిల్లు ద్రుపదక్షితిపాలసుతుండు గ్రక్కునం**
**గొని శరసప్తతిం గురిసి కోపముఁ బెంచిన నాతఁ డుగ్రతన్. 382**

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; పార్షతుండు= పృషతుని వంశీయుడు - ధృష్టద్యుమ్నుడు; అపుడు; కట్టుపకాసి+అయి= ధీరుడు అయి; వీఁక+తాఁకినన్= ఉత్సాహంతో మార్కొనగా; అతండు= ద్రోణుడు; తద్+ధనువు= అతడి విల్లు (ధృష్టద్యుమ్నుడి విల్లు); తునిమెన్= విరుగగొట్టాడు; తోడన= వెనువెంటనే; పెక్కు+శరంబులు= అనేక బాణాలు; ఏసెన్= ప్రయోగించాడు; ఆతని+మెయిన్= ధృష్టద్యుమ్నుని శరీరంపై; ద్రుపదక్షితిపాల సుతుండు= ద్రుపదరాజపుత్రుడు; ఒండు+విల్లు= ఇంకో ధనుస్సు; గ్రక్కునన్= వేగంగా; కొని= స్వీకరించి; శర+సప్తతిన్+కురిసి= డెబ్బై బాణాలు ప్రయోగించి; కోపమున్= ఆగ్రహం; పెంచినన్= అతిశయింపజేయగా; ఆతఁడు= ద్రోణుడు; ఉగ్రతన్= భయంకరంగా.

**తాత్పర్యం:** ద్రోణుడి విజృంభణ చూచి ధృష్టద్యుమ్నుడు - ఆ సమయంలో ధీరుడై ఉత్సాహంతో అతడిని మార్కొన్నాడు. ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి విల్లు ఖండించి, వెనువెంటనే ఆతని శరీరంపై అమ్ములు గుప్పాడు. ధృష్టద్యుమ్నుడు వేరొక విల్లు పట్టుకొని ద్రోణుడిపై డెబ్బై బాణాలు వేశాడు. ద్రోణుడు ఆగ్రహించి, భయంకరుడై (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** 'గట్టుపకాసి' (లేదా) 'కట్టుపకాసు' ఈ మాటకు అర్థం - 'వీరుడు (శూరుడు)'. శబ్దరత్నాకరంలో ఈ శబ్దం 'క'తో మొదలై ఉన్నది. అచలుడు అని అర్థం ఇవ్వబడింది. బ్రౌను నిఘంటువులో 'గ' తో మొదలై - గట్టుపకాసి అని గట్టుపకాసి = గట్టువలె ప్రకాశించువాడు - పర్వత ధీరుడు అని ఉంది. బ్రౌను స్వీకరించిన శబ్దమే సమంజసంగా తోచుతున్నది. సూర్యరాయాంధ్ర నిఘంటువులో 'ఇది ఇంకను ఆలోచింపదగినది' అని ఉన్నది.

**క. ఆ విల్లు ద్రుంచి రౌద్రర । సావేశంబొప్ప నాలుగమ్ముల రథవా**
**హావలిని సూతు నొక్కట । దేవగణము వొగడ వసుమతిం బడ నేసెన్. 383**

**ప్రతిపదార్థం:** ఆ విల్లున్ త్రుంచి= ఆ ధనుస్సును ఖండించి; రౌద్ర రస+ఆవేశంబు+ఒప్పన్= క్రోధరసం యొక్క సంరంభం శోభిల్లగా; నాలుగు+ అమ్ములన్= నాలుగు బాణాలతో; రథ వాహ+ఆవలిని= తేరుకు పూన్చిన గుర్రాల సముదాయాన్ని; ఒక్కటన్= ఒక బాణంతో; సూతున్= సారథిని; దేవ+గణము= దేవతల గుంపు; పొగడన్= ప్రశంసింపగా; వసుమతిన్+పడన్+ఏసెన్= నేలపై కూల్చాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి ధనువు ఖండించి, మిక్కుటమగు కోపంతో - నాలుగు బాణాలతో అతడి గుర్రాలను, ఒక బాణంతో అతడి సారథిని - దేవతలు కీర్తించేటట్లుగా నేలపై కూల్చాడు.

**విశేషం:** 'రౌద్ర రస+ఆవేశంబు' - తిక్కన 'రస' శబ్దాన్ని ఎన్నో సారులు ప్రయోగించాడు. 'రసము' అని వాచ్యంగా చెప్పటం కావ్య శిల్పమునకు అపకర్ష అని వాదించే విమర్శకులు ఉన్నారు. 'రస' శబ్దం నవరసపరంగా ఆలంకారికముగానే తిక్కన వాడలేదు. రసమును ఆర్ద్రభావంగా స్వీకరించవచ్చును. రసములు ఎన్ని? 'అనంతో వై రసాః' - 'రసములు అనంతములు' అనే సుప్రసిద్ధ వాదం ఉన్నది.

**మ. విరథుండై యభిమన్యు తేరిపయికిన్ వేగంబ పాంచాలభూ**
**వరసూనుం దరుగం దదీయబల మోర్వం జాల కొక్కుమ్మడిన్**
**మరలంబాఱె నతండు వాయుసుతుఁడున్ మానింప మానింప న**
**ప్డు రథానీకముతోడ భీముఁ బొదివెన్ భూమీశ్వరుం డుద్ధతిన్. 384**

**ప్రతిపదార్థం:** విరథుండు+ఐ= రథం లేనివాడై; వేగంబు+అ= వేగంబ= మిక్కిలి శీఘ్రంగా; పాంచాల భూవర సూనుండు= పాంచాల రాజపుత్రుడు(ధృష్టద్యుమ్నుడు); అభిమన్యు+తేరి+పయికిన్= అభిమన్యుని రథంమీదికి; అరుగన్= వెళ్ళగా; తదీయ+బలము= అతని సేన; ఓర్వన్+జాలక= ద్రోణుని ధాటికి సహింపలేక; ఒక్కుమ్మడిన్= కలిసికట్టుగా(అందరూ ఏకంగా); మరలన్+పాఱెన్= మరలిపారిపోయింది; అతండు= ధృష్టద్యుమ్నుడు; వాయుసుతుఁడున్= భీముడును; మానింపన్+మానింపన్= ఆపగా, ఆపగా; అప్డు= ఆ సమయంలో; రథ+అనీకముతోడన్= రథసేనతో; భూమీశ్వరుండు= రాజు(దుర్యోధనుడు); భీమున్; ఉద్ధతిన్= గర్వంతో; పొదివెన్= చుట్టుముట్టాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు - విరథుడై అభిమన్యుడి రథం మీదికి పోయాడు. ఆతడి సేన ద్రోణుడి ధాటికి తట్టుకోలేక పారిపోయింది. అప్పుడు అతడు, భీముడు - పారిపోయే సేనను ఆపారు. ఆ సమయంలో దుర్యోధనుడు తన రథ సేనతో వచ్చి సగర్వంగా భీముడిని చుట్టుముట్టాడు.

### ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునితో యుద్ధము సేయుట (సం. 6-73-67)

**తే. అంత నొం డొకసారథి యతిరయమునఁ । జటులహయములఁ బూన్పఁ బాంచాలసుతుఁడు**
**దన రథమునకు గ్రక్కునఁ జని పరాక్ర। మాభిరాముఁడై గురునిపై నడరెఁ బెలుచ. 385**

**ప్రతిపదార్థం:** అంతన్= పిదప; ఒండు+ఒక+సారథి= ఇంకొక సూతుడు; అతి రయమునన్= మిక్కిలి వేగంగా; చటుల హయములన్= వేగంగా పోయే గుఱ్ఱాలను; పూన్పన్= తన రథానికి కట్టగా; పాంచాల సుతుఁడు= ధృష్టద్యుమ్నుడు; గ్రక్కునన్+చని= వేగంగా వెళ్ళి; పరాక్రమ+అభిరాముడు+ఐ= పరాక్రమము చేత అందగించినవాడై; పెలుచన్= ఆటోపంతో; గురునిపైన్= ద్రోణుడిపై; అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** అంతట, మరియొక సారథి, మిక్కిలి వేగంతో శీఘ్రంగా పరుగెత్తే గుఱ్ఱాలను తన రథానికి పూన్పగా, ధృష్టద్యుమ్నుడు తన రథం ఎక్కి, పరాక్రమంతో శోభిల్లి తిరిగి ద్రోణుడిపై విజృంభించాడు.

**వ. ఇట్లు ధృష్టద్యుమ్నుండు గడంగి యెప్పటియట్ల కుంభసంభవుతోడం బెనంగుచుండ భీమసేనుండును.386**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; కడంగి= పూని; ఎప్పటి+అట్లు+అ= యథాప్రకారం; కుంభ+సంభవుతోడన్= ద్రోణునితో; పెనంగుచుండన్= విరమించని పోరాటం సలుపుచుండగా; భీమసేనుండును= భీముడు గూడ;

**తాత్పర్యం:** 'ఈ విధంగా ధృష్టద్యుమ్నుడు తిరిగి వెనుకటి మాదిరిగా ద్రోణునితో పోరాటం ప్రారంభించగా, భీముడు కూడ.

**క. తనయరదంబు విశోకుఁడు । గొనివచ్చిన నెలమి నెక్కి క్రూరోత్సాహం**
**బునఁ దనుఁ బొదివిన దుర్యో। ధనుమీఁద నిశాతవిశిఖతతి నిగిడించెన్. 387**

**ప్రతిపదార్థం:** తన+అరదంబున్= తన రథాన్ని; విశోకుఁడు= భీముని సారథి; కొనివచ్చినన్= తీసికొని రాగా; ఎలమిన్+ఎక్కి= సంతోషంతో ఆరోహించి; క్రూర+ఉత్సాహంబునన్= కఠినమైనట్టి ఉద్వేగముతో కూడిన పూనికతో; తనున్= తన్ను; పొదివిన= చుట్టుముట్టిన; దుర్యోధనుమీఁదన్= దుర్యోధనుడిపై; నిశాత+విశిఖ+తతిన్= వాడియైన అమ్ముల గుంపులు; నిగిడించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** అంతలో విశోకుడు తన రథాన్ని తోలుకొని తెచ్చాడు. భీముడు సగర్వంగా ఆ రథాన్ని ఎక్కి, కరకుదనం ఉప్పొంగే పూనికతో తన్ను చుట్టుముట్టిన దుర్యోధనుడిపై అమ్ములవాన కురిపించాడు.

**క. కురుపతి యొక నారాచం । బురమున నాటింప భీముఁ డుగ్రత నేసెన్**
**గురుతరశరత్రయంబున । గరములు వక్షమును నాటఁ గౌరవనాథున్. 388**

**ప్రతిపదార్థం:** కురుపతి= కురురాజు(దుర్యోధనుడు); ఒక+నారాచంబు= ఒక బాణం; ఉరమునన్= వక్షమునందు; నాటింపన్= గ్రుచ్చుకొనేటట్లు వేయగా; గురుతర+శర+త్రయంబునన్= గొప్పవైన మూడు బాణాలతో; కౌరవనాథున్= దుర్యోధనుడిని; కరములు= చేతులు; వక్షమును= ఉరమును; నాటన్= గ్రుచ్చికొనునట్లుగా; భీముఁడు= భీమసేనుడు; ఉగ్రతన్+ఏసెన్= భయంకరముగా ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ఒక బాణంతో దుర్యోధనుడు భీముడి వక్షమును తాకేటట్లు కొట్టాడు. భీముడు - మూడు బాణాలను, దుర్యోధనుడి రెండు చేతులందు - రొమ్ముపైన గ్రుచ్చుకొనేటట్లుగా, భయంకరంగా ప్రయోగించాడు.

**వ. దాని కతండు చలింపక వృకోదరుపై వివిధశరంబులేసె నతనితమ్ములు దలకడచి యాభీమసేనుం బట్టికొన నుత్సహించి యెప్పటియట్ల బెట్టిదంబుగాఁ గవిసినం గని యక్కుమారుల నభిమన్యు ద్రౌపదేయులును ధృష్టకేతు కేకయులునుం దాఁకి రట్లు వారును నమ్మారుతియుం గూడి దారుణభంగిం దఱుముట సైరింపం జాలక. 389**

**ప్రతిపదార్థం:** దానికిన్+అతండు చలింపక= భీముడు వేసిన మూడు బాణాలకు దుర్యోధనుడు కదలక; వృకోదరుపైన్= భీముడిపై; వివిధ శరంబులు= పెక్కు అమ్ములు; ఏసెన్= ప్రయోగించాడు; అతని తమ్ములు= దుర్యోధనుడి సోదరులు; తలకడచి= విజృంభించి; ఆ భీమసేనున్= ఆ భీముని; పట్టికొనన్+ఉత్సహించి= పట్టుకోవాలని ఉత్సాహంతో ప్రయత్నించి; ఎప్పటి+అట్ల+అ= ఎప్పటి మాదిరిగానే(యథాప్రకారంగా); బెట్టిదముగాన్= ఎక్కువగా; కవిసినన్= మార్కొనగా; కని; ఆ+కుమారులన్= ఆ కౌరవరాజపుత్రులను; అభిమన్యు, ద్రౌపదేయులును= అభిమన్యుడు - ద్రౌపది కొడుకులును; ధృష్టకేతు+కేకయులున్; తాఁకిరి= మార్కొన్నారు; అట్లు; వారును= అభిమన్యుడు మున్నగువారును; మారుతియున్= భీముడును; కూడి= కలిసికొని; దారుణ+భంగిన్= భయంకరముగా; తఱుముట= మార్కొనటం; సైరింపన్+చాలక= ఓర్వక.

**తాత్పర్యం:** దుర్యోధనుడు భీముడి బాణాలకు చలింపక - అతడిపై పెక్కు అమ్ములు ప్రయోగించాడు. దుర్యోధనుడి తమ్ములు పైకి విజృంభించి, ఆ భీమసేనుడిని పట్టుకోవాలని, ఉత్సాహంతో అతడిని యథాప్రకారం మార్కొన్నారు. అప్పుడు అభిమన్యుడు, ద్రౌపది తనయులు ధృష్టకేతుడు, కేకయులు - భీముడికి బాసటగా నిలిచారు. భీముడు, వారందరు కలిసి భయంకరంగా కౌరవరాజకుమారులపై విజృంభించారు. వారి ధాటికి కౌరవరాజకుమారులు తట్టుకోలేకపోయారు.

**క. విఱిగి భవత్సుత నివహం । బఱిముఱిఁ గనుకనిఁ జనంగ ననిలసుతుం డే**
**డ్తెఱ నెగచి వగచె వారం । దఱుఁ దనచేఁ జచ్చుటపుడు దప్పుటకుఁ గడున్. 390**

**ప్రతిపదార్థం:** విఱిగి= ఓడిపోయి; భవత్+సుత+ నివహంబు= నీకొడుకుల సముదాయం; అతిముఖిన్= వేగంగా; కనుకనిన్+చనంగన్= భయపడి వెడలిపారిపోగా; అనిల+సుతుండు= వాయుపుత్రుడు(భీముడు); ఏడ్తెఅన్= పరాక్రమంతో; ఎగచి= విజృంభించి; వారు+అందఱున్= ఆ కౌరవరాజపుత్రులు అందరూ; తనచేన్+చచ్చుట+అపుడు+తప్పుటకున్= అపుడు తనచే చావకుండా తప్పించికొనిపోవటానికి; కడున్= మిక్కుటముగా; వగచెన్= విచారించాడు.

**తాత్పర్యం:** ఓడిపోయి నీ కుమారవర్గం భయంతో వేగంగా పారిపోయారు. భీముడు తనకు లభించిన అవకాశం తప్పిపోయింది అనీ, వారు అందరు తన చేత చావకుండా తప్పించుకున్నారనీ మిక్కిలి విచారించాడు.

**క. తమ్ములఁ దోలిన నతిరౌ । ద్రమ్ముగఁ గోపించి యన్నదలపడియెను సై**
**న్యమ్ముఁ బురికొలిపికొని రభ । సమ్మున భీమాదియోధసంఘముతోడన్. 391**

**ప్రతిపదార్థం:** తమ్ములన్= సోదరులను(అవరజులను); తోలినన్= పారిపోవునట్లు చేయగా; అతి+రౌద్రమ్ముగన్= మిక్కిలి రోషంతో; కోపించి= ఆగ్రహం చెంది; అన్న= అగ్రసోదరుడు(దుర్యోధనుడు); సైన్యమ్మున్= సేనను; పురికొలిపికొని= ప్రోత్సహించి; రభసమ్మునన్= సంరంభంతో; భీమ+ఆది యోధ సంఘముతోడన్= భీముడు మున్నగు యోధుల గుంపుతో; తలపడియెను= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** తమ్ములను ఓడించి తరిమినందుకు దుర్యోధనుడికి కోపం వచ్చింది. అతడు సేనను ప్రోత్సహించి, సంరంభంతో భీముడు మున్నగు వీరులపై విజృంభించాడు.

**క. అపరాహ్ణ సమయమున న । ట్లుపమాతీతాతిఘోరయుద్ధం బయ్యెన్**
**రిపుభయదభుజుఁడు భీమున । కపరిమితబలుండు గురుధరాధీశునకున్. 392**

**ప్రతిపదార్థం:** అపర+అహ్ణ+సమయమునన్= మధ్యాహ్నము తదుపరి వేళయందు; అట్లు; ఉపమా+అతీత+అతి ఘోర యుద్ధంబు= సాదృశ్యం చెప్పటానికి వీలులేని భయంకర సంగ్రామం; రిపు భయద భుజుఁడు= శత్రువులకు వెఱపుగొలిపే భుజములు కలవాడు (భీముడు)భీమునకును; కురు+ధరా+అధీశునకున్= కురురాజుకు(దుర్యోధనుడికి); అయ్యెన్= జరిగింది.

**తాత్పర్యం:** మధ్యాహ్నం దాటిన వేళలో, శత్రువులకు భయంకరుడైన భీముడికీ, కౌరవరాజు అయిన దుర్యోధనుడికీ మధ్య ఉపమించటానికి వీలులేని భయంకర సంగ్రామం జరిగింది.

**సీ. తదవసరంబునఁ బొదివి వికర్ణుండుఁ జిత్రసేనుఁడుఁ బార్థుపుత్త్రుమీఁదఁ**
**గవిసిన నతఁడు వికర్ణురథ్యంబులఁ గూల్చి యాతనిపయిఁ గుప్పెకోల**
**లిరువది నాటింప నరదంబు డిగి భీతి యూన నాతఁడు చిత్రసేనురథము**
**పై కేఁగె ద్రౌపదిపట్టు లేవురు భీమునకు నడ్డపడి కురునాథుఁ దాఁకి**

**తే. మేనునెత్తురు వఱ్ఱుగా మెఱుఁగుటమ్ము । లేయ వారలఁ దలపడి యేనునార**
**సముల రారాజు నో నేసి సరభసముగఁ । దఱిమె గాంగేయుఁ డరిసేనఁ దఱియఁ జొచ్చె. 393**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; పొదివి= చుట్టుముట్టి; వికర్ణుఁడు; చిత్రసేనుఁడు; పార్థ+పుత్త్రుమీఁదన్= అర్జునుడి కొడుకైన అభిమన్యుడిపై; కవిసినన్= మార్కొనగా, అతఁడు= అభిమన్యుడు; వికర్ణ+రథ్యంబులన్= వికర్ణుడి తేరు గుఱ్ఱాలను; కూల్చి= సంహరించి; ఆతని+పయిన్= వికర్ణుడిపై; కోలలు+ఇరువది= ఇరవై బాణాలు; నాటింపన్= గ్రుచ్చగా; అరదంబు+డిగి= రథం దిగి; భీతి+ఊనన్= భయం పొందగా; ఆతఁడు= వికర్ణుడు; చిత్రసేను+రథముపైకిన్; ఏగెన్= వెళ్ళాడు; ద్రౌపది+పట్టులు+ఏవురున్= ద్రౌపది కొడుకులు అయిదుగురును; భీమునకున్; అడ్డుపడి= అడ్డంగా నిలిచి; కురునాథున్+తాఁకి=

కురుపతి (దుర్యోధనుని); మార్కొని; మేను+నెత్తురు= శరీరంపై రక్తం; వఱ్ఱుగాన్= ప్రవాహంగా; మెఱుఁగు+అమ్ములు= మెరిసే బాణాలు; వేయఁగాన్= ప్రయోగించగా; వారలన్+తలపడి= వారిని తాకి; ఏను+నారసములన్= అయిదు బాణాలతో; రారాజున్= దుర్యోధనుని; నోన్+ఏసి= బాధపడేటట్లు ప్రయోగించి; సరసభసముగన్= సంరంభముతో; తఱిమెన్= కవిశాడు; గాంగేయుఁడు= గంగకొడుకు(భీష్ముడు); అరిసేనన్= శత్రుసేనను; తఱియన్+చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో వికర్ణుడు, చిత్రసేనుడు అర్జునసుతుడైన అభిమన్యుడిని మార్కొన్నారు. అభిమన్యుడు - ఆ వికర్ణుని గుర్రాలను సంహరించి, విరథుడైన అతడిపై ఇరవై బాణాలు ప్రయోగించి అతనిని నొప్పించగా అతడు భయపడి చిత్రసేనుడి రథంమీదికి వెళ్ళాడు. ద్రౌపది కొడుకులు అయిదుగురూ భీముడికి సాయంగా వచ్చి - కురుపతి దుర్యోధనుడిపై ప్రకాశించే బాణాలను ప్రయోగించి, ఐదు బాణాలతో అతడిని నొప్పించి తరిమివేశారు. అంతలో భీష్ముడు శత్రుసేనలో ప్రవేశించాడు.

**క. చొచ్చి చతురంగ వితతులు । విచ్చునటులు సేయుటయును వివ్వచ్చుఁడు వే**
**వచ్చి తలపడినఁ బురికొని । యచ్చట నిరువాఁగు నట్టలాడం బోరెన్. 394**

**ప్రతిపదార్థం:** చొచ్చి= ప్రవేశించి; చతుః+అంగ+వితతులు= నాలుగు సేనాంగముల సమూహాలు; విచ్చు+అటులు= బ్రద్దలై విచ్చిపోయేటట్లుగా; చేయుటయును= చేయటంచేత; వివ్వచ్చుఁడు= అర్జునుడు; వే+వచ్చి= వేగంగాఅరుదెంచి; తలపడినన్= మార్కొనగా; పురికొని= ఉత్సహించి; ఇరువాఁగున్= రెండుపక్షాలూ; అట్టలాడన్= అల్లాడగా (మొండెములాడేటట్లు); పోరెన్= యుద్ధం చేశాయి.

**తాత్పర్యం:** సేనాపతియైన భీష్ముడు ప్రవేశించి - పాండవ సేన చెదరిపోయేటట్లు చేశాడు. అంతలో అర్జునుడు అరుగుదెంచి భీష్ముడిని మార్కొనగా, ఇరుపక్షాలూ ఉత్సాహంతో (మొండెము లాడగా) పోరాటం కొనసాగించాయి.

**ఆ. రక్తనదులలోన రథయానపాత్రముల్ । వఱపి యోధవరులు బాహుబలము**
**వెలయ సమరకేళి సలిపిరి శూరత । నేచి కడఁగి యోల రాచి రాచి. 395**

**ప్రతిపదార్థం:** రక్త నదులలోనన్= నెత్తురు ప్రవాహాలలో; రథయానపాత్రముల్= రథములు అనే పడవలు; వఱపి= నడపి; యోధవరులు= వీరశ్రేష్ఠులు; బాహు బలము వెలయన్= భుజ పరాక్రమం శోభిల్లగా; శూరతన్= శౌర్యంతో; ఏచి= విజృంభించి; కడఁగి= పూని; ఓల= (రక్త) జల క్రీడలో; రాచి+రాచి= సంఘర్షణ ఘటించి ఘటించి; సమర కేళి సలిపిరి= యుద్ధం అనే ఆట ఆడారు.

**తాత్పర్యం:** రక్త నదులలో రథాలను పడవలుగా ఉపయోగించి, వీరవరులు భుజబలం శోభిల్లగా పరాక్రమంతో విజృంభించి ఒకరినొకరు ఒరుసు కొంటూ రక్తజలక్రీడగా యుద్ధమనే ఆట ఆడారు.

**విశేషం:** అలం: రూపకం.

**వ. అంత నరుణకిరణుం డన్వర్థాభిధానుం డగుచు వచ్చిన వేగిరపడి వాయునందనుండు సుయోధను నేఁడ సమయింతు ననుసంరంభంబున నతనికి సమ్ముఖంబుగాఁ దేరు వఱపించి కదిసి క్రోధమోదంబులు మనంబునం బెనంగొన నతనిం గనుంగొని. 396**

**ప్రతిపదార్థం:** అంతన్= అటుపిమ్మట; అరుణ+కిరణుఁడు= ఎర్రని కిరణాలు కలవాడు(సాయం సూర్యుడు); అను+అర్థ+అభిధానుండు+అగుచున్= సార్థక నామధేయుడు అగుచు; వచ్చినన్= అరుదెంచగా; వేగిరపడి= తొందరపడి; వాయునందనుండు= మారుతి(భీముడు); సుయోధనున్= దుర్యోధనుడిని; నేఁడు+అ=నేడే, ఈ దినమునందే; సమయింతున్= సంహరింపగలను; అను+సంరంభంబునన్= అనే ఆటోపంతో; అతనికిన్= ఆ దుర్యోధనుడికి; సమ్ముఖంబుగాన్= ఎదురుగా(దగ్గరగా);

తేరు= రథము; పఱపించి= నడపి; కదిసి= కూడి; క్రోధ+మోహంబులు= కోపం, మోహం; మనంబునన్= మనస్సులో; పెనంగొనన్= పెనగొనగా; అతనిన్+కనుంగొని= ఆ దుర్యోధనుడిని చూచి.

**తాత్పర్యం:** అంత అరుణ కిరణుడు - ఎర్రని కిరణాలతో తన పేరుకు తగినట్లుగా అరుగుదెంచగా, భీముడు వేగిరపడి - 'నేడే దుర్యోధనుడిని సంహరింపగలను' అనే సరభస వృత్తితో అతడికి చేరువగా తన రథం తోలించాడు. అతడి మనస్సులో కోపం - మోహం పెరిగొన్నాయి.

**విశేషం:** భీముని వేగిరపాటుకు కారణం - సూర్యుడు అరుణ కిరణుడు కావటం. సూర్యుడు అస్తమించేటప్పుడు ఉభయ పక్షాలు యుద్ధవిరమణ చేయాలి గదా! ఈలోపుగా - 'నేడే' దుర్యోధనుడిని వధించాలని భీముని ఆరాటం.

**సీ. కడుఁ బెద్ద కాలంబు గాంక్షించి యున్నయుత్సవ మిప్డు సమకూర దైవ మిచ్చె**
**గొంతిసంకటపాటుఁ గోడలిబన్నంబుఁ దీర్చెదఁ గృష్ణుండు దెలుప నీవు**
**సరకు సేయమియును సభలో నులూకునిఁ బంచి యాడించిన పరుసములును**
**గక్కించి బీరంబు దక్కించుకొననీక తెగఁ జూడఁగాంచితి మగతనంబు**

**తే. గలిగి మగుడక నిలు మని పలికి యుగ్ర గతి నెదుర్కొని రథతురంగముల సూతుఁ**
**జంపి చాపంబు ద్రుంచి విస్ఫారకేతు। దండ మేడ్తెఱ నఱకె భీముండు సెలఁగి.** 397

**ప్రతిపదార్థం:** కడున్+పెద్ద+కాలంబు= చాలా నాళ్ళుగా; కాంక్షించి+ఉన్న= కోరుకొనినట్టి; ఉత్సవము= పండుగ; ఇప్డు= ఇపుడు; దైవము= అదృష్టము; సమకూరన్+ఇచ్చెన్= సమకూరేటట్లు చేసింది; గొంతి+సంకటపాటు= కుంతీదేవి పడిన కష్టాలు; కోడలి+బన్నంబు= ద్రౌపది అవమానం; తీర్చెదన్= పోగొట్టగలను; కృష్ణుండు; తెలుపన్= చెప్పగా; నీవు; సరకు చేయుమియును= లెక్కచేయకపోవటం; సభలోన్= కొలువుకూటంలో; ఉలూకునిన్+పంచి= ఉలూకుని నియమించి; ఆడించిన= పలికించిన; పరుసములును= కఠిన వాక్యాలు; కక్కించి= కక్కేటట్లుచేసి, వెనుకకు తీసికొనేటట్లు చేసి; బీరంబు= దర్పం; దక్కించుకొననీక= చెల్లటానికి వీలు కలుగనీకుండా; తెగన్+చూడన్+కాంచితిన్= ముక్కలు చేయటం చూడగలిగాను; మగతనము+కలిగి= పౌరుషం కలిగి; మగుడక= వెనుకకు మరలిపోకుండా; నిలుము= నిలిచిఉండుము; అని+పలికి= అని చెప్పి; ఉగ్రగతిన్= భయంకరంగా; ఎదుర్కొని= మార్కొని; రథ+తురంగములన్= అరదమునకు పూన్చిన గుర్రాలను; సూతునిన్= సారథిని; చంపి= సంహరించి; చాపంబున్= విల్లును; త్రుంచి= ఖండించి; భీముండు; చెలఁగి= శోభిల్లి, విస్ఫార కేతు దండము= వెలుగులతో విస్తరించిన పతాకం యొక్క కొయ్యను; ఏడ్తెఱన్= పరాక్రమంతో; నఱకెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** చాలకాలం నుంచి కోరుకుంటున్న పండుగ నేడు భాగ్యవశాన సమకూడింది. కుంతీదేవి పడిన కష్టపాటునూ, ఆమె కోడలు ద్రౌపది యొక్క భంగపాటునూ తీరుస్తాను. కృష్ణుడు రాయబారిగ వెళ్లి చేసిన బోధను నీవు లెక్క చేయకుండా ఉండటం, ఉలూకుని పంపించి సభలో పల్కించిన పరుషవాక్యాలనూ నీచే క్రక్కించి నీవు పౌరుషం దక్కించుకోకుండా నిన్ను చంపే అవకాశం నాకు లభించింది. మగతనం కలిగి పారిపోకనిలువుమని, భీముడు భయంకరంగా దుర్యోధనుణ్ణి ఎదుర్కొని అతని రథానికి పూన్చిన గుర్రాలను, సారథినీ చంపి, దుర్యోధనుడి విల్లు విరిచి వెలిగే జెండా కర్రను పరాక్రమంతో నరికి ప్రకాశించాడు.

**ఉ. వేఱొక విల్లు పుచ్చికొను వేగములోనన కౌరవేంద్రు మైఁ**
**దూఱ వృకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిం**
**దూఱినయట్లుగాఁ బ్రబలదోర్బల మేర్పడ నేయ నెమ్మలన్**
**గీఱిన మూర్ఛ వచ్చి యొఱగెం దఱచై రుధిరంబు గ్రమ్మఁగన్.** 398

**ప్రతిపదార్థం:** వేఱు+ఒక+విల్లు= మరియొక ధనుస్సు; పుచ్చికొను+వేగము+లోనన్= పరిగ్రహించే వేగం మధ్యనే; కౌరవ+ఇంద్రు+మైన్+దూఱన్= కౌరవ రాజు అయిన దుర్యోధనుని శరీరంలోకి చొచ్చుకొనేటట్లుగా; వృకోదరుండు= భీముడు; పది+తూపులన్= పది బాణాలను; పాములు= సర్పములు; పుట్టలోనికిన్; తూఱిన+అట్లుగాన్; ప్రబల+దోః+బలము+ఏర్పడన్= గొప్ప భుజశక్తి, పరాక్రమం కలుగగా; ఏయన్= ప్రయోగింపగా; ఎమ్ములన్= ఎముకలతో; గీఱిన= రక్కగా; తఱచు+ఐ= దట్టమై; రుధిరమ్ము= నెత్తురు; క్రమ్మఁగన్= స్రవింపగా; మూర్ఛవచ్చి= స్పృహతప్పి(దుర్యోధనుడు); ఒఱగెన్= వ్రాలాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు వేగంగా మరియొక ధనువు గ్రహించేలోపుగానే, భీముడు పదితూపులతో కొట్టాడు - భుజబలంతో. ఆ బాణాలు-పాములు పుట్టలో చేరినట్లుగా దుర్యోధనుని శరీరంలో ఎముకలను తాకి, గాయాలు చేశాయి. నెత్తురు కారిపోతూ ఉండగా, దుర్యోధనుడు మూర్ఛ చెంది, స్పృహతప్పి పడిపోయాడు.

**వ. అట్టియెడ జయద్రథుండు రథికవరులతోడం గడంగి వడముడిపై నడరె నప్పుడు కృపాచార్యుండు దుర్యోధనుఁ దనరథంబుమీఁదం బెట్టికొని తొలంగం గొనిపోయె నభిమన్యుండును ద్రౌపదేయులును గేకయులును మారుతిని మీఱి సైంధవుం దలపడినఁ జిత్రసేనుండును జిత్రుండును జిత్రాక్షుండును జారుచిత్రుండును సులోచనుండును నందుండును నుపనందుండును రౌద్రంబుగా సౌభద్రుం బొదివిన. 399**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; జయద్రథుండు= సింధురాజు; రథికవరులతోడన్+కడంగి= వీర శ్రేష్ఠులతో కలసిపూని; వడముడిపైన్= భీమునిపై; అడరెన్= విజృంభించాడు; అప్పుడు; కృపాచార్యుండు; దుర్యోధనున్= దుర్యోధనుని; తన+రథంబుమీఁదన్= తన తేరుమీద; పెట్టికొని; తొలఁగన్+కొనిపోయెన్= తప్పించి తీసికొని పోయాడు; అభిమన్యుండును; ద్రౌపదేయులును= ద్రౌపది కొడుకులును; కేకయులును; మారుతిని+మీఱి= భీముడిని దాటి; సైంధవున్= జయద్రథుడిని; తలపడినన్= మార్కొనగా; చిత్రసేనుండును; చిత్రుండును; చిత్రాక్షుండును; చారుచిత్రుండును; సులోచనుండును; నందుండును; ఉపనందుండును; రౌద్రంబుగాన్= భయంకరముగా; సౌభద్రున్= అభిమన్యుడిని; పొదివినన్= చుట్టుముట్టగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో జయద్రథుడు వీరవరులతోపాటు భీముడిపై విజృంభించాడు. అప్పుడు మూర్ఛిల్లిన దుర్యోధనుడిని కృపాచార్యుడు తన తేరుపైకి ఎక్కించుకొని వెళ్ళాడు. అభిమన్యుడు, ద్రౌపదేయులు, కేకయులు, భీముడిని దాటివెళ్ళి, సైంధవుడిని మార్కొన్నారు. చిత్రసేనుడు, చిత్రుడు, చిత్రాక్షుడు, చారుచిత్రుడు, సులోచనుడు, నందుడు, ఉపనందుడు భయంకరంగా అభిమన్యుడిని చుట్టుముట్టారు.

**క. బలియుఁ డగు పార్థపుత్త్రుఁడు । వలనేర్పడ నొకనినొకని వడి నైదైద**
**మ్ముల నేసి నొంప వారలు । దలఁకక వెస ముంచి రస్త్రధారల నతనిన్. 400**

**ప్రతిపదార్థం:** బలియుఁడు+అగు= బలవంతుడగు; పార్థ+పుత్త్రుఁడు= అభిమన్యుడు; వలను+ఏర్పడన్= అవకాశం చూచికొని; ఒకనిన్+ఒకనిన్= ఒక్కొక్కడిని; వడిన్= వేగంగా; ఐదు+ఐదు+అమ్ములన్= ఐదేసి బాణాలతో; ఏసి= ప్రయోగించి; నొంపన్= నొప్పింపగా; వారలు; తలఁకక= వెనుకాడక; అతనిన్= ఆ అభిమన్యుడిని; అస్త్రధారలన్= అమ్ముల జల్లులో; ముంచిరి= తడిపివేశారు.

**తాత్పర్యం:** బలశాలి అయిన అభిమన్యుడు అవకాశం చూచుకొని ఒక్కొక్కరిని అయిదయిదు బాణాలతో నొప్పించగా వారు భయపడకుండా వేగంగా అతడిని అస్త్ర ధారలలో ముంచారు.

**విశేషం:** దీనికి 393వ పద్యంతో సరిచూచుకోవాలి. అప్పుడు 'వికర్ణుడు' విరథుడై చిత్రసేనుడి రథంపైకి వెళ్ళాడు. ఇప్పుడు తిరిగి యుద్ధంలో ప్రవేశించాడు. ఇది చదువరులు గ్రహించి జ్ఞాపకం చేసుకోవాలి.

**వ. సహోదరులకు సహాయత్వంబు సేయంబూని మున్ను విరథుండై పోయినవాఁడగుటం జేసి. 401**

**ప్రతిపదార్థం:** సహోదరులకున్= తమ్ములకు; సహాయత్వంబు= సాయం; చేయన్+పూని= చేయటానికి ఆయత్తుడై; మున్ను= ఇంతకు ముందు; విరథుండు+ఐ= రథమును కోలుపోయినవాడై; పోయినవాఁడు+అగుటన్+చేసి= యుద్ధరంగము నుండి వెడలినవాడు కావటం చేత.

**తాత్పర్యం:** సోదరులకు తోడ్పాటు నందించుటకు పూని రథాన్ని కోలుపోవటం చేత వికర్ణుడు యుద్ధరంగము నుండి తొలగిపోయినవాడు కావటంచేత (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. తఱిమి వికర్ణుఁ డప్డు తనుఁ దాఁకిన నా యభిమన్యుఁ డల్గి బి**
**ట్టఱ విలుద్రుంచి సారథి వడం దురగంబులఁ జావ నేసి క్రొ**
**మ్మెఱుఁగులతోడఁ దద్ధ్వజము మేదినిఁ గూలఁగఁ జేసి యంగముల్**
**గిఱికొన బాణముల్ నినిచెఁ గేలిమెయిం బటు దర్ప మేర్పడన్. 402**

**ప్రతిపదార్థం:** తఱిమి= కవిసి; వికర్ణుఁడు= వికర్ణుడు; అప్డు= అప్పుడు; తనున్= తన్ను; తాఁకినన్= మార్కొనగా; ఆ+అభిమన్యుఁడు; అల్గి= కోపించి; బిట్టు+అఱన్= అతిశయము అణగారునట్లుగా; విలు+త్రుంచి= ధనుస్సు ఖండించి; సారథి; పడన్= కూలగా; తురగంబులన్= గుర్రాలను; చావన్+ఏసి= సంహరించి; క్రొత్త+మెఱుగులతోడన్= క్రొత్త వెలుగులతో; తద్+ధ్వజము= ఆ జెండా; మేదినిన్= భూమిపై; కూలఁగన్+చేసి= పడునట్లుగా చేసి; అంగముల్= అవయవాలు; గిఱికొనన్= చుట్టుకొనగా; కేలి+మెయిన్= లీలగా; పటు+దర్పము+ఏర్పడన్= మిక్కుటమగు గర్వము తెల్లమగునట్లుగా; బాణముల్= అమ్ములు; నినిచెన్= నిండించాడు.

**తాత్పర్యం:** అంతకుముందు విరథుడై వెడలిన వికర్ణుడు మరల వచ్చి తన్ను మార్కొనగా, అభిమన్యుడు కోపించి అతని అతిశయం అణగారిపోయేటట్లు వింటిని త్రుంచి, సారథిని సంహరించి, గుర్రాలను కూల్చి, కొత్తవెలుగులతో పాటు అతని జెండాను భూమిపై పడగొట్టాడు. అతడి అవయవాలు నొచ్చునట్లు అవలీలగా తన గర్వం వెల్లడి అగునట్లు బాణాలు వేగంగా ప్రయోగించాడు.

**వ. ఇట్లు నొచ్చినవికర్ణుం గనుంగొని కురుకుమారు లొక్కపెట్ట కవ్వడి కొడుకుపై నురవడించిన. 403**

**ప్రతిపదార్థం:** ఇట్లు=ఈ విధంగా; నొచ్చిన= కలతచెందిన; వికర్ణున్+కనుఁగొని= వికర్ణుని చూచి; కురు+కుమారులు= కౌరవరాజు కుమారులు; ఒక్క+పెట్టన్= ఏకంగా ఒకేసారి; కవ్వడి+కొడుకుపైన్= సవ్యసాచియైన అర్జునుడి కొడుకు అభిమన్యుడిపై; ఉరవడించినన్= వేగంగా మార్కొనగా.

**ఉ. ఏవురు ద్రౌపదేయులును నేడ్తెఱ నాతని కడ్డమై తురం**
**గావళి నొంచియుం బడగ లన్నియుఁ ద్రుంచియు నంపవానలం**
**జేవ సెడంగ ముంచియునుఁ జేడ్పడఁ జేయఁగ నీతనూభవుల్**
**వోవక వారితో మఱియుఁ బోరిరి సిగ్గున బీర మెక్కఁగన్. 404**

**ప్రతిపదార్థం:** ఏవురు+ద్రౌపదేయులును= ద్రౌపదీపుత్రులు అయిదుగురును; ఏడ్తెఱన్= పరాక్రమంతో; ఆతనికిన్+అడ్డమై= అభిమన్యుడికి అడ్డంగా, కురురాజకుమారులకు మధ్య నిలిచి; తురంగ+ఆవళి+నొంచియున్= గుర్రాల గుంపులను నొప్పించి; పడగలు+అన్నియున్+ త్రుంచియున్= జెండాలు అన్నింటినీ ఖండించియూ; అంప+వానలన్= బాణవర్షంచే; చేవ+చెడంగన్= శక్తి అణగారునట్లుగా; ముంచియున్= ముంచియును; చేడ్పడన్+చేయఁగన్= బాధనొందునట్లు చేయగా; నీ+తనూభవులు= నీ కొడుకులు(కౌరవరాజు కుమారులు); పోవక= మరలి వెళ్ళకుండా; వారితోన్= ద్రౌపదీసుతులతో; సిగ్గునన్= లజ్జచేత; బీరము+ ఎక్కఁగన్= అహంకారం అతిశయింపగా; మఱియున్= ఇంకనూ; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** ద్రౌపదీ సుతులు అయిదుమంది పరాక్రమంతో అభిమన్యుడిని దాటి కౌరవ రాజకుమారుల గుర్రాలను నొప్పించారు. జెండాలను త్రుంచారు. వారిచేవ చెడి పోగా అమ్ములవానలో ముంచి నొప్పించారు. అయితే నీ కుమారులు లజ్జ అహంకారాన్ని పెంచగా వెనుదిరిగిపోకుండా నిలిచి ద్రౌపదేయులతో పోరాడారు.

**వ. అట్టియెడ నకులనందనుం డగుశతానీకుండు బహుప్రకారబాణంబుల వివిధ విక్రమక్రీడ సలుపు బలుపుఁ గనుంగొని కేకయపాంచాలపతులు బాసటయై చటులతరతురంగమాతంగస్యందనసందోహంబులం బఱపి కడిమి నెఱపి రిప్పరుసునం బ్రతివీరుల నఱుముటయు నప్పుడు పతంగుండు పశ్చిమాచలశృంగంబు మఱుంగుపడుటయుం జూచి గాంగేయుం డంత్యకాలకాలాకృతిం గడంగి పటు విశిఖవితానంబుల వేఁడిమి సూపి యమ్మోహరంబు దెరల్చి తనమొనల మరల్చికొని సమరంబు సాలించి శిబిరంబున కరిగెఁ బాండుసూనులును మేనులు వెడవెడ చెమర్ప విడిదలకుం జని రని సంజయుం డాఱవ దివసంబు నాహవంబు తెఱం గెఱింగించె నప్పుడు. 405**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆసమయంలో; నకుల+నందనుండు+అగు= నకులుని కొడుకు అయిన; శతానీకుండు; బహు+ప్రకారబాణంబులన్= పెక్కు విధములైన బాణాలతో; వివిధ+విక్రమ+క్రీడ= నానా పరాక్రమలీల; సలుపు బలుపున్+కనుంగొని= చేసే అతిశయం చూచి; కేకయ, పాంచాలపతులు= కేకయ దేశాధిపతులు, ద్రుపదుడు; బాసటయై= సాయమై; చటుల తర, తురంగ, మాతంగ స్యందన సందోహంబులన్+పఱపి= వేగంగా కదలే గుర్రాలు, ఏనుగులు, రథాల సమూహములను తరలించి; కడిమి+నెఱపిరి= పరాక్రమం ప్రదర్శించారు; ఈ+పరుసునన్= ఈ విధంగా; ప్రతి వీరులన్= శత్రువులను; అఱుముటయున్= మార్కొనగా; అప్పుడు; పతంగుండు= సూర్యుడు; పశ్చిమ+అచల శృంగంబు మఱుంగు పడుటయున్= పడమటి కొండ కొమ్ముమాటున అదృశ్యుడు కావటం; చూచి; గాంగేయుండు= భీష్ముడు; అంత్యకాల+కాల+ కాల+ఆకృతిన్= ప్రళయ సమయంలోని యముని ఆకృతిని పోలి; కడంగి= పూని; పటు విశిఖ వితానంబులన్= గొప్ప బాణాల సముదాయంతో; వేఁడిమి+చూపి= ఉష్ణత వెలయించి; ఆ+మోహరంబున్= ఆ మొగ్గరమును; తెరల్చి= చెదరగొట్టి; తన మొనలన్= తన సేనలను (కౌరవసేనలను); మరల్చికొని= వెనుకకు తరలించి; సమరంబు+చాలించి= యుద్ధం విరమించి; శిబిరంబునకున్+అరిగెన్= స్కంధావారమునకు, విడిదికి వెళ్ళాడు; పాండుసూనులును= పాండవులుకూడా; మేనులు= శరీరాలు; వెడవెడ చెమర్పన్= ఎక్కువగా చెమటలుకారగా; విడిదలకున్+చనిరి= తమ ఆవాసాలకు వెళ్ళారు; అని, సంజయుండు; ఆఱవ దివసంబు+ఆవహంబు+తెఱంగు= ఆరవదినమున జరిగిన యుద్ధం తీరుతెన్నులు; ఎఱింగించెన్= తెలిపాడు; అప్పుడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో నకులుడి కొడుకైన శతానీకుడు పరాక్రమం ప్రదర్శించి, విజృంభించాడు. కేకయ దేశాధిపతులు, ద్రుపదుడు అతడికి బాసటగా చేరి నిలిచారు. వారు రథతురగగజ సమూహాలతో శత్రువులను

ఎదుర్కొన్నారు. అప్పుడు సూర్యుడు పడమటికొండ మాటునకు చేరి అదృశ్యమయ్యాడు. భీష్ముడు ప్రళయకాలంలోని యమునివలె విజృంభించి పాండవుల మొగ్గరాన్ని చీల్చి, తన సేనలను ఉపసంహరించి, విడిదులకు పొమ్మన్నాడు. తాను తన శిబిరానికి వెళ్ళాడు. ఆనాటికి యుద్ధ విరమణ జరిగింది. పాండవులు డస్సిపోయి, చెమట కారే దేహాలతో తమ విడిదులకు వెళ్ళిపోయారు.' అని సంజయుడు ఆ విధంగా కురుక్షేత్ర సంగ్రామంలోని ఆరవరోజు తీరుతెన్నులు తెలిపాడు. ఆ సమయంలో.

**క. ' కిమ్మీరమర్దనునిచే । నిమ్మెయి నోటాఱఁ బెక్కు లేటులు వడి ద**
**ర్ప మ్మెడలి మూర్ఛ మునిఁగియుఁ । గ్రమ్మఱఁ గురునాథుఁ డెట్లు గడఁగెనొ యనికిన్?' 406**

**ప్రతిపదార్థం:** కిమ్మీర+మర్దనునిచేన్= కిమ్మీరుడు అనే రాక్షసుని సంహరించిన భీమునిచే; ఈ+మెయిన్= ఈ రీతిగా; ఓటారన్= నిస్సత్తువుడుగా; పెక్కులు+ఏటులు+పడి= ఎన్నో దెబ్బలు తిని; దర్పమ్ము+ఎడలి= గర్వము అణగారి; మూర్ఛ+మునిఁగియున్= స్పృహతప్పి కూడా; క్రమ్మఱన్= తిరిగి; అనికిన్= యుద్ధానికి; కురు+నాథుఁడు= కురురాజు(దుర్యోధనుడు); ఎట్లు; కడఁగెన్+ఒ?= పూనినాడో?

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఈ విధంగా సంజయుని ప్రశ్నించాడు 'ఓ సంజయా, దుర్యోధనుడు ఆ విధంగా నిస్సత్తువుడై భీమునిచే అన్ని దెబ్బలు తిని, యుద్ధంలో ఓడిపోయి స్పృహతప్పి పడిపోయాడు గదా! మరల ఏ విధంగా యుద్ధానికి వచ్చాడు? ఏం జరిగింది?'

**విశేషం:** యుద్ధంలో ప్రతి విషయాన్ని - సూక్ష్మాతిసూక్ష్మంగా ఏ విశేషం విడిచి పెట్టకుండా తిక్కన అభివర్ణించగలిగాడు. 397, 398 పద్యాలలో, 399 గద్యంలో భీమసేనుడికీ, దుర్యోధనుడికీ మధ్య జరిగిన పోరాటం వర్ణింపబడింది. అప్పుడు మూర్ఛితుడైన దుర్యోధనుడిని కృపాచార్యుడు తన రథంమీద పెట్టుకొని తొలగిపోయాడు. ఆ తరువాత దుర్యోధనుడు ఏమైనట్లు? ఆ ప్రశ్న ధృతరాష్ట్రుడు అడగటం సమంజసం. అయితే సమాధానం - సంజయుడు చెప్పకుండా ద్వితీయాశ్వాసం ముగిసింది. చదువరుల ఉత్కంఠ అట్లానే ఉండిపోయింది.

**వ. అని సకౌతుకంబుగాఁ బలికిన. 407**

**ప్రతిపదార్థం:** అని= అని; స+కౌతుకంబుగాన్= కుతూహలముతో; తెలుసుకోవాలనే ఉబలాటంతో; పలికినన్= అడుగగా.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అడుగగా.

### ఆశ్వాసాంతము

**ఉ. భూరి తపోవిశేష! పరిపూర్ణమృదుస్థిరహృత్కరండవి**
**స్తారనివాస! తంత్ర ఘనసారవిధాపరమాభిరామ రే**
**ఖారమణీయ! లోకహితకారి మహాకరణీయ! ఘోరసం**
**సారదురామయాపదవసాయక! నిత్యఫలప్రదాయకా! 408**

**ప్రతిపదార్థం:** భూరితపస్+విశేష!= గొప్పదైన తపో విశేషము కలవాడా!; పరిపూర్ణ+మృదు+స్థిర+హృద్+కరండ+విస్తార+నివాస!= మృదుత్వముగా స్థైర్యముతో నిండిన హృదయమనే బరిణలు, విస్తరించి, నివసించేవాడా!; తంత్ర= శైవాగమములనే; ఘనసార, విధా, పరమాభిరామ, రేఖా+రమణీయ!= కప్పురపు పూతచే గొప్పగా అందంగా శోభిల్లేవాడా!; లోక+హితకారి+మహాకరణీయ!=

జగత్తునకు మేలు చేసే కర్తవ్యములు నెరవేర్చువాడా!; ఘోర+సంసార+దుస్+ఆమయ+ఆపద్+అవసాయక!= భయంకరమైన సంసారములోని పీడలను, భ్రమలను, పీడలను నశింపచేయువాడా!; నిత్య+ఫల+ప్రదాయకా!= నిత్యము మేలు చేయునట్టివాటిని ఇచ్చేవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! విస్తారమైన గొప్ప తపస్సుతో కూడినవాడా, మెత్తనిది, పండినది, నిండైనది అయిన గుండెలో నివసించునట్టివాడా, కప్పురము, కప్పురపు పూతచే శోభిల్లి, అందముగా కనిపించేవాడా, లోకమునకు మేలు చేసెడి కర్తవ్యాలను నిర్వహించేవాడా సంసార తాపములను, భ్రమలను, నాశనము చేసేవాడా.

**విశేషం:** ఇది భీష్మపర్వం - ద్వితీయాశ్వాసాంత పద్యాలలో మొదటిది 1. ఆశ్వాసాంత పద్యాలు అన్నీ సంస్కృతసమాస భూయిష్ఠములే. 2. ఇది హరిహరనాథతత్త్వ ప్రతిపాదకం.

**క. పారాశర్యప్రముఖో। దారమునీంద్రాంతరంగధామాంతర్వి**
**స్ఫారప్రభాపటలవి। స్తారోజ్జ్వలదీపరూపతా స్తవనీయా! 409**

**ప్రతిపదార్థం:** పారాశర్య+ప్రముఖ+ఉదార+ముని+ఇంద్ర+అంతరంగ+ధామ+అంతర్+విస్ఫార+ ప్రభా+పటల+విస్తార+ఉజ్జ్వల+దీప+రూపతా+స్తవనీయా!= వ్యాసుడు మున్నగు గొప్ప మునివరేణ్యుల మనస్సులు అనే చోటులలో చక్కగా విస్తరించిన వెలుగుల సముదాయంతో ప్రకాశించే దీపమువలె స్తుతింపదగినవాడా!

**తాత్పర్యం:** వ్యాసుడు మున్నగు గొప్ప ఋషుల మానససీమలలో వెలుగులు వెలార్చు దీపమువలె ఆరాధించి కీర్తించదగినవాడా! ఓ హరిహరనాథా!

**విశేషం:** 1. ఆశ్వాసాంత పద్యాలు - సంస్కృత సమాసాలతో నింపటం ప్రారంభించింది నన్నయ మహాకవి. ఆ ఒరవడినే తిక్కన, తదుపరి కవులు బహుళంగా పాటించారు.

**మాలిని.**

**అసురదళనలీలావ్యాప్తిదీప్తాభిశోచి**
**ర్లసితపరశుగాఢాలంకృతప్రౌఢముద్రా**
**భ్యసనమహితబాహాప్రస్ఫురత్కాంతిహృద్యా!**
**హసనసురభివిద్యా! హంసనాదైకవేద్యా ! 410**

**ప్రతిపదార్థం:** అసుర+దళన+లీలా+వ్యాప్తి+దీప్త+అభిశోచిస్+లసిత+పరశు+గాఢా+ అలంకృత+ప్రౌఢ+ముద్రా+అభ్యసనమహిత+బాహా+ప్రస్ఫురత్+కాంతిహృద్యా!= రాక్షసులను చీల్చి చెండాడే ఆటయందు విస్తరించి ప్రకాశించే, రశ్మిచేత శోభిల్లే గండ్రగొడ్డలి చేత ఎక్కువగా అలంకరింపబడిన, గొప్ప తెలివితో భాసించే భంగిమను అభ్యసించే గొప్ప చేతులలో ప్రకాశించే కాంతి చేత మనోజ్ఞమైన వాడా!; హసన+సురభి+విద్యా!= నవ్వుచే మనోజ్ఞమైన విద్య కలవాడా!; హంస+నాద+ఏక+వేద్యా!= యోగుల నాదబిందుకళోపాసనచేత మాత్రమే తెలియబడగలవాడా!

**తాత్పర్యం:** రాక్షసులను సంహరించే పరశువును పట్టుకొని విజృంభించే భంగిమతో కూడుకొన్న బాహు పరాక్రమం గలవాడా! ఓ హరిహరనాథా! నవ్వుతో శోభిల్లే విద్యకలవాడా! యోగుల నాదోపాసనచే మాత్రమే తెలియబడగలవాడా!

**విశేషం:** 1. ఈ పద్యంలోని ఆంతర్యం 'దుష్టశిక్షణ - శిష్టరక్షణ'. లయకారుడు హరుడు. దుష్టశిక్షణ చేయగలవాడు. స్థితికారుడు - శిష్టరక్షకుడు హరి. 'హంస' శబ్ద ప్రయోగం - అర్థవంతమైనది. 'హంస' జీవన్ముక్తుడైన మహర్షికి పర్యాయపదం.

2. 'దీప్తారశోచిర్లసిత', పాఠముకంటె, పాఠాంతరమైన 'దీప్తాభిశోచిర్లసిత' పాఠమే గ్రహింపబడింది. అరము అనగా వేగము. 'అరశోచిస్' కంటె 'అభిశోచిస్' అని గ్రహించటమే మంచిది అనిపించింది.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబున భీష్మపర్వంబునందు ద్వితీయాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఇది; శ్రీమత్+ఉభయ+కవి+మిత్త్ర= శ్రీమంతులైన సంస్కృతం, తెలుగులో కవిత చెప్పే వారికి స్నేహితుడు; - కొమ్మన+అమాత్యపుత్త్ర= కొమ్మన మంత్రి కొడుకు; బుధ+ఆరాధన+విరాజి= బుద్ధిమంతులను పూజించుటచే, శోభిల్లేవాడు; తిక్కన సోమయాజి; ప్రణీతంబు+అయిన= వ్రాయబడినది అయిన, శ్రీమహా+భారతంబునన్= శ్రీమహాభారతంలో; భీష్మ+పర్వంబునందు= భీష్మపర్వంలో; ద్వితీయ+ఆశ్వాసము= రెండవ ఆశ్వాసము.

**తాత్పర్యం:** శ్రీమంతులైన సంస్కృతాంధ్ర కవీశ్వరులకు హితుడును, కొమ్మన మంత్రికి కుమారుడును, పండితులను పూజించుటచేత ప్రకాశించేవాడును అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శుభకరమైన మహాభారతంలోని భీష్మపర్వంలో రెండవ ఆశ్వాసం ముగిసింది.

**విశేషం:** 1. 'ఉభయ కవిమిత్త్రుడు'(తిక్కనకు కల బిరుదు) కేతన ఈ విషయం దశకుమార చరిత్ర తిక్కనకు అంకితం చేస్తూ అవతారికలో ఈ విషయం చెప్పాడు. 2. సోమయాజి= యజ్ఞం చేసినవాడు. భారతం వ్రాసేముందు తిక్కన యజ్ఞంచేసి పవిత్ర భావన చేకూర్చుకున్నట్లు విమర్శకుల అభిప్రాయం. యజ్ఞం లోక సంగ్రహదీక్ష. 3. బుధారాధన - విరాజి ఈ ప్రయోగం మహాభారతకర్తయైన తన వ్యక్తిత్వం 'బుధుల పూజచే', ఆరాధన వలన - ప్రకాశమానమైనదని వినయంతో, వివేకంతో తిక్కన చేసిన విజ్ఞప్తి.

**భీష్మపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము - తృతీయాశ్వాసము

**శ్రీ విలసనత్వగురు గౌ । రీ విభ్రమ రమ్య చాతురీ స్వీకృత స**
**ద్భావ! నిరుపాధికానం । దావహ! కరుణానుభావ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= లక్ష్మి యొక్క; విలసనత్వ= విలాసం చేత; గురు= గొప్పదైనదీ; గౌరీ= పార్వతి యొక్క; విభ్రమ= శృంగార చేష్టలయొక్క; రమ్య= అందమైన; చాతురీ= నేర్పుచేత; స్వీకృత= గ్రహించబడిన; సత్+భావ!= ఉనికి కలవాడా!; సాధుభావం కలవాడా!; నిరుపాధిక+ఆనంద+ఆవహ!= ఉపాధిరహితమైన (అపరిమితమైన) ఆనందాన్ని వహించేవాడా!; కరుణా+అనుభావ!= (భక్తులయందు) దయ చూపించే స్వభావం కలవాడా!; హరిహరనాథా!= హరిహరనాథుడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! లక్ష్మీదేవి విలాస చేష్టలనూ, గౌరీదేవి శృంగార చేష్టలనూ అందంగా స్వీకరించే నేర్పుగల సాధుభావం కలవాడా! అనంతమైన ఆనంద స్వరూపం కలవాడా! భక్తుల పట్ల దయచూపే ప్రవర్తన కలవాడా!

**విశేషాలు:** పరతత్త్వమైన హరిహరనాథుడు నిర్గుణుడైనా, సగుణభావంలో శ్రీ గౌరీ రూపిణి అయిన మహాశక్తి యొక్క విలాస చేష్టలను ఆమోదించి సృష్ట్యాది కార్యాలను నిర్వహిస్తాడని భావం. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని తైత్తిరీయోపనిషత్తు. సర్వజీవులు అనుభవించే ఆనందం బ్రహ్మానందంలో లేశమే కావటం చేత పరబ్రహ్మమైన హరిహరనాథుడు అనంతానందరూపుడని తాత్పర్యం. హరిహరనాథుడి చేష్టలన్నీ భక్తులను కరుణించటానికి ప్రదర్శించేవే కాబట్టి అతడు కరుణానుభావుడు.

### భీష్మగాంధారేయుల సంవాదము (సం. 6-76-3)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** దేవా= ఓ ప్రభూ!; వైశంపాయనుండు= వైశంపాయనుడనే ఋషి; జనమేజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

**తే. భండనంబునఁ దనయుండు గం డడంగి । పోక విని తీవ్రఖేదంబుఁ బొంది యంబి**
**కాతనూభవుఁ డప్పు డాసూతపుత్త్రు । నడిగె నుత్తరవర్తన మాదరమున. 3**

**ప్రతిపదార్థం:** అంబికా తనూభవుఁడు= అంబిక అను నామె కుమారుడైన ధృతరాష్ట్రుడు; అప్పుడు= దుర్యోధనుడు బలం తగ్గి వెనుకకు తిరిగిన సమయాన; భండనంబునన్= యుద్ధమందు; తనయుండు= తన కుమారుడైన దుర్యోధనుడు; గండు+అడంగి= పౌరుషం దక్కి; పోక= వెళ్ళుటను; విని; తీవ్రఖేదంబున్= అధికమైన దుఃఖమును; పొంది= పొందినవాడై; ఆదరమునన్= మన్ననతో; ఉత్తర వర్తనము= దుర్యోధనుని తరువాతి నడవడిని గూర్చి; ఆ సూతపుత్త్రున్= సూతుని కుమారుడైన సంజయుడిని; అడిగెన్= అడిగాడు.

**తాత్పర్యం:** యుద్ధంలో దుర్యోధనుడు పౌరుషం కోల్పోయి, వెనుకకు మళ్ళాడని విని, ధృతరాష్ట్రుడు మిక్కిలి శోకం చెందినవాడై, తరువాత ఆ దుర్యోధను డేమిచేశాడని సూతపుత్రుడిని అడిగాడు.

**వ. అడుగుటయు నతం డతని కి ట్లను 'నాఁటిరేయి గాంగేయుతోడ గాంధారేయుండు. 4**

**ప్రతిపదార్థం:** అడుగుటయున్= ధృతరాష్ట్రు డిట్లడుగగా; అతండు= సంజయుడు; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; నాఁటిరేయి= ఆ నాటి రాత్రి; గాంధారేయుండు= గాంధారీ కుమారుడు దుర్యోధనుడు; గాంగేయుతోడన్= గంగాపుత్రుడైన భీష్ముడితో చెప్పిన విషయమును; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు, భంగపాటు పొందిన దుర్యోధనుడి తరువాతి వృత్తాంతాన్ని గూర్చి సంజయుడిని అడుగగా, ఆతడు ఇట్లా చెప్పాడు: ఆనాటి రాత్రి భీష్ముడితో దుర్యోధనుడు ఇట్లా అన్నాడు.

**ఆ. ' మనము పూఁచి పట్టి మొన లేర్చికొని పోవఁ । బాండురాజసుతులబలము గవిసి**
**గాసి చేయునదియుఁ గాక నీ ముందటఁ । బవనతనయుచేత భంగపడితి. 5**

**ప్రతిపదార్థం:** మనము= కౌరవులైన మనం; పూఁచిపట్టి= ప్రయత్నంతో; మొనలు= వ్యూహములు; ఏర్చికొని= ఏర్పాటు చేసికొని; పోవన్=, ముందుకు సాగుతూంటే; పాండురాజ సుతులబలము= పాండవుల సైన్యము; కవిసి= మార్కొని; గాసిచేయున్= నాశం చేస్తున్నది; అదియున్+కాక= అంతమాత్రమేకాకుండా; నీ ముందటన్= (భీష్ముడవైన) నీ ఎదుటనే; పవన తనయుచేతన్= గాలికొమరుడైన భీమునిచేత; భంగపడితిన్= భంగపాటుపొందాను.

**తాత్పర్యం:** 'మనమెంతో పూనికతో వ్యూహం చక్కపఱచుకొంటూ ముందుకుసాగుతున్నా, పాండవ సేన దానిని నాశనం చేస్తున్నది. అందుకు తోడుగా, నీవు చూస్తూండగానే భీముడిచేత భంగపడినాను గదా!

**విశేషం:** 'నీముందటన్' అనటంలో, 'నీ సాయంతో పాండవులను గెలవగలననే నమ్మకం గలవాడను. నీ ధాటికి దేవతలు కూడా ఎదురు నిలువజాలరు. అట్టి నీవు ఉపేక్ష చేశా'వని, దుర్యోధనుడు భీష్ముడిని ఎత్తిపొడుచుతున్నాడు.

**క. నినుఁ గొని గెలిచెదఁ గుంతీ । తనయుల నని యున్న తలఁపు దప్పించెదు నీ**
**వనిమిషులనైనఁ జేకొన । వనిమొన వా రింత బలియు రగు టేమి యొకో?' 6**

**ప్రతిపదార్థం:** నినున్+కొని= నిన్ను ఆధారంగా చేసికొని; కుంతీ తనయులన్= కుంతి కొడుకులగు పాండవులను; గెలిచెదన్+ అనియున్న తలఁపున్= అనియున్నట్టి నా కోరికను; తప్పించెదు= తప్పగొట్టుతున్నావు; నీవు; అనిమిషులనైనన్= దేవతలనైనను; చేకొనవు= లెక్కచేయవు; అనిమొనన్= యుద్ధపు వ్యూహంలో; వారు= ఆ పాండవులు; ఇంత బలియురు+అగుట= ఇంతగా బలవంతులు కావడం; ఏమి+ఒకో?= ఏమిటో?.

**తాత్పర్యం:** కొండంత అండగా నీవు ఉండడంచేత పాండవులను గెలుస్తాననే ఆశ నాకుండినది. దానిని నీవు తప్పగొట్టుతున్నావు. నీవు దేవతలను కూడ జయింపగల పరాక్రమంగలవాడవు. యుద్ధరంగంలో ఆ పాండవు లంత పరాక్రమవంతులవటానికి కారణం ఏమిటి?'

**విశేషం:** దుర్యోధనుని ఈ మాటవలన భీష్ముడి యుద్ధ వైఖరిలో అతడికి కొంత సంశయం కలిగినట్టు తోస్తున్నది. అనిమిషులు= రెప్పపాటులేనివారు (దేవతలు).

**అవతారిక:** దుర్యోధనుడి అమాయికత్వానికి, మూర్ఖత్వానికి భీష్ముడు నవ్వి ఇట్లంటున్నాడు-

**క. అనిన విని నవ్వి యతఁ డి । ట్లను 'నిం తన నేల? నన్ను నని నా యొడ లో**
**మినచోటుఁగలదె? పెఱయో । ధనికాయం బైన నకట! తలఁకదె చెపుమా! 7**

**ప్రతిపదార్థం:** అనినన్= దుర్యోధనుడు పై విధముగా చెప్పగా; విని; నవ్వి; అతఁడు= ఆ భీష్ముడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు; నన్నున్= నన్ను; ఇంత+అనన్+ఏల?= నీవు ఇంతగా తూలనాడడం ఎందుకు?; అనిన్= యుద్ధమందు; నా+ఒడలు= నా శరీరము; ఓమిన= రక్షించుకొన్న; చోటు+కలదె?= తావున్నదా?; అకట!= అయ్యో!; పెఱ యోధనికాయంబు+ఐనన్= శత్రువుల యోధుల సమూహమైనను; తలఁకదె?= భయపడదా? చెపుమా!

**తాత్పర్యం:** దుర్యోధనుడి మాటలు విన్న భీష్ముడు నవ్వి ఇట్లా అంటున్నాడు. 'నీవు ఈ విధంగా న న్ననటందేనికి? యుద్ధంలో నా శరీరం ఎక్కడైనా దాచుకొన్నానా? పాండవులు కాకుండా ఇతర యోధసమూహమై ఉండి వుంటే భయపడదా? చెప్పు.

**వ. పాండవుల గెలువ నలవి గా దని యెప్పుడుం జెప్పుదు నైన నఱలేక నీకు జయంబు గోరి పోరెద వగవ కుండుము.' 8**

**ప్రతిపదార్థం:** పాండవులన్; గెలువన్+అలవి కాదు+అని= గెలవటం సాధ్యం కాదని; ఎప్పుడున్+చెప్పుదున్= ఎల్లవేళలా అంటూనే ఉంటాను; ఐనన్= ఐనా; అఱలేక= కపటంలేకుండ; నీకున్; జయంబు; కోరి; పోరెదన్= యుద్ధం చేస్తాను; వగవక+ఉండుము= దుఃఖపడవద్దు.

**తాత్పర్యం:** పాండవు లెప్పటికిని జయింపరానివారే అని పలుమారు చెప్పుతుంటాను గదా! అయినప్పటికి నీవు జయించాలనే ఉద్దేశంతో ఒళ్ళు దాచుకోకుండా యుద్ధం చేస్తాను. నీవు దుఃఖపడవద్దు.'

### భీష్ముని సప్తమ దివస యుద్ధక్రమము (సం. 6-77-11)

**క. అన విని యూఱడి నిద్రా । జనితసుఖంబంది రేప జనపతి యనికిం**
**జనుటయు భీష్ముఁడు బల మె । ల్లను నెఱయఁగ దీర్చె మండలవ్యూహముగన్. 9**

**ప్రతిపదార్థం:** జనపతి= రాజైన దుర్యోధనుడు; అనన్ విని= భీష్ముడు చెప్పగా విని; ఊఱడి= ఊరటచెంది; నిద్రాజనిత సుఖంబు+అంది= నిద్రచేత కలిగిన సుఖమును పొందినవాడై; రేపు+అ= ఉదయమున; అనికిన్= యుద్ధమునకు; చనుటయున్= పోగా; భీష్ముఁడు; బలము+ఎల్లను= తమ సేననంతటిని; మండల వ్యూహముగన్= మండలాకారంలో తీర్చిన వ్యూహాన్ని; నెఱయఁగన్= యుద్ధభూమినంతా వ్యాపించేటట్లుగా; తీర్చెన్= తీర్చిదిద్దాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు భీష్ముడి మాటలు విని ఊరటజెంది, రాత్రి సుఖంగా నిద్రించి, ఉదయాన లేచి, యుద్ధానికి వెళ్ళాడు. భీష్ముడు కూడా తన సైన్యాన్ని తేరిపారజూచి, యుద్ధరంగాన్నంతా వ్యాపించే విధంగా మండల వ్యూహాన్ని ఏర్పాటు చేశాడు.

**విశేషం:** వ్యూహభేదములు నాలుగు. 1. దండము; 2.భోగము; 3. మండలము; 4. అసంహతము. చక్రగోమూత్రికాదులు వీటి అంతర్గత భేదాలు వ్యూహమంటే, యుద్ధం కొరకు సైన్యమును ఒక ప్రత్యేక ప్రదేశములో శత్రువులకు చొరటానికి వీలులేకుండా విభజించి నిలుపుట.

**వ. అందు నడుమ నరనాథుం డొప్పియుండెఁ దమ్ములుఁ జేయంగలదొరలును సూరెల నిలిచి రంతం బాండవులును భండనంబునకు వెడలి రయ్యుధిష్ఠిరుండు మనమొనలం గనుంగొని వజ్రవ్యూహంబు**

**గల్పింపుమని సేనాపతిం బనుప నతండును దత్ప్రకారంబున సైన్యంబు సన్నద్ధంబు సేసిన నది పరబలంబు మెచ్చక తఱిమి తూర్యధ్వను లెసఁగం దాఁకె, నప్పుడు ద్రోణుండు విరాటుని, ద్రౌణి శిఖండిని, దుర్యోధనుండు ధృష్టద్యుమ్నుని, మద్రపతి గవలను, విందానువిందులు యుధామన్యునిఁ బెక్కండ్రురాజులు బీభత్సుని మార్కొనిరి. భీమసేనుండు గృతవర్మను, సౌభద్రుండు చిత్రసేన దుశ్శాసన వికర్ణులను, ఘటోత్కచుండు భగదత్తుని, సాత్యకి యలంబుసుని, ధృష్టకేతుండు భూరిశ్రవసునిఁ, జేకితానుండు గృపాచార్యుని, ధర్మసూనుండు శ్రుతాయువును, బలువురు భూపతులు భీష్మునిం దలపడి రట్టియెడఁ గృష్ణునితో జిష్ణుం డిట్లనియె. 10**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ మండలవ్యూహమునందు; నడుమన్= మధ్యభాగాన; నరనాథుండు= దుర్యోధనుడు; ఒప్పి+ఉండెన్= తగినట్లుగా ఉన్నాడు; తమ్ములున్; చేయంగల దొరలును= యుద్ధములో తనకు సాయపడునట్టి రాజులు; సూరెలన్= రాజునకు ఇరు ప్రక్కలందును; నిలిచిరి= నిలిచారు; అంతన్= అంతట; పాండవులును= పాండవులు కూడా; భండనంబునకున్= యుద్ధమునకు; ఆ+యుధిష్ఠిరుండు= (యుద్ధమందు స్థిరంగా ఉండే) ఆ ధర్మరాజు; మన మొనలన్= మన (కౌరవుల) సేనలను; కనుంగొని= చూచి; వజ్రవ్యూహంబున్= వజ్రమనే పేరుగల ఒక వ్యూహమును; కల్పింపుము= చేయుము; అని పనుపన్= ఆజ్ఞాపింపగా; అతండును= ఆ సేనాపతియును; తద్+ప్రకారంబునన్= ఆ విధంగా; సైన్యంబున్= సైన్యమును; సన్నద్ధంబు= యుద్ధమునకు సిద్ధము; చేసినన్= చేయగా; అది= ఆ పాండవులసేన; పరబలంబున్= శత్రువు (కౌరవు)ల సైన్యమును; మెచ్చక= లక్ష్యపెట్టక; తఱిమి= వెంబడించి పరుగెత్తించి; తూర్యధ్వనులు= వాద్యముల శబ్దములు; ఎసఁగన్= అతిశయించగా; తాఁకెన్= ఎదిరించెను; ద్రౌణి= ద్రోణుని కుమారుడు అశ్వత్థామ; శిఖండిని; ద్రోణుండు; విరాటుని; దుర్యోధనుండు; ధృష్టద్యుమ్నుని; మద్రపతి= శల్యుడు; కవలను= నకుల సహదేవులను; వింద+అనువిందులు; యుధామన్యుని; పెక్కండ్రు రాజులు= ఎందరో రాజులు; బీభత్సునిన్= అర్జునుడిని; మార్కొనిరి= ఎదిరించారు; భీమసేనుండు; కృతవర్మను; సౌభద్రుండు= సుభద్ర కొడుకైన అభిమన్యుడు; చిత్రసేన, దుశ్శాసన, వికర్ణులను; ఘటోత్కచుండు- భగదత్తుని; సాత్యకి-అలంబుసుని; ధృష్టకేతుండు- భూరిశ్రవసుని; చేకితానుండు-కృపాచార్యుని; ధర్మసూనుండు-శ్రుతాయువును; పలువురు భూపతులు= చాలామంది రాజులు; భీష్మునిన్= భీష్మునితో; తలపడిరి; అట్టి+ఎడన్= అట్టి సమయంలో; కృష్ణునితో; జిష్ణుండు+ఇట్లు+అనియెన్= అర్జునుడు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మండలవ్యూహంలో మధ్యభాగాన దుర్యోధనుడున్నాడు. తమ్ములు, అతడికిసాయపడే రాజులూ ఇరు ప్రక్కలా నిలిచారు. అపుడు పాండవులు కూడా యుద్ధానికి వెళ్ళారు. ధర్మరాజు మన మొనలను చూచి తన సేనాపతియైన ధృష్టద్యుమ్నుడిని వజ్రవ్యూహాన్ని ఏర్పరచవలసిందిగా ఆదేశించాడు. ధృష్టద్యుమ్నుడు ఆ వ్యూహాన్ని ఏర్పరిచాడు. పాండవసేన శత్రుబలాన్ని లెక్కచేయకుండా తూర్య ధ్వనులు అతిశయించగా తరిమి మార్కొన్నది.

ద్రోణుడు విరాటుడినీ, అశ్వత్థామ శిఖండినీ, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడినీ, శల్యుడు నకుల సహదేవులనూ, విందానువిందులు యుధామన్యుడినీ, చాలమంది రాజులు అర్జునుడినీ మార్కొన్నారు. ఇంకా, పాండవసేనలోని భీమసేనుడు కృతవర్మనూ, అభిమన్యుడు చిత్రసేనుడినీ, దుశ్శాసనుడినీ, వికర్ణుడినీ, ఘటోత్కచుడు భగదత్తుడినీ, సాత్యకి అలంబుసుడినీ, ధృష్టకేతుడు భూరిశ్రవసుడినీ, చేకితానుడు కృపాచార్యుడినీ, ధర్మరాజు శ్రుతాయువునూ, చాలా మంది రాజులు - భీష్ముడిని ఎదిరించారు. అప్పుడు శ్రీకృష్ణుడితో అర్జునుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** 'పెక్కండ్రు రాజులు బీభత్సుని మార్కొనిరి' అని, 'పలువురు భూపతులు భీష్మునిఁ దలపడిరి' అనటంలో విశేషం ఏమిటంటే- మిగతా వీరుల విషయంలో ఒక్కడిని ఒక్కడుగాని, ముగ్గురిని మించకుండా ఎదుర్కొనగా, కౌరవ పక్షంలోని భీష్ముడి విషయంలోను,

పాండవ పక్షంలోని అర్జునుడి విషయంలోను ఆ విధంగా కాక- ఎక్కువ మంది ఎదుర్కొనటం జరిగింది. అనగా వీరిద్దరు వారి వారి పక్షాలలో అజేయులైన ప్రధాన వీరులని తెలుస్తున్నది.

**తే. ' భీష్ముఁ డొడ్డన మేర్చిన బెడఁగు సాల । నొప్పెఁ, గౌరవయోధుల యుబ్బు మెఱసె**
**నృపు లనేకులు నా మీఁద నిగిడి రేను । జిక్కుపఱిచెదఁ జూడుమీ యుక్కు మెఱసి.' 11**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు= భీష్మాచార్యుడు; ఒడ్డనము= వ్యూహము; ఏర్చిన బెడఁగు= ఏర్పరచటంలోని అందం; చాలన్+ఒప్పెన్= మిక్కిలి తగియున్నది; కౌరవయోధుల ఉబ్బు= కౌరవ సైన్యములోని వీరులయొక్క పొంగు; మెఱసెన్= ప్రకాశించింది; అనేకులు నృపులు= పలువురు రాజులు; నా మీఁదన్= నా పైకి; నిగిడిరి= విజృంభించారు; ఏను= నేను; ఉక్కు మెఱసి= బలం అతిశయించగా; చిక్కు+పఱిచెదన్= సంకట పరుస్తాను; చూడుమీ= (ఓ కృష్ణా) చూడుము.

**తాత్పర్యం:** 'భీష్ముడు మండల వ్యూహాన్ని సంఘటించి, అందంగా ఒప్పిదంగా నిలిపాడు. అందుచేతనే కౌరవ సైనికులకు ఉత్సాహం అతిశయించింది. ఆ కారణంచేతనే పలువురు కౌరవ సైనికులు నా మీదకు ఉరుకుతున్నారు. నేను వారి బలానికి భంగం కలిగించి, కష్టం కలిగిస్తాను. ఓ కృష్ణా! చూడుము.'

**వ. అని పలికి గొనయంబు సారించి. 12**

**ప్రతిపదార్థం:** అని పలికి; గొనయంబున్= వింటినారిని, సారించి= సరిదీసి.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా పలికి, వింటి నారిని సారించి (తరువాతి పద్యంతో అన్వయం).

**క. జననాథులపైఁ బె ల్లే । సిన వారలు నొక్కపెట్ట చెలఁగి ముకుందా**
**ర్జునులఁ బటుబాణవర్షం । బున ముంచిన నార్చె నీదుపుత్రబలంబుల్. 13**

**ప్రతిపదార్థం:** జననాథులపైన్= కౌరవసేనలోని రాజులపైన; పెల్లు+ఏసినన్= అధికముగా ప్రయోగింపఁగా; వారలున్= ఆ రాజులుకూడ; ఒక్కపెట్ట= ఒక్కసారిగా; చెలఁగి= ఉత్సాహం చెంది; ముకుంద+అర్జునులన్= శ్రీకృష్ణుడిని, అర్జునుడిని; పటు బాణ వర్షంబునన్= చురుకైన బాణములనెడి వర్షంలో; ముంచినన్= ముంచివేయగా; నీదు పుత్రబలంబుల్= నీ కుమారుడి సేనలు; ఆర్చెన్= బొబ్బలు పెట్టాయి.

**తాత్పర్యం:** అర్జునుడు రాజులపై అధికంగా బాణాలు ప్రయోగించగా, వారు ఒక్కసారిగా విజృంభించి, పదునైన బాణవర్షంలో ఆ కృష్ణార్జునులను ముంచివేశారు. అప్పుడు నీ కుమారుడి సేనలు పెను బొబ్బలు పెట్టాయి.

**వ. అప్పు డింద్రనందనుండు గోపించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 14**

**ప్రతిపదార్థం:** అప్పుడు= కౌరవసేనలోని రాజులు కృష్ణార్జునులను బాణవర్షంలో ముంచినప్పుడు; ఇంద్రనందనుండు= ఇంద్రుడి కుమారుడైన అర్జునుడు; కోపించి; ఐంద్ర+అస్త్రంబు= ఇంద్రుడు దేవతగా గల బాణాన్ని; ప్రయోగించినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** కౌరవరాజుల విజృంభణాన్ని చూచి కోపించి, అర్జునుడు ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు.

**మ. అది యా బాణములెల్ల మాన్చి నరనా । థాంగంబులన్ గీఱి యు**
**న్మదశుండాలహయాళిఁ గూల్చి రభసో । న్మాదక్రియన్ సంభ్రమ**
**ప్రద మై మందర మంబుధిం గలఁచు ద । ర్పం బొప్ప నొప్పించుడుం**
**దదనీకంబులు వాఱి భీష్మరథ మా । ధారంబుగా నిల్చినన్. 15**

**ప్రతిపదార్థం:** అది= అర్జునుడు ప్రయోగించిన ఐంద్రాస్త్రము; ఆ+బాణములు+ఎల్లన్= కురుసేనలోని రాజులు ప్రయోగించిన అన్ని బాణములను; మాన్చి= నశింపజేసి; నరనాథ+అంగంబులన్= రాజుల శరీరములను; గీఱి= భేదించి; ఉన్మద శుండాల హయ+ఆళిన్= మదముచెందిన ఏనుగుల, గుర్రాల సమూహమును; కూల్చి= కూలద్రోసి; రభస+ఉన్మాదక్రియన్= చెలరేగిన వెర్రివలె; సంభ్రమప్రదము+ఐ= మిక్కిలి భ్రాంతి గొల్పుచున్నదై; మందరము= మందర పర్వతము; అంబుధిన్= సముద్రమును; కలఁచు దర్పంబు+ఒప్పన్= కలతనొందించునట్టి గర్వము ఒప్పగా; నొప్పించుడున్= బాధను కలిగించగా; తద్+అనీకంబులు= ఆ కౌరవులసేనలు; పాఱి= పరుగెత్తి; భీష్మరథము= భీష్మునియొక్కతేరు; ఆధారంబు+కాన్= అండకాగా; నిల్చినన్= నిలువగా.

**తాత్పర్యం:** అర్జునుడు వేసిన బాణం శత్రువులు వేసిన బాణాల ప్రభావాన్ని పోగొట్టింది. శత్రురాజుల శరీరాలను గాయపరచింది. మత్తిల్లిన ఏనుగుల గుంపునూ, గుర్రాల పౌజునూ కూల్చివేసింది. వెర్రెత్తినదానివలె శత్రువులకు భయం కలిగిస్తూ మందరమనే పర్వతం సముద్రాన్ని కలచివైచినట్లుగా శత్రుసైన్యాన్ని కలత నొందించగా, కౌరవసేనలు భయపడి పరుగెత్తి, భీష్ముడి రథం మరుగుజొచ్చాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. త్రిగర్తపతి మొదలయిన యమ్మహీపతులుం దెరలి తమతమ సైన్యంబులు సన్న నెలవులకుం జని యొదుంగుటయు గాంగేయుండు గడంగుటయుం గని రాజులతో రారా జిట్లనియె. 16**

**ప్రతిపదార్థం:** త్రిగర్తపతి= త్రిగర్త దేశపురాజు సుశర్మ; మొదలు+అయిన; ఆ+మహీపతులున్= ఆ రాజులు కూడా; తెరలి= కలత చెంది; తమ తమ సైన్యంబులు= వారి వారి సేనలు; చన్న= వెళ్ళిన; నెలవులకున్= చోటులకు; చని= వెళ్ళి; ఒదుంగుటయున్= తల దాచుకొనగా; గాంగేయుండున్= గంగాపుత్రుడగు భీష్ముడు; కడంగుటయున్= శత్రుసంహారానికి యత్నించగా; కని; రాజులతో; రారాజు= చక్రవర్తియగు దుర్యోధనుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** త్రిగర్తాధిపతి ముఖ్యుడుగా గల పలువురు రాజులు కలతజెంది, తమసైన్యాలు వెళ్ళినచోటులకే వెళ్ళి దాగటాన్ని, భీష్ముడు యుద్ధంలో ప్రయత్నపరుడై ఉండటాన్ని చూచిన దుర్యోధనుడు ఆ రాజులతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** త్రిగర్తము- మూడు అగర్తల దేశం. లాహోరమనే దేశంలోని ఒక భాగం జాలంధరమని కూడా దీనికిపేరు.

**అవతారిక:** వెనుకంజవేస్తున్న రాజులను రారాజు ఈ విధంగా ప్రోత్సాహపరుస్తున్నాడు.

**క. 'సేనాసమేతుఁడగు నరు । పై నొక్కఁడ భీష్ముఁ డడర బలువిడిమైఁ దో**
**డై నడవ వలదె? యింతటి । మానుసులకు నేను జూడ మరలం దగునే?' 17**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు ఒక్కఁడు+అ= భీష్ముడొక్కడే; సేనాసమేతుఁడు+అగు= సైన్యముతో కూడినవాడైన; నరుపైన్= అర్జునుని మీదికి; అడరన్= విజృంభించుచుండగా; బలువిడిమైన్= ప్రతాపముతో; ఇంతటి మానుసులకున్= ఇంత గొప్ప పరాక్రమవంతులగు మనుష్య (భటు)లకు; తోడు+ఐ= సహాయులై; నడవన్‌వలదె= వెళ్లనక్కరలేదా?; నేను చూడన్= మీ ఏలికయగు నేను చూచుచుండగనే; మరలన్+తగునే?= వెనుదిరుగుట తగునా?

**తాత్పర్యం:** 'సైన్యంతో కూడియున్న అర్జునుడిపైకి భీష్ముడు ఒంటరివాడై తలపడుతుండగా, రారాజునైన నా సమక్షంలోనే, వీరులైన మీరు (రాజులు) శౌర్యంతో భీష్ముడికి అండగా ఉండకుండా పెడదారి పట్టటం న్యాయమా?' అని దుర్యోధనుడు రాజులను యుద్ధానికి పురికొల్పుతున్నాడు.

**వ. అనిన విని యా భూపాలనికరం బాలంబునకు నూలుకొని సురనదీసూను నిరుగెలంకులం గూడుకొనియె నప్పుడు. 18**

**ప్రతిపదార్థం:** అనినన్= దుర్యోధనుడు పై విధంగా అనగా; విని; ఆ భూపాలనికరంబు= ఆ రాజుల సమూహము; ఆలంబునకున్= యుద్ధమునకు; నూలుకొని= మనసు చక్కపరచుకొని; సురనదీసూనున్= దేవనదియగు గంగపుత్రుడైన భీష్ముని; ఇరు+కెలంకులన్= రెండు ప్రక్కలందు; కూడికొనియెన్= చేరెను; అప్పుడు.

**తాత్పర్యం:** రాజులందరూ రారాజు మాటవిని, యుద్ధానికి సన్నద్ధులై, భీష్మునికి ఇరుప్రక్కలందు నిలిచారు. ఆ సమయంలో-

**సీ. గురుఁడు విరాటుని కోదండకేతుదం । డంబులఁ ద్రుంచె రెండంబకముల**
**నతఁడు వేఱొకవింట నాచార్యుమేనును । సూతుని మూఁడేసిసునిశితాస్త్ర**
**ముల నొంచి ఘోటకమ్ములనాలుగింట నో । నేసి చాపము సిడ మెడల రెంట**
**నేసిన నతఁడు ద న్నెనిమిదియమ్ముల । విరథుఁ జేసిన సుతునరద మెక్కి**

**తే. యతఁడు దానును గూడి వాలంపవెల్లి । ముంచుటయుఁ గుంభజుండు గోపించి దొడ్డ**
**నారసం బేయ నమ్మత్స్యనాథతనయు । నురము వడిఁ గాఁడి వీఁపున నుచ్చిపోయె. 19**

**ప్రతిపదార్థం:** గురుఁడు= కౌరవ పాండవులకు విలు విద్య నేర్పిన ఆచార్యుడు- ద్రోణుడు; విరాటుని కోదండకేతుదండంబులన్= విరాట మహారాజుయొక్క వింటిని; టెక్కెము యొక్క కర్రను; రెండు+అంబకములన్= రెండు బాణాలతో; త్రుంచెన్= తునుకలు చేసినాడు; అతఁడు= ఆ విరాటమహారాజు; వేఱు+ఒక వింటన్= మరియొక విల్లుతో; మూఁడు+ఏసి= మూడు మూడు; సునిశిత+అస్త్రములన్= చాల పదునైన బాణములతో; ఆచార్యు మేనును= ద్రోణాచార్యుని యొక్క శరీరమును; సూతునిన్= సారథిని; నొంచి= గాయపరచి; నాలుగింటన్= నాలుగు బాణాలతో; ఘోటకమ్ములన్= గుర్రములను; నోన్+ఏసి= నొవ్వజేసి; రెంటన్= రెండు బాణాలతో; చాపము= విల్లు; సిడము= టెక్కెము; ఎడలన్= విరిగేటట్లుగా; ఏసినన్= వేయగా; అతఁడున్= ఆ ద్రోణాచార్యుడును; తన్నున్= తనను (విరాటుని); ఎనిమిది+అమ్ములన్= ఎనిమిది బాణాలతో; విరథున్= రథములేని వాడినిగా; చేసినన్= చేయగా; సుతు+అరదము+ఎక్కి= కుమారుడి రథమును ఎక్కి; అతఁడున్= కుమారుడును; తానునున్= విరాటమహారాజును; కూడి= కలిసి; వాలు+అంపవెల్లిన్= పదునైన బాణాల వెల్లువలో, ముంచుటయున్= ముంచివేయగా; కుంభజుండు= కడవనుండిపుట్టినవాడు- ద్రోణుడు; కోపించి= కోపంచెంది; దొడ్డనారసంబు= పెద్దదయిన ఇనుముతో చేయబడిన బాణాన్ని; ఏయన్= ప్రయోగింపగా; ఆ+మత్స్యనాథ తనయున్= ఆ మత్స్యదేశానికి రాజైన విరాటుని కుమారుని యొక్క; ఉరమున్= రొమ్మును; వడిన్= వేగముతో; కాఁడి= త్రవ్వి; వీఁపునన్= వీపునందు; ఉచ్చిపోయెన్= నాటుకొని బయటకు వచ్చినది.

**తాత్పర్యం:** ద్రోణుడు రెండు బాణాలువేసి, విరాటరాజు యొక్క వింటిని, పతాకము యొక్క కర్రను, త్రుంచివేశాడు. ఆ విరాటుడు మరొక వింటిని అందుకొని, మూడు మూడు మిక్కిలి పదునైన బాణాలతో ద్రోణాచార్యుడి శరీరాన్ని, సారథిని నొప్పించాడు. నాలుగు బాణాలతో గుర్రాలను కొట్టాడు. రెండు బాణాలతో ద్రోణుని ధనుస్సును, టెక్కెమునూ విరిచివేశాడు. ఆ ద్రోణుడు ఎనిమిది బాణాలువేసి, విరాటుని రథాన్ని కూల్చాడు. అప్పు డా విరాటుడు తన కొడుకు రథమెక్కి, తనకొడుకుతో కలిసి, పదునైన బాణాల ప్రవాహంలో ఆ ద్రోణుడిని ముంచాడు. అప్పుడు ద్రోణుడు కోపం చెంది, చాలా పొడవైన ఒక బాణాన్ని వేయగా, అది మత్స్యరాజు కుమారుని రొమ్మును గాయపరచి, వీపును తొలుచుకొని వెలుపలకి వచ్చినది.

**వ. ఇట్లు క్రూరనారాచంబు బెట్టు దాఁకిన. 20**

**ప్రతిపదార్థం:** ఇట్లు; క్రూరనారాచంబు= కఠినమైన ఆ బాణం; బెట్టు= గట్టిగా; తాఁకినన్= తగులగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ మత్స్యరాజు ప్రయోగించిన బాణం గట్టిగా తగులగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. విల్లును నమ్ములు విడుచుచుఁ । ద్రెళ్లుటయును శంఖుఁజూచి ధృతిగలఁగి జనం**
**బెల్లను జూడ విరాటుఁడు । దల్లడమునఁ బాఱ విచ్చెఁ దత్సైన్యంబుల్. 21**

**ప్రతిపదార్థం:** విల్లును(న్)= ధనుస్సును; అమ్ములున్= బాణములను; విడుచుచున్= వదలిపెట్టుచు; త్రెళ్లుటయున్= పడిపోగా; శంఖున్= ఆ శంఖుని; చూచి; ధృతి= ధైర్యము; కలఁగి= కలతపడి; విరాటుడు; జనంబు+ఎల్లను= జనులందరును; చూడన్= చూచుచుండగా; తల్లడమునన్= భయంతో; పాఱన్= పరుగెత్తగా; తద్+సైన్యంబుల్= ఆ విరాటుని సేనలు; విచ్చెన్= చెదరిపోయాయి.

**తాత్పర్యం:** ఆ ద్రోణుడు ప్రయోగించిన పెద్ద బాణపు దెబ్బకు శంఖుడు ధనుర్బాణాలను జారవిడిచి నేలపడ్డాడు. ఆ దృశ్యం చూడటంచేత ధైర్యం కోల్పోయి, విరాటుడు జనమంతా చూస్తుండగా, భయంతో పరుగెత్తాడు. ఆతడి సేనలు గూడ చెల్లాచెదరైపోయాయి.

**అవతారిక:** శిఖండి అశ్వత్థామల పోరు వర్ణిస్తున్నాడు.

**వ. అట్టిసమయంబున శిఖండి గురుపుత్త్ర ఫాలంబునఁ బటునారాచత్రయంబు నాటించిన నతం డలిగి యొక్క పెట్ట పెక్కమ్ములఁ దురంగ సూతకేతు చాపంబుల నుగ్గుసేసినం బలకయు వాలునుం గొని నేల కుఱికి పాంచాలనందనుండు సాళువంబు చందంబునం గవిసి యశ్వత్థామ యేయు బాణంబులు గృపాణంబునఁ ద్రుంచుచుం గదిసిన నతండు కోపించి. 22**

**ప్రతిపదార్థం:** అట్టి సమయంబునన్= విరాటుడు పారిపోయినట్టి తరుణంలో (ఆతడి సైన్యం కకావికలైపోయినట్టి ఆ సమయంలో); శిఖండి; గురుపుత్త్రుఫాలంబునన్= ద్రోణుడి కుమారుడైన అశ్వత్థామ యొక్క నుదుట; పటునారాచత్రయంబున్= మంచి శక్తిగల మూడు బాణాలను; నాటించినన్= గ్రుచ్చుకొనునట్లుచేయగా; అతండు= ఆ అశ్వత్థామ; అలిగి= కోపగించి; ఒక్క పెట్టన్= ఒకేసారిగా; పెక్కు+అమ్ములన్= ఎన్నో బాణాలతో; తురంగ= గుర్రాలు; సూత= సారథి; కేతు= ధ్వజము; చాపంబులన్= ధనుస్సు- వీటిని; నుగ్గు+చేసినన్= పొడిచేయగా; పలకయున్= కేడెమును (ఆయుధ విశేషము); వాలునున్= కత్తియును; కొని= తీసికొని; నేలకున్= భూమి మీదికి; ఉఱికి= దుమికి; పాంచాల నందనుండు= పాంచాలరాజుకుమారుడు శిఖండి; సాళువంబు చందంబునన్= డేగవలె; కవిసి= వ్యాపించి; అశ్వత్థామ= గురుపుత్రుడు; ఏయు= ప్రయోగించునట్టి; బాణంబులన్= బాణాలను; కృపాణంబునన్= కత్తితో; త్రుంచుచున్= తునియలుచేస్తూ; కదిసినన్= దగ్గరకురాగా; అతండు= ఆ అశ్వత్థామ; కోపించి.

**తాత్పర్యం:** ఆ సమయంలో శిఖండి మూడు పదునైన బాణాలను అశ్వత్థామ నొసట గ్రుచ్చుకొనేటట్లు ప్రయోగించాడు. అశ్వత్థామ కోపం చెంది ఒక్క తడవగా చాలా బాణాలు ప్రయోగించి అతని గుర్రాలను, సారథిని, టెక్కాన్ని, ధనుస్సును నుగ్గుచేశాడు. దానితో శిఖండి డాలు కత్తి తీసికొని, నేలపైకి ఉరికి, డేగమాదిరిగా ఎగబడుతూ, అశ్వత్థామ వేసే బాణాల నన్నింటినీ తన కత్తితో త్రుంచివేస్తూ మీదికి వచ్చాడు. అప్పుడు అశ్వత్థామ కోపంతో. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. పలక పఱియలుగాఁ జేసి యలుఁగుఁ దునిమి । యొడల వాలంపపొది నింప నొల్లఁబోక**
**ద్రుపదపుత్రుండు గరవాలు దునియ వైవ । నడుమఁ బొడి సేసె నాచార్యనందనుండు. 23**

**ప్రతిపదార్థం:** పలక(న్)= కేడెమును; పఱియలు+కాన్+చేసి= బద్దలయ్యేటట్లుచేసి; అలుఁగున్= ఖడ్గమును; తునిమి= తునకలుచేసి; ఒడల(న్)= శరీరమందు; వాలు+అంపపొదిన్= పదునైన బాణాల సమూహాన్ని; నింపన్= నింపివేయగా; ఒల్లఁబోక= లెక్కచేయక; ద్రుపదపుత్రుండు= ద్రుపదునియొక్క కుమారుడు- శిఖండి; కరవాలు= కత్తియొక్క; తునియన్ వైవన్= ముక్కను వేయగా; ఆచార్యనందనుండు= ద్రోణపుత్రుడు- అశ్వత్థామ; నడుమన్= మధ్యలోనే; పొడి+చేసెన్= (శిఖండి వేసిన కత్తితుంటను) పొడి పొడి చేశాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ శిఖండి యొక్క డాలును బద్దలుకొట్టాడు. ఖడ్గాన్ని నరికి పదునైన బాణ సమూహాన్ని అతడి ఒంటినిండా నింపాడు. శిఖండి వెనుదీయకుండా అశ్వత్థామ నరకగా మిగిలిన కత్తి ముక్కను విసరగా అశ్వత్థామ దానిని తన వద్దకు రానీయకుండా మధ్యలోనే పొడిచేసేశాడు.

**వ. శిఖండియు సాత్యకిరథం బెక్కెఁ దదవసరంబున ధృష్టద్యుమ్నుండు. 24**

**ప్రతిపదార్థం:** శిఖండియున్= శిఖండికూడ; సాత్యకిరథంబున్= సాత్యకి రథాన్ని; ఎక్కెన్; తద్+అవసరంబునన్= ఆ సమయంలో; ధృష్టద్యుమ్నుండు.

**తాత్పర్యం:** తన ఆయుధాలను అశ్వత్థామ మధ్యలోనే పొడిచేయగా, శిఖండి సాత్యకియొక్క రథంలోకి వెళ్ళాడు. ఆ సమయంలో.

**ధృష్టద్యుమ్నునిచే దుర్యోధనుండు విరథుఁ డై పోవుట (సం. 6-78-44)**

**క. శరములు గురుపతిమీఁదం । గురిసిన నతఁ డతని మేనఁ గ్రూరాస్త్రంబుల్**
**సరభసమున నింపఁగ స । త్వరముగ నాద్రుపదసుతుఁడు దచ్చాపంబున్. 25**

**ప్రతిపదార్థం:** శరములు= (ధృష్టద్యుమ్నుడు) బాణాలను; కురుపతిమీఁదన్= కురురాజైన దుర్యోధనుడిపై; కురిసినన్= వర్షింపగా; అతఁడు= ఆ దుర్యోధనుడు; అతనిమేనన్= ఆ ధృష్టద్యుమ్నుడి శరీరంమీద; క్రూర+అస్త్రంబుల్= కఠినమైన బాణాలను సరభసమునన్= మిక్కిలి వేగంతో; నింపఁగన్= నిండింపగా; ఆ ద్రుపదసుతుఁడు= ద్రుపదుని కుమారుడగు ఆ ధృష్టద్యుమ్నుడు; సత్వరముగన్= త్వరతో; తద్+చాపంబున్= ఆ దుర్యోధనునియొక్క విల్లును.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుడిపై బాణాలు గుప్పించాడు. దుర్యోధనుడు కూడా వెంటనే ధృష్టద్యుమ్నుడి శరీరంమీద కఠినమైన బాణాలను నింపాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుడి విల్లును (విరిచాడు).

**వ. తుండంబులు గావించి. 26**

**ప్రతిపదార్థం:** తుండంబులు= తునుకలు; కావించి= చేసి.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుని విల్లును తునుకలు చేశాడు.

**క. మఱియు నొక విల్లు గొను న । త్తెఱపిన విరథుఁడుగఁ జేయ ధృతిఁ గరవాలం**
**బుఱక గొని విభుఁడు నేలకు । నుఱికి యతనిమీఁద నడరె నుగ్రాకృతియై. 27**

**ప్రతిపదార్థం:** మఱియున్+ఒక+విల్లున్= వేరొక వింటిని; కొను+ఆ+తెఱపినన్= తీసికొనే లోపల; విరథుడుగన్+చేయన్= రథంలేని వాడిగా చేయగా; విభుఁడు= రాజైన దుర్యోధనుడు; ధృతిన్= ధైర్యముతో; కరవాలంబున్= కత్తిని; ఉఱక+కొని= అలవోకగా పట్టుకొని; నేలకున్= నేలమీదికి; ఉఱికి= దూకి; ఉగ్ర+ఆకృతి+ఐ= భయంకరమైన ఆకారంకలవాడై; అతనిమీఁదన్= ఆ ధృష్టద్యుమ్నుడి మీదికి; అడరెన్= విజృంభించెను.

**తాత్పర్యం:** దుర్యోధనుడు వేరే విల్లు తీసికొనే లోపలనే ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుని రథాన్ని నుగ్గుచేశాడు. అప్పుడు దుర్యోధనుడు తన ఖడ్గాన్ని తీసికొని మహాధైర్యంతో, భయంకరాకారంతో నేలమీదికి దూకి శత్రువుపైకి విజృంభించాడు.

**వ. అట్టియెడ సౌబలుండు రయంబున నెయిది యన్నరపతిం దనరథంబు మీఁదికిఁ దిగిచికొని పోయె. సాత్యకి యలంబుసుని నలఘు విశిఖ వృష్టిం బొదివిన నద్దనుజుం డర్ధచంద్రబాణంబున దద్బాణాసనంబు దుండంబులు సేసి యంగమ్ముల వాలమ్ములు గీలించి మాయ లొనర్చి యతిఘోరంబుగాఁ బేర్చిన నా శినివంశవరుం డచలుం డై యైంద్రాస్త్రప్రయోగంబున నమ్మాయ మాయించి యతని వెగడుపఱచిన నతఁడు వెఱచఱచి పఱచిన నయ్యాదవసింహుండు సింహనాదంబు సేసి కురుబలంబులపయిం గవిసెనప్పుడు. 28**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; సౌబలుండు= సుబలుని కుమారుడు-శకుని; రయంబునన్= వేగంగా; ఎయిది= అనుసరించి వెళ్ళి; ఆ+నరపతిన్= ఆ దుర్యోధనుడిని; తన; రథంబుమీఁదికిన్; తిగిచికొని+పోయెన్= లాగుకొని పోయాడు; సాత్యకి= కృష్ణుని సోదరుడు; అలంబుసునిన్= అలంబుసుడను కౌరవపక్షంలోని రాక్షసుణ్ణి; అలఘు విశిఖవృష్టిన్= అధికములగు బాణాల వర్షంతో; పొదివినన్= కప్పివేయగా; ఆ+దనుజుండు= రాక్షసుడైన ఆ అలంబుసుడు; అర్ధచంద్రబాణంబునన్= అర్ధచంద్రుని ఆకారంతో ఉండే బాణంతో; తద్+బాణాసనంబున్= వాని వింటిని; తుండంబులు+చేసి= తునుకలుగా చేసి; అంగమ్ములన్= వాని అవయవాలయందు; వాలు+అమ్ములన్= పదునుగల బాణాలను; కీలించి= నాటి; మాయలు= రాక్షసమాయలు; ఒనర్చి= చేసి; అతి ఘోరంబు+గాన్= మిక్కలి భయంకరంగా; పేర్చినన్= అతిశయించగా; ఆ శినివంశవరుండు= ప్రసిద్ధమైన శినివంశంలో ముఖ్యుడైనవాడు- సాత్యకి; అచలుండు+ఐ= చలనంలేనివాడై; ఐంద్రాస్త్ర ప్రయోగంబునన్= ఇంద్రుడు దేవతగాగల బాణాన్ని ప్రయోగించడంచేత; ఆ+మాయన్= అలంబుసుడు ప్రయోగించిన మాయను; మాయించి= పోగొట్టి; అతనిన్= అలంబుసుడిని; వెగడుపఱిచినన్= తల్లడిల్లజేయగా; అతఁడు= అలంబుసుడు; వెఱచఱచి= భయపడి; పఱచినన్= పారిపోగా; ఆ+యాదవసింహుడు= యదువంశంలోని వాళ్ళలో శ్రేష్ఠుడు- సాత్యకి; సింహనాదంబుచేసి= సింహం మాదిరి గర్జించి; కురుబలంబులపయిన్= కౌరవ బలాల మీదికి; కవిసెన్= విజృంభించాడు; అప్పుడు.

**తాత్పర్యం:** అప్పుడు శకుని ఆ దుర్యోధనుడిని తన రథంలోనికి ఎక్కించుకొని పోయాడు. పాండవ పక్షంలోని సాత్యకి అలంబుసుడనే రాక్షసుడిని బాణాలవర్షంలో ముంచి వేశాడు. ఆ రాక్షసుడు అర్ధచంద్రాకారంగా ఉండే బాణంతో సాత్యకి వింటిని ముక్కలు చేశాడు. అవయవాలనిండా బాణాలను గ్రుచ్చివేశాడు. రాక్షసమాయలు చేశాడు. చాలా భయంకరంగా మాయాపరంపరలను ఆతనిపైకి ప్రయోగించాడు. వాడింతచేసినా, శినివంశశ్రేష్ఠుడు సాత్యకి స్థిరంగా నిలబడి, ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించి, ఆ రాక్షసుడి మాయను మటుమాయంచేసి అతడిని తల్లడిల్లేటట్లు చేశాడు. ఆ దెబ్బతో అతడు భయపడి పారిపోయాడు. సాత్యకి కురుసైన్యంపైకి ఉరికాడు. అప్పుడు-

**అవ.** భీముడికి, కృతవర్మకు, యుద్ధం ఇక్కడ చెప్పబడుతోంది.

**క. కృతవర్మ యేచి మారుత । సుతుపయిఁ దఱుముటయుఁ నతఁడు సూతునిఁ దురగ**
**ప్రతతిం బడనేసి మహో । ద్ధతి మార్గణమయముసేసెఁ దద్గాత్రంబున్. 29**

**ప్రతిపదార్థం:** కృతవర్మ= కౌరవపక్షపాతియగు కృతవర్మయనువాడు; ఏచి= విజృంభించి; మారుతసుతుపయిన్= వాయుదేవుని కుమారుడు భీముడి మీదికి; తఱుముటయున్= కవియగా; అతఁడు= ఆ భీముడు; సూతునిన్= సారథిని; తురగ ప్రతతిన్= గుర్రాల గుంపును; పడన్+ఏసి= పడేటట్లుకొట్టి; మహా+ఉద్ధతిన్= చాలా గర్వంతో; తద్+గాత్రంబున్= ఆ కృతవర్మశరీరాన్ని; మార్గణమయము= బాణాలమయంగా; చేసెన్= చేసినాడు.

**తాత్పర్యం:** కృతవర్మ ఆటోపంగా భీముడిపైకి విజృంభించాడు. భీముడు ఆ కృతవర్మ సారథిని, గుర్రాల గుంపును కూల్చివేశాడు. గర్వంతో పలు బాణాలు ప్రయోగించి, శత్రువు శరీరాన్ని శరమయం చేశాడు.

**వ. ఇట్లు విరథుండును విశిఖక్షతదేహుండు నై యతం డేదు వెరిఁగి నట్లు నీదు మఱందియగు వృషకు నరదంబుమీఁది కరిగె, ననిలతనయుండును మనగజఘటలపైఁ బటురయంబునం దనరథంబుఁ బఱపె' ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అతండు= ఆ కృతవర్మ; విరథుండును= రథంలేనివాడుగాను; విశిఖక్షత దేహుండున్+ఐ= బాణాలచే గాయపరచబడ్డ దేహం కలవాడుగానూ అయి; ఏదు+వెరిఁగినట్లు= ముండ్లపంది పెరిగినట్లు; నీదు మఱంది= నీ (ధృతరాష్ట్రుని) బావమరది; అగు= అయిన; వృషకు= వృషకునియొక్క; అరదంబుమీఁదికిన్= రథంపైకి; అరిగెన్= వెళ్ళాడు; అనిలతనయుండును= వాయుపుత్రుడు- భీముడు; మన= (కౌరవులైన) మనయొక్క; గజఘటలపైన్= ఏనుగుల గుంపులమీదికి; పటురయంబునన్= మిక్కిలి వేగంతో; తన= తనయొక్క; రథంబున్= తేరును; పఱపెన్= సాగదోలాడు; అనినన్= అని చెప్పగా; విని; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈవిధంగా విరథుడూ, బాణాలతో గాయపడ్డ శరీరం కలవాడూ అయిన కృతవర్మ నిక్కపొడుచుకున్న ముళ్ళు గల ముండ్లపందివలె నీమరదియైన వృషకుడి రథంమీదికి వెళ్లాడు. వాయుపుత్రుడైన భీమసేనుడు మన ఏనుగుల గుంపుమీదికి మిక్కిలి వేగంతో తన రథాన్ని నడిపాడు. అని చెప్పగా విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లన్నాడు.

**విశేషం:** ఘట= యుద్ధంకోసం ఒక నిర్ణీతస్థలంలో చేర్చబడిన ఏనుగుల గుంపు.

**అవతారిక:** పాండవసేనలు విజృంభించటాన్ని, కౌరవసేనలు తగ్గుముఖం పట్టడాన్ని విని ధృతరాష్ట్రుడు చింతతో సంజయుణ్ణి అడుగుతాడు.

**క. ' విఱుగుట నొచ్చుట మనదెసఁ । దఱచుగ నాడెదవు పాండుతనయులబల మే**
**డ్తెఱ దఱుఁగక పెనఁగుట పలు । మఱుఁ జెప్పెద వకట! యేమి మాయయొ తలఁపన్. 31**

**ప్రతిపదార్థం:** విఱుగుట= ఓడిపోవుట; నొచ్చుట= నొప్పిచెందుట; మనదెసన్= మనదైన కౌరవపక్షంలో; తఱచుగన్= అధికంగా; ఆడెదవు= చెప్పుతున్నావు; పాండు తనయుల బలము= పాండు రాజకుమారుల సైన్యము; తఱుగక= నశించిపోక; ఏడ్తెఱన్= పరాక్రమంతో; పెనఁగుట= యుద్ధముచేయుట; పలుమఱున్= మాటి మాటికి; చెప్పెదవు= పలుకుతున్నావు; అకట!= అయ్యో!; తలఁపన్= ఆలోచింపగా; ఏమి మాయయొ?= ఇది ఏమి మాయో?

**తాత్పర్యం:** 'ఓ సంజయా! మన పక్షంలో చావడం, బాధపడడం గూర్చి ఎక్కువగా చెప్పుతున్నావు. మరి పాండవ బలమైతే నాశనం లేకుండా గొప్పగా యుద్ధంచేయటాన్ని పదేపదే పలుకుతున్నావు. అయ్యో! ఇది ఏమి మాయో అర్థం కావటంలేదు?'

**వ. అనిన విని సంజయుం డతని కిట్లను 'మనవారు దా మోపినభంగిఁ బెనంగుదురు. సముద్రంబుసొచ్చిన యేఱులుంబోలెఁ బాండవసేనం జొచ్చి తమ దర్పంబులు మెఱయలే రది తప్పుగాఁ గొనరాదు. నీ తప్పునఁ బాటిల్లిన చేటునకు శోకింపం బని లేదు. సమరప్రకారం బవధరింపు మవంతిదేశాధీశులగు విందాను విందులం బటుబాణపరంపరలం గప్పి యుధామన్యుం డేచి యనువిందు విరథుం జేసిన నతండు విందు స్యందనం బెక్కుటయు, నప్పాంచాలవంశవరుండు. 32**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధృతరాష్ట్రుడు చెప్పగా; సంజయుండు; విని; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; ఇట్లు; అనున్= అంటాడు; మనవారు= కౌరవులు; తాము; ఓపిన భంగిన్= శక్తికొలది; పెనంగుదురు= యుద్ధంచేస్తారు; సముద్రంబు= సముద్రంలోకి; చొచ్చిన= ప్రవేశించిన; ఏఱులున్+పోలెన్= నదులమాదిరి; పాండవసేనన్= పాండవుల సైన్యమును; చొచ్చి= ప్రవేశించి; తమ; దర్పంబులు= గర్వాలను; మెఱయలేరు= ప్రకాశింపచేయలేరు; అది= తమ పౌరుషాన్ని ప్రకాశింపచేయలేకపోవుట; తప్పు+కాన్= అపరాధముగా; కొనరాదు= అనుకోకూడదు; నీ తప్పునన్= నీ అపరాధంవల్ల; పాటిల్లిన= కలిగిన; చేటునకున్= నాశనానికి; శోకింపన్= దుఃఖింపగా; పనిలేదు; సమర ప్రకారంబు= యుద్ధ విధానాన్ని; అవధరింపుము; అవంతి దేశాధీశులు+అగు= అవంతిదేశానికి రాజులైన; విందానువిందులన్= విందుడు, అనువిందుడు అనువారిని; పటుబాణ పరంపరలన్= బటువులైన బాణాల వరుసలతో; కప్పి= కప్పివేసి; యుధామన్యుండు= ఆ పేరుగలరాజు; ఏచి= విజృంభించి; అనువిందున్= అనువిందుడనువాడిని; విరథున్= రథంలేనివాడిగా; చేసినన్= చేయగా; అతండు= ఆ అనువిందుడు; విందు స్యందనంబు= విందునియొక్క రథాన్ని; ఎక్కుటయున్= ఎక్కటంతో; ఆ+పాంచాలవంశవరుండు= పాంచాల వంశంలో శ్రేష్ఠుడైన ఆ యుధామన్యుడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు అడిగినదానికి సంజయు డీ విధంగా బదులుచెప్పాడు. 'మనకౌరవ సైన్యమేమో తన శక్తికొద్దీ పోరాడుతున్నది. సముద్రాన్ని చేరిన ఏళ్ళు అందులో కలిసిపోయి తమ స్వరూపాన్ని చూపలేని విధంగా, తమ ప్రతాపాన్ని వీరు చూపలేకపోతున్నారు. అది వారి తప్పుకాదు. నీ తప్పిదంవల్లనే ఈ ముప్పు ముంచుకు వచ్చింది. దానికీ దుఃఖపడనక్కరలేదు. యుద్ధవైఖరిని ఆలకించు. యుధామన్యుడు బాగా విజృంభించి అవంతిదేశపురాజులు విందానువిందులనే వాళ్ళను పుంఖానుపుంఖంగా పదునైన బాణాలతో కప్పివేసి, అనువిందుడనేవాడి రథాన్ని నుగ్గుచేశాడు. వాడు విందుడి రథమెక్కాడు. అప్పుడు పాంచాల రాజు యుధామన్యుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. విందుని సారథి నొక కో । లం దునిమిన వాహములు గలంగంబడి పా**
**఩ెం దేరు దిగిచికొని మగు । డం దద్బలమెల్లఁ దల్లడముఁ బొందె వడిన్. 33**

**ప్రతిపదార్థం:** ఒక కోలన్= ఒక బాణముతో; విందుని సారథిన్= విందునియొక్క సారథిని; తునిమినన్= చంపివేయగా; వాహములు= గుర్రాలు; కలంగన్+పడి= కలతచెంది; తేరున్= రథమును; తిగిచికొని= లాగికొని; మగుడన్= వెనుదిరిగి; పాఱెన్= పరుగెత్తాయి; తద్+బలము= వాని సైన్యము; ఎల్లన్= అంతయు; వడిన్= వేగంగా; తల్లడమున్= చంచలత్వమును; పొందెన్.

**తాత్పర్యం:** యుధామన్యుడు విందుడి సారథిని ఒక బాణంతో చంపివేశాడు. అప్పుడు రథానికి పూన్చిన గుర్రాలు కలతచెంది, తేరును లాగికొని వెనుకకు మళ్ళాయి. దానితో విందునిసేన తల్లడిల్లిపోయినది.

**వ. అట్టి సంకులసమరంబున. 34**

**ప్రతిపదార్థం:** అట్టి= ఆ విధమైన; సంకులసమరంబునన్= దొమ్మి యుద్ధంలో.

**తాత్పర్యం:** పద్ధతిని అతిక్రమించి జరిగిన ఆ దొమ్మియుద్ధంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

క. **భగదత్తు నేనుఁ గడరిన । వెగడునఁ బాండవులమొనలు విఱుగుటయు మహా**
**నగ మేటివేగ మాఁగిన । పగిది ఘటోత్కచుఁడు దాని పరు వుడిగించెన్.** 35

**ప్రతిపదార్థం:** భగదత్తు= భగదత్తుని యొక్క; ఏనుఁగు= గజము; అడరినన్= విజృంభించగా; పాండవులమొనలు= పాండవుల యొక్క సైన్యము; వెగడునన్= తడబాటుతో; విఱుగుటయున్= ఓడిపోవుటమూ; నగము= పర్వతం; ఏటి వేగము= నదీ ప్రవాహాన్ని; ఆఁగిన పగిదిన్= ఆపుచేసిన విధంగా; ఘటోత్కచుఁడు; దాని పరువు= ఆ ఏనుగు యొక్క పరుగెత్తటాన్ని; ఉడిగించెన్= మాన్పింపచేసినాడు.

**తాత్పర్యం:** భగదత్తుడి ఏనుగు విజృంభించి పరుగెత్తింది. దానివలన పాండవుల సేన తడబడి చిందరవందరైపోసాగింది. అప్పుడు ఘటోత్కచుడు నదీవేగాన్ని గొప్పపర్వతం ఆపినట్టుగా ఆ ఏనుగు పరుగును ఆపాడు.

సీ. **దనుజేంద్రు నిలుచుట గని సైన్య మెప్పటి । యట్టుల పురికొని యనికిఁ జొచ్చె**
**నాఘటోత్కచుఁడు బాణావళి వఱపిన । భగదత్తుఁ డదియెల్ల మగుడఁ జేసి**
**పటుతోమరంబులు పదునాలు గడరింప । నవి ద్రుంచి డెబ్బది యమ్ములేసి**
**యసుర యార్చినఁ బేర్చి యాతఁడు విరథుఁ జే । సిన వాఁడు శక్తి వైచిన నతండు**

తే. **నడుమఁ దునుమాడి వడిఁ బెక్కునారసముల । నొంప దైత్యుండు నముచి నిలింపపతికిఁ**
**బాఱిన ట్లోడి పాఱె నబ్బలము గడిమి । నెగచెఁ బ్రాగ్జ్యోతిషాధీశుఁ డిభముఁ బఱపి.** 36

**ప్రతిపదార్థం:** దనుజేంద్రు నిలుచుటన్= ఘటోత్కచుడు నిలబడటాన్ని; కని= చూచి; సైన్యము= కౌరవసేన; ఎప్పటి+అట్టులన్= మరల; పురికొని= కమ్ముకొని; అనికిన్= యుద్ధమునకు; చొచ్చెన్= చొరబడినది; ఆ ఘటోత్కచుఁడు; బాణావళిన్= బాణాల సమూహాలను; పఱపినన్= ప్రయోగించగా; భగదత్తుఁడు; అది+ఎల్లన్= దానినంతటినీ; మగుడన్+చేసి= తిప్పికొట్టి; పదునాలుగు; పటు తోమరంబులు= సమర్థములగు చిల్లకోలలను; అడరింపన్= ప్రయోగించగా; అవి= వాటిని; త్రుంచి= తునుకలుచేసి; అసుర= రాక్షసుడు; డెబ్బది+అమ్ములు+ఏసి= డెబ్బై బాణాలువేసి; ఆర్చినన్= పొలికేక పెట్టగా; ఆతఁడు= ఆ భగదత్తుడు; పేర్చి= విజృంభించి; విరథున్+చేసినన్= రథములేనివాడిని చేయగా; వాఁడు= ఆ ఘటోత్కచుడు; శక్తి వైచినన్= శక్త్యాయుధాన్ని ప్రయోగించగా; అతండు= ఆ భగదత్తుడు; నడుమన్= మధ్యలోనే; తునుము+ఆడి= తునుకలుచేసి; వడిన్= వేగంతో; పెక్కు నారసములన్= పలుబాణాలతో; నొంపన్= బాధించగా; నముచి= నముచి అనే రాక్షసుడు; నిలింప పతికిన్= దేవతల రాజగు ఇంద్రుడికి; పాఱినట్లు= పరుగెత్తిన మాదిరిగా; దైత్యుండు= ఘటోత్కచుడు; ఓడి= ఓడిపోయి; పాఱెన్= పరుగెత్తాడు; ప్రాగ్జ్యోతిష+అధీశుఁడు= ప్రాగ్జ్యోతిషమునకు రాజైన భగదత్తుడు; ఇభమున్= తన ఏనుగును; పఱపి= తోలి; ఆ+బలమున్= ఆ రాక్షసుడి సైన్యాన్ని; కడిమిన్= పరాక్రమంతో; ఎగచెన్= తరిమాడు.

**తాత్పర్యం:** భగదత్తుని ఏనుగు ముందు ఘటోత్కచుడు నిలవడంచూచి, ఆ ఏనుగు యొక్క విజృంభణానికి భయపడిపారిపోయిన పాండవసేన ఎప్పటిలాగానే పూనుకొని యుద్ధం చేసింది. ఆ ఘటోత్కచుడు అతడిపై బాణాలు కురిపించాడు. ఆ బాణాలను భగదత్తుడు తిప్పికొట్టాడు. బలంగల పధ్నాలుగు చిల్లకోలలను కూడా వాడిపై ప్రయోగించాడు. ఘటోత్కచుడు, వాటిని త్రుంచి డెబ్బై బాణాలు వేసి, సింహనాదం చేయగా భగదత్తుడు విజృంభించి, ఆ రాక్షసుడి రథాన్ని కూల్చాడు. వాడు భగదత్తుడి మీద 'శక్తి' అనే ఆయుధాన్ని ప్రయోగించాడు. భగదత్తుడు ఆ 'శక్తి' ఆయుధాన్ని మధ్యలోనే త్రుంచివేసి వేగంగా పెక్కు బాణాలతో నొప్పించాడు. అప్పుడు ఘటోత్కచుడు ఇంద్రుడి దెబ్బకు తట్టుకోలేక పారిపోయిన నముచి విధంగా, భయపడి పారిపోయాడు. ఆ సమయంలో భగదత్తుడు ఘటోత్కచుడి సైన్యంమీదికి తన ఏనుగును పురికొలిపి, చిందరవందర చేశాడు.

**అవతారిక:** శల్యునికి, నకులసహదేవులకు జరిగిన యుద్ధం వర్ణించబడుతోంది.

**ఆ. శల్యుమీఁద గవలు శరవృష్టి గురిసిన । నగుచు, విరథుఁ జేసె నకులు నతఁడు**
**వార లప్పు డొక్క తే రెక్కి యడరిన । రౌద్ర మెసఁగ నొంచె మద్రవిభుఁడు. 37**

**ప్రతిపదార్థం:** కవలు= నకుల సహదేవులు; శల్యుమీఁదన్; శరవృష్టిన్= బాణవర్షాన్ని; కురిసినన్= కురిపింపగా; అతఁడు= ఆ శల్యుడు; నగుచున్= నవ్వుతూ; నకులున్= నకులుడిని; విరథున్= రథంలేనివాడినిగా; చేసెన్= చేశాడు; అప్పుడు= ఆ రథం భగ్నమైన సమయంలో; వారలు= ఆ నకుల సహదేవులు; ఒక్కతేరు= ఒకేరథాన్ని; ఎక్కి; అడరినన్= అతిశయించగా; మద్రవిభుఁడు= శల్యుడు; రౌద్రము= రౌద్రరసము; ఎసఁగన్= అతిశయించగా; నొంచెన్= వారిని బాధించాడు.

**తాత్పర్యం:** నకులుడు, సహదేవుడు- వీరిద్దరూ శల్యుడిమీద బాణాల వర్షాన్ని కురిపించారు. శల్యుడు నవ్వుతూ సునాయాసంగా నకులుడి రథాన్ని విరిచాడు. తరువాత, నకుల సహదేవులిద్దరూ ఒకే రథాన్నెక్కి విజృంభించారు. శల్యుడు మహారౌద్రంతో వారిని బాధించాడు.

**విశేషం:** రౌద్రము= శృంగారాది రసాల్లో ఒకటి. నవరసాలు- 1. శృంగారము; 2. హాస్యము; 3.కరుణము; 4.వీరము; 5.రౌద్రము; 6.భయానకము; 7. బీభత్సము; 8.అద్భుతము; 9. శాంతము.

**చ. ధృతి బలుపొప్ప నిల్చి సహ । దేవుఁడు వ్రేఁకని నారసంబు గ్రూ**
**రత నుర మాడనేయ నది । రక్తము సోఁకక యుచ్చిపోవుడున్**
**మృతుఁడునుబోలెఁ దేరిపయి । మేటిమగండగు మద్రమేదినీ**
**పతి వడినం గలంగె నర । పాలక! కౌరవరాజ సైన్యముల్. 38**

**ప్రతిపదార్థం:** నరపాలక!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; సహదేవుఁడు; ధృతి= ధైర్యముయొక్క; బలుపు= ఆధిక్యము; ఒప్పన్= ఒప్పియుండగా; నిల్చి= నిలబడి; వ్రేఁకని= బరువైన; నారసంబు= బాణం; క్రూరతన్= కఠినముగా; ఉరము= రొమ్మును; ఆడన్= నాటేటట్లుగా; ఏయన్= వేయగా; అది= ఆ బాణం; రక్తము= నెత్తుటిని; సోఁకక= తాకక; ఉచ్చిపోవుడున్= గ్రుచ్చికొని వెలుపలికి రాగా; మేటిమగండు+అగు= గొప్పవీరుడు అయిన; మద్రమేదినీపతి= మద్రదేశపురాజు- శల్యుడు; తేరిపయిన్= రథంమీద; మృతుఁడునున్+పోలెన్= చచ్చినవాడి మాదిరి; పడినన్= పడిపోగా; కౌరవరాజసైన్యముల్= కౌరవులకు రాజైన దుర్యోధనుడి సైన్యాలు; కలంగెన్= కలతపడినాయి.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! సహదేవుడు ధైర్యాతిశయంతో, కాలునిలదొక్కుకొని, బాగా చూచి ఒక్కబాణాన్ని శల్యుడిమీదికి వేశాడు. రొమ్ము తాకేటట్లు వేయబడ్డ ఆ బాణం రక్తం అంటుకోకుండా గుచ్చుకొని, వెలుపలికి వెళ్ళిపోయింది. ఆ దెబ్బకు శల్యుడు చచ్చినవాడి మాదిరి, రథంలో పడ్డాడు. ఆ దృశ్యం చూచి, కౌరవసేనలు చాలా కలతచెందాయి.

**వ. ఇట్లు మూర్ఛితుం డయినశల్యుం జూచి సారథి రథంబు దొలంగందోలికొనిపోయినం గనుంగొని కవలు సింహనాదంబు సేసి, శంఖంబులఁ బూరించి రంతం గమలబాంధవుండు దివసమధ్యోపేతుం డయ్యె నట్టి సమయంబున యమసూనుండు శ్రుతాయువుపైఁ దొమ్మిదియమ్ములు నిగిడించిన నతండు వాని మగిడించి నిశాతసాయకసప్తకంబు శరీరంబున గ్రుచ్చినం గోపించి యుధిష్ఠిరుండు వరాహకర్ణశరాసారంబున వాని వక్షస్ స్థలంబు వ్రచ్చి వెడందవాతియమ్మునం గేతువుం దునిమిన నతండు. 39**

**ప్రతిపదార్థం:** సారథి= శల్యుడి రథసారథి; ఇట్లు= ఈ విధంగా; మూర్ఛితుండు+ఐన= మూర్ఛచెందినవాడైన; శల్యున్= శల్యుడిని; చూచి= గమనించి; రథంబున్= తేరును; తొలంగన్= యుద్ధభూమినుండి తొలగిపోయేటట్లు; తోలికొనిపోయినన్; కవలు= నకుల సహదేవులు; కనుంగొని= చూచి; సింహనాదంబు= సింహగర్జన; చేసి; శంఖంబులన్= తమ తమ శంఖాలను; పూరించిరి= ఊదినారు; అంతన్= అంతలో (ఆ సమయంలో); కమల బాంధవుండు= తామరపూలకు చుట్టమైన సూర్యుడు; దివసమధ్య+ఉపేతుండు+అయ్యెన్= పగటి మధ్యభాగాన్ని పొందినవాడైనాడు; అట్టి సమయంబునన్= ఆ సమయంలో; యమసూనుండు= యమధర్మరాజు కొడుకు- ధర్మరాజు; శ్రుతాయువు+పైన్= శ్రుతాయువు మీద; తొమ్మిది+అమ్ములు= తొమ్మిది బాణాలు; నిగిడించినన్= వ్యాపింపచేయగా; అతండు= ఆ శ్రుతాయువు; వానిన్= ఆ బాణాలను; మగిడించి= మరలింపజేసి; నిశాతసాయక సప్తకంబు= వాడియైన బాణాలు ఏడింటిని; శరీరంబునన్= ధర్మరాజు శరీరంలో; గ్రుచ్చినన్= నాటగా; కోపించి= కోపపడి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; వరాహకర్ణశర+ఆసారంబునన్= పందిచెవివలె ఉండే బాణాల జడివానతో; వాని= ఆ శ్రుతాయువు యొక్క; వక్షస్ స్థలంబున్= రొమ్మును; వ్రచ్చి= చీల్చి; వెడంద+వాతి+అమ్మునన్= వెడల్పుగల నోరు ఉన్న బాణంతో; కేతువున్= టెక్కెమును; తునిమినన్= త్రుంచివేయగా; అతండు= ఆ శ్రుతాయువు.

**తాత్పర్యం:** శల్యుడు రథంమీద మూర్ఛచెందాడు. దానితో అతడి సారథి రథాన్ని వెంటనే యుద్ధభూమి నుండి అవతలకు తోలుకొనిపోయాడు. కవలు అది చూచి విజయోత్సాహంతో పెనుబొబ్బలు పెట్టుతూ తమ శంఖాలను ఊదారు. ఇంతలో సూర్యుడు ఆకాశం మధ్యభాగానికి చేరుకొన్నాడు. అప్పుడు ధర్మరాజు శ్రుతాయువు మీద తొమ్మిది బాణాలు వేశాడు. వాడు వాటిని తిప్పికొట్టి, పదునుగల ఏడు బాణాలను ఆ ధర్మరాజు శరీరంలో గుచ్చుకొనేటట్లు వేశాడు. అతడు కోపంతో పందిచెవివంటి బాణాలు వేసి, శ్రుతాయువు రొమ్మును చీల్చి, ఒకానొక ప్రత్యేక బాణంతో ఆతడి ధ్వజాన్ని తుంచివేశాడు. అప్పుడు ఆ శ్రుతాయువు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** సింహనాదము= యుద్ధంలో ఏనుగులు మొదలైనవాటిని భయపెట్టేటందుకు వీరులుచేసే ధ్వని (బొబ్బ) వెడదవాతియమ్ము= వెడల్పయిన అగ్రభాగం ఉన్న బాణము; యుధిష్ఠిరుడు= యుద్ధంలో స్థిరంగా నిలబడేవాడు (ధర్మరాజు)

**ఉ. వెండియు నేడు బాణములు వే తొడి ధర్మజు నొవ్వ నేయ నా**
**తండు మహోగ్రకోపమునఁ దత్తురగంబులఁ జంపి తద్ధను**
**ర్దండముఁ ద్రుంచి తత్తనువు రక్తమయంబుగఁ జేయ వాఁడు భీ**
**తుండయి పాఱె నీబలము దూలఁగ నబ్బల ముబ్బి క్రాలఁగన్. 40**

**ప్రతిపదార్థం:** వెండియున్= మరియు; ఏడు బాణములు= ఏడు బాణాలను; వే తొడి= వేగంగా వింటిలో సంధించి; ధర్మజున్= ధర్మరాజును; నొవ్వన్= బాధపడునట్లు; ఏయన్= వేయగా; ఆతండు= ధర్మరాజు; మహా+ఉగ్రకోపమునన్= చాలా భయంకరమైన కోపంతో; తద్+తురగంబులన్= వాడి గుర్రాలను; చంపి; తద్+ధనుస్+దండమున్= ఆతని వింటి కర్రను; త్రుంచి= తునుగచేసి; తద్+తనువున్= వాడి శరీరాన్ని; రక్తమయంబు+కన్= నెత్తురు మయంగా; చేయన్= చేయగా; వాఁడు= ఆ శ్రుతాయువు; భీతుండు+అయి= భయంచెందినవాడై; నీ బలము= (ధృతరాష్ట్రుడవైన) నీ సైన్యము; తూలఁగన్= తొలగిపోగా; ఆ+బలము= ఆ పాండవులయొక్క సైన్యం; ఉబ్బి= సంతోషపడి; క్రాలఁగాన్= ప్రకాశించగా; పాఱెన్= పరుగెత్తిపోయినాడు.

**తాత్పర్యం:** శ్రుతాయువు ఏడు బాణాలతో ధర్మరాజును బాధ కలిగేటట్లు కొట్టాడు. ధర్మరాజుకు చాలా కోపం వచ్చి, వాడి గుర్రాలను చంపాడు. వింటి బద్దను తుంచాడు. అతడి శరీరాన్నంతటినీ రక్తంలో ముంచెత్తాడు. దానికి వాడు భయపడి పారిపోయాడు. అప్పుడు కౌరవసైన్యమంతా చిందరవందరైంది. పాండవుల సైన్యం ఎంతో సంతోషపడింది.

## చేకితానకృపాచార్యుల ద్వంద్వయుద్ధము (సం 6-80-20)

**తే. చేకితానుండు గృపునిపై శితశరములు । గురిసె నాతండు విల్లును గుఱ్ఱములను**
**వ్రయ్యలుగఁ జేయ గద గొని రథము డిగ్గి । సరభసంబుగఁ జని కృపు విరథుఁ జేసి. 41**

**ప్రతిపదార్థం:** చేకితానుండు= చేకితానుడనే యాదవుడు; కృపునిపైన్= కృపాచార్యుడిమీద; శితశరములు= వాడియైన బాణాలు; కురిసెన్= కురిపించాడు; ఆతండు= కృపాచార్యుడు; విల్లును= చేకితానుడి విల్లును; గుఱ్ఱములను; వ్రయ్యలు+కన్= తునుకలుగా; చేయన్= చేయగా; గదన్+కొని= ఆ చేకితానుడు గదను తీసికొని; రథము డిగ్గి= తన రథాన్నుండి దిగి; సరభసంబుగన్= తొందరగా; చని= వెళ్ళి; కృపున్= కృపాచార్యుని; విరథున్= రథములేనివానిగా; చేసి.

**తాత్పర్యం:** చేకితానుడు కృపాచార్యుడిమీద పదునైన బాణాలను వర్షంగా కురిపించాడు. అప్పు డాతడు చేకితానుడి, విల్లును, గుర్రాలను తునుకలుగా చేశాడు. అప్పు డా చేకితానుడు గద తీసికొని, రథం దిగి తొందరగా నడిచి, గదతో కృపాచార్యుడి రథాన్ని తునుకలు చేసి. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అయ్యాదవ సింహుండు వెనుకకు లంఘించిపోయినం గృపాచార్యుండు పదాఱమ్ము లెమ్ములం గీలించుటయు, నతండు గదాదండంబు వైవ నగ్గౌతముండు తుండంబులు సేసినఁ జేకితానుండు రయంబున రథంబుమీఁది కరవాలంబుగొని మెఱుంగు మెఱసినట్లు పఱతెంచిన శారద్వతుండు నిశాత కృపాణపాణియై ధరణి కెఱఁగి యేడ్తెఱ నతనిం గవిసి నొప్పించి, యతనిచేత నొచ్చె న ట్లిరువురును మూర్ఛిల్లి మేదిని వ్రాలిన. 42**

**ప్రతిపదార్థం:** ఆ+యాదవసింహుండు= యాదవులలో శ్రేష్ఠుడైన ఆ చేకితానుడు; వెనుకకున్= వెనుక భాగానికి; లంఘించి= దూకి; పోయినన్= పోగా; కృపాచార్యుండు; పదాఱు= పదహారు; అమ్ములు= బాణాలు; ఎమ్ములన్= ఎముకలలో; కీలించుటయున్= తగులుకొనేటట్లు చేయగా; అతండు= ఆ చేకితానుడు; గదా దండంబు+వైవన్= గదాయుధాన్ని ప్రయోగింపగా; ఆ+గౌతముండు= గౌతమవంశంలోనివాడైన కృపాచార్యుడు; తుండంబులు= (ఆ గదను); తునుకలుగా; చేసినన్= చేయగా; చేకితానుండు; రయంబునన్= వేగంతో; రథంబు మీది; కరవాలంబున్= కత్తిని; కొని= తీసికొని; మెఱుంగు మెఱసిన+అట్లు= మెరుపు మెరిసిన మాదిరి; శారద్వతుండు= కృపాచార్యుడు; నిశాత కృపాణపాణి+ఐ= పదునైన ఖడ్గం చేతపట్టుకొనినవాడై; ధరణికిన్= భూమికి; ఎఱఁగి= వాలి; ఏడ్తెఱన్= అతిశయంతో; అతనిన్+కవిసి= అతడిని ఆక్రమించి; నొప్పించి= బాధకలుగునట్లుచేసి; అతనిచేతన్= ఆ చేకితానుడిచేత; నొచ్చెన్= బాధింపబడ్డాడు; అట్లు= ఆ విధంగా; ఇరువురును= ఆ ఇద్దరు వీరులు; మూర్ఛిల్లి= మూర్ఛచెంది; మేదినిన్= భూమిమీద; వ్రాలినన్= వాలిపోగా.

**తాత్పర్యం:** చేకితానుడు వెనుకకు దూకిపోగా, కృపాచార్యుడు పదహారు బాణాలు అతడి ఎముకలలో గుచ్చుకొనేటట్లు వేశాడు. ఆ చేకితానుడు గదాదండాన్ని విసిరాడు. కృపుడు గదను తునకలు చేశాడు. చేకితానుడు తొందరగా తన రథంలో ఉండిన ఖడ్గాన్ని చేతపట్టుకొని, మెరుపు మెరిసిన చందంగా ఒక క్షణంలో మీదపడి. కృపుడిని నొవ్వజేసి, అతడి చేత తాను కూడా నొప్పించబడ్డాడు. ఇద్దరు మూర్ఛచెంది, నేలపైకి ఒరిగారు.

**విశేషం:** గౌతముడు= గౌతమ ఋషి యొక్క గోత్రంలో పుట్టినవాడు. కురుకులంలోని కౌరవపాండవ కుమారులకు ఆచార్యుడు కృపుడు. కృపుని పుట్టుకను గూర్చి

**అవస్కన్నం శరస్తంబే మిథునం సమపద్యత । కృపయా తచ్చ జగ్రాహ శాన్తను ర్మృగయాగతః॥**

**కృపః స్మృతః సవై తస్మాత్, గౌతమీ చ కృపీ తథా । ఏతే శారద్వతాః ప్రోక్తాఏతే తే గౌతమాః స్మృతాః॥**

(హరివంశే. 32-75-76) శారద్వతుడని కూడా కృపుడికి పేరు.

క. ఇద్దెస సుబలతనూజుఁడు । నద్దెసఁ గరకర్షణుఁడు రయం బెసఁగఁగ న
యిద్దఱఁ దమ రథములపై । గ్రద్దన నిడికొని తొలంగఁగాఁ జని రధిపా! 43

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఈ+దెసన్= మన ఈవైపున; సుబల తనూజుఁడు= సుబలుని కుమారుడు శకుని; ఆ+దెసన్= ఆ పాండవులవైపున; కరకర్షణుండు= ఆ పేరుగలవాడు; రయంబు= త్వర; ఎసఁగఁగన్= అతిశయింపగా; ఆ+ఇద్దఱన్= ఆ కృప చేకితానులను; తమ= తమ యొక్క; రథములపైన్= తేరులలో; గ్రద్దనన్= త్వరితంగా; ఇడుకొని= ఉంచుకొని; తొలంగఁగాన్= యుద్ధభూమినుండి తొలగేటట్లుగా; చనిరి= వెళ్ళారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! మనవైపున సుబలుడి కొడుకు, ఆ వైపున కరకర్షణుడు మూర్ఛచెంది నేలవ్రాలిన ఆ ఇద్దరినీ (కృపాచార్య చేకితానులను) వారి వారి రథాలలోఉంచుకొని తొలగిపోయారు.

వ. చేదిపతి యగు ధృష్టకేతుండు భూరిశ్రవసునిం దొంబదితూపుల నేపారి యేసిన నొచ్చి కోపించి యా సోమదత్తతనయుండు. 44

**ప్రతిపదార్థం:** చేదిపతి+అగు= చేది దేశానికి రాజైన; ధృష్టకేతుండు= ధృష్టకేతుడనేవాడు; భూరిశ్రవసునిన్= భూరిశ్రవసుడిని; తొంబది తూపులన్= తొంభై బాణాలతో; ఏపారి= విజృంభించి; ఏసినన్= కొట్టగా; నొచ్చి= బాధపడి; కోపించి; ఆ+సోమదత్త తనయుండు= సోమదత్తుని కొడుకు- ఆ భూరిశ్రవుడు.

**తాత్పర్యం:** చేది దేశరాజు ధృష్టకేతుడు, విజృంభించి తొంభై బాణాలతో కొట్టాడు. ఆ దెబ్బలకు ఆ భూరిశ్రవసుడు బాధపడి కోపంతో-

క. నానాస్త్రంబుల హయముల । మేనులు దునియలుగఁ జేసి మెయి నారసముల్
వే నాటించిన నతఁడు శ । తానీకుని రథముపైకి నరిగెం బెలుచన్ 45

**ప్రతిపదార్థం:** నానా+అస్త్రంబులన్= పలు విధాలైన బాణాలతో; హయముల= గుర్రాలయొక్క; మేనులు= శరీరాలు; తునియలు+కన్= తునుకలుగా; చేసి; మెయిన్= చేదిరాజు శరీరంపైన; నారసముల్= బాణాలను; వే నాటించినన్= వేగంగా గ్రుచ్చుకొనేటట్లు చేయగా; అతఁడు= ఆ ధృష్టకేతువు; శతానీకుని; రథముపైకిన్; పెలుచన్= శీఘ్రంగా; అరిగెన్= పోయాడు.

**తాత్పర్యం:** ఆ భూరిశ్రవసుడు పలు బాణాలు ప్రయోగించి ధృష్టకేతుడి గుర్రాలను తునుకలు చేశాడు. అతడి శరీరంలో బాగా గుచ్చుకొనేటట్లుగా బాణాలు వేశాడు. అతడు తట్టుకోలేక శీఘ్రంగా శతానీకుడి రథం మీదికి పోయాడు.

వ. దుశ్శాసనవికర్ణచిత్రసేనులతో సుభద్రాసూనునకు మహాయుద్ధం బయ్యె నందు వారలనందఱ నా సంక్రందన పౌత్రుండు విరథులం జేసి వృకోదరువచనంబులు దలంచి యలంచుచుండెం గాని సమయింపఁ డయ్యె నట్టి సమయంబున శాంతనవుండు వారిం గైకొని యనేకరాజరథికులతోడం గూడ నన్నరనందనుపై నురవడించిన నాభూపతులు పలువురు ప్రౌఢులగుటయు నయ్యభిమన్యుం డొక్కరుండు బాలుండు నగుటయుం జూచి సవ్యసాచి శౌరితో ని ట్లనియె. 46

**ప్రతిపదార్థం:** దుశ్శాసన వికర్ణ చిత్రసేనులతోన్; సుభద్రాసుతునకున్= సుభద్రకొడుకు అభిమన్యుడికి; మహాయుద్ధంబు= గొప్ప యుద్ధము; అయ్యెన్= జరిగింది; అందున్= ఆ యుద్ధంలో; వారలన్+అందఱన్= ఆ ముగ్గురిని; ఆ సంక్రందన పౌత్రుండు=

ఇంద్రునికి మనుమడైన అభిమన్యుడు; విరథులన్= రథాలులేనివారిగా; చేసి; వృకోదరు వచనంబులు= భీముడి మాటలు; తలంచి= స్మరించి; అలంచుచుండెన్+కాని= కష్టపెట్టాడే కాని; సమయింపండు+అయ్యెన్= చంపలేదు; అట్టి సమయంబునన్= ఆ సమయంలో; శాంతనవుండు= భీష్ముడు; వారిన్= ఆ దుశ్శాసనాదులను; కైకొని= గ్రహించి (చూచి); అనేక రాజరథికుల తోడన్+కూడన్= ఎంతో మంది రాజులతోను; రథికులతోను కూడా; ఆ+నరనందనుపైన్= అర్జునుని కొడుకైన ఆ అభిమన్యుడి మీదికి; ఉరవడించినన్= యుద్ధానికి తొందరపడగా; ఆ భూపతులు= కౌరవసేనలోని ఆ రాజులు; పలువురు= చాలమంది; ప్రౌఢులు= నిపుణులు; అగుటయున్; ఆ+అభిమన్యుఁడు= ఆ అభిమన్యుడు; ఒక్కరుండు= ఒంటరివాడు; బాలుండున్= పిల్లవాడు; అగుటయున్; చూచి; సవ్యసాచి= అర్జునుడు; శౌరితోన్= కృష్ణునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు, చిత్రసేనుడు, వికర్ణుడు- వీరికి, అభిమన్యుడికి ఘోరంగా యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో అభిమన్యుడు ఆ ముగ్గురి రథాలను ధ్వంసం చేశాడు. భీముడు దుశ్శాసనుడి రొమ్ముచీల్చి రక్తాన్ని తాగుతానని శపథంచేశాడు గదా! అది జ్ఞాపకానికి రాగా నే అతడు వాళ్ళను బాధపెట్టాడేగానీ చంపలేదు. లేకుంటే చంపేవాడే. అప్పుడు భీష్ముడు దుశ్శాసనాదుల దుఃస్థితిని గమనించి పలువురు రథికులైన రాజులు, వెంటరాగా అభిమన్యుడిని ఎదుర్కొన్నాడు. కౌరవసైన్యంలోని పలువురు రాజులు యుద్ధంలో ఆరితేరినవారు కావటాన్నీ, అభిమన్యుడు ఒంటరివాడు, అర్భకుడు కావటాన్నీ చూచి, అర్జునుడు కృష్ణుడితో ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** వృకోదరుడు= తోడేలుపొట్టవంటి పొట్టగలవాడు (భీముడు); సవ్యసాచి= రెండుచేతులతో బాణాలు వేసేవాడు (అర్జునుడు).

**క. ఉక్కు మిగిలి జగతీశులు । పెక్కండ్రు రయంబు మెఱయ భీష్మసహితులై**
**యొక్కటఁ దోతెంచెద రా । దిక్కునఁ బోనిమ్ము రథముఁ దీవ్రస్ఫురణన్. 47**

**ప్రతిపదార్థం:** పెక్కండ్రు= పలువురు; జగతీ+ఈశులు; భూభర్తలు= రాజులు; రయంబు= వేగము; మెఱయన్= అతిశయింపగా; ఉక్కు= శౌర్యము; మిగిలి= అతిశయించి; భీష్మ సహితులు+ఐ= భీష్మునితో కూడినవారై; ఒక్కటన్= ఒకే సమయంలో; తోతెంచెదరు= వస్తున్నారు; తీవ్రస్ఫురణన్= అధికమైన కదలికతో; ఆ దిక్కునకున్= ఆ వైపునకు; రథమున్; పోనిమ్ము= తోలుము.

**తాత్పర్యం:** 'ఓ కృష్ణా! చాలా మంది కౌరవరాజులు శౌర్యాతిశయంతో, వేగంగా, భీష్ముడితో కలిసి ఒక్కుమ్మడిగా వస్తున్నారు. ఆ గుంపున్నచోటికి మన రథాన్ని శీఘ్రంగా పోనిమ్ము' అని.

**వ. అని వారలవలను సూప నచ్యుతుండట్ల చేయం ద్రిగర్తపతి దనమొనలకుం దలకడచి కవ్వడి మార్కొనుటయు నతండు. 48**

**ప్రతిపదార్థం:** అని; వారలవలను= ఆ కౌరవసైన్యముండే దిక్కును; చూపన్= చూపగా; అచ్యుతుండు= కృష్ణుడు; అట్లు+అ= అర్జునుడు చెప్పిన విధంగా; చేయన్= తేరును పోనివ్వగా; కవ్వడిన్= అర్జునుడిని; త్రిగర్తపతి= త్రిగర్త దేశంరాజు; తన మొనలకున్= తనయొక్క సైన్యాలకు; తలకడచి= ముందు భాగమును చేరుకొని; మార్కొనుటయున్= ఎదుర్కొనటంతో; అతండు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** కృష్ణుడు అర్జునుడు చెప్పిన విధంగా అభిమన్యుడిమీదికి ఉరుకుతున్న కౌరవసైన్యంవైపు రథాన్ని పోనిచ్చాడు. అప్పుడు త్రిగర్తపతి తన సైన్యానికి ముందుగా నిలిచి, అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అప్పుడు అర్జునుడు

**క. మీవీటికెల్ల మేటివి । నీ విట్లు గడంగి తిచట నిక్కము పోరం**
**గావలయుఁ జుమీ యనుచు శ । రావృతుఁ గావించె సూతహయసహితముగాన్. 49**

**ప్రతిపదార్థం:** మీ వీటికిన్= మీదండునకు; ఎల్లన్= అంతటికి; నీవు= సుశర్మవను నీవు; మేటివి= మొనగాడవు; ఇట్లు= ఈ విధంగా; ఇచ్చటన్= ఈ చోటులో; కడంగితి(వి)= యుద్ధానికి దిగావు; నిక్కము+అ= నిజంగా; పోరంగావలయున్+చుమీ!= యుద్ధం చేయవలెను సుమా!; అనుచున్= అని చెప్పుచూ; సూతహయసహితము+కాన్= సారథి, గుర్రాలతో కూడునట్లుగా; శర+ఆవృతున్= బాణాలతో కప్పబడ్డవాణ్ణిగా; కావించెన్= చేశాడు.

**తాత్పర్యం:** 'ఓ సుశర్మా! నీవు మీ దండులోకెల్లా చాలా మొనగాడివి. ఇక్కడ ఇప్పుడు నాతో యుద్ధానికి దిగావు. నిజంగా, యుద్ధం చేయవలసిందే సుమా!' అంటూ సుశర్మను, ఆయన సారథిని, గుర్రాలను అర్జునుడు బాణాలతో కప్పివేశాడు.

**వ. అట్టియెడం గౌరవసైన్యంబు గాండీవిపై నొక్క పెట్ట యడరినం బాండవబలంబు లతనికిం దలకడచి తలపడిన సందండికయ్యం బయ్యె నా సంక్రందననందనుండు రాజులగములకుంగవిసి కేతనంబులు నఱికియు, సారథిరథికరథ్యంబులప్రాణంబులు వెఱికియు నాతపత్రచామరంబులు పొడిసేసియుఁ జాపంబులు రూపఱఁజేసియుఁ, వర్మంబులు వ్రచ్చియు, మర్మంబుల మార్గణంబులు గ్రుచ్చియు, సర్వాంగంబులు నొంచియుఁ దలలు ద్రుంచియు, విహరించుచుండ నపరాహ్ణంబయ్యెఁ ద్రిగర్తనాథుండు వెండియుం బేర్చి యెదిర్చిన. 50**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో; కౌరవసైన్యంబు= దుర్యోధనునిసేన; గాండీవిపైన్= అర్జునుడిపైన; ఒక్కపెట్ట= ఒక్కసారిగా; అడరినన్= విజృంభించగా; పాండవ బలంబులు= పాండవుల సేనలు; అతనికిన్= ఆ అర్జునుడికి; తలకడచి= ముందు భాగంలోచేరి; తలపడినన్= ఎదుర్కొనగా; సందడికయ్యంబు= సంకులసమరము; అయ్యెన్= జరిగింది; ఆ సంక్రందననందనుండు= ఇంద్రుడి కొడుకు- అర్జునుడు; రాజులగములకున్= దొరలగుంపును; కవిసి= ఎదుర్కొని; కేతనంబులు= టెక్కాలు; నఱికియున్= తెగగొట్టి; సారథి రథిక రథ్యంబుల= రథంతోలేవాడియొక్క, రథంలోనుండి యుద్ధం చేసేవారియొక్క, రథానికి కట్టి ఉండే గుర్రాలయొక్క; ప్రాణంబులన్= ప్రాణాలను; పెఱికియున్= పోగొట్టి; ఆతపత్ర చామరంబులు= గొడుగులను, చామరాలను; పొడి+చేసియున్= నుగ్గుచేసి; చాపంబులు= విండ్లను; రూపు+అఱన్+చేసియున్= రూపుమాపి; వర్మంబులు= కవచాలు; వ్రచ్చియున్= చీల్చి; మర్మంబులన్= ఆయువుపట్టులందు; మార్గణంబులు= బాణాలు; గ్రుచ్చియున్= పొడిచి; సర్వ+అంగంబులు= అన్ని అవయవాలను; నొంచియున్= పీడించి; తలలు= తలలను; త్రుంచియున్= తుంచివేసి; విహరించుచుండన్= వీరవిహారం చేస్తూండగా; అపరాహ్ణంబు+అయ్యెన్= అపరాహ్ణకాలము అయింది; త్రిగర్తనాథుండు= త్రిగర్తదేశపురాజు; వెండియున్= మరల; పేర్చి= విజృంభించి; ఎదిర్చినన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** అప్పుడు కౌరవ సైన్యం ఒక్కుమ్మడిగా అర్జునుడిమీదికి వచ్చింది. పాండవుల సేనకూడా అర్జునుడికి ముందుగా నిలబడి యుద్ధానికి సన్నద్ధం అయింది. అప్పుడు ఆ రెండుసేనలకు దొమ్మి యుద్ధం జరిగింది. అప్పుడు అర్జునుడు ఎదిరిపక్షంలోని వారి కేతనాలను తెగగొట్టి, రథికుల సారథుల, గుర్రాల ప్రాణాలను తీశాడు. గొడుగులను, చామరాలను నుగ్గుచేశాడు. చాపాలను రూపం లేకుండా చేశాడు. కవచాలను బ్రద్దలుకొట్టాడు. ఆయువుపట్టులలో బాణాలు గ్రుచ్చాడు. శత్రువుల అవయవా లన్నింటికీ బాధ కలిగించాడు. శత్రువుల తలలు త్రుంచాడు. ఈ విధంగా అర్జునుడు స్వైరవిహారం చేస్తూండగా మధ్యాహ్నకాలమైనది. అయినా త్రిగర్తాధిపతి కవిసి ఎదుర్కొన్నాడు.

**విశేషం:** గాండీవి= గాండీవమనే విల్లు ముఖ్యమైన ఆయుధంగా గలవాడు (అర్జునుడు)

సందడి కయ్యంబు= సంకుల సమరం. ఇరుపక్షాలవారు కలసిపోయి, ఒకరునొకరు భుజాలు ఒరిసికొంటూ ఎవ డే పక్షంవాడో తెలియకుండా యుద్ధంచేయటం.

అపరాహ్ణంబు= ప్రాత, స్సంగమ, మధ్యాహ్న, అపరాహ్ణ, సాయాహ్నములని పగటిని అయిదు భాగాలు చేస్తే అందులో నాలుగవ భాగం అపరాహ్ణం.

**తే. అతని రథరక్షకులు శక్రసుతుని మీఁదఁ। గడఁగి ముప్పదియిద్దఱు గవియుటయును**
**నవ్వి యఱువదినాలుగు నారసముల। నక్కిరీటి యా రథికుల నవనిఁ గూల్చె. 51**

**ప్రతిపదార్థం:** అతనిన్= ఆ త్రిగర్తరాజు సుశర్మయొక్క; రథరక్షకులు= తేరును రక్షించే వీరులు; ముప్పది+ఇద్దఱున్= ముప్పై రెండుమంది; కడఁగి= పూనుకొని; శక్రసుతుని మీఁదన్= ఇంద్రపుత్రుడైన అర్జునుడి మీద; కవియుటయును= ఎగబడగా; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; నవ్వి= ఎగతాళిచేసి; అఱువదినాలుగు= అరవైనాలుగు; నారసములన్= బాణాలతో; ఆ రథికులన్= తనపై కవిసిన ఆ రథికులను; అవనిన్= నేలమీద; కూల్చెన్= పడద్రోశాడు.

**తాత్పర్యం:** త్రిగర్తాధీశుడు సుశర్మయొక్క రథ రక్షకులు ముప్పై ఇద్దరు ప్రయత్నంతో అర్జునుడిమీదికి ఎగబడ్డారు. అర్జునుడు ఎగతాళిగా నవ్వి, వారినందరిని, అరవైనాల్గు బాణాలతో కొట్టి నేలపడద్రోశాడు.

**క. ఇలఁబడిన సహచరులఁ గని। యలిగి సుశర్ముండు దాఁకె నర్జును నతనిం**
**దలకడచి శిఖండిప్రభృ। తులు నిగిడిరి వారిమీఁద ద్రుపదజ్ఞాతుల్. 52**

**ప్రతిపదార్థం:** సుశర్ముండు= త్రిగర్తాధిపతి సుశర్మ; ఇలన్= నేలమీద; పడిన= పడినట్టి; సహచరులన్= తనతో కలిసి యుద్ధంచేసే రథికులను; కని= చూచి; అలిగి= కోపించి; అర్జునున్= అర్జునుడిని; తాఁకెన్= ఎదుర్కొన్నాడు; అతనిన్= ఆ అర్జునుడిని; తలకడచి= ముందుభాగానికి వచ్చి; ద్రుపదజ్ఞాతుల్= ద్రుపదుడి దాయాదులు; శిఖండి ప్రభృతులు= ధృష్టద్యుమ్నుడి అన్న శిఖండి మున్నగువారు; వారిమీఁదన్= సుశర్మ మొదలైనవారిమీద; నిగిడిరి= కమ్ముకొన్నారు.

**తాత్పర్యం:** సుశర్మ నేలవాలిన తనతోడి విలుకాండ్రను చూచాడు. చాలా కోపంవచ్చి, అర్జునుడి మీదికి ఎగబడ్డాడు. అర్జునుడి సేనకు ముందుగా శిఖండి మొదలుగా గల ద్రుపద మహారాజు జ్ఞాతులు సుశర్మ మొదలైన వారిని క్రమ్ముకొన్నారు.

**వ. ధనంజయుండును దనకు దుర్యోధన సైంధవు లగ్గంబై యున్నను గ్రేఁగంటం జూచుచు గాంగేయుపై నడరె నప్పుడు దన్నుఁ దొడరవచ్చు శల్యునాదరింపక ధర్మతనయుం డనిలతనయమాద్రీతనయసహితుం డై పార్థునకు బాసట యై భీష్మునిదెసకు నడరె నిట్లు పాండవ పంచకంబుతోఁ బెనంగు శాంతనవుం గనుంగొని కురుపతియును సింధురాజును బరవసంబు సేసి యప్పాండవేయులం దాఁకిన. 53**

**ప్రతిపదార్థం:** ధనంజయుండునున్= అర్జునుడుకూడా; తనకున్= అర్జునుడికి; దుర్యోధన సైంధవులు= దుర్యోధనుడు, సైంధవుడును; అగ్గంబు+ఐ+ఉన్నన్= అధీనమై ఉన్నా; క్రేఁగంటన్= కోరచూపుతో; చూచుచున్= చూస్తూ; గాంగేయుపైన్= భీష్ముడిపైన; అడరెన్= విజృంభించాడు; అప్పుడు= ఆ సమయంలో; ధర్మతనయుండు= ధర్మరాజు; తన్నున్= తనను; తొడరన్ వచ్చు= ఢీకొనడానికి వచ్చే; శల్యున్= శల్యుడిని; ఆదరింపక= లెక్కజేయక; అనిలతనయ మాద్రీతనయ సహితుండు+ఐ= భీముడు, నకుల సహదేవులు- వీరితోకూడినవాడై; పార్థునకున్= అర్జునుడికి; బాసట+ఐ= సహాయుడై; భీష్ముని దెసకున్= భీష్ముడుండే వైపునకు; అడరెన్= కదిలాడు; ఇట్లు= ఈ మాదిరి; పాండవ పంచకంబుతోన్= పంచపాండవులతో; పెనంగు= యుద్ధంచేసే;

శాంతనవున్= శంతను మహారాజు కొడుకు భీష్ముణ్ణి; కనుంగొని= చూచి; కురుపతియును= దుర్యోధనుడున్నూ; సింధురాజును= సైంధవుడున్నూ; బరవసంబు+చేసి= ధైర్యం వహించి; ఆ+పాండవేయులన్= ఆ పాండవులను; తాఁకినన్= మార్కొనగా.

**తాత్పర్యం:** అర్జునుడు తనకు దుర్యోధనసైంధవులు అధీనులైనప్పటికీ క్రీగంటితో చూస్తూ, భీష్ముడిపైకి యుద్ధానికి వెళ్ళాడు. అప్పుడు ధర్మరాజు శల్యుడు తనమీదికి వస్తున్నప్పటికి లెక్కచేయకుండా, భీముడు, నకులుడు, సహదేవుడు వీరితో కలిసి అర్జునుడికి అండగా ఉండటానికి భీష్ముడున్నచోటికి వెళ్ళాడు. ఇంతలో దుర్యోధనుడు, సైంధవుడు పాండవులతో భీష్ముడు యుద్ధంచేస్తూండడం చూచి ఆ పాండవులను ధైర్యంతో ఎదుర్కొన్నారు.

**క. శలశల్యచిత్రసేనులు । బలియుండగు కృపునిఁ గూడి పాండుకుమారా**
**వలిమీఁదఁ గవిసి వాల । మ్ములు గురిసి రతండు సూచి మోదం బందన్. 54**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ భీష్ముడు; చూచి= చూచి; మోదంబు+అందన్= సంతోషపడగా; శలశల్యచిత్రసేనులు= శలుడు, శల్యుడు, చిత్రసేనుడు అనేవారు; బలియుండు+అగు= బలవంతుడైన; కృపునిన్+కూడి= కృపాచార్యుడితో కలిసి; వాలు+అమ్ములు= పదునుగల బాణాలను; పాండుకుమార+ఆవలిమీఁదన్= పాండవుల సమూహంమీద; కురిసిరి= కురిపించారు.

**తాత్పర్యం:** భీష్ముడు సంతోషం చెందేటట్లుగా శలశల్యచిత్రసేనులు బలవంతుడైన కృపుడితోకూడి, పాండవులమీద పదునైన బాణాలు కురిపించారు.

**వ. తదవసరంబున శిఖండి దేవవ్రతున కెదిర్చిన నొండు సేయ నొల్లమి నాతండు కోదండంబు దుండంబులు సేసి పిఱుసనఁజేయుటయుఁ బాండవాగ్రజుండు వాని ప్రతిజ్ఞావచనంబులెత్తి చెప్పి మొగమోడక యదల్చినం బురికొని యప్పాంచాలపతిసూనుండు సురనదీసూను మార్కొనుటయు మద్రనాథుం డెడసొచ్చి మహానలాస్త్రంబు ప్రయోగించిన దానికిం దలంకక వారించి వాఁడును వారుణాస్త్రం బేసిన నతండు తత్ప్రతిహతి గావించె; గాంగేయుండును ధర్మతనయు కేతుచాపదండంబులు ద్రుంచి యార్చినం బేర్చి భీముండు గదగొని రథంబు డిగ్గి రారాజుపయిం గవియుటయుఁ దత్సమయంబునం దలమిగిలి జయద్రథుండు రౌద్రం బెసంగ వేగంబు మెఱసి మెఱుంగుటమ్ము లేనూ ఱతనిపై నడరింప నతండు సరకుసేయక శరంబులు గదజడియుచుం గదిసి యమ్మారుతి సింధురాజ హయంబులం జదియ మోఁదిన నా సైంధవుండు. 55**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; శిఖండి; దేవవ్రతునకున్= భీష్ముడిని; ఎదిర్చినన్= ఎదుర్కోగా; ఆతండు= ఆ భీష్ముడు; ఒండు+చేయన్+ఒల్లక= ఏదీ చేయడానికి ఇష్టపడక (చంపడానికి ఇష్టంలేక); కోదండంబు= వాని వింటిని; తుండంబులు= ముక్కలుగా; చేసి= కావించి; పిఱు+చనన్= వెనక్కు మళ్ళి వెళ్ళేటట్లుగా; చేయుటయున్= చేయగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; వాని= ఆ శిఖండియొక్క; ప్రతిజ్ఞావచనంబులు= బాసలను; ఎత్తిచెప్పి= జ్ఞాపకంచేసి; మొగమోడక= దాక్షిణ్యంలేకుండా; అదల్చినన్= గద్దించగా; పురికొని= ఉత్సహించి; ఆ+పాంచాలపతిసుతుండు= ఆ పాంచాల మహారాజు యొక్క కుమారుడు- శిఖండి; సురనదీసూతున్= గంగానదికొడుకు భీష్ముడిని; మార్కొనుటయున్= ఎదిరించగా; మద్రనాథుండు= మద్రదేశానికి రాజు- శల్యుడు; ఎడ+చొచ్చి= సందులో చేరి; మహానల+అస్త్రంబున్= గొప్పదైన ఆగ్నేయాస్త్రాన్ని; ప్రయోగించినన్= వేయగా; దానికిన్= ఆ ఆగ్నేయాస్త్రానికి; తలంకక= జంకక; వాఁడును= ఆ శిఖండి; వారుణాస్త్రంబు+ఏసినన్= వారుణాస్త్రాన్ని ప్రయోగించగా; అతండు= ఆ శల్యుడు; తద్+ప్రతిహతిన్= దాని నాశమును; కావించెన్= చేశాడు; గాంగేయుండును= భీష్ముడు కూడా; ధర్మతనయు= ధర్మరాజుయొక్క; కేతుచాపదండంబులు= పతాకంయొక్క, వింటియొక్క, కర్రలను; త్రుంచి= తునుకలుచేసి; ఆర్చినన్= గర్జించగా; భీముండు; పేర్చి= అతిశయించి; గదన్=+కొని= గదాయుధాన్ని తీసికొని; రథంబున్+డిగ్గి=

తేరునుండి దిగి; రారాజుపయిన్= దుర్యోధనుడి మీదికి; కవియుటయున్= ఎగబడగా; తద్+సమయంబునన్= ఆ సమయంలో; తలమిగిలి= సేనకు ముందువైపు వచ్చి; జయద్రథుండు= సైంధవుడు; రౌద్రంబు+ఎసంగన్= రౌద్రరసం ఎక్కువకాగా; వేగంబు= త్వర; మెఱసి= ప్రకాశింపజేసి; మెఱుంగు+అమ్ములు= తళతళలాడే బాణాలను; ఏనూఱు= అయిదు వందలను; అతనిపైన్= ఆ భీముడి మీద; అడరింపన్= వేయగా; అతండు= ఆ భీముడు; శరంబులు= బాణాలను; సరకు+చేయక= లెక్కపెట్టక; గద= గదను; జడియించుచున్= ఆడించుతూ; కదిసి= దగ్గరకువచ్చి; ఆ+మారుతి= ఆ భీముడు; సింధురాజ హయంబులన్= సైంధవుడి గుఱ్ఱాలను; చదియన్+మోఁదినన్= నలిగేటట్లు కొట్టగా; ఆ సైంధవుండు= ఆ సింధుదేశపురాజు.

**తాత్పర్యం:** ఆ సమయాన శిఖండి భీష్మణ్ణి ఎదుర్కొన్నాడు. అతడు వాడిని ఏమీచేయక, అతడి వింటిని తునాతునకలుచేసి వాడు తిరిగిపోయేటట్లు చేశాడు. అప్పుడు ధర్మరాజు అతడు చేసిన ప్రతిజ్ఞను జ్ఞాపకంచేస్తూ శిఖండిని మొగమాటపడకుండా చీవాట్లు పెట్టాడు. శిఖండి ఉత్సాహం తెచ్చుకొని మళ్లా భీష్మడితో తలపడ్డాడు. ఈ సందడిలో మద్రదేశాధిపతి శల్యుడు దూరి గొప్ప ఆగ్నేయాస్త్రాన్ని శిఖండిమీద ప్రయోగించాడు. దానికి కదలకుండా నిలబడి, శిఖండి వారుణాస్త్రాన్ని వేశాడు. శల్యుడు దానిని పాడుచేశాడు, భీష్ముడు ధర్మరాజు పతాకదండాన్ని వింటి బద్దను ఒక దెబ్బతో విరిచేశాడు, పెనుబొబ్బలు పెట్టాడు. భీముడు ఆవేశంతో గదను పట్టుకొని, రథాన్నుండి దిగి, దుర్యోధనుడికి మీదికి ఉరికాడు. అప్పుడు జయద్రథుడు సేనకు ముందుభాగానికి వచ్చి, ఐదువందలు వాడిబాణాలను భీముడి మీద గుప్పించాడు. భీముడు ఆ బాణాలను లెక్కచేయకుండా గదను ఆడిస్తూ, దగ్గరకు వచ్చి సైంధవుడి గుఱ్ఱాలను ఎముకలు నలిగేటట్లు బాదాడు. ఆ సైంధవుడు- (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** దేవవ్రతుడు= దేవుడివలె వ్రతము, స్థిరత్వమైన ప్రతిజ్ఞ కలవాడు. భీష్ముడు,

> **శ్లో॥ చిత్రాంగదం తతో రాజ్యే స్థాపయామాస వీర్యవాన్ ।**
> **స్వయం నకృతవాన్‌రాజ్యం, తస్మాద్దేవవ్రతోఽభవత్॥** (దేవీ భాగవతే 1-20-16)

చిత్రాంగదుడిని పట్టాభిషిక్తుడిగా చేసి ఈ వీరుడు రాజ్యాన్ని పాలించలేదు. అందుచేత దేవవ్రతుడైనాడు.

**క. ఉక్కఱి యొండొకని రథం । బెక్కుటయున్ దొరలు దెరలి యేడ్తెఱ సెడి రా**
**దిక్కు ప్రజ విచ్చెనప్పుడు । గ్రక్కునఁ బతి భీము మీఁదఁ గవిసెం బెలుచన్. 56**

**ప్రతిపదార్థం:** ఉక్కు+అఱి= శౌర్యాన్ని కోలుపోయి (సైంధవుడు); ఒండు+ఒకని= మరియొకని యొక్క; రథంబు= తేరును; ఎక్కుటయున్= ఎక్కగా; దొరలున్= రాజులు; తెరలి= తొలగిపోయి; ఏడ్తెఱ= పరాక్రమమును; చెడిరి= కోల్పోయిరి; ఆ దిక్కు ప్రజ= ఆ వైపున ఉండే జనము; విచ్చెన్= చీలిపోయింది; అప్పుడు= ఆ సమయంలో; పతి= కౌరవ భర్తఅయిన దుర్యోధనుడు; భీముమీఁదన్= భీముడి మీదికి; పెలుచన్= కోపంతో; కవిసెన్= దుమికాడు.

**తాత్పర్యం:** సైంధవుడు తన రథం కూలిపోగా, మరొకడి రథం ఎక్కాడు. యుద్ధమాడే రాజులందరూ తోడుగా శౌర్యం కోల్పోయారు. వారి వైపున ఉండే సైనికులంతా చెల్లాచెదరైపోయారు. అప్పుడు దుర్యోధనుడు భీముడి మీద దాడి చేశాడు.

**క. ఎడఁ జొచ్చి చిత్రసేనుఁడు । వడముడిపై నేయ నతఁడు వైచెం గోపం**
**బడరఁగ గద నది యుగ్రపుఁ । బిడుగు క్రియన్ మెఱసి పఱచె బిట్టుగఁ జదలన్. 57**

**ప్రతిపదార్థం:** చిత్రసేనుఁడు= ఆ పేరుగల కౌరవపక్షంయోధుడు; ఎడన్= మధ్యలో; చొచ్చి= ప్రవేశించి; వడముడిపైన్= (విరోధులకు పరితాపం కలిగించే) భీముడిని; ఏయన్= బాణాలతో కొట్టగా; అతఁడు= ఆ భీముడు; కోపంబు= క్రోధం; అడరఁగన్= అధికంకాగా; గదన్= తన గదాయుధాన్ని; వైచెన్= విసిరివేశాడు; అది= ఆ గదాయుధం; ఉగ్రపున్= భయంకరమైన; పిడుగు క్రియన్= పిడుగు మాదిరి; చదలన్= ఆకాశంలో; మెఱసి= వెలుగుతూ; బిట్టుగన్= వేగంగా; పఱచెన్= పరుగెత్తి వచ్చింది.

**తాత్పర్యం:** చిత్రసేనుడు మధ్యలో వచ్చి భీముడిని బాణాలతో కొట్టాడు. భీముడు ఉగ్రుడై తన గదను విసరివేశాడు. అది పిడుగు చందంగా జాజ్వల్యమానంగా ఆకాశంలో వెలుగుతూ, గొప్ప వేగంతో వచ్చింది.

**తే.** **అట్లు వచ్చునాగదఁ గని యచటి యోధు । లలికి తమతమమీఁదన యడరు ననియుఁ**
**దలఁచి యొదిఁగిరి రారాజుఁ దలఁప రైరి; । ప్రాణభయ మెట్టివారిఁ గీడ్పఱుపకున్నె?** 58

**ప్రతిపదార్థం:** అచటి యోధులు= ఆ యుద్ధభూమిలో ఉండే వీరులు; అట్లు వచ్చు= ఆ విధంగా వెలుగుతూ వచ్చుచున్న; ఆ గదన్= భీముని ఆ గదాయుధాన్ని; కని= చూచి; అలికి= భయపడి; తమ తమ మీదన్= తమ తమ మీదనే; అడరున్+అనియున్= పడును అని కూడా; తలంచి= ఎంచి; ఒదిఁగిరి= దాగికొన్నారు; రారాజున్= దుర్యోధనుడిని గురించి; తలఁపరు+ఐరి= తలచనైనా తలచలేదు; ఎట్టివారిన్= ఎంతటి ధీరులనైనప్పటికీ; ప్రాణభయము= ప్రాణాలు పోతాయేమో అనే భయం; కీడ్పఱుపక+ఉన్నె?= తక్కువ వారిగా చేయకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** యుద్ధరంగంలో ఉండే వీరులంతా సెగలు పొగలతో వస్తూన్న భీముడు విసరివేసిన గదను చూచారు. ఎవరికివారు ఆ గద తమ మీదపడుతుందనే. తమ తమ ప్రాణాలు కాపాడుకొనే ప్రయత్నం చేశారేగాని, దుర్యోధనుడి సంగతి ఎవడూ పట్టించుకోలేదు. ప్రాణభయం ఎంత గొప్పవారికి కూడా తక్కువతనాన్ని కలిగిస్తుంది కదా!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క.** **అడిదముఁ బలుకయునుం గొని । చిడిముడి వడ కపుడు చిత్రసేనుం డుఱికెం**
**బుడమికి రథహయసూతులఁ । బొడిపొడి గావించెఁ బవనపుత్త్రునిగదయున్.** 59

**ప్రతిపదార్థం:** చిత్రసేనుండు= ఆ చిత్రసేనుడనే రాజు; అపుడు= ఆ సమయంలో; చిడిముడి+పడక= తొట్రుపాటు లేకుండా; అడిదమున్= కత్తిని; పలుకయునున్= కేడెమును; కొని= పట్టుకొని; పుడమికిన్= నేలపైకి; ఉరికెన్= దూకాడు; పవన పుత్రుని గదయున్= వాయుదేవుని కొడుకైన భీమునియొక్క గదాయుధము; రథహయసూతులన్= రథాన్నీ, గుర్రాలను, సారథిని; పొడిపొడి= నుగ్గు నుగ్గుగా; కావించెన్= చేసింది.

**తాత్పర్యం:** ఆ సమయంలో చిత్రసేనుడు తొట్రుపాటులేకుండా కత్తిని, కేదాన్ని పట్టుకొని నేలకు ఉరికాడు. అప్పుడు భీముడిగద చిత్రసేనుడి రథాన్ని, గుర్రాలను, సారథిని పిండిపిండిచేసింది.

**వ.** **ఇట్లు చిత్రసేనుండు విరథుం డైన వికర్ణుం డతనిం దనరథం బెక్కించుకొనిపోయె నట్టియెడ.** 60

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; చిత్రసేనుండు= చిత్రసేనుడనేవాడు; విరథుండు+ఐనన్= రథంలేనివాడుకాగా; వికర్ణుండు= కౌరవులలో ఒకడు; అతనిన్= ఆ చిత్రసేనుడిని; తన రథంబున్= తనయొక్క తేరులోనికి; ఎక్కించుకొనిపోయెన్= కూర్చోపెట్టుకొనిపోయాడు; అట్టి+ఎడన్= అట్టి సమయంలో.

**తాత్పర్యం:** చిత్రసేనుడీవిధంగా రథంలేనివాడయ్యాడు. అప్పుడు వికర్ణుడు అతడిని తన రథంలోనికి ఎక్కించు కొనిపోయాడు. ఆ సమయంలో- (తరువాతి పద్యంతో అన్వయం)

**శా. గంగాపుత్త్రుఁడు పాండవాగ్రజుని యు। గ్యంబుల్ మహిం గూల్చి స**
**ర్వాంగంబుల్ వెస నొంప నాతఁడు సము। ద్యత్క్రోధుఁడై శక్తి వై**
**చెం గంపింపక త్రుంచెఁ దాత విభుఁడున్। శీఘ్రంబ మాద్రీసుతో**
**త్తుంగస్యందనమెక్క నొంచెను సరి। త్సూనుండు మాద్రేయులన్. 61**

**ప్రతిపదార్థం:** గంగాపుత్త్రుఁడు= గంగాదేవి యొక్క కుమారుడు- భీష్ముడు; పాండవ+అగ్రజుని= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజుయొక్క; యుగ్యంబుల్= తేరి గుర్రాలను; మహిన్= నేలమీద; కూల్చి= పడవేసి; సర్వ+అంగంబుల్= ఆ ధర్మరాజుయొక్క అన్ని అవయవాలను; వెసన్= వేగంతో; నొంపన్= బాధింపగా; ఆతఁడు= ఆ ధర్మరాజు; సముద్యత్+క్రోధుఁడు+ఐ= పుట్టుతున్న కోపం కలవాడై; శక్తిన్= శక్తి అనే ఆయుధాన్ని; వైచెన్= విసరినాడు; తాత= తాతయైన భీష్ముడు; కంపింపక= చలనంలేకుండా; త్రుంచెన్= ఆ శక్తి ఆయుధాన్ని తుంచివేసినాడు; విభుఁడున్= ప్రభువైన ధర్మరాజు; శీఘ్రంబ= వేగంగా; మాద్రీసుత+ఉత్తుంగ స్యందనము= మాద్రికొడుకులైన నకుల సహదేవులయొక్క ఎత్తైన రథాన్ని; ఎక్కన్= ఎక్కగా; సరిత్+సూనుండు= గంగానది కుమారుడు- భీష్ముడు; మాద్రేయులన్= నకుల సహదేవులను; నొంచెను= బాధించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు, ధర్మరాజు గుర్రాలను నేలకూల్చాడు. అతని కరచరణాదులైన అవయవాలన్నింటికీ నొప్పికలిగించాడు. ధర్మరాజు కోపం రెచ్చిపోవగా భీష్ముడి మీదికి శక్తిని ప్రయోగించాడు. భీష్ముడు నిబ్బరంగా నిలబడి దాన్ని కూల్చివేశాడు. దానితో ధర్మరాజు గబగబా వెళ్ళి నకుల సహదేవులున్న రథంలోకి ఎక్కాడు. ఆ మాద్రీపుత్రులను కూడా భీష్ముడు బాణప్రయోగంతో బాగా లొంగదీశాడు.

**క. తమ్ముల నొంచిన నగ్రజుఁ। డుమ్మలికముతోడ బెరయునుత్సాహమునం**
**ద మ్మందఱఁ బురికొలుపఁగ। నమ్మొన నృపు లెల్లఁ దాఁకి రప్పుడు భీష్మున్. 62**

**ప్రతిపదార్థం:** తమ్ములన్= తమ్ముళ్ళైన నకుల సహదేవులను; నొంచినన్= బాధించగా; అగ్రజుఁడు= అన్న అగు ధర్మజుడు; ఉమ్మలికముతోడన్= బాధతో; బెరయు= కలుగు; ఉత్సాహమునన్= ఉత్సాహంతో; అప్పుడు= ఆ సమయంలో; ఆ+మొనన్= ఆ సైన్యంలో; నృపులు+ఎల్లన్= రాజులందరు; తమ్ము+అందఱన్= తమర్నందరిని; పురి కొలుపఁగన్= కవ్వించగా; భీష్మున్= భీష్మ్మడిని; తాఁకిరి= మార్కొనిరి.

**తాత్పర్యం:** ధర్మరాజు తన సోదరులు నకుల సహదేవులను భీష్ముడు లొంగదీయడం చూచాడు. చాలా దుఃఖంతోను, కలిగిన ఉత్సాహంతోనూ, సైన్యంలోని రాజులందరినీ పురికొలుపగా వారందరూ భీష్ముడిని ఎదిరించారు.

**వ. ఇట్లు పలువురు ధరణీశు లురవడించినం బెక్కు మృగంబులు మార్కొనినం జెలంగు సింగంబుచందంబున నలిరేఁగి సురనదీసూనుండు వెరవు గలవనపాలకుండు తాళఫలంబులు దిగఁద్రోచు చందంబున మెఱుంగు లడరు వెడంద వాతియమ్ముల నమ్మహీశుల తలలు డొల్ల నేయుచు మండలచారి యై విహరించుచున్న వెఱఁగుపడి పాండవులు సూచుచుండ శిఖండి కోదండపాండిత్యంబు మెఱయుచుం గదిసినఁ గ్రేడించి యతండు సృంజయసైన్యంబుపయిం దఱిమి దైన్యంబు నొందించె నట్టిసమయంబున. 63**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పలువురు= చాలామంది; ధరణీ+ఈశులు= రాజులు; ఉరవడించినన్= వేగిరపడగా; పెక్కు; మృగంబులు= జంతువులు; మార్కొనినన్= ఎదిరించగా; చెలంగు= విజృంభించు; సింగంబు చందంబునన్= సింహం మాదిరి; నలిరేఁగి= ఎక్కువగా విజృంభించి; సురనదీసూనుండు= గంగాదేవియొక్క కుమారుడు- భీష్ముడు; వెరవుగల= ఉపాయము కలిగినట్టి; వనపాలకుండు= వనాన్ని రక్షించేవాడు; తాళఫలంబులు= తాటి పండ్లను; దిగన్= క్రిందికి; త్రోచుచందబునన్= తోసే

మాదిరి; మెఱుంగులు= తళ తళమనే కాంతులు; అడరు= అతిశయించ; వెడందవాతియమ్ములన్= వెడల్పయిన మొనలు గల బాణాలతో; ఆ+మహీ+ఈశుల తలలు= ఆ రాజులయొక్కతలలు; డొల్లన్+ఏయుచున్= పడవేయుచు; మండలచారి+ఐ= రెండుకాళ్ళతో మండలాకారముగా చరించుచున్నవాడై; విహరించుచున్+ఉన్నన్= క్రీడిస్తూ ఉండగా; పాండవులు= పాండురాజు కొడుకులు; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; చూచుచున్+ఉండన్= చూస్తుండగా; కోదండపాండిత్యంబు= ధనుర్విద్యా నైపుణ్యం; మెఱయుచున్= ప్రకాశింపచేస్తూ; శిఖండి= శిఖండి; కదిసినన్= దగ్గరకు రాగా; క్రేడించి= అలక్ష్యంచేసి; అతండు= ఆ భీష్ముడు; సృంజయ సైన్యంబు పయిన్= సృంజయుడి సైన్యంమీదకు; తఱిమి= వెంటబడి పరుగెత్తించి; దైన్యంబున్+ఒందించెన్= దురవస్థపాలుచేశాడు; అట్టి సమయంబునన్.

**తాత్పర్యం:** పలురకాలైన మృగాలు ఎదిరించగా విజృంభించి నిశ్చలంగా నిలిచే సింహం మాదిరి, పలువురు రాజులు వేగిరపాటుతో ఎదిరించగా, భీష్ముడు యుక్తిగల తోపుకాపరి తాటిపండ్లను రాల్చినట్లు మిరుమిట్లుగొలిపే బాణాలతో చాలామంది రాజుల తలలు నేలకు రాల్చాడు. మండలచారిగా విహరించాడు. పాండవులు చేష్టలు మాని ఆశ్చర్యంతో చూస్తూండగా, శిఖండి తన విలువిద్యా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తూ ఆయన దగ్గరకు వచ్చాడు. వాడిని లెక్కచేయకుండా భీష్ముడు సృంజయుడి సేనమీద పడి దానిని బాధించాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** 'మండలచారి' అంటే రెండుకాళ్ళతో మండలాకారంగా నిలుచున్నవాడు (భీష్ముడు) విలుకాడు యుద్ధంలో భేదాలు 1.ప్రత్యాలీఢము; 2. ఆలీఢము; 3. సమపదము; 4. విశాఖము; 5. మండలము.

**సీ.** **సాత్యకి యేచి ధృష్టద్యుమ్నుఁడును దాను । గురుసైన్యములఁ గలగుండువెట్ట**
**విందానువిందులు వెసఁ దాఁకి ద్రుపదుని । కొడుకుగుఱ్ఱంబులఁ గూల్చుటయును**
**విరథుఁ డై హరితమ్మునరదంబుపై కతఁ । డేఁగిన ధర్మజుఁ డెల్ల బలముఁ**
**గవియించి యిరువురఁ గైకొని తఱిమినఁ । బ్రజకుఁ జేవీచి రారాజు గడఁగఁ**

**తే.** **దమ్ములును భీష్ముఁడును ధర్మతనయుసమద । సేనఁ బొదివిన వాసవసూనుఁ డడర**
**ద్రోణుఁ డాతని మార్కొని బాణజాల । పిహితముగఁ జేసె రోదసీకుహర మెల్ల.** **64**

**ప్రతిపదార్థం:** సాత్యకి= శ్రీకృష్ణుడి తమ్ముడు; తాను, ధృష్టద్యుమ్నుఁడునున్= ధృష్టద్యుమ్నుడు; ఏచి= విజృంభించి; కురుసైన్యములన్= కౌరవుల సైన్యాన్ని; కలగుండు+పెట్టన్= కలచివేయగా; వింద+అనువిందులు= విందుడు, అనువిందుడు అనేవాళ్ళు; వెసన్= వేగంగా; తాఁకి= ఎదుర్కొని; ద్రుపదుని కొడుకు= ద్రుపద మహారాజు కొడుకు ధృష్టద్యుమ్నుని యొక్క; గుఱ్ఱంబులన్; కూల్చుటయున్= పడగొట్టగా; విరథుఁడై= రథంలేనివాడై; అతఁడు= ఆ ధృష్టద్యుమ్నుడు; హరితమ్ము= కృష్ణుడి తమ్ముడైన సాత్యకి యొక్క; అరదంబుపైకిన్= తేరుమీదికి; ఏఁగినన్= పోగా; ధర్మజుఁడు= ధర్మరాజు; ఎల్లబలమున్= సైన్యాన్నంతయు; కవియించి= కవ్వించి; ఇరువురన్= ఆ విందానువిందులను; కైకొని= గురిగాచేసుకొని; తఱిమినన్= వెంబడించి తరుమగా; రారాజు= రాజులకు రాజు దుర్యోధనుడు; ప్రజకున్= జనానికి (సైన్యానికి); చేవీచి= చేతితో సంజ్ఞచేసి (ప్రోత్సాహపరచి); కడఁగన్= యుద్ధానికి దిగగా; తమ్ములును= దుర్యోధనుడి తమ్ములు; భీష్ముఁడును= భీష్ముడున్నూ; ధర్మతనయు= ధర్మరాజుయొక్క; సమదసేనన్= మదంతో కూడిన సైన్యాన్ని; పొదివినన్= కమ్ముకోగా; వాసవసూనుఁడు= ఇంద్రుని కొడుకు అర్జునుడు; అడరన్= సిద్ధంకాగా; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; ఆతనిన్= ఆ అర్జునుడిని; మార్కొని= ఎదిరించి; రోదసీకుహరము+ఎల్లన్= భూమి ఆకాశాలమధ్యభాగాన్ని పూర్తిగా; బాణజాలపిహితముగన్= బాణాల సమూహంతో కప్పబడినదానిగా; చేసెన్= కావించెను.

**తాత్పర్యం:** సాత్యకి, ధృష్టద్యుమ్నుడు బాగా విజృంభించి కురుసైన్యాన్ని కలతపెట్టారు. విందానువిందులు వేగంతో ఎదుర్కొని ధృష్టద్యుమ్నుడి గుర్రాలను కూల్చివేశారు. అతడు తన రథం చెడిపోగా సాత్యకి రథమెక్కాడు. ధర్మరాజు తన బలాన్నంతా బాగా పురికొల్పి విందానువిందులను చూచి తరిమాడు. అప్పుడు దుర్యోధనుడు చేయి విసరి తన సైన్యాన్నంతా కవ్వించి తానూ యుద్ధానికి దిగాడు. తాను, తనతమ్ములు భీష్ముడు అందరు ధర్మరాజు సైన్యాన్ని కమ్మివేశాడు. అప్పుడు అక్కడ అర్జునుడు కూడా ప్రత్యక్షమైనాడు. అంతలో ద్రోణాచార్యుడు అర్జునుడిని ఎదిరించి, భూమి ఆకాశం మధ్యభాగాన్ని బాణాలు బాగా గుప్పించి కప్పివేశాడు.

**విశేషం:** సాత్యకి వృష్ణివంశీయుడు, శినికి మనుమడు, అర్జునుడి శిష్యుడు, యుద్ధంలో పాండవ పక్షాన్ని ఆశ్రయించాడు.

**వ. ఇవ్విధంబున నాచార్యుం డేచిన నతనిప్రాపున భవత్సేనలు సెలంగి పైకొనియె, నయ్యవసరంబున ధర్మతనయుండు దనయెలుంగు సూపిన నగ్గలిక నాతనిమొగ్గరంబున మొనలు బెరసి పరుసఁదనంబు సూపి యేపునం బెనంగుచుండ నినుండు దర్శనీయమండలుం డగుచు నపరశైలశిఖరగతుండయ్యె, నయ్యెడ సంజకెంజాయ నెఱయ నెత్తుటేఱులపయి వడిందేలిపోవుపీనుంగులం దివిచికొని చను భూతబేతాళ సమ్మర్దంబులను, సమరతలప్రాంతపతితంబులైన శవంబులం గైకొని చెలంగు సృగాలంబు రవంబులను దత్సమయం బతిఘోరం బగుటయుఁ,ద్రిగర్తపతిప్రముఖు లగు జగతీశుల వెగడు పఱచి మెఱచిన సవ్యసాచియు, సైంధవాదివసుంధరాపతులం జిక్కువడం జేసి యుక్కుమీఱిన మారుతియుం దమ యన్నకుం బొడసూపి నిలిచిన నతండు సైన్యంబుల నివర్తింప నియమించి సమస్తపరిజన పరివృతుం డై. 65**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; ఏచినన్= విజృంభించగా; అతనిప్రాపునన్= అండగా; భవత్+సేనలున్= నీ యొక్క సేనలు; చెలంగి= విజృంభించి; పైకొనియెన్= ఎదుర్కొన్నవి; ఆ+అవసరంబునన్= ఆ సమయమందు; ధర్మతనయుండు= ధర్మరాజు; తన= తనయొక్క; ఎలుంగున్= గొంతును (కంఠధ్వనిని); చూపినన్= చూపించగా (వినిపించగా); ఆతని మొగ్గరంబునన్= అతడి వ్యూహములోనుండు; మొనలున్= సేనలు; అగ్గలికన్= ఉత్సాహముతో; బెరసి= క్రమ్ముకొని; పరుసఁ దనంబున్= కాఠిన్యాన్ని; చూపి= ప్రదర్శించి (చూపి); ఏపునన్= అధికంగా; పెనంగుచుండన్= పెనగులాడుచుండగా; ఇనుండు= సూర్యుడు; దర్శనీయమండలుండు+అగుచున్= చూడ శక్యమైనబింబముకలవాడౌతూ; అపరశైల శిఖరగతుండు+అయ్యెన్= పడమటి దిక్కునందలి పర్వతముయొక్క కొనను పొందినవాడయ్యాడు; ఆ+ఎడన్= ఆ సమయంలో; సంజ+కెంపు+చాయ= సాయంకాలపు మెరుపురంగు; నెఱయన్= వ్యాపించగా; నెత్తురు+ఏఱులపయిన్= నెత్తురు ప్రవాహాలమీద, వడిన్= వేగంతో; తేలిపోవు; పీనుంగులన్= శవాలను; తివిచికొని= లాగికొని; చను= పోతూండే; భూతబేతాళ సమ్మర్దంబులను= భూతాలు, బేతాళులు- వీటి ఒరపిళ్ళతో; సమర తలప్రాంతపతితంబులు+ఐన= యుద్ధభూమి అంచుల్లో పడి ఉండే; శవంబులన్= పీనుగులను; కైకొని= తీసికొని; చెలంగు= మ్రోసే; సృగాలంబుల రవంబులను= నక్కల ఊళలచేతను; తద్+సమయంబు= ఆ కాలము; అతిఘోరంబు+అగుటయున్= చాలా భయంకరమైనదికాగా; త్రిగర్తపతి ప్రముఖులు+అగు= త్రిగర్త దేశపురాజు మున్నగు; జగతీ+ఈశులన్= భూభర్తల (రాజుల)ను; వెగడుపఱిచి= బాధపెట్టి; మెఱసినన్= ప్రకాశించగా; సవ్యసాచియున్= అర్జునుడున్నూ; సైంధవ+ఆది+వసుంధరాపతులన్+ సైంధవుడు మొదలైన రాజులను; చిక్కు+పడన్+చేసి= కష్టపడేటట్లుగాచేసి; ఉక్కుమీఱినన్= శౌర్యంచే అతిశయించిన; మారుతియున్= భీముడున్నూ; తమ+అన్నకున్= తమ అన్నయైన ధర్మరాజుకు; పొడసూపి= కనుపించి; నిలిచినన్= నిలబడగా; అతండు= ఆ ధర్మరాజు; సైన్యంబులన్= తమసేనలను; నివర్తింపన్= వెనుకకు మళ్ళించుటకు- యుద్ధాన్ని చాలించడానికి; నియమించి= ఆజ్ఞ ఇచ్చి; సమస్త పరిజన పరివృతుండు+ఐ= సకలమైన పరివారంతో కూడినవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రోణాచార్యుడు విజృంభించాడు. నీ సేనలన్నీ ఆయన అండనుచేరి ఉత్సాహంతో శత్రువులపైకి ఎగబడ్డాయి. అప్పుడు ధర్మరాజు బిగ్గరగా అరవగా ఆయన వ్యూహంలోని సైనికులు ఉత్సాహంతో యుద్ధం చేస్తూ ఉండగా సూర్యుడు అస్తపర్వతంపైకెక్కాడు. ఆ సాయంకాలపు ఎర్రని కాంతులు అంతటా వ్యాపించాయి. యుద్ధరంగంలో నెత్తురు ఏరులై పారింది. ఆ ప్రవాహంలో కొట్టుకొని పోతున్న శవాలను లాగుకొనిపోయే భూతబేతాళాల రాపిళ్ళతోనూ, యుద్ధభూమిలో కూలిన పీనుగులను పీక్కొని తింటూ చెలరేగే నక్కల ఊళలతోనూ ఆ సమయం భయంకరంగా ఉండింది. అప్పుడు ఆ త్రిగర్తదేశపురాజు ముఖ్యుడుగా ఉండే రాజులనందరినీ తల్లడిల్లేటట్లు చేసిన అర్జునుడు, సైంధవుడాదిగాగల రాజులనందరినీ అగచాట్లపాలుచేసి శౌర్యాతిశయంతో ఒప్పివున్న భీముడు, అన్నగారైన ధర్మరాజు ఎదుట నిలిచాడు. అప్పుడా ధర్మరాజు, యుద్ధం చాలించుమని అనుజ్ఞ ఇచ్చి, తనదైన సమస్త పరివారంతో కూడా. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** సవ్యసాచి= రెండుచేతులతో బాణాలు వదిలేవాడు.

**శ్లో॥ ఉభే మే దక్షిణే పాణీ గాండీవస్య వికర్షణే।**
**తేన దేవమనుష్యేషు సవ్యసాచీతి మాం విదుః॥**(మహాభారతే - 4-12-16)

**తే. విడిదలకుఁ బోయె నపుడు నీ కొడుకులెల్ల । నాపగానందనునికడ కరుగుదెంచి**
**బలము లన్నింటిఁ దివియంగఁబనిచి మరలి । రాత్మసన్నివేశంబుల కతఁడుఁ దారు. 66**

**ప్రతిపదార్థం:** విడిదలకున్= తన చోటికి; పోయెన్= వెళ్ళాడు; అపుడు= ధర్మజుడు సపరివారంగా వెళ్ళినప్పుడు; నీ కొడుకులు+ఎల్లన్= నీ కుమారులు దుర్యోధనాదులందరున్నూ; ఆపగానందనుని= గంగానదీ కొడుకైన భీష్ముడి; కడకున్= సమీపానికి; అరుగుదెంచి= వచ్చి; బలములు+అన్నిటిన్= సేనలనన్నిటినీ; తివియంగన్+పనిచి= వెనుకకు తిప్పిపంపి (ఉపసంహరించి); అతఁడున్= ఆ భీష్ముడు; తారు= తాము (దుర్యోధనాదులు); ఆత్మసన్నివేశంబులకున్= తమదండు విడిసిన చోటులకు; మరలిరి= తిరిగివెళ్ళారు.

**తాత్పర్యం:** ధర్మరాజు పరివారంతో తమదండు విడిసియున్న చోటికి వెళ్లాడు. దుర్యోధనాదులుకూడా భీష్ముడివద్దకు పోయి, తమసైన్యాన్నంతా యుద్ధంనుండి విరమింపచేసి, తమ తమ గుడారాలకు వెళ్ళిపోయారు.

**వ. సప్తమదివస రజనీసమయావసానం బగుటయు 67**

**ప్రతిపదార్థం:** సప్తమ= ఏడవదైన; దివస= దినముయొక్క; రజనీ= రాత్రియొక్క; అవసానంబు= ముగింపు; అగుటయున్= కావటంతో.

**తాత్పర్యం:** భీష్ముడు సేనాధిపతిగా జరిగిన యుద్ధంలో ఏడవ దినపు రాత్రి తెల్లవారగా.

### భీష్ముని యష్టమదివస యుద్ధక్రమము (సం. 6-83-1)

**క. భూపోత్తమ! విను పాండు । క్ష్మాపాలతనూభవులును గౌరవులును నా**
**టోపంబున సంగరకే । ళీపరులై వెడలి రుగ్రలీలలు మెఱయన్. 68**

**ప్రతిపదార్థం:** భూప+ఉత్తమ= భూమిని పాలించువాళ్ళలో శ్రేష్ఠుడవైన ధృతరాష్ట్రా!; విను; పాండుక్ష్మాపాల= పాండురాజుయొక్క; తనూభవులునున్= పుత్రులూ; కౌరవులునున్= దుర్యోధనాదులూ; ఆటోపంబునన్= సంభ్రమంతో; ఉగ్రలీలలు= భయంకరమైన చేష్టలు; మెఱయన్= అతిశయించగా; సంగరకేళీపరులు+ఐ= యుద్ధమనే క్రీడయందు ఆశకలవారై; వెడలిరి= బయలుదేరారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! వినుము. పాండురాజు కొడుకులున్నూ, నీ కొడుకులు దుర్యోధనాదులున్నూ వేగిరపాటుతో భయం కలిగించే చేష్టలు చేస్తూ, యుద్ధక్రీడలో ఆశగలవారై యుద్ధానికి పోయారు.

**వ. అట్టియెడం గురుపితామహుండు గూర్మవ్యూహంబు దీర్చినం గనుంగొని ధర్మతనయుండు ధృష్టద్యుమ్ను నాలోకించి 'కౌరవవ్యూహంబు సూచితే? దీనికిఁ బ్రతివ్యూహం బెయ్యది దాని సంఘటింపు'మనిన నతండు శృంగాటకవ్యూహంబు పన్నె నిట్లు రెండుసైన్యంబులు మోహరించి యుత్సాహంబులు మెఱయ భేరీ మృదంగాదితూర్యంబులు మొరయం దలపడినఁ బటుహేతివ్రాతపరస్పరసంఘట్టనంబులం బొగ లేని మంట లెగయం జటులస్యందనమాతంగతురంగభటకదంబకంబుల గమనవేగంబున నెగయుపరాగపటలంబు లంబరంబునం బరఁగనీక తత్తదనీకానేకరక్తధారాసారంబు లడరి యడంగించిన నతిరౌద్రంబునఁ బెనంగు నాసమయంబున. 69**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో; కురుపితామహుండు= కురుకులానికి తాత భీష్ముడు; కూర్మవ్యూహంబున్= తాబేలు వ్యూహాన్ని; తీర్చినన్= ఏర్పాటుచేయగా; ధర్మతనయుండు= ధర్మరాజు; కనుంగొని= ఆ కూర్మవ్యూహాన్నిచూచి; ధృష్టద్యుమ్నున్= ఆపేరుగల తమసేనా నాయకుణ్ణి; ఆలోకించి= చూచి; కౌరవవ్యూహంబున్= కౌరవులయొక్క సేనా సన్నివేశాన్ని; చూచితే= చూచావా?; దీనికిన్= ఈ కూర్మవ్యూహానికి; ప్రతివ్యూహంబు= ఈ కూర్మవ్యూహాన్ని ఎదిరించగల వ్యూహం; ఏ+అది= ఏదో; దానిన్= అట్టి వ్యూహాన్ని; సంఘటింపుము= ఏర్పాటుచేయి; అనినన్= అని చెప్పగా; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; శృంగాటక వ్యూహంబున్= శృంగాటకమనే ప్రతివ్యూహాన్ని; పన్నెన్= ఏర్పాటుచేశాడు. ఇట్లు= ఈ విధంగా; రెండు సైన్యంబులు= కౌరవపాండవుల సేనలు; మోహరించి= ఎదుర్కొని; ఉత్సాహంబులు మెఱయన్= ఉత్సాహాలు అతిశయించగా; భేరీ మృదంగ+ఆది తూర్యంబులు= నగారాలు, మద్దెలలు మున్నుగాగల వాద్యాలు; మొరయన్= శబ్దించగా; తలపడినన్= ఒకర్నొకరు ఎదిరించగా; సంఘట్టనంబులు= సంఘర్షణలు; పటు= సమర్థతగల; హేతి= ఆయుధాలయొక్క; వ్రాత= సమూహముయొక్క; పరస్పర= ఒండొంటియొక్క; సంఘట్టనంబులన్= ఒరసికొనుటచేత; పొగలేని= పొగలేకయే; మంటలు= జ్వాలలు; ఎగయన్= పైకి వ్యాపించగా; చటుల= కదలుతున్న; స్యందన= రథములు; మాతంగ= ఏనుగులు; తురంగ= గుర్రాలు; భట= భటులు వీటియొక్క; కదంబకంబులన్= గుంపులయొక్క; గమనవేగంబునన్= నడకయొక్క వేగంచేత; ఎగయు= పైకిలేచు; పరాగపటలంబులు= దుమ్ముల గుంపులు; అంబరతలంబునన్= ఆకాశభాగంలో; పరఁగన్+ఈక= వ్యాపింపనీయకుండా; తద్+తద్+అనేక+అనేక= వారి వారి సేనల బాహుళ్యము యొక్క; రక్తధారా= నెత్తురు ధారలనే; ఆసారంబులు= జడివానలు; అడరి= అధికమై; అడంగించినన్= అణగిపోవునట్లుచేయగా; అతిరౌద్రంబునన్= మిక్కిలి కోపముతో; పెనంగు= యుద్ధంచేసే; ఆ సమయంబునన్= ఆ వేళలో

**తాత్పర్యం:** కౌరవపాండవులు యుద్ధానికి మోహరించినప్పుడు భీష్ముడు కూర్మవ్యూహాన్ని ఏర్పరచాడు. ధర్మరాజు దాన్నిచూచి, ధృష్టద్యుమ్నుడితో 'కౌరవులు పన్నిన కూర్మవ్యూహాన్ని చూచావుకదా! దీనికి ఈడైన వ్యూహం ఏదో దాన్ని నీవు ఏర్పాటుచేయుము' అన్నాడు. ధృష్టద్యుమ్నుడు దానికి ఈడైన శృంగాటకవ్యూహాన్ని పన్నాడు. ఈ విధంగా రెండు సైన్యాలూ వ్యూహాలు తీర్చుకొని ఉత్సాహంతో యుద్ధానికి సిద్ధంకాగా, నగారాల, మృదంగాది వాద్యాల శబ్దాలు మిన్నుముట్టగా- కౌరవపాండవులు తలపడ్డారు. ఆయుధాల సమూహాలు ఒండొంటి ఒరపిడిచేత పొగలేని మంటలు ఎగబాకాయి. తొందరపాటుతో కదలే రథాలు, ఏనుగులు, గుర్రాలు, భటులు. వీటి ఘట్టనలతో లేచిన ధూళి ఆకాశాన్ని ఆవరింపకుండా ఆయా పెక్కు సేనలయొక్క నెత్తురు ధారల వర్షంతో అణగిపోయింది. ఇంతటి పెనగులాట జరిగే సమయంలో- (తరువాతి పద్యంతో అన్వయం)

**క. మీ తండ్రి సింహనాద । స్ఫీతముఖుం డగుచు నాత్మసేన గడచినన్**
**భీతిం బాండవయోధ । వ్రాతము మార్కొనక యొదిఁగె వసుధాధీశా! 70**

**ప్రతిపదార్థం:** వసుధా+అధీశా!= భూమికి భర్తవగు ఓ ధృతరాష్ట్ర మహారాజా! మీ తండ్రి= నీయొక్క తండ్రియైన భీష్ముడు; సింహనాద స్ఫీతముఖుండు+అగుచున్= సింహనాదం చేయటంలో ప్రకాశించే ముఖం కలవాడు అయి; ఆత్మసేనన్= తనయొక్క సేనను; కడచినన్= దాటిరాగా; పాండవయోధవ్రాతము= పాండవసైన్యంలోని వీరులయొక్క సమూహము; భీతిన్= భయముతో; మార్కొనన్= ఎదిరించగా; ఒదిఁగెన్= తొలగినది.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు బాగా బొబ్బలు పెట్టుతూ తన సైన్యానికి ముందుభాగాన్ని చేరగా పాండవసేనలోని మహావీరులందరూ ఆ భీష్ముణ్ణి ఎదిరించలేక మారుమూలలకు తొలగారు.

**చ. అనిలతనూజుఁ డొక్కరుఁడు । నార్చుచు భీష్మునెదిర్చి సూతుఁ జం**
**పిన రథ మీడ్చికొంచుఁ గురు । బృందము గొందల మంద నశ్వముల్**
**వెనుకకుఁ బాఱె నప్డు పృథి । వీవర! పాండవ సేన యుబ్బె నీ**
**తనయుఁడు భీముఁ గట్టెదురఁ । దాఁకె సునాభుఁడు విక్రమోద్ధతిన్. 71**

**ప్రతిపదార్థం:** పృథివీవర!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అనిలతనూజుఁడు= వాయుదేవునికొడుకు- భీముడు; ఒక్కరుఁడున్= ఒక్కడే; ఆర్చుచున్= బొబ్బలు పెడుతూ; భీష్మున్; ఎదిర్చి= ఢీకొని; సూతున్= సారథిని; చంపినన్= చంపగా; కురుబృందము= కౌరవుల గుంపు; కొందలము+అందన్= కలతచెందగా; అశ్వముల్= గుర్రాలు; రథమున్= తేరును; ఈడ్చికొంచున్= లాగికొంటూ; వెనుకకున్= వెనుకకు; పాఱెన్= పరుగెత్తాయి; అప్డు= ఆ సమయంలో; పాండవసేన= పాండవులయొక్క సైన్యం; ఉబ్బెన్= సంతోష పడినది; నీ తనయుఁడు= నీ కొడుకు; సునాభుఁడు= సునాభుడనేవాడు; విక్రమ+ఉద్ధతిన్= పరాక్రమం యొక్క అతిశయం తో; భీము కడు+ఎదురన్= భీముడికి చాలా దగ్గరగా; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** భీము డొక్కడే పెనుబొబ్బలుపెట్టుతూ భీష్ముడిని ఎదిరించాడు. ఆతడి సారథిని హతమార్చాడు. కౌరవ సైనికులందరూ కంగారుపడుతూంటే గుర్రాలు రథాన్ని లాక్కొని వెనక్కి పరుగెత్తి వెళ్ళాయి. ఆ పట్టులో పాండవసేన చాల ఉత్సాహంచెందింది. నీ కొడుకు సునాభుడనేవాడు పరాక్రమంతో చాలా దగ్గరకువచ్చి భీముడిని ఎదుర్కొన్నాడు.

### సునాభుడు మొదలగు కురుకుమారులు భీమునిచేఁ జచ్చుట (సం. 6-84-12)

**ఆ. అట్లు దాఁ కుటయు బకాంతకుఁ డంత్యకా । లాంతకుండు వోలె నలిగి బొమలు**
**ముడివడంగ నొక్క వెడఁ దయమ్మునఁ దల । నఱికి వైచి పెలుచ నవ్వె నధిప! 72**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అట్లు= ఆ విధంగా; తాఁకుటయున్= ఎదుర్కోగా; బక+అంతకుఁడు= బకుడనే రాక్షసుణ్ణి చంపిన భీముడు; అంత్యకాల+అంతకుండున్+పోలెన్= ప్రళయకాలంలోని యముడి మాదిరి; అలిగి= కోపించి; బొమలు ముడి+పడంగన్= కనుబొమ్మలు ముడిఏర్పడగా (కోపసూచకం); ఒక్క= ఒక్కటైన; వెడఁద= విశాలమైన; అమ్మునన్= బాణంతో; తలన్= తలను; నఱికివైచి= నరికివేసి; పెలుచన్= బిగ్గరగా; నవ్వెన్= నవ్వాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! ఆ విధంగా సునాభుడు, బకాసురుణ్ణికూడా చంపిన మహావీరుడైన భీముణ్ణి ఎదుర్కొన్నాడు. ఆ భీముడు యమధర్మరాజు మాదిరిగా నిండా అలిగిన లక్షణాన్ని సూచించే కనుబొమలముడి ఏర్పడగా, ఒక్క పదునైన బాణంతో ఆ సునాభుడి తల నరికి విరగబడి నవ్వాడు.

**అవతారిక:** సునాభుడి సోదరులు ఏడుగుర్ని భీముడు చంపుతాడు.

**వ. ఇట్లు సునాభుండు వడుట గనుంగొని కోపాటోపంబునఁ దత్సోదరులగు నాదిత్యకేతుండును, నపరాజితుండును, బహ్వాశియుఁ, బండితుండును, గుండధారుండును, విశాలాక్షుండును, మహోదరుండును వృకోదరుపై నొక్కపెట్ట కదిసి పెక్కు విధమ్ములగునమ్ములం బెక్కింట నొప్పించిన నప్పాండవ వీరుండు రోషాతిభీషణుండై యేరికిం దేఱి చూడ రాక పటుభల్లంబున, నతినిశితక్షురప్రముఖంబున, శితప్రదరంబున, శాతక్షురికాముఖంబున, దీప్తార్ధ చంద్రాంబకంబున, ఖరనారాచంబునఁ గ్రూరబాణంబునఁ నక్కుమారసప్తకంబు సమవర్తి సమీపంబున కనిచినం దక్కటికుమారు లుక్కుదక్కి వెఱఁగుపడి యంతంత నొదిఁగిన. 73**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సునాభుండు= సునాభుడనేవాడు; పడుటన్= చచ్చుటను; కనుంగొని= చూచి; కోప+ఆటోపంబునన్= కోపంతోనైన వేగిరపాటుతో; తద్+సోదరులు+అగు= ఆ సునాభుడికి తోడబుట్టువులైనట్టి 1.ఆదిత్యకేతుండును; 2.అపరాజితుండును; 3.బహ్వాశియు; 4.పండితుండును; 5.కుండధారుండును; 6.విశాలాక్షుండును; 7.మహోదరుండును; వృక+ఉదరుపైన్= భీముడిమీదికి; ఒక్కపెట్ట= ఒక్కసారిగా; కదిసి= సమీపానికి వెళ్ళి; పెక్కువిధమ్ములు+అగు= నానా ప్రకారాలైన; అమ్ములన్+పెక్కింటన్= అనేకబాణాలతో; నొప్పించినన్= బాధకలిగించగా; ఆ+పాండవవీరుండు= వీరుడైన ఆ భీముడు; రోష+అతి భీషణుండు+ఐ= కోపంచే మిక్కిలి భయంకరుడై; ఏరికిన్= ఎవరికిగాని; తేఱి చూడరాక= ఎగాదిగా చూట్టానికి సాధ్యంకాక; పటుభల్లంబునన్= గట్టి బల్లెంతో; అతి నిశిత క్షుర ప్రముఖంబునన్= అతి పదునైన అర్ధచంద్రబాణపుకొనతో; శితప్రదరంబున(న్)= వాడియైన బాణంతో; శాతక్షురికా ముఖంబునన్= మంగలి కత్తివంటి వాడిఅయిన ఆయుధంతో; దీప్త+అర్ధచంద్ర+అంబకమునన్= బాగా వెలిగే అర్ధచంద్రాకారపు; బాణంతో; ఖరనారాచంబునన్= వాడిబాణంతో; క్రూరబాణంబునన్= కఠినమైన బాణంతో; ఆ+కుమార సప్తకంబున్= ఆ నీ కుమారులు ఏడుగురిని; సమవర్తి సమీపంబునకున్= యమధర్మరాజు దగ్గరకు; అనిచినన్= పంపగా; తక్కటి కుమారులు= మిగిలిన నీ కొడుకులు; ఉక్కు= బలం; తక్కి= వదలిపెట్టి; వెఱఁగుపడి= భయపడి; అంతన్+అంతన్= అక్కడక్కడ; ఒదిఁగినన్= నక్కినవారు కాగా.

**తాత్పర్యం:** సునాభుడు భీముడిచేత చావటాన్ని అతడి సోదరులు ఏడుగురూ చూచారు. వారందరూ దొమ్మిగా ఒక్కసారిగా ఆ భీముడిమీదపడి, నానావిధాలైన బాణాల వర్షాలు కురిపించి ఆతడికి చాలా బాధకలిగేట్టు చేశారు. దానితో ఆ కుంతీకుమారుడికి అంతా ఇంతా అనరాని రోషం కలిగింది. ఎవరికీ తేరిపారచూడటానికి కూడా సాధ్యంకానివాడై, ఆ సోదరులను క్రమంగా ఉక్కుబల్లెంతో ఆదిత్యకేతుడిని, పదునుగల క్షురప్రముఖమనే ఆయుధంతో అపరాజితుడిని, చురుకుగల బాణంతో బహ్వాశి అనేవాడిని, మంగలికత్తివంటి ఆయుధంతో పండితుడిని, జ్వలించే అర్ధచంద్రాకారపు బాణంతో కుండధారుడిని, కరుకైన బాణంతో విశాలాక్షుడిని, కటువైన బాణంతో మహాధరుడిని, - ఇట్లా ఆ ఏడుగురినీ చంపాడు. దీన్ని చూచి తక్కిన నీ కుమారులందరూ ధైర్యాన్ని వదలి భయంతో తొలగిపోయారు.

**తే. 'నాఁడు సభ నాడినంతయు నేఁడ చేయు । నట్టు లున్నాఁడు మొనతల ననిలసుతుఁడు**
**విదురుపలుకులు దలకూడె వేయు నేల?। యనుచు వెఱఁ జూచుచుండిరి మనుజపతులు. 74**

**ప్రతిపదార్థం:** అనిల సుతుఁడు= భీముడు; నాఁడు= ఆ దినం; సభన్= కౌరవుల సభలో; ఆడిన= పలికినదానిని; అంతయున్= పూర్తిగా; నేఁడు+అ= ఈనాడే; మొనతలన్= యుద్ధంలో; చేయు+అట్టులున్= చేసే మాదిరిగా; ఉన్నాఁడు; విదురుపలుకులు=

విరుదునియొక్క మాటలు; తలకూడెన్= సిద్ధించాయి (కార్యరూపం తాల్చాయి); వేయున్+ఏల?= ఇక వేయి మాటలెందుకు?; అనుచున్= అని అంటూ; మనుజపతులు= రాజులు; వెఱన్= ఆశ్చర్యంతో; చూచుచుండిరి= చూస్తూ ఉండిపోయారు.

**తాత్పర్యం:** 'భీముడానాడు సభలో చేసిన ప్రతిజ్ఞలన్నీ ఈనాడు యుద్ధంలో నెరవేర్చేటట్లున్నాడు. విదురుడు చెప్పిన నీతి మాటలు ఈ దినం సార్థకం కాబోతున్నాయి. ఇక వెయ్యి మాట లెందుకు?' అని రాజులందరూ ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయారు.

**క. ' నీవు తనూజుల దుర్విన । యావేశం బుడుపవైతి వది దుర్దశలం**
**గావింప నింకఁ జావక । పోవచ్చునె వారి కనిలపుత్రుని చేతన్. 75**

**ప్రతిపదార్థం:** నీవు= (ధృతరాష్ట్రుడవైన) నీవు; తనూజుల= కొడుకులైన దుర్యోధనాదులయొక్క; దుర్వినయ+ఆవేశంబున్= అవినీతిచే ఒడలు తెలియకపోవటాన్ని; ఉడుపవు+ఐతివి= పోగొట్టకపోయావు; అది= ఆ అవినీతిని పోగొట్టకపోవడం; దుస్+దశలన్= చెడ్డ అవస్థలను; కావింపన్= కలిగించగా; ఇంకన్= ఇక మీద; వారికిన్= ఆ దుర్యోధనుడు మున్నగువారికి; అనిలపుత్రునిచేతన్= భీముడిచేత; చావన్= చనిపోక; పోవచ్చునె?= తప్పించుకొనవచ్చునా?.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజా! నీ కొడుకులయొక్క అవినీతిచేనైన దుష్టచేష్టలను అరికట్టకపోయావు. ఆ నీ చేతగాని తనం ఇప్పుడిన్ని కష్టాలకు కారణమైంది. ఇక ఆ దుర్యోధనాదులకు, ఆ భీముడివల్ల చావు తప్పుతుందా? తప్పదు.

**వ. అది యట్లుండె నప్పుడు సుయోధనుండు దనచుట్టు నున్న యోధవీరులం గలయం గనుంగొని భీమసేను మార్కొనం బంచి భీష్ము కడకుం జని శోకగద్గదకంఠుం డగుచు నతనితో ని ట్లనియె. 76**

**ప్రతిపదార్థం:** అది= ఆ సంగతి; అట్లు+ఉండెన్= అట్లా ఉంది; అప్పుడు= ఆ సమయంలో; సుయోధనుండు; తన= తనయొక్క; చుట్టున్= తనచుట్టూ; ఉన్న= ఉన్నటువంటి; యోధవీరులన్= భటులను, శూరులను; కలయన్+కనుంగొని= కలయజూచి; భీమసేనున్; మార్కొనన్= ఎదిరించుటకు; పంచి= పంపించి; భీష్ము కడకున్= భీష్ముడివద్దకు; చని= వెళ్ళి; శోక గద్గద కంఠుండు+అగుచున్= దుఃఖంచేత బొంగురుపోయిన కంఠస్వరంగలవాడై; అతనితోన్= ఆ భీష్మాచార్యునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సంగతి అట్లా ఉండినది. అప్పుడు దుర్యోధనుడు తనచుట్టూ ఉన్నట్టి భటులనూ, శూరులనూ చూచి భీముడితో యుద్ధం చేయడానికి వెళ్ళుమన్నాడు. తానేమో భీష్ముడివద్దకు వెళ్ళాడు. దుఃఖంచే బొంగురుపోయిన కంఠస్వరంతో ఆయనతో ఇట్లా అన్నాడు.

**అవతారిక:** భీముడిచేత తన తమ్ములు చావడం చూచాడు. దుఃఖంతో దుర్యోధనుడు భీష్ముడి దగ్గరకు వెళ్ళి, ఆయన వారిని కాపాడలేదని బాగా యుద్ధంచేయలేదని ఎత్తి పొడుపు మాటలంటాడు.

**ఉ. ' ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతుఁ । డేపునఁ గోలుమసంగి పొంగి నా**
**తమ్ములఁ జంపఁగా నకట! । తప్పక చూచెదు గాని రోషశో**
**కమ్ములు లేవు తోడుపడఁ । గా దని నిల్చితొ యున్నవారు నొ**
**క్కుమ్మడిఁ జావఁ గోరి యిటు । లూరక యుండితొ కౌరవోత్తమా!' 77**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఉత్తమా!= కురువంశపు రాజులలో గొప్పవాడైన ఓ భీష్మా!; వాయుసుతుండు= వాయుదేవుడి కుమారుడు భీముడు; ఈ+మెయిన్= ఈ విధంగా; కిట్టి= దగ్గరకువచ్చి; ఏపునన్= అతిశయంతో; కోలుమసంగి= మిక్కిలి విజృంభించి; పొంగి=

గర్వించి; నా తమ్ములన్= నా యొక్క తోబుట్టువులను; చంపఁగాన్= చంపుతుండగా!; అకట!= అయ్యో!; తప్పక= చేసేదిలేక; చూచెదు= చూస్తున్నావు; కాని= అంతేగాని; రోషశోకమ్ములు= రోషంగాని దుఃఖంగాని; లేవు= (నీలో) అగుపించవు; తోడుపడన్ కాదు+అని= సహాయపడుట తగదని; నిల్చితి+ఒ= ఊరకున్నావో; ఉన్నవారున్= మిగిలి ఉండేవారు కూడా; ఒక్క+ఉమ్మడిన్= ఒకేసారిగా; చావన్+కోరి= చావాలి అని వాంఛించి; ఇటులు= ఈ విధంగా; ఊరక ఉండితి+ఒ= మిన్నకున్నావో!

**తాత్పర్యం:** ఓ కౌరవోత్తమా! ఈ విధంగా మీదికి వచ్చి భీముడు అతిశయంతో మిక్కిలి విజృంభించి ఉప్పొంగి నా తమ్ములను చంపగా అయ్యో! తప్పకుండా చూస్తున్నావు గాని నీకు కోపం కానీ, దుఃఖం కానీ రాలేదు. తోడ్పడకూడదని నిలబడి పోయావో? లేక ఉన్నవారందరూ ఒక్కసారిగా చావనీయమని ఇట్లా ఊరకున్నావో?

**వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కి ట్లనియె. 78**

**ప్రతిపదార్థం:** అనినన్= దుర్యోధనుడిట్లా అనగా; విని; నదీసూనుండు= గంగాపుత్రుడు- భీష్ముడు; తానున్= తానుకూడ; ఎదురు= శోకించి; దుర్యోధనుడితోపాటు దుఃఖపడి; అతనికిన్= ఆ దుర్యోధనుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధను డాడిన పలుకులు విని, భీష్ముడు అతనితోపాటు తానూ దుఃఖం చెంది, దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**క. ' ఇది మున్న యేను ద్రోణుఁడు । విదురుండును జెప్పినదియ విన వప్పుడు బె**
**ట్టిదు లగుపాండుతనూజుల । కెదు రై నిర్జింప వశమె? యీశున కైనన్. 79**

**ప్రతిపదార్థం:** ఇది= పాండవులచే మీరు (దుర్యోధనాదులు) భంగపడుతారనేది; మున్ను+అ= ముందుగానే; ఏను= భీష్ముడనైన నేను; ద్రోణుఁడు= ధనురాచార్యుడైనట్టి ద్రోణుడు; విదురుండునున్= నీతిమంతుడైన విదురుడున్నూ; చెప్పినది+అ= చెప్పినట్టిదే; అప్పుడు= ఆ సమయంలో; వినవు= నీవు వినకపోతివి; బెట్టిదులు+అగు= ఉద్ధతులైన; పాండుతనూజులకున్= పాండురాజు కొడుకులకు; ఎదురు+ఐ= ఎదురుగా నిలబడి; ఈశునకున్+ఐనన్= పరమేశ్వరుడికైనా; నిర్జింపన్= జయించడానికి; వశమె?= సాధ్యమా? కాదని భావం.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! ఇప్పటి ఈ ఆపత్తు ఉప్పతిల్లుతుందని ఏనాడో నేను, ద్రోణాచార్యుడు, విదురుడు నీకు చెప్పాము. కాని మా మాటలప్పుడు లెక్కచేయకుంటివి. మహాపరాక్రమవంతులైన పాండవులకు ఎదురుగా నిలిచి జయించటానికి ఈశ్వరుడికికూడా సాధ్యం కాదు. ఇక మనబోటి వాళ్ళు ఎంతమాత్రం?

**తే. మనకుమారులలోన నయ్యనిలతనయు । బారి కగపడువాని నెవ్వారి కైనఁ**
**గావఁ దలకొన శక్యంబు గాదు మనకు । నడలఁ బనిలేదు దీనికి నధిపతనయ! 80**

**ప్రతిపదార్థం:** అధిప తనయ!= రాజకుమారా దుర్యోధనా!; మన కుమారులలోనన్= మన ధృతరాష్ట్రుడి కొడుకులలో; ఆ+అనిల తనయు బారికిన్= ఆ భీముడికి యుద్ధపు మార్గంలో; అగపడువానిన్= కనిపించేవాడిని; కావన్= కాపాడ్డానికి; ఎవ్వారికిన్+ఐనన్= ఎలాంటి శూరుడికైనా; తలకొనన్= ప్రయత్నించుటకు; శక్యంబు+కాదు= సాధ్యంకాదు; దీనికిన్= సాధ్యంకాదనే ఈ విషయానికి; మనకున్= కౌరవులైన మనకు; అడలన్= చింతించవలసిన; పనిలేదు= అవసరం లేదు.

**తాత్పర్యం:** దుర్యోధనా! కౌరవ కుమారులలో ఎవడైనా ఆ భీముడికెదురైతే, అట్టివాడిని కాపాడటానికి ప్రయత్నించడానికి కూడా ఎట్టి శూరుడికైనా సాధ్యం కాదు. ఈ దుస్థితిని గూర్చి మనం ఏడవవలసినపని లేదు.

**క. వీరస్వర్గము ధనముగఁ । బోరుము నీ వింక నొండుబుద్ధు లుడుగు మేఁ**
**బోరెద నోపినమెయిఁ దెగి । పోరఁగ జయమైన దానిఁ బోఁ ద్రోచెదమే! 81**

**ప్రతిపదార్థం:** నీవు= దుర్యోధనుడవైన నీవు; ఇంకన్= ఇక మీదట; వీరస్వర్గము= వీరస్వర్గమే; ధనముగన్= ధనంగా; పోరుము= యుద్ధంచెయ్యి; ఒండు బుద్ధులు= వేరే బుద్ధులు (ఆలోచనలు); ఉడుగుము= వదిలిపెట్టుము; ఏన్= నేను (భీష్ముడు); ఓపినమెయిన్= శక్యమయినంత; తెగి= సాహసించి; పోరెదన్= యుద్ధంచేస్తాను; పోరఁగన్= యుద్ధంచేస్తే; జయము+ఐనన్= మనకు జయం కలిగితే; దానిన్= ఆ జయాన్ని; పోన్+త్రోచెదము+ఏ?= అవతలకు నెట్టివేస్తామా?

**తాత్పర్యం:** దుర్యోధనా! నీ వింక వీరస్వర్గాన్నే ధనంగా కోరి యుద్ధంచేయుము. అంతేగాని వేరే ఆలోచనలు అనగా రాజ్యంమీద ఆశను విడిచిపెట్టుము. నేనేమో చేతనయినంతగా తెగించి యుద్ధంచేస్తాను. ఒక వేళ జయం మనదైతే ఆ జయాన్ని కాదంటామా!'

**వ. అనియె నని చెప్పిన విని వైచిత్రవీర్యుండు. 82**

**ప్రతిపదార్థం:** అనియెన్= భీష్ముడన్నాడు; అని చెప్పినన్= అని సంజయుడు చెప్పగా; విని= ఆలకించి; వైచిత్రవీర్యుండు= విచిత్రవీర్యుని కొడుకు- ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** భీష్ముడు దుర్యోధనుడితో చెప్పిన మాటలను సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు.

**తే. ' గురుఁడు భీష్ముడుఁ గలుగంగఁ గురుకుమారు । లిట్టు వొలిసెదరే మున్నయింతవట్టు!**
**దల్లియును నేనుఁ జెప్పినఁ బొల్ల సేసి । దాని ఫల మిప్పు డా సుయోధనుఁడు గనియె. 83**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; భీష్ముండున్= భీష్ముడున్నూ; కలుగంగన్= మనపక్షంలో ఉండగా; కురుకుమారులు= కౌరవపుత్రులు; ఇట్టు= ఈ మాదిరి; పొలిసెదరే!= చస్తారా!; మున్ను+అ= మునుపే; ఇంత+పట్టు= ఇదంతా; తల్లియునున్= తల్లియైన గాంధారి; ఏనున్= నేను (ధృతరాష్ట్రుడు); చెప్పినన్= చెప్పగా; పొల్ల+చేసి= వ్యర్థంచేసి; దాని ఫలము= ఆ మాటలు విననిదానియొక్క ఫలాన్ని; ఇప్పుడు= ఈనాడు; సుయోధనుండు= దుర్యోధనుడు; కనియెన్= చూచాడు.

**తాత్పర్యం:** 'అస్త్ర గురువు ద్రోణాచార్యుడు, దేవతలకు కూడా అజేయుడైన భీష్మాచార్యుడు ఈ యిద్దరున్నూ మన పక్షాన ఉండి యుద్ధంచేస్తూంటే ఇందరు కుమారులు చావడమా? భవిష్యత్తులో కలిగే ఈ విపత్తునంతా ముందుగానే గాంధారి, నేనూ ఎంతగానో చెప్పినప్పటికి ఆ దుర్యోధనుడు దాన్ని పెడచెవిని పెట్టాడు- దాని ఫలం ఇప్పుడు అనుభవిస్తున్నాడు.

**వ. ఇంక నమ్మాటలాడుట గతజలసేతుబంధనంబు దానిం జాలింపు మట్లు కురుకుమారులచావు గనుంగొని గాంగేయకుంభసంభవులు పదంపడి యేమి సేసి రని యడుగుటయు, సూతనందనుం డంబికానందనున కిట్లను, భీష్ముండు భయంకరాకారుం డై మారుతిపయిం దేరు వఱపె, నతనిం గని ధర్మనందనుండు సేయివీచిన ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకులు దలకడచి యతనితోఁ దలపడి రంతకు మున్న**

**దుర్యోధనుపనుపునఁ గవిసిన రథికులమీఁదం జేకితాన ద్రౌపదేయసహితంబుగా సవ్యసాచి యడరె. నభిమన్యుండును హైడింబుండును ధార్తరాష్ట్రులదెసం దఱిమి రిత్తెఱంగున మూఁడు గట్టిమొత్తమ్ములు బెట్టిదంబు సేయ మన బలంబులుం బోక పెనంగుచుండె; నట్టియెడ. 84**

**ప్రతిపదార్థం:** ఇంకన్= ఇకమీదట; ఆ+మాటలు= ఆ పలుకులు; ఆడుట= చెప్పుకోవడం; గతజలసేతు బంధనంబు= ప్రవాహంపోయిన తరువాత కట్టకట్టడంవంటిది (వ్యర్థము); దానిన్= ఆ సమాచారాన్ని; చాలింపుము= వదలిపెట్టుము; అట్లు= ఆ విధంగా; కురు కుమారుల చావున్= కురు కుమారుల మరణాన్ని; కనుంగొని= చూచి; గాంగేయ కుంభసంభవులు= గంగాదేవి కొడుకు- భీష్ముడు, కడవనుండి పుట్టిన ద్రోణుడు- వీరిద్దరు; ఏమిసేసిరి= ఏం చేశారు; అని అడుగుటయున్= అని అడగ్గా; సూత నందనుండు= సూతుని కొడుకు సంజయుడు; అంబికానందనునకున్= అంబికయొుక్క కొడుకైన ధృతరాష్ట్రుడికి; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటాడు; భీష్ముండు; భయంకర+ఆకారుండు+ఐ= భయంకలిగించే రూపంకలవాడై; మారుతిపయిన్= భీముడిమీదికి; తేరున్= రథాన్ని; పఱపెన్= తోలాడు; అతనిన్= ఆ భీష్ముడిని; కని= చూచి; ధర్మనందనుండు; చేయివీచినన్= చేతితో సైగచేయగా; ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకులు= ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సాత్యకి; తలకడచి= అతిక్రమించి; అతనితోన్= ఆ భీష్ముడితో; తలపడిరి= ఎదిరించారు; అంతకుమున్ను+అ= అంతకుముందుగానే; దుర్యోధను పనుపునన్= దుర్యోధనుడి ఆజ్ఞచేత; కవిసిన= పర్విన; రథికులమీఁదన్= రథంలో కూర్చొని యుద్ధంచేసేవారి మీదికి; చేకితాన ద్రౌపదేయ సహితంబుగాన్= చేకితానుడు, ద్రౌపది కొడుకులు- వీరితో కూడికొని; సవ్యసాచి= అర్జునుడు; అడరెన్= విజృంభించాడు; అభిమన్యుండును= సుభద్రకొడుకు అభిమన్యుడు; హైడింబుండును= హిడింబ అనే రాక్షసికొడుకున్నూ; ధార్తరాష్ట్రునిదెసన్= దుర్యోధనుడున్న దిక్కునకు; తఱిమిరి= కవిశారు; ఈ+తెఱంగునన్= ఈ మాదిరిగా; మూఁడు; గట్టి= దిట్టమైన; మొత్తమ్ములు= గుంపులు; బెట్టిదంబు= క్రూరత్వాన్ని; చేయన్= చేయగా; మనబలంబులున్= మన కౌరవులయొుక్క సైన్యంకూడా; పోక= వెనుకకు తిరగకుండా; పెనంగుచున్+ఉండెన్= యుద్ధం చేస్తున్నాయి; అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఇక ఆ మాటలు చాలించు. ఇక అది గతజలసేతుబంధనంవలె ఉపయోగంలేనిది. ఆ కురుకుమారులు చావటాన్ని చూచి భీష్మద్రోణులు ఆపైన ఏంచేశారు?' అని ధృతరాష్ట్రుడు అడిగాడు. దానికి బదులు సంజయుడిట్లా చెప్పాడు. 'భీష్ముడు భయంకరమైన ఆకారంతో భీముడున్న వైపునకు రథం పోనిచ్చాడు. దాన్ని చూచి ధర్మరాజు చేసన్నచేయగా ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకులు ముందుకువచ్చి ఆ భీష్ముడితో తలపడ్డారు. అంతకుముందే దుర్యోధనుడి ఆజ్ఞతో ఎగబడిన రథికులపైకి అర్జునుడు, చేకితానుడు ద్రౌపదీ పుత్రులతో కూడి ఎగబడ్డారు. అభిమన్యుడు, ఘటోత్కచుడు దుర్యోధనుడిపైకి ఉరికారు. ఈ విధంగా మూడు గట్టి సైన్యాలు చాలా కఠోరంగా యుద్ధం సాగించాయి. కౌరవబలాలు వెనుకంజ వేయకుండా బాగా పోరుతూ వచ్చాయి. అప్పుడు-

**విశేషం:** భీష్ముడు- అష్టవసువులలో ఒకడు. వసిష్ఠుడి శాపంవల్ల భీష్ముడుగా పుట్టాడు. శంతనురాజు తండ్రి, గంగాదేవి తల్లి. ఇతడు పరమ ధర్మాత్ముడు, మహావీరుడు. తండ్రి శంతనుడు దాసకన్యను వివాహం చేసికొనే సందర్భంలో తాను తండ్రి రాజ్యాన్ని కోరక, వివాహం చేసికొనక, ఊర్ధ్వరేతుడయ్యాడు.

**క. ద్రోణాచార్యుఁడు ద్రుపద । క్షోణీశ్వరుమోహరంబు సుడివడ దివి గీ**
**ర్వాణులు గీర్తింపఁగఁ బటు । బాణపరంపర లనేకభంగులఁ బఱపెన్. 85**

**ప్రతిపదార్థం:** దివిన్= ఆకాశంలో; గీర్వాణులున్= దేవతలు; కీర్తింపఁగన్= పొగడగా; ద్రోణాచార్యుఁడు= విలువిద్యలో గురువు ద్రోణుడు; ద్రుపదక్షోణీశ్వరు= ద్రుపద మహారాజుయొుక్క; మోహరంబు= పన్నినవ్యూహాన్ని; సుడివడన్= చలించునట్లుగా; బాణపరంపరలు= బాణాల వరుసలను; అనేక భంగులన్= పెక్కు విధాలుగా; పఱపెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు బలమైన పలురకాలైన బాణాలు ప్రయోగించి, ద్రుపద మహారాజు పన్నిన వ్యూహాన్ని చిందరవందర చేశాడు. అప్పుడు ఆకాశంలో విమానాల నుండి చూస్తున్న దేవతలు ఆయన శౌర్యాన్ని ఎంతో పొగిడారు.

**క. కరిఘటలు మీఁద భీముఁడు । సరభసముగ నేయునారసంబుల మ్రోఁ దై**
**ధరఁ బడి రూపఱినను దిన । కరుకరములఁ దమము విరియుగతిఁ దోఁచె నృపా! 86**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; భీముఁడు= భీముడు; కరిఘటలు= ఏనుగు గుంపులు; మీఁదన్= మీద; సరభసంబుగన్= వేగంతో; ఏయు= ప్రయోగించునట్టి; నారసంబులన్= బాణాలచేత; మ్రోడు+ఐ= మొద్దుబారి; ధరన్= నేలమీద; పడి= పడి; రూపు+అఱినను= అవయవాలు తెగిపోగా; దినకరు కరములన్= సూర్యుని యొక్క కిరణాలచేత; తమము= చీకటి; విరియుగతిన్= చెదిరిపోయే మాదిరిగా; తోఁచెన్= అనిపించింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! భీముడు బలంగా వేసిన బాణాల దెబ్బకు ఏనుగుల గుంపులు మొద్దుబారి, అవయవాలు తెగిపోగా, నేలమీద పడ్డాయి. అది సూర్యకిరణాలు సోకగా చీకటి చెదరిపోయే విధంగా ఉండింది.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. అఱిముఱి గుఱ్ఱపుదడముల । కుఱికి కవలు రౌద్రరసమహోగ్రాకృతు లై**
**నఱకిన నచ్చట రథములు । పఱపఁగరాదయ్యె నుభయబలయోధులకున్. 87**

**ప్రతిపదార్థం:** కవలు= నకుల సహదేవులు; అఱిముఱి= సంభ్రమంతో; గుఱ్ఱపుదడములకున్= గుఱ్ఱాల దండుపైకి; ఉఱికి= దూకి; రౌద్రరస= రౌద్రరసంచేత;మహా= అధికమైన; ఉగ్ర= భయంకరమైన; ఆకృతులు+ఐ= ఆకారంగలవారై; నఱకినన్= నఱికివేయగా; అచ్చటన్= ఆ యుద్ధరంగంలో; ఉభయబలయోధులకున్= రెండు సేనలలోని భటులకు కూడా; రథములున్= రథాలను; పఱపఁగన్= తోలుటకు; రాదు+అయ్యెన్= సాధ్యంకాలేదు.

**తాత్పర్యం:** నకులుడు, సహదేవుడు శత్రువుల గుఱ్ఱపు దళాల మీదికి సంభ్రమంగా దూకి, రౌద్రరసంతో చూచేవారికి చాల భయంకరులై, చాలా గుఱ్ఱాలను నరికివేశారు. యుద్ధభూమి అంతా చచ్చిన గుఱ్ఱాలతో నిండిపోయింది. అప్పుడు కురుపాండవసేనలలోని భటులు తమ రథాలను తోలడానికి కూడా దారి లేకపోయింది.

**తే. నరుఁడు రథికజనంబుపై సరభసముగ । నేయఁ గేయూరహారతత్కాయశకల**
**వితతి నిల యొప్పె రాలినవివిధ పుష్ప । పుంజమునఁ బొల్చు నుద్యానభూమి వోలె. 88**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; సరభసముగన్= తొందరపాటుతో; రథికజనంబుపైన్= రథంలో కూర్చుని యుద్ధంచేసేవారిమీదికి; ఏయన్= బాణాలువేయగా; రాలిన= నేలపడినట్టి; వివిధ పుష్పపుంజమునన్= రకరకాల పూల కుప్పలతో; పొల్చు= ఒప్పునట్టి; ఉద్యానభూమిన్+పోలెన్= ఉద్యానవనం మాదిరి; కేయూర= బాహుపురులయొక్క; హార= దండలయొక్క; తద్+కాయ= ఆ చంపబడ్డ రథికుల శరీరాలయొక్క; శకల= తునుకలయొక్క; వితతిన్= సముదాయంచేత; ఇల= భూమి; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** అర్జునుడు త్వరతో బాణాలువేసి రథికులను హతమార్చాడు. అప్పుడా యుద్ధభూమి చచ్చిన రథికులయొక్క బాహుపురులతో, రత్నాలు చెక్కిన హారాలతో, శరీరాల అవయవాల తునుకలతో నేలపై రాలిన పలురంగుల పూల కుప్పలతో ప్రకాశించే ఉద్యానవనంలా ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అప్పు డిరావంతుండు.** 89

**ప్రతిపదార్థం:** అప్పుడు= అర్జునుడు చాలామంది రథికుల్ని చంపిన సమయంలో; ఇరావంతుండు= అర్జునుడికి నాగకన్యకు పుట్టినవాడు.

**తాత్పర్యం:** అట్టి సమయంలో ఇరావంతుడనేవాడు.

**క. తురగనికరంబుతోడం । గురుసైన్యము దఱియఁ జొచ్చుకోల్తల సూడం**
**గర మొప్పె ఘనవిహంగో । త్కరముపయిం గవియు డేగతండంబుగతిన్.** 90

**ప్రతిపదార్థం:** తురగ నికరంబుతోడన్= గుర్రాల గుంపుతో; కురుసైన్యమున్= కౌరవులసేనను; తఱియన్= దగ్గఱకువచ్చి; చొచ్చు= దూరునట్టి; కోల్తలన్= యుద్ధసన్నాహాన్ని; చూడన్= చూడగా; ఘన= దట్టంగావున్న; విహంగ= పక్షులయొక్క; ఉత్కరము పయిన్= గుంపుమీదికి; కవియు= ఆక్రమించే; డేగతండంబుగతిన్= డేగలగుంపులాగా; కరము= మిక్కిలి; ఒప్పెన్= అమరింది.

**తాత్పర్యం:** గుర్రాల గుంపుతో ఇరావంతుడు కురుసేన దగ్గరకు వెళ్ళి చొరబడటం చూస్తే దట్టంగా ఉండే పక్షులగుంపుమీదికి ఉరికే డేగ గుంపువలె ఉండింది. కౌరవుల సేన పక్షుల గుంపువలె, ఇరావంతుడి సైన్యం డేగ గుంపువలె అగుపించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇ ట్లుక్కు మిగిలి యెక్కినయర్జుననందనుం గనుంగొని శకునితమ్ములు శుకుండును, శర్మవంతుండును, వృషకుండును, నార్జవుండును, గజుండును, గవాక్షుండును, గుఱ్ఱపు మొత్తంబులతో నగ్గలిక నతనిపై వాహనంబులం బఱపి పిఱుదివియక రాయిరాయి దాఁకినట్లు దాఁకి రయ్యిరువాఁగును విచిత్రంబుగాఁ బోర నయ్యార్వురు గాంధారకుమారులు నయ్యిరావంతుం బొదివి సెలకట్టెలవాట్ల డొంకెనపోట్ల నొప్పించిన బరిగోలలపోటులు దాఁకినం గినిసిన గంధగజంబు చందం బై.** 91

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఉక్కుమిగిలి+ఎక్కిన= మిక్కిలి పరాక్రమంతో అతిశయించిన; అర్జుననందనున్= అర్జునుడికొడుకైన ఇరావంతుణ్ణి; కనుంగొని= చూచి; శకుని తమ్ములు; శకుండును; శర్మవంతుడును; వృషకుండును; ఆర్జవుండును; గజుండును; గవాక్షుండును; గుఱ్ఱపు మొత్తంబులతోన్= గుర్రపు సమూహంతో; అగ్గలికన్= పూనికతో; అతనిపైన్= ఆ ఇరావంతుడి మీదికి; వాహనంబులన్= గుర్రాలను; పఱపి= తోలి; పిఱు+తివియక= వెనక్కిమళ్లకుండా; రాయి= శిల; రాయిన్= శిలను; తాఁకినట్లు= ఢీకొన్నవిధంగా; తాఁకిరి= ఎదుర్కొనిరి; ఆ+ఇరువాఁగును= ఆ రెండు సేనలున్నూ; విచిత్రంబుగాన్= ఆశ్చర్యంగా; పోరన్= యుద్ధంచేయగా; ఆ+ఆర్వురు= ఆ ఆర్వురు; గాంధారకుమారులు= గాంధార రాజుయొక్క కొడుకులు; ఆ+ఇరావంతున్= ఆ ఇరావంతుడిని; పొదివి= కమ్ముకొని; సెలకట్టెల= బాణాల; వాట్లన్= దెబ్బలతో; డొంకెన= ఈటెలయొక్క; పోట్లన్= పొడుచుటచేత; నొప్పించినన్= బాధపెట్టగా; బరిగోలల= అంకుశాలయొక్క; పోట్లన్= పొడుపులతో; తాఁకినన్= గ్రుచ్చుకోగా; కినిసిన= కోపంచెందిన; గంధ= మదించిన; గజంబు= ఏనుగుయొక్క చందంబు+ఐ= విధమై.

**తాత్పర్యం:** ఎక్కువయిన పరాక్రమంతో అతిశయించిన ఇరావంతుడిని చూచారు. శకుని తమ్ముళ్ళు ఆరుగురూ చాలా పూనికతో తమ గుర్రాల గుంపును వాడిమీదికి తోలారు. వెనక్కి తగ్గకుండా, రాయి రాతితో ఢీకొన్నట్లుగా రెండుపక్షాల వారూ చాలా ఆశ్చర్యంగా యుద్ధం చేశారు. ఆరుగురూ ఆ ఇరావంతుడిని చుట్టుముట్టి బాణాలతో బాదారు, వంకర కొనలుగల ఈటెలతో పొడిచారు. అంకుశపు పొడుపు తినిన మదపుటేనుగు విధంగా కోపగించి.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. అతఁడు ధన్వి యగుట నశ్వంబుఁ దొలఁగ దాఁ । టించి తిరిగి యా కడిందిమగల**
**నారసములు పెక్కు నాటించి నొప్పించి । వెగడుపఱిచె సురలు వొగడుచుండ. 92**

**ప్రతిపదార్థం:** సురలు= దేవతలు; పొగడుచుండన్= పొగడుచుండగా; అతఁడు= ఆ ఇరావంతుడు; ధన్వి= విలుకాడు; అగుటన్= కావడంచేత; అశ్వంబున్= గుర్రాన్ని; తొలఁగన్= పక్కకు పోయేటట్లుగా; దాఁటించి= తప్పించి; తిరిగి= ప్రక్కకుమళ్ళి; ఆ కడింది= ఆ అసాధ్యులైన; మగలన్= శూరులను; నారసములు= బాణాలు; పెక్కు= అనేకములు; నాటించి= గ్రుచ్చుకొనేటట్లుచేసి; నొప్పించి= బాధకలిగించి; వెగడుపఱిచెన్= తల్లడిల్లజేశాడు.

**తాత్పర్యం:** ఆ ఇరావంతుడు విలుకాడు కాబట్టి తన గుర్రాలను ప్రక్కకు తప్పించి మరల తిరిగివచ్చి ఆ వీరులపై పలుబాణాలు ప్రయోగించి నొప్పించాడు. అప్పుడు దేవతలందరూ ఆ ఇరావంతుడి శౌర్యాన్ని మెచ్చుకొన్నారు.

**వ. అట్టియెడ. 93**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ ఇరావంతుడు, పెక్కుబాణాలువేసి, శత్రువులకు అడలు పుట్టించే సమయంలో.

**క. మునుపోటులఁ బడినొచ్చుటఁ । దనగుఱ్ఱము వడినఁ బడక ధరణికి లంఘిం**
**చెను వెఱపు లేక పే రు । క్కునఁ బటుఖడ్గంబు వెఱికికొనుచు రయమునన్. 94**

**ప్రతిపదార్థం:** మును= ముందే; పోటులన్+పడి= పొడుపులుతిని; నొచ్చుటన్= బాధపడటంచేత; తనగుఱ్ఱము= ఇరావంతునియొక్క గుర్రము; పడినన్= పడిపోగా; పడక= తాను (ఇరావంతుడు) క్రిందపడకుండా; వెఱపులేక= భయపడకుండా; పేరు+ఉక్కునన్= మిక్కిలి స్థైర్యంతో; పటుఖడ్గంబున్= దిట్టమైనకత్తిని; రయమునన్= వేగంతో; పెఱికికొనుచున్= ఒరనుండిపైకి దూస్తూ; ధరణికిన్= భూమిమీదికి; లంఘించెన్= దూకాడు.

**తాత్పర్యం:** అంతకుముందే ఇరావంతుడి గుర్రం బాగా దెబ్బలుతిని ఉండడంచేత నేలకు ఒరిగిపోయింది. ఇరావంతుడు కిందపడకుండా చాలా జాగ్రత్తగా ధైర్యంతో ఒక గట్టి కత్తిని తీసికొని వేగంగా నేలమీదికి దూకాడు.

**వ. ఇట్లు భూచారి యయిన భుజగరాజదౌహిత్రుం జూచి యేచి యా సుబలసూనులు సుట్టుముట్టి. 95**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఆ సుబలసూనులు= గాంధార రాజు సుబలుడి కుమారులు; భూచారి+అయిన= (పదాతి) భూమి మీద ఉండి యుద్ధంచేసే వాడైన; భుజగరాజ దౌహిత్రున్= సర్పాలరాజు కూతురి కొడుకైన ఇరావంతుణ్ణి; చూచి= దర్శించి; ఏచి= విజృంభించి; చుట్టుముట్టి= నాలుగు పక్కల క్రమ్ముకొని;

**తాత్పర్యం:** భూమిమీద నిలబడి యుద్ధంచేసే ఆ ఇరావంతుడిని చూచి, ఆ ఆరుగురు అన్నదమ్ములు విజృంభించి చుట్టుముట్టారు.

**విశేషం:** ఇరావంతుడు కౌరవ్యుడనే సర్పరాజుకూతురు కొడుకు.

**క. పొడువఁగ వ్రేయఁగ నతఁడుం । గడునుఱ వగు నేర్పు కడిమికలిమిం దనపైఁ**
**బడకుండఁ గృపాణమ్మునఁ । గడుఁజిత్రపుగతుల జడిసెఁ గైదువు లెల్లన్. 96**

**ప్రతిపదార్థం:** పొడువఁగన్= ఆ సుబల సూనులు(తనను) బల్లాలతో గ్రుచ్చగా; వ్రేయఁగన్= కొట్టగా; అతఁడున్= ఆ ఇరావంతుడు; కడున్= మిక్కిలి; ఉఱవు+అగు= ఎక్కువైన; నేర్పు= సామర్థ్యము; కడిమి= పరాక్రమము వీనిని; కలిమిన్= కలిగియుండుటచేత; తనపైన్= తనమీద; పడక+ఉండన్= తనమీదపడకుండునట్లుగా; కృపాణమ్మునన్= ఖడ్గంతో; కైదువులు+ఎల్లన్= అన్ని ఆయుధాలను; కడున్= మిక్కిలి; చిత్రపుగతులన్= విచిత్రాలైన పోకడలతో; జడిసెన్= నివారించాడు.

**తాత్పర్యం:** ఆ శకుని తమ్ములు ఆరుగురూ, ఇరావంతుడిని బల్లాలతో పొడిచారు. ఆయుధాలతో కొట్టారు. ఇరావంతుడు ఎక్కువ నేర్పు, సామర్థ్యం, పరాక్రమం కలిగినవాడు కావటంచేత, ఆ శత్రువులు ప్రయోగించిన అన్ని ఆయుధాలనూ, తన ఖడ్గంతో చిత్రవిచిత్రాలైన విధానాలతో అవి తనమీద పడకుండా చేసికొంటూ వాటి నన్నింటినీ ఖండించివేశాడు.

**వ. ఆ రౌతులు వీఁడు గాలుమానిసి యగుటం జేసి మనకు నొప్పింప వెరవుగాదయ్యెడు' నను దుర్విచారంబున. 97**

**ప్రతిపదార్థం:** ఆ రౌతులు= గుర్రాలనెక్కి యుద్ధంచేసే ఆ ఆరుగురు; వీఁడు= ఈ ఇరావంతుడు; కాలుమానిసి= నేలపై నిల్చి యుద్ధంచేసేవాడు (పదాతి) అగుటన్+చేసి= కావడంవల్ల; మనకున్= గాంధారరాజు కొడుకులైన మనకు; నొప్పింపన్= బాధపెట్టడానికి; వెరవు= సాధ్యము; కాదు+అయ్యెడున్= కాకుండా ఉన్నది; అను= అనునట్టి; దుర్+విచారంబునన్= చెడ్డ ఆలోచనతో.

**తాత్పర్యం:** 'ఈ ఇరావంతుడు నేలపై నిలిచి యుద్ధం చేస్తున్నాడు. మనమేమో గుర్రాలపై కూర్చొని యుద్ధం చేస్తున్నాము కాబట్టి మనకు వీడిని హింసించడం సాధ్యంకాదు. అనే చెడ్డ ఊహలో పడినవారై.

**ఆ. ఆర్వురును గడంగి హయముల డిగి పటు । ఖడ్గదీప్తు లడరఁ గదియుటయును**
**బ్రమరి తిరిగి వారిఁ బండ్రెండుదునియలు । సేసి క్రీడికొడుకు సెలఁగి యార్చె. 98**

**ప్రతిపదార్థం:** ఆర్వురునున్= ఆ ఆరుగురు సోదరులున్నూ; కడంగి= ప్రయత్నపడి; హయములన్= గుర్రాల నుండి; దిగి= క్రిందికిదిగి; పటుఖడ్గదీప్తులు= దృఢమైనకత్తుల కాంతులు; అడరన్= వ్యాపించగా; కదియుటయును= దగ్గరకురాగా; క్రీడికొడుకు= అర్జునుడి కుమారుడు; భ్రమరితిరిగి= చుట్టివచ్చి; వారిన్= ఆ శకుని సోదరులు ఆరుమందిని; పండ్రెండు= పన్నెండు; తునియలు= తునుకలుగా; చేసి= సలిపి; చెలఁగి= చెలరేగి; ఆర్చెన్= బొబ్బరించాడు.

**తాత్పర్యం:** ఆ ఆరుగురు సోదరులు గుర్రాలమీదినుండి నేలపైకి దిగారు. పదునైన దిట్టములైన ఖడ్గాల చేతబట్టుకొని ఆ ఇరావంతుడి దగ్గరకు వచ్చారు. ఆ ఇరావంతుడు, చుట్టివచ్చి ఒక్కొక్కడిని, రెండుతుంటలచొప్పున ఆ ఆరుగుర్ని మొత్తం పన్నెండు తుంటలుగా నరికివేశాడు. వీరావేశంతో పెనుబొబ్బలు పెట్టాడు.

**అవతారిక:** ఈ దృశ్యాన్ని చూచిన దుర్యోధనుడు ఇరావంతుడి మీదకి యుద్ధానికి అలంబుసుడనే రాక్షసుడిని ఉసిగొల్పుతాడు.

**క. వెక్కస మందుచుఁ గురుపతి । రక్కసుతో ననియె 'నియ్యురగ దౌహిత్రుం**
**డొక్కఁడ మన సైన్యంబు । ల్సక్కడఁచుచు నున్నవాఁ డలంబుస! కంటే.' 99**

**ప్రతిపదార్థం:** కురుపతి= కురురాజు దుర్యోధనుడు; వెక్కసము= అసహనము; అందుచున్= పొందుచున్నవాడగుతూ; రక్కసుతోన్= రాక్షసుడితో; అలంబుస!= ఓ అలంబుసుడా!; ఈ+ఉరగదౌహిత్రుండు= ఈ నాగరాజు కూతురి కొడుకు

(ఇరావంతుడు); ఒక్కడు+అ; మన సైన్యంబుల్= మనయొక్క సేనలను; చక్కడఁచుచున్+ఉన్నవాఁడు; సంహరిస్తూ ఉన్నాడు; కంటే?= చూచావా?; అనియెన్= అని అన్నాడు.

**తాత్పర్యం:** ఆ ఆరుగురు గాంధారరాజు కుమారులను ఇరావంతుడొక్కడే చంపటాన్ని దుర్యోధనుడు చూచాడు. అతడికి వెక్కసపాటు ఎక్కువైంది. తన సమీపానవుండే రాక్షసుడితో "ఓ అలంబుసుడా! చూచావుగదా! అర్జునుడి కొడుకు ఇరావంతుడు ఒక్కడే మనసైన్యం మీద విరుచుకపడి అడగారిపోయ్యేట్టు చేస్తున్నాడు.

**అలంబుసునిచేత నిరావంతుఁడు మృతుం డగుట (సం. 6-86-48)**

**వ. అని యాతని వలను సూపినం గనుంగొని దైతేయనాథుండు. 100**

**ప్రతిపదార్థం:** అని= అనిచెప్పి; ఆతని= ఆ ఇరావంతునియొక్క; వలనున్= ఉన్నవైపును; చూపినన్= చూపించగా; ఆ దైతేయనాథుండు= రాక్షసప్రభువైన ఆ అలంబుసుడు; కనుంగొని.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఇరావంతుడున్న దిక్కుచూపగా, ఆ అలంబుసుడు చూచి- (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. కడఁగి నడచి మాయ గావింప నయ్యిరా । వంతు నశ్వసేనయంతసేన**
**వుట్టి వారిమీఁదఁ బురికొని తలపడి । సమయఁ జేసె నదియు సమసె నధిప! 101**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; కడఁగి= ప్రయత్నించి; నడచి= ఆ ఇరావంతుడి సమీపానికిపోయి; మాయన్= రాక్షస మాయను; కావింపన్= చేయగా; ఆ+ఇరావంతున్= ఆ ఇరావంతుడియొక్క; అశ్వసేన+అంత= గుఱ్ఱాల సైన్యం ఎంత ఉన్నదో; అంత= ఆ పాటి; సేన= సైన్యం; పుట్టి= ఉప్పతిల్లి; వారిమీఁదన్= ఆ ఇరావంతుడి సైన్యాలమీద; పురికొని= క్రమ్ముకొని; తలపడి= ఎదిరించి; సమయన్+చేసెన్= చంపివేసింది; అదియున్= మాయచేపుట్టిన ఆ సేనకూడా; సమసెన్= నశించింది;

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! ఆ అలంబుసుడు వేగంగా ఆ ఇరావంతుడున్న దిక్కుకు వెళ్ళాడు. తన మాయాబలంతో ఆ ఇరావంతుడి అశ్వసేన ఎంత ఉన్నదో అంత అశ్వసేనను తానూ పుట్టించాడు. మాయతో పుట్టిన ఆ అశ్వసేన ఇరావంతుడి అశ్వసైన్యాన్ని క్రమ్ముకొని, ఎదిరించి చంపివేసింది. తర్వాత ఆ మాయ గుఱ్ఱాల దండు కూడా నశించింది.

**వ. అయ్యిరావంతుం డొక్కరుండును బొలివోని విక్రమంబున నలంబుసుని మార్కొని రయంబు మెఱయ మెఱుంగు మెఱసినట్లు గవిసి కరవాలంబున విల్లు దునిమిన దనుజుండు వినువీథి కెగసి మాయాశరంబుల నతని నొప్పించినం గోపించి గగనంబునకు లంఘించి. 102**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరావంతుండు= ఆ ఇరావంతుడు; ఒక్కరుండునున్= ఒంటరివాడైనప్పటికి; పొలిపోని= వ్యర్థముకాని; విక్రమంబునన్= పరాక్రమంతో; అలంబుసునిన్; మార్కొని= ఎదిరించి; రయంబు= వేగము; మెఱయన్= ప్రకాశింపగా; మెఱుంగు= మెరుపు; మెఱసిన+అట్లు= మెరిసిన విధంగా; కవిసి; కరవాలంబునన్= కత్తితో; విల్లున్= ధనుస్సును; తునిమినన్= తుంచివేయగా; దనుజుండు= రాక్షసుడు; వినువీథికి= ఆకాశమార్గానికి; ఎగసి= ఎగిరి; మాయాశరంబులన్= మాయచే పుట్టిన బాణాలతో; అతనిన్:= ఆ ఇరావంతుణ్ణి; నొప్పించినన్= నొప్పికలిగేటట్లు చేయగా; కోపించి; గగనంబునకున్= ఆకాశానికి; లంఘించి= ఎగిరి.

**తాత్పర్యం:** ఆ ఇరావంతుడు ఒంటరివాడై పరాక్రమంతో ఆ అలంబుసుడిని ఎదిరించాడు. వేగంగా మెరుపు మెరిసినట్లు ఆ రాక్షసుడిమీద పడ్డాడు. కత్తితో వాడి వింటిని తుంటులు చేశాడు. అప్పుడు అలంబుసుడు ఆకాశానికి ఎగిరిపోయి, మాయాబాణాలు అతడిపై గుప్పించి, నొప్పించాడు. ఇరావంతుడు కూడా కోపంతో ఆకాశానికి ఎగిరి.

**క. ఘనఖడ్గంబున వానిం। దునుమ నలంబుసుఁడు దోడుతో నుజ్జ్వల యౌ**
**వనరూపము గ్రొత్తగఁ గై। కొని పెనఁగంబెనఁగఁ బార్థుకొడు కచలుం డై. 103**

**ప్రతిపదార్థం:** పార్థుకొడుకు= అర్జునుడి కొడుకు ఇరావంతుడు; ఘనఖడ్గంబునన్= గొప్ప కత్తితో; వానిన్= ఆ అలంబుసుడిని; తునుమన్= నరికివేయగా; అలంబుసుఁడున్= రాక్షసుడు; తోడుతోన్= వెనువెంటనే; ఉజ్జ్వలయౌవన రూపమున్= ప్రకాశిస్తున్న యౌవనంతో కూడిన రూపాన్ని; క్రొత్తగన్= నూతనంగా; కైకొని= తీసికొని (గ్రహించి); పెనఁగన్= చుట్టుకొని యుద్ధంచేయగా; అచలుండు+ఐ= (ఇరావంతుడు) కదలికలేనివాడై; పెనఁగన్+పెనఁగన్= యుద్ధంచేయగా.

**తాత్పర్యం:** ఇరావంతుడు బలమైన కత్తితో అలంబుసుడిని నరికివేశాడు. వాడు వెంబడివెంబడిగానే ప్రకాశిస్తుండే యౌవనరూపాన్ని అప్పటికప్పుడు కొత్తగా పొంది, యుద్ధం చేశాడు. ఇరావంతుడుకూడా స్థిరంగా నిలబడి యుద్ధంచేస్తుండగా.

**క. జననీవంశంబుననఁగల। యనుపమమాయానుభావ మాత్మఁ దలఁచి శే**
**షునిచందంబగు రూపం। బునఁ బేర్చి యనేక నాగపుంజముతోడన్. 104**

**ప్రతిపదార్థం:** జననీవంశంబునన్= తల్లియొక్కవంశంలో; కల= ఉన్నటువంటి; అనుపమ= సాటిలేని; మాయా= ఇంద్రజాలవిద్యలయొక్క; అనుభావము= ప్రభావాన్ని; ఆత్మన్= మనస్సులో; తలఁచి= తలచుకొని; అనేకనాగపుంజముతోడన్= అనేకములైన నాగులయొక్క సమూహముతోకూడా; శేషుని= ఆదిశేషునియొక్క; చందంబు+అగు= విధమైన; రూపంబునన్= ఆకారంతో; పేర్చి= అతిశయించి.

**తాత్పర్యం:** ఆ ఇరావంతుడు తనతల్లియొక్క నాగవంశంలో ఉండే సాటిలేని ఇంద్రజాల విద్యల ప్రభావాన్ని మనసులో తలచుకొన్నాడు. వెంటనే చాలా నాగుల సమూహంతో ఆదిశేషుడి మాదిరి రూపాన్ని ధరించి.

**చ. అడరిన దానవుండు గరు డాకృతిఁ గైకొని మాయతోడ లోఁ**
**బడ భుజగంబులం బొదివి పట్టి రయంబున మ్రింగి యప్డు చే**
**డ్పడు నరుపట్టి కంఠముఁ గృ పాణమునం దెగవ్రేయ మేదినిం**
**బడి మొగ మొప్పెఁ బూర్ణశశి భాతి వికారము లేని చెన్నునన్. 105**

**ప్రతిపదార్థం:** అడరినన్= (ఇరావంతుడు) విజృంభించగా; దానవుండు= అలంబుసుడు; గరుడ+ఆకృతిన్= గరుత్మంతునియొక్క ఆకారంవంటి ఆకారాన్ని; కైకొని= గ్రహించి; మాయతోడన్= ఇంద్రజాలంచేత; లోన్+పడన్= అధీనంకాగా; భుజగంబులన్= సర్పాలను; పొదివి= క్రమ్ముకొని; పట్టి= పట్టుకొని; రయంబునన్= వేగంగా; మ్రింగి= తిని; అప్డు= ఆ సమయంలో; చేడ్పడు= బాధపడుతున్న; నరుపట్టి కంఠము= ఇరావంతునియొక్క మెడను; కృపాణమునన్= కత్తితో; తెగన్+వ్రేయన్= నరికివేయగా; మేదినిన్= నేలమీద; పడి; వికారములేని= రూపముయొక్క మారుపాటులేనట్టి; చెన్నునన్= అందంతో; పూర్ణశశిభాతిన్= పున్నమినాటి చంద్రుడువలె; ఒప్పెన్= (అతడి ముఖం) ఒప్పింది.

**తాత్పర్యం:** ఆ ఇరావంతుడు నాగులగుంపుతో అలంబుసుడిమీదికి ఉరికాడు. అప్పుడు ఆ రాక్షసుడు గరుత్మంతుడి ఆకారం ధరించి, ఇంద్రజాలంతో వాటిని అధీనంలోనికి తెచ్చుకొని, పట్టుకొని, అన్ని పాములనూ తిన్నాడు. అప్పుడు ఇరావంతుడు కొంచెం ఇరుకున పడ్డాడు. ఆ సమయం కనిపెట్టి రాక్షసుడు ఇరావంతునిమెడ నరికివేశాడు. అతడి తల నేలపైబడింది. అయినా ఆ ఇరావంతుడి ముఖానికి చావు కళపట్టకుండా కళకళలాడుతూ పున్నమిచంద్రుడివలె ప్రకాశిస్తూనే ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అంత వియత్తలం బుదాత్తమిహిరమండలమండితమధ్యం బయ్యె నని చెప్పిన విని ధృతరాష్ట్రుం డయ్యిరావంతుండు వడినం బాండవులును వారి యోధవీరులును జేసిన తెఱంగు సెప్పు మనవుడు సంజయుఁ డతని కిట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ సమయంలో; వియత్+తలంబు= ఆకాశము; ఉదాత్త= గొప్పదైన; మిహిర= సూర్యునియొక్క; మండల= మండలంచేత; మండిత= అలంకరింపబడిన; మధ్యంబు+అయ్యెన్= మధ్యభాగం కలిగినదైనది; అని చెప్పినన్= అని చెప్పగా; ధృతరాష్ట్రుండు; ఆ+ఇరావంతుండు= ఆ అర్జునుడి కొడుకు; పడినన్= చావగా; పాండవులును= పాండురాజు కొడుకులున్నూ; వారి= ఆ పాండవ పక్షానికి చెందిన; యోధవీరులును= భటులు, శూరులు; చేసిన= నిర్వహించిన; తెఱంగు= విధానమును; చెప్పుము= తెలియ చెప్పుము; అనవుడున్= అనగా; సంజయుఁడు; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; ఇట్లు అనియెన్.

**తాత్పర్యం:** 'ఆ ఇరావంతుడు చచ్చిన సమయంలో మిట్టమధ్యాహ్నమైంది' అని సంజయుడన్నాడు. ధృతరాష్ట్రుడు 'ఇరావంతుడు చచ్చిన పిదప ఆ పాండవులు, వారి భటులు వీరులు అంతా ఏమి చేశారో చెప్పు' అని అడిగాడు సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పాడు.

**శా. తోడంబుట్టువుపాటు సూచి యలుకన్ దుర్వారశుం భద్గతిన్**
**హైడింబుండు, మహాసురేంద్రులు గజేం ద్రారూఢు లై సంగర**
**క్రీడాలోలతఁ దన్ను మీఱి విలయా గ్నింబోల దిక్చక్ర మ**
**ల్లాడన్ బెట్టుగ నార్చి చొచ్చెఁ గురు సై న్యంబున్ మహోగ్రంబుగన్. 107**

**ప్రతిపదార్థం:** తోడన్+పుట్టువు= తోడపుట్టిన వాడైన ఇరావంతుడి యొక్క; పాటు= చావు; చూచి; అలుకన్= కోపంతో దుర్వార శుంభత్+గతిన్= అడ్డగించలేని చాకచక్యంతో కూడిన పోకడతో; హైడింబుండు= హిడింబ కొడుకైన ఘటోత్కచుడు; గజ+ఇంద్ర+ఆరూఢులు+ఐ= గొప్ప ఏనుగులను ఎక్కినవారై; మహా+అసుర+ఇంద్రులు= గొప్ప రాక్షస శ్రేష్ఠులూ; సంగర క్రీడాలోలతన్= యుద్ధమనే ఆటలోని ఆసక్తిచేత; తన్నున్+మీఱి= ఆ ఘటోత్కచుడిని కూడా అతిక్రమించి; దిక్+చక్రము= దిక్కులయొక్క మధ్యభాగము; అల్లాడన్= కదలిపోవునట్లుగా; బెట్టుగన్= (వారి అండతో) బిగ్గరగా; ఆర్చి= బొబ్బలుపెట్టి; విలయ+అగ్ని+పోలన్= ప్రళయాగ్నిని పోలి; మహా+ఉగ్రంబుగన్= చాలా భయంకరంగా; కురుసైన్యంబున్= కౌరవుల సైన్యంలోకి; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** సోదరుడు మరణించటం చూచి ఘటోత్కచుడు కోపించి అనివార్యమైన వేగంతో ముందుకు వచ్చాడు. అతడి అనుయాయులైన రక్కసులు ఏనుగుల నెక్కి యుద్ధ క్రీడోత్సాహంతో అతడిని తలకడచి ప్రళయాగ్నివలె భాసించాడు. దిక్కులల్లాడగా పెడబొబ్బలు పెట్టుతూ కురుసైన్యంలోకి ఘటోత్కచుడు చొరబడ్డాడు.

**చ. కరమున నున్న శూలమునఁ గ్రమ్ముమెఱుంగులు శత్రు సైన్య భీ**
**కరములుగా గజాశ్వభట కాయములన్ గుదిగ్రుచ్చినట్లుగాఁ**
**జెరువుచు వచ్చువానిఁ గురు సింహుఁడు సూచి మదాంధసింధురో**
**త్కరరభసాతిభీషణముగాఁ గవిసెం బటువిక్రమోద్ధతిన్. 108**

**ప్రతిపదార్థం:** కురుసింహుఁడు= దుర్యోధనుడు; కరమునన్= చేతియందు; ఉన్న= పట్టుకొని ఉన్నట్టి; శూలమునన్; క్రమ్ము= పైకి ఉబుకుచున్న; మెఱుంగులు= కాంతులు (తళతళలు); శత్రుసైన్య భీకరములు+కాన్= విరోధుల సైనికులకు భయంకలిగించేవికాగా;

గజ= ఏనుగుల యొక్కయు; అశ్వ= గుఱ్ఱాల యొక్కయు; భట= భటులయొక్కయు; కాయములన్= దేహాలను; గుదిగ్రుచ్చిన+అట్లుగాన్= వరుసగా పూలుగ్రుచ్చిన దండవలె; చెరువుచున్= (శూలానికి) గ్రుచ్చుకొంటూ; వచ్చువానిన్= వస్తున్న ఘటోత్కచుణ్ణి; చూచి= తిలకించి; మద= మదంచేత; అంధ= గుడ్డిదైన; సింధుర= ఏనుగుల యొక్క; ఉత్కర= సమూహముయొక్క; రభస= వేగంవంటి వేగంతో; అతిభీషణముగాన్= చాలా భయంకరంగా; పటువిక్రమ+ఉద్ధతిన్= నేర్పుగల పరాక్రమంవల్ల కలిగిన గర్వంతో; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు చేత శూలంపట్టుకొని యుద్ధంలోకి ఉరికాడు. ఆ శూలము నుండి పైకి వచ్చిన తళతళకాంతులు శత్రుసైనికులకు చాలా భయం కలిగించాయి. ఆ ఘటోత్కచుడు తన శూలానికి ఏనుగుల, గుర్రాల, భటుల దేహాలను వరుసగా ఒకదారంలోనికి రకరకాల పూలను గ్రుచ్చినట్లుగా గ్రుచ్చుకొంటూ వచ్చాడు. దుర్యోధనుడు ఈ రాక్షసుణ్ణి చూశాడు. మదం పట్టడంవల్ల ముందు వెనుకలు తెలియని ఏనుగుల గుంపువలె మిక్కిలి వేగంతో నేర్పుగల పరాక్రమంచేత చాలా ఉద్ధతితో దుర్యోధనుడు వాని నెదుర్కొన్నాడు.

**క. వంగాధిపతియు శౌర్యో । త్తుంగతనుండగుచు నీసుతుం డలరఁగ దై**
**త్యుం గదిసె గాఢమద మా । తంగ ఘటలతోడ నపుడు దారుణభంగిన్. 109**

**ప్రతిపదార్థం:** నీ సుతుండు= నీ కొడుకు దుర్యోధనుడు; అలరఁగన్= సంతోషపడగా; అపుడు= ఆ సమయంలో; వంగ+అధిపతియున్= వంగదేశపురాజు; శౌర్య+ఉత్తుంగ తనుండు= పరాక్రమంచేత పొడుగుసాగిన శరీరంగలవాడు; అగుచున్= అయి; గాఢ= దట్టమైన; మద= మదంకలిగినట్టి; మాతంగ= ఏనుగులయొక్క; ఘటలతోడన్= గుంపులతో; దారుణభంగిన్= భయంకరమైన విధంగా; దైత్యున్= ఘటోత్కచుడిని; కదిసెన్= సమీపించాడు - ఎదురుకొన్నాడు.

**తాత్పర్యం:** నీ కొడుకు సంతోషపడుతూండగా వంగదేశరాజు శౌర్యంచేత ఒళ్ళుపెంచుకొని, బాగా మదించినట్టి ఏనుగుల గుంపుల సహాయంతో, శత్రువులకు చాల భయం కలిగే విధంగా- ఆ రాక్షసుడైన ఘటోత్కచుడి సమీపానికి చేరాడు.

**వ. ఇట్లు దన్ను బెట్టు గిట్టిన కరినికరంబులం గని పొంగి కరవాలంబు గొని యడరి ఘటోత్కచుండు. 110**

**ప్రతిపదార్థం:** ఘటోత్కచుండు= రాక్షసుడైన ఘటోత్కచుడు; ఇట్లు= ఈ విధంగా; తన్నున్= తనను (ఘటోత్కచుడిని); బెట్టు= అధికంగా; కిట్టిన= సమీపించిన; కరినికరంబులన్= ఏనుగుల గుంపులను; కని; పొంగి= గర్వపడి; కరవాలంబున్= కత్తిని; కొని; అడరి= విజృంభించి.

**తాత్పర్యం:** ఆ ఘటోత్కచుడు తనను సమీపించిన ఏనుగుల గుంపును చూశాడు. గర్వంతో కత్తి చేతపట్టుకొని, చెలరేగి వాటిపైకి దూకి. (తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** ఘట+ఉత్+కచుడు- ఘటోత్కచుడు (కుండమాదిరిగా పైకి లేచిన వెండ్రుకలు కలవాడు) భీముడి వలన హిడింబ అనే రాక్షసి గర్భంలో జనించినవాడు.

**క. కరదంతకర్ణమస్తక । చరణములవి తోఁపకుండుచందముగా ని**
**ష్ఠురవిక్రమకేళీ వి । స్ఫురణంబున రూపుమాపె సురలు నుతింపన్. 111**

**ప్రతిపదార్థం:** సురలు= దేవతలు; నుతింపన్= కీర్తింపగా; కర= తొండాలు; దంత= దంతాలు; కర్ణ= చెవులు; మస్తక= తలలు; చరణములు= కాళ్ళు; అవి; తోఁపకుండు చందముగాన్= తెలియకుండా ఉన్న విధంగా; నిష్ఠుర= కఠినమైన; విక్రమ= పరాక్రమమనెడు; కేళీ= ఆటయొక్క; విస్ఫురణంబునన్= స్ఫూర్తితో; రూపుమాపెన్= చంపాడు.

**తాత్పర్యం:** ఆ ఘటోత్కచుడు కఠోరమైన పరాక్రమంతో అవలీలగా ఆ ఏనుగుల తొండాలు, దంతాలు, చెవులు, తలలు, కాళ్ళు వాటి రూపం తెలియకుండా పోయే విధంగా తునాతునకలుచేశాడు. దేవతలు కూడా ఇతని శౌర్యాన్ని ఎంతో మెచ్చుకొన్నారు.

**వ. ఇవ్విధంబున గజంబులు వొలిసిన గజపురనాథుండు రోషంబున నురవడించి నారాచవృష్టి ముంచి వేగవంతుండును, విద్యుజ్జిహ్వుండును, బహ్వాశియు, నను దనుజప్రధాననాయకులం బ్రేతపతిపురంబున కనిచి యా భీమసేన తనయుతనువుననిశాతశరములు నించినం గోదండపాణియై క్రోధాగ్నిజ్వాలలు నిగుడువడువునం బటుబాణజ్వాలలు నిగిడించి కదిసి కురుపతి నవలోకించి యా ఘటోత్కచుం డిట్లనియె. 112**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ పైన చెప్పిన రీతిగా; గజంబులు= ఏనుగులు; పొలిసినన్= చావగా; గజపురనాథుండు= హస్తినాపురమునకు రాజైన దుర్యోధనుడు; రోషంబునన్= కోపంతో; ఉరవడించి= వేగిరపడి; నారాచవృష్టిన్= బాణాలవానలో; ముంచి= ముంచివేసి; వేగవంతుండు, విద్యుజ్జిహ్వుండు, బహ్వాశియున్; అను= అనునట్టి; దనుజ ప్రధాన నాయకులన్= రాక్షసులలో ముఖ్యులైన నాయకులను; ప్రేతపతి పురంబునకున్= యమధర్మరాజు నగరానికి; అనిచి= పంపి; ఆ భీమసేనతనయు తనువునన్= ఆ భీముడి కొడుకైన ఘటోత్కచు శరీరంలో; నిశాతశరంబులున్= పదునుగల బాణాలను, నించినన్= నిండచేయగా; అతండు= ఆ ఘటోత్కచుడు; కోదండపాణి+ఐ= విల్లుచేతగలవాడై; క్రోధ+అగ్నిజ్వాలలు= కోపమనే అగ్గియొక్క సెగలు; నిగుడువడువునన్= వ్యాపించే విధంగా; పటు బాణజ్వాలలు= శక్తిగల బాణాల సెగలు; నిగిడించి= వ్యాపించేటట్లుచేసి; కదిసి= దగ్గరకు వచ్చి; కురుపతిన్= దుర్యోధనుడిని; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఘటోత్కచుడు కౌరవసేనలోని ఏనుగులనన్నింటినీ తునుకలు చేశాడు. దీనిని చూచి దుర్యోధనుడు త్వరత్వరగా బాణాలవర్షంలో ముంచి కోపించి, అంతటితో ఊరుకోక వేగవంతుడు, విద్యుజ్జిహ్వుడు, బహ్వాశి అనే ముగ్గురు ప్రముఖులైన రాక్షసులను చంపాడు. ఘటోత్కచుడి శరీరాన్నంతా బాణాలతో నింపేశాడు. అప్పు డా రాక్షసుడు విల్లుచేతపట్టుకొని కోపమనే అగ్నిజ్వాలలు వ్యాపించునట్లు బాణాల కాంతులు ప్రసరింపజేస్తూ దుర్యోధనుడి వద్దకువచ్చి, ఆతడిని చూచి ఇట్లా అన్నాడు.

**ఉ. ' పాడియు సత్యముం గలుగు పాండుతనూజుల కీవు దొల్లి యె**
**ప్పాడిమెయిన్ సభం గరము భంగ మొనర్చితి నాఁటియందఱుం**
**జూడఁగ నేఁడు తత్ఫలము సూపెద నీ కని మూదలించి మై**
**నాడఁగ నేసెఁ గృష్ణభుజ గావలిఁ బోలిన నారసంబులన్. 113**

**ప్రతిపదార్థం:** ఈవు= దుర్యోధనుడవైన నీవు; తొల్లి= మునుపు (సభలో); పాడియున్= ధర్మము; సత్యమున్= నిజము చెప్పుటయు; కలుగు; పాండుతనూజులకున్= పాండవులకు; సభన్= కౌరవసభలో; ఏ+పాడిమెయిన్= ఏ మాత్రం న్యాయంతో; కరమున్= మిక్కిలి; భంగము= అవమానము; ఒనర్చితి(వి)= చేశావో; నాఁటి= ఆనాడు సభలోనున్నట్టి; అందఱున్; చూడఁగన్= చూస్తుండగా; నేఁడు= ఈదినం; నీకున్= నీకు; తద్+ఫలమున్= దానియొక్క ఫలాన్ని; చూపెదన్= చూపిస్తాను; అని= అంటూ; మూదలించి= హెచ్చరించి; కృష్ణభుజగ+ఆవలిన్= నల్ల త్రాచులవరుసను; పోలిన= సరిపోలిన; నారసంబులన్= బాణాలను; మైన్= దేహంలో; ఆడఁగన్+ఏసెన్= నాటుకొనేటట్లు వేశాడు.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! న్యాయం సత్యం కలిగినట్టి పాండవులకు నీవు అనాడు సభలో ఏ న్యాయంతో ఎంతగా అవమానం కలిగించావో, ఆనాడు సభలో ఉండినవారంతా ఈనాడు ఇక్కడ చూస్తూ ఉండగా దానిఫలాన్ని నీకు

చూపిస్తాను' అని హెచ్చరిస్తూ నల్లత్రాచుపాముల వరుసతో సమానాలైన బాణాలతో ఆ దుర్యోధనుడి శరీరాన్నంతా నింపివేశాడు.

**క. ' దానికిఁ జల మెడలక నీ । సూనుం డా పవనసూనుసూనునిమేనం**
**దా నుగ్రశరము లిరువది । యేను వెసం గీలుకొలిపె నిభపురనాథా! 114**

**ప్రతిపదార్థం:** ఇభపురనాథా!= హస్తినాపురానికి రాజైన ధృతరాష్ట్రా!; నీ సూనుండు= నీ కొడుకు దుర్యోధనుడు; దానికిన్= ఆ ఘటోత్కచుడు వేసిన బాణాలకు; చలము= మత్సరము; ఎడలక= వదలిపెట్టకుండా; ఆ పవనసూను సూనునిమేనన్= ఆ భీముడి కొడుకైన ఘటోత్కచుడి శరీరంమీద; తాన్= తాను (దుర్యోధనుడు); ఇరువది+ఏను= ఇరవై అయిదు; ఉగ్రశరములు= భయంకలిగించే బాణాలు; వెసన్= వేగంతో; కీలుకొలుపెన్= నాటినాడు.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ కొడుకు దుర్యోధనుడు- ఆ ఘటోత్కచుడు వేసిన కరుకైన బాణాలకు జంకిపోకుండా, మాత్సర్యాన్ని వదలకుండా, అతడి దేహంలో నాటుకొనేటట్లుగా ఇరవై అయిదు బాణాలు వెంటనే ప్రయోగించాడు.

**తే. అసుర కినిసి కృతాంతజిహ్వాయునుబోని । శక్తి యెత్తిన న మ్మహీశ్వరున కపుడు**
**వంగపతి యడ్డపడుటయు వానిగజముఁ । గూల వైచిన నాతండు నేల కుఱికె. 115**

**ప్రతిపదార్థం:** అసుర= రాక్షసుడు- ఘటోత్కచుడు; కినిసి= అలిగి; కృతాంతజిహ్వాయునున్ పోని= యమధర్మరాజు నాలుకను పోలిన; శక్తి= శక్తి అనే ఆయుధాన్ని; ఎత్తినన్= ఎత్తుకోగా; అపుడు; ఆ+మహీశ్వరునకున్= ఆ దుర్యోధనుడికి; వంగపతి= వంగదేశపురాజు; అడ్డపడుటయున్= అడ్డం తగలగా; వానిగజమున్= ఆ వంగదేశపురాజు ఏనుగును; కూలవైచినన్= పడిపోయేట్టుకొట్టగా; ఆతండు= ఆ వంగదేశరాజు; నేలకున్= భూమిమీదికి; ఉఱికెన్= దూకాడు.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు మహాకోపంతో దుర్యోధనుడిమీద పడవేయటానికి యముడి నాలుకమాదిరి భయంకరమైన శక్త్యాయుధాన్ని ఎత్తాడు. ఇంతలో దుర్యోధనుడికి అడ్డంగా వంగదేశరాజు రాగా, అతడి ఏనుగును రాక్షసుడు దానితో కూల్చాడు. వంగదేశరాజు నేలకు దూకాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఏనుంగు పడిన నచ్చటి । సేనలు దెరలుటయు రాజసింహుఁడు దన్నుం**
**దాన పురికొల్పికొని వెఱ । పూనక దానవునియెదుర నొక్కడ నిలిచెన్. 116**

**ప్రతిపదార్థం:** ఏనుంగు= ఏనుగు; పడినన్= పడిపోగా; అచ్చటిసేనలు= అక్కడవుండే సైన్యాలు; తెరలుటయున్= తొలగిపోగా; రాజసింహుఁడున్= రాజుల్లో గొప్పవాడు దుర్యోధనుడు; తన్నున్= తనను; తాను+అ= తానే; పురికొల్పికొని= ప్రోత్సాహపరచికొని; వెఱపున్= భయాన్ని; ఊనక= పొందక; దానవుని= ఘటోత్కచుడియొక్క; ఎదురన్= సమక్షంలో; ఒక్కఁడు+అ= ఒంటరివాడుగానే; నిలిచెన్= నిలబడ్డాడు.

**తాత్పర్యం:** వంగపతి ఏనుగు నేలకూలటంతో కౌరవసేనలు భయంతో పెద్దపెట్టున అరిచాయి. దుర్యోధనుడు తన్నుతానే ప్రోత్సాహపరచికొన్నాడు. (అక్కడ వేరేవీరులు) ప్రోత్సాహపరచే వారులేరన్నమాట- అతడు భయంలేకుండా తాను ఒక్కడే వాడియెదుట నిల్చి ఎదుర్కొన్నాడు.

క. నిలిచి మహాస్త్రం బెఱ మం। టలు గ్రమ్ముఁగఁ బెలుచ నేయుటయు నడుమన చె
క్కలు గాఁగ నేసి దిక్కులు। నలిగులిగా నతఁడు సింహనాదము సేసెన్. 117

**ప్రతిపదార్థం:** నిలిచి= నిలబడి; ఎఱమంటలు= ఎర్రటి జ్వాలలు; క్రమ్మఁగన్= వ్యాపించగా; పెలుచన్= కోపంతో; మహా+అస్త్రంబు= గొప్ప ఆయుధాన్ని; ఏయుటయున్= ప్రయోగించగా; అతఁడు= ఆ ఘటోత్కచుడు; నడుమన= మధ్యలోనే; చెక్కలు+కాఁగన్= చెక్కలయ్యేటట్లుగా; ఏసి= కొట్టి; దిక్కులు= అన్ని దిక్కులు; నలిగులిగాన్= పిక్కటిల్లేట్టుగా; సింహనాదము= సింహగర్జనాన్ని; చేసెన్= చేసినాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఘటోత్కచుడికి ఎదురుగా నిలబడి, ఎర్రటి జ్వాలలు అంతటా వ్యాపించే ఒక గొప్ప ఆయుధాన్ని మహాకోపంతో వాడిమీదకు విసిరాడు. వాడు ఆ ఆయుధాన్ని మధ్యలోనే ముక్కలుచెక్కలుచేసి, దిక్కులు పిక్కటిల్లేటట్లుగా సింహంవలె గర్జించాడు.

వ. ఇట్లు సేసిన విని గాంగేయుండు గురుపక్షయోధవీరులం గలయం గనుంగొని. 118

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సేసినన్= సింహనాదం చేయగా; గాంగేయుండు= గంగాపుత్రుడైన భీష్ముడు; కురుపక్షయోధవీరులన్= కౌరవుల పక్షంలో ఉండేభటులను, శూరులను; కలయన్= అంతటను; కనుంగొని.

**తాత్పర్యం:** భీష్ముడు ఘటోత్కచుడు చేసిన సింహనాదాన్ని విని, కౌరవపక్షంలోని భటులను, శూరులను తేరిపారచూచి (ఇట్లా అన్నాడు).

క. 'భీముని తనయుం డత్యు। ద్దామగతిన్ రాజుఁ దొడరి తత్కరటిఘటా
స్తోమంబు గూల్చి యాతని। పై మారిమసంగినట్లు బలువిడిఁ గవిసెన్. 119

**ప్రతిపదార్థం:** భీముని తనయుండు= భీమునియొక్క కొడుకు- ఘటోత్కచుడు; అతి+ఉద్దామగతిన్= హద్దులేని విధంగా; రాజున్= దుర్యోధనుడిని; తొడరి= వెంబడించి; తద్+కరటి ఘటాస్తోమంబున్= ఆ దుర్యోధనుడియొక్క గున్నఏనుగుల గుంపును;కూల్చి= చంపి; ఆతనిపైన్= ఆ దుర్యోధనుడి మీదికి; మారిమసంగినట్లు= మరణదేవత విజృంభించినట్లుగా; బలువిడిన్= అధికంగా; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** 'ఘటోత్కచుడు చాలా ఉద్ధతుడై, దుర్యోధనుడిని ఎదుర్కొని అతడి ఏనుగుగున్నల గుంపును చంపి, మహామారి మాదిరి రాజుపైకి ఎగబడ్డాడు

వ. 'ఆ ఘటోత్కచుండు దివిజులకు దుర్జయుండు' మీరు వేవేగ రారాజుం గూడికొనుం డనిన, సేనాపతి పలుకులకు గురుకృపాశ్వత్థామచిత్రసేనులు, బృహద్బల బాహ్లికావంతీనాథభూరిశ్రవసులును, సైంధవసోమదత్త వివింశతివికర్ణులు నేకోద్యోగంబునం దమతమ యనుచరు లైన యోధవీర సహస్రంబులతో రథంబులు దోలికొని చని భవత్తనయుం బరివేష్టించి హిడింబాతనయుం దాఁకిన నతండును దైతేయ బలంబులంగొని బలిమి మెఱసి నిలిచి మార్కొనియె, నారెండు సైన్యంబులు నొండొంటి కెదిర్చి పేర్చి పెనంగుచుండ నా భీమసేన నందనుం డాచార్య ప్రభృతులగు నా పన్నిద్దఱపై బహుప్రకార క్రూరబాణంబులు వరఁగింప నందు. 120

**ప్రతిపదార్థం:** ఆ ఘటోత్కచుండు; దివిజులకున్= దేవతలకు కూడా; అజయ్యుండు= జయింపరానివాడు; మీరు; వేవేగన్= మిక్కిలి వేగంగా; రారాజున్= దుర్యోధనుడిని; కూడికొనుండు= చేరుకొనండి; అనినన్= అని చెప్పిన; సేనాపతిపలుకులకున్=

సేనాధిపతియైన భీష్మడి మాటలకు; గురు కృప+అశ్వత్థామ, చిత్రసేనులు; బృహద్బల బాహ్లిక; అవంతీనాథ; భూరిశ్రవసులును, సైంధవ; సోమదత్త; వివింశతి; వికర్ణులు; ఏక+ఉద్యోగంబునన్= ఒకేవిధమైన ప్రయత్నంతో; తమ తమ= వారి వారికి; అనుచరులు+ఐన= సహాయపడేవారైన; యోధవీర సహస్రంబులతోన్= వేలకొలది భటులయొక్క; వీరులయొక్క; రథంబులు= రథాలను; తోలికొని; చని= వెళ్లి; భవత్+తనయున్= నీ కుమారుడు దుర్యోధనుణ్ణి; పరివేష్టించి= చుట్టుకొని; హిడింబా తనయున్= హిడింబ కొడుకు ఘటోత్కచుణ్ణి; తాఁకినన్= ఎదుర్కొనగా; అతండును= ఆ ఘటోత్కచుడున్నూ; దైతేయబలంబులన్= రాక్షస బలగాన్ని; కొని= తీసుకొని; బలిమిన్= దేహబలంతో; మెఱసి= ప్రకాశించి; నిలిచి= నిలబడి; మార్కొనియెన్= ఎదిరించాడు; ఆ రెండు సైన్యంబులున్= ఆ రెండు సేనలున్నూ; ఒండొంటికిన్= ఒకదానినొకటి; ఎదిర్చి= ఎదిరించి; పేర్చి= అతిశయించి; పెనంగుచుండన్= యుద్ధంచేస్తుండగా; ఆ భీమసేననందనుండు= ఆ భీముడి కొడుకు; ఆచార్య ప్రభృతులు+అగు= ద్రోణాచార్యుడు మున్నుగాగల; ఆ పన్నిద్దఱపైన్= ఆ పన్నెండుమందిమీద; బహు ప్రకార= నానా విధాలైన; క్రూర= కఠోరాలైన; బాణంబులు= బాణాలను; పరఁగింపన్= ప్రయోగింపగా; అందున్= ఆ యుద్ధంలో.

**తాత్పర్యం:** 'ఘటోత్కచుడు దేవతలకుకూడా జయింపరానివాడు, మీరందరూ అతిత్వరగా వెళ్ళి, దుర్యోధనుడికి సాయపడండి' అని సేనాపతి భీష్ముడన్నాడు. ఆ మాటలు విని ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, చిత్రసేనుడు, బృహద్బలుడు, బాహ్లికుడు, అవంతీనాథుడు, భూరిశ్రవసుడు, సైంధవుడు, సోమదత్తుడు, వివింశతి, వికర్ణుడు- వీరందరూ ఒకే ఎత్తున తమకు సహాయులైన అనేక వీరులతో, భటులతో, రథాలు కదిలించికొనిపోయి , దుర్యోధనుడిని గుండ్రంగా చుట్టుకొని, ఆ రాక్షసుడిని ఎదిరించారు. వాడు కూడా తన రాక్షసబలాన్ని వెంట వేసికొని బలంతో దేదీప్యమానుడై ఎదురొడ్డి నిలిచి యుద్ధంచేశాడు. అప్పు డారెండు సైన్యాలు ఒకదాన్నిమించి మరొకటి పోటీపడి ఎదిరిస్తూ విజృంభించుతూ యుద్ధం చేస్తూ ఉండగా, ఆ ఘటోత్కచుడు ద్రోణుడు ప్రధానుడుగా ఉండే ఆ పన్నెండుమంది వీరులపైన పలురకాల క్రూరములైన బాణాలను ప్రయోగించాడు. ఆ యుద్ధంలో.

**విశేషం:** సేనాపతి-భీష్ముడు- సేనాపతి లక్షణాలు-

**శ్లో॥ కులీనః శీలసంపన్నో ధనుర్వేద విశారదః।**
**హస్తి శిక్షాశ్వశిక్షాసు కుశలః శ్లక్ష్ణ భాషణః॥**
**నిమిత్తే శకునజ్ఞానే, వేత్తాచైవ చికిత్సితే।**
**కృతజ్ఞః కర్మణాం శూరః తథాక్లేశ సహోఋజుః॥**
**వ్యూహతత్త్వ విధానజ్ఞః ఫల్గుసారవిశేషవిత్।**
**రాజ్ఞాసేనాపతిః కార్యోబ్రాహ్మణః క్షత్రియోథవా॥ మాత్స్యే రాజ ధర్మే.**

**శ్లో॥ గౌతమాన్మిథునం జజ్ఞే శరస్తంబాచ్ఛరద్వతః।**
**అశ్వత్థామ్నశ్చ జననీ కృపశ్చైవ మహాబలః"॥** (మహాభారతం)

కృపుడు గౌతమవంశానికి చెందిన శరద్వంతుడి కొడుకు. శంతనునిచే కృపతో కాపాడబడ్డాడు కాబట్టి కృపాచార్యుడనే పేరు వచ్చింది. ఇతడు జీవితపర్యంతం బ్రహ్మచారిగా ఉండిపోయాడు. కురుబాలకులకు ఆచార్యుడుగా భీష్మాదులచేత నియోగింపబడ్డాడు. పాండవులను బాగా ఎదుర్కొన్నాడు. కాని అమరత్వం కలిగిన, కారణంచేత యుద్ధంలో ఇతడు చనిపోలేదు.

అశ్వత్థామ= ద్రోణుడి కొడుకు. చిరంజీవి- మహారథుడు. ఇతడు పుట్టగానే గుఱ్ఱం మాదిరి శబ్దించాడు. కనుకనే అశ్వత్థామ అనే పేరు వచ్చింది.

శ్లో. అలభత్ గౌతమీ పుత్రం అశ్వత్థామానమేవచ ।
స జాతమాత్రో వ్యనదత్, యథైవోచ్చైఃశ్రవాహయః॥
"తత్ శ్రుత్వాంతర్హితంభూతం అంతరిక్షస్థ మబ్రవీత్।
అశ్వస్యేవాస్యయత్ స్థామ నదతః ప్రదిశో గతమ్॥
అశ్వత్థామైవబాలోzయం, తస్మాన్నామ్నా భవిష్యతి॥ (భారతం)

చిత్రసేనుడు= ధృతరాష్ట్రుడి కొడుకు- అతడి కొడుకులలో నలుగురు- దుర్యోధనుడు, దుశ్శాసనుడు, వికర్ణుడు, చిత్రసేనుడు ప్రధానులైనవారు.

**ఘటోత్కచుండు ద్రోణాచార్యప్రభృతులతో యుద్ధంబు సేయుట (సం. 6-88-25)**

**క. కొందఱసూతులు వొలిసిరి। కొందఱిచాపములు దునిసెఁ గొందఱ చటుల**
**స్యందనహయాలి వడియెను। గొందఱ యంగములు వ్రస్సెఁ గురుకులముఖ్యా! 121**

**ప్రతిపదార్థం:** కురుకులముఖ్యా!= కురు వంశంలో ప్రధానుడవైన ఓ ధృతరాష్ట్ర మహారాజా!; కొందఱ సూతులు= కొంతమంది రథికుల సారథులు; పొలిసిరి= చచ్చారు; కొందఱ చాపములు= కొంతమంది విలుకాండ్ర ధనుస్సులు; తునిసెన్= విరిగిపోయాయి; కొందఱ= మరికొందరియొక్క; చటుల+స్యందన+హయ+ఆలి= చంచలమైన రథాలు, గుర్రాలు- వీటియొక్క వరుస; పడియెన్= కింద పడిపోయాయి; కొందఱ అంగములు= ఇంకా కొందరి శరీరాలు; వ్రస్సెన్= బద్దలయ్యాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ ఘటోత్కచుడు ద్రోణుడాదిగాగల పన్నెండుగురితో యుద్ధం చేసేటప్పుడు, కొందరి సారథులు చచ్చారు. మరికొందరి ధనుస్సులు విరిగిపోయాయి. ఇంకా కొందరి రథాలు, గుర్రాలు కూలిపోయాయి. కొందరి శరీరాలే బద్దలైపోయాయి.

**వ. ఇ ట్లతిరథమహారథులం జిక్కువఱిచినరక్కసున కలిగి రయంబున సాధనంబులు సమకట్టికొని రభసంబున నాకుంభసంభవాది ద్వాదశ రథికవరులు నొక్కపెట్ట చుట్టుముట్టి మహాస్త్రజ్వాలా జాలంబులం బొదివిన. 122**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అతిరథమహారథులన్= అతిరథులను, మహారథులను; చిక్కు+పఱిచిన= తంటాలుపెట్టిన; రక్కసునకున్= రాక్షసుడికి; ఆ కుంభసంభవ+ఆది ద్వాదశరథికవరులున్= ద్రోణుడు మొదలుగాగల పన్నెండుమంది రథిక శ్రేష్ఠులు; అలిగి= కోపగించి; రయంబునన్= తొందరగా; సాధనంబులున్= పనిముట్లను; సమకట్టికొని= సమకూర్చుకొని; రభసంబునన్= వేగంతో; ఒక్కపెట్ట= ఒకేసారిగా; చుట్టుముట్టి; మహా+అస్త్రజ్వాలాజాలంబులన్= గొప్పవగు ఆయుధాలనే మంటల సమూహంతో; పొదివినన్= కవియగా.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు కౌరవసైన్యాన్ని చీల్చి చెండాడుతూ, అతిరథమహారథులను కూడా చిక్కుపరిచాడు. అప్పుడు ద్రోణుడు మొదలుగాగల పన్నెండుగురు చాలా కోపపడి, వెంటనే యుద్ధసామగ్రినంతా బాగా సమకూర్చికొని ఒక్కుమ్మడిగా అతడి చుట్టూచేరి, గొప్ప అస్త్రాలనే అగ్నిజ్వాలలను అతడిపై కురిపించుతూ ఎదిరించారు.

**విశేషం:** మహారథుడు- "ఆత్మానం, సారథించాశ్వాన్ రక్షన్ యుధ్యేత యో నరః। సమహారథ సంజ్ఞః స్యాత్"

**ఆ. ఓర్వరాక దానవోత్తముఁ డంబర। వీథి కెగసి పోయి విపులరవము**
**సెలఁగఁ బెలుచ నడరి జీమూత భంగి దు। ర్దాంతుఁడైనఁ జూచి ధర్మసుతుఁడు. 123**

**ప్రతిపదార్థం:** దానవ+ఉత్తముఁడు= రాక్షసుల్లో శ్రేష్ఠుడు ఘటోత్కచుడు; ఓర్వరాక= తట్టుకోలేక; అంబరవీథికిన్= ఆకాశమార్గానికి; ఎగసిపోయి= ఎగిరిపోయి; విపులరవము= అధికమైనశబ్దము; చెలఁగన్= మ్రోయగా; పెలుచన్= ఆగ్రహంతో; జీమూతభంగిన్= మేఘంమాదిరి; అడరి= వ్యాపించి; దుర్+దాంతుఁడు+ఐనన్= అడచరానివాడు కాగా; ధర్మసుతుఁడు= ధర్మరాజు; చూచి.

**తాత్పర్యం:** ద్రోణాది మహావీరులు ప్రయోగించిన బాణాల దెబ్బకు తట్టుకోలేక ఘటోత్కచుడు ఆకాశంలోకి ఎగిరాడు. చాల కఠోరంగా పెనుబొబ్బలు పెట్టుతూ, మేఘంమాదిరి ఆకాశాన్ని ఆవరించి అణచరానివా డయ్యాడు. అప్పుడు ధర్మరాజు చూచి (భీముడితో ఇట్లా అంటున్నాడు).

**వ. భీమసేనుతో నిట్లనియె నిక్కడ భీష్మబారిం బడిన పాంచాల బలంబులఁ బరిపాలింపను, నక్కడ నాచార్యాదుల కగపడ్డ ఘటోత్కచుం గావను వలసియున్నయది యివ్వలనికిం గవ్వడి గలం డవ్వలనికి వేగంబ యరుగు మనిన సింహనాదంబు సేయుచు.** **124**

**ప్రతిపదార్థం:** భీమసేనుతోన్= భీముడితో; ఇట్లు; అనియెన్= అన్నాడు; ఈ+కడన్= ఈ చోటున; భీష్మబారిన్= భీష్ముడి నిర్బంధంలో; పడిన= కంటబడిన పాంచాలబలంబులన్= పాంచాలరాజు సేనలను;పరిపాలింపనున్= కాపాడడానికి; ఆ+కడన్= ఆచోట; ఆచార్య+ఆదులకున్= ద్రోణుడు మొదలైన వారికి; అగపడ్డ= కనుపించిన; ఘటోత్కచున్; కావను= రక్షించును; వలసియున్నది= అవసరమైయున్నది; ఈ+వలనికిన్= ఈ వైపునకు; కవ్వడి= అర్జునుడు; కలండు= ఉన్నాడు; ఆ+వలనికిన్= ఆ పక్కకు; వేగంబు+అ= తొందరగా; అరుగుము= వెళ్లుము; అనినన్= అని చెప్పగానే; సింహనాదంబున్= సింహగర్జన; చేయుచున్.

**తాత్పర్యం:** ధర్మరాజు భీముడితో ఇట్లా అన్నాడు 'ఇక్కడ భీష్ముడి బారినపడ్డ పాంచాల బలాన్ని కాపాడుకొనాలి. అక్కడ ద్రోణుడు ముఖ్యుడుగా ఉండే వారినుండి ఘటోత్కచుడిని రక్షించుకొనాలి. ఈ రెండు పనులూ మనకు ముఖ్యం. ఇక్కడ పాంచాలబలానికేమో రక్షకుడుగా అర్జునుడున్నాడు. ఆ ఘటోత్కచుడున్నచోటికి నీవు వేగంగా వెళ్ళుము' దానితో భీముడు వెంటనే సింహనాదంచేస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. కౌరవబలములు సుడివడ । మారుతి గవియుటయు మెఱసి మార్కొని కురుధా**
**త్రీరమణుఁ డర్ధచంద్రా । కారశరము దొడిగి ధనువు గ్రక్కునఁ దునిమెన్.** **125**

**ప్రతిపదార్థం:** కౌరవబలములు= కౌరవులసేనలు; సుడి+పడన్= సుడులు తిరిగేలాగా; మారుతి= భీముడు; కవియుటయున్= ఎదుర్కొనగా; కురుధాత్రీరమణుఁడు= కురుదేశానికి రాజైన దుర్యోధనుడు; మెఱసి= బయటకు వచ్చి; మార్కొని= ఎదిరించి; అర్ధచంద్ర+ఆకారశరమున్= సగం చంద్రుడి ఆకారంలోవుండే బాణాన్ని; తొడిగి= సంధించి; ధనువు= భీముడి విల్లును; గ్రక్కునన్= త్వరితంగా; తునిమెన్= త్రుంచివేశాడు.

**తాత్పర్యం:** భీముడు ఉరకగానే, కౌరవులసేన సుడులు తిరుగసాగినది. అప్పటికప్పుడే దుర్యోధనుడువచ్చి అర్ధచంద్రుడి ఆకారంలోవుండే బాణాన్ని సంధించి భీముడి ధనుస్సును విరుగగొట్టాడు.

**తే. తునిమి తోడన క్రొవ్వాఁడి దొడ్డనార । సంబు భీముని వక్షస్స్థలంబు దూఱ**
**నేయుటయు సోలఁ గని ద్రౌపదేయు లడరఁ । గడఁగె సౌభద్రుఁడును ఘటోత్కచుఁడుఁ గలసె.** **126**

**ప్రతిపదార్థం:** తునిమి= త్రుంచివేసి; తోడన= వెంటనే; దొడ్డనారసంబున్= బలమైన బాణాన్ని; భీముని వక్షస్+స్థలంబు= భీముడి రొమ్ముభాగాన్ని; దూఱన్= దూరిపోయేటట్లుగా; ఏయుటయున్= ప్రయోగింపగా; సోలన్= ఆ భీముడు స్వాధీనం తప్పివాలిపోగా;

కని; ద్రౌపదేయులు= ద్రౌపది కొడుకులు; అడరన్= విజృంభించగా; సౌభద్రుఁడును= అభిమన్యుడు; కడఁగెన్= ప్రయత్నపరుడైనాడు; ఘటోత్కచుండున్= ఘటోత్కచుడు కూడా; కలసెన్= వారితో కలుసుకొన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు, భీముడి విల్లును విరుగగొట్టి, బలమైన బాణాన్ని ప్రయోగించాడు. అది ఆతడి రొమ్ములో దూసికొనిపోయింది. ఆ దెబ్బకు భీముడు ఒడలుమరచి ఒరిగిపోయాడు. భీముడి దీనస్థితిని చూచి, ద్రౌపది పుత్రులు (ఉపపాండవులు) విజృంభించారు. అభిమన్యుడు ఘటోత్కచుడుకూడా వారిని చేరుకొన్నారు.

**వ. ఇట్లు దండ్రి నొచ్చినఁ బాండుపౌత్త్రులు నీపుత్త్రునిపై నొక్కపెట్ట మిక్కుటం బగుకోపంబునం గవిసిన. 127**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తండ్రి= తండ్రియగు భీముడు; నొచ్చినన్= నొప్పిచెందగా; పాండుపౌత్త్రులు= పాండురాజుయొక్క కొడుకుల కొడుకులు; నీ పుత్త్రునిపైన్= నీకొడుకుమీద; ఒక్కపెట్ట= ఒక్కసారిగా; మిక్కుటంబు+అగు= అధికమైన; కోపంబునన్= కోపంతో; కవిసినన్.

**తాత్పర్యం:** తండ్రి భీముడు నొప్పిచెంది, నేలకు ఒరిగిపోగా, పాండురాజు మనుమలు అందరూ చాలా కోపంతో ఒక్కసారిగా మనసేనపైకి విజృంభించారు.

**చ. కని కృపబాహ్లికాది రథి । క ప్రకరంబు గడంగి వారి మా**
**ర్కొని పెనఁగంగఁ దేఁటి కడుఁ । గ్రూరత నేచిన మారుతాత్మజుం**
**జెనసి గురుండు రక్తపరి । షిక్తునిఁ జేసిన నాతఁ డల్గి యా**
**తని నొక నారసంబున ను । దగ్రత మూర్ఛ మునుంగ నేసినన్. 128**

**ప్రతిపదార్థం:** కని= చూచి; కృపబాహ్లిక+ఆది రథిక ప్రకరంబున్= కృపుడు, బాహ్లికుడుమున్నుగా గల రథికుల సమూహం; కడంగి= ప్రయత్నపడి; వారిన్= ఆ పాండుపౌత్రులను; మార్కొని= ఎదిరించి; పెనఁగంగన్= పెనగులాడుతూంటే; తేఁటి= తెప్పరిల్లుకొని; కడున్= మిక్కిలి; క్రూరతన్= కఠోరంగా; ఏచినన్= విజృంభించినట్టి; మారుతాత్మజున్= భీముడిని; చెనసి= ఎదిరించి; గురుండు= ద్రోణుడు; రక్తపరిషిక్తునిన్= నెత్తుటితో తడిసిన వాడినిగా; చేసినన్= చేయగా; ఆతఁడు= ఆ భీముడు; అల్గి= కోపించి; ఆతనిన్= ఆ ద్రోణుడిని; ఒకనారసంబునన్= ఒకే బాణంతో; ఉదగ్రతన్= చాలా అధికంగా; మూర్ఛన్= మూర్ఛలో; మునుంగన్= మునిగేట్టుగా; ఏసినన్= కొట్టగా.

**తాత్పర్యం:** పాండవ పుత్రులంతా ఏకమై మీదపడటాన్ని చూచి, కృపుడు, బాహ్లికుడు మున్నగు రాజులు ఎదిరించి యుద్ధం చేస్తూ ఉండగా, ఇంతలో భీముడు తెప్పరిల్లుకొని చాలా కఠోరంగా విజృంభించాడు. అతడిని ద్రోణుడు ఎదిరించి, అతడిని నెత్తురుమయం చేశాడు. దానికి భీముడు కోపంతో ఒకే బాణంతో ద్రోణుడిని కొట్టి మూర్ఛ పోయేలా చేశాడు.

**మ. ధనురాచార్యునిఁ జూచి తత్తనయుఁడున్ ధాత్రీశుఁడున్ భీము మా**
**ర్కొని రాతం డెలనవ్వు చెన్నుగ గదా ఘోరాకృతిం దేరు డి**
**గ్గిన యాలోనన తేఁటి ద్రోణుఁడు గడంగెం జూచి తోడై కృపా**
**ది నికాయంబు గడంగి వాయు సుతుపైఁ దీవ్రాస్త్రముల్ నింపఁగన్. 129**

**ప్రతిపదార్థం:** ధనుః+ఆచార్యునిన్= అస్త్రవిద్యలో గురువైన ద్రోణుడిని; చూచి= గమనించి; తద్+తనయుడున్= ఆ ద్రోణుడి కొడుకు అశ్వత్థామ; ధాత్రీ+ఈశుఁడున్= భూమికి ప్రభువైన దుర్యోధనుడున్నూ; భీమున్= భీముడిని; మార్కొనిరి= ఎదిరించారు;

ఆతండు= ఆ భీముడు; ఎలనవ్వు= చిరునవ్వు; చెన్నుగన్= అందంగా; గదాఘోర+ఆకృతిన్= గదపట్టుకోవటంచేత భయంగొలిపే ఆకారంతో; తేరు డిగ్గినన్= తేరునుండి దిగగా; ఆలోనన= అంతలోనే; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; తేఱి= తెప్పరిల్లుకొని; కడంగన్= యుద్ధానికి సిద్ధమయ్యాడు; కృప+ఆది నికాయంబున్= కృపాచార్యుడు ముఖ్యుడుగాగల సమూహం; చూచి= ద్రోణుడు యుద్ధానికి దిగటాన్నిచూచి; తోడు+ఐ= సహాయులై; కడంగి= ప్రయత్నపడి; తీవ్ర+అస్త్రముల్= చురుకైన ఆయుధాలను; వాయుసుతుపైన్= భీముడి మీద; నింపఁగన్= నిండింపచేయగా.

**తాత్పర్యం:** అశ్వత్థామ, దుర్యోధనుడు- ద్రోణుడు మూర్ఛపడటాన్ని చూశారు. భీముడిని బాగా ఎదుర్కొన్నారు. భీముడేమో వారిని లెక్కచేయకుండా అందంగా చిరునవ్వునవ్వి, గదనుపట్టుకొని భయంకరంగా తేరును దిగాడు. ఆతడు తేరు దిగే లోపలనే ద్రోణుడు తెలివిపొంది, యుద్ధంచేయడానికి ప్రయత్నపడ్డాడు. కృపుడు ముఖ్యుడుగాగల సైన్యం ద్రోణుడు యుద్ధానికి దిగటాన్ని చూచి, భీముడిని చురుకైన ఆయుధాలతో నింపివేశారు.

**క. ఏపున హిడింబసుతుఁడును । ద్రౌపదిపుత్త్రులు సుభద్రతనయుఁడుఁ గోపో**
**ద్దీపితు లై వారల యా । టోపముఁ గుదియించి రతిపటుప్రదరములన్. 130**

**ప్రతిపదార్థం:** ఏపునన్= ఆటోపంతో; హిడింబసుతుఁడును= ఘటోత్కచుడు; ద్రౌపదిపుత్రులు= ద్రౌపదియొక్క కొడుకులు; సుభద్రతనయుఁడున్= అభిమన్యుడు; కోప+ఉద్దీపితులు+ఐ= కోపంతో మండిపడినవారై; వారల+ఆటోపమున్= ఆ అశ్వత్థామ దుర్యోధనుల విజృంభణాన్ని; అతిపటు ప్రదరములన్= చాల చురుకైన బాణాలతో; కుదియించిరి= తగ్గించారు.

**తాత్పర్యం:** ఇంతలో- ఘటోత్కచుడు, ఉపపాండవులు, అభిమన్యుడు- వీరందరూ, కోపంతో మండిపడుతూ, మిక్కిలి పదునుగా వుండే బాణాలు అశ్వత్థామ మీద, దుర్యోధనుడి మీద ప్రయోగించి వారి సంబరాన్ని చాలావరకు తగ్గించారు.

**వ. అప్పు డనూపభూపాలుండును భీమసేన సఖిత్వలోలుండు నగు నీలుండు నశ్వత్థామం దొడరి నొచ్చినం గని ఘటోత్కచుండు. 131**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; అనూపభూపాలుండును= అనూపదేశపు రాజు; భీమసేన సఖిత్వలోలుండున్= భీముడి స్నేహంలో ఆశగలవాడున్నూ; అగు= అయినట్టి; నీలుండు= నీలుడనేవాడు; అశ్వత్థామన్= అశ్వత్థామను; తొడరి= ప్రయత్నంతో ఎదిరించి; నొచ్చినన్= నొప్పిచెందగా; ఘటోత్కచుండు= రాక్షసుడు ఘటోత్కచుడు; కని= చూచి.

**తాత్పర్యం:** పాండురాజు మనుమలు ఆ అశ్వత్థామమీద, దుర్యోధనుడిమీద మంచి మంచి బాణాలు ప్రయోగించిన సమయంలో భీముడి నేస్తాన్ని కోరుకొనే అనూపదేశ రాజు నీలుడనేవాడు, అశ్వత్థామను ఎదుర్కొని, చాలా నొచ్చిపోయాడు. అప్పుడు ఘటోత్కచుడు. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. తలపడి యగ్గురునందనుఁ । జలమున నొప్పింప గురుఁడు సరభసముగ ను**
**జ్జ్వలబాణావృతుఁ జేసిన । బలమఱి దనుజుండు మాయఁ బన్నెఁ గుపితుఁడై. 132**

**ప్రతిపదార్థం:** తలపడి= ఎదిరించి; ఆ+గురునందనున్= ద్రోణుడి కొడుకైన ఆ అశ్వత్థామను; చలమునన్= కసితో; నొప్పింపన్= బంధించగా; గురుఁడు= ద్రోణాచార్యుడు; సరభసముగన్= తొందరతో; ఉజ్జ్వలబాణ+ఆవృతున్= (ఆ ఘటోత్కచుడిని) వెలుగుతూ ఉండే బాణాలతో కప్పబడ్డవాడినిగా; చేసినన్= చేయగా; దనుజుండు= ఆ ఘటోత్కచుడు; బలము+అఱి= బలం కోల్పోయి; కుపితుఁడు+ఐ= కోపం పొందినవాడై; మాయన్= మాయను (ఇంద్రజాలాన్ని); పన్నెన్.

**తాత్పర్యం:** అశ్వత్థామ యొక్క గొప్పతనాన్ని చూచి ఓర్వలేక ఆ రాక్షసుడు అతడిని బాగా నొప్పించాడు. అంతలో ద్రోణాచార్యుడు తొందరగావచ్చి, మండుతూ ఉన్న బాణాలతో వాడిని బాగా కప్పివేశాడు. అప్పుడు ఘటోత్కచుడు బలం తగ్గిపోవటంచేత కోపంతో మాయలు చేయడానికి పూనాడు.

**వ. ఇవ్విధంబున హిడింబాసూనుండు సేసిన మాయం జేసి. 133**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ మాదిరి; హిడింబాసూనుండు= హిడింబయొక్క కుమారుడు; చేసిన= చేసినట్టి; మాయన్+చేసి= మాయవలన.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడు ఈ మాదిరి మాయాజాలాలను చేశాడు. దాని ఫలితంగా.

**క. గురుఁడు మొదలైన యా ప। న్నిరువురుఁ గురుపతియు నొవ్వ నేటులఁ బడి నె**
**త్తురు దొరఁగ సోలి సంగర। ధరణిం బడినట్లు దోఁచెఁ దత్సేనలకున్. 134**

**ప్రతిపదార్థం:** తద్+సేనలకున్= ఆ కౌరవసేనలకు; గురుఁడు= ద్రోణుడు; మొదలు+ఐన; ఆ+పన్నిరువురున్= ఆ పన్నెండుగురు వీరులు; కురుపతియున్= దుర్యోధనుడున్నూ; నొవ్వన్= నొచ్చిపోయ్యేటుగా; ఏటులన్+పడి= దెబ్బలుతిని; నెత్తురు= రక్తము; తొరఁగన్= కారుచుండగా; సోలి= స్వాధీనంతప్పి; సంగరధరణిన్= యుద్ధభూమి మీద; పడినట్లు= పడిన విధంగా; తోఁచెన్= అనిపించింది.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు ద్రోణుడు ముఖ్యుడుగాగల ఆ అతిరథమహారథులు, కృపాశ్వత్థామ, చిత్రసేన, బృహద్బలబాహ్లికావంతీనాథ భూరిశ్రవసులను, సైంధవ సోమదత్త వివింశతి వికర్ణులను, దుర్యోధనుడిని, బాగా ఒళ్ళుబద్ద లయ్యేట్లు చావబాది, అంతటితో వదలక, తన మాయాబలంతో వీళ్ళందరూ నెత్తురు కార్చుకొంటూ చచ్చినేలపై పడ్డట్టుగా కౌరవుల సేనకు కనిపించేటట్లు చేశాడు.

**చ. కనుఁగొని సైన్యముల్ విటిగి క్రందుకొనన్ వెసఁబాఱ నాపగా**
**తనయుఁడు సేన నాఁగి యివి దైత్యులమాయలు గాని బొంకుబొం**
**కని యెలుఁగెత్తి చెప్పఁగ భయంబున నమ్మక పోయె నట్లు వో**
**యినఁ జనుదెంచెఁ గౌరవ మహీశుఁడు దీనత భీష్మపాలికిన్. 135**

**ప్రతిదార్థం:** సైన్యముల్= కౌరవసేనలు; కనుఁగొని= ఆ దృశ్యాన్నిచూచి; విటిగి= వేరువేరుగా అయి; క్రందుకొనన్= సందడిఏర్పడగా; వెసన్= వేగంగా; పాఱన్= పరుగులు తీయగా; ఆపగాతనయుఁడు= గంగకొడుకు- భీష్ముడు; సేనన్= తన సేనను; ఆఁగి= అడ్డగించి; ఇవి= ఇప్పుడు మీకు భయం కలిగించినట్టివి; దైత్యులమాయలు= రాక్షసుల ఇంద్రజాలాలు; కాని= అంతేకాని; బొంకు బొంకు+అని= అబద్ధము అబద్ధము అని; ఎలుఁగు+ఎత్తి= గొంతెత్తి; చెప్పినన్= చెప్పినప్పటికి; భయంబునన్= భయంచేత; నమ్మక= విశ్వసింపక; పోయెన్= పారిపోయెను; అట్లు= ఆ విధంగా; పోయినన్= సైన్యం వెళ్ళిపోగా; కౌరవమహీ+ఈశుఁడు= కురురాజు దుర్యోధనుడు; దీనతన్= దైన్యంతో; భీష్మపాలికిన్= భీష్ముడి దగ్గరకు; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** కౌరవసేనలోని తమయోధులందరు చచ్చినట్లు పడివుండటాన్ని చూచి గాబరాపడి ఎక్కడివారక్కడ విడివిడిగా పారిపోతూండడాన్ని చూచి, భీష్ముడు వారికి అడ్డుపడి ఇదంతా రాక్షసమాయలు అబద్ధాలు, నమ్మకండి అని గొంతు చినిగేటట్లు అరచి చెప్పినా వాళ్ళు పెడచెవినిబెట్టారు. అప్పుడు దుర్యోధనుడు బెంగగా ముఖం చిన్నపుచ్చుకొని భీష్ముడి దగ్గరకు వచ్చాడు.

**వ. వచ్చి యి ట్లనియె.** **136**

**ప్రతిపదార్థం:** వచ్చి= సమీపించి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు భీష్ముడి దగ్గరకు వచ్చి చెప్పబోయే విధంగా అంటున్నాడు.

**క. నీవును ద్రోణుఁడు గలుగం । గా వైరులచేత నేను గష్టపడితిఁ గా**
**దే వారితోడఁ దలపడి । చా వొండెను విజయ మొండె సంపాదింతున్.** **137**

**ప్రతిపదార్థం:** నీవును= భీష్ముడైన నీవున్నూ; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడున్నూ; కలుగంగాన్= నా పక్షంలో ఉండగా; వైరులచేతన్= శత్రువులచేత; ఏను= నేను (దుర్యోధనుడు); కష్టపడితిన్=+కాదే!= కష్టపడ్డాను కదా!; వారితోడన్= ఆ శత్రువులతో; తలపడి= యుద్ధంచేసి; చావు+ఒండెన్= మరణంగానీ; విజయము+ఒండెన్= జయంగానీ; సంపాదింతున్= పొందుతాను.

**తాత్పర్యం:** దేవతలకూ కూడా అజేయుడవైన నీవు, అస్త్రగురువు ద్రోణుడు కూడా మా పక్షాన ఉండి యుద్ధం సాగిస్తుంటే, శత్రువులచేత ఎంతో కష్టపడ్డాను కదా! ఇక నేనే వాళ్ళతో పోరి, చావనైనా చస్తాను, లేక జయాన్నైనా పొందుతాను. (అన్నాడు).

**చ. అన విని నవ్వి పాండవుల యంతటివారికిఁ గాక నీకు మా**
**ర్కొన నగు నయ్య! యిప్పరుసు కుత్సితవర్తన మిట్టి దుస్తరం**
**బునఁ దగులావుసేయ మము బోఁటులు లేరె? చలంబు డింపు మీ**
**వనిపతితోడఁ జెప్పి సరిదాత్మజుఁ డప్పుడు ప్రాభవంబునన్.** **138**

**ప్రతిపదార్థం:** సరిత్+ఆత్మజుఁడు= గంగానది పుత్రుడు భీష్ముడు; అనన్= దుర్యోధనుడు అట్లా అనగా; విని= ఆలకించి; నవ్వి; పాండవుల+అంతటివారికిన్+కాక= (పాండవులను గెలవడానికి) పాండవులంతటివారికేతప్ప; నీకు; మార్కొనన్= ఎదిరించటానికి; అగున్+ అయ్య= సాధ్యమగునా అయ్యా!; ఈ+పరుసు= ఈ విధమైన; కుత్సితవర్తనము= హీనమైన నడవడి; ఇట్టి= ఈ విధమైన; దుస్తరంబునన్= తరింపరాని యుద్ధంలో; తగు= తగినట్టి; లావు= బలం; చేయన్= చేయడానికి; మము+బోఁటులు= మాలాంటి వాళ్ళు; లేరే= లేరె? (ఉన్నారనుట); ఈవు= నీవు; చలంబు= మాత్సర్యాన్ని; డింపుము= వదిలెయ్యి; అని= ఈ విధంగా; పతితోడన్= దుర్యోధనుడితో; చెప్పి= పలికి; ప్రాభవంబునన్= హుందాతనంతో.

**తాత్పర్యం:** భీష్ముడు దుర్యోధనుడన్నమాటలంతా విన్నాడు, నవ్వాడు. ఇట్లా అన్నాడు "పాండవులను ఎదిరించటానికి పాండవులంతటివారై ఉండాలికాని, నీలాంటివాడికి సాధ్యమా! (కాదు). ఈ రకం హీనమైన నడవడి నీకు తగదు. అసాధ్యమైన ఈ యుద్ధంలో తగురీతిగా చేయడానికి మావంటివారులేరా? (ఉన్నారనుట) నీవు మాత్సర్యాన్ని వదిలిపెట్టుము'' అని దుర్యోధనుడితో అంటూ (హుందాగా).

**వ. భగదత్తు నాలోకించి.** **139**

**ప్రతిపదార్థం:** భగదత్తున్= భగదత్తుణ్ణి; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** భీష్ముడు భగదత్తుణ్ణి చూచి (ఇట్లా అంటున్నాడు).

**క. దనుజు లొనరించు మాయలు । నినుఁ జేరవు వారి గెలుతు వీ విప్పుడ యీ**
**జనపతి మెచ్చఁగఁ నా దై । త్యుని గెలువుము నీదు సేనతో నడరి వడిన్.** **140**

**ప్రతిపదార్థం:** దనుజులు= రాక్షసులు; ఒనరించు= చేయునట్టి; మాయలు= ఇంద్రజాలాలు; నినున్= నిన్ను (భగదత్తుణ్ణి); చేరవు= అంటవు; నీవు= (భగదత్తుడు); వారిన్= ఆ రాక్షసులను; గెలుతు(వు)= గెలుస్తావు; ఇప్పుడు+అ= ఇప్పుడే; ఈ జనపతి= ఈ దుర్యోధనుడు; మెచ్చఁగన్= మెచ్చుకొనేట్టుగా; నీదు సేనతోన్= నీ యొక్క సైన్యంతో; అడరి= విజృంభించి; వడిన్= వేగంగా; ఆ దైత్యునిన్= ఆ రాక్షసుడిని (ఘటోత్కచుడిని); గెలువుము= జయించుము.

**తాత్పర్యం:** 'ఓయీ భగదత్తా! రాక్షసులు పన్నే మాయలు నీ దగ్గరకు కూడా రావు. నీవు వాళ్లని గెలుస్తావు. మన రారాజుమెచ్చుకొనేటట్టు ఇప్పుడే నీ సేనతో కూడి త్వరగా బాగా విజృంభించి వాడిని గెలువుము.

**వ. అని భీష్ముండు పలికినం బ్రాగ్జ్యోతిషపతి మేటి మగండుగావున అమ్మాటకుం బొంగి సింగం బడరిన చందంబున నార్చి సుప్రతీకంబు నెక్కి సేనా సమేతుండై. 141**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; భీష్ముండు= భీష్ముడు; పలికినన్= చెప్పగా; ప్రాగ్జ్యోతిషపతి= ప్రాగ్జ్యోతిషమనే దేశానికి రాజు భగదత్తుడు; మేటి మగండున్= శూరుల్లో గొప్పవాడు; కావునన్= కావటంచేత; ఆ+మాటకున్= ఆ భీష్ముడి మాటకు; పొంగి= ఉప్పొంగిపోయి; సింగంబు= సింహము; అడరిన= విజృంభించిన; చందంబునన్= మాదిరి; ఆర్చి= బొబ్బపెట్టి; సుప్రతీకంబున్= సుప్రతీకమనే తన ఏనుగును; ఎక్కి= ఎక్కి; సేనాసమేతుండు+ఐ= సేనతో కూడుకొనినవాడై.

**తాత్పర్యం:** భీష్ముడి మాటలు విన్నాడు భగదత్తుడు. ఇతడు వీరులలో వీరుడు కావటంచేత ఉబ్బిపోయి సింహంమాదిరి విజృంభించాడు. బొబ్బలు పెట్టాడు. సేనలతో కూడినవాడై, తన ఏనుగును ఎక్కాడు.

**తే. పరఁగి తోఁతెంచుపాండవబలముమీఁదఁ । గవియుటయుఁ నంతనంతఁ గౌరవుల మూఁక**
**మరలి యేర్పడఁ జూచి యమ్మాట యపుడు । నిజముగాఁ గొని యాజికి నిగిడె మగుడ. 142**

**ప్రతిపదార్థం:** పరఁగి= ఒప్పి; తో+తెంచు= వస్తున్న; పాండవ బలము మీఁదన్= పాండవ సైన్యంమీద; కవియుటయున్= భగదత్తుడు ఎదుర్కొనగా; కౌరవులమూఁక= కౌరవులసైన్యం; అంతన్+అంతన్= కొంత కొంతదూరంలో; మరలి; ఏర్పడన్= బాగాతెలిసేటట్టుగా; చూచి= పరికించి; ఆ+మాట= భీష్ముడు చెప్పిన పలుకులు; నిజము+కాన్= యథార్థమని; కొని= గ్రహించి; మగుడన్= మరల; ఆజికిన్= యుద్ధానికి; నిగిడెన్= విజృంభించింది.

**తాత్పర్యం:** భగదత్తుడు ఎదురువచ్చే పాండవసేనతో యుద్ధంచేయసాగాడు. అది చూచి కౌరవులమూక, భీష్ముడన్న మాటలు నిజమని నమ్మి పాండవసేనకు అభిముఖపై మార్కొనింది

**వ. ఇ ట్లుభయసైన్యంబులుం దలపడిన సందడికయ్యంబున నపరాహ్ణం బగుచు నుండ. 143**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ మాదిరి; ఉభయసైన్యంబులున్= రెండు సేనలున్నూ; తలపడిన= ఎదురుకొన్న; సందడికయ్యంబున్= సంకుల సమరంలో; అపర+అహ్ణంబు= పగటిలో నాలుగో భాగం; అగుచున్+ఉండన్.

**తాత్పర్యం:** ఈ మాదిరి కౌరవపాండవసేనలు తలపడి యుద్ధం సాగించాయి. తన పక్షంవాడు, శత్రుపక్షంవాడు అనేదే తెలియకుండా ఆ యుద్ధం జరిగింది. ఇంతలో అపరాహ్ణకాలం కావడం ఆరంభించింది.

**క. నగపతియుఁ బోనిగజపతిఁ । దగ నేడ్తెఱ నెక్కి ప్రబలదైత్యబలముతో**
**నిగుడఁగ ఘటోత్కచుం డా । భగదత్తునిమీఁదఁ గవిసెఁ బార్థివముఖ్యా! 144**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= రాజులలో ప్రధానుడవైన ధృతరాష్ట్ర మహారాజా!; ఘటోత్కచుండు; నగపతియున్+పోని= మహాపర్వతంలాంటి; గజపతిన్= గొప్ప ఏనుగును; తగన్= ఒప్పిదంగా; ఎక్కి= అధిష్ఠించి; ఏడ్తెఱన్= పరాక్రమంతో; ప్రబలదైత్య బలముతోన్= మిక్కుటమైన రక్కసిమూకతో; నిగుడఁగన్= విజృంభించగా; ఘటోత్కచుడు; ఆ భగదత్తుని మీఁదన్= భగదత్తుడిపైన; కవిసెన్= ఎత్తివచ్చాడు.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ ఘటోత్కచుడు కొండంత పెద్ద ఏనుగునెక్కి, పరాక్రమంతో తన రాక్షససైన్యాన్ని కూడా తీసికొని యుద్ధరంగాన్నంతా కమ్ముకుంటూ భగదత్తుడిమీదికి ఎత్తివచ్చాడు.

**వ. తదవసరంబున వృకోదరుం డరదంబు రయంబు మెఱయ నయ్యభిమన్యుద్రౌపదేయ ప్రముఖులుం దానును హైడింబునకుం దో డై కడంగె నట్టియెడ. 145**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; వృక+ఉదరుండు= తోడేలు కడుపువంటి కడుపుకలవాడు (భీముడు); అరదంబు రయంబు= (తన) రథంయొక్క వేగం; మెఱయన్= బయలుపడగా; ఆ+అభిమన్యు ద్రౌపదేయ ప్రముఖులున్= ఆ అభిమన్యుడు, ద్రౌపది కొడుకులు మొదలైనవారు; తానును= భీముడున్నూ; హైడింబునకున్= ఘటోత్కచుడికి; తోడు+ఐ= తోడుపడి; కడంగెన్= యుద్ధానికి దిగాడు; అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో భీముడు తన రథవేగం అధికం కాగా, అభిమన్యుడు, ద్రౌపదికొడుకులు ప్రధానులుగాగల కొందరితో ఘటోత్కచుడికి అండగా నిలబడి, కయ్యానికి సిద్ధపడ్డాడు. ఆ సమయంలో.

**ఆ. పొదివి పలువు రేయఁ బొడువ వ్రేయఁగ భగ । దత్తుదంతిరక్తధార లొప్పెఁ**
**జెలువు రెట్టిగాఁగ జేవుఱుసెలయేఱు । లున్నతాచలమున నురలునట్లు. 146**

**ప్రతిపదార్థం:** పొదివి= చుట్టుముట్టి; పలువురు= చాలామంది; ఏయన్= బాణాలు ప్రయోగించగా; పొడువన్= బల్లాలతో పొడవగా; వ్రేయన్= గుదియలతో కొట్టగా; భగదత్తు= భగదత్తుడియొక్క; దంతి= ఏనుగుయొక్క; రక్త= నెత్తటియొక్క; ధారలు= ప్రవాహాలు; చెలువు= అందము; రెట్టిగాఁగన్= రెండింతలు కాగా; జేవుఱుసెలయేఱులు= జేవురురంగుసెలయేళ్ళు; ఉన్నత+అచలమునన్= ఎత్తైన పర్వతాన్నుండి; ఉరలునట్లు= కారేటట్టుగా; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** పాండవ పక్షంవారంతా భగదత్తుడి ఏనుగును చుట్టుముట్టి- కొందరు బాణాలతోకొట్టారు, మరికొందరు బల్లెములతో పొడిచారు. మరికొందరు గుదియలతో బాదారు. అతడి ఏనుగు శరీరంనుండి రక్తంకారుతూవుంది. అప్పుడది అదంతా రెట్టింపైన అందంతో జేవురురంగు పిల్లకాల్వలు కొండపైనుండి దిగువకు కార్తున్నట్టుంది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. శూలంబున హైడింబుఁడు । గాలాకృతితోడ వైవఁగా నది పొడి యై**
**రాలెడునట్లుగ మగఁటిమి । వ్రాలినభగదత్తుఁ డేసె వడి భల్లమునన్. 147**

**ప్రతిపదార్థం:** కాల+ఆకృతితోడన్= యముడి ఆకారంవంటి ఆకారంతో; హైడింబుఁడు= ఘటోత్కచుడు; శూలంబున(న్)= శూలాయుధంతో; వైవఁగాన్= గుచ్చగా; మగఁటిమి= పౌరుషము; వ్రాలిన= మీరిన; భగదత్తుఁడు; అది= ఆ శూలం; పొడి+ఐ= చూర్ణమై; రాలెడు+అట్లు+కన్= రాలిపొయ్యే విధంగా; వడిన్= వేగంగా; భల్లమునన్= బల్లెంతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు యమధర్మరాజుమాదిరి శూలాన్ని విసిరాడు. భగదత్తుడు పౌరుషం అతిశయంకాగా, వేగంగా ఒక బల్లెమును ప్రతిగావేసి వాడి బల్లెమును నుగ్గునుగ్గు చేశాడు.

**వ. ఇ ట్లేసి యార్చి వెండియు. 148**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ మాదిరి; ఏసి= ప్రయోగించి; ఆర్చి= బొబ్బపెట్టి; వెండియున్= మరియు.

**తాత్పర్యం:** భగదత్తుడీవిధంగా శూలంతో ఘటోత్కచుడి శూలాన్ని నుగ్గుచేసి బొబ్బలుపెట్టి.

**ఆ. భీముహరులఁ గూల్చి పేర్చి సౌభద్రాది । యోధవరుల నెల్ల నుఱక తఱచు**
**టంపవానఁ దడిపి హయరథభట సమూ । హంబుఁ జదిపె సమదహస్తిఁ బఱపి. 149**

**ప్రతిపదార్థం:** భీముహరులన్= భీముడి గుర్రాలను; కూల్చి= కూలద్రోసి; పేర్చి= అతిశయించి; సౌభద్ర+ఆది+యోధవరులన్= అభిమన్యుడు మొదలైన గొప్పవీరులను; ఎల్లన్= అందరినీ; ఉఱక= ఊరకయే; తఱచు= అధికమైన; అంపవానన్= బాణాలతో; తడిపి= ముంచి; సమదహస్తిన్= మదంతో కూడిన ఏనుగును; పఱపి= తోలి; హయరథభటసమూహంబున్= గుర్రాలు, రథాలు; భటులు= సైనికులు; వీరి గుంపును; చదిపెన్= నలిచివేశాడు.

**తాత్పర్యం:** ఆ భగదత్తుడు భీముడి రథం గుర్రాలను కుప్పకూల్చాడు. చాలా బాగా విజృంభించాడు. అభిమన్యుడు మొదలైన పలువురు యోధులందరినీ గొప్ప బాణాలవానతో తడిపివేశాడు. తన ఏనుగును ఉసికొల్పి గుర్రాలను; భటులను రథాలను నుగ్గు చేశాడు.

**క. మందరము మహాంభోనిధి । యందుఁ దిరుగునట్లు పాండవానీకములో**
**నం దిరిగి సుప్రతీక మ । మందగతిం జంపెఁ బెక్కు మాతంగములన్. 150**

**ప్రతిపదార్థం:** సుప్రతీకము= భగదత్తుడి ఏనుగు; మందరము= మందరమనే పర్వతం; మహా+అంభోనిధి+అందున్= మహాసాగరంలో; తిరుగు+అట్లు= తిరిగేమాదిరి; పాండవ+అనీకములోనన్= పాండవుల సేనలో; తిరిగి= భ్రమించి; అమందగతిన్= వేగవంతమైన నడకతో; పెక్కుమాతంగములన్= చాలా ఏనుగులను; చంపెన్= చంపింది.

**తాత్పర్యం:** సుప్రతీకం అనే ఏనుగు మహాసముద్రంలో మందరపర్వతం తిరిగేమాదిరిగా పాండవులసేనలోనికి చొచ్చుకొనిపోయి, వేగంతో ఇటూ అటూ తిరుగుతూ శత్రువుల ఏనుగులను ఎన్నింటినో కాలరాచినది.

**విశేషం:** అలం: ఉపమ. చంపె అనుటకు మారుగా చదిపె అను పాఠాంతరము మేలైనది.

**క. అలిగి దశార్ణాధీశుఁడు । గొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము ను**
**జ్జ్వలము లగునతనితోమర ములతాఁకున నది చలించి మొగతిరిగె వెసన్. 151**

**ప్రతిపదార్థం:** దశార్ణ+అధీశుఁడున్= దశార్ణదేశపురాజు; అలిగి= కోపించి; భగదత్తు మీఁదన్; భగదత్తుడిమీదికి; క్రూరగజమున్= భయంకరమైన (తన) ఏనుగును; కొలిపెన్= ప్రేరేపించాడు; అది= ఆ ఏనుగు; ఉజ్జ్వలములు+అగు= పదునుచేత ప్రకాశిస్తూ ఉన్న; అతని= ఆ భగదత్తుడియొక్క; తోమరముల తాఁకునన్= తోమరాలనే ఆయుధాల దెబ్బతో; చలించి= కదలిపోయి; వెసన్= వెంటనే; మొగతిరిగెన్= వెనక్కితిరిగింది.

**తాత్పర్యం:** దశార్ణరాజు కోపంచెంది, భగదత్తుడిమీదికి తన ఏనుగును పురికొల్పాడు. అది భగదత్తుడి క్రూరపు తోమరాలతాకిడికి తట్టుకోలేక వెనక్కి మళ్లినది.

**వ. ఇవ్విధంబునం బోరు భగదత్తుం గనుంగొని గండుమిగిలి కురువిభుండు గురుకృపాది యోధవీర సమేతంబుగాఁ దఱిమినం దమ బలంబులు గోలాహలబహుళంబు లగుటయుఁ బాండవాగ్రజుండు పార్థపాంచాల పురస్సరుండై యవ్వలనికిం గ్రొ వ్వలరం గోల్తల సేసె నట్టి సమయంబున. 152**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; పోరు= యుద్ధంచేస్తున్న; భగదత్తున్= భగదత్తుణ్ణి; కనుంగొని= చూచి; కురువిభుండు= కురురాజు, దుర్యోధనుడు; గండుమిగిలి= పౌరుషం అధికంకాగా; గురు= ద్రోణాచార్యుడు; కృప= కృపాచార్యుడు; ఆది= మొదలుగాగల; యోధ= భటులు; వీర= వీరులు; (వీరితో) సమేతంబుగాన్= కూడుకొని; తఱిమినన్= వెంబడిపడి తరుమగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; తమబలంబులున్= తమ (కౌరవుల); బలంబులున్= సైన్యాలు; కోలాహల బహుళంబులున్= కలకలశబ్దాలతో నిండినవిగా; అగుటయున్= కావడమున్నూ; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; పార్థపాంచాల పురస్సరుండు+ఐ= అర్జునుడు; ద్రుపదుడుముందున్నవారుకాగా; ఆ+వలనికిన్= ఆవైపునకు; క్రొవ్వు+అలరన్= మదం అధికంకాగా; కోల్తల+చేసెన్= ఎదురుగా నిల్చి యుద్ధంచేశాడు; అట్టి సమయంబునన్= అలాంటి సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా యుద్ధం చేస్తూన్న భగదత్తుణ్ణి చూశాడు దుర్యోధనుడు. మహాపౌరుషంతో ద్రోణాచార్య కృపాచార్యులు ముఖ్యులుగా ఉండే యోధవీరులతో కూడి పాండవసేనను వెంబడించి తరిమాడు. అప్పుడు కౌరవసేనలో కోలాహలం పుట్టింది. దానిని గమనించి, ధర్మరాజు - అర్జునుడు, ద్రుపదుడు ముందు నిలువగా ఆ యుద్ధం జరిగే దిక్కుకు వెళ్ళి మదాతిశయంతో యుద్ధం చేశాడు.

### అర్జునుఁ డిరావంతునిచచ్చుట భీమునిచే విని దుఃఖించుట (సం. 6-92-1)

**క. నరుఁడు ధనుర్గుణరావ । స్ఫురణంబును దేవదత్తభూరిరవము నం**
**బరము వగిలింప నానా । శరములఁ గురుసైన్యసరభసత్వం బుడిపెన్. 153**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; ధనుస్= విల్లుయొక్క; గుణ= అల్లెత్రాటియొక్క; రావ= ధ్వనియొక్క; స్ఫురణంబును= కదలికయు; దేవదత్తభూరిరవమున్= దేవదత్తమనే తన శంఖంయొక్క పెద్దశబ్దమున్నూ; అంబరము= ఆకాశాన్ని; పగిలింపన్= బ్రద్దలుకొట్టగా; నానాశరములన్= పలురకాల బాణాలతో; కురుసైన్య సరభసత్వంబున్= కౌరవసైన్యాలవేగిరపాటును; ఉడిపెన్= మాన్పించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ధనుష్టంకారం చేశాడు. తన శంఖాన్ని ఊదాడు. ఈ రెంటి చప్పుడు ఆకాశాన్ని బ్రద్దలు కొట్టింది. వెంటనే అర్జునుడు పలురకాల బాణాలు వేసి, కౌరవసేనల ఉద్ధతిని తగ్గించాడు.

**ఆ. అపుడు సేరి భీముఁ డతనికి భుజగేంద్ర । కన్యకాసుతుండు గలనఁ బడుట**
**నల్లఁ జెప్పటయును నడలి యెచ్చట నని । యడిగి యతఁడు సూప నచటి కరిగి. 154**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; భీముఁడు; చేరి= అర్జునుడి దగ్గరకువచ్చి; అతనికిన్= ఆ అర్జునుడికి; కలనన్= యుద్ధంలో; భుజగ+ఇంద్రకన్యకాసుతుండున్= సర్పరాజు కుమార్తెయొక్క కొడుకు ఇరావంతుడు; పడుటన్= చనిపోవటాన్ని; అల్లన్= మెల్లగా; చెప్పుటయున్= తెలియచేయగా; అడలి= శోకించి; ఎచ్చటన్= ఎక్కడ?; అని+అడిగి= అని ప్రశ్నించి; అతఁడున్= ఆ భీముడు; చూపన్= చూపించగా; అచటికిన్= ఆ చోటికి; అరిగి= వెళ్లి.

**తాత్పర్యం:** అర్జునుడు ఇట్లా యుద్ధం చేస్తున్న సమయంలో, భీముడు అతడి దగ్గరకు వెళ్ళి మెల్లగా ఇరావంతుడు యుద్ధంలో చావటాన్ని చెప్పాడు. అర్జునుడు విలపించి 'ఎక్కడ' అని అడిగాడు. భీముడు చూపించిన చోటికి తాను వెళ్ళి.

**వ. దనుజఖండితుం డయి పడియున్న యయ్యిరావంతు శరీరంబు గనుంగొని యా ధనంజయుండు.155**

**ప్రతిపదార్థం:** ఆ ధనంజయుండు= ఆ అర్జునుడు; దనుజ ఖండితుండు+అయి= రాక్షసుడిచే చంపబడ్డవాడై; పడియున్న= నేలపైపడివున్నట్టి; ఆ+ఇరావంతు శరీరంబున్= ఆ ఇరావంతుడి దేహాన్ని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** అలంబుసుడిచే చంపబడి నేలబడి ఉన్న ఇరావంతుడి దేహాన్ని చూచి అర్జునుడు.

**చ. ఘనతరశోకవేగమునఁ గన్నుల నీళులు నించి యా సుయో**
**ధనునవినీతియుం బిదప ధర్మతనూజుఁడు సంధి గోరి ప**
**ల్కిన తగవుం గడంగి యనికిం దలకొన్ననిజోద్యమంబుఁ దోఁ**
**చిన విధిఁ దిట్టుచున్ వినుతి సేయుచు రోయుచునుండె నయ్యెడన్. 156**

**ప్రతిపదార్థం:** ఆ+ఎడన్= ఆ సమయాన; ఘనతరశోకవేగమునన్= మిక్కిలి ఎక్కువైన దుఃఖవేగంతో; కన్నులన్= కండ్లలో; నీళులు= నీరు; నించి= నిండించుకొని; ఆ సుయోధను+అవినీతియున్= ఆ దుర్యోధనుడి అవినీతిని; పిదపన్= అటు తర్వాత; ధర్మతనూజుఁడు= ధర్మరాజు; సంధిన్+కోరి= సంధిని ఇష్టపడి; పల్కిన తగవున్= చెప్పిన న్యాయం; అనికిన్= యుద్ధానికి; కడంగి= ప్రయత్నపడి; తలకొన్న= పూనుకొన్న; నిజ+ఉద్యమంబున్= తనకార్యక్రమం; తోఁచినన్= జ్ఞాపకానికి రాగా; విధిన్= దైవాన్ని; తిట్టుచున్= తిట్టుతూ; వినుతి+చేయుచున్= ధర్మరాజు గొప్పదనాన్ని పొగడుతూ; రోయుచున్= తన యుద్ధచర్యను ఏవగించుకొంటూ; ఉండెన్= ఉండినాడు.

**తాత్పర్యం:** అర్జునుడు అధిక దుఃఖంతో కన్నులలో నీళ్ళు నింపుకొని, మొదట దుర్యోధనుడు చేసిన జూదంవగైరా అన్యాయాన్ని, తరువాత అన్న ధర్మరాజు ఉదారంగా ఐదూళ్లైనా ఇవ్వమని కోరటాన్ని సంధి కుదరకపోగా తాను చేసే అసహ్యమైన యుద్ధాన్ని ఒకసారి జ్ఞాపకానికి తెచ్చుకొన్నాడు. విధిని తిట్టాడు. పిదప ధర్మరాజు న్యాయాన్ని మెచ్చుకొన్నాడు. తను యుద్ధంలో దిగడంచేత పలువురు చావటాన్ని చూచి తన్ను ఏవగించుకొన్నాడు.

**వ. ఇట్లు పుత్త్రశోకానలసంతప్తచిత్తుం డగు సవ్యసాచిం జూచి గోవిందుండు మందస్మితంబు సేసిన. 157**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పుత్త్ర= కొడుకైన ఇరావంతుడి సంబంధమైన; శోక= దుఃఖమనే; అనల= అగ్గిచేత; సంతప్త= తపించిపోయిన; చిత్తుండు+అగు= మనస్సుకలవాడైనట్టి; సవ్యసాచిన్= అర్జునుణ్ణి; చూచి; గోవిందుండు= శ్రీకృష్ణుడు; మందస్మితంబు= చిరునవ్వు; చేసినన్= చేయగా (నవ్వగా).

**తాత్పర్యం:** అర్జునుడికి కొడుకు చావటంచేత కలిగిన దుఃఖంఅనే అగ్నిచేత ఆతడి మనస్సు బాగా తపించిపోయింది. అట్టి అర్జునుడిని చూచి కృష్ణుడు చిరునవ్వు నవ్వగా.

**క. 'కని యతఁడు దెలిసి నీచే। వినినది యిది మున్ను దీని విడిచితి నహిభం**
**జన! తేరు నడపు కురుబల। వినిపాతనపాటవమున విహరించుటకున్.' 158**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ అర్జునుడు; కని= కృష్ణుడు నవ్వటాన్ని చూచి; తెలిసి= ఆ నవ్వులోని అర్థాన్ని గ్రహించి; అహిభంజన!= కాళియుడనే సర్పరాజును మర్దించిన ఓ కృష్ణా!; ఇది= ఈ ఆత్మానాత్మ విచారం; మున్ను= ఇంతకు మునుపే; నీచేన్; వినిన+అది= విన్నట్టిదేను; దీనిన్= ఈ కొడుకు చావువల్ల కలిగిన దుఃఖాన్ని; విడిచితిన్= వదలిపెట్టాను; కురు= కౌరవులయొక్క; బల= సేనలయొక్క; వినిపాతన= బాగాపడగొట్టడంలో; పాటవమునన్= నైపుణ్యంతో; విహరించుటకున్= వేడుకగా తిరగడానికి; తేరునడపు(ము)= రథాన్ని ముందుకు పోనిమ్ము.

**తాత్పర్యం:** కృష్ణుడి నవ్వులోని మర్మాన్ని అర్జునుడు తెలిసికొన్నాడు. 'ఓ కృష్ణా చావు బ్రతుకుల తత్త్వాన్ని నీవు ముందే చెప్పావు, నేను విన్నాను. ఇక వీడి మరణంవల్ల ఏర్పడ్డ దుఃఖాన్ని వదిలివేశాను. ఆ కౌరవసైన్యాన్ని కుప్పకూల్చే సామర్థ్యంతో విహరించటానికి అనువుగా రథాన్ని పోనిమ్ము.

**వ. అని పలికినం బద్మనాభుండు రథంబు రయంబున మనమొనపయిం బఱపం బార్థుండు పటుబాణపరంపరలు వరగింప భగదత్తుండును, గృపాచార్యుండును, ద్రిగర్తపతియు భీష్మం గూడుకొని యాక్రీడి నెదిర్చిరి. సాత్యకి యడరినం గృతవర్మ బాహ్లికులు మార్కొనిరి మారుతి గవిసినం గుంభసంభవుండు దలపడియె. నతని ప్రాపున నేపు మిగిలి నీపుత్త్రకు లా బకమర్దను మర్దింపం గడంగి కవిసిన. 159**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; పలికినన్= అర్జునుడు చెప్పగా; పద్మనాభుండు= కృష్ణుడు; రథంబున్; రయంబునన్= వేగంతో; మనమొనపయిన్= మన (కౌరవుల)సేన మీదికి; పఱపన్= తోలగా; పార్థుండు= అర్జునుడు; పటుబాణపరంపరలు= గట్టి బాణాల వరుసలను; పరఁగింపన్= ప్రయోగింపగా; భగదత్తుండును; కృపాచార్యుండును, త్రిగర్తపతియున్; భీష్మున్; కూడుకొని= కలిసికొని; ఆ క్రీడిన్= ఆ అర్జునుడిని; ఎదిర్చిరి= ఎదిరించారు; సాత్యకి; అడరినన్= అతిశయించగా; కృతవర్మబాహ్లికులు= కృతవర్మయు, బాహ్లికుడున్నూ; మార్కొనిరి= ఎదిరించారు; మారుతి= భీముడు; కవిసినన్= ఢీకొనగా; కుంభసంభవుండు= ద్రోణాచార్యుడు; తలపడియెన్= తాకాడు; అతని ప్రాపునన్= ఆ ద్రోణుడి అండన; ఏపు మిగిలి= విజృంభణంచేత అతిశయించి; నీ పుత్త్రకులు= నీ కొడుకులు (కౌరవులు); ఆ బకమర్దనున్= బకుడనే రాక్షసుణ్ణి చంపిన భీముడిని; మర్దింపన్= అణచటానికి; కడంగి= ప్రయత్నపడి; కవిసినన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** అర్జునుడి మాటలు విని కృష్ణుడు వేగంగా రథాన్ని కౌరవసైన్యంవుండే ప్రక్కకు తోలాడు. పార్థుడు గొప్పవైన బాణాలను వరుసగా వేశాడు. అప్పుడు భగదత్తుడు, త్రిగర్తదేశపురాజు, కృపుడు భీష్ముడితో కూడుకొని ఆ అర్జునుడిని ఎదిరించాడు. సాత్యకి తలపడగా కృతవర్మ, బాహ్లికుడు అతడిని ఎదిరించారు. భీముడు మీదపడగా ద్రోణుడతనిని ఎదిరించాడు. ఆ ద్రోణుడి అండన ఉన్న నీ కొడుకులు ఆ భీముడిని కొట్టటానికి పెద్ద ప్రయత్నంతో ఎగబడ్డారు.

**క. గురునంపవెల్లి నాఁగుచు । సరభసముగ వారిమీఁద శరవర్షంబుల్**
**గురియుచు వారలయమ్ములఁ । దెరలక భీముండు పటుగతిస్యందనుఁడై. 160**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీముడు; పటుగతి స్యందనుఁడు+ఐ= దిట్టమైన పోకడగల రథంకలవాడై; గురున్= గురువైన ద్రోణాచార్యునియొక్క; అంపవెల్లిన్= బాణాలవెల్లువను; ఆఁగుచున్= అడ్డగిస్తూ; సరభసముగన్= తొందరపాటుతో; వారిమీఁదన్= ఆ కౌరవులమీద; శరవర్షంబుల్= బాణాలవానలను; కురియుచున్= కురిపిస్తూ; వారల= ఆ శత్రువుల; అమ్ములన్= బాణాలను; తెరలక= (దగ్గరకు రానీకుండా) తొలిగించుతూ.

**తాత్పర్యం:** భీముడు మంచివేగంగల రథాన్నెక్కి, ద్రోణుడు ప్రయోగించే బాణాల ప్రవాహాన్ని ఆపాడు. వాళ్ళమీద బాణాలవానలు కురిపించాడు. శత్రువులు వేసే బాణాలను తొలగించుకుంటూ (తరువాతి వచనంతో అన్వయం).

**వ. సమరక్రీడ సలిపి గురుకుమారులు దొరఁగించు నారాచధారల నొచ్చి యాజ్యధారాక్రాంతుం డైన యర్చిష్మంతుండునుంబోలె మండి యుద్దండకోదండనైపుణ్యంబు సూపినం గుండభేదియు, ననాధృష్యుండును, గనకధ్వజుండును, విరావియు, సుబాహుండును, దీర్ఘబాహుండును, దీర్ఘలోచ నుండును దీర్ఘనిద్రం బొందిరి; పెఱవారు వెఱచఱచి విఱిగి పఱచిన నజంబుల వెనుకొనువృకంబు విధంబున వృకోదరుండు దోర్విలాసంబు**

**మెఱసె నప్పుడు బ్రొద్దుగ్రుంకుచుండ నీ పెద్దకొడుకు బలుమొనలం బురికొల్పికొని చలంబునం గోల్తల సేసిన గౌంతేయవ్యూహంబులు నభినవోత్సా హంబునం బోక పెనంగిన. 161**

**ప్రతిపదార్థం:** సమరక్రీడ సలిపి= యుద్ధంలో క్రీడించి; కురుకుమారులు= దుర్యోధనుడి తమ్ముళ్ళు; తొరఁగించు= పడవేస్తున్నట్టి; నారాచధారలన్= బాణాలచేత; నొచ్చి= బాధపడి; ఆజ్యధారా+ఆక్రాంతుండు+ఐన= నేతిధారలచే కప్పబడిన; అర్చిష్మంతుండునున్+పోలెన్= అగ్నిమాదిరి; మండి= వెలిగి; ఉద్దండకోదండ నైపుణ్యంబు= మితిమీరిన విలువిద్యలోని చాకచక్యాన్ని; చూపినన్= ప్రదర్శించగా; కుండభేదియున్; అనాధృష్యుండునున్; కనక ధ్వజుండును; విరావియున్; సుబాహుండును; దీర్ఘబాహుండునున్; దీర్ఘలోచనుండును; దీర్ఘనిద్రన్= చావును; పొందిరి; పెఱవారు= తక్కినవారు; వెఱచఱచి= భయంచెంది; విఱిగి= ఓడిపోయి; పఱచినన్= పారిపోగా; అజంబులన్= మేకలను; వెనుకొను= అనుసరించితరుము; వృకంబు విధంబునన్= తోడేలుమాదిరి; వృకోదరుండు= భీముడు; దోస్+విలాసంబు= భుజాల క్రీడలో; మెఱసెన్= ప్రకాశించాడు; అప్పుడు= ఆ సమయంలో; ప్రొద్దు= సూర్యుడు; క్రుంకుచున్+ఉండన్= మరుగైపోతూండగా; నీ పెద్దకొడుకు= దుర్యోధనుడు; బలుమొనలన్= బలంగల సైన్యాలను; పురికొల్పికొని= ప్రోత్సాహపరచికొని; చలంబునన్= మాత్సర్యంతో; కోల్తల+చేసినన్= ఎదుట నిల్చి యుద్ధంచేయగా; కౌంతేయ వ్యూహంబులున్= కుంతికొడుకుల బలాలు; అభినవ+ఉత్సాహంబునన్= కొంగ్రొత్త ఉత్సాహంతో; పోక= వెనుకంజవేయక; పెనంగినన్= యుద్ధంచేయగా.

**తాత్పర్యం:** భీముడు యుద్ధంలో విచ్చలవిడిగా విహరిస్తూ, కౌరవులువేసే బాణాల దెబ్బకు చాలా బాధపడి నెయ్యిపోస్తే గుప్పుమని మండే అగ్గిలాగా మండిపడుతూ, విలువిద్యలో తనకుండే గొప్పనేర్పును కనపరుచుతూ కౌరవులను ఏడుమందిని చంపివేశాడు. మిగిలినవారందరూ ఓడి, భయపడి పారిపోసాగారు. మేకలను తోడేలు మాదిరిగా వాళ్ళను వెంబడించి తరిమాడు. తన భుజబలాన్ని ప్రకాశింపజేశాడు. అప్పుడే సూర్యుడు అస్తమిస్తున్నాడు. అప్పుడు దుర్యోధనుడు తన బలగంలో బలవంతుల్ని పురికొల్పికొంటూ మాత్సర్యంతో ఎదిరించి యుద్ధంచేయుటకు పూనాడు. పాండవుల దండుకూడా వెనుకకు మళ్ళక అప్పటికప్పుడే ఏర్పడ్డ ఉత్సాహంతో పోరు సాగించగా.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణ కాయ । శస్త్రఖండజాలంబులఁ జాలఁ బొలిచెఁ**
**బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు । తెఱఁగుతొడవులు దొడిగినతెఱవవోలె. 162**

**ప్రతిపదార్థం:** ధరణి= భూమి; నెత్తుటన్= నెత్తురులో; తోఁగి= మునిగి; ఆభరణ= నగలు; కాయ= శరీరాలు; శస్త్ర= ఆయుధాలు- వీటియొక్క; ఖండ= ముక్కల; జాలంబులన్= గుంపులతో; పలుచ+కాకుండన్= పలచగాకాక (దట్టంగా); కుంకుమము= కుంకుమపువ్వును; అలఁది= పూసుకొని; పెక్కు+తెఱఁగు తొడవులన్= పలురకాలైన నగలను; తొడిగిన= ధరించిన; తెఱవ+పోలెన్= ఆడదానిమాదిరి; చాలన్= అధికంగా; పొలిచెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** నెత్తుటితో బాగా తడిసి, నగలు, శరీరాలు, ఆయుధాలు- వీటి తునుకలతో నిండిన భూమి, ఎర్రని కుంకుమలేపనాన్ని దట్టంగా పూసికొని, నానావిధాల నగలు ధరించిన అందగత్తెవలె వెలుగుతూ ఉండినది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అంత. 163**

**తాత్పర్యం:** ఆ సమయంలో- (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తిమిరము గవిసినఁ బాండవ । సమితియుఁ గౌరవులు రణము సాలించి నివా**
**సములకుఁ దగఁ జని రయ్యు । ష్టమయామిని నుదితపటువిషాదుం డగుచున్. 164**

**ప్రతిపదార్థం:** తిమిరము= చీకటి; కవిసినన్= క్రమ్ముకోగా; పాండవసమితియున్= పాండవుల సమూహమూ; కౌరవులు= దుర్యోధనాదులు; రణము= యుద్ధం; చాలించి= ముగించి; నివాసములకున్= తమ తమ తావులకు; తగన్= ఒప్పిదంగా; చనిరి= వెళ్ళారు; ఆ+అష్టమ యామినిన్= ఆ ఎనిమిదవనాటి రాత్రిపూట; ఉదిత= పుట్టిన; పటు= గట్టిదైన; విషాదుండు+అగుచున్= ఖేదంకలవాడై.

**తాత్పర్యం:** చీకటి అంతటా వ్యాపించింది. పాండవులు, కౌరవులు యుద్ధం చాలించి తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు. ఆ ఎనిమిదో నాటిరాత్రి తనసైన్యం చాలా నష్టంకావడంచేత ధుర్యోధనుడి మనస్సు కలతచెందగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కురువిభుఁడు నగరు సొచ్చియుఁ । జొరమిన గాంధారవిభుని సూతతనూజుం**
**ద్వరితముగఁ బిలువు మని యా । తురతం బలుమాఱుఁ జెప్పె దుశ్శాసనుతోన్. 165**

**ప్రతిపదార్థం:** కురువిభుఁడు= దుర్యోధనుడు; నగరు= తన రాజభవనాన్ని; చొచ్చియున్= ప్రవేశించియు; చొరమిన్+అ= ప్రవేశింపకయే; దుశ్శాసనుతోన్= తన తమ్ముడు దుశ్శాసనుడితో; త్వరితముగన్= వేగంగా; గాంధారవిభునిన్= గాంధారదేశపురాజు శకునిని; సూతతనూజున్= సూతపుత్రుడు కర్ణుడిని; పిలువుము+అని= పిలుచుకొనిరమ్మని; ఆతురతన్= ఆత్రంతో; పలుమాఱున్= చాలాసార్లు; చెప్పెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన భవనంలోకి అడుగుపెట్టీపెట్టకముందే 'శకునిని, కర్ణుడిని ఇప్పుడే వేగంగా పిలుచుకొనిరమ్ము' అని ఆత్రంతో ఆ దుశ్శాసనుడితో మరీ మరీ చెప్పాడు.

**వ. చెప్పిన నతండు వారిం గూర్చికొని వచ్చుటయు నేకాంతంబున నమ్మహీకాంతుండు వారలతో ని ట్లనియె 'గాంగేయ గురుకృపాశ్వత్థామలు మధ్యస్థు లై పాండవబలంబులం జెఱుచునట్టి సంరంభంబునకుం జొరరు. మనసేనలు నానాఁటికి సన్నంబు లై సమయుచువచ్చె నేమి సేయంగలవార?' మనిన విని రాధేయుండు రణక్రీడాలంపటుం డై. 166**

**ప్రతిపదార్థం:** చెప్పినన్= చెప్పగానే; అతండు= ఆ దుశ్శాసనుడు; వారిన్= ఆ శకుని కర్ణులను; కూర్చికొని= చేర్చుకొని; వచ్చుటయున్= రాగానే; ఏకాంతమ్మునన్= రహస్యంగా; వారలతోన్= ఆ వచ్చినవారితో; ఆ+మహీకాంతుండు= ఆ రాజు-దుర్యోధనుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; గాంగేయ, గురుకృప+అశ్వత్థామలు= భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామలు; వీరు; మధ్యస్థులు+ఐ= ఉదాసీనులయి; పాండవబలంబులన్= పాండవులసేనలను; చెఱచు+అట్టి= చంపేటటువంటి; సంరంభంబునకున్= ఆటోపమునకు; చొరరు= పూనరు; మనసేనలు= మన (కౌరవుల) సైన్యాలు; నాఁడు+నాఁటికిన్= దినదినానికి; సన్నంబులు+ఐ= కృశించినవై; సమయుచున్ వచ్చెన్= చచ్చిపోతున్నాయి; ఏమిసేయన్+కలవారము?= మన మేమి చేయగలము?; అనినన్; రాధేయుండు= రాధకొడుకు - కర్ణుడు; విని= ఆలకించి; రణక్రియాలంపటుండు+ఐ= యుద్ధమాడటంలో ఆశ కలవాడై.

**తాత్పర్యం:** దుర్యోధనుడు అట్లు చెప్పగానే దుశ్శాసనుడు వెళ్ళి శకుని కర్ణులను వెంటబెట్టుకొని వచ్చాడు. వాళ్లతో దుర్యోధనుడు రహస్యంగా 'భీష్ముడు, ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ వీళ్ళు నలుగురును మధ్యస్థంగా ఉంటూ పాండవులసైన్యాలను చంపే సంరంభం కూడా చేయటం లేదు. మనసేనలేమో దినదినానికీ తరిగిపోతున్నాయి. కనుక ఇప్పుడు మనం ఏం చెయ్యాలి?' అని అన్నాడు. ఆ మాటలు విని కర్ణుడు యుద్ధమాడటం అంటే చాలా ఇష్టం కలవాడై

క. నరనాథ! యింక భీష్ముని । దురమునకుం దేకు మేను దోర్బలవిభవో
ద్ధురతం బాండుకుమారో । త్కరముం దత్సేనలన్ మదం బడఁగింతున్.' 167

**ప్రతిపదార్థం:** నరనాథ!= ఓ ప్రభూ! దుర్యోధనా! ఇంకన్= ఇకమీద; భీష్మునిన్= భీష్మాచార్యుడిని; దురమునకున్= యుద్ధానికి; తేకుము= తేవద్దు; ఏను= నేను (కర్ణుడు); దోః+బలవిభవ+ఉద్ధురతన్= భుజబల సంపత్తి యొక్క ఆధిక్యంతో; పాండుకుమార+ఉత్కరమున్= పాండురాజు కొడుకులగుంపును; తద్+సేనలన్= ఆపాండవుల సేనలను; మదంబు= పొగరును; అడఁగింతున్= అణచివేస్తాను.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! ఇకమీద ఆ భీష్ముడిని యుద్ధానికి తీసికొని పోవలదు. నేను నా భుజబలసంపత్తి పెంపుతో, ఆ పాండవులు ఐదుగురినీ వారి సేనలను మార్కొని - మదమణిగే విధంగా యుద్ధం చేస్తాను.'

క. అని పలికిన విని దుశ్శా । సనుఁ గనుఁగొని మనము వోయి శాంతనవుని భం
డన ముడిపి వత్త మని చె । ప్పి నరేంద్రుఁడు వీడుకొల్పెఁ బెఱవారిఁ దగన్. 168

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికినన్= (కర్ణుడు) చెప్పగా; విని= ఆలకించి; నర+ఇంద్రుఁడు= రాజైన దుర్యోధనుడు; దుశ్శాసనున్= తమ్ముడు దుశ్శాసనుణ్ణి; కనుఁగొని= చూచి; మనము= మన మిద్దరం; పోయి= వెళ్ళి; శాంతనవుని భండనము= భీష్ముడి యుద్ధాన్ని; ఉడిపి= చాలింపచేసి; వత్తము= వద్దాము; అని చెప్పి= అని పలికి; పెఱవారిన్= ఇతరులను; తగన్= తగినట్లుగా; వీడుకొల్పెన్= పంపివేశాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కర్ణుడి మాటలు విన్నాడు. దుశ్శాసనుడివైపు తిరిగి, 'మనం భీష్ముడి యుద్ధాన్ని నిలిపివద్దాము' అని చెప్పి, మిగిలినవాళ్ళను అక్కడి నుండి బయటకు పంపాడు.

వ. ఇట్లు కర్ణసౌబలుల నిజనివాసంబులకుం బోవం బనిచి బహుప్రకార సౌరభసంవాసితంబులగు జలంబుల జలకం బాడి పరమసురభిచందనానులేపనంబులను జీనిచీనాంబరపరిధానంబులను మహనీయ మాల్యాభరణంబులను బ్రస్ఫీతమణిమయ భూషణధారణంబులను దగ నలంకృతుం డై తమ్ములుం దగువారలుం బరివేష్టింపఁ బరిమళపరంపరాభాసితనూతనతైలధారాభిషేక ప్రదీపితంబులయిన కరదీపికాసహస్రంబులు వెలుంగ వేత్రహస్తులు దొలంగుఁడు తొలంగుండని సందడి నెడ గలుగ జడియ వందిసందోహంబులు సంకీర్తనంబులు సేయ మాగధమంజులగానంబులు వీనులం బొరయఁ బాఠక పఠనరవంబుల మనంబు రంజిల్ల రమణీయరత్నఖచితం బగు రథం బెక్కి మందగమనంబున మందాకినీనందనుమందిరంబు సేరం జని తదీయద్వారంబునం దేరు డిగ్గి దుశ్శాసను ముంజేయి కరతలంబున నవలంబించి యల్లన నడచి యుచితప్రకారంబునం బ్రవేశించి యప్పితామహు పాదంబులకుం బ్రణామంబులు సేసి తత్పీఠ సమీపంబున సమంచిత కనకాసనంబున నతం డనుప నాసీనుం డై చేతులు మొగిచి యమ్మనుజపతి యతనితో నిట్లనియె. 169

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కర్ణసౌబలులన్= కర్ణుడిని, శకునిని; నిజనివాసంబులకున్= తమ భవనాలకు; పోవన్= పోవడానికి; పనిచి= పంపి; బహుప్రకార= నానావిధాలైన; సౌరభ= వాసనలచేత; సంవాసితంబులు+అగు= వాసనగలవిగా చేయబడిన, జలంబులన్= నీళ్ళతో; జలకంబు+ఆడి= స్నానంచేసి; పరమ= మేలైన; సురభి= వాసనతో కూడిన; చందన= గంధము యొక్క; అనులేపనంబులను= మైపూతల చేతను; చీనిచీనాంబర పరిధానంబులను= పట్టు ధోవతి, పైకండువాలతో; మహనీయమాల్య+

ఆభరణంబులను= జిగేలుమనిపించే పూలదండలతో, ప్రస్ఫీత= మిక్కిలి అధికమైన; మణిమయ= రత్నాలు చెక్కిన; భూషణ= అలంకారాల; ధారణంబులను= ధరించటం చేత; తగన్= ఒప్పిదంగా; అలంకృతుండు+ఐ= అలంకరించుకొన్నవాడై; తమ్ములున్= తన తమ్ములు దుశ్శాసనాదులు; తగువారలున్= ఉండతగ్గవారును; పరివేష్టింపన్= తన్ను చుట్టి ఉండగా; పరిమళ= వాసనలయొక్క; పరంపరా= వరుసలచేత; ఆభాసిత= అంతటను వెలుగునిచ్చే; నూతన= అప్పుడే గానుగ నుండి తెచ్చిన; తైల= నూనెయొక్క; ధారా= ధారల యొక్క; అభిషేక= స్నానంచేత; ప్రదీపితంబులు+అయిన= వెలుగిచ్చేటివైన; కరదీపికా సహస్రంబులు= చేదివిటీలవేలు; వెలుంగన్= వెలుగుతుండగా; వేత్రహస్తులు= బెత్తాలు చేతపట్టుకొన్న సేవకులు; తొలంగుఁడు+తొలంగుఁడు+అని= దూరంగా జరిగి ఉండండి అని; సందడిన్= జనాన్ని తొలగించడంచేత; ఎడన్= అవకాశము; కలుగన్= ఏర్పడునట్లు; జడియన్= తొలగించగా; వందిసందోహంబులు= బట్టువారి గుంపు; సంకీర్తనంబులు+చేయన్= పొగడ్తలు చేయగా; మాగధమంజుల గానంబులు= ప్రభువు వంశాన్ని, వీరత్వాన్ని పొగిడేవారి ఇంపైన పాటలు; వీనులన్= చెవులకు, పొరయన్= సోకగా; పాఠక పఠన రవంబులన్= చదివేవారి చదువుల శబ్దాలచేత; మనంబు= మనస్సు; రంజిల్లన్= రసాన్ని అనుభవించగా; రమణీయ రత్న+ఖచితంబు+అగు= మనోహరాలైన మణులు తాపినట్టి; రథంబున్+ఎక్కి; మందగమనంబునన్= మెల్లగా ప్రయాణిస్తూ మందాకినీ నందను మందిరంబు= భీష్ముడి భవనాన్ని; చేరన్+చని= చేరునట్లు వెళ్ళి, తదీయద్వారంబునన్= ఆ భవనం గడప వద్ద; తేరుడిగ్గి= రథాన్నుండి దిగి; దుశ్శాసనుముందు+చేయి= దుశ్శాసనుడి చేతిని; కరతలంబునన్= తన చేతితో, అవలంబించి= పట్టుకొని; అల్లన= మెల్లగా; నడచి= అడుగులు వేసి; ఉచిత ప్రకారంబునన్= తగినరీతిగా; ప్రవేశించి= లోనికిపోయి; ఆ+పితామహుపాదంబులకున్= ఆ భీష్ముడి పాదాలకు; ప్రణామంబులు= దండాలు; చేసి= పెట్టి; తద్+పీఠసమీపంబునన్= ఆ భీష్ముడి ఆసనానికి దగ్గరగా; సముచిత కనక+ఆసనంబునన్= మేలైన బంగారు పీఠంమీద; అతండు= ఆ భీష్ముడు; అనుపన్= ఆజ్ఞాపించగా; ఆసీనుండు+ఐ= కూరుచున్న వాడై; చేతులు మొగిచి= చేతులు జోడించి; ఆ+మనుజపతి= ఆ దుర్యోధనుడు; అతనితోన్= ఆ భీష్ముడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఈ విధంగా కర్ణుడిని, శకునిని, వారి నివాసాలకు పంపించి వేశాడు. పన్నీరు, అత్తరు వంటి సువాసన ద్రవ్యాలతో గుబాళించే నీటితో స్నానం చేశాడు. మంచి వాసనగల మేలుగంధం, ఒంటికి దట్టంగా పూసుకొన్నాడు. పట్టుబట్టలు కట్టుకొన్నాడు. పట్టుకండువాలుపైన వేసుకొన్నాడు. వాసనగల పూలదండలు తగిలించుకొన్నాడు. వ్యాపించే కాంతిగల రత్నాలు పొదిగిన బాహుపురులు, మెరపుగల నగలు, పెట్టుకొన్నాడు. ఉచితమైన పరివారం అనుసరించగా, వాసనలు విరజిమ్మే కొత్త నూనెలు పోయటంచే జగజ్జేగీయమానంగా వెలిగే చాలా చేదివిటీలు వెలుగుతూండగా, భటులు బెత్తాలు చేత పట్టుకొని, 'తొలగండి తొలగండి' అని జనాన్ని అదలిస్తుండగా, ఏర్పడ్డ అవకాశంలో(సందు) భట్రాజులు పొగడుతు ఉండగా, మాగధులు ప్రభువు యొక్క ప్రాభవాన్ని పాడుతూ ఉంటే ఆలకిస్తూ, చదివే వాళ్ళ చదువులు మనస్సుకు ఇంపుగొల్పుతూ ఉంటే, మేలి రత్నాలు తాపిన తేరెక్కి, మందగమనంతో భీష్ముడి నివాసానికి చేరుకొని, ఆ భవన ద్వారం వద్ద తేరుదిగి, దుశ్శాసనుడి చేతిని ఆధారంగా పట్టుకొని, మెల్లగా అడుగులుపెడుతూ, తగిన విధంగా వినయంగా లోపలికి పోయి, భీష్ముడి అడుగులకు దండాలు పెట్టి, ఆయన పీఠానికి దగ్గరలో, ఒప్పిదమైన బంగారుపీటమీద ఆయన అనుమతితో కూర్చొని చేతులు జోడించి, దుర్యోధనుడు భీష్ముడితో ఇట్లా అన్నాడు.

**మ.** **నిను మున్నెంతయు నమ్మి పాండవుల యున్మేషంబు నేఁ జీరికిం**
**గొన నీపోరెడు చందముల్ దెలియఁ బెక్కుల్ సూచితిం జేరి చే**
**రి నయం బిచ్చుచు నొంప నూల్కొనక వారిం బట్టి పాలార్చె దొం**
**డన నేరం గురుముఖ్య! యింక నిట నీ వాలంబు సాలింపవే!** **170**

**ప్రతిపదార్థం:** కురుముఖ్య!= కురువంశంలో ప్రధానుడవైన భీష్మా!; నినున్; మున్ను= మొదట, ఎంతయున్= ఎంతగానో; నమ్మి= విశ్వసించి; పాండవుల యున్మేషంబున్= పాండురాజు కొడుకుల వికాసాన్ని; ఏన్= నేను; చీరికిన్+కొనన్= లెక్కపెట్టను; నీ పోరెడుచందముల్= నీవు యుద్ధం చేసేవిధానాలను; తెలియన్= విశదం కావడానికి; పెక్కుల్= చాలా; చూచితిన్= చూచాను, వారిన్= ఆ పాండవులను; చేరి చేరి= దగ్గరకు చేరికూడా; నయంబు+ఇచ్చుచున్= మెత్తదనాన్ని చూపిస్తూ; నొంపన్= బాధపెట్టడానికి; నూల్కొనక= ఒప్పుకోకుండా; పట్టి పాలార్చెదు= చేత చిక్కించుకొని కూడా ఊరకుంటున్నావు; ఒండు అనన్+నేరన్= ఒక్కటీ నిన్ను అనలేను; ఇంకన్= ఇకమీద; ఇటన్= ఇక్కడ; నీవు; ఆలంబు= యుద్ధం చేయటాన్ని; చాలింపవే!= వదలిపెట్టుము!

**తాత్పర్యం:** 'ఓ భీష్మా! మొదటి నుండి నిన్ను నమ్మి, పాండవుల వికాసాన్ని లక్ష్యం చేయకుండా ఉంటూ వచ్చాను. అయితే, నీవు చాలా సందర్భాలలో యుద్ధం చేస్తున్న తీరు గమనిస్తే నాకు అర్థమవుతున్నది ఏమిటంటే- నీవు పాండవులపట్ల మెత్తదనాన్నే చూపిస్తున్నావు. వాళ్ళకు నొప్పి కలిగించకుండా ఉంటున్నావు. వాళ్ళు చేత చిక్కినా ఏమీ చేయటం లేదు. కాబట్టి నీవు ఇంక యుద్ధం చేయకుము.

**చ. అనిమొన దేవదానవుల కైనను మార్కొనరాదు నిన్ను నేఁ**
**డెనిమిది నాళ్ళు లయ్యె సమయింపవు నొంపవు సవ్యసాచి న**
**ప్పని యటులుండనిమ్ము నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టు నా**
**చనవునఁ బోవ నిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే! 171**

**ప్రతిపదార్థం:** నృపసత్తమ!= రాజుల్లో గొప్పవాడవైన భీష్మా!; అనిమొనన్= యుద్ధరంగంలో; దేవదానవులకున్+ఐనను= దేవతలకుగానీ, రాక్షసులకుగానీ; నిన్ను; మార్కొనన్+రాదు= ఎదిరించడానికి సాధ్యంకాదు; నేఁడు= నేటికి; ఎనిమిదినాళులు+అయ్యెన్= యుద్ధం మొదలుపెట్టి నేటికి, ఎనిమిది దినాలు గడిచినాయి; సవ్యసాచిన్= అర్జునుడిని; సమయింపవు= చంపవు; నొంపవు= బాధకూడా పెట్టలేదు; ఆ+పని= అర్జునుణ్ణి హింసించే ఆ పని; అటులు ఉండనిమ్ము; అట్లా ఉండనీ; నినున్= నిన్ను; ఇంత+పట్టు= ఇంతమాత్రం; ప్రార్థన+చేసెదన్= వేడుకొంటున్నాను; నా చనవునన్= నా కోరిక ప్రకారం; పోవన్+ఇచ్చి= నన్ను నడుచుకునేటట్లు చేసి; కర్ణున్= కర్ణుడిని; పోరికిన్= యుద్ధానికి; పంపవే?= పంపవా?.

**తాత్పర్యం:** తాతా! భీష్మా! నిన్ను యుద్ధంలో దేవతలుగాని, రాక్షసులుగాని ఎవ్వరూ ఎదుర్కొనలేరు. యుద్ధంమొదలుపెట్టి ఈనాటికి ఎనిమిది రోజులు గడిచాయి. నీవేమో ఈ నాటిదాకా అర్జునుడిని చంపలేదు. చివరకు బాధించనుకూడా లేదు. సరే ఆ పని అట్లా ఉండనిమ్ము. నిన్ను మాత్రం వేడుకొంటున్నాను, అదేమంటే నన్ను నా కోరిక ప్రకారం నడుచుకోనిమ్ము, ఇక యుద్ధానికి కర్ణుడిని పంపించుము.

**వ. అనవుడు. 172**

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఇట్లా అనగా (తరువాతి పద్యంతో అన్వయం)

**క. అమ్మాట మనమునకు వా । లమ్మై తాఁకుటయు భీష్ముఁ డత్యంతవిషా**
**దమ్మున నించుకవడి మౌ । నమ్ముఁ దగం దాల్చియుండె నతవదనుం డై. 173**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు= భీష్మాచార్యుడు; ఆ+మాట= దుర్యోధనుడన్న ఆపలుకు; మనమునకున్= మనస్సుకు; వాలు+అమ్ము+ఐ= వాడి బాణంగా; తాఁకుటయున్= గ్రుచ్చుకోగా; అత్యంత విషాదమ్మునన్= చాల దుఃఖంతో; ఇంచుక+వడి= కొంచెంసేపు; తగన్= ఆ దుఖానికి తగినట్లుగా; మౌనమ్మున్= మౌనాన్ని; తాల్చి= వహించి; నతవదనుండు+ఐ= వంచబడ్డ ముఖం కలవాడై; ఉండెన్= ఉండినాడు.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు పలికిన పలుకులు ములుకులుగా భీష్ముడి మనస్సున గ్రుచ్చుకొన్నాయి. భీష్ముడు చాలా బాధతో, తలవంచుకొని ఏమీ మాట్లాడకుండా కొంచెంసేపు మౌనంగా ఉండి పోయాడు.

**వ. పదంపడి నిట్టూర్పు నిగిడించి మొగం బెగయించి భూపాలు నాలోకించి. 174**

**ప్రతిపదార్థం:** పదంపడి= అటు తర్వాత; నిడు+ఊర్పు= దీర్ఘమైన నిశ్వాసం; నిగిడించి= వదలిపెట్టి; మొగంబు= ముఖాన్ని; ఎగయించి= పైకెత్తి; భూపాలున్= రాజైన దుర్యోధనుడిని; ఆలోకించి.

**తాత్పర్యం:** భీష్ముడు అంతట పెద్ద నిట్టూర్పు వదలి, ముఖం పైకెత్తాడు. రారాజును చూచి.

**క. 'తలకొని నీకుం బ్రాణంబులు డాఁ। పక యోపినట్లు పోరఁగ నిమ్మెఁ**
**బలుకఁదగునె? యక్కట! నా। వలనం గలభక్తి యెల్ల వమ్మునఁ గలయన్? 175**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో! తలకొని= ప్రయత్నపడి; నీకున్= దుర్యోధనుడవైననీకు; ప్రాణంబులు= ప్రాణాలను; డాఁపక= దాచుకోక; ఓపిన అట్లు= చేతనైనంతవరకు; పోరఁగన్= (నేను) యుద్ధం చేస్తే; నావలనన్= నాపట్ల; కల= ఉన్నట్టి; భక్తి+ఎల్లన్= ప్రభుభక్తి అంతాకూడా; వమ్మనన్+కలయన్= వ్యర్థమైపోగా; ఈ+ మెయిన్= ఈ విధంగా; పలుకన్= మాట్లాడటం; తగునె?= తగునా? (తగదు).

**తాత్పర్యం:** 'దుర్యోధనా! నీకు జయం కలగాలని నా ప్రాణాలను కూడా దాచుకోకుండా శక్తి వంచన లేకుండా నేను యుద్ధం చేస్తూ ఉంటే నాకుగల ప్రభుభక్తి అంతా బుగ్గిపాలయ్యేట్లు నీవు ఈ విధంగా కఠినంగా మాట్లాడడం ఏమి న్యాయం?' అన్నాడు భీష్ముడు.

**వ. అని పలికి యలుక వొడమి వెండియు. 176**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; అలుక= కోపము; పొడమి= పుట్టి; వెండియున్= మరల

**తాత్పర్యం:** అని, కోపంతో మండిపడుతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'కాల్పడే మహనీయ ఖాండవం బింద్రుని। నమరగణంబుతో విముఖుఁ జేసి?**
**బహుదివ్యశరములు వడయఁడే? యెక్కటి। బవరాన మెప్పించి శివునిచేత?**
**గంధర్వులకు నోడి కర్ణుండు నీ తమ్ము। లును బాఱ విడిపించికొనఁడె నిన్ను?**
**నిను నను ద్రోణు నాతని పుత్త్రుఁ గృపుఁ గర్ణు। గెలిచి విరాటుగోవులఁ గొనండె?**

**ఆ. తక్కు పెక్కులెడలఁ బెక్కండ్ర నేమేమి। సేసె వినమె? యట్టి జెట్టి నిన్ని**
**దినము లిట్లు దొడరి పెనఁగియు నీ చేత। నేఁడు వినఁగ వలసె వేఁడిపలుకు. 177**

**ప్రతిపదార్థం:** అమరగణంబుతోన్= దేవతల సమూహంతోపాటు; ఇంద్రునిన్= దేవేంద్రుణ్ణి; విముఖున్+చేసి= యుద్ధానికి పెడమొగం పెట్టేవాడిగా చేసి; మహనీయఖాండవంబున్= మాననీయమైన ఖాండవం అనే అరణ్యాన్ని; కాల్పఁడు+ఏ?= కాల్చలేదా?; ఎక్కటి= తనకు సహాయుడు లేనట్టి; బవరానన్= యుద్ధంలో; మెప్పించి; శివునిచేతన్= ఈశ్వరుడి చేత; బహుదివ్య శరములు= నానావిధాలైన దివ్యములైన బాణాలను; పడయఁడు+ఏ?= పొందలేదా?; కర్ణుండు= సూతపుత్రుడు; నీ తమ్ములునున్= నీ తమ్ముళ్ళు దుశ్శాసనాదులు; గంధర్వులకున్= గంధర్వుల దెబ్బకు; పాఱన్= పరుగుతీయగా; నిన్నున్; విడిపించికొనఁడు+ఎ?= విడిపించుకోలేదా?; నిను(న్)= నిన్ను (దుర్యోధనుడిని); ననున్= నన్ను; ద్రోణున్= ద్రోణాచార్యుడిని; ఆతనిపుత్త్రున్= ద్రోణుడి

కుమారుడు అశ్వత్థామను; కృపున్= కృపాచార్యుడిని; కర్ణున్= కర్ణుడిని; గెలిచి= జయించి; విరాటు గోవులన్= విరాటరాజు ఆవులను; కొనండు+ఎ?= మళ్ళించుకోలేదా?; తక్కు= తక్కిన; పెక్కులు+ఎడలన్= పలు తావులలో; పెక్కండ్రన్= చాలామంది వీరులను; ఏమి+ఏమి+చేసెన్= ఏమేమి చేశాడో; వినము+ఎ?= మనం వినలేదా?; అట్టిజెట్టిన్= అట్టి మహా శూరుడైన అర్జునుడిని; ఇన్ని దినములు= ఈ ఎనిమిది రోజులు; ఇట్లు= ఇంతఘోరంగా; తొడరి= ఎదిరించి; పెనఁగియున్= యుద్ధం చేసికూడా; నేఁడు= ఈ దినం; నీ చేతన్= నీచేత; వేఁడి పలుకు= తీక్ష్ణమైన మాట; వినఁగ+వలసెన్= వినవలసి వచ్చింది.

**తాత్పర్యం:** 'దేవతలతో పాటు, దేవేంద్రుడంతటి వాడిని కూడా యుద్ధానికి పెడమొగం పెట్టే వాడినిగా చేసి ఖాండవ వనాన్ని కాల్చివేశాడు కదా! తాను ఏకాకిగా యుద్ధం చేసి శివుడంతటి వాడిని మెప్పించి, పాశుపతం మొదలైన దివ్యాస్త్రాలు సంపాదించుకొన్నాడు కదా! నీవు, నీ తమ్ముళ్ళు, కర్ణుడు అందరూ గంధర్వుల దెబ్బకు నిలువలేకపారిపోగా, వారి బారినుండి ఆ అర్జునుడు నిన్ను విడిపించుకొన్నాడు గదా! ఉత్తర గోగ్రహణంలో, నిన్ను, నన్ను, ద్రోణుడిని, ఆయన కొడుకును, కృపుడిని, కర్ణుడిని ఒక్కడే గెలిచాడు కదా! ఇంకా ఎన్నెన్నో చోట్ల ఎందరెందరినో ఏమేమి చేశాడో మనం విన్నాం కదా! అలాంటి వీరుడితో ఈ ఎనిమిది దినాలు ఎదిరించి యుద్ధం చేసినట్టి నేను ఈనాడు, నీచేత చుఱుకుమనిపించే మాటలు వినవలసి వచ్చింది. (అని భీష్ముడు వాపోతున్నాడు.)

**క. తగనిపని యని తలంపక । పగ గొంటి వజేయులైన పాండుసుతులతోఁ**
**దెగి యింక నీవు రణమున । మగఁటిమి వాటింపు రిత్తమాటల నగునే? 178**

**ప్రతిపదార్థం:** తగనిపని+అని= చేయరాని పని అని; తలంపక= ఆలోచించకుండా; అజేయులు+ఐన= జయింపరానివారైన; పాండుసుతులతోన్= పాండురాజు కొడుకులతో; పగ+కొంటివి= విరోధాన్ని పూనావు; ఇంకన్; నీవు; తెగి= సాహసించి; రణమునన్= యుద్ధంలో; మగటిమిన్= పౌరుషాన్ని; పాటింపు(ము)= ప్రకటించుము; రిత్తమాటలన్= ఉత్త ఉత్తమాటలతో; అగునే?= సమకూడునా?

**తాత్పర్యం:** కాని పని అనే ఆలోచన లేకుండా, జయింపరాని పాండవులతో విరోధాన్ని కొని తెచ్చుకొన్నావు. ఇంక నీవు యుద్ధంలో సాహసంతో పౌరుషాన్ని బాగా చూపుము. అంతేగాని, కల్లబొల్లి మాటలతో ఏమి ప్రయోజనం?

**వ. అని మఱియును. 179**

**తాత్పర్యం:** ఇంకను,

**క. ' గాండీవి గెలువ రాదు శి । ఖండిని జంపంగ నాకుఁ గాదు వినుము న**
**న్నొండుమగలు మార్కొనినం । జెండుదు నుగ్రముగ మున్న చెప్పితి నీకున్. 180**

**ప్రతిపదార్థం:** నాకున్= భీష్ముడనైన నాకు; గాండీవిన్= అర్జునుడిని; గెలువన్‌రాదు= జయించ వీలుకాదు; శిఖండిని= ద్రుపదుని కొడుకు శిఖండిని; చంపఁగన్= చంపడానికి; కాదు= నావల్ల కాదు; వినుము; ఒండు+మగలు= వేరే వీరులు, నన్నున్; మార్కొనినన్= ఎదిరిస్తే; ఉగ్రముగన్= భయంకరంగా; చెండుదున్= నరుకుతాను; నీకున్; మున్ను+అ= ముందుగానే; చెప్పితిన్= ఈ మాట చెప్పాను.

**తాత్పర్యం:** దుర్యోధనా! నేనేమో అర్జునుడిని జయించలేను, శిఖండిని కూడా చంపలేను, బాగా వినుము. తక్కినవారు ఎంతటి వీరులైనా సరే, నన్నెదిరించారంటే చీల్చిచెండాడుతాను. ఈ సంగతి నీకు ఇంతకు ముందే చెప్పాను.

**క. ఏనును నాదళమున ద్రుప । దానీకవిరాటసైన్యయాదవబలసం**
**తానములతోడఁ బెనఁగెదఁ । బూనుఁడు మీ రెల్లఁ బాండుపుత్త్రుల గెలువన్. 181**

**ప్రతిపదార్థం:** ఏనును= నేను; నా దళమునన్= నా సైన్యంలో; ద్రుపద= ద్రుపదమహారాజుయొక్క; అనీక= సైన్యంతో; విరాట= విరాటరాజుయొక్క; సైన్య= దండుతో; యాదవ= యదువంశంలో పుట్టినవారియొక్క; బల= సేనయొక్క; సంతానములతోడన్= సమూహాలతో; పెనఁగెదన్= యుద్ధం చేస్తాను; మీరు+ఎల్లన్= మీరందరుకలిసి; పాండుపుత్త్రులన్= పంచపాండవుల్ని; గెలువన్= జయించటానికి; పూనుఁడు= ప్రయత్నపడండి.

**తాత్పర్యం:** నేనూ, నా సైన్యం కలిసి ద్రుపద విరాట యాదవ సేనా సమూహాన్ని ఎదుర్కొని యుద్ధం చేస్తాము. తక్కిన మీరందరూ ఏకమై పాండవులను గెలవటానికి ప్రయత్నించండి.

**ఆ. నడికిరేయి వచ్చి నను నొవ్వ బలికినఁ । కలుగునయ్య జయము? గడఁగి నీవు**
**నడవు మనికి నెల్లి నా చేతి బలుపు సూ । చెదవుగాక వేయి సెప్పనేల?' 182**

**ప్రతిపదార్థం:** నడికిరేయి= అర్ధరాత్రివేళలో; వచ్చి= నా సమీపానికి వచ్చి; ననున్= నన్ను; నొవ్వన్= నొప్పి కలిగేట్లుగా; పలికినన్= మాటాడితే; జయము= గెలుపు; కలుగున్+అయ్య?= లభిస్తుందా?; నీవు; కడఁగి= ప్రయత్నించి; అనికిన్= యుద్ధానికి; నడవుము= బయలుదేరుము; వేయి= వెయ్యిమాటలు; చెప్పన్+ఏల?= చెప్పడం ఎందుకు?; ఎల్లి= రేపు; నా చేతి బలుపు= నా బాహుబలాన్ని; చూచెదవుగాక= చూస్తావులే.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! అర్ధరాత్రి సమయంలో వచ్చి నీవు నన్ను బాధకలిగేట్లుగా సూటిపోటి మాటలు మాట్లాడినావుకదా! దీని చేత గెలుపు కలుగుతుందా? నీవు రేపు యుద్ధానికి సన్నద్ధుడవై వెళ్ళుము. వేయి మాటలు పలకటం ఎందుకు? నా బాహుబలాన్ని రేపు నీవు చూస్తావులే!'

**క. అనినఁ బ్రియమంది నగరికిఁ । జని పతి సుఖనిద్ర సేసి సముచితసమయం**
**బున మేలు కాంచి కయ్యం । బున కాయిత మయ్యె మేను వొంగారంగాన్. 183**

**ప్రతిపదార్థం:** అనినన్= భీష్ముడు చెప్పగా; పతి= రాజు; ప్రియము+అంది= సంతోషపడి; నగరికిన్= తన రాజ భవనానికి; చని= వెళ్ళి; సుఖనిద్ర+చేసి= సుఖంగా నిద్రించి; సముచిత సమయంబునన్= తగిన వేళలో; మేలుకాంచి= నిద్రనుండి మేల్కొని; మేను= శరీరం; పొంగు+ఆరంగాన్= ఉబ్బగా; కయ్యంబునకున్= యుద్ధానికి; ఆయితము+అయ్యెన్= సిద్ధపడ్డాడు.

**తాత్పర్యం:** భీష్ముడన్న మాటలకు దుర్యోధనుడు సంతోషించి, నగరులోనికి వెళ్ళి, బాగా నిద్రపోయి, సకాలంలో లేచి, తన శరీరం ఉప్పొంగిపోతూండగా యుద్ధానికి తయారయ్యాడు.

**వ. ఇట్లు సన్నద్ధుం డయి బలంబుతో వెడలి నీ పుత్త్రుండు భీష్ము నుపలక్షించి భూపతిప్రకరంబులతో ని ట్లనియె. 184**

**ప్రతిపదార్థం:** నీ పుత్త్రుండు= నీ కొడుకు దుర్యోధనుడు; ఇట్లు చెప్పిన విధంగా; సన్నద్ధుండు+అయి= సిద్ధపడినవాడై; బలంబుతోన్= సైన్యంతో; వెడలి= బయలుదేరి; భీష్మున్= భీష్ముడిని; ఉపలక్షించి= చూచి; భూపతిప్రకరంబులతోన్= రాజుల సమూహముతో; ఇట్లు+అనియెన్= ఈ చెప్పబోయే విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు యుద్ధానికి సిద్ధపడి, కవచం తొడుగుకొని తన సేనతో వెళ్ళి, భీష్ముడిని చూస్తూ అక్కడ ఉండే రాజులందరితో ఈ విధంగా చెప్పాడు.

## భీష్ముని నవమదివస యుద్ధము (సం. 6-95-1)

తే. ' ఇతఁడు పాంచాలు రాదిగ నెల్ల బలముఁ । జంపి పాండుతనూజుల సమరభూమి
గెలువఁ గలవాఁడ నని రాత్రి పలికె నేఁడు । దఱిమి మనలావుఁ జేవయు మెఱయ వలయు.' 185

**ప్రతిపదార్థం:** ఇతఁడు= ఈ భీష్ముడు; పాంచాలురు+ఆదిగన్= ద్రుపద మహారాజు మొదలుగాగల; ఎల్లబలమున్= సకల సైన్యాన్ని; చంపి; సమరభూమిన్= యుద్ధరంగంలో; పాండుతనూజులన్= పాండవులను; గెలువన్+కలవాఁడన్+అని= గెలుస్తానని, రాత్రి= కడచిన రేయి; పలికెన్= చెప్పాడు; నేఁడు= ఈ దినం; తఱిమి; మనలావున్= మనసామర్థ్యం; చేవయున్= బలంకూడా; మెఱయవలయున్= ప్రకటించవలె.

**తాత్పర్యం:** 'ఈ భీష్ముడు రాత్రి నాతో ద్రుపద విరాట యాదవుల సైన్యాలను చంపి, యుద్ధరంగంలో అటుపైన పాండవుల గెలిచెదనని అన్నాడు. కాబట్టి మనందరి సామర్థ్యం, బలం ఈ దినమే వెల్లడి కావాలి' అన్నాడు.

క. అని యాడు తులువమాటలు విని । బీభత్సంబు సిగ్గు విపులవిషాదం
బును నొక్కపెట్ట పుట్టఁగ । ననిమిషతటినీతనూజుఁ డతిదుఃఖితుఁడై. 186

**ప్రతిపదార్థం:** అని; ఆడు= అని పలికే దుర్యోధనుడి యొక్క; తులువమాటలు= కుత్సితపు మాటలు; విని= ఆలకించి; అనిమిషతటినీ తనూజుఁడు= ఆకాశగంగానది కొడుకు- భీష్ముడు; బీభత్సంబు= రోత, సిగ్గు, లజ్జ; విపుల విషాదంబును= అధికమైన దుఃఖము; ఒక్కపెట్ట= ఒక్క సారిగా; పుట్టఁగన్= తనలో పుట్టగా; అతి దుఃఖితుఁడు+ఐ= చాలా దుఃఖం చెందినవాడై.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పలికిన అబద్ధపు మాటలు విన్నాడు భీష్ముడు. ఆయనలో ఒక్కుమ్మడిగా ఏవగింపు, లజ్జ, మనోదుఃఖం అధికంగా కలిగాయి.

వ. తన్నుం దాన యుపశమించుకొనియున్నం గనుంగొని కౌరవేశ్వరుండతని కన్నెఱింగినవాఁడై దుశ్శాసనునితో నిట్లనియె. 187

**ప్రతిపదార్థం:** తన్నున్= తనను(భీష్ముని); తాను+అ= తానే (భీష్ముడు); ఉపశమించుకొని= ఊరడింపచేసికొని; ఉన్నన్= ఉండగా; కనుంగొని= చూచి; కౌరవ+ఈశ్వరుండు= దుర్యోధనుడు; అతని= ఆ భీష్ముడి; కన్ను+ఎఱింగినవాఁడు+ఐ= జాడను తెలిసికొన్నవాడై; దుశ్శాసనునితోన్= తన తమ్ముడితో, ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు తనను తానే ఓదార్చుకొన్నాడు. దుర్యోధనుడు భీష్ముడి తీరును తెలిసికొని, దుశ్శాసనుడితో ఇట్లా అన్నాడు.

క. ' మనమెల్లఁ బితామహునొ । ద్దన యుండుద మదియుఁ గా కితనిముందటఁ బె
ట్టన వలయు శత్రుబలమ । ర్దను లిరువదిరెండువేలరథములవారిన్. 188

**ప్రతిపదార్థం:** మనము+ఎల్లన్= మనమందరం (దుర్యోధనాదులు); పితామహు+ఒద్దన్+అ= తాత భీష్ముడి దగ్గరే; ఉండుదము= ఉందాము; అదియున్+కాక= అంత మాత్రమే కాకుండా; ఇతని ముందటన్= ఈ భీష్ముడికి ముందుగా; శత్రుబల మర్దనులు= విరోధుల సైన్యాలను కొట్టగలిగినట్టి; ఇరువది రెండువేల రథములవారిన్= ఇరవై రెండువేలు రథికులను; పెట్టన వలయున్= ఉంచాలి.

**తాత్పర్యం:** 'మనమందరం భీష్ముడి దగ్గరే ఉందాము. అంతేకాదు, శత్రుసైన్యాలను బాగా కొట్టగలిగినట్టి ఇరవై రెండువేల రథికులను కూడ ఇతని ముందరే ఉంచాలి.

**వ. అని నియోగించిన నతండట్ల చేసె. నద్ధరణీశుండు గురుకృపాశ్వత్థామల నాలోకించి గాంగేయుం జూపి "సత్యవ్రతుండగునీతండు శిఖండిపై నేయనని మన మెత్తి విడియునాఁడ చెప్పట మీ రెఱుంగుదుర కాదె! యన్నీచునకు గోచరంబు గాకుండ నిమ్మహానుభావుం బొదివికొని రావలయు" ననిన వారలు నట్లకాకయని రయ్యమరనదీసూనుండు సర్వతోభద్రవ్యూహం బొనర్చె నందుఁ గృపాచార్యకృతవర్మ శల్యశకునిసుదక్షిణ సైంధవులును గురుకుమారులుం దానును ముందట నిలిచెఁ దదనుమతిం గుంభసంభవభూరిశ్రవో భగదత్తులు వలపటను, సోమదత్తద్రోణపుత్రవిందానువిందులు దాపటను హలాయుధాలంబుసశ్రుతాయువులు వెనుకను ద్రిగర్త ప్రకరపరివృతుం డై జననాథుండు నడుమను నిలిచి రంతకు మున్న కౌంతేయులు సైన్యసమేతంబుగా వెడలి రట్టియెడ నర్జునుండు మన మొగ్గరంబు సూచి ధృష్టద్యుమ్నున కి ట్లనియె. 189**

**ప్రతిపదార్థం:** అని= పైన చెప్పిన రీతిగా; నియోగించినన్= ఏర్పాటు చేయగా; అతండు= దుశ్శాసనుండు; అట్లు+అ= దుర్యోధనుడు చెప్పిన మాదిరిగానే; చేసెన్= ఏర్పాటు చేశాడు; ఆ+ధరణీశుండు= ఆ దుర్యోధనుడు; కృప+అశ్వత్థామలన్= కృపుడినీ, అశ్వత్థామను; ఆలోకించి= చూచి; గాంగేయున్= భీష్ముణ్ణి; చూపి= చూపించి; సత్యవ్రతుండు+అగు= సత్యమే వ్రతంగాగల; ఈతండు= ఈ భీష్ముడు; శిఖండి= శిఖండిమీద; ఏయన్+అని= బాణాలు వేయనని; మనము= మనము; ఎత్తి విడియునాఁడు+అ= దండెత్తి వచ్చిననాడే; చెప్పుట= చెప్పటాన్ని; మీరు= కృపాశ్వత్థామలు; ఎఱుంగుదురు+అ+కాదె!= మీరు తెలిసికొన్నదే కదా!; ఆ+నీచునకున్= హీనుడైన ఆ శిఖండికి; గోచరంబు కాకుండన్= కంటపడకుండా; ఈ+మహానుభావున్= గొప్ప ప్రభావం కలిగినట్టి భీష్ముడిని; పొదివికొని రావలయున్= క్రమ్ముకొని ఉండాలి; అనినన్= అనిచెప్పగా; వారలున్= ఆ కృపాశ్వత్థామలు కూడ; అట్లు+అ+కాక= అట్లే కానిమ్ము; అనిరి= అన్నారు; ఆ+అమరనదీసూనుండు= ఆకాశ గంగానది కొడుకు- భీష్ముడు; సర్వతోభద్ర వ్యూహంబున్= సర్వతోభద్రమనే మొగ్గరాన్ని; ఒనర్చెన్= చేశాడు; అందున్= ఆ మొగ్గరంలో; కృపాచార్య, కృతవర్మ, శల్య, శకుని, సుదక్షిణ; సైంధవులును, కురుకుమారులున్= కౌరవులున్నూ; తానును= భీష్ముడున్నూ; ముందటన్= మొగ్గరానికి ముందువైపు; నిలిచెన్= నిలిచాడు; తద్+అనుమతిన్= ఆ దుర్యోధనుడి ఆజ్ఞచొప్పున; కుంభసంభవ= ద్రోణుడు; భూరిశ్రవస్, భగదత్తులు-వీరు; వలపటను= కుడిభాగంలో; సోమదత్త= సోమదత్తుడు; ద్రోణపుత్ర= అశ్వత్థామ; వింద+అనువిందులు; దాపటను= ఎడమవైపునందు; హలాయుధ, అలంబుస, శ్రుతాయువులు; వెనుకను= వెనుకభాగంలోను; త్రిగర్త ప్రకరపరివృతుండు+ఐ= త్రిగర్త దేశపు గుంపుతో చుట్టబడి; జననాథుండు= రాజు దుర్యోధనుడు; నడుమను= మధ్యభాగంలోను; నిలిచిరి= నిల్చారు; అంతకు మున్న= అంతకుముందే; కౌంతేయులు= పాండవులు; సైన్య సమేతంబుగాన్= సేనతోకూడ; వెడలిరి= వచ్చారు; అట్టి ఎడన్= ఆ సమయంలో; అర్జునుఁడు= అర్జునుడు; మన= కౌరవులైన మనయొక్క; మొగ్గరంబున్= వ్యూహాన్ని; చూచి; ధృష్టద్యుమ్ననకున్= తమ సేనాని ధృష్టద్యుమ్నుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పైవిధంగా చెప్పి, భీష్ముడిని చూపిస్తూ , కృపాశ్వత్థామలతో ఇట్లా అన్నాడు. 'ఈ సత్యవ్రతుడు శిఖండిమీద బాణప్రయోగం చేయనని మనం - దండెత్తి వచ్చిననాడే చెప్పాడు. ఆ సంగతి మీకు తెలుసుకదా! ఆ నీచుడు శిఖండి ఈయన కంటబడకుండా మనం ఈయనను కమ్ముకొని ఉండాలి'. వారు ఆ మాటకు సమ్మతించారు. భీష్ముడు సర్వతోభద్రవ్యూహాన్ని ఏర్పాటు చేశాడు. ఆ వ్యూహంలో కృపాచార్యుడు, కృతవర్మ, శల్యుడు, శకుని, సుదక్షిణుడు, సైంధవుడు, కౌరవులు, భీష్ముడు ముందుభాగంలో నిలిచారు. భీష్ముడి ఆజ్ఞ చొప్పున ద్రోణుడు, భూరిశ్రవుడు, భగదత్తుడు- కుడి భాగంలోను, సోమదత్తుడు, అశ్వత్థామ, విందుడు, అనువిందుడు- ఎడమవైపున నిలుచున్నారు. హలాయుధుడు, అలంబుసుడు, శ్రుతాయువు- వీరు వెనుక వైపున ఉన్నారు. త్రిగర్త సైన్యంతో చుట్టబడి, దుర్యోధనుడు మధ్యభాగంలో నిలిచాడు. అంతకుమునుపే పాండవులు సేనలతో గూడ బయలుదేరారు. అప్పుడు అర్జునుడు మన సర్వతోభద్రవ్యూహాన్ని చూచి ధృష్టద్యుమ్నుడితో ఇలా అన్నాడు.

**విశేషం :** సర్వతోభద్రవ్యూహం నాలుగువైపుల నుండి శత్రువులను చొరనీక ఎదిరించడానికి అనువైనది.

**తే. ' కంటె గాంగేయు? నతనిచక్కటి శిఖండిఁ । బెట్టు మీతని మనమెల్లఁ బిండుగట్టి**
**పొదివికొనివత్త మివ్విధంబునకుఁ దగ ద । ళంబుగా మోహరింపు బలంబు నెల్ల.' 190**

**ప్రతిపదార్థం:** గాంగేయున్= భీష్ముణ్ణి; కంటె?= చూచావా?; అతని చక్కటిన్= ఆ భీష్ముడుండే దిక్కున; శిఖండిన్= శిఖండిని; పెట్టుము= నిలబెట్టుము; మనము+ఎల్లన్= మనమందరం; ఈతనిన్= ఈ శిఖండిని; పిండుగట్టి= గుంపుగా; పొదివికొని= క్రమ్ముకొని; వత్తము= వద్దాము; ఈ+విధంబునకున్= ఈ విధానానికి; తగన్= తగినట్టుగా; బలంబు+ఎల్లన్= మన సైన్యాన్నంతా; దళంబు+కాన్= దట్టంగా; మోహరింపు(ము)= సిద్ధంచేయుము.

**తాత్పర్యం:** 'ధృష్టద్యుమ్నా! భీష్ముడిని చూచావా? అతడికి ఎదురుగా ఈ శిఖండిని నిలబెట్టుము. ఇతడిచుట్టూ మనమంతా కమ్ముకొని గుంపుగానిలుద్దాము. దీనికి తగినట్టుగా నీవు మన సైన్యాన్ని దట్టంగా మోహరింపచేయుము'.

**వ. అనిన విని యతం డట్ల చేయుదు నని సాత్యకి విరాటులు వలపటను, అభిమన్యు పాంచాల కేకయులు దాపటను, నకులసహదేవ ద్రౌపదేయపురస్సరుండైన యుధిష్ఠిరుండు నడుమను, జేకితానకుంతి భోజులు వెనుకంగా నొనర్చి యగ్రభాగంబున శిఖండి నునిచి యతనికెలంకుల డాసి భీమసేన ఘటోత్కచు లొక్కవలనను, బార్థుండుఁ దాను నొక్కదిక్కున నిలిచి తక్కినయోధవీరులం గలయం జేర్చి గట్టిమొనగా నమర్చె ని ట్లుభయ సైన్యంబులుం బన్ని భేరీభాంకారశంఖాదినిస్వనగర్జాస్ఫూర్జిత బహుళంబుగా నొండొంటిం దాఁకె నట్టి సమయంబున. 191**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; అట్లు+అ+చేయుదున్+అని= అర్జునుడు చెప్పిన విధంగానే వ్యూహం పన్నుతానని చెప్పి; సాత్యకి విరాటులు= సాత్యకి, విరాటుడు; వలపటను= కుడివైపునందు; అభిమన్యు; పాంచాల, కేకయులు; దాపటను= ఎడమప్రక్కన; నకుల= నకులుడు; సహదేవ= సహదేవుడు; ద్రౌపదేయ పురస్సరుండు+ఐ= ద్రౌపది కొడుకులు ముందు నిలిచినవారుగా; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; నడుమను= మధ్యభాగంలోను; చేకితాన కుంతిభోజులు; వెనుకను+కాన్= వెనుకవైపు ఉండేటట్లుగా; ఒనర్చి= చేసి; అగ్రభాగంబునన్= ముందుభాగంలో; శిఖండిన్= శిఖండిని; ఉనిచి= పెట్టి; అతని= ఆ శిఖండియొక్క; కెలంకులన్= రెండు ప్రక్క భాగాలలో; డాసి= సమీపించి; భీమసేన ఘటోత్కచులు= భీముడు, ఘటోత్కచుడున్నూ; ఒక్కవలనను= ఒక ప్రక్కను; పార్థుండున్= అర్జునుడున్నూ; తాను= ధృష్టద్యుమ్నుడున్నూ; ఒక దిక్కునన్= ఒక ప్రక్క; నిలిచి= నిలబడి; తక్కిన= మిగిలిన; యోధవీరులన్= యోధులను, శూరులను; కలయన్= గుంపుగా; చేర్చి= చేసి; గట్టిమొనగాన్= అసాధ్యమైన వ్యూహంగా; ఒనర్చెన్= చేశాడు; ఇట్లు= ఈ విధంగా; ఉభయ సైన్యంబులున్= రెండు సేనలున్నూ; పన్ని= యుద్ధానికి, సిద్ధపడి; భేరీ= దుందుభులనే వాద్యముల యొక్క;భాంకార= భాం భాం- అనే శబ్దాలతోను; శంఖ+ఆది= శంఖములోనుగా గలవాని యొక్క; నిస్వన= ధ్వనులతోను; గర్జా= సింహనాదాలయొక్క; స్ఫూర్జిత= అదరుటచేత; బహుళంబుగాన్= అధికంగా; ఒండొంటిన్= ఒక సైన్యాన్ని మరోసైన్యం; తాఁకెన్= ఎదిరించినవి; అట్టి సమయంబున.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు అర్జునుడు అడిగిన ప్రకారం కౌరవుల వ్యూహానికి ప్రతిగా ఒక వ్యూహాన్ని ఏర్పరచాడు. దానిలో కుడివైపున సాత్యకి, విరాటుడు; ఎడమవైపున అభిమన్యుడు, ద్రుపదుడు, కేకయులు, నకులుడు, సహదేవుడు, ఉపపాండవులు. వీరి వెనుక ధర్మరాజు, ధర్మరాజుకు వెనుకగా చేకితానుడు, కుంతిభోజుడు, ముందు భాగంలో శిఖండి, శిఖండికి ఒక ప్రక్కన భీముడు, ఘటోత్కచుడు, శిఖండికి మరొక ప్రక్కన అర్జునుడు, ధృష్టద్యుమ్నుడు,

మిగిలిన యోధులు వేరే వేరే చోట్లలో గుంపులుగా- ఈ విధంగా ఆ వ్యూహరచన జరిగింది. ఆ రెండు సేనలూ యుద్ధానికి సిద్ధమై సింహనాదాలతో, దుందుభుల, శంఖాల ధ్వనులతో కూడినవై, పరస్పరం ఎదుర్కొన్నాయి.

**క. చెంగట నభిమన్యుండు । పిశంగతురంగప్రచారచంచద్రథుఁడై**
**పొంగి మనదిక్కు ప్రజమీఁ । దం గవిసెం జిచ్చు దూది దరికొనుమాడ్కిన్. 192**

**ప్రతిపదార్థం:** అభిమన్యుఁడు= సుభద్రకొడుకు; చెంగటన్= దగ్గరలో; పిశంగ= కపిల వర్ణపు; తురంగ= గుర్రాలయొక్క; ప్రచార= సంచారాలచేత; చంచత్= కదులుతున్న; రథుఁడు+ఐ= రథంకలవాడై; పొంగి= గర్వించి; మనదిక్కు= మనపక్షంలో గల; ప్రజమీఁదన్= జనాలమీద; చిచ్చు= అగ్గి; దూదిన్= పత్తిని; దరికొనుమాడ్కిన్= కాల్చే మాదిరి; కవిసెన్= పర్వినాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు, కపిల వర్ణపు గుర్రాలను పూన్చిన రథాన్నెక్కి మన సైన్యం సమీపంలో చిత్రంగా తిరుగుతూ ఉప్పొంగి, అగ్గి దూదిని కాల్చే మాదిరిగా మన సేనలను మార్కొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు గవిసి. 193**

**తాత్పర్యం:** ఈ విధంగా ఎదిరించి.

**తే. మెఱసి మండలచారి యై కొఱవి ద్రిప్పి । నట్లు గురుకృపసింధురాజాదు లైన**
**యోధవీరులు వెగడంద నులివు మిగిలి । తరువఁబడు నబ్ధిక్రియ సేన దిరుగఁబడఁగ. 194**

**ప్రతిపదార్థం:** మండలచారి+ఐ= అభిమన్యుడు మండలాకారంలో నిలబడి; మెఱసి= ప్రకాశించి; కొఱవిన్= కొరవికట్టెను; త్రిప్పిన+అట్లు= త్రిప్పిన విధంగా; గురు= ద్రోణుడు; కృప= కృపాచార్యుడు; సింధురాజు= సైంధవుడు; ఆదులు+ఐన= ప్రధానులుగాగల; యోధవీరులు= యోధులైన శూరులు; వెగడు+అందన్= తల్లడపాటు చెందగా; ఉలివుమిగిలి= హెచ్చైన శబ్దంతో; తరువన్+పడు= చిలుకబడేటువంటి; అబ్ధిక్రియన్= సముద్రం వలె; సేన= మన కౌరవసైన్యం; తిరుగన్+పడఁగన్= తల్లడిల్లి పోగా యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు వెలుగొందుతూ మండలాకారంలో చరిస్తూ కొరవి త్రిప్పినట్లుగా ద్రోణుడు, కృపుడు, సైంధవుడు మొదలైన యుద్ధ వీరులు తల్లడిల్లగా హెచ్చైన శబ్దంతో చిలుకబడుతున్న సముద్రంచందంగా కౌరవసేన కలత నొందగా (మీది వచనంతో అన్వయం)

**వ. ఇట్లు మాఱు లేక తఱుముచున్న సౌభద్రుం గనుంగొని కౌరవపతి యలంబుసుతో నిట్లనియె 'వీఁడు రెండవ యర్జునుం డై మనబలంబులఁ గలంచుచున్నవాఁ డర్జుననందను నెదుర్కొన నీవకాని మాఱు లేదేము పాండవుల కడ్డపడియెదము నీవు వీనిం బొదివి భంజింపుము.' 195**

**ప్రతిపదార్థం:** కౌరవపతి= కురురాజు దుర్యోధనుడు; ఇట్లు= చెప్పిన విధంగా; మాఱులేక= ఎదురులేకుండా; తఱుముచున్+ఉన్న= కవియుచున్న; సౌభద్రున్= సుభద్రకొడుకు అభిమన్యుడిని; కనుంగొని= చూచి; అలంబుసుతోన్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; వీఁడు= ఈ అభిమన్యుడు; రెండవ అర్జునుఁడు+ఐ= రెండో అర్జునుడుగా; మనబలంబులన్= మన కౌరవులయొక్క సైన్యాలను; కలంచుచున్+ఉన్నవాఁడు= కలత పెడ్తున్నాడు; అర్జుననందనున్= అర్జునుడి కొడుకుఅభిమన్యుడిని; ఎదుర్కొనన్= ఎదిరించడానికి; నీవు+అ+కాని= నీవే తప్ప; మాఱులేదు= ఎదురులేరు; ఏము= మేము; పాండవులకున్= పాండురాజు కుమారులకు; అడ్డపడియెదము= అడ్డ తగుల్తాము; నీవు= నీవు (అలంబుసుడు); వీనిన్= ఈ అభిమన్యుడిని; పొదివి= కవిసి; భంజింపుము= ఓడించుము.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తన సైన్యాన్ని అభిమన్యుడు తరమటాన్ని చూచి, అలంబుసుడితో 'వీడు రెండో అర్జునుడివలె తయారై మన సైన్యాన్ని కలత పెడుతున్నాడు. వీడిని ఎదిరించటానికి నీవు తప్ప వేరే ఎవరూ లేరు. మేము పాండవులను అడ్డగిస్తాం. నీవు వీడిని ఓడించుము.'

**అలంబసుఁడు దుర్యోధన ప్రేరితుండై యభిమన్యునిపైఁ గవియుట (సం. 6-96-24)**

**క. అనవుడు నతండు దుర్దమ । దనుజావలి మున్ను గాఁగఁ దఱిమెం గుంతీ**
**తనయబలము గారాకులు । పెనుగాలిం దూలునట్లు భీతిం జెదరన్. 196**

**ప్రతిపదార్థం:** అనవుడున్= దుర్యోధనుడు పై విధంగా చెప్పగా; అతండు= ఆ అలంబసుడు; కారు+ఆకులు= పండిపోయిన ఆకులు; పెనుగాలిన్= పెద్దగాలికి; తూలు+అట్లు= కొట్టుకుపోయే మాదిరి; దుర్దమదనుజావలి= జయింపరాని రాక్షసుల గుంపు; మున్ను+కాఁగన్= తన ముందుండునట్లుగా; కుంతీ తనయుల బలమున్= పాండవుల సైన్యాన్ని; భీతిన్= భయంతో; చెదరన్= చెదిరిపోయేటట్లుగా; తఱిమెన్= వెంబడిబడి పరుగులెత్తించాడు.

**తాత్పర్యం:** దుర్యోధను డా విధంగా చెప్పగానే, అలంబుసుడు అజేయులైన రాక్షసుల మూకను తన ముందు పెట్టుకొని పాండవ సేనను తరిమాడు. తుఫానుగాలికి పండుటాకులు ఎక్కడికో కొట్టుకుపోయేట్టు పాండవ సైన్యం మూలమూలకు పారిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. అప్పుడు ద్రౌపదేయులు రయంబున నడ్డము సొచ్చి దైత్యులం**
**గుప్పలుగా మహిం బెలుచఁ గూల్చిన దానవనాథుఁ డమ్ములం**
**గప్పెఁ గడంగి వారల నఖండపరాక్రమలీల వారు వాఁ**
**డొప్పటి తేరి కూబరమయూఁతగ వ్రాలఁగనేసి యార్చినన్. 197**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ద్రౌపదేయులు= ద్రౌపది కొడుకులు, రయంబునన్= వేగంతో; అడ్డము+చొచ్చి= అడ్డంగా చొరబడి; దైత్యులన్= రాక్షసులను; కుప్పలు+కాన్= కుప్పలుగా; పెలుచన్= సులువుగా; మహిన్= నేలమీద; కూల్చినన్= పడద్రోయగా; దానవనాథుఁడు= రాక్షసరాజు అలంబుసుడు; కడంగి= ప్రయత్నించి; వారలన్= ద్రౌపది కొడుకులను; అమ్ములన్= బాణాలతో, కప్పెన్= కప్పివేశాడు; వారు= ఆ ద్రౌపది కొడుకులు; అఖండ పరాక్రమలీలన్= అంతులేని పరాక్రమం యొక్క విలాసంతో; వాఁడు= ఆ అలంబుసుడు; ఒప్పు+అఱి= సౌందర్యం పోగొట్టుకొని; తేరి కూబరము+అ= రథంయొక్కనొగ; ఊఁతగన్= ఆధారంగా; వ్రాలఁగన్= వాలిపోయేట్టుగా; ఏసి= బాణాలు ప్రయోగించి; ఆర్చినన్= బొబ్బలు పెట్టగా.

**తాత్పర్యం:** అలంబుసుడి దెబ్బకు పాండవసేన చెల్లాచెదరైపోయినప్పుడు ద్రౌపది కొడుకులు వేగంగా అడ్డంగా చొరబడి, ఆ రాక్షసుల మూకను సునాయాసంగా కుప్పతిప్పలుగా నేలకూల్చారు. అప్పుడు అలంబుసుడు ఆ ద్రౌపదేయులను బాణాలతో కప్పివేశాడు. అప్పు డా ద్రౌపది కొడుకులు, ఆ రాక్షసుడు అందం చెడి, రథపు నొగను ఆధారం చేసికొని, ఒరిగిపోయేటట్లుగా బాణాలతో కొట్టి, బొబ్బలు పెట్టగా.

**క. ఆలోనన తెప్పిఱి లయ కాలుండును । బోలె నసుర గన్నుల నిప్పుల్**
**రాలఁగ వారలసిడములు । నేలం బడనేసి చాపనికరము ద్రుంచెన్. 198**

**ప్రతిపదార్థం:** ఆలోనన్+అ= అంతలోనే; అసుర= రాక్షసుడు- అలంబుసుడు; తెప్పిఱి= తేరుకొని; లయకాలుండునున్+పోలెన్= ప్రళయకాలంలోని యమధర్మరాజువలె; కన్నులన్= కన్నులనుండి; నిప్పుల్= అగ్నులు; రాలఁగన్= రాలుచుండగా; వారల= ఆ ఉపపాండవుల యొక్క; సిడములు= ధ్వజాలు; నేలన్+పడన్+ఏసి= నేలమీద పడేటట్లుగా; ఎన్నో బాణాలు ప్రయోగించి; చాపనికరమున్= ధనుస్సుల సముదాయాన్ని; త్రుంచెన్= విరుగగొట్టాడు.

**తాత్పర్యం:** అంతలోనే అలంబుసుడు తేరుకొని ప్రళయకాలంలోని యముడి మాదిరి కండ్ల నుండి నిప్పులు కక్కుతూ, బాణాలతో కొట్టి వారి ధ్వజాలను నేలకూల్చాడు. వారి ధనుస్సులను కూడా తునుకలు చేశాడు.

**వ. త్రుంచి నవ్వుచు.** **199**

**ప్రతిపదార్థం:** త్రుంచి= తునకలు చేసి; నవ్వుచు(న్)= ఎగతాళి చేస్తూ.

**తాత్పర్యం:** అలంబుసుడు ద్రౌపది కొడుకుల విండ్లను త్రుంచివేసి ఎగతాళిగా నవ్వుతూ. (తరువాతి పద్యంతో అన్వయం)

**తే. ఒకని నొకని నైదైదు మహోగ్ర భాసు । రాస్త్రముల నేసి నొంచిన నతనిమదము**
**సొంపు సోదరవ్యథయును జూచి । యడరె నప్పు డాతనిపై సుభద్రాత్మజుండు.** **200**

**ప్రతిపదార్థం:** ఏచి= విజృంభించి; ఒకనిన్+ఒకనిన్= ఒక్కొక్కడినీ; ఐదు+ఐదు= ఐదేసి చొప్పున; మహా+ఉగ్రభాసుర+అస్త్రములన్= గొప్పవైన, భయం గొలుపుతూ ప్రకాశిస్తూండే ఆయుధాలతో; నొంచినన్= బాధకలిగేటట్లు చేయగా; అప్పుడు; సుభద్రా+ఆత్మజుండు= సుభద్ర కొడుకు అభిమన్యుడు; అతని మదమున్= ఆ రాక్షసుడి మదాన్ని; సొంపు= అందాన్ని; సోదర వ్యథయున్= అన్నదమ్ముల-కుంతీపుత్రుల కష్టాన్ని; చూచి; ఆతనిపైన్= ఆ రాక్షసుడి మీదికి; అడరెన్= ఉరికాడు.

**తాత్పర్యం:** అలంబుసుడు ఒక్కొక్కడి మీద అయిదేసి చొప్పున కఠినమైన, మండుతున్న బాణాలను వేసి, ఆ ద్రౌపదేయులను చాలా నొప్పించాడు. అభిమన్యుడు ఆ రాక్షసుడి మదాన్ని, అందాన్ని చూశాడు. తన అన్నదమ్ముల కష్టాన్ని కనిపెట్టి, ఆ రాక్షసుడి మీదికి దూకాడు.

**వ. అప్పు డుభయ సైన్యంబులవారును వెఱఁగంది.** **201**

**ప్రతిపదార్థం:** అప్పుడు ఉభయ సైన్యంబులవారును= కౌరవ పాండవ సేనలలో ఉండే సైనికులు; వెఱఁగు+అంది= ఆశ్చర్యంచెంది.

**తాత్పర్యం:** ఆ సమయంలో కౌరవ, పాండవసేనలలోని సైనికులు ఆశ్చర్యం చెంది. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. 'దనుజుఁడు మాయాధికుఁ డ । ర్జునతనయుండు దివ్యశరధరుం డెట్లగునో?**
**యనుచుండఁగ నయ్యిరువురు । ననిసేసిరి వృత్రవాసవాకృతి దోఁపన్.** **202**

**ప్రతిపదార్థం:** దనుజుఁడు= రాక్షసుడు- అలంబుసుడు; మాయా+అధికుఁడు= మాయచేత గొప్పవాడు; అర్జున తనయుఁడు= అర్జునుడి కొడుకు అభిమన్యుడు; దివ్యశరధరుండు= అమోఘములైన బాణాలు కలవాడు; ఎట్లు+అగును+ఓ?= ఫలితం ఎట్లా ఉంటుందో?; అనుచుండఁగన్= అనుకొంటూండగా; ఆ+ఇరువురు= ఆ ఇద్దరు (అలంబుసుడు, అభిమన్యుడు); వృత్రవాసవ+ఆకృతిన్= వృత్రాసురుడు, ఇంద్రుడు- వీరి రూపాలు ; తోఁపన్= తోచేటట్లుగా; అని= యుద్ధాన్ని; చేసిరి= చేశారు.

**తాత్పర్యం:** 'మాయలమారివాడు అలంబుసుడు- మంచి మంచి బాణాలు కలవాడు అభిమన్యుడు. మరి వీరిద్దరిలో ఎవడిని, విజయలక్ష్మి వరిస్తుందో?' అని కౌరవపాండవసేనలలోని వారంతా ఆశ్చర్యంగా అనుకొంటూండగా

వారిద్దరూ యుద్ధానికి తలపడ్డారు. అలంబుసుడు వృత్రుడనే రాక్షసుడి మాదిరి అనిపించాడు. అభిమన్యుడు ఇంద్రుడు మాదిరి అగుపించాడు.

**క. ఇతరేతరశరకృతశో ၊ ణిత ధారలు నిగుడ నపుడు నిర్భరదావ**
**ద్యుతు లడరఁ బొలుచునగముల ၊ గతిఁ బొలిచిరి వార లప్రకంపోన్నతు లై. 203**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ యుద్ధ సమయంలో; ఇతర+ఇతర= ఒండొరులయొక్క; శర= బాణాలచేత; కృత= చేయబడ్డ; శోణిత ధారలు= నెత్తుటి యొక్క ధారలు= పైనుండి కిందికి జారే చాళ్ళు; నిగుడన్= అధికంకాగా; నిర్భర= ఓర్చుకోడానికి సాధ్యంకాని; దావ= కార్చిచ్చు యొక్క; ద్యుతులు= మంటలు; అడరన్= వ్యాపించగా; పొలుచు= ఒప్పునట్టి; నగములగతిన్= పర్వతాల మాదిరి; వారలు= అలంబసుడు, అభిమన్యుడున్నూ; అప్రకంప+ఉన్నతులు+ఐ= అచలులై; పొలిచిరి= ఒప్పినారు.

**తాత్పర్యం:** ఆ అలంబసుడు, అభిమన్యుడు ఒకరిపై ఒకరు బాణాలు వేసికోవటం వల్ల, నెత్తుటి కాల్వలు వారి శరీరాలపై నుండి కిందికి కారటంవల్ల, నిక్కి నిశ్చలంగా నిలబడ్డ ఆ వీరులిద్దరు కార్చిచ్చు అలముకొన్న పర్వతాలను పోలి ఉన్నారు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. దనుజేశ్వరుండు మాయం ၊ బొనరించినఁ దమము గవిసె భూనాయక ! ఫ**
**ల్గున సుతుఁడు భాస్కరాంబక ၊ మున వెలుఁ గొనరించె సురసమూహము వొగడన్. 204**

**ప్రతిపదార్థం:** భూనాయక!= భూమికి ప్రభువైన ధృతరాష్ట్ర మహారాజా!; దనుజ+ ఈశ్వరుండు= రాక్షసులకు రాజైన అలంబుసుడు; మాయన్= మాయను (ఇంద్రజాలాన్ని); పొనరించిన= చేయగా; తమము= చీకటి; కవిసెన్= కమ్ముకొన్నది; ఫల్గున సుతుఁడు= అర్జునుడి కొడుకు; సురసమూహము= దేవతల గుంపు; పొగడన్= పొగడగా; భాస్కర+అంబకమునన్= సూర్యుడు దేవతగా ఉన్నట్టి బాణంతో; వెలుఁగున్+ఒనరించెన్= వెలుతురు వచ్చేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** ఆ రాక్షసుడు పన్నిన మాయచేత ఆ యుద్ధభూమినంతా చీకటి దట్టంగా కమ్ముకొన్నది. అప్పుడు అభిమన్యుడు సూర్యసంబంధమైన అస్త్రాన్ని ప్రయోగించి ఆ చీకటినంతా పటాపంచలు చేశాడు. ఆకాశాన్నుండి యుద్ధాన్ని చూస్తున్న దేవతలందరూ అభిమన్యుడి శౌర్యాన్ని ఎంతో మెచ్చుకొన్నారు.

**తే. అసుర వెండియుఁ బెక్కు మాయలు ఘటింప ၊ శక్ర పౌత్రుండు దివ్యాస్త్రజాల మడరఁ**
**జేసి యన్నింటి నడఁగించి చెలఁగి నొంప ၊ రథము డిగి పాఱెఁ బెలుచ నా రాక్షసుండు. 205**

**ప్రతిపదార్థం:** అసుర= రాక్షసుడు అలంబుసుడు; వెండియున్= ఇంకా కూడా; పెక్కు మాయలు= పలు రకాలైన మాయలను; ఘటింపన్= చేయగా; శక్రపౌత్రుండు= ఇంద్రుడి మనుమడు- అభిమన్యుడు; దివ్య+అస్త్రజాలము= దేవ సంబంధాలైన ఆయుధాల సమూహాన్ని; అడరన్+చేసి= వ్యాపింపచేసి; అన్నింటిన్= రాక్షసుడు చేసిన మాయలన్నిటిని; అడఁగించి= రూపుమాపి; చెలఁగి= విజృంభించి; నొంపన్= ఆ రాక్షసుడిని బాధించగా; ఆ రాక్షసుండు= ఆ అలంబుసుడు; పెలుచన్= శీఘ్రంగా; రథము డిగి= తేరునుండి కిందికి దిగి; పాఱెన్= పరుగెత్తాడు.

**తాత్పర్యం:** అలంబుసుడు ఇంకా ఎన్నో మాయలు చేశాడు. అభిమన్యుడు వాటినన్నిటినీ దివ్యాస్త్రాలు ప్రయోగించి మటుమాయం చేశాడు. వాడికి బాగా నొప్పి కల్గించాడు. అలంబుసుడు ఏమీ చేయలేక శీఘ్రంగా రథాన్నుండి క్రిందికి దిగి, పారిపోయాడు.

**క. రక్కసుఁడు విఱిగినం గడు । నుక్కున సౌభద్రుఁ డడరునురవడి గని న**
**ల్దిక్కులఁ బఱచెం దమలోఁ । జిక్కువడుచుఁ గౌరవేంద్రుసేనలు భీతిన్. 206**

**ప్రతిపదార్థం:** రక్కసుఁడు= రాక్షసుడు అలంబుసుడు; విఱిగినన్= ఓడిపోగా; కడున్= అధికమైన; ఉక్కునన్= శౌర్యంతో; సౌభద్రుఁడు= అభిమన్యుడు; అడరు= అతిశయించే; ఉరవడిన్= అతివేగాన్ని; కని= చూచి; కౌరవ+ఇంద్రుసేనలు= దుర్యోధనుడి సైన్యాలు; భీతిన్= భయంతో; తమలోన్= తమలోతాము; చిక్కు+పడుచున్= కష్టపడుతూ; నలు+దిక్కులన్= నాలుగు దిక్కులకు; పఱచెన్= పరుగెత్తాయి.

**తాత్పర్యం:** అలంబుసుడు అభిమన్యుడి ధాటికి ఓడిపోయాడు. అంతటా అతిశయించిన అభిమన్యుడి వేగానికి తట్టుకోలేక, కౌరవ సైన్యమంతా తమ తమ మనస్సుల్లో చాలా సంకటపడుతూ, దిక్కులకు పరుగెత్తి వెళ్ళారు.

**వ. అప్పుడు పెక్కండ్రు రథికులతోడం గూడి గాంగేయుం డభిమన్యు పయిం గవిసిన. 207**

**ప్రతిపదార్థం:** అప్పుడు= కౌరవసేన పారిపోయినప్పుడు; గాంగేయుండు= భీష్ముడు; పెక్కండ్రు= పలువురు, రథికులతోడన్= రథంలో కూర్చుని యుద్ధం చేసేవారితో; కూడి= చేరి; అభిమన్యుపయిన్= అభిమన్యుడి మీదికి; కవిసినన్= పర్వగా.

**తాత్పర్యం:** అభిమన్యుడి ధాటికి తట్టుకోలేక కౌరవసేన చెల్లాచెదరుకాగా, భీష్ముడు చాలామంది రథికులను వెంటవేసికొని అభిమన్యుడి మీదికి ఎగబడ్డాడు.

**తే. అతఁడు దానికిఁ దలఁకక యందఱకును । నన్నిరూపు లై పోరంగ నర్జునుండు**
**సరభసంబుగ భీష్ముపై నురవడింపఁ । బొంగి యిరువాఁగు నిరువురఁ బొదివె బెరసి. 208**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ అభిమన్యుడు; దానికిన్= ఆ భీష్ముడి దెబ్బకు; తలఁకక= చలించక(భయపడక); అందఱకును= భీష్ముడు మొదలైన రథికులకందరికిని; అన్ని+రూపులు+ఐ= ప్రతివాడికి ఒక్కొక్క అభిమన్యుడుగా తోపచేసి; పోరంగన్= యుద్ధం చేస్తూ ఉండగా; అర్జునుండు= అర్జునుడు; భీష్ముపైన్= భీష్ముడు మీదికి; సరభసంబుగన్= వేగంతో; ఉరవడింపన్= తొందరపడగా; ఇరువాఁగున్= రెండు సైన్యాలు; పొంగి= గర్వంపొంది; ఇరువురన్= భీష్ముడిని; అర్జునుడిని; బెరసి= దగ్గరగా చేరి; పొదివెన్= క్రమ్ముకొన్నవి.

**తాత్పర్యం:** ఆ అభిమన్యుడు భీష్ముడి ధాటికి ఏ మాత్రం చలించకుండా నిలబడి, తనమీదికి కవిసే వారికందరికీ అదే సంఖ్యగల అభిమన్యులుగా కనబడి చాకచక్యంగా యుద్ధం చేస్తూ వచ్చాడు. తన కొడుకు పాటు చూచి, అర్జునుడు వేగంగా భీష్ముడిపైకి ఎత్తివచ్చాడు. అప్పుడు కౌరవుల పాండవుల సైన్యాలు గర్వించి, కౌరవసైన్యాలు భీష్ముడి దగ్గరకు, పాండవ సైన్యాలు అర్జునుడి దగ్గరకు చేరుకొని, క్రమ్ముకొన్నాయి.

**వ. అట్టి సంకులసమరంబున నభిమన్యుపై నడరు కృపాచార్యుం దాఁకి సాత్యకి బెడిదంపునారసంబు లేసిన వాని నన్నింటిని నశ్వత్థామ తునిమి యతని విల్లు ద్రుంచినం గోపించి. 209**

**ప్రతిపదార్థం:** అట్టి= ఆ విధమైన; సంకుల సమరంబునన్; అభిమన్యుపైన్= అభిమన్యుడి మీదికి; అడరు= విజృంభిస్తున్న; కృపాచార్యున్= కృపుని; సాత్యకి= సాత్యకి; తాఁకి= మార్కొని; బెడిదంపు నారసంబులు= భయంకరాలైన బాణాలు; ఏసినన్= వేయగా; వానిన్=ఆ బాణాలను; అన్నింటిన్= అన్నిటిని; అశ్వత్థామ= ద్రోణుడి కొడుకు; తునిమి= తునుకలు చేసి; అతనివిల్లున్= ఆ సాత్యకి యొక్క విల్లును; త్రుంచినన్= విరిచివేయగా; కోపించి= (సాత్యకి) కోపపడి.

**తాత్పర్యం:** రెండు సైన్యాల వారూ కలగా పులగంగా కలిసిపోయి యుద్ధంచేసే సమయంలో సాత్యకి, అభిమన్యుడిపైకి దూకే కృపాచార్యుడిని ఎదిరించి, కఠోరాలైన బాణాలు ప్రయోగించాడు. వాటిని అన్నిటినీ అశ్వత్థామ తుంటలు చేసి, సాత్యకి విల్లును కూడా విరిచివేశాడు. దానికి సాత్యకి ఆగ్రహించి.

**క. ఆ సాత్యకి వేఱొక వి। ల్లాసురగతి నెత్తి యుగ్రమగు నారాచం**
**బేసిన నాతఁడు కేతు। వ్యాసక్తుండయ్యె మూర్ఛవచ్చి నరేంద్రా! 210**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ధృతరాష్ట్ర మహారాజా! ఆ సాత్యకి; వేఱు+ఒక= మరియొక; విల్లు= ధనువును; ఆసురగతిన్= రాక్షసంగా; ఎత్తి= తీసికొని; ఉగ్రము+అగు= భయంకరమైన; నారాచంబు= బాణాన్ని; ఏసినన్= వేయగా; ఆతఁడు= ఆ అశ్వత్థామ; మూర్ఛవచ్చి= మూర్ఛతగిలి; కేతువ్యాసక్తుండు+అయ్యెన్= ధ్వజానికి ఆనుకొన్నాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సాత్యకి మరొక విల్లు తీసికొని, రక్కసితనంగా కర్కశమైన ఒక బాణాన్ని అశ్వత్థామ మీదికి ప్రయోగించారు. వెంటనే అశ్వత్థామ మూర్ఛపోయి, తనతేరు ధ్వజానికి అంటుకుపోయాడు.

**క. ఆలోనన తెలిసి మెఱుఁగు। వాలిక తూ పాతఁ డతని వక్షమునడుమం**
**గీలించి సిడము గ్రక్కున। నేలం బడనేసి యార్చె నింగి వడంకన్. 211**

**ప్రతిపదార్థం:** ఆలోనన్+అ= అంతలోపలనే; ఆతఁడు= ఆ అశ్వత్థామ; తెలిసి= తెలివినిపొంది; మెఱుఁగు= తళతళలాడే; వాలిక= పదునైన; తూపు= బాణాన్ని; అతని= ఆ సాత్యకియొక్క; వక్షము= రొమ్ముయొక్క; నడుమన్= మధ్యభాగంలో; కీలించి= గ్రుచ్చి సిడము= ధ్వజము; గ్రక్కునన్= వెంటనే; నేలన్+పడన్+ఏసి= నేలకూల్చి; నింగి= ఆకాశము; వడంకన్= వడకేటట్లుగా; ఆర్చెన్= బొబ్బరించాడు.

**తాత్పర్యం:** ఆ అశ్వత్థామ అంతలోనే తెప్పిరిల్లికొని, నిగనిగలాడే పదును గల బాణాన్ని ఆ సాత్యకి రొమ్మున గ్రుచ్చాడు. అతడి టెక్కాన్ని నేలకూల్చాడు. ఆకాశం అదిరేటట్లుగా బొబ్బలు పెట్టాడు.

**వ. దానికిం గినిసి శినిమనుమండు పొగరు మిగులునారాచనిచయంబులం బొదివిన నశ్వత్థామ రాహుగ్రస్తుం డగు నుగ్రగభస్తియుంబోలె నైనం గనుంగొని. 212**

**ప్రతిపదార్థం:** దానికిన్= అశ్వత్థామచేసిన దానికి; శినిమనుమండు= సాత్యకి; కినిసి= కోపించి; పొగరుమిగులు= మిక్కిలి దారుణములైన; నారాచ నిచయంబులన్= బాణాల సమూహాలతో; పొదివినన్= కప్పివేయగా; అశ్వత్థామ; రాహుగ్రస్తుండు+అగు= రాహువుచే మ్రింగబడినట్టివాడగు; ఉగ్రగభస్తియున్+పోలెన్= కరకు కిరణాలు గల సూర్యుడి చందంగా; ఐనన్= కాగా; కనుంగొని.

**తాత్పర్యం:** అశ్వత్థామచే చాలా దెబ్బలు తిన్నాడు సాత్యకి. కనుకనే చాలా కోపగించాడు. మెరుస్తున్న వాడి, వేడి బాణాలతో ఆ అశ్వత్థామను బాగా కప్పివేసినపుడు అతడు రాహువుచే కబళింపబడ్డ సూర్యుడిలాగా అనిపించాడు. దీన్ని చూచి. (ద్రోణాచార్యుడు సాత్యకిపైకి కవిశాడు.)

**విశేషం:** అలం: ఉపమ.

**క. ద్రోణాచార్యుండు సుత। త్రాణపరత్వమునఁ గృష్ణుతమ్ముని పై న**
**క్షీణోద్ధతిఁ గవియుడు గీ। ర్వాణాధిపసుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్. 213**

**ప్రతిపదార్థం:** ద్రోణాచార్యుండు= ద్రోణుడు; సుతత్రాణ పరత్వమునన్= కొడుకును కాపాడుకోవడంలో ఆశకలవాడు కావటంచేత; కృష్ణుతమ్మునిపైన్= కృష్ణుడి తమ్ముడైన సాత్యకిమీద; అక్షీణ+ఉద్ధతిన్= తక్కువకాని ఆటోపంతో(గర్వంతో); కవియుడున్; గీర్వాణ+అధిపసుతుఁడు= దేవతలకు ప్రభువైన ఇంద్రుడి కొడుకు( అర్జునుడు); వడిన్= వేగంగా; వచ్చి= చేరి; ఎడన్= మధ్యలో; చొచ్చెన్= చొరబడ్డాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు - తన కొడుకు అశ్వత్థామ ప్రాణాలు కాపాడాలనే ఆత్రంతో, గర్వంతో సాత్యకి మీదికి దూకాడు. అప్పుడు అర్జునుడు వేగంగా వచ్చి, సందు చేసికొని చొరబడ్డాడు.

**చ. అనవుడు నాంబికేయవసుధాధిపుఁ డిట్లనుఁ 'ద్రోణుఁ డాత్మ న**
**ర్జుననకుఁ గూర్చునాతఁడు గురుంగని యెంతయు భక్తి సేయు వా**
**రనిఁ దమలోన నట్లు వెస నప్పడు దార్కొని యెట్లు వోరిరో**
**వినఁగల దేర్పడం జెపుమ విశ్రుతభంగిగ నాకు సంజయా!' 214**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని జెప్పగా; ఆంబికేయవసుధా+అధిపుఁడు= అంబిక కొడుకు ధృతరాష్ట్రుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు; సంజయా!= ఓ సంజయుడా!; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు, ఆత్మన్= మనసునందు; అర్జుననకున్= అర్జునుడికి; కూర్చున్= ఇష్టం కోరుతాడు; ఆతఁడున్= ఆ అర్జునుడుకూడా; గురున్= గురువైన ద్రోణుడిని; కని= చూచి; ఎంతయున్= ఎంతో అధికంగా; భక్తి+చేయున్= సేవిస్తూ ఉంటాడు; వారు= అట్టివారిద్దరు; అనిన్= యుద్ధంలో; తమలోనన్= తమలో తాము; అట్లు= ఆ విధంగా; అప్పుడు; వెసన్=వేగంతో; తార్కొని= దగ్గరకు చేరుకొని; ఎట్లు= ఏ విధంగా; పోరిరో= యుద్ధం చేశారో; నాకున్; వినన్+కలది= వినవలసి ఉన్నది; విశ్రుతభంగిన్= చక్కగా ప్రఖ్యాతి కెక్కేటట్లుగా; ఏర్పడన్= బాగా తెలిసేటట్లుగా; చెపుము+అ!= పలుకుము.

**తాత్పర్యం:** ద్రోణుడు, అర్జునుడు - ఇద్దరూ యుద్ధానికి పూనుకొన్నారని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు. 'ఓ సంజయా! ద్రోణుడికి అర్జునుడంటే చాలా ఇష్టం. అర్జునుడికీ ద్రోణుడంటే చాలా భక్తి. అట్టి ఆ గురుశిష్యులిద్దరూ యుద్ధంలో ఒకరినొకరు మార్కొని ఎట్లా యుద్ధం చేశారు? వీరి యుద్ధం ప్రసిద్ధి కెక్కే విధంగా ఉంటుంది, వినతగ్గది కాబట్టి, విపులంగా నాకు తెలుపుము.'

**వ. అనిన నా సూతనందనుం డతని కి ట్లనియె. 215**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అడగ్గా; ఆ సూతనందనుండు; సంజయుడు; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు భీష్మార్జునుల యుద్ధాన్ని గూర్చి విమర్శగా చెప్పుమని కోరగా, సంజయుడు ఇలా చెప్పసాగాడు.

**క. క్షాత్త్రము దలకొని సంగర । ధాత్రికి నేతెంచి గురులు దండ్రులు దమ్ముల్**
**పౌత్త్రులు శిష్యులు మామలు । పుత్త్రులనం గలదె? తాడరి పోరన వలయున్. 216**

**ప్రతిపదార్థం:** క్షాత్రమున్= క్షత్రియ ధర్మాన్ని; తలకొని= పూని; సంగరధాత్రికిన్= యుద్ధభూమికి; ఏతెంచి= వచ్చి; గురులు= ఉపాధ్యాయులు; తండ్రులు= తండ్రులు; తమ్ముల్= తమ్ముళ్ళు, పౌత్రులు= మనుమలు; శిష్యులు= తమ దగ్గర విద్య

నేర్చుకొన్నవారు; మామలు= కూతులను ఇచ్చినవారు; పుత్త్రులు= కొడుకులు; అనన్= అనడం; కలదు+ఎ?= సాధ్యమా?; తొడరి= ప్రయత్నించి; పోరనవలయున్= యుద్ధం చేయవలసి ఉంటుంది.

**తాత్పర్యం:** క్షత్రియధర్మం కలిగి యుద్ధరంగంలోకి దిగినప్పుడు, గురువులు, తండ్రి వరుసవారు, తమ్ముళ్ళు, మనుమలు, శిష్యులు, మామలు, మేనమామలు, కొడుకులు, అనే చుట్టరికం లెక్కించకుండా తెగించి యుద్ధం చేయవలసిందే కదా!

### అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధముసేయుట (సం. 6-98-4)

**వ. వినుము.** **217**

**ప్రతిపదార్థం:** వినుము - ఆలకించుము

**తాత్పర్యం:** వారి యుద్ధం ఎలా జరిగిందో చెపుతాను వినుము.

**సీ. అర్జునుం డడరి ద్రోణాచార్యు మూఁడు నారసముల నేసి యుగ్రంపుటంప**
**వెల్లువ పఱపిన వెగడొంద కాతఁ డాతనిమేనఁ దూపులు దఱుచు గాఁగ**
**నాటించె నంత భూనాథుండు పురికొల్పఁ గాఁ ద్రిగర్తులు గురుఁ గడచి కవియ**
**నరుఁడేచి వాయుబాణమ్మున నమ్మొనఁ దూలింపఁ గుంభజుశైలశరము**

**ఆ. వచ్చి యుడుప నలిగి వాసవినారాచ । వర్షమునఁ ద్రిగర్తవరునిపుత్ర**
**చయముఁ దెరలుచుటయు జనపతి కృపశల్య । బాహ్లికులునుఁ దానుఁ బార్థుఁ దాఁకె.** **218**

**ప్రతిపదార్థం:** అర్జునుండు; అడరి= పూని; ద్రోణ+ఆచార్యున్= ద్రోణుడిని; మూఁడు నారసములన్= మూడు బాణాలతో; ఏసి= కొట్టి; ఉగ్రము+అంపవెల్లువ= భయంకరములైన బాణాల ప్రవాహాన్ని; పఱపినన్= ప్రయోగించగా; ఆతఁడు= ఆ ద్రోణుడు; వెగడు+ఒందక= తడబాటు చెందకుండా; ఆతనిమేనన్= అర్జునుడి దేహంమీద; తఱుచుగాఁగన్= మిక్కుటముగా; తూపులు=బాణాలను; నాటించెన్= గ్రుచ్చాడు; అంతన్= అటుమీద; భూనాథుండు= భూమికి రాజు-దుర్యోధనుడు; పురికొల్పఁగాన్= ప్రోత్సాహపరచగా; త్రిగర్తులు= త్రిగర్త దేశపు రాజు కొడుకులు; గురున్= ద్రోణుడిని; కడచి= దాటి; కవియన్; నరుఁడు= అర్జునుడు; ఏచి= విజృంభించి; వాయుబాణమ్మునన్= వాయువు దైవంగా గల బాణంచేత; ఆ+మొనన్= ఆ సైన్యాన్ని; తూలింపన్= చలింపచేయగా; కుంభజు= ద్రోణునియొక్క; శైలశరము= పర్వతబాణము; ఉడుపన్= వచ్చి, నశింపచేయగా; వాసవి= ఇంద్రుడి కొడుకు - అర్జునుడు; అలిగి= కోపం చెంది; నారాచవర్షమునన్= బాణాల వానతో; త్రిగర్తవరుని= త్రిగర్తరాజు యొక్క; పుత్రచయమున్= కొడుకుల గుంపును; తెరలుచుటయున్= తొలగింపచేయగా; జనపతి= ప్రభువైన; తానున్= దుర్యోధనుడు; కృపశల్య బాహ్లికులును= కృపుడు, శల్యుడు, బాహ్లికుడున్నూ; పార్థున్= అర్జునుడిని; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ప్రయత్నంతో ద్రోణాచార్యుడిని మూడు బాణాలతో కొట్టి, పదునైన బాణాల ప్రవాహాన్ని అతడిపైకి ప్రయోగించాడు. భీష్ముడు జంకకుండా చాలా బాణాలను ఆ అర్జునుడి ఒంటిలో గుచ్చుకొనేటట్లుగా వేశాడు. అప్పుడు దుర్యోధనుడు ప్రోత్సాహపరచగా, త్రిగర్తరాజు కొడుకులు ద్రోణుడికి ముందుగా నిలిచి అర్జునుడిని ఎదుర్కొన్నారు. అప్పుడు అర్జునుడు వాయుబాణాన్ని వేసి. దానివల్ల వారంతా కొట్టుకపోయేటట్లు చేశాడు. ద్రోణుడు ఆ వాయుబాణానికి ప్రతిగా శైలాస్త్రం ప్రయోగించాడు. అర్జునుడికి కోపంవచ్చి, బాణవర్షం కురిపించాడు. ఆ

దెబ్బకు త్రిగర్తపతిపుత్రులంతా చెల్లాచెదరై పోయారు. అది చూచి దుర్యోధనుడు, కృపుడు, శల్యుడు, బాహ్లీకుడు- వీరంతా అర్జునుడి మీదికి ఎగబడ్డారు.

**వ. అట్లు దాఁకుటయు వారల నతండు గన్నెరా కమ్ములం జీకాకు పఱిచె నట్లు గురుండు మొదలైనయందఱకును నా ధనంజయుపోరు దలమునుకలయ్యెఁ గురుపితామహుండు ధర్మసూతి యున్న తిట్ట కుఱికి తలలు చెండాడె శకునిభూరిశ్రవసులు గవలం దలపడిరి కళింగపతియును భగదత్తుండును నిభసేనలతోడం దొడరి భీమసేనుం బొదివిన. 219**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆవిధంగా; తాఁకుటయున్= దుర్యోధనాదులు ఎదుర్కొనగా; వారలన్= ఆ వీరులను; అతండు= ఆ అర్జునుడు; కన్నెరాకు+అమ్ములన్= ఒక విధమైన బాణాలతో; చీకాకు పఱిచెన్= శ్రమకలిగించాడు; అట్లు; గురుండు= ద్రోణుడు; మొదలు+ఐన= ముఖ్యుడుగాగల; అందఱకున్= రథికులందరికీ; ధనంజయుపోరు= అర్జునుడితో యుద్ధం; తలమునుకలు+అయ్యెన్= తలకుమించిన(అసాధ్యమైన) దైనది; కురుపితామహుండు= భీష్ముడు; ధర్మసూతి= ధర్మరాజు; ఉన్న; తిట్టకున్= సైన్యం ఉన్నచోటికి; ఉఱికి; తలలు చెండు+ఆడెన్= సైనికుల తలలు నరికివేశాడు; శకుని భూరిశ్రవసులు= శకుని, భూరిశ్రవసుడు; కవలన్= నకుల సహదేవులను; తలపడిరి= ఎదుర్కొన్నారు; కళింగపతియును= కళింగ దేశపు రాజు; భగదత్తుండును; ఇభసేనలతోడన్= ఏనుగుల సైన్యంతో; తొడరి= వెంటపెట్టుకొని; భీమసేనున్= భీముని; పొదివినన్.

**తాత్పర్యం:** దుర్యోధనాది రథికులు అర్జునుడిని తాకారు. అతడు క్రొత్త క్రొత్త బాణాలు వేసి వారికి చిరాకు పుట్టించాడు. ద్రోణుడు మొదలైన యోధులకందరికి అర్జునుడితో యుద్ధం తలమునకలైంది. భీష్ముడు ధర్మరాజు సైన్యం ఉన్న చోటును దాటిపోయి, సైనికుల తలలు తెగనరికాడు. శకుని భూరిశ్రవసులు కవలలతో మార్కొన్నారు. కళింగదేశపురాజు, భగదత్తుడు- వీరిద్దరూ ఏనుగుల సైన్యంతో భీముడిమీదికి మళ్ళగా.

**విశేషం :** కళింగపతి: కళింగుడనే రాజు ఏలే దేశానికి కళింగదేశం అని పేరు. ఇతడు కౌరవ పక్షాన చేరి యుద్ధం చేశాడు. **'అంగోవంగః కళింగశ్చ పుండ్రః సుహ్మశ్చతే సుతాః తేషాం దేశాః సమాఖ్యాతాః స్వనామప్రథితా భువి॥ అంగస్యాంగో భవద్దేశో, వంగో వంగస్య చ స్మృతః। కళింగ విషయశ్చైవ కళింగస్య చ స స్మృతః ॥** (మహాభారతే 1 - 104 - 49, 50).

**క. గిరి డిగు కేసరి చాడ్పున । నరదము డిగి భ్రమితపటుగదాభీలత నా**
**కరువలిపట్టియుఁ గవిసినఁ । గరులుఁ దెరలెఁ బవనధూతఘనపంక్తి గతిన్. 220**

**ప్రతిపదార్థం:** గిరిన్= కొండపై నుండి; డిగు= దిగునట్టి; కేసరి చాడ్పునన్= సింహం మాదిరి; ఆ కరువలి పట్టియున్= వాయుదేవుని కొడుకు భీముడు; అరదము డిగి= రథంనుండి దిగి; భ్రమిత= త్రిప్పబడిన; పటు= దృఢమైన; గదా= గదాయుధంచేత; ఆభీలతన్= భయంకరంగా; కవిసినన్=మార్కొనగా; కరులు= ఏనుగులు; పవన= గాలిచేత; ధూత= ఎగురకొట్టబడ్డ; ఘన= మేఘాల యొక్క; పంక్తిగతిన్= వరుసవలె; తెరలెన్= తొలగిపోయాయి.

**తాత్పర్యం:** భీముడు కొండపైనుండి దిగి వచ్చే సింహం మాదిరిగా రథం నుండి దిగి, తన గదను గిరగిర తిప్పుతూ భయంకరంగా ఆ ఏనుగుల గుంపుమీదికి దూకాడు. గాలికి చెల్లా చెదరై పోయే మేఘాల వరుస మాదిరి అవి(ఏనుగులు) దూరంగా వెళ్ళిపోయాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. క్రందుకొని యిట్లు మాతంగ ఘటలు విఱుగ। నా శ్రుతాయువుఁ బ్రాగ్జ్యోతిషాధిపతియుఁ**
**బోక నిలిచి యమ్మారుతపు త్త్రుజోడుఁ। దనువుఁ జించిరి వివిధాస్త్రతతులు పఱపి. 221**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా, మాతంగ ఘటలు= ఏనుగుల గుంపులు; క్రందుకొని= అధికంగా; విఱుగన్= బెదిరిపోగా; శ్రుతాయువున్= శ్రుతాయువనేవాడు; ప్రాగ్జ్యోతిషాధిపతియున్= భగదత్తుడు; ఈ ఇద్దరు; పోక= పారిపోకుండా; నిలిచి; ఆ+మారుత పుత్త్రు= ఆ భీముడియొక్క; జోడున్= కవచాన్ని; తనువున్= శరీరాన్ని; వివిధ+అస్త్రతతులు= నానా విధాలైన అస్త్రాలను; పఱపి= ప్రయోగించి; చించిరి= చినిగేట్టు చేశారు.

**తాత్పర్యం:** భీముడి గద దెబ్బలకు ఏనుగుల గుంపు బెదిరిపోగా శ్రుతాయువు, భగదత్తుడు గట్టిగా నిలబడి, భీముడి మీదికి చాలా ఆయుధాలు ప్రయోగించి అతడి కవచాన్ని, శరీరాన్ని చీలికలు చేశారు.

**విశేషం:** శ్రుతాయువు-సూర్యవంశపురాజు. ఇతడు కుశుడికి పదునాలుగవ తరంవాడు. **'నాభాగస్యాంబరీషోఽభూత్, సింధుద్వీప స్తతోఽభవత్ । తతః శ్రుతాయు రభవత్ ఋతుపాల స్తతోఽభవత్॥** (మాత్స్యే 13 వ అధ్యాయః)

**వ. అప్పుడు గాంగేయుండు సేయు దారుణరణంబు ధర్మపుత్త్రునకు భరం బైన నతం డెలుంగెత్తి పేరువేరం బిలిచి చేయి వీచిన నా కళింగనాథ భగదత్తుల విడిచి యవుడు గఱచుచు. 222**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; గాంగేయుండు= భీష్మాచార్యుడు; చేయు= చేస్తున్న; దారుణరణంబు= భయంకరమైనయుద్ధం; ధర్మపుత్త్రునకున్= ధర్మరాజుకు; భరంబు+ఐనన్= బరువైనదికాగా; అతండు= ఆ ధర్మరాజు; ఎలుఁగు+ఎత్తి= గొంతెత్తి; పేరు+పేరన్+పిలిచి= తనవారిని పేరు పేరునా పిలుస్తూ; చేయివీచినన్= చేయి విసరగా; ఆ కళింగనాథభగదత్తులన్= కళింగరాజు; భగదత్తుడు-వీరిద్దరిని; విడిచి= వదలిపెట్టి; అవుడు+కఱచుచున్= పెదవి కొరుక్కుంటూ.

**తాత్పర్యం:** అప్పుడు భీష్ముడు చేస్తున్న యుద్ధానికి ధర్మరాజు తట్టుకోలేకపోయాడు. వెంటనే, గొంతెత్తి, తమ వారిని పిలిచాడు. రమ్మని చేయి విసిరాడు. వెంటనే భీముడు శ్రుతాయువును, భగదత్తుడిని వదలిపెట్టి, పెదవి కొరుక్కుంటూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కలయఁగఁ గరములఁ జరణం। బుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం**
**దలి రెసఁగిన నడమామిడి । చెలువునఁ బఱతెంచె భీమసేనుఁ డచటికిన్. 223**

**ప్రతిపదార్థం:** భీమసేనుఁడు= భీముడు; కలయఁగన్= అంతటినుండి; కరములన్= చేతులనుండి; చరణంబులన్= కాళ్ళనుండి; ఉరమునన్= రొమ్మునుండి; శోణితంబు= నెత్తురు; బోరన= వేగంగా; తొరఁగన్= కారుతుండగా; తలిరు+ఎసఁగిన= చిగుళ్ళతో ఒప్పియున్న; నడమామిడి చెలువునన్= నడిచే మామిడిచెట్టుమాదిరి; అచటికిన్= ధర్మరాజున్న చోటికి; పఱతెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** భీముడు చేతులు, కాళ్ళు, రొమ్ము - వీటి నుండి నెత్తురు ఎక్కువగా కారుతూ ఉండగా, ఒళ్ళంతా రక్తమయంకాగా ఎర్రని చిగుళ్ళతో ఒప్పినట్టి నడిచే మామిడిచెట్టు మాదిరి ధర్మరాజు కడకు వచ్చి చేరాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అంతకు మున్న ధృష్టద్యుమ్న శిఖండి విరాటద్రుపదులు ధర్మనందనున కడ్డపడి భీష్మునిపై నడరి బహుప్రకార విశిఖంబుల వెగడు పఱచిన నతం డలిగి శిఖండి నేయనొల్లక యమ్మువ్వురను మూఁడేసి వాఁడితూపుల నేసిన నావీర రథికులు హుతాగ్నిత్రయంబునుం బోలెఁ బ్రజ్వలించి బాణజ్వాలలు నిగిడించి యతని నొప్పించిరి**

**వృకోదరుఁడద్దెసం గవియుటం గనుంగొని కేకయగణశైనేయద్రౌపదేయులు గూడుకొని కవిసినం గౌరవసేనం జేయంగలమేటిమగ లెల్లను మిన్నేటికొడుకునకుం దలకడచి వారిం దలపడిన నిరుదెఱంగుల దొరలును, బలంబులును నొక్కుమ్మడిం గ్రందుకొన బెరసి పోట్లాడుచుండం జండరశ్మి వినువీథి చక్క సగంబునకుం జనుదెంచె నట్టియెడ. 224**

**ప్రతిపదార్థం:** అంతకుమున్న= భీముడు రావడానికి ముందుగానే; ధృష్టద్యుమ్న; శిఖండి; విరాట; ద్రుపదులు; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; అడ్డపడి= అడ్డంగా వచ్చి; భీష్మునిపైన్= భీష్ముడిమీదికి; అడరి= విజృంభించి; బహుప్రకారవిశిఖంబులన్= అనేక విధాలైన బాణాలతో; వెగడుపఱచినన్= తల్లడిల్లజేయగా; అతండు= ఆ భీష్ముడు; అలిగి= కోపగించి; శిఖండిన్= శిఖండిని; ఏయన్= కొట్టడానికి; ఒల్లక= ఇష్టపడక; ఆ+మువ్వురనున్= ధృష్టద్యుమ్నవిరాటద్రుపదులను; మూఁడేసి= మూడుమూడు; వాఁడి= పదునుగల; తూపులన్= బాణాలతో; ఏసినన్= కొట్టగా; ఆ వీరరథికులు= వీరులూ, రథికులు అయిన ఆ ముగ్గురు; హుతాగ్నిత్రయంబున్+పోలెన్= వేల్చబడిన మూడగ్నుల చందంగా; ప్రజ్వలించి= మండిపడి; బాణజ్వాలలు= బాణాలనే అగ్నిశిఖలను; నిగిడించి= ప్రయోగించి; అతనిన్= ఆ భీష్ముని; నొప్పించిరి= బాధపెట్టారు; వృకోదరుఁడు= భీముడు; ఆ+దెసన్= అటుప్రక్కకు; కవియుటయున్; కనుంగొని= చూచి; కేకయ= కేకయదేశీయుల యొక్క; గణ= గుంపు; శైనేయ= శిని వంశంవాడైన సాత్యకి; ద్రౌపదేయులు= ద్రౌపదికొడుకులున్నూ; కూడుకొని= ఒక్కటై; కవిసినన్; కౌరవసేనన్; చేయంగల= సమర్థులైన; మేటిమగలు= గొప్పవారైన శూరులు; మిన్నేటి కొడుకునకున్= భీష్ముడికి; తలకడచి= ముందువైపునకుదాటి; వారిన్= ఆ ముగ్గురిని; తలపడినన్= ఎదుర్కోగా; ఇరుతెఱంగుల= రెండువైపుల ఉన్నట్టి; దొరలును= రాజులున్నూ; బలంబులును= సైన్యాలున్నూ; ఒక్కుమ్మడిన్= ఒక్కసారిగా; క్రందుకొనన్= అతిశయింపగా; బెరసి= దగ్గరకు చేరుకొని; పోట్లాడుచుండన్= పోట్లాడే సమయంలో; చండరశ్మి= వేడి కిరణాలు కలవాడు(సూర్యుడు); వినువీథిన్= ఆకాశమార్గంలో; చక్క సగంబునకున్= సరిగ్గా మధ్యభాగానికి; చనుదెంచెన్= వచ్చి చేరాడు; అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** భీముడు వచ్చి చేరటానికి ముందే ధృష్టద్యుమ్నుడు, శిఖండి, విరాటుడు, ద్రుపదుడు - వీరు నలుగురూ ధర్మరాజుకు అండగా అడ్డంగా నిలిచి, భీష్ముడిపైన నానా విధాల బాణాలు ప్రయోగించి, అతడిని చాలా బాధపెట్టారు. అతడు కోపగించి, శిఖండిని వదలిపెట్టి మిగిలిన ముగ్గురిపైనా మూడేసి పదునైన బాణాలు వేశాడు. దానికి ఆ రథికులు త్రేతాగ్నుల చందంగా మండిపడుతూ, మండుతున్న బాణాలను అతడి మీదికి వేసి బాధించారు. భీముడు ఆ ప్రక్కకు రావటాన్ని చూచి కేకయులు, సాత్యకి, ద్రౌపదేయులు ఒక్కటిగా చేరి కలిశారు. అప్పుడు కౌరవసేనలో ఉండే సామర్థ్యం గల మహా వీరులందరూ భీష్ముడికి అండగా ముందుగా నిలబడి ఆ కేకయ సాత్యకి ద్రౌపదేయులను ఎదిరించారు. అప్పుడు పాండవసేనలో, కౌరవసేనలో ఉండే సమర్థులు అయిన రాజులు, వారి వారి సైన్యాలూ ఒక్కపెట్టున ఏకమై విజృంభించి, దగ్గరికి చేరి, యుద్ధం చేస్తూండగా సూర్యుడు ఆకాశం మధ్యకు చేరుకొన్నాడు. (అప్పుడు మిట్టమధ్యాహ్నమైందన్నమాట.)

**విశేషం** : అగ్నిత్రయంబు= 1. ఆహవనీయము; 2. దక్షిణాగ్ని; 3. గార్హపత్యం.

**తే. రథములను సామజములఁ దురంగమముల । నుఱక నెత్రుటేఱుల నీఁది తఱియ నడచి**
**పోరి రేటును వ్రేటును బోటు నొక్క । యలవిఁ జెలఁగంగ నుభయసైన్యములవారు. 225**

**ప్రతిపదార్థం:** ఉభయసైన్యములవారున్= రెండు సైన్యాలలోని యోధులు; రథములను= తేరులను; సామజములన్= ఏనుగులను; తురంగమములన్= గుర్రాలను; ఉఱక= దాటటానికి; నెత్రు+ఏరులన్= నెత్తురు ప్రవాహాలలో; ఈఁది= ఈతకొట్టి; తఱియనడచి=

దగ్గరకు చేరడానికి నడిచి; ఏటును= బాణాలు ప్రయోగించుకోవడం; వ్రేటును= బాదటం; పోటునున్= పొడుచుకోవటం-వీటిలో; ఒక్క+అలవిన్= ఒకే (సామర్థ్యంలో); చెలఁగంగన్= ఒప్పి ఉండేటట్లుగా; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** పాండవ కౌరవసేనలలోనివారు రథాలు, ఏనుగులు, గుర్రాలు - వీటిని నరికివేయటంచేత ఏర్పడిన రక్తపుటేరులలో కొంతదూరం ఈతాడి, మరికొంత దూరం దూకి, నడచి, బాణప్రయోగంతో కొట్టుకొనటంలో, పొడుచుకొనటంలో ఒకరికొకరు తీసిపోకుండా, సమతూకంగా విజృంభించి యుద్ధం చేశారు.

**వ. అప్పుడు మన బలంబుల జనంబులు. 226**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; మనబలంబుల= మన సేనలో ఉండే; జనంబులు= జనులు.

**తాత్పర్యం:** రెండు సైన్యాలు సమానంగా పోరే సమయంలో, మన కౌరవ సేనలలో ఉండే జనాలు ఏమనుకొంటున్నారంటే.

**క. ' ధృతరాష్ట్రుండును బుత్త్రులు। నతిలోభంబునఁ బ్రజాక్షయము సేసిరి ధ**
**ర్మతనూజు గెలువ వచ్చునె?। మతి లేరై రింక నేటిమాటలు? మనకున్' 227**

**ప్రతిపదార్థం:** అతిలోభంబునన్= మితిమీరిన ఆశతో; ధృతరాష్ట్రుండును= ధృతరాష్ట్రుడు; పుత్త్రులున్= అతని కొడుకులు; ప్రజాక్షయము= జననాశాన్ని; చేసిరి= చేశారు; ధర్మతనూజున్= ధర్మరాజును; గెలువన్ వచ్చునె?= జయించటం సాధ్యమా?(కాదు); మతిలేరు+ఐరి= (కౌరవులు) బుద్ధిలేని వారయ్యారు; ఇంకన్= ఇకమీద; మనకున్= కౌరవపక్షంలోని మనకు; ఏటిమాటలు?= ఏమి భవిష్యత్తు?

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రుడు, అతడి కొడుకులు చాలా దురాశాపరులై పాండవులతో యుద్ధానికి దిగారు. ఆ ఆశబోతులవల్ల అమాయిక ప్రజలెందరో యుద్ధంలో మరణిస్తున్నారు. ధర్మరాజు నీతి, నిజాయితీ గలవాడు. ఆయనను జయించటం సాధ్యమయ్యే పనేనా? (కాదు). కౌరవులు ఓడిపోయి, పాండవులు జయిస్తారు. అప్పుడు కౌరవపక్షంలో ఉన్న మన సంగతేమిటి?'

**ఆ. అనుచు వగచు పలుకు లాలించు భీష్మాది। యోధవరులతో సుయోధనుండు**
**'చెనఁటి మాటలేమి వినియెద?'రనిన వా। ర దియు నదియు విననియట్ల పోలె. 228**

**ప్రతిపదార్థం:** సుయోధనుండు= దుర్యోధనుడు; అనుచున్= అని; వగచు పలుకులు= చింతించే మాటలు; ఆలించు= వినే; భీష్మ+ఆది యోధ వరులతోన్= భీష్ముడు మొదలుగా గల వీరాగ్రేసరులతో; చెనఁటిమాటలు= కుత్సితుల మాటలు; ఏమి వినియెదరు?= ఎందుకు వింటారు? అనినన్= అనగా, వారు= ఆ భీష్మాదులు; అదియున్+అదియున్= ఆయా మాటలను; వినని+అట్ల పోలెన్= ఆలకించని విధంగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తనసేనలోని వారి యొక్క నిరుత్సాహపరచే శోకంతో కూడిన మాటలు వినే, భీష్మాదులతో 'కుత్సితపు మాటలు ఎందుకు వింటారు?' అన్నాడు. ఆ యోధవరులు, ఆ కుత్సితపు మాటలూ, దుర్యోధనుని మాటలూ వినని విధంగా మామూలుగా యుద్ధం చేస్తున్నారు.

**వ. పరాక్రమక్రీడలు సలుపుచుండి రాసందడికయ్యంబునం గిమ్మీరమర్దనుండు గదపండువు సేయుచుండె నప్పుడు. 229**

**ప్రతిపదార్థం:** పరాక్రమ క్రీడలు= పరాక్రమంతో కూడిన ఆటలు; సలుపుచుండిరి= చేస్తూ వుండినారు; ఆ సందడి కయ్యంబునన్= ఆ సంకులసమరంలో; కిమ్మీర మర్దనుండు= కిమ్మీరుడనే రాక్షసుడిని చంపినవాడు(భీముడు); గదపండువు(న్)= (తన) గదకు పండుగను; చేయుచుండెన్= చేస్తూ ఉండినాడు; అప్పుడు.

**తాత్పర్యం:** వీరులందరూ యథాప్రకారంగా తమ శౌర్యాన్ని చూపిస్తూ, ఆటమాదిరి యుద్ధం చేస్తూ ఉన్నారు. అప్పటి యుద్ధం సంకులసమరంగా ఉన్నది. భీముడు తన గదకు పండుగ చేస్తున్నాడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. సరభసముగ సారథి దన । యరదముఁ దెచ్చుటయు నెక్కి యతినిశితశర**
**స్ఫురణాపరిణతి బాహ్లికు । విరథుం గావించె సురలు వినుతింపంగన్. 230**

**ప్రతిపదార్థం:** సారథి= రథంతోలేవాడు; సరభసముగ(న్)= వేగంగా; తన= (తన) భీమునియొక్క; అరదమున్= రథాన్ని; తెచ్చుటయున్= తేగా; ఎక్కి; అతి= మిక్కుటంగా; నిశిత= పదునైన; శర= బాణాలయొక్క; స్ఫురణా= కదలికయందలి; పరిణతి(న్)= పరిపక్వతతో; సురలు= దేవతలు; వినుతింపంగన్= పొగడుతూ ఉండగా; బాహ్లికున్= బాహ్లికుడిని; విరథున్= రథంలేని వాడినిగా; కావించెన్= చేశాడు.

**తాత్పర్యం:** తన సారథి తొందరగా రథాన్ని తీసికొని రాగానే, భీముడు దానిలోనికి ఎక్కి, చాలా పదునైన బాణాలు వేశాడు. బాణాలను అడరేటట్లు చేయడంలో తనకు గల నేర్పుతో బాహ్లికుడి రథాన్ని కూల్చాడు. అప్పుడు దేవతలు ఆతడిని పొగిడారు.

**తే. చిత్రసేనుండు సౌభద్రుఁ జిత్రబాణ । పాతమున నొంచి యార్చినఁ బాండుపౌత్రుఁ**
**డతని సారథిఁ బడ నేసి యంతఁ బోక । తురగములఁ జంపి యాతని త్రు ళ్ళడంచె. 231**

**ప్రతిపదార్థం:** చిత్రసేనుండు= చిత్రసేనుడు(కౌరవుల పక్షంవాడు); సౌభద్రున్= అభిమన్యుని; చిత్రబాణపాతమునన్= చిత్రములైన బాణాలతో కొట్టడంవల్ల; నొంచి= నొప్పచేసి; ఆర్చినన్= బొబ్బపెట్టగా; పాండుపౌత్రుఁడు= పాండురాజు మనుమడు(అభిమన్యుడు); అతని సారథిన్= ఆ చిత్రసేనుడి సారథిని; పడన్+ఏసి= పడగొట్టి; అంతన్+పోక= అంతటితో ఆగక; తురగములన్= గుర్రాలను కూడా; చంపి= వధించి; ఆతని త్రుళ్ళు= ఆ చిత్రసేనుడి ఎగిరిపాటును; అడంచెన్= నశింపచేశాడు.

**తాత్పర్యం:** చిత్రసేనుడు అభిమన్యుడిని బలమైన బాణాలతో కొట్టి, నొప్పి కలిగించి గర్జన చేశాడు. అభిమన్యుడు చిత్రసేనుడి సారథిని చంపి, అంతటితో వదలిపెట్టకుండా, గుర్రాలను కూడా చంపి వాడి పొగరణచాడు.

**విశేషం :** చిత్రసేనుడు: ధృతరాష్ట్రుడి కొడుకులలో ఒకడు - ధృతరాష్ట్రుని కుమారులలో ప్రధానులు నలుగురు: 1. దుర్యోధనుడు, 2. దుశ్శాసనుడు, 3. వికర్ణుడు, 4. చిత్రసేనుడు.

**వ. అక్కుమారుండును దుర్ముఖునిరథంబెక్కెఁ బాంచాలపతి గుంభసంభవుపై నడరి యతనిమేన నానాస్త్రంబులు నించిన. 232**

**ప్రతిపదార్థం:** ఆ+కుమారుండును= ఆ చిత్రసేనుడును; దుర్ముఖుని రథంబు; ఎక్కెన్= ఎక్కాడు; పాంచాలపతి= ద్రుపదుడు; కుంభసంభవుపైన్= ద్రోణుడిమీదికి; అడరి= విజృంభించి; అతనిమేనన్= ఆ ద్రోణుడి శరీరంపైన; నానా+అస్త్రంబులు= పలు మంత్రపూర్వకములైన బాణాలు; నించిన(న్)= నింపగా.

**తాత్పర్యం:** ఆ చిత్రసేనుడు దుర్ముఖుడి రథంలోనికి ఎక్కాడు. ద్రుపదుడు ద్రోణుడి మీదికి విజృంభించి, పలు బాణాలతో అతడి శరీరాన్ని నింపివేశాడు.

**విశేషం:** పాంచాలదేశము: అయిదు ముఖ్య నదులచే చుట్టబడినది - పాంచాలములో పంచాలశబ్దం పైన స్వార్థంలో 'అణ్' ప్రత్యయం రాగా, 'పాంచాలము' అనే రూపమైనది. ఆ పాంచాల నగరానికి రాజు ద్రుపదుడు. ఇప్పు డా నగరానికి 'ఫరక్కాబాద్' అని వాడుక.

**క. ద్రోణుఁడు గోపించి తను । త్రాణం బఱువుళ్ళు సేసి తనువున రాజ**
**ద్బాణంబులు గ్రుచ్చిన సం । క్షీణబలుండై యతండు సిగ్గఱి తొలఁగెన్. 233**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; కోపించి= కోపంచెంది; తనుత్రాణంబు= ద్రుపదుడి కవచాన్ని; అఱువుళ్ళు+చేసి= శిథిలాలుగా చేసి; తనువునన్= శరీరంలో; రాజత్+బాణంబులు= జ్వలించే బాణాలను; గ్రుచ్చినన్= గ్రుచ్చుకొనేట్లు చేయగా; అతండు= ఆ పాంచాలరాజు; సంక్షీణబలుండు+ఐ= తగ్గిపోయిన బలం గలవాడై; సిగ్గు+అఱి= సిగ్గుచెడి; తొలఁగెన్= తొలగిపోయాడు.

**తాత్పర్యం:** ద్రోణుడికి గొప్ప కోపం వచ్చింది. ఆ పాంచాలరాజు కవచాలను ఏ భాగాని కాభాగం వదలిపోయేట్లు చేసి, అతడి శరీరాన్ని మెరిసే బాణాలతో నింపేశాడు. అతడు సిగ్గుతో తొలగిపోయాడు.

**విశేషం :** ద్రోణుడు- కలశం ఇతనికి ఉత్పత్తి స్థానం కనుక ద్రోణుడు. కురు పాండవులకు ఆచార్యుడు. ఇతడి తండ్రి భరద్వాజుడు. అతడొకనాడు గంగానదిలో స్నానం చేయటానికి వెళ్ళి గంగలో స్నానం చేసిన ఘృతాచి అనే అప్సరసను చూచి, మోహించాడు. ఆమెను కలిశాడు. తననుండి స్ఖలించిన రేతస్సును ద్రోణం (కలశం)లోకి పట్టగా, అందు పుట్టాడు ద్రోణుడు. (ఇతడిని ద్రుపదమహారాజు కొడుకు ధృష్టద్యుమ్నుడు యుద్ధంలో సంహరిస్తాడు.)

**సీ. తఱిమి సుశర్ముండు దాఁకి యర్జును నొంచి । కృష్ణుపై నమ్ములు గీలుకొలుప**
**నలిగి యన్నరుఁడు వాలంపకాలువ లోలి । నడరించుటయు వానియఖిలబలముఁ**
**జేతిసమ్మెటలను జేరుకోలల వ్రేసి । యంకుశంబుల నూఁటి యతిరయమున**
**వాహనంబులఁ దోలువారును విండ్లును । బలకలు వైచుచుఁ బఱచువారు**

**తే. నైన మీ తండ్రి క్రీడిపై నడర నడుమఁ । జొచ్చె సాత్యకి యన్నదీసుతుఁడు శక్తి**
**వైవ మెయి వాల్చి యది పట్టి వైచె మగుడ । నాతఁ డా భీష్ముఁ డెడఁ దునుమాడె నధిప! 234**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా! సుశర్ముండున్= సుశర్మ అనేవాడు; తఱిమి= త్వరపడి; అర్జునున్= అర్జునుడిని; తాఁకి= మార్కొని; నొంచి= నొవ్వచేసి; కృష్ణుపైన్= కృష్ణుడిమీద; అమ్ములు= బాణాలను; కీలుకొలుపన్= గ్రుచ్చగా; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; అలిగి= కోపించి; వాలు+అంపకాలువల= పొడవైన బాణాల కాలువల; ఓలిన్= వరుసగా; అడరించుటయున్= అతిశయింపచేయగా; వాని+అఖిలబలమున్= ఆ సుశర్మ సైన్యమునంతయు; చేతి సమ్మెటలను; చేరుకోలలన్= జాటీలతోనూ; వ్రేసి= కొట్టి; అంకుశంబులన్; ఊఁటి= పొడిచి; అతిరయమునన్= చాల వేగంతో; వాహనంబులన్= ఏనుగులను, గుర్రాలను; తోలువారును= తోలేటటువంటివారున్నూ; విండ్లును= ధనుస్సులు; పలకలు= కేడెములు; వైచుచున్= పడవేయుచు; పఱచువారున్ ఐనన్= పరుగులు తీసేవారుకాగా; మీ తండ్రి= మీ తండ్రియైన భీష్ముడు, క్రీడిపైన్= అర్జునుడిమీదికి; అడరన్= విజృంభించగా; సాత్యకి= పాండవుల పక్షంవాడు; నడుమన్= మధ్యలో; చొచ్చెన్= చొరబడ్డాడు; ఆ+నదీసుతుఁడు= ఆ భీష్ముడు; శక్తివైవన్= శక్తి అనే ఆయుధాన్ని ప్రయోగించగా; మెయిన్= శరీరాన్ని; వాల్చి= వంచి; ఆతఁడు= ఆ సాత్యకి; అది పట్టి= ఆ శక్తి అనే ఆయుధాన్ని పట్టుకొని; మగుడన్= మరల; వైచెన్= వేశాడు; ఆ+భీష్ముఁడు; ఎడన్= మధ్యలోనే; తునుము+ఆడెన్= త్రుంచివేశాడు.

**తాత్పర్యం:** సుశర్మ అర్జునుడిని ఎదిరించి, ఆతడికి నొప్పి కలిగించాడు. కృష్ణుడిమీద కూడా బాణాలు గుప్పించాడు. దానితో అర్జునుడికి కోపం వచ్చింది. బాణాలను ప్రవాహాలుగా ప్రయోగించి ఆ ప్రవాహాలలో శత్రువులను

ఓలలాడించాడు. ఆ ధాటికి సుశర్మ సైన్యమంతా కూడా తమ తమ ఆయుధాలతో, సమ్మెటలు, జాటీలు, అంకుశాలు - వీటితో తమ వాహనాలు, గుర్రాలు, ఏనుగులను కొట్టి, పొడిచి, వేగంగా తోలుకొని పోయారు. బంట్లు తమ ధనుస్సులను, కేడెములను పారవైచి, పరుగులు తీశారు. అప్పుడు భీష్ముడు అర్జునుడి మీదికి విజృంభించగా సాత్యకి మధ్యలో అడ్డం తగిలాడు. భీష్ముడు సాత్యకి మీదికి శక్తిని ప్రయోగించాడు. అప్పుడు సాత్యకి వంగి, ఆ శక్త్యాయుధాన్ని పట్టుకొని, మళ్ళీ భీష్ముడిపైకే విసరగా, మధ్యలోనే దాన్ని ఖండించాడు భీష్ముడు.

**వ. ఇట్లు ద్రుంచి. 235**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; త్రుంచి= విరుగగొట్టి.

**తాత్పర్యం:** సాత్యకి తిప్పివేసిన శక్తి ఆయుధాన్ని విరిచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఆలోనన మెయిఁ దొమ్మిది । వాలమ్ములు నాటఁ బాండవవ్యూహము శుం**
**డాలరథఘోటసుభటా । భీలతఁ దలకడచి పొదివె భీష్మని నంతన్. 236**

**ప్రతిపదార్థం:** ఆలోనన్+అ= అంతలోపలనే; మెయిన్= సాత్యకి దేహంమీద; తొమ్మిది వాలు+అమ్ములు= తొమ్మిది పదునైన బాణాలు; నాఁటన్= (భీష్ముడు)గ్రుచ్చుకొనేటట్లు చేయగా; అంతన్; పాండవవ్యూహము= పాండవుల సైన్యం; శుండాల= ఏనుగులు; రథ= రథాలు; ఘోట= గుర్రాలు; సుభట= కాల్బలము; ఈ చతురంగ బలం; ఆభీలతన్= భయంకరంగా; తలకడచి= దాటివచ్చి; భీష్మనిన్= భీష్మాచార్యుడిని; పొదివెన్= కమ్ముకొన్నది.

**తాత్పర్యం:** అంతలోనే భీష్ముడు తొమ్మిది బాణాలు సాత్యకి ఒంటి మీద గ్రుచ్చుకొనేటట్లుగా ప్రయోగించాడు. పాండవసేనలోని ఏనుగులు, రథాలు, గుర్రాలు, కాల్బలం - అంతా భయంకరంగా దాటివచ్చి, ఆ భీష్ముడిని క్రమ్ముకొన్నాయి.

### దుర్యోధనుఁడు శకునిదుశ్శాసనుల భీష్మనకు సహాయంబుగా బంపుట (సం. 6-101-1)

**క. కని కౌరవపతి దుశ్శా । సనుతో నిట్లనియెఁ గంటె? శాంతనవునిపై**
**ఘన సేన ద్రోచెఁ జని కై । కొనుఁ డీవును సౌబలుఁడు నకుంఠితవృత్తిన్.' 237**

**ప్రతిపదార్థం:** కౌరవపతి= కురురాజు దుర్యోధనుడు; దుశ్శాసనుతోన్; ఇట్లు+అనియెన్; శాంతనవునిపైన్= శంతనుడి కుమారుడైన భీష్ముడిమీదకి; ఘనసేన= గొప్పదగు సైన్యం; త్రోచెన్= వ్యాపిస్తున్నది; కంటె?= చూచావా?; ఈవును= నీవున్నూ; సౌబలుఁడు= శకుని; చని= వెళ్ళి; అకుంఠితవృత్తిన్= మొక్కపోని విధంగా; కైకొనుఁడు= అతడి సహాయానికి పూనుకోండి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు దుశ్శాసనుడితో ఇట్లా అన్నాడు: 'భీష్ముడి మీదికి పాండవులదైన గొప్ప సైన్యం విరుచుకపడుతూ ఉన్నది. చూచావా? నీవు, శకుని వెళ్ళి, ఏ మాత్రం జంకూగొంకూ లేక ఆయన్ని ఆదుకోండి.'

**క. అనవుడు నయ్యిరువురు నే । పునఁ గదియుడుఁ జూచి ధర్మపుత్త్రుఁడు మాద్రీ**
**తనయులు నడరిన దుర్యో । ధనుఁ డపుడు తురంగమాయుతముఁ బురికొలిపెన్. 238**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; ఆ+ఇరువురున్= ఆ శకుని దుశ్శాసనులిద్దరూ; ఏపునన్= విజృంభణంతో, కదియుడున్= దగ్గరకు రాగా; చూచి; ధర్మపుత్త్రుఁడు= ధర్మరాజు; మాద్రీతనయులున్= మాద్రి కొడుకులు నకుల సహదేవులున్నూ; అడరినన్=

విజృంభించగా; అపుడు= ఆ సమయంలో; దుర్యోధనుఁడు; తురంగమ+అయుతమున్= పదివేల గుఱ్ఱాల(రౌతుల)ను; పురికొల్పెన్= కవ్వింపచేశాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు చెప్పగానే, శకుని దుశ్శాసను లిద్దరూ భీష్ముడి దగ్గరకు వచ్చారు. దీన్ని చూచి ధర్మరాజు, నకులుడు, సహదేవుడు అక్కడికి వచ్చి, విజృంభించారు. దాన్ని చూచి దుర్యోధనుడు పదివేల గుఱ్ఱపు రౌతుల్ని వారి మీదికి కవ్వింపజేశాడు.

**వ. ఆ పదివేవురు నెఱరావుతులును నొక్కపెట్ట శకునిదుశ్శాసనులకుం దలకడచి యెక్కినం బాండవబలంబు మహామత్స్యసమూహవిహారంబునం గలంగు మడువునుంబోలె సంక్షోభించినం గోపించి కౌంతేయాగ్రజుండును గవలును, వివిధవిశిఖపరంపరలు వరగింప ముందటికాళ్ళు దునిసిన మ్రొగ్గ తిలంబడియును మోరలు పఱియలైన నెఱి దప్పం గూలియు, గుండియ లవిసిన నెగసి కెడసియు వాగెలు ద్రెవ్విన వలియం బాఱియు నాశ్వికులు నేల కొఱగినం జెనఁటి దిరిగియు, ననేకఘోటకంబులు రూపఱిన నేపఱి యత్తురంగనికరంబు లేటమొగంబు వడి చెదరి కనుకనిం బఱచిన. 239**

**ప్రతిపదార్థం:** ఆ పదివేవురు= ఆ పదివేలు; నెఱరావుతులును= సమర్థులైన గుఱ్ఱపు రౌతులు; ఒక్కపెట్ట= ఒక్కసారిగా, శకుని దుశ్శాసనులకున్; తలకడచి= ముందుకు వెళ్ళి; ఎక్కినన్= అతిశయించగా; పాండవబలంబు= పాండవుల సేన; మహా= గొప్ప; మత్స్య= చేపల; సమూహ= గుంపుయొక్క; విహారంబునన్= తిరగటంచేత; కలంగు= కలత చెందునట్టి; మడువునన్+పోలెన్= మడుగుమాదిరి; సంక్షోభించినన్= కలతచెందగా; కౌంతేయ+అగ్రజుండునున్= ధర్మరాజున్నూ; కవలును= నకుల సహదేవులున్నూ; కోపించి; వివిధ విశిఖ పరంపరలు= నానా విధాలైన బాణాల వరుసలు; పరగింపన్= ప్రయోగించగా; ముందటి కాళ్ళున్= ముందుకాళ్ళు; తునిసినన్= తుంటలుకాగా; మ్రొగ్గతిలన్+పడియును= మోకరిల్లిపడియు; మోరలు= ముఖాలు; పఱియలు+ఐనన్= బద్దలుకాగా; నెఱి= అందం; తప్పన్= తప్పిపోగా; కూలియున్= క్రిందపడియు; గుండియలు= గుండెకాయలు; అవిసినన్= పగిలిపోగా; ఎగసి= ఎగిరి; కెడసియు(న్)= పడియు; వాగెలు(న్)= కళ్ళెమునకు తగిలించే పగ్గాలు; త్రెవ్వినన్= తెగిపోగా; వలియ బాఱియు(న్)= బలహీనపడి; అలసిపోయి; ఆశ్వికులు= రౌతులు; నేలకున్= నేలమీదికి; ఒఱగినన్= వాలిపోగా; చెనఁటి= దండుగగా; తిరిగియున్; అనేక ఘోటకంబులు= పలుగుఱ్ఱాలు; రూపఱినన్= అంగహీనాలుకాగా; ఏపు+అఱి= విజృంభణం తగ్గి; ఆ+తురంగనికరంబు= ఆ గుఱ్ఱాల గుంపు; లేటమొగంబు+పడి= పక్కకు త్రిప్పుకొనిన ముఖాలు కలవై; చెదరి= కలతపడి; కనుకనిన్= తొందరపాటుతో; పఱచినన్= పారిపోగా.

**తాత్పర్యం:** ఆ పదివేల మంది రౌతులు ఒక్కసారిగా శకునిదుశ్శాసనుల ముందుకు వచ్చి విజృంభించారు. అప్పుడు పాండవుల సేన అంతా కూడా, గొప్ప గొప్ప చేపల గుంపులు ఇటూ అటూ తిరగటంచేత కలత చెందిన కొలను చందంగా అయింది. అప్పుడు ధర్మరాజుకు, నకులసహదేవులకు తమ సేన పాటు చూచి కోపం వచ్చి, వారు రకరకాలైన బాణాల వరుసలు ఆ గుఱ్ఱాలపై గుప్పించారు. దాని ఫలితంగా, చాలా గుఱ్ఱాలు ముందు కాళ్ళు విరిగి మోకరిల్లి పడ్డాయి. ఇంకా కొన్ని గుఱ్ఱాలు - ముఖాలు బద్దలుగా పగిలిపోగా, అందం తప్పి, కుప్పకూలాయి. మరికొన్ని గుండెకాయలు పగిలి ఎగిరి నేల కూలాయి. పలుగుఱ్ఱాలు నోటికి కళ్ళెంతో పాటు తగిలించే తాళ్ళు తెగిపోగా పెడదారిని పారిపోయాయి. మరికొన్ని గుఱ్ఱాలు తమ రౌతులు నేలవ్రాలగా ఇటూ అటూ తిరిగాయి. చాలా గుఱ్ఱాలు అంగవిహీనాలై, తమ పటాటోపం పాడుకాగా ముఖాలు అడ్డంగా త్రిప్పుకొని కలతపడి తొందరపాటుతో ఇటూ అటూ పరుగెత్తాయి.

**క. భేరీశంఖాదిరవ । స్ఫారత నప్పాండుపుత్ర బలమేచుటయుం**
**గౌరవపతి శల్యునితో । గారవమున నిట్టు లనియెఁ గడు దీనుం డై. 240**

**ప్రతిపదార్థం:** ఆ+పాండుపుత్రబలము= ఆ పాండురాజు కొడుకు సైన్యం; భేరీ= దుందుభులు; శంఖ= శంఖాలు; ఆది= మొదలగు వాద్యాల, రవ= చప్పుళ్ళయొక్క; స్ఫారతన్= ఆధిక్యంతో; ఏచుటయున్= అతిశయించగా; కౌరవపతి= దుర్యోధనుడు; కడు దీనుండు+ఐ= మిక్కిలి శోచనీయమైన స్థితిని పొందినవాడై; శల్యునితోన్; గారవమునన్= ప్రేమతో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్.

**తాత్పర్యం:** కౌరవుల అశ్వాల హీనస్థితినిచూచి, పాండవుల సేనలో భేరీశంఖాది వాద్యాల ఘోష మిన్నుముట్టింది. దాన్ని చూచి, దుర్యోధనుడు చాలా దీనస్థితికి లోనై, సగౌరవంగా శల్యుడితో ఈ విధంగా అన్నాడు.

**క. ' వెలివిరిసి వచ్చు జలనిధి । పొలుపునఁ దోఁతెంచు ధర్మపుత్రుని బలు గో**
**ల్తల నిలువరింప నీ వొక । చెలియలికట్ట వయి మమ్ముఁ జేకొను మిచటన్.' 241**

**ప్రతిపదార్థం:** వెలివిరిసి= పెల్లుబికి; వచ్చు= పైకి వచ్చెడి; జలనిధి పొలుపునన్= సముద్రం ఒప్పుతో; తోఁతెంచు= వచ్చుచున్నట్టి; ధర్మపుత్రుని= ధర్మరాజుయొక్క; బలుకోల్తలన్= అధికములగు యుద్ధసన్నాహాలను; నిలువరింపన్= ఆపడానికి; ఈవు= నీవు(శల్యుడు); ఒక చెలియలికట్టవు+అయి= ఒక సముద్రపు ఒడ్డుగా తయారై; ఇచటన్= ఈ ప్రమాద స్థలంలో; మమ్మున్; చేకొనుము= ఆదరించుము.

**తాత్పర్యం:** 'పొంగి పొరలి వచ్చే సముద్రంలాగా, పాండవసేనలు యుద్ధ సన్నాహాలు చేసికొంటూ మన మీదికి వస్తున్నాయి. వారి సన్నాహ ప్రవాహాన్ని ఆపడానికి నీవు ఒక చెలియలి కట్టలాగా మమ్మలను ఈ ఆపత్సమయంలో ఆదుకొమ్ము.'

**ఆ. అనుడు నతఁడు పాండవాగ్రజుఁ గవలను । దాఁకి విపులబాహుదర్ప మొప్ప**
**నారసములఁ బొదివి మారిమసంగిన । ట్లయినఁ జూచి నరుఁడు ననిలసుతుఁడు. 242**

**ప్రతిపదార్థం:** అనుడున్= అని చెప్పగా; అతఁడు= ఆ శల్యుడు; పాండవ+అగ్రజున్= ధర్మరాజును; కవలనున్= నకుల సహదేవులను; తాఁకి= మార్కొని; విపుల బాహుదర్పము= అధికమైన చేతుల పొగరు; ఒప్పన్= తగియుండగా; నారసములన్= బాణాలతో; పొదివి= కప్పి; మారిమసంగిన+అట్లు+అయినన్; మసూరికా రోగం విజృంభించినట్లు కాగా; నరుఁడు= అర్జునుడు; అనిలసుతుఁడు= భీముడు; చూచి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కోరిన విధంగా శల్యుడు ధర్మరాజుపైకి, నకులసహదేవులపైకి కవిసి తన బాహుబలం చూపి బాణాలతో వారిని కప్పివేయగా, అక్కడ మహమ్మారి రేగినట్లయింది. దాన్ని చూచి అర్జునుడు, భీముడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఒక్కటఁ గడంగి శల్యునిఁ । బెక్కమ్ముల నొంచుటయును భీష్మద్రోణుల్**
**గ్రక్కునఁ దఱిమిన నియ్యిరు । దిక్కులసైన్యములు నత్యుదీర్ణత బెరసెన్. 243**

**ప్రతిపదార్థం:** ఒక్కటన్= ఒకే మాదిరిగా; కడంగి= యత్నించి; శల్యునిన్; పెక్కు+అమ్ములన్= చాలా బాణాలతో; నొంచుటయును(న్)= బాధించగా; భీష్మద్రోణుల్= భీష్ముడు, ద్రోణుడును; గ్రక్కునన్= వెంటనే; తఱిమినన్; ఆ+ఇరుదిక్కుల సైన్యములున్= ఆ రెండు పక్షాల సేనలు; అతి+ఉదీర్ణతన్= మిక్కిలి అతిశయంగా; బెరసెన్= తారసిల్లాయి.

**తాత్పర్యం:** ఆ అర్జునుడు, భీముడు ఒకేసారి శల్యుడిపైకి ఎగబడి చాలా బాధ కలిగించారు. వెంటనే భీష్ముడు, ద్రోణుడు కవియగా ఆ రెండు సేనలూ విజృంభించి పెనగులాడాయి.

**వ. ఇట్లు గలయన్ బెరసి యపరాహ్ణంబున నుభయ చతురంగమథనం బగు ప్రధనంబు చెల్లె నట్టియెడ భీష్మ గ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిన నారసంబులను కిరణంబుల పరగించి. 244**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కలయన్= కలిసేటట్లుగా; బెరసి= చేరి; అపరాహ్ణంబునన్= దినముయొక్క నాల్గవ భాగాన; ఉభయ= రెండు పక్షాలవారియొక్క; చతురంగ= చతురంగ బలములయొక్క; మథనంబు+అగు= చిలుకుట అగు; ప్రధనంబున్= యుద్ధం; చెల్లెన్= ఒప్పెను; అట్టి+ఎడన్= ఆ సమయంలో; భీష్మ గ్రీష్మ+ఆదిత్యుండు= భీష్ముడనే ఎండకాలంలోని సూర్యుడు; వేఁడి మిగిలి= చురుకుదనంచేత అతిశయించి; వాఁడి= పదనుచే; మెఱసిన= ప్రకాశించే; నారసంబులు+అను= బాణాలనే; కిరణంబులు= కిరణాలను; పరగించి= ప్రసరింపచేసి.

**తాత్పర్యం:** పాండవసైన్యం, కౌరవసైన్యం రెండూ కలిసి కలియబడి, యుద్ధం చేసేటప్పుడు అపరాహ్ణకాలం అయింది. ఆ రెండు సేనలలోని చతురంగ బలాలు సముద్రాన్ని చిలికినట్టుగా, ఒక దాన్ని మరొకటి బాగా కలత చెందేటట్లుగా చేశాయి. అప్పుడు ఎండాకాలంలో మండుతుండే సూర్యుడిలాగా భీష్ముడు వేడి, వాడిగల బాణాలనే కిరణాలను అంతటా ప్రసరింపచేశాడు.

**విశేషం:** చతురంగబలము: చతుః +అంగబలము= నాలుగు అంగాలు కల సైన్యం. 1. రథాలు, 2. ఏనుగులు, 3. గుర్రాలు, 4. కాల్బలం. అలంకారం: రూపకం.

**సీ. పండ్రెంటఁ బండ్రెంటఁ బాండవాగ్రజుని భీముని మాద్రికొడుకుల మూఁట మూఁట**
**నేడింట నేడింట నేచి సాత్యకిని ధృష్టద్యుమ్ను నొప్పించి సమదవృత్తి**
**నార్చిన మాత్స్యపాండ్యానీకములును సోమకవరూథినియును మగధబలముఁ**
**గాశసైన్యంబుఁ గరూశసేనయు నొక్క పెట్ట రయంబున భీష్ముమీఁద**

**తే. నురవడించినఁ బాండవోత్కరముఁ గృష్ణు । తమ్ముఁ బాంచాలనందను సమ్ముఖమున**
**కడరనీ కాఁగి యందఱ కన్నిరూపు । లై మహారణ మొనరించె నస్త్రగురుఁడు. 245**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజుని(న్)= ధర్మరాజును; భీముని(న్)= భీముడిని; పండ్రెంటన్+పండ్రెంటన్= పన్నెండుపన్నెండు బాణాలతో; మాద్రికొడుకులన్= నకుల సహదేవులను; మూఁటన్+మూఁటన్= మూడేసి బాణాలతో; సాత్యకిన్= సాత్యకిని; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; ఏడింటన్+ఏడింటన్= ఏడేసి ఏడేసి బాణాలతో; ఏచి= విజృంభించి; నొప్పించి= బాధ కలిగించి; సమదవృత్తిన్= మదంతో కూడిన తీరుతో; ఆర్చిన(న్)= బొబ్బరించగా; మాత్స్య, పాండ్య+అనీకములును= మత్స్య, పాండ్య దేశాల రాజుల సేనలు; సోమకవరూథినియును= సోమకుడి సైన్యమున్నూ; మగధబలమున్= మగధ రాజు సేనయు; కాశసైన్యంబున్= కాశదేశపు సేనయు; కరూశసేనయున్= కరూశదేశపు బలమున్నూ; ఒక్కపెట్ట= ఒక్కసారిగా; రయంబునన్= వేగంతో; భీష్ముమీఁదన్= భీష్ముడిమీదికి; ఉరవడించినన్= వేగంగా కవియగా; అస్త్రగురుఁడు= ద్రోణాచార్యుడు; పాండవ+ఉత్కరమున్= పాండవుల గుంపును; కృష్ణుతమ్మున్= కృష్ణుడి తమ్ముడు సాత్యకిని; పాంచాల నందనున్= ధృష్టద్యుమ్నుడిని; సమ్ముఖమునకున్= ఎదుటికి; అడరన్+ఈక= రానీకుండా; ఆఁగి= అడ్డగించి; అందఱకున్= ఎదిరించే సైనికులందరికి; అన్నిరూపులు+ఐ= అంతమంది ద్రోణులుగా అయి; మహా+రణము= గొప్ప భయంకరమైన యుద్ధాన్ని; ఒనరించెన్= చేశాడు.

**తాత్పర్యం:** భీష్ముడు పన్నెండు బాణాలతో ధర్మరాజును, మరో పన్నెండు బాణాలతో భీముడిని, మూడు బాణాలతో నకులుడిని, మరి మూడింటితో సహదేవుడిని, ఇంకో ఏడు బాణాలతో సాత్యకిని, మరి ఏడింటితో ధృష్టద్యుమ్నుడిని బాగా విజృంభించి, కొట్టి, బాధ కలిగించి, బిగ్గరగా బొబ్బరించాడు. అప్పుడు మాత్స్య, పాండ్య, సోమక, మగధ,

కాశ, కరూశ దేశాల సేనలు ఒక్కసారిగా వేగంగా భీష్ముడి మీదికి ఉరికాయి. అప్పుడు ద్రోణాచార్యుడు పాండవులందరినీ, సాత్యకిని, ధృష్టద్యుమ్నుడిని భీష్ముడి ఎదుటికి రానీయకుండా ఆపి, సేనలోని ప్రతివాడికి ఒక్కొక్క ద్రోణుడివలె కనిపిస్తూ చాలా నేర్పుగా భయంకరంగా యుద్ధం చేశాడు.

**ఉ. శాంతనవుం డనేకబలసంతతి నుద్భట శౌర్యసారదు**
**ర్దాంతపరాక్రమస్ఫురణఁ దాఁకి సముజ్జ్వలశాతసాయక**
**క్రాంతపరీతనిర్మథితకంపితపాతితమూర్తిఁ జేసి య**
**త్యంతరయంబునం దనరథంబుగతుల్ మెఱయం బ్రదీప్తుఁ డై. 246**

**ప్రతిపదార్థం:** శాంతనవుండు= భీష్ముడు; అనేకబల సంతతిన్= చాలా సైన్యాల సమూహాన్ని; ఉద్భట= అధికమైన; శౌర్య= శూరత్వము యొక్క; సార= బలంచేతను; దుర్+దాంత= అణచరాని; పరాక్రమ= పరాక్రమం యొక్క; స్ఫురణన్= తోచుటచేత; తాఁకి= మార్కొని; సమ్+ఉత్+జ్వల= చక్కగా వెలుగుతున్న; శాత= పదునుగల; సాయక= బాణాలచేత; క్రాంత= ఆక్రమింపబడిన; పరీత= చుట్టబడిన; నిర్+మథిత= బాగా చిలకబడిన; కంపిత= కదలింపబడిన; పాతిత= పడవేయబడిన; మూర్తిన్= శరీరాలు కలవారినిగా; చేసి; అతి+అంత రయంబునన్= చాలావేగంతో; తన= భీష్ముడియొక్క; రథంబుగతుల్= రథము యొక్క పోకడలు; మెఱయన్= ప్రకాశింపగా; ప్రదీప్తుడు+ఐ= మండిపడుతున్నవాడై.

**తాత్పర్యం:** భీష్ముడు పాండవుల చాలా సేనలను అధికమైన శౌర్యంతో, బలంతో, అడచరాని పరాక్రమంతో ఎదిరించి, మంటలు కక్కుతున్న తన పదునుగల బాణాలు ప్రయోగించి, విరోధిసేనలోని చాలామందిని ఆక్రమించాడు. మరికొందర్ని బాణాలతో చుట్టివేశాడు. ఇంకా కొందరిని చిలికి, తుక్కుచేశాడు. మిక్కిలి వేగంతో తన తేరు నడకలు ప్రకాశిస్తూండగా, తాను కోపోద్దీపితుడై (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురంగప్రస్ఫురత్కింకిణీ**
**వ్రజముం గాహళ దుందుభిప్రభృతితూర్య శ్రేణులన్ సుందర**
**ధ్వజఘంటాతతులన్ శరాసనగుణవ్రాతంబుఁ దున్మాడి ధ**
**ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగన్. 247**

**ప్రతిపదార్థం:** పటు+దోః+గర్వంబు= సమర్థములైన చేతుల పొగరు; అఖర్వంబు+కాన్= అధికంకాగా; గజరాజ= శ్రేష్ఠములగు ఏనుగుల యొక్క; ఉజ్జ్వల= ప్రకాశించెడి; ఘంటికా= గంటలయొక్క; ఆవళిన్= వరుసను; తురంగ= గుర్రాలయొక్క; ప్రస్ఫురత్= కదలుతున్న; కింకిణీ= చిరుగంటలయొక్క; వ్రజమున్= సమూహాన్ని; కాహళ= కొమ్ములు; దుందుభి= భేరులు; ప్రభృతి= మున్నుగాగల; తూర్య= వాద్యవిశేషముల యొక్క; శ్రేణులన్= వరుసలను; సుందర= అందమైన; ధ్వజ= టెక్కెములయొక్క; ఘంటా= గంటలయొక్క; తతులన్= సమూహాలను; శరాసన= ధనుస్సులయొక్క; గుణ= అల్లెత్రాళ్ళయొక్క; వ్రాతంబున్= సమూహాన్ని; తున్మ+ఆడి= తుంటలుచేసి; ధర్మజ సేనాతతి(న్)= ధర్మరాజు యొక్క సేనా సమూహాన్ని; ముంపన్+చేసెన్= బాణాలతో మునిగిపోయేటట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** భీష్ముడు బలమైన తన భుజాలబలగర్వం అతిశయించేటట్టుగా, ఏనుగులకు ఉండే గంటలను, గుర్రాల శరీరాలపైన కదలుతుండే చిరుగంటల సముదాయాన్ని, కొమ్ములు దుందుభులు మొదలైన వాద్యాల సముదాయాన్ని, అందంగా ధ్వజాలకు కట్టి ఉండే గంటల సమూహాన్ని, విండ్లయొక్క అల్లెత్రాళ్ళను తునాతునకలు చేసి, ధర్మరాజు సేనాసమూహాన్ని బాణాలతో ముంచివేశాడు.

**విశేషం:** ఈ వచనంలో భీష్ముడి శౌర్యాతిశయాన్నే గాక, యుద్ధవర్ణనలో తనకు గల నేర్పరితనాన్ని కూడా తిక్కన చక్కగా, చిక్కగా ప్రదర్శించాడు. సహజ సుందరాలైన ఉపమానాలను కూడా అక్కడక్కడ చూపాడు.

**వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడిగొని మార్కొనుమగలు లేక మదంబునం బొంగి గాంగేయుండు పాండవేయులు వెఱఁగుపడియుండ మఱియునుం గడంగి దుర్వారంబు లగు దివ్యాస్త్రంబులు దీటుకొల్పి యే దిక్కు సూచినం దాన యై రథికులను, హాస్తికులను, నాశ్వికులనుం దునిమిన గంధసింధురక్రీడనంబున వ్రోడుపడిన యుద్యానంబు చందంబున నగుచున్న చోట్లును, గాలుబలంబులం గనుపుకొట్టిన గాలు, చేయి, తల, డొక్క యని యేఱుపాటు లేక వండం దఱిగినయ ట్లున్నయెడలును, బెక్కుదెఱంగుల చప్పుళ్ళు నిగుడ రథచయంబు నవయవంబులుం గరిహయనికరంబుల యెమ్ములు విఱుగం గార్చిచ్చు పొదివిన వెదురుటడవి తెఱంగునం దోఁచుపట్లును, దఱచు గొడుగులు విట తాటనంబు సేసినం బెనుగాలిం జిక్కువడిన కుసుమితకాశవనంబునుం బోలు చక్కట్లును, బహురత్నమయ మకుటాది భూషణ వ్రజంబు వివిధ వర్ణ చామరజాతంబు నఱికి పడవైచినం బ్రబలోద్ధతలులాయలులితంబయి కమలకైరవోత్పలాకీర్ణం బగుకొలని ననుకరించు ప్రదేశంబులును నై పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ గలగుండుగొనియు బెండువడియుఁ గలంగంబాఱియుఁ దొలంగం దెరలియుం గోలాహలబహుళంబు లగుటం గనుంగొని గోవిందుండు. 248**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; బల్లిదుండు+అయి= మిక్కిలిబలంగలవాడై; మదంబునన్= గర్వంచేత; పొంగి=ఉబ్బి; గాంగేయుండు; మల్లడిగొని యుద్ధం చేయగా; మార్కొనన్= ఎదిరించటానికి; మగలులేక= శూరులు లేకపోగా; పాండవేయులు= పాండురాజకుమారులు; వెఱఁగుపడి ఉండన్= నిశ్చేష్టులు కాగా; మఱియును(న్)= మరలకూడా; కడంగి= పూనుకొని; దుర్వారంబులు+అగు= అడ్డగింపరానివైన; దివ్య+అస్త్రంబులు= అమోఘములైన ఆయుధాలను; దీటుకొల్పి= నిండింపచేసి; ఏ దిక్కు= ఏ వైపు; చూచినన్; తాను+అ+ఐ= తానే(భీష్ముడు) అగపడుతూ; రథికులను= రథంలోని వాళ్ళను; హాస్తికులను= ఏనుగుల నెక్కి యుద్ధం చేసేవారిని; ఆశ్వికులనున్= గుఱ్ఱపు రౌతులను; తునిమిన(న్)= తుంటలు చేయగా; గంధ సింధుర క్రీడనంబున(న్)= మదపుటేనుగు యొక్క విహారంచేత; వ్రోడుపడిన; ఉద్యానంబు చందంబున(న్)= ఉద్యానవనం మాదిరి; అగుచున్+ఉన్న= అవుతూ ఉన్నట్టి; చోట్లును= స్థలాలున్నూ; కాలుబలంబులన్= కాల్బంట్లను; కనుపుకొట్టినన్= ఖండించగా; కాలు; చేయి; తల; డొక్క; అని; ఏఱుపాటు= భేదం; లేక; వండన్= వంటచేయటానికి; తఱిగిన+అట్లు= తరిగిపెట్టిన కూరల మాదిరి; ఉన్న= ఉన్నట్టి; ఎడలును(న్)= చోట్లున్నూ; పెక్కు తెఱంగుల= నానా విధాలైన; చప్పుళ్ళు= శబ్దాలు; నిగుడన్= అతిశయించగా, రథచయంబు= రథాల సమూహాలయొక్క; అవయవంబులున్= భాగాలున్నూ; కరిహయనికరంబుల= ఏనుగుల యొక్క, గుర్రాలయొక్క, ఎమ్ములు= ఎముకలు; విఱుగన్= విరుగుచుండగా; కార్చిచ్చు= దావానలం(అడవిలో పుట్టే అగ్ని); పొదివిన= వ్యాపించినట్టి; వెదురు+అడవి= వెదుళ్ళుగల అరణ్యం; తెఱంగునన్= వలె; తోఁచు= కనిపించునట్టి; పట్లును= చోట్లున్నూ; గొడుగులు= ఛత్రాలు; తఱచు= అధికంగా; విటతాటనంబు+చేసినన్= తారుమారుకాగా; పెనుగాలిన్= పెద్దగాలిచేత; చిక్కుపడిన= చిందరవందరైనట్టి; కుసుమిత కాశ వనంబును(న్)= పూచిన రెల్లు వనాన్ని; పోలు= అనుకరించునట్టి; చక్కట్లును= ప్రదేశాలున్నూ; బహు= అనేకాలైన; రత్నమయ= మణులు తాపిన; మకుట+ఆది= కిరీటాలు మొదలగు; భూషణ= నగలయొక్క; వ్రజంబు(న్)= సమూహము; వివిధ= పలురకాలైన; వర్ణ= రంగులుగల; చామర= చామరాల యొక్క; జాతంబును= సముదాయమున్నూ; నఱికి= ఖండించి; పడవైచినన్= పడవేయగా; ప్రబల= అధికంగా; ఉద్ధత= గర్వించిన; లులాయ= దున్నచేత; లులితంబు= కలత నొందింపబడ్డదై; కమల= పద్మాలు; కైరవ= కుముదాలు; ఉత్పల= కువలయాలు - వీనిచే; ఆకీర్ణంబు+అగు= ఒకదానితో నొకటి కలిసిపోయినదగు; కొలని(న్)= సరస్సును; అనుకరించు= పోలునట్టి; ప్రదేశంబులును(న్)+ఐ= చోట్లును అయి; పాండవ సైన్యంబులు= పాండవుల సేనలు; దైన్యంబున్= నిస్సహాయస్థితిని; పొందియు(న్)= పొందియు; కలగుండు+కొనియున్= కలతచెందియు; బెండు+పడియున్=

తేలికదనం చెందియు; కలంకన్+పాటియు(న్)= కలత చెందియు; తొలంగన్= చలనమునకు; తెరలియున్= తొలగియు; కోలాహల బహుళంబులు= కలకల శబ్దాలచే నిండినట్టివి; అగుటన్= కాగా; గోవిందుండు= కృష్ణుడు; కనుంగొని.

**తాత్పర్యం:** పాండవ సేనకు పట్టిన దుస్థితిని చూచి, ఎదిరించే మగధీరులు లేకపోగా, భీష్ముడు మహాబలపరాక్రమాలతో కూడుకొన్నవాడై గర్వంతో ఉప్పొంగి, పాండవులు మరీ భయపడేటట్లుగా మరల మరల సమర సన్నాహంతో, అడ్డగింపరాని అమోఘములైన ఆయుధాలతో ఆ యుద్ధభూమిని పూర్తిగా నింపించేశాడు. ఏ ప్రక్క చూచినా తానే అగపడుతూ, చకచకా తిరుగుతూ యుద్ధం చేశాడు భీష్ముడు. రథికులను, హాస్తికులను, ఆశ్వికులను తునుకలు చేయగా, అట్టిచోట్లు మదపుటేనుగు విహారంచేత మొక్కపోయిన ఉద్యానవనంవలె కళాహీనమై పోయాయి. అతడు కాల్బలాన్ని తుంటలుతుంటలు చేయగా, కాలు, చెయ్యి, తల, డొక్క అనే అవయవభేదాలు తెలియకుండా, వంటచేయడానికి తరిగిపెట్టిన కూరగాయల ముక్కలలాగా కొన్ని స్థలాలు కన్పడ్డాయి. రథాలనొగలు, చక్రాలు మొదలైనవాటిని, ఏనుగులు, గుర్రాలు - వీటి ఎముకలను విరగబాదేటప్పుడు విస్తరించిన వివిధ శబ్దాలు, కార్చిచ్చు అలముకోగా, చిటచిటమని, పటపట మని మండి బీడుపడిన వెదురు పొదలుగల అరణ్యం మాదిరి కొన్ని తావులు అగపడ్డాయి. గొడుగులు మాటిమాటికి తారుమారై కొన్ని మరికొన్నిటితో పెనవేసికొని ఉండే ప్రదేశాలు పెనుగాలిచేత చిక్కుపడిన పూచిన రెల్లువనం వలె అనిపించాయి. మణులు తాపిన కిరీటాలు, భుజకీర్తులు, హారాలు, పలురంగుల చామరాలు-వీటన్నిటినీ భీష్ముడు తుత్తునియలు చేసి నేలమీద పడవేయగా, అట్టిచోట్లు బలం, గర్వంగల దున్నపోతుచే చిందరవందరచేయబడ్డ ఎర్ర, తెల్ల తామర పూలు, కలువలుగల కొలనుగా తోచింది. పాండవసేన హీనమైన స్థితిని పొందినది, కలతచెందినది. బలహీనమైపోయినది. దాగి ఉండటానికి తొలగిపోయింది. సేనలో పెద్దగా కోలాహలం ఏర్పడింది. శ్రీకృష్ణుడు దీనిని గమనించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలంకారం: ఉపమ. యుద్ధాన్ని వర్ణించడంలో సోమయాజి అందెవేసిన చేయి. కనుకనే ఈ వచనంలో, యుద్ధరంగంలోని పలుతావులను వర్ణించడంలో అయిదు ఉపమానాలతో వాటిని అలంకరించాడు.

**ఉ. ' అర్జున! చూచితే? మనబలావళి నెల్లఁ గలంచుచున్నవాఁ**
**డూర్జితశౌర్యసంపదయు నుగ్రభుజాబలవైభవంబు వి**
**స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ జూపె నదీసుతుఁ డిట్టి చోట నీ**
**దుర్జయదర్పవిభ్రమము దోఁ పఁగఁ జేయకయున్కి యొప్పునే?' 249**

**ప్రతిపదార్థం:** అర్జున!= ఓ అర్జునా! నదీసుతుఁడు= భీష్ముడు; మన= మనయొక్క; బల+ఆవళిన్+ఎల్లన్= మన పాండవసేననంతటినీ; కలంచుచున్+ఉన్నవాఁడు= కలతపెట్టుచున్నాడు; చూచితే?= చూచితివా?; ఊర్జిత శౌర్య సంపదయున్= దృఢమైన పరాక్రమముయొక్క సంపత్తియు; ఉగ్ర= భయంకరాలైన; భుజా= చేతులయొక్క; బల= సారముయొక్క; వైభవంబు(న్)= విభవాన్ని; విస్ఫూర్జిత= మిక్కిలి ప్రకాశించిన; విక్రమ= పరాక్రమముయొక్క; ఉద్ధతియున్= గర్వాన్ని; చూపెన్= కనపరుస్తున్నాడు, ఇట్టిచోటన్= ఇట్లాంటి స్థలంలో; విభ్రమమున్= విలాసాన్ని; తోఁపగన్= తెలిపేటట్టుగా; చేయక+ఉన్కి= చేయకుండా ఉండటం; ఒప్పునే?= తగునా?

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! భీష్ముడు మన సైన్యాన్ని ఎంతగా కలత పెడుతున్నాడో చూచావా? స్థిరమైన తన పరాక్రమం యొక్క సమృద్ధిని, భయంకరమైన తన చేతుల బలవైభవాన్ని, ప్రకాశించే పరాక్రమాటోపాన్ని బాగా ప్రదర్శిస్తున్నాడు. ఇట్టిపట్టులో జయింపరాని నీ శౌర్యాన్ని చూపకుండా ఉండడం తగదు.'

**వ. అనిన వివ్వచ్చుండు విచారడోలాయత్తం బగుచిత్తంబుతోడ నిరుత్సాహుం డై యున్నం జూచి వెన్నుం డతని కి ట్లనియె. 250**

**ప్రతిపదార్థం:** అనిన(న్)= అని చెప్పగా; వివ్వచ్చుండు= అర్జునుడు; విచార= బాధతో; డోలా+ఆయత్తంబు+అగు= ఊగిసలాడుతున్న; చిత్తంబుతోడన్= మనస్సుతో; నిర్+ఉత్సాహుండు+ఐ= ఉత్సాహంలేనివాడై; ఉన్నన్= ఉండగా; వెన్నుండు= కృష్ణుడు; చూచి; అతనికిన్= ఆ అర్జునుడికి; ఇట్లు+అనియె(న్).

**తాత్పర్యం:** కృష్ణుడు పై విధంగా అనగా, అర్జునుడు బాధతో ఊగిసలాడే మనస్సుతో ఉత్సాహం లేనివాడై ఉండగా చూచి కృష్ణుడు, అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**క. 'మును మత్స్యనాథునగరం । బున సంజయుతోడ నీవు పొంగుచు బె ట్టా**
**డినమాట లెల్ల మఱచిన । నిను నగరే రథికవరు లనింద్యచరిత్రా! 251**

**ప్రతిపదార్థం:** అనింద్య చరిత్రా!= నిందింపరాని చరితగల ఓ అర్జునా!; మును= మునుపు; నీవు; మత్స్యరాజు నగరంబునన్= విరాటరాజు యొక్క పట్టణంలో; సంజయుతోడ(న్); బెట్టు= అధికంగా(గొప్పగా); పొంగుచున్= ఉబ్బిపోతూ; ఆడినమాటలు= పలికిన పలుకులు; ఎల్ల(న్)= అన్నిటిని; మఱచిన(న్)= మరిచిపోతే; రథికవరులు= మహారథులు; నిను(న్)= నిన్నుచూచి; నగరే?= నవ్వరా?

**తాత్పర్యం:** 'మంచి స్వభావంగల ఓ అర్జునా! నీవు మునుపు మత్స్యరాజు నగరంలో విజృంభించి, భీష్ముడిని గెలుస్తానని సంజయుడితో అన్నావు కదా! ఆ మాట ఇప్పుడు నీవు మరచిపోతే, వీరులందరు నిన్ను చూచి నవ్వుతారు కదా! (కనుక అప్పుడన్న మాట లిప్పుడు గుర్తుకు తెచ్చికొని, బాగా యుద్ధం చేయుము.)

**వ. అనుటయు నర్జునుండు. 252**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; అర్జునుండు.

**తాత్పర్యం:** కృష్ణుడు పైవిధంగా చెప్పగా అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'సకల బంధుజనులఁ జంపి కౌరవ హీన । మైన రాజ్యమహిమ యేను బడసి**
**యనఘ! యేమిసుకృత మాచరించినవాఁడ । నగుదు? మనసు గొలుపదయ్యె ననికి. 253**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపంలేనట్టి కృష్ణా! ఏను= నేను(అర్జునుడు); సకల బంధు జనులన్= బంధుజాలాన్ని అంతా; చంపి; కౌరవహీనము+ఐన= కురు వంశంవారు లేనట్టి; రాజ్యమహిమన్= రాజ్యము యొక్క మహిమను; పడసి= పొంది; ఏమి సుకృతము= ఏమి పుణ్యాన్ని; ఆచరించినవాఁడన్= చేసినవాడనుగా; అగుదున్?= కాగలను?; అనికి(న్)= యుద్ధానికి; మనసు+కొలుపదు+అయ్యెన్= మనసు ఒప్పదాయెను.

**తాత్పర్యం:** 'ఓ కృష్ణా! చుట్టాల నందర్నీ మట్టుపెట్టి, కురు వంశం వాడే లేనట్టి ఈ రాజ్యాన్ని నేను సంపాదించికొని, ఎట్టి పుణ్యం చేసిన వాడనౌతాను? పాపమే కదా నాకు మిగిలేది? కాబట్టి యుద్ధం చేయడానికి మనసు పుట్టడంలేదు.

**వ. అయిన నీతో నప్పటప్పటి కేటి మాటలు గలవు మిన్నేటి కొడుకుం బడవైచెదం దేరు నడపు' మనుటయు నారాయణుండు నదీనందనుస్యందనంబునకు సమ్ముఖంబుగా రథ్యమ్ములం ద్వరితగతి నడపినం దెరలిన సైన్యంబులు గూడికొని గాంగేయుపయిం గవియ నతండు సెలంగి మహాస్త్రనికరంబులు నిగిడించి యబ్బలంబు నిలువరించి సింహనాదంబు సేసి. 254**

**ప్రతిపదార్థం:** అయినన్; నీతో; అప్పటికిన్+అప్పటికిన్= మాటిమాటికి; ఏటిమాటలు; కలవు= ఉన్నవి?; మిన్ను+ఏటికొడుకు(న్)= ఆకాశగంగా పుత్రుడైన భీష్ముని; పడవైచెదన్= పడగొట్టుతాను; తేరు నడపుము= రథాన్ని పోనిమ్ము; అనుటయు(న్)= అని చెప్పగా; నారాయణుండు= కృష్ణుడు; నదీనందను స్యందనంబునకు(న్)= భీష్ముడి రథానికి; సమ్ముఖంబు+కాన్= ఎదురుగా; రథ్యంబులన్= తేరి గుర్రాలను; త్వరితగతిన్= వేగంతో కూడిన పోకతో; నడపింపన్= పోనీయగా; తెరలిన సైన్యంబులు= తొలగిపోయిన సేనలు; కూడికొని= కలిసికొని; గాంగేయుపయిన్= భీష్ముడిమీద; కవియన్; అతండు(న్)= ఆ భీష్ముడు; చెలంగి= అతిశయించి; మహా+అస్త్రనికరంబులు(న్)= గొప్ప అస్త్రాల సమూహాలను; నిగిడించి= వ్యాపింపజేసి; ఆ+బలంబు(న్)= ఆ సేనను; నిలువరించి= ఆపి; సింహనాదంబు+చేసి.

**తాత్పర్యం:** అయినా నీతో మాట్లాడటానికి మాటిమాటికి ఏమిమాటలున్నాయి. భీష్ముడిని పడగూలుస్తాను. రథాన్ని పోనిమ్ము అనగా నారాయణుడు భీష్ముడి రథానికి ఎదురుగా గుర్రాలను వేగంగా తోలాడు. అంతట చెదరిపోయిన తనసేనలను కూడుకొని అర్జునుడు భీష్ముని మీదికి విజృంభించాడు. అపుడు గంగా పుత్రుడు చెలరేగి మహాస్త్రముల గుంపులు గుప్పించి ఆ సైన్యాన్ని ఆపి సింహనాదం చేసి (తరువాతి పద్యంతో అన్వయం)

**మ.** **ఖరనారాచపరంపరోగ్రనిహతిన్ గాండీవియంగంబు లా**
**తురతం బొందఁగ నేసి బాణమయగాత్రుం జేసి గోవిందు ని**
**ష్ఠురలీలం దురగంబులం బటుశరస్యూతాస్యముల్ గాఁగ స**
**త్వరుఁడై యేసి, రథంబు గూడఁ బొదివెన్ వాలంప మొత్తంబులన్.** 255

**ప్రతిపదార్థం:** ఖర= పదునైన; నారాచ= బాణాలయొక్క; పరంపరా= వరుసలచేత; ఉగ్ర= భయంకరంగా; నిహతిన్= కొట్టటంచేత; గాండీవి= అర్జునుడియొక్క; అంగంబులు= అవయవాలు; ఆతురతన్= బాధను; పొందఁగన్= పొందేట్టుగా; ఏసి= కొట్టి; గోవిందున్= కృష్ణుని; బాణమయగాత్రున్= బాణాలతో నిండిన శరీరంగలవానిగా; చేసి; సత్వరుఁడై= వేగంతో కూడిన వాడై; నిష్ఠుర లీలన్= క్రూరమైనవిధంగా; తురగంబులన్= గుర్రాలను; పటు= సమర్థములైన; శర= బాణాలచేత; స్యూత= గుచ్చబడిన; ఆస్యముల్+కాఁగన్= ముఖాలు కలుగునట్లుగా; ఏసి= బాణాలు ప్రయోగించి; రథంబు+కూడన్= తేరును కూడా; వాలు+అంప+మొత్తంబులన్= పదునైన బాణాల సమూహాలతో; పొదివెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** భీష్ముడు పదునైన బాణాల వరుసలతో భయంకరంగా కొట్టటంవలన, అర్జునుడి అవయవాలు గాయపడ్డాయి. కృష్ణుడి శరీరమంతా బాణమయమైనది. వేగంగా, క్రూరములైన గట్టి బాణాలు ప్రయోగించి గుర్రాల ముఖాలను గ్రుచ్చివేశాడు. పదునైన బాణాల సమూహాలతో అర్జునుడి రథాన్ని కప్పివేశాడు.

**వ.** **అప్పుడు.** 256

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** భీష్ముడు పై విధంగా చేసినప్పుడు (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **బీఱువోయి రథ్యంబులు మాఱు మొగము । వడినఁ దా నొచ్చి యుండియుఁ దడవి శౌరి**
**నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్ర । భల్లమునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె.** 257

**ప్రతిపదార్థం:** రథ్యంబులు= గుర్రాలు; బీఱువోయి= ఉపయోగం లేనివై; మాఱుమొగము పడినన్= పెడమొగంపెట్టినవి కాగా; శౌరి= కృష్ణుడు; తాన్= తాను; నొచ్చియుండియున్= బాధచెందికూడా; తడవి= చేతులతో అటూ ఇటూ తాకి; నూలుకొనన్+చేసి=

కుదుటపడజేసి; తఱిమిన(న్)= తోలగా; క్రీడి= అర్జునుడు; వ్రాలి= మీరి(అతిశయించి); తీవ్ర భల్లమునన్= తీవ్రమైన బల్లెముతో; భీష్మునివిల్లున్; తునిమెన్= త్రుంచివేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడి రథానికి కట్టిన గుర్రాలు చచ్చుపడి, పెడమొగం పెట్టాయి. కృష్ణుడు తాను బాణాల దెబ్బలతో బాధపడుతూ ఉండి కూడా, తన చేతులతో వాటిని ఇటూ అటూ నిమిరి, తోలగా, ఒక కరుకైన బల్లెంతో అర్జునుడు భీష్ముడి విల్లు తుంటలు అయ్యేటట్లుగా చేశాడు.

**క. అతఁ డొండొక విల్లెత్తిన । నతిరయమున నదియుఁ దునుమ నాతం డౌరా**
**శతమఖనందన! యనుచును' ధృతి వేఱొకవింట శరతతిం బరగించెన్. 258**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ భీష్ముడు; ఒండు+ఒక= మరొక; విల్లు= ధనుస్సును; ఎత్తినన్; అతిరయమునన్= మిక్కిలివేగంతో; అదియున్= ఆ వింటినికూడా; తునుమన్= ముక్కలు చేయగా; ఆతండు= ఆ భీష్ముడు; శతమఖనందన!= అర్జునా!; ఔరా! అనుచున్= ఆశ్చర్యాన్ని వెలిపుచ్చుతూ; ధృతిన్= ధైర్యంతో; వేఱు+ఒక వింటన్= వేరొక విల్లునుండి; శరతతిన్= బాణ సమూహాన్ని; పరఁగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు మరో విల్లు ఎత్తుకోగా, దాన్ని కూడా అర్జునుడు వేగంగా తుంటలు చేశాడు. భీష్ముడు, 'ఔరా! అర్జునా!' అని మెచ్చుకొంటూ ధైర్యంతో ఇంకొక విల్లెత్తుకొని పెల్లుగా బాణాలు వెల్లువై వెల్లివిరిసేటట్లు ప్రయోగించాడు.

**క. ఆ బెట్టిదంపు టంపఱ । చే బీభత్సుండు నొచ్చి చేడ్పడి మఱియుం**
**దా బంటుతనమ పటుబా । హాబలముగఁ బోరుచుండె నంగము దూలన్. 259**

**ప్రతిపదార్థం:** బీభత్సుండు= అర్జునుడు; ఆ బెట్టిదము+అంపఱచేన్= క్రూరములైన ఆ బాణాల సమూహంచేత; నొచ్చి= నొప్పిచెంది; చేడ్పడి= చలించి; మఱియున్= మరల; తాన్= తాను(అర్జునుడు); బంటుతనము+అ= శూరత్వమే; పటుబాహాబలముగన్= పటువైన భుజబలంగా; అంగము= శరీరము; తూలన్= వాలిపోతుండగా; పోరుచున్+ఉండెన్= యుద్ధంచేస్తుండినాడు.

**తాత్పర్యం:** భీష్ముడు వేసిన కఠోరబాణాల చేత అర్జునుడు చాలా బాధ అనుభవించాడు. వణకిపోయాడు. అయినా కూడా తన శౌర్యమే బాహుబలంగా కలిగి, శరీరం వాలిపోతూంటే కూడా, యుద్ధం చేస్తూనే ఉన్నాడు.

**క. వివ్వచ్చునొవ్వి నెంతయుఁ । గ్రొవ్వున భీష్ముండు గడఁగుకోల్తలయుం ద**
**క్కెవ్వరు నాతనిఁ జేరక । దవ్వుల నిల్చుటయుఁ జూచి తన చిత్తమునన్. 260**

**ప్రతిపదార్థం:** ఎంతయున్= అధికమైన; వివ్వచ్చునొవ్విన్= అర్జునుడి వేదనను; భీష్ముండు= భీష్ముడు; క్రొవ్వునన్= మదంతో; కడఁగు= ప్రయత్నపడు; కోల్తలయున్= ఎదుట నిలచియుద్ధం చేయటాన్ని; తక్క+ఎవ్వరున్= మిగిలినవారు ఎవరుగాని; ఆతనిన్= ఆ భీష్ముడిని; చేరక= దగ్గరకురాక; దవ్వులన్= దూరంగా; నిల్చుటయున్= నిలబడి ఉండటాన్ని; చూచి; తన చిత్తమునన్= (కృష్ణుడు) తన మనస్సులో.

**తాత్పర్యం:** శ్రీ కృష్ణుడు అర్జునుడు చాలా బాధపడుతూండటాన్ని చూచాడు. భీష్ముడు మదంతో ప్రయత్నంతో అర్జునుడికి ముఖాముఖిగా నిలబడి యుద్ధం చేస్తూండడం గమనించాడు. వేరే ఎవరూకూడా భీష్ముడి అండచేరకుండా దూరంగా ఉండటాన్ని కూడా తిలకించి, తన మనస్సులో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. దారుణరోషం బడరఁగ । నారాయణుఁ డపుడు సైరణం దొఱఁగి వెసం**
**దేరి నొగలఁ బగ్గము లిడి । క్రూరత మునికోల యెత్తికొని యిల కుఱికెన్. 261**

**ప్రతిపదార్థం:** అపుడు; నారాయణుఁడు= శ్రీకృష్ణుడు; దారుణరోషంబు= భయంకరమైన కోపం; అడరఁగన్= అధికం కాగా; సైరణన్= ఓర్పును; తొఱఁగి= విడిచిపెట్టి; వెసన్= వేగంతో; పగ్గములు; తేరినొగలన్= రథం నొగలమీద; ఇడి= పెట్టి; మునికోల= జాటీని; ఎత్తికొని= తీసికొని; క్రూరతన్= భయంకరంగా; ఇలకున్= నేలమీదికి; ఉఱికెన్= దూకాడు.

**తాత్పర్యం:** ఆ దృశ్యాన్ని చూచిన కృష్ణుడికి భయంకరమైన కోపం వచ్చింది. ఓర్పు కోల్పోయాడు. గుఱ్ఱాల కళ్ళాలకు కట్టి ఈడ్చి పట్టే పగ్గాలను రథం నొగలమీద పడవేశాడు. జాటీ పట్టుకొన్నాడు. భయం కలిగిస్తూ నేలకు దూకాడు.

**శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకిఁ బోవుట (సం. 6-102-52)**

**వ. ఇట్లు లంఘించి. 262**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; లంఘించి= దూకి

**తాత్పర్యం:** ఈ మాదిరి కృష్ణుడు నేలపైకి దూకి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. ధరణీచక్రము గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణి కం**
**ధరముల్ మ్రొగ్గఁబడన్ దిశావలయ ముత్కంపంబుగా నీబలం**
**బురులం బాఱఁగ భీష్ముపైఁ గవిసె రౌద్రోద్రేకముం జూచి ఖే**
**చరలోకంబును సంచలింప హరి చంచద్బాహుఘోరాకృతిన్. 263**

**ప్రతిపదార్థం:** ధరణీచక్రము= చక్రం మాదిరి గుండ్రంగా వుండే భూమి; గ్రక్కునన్= వెంటనే; కదల(న్)= చలించగా; దిక్= దిక్కులందుండే; దంతావళ= ఏనుగుల యొక్క; శ్రేణి= వరుసయొక్క; కంధరముల్= మెడలు; మ్రొగ్గన్+పడన్= వంగిపోగా; దిశావలయము= దిక్చక్రము; ఉత్+కంపంబు+కాన్= మిక్కుటంగా వణికేది కాగా; నీ బలంబు= (ధృతరాష్ట్రుడవైన) నీ యొక్క సైన్యము; ఉరులన్+పాఱఁగన్= చలించిపోగా; రౌద్ర+ఉద్రేకమున్= రౌద్ర రసాధిక్యాన్ని; చూచి= తిలకించి; ఖేచరలోకంబును= దేవలోకం కూడా; సంచలింపన్= వణకగా; హరి= శ్రీకృష్ణుడు; చంచత్= అదురుచున్న; బాహు= భుజాలచేత; ఘోర= భయంకరమైన; ఆకృతిన్= ఆకారంతో; భీష్ముపైన్= భీష్ముడిమీదికి; కవిసెన్= దుమికాడు.

**తాత్పర్యం:** భూమండలం కదలుతూ ఉండగా, దిక్కులందుండే ఏన్గుల మెడలు వంగిపోగా, దిక్కులు వణకిపోగా, నీసైన్యం బెదురుతూ చెదిరిపోతూండగా, తన రౌద్రావేశాన్ని చూచి దేవతలు కూడా గడగడలాడగా కృష్ణుడు, అదురుతూ ఉన్న బాహువులతో, భయంకరమైన ఆకారంతో భీష్ముడిపైకి లంఘించాడు.

**తే. లలితపీతాంబరంబు విలాస మొప్పసింహనాదోద్భటం బగు చెలువుతోడ**
**మెఱుఁగు వెలుఁగును గర్జయు మెఱయ వచ్చు కారుమొగిలనఁ గృష్ణునాకార మొప్పె. 264**

**ప్రతిపదార్థం:** లలితపీత+అంబరంబు= సుందరమైన పసుపు వస్త్రం యొక్క; విలాసము= హొయలు; ఒప్పన్= తగియుండగా; సింహనాద+ఉద్భటంబు+అగు= సింహనాదం చేత మిక్కుటమైన; చెలువుతోడన్= అందంతో; మెఱుఁగు వెలుఁగును= మెరుపువంటి కాంతియు; గర్జయున్= ఉరుమున్నూ; మెఱయన్= ప్రకాశింపగా; వచ్చు= వచ్చునట్టి; కారుమొగిలు+అనన్= వర్షాకాలంలోని మేఘంవలె; కృష్ణ+ఆకారము= కృష్ణుడి ఆకారం; ఒప్పెన్= తగి ఉండింది.

**తాత్పర్యం:** ధరించిన పచ్చటి పచ్చడం అందాలు చిలుకుతూంటే, సింహనాదంతో చెలరేగిన సౌందర్యంతో భీష్ముడి మీదికి వస్తూఉన్న కృష్ణుడి ఆకారం వర్షాకాలంలో మెరుపులతో, ఉరుములతో దిగివచ్చే మేఘాన్ని పోలి ఉన్నది.

**విశేషం :** పసుపురంగు వస్త్రాన్ని ధరించి సింహనాదం చేస్తూ నల్లని శరీరచ్ఛాయ కలిగిన కృష్ణుడు మెరుపులతో, ఉరుములతో కన్పించే కారు మేఘం లాగా ఉన్నాడనటంలో ఉపమాలంకారం.

**వ. అట్టియెడ. 265**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. బలు జీవము వోయిన వెల వెలఁ బాఱుచు నీదుయోధవీరులు పాలిసెం**
**బొలిసె నదె భీష్ముఁ డనుచును గలఁగంబడి యఱ్ఱు లెత్తి కనుఁగొనుచుండన్. 266**

**ప్రతిపదార్థం:** నీదు యోధవీరులు= నీ (ధృతరాష్ట్రుని) యొక్క భటులు శూరులున్నూ; బలుజీవము= అధికమగు జీవశక్తి; పోయినన్= చెడిపోగా; వెలవెల+ పాఱుచున్= తెల్లపోయి (వివర్ణత చెంది); అదె= అల్లదిగో; భీష్ముఁడు= భీష్ముడు; పొలిసెన్ పొలిసెన్= చచ్చాడు, చచ్చాడు; అనుచునున్= అంటూ; కలఁగన్+పడి= కలతచెంది; అఱ్ఱులు+ఎత్తి= మెడలు పైకెత్తి; కనుఁగొనుచున్+ఉండన్= చూచుచుండగా.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! కృష్ణుడు భీముడిపైకి దూకినప్పుడు నీ భటులు, శూరులు అందరూ బలాన్నీ, ధైర్యాన్నీ కోల్పోయి, ముఖాల నెత్తురు లేనివారై, కలతచెంది, అదిగో భీష్ముడు చచ్చాడు చచ్చాడు అని మెడలు పైకి చాచి చూడసాగారు.

**చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి**
**ట్లనుఁ 'జనుదెమ్ము వేగమ మహాత్మ! వికస్వరపుండరీకలో**
**చన! యిది లెస్స నా కిచట శాశ్వత మైనయశంబు నచ్చట**
**న్వినుతికి నెక్కు సద్గతియు నీ దయఁ జేకుఱఁజేయు మిష్టమున్.' 267**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు= భీష్ముడు; కనుఁగొని= చూచి; ఉల్లము= మనస్సు; వికాసమున్= ప్రసన్నతను; ఒందఁగన్= పొందగా; అల్లనవ్వి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; మహాత్మ!= మాహాత్మ్యం కలవాడా!; వికస్వర పుండరీక లోచన!= పూచిన తెల్లతామరలవంటి కన్నులుగల కృష్ణా! వేగము+అ= త్వరితంగా; చనుదెమ్ము= రమ్ము; ఇది= ఈపని; లెస్స= మంచిది; నాకున్; ఇచటన్= ఈ లోకంలో; శాశ్వతము+ఐన= స్థిరమైన; యశంబున్= కీర్తియు; అచ్చటన్= పై లోకంలో; వినుతికిన్+ఎక్కు= పొగడ్తకెక్కునట్టి; సత్+గతియున్= ఉత్తమగతీ; ఇష్టమున్= నాకిష్టమగు ఈ రెంటిని; నీదయన్= నీ దయచేత; చేకురన్= కలిగేటట్టుగా; చేయుము.

**తాత్పర్యం:** కృష్ణుడు తన పైకి దూకటాన్ని భీష్ముడు చూచాడు. మనస్సులో ఉల్లాసం కలిగింది. ఒక్క నవ్వు నవ్వి ఇట్లా అన్నాడు. 'మహాత్మా! పూచిన తెల్ల తామరలను పోలిన కన్నులుగల ఓ కృష్ణా! వేగంగా రమ్ము. నన్ను కడతేర్చుము. ఇది నాకు ఇష్టమైనది. ఈ లోకంలో నాకు స్థిరమైన కీర్తీ, పరలోకంలో పొగడికకెక్కే ఉత్తమ గతీ, పునరావృత్తిరహితమైన మోక్షం, కూడా నీ దయావిశేషంచేత నాకు అబ్బేటట్లు చేయుము.'

**వ. అని పలుకు నంత జంభాంతకసూనుండు సరభసంబుగా రథంబు డిగ్గనుఱికి వెన్నుని వెనుక నెయిది కరంబులఁ గ్రుచ్చి పట్టిన నతండును దిగిచికొని వెండియుం బోవం బోవఁ బదియడుగులకొలంది నా కౌంతేయుండు పదస్థైర్యంబును, బాహు వీర్యంబును మెఱయ మహీతలం బూని మెట్టి నిలువం బట్టి నిట్టూర్పు నిగిడించుచు నద్దనుజమర్దనుతో ని ట్లనియె. 268**

**ప్రతిపదార్థం:** అని పలుకు+అంతన్= అని చెప్పేలోపల; జంభ+అంతక సూనుండు= జంభుడనే రాక్షసుడిని చంపిన యింద్రుడి కుమారుడు - అర్జునుడు; సరభసంబు+కాన్= తొందరగా; రథంబున్= రథాన్నుండి; డిగ్గన్= దిగటానికి; ఉఱికి= గంతువేసి; వెన్నుని వెనుకన్= కృష్ణుడి వెనుక ప్రక్క; ఎయిది= వెంబడించి; కరంబులన్= చేతులను; గ్రుచ్చి= దూర్చి; పట్టినన్= పట్టుకోగా; అతండునున్= ఆ కృష్ణుడుకూడా; తిగిచికొని= లాగికొని; వెండియున్= మరియు; పదియడుగుల కొలంది= పదడుగుల దూరం; పోవన్+పోవన్= పోతూ పోతూ ఉండగా; ఆ కౌంతేయుండు= ఆ అర్జునుడు; పదస్థైర్యంబును= అడుగుల గట్టిదనం; మెఱయన్= ప్రకాశింపగా; మహీతలంబు= భూమిని; ఊని= ఆనించి; మెట్టి= తొక్కిపట్టి; బాహువీర్యంబును= భుజబలం; మెఱయన్= ప్రకాశింపగా; నిలువన్+పట్టి= (కృష్ణుని) ఆగేటట్లుగా చేసి; నిడుద+ఊర్పున్= దీర్ఘ నిశ్వాసాన్ని; నిగిడించుచున్= వ్యాపింపజేస్తూ; ఆ+దనుజమర్దనుతోన్= ఆ కృష్ణునితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు పై విధంగా అంటూండగా, అర్జునుడు తొందర తొందరగా రథంనుండి క్రిందికి దూకి, కృష్ణుడిని వెంబడించి, చేతులతో గ్రుచ్చి పట్టుకొన్నాడు. అయినప్పటికీ కృష్ణుడు అతడి చేతులు లాగికొని ఇంకా పదడుగుల దూరం పోతూ ఉండగా, తనపాదాల బలంతో నేలను గట్టిగా తొక్కిపట్టి, భుజబలంతో కదలకుండా నిలబెట్టి, పెద్దగా నిట్టూర్చుతూ కృష్ణుడితో అన్నాడు.

**ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ**
**వియ్యెడఁ దప్పితేని జగ మేమను? నించుకసేపు పోరులన్**
**డయ్యుట దప్పె? నాపయిఁ గడంగిన భీష్మునిపాటు సూతు రా**
**వయ్య, రథంబుమీఁది కిటు లాశ్రితమానము వీటిఁబుత్తురే?' 269**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; కయ్యము= యుద్ధమును; చేయన్+అని= చేయనంటూ; అకల్మషబుద్ధిన్= పాపంలేని బుద్ధితో; ప్రతిజ్ఞన్+చేసి= ప్రతినబూని; నీవు; ఈ+ఎడన్= ఈ చోటున, తప్పితి(వి)+ఏనిన్= ప్రతిజ్ఞ తప్పితే; జగము= లోకము; ఏమి+అనున్?= ఏమంటుంది?; పోరులన్= యుద్ధాలలో; ఇంచుకసేపు= కొంచెంసేపు; డయ్యుట+తప్పు+ఎ?= శ్రమచెందడం కూడా తప్పేనా?; నాపయిన్= నాపైకి; కడంగిన= ఉద్యమించిన; భీష్మునిపాటు= భీష్మడి ఆపదను; చూతు(వు)= చూస్తావు; రథంబు మీఁదికిన్= తేరుపైకి; రావయ్య= రమ్ము; ఇటులు= ఈ మాదిరి; ఆశ్రిత మానమున్= ఆశ్రయించినవారి అభిమానాన్ని; వీటిన్+పుత్తురు+ఏ?= (ఎవరైనా) పోగొట్టుతారా?

**తాత్పర్యం:** 'ఓ కృష్ణా! నేను యుద్ధంచేయను-అని నీవు శుద్ధమైన బుద్ధితో, ప్రతిజ్ఞ చేశావుగదా! నీవు ఇప్పుడా ప్రతిజ్ఞను పాటించకపోతే (లోకం) జనం నిన్నేమంటుంది? దూషించదా? కొంచెం సేపు యుద్ధాలలో బడలిక చెందడం తప్పవుతుందా? కాదుకదా! నా మీదికి కవిసిన ఆ భీష్ముడికి ఇప్పు డే గతిపట్టిస్తానో చూతువుగాని, రమ్ము, రథంమీదికి వచ్చి కూర్చొనుము. నీవంటి మహాత్ములు ఆశ్రయించి ఉండేవారి యొక్క ఆత్మాభిమానానికి నష్టం, కష్టం కలిగిస్తారా?'

**వ. అని ప్రార్థించినం బార్థుపలుకులకుం బ్రియం బంది ముకుందుం డూరక మరలె నయ్యిరువురు నెక్కిన యరదంబు శిఖరద్వయసుందరం బైన శైలంబునుంబోలెఁ బొలిచి నిలిచినం బ్రళయకాలభైరవరవం బగు వారిదంబు కరణి గర్జిల్లుచుఁ బటునారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడు వఱిచి యచ్చట నొండొరుల మెచ్చక యతిమి తతిమిన వైరుల రూపు మాపి భీష్ముండు భీషణాకారుం డై పరిశ్రాంతులయిన కృష్ణార్జునులును, భీతు లగు భీమసేన ప్రముఖులును, జేయునది లేక చూచుచుండం బాంచాలబలంబుల బారిసమరునప్పడు బలుమానిసి చలిచీమలం గాలం జమురు చందంబు దోఁచె నయ్యవసరంబున. 270**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా; ప్రార్థించినన్= వేడుకోగా; పార్థుపలుకులకున్= అర్జునుడి మాటలకు; ప్రియంబు+అంది= ఇష్టపడి; ముకుందుండు= కృష్ణుడు; ఊఱక= బదులు చెప్పకుండా; మరలెన్= వెనక్కి తిరిగాడు; ఆ+ఇరువురున్= ఆ కృష్ణార్జునులిద్దరు; ఎక్కిన= ఎక్కినట్టి; అరదంబు= రథము; శిఖరద్వయ సుందరంబు+ఐన= శిఖరాల రెంటిచే అందమైన; శైలంబునున్+పోలెన్= పర్వతం మాదిరి; పొలిచి= ఒప్పి; నిలిచినన్= ఉండగా; భీష్ముండు; భీషణ+ఆకారుండు+ఐ= భయం కలిగించే ఆకారం కలవాడై; ప్రళయకాలభైరవరవంబు+అగు= యుగంయొక్క అంతంలోని భయంకరమైన గర్జనగల; వారిదంబు కరణిన్= మేఘంవలె; గర్జిల్లుచున్= గర్జన చేస్తూ; పటు= సమర్థమైన; నారాచ= బాణాలయొక్క; పటల= సమూహమనే; ఆసారంబున్= జడివానను; నిగిడించి= క్రమ్ముకొనచేసి; వారలన్= ఆ కృష్ణార్జునులను; వెగడు పటిచి= తల్లడపడచేసి; అచ్చటన్= ఆచోట; ఒండు+ఒరులన్= ఒకరినొకరిని; మెచ్చక= లెక్కచేయక(లక్ష్యపెట్టక); అటిమి= ఆక్రమించి; తటిమిన= వెంబడిపడి పరుగుదీయించిన; వైరులన్= శత్రువులగు యోధులను; రూపుమాపి= నశింపజేసి; పరిశ్రాంతులు+ఐన= మిక్కిలి బడలిక చెందినవారైన; కృష్ణ+అర్జునులునున్= కృష్ణుడు, అర్జునుడును; భీతులు+అగు= భయపడ్డవారైన; భీమసేన ప్రముఖులును= భీముడు ప్రధానుడుగా గలవారును; చేయునది లేక= ఏమీ చేయడానికి చేతగాక; చూచుచున్+ఉండన్= చూస్తూ ఉండగా; పాంచాల బలంబులన్= పాంచాల రాజు సేనలను; బారి+చమరు+అప్పుడు= హింసించే సమయంలో; బలుమానిసి= బలంగల మనుష్యుడు; చలిచీమలన్= చలిచీమలను; కాలన్= అరికాలితో; చమురు చందంబున్= రాచే విధంగా; తోఁచెన్= అనిపించింది; ఆ+అవసరంబునన్= అట్టి సమయంలో.

**తాత్పర్యం:** అర్జునుడు పై విధంగా ప్రార్థించగా, కృష్ణుడు ప్రియపడి, ఏమీ మాట్లాడకుండా వెనుకకు తిరిగి వచ్చాడు. ఆ కృష్ణార్జునులు ఇద్దరూ ఎక్కిన తేరు రెండు శిఖరాలు కల పర్వతంలా అండగా నిలిచి ఉన్నది. భీష్ముడు భయంకరమైన ఆకారంతో ప్రళయకాలంలో భయంకరంగా గర్జించే మేఘం మాదిరి బొబ్బలు పెట్టుతూ, బాణ పరంపర లనే జడివాన కురిపించి ఆ ఇద్దరినీ తల్లడిల్లచేశాడు. అక్కడుండే వారినెవరినీ లెక్కచేయకుండా, మీదపడి పరుగులెత్తించాడు. శత్రువుల భటులను నశింపజేశాడు. బాగా బడలికచెందిన కృష్ణార్జునులు, భయపడ్డ భీమాదులు ఏమీ చేయలేక ఊరక చూస్తూండగా, పాంచాలరాజు సేనను అప్పుడు భీష్ముడు చంపటాన్ని చూస్తుంటే ఒక బలవంతుడైనవాడు అరికాలితో చీమల్ని రాచివేసే మాదిరి గోచరించింది. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉపమ. 1.కృష్ణార్జునులు ఇద్దరెక్కిన రథం, రెండు శిఖరాలు గల పర్వతం మాదిరి ఉన్నది - అనటంలో, రథం - ఉపమేయం. పర్వతం - ఉపమానం, కృష్ణార్జునులు - ఉపమేయాలు, రెండు శిఖరాలు - ఉపమానం. పోలెన్ - అనేమాట ఉపమావాచకం. ఒప్పియుండుట సాధారణ ధర్మము- ఇది పూర్ణోపమాలంకారము.

2. భీష్ముడు - ఉపమేయం; వారిదము - ఉపమానము; కరణి అనేమాట ఉపమావాచకం. కురియడం సాధారణ ధర్మం. ఉపమాన ఉపమేయ - సాధారణ ధర్మ ఉపమావాచకాలు అప్పటంగా చెప్పటంచేత ఇక్కడకూడా పూర్ణోపమాలంకారమే. మేఘం కొండ శిఖరాలను తాకి వర్షిస్తుంది. భీష్ముడు కృష్ణార్జునులను చేరి బాణ వర్షం కురిపించాడు.

3. భీష్ముడు - ఉపమేయం; బలుమానిసి - ఉపమానం; పాంచాల బలాలు - ఉపమేయం ; చలిచీమలు - ఉపమానం హింసించడం - సాధారణధర్మం. 'చందంబు' అనే మాట ఉపమావాచకం. ఇచ్చట కూడా పై వాటి వలె పూర్ణోపమాలంకారమే.

**క. తా నస్తశిఖరి మఱువడఁ । బోనియపుడు పాండురాజపుత్త్ర విరాజ**
**త్సేన పాడవడఁగు ననుకృప । నో నలినాప్తుండు గ్రుంకె నుర్వీనాథా! 271**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= భూమికి భర్తవైన ధృతరాష్ట్రమహారాజా!; తాన్= తాను(సూర్యుడు); అస్తశిఖరి= పడమటి కొండలో; మఱు+పడన్= అస్తమించటానికి; పోని+అపుడు= పోకుండా ఉన్నప్పుడు; పాండురాజు= పాండురాజుయొక్క; పుత్త్ర= కొడుకులైన

ధర్మరాజాదులయొక్క; విరాజత్= ప్రకాశించెడి; సేన= సైన్యము; పొడవు+అడఁగున్= రూపుచెడిపోవును; అనుకృపనో?= అనే దయతోనే ఏమో?; నలిన+ఆప్తుండు= తామరలకు మిత్రుడు అయిన సూర్యుడు; క్రుంకెన్= అస్తమించాడు.

**తాత్పర్యం:** తాను (సూర్యుడు) అస్తగిరిని చేరి మరుగుపడకపోతే ఈ పాండవ సైన్యమంతా రూపుమాసిపోతుంది. అనే దయతో కాబోలు - సూర్యుడు అస్తమించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. సూర్యుడు సహజంగా అస్తమించడాన్ని కవి ఈ విధంగా ఉత్ప్రేక్షించాడు. సూర్యాస్తమయానికి, పాండవసేన రూపుమాసిపోవడం కారణం కాకపోయినా, దాన్ని కారణంగా చెప్పాడు.

**వ. అట్టియెడ ధర్మతనయుం డతిఘోరం బగు సంధ్యాసమయంబునం బంకనిర్మగ్నయైన గోవునుం బోలె నున్న నిజసేనం జూచి యొక్కింతసేపు చింతా క్రాంతుండై యప్పటికిం దిగుటయ కర్జంబుగాఁ దలంచి తగువారల నెల్లం దివియ నియమించి. 272**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్=ఆలాంటి సమయంలో; ధర్మతనయుండ; అతి ఘోరంబు+అగు=మిక్కిలిభయంకరమైనట్టి; సంధ్యాసమయంబునన్=సంధ్యాకాలంలో; పంక నిర్మగ్న+ఐన=బురదలోబాగాదిగబడిన; గోవునున్+పోలెన్=ఆవువలె; ఉన్న=ఉన్నట్టి; నిజసేనన్=తన యొక్క సైన్యాన్ని; చూచి; ఒక్క+ఇంతసేపు= కొంచెంకాలం, చింతా+ఆక్రాంతుండు+ఐ= బాధచేత ఆక్రమింపబడినవాడై; అప్పటికిన్=ఆసమయానికి; తిగుట+అ=వెనక్కు తగ్గటమే; కర్జంబు+కాన్=చేయతగ్గపనిగా; తలంచి; తగువారలన్=తగినవారిని; ఎల్లన్=అందరిని; తివియన్=వెనుదిరుగుటకు; నియమించి=ఆజ్ఞాపించి;

**తాత్పర్యం:** అప్పుడు మిక్కిలి దారుణమైన సంధ్యాసమయంలో బురదలో బాగా దిగబడ్డ ఆవు మాదిరి తనసైన్యం చాలా సంకటపడుతూండగా ధర్మరాజు చూచి, కొంచెంసేపు, బాధపడి, యుద్ధం నుండి తన బలాన్ని చాలిం(ఉపసంహరిం)ప చేయటమే ఆసమయానికి తగినపని అని అనుకొని, సైన్యాన్ని వెనుదిరగటానికి ఆజ్ఞాపించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. గాంగేయుచేత నెంతయు । భంగపడితి మనుచు వగచు పార్థాదులు ద**
**న్నుం గొలిచి చనఁగ విడిదల । కుం గడువిన్ననయిపోయెఁ గురువంశనిధీ! 273**

**ప్రతిపదార్థం:** కురువంశనిధీ= కురుకులానికిగనియైన ధృతరాష్ట్రమహారాజా!; గాంగేయుచేతన్= భీష్ముడిచేత; ఎంతయున్= ఎంతో అధికంగా; భంగము+పడితిమి+అనుచున్= అవమానపడ్డామని అనుకుంటూ; వగచు=దుఃఖపడుతున్న; పార్థ+ఆదులున్= అర్జునుడు మున్నగు పాండవులు; తన్నున్= తన(ధర్మరాజు)ను; కొలిచి= సేవించి(అనుసరించి); చనఁగన్= నడువగా; విడిదలకున్= తమ నివాసస్థానాలకు; కడున్= మిక్కిలి; విన్నన+అయి= వెలవెలబారినవాడై; పోయెన్= (ధర్మరాజు) వెళ్ళాడు.

**తాత్పర్యం:** అర్జును డాదిగా గల మహామహులందరు భీష్ముడిచేత, చాలా అవమానపడ్డామని దుఃఖపడుతూ, తన్ను (ధర్మరాజును) అనుసరించిరాగా, ముఖం చిన్నబుచ్చుకొని ధర్మరాజు తన నివాసానికి చేరుకొన్నాడు.

**వ. ఇట్లు పాండవ వ్యూహంబు లోహటించి పోయినం దారును దమబలంబులఁ దివియ నియమించి.274**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవవ్యూహంబులు= పాండవుల సేనలు; ఓహటించి= వెనుకకు తిరిగి; పోయినన్= పోగా; తారునున్= తాము(కౌరవులు)న్నూ; తమ బలంబులన్= తమయొక్క సేనలను; తివియన్= యుద్ధం నిలపడానికి; నియమించి= ఆజ్ఞచేసి.

**తాత్పర్యం:** పై విధంగా పాండవసేనలు వెనుకకు మరలి వెళ్ళాయి. అప్పుడు కౌరవులుకూడా తమ బలాలకు యుద్ధం చాలించండి అని ఉత్తరువు చేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. ఎలమి నమస్కరించుచు నహీనపరాక్రమభంగు లేర్పడం**
**బలికి యుదాత్తవాక్యములఁ బ్రస్తుతి సేయుచు భీష్ము నందఱున్**
**బలసి భవత్తనూజులు మనంబులు నిండి ముదంబు మోములన్**
**వెలి విరియంగ నేఁగిరి నవీనవిభూతి నివాసభూమికిన్. 275**

**ప్రతిపదార్థం:** భవత్+తనూజులు= నీ (ధృతరాష్ట్రుని) యొక్క కుమారులు; అందఱున్= యావన్మంది; భీష్మున్= భీష్ముని; బలసి= చుట్టుకొని; ఎలమిన్= సంతోషంతో; నమస్కరించుచున్= దండాలు పెట్టుతూ; అహీన= తక్కువకాని; పరాక్రమ= భీష్ముని పరాక్రమముయొక్క; భంగులు= విధాలు; ఏర్పడన్= తేటతెల్లంగా; పలికి= చెప్పి; ఉదాత్తవాక్యములన్= గొప్ప గొప్ప మాటలతో; ప్రస్తుతి+చేయుచున్= పొగడుతూ; ముదంబు= సంతోషము; మనంబులు నిండి= మనస్సులందు నిండిపోయి; మోములన్ = ముఖాలయందు; వెలివిరియంగన్= ఉబ్బుచుండగా; నవీన= క్రొత్తదైన; విభూతిన్= ఐశ్వర్యంతో; నివాసభూమికిన్= తాము ఉండేచోటుకు; ఏఁగిరి= వెళ్ళిపోయారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ కుమారులందరూ భీష్ముడిని చుట్టి నిలిచి, దండాలు పెడుతూ, ఆయన యొక్క గొప్ప పరాక్రమాల పోకడలను ఎత్తి చెప్పుతూ, అర్థయుక్తమైన పదజాలంతో అతడిని పొగడుతూ, తమ మనస్సులలోని ఆనందం ముఖాలలో తాండవిస్తూ ఉండగా తమ తమ నివాసభవనాలకు వెళ్ళిపోయారు.

**వ. ఇట్లు ధర్మతనయుండు దొమ్మిదవ నాఁటి బవరంబున బెండువడి యా నిశాసమయంబునందు రహస్య ప్రకారంబున. 276**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ మాదిరిగా; ధర్మతనయుండు= ధర్మరాజు; తొమ్మిదవనాటి= తొమ్మిదో దినం యొక్క; బవరంబునన్= యుద్ధమందు; బెండు+పడి= బలహీనపడి; ఆ+నిశా సమయంబునందున్= ఆనాటి రాత్రి కాలంలో; రహస్యప్రకారంబునన్= రహస్యమైన రీతిలో.

**తాత్పర్యం:** తొమ్మిదవనాటి యుద్ధంలో ధర్మరాజు చాలా బలహీనపడ్డాడు. ఆనాటి రాత్రి ఆతడు రహస్యంగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మనమున విషాద మడరఁగ । ననుజులఁ గూర్చికొని దానవాంతకుసదనం**
**బునకుం జని యి ట్లను నా । తనితో నాత్మీయకార్యదశ దెలియుటకున్. 277**

**ప్రతిపదార్థం:** మనమునన్= మనస్సులో; విషాదము= దుఃఖము; అడరఁగన్= అధికంకాగా; అనుజులన్= తమ్ముళ్ళను; కూర్చికొని= వెంటబెట్టుకొని; దానవ+అంతకు సదనంబునకున్= రాక్షసులను చంపిన కృష్ణుడి భవనానికి; చని= వెళ్ళి; ఆత్మీయ కార్యదశన్= తనదైన చేయతగ్గ పని యొక్క స్థితిని; తెలియుటకున్= తెలుసుకోవడానికి; ఆతనితోన్= ఆ కృష్ణుడితో; ఇట్లు+అనున్.

**తాత్పర్యం:** ధర్మరాజుకి మనస్సులో దుఃఖం పెచ్చురేగింది. తన తమ్ముళ్ళను వెంటతీసికొని శ్రీకృష్ణుడి భవనానికి వెళ్ళాడు. తను ఇకముందు చేయదగ్గ పనిని తెలిసికోవటానికి ఆయనతో ఇట్లా అన్నాడు:

**క. ' కార్చిచ్చు గవిసి మృగతతి । నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచిన కడిమిం**
**బేర్చి మనసేనఁ బొదివె శ । రార్చుల నవ్వీరుఁ గన్నులారం గంటే? 278**

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు; నేఁడు= ఈనాడు; ఏచినకడిమిన్= అతిశయించిన పరాక్రమంతో, పేర్చి= అతిశయించి; మనసేనన్= మన పాండవుల యొక్క సైన్యాన్ని; కారు+చిచ్చు= అడవిలో పుట్టే అగ్ని; కవిసి; మృగతతిన్= జంతు సముదాయాన్ని; ఏర్చు కరణిన్= కాల్చే మాదిరిగా; శర+అర్చులన్= బాణాలనే అగ్ని జ్వాలలతో; పొదివెన్= కప్పివేశాడు; ఆ+వీరున్= ఆ వీరుడిని; కన్నులారన్= నీ కండ్లతో చక్కగా; కంటే?= చూచావా?

**తాత్పర్యం:** 'భీష్ముడు ఈ దినం యుద్ధంలో బాగా విజృంభించిన పరాక్రమంతో మనసేనను వరుసపెట్టి, దావాగ్ని అరణ్యంలోని జంతుజాలాన్ని భస్మంచేసే విధంగా బాణాగ్నిజ్వాలలతో కప్పివేశాడు. ఓ కృష్ణా! నీవు ప్రత్యక్షంగా కన్నులారా ఆ వీరుడిని చూచావుగదా!

**విశేషం :** అలం: ఉపమ. 'భీష్ముడు మనసేనన్'... పొదువుట - ఉపమేయవాక్యం. 'కార్చిచ్చు మృగతితిన్...' ఏర్చుట - ఉపమానవాక్యం; ఏర్చుట, పొదువుట - సాధారణ ధర్మం; కరణి - ఉపమావాచకం. శరార్చులు అనే చోట రూపకం. శరములనెడి అర్చులు.

**మ.** **మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుర్మానంబునం జేసి యే**
**మును గార్యస్థితిఁ గాన నైతి విను నిర్మూలంబుగాఁ బోరఁ జ**
**చ్చిన సామ్రాజ్యము గొన్న యట్లగునె? నిశ్చింతంబునం గాననం**
**బునకుం బోయెదఁ దమ్ములం గొని తపఃపూజ్యుండ నై యుండెదన్.** **279**

**ప్రతిపదార్థం:** ఆతనికిన్= ఆ భీష్ముడికి; మనవారు= పాండవపక్షంలోనివారు; ఎవ్వరున్= ఎవరుగాని; ఓర్వరు= ఎదురు నిలబడలేరు; ఏన్= నేను; మును= ముందు; దుర్+మానంబునన్+చేసి= దురహంకారంతో; కార్యస్థితిన్= కాగల కార్యం యొక్క నిజస్థితిని; కానన్+ఐతిన్= తెలియలేకపోయాను; విను= ఓ కృష్ణా!, ఆలకించు; పోరన్= యుద్ధంలో; నిర్+మూలంబు+కాన్= మొదలంట; చచ్చినన్= బందుగులు చనిపోగా; సామ్రాజ్యమున్= సకల భూమికి రాజగుట(చక్రవర్తిత్వము); కొన్న+అట్లు+అగునె?= తీసికొన్నట్లగునా?; నిస్+చింతంబునన్= చింతలేనట్లుగా; తమ్ములన్= నా తమ్ముళ్ళను - భీమాదులను; కొని= తీసికొని; కాననంబునకున్= అరణ్యానికి; పోయెదన్= వెళ్ళుతాను; తపః+పూజ్యుండన్+ఐ= తపస్సుచేత పూజింపతగ్గవాడనై; ఉండెదన్= ఉంటాను.

**తాత్పర్యం:** ఓ కృష్ణా! మన పాండవులసేనలో ఏ ఒకడూ కూడా భీష్ముడు ఢీకొంటే ఎదుట నిలబడగలవాడు లేడు. యుద్ధానికి దిగేముందే, వ్యర్థమైన అహంకారంతో భీష్ముడి తాకిడికి తట్టుకోలేమనే సంగతిని నేను ఊహించలేకపోయాను. యుద్ధంలో బంధుజనం, జనం అసలు లేకుండా చావగా వచ్చిన సామ్రాజ్యం ఎందుకు? జనంలేని సామ్రాజ్యాన్ని తీసుకోవటం, ఒక రాచరికమౌతుందా? కనుక జనం లేని సామ్రాజ్యం నాకు అక్కరలేదు. నేను నిశ్చింతగా నా తమ్ముళ్ళను వెంటబెట్టుకొని అరణ్యానికి వెళ్ళుతాను. అక్కడ తపస్సు చేసికొంటూ, పూజార్హుడుగా ఉండిపోతాను. ఇక్కడ ఈ యుద్ధంవల్ల నాకు నింద కలుగుతుంది.

**క.** **మున్నును నేఁగారణముగ । నన్నియిడుమ లనుభవించి రనుజులు వీరిం**
**గన్నారఁ జూతుఁ గాని జ । గన్నుత! భీష్మునకుఁ గోలుగా నీఁ జాలన్.** **280**

**ప్రతిపదార్థం:** జగత్+నుత!= లోకంచేత కీర్తింపబడే ఓ కృష్ణా!; మున్నునున్= మునుపు; ఏన్+కారణముగన్= నేను కారణంకాగా; అనుజులు= నా తమ్ములు; అన్ని+ఇడుమలు= అన్ని కష్టాలను; అనుభవించిరి= అనుభవించారు; వీరిన్= అట్టి ఈ నా తమ్ముళ్ళను; కన్నారన్= కనులపండువుగా; చూతున్+కాని= చూస్తానుగాని; భీష్మునకున్= భీష్ముడికి; కోలు+కాన్= దోపిడి అయ్యేటట్లుగా; ఈన్+చాలన్= ఈయలేను.

**తాత్పర్యం:** ఓ కృష్ణా! జూదమాడిన నావల్ల నా తమ్ముళ్ళు ఎన్నో కష్టాలు అనుభవించారు. అట్టివారిని కన్నులార చూచి, సంతోషించుచుతానుగాని భీష్ముడికి దోపిడిగా ఒప్పగించలేను.

**వ. నీకు మా దెస ననుగ్రహంబు గలదేని కయ్యంబు దక్కి ధర్మ విరోధంబు గాకుండునట్టి యొక్క తెరువు సెప్పు' మని సకరుణంబుగాఁ బలికిన విని శౌరి సాంత్వనవచనంబుల ననునయించి యతని కి ట్లనియె. 281**

**ప్రతిపదార్థం:** నీకున్= (కృష్ణుడవగు) నీకు; మాదెసన్= మాయందు; అనుగ్రహంబు= దయ; కలదు+ఏనిన్= ఉన్నట్లయితే; కయ్యంబు= యుద్ధాన్ని; తక్కి= వదలిపెట్టి; ధర్మవిరోధంబు= ధర్మానికి విరోధము; కాక+ఉండు+అట్టి= కాకుండా ఉండేటువంటి; ఒక్క తెరువు= ఒక మార్గాన్ని; చెప్పుము+ అని= సెలవీయవలెనని; సకరుణంబు+కాన్= దయతో కూడునట్లుగా; పలికినన్= చెప్పగా; విని; శౌరి= కృష్ణుడు; సాంత్వనవచనంబులన్= ఊరడింపు మాటలతో; అనునయించి= బుజ్జగించి; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు+అనియె.

**తాత్పర్యం:** ఓ కృష్ణా! నీకు మా పట్ల దయ ఉంటే, యుద్ధాన్ని తప్పనిచ్చి, ధర్మానికి విరోధం లేకుండా ఉండే ఏదో ఒక ఉపాయాన్ని (మార్గం) చెప్పు' అని చాలా జాలిగా ధర్మరాజన్నాడు. కృష్ణ డితడి మాటలు విని, అతన్ని ఊరడింపు మాటలతో బుజ్జగించి, ఈ విధంగా అన్నాడు.

**క. ' సత్యప్రతిజ్ఞుఁడవు నీ । వత్యద్భుత బాహువీర్యు లనుజన్ములు దౌ**
**ర్గత్యము గల్గునె? నీకు న । మాత్యుఁడ నై యేను రాజ్యమహిమ నొనర్తున్. 282**

**ప్రతిపదార్థం:** నీవు; సత్యప్రతిజ్ఞుఁడవు= సత్యమైన ప్రతిజ్ఞ కలవాడివి; అనుజన్ములు= నీ తోబుట్టువులు; అతి+అద్భుత బాహు వీర్యులు= చాలా గొప్ప భుజబలం గలవారు; నీకున్= నీకు; దౌర్గత్యము= దుర్గతి (హీనత్వము); కల్గునె?= ఏర్పడునా?; ఏర్పడదనుట; ఏను= నేను (శ్రీకృష్ణుడు); అమాత్యుఁడన్+ఐ= మంత్రిగా ఉండి; రాజ్యమహిమన్= నీ రాజ్యానికి ఐశ్వర్యాన్ని; ఒనర్తున్= కలిగించుతాను.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! నీవు సత్యమైన ప్రతిజ్ఞ కలవాడివి, అంటే నీవు ప్రతిజ్ఞ చేశావంటే దాన్ని తప్పక నెరవేర్చేవాడివి. ఇక నీ తమ్ముళ్ళూ ఆశ్చర్యం కలిగించే బాహుబలంగలవారు. అటువంటి నీకు (దుఃస్థితి) హీనదశ కలుగనేరదు. పైగా నేను మంత్రిగా ఉండి నీ రాజ్యానికి ఐశ్వర్యాన్ని సమకూరుస్తాను.

**క. వగవఁగ నేటికిఁ బార్థుఁడు । దెగువకుఁ జొరకున్న భీష్ముఁ దెగఁ జూచి వెసం**
**బగ యడఁగించెద నన్నున్ । మగిడింపక చూచుచుండు మనుజాధీశా! 283**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= ఓ ప్రభూ ధర్మరాజా!; వగవఁగన్+ఏటికిన్= దుఃఖించడం ఎందుకు?; పార్థుఁడు= అర్జునుడు; తెగువకున్= సాహసానికి; చొరక+ఉన్నన్= దిగకుండా ఉంటే; భీష్మున్= భీష్ముడిని; తెగన్+చూచి= చంపి; వెసన్= వెంటనే; పగ= విరోధాన్ని; అడగించెదన్= పోగొడతాను; నన్నున్= కృష్ణుడగునన్ను; మగిడింపక= మరల్పకుండా; చూచుచుండుము.

**తాత్పర్యం:** ధర్మజా ! దుఃఖ పడటమెందుకు? అర్జునుడు భీష్ముడిని చంపడానికి తెగించకపోతే నేనే భీష్ముడిని చంపి పగను పోగొడతాను. అర్జునుడు నన్ను వెనుకకు మరల్చకుండా చూడు.

**తే. సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి । నాకు, నతనికి నై యేను నరవరేణ్య!**
**కూర్మిమై నిత్తుఁ గండలు గోసి యైన । నరయ నాతండు నాయెడ నట్టివాఁడ. 284**

**ప్రతిపదార్థం:** నరవరేణ్య!= ఓ మానవశ్రేష్ఠుడా!; సవ్యసాచి= అర్జునుడు; నాకున్; సఖుఁడు= చెలికాడు; సంబంధి= చుట్టం; శిష్యుండు; ఏను= నేను; అతనికిన్+ఐ= ఆతడికొరకై; కూర్మిమైన్= ప్రేమతో; కండలుకోసి+ఇనన్= నా శరీరంలోని కండలు కోసి అయినా; ఇత్తున్; అరయన్= చూడగా; ఆతండున్= ఆ అర్జునుడుకూడా; నా+ఎడన్= నా విషయంలో; అట్టివాఁడు+అ= అట్టివాడే.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నాకు అర్జునుడు - స్నేహితుడు, సంబంధి (మా సోదరి సుభద్రకు భర్త) అంతేకాదు. నాకు శిష్యుడు కూడా. అతని మేలు కోసం సంతోషంతో నా శరీరంలోని కండలైనా కోసి ఇస్తాను. ఆలోచించి చూడగా అర్జునుడు కూడా నాపట్ల అంతప్రేమకలవాడే. మా ఇద్దరి కలయిక అంత దృఢమైనది.

**వ. ఉపప్లావ్యంబున నతండు సంజయుతో నాడినబలుమాటలకు, నులూకుండు వచ్చినప్పు డతని పలుకులం బుట్టినబెట్టిదంపుఁదనంబునకుం దగినయంత నాకుం జేయవలయు నేను నీరెండెడలం బెక్కులు వలికినవాఁడ మా కిరువురకు నొండొరువుల పలుకులు పరిపాలించుట సమయంబయి యుండు ననిన వసుదేవనందనునకు ధర్మనందనుం డి ట్లనియె. 285**

**ప్రతిపదార్థం:** ఉపప్లావ్యంబునన్; ఇతండు= అర్జునుడు; సంజయుతోన్; ఆడిన= పలికిన; బలుమాటలకున్= పెద్దమాటలకు; ఉలూకుండు; వచ్చిన+అప్పుడు= వచ్చిన సమయంలో; అతని పలుకులన్= అతడి మాటలవల్ల; పుట్టిన= కలిగిన; బెట్టిదము+తనంబునకున్= క్రూరత్వానికి; తగిన+అంత; నాకున్+చేయవలయున్= నేను చేయవలసివుంది; ఏనున్= నేను(కృష్ణుడు)కూడా; ఈ రెండు+ఎడలన్= ఈ రెండు చోట్ల; పెక్కులు= చాలా చాలా; పలికినవాఁడన్= మాట్లాడాను; ఒండు+ఒరుల; ఒకరొకరియొక్క; పలుకులు= మాటలు; పరిపాలించుట= నెరవేర్చుట; మాకున్+ఇరువురకున్= మా ఇద్దరికి; సమయంబు+అయి+ఉండున్= ఒడంబడికగా ఉన్నది; అనినన్; ధర్మనందనుండు; వసుదేవనందనునకున్= వసుదేవుడి కొడుకు - కృష్ణుడికి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** ఉపప్లావ్యంలో అర్జునుడు సంజయుడితో అన్న మాటలకు, ఉలూకుడు వచ్చిన సమయంలో అతడి మాటల వల్ల ఏర్పడ్డ క్రూరత్వానికి తగినట్లుగా నేను కూడా చేయవలసి ఉన్నది. ఈ రెండు సందర్భాలలో నేను కూడా హెచ్చులు పలికాను. మా ఇద్దరిలో, ఒకరి మాటలను మరొకరు నెరవేర్చడమనేది మా ఇద్దరి ప్రతిజ్ఞ' అనగా విని, ధర్మరాజు కృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఉలూకుడు: ఇతడు భారత యోధుడు. శకుని యొక్క కొడుకు. **"ఆహూయోపహ్వరే రాజన్నులూక మిదమబ్రవీత్ । ఉలూక గచ్ఛకౌరవ్య పాండవాన్ సహసోమకాన్"** ॥ (మహాభారతం)

**క. ' కయ్యము సేయక తగు సా । హాయ్యము సేయఁగలవాఁడ నని పలికితి ని**
**న్ని య్యెడ నేఁ బొంకింతునె? । దయ్యము నా కేల యిట్టి దైన్యము దెచ్చెన్? 286**

**ప్రతిపదార్థం:** కయ్యము= యుద్ధం; చేయక; తగు= తగినట్టి; సాహాయ్యమున్= సహాయాన్ని; చేయన్+కలవాఁడన్+అని= చేస్తానని; పలికితి(వి)= చెప్పావు; నిన్నున్= అట్లా చెప్పినట్టి నిన్నున్; ఈ+ఎడన్= ఈ పట్టులో; ఏన్= నేను (ధర్మరాజు); బొంకింతున్+ఎ?= అబద్ధమాడించగలనా?; దయ్యము= విధి; నాకున్= ధర్మరాజగు నాకు; ఇట్టి దైన్యమున్= ఈలాంటి హీనస్థితిని; ఏల తెచ్చెన్?= ఎందుకు తెచ్చిపెట్టింది?

**తాత్పర్యం:** 'ఓ కృష్ణా! నీవు యుద్ధం చేయకుండా ఉండి, తగు సహాయంచేస్తానని అన్నావుకదా! ఈ కష్టసమయంలో నిన్ను అబద్ధాలాడే వాడినిగా నేనెట్లా చేయను? నీవు యుద్ధం చేస్తే నా కోసం నీవు అబద్ధాలాడే వాడవవుతావు కదా! దైవం నాకు ఇంతగా సంకటమైన స్థితిని తెచ్చిపెట్టింది కదా!

**వ. నాకు దేవవ్రతునకు నొక్క సమయంబు గల దమ్మహాత్ముండు కౌరవులకు నయి కయ్యంబు సేయుటకును, నాకు హితం బగు కార్యంబు బుద్ధిం దలకొనుటకుం బూనినవాఁ డతండు రాజ్యం బొసంగు నని పలికి సఖేదంబుగా ని ట్లనియె. 287**

**ప్రతిపదార్థం:** నాకున్= ధర్మరాజైన నాకు; దేవవ్రతునకున్= భీష్ముడికిని; ఒక్క సమయంబు+కలదు= ఒక ఒడంబడిక ఉన్నది; ఆ+మహాత్ముండు; కౌరవులకున్+అయి= కౌరవులకొరకు; కయ్యంబున్= యుద్ధాన్ని; చేయుటకును= చేయడానికి; నాకున్; హితంబు+అగు= మంచిదైనట్టి; కార్యంబు= పనిని; బుద్ధిన్=బుద్ధియందు; తలకొనుటకున్= కలిగియుండుటకు; పూనినవాఁడు= పూనుకొన్నవాడు; అతండు= ఆ భీష్ముడు; రాజ్యంబున్= రాజ్యాన్ని; ఒసంగున్= ఇచ్చును; అని; పలికి; సఖేదంబు+గాన్= దుఃఖంతో కూడుకొన్నవాడై; ఇట్లు+అనియెన్= ఇలాగన్నాడు.

**తాత్పర్యం:** నాకున్నూ, భీష్ముడికీ ఒక ఒడంబడిక ఉన్నది. అదేమంటే, అతడు కౌరవుల పక్షంలో ఉండి యుద్ధం చేస్తాడు. నాకు మంచి కలిగించే ఆలోచన కలిగియుంటాడు. కాబట్టి రాజ్యం నాకు దక్కే ఉపాయం చెప్తుతాడు.' అని ధర్మరాజు అని, దుఃఖంతో మరలా ఇట్లా అన్నాడు:

**విశేషం :** దేవవ్రతుడు - దేవుని యొక్క వ్రతంవంటి వ్రతం గలవాడు. అనగా స్థిరమైన ప్రతిజ్ఞ కలవాడు. **'చిత్రాంగదం తతో రాజ్యే స్థాపయామాస వీర్యవాన్ । స్వయం న కృతవాన్ రాజ్యం తస్మాద్దేవవ్రతోzభవత్ ॥** దేవీ భాగవతే (1 - 20 - 16)

**ఆ. ' అకట! తండ్రి సచ్చినంతనుండియు మమ్ము । నరసి ప్రోచినట్టి యనుఁగుఁ దాతఁ**
**జంప మదిఁ దలంచుతెంపు సూచితె? రాజ । ధర్మ మింత క్రూరకర్మమగునె?' 288**

**ప్రతిపదార్థం:** అకట!= అయ్యో!; తండ్రి= తండ్రియైన పాండురాజు; చచ్చిన+అంతన్+ఉండియున్= చచ్చిపోయింది మొదలు; మమ్మున్= పాండురాజు కొడుకులమైన మమ్ములను; అరసి= విచారించి, (చూచి); ప్రోచిన; అట్టి= కాపాడినట్టి; అనుఁగు= ప్రియమైన; తాతన్= తాతగారిని; చంపన్= చంపటానికి; మదిన్= మనస్సులో; తలంచుతెంపు= తలచే తెగువ; చూచితే?= (ఓకృష్ణా!); చూచావా?; రాజధర్మము= క్షత్రియులయొక్క ధర్మం; ఇంత= ఇంతగా; క్రూరకర్మము= భయంకరమైన పని; అగునె?= అగునా?

**తాత్పర్యం:** అయ్యయ్యో! తండ్రి చనిపోయింది మొదలు మమ్ములను ఎంతో గారాబంగా చూచుకొంటూ వచ్చినవాడు, మాకు చాలా ప్రియమైనవాడు, అయిన తాతగారినే చంపాలనే తలంపు మనస్సులో పుట్టడం - చూశావా? రాజధర్మం ఇంత ఘోరమైనదా?

**వ. అనవుడు. 289**

**ప్రతిపదార్థం:** అనవుడు(న్)= అని చెప్పగానే.

**తాత్పర్యం:** ధర్మరాజు ఈ విధంగా కృష్ణుడితో చెప్పగానే (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. విని మురాంతకుఁ డితఁడు శాంతనవుకడకు । నరుగఁ జూచినవాఁ డని యాత్మ నెఱిఁగి**
**క్రమ్మఱంగ 'నేతెంచెదు గాక!' యనిన । యన్నదీసూనుతొంటి వాక్యములు దలఁచి. 290**

**ప్రతిపదార్థం:** ముర+అంతకుఁడు= మురుడనే రాక్షసుడిని చంపిన శ్రీకృష్ణుడు; విని= ధర్మరాజు మాటలు ఆలకించి; ఇతఁడు= ఈ ధర్మరాజు; శాంతనవు కడకున్= భీష్ముడి దగ్గరికి; అరుగన్= వెళ్ళడానికి; చూచినవాఁడు+అని= యత్నిస్తున్నాడని; ఆత్మన్=

మనస్సులో; ఎఱిఁగి= తెలుసుకొని; క్రమ్మఱంగన్= మరల తిరిగివచ్చుటకు; ఏతెంచెదుగాక!= వచ్చెదవులెమ్ము!; అనినన్= అంటూ; ఆ+నదీసూను= ఆ భీష్ముడియొక్క; తొంటి వాక్యములు= మొదట అన్న మాటల్ని; తలఁచి= జ్ఞప్తికి తెచ్చికొని.

**తాత్పర్యం:** కృష్ణుడు ధర్మరాజన్న మాటలు విన్నాడు. ఇతడు భీష్ముడి దగ్గరకు పోవాలని ఉన్నాడని మనస్సులో గ్రహించాడు. తరువాత వచ్చెదవుగాక అని భీష్ముడు యుద్ధ ప్రారంభానికి ముందు ధర్మజునితో అనిన వాక్యాలు జ్ఞప్తికి తెచ్చుకొని (తరువాతి పద్యంతో అన్వయం)

**వ. అజాతశత్రున కిట్లనియె. 291**

**ప్రతిపదార్థం:** అజాత శత్రునకున్ ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఈ చెప్పబోయే విధంగా అన్నాడు.

**విశేషం:** అజాతశత్రుడు(వు) - పుట్టని శత్రువులు కలవాడు - ధర్మరాజు (ఇతడికి శత్రువులే లేరన్నమాట.)

**ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట (సం. 6-103-50)**

**ఆ. నీ తలంపు లెస్స నీవు మున్ననినట్ల । కాక భీష్ముఁ డలుక గదిరిపోరఁ**
**జక్కఁ జూచెనేని శత్రువుల్ వొలియరె? । యిప్పుడతని పాలికేఁగు మధిప! 292**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధర్మరాజా!; నీ తలంపు= నీ యొక్క ఆలోచన; లెస్స= మంచిది; నీవు= ధర్మరాజు; మున్ను= ముందు; అనిన+అట్లు+అ+కాక= నీవు అన్నట్లే; భీష్ముఁడు = భీష్మాచార్యుడు; అలుక= కోపం; కదిరి= విజృంభించి; పోరన్= యుద్ధంలో; చక్కన్+చూచెన్+ఏని= చంపదలచుకుంటే; శత్రువుల్= విరోధులు; పొలియరె?= చావరా?; ఇప్పుడు; అతని పాలికిన్= ఆ భీష్ముడి దగ్గరకు; ఏఁగుము= పొమ్ము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! భీష్ముడి వద్దకు వెళ్ళాలనే నీ ఆలోచన చాలామంచిది. భీష్ముడు కౌరవుల వైపు ఉండి, యుద్ధం చేస్తాడని, మనస్సులో మీ హితాన్ని కోరుతూ మంచి కలిగించడానికి పూనుకొని ఉంటాడని, అతడు నీకు రాజ్యం చెందేట్టు చేస్తాడని - అన్నావు కదా! అట్లా కాకపోతే, అతడనుకుంటే శత్రులనందరినీ చంపివేయగలడు. కాబట్టి నీవు ఇప్పుడు అతనివద్దకు వెళ్ళటం చాలా మంచిది.

**సీ. నీవు దన్నడిగిన నిజవధోపాయం బవశ్యంబుఁ జెప్పు దేవవ్రతుండు**
**మనము రహస్యవర్తనమున నందఱమును జని య మ్మహాత్మునకు భక్తి**
**నెరఁగి తెల్లంబుగ హితకార్యగతి వినయంబుమైఁ బ్రార్థించి యడిగి యతని**
**సదయమంత్రోపదేశంబున నెగడుద' మని యిట్లు హరి నిశ్చయంబు సేయ**

**ఆ. నయ్యజాతశత్రుఁ డనుజులు నతఁడును । దాను సౌమ్యవేషధరణమొప్ప**
**నతినిగూఢ వృత్తి నాపగాసుతుమంది । రమున కరిగి సముచితముగఁ జొచ్చి. 293**

**ప్రతిపదార్థం:** నీవు= ధర్మరాజైనట్టి నీవు; తన్నున్= ఆ భీష్ముడిని; అడిగిన(న్)= అడిగితే; దేవవ్రతుండు= భీష్ముడు; నిజవధ+ఉపాయంబున్= తన మరణానికి ఉపాయాన్ని; అవశ్యంబున్= తప్పకుండా; చెప్పున్= చెప్తాడు; మనము; మనమందరం; రహస్య వర్తనమునన్= చాటుగా; చని= అతడివద్దకుపోయి; ఆ+మహాత్మునకున్= ఆ మహానుభావుడికి; భక్తిన్= భక్తితో; ఎరఁగి=

నమస్కరించి; తెల్లంబుగన్= స్పష్టంగా; హితకార్యగతిన్= మేలు గల్గించు కార్యవిధానమును; వినయంబుమైన్= వినయంతో; ప్రార్థించి; అడిగి; అతని= ఆ భీష్ముడియొక్క; సదయమంత్ర+ఉపదేశంబునన్= దయతో కూడిన రహస్యమైన హితవచనంతో; నెగడుదము+అని= వృద్ధి పొందుదామని; ఇట్లు; నిశ్చయంబు= నిర్ణయాన్ని; చేయన్= చేయగా; అతఁడునున్; ఆ+అజాతశత్రుఁడున్= ఆ ధర్మరాజు; అనుజులున్= తమ్ములు; తాను= కృష్ణుడు; సౌమ్యవేషధరణము= సాధారణమైన వస్త్రాదులు ధరించుట; ఒప్పన్= తగియుండగా; అతి నిగూఢమైన వృత్తిన్= అతి రహస్యమైన రీతిలో; ఆపగాసుతుమందిరమునకున్= భీష్ముడి భవనానికి; అరిగి= వెళ్ళి; సమ్+ఉచితముగన్= చక్కగా, తగిన రీతిగా; చొచ్చి= లోనికి వెళ్ళి.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీవు ఆ భీష్ముడిని తన వధకు ఉపాయమేమిటో అడిగితే అతడు నీకు తప్పకుండా చెప్పుతాడు. మన మందరం కలిసి, ఎవ్వరికి తెలియకుండా ఆయన దగ్గరకు వెళ్ళాలి. ఆ మహాత్ముడికి భక్తితో దండాలు పెట్టాలి. మనకు మేలు కలిగే కార్యవిధానాన్ని బాగా మనకు తెలియజెప్పవలెనని ఆయనను వేడికొని అడగాలి. అప్పు డతడు దయగలవాడై, మనకు మేలు కలిగించే ఉపాయాన్ని చెప్పగలడు. ఆయన ఉపదేశంతో పెంపొందెదము" అని కృష్ణుడు నిశ్చయించగా, ధర్మరాజు, అతడి తమ్ములు, తాను (కృష్ణుడు) ఆర్భాటం లేకుండా, సాధారణమైన వస్త్రాలు, అలంకారాలు ధరించి, ఎవరికంటా పడకుండా రహస్యంగా భీష్ముడి భవనానికి వెళ్ళి, తగిన రీతిగా వినయంగా లోపలికి ప్రవేశించారు.

**వ. అతనిం గాంచి యధికభక్తిం బ్రస్తవనపూర్వకంబుగాఁ దత్పాదంబులకుం బ్రణమిల్లిన నతం డత్యాదరంబునఁ**
**బేరుపేర వారలందఱసేమంబు లడిగి యి ట్లనియె. 294**

**ప్రతిపదార్థం:** అతనిన్= ఆ భీష్ముడిని; కాంచి= చూచి; అధికభక్తిన్= మిక్కుటమగు భక్తితో; ప్రస్తవన పూర్వకంబుగాన్= పొగడ్త ముందు కలుగునట్లుగా; తద్+పాదంబులకున్= ఆయన పాదాలకు; ప్రణమిల్లినన్= నమస్కారం చేయగా; అతండు= ఆ భీష్ముడు; అతి+ఆదరంబునన్= మిక్కిలి ఆదరణతో; పేరు+పేరన్= పేరుపేరునా; వారల+అందఱ= వారందరియొక్క; సేమంబులు= క్షేమాలను; అడిగి; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** కృష్ణుడూ, పాండవులూ ఆ భీష్ముడిని చూచి చాలా భక్తితో పొగడుతూ, ఆతడి పాదాలకు దండాలు పెట్టారు. భీష్ముడు చాలా ఆప్యాయంగా వారందరినీ ప్రతి ఒక్కరినీ పేరుపేరునా పిలిచి, పలుకరించి, వారి క్షేమాలను గూర్చి అడిగి, ఇట్లా అన్నాడు:

**క. 'ఇచ్చటికి మీర లందఱు । వచ్చిన పనియేమి? యేది వలసిన నడుగుం**
**డిచ్చెద దుష్కరమైనను । జెచ్చెరఁ దలకొని ఘటింపఁ జేసెదఁ బ్రీతిన్.' 295**

**ప్రతిపదార్థం:** ఇచ్చటికిన్= ఈ నా ఉన్న చోటికి; మీరలు+అందఱున్; కృష్ణుడు, పాండవులు అగు మీరు యావన్మందిన్నీ; వచ్చిన పని+ఏమి?; ఏది వలసినన్= ఏది కావలసి ఉంటే అట్టిదానిని; అడుగుండు= కోరండి; ఇచ్చెదన్= ఇస్తాను; దుష్కరము+ ఐనను= చేయరాని పని అయినా గూడా; చెచ్చెరన్= త్వరగా; తలకొని= ప్రయత్నించి; ప్రీతిన్= ప్రీతితో; ఘటింపన్+చేసెదన్= కలిగేటట్టు చేస్తాను.

**తాత్పర్యం:** 'మీరందరూ కలిసి ఇక్కడికి నేనుండే చోటికి ఏం పనిమీద వచ్చారో, మీకేం కావాలో అడగండి - ఇస్తాను. అదెంత కష్టసాధ్యమైన పనైనా సరే - ప్రేమతో యత్నించియైనా మీకా పని నెరవేరేటట్లుగా చేస్తాను.'

**వ. అని తెలివొందిన మొగంబుతో నడిగిన దీనాననుం డగుచు ధర్మసూనుం డతని కి ట్లనియె. 296**

**ప్రతిపదార్థం:** అని= పై చెప్పినరీతిగా; తెలివి+ఒందిన మొగంబుతోన్= ప్రసన్నమైనముఖంతో; అడిగినన్; ధర్మసూనుండు= ధర్మరాజు; దీన+ఆననుండు+అగుచున్= దీనత్వంతో కూడిన ముఖం గలవాడౌతూ; అతనికిన్= ఆ భీష్మునికి; ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** 'మీకేం కావాలన్నా ఇస్తా'నని భీష్ముడు నవ్వు ముఖంతో వాళ్ళని అడిగాడు. అప్పుడు ధర్మరాజు ముఖం చిన్నబుచ్చుకొని భీష్ముడితో ఇలా అన్నాడు.

**క. ' మా కెమ్మెయి సామ్రాజ్యము । సేకుఱు నెబ్భంగి బహుళసేనోత్పాద**
**వ్యాకులత రాక తక్కుం । జేకొని యత్తెఱఁగు కరుణఁ జెప్పఁగ వలయున్.' 297**

**ప్రతిపదార్థం:** మాకున్= పాండవులైనట్టి మాకు; ఏ+మెయిన్= ఏ విధంచేత; సామ్రాజ్యము= సార్వభౌమత్వము; చేకుఱున్= కలుగునో; ఏ+భంగిన్= ఏ విధంచేతనైతే; బహుళ= అధికమైన; సేనా= సైన్యంయొక్క; ఉత్పాద= నాశముచేనైన; వ్యాకులత= కలవరపాటు; రాక= రాకుండా; తక్కున్= తప్పిపోవునో; చేకొని= ఆదరించి; ఆ+తెఱఁగు= ఆ మార్గాన్ని; కరుణన్= దయతో; చెప్పఁగన్ వలయున్= చెప్పాలి.

**తాత్పర్యం:** 'మాకు ఏ విధంగా సామ్రాజ్యం వస్తుందో, ఏ మాదిరి, ఎక్కువ సేన నాశమైనదనే వ్యాకులత(కలవరపాటు) లేకుండా పోతుందో అట్టి ఉపాయాన్ని ఆదరభావంతో, దయతో మాకు సెలవీయుమని కోరాడు ధర్మరాజు.

**క. అనవుడు'నేఁ బెనఁగఁగ మీ । కనఘా! సైన్యక్షయంబు నగు సామ్రాజ్యం**
**బును గానేరదు గావున । నను నిర్జింపంగ శోభనము లెల్ల నగున్.' 298**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; అనఘా!= పాపములేని ధర్మజా!; ఏన్= నేను(భీష్ముడు); పెనఁగఁగన్= యుద్ధం చేస్తూండగా; మీకున్= పాండవులైన మీకు; సైన్యక్షయంబున్= సేనయొక్క నాశమున్నూ; అగున్= కలుగును; సామ్రాజ్యంబునున్= సామ్రాజ్యంకూడా; కానేరదు= ప్రాప్తించదు; కావునన్= కాబట్టి; ననున్= భీష్ముడనగు నన్ను; నిర్జింపంగన్= జయిస్తే; ఎల్లన్= సకల విధాలైన; శోభనములు= శుభములు(మేళ్ళు); అగున్= కలుగును.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! నేను యుద్ధం చేస్తూండేదాకా మీకు, సైన్యం నాశనం కాక తప్పదు. మరి సామ్రాజ్యం కూడా మీకు దక్కదు. కాబట్టి నన్ను జయిస్తే మీకు అన్నివిధాల శుభాలు సైన్యం బ్రతకడం, సామ్రాజ్యం ప్రాప్తించడం జరుగుతుంది.'

**విశేషం:** భీష్ముడు, ధర్మజుడిని, 'అనఘా!' అనటంలో అతడిపై అంతరంగంలో గల అభిమానం బాగా తేటతెల్లమౌతున్నది.

**వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుం డి ట్లనియె. 299**

**ప్రతిపదార్థం:** అని పలికిన= అని చెప్పిన; శాంతనవునకున్= భీష్ముడితో; కౌంతేయ+అగ్రజుండు= కుంతీపుత్రులలో మొదటివాడైన ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని పలుకగగా, కుంతీపుత్రులలో మొదటివాడైన ధర్మరాజు భీష్ముడితో ఇట్లా అన్నాడు:

**ఉ. ' చిచ్చఱకన్ను మూసికొని చేతిత్రిశూలము డాఁచి లీలమై**
**వచ్చిన రుద్రుచందమున వ్రాలుదు వీ వనిలోన నోర్వఁగా**
**వచ్చునె నిన్ను నెట్టి మగవారికి? నీకృప నాశ్రయింపఁగా**
**వచ్చితి మెవ్విధిన్ గెలువవచ్చు మహాత్మ! యెఱుంగఁ జెప్పవే?' 300**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= ఓ మహాత్ముడా!; చిచ్చఱ+కన్ను= అగ్నిమయమైన మూడో నేత్రాన్ని; మూసికొని; చేతి త్రిశూలమున్= చేతనుండే త్రిశూలాన్ని; డాఁచి= దాచిపెట్టి; లీలమైన్= విలాసంగా; వచ్చిన= యుద్ధానికి వచ్చినట్టి; రుద్రుచందమునన్= ఈశ్వరుడి మాదిరిగా; ఈవు= నీవు, వ్రాలుదువు= యుద్ధంలోకి దిగుతావు; అని లోనన్= యుద్ధంలో; నిన్నున్= భీష్ముడవైన నిన్ను; ఎట్టిమగవారికిన్= ఎంతటి శూరులకైనా; ఓర్వఁగాన్+వచ్చునె?= ఎదిరించడానికి సాధ్యమా?; నీ కృపన్= నీ దయను; ఆశ్రయింపఁగాన్= ఆశ్రయించటానికి; వచ్చితిమి= వచ్చాము; ఏ+విధిన్= ఏ విధంగా; గెలువన్‌వచ్చున్; ఎఱుంగన్= తెలిసేవిధంగా; చెప్పవు+ఏ= చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ మహానుభావా, భీష్మా! మూడో కన్ను మూసికొని, చేతిలో ఉండే త్రిశూలాన్ని దాచిపెట్టి, విలాసంగా యుద్ధం చేయటానికి వచ్చిన ఈశ్వరుడి మాదిరి నీవు యుద్ధానికి దిగితే, ఎంత ధీరుడైనా, శూరుడైనా నిన్నెదిరించగలడా? మేము నీ దయకు పాత్రులం కావటానికే వచ్చాము. నిన్ను ఏ విధంగానైతే గెల్వవచ్చునో - మాకు తెలియచెప్పాలి.'

**విశేషం:** అలం: ఉపమ.

**క. అనుటయు ని ట్లను గంగా । తనయుఁడు 'నీ చెప్పినట్ల తథ్యం బది న**
**న్ననిమిషులు గెలుతు రే? చే । ధనువుండఁగ వినుము తద్విధము దేటపడన్. 301**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ధర్మరాజు పైవిధంగా అనగా; గంగాతనయుఁడు= భీష్ముడు; ఇట్లు+అనున్; నీచెప్పిన+అట్ల= నీవు చెప్పిన విధంగానే; అది= ఆ మాట; తథ్యంబు= నిజము; చే ధనువుండఁగన్= చేతిలో ధనుస్సు ఉండగా; నన్నున్= నన్ను(భీష్ముడిని); అనిమిషులు= దేవతలు; గెలుతురు+ఏ?= గెలుస్తారా?; తద్+విధమున్= నన్ను గెలిచే రీతిని; తేటపడన్= బాగా తెలిసేట్లుగా; వినుము= ఆలకింపుము.

**తాత్పర్యం:** ధర్మరాజు అడిగినదానికి భీష్ముడు ఇట్లా అన్నాడు: 'ధర్మజా! నీవన్నమాట నిజమే. నా చేతిలో ధనుస్సు ఉన్నంతసేపు నన్ను దేవతలు కూడా జయించలేరు సుమా! నా వధోపాయం చెప్తాను. బాగా తెలిసికొనుము.

**తే. ఇట్టివానిఁగ నన్ను మీరెఱిఁగి యిచటి । కిందఱును వచ్చి యక్కటా! యిట్టు లడుగ**
**మీకుఁ బ్రియమైన కార్యంబు మెయికొనంగఁ । గనుట కంటెను సుకృతంబు గలదె నాకు? 302**

**ప్రతిపదార్థం:** నన్నున్= భీష్ముడగు నన్ను; ఇట్టివానిఁగన్= ఇంతగొప్పవీరునిగా; మీరు= పాండవాదులైన మీరు; ఎఱిఁగి= తెలిసికొని; ఇచటికిన్= నేనుండే ఈ చోటికి; ఇందఱును= ఇంతమందికూడా; వచ్చి= వచ్చి; అక్కటా!; ఇట్టులు= ఇంత దీనంగా; అడుగన్= ప్రార్థిస్తూంటే; మీకున్= కృష్ణుడు; పాండవులు అగుమీకు; ప్రియము+ఐన= ఇష్టమైన; కార్యంబున్= పనిని; మెయికొనంగన్= సమ్మతమయ్యేటట్లు; కనుటకంటెను= తెలిసికొనటంకంటె; నాకున్= నాకు; సుకృతంబు= పుణ్యము; కలదె?= కలదా?

**తాత్పర్యం:** మీరందరు నన్నింత గొప్పవాడుగా అనుకొని, నా దగ్గరికి వచ్చి, అయ్యో పాపం - ఎంతో దీనంగా బతిమాలుతుంటే, మీకు ఇష్టమైన కార్యాన్ని, అందరికి సమ్మతంగా వుండేదాన్ని తెలుసుకొని మీకు చెప్పటానికంటే మించిన పుణ్యం నాకేముంటుంది? (ఉండదని భావం.)

**వ. ఏ నా యుధ వ్యాపారంబువలన నుదాసీనత్వంబు నొందిన నన్ను జయింప సమకూరు జోడు వుచ్చినవానిని, గైదువు బెట్టినవానిని, సిడంబు డించినవానిని, నంగనను, నంగనాపూర్వుని, నంగనాభిధానునిఁ దలచీర వీడినవానిని, భ్రాతృహీనుని, నపుత్రకునిం గని యేటుఁ బోటుఁ దక్కి సమరంబు సేయ మానుదు. మఱియు**

**నొక్క వ్రతంబు పూనినవాఁడం బుట్టి నప్పుడు లేక నడుమ దైవం బిచ్చిన పురుషత్వంబు గలవానితోడఁ గయ్యంబు సేయం గావున మీకు నొక్కయుపాయంబు సెప్పెద. ద్రుపదు నపత్యం బైన శిఖండి యట్టివాఁడగుట మీరెఱుంగు దుర కాదె? విశేషించి ముందటి పుట్టువున నంగన యగుట వాని కెదు రేయకుండుదు నర్జునుండు వానిం బురస్కరించుకొని వచ్చి యే నేయుట మానినయెడ నొప్పించి పడవైచునది. పదంపడి బంధుమిత్త్రు లగు ధార్తరాష్ట్రుల గెలుచుట సుకరం బగునిది నాపను పేను బనిచి నట్ల చేయుం డని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతుచేత ననుజ్ఞాతు లై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవుచున్న సమయంబున బీభత్సుండు. 303**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఆయుధవ్యాపారంబు వలనన్= ఆయుధాలు ప్రయోగించే పని నుండి; ఉదాసీనత్వంబున్= ఉపేక్షా భావాన్ని; ఒందినన్; పొందినప్పుడున్ను; నన్నున్= భీష్ముడగు నన్ను; జయింపన్ సమకూరున్= జయించడం సిద్ధిస్తుంది; జోడు+ పుచ్చిన వానినిన్= కవచం తీసివేసినవాడిని; కైదువున్ పెట్టిన వానినిన్= ఆయుధాన్ని దిగువపెట్టేసినవాడిని; సిడంబున్= ధ్వజాన్ని; డించినవానినిన్= కిందికి దించినవాడిని; అంగననున్= ఆడుదానిని; అంగనా పూర్వునిన్= ముందు అంగన ఐనవానిని; అంగనా+ అభిదానునిన్= ఆడదాని పేరుగలవాడిని; తలచీర వీడినవానిని= తలపాగా వీడిపోయినవాడిని; భ్రాతృహీనునిన్= అన్నదమ్ములు లేనివాడిని; అపుత్రకునిన్= బిడ్డలు లేనివాడిని; కని= చూచి; ఏటున్= బాణప్రయోగాన్ని; పోటున్= పొడవటాన్ని; తక్కి= మాని; సమరంబు= యుద్ధం; సేయమానుదున్= చేయడం మానివేస్తాను; మఱియున్= ఇంకా కూడా; ఒక్క వ్రతంబున్= ఒక నియమాన్ని; పూనిన వాఁడన్= కలిగి ఉన్నాను; పుట్టిన+అప్పుడు= పుట్టిన సమయంలో; లేక= లేకుండా; నడుమన్= మధ్యకాలంలో; దైవంబు= దేవుడు; ఇచ్చిన= ఇచ్చినట్టి; పురుషత్వంబున్= మగతనాన్ని; కలిగినవానితోడన్= పొందినట్టివాడితోకూడా; కయ్యంబున్=యుద్ధాన్ని; చేయన్= చేయను; కావున; మీకున్; ఒక్క; ఉపాయంబున్; చెప్పెదన్=చెప్తాను; ద్రుపదు+అపత్యంబు+ఐన= ద్రుపదుని కొడుకైనట్టి; శిఖండి; అట్టివాఁడు; అగుటన్= కావటాన్ని; మీరు= పాండవులు; ఎఱుంగుదురు+అ+కాదు+ఎ?= తెలిసికొన్నవారే కదా!; విశేషించి= మీదు మిక్కిలి;ముందటి పుట్టువునన్= కడచిపోయిన జన్మలో, అంగన+అగుటన్= ఆడుది కాబట్టి; వానికిన్+ ఎదురు+ ఏయక+ఉండుదున్= వాడికి ఎదురుగా బాణాలు వేయను; అర్జునుండు; వానిన్= ఆ శిఖండిని; పురస్కరించుకొనివచ్చి= ముందు పెట్టుకొనివచ్చి; ఏన్= నేను; ఏయుటన్= బాణాలు ప్రయోగించడాన్ని;మానిన+ఎడన్= మానుకొన్న వేళలో; నొప్పించి= బాధ కల్గించి; పడన్ వైచునది= నన్ను పడగొట్టవలెను; పదంపడి= అటుపైన; బంధుమిత్రులు+అగు= చుట్టాలు, స్నేహితులు అయినట్టి; ధార్త రాష్ట్రులన్= ధృతరాష్ట్రుడి కొడుకులను; గెలుచుట; సుకరంబు+అగున్= సులభమౌతుంది; ఇది నా పనుపు= నాయొక్క ఉత్తరువు; నేను పనిచిన+అట్లు+అ= నేను ఉత్తరువు చేసిన విధంగానే; చేయుండు; అని+సహృదయంబు+కాన్= మనస్ఫూర్తిగా; చెప్పినన్; అట్లు; దేవవ్రతుచేతన్= భీష్ముడిచేత; అనుజ్ఞాతులు+ఐ= ఆజ్ఞాపించబడినవారై; వారలు= ఆ ధర్మరాజాదులు; ఆతనికి(న్)=ఆ భీష్ముడికి; నమస్కరించి; వీడ్కొని= పోయి వచ్చెదమని చెప్పి; విడిదలకున్= తమ నివాసాలకు; పోవుచున్న సమయంబునన్=వెళ్ళే సమయంలో; బీభత్సుండు= అర్జునుడు.

**తాత్పర్యం:** నేను ఆయుధం పట్టకుండా ఉండే సమయంలో నన్ను జయించవచ్చును. కవచంలేనివాడిని, ఆయుధం క్రిందపడవేసిన వాడిని, ధ్వజాన్ని క్రిందికి దించినవాడిని, ఆడదాన్ని, పూర్వం ఆడది అయినవాడిని, ఆడదానిపేరుగలవాడిని, తలపాగా ఊడిపోయినవాడిని, అన్నదమ్ములు లేనివాడిని, బిడ్డలు లేనివాడిని - బాణాలతో కొట్టను. ఆయుధాలతో పొడువను. అట్లాంటివారితో యుద్ధం చేయను. మరొక వ్రతం కూడా నాకున్నది. అదేమిటంటే పుట్టినప్పుడు మగతనం లేకుండా మధ్యలో దైవంచేత మగతనం పొందినవాడితో కూడా యుద్ధం చేయను. కాబట్టి మీకో ఉపాయం చెపుతాను. ద్రుపదుడి కొడుకు శిఖండి అట్లాంటి వాడనే సంగతి మీకు కూడా

తెలియునుకదా! పైపెచ్చు - వాడు గడచిన జన్మలో ఆడుది కాబట్టి, వాడిని ముందు పెట్టుకొని అర్జునుడు వచ్చి, నేను బాణాలు వేయడం చాలించినప్పుడు నన్ను బాధించి పడవేయాలి. అటు తరువాత చుట్టపక్కాలైన ధృతరాష్ట్రుడి సంతానాన్ని గెలవటం సులభమౌతుంది. ఇది నా ఉత్తరువు. ఈ విధంగా చేయండి.' అని హృదయపూర్వకంగా భీష్ముడు చెప్పాడు. వెళ్ళటానికి ఆయనచేత ఆజ్ఞాపింపబడ్డవారై నమస్కారంచేసి సెలవు తీసికొని పాండవులు తమ తమ స్థావరాలకు వెళ్ళే సమయంలో అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. సురనదీసుతుండు పరలోకగతి నిరీ । క్షించుటకును దాను గృతకవృత్తిఁ**
**జంపవలయుటకును సవిషాదమానసుం । డగుచు నిట్టు లనియె నచ్యుతునకు. 304**

**ప్రతిపదార్థం:** సురనదీసుతుండు= భీష్ముడు; పరలోకగతి= ఇతర(స్వర్గ) లోకానికి వెళ్ళటానికి; నిరీక్షించుటకునున్= ఎదురుచూడటానికి; తాను= అర్జునుడు; కృతకవృత్తిన్= మోసపు విధానంతో; చంపవలయుటకును= చంపవలసి వచ్చినదానికిన్నీ; సవిషాదమానసుండు +అగుచున్= బాధతో కూడిన మనస్సుగలవాడౌతూ; అచ్యుతునకున్= కృష్ణుడికి, ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు స్వర్గానికి వెళ్ళటానికి ఎదురుచూస్తూండటానికి, తాను మోసంగా ఆయనను చంపవలసిందిగా ఏర్పడ్డందుకు, మనస్సులో చాల చింత కలవాడై కృష్ణుడితో అర్జునుడు ఈ విధంగా అన్నాడు.

**క. ' గురునిఁ గృతప్రజ్ఞుని ధ । ర్మ రతు వయోవృద్ధు లోకమాన్యు దయాళున్**
**సురతటినీసుతు వంచనఁ । బురుషోత్తమ! చంపబుద్ధి వుట్టదు నాకున్. 305**

**ప్రతిపదార్థం:** పురుషోత్తమ!= పురుషులలో ఉత్తముడవగు ఓ కృష్ణా!; గురునిన్= శ్రేష్ఠుడిని; (గురువుతో సమానుని) కృతప్రజ్ఞునిన్= గొప్ప బుద్ధి కలవాడిని; ధర్మరతున్= ధర్మమందు+ఆశ గలవాడిని; వయః+వృద్ధున్= వయసుచేత పెద్దవాడిని; లోకమాన్యున్= జనులచేత పూజింపదగ్గవాడిని; దయాళున్= కరుణగలవాడిని; సురతటినీ సుతున్= ఆకాశగంగానది కొడుకైన భీష్ముడిని; వంచనన్= మోసంతో; చంపన్= చంపడానికి; నాకున్= (అర్జునుడగు)నాకు, బుద్ధి పుట్టదు= బుద్ధి పుట్టటంలేదు.

**తాత్పర్యం:** 'ఓ కృష్ణా! చాలా గొప్పవాడు, మంచి ప్రజ్ఞ గలవాడు, ధర్మాత్ముడు, వయసులో చాలా పెద్దవాడు, జనులచే పూజింపదగ్గవాడు, దయామయుడు, అయినట్టి భీష్ముడిని మోసంతో చంపడానికి నాకు బుద్ధి పుట్టడంలేదు.

**ఆ. నన్నుఁ బాంసుకేళి నున్న నర్మిలి నెత్తి । మేనిధూళి దనదు మేను వొరయఁ**
**బ్రీతిఁ గౌఁగిలించి మా తండ్రి గుణము ల । గ్గించి కన్నునీరు నించునతఁడు. 306**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ భీష్ముడు; పాంసుకేళిన్= మట్టి ఆటలో; ఉన్నన్= ఉండగా; నన్నున్; ఆర్మిలిన్= ప్రేమతో; ఎత్తి= ఎత్తుకొని; మేనిధూళిన్= నా శరీరం దుమ్ము; తనదు= తన (భీష్ముడి) యొక్క; మేనున్= శరీరాన్ని; ఒరయన్= రాచుకొంటూండగా; ప్రీతిన్= ప్రేమతో; కౌఁగిలించి= ఆలింగనం చేసికొని; మా తండ్రిగుణములు= మా తండ్రియైన పాండురాజు యొక్క గుణాలను; అగ్గించి= పొగడి; కన్ను నీరు నించున్= కన్నులందు నీరు నింపికొనేవాడు.

**తాత్పర్యం:** ఆ భీష్ముడు నేను మట్టిలో ఆడుకొంటూ ఉంటే, ప్రేమతో నన్ను ఎత్తికొనేవాడు. నా ఒంటిమీది మట్టి ఆతడి శరీరానికి రాచికొంటూండగా కౌగిలించుకొని, మా తండ్రి పాండురాజు గుణాలను పొగడుతూ, కన్నుల నిండా నీరు నింపుకొనేవాడు.

**ఉ. అక్కట! తండ్రి లేని మము నమ్మెయిఁ బెంచిన తాత ని మ్మెయిం**
**ద్రెక్కొనఁగా దతండు సముదీర్ణభుజాబలశౌర్యశాలియై**
**యిక్కడి సేనఁ జక్కడిచెనేనియుఁ జూతున కాక ధర్మముం**
**దక్కుట కోర్వఁ జాలుదునె? ధర్మజుతమ్ములు క్రూరకర్ములే?' 307**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో! తండ్రిలేని మమున్= తండ్రిలేనట్టి పాండవులైన మమ్ములను; ఆ+మెయిన్= ఆ విధంగా; పెంచిన= పెద్దచేసినట్టి; తాతన్= తాతగారిని; ఈ+మెయిన్= ఈ విధమైన మోసంతో; త్రెక్కొనన్+కాదు= చంపదగదు; అతండు= ఆ భీష్ముడు; సముదీర్ణ= మిక్కిలి గొప్పదైన; భుజాబల= బాహుబలము; శౌర్య= శూరత్వము - వీటిచే; శాలి+ఐ= ప్రకాశించెడివాడై; ఇక్కడిసేనన్= ఇక్కడ ఉన్నట్టి మన సైన్యాన్ని; చక్కడిచెన్+ఏనియున్= చంపినప్పటికిని; చూతును+అ కాక= చూస్తానేకాని; ధర్మమున్= యుద్ధ ధర్మాన్ని; తక్కుటకున్= విడువటానికి; ఓర్వన్+చాలుదున్+ఎ?= ఓర్చుకోగలుగుదునా?; ధర్మజు తమ్ములు= ధర్మరాజు యొక్క తమ్ముళ్ళు; క్రూరకర్ములు+ఏ?= క్రూరమైన పనులు చేసేవారా?; కాదనుట.

**తాత్పర్యం:** అక్కటా! చిన్ననాడే తండ్రిని పోగొట్టుకొన్నట్టి పాండవులను మమ్ములను ఏ విధంగానో చాలా ప్రయాసతో పెంచి పెద్ద చేసినట్టి తాతగారినే ఈ మాదిరి మోసంగా చంపటం ఏ మాత్రం న్యాయంకాదు. ఆ భీష్ముడు తన భుజబలంతో, శౌర్యంతో, ఈ మన సేననంతా బాగా నశింపచేసినప్పటికీ చూస్తూ ఉంటానే కాని, యుద్ధధర్మాన్ని తప్పటానికి మాత్రం నే నొప్పుకొనను. ధర్మాత్ముడని ప్రసిద్ధి కెక్కిన ధర్మరాజు తమ్ముళ్ళమగు మేము, క్రూరపు పనులు చేస్తామా?'

**వ. అనిన విని కృష్ణుం డా జిష్ణున కిట్లనియె. 308**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని; కృష్ణుండు; ఆ జిష్ణునకున్= ఆ అర్జునుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు పై విధంగా చెప్పగా, కృష్ణుడు అర్జునుడితో ఈ విధంగా అన్నాడు.

**ఉ. ' క్రూరత కోర్చి యించుకయు రోయక పైకొని యెల్లభంగులన్**
**వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ**
**గో రరి గొంచు సద్వ్యయము గోరి యొనర్చుట రాజధర్మవి**
**స్తారముగా బలారికి వచస్పతి సెప్పట యప్రసిద్ధమే? 309**

**ప్రతిపదార్థం:** క్రూరతకున్= కఠినత్వానికి; ఓర్చి= సహించి; ఇంచుకయున్= కొంచెంకూడా; రోయక= ఏవగించుకొనక; పైకొని= కవిసి; ఎల్లభంగులన్= అన్నివిధాలా; వైరులన్= శత్రువులను; చంపి= వధించి; భూప్రజకున్= భూమిపై ఉండే జనానికి; వర్ధనమున్= అభివృద్ధిని; కలిగించి= కలుగచేసి; పాడిమైన్= న్యాయంగా; కోరు= పంటలో కొంతభాగము; అరిన్= సిస్తుగా; కొంచున్= తీసికొంటూ; సత్+వ్యయమున్= ఉత్తమవ్యయం; కోరి= ఇష్టపడి; ఒనర్చుట= చేయటం; రాజధర్మ విస్తారముగాన్= రాజుల ధర్మం యొక్క అతిశయంగా; బల+అరికిన్= బలుడనే రాక్షసుడికి విరోధియైన ఇంద్రుడికి; వచస్+పతి= బృహస్పతి; చెప్పుట= చెప్పడం; అప్రసిద్ధము+ఏ?= ప్రసిద్ధి చెందినది కాదా?.

**తాత్పర్యం:** కఠినత్వానికి ఓర్చికొని, కొంచెం కూడా ఏవగింపు లేకుండా, ఎదిరించి ఏ విధంచేతనైనా శత్రువులను చంపాలి. జనానికి అభివృద్ధి కలిగించాలి. న్యాయంగా ప్రజలనుండి పంటలో కొంతభాగము సిస్తుగా వసూలు

చేసికొని, దానితో ప్రజలకు, దేశానికి ఉపయోగపడే మంచి మంచి పనులు చేయాలి. ఇది మంచి రాజుల ధర్మం అని బృహస్పతి (దేవగురువు) దేవేంద్రుడికి చెప్పాడు. అది ప్రసిద్ధమైన విషయమే కదా!

**చ. అనిమొన నోర్తు భీష్ము నని యాడిననీదగు పూన్కి లోక మె**
**ల్లను వినియుండఁగా నిటు చలం బెడలం జన దెట్టు లైనఁ జం**
**పన తగు రాజధర్మపరిపాలన గా కిది క్రూరకర్మమే?**
**నిను విధిపంచె శాంతనవునిం దెగటార్పఁగ వేయు నేటికిన్.' 310**

**ప్రతిపదార్థం:** అనిమొనన్= యుద్ధంలో ప్రముఖమైన తావులో; భీష్మున్= భీష్ముడిని; ఓర్తున్+అని= ఓడిస్తానని; ఆడి= చెప్పినట్టి; నీది+అగు పూన్కి= నీ యొక్క పట్టుదల; లోకము ఎల్లనున్; జనులందరు; వినియుండఁగాన్= ఆలకించి ఉండగా; ఇటు= ఈ విధంగా; చలంబు= మాత్సర్యం; ఎడలన్+చనదు= విచ్ఛిన్నం కారాదు; ఎట్టులు+ఐనన్= ఏ విధంచేతనైనా; చంపన+తగున్= చంపడమే తగినది; ఇది= ఈ భీష్ముడిని చంపటం; రాజధర్మ పరిపాలన+కాక= రాజధర్మాన్ని పాలించటం గాక; క్రూరకర్మము+ఏ?= క్రూరమైనపనా?; వేయున్+ఏటికిన్= వెయ్యి మాటలెందుకు?; శాంతనవునిన్= భీష్ముడిని; తెగటార్పఁగన్= చంపటానికి; విధి= దైవము; నినున్; పంచెన్= పంపించాడు.

**తాత్పర్యం:** ఓ అర్జునా! యుద్ధ మధ్యంలో భీష్ముడిని ఓడిస్తానని నీవన్నమాటలు జనానికంతా బాగా తెలుసు. ఇప్పుడు నీవన్న మాట ఆ పూనికను సడలించివేస్తున్నది. నీవు ఆ మాత్సర్యానికి భంగం కలిగిస్తే జనమంతా నిన్ను ఎగతాళి చేస్తారు. ప్రత్యక్షంగాకాని పరోక్షంగాకాని ఏ విధంగానైనా నీవు భీష్ముడిని చంపవలసినదే. అట్లా చంపడం రాజధర్మమే కాని, క్రూరమైన పని కానే కాదు. ఇంతెందుకు? ఆ విధి యీ భీష్ముడిని చంపడానికే నిన్ను పంపించినది.'

**చ. అనుటయుఁ గ్రీడి యిట్టు లను నాద్రుపదాత్మజుజన్మ మాపగా**
**తనయవధార్థ మం డ్రదియుఁ దప్ప దతండును వాని నేయఁ డే**
**ను నతని నేయుచందమున నూల్కొని యన్యుల నేయుచుండు వాఁ**
**డనితరవధ్యకాయుఁ డగు నాయనఁ దాఁ బడ నేయు నుగ్రతన్. 311**

**ప్రతిపదార్థం:** అనుటయున్= కృష్ణుడీ విధంగా చెప్పగా; క్రీడి= అర్జునుడు; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నాడు; ఆ ద్రుపద+ఆత్మజు జన్మము= ద్రుపదుని కొడుకు ఆ శిఖండియొక్క పుట్టుక; ఆపగాతనయ వధ+అర్థము= భీష్ముని చంపటానికే; అంద్రు= అని అంటారు; అదియున్= ఆ మాట; తప్పదు= పొల్లుకాదు; అతండునున్= ఆ భీష్ముడున్నూ; వానిన్= ఆ శిఖండిని; ఏయఁడు= కొట్టడు; ఏనున్= నేనుకూడా; అతనిన్= ఆభీష్ముడిని; ఏయుచందమునన్= కొట్టే మాదిరిగా, నూల్కొని= కుదురుకొని; అన్యులన్= ఇతరులమీద; ఏయుచు+ఉందున్= బాణాలు ప్రయోగిస్తూ ఉంటాను; వాఁడు= ఆ శిఖండి; అనితర వధ్యకాయుఁడు+అగున్= ఇతరులచే చంప తగని శరీరం కలవాడు అగును; ఆయనన్= ఆతని(భీష్ముడిని); ఉగ్రతన్= భయంకరంగా; తాన్= తాను(శిఖండి); పడన్+ఏయున్= పడగొట్టుతాడు.

**తాత్పర్యం:** కృష్ణుడన్న మాటలు విని అర్జునుడు ఇట్లా అన్నాడు: 'శిఖండి పుట్టుక భీష్ముడిని చంపటానికే అని అంటారు కదా! ఆ మాట అబద్ధమౌతుందా? ఆ భీష్ముడేమో శిఖండిని బాణాలతో కొట్టడు - నేను భీష్ముడిని కొట్టుతున్నట్లు నటన చేస్తూ ఇతరులను బాణాలతో కొట్టుతాను. శిఖండిని తప్పించి ఇతరులచే చంపబడని ఆ భీష్ముడిని, ఆ శిఖండి భయంకరంగా తానే కూల్చుతాడు.

**వ. అనవుడు నవ్వి కవ్వడికిం గమలనాభుం డి ట్లనియె. 312**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; కమలనాభుండు= కమలం బొడ్డున గలవాడు - కృష్ణుడు; నవ్వి= ఎగతాళిచేసి; కవ్వడికిన్= అర్జునుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడన్న మాటలు కృష్ణుడు విని, ఎగతాళిగా నవ్వి అతడితో ఇట్లా అన్నాడు.

**ఉ. ' నీ వొకరుండు దక్కఁగ ననింద్య పరాక్రమశాలి భీష్మునిం**
**జావఁగ నేయ నెవ్వఁడును జాలఁడు నీతలఁ పెన్నిభంగులన్**
**దైవము చూపువోలెఁ దుదిదాఁకునె? యవ్విధ మిట్టు లుండఁగాఁ**
**ద్రోవఁగ వచ్చునే? యెటులు ద్రోచినఁ బోవదు చూచి యుండుమీ.' 313**

**ప్రతిపదార్థం:** అనింద్య పరాక్రమశాలి= నిందింప తగని పరాక్రమం చేత ప్రకాశించునట్టి; భీష్మునిన్= భీష్ముడిని; చావఁగన్+ఏయన్= చావగొట్టడానికి; నీవు ఒకరుండున్+తక్కఁగన్= నీ వొకడవు తప్పితే; ఎవ్వఁడునున్= మరెవ్వడుగాని; చాలఁడు= సమర్థుడు కాలేడు; ఎన్ని భంగులన్= ఎన్ని విధాలచేతనైనా; నీతలఁపు= నీ యొక్క కోరిక; దైవము చూపు+పోలెన్= విధి దృష్టి విధంగా; తుదిన్+తాఁకునె?= తుదముట్టునా?; ఆ+విధము= భీష్ముడిని చంపే ఆ విధానము; ఇట్టులు= ఈ విధంగా; ఉండఁగాన్; త్రోవఁగన్ వచ్చునే?= ఆ విధానాన్ని త్రోసివేయటానికి సాధ్యమౌతుందా?; ఎటులు+త్రోచినన్= ఎట్లాగైనా త్రోచివైచినా కూడా; పోవదు= నీవు భీష్ముడిని చంపటమనేది తప్పదు; చూచి+ఉండుమీ.

**తాత్పర్యం:** 'పొగడ్తకెక్కిన పరాక్రమంతో ప్రకాశించే ఆ భీష్ముడిని నీవు తప్ప మరెవ్వరూ చంపలేరు. భీష్ముడిని కొట్టననే నీతలంపు ఎన్నటికి నెరవేరదు. నీవే భీష్ముడిని కూలద్రోస్తావు. నీవు భీష్ముడిని చంపవలసిందిగా దైవ నిర్ణయం ఉండగా ఆ నిర్ణయాన్ని కాదనటానికి నీ తరమా? కాదంటే మాత్రం అది తప్పుతుందా? అంతా నీవే మున్ముందు చూడగలవులెమ్ము.'

**వ. అనిపలికినవినియతండట్లకాకయప్పటికినెట్లయిననట్లయ్యెడుననియర్జునుండియ్యకొనినగోవిందుండును, ధర్మనందనాదులుం బ్రమోదంబు నొంది రివ్విధంబున శిబిరంబున కరిగి పాండవులు పుండరీకాక్షుని నిజ నివాసంబున కనిచి తమ తమ నికేతనములకుం జని యా రాత్రి సుఖనిద్ర సేసి' రని చెప్పిన సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 314**

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని చెప్పగా; విని; అతండు= ఆ అర్జునుడు; అట్లు+అ+కాక= ఆ విధంగానే అగుగాక; అప్పటికిన్= ఆ సమయానికి; ఎట్లు+అయినన్= ఎట్లాగయితే; అట్లు+అయ్యెడున్= అట్లా అవుతుంది; అని; అర్జునుండు; ఇయ్యకొనినన్= ఒప్పుకోగా; గోవిందుండును= కృష్ణుడునూ; ధర్మనందన+ఆదులున్= ధర్మరాజు మొదలుగా గల పాండవులు; ప్రమోదంబున్= సంతోషాన్ని; ఒందిరి= పొందారు; ఈ+విధంబునన్= ఈ మాదిరిగా; శిబిరంబునకున్= గుడారానికి; అరిగి= వెళ్ళి; పాండవులు; పుండరీక+అక్షుని(న్)= కృష్ణుని; నిజనివాసంబునకు(న్)= అతడుండే చోటికి; అనిచి= పంపి; తమ తమ నికేతనములకున్= వారి వారి భవనాలకు; చని; ఆ రాత్రి; సుఖ నిద్ర+చేసిరి; అని చెప్పిన= అని చెప్పగా; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** కృష్ణుడు పై విధంగా అనగా, ఆ మాటలు విని, అర్జునుడు 'అటులే కానిమ్ము. కానున్నది కాకమానదు.' అని ఒప్పుకొన్నాడు. దానితో గోవిందుడు, పాండవులు సంతోషపడ్డారు. అందరూ గుడారానికి వెళ్ళారు. పాండవులు కృష్ణుడిని ఆయన నివాసానికి పంపి, వారి వారి భవనాలకు చేరుకొన్నారు. అర్జునుడు భీష్ముడిని చంపడానికి

ఒప్పుకొన్నాడు కాబట్టి, అందరూ ఆ రాత్రి బాగా నిద్రపోయారు.' అని సంజయుడు చెప్పాడు. అది విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**క. పాండుసుతు లేమిభంగి శి । ఖండిం గూర్చికొని యాపగాసుతుపై ను**
**ద్దండగతి నడచి రెట్లు? ప్ర । చండతతో సమరకేలి సలిపిరి? చెపుమా.' 315**

**ప్రతిపదార్థం:** పాండుసుతులు= పాండురాజు కుమారులు ధర్మరాజాదులు; శిఖండిన్; ఏమిభంగిన్= ఏ విధంగా; కూర్చికొని= కూడగట్టుకొని; ఆపగాసుతుపైన్= భీష్ముడి మీదికి; ఉద్దండగతిన్= ఎక్కువైన పోకడతో; నడచిరి?; ప్రచండతతోన్= సాధ్యంకాని విధంగా; ఎట్లు= ఏ మాదిరి; సమరకేళిన్= యుద్ధ క్రీడను; సలిపిరి?= చేశారు?; చెపుమా= ఓ సంజయా! తెలుపుము.

**తాత్పర్యం:** సంజయా! పాండవులేవిధంగా శిఖండిని తమతో చేర్చికొన్నారో, వేగంతో కూడిన గమనంతో భీష్ముడి మీదికి ఏ విధంగా వచ్చారో, ఏ విధంగా అసాధ్యమైన రీతిలో యుద్ధం చేశారో బాగా చెప్పుము.'

### భీష్ముని దశమ దివసయుద్ధానుక్రమము (సం. 6-104-2)

**వ. అనుటయు నా సూతనందనుం డతని కిట్లను సూర్యోదయ సమయంబునఁ బాండుసూనులు సేనా సమేతులై వెడలి మోహరించునప్పుడు ముందట శిఖండిని నిలిపి యతనికెలంకుల భీమార్జునులును, వెనుక నభిమన్యు ద్రౌపదేయులును వారియిరువంకలం జేకితాన శైనేయులును, నట పిఱుంద ధృష్టద్యుమ్నాది పాంచాల కుమారుల మున్నిడుకొని కవల నుభయపార్శ్వంబులం బెట్టికొని, యుధిష్ఠిరుండును వీరి సూరెలం బొదివికొని విరాటద్రుపదముఖ్యులగు పృథ్వీపతులును గేకయపంచక ధృష్టకేతులును నిలిచి రిత్తెఱంగున గట్టి మోహరంబు దీర్చుకొని నడచి రంతకు మున్న మనవారును వెడలి భీష్ముం డగ్ర భాగంబున నుల్లసిల్ల నీ కుమారు లమ్మహాత్ముం బరివేష్టింపఁ గుంభసంభవతత్సంభవులుం దక్షిణవామభాగంబులను, గృపకృతవర్మ భగదత్తపురస్సరుండై కురురాజు మధ్యభాగంబునను, బృహద్బల కాంభోజ ముఖ్యు లైన మహీపతు లమ్మనుజేంద్రు చుట్టును,ద్రిగర్తు లపరభాగంబునను, బన్ని బలుమొన యమర్చి కొని త్రోచి నడచి రి ట్లిరువాఁగునుం గవిసి వివిధతూర్యస్వనంబులు నింగిముట్ట నొండొంటిం దాఁకిన. 316**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని అడగ్గా; ఆ సూతనందనుండు= సంజయుడు; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; ఇట్లు+అనున్; సూర్య+ఉదయ సమయంబునన్= సూర్యుడు ఉదయించే సమయంలో; పాండు సూనులు= పాండురాజు కొడుకులు; సేనా+సమేతులు+ఐ= సేనలతో కూడినవారై; వెడలి= బయలుదేరి; మోహరించు+అప్పుడు= వ్యూహం పన్నేటప్పుడు; ముందటన్= ముందు భాగంలో; శిఖండిన్= శిఖండిని; నిలిపి; అతని కెలంకులన్= ఆ శిఖండి ప్రక్కలందు; భీమ+అర్జునులున్నూ; వెనుకన్; అభిమన్యు ద్రౌపదేయులును; వారి+ఇరువంకలన్= వారికి రెండువైపుల; చేకితాన శైనేయులునున్= చేకితానుడు, సాత్యకి; అట పిఱుందన్= ఆ వెనుక; ధృష్టద్యుమ్న+ఆది పాంచాలకుమారులన్= ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాలకుమారులను; మున్ను+ఇడుకొని= ముందుంచికొని; కవలన్= నకుల సహదేవులను; ఉభయ పార్శ్వంబులన్= రెండువైపులా; పెట్టికొని= ఉంచికొని; యుధిష్ఠిరుండునున్= ధర్మరాజున్నూ; వీరి సూరెలన్= వీరికి ప్రక్క భాగములందు; పొదివికొని= క్రమ్ముకొని; విరాట ద్రుపద ముఖ్యులు+అగు= విరాటుడు, ద్రుపదుడు, ముఖ్యులుగా గల; పృథ్వీపతులును= రాజులున్నూ; కేకయ పంచక ధృష్టకేతులును= కేకయ దేశీయులగు అయిదుగురు, ధృష్టకేతువున్నూ; నిలిచిరి= నిలబడ్డారు; ఈ+తెఱంగునన్= ఈ మాదిరిగా; గట్టి మోహరంబున్= దృఢమైన వ్యూహాన్ని; తీర్చుకొని= ఏర్పాటు చేసికొని; నడచిరి; అంతకున్‌మున్ను+అ= దానికి ముందుగానే; మనవారును= మన కౌరవులుకూడా; వెడలి= బయలుదేరి; భీష్ముండు; అగ్రభాగంబునన్= ముందుప్రక్క; ఉల్లసిల్లన్= ప్రకాశిస్తూండగా; నీ

కుమారులు= కౌరవులు; ఆ+మహాత్మున్= ఆ పూజ్యుని; పరివేష్టింపన్= చుట్టియుండగా; కుంభసంభవ తద్+సంభవులున్= ద్రోణుడు అతడి కుమారుడు అశ్వత్థామయు; దక్షిణ వామభాగంబులనున్= కుడి యెడమలందును; కృపకృతవర్మ భగదత్త పురస్సరుండు+ఐ= కృపుడు, కృతవర్మ, భగదత్తుడు ముందు భాగంలో కలవాడై; కురురాజు= దుర్యోధనుడు; మధ్యభాగంబునన్= నడిమి భాగంలో; బృహద్బల కాంభోజ ముఖ్యులు+ఐన= బృహద్బలుడు, కాంభోజరాజు ప్రధానులుగా గల; మహీపతులు= రాజులు; ఆ+మనుజేంద్రు చుట్టునున్= ఆ దుర్యోధనుడి చుట్టున్నూ; త్రిగర్తులు= త్రిగర్త దేశపు వీరులు; అపరభాగంబునను(న్)= వెనుకవైపునందు; పన్ని= యుద్ధానికి సిద్ధపడి; బలుమొన అమర్చికొని= బలమైన వ్యూహాన్ని ఏర్పాటు చేసికొని; త్రోచి; నడచిరి= ముందుకు సాగారు; ఇట్లు= ఈ విధంగా; ఇరువాఁగునున్= రెండు సేనలున్నూ; కవిసి; వివిధ తూర్యస్వనంబులు= నానా విధాలైన వాద్యాల చప్పుళ్ళు, నింగిముట్టన్= ఆకాశాన్నంటగా, ఒండొంటిన్= ఒకసేన మరొక సేనను; తాఁకినన్= ఎదుర్కొనగా;

**తాత్పర్యం:** పాండవులు భీష్ముడితో యుద్ధం చేసిన రీతిని గూర్చి ధృతరాష్ట్రు డడుగగా సంజయు డిట్లా బదులు చెప్పాడు. 'సూర్యోదయం కావటంతోనే పాండవులు తమ తమ సేనలతోపాటు యుద్ధరంగానికి వెళ్ళి మోహరించేటప్పుడు శిఖండిని ముందు నిలిపారు. ఆతడికి రెండు ప్రక్కల - భీమార్జునులు, వెనుకప్రక్క- అభిమన్యుడు, ద్రౌపది కొమాళ్ళున్నూ, వారికి రెండువైపుల - చేకితానుడు, సాత్యకియూ నిలిచారు. వారికి వెనుకవైపు ధర్మరాజు, ధృష్టద్యుమ్నుడాదిగా గల పాంచాల కుమారులను ముందు ఉంచికొని, నకుల సహదేవులను ఇరు ప్రక్కల పెట్టుకొన్నాడు. వీరికి ప్రక్క భాగాలలో క్రమ్ముకొని విరాటుడు, ద్రుపదుడు ప్రధానులుగా ఉండే రాజులున్నూ, కేకయపంచకం, ధృష్టకేతువు నిలిచారు. ఈ మాదిరి గట్టి మోహరాన్ని ఏర్పాటుచేసికొని పాండవులు యుద్ధానికి సిద్ధమయ్యారు. అంతకుముందే కౌరవులు కూడా యుద్ధ రంగానికి వెళ్ళారు. భీష్ముడు అగ్రభాగంలో ఉండగా, నీ కొడుకులు కౌరవులు అతని చుట్టూ చేరారు. ద్రోణుడు, అశ్వత్థామ కుడి ఎడమ భాగాల్లోను, దుర్యోధనుడు కృపుడు, కృతవర్మ - వీరుముందు నిలబడగా తాను మధ్యభాగంలో నిలిచాడు. బృహద్బలుడు, కాంభోజుడు ముఖ్యులుగా గల రాజులు ఆ దుర్యోధనుడి చుట్టూ నిలిచారు. త్రిగర్తులు వెనుకవైపు నిలిచి, బలిష్ఠమైన సేనను ఏర్పాటుచేసికొని, ముందుకు నడిచారు. ఈ విధంగా రెండు పక్షాలవారూ కవియగా, నానా విధాలైన వాద్యాల శబ్దాలు ఆకాశాన్ని అంటుతూండగా ఒకరినొకరు డీకొన్నారు.

**క. సమరం బప్పుడు దనుజులు । నమరులునుం బెనఁగుచందమై తోఁపఁగ భూ**
**రమణ! విను మేమిసెప్పుదు? । జముపురమున నగ్గలంపుసందడి యయ్యెన్. 317**

**ప్రతిపదార్థం:** భూరమణ!= భూమికి భర్తవైన ధృతరాష్ట్ర మహారాజా; వినుము= ఆలకింపుము; ఏమి చెప్పుదున్?= ఏమి చెప్పగలను; అప్పుడు= ఆ సమయంలో; సమరంబు= కౌరవపాండవయుద్ధం; దనుజులును= రాక్షసులున్నూ; అమరులునున్= దేవతలున్నూ; పెనఁగు చందము+ఐ= యుద్ధం చేసే మాదిరిగా; తోఁపగన్= తోపింపచేయగా; జముపురమునన్= యమధర్మరాజు పట్టణంలో; అగ్గలము+సందడి= అధికమైన జనాల తోపిడి; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! వినుము. కౌరవపాండవుల యుద్ధం దేవదానవయుద్ధంవలె కన్పించింది. అప్పుడు, యమధర్మరాజుపట్టణంలో జనాల తోపిడి ఎక్కువయింది.

**వ. అట్టియెడ. 318**

**ప్రతిపదార్థం:** అట్టి= అట్లాంటి, ఎడన్= సమయంలో.

**తాత్పర్యం:** అట్లా కౌరవపాండవులు యుద్ధం చేసే సమయంలో.

**మ. కవ లుద్దామపరాక్రమస్ఫురణమైఁ గౌరవ్యసైన్యంబు సి**
**క్కువడంజేయఁగ భీమపార్థులును గోకొమ్మంచు నొక్కుమ్మడిం**
**గవియం బాండవసేన యుబ్బి యడరంగాఁ జూచి కల్పాంతభై**
**రవభీమాకృతి నేచి భీష్ముఁడు శరవ్రాతంబు గుప్పించినన్. 319**

**ప్రతిపదార్థం:** కవలు= నకుల సహదేవులు; ఉద్దామ= గొప్ప; పరాక్రమ స్ఫురణమైన్= పరాక్రమం తోచుటచేత; కౌరవ్య సైన్యంబు= కౌరవులసేనను; చిక్కు+పడన్+చేయఁగన్= చిక్కులో పడేటట్లు చేయగా; భీమపార్థులునున్= భీముడు, అర్జునుడున్నూ; కో కొమ్ము+అంచున్= 'కో' అనే ధ్వనిని అనుకరిస్తూ; ఒక్క+ఉమ్మడిన్= ఒకేసారిగా; కవియన్; పాండవసేన= పాండవుల సైన్యం; ఉబ్బి= పొంగి; అడరంగాన్= విజృంభించగా; భీష్ముఁడు; చూచి; కల్ప+అంత= ప్రళయకాలంలోని; భైరవ= రుద్రుడివలె; భీమ+ఆకృతిన్= భయంకరమైన ఆకారంతో; ఏచి= విజృంభించి; శరవ్రాతంబున్= బాణాలసమూహాన్ని; గుప్పించినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** నకుల సహదేవులు హద్దుమీరిన పరాక్రమం గలవారై, అప్పటికప్పటికి తోచే విధంగా యుద్ధం చేసి కౌరవసేనను ఇరకాటంలో పెట్టారు. అదే సమయంలో భీముడు, అర్జునుడు 'కో' అని అరచుచూ ఒకేసారిగా కౌరవుల సేన మీదకు ఎగబడ్డారు. దీన్ని చూచి, పాండవసేన ఉత్సాహంతో పొంగి, కురుసేన మీదకు విజృంభించింది. ఇంతలో భీష్ముడు ఈ పరిస్థితిని చూచి, ప్రళయకాలంలో రుద్రుడివలె భయానకమైన ఆకారంతో బాణాల మొత్తాన్ని వారిపైన కుప్పలు తెప్పలుగా పడవైచాడు.

**ఆ. కాలుకాలు పెనఁగి కాలుబలంబులు । నొడ్డగెడవుగా రథోత్కరంబు**
**మ్రొగ్గతిలఁగ గుఱ్ఱములు నేల యద్రువ మా । తంగఘటలు గూలెఁ దత్క్షణంబ. 320**

**ప్రతిపదార్థం:** తద్+క్షణంబు+అ= యుద్ధం చేసే ఆ సమయంలోనే; కాలుబలంబులు= పదాతిసేన; కాలుకాలు పెనఁగి= ఒకడి కాలితో మరొకడి కాలు పెనవైచికొని; రథ+ఉత్కరంబు= రథాల సమూహము; ఒడ్డగెడవు కాన్= ఒక ప్రక్క కిందికి ఒరిగి మరొక ప్రక్క పైకి లేచి; గుఱ్ఱములు; మ్రొగ్గతిలఁగన్= పెడమొగంపెట్టినవై; మాతంగ ఘటలు= ఏనుగుల గుంపులు; నేల= భూమి; అద్రువన్= అదిరిపోయేటట్లుగా; కూలెన్= కూలిపోయాయి.

**తాత్పర్యం:** భయంకరంగా యుద్ధం జరిగే ఆ సమయంలో కాలిబంట్లు ఒకరి కాళ్ళు మరొకరి కాళ్ళతో పెనవేసుకొని, రథాలు హెచ్చుతగ్గులుగా ఒరిగి, గుర్రాలు పెడమొగం పెట్టికొని, ఏనుగు గుంపులు నేల అదరిపోయేటట్లుగా కింద పడ్డాయి.

**క. కనుఁగొని శిఖండి వెస మా । ర్కొని భీష్ముని నేసె మూఁడు క్రూరాస్త్రములం**
**గని యతఁడు మరల చూడ క । తని నుద్దేశించి పలికె దరహాసముతోన్. 321**

**ప్రతిపదార్థం:** శిఖండి; భీష్మునిన్= భీష్మాచార్యుడిని; కనుఁగొని= చూచి; వెసన్= వేగంగా; మార్కొని= ఎదిరించి; మూఁడు= మూడైన; క్రూర+అస్త్రములన్= గట్టి బాణాలతో; ఏసెన్= కొట్టాడు; అతఁడు= ఆ భీష్ముడు; కని= చూచి; మరలచూడక= తిరిగిచూడకుండా; అతనిన్= ఆ శిఖండిని; ఉద్దేశించి; దరహాసముతోన్= చిరునవ్వుతో; పలికెన్= పలికాడు.

**తాత్పర్యం:** శిఖండి భీష్ముడిని గుర్తు పట్టి, వెంటనే ఎదిరించి, మూడుబాణాలతో అతడిని కొట్టాడు. భీష్ముడు శిఖండిని ఒక్కసారి చూచి, మరలా వాడి ముఖం చూడకుండా అతడిని ఉద్దేశించి చిరునవ్వుతో ఇట్లా అన్నాడు:

**ఉ. ' ఎవ్వత నేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁ గాఁగ నా**
**కొవ్వమిఁ జేసి యట్టి నిను నుగ్మలి నేయఁగ నొల్ల నాపయిం**
**గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరగించితేని నే**
**నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ!' 322**

**ప్రతిపదార్థం:** శిఖండినీ!= ఓ శిఖండినీ!; ఎవ్వతన్+ఏనిన్= ఏ ఆడదాన్నయితే; ధాత= బ్రహ్మదేవుడు; తగన్= ఒప్పిదంగా; మగవానిన్+కాఁగన్= మగవాడుగా; సృజియించెన్= సృష్టిచేశాడో; నాకున్= భీష్ముడనైన నాకు; ఒవ్వమిన్+చేసి= గిట్టనికారణంగా; అట్టి= ఆలాంటి; ఉగ్మలిన్ నినున్= ఆడుదైన నిన్ను; ఏయఁగన్ ఒల్లన్= కొట్టడానికి ఇష్టపడను; నీవు= శిఖండివైన నీవు; క్రొవ్వు+ఎసలారన్= మదము హెచ్చగా; శరకోటిన్= బాణాలకోట్లను; వెసన్= వేగంతో; పరఁగించితి+(వి)+ఏనిన్= ప్రయోగించినప్పటికి; ఏన్= ఏను; నవ్వుదున్+కాని= నవ్వుతూ ఉంటానేగాని; మనంబునన్= నా మనస్సులో; కోపము= క్రోధము; పుట్టదుసూ= కలుగదు సుమా!

**తాత్పర్యం:** ఓ శిఖండినీ! నీవు ద్రుపదమహారాజుకు కూతురుగా పుట్టావు. పిదప బ్రహ్మదేవుడు నిన్ను మగవాడుగా సృష్టి చేశాడు. అట్లాంటి ఆడుదియైన నీ మీద బాణాలు వేయడం నాకు ఇష్టంకాదు. కాబట్టి నీవు నీకు గల మదం కొద్దీ నా మీద ఎన్ని బాణాలు వేసినా సరే - నేను నవ్వుతూ ఊరక ఉంటానే గాని, నా మనస్సులో నీ మీద కోపం పుట్టదు సుమా!

**విశేషం:** శిఖండిని - ద్రుపదరాజు కూతురు. 'కన్యా శిఖండినీ జాతా, పురుషో వై నివేదితః (సం. మహాభారతం). యక్షుని మగతనాన్ని ఆ శిఖండిని గ్రహించటంచేత 'శిఖండి' అని ప్రసిద్ధి చెందినది.

**వ. అనినం గోపించి శిఖండియు నతని కిట్లనియె. 323**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; శిఖండియున్= శిఖండికూడా; కోపించి= కోపం చెంది; అతనికిన్= భీస్ముడితో; ఇట్లు+అనియె(న్)= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు పై విధంగా చెప్పగా, శిఖండి కోపగించినవాడై అతనితో ఇట్లా అన్నాడు.

**క. ' గెలిచితి రాజుల నెల్లను। బలియుండగు పరశురాముప్రతివీరుఁడవై**
**యలవుకలిమి నెఱపిన। నీ చలము బలము నాకుఁ జూపఁ జాలవు కంటే? 324**

**ప్రతిపదార్థం:** రాజులన్= రాచవారిని; ఎల్లను= అందరినీ; గెలిచితివి= గెలిచావు; బలియుండు+అగు= బలవంతుడైనట్టి; పరశురాము ప్రతివీరుఁడవు+ఐ= పరశురాముడికి సమానుడైన వీరుడుగా అయి; అలవు+కలిమిన్= బలముయొక్క అతిశయాన్ని; నెఱపిన= వ్యాపింపజేసిన; నీ చలము= నీ యొక్క మాత్సర్యాన్ని; బలము= బలాన్ని; నాకున్= శిఖండినైన నాకు; చూపన్+చాలవు= చూపలేకున్నావు; కంటే?= చూచావా!

**తాత్పర్యం:** 'ఓ భీష్మా! నీవు రాజుల నందరినీ గెలిచావు. మహాబలపరాక్రమం గల పరశురాముడికి సమ ఉజ్జి అయినవాడివి. నీ బలాతిశయాన్ని లోకంలో బాగా విస్తరింపజేశావు, అట్టి నీవు నీబలం, చలం నాకు చూపలేకున్నావు కదా!

**క. ఏయు మొకనేర్పుమై ని। ట్లేయక క్రీడించి యరుగు మెట్లయినను మ**
**త్సాయకముల నినుఁ గూల్చెదఁ। జూ యెవ్వత నైతి నేమి సూచెదు? నన్నున్. 325**

**ప్రతిపదార్థం:** ఒక నేర్పుమైన్= ఏ కొద్ది నేర్పుతోనైనా; ఏయుము= బాణాలతో కొట్టుము; ఇట్లు= ఈ విధంగా; ఏయక= బాణాలు ప్రయోగించక; క్రేడించి= తొలగి; అరుగుము= వెళ్ళు; ఎట్లు+అయిననున్= ఏ విధంచేతనైనా; మత్+సాయకములన్= నా బాణాలతో; నినున్= నిన్ను; కూల్చెదన్= చంపుతాను; చూ= సుమా!; ఎవ్వతన్+ఐతిన్= నేనెవరైతే నేమి?; నన్నున్= నన్ను; ఏమి చూచెదు?= ఏమి చూస్తావు?

**తాత్పర్యం:** ఓ భీష్మా! నీలో ఏ కొద్ది నేర్పున్నా నా పైన బాణాలు ప్రయోగించు. చేతకాకపోతే బాణాలు ప్రయోగించకుండా అవతలికి వెళ్ళిపొమ్ము. నీవు నిలిచి బాణాలు వేసినా, తొలగిపోయినా - ఎట్లయినా సరే నేను బాణాలు వేసి నిన్ను చంపుతాను. నేను ఆడదాననైతేనేమి? మగవాడనైతేనేమి? నన్నేం చూస్తావు?

**క. నేఁ డెమ్మెయి నైనను నీ । పోఁడిమిఁ జెడఁ దోన తవిలి పొదువుదు నిన్నున్**
**వాఁడిమగఁ డనుట యుడుపుదు । వేఁడిమి సొం పెసఁగ నస్త్రవిద్య మెఱయుదున్. 326**

**ప్రతిపదార్థం:** నేఁడు= ఈనాడు; ఏ+మెయిన్+అయిననున్= ఏ విధంగానైనా సరే; నీ పోఁడిమి= నీ యొక్క ఒప్పిదము; చెడన్= చెడిపోయేట్లుగా; తోనన్ తవిలి= వెంబడి తగులుకొని; నిన్నున్ నిన్ను; పొదువుదున్= క్రమ్ముకొంటాను; వాఁడి మగఁడు+అనుటన్= చురుకుతనం గల మగవా డనే ప్రసిద్ధిని; ఉడుపుదున్= పోగొట్టుతాను; అస్త్రవిద్యకున్= ఆయుధాల విద్యలో; వేఁడిమి సొంపు= తీక్ష్ణతయొక్క ఆధిక్యం; ఎసఁగన్= అతిశయించగా; మెఱయుదున్= ప్రకాశిస్తాను.

**తాత్పర్యం:** ఓ భీష్మాచార్యా! ఈ దినం ఏవిధంగానైనా, నీ వాక్యం చెడిపోయేటట్లుగా నీ వెంబడిపడి నిన్ను క్రమ్ముతాను. చురుకుదనం గల మగవాడివనే ప్రసిద్ధిని రూపుమాపుతాను. ఆయుధాలు ప్రయోగించే విద్యలో నాకున్న నిశితత్వం ప్రదర్శిస్తాను.'

**వ. అనుచు మఱియు నైదమ్ము లేసె నప్పలుకులు విని ఫల్గునుం డాత్మగతంబున నేఁడు శిఖండి చందంబు వింత యయియున్న యది. నదీనందనుండు సమయుటకు సమయం బైన దైవదత్తోత్సాహంబున నేచి పలికెం గావలయు'నని యూహించి యుపోద్బలంబుగా నతని కిట్లనియె. 327**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని చెప్పుచు; మఱియున్= ఇంకాకూడా; ఐదు+అమ్ములు= ఐదు బాణాలను; ఏసెన్= ప్రయోగించాడు; ఫల్గునుండు= అర్జునుడు; ఆ+పలుకులు= ఆ మాటలు; విని; నేఁడు= ఈనాడు;శిఖండి చందంబు= శిఖండియొక్క విధము; వింత+అయి= ఆశ్చర్యమై; ఉన్న+అది; నదీనందనుండు= భీష్ముడు; సమయుటకున్= చావడానికి; సమయంబు+ఐనన్= సమయంకాగా; దైవదత్త+ఉత్సాహంబుననన్= విధిచే ఈయబడ్డ ఉత్సాహంబుతో; ఏచి= విజృంభించి; పలికెన్+కావలయున్+అని= పలికాడు కాబోలు అని; ఆత్మగతంబుననన్= తనలో; ఊహించి; ఉప+ఉద్బలంబు+కాన్= ప్రోత్సాహం కలిగేట్టుగా; అతనికిన్= ఆ శిఖండికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని ఈ విధంగా శిఖండి భీష్ముడిని తూలనాడుతూ మరల ఐదు బాణాలతో అతడిని కొట్టాడు. అప్పుడు వాడాడిన మాటలు అర్జునుడు విని, 'ఓహో! నేడు వీడి విధానం వింతగా కన్పిస్తున్నది. భీష్ముడు చావటానికి సమయం ఆసన్నమైంది కాబట్టే, దైవ ప్రేరణచేత ఉత్సాహం కలిగి విజృంభించి పలికాడు, కాబోలు' అని తన మనస్సులో ఊహించి వాడి ఉత్సాహాన్ని హెచ్చుచేసేట్లుగా ఇట్లా అన్నాడు:

**అర్జునుఁడు శిఖండికిఁ బ్రోత్సాహంబు గలిగించి భీష్ముపైఁ గవియించుట (సం. 6-104-51)**

**ఆ. ' ఇట్టు లాడి పిదప నేమియుఁ జేయంగఁ । జాలకున్న మనల జగము నవ్వు**
**నేను గలుగ నిన్ను నెవ్వరి కేమియుఁ । జేయరాదు భీష్ము నేయు మడరి.' 328**

**ప్రతిపదార్థం:** ఇట్టులు= ఈ మాదిరి; ఆడి= మాటలాడి; పిదపన్= అటుపైన; ఏమియున్= ఏమీకూడా; చేయంగన్+చాలక= చేయలేక; ఉన్నన్= ఉన్నట్టయితే; మనలన్= మనలను; జగము= లోకము; నవ్వున్= నవ్వుతుంది; ఏనున్= అర్జునుడనగు నేను; కలుగన్= ఉండగా; నిన్నున్; ఎవ్వరికిన్= ఎవరికిగాని; ఏమియున్+చేయరాదు= ఏమీ చేయడానికి సాధ్యంకాదు; అడరి= విజృంభించి; భీష్మున్+ఏయుము= భీష్ముడిని బాణాలతో కొట్టుము.

**తాత్పర్యం:** 'ఓ శిఖండీ! ఈ విధంగా బీరాలు పలికి అటుపై బలంగా యుద్ధం చేయకుండా ఊరకుంటే, మనలను చూచి జనం నవ్వుతారు. నేను నీకు అండగా ఉండగా నీ కేమి భయం? ఎవ్వరూ నిన్నేమీ చేయలేరు. విజృంభించి భీష్ముడితో తలపడు'మని అర్జునుడు అన్నాడు.

**వ. అనియె నప్పుడు గాంగేయుండు దొలంగి పాంచాలబలంబులపైఁ దఱిమినం దెఱపి గని పాండవబలంబులు గాండీవి మున్నుగాఁ గవిసినం గౌరవసేన దెరలి మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ 'నీవు గలుగ మన సైన్యంబు దైన్యంబు నొంద నగునే?' యనవుడు రారాజుతో నతండు. 329**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అప్పుడు; గాంగేయుండున్; తొలంగి; పాంచాల బలంబులపైన్= పాంచాల రాజు సేనలపైకి; తఱిమినన్= కవియగా; పాండవ బలంబులు= పాండవుల సేనలు; తెఱపిన్+కని= సందుచూచికొని; గాండీవిమున్ను+కాన్= అర్జునుడు ముందు నిలబడగా; కవిసినన్; కౌరవసేన; తెరలి= తొలగి; మరలినన్= వెనుకకు మళ్ళగా; కురురాజు= దుర్యోధనుడు; సురనదీసూనుతోడన్= భీష్ముడితో; నీవు+కలుగన్= నీవు ఉండగా; మన సైన్యంబు= మనయొక్క సేన; దైన్యంబున్= హీనమైన దశను; పొందన్+అగున్+ఏ?= చెంద తగునా?; అనవుడున్= అని చెప్పగా; అతండు= ఆ భీష్ముడు; రారాజుతోన్= దుర్యోధనుడితో.

**తాత్పర్యం:** పై విధంగా అర్జునుడు శిఖండితో చెప్పిన సమయంలో, భీష్ముడు తొలగిపోయి పాంచాలరాజు సేనల మీద పడ్డాడు. ఆ సందు చూచికొని పాండవబలాలు, గాండీవి ముందు నిలబడగా శత్రు సైన్యం మీదికి కవిశాయి. అప్పుడు కౌరవుల బలం భయంతో ఒదిగి ఒదిగి, వెనుకకు మళ్ళింది. దుర్యోధనుడు చూచి, 'నీవు ఉండగానే మన సేనలకు ఇంత దుఃస్థితి పట్టటమా? అని భీష్ముడితో అన్నాడు. దానికి భీష్ముడు దుర్యోధనుడికి ఈ విధంగా బదులు చెప్పాడు.

**విశేషం:** భీష్ముడు తాను ఋణం తీర్చుకొన్నానని, పాండవు లజేయులని దుర్యోధనుడితో అంటాడు.

**క. ' మును పదివేవురఁ జంపుదు । ననియిచ్చినబాసవచ్చె నవనీశ్వర! నీ**
**మనిచినఋణంబు దీర్చితి । విను లా విటమీఁదఁ దఱుఁగువిధమై తోఁచెన్. 330**

**ప్రతిపదార్థం:** అవనీశ్వర!= ప్రభువగు దుర్యోధనా! పదివేవురన్= పదివేల మందిని; చంపుదున్+అని= చంపుతానని; మును= ముందు; ఇచ్చిన= ఒసగిన; బాస= ప్రతిజ్ఞ; వచ్చెన్= పూర్తి అయింది; నీ మనిచిన ఋణంబు= నీవు పోషించడంచేతనైన అప్పును; తీర్చితిన్; తీర్చివేశాను; విను= వినుము; ఇటమీఁదఁన్= ఇకమీదట; లావు= బలము; తఱుఁగు విధము+ఐ= తగ్గిపోయే మాదిరిగా; తోఁచెన్= అనిపిస్తోంది.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! మునుపు పదివేల యోధులను చంపుతానని నేను చేసిన ప్రతిజ్ఞ పూర్తయింది. నీవు ఇన్నాళ్ళు నన్ను పోషించావు. ఆ ఋణం తీర్చికొన్నాను. అయ్యా, విను! ఇక నా బలం తగ్గిపోతూన్నట్లుగా అనిపిస్తున్నది.

**ఆ. నేఁటిభంగి సూడ నృపవర । పాండవు లొండె నన్ను, వారి నొండె నేను**
**సమయఁజేత గలుగు సమసెదరే? యొక । మర్త్యుచేత వా రమర్త్యబలులు. 331**

**ప్రతిపదార్థం:** నృపవర!= రాజులలో గొప్పవాడైన దుర్యోధనా!; నేఁటిభంగిన్= ఈ నాటి విధానాన్ని; చూడన్= చూడగా; పాండవులు; నన్ను ఒండెన్= నన్నుగాని; నేను; వారిన్ఒండెన్= వాళ్ళను గాని; సమయన్+చేఁత= చంపటం; కలుగున్= జరుగుతుంది; అమర్త్యబలులు= చావులేని దేవతల బలంవంటి బలంగలవారైన; వారు= ఆ పాండవులు; ఒక మర్త్యుచేతన్= ఒక మానవుడిచేత; సమసెదరు+ఏ?= చస్తారా?

**తాత్పర్యం:** ఓ దుర్యోధన మహారాజా! నేటి పరిస్థితి చూస్తే, పాండవులు నన్నుగాని, నేను పాండవులనుగాని చంపడం తప్పకుండా జరుగుతుంది. ఆ పాండవులు దేవతల బలంవంటి బలంగలవారు కావటంచేత, ఒకానొక మానవుడైన నావంటి వాడిచేత చస్తారా? (ఈ పద్యంలో తాను చావటం ఖాయమని, పాండవులు జయించడం నిజమని నిక్కచ్చిగా భీష్ముడు దుర్యోధనుడికి చెప్పాడు.)

**వ. ఐనను నా చేతి బలుపు సూడుమీ యని పలికి పేర్చి పటుతరశరార్చులం బ్రచండ నరనాథ యూథంబులం బొదివికొని పాండవులకుం దేఱిచూడరాక నిర్ధూమదహనస్వభావుండైన పితామహు ప్రాపున భవత్పుత్త్రులు శత్రుబలంబుల బడలువడంజేయందొడంగిన వారిం గనుంగొని. 332**

**ప్రతిపదార్థం:** ఐనను= అయినప్పటికి; నా చేతి బలువు= నా చేతియొక్క బలాన్ని; చూడుమీ= చూడు; అని పలికి; పేర్చి= విజృంభించి; పటుతరశర+అర్చులన్= మిక్కిలి సమర్థములైన బాణాల జ్వాలలతో; ప్రచండ నరనాథ యూథంబులన్= అసాధ్యమైన రాజుల గుంపును; పొదివికొని= ఆక్రమించి; పాండవులకున్; తేఱిచూడరాక= రెప్పవేయక చూడటానికి సాధ్యంకాక; నిర్+ధూమ= పొగలేని; దహన+అగ్నియొక్క; స్వభావుండు+ఐ= స్వభావంగలవాడైన; పితామహు ప్రాపునన్= తాతగారైన భీష్ముని ఆశ్రయం(అండ)తో; భవత్+పుత్త్రులు= నీ కొడుకులు కౌరవులు; శత్రుబలంబులన్= శత్రువులైన పాండవుల సేనలను; బడలు+పడన్+చేయన్= బడలిక చెందేటట్లు చేయటానికి; తొడంగినన్= మొదలుపెట్టగా; వారిన్= ఆ కౌరవుల సేనలను; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** అయినప్పటికీ నా బాహుబలం చూడు, అని అంటూ బాగా దిట్టమైన బాణాల జ్వాలలతో అసాధ్యమైన రాజుల గుంపును ఎదుర్కొన్నాడు భీష్ముడు. అప్పు డాయనను పాండవులు తేరిపార చూడలేకపోయారు. అప్పుడు భీష్ముడు పొగలేని అగ్గిలా మండిపడుతూ ఉండగా నీ కొడుకులందరూ అతని అండన చేరి, పాండవుల బలగాలను నొచ్చిపోయేటట్లు చేయసాగారు. ఆ కౌరవసేనలను చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. పాండవేయమాత్స్యపాంచాలయాదవ । పాండ్యకేకయాదిబలము లొక్క**
**మొగిన త్రోవ నీదుమొనలు మార్కొనుటయు । నపుడు పోరు ఘోర మయ్యె నధిప! 333**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్రా!; పాండవేయ= పాండవులకొడుకుల; మాత్స్య= మత్స్యదేశపురాజు; పాంచాల= పాంచాలరాజు; యాదవ= యాదవులు; పాండ్య= పాండ్య దేశపురాజు; కేకయ= కేకయరాజు; ఆది= మొదలుగాగల వారియొక్క; బలములు= సేనలు; ఒక్క మొగిన= ఒక్కసారిగా; త్రోవన్= కవియగా; నీదు= నీయొక్క; మొనలు= సైన్యాలు; మార్కొనుటయున్= ఎదిరించగా; అపుడు; పోరు= కౌరవ పాండవుల యుద్ధం; ఘోరము= భయంకరమైందిగా; అయ్యెన్.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! పాండవుల కొడుకులు, మత్స్యదేశపురాజు, పాంచాలరాజు, యాదవులు, పాండ్యుడు, కేకయరాజు మొదలుగా గల వారి సైన్యాలు ఒక్కుమ్మడిగా కవియగా, నీ కొడుకు దుర్యోధనుడి సేనలు కూడా ఎదిరించగా యుద్ధం చాలా భయంకరంగా జరిగింది.

**వ. అట్టియెడ నర్జునుండు శిఖండి నాలోకించి. 334**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్; అర్జునుండు; శిఖండిన్; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అప్పుడు అర్జునుడు శిఖండిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. ' నీవు భీష్మున కలికినఁ బోవ దేను । గలుగ వెఱపేల? యతనిపైఁ గవియు మెయిది**
**కొని మదీయబాణంబులఁ గుప్పఁగూరఁ । బఱపి కూల్చెద నీతనిఁ బటురయమున.' 335**

**ప్రతిపదార్థం:** నీవు; భీష్మునకున్= భీష్ముడికి; అలికినన్= భయపడినా కూడా; పోవదు= భీష్ముడి మరణం తప్పదు; ఏను= నేను; కలుగన్= ఉండగా; వెఱపు+ఏల?= నీకు భయమెందుకు?; ఎయిదికొని= వెంబడించి; అతనిపైన్= ఆ భీష్ముడి మీదికి; కవియుము= పర్వుము; మదీయబాణంబులన్= నా దగ్గరుండే బాణాలను; కొని= తీసికొని; కుప్పఁగూరన్= కుప్పలుకుప్పలుగా; పఱపి= ప్రయోగించి; పటురయమునన్= మిక్కిలి వేగంతో; ఈతనిన్= ఈ భీష్ముడిని; కూల్చెదన్= చంపుతాను.

**తాత్పర్యం:** 'ఓ శిఖండీ! నీవు భీష్ముడి దెబ్బకు భయపడినా కూడా ఆతడి చావు తప్పదు. నే నున్నానుకదా! ఇక నీకు భయం దేనికి? అతడి వెంటపడుము. నేను నా బాణాలన్నీ ప్రయోగించి కుప్పలు కుప్పలుగా గుప్పించి చాలా వేగంతో ఈనా డీ భీష్ముడిని కడతేర్చుతాను.

**వ. అనిన నాతని పలుకులు విని యెలుంగెత్తి ధృష్టద్యుమ్నుండు. 336**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; ఆతని పలుకులు= ఆ అర్జునుడి మాటలు; విని; ఎలుంగు+ఎత్తి= గొంతెత్తి; ధృష్టద్యుమ్నుడు.

**తాత్పర్యం:** అని అనగా , ఆ అర్జునుడి మాటలను విన్నట్టి ధృష్టద్యుమ్నుడు బిగ్గరగా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ' మన యోధులందఱును శాం । తనవునిపైఁ దఱుముఁ డింద్రతనయుఁడు గలుగన్**
**మన మతనికి శంకింపఁగఁ । బనిలే' దని పలికి యార్చి బలువిడి నడరెన్. 337**

**ప్రతిపదార్థం:** మన యోధులు= మన పక్షంలోని వీరులు; అందఱును= అందరూకూడా; శాంతనవునిపైన్= భీష్ముడిమీదికి; తఱుముఁడు= కవియుడు; ఇంద్ర తనయుఁడు= ఇంద్రుడి కుమారుడు - అర్జునుడు; కలుగన్= ఉండగా; మనము; అతనికిన్= ఆ భీష్ముడికి; శంకింపఁగన్+పనిలేదు= భయపడనక్కరలేదు; అని పలికి; ఆర్చి= బొబ్బరించి; బలువిడిన్= బలంగా; అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** 'మన యోధులందరు ఏకంగా భీష్ముడిని చుట్టుముట్టండి. అర్జును డుండగా మనకేం భయం? ఆ భీష్ముడిని చూచి మనం జంక పనిలేదు' అని అంటూ, పెనుబొబ్బపెట్టి ధృష్టద్యుమ్నుడు బలంగా విజృంభించాడు.

**వ. అప్పుడు ధర్మజభీమనకులసహదేవులును సుభద్రాతనయద్రౌపదేయులును ద్రుపదవిరాటులును, సాత్యకి చేకితాన ధృష్టకేతు కేకయ మాగధులును మఱియునుం జేయంగల దొరలు నొక్కపెట్ట బెట్టఁదరిన నిక్కడ గురుపుత్రభూరిశ్రవసులును, గృతవర్మకృపకాంభోజపతులును, వికర్ణదుర్ముఖ వివింశతిచిత్రసేనులును లోనైన యోధులు దేవవ్రతునకుం దలకడచి వారిం దలపడి రిట్లు మందాకినీనందనుపయిం గవియు పాండవసైనికులను నతని కడ్డుపడు కౌరవ్యవీరులును జూచునెడ సురల కనిమిషత్వంబు సార్థకం బయ్యె నయ్యవసరంబున. 338**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ధర్మజ; భీమ; నకుల; సహదేవులును సుభద్రాతనయ= సుభద్ర కుమారుడు అభిమన్యుడు; ద్రౌపదేయులును= ద్రౌపదికుమారులునూ; ద్రుపద విరాటులును; సాత్యకి; చేకితాన; ధృష్టకేతు; కేకయ; మాగధులును; మఱియునున్; చేయన్+కల= సమర్థులైన; దొరలును; ఒక్కపెట్టన్= ఒకేసారిగా; బెట్టు= అధికంగా; అడరినన్= విజృంభించగా; ఇక్కడ= ఈ కౌరవసేనలో; గురుపుత్ర భూరిశ్రవసులును= అశ్వత్థామయు, భూరిశ్రవసుడును; కృతవర్మ; కృప; కాంభోజ పతులును; వికర్ణ; దుర్ముఖ; వివింశతి అనే వారు; చిత్రసేనులును; లోను+ఐన యోధులు= మొదలుగా గల వీరులు; దేవవ్రతునకున్= భీష్ముడికి; తలకడచి= అతిక్రమించి; వారిన్= ఆ పాండవపక్షంలోనివారలను; తలపడిరి= ఎదుర్కొన్నారు; ఇట్లు; మందాకినీ నందను పయిన్= భీష్ముడిమీద; కవియు; పాండవసైనికులను= పాండవుల సేనలో ఉండేవారిని; అతనికిన్= ఆ భీష్ముడికి; అడ్డుపడు= అండగా ముందు అడ్డుకొనే; కౌరవ్యవీరులునున్= కౌరవుల సేనలోని శూరులను; చూచు+ఎడన్ చూచే సమయంలో; సురలకున్= దేవతలకు; అనిమిషత్వంబు= రెప్పపాటు లేకుండుట; సార్థకంబు+అయ్యెన్= సఫలమైంది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు బొబ్బలుపెట్టుతూ విజృంభించినప్పుడు ధర్మరాజు, భీముడు, నకులుడు, సహదేవుడున్నూ, అభిమన్యుడు, ద్రౌపది కొడుకులున్నూ, సాత్యకి, చేకితానుడు, కేకయమాగధరాజులున్నూ ఇంకా ఉండే రాజులందరూ ఒకే ఊపుతో బాగా విజృంభించారు. ఇక్కడ కౌరవసేనలో అశ్వత్థామ, భూరిశ్రవసుడు, కృతవర్మ, కృపాచార్యుడు, కాంభోజరాజున్నూ, వికర్ణుడు, దుర్ముఖుడు, వివింశతి, చిత్రసేనుడు మొదలుగా కలిగిన శూరులు, భీష్ముడికి రక్షణగా ముందు భాగంలో నిలిచి, పాండవ సైనికులను ఎదిరించారు. ఈ యుద్ధపుపట్టును చూస్తూన్న దేవతలకు రెప్పపాటు లేకుండటం సఫలమైంది. (అంటే ఘోరంగా యుద్ధం జరిగిందని, దేవతలు ఆ యుద్ధాన్ని రెప్పవేయకుండా చూశారని భావం.)

**క. మొనసి శిఖండిని మున్నిడి । కొనియురవడిఁ దఱుము నరునకును వెస దుశ్శా**
**సనుఁ డడ్డపడియెఁ బొంగిన । వననిధికిని వేలవోలె వసుధాధీశా! 339**

**ప్రతిపదార్థం:** వసుధా+అధీశా!= భూమికి భర్తవైన ధృతరాష్ట్ర మహారాజా!; మొనసి= పూనుకొని; శిఖండిని= శిఖండి అనేవాడిని; మున్ను+ఇడికొని= ముందుగా పెట్టుకొని; ఉరవడిన్= చాలావేగంగా; తఱుము= కవియుచున్నట్టి; నరునకున్= అర్జునుడికి; వెసన్= వేగంతో; దుశ్శాసనుఁడు; పొంగిన= ఉబ్బిన; వననిధికిన్= సముద్రానికి; వేల+పోలెన్= చెలియలికట్టలాగా; అడ్డపడియెన్= అడ్డువచ్చాడు.

**తాత్పర్యం:** ప్రయత్నంతో శిఖండిని ముందు ఉంచికొని వేగంగా ముందుకు దూసుకొనిపోతున్న అర్జునుడికి - సముద్రానికి చెలియలికట్ట మాదిరిగా దుశ్శాసనుడు అడ్డుతగిలాడు.

**విశేషం:** అలం: ఉపమ. సముద్రానికి చెలియలికట్ట ఎట్లాగో - వేగంగా ముందుకు పోతున్న అర్జునుడికి దుశ్శాసనుడు అట్లాగ.

**వ. ఇట్లు నిలువరించి. 340**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నిలువరించి= ఆపి.

**తాత్పర్యం:** పైన చెప్పినరీతిగా దుశ్శాసనుడు పాండవసేనను నిలబడేటట్లుగా చేసి (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఇరువురఁ గృష్ణుల నాతం । డిరువదిబలునారసముల నేసెం గ్రోధ**
**స్ఫురితుఁ డయి నొంచెఁ గ్రీడియు । నరనాయక! యతని నూఱునారాచములన్. 341**

**ప్రతిపదార్థం:** నరనాయక!= ప్రభూ; ఆతండు= ఆ దుశ్శాసనుడు; ఇరువురన్= ఇద్దరైన; కృష్ణులన్= కృష్ణుడిని, అర్జునుడిని; ఇరువది బలు నారసములన్= ఇరవై వాడి బాణాలతో; ఏసెన్= కొట్టాడు; క్రీడియు(న్)= అర్జునుడున్నూ; క్రోధస్ఫురితుఁడు+అయి= కోపంచే అదరుతున్నవాడై; నూఱు నారాచములన్= నూరు బాణాలతో; అతని(న్)= ఆ దుశ్శాసనుడిని; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** రాజా! ఆ దుశ్శాసనుడు ఇరువది బాణాలతో, ఆ కృష్ణార్జును లిద్దరినీ కొట్టాడు. అర్జునుడు మిక్కిలి కోపించి నూరు బాణాలు వేసి దుశ్శాసనుడిని నొవ్వజేశాడు.

**తే. అతఁడు నొచ్చియు నాటించె నైదుతూపు । లింద్రసుతుఫాలమున నాతఁ డేచి విల్లు**
**దునిమి పెల్లేయఁ దలఁకక దుస్ససేనుఁ । డన్యధనువున నిరువదేనమ్ము లేసె. 342**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ దుశ్శాసనుడు; నొచ్చియున్= బాధపొందికూడా; ఇంద్రసుతు ఫాలమునన్= అర్జునుడి నొసటన; ఐదు+తూపులు= అయిదు బాణాలు; నాటించెన్= గుచ్చినాడు; ఆతఁడు= ఆ అర్జునుడు; ఏచి= విజృంభించి; విల్లున్= దుశ్శాసనుడి వింటిని;తునిమి= తునకలు చేసి; పెల్లు= అధికంగా; ఏయన్= బాణాలతో కొట్టగా; దుస్ససేనుఁడు= దుశ్శాసనుడు; తలఁకక= చలించకుండా; అన్యధనువునన్= వేరే విల్లుతో; ఇరువది+ఏను= ఇరవై అయిదు;అమ్ములు= బాణాలు; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు చాలా దెబ్బతినికూడా, అర్జునుడి నొసట అయిదు బాణాలు గ్రుచ్చాడు. ఆ అర్జునుడు మిక్కిలి విజృంభించి, దుశ్శాసనుడి వింటిని తునుకలు చేసి, చాలా బాణాలు వేశాడు. కాని దుశ్శాసనుడు ఏ మాత్రం చలించకుండా, వేరే విల్లందుకొని ఇరవైఅయిదు బాణాలు ప్రయోగించాడు.

**క. ఆ తూపులు నఱికి పరి । స్ఫీతంబగు నారసంబు పృథుతరవక్ష**
**స్స్యూతంబు సేసి విజయుఁడు । నీ తనయుని మూర్ఛ వుచ్చె నిష్ఠురవృత్తిన్. 343**

**ప్రతిపదార్థం:** విజయుఁడు= అర్జునుడు; ఆ తూపులు= దుశ్శాసనుడు వేసిన ఆ బాణాలను; నఱికి= తుంటలు చేసి; పరిస్ఫీతంబు+అగు= మిక్కిలి విశాలమయిన; వక్షస్= రొమ్మున; స్యూతంబున్+చేసి= గ్రుచ్చుకొనేటట్లుగా చేసి; నీ తనయునిన్= దుశ్శాసనుడిని; నిష్ఠురవృత్తిన్= కఠోరంగా; మూర్ఛపుచ్చెన్= మూర్ఛ చెందేట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు తనపై ప్రయోగించిన బాణాలను అర్జునుడు తుంటలు చేసి, చాలా శక్తి గల ఒక బాణాన్ని ప్రయోగించాడు. ఆ బాణం దుశ్శాసనుడి విశాలమైన రొమ్ములో బాగా గ్రుచ్చుకొన్నది. ఆ దెబ్బతో నీ కొడుకు దుశ్శాసనుడు మూర్ఛపోయాడు.

**వ. ఇట్లు దుశ్శాసనుండు సోలి వ్రాలుటయు. 344**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ మాదిరి; దుశ్శాసనుండు= దుశ్శాసనుడు; సోలి= సొమ్మసిల్లి; వ్రాలుటయున్= ఒరిగిపోగా.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు మూర్ఛ చెంది, రథంలో వాలిపోగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సారథి యరదము భీష్ముని । తేరివెనుక కెగిచె నంతఁ దెలివొంది ధృతి**
**స్ఫారుఁ డగు న క్కుమారుఁ డు । దారగతిన్ మగిడి వచ్చి తాఁకెం గ్రీడిన్. 345**

**ప్రతిపదార్థం:** సారథి= దుశ్శాసనుడి సారథి; అరదమున్= రథాన్ని; భీష్ముని తేరి వెనుకకున్= భీష్ముడి రథం వెనుకప్రక్కకు; ఎగిచెన్= తరిమాడు; అంతన్= అంతలోపల; ధృతిస్ఫారుఁడు+అగు= ధైర్యంచే గొప్పవాడైన; ఆ+కుమారుఁడు= ఆ దుశ్శాసనుడు; తెలివి+ఒంది= స్పృహపొంది; ఉదారగతిన్= గొప్పదైన గమనంతో; మగిడివచ్చి= తిరిగివచ్చి; క్రీడిన్= అర్జునుడిని; తాఁకెన్= మార్కొన్నాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు మూర్ఛ చెందగానే, అతడి సారథి భీష్ముడి రథానికి వెనుక ప్రక్కకు తన రథాన్ని తరుముకొని పోయాడు. అంతలోనే, మహాధైర్యవంతుడైన ఆ దుశ్శాసనుడు తెప్పరిల్లుకొని, హుందాగా తిరిగివచ్చి అర్జునుడిని ఎదుర్కొన్నాడు.

వ. **తదవసరంబున సాత్యకితో నలంబుస భగదత్తులును, నభిమన్యునితో సుదక్షిణుండును, విరాటద్రుపదులతో నశ్వత్థామయు, సహదేవునితోఁ గృపాచార్యుండును, నకులునితో వికర్ణుండును, ఘటోత్కచునితో దుర్ముఖుండును, భీమసేనుతో భూరిశ్రవసుండును, జేకితానుతోఁ జిత్రసేనుండును, ధర్మనందనుతో నస్త్రగురుండును దలపడిన బెట్టిదంబగు బవరం బయ్యె నందిరుదెఱంగుల యోధులు నన్యోన్యధ్వజభంజనంబును, బరస్పరతురగహననంబును, నితరేతరసూతనిపాతనంబును, మిథఃకోదండ ఖండనంబును జేయుచుండం బటుతరశరసంపాతసంపాదితశంపాజాలకాభీలంబును, భీషణ గుణరణనగర్జాస్ఫూర్జితంబును, రక్తధారాసారఘోరంబును, నగు నపూర్వ పర్జన్యసమయంబు దోఁచె నప్పుడు గయ్యంబు కలరూపంతయుం గనుంగొనుటకు మింటి క్రేవ నున్న వెరవు గా దను పరుసున సవిత్రుండు సగమింటికిం జనుదెంచె; నట్టియెడ.** **346**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబున్= ఆ సమయంలో; సాత్యకితోన్; అలంబుస భగదత్తులునున్; అభిమన్యుతో; సుదక్షిణుండునున్= సుదక్షిణుడనేవాడున్నూ; విరాటద్రుపదులతోన్; అశ్వత్థామయున్; సహదేవునితోన్; కృపాచార్యుండును; నకులునితో; వికర్ణుండును; ఘటోత్కచునితోన్; దుర్ముఖుండును; భీమసేనుతోన్ ; భూరిశ్రవసుండున్; చేకితానుతోన్; చిత్రసేనుండును; ధర్మనందనుతోన్= ధర్మరాజుతో; అస్త్రగురుండున్= విలు విద్య నేర్పిన గురువైన ద్రోణాచార్యుడున్నూ; తలపడినన్= మార్కొనగా; బెట్టిదంబు+అగు= క్రూరమైన; బవరంబు+అయ్యెన్= యుద్ధం జరిగింది; అందున్= ఆ యుద్ధంలో; ఇరు+తెఱంగుల యోధులున్= రెండు పక్షాలలోని వీరులున్నూ; అన్యోన్య ధ్వజ భంజనంబును= ఒండొరుల యొక్క టెక్కెములను విరుచుకోవడం; పరస్పర తురగ హననంబునున్= ఒకరి గుర్రాలను మరొకరు చంపుకోవడం; ఇతరేతర సూత నిపాతనంబును= ఒండొరుల సారథులను పడవేయటం; మిథః కోదండ ఖండనంబును= అన్యోన్యం ధనువులను త్రుంచివేయటం; చేయుచుండన్= చేస్తూండగా; పటుతర= మిక్కిలిగట్టివైన; శర= బాణాలయొక్క, సంపాత= బాగా పడవేయటంచేత; సంపాదిత= కలుగజేయబడిన; శంపా= మెరుపుతీగల యొక్క; జాలక= సమూహంచేత; ఆభీలంబును= భయంకరమైనదిన్నీ, భీషణ= భయంకరమైన; గుణ= అల్లెత్రాళ్ళయొక్క; రణన= ధ్వనుల; గర్జా= ఉరుములయొక్క; స్ఫూర్జితంబును= ప్రతిధ్వనులు కలదియు; రక్తధారా= నెత్తుటిధారలనే; ఆసార= జడివానచేత; ఘోరంబును(న్)= భయంకరమైనదియు; అగు= అగునట్టి; అపూర్వ పర్జన్యసమయంబు= మునుపు లేనట్టి వర్షాకాలం; తోఁచెన్= తోపింపచేసింది; అప్పుడు= ఆ సమయంలో; కయ్యంబుకలరూపు= యుద్ధం ఉన్నదున్నట్టుగా; అంతయున్= పూర్తిగా; కనుంగొనుటకున్= చూడటానికి; మింటి క్రేవన్= ఆకాశంలో ఒక వైపు; ఉన్నన్= ఉండగా; వెరవు గాదు= సాధ్యం కాదు; అనుపరుసునన్= అనే విధంగా; సవిత్రుండు= సూర్యుడు; సగమింటికిన్= ఆకాశం మధ్యభాగానికి; చనుదెంచెన్= వచ్చాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ యుద్ధంలో సాత్యకితో అలంబుసుడు, భగదత్తుడు; అభిమన్యుడితో సుదక్షిణుడు; విరాటరాజు,ద్రుపదుడు - వీరిద్దరితో అశ్వత్థామ; సహదేవుడితో - కృపుడున్నూ, నకులుడితో - వికర్ణుడు; ఘటోత్కచుడితో దుర్ముఖుడు; భీముడితో భూరిశ్రవసుడు; చేకితానుడితో చిత్రసేనుడు; ధర్మరాజుతో ద్రోణాచార్యుడు తలపడ్డారు. పోరుఘోరంగా ఉండినది. ఆ యుద్ధంలో రెండుపక్షాల వారు ఒకరొకరి ధ్వజాలను విరచటం, ఒండొరుల గుర్రాలను చంపుకోవటం, ఇరుపక్షాలవారి సారథులను పడవేయటం, వీరి విండ్లను వారు, వారి విండ్లను వీరు

త్రుంచివేయటం జరుగుతూ ఉంటే, విరివిగా బాణాలు విసురుకోవటం చేత కలిగిన మెరుపుల గుంపులచే భయంగొలిపేది, భయంకరమైన అల్లెత్రాళ్ళ ధ్వనులనెడి ఉరుముల కదలికలు కలది, నెత్తుటి ధారలనే జడివానచే ఘోరమైనది అవుతూ, మునుపెన్నడూ లేని వర్షాకాల సమయంగా అనిపించింది. అప్పుడు సూర్యభగవానుడు ఆకాశంలో ఒకవైపు యుద్ధం జరుగుతున్నట్టిది జరుగుతున్నట్టుగా చూడటానికి సాధ్యంకాదని అనుకొన్నాడో అన్నట్లు ఆకాశంలో మధ్య భాగానికి చేరుకొన్నాడు. అట్టి సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** అలం: ఉత్ప్రేక్షం.

**మ.** **పటుదుశ్శాసనబాణపంక్తి నతిదర్పస్ఫూర్తిమైఁ ద్రుంచి యు**
**త్కటకోపానలదీప్తవక్త్రుఁ డగుచున్ గాండీవి పెల్లేయుడుం**
**ద్రుటితజ్యాలతికాధనుర్ధ్వజుఁడు నిర్లూనాఖిలాంగుండు నై**
**రటదశ్వం బగుతేరితో నతఁడు సంత్రాసంబునం బాటినన్.** **347**

**ప్రతిపదార్థం:** గాండీవి= అర్జునుడు; పటు; దుశ్శాసన= దుశ్శాసనుడిచే ప్రయోగింపబడ్డ, బాణ= బాణాలయొక్క; పంక్తిన్= వరుసను; అతిదర్ప స్ఫూర్తిమైన్= మిక్కుటమైన గర్వంచేతనైన కదలికతో; త్రుంచి= తునుకలు చేసి; ఉత్కట= ఎక్కువైన; కోప= కోపమనెడి; అనల= అగ్గిచే; దీప్త= జ్వలించెడి; వక్త్రుఁడు+అగుచున్=ముఖంగల వాడౌతూ; పెల్లు= అధికంగా బాణాలను; ఏయుడున్= ప్రయోగించగా; అతఁడు= ఆ దుశ్శాసనుడు; త్రుటిత= తునిగిపోయిన; జ్యాలతికా= తీగవంటి అల్లెత్రాడు; ధనుః= విల్లు; ధ్వజుఁడు+ఐ= ధ్వజం ఇవి అన్నీకలవాడై; నిర్లూన+అఖిల+అంగుండున్+ఐ= గాయపరచబడిన ఎల్ల అవయవాలు కలవాడై; రటత్+అశ్వంబు+అగు= సకిలిస్తున్న గుర్రాలుగల; తేరితోన్= రథంతో; సంత్రాసంబునన్= మిక్కుటమైన భయంతో; పాటినన్= పారిపోగా.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు వేసిన గొప్ప బాణాలన్నిటినీ, అర్జునుడు చాలా కోపంతో త్రుంచివేశాడు. కోపాగ్నితో జ్వలిస్తుండే ముఖంతో చాలా బాణాలను దుశ్శాసనుడి మీద ప్రయోగించాడు. దానితో ఆ దుశ్శాసనుడి అల్లెత్రాడు, విల్లు - ధ్వజం తునాతునక లయ్యాయి. అంతేకాదు, అతడి అవయవాలన్నీ దెబ్బతిన్నాయి. తన తేరి గుర్రాలు భయంతో సకిలిస్తుండగా, భయపడి అతడు పారిపోయాడు.

**తే.** **ఫల్గునుఁడు భీష్మముందటిబలము నెల్లఁ । జటులరథవల్గనుం డయిఁ చంపుచున్నఁ**
**జూచి ద్రోణుండు గుణరవస్ఫురణఘూర్ణ । రోదసీభాగుఁ డగుచు మార్కొనఁ గడంగి.** **348**

**ప్రతిపదార్థం:** ఫల్గునుఁడు= అర్జునుడు; చటుల= చలించుచున్న; రథంయొక్క+వల్గనుండు+అయి= గుర్రాల గమన భేదం కలవాడై; భీష్మ ముందటి బలమున్+ఎల్లన్= భీష్ముడి ముందు నిలబడియుండే సైన్యాన్నంతా; చంపుచున్+ఉన్నన్= చంపుతుండగా; ద్రోణుండు; చూచి; గుణ= అల్లెత్రాటియొక్క; రవ= శబ్దముయొక్క; స్ఫురణ= అనుకంపనాల చేత; ఘూర్ణ= తిరుగుడు పడుతూ ఉండే; రోదసీభాగుఁడు+అగుచున్= భూమ్యాకాశమధ్యభాగం కలవాడౌతూ; మార్కొనన్= ఎదుర్కోవటానికి; కడంగి= ప్రయత్నపడి.

**తాత్పర్యం:** అర్జునుడు, తన రథాల గుర్రాలు గతిభేదాలతో నడుస్తూ ఉండగా, భీష్మాచార్యుడికి ముందుండే సైన్యాన్నంతా చంపుతూ వచ్చాడు. దాన్ని చూచి ద్రోణాచార్యుడు తన వింటినారిని బాగా శబ్దింపజేశాడు. ఆ శబ్దం వల్ల ఏర్పడ్డ కంపనం భూమి, ఆకాశాల మధ్యభాగాన్ని తిరుగుడు పడేటట్లు చేసింది. అప్పుడు ద్రోణుడు ఎదుర్కొనటానికి సిద్ధపడుతూ ఉండగా (తరువాతి పద్యంతో అన్వయం.)

ద్రోణాచార్యు లశ్వత్థామను భీష్మునకు సహాయంబుగాఁ బంపుట (సం. 6-108-1)

**వ. అక్కడ నడచినం గౌంతేయాగ్రజుండు తోడన తవిలి సేనాసమేతంబుగా నడ్డపడి పోనీక పెనంగుచుండ నక్కుంభసంభవుండు. 349**

**ప్రతిపదార్థం:** ఆ+కడన్= ఆ చోటికి; నడచినన్= ద్రోణుడు వెడుతూ ఉండగా; కౌంతేయ+అగ్రజుండు= ధర్మరాజు; తోడన్+అ= వెంటనే; తవిలి= వెంబడించి; సేనాసమేతంబుగాన్= సైన్యంతో కూడుకొని ఉన్నట్లుగా; అడ్డపడి= ఎదురునిలిచి; పోనీక= పోనీకుండా; పెనంగుచున్+ఉండన్= యుద్ధం చేస్తూ ఉండగా; ఆ+కుంభసంభవుండు= ఆ ద్రోణాచార్యుడు.

**తాత్పర్యం:** ద్రోణుడు అర్జునుడున్న దిక్కుకు నడుస్తూ ఉండగా, ధర్మరాజు తనసేనతో కూడా, ద్రోణుడిని వెంబడించి, అడ్డ తగిలి అతడిని పోనీయక యుద్ధం చేస్తూ ఉండగా, ద్రోణాచార్యుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అప్పుడు క్రోధమునం గను । నిప్పులు రాలంగఁ దనకు నెఱసంగడ మై**
**యొప్పిన తనయున కి ట్లని । చెప్పెం దత్కాలగతి విశేషము లెల్లన్ 350**

**ప్రతిపదార్థం:** అప్పుడు; క్రోధమునన్= కోపంచేత; కను నిప్పులు= కన్నుల నుండి నిప్పు కణికలు; రాలంగన్= రాలుతూ ఉండగా; తనకున్= ద్రోణుడికి; నెఱసంగడము+ఐ= చాలా చేరికగా; ఒప్పిన= ఉన్నటువంటి; తనయునకున్= కొడుకైన అశ్వత్థామకు; తద్+కాలగతి విశేషములు= ఆ సమయాన జరుగుతుండే విశేషాలను; ఎల్లన్= అన్నింటిని; ఇట్లు+అని+చెప్పెన్= ఈ విధంగా చెప్పాడు.

**తాత్పర్యం:** ఆ సమయాన ద్రోణాచార్యుడు, కన్నులనుండి నిప్పులు రాలుతుండగా, చాలాకోపంగా తనకు చాలా దగ్గరలో ఉన్న తన కొడుకైన అశ్వత్థామను చూచి, ఆ సమయంలో తనకు ఏర్పడ్డ పరిస్థితిని గూర్చి ఈ విధంగా చెప్పాడు.

**చ. ' తడఁబడె దివ్యబాణముల తంత్రము, మంత్రముఁ దప్పెడుం గడు**
**న్వడఁకెడుఁ జాపదండము, మనంబును నాకు వశంబుగాదు, వీ**
**డ్వడియెడుఁ జెయ్వు లంగము గడంక దొఱంగెడు, నేఁటి భంగిఁ గ**
**వ్వడి తనపూన్కిఁ దీర్చుట ధ్రువంబని బుద్ధి జనించెఁ బుత్రకా! 351**

**ప్రతిపదార్థం:** పుత్రకా!= ఓ కుమారుడా! అశ్వత్థామా!; దివ్యబాణముల తంత్రము= అమోఘాలైన బాణాల కార్యసాధనోపాయం; తడఁబడెన్= తడబాటు చెందుతున్నది; మంత్రము= అస్త్రాలకు సంబంధించిన మంత్రము; తప్పెడున్= తప్పిపోతూ ఉన్నది; చాపదండము= ధనుస్సుయొక్క దండము; కడున్= మిక్కిలిగా; వడఁకెడున్= వణకుతున్నది; నాకున్; మనంబును= మనస్సు కూడా; వశంబు+కాదు= అధీనంలో ఉండటంలేదు; చెయ్వులు= పనులు; వీడు+పడియెడున్= వదలిపెట్టిపోతున్నవి; అంగము= శరీరం; కడంకన్= ప్రయత్నాన్ని; తొఱంగెడున్= విడిచిపెట్టుతున్నది; నేఁటిభంగిన్= ఈ నాటి యుద్ధపురీతితో; కవ్వడి= అర్జునుడు; తన పూన్కిన్= తన యొక్క ప్రయత్నాన్ని; తీర్చుట= నెరవేర్చటం; ధ్రువంబు+అని= నిజమని; బుద్ధి= ఆలోచన; జనించెన్= పుట్టింది.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు తత్కాలంలో తనకు కల్గిన తారుమారు స్థితిని తన కొడుకుతో ఈ విధంగా తెలుపుతున్నాడు. 'కుమారా! అమోఘాలైన బాణాలన్నీ తడబడుతున్నాయి. ఆయా ఆయుధాల అధిదేవతల మంత్రాలు మరచిపోతున్నాను. ధనుస్సున ఉండే దండం వణకుతున్నది. నా మనస్సు నా అధీనంలో ఉండటం

లేదు. ఆయా సమయంలో చేయవలసిన పనులు జ్ఞప్తికి రావటంలేదు. శరీరం ప్రయత్నాన్ని విడిచిపెట్టుతున్నది. ఈనాటి యుద్ధ విధానాన్ని చూస్తే అర్జునుడు తన (భీష్ముడిని చంపుతాననే) నిర్ణయాన్ని నిజంగా నెరవేర్చుతాడని నాకు తోస్తున్నది.

**వ. అతని మును మటు తలయెత్తి చూడుము. 352**

**ప్రతిపదార్థం:** అటు= అటువైపు; అతని మునుము= ఆ అర్జునుడి సేన యొక్క అగ్రభాగాన్ని; తలయెత్తి= తలను పైకెత్తి; చూడుము.

**తాత్పర్యం:** ఓ అశ్వత్థామా! అటు బాగా తల పైకెత్తి, అర్జునుడు చేసే బీభత్సాన్ని చూడుము.

**క. కూలెడు గుఱ్ఱంబులు ధర । వ్రాలెడు నేనుఁగులుఁ గెడయు రథములు నై యా**
**భీల యుగాంత సముద్భట । కాలపురోభాగరేఖ గానఁగనయ్యెన్. 353**

**ప్రతిపదార్థం:** కూలెడు= పడిపోతున్న; గుఱ్ఱంబులు= గుర్రాలు; ధరన్= నేలమీద; వ్రాలెడు= వాలిపోతుండే; ఏనుఁగులున్= ఏనుగులున్నూ; కెడయు= పడిపోతున్న; రథములున్+ఐ= రథములున్నూ కలిగి; ఆభీల= భయంకరమైన; యుగాంత= మహా ప్రళయ కాలంలోని; సమ్+ఉద్భట= భయంకరమైన; కాల= సమయము యొక్క; పురోభాగ= ముందటి భాగమందు ఏర్పడే; రేఖ= గుర్తు గీర; కానఁగన్+అయ్యెన్= కన్పిస్తుంది.

**తాత్పర్యం:** గుర్రాలు కుప్పకూలుతున్నాయి. ఏనుగులు నేలమీదికి ఒరిగిపోతున్నాయి. రథాలు పడిపోతున్నాయి. భయం కలిగించే మహాప్రళయంలో దానికిముందు కాలంలో కన్పించే చిన్నెలు ఎన్నో అగుపడుతున్నాయి.

**వ. అదియునుం గాక. 354**

**ప్రతిపదార్థం:** అదియునున్+కాక= అంతమాత్రమే కాకుండా.

**తాత్పర్యం:** సేనానష్టమే కాకుండా, చాలా దుశ్శకునాలు కూడా కలుగుతున్నాయి.

**తే. అడరి కురుసేనపై గ్రద్దలాడఁ జొచ్చెఁ । బడుచునున్నవి యుల్క లిక్కడ వినంగ**
**వచ్చె నతిరూక్షభంగి శివారుతంబు । లాపగానందనునకుఁ గీ డావహిల్లు. 355**

**ప్రతిపదార్థం:** గ్రద్దలు= గద్దలు; అడరి= విజృంభించి; కురుసేనపైన్= కురురాజుల సేనమీద; ఆడన్+చొచ్చెన్= తిరుగాడ సాగాయి; ఇక్కడన్; ఉల్కలు= కొరవులు; పడుచున్+ఉన్నవి= పడిపోతున్నాయి; శివారుతంబులు= ఆడనక్కల ఊళలు; అతిరూక్షభంగిన్= చాలా కరకుగా; వినంగన్ వచ్చెన్= వినవస్తున్నాయి; ఆపగానందనునకున్= భీష్ముడికి; కీడు= చెడ్డ(అశుభం); ఆవహిల్లున్= కలుగును.

**తాత్పర్యం:** కురుసేనపైన గద్దలు తిరుగుతున్నాయి. మనం ఉన్న తావులో నిప్పులేని కొరవులు పడుతున్నాయి. చాలా కటువుగా ఆడనక్కల అరుపులు వినవస్తున్నాయి. అందుచేత భీష్ముడికి ముప్పు తప్పదు.

**వ. యుధిష్ఠిరు మొగంబునం గ్రోధం బగ్గలం బై తోఁచుచున్నయది ద్రౌపదేయ నకులసహదేవసహితుం డయి తఱుము నతని మిగిలి నాకు రా రాదు నీవు దేవవ్రతుపాలికిం బోయి యతనికి దాపట వలపటం బ్రాపై నిలువు మిది ప్రాణంబులు డాఁచు సమయంబు గా దని పలికి పనిచిన నశ్వత్థామ యుద్దామగతిం జనియె నక్కడ భీమసేనుండు. 356**

**ప్రతిపదార్థం:** యుధిష్ఠిరు మొగంబునన్= ధర్మరాజు ముఖంలో; క్రోధంబు= కోపం; అగ్గలంబు+ఐ= ఎక్కువై; తోచుచున్నయది= కనుపించుచున్నది; ద్రౌపదేయ; నకుల; సహదేవ; సహితుండు+అయి= వీరందరితో కూడుకొన్నవాడై; తఱుము= కవియుచుండే; అతనిన్= ఆ ధర్మరాజును; మిగిలి= అతిశయించి; నాకున్; రారాదు= రావటానికి సాధ్యంకాదు; నీవు; దేవవ్రతుపాలికిన్= భీష్ముడి దగ్గరకు; పోయి; అతనికిన్= ఆ భీష్ముడికి; దాపటన్= ఎడమప్రక్క; వలపటన్= కుడిప్రక్క; ప్రాపు+ఐ= అండగా(ఆధారంగా); నిలువుము; ఇది= ఈ సమయం; ప్రాణంబులు; డాఁచు సమయంబు+కాదు= దాచుకోడానికి అదనుగాదు; అని పలికి; పనిచినన్= పంపగా; అశ్వత్థామ; ఉద్దామగతిన్= గొప్ప నడకతో; చనియెన్= వెళ్ళాడు; అక్కడన్= భీష్ముడు యుద్ధం చేస్తూ ఉన్నచోట; భీమసేనుండు.

**తాత్పర్యం:** ధర్మరాజు ముఖం కోపావేశంతో కూడుకొని ఉన్నట్లు అనిపిస్తోంది. అతడు ద్రౌపది కొడుకులు, నకుల సహదేవులతో కూడి నాపైకి ఉరుకుతున్నాడు. అతడిని దాటుకొని రావటానికి నాకు సాధ్యంకాదు. కనుక నీవు ఆ భీష్ముడి దగ్గరకు వెళ్ళి, అతనికి కుడియెడమ భాగాలలో అండగా నిలబడు. ప్రాణాలు దాచుకోడానికి ఇది సమయంకాదు.' అని చెప్పగానే, అశ్వత్థామ తీవ్రమైన గమనంతో అక్కడికి వెళ్ళాడు. అక్కడ భీముడు (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. నరుఁ డేచి శిఖండిఁ బుర । స్సరుఁగాఁ గొని యపుడు భీష్ము సమయింపఁగ స**
**త్వరుఁ డగుటకుఁ దగ రణత । త్పరుఁ డై కురుసేనమీఁదఁ దఱిమెం బెలుచన్. 357**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; నరుఁడు= అర్జునుడు+ఏచి= విజృంభించి; శిఖండిన్= శిఖండిని; పురస్సరుఁగాన్+కొని= ముందు పెట్టుకొని; భీష్మున్= భీష్ముడిని; సమయింపఁగన్= చంపడానికి; సత్వరుఁడు+అగుటకున్= వేగిరపాటుతో కూడిన వాడు కావటానికి; తగన్= తగునట్లు(అనుకూలం)గా; రణతత్పరుఁడు+ఐ= యుద్ధమందాసక్తి గలవాడై; కురుసేనమీఁదన్= కౌరవసైన్యం మీదికి; పెలుచన్= ఆగ్రహంతో; తఱిమెన్= కవిశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు విజృంభించి, శిఖండిని ముందుంచుకొని, భీష్ముడిని చంపటానికి త్వరపడేదానికి అనుకూలంగా భీముడు యుద్ధంమీది ఆసక్తితో, కురుసేనమీదికి ఉరికాడు. (భీముడు కురుసేనమీదికి కవియటం వలన, అర్జునుడికి భీష్ముడిని చంపడానికి మంచి అవకాశం కలిగిందన్నమాట.)

**వ. ఇట్లు దఱిమి గాంగేయుముందటిబలంబుల బారిసమరం దొడంగిన భగదత్తకృపకృతవర్మశల్యసైంధవ చిత్రసేనదుర్మర్షణవిందానువిందవికర్ణులు పదుండ్రు నొక్కపెట్ట భీమునిం బొదివి నానాస్త్రసంతానంబుల నొప్పించిన నొచ్చియుం జలింపక పోరునమ్మారుతిం గనుంగొని క్రీడి తోడై తఱియ నుఱికి ధనువుల తునియలను, బాణంబులపఱియలను, గేతుచ్ఛత్త్రచామరంబులచెక్కలను, భూషణంబులపొళ్ళను, బుడమిం గప్పినం జూచి సుయోధనుండు సుశర్మాదిభూపాలకుల నాలోకించి యా భీమార్జునులం దాఁక నియోగించిన. 358**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తఱిమి= కవిసి; గాంగేయు ముందటి బలంబులన్= భీష్ముడి ముందుండే సేనలను; బారి+చమరన్= చంపటానికి; తొడంగినన్= ఆరంభించగా; భగదత్త; కృప; కృతవర్మ; శల్య; సైంధవ; చిత్రసేన; దుర్మర్షణ; వింద; అనువింద; వికర్ణులు; పదుండ్రున్= పదిమందికూడా; ఒక్కపెట్ట= ఒకేసారిగా; భీమునిన్= ఆ భీముడిని; పొదివి= క్రమ్ముకొని; నానా+అస్త్ర సంతానంబులన్= పలురకాల ఆయుధాల గుంపులతో; నొప్పించినన్= బాధించగా; నొచ్చియున్= బాధపడికూడా; చలింపక= కదలకుండా; పోరు= యుద్ధం చేస్తుండే; ఆ+మారుతిన్= ఆ భీముడిని; క్రీడి= అర్జునుడు; కనుంగొని= చూచి; తోడు+ఐ=

భీముడికి సహాయుడై; తఱియన్= దగ్గరకు రావటానికి; ఉఱికి; ధనువుల తునియలను= విండ్లతునుకలతో; బాణంబుల పఱియలను= బాణాల బద్దలతో; కేతుచ్ఛత్ర చామరంబుల చెక్కలను; ధ్వజాలు, గొడుగులు చామరాలు - వీటియొక్క ముక్కలతో; భూషణంబుల పొళ్ళను= ఆభరణాల చూర్ణంతోను; పుడమిన్= భూమిని; కప్పినన్= కప్పివేయగా; చూచి; సుయోధనుండు; సుశర్మ+ఆది భూపాలకులన్= సుశర్మ మొదలైన రాజులను; ఆలోకించి= చూచి; ఆ భీమ+అర్జునులన్= ఆ భీముడిని, అర్జునుడిని; తాఁకన్= ఎదిరించటానికి; నియోగించినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడు కవిసి, భీష్ముడికి ముందు భాగాన ఉండే సైన్యాన్ని చంపటాన్ని ఆరంభించాడు. భగదత్తుడు, కృపుడు, కృతవర్మ, శల్యుడు, సైంధవుడు, చిత్రసేనుడు, దుర్మర్షణుడు, విందుడు, అనువిందుడు, వికర్ణుడు - అనే పదిమంది ఒక్కసారిగా ఆ భీముడిని చుట్టుముట్టి, పలు రకాల ఆయుధాలు ప్రయోగించి, బాధించారు. తాను బాధపడి కూడా కదలకుండా నిలబడి యుద్ధం చేస్తున్న భీముడిని చూచి సాయపడటానికై అర్జునుడు తోడుగా వచ్చాడు. ధనుస్సుల తునుకలతో, బాణాల బద్దలతో, ధ్వజాల తుంటలతో, గొడుగుల తునుకలతో, చామరాల ముక్కలతో, నగల పొడులతో నేలను కప్పివేశారు. సుయోధనుడు ఆ దృశ్యాన్ని చూచాడు. సుశర్మ ముఖ్యుడుగా గల రాజులను చూచి, ఆ భీమార్జునులను ఎదుర్కొనుడని ఆజ్ఞాపించాడు.

**క. ముందటిపదుండ్రు నా నృపు । లందఱునుం గూడి పెనఁగి యయ్యిరువురచే**
**తం దూలపోవఁ జొచ్చినఁ । గ్రందుగ బలుమొనల నెల్లఁ గవియం బనిచెన్. 359**

**ప్రతిపదార్థం:** ముందటి పదుండ్రున్= ముందు చెప్పిన ఆ పదుగురు రాజులున్నూ; ఆ నృపులు= దుర్యోధనుడు ఆజ్ఞాపించిన సుశర్మ మున్నగు రాజులున్నూ; అందఱునున్= వారు, వీరు - అందరున్నూ; కూడి= ఏకమై; పెనఁగి= యుద్ధం చేసి; ఆ+ఇరువురచేతన్= ఇద్దరైన ఆ భీమార్జునులచేత; తూలపోవన్= చిన్నపోవడానికి; చొచ్చినన్= ఆరంభించగా; క్రందుగన్= ఎక్కువగా; బలు మొనలన్+ఎల్లన్= నానావిధాలైన సైన్యాన్నంతయు; కవియన్; పనిచెన్= ఆజ్ఞ చేశాడు.

**తాత్పర్యం:** మొదట భీముడిని ఎదుర్కొనటానికి వచ్చిన భగదత్తాదులు పదిమంది రాజులు, ఇప్పుడు దుర్యోధనుడి ఆజ్ఞచే వచ్చిన సుశర్మ మొదలుగా గల వీరులు - వీరందరూ కూడా, ఆ భీమార్జునుల దెబ్బలకు తూలిపోసాగారు. దీన్ని గమనించి, దుర్యోధనుడు తనకు గల సకలవిధాలైన సైన్యాలను ఆ భీమార్జునులను ఎదుర్కోవలసిందిగా ఆజ్ఞాపించాడు.

**వ. ఇవ్విధంబునం బెక్కు మొనలు పయింబడిన నయ్యిరువురకుఁ బోరు భరం బగుట యెఱింగి సౌభద్రసాత్యకి ప్రముఖులగు రథికజనంబులు సైన్యోపేతంబుగాఁ ద్రోచి యేచిన. 360**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ మాదిరిగా; పెక్కు= అనేకములైన; మొనలు= సేనలు; పయిన్= మీద; పడినన్= పడగా; ఆ+ఇరువురకున్= ఆ భీమార్జునుల కిద్దరికి; పోరు= యుద్ధము; భరంబు= బరువైనదిగా; అగుట= కావటాన్ని; ఎఱింగి= తెలిసికొని; సౌభద్ర సాత్యకి ప్రముఖులు+అగు= అభిమన్యుడు, సాత్యకి ముఖ్యులుగా గల; రథికజనంబులు= రథాన్నెక్కి యుద్ధం చేసేవారు; సైన్య+ఉపేతంబు+కాన్= సేనలతో కూడునట్లుగా; త్రోచి= ముందుకు నడిచి; ఏచినన్= విజృంభింపగా.

**తాత్పర్యం:** కౌరవసేన మొత్తంగా కూడి, భీమార్జునుల మీదికి కవియగా - వారిద్దరికి అపుడు యుద్ధం చాలా దుర్భరమైంది. ఈ పరిస్థితిని గుర్తించి, అభిమన్యుడు సాత్యకి ముఖ్యులుగా గల పాండవసేనలో గల రథికులందరూ, తమ తమ సైన్యాలతో బాగా ముందుకు సాగి విజృంభించి యుద్ధం చేయసాగారు.

**క. పాండవబలముల యత్యు । ద్దండపరాక్రమము సూచి దర్పోద్ధతవే**
**దండములఁ గనిన కేసరి । చండత భీష్ముండు వొదివె శరనఖరములన్. 361**

**ప్రతిపదార్థం:** భీష్ముండు= భీష్ముడు; పాండవబలముల= పాండవుల సేనలయొక్క; అతి+ఉద్దండ పరాక్రమము= మిక్కిలి అధికమైన శౌర్యాన్ని; చూచి; దర్ప+ఉద్ధత= గర్వం యొక్క అతిశయంగల; వేదండములన్= ఏనుగులను; కనిన= చూచిన; కేసరి చండతన్= సింహం యొక్క కోపం వంటి కోపం గలవాడై; శరనఖరములన్= బాణాలవంటి గోళ్ళతో; పొదివెన్= క్రమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు పాండవసేనల యొక్క ఉద్దండ పరాక్రమాన్ని చూచాడు. దానితో ఆయనకు దర్పం పెల్లుబికింది. కోపగించిన సింహం ఎట్లాగయితే తనవాడి గోళ్ళతో ఏనుగులను కప్పివేస్తుందో ఆ మాదిరి తన పదనైన బాణాలతో పాండవుల సేనలను కప్పివేశాడు.

**విశేషం:** అలం: ఉపమ. 'శరనఖరములన్' అనేమాటలో రూపకాలంకారం. దీనిచే ఉపమాలంకారం ఉపజీవ్యమైంది.

**క. డొల్లెడుసూతులుఁ బెలుచం । ద్రెళ్ళెడు తురగములుఁ గా నతిక్రూరగతిం**
**బె ల్లేయుచు సత్వరముగ । నెల్లెడలం దాన యగుచు నేడ్తెఱఁ బొదివెన్. 362**

**ప్రతిపదార్థం:** డొల్లెడు= పడునట్టి; సూతులున్= సారథులున్నూ; పెలుచన్= అధికంగా; త్రెళ్ళెడు= ఎగిరిపడేటువంటి; తురగములున్+కాన్= గుర్రాలు కలుగునట్లుగా; అతి క్రూరగతిన్= మిక్కిలి కఠోరమైన రీతితో; పెల్లు= అధికంగా; ఏయుచున్= బాణాలతో కొట్టుతూ; సత్వరముగన్= వేగంతో కూడునట్లుగా; ఎల్ల+ఎడలన్= అన్నిచోట్ల; తాను+అ= తానే; అగుచున్= ఉంటున్నవాడై; ఏడ్తెరన్= పరాక్రమంతో; పొదివెన్= కవిశాడు.

**తాత్పర్యం:** సారథులు కిందపడేటట్లుగా గుర్రాలు ఎగిరిపడేటట్లుగా చాలా కఠినంగా విజృంభించి, వేగంతో అన్ని చోట్లా తానే ఔతూ, బాణాలతో పాండవసేనను పరిమార్చుతూ, భీష్ముడు ఆశ్చర్యకరంగా యుద్ధం చేశాడు.

**వ. ఇట్లు పెద్దయుంబ్రొద్దు విహరించి యపరాహ్ణం బగుటయు నతం డాత్మగతంబున. 363**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ చెప్పిన విధంగా; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; విహరించి= విహారం చేసి;అపరాహ్ణంబు+అగుటయున్= పగటిలో నాల్గవభాగంకాగా; అతండు= ఆ భీష్ముడు; ఆత్మగతంబునన్= తనలో.

**తాత్పర్యం:** ఈ విధంగా చాలాసేపు యుద్ధం చేసి, భీష్ముడు అపరాహ్ణ కాలం కాగా తన మనసులో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. ' ఉత్తమక్షత్రియుల నెల్ల నుగ్రవృత్తి । నేఁడు పదినాళ్ళగోలె నా నిశితశరచ**
**యములఁ గూల్చితి వేసరినట్టులయ్యె । మేనితోడి పొత్తిం కిట మానుటొప్పు.' 364**

**ప్రతిపదార్థం:** ఉత్తమ క్షత్రియులన్= ఉత్తములైన రాజులను; ఎల్లన్= అందరిని; ఉగ్రవృత్తిన్= భయంకరమైన ప్రవర్తనతో; నేఁడు పదినాళ్ళగోలెన్= ఈ పది దినాలు మొదలుకొని; నా నిశిత శరచయములన్= నాయొక్క పదునైన బాణాల సమూహాలతో; కూల్చితిన్= చంపివేశాను; వేసరినట్టులు+అయ్యెన్= విసుగుచెందినట్లైంది; ఇంకన్= ఇకమీదట; ఇటన్= ఈ లోకంలో; మేని తోడిపొత్తు= శరీరంతోడి సంబంధాన్ని; మానుట= వదలిపెట్టడం; ఒప్పున్= తగినది.

**తాత్పర్యం:** భీష్ముడు ఇట్లా అనుకొన్నాడు 'ఈనాటితో పది దినాలుగా చాలా భయంకరంగా మహామహా రాజుల నెందరినో పదునైన బాణాలు గుప్పించి చంపాను. ఇప్పుడు నాకే విసుగు పుట్టుతున్నది. ఇక ఈ శరీరాన్ని వదలిపెట్టటం తగినపని.'

**వ. అని తలంచి తొలంగి బలంబులం దెరల్చికొనుచుం గయ్యంబు సేయు చందంబునం గౌంతేయాగ్రజుం గదిసి యల్లన యతనితో ని ట్లనియె. 365**

**ప్రతిపదార్థం:** అని తలంచి= పై విధంగా అనుకొని; తొలంగి= అవతలకు వెళ్ళి; బలంబులన్= సేనలను; తెరల్చికొనుచున్= తొలగించుకొంటూ; కయ్యంబు= యుద్ధాన్ని; చేయు చందంబునన్= చేసే మాదిరిగా; కౌంతేయ+అగ్రజున్= ధర్మరాజును; కదిసి= సమీపించి; అల్లన= మెల్లగా; అతనితోన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు+ అనియెన్= ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు పై విధంగా అనుకొని, అక్కడినుంచి అవతలికి పోయి, సైన్యాలను ఇటూ అటూ నెట్టుకొంటూ - యుద్ధం చేసే మాదిరి కనిపించుతూ ధర్మరాజు దగ్గరకువెళ్ళి ఎవరికీ వినబడకుండా సన్నగా అతడితో యిట్లా అన్నాడు:

**క. ' జనియించినంతనుండియు । జనపతులం గ్రూరవృత్తిఁ జంపుచు నుండం**
**జనియెం గాలము విసివితి । ననఘా! యే నింకఁ జాల నాసురవిధికిన్. 366**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపములేని ధర్మజా! జనియించిన+అంత+ఉండియున్= పుట్టినది మొదలుకొని; జనపతులన్= రాజులను; క్రూరవృత్తిన్= కఠినంగా; చంపుచున్+ఉండన్= చంపుతూ ఉండగా; కాలము= సమయము; చనియెన్= కడచిపోయింది; విసివితిన్= విసుగుచెందాను; ఏను= నేను; ఇంకన్= ఇకమీదట; ఆసురవిధికిన్= రాక్షసకృత్యానికి; చాలన్= సమర్థుడనుకాను.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నేను పుట్టినది లగాయతు ఇంతవరకు ఎంతోమంది రాజులను చాలా క్రూరంగా చంపటంతోనే నా కాలం గడచిపోయింది. ఇప్పుడు నేను బాగా విసుగుచెందాను. ఇకమీద ఈ రాక్షసకృత్యానికి నేను ఒప్పుకోను; యుద్ధంలో సైనికులను నేను చంపజాలను.

**ఆ. మీరు నా హితంబుఁ గోరుదురేని శి । ఖండి ముున్ను గాఁగఁ గడఁగి యంత**
**వట్టు వారు నొక్క పెట్టకాఁ బైఁబడి । యేయుఁ డింకఁ దడవు సేయ వలదు.' 367**

**ప్రతిపదార్థం:** మీరు= పాండవులైనట్టి మీరు; నా హితంబున్= నాయొక్క మేలును; కోరుదురు+ఏనిన్= కోరేవారైతే; శిఖండిమున్ను+కాఁగన్= శిఖండి ముందుండేటట్లుగా; కడఁగి= ప్రయత్నించి; అంత+వట్టువారున్= అందరున్నూ; ఒక్కపెట్టకాన్= ఒకేసారిగా; పైన్+పడి= నామీద పడి; ఏయుఁడు= బాణాలు ప్రయోగించండి; ఇంకన్= ఇకపైన; తడవు= ఆలస్యం; చేయవలదు.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! మీరు నామేలు కోరేవారైతే, శిఖండిని ముందుపెట్టుకొని, పూనికతో మీ సేనలోని వారందరూ ఒక్కుమ్మడిగా నా పైకి ఉరికి, బాణాలతో కొట్టండి. ఇంక ఏ మాత్రం ఆలస్యం చేయకండి.

**వ. అని పలికి సమరప్రకారంబునం దేరు గ్రేక్కుదోలి పాంచాలబలంబులపయి నడరె నప్పు డయ్యజాతశత్రుండు సమీపవర్తి యగు ధృష్టద్యుమ్ను నాలోకించి. 368**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; సమరప్రకారంబునన్= యుద్ధం చేసే మాదిరిగా; తేరున్= రథాన్ని; క్రేళ్ళు+తోలి= పరుగులెత్తించి; పాంచాలబలంబులపయిన్= పాంచాలరాజుయొక్క సేనలమీదికి; అడరెన్= విజృంభించాడు; అప్పుడు= అట్టి పట్టులో; ఆ+అజాతశత్రుండు= ఆ ధర్మరాజు; సమీపవర్తి+అగు= దగ్గరగానున్నట్టి; ధృష్టద్యుమ్నున్; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** భీష్ముడు పైవిధంగా ధర్మరాజుతో చెప్పి, తానేమో యుద్ధంచేసే విధంగా, తన రథాన్ని జోరుగా పోనిచ్చి, పాంచాలరాజు సేనల మీదికి విజృంభించాడు. అప్పుడు ధర్మరాజు తనకు సమీపంలో ఉండే ధృష్టద్యుమ్నుడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

క. ' దేవవ్రతు పలుకులు విం । టే? వేగమ పనుపు మొక్కటిగఁ దఱుమఁగ యో
ధావళి నెల్లను భీముఁడు । నీవును నరుతోడఁ గూడి నిగుడుఁడు పెలుచన్.' 369

**ప్రతిపదార్థం:** దేవవ్రతు పలుకులు= భీష్ముడు చెప్పినమాటలు; వింటే?= విన్నావా?; యోధ+ఆవళిన్+ఎల్లనున్= వీరుల సమూహాన్నంతటిని; ఒక్కటిగన్= ఒకే మారుగా; తఱుమఁగన్= కవియటానికి; వేగము+అ= వెంటనే(త్వరితంగా); పనుపుము= ఆజ్ఞాపించుము; భీముఁడు; నీవును= నీవు (ధృష్టద్యుమ్నుడు)న్నూ; నరుతోడన్+కూడి= అర్జునుడితో చేరి; పెలుచన్= ఆటోపంతో; నిగుడుఁడు= విజృంభించండి.

**తాత్పర్యం:** 'ధృష్టద్యుమ్నా! భీష్ముడు చెప్పిన మాటలు విన్నావు గదా! మన సేనలో ఉన్న యోధులందరినీ ఒకేసారిగా భీష్ముడి మీదికి కవియవలసినదిగా ఆలస్యం చేయకుండా వెంటనే ఆజ్ఞాపించుము. భీముడు, నీవు అర్జునుడితోకూడి, కోపోద్దీప్తులై, ఆతడి మీదికి బాగా విజృంభించండి.'

వ. అనవుడు నతండు. 370

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు.

**తాత్పర్యం:** ధర్మరాజు పై విధంగా చెప్పగానే ఆ ధృష్టద్యుమ్నుడు (తరువాతి పద్యంతో అన్వయం.)

సీ. మాత్స్య కైకేయాది మనుజేంద్రులకుఁ జేయఁ । గలయట్టి యోధవీరులకుఁ జేయి
సూపి మరున్నదీసూనుపైఁ గవియింపఁ । బవనజపార్థుల ప్రాపుకలిమి
వెఱ పేది యందఱుఁ దఱుమఁ గౌరవపతి । తమ్ములు దొరలును, దానుఁ దాతఁ
గడచి తాఁకినఁ బోరు ఘన మయ్యె నప్పడు । సౌభద్రుఁ డమ్మహీశ్వరుని నొంచె;

తే. ద్రోణతనయుండు శైనేయు బాణమయ శ । రీరుఁ గావించెఁ జేదీశ పౌరవు లస
మాన విక్రము లై యొప్ప మారుతాత్మ । జుండు రారాజు నేనిక పిండుఁ జదిపె. 371

**ప్రతిపదార్థం:** మాత్స్య= మత్స్య దేశపురాజు; కైకేయ= కేకయదేశపురాజు; ఆది= ముందుగాగల; మనుజ+ ఇంద్రులకున్= రాజులకు; చేయన్+కల+అట్టి= సమర్థులైనట్టి; యోధవీరులకున్= యోధులకును, వీరులకును; చేయి+చూపి= చేతితో చూపించి; మరుత్+నదీసూనుపైన్= భీష్మాచార్యుడి మీదికి; కవియింపన్; పవనజపార్థుల= భీమార్జునులయొక్క; ప్రాపుకలిమి= అండ అధికంగా ఉండటంచేత; వెఱపు+ఏది= భయంలేకుండా; అందఱున్= పాండవసేనలోని వారందరున్నూ; తఱుమన్= వెంబడిబడగా; కౌరవపతి; అతడి తమ్ములు; దొరలును= ఇతర రాజులును; తాను; తాతన్= తాతను(భీష్ముడిని); కడచి= అతిక్రమించి; తాఁకినన్= మార్కొనగా; పోరు= యుద్ధం; ఘనము+అయ్యెన్= భయంకరంగా ఉండినది; అప్పుడు= అట్టి సమయంలో; సౌభద్రుఁడు= అభిమన్యుడు; ఆ+మహీ+ఈశ్వరునిన్= ఆ దుర్యోధనుడిని; నొంచెన్= నొప్పించాడు; ద్రోణతనయుండు= ద్రోణాచార్యుడి కొడుకు అశ్వత్థామ; శైనేయున్= శినివంశం వాడైన సాత్యకిని; బాణమయ శరీరున్= బాణాలతో నిండిన శరీరం కలవాడినిగా; కావించెన్= చేశాడు; చేదీశ పౌరవులు= చేదిరాజు, పురువంశపురాజు; అసమాన విక్రములు+ఐ= సాటిలేని పరాక్రమం కలవారై; ఒప్పన్= ఒప్పియుండగా; మారుత+ఆత్మజుండు= వాయుపుత్రుడు భీముడు; రారాజు+ఏనికపిండున్= దుర్యోధనుడి యొక్క ఏనుగుల గుంపును; చదిపెన్= చంపివేశాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు చెప్పినట్లుగా, ధృష్టద్యుమ్నుడు చేసైగతో మత్స్యదేశపురాజు, కేకయరాజు మొదలైన రాజులను, బాగా యుద్ధం చేయగల యోధులను వీరులను భీష్ముడి మీదికి కవ్వింపజేశాడు. వీరందరూ భీమార్జునులు అండగా

ఉండడంచేత ఎంతమాత్రం జంకుగొంకు లేకుండా భీష్ముడి మీదికి విరుచుకపడ్డారు. దీన్ని చూచి, దుర్యోధనుడి అందరు తమ్ముళ్ళు, ఇంకా ఉన్న రాజులు, దుర్యోధనుడు - వీరంతా ఏకమై భీష్ముడికి ముందుగా ఆయనకు రక్షణగా నిలిచి, పాండవసేనను ఎదుర్కొన్నారు. అప్పుడు యుద్ధం చాలా భయంకరంగా జరిగింది. అభిమన్యుడు దుర్యోధనుడిని నొచ్చిపోయేట్టు చేశాడు. అశ్వత్థామ సాత్యకి శరీరాన్ని బాణమయం చేశాడు. చేదిపౌరవుల యుద్ధం సాటిలేనిదిగా ఒప్పినది. భీముడేమో దుర్యోధనుడి ఏనుగుల గుంపునంతటినీ చంపివేశాడు.

**వ. మఱియు నందు నిందును మందాకినీనందనుపయిం ద్రోవను నతనిం గావను దలంచి గడంగిన సైనికు లనేకులు నానాప్రకారంబుల వివిధాయుధంబులం బెనంగుచుండ. 372**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా కూడా; అందున్= ఆ పాండవుల సైన్యంలో; ఇందును(న్)= ఈ కౌరవసేనలోను; మందాకినీ నందనుపయిన్= భీష్ముడి మీదికి; త్రోవను= పడదోయడానికి; అతనిన్= ఆ భీష్ముడిని; కావను= కాపాడటానికి; ఉద్దేశించి; కడంగిన= పూనుకొన్న; అనేకులు= పలువురు; సైనికులు= భటులు; నానా ప్రకారంబులన్= పలు రకాలుగా; వివిధ+ఆయుధంబులన్= పలు విధాలైన ఆయుధాలతో; పెనంగుచున్+ఉండన్= యుద్ధం చేస్తూండగా.

**తాత్పర్యం:** పాండవ పక్షంలోని చాలామంది భటులు ఆ భీష్ముడిని కూలదోయడానికి, కౌరవుల భటులు పలువురు ఆ భీష్ముడిని కాపాడటానికి, ప్రయత్నించుచుతూ నానా విధాలుగా, నానా విధాలైన అస్త్రశస్త్రాలతో యుద్ధం చేస్తుండగా.

**క. మొనసి మృగేంద్రుఁ మృగేంద్రుఁడు । చెనయంజను పగిది నరుఁడు శీఘ్రగతిన్ శాం**
**తనవుపయిఁ గవియ దుశ్శా । సనుఁ డడ్డము సొచ్చె దేవసంఘము వొగడన్. 373**

**ప్రతిపదార్థం:** మృగ+ఇంద్రుఁడు= మృగములకు రాజు - సింహము; మొనసి= పూనుకొని; మృగ+ఇంద్రున్= మృగాల రాజు సింహాన్ని; చెనయన్= ఎదిరించటానికి; చనుపగిదిన్= వెళ్ళే మాదిరి; నరుఁడు= అర్జునుడు; శీఘ్రగతిన్= వేగంతో కూడిన నడకతో; శాంతనవుపయిన్= భీష్ముడి మీదికి; కవియ(న్); దేవసంఘము= దేవతలసమూహం; పొగడన్= పొగడగా; దుశ్శాసనుఁడు; అడ్డము+చొచ్చెన్= అడ్డంగా ప్రవేశించాడు.

**తాత్పర్యం:** పూనికతో సింహం మరో సింహాన్ని ఎదుర్కొనటానికి వెళ్ళేమాదిరి అర్జునుడు త్వరత్వరగా భీష్ముడి మీదికి కవిశాడు. అంతలో శాంతనవుడిని కాపాడటానికి దుశ్శాసనుడు ఇద్దరికీ అడ్డంగా వచ్చాడు. ఈ సన్నివేశాన్ని తిలకించిన దేవతలు దుశ్శాసనుడి శౌర్యాన్ని పొగిడారు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. ఆతని కప్పు డెదుర నమ్మొన నెవ్వరుఁ । జాలరైరి సవ్యసాచి యొకఁడ**
**నిశితవిశిఖపంక్తి నిగిడించి నొప్పించి । యొత్తి భీష్మువెనుక కొదుఁగఁ జేసె. 374**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ఆ+మొనన్= ఆ పాండవుల సేనలో; ఎవ్వరున్= ఏ యోధులుగాని; ఆతనికిన్= ఆ దుశ్శాసనుడికి; ఎదురన్= ఎదిరించడానికి; చాలరు+ఐరి= సమర్థులు కాలేకపోయారు; సవ్యసాచి= అర్జునుడు; ఒక్కఁడు+అ= ఒకడే; నిశిత విశిఖ పంక్తిన్= పదునైన బాణాల వరుసలను; నిగిడించి= వ్యాపింపచేసి; నొప్పించి= బాధపెట్టి; ఒత్తి= పొడిచి; భీష్మ వెనుకకున్= భీష్ముడి వెనుకవైపునకు; ఒదుఁగన్+చేసెన్= తొలగేట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు దేవతల పొగడ్తలందుకుంటూ యుద్ధంచేస్తున్నాడు. అప్పుడు అతన్ని ఎదిరించగల వీరుడే పాండవసేనలో ఎవడూ లేకపోయాడు. ఒక్క అర్జునుడు మాత్రం ఎదుట నిల్చి, పదునుగల బాణాల కుప్పలు గుప్పించి, నొప్పించి, దుశ్శాసనుడిని నొక్కి భీష్ముడి వెనుక నక్కేటట్లు చేశాడు.

**వ. తదవసరంబున సరభసంబున. 375**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; సరభసంబునన్= తొందరపాటుగా.

**తాత్పర్యం:** అర్జునుడు బాణాలు గుప్పించే సమయంలో తొందరపాటుతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. భగదత్తుని నా కవ్వడి । వెగ డొందఁగఁ జేసి యతని వెల్లేనుఁగుఁ గెం**
**పుగఁ జేసిన నాతండును । నిగిడెం బాంచాలమేదినీపతిమీఁదన్. 376**

**ప్రతిపదార్థం:** ఆ+కవ్వడి= ఆ అర్జునుడు; భగదత్తునిన్= నరకాసురుడి కొడుకును; వెగడు+ఒందఁగన్+చేసి= తల్లడపడేటట్లు చేసి; అతని వెల్ల+ఏనుఁగున్= అతడి తెల్ల ఏనుగును; కెంపుగన్+చేసినన్= ఎర్ర బారేటట్లు చేయగా; ఆతండునున్= ఆ భగదత్తుడున్నూ; పాంచాల మేదినీ పతి మీఁదన్= ద్రుపదుడి మీదికి; నిగిడెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు భగదత్తుడిని తల్లడిల్లజేశాడు. అతడి తెల్ల ఏనుగును బాణాలతో కొట్టి రక్తసిక్తం చేసి ఎరుపురంగు గల దానినిగా చేశాడు. ఆ భగదత్తుడు ద్రుపదమహారాజు మీదికి విజృంభించాడు.

**వ. ఆఖండలనందనుండును శిఖండిం దఱిమి తెఱపి సూపి దేవవ్రతు నేయుమని పురికొలిపె నంత. 377**

**ప్రతిపదార్థం:** ఆఖండల నందనుండును= ఇంద్రుని కొడుకు అర్జునుడును; శిఖండిన్; తఱిమి= వెంబడిబడి ; తెఱపి= అవకాశాన్ని, చూపి= కనుపరచి; దేవవ్రతున్= భీష్ముడిని; ఏయుము+అని= బాణాలతో కొట్టుము అని; పురికొలిపెన్= ప్రోత్సహించాడు; అంతన్= అప్పుడు.

**తాత్పర్యం:** అర్జునుడు శిఖండిని బలాత్కరించి, అవకాశాన్ని చూపించి 'భీష్ముడిని బాణాలతో కొట్టుము' అని ప్రోత్సాహపరిచాడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మనయోధప్రకరము శాం । తనవుం దలకడచి యత్యుదగ్రత నయ్యు**
**ర్జునుఁ బొదివె నతం డలిగినఁ । బెనుగాలిం దూలు మొగిలుపిండునుబోలెన్. 378**

**ప్రతిపదార్థం:** మనయోధప్రకరము= మన(కౌరవ) వీరులసమూహం; శాంతనవున్= భీష్ముడిని; తలకడచి= అతిక్రమించి ముందునిలబడి; అతి+ఉదగ్రతన్= చాలాభయంకరంగా; ఆ+అర్జునున్= ఆ అర్జునుడిని; పొదివెన్= కప్పివేసింది; అతండు= ఆ అర్జునుడు; అలిగినన్= కోపించినవాడుకాగా; పెనుగాలిన్= తుపానుగాలిచేత; తూలు= తొలగిపోవు; మొగిలుపిండును+పోలెన్= మబ్బులసమూహం మాదిరి (చెదరిపోయింది).

**తాత్పర్యం:** కౌరవసేనలోని యోధులందరూ భీష్ముడిని కాపాడడానికి ఆయనకు ముందుభాగంలో నిలబడి చాలా భయంకరంగా అర్జునుడిని కమ్మివేశారు. ఆ అర్జునుడు అలుగగా, మనసేనలంతా పెనుగాలికి తుత్తునియలై చెదిరిపోయే కారుమబ్బుల మాదిరి చెదరిపోయాయి.

**విశేషం :** ఈ పద్యంలో 'పెనుగాలిం దూలు మొగిలిపిండును బోలెన్' అను ఉపమానవాక్యం వాచ్యంగా చెప్పబడినది. 'అర్జునుడలిగితే మన సేనాసమూహం చెల్లాచెదరై పోతుంది' అనే ఉపమేయవాక్యం, గమ్యమానంగా ఉన్నది. ఇది ఒక విధమైన రచనా వైఖరి అనుకోదగినది.

**వ. (తూలె) నట్లు దూలిన. 379**

**ప్రతిపదార్థం:** తూలెన్; అట్లు+తూలిన= ఆ విధంగా తొలగిపోగా.

**తాత్పర్యం:** ఆ విధంగా మన సేనలు తొలగిపోగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. అట్టియెడ శిఖండి యాపగాసుతుమీఁద । వాలుటమ్ము లేయ వాని నేయ**
**నొల్ల కతఁడు గెలని యోధవీరావళి । నేయుచుండె శౌర్య మెసకమెసఁగ. 380**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్; శిఖండి; ఆపగాసుతుమీఁదన్= భీష్ముడిమీద; వాలు+అమ్ములు= పదునుగల బాణాలు; ఏయన్= ప్రయోగించగా; వానిన్= ఆ శిఖండిని; ఏయన్+ఒల్లక= బాణాలతో కొట్టడానికి ఇష్టపడక; అతఁడు= ఆ భీష్ముడు; కెలని= ప్రక్కన ఉన్న; యోధవీర+ఆవళిన్= యోధవీరుల వరుసను; శౌర్యము= పరాక్రమము; ఎసకము= విజృంభణము; ఎసఁగన్= అతిశయింపగా; ఏయుచుండెన్= బాణాలతో కొట్టుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో శిఖండి భీష్ముడి మీద పదునైన బాణాలు ప్రయోగించాడు. భీష్ముడు వాడిమీద బాణాలు వేయకుండా, యుద్ధభూమిలోనుండే వీరులమీద, యోధులమీద, తన శౌర్య విజృంభణం అతిశయించగా, బాణాలు చాలా ప్రయోగించాడు.

**క. నరుఁడు శిఖండిం దఱిమిన । శరము లతఁడు భీష్మునురుభుజామధ్యమునం**
**గురియఁగ నవ్వుచునుండెం । గరి యంత్రజలంబు దొరఁగఁగా నున్న క్రియన్. 381**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; శిఖండిన్; తఱిమినన్= బలవంతపెట్టగా; అతఁడు= శిఖండి; భీష్మున్= భీష్మునియొక్క; ఉరు భుజామధ్యమునన్= విశాలమైన రొమ్ముపై; శరములు= బాణాలను; కురియఁగన్= వర్షింపజేయగా; యంత్రజలంబు= యంత్రమునుండి నీరు; తొరఁగన్+కాన్= ప్రవహించుచుండగా; కరి= ఏనుగు; ఉన్న క్రియన్= ఉండే విధంగా; నవ్వుచున్+ఉండెన్= నవ్వుతున్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు నిర్బంధపెట్టగా, శిఖండి భీష్ముడి విశాలమైన వక్షస్ స్థలంపైన బాణవర్షం కురిపించాడు. దానికి, జలయంత్రం నుండి నీరు బయటికి వస్తూ ఉంటే వినోదిస్తున్న ఏనుగుమాదిరిగా భీష్ముడు నవ్వసాగాడు. కాని, ఏ మాత్రమూ కష్టపడలేదు.

**వ. ఇట్లు దేవవ్రతుండు శిఖండి యేయుట సరకుసేయక యతం డగ్గమైననేయక సాయకంబులు సవ్యసాచిపయి నిగిడింప మగిడి దుశ్శాసనుండు గడంగి కవ్వడి వెగడుపడునంతకయ్యంబు సేసి నొచ్చి పాసినం గౌరవపతి గనుంగొని యెలుంగు సూపి చేయివీచి పురికొల్పినం గళింగమాళవ బాహ్లిక విదేహ శూరసేన ప్రముఖ బలంబులు బలమర్దనుతనయు దెసకుం గవిసిన 382**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దేవవ్రతుండు= భీష్ముడు; శిఖండి+ఏయుట= శిఖండియొక్క బాణ ప్రయోగాన్ని; సరకు+చేయక= లెక్కచేయకుండా; అతండు= ఆ శిఖండి; అగ్గము+ఐనన్= అధీనం(అందుబాటు)లో ఉన్నప్పటికీ; ఏయన్= బాణాలతో కొట్టక; సవ్యసాచిపయిన్= అర్జునుడిమీదికి; సాయకంబులు= బాణాలు; నిగిడింప(న్)= వ్యాపింపజేయగా; దుశ్శాసనుండు; మగిడి= తిరిగి; కడంగి= పూనుకొని; కవ్వడి= అర్జునుడు; వెగడుపడునంత= తల్లడపడేటంతగా; కయ్యంబు+చేసి= యుద్ధంచేసి; నొచ్చి= బాధచెంది; పాసినన్= తొలగిపోగా; కౌరవపతి= దుర్యోధనుడు; కనుంగొని= తెలిసికొని; ఎలుంగు+చూపి= కంఠస్వరాన్ని

వినిపింపజేసి(గొంతిచ్చి); చేయివీచి= చేతితో సైగచేసి; పురికొల్పినన్= ప్రోత్సాహపరచగా; కళింగ= కళింగదేశపురాజు; మాళవ= మాళవదేశపురాజు; బాహ్లిక= బాహ్లిక దేశపురాజు; విదేహ= ఆ పేరుగల దేశపురాజు; శూరసేన= ఆ దేశపురాజు; ప్రముఖ= మొదలుగాగల రాజుల యొక్క; బలంబులు= సేనలు; బలమర్దను తనయు దెసకున్= అర్జునుడున్న వైపునకు; కవిసిన(న్).

**తాత్పర్యం:** భీష్ముడు శిఖండి తన మీద ప్రయోగించే బాణాలను లెక్కచేయలేదు. ఆ శిఖండి అందుబాటులో దగ్గరగా ఉన్నాకూడా బాణాలతో కొట్టలేదు. అర్జునుడి మీద బాణాలు ప్రయోగించాడు. దుశ్శాసనుడు తిరిగి, వచ్చి అర్జునుడు ఓర్చుకోలేనంతగా యుద్ధంచేసి, తాను నొచ్చి, పారిపోయాడు. ఈ విషయం తెలిసికొన్నట్టి దుర్యోధనుడు ఎలుగెత్తి అరచి చేయి విసరుతూ, కళింగ మాళవ బాహ్లిక విదేహ శూరసేనులు ముఖ్యులుగా, గల బలాలను ప్రోత్సాహపరచాడు. వీరందరు అర్జునుడి మీదికి కవియగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. అతఁడు దివ్యాస్త్రజాలంబు నతిశయంబు । సూపి చతురంగబలముల రూపు మాపి**
**యుఱక తటిమి శిఖండికిఁ దెఱపి సూప । వాఁడి తూపులు భీష్ముపై వాఁడు నినిచె. 383**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ అర్జునుడు; దివ్య+అస్త్రజాలంబున్= అమోఘాలైన ఆయుధాల సమూహంయొక్క; అతిశయంబున్= గొప్పతనాన్ని; చూపి= కనపరచి; చతురంగబలములన్= రథ, గజ, తురగ పదాతులనే నాలుగు రకాల సేనలను; రూపుమాపి= నాశనంచేసి; ఉఱక= మాటాడక; తటిమి= పరుగెత్తించి; శిఖండికిన్= శిఖండికి; తెఱపి= అవకాశాన్ని; చూపన్= చూపించగా; వాఁడు= ఆ శిఖండి; వాఁడితూపులు= పదునైన బాణాలు; భీష్ముపైన్= భీష్ముడిమీద; నినిచెన్= నింపాడు.

**తాత్పర్యం:** ఆ అర్జునుడు దివ్యాస్త్రాల గొప్పతనాన్ని చూపించుతూ, మన చతురంగ బలాన్ని నాశనంచేసి, పరుగెత్త చేశాడు. శిఖండికి సందు చూపాడు. అప్పుడు అతడు భీష్ముడిపైన పదునైన బాణాలను బాగా నాటాడు.

**వ. ఆ సమయంబునం గృపశల్యవివింశతివికర్ణులం గూర్చికొని పేర్చి దుశ్శాసనుండు శాంతనవున కడ్డపడినం బార్థుం డయ్యేవురను విరథులం జేసిన. 384**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అట్టి సమయంలో; దుశ్శాసనుండు; కృప; శల్య; వివింశతి; వికర్ణులన్= వికర్ణుడు అనే నలుగురిని; కూర్చికొని= వెంటతీసికొని; పేర్చి= విజృంభించి; శాంతనవునకున్= భీష్ముడికి; అడ్డపడినన్= అడ్డంగా నిలబడగా; పార్థుండు= అర్జునుడు; ఆ+ఏవురను= ఆ ఐదుగురిని; విరథులన్= రథాలు లేనివాళ్ళనుగా; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** అప్పుడు దుశ్శాసనుడు, కృపుడిని, శల్యుడిని, వివింశతిని, వికర్ణుడిని వెంటబెట్టుకొని విజృంభించుతూ, భీష్ముడికి రక్షణగా ఆయనముందు నిలబడ్డాడు. అర్జునుడు ఆ ఐదుగురు యోధుల రథాలనూ ధ్వంసం చేయగా.

**క. కురుపతియు ననుజవర్గముఁ । బరమక్రోధమునఁ దెంపు బలుపును మెఱయన్**
**సురనాథనందనునిపై । నురవడిఁ ద్రోచుటయు సేన లుగ్రత నడరెన్. 385**

**ప్రతిపదార్థం:** కురుపతియున్= కురురాజు దుర్యోధనుడు; అనుజవర్గమున్= అతని తమ్ముళ్ళగుంపు; పరమక్రోధమునన్= అధికమైన కోపంతో; తెంపు= తెగువ; బలుపును= బలము; మెఱయన్= బయల్పడగా; సురనాథనందనుని పైన్= అర్జునుడిమీద; ఉరవడిన్= అతివేగంతో, త్రోచుటయున్= కవియగా; సేనలు= సైన్యాలు; ఉగ్రతన్= భయంకరంగా; అడరెన్= విజృంభించాయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు, అతడి సోదరులూ కోపోద్దీపితులై, తమ తెగువ, బలం బయటపడేటట్లు అర్జునుడి మీదికి చాలా వేగంతో కవిశారు. అప్పుడు రెండు పక్షాల సేనలూ బాగా విజృంభించాయి.

**క. పాండవ బలములు దలపడి । భండన మొనరింప నగ్ర భాగంబున ను**
**ద్దండతఁ బోరెడు మనుమల । తండము గని మెచ్చి య ప్పితామహుఁడు వెసన్. 386**

**ప్రతిపదార్థం:** పాండవబలములు= పాండవులయొక్క సేనలు; తలపడి= తాకి; భండనము+ఒనరింపన్= యుద్ధంచేయగా; అగ్రభాగంబునన్= తనకు ముందరభాగంలో; ఉద్దండతన్= అతిశయంగా; పోరెడు= యుద్ధంచేస్తూ ఉండే; మనుమల తండమున్= దుర్యోధనాదులగు మనుమల గుంపును; ఆ+పితామహుండు= ఆ భీష్ముడు; కని= చూచి; మెచ్చి= మెచ్చుకొని; వెసన్= వేగంతో.

**తాత్పర్యం:** పాండవులు ఎదురెక్కి యుద్ధం చేస్తూండగా, తనముందు భాగంలో నిలిచి అతి గొప్పయుద్ధం చేస్తూ ఉన్న తన మనుమళ్ళందరినీ భీష్ముడు చూచి, మెచ్చుకొంటూ వెంటనే. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. అరిబలంబుపై నొక్క దివ్యాస్త్ర మేయఁ । దలఁచి యరిఁబోసి తిగిచి యుదగ్రవృత్తిఁ**
**గవిసి ముందట నున్నశిఖండిచూడ్కి । దొడరుటయుఁ దాల్మిమైఁ దెగ యుడిపె నధిప! 387**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా! అరిబలముపైన్= శత్రుసైన్యంమీద; ఒక్క= ఒకానొక అపూర్వమైన; దివ్య+అస్త్రము= దివ్యమైన ఆయుధాన్ని; ఏయన్= ప్రయోగించాలని; తలఁచి= అనుకొని; అరి= శరసంధానస్థానమైన అల్లెత్రాటి నడిమిభాగంలో; పోసి= బాణాన్ని సంధించి; తిగిచి= ఆకర్షించి(లాగి); ఉదగ్రవృత్తిన్= భయంకరమైన నడవడితో; కవిసి= మార్కొని; ముందటన్+ఉన్న= తనకు ముందు ప్రక్కన ఉన్నట్టి; శిఖండి; చూడ్కి= కంటికి; తొడరుటయున్= కనపడగానే; తాల్మిమైన్= ఓర్పుతో; తెగ= ఎక్కుపెట్టిన అల్లెత్రాటిని; ఉడిపెన్= ఉడిగింపజేశాడు. (దించివేశాడు)

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రమహారాజా! భీష్ముడు ఒకానొక మహాస్త్రాన్ని శత్రుసైన్యాల మీద వేయాలని అనుకొన్నాడు. విల్లు ఎక్కుపెట్టాడు. అల్లెత్రాటి మధ్యలో బాణాన్ని పెట్టాడు. ఆ బాణం వేగంగా దూరంగా పోవడానికి బాగా లాగాడు. భయంకరంగా కవిశాడు. ఇంతలో తనకు ముందు (పేడి) శిఖండి తన కంటికి అగుపడ్డాడు. దానితో, భీష్ముడు ఎంత కోపంతో ఉరికాడో, అంత శాంతంతో వెనుకకు తగ్గాడు. ఎక్కుపెట్టిన వింటిని దించివేశాడు.

**వ. అంత. 388**

**తాత్పర్యం:** ఆ తరువాత.

**క. సోమక మాత్స్యప్రముఖో । ద్దామబలము లేచి పెలుచఁ దఱుముటయును సం**
**గ్రామతలము సేనాంగ । స్తోమాంగమయంబు సేసె దుర్దాంతగతిన్. 389**

**ప్రతిపదార్థం:** సోమక= ద్రుపదుడు; మాత్స్య= విరటుడు; ప్రముఖ= ముఖ్యులుగా గలవారి యొక్క; ఉద్దామబలములు= గొప్ప సేనలు; ఏచి= విజృంభించి; పెలుచన్= కోపంతో; తఱుముటయునున్= కవియగా; (భీష్ముడు)దుర్దాంతగతిన్= అణచరాని పోకడతో; సంగ్రామతలమున్= యుద్ధభూమిని; సేనా= సైన్యానికి; అంగ= అంగాలైన రథ, గజ, తురగ, పదాతులయొక్క; స్తోమ= సమూహాలయొక్క; అంగమయంబున్= అవయవా(శరీరా)లతో నిండిన దానినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ద్రుపదుడు, విరాటుడు మొదలైనవారి బలాలు విచ్చలవిడిగా విజృంభించి భీష్ముడిపై కవిశాయి. అప్పుడు భీష్మాచార్యుడు అడచరాని పోకడతో ఆ యుద్ధభూమినంతా శత్రువుల చతురంగబలాల అంగాలతో నింపివేశాడు. అనగా శత్రువుల, రథాలను, ఏనుగులను, గుఱ్ఱాలను, కాల్బలాన్ని తునాతునకలు చేశాడు.

క. సేనల నిమ్మెయి భీష్ముఁడు । దీనతఁ బొందింప నలిగి ధీరత్వము వీ
రానీకం బగ్గింప శతానీకుఁ । డెదిర్చె నతని నాసురభంగిన్. 390

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు; ఈ+మెయిన్= ఈ విధంగా; సేనలన్= సైన్యాలను; దీనతన్= భయాన్ని; పొందింపన్= కలిగింపగా; అలిగి= కోపించి; వీర+అనీకంబు= శూరులసమూహం; ధీరత్వము= (తన) ధైర్యాన్ని; అగ్గింపన్= పొగడుతుండగా;శతానీకుఁడు= విరాటరాజు తమ్ముడు; అతనిన్= ఆ భీష్ముడిని; ఆసురభంగిన్= రాక్షస సంబంధమైన రీతిలో; ఎదిర్చెన్= ఎదిరించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు పైన చెప్పిన విధంగా పాండవుల సేనలకన్నింటికీ మహాభయాన్ని కలిగించాడు. అక్కడ ఉన్న వీరులందరూ తన ధైర్య శౌర్యాలను పొగడగా శతానీకుడు (విరాటరాజు తమ్ముడు) రాక్షసుడి మాదిరి ఆ భీష్ముడి మీదికి ఎగబడినాడు.

### విరటుతమ్ముఁడగు శతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట(సం. 6-113-24)

వ. ఇట్లు దాఁకి విరటుతమ్ముండు వాలమ్ముల నొప్పించినం గోపించి. 391

**ప్రతిపదార్థం:** విరటు తమ్ముండు= విరాటరాజు తమ్ముడు శతానీకుడు; ఇట్లు= పైన చెప్పిన ప్రకారం; తాఁకి= మార్కొని; వాలు+అమ్ములన్= పదునుగల బాణాలతో; నొప్పించినన్= నొప్పి కలిగేటట్లు చేయగా; కోపించి= భీష్ముడు కోపంచెంది.

**తాత్పర్యం:** పైన చెప్పిన విధంగా శతానీకుడు భీష్ముడిని మార్కొని, చురుకైన బాణాలను ప్రయోగించి, అతడికి బాధను కలిగించగా భీష్ముడు కోపించి. (తరువాతి పద్యంతో అన్వయం.)

శా. విల్లుం గేతువుఁ ద్రుంచి సూతు వెస నుర్విం గూల్చి రథ్యంబులన్
డొల్లం దీవ్రత నేసి యాతఁడు భుజాటోపంబు శౌర్యంబు శో
భిల్లన్ వైచిన శక్తియుం దునిమి యాభీలద్యుతిప్రస్ఫుర
ద్భల్లం బొక్కటి భీష్ముఁ డేసి నఱకెం దన్మస్తకం బుగ్రతన్. 392

**ప్రతిపదార్థం:** భీష్ముఁడు; విల్లున్= వింటిని; కేతువున్= ధ్వజాన్ని; త్రుంచి= తునుకలు చేసి; వెసన్= వెంటనే; సూతున్= సారథిని; ఉర్విన్= నేలమీద; కూల్చి= కూలదోసి; రథ్యంబులన్= గుర్రాలను; డొల్లన్= కిందపడేట్టుగా; తీవ్రతన్= గట్టిగా; ఏసి= బాణాలు ప్రయోగించి; ఆతఁడు= ఆ శతానీకుడు; భుజ+ఆటోపంబు= చేతుల విజృంభణం; శౌర్యంబు= శూరత్వము; శోభిల్లన్= ప్రకాశింపగా; వైచిన= ప్రయోగించినట్టి; శక్తియున్= శక్తి అనే ఆయుధాన్ని; తునిమి= తుంటలుగా చేసి; ఒక్కటి= ఒకానొకటైన; ఆభీల= భయంకరమైన; ద్యుతి= కాంతితో; ప్రస్ఫురత్= ప్రకాశిస్తున్న; భల్లంబున్= బల్లెమును; ఏసి= ప్రయోగించి; ఉగ్రతన్= భయంకరంగా; తద్+మస్తకంబు= ఆ శతానీకుడి తలను; నఱకెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ఆ శతానీకుడి వింటిని, పతాకాన్ని తునకలు చేశాడు. అతడి సారథిని నేలపై పడేటట్లు కొట్టాడు. రథానికుండే గుర్రాలను నేల దొరలేటట్లుగా చేశాడు. ఆ శతానీకుడు, భుజబలం, శూరత్వం ఒప్పుతూ ఉండగా 'శక్తి' అనే ఆయుధాన్ని భీష్ముడి మీదికి ప్రయోగించగా, భీష్ముడు దాన్ని తునుకలు చేశాడు. కాంతితో జ్వలిస్తూండే ఒకానొక బల్లేన్ని అతడి మీదికి ప్రయోగించి, భయంకరంగా ఆ శతానీకుడి తలను భీష్ముడు ఖండించాడు.

వ. ఇవ్విధంబున శతానీకుం జంపిన. 393

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ చెప్పిన ప్రకారంగా; శతానీకున్; చంపినన్.

**తాత్పర్యం:** పైన చెప్పిన ప్రకారంగా భీష్ముడు విరాట మహారాజు తమ్ముడగు శతానీకుడిని చంపివేశాక. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మొనలెల్ల విఱుగ మధ్యం। దినమున యినుమాడ్కి బయలఁ దేజోనిధి శం**
**తను సూనుఁ డొప్పె నప్పుడు। గనుఁగొని యిట్లనియె శౌరి గాండివితోడన్. 394**

**ప్రతిపదార్థం:** మొనలు= సైన్యాలు; ఎల్లన్= అన్నియు; విఱుగన్= ఓడిపోగా; తేజోనిధి= తేజస్సుకు గనివంటివాడైన; శంత నుసూనుఁడు = శంతను మహారాజు యొక్క కుమారుడు - భీష్ముడు; బయలన్= శూన్య ప్రదేశంలో (ఆకాశంలో); మధ్యందినమునన్= మధ్యాహ్న సమయంలోని; ఇనుమాడ్కిన్= సూర్యుడి విధంగా; ఒప్పెన్= ప్రకాశించాడు; అప్పుడు= అట్టి సమయంలో; శౌరి= కృష్ణుడు; కనుఁగొని= చూచి; గాండివితోడన్= అర్జునుడితో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** శతానీకుడు చావగానే, సైన్యాలు భయపడి పారిపోయాయి. ఆ సమయంలో నిర్మానుష్యంగా ఉన్న ఆ యుద్ధరంగంలో తేజఃపుంజంతో వెలిగే భీష్ముడు ఆకాశంలో ప్రకాశించే సూర్యుడి మాదిరి అగుపడ్డాడు. శ్రీకృష్ణుడు, ఈ పరిస్థితిని బాగా గమనించి, అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమాలంకారం. భీష్ముడికి సూర్యుడితో పోలిక. ఇద్దరూ తేజోనిధులే. 'మాడ్కి' ఉపమావాచకం, ఒప్పి ఉండటం సమానధర్మం.

**క. ' మనమోహరములు సెడి, కను। కనిఁ బాఱెడు నిప్ప డాపగాసుతునకు గ్ర**
**క్కున నీవు మార్కొనక త। క్కినఁ గార్యము దప్పుఁ బొదివి గెలువుము కడఁకన్.' 395**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు= ఈ సమయంలో; మనమోహరములు= మనయొక్క వ్యూహాలు; కనుకనిన్= తొట్రుపాటుతో; చెడి= కనబడకుండా పోయి; పాఱెడున్= పరుగెత్తిపోతున్నాయి; గ్రక్కునన్= వెంటనే; నీవు; ఆపగాసుతునకున్= భీష్ముడికి; మార్కొనక= ఎదురు నిలబడకుండా; తక్కినన్= తప్పుకొన్నట్లయితే; కార్యము= పని; తప్పున్= చెడిపోవును; కడఁకన్= ప్రయత్నంతో; పొదివి; గెలువుము= జయించుము.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! మన సైన్యాలు శతానీకుడి మరణం రణంలో చూచి, అదిరి, బెదిరి, కనబడకుండా పారిపోతున్నాయి. కనుక ఇప్పుడు నీవు భీష్ముడిని మార్కొనకుండాపోతే మన పని చెడిపోతుంది. కాబట్టి, నీవు ప్రయత్నంతో భీష్ముడిని కవిసి జయించుము.

**వ. అనిన విని యతండు రథరథ్యసారథిసహితంబుగా సురనదీనందను నమందమార్గణపుంజంబునం బొదివె శిఖండియుం జేరి నారాచంబుల నొప్పించిన దేవవ్రతుండు వాని నేయ నొల్లనిసందున నాసవ్యసాచి యతని విల్లు దునిమి పెల్లేయుచున్నం జూచి సైరింపక శలశల్యకృప కృతవర్మచిత్రసేనభూరిశ్రవః ప్రభృతివీరలోకం బతిలోకంబుగ దివ్యాస్త్రజాలంబులు నెఱపుచు నేయుచు భీష్మున కడ్డపడుండు దలకడవుం'డను నెలుంగులు నింగి ముట్ట బలసమేతంబుగా నడరినం గని సమీర నందన సాత్యకి సౌభద్ర విరాట ద్రుపద ఘటోత్కచ ప్రముఖ యోధవర్గం బనర్గళభంగిం దఱుమం దత్సైన్యంబులు గూడుకొని కవిసిన దివిజదానవసంపాతసమయ సమరం బయ్యె నందుఁ బురందరనందనుండు మన సైనికుల కందఱ కన్నిరూపులయి యైంద్రవారుణాగ్నేయాది**

**మహాశరంబులం దెరల్చుచు సురక్షితుం డైన శిఖండిం బురికొల్పికొని మీ తండ్రి నేయించుచు నతండెన్ని విండ్లెత్తిన నన్నిటిం దోడ్తోన తునుమాడుచుండె నా క్రీడిపై నతం డుగ్రశక్తి ప్రయోగింప నదియునుం ద్రుంచి సూతునిం గేతనంబునుం గూల్చిన. 396**

**ప్రతిపదార్థం:** అనినన్; విని; అతండు= ఆ అర్జునుడు; రథ= రథాలు; రథ్య= గుర్రాలు; సారథి= రథంనడిపేవాడు - వీటితో; సహితంబుగాన్= కూడునట్లుగా; సురనదీనందనున్= భీష్ముడిని; అమందమార్గణ పుంజంబునన్= తక్కువకాని బాణాల సమూహంతో; పొదివెన్= కప్పివేశాడు; శిఖండియున్= శిఖండికూడా; చేరి= కలిసికొని; నారాచంబులన్= బాణాలతో; నొప్పించినన్= బాధను కలిగించగా; దేవవ్రతుండు= భీష్ముడు; వానిన్= ఆ శిఖండిని; ఏయన్= బాణాలతో కొట్టడానికి; ఒల్లని సందునన్= ఇష్టపడకుండా ఉండే సమయంలో; ఆ సవ్యసాచి= ఆ అర్జునుడు; అతని విల్లున్= ఆ భీష్ముడి వింటిని; తునిమి= తుంటలు చేసి; పెల్లు= అధికంగా; ఏయుచున్నన్= బాణాలు ప్రయోగిస్తూ ఉండగా; చూచి; సైరింపక= ఓర్చుకోకుండా; శల; శల్య; కృప; కృతవర్మ; చిత్రసేన; భూరిశ్రవః= భూరిశ్రవసుడు; ప్రభృతి= ముఖ్యులుగాగల; వీరలోకంబు= వీరులయొక్క సమూహం; అతిలోకంబుగ(న్)= లోకాతీతంగా; దివ్య+అస్త్రజాలంబులు= అమోఘాలైన ఆయుధాల సమూహాలను; నెఱపుచు(న్)= వ్యాపింప జేయుచు; ఏయుచున్= బాణాలు ప్రయోగిస్తూ; భీష్మునకున్= భీష్ముడికి; అడ్డపడుండు= అడ్డుపడండి; తలకడవుండు= ఉన్నచోటిని దాటిరండి; అను= అనునట్టి; ఎలుంగులు= కంఠస్వనాలు; నింగిముట్టన్= ఆకాశాన్నంటుతూ ఉండగా; బలసమేతంబుగాన్= సైన్యాలతో కూడునట్లుగా; అడరినన్= విజృంభించగా; కని; సమీరనందన= భీముడు; సాత్యకి; సౌభద్ర= సుభద్రకుమారుడు - అభిమన్యుడు; విరాట; ద్రుపద; ఘటోత్కచ ప్రముఖ= ప్రధానులుగాగల; యోధవర్గంబు= యోధులగుంపు; అనర్గళభంగిన్= అడ్డులేని విధంగా తఱుమన్= ఎదుర్కొనగా; తద్+సైన్యంబులు(న్)= ఆ కౌరవసైన్యాలు; కూడుకొని= ఏకమై; కవిసిన(న్); దివిజదానవ= దేవతలరాక్షసులయొక్క; సంపాత= చక్కని పాటు కల్గిన; సమయ= సమయమందలి; సమరంబు+అయ్యెన్= యుద్ధంవంటి యుద్ధం జరిగింది; ఆలాటి యుద్ధంలో; పురందర నందనుండు= అర్జునుడు; మన సైనికులకున్= మన(కౌరవ) సైన్యంలోని వారికి; అందఱకున్= అందరికీ కూడా; అన్ని రూపులు+అయి= అంతమంది అర్జునులుగా అగపడి; ఐంద్ర= ఇంద్ర దేవతాకములు; వారుణ= వరుణ దేవతాకములు; ఆగ్నేయ= అగ్ని దేవతాకములు; ఆది= మున్నుగాగల; మహాశరంబులన్= గొప్ప బాణాలతో; తెరల్చుచు(న్)= తొలగించుకొంటూ; సురక్షితుండు+ఐన= బాగా కాపాడబడ్డవాడైన; శిఖండిన్; పురికొల్పికొని= ప్రోత్సాహపరిచి; మీ తండ్రిన్= మీ తండ్రియైన భీష్ముని; ఏయించుచున్= బాణాలతో కొట్టించుతూ; అతండు= ఆ భీష్ముడు; ఎన్ని విండ్లు= ఎన్ని ధనుస్సులను; ఎత్తినన్= ఎత్తికొన్నప్పటికీ; అన్నింటిన్= అన్ని విండ్లనూ; తోడ్తోన= వెంటనే; తునుమాడుచుండెన్= తునుకలు చేస్తూ వచ్చాడు; అతండు= ఆ భీష్ముడు; ఆ క్రీడిపైన్= ఆ అర్జునుడిమీద; ఉగ్రశక్తిన్= భయంకరమైన శక్త్యాయుధాన్ని; ప్రయోగింపన్= వేయగా; అదియునున్= ఆ శక్తి ఆయుధాన్ని కూడా; త్రుంచి= తునుకలుచేసి; సూతునిన్= సారథిని; కేతనంబునున్= ధ్వజాన్ని కూడా; కూల్చిన(న్)= కూలద్రోయగా.

**తాత్పర్యం:** అర్జునుడు కృష్ణుడన్న మాటలు విన్నాడు. భీష్ముడిని, ఆయన రథాన్ని, గుర్రాలను, సారథిని, చురుకైన బాణాల సమూహంతో కప్పివేశాడు. శిఖండి కూడా అర్జునుడితో కూడా చేరుకొని బాణాలతో భీష్ముడిని నొప్పించాడు. శిఖండి పేడి కాబట్టి వాడిమీద బాణాలు వేయడానికి భీష్ముడు ఇష్టపడకుండా ఉండే సమయంలో అర్జునుడు అతడి విల్లును విరిచివేసి, పెల్లుగా బాణాలను గుప్పించాడు. దీన్ని చూచి, శలశల్యాదులైన వీరులందరూ ఓర్చుకోలేక చాలా భయంకరాలైన, అమోఘాలైన అస్త్రశస్త్రాలతో యుద్ధభూమినంతా కప్పివేస్తూ, బాణాలతో కొట్టుతూ, భీష్ముడికి అండగా ముందు నిలబడండి, మీరుండే చోటినుండి కదలిరండి.' అనే అరుపులు ఆకాశాన్ని అంటుతుండగా, సేనలతో వారు విజృంభించారు. భీముడు, సాత్యకి, అభిమన్యుడు ముఖ్యులుగా ఉండే యోధవర్గం వారి విజృంభణాన్ని చూచారు. అడ్డు, ఆపు లేకుండా శత్రుసైన్యాన్ని తరిమారు. శత్రుసేనలంతా ఒక్కటిగా చేరుకొని కవిశారు. అప్పటివారి

యుద్ధం దేవతల రాక్షసుల యుద్ధంవలె అనిపించింది. అట్టిపట్టులో అర్జునుడు మన సైనికులకు ఒక్కొక్కడికి ఒక్కొక్క అర్జునుడుగా అగుపడుతూ, ఇంద్రవారుణాగ్నేయాది దివ్యాస్త్రాలు ప్రయోగించి దారి ఏర్పరచుకొంటూ, తనచే చక్కగా కాపాడబడుతూ ఉన్న శిఖండిని దండిగా ప్రేరేపించి, (మీతండ్రి) భీష్ముడిని బాణాలతో కొట్టించాడు. భీష్ముడు ఎన్ని విండ్లెత్తుకున్నా అన్నిటిని వెంట వెంటనే తునాతునుకలు చేశాడు. ఆ భీష్ముడు అర్జునుడి మీదికి భయంకరమైన ఒక శక్తి ఆయుధాన్ని ప్రయోగించాడు. అర్జునుడు దాన్నికూడా తునుమాడి, అంతటితో ఊరకొనక, ఆ భీష్ముడి సారథిని, రథటెక్కాన్ని కూడా కూల్చివేశాడు.

**సీ.** **మనమున భీష్ముఁ డిట్లని వితర్కించుఁ । 'బాండవుల నాయొక్క వింటన కడంగి**
**గెలువనే? వీరికిఁ గృష్ణుండు ప్రాపు గా । కున్న నిం కది యట్టు లుండనిమ్ము**
**కృష్ణుఁ దోడుగఁ గొని కీడ్పడి వీరలు । వచ్చినఁ జెప్పితి వధవిధంబు**
**సమర ముపేక్షించి శాంతిమై నుండెద । నడిచిపాటేటికి?' ననఁగ నెఱిఁగి**

**తే.** **చదల సుర లిట్లు 'మే లిది సమ్మతంబు । మాకు' నని ప్రీతిమైఁ జెప్పుమాట లాతఁ**
**డొక్కరుండును వినియె; నే నొకఁడు వింటి । మునిమహానుభావంబున మనుజనాథ!** **397**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ప్రభువగు ధృతరాష్ట్ర మహారాజా!; మనమునన్= మనస్సులో; భీష్ముఁడు; ఇట్లు+అని; వితర్కించున్= ఊహించుకొంటున్నాడు; వీరికిన్= ఈ పాండవులకు; కృష్ణుండు= కృష్ణుడు; ప్రాపు= ఆశ్రయము; కాక+ఉన్నన్= కాకుండా ఉంటే; పాండవులన్= పాండురాజు కొడుకులను; నా+ఒక్కవింటన్+అ= నా ఒక్క ధనుస్సుతోనే; కడంగి= యత్నించి; గెలువనే?= గెలువనా?; ఇంకన్= ఇకమీద; అది= ఆ సంగతి; అటులు+ఉండనిమ్ము= అట్లా ఉండనీ; వీరలు= ఈ పాండవులు; కీడు+పడి= తక్కువపాటు చెంది; కృష్ణున్= కృష్ణుడిని; తోడుగన్+కొని= సహాయంగా తీసికొని; వచ్చినన్= రాగా; వధవిధంబున్= నన్ను చంపేరీతిని; చెప్పితిన్= చెప్పాను; సమరము= యుద్ధమును; ఉపేక్షించి; అశ్రద్ధచేసి; శాంతిమైన్= ఓర్పుతో; ఉండెదన్= ఉంటాను; అడిచిపాటు= తొందరపడటం; ఏటికిన్?= ఎందుకోసం?; అనఁగన్= అని వితర్కించుకుంటూ ఉండగా; చదలన్= ఆకాశాన; సురలు= దేవతలు; ఎఱిఁగి= భీష్ముడి తర్కాన్ని తెలుసుకొని; ఇట్లు;మేలు+ఇది= ఇది బాగున్నది; మాకున్= దేవతలమగు మాకు; సమ్మతంబు= ఇష్టం; అని= అంటూ; ప్రీతిమైన్= ప్రేమతో; చెప్పుమాటలు= చెప్పెడి మాటలను; ఆతఁడు= ఆ భీష్ముడు; ఒక్కరుండును= ఒక్కడు మాత్రమే, వినియెన్= విన్నాడు; మునిమహానుభావంబునన్= వ్యాస మహర్షి యొక్క మహిమవల్ల; ఏన్+ఒకఁడు= నే నొకడు మాత్రమే; వింటిన్= విన్నాను.

**తాత్పర్యం:** భీష్ముడు తన మనస్సులో ఈ విధంగా అనుకొంటున్నాడు. 'ఈ పాండవులకు కృష్ణుడు ఆశ్రయంగా లేకుండా ఉండిఉంటే నా ఒక్క ధనుస్సుతోనే వీరినంతా నేను గెలువనా? సరే, ఆ సంగతి అట్లా ఉండనీ. ఈ పాండవులందరూ లొచ్చుపడి, చచ్చుదేలి, కృష్ణుడిని సహాయంగా తీసికొని నా దగ్గరకు వచ్చారు. నా మరణానికి ఉపాయాన్ని వీరికి చెప్పాను. ఇకమీద యుద్ధంలో శ్రద్ధ చూపకుండా ప్రశాంతంగా ఉంటాను. వేగిరపాటెందుకు?' అనే ఈ మాటలు ఆకాశంలో ఉండే దేవతలు విన్నారు. 'ఇదే మేలైనపని. మా ఇష్టం కూడా ఇదే' అని ప్రేమతో వారు చెప్పే మాటలు ఆ భీష్ముడు ఒకడు మాత్రమే విన్నాడు. వ్యాసమహర్షి ప్రభావం వలన నేను కూడా విన్నాను.

**వ.** **తదవసరంబున సూక్ష్మజలశీకరశిశిరంబగు మారుతంబు మరుత్తటినీతనయు మీఁద సుడిసె సురదుందుభులు మ్రోసెఁ గుసుమవర్షంబులు గురిసె నవియు ననన్యగోచరంబులయ్యె నిట్లు నిశ్చయించియు న మ్మహాత్ముం డూరకున్నం గెలని కొకభంగియై తోఁచు నని తలంచి.** **398**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆనాటి సమయంలో; మరుత్+తటినీతనయుమీఁదన్= దేవనదికొడుకైన భీష్ముడిమీద; సూక్ష్మ= కొద్దిపాటివైన; జల= నీటియొక్క; శీకర= తుంపరల చేత; శిశిరంబు+అగు= చల్లనైన; మారుతంబు= గాలి; సుడిసెన్= చుట్టిముట్టి వీచింది; సురదుందుభులు= దేవదుందుభులు; మ్రోసెన్= మ్రోగాయి; కుసుమవర్షంబులు= పూలవానలు; కురిసెన్; అవియున్= ఈ చెప్పినవన్నీ; అనన్యగోచరంబులు+అయ్యెన్= ఇతరులకు అగుపడకుండా ఉండినాయి; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు; ఇట్లు= ఈ విధంగా; నిశ్చయించియున్= నిశ్చయం చేసికొని కూడా; ఊరక+ఉన్నన్= యుద్ధం చేయకుండా వుంటే; కెలనికి(న్)= తన పక్షంవారికి; ఒక భంగి+ఐ= ఒక విధంగా(మోసం)గా; తోఁచున్+అని= అనిపించవచ్చునని; తలంచి= అనుకొని.

**తాత్పర్యం:** భీష్ముడు దేవతలన్న మాటలు విన్న సమయంలో, ఆ భీష్ముడి మీద నీటి బిందువులతో నిండిన చల్లని పిల్లగాలులు వీచాయి. దేవదుందుభులు మ్రోగాయి. పూలవానలు కురిశాయి. ఈ వింతలంతా వేరెవరికీ అగుపించలేదు. ఆ మహాపురుషుడు తానిక యుద్ధం చేయకూడదని, ప్రశాంతంగా ఉండాలని నిశ్చయం చేసికొని కూడా ఊరకనే ఉంటే తన పక్షంవారికి, కౌరవులకు తన వైఖరి మోసం(కపటం)గా అనిపిస్తుందేమో అని తన విల్లు ఎక్కుపెట్టాడు.

**తే. ఒక్క వి ల్లెక్కుపెట్టంగ నుఱక వెస శి । ఖండి పటు మార్గణంబులఁ గడఁగి యేయ**
**నతఁడు మిసిమింతుఁడును గామి కల్ల నవ్వి । పఱపెఁ దనయమ్ము లతనిపై ఫల్గునుండు. 399**

**ప్రతిపదార్థం:** ఒక్కవిల్లు= ఒకవింటిని; ఎక్కుపెట్టంగన్; శిఖండి= ద్రుపదుని పుత్రుడు; ఉఱక= లెక్కచేయక; కడఁగి= ప్రయత్నించి; వెసన్= వేగంగా; పటుమార్గణంబులన్= సమర్థములైన బాణాలను; ఏయన్= ప్రయోగింపగా; అతఁడు= ఆ భీష్ముడు; మిసిమింతుఁడునున్= అలసిపోయినవాడుగా కూడా; కామికిన్= కాకున్నదానికి; ఫల్గునుండు= అర్జునుడు; అల్ల నవ్వి= సన్నగా నవ్వి; తన+అమ్ములు= తన బాణాలను; అతనిపైన్= ఆ భీష్ముడిమీద; పఱపెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు ఒక వింటిని ఎక్కుపెట్టాడు. అంతలో శిఖండి దానిని లెక్కచేయక ప్రయత్నంతో వేగంగా మంచి మంచి బాణాలను ఆ భీష్ముడిమీదికి ప్రయోగించాడు. ఆ బాణాల దెబ్బలకు భీష్ముడు కొంచెం కూడా అలసట చెందలేదు. దీన్ని చూచి అర్జునుడు నవ్వి, తన బాణాలను అతడి మీద ప్రయోగించాడు.

**వ. శాంతనవుండును సముల్లాసంబున నేసిన. 400**

**ప్రతిపదార్థం:** శాంతనవుండును= శంతనుమహారాజు కుమారుడు భీష్ముడును; సమ్+ఉల్లాసంబునన్= ఉత్సాహంతో; ఏసినన్= బాణాలు ప్రయోగించగా.

**తాత్పర్యం:** అర్జునుడు తనపై బాణాలు ప్రయోగించగా, భీష్ముడున్నూ ఉత్సాహంతో మళ్ళీ బాణాలు ప్రయోగించగా. (తరువాత పద్యంతో అన్వయంతో.)

**క. నరుఁడు, దనమీఁదఁ దొరఁగెడు । శరములు వారించి యతని చాపం బధిక**
**త్వరితగతిఁ ద్రుంచి యతిని । ష్ఠుర నారాచంబు దనువు సొర నేయుటయున్. 401**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; తనమీఁదన్= తన(అర్జునుడి)మీద; తొరఁగెడు శరములు= పడునట్టి బాణాలను; వారించి= అడ్డగించి(నివారించి); అధిక త్వరితగతిన్= మిక్కిలి వేగంతో కూడిన విధంగా; అతని చాపంబున్= ఆ భీష్ముడి ధనుస్సును; త్రుంచి= తునుకలు చేసి; అతినిష్ఠుర నారాచంబున్= మిక్కిలి క్రూరమైన బాణాన్ని; తనువు+చొరన్= భీష్ముడి శరీరంలోకి చొచ్చుకొని పోయేటట్లుగా; ఏయుటయున్= వేయగా.

**తాత్పర్యం:** భీష్ముడు తనమీద ప్రయోగించే బాణాలను నివారిస్తూ, అర్జునుడు చాలావేగంతో ఆ భీష్ముడి వింటిని విరుగగొట్టాడు. ఒక కఠోరమైన బాణాన్ని ఆ భీష్ముడి శరీరంలోనికి చొచ్చుకుపోయేటట్లుగా ప్రయోగించగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. తమకుం దమ యోధవరులకును వారింపం జేరం జెనయం గొలఁది గాక వెల్లివిరిసిన శరనిధిభంగిం బొంగిన వివ్వచ్చు వెఱఁగుపడి చూచుచుం దన్ను విడువక కెలంకులనున్న నీ కొడుకులం గలయం గనుంగొని మీ తండ్రి రారాజుతో నిట్లనియె. 402**

**ప్రతిపదార్థం:** తమకున్= తమకుగాని; తమ యోధవరులకును= తమ పక్షంలోని వీరాగ్రేసరులకుగాని; వారింపన్= అడ్డగించడానికి; చేరన్= దగ్గరకువచ్చుటకుగాని; చెనయన్= ఎదిరించడానికి గాని; కొలఁదికాక= సాధ్యం కాకుండా; వెల్లివిరిసిన= పెల్లుగా ఉబ్బిన; శరనిధిభంగిన్= సముద్రం(బాణాల గని)వలె; పొంగినన్= అతిశయించగా; వివ్వచ్చున్= అర్జునుడిని; వెఱఁగుపడి= చేష్టలుమాని; చూచుచున్= కనుగొంటూ; తన్నున్= (భీష్ముడగు) తనను; విడువక= వదలిపెట్టకుండా; కెలంకులన్= ప్రక్కభాగాలలో; ఉన్న= ఉన్నటువంటి; కొడుకులన్= కుమారులను; కలయన్+కనుంగొని= కలయజూచి; తండ్రి= మీ తండ్రియగు భీష్ముడు; రారాజుతోన్= దుర్యోధన మహారాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** తనకు(భీష్ముడికి), దుర్యోధనాదులకు, తమ పక్షంలో వుండే గొప్పవీరులకుగాని, అడ్డగించటానికి, దగ్గరకు పోవటానికి, ఎదిరించటానికి సాధ్యం కాకుండా ఉప్పొంగిన సముద్రంలాగా, ఆటోపంతో వస్తున్న అర్జునుడిని చూచి భీష్ముడు చేష్టలుడిగి, తననెప్పుడూ వదలకుండా రక్షణగా రెండుప్రక్కల ఉండే కుమారు (వయసువార)లను చూస్తూ, దుర్యోధనమహారాజుతో ఇట్లా అన్నాడు:

**మ. 'అని దేవాసురకోటి కైనను నశక్యం బిమ్మహావీరు మా**
**ర్కొన వీఁ డల్గిన మర్త్యు లే యెదు రుదారుండైన యీ క్రీడి ద**
**క్కిన ని ప్పాండవసైన్య మింతయును మ్రగ్గింపంగ నేఁ జాలుదున్**
**విను, సత్యం బిది వీని వింటి కెదురన్ విల్లెత్తలేఁ డెవ్వఁడున్.' 403**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధమందు; ఈ+మహావీరున్= గొప్ప వీరుడైన యీ అర్జునుడిని; మార్కొనన్= ఎదిరించడానికి; దేవ+అసురకోటికైననున్= కోటి సంఖ్యగల దేవతలకు గాని, రాక్షసులకుగాని; అశక్యంబు= సాధ్యంకాదు; వీఁడు= ఈ అర్జునుడు; అల్గినన్ కోపంచెందిన వాడైతే; మర్త్యులు= మనుష్యులు; ఏయెదురు= ఎదుట నిల్తురా?; నిలువలేరు; ఉదారుండు+ఐన= గొప్పవాడైనట్టి; ఈ క్రీడి= ఈ అర్జునుడు; తక్కినన్= లేకుంటే; ఏన్= నేను(భీష్ముడు); ఈ+పాండవ సైన్యము= ఈ పాండవుల సేనను; ఇంతయును= అంతటిని; మ్రగ్గింపంగన్= చంపటానికి; చాలుదున్= సమర్థుడనగుదును; విను= ఆకర్ణించుము; వీని వింటికిన్= ఈ అర్జునుడి ధనుస్సుకు; ఎదురన్= ఎదురుగా; ఎవ్వఁడున్= ఎట్లాంటి వీరుడైనా సరే; విల్లు+ఎత్తఁలేడు= విల్లు పట్టుకొనలేడు (ఎక్కుపెట్టలేడు); ఇది= ఈ మాట; సత్యంబు= నిజము.

**తాత్పర్యం:** 'కోటిమంది దేవతలుగాని, కోటిమంది రాక్షసులుగాని ఈ అర్జునుడిని ఎదిరించలేరు. ఈ అర్జునుడిని ఎదుర్కోవటానికి దేవరాక్షసకోటికే సాధ్యం కాదంటే ఇక మానవులకెట్లు సాధ్యం? (మానవులకు, అర్జునుడిని ఎదిరించడం ఎంతమాత్రం సాధ్యంకాదన్నమాట.) మహావీరుడైన ఈ అర్జునుడు ఒక్కడు పాండవసైన్యంలో లేకుంటే, ఈ సైన్యాన్ని మొదలంటా మట్టుపెట్టటానికి నేనొకడనే చాలేవాడిని. ఓ దుర్యోధనా! నా మాట విను. ఈ అర్జునుడు

ధనుస్సు చేతపట్టుకొంటే, వీడికి ఎదురుగా ఏ మహావీరుడూ కూడా ధనుస్సు పైకెత్తలేడు. ఇక వీడిపై బాణాలు ప్రయోగించే దెక్కడ? ఇది నిజం.'

**క. అనునెడ శిఖండిచాపము । వెనుకం దనవిల్లు నిల్పి వెస నాతం డే**
**సిన భంగిగ నరుఁ డేసెను । జననాయక! దొడ్డనారసంబులు భీష్మున్. 404**

**ప్రతిపదార్థం:** జననాయక!= జనులకు ప్రభువువైన ధృతరాష్ట్రా!; అనున్+ఎడన్= భీష్ముడు ఈవిధంగా చెప్తున్న సమయంలో; నరుఁడు= అర్జునుడు; వెసన్= వేగంగా; శిఖండి చాపము వెనుకన్= శిఖండియొక్క వింటికి వెనుకప్రక్కన; తనవిల్లు= తన (అర్జునుడి) యొక్క ధనుస్సును; నిల్పి= ఉంచి; ఆతండు= ఆ శిఖండి; ఏసిన భంగిగన్= బాణాలు ప్రయోగించిన మాదిరిగా; దొడ్డ నారసంబులు= గొప్ప బాణాలతో; భీష్మున్= భీష్మాచార్యుడిని; ఏసెను= కొట్టినాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీష్ము డీ విధంగా దుర్యోధనుడితో చెపుతున్న సమయంలో సందు చూచికొని అర్జునుడు శిఖండి వింటికి వెనుకనే తనవింటిని ఎవ్వరికీ కనిపించకుండా ఆనించి, ఆ శిఖండే బాణాలు ప్రయోగిస్తున్నట్లు చూచేవారికి అనిపించేటట్లుగా గొప్ప బాణాలను ఆ భీష్ముడి మీద ప్రయోగించాడు.

**వ. అప్పుడు దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి. 405**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; దేవవ్రతుండు= భీష్ముడు; దుశ్శాసనున్= దుశ్శాసనుని; ఆలోకించి= చూచి

**తాత్పర్యం:** ఆ విధంగా బలమైన బాణాలను తన మీదికి అర్జునుడు ప్రయోగించినప్పుడు భీష్ముడు దుశ్శాసనుడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ. "అశనికల్పము లివి యర్జును బాణముల్ । గాని శిఖండివి గావు సుమ్ము;**
**కర్కటిగర్భంబు కరణి గాత్రము వ్రచ్చె । నిట్టివి వీనికి నెందుఁ గలవు?**
**బహ్మదండంబులపాటి యై మర్మంబు । లిట్టు నోనాటునే? యితని చేత**
**జముదూత లట్లు ప్రాణముల వెలార్పంగ । నీ ద్రుపదాత్మజుఁ డెన్నఁ డేసె?**

**ఆ. దృఢవిముక్తములును దీప్తాకృతులు లక్ష్య । శుద్ధిమంతములును సునిశితములు**
**నైననారసంబు లతనివి గాక యీ । తనివి యగునె? యెవ్విధమునఁ జూడ.' 406**

**ప్రతిపదార్థం:** ఇవి= ఈ బాణాలు; అశనికల్పములు= పిడుగులతో సమానాలు; అర్జును బాణముల్+కాని= అర్జునుడి బాణాలే గాని; శిఖండివి= శిఖండి ప్రయోగించినట్టివి; కావుసుమ్మ= కావుసుమా!; కర్కటిగర్భంబు కరణిన్= ఎండ్రకాయ కడుపులోని పిండంవలె; గాత్రము= శరీరాన్ని; వ్రచ్చెన్= చీల్చివేస్తున్నది; ఇట్టివి= ఈలాంటి బాణాలు; వీనికిన్= ఈ శిఖండికి; ఎందున్+కలవు= ఎక్కడున్నాయి?; బ్రహ్మదండంబుల పాటియై= బ్రహ్మదండాలతో సమానమై; ఇతనిచేతన్= ఈ శిఖండిచేత; మర్మంబులు= జీవస్థానాలను; ఇట్టు= ఇంతగా; నోనాటున్+ఏ?= నొప్పించేటట్టు గుచ్చుకుంటాయా?; జముదూతలు+అట్లు= యముడి దూతల మాదిరిగానే; ప్రాణములన్; వెలార్పంగన్= బయటికి లాగేట్టుగా; ఈ ద్రుపద+ఆత్మజుఁడు= ఈ శిఖండి; ఎన్నఁడు= ఏనాడు; ఏసెన్?= బాణాలు ప్రయోగించాడు?; దృఢవిముక్తములునున్= గట్టిగా ఎక్కువగా వదలబడ్డవియు; దీప్త+ఆకృతులు= మండుతూ ఉండే ఆకారం కలవియు; లక్ష్యశుద్ధిమంతములును= గురితప్పకున్నట్టివియు; సునిశితములున్+ఐన= బాగా పదునుగలవియునైన; నారసంబులు= బాణాలు; అతనివిగాక= ఆ అర్జునుడివి కాకపోతే; ఏ+విధమునన్= ఏ విధంగా గాని; చూడన్= చూచినప్పటికీ; ఈతనివి= ఈ శిఖండికి సంబంధించినట్టివి; అగున్+ఎ?= అగునా?

**తాత్పర్యం:** భీష్ముడు, దుశ్శాసనుడితో ఇట్లా అంటున్నాడు: 'ఇప్పుడు నా మీదపడ్డ బాణాలు పిడుగుల్లా ఉన్నాయి. ఇవి అర్జునుడు ప్రయోగించిన బాణాలే గాని, శిఖండి వేసిన బాణాలు ఎంత మాత్రం కావుసుమా! ఎండ్రకాయ గర్భంలోనుండే పిండం మాదిరి శరీరాన్ని పేల్చివేస్తున్నది. ఇంత ప్రభావంగల బాణాలు వీడి(శిఖండి)కి ఎక్కడున్నాయి? పలు బ్రహ్మదండాలు పైన పడినట్లు ఆయువు పట్టులందు గాఢంగా నాటి నొప్పిజేసే బాణాలు వేయటానికి వీడి (శిఖండి) చేత ఏమౌతుంది? యముడి దూతలు పలువురు ప్రాణి ప్రాణాలను వెలికిలాగే మాదిరి బాణాలు ఈ శిఖండి ఏనాడు ప్రయోగించగలిగాడు? నాపైన బడ్డ ఈ బాణాలు గట్టిగా ఎక్కువగా వేగంగా వదలబడ్డవి, జ్వలిస్తున్నవి, గురితప్పకుండా ఛేదించేవి, చాలా పదును గల్గినట్టివి, అయిన - ఈ బాణాలు అర్జునుడివే సుమా! మన అనుభవంలో ఏనాడూ శిఖండి ఇట్టి తీవ్రమైన ఆయుధాలు ప్రయోగించినవాడు కాడు. పైగా శిఖండి బాణాలకు ఇంతగట్టితనం, వెలుగు, గురితప్పకుండటం, పదును, లేనేలేవు. ఎన్ని విధాల చూచినా ఈ బాణాలు శిఖండివి కానేకావు.'

**విశేషం:** అలంకారం: మాలోపమ. కర్కటి గర్భము. (ఇది ఒక న్యాయము) ఎండ్రి గర్భం ధరించడం అని అర్థం. ఎండ్రకాయ,గర్భంలో వుండే ప్రాణి, తల్లిఎండ్రిని బ్రద్దలుచేసి బయట పడుతుంది. ఈ బాణాలు మనిషిని చంపిగాని ఇవతలకు రాకున్నవన్నమాట.

బ్రహ్మదండము: బ్రాహ్మణుడి చేత ఉండే యష్టికి సాధారణంగా ఈ పేరు. వసిష్ఠమహర్షిచేతిలోని యోగదండాన్ని కూడా బ్రహ్మదండమంటారు. శ్రీమద్రామయణంలో 'ధి క్బలం క్షత్రియబలం బ్రహ్మతేజోబలం బలమ్। ఏకేన బ్రహ్మదండేన బహవోనాశితా మమ' అని విశ్వామిత్రు డంటాడు. ఒక్క బ్రహ్మదండంతోనే విశ్వామిత్రుడి వాళ్ళు చాలామంది చచ్చారట. ఇక్కడ అనేక బ్రహ్మదండాలతో సాటియైన బాణాలు ఒక్క భీష్ముడి మీద పడ్డాయంటే ఇక వాటి బాధ ఎంతగా వుంటుందో, అట్టి బాధను ఓర్చుకోగలవాడు ఎంత మహావీరుడో ఊహించుకొనవచ్చును. 'జముదూతలట్ల' అని బహువచనంవల్ల, ఒక వ్యక్తిపైన పలువురు యమకింకరులు పడ్డారంటే, ఆ యాతన ఎంతగా ఉంటుందో, అట్టి యాతనను ఓర్చుకోగలిగన దిట్ట ఎట్టి దేవాంశతో పుట్టాడో ఊహించుకోవచ్చు.

శిఖండి వేసినట్టుగా అర్జునుడు, భీష్ముడి మీదికి ప్రయోగించిన బాణాలను, క్రమంగా, అశనికల్పాలు, కర్కటిగర్భం, బ్రహ్మదండాలు, జముదూతలు, అని నాలుగు ఉపమానాలతో క్రమంగా చెప్పబడింది. మొదటి ఉపమానం వలన శరీరంపై భాగానికి బాగా దెబ్బఅని, రెండవ ఉపమానంవల్ల కడుపులో బాధ అని, మూడోదానివలన ఆయువుపట్టుకు ఆపత్తని, నాలుగో ఉపమానం వలన శరీరంలోని ప్రాణాలు బైటపడతాయని సూచిస్తూ ఇన్నిటిని ఓర్చుకోగల్గిన మహానుభావుడు ముమ్మాటికీ దేవాంశ వల్ల పుట్టిన వాడేనని ఊహించుకోవచ్చును. ఇంతకుముందు వచ్చిన ఒక పద్యంలో 'విను సత్యం బిది వీని వింటికెదురన్ విల్లెత్తలేఁ డెవ్వఁడున్' అని భీష్ముడు రారాజుతో అంటాడు. ఈ పద్యంలో అర్జునుడి బాణాల ధాటికి తట్టుకోలేమంటూ నాలుగు ఉపమానాలతో చక్కగా దుశ్శాసనుడికి నొక్కిచెప్పాడు భీష్ముడు. ఈ అనర్థానికి కారకులైన వారిలో ఈ ఇద్దరూ (దుర్యోధన దుశ్శాసనులు) ముఖ్యులు. ఎంతో సామర్థ్యంతో యుద్ధం చేసి, శత్రుసైన్యాన్ని చించి చెండాడి, ఇప్పుడు విరమించుకుంటూ, ఇక మీరు పాండవులను జయించడం కల్ల. సంధి చేసికొని ప్రాణాలతో బ్రతికి బయటపడండి' అనే సంగతిని వారికి చెప్పక చెప్పినట్లు అనిపిస్తుంది.

**క. అనుచుఁ బటుశక్తి నప్పా। ర్థుని వైచిన నది యతండు దునుమాడుడు శాం**
**తనవుఁడు వాలుం బలకయుఁ। గొని యరదము డిగ్గఁజూచుకొలఁదిం బెలుచన్. 407**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని చెపుతూ; పటుశక్తిన్= బలిష్ఠమైన శక్త్యాయుధంతో; ఆ+పార్థుని= ఆ అర్జునుడిని; వైచినన్= విసిరికొట్టగా; అతండు= ఆ అర్జునుడు; అది= ఆ శక్త్యాయుధాన్ని; తునుమాడుడున్= తుంటలు చేయగానే; శాంతనవుఁడు= భీష్ముడు; వాలున్= కత్తిని; పలకయున్= కేడెమును; కొని; అరదము= రథాన్ని; డిగ్గన్= దిగటానికి; చూచుకొలఁదిన్= అనుకొనేంత సమయంలో; పెలుచన్= తేలికగా;

**తాత్పర్యం:** భీష్ముడు దుశ్శాసనుడితో పై విధంగా చెప్తుతూ ఒక దృఢమైన శక్త్యాయుధాన్ని అర్జునుడిపైకి ప్రయోగించాడు. దాన్ని అర్జునుడు తుంటలు చేశాడు. భీష్ముడు కత్తి, డాలు తీసికొని రథంనుండి దిగేటంతలోపలనే, కోపంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **ఏసి యా రెంటిఁ దునియలు సేసి యెలుఁగు । సూపి యే నుండ వెఱ పేల? నాపగాత**
**నూజుఁ బొదువుఁడు మీ' రని యోజఁ జెప్పె । శక్రతనయుండు దనయోధజనుల కెల్ల.** **408**

**ప్రతిపదార్థం:** శక్రతనయుండు= ఇంద్రపుత్రుడు - అర్జునుడు; ఏసి= బాణాలు ప్రయోగించి; ఆరెంటిన్= ఆ కత్తిని, కేడెమును; తునియలు+చేసి= ముక్కలు చేసి; తన యోధ జనులకున్+ఎల్లన్= తన పక్షంలోని వీరులందరికీ; ఎలుఁగున్+చూపి= తన గొంతు సవ్వడి వినిపించి; ఏను+ఉండన్; వెఱపు+ఏల?= భయమెందుకు?; మీరు= మా వైపున ఉండే వీరులైన మీరు; ఆపగాతనూజున్= భీష్ముడిని; పొదువుఁడు= కవియండి; అని; ఓజన్= ఉత్సాహంతో; చెప్పెన్= చెప్పినాడు.

**తాత్పర్యం:** అర్జునుడు బాణప్రయోగం చేసి, భీష్ముడికత్తిని, పలకను పలుకులు చేసి, గొంతెత్తి తనవైపు ఉన్న వీరవరులకందరితో "నేనున్నానుగా? మీకేమి భయం? మీరందరూ భీష్ముడిని కమ్ముకొనండి' అని ఉత్సాహంతో పలికాడు.

**వ.** **అ ప్పలుకు లాకర్ణించి.** **409**

**ప్రతిపదార్థం:** ఆ+పలుకులు= ఆ మాటలు, ఆకర్ణించి= విని.

**తాత్పర్యం:** అర్జునుడన్న ఆ మాటలు యోధులు విని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క.** **ఏయుఁడు పొడువుం డడువుఁడు । వ్రేయుఁ డనుచు వారు జాహ్నవీతనయుఁ గడున్**
**డాయుఁడు, మన సైనికులుం । గో యని తలపడ్డఁ బోరు ఘోరం బయ్యెన్** **410**

**ప్రతిపదార్థం:** వారు= ఆ పాండవయోధులు; ఏయుఁడు= బాణాలు ప్రయోగించండి; పొడువుండు= పొడవండి; అడువుఁడు= కొట్టండి; వ్రేయుఁడు= నరకండి; అనుచున్= అంటూ; జాహ్నవీతనయున్= భీష్ముడిని; కడున్ డాయుఁడు= చాలా దగ్గరికి చేరగా; మన సైనికులున్= మన(కౌరవ) సేనలోనివారున్నూ; కో+అని= 'కో' అని అరుస్తూ; తలపడ్డన్= తాకగా; పోరు= యుద్ధం; ఘోరంబు+అయ్యెన్= భయంకరంగా జరిగింది.

**తాత్పర్యం:** పాండవపక్షంలోని యోధులు 'బాణాలు ప్రయోగించండి. బల్లేలతో పొడవండి. గుదియలతో కొట్టండి. కత్తులతో నరకండి' అని కేకలు వేస్తూ, భీష్ముడికి చాలా దగ్గరికి వచ్చారు. అప్పుడు మన(కౌరవ) సైనికులు కూడా బొబ్బలు పెడుతూ శత్రుసైన్యంతో తలపడ్డారు. దానితో యుద్ధం చాలా భయంకరంగా కనిపించింది.

**వ.** **అప్పుడు.** **411**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కౌరవ పాండవులకు ఘోరంగా యుద్ధం జరిగే ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే.** **ఏసి గాండీవి కురుసేన నెగువ నతని । వారు వెఱవక భీష్మునిఁ జేరి యొడల**
**వ్రేలెఁ డెడ లేనియట్లుగ వివిధభంగి । నిష్ఠురాస్త్రశస్త్రంబుల నినిచి రధిప!** **412**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; గాండీవి= అర్జునుడు; ఏసి= బాణప్రయోగం చేసి; కురుసేనన్= కౌరవుల సైన్యాన్ని; ఎగువన్= తరుమగా; అతనివారు= ఆ అర్జునుడికి సంబంధించిన వీరులు; వెఱవక= భయంలేకుండా; భీష్మునిన్+చేరి= భీష్ముడి దగ్గరకువచ్చి; ఒడలన్= శరీరంమీద; వ్రేలెఁడు+ఎడ= వేలుపట్టే మాత్రంసందు కూడా; లేని+అట్లుగన్= లేకుండా వుండేట్లుగా; వివిధభంగిన్= నానా విధాలుగా; నిష్ఠుర+అస్త్రశస్త్రంబులన్= కఠినములైన బాణాలను ఆయుధాలను; నినిచిరి= నింపేశారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! అర్జునుడు బాగా విజృంభించి, కౌరవ సైనికులను చిందరవందర చేశాడు. అప్పుడు అర్జునుడి పక్షపు వీరులందరూ ఏ మాత్రం జంకూ గొంకూ లేకుండా భీష్ముడికి చాలా దగ్గరగా మూగారు. ఆతడి శరీరంలో వేలెడు చోటు కూడా కాళీ లేకుండా బాణాలతో పరిఘాదులగు ఆయుధాలతో నింపివేశారు.

### భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట (సం. 6-114-80)

**వ. అంతనంశుమంతుండు శాంతుండగుచు వచ్చె; నట్టియెడం గదిసి కవ్వడి గాంగేయుపైఁ గ్రూరనారాచనికరంబు నిగిడించి పడం ద్రోచిన. 413**

**ప్రతిపదార్థం:** అంతన్= ఆ సమయంలో; అంశుమంతుండు= సూర్యుడు; శాంతుండు+అగుచున్‌వచ్చెన్= చల్లబడుతూ వచ్చాడు; అట్టి+ఎడన్= ఆలాంటి సమయంలో; కవ్వడి= అర్జునుడు; గాంగేయుపైన్= భీష్ముడిమీద; క్రూరనారాచనికరంబులు= కఠినములైన బాణాల పరంపరను; నిగిడించి= ప్రయోగించి; పడన్+త్రోచినన్= పడద్రోయగా.

**తాత్పర్యం:** అట్టి సమయంలో తన ప్రతాపాన్ని బాగా చూపిన సూర్యుడు శాంతించి అస్తమించబోతున్నాడు. అప్పుడు అర్జునుడు సమీపానికి వచ్చి భీష్ముడి మీద కఠోరమైన బాణాల వరుసను గుప్పించి, కూలద్రోశాడు.

**క. తూర్పు తలఁ గాఁగ నీ సుతు । లేర్పడఁ గనుఁగొనుచునుండ నిల గంపింపన్**
**దర్పోజ్జ్వలుఁ డా భీష్ముఁ డహర్పతి । యస్తాద్రి సేరునట్లుగఁ బడియెన్. 414**

**ప్రతిపదార్థం:** నీ సుతులు= ధృతరాష్ట్రుడవైన నీ యొక్క కుమారులు; ఏర్పడన్= బాగా తెలిసేటట్టు; కనుఁగొనుచున్+ఉండన్= చూస్తూ ఉండగా; ఇల= భూమి; కంపింపన్= వడకుచుండగా; దర్ప+ఉజ్జ్వలుఁడు= పౌరుషంతో ప్రకాశిస్తుండే; ఆ భీష్ముఁడు; అహర్పతి= సూర్యుడు; అస్త+అద్రి= పడమటికొండను; చేరు+అట్లుగన్= చేరేమాదిరిగా; తూర్పుతలఁగాఁగన్= తూర్పుదిక్కు తల ఉండేటట్లుగా; పడియెన్= పడ్డాడు.

**తాత్పర్యం:** కౌరవకుమారులందరు చూస్తూ ఉండగా, భూమి వణకిపోతూ ఉండగా, దర్పంతో వెలిగే ఆ భీష్ముడు సూర్యుడు పడమటికొండకు చేరే విధంగా, తూర్పుతలగా ఒరిగాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. తనువు ధరఁ బొందకుండఁగఁ దల్పభంగి । శరము లూఁత యై పొలుపారె నరవరేణ్య!**
**యట్లు శరతల్పగతుఁ డగు నమ్మహాను । భావు దేవవ్రతుని దేవభావ మొందె. 415**

**ప్రతిపదార్థం:** నరవరేణ్య!= ధృతరాష్ట్రమహారాజా! తనువు= శరీరం; ధరన్= భూమిని; పొందక+ఉండఁగన్= తాకకుండా ఉండేటట్లుగా; తల్పభంగి= పాన్పుమాదిరి; శరములు= బాణాలు; ఊఁత+ఐ= ఆధారంగా; పొలుపు+ఆరెన్= ఒప్పింది; అట్లు= ఆ విధంగా; శరతల్పగతుఁడు+అగు= బాణాలపాన్పును కలిగినట్టి; ఆ+మహానుభావున్= ఆ మహానుభావుడైన; దేవవ్రతునిన్= భీష్ముడిని; దేవభావము= దేవత్వము(దేవునితనము); ఒందెన్= పొందింది.

**తాత్పర్యం:** భీష్ముడి శరీరం భూమిని తాకకుండా, పానుపుమాదిరి, బాణాలు ఆధారంగా అమరాయి. ఆ విధంగా బాణాల పాన్పుపై పరుండిన ఆ మహాశయుడిని దేవత్వం ఆవహించింది. అంటే ఆయన దేవుడుగా అగుపడ్డాడు.

**చ.** **అనిమిషు లప్డు సూచి 'మృతుఁ డయ్యెడు నక్కట! దక్షిణాయనం**
**బునఁ గృతపుణ్యుఁ డంచు వగఁ బొందిన భీష్ముఁ డెఱింగి వారి కి**
**ట్లను 'సురలార! కాలగతి నాత్మఁ దలంచియ కాదె? మేనిలో**
**నునిచినవాఁడఁ బ్రాణముల నుమ్మలికింపకుఁ డించుకేనియున్.** **416**

**ప్రతిపదార్థం:** అప్డు= ఆ సమయంలో; అనిమిషులు= దేవతలు; చూచి= భీష్ముడు పడటం తిలకించి; అక్కట!= అయ్యో! కృతపుణ్యుఁడు= చేయబడ్డ పుణ్యంకలవాడు(పుణ్యాత్ముడు); దక్షిణ+అయనంబునన్= దక్షిణాయనంలో; మృతుఁడు+అయ్యెడున్= చనిపోతాడు; అంచున్= అనుకొంటూ; వగన్= పరితాపాన్ని; పొందినన్= చెందగా; భీష్ముఁడు; ఎఱింగి; వారికిన్= ఆ దేవతలకు; ఇట్లు+అనున్= ఇట్లా అంటాడు; సురలార!= ఓ దేవతలారా!; కాలగతిన్= కాలముయొక్క గతిని(మరణాన్ని); ఆత్మన్= మనస్సులో; తలంచి+అ+కాదె?= ఎరిగేకదా; ప్రాణములన్= ప్రాణాలను; మేనిలోన్= శరీరంలో; ఉనిచినవాఁడన్= ఉంచికొన్నాను; ఇంచుక+ఏనియున్= కొంచెంకూడా; ఉమ్మలికింపకుఁడు= బాధపడకండి.

**తాత్పర్యం:** ఆ భీష్ముడు నేల కొరగడాన్ని దేవతలు చూచి 'అయ్యో! పాపం ఇతడెంతో పుణ్యాత్ముడే! నరకానికి మార్గమైన దక్షిణాయనంలో మరణిస్తున్నాడే!' అని వాపోవటాన్ని భీష్ముడు తెలిసికొని వారితో 'దేవతలారా! దక్షిణాయనకాలము యొక్క గమనా(మరణాన్ని)న్ని మనస్సున ఎరిగేకదా - ప్రాణాలను నా బొందిలో నిల్పుకొన్నాను. మీరు కొంచెం కూడా విచారించకండి'.

**వ.** **సత్యవతీవివాహం బొనర్చుటకు మాతండ్రి మెచ్చి నా కవధ్యత్వంబును స్వచ్ఛందమరణంబును నిచ్చినవాఁడు గావునఁ దద్వరప్రభావంబున నావధంబున కే నొడంబడక కానేరదయ్యెఁబ్రాణంబులు నా వశంబ' యనిన విని వారలు సంతోషించి రాసమయంబున భాగీరథి పనుపునం గొందఱు మునివరులు హంసరూపంబుల నమ్మహాత్మునకు దక్షిణాయనం బెఱింగింపం జనుదెంచి యతండు దెలిసియునికి నతనిచేత నెఱింగి ప్రియం బంది యేఁగి రట్టియెడ దుర్యోధనుండు వుచ్చిన దుశ్శాసనుండు గుంభసంభవుపాలికింబోయి భీష్ముపాటు సెప్పిన నతండు మూర్ఛిల్లి యొక్కింత దేఱి దీనాననుం డగుచు నమ్మహీనాథుకడకుం జనియె నయ్యవసరంబున.** **417**

**ప్రతిపదార్థం:** సత్యవతీ వివాహంబున్= దాశరాజ కన్యక సత్యవతితో పెండ్లిని; ఒనర్చుటకున్= చేసినదానికి; మా తండ్రి= మా తండ్రి శంతను మహారాజు; మెచ్చి= సంతోషపడి; నాకున్= నాకు; అవధ్యత్వంబును= చంపబడకుండటాన్ని; స్వచ్ఛందమరణంబునున్= ఇష్టం వచ్చినపుడు చనిపోవడాన్ని; ఇచ్చినవాఁడు= ఇచ్చాడు; కావునన్= కాబట్టి; తద్+వరప్రభావంబునన్= ఆ వరాల మహిమవల్ల; నా వధంబునకున్= నా యొక్క మరణానికి; ఏన్+ఒడంబడక= నే నొప్పుకోకుండా; కానేరదు+అయ్యెన్= జరగదాయెను; ప్రాణంబులు= ప్రాణాలు; నా వశంబు+అ= నా అధీనమే; అనినన్= అని చెప్పగా; వారలు= ఆ దేవతలు; సంతోషించిరి; ఆ సమయంబునన్; భాగీరథి పనుపునన్= గంగానది పంపగా; హంసరూపంబులన్= హంసల ఆకారాలతో; కొందఱు మునివరులు= కొంతమంది ఋషిపుంగవులు; ఆ+మహాత్మునకున్= ఆ మహాత్ముడికి; దక్షిణాయనంబు= ఇప్పుడు దక్షిణాయనమని; ఎఱింగింపన్= తెలియచెప్పడానికి; చనుదెంచి= వచ్చి; అతండు= ఆ భీష్ముడు; తెలిసియునికిన్= తెలిసికొని ఉండటాన్ని; అతనిచేతన్= ఆ భీష్ముడిచేత; ఎఱింగి= తెలిసికొని; ప్రియంబు+అంది= సంతోషంచెంది; ఏఁగిరి= వెళ్ళారు; అట్టి+ఎడన్; దుర్యోధనుండు;

పుచ్చిన(న్)= ఆజ్ఞాపించగా; దుశ్శాసనుండు; కుంభసంభవు పాలికిన్= ద్రోణాచార్యుడి దగ్గరకు; పోయి= వెళ్ళి; భీష్మపాటు= భీష్ముడు పడడాన్ని; చెప్పినన్= చెప్పగా; అతండు= ఆ ద్రోణుడు; మూర్ఛిల్లి= మూర్ఛచెంది; ఒక్క+ఇంతన్= ఒక కొంచెం; తేఱి= తెప్పిరిల్లుకొని; దీన+ఆననుండు+అగుచున్= తెల్లబోయిన మొగం కలవాడై; ఆ+మహీనాథుకడకున్= ఆ భీష్ముడి వద్దకు; చనియెన్= వెళ్ళాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయాన.

**తాత్పర్యం:** సత్యవతిని పెండ్లాడడానికి అనుకూలపడటం వల్ల మా తండ్రి శంతనుడు సంతోషపడి నాకు ఎవ్వరిచేతనూ చంపబడకుండటం, నా ఇష్టానుసారంగా చనిపోవటం - అనే రెండు వరాలిచ్చాడు. ఆ వరాల ప్రభావంవల్ల నేననుకొంటేనే గాని నాకు మరణం కలుగదు. నా ప్రాణాలు నా చెప్పుచేతల్లో ఉంటాయి' అన్నాడు భీష్ముడు. దేవతలు విన్నారు - సంతోషపడ్డారుకూడా. అదే సమయంలో గంగానది చెప్పి పంపగా కొందరు ఋషులు హంసల రూపాలలో భీష్ముడి దగ్గరకు అది దక్షిణాయనమని తెల్పడానికి వచ్చారు. భీష్ముడది ఎరిగి ఉన్నాడని అతనివల్లే తెలిసికొని, ప్రియంతో వెళ్ళిపోయారు. అప్పుడు దుర్యోధనుడు ఆజ్ఞచేయగా దుశ్శాసనుడు ద్రోణాచార్యుడి వద్దకు వెళ్ళి, భీష్ముడి పతనాన్ని గూర్చి చెప్పాడు. ద్రోణుడు మూర్ఛపోయి, కొంచెం సేపటికి తెప్పిరిల్లాడు. బిక్కమొగం వేసికొని తొందరగా భీష్ముడి దగ్గరకు వెళ్ళాడు. (ఆ సమయంలో పాండవులు సంతోషపడ్డారు. కౌరవులు ఏడ్చారు.)

**సీ. పాండవేయులు మాత్స్య పాంచాలయాదవ । సహితంబుగా సంతసమునఁ బొదలి;**
**రాదెస బొబ్బలు నార్పులు బహుతూర్య । కోటియుఁ జెలఁగె; నీకొడుకుగమియు**
**నీదిక్కుదొరలును నెలుఁగెత్తి యేడ్వంగ । నంబరచరుల హాహారవంబు**
**లులియంగ రోదసి గలయంతవట్టును । ఘనశబ్దమయమయ్యె మనుజనాథ!**

**తే. కాలుసేయార్చుటలు లేక కన్నుఁగవల । నశ్రు లొలుకంగఁ జిత్తంబు లడలఁ బాండు**
**సూనుతతిఁ జూచుచుండిరి గాని యించు । కయును గడఁగరు మనవారు గయ్యమునకు. 418**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ప్రభువగు ధృతరాష్ట్రా!; ఆ దెస= పాండవపక్షంలో; పాండవేయులు= పాండవుల సంతానము; మాత్స్య= మత్స్య దేశరాజు; పాంచాల= ద్రుపదుడు; యాదవ= యదువంశంవారు; వీరితో; సహితంబుగాన్= కూడుకొన్నట్లుగా; సంతసమునన్= ఆనందంతో; పొదలిరి= ఉప్పొంగిపోయారు; బొబ్బలు= గర్జనలు; ఆర్పులు= బిగ్గరగా అరవటాలు; బహుతూర్య కోటియున్= నానావిధాలైన వాద్య విశేషాల అనేకాలున్నూ; చెలఁగెన్= చెలరేగాయి; నీ కొడుకు గమియున్= నీ కొడుకుల సమూహం; ఈ దిక్కుదొరలును= ఈ కౌరవుల పక్షాన ఉన్న రాజులున్నూ; ఎలుఁగు+ఎత్తి= గొంతెత్తి; ఏడ్వంగన్; అంబరచరులు= ఆకాశంలో తిరిగేవారి యొక్క; హాహారవంబులు= హాహా అనే అరుపులు; ఉలియంగన్= మ్రోయగా; రోదసిగలయంత+పట్టును= భూమి ఆకాశాల మధ్యభాగం అంతా కూడా; ఘనశబ్దమయము+అయ్యెన్= గొప్ప(మేఘములయొక్క అని అర్థాంతరము) ధ్వనితో నిండిపోయింది; మనవారు= కౌరవసేనలోనివారు; కాలు+చే= కాలు చేతులు; ఆర్చుటలులేక= కదలించటాలు లేకుండా; కన్ను+కవలన్= రెండుకళ్ళనుండి; అశ్రులు= కన్నీటిబొట్లు; ఒలుకంగన్= చిందగా; చిత్తంబులు= మనస్సులు; అడలన్= భయంచెందగా; పాండుసూనుతతిన్= పాండవుల సంఘాన్ని; చూచుచుండిరి+కాని= చూస్తూ నిలబడ్డారేగాని; కయ్యమునకున్= యుద్ధానికి; ఇంచుకయున్= కొంచెంకూడా; కడఁగరు= పూనుకొనరు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా!, పాండవులు, వారి సంతానం, మత్స్య ద్రుపద యాదవులతోపాటు ఆనందంతో ఉబ్బిపోయారు. గర్జనలు చేశారు. పొలికేకలు పెట్టారు. దీనికి తోడు వారి బహువిధాలైన భేరీ భాంకారాదుల చప్పుళ్ళు ఉప్పతిల్లాయి. నీ అందరు కొడుకులు, ఈ పక్షంలో ఉండే రాజులు గొంతు విప్పి

బోరుమంటూ ఏడవసాగారు. ఆకాశంలో సంచారం చేసే దేవగంధర్వకిన్నరాదుల హాహాకారాలు దీనికి తోడు కాగా, భూమి ఆకాశాల మధ్య గల భాగమంతా పెద్ద (మేఘ) ధ్వనితో నిండిపోయింది. ఇక మన (కౌరవ) పక్షంలోని వారు కాలు, చేయి కూడా కదల్చలేక పోయారు. కన్నీటి ధారలను కార్చుతున్నారు. మనస్సుల్లో హడలెత్తగా, ఊరకే పాండవుల దండును చూస్తూ ఉండిపోయారే గానీ, యుద్ధం చేయడానికి కొంచెం కూడా యత్నించనే లేదు.

**విశేషం:** 'ఘనశబ్దమయమయ్యె' - గొప్ప ధ్వనితో నిండినదయ్యెను - ఉఱుములతో నిండిన దయ్యెనని అర్థాంతరము, ఘన శబ్దము శ్లిష్ట పదము గొప్పదని, మేఘమని దానికర్థము.

**వ. తదవసరంబున నంబరమణి యపరరత్నాకరంబు సొచ్చె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 419**

**ప్రతిపదార్థం:** తద్+అవసరంబునన్= ఆ సమయంలో; అంబరమణి= సూర్యుడు; అపరరత్నాకరంబున్= పడమటి సముద్రాన్ని; చొచ్చెన్= ప్రవేశించాడు; అనినన్= అని చెప్పగా; విని; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అప్పుడు సూర్యుడు అస్తమించాడు.' అని సంజయు డనటాన్ని విన్నట్టి ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు:

**క. ' నాయుల్ల మరయ నినుమో? । ఱాయో? కా కిట్లు రూపఱక విన నోర్చెన్**
**సాయకసముదయఖరభవ । దీయవచనచయము గవియుదేరం దిర మై. 420**

**ప్రతిపదార్థం:** అరయన్= చూడగా; నా ఉల్లము= నాయొక్క మనస్సు; ఇనుము+ఓ?= ఇనుపముద్దయో?; ఱాయి+ఓ?= బండయో?; కాక= కాకుంటే; సాయక= బాణాలయొక్క; సముదయ= వరుసవలె; ఖర= పదునైన; భవదీయ= నీ నుండి వచ్చేవైన; వచన= మాటలయొక్క; చయము= గుంపు; కవియుదేరన్= వ్యాపిస్తూ ఉన్నప్పటికి; తిరము+ఐ= స్థిరంగా ఉన్నట్టిదై; ఇట్లు; రూపు+అఱక= నశించిపోకుండా; వినన్+ఓర్చెన్= వినగల్గింది.

**తాత్పర్యం:** 'ఓ సంజయా! ఆలోచిస్తే నా మనస్సు (హృదయం) ఇనుప ముద్దయో, రాయియో అయి ఉంటుంది. లేకపోతే అనేక బాణాల వలె కరకైన నీ మాటల వరుసలు నాపై వ్యాపించినా కూడా దిట్టంగా, బద్దలు కాకుండా ఉండి వినగల్గుతున్నది.

**వ. ఇంక నేనేమియుం జెప్పం గొఱంత గలదే' యనుటయు నాసూతనందనుం డి ట్లనునప్పుడు కౌరవులుం దారును దమవారును మైమఱువులూడ్చి యాయుధంబులు వెట్టి గాంగేయుకడకుం బోయిరి. కౌంతేయులు నట్ల బంధుమిత్త్రసహితు లయి యచటికిం జనిరి. ధనంజయుం డొక్కరుండును ధనుష్పాణి యై యరిగె ని ట్లియ్యిరుదెఱంగులవారలుం దత్కాలప్రశాంతస్వాంతులై యన్యోన్యవిషయరోషంబులు దక్కి తన్నుం బరివేష్టించినం గులగురుం డగు నమ్మందాకినీనందనుండు వారి నభినందించి కొలిపించికొని యుండె. 421**

**ప్రతిపదార్థం:** ఇంకన్= ఇకమీద; ఏను= నేను(ధృతరాష్ట్రుడు); ఏమియున్= ఏమైనా; చెప్పన్= చెప్పడానికి; కొఱంత= తక్కువ; కలదు+ఏ?= ఉన్నదా?; అనుటయున్= అని చెప్పగా; సూతనందనుండు= సంజయుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; కౌరవులున్= కౌరవులును; తారును= తామున్నూ; తమవారును= తమకు సంబంధించిన వారున్నూ; మైమఱువులు= కవచాలు; ఊడ్చి= తీసిపెట్టి; ఆయుధంబులు= అస్త్రశస్త్రాలను; పెట్టి= ప్రక్కనపెట్టి; గాంగేయుకడకున్= భీష్ముడివద్దకు; పోయిరి= వెళ్ళారు; కౌంతేయులు= కుంతికొడుకులు; అట్లు+అ= ఆవిధంగా; బంధుమిత్ర సహితులు+ అయి=

చుట్టాలతో, స్నేహితులతోకూడి; అచటికిన్= భీష్ముడున్న ఆ చోటికి; చనిరి= పోయారు; ధనంజయుండు= అర్జునుడు; ఒక్కరుండును= ఒకడు మాత్రం; ధనుస్+పాణియై= విల్లుచేతియందు కలవాడై; అరిగెన్= వెళ్ళాడు; ఇట్లు= ఈ విధంగా, ఆ+ఇరుతెఱంగులవారలున్= ఆ రెండు పక్షాలవారున్నూ; తద్+కాల ప్రశాంత స్వాంతులు+ఐ= ఆ సమయానికి కోపం లేని మనస్సు కలవారై; అన్యోన్య విషయ రోషంబులు= ఒండొరుల విషయమైన కోపం; తక్కి= వదలి; తన్నున్= ఆ భీష్ముడిని; పరివేష్టించినన్= చుట్టి ఉండగా; కులగురుండు+అగు= వంశానికే, (గొప్పవాడు); గురువు అయినట్టి, ఆ+మందాకినీ నందనుండు= ఆ భీష్ముడు; వారిన్= ఆ వచ్చిన కౌరవ పాండవులను; అభినందించి= పొగడి; కొలిపించుకొని యుండెన్= సేవలు చేయించుకొన్నాడు.

**తాత్పర్యం:** ఇంక నేనేమైనా చెప్పడానికి ఉన్నదా?' అన్నాడు ధృతరాష్ట్రుడు. దానికి సంజయుడు ఇట్లా అన్నాడు: 'అప్పుడు తాము కౌరవులు, వారికైనవారు, కవచాలు ఊడదీసిపెట్టి, ఆయుధాలన్నీ ఒకచోట పెట్టి, భీష్ముడి వద్దకు వెళ్ళారు. ధర్మరాజాదులు కూడా తమ బంధువులతో, మిత్రులతో కూడా ఆ భీష్ముడున్న చోటికి వెళ్ళారు. ఒక్క అర్జునుడు మాత్రం ధనుస్సు చేతబట్టుకొని ఆయన దగ్గరికి వెళ్ళాడు. ఇట్లు ఆ ఇరువర్గాలవారున్నూ ఆ సమయానికి వారికి గల కోపాలు మానుకొని ఆ భీష్ముడి చుట్టూ మూగారు. కులానికంతా పెద్దయైన ఆ భీష్ముడు వారిని కొనియాడి, తత్కాలానికి తనకు కావలసిన ఉపచారాలను వారిచే చేయించికొన్నాడు.

**తే. తనకుఁ గ్రిందల యని భవత్తనయులకు నె । ఱుంగఁ జెప్పిన వారు గడంగి మెత్తఁ**
**దనముగల తలగడలు దేఁబనుచుటయును । జూచి చిఱునవ్వుతో సవ్యసాచిఁ బిలిచె.' 422**

**ప్రతిపదార్థం:** తనకున్= భీష్ముడికి; క్రిందల= తల అడుగు భాగం - తలగడ; అని; భవత్తనయులకున్= నీ కొడుకులకు; ఎఱుంగన్+చెప్పినన్= (తనకు తలగడ కావాలని) తెలియచెప్పగా; వారు= నీ కొడుకులు; కడంగి= ప్రయత్నించి; మెత్తఁదనమున్+కల= మృదుత్వం కలిగినట్టి; తలగడలున్= దిండ్లు; తేన్+పనుచుటయునున్= తేవటానికి పంపగా; చూచి= భీష్ముడు తిలకించి; చిరునవ్వుతో; సవ్యసాచిన్= అర్జునుడిని; పిలిచెన్= పిలిచాడు.

**తాత్పర్యం:** భీష్ముడు తనకు తల క్రిందకు దిండు(తలగడ) కావాలని నీ పుత్రులతో చెప్పాడు. వారు మెత్తని దిండ్లు తెండని పనివారికి ఉత్తరువు చేశారు. భీష్ముడు చిరునవ్వుతో అర్జునుడిని చూచి దగ్గరకు పిలిచాడు.

**క. పిలుచుటయు నతఁడు బాష్పము । లొలుకఁగ గాండివము వెట్టి యొయ్యన చనినం**
**'దలగడతూపులు సెజ్జకు । నలవడఁ బెట్టు' మని భీష్ముఁ డాతనిఁ బనిచెన్. 423**

**ప్రతిపదార్థం:** పిలుచుటయున్= పిలువగా; అతఁడు= ఆ అర్జునుడు; బాష్పములు= కన్నీళ్ళు; ఒలుకఁగన్= కారుతుండగా; గాండివమున్= గాండీవమనే తన వింటిని; పెట్టి= ప్రక్కన ఉంచి; ఒయ్యనన్= మెల్లగా; చనినన్= దగ్గరకుపోగా; సెజ్జకున్= పాన్పునకు; తలగడ తూపులు= దిండైన బాణాలు; అలవడన్= తగినట్టుగా; పెట్టుము+అని= ఉంచుము అని; భీష్ముడు; ఆతనిన్= ఆ అర్జునుడిని; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు తనను పిలవగానే, అర్జునుడు కంటనీరు కార్చుకొంటూ, తన గాండీవాన్ని (వింటిని) అవతలపెట్టి, వినయంతో మెల్లగా అతడి దగ్గరకు వెళ్ళాడు. అప్పుడు భీష్ముడు 'ఈ బాణాల పాన్పునకు సరిపడేటట్లుగా తూపుల దిండుపెట్టుము' అని ఆనతిచ్చాడు.

**వ. ఇట్లు పనిచినం బార్థుం డట్ల చేయుదు నని గాండివంబు పుచ్చికొని మఱియు ననుజ్ఞ గొని మూఁడు వాలమ్ము లభిమంత్రించి పెడతలఁ దాకి యెత్తి పట్టుకొని పుంఖంబులు భూమి మోచి నిలుచునట్లుగా నేసినం దాత**

**ప్రీతుండై తల్పంబునకుందగిన యుపధానంబు వెట్టితని యతనిం గొనియాడి సకలపౌత్రులను ధాత్రీపతులను నవలోకించి. 424**

**ప్రతిపదార్థం:** ఇట్లు; పనిచినన్= ఉత్తరువు చేయగా; పార్థుండు; అట్ల చేయుదున్+అని= అట్లే చేస్తానని అంటూ; గాండివంబున్; పుచ్చికొని= తీసికొని; మఱియున్= మరల; అనుజ్ఞన్= ఆజ్ఞను; కొని= పొంది; మూఁడు; వాలు+అమ్ములు= పదునుగల బాణాలు; అభిమంత్రించి= మంత్రంవేసి; పెడతలన్= తలయొక్క వెనుక ప్రక్క; తాఁకి= ముట్టి; ఎత్తిపట్టుకొని= పైకెత్తి పట్టుకొని; పుంఖంబులు= బాణాల క్రిందికొనలు; భూమి(న్)= నేలమీద; మోచి= ఆనుకొని; నిలుచున్+అట్లు+కాన్= నిలబడే విధంగా; ఏసినన్= బాణాలు వేయగా; తాత= పితామహుడైన భీష్ముడు; ప్రీతుండు+ఐ= ప్రీతి చెందినవాడై; తల్పంబునకున్= పానుపునకు; తగిన= తగ్గట్టి; ఉపధానంబున్= తలగడను; పెట్టితి(వి)+అని= పెట్టావని; అతనిన్= ఆ అర్జునుడిని; కొనియాడి= పొగడి; సకలపౌత్రులను= అందరు మనుమలను; ధాత్రీపతులనున్= దొరలను; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** పై విధంగా భీష్ముడు అర్జునుడిని ఆజ్ఞాపించాడు. అట్లే చేస్తానని అర్జునుడు తన గాండీవాన్ని ఎత్తుకొన్నాడు. మళ్ళీ అనుజ్ఞ తీసికొన్నాడు. మూడు పదునుగల బాణాలను బాగా మంత్రించి, భీష్ముడి తలయొక్క వెనుక భాగాన్ని ఎత్తి పట్టుకొని, ఆ మంత్రించిన బాణాలను ప్రయోగించాడు. వాటి కొనలు నేలకు గట్టిగా గుచ్చుకొని, చక్కగా నిలబడ్డాయి. భీష్ముడు చూచి, సంతోషపడ్డాడు. అంపశయ్యకు అనువైన దిండు పెట్టినందుకు అతడిని పొగిడాడు. తన మనుమ లందరనూ దొరలనూ చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ' రవిఁ గొల్చి యుత్తరాయణ । మవునంతకు నంపపాన్పునం దిట్లు మహో**
**త్సవలీల నిలుతు నా కీ । దివసంబులఁ జేయవలయుఁ దృఢతరరక్షన్. 425**

**ప్రతిపదార్థం:** రవిన్= సూర్యుడిని; కొల్చి= ఆరాధించి; ఉత్తర+అయనము= ఉత్తరాయణము; అవు+అంతకున్= అయ్యేటంతవరకు; అంపపాన్పునందున్= బాణాల శయ్యపై; ఇట్లు= ఈ విధంగానే; మహా+ఉత్సవలీలన్= మహానందాన్ని కలిగించే రీతులతో; నిలుతున్= ప్రాణాలతో ఉంటాను; నాకున్= భీష్ముడనైన నాకు; ఈ దివసంబులన్= పాన్పున ఉండే ఈ దినాలలో; తగన్= తగినట్లుగా; దృఢతర రక్షన్= గట్టికాపలాను; చేయవలయున్.

**తాత్పర్యం:** 'సూర్యుడిని ఆరాధిస్తాను. ఉత్తరాయణం వచ్చేదాకా ఈ బాణాల పడకపైన ఇట్లాగే ఉండి ఆనందంతో, ఉత్సాహంతో కాలం గడుపు ఈ దినాలలో నాకు తగినవిధంగా చక్కని కాపలా మీరు ఏర్పాటు చేయాలి.

**క. అలయ కరయ నోపినవా । రలు గ్రక్కునఁ బరిఖతోడి ప్రాకారం బి**
**ట్టలముగఁ గావింపుఁ' డనుడుఁ । దలకొని నీసుతులుఁ బాండు తనయులు భక్తిన్. 426**

**ప్రతిపదార్థం:** అలయక= శ్రమము లేకుండా; అరయన్= చూసుకోవడానికి; ఓపినవారలు= చాలినవారు; గ్రక్కునన్= వెంటనే; పరిఖతోడి= అగడ్తలతో కూడిన; ప్రాకారంబున్= ప్రహరీగోడలను; ఇట్టలముగన్= బాగా ఎత్తుగా; కావింపుఁడు= ఏర్పరచండి; అనుడున్= అని చెప్పగా; భక్తిన్= భక్తితో; నీ సుతులు= నీ కుమారులు, పాండుతనయులు= పాండురాజు కొడుకులు; తలకొని= ప్రయత్నపడి

**తాత్పర్యం:** శ్రమ లేకుండా చూచుకొనగల వారు నాకు బాగా కాపుగా ఉండాలి. వెంటనే అగడ్తలు గల ప్రాకారాన్ని ఎత్తుగా నా చుట్టూ కట్టించండి'. అనగానే భక్తితో కౌరవులు, పాండవులు కూడా ప్రయత్నపడి

**వ. అత్తెఱం గాచరింపనుం దాత్పర్యంబున రక్షింపనుం దమతమయందుఁ దగినవారల నియోగించి రంతఁ జికిత్సకులు వచ్చి శల్యచికిత్స సేసెద మని తొడంగిన గాంగేయుండు వారించి వారి కభిమతార్థంబు లొసంగి వీడుకొల్పె గీతవాద్యనృత్తప్రవీణంబు లగు పాత్రంబు లమ్మహాత్మునకు వినోదంబు సలుపుచుండె నట్టియెడ నాదేవవ్రతుండు నీళ్ళు ద్రావ నడిగినం దనుపారు నీ రనేకులు గొనివచ్చిన నతండు. 427**

**ప్రతిపదార్థం:** ఆ+తెఱంగు= ఆ విధంగా; ఆచరింపనున్= చేయటానికిన్నీ; తాత్పర్యంబునన్= తత్పరతతో; రక్షింపనున్= కాపాడ్డానికి; తమ తమ యందున్= వారి వారిలో; తగినవారలన్= అర్హులైనవారిని; నియోగించిరి= ఏర్పాటు చేశారు; అంతన్= అంతట; చికిత్సకులు= వైద్యులు; వచ్చి= సమీపించి; శల్యచికిత్సన్= ఎముకలకు సంబంధపడిన వైద్యాన్ని; చేసెదము+అని= చేస్తామని; తొడంగినన్= ఆరంభించగా; గాంగేయుండు= భీష్ముడు; వారించి= వద్దని చెప్పి; వారికిన్= ఆ వైద్యులకు, అభిమత+ అర్థంబులు= ఇష్టమైన వస్తువులు; ఒసంగి= ఇచ్చి; వీడుకొల్పెన్= పంపివేశాడు; గీతవాద్యనృత్త ప్రవీణంబులు+అగు= పాటలో; వాద్యంలో; ఆటలో నేర్పరులైన; పాత్రంబులు= వేషధారులు; ఆ+మహాత్మునకున్= ఆ మహానుభావుడి(భీష్ముడి)కి; వినోదంబు= కాలక్షేపాన్ని(వేడుకను); సలుపుచుండెన్= కలిగిస్తూ ఉండిరి; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ దేవవ్రతుండు= ఆ భీష్ముడు; నీళ్ళు= నీటిని; త్రావన్= త్రాగటానికి; అడిగినన్= కోరగా; అనేకులు= చాలామంది; తనుపు+ఆరు= తృప్తిగలిగించే; నీరు= నీళ్ళను; కొనివచ్చినన్= తీసికొని రాగా; ఆతండు= ఆ భీష్ముడు.

**తాత్పర్యం:** అగడ్తతోపాటు ప్రాకారాన్ని కట్టటానికి, కంటిని రెప్పవలె ఏమరకుండా కాపాడుతూ ఉండటానికి, ఇరుపక్షాలవారు (కౌరవపాండవులు) తమలో సమర్థులైన వారిని నియమించారు. ఇంతలో వైద్యులు దెబ్బతిన్న ఎముకలకు వైద్యం చేస్తామంటూ వచ్చారు. భీష్ముడు వైద్యం అక్కరలేదంటూ, వారికి కావలసిన అమూల్యాలైన వస్తువుల నిచ్చి సత్కరించి పంపించివేశాడు. సంగీతం పాడేవారు, వీణా వేణు మృదంగాది వాద్యాలు బాగా వాయించేవారు, నాట్యం, అభినయం బాగా చేయగలవారు ఆ మహనీయుడికి ఉబుసుపోక (వేడుక)ను కల్గిస్తున్నారు. ఇంతలో ఆతడికి (భీష్ముడికి) గొంతెండిపోయింది. త్రాగటానికి నీళ్ళు కావాలన్నాడు. చాలామంది చల్లని పానీయాలు తెచ్చి ఇచ్చారు. కాని ఆతడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'వినుఁడు శరతల్పగతుఁడ నై యునికిఁజేసి । యన్యసలిలంబు సేవించు టనుచితంబు**
**నాకుఁదేజోమయాస్త్రవిన్యాసవిధి స । ముత్థితం బైన భూజల మొకఁడు దక్క'. 428**

**ప్రతిపదార్థం:** వినుఁడు= వినండి; శరతల్పగతుఁడన్+ఐ= బాణాల పాన్పులో పడుకొన్నవాడనై; ఉనికిన్+చేసి= ఉండే కారణం వల్ల; నాకున్= నాకు; తేజోమయ= తేజస్సుతో నిండిన; అస్త్ర= మంత్రపూతమైన బాణం యొక్క; విన్యాసవిధి= ప్రయోగించే విధానము చేత; సముత్థితంబు+ఐన= పుట్టినట్టి; భూజలము= భూమిలోపలినుండి వెలువడినట్టి నీరు; ఒకఁడు= ఒకటి; తక్కన్= తప్ప; అన్యసలిలంబు= ఇతరమైన నీరు; సేవించుట= త్రాగుట; అనుచితంబు= తగదు.

**తాత్పర్యం:** 'వినండి. నేనిప్పుడు బాణాల పాన్పుపై పడుకొని ఉన్నాను కాబట్టి, తేజోమయమైన బాణాన్ని ప్రయోగించడం వల్ల భూమి లోపలినుండి వెలికి పుట్టుకొనివచ్చే నీళ్ళను మాత్రమే త్రాగుతాను కానీ ఇతరమైన నీటిని త్రాగను. కావున మీరిచ్చిన ఈ నీరు నాకు తగదు'.

**తే. అనుటయుఁ గౌరవులును దక్కటి రాజులును వెఱఁగుపడియున్నం గవ్వడిం గనుంగొని గాంగేయుండు. 429**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; కౌరవులును(న్)= దుర్యోధనుడు మున్నుగా గలవారు; తక్కటి రాజులును= ఇతరులైన దొరలున్నూ; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; ఉన్నన్= ఉండగా; గాంగేయుండు= భీష్ముడు; కవ్వడిన్= అర్జునుడిని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** ఆ మాటలు విని కౌరవులు, వారివైపుండే దొరలందరు ఆశ్చర్యపోగా; ఆ సమయంలో భీష్ముడు అర్జునుడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ' శరవేదన సర్వాంగము । లెరియఁగ నా కిపుడు పెదవు లెండెడుఁ దృష్ణా**
**భర ముడుపఁదగిన నీళులు । వెరవునఁ దే నేర్తు వీవ వే తె మ్మనఘా!' 430**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపంచేయని అర్జునా!; శరవేదనన్= బాణాల వలని బాధవల్ల; సర్వ+అంగములున్= శరీరభాగాలన్నీ; ఎరియఁగన్= మండుతూ ఉండగా; ఇపుడు; నాకున్; పెదవులు; ఎండెడున్= ఎండిపోతున్నాయి; ఈవు+అ= నీవే; తృష్ణాభరము= దప్పి యొక్క అతిశయాన్ని; ఉడుపన్= పోగొట్టడానికి; తగిన= అనువైన; నీళులు= నీళ్ళు; వెరవునన్= ఉపాయంతో; తేనేర్తువు= తీసికొని రాగలవు; వేతెమ్ము= వేగంగా తీసికొనిరా.

**తాత్పర్యం:** 'అర్జునా! బాణాల బాధవల్ల నా శరీరమంతా మండిపోతున్నది. దప్పిక ఎక్కువైనది. పెదవులు కూడా ఎండిపోతున్నాయి. నా ఈ సహింపరాని దప్పికను పోగొట్టటానికి తగినట్టి నీటిని ఉపాయంతో తేవటానికి నీ కొక్కడికే చేతనౌతుంది. కనుక, ఆలస్యం చేయకుండా నాకు తగ్గనీరు తీసికొనిరమ్ము.'

**వ. అనిన నట్లకాక యని యతం డతనికిం బ్రదక్షిణంబు సేసి తేజోమయంబయిన మార్గణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబు గావించి మహీతలంబు గాఁడనేసిన భాసురచ్ఛాయం బగుతోయంబు ధారా రూపంబున దివ్యగంధరసోపేతం బయి యెగసిన. 431**

**ప్రతిపదార్థం:** అనినన్= అనిచెప్పగా; అట్ల+కాక అని = ఆ విధంగానే అగునుగాక అని; అతండు= ఆ అర్జునుడు, అతనికిన్= ఆ భీష్ముడికి; ప్రదక్షిణంబు+చేసి= చుట్టూ తిరిగి; తేజోమయంబు+అయిన= తేజోరూపమైనట్టి; మార్గణంబున్= బాణాన్ని; పర్జన్యమంత్ర= వర్షాధిదేవత ఇంద్రుడు దేవతగా గల మంత్రాలతో; అభిమంత్రితంబున్= బాగా మంత్రింపఁబడిన దానినిగా; కావించి= చేసి; మహీతలంబున్= నేలమీదను; కాడన్= సందుపడేట్టుగా; ఏసినన్= ప్రయోగింపగా; భాసురచ్ఛాయంబు+అగు= పటికరాయి కాంతివంటి కాంతిగల; తోయంబు= నీరు; ధారారూపంబునన్= ప్రవాహరూపంగా; దివ్య గంధరస+ఉపేతంబు+అయి= దివ్యమైన వాసనతో, రుచితో కూడినదై; ఎగసినన్= పైకిరాగా.

**తాత్పర్యం:** పై విధంగా భీష్ముడు చెప్పగా, అర్జునుడు అలాగే చేస్తానని భీష్ముడికి ప్రదక్షిణం చేశాడు. తేజోరూపంగా ఉండే ఒక బాణాన్ని తీసికొన్నాడు. దాన్ని మేఘాలకునాయకుడైన ఇంద్రుడు దేవతగా గల మంత్రాలతో బాగా మంత్రించాడు. ఆ బాణాన్ని నేలలో బాగా గుచ్చుకొనేటట్లుగా ప్రయోగించాడు. దానితో, పటిక మాదిరి తెల్లగా ఉండే నీరు పైకి ఎగజిమ్మినది. దివ్యమైన సువాసన, రుచి కలిగి ఉన్న నీరు ప్రవాహరూపంగా పైకిరాగా.

**ఆ. కౌరవులు ప్రకంపగాఢ విస్మయు లైరి । పాండుసుతులు వారిబలము నుబ్బి**
**యార్చి సంకు లొత్తి రా జలంబుల నమ్మ । హాత్ముఁ దృప్తుఁ జేసె నర్జునుండు. 432**

**ప్రతిపదార్థం:** కౌరవులు= ధార్తరాష్ట్రులు; ప్రకంపగాఢ విస్మయులు= ఎక్కువ వణకు, అధికంగా ఆశ్చర్యం కలవారు; ఐరి= అయ్యారు; పాండుసుతులు= పాండురాజు కొడుకులు; వారి బలము= ఆ పాండవుల సేన; ఉబ్బి= సంతోషపడి; ఆర్చి= బొబ్బలు పెట్టి; సంకులు= శంఖాలు; ఒత్తిరి= ఊదారు; అర్జునుండు; ఆ జలంబులన్= పాతాళం నుండి వచ్చిన ఆ నీటితో; ఆ+మహాత్మున్= మహాత్ముడైన ఆ భీష్ముడిని; తృప్తున్= తృప్తి చెందినవాడినిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** కౌరవులకు బాగా వణకు, ఆశ్చర్యం కలిగింది. పాండవులు, వారి బలగం సంతోషంతో ఉబ్బిపోయారు. గర్జించారు. శంఖాలు పూరించారు. అర్జునుడు ఆ జలంతో భీష్ముడికి తృప్తి కలిగించాడు.

**వ. ఇట్లు తృప్తిఁ బొంది మందాకినీనందనుండు పురందరనందనున కి ట్లనియె. 433**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా మందాకినీ నందనుండు= భీష్ముడు; తృప్తిన్= తనివిని; పొంది= చెంది; పురందర నందనునకు(న్)= అర్జునుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు, ఈ విధంగా పైకి వచ్చిన నీరు త్రాగి తృప్తి చెంది అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**ఉ. ' నారదుచేత నిన్ను మునినాథునిఁ గాఁగ నెఱింగి యుండుదున్**
**శౌరియు నీవుఁ గూడిన నసాధ్యము లెవ్వియు లేవు దర్పదు**
**ర్వారుఁడ వైన నీవలనివైరము గీ డని చెప్పఁ జెప్ప నీ**
**కౌరవరాజు మానఁడు దెగం జెడుఁ గా కిటమీఁద భీముచేన్.' 434**

**ప్రతిపదార్థం:** నిన్నున్; నారదుచేతన్= నారదమహర్షివల్ల; మునినాథునిన్+కాఁగన్= ఋషిపుంగవుడినిగా; ఎఱింగి ఉండుదున్= తెలిసికొని ఉన్నాను; శౌరియున్= శ్రీకృష్ణుడున్నూ; నీవున్+కూడినన్= నీవున్నూ చేరితే; అసాధ్యములు= సాధింపరానివి; ఎవ్వియున్ లేవు= ఏవీకూడా ఉండవు; దర్ప దుర్వారుఁడవు+ఐ= గర్వంచేత అడ్డగింపరానివాడవైన; నీవలని వైరమున్= నీతోడి విరోధం; కీడు+అని= చెడుపు అని; చెప్పన్ చెప్పన్= ఎంతగా చెప్పినా కూడా; ఈ కౌరవరాజు= ఈ దుర్యోధనుడు; మానఁడు= వదలిపెట్టడు; ఇటమీఁదన్= ఇకపైన; భీముచేన్= భీముడిచేత; తెగన్+చెడున్+కాక= సమూలంగా నశించిపోతాడు.

**తాత్పర్యం:** 'అర్జునా! నీవు నరనారాయణావతారంలోని నరుడనే మహర్షివని నారదుడు చెప్పగా విని ఉన్నాను. నీవు, శ్రీకృష్ణుడు ఒకచోట చేరారంటే ఇంక మీకు సాధ్యం కాని పనులంటూ ఏవీ ఉండవు. గర్వంతో ని న్నెవరూ ఏమీ చేయలేరు. నీ తోడి విరోధం నాశనానికి కారణమని ఎన్నో మార్లు చెప్పినా ఈ దుర్యోధనుడు నీతో విరోధం మానుకోలేదు. ఇక ఇతడు భీముడిచేత బొత్తిగా సమూలంగా వినాశం పొందుతాడు.'

**వ. అని పలికి దీనమానసుం డగుచున్న భవత్సూనుతో ని ట్లనియె. 435**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; దీన మానసుండు+అగుచున్న= చిన్నపోయిన మనస్సు కలవాడౌతున్న; భవత్+సూనుతోన్= నీ కొడుకుతో; ఇట్లు+అనియెన్= ఈ మాదిరి అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు అర్జునుడితో పై రీతిగా చెప్పగా మనస్సు చిన్నబుచ్చుకొని ఉన్న నీ కుమారుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**మ. ' నరుఁ డత్యద్భుతవిక్రముం డతని కానారాయణుం డాప్తుఁ డె**
**వ్వరికిన్ వీరి జయింపరాదు సమరావష్టంభముం దక్కి ధ**
**ర్మరతుం డైనయజాతశత్రునకు నింద్రప్రస్థ మి మ్మర్థరా**
**జ్యరమం బొందుము మీరు గొందఱయినం జాకున్న నీ కొప్పదే?' 436**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; అతి+అద్భుతవిక్రముండు= మిగుల ఆశ్చర్యకరమైన పరాక్రమం కలవాడు; అతనికిన్= ఆ అర్జునుడికి; ఆ నారాయణుండు= జగత్ప్రసిద్ధి చెందిన కృష్ణుడు; ఆప్తుఁడు= ఎప్పుడు వదలక వెంట ఉండేవాడు; వీరిన్=

అట్టి ఇద్దరినీ; ఎవ్వరికిన్= ఎట్టి శూరులకు గాని; జయింపన్+కాదు= జయించడానికి సాధ్యంకాదు; సమర+అవష్టంభమున్= యుద్ధసంబంధమైన గర్వా (ప్రయత్నా)న్ని; తక్కి= వదలిపెట్టి; ధర్మరతుండు+ఐన= ధర్మమందు ఆసక్తిగల; అజాతశత్రునకున్= శత్రువులే లేనట్టి ధర్మరాజుకు; ఇంద్రప్రస్థము+ఇమ్ము= ఇంద్రప్రస్థాన్ని ఇచ్చివేయుము; అర్ధరాజ్యరమన్= సగపాలు రాజ్యలక్ష్మిని; పొందుము= కలిగి ఉండుము; కొందఱు+అయినన్= కొంతమందైనప్పటికీ; మీరు= కౌరవులు; చాక+ఉన్నన్= చావకుండా వుంటే; నీకున్; ఒప్పదు+ఏ?= ఒప్పిదం(సమ్మతం) కాదా?

**తాత్పర్యం:** 'అర్జునుడు చాలా ఆశ్చర్యం కొలిపే పరాక్రమం కలిగినవాడు. అతడికి అనుక్షణం తోడు నీడగా ఉండేవాడు ప్రఖ్యాతి కెక్కిన శ్రీకృష్ణుడు - సాక్షాత్తు నారాయణమూర్తి. ఇక వీరిద్దరూ ఏకమై నిలిస్తే ఎంత గొప్ప వీరులైనా జయించలేరు. కాబట్టి అట్టి యుద్ధ ప్రయత్నాన్ని, గెలుస్తామనే గర్వాన్ని ఇకనైనా విడిచిపెట్టుము. ధర్మదేవత అంశాన పుట్టినవాడు, పుట్టని శత్రువులు గలవాడు అయిన ఆ ధర్మరాజుకు ఇంద్రప్రస్థాన్ని ఇచ్చివేయుము. మిగిలిన సగంరాజ్యాన్ని నీవు ఏలుకొమ్ము. యుద్ధాన్ని చాలిస్తే మీలో కొందరైనా బ్రతుకుతారు కదా! అది నీకు మంచిది.'

**విశేషం:** నరుఁడు: అద్భుత విక్రముడు; నారాయణుడు: ఆప్తుడు; ధర్మరతుడు - అజాతశత్రుడు; ఇవి సాభిప్రాయాలు. నరుడు నరనారాయణులలో ఒకడు. అనగా భగవంతుడి అంశతో పుట్టినాడనుట. అద్భుత విక్రముడే అంపశయ్యకు అనువైన తలగడ ఏర్పాటు చేయటం, పాతాళగంగను పైకి రప్పించటం వంటి అద్భుతకార్యాలను చేయగలడు. నారాయణుడు సాక్షాత్తు పరమాత్మస్వరూపుడు - ఆప్తుడు - భగవంతుడే ఆప్తుడైన వారికి కొదవేమిటి? ధర్మరతుడు - ధర్మరాజు ధర్మం వదలనివాడు, **'యతో ధర్మస్తతో జయః'** అనే వాక్యం వల్ల **'యత్రయోగేశ్వరః కృష్ణః యత్ర పార్థో ధనుర్ధరః తత్ర శ్రీర్విజయోభూతిః ధ్రువా నీతిర్మతిర్మమ.'** అనే న్యాయం చేత పాండవులకు విజయం తప్పదని సూచిస్తున్నాడు. అజాతశత్రుడు: సహజంగా ఆయనకు శత్రువులంటూ ఎవరూలేరు- 'నీ మూర్ఖత్వం వలన యుద్ధం ఏర్పడింది. ఇకనైనా వైరం మానుకొని ఇంద్రప్రస్థం వారికిచ్చి, మిగిలిన సగం రాజ్యాన్ని ఏలుకుంటూ మిగిలిన మీ వారితో సుఖంగా ఉండుము అని భీష్ముడు దుర్యోధనుడికి బుద్ధి చెప్పాడు.

**వ. అని పలికి యూరకుండెం; గౌరవ పాండవులును మాఱు పలుకక యతనికి నమస్కరించి నిజనివాసంబులకుం జని; రట్లు సనునెడ గోవిందుండు కౌంతేయాగ్రజుం గనుంగొని. 437**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని చెప్పి; ఊరక+ఉండెన్= ఏమీ మాట్లాడకుండా ఉన్నాడు; కౌరవపాండవులును= కౌరవులు, పాండవులు; మాఱుపలుకక= బదులుమాట్లాడక; అతనికిన్= ఆ భీష్ముడికి; నమస్కరించి; నిజనివాసంబులకున్= తమతమ ఉనికిపట్టులకు; చనిరి= వెళ్ళారు; అట్లు= ఆ విధంగా; చను+ఎడన్= వెళ్ళే సమయంలో; గోవిందుండు= కృష్ణుడు; కౌంతేయ+అగ్రజున్= కుంతి కొడుకులలో పెద్దవాడైన ధర్మరాజును; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** భీష్ముడు పై విధంగా దుర్యోధనుడికి బుద్ధి చెప్పి, ఏమీ పలకకుండా ఊరుకొన్నాడు. కౌరవులు, పాండవులు కూడా ఏమీ బదులు చెప్పకుండా భీష్ముడికి నమస్కారాలు చేసి వారి వారి నివాసాలకు వెళ్ళిపోయారు. అట్లా పోతూ ఉండేటప్పుడు శ్రీకృష్ణుడు ధర్మరాజును చూచి (ఇట్లా అన్నాడు.)

**క. ' సురలకు నజయ్యుఁ డగు నీ । సురసరిదాత్మజుని గెలువఁ జొప్పడునే? యె**
**వ్వరికైన నద్భుతావహ । పరికరులగు మీకుఁ దక్కఁ బౌరవముఖ్యా!' 438**

**ప్రతిపదార్థం:** పౌరవముఖ్యా!= పురువంశంలో ప్రముఖుడైన ధర్మరాజా!; సురలకున్= దేవతలకు; అజయ్యుఁడు+అగు= జయించటానికి అసాధ్యుడైన; ఈ సురసరిత్+ఆత్మజునిన్= దేవనది కొడుకైన ఈ భీష్ముడిని; గెలువన్= జయించటానికి;

అద్భుత+ఆవహపరికరులు+అగు= ఆశ్చర్యం కలిగించే; ఆయుధాలు, పరివారం కల్గినట్టి; మీఁకున్+తక్కన్= మీకుతప్ప; ఎవ్వరికిన్+ఐనన్= ఏ వీరులకైనా; చొప్పడును+ఏ?= సరిపడునా? (సరిపడదు)

**తాత్పర్యం:** 'ధర్మరాజా! భీష్ముడిని, గెలవటానికి దేవతలకు కూడా అలవికాదు. అట్టివానిని జయించడానికి ఆశ్చర్యకరములైన అస్త్రశస్త్రాది పరికరాలు, పరివారాలు కలిగి ఉండే మీకు తప్పితే, మరెవ్వరికీ శక్యంగాదు.'

**క. అనుటయు నతఁడిట్లను 'నే । మనఁగా నొక మానిసులమె? యప్రతిహతవీ**
**రుని నిన్నుఁ బడసి యింతటి । పనులకుఁ జాలితిమి గాక భక్తాధీనా! 439**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని శ్రీకృష్ణుడంటే; అతఁడు= ఆ ధర్మరాజు; ఇట్లు+అనున్= ఇట్లా అంటాడు; భక్త+అధీనా!= భక్తులకు అధీనుడవైన కృష్ణా!; ఏము+అనఁగాన్= మేమంటే; ఒక మానిసులము+ఎ?= మానవమాత్రులమే?; అప్రతిహతవీరునిన్= అడ్డులేని వీరుడవైన; నిన్నున్= శ్రీకృష్ణుడవైన నిన్ను; పడసి= పొంది; ఇంతటి పనులకున్= ఇంతింత గొప్ప పనులకు; చాలితిమి+కాక= సమర్థులమయ్యాము తప్ప వేరుకారణం లేదు.

**తాత్పర్యం:** కృష్ణుడు పై విధంగా అన్నప్పుడు ధర్మరాజు అంటున్నాడు. 'భక్త పరాధీనుడవైన కృష్ణా! మేమంటే మనుష్య మాత్రులమే కదా! ఎదురులేని పరాక్రమం గల నీవు మాకు చేదోడు వాదోడుగా ఉండటం బట్టిగానీ, లేకుంటే ఇంతింత అసాధ్యాలైన పనులు చేయగలిగేవాళ్ళమా?'

**కర్ణుఁడు భీష్మునియొద్దకుఁ బోయి వినతుం డగుట (సం. 6-117-1)**

**వ. అని యిట్లయ్యిరువురు నొండొరులం బ్రశంసించుచు నఖిలజన పరివృతు లై శిబిరంబుల కరిగిరి తదనంతరంబ కర్ణుండు గాంగేయుకడకుం బోయి భక్తివినయంబులు దోఁపం బాదప్రణామం బాచరించి. 440**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరున్నూ; ఒండొరులన్= ఒకరినొకరు; ప్రశంసించుచున్= పొగడుకుంటూ; అఖిలజన పరివృతులు+ఐ= సమస్తజనంచేత చుట్టబడినవారై; శిబిరంబులకున్= తమ గుడారములకు; అరిగిరి= పోయారు; తద్+అనంతరంబు+అ= ఆ వెనువెంటనే; కర్ణుండు= రాధేయుడు; గాంగేయుకడకున్= భీష్ముడివద్దకు; పోయి; భక్తివినయంబులు= భక్తియు, వినయమున్నూ; తోఁపన్= తెలిసేట్లుగా; పాదప్రణామంబు= అడుగులకు నమస్కారాన్ని; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** ఈ ప్రకారం కృష్ణుడు, ధర్మరాజు ఒకరినొకరు పొగడుకొంటూ, జనమంతా మూగిరాగా తమ స్థావరాలకు వెళ్ళారు. ఆ వెంటనే కర్ణుడు భీష్ముడి దగ్గరకువచ్చి భక్తి వినయాలతో ఆయనకు సాష్టాంగ నమస్కారం చేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. ' అలుక దక్కి నన్ను నధికవాత్సల్యశీ । తలము గాఁగఁ జూచి తగినమాట**
**లాడవే? మహాత్మ!' యనుటయు నాతండు । గారవమున నతనిఁ జేరఁ బిలిచి. 441**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= మహానుభావా!; అలుక+తక్కి= కోపం విడిచిపెట్టి; అధికవాత్సల్య శీతలము+కాఁగన్= మిక్కుటమైన పుత్రాదులందుండెడు స్నేహంతో చల్లగా; చూచి; తగిన మాటలు= ఉచితమైన మాటలు; ఆడవు+ఏ?= పలుకవా?; అనుటయున్= అనిచెప్పగానే; ఆతండు= ఆ భీష్ముడు; గారవమునన్= గౌరవంతో; అతనిన్= ఆ కర్ణుడిని; చేరన్+పిలిచి= దగ్గరకు రమ్మని పిలిచి.

**తాత్పర్యం:** 'కోపం మానుకొని, పుత్రవాత్సల్యంతో, చల్లని చూపుతో చూచి, ఒప్పిదమైన పలుకులతో నను పలుకరింపవా మహాత్మా!' అని కర్ణు డనగానే భీష్ముడతడిని దగ్గరకు రమ్మని పిలిచి. (తరువాతి పద్యంతో అన్వయం).

పలాశవాన్ అనునది ద్రోణపర్వమునకు వేయబడిన విశేషణము. పలాశము అనగా 1. పచ్చనిది; 2. క్రూరమైనది - నిర్ఘృణమైనది; 3. ఒక రాక్షసుడు; 4. కింశుకము; 5. పత్రము, రేకు మున్నగు అర్థములను ఆప్టే నిఘంటువు ఇచ్చుచున్నది. ద్రోణపర్వమునకు ఈ విశేషణ మెంతయు తగియున్నది. ద్రోణపర్వమునందు విస్తారముగా వీరుల నాశము జరిగినది. ఉభయ పక్షయోధులును క్రౌర్యావిష్టులై జయము గొనుటకై పోరాడిరి. కావున ఈ పర్వము క్రౌర్యభూయిష్ఠ మనుట యుక్తమే. ఇందు రాక్షసులైన అలంబుస ఘటోత్కచులు హెచ్చుగా విజృంభించి మరణము నొందిరి. కౌరవ పాండవ వాహినులు అపారముగా మడిసి రక్తనదులు ప్రవహించుటచే ఈ పర్వము కింశుకమువంటి దనుటయు చారుభీషణముగా ఉన్నది. ద్రోణాచార్యుడు సేనానిగా ఉన్నప్పుడు విస్తారముగా జననాశమైనట్లు వ్యాసమహర్షి వివరించెను.

''ద్రోణపర్వం తత శ్చిత్రం బహువృత్తాంత ముచ్యతే
సప్తమం భారతే పర్వ మహ దేత ముదాహృతమ్
యత్ర తే పృథివీపాలాః ప్రాయశో నిధనం గతాః'. **(సం. 1-2-254)**

(శ్రీమదాంధ్ర మహాభారతము (ఆం.ప్ర.సా.అ. ప్రచురణ 1971) ద్రోణపర్వము - ఉపోద్ఘాతము పు. 1-2)

ద్రోణపర్వంలోని క్రూరస్వభావం రౌద్రరస స్వభావమే. రక్తపాతం రౌద్ర కర్మఫలితమే. ఈ స్వభావాన్ని బట్టి పరిశీలించి చూస్తే రౌద్రరస విభూతి ప్రదర్శనమే ద్రోణపర్వ రసశిల్పం.

సంస్కృత మహాభారతంలోని ద్రోణపర్వంలో ఎనిమిది ఉపపర్వా లున్నాయి. అవి: ద్రోణాభిషేకం, సంశప్తక వధ, అభిమన్యు వధ, ప్రతిజ్ఞాపర్వం, జయద్రథవధ, ఘటోత్కచ వధ, ద్రోణ వధ, నారాయణాస్త్ర ప్రయోగం. నన్నయ ఈ ప్రధానాంశాలను వివరిస్తూ మరికొన్ని విశేషాలను సర్వపర్వ సంగ్రహవచనంలో పేర్కొన్నాడు. తిక్కన ఆ అంశాల నన్నింటిని తన రచనలో సందర్భోచితంగా వివరించి రచించాడు. అంతేకాక తన రచన కొక కావ్య కళా సౌందర్యాన్ని కల్పించి వన్నె పెట్టాడు.

రౌద్రరస ప్రధానమైన ఈ కథ తద్రసాధిదేవత అయిన పరమేశ్వర మహత్త్వ కీర్తనంతో, శరణాగత భక్తితత్త్వంతో ముగుస్తుంది. రుద్రుడు అష్టరూపుడు. అష్టవిధ రౌద్రముద్రితంగా సంస్కృత ద్రోణపర్వం ఉపపర్వాష్టకంతో రాణిస్తున్నట్లు చిత్రించబడింది. తిక్కన దానిని పంచాశ్వాస పరివ్యాప్తమైన ప్రబంధంగా రూపొందించటమే కాకుండా పంచాంక వినిర్మితమైన దృశ్యకావ్యంగా భాసింపచేసి ఉభయకవిత్వతత్త్వ విభవోజ్జ్వలు డనిపించుకొన్నాడు.

## 2. ద్రోణుడి చరిత్రలో క్రోధ బీజం:

భారత వీరులలో భీష్ముడి తరువాత గౌరవపాత్రుడు ద్రోణుడు. అతడి పుట్టుక విచిత్రం. అతడి చరిత్ర విశిష్టం. వాత్సల్య స్నేహ రసాల కుదురులో ఉద్భవించిన ద్రోణుడు క్రోధబీజంతో మొలకెత్తిన జీవన వృక్షాన్ని ధర్మరక్షణతో పెంచాడు.

భరద్వాజ మహర్షి సద్వినుత చరిత్రుడు. పుణ్యాత్ముడు. గంగాస్నాన సందర్భంలో జలక్రీడ లాడుతున్న ఘృతాచిని చూచి కామోద్రిక్తుడయ్యాడు. తత్క్షణమే శుక్లపాతమయింది. దానిని ఆతడు ద్రోణంలో సంగ్రహించి రక్షించాడు. ఆ పుణ్యమూర్తి వత్సలరసం కారణంగా ద్రోణుడి జన్మ ద్రోణంలో జరిగింది. అందువలన ద్రోణుడు సార్థక నామధేయు డయ్యాడు.

భరద్వాజుడికి ఒక ప్రాణమిత్రు డున్నాడు. అతడి పేరు వృషతుడు; పాంచాల రాజు. అత డొకనాడు తోటలో పూలుసేకరిస్తున్న మేనకను చూచి మదనావేశం పొంది రేతస్స్కందనానికి గురి అయ్యాడు. నేలపై బడిన రేతస్సును పాదంతో కప్పి ఉంచాడు. ఆ రేతస్సునుండి ద్రుపదుడు పుట్టాడు. ఆప్తమిత్రుల పుత్రు లిద్దరూ మిత్రులుగా కలసి మెలసి పెరిగారు. భరద్వాజాశ్రమంలో కలిసి వేదవిద్యనూ, ధనుర్వేదాన్నీ అధ్యయనం చేసి పండితులయ్యారు. అంతలో వృషతుడు మృతుడయ్యాడు. ద్రుపదుడు పాంచాల రాజ్యానికి రాజయ్యాడు. మిత్రుడైన ద్రోణుడికి స్నేహాహ్వానాన్ని అందించాడు. వారిరువురు కారణజన్ములు. ద్రోణుడు

శుక్రాచార్యాంశంలోను, ద్రుపదుడు వాయుదేవుడి అంశంలోనూ పుట్టారు. వారి ప్రవృత్తులు కూడా ఆయా అంశలకు అనుగుణంగానే ఉండటం సహజం కూడా.

ద్రోణుడు భరద్వాజుడివలన సకల ధనుర్విద్యలు నేర్చికొని అగ్నివేశుడనే మహర్షిని సేవించి అనేక దివ్యాస్త్రాలను పొందాడు. తండ్రి ఆనతి మేరకు కృపాచార్యుడి చెల్లెలైన కృపిని వివాహమాడి అశ్వత్థామను పుత్రుడిగా పొందాడు. అయితే ద్రోణుడు ఎంతటి విద్యావంతుడైనా పేదరికంలో మగ్గుతూ ఉండేవాడు. మహేంద్రాచలంలో తపస్సు చేసికొంటున్న పరశురాముడు బ్రాహ్మణులకు కోరిన సంపద లిస్తున్నాడని విని, ఆయనను ఆశ్రయించి సంపద నర్థించాడు. అయితే అప్పటికే ఆయన సంపదలన్నింటిని దానంచేశాడు. ధాత్రిని కూడా కశ్యపుడికి ఇచ్చివేశాడు. ఇక మిగిలినవి శరీరం, శస్త్రాలు. ఆ రెండింటిలో దేనినైన కోరుకొమ్మన్నాడు పరశురాముడు. అప్పుడు ద్రోణుడు -

క. ' ధనములలో నత్యుత్తమ । ధనములు శస్త్రాస్త్రములు; ముదంబున వీనిం
గొని కృతకృత్యుఁడ నగుదును । జననుత! నా కొసఁగు మస్త్రశస్త్ర చయంబుల్'. **(ఆది. 5.201)**

అని కోరుకొని దివ్యాస్త్ర సంపదను పొందాడు. అప్పటినుండి అస్త్రాచార్యుడిగానే జీవితం సాగించాడు.

అశ్వత్థామ బాలుడు. రాచబిడ్డలు ప్రతిరోజూ పాలు త్రాగటం చూచి తనకూ పాలు కావాలని మారాం చేయటం మొదలు పెట్టాడు. గోసంపదను పొందాలంటే ధనం కావాలి. ద్రోణుడికి బాల్యమిత్రుడు ద్రుపదుడు జ్ఞాపకం వచ్చాడు. అతడి ఆహ్వానం మనసులో ఆశలు రేపింది. అతడు ద్రుపదనగరానికి వెళ్ళి అతడిని కలిసి స్నేహపురస్సరంగా సంభావించాడు. ఆ చనవును సహించలేక, ప్రభుత్వగర్వంతో ద్రుపదుడు ద్రోణుడిని తృణీకరించాడు.

చ. "కొలఁది యెఱుంగ కిట్టి పలుకుల్ వలుకం దగుఁ గాదు నాక నన్
బలుగుఁదనంబునం బలుకఁ బాడియె నీ సఖి నంచుఁ? బేద వి
ప్రులకును ధారుణీశులకుఁ బోలఁగ సఖ్యము సంభవించునే?
పలుకక వేగ పొ; మ్మకట! పాఱుఁడు సంగడికాఁడె యెందునున్?' **(ఆది. 5. 203)**

వియ్యానికీ కయ్యానికీ హోదాలుండాలనీ, మిత్రామిత్ర సంబంధాలు కార్యవశంగా ఏర్పడేవే కాని శాశ్వతాలు కావనీ చెప్పి, ఐశ్వర్య గర్వంతో ద్రోణుడిని తూలనాడాడు. స్నేహార్ద్రమైన ద్రోణుడి హృదయం మిత్ర కృత తిరస్కారంతో ప్రజ్వలించింది. జీవితాంతం రగులుతూ నిప్పురవ్వలు రేపే క్రోధాగ్నిని ప్రకోపిస్తూనే ఉండేది. ద్రుపదుడిని సంహరించిన దాకా అది ప్రస్ఫుటంగానూ, గూఢంగానూ ఆయనలో రౌద్రరసాన్ని కలిగిస్తూనే ఉండేది. తండ్రి శిక్షణలో సాత్త్వికుడుగా ఉత్తమ సంస్కారాన్ని ఉన్మీలింపజేసికొన్న ద్రోణుడు ద్రుపదధిక్కారంతో గూఢమైన రాజసమూర్తిగా పరివర్తనం చెందాడు. అతడిలోని శుక్రాచార్యాంశ ప్రతీకార ప్రజ్వలన రూపంగా ప్రకోపించి అతడిలో అసుర ప్రవృత్తిని ఆవిర్భవింపజేసి, కౌరవపక్షంలోనే ఉండి యుద్ధాలలో పాల్గొనే జీవిత విధానానికి దారితీసింది. అతడికోపం నివురుకప్పిన నిప్పు. ద్రుపదుడనే గాలి సోకితే చాలు నివురు తొలగుతుంది. నిప్పులు క్రక్కుతుంది. ఇది ద్రోణుడి నైజమైపోయింది.

ద్రుపదుడు చేసిన అవమానంవలన ప్రజ్వలించిన కోపాగ్నిని కొంత ఉపశమింపజేశాయి భీష్ముడి ఆదరాభిమానాలు, కౌరవ పాండవుల అస్త్రశస్త్ర విద్యా విన్యాసాలు. అయినా క్రోధాగ్ని పూర్తిగా చల్లారలేదు. విద్యారంభంలోనే ద్రోణుడు ఒక వాగ్దానాన్ని అడిగాడు కురుకుమారులను. 'నా దగ్గర అస్త్ర విద్యలు నేర్చిన మీలో నా ఇష్టాన్ని కోరినవెంటనే ఎవరు తీర్చగలరు?' అని అందరినీ మూకుమ్మడిగా అడిగాడు. కౌరవులందరూ నిరుత్తరులై నిలిచారు. అర్జునుడొక్కడే తన అంగీకారాన్ని తెలిపాడు. శిష్యుడంటే అతడే అని ఉప్పొంగి అభిమానించాడు ఆచార్యుడు. 'శిష్యా దిచ్ఛేత్ పరాజయమ్' - అన్న స్ఫూర్తితో దివ్యాస్త్ర శస్త్ర విద్యలన్నీ తన కొడుకుకంటె మిన్నగా పార్థుడికి నేర్పాడు. జగదేకవీరుడిగా అతడిని తీర్చిదిద్దుతానని మాట ఇచ్చాడు. ద్వంద్వ సంకీర్ణ యుద్ధాలను,

రథ గజ తురంగ సంహార రహస్యాలను, బహువిధ వ్యూహ భేదనోపాయాలను, ప్రయోగ రహస్యాతిశయంగా ఉపదేశించాడు. తనంతటివాడినిగా తయారు చేశాడు. పార్థుడితో పోటీపడగలిగిన ఏకలవ్యుడి సామర్థ్యాన్ని కుంటుపరిచాడు. పార్థుడికి ఎన్నో పరీక్షలు పెట్టాడు. వాటిలో నెగ్గిన శిష్యుడిని శిఖరప్రాయుడిగా తీర్చిదిద్దాడు.

కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సందర్భంలో అర్జునుడికి దీటుగా కర్ణుడు రంగంలో నిలిచాడు. కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధం సాగింది. కర్ణుడి పుట్టుకను హోదాను గురించిన చర్చను రేపి, అతడిని అనర్హుడని ప్రకటించటానికి ద్రోణాచార్యుడు యత్నించాడు. కాని, దుర్యోధనుడు కర్ణుడికి అంగరాజ్య మిచ్చి, అభిషేకించి, ప్రాణమిత్రుడిగా మన్నించి అర్జునుడికి ప్రతివీరుడిగా నిలిపాడు. ఆ చర్య ఆచార్యుడి ఆత్మాభిమానాన్ని బాగా దెబ్బతీసింది. అయితే, కురుకుమారులతో విరోధం సమయోచితం కాదని మనసులోనే ఆ మంటను దాచుకొన్నాడు. దానితో కర్ణుడూ, అతడిని సమర్థించిన దుర్యోధనాదులూ ఆయనకు అహిత వర్గంలో చేరారు. కాని, ఆ గుట్టును బయటపెట్టకుండా ప్రభుసేవలో బ్రతుకు సాగిస్తూ, భీష్ముడి అండన ఆచార్యత్వాన్ని సంరక్షించుకొంటూ వచ్చాడు. శుక్రుడు ఎంతటి ధర్మవేత్త అయినా అతడి కృషి అంతా రాక్షససేవకే అంకితమౌతుందన్న సూక్తి తదంశతో పుట్టిన ద్రోణుడి పట్ల అన్వర్థమయింది.

అస్త్రవిద్యాబోధనానంతరం ద్రోణుడు ధార్తరాష్ట్రులనూ, పాండవులనూ ఒక విచిత్రమైన గురు దక్షిణను కోరాడు. 'అవివేక కారణ దారుణైశ్వర్యావలిప్తుండైన ద్రుపదు నోడించి పట్టి తెండు' - అని ఆజ్ఞాపించాడు. కౌరవులు గుంపులు గుంపులుగా ముందుగా సాగిపోయి ద్రుపదుడిపై దాడిచేశారు. కాని, అతడి ధాటికి ఆగలేక పలాయనం చిత్తగించారు. అర్జునుడు ఆ తరువాత వీరోచితంగా పోరాడి, ద్రుపదుడిని పట్టి రథచక్రానికి కట్టి తెచ్చి ద్రోణుడి ముందుంచాడు. అర్జునుడి పరాక్రమాన్ని చూచి ఆచార్యుడు పరమహర్షాన్ని ప్రకటించాడు. ద్రుపదుడిని చూచి అవహేళనగా నవ్వాడు. వ్యంగ్యంగా అధిక్షేప గర్భితంగా ఈ విధంగా పలికాడు.

క.. ' వీ రెవ్వరయ్య? ద్రుపద మ । హారాజులె? యిట్లు కృపణులయి పట్టువడన్
వీరికి వలసెనె? యహహా! మ । హారాజ్యమదాంధకార మది వాసె నొకో!' **(ఆది. 6. 90)**

'ఇంకనైన మమ్ము నెఱుఁగంగఁ నగు నొక్కొ!' అని వ్యంగ్యంగా ఎత్తిపొడిచాడు. ఆ తరువాత, ఏహానీ తలపెట్టక వెంటనే అతడిని విడిచిపుచ్చాడు. 'విప్రుల యలుకయుఁ దృణహుతాశనంబు దీర్ఘమగునె?' (ఆది. 6.91) అని నన్నయ అర్థాంతరన్యాసంలో ఆచార్యుడి క్రోధస్వభావాన్ని ధ్వనింపజేశాడు. దీర్ఘకోపవృత్తి లేని బ్రాహ్మణుడే అయినా గూఢకోపవృత్తి లేని సాత్త్వికుడు మాత్రం కాడు ద్రోణాచార్యుడు.

### 3. ద్రోణుడి సాత్త్విక రాజసప్రవృత్తి:

ద్రోణుడి సాత్త్విక రాజస ప్రవృత్తి ధర్మరాజుకు ఎన్నో వెలుగుబాటలు చూపింది. శత్రువును బంధించి తెచ్చిన తనవారిని మెచ్చుకొని, అతడిని అధిక్షేపించి బంధవిముక్తుడిని చేసి బుద్ధి చెప్పి పంపిన సన్నివేశం అతడి కొక ఉపదేశమయింది. ఆరణ్యపర్వం లోని ఘోషయాత్రా ఘట్టంలో ధర్మరాజు దుర్యోధనుడి పట్ల అటువంటి ప్రవృత్తియే ప్రదర్శించి ఆచార్యుడికి అచ్చమైన శిష్యు డనిపించుకొన్నాడు. అర్జునుడు కూడా ఈ లక్షణాన్ని ఎడనెడ రణరంగంలోనూ ప్రదర్శించాడు.

ద్రుపదుడు పరితాపాన్ని ప్రదర్శించి ఉంటే ద్రోణుడి క్రోధం ఉపశమించి ఉండేదేమో! కాని, ద్రుపదుడు 'కోపపాశబద్ధు' డయ్యాడు. అవమానతప్తు డయ్యాడు. అవమాన భూమిక నుండి క్రోధబీజం ప్రజ్వలించింది. బ్రాహ్మణోపాస్తిని దీక్షగా నిర్వహించి, హోమాగ్ని గర్భంనుండి ద్రోణుడిని చంపగలిగిన పుత్రుడు ధృష్టద్యుమ్నుడినీ, అర్జునుడిని చేపట్టగల పుత్రిక - ద్రౌపదినీ సంతానంగా పొందగలిగాడు. ఇది క్రోధం నుండి పుట్టిన క్రోధం. దీనివలన ద్రోణుడిలో క్రోధం మరల కుళ్ళగించినట్లయింది. తనను వధించటానికి పుత్రుడిని కన్న ద్రుపదుడినీ, అతడి పుత్రుడినీ యుద్ధంలో సంహరించేంతవరకు చల్లారని క్రోధం కోరలు చాస్తూ లోలోన బుసలు కొట్టుతూ ద్రోణుడిని గూఢక్రోధమూర్తిగా మార్చి పడగవిప్పని పామువలె ప్రవర్తిల్ల జేసింది.

అర్జునుడికి 'బ్రహ్మశిర'మనే మహాస్త్రాన్ని ప్రసాదించి తనతో సమానుడిగా సమ్మానించాడు ద్రోణుడు. అయితే తనతో అర్జునుడు ప్రతియుద్ధం చేయకుండా కట్టడి చేశాడు. అందుకనే, అర్జునుడు తనంతట తాను ఆచార్యుడిపై ముందుగా యుద్ధం ప్రారంభించడు. ఒక్కొక్కసారి నమస్కార బాణాలతో అభివాదనంచేసి, ముందుకు సాగుతాడు. లేదా యుద్ధం చేయటానికి అనుమతిని వేడి గాండీవాన్ని సారిస్తాడు. లేదా ఆయనను తప్పించి ప్రక్కగా మొగ్గరంలోకి ప్రవేశించి పురోగమిస్తాడు. భారత కథను గమనిస్తే - అర్జునుడు ధర్మజ కృష్ణుల తరువాత గౌరవించే మహాత్ముడు ద్రోణుడు. పార్థుడికి పితామహు డంటే భయం. ఆచార్యుడంటే భక్తి.

పాండవులు లాక్షాగృహ దహనంలో ప్రాణాలు కోల్పోయారని తెలిసి ద్రోణుడు దుఃఖించాడు. కాని, అది దుర్యోధనుడి కపటోపాయ మని ఆయనకు తెలియదు. ఆ తరువాత పాండవులు సజీవులై ఉన్నారనీ, ద్రౌపదిని పెండ్లాడి ద్రుపదనగరంలో క్షేమంగా ఉన్నారనీ తెలిసి ఆనందించాడు. అయితే, ధృతరాష్ట్రుడు దుష్టచతుష్టయ ప్రేరణతో పాండవులపై యుద్ధం ప్రకటించి ద్రుపదులను ఓడించి వారిని బందీలుగా చేసితేవటమో, లేక చంపివేయటమో చేయాలన్న వ్యూహాన్ని ఖరారు చేసి, సలహాకొరకు ధర్మవేత్తలైన భీష్మ విదుర ద్రోణాదులను పిలిచి సభ చేశాడు. పాండవులను పిలిపించి తండ్రిపాలైన సగం రాజ్యాన్ని వారికి ఇవ్వటం ధర్మమని భీష్ముడు సలహా చెప్పాడు. ద్రోణుడు ఆయనను సమర్థించాడు. బలవంతులైన పాండవులతో కలిసి ఉండటం మేలని హితవు చెప్పాడు. దానికి కర్ణుడు మండిపడ్డాడు.

తే. 'ముదుసళులు తమ కిమ్ముగాఁ జదివికొండ్రు। గాక పతులకు హిత మగు కర్జ మేల
యొలసి చెప్పుదు?; రహితులఁ గలసికొనుట। ధర్మువని; రిది నయవిరుద్ధంబు గాదె!'.**(ఆది.8. 38)**

అని పలికి ద్రోణుడి సలహా అసాధువని అధిక్షేపించాడు. ఆతడి తిరస్కారం ద్రోణుడిలో క్రోధాన్ని ప్రజ్వలింపజేసింది. రోషంతో ఇట్లా అన్నాడు.

క. 'ఉడుగక యే మహితముఁ బలి। కెడు వారము, నీవు హితవు క్రియ గొనఁగాఁ బ
ల్కెడువాఁడవు మాకంటెను। గడు హితుఁడవు నీవ కావె కౌరవ్యులకున్?'

క. 'నీ కఱపుల నిక్కురుకుల। మాకుల్యముఁ బొందు టేమి యాశ్చర్యము సౌ
మ్యాకృతులు గాని వారల। వాకులు శిక్షలు నుపద్రవమ్ములు కావే?' **(ఆది. 8. 40-41)**

కాకువుతో శత్రువును వ్యంగ్యంగా అధిక్షేపించటంలో, బాణాలకంటె వాడిగా వాగ్బాణాలను సంధించటంలో ద్రోణుడు నేర్పరి. ద్రుపదుడిని ఎత్తిపొడిచిన మాట వ్యంగ్యోక్తి. కర్ణుడిని ఈసడించిన మాట వక్రోక్తి. రెంటికీ కాకువు జీవాతువు. నన్నయ ద్రోణుడి నోట పలికించిన ఈ పద్యాలు తెలుగునాట సంభాషణలలో వ్యంగ్యోక్తులుగా నేటికీ ప్రచారంలో ఉన్నాయి.

దుర్యోధనుడు కర్ణాదుల ప్రబోధంతో ద్రోణుడిని హితుడిగా నమ్మి వ్యవహరించలేదు; పాండవ పక్షపాతిగా పరిగణించి, తమ ఆలోచనలకు ఆయనను దూరంగా ఉంచాడు. ద్రోణుడు దుష్టచతుష్టయాన్ని ఎన్నడూ సమర్థించలేదు. అయితే, తానే ముందుపడి వారికి హితవు చెప్పలేదు. భీష్ముడి మాటను సమర్థిస్తూ తన పాత్రను పోషించుకొన్నాడు. ధృతరాష్ట్రుడు ద్రోణుడిపట్ల గౌరవాన్ని ప్రదర్శించాడు. అందువలన రాజసభా గౌరవానికి అతడు దూరం కాలేదు. దుష్టచతుష్టయ ప్రవర్తనం పాండవులపట్ల ద్రోణుడు సానుభూతిని పెంచుకొనటానికి దోహదం చేసింది. తనువు ధృతరాష్ట్రుడికీ, మనసు పాండవులకూ అంకితం చేశాడు. కాని, ద్రౌపదీ పాండవులను అభిమానించినంతగా ఆయన ఎన్నడూ ద్రుపదుడినీ, ధృష్టద్యుమ్నుడినీ గౌరవించలేదు. వారిమీద గూఢమైన క్రోధం కొనసాగుతూనే ఉన్నది. అది పాండవ పక్షంలో బాహాటంగా చేరటానికి అడ్డం వచ్చింది. దీనికి మించి తనకు ఆచార్య పదవి నిచ్చి గౌరవించిన భీష్ముడిని వీడి వెళ్ళటం ఆయనకు ఇష్టం లేదు. భీష్మ ద్రోణులు విడదీయరాని మిత్రద్వయం. అయినా ద్రోణుడు భీష్ముడివలె స్వతంత్రుడు కాడు. యజమానుడి వెనుక ఉన్న విజ్ఞాని.

**4. కర్ణ దుర్యోధనులు ప్రక్కలో బల్లాలు:**

పాండవులు హస్తినాపురానికి వచ్చారు. భీష్మద్రోణుల కోర్కె ఫలించింది. ధార్తరాష్ట్ర పాండుసుతులు కలతలు పడకుండా జీవించటానికి తగిన ఉపాయంగా ధర్మరాజును యువరాజును చేసి, ఇంద్రప్రస్థపురాన్ని పాండవులకిచ్చి సుఖంగా నివసించే ఏర్పాటును ద్రోణుడు సమర్థించాడు. కురువంశంలో శాంతి సౌమనస్యాలు వృద్ధి చెందాలని ఆశించిన హితు డాయన. పాండవులు రాజసూయం చేసినప్పుడు సంతోషించాడు. మాయాద్యూతంలో పాండవు లోడినప్పుడు, ద్రౌపదీ వస్త్రాపహరణాది ఘట్టాలలో ఆయన కటకట పడ్డాడు. కాని, రాజకీయంలో భీష్ముడు చొరవతీసికొన్నంతగా అతడు ముందుకు రాలేడు. వచ్చినా దుర్యోధనుడు రానీయడు; కర్ణుడు నిష్ఠురంగా నిందిస్తాడు. అందువలన వలసినప్పుడు హితవు పలకటం తప్ప ద్రోణుడు కౌరవులతో స్నేహం పెంచుకొనలేకపోయాడు; పాండవులకు ప్రత్యక్షంగా మేలు చేయలేకపోయాడు. ఆయన మౌనంవలన పాండవులకు కొంత అన్యాయం జరిగిందని మాత్రం బాధపడేవాడు. పునర్ద్యూతంలో ఓడి పాండవులు అరణ్య అజ్ఞాతవాసాలకు వెళ్ళవలసి వచ్చింది. విదురాదులవలె ద్రోణుడు కూడా నిశ్శబ్దంగా నిట్టూర్పి ఉండిపోయాడు. హస్తినాపురాన్ని, ధృతరాష్ట్రుడి కొలువును, భీష్ముడి స్నేహాన్ని ఆయన వదలుకొనలేకపోయాడు. అయితే, మనసులో ధర్మరాజంటే నిండు గౌరవముండేది; అర్జునుడంటే ఆత్మీయమైన అభిమానం ఉండేది. అర్జున విజయమే ఆచార్యుడి అంతరంగం.

అరణ్యవాసంలో అర్జునుడు తపస్సుచేసి పరమేశ్వరుడిని యుద్ధంలో మెప్పించి పాశుపతాస్త్రాన్ని సంపాదించి, ఇంద్రుడి సింహాసనంమీద అతడితోపాటు అధివసించి, దివ్యాస్త్రాలనెన్నో సాధించి, నివాతకవచాది రాక్షసులను సంహరించి జగద్విఖ్యాతి కాంచిన వృత్తాంతం ద్రోణుడికి సంతోషం కలిగించింది. పాశుపతాస్త్ర సంపాదియొక్క అతిలోక పరాక్రమశక్తిని తెలిసిన ఆచార్యుడు ద్రోణుడు. అందుకే అజ్ఞాతవాసకాలంలో మత్స్యనగరంమీద సాగిన ఉత్తర గోగ్రహణ యుద్ధంలో ఉత్తరకుమారుడి సారథిగా పేడిరూపాన కానవచ్చిన అర్జునుడిని ద్రోణుడు గుర్తించి, అత డావేశంతో సమయభంగ మయ్యే సాహసం చేపట్టినందుకు లోలోన బాధపడి, 'అజ్ఞాతవాసపు గడువు తీరిందా?' అని భీష్ముడిని ప్రశ్నించి, తీరిందని అతడు చేసిన సూచనను గ్రహించి, అన్నేళ్ళ తరువాత శిష్యుడిని చూచిన సంతోషంతో ఉప్పొంగిపోయి అర్జునుడిని ఎలుగెత్తి కీర్తించాడు. తిక్కన కవితలో ఆణిముత్యాల వంటి పద్యాలు ఆవిర్భవించాయి.

శా. 'సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శన సముద్యత్క్రోధ మై వచ్చునో
జం గాంతార నివాస ఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.'

ఉ. 'ఈతని తోడి కయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యాతత సేనలోఁ గలుగు టారయ సంశయ; మెల్లభంగి గో
వ్రాతనివర్తనంబు సుకరంబ కిరీటి; కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా వినమె పెంపెసలారెడు బాహు సంపదన్?' **(విరా. 4. 95,96)**

కోదండ పాండిత్యంలో గురువును మించిన శిష్యుడు తారసిల్లినప్పుడు అవ్యాజవాత్సల్య పూర్ణమైన మనస్సుతో చేసిన వీర ప్రశంస ఇది. ద్రోణుడు తనకు సాధ్యంగాని పాశుపతాన్ని పొందిన పార్థుడిని జగదేకవీరుడిగా గుర్తించి చేసిన గుణకీర్తన మిది. గుణాన్ని మెచ్చే గురువు ద్రోణాచార్యుడు. ద్రోణుడి ఈ గుణం కర్ణ దుర్యోధనులకు నచ్చదు. ఆయన చేసిన ప్రశంస పాండవ పక్షపాతంతో నోటికి వచ్చినట్లు పలికిన శత్రుప్రశంసగా, స్వపక్షనిందగా వారికి తోచింది. ద్రోణు డప్పుడు ప్రభుపక్షంవారిచేత అవమానించబడ్డాడు. అయినా, అతడి మనసు మారలేదు; మాట మారలేదు. ఆచార్యుడు గుర్తించిన అర్హత అర్జున పరాక్రమం.

అజ్ఞాతవాస కాలం పూర్తికాకుండానే బయలు మెరుస్తున్న అర్జునుడిని గుర్తించి, పాండవులను మరల అరణ్యాజ్ఞాతవాసాలకు పంపవచ్చుననే దురాలోచనలో మునిగి, వాస్తవాన్ని గుర్తించక పెనుముప్పు నెదుర్కొనబోయే దుర్యోధనుడికీ, కౌరవసేనకూ సమయోచిత రక్షావ్యూహాన్ని సూచించి రణవిద్యాచార్యు డనిపించుకొన్నాడు ద్రోణుడు.

ఉ. ‘ ముందర రాజుఁ బుచ్చి బలముల్ గలయంబడి గోవ్రజంబులన్
దందడి వెట్టకుండఁ బిఱుఁదన్ నడపింపఁగఁ బంచి గట్టిమై
నందఱు నింతకున్ వెనుకయై మొనలేర్చి చనంగ నెప్డు సం
క్రందనసూతి డగ్గఱియెఁ గయ్యము సేయుట కప్పు డిమ్మగున్’. **(విరా. 4.184)**

ఈ మాటలకు దుర్యోధనుడు దురహంకారంతో మండిపడి ద్రోణాచార్యులను తూలనాడాడు. ‘ఆచార్యులైన వారలు కార్యంబు దప్పులం గనియెడువారు గాన కయ్యంబు తెఱంగు వారల నడుగవలవదు; బుద్ధిమంతు లిండ్లకడ నుండి భోజనావసరంబుల, నాయుధ శ్రమ సమయంబుల, నీతి శాస్త్ర గోష్ఠీ కాలంబుల నుచితాలాపంబులు పలుకుదురు గాని పోట్లాడువారు గారు; వారిం గలనం గలసి నిలువనీక పిఱిందిదెస నిలిపిన మనకు వారు విజయంబు గోరుచుండుట లెస్స’ - (విరా. ) అని అవహేళనం చేశాడు. ఈ మాటలకు ఆచార్యుడికంటె అశ్వత్థామకే ఆగ్రహం పొంగివచ్చింది. ఆచార్యుడు నిగ్రహించుకొన్నాడు.

కర్ణ దుర్యోధనుల చిన్నచూపునకు పాలైన ద్రోణుడు పార్థుడి గురుప్రశంసలకు పాత్రుడయ్యాడు. ఉత్తర గోగ్రహణ యుద్ధంలో కౌరవవీరులను ఉత్తరకుమారుడికి పరిచయం చేస్తూ పార్థుడు ద్రోణాచార్యుడిని అందరికంటె మిన్నగా (మూడు పద్యాలలో) ప్రశంసించాడు. భీష్మాదుల నెదుర్కొనటానికి ఎటువంటి నియమాలు లేవు. కాని, పార్థుడు ద్రోణుడిని తనంతటతాను ఎదుర్కొనరాదనే నియతి గురుశిష్యుల నడుమ కుదురుకొని ఉన్నది. అర్జును డా నియతిని ఎప్పుడూ తప్పలేదు. ఉత్తరకుమారుడితో చెప్పిన ఈ మాటలు గమనించదగినవి.

క. ‘ గురునకుఁ బ్రదక్షిణంబుగ । నరదముఁ బోనిత్త; మిమ్మహాపురుషు నెడం
బరిభవము వలవ; దీతఁడు । కురుకుల నృపతనయ శిక్షకుఁడు సు మ్మనఘా!’

క. ‘ శస్త్ర ప్రకార నిపుణుం । డస్త్ర విదుఁడు దూరపాతనాభీలుఁడు వ
ర్చ స్త్రాసిత రిపుఁడు ధను । శ్శాస్త్ర పరిజ్ఞాన ఘనుఁ డసదృశుఁడు శక్తిన్.’

ఉ. ‘ ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగ; దేను దుష్పథ
ద్యూత జయోద్ధతుం డగు సుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాతశరోత్కరం బతఁడు చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము; దాన ము న్ననికిఁ జొచ్చినఁ జొత్తము గాక పిమ్మటన్’. **(విరా. 5. 5-7)**

అస్త్రవిద్యాగురువును అవమానించరాదు; గురువుకు ఎదురు నడిచి అవినయాన్ని ప్రకటించరాదు; ప్రదక్షిణంగా పయనిస్తే ఆచార్యుడి అనుగ్రహం లభిస్తుంది. శిష్యు లెప్పుడూ అధికులు కాలేరు. కాబట్టి గురువుతో పోరు తగదు. దుర్యోధనుడిని చంపే లక్ష్యంతో సాగటం కర్తవ్యం. ఆచార్యుడు అర్జునుడిపై అస్త్రశస్త్రాలు ప్రయోగించిన తరువాతే ఆయనమీద బాణప్రయోగం; యుద్ధం ఆచార్యుడు మొదలు పెట్టితేనే అర్జునుడు ప్రారంభించేది. ఇది గురు శిష్య ప్రతిజ్ఞలకు భంగం కాని విధం. కష్టకాలంలో కూడా నియతిని పాటించిన పార్థుడి పరాక్రమశీలం ద్రోణాచార్యుల ఆశీస్సుల నందుకొన్నది. శిష్యవాత్సల్యం గురువులకు నైజం.

**5. గురుశిష్య ధర్మవర్తనం :**

ఉత్తర గోగ్రహణ యుద్ధంలో ద్రోణుడు ముందుగా అర్జునుడిపై ఇరవై బాణాలు సంధించాడు. వాటిని అర్జునుడు మధ్యలోనే త్రుంచివేశాడు. ఇరువురనడుమ ద్వంద్వయుద్ధం ఘోరంగా మొదలయింది. ముందు నీవా నేనా అన్నట్లు ప్రారంభమైనా కొంతసేపటికి ఇరువురూ సమానులే అన్నట్లు చూపరులకు తోచింది.

శా. 'శ్రావ్యంబై చెలఁగన్ గభీరమధుర జ్యానాద ముద్దామవీ
రవ్యాపార నిరూఢతం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రౌఢి దృఢాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్దఱును సాదృశ్యం బదృశ్యంబుగన్'. **(విరా. 5. 132)**

కొంతసేపటికి ద్రోణాచార్యుడికి సాయంగా పెద్దసైన్యం వచ్చి అర్జునుడిని అడ్డగించింది. వారందరిని క్షణంలో చంపి రక్తసముద్రాన్ని రణరంగంలో కల్పించాడు అర్జునుడు. ఆతడి నేర్పరితనం ఆచార్యుడికే ఆశ్చర్యం కలిగించింది.

క. 'అర్జునుని నాహవంబున । నిర్జింపఁగ నగునె ఫాలనేత్రున కైనం;
బర్జన్యసుతుఁడు శరవ । ర్షోర్జితమూర్తి యగు టరయ నుచితము కాదే!' **(విరా. 5.134)**

అని ప్రశంసించాడు. ఆకాశంలో నిలబడి వారిరువురి యుద్ధాన్ని చూస్తున్న దేవగణాలు అర్జునుడి ముందు నిలబడి అంతసేపు యుద్ధం చేయటమే ద్రోణుడి దొడ్డతనం - అని భావించేటంతవరకు వచ్చింది. అంతలో అర్జునుడు ద్రోణుడి రథాన్నీ, గుర్రాలనూ, సూతుడినీ, చివరకు ఆయన దేహాన్నీ బాణాలతో నింపి ఆచార్యుడిని అస్త్రాబ్ధిలో ముంచివేశాడు. అతడిని రక్షించటానికి అశ్వత్థామ యుద్ధంలోకి దూకవలసి వచ్చింది. ఈ సన్నివేశం ద్రోణపర్వంలోని చివరి ఘట్టానికి తొలి సూచికగా భాసించింది. విశేషమేమంటే - అర్జునుడు యుద్ధంలో ఎంతటి వీరాన్ని ప్రదర్శించినా గురువుకు క్రోధం రాదు. సరికదా ఆనందప్రదం. అర్జునుడిది - గురుభక్తి వలన కలిగిన శక్తి. అతడు గురువును మించిన శిష్యుడన్న సత్యం ద్రోణుడు స్వానుభవం వలన తెలిసికొన్నాడు. అతడి చిరకాలవాంఛ ఫలించినట్లయింది.

శ్రీకృష్ణుడు రాయబారం సలిపిన నిండుసభలో భీష్మద్రోణులు దుర్యోధనుడికి హితవు చెప్పారు. చివరగా వారు చేసిన హెచ్చరిక మహాభారత యుద్ధఫలితాన్ని ధ్వనింపజేసేది.

క. 'ఈ కృష్ణుని సారథ్యము । నా కృష్ణుని గాండివంబునై తోఁపక ము
న్నీ కొలఁదిఁ జక్కఁబడి వీ । కురువంశంబు గావు మిభపురనాథా!' **(ఉద్యో. 3. 351)**

ఎన్ని హితవులు చెప్పినా పెడచెవిని బెట్టిన దుర్యోధనుడికి జంటకవులవలె భీష్మద్రోణులు చేసిన బోధ ఇది.

శా. 'మాకుం జూడఁగఁబోలు కార్య మిది; ధర్మ ప్రీతి నీ వేఁగి సు
శ్లోకుండైన యుధిష్ఠిరుం గని జనస్తుత్యంబుగా శాంతిమై
నీ కౌరవ్యుల నెల్లఁ గాచికొనవే! యే పొప్ప దెందుం; దుదిన్
శోకం బొందక వేగమైఁ గదలి కృష్ణుం గూడఁ బోవే నృపా!' **(ఉద్యో. 4.24)**

ఈ మాటలు విని దుర్యోధనుడు మొగం రాజుతూ ఉండగా మాటాడక ఊరకుండిపోయాడు. అది గురుహిత తిరస్కార సూచకమైన అభినయం. దుర్యోధనుడి దుర్వివేకానికి భీష్మద్రోణులు మండిపడ్డారు. దిగ్గన లేచి

క. ‘ కురునృప! విను; సంసారము । దరి ద్రొక్కినవార; మింక దలఁకెదమే సం
గరమునకు నేము నీకై । పొరలితి; మెట్లైన నగును బోయెద మనుచున్’ **(ఉద్యో. 4.26)**

సభను వదలి వెళ్ళిపోయారు. దుర్యోధనుడు కొరకరాని కొయ్య. యుద్ధం తప్పదు. అందులో మరణం తప్పదు. దీనిని తెలియజెప్పినా తెలిసికొనలేని తెలిసి తెలియని మూర్ఖుడు దుర్యోధనుడు. అతడు చావబోతూ వంశాన్నంతా బలిపెట్టుతున్న దుర్నయుడు. ఆతడి మీది కోపం. అతడి అవివేకం మీది కోపం. ‘ఎట్లైన అగును, పోయెదము’ - అనే మాటలు నైరాశ్యసూచకాలే కాదు, విషాదాంత సూచకాలు కూడా! ఏదైతే అది అవుతుంది. మేం పోతున్నాం - అని ఒక అర్థం. ఏదో మార్గంతో కానున్నది కాకమానదు. మేము పోవటం (చనిపోవటం) నిజం - అని ఒక అర్థం. ఇవి గూఢమైన రౌద్రరస బీజాక్షరాలు.

## 6. ద్రోణాచార్యుడి యుద్ధవీరమూర్తి:

పితామహుడు ద్రోణాచార్యుడి యుద్ధవీరమూర్తిని సుస్పష్టరేఖలతో చిత్రించాడు.

సీ. ‘ అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డందలి । యిందలి విలుకాండ్ర కెల్లఁ గురుఁడు,
హితుఁడు నీ, కెంతయు నేర్చిన మొన లితం । డడరినఁ జమరిన యట్ల ద్రుంచు;
వృద్ధని యితని భావింప రాఁ దనిలోన । నంగవిస్ఫురణంబు భంగి సూడ;
నర్జునుపైఁ గూర్మి నతని నో నేయఁడు; । సచరాచరం బైన జగము లెల్ల

తే. నొక్క మొగమై కడంగినఁ జిక్కువఱుచు । దివ్య బాణ జాలంబుల దీటుకొలిపి;
ప్రాణములు డాఁపఁ; డీతని పాటి దొరలఁ । గాన మే రాజ్యములయందుఁ గౌరవేంద్ర!’**(ఉద్యో. 4.230)**

భీష్మద్రోణ పర్వాలలో ద్రోణుడి యుద్ధవీర వ్యక్తిత్వం శతపత్రంవలె వికసించటం గమనించగలం. ధర్మరాజు యుద్ధారంభంలో భీష్ముడి తరువాత ద్రోణుడిని దర్శించి అతడి అనుజ్ఞను కోరాడు. అందులో మూడంశా లున్నాయి.

1. యుద్ధం చేయటానికి ద్రోణుడు ధర్మరాజును అనుమతించుమని కోరటం.
2. యుద్ధంలో ధర్మరాజుకు జయం కలగాలని ఆశాసించుమని ద్రోణుడిని కోరటం.
3. యుద్ధంలో నిజవధోపాయం చెప్పుమని ద్రోణుడిని ధర్మరాజు కోరటం.

యుద్ధానికి సిద్ధమై కురుక్షేత్రంలో ఉభయపక్షసేనలు మోహరించి ఎదురెదురుగా నిలువబడిన తరువాత అనుమతికోరటం ఎందుకు? అనే ప్రశ్న సామాన్యంగా కలుగుతుంది. ధర్మరాజు భీష్మ, ద్రోణ, కృప, శల్యులను మాత్రమే అనుమతిని అడిగాడు. దీని కేదో నీతి సూత్రమో, ధర్మసూత్రమో, యుద్ధమంత్రమో, ఉపాయ విశేషమో కారణమై ఉండాలి. అందులోనూ నలుగురిని క్రమంగా అడగటంలో వేరు వేరు ప్రయోజనాలు కూడా ఉండి ఉండాలి. వాటిలో ద్రోణుడికి సంబంధించిన అంశాలు ఇక్కడ ప్రస్తుతాలు.

శస్త్రాస్త్ర విద్యాబోధకు పారితోషికంగా ద్రోణుడు కోరిన కోరికలలో ఒకటి పార్థుడు అతడిపై యుద్ధానికి తనంతటతాను పూనుకొనరాదు. ద్రోణుడు అనుమతిస్తే దోషంలేదు. ఈ కట్టడి అర్జునుడితో చేసికొన్నదయినా, పాండవుల కందరికీ అది వర్తిస్తుందని ధర్మజుడు భావించి వారి భావసమైక్యమును ప్రకటింపదలచి ఉండవచ్చును. అందువలన అందరికీ ఆయన అనుజ్ఞ లభించటంవలన యుద్ధాన్ని నిరాఘాటంగా సాగించవచ్చునని ధర్మజుడి వ్యూహమై ఉంటుంది.

యుద్ధంలో ధర్మరాజుకు జయం కలిగేటట్లు ఆశాసించాలని రెండవ ప్రార్థన. కౌరవపక్ష ప్రధానులలో ఒకడైన ద్రోణుడు ప్రతిపక్షనాయకుడి విజయాన్ని ఆకాంక్షించటం ధర్మవిరుద్ధం; నైతిక ప్రవర్తనకు విరుద్ధం. అందుకే ఆయన ప్రత్యక్షాశీర్వాదం ఇవ్వటానికి బదులు పరోక్షాశీస్సునే అందించాడు. 'ధర్మజా! నీకు కృష్ణుడు మంత్రి అయి ఉండగా జయం కలిగేటట్లు మరొకరిని ఆశీర్వదించుమని కోరనవసర మేముంది? ధర్మం ఏ పక్షంలో ఉంటుందో కృష్ణు డా వైపున ఉంటాడు. జయం ఆ పక్షానికితథ్యం' అన్నాడు. ద్రోణుడు పాండవులదే ధర్మవిజయమని అంతరాత్మ సాక్షిగా చెప్పాడు. అయినా, కౌరవులపక్షాన పోరాడుతున్నాడు. అతడు విల్లు పట్టి నిలిచి ఉండగా శత్రువులకు విజయం అసాధ్యం. కాబట్టి పాండవ విజయానికి అవకాశం కలిగించేది ఆచార్యుడి అస్తమయమే. ఆయన మరణ రహస్యం ఆయనకే తెలుసు. అందువలన తద్ వధోపాయాన్ని ధర్మరాజు ఆయననే అడిగాడు. ఆచార్యుడు కపటంలేని కరుణామయుడు. పాండవులయందు వాత్సల్యం కలవాడు. అర్జునుడి విజయాన్ని కోరేవాడు. బంధుమిత్రులకంటె గురువులు శిష్యుల కోర్కెలు తీర్చటంలో అత్యంత ఉదారహృదయులుగా ఉండటం లోక సహజం. పాండవ విజయం స్వీయవధ రహస్యం మీదనే ఆధారపడి ఉండటంచేత వెంటనే మెత్తబడి గట్టిగా, సూటిగా, స్పష్టంగా చెప్పాడు. 'నా చేతిలో ఆయుధం ఉండగా నన్ను చంపటానికి ఎవ్వరికీ శక్యం కాదు. నేను ప్రాయోపవేశంలో ప్రవేశించి అస్త్రశస్త్రాలను సన్న్యసించి ఉన్నప్పుడు మాత్రమే నన్ను చంపగల శక్తికలవాడికి ఆ అవకాశం లభిస్తుంది. బాగా నమ్మదగినవాడు అత్యంత దుస్సహమైన కీడుమాటను చెప్పినప్పుడు మాత్రమే నేను ప్రాయోపవేశానికి దిగుతాను. నేను ప్రాయోపవేశంలో ఉన్నప్పుడే నన్ను చంపే క్రూరకర్మ సాధ్యమౌతుంది!'

ద్రోణుడిచ్చిన మూడు వరాల వలన కలిగిన ఫలితాంశాలను విశ్లేషించుకొంటే కొన్ని విశేషాలు స్పష్టమౌతాయి. 1. పాండవులు ద్రోణుడిమీద యుద్ధం సాగించి ప్రయత్నిస్తే విజయం తప్పక లభిస్తుంది. 2. కౌరవ పక్షాన ద్రోణుడు యుద్ధం చేస్తున్నా పాండవులకు విజయం కలగాలన్న ఆయన ఆశీస్సుకు విరుద్ధంగా యుద్ధ విజృంభణం సాగరాదు. ఎంతటి అసాధ్యమైన వ్యూహమైనా అది భగ్నం అయ్యేద్వారాలను ద్రోణుడు తెరువవలసి ఉంటుంది. 3. ద్రోణుడిని చంపటానికే వరపుత్రుడుగా పుట్టిన ధృష్టద్యుమ్నుడు పాండవపక్షంలో ఉన్నాడు. అయినా, ద్రోణుడు ప్రాయోపవేశంలో ప్రవేశిస్తే తప్ప అతడు చంపలేడు. నమ్మదగిన వ్యక్తి వినగూడని కీడు మాట పలికితే కాని ద్రోణుడు అస్త్రసన్న్యాసం చేయడు. ఆ వ్యక్తి ఎవరు? ఆ కీడుమాట ఏమిటి? ఇవి కాలం చెప్పవలసిన రహస్యాలు. కథలో ఉత్కంఠను పెంచే ఉచ్చుముడులు. పాండవ విజయానికి భద్రమార్గాలైన ఈ మూడు అంశాలూ కౌరవుల ఓటమికి సంకేతాలు. ఇవి ద్రోణుడి ప్రభుభక్తికి వ్యతిరేక చిహ్నాలు. ద్రోణుడి తనుత్యాగానికి తరణోపాయాలు. వంశనాశనం జరుగుతుందని పెద్దలు హెచ్చరించినా వినిపించుకొనక యుద్ధానికి సిద్ధమైన దుర్యోధనుడు స్వీయ (వంశ)నాశనానికే పురోగమిస్తున్నాడు. అతడు అర్థపురుషార్థ సాధనలో ఉద్ధతుడివలె వ్యవహరిస్తున్నాడు. అతడు చనిపోవాలంటే అతడి పక్షాన ఉన్న మేటి వీరులందరూ చనిపోవాలి. అందులో ద్రోణుడు కూడా ఒకడు. ఆ పని ఎంత త్వరగా జరిగితే అంత మంచిది. కాబట్టి ఈ వాగ్దానాలు దుర్యోధనుడి దుర్నీతిని త్రుంచే ఉపాయాలు. ద్రోణుడిపట్ల అతడు ప్రకటించే అవినయాన్నీ, అపనమ్మకాన్నీ, అవజ్ఞతనూ సహనంతో సహించి అతడిపై అంతరాంతరాలలో రగిలే క్రోధాగ్నిని ప్రచ్ఛన్నంగా అతడి పతనానికై ప్రయోగించే రహస్య రౌద్రప్రవృత్తి ద్రోణుడి ప్రవర్తనకు ప్రధాన కారణమయింది. గూఢరౌద్రం కురుక్షేత్రంలో క్రమంగా కోరలు విచ్చుకొన్నది. మచ్చుకు భీష్మపర్వంలోని కొన్ని సన్నివేశాలు.

1. కౌరవ సైన్య మహాధ్యక్షుడు భీష్ముడూ, ఆతడికి నీడవలె ద్రోణుడూ రణరంగంలో వీరవిహారం సాగించారు. నాలుగు రోజుల యుద్ధం సాగింది. ఇద్దరూ అర్జునుడి తీవ్ర ప్రతాపాన్ని అడ్డుకొనలేకపోయారు. దానికి కారణం వారి పార్థపక్షపాతమే అని దుర్యోధనుడి అనుమానం. పార్థుడి అనన్యపరాక్రమమే కారణమని భీష్మద్రోణుల భావం. ఈ రెండింటికి వెనుక భీష్మద్రోణులకు అర్జునుడిపై ఉన్న అపారప్రేమ వాత్సల్యాలు ప్రత్యక్షకారణాలుగానూ, దుర్యోధన కర్ణాదులపై వారికున్న క్రోధభావం పరోక్ష కారణంగానూ ఉన్నాయన్నది కాదనరాని వాస్తవం.

2. భీష్ముడి అయిదవనాటి యుద్ధారంభంలో కౌరవుల మకరవ్యూహాన్ని ఛేదించి భీముడు చొరబడి భీష్ముడితో తలపడి ఆయనను బాణవర్షంతో క్రమ్మివేశాడు. భీష్ముడు భీముడి గర్వాన్ని అణచి, సైన్యాన్ని మంటలలో కాల్చి వేధించాడు. అంతలో అర్జునుడు రంగప్రవేశం చేసి భీష్ముడి విజృంభణాన్ని వెనుకంజ వేయించి దుర్యోధనాది వీరులను కలతపెట్టాడు. సేనలను చంపి కుప్పలు పోశాడు. అప్పుడు దుర్యోధనుడు ద్రోణుడితో ఇట్లా అన్నాడు.

తే. ‘ పట్టి పాలార్చెదరు మీరు పాండు సుతుల । నీవు భీష్ముండు నలిగిన దేవతలకు
నైన మార్కొనవచ్చునే? సేన నరుఁడు । నొంపఁగా నిటు లొప్పరికింపఁ దగునె?’

ఈ మాట ద్రోణుడి మనస్సును కలత పెట్టింది. కోపం మోసులెత్తింది.

తే. ‘ ఎన్నఁడును మున్ను వారలయేపు నోపఁ । గాన మెట్లు సముద్రంబులోన బుఙ్గ
వైవఁ గొన్నంత గొనుఁగాక వారి గెల్వ । మాకు శక్యంబె? చవిగాని మాట లేల?’**(భీష్మ. 2. 280,282)**

దుర్యోధనుడి అధిక్షేపం ఆచార్యుడి హృదయంలో అణచబడిన ఆగ్రహాన్ని కుళ్ళగించింది. ఈ వాక్యంతో ‘పాండవులను గెల్వలేము!’ అన్నది అసమర్థోక్తి కాదు. దుర్యోధనుడిపై ప్రయోగించిన ఆగ్రహోక్తి, పార్థుడి పరాక్రమం తెలియక ఆచార్యుడిని ఆడిపోసుకొనటంలోని అవివేకం, గూఢ క్రోధభావాన్ని పైకి రేపింది. అత్తమీది కోపం దుత్తమీద చూపిన సామెతగా ద్రోణుడు పాండవసైన్యాన్ని నురుమాడసాగాడు. దుర్యోధను డతనిని మరింత పురికొల్పాడు. అతడిని సంతోషపెట్టటానికి భీముడిపై ద్రోణుడు విరుచుకపడ్డాడు. పోరు ఘోరంగా సాగింది. భీష్ముడు ప్రతాపమూర్తిని ప్రదర్శించాడు. భీష్మపర్వంలో భీష్ముడి ప్రతాపాగ్ని. ద్రోణ సహాయంతో తీవ్రతరం అయ్యేది.

3. ద్రోణుడి దృష్టి ప్రధానంగా ధృష్టద్యుమ్నుడి మీదే ఉండేది. ఆరవనాటి యుద్ధంలో ఆతడితోడ యుద్ధంచేసే మంచి అవకాశం దొరికింది. ధృష్టద్యుమ్నుడి ప్రధాన లక్ష్యం ద్రోణవధ. దానికి దొరికిన అవకాశాన్ని అతడు వదలుకొనేవాడు కాడు. తీవ్రయత్నం చేసేవాడు. అతడికి భీమార్జునులు సహాయపడుతూ ఉండేవారు. ద్రోణుడి ధాటికి ధృష్టద్యుమ్ను డాగేవాడు కాడు. ద్రోణవధకై అతడు జన్మించినా ద్రోణుడు అస్త్రశస్త్ర సన్న్యాసం చేస్తేగాని ఆ అవకాశం దొరకదన్న వాస్తవం తెలిసిన పాండవులు తగిన జాగ్రత్తలో ఎప్పుడూ ఉండేవారు. అందువలననే ద్రోణుడు ఘటోత్కచాదులతోనూ, చివరకు అర్జునుడితోనూ తలపడి పోరు ఘోరంగా చేయవలసి వచ్చింది. భీష్ముడి దశమ దివస యుద్ధంలో ధర్మజ భీమార్జునులు అరిభయంకరంగా విజృంభించి, భీష్ముడికి రక్షగా ఉన్న బలాన్ని మట్టుబెట్టి, పితామహుడితో హుటాహుటిగా ఎదుర్కొన్నారు. ఆయనకు పోరు భారమయ్యేటట్లు చేశారు. ఆ సమయంలో ద్రోణుడు క్రుద్ధుడై అశ్వత్థామను భీష్ముడికి సహాయంగా పంపాడు. కృతజ్ఞత ఆయన ఆచార్యత్వానికి అమరిన అనర్ఘ శిరోరత్నం.

**7. ద్రోణుడి వరం: వాఙ్మయ పద్మవ్యూహం:**

భీష్ముడు లేని కౌరవసేనలో ద్రోణుడి బాధ్యత పెరిగింది. భీష్ముడి తరువాత సర్వసైన్యాధ్యక్ష పదవికి అన్నివిధాలా అర్హుడు ఆయనే. ఆ సత్యాన్ని కర్ణుడు బోధిస్తేగాని దుర్యోధనుడు గ్రహించలేకపోయాడు. దుర్యోధనుడి కర్ణాభిమానం ద్రోణుడికి అవమానంగామారటం పూర్వకథ చెప్పిన సత్యం. దానిని రహస్యంగా కడుపులో దాచుకొన్న ద్రోణుడు దుర్యోధనుడి ప్రార్థన మన్నించి సర్వసైన్యాధ్యక్ష పదవిని స్వీకరించాడు. కర్ణుడిని కాదని తన నాపదవిలో నియోగించినందుకు ద్రోణుడు సంతోషించి దుర్యోధనుడిని ఒక వరం కోరుకొమ్మని అనుగ్రహించాడు. అసలు ద్రోణపర్వకథ ఇక్కడి నుండి మొదలవుతుంది.

భీష్ముడు వరమిస్తా ననలేదు. ద్రోణుడు వరమివ్వటానికి ముందుకు వచ్చాడు. దుర్యోధనుడు ఆ మాటను నమ్మలేక నమ్మి ఆ అవకాశాన్ని రాజనీతితో సఫలం చేసికొనవలెనని ప్రయత్నించాడు. కర్ణదుశ్శాసనాదులతో రహస్యమంతనాలు చేసి ఒక నిర్ణయానికి వచ్చాడు. ‘యుద్ధంలో ధర్మరాజును ప్రాణాలతో పట్టి దుర్యోధనుడి వద్దకు తీసికొని రావాలి’ అని గురువును కోరాడు.

ఈ కోరిక వినగానే అనేకవిధాల ఆలోచనలు అందరికీ కలగటం సహజం. ఘోషయాత్రా యుద్ధంలో చిత్రసేనుడు దుర్యోధనాదులను బంధించి ఇంద్రుడి వద్దకు తీసికొనిపోతున్నప్పుడు ధర్మరాజు దుర్యోధనుడిని శత్రువులనుండి విడిపించి సజీవంగా తన వద్దకు తెమ్మని భీమార్జునులను కోరాడు. దానికి ప్రతీకారంగా దుర్యోధనుడు కోరుతున్నాడా? అని భావించటానికి వీలున్నది. లేదా - ధర్మరాజు ద్రోణుడికి నమస్కరించి యుద్ధంలో విజయం కలిగేటట్లు ఆశీర్వదించుమని కోరాడు కదా! అతడినే బందీగా పట్టి దుర్యోధనుడికి అప్పజెప్పితే ద్రోణుడికి స్వప్రతిజ్ఞాభంగం ఏర్పడుతుంది. ద్రోణుడి వ్రేలితో అతడి కన్నునే పొడిచినట్లౌతుంది అని దుర్యోధనుడు ఆ పన్నాగం పన్నాడని భావించటానికి వీలున్నది.

ద్రోణాచార్యు డింతటి దురాలోచన చేయలేదు. కాని, తాను ధర్మరాజు కిచ్చిన ఆశీస్సులను మరచిపోలేదు. ధర్మరాజుకు విజయం కలిగితే ఫలంగా రాజ్యం వస్తుంది. ఆ ఫలాన్ని అందిస్తే ద్రోణుడికి ఆ వరాన్ని తీర్చటంలో అభ్యంతరం ఉండబోదు. దానిని నిశ్చయించుకొనటానికే ఇట్లా అన్నాడు -

చ. ‘ అకట! యజాతశత్రుఁ డను నప్పలు కిప్పుడు నిక్కమయ్యె వా
నికిఁ; గురునాథ! యిట్టు లతనిం దెగఁ జూచుట గోర కాజిఁ బ
ట్టి కొనుట గోరి; తివ్విధము డెప్పర మెంతయు నిత్తెఱంగు గో
ర్కికిఁ గత మేమి? పాండవుల గెల్చి ధరన్ సగ మీఁ దలంచితే?’ **(ద్రోణ. 1. 109)**

‘అని అడిగి ‘ధర్మరాజును పట్టి తేస్తే ఏం చేస్తావో నీ నిశ్చయాన్ని చెప్పు’ మని దుర్యోధనుడిని సూటిగా అడిగాడు. అందుకు దుర్యోధనుడు సంతోషించి తన మనసులోని మాటను బయటపెట్టాడు. ‘ఆ ధర్మరాజును యుద్ధంలో చంపితే అర్జునుడు ఆగ్రహోదగ్రుడై కురుబలాన్ని సర్వనాశనం చేస్తాడు. మనం ప్రయత్నించి పాండవుల నందరినీ చంపినప్పటికీ గోవిందుడు తన చక్రాయుధంతో మనలనందరినీ చెండాడి కుంతీదేవికైనా పట్టం కట్టుతాడు. కాబట్టి ధర్మరాజును చంపకుండా పట్టి తెచ్చి, జూదమాడేటట్లు చేసి, అతడితోపాటు భీమాదులనందరినీ అరణ్యవాసానికి పంపితే, శత్రుపీడ వదలి కలకాలం ఈ విశాల రాజ్య సంపదను అనుభవిస్తాను’ అని అన్నాడు.

దుర్యోధనుడి కోరిక వెనుక నున్న కుటిలనీతిని ద్రోణుడు పసికట్టాడు. వరమిచ్చే గురువుకే ఆ కోరిక వెగటువేసింది. దుర్యోధనుడి అంచనా ప్రకారం భీష్మద్రోణులకు అర్జునుడు యుద్ధంలో అసాధ్యుడు. కర్ణు డొక్కడే అతడిని చంపగలవాడు. ద్రోణుడు సేనా నాయకుడైనప్పుడు అర్జునుడిని చంపటం కుదరదు. కర్ణాదులు రణరంగంలో అతడిచేత చంపబడకుండా రక్షించుకొనే భారం కూడా ఏర్పడుతుంది. అందువలన యుద్ధంకంటె తేలికైన కపటోపాయం ద్యూతం. దానిని మరల ప్రయోగించదలచి యుధిష్ఠిరుడిని ప్రాణాలతో పట్టి తెమ్మన్నాడు. దుర్యోధన పక్షాన ఈ వ్యూహం పటిష్ఠమైనదే. ద్రోణుడు తలచుకొంటే ధర్మరాజును బంధించటం పెద్ద పనికాదు. దానితో పాండవ పరాజయం, కౌరవ విజయం ఒక్కసారిగా సిద్ధించే అవకాశం ఉంటుంది. కాని, ఇది ద్రోణుడికి ఇష్టమైనది కాదు. ధర్మబద్ధమూ కాదు. ఎట్లాగంటే - యుద్ధంలో ధర్మజుడికి విజయం కలిగే ప్రయోజనం కూకటివేళ్ళతో దీనివలన వీగిపోతుంది. పార్థపరాక్రమ ప్రదర్శనం వ్యర్థమైపోతుంది. పార్థుడిని కాదని ధర్మజుడిని పట్టటం అసాధ్యం. అర్జునుడు ప్రాణాలతో ఉండగా ధర్మరాజును ఎవరికీ చిక్కనివ్వడు. అందువలన పాండవాగ్రజుడిని పట్టటం అసంభవం - అని ద్రోణుడు భావించాడు. వరమిచ్చిన తరువాత కాదనటానికి వీలులేదు. చిక్కుసమస్య తెచ్చిపెట్టినందుకు కపట దుర్యోధనుడిపై గుండెలో క్రోధం కుంపటివలె మండుతున్నది. దానిని కప్పిపుచ్చుకొని వరంకాని వరంగా మార్చి ఇట్లా పలికాడు ద్రోణుడు.

చ. ‘ నరుఁ డెడ సొచ్చెనేని విను! నా కది దుష్కర మే నొకండనే
సురగణ మైన వ్రేలిఁగొని చూపఁగఁ జాలరు; వాఁడు లేనిచోఁ
దిరమయి పోర నిల్చిన యుధిష్ఠిరు ద్రౌపది పుట్టి నింటి వే
వురు వెఱఁగంది చూడ నలవుం జలముం జెడఁ బట్టి తెచ్చెదన్’. **(ద్రోణ. 1.113)**

అర్జునుడు యుద్ధంలో అడ్డగిస్తే ధర్మరాజును పట్టటం నాకు దుష్కరం. నా కొక్కడికే కాదు. దేవతలందరూ కలిసి వచ్చినా అతడిని వేలెత్తి చూపలేరు. ఆ అర్జునుడు లేకపోతే యుద్ధంలో యుధిష్ఠిరుడు ఎంత స్థిరంగా నిలిచినా పాంచాలురు వేయిమంది కన్నులప్పగించి చూస్తూ ఉండగా అతడి చలం, బలం నశించగా బంధించి తెస్తాను' అని అన్నాడు. ఈ పద్యం ద్రోణపర్వ కార్యనీతికి కీలకం వంటిది. ఈ పర్వకథా గతికి మార్గదర్శకం వంటిది. 'ధర్మజుడిని పట్టి తెస్తా ననటం' ఇందులో ప్రతిజ్ఞ. దీనినే గ్రహించి నిజమని నమ్మి స్కంధావారంలో చాటబంచిన దుర్యోధనాదులు అవివేకు (బాలిశు)లని సంజయుడు వ్యాఖ్యానించటం గమనార్హం. ద్రోణుడి యుద్ధంలో కీలకం ధర్మరాజును పట్టుకొనటం. ఇది మూడు రకాల నియమాలతో ముడిపడి ఉన్నది. 1.అర్జునుడు ధర్మరాజుకు అడ్డుపడరాదు; 2. అతడు అడ్డుపడకుండా కౌరవవీరులు క్రమ్ముకొని నొప్పించాలి లేదా దూరం చేయాలి; 3. అర్జునుడిని ఏదైనా మిషతో ధర్మరాజున్న చోటినుండి చాలా దూరం తీసికొని పోయి అన్నగారికి ఆపత్‌సమయంలో కూడా అందుబాటులోకి రాని విధంగా వ్యూహం పన్నాలి; 4. లేదా అర్జునుడిని లేకుండా చేయాలి (చంపివేయాలి). అది ద్రోణుడికి సాధ్యపడేది కాదు. కాబట్టి ఆ భారం మరెవరైనా స్వీకరించాలి. ఈ పరిస్థితు లనుకూలిస్తే ద్రోణుడు తా నిచ్చిన వరాన్ని నిలుపుకొంటాడు. లేదా, ఆ వైఫల్యం ఆయనది కాదు దుర్యోధనాదులదే. ఈ లోతైన సూక్ష్మాంశాలను గ్రహించని బాలిశుడు దుర్యోధనుడు. ఆతడికంటె ఘనులు అధికులు ఆయన ఆతడి మిత్రులూ, సోదరులూ.

రహస్య మేమంటే - అర్జునుడు ధర్మజు రక్షణలో ఏమరుపాటు ప్రదర్శించడు. కౌరవులు ఎన్ని ఎత్తులు వేసినా వాటిని చిత్తుచేసే ఎత్తులు తిరిగి వేయగలడు. ఒకవేళ అర్జునుడు దూరంగా ఉన్నా ధర్మజుడు ఒంటరిగా దొరకటం కూడా అంత సులభమైన పనికాదు. దొరికినా, ఆతడిని బంధించటం ద్రోణుడు ఆతడి కిచ్చిన మాటకు విరుద్ధం. కాబట్టి అతడిని బంధించటం ద్రోణుడి అభిమతం కాదు. అట్లని ధర్మజుడిని బాధించక వదలిపెట్టటానికి వీలులేదు. ద్రోణాచార్యుడి చేతిలో ఓడిపోయే పరిస్థితి రణరంగంలో ఏర్పడితే ధర్మజుడు వశుడౌతాడా? లేక ఉపాయాంతరంచేత రక్షించుకొంటాడా? ఈ విషయంలో కృష్ణార్జునులు ఆతడికి తగిన సలహాలిస్తారు. అందువలననే రథం విరిగితే వెంటనే మరొక రథం ఎక్కే ఏర్పాట్లు చేయవచ్చును. పరిస్థితులు ప్రతికూలమైతే చేతులు పై కెత్తి ఆత్మరక్షణ చేసికొనవచ్చును. అట్టి పరిస్థితులతో ధర్మజుడిపై బాణాలు వేయటం యుద్ధనీతి కాదు. ఇవన్నీ కలిపి ఆలోచిస్తే ధర్మజుడు పట్టుపడకుండ ఉండటమే ద్రోణుడి అభిమతంగా తోస్తున్నది. దానిని గూఢంగా వాక్యార్థంలో దాచటం ద్రోణుడి ప్రజ్ఞ. ఆ రహస్యం తెలియక దుర్యోధనుడు ద్రోణుడిని నిందించే సందర్భాలు రావచ్చును. అవి ఆతడికి క్రోధకారకాలై తారసిల్లవచ్చును. దుర్యోధనుడి దుర్భాషలే ద్రోణుడి రౌద్రాగ్నికి సమిధలుగా సన్నద్ధమయ్యే భావి యుద్ధ యజ్ఞానికి ఈ ద్రోణ ప్రతిజ్ఞ వాఙ్మయ వేదిక! దుర్యోధనుడు దూరాలోచనం లేకుండా దురాలోచనతో ప్రవేశించిన వాఙ్మయ పద్మవ్యూహం.

## 8. ద్రోణుడు తన వ్యూహంలో తానే చిక్కుకొన్నాడు:

మహాభారతంలోని యుద్ధపంచకంలో ద్రోణపర్వంలో జరిగినంత రౌద్రకర్మ మరొకపర్వంలో జరుగలేదు. రౌద్రరస ప్రధానమైన ఈ పర్వంలో ధీరోదాత్త ప్రవృత్తులకంటె ధీరోద్ధత ప్రవృత్తుల ప్రాచుర్యం, ప్రాధాన్యం ఎక్కువగా ఉంటుంది. పాండవులు ధీరోదాత్తులు; కౌరవులు ధీరోద్ధతులు. కౌరవ సైన్యాధ్యక్షులు ధీరోద్ధతుడైన దుర్యోధనుడి అభిమతానికి అనుగుణంగా యుద్ధవ్యూహాలు సాగించారు. వారు సహజంగా ఉదాత్తులైనా అర్థసాధకుడైన దుర్యోధనుడి స్వార్థసాధన కొరకే యుద్ధయత్నం సాగించారు. అర్థసాధనలో ధర్మసాధనను కూడా సాధించాలని యత్నించారు. కాని, కృతకృత్యులు కాలేకపోవటంతో తమంతట తాము ఉపాయాంతరాన్ని శత్రువులకు సూచించి రణరంగంలో వీరోచితంగా ఒరిగిపోయారు. ధర్మపురుషార్థం అర్థపురుషార్థానికి అంగంగా మారితే పరిణామం మరణమన్న వాస్తవాన్ని తమ జీవిత సందేశంగా ప్రజలకు అందించారు. దుర్యోధనుడికి కూడ చెప్పి చూచారు. ధర్మహాని ఆత్మహానికి దారితీస్తుందన్న సత్యాన్ని దుర్యోధనుడు మదాంధుడై గ్రహించలేకపోయాడు. అందువలన ధీరోద్ధతుడివలె యుద్ధంలో కూడా "దర్పమాత్సర్య భూయిష్ఠో మాయా ఛ్ఛద్మపరాయణః । ధీరోద్ధత స్త్వహంకారీ చల శ్చండో వికత్థనః" (దర్ప మాత్సర్యభూయిష్ఠుడూ, మాయావి, మోసగాడు, అహంకారి, చపలుడు, ప్రచండుడు, ఆత్మశ్లాఘానిరతుడు, శూరుడు, మత్సరి, అవలిప్తుడు, సులభకోపి) అనే లక్షణాల

నన్నింటినీ అర్థసాధనలో ప్రదర్శించాడు. అతడి ప్రయోజనాన్ని సాధించే సర్వసేనాపతులు అర్థపురుషార్థం కొరకే పోరు సాగించాలి. అదే ద్రోణపర్వంలో ద్రోణుడికి కలిగిన దురవస్థ.

మహాభారతంలో ప్రతినాయకుడు దుర్యోధనుడు. అతడిది ఉద్ధతమార్గం. దానిని తమశక్తియుక్తుల పోషించినవారు కౌరవవీరులు. ఈ పర్వంలో దుర్యోధనుడు ద్రోణుడికి చూపిన లక్ష్యం ధర్మరాజును ప్రాణాలతో పట్టితేవటం. పట్టితెస్తానన్న ద్రోణుడు వీరుడైన యోధుడే కావచ్చును. అది అతడి ఆత్మధర్మానికి విరుద్ధమైనది. అయినా దుర్యోధనుడిని సంతోషపెట్టేందుకు ధర్మరాజును పట్టి ఇస్తానని ప్రతిజ్ఞ చేశాడు. అయితే అర్జునుడి దాడినుండి ద్రోణుడిని తప్పించగలిగే పరిస్థితులు దుర్యోధనుడు కల్పించాలని అతడు భావించాడు. అర్జునుడిని కూడ ఓడించే బాధ్యత ద్రోణుడే స్వీకరించాలని దుర్యోధనుడు తలంచాడు. ఈ విషయంలో బాహాటంగా ఏ కట్టడీ వారు చేసికొనలేదు. కథాసందర్భాలలో వారు వాటిని బయటపెట్టుకొన్నారు. అప్పు డొకరిపై మరొకరికి కోపతాపాలు ఏర్పడ్డాయి. అవి కౌరవసేనకు అపకారం కూడా చేశాయి. ఏమైనా ద్రోణుడు ధీరోద్ధత ప్రభావంతో యుద్ధం సాగించా డన్నది వాస్తవం. ఇదే ద్రోణపర్వం చివర ద్రోణుడు వధార్హుడని ధర్మజుడు నిశ్చయించటానికి దోహదపడింది. నరుడు గురువధకు అంగీకరించలేదు. గురువధ చేసిన ధృష్టద్యుమ్నుడిని అభినందించకపోగా అభిశంసించాడు, తండ్రి మరణవార్త విని క్రుద్ధుడై నారాయణాస్త్ర ప్రయోగం చేసిన అశ్వత్థామను సమర్థిస్తున్నట్లుగా అర్జునుడు ఆ అస్త్రాన్ని ఉపసంహరింపచేయకుండా ఊరక ఉండిపోయాడు. ద్రోణవధకు ఏకైక కారకుడు ధర్మరాజనీ, అతడు ఉదాత్తుడైన ద్రోణుడిని చంపే ఉపాయం చేయటం ధర్మవిరుద్ధమనీ వీరులందరూ విమర్శించేటట్లు యుద్ధరంగంలో కృష్ణార్జునులు ఒక సన్నివేశాన్ని కల్పించారు. అప్పుడు ధర్మరాజు ఎలుగెత్తి ఇట్లా ప్రకటించాడు.

సీ. ‘ఆ సభఁ బాంచాలి గాసి సేయఁగ నుపే । క్షకుఁ డయి చూచెఁ, బెక్కండ్రఁ గూర్చి
కొని బాలు నభిమన్యుఁ గూల్చె; నించుకవడి । యాఁగిన నర్జునుఁ డగ్నిఁ జొచ్చు
ననువగ మనల నాతనికిఁ దోడ్పడఁ బోవ । నీ కాఁగె నమ్మెయి; నిట్టి ధర్మ
పరుఁ డైన కలశసంభవుతోడ సరివచ్చు । టుచితంబె? యావచ్చు నుజ్జ్వలాగ్ని

తే. వలని కరిగెద; మీరు, మీ వాహినులును । బాఱిపోం డెక్కడేని; న ప్పార్థుకోర్కె
యంత సఫలతఁ బొందెడు; నచ్యుతుండు । నెట్లు దనకు రుచించెఁ దా నట్లు సేయు.(**ద్రోణ. 5. 380**)

శాంతమూర్తి అయిన ధర్మరాజులోని కోపం ప్రళయాగ్నిగా మండిన మాట లివి. వ్యంగ్య నిష్ఠురోక్తికి ఈ పద్యం నిండైన ఉదాహరణం. మాటనేర్పరితనంలో ఇతడు గురువునే మించాడు. నారాయణాస్త్రం కంటె ఈ అధిక్షేపం శక్తిమంతమైనది. ‘ఇట్టి ధర్మపరుడైన కలశసంభవు’ డనే మాట వ్యతిరేక వ్యంగ్యోక్తి. ద్రోణుడియందు క్షమించరాని మూడు దోషాలను చూపించి, అతడు ఉద్ధతుడివలె వ్యవహరించా డని ఆరోపించాడు. వధ్యుడని క్రుద్ధుడై అన్నాడే కాని ధర్మరాజు దుర్యోధనుడివలె ఆయనను నిందించలేదు. గురువధలో కూడా ఒక ధర్మం ఉన్నదని ప్రతిపాదించిన ధర్మరాజు అర్జునుడిమీద వాఙ్మయాస్త్రాన్ని ప్రయోగించాడు. శ్రీకృష్ణుడిమీద ధర్మచక్రం విసిరాడు. అప్పుడు కృష్ణార్జునులు జాగృతులై కార్యాన్ని ముగింపునకు తెచ్చారు. ధర్మరాజు నిండుకుండ. ద్రోణుడి మొదటిదోషం అతడిమీద యుద్ధం చేయటానికి పాండవులకు నైతికమైన అర్హతను కలిగించింది. దానిని ద్రోణుడు అంగీకరించాడు కూడా. అభిమన్యువధ ద్రోణుడి ధర్మప్రవర్తనాన్ని కలుషితం చేసింది. అందువలన మోసాన్ని మోసంతో జయించే ఉపాయాన్ని ఆయనమీద ప్రయోగించే అర్హత పాండవులకు కలిగింది. అర్జునుడు సైంధవవధను చేయకుండా అడ్డపడి అతడి మరణానికి దోహదం చేసిన ద్రోణుడియత్నం ఆయన సత్యవ్రతాన్నే భగ్నం చేసింది. ధర్మం తప్పినవాడు ఎంతటి మహనీయుడైనా వధకు అర్హుడని ధర్మరాజు తీర్పు చెప్పినట్లయింది. ఇందులో ధర్మజుడు ద్రోణుడిని ధర్మనిష్ఠాపరుడైన గురుమూర్తిగా కాక,

అర్థసాధనకై అడ్డదారులు త్రొక్కిన ఉద్ధతుడిగా అభివర్ణించాడు. ఇది ద్రోణపర్వంలో ద్రోణపాత్ర చిత్రణకు కీలకమైన కథాంశం. తిక్కన దీనిని కథా నిర్వహణంలో చెప్పించి కథను ఉత్కంఠభరితంగా ఉన్మీలింప చేశాడు.

**9. అయిదునాళ్ళ యుద్ధం : అయిదంకాల రూపకం:**

మూలభారతంలోనే ముచ్చటగా కుదిరిన దృశ్యకావ్య స్వభావాన్ని తిక్కన తేటపడేటట్లు చిత్రించాడు. ద్రోణుడు అయిదునాళ్ళు యుద్ధం చేశాడు. ఒక్కొకనాటి యుద్ధం ఒక్కొక అంకంగా భావించే అవకాశం ఉన్నది. సామాన్యంగా అయిదంకాల నాటకంలో పంచసంధులు ప్రవర్తిల్లే కథను చిత్రించటం రూపకసంప్రదాయం. ద్రోణపర్వంలో ఆ సంప్రదాయచ్ఛాయలు గోచరిస్తాయి. అయితే, సంస్కృత రూపకాలలో కూడా ఒక్కొక్క అంకంలో ఒక్కొక సంధి ప్రవర్తిల్లుతుందనే నియమం ఉండదు. మొత్తంమీద దానిని కథాగతిని బట్టి అన్వయించుకొనాలి. ద్రోణపర్వంలో కూడా అంతే.

ప్రథమాశ్వాసంలో - ద్రోణుడి మొదటి రెండు రోజులయుద్ధం వర్ణించబడింది. తొలినాటి యుద్ధంలో ముఖసంధీ, రెండవనాటి యుద్ధంలో ప్రతిముఖసంధీ గోచరిస్తాయి.

ద్వితీయాశ్వాసంలో - ద్రోణుడి మూడవనాటి యుద్ధం - అందులో అభిమన్యుడివధ, అర్జునుడు సైంధవవధకు ప్రతిజ్ఞ చేయటం వర్ణించబడ్డాయి. ఈ ఘట్టంలో గర్భసంధి రసవత్తరంగా చిత్రించబడింది. అంటే కథ క్లైమాక్స్ ఇందులో కనబడుతుంది.

తృతీయ చతుర్థాశ్వాసాలలో - అవమర్శ సంధి పోషించబడింది. సైంధవ సంహారఘట్టం విస్తారంగా రసవత్తరంగా చిత్రించబడింది.

పంచమాశ్వాసంలో - ద్రోణుడి అయిదవనాటి యుద్ధం చెప్పబడింది. ఇందులో ద్రోణనిర్యాణం, అశ్వత్థామ రౌద్రప్రదర్శనం చిత్రించబడ్డాయి. చివరకు కృష్ణార్జునులయొక్క, పరమేశ్వరుడి యొక్క మహిమలను వ్యాసుడు వివరించే ఘట్టంతో కథ ముగుస్తుంది. మూడురకాల అద్భుతాలతో ముప్పేటగా ముగిసే మహనీయ ఘట్టం నిర్వహణసంధి.

యుద్ధరీతులలో సామాన్యంగా అయిదురకాలు ప్రాచుర్యంలో ఉన్నాయి. 1. ఎదురుదాడి యుద్ధరీతి, 2. ఆత్మరక్షణ యుద్ధరీతి, 3. మాయాయుద్ధరీతి, 4. ద్వంద్వ యుద్ధరీతి, 5. మూకుమ్మడి యుద్ధరీతి. ఆయా యుద్ధరీతుల అవసరాలనుబట్టి వ్యూహరచనలు చేసికొనటం సహజం. ద్రోణపర్వంలో పైన పేర్కొన్న యుద్ధరీతులన్నీ ప్రవర్తిల్లాయి. అందులోకూడ ఒక విశేషాన్ని గమనించవచ్చును. కౌరవపక్షం మొదటి మూడురోజులూ పాండవసైన్యం మీద దాడిచేసి కార్యసాధన చేసికొనాలనే ఉత్సాహాన్ని ప్రదర్శించింది. పాండవసేన ఆ కాలంలో ఆత్మరక్షణ యుద్ధరీతిని అనుసరించింది. చివరి రెండునాళ్ళూ దీనికి విరుద్ధంగా సాగింది. ఇందులో ఎక్కువతక్కువలను లెక్కకట్టటం కంటె కార్యసాధనకు ఉపయోగించే ప్రయోజనాలను పరిగణించటమే సమంజసం.

ద్రోణుడు కౌరవసేనకు సర్వసైన్యాధ్యక్షుడైన వెంటనే అతడిని యుద్ధంలో సంహరిస్తానని ధృష్టద్యుమ్నుడు శపథం చేయలేదు. చేసే పరిస్థితు లున్నాయని పాండవులు భావించలేదు. ద్రోణవధోపాయం తెలిసిన ధర్మరాజుకూడా సమయం అనుకూలించిందని అనుకొనలేదు. పాండవులు కార్యలక్ష్యాన్ని నిర్ణయించుకొనకముందే దుర్యోధనుడు ధర్మరాజును ప్రాణాలతో బందీచేసే లక్ష్యాన్ని సేనాపతికి నిర్దేశించాడు. దానికి అర్జునుడు అడ్డుగా ఉన్నాడని తెలిసినా ద్రోణుడు ధర్మరాజును పట్టుకొనబోతున్నాడని రాజరాజు చాటింపు వేయించాడు. దానికి ప్రయోజనం కూడా ఉన్నది. భీష్మపతనానంతరం పాండవులు విజయగర్వంతో కౌరవులపై కాలు దువ్వుతూ ఉంటారు. వారికి తగిన భయోత్పాతాన్ని కలిగించి వారి ఉత్సాహాన్ని నీరుకార్చే ఉపాయం అది. పాండవ విజయం తథ్యమని ఆచార్యాశీర్వాదం పొందిన ధర్మరాజు కూడ భయంతో గడగడలాడి, అర్జునుడితో మొరబెట్టుకొని, తనను వదలి రణరంగంలో దూరంగా పోకుండా కవచంవలె రక్షించుమని అతడిని కోరాడు. అర్జునుడు అన్నకు అభయాన్ని అందించి ధైర్యం చెప్పాడు. ఆయన మాటలు ద్రోణపర్వ కథాకార్యానికి ఆయువుపట్టులు.

క. ‘ గురుని వధియించుటయు భూ । వర! నీ వని నొవ్వ నొండువలను సనుటయుం
బరికింప నొక్కరూ పవి । దురితంబులు; వీని( జేయుదునె నే నెందున్?’ **(ద్రోణ. 1.119)**

అర్జునుడి అభిప్రాయంలో ద్రోణవధ ఎంతపాపమో, ధర్మరాజు పట్టుబడి శత్రుశిబిరం చేరటం అంత పాపమట! ఆ రెండు పాపాలూ ఎన్నడూ, ఎప్పుడూ ఆయన చేయడట! అటు గురుభక్తి, ఇటు భ్రాతృభక్తి ఆయనకు సమానమన్నమాట! దీనిని బట్టి గ్రహించదగిన సారాంశం మరొకటి ఉన్నది. ద్రోణపర్వంలో అర్జునుడు ద్రోణవధకు తాను ప్రయత్నించడు. ధృష్టద్యుమ్నుడు చేస్తే అతడు అంగీకరించకపోవచ్చును. అంటే - ద్రోణపర్వంలో పాండవుల లక్ష్యం ద్రోణవధ కాదన్నమాట! కౌరవపక్షంలో సత్వరకర్తవ్యం ధర్మజుడిని ప్రాణాలతో పట్టుకొనిపోవటం. ఆ కార్యం అర్జునుడు జరగనివ్వడు. దాని బాధ్యతకూడా అతడిదే అన్నట్లు స్పష్టపరిచాడు. ఈ వాక్యంలో ఉత్తరార్ధం ధర్మజుడికి తృప్తిని కలిగించినా, పూర్వార్ధం ఆయనకు అభిమతం కాదు. దానిని ప్రస్తావించటం ప్రస్తుతం కాదు కాబట్టి ధర్మరాజు ఊరకున్నాడు. అర్జునుడు కూడ కౌరవకార్యం సఫలం కాదని ధర్మజుడి ఎదుట గట్టిగా చెప్పాడు.

క. ‘ క్షోణీవల్లభ! విను మే( । బ్రాణముతో నుండ నిన్ను( బట్టుకొన(గ నా
ద్రోణునకు( గాదు సగణ । స్థాణునకైనను వశంబె తల( కేమిటికిన్? **(ద్రోణ. 1.120)**

ధర్మరాజు పట్టుబడాలంటే అర్జునుడు ముందుగా యుద్ధంలో ప్రాణాలు కోల్పోవాలి. అది జరగని పని. అందువలన ధర్మరాజు పట్టుబడటం కూడా జరగనిపని. సర్వసేనాపతులు కలిసిరాగా ద్రోణుడు ప్రయత్నించినా, అతడి ప్రార్థనపై ప్రమథగణంతో పరమేశ్వరుడే ముందుకు వచ్చినా విజయు డుండగా కౌరవులకు విజయం లభించటం అసంభవం! అని వీరోక్తిని ప్రకటించాడు. ఇది ప్రతినాయకుడికీ, అతడి సర్వసేనాధిపతికీ, అతడిని అనుసరించే కౌరవవీరులకూ ప్రతిగా చేస్తున్న ప్రతినవంటిది. ఇందులోనూ ద్రోణుడిని ఓడిస్తా నన్నాడే కాని, చంపుతా ననలేదు. అస్త్రగురువును, ఎదిరించి ఓడించటమే వీరధర్మ మనుకొన్నాడు కాని, చంపటం మహాపాతక మనుకొన్నట్లు స్థిరపరచా డిక్కడ అర్జునుడు.

పై మాటలతో పార్థుడు ధర్మరాజుభయాన్ని దూరం చేశాడు. ఆ పైన విజయం తథ్యమనే ధైర్యాన్ని కల్పించేటట్లు పలికాడు. ‘ధార్తరాష్ట్రులు తమ శక్తియుక్తులను తెలిసికొనకుండా దురాశతో నిన్ను పట్టాలని తలచారు కాని, మూడు లోకాలను వెంటబెట్టుకొని సగర్వంగా యుద్ధానికి కదలివచ్చినా ధర్మరాజా! నీవు యుద్ధంలో భంగపడటం జరగదు. అట్లా జరిగితే ఈ భూమి బ్రద్దలైపోదా? సముద్రాలు ఇంకిపోవా? ఆకాశం నేలపై కూలిపోదా? కాబట్టి, వారి సంకల్పం ఫలించదు. ఆ దురాత్ములు యుద్ధంలో మనలను పరాభవించలేరు. నా సంకల్పం ఇట్లా ఉన్నది-’ అని ధర్మరాజుకు నిండైన ధైర్యాన్ని కలిగించి యుద్ధానికి ఉత్సాహంగా ముందుకు సాగించాడు.

కౌరవపక్షంలో ద్రోణుడి ప్రతిజ్ఞ పాండవులపై దాడిచేసే పద్ధతిని ప్రదర్శించగా, అర్జునుడు చేసిన ప్రతిజ్ఞ ఆత్మరక్షణకై చేసే యుద్ధరీతిని ప్రదర్శించింది. ఇదే వైఖరి ద్రోణపర్వంలో మూడు రోజులు సాగుతుంది. అభిమన్యుడి మరణానంతరం అర్జునుడు ఆత్మరక్షణరీతిని వదలి సైంధవవధను లక్ష్యంగా చేసికొని శత్రుసేనమీద దాడికి పూనుకొంటాడు. ద్రోణుడు అప్పుడు ఆత్మరక్షణరీతిలో పడ్డాడు. అర్జునుడి ప్రతిజ్ఞ తీరకుండా ఎన్ని ఆటంకాలు కలిగించాలో అన్నిటినీ సప్రయత్నంగా సాగించాడు. అయినా, శ్రీకృష్ణార్జునుల అద్భుత పరాక్రమానికీ, వ్యూహచాతుర్యానికీ, మహిమలకూ, దివ్యశక్తులకూ ఎదురు నిలువలేక భంగపాటుకు గురి ఔతాడు. కథలోని ఈ మలుపు అర్జునుడు సాధించే వీరకార్యమే.

ఈ వివరణం వలన తెలిసే మరొక సూక్ష్మాంశం ఇది - ద్రోణపర్వంలో కార్యం మొదలుపెట్టేది ప్రతినాయకుడు. దానిని ప్రవర్తింపజేసేది ద్రోణుడు (సేనాపతి). నాయకుడైన ధర్మరాజు సేనాపతి యత్నాన్ని తన సేనాపతితో కాక సమర్థుడైన అర్జునుడిచే భగ్నం చేయించాడు. ప్రతినాయక ప్రయత్నం భగ్నం ఈ పర్వంలోని కార్యస్వభావం. ఈ ప్రయత్నాన్ని వ్యక్తీకరింపజేసేవి ఆయా వీరుల వ్యూహరచనలు, యుద్ధక్రీడలు.

## 10. మొదటినాటి యుద్ధం: ముఖసంధి: శకట క్రౌంచవ్యూహాలు:

ప్రథమాశ్వాసంలో ద్రోణుడు ధర్మరాజును పట్టుకొనటానికి బీజం నాటి కార్యారంభం చేశాడు. ముఖసంధి మూర్తికట్టింది. దానికి తగ్గట్లు ఆయా సైన్యాధిపతుల స్వభావాలు వ్యక్తమయ్యేటట్లు వ్యూహాలు రచించబడ్డాయి. మొదట వ్యూహరచన చేసింది ద్రోణుడు. అతడు శుక్రాచార్యాంశతో పుట్టినవాడు కావటంచేత అతడి వ్యూహరచనలో రాక్షసాచార్య స్వభావం ప్రతిఫలిస్తూ ఉంటుంది. ద్రోణుడు శకటవ్యూహాన్ని పన్నాడు. 'పక్షౌ, ఉరస్యం, ప్రతిగ్రహః ఇత్యౌశనసో వ్యూహవిభాగః. పక్షౌ, కక్షౌ, ఉరస్యం, ప్రతిగ్రహః ఇతిబార్హస్పత్యః' - అని కౌటిల్యుడి అర్థశాస్త్రం చెప్పుతున్నది. (అర్థశాస్త్రమ్. సాంగ్రామికం, దశమాధికరణమ్: షష్ఠోధ్యాయః) వ్యూహంలో రెండుపక్షాలూ, ఉరస్యం (మధ్యప్రదేశం), ప్రతిగ్రహం (సైన్యపృష్ఠదేశం) - ఈ నాలుగు అవయవాలూ ఉంటాయని శుక్రాచార్యులమతం. రెండు పక్షాలూ, రెండు కక్షాలూ, ఉరస్యం, ప్రతిగ్రహం అని ఆరు అవయవాలు ఉంటాయని బృహస్పతి మతం. ఈ లక్షణాన్ని పట్టిచూస్తే ద్రోణుడు పన్నిన శకటవ్యూహం శుక్రాచార్య సమ్మతమైనది. ఆసురమైనది. దానికి ప్రతిగా పాండవులు పన్నినవ్యూహం క్రౌంచవ్యూహం. ఇది బృహస్పతి మతానుకూలంగా ఉండే దివ్యవ్యూహం. వ్యూహస్వభావాలే కౌరవపాండవుల ఆసురీదైవీ ప్రవృత్తులను ధ్వనింపజేస్తున్నాయి.

ధర్మరాజును పట్టి సురక్షితంగా గమ్యం చేర్చటానికి సైన్యవ్యూహాన్ని బండిగా రూపొందించాడు ద్రోణుడు. ముందుభాగంలో కర్ణుడు నిలిచిఉన్నాడు. ఆతడు బండిని లాగే అశ్వం వంటివాడు. అతడి వెనక దుర్యోధనుడు ఉన్నాడు బండితోలేవాడివలె. అతడి ఇష్టప్రకారం బండి ఎదుటివారి వ్యూహంలోకి దూసికొని పోవాలి. ఈ వ్యూహంలో ముందుభాగానికి (దీనిని పురఃపృష్ఠం అనవచ్చును) చొరవచేసికొని పోయే గుణం ఉంటుంది. కర్ణదుర్యోధనులు ఆ స్థానాలలో ఉన్నారు. ద్రోణుడు మధ్యభాగంలో ఉన్నాడు. కర్ణుడు చూపే చొరవతో ముందుకు సాగి ధర్మరాజును వెంటాడి నిపుణంగా పట్టి వ్యూహమధ్యభాగాన పెట్టాలి. అప్పుడతడు వెనుకకు మరలుతాడు. ఆయనకు ఇరుప్రక్కలా కురువీరు లున్నారు. కుడిప్రక్క జయద్రథ, భగదత్త, వికర్ణులూ, వారికి సాయంగా శకునీ ఉన్నారు. ఎడమప్రక్క కృతవర్మ, వివింశతి, చిత్రసేనులతో కూడిన దుశ్శాసనుడు, అతడికి సాయంగా కాంభోజశకయవన దేశాధీశు లున్నారు. మధ్యభాగంలో త్రిగర్త, మద్ర, శిబి, శూరసేన దేశాధిపతులు చుట్టూ ఉన్న ద్రోణుడు రాణించాడు. ఈ వ్యూహంలో కార్యసాధనోపాయం కూడా ఉన్నది. పాండవసేనలో ధర్మజుడు పట్టువడాలంటే ముందుగా అర్జునుడిని సమర్థంగా అడ్డుకొని, అతడి సహాయం అగ్రజుడికి అందకుండా చూడాలి. అందుకు శకటవ్యూహంలో కర్ణుడు ముందు నిలిచి ఉన్నాడు. భీముడిని ఎదుర్కొని అతడి సాయం ధర్మరాజుకు అందకుండా చేయాలని సుయోధనుడు కర్ణుడి వెంట వ్యూహంలోకి చొరబడటానికి సిద్ధమయ్యాడు. వీరిద్దరూ ద్వంద్వ యుద్ధాలలో అర్జున భీములను నిలువరించగలిగితే ధృష్టద్యుమ్నాది పాంచాలవీరులు ధర్మరాజుకు అండగా నిలుస్తారు. వారిని చెండాడి, మనస్సులోని మంట తీరేటట్లు ద్రుపదాదులను బాధించి ధర్మరాజును ఒంటరివాడిని చేసి పట్టుకొనటానికి ప్రయత్నించాలని ద్రోణుడు మధ్యప్రదేశంలో నిలబడి అవకాశం కొరకు వ్యూహాన్ని ముందుకు నడపసాగాడు. ప్రాణాలతో పట్టిన శత్రువును భద్రంగా తరలించాలంటే శకటవ్యూహం ప్రశస్తమని ద్రోణుడి అభిప్రాయం.

శకటవ్యూహానికి ప్రతిగా పాండవులు పన్నింది క్రౌంచవ్యూహం. తిక్కన క్రౌంచవ్యూహంలో ఎవరెవరు ఏయే స్థానాలలో నిలిచారో స్పష్టంగా వివరించకపోయినా సూచనాప్రాయంగా పేర్కొన్నాడు. బండి నేలమీద నడుస్తుంది. పక్షి ఆకసంలో ఎగురుతుంది. క్రౌంచ, గరుడ, శ్యేనాది వ్యూహాలు పక్షివ్యూహాలు. పక్షికి రెండు రెక్కలు, తోక, కడుపు, కంఠం అందులో ముఖ్యంగా ముక్కు - అనే అంగాలు ముఖ్యం. ఈ అంగాలన్నీ ఉంటే అది బృహస్పతి సమ్మతమైన దివ్యవ్యూహం. ధర్మరాజును బండిలో బందీగా తీసికొనిపోతున్నప్పుడు ఎక్కడికైనా ఎగిరి వ్యూహాన్ని ఎదుర్కొని భేదించి బందీని విడిపించి శత్రువ్యూహాన్ని ధ్వంసం చేయటానికి తోడ్పడేది పక్షివ్యూహం.

పాండవవ్యూహం ప్రత్యర్థుల పథకాన్ని భగ్నం చేయగలిగిన అవకాశాలను కలిగించేది. అందులో క్రౌంచపక్షి వాడి అయిన ముక్కువలె అగ్రభాగంలో నిలిచాడు అర్జునుడు. కంఠప్రదేశం వలె నిలిచాడు ధృష్టద్యుమ్నుడు. ఒకవైపు భీమాది సోదరులున్నారు,

మరొకవైపు అభిమన్యు ప్రభృతి కుమారు లున్నారు. ధృష్టకేతువు మొదలైనవారు పృష్ఠభాగంలో నిలిచారు. ధర్మజుడు గర్భస్థానంలో సురక్షితంగా ఉన్నాడు. ఇది శకటవ్యూహం కంటె సమగ్రమైనది, వేగవంతమైనది, ఎట్టి క్లిష్టపరిస్థితులలోనైనా శత్రువుమీద మెరుపుదాడి చేయటానికి వీలైనది. వ్యూహస్వభావాన్ని బట్టి గమనిస్తే ధర్మజుడిని పట్టేయత్నం బలంగా సాగినా, పార్థాదుల మెరపు దాడులలో అది ఫలించదని ఊహించటానికి వీలుంది. కథలో ఈ ఊహ నిజమౌతుంది కూడా.

శకటవ్యూహంలో ముందున్న కర్ణుడిని, క్రౌంచవ్యూహంలో ముందున్న అర్జునుడు ఢీకొని యుద్ధం చేస్తూ ఉండగా, ద్రోణుడు వారిద్దరివైపు కాకుండా ధర్మరాజున్న వైపు సంకులసమరాన్ని సాగించాడు. ధర్మజరక్షణలో పాండవవీరులు కూడి ఒక్కుమ్మడిగా ద్రోణుడి పరాక్రమాన్ని ఎదురొడ్డి పోరు ఘోరంగా చేశారు. మధ్యాహ్నానికి ద్రోణుడి ప్రతాపం దేదీప్యమానమైపోయింది. ధర్మరాజును రక్షించే వీరులు రంగంలో నిలువలేకపోయారు. అప్పుడు ధర్మరాజు ద్రోణుడిని ఎదిరించి అతడిని నిలువరించటానికి అర్జునుడినీ, ధృష్టద్యుమ్నుడినీ ఆజ్ఞాపించాడు. వారిద్దరూ తాము కర్ణాదులతో చేస్తున్న యుద్ధాలను మాని ద్రోణుడివైపు లక్ష్యాన్ని మళ్ళించి ఆయనతో శస్త్రాస్త్ర ప్రయోగ పాండిత్యంతో పోరి ధర్మజుడి దరికిచేరకుండ నిలువరింపచేశారు. ప్రక్కలనుండి దూరి ధర్మజుడికి హాని చేయాలనుకొన్న శల్యాదులకు భీమాదులు తగిన గుణపాఠం చెప్పారు. ద్రోణుడు పాండవవీరుల సంఘటిత శక్తిని ఎదుర్కొనవలసి వచ్చింది. అతడు సాహసంతో తెగించి ధర్మరాజును లక్ష్యంగా పెట్టుకొని సూటిగా యుద్ధం సాగించాడు. చుట్టుముట్టి ఆతడిని సమీపించాడు. సైనికులందరూ ధర్మజుడు చిక్కాడని కేకలుపెట్టారు. ఆ కేకలు అర్జునుడిని ఆగ్రహోదగ్రుడిగా చేశాయి. ద్రోణుడిమీద, కౌరవసైన్యంమీద కొరవివలె, కార్చిచ్చువలె విరుచుకుపడ్డాడు. సైన్యాన్ని రక్తప్రవాహంగా మార్చాడు. అస్తమయ సమయంలో రణరంగం రక్తవర్ణంతో భయంకరంగా మారింది. యుద్ధం ఆగిపోయింది.

మొదటినాటి యుద్ధంలో కార్యారంభం సమర్థనీయంగా సాగింది. కాని అర్జునుడి ప్రతిజ్ఞమేరకు ధర్మజుడు పట్టువడకుండ రక్షించబడ్డాడు. ధర్మజరక్షణలో పాండవవీరులు ద్రోణుడిపై దాడి చేసినప్పుడు అతడు క్రోధమూర్తిగా విజృంభించి పాండవసైన్యాన్ని వేటాడాడు. అయినా కార్యం కుంటువడింది. ఇటువంటి ఘట్టమే ముఖసంధిని ప్రదర్శిస్తుంది.

### 11. రెండవనాటి యుద్ధం: ప్రతిముఖసంధి: గరుడ - అర్ధమండల వ్యూహాలు:

ప్రారంభించిన కార్యం ఏదో బలమైన కారణంచేత ముందుకు సాగకపోతే తీవ్రమైన ప్రయత్నంచేసి బహుప్రయోజనాలు సాధించే వ్యూహాన్ని ప్రయోగించే కథాఘట్టంలో ప్రతిముఖసంధి ప్రకాశిస్తుంది. అది ద్రోణుడి రెండవనాటి యుద్ధంలో ప్రస్ఫుటమయింది.

మొదటినాటి యుద్ధంలో ధర్మజుడిని పట్టివ్వలేనందుకు ద్రోణుడు లజ్జావిషాదాలను పొందాడు. దుర్యోధను డాయనను ఏమీ అనక పూర్వమే ఇట్లా పేర్కొన్నాడు.

చ. ‘ నరవర! మున్న చెప్పితి రణంబున నర్జును( డొద్ద నున్న నె
వ్వరికిని ధర్మసూను( బొదువంగ నశక్య; మొకండు పార్థు ను
ద్ధురు( డయి నేల వాపికొని దోర్బల మొప్పఁగ( బోవ( జాలినన్
వెరవున( బట్టెదం; బరులు వేవురు మార్కొనినం గలంచెదన్’. **(ద్రోణ. 1.216)**

ఆ. ‘ నరు(డు లేనిచోట నను( గని వెన్నిచ్చి । పాఱకున్న( బట్టువడియె( గాఁగ(
దలఁపు ధర్మపుత్త్రు ధరణీశ!; పాఱుట । గలిగెనేని నంతకంటె మేలు’ **(ద్రోణ. 1.217)**

యుద్ధారంభంలో చేసిన ద్రోణుడి ప్రతిజ్ఞకు ఈ వాక్యాలు అనుబంధాలు. అర్జునుడు దగ్గర ఉంటే ధర్మజుడిని పట్టటం అసాధ్యం. అందువలన మొదటిరోజున కార్యం పూర్తికాలేదు. దానిని కొనసాగించి ఫలింపజేయాలంటే అర్జునుడు ధర్మజుడికి దూరంగా పోవాలి. అట్లా ఎవరైనా చేయగలిగితే ద్రోణుడికి ధర్మరాజును పట్టటం సాధ్యమౌతుంది. అయితే, ధర్మజుడు ద్రోణుడి

ప్రతాపానికి భయపడి వెన్నిచ్చి పారిపోకుండా యుద్ధం చేస్తే పట్టటం తథ్యం. ఒకవేళ పలాయనం చిత్తగిస్తే అంతకంటె (పట్టుబడటంకంటె) మరీ మంచిది. అంటే ఓడి పారిపోవటం మరణంకంటె హీనం. ద్రోణుడి మాటలలో రెండుమూడు సూక్ష్మాంశాలున్నాయి. ప్రతిజ్ఞ తీర్చకపోవటానికి ద్రోణుడు విధించిన నియమం అడ్డం వచ్చింది. అర్జునుడు ధర్మరాజును ఆదుకొన్నాడు. దానికి ద్రోణుడు బాధ్యుడు కాడు. అర్జునుడిని ఎదిరించి విజయం సాధించటం తనకు సాధ్యంకాదని ద్రోణుడు ముందే ప్రకటించి ఉన్నాడు కాబట్టి అర్జునుడిని దూరంగా తీసికొని వెళ్ళే బాధ్యత దుర్యోధనుడిదే అని ఆచార్యుడి భావం. ఆ పనిని కర్ణుడు నిర్వహించగలడని దుర్యోధనుడి ధైర్యం. కర్ణుడు అర్జునుడిని జయించలేడని ద్రోణుడికి తెలుసు. అందువలన అది ఆచరణ యోగ్యమైన ప్రతిపాదన కాదని కూడ తెలుసు. అయితే, దానినిగురించి దుర్యోధనుడు స్పందించే లోపలే సుశర్మ తన బలగంతో, సంశప్తకులతో అర్జునుడిని ఎదిరించే అవకాశం ఇమ్మని దుర్యోధనుడిని అడగటం, అందు కాయన అంగీకరించటం ఒకేసారి జరిగిపోయాయి. ద్రోణుడి ప్రయత్నం ఫలించే అవకాశం లభించింది. సుశర్మా, సంశప్తకులూ పార్థుడిని పోరుకు ఆహ్వానించారు. యుద్ధాహ్వానాన్ని ఆదరించకపోవటం వీరధర్మం కాదు. అందువలన అర్జునుడు ధర్మరాజును ఒప్పించి, అగ్రజరక్షణకై సర్వజిత్తు మొదలైన పాంచాల వంశీయులను నియమించి, సంశప్తకులపై సమరానికి వెళ్ళాడు.

ద్రోణుడు గరుడవ్యూహాన్ని పన్నితే ధర్మరాజు ధృష్టద్యుమ్నుడిచేత మండలార్ధ వ్యూహాన్ని పన్నింపజేశాడు. ఈ రెండూ సందర్భోచిత వ్యూహాలే. వ్యూహంలోని రెండుపక్షాలనూ వాటిస్థానంలోనే ఉంచి ఉరస్యం శత్రుబలం వైపు ముందుకు వెళ్ళే యుద్ధరీతిని ప్రదర్శించేది గరుడవ్యూహం.

కౌటిల్యుడి అర్థశాస్త్రంలో వ్యూహప్రతివ్యూహాల చర్చ కొంత సాగింది. శ్యేన గరుడవ్యూహాలను చాప, బాణ, అర్ధచంద్రాకార, మండలార్ధాది వ్యూహాలతో ఎదుర్కొనవచ్చునని సూచనలు చేశాడు. వ్యూహమర్మజ్ఞుల పన్నాగాలు యుద్ధం రౌద్రోద్రేకంతో సాగే విధానానికి దోహదం కలిగిస్తాయి. ద్రోణుడి ద్వితీయ దివసయుద్ధం ఈ తంత్రానికి అద్దం పట్టింది.

1. అర్జునుడు సంశప్తకులను చీల్చి చెండాడుతున్నా వారు మొండికి పడి ఎదురాడుతూ ఉండగా వారిని నిర్దాక్షిణ్యంగా నరుకుతూ విజయపథంలో సాగుతున్నాడు. ఇవి కౌరవపాండవుల ప్రత్యక్ష వ్యూహాలలో భాగం కాదు.

2. గరుడవ్యూహంలో ముక్కుగా నిలిచిన ద్రోణుడు మొట్టమొదట ధృష్టద్యుమ్నుడిని ఎదుర్కొనవలసి వచ్చింది. కాని, ఆచార్యుడు అతడి మొగం చూడటం తనకు అరిష్టమని భావించి, అతడిని తప్పించి పాంచాలురమీద బాణపరంపరలు సారించాడు.

3. ద్రోణుడికి బదులు దుర్ముఖుడు ధృష్టద్యుమ్నుడిని ఢీకొని ఆచార్యుడికి సంతోషం కలిగించాడు.

4. ద్రోణుడు అసంఖ్యాకమైన పాండవబలాన్ని నుగ్గునుగ్గు చేసి ధర్మరాజువైపు దూసుకొని వెళ్ళాడు. ధర్మరాజుకు రక్షాకవచం వలె నిలిచిన సత్యజిత్తు ఘోరయుద్ధం చేసి ద్రోణుడి క్రోధానికి గురి అయి, అతడి చేతిలో మరణించాడు. సత్యజిత్తు తరువాత సూర్యదత్తు వీరోచితంగా పోరాడి ద్రోణుడి ఆగ్రహజ్వాలలకు అసువులను కోల్పోయాడు. ధర్మరాజుకు రక్షణ తక్కువయింది. ద్రోణుడు ధర్మరాజును పట్టుకొనటానికి అప్పళించి తరుమనారంభించాడు.

5. అంతలో యుధామన్యుడు, ఉత్తమౌజుడు, వసుధానుడు, శిఖండి మొదలైనవారు ద్రోణుడిని ఎదిరించి ధర్మజుడికి రక్షగా నిలిచారు. అంతలో ధర్మరాజు ధృష్టద్యుమ్నుడిని, సాత్యకిని ముందుంచుకొని యుద్ధానికి

సిద్ధమయ్యాడు. ద్రోణుడు పాండవవీరుల నందరినీ బాణాలచేత బాధించి ధర్మరాజును మరల సమీపించాడు. ధర్మజుడు భయపడి ఏదో ఒక మిషతో యుద్ధఘట్టాన్ని వీడి ప్రక్కకు తొలగిపోయాడు. ద్రోణుడి పరాక్రమాన్ని సహించక వికావికలౌతున్న పాండవ సైన్యాన్ని కూడగట్టుకొంటూ చిత్రసేనాదులు ఎదురుదాడి చేశారు కాని, ద్రోణుడి ధాటికి ఎదురు నిలువలేకపోయారు. వారిని చూచి దుర్యోధనుడు కలకల నవ్వుతూ కర్ణుడితో ఇట్లా అన్నాడు.

క. 'పెనుగాలికి వెసఁగూలిన । వనము క్రియం బడిన పాండవ బలముఁ గంటే?
విను మింక నెన్నఁడును మొగ । కొన రీ యోడి చనువారు గురుకోల్తలకున్.'

చ. 'పవన తనూజుఁ గంటె! నిజపార్శ్వములం దనవారు లేక కౌ
రవులు మహోగ్రభంగి నడరం గడు దైన్యముఁ బొందియున్న వాఁ
డవిరళ దివ్య మార్గణ దురాసదు ద్రోణులఁ జూచి వీఁడు రా
జ్యవిభవకాంక్ష యెల్లఁ దెగటాఱఁగఁ బాఱెడు నట్లు సూడుమీ!' **(ద్రోణ. 1. 201, 202)**

ఆ మాటలు విని కర్ణుడు భీమాదులను తక్కువగా అంచనా వేయవద్దని రారాజుకు హితవు చెప్పి, పాండవులు ఉద్దామబలాఢ్యులు కావటంతో ప్రాణాలైనా త్యజిస్తారు కాని రణరంగంలో పరాజయాన్ని పొందటానికి అంగీకరించరు. దుర్యోధనుడి వలన మున్ను పడ్డ పాట్లను తలచుకొంటే వారికి లేనిబలం పొంగివస్తుంది అని మొగమోటం లేకుండా చెప్పాడు. కర్ణుడు చెప్పినట్లుగానే పాండవవీరులు సైన్యాలను సేకరించుకొని ద్రోణుడిపై యుద్ధానికి సిద్ధమయ్యారు. కురుపాండవ వీరులమధ్య ద్వంద్వయుద్ధాలు భీకరంగా సాగాయి. భీముడు దుర్యోధనుడిని నొప్పించాడు. మధ్యాహ్న సమయానికి ద్రోణుడు ద్వంద్వయుద్ధంలో ధృష్టద్యుమ్నుడిని అవలీలగా ఓడించాడు. భీముడు కౌరవసైన్యాన్ని కలతపెట్టాడు.

6. భగదత్తుడు గజబలంతో పాండవసేనపై దాడిచేశాడు. భీముడు అతడి సైన్యాన్ని ధ్వంసం చేశాడు. అయితే అతడి భద్రగజం సుప్రతీకం భయంకరంగా విజృంభించి పాండవసైన్యాన్ని త్రొక్కివేయనారంభించింది. ఆ విపత్తునుండి తనవారిని తప్పించటానికి అర్జునుడు సంశప్తకులతో చేస్తున్న యుద్ధం మధ్యలో ఆపి రణరంగానికి రావలసివచ్చింది. అతడు వస్తూ ఉండగా పదునాల్గువేలమంది సంశప్తకులు వెన్నంటి బాణాలు వేశారు. వారినందరిని పార్థుడు హతమార్చి, భగదత్తుడిపై విజృంభించి పరాక్రమస్ఫూర్తితో అతడినీ, అతడి సుప్రతీకాన్నీ వధించి పాండవపక్షానికి క్రొత్తచేవను తెప్పించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడికి అడుగడుగున అడ్డుపడి గడ్డు సమస్యలు సృష్టించాడు.

7. రెండవనాడు చెప్పుకోదగిన చివరి ద్వంద్వయుద్ధం కర్ణార్జునులపోరు. కర్ణుడు యుద్ధంలో శత్రువుల మధ్య చిక్కుకొన్నాడు. ద్రోణాదులు ఆతడిని రక్షించి బయటపడవేశారు. అర్జునుడు విజృంభించి కౌరవసేనలను నురుము చేయనారంభించాడు. సాయంకాలం కావటంతో యుద్ధం ఆపటం జరిగింది.

8. రెండవనాడు కూడా ద్రోణుడి ప్రతిన పూర్తి కాలేదు. దానికి కారణం ద్రోణుడి పాండవ పక్షపాత వర్తన మని దుర్యోధనుడు దూషించాడు; ఆచార్యుడికి కోపం వచ్చింది. అర్జునుడు తిరిగిరాకుండా నియమించలేని దుర్యోధనుడిదే లోపమని ద్రోణుడు ప్రకటించాడు. మూడవనాడు సాయంకాలం యుద్ధం ముగిసేవరకు అర్జునుడు తిరిగి రాకుండే ఉపాయం ఆలోచించుమని దుర్యోధనుడికి సూచించాడు ద్రోణుడు. పార్థుడి నా విధంగా రోజంతా ఆపగలమని సంశప్తకులు ప్రతిజ్ఞ చేశారు.

కౌరవపక్షం ప్రారంభించిన కార్యం ఆరంభంలో విఫలంకాగా దానిని రెండవనాటి యుద్ధంలో మరొకసారి తీవ్రయత్నంతో కొనసాగించే కథాభాగం ఉండటంచేత ఇది ప్రతిముఖసంధి. ఇందులో కార్యం ఫలవంతం కాకపోగా, ఔతుంది అనే నమ్మకం కుదరలేదు. ద్రోణుడి ప్రతిజ్ఞ ఫలిస్తుందా లేదా అనే అనుమానం అందరి మనస్సులలో ఆరాటం కలిగిస్తూనే ఉంటుంది. అయినా విస్తృతవ్యాప్తి కలిగిన ఏదో తీవ్రయత్నంకోసం అన్వేషణ సాగుతుంది. అందులోనుండే గర్భసంధి కథ పుట్టుకొస్తుంది.

## 12. మూడవనాటి యుద్ధం: గర్భసంధి: పద్మవ్యూహం:

ద్రోణాచార్యుడు మూడవనాడు పద్మవ్యూహాన్ని పన్నాడు. దాని వెనుక బహుముఖ ప్రయోజనం సాధించే పటిష్ఠమైన ఆలోచన ఉన్నది. ధర్మజుడికి నిరంతర రక్షాకవచంవలె రాణించే పార్థుడు ఎట్టి పరిస్థితులలోనూ అన్నకు సహాయమందించే అవకాశం లేని దూరప్రాంతానికి పంపి సంశప్తకులచేత చావటమో లేక వారితో యుద్ధంలో తలమునకలై ఉండటమో జరగాలని మొదటియోచన. దానివలన అర్జునుడు లేని పాండవసైన్యంలో వీరులందరూ ధర్మజరక్షలోనే నిమగ్నులై ఉంటారు. వారు దానికి తగిన వ్యూహాన్ని ఎన్నుకొనవచ్చును. కాని, దానికి అవకాశం ఇవ్వకుండా ముందుగానే పద్మవ్యూహాన్ని ప్రకటించాడు ద్రోణుడు. వ్యూహాలలో పద్మవ్యూహం దుర్భేద్యమైనది. మండలాకార వ్యూహాలలో మహాపటిష్ఠమయింది. మహాజటిలమూ, సంశ్లిష్టమూ అయింది. దానిని భేదించగలిగినవారు పాండవపక్షంలో ముగ్గురు మాత్రమే ఉన్నారు. వారు కృష్ణుడు, అర్జునుడు. వారిరువురూ దూరంగా వెళ్ళారు. ఇక మిగిలింది అభిమన్యుడు. అతడికి మొగ్గరాన్ని ఛేదించి, లోనికి ప్రవేశించి కలచివేసే రహస్యాలు తెలుసు. కాని, వెనుకనుండి క్రమ్ముకొని వచ్చి మార్గాలు బంధించే వ్యూహవిధానాన్ని ఛేదించుకొంటూనో, లేక క్రమ్ముకొనకుండా చేసే పద్ధతినో పాటించి క్షేమంగా తిరిగివచ్చే రహస్యం అతడికి తెలియదు. అందువలన అభిమన్యుడిని ముందు పెట్టుకొని కాని, లేక వీరులందరూ కలిసి ఒక్కుమ్మడిగా సాహసించిగాని పద్మవ్యూహాన్ని ఛేదించి లోనికి రావచ్చును. వచ్చిన తరువాత ఒక ధర్మరాజునే కాదు అందరినీ బంధించవచ్చును. పాండవవీరులను నిస్సహాయస్థితిలో పెట్టి ధర్మజగ్రహణం చేయటం పద్మవ్యూహ పరమప్రయోజనం. ప్రతివ్యూహం లేని పాండవసేన మూకుమ్మడిగా మృత్యుముఖంలోకి ప్రవేశించినట్లౌతుందని ద్రోణుడి ఆలోచన. ఆనాటితో యుద్ధం ముగియక తప్పదనే ధైర్యం, నమ్మకం దుర్యోధనుడికి కలిగించి తన వీరధర్మాన్ని చాటుకొనటం కూడా మరొక ప్రయోజనం.

పద్మవ్యూహ పరికల్పనలో ద్రోణుడు పాటించిన పద్ధతి ప్రశస్తమైనది. పద్మస్వభావాన్ని ఆ వ్యూహంలో ప్రవర్తింపజేయటం పరమార్థం. సూర్యోదయం కాగానే పద్మం వికసిస్తుంది. దానిలోని మకరందాన్ని ఆస్వాదించటానికి తుమ్మెదలు వస్తాయి. లోనికి ప్రవేశించి మధువును త్రాగటంలో తనువులు మరచి అట్లాగే ఉండిపోతాయి. రాత్రికి కమలం ముకుళించుకొంటుంది. తుమ్మెదలు బందీలైపోతాయి. ఇదేవైఖరి పద్మవ్యూహంలో ప్రదర్శించబడుతుంది. అయితే, ద్రోణుడు పన్నిన వ్యూహం వికసించిన పద్మాకారంలో లేదు. అభేద్యంగా ఉండే పద్ధతిలో రచించిన పద్మవ్యూహం వలయాకారంగా ఉండటంచేత చక్రవ్యూహమా అనే భ్రాంతి కలిగించేటట్లు ఉన్నదట! అందులోకి ప్రవేశించాలంటే ఒకే ఒక మార్గం ఉన్నదట! అక్కడ ద్రోణుడు నిలిచి ఉన్నాడట! అంటే - ఆ పద్మవ్యూహం ముకుళించిన పద్మంవంటిదన్నమాట! అందులోనికి ప్రవేశించే తుమ్మెద మొనను చించుకొని లోనికి పోవలసిందే. ఇక లోనికి ప్రవేశిస్తే చుట్టూ దళాలు క్రమ్ముకొనే ఉంటాయి. ఆ దళాలుగా వివిధ దేశాలరాజులు నిలిచి ఉన్నారు. పద్మకేసరాలు లోన బారులు తీరి ఉంటాయి. ఆయాస్థానాలలో రాజకుమారులు ఆసన్నులై ఉన్నారు. పద్మమూలస్థానం కర్ణిక. కర్ణదుశ్శాసనాది మహావీరులు అందరూ పరివేష్టించి ఉండగా దుర్యోధనుడు ఆ స్థానంలో నిలిచి ఉన్నాడు. ద్రోణుడిని ఓడించి లోనికి ప్రవేశించిన వీరులు కేసరాల బారిని పడకుండా కర్ణికకు చేరి వీరమండలాన్ని ఎదుర్కొని నిలవాలి. ఆ వర్తులాన్ని భేదించి, చొరవచేసికొని, మూసికొని ఉన్న ద్వారాన్ని శిథిలంచేసి బయటపడాలి. ప్రవేశించటం ఎంత కష్టమో తిరిగిరావటం కూడా అంత కష్టం. అటువంటి జటిలవ్యూహంలో చివరకు ధర్మరాజు దుర్యోధనుడి కర్ణికలోనే పట్టుపడవచ్చును. దానివలన ద్రోణుడికి పట్టియిచ్చిన పరువూ దక్కుతుంది. దుర్యోధనుడికి పట్టుకొన్న బిరుదూ దక్కుతుంది. దురాలోచనా పరుడైన దుర్యోధనుడి ఆశ తీరటానికి పద్మవ్యూహం అనువైనది కాబట్టి ద్రోణుడు దానిని పన్నాడు.

పద్మవ్యూహం పాండవులకు పరువును, పౌరుషాన్నీ, చివరకు ప్రాణాలను నిలుపుకొనే జటిల సమస్యగా మారింది. అర్జునుడు లేని సమయంలో భీముడు సమరసన్నాహానికి సారథ్యం వహించటం సర్వసామాన్యమే. భీముడు ముందు నిలువగా వరుసగా సాత్యకి ధృష్టద్యుమ్న కుంతిభోజులు ఒక జట్టుగా, చేకితాన క్షత్త్రధర్మ క్షత్రవర్మలు ఒక జట్టుగా, ధృష్టకేతు నకుల సహదేవులు ఒక జట్టుగా, ఉత్తమౌజశ్శిఖండి యుధామన్యులు మరొకజట్టుగా, ఘటోత్కచ విరాట ద్రుపదులు ఇంకొక జట్టుగా, ద్రౌపదేయ కేకయ

సృంజయాది బృందాలు చివరి జట్టుగానూ యుద్ధస్ఫూర్తితో ముందుకు సాగి ద్రోణుడితో డీకొన్నారు. ఆచార్యుడు వారి ప్రయత్నాన్ని చూచి నవ్వి వారినందరినీ బాణవర్షంతో బడలుపడేటట్లు చేశాడు. పద్మవ్యూహముఖం పాశవికబలంతో పగిలిపోయేది కాదని పాండవులకు అర్థమయింది. ఆ వ్యూహాన్ని భేదించే ఉపాయం కొరకు ధర్మజుడు అన్వేషించి అభిమన్యుడిని ఆశ్రయించాడు.

సీ. ' ఈ యొడ్డు భేదింప నే మెవ్వరము నేర; । మర్జునుండును నీవు నచ్యుతుండుఁ
ప్రద్యుమ్నుఁడును దక్కఁ; బార్థుఁడు మనల ను । ల్లస మాడకుండ నీలావు మెఱసి
భేదించి మా కెల్లఁ బ్రియ మొనర్పు కుమార!' యనవుడు నతఁ డాననాబ్జ మలర
' దీని ముఖంబు భేదించు తెఱంగు నా । కెఱిఁగించె మా తండ్రి; యేను దెఱపి

ఆ. సేయ నేర్తుఁ; జొచ్చి చించి చెండాడెద; । మూఁక లెల్లఁ జుట్టుముట్టినపుడు
వెడలునట్టి వెరవు విన; దాని కేమి? నా । చొచ్చు నేర్పు బలువుఁ జూడు మధిప!' **(ద్రోణ. 2. 5)**

అభిమన్యుడి మాటలలో పద్మవ్యూహ భేదనోపాయం స్పష్టంగా గోచరిస్తుంది. తిరిగివచ్చే పద్ధతి ఆతడికి తెలియదు, పాండవులకు తెలియదు. ఆ సమయానికి అర్జునుడు వచ్చి సాయపడే అవకాశం కూడా లేదు. ఈ పరిస్థితిలో అభిమన్యుడి వెంట పాండవులు ప్రవేశించి దుర్భేద్యమైన పద్మవ్యూహ నిర్మాణాన్నే భగ్నం చేయటం తప్ప మార్గాంతరం లేదని తెలిసింది. అది భేదించటం సాధ్యమా? అసాధ్యమా? అనే మీమాంసకు అప్పుడు తావు లేదు. భీముడు తమబలంతో దానిని సాధించగలననే విశ్వాసాన్ని ప్రకటించాడు. ''ధైర్యే సాహసే లక్ష్మీ'' అనే న్యాయంతో అభిమన్యుడిని ముందు నడిపించారు.

పాండవవీరులందరిలో అభిమన్యుడి కున్న ప్రత్యేకశక్తికి అప్పుడు గుర్తింపు వచ్చింది. తాతలకంటె, తండ్రులకంటె అతడికి ఆనాడు ఉన్నతస్థితి ఏర్పడింది. అర్జునుడు లేనినాడు పాండవసైన్యంలో అభిమన్యుడే అభినవార్జును డన్నట్లు స్ఫురించింది. శ్రీకృష్ణు డుంటే అభిమన్యుడికి అవకాశం ఉండేది కాదు. పద్మవ్యూహ పరిజ్ఞానం సగం మాత్రమే తెలిసిన పండితుడే ఆనాడు మహాపండితుడైనాడు. అతడి ప్రతాపాన్ని సంపూర్ణంగా ప్రదర్శించే అదను లభించింది; తన బలంమీద, నేర్పరితనం మీద విశ్వాసం పెరిగింది. దానివలన ఒక్కనాటిలో ఒక జీవితకాలం సంపాదించుకొనే కీర్తిని సాధించవచ్చునని యశోవీరం ఉప్పొంగింది. పాండవసైన్యముఖంలో నిలబడి ఉన్న భీముడితో తానా స్థానంలో నిలిచి యుద్ధాన్ని ముందుకు సాగిస్తా నని ప్రతాపోక్తులు పలికాడు.

చ. ' నను విను కీచకాంతక! మనంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చి య
మ్మొనఁ గలఁగింప కిట్లు కురుముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం
చిన జతనంబు నిష్ఫలము సేయుదునే? నరుఁడున్ సుభద్రయుం
దనయునిఁ గాంచి సంతసము దాల్చుట యంతయు రిత్తఁ బుత్తునే?'

చ. ' ఇదె యొక పిన్నవాఁ డడరి యెక్కుడు మూఁకల క్రందు దోలెడుం
గదుపుల వెల్చు గోపకుని కైవడి నంచు జనుల్ నుతింపఁ జే
సెద; విని మామ ప్రీతి విలసిల్లఁగఁ దండ్రియు సంతసిల్లఁ బె
ట్టిదుఁ డగు కౌరవేంద్రునకు డెప్పర మయ్యెడు భంగిఁ బేర్చెదన్' **(ద్రోణ. 2. 10-11)**

ఇవన్నీ అభిమన్యుడు పేర్కొన్న లక్ష్యాలు. వాటిని సాధించి వీరులను యుద్ధంలో కలతపెట్టి పాండవులకు గెలుపుబాట చూపటమే ఆతడి లక్ష్యం. గెలుపును వారు సాధించుకొని విజయఫలాన్ని పొందాలని ఆతడి అభిప్రాయం. ఈ పూనిక అంత భద్రమైనది కాదని సారథి అపశకునం పలికాడు. అయినా, ఆతడు వెనుకాడలేదు. అనుమానించలేదు. పద్మవ్యూహం భేదించాలని అభిమన్యుడు రౌద్రరసోల్లసితమూర్తి అయినాడు. మెరుపువలె మెరిసి ద్రోణుడిని బాధించి మొగ్గరంలోకి ప్రవేశించాడు. మహాసాగరంలో

మందరపర్వతం తిరిగినట్లు పద్మవ్యూహంలోని వీరులను పరాక్రమంతో చిలకటం మొదలుపెట్టాడు. అలంకార ధ్వని నాశ్రయించి ముందుగా హాలాహలం పుడుతుంది. అభిమన్యుడు మరణిస్తాడు. ఆ తరువాత అమృతం ఆవిర్భవిస్తుంది. అర్జునుడు సైంధవుడిని సంహరిస్తాడు ఆ తరువాత ద్రోణుడు ప్రాణత్యాగం చేస్తాడు. విజయాన్ని విజయుడు సాధిస్తాడు.

పద్మవ్యూహఘట్టం నాటకంలోని గర్భసంధి స్వభావాన్ని కమనీయంగా సంతరించుకొని ఉన్నది. గర్భసంధిలో ప్రాప్త్యాశ అనే అవస్థ ప్రధానంగా ప్రవర్తిలుతుంది. ఫలం సిద్ధిస్తుందో లేదో అనే సంశయంతో కార్యసిద్ధి అనిశ్చితంగా ఉండటం ప్రాప్త్యాశ. పాండవులకు పద్మవ్యూహం కార్యసిద్ధినిగురించి అనిశ్చిత మానసికావస్థను సృష్టించింది. అందుకే వారు 'అభూతాహరణ'మనే అంగాన్ని ఎన్నుకొన్నారు. శత్రువ్యూహానికి ప్రతిక్రియ చేయటానికి ఒక వంచన కృత్యంవంటి ఉపాయాన్ని పన్నారు. అదే అభిమన్యుడిని వ్యూహభేదానికి నియోగించటం. ప్రాప్త్యాశలో అభిమన్యుడే ఆశాకిరణంవలె ప్రకాశించాడు. అతడు తన శక్తియుక్తులను గురించి యాథార్థ్యాన్ని చెప్పటంవలన ఫలసిద్ధి అనుమానమైనా ఆశాజనకంగా నిలిచింది. ఆతడు స్వయంగానూ శత్రువీరుల చేతనూ ప్రదర్శింపజేసే క్రోధ సంభ్రమాదులు తోటకాన్ని పోషించాయి. రూపం, ఉదాహృతి, క్రమం, అనుమానం, అధిబలం, ఉద్వేగం, సంభ్రమం, ఆక్షేపంవంటి సంధ్యంగాలన్నీ పాండవ పక్షంలోనే కాక కౌరవపక్షంలో కూడా ప్రత్యక్షమౌతాయి. అందువలన మూడవనాటి యుద్ధం సమగ్ర గర్భసంధిని ప్రదర్శించింది.

ద్రోణుడు ధర్మరాజును పట్టటానికి పద్మవ్యూహాన్ని పన్నాడు. దానివెనుక కౌరవుల ప్రాప్త్యాశ ఉన్నది. కాని, అభిమన్యుడు రంగంలోనికి ప్రవేశించి పద్మవ్యూహాన్ని సంక్షోభపెట్టటంతో ధర్మజుడిని బంధించటం మరుగునపడిపోయింది. అభిమన్యుడు విజృంభిస్తే ధర్మజుడిని పట్టే వీరులే కౌరవపక్షంలో మిగులుతారా? అనే అనుమానం ధార్తరాష్ట్రులకు కలిగింది. అందువలన అధర్మయుద్ధంలో ఆతడిని మూకుమ్మడిగా కూడి చంపట మొక్కటే ప్రాప్త్యాశకు దోహదమయింది. గర్భసంధ్యంగాలన్నీ పాండవ కౌరవ పక్షాలకు అన్వయించటం అద్భుతం.

గర్భసంధిలో అర్థప్రకృతి పతాక. స్వీయప్రయోజనాన్ని సాధించుకొంటూనే ప్రధానకథకు అంగమై దాని ప్రయోజనాన్ని కూడా కొంతసాధిస్తూ కొంతవరకు వ్యాపించే ఉపకథ పతాకా. దానిని పతాకా కథ అంటారు. ఆ ఘట్టానికి నాయకుడిని పతాకానాయకుడనీ అంటారు. పాండవపక్షంలో పతాకా వృత్తాంతం అభిమన్యుడు పద్మవ్యూహాన్ని భేదించి కురువీరులను కలతపెట్టి, చివరకు వారి అధర్మ యుద్ధంలో చనిపోయిన గాథ. దానివలన పాండవులకు తీవ్రంగా బీజాన్వేషణం చేసికొనవలసిన అవసరం ఏర్పడింది. అభిమన్యువధ పాండవులచేత వరుసగా సైంధవుడినీ, ద్రోణుడినీ చంపటానికి కారణమై పర్వ ప్రయోజనాన్ని సాధించింది.

ఇటు కౌరవ పక్షంలో ప్రకరీ నాయకుడుగా నిలిచినవాడు సైంధవుడు. అతడు శివుడివరంవలన పొందిన అవకాశం - అర్జునుడు లేని పాండవులను ఒకనాడు యుద్ధంలో నిలువరించగలగటం. ఆ వరం అర్జునుడు సంశప్తకులను వధించబోగా అభిమన్యుడు పద్మవ్యూహంలో ప్రవేశించిననాడే వర్తిల్లే అవకాశం ఏర్పడింది. ఆనాడు పాండవుల సహాయం అభిమన్యుడి కందకుండా చేసి అభిమన్యుడి మరణానికి తోడ్పడ్డాడు. అది అతడు స్వయంగా సాధించిన ప్రయోజనమే. దానివలన అభిమన్యుడి మరణం సంభవించినా ధర్మరాజు పట్టుబడటం జరగలేదు. అందువలన ద్రోణుడు మరునాడు మరొక ఉపాయాన్ని పన్నుకొనవలసి వచ్చింది. ఈ విధంగా ప్రకరిఘట్టాలు ద్రోణపర్వంలో ప్రసిద్ధి చెందాయి. గర్భసంధిని గంభీరంగా పోషించాయి.

అభిమన్యుడు పద్మవ్యూహాన్ని భేదించిన విధానాన్ని తిక్కన కన్నులకు కట్టేటట్లు రచించాడు. వర్తులాకారంగా, చక్రవ్యూహంవలె పన్నబడిన పద్మవ్యూహంలో ప్రవేశించగానే దానిలో మహార్ణవంలో తిరిగే మందరపర్వతంవలె తిరిగి ఆ వ్యూహాన్ని కలతపెట్టాడు. అడవిలో చరించే తీవ్రానలంవలె వ్యాపించి సైన్యాలను పొడిచేశాడు. ప్రళయకాలంలో లోకాలను సంహరించే క్రీడ సలిపే శూలి వలె సైనిక సమూహాలను రూపుమాపాడు. ఈ మూడు రకాల రణక్రీడలు మండలాకారవ్యూహ రచనలధ్వంసనానికి ఉపయోగించేవి. మొదట కేసరాలుగా, దళాలుగా నిలిచినవారిని నిరాఘాటంగా చంపటం వలన పద్మవ్యూహంలో మూలస్థానమైన కర్ణికను చేరే

మార్గాన్ని సుగమం చేసికొన్నాడు. హుటాహుటిగా కర్ణికను చేరికొనటంవలన కొన్ని ప్రయోజనా లుండవచ్చును. 1.దళాలుగా ఉన్న వివిధ దేశాధిపతులను, కేసరాలుగా ఉన్న రాజకుమారులను అవలీలగా దాటిపోవటంవలన ఆ స్థానాలలో ఉన్నవారందరూ, ద్రోణుడివలెనే ఆశ్చర్యపోతారు. 2. మొన చించిన తరువాత తనవెంట వచ్చే భీమాదిపాండవ వీరులకు త్రోవ సుకరంచేయుట మౌతుంది. 3. పద్మవ్యూహంలో లక్ష్యం దగ్గరికి సూటిగా పోవటం సబబు కాదన్నట్లున్నది. వక్రంగా, వర్తులాకారంగా సాగే రణ సంప్రదాయాన్ని అభిమన్యుడు పాటించాడు. 4. పద్మంలో ప్రవేశించే తుమ్మెద కేసరాలకంటె కర్ణికమీదనే వాలుతుంది. అట్లాగే పద్మవ్యూహంలో కర్ణికను భేదిస్తే మొత్తం నిర్మాణం శిథిలమౌతుందని అభిమన్యుడు అట్లా చేసి ఉంటాడు. 5. ధర్మరాజును పట్టివ్వాలని పగబట్టి అడిగిన కుటిలవర్తనుడు దుర్యోధనుడిని హుటాహుటిగా ఎదుర్కొని అతడిని ఓడించి బంధించి తెస్తే ధర్మరాజుకు సంతోషం కలుగుతుందని భావించి ఉండవచ్చును. 6. సామాన్యంగా ఇతరవీరులు వ్యూహభేదనం చేసిన దానికంటె విలక్షణంగా వ్యవహరిస్తే శ్రీకృష్ణార్జునుల మెప్పు పొందవచ్చును. ఇన్ని ప్రయోజనాల నాశించి అభిమన్యుడు కర్ణికలో మహావీరులచేత రక్షించబడుతున్న దుర్యోధనుడికి ఎదురుగా పోయాడు. ఆ వ్యూహంలో అభిమన్యుడిని ఎదుర్కొనవలసిన అవసరం దుర్యోధనుడికి రావటం విశేషం. మెరుపుదాడితో కర్ణికను నాశనం చేసి దుర్యోధనుడిని ఓడించబోతున్న అభిమన్యుడిని ఎదుర్కోవటాన్ని ద్రోణుడు కర్ణికస్థానంలో ఉన్న మహావీరులనందరినీ ఎలుగెత్తి హెచ్చరించాడు. దానితో ఆ మూలస్థానంలో ఉన్న వీరులు వలయాకారంగా అభిమన్యుడిని ఆవరించారు. కాని, అతడిని నిలువరించలేకపోయారు. ఆ స్థితిని గమనించి ద్రోణుడు తాను మోహర ముఖస్థానాన్ని వదలి కర్ణిక రక్షణకు స్వయంగా వచ్చాడు. పద్మవ్యూహ సమగ్ర నిర్మాణం శిథిలం కావటం మొదలైనదనటానికి ఇది ప్రథమసూచన.

దుర్యోధనాది వీరులందరూ ఒక్కుమ్మడిగా అభిమన్యుడిని చుట్టుముట్టి మరల దాడి చేయనారంభించారు. అప్పుడు సేనాపతుల సంహారం మొదలు పెట్టాడు అభిమన్యుడు. మొదట అతడిచేత చచ్చినవాడు అశ్మకుడు. అతడి పతనంతో భయపడి పరుగెత్తే సైన్యాలను పురికొల్పి కురుకుమారులు డీకొన్నారు. వీరు కర్ణికకు అండగా నిలిచి ఉన్న కేసరస్థానీయులలో కొందరు. వారందరినీ అభిమన్యుడు నురుమాడాడు. అంటే కొన్ని కేసరస్థానాలు ధ్వంసమయ్యాయన్నమాట! దానితో కర్ణిక మీద భారం పడటం మొదలయింది. మహావీరులలో ఒకడైన శల్యుడు విజృంభించి అభిమన్యుడిని ఎదుర్కొన్నాడు. కాని, ఆతడి వాడి అయిన బాణాలకు నిలువలేక మూర్ఛపోయాడు. అతడిని చూచి అతడి తమ్ముడు కోపించి అభిమన్యుడిపై యుద్ధానికి వచ్చాడు. అతడి తలను నరసుతుడు భల్లంతో త్రుంచాడు. ఆ దెబ్బతో పెద్దలందరూ గగ్గోలుపడ్డారు. ద్రోణకృపద్రౌణి కృతవర్మ బృహద్బల కర్ణాది వీరులందరూ పరస్పరం పేర్లుపెట్టి పిలుచుకొని ఏకమై, సైన్యాలను కూర్చుకొని పోరు ఘోరంగా సాగించినా ఆ బాలుడి పరాక్రమానికి ఎదురు నిలువలేకపోయారు. అభిమన్యుడు కొరవి త్రిప్పినట్లు తిరిగి వారిసేనలను పీనుగు పెంటలు చేశాడు. కర్ణికా స్థానానికి నాయకుడుగా ఉండవలసిన దుర్యోధనుడు, అతడికి అండగా నిలువవలసిన యోధగణం వికావికలు కాగా, కర్ణికను కూడా సర్వసైన్యాధ్యక్షుడు రక్షించుకొనవలసిన దుఃస్థితి ఏర్పడటం రెండవ క్షీణ దశ.

ఆ దీనస్థితి దుర్యోధనుడి దురాశవలన ఏర్పడిందని ద్రోణుడు భావించాడు. రారాజును ఓదార్చటానికి బదులు అభిమన్యుడి ప్రతాపాన్ని కృపాచార్యుడిముందు ప్రశంసించి అతడి గుండెలు మండేటట్లు చేశాడు. ఇది ద్రోణుడి గూఢకోప వ్యంగ్యాభివ్యక్తి.

ఉ. ‘ తమ్ములు నన్నలుం జెలులుఁ దండ్రులు మామలు భృత్యులుం బ్రమో
దమ్మునఁ దేల నిట్లు వడిఁ దాఁకెడునే విజయాత్మజుండు ఘో
టమ్ములుఁ గుంజరమ్ములు బడల్పడఁ దేరులు నుగ్గు గాఁగ నా
నమ్మిన యోధవీరులు వినాశము, భంగము నొంద నొక్కఁడున్’ **(ద్రోణ. 2. 43)**

అభిమానధనుడైన రారాజు ఆ మాటలు విని వెలవెలబోయాడు. దీనమైన ముఖంపెట్టాడు. దానిని కప్పుకొనటానికి నవ్వుగాని నవ్వు నవ్వుతూ ద్రోణుడిని గురించి మిత్రులతో ఇట్లా నేరాలు చెప్పాడు.

చ. ‘పలుకులు వింటిరే ధనువు పట్టెడి వారికి నెల్ల నొజ్జ దో
ర్బల విదితుండు గుంభజుఁడు బాలుని నొక్కరుఁ జంచలాత్ము వెం
గలిఁ గడుఁ బెద్దఁ జేయుచుఁ బొగడ్తకుఁ జొచ్చె? నితండు నొంపఁగాఁ
దలఁపడు వీనిఁ, బార్థునకుఁ దాఁ గడుఁ గూర్చుట నెంత త్రుళ్ళినన్.’

చ. ‘గురుని యుపేక్షఁ జేసి తనకున్ సమరోద్ధతి సెల్ల దాని నీ
వెరవిఁడి గానలేఁడు; దన వీరము కాఁ గొని విఱ్ఱవీఁగెడుం;
బొరిగొనుఁ డందఱుం గడఁగి పోవఁగనీక దృఢాస్త్ర శస్త్ర ని
ష్ఠురపరిపాతనోగ్రముగఁ జుట్టును ముట్టి చలం బెలర్పఁగన్’. (ద్రోణ. 2. 45,46)

ఆచార్యుడి అర్జున పక్షపాతమే అభిమన్యు డింతగా పెచ్చుపెరిగిపోవటానికి కారణమని మిత్రులకు నమ్మబలికి దుర్యోధనుడు ద్రోణుడికి అలక తెప్పించాడు. అందరూ కలిసి అభిమన్యుడిని చుట్టుముట్టటానికి పూనుకొనేటప్పుడు అన్నగారి మీద అభిమానంతో దుశ్శాసనుడు ముందుకు వచ్చి అభిమన్యుడితో తలపడి, పోరి, నిలువలేక రథంమీద చచ్చినవాడివలె మూర్ఛలోపడ్డాడు. సారథి అతడి రథాన్ని దూరంగా తీసికొనిపోయాడు. కర్ణికాస్థానంలో ఉన్నవీరులకు ప్రతినిధిగా పోరిన దుశ్శాసనుడు తరువాత చాలమందికి బాట చూపాడు. కర్ణుడు అట్లాగే యుద్ధంచేసి అలసిపోయాడు. అతడి తమ్ముడు అన్నకు సాయంగా వచ్చి యుద్ధంలో ప్రాణాలు కోల్పోయాడు. దుర్యోధనుడిని రక్షించవలసిన మహావీరులందరూ పరుగులు తీస్తుంటే సర్వసేనాధ్యక్షుడు ఇట్లా మొరపెట్టుకొనవలసి వచ్చింది.

చ. ‘నిలు నిలు కర్ణ! యో కృపుఁడ! నీ విటు లేల కడంక దక్క? సౌ
బల! ధృతి దూల నేమిటికి? బాహ్లిక! యిత్తఱిఁ గౌరవేంద్ర! నీ
బలముఁ జలంబుఁ జూపి నిలుపం దగు సేనల నంచుఁ బెక్కు భం
గులఁ బురికొల్ప నెవ్వరును గోల్తలఁ సేయరు; యేమి సెప్పుదున్!’ (ద్రోణ. 2. 59)

సంజయుడు చెప్పిన ఈ కథనం వలన కర్ణికాస్థానం ఎంత శిథిలమయిందో సర్వసేనాని పిలుపు ఎంతటి అరణ్య రోదనమయిందో తెలుస్తుంది. ఇది శోచనీయమైన మూడవ దశ.

కౌరవ వీరులకు యశస్సో, మరణమో తేల్చికొనవలసిన తరుణం ఏర్పడింది. సైంధవు డడ్డుపడటంవలన భీమాదుల సాయం అభిమన్యుడికి అందకపోవటంతో అతడికి ఏకవీరయుద్ధం తప్పనిదైపోయింది. తిరిగిపోలేని వ్యూహంలో చేతికందినంతవరకు శత్రుసంహారం చేసి వ్యూహాన్ని నిర్వీర్యం చేయటమే ఆతడికి మిగిలింది. అందులో యశస్సో, మృత్యువో - దేనికైనా తెగించి పోరవలసిన సమయం ఆసన్నమయింది. వ్యూహం బలమైనదైనా వ్యూహరక్షకులు బలమైనవారు కాలేకపోయారు. వృషసేనుడు సాహసించి పోరాడి మూర్ఛితుడయ్యాడు. వసాతిభూపతి రణంలో ప్రాణాలు వదిలాడు. రుక్మధరుడు యుద్ధంలో కూలిపోయాడు. దానిని చూచి పెక్కురు రాజులు అభిమన్యుడిని పగతో ముట్టడించి క్రమ్ముకొన్నారు. అభిమన్యుడు చనిపోయాడని అందరూ అనుకొన్నారు. కాని, ఆ మూకదాడినుండి గాంధర్వమాయతో విజయస్ఫూర్తితో బైటపడి వారిని తరిమికొట్టాడు. దుర్యోధనుడు పెనుబలంతో అభిమన్యుడిని డీకొని మంచిపోరు నిచ్చాడు. కాని, అభిమన్యుడి ఆగ్రహానికి తాళలేక వెనుదిరిగిపోయాడు. ఆ సన్నివేశం గమనించి రోషంతో దుర్యోధన పుత్రుడైన లక్ష్మణకుమారుడు అభిమన్యుడిపై విరుచుకొనిపడి పోరు సాగించాడు. కాని, అతడి చేతిలో మరణించాడు. కొడుకును చంపిన అభిమన్యుడిపై దుర్యోధనుడు మండిపడ్డాడు. కృపాశ్వత్థామాది వీరులు అందరూ కలిసి అతడి మీదపడి నిర్దయగా చంపండి అని ఆజ్ఞనిచ్చాడు. వా రా ప్రయత్నంచేసి విఫలులయ్యారు. అభిమన్యుడు సైంధవుడిమీద విజృంభించి పాండవులకు అడ్డంకి తొలగించే ప్రయత్నం చేశాడు. కాని, దళస్థానాలలో ఉన్న నిషాదులు, కళింగులు మొదలైన

గజసైన్యాధిపతులు ఎదుర్కొన్నారు. జయద్రథుడు పాండవుల నడ్డగించి దూరంగా తీసికొనిపోయాడు. అభిమన్యుడు ఒంటరిపోరు సాగించాడు. కేసరస్థానీయులైన శత్రుంజయుడు, చంద్రకేతుడు, సువర్చసుడు, సూర్యభానుడు, మేఘవేగుడు, గాంధారపతి మొదలైన వీరులు అతడిని చుట్టుముట్టి పోరాడారు. వారందరినీ అభిమన్యుడు బాణాలతో జర్జరిత దేహులనుగా చేయగా, వారందరూ కలిసి దుర్యోధనుడి వద్దకు వచ్చి అభిమన్యుడి వీరాన్ని ప్రశంసించారు. అతడు అభినవ అర్జునుడుగా ద్రోణుడు పొగిడాడు. దీనితో పద్మవ్యూహం నిర్వీర్యమైనట్లు అందరూ భావించారు. అది చివరి నిరాశా దశ.

అభిమన్యు వధోపాయాన్ని చెప్పుమని దుర్యోధనుడు ద్రోణుడిని అడిగాడు. అతడు నవ్వి ఈ విధంగా చెప్పాడు: 'కవచధారణమనే విద్యను నేను అర్జునుడికి ఇచ్చాను. అతడు అభిమన్యుడి కిచ్చాడు. అందువలన అతడిని నొప్పించటం శక్యంకాదు. అయితే, కపటోపాయంతో అతడి అల్లెత్రాడును త్రెంచాలి, విల్లును విరవాలి, ఆ తరువాత గుర్రాలను, సారథిని చంపి అతడిని వధించే యత్నం చేయాలి. అతడి చేత ధనువుంటే దేవతలు కూడా దరిచేరలేరు. నీ వట్లా అధర్మయుద్ధం చేయగలిగితే కార్యాన్ని సాధించగలము' అని దుర్యోధనుడిని ద్రోణుడు పురికొల్పాడు.

కర్ణుడు వంచనతో వెనుకనుండి అభిమన్యుడి విల్లును విరిచాడు. ద్రోణుడు గుర్రాలను చంపాడు. కృపుడు సారథిని చంపాడు. శకుని, కృతవర్మ, శల్య, బాహ్లిక, అశ్వత్థామాదులు అతడిపై బాణాలను గుప్పించారు. విరథుడైన అభిమన్యుడు కత్తీ, డాలూ తీసికొని గగనానికి ఎగిరి మండలాకారంలో తిరుగుతూ యోధులను వేధించాడు. ద్రోణుడు కత్తిని విరుగకొట్టాడు. కర్ణుడు పలకను పగులకొట్టాడు. శకుని, కృతవర్మాదులు చక్రాన్ని ముక్కలు చేశారు. ఆపైన గదను చేపట్టి అశ్వత్థామపై ఉరికాడు. అతడు పరుగెత్తాడు. గాంధారులు, వసాతీయులు, కేకయులు మొదలైనవారు దాడిచేశారు. వారిని అభిమన్యుడు వీరవ్రతంతో ధీరత్వంతో నొప్పించాడు. అంతలో దుశ్శాసనుడి కొడుకు అతడిపై దాడిచేశాడు. వారిద్దరూ క్రోధమూర్తులై రౌద్రరసం చిప్పిల్లగా ద్వంద్వయుద్ధంచేసి రణరంగంలో ఒకేసారి చనిపాయారు. 'శౌర్యసార సంపాదిత రౌద్రుండైన సౌభద్రుడు' పడిపోవటంతో పద్మవ్యూహం ఎంత గెలిచిందో, అంత ఓడింది. అధర్మయుద్ధంలో పెక్కురు కలిసి ఒక్కడిని చంపారని పంచభూతాలు అరచాయి. సాయంకాల మయింది. యుద్ధం ఆగింది. కౌరవులు ఉప్పొంగారు; పాండవులు శోకమూర్తు లయ్యారు.

కౌరవుల రౌద్రకర్మ ద్రోణుడి నాయకత్వంలో సాగింది. ఆ పాపకర్మలో ఆయన పాత్ర బలీయమైనది కూడా. దుర్యోధనుడి సైన్యాధ్యక్షుడిగా ఆయన ఒక అధర్మయుద్ధానికి నాందిపలికాడు. అది ధర్మరాజు మనస్సును బాధించింది. ఆచార్యుడి ప్రవర్తనమీదకంటె అభిమన్యుడికి సహాయం అందకుండా పాండవుల నడ్డగించిన సైంధవుడి మీద అర్జునుడు ఆగ్రహించాడు. పుత్రవియోగ దుఃఖంలోనుండి శత్రుసంహార రౌద్రం ఉద్భవించింది. శ్రీకృష్ణుడి దివ్యానుగ్రహంతో పరమేశ్వర వరప్రసాదంతో అర్జునుడు మరునాడు సూర్యాస్తమయంలోపల జయద్రథవధ చేస్తానని ప్రతిజ్ఞచేశాడు. అట్లా చేయలేకపోతే గాండీవంతోసహా అగ్నిలో ప్రవేశిస్తానని ప్రకటించాడు.

పార్థుడి ప్రతిజ్ఞ కౌరవపాండవుల కిద్దరికీ పెద్ద సమస్య అయింది. ఒకరికి సైంధవ ప్రాణరక్షణ. మరొకరికి పార్థ ప్రాణరక్షణ. ఈ రెండింటి నడుమ ధర్మరాజును పట్టితెచ్చే కార్యం తెరవెనుకకు పోయింది. అర్జునుడు ప్రతిజ్ఞానిర్వహణంలో విఫలుడైతే చనిపోతాడు కాబట్టి మర్నాడు అర్జునుడు లేని యుద్ధంలో ధర్మరాజును పట్టికొనటం సులభమని ద్రోణుడు భావించాడు. గర్భసంధిలో కథ భావికార్య విమర్శలో పడింది.

**13. నాల్గవనాటి యుద్ధం: విమర్శ సంధి : శకటపద్మసూచీవ్యూహాలు :**

చ. 'అనిమిష దైత్య కింపురుషు లాదిగ నెవ్వరు వచ్చి కాచినం
దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్రుఁడు గ్రుంకకుండు ము
న్న నరవరేణ్య! యిత్తెఱఁగు నా కొనరింపఁగ రాక యున్న నే
ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగఁ గాండివంబుతోన్'. **(ద్రోణ. 2. 281)**

ద్రోణుడి నాల్గవనాటి యుద్ధానికి అర్జునుడి ప్రతిజ్ఞ కేంద్ర బిందువు. ఇది విమర్శ సంధికి కీలకం. గర్భసంధిలో ప్రకాశించిన బీజార్థాలను గురించి క్రోధవ్యసనాదులతో చేసే పర్యాలోచనం విమర్శసంధిలో ప్రకటితమౌతుంది. వాటి స్వరూప స్వభావాలు ఇట్లా ఉంటాయి.

1. గర్భసంధిలో పలువురు కూడి అన్యాయంగా అభిమన్యుడిని చంపారు. వారు చేసిన అన్యాయానికి వారు అన్యాయపు చావులు చచ్చే యోగ్యతలను సంపాదించుకొన్నారని ధార్మికులు భావించారు.

2. అభిమన్యుడి వ్యూహం ప్రకారం పాండవ సహాయం అతడికి అందకుండా అవరోధం కలిగించిన సైంధవుడు చేసిన నేరం క్షంతవ్యం కానిది. కాబట్టి అతడి చావుకు అర్జునుడు ముహూర్తంపెట్టటం, ఆ ప్రతిన సాధ్యమా? అని అనేకులు అనేక విధాలుగా కలతచెందటం. శ్రీకృష్ణానుగ్రహంవలన పార్థుడు పాశుపతాస్త్రాన్ని సమంత్రకంగా పొంది ఫలావాప్తికి మార్గం ఏర్పరచుకొనటం.

3. ద్రోణుడు నాల్గవనాటి యుద్ధంలో ధర్మరాజును పట్టటం కంటె, సైంధవుడిని రక్షించే యత్నానికే ప్రాధాన్యం ఏర్పడటం.

4. సైంధవుడు యుద్ధభూమినుండి వైదొలగటానికి పూనుకొనగా అతడిని వారించి, అతడి రక్షణకు ద్రోణుడూ పూచీ వహించటం. దానికై ద్విముఖవ్యూహాన్ని సిద్ధం చేయటం. ఒకటి - సైంధవుడిని అర్జునుడికి అందుబాటులో లేకుండ దూరంగా ఉన్న వ్యూహంలో సురక్షితుడిగా ఉంచటం. రెండు-అర్జునుడు అతడిని చేరకుండా అవరోధాల నెన్నో కల్పించి సూర్యాస్తమయం వరకు నిగ్రహించగలిగితే అతడు అగ్నిలో ప్రవేశిస్తాడు. కాబట్టి ధర్మజుడిని పట్టటం సులభమౌతుందని భావించటం.

5. ద్రోణుడు సైంధవ రక్షణకై వ్యూహత్రయ సంపుటిని సమీకరించాడు. సైంధవుడు, భూరిశ్రవుడు, కర్ణుడు, అశ్వత్థామ, వృషసేనుడు, కృపాచార్యుడు కలిసి ఉండాలి. వారి అధీనంలో ఉత్తమజాతివైన పదునాలుగువేల ఏనుగులు, అరువదివేల రథాలు, లక్ష గుర్రాలు, పది లక్షల పదాతులు ఉండాలి. వారి స్థావరం ప్రధానవ్యూహానికి వెనుకగా మూడు యోజనాల దూరంలో ఉండాలి అని ముందుగా నిర్దేశించటం.

ప్రధాన వ్యూహంగా శకటవ్యూహాన్ని పన్నాడు. దాని పొడుగు పన్నెండు గవ్యూతులు. వెడల్పు అయిదు గవ్యూతులు. దీనిలో పడమటి సగభాగంలో పద్మవ్యూహాన్ని గర్భవ్యూహంగా అమర్చాడు. ఆ మధ్యభాగంనుండి సేనాముఖం వరకు కలిపేవిధంగా ఉండేటట్లు సూచీవ్యూహాన్ని అమర్చాడు. సూచీముఖంలో కృతవర్మ నుంచాడు. అతడి వెనుక కాంభోజరాజును, అతడి వెనుక శతసహస్రయోధులను ముందుంచుకొని దుర్యోధనుడిని, సూచీమూలస్థానంలో జయద్రథుడిని నిలిపాడు. ఇది అద్భుతమైన వ్యూహమని దేవతలు కూడా మెచ్చుకొన్నారు. వ్యూహత్రయంలో సూచీవ్యూహం కీలకపాత్రను నిర్వహిస్తుందని తెలుస్తున్నది. దీనిని రక్షించుకొంటే అర్జునుడిని ప్రవేశించకుండా అడ్డగించవచ్చును. దీని ద్వారా సైంధవుడి రక్షణలో స్వీయబలాలను వలసిన చోట్లకు ప్రసారం చేసికొనవచ్చును.

దుర్మర్షణుడు ద్రోణుడు పన్నిన వ్యూహాలను కాదని తాను స్వంతంగా పదిహేనువందల విండ్లదూరంలో మరొక వ్యూహం పన్ని అర్జునుడిని హుటాహుటి ఎదిరించటానికి సిద్ధమయ్యాడు. దుశ్శాసన వికర్ణులు సైంధవ రక్షణార్థం నిజ బలాలతో ఆ సమీపంలో నిలిచి ఉన్నారు. ద్రోణుడు శకటవ్యూహముఖంలో ఉన్నాడు.

6. అర్జునుడు దీనికి దీటుగా మరొక మహావ్యూహాన్ని పన్నలేదు. దర్మజుడి రక్షణకు సాత్యకి నాయకత్వంలో ఒక దృఢవ్యవస్థను ఏర్పాటు చేయటం. కౌరవులకు సైంధవరక్షణ మెంత ముఖ్యమో పాండవులకు ధర్మజ రక్షణమంత ముఖ్యమని చెప్పి, దానిపై ప్రత్యేక శ్రద్ధవహించటం. తన వెంట కొందరు వీరులు కలిసి రాగా ఒంటరిగా కౌరవవ్యూహాన్ని భేదించి గడువులోపల సైంధవవధ చేసే దృఢయత్నం చేయటం. అతడికి తోడుగా ధృష్టద్యుమ్నుడు, నకులుని సుతుడు శతానీకుడు ముందుకుసాగుతూ ఆయా సమయాలకు అనుగుణమైన మొగ్గరాన్ని కల్పించటం.

7. అర్జునుడు కౌరవవ్యూహాన్ని అంచెలంచెలుగా ధ్వంసం చేసిన విధం అపూర్వం. ఆ క్రమాన్ని పరిశీలిస్తే శత్రువ్యూహరహస్య విచారం ఆయన కెంత గాఢంగా ఉన్నదో స్పష్టమౌతుంది. రేఖామాత్రంగా గమనించటం ప్రస్తుత కర్తవ్యం.

8. ద్రోణవ్యూహానికి ముందే దుర్మర్షణుడి వ్యూహం ఉండటంచేత, బాహుగర్వంతో అతడు అర్జునుడిపై దూసుకొని వచ్చాడు. అర్జునుడు నవ్వుతూ 'వీడే ఈనాటి తొలిముద్ద' అని నవ్వుతూ అతడిని చంపాడు. దుర్మర్షణుడి సహాయకులందరూ ఒక్కుమ్మడి పార్థుడిని క్రమ్ముకొని దొమ్మియుద్ధం చేశారు. వారిని పార్థుడు నుగ్గు నుగ్గు చేసి సేనలను తరిమికొట్టాడు. దీనితో ద్రోణవ్యూహానికి కంచెగా నిలిచిన దుర్మర్షణుడి బలగం నశించి, దారి ఏర్పడింది.

9. దుర్మర్షణుడి వెనుకభాగంలో వ్యూహంలో భాగం కాకపోయినా అనుబంధ వ్యూహంగా నిలిచి ఉన్నారు దుశ్శాసన వికర్ణులు. దుశ్శాసనుడు బహుళగజ సైన్యంతో అర్జునుడిని ఎదుర్కొన్నాడు. అతడి బలాన్ని అణచి అతడు ద్రోణుడి మొగంచూస్తూ వెనుదిరిగి పరుగెత్తాడు. దానితో ద్రోణవ్యూహానికి ఉన్న రెండవ కంచె కూలింది. సైంధవుడివైపు పురోగమించాలని అర్జునుడు యత్నించాడు.

10. శకటవ్యూహముఖంలో ఉన్న ద్రోణాచార్యుడి నతిక్రమించాలని అర్జునుడు ఆయన అనుమతి కోరాడు. 'నన్ను గెలవకుండా సైంధవుడిని ఎట్లా సమీపించగలవు?' అని శస్త్రాస్త్రాలను ప్రయోగించి శ్రీకృష్ణార్జునులను బడలేటట్లు చేశాడు ద్రోణుడు. అర్జునుడు ఆచార్యుడి చాపాన్ని విరుగగొట్టాడు. అల్లెత్రాడును తెంపాడు. శ్రీకృష్ణుడి సూచనమేరకు వెంట వెంటనే విజృంభించి ద్రోణుడికి ప్రదక్షిణం చేసి దాటి శకటవ్యూహంలో ప్రవేశించాడు. 'శత్రువును గెలవకుండా ఇట్లా పోవటం ఎక్కడైనా ఉన్నదా?' అంటూ నవ్వుతూ ద్రోణుడు అర్జునుడిని వెంటాడాడు. 'యుద్ధంలో పోరే నిన్ను పరమేశ్వరుడు కూడా ఎదురొడ్డలేడు' అంటూ వినయంతో కీర్తించి మొగ్గరంలోనికి ప్రవేశించాడు. అతడివెంట పాంచాలకుమారులు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు వ్యూహంలోకి చొచ్చుకొనిపోయారు. శకటవ్యూహం శిథిలంకావటం మొదలయింది. ఆచార్యుడి కన్నులముందే, ఆయన అర్జునుడిని వెంటాడిపోరినంత పోరి, వ్యూహముఖాన్ని రక్షించుకొనటానికి తిరిగి వెళ్ళాడు. అంటే శకటవ్యూహంమీద అర్జునుడు పట్టుసాధించా డన్నమాట.

11. మధ్యభాగంలో సూచీవ్యూహం ఉన్నది. దాని అగ్రభాగంలో కృతవర్మ ఉన్నాడు. అతడు వక్రమార్గంలో అర్జునుడిని వెనుకనుండి ఎదుర్కొన్నాడు. శ్రీకృష్ణుడి సలహా మేరకు పార్థుడు కృతవర్మను మూర్ఛలో ముంచి ముందుకు సాగాడు. కృతవర్మ మూర్ఛనుండి తేరుకొని నరుడిమీద, అతడి అనుచరులమీద బాణాలు కురిపించాడు. అర్జునుడు అతడి విల్లును విరిచాడు. అతడికీ, కృతవర్మకూ తోడుగా సూచీముఖంలో ఉన్న శ్రుతాయుధుడు పోరు సాగించాడు. వరుణ తనయుడైన ఆతడి బాణప్రయోగం వికటించి ఆతడినే చంపింది. అంతకు పూర్వమే అర్జునుడు అతడి చేతులు నరికాడు.

12. సూచీముఖంలో కృతవర్మకు సాయంగా నిలిచిన మరొక వీరుడు కాంభోజరాజు. అతడు అర్జునుడితో పోరి ఆతడి చేతులలో చనిపోయాడు. ఆ తరువాత దూసుకొని వచ్చిన నియుతాయువు, దీర్ఘాయువు అనేవారిని తేలికగా పార్థుడు చంపాడు. మొత్తంమీద అర్జునుడు ద్రోణుడిని దాటి వచ్చాడు. కృతవర్మను బాధించాడు, శ్రుతాయుధుడిని కూల్చాడు, కాంభోజపతిని చంపాడు, శ్రుతాయువు మొదలైన వారిని హతమార్చాడు. సూచీవ్యూహ ప్రవేశానికి మార్గం ఏర్పరచుకొన్నాడు.

13. సూచీవ్యూహ గర్భంలో నూరువేల యోధులను చుట్టూ ఉంచుకొని దుర్యోధనుడు ఉన్నాడు. తరువాతి దాడి అతడిమీద జరుగబోతుంది. అంతవరకు అర్జునుడిని రానిచ్చిన ద్రోణాచార్యుడిమీద దుర్యోధనుడికి కోపం వచ్చింది. అతడిని పాండవ పక్షపాతి అని నిందించాడు. అతడిని నమ్మి మరొకచోటికి పారిపోకుండా సైంధవుడు రణరంగంలో నిలిచినందుకు ఫలం అతడి మృత్యువా? అని ప్రశ్నించాడు. ద్రోణుడు 'తేనె పూసిన కత్తి' అని దూషించాడు. అయినా, అది సమయం కాదని శాంతించి పార్థుడి రాకవలన రాజలోకం వెలవెలపోతున్నదనీ, సైంధవరక్షణకు ఉపాయం చెప్పుమనీ వేడాడు. ద్రోణుడు శ్రీకృష్ణపాండవుల మహిమను చెప్పి, తాను వ్యూహముఖంనుండి వెనుకకు రాగూడదని తెలిపి, వృద్ధుడైన ద్రోణుడు అర్జునుడి వేగాన్ని అనుకరించలేడని పేర్కొని, సమ

వయస్కుడైన దుర్యోధనుడిని నరుడిమీద యుద్ధం చేయటానికి పురికొల్పాడు. రక్షాకవచాన్ని ఒకదానిని ప్రసాదించాడు. దానిని పొందిన దుర్యోధనుడు అర్జునుడిని అడ్డగించాడు. దానితో సైంధవరక్షకులలో ముఖ్యుడైన దుర్యోధనుడే నరుడితో యుద్ధానికి దిగవలసి వచ్చింది. అర్జునుడు సూచీవ్యూహాన్ని నిపుణంగా విచ్చి అందులో ప్రవేశించి ముందుకు సాగాడు.

14. అర్జునుడి వెంట వస్తున్న ధృష్టద్యుమ్నుడితో ద్రోణుడు తలపడ్డాడు. యుద్ధంలో అతడిని చంపబోయాడు. కాని, సాత్యకి అడ్డుపడి మిత్రుడిని రక్షించాడు. ద్రోణుడు అతడిపై పోరు సాగించాడు. ధర్మజభీమనకులసహదేవులు సాత్యకికి తోడువచ్చారు. అంటే ద్రోణుడి దృష్టిని సైంధవుడినుండి పాండవులు మళ్ళించారు. ఆ అదనుచూచి అర్జునుడు రథాన్ని సైంధవుడిమీద లంఘించుమని శ్రీకృష్ణుడిని కోరాడు.

15. రథం ముందుకు సాగింది. అర్జునుడి వాడి బాణాలతో విరథుడు, వికలహస్తుడు అయిన దుర్యోధనుడు అవివేకంగా ఈ కవచం నిష్ఫలమని భావించి తనకు తానే ఆ కవచాన్ని తీసివేసి, వేరొక కవచాన్ని ధరించాడు. ఆ విధంగా ద్రోణుడు, దుర్యోధనుడికి చేసిన కవచప్రదానంవలన కలిగిన అడ్డంకి అర్జునుడికి తొలగిపోయింది.

16. ధర్మరాజు ద్రోణుడిని ఎదుర్కొని విరథుడై చేతులెత్తి నిలిచాడు. ద్రోణుడు అతడిపై బాణాలు వేయక చుట్టూ ఉన్న సేనను చెండాడాడు. ఆ విధంగా ధర్మరాజును పట్టుకొనటానికి అందివచ్చిన మంచి అవకాశాన్ని వదలుకొన్నాడు. దానికి యుద్ధనియమంతో పాటు ధర్మరాజుకు ఇచ్చిన వరంకూడా కారణం కావటం విశేషం.

17. కర్ణ దుర్యోధనులు అర్జునుడి ధాటికి నిలిచి సైంధవ రక్షణం చేయలేకపోతుండగా అశ్వత్థామ, శల్య, వృషసేనులు సైంధవుడికి పెట్టనికోటగా నిలిచారు. అర్జునుడు, సాత్యకి, భీముడూ కలిసి వారిని బలంగా ఎదిరించి వ్యూహాన్ని బలహీనం చేశారు. దుర్యోధనుడు ద్రోణుడిని నిందించాడు.

18. ద్రోణుడు నొచ్చుకొన్నాడు. కోపంతో దుర్యోధనుడికే సైంధవుడిని రక్షించుకొనే బాధ్యత వదలిపెట్టాడు. వ్యూహముఖంలో ఉండి పాండవసైన్యం లోనికి రాకుండా చూచాడు. దానితో సైంధవరక్షణ కౌరవులకు భారమై పోయింది. కథ అడ్డంతిరిగింది. కర్ణుడు, అశ్వత్థామ, శల్యుడు, వృషసేనుడు - మొదలైనవారు సైంధవ రక్షణలో దడికట్టి నిలిచి పోరు ఘోరంగా సాగించారు. కౌరవవీరులు ఎట్లాగైనా కాలయాపనం చేసి సూర్యాస్తమయమయ్యేంతవరకు యుద్ధం సాగించాలని ప్రయత్నం చేశారు. శ్రీకృష్ణుడు వారి వ్యూహాన్ని గమనించి ఉపాయాంతరాన్ని ఆలోచించాడు. మాయా తిమిరాన్ని కల్పించాడు. సూర్యు డస్తమించాడన్న భ్రాంతిని అందరికీ కలిగించటంతో ఆ దృశ్యాన్ని ఆశ్చర్యంతో తలెత్తి చూస్తున్న సైంధవుడి తలను అర్జునుడు బాణంతో నరికాడు. పాశుపతాస్త్రంతో ఆ తల క్రిందబడకుండా వృద్ధక్షత్రుడి ఒడిలో పడేటట్లు చేశాడు.

19. ద్రోణుడు నాలుగవరోజు కల్పించిన వ్యూహం సంశ్లిష్టమయింది. సంక్లిష్టమయింది. అయినా అర్జునుడు అందులోని ఆయువుపట్టును గ్రహించి సూచీవ్యూహాన్ని భేదిస్తే మిగిలిన వ్యూహాలు తమంతటతాము విచ్ఛిన్నమై పోతాయన్న ప్రతివ్యూహాన్ని పాటించాడు. కార్యాన్ని సాధించాడు.

20. ద్రోణుడు శకటవ్యూహం ముఖాన నిలబడి ఉన్నాడు. అర్జునుడు తనను తప్పించుకొని వ్యూహంలోకి ప్రవేశించగా అతడిని వెన్నంటాడు. కాని, అతడిని నిలువరించలేకపోయాడు. దానికి కారణం అతడికి శక్తిలేక కాదనీ, అర్జునుడి మీద మమకారమనీ దుర్యోధనుడు దూషించాడు. అర్జునుడు కౌరవవ్యూహాన్ని ధ్వంసం చేస్తుండగా ద్రోణుడు ధర్మరాజును పట్టాలని ప్రయత్నం చేశాడు. అతడు విరథుడై నేలమీద నిలిచి చేతులెత్తి ఉన్నప్పుడు పట్టుకొనవచ్చును కాని, యుద్ధనీతిని అనుసరించి ఆచార్యు డాపని చేయలేదు. దుర్యోధనుడు దానికీ కోపగించాడు. ఎంతటి వ్యూహం కౌరవులకొరకు పన్నినా ద్రోణుడి అంతర్వ్యూహం మరొకటున్నదని దుర్యోధనుడికి తెలిసింది. ఆచార్యుడిని అనుమానించే దుష్టచతుష్టయాన్ని సంబాళించుకొంటూ ఆడినమాట తప్పకుండా ఇటు దుర్యోధనుడినీ, అటు ధర్మరాజునూ మెప్పించే క్లిష్టపాత్ర ద్రోణుడు. ధర్మం కొరకు నిందలు పడినా చలించని దృఢవ్రతుడు.

ఎంతటి క్లిష్టవ్యూహం పన్నినా శ్రీకృష్ణుడి మహిమముందు, అర్జునుడి పరాక్రమం ముందు అది నిలవటం కష్టమనీ, కౌరవులకు విజయం అసాధ్యమనీ భావించి మనకు అనేకాంశాలలో బీజార్థాలను గురించిన విమర్శలను మిగిలించి, పాండవులకు విజయం కలిగే ప్రాప్త్యాశను కలిగించిన యోధుడు ద్రోణుడు. అయిదవనాటి యుద్ధంలో ప్రాణత్యాగం చేసి పాండవ విజయమార్గాన్ని సుకరం చేసిన పుణ్యశ్లోకుడు ద్రోణుడు.

**14. అయిదవనాటి యుద్ధం: నిర్వహణ సంధి: ద్వంద్వ యుద్ధాలు :**

1. ద్రోణపర్వ నిర్వహణం అద్భుతంగా సాగింది. పాండవులమీద పగబట్టిన రాజరాజు అర్జునుడి పరాక్రమాన్ని లోలోన ప్రశంసించినా బయటపడడు. ద్రోణుడు అర్జునుడిమీది అభిమానంతో అతడిని చంపడని తేలింది. అతడు చావకపోతే ధర్మజుడిని పట్టడని స్పష్టమయింది. అందువలన యుద్ధభారాన్ని ద్రోణుడు కర్ణుడికి ఇస్తే అతడు పౌరుషంతో యుద్ధం చేస్తాడని రారాజు ప్రతిపాదించాడు. ద్రోణుడు ఆ మాటలకు కలతపడ్డాడు. శ్రీకృష్ణార్జునుల ప్రతాపాన్నీ, కౌరవులు చేసిన పాపాలనూ, పాండవుల ధర్మనీతినీ ప్రశంసించాడు. అయితే, సర్వసైన్యాధ్యక్షుడు యుద్ధలక్ష్యాన్ని సాధించలేనందుకు తన బలహీనతను అంగీకరిస్తూ తాను బ్రతికి ఉండగా మరొకరికి ఆ బాధ్యతను ధారాదత్తం చేయటం వీరధర్మం కాదన్నాడు. అట్లని లక్ష్యాన్ని వీడటం న్యాయం కాదనుకొన్నాడు. పౌరుషంతో ద్రోణుడు పాంచాలురను చంపకుండా కవచం విడువనని ప్రతిజ్ఞచేశాడు. మొదటినాడు పాంచాలురు చూస్తూ ఉండగా ధర్మరాజును పట్టుకొంటానన్నవాడు. అయిదవనాడు పల్లవి మార్చాడు. లక్ష్యం మారింది. అది ఆ నాడే తీరుతుందని కవచం మీది శపథం సూచించింది. ఇది కౌరవపక్షంలో ఒక వైఫల్యం.

2. ఆ వైఫల్యాన్ని దుర్యోధనుడు సహించలేక, ద్రోణుడిని నమ్మలేక కర్ణుడి వద్దకు వెళ్ళి, ఆచార్యుడు అభేద్యమైన వ్యూహం పన్నికూడా అర్జునుడిని అందులోకి చొరనిచ్చి పక్షపాతవైఖరి ప్రదర్శించాడని నేరం మోపి, కయ్యపు పగ్గాలు పట్టుమని కోరాడు. కర్ణుడు అతడిని వారించి ద్రోణుడు యథాశక్తి పోరాడుతున్నాడనీ, అర్జున పరాక్రమం అమోఘ మనీ, వాస్తవాన్ని నచ్చచెప్పాడు. అయిదవనాడు ఈ ఉదయ సన్నివేశం భవిష్యత్కథా సూచకంగా ఉండటం విశేషం. కర్ణుడు పోరినా అర్జునుడిని సంహరించటం సాధ్యం కాదని సూచన.

3. అయిదవనాడు ద్రోణుడు ఏ వ్యూహమూ పన్నలేదు. పన్ని ప్రయోజనమూ లేదని తెలిసికొన్నాడు. అందువలన ప్రధానంగా ద్వంద్వయుద్ధాలే జరిగాయి.

4. పాండవవీరులు ద్వంద్వయుద్ధాలలో కౌరవవీరులను కొందరిని సంహరించారు. భీమసేనుడు దుర్మదదుష్కర్ణులను, బాహ్లికుడిని, సాత్యకి సోమదత్తుడిని, ఘటోత్కచుడు అలంబుసుడిని, అలాయుధుడిని వధించారు.

5. అట్లాగే కౌరవవీరులు పాండవపక్షంలోని వీరులను కూడా చంపారు. అశ్వత్థామ అంజనపర్వుడిని, కర్ణుడు ఘటోత్కచుడిని, ద్రోణుడు విరాట ద్రుపదులను హతమార్చారు.

6. ద్వంద్వయుద్ధాలన్నింటిలో ద్రోణార్జునుల యుద్ధం పరాకాష్ఠ. అక్కడ ఫలాగమాన్ని గురించి తీవ్రమైన ఆలోచన జరిగింది. అది అర్జునుడుగాని, ధర్మరాజుగాని చేసింది కాదు. అది మానవీయంకూడా కాదు. శ్రీకృష్ణుడు దివ్యశక్తిచేత కల్పించింది. అది ఒక క్రమంగా సాగి పర్వం ముగియటం విశేషం.

7. ద్రోణుడు తన వ్యూహాలన్నీ భగ్నం కావటంతో నిరాశచెందాడు. దుర్యోధనుడి అధిక్షేపాలతో మనసులో కలతచెందాడు. కర్ణుడు తనకంటె సమర్థుడనే మాట వినేసరికి మండిపడ్డాడు. పరువు దక్కించుకొనటానికి పాంచాలురను సంహరిస్తానని శపథం చేశాడు. ద్రుపదుడూ, ధృష్టద్యుమ్నుడూ పాంచాలురలో ముఖ్యులు. వారిని చంపకుండా ఆయన కవచం విడువనన్నాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిచేత చావడు. ద్రోణుడు పగబట్టిన ద్రుపదుడు మరణించాడు. కథ ముగియదు. దానికి ఉపాయంగా

కృష్ణుడు మహర్షులచేత ద్రోణుడికి యుద్ధ విముఖత గురించి ప్రబోధింపజేశాడు. 'భారద్వాజా! నీవు బ్రాహ్మణుఁడవు; వేదవేదాంగ విదుఁడవు; నీకు సంగ్రామంబు సేయ ధర్మంబగునే? యింతకు మున్ను చేసితేనియుఁ జేసితిగాని కాలంబు పూర్ణంబయ్యెఁ గాన నింక సమరంబు నుడుగుట మేలు మా మాటలు వట్టి, యాయుధంబులు వెట్టి శాంతిం బొందుము' - అన్నది వారి ప్రబోధం. ఇది దివ్యోపాయం.

8. దీనికంటె ముందే శ్రీకృష్ణుడు మానుషోపాయం ప్రారంభించాడు. ద్రుపదవధ జరిగిన తరువాత ద్రోణుడు ధృష్టద్యుమ్నుడిని వదలడు. అతడిని చంపగలిగిన శక్తికూడా అతడి కున్నది. ఆయుధం చేతిలో ఉండగా ఆచార్యుడిని ఎవరూ చంపలేరు. కాబట్టి ద్రోణవధోపాయం అవశ్యకర్తవ్యం. అశ్వత్థామ హతుడయ్యాడన్న దుర్వార్తకంటె ద్రోణుడిని యుద్ధవిముఖుడిగా చేసే ఉపాయం మరొకటిలేదు. అందువలన కృష్ణుడు అర్జునుడు వినేటట్లుగా ధర్మజ భీమాదులకు వినవచ్చేటట్లుగా ఆ ఉపాయాన్ని చెప్పాడు. ఆ పని చేయకపోతే సాయంకాలంలోపల పాండవసైన్యాన్ని ద్రోణుడు మట్టుపెట్టటం తథ్యమన్నాడు. భీముడు ఆ ఉపాయాన్ని అశ్వత్థామ అనే గజం మిషగా ప్రవర్తిల్లజేశాడు. ద్రోణుడికి దుఃఖం కలిగింది. కాని, ఆ మాటను నమ్మలేకపోయాడు. అంతలో మహర్షులు బోధించారు. ఎదురుగా ధృష్టద్యుమ్నుడు కనపడ్డాడు. కటకట పడ్డాడు. వికలచిత్తు డయ్యాడు. శ్రీకృష్ణుడు ధర్మరాజుచేత భీముడివలె 'అశ్వత్థామాః హతః కుంజరః' అని చెప్పించటానికి యుద్ధనీతిని ప్రయోగించి అంగీకరింప జేశాడు. 'కుంజరః' అనే పదం వినపడకుండా భేరీభాంకారాలు మ్రోయించాడు. ఉపాయం ఫలించింది. ద్రోణుడు ఆయుధ పరిత్యాగంచేసి, రథంమీద యోగదీక్షలో నిలిచి, శరీరంనుండి ప్రాణాలను వెడలించి, మహాసిద్ధుడు పొందే విదేహప్రాప్తిని పొందాడు. ఆ తరువాత ధృష్టద్యుమ్నుడికి యోగ్యత వచ్చింది. ద్రోణుడిని చంపటానికి పుట్టినవాడే ఆయుధ విసర్జనానంతరం ఆతడిని చంపగలడు కాబట్టి ద్రోణవధ ముగిసింది.

9. కథ ఇంతటితో ముగియదు. ద్రోణుడి మరణవార్త తెలిసికొని అశ్వత్థామ పాండవ సైన్యంమీద విరుచుకొనిపడ్డాడు. మహాస్త్రాలను ప్రయోగించాడు. పాండవవీరులలో కొందరు ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని వధించిన తీరుకు గర్హించారు. సాత్యకి వంటి యాదవవీరులే కాక అర్జునుడివంటి పాండవవీరులూ అందులో ఉన్నారు. చివరకు ద్రోణవధను సమర్థించుకొనే అవస్థ ధర్మరాజుకే కలిగింది. ఆ తరువాత కాని పాండవపక్షం అశ్వత్థామను కలిసికట్టుగా ఎదిరించలేకుండాపోయింది. అశ్వత్థామ ప్రయోగించిన నారాయణాస్త్రాన్ని తప్పించుకొనటానికి అందరూ భూమిమీద దిగి నమస్కరించారు. అశ్వత్థామ ప్రయుక్త ఆగ్నేయాది మహాస్త్ర సంపద విఫలమైపోయింది. ద్రోణాశ్వత్థామల వైఫల్యాలు దైవవ్యూహఫలాలు కాని మానవ వ్యూహఫలాలు కావని తెలిసింది.

10. ద్రోణ పర్వాంతంలో వ్యాసుడు అశ్వత్థామకు శ్రీకృష్ణార్జునుల మహిమను చెప్పటం, అర్జునుడికి పరమేశ్వర మహిమను చెప్పటం ఒక తాత్త్వికమైన ముగింపు నందించాయి. తిక్కనగారి హరిహరాభేదతత్త్వం వస్తుధ్వని నాశ్రయించి ప్రతీయమానమయింది.

## 15. ద్రోణపర్వంలో శ్రీకృష్ణుడు నాయకుడా?

ద్రోణపర్వ కథనంతా పరిశీలిస్తే అది సహజంగా సాగిందా? లేక శ్రీకృష్ణుడు వెనుకనుండి నడిపించాడా? అనే అనుమానం సామాన్యంగా కలుగుతుంది. శ్రీకృష్ణుడు సాక్షాత్ నారాయణాంశ సంభూతుడు కాబట్టి చక్రం పట్టకపోయినా యుద్ధచక్రం త్రిప్పగలడు. శిష్టరక్షణ కొరకు దుష్టశిక్షణ చేయగలడు. ఈ పర్వంలో మొదటినాడు పార్థుడి పరాక్రమమే ధర్మజుడిని రక్షించింది. రెండవనాడు సంశప్తకులతో యుద్ధం, భగదత్తుడితో యుద్ధం చేయవలసి వచ్చినప్పుడు పార్థుడికి శ్రీకృష్ణుడి సహకారం కావలసి వచ్చింది. మూడవనాడు అభిమన్యుడి మరణానంతరం పార్థుడి పుత్రశోకాన్ని మాన్పటానికీ, సైంధవవధవంటి దుష్కరకార్యాన్ని సాధించటానికీ అర్జునుడిలోని రౌద్రశక్తిని మేల్కొల్పి, పాశుపతాస్త్ర మంత్రఫలసిద్ధిని కల్పించి కౌరవవ్యూహ విధ్వంసనానికీ మార్గదర్శి అయిన దైవశక్తి శ్రీకృష్ణుడు. శివ కేశవులకు గల అభేదతత్త్వాన్ని స్వప్నంలో ఆవిష్కరించి యుద్ధంలో దర్శింపజేసిన మహాదేవుడు శ్రీకృష్ణుడు. ద్రోణుడు పన్నిన సంశ్లిష్టవ్యూహంలో శకటవ్యూహాన్ని భేదించి సూచీవ్యూహాన్ని ఆశ్రయించి దాని చివర సురక్షిత ప్రాంతంలో ఉన్న సైంధవుడిని చంపే మార్గం సుగమం చేయటంలో, దుర్యోధనాదులను ఓడించటంలో, మాయా తిమిరాన్ని కల్పించి సైంధవుడిని పైకి రప్పించటంలో, అతడి తలను పార్థుడిచేత ఖండింపజేయటంలో, అది నేలమీదపడకుండా వృద్ధక్షత్రుడి ఒడిలో పడేటట్టు

చేయటంలోనూ శ్రీకృష్ణుడి దివ్యసంకల్పమే విజయకారణం. అభిమన్యుడి మరణం పాశుపతాస్త్ర మంత్రసిద్ధికి మూలమయింది. ఆ మహాస్త్రసిద్ధి సైంధవుడితల నేలమీద పడకుండా, పార్థుడి శిరస్సు వ్రక్కలు కాకుండా రక్షించింది. సైంధవ వధానంతరం పాండవపక్షంలోనే కాక కౌరవపక్షంలోకూడా వీరులందరు శ్రీకృష్ణార్జునుల మహిమను ప్రశంసించారు. సాత్యకి భీమసేన ధర్మరాజాదులను అదనెరిగి రక్షించే సూక్ష్మేక్షిక శ్రీకృష్ణుడిదే.

ఈ సన్నివేశాలన్నీ శ్రీకృష్ణుడి దివ్యత్వాన్ని తెలుపుతున్నాయి. దీనితోపాటు కురుక్షేత్రయుద్ధంలో పార్థుడి విజయానికి కలిగే అడ్డంకులను క్రమంగా తొలగించటం ఆయన దివ్యవ్యూహాన్ని తెలుపుతాయి. పంచమాశ్వాసంలో ఇంద్రదత్తమైన శక్తిచేత ఘటోత్కచుడు మరణించినందుకు శ్రీకృష్ణుడు మనశ్శాంతిని పొందుతాడు. దానికి కారణం శక్తివలన అర్జునుడికి సంభవించే మరణం తప్పింది కాబట్టి. ఆ శక్తిని అర్జునుడిమీద ప్రయోగించకుండా కర్ణుడికి ప్రతిరోజూ మరపును కలిగించే శక్తికూడా ఆయన వ్యూహమే. ఇది మాయాతిమిర వ్యూహంకంటె మహాశక్తిమంతమైనది. దీనికంటె మించింది ద్రోణవధ వ్యూహం. సమయానికి దానిని సూచించిందీ, సమయోచితంగా నిర్వహింపజేసిందీ, ఆ శ్రీకృష్ణుడే. ఆ తరువాత అశ్వత్థామ దివ్యాస్త్ర ప్రయోగాన్ని నిర్వీర్యం చేసిందీ శ్రీకృష్ణుడి వ్యూహపాండిత్యమే. ఆనాడు అశ్వత్థామను ఆపకపోయినట్లయితే ద్రోణుడి తరువాత ఆతడే సేనా నాయకు డయ్యేవాడేమో! చావులేని అతడిని చంపటం పాండవపక్షానికి సాధ్యమయ్యేది కాదేమో! 'శక్తి'ని కోల్పోయిన కర్ణుడే తరువాతి వరుసలో రావాలని శ్రీకృష్ణుడి దివ్యసంకల్పమని స్పష్టమౌతున్నది.

ఇంతటి కథ నడిపిన శ్రీకృష్ణుడు కథానాయకుడా? అన్నది హిమాలయమంత ప్రశ్న. ఆయన కథా సూత్రధారుడే కాని కథానాయకుడు కాడు. నాయక సహాయకుడే కాని నాయకుడు కాడు. కథలో దీనికి సాక్ష్యాలు కోకొల్లలు. ధర్మరాజు విజయార్థియై ద్రోణుడి ఆశీర్వాదం కోరగా 'నీ మంత్రి శ్రీకృష్ణుడుండగా నన్నెందుకు అడుగుతా?'వని అన్నాడు. దుర్యోధనుడు ధర్మరాజును ప్రాణాలతో పట్టి తెమ్మన్నాడే కాని శ్రీకృష్ణుడిని కాదు. అట్లా అడగటానికి కారణం శ్రీకృష్ణుడి మాహాత్మ్యం తెలియక కాదు .కౌరవులు పాండవుల నందరినీ చంపినా శ్రీకృష్ణుడు చక్రంతో కౌరవులను మట్టుపెట్టి కుంతికి పట్టాభిషేకం చేస్తాడని గుర్తించి, మాయాద్యూతంలో ధర్మజుడిని ఓడిస్తే శ్రీకృష్ణార్జునుల శక్తులు నిష్ఫలాలై పోతాయని భావించాడు. కాబట్టి నాయకుడు ధర్మరాజే. శ్రీకృష్ణార్జునులు పరమేశ్వరుడిని దర్శించి వచ్చినా, సైంధవుడిని చంపినా, శత్రువులను సంహరించినా శిబిరానికి తిరిగివచ్చి ధర్మజుడికి నివేదించు కొనేవారు. ఆయన ఆజ్ఞలమేరకు మసలుకొనేవారు. ఆయనకే విపత్తువస్తే తాము అతడిరక్షణ కొరకు అన్ని జాగ్రత్తలూ తీసికొనేవారు. ధర్మరాజుకు భీముడు మానుష శక్తి, అర్జునుడు దైవీశక్తి, శ్రీకృష్ణుడు జ్ఞానశక్తి. ఈ మూడు శక్తులు ధర్మశక్తికి ఉపాంగాలే.

మరొక విశేషం, భాగవతం వంటి మహాపురాణాలలో విష్ణువుగాని, అవతారపురుషులు గాని నాయకులై భక్తులను రక్షించే దివ్యలీలలను ప్రదర్శిస్తారు. ఆ పురాణంలో శ్రీకృష్ణుడు దివ్యుడు. కాని, భారతం కావ్యేతిహాసం. ఇందులో కృష్ణుడు దివ్యాదివ్యుడు. పాండవులతో కలిసిమెలసి తిరుగుతూ వారిని విపత్తులనుండి తరింపజేస్తూ ఉంటాడు. స్కంధావారంలో దర్భాసనం మీద శ్రీకృష్ణుడి శరీరం మీద ఉంచిన పూజాద్రవ్యాలు కైలాసంలో శివుడి మేనిమీద గోచరించటం అద్భుతలీలయే. అంతటి లీల అర్జునుడికి అంగమౌతుంది. వారిద్దరి ప్రతాపం ధర్మరాజుకు ఉపాంగమౌతుంది.

మచ్చుకు ధర్మజ శ్రీకృష్ణుల ఈ సంభాషణ గ్రహించవచ్చును.

ధర్మరాజు:

ఉ. 'పంకజనాభ! మా పడినపాటులు రాజ్యము గోలుపోకయుం
గింకకు మూలమై కడఁగి గెల్పు కిరీటికి నీఁ దలంచి యీ
వంకకు వ్రాలి భక్తజనవత్సలతన్ రథచోదకుండ వై
తిం కిట మమ్ముఁ గావు మని యేటికిఁ జెప్పఁగ మాటిమాటికిన్'.

వ. ‘ అర్జును ప్రతిన చిత్తంబున నిలుపుము; దుఃఖామర్షమహార్ణవ మగ్నులమైన మమ్ముం దీరంబు సేరుపం
దేపవు నీవ కావె?’ **(ద్రోణ. 3.13, 14)**

శ్రీకృష్ణుడు:

మ. ‘ విను నేఁ డర్జునుఁ డన్యసైన్యముల నుర్విం గూల్చుచుం బ్రేత భూ
త నికాయంబులు మాంసభక్షణము రక్తస్వైర పానంబుఁ జే
సి నలిం గ్రాలఁగఁ గ్రీడ సల్పు; నిను మెచ్చించుం దుదిన్ సైంధవుం
డనువానిం దెగటార్చి పేర్చు రిపు ధైర్యక్షేపణాటోపతన్.’

వ. క్రోధ శోకజ్వర విముక్తుండవై శాంతిం బొందుము’. **(ద్రోణ. 3. 15, 16)**

సైంధవవధ చేసింది అర్జునుడైనా, చేయించింది శ్రీకృష్ణుడైనా దానివలన కలిగే ఫలం క్రోధ శోకజ్వర విముక్తి. దానిని పొందేది మాత్రం నాయకుడైన ధర్మరాజు. సచివాయత్త సిద్ధి అయిన నాయకుడి స్వభావం కూడా అదే.

### 16. ద్రోణపర్వంలో ఎనిమిది రకాల రౌద్రం:

పాత్రల స్వభావాన్నిబట్టి, అభినయాన్నిబట్టి రౌద్రాన్ని మూడు రకాలుగా విభజించటం భరతుడి కాలం నుండి సంప్రదాయంగా వస్తూనే ఉన్నది. అయితే కథలో కార్యసాధనోపాయాలనుబట్టి కూడా రౌద్రవివేచనం చేయటానికి వీలున్నది. ఆ దృష్టితో ఈ పర్వంలో ప్రవర్తిల్లిన రౌద్రం ఎనిమిది విధాలు: అవి -

1. అర్థసాధన కొరకు కపటోపాయాన్ని ఆశ్రయించి శత్రువును జయించే క్రోధాన్ని ప్రకటించటం. ఈ క్రోధం ఈ పర్వంలోని అన్నిరకాల రౌద్రాలకు మూలం. దుర్యోధనుడు ధర్మరాజును పట్టుకొని, వంచనతో జూదమాడి అరణ్యాజ్ఞాతవాసాలకు శాశ్వతంగా పంపే యత్నం, అసాధ్యుడైన అభిమన్యుడిని వంచనతో సంహరించే వ్యూహం పన్ని నిర్దాక్షిణ్యంగా అతడిని వధించే యత్నం, మాయాతిమిరాన్ని సృష్టించి సైంధవవధకు పాల్పడటం, ‘అశ్వత్థామా హతః కుంజరః’, అన్న వాక్యంతో ద్రోణుడిని అస్త్రసన్న్యాసం చేసేటట్లు చేసి అతడి తలను నరకేయత్నం; ఇవన్నీ అర్థసాధనోపాయాలే, ధర్మం ఇందులో గౌణం. అయితే రౌద్రం వలన రౌద్రం ఉత్పన్నమయితే ఇటువంటి సన్నివేశాలు తప్పవు. ఇవి ద్రోణపర్వంలోనే ఒక్కచోట ప్రోగువడ్డాయి.

2. తీవ్రమైన కోపం వచ్చినప్పుడు సాధ్యాసాధ్యాలు గమనించకుండా శత్రుసంహార యత్నం చేయటం. అర్జునుడు సైంధవ వధకై అసాధ్యమైన ప్రతిజ్ఞచేసి దానిని సాధించటం కొరకు శత్రువ్యూహాలను భగ్నంచేసి తీవ్రకోపంతో యుద్ధంచేయటం. ఇటువంటివి ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ, దుర్యోధనుడు మొదలైనవారు ప్రదర్శించినా అవి సఫలంకాకపోవటంచేత రౌద్రరసాభాసాన్ని కలిగించటం గమనిస్తాం.

3. మాయాయుద్ధంలో మారణహోమానికి పూనుకొనటం. మాయాయుద్ధం రాక్షసుల సొత్తు. వారిది నిలువెల్ల కోపం. ఎదుటివారిని హింసించటమే వారి స్వభావం. ఈ పర్వంలో హిడింబాసుతుడూ, అలంబుసుడూ ప్రదర్శించిన బీభత్స ప్రధానమైన యుద్ధం రౌద్రానికి చక్కని ఉదాహరణం.

4. ఆజన్మ శత్రువులు కనపడితే చాలు, వారి మాటలు స్మరిస్తేచాలు అగ్నిలో ఆజ్యంపోసిన విధంగా క్రోధంతో భగ్గునమండి యుద్ధానికి కాలుదువ్వేవారు. పాండవులలో భీముడు, కౌరవులలో ద్రోణుడు, కర్ణుడూ మొదలైన వీరులు దుర్యోధన, ధృష్టద్యుమ్న, అర్జునాది వీరులను చూస్తే వారిలో తోచేది యుద్ధవీరం కంటె రౌద్రం అధికం.

5. ఆత్మీయులను అవమానించిన వారిని గాని, చంపినవారినిగాని ఎదుర్కొన్నప్పుడు ప్రతీకారవాంఛతో ద్విగుణీకృత క్రోధవిస్ఫూర్తితో పోరాడటం మరొకభేదం. అభిమన్యుడు పద్మవ్యూహంలో కురువీరులను అధిక్షేపిస్తూ క్రోధమూర్తి అయి విజృంభించిన రౌద్రఘట్టం అపూర్వోదాహరణం. లక్ష్మణకుమారుడిని, దుశ్శాసన కుమారుడిని అభిమన్యుడు చంపినప్పుడు వారి తండ్రులు కోపోద్రిక్తులైనారు.

6. తన నిజాయితీనీ, వాస్తవస్థితి గతులనూ గమనించకుండా అడుగడుగునా అనుమానిస్తూ అధిక్షేపించే ప్రభువుపై సేనాపతులు అంతర్గత కోపాన్ని కార్యంలో ప్రదర్శించి, కార్యవైఫల్యానికి తోడ్పడే రౌద్రకర్మ - ద్రోణుడి సర్వసేనాపతిత్వం మొదటినుండి చివరిదాకా ఈ అంతర్గత కోపంతోనే సాగింది. ఆచార్యుడు వ్యూహముఖ రక్షణం వరకే తాను పరిమితమై వ్యూహభారమంతా దుర్యోధనుడిపై ఉంచాడు. చివరకు అకస్మాత్తుగా అస్త్రసన్న్యాసం చేస్తూ దుర్యోధనుడికి అప్పగింతలు చెప్పి కన్నుమూశాడు. ఇది వీరలక్షణం కాదు. రౌద్ర లక్షణం.

7. జనకరసాలనుండి జన్యరసాలు పుట్టిన ఘట్టాలలో రౌద్రకర్మ ప్రభావాన్ని విపులంగా వర్ణించి రసపోషణం చేయటం.

రౌద్రరసంనుండి కరుణరసం జనిస్తుందని లాక్షణికులు చెప్పుతారు. ఇది నిజం. అభిమన్యు వధ రౌద్రకర్మకు అక్షరోదాహరణం. దానివలన పాండవపక్షంలో అపారశోకం ఉద్భవిల్లింది. ధర్మరాజు, అర్జునుడు, సుభద్రాది రాణివాసపు స్త్రీలు, మిగిలిన పాండవులు, ఆప్తులు ప్రకటించిన శోకం వ్యాస శ్రీకృష్ణులే స్వయంగా ఓదార్చవలసినంత తీవ్రస్థాయిలో వర్ణించబడింది. అభిమన్యువధ ఎంత విస్తృతంగా వర్ణించబడిందో అతడిని గురించి బంధువులు శోకించిన ఘట్టం కూడా అంత విపులంగా ప్రదర్శించబడింది. ఆ ఘట్టంలోని కొన్ని పద్యాలను నేటికి ఆంధ్రులు ఆర్ద్రనయనాలతో చదువుకొంటూ ఉంటారు. మచ్చుకు కొన్ని:

ధీరోదాత్తుడైన ధర్మరాజు సైతం దీనుడై ఇట్లా దుఃఖించాడు.

మ. ‘ గురుశారద్వత ముఖ్యయోధవర సంగుప్తంబు నిర్భేద్య ము
ద్ధుర మా సైన్యము; దానిఁ జొచ్చి ననుఁ బ్రీతుం జేయఁగాఁ బూని యొ
క్కరుఁడున్ గోవులలోనఁ జొచ్చు బలుసింగం బొక్కొ నా నట్లు సొ
చ్చి రయంబార ననేక వీర శిరముల్ చెండాడె నుద్దండుఁడై’. **(ద్రోణ. 2. 138)**

ఈ పద్యం పైకి చూస్తే వీరరసపోషకంగా ఉంటుంది. మహాయోధులు గుమికూడిన వ్యూహంలో ఒంటరిగా ప్రవేశించి, ఎందరితలలో నరికాడు అన్నది ఇందులోని వీరకృత్యం. చిన్నవాడయినా అంతటి పెద్దపని ఎందుకు చేశాడు? కారణం? ‘ననుఁ బ్రీతుంజేయగాన్’ అని చెప్పటంలో ఆత్మీయత, తనకోసం ఆ పని చేశాడు. మహావీరులు కూడా అతడి ముందు గోవులవలె గోచరించారు. అతడు సింహంవలె చెలువొందాడు. అభిమన్యుడు బ్రతికి ఉన్నట్లయితే ఇది వీర ప్రశంస అయ్యేది, మరణానంతరం ఇది స్మృతి రూప దుఃఖభావమయింది. పార్థతనయుడి పరాక్రమమే ఆయన శోకంలోని ప్రధానాంశం.

ఫల్గునుడు కూడా ధీరోదాత్తుడే. అయినా కన్నతండ్రి. పుత్రశోకంతో అతడు నేలమీద చతికిలపడి ఎలుగెత్తి ఏడ్చాడు. తిక్కనమాటలలో -

ఉ. ‘ హా యను, ధర్మరాజ తనయా యను, నన్నెడఁ బాయ నీకుఁ జ
న్నే యనుఁ, దల్లి నేఁపఁ జనునే యను; గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను, నొంటి వోక దగవే యను; నే గతిఁ బోవు వాఁడ నే
నో యభిమన్యుఁడా యనుఁ; బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్’ **(ద్రోణ. ద్వి. 242)**

ప్రతి పిలుపులో ప్రేగు బాధ విషాద గీతిగా వినిపించింది. బాంధవ్యం, ఆత్మీయత, ఆక్రందనలో వినిపించింది. ధర్మరాజు బుద్ధిమంతుడివలె దుఃఖించాడు. పార్థుడు గుండెపగిలినట్లు శోకించాడు.

కరుణరసాన్ని ప్రకటించేవారు కూడా త్రిగుణాత్మకంగా ఉంటారేమో? ద్రోణపర్వంలో విచిత్ర మేమంటే - చచ్చిన ఆత్మీయులను చూచి అందరూ అర్జునుడివలె, ధర్మరాజువలె దుఃఖించరు. వారు సాత్త్విక ప్రవృత్తులు కాబట్టి వారిలో ఉద్బుద్ధమైన శోకం అవలీలగా రసస్థాయికి చేరుకొంటుంది. భీముడి కొడుకు ఘటోత్కచుడు వీరమరణం పొందినప్పుడు పాండవులు దుఃఖించారు గాని శోకించలేదు. పైపెచ్చు శ్రీకృష్ణుడు సంతోషించాడు. ఘటోత్కచుడు చచ్చి అర్జునుడిని బ్రతికించాడు. అందువలన ఆ ఘట్టంలో దుఃఖాన్ని రేఖామాత్రంగా ప్రకటించారు. వీరు రాజస ప్రవృత్తులు. ఇక కౌరవులలో దుర్యోధన దుశ్శాసనుల కొడుకులు కూడా అభిమన్యుడి రౌద్రకర్మకు బలి అయ్యారు. కాని, వారు దుఃఖించిన దానికంటె శత్రువుమీద మండిపడటం ఎక్కువగా కనబడింది. దుఃఖంనుండి కోపం పుట్టటం ఉదాత్తలక్షణం. దుఃఖం లేకుండా కోపం కలగటం ఉద్ధత లక్షణం, లేదా తమోగుణ లక్షణం.

అన్నిటికంటె మించి పేర్కొనదగింది ధృతరాష్ట్రుడి శోకం. మహాభారత యుద్ధకాలంలో మహావీరుల మరణవార్తలు విన్న ఆంబికేయుడు కన్నీరుమున్నీరుగా శోకించటం గమనిస్తాం. దుఃఖనదులన్నీ ధృతరాష్ట్ర హృదయక్షేత్రంలో కలిసి శోకమహాసాగరమౌతున్నట్లుంటుంది. జన్యరసచిత్రణలో ఇది ఒక మెలకువ.

8. జన్య మిత్ర రసాలనుండి రౌద్రం ప్రబుద్ధమైనట్లు వర్ణించటం.

జనకరసమైన రౌద్రం ఒక్కొక్కసారి జన్యరసస్థానంలో ఉండవచ్చును. క్రోధోద్రేకంలో విజృంభించే వీరులు పలికే వాక్యాలకూ, చేసే శపథాలకూ ప్రతిగా వీరులు రౌద్రాన్ని ప్రదర్శించవచ్చును. ఇవి భీమ దుర్యోధనుల నడుమా, ద్రోణ ధృష్టద్యుమ్నుల నడుమా, సాత్యకి కర్ణుల మధ్యా, అశ్వత్థామ ధృష్టద్యుమ్నుల మధ్యా సామాన్యంగా ఇటువంటి సన్నివేశాలు గోచరిస్తాయి. ఈ పర్వంలో సుశర్మకూ, సంశప్తకులకూ అర్జునుడికీ నడుమ సాగిన రౌద్రరస విజృంభణం పరస్పర జనకంగానూ, పోషకంగానూ ఉన్నాయి.

శత్రుకృతమైన రౌద్రకర్మలకు శోకం కలిగినా దానిని అధిగమించి క్రోధోద్రేకంతో పగసాధించే ప్రయత్నంలో శత్రువధకు ఘోరప్రతిజ్ఞ చేయవచ్చును. ద్రోణపర్వంలోనే కాదు మహాభారతయుద్ధం మొత్తంలో కూడా పేరెన్నికగన్నది. సైంధవుడిని వధిస్తానని చేసిన పార్థ ప్రతిజ్ఞ పుత్రశోక కారకుడైన విరోధిపై ప్రకటించిన రౌద్ర విస్ఫూర్తి.

రౌద్రరసపోషణంలో భయానక బీభత్సరసాలు వర్తిల్లటం యుద్ధరంగంలో సహజం. ద్రోణార్జునాది మహావీరుల విజృంభణం వలన యుద్ధభూమి బీభత్సంగా కనబడుతుంది. ఆ మహావీరుల ద్వంద్వయుద్ధాలు చూపరులకు భయంకరాలుగా కనబడతాయి.

రౌద్రఘట్టాలలో వీరులు కొందరు శత్రువుల బలాబలాలను అపహాస్యం చేస్తూ గంభీర హాస్యాన్ని ఉత్పత్తి చేస్తారు. మచ్చు కొక్కటి:

కర్ణుడి పౌరుషోక్తి: (దుర్యోధనుడితో)

శా. ‘ చంపం జాలుదు నే నొకండన భుజాశక్తిన్ నరున్, వెండి మ<br>ర్దింపం జుల్కన భీమముఖ్యుల; భవత్తేజంబు రాజ్యంబుఁ బా<br>లింపం బూనిక యేను గల్గఁగ రిపు ల్జృంభింతురే? చూడు నా<br>తెంపుం బెంపును’ నంచుఁ గర్ణుఁడు మహోదీర్ణాకృతిం బొల్చినన్.

వ. కనుంగొని గృపాచార్యుం డలంతి నవ్వుతో నతని కిట్లనియె.

చ. ‘ అగు నగు మేలు మేలు మనుజాధిపుఁడున్ మహి యేలు మాటల
నృగఁటిమి యిమ్మెయిన్ నెఱపినం జెడుఁ బాండుతనూజకోటియుం
దగు మును ఘోషయాత్రను బదంబడి గోగ్రహణంబునందుఁ బే
రు గొనిన నీకు ని ట్లనుట క్రొవ్వులు దక్కుము సాలు నిన్నియున్’. **(ద్రోణ. 5. 97-99)**

కర్ణుడు పల్కినవి పౌరుషోక్తులు కావని అవి ప్రగల్భోక్తులని అవహేళన చేసిన కృపాచార్యుడి మాటలు లలిత హాస్య జనకాలు.

సర్వాంగ సుందరమైన రౌద్ర రసావతారం ద్రోణపర్వం.

## 17. ద్రోణపర్వం: అంతరార్థం

మహాభారత కథను ముక్తిసాధనమార్గంగా అన్వయించి తాత్త్వికదర్శనాన్ని చేసే అధ్యాత్మ విదులున్నారు. వారు ద్రోణపర్వంలోని అభిమన్యుడి వధకూ, ద్రోణవధకూ తాత్త్విక వ్యాఖ్యానం చేస్తారు. అభిమన్యువధ పూర్ణయోగ సాధనకూ, ద్రోణవధ అసమగ్రమైన జ్ఞానాన్ని సమగ్రజ్ఞానంతో విలీనం చేసే సాధనకూ ప్రతీకలుగా పేర్కొంటారు.

సాధకుడు ముక్తిసాధన చేసేటప్పుడు అతడిలో ఆ సాధనకు ప్రతిరోధకంగా ఉండే పాక్షిక సాత్త్విక వృత్తులే భీష్మ, ద్రోణ, కర్ణులుగా గ్రహించాలి. భీష్ముడు అసమగ్ర కర్మమార్గానికీ, ద్రోణుడు అసమగ్ర జ్ఞానమార్గానికీ, కర్ణుడు అసమగ్ర యోగమార్గానికీ చిహ్నాలుగా గోచరిస్తారు. పాక్షిక వృత్తులంటే అటు కేవలం సాత్త్వికాలు, ఇటు కేవలం తామసికాలూ కాని వృత్తులని భావం. వాటిని గుర్తించి నాశనం చేయటం కష్టసాధ్యం.

దుర్యోధనుడు ధర్మరాజును చంపకుండా పట్టి తెమ్మని ద్రోణుడిని అడిగాడు. అతడిని మరల జూదంలో ఓడించి శాశ్వతంగా అడవులకు పంపాలని ఆశించాడు. ధర్మరాజును చంపితే అర్జునుడు విజృంభిస్తాడనీ, పాండవులనందరినీ చంపితే శ్రీకృష్ణుడు చక్రప్రయోగంతో కౌరవులనందరినీ సంహరించి రాజ్యాన్ని కుంతికైనా కట్టబెట్టుతాడనీ దుర్యోధనుడు భావించాడు. ద్రోణపర్వంలో ఈ సంకల్పం బీజం. దీనిని తాత్త్వికంగా ఇట్లా వ్యాఖ్యానించవచ్చును.

ధర్మరాజు అష్టాంగపరమైన శారీరక సాధనకు చిహ్నం. అర్జునుడు ఋజువృత్తికీ, శ్రీకృష్ణుడు నివృత్తికీ ప్రతీకలు. ధర్మరాజును కృష్ణార్జునులకు దూరం చేసి, ఉన్న స్థితిలోనే ఉంచటం దీని అంతరార్థం. అంటే - ఋజువృత్తికీ, నివృత్తికీ దూరమైన అష్టాంగ శారీరకసాధన పెరగకుండా ఉండేటట్లు బ్రతికించి ఉంచటం కొరకు అసమగ్ర జ్ఞానవృత్తిని ప్రోత్సహించటం దుర్యోధనుడి లక్ష్యం! ఈ అవరోధం సామాన్యంగా మోక్షసాధనలోని చివరిదశలో ఏర్పడుతుంది. తీవ్రమైన విఘ్నాలలో ఒకటిగా పరిగణించబడుతుంది. అందుకే ద్రోణవధ పెద్ద ప్రయత్నమైపోయింది.

వ్యూహాలలో పద్మవ్యూహానికి ప్రత్యేకత ఉన్నది. పత్+మా+వ్యూహం= పద్మవ్యూహం. పతనశీలమైన ప్రవృత్తికీ, సంపదలకూ సంబంధించిన ఊహలను పుట్టించే మాయాజాలం - అని పద్మవ్యూహానికి అంతరార్థం. ముక్తిసాధనను భ్రష్టంచేసే తామసిక వృత్తిచేత ప్రేరేపించబడే ప్రకృతి వ్యామోహం కలిగించే మాయావృత్తియే పద్మవ్యూహం. ఆ వ్యూహం అసమగ్ర జ్ఞానవృత్తి (ద్రోణుడి) వలన కల్పించబడింది. దానిని అభిమన్యుడు భేదించాడు. ‘అభితః మనుతే ఇతి అభిమన్యుః’ అని వ్యుత్పత్తి. అభిమన్యు సాధన అంటే ‘అహం బ్రహ్మాస్మి’ ‘సర్వం ఖల్విదం బ్రహ్మ’ అనేవాటి సమష్టి సాధన. దానిని పూర్ణయోగం అంటారు. ఋజుప్రవృత్తి అయిన అర్జునుడివలన అతడు ఆరోహణమార్గాన్నే తెలిసికొన్నాడు. అంటే పద్మవ్యూహంలోకి ప్రవేశించటమే తెలుసు. కాని, భయరహితమనః ప్రవృత్తులు (భీమాదులు) వెళ్ళిన మార్గాననే తిరిగిరావచ్చునని ధైర్యం చెప్పటంతో అభిమన్యుడు పూనుకొన్నాడు. అంటే వారికి పూర్ణయోగం తెలియదన్నమాట!

తిరిగి వచ్చేటప్పుడు పెక్కుమంది కూడి అభిమన్యుడిని అన్యాయంగా చంపారు. దీని అంతరార్థాన్ని ఈ విధంగా భావించవచ్చును. బ్రహ్మాత్వసిద్ధి సాధకుడికి అవరోహణక్రమం తెలియనప్పుడు - అంటే - ప్రకృతినంతనూ ఇది బ్రహ్మకాదు అని, 'అహం బ్రహ్మాస్మి' అనే సాధనలో నిషేధించుకొంటూ పోవటం మాత్రమే తెలిసి, సర్వప్రకృతినీ (పద్మవ్యూహాన్ని) బ్రహ్మస్వరూపంగా సాధకుడు చూడలేనప్పుడు, సాధకుడిచేత అంతక్రితం నిషేధించబడిన ప్రకృతికి చెందిన వాసనామనోవృత్తులే ఒక్కుమ్మడిగా సాధనను భ్రష్టంచేసి వేస్తాయన్న సాధనా విఘ్నదశా రహస్యాన్ని తెలుపుతున్నది. ఇక్కడ చనిపోవటం అంటే సాధన వ్యర్థం అయిందని అంతరార్థంగా గ్రహించాలి.

సూర్యు డస్తమించే లోగా సైంధవుడిని (జయద్రథుడిని) వధిస్తా నని అర్జునుడు శపథం చేశాడు. సూర్యు డంటే జ్ఞానప్రకాశం. సాధకుడిలోని జ్ఞానప్రకాశం నశించకుండా కర్మమార్గం వలన కలిగే జనన మరణ కర్మ వాసనలను నాశనం చేయటం (జయద్రథ వధ) ఋజుప్రవర్తనా (అర్జునుడి) సాధన (ప్రతిజ్ఞ) లక్షణంగా బోధపడుతున్నది.

ద్రోణవధలో అసమగ్రమైన జ్ఞానాన్ని సమగ్రజ్ఞానంతో విలీనంచేసే సాధన గోచరిస్తుంది. ద్రు+ఊన= ద్రోణ - అంటే ప్రకృతినుండి విడిపోయినది, మాయాసంబంధాన్ని విడిచిపెట్టింది - అనే అర్థం గల జ్ఞానదీప్తిగా చెప్పాలి. కొన్నాళ్ళ తరువాత అశ్వత్థామ పుట్టాడు. ఆ తరువాత ఆచార్యుడైన ద్రోణుడు కౌరవపక్షంలోనే ఉండిపోయాడు. కురుక్షేత్రయుద్ధంలో సర్వసేనానిగా అభిషిక్తుడయ్యాడు. అశ్వత్థామ (అశ్వత్+థామ) అంటే ప్రకృతిగా ఆచరించే కర్మవాసనల ప్రకాశం అని అర్థం. అశ్వత్థామకు ద్రోణుడు తండ్రి. అంటే - అసమగ్రమైన జ్ఞానం ప్రకృతిలో చరించే కర్మవాసనలకు ఉత్పత్తిస్థానం - అని అంతరార్థం. ఈ విధంగా కౌరవపక్షాన్ని కోరి యుద్ధభారాన్ని వహించిన ద్రోణుడు జీవనవృత్తికి ఐహికవాంఛలకు లోనై ప్రకృతికర్మ వాసనలకు జనకుడై ఉండటంచేత అసమగ్ర జ్ఞానదీప్తి గల పాక్షిక సాత్త్విక మనోవృత్తి అన్నమాట. ఎంత అసమగ్రమైనదైనా, వింతగా ప్రకృతివాంఛలు కలిగిఉన్నా జ్ఞానం అనేది మనస్సును జయించి సంపాదించిందే కావటంవలన మనస్సుచేత జయించబడని శక్తిసామర్థ్యాలు దానికి ఉండే ఉంటాయి.

అర్జునుడంటే ఋజుమనోవృత్తి. ఎంత ఋజువృత్తి అయినా అది మనస్సునుండి కలిగిన జ్ఞానవృత్తివలన కలిగినదే కావటంవలన, జ్ఞానస్వరూపానికి అది అసమగ్రమైనదే అయినా, ఋజుమనోవృత్తి గురుభావంతో మ్రొగ్గి విధేయతను వహించి లొంగి ఉండవలసిందే.

అర్జునుడు ఎంత ఘోరంగా తలపడి యుద్ధంచేసినా ద్రోణుడిని జయించలేకపోయాడు. అంటే - ఎంతటి ఋజుమనోవృత్తికి కూడా ఆత్మజ్ఞానాన్ని (అది అసమగ్రమైనదే అయినా) మించి ఉండగలిగే సామర్థ్యం ఉండనే ఉండదు. ఋజువృత్తి అనేది విషయాలకు సంబంధించినదే కావటంవలన జ్ఞానవృత్తికి అది క్రింది స్థాయిదే. అది జ్ఞానాన్ని గెలవాలంటే దానిలోని దౌర్బల్యంవలన మధ్యలో ఏర్పడిన ప్రకృతి లోలత్వాన్ని (అశ్వత్థామ పట్ల అభిమానాన్ని) అసమగ్రమైన జ్ఞానంచేతనే గ్రహింపజేసి పశ్చాత్తాపంతో నిర్మలతను పొంగింపజేసి, ప్రకృతిపైని మమకారాన్ని పోగొట్టి, స్వచ్ఛందంగా అది ముక్తిని పొందాలనే స్థితిని దానికి కలిగించాలి. లోగడ దౌర్బల్యంవలన దానిలో కలిగిన ప్రకృతి లోలత్వాన్ని (అశ్వత్థామాభిమానాన్ని) విడిపించాలి.

ఈ అంతరార్థాన్ని అన్వయించుకొంటే ద్రోణవధలోని సాధన రహస్యం వివృతమౌతుంది. విశ్వామిత్రాది మహర్షులు ఏడుగురు ద్రోణుడికి ప్రసన్నులై ప్రబోధించారు. అంటే సప్తవిధమనోవృత్తులు అశ్వత్థామయందు అమితప్రేమగల ద్రోణుడిని (ప్రకృతి వాంఛలతో అమితంగా కూడిన సాధకుడిలోని అసమగ్రజ్ఞానాన్ని) ప్రబుద్ధపరిచాయి. అంటే ప్రకృతిమీది ఆసక్తిని నశింపజేసికొని ముక్తిని పొందవలసిందిగా సాధకుడిని హెచ్చరించాయన్నమాట! అప్పుడు 'అశ్వత్థామః హతః కుంజరః' అనే ధర్మరాజు మాట వినిపించింది. అంటే ప్రకృతి ప్రకాశం హతమైనది, సాధకుడిలో నుండి నశించిపోయింది, ఆత్మజ్ఞానం ప్రబుద్ధమయింది, అంతః ప్రబోధం కలిగింది- అని గ్రహించాలి. ఆ ఉపాయం (కృష్ణుడు) నివృత్తితత్త్వం చూపించిందని కూడా గ్రహించాలి.

ఇక్కడ ఒక విశేషం గ్రహించాలి. ధర్మరాజు అబద్ధమాడాడు అన్నది వాచ్యార్థంలోనే తప్ప అంతరార్థంలో కాదు. అంతరార్థంలో అది సత్యం చెప్పటమే ఔతుంది. ఎట్లాగంటే - ప్రకృతిలోనే పరమాత్మ ఉంటాడు. కాబట్టి ప్రకృతి నశించిపోవటం అనేది సత్యం కాదు. ప్రకృతి నిత్యమే. అందుకే ఇక్కడ కుంజర (కుం= ఐహికవృత్తిని; జరః= నాశనం చేసేది) శబ్దం వాడబడింది. ఆ కారణంగా జీవన్ముక్తావస్థను చెప్పటంగా జరిగింది.

ధర్మరాజు అంటే ధర్మతేజస్సు అని అర్థం. ధర్మతేజస్సు ఎప్పుడూ సత్యమైన ప్రకృతిని నశించిందని చెప్పదు. తరువాత ధృష్టద్యుమ్నుడు (దృఢమైన జ్ఞానప్రకాశం) ద్రోణుడిని యోగనిష్ఠలో ఉండగా తల తెగనరికాడు. అంటే అసమగ్రజ్ఞానం ధ్యానస్థితిలో ఉండగా పరిపూర్ణ జ్ఞానంలో విలీనం చేయటం జరిగిందని భావం.

ద్రోణుడి వధను అసమగ్రజ్ఞానం పూర్ణజ్ఞానంలో భగవద్ధ్యానం వలన వాసనానివృత్తి పొంది ఉన్న సమయంలో జ్ఞాన దీప్తిలో విలీనం చేసే సాధనంగా గ్రహించి సంపూర్ణజ్ఞానం పొందటానికి సాధకులు సాధనలు సాగించాలి. ఇది ద్రోణపర్వం మన కందించే అంతరార్థం. (మరిన్ని వివరాలకు డాక్టర్ వేదుల సూర్యనారాయణ శర్మగారి 'అంతరార్థ మహాభారతము' అనే గ్రంథాన్ని చూడండి).

**18. కవిత్రయ మహాభారతం: వ్యాఖ్యానం:**

తెలుగులో ఆదికావ్యమైన ఆంధ్రమహాభారతం అవతరించి దాదాపు వెయ్యేళ్ళు కావస్తున్నా, ఇంతవరకు దానికి సమగ్రవ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్టవ్యావహారిక భాషలో సరళవ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి మోదముంబొరసే అపూర్వ సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు భారతీయ వైదిక ధర్మప్రచార మహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమవేద వ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండలరాయడు మాత్రమే చేపట్టి, ధర్మరక్షణ కళాప్రావీణ్యంతో ఈ బృహత్తర ధర్మకార్యాన్ని ప్రజలకు ప్రసన్నంగా ప్రసాదించగలిగిన పరమ దయాళువు. ఆ దేవదేవుడి కృపాకటాక్షంతో పండితులు పదునెనిమిది పర్వాల ఈ దివ్య ప్రబంధమండలిని పరిష్కరించి, ప్రతి పద్యానికి వ్యాఖ్యానం వెలయించి, సవిమర్శకమైన పీఠికలు సమకూర్చి, కథాసారాదులను చేర్చి సర్వార్థసాధకంగా సంతరించి, సర్వాంగసుందరంగా ప్రచురించి, సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీ తిరుమలేశుడి పక్షాన బాధ్యత వహించి, అభ్యుదయ పరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి.బోర్డు ఛైర్మన్, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, వారి సహకారులూ, సంపాదక సలహామండలుల సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ఎడిటోరియల్ సెల్ సభ్యులూ, పలురకాలుగా ఈ కార్యక్రమంలో తోడ్పడుతున్న అధికార, అనధికారులూ ధన్యులు, వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. అది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన ఆరణ్యపర్వం మూడవసంపుటిగా రెండు భాగాలలలో ప్రచురించబడింది. మొదటి భాగం నన్నయ రచించిన ఆరణ్యపర్వభాగం. రెండవభాగం ఎఱ్ఱాప్రెగడ పూరించిన ఆరణ్యపర్వశేషం. ఈ విధంగా ఆరణ్యపర్వం విభజించబడి ప్రచురించబడటం తెలుగులో ప్రథమం. నాల్గవ, అయిదవ, ఆరవ సంపుటులుగా విరాట, ఉద్యోగ, భీష్మపర్వాలు వెలువడ్డాయి. ఇప్పటి ఈ ఏడవసంపుటి ద్రోణపర్వం.

ద్రోణపర్వ వ్యాఖ్యానంలో నలుగురు మహాపండితులు పాల్గొన్నారు. ప్రథమాశ్వాసానికి డాక్టర్ జి. హరనాథ్‌గారూ, ద్వితీయా శ్వాసానికి డాక్టర్ మల్లెల గురవయ్యగారూ, తృతీయ చతుర్థాశ్వాసాలకు శ్రీ సింగరాజు సచ్చిదానందంగారూ, పంచమాశ్వాసానికి డాక్టర్ కె. రాజన్న శాస్త్రిగారూ వ్యాఖ్యానం వ్రాశారు. మనీషులైన వీరు మధుర రచన చేశారు. ఈ పర్వానికి తగిన పీఠికను నేను సంతరించాను. ఇవి ఆంధ్రుల ఆమోదాన్ని పొందుతాయని ఆశిస్తున్నాను.

ఈ సంపుటి ఈ విధంగా రూపొందటానికి తోడ్పడిన మిత్రులు విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు గారికీ, శ్రీ కె. సత్యరామ ప్రసాదు గారికీ, డాక్టర్ దాసు అచ్యుతరావు గారికీ, శ్రీ ఎన్.ఎస్. హరనాథ్ గారికి, శ్రీ జి. రాధాకృష్ణగారికి, శ్రీమతులు సుశీలా లక్ష్మీ విద్యానాథులకూ, డాక్టర్ వి.యస్. లక్ష్మిగారికీ నా హార్దిక కృతజ్ఞతలు.

పరమకల్యాణ భద్రమూర్తి అయిన శ్రీ పద్మావతీ సహిత శ్రీ వేంకటేశ్వరస్వామివారు వేదవేద్యులు, వేదాంతగమ్యులు, పరమతత్త్వరూపులు అయిన భక్త సులభులు, సాహిత్య సంగీత కళాప్రియులు, రసానందమూర్తులు. ఆ స్వామికి ఈ పంచమవేదం అక్షరమైన తోమాలసేవ. వ్యాఖ్యానం సుగంధ పరిమళసేవ. ద్రోణపర్వ విశేషాంశాలు ఉజ్జ్వలాలంకారసేవ. పీఠిక విరాణ్మూర్తికి మంగళనీరాజనం. ఈ పర్వం స్వామివారికి సారస్వతమైన అక్షరార్చనం.

సత్య శివ సుందర రూపులైన స్వామివారి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యా సంపుటిని వాఙ్మయారాధనలోని భాగంగా పుణ్యపూజాకుసుమ మంజరిగా సమర్పించుకొంటున్నాను. విశ్వశ్రేయస్సును ప్రసాదించుమని స్వామివారిని వేడుకొంటున్నాను

హైదరాబాదు

10.5.2004

**జి.వి. సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు,

కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు,

తిరుమల తిరుపతి దేవస్థానం..

# ద్రోణపర్వ కథాసారం

భీష్ముడు రణరంగంలో కూలి అంపశయ్యమీద ఉండటం విని ధృతరాష్ట్రుడు మిక్కిలి శోకించి కౌరవులకు విజయం కలుగుతుందనే ఆశతో తరువాతి యుద్ధవార్తలను తెలిసికొని రమ్మని సంజయుడిని యుద్ధభూమికి పంపాడు. ఆ తరువాత ఒకనాటి అర్ధరాత్రి సమయంలో సంజయుడు యుద్ధభూమినుండి తిరిగివచ్చి ద్రోణుడి మరణవార్తను తెలిపాడు. పిడుగువంటి ఆ వార్తను విని ధృతరాష్ట్రుడు దిగ్భ్రాంతి చెంది, మూర్ఛపోయి, తేరుకొని పరిపరి విధాల ద్రోణుడి గుణగణాలు స్మరిస్తూ దుఃఖించాడు. కౌరవులకు ఇక విజయం కలగటం కష్టమని భావించి నిట్టూర్చాడు. తరువాతి కథను వినిపించుమని కోరగా సంజయుడు ద్రోణవధ కథను వివరించి చెప్పాడు.

భీష్ముడు కూలిన తరువాత కౌరవసైన్యం గోపాలుడు లేని గోగణంవలె వెలవెలపోయింది. దుర్యోధనాదులకు, కౌరవసైనికులకు కర్ణుడు జ్ఞాపకం వచ్చాడు. భీష్ముడు పడిపోయేంతవరకు రణరంగంలోకి అడుగుపెట్టనని ప్రతిజ్ఞచేసిన కర్ణుడు దుర్యోధనుడి ఆహ్వానంమీద రథమెక్కి యుద్ధం చేయటానికి సిద్ధమయ్యాడు. అంపశయ్యపై శయనించి ఉన్న భీష్ముడివద్దకు వెళ్ళి ఆతడి అభినందనలు పొందాడు. సర్వసైన్యాధ్యక్షుడవు కమ్మని దుర్యోధనుడు కోరగా కర్ణుడు ధనురాచార్యుడైన ద్రోణుడిని అభిషిక్తుడిని చేయుమని సలహా ఇచ్చాడు. సుయోధనుడు సేనాపతుల నందరిని వెంటబెట్టుకొని ద్రోణాచార్యుడి వద్దకు వెళ్ళి, అతడిని అర్చించి, అతడి అంగీకారంపొంది సర్వసైన్యాధ్యక్షుడిగా అభిషేకించాడు. ద్రోణుడు ఉప్పొంగిపోయి దుర్యోధనుడిని ఒక వరం కోరుకొమ్మన్నాడు. అతడు కర్ణ దుశ్శాసనాదులతో ఆలోచించి 'ధర్మరాజును పట్టి ఇ'మ్మని కోరాడు. అందుకు ఆచార్యుడు ఆశ్చర్యపోయి 'ధర్మరాజును సంహరించుమనకుండా ప్రాణాలతో పట్టితెమ్మని ఎందుకు అడుగుతున్నావు? అర్ధరాజ్యమీయాలని అనుకొంటున్నావా?' అని ప్రశ్నించాడు. దుర్యోధను డందుకు ఇట్లా బదులిచ్చాడు. 'ధర్మరాజును సంహరిస్తే అర్జునుడు కోపించి కౌరవులనందరినీ యుద్ధరంగానికి బలిచేస్తాడు. ఒకవేళ మనం పాండవులను సంహరించినా కృష్ణుడు చక్రంతో కౌరవసేనను మట్టుపెట్టి రాజ్యాన్ని కుంతికైనా ఇస్తాడు. కాబట్టి ధర్మరాజును ప్రాణాలతో పట్టితెస్తే అతడితో తిరిగి జూదమాడి అతడి నందులో ఓడించి అలవోకగా దీర్ఘకాలం అడవులకు పంపి, రాజ్యాన్ని సుఖంగా ఏలుకొనవచ్చునని నా అభిప్రాయం.' ఆ మాటలు విని దుర్యోధనుడి కుటిల చింతనకు మనసులో రోసి తన వరాన్ని నిపుణంగా తప్పించుకొనగలిగేటట్లు ప్రతిజ్ఞచేశాడు. 'అర్జునుడు సమీపంలో లేకుండా ఉంటే, ధర్మరాజు రణరంగంనుండి పారిపోకుండా ఉంటే, అతడిని పట్టి ఇస్తాను' అని పలికి దుర్యోధనుడిని తృప్తిపరిచాడు. ద్రోణుడి ప్రతిజ్ఞను రారాజు సైనికులందరికీ చాటించాడు. దానిని గూఢచారులవలన ధర్మరాజు విని అర్జునుడిని పిలిచి ద్రోణ శపథాన్ని గురించి చెప్పాడు. తానున్న చోటును ఎప్పుడూ వదలకుండా పొదివికొని యుద్ధం సాగించుమని కోరాడు. 'అగ్రజా! నేను ప్రాణాలతో ఉండగా నిన్ను పట్టుకొనటానికి ఆ ద్రోణుడికి కాదు కదా! ఆ స్థాణువుకైనా సాధ్యం కాదు. నీకు భయ మెందుకు?' అని అర్జునుడు ధర్మరాజుకు ధైర్యం చెప్పాడు. ఆనాడు పాండవులు క్రౌంచవ్యూహం పన్ని సైన్యాలను నడిపారు. సేనాముఖంలో అర్జునుడు గాండీవాన్ని ధరించి నిలిచాడు. కౌరవులు శకటవ్యూహాన్ని పన్నారు.

## ద్రోణుడి మొదటినాటి యుద్ధం:

ద్రోణుడు పాండవసైన్యంమీద దివ్యాస్త్రాలతో విరుచుకొని పడ్డాడు. నరుడు గురుడిమీద దివ్యాస్త్రాలతో తలపడ్డాడు. పోరు మహాఘోరంగా మొదలైంది, సంకుల సమరంగా సాగింది. భీమసేనుడూ, శల్యుడూ గదాద్వంద్వయుద్ధం భీకరంగా చేశారు.పాండవ సేనాపతులు తమతమ పరాక్రమాలను ప్రచండంగా ప్రదర్శించారు. ద్రోణుడు మండిపడ్డాడు. భీమ సాత్యకి పాంచాలాదులచేత

పరిరక్షితుడైన ధర్మరాజుమీద దారుణంగా దాడి మొదలుపెట్టాడు. పాండవ సేనానులు పెక్కురు ధర్మరాజును రక్షించుకొంటూ ఆచార్యుడిమీద యుద్ధం సాగించారు. ద్రోణుడు కార్చిచ్చువలె వ్యాపించి వీరులనందరినీ కలతపెట్టి ధర్మరాజును సమీపించి సంకులసమరం చేశాడు. 'ధర్మరాజు పట్టుపడ్డాడు' అని సైనికులందరూ కేకలు వేశారు. కర్ణుడితో పోరు ఘోరంగా చేస్తున్న అర్జునుడు మెరుపువలె ద్రోణాచార్యుడికి అడ్డుపడ్డాడు. క్షీరసముద్రాన్ని మందరపర్వతం కలచివేసినట్లుగా కౌరవసైన్యాన్ని అర్జునుడు సంక్షోభపరిచాడు. కురువీరులందరూ ఆచార్యుడికి అండగా నిలిచి పోరాడినా గాండీవి పరాక్రమానికి ఎదురునిలిచి నెగ్గలేకపోయారు. ఈ విధంగా ద్రోణుడి మొదటినాటి యుద్ధం ముగిసింది.

## ద్రోణుడి రెండవనాటి యుద్ధం:

రెండవనాడు ద్రోణాచార్యుడు గరుడవ్యూహాన్ని పన్నాడు. పాండవులు మండలార్ధ వ్యూహాన్ని మోహరించారు. కౌరవపక్షాన సుశర్మ నాయకత్వంలో సంశప్తకులు పదివేలమంది రథికులు ఒక్కటిగా కూడి అర్జునుడిపై పగసాధించటానికి దుర్యోధనుడి అనుమతిని కోరారు. అత డంగీకరించాడు. అర్జునుడిని ధర్మరాజుకు దూరంగా పంపటానికి సంశప్తకులు తోడ్పడ్డారు. దక్షిణదిశగా దూరంగా మోహరించిన సంశప్తకులు అర్జునుడిని యుద్ధానికి ఆహ్వానించారు. పార్థుడికి గడ్డుప్రశ్న ఏర్పడింది. అటు యుద్ధాహ్వానాన్ని కాదనటానికి వీలులేదు. ఇటు అన్న ధర్మరాజు రక్షణను వదలటానికి వీలులేదు. వీరుడైన అర్జునుడు పాంచాలవరుడైన సత్యజిత్తు రక్షణలో ధర్మరాజును ఉంచి తాను సంశప్తకులపై యుద్ధానికి వెళ్ళాడు. సంశప్తకులందరూ కలిసి అర్జునుడిమీద ఒక్కుమ్మడి దాడిచేసి దొమ్మియుద్ధం సాగించారు. బాణాలతో అర్జునుడిని కప్పివేశారు. సారథి అయిన కృష్ణుడికే అర్జునుడు కనబడటం కష్టమయింది. ఫల్గునుడు అనిలాస్త్రాన్ని ప్రయోగించి క్రమ్మిన బాణమేఘాలను వమ్ముచేశాడు. సంశప్తకులను చీకాకుపరిచాడు.

అర్జునుడు సంశప్తకులవైపు పోగానే ద్రోణాచార్యుడు ధర్మరాజువైపు దాడి సాగించాడు. అపారబలాఢ్యుడు సత్యజిత్తు ధర్మరాజుకు రక్షగా నిలిచి విజృంభించాడు. కాని, శస్త్ర కళాచార్యుడైన ద్రోణుడు అతడి విల్లును విరిచాడు. అతడు విల్లందినప్పుడెల్లా దానిని తునకలు చేశాడు. చివరకు అర్ధచంద్రాకార బాణంతో అతడి తల తెగగొట్టాడు. సత్యజిత్తు చనిపోగానే ధర్మరాజు ద్రోణుడి పరాక్రమానికి భయపడి రణరంగంనుండి రథం మీద తొలగిపోసాగాడు. అంతలో మత్స్యరాజు తమ్ముడు సూర్యదత్తుడు ద్రోణుడి నెదుర్కొన్నాడు. అతడికి చేది మగధ కేకయరాజులసైన్యాలు అండగా నిలిచాయి. ద్రోణుడు సూర్యదత్తుడిని చంపి, ధర్మరాజును పట్టుకొనటానికి అతడిని తరుముకొని పోజొచ్చాడు. అప్పుడు ధర్మరాజుకు అండగా యుధామన్యుడు, ఉత్తమౌజుడు, వసుదానుడు, శిఖండి, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు, చేకితానుడు క్రమ్ముకొని ద్రోణుడిని ఎదిరించారు. సుడిగాలికి కూలిన చెట్లవలె పాండవసైన్యాలు పడిపోయాయి. ధర్మజుడు భయపడి యుద్ధభూమినుండి తొలగిపోయాడు. మిగిలిన రాజులు భీముడి అండజేరి పోరు సాగించారు.

దుర్యోధనుడు గజసైన్యాన్ని భీముడిమీదకు పురికొల్పాడు. భగదత్తుడు ఇంద్రగజంవంటి సుప్రతీకాన్ని భీముడిపైకి ఉరికించాడు. భీముడు ఏనుగులను మట్టుపెట్టాడు. భగదత్తుడి గజం పాండవసైన్యాన్ని కలచివేసింది. అర్జునుడు భగదత్తుడిపైకి రథాన్ని మళ్ళించాడు. అర్జునుడి విజృంభణంచూచి భగదత్తుడు తన అంకుశాన్ని అభిమంత్రించి అతడి మీద ప్రయోగించాడు. శ్రీకృష్ణుడు అర్జునుడికి అడ్డంగా తన దేహాన్ని నిలిపి, తన హృదయం మీద ఆ అంకుశాన్ని ధరించాడు. అందుకు అర్జునుడు శ్రీకృష్ణా! నీవు సారథ్యం చేయాలిగాని, ఈ విధంగా యుద్ధంలో పాలు పంచుకోవచ్చునా! ఇది నన్ను చులకన చేయటమే కదా అని మనస్సు నొచ్చుకొంటే-శ్రీకృష్ణుడు ఆ అంకుశ వృత్తాంతం అంతా చెప్పి, ఘోరమైన ఆ వైష్ణవాస్త్రాన్ని తాను తప్ప ఇతరులు సహించలేరని తెలియచేసి, సవ్యసాచిని సమాధానపరిచాడు. ఘోరయుద్ధం చేసి సుప్రతీకాన్నీ, భగదత్తుడినీ అర్జునుడు నేలకొరిగించాడు. అర్జునుడిని కర్ణుడు ఢీ కొన్నాడు. మహాస్త్రాలతో మారణయుద్ధం చేశాడు. సూర్యాస్తమయం అయింది. యుద్ధం చాలించారు.

ఆనాడు కూడా ధర్మరాజును పట్టి ఇవ్వనందుకు దుర్యోధనుడు ద్రోణుడిని నిందించాడు. అందు కాతడు కటకటపడి 'నరుడి పరాక్రమం, నారాయణుడి మాహాత్మ్యం తెలిసికూడా ఇట్లా మాట్లాడటం న్యాయమా! ధర్మరాజుమీద చేయి పడకుండా పాండవ వీరులు వరుసగా ఎట్లా కాపాడుకొంటున్నారో గమనించావు కదా! రేపు అర్జునుడిని దూరంగా పంపివేయాలి. ధర్మరాజును పట్టాలి' అంటూ వ్యూహాన్ని పన్నాడు.

## ద్రోణుడి మూడవనాటి యుద్ధం:

మరునాడు ద్రోణుడు పద్మవ్యూహాన్ని పన్నాడు. సంశప్తకులు అర్జునుడిని ఆహవానికి ఆహ్వానించి దూరప్రాంతానికి తీసికొని వెళ్ళారు. వ్యూహం వలయాకారంగా ఉండటంచేత దుర్భేద్యమైన చక్రవ్యూహం ఏర్పడింది. పాండవులలో పద్మవ్యూహాన్ని భేదించి విజయాన్ని సాధించే నేర్పు అర్జునుడికీ, శ్రీకృష్ణుడికే ఉన్నది. అభిమన్యుడికి పద్యవ్యూహాన్ని భేదించి లోనికి ప్రవేశించటం తెలుసు గాని విజయవంతంగా తిరిగిరావటం తెలియదు. ద్రోణుడు పాండవసైన్యాన్ని బాణాలతో బాధించాడు. వ్యూహంలో ప్రవేశించటం పాండవవీరులకు శక్యం కాలేదు. అప్పుడు ధర్మరాజు భీమాదులను వెంటబెట్టుకొని అభిమన్యుడి వద్దకు వెళ్ళి పద్మవ్యూహాన్ని భేదించి పాండవుల గౌరవాన్ని నిలుపుమనీ, పార్థగోవిందుల ప్రశంసలు పొందుమనీ కోరాడు. అభిమన్యుడివెంట భీమాదులందరూ వ్యూహంలో ప్రవేశించి దానిని ధ్వంసం చేయగలరని ధైర్యం చెప్పాడు. అభిమన్యుడు తనకు దొరికిన అవకాశానికి ఆనందావేశాలతో ఊగిపోయాడు. భీముడిముందు ఈ విధంగా శపథం చేశాడు.

'ధర్మరాజు నన్ను అభిమానించిన ఈ ప్రయత్నాన్ని నిష్ఫలంచేయకుండా ద్రోణుడు మెచ్చేటట్లు నేను మొగ్గరంలో ప్రవేశించి సైన్యాలను కలతపెట్టుతాను. సుభద్రార్జునులు తమ కొడుకు ప్రదర్శించే పరాక్రమాన్ని చూచి మురిసిపోయేటట్లు చేస్తాను. 'చూడండి! ఒక చిన్నవాడు పెద్ద సైన్యసమూహాలను గోపకుడు ఆవులమందను తోలినట్లుగా అదుపుచేస్తున్నా'డని ప్రజలందరూ ప్రశంసించగా విని మామ (శ్రీకృష్ణుడు) సంతోషంతో పొంగియేటట్లు, తండ్రి (అర్జునుడు) ఆనందించేటట్లు, శత్రువైన దుర్యోధనుడికి పోరు భారమయ్యేటట్లు యుద్ధం చేస్తాను' - అని వీరప్రతిజ్ఞ చేశాడు. ధర్మజు డతడిని అనుమతించి ఆశీర్వదించాడు. అభిమన్యుడు సమరోత్సాహంతో రథాన్ని ద్రోణ సైన్యం మీదికి నడిపించాడు.

మెరుపు మెరిసినట్లు ఆచార్యుడిమీద బాణాలను కురిపించి ఆయనను దాటి అభిమన్యుడు పద్మవ్యూహంలోకి ప్రవేశించాడు. అడవిని కాల్చే కార్చిచ్చువలె, ప్రళయకాలంలో సంహారక్రియకు పూనుకొన్న రుద్రుడివలె పద్మవ్యూహంలోని వీరవరులనందరినీ కలవరపెట్టటం మొదలుపెట్టాడు. ఎదురుపడ్డ కురువీరులనందరినీ బాణాలతో బాధించాడు. అందులో వరుసగా సుయోధనుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుడు మొదలైనవారందరూ ఉన్నారు. విలువిద్యలో విచ్చుడిని మించిన అభిమన్యుడిని ఆపటం అసాధ్యమని ఆచార్యుడు భావించాడు. అభిమన్యుడి అపూర్వపరాక్రమాన్ని కృపాచార్యుడి ఎదుట పొగిడాడు. దుర్యోధనుడు దానికి కటకటపడి కవ్వడి కొడుకును దొమ్మిగా దాడిచేసి చంపాలని పన్నాగం పన్ని, కర్ణాదివీరులను ప్రోత్సహించి ఒక్కుమ్మడి క్రమ్ముకొనబోయాడు. అంతలో దుశ్శాసనుడు అభిమానంతో పార్థుని కొడుకును ద్వంద్వయుద్ధంలో చంపుతానని తలపడ్డాడు. ఇద్దరూ బలంగా ఎదుర్కొన్నారు. ధర్మరాజాదులను ఆనాడు కురుసభలో అవమానించి పలికిన మాటలను స్మరించి, దుశ్శాసనుడిని మూర్ఛపోయేటట్లు బాణంతో కొట్టాడు అభిమన్యుడు. సారథి దుశ్శాసనుడి రథాన్ని ఆవలికి తోలుకొనిపోయాడు. అభిమన్యుడు కొరవి త్రిప్పిన విధంగా మొగ్గరంలో యథేచ్ఛగా తిరుగ నారంభించాడు. మేటి వీరులనందరిని వాడి బాణాలతో నొప్పించాడు. పేరుపేరునా పిలుస్తూ వారిని అధిక్షేపించాడు. కాని, ఎవ్వరూ అతడిని ఎదిరించలేకపోయారు. ఎదురులేని వీరుడివలె, ఆర్పలేని కార్చిచ్చువలె, మీదపడిన మహా ప్రళయంవలె అభిమన్యుడు అరిభయంకరంగా యుద్ధం సాగించాడు.

పద్మవ్యూహం భేదించిన అభిమన్యుడివెంట భీమాదులు మోహరంలో ప్రవేశించి సైన్యాన్ని నురుమాడటం మొదలుపెట్టారు. వారికి సైంధవు డడ్డం పడ్డాడు. పాండవులను (అర్జునుడిని తప్ప) ఒక రోజు నిలువరించగలిగే శక్తిని శివుడివలన వరంగా పొంది ఉన్నాడు సైంధవుడు. ఆనాడే ఆ ఒక ఒకరోజు అయింది. పాండవు లెంత భయంకరంగా పోరాడినా సైంధవుడిని దాటి ఒక అడుగు ముందుకు వేయలేకపోయారు. అభిమన్యుడు వెనుకాడకుండా ముందుకు చొచ్చుకొనిపోయేకొద్దీ పాండవ సహాయం అందకపోవటంతో ఒంటరివాడయ్యాడు. అయినా అభిమన్యుడు అగ్గిపిడుగు. వృషసేనుడిని మూర్ఛపోగొట్టాడు; దుర్యోధనుడి కొడుకైన లక్ష్మణుడిని ద్వంద్వయుద్ధంలో ఓడించి చంపాడు. మధ్యాహ్నమార్తాండ తేజంతో వెలుగొందే అభిమన్యుడిని అర్జునతుల్యుడిగా ఆచార్యుడు ఆశ్చర్యంతో ప్రశంసించాడు.

అభిమన్యుడిని చంపే ఉపాయం అడిగాడు సుయోధనుడు. 'అతడి చేతిలో విల్లమ్ములుండగా జయించటం కష్ట'మని ద్రోణాచార్యుడు పేర్కొన్నాడు. 'కవచధారణ' మనే విద్య - నేను అర్జునుడికి చెప్పిందే - అభిమన్యుడు నేర్చుకొన్నాడు. ఆ విద్య నేర్చినవాడిని ఓడించటం కష్టం. అయినా మోసంతో అల్లెత్రాడును త్రెంచి, విల్లును విరుగకొట్టి, గుర్రాలను కూలగొట్టి, సారథిని చంపి, ఒక్కసారిగా ఇతడిని క్రమ్ముకొని చంపితే చంపవచ్చునుగాని లేకపోతే ఇతడివైపు దేవతలకు కూడా తేరిపార చూడటం సాధ్యం కాదని ఉపాయాన్ని అందించాడు. దాని ఆచరణకు కర్ణాదులు పూనుకొన్నారు. భయపడినవాడివలె కర్ణుడు అభిమన్యుడి వెనుకకుపోయి, అతడి విల్లు త్రుంచాడు. వెంటనే ద్రోణుడు గుర్రాలను కూల్చాడు. కృపాచార్యుడు సారథిని చంపాడు. శకుని, కృతవర్మ, బాహ్లికుడు, అశ్వత్థామ మొదలుగా అనేకులు ఒక్కసారి అతడిమీద అస్త్రశస్త్రాలను కుండపోతగా కురిపించారు.

అభిమన్యుడు కత్తీ డాలూ తీసికొని గగనానికి ఎగసి, మండలాకారంగా తిరుగుతూ వీరులనందరినీ ఒంటిగా ఎదుర్కొన్నాడు. అతడి కత్తిని ద్రోణుడు, డాలును కర్ణుడు ముక్కలు చేశారు. అభిమన్యుడు రథచక్రాన్ని తీసికొని భూమిపై నిలిచి మండలాకారంగా తిరుగుతున్న మహాజ్వాలవలె విజృంభించాడు. అతడి శరీరం రక్తప్లావితమైంది. కాని, పౌరుషంతో ఎర్రగా జేవురించి శత్రువులకు భయంకరంగా ఉన్నది. అతడి యుద్ధక్రీడను దేవతలు మెచ్చుకొన్నారు. కౌరవవీరులందరు కలిసి అభిమన్యుడి చక్రాన్ని తునియలు చేశారు. అతడు గదను తీసికొని అశ్వత్థామపై దాడిచేశాడు. అశ్వత్థామ భయపడి రథం దిగి పరుగుతీశాడు. ఏడు వందలమంది రథికులను గదతో చావమోదాడు. దుశ్శాసనుడి కొడుకును యమలోకానికి పంపించాడు. ఇట్లా మదించిన ఏనుగు సరోవరంలో దిగి పద్మాలను చిందరవందర చేసినట్లు పద్మవ్యూహ రక్షకులైన మహావీరుల నందరినీ మహాసంక్షోభంలో ముంచాడు. అభిమన్యుడి చేత అవమానించబడినవారంతా అన్యాయంగా అతడిని చంపటానికి ఏకమయ్యారు. లోతైన నీటిలో దిగిన గజాన్ని బోయలు దయమాలి కొట్టి చంపినట్లు వీరులందరూ అభిమన్యుడిని చుట్టుముట్టి ఆయుధాలతో కొట్టి చంపారు. అపరాద్రిపై అస్తమించిన సూర్యబింబంవలె, అడవినంతా కాల్చి చల్లారిన కార్చిచ్చువలె, అలలు ఎండబారిన మహాసముద్రంవలె, నేలమీద పడిన చంద్రబింబంవలె - అరివీర భయంకరంగా యుద్ధం చేసిన అభిమన్యుడు నేలకొరిగాడు. రక్తసిక్తమైన ఆ నేలమీద పడి ఉన్న అభిమన్యుడు యోగనిద్రలో ఉన్న విష్ణువువలె వెలుగొందాడు. "పెక్కంద్రు గూడి ఇమ్మెయి నొక్కనిఁ జంపుట అధర్మ మహో!" - అని దిక్కులు పిక్కటిల్లేటట్లు భూత సమూహాలు కేకలు వేశాయి.

అభిమన్యుడి మరణానికి శోకించని మానిసి లేడు. అతడి పరాక్రమాన్ని కీర్తించని వీరుడు లేడు. ధర్మరాజు శోకం కట్టలు తెగిపోయింది. వ్యాసమునీంద్రుడు వచ్చి అతడిని ఊరడించాడు. శోకోపశమనంకొరకు సువర్ణష్ఠీవి చరిత్రాన్ని చెప్పాడు. షోడశ మహారాజుల చరిత్రలు వినిపించాడు. వారందరూ కాలంతీరిపోయారు కాబట్టి స్థిరంకాని శరీరం కొరకు వివేకవంతులు విషాదం పొందకూడదని బోధించాడు.

సాయంకాలానికెల్ల సంశప్తకులను సంహరించి సవ్యసాచి శిబిరానికి తిరిగివస్తూ అపశకునాలను గమనించి ఏదో కీడు జరిగి ఉంటుందని అనుమానించాడు. స్కంధావారానికి చేరాడు. దీనవదనాలతో ఉన్న తనవారిని చూచాడు. వారిలో అభిమన్యుడు కానరాలేదు. 'ద్రోణుడు పన్నిన పద్మవ్యూహాన్ని భేదించటానికి ధర్మరాజు అభిమన్యుడిని పంపలేదు కదా! వాడికి ఛేదించటం వచ్చుకాని, వీరులు చుట్టుముట్టినప్పుడు విడిపంచుకొనటం తెలియదు. మీ ఉపాయం మాసిపోను! నా కొడుకును రణభూమికి అర్పించలేదు కదా! చెప్పండి. వాడు లేకుండా నే నెట్లా బ్రతికేది?' అని ఆవేదనపడుతూ, నిజం తెలిసికొని,

'హా! యను, ధర్మరాజతనయా! యను, నన్నెడఁబాయ నీకుఁ జ
న్నే? యను, తల్లి నేపఁజనునే! యనుఁ, గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే! యను, నొంటి వోక తగవే! యను, నేగతిఁ బోవువాఁడ నే
నో యభిమన్యుఁడా! యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ జేర్పవే! యనున్'.

ఇట్లా అనేక విధాల ప్రియపుత్రుడి కొరకు విలపించి విలపించి అర్జునుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు - 'భీముడు దగ్గర లేడా? బాలుడిని ఒంటరిగా పంపారా? ద్రుపదుడు, సాత్యకి, విరటుడు - వీరంతా ఎక్కడికి పోయారు? ఇందరు ఉండగా అభిమన్యుడు

చనిపోవటానికి కారణం ఏమిటి? చనిపోయాడు సరే, యుద్ధంలో వెనుకాడకుండా విక్రమాన్ని ప్రకటించి పేరు పొందాడా? పలువురు తనను చుట్టుముట్టి అస్త్రశస్త్రాలతో బాధిస్తున్నప్పుడు తోడుపడేవా రెవ్వరూ లేక నాన్నా! నాన్నా! అని ఎన్నిసార్లు నన్ను పిలిచి ఉంటాడో! తప్పు, తప్పు నేను పొరపాటన్నాను. గోవిందుడి మేనల్లుడు యుద్ధంలో ఓడతాడా? మిన్ను మీదపడ్డా బాహాగర్వాన్ని వదలుతాడా? అని పలురకాల ప్రశ్న పరంపరలు కురిపించాడు పార్థుడు. ధర్మజుడు జరిగినదంతా వివరంగా చెప్పాడు. అభిమన్యుడికి భీమాదుల సహాయం అందకపోవటానికి సైంధవుడడ్డగించటమే కారణమని స్పష్టం చేశాడు. అర్జునుడు సైంధవకృత్యానికి మండిపడి అతడిని చంపుతానని భయంకర శపథం చేశాడు.

'అనిమిషదైత్య కింపురుషు లాదిగ నెవ్వరు వచ్చి కాచినం
దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్రుఁడు గ్రుంకకుండ ము
న్న నరవరేణ్య! యిత్తెఱఁగు నా కొనరింపఁగ రాకయున్న నే
ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగ గాండివంబుతోన్'.

శపథంతో పాటు అర్జునుడు గాండీవజ్యారావాన్ని మ్రోగించాడు. పద్మనాభుడు పాంచజన్యాన్ని పూరించాడు.

అర్జునుడి ప్రతిజ్ఞ కౌరవ స్కంధావారంలో ప్రకంపనలు కలిగించింది. సైంధవుడు ప్రాణభయంతో గజగజలాడిపోయి పారిపోవ ప్రయత్నించాడు. ద్రోణాదులది క్షత్రియధర్మం కాదని, తమ రక్షణలో తన కెట్టి కీడు రానీయమని మాట ఇచ్చి మోహరంలో నడుమ భద్రంగా రక్షించటానికి నిశ్చయించారు.

అర్జునుడు తన ప్రతిజ్ఞ ఏ విధంగానైనా సఫలమయ్యేటట్లు వరమిమ్మని శ్రీకృష్ణుడిని ప్రార్థించాడు. నరనాయణు లిద్దరూ క్రోధపూరిత హృదయాలతో బుసలుకొట్టేపాములవలె కనుపించారు. వారి రూపాలు చూచి దేవతలు భయపడ్డారు. ప్రకృతి సంక్షోభించింది. కౌరవస్కంధావారంలో అనేక దుర్నిమిత్తాలు కలిగాయి.

ఆనాటికి ఒకరోజు ముందే శిబిరానికి సుభద్ర, పాంచాలి, ఉత్తర వచ్చి ఉన్న సంగతి తెలిసి అర్జునుడు శ్రీకృష్ణుడిని వారి నోదార్చటానికి పంపాడు. శ్రీకృష్ణుడు వారివద్దకు పోయి పుత్రశోకాతుర అయిన సుభద్రను ఎంతో ప్రయత్నంమీద ఓదార్చాడు. మిగిలినవారిని తగిన మాటలతో శాంతింపజేశాడు. శ్రీకృష్ణుడు అర్జునుడిని వెంట తీసికొని వెళ్ళాడు. తన మందిరంలో శ్రీకృష్ణుడు కాళ్ళు కడిగికొని, ఆచమనంచేసి, ఒకదర్భశయ్య నలంకరించి అక్షతగంధపుష్పాలతో పూజించి ఆయుధాల నక్కడ చుట్టూ ఉంచి అర్జునుడిని అక్కడ ఉండుమని చెప్పాడు. నిత్యం రాత్రివేళ చేసే దేవపూజ ఇంతకుముందు చేయలేదని అతడికి జ్ఞాపకం చేశాడు. అర్జునుడు పాదప్రక్షాళనం చేసికొని శుచి అయి, నిత్యమూ చేసే శివపూజను షోడశోపచార సమన్వితంగా శ్రీకృష్ణుడికి అర్పించాడు. జనార్దనుడు సంతోషించి అర్జునుడిని అక్కడే ఉండుమని నియోగించి, తగిన రక్షణను అతడికి కల్పించాడు. అర్జునుడికి శుభం కోరుతూ ఉంటానని శ్రీకృష్ణుడు చెప్పి తన శయ్యపై పరుండి చాలసేపు దీర్ఘయోచనలో మునిగిపోయాడు. తెల్లవారితే నరనారాయణు లేవిధంగా సైంధవవధను నిర్వహిస్తారో, ఎటువంటి కీడు కలుగుతుందో! అని కలవరపడుతూ ఉభయస్కంధావారాలలో అందరూ తమ పూర్వపుణ్యఫలాలన్నీ సైంధవవధకు అర్జునునికి తోడ్పడాలని గట్టిగా అంటూ, శుభాన్నిచేకూర్చే పవిత్రగ్రంథాలను పఠిస్తూ కంటిమీద కునుకు లేకుండా తెల్లవార్చారు.

శ్రీకృష్ణుడు దారుకుడితో అర్జునుడి ప్రతిజ్ఞ విషయం చెప్పి అంతటి అసాధ్యమైన ప్రతిజ్ఞను తీసికొన్న అర్జునుడిని తానెట్లాగైనా కృతార్థుడిని చేస్తానని చెప్పాడు. తనలో సగభాగం అర్జునుడనీ, అతడు బ్రతికితేనే తాను బ్రతుకుతాననీ తెలిపి సూర్యాస్తమయంలోగా సైంధవవధ జరిపించి పాండవకీర్తిని నిలుపుతానని ప్రతిజ్ఞ చేశాడు. మరునాడు రథాన్ని సర్వసన్నాహం చేసి ఉంచుమనీ, తన పాంచజన్యనాదం సంకేతంగా విని అ రథాన్ని రణస్థలికి తీసికొని రమ్మని శ్రీకృష్ణుడు దారుకుడితో చెప్పాడు. సకల భూతాలు తన శక్తిసామర్థ్యాలను, పాండవులపట్ల తనకున్నప్రేమనుతెలుసుకొనే విధంగా రేపు యుద్ధరంగంలో తానే రౌద్రరసాకారంతో విజృంభించి, సైంధవుణ్ణి సూర్యాస్తమయంలోగా సంహరిస్తానన్నాడు. అందుకు దారుకుడు మీరు ఆ విధంగా చేయవలసిన అవసరం ఉండదని, మీరు సారథ్యం వహిస్తూ శుభాన్నికూర్చే స్థితిని కలిగిస్తుంటే అర్జునుడు అడ్డుకోలేని వీరుడు ఆ వైపు ఎవడున్నాడు అని సవినయంగా, చాకచక్యంగా మాట్లాడి శ్రీకృష్ణుని ఆవేశాన్ని తొందరపాటును తగ్గించాడు. మీ ఆజ్ఞను పాటిస్తానని వెళ్ళాడు.

అర్జునుడు శ్రీకృష్ణుడు అమర్చిన దర్భశయ్యమీద పరున్నాడు. ప్రతిజ్ఞానిర్వహణాన్ని గురించి ఆలోచిస్తూ శోకనిద్రా పరవశుడయ్యాడు. కలలో శ్రీకృష్ణు డతని సమీపానికి వచ్చాడు. అతడు శయ్యనుండి లేచి కృష్ణుడికి నమస్కరించి తన శయ్యమీద

కూర్చుండబెట్టాడు. శ్రీకృష్ణుడు అర్జునుడికి శోకభావాన్ని తొలగించి ఉత్సాహాన్ని పెంచాడు. నరుడి శుభాన్ని కోరి అతడిని తూర్పుదిక్కు మొగమై కూర్చొనుమన్నాడు. పరమేశ్వరు డిచ్చిన పాశుపతాస్త్రాన్ని సమంత్రకంగా ఆరాధించి పరమశివుడిని ధ్యానించుకొమ్మని నిర్దేశించాడు. అత డట్లాగే చేశాడు. శ్రీకృష్ణుడు అర్జునుడి చేతిని పట్టుకొని గగనపథంలోకి తీసికొనిపోయాడు. అనేక లోకాల ఆవల ఉన్న కైలాసాన్ని చేరారు. అందులో పరమేశ్వరుడిని దర్శించి ప్రార్థించాడు. అర్జునుడు శ్రీకృష్ణుడిని పూజించిన పూజాద్రవ్యాలు శివుడి శరీరంమీద చూచి శివకేశవాభేద భక్తి పారవశ్యాన్ని పొందాడు. పాశుపతాస్త్ర మంత్ర సిద్ధిని ప్రసాదించ వేడుమని అర్జునుడిని శ్రీకృష్ణుడు ప్రోత్సహించాడు. పార్థుడు పరమేశ్వరుడిని ప్రార్థించగా ఆ మహాదేవు డనుగ్రహించాడు. శివభటులు ఆతడిని ఒక దివ్యసరస్సువద్దకు చేర్చారు. అందులోనుండి రెండు విషసర్ప జిహ్వాలజ్వాలలు రెండు వెలువడ్డాయి. అర్జునుడు శుచి అయి ఆ మహాసర్పాలకు నమస్కరించి, శతరుద్రీయాన్ని మనసులో జపిస్తూ శివుడిని ధ్యానించాడు. ఆ సర్పాలు రెండూ క్రమంగా విల్లుగా, బాణాలుగా మారాయి. శివుడి పార్శ్వంనుండి ఒక మహాతేజస్వి అయిన బాలుడు వెలువడి వచ్చి ఆ బాణప్రయోగవిధానాన్ని ప్రదర్శించి చూపించాడు. దానిని గ్రహించిన అర్జునుడికి మంత్రస్వరూపాన్ని అనుగ్రహించాడు. ఇక పాశుపతాస్త్రానికి తిరుగులేదని మహాదేవుడు ప్రకటించాడు. ఇక తన ప్రతిజ్ఞానిర్వహణకు తిరుగులేదని అర్జునుడు సంతోషించాడు. నరనారాయణు లిద్దరూ శివుడికి నమస్కరించి తిరిగి వచ్చారు. తెల్లవారింది. అర్జునుడు ధర్మరాజువద్ద కేగి రాత్రి జరిగిన స్వప్నవృత్తాంతాన్ని తెలిసాడు. పాండవులందరూ శ్రీకృష్ణుడిని పరమాత్మగా భావించి ప్రస్తుతించారు. గోవిందుడు వారికి విజయం తథ్యమని అభయం అందించాడు.

## ద్రోణుడి నాల్గవనాటి యుద్ధం:

ధర్మరాజ రక్షణకు సాత్యకిని నియోగించి సైంధవవధకు విజయుడు విజృంభించాడు. ద్రోణుడు శకటవ్యూహాన్ని పన్నాడు. దానికి పడమటిభాగంలో గర్భవ్యూహంగా పద్మవ్యూహం పన్నాడు. దాని మధ్యభాగం మొదలుకొని సేనాముఖం వరకు సూచీ వ్యూహాన్ని అమర్చాడు. సూచీవ్యూహంలోని కేంద్రస్థానంలో సైంధవుడిని నిలిపాడు.ద్రోణుడు సూచీవ్యూహం పన్నాడు. అర్జునుడు మొట్టమొదట ద్రోణుడికి నమస్కరించి ఆశీస్సులను కోరాడు. ఆచార్యుడు నవ్వి 'నన్ను గెలవకుండా సైంధవుడి దరికి ఎట్లా చేరగలవు?' అని చిరునవ్వు నవ్వాడు. దానిని అనుమతిగా గ్రహించి విజయుడు యుద్ధాన్ని ఆరంభించి ఆచార్యుడిని అతిక్రమించి మొగ్గరంలో ప్రవేశించాడు. కర్కశంగా యుద్ధం చేస్తూ శ్రుతాయుధాదులను, విందానువిందులనూ పోరులో చంపాడు. ద్రోణుడు అర్జునుడి పట్ల పక్షపాతాన్ని చూపుతున్నాడని దుర్యోధనుడు ఆచార్యుడిని నిందించాడు. ఆచార్యుడు ఆ మాటలకు వెగటు ప్రకటించాడు. అర్జునుడి వెంట తానూ వస్తే సేనాముఖం వికలమై పాండవులను నిగ్రహించటం, సైంధవుడిని రక్షించటం కష్టమని పేర్కొని, అర్జునుడి పరాక్రమాన్ని ప్రశంసించాడు. సమవయస్కుడైన గాండీవిని దుర్యోధనుడినే ఎదురించుమని ఒక సహజ కవచాన్ని ప్రసాదించాడు. దాని ప్రభావంతో దుర్యోధనుడు నిర్భయంగా అర్జునుడిపై దాడి చేశాడు. ద్రోణుడు పాంచాలవీరులవైపు పోరు సాగించాడు.

ద్రోణుడు ధృష్టద్యుమ్నుడిని దాటి పాండవసైన్యాన్ని చంపనారంభించాడు. ధృష్టద్యుమ్నుడు విజృంభించాడు. కాని, నిపుణమైన యుద్ధంలో ద్రోణుడు అతడిని విరథుడిని చేసి, బాణప్రయోగంతో చంపబోయాడు. అంతలో సాత్యకి అడ్డుపడి ధృష్టద్యుమ్నుడిని రక్షించాడు. దానిని సహించక ద్రోణుడు సాత్యకిపై బాణాలవర్షం కురిపించాడు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి విల్లు విరిచాడు. ఇరువురి నడుమ అస్త్రశస్త్రాలతో పోరు ఘోరమయింది. ధర్మజ భీమ నకుల సహదేవులు సాత్యకికి తోడుగా వచ్చారు. అంతలో ధృష్టద్యుమ్నుడు మరల విజృంభించి వీరందరినీ దాటి ముందుకు సాగి ద్రోణుడి నెదుర్కొన్నాడు. ఈ విధంగా ఇరువర్గాలవారూ యుద్ధం చేస్తూ ఉండగా అర్జునుడు తన రథాన్ని సైంధవుడున్న దెసకు నడుపుమని శ్రీకృష్ణుడిని కోరాడు. రథం ముందుకు సాగిపోతున్నది. వారికి విందానువిందులు అడ్డపడి పోరు సాగించారు. వారిని అర్జునుడు సంహరించాడు. అప్పటికి అర్జునుడి రథాశ్వాలు బాగా దప్పిగొన్నాయి. వాటికి దప్పిక తీరిస్తే విజయుడికి విజయం తథ్యమని కృష్ణుడు సూచించాడు. అర్జునుడు దివ్యాస్త్రాలతో ఒక సరోవరాన్ని కల్పించాడు. కృష్ణుడు గుర్రాలకు నీరుపట్టి, ఒడలు తట్టి, రథానికి కట్టి సిద్ధపరిచాడు. పోరుసాగింది. కవచధారణశక్తిచేత దుర్యోధనుడు అర్జునాదులపై అద్భుత విజృంభణం సాగించాడు. ఆ బలానికి కారణమేమిటో గ్రహించిన అర్జునుడు ఇంద్రుడిచ్చిన మహాస్త్రంతో ద్రోణుడు దుర్యోధనుడి కిచ్చిన కవచాన్ని ఛేదించటానికి ప్రయోగించాడు. అశ్వత్థామ దానిని

మరొక మహాస్త్రంతో వమ్ముచేశాడు. అప్పుడు అర్జునుడు ప్రయోగించిన బాణాలతో రారాజు విరథుడయ్యాడు. అతని అరచేతి నిండా గాయాలయ్యాయి. దుర్యోధనుడు అవివేకంగా ద్రోణుడిచ్చిన కవచం నిష్ఫలమని భావించి తనకుతానే దాన్ని తొలగించుకొని మరొక కవచాన్ని ధరించాడు. అది అర్జునుడికి ఎంతో అనుకూలించింది. అతడు ముందుకు వెళ్ళాడు.

అర్జునుడిపై వృషసేనాది వీరులు ఎనిమిదిమంది క్రమ్ముకొని యుద్ధం ప్రారంభించారు. అర్జునుడు వారిని సంహరించి కౌరవసైన్యాన్ని కకావికలు చేశాడు. అశ్వత్థామ విజృంభించి క్రూరబాణాలను పరచాడు. అర్జునుడికీ ఆతడికీ మధ్య శస్త్రాస్త్రయుద్ధం సాగింది. అట్లే కౌరవపాండవ వీరుల మధ్య ద్వంద్వయుద్ధాలు సాగాయి. ధర్మరాజు ద్రోణుడితో తలపడి రథాన్ని కోల్పోయి నేలపై దిగి నిరాయుధుడై చేతులు పైకెత్తి ఊరుకొన్నాడు. అతడిపై బాణాలు ద్రోణుడు సంధించలేక చుట్టూ ఉన్న గుర్రాలను, ఏనుగులను సంహరించాడు. అంతలో సహదేవుడు ధర్మజుడిని తన రథంమీద ఎక్కించుకొని తొలగిపోయాడు. ద్రోణుడు పాండవసైన్యాన్ని చెండాడటం మొదలుపెట్టాడు.

ఘటోత్కచుడు తనసేనతో కలిసి ద్రోణుడితో యుద్ధానికి పూనుకొన్నాడు. అతడిమీద అలంబుసుడు విరుచుకొనిపడ్డాడు. ఇరువురి నడుమ మాయాయుద్ధం మహా భయంకరంగా సాగింది. ఘటోత్కచుడు అలంబుసుడిని చంపి ధర్మరాజుకు సంతోషం కలిగించాడు.

అర్జునుడి ప్రతిజ్ఞ అందరికీ ముఖ్యాంశమై నిలిచింది. అతడికి అండదండలుగా నిలిచి సాయపడటానికి సాత్యకిని పంపాడు ధర్మరాజు. అతడు మొగ్గరంలో ప్రవేశించి దుశ్శాసనాదులను ఓడించి ముందుకు సాగాడు. అతడికి తోడుగా భీముడు ద్రోణాదుల నతిక్రమించి అర్జునుడివైపు దాడి సాగించాడు. కర్ణుడు భీమసేనుడిని డీకొని ఓడించి, అధిక్షేపించి, బాధించి, చివరకు చంపకుండా వదిలాడు. కర్ణార్జునులు ద్వంద్వయుద్ధంలో తారసిల్లారు. పోరు ఘోరంగా సాగింది. దుర్యోధనాదులు కర్ణుడికి సాయంగా నిలిచి యుద్ధం చేయసాగారు. వారిని బలహీనపరచి అర్జునుడు ముందుకు పోగా అశ్వత్థామ శల్య వృషసేనులు సైంధవుడికి పెట్టని కోటగా నిలిచారు.

దుర్యోధనుడు ద్రోణుడిని తూలనాడాడు. 'అర్జునుడు, సాత్యకి, భీముడు మొదలైనవారు కౌరవసేనను చీకాకుపరచి సైంధవుడివైపు వేగంగా దూసికొనిపోతున్నారు. యుద్ధంలో నీవు ఓడటమంటే సముద్రం ఇంకిపోవటం వంటిదే కదా! సాత్యకి నిన్ను జయించాడని జనులు భావించటం మంచిదా? ఈ విధంగా నీవు వ్యవహరించటం మా దురదృష్టం. ఆ మాట అటుండనిమ్ము నీ పరాక్రమం, నీతి చాతుర్యం ప్రకాశించేటట్లు ఈ సంక్షోభంనుండి బైటపడే ఉపాయం చెప్పుము' - అని నిలదీసి అడిగాడు. అందుకు ద్రోణుడు ఇట్లా అన్నాడు. 'నాకు రెండువైపులవారూ ఒక్కటే. కాని, మనసేన కేర్పడిన విపత్తును నాకు చేతనైనంతవరకు తొలగించే యత్నం చేస్తాను. రారాజా! నీకిప్పుడు సైంధవుడిని కాపాడుకొనే పెద్ద పందెం మిగిలింది. ఈ యుద్ధమనే జూదంలో నీవు దానిని కాపాడుకొనాలి. కాని, నీకు ఇప్పుడు శకుని పనికిరాడు. అతడివలన నీకు కలిగిన లాభం తాత్కాలికం. ఇప్పటి గెలుపే సుస్థిరమైనది. కాబట్టి నీవు కర్ణాదులను సహాయం తీసికొని అర్జునుడితో యుద్ధంచేసి విజయాన్ని సాధించుము. నేను సేనాముఖంలో నిలిచి మిగిలినవారి నందరినీ అడ్డగిస్తాను. నేను నీతో కలిసి రావటం కార్యం కాదు నీవు పొమ్ము' అని నిక్కచ్చిగా చెప్పాడు.

దుర్యోధనుడు యుద్ధం సాగించాడు. కర్ణుడు సాత్యకితో యుద్ధంచేసి ఓడిపోయాడు. అర్జునుడు విజృంభించి కౌరవసేనను ఎదుర్కొన్నాడు. దుర్యోధన కర్ణ వృషసేన శల్య కృపాశ్వత్థామలందరు ఏకమై అర్జునుడిని చుట్టుముట్టారు. వారిని పార్థుడు పెక్కమ్ములతో స్రుక్కించాడు. కర్ణుడి ప్రాణాలు తీయగల వాడిబాణాన్ని పార్థుడు వేయగా దానిని అశ్వత్థామ వమ్ముచేశాడు. కర్ణార్జునులకు ద్వంద్వయుద్ధం బలంగా సాగింది. రారాజు తనవారిని కర్ణుడికి సాయంచేయుడని ఎలుగెత్తి పిలిచాడు. అర్జునుడు వారందరికి మధ్యాహ్న సూర్యుడివలె దుర్నిరీక్షుడై బాణాలతో చెండాడాడు. జయద్రథుడిని డీకొన్నాడు. అయినా తెంపుచేసి కృపాశ్వత్థామ శల్య వృషసేనులు సైంధవుడికి రక్షగా దడిగట్టినట్లు నిలిచి పోరు సాగించారు. అర్జునుడు సైంధవుడిని చంపే అవకాశం దొరకక అవుడుగరుస్తూ ప్రొద్దువైపు చూచాడు. శ్రీకృష్ణుడు దానిని గమనించి 'అర్జునా! నీవు వెనుకాడక ముందుకు సూటిగా సాగుము. భయపడవద్దు. సూర్యుడు పడమటి కొండపైకి చేరబోతున్నాడు. దీనికి నేను ఒక ఉపాయం కల్పిస్తాను. అప్పుడుగాని సైంధవుడు చావడు' అని చెప్పి, మాయాతిమిరంతో సూర్యబింబాన్ని కప్పివేశాడు. సూర్యుడస్తమించాడని

కౌరవవీరులు ఉప్పొంగిపోయారు. సైంధవుడు తలఎత్తి పడమరవైపున ఆశ్చర్యంతో చూస్తూ నిలిచాడు. శ్రీకృష్ణుడి సూచనమేరకు అర్జునుడు ఆ అదనెరిగి వాడిబాణంతో సైంధవుడి తలను తెగనరికాడు. దానిని క్రిందపడకుండా ఆకాశంలోనే చిత్రవిచిత్ర బాణవిద్యానైపుణ్యంతో నిలుపుతూ వచ్చాడు. శ్రీకృష్ణుడు మాయా తిమిరం తొలగించాడు. సూర్యు డస్తమించకుండానే సైంధవుడిని చంపి అర్జునుడు తన శపథాన్ని నిలపుకొన్నాడు. ఆ తరువాత శ్రీకృష్ణుడి నిర్దేశంతో పాశుపతాస్త్రాన్ని ప్రయోగించి సైంధవ శిరాన్ని అతడి తండ్రి అయిన వృద్ధక్షత్రుడి ఒళ్ళో పడేటట్లు చేశాడు. అత డాశిరస్సును నేలమీద పడవేశాడు. వెంటనే వృద్ధక్షత్రుడి శిరస్సు వేయి వ్రక్కలైపోయింది. సైంధవుడి శిరం ఎవరివలన నేలమీద పడుతుందో అతడి శిరస్సు వేయి వ్రక్కలౌతుందని వృద్ధక్షత్రుడి శాపమే ఉన్నది. అతడి శాపంతోనే అతడిని దండింపజేసి, అర్జునుడికి ఆ కీడు కలుగకుండా శ్రీకృష్ణుడు చాతుర్యంతో రక్షించాడు. ధర్మజుడు సంతసించాడు.

## ద్రోణుడి అయిదవనాటి యుద్ధం:

అయిదవనాటి యుద్ధం ప్రారంభించేముందు ద్రోణుడు పాంచాలురను చంపనిదే కవచం విడువనని శపథం చేసి, యుద్ధంలో విరాట ద్రుపదులను కడతేర్చాడు. భీమసేనుడు దుర్మద దుష్కర్ణులను చంపాడు. అశ్వత్థామ అంజనపర్వుడిని యుద్ధంలో అంతమొందించాడు. భీమకుమారుడైన ఘటోత్కచుడు విజృంభించి అశ్వత్థామను ఎదుర్కొన్నాడు. ఇరువురు ఘోరంగా యుద్ధం చేశారు. అశ్వత్థామ ఒక అక్షౌహిణి సైన్యాన్ని చంపి ఘటోత్కచుడిని కాలదండంవంటి బాణంతో మూర్ఛపడేటట్లు చేశాడు. అతడిని ధృష్టద్యుమ్నుడు యుద్ధరంగంనుండి రథంమీద తప్పించాడు. దానిని చూచి అశ్వత్థామ సింహగర్జనం చేసి విజృంభించాడు. ధర్మజ భీమ సాత్యకు లొక్కటై అతడిని ఎదుర్కొన్నారు. బాహ్లికుడు సాత్యకిని డీ కొన్నాడు. భీముడు ఉద్రిక్తుడై ముద్గరంతో బాహ్లికుడి తల పగులగొట్టి చంపాడు. దుర్యోధన ప్రేరితుడైన ద్రోణుడు ధర్మరాజుతో తలపడ్డాడు. ఇరువురూ దివ్యాస్త్రాలను ప్రయోగించి ప్రతాపాన్ని ప్రదర్శించారు. ధృష్టద్యుమ్ను డడ్డుకొని ద్రోణుడితో యుద్ధం సాగించాడు. భీమార్జునులు అతడికి సాయం చేశారు. కౌరవబలాన్ని గడగడ వణకేటట్లు చేశారు. అప్పుడు దుర్యోధనుడు కర్ణుడిని తన పరాక్రమాన్ని ప్రదర్శించి సేనను కాపాడుమని కోరాడు. కర్ణుడు పాండవులను పరిభవిస్తానని ప్రగల్భాలాడాడు. అందుకు కృపాచార్యుడు అతడి బడాయి మాటలు గమనించి ఉపాలంభించాడు. వారి వాదును మాన్పి దుర్యోధనుడు తానే యుద్ధం చేయటానికి ముందుకు సాగాడు. కృపాచార్యుడి సలహామేరకు అశ్వత్థామ దుర్యోధనుడి సాహసాన్ని మాన్పాడు, కృతవర్మాదులు యుద్ధభారాన్ని వహించారు.

సాత్యకి సమరంలో సింహంవలె చెలరేగాడు. సోమదత్తుడిని ద్వంద్వబాణ యుద్ధంలో చంపాడు. అదే సమయంలో పెక్కురు కౌరవ పాండవవీరుల నడుమ ద్వంద్వయుద్ధాలు ప్రవర్తిల్లాయి. కర్ణుడు సహదేవుడిని ఓడించి అవమానించాడు. అశ్వత్థామకూ ధృష్టద్యుమ్నుడికీ, సాత్యకికీ కర్ణ దుర్యోధనులకూ పోరు విరివిగా సాగింది. మాయాయుద్ధంలో ఘటోత్కచుడు అలంబుసుడు అలాయుధుడు అనే రాక్షసులను సంహరించాడు. ఆపై కౌరవవీరులమీద విరుచుకొనిపడ్డాడు. అతడి పోరు మరికొంతసేపు జరిగితే కౌరవసేనలో జనం మిగిలేటట్లు కనబడలేదు. అప్పుడు కౌరవవీరులూ, దుర్యోధనాదులూ 'శక్తిని ప్రయోగించి ఘటోత్కచుడిని చంపు'మని కర్ణుడిని కోరారు. 'ముందు ఘటోత్కచుడి చావునుండి బ్రతికితే అర్జునుడిని చంపే ఉపాయం ఆలోచించవచ్చు'నని భావించారు. గత్యంతరం లేక కర్ణుడు ఇంద్రదత్తమైన శక్తిని ప్రయోగించి ఘటోత్కచుడిని వధించాడు. పాండవపక్షంలో అందరూ దుఃఖించారు. కృష్ణుడు మాత్రం ఘటోత్కచుడివలన ఇంద్రశక్తి వమ్మై అర్జునుడి ప్రాణ రక్షణచేసిందని హర్షించాడు. క్రుద్ధులైన భీమ నకుల సహదేవులూ, అర్జునుడూ కలిసి ద్రోణుడిపై విజృంభించారు. ద్రోణార్జునుల మధ్య శస్త్రాస్త్ర ద్వంద్వయుద్ధం భయంకరంగా సాగింది. ఇరువురిలో గెలుపోటములు నిర్ణయించటం అసాధ్యమై యుద్ధం సాగుతూపోయింది. శ్రీకృష్ణుడు ధర్మజ భీముల దరికి రథం పోనిచ్చి వారికి వినవచ్చేటట్లు అర్జునుడితో ఇట్లా అన్నాడు. 'ద్రోణుడు దేవదానవులకు కూడా జయంచశక్యం కానివాడు. ఇతడిని అంతమొందించాలంటే ఒక ఉపాయం ఉన్నది. 'నీ కొడుకు హతు డయ్యా'డనేమాట మన మంటే అతడు వింటే వెంటనే ఆయుధాలను దిగవిడిచి నిశ్చేష్టుడై నిలిచిపోతాడు. అప్పు డతడిని చంపవచ్చును. అంతకంటె అనువైన ఉపాయం మరొకటి లేదు' అన్నాడు. అందరూ అది మంచి ఉపాయమని మెచ్చుకొన్నారు. కాని, అర్జునుడు దాని కంగీకరించలేదు. ధర్మరాజు విషాదంతో

మిన్నకుండిపోయాడు. అప్పు డద నెరిగి భీముడు తానుచంపిన అశ్వత్థామ అనే ఏనుగును మిషగాచేసికొని అశ్వత్థామ హతమయ్యెనని బిగ్గరగా ద్రోణుడు వినేటట్లు అరచాడు. ఆ మాటలు విని ద్రోణుడి హృదయం ఝల్లుమన్నది. అశ్వత్థామ పరాక్రమాదులను స్మరించి భీముడి మాటలు నమ్మక ధృష్టద్యుమ్నుడిపై దారుణంగా యుద్ధం ప్రారంభించాడు.

అప్పుడు ఆకాశమార్గాన విశ్వామిత్ర, జమదగ్ని, భరద్వాజ, గౌతమ, కశ్యప, వసిష్ఠాత్రి ప్రభృతి మునివరులందరూ ద్రోణుడిని కనుపించి 'ద్రోణా! నీవు బ్రాహ్మణుడవు. వేదవేదాంగాలు చదివినవాడవు. నీకు యుద్ధం చేయటం ధర్మమా? ఇంతకుముందు చేస్తే చేశావు కాని, నీకు కాలం పూర్ణమయింది. కాబట్టి నీవు యుద్ధం మానటం మంచిది' అని హెచ్చరించి అంతర్ధానమయ్యారు. ద్రోణుడు మునుల మాటలను గురించి యోచించాడు. భీమసేనుడి మాటలు తలపోశాడు. ధృష్టద్యుమ్నుడిని కనుగొన్నాడు. మనస్సు వికలమైపోగా శోకాయత్తుడయ్యాడు. తన కొడుకు చచ్చినవార్త నిజమా కాదా అని ధర్మరాజు నడిగి తెలిసికొనదలచాడు. అడిగాడు.

ఆ సమయంలో శ్రీకృష్ణుడు ధర్మరాజును ఈ విధంగా హెచ్చరించాడు. 'యుధిష్ఠిరా! ఈనాటి అపరాహ్ణం వరకు ద్రోణుడు యుద్ధం చేస్తే మనవైపు ఇక ఎవ్వరూ మిగలరు. ఇది నిజం. మమ్ములను ద్రోణుడి బాణాలకు బలిపెట్టకుండా సముచితంగా కాపాడుకొమ్ము. ప్రాణరక్షణ సమయంలో అసత్యవచనదోషం లేదు. అశ్వత్థామ చచ్చె నని చెప్పుము!' అన్నాడు. భీముడు కూడా తాను పలికిన మాటలు అసత్యాలు కావని చెప్పాడు. భీముడు మాళవరాజైన ఇంద్రవర్మ గజాన్ని - అశ్వత్థామ పేరుగల దానిని - చంపి గజంమీద పెట్టి 'అశ్వత్థామా హతః' అని పలకటం జరిగిందని చెప్పి ధర్మరాజును కూడా గజంమిషతో అశ్వత్థామ మరణవార్తను తెలియజెప్పుమని సూచించాడు. వారిద్దరి మాటలు విని ధర్మరాజు ఏమైతే అది ఔతుందని సమ్మతించి, ఉపాయ మాలోచించి 'అశ్వత్థామా హతః' అనే వాక్యాన్ని ధర్మజుడు ఎలుగెత్తి పలికి 'కుంజరః' అనే పదాన్ని వాద్యాల చప్పుళ్ళలో కలిసిపోయేటట్లు మెల్లగా పలికాడు. ఆ మాట విని ద్రోణుడు అస్త్రసన్న్యాసం చేసి యోగాసనంలో రథంమీద కూర్చుండి తనువు త్యజించాడు. ధృష్టద్యుమ్నుడు- ధర్మరాజాదులు వారిస్తున్నా వినకుండా - ద్రోణుడి తలజుట్టును నిటారుగా పట్టి కుత్తుకను కత్తితో కోశాడు. ద్రోణుడి తేజస్సు ఆరిపోయింది.

ధృష్టద్యుమ్నుడి చర్యను అందరూ గర్హించారు. ఆ విషయం తరువాత తెలిసికొన్న అశ్వత్థామ కోపోద్రిక్తుడై పాండవసైన్యాన్ని మట్టుపెట్టటానికి పూనుకొని, సైన్యసన్నాహంతో యుద్ధభూమిలో విజృంభించాడు. పాండవ సైన్యంమీద నారాయణాస్త్రాన్ని ప్రయోగించాడు. శ్రీకృష్ణుడి సూచనపై పాండవవీరులందరూ నేలపై దిగి, ఆయుధాలు వీడి, నమస్కరించి, నారాయణశక్తిని భక్తితో గౌరవించారు. భీముడు మొదట తిరగబడినా కృష్ణార్జునుల హితోక్తులతో నారాయణాస్త్రానికి తలవంచాడు. నారాయణాస్త్రం ఉపశమించింది. అందరూ ప్రాణాలు దక్కించుకొన్నారు. అశ్వత్థామ అంతటితో ఆగక ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. అర్జునుడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి దానిని వమ్ముచేశాడు. దానితో అశ్వత్థామ చేసేదిలేక రణరంగం నుండి తిరిగిపోయాడు. అతడి ఎదుట వేదవ్యాసుడు ప్రత్యక్షమయ్యాడు. అశ్వత్థామ ఆ మహర్షికి నమస్కరించి గద్గదకంఠంతో 'మునీంద్రా! నా ఆగ్నేయాస్త్రం వృథ అయింది. దానికి కారణ మేమో తెలియదు. సురాసురగంధర్వాదులకు కూడా దుస్సహమైన ఆ అస్త్రం మానవులైన కృష్ణార్జునులను ఎందుకు దహించలేకపోయింది?' అని అడిగాడు.

వ్యాసమహర్షి ఇట్లా చెప్పాడు: 'ఆదిదేవుడైన శ్రీమహావిష్ణువు అఖిలలోక రక్షణార్థం భూలోకంలో జన్మించి మైనాక పర్వతంమీద శివుడిని గూర్చి తపస్సు చేశాడు. పరమశివుడు ప్రత్యక్షం కాగా ఆతడిని అనేకవిధాల ప్రస్తుతించాడు. 'ఇతరులకెవ్వరికీ లేని ప్రభావాన్ని నాకు ప్రసాదించు'మని వరం కోరాడు. పరమేశ్వరుడు కరుణించాడు. సురాసురగంధర్వ కిన్నర గరుడోరగాదులను అవలీలగా గెలువగలిగిన పరమతేజస్సుతో ప్రకాశిస్తూ వర్తించే మహిమ నిచ్చాడు. అస్త్రశస్త్రాలవలనగాని, అగ్నిజలాదులవలనగాని ఎటువంటి కీడు జరుగని మహిమ నిచ్చాడు. యుద్ధంలో శివుడినైన నిర్జించగల మహిమను ప్రసాదించాడు. అందువలన నారాయణుడు అజయ్యుడై ఉన్నాడు. అతడినుండి పుట్టిన నరుడు కూడా ఆ లక్షణాలనే కలిగి ఉన్నాడు. నరుడితో కూడిన నారాయణుడు నిజమాయా విశేషంచేత జగన్మోహనాకారుడై విహరిస్తూ ఉంటాడు. వారిరువురూ దానవులను సంహరించి ధర్మసంస్థాపనం చేయటానికి పుట్టారు. వారే కృష్ణార్జునులు' - అని తెలియచెప్పాడు.

ఆగ్నేయాస్త్రాదులు అశ్వత్థామయందు అసమగ్రం కావటానికి కారణంకూడా వ్యాసుడు చెప్పాడు. అశ్వత్థామ మట్టితో చేసిన శివుని ప్రతిమను అర్చించేవాడు. కృష్ణార్జునులు లింగరూపశివారాధనం చేసేవారు. కాబట్టి అతడికంటె వారు శ్రేష్ఠు లయ్యారని పేర్కొన్నాడు. అశ్వత్థామ పులకితుడై రుద్రుడిని ధ్యానించాడు. కేశవుడిని ప్రస్తుతించాడు. వ్యాసమహర్షికి నమస్కరించాడు. రథమెక్కి స్కంధావారం చేరాడు. కౌరవులు విషణ్ణులయ్యారు. పాండవులు మహానందభరితులయ్యారు.

స్కంధావారంలో రాత్రి వేదవ్యాసుడు అర్జునుడికి ప్రత్యక్షమయ్యాడు. పార్థు డా మహర్షిని పూజించి ఒక ప్రశ్న అడిగాడు. 'మహర్షీ! నేను యుద్ధం చేస్తున్నప్పుడు నా ముందు అగ్నివంటి ఒక మహాపురుషుడు నేలపై కాళ్ళానకుండా నడుస్తూ యోధులనందరినీ ఆతడే సంహరిస్తూ ఉండగా నేను తరువాత వారిని చంపుతూ ఉంటాను. ఆ మహాపురుషు డెవ్వరో నాకు తెలుపుము'.

ఆతడు సర్వలోక ప్రభువైన పరమేశ్వరుడైన రుద్రుడని తెలిపి, అటువంటి మహాదేవుడు అర్జునుడికి ప్రసన్నుడయ్యాడనీ, భక్తపరాధీనుడైన అతడు తానే వీరులను సంహరిస్తూ కిరీటికి కీర్తి కలిగేటట్లు చేస్తున్నాడని తెలిపాడు. సర్వలోక శరణ్యుడైన ఆ దేవదేవుడిని శరణుజొచ్చి సర్వశుభాలను పొందుమని అర్జునుడిని దీవించి వ్యాసమహర్షి అంతర్ధానమయ్యాడు. అర్జునుడు శివధ్యానమగ్ను డయ్యాడు.

**- జి.వి.సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము

## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము



## పంచమాశ్వాసము

శ్రీరస్తు

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీసంశ్రయ మంగళ గౌ । రీసంగమ విభవ పుణ్యరేఖా సంప**
**ద్భాసిత వక్షోవామాం । గా! సూత్రితచిత్ర మహిమ! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** హరిహరనాథా!= శివకేశవాత్మకుడవైన దేవా!; శ్రీ సంశ్రయ= లక్ష్మీదేవి ఆశ్రయం; మంగళగౌరీ సంగమ=శుభప్రదయగు గౌరీదేవి కూడిక అనే; విభవ= ఐశ్వర్యానికి చెందిన; పుణ్యరేఖా= అదృష్టరేఖయొక్క; సంపద్= శోభతో; భాసిత= ప్రకాశించే; వక్షోవామాంగా!= హృదయమూ ఎడమ మేనూ కలవాడా!; సూత్రిత చిత్రమహిమ!= సూత్రప్రాయంగానే తెలుపబడిన చిత్ర విచిత్రమైన మహిమలు కలవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! నీ భాగ్యరేఖను నేను ఏమని వర్ణించగలను? సర్వసుఖాలను ఇచ్చే లక్ష్మీదేవి నీ రొమ్మునందు, సర్వశుభాలను ఒసగే మంగళగౌరీదేవి నీ వామాంగంలోను నెలకొని ఉన్నారు. చిత్రాతి చిత్రమైన నీ మహిమను వేదాలు కూడా వర్ణించలేక సూత్రప్రాయంగానే తెలియజేస్తున్నవి.

**విశేషం:** సర్వభువనాలలోని జడచేతనాల స్వరూప స్వభావాలన్నీ పరాత్పరుడి చిత్రాతిచిత్రమహిమలే. శ్రీసంశ్రయం హరిభాగం. గౌరీసంగమం హరుని వామ శరీరం. వక్షస్సు హరిది. వామాంగం హరుడిది అని క్రమాన్వయం.

లక్ష్మీగౌరీ సమాశ్రయం శృంగార రసాన్నీ, ఆశ్చర్యంగొలిపే ఇట్టి దివ్యమంగళ విగ్రహం, 'చిత్రమహిమ' అద్భుత రసాన్నీ వ్యక్తీకరిస్తున్నవి. ఈ శృంగారాద్భుత రసాలు హరిహరనాథుడి యెడ ప్రదర్శించే భక్తిభావానికి పోషకాలుగా ఉన్నాయి.

**సంజయుఁడు యుద్ధభూమికిఁ బోయి మరలి వచ్చి యందలి వృత్తాంతంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట (సం. 7-1-5)**

**వ. దేవా! వైశంపాయనునకు జనమేజయుం డి ట్లనియె.** 2

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనునకున్= వ్యాసమహర్షికి శిష్యుడైన వైశంపాయనుడితో; జనమేజయుండు= పరీక్షిన్మహారాజు పుత్రుడైన జనమేజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** హరిహరనాథా! వ్యాస శిష్యుడైన వైశంపాయనుడితో పరీక్షిన్మహారాజుపుత్రుడైన జనమేజయుడు ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** వేదవ్యాసుడు మహాభారతం రచించి భూలోకంలో దానిని ప్రవర్తింపజేయడానికై తన శిష్యుడైన వైశంపాయనుడిని నియమించాడు. తర్వాత ఒకసారి వ్యాసమహర్షిని జనమేజయుడు తమ పూర్వుల చరిత్రను చెప్పవలసినదని కోరగా, వ్యాసుడి కోరికపై వైశంపాయనుడు జనమేజయుడికి భారతకథ చెప్పటం ప్రారంభించాడు. ఈ విధంగా భారతేతిహాసానికి వైశంపాయనుడు వక్త. జనమేజయుడు శ్రోత.

మళ్ళీ కవిబ్రహ్మ తిక్కన, తెలుగు మహాభారతానికి కృతిపతి అయిన హరిహరనాథుడిని 'దేవా!' అని సంబోధిస్తూ భారత కథను వివరిస్తున్నాడు.

**క. 'ముని జన వల్లభ! యివ్విధ । మున దేవవ్రతుఁడు శాంతిఁ బొందినక్రమ మె**
**ల్లను ధృతరాష్ట్రమహీశుఁడు । విని యెయ్యది యాచరించె వినిపింపు తగన్.' 3**

**ప్రతిపదార్థం:** మునిజన వల్లభ!= మౌనులలో శ్రేష్ఠుడవైన వైశంపాయనా!; ఈ+విధమునన్= ఇట్లా; దేవవ్రతుఁడు= భీష్ముడు; శాంతిన్+పొందిన= యుద్ధం చాలించిన; క్రమము= విధం; ఎల్లను= అంతా; ధృతరాష్ట్ర మహీశుఁడు= ధృతరాష్ట్ర మహారాజు; విని=ఆలకించి; ఏ+అది= ఏది; ఆచరించెన్= చేశాడో; తగన్= తగినవిధంగా; వినిపింపు(ము)= తెలియజెప్పుము.

**తాత్పర్యం:** వైశంపాయన మునిశ్రేష్ఠా! కౌరవ సేనాధిపతి అయిన భీష్ముడు యుద్ధం చాలించిన విషయాన్ని సంజయుడి వలన విని ధృతరాష్ట్రుడు ఏమి చేశాడో చెప్పుము.

**వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 4**

**ప్రతిపదార్థం:** అని+అడిగిన= అట్లు ప్రశ్నించిన; జనమేజయునకున్= జనమేజయ మహారాజుతో; వైశంపాయనుండు= వ్యాసశిష్యుడైన వైశంపాయనుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అని ప్రశ్నించిన జనమేజయ మహారాజుతో వైశంపాయనమునీంద్రుడు ఇట్లా అన్నాడు.

**క. అనిమిష నదీ తనూజుఁడు । సనుటయు విని యవ్విభుండు సంజయుఁ బోవం**
**బనిచెను దనయుని కడకు న । తని విజయము కాంక్ష దన హృదయమున మొలవన్. 5**

**ప్రతిపదార్థం:** అనిమిష నదీతనూజుఁడు= దేవ నదీ పుత్రుడైన భీష్ముడు; చనుటయున్= యుద్ధ రంగంనుండి తొలగిపోవటం; విని; ఆ+విభుండు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; అతని= దుర్యోధనుడి; విజయము= గెలుపుయొక్క; కాంక్ష= కోరిక; తన హృదయమునన్= తన మనస్సులో; మొలవన్= పొడసూపగా; తనయుని కడకున్= పుత్రుడైన దుర్యోధనుడి దగ్గరకు; సంజయున్= భారతయుద్ధ విశేషాలు వినిపించే సంజయుడిని; పోవన్= వెళ్ళటానికై; పనిచెన్= నియమించాడు.

**తాత్పర్యం:** భీష్ముడు యుద్ధ రంగంనుండి తొలగిపోవటం విని, దుర్యోధనుడి విజయకాంక్ష తన మనస్సులో మొలకెత్తగా, ధృతరాష్ట్రుడు తన కొడుకు వద్దకు సంజయుడిని పంపించాడు.

**క. పనిచి కృతపడిన గాంగే । యుని దెస యుమ్మలిక నాతఁ డుల్లము నానా**
**ఘనతర చింతాభర మొం । దినఁ గుందుచు నుండఁ గొన్ని దివసంబులకున్. 6**

**ప్రతిపదార్థం:** పనిచి= పంపి; కృతపడిన= కడచిన (యుద్ధం నుండి తొలగిన); గాంగేయుని దెస= గంగాపుత్రుడైన భీష్ముడిని గూర్చిన; ఉమ్మలికన్=దుఃఖంతో; ఆతఁడు= ధృతరాష్ట్రుడు; ఉల్లము= మనస్సు; నానా= అనేక విధాలైన; ఘనతర= మిక్కుటమైన; చింతా భరము= విచార భారం; ఒందినన్= పొందగా; కుందుచున్= క్రుంగుతూ; ఉండన్= ఉండగా; కొన్ని= కొద్ది; దివసంబులకున్= రోజులకు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు సంజయుడిని యుద్ధరంగానికి పంపి, భీష్ముడు యుద్ధంనుండి తొలగటం చేత దుఃఖించి, మిక్కిలి చింతాభారంతో క్రుంగిపోతుండగా, కొన్నిదినాలకు.

**క. వ్యాసప్రసాదమహిమం । జేసి యుభయ సైన్యగత విశేషజ్ఞుం డై**
**యా సంజయుఁ డొకనాఁటి ని । శా సమయమునందుఁ గడు వెసం జనుదెంచెన్. 7**

**ప్రతిపదార్థం:** వ్యాసప్రసాదమహిమన్+చేసి= వ్యాసమహర్షియొక్క అనుగ్రహపు గొప్పతనం వలన; ఉభయ= కౌరవుల, పాండవుల; సైన్యగత= సేనలకు సంబంధించిన; విశేషజ్ఞుండు+ఐ= విశేషాలన్నీ తెలిసినవాడై; ఆ సంజయుఁడు= అట్టి సంజయుడు; ఒకనాఁటి; నిశాసమయమునన్= రాత్రివేళ; కడువేసన్= మిక్కిలి వేగంగా; చనుదెంచెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** వ్యాసమహర్షి అనుగ్రహం వలన కౌరవపాండవ శిబిరాలలోని విశేషాలన్నీ తెలిసికొని, ఒకనాటి రాత్రి సంజయుడు ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చాడు.

**వ.** **ఇట్లు శిబిరంబుననుండి సూతనందనుండు గరినగరంబునకు వచ్చి యంతఃపురంబున నున్న ధృతరాష్ట్రు నుచిత ప్రకారంబునం గనిన నమ్మనుజవల్లభుం డతనిం దన చేరువ నునిచికొని యాదరించి.** **8**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; శిబిరంబుననుండి= దండు విడిసిన చోటునుండి; సూతనందనుండు= సూతవంశీయుడి పుత్రుడైన సంజయుడు; కరినగరంబునకున్= హస్తినాపురానికి; వచ్చి=వచ్చి; అంతఃపురంబునన్+ఉన్న= అంతఃపురంలో ఉన్న; ధృతరాష్ట్రున్= ధృతరాష్ట్రుడిని; ఉచిత ప్రకారంబునన్= తగు విధంగా; కనినన్= చూడగా; ఆ+మనుజవల్లభుండు= ఆ రాజు; అతనిన్= సంజయుడిని; తన చేరువన్= తన సమీపంలో; ఉనిచికొని= ఉంచుకొని; ఆదరించి= మన్నించి.

**తాత్పర్యం:** ఈ విధంగా సంజయుడు హస్తినాపురానికి వచ్చి, అంతఃపురంలో ఉన్న ధృతరాష్ట్ర మహారాజును సగౌరవంగా దర్శించాడు. అపుడు ఆ రాజు అతడిని దగ్గరికి తీసికొని ఆదరించి.

**చ.** **అమరనదీతనూజు సమరావనిఁ గోల్పడి నాదు యోధవ**
**ర్గము మఱి యెవ్వరిం గొని పరాక్రమ దుర్దమ పాండుపుత్ర సై**
**న్యమునకు మార్కొనం దలఁచె? నక్కట! కౌరవు లేమి సేసి రా**
**సమయమునన్ బలప్రచయ సంఘటనం బెటులయ్యెఁ సంజయా!** **9**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; సంజయా!= ఓ సంజయా!; అమర నదీ తనూజు= గంగాదేవి పుత్రుడైన భీష్ముడిని; సమరావనిన్= యుద్ధభూమిలో; కోల్పడి= కోల్పోయి; నాదు= నా యొక్క; యోధవర్గము= వీరుల సమూహం; మఱి= మళ్ళీ; ఎవ్వరిన్= ఏ వీరుడిని; కొని= సేనానిగా నియమించి; పరాక్రమ= శత్రువులను వశపరచుకొనే; దుర్దమ= అణచశక్యముకాని; పాండుపుత్ర= పాండవుల; సైన్యమునకున్= సేనను; మార్కొనన్= ఎదుర్కొనవలెనని; తలఁచెన్?= అనుకొన్నది?; కౌరవులు= కురువంశీయులైన దుర్యోధనాదులు; ఏమి+చేసిరి?= ఏమి చేశారు; ఆ సమయమునన్= అట్టి ఆపదవేళలో; బల ప్రచయ సంఘటనంబు= సైన్య సమూహంయొక్క కూర్పు; ఎటులు+అయ్యెన్?= ఏ విధంగా జరిగింది?

**తాత్పర్యం:** అయ్యో సంజయా! యుద్ధరంగంలో భీష్ముడిని కోల్పోయిన కౌరవ వర్గం మళ్లీ ఎవ్వరిని సేనాపతిగా నియమించి, పరాక్రమంలో సాటిలేని పాండవసైన్యాన్ని ఎదుర్కొనవలెనని అనుకొన్నది? చెదరిపోయిన సైన్యాన్ని, కౌరవులు అపుడు ఒకచోటికి ఎట్లా కూర్చుకొన్నారు? తెలుపవలసింది.

**విశేషం:** 'అక్కటా!' అనటంతో ధృతరాష్ట్రుడిలోని చింతా, విషాదాలు వ్యక్తమవుతున్నవి.

**క.** **అనిన విని సూతసుతుఁ డి । ట్లను నక్కురునాథుతోడ 'నవహితమతివై**
**విను మంతయుఁ జెప్పెదఁ గ్రమ । మున నీ యడిగిన తెఱంగు భూవర! తెలియన్.'** **10**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; సూతసుతుఁడు= సూతుడి కుమారుడైన సంజయుడు; ఆ+కురునాథుతోడన్= ఆ ధృతరాష్ట్రుడితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటాడు; భూవర= రాజా! ; నీ+అడిగిన తెఱంగు= నీవు అడిగిన విధం; క్రమమునన్= వరుసగా; అంతయున్= మొత్తం; తెలియన్= (నీకు) స్పష్టంగా తెలిసేటట్లుగ; చెప్పెదన్= చెపుతాను; అవహితమతివి+ఐ= సావధానుడవై; వినుము= వినుము

**తాత్పర్యం:** ఇది విని సంజయుడు, 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీవు అడిగినదంతా వరుసగా వివరిస్తాను, సావధానంగా వినుము' అన్నాడు.

**వ. దేవవ్రతుండు దేవభావంబునం బొందిన యప్పుడు కురుపాండవులు లతని కడకు వచ్చుటయు నా సమయంబునఁ బుట్టిన విశేషంబులు నాఁడు నీ కెఱింగించితి; శరతల్పగతుం డైన శాంతనవుండు సెప్పిన హితవచనంబు లాదరింపక రోషసంరక్త నయను లగుచు నతని వీడ్కొని యట్లు సనిన కౌరవులు నాటి వేకువ నీ కడనుండి యేను బోయి శిబిరంబు సొచ్చు నవసరంబున. 11**

**ప్రతిపదార్థం:** దేవవ్రతుండు= భీష్ముడు; దేవభావంబునన్= దేవత్వాన్ని; పొందిన; అప్పుడు= ఆ సమయంలో; కురుపాండవులు= ధృతరాష్ట్రుడి పుత్రులు, పాండురాజు కుమారులు; అతని కడకున్= ఆ భీష్ముడి వద్దకు; వచ్చుటయున్= రాగా; ఆ సమయంబునన్= అప్పుడు; పుట్టిన= కలిగిన; విశేషంబులు= భీష్ముడు శరతల్పగతుడు కావటం, అర్జునుడు భీష్ముడు త్రాగడానికి పర్జన్యాస్త్రం వేసి భూమినుండి జలధారలు పుట్టించటం వంటి విశేషాలు; నాఁడు= భీష్ముడు యుద్ధంలో కూలిననాడు; నీకున్; ఎఱింగించితిన్= తెలిపాను; శరతల్పగతుండు+ఐన= అంపశయ్యపై పడ్డ; శాంతనవుండు= శంతనుడి పుత్రుడైన భీష్ముడు; చెప్పిన= పలికిన; హితవచనంబులు= మంచిమాటలు; ఆదరింపక= పాటించక; రోష= కోపంతో; సంరక్త= మిక్కిలి ఎరుపెక్కిన; నయనులు= కన్నులు గలవారు; అగుచున్= అవుతూ; అతనిన్= ఆ భీష్ముడిని; వీడ్కొని= వదలి; అట్లు= ఆ విధంగా; చనిన= పోయిన; కౌరవులు= దుర్యోధనాదులు; నాఁటి= ఆనాటి; వేకువన్= ఉదయాన; నీ కడనుండి= నీ వద్దనుండి; ఏను= నేను; పోయి= వెళ్ళి; శిబిరంబు= దండు విడిసిన చోటు; చొచ్చు+అవసరంబునన్= ప్రవేశించే సమయంలో.

**తాత్పర్యం:** భీష్ముడు శరతల్పగతుడై దేవత్వాన్ని పొందినపుడు, కౌరవులు, పాండవులు ఆయన వద్దకు రాగా, ఆ సమయంలో అర్జునుడు పర్జన్యాస్త్రాన్ని వేసి భూమి నుండి జలధారలు పుట్టించటంవంటి విశేషాలు ఆనాడు నీకు తెలిపాను. అప్పుడు భీష్ముడు చెప్పిన మంచిమాటలు లెక్కించక కోపంతో కౌరవులు అచటినుండి వెళ్లిపోయారు. ఆనాటి ఉదయం నేను నీవద్ద నుండి కౌరవ శిబిరాన్ని ప్రవేశించే సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. సమరోద్యోగము వీటికిం దెలుపు నిస్సాణాది తూర్యంబు లొ**
**క్కమొగిన్ మ్రోయఁగ వారణాది చతురంగస్ఫార సన్నాహ సం**
**గమనాటోపము మిక్కుటంబుగఁ గడంకన్ వీరనైపథ్య వి**
**భ్రమలోలాకృతు లైరి మోముల వివర్ణత్వంబు సంధిల్లఁగాన్. 12**

**ప్రతిపదార్థం:** సమర+ఉద్యోగము= యుద్ధానికి పూనుకోవటం; వీటికిన్= సైన్యం విడిసిన చోటుకు; తెలుపు= తెలియజేసే; నిస్సాణ= నిస్సాణమనే పేరుగలది; ఆది= మొదలైన; తూర్యంబులు= చర్మవాద్యాలు; ఒక్కమొగిన్= ఒకేసారి; మ్రోయఁగన్= ధ్వనించగా; వారణ+ఆది= ఏనుగులు మొదలైన; చతురంగ= రథాలు, గజాలు, గుర్రాలు, పదాతి దళాలయొక్క; స్ఫార= అధికమైన; సన్నాహ= ప్రయత్నంలోని; సంగమన= క్రమబద్ధంగా వెళ్ళటంలోని; ఆటోపము= వేగిరపాటు; మిక్కుటంబుగన్= ఎక్కువగా; కడంకన్= పూనగా; మోములన్= ముఖాలలో; వివర్ణత్వంబు= తెల్లదనం; సంధిల్లఁగాన్= తోచగా; వీర= శూరులకు సంబంధించిన; నైపథ్య= వస్త్రాద్యలంకారాల యొక్క; విభ్రమ= విలాసముచే; లోల= చలించే; ఆకృతులు+ఐరి= ఆకారాలు కలవారయ్యారు.

**తాత్పర్యం:** సైన్య శిబిరాలకు యుద్ధసన్నాహాన్ని తెలిపే నిస్సాణాది వాద్యాలు ఒక్క పెట్టున మ్రోయగా, గజాది చతురంగ బలాలు క్రమబద్ధంగా వేగిరపాటుతో ముందుకు సాగటానికి ప్రయత్నిస్తుండగా, తెల్లముఖాలు వేసిన కౌరవులు, వీరుల వస్త్రకవచాద్యలంకారాల కదలికలతో చలించే రూపాలు కలవారయ్యారు.

**విశేషం:** వివర్ణత్వం సాత్త్వికభావం. ఇది మనస్సులోని చింతావిషాదాదులను వ్యక్తీకరించేది. సేనాధిపతి అయిన భీష్ముడు యుద్ధరంగంలో కూలిపోవటం వలన ముందు జరిగే యుద్ధానికై సన్నద్ధమవుతున్న కౌరవుల ముఖాలలో విషాదం అలముకొనటాన్ని 'వివర్ణత్వము' అనే పదం సూచిస్తున్నది.

**వ. ఇట్లు సన్నద్ధులై వెడలి యసమెడలిన బలంబులం గూర్చుకొనుచుండి. 13**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సన్నద్ధులు+ఐ= యుద్ధానికి సిద్ధమైనవారై; వెడలి= శిబిరాలలో నుండి వెలికివచ్చి; అసము= ఉత్సాహం; ఎడలిన= తొలగిన; బలంబులన్= సైన్యాన్ని; కూర్చుకొనుచున్+ఉండి= ప్రోగుచేసికొంటూ.

**తాత్పర్యం:** ఈ విధంగా యుద్ధానికి సిద్ధమై శిబిరాలలో నుండి వెలుపలికి వచ్చి, దర్పహీనమైన సైన్యాలను సమీకరిస్తూ.

**ఉ. అప్పుడు భీష్ములేమి హృదయంబుల నుమ్మలికంబు గూరఁగా**
**నెప్పటి చందముల్ విడిచి యేడ్తెఱఁ దక్కిన చూడ్కు లొండొరు**
**న్రెప్పల మాటునం బొలయ నీ సుతు పాలికి వచ్చు రాజులం**
**దిప్పు డతండు రా వలవదే యని కర్ణుఁ దలంచి రందఱున్. 14**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; భీష్ములేమి= భీష్ముఁడు లేకుండటం; హృదయంబులన్= మనస్సులలో; ఉమ్మలికంబు= దుఃఖము; కూరఁగాన్= కలుగగా; ఎప్పటి చందముల్= ఎల్లవేళలలో ఉండే తీరు; విడిచి= వదలి; ఏడ్తెఱన్= కాంతిని; తక్కిన= వీడిన; చూడ్కులు= చూపులు; ఒండు+ఒరున్= ఒకటికొకటి; రెప్పలమాటునన్= కంటి రెప్పల చాటున; పొలయన్= వ్యాపించగా; నీ= నీయొక్క; సుతు= పుత్రుడైన దుర్యోధనుడి యొక్క; పాలికిన్= వద్దకు; వచ్చు= వచ్చే; రాజులందున్= రాజులలో; ఇప్పుడు= భీష్ముడు యుద్ధంలో కూలిన తర్వాత; అతండు= ఆ కర్ణుడు; రావలవదే+అని= రాగూడదా అని; అందఱున్= కౌరవులు అందరు; కర్ణున్= కర్ణుడిని; తలంచిరి= తలచుకొన్నారు.

**తాత్పర్యం:** ఆ సమయంలో యుద్ధరంగంలో భీష్ముడు లేకపోవటం అందరికీ దుఃఖాన్ని కలిగించగా, సహజమైన దర్పాదులను విడిచి, ఒకరికొకరు కాంతివిహీనమైన చూపులు రెప్పలమాటుననే నిగిడించి, నీ పుత్రుడైన దుర్యోధనుడి వద్దకు ఇతర రాజులందరు వచ్చారు. 'భీష్ముడు పడిపోయిన తర్వాతనైనా కర్ణుడు యుద్ధ రంగానికి రావచ్చుగదా!' యని అందరు కర్ణుడిని తలచుకొన్నారు.

**వ. అట్టి యెడ. 15**

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** భీష్ముడు లేని ఆ విషాదసమయంలో.

**చ. పతిరహితాత్మ యైన సతి భంగియు గోపక హీనమైన గో**
**ప్రతతి విధంబు, సస్య విధుర స్థితి యైన ధరిత్రి చాడ్పు, ను**
**ద్ధత హరి శూన్యమైన వసుధాధర కందర భూమి చందమున్**
**మతి మనసేనఁ దోఁచె బుధమాన్యుఁడు భీష్ముఁడు లేకయుండుటన్. 16**

**ప్రతిపదార్థం:** బుధమాన్యుఁడు= పండితులలో శ్రేష్ఠుడైన; భీష్ముఁడు= భీష్ముడు; లేక+ఉండుటన్= లేకపోవటంవలన; మనసేన= మన యొక్క సైన్యం; పతిరహిత+ఆత్మ+ఐన= భర్తలేని; సతి= భార్యయొక్క; భంగియున్= విధమునను; గోపకహీనము+ఐన= గోపాలుడు లేని; గోప్రతతి= గోవుల సమూహం; విధంబున్= వలెను; సస్య= పంటలు; విధురస్థితి+ఐన= లేని; ధరిత్రి= భూమి; చాడ్పున్= వలెను; ఉద్ధత= గర్వించిన; హరి= సింహం; శూన్యము+ఐన= లేని; వసుధాధర= భూమిని ధరించే పర్వతం యొక్క; కందర= గుహయొక్క; భూమి= స్థలం; చందమున్= వలెను; మతిన్= మనస్సుకు; తోఁచెన్= అనిపించింది.

**తాత్పర్యం:** జ్ఞానులలో శ్రేష్ఠుడైన భీష్ముడు లేని మన సేన వైధవ్యం పొందిన స్త్రీవలెను, కాపరిలేని ఆవులమందవలెను, పంటలు లేని పొలంవలెను, సింహం లేని పర్వత గుహవలెను నా మనస్సుకు తోచింది.

**విశేషం:** అలం: మాలోపమ. భీష్ముడు లేని కౌరవసైన్యాన్ని పతిలేని సతిగా, కాపరిలేని గోగణంగా, సింహం లేని గుహగా ఉపమించి చెప్పటంవలన సైన్యం యొక్క దీనస్థితి వ్యక్తమౌతున్నది.

**ఉ. అంగద నాథు మ్రింగిన వృకావలి దన్ వెస ముట్టికొన్న స**
**ర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులు సూచుచున్న సా**
**రంగియ పోలె నుండెఁ గురురాజ! భవత్సుతు సేన భీష్ము నా**
**జిం గబళించి పాండవులు జృంభిత విక్రమలీలఁ బొల్చుటన్. 17**

**ప్రతిపదార్థం:** కురురాజ!= ధృతరాష్ట్ర మహారాజా!; పాండవులు; భీష్మున్= భీష్ముడిని; ఆజిన్= యుద్ధంలో; కబళించి= మ్రింగి; జృంభిత= అతిశయించిన; విక్రమ= పరాక్రమం యొక్క; లీలన్= విలాసంతో; పొల్చుటన్= ఒప్పిదముతో ఉండటం; అంగదన్= ఆకలితో; నాథున్+మ్రింగిన= పతిని చంపిన; వృకావలి= తోడేళ్ళగుంపు; తన్= తనను, (సారంగిని); వెసన్ ముట్టికొన్నన్= వేగంగా చుట్టుముట్టగా; సర్వాంగములున్= అన్ని అవయవాలూ; చలింపన్= వణకగా; వెగడు+అందుచున్= భయపడుతూ; దిక్కులు= నలువైపుల; చూచుచున్+ఉన్న= చూస్తున్న; సారంగి+అ పోలెన్= ఆడు జింకవలె; భవత్= తమయొక్క; సుతు= కుమారుడైన దుర్యోధనుడి యొక్క; సేన= సైన్యం; ఉండెన్= ఉండినది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆకలితో ప్రియుడిని మింగిన తోడేళ్ళగుంపు వేగంగా తనను చుట్టుముట్టగా, భయంతో వణకుతూ దిక్కులు చూస్తున్న ఆడజింకవలె నీ పుత్రుడి సైన్యం, భీష్ముడిని యుద్ధంలో కూలనేసి విజృంభించిన పాండవుల పరాక్రమాన్ని చూచి బెదరిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ. సేనాని అయిన భీష్ముడు పడిపోవటం వలన అనాథ అయిన కౌరవసేనను నాథుడిని కబళించి చుట్టుముట్టిన తోడేళ్ళ గుంపును చూచి భయపడ్డ సారంగితో ఉపమించటం ద్వారా భయానక రసం వ్యక్తమౌతున్నది.

**ఆ. 'కర్ణ! కర్ణ! వచ్చి కావు మనాథుల । మైతి'మను నెలుంగు లగ్గలముగ**
**బలములోన నెల్లఁ గలయంగ వీతెంచె । నార్తి దెల్లముగ జనాధినాథ! 18**

**ప్రతిపదార్థం:** జన+అధినాథ!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఆర్తి= బాధ; తెల్లముగన్= స్పష్టంగా- బాగా తెలిసేవిధంగా; కర్ణ! కర్ణ!= ఓ కర్ణుడా!; అనాథులము+ఐతిమి= దిక్కులేని వారమయ్యాము; కావుము= రక్షించుము; అను= అనే; ఎలుంగులు= ఆర్తనాదాలు; అగ్గలముగన్= అధికంగా; బలములోనన్= సైన్యంలో; కలయంగన్= అంతట; వీతెంచెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అప్పుడు 'కర్ణా! ఓ కర్ణా! మేమంతా దిక్కులేనివారం అయ్యాం. వేగంగా వచ్చి కాపాడు' అనే ఆర్తనాదాలు స్పష్టంగా సైన్యంలో అంతటా వ్యాపించాయి.

**విశేషం:** 'కర్ణ! కర్ణ' అని కౌరవసైన్యం చేసే ఆర్తనాదాల వలన ధైర్య విషాదాది భావాలు వ్యక్తమై భయానక రసం అభివ్యక్తమౌతున్నది.

**వ.** **తదనంతరంబున.** **19**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబునన్= ఆ తరువాత.

**తాత్పర్యం:** కౌరవసైన్యం అంతటా ఆర్తనాదాలు వ్యాపించిన తర్వాత.

**క.** **'పిలువుఁడు దడయక కర్ణుని; । బలవిక్రమశాలి యతఁడు; పది దివసములుం**
**గలనికి రాఁడు నదీసుతు । పలుకులకుం గనలి సచివబంధుయుతముగన్.'** **20**

**ప్రతిపదార్థం:** తడయక= ఆలస్యం చేయక; కర్ణునిన్= కర్ణుడిని; పిలువుఁడు= పిలవండి; అతఁడు= ఆ కర్ణుడు; బలవిక్రమశాలి= బలపరాక్రమాలు కలవాడు; నదీసుతు= గంగాపుత్రుడైన భీష్ముడి యొక్క; పలుకులకున్= మాటలకు; కనలి= కోపించి;ఎ 3ది దివసములున్=యుద్ధం మొదలైన పది దినాలు; సచివ= మిత్రులతో; బంధుయుతముగాన్= చుట్టాలతోపాటు; కలనికిన్= యుద్ధానికి; రాఁడు= రాలేదు.

**తాత్పర్యం:** 'కర్ణుడు బలపరాక్రమశాలి, ఆలస్యం చేయక అతడిని యుద్ధం చేయటానికి ఆహ్వానించండి. భీష్ముని మాటలకు అలిగి ఆయన యుద్ధరంగంలో ఉన్నంత వరకు ఆ పదిరోజులు తాను బంధుమిత్రులతో కలిసి యుద్ధానికి రాలేదు కదా!

**వ.** **అని కౌరవులును దక్కటి జనపతులును దగుజనంబులును నతని నాసపడి పలుకుచుండి; రాతని తెఱంగు దొల్లియు నీ వాకర్ణించి తది యెయ్యది యనిన.** **21**

**ప్రతిపదార్థం:** అని= పై విధంగా పలికి; కౌరవులును= ధృతరాష్ట్రుడి కుమారులు; తక్కటి= మిగిలిన; జనపతులును= రాజులును; అతనిన్= కర్ణుడిని; ఆసపడి= కోరి; పలుకుచుండిరి= అనుకొంటూ ఉన్నారు; ఆతని= ఆ కర్ణుని యొక్క; తెఱంగు= తీరు; నీవు= ధృతరాష్ట్రుడవైన నీవు; ఆకర్ణించితివి= విన్నావు; అది= ఆ విషయం; ఏ+అది+అనిన్= ఏమిటంటే.

**తాత్పర్యం:** పై విధంగా పలికి దుర్యోధనాదులు, తక్కిన రాజులు కర్ణుడు తమ రక్షణార్థం రావాలని అనుకొన్నారు. కర్ణుడు యుద్ధరంగం వదలటానికి గల కారణం నీవూ విన్నావు. అది ఏమిటంటే.

**చ.** **అనఘు! సరిత్సుతుండు దను నర్ధరథుండని పల్కినన్ మనం**
**బునఁ గడునొచ్చి 'నీ వనికిఁ బోయిన నద్దెస రాను; నీ జయం**
**బున వనవాసి నయ్యెద; రిపుల్ నిను నోర్చిన వారి నోర్చెదన్**
**ఘన భుజశక్తి నేననియెఁ గాదె! నృపుల్ విన నమ్మహాత్ముతోన్.** **22**

**ప్రతిపదార్థం:** అనఘ!= పాపరహితుడవైన ధృతరాష్ట్ర మహారాజా!; సరిత్+సుతుండు= నదీపుత్రుడైన భీష్ముడు; తనున్= కర్ణుడిని; అర్ధరథుండు+అని= అతిరథ, మహారథులకంటె, సమరథుడికంటె తక్కువవాడని; పల్కినన్= అనగా; మనంబునన్= మనస్సులో; కడున్+నొచ్చి= మిక్కిలి బాధపడి; నీవు= భీష్ముడవైన నీవు; అనికిన్= యుద్ధానికి; పోయినన్= వెళ్ళితే; ఆ+దెస= ఆ వైపు; రాను= రాజాలను; నీ= నీయొక్క; జయంబునన్= గెలుపుచే; వనవాసిని= అడవులలో నివసించేవాడిని; అయ్యెదన్= అవుతాను; రిపుల్= శత్రువులు; నినున్= నిన్ను; ఓర్చినన్= ఓడిస్తే; ఘనభుజశక్తిన్= గొప్ప భుజబలంతో; ఏను= నేను; వారిన్= ఆ శత్రువులను; ఓర్చెదన్= జయిస్తాను అని; నృపుల్= రాజులు; వినన్= వినేటట్లుగా; ఆ+మహాత్ముతోన్= ఆ మహాత్ముడైన; భీష్ముడితో; అనియెన్+కాదె!= అన్నాడు గదా!

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీష్ముడు తనను అర్ధరథుడని కించపరుచగా కర్ణుడు మనస్సులో మిక్కిలి బాధపడి, ఓ భీష్మాచార్యా! 'నీవు యుద్ధానికి వెళ్ళితే నే నా వైపు రాను; యుద్ధంలో నీవు జయిస్తే అడవుల పాలౌతాను; ఓడిపోతే నా బాహుబలంతో శత్రువులను జయిస్తా'నని రాజులంతా వింటుండగా, మహాత్ముడైన భీష్ముడితో అన్నాడు గదా!

**వ. కావున నతం డంతకు మున్నుకయ్యంబునకుం దొలంగియుండె; నాఁ డట్లు మా మనంబులెల్ల నా సూతనందను దెసకుం బాఱె'ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 23**

**ప్రతిపదార్థం:** కావునన్= ఈ కారణాలవలన; అతండు= ఆ కర్ణుడు; అంతకున్ మున్ను= అప్పటి వరకు; కయ్యంబునకున్= యుద్ధమునకు; తొలంగిఉండెన్= దూరంగా ఉన్నాడు; నాఁడు= భీష్ముడు యుద్ధం నుండి తొలగిన మరునాడు; అట్లు= ఆ విధంగా; మనవారి= మన కౌరవపక్షం వారి; మనంబులు= మనస్సులు; ఎల్లన్= అన్ని; ఆ సూతనందను దెసకున్= ఆ కర్ణుడివైపు; పాఱెన్= ప్రసరించాయి; అనినన్= అనగా విని; ఆంబికేయుండు= అంబికా పుత్రుడైన ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** భీష్ముడు కర్ణుడిని అర్ధరథుడనటం వలన యుద్ధరంగంలో భీష్ముడు ఉన్నంత వరకు అతడు యుద్ధానికి రాలేదు. భీష్ముడి పతనానంతరం మన కౌరవుల మనస్సులన్నీ కర్ణుడివైపు ప్రసరించాయి' అనగా విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'తను నిమ్మెయిఁ దలచిన య । మ్మను జేంద్రులఁ గౌరవులను మన మూఁకల న**
**య్యనిఁ గర్ణుఁడు గాచెనె? తన । మనోరథము లెల్ల ఫలసమగ్రతఁ బొందన్.' 24**

**ప్రతిపదార్థం:** తనున్= కర్ణుడిని; ఈ+మెయిన్= ఈ విధంగా; తలఁచిన= స్మరించిన; ఆ+మనుజేంద్రులన్= ఆ రాజులను; కౌరవులన్= దుర్యోధనాదులను; మన మూఁకలన్= మన సేనలను; ఆ+అనిన్= ఆ యుద్ధంలో; కర్ణుఁడు= కర్ణుడు; తన= తనయొక్క; మనోరథములు= కోర్కెలు; ఎల్లన్= అన్ని; ఫలసమగ్రతన్= పూర్ణఫలాన్ని; పొందన్= పొందగా; కాచెనె?= కాపాడెనా?

**తాత్పర్యం:** 'కర్ణుడిని ఈ విధంగా స్మరిస్తే, అతడు ఆ రాజులను, దుర్యోధనాది కౌరవులను, మన సైన్యాన్ని తాను భీష్ముడు పడిపోతే రక్షిస్తానని చెప్పి ఉన్నాడు గదా! అట్లా తన మనోరథం నెరవేరగా రక్షించాడా?'

**వ. అనవుడు నమ్మనుజపతికి నతం డిట్లనియె. 25**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; ఆ+మనుజ పతికిన్= ఆ ధృతరాష్ట్రుడితో; అతండు= ఆ సంజయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా, ధృతరాష్ట్ర మహారాజుతో సంజయుడు ఇట్లా అన్నాడు.

**క. వననిధి నడు నీటఁ గలము । మునిఁగిన బెగడందు చిత్తములు గలిగిన త**
**జ్జనుల క్రియ నున్న సేనలు । గనుఁగొన దీవిగతిఁ దోఁచెఁ గర్ణుం డంతన్. 26**

**ప్రతిపదార్థం:** వననిధిన్= సముద్రంలో; నడు నీటన్= నీటి నడుమ; కలము= పడవ; మునిఁగినన్= మునిగిపోగా; బెగడు+అందు= భయపడే; చిత్తములు= మనస్సులు; కలిగిన= కల; తద్+జనుల క్రియన్= ఆ మనుష్యులవలె; ఉన్నసేనలు= ఉన్నటువంటి సైన్యాలు; కనుఁగొనన్= పరిశీలించగా; అంతన్= అప్పుడు; కర్ణుండు= కర్ణుడు; దీవి గతిన్= ద్వీపంవలె; తోఁచెన్= కనిపించినాడు.

**తాత్పర్యం:** సముద్ర మధ్యంలో పడవ మునిగితే బెదరిపోయిన వారివలె ఉన్న కౌరవ సేనలకు కర్ణుడు ద్వీపంవలె కనిపించినాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు పురంబు వెడలి యతండు కురుపతి కడ కేతెంచి ప్రీతుం డగు నతని చేత నభినందితుండై రాజలోకంబు నాలోకించి. 27**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పురంబు= హస్తినాపురం నుండి; వెడలి= వెళ్లి; అతండు= ఆ కర్ణుడు; కురుపతి కడకున్= దుర్యోధనుడి వద్దకు; ఏతెంచి= వచ్చి; ప్రీతుండు+అగు= సంతోషించిన; అతనిచేతన్= ఆ దుర్యోధనుడి చేత; అభినందితుండు+ఐ= ప్రశంసించబడినవాడై; రాజలోకంబున్= రాజుల సమూహాన్ని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా హస్తినాపురం నుండి కర్ణుడు దుర్యోధనుడి వద్దకు వచ్చి, సంతసించిన అతడిచేత ప్రశంసించబడి, అచటి రాజులను చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'దమమును సత్యముం దపము దానము శీలము నస్త్రవీర్య శౌ**
**ర్యములును భీష్మునంద కల; వట్టి మహాత్ముఁడు పోర నీల్గె; నిం**
**క మనకు నేటి బాహు బల గర్వము లెక్కడి సేన లక్కటా!**
**సమసెనె కౌరవేశ్వరుని సంపద?' యంచు విషణ్ణమూర్తియై. 28**

**ప్రతిపదార్థం:** దమమును= ఇంద్రియనిగ్రహం; సత్యమున్= సత్యము; తపమున్= తపస్సు; దానమున్= దానం; శీలమున్= సత్ప్రవర్తన; అస్త్ర= మంత్రపూర్వకంగా ప్రయోగించే ఆగ్నేయాస్త్రాదులు; వీర్య= బలము; శౌర్యములును= యుద్ధంలో భయపడని గుణం; భీష్మ+అందు+అ= భీష్ముడియందే; కలవు= ఉన్నవి; అట్టి మహాత్ముఁడు= ఆ విధమైన సద్గుణ సంపన్నుడైన; మహనీయుడు; పోరన్= యుద్ధంలో; ఈల్గెన్= కూలెను; ఇంకన్= ఆపై; మనకున్= కౌరవులకు; ఏటి= ఎక్కడి; బాహుబలగర్వము= భుజబలం వలన కలిగిన అహంకారం; ఎక్కడి సేనలు= ఎక్కడి సైన్యాలు; అక్కట!= అయ్యో!; కౌరవేశ్వరుని= దుర్యోధనుడియొక్క; సంపద= సౌభాగ్యం; సమసెనె?= నశించెనే?; అంచున్= అంటూ; విషణ్ణమూర్తి+ఐ= విషాదమే రూపంగా కలవాడై.

**తాత్పర్యం:** ఇంద్రియనిగ్రహం, సత్యవాక్పరిపాలన, తపస్సు, దాతృత్వం, సత్ప్రవర్తన, అస్త్రాలను ప్రయోగించే సామర్థ్యం వంటి సద్గుణాలు ఒక్క భీష్ముడిలోనే ఉన్నవి. అటువంటి మహనీయుడు యుద్ధంలో కూలిపోయాడు. ఇంక మనకు బాహుబలగర్వం ఎక్కడ? ఎక్కడి సేనలు? అయ్యో! కౌరవేశ్వరుడైన దుర్యోధనుడి ఐశ్వర్యం నశించింది కదా! అని కర్ణుడు భీష్ముడిని తలచుకొని విచారగ్రస్తుడై.

**విశేషం:** భీష్ముడి ధర్మవీర, యుద్ధవీర గుణాలను స్మరించటంవలన కర్ణుడిలో శోకం ఉద్దీప్తమై విషాదం అలముకొన్నది. ఇక్కడ వీరరసం కరుణ రసానికి పోషకంగా ఉన్నది.

**క. కన్నీ రొలుకఁగ వగచిన । నన్నరపతులెల్ల నేడ్చి రార్తరవంబుల్**
**మిన్నంద నశ్రుజలములు । విన్నని వదనంబులందు వెల్లిగొనంగన్. 29**

**ప్రతిపదార్థం:** కన్నీరు= కంటినీరు; ఒలుకఁగన్= కారగా; వగచినన్= ఏడ్వగా; ఆ+నరపతులు= ఆ కౌరవపక్షంలోని రాజులు; ఎల్లన్= అందరు కూడా; ఆర్తరవంబుల్= దుఃఖధ్వనులు; మిన్ను+అందన్= ఆకాశాన్ని తాకగా; అశ్రుజలంబుల్= కన్నీరు; విన్నని= వెలవెలపోయిన; వదనంబులందున్= ముఖములందు; వెల్లిగొనంగన్= జాలువారగా; ఏడ్చిరి=శోకించారు.

**తాత్పర్యం:** కర్ణుడు కన్నీరు కారేవిధంగా ఏడ్వగా, అక్కడఉన్న రాజులందరు ఆర్తరవాలు మిన్ను ముట్టేటట్లు, వివర్ణాలైన మొగాలపై అశ్రువులు జాలువారగా శోకించారు.

**విశేషం:** ఆర్తరవాలు, అశ్రువులు, తెల్లబోయిన వదనాలు అనే అనుభావాలవలన దైన్య విషాదాదులు వ్యక్తమై ఇందు కరుణరసం ఉట్టిపడుతున్నది.

**వ. అప్పుడు దన్నుం దాన యుపశమించుకొని యందఱడెందంబుల యుమ్మలికంబులు వాయ రాధేయుం డిట్లనియె. 30**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; తన్నున్= తనను; తాను+అ= తానే; ఉపశమించుకొని= ఓదార్చుకొని; అందఱ= అందరియొక్క; డెందంబుల= మనస్సులలోని; ఉమ్మలికంబులు= బాధలు; పాయన్= పోయేటట్లుగా; రాధేయుండు= రాధా కుమారుడైన కర్ణుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడు ఆ సమయంలో తనను తాను ఓదార్చుకొని, అక్కడగల వారందరిలోని బాధలు తొలగిపోయేటట్లు ఈ విధంగా అన్నాడు.

**క. 'మీ రెల్లఁ జూచుచుండఁగఁ । గౌరవ నికురంబమునకుఁ గన్నాకై యొ**
**ప్పారెడు భీష్ముఁడు వడియెను । మేరు వొఱగినట్టు లసము మిగుల నరునకున్. 31**

**ప్రతిపదార్థం:** మీరు; ఎల్లన్= అందరు; చూచుచుండఁగన్= చూస్తుండగా; కౌరవ= కౌరవులయొక్క; నికురుంబమునకున్= సమూహానికి; కన్నాకు+ఐ= ముఖ్యుడై; ఒప్పారిన= ఉన్న; భీష్ముఁడు= భీష్ముడు; నరునకున్= అర్జునుడికి; అసము= దర్పం; మిగులన్= అతిశయించగా; మేరువు= మేరుపర్వతం; ఒఱగినట్టులు= వంగిన విధంగా; పడియెన్= పడిపోయాడు.

**తాత్పర్యం:** మీరంతా చూస్తుండగా, కౌరవ సైన్యంలో అగ్రేసరుడైన భీష్ముడు, అర్జునుడి దర్పం అతిశయించగా మేరు పర్వతం విరిగినట్లు పడిపోయాడు.

**వ. నా తెఱంగు వినుండు. 32**

**ప్రతిపదార్థం:** నా= నా యొక్క; తెఱంగు= విధం; వినుండు= వినండి.

**తాత్పర్యం:** కర్ణుడు తన శౌర్యధైర్య పరాక్రమములను గూర్చి వినండి అని కౌరవసేనతో అంటున్నాడు.

**క. కలఁగిన సేనలఁ గాచెద; । నిలిపెద నర్జునుని కడఁక నెఱపెద; బాహా**
**బల మా భీష్ముం డె ట్ల । గ్గలిక మెఱసె నట్ల మీకుఁ గన్నులు దనియన్. 33**

**ప్రతిపదార్థం:** కలఁగిన= చెదరిన; సేనలన్= సైన్యాలను; కాచెదన్= రక్షిస్తాను; అర్జునుని= అర్జునుని యొక్క; కడఁక= ప్రయత్నాన్ని; నిలిపెదన్= అడ్డగిస్తాను; ఆ భీష్ముండు= ఆ భీష్ముడు; ఎట్లు= ఏ విధంగా; అగ్గలికన్= ఆధిక్యంతో; మెఱసెన్= ప్రకాశించాడో; అట్లు+అ= ఆ విధంగానే; మీకున్= కౌరవ సైన్యానికి; కన్నులు; తనియన్= తృప్తిపొందేటట్లు; బాహాబలము= భుజబలం; నెఱపెదన్ = ప్రదర్శిస్తాను.

**తాత్పర్యం:** నేను మన చెదరిపోయిన సైన్యాన్ని కాపాడుతాను. అర్జునుడి పూనికను ప్రతిఘటిస్తాను. భీష్ముడు ఏ విధంగా శౌర్యంతో ప్రకాశించాడో అట్లా నా భుజబలాన్ని ప్రదర్శిస్తాను.

**ఉ. ధర్మజ భీమ పార్థులును దమ్ములు నుద్భట సంగరక్రియా**
**కర్మఠు లచ్యుతానుజుని గర్వము దుర్విషహంబు వారి మ**
**త్కార్ముక ముక్త చండశర ఖండిత దేహులఁ జేసి యిత్తు నేఁ**
**బేర్మిగఁ గౌరవేంద్రున కభీష్టత రాజ్యరమా విలాసమున్. 34**

**ప్రతిపదార్థం:** ధర్మజ= ధర్మరాజు; భీమ= భీముడు; పార్థులును= అర్జునుడును; తమ్ములున్= వారి తమ్ములైన నకుల సహదేవులును; ఉద్భట= గొప్ప; సంగరక్రియా= యుద్ధం చేయటంలో; కర్మఠులు= సఫలమయ్యే వరకు పనిచేసేవారు; అచ్యుత+అనుజుని= కృష్ణుడి తమ్ముడైన సాత్యకియొక్క; గర్వము= అహంకారం; దుర్విషహంబు= సహించరానిది; వారిన్= పాండవులను, సాత్యకిని; మత్= నా యొక్క; కార్ముక= ధనుస్సు నుండి; ముక్త= వదలబడిన; చండ= తీవ్రమైన; శర= బాణాలచేత; ఖండిత= త్రుంచబడిన; దేహులన్= శరీరాలు కలవారిగా; చేసి= చేసి; పేర్మిగన్= గౌరవంగా; కౌరవ+ఇంద్రునకున్= దుర్యోధన మహారాజుకు; అభీష్టతన్= కోరికతో; రాజ్య= రాజ్యమనే; రమా= లక్ష్మియొక్క; విలాసమున్= లీలను; ఏన్= నేను; ఇత్తున్=ఇస్తాను.

**తాత్పర్యం:** ధర్మరాజు, భీముడు, అర్జునుడు, నకులుడు, సహదేవుడు యుద్ధం చేయడంలో వెనుదిరుగని శూరులు. సాత్యకి గర్వం సహించరానిది. వీరందరిని నా ధనుస్సునుండి వెలువడే ప్రచండ బాణాల చేత తునాతునకలు చేసి, నేను కౌరవేశ్వరుడైన దుర్యోధనుడికి అతడు కోరినట్లుగా రాజ్యలక్ష్మి విలాసాలను అందిస్తాను.

**విశేషం:** పాండవుల యొక్క, సాత్యకియొక్క ధైర్యపరాక్రమాదుల స్మరణ వలన ఉద్దీప్తమైన కర్ణుడిలోని ఉత్సాహం అతడి ధైర్యశౌర్యాదులచేత పోషింపబడి వీరరసంగా వ్యక్తమౌతున్నది.

**క. కాదేని గాండివజ్యా । నాదము సురదుందుభి ప్రణాదంబును నిః**
**ఖేదుఁడనై వించు నధిక । మోదంబున నిత్య సౌఖ్యముం గైకొందున్. 35**

**ప్రతిపదార్థం:** కాదు+ఏనిన్= పాండవులను జయించలేకపోతే; గాండివ= గాండీవం అనే పేరుగల అర్జునుడి ధనుస్సుయొక్క; జ్యా= అల్లెత్రాటి; నాదమున్= ధ్వనియు; సురదుందుభి= దేవతలు మ్రోగించే దుందుభి అనే వాద్యం యొక్క; ప్రణాదంబును = తీవ్రతరమైన ధ్వనిని; నిఃఖేదుఁడను+ఐ= దుఃఖం ఏమాత్రం లేనివాడినై; వించున్= వింటూ; అధిక= మిక్కిలి; మోదంబునన్= సంతోషంతో; నిత్య= శాశ్వతమైన; సౌఖ్యమున్= ఆనందాన్ని, వీరస్వర్గాన్ని; కైకొందున్= పొందుతాను.

**తాత్పర్యం:** నేను పాండవులను జయించలేకపోతే, అర్జునుడి గాండీవం నుండి వచ్చే నాదాన్ని, దేవదుందుభుల మ్రోతను ఆనందంతో వింటూ, సంతోషంతో వీరస్వర్గాన్ని అలంకరిస్తాను.

**క. కౌరవులం గాచుచు రణ । శూరులఁ బాండవుల నోర్చుచుం గీర్తి కర**
**స్ఫారవిహారత భీష్మునిఁ । జేరంజను కంటె నొప్పు సెప్పం గలదే?' 36**

**ప్రతిపదార్థం:** కౌరవులన్= దుర్యోధనాదులను; కాచుచున్= కాపాడుతూ; రణ= యుద్ధంలో; శూరులన్= శౌర్యంగలవారైన; పాండవులన్= ధర్మజుడు మొదలైన పాండురాజు పుత్రులను; ఓర్చుచున్= ఓడిస్తూ; కీర్తికర= యశస్సును కలిగించే; స్ఫార= అధికమైన; విహారతన్= విహరించే గుణంతో, స్వైరవిహారం చేసి; భీష్మునిన్= భీష్మపితామహుడిని; చేరన్+చనుకంటెన్= చేరబోవటం కంటె; ఒప్పు= యోగ్యమైనది; చెప్పన్+కలదే?= చెప్పడాని కేముంది?

**తాత్పర్యం:** దుర్యోధనాది కౌరవవర్గాన్ని రక్షిస్తూ, రణశూరులైన పాండవులను ఓడిస్తూ, యుద్ధంలో ప్రశంసాపూర్వకంగా స్వైరవిహారం చేస్తూ భీష్ముడిని చేరబోవటంకంటె వేరే చెప్పవలసిం దేమున్నది?'

**వ. అని పలికి తన సారథిం గనుంగొని. 37**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఆ విధంగా చెప్పి; తన సారథిన్= తన రథసారథిని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** కర్ణుడు పై విధంగా పలికి, తన సారథిని చూచి.

**సీ. 'మణిగణోజ్జ్వలమైన మన యరదంబున । జవనాశ్వములఁ బూన్పు; చాప బాణ**
**ఖడ్గాది సాధనోత్కర మొడఁగూర్పుము । రత్నధ్వజం బెత్తు రశ్ములడర**
**శంఖ మృదంగ నిస్సాణాది తూర్యముల్ । సంఘటింపుము రభసమున' ననుడు**
**వాఁ డట్ల చేయ దుర్వార గర్వోద్ధతి । నగ్నిప్రభంబగు నారథంబు**

**తే. పటురయంబున నెక్కి భూపతికి మ్రొక్కి । యాతఁ డెల్ల కౌరవులును నఖిల నృపులుఁ**
**దన్నుఁ గొనియాడఁ గర్ణుఁ డుత్సాహ లీల । నిజ బలాభీల సుందర ధ్వజము లొప్ప. 38**

**ప్రతిపదార్థం:** మణిగణ= రత్న సమూహంతో; ఉజ్జ్వలము+ఐ= మిక్కిలి ప్రకాశించే; మన+అరదంబునన్= మన రథమునందు; జవనాశ్వముల్= వడిగల గుర్రాలను; పూన్పు= కట్టుము; చాప= ధనుస్సులు; బాణ= అమ్ములు; ఖడ్గ+ఆది= కత్తులు మొదలైన; సాధన+ఉత్కరము= పరికరాల సమూహం; ఒడన్+కూర్పుము= సమకూర్చుము; రశ్ములు= కిరణాలు; అడరన్= అతిశయించగా; రత్నధ్వజంబు= మణులుగల టెక్కెపు స్తంభం; ఎత్తు(ము)= పైకెత్తుము; శంఖ= శంఖం; మృదంగ= మద్దెల; నిస్సాణ+ఆది= నిస్సాణం మొదలైన; తూర్యముల్= వాద్యవిశేషాలను; రభసమునన్= వేగంగా; సంఘటింపుము= కూర్చుము; అనుడున్= అనగా; వాఁడు= ఆ సారథి; అట్లు+అ= ఆ విధంగానే; చేయన్= చేయుగా; దుర్వార= వారించటానికి వీలుకాని; గర్వ+ఉద్ధతిన్= గర్వం యొక్క ఉద్రేకంతో; అగ్ని= అగ్ని యొక్క; ప్రభంబు= ప్రకాశంకలది అగు; ఆ రథంబు= ఆ రథాన్ని; పటురయంబునన్= మిక్కిలి వేగంగా, ఎక్కి; భూపతికిన్= దుర్యోధన మహారాజుకు; మ్రొక్కి= నమస్కరించి; ఆతఁడు= ఆ కర్ణుడు; ఎల్ల కౌరవులున్= కౌరవులందరు; అఖిల నృపులున్= రాజులందరు; తన్నున్= తనను; కొనియాడన్= ప్రశంసించగా; ఉత్సాహలీలన్= ఉత్సాహంయొక్క విలాసంతో; నిజ= తన; బల= సైన్యం యొక్క; ఆభీల= భయం గొలిపే; సుందర= అందమైన; ధ్వజములు= టెక్కెపు కంబాలు; ఒప్పన్= ఒప్పగా.

**తాత్పర్యం:** మణులతో ప్రకాశించే మన రథానికి వడిగల గుర్రాలను పూన్చుము. ధనుర్బాణాలు, ఖడ్గాలు మొదలైన ఆయుధ సామగ్రిని సమకూర్చుము. మిలమిలలాడే రత్నధ్వజాన్ని ఎత్తుము. శంఖం, మృదంగం, నిస్సాణం మొదలైన వాద్యాలను త్వరగా చేర్చుము' అనగా, ఆ సారథి వాటి నన్నింటిని రథంలో సిద్ధపరచాడు. కర్ణు డపుడు అనివార్యమైన గర్వంతో అగ్నిహోత్రుడివలె ప్రకాశించే ఆ రథాన్ని వెంటనే ఎక్కి, దుర్యోధన మహారాజుకు నమస్కరించి, కౌరవులు, రాజులు బహుముఖాల ప్రశంసిస్తుండగా, ఉత్సాహం మించగా, తన సైన్యంలో భయం గొలిపే సుందరమైన ధ్వజాలు వెలుగొందుతుండగా.

**విశేషం:** ఇందుగల అగ్ని ప్రభమైన రథం, ధ్వజ, బాణ, శంఖాది సామగ్రి అంతా కర్ణుడిలోని యుద్ధవీరాన్ని ఉద్దీపనం చేసేది.

**వ. నడచి, నదీనందనుం డున్న యెడకుఁ జేర ంబోయి, శోషించిన సముద్రంబు చందంబున, విమానంబు విఱిగిపడిన దివ్యుని తెఱంగున, భూతల పతితుండైన పతంగు భంగిని, భగ్నపక్షంబైన మైనాకంబు మాడ్కిం బొలుచు నతని కడకుం బాదచారియై యరిగి, ఫల్గును నారాచనిచయంబునం బొదువంబడి యమునానదీ హ్రదస్థితంబును మదనిమీలితాక్షంబునునై శోభిల్లుశుండాలంబు ననుకరించుచు వీరశయన మహనీయుండైనయమ్మహానుభావుని యడుగులపైఁ గన్నీరు దొరఁగం బ్రణమిల్లి, కేలు మొగిచి, వినయ వినమిత శరీరుండై. 39**

**ప్రతిపదార్థం:** నడచి; నదీనందనుండు= భీష్ముడు; ఉన్న+ఎడకున్= ఉన్నచోటికి; చేరన్+పోయి= సమీపించి; శోషించిన= ఎండిపోయిన; సముద్రంబు= సముద్రం; చందంబునన్= వలె; విమానంబు= విమానం; విరిగిపడిన= విరిగిపోయి క్రిందపడిన; దివ్యుని= దేవలోకస్థుడి; తెఱంగునన్= విధంగా; భూతల= భూమిపై; పతితుండు+ఐన= పడిపోయిన; పతంగు= పక్షి; భంగిని= వలె; భగ్నపక్షంబు+ఐన= రెక్కలు విరిగిన; మైనాకంబు= హిమవత్పర్వతుడి పుత్రుడైన మైనాక పర్వతం; మాడ్కిన్= వలె; పొలుచు= ఒప్పు; అతని కడకున్= ఆ భీష్ముడి దగ్గరకు; పాదచారి+ఐ= కాళ్ళతో నడుస్తూ; అరిగి= వెళ్ళి; ఆ ఫల్గును= అర్జునుడి యొక్క; నారాచ= బాణాల; నిచయంబునన్= సమూహంతో; పొదువన్+పడి= కప్పబడి; యమున= యమున అనే పేరుగల; నదీ= నదియొక్క; హ్రద= మడుగులో; స్థితంబును= ఉన్న; మద= మదంచేత; నిమీలిత+అక్షంబునున్+ఐ = కన్నులు మూసికొని; శోభిల్లు= ప్రకాశించే; శుండాలంబున్= ఏనుగును; అనుకరించుచున్= పోలుచు; వీరశయన= శరతల్పంపై పరుండిన; మహనీయుండు+ఐన= మహాత్ముడైన; ఆ+మహానుభావుని= ఆ గొప్ప ప్రభావంగల భీష్మునియొక్క; అడుగులపైన్= పాదాలపై; కన్నీరు= కంటినీరు; తొరఁగన్= జారగా; ప్రణమిల్లి= నమస్కరించి; కేలు మొగిడ్చి= చేతులు జోడించి; వినయ= వినయంతో; వినమిత= మిక్కలి వంగిన; శరీరుండు+ఐ= దేహం కలవాడై.

**తాత్పర్యం:** కర్ణుడు నడచి భీష్ముడు ఉన్నచోటికి వచ్చాడు. అక్కడ ఎండిపోయిన సముద్రంవలె, విమానం విరుగగా పడిపోయిన అమరుడివలె, భూమిపై పడిన పక్షివలె, రెక్కలు విరిగిన మైనాక పర్వతంవలె ఒప్పుతున్న ఆ కురుపితామహుడి వద్దకు వెళ్లి, అర్జునుడి బాణాలచేత పొదువబడి, యమునానది మడుగులో మదంచేత కన్నులు మూసికొని ఉన్న ఏనుగువలె శరతల్ప గతుడైన ఆ మహానుభావుడి పాదాలపై కన్నీరు రాలగా నమస్కరించి, చేతులు జోడించి, వినయంతో వంగిన శరీరం కలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: మాలోపమ. యుద్ధంలో కూలిన భీష్ముని రెక్కలు తెగిన మైనాకుడితో ఉపమించడంలో ఎంతో ఔచిత్యం ఉంది. మైనాకుడు మేనా హిమవంతుల పుత్రుడు, పర్వతాలకు పూర్వం రెక్కలు ఉండేవట. అవి పక్షులవలె ఎగిరి నగరాదులపైబడి ఉపద్రవం కలిగించేవి. లోకరక్షకుడైన ఇంద్రుడు పర్వతాల ఆగడాన్ని మాన్పడానికై వజ్రాయుధంతో పర్వతాల రెక్కలను ఛేదించేటప్పుడు మైనాకుడు ఎగిరిపోయి దక్షిణ సముద్రంలో దాగి తన రెక్కలు కాపాడుకొన్నాడు. ఇట శరతల్ప గతుడైన భీష్ముడిని రెక్కలు తెగి దీనస్థితికి చేరిన మైనాకునిగా భావించి శోకాన్ని వెలిబుచ్చినాడు కర్ణుడు.

**క. 'వచ్చితి రాధేయుఁడఁ; గను । విచ్చి ననుం జూడు భరత వీరాగ్రణి! నీ**
**సచ్చరితము ఫలమే యి । ట్లిచ్చట నీ యునికి? ధాత నేమన నేర్తున్? 40**

**ప్రతిపదార్థం:** భరత= భరతవంశానికి చెందిన; వీర= వీరులలో; అగ్రణి!= శ్రేష్ఠా!; రాధేయుఁడన్= రాధా పుత్రుడనైన కర్ణుడిని; వచ్చితిన్= వచ్చాను; కనువిచ్చి= కన్నులు తెరిచి; నన్నున్= నన్ను; చూడు(ము)= చూడవలసింది; ఇట్లు= ఈ విధంగా; ఇచ్చట= ఈ యుద్ధభూమిలో; నీ+ఉనికి= నీవు పడి ఉండటం; నీ= నీయొక్క; సత్+చరితము= మంచి నడత; ఫలమే= ఫలమా; ధాతన్= బ్రహ్మదేవుడిని; ఏమి+అననేర్తున్?= ఏమనగలను?

**తాత్పర్యం:** 'ఓ భరతకుల శ్రేష్ఠా! నీ దర్శనార్థం కర్ణుడిని వచ్చినాను. కన్నులు తెరిచి నన్ను చూడవలసింది. నీ సచ్చరిత్రకు యుద్ధభూమిలో దైన్యంగా పడి ఉండటమా ఫలం? విధిని ఏమనాలి?

**విశేషం:** 'భరత వీరాగ్రణి!' అనే సంబోధన సాభిప్రాయంతో, ఔచిత్యంతో కూడుకొన్నది. కర్ణుడి మాటలలో క్రోధ, విషాద, నిర్వేదాది భావాలు గోచరిస్తున్నవి.

**ఆ.** **పావనంబు లయిన పలుకులు నా చెవు । లార నెమ్మి నన్ను నాదరింపు**
**మయ్య! ధర్మనిత్య! యంచితసత్య! శం । తను కుమార! గాఢ ధైర్యసార! 41**

**ప్రతిపదార్థం:** ధర్మనిత్య!= ధర్మాన్ని ఎల్లవేళలా ఆచరించేవాడా!; అంచితసత్య!= సత్యాన్ని పూజించేవాడా!; గాఢ ధైర్యసార!= నిబిడమైన ధైర్యశక్తి కలవాడా!; శంతను కుమార!= శంతనుడి పుత్రుడా!; పావనంబులైన= పవిత్రమైన; పలుకులు= మాటలు; నా= నాయొక్క; చెవులు+ఆరన్= చెవుల తనివి దీరేటట్లుగా (పలికి); నెమ్మిన్= ప్రేమతో; నన్నున్= నన్ను; ఆదరింపుము+అయ్య!= మన్నించవయ్య!

**తాత్పర్యం:** సత్యాన్ని, ధర్మాన్ని సర్వకాల సర్వావస్థలలో పాటించేవాడా! అపార ధైర్యనిధీ! శంతను పుత్రా! పవిత్రమైన నీ వాక్కులచేత వీనులవిందు గావించి నన్ను ఆదరించుము.

**విశేషం:** ధర్మనిత్యాది విశేషణాలు సాభిప్రాయాలై భీష్ముడి మహనీయతను చాటుతున్నవి.

**ఉ.** **పేర్చిన మూఁకఁగూడ నడపింపఁగఁ గోల్తలసేయఁ దీవ్ర బా**
**ణార్చుల మార్బలంబుల రయంబున నీఱుగఁ గాల్ప నాజి నీ**
**నేర్చిన భంగి నొండొకఁడు నేర్చునె? పాండవ బాహు సంపదల్**
**పేర్చు నెలర్చు నింకఁ గురుబృందము లెల్లనుఁ దల్లడిల్లఁగన్. 42**

**ప్రతిపదార్థం:** పేర్చిన= విజృంభించిన; మూఁకన్= సైన్యాన్ని; కూడన్= కూడగట్టుకొని; నడిపింపఁగన్= నడిపించటంలో; కోల్తల+చేయన్= ముందుండి యుద్ధం చేయుటంలో; తీవ్ర= ప్రచండమైన; బాణ= బాణాలనే; అర్చులన్= మంటలచేత; మార్బలంబులన్= శత్రు సైన్యాలను; రయంబునన్= వెంటనే; నీఱుగన్= బూడిద అయ్యేటట్లు; కాల్పన్= కాల్చటంలో; ఆజిన్= యుద్ధంలో; నీ నేర్చిన= నీవు తెలిసికొన్న; భంగిన్= విధంగా; ఒండు+ఒకఁడు= మరొకడు; నేర్చునె?= నేర్చాడా?; కురుబృందములు= కౌరవ సైన్యాలు; ఎల్లనున్= అన్నీ; తల్లడిల్లఁగన్= బాధపడగా; ఇంకన్= ఇంకముందు; పాండవ= పాండురాజు పుత్రులైన ధర్మజాదులయొక్క; బాహుసంపదల్= భుజ బలాలు; పేర్చున్= విజృంభిస్తాయి; ఎలర్చున్= అతిశయిస్తాయి.

**తాత్పర్యం:** యుద్ధంలో విజృంభించిన సైన్యాన్ని కూడగట్టుకొని నడిపించటంలో, ముందుండి యుద్ధం చేయటంలో, ప్రచండమైన బాణాగ్నులతో ఆ క్షణంలోనే శత్రుసైన్యాలను భస్మీపటలం చేయటంలో నిన్ను మించినవాడు మరొక డెవ్వడు? ఇకమీద కౌరవసైన్యం తల్లడిల్లేటట్లు పాండవుల బాహుబలాలు మిక్కిలి విజృంభిస్తాయి.

**క.** **శర జిహ్వా భీకరుఁ డగు । నరుఁ డను శిఖి నిగుడఁ జేసి నారాయణ దు**
**ర్ధర పవనుఁ డింక బంధుర । కురుసేనా కాననంబు క్రొ వ్వడఁగించున్. 43**

**ప్రతిపదార్థం:** శర= బాణాలనే; జిహ్వా= నాలుకలచేత; భీకరుఁడు+అగు= భయంకరుడైన; నరుఁడు= అర్జునుడు; అను= అనే; శిఖి= అగ్నిహోత్రుడిని; నిగుడన్+చేసి= వృద్ధిచేసి; నారాయణ= శ్రీకృష్ణుడు అనే దుర్ధర= భరించవీలుగాని; పవనుఁడు= గాలి; ఇంకన్= ఇకముందు; బంధుర= దట్టమైన; కురుసేనా= కౌరవసేన అనే; కాననంబు= అడవి; క్రొవ్వు= బలుపును; అడఁగించున్= అణచివేస్తాడు.

**తాత్పర్యం:** బాణాలు అనే నాలుకలచేత భీకరుడైన అర్జునుడు అనే అగ్నిహోత్రుడిని వ్యాపింపజేసి, శ్రీకృష్ణుడు అనే భరించరాని వాయుదేవుడు ఇకముందు కౌరవసేన అనే అరణ్యంయొక్క బలుపును అణచివేస్తాడు.

**విశేషం:** అలం: రూపకం. కృష్ణార్జునులు ఇద్దరూ పూర్వజన్మలో నరనారాయణులనే మహాతపస్వులైన మునులు. కనుక వారితో వీరికి అభేదాన్ని సూచించడానికి పూర్వపు పేర్లు ఇట వాడబడినవి.

**మ.** **భరితాశాంతర పాంచజన్యరవ దృప్యద్దేవదత్త ధ్వని**
**స్ఫురణన్ వీనులు వ్రయ్యఁ గేతన కపిస్ఫూర్జత్ప్రభం జూడ్కు లా**
**తురతం బొందఁగఁ జండగాండివ సముద్భూతాస్త్రజాలంబు లె**
**వ్వరు సైరింతురు? నీవు దక్క భుజగర్వస్ఫూర్తి నిర్వాహకా!** 44

**ప్రతిపదార్థం:** భుజ= బాహువుల; గర్వస్ఫూర్తి= అహంకారస్ఫురణముయొక్క; నిర్వాహకా!= నిర్వహించే భీష్ముడా!; భరిత= నిండిన; ఆశా+అంతర= దిక్కుల లోపలి విభాగంగల; పాంచజన్య= పాంచజన్యం అనే శ్రీకృష్ణుడి శంఖం యొక్క; రవ= చప్పుడు; దృప్యత్= దర్పిస్తున్న; దేవదత్తధ్వని= అర్జునుడి శంఖమైన దేవదత్తంయొక్క నాదంయొక్క; స్ఫురణన్= తోచటంవలన; వీనులు= చెవులు; వ్రయ్యన్= పగులగా; కేతన= ధ్వజంపై గల; కపి= హనుమంతుడి యొక్క; స్ఫూర్జత్= ప్రకాశిస్తున్న; ప్రభన్= వెలుగులవలన; చూడ్కులు= చూపులు; ఆతురతన్= బాధను; చండ= భయంకరమైన; గాండివ= గాండీవం అనే అర్జునుడి ధనుస్సువలన; సముద్భూత= పుట్టిన; అస్త్రజాలంబులు= మంత్రపూతాలైన బాణసమూహాలు; నీవు+తక్క= నీవు తప్ప; ఎవ్వరు= ఇతరు లెవ్వరు; సైరింతురు?= ఓర్చుకొంటారు?

**తాత్పర్యం:** బాహు బల గర్వం స్ఫురించేటట్లు పోరుసల్పే భీష్మా! కౌరవ సైన్యం నలువైపులా పాంచజన్య, దేవదత్త ధ్వనులు మోయటం వలన చెవులు పగులగా, అర్జునుడి ధ్వజంపైగల హనుమంతుడి మెరిసే వెలుగు వలనచూపులు చెదరిపోగా; భయంకరమైన గాండీవంనుండి దూసుకొనివచ్చే అస్త్రసమూహాన్ని నీవు తప్ప ఎవ్వరు సహిస్తారు?

**విశేషం:** ఇట శత్రువులైన కృష్ణార్జునుల అతిలోక పరాక్రమాన్ని ప్రశంసించడంవలన కర్ణుని ఔదార్యం వ్యక్తమౌతున్నది.

**ఆ.** **మెయి మెయిం బెనంగి మెచ్చించి ముక్కంటి । చే వరంబు గొని విశిష్ట దివ్య**
**కర్మదీప్తుఁ డైన గాండీవి నొరుఁ డాజిఁ । జెనయఁ జాలకునికి సెప్ప నేల?'** 45

**ప్రతిపదార్థం:** ముక్కంటిచేన్= మూడు కన్నులు కలవాడిచేత - శివుడిచేత; మెయిమెయిన్= దేహాన్ని దేహంతో; పెనంగి= యుద్ధం చేసి; మెచ్చించి= మెప్పించి; వరంబు+కొని= వరం సంపాదించి; విశిష్ట= శ్రేష్ఠమైన; దివ్య= దేవతా సంబంధమైన; కర్మ= పనులచేత; దీప్తుఁడు+ఐన= ప్రకాశించేవాడు అయిన; గాండీవిని= గాండీవమనే ధనుస్సును ధరించే అర్జునుడిని; ఒరుఁడు= ఇతరుడు; ఆజిన్= యుద్ధంలో; చెనయన్+చాలక= ఎదుర్కొనలేక; ఉనికి= ఉండటాన్ని గూర్చి; చెప్పన్+ఏల?= చెప్పేది ఏముంది?

**తాత్పర్యం:** మహేశ్వరుడితో శరీరాన్ని శరీరంతో కలిపి ద్వంద్వ యుద్ధం చేసి, అతడి మెప్పువడసి, వరాలు పొంది, ఇంద్రుడి కోర్కెపై నివాతకవచాదులను హతమార్చటంవంటి దివ్యకర్మలచేత వెలుగొందిన గాండీవిని ఇతరు లెవ్వరు ఎదిరించజాలకపోవటంలో ఆశ్చర్యమేమున్నది?

**విశేషం:** అరణ్యవాసంచేసే సందర్భంలో, దివ్యాస్త్రాలను సంపాదించేకొరకై ఇంద్రకీలాద్రిపై ఘోరతపస్సు చేసి, కిరాతుడి రూపంలో వచ్చిన రుద్రుడిపైబడి పోరి, అతని ప్రశంసలనంది, పాశుపతాది దివ్యాస్త్రాలనుపొందిన గాథ ఇందులో సూచించబడింది. ఇందులో ముక్కంటి శబ్దమూ, గాండీవి శబ్దమూ సాభిప్రాయాలు.

**క. అని పెక్కు మాట లాడిన । విని యాదరభరితనేత్ర విస్తారుం డై**
**యనిమిష నదీతనూజుఁడు । గనుఁగొనుటయు మఱియు మ్రొక్కి కర్ణుఁడు పలికెన్. 46**

**ప్రతిపదార్థం:** అని= కర్ణుడు ఇట్లు అని; పెక్కుమాటలు+ఆడిన= బహు విధాలుగా పలుకగా; విని; అనిమిష నదీ తనూజుఁడు= దేవనదీ పుత్రుడైన భీష్ముడు; ఆదర= మన్ననతో; భరిత= నిండిన; నేత్ర విస్తారుండు+ఐ= కన్నుల విప్పుగలవాడై; కనుఁగొనుటయున్= చూడగా; మఱియున్= మరల; మ్రొక్కి= నమస్కరించి; కర్ణుఁడు= కర్ణుడు; పలికెన్= ఇట్లన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడు ఈ విధంగా పలురీతుల భీష్ముడిని ప్రశంసించగా, ఆదరంతో అతడు కన్నులు విచ్చి కర్ణుడిని చూచాడు. అపుడు కర్ణుడు ఆ మహనీయుడికి మ్రొక్కి ఇంకా ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఆ నరు నే నొకండన విషానల దుస్సహ దృష్టి భీషణం**
**బైన మహా భుజంగమము నద్భుత మంత్ర నిరస్త దర్పముం**
**గా నొనరించునట్లు భుజ గర్వ మడంచెద నస్త్ర శస్త్ర వి**
**ద్యా నిపుణత్వ సంపద నుదాత్త గుణోత్తర! నీవు పంపఁగన్.' 47**

**ప్రతిపదార్థం:** ఉదాత్తగుణ+ఉత్తర!= శ్రేష్ఠగుణాలతో ఉత్తముడవైన భీష్మా!; నీవు; పంపఁగన్= ఆజ్ఞాపించగా; ఆ నరున్= అట్టి దివ్యాస్త్రోపేతుడైన అర్జునుడిని; ఏన్+ఒకండన్+అ= నేనొక్కడినే; విష+అనల= విషమనే అగ్నిచేత; దుస్సహ= ఓర్వరాని; దృష్టి= చూపులచేత; భీషణంబు+ఐన= భయంకరమైన; మహాభుజంగమమున్= గొప్ప పామును; అద్భుత= ఆశ్చర్యంగొల్పే; మంత్ర= మంత్రముచేత; నిరస్తదర్పమున్+కాన్= తొలగిన దర్పం కలదానిగా; ఒనరించునట్లు= చేసినట్లు; భుజ గర్వము= బాహువుల అహంకారాన్ని; అస్త్ర= మంత్రపూర్వకంగా ప్రయుక్తమయ్యే వాయవ్యాద్యస్త్రాల; శస్త్ర= ఖడ్గాద్యాయుధాల; విద్యా= విద్య అందలి; నిపుణత్వ సంపదన్= నైపుణ్యం అనే సంపత్తుచేత; భుజగర్వము= బాహువుల పొగరును; అడంచెదన్= అణచివేస్తాను.

**తాత్పర్యం:** 'ఓ సద్గుణశ్రేష్ఠా! నీవు ఆజ్ఞాపిస్తే దివ్యాస్త్రోపేతుడైన అర్జునుడి బాహుగర్వాన్ని నేనొక్కడినే, విషాగ్నిని వెలిగ్రక్కే భయంకరమైన చూపులుగల మహాసర్పం యొక్క దర్పాన్ని అద్భుతమైన మంత్రశక్తితో అణచివేసినట్లు, నా అస్త్ర శస్త్ర విద్యానైపుణ్యంతో అణచివేస్తాను.'

**విశేషం:** అలం: ఉపమ. ఇందులో భీకరవిషసర్పంతో అర్జునుడిని పోల్చటంవలన కర్ణుడిలోని ఉత్సాహం ధైర్యశౌర్యాదులతో పోషించబడి వీర రస రూపంలో వ్యక్తమౌతున్నది.

**వ. అనిన గాంగేయుండు రాధేయున కిట్లనియె. 48**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; గాంగేయుండు= గంగాపుత్రుడైన భీష్ముడు; రాధేయునకున్= రాధాపుత్రుడైన కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడిని ఓడించటానికి తనను యుద్ధరంగానికి పంపుమని అడిగిన కర్ణుడితో భీష్ముడు ఈ విధంగా అన్నాడు.

**మ. 'తగఁ బర్జన్యుని సొంపునన్ బ్రతుకు భూతవ్రాతముల్ వార్ధి సొ**
**చ్చి గరిష్ఠస్థితి నుండు నేఱులును, సంక్షీణంబులై యుర్వి ని**
**ల్చి గుణాధిక్యముఁ బొందు బీజములుఁ బోలెం గౌరవుల్ విశ్రుతం**
**బగు నీప్రోపును బ్రాపుఁ గాపుఁ గని సౌఖ్యం బొందు టొప్పం గడున్. 49**

**ప్రతిపదార్థం:** తగన్= తగువిధంగా; పర్జన్యుని= మేఘుడి; సొంపునన్= సమృద్ధితో; బ్రతుకు= జీవించే; భూతవ్రాతమున్ పోలెన్= ప్రాణికోటివలెను; వార్ధి+చొచ్చి= సముద్రంలో ప్రవేశించి; గరిష్ఠ స్థితిన్= అత్యున్నత స్థాయిలో; ఉండు+ఏఱులున్ పోలెన్= ఉండే నదులవలెను; సంక్షీణంబులు+ఐ= మిక్కిలి ఎండిపోయినవై; ఉర్విన్ నిల్చి= నేలలో ఉండి; గుణ+ఆధిక్యమున్+పొందు= గుణముల ఆధిక్యమును పొందు; బీజములున్+పోలెన్= విత్తనాలవలెను; కౌరవుల్= దుర్యోధనాదులు; విశ్రుతంబు+అగు= ప్రసిద్ధమైన; నీ ప్రోపున్= నీ పోషణను; ప్రాపున్= ఆశ్రయాన్ని; కాపున్= రక్షణను; కని= పొంది; కడున్= మిక్కిలి; సౌఖ్యంబు= సుఖం; ఒందుట= పొందటం; ఒప్పున్= తగును.

**తాత్పర్యం:** ప్రాణికోటి వానలు సమృద్ధిగా కురియటం వలన రక్షించబడినట్లు, నదులు సముద్రాన్ని ఆశ్రయించి అత్యున్నత స్థితి పొందినట్లు, విత్తనాలు బాగా ఎండి భూమిలో ఉండి పెంపొందేటట్లు, కౌరవులు నీ పేరుగాంచిన పోషణలో ఉండి, నీ ఆశ్రయాన్ని పొంది, నీ రక్షణలో సౌఖ్యాన్ని పొందటం ఎంతైనా ఒప్పుకొనదగింది.

**విశేషం:** అలం: మాలోపమ.

**చ.** **అరయఁగ బంధుకోటులకు నక్కురునాథుని యట్లకావె, నీ**
**వరిబలభేది! జన్మమున నయ్యెడు చుట్టఱికంబుకంటె సు**
**స్థిరతరమైన సంగడము చే నగు బాంధవ మెక్కుడండ్రు రా**
**నరపతి రాజ్యభారము మనంబున నీయదిగాఁ దలంపుమీ!** 50

**ప్రతిపదార్థం:** అరి= శత్రువులయొక్క; బల= సైన్యాన్ని; భేది!= చీల్చే కర్ణా!; నీవు; అరయఁగన్= పరిశీలించగా; బంధుకోటులకున్= చుట్టాలందరికి; ఆ+కురునాథుని+అట్లు+అ= ఆ దుర్యోధనుడి వంటి వాడవే; కావె?= కావా?; జన్మమునన్= పుట్టుకతో; అయ్యెడు= కలిగే; చుట్టఱికంబుకంటెన్= బంధుత్వం కంటె; సుస్థిరతరము+ఐన= మిక్కిలి దృఢమైన; సంగడముచేన్= స్నేహంతో; అగు= కలిగే; బాంధవము= చుట్టరికం; ఎక్కుడు= ఎక్కువ; అందురు= అంటారు; ఆ నరపతి= ఆ దుర్యోధనుడి యొక్క; రాజ్యభారము= రాజ్యాన్ని మోయటం; మనంబునన్= మనస్సులో; నీ+అదిగాన్= నీదే అని; తలంపుమీ= భావించుము.

**తాత్పర్యం:** శత్రుసైన్యాన్ని భేదించే కర్ణా! బంధువర్గానికంతా నీవు కూడా దుర్యోధనుడి వంటి వాడవే కదా! పుట్టుకతో కలిగే బంధుత్వం కంటె దృఢమైన స్నేహంతో కలిగే ఆత్మీయతయే ఎక్కువ అని పెద్దలు అంటారు. దుర్యోధనుడి రాజ్యరక్షణభారం నీపైననే ఉన్నదని తెలిసికొనుము.

**వ.** **అంబష్ఠవిదేహపౌండ్రాదిదేశాధీశులగెల్చి, దుర్యోధనాధీనవర్తులంగా నిర్వర్తించిన నీకు నిట్లు సెప్పవలయునే? యండజంబులు పండినవృక్షంబు నుపజీవించు చందంబున నిన్నుం జెంది బంధువులు సుహృజ్జనులు సుఖులై యుండువారుగాక! నాకు నీవును సుయోధనునట్ల కావున మేలాడెదఁ; గౌరవుల నడపికొని, యమ్మహీ విభునకు విజయంబు గావింపుము పొ’మ్మని సమ్మదంబునం బలికిన సూతనందనుండు ప్రీతుండై యద్దేవవ్రతుచరణంబులు శిరంబు సోఁక వినతుండై వీడ్కొని, యరదం బెక్కి యరుగుదెంచి, భవదీయ సైన్యంబు దైన్యంబు వాపి, యే పగ్గలించి కలయం గనుంగొని.** 51

**ప్రతిపదార్థం:** అంబష్ఠ= అంబష్ఠ దేశం; విదేహ= విదేహమనే పేరుగల దేశం; పౌండ్ర+ఆది= పౌండ్ర+ఆది= పౌండ్రదేశం మొదలైన; దేశాధీశులన్= దేశాధిపతులను; గెల్చి= జయించి; దుర్యోధన= దుర్యోధనుడి యొక్క; అధీనవర్తులన్+కాన్= వశంలో ఉన్నవారినిగా; నిర్వర్తించిన= చేసిన; నీకున్= నీకు (కర్ణునకు); చెప్పవలయునే?= చెప్పవలసినదేమున్నది?; అండజంబులు= గ్రుడ్లనుండి పుట్టే

పక్షులు; పండిన వృక్షంబున్= ఫలించిన చెట్టును; ఉపజీవించు= ఆశ్రయించే; చందంబునన్= విధంగా; నిన్నున్+చెంది= నిన్ను పొంది; బంధువులు= చుట్టాలు; సుఖులు+ఐ= సుఖంగా; ఉండువారుగాక= ఉంటారుగాక; నాకున్= (భీష్ముడనగు) నాకు; నీవును= కర్ణుడవగు నీవుగూడ; సుయోధనున్+అట్లు+అ= దుర్యోధనుడి వంటి వాడవే; కావునన్= కాన; మేలు+ఆడెదన్= మేలు పలుకుతాను; కౌరవులను= దుర్యోధనాదులను; నడపికొని= ముందుకు నడిపించి; ఆ+మహీవిభునకున్= ఆ మహారాజుకు; విజయంబు= గెలుపు; కావింపుము= కలిగేటట్లు చేయవలసింది; పొమ్ము+అని= యుద్ధానికి పొమ్మని; సమ్మదంబునన్= సంతోషంతో; పలికినన్= పలుకగా; సూతనందనుండు= కర్ణుడు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; ఆ దేవవ్రతు= ఆ భీష్ముడి యొక్క; చరణంబులు= పాదాలు; శిరంబుసోఁకన్= తల తాకునట్లు; వినతుండు+ఐ= నమస్కరించినవాడై; వీడ్కొని= సెలవు తీసికొని; అరదంబు+ఎక్కి= రథంపై ఎక్కి; అరుగుదెంచి= వచ్చి; భవదీయ= తమ యొక్క; సైన్యంబు= సేనయొక్క; దైన్యంబు= దీనత్వాన్ని; పాపి= తొలగించి; ఏపు+అగ్గలించి= విజృంభణం అధికమై; కలయన్+కనుంగొని= అంతటా చూచి.

**తాత్పర్యం:** అంబష్ఠ, విదేహ, పౌండ్రాది దేశాల రాజులను జయించి దుర్యోధనుడి వశంలో ఉండేటట్లు చేశావు కనుక నీ కింక ఎక్కువగా చెప్పనవసరం లేదు. పక్షులు పండ్లుండే వృక్షాన్ని ఆశ్రయించి జీవించే విధంగా నిన్ను ఆశ్రయించి బంధువర్గమంతా సుఖంగా ఉండాలి. నాకు నీవుకూడా దుర్యోధనుడి వంటి వాడవే కనుక నీ క్షేమాన్ని కోరుతాను; కౌరవులను ముందుకు నడిపించి ఆ మహారాజుకు విజయాన్ని చేకూర్చు; పో!' అని సంతోషంతో భీష్ముడు పలికేసరికి, కర్ణుడు సంతోషపడి, భీష్ముడి పాదాలపై శిరస్సు మోపి నమస్కరించి, సెలవు తీసికొని, రథంపై వచ్చి నీ సైన్యంయొక్క దీనావస్థను తొలగించి, మిక్కిలి ఉత్సాహంతో అంతటా చూచి.

**క. నరపతి యలరఁగ రథకరి । తురగ సుభట సముదయముల దోర్గర్వధురం**
**ధరలీల మెఱసి యతి బం । ధురములుగా సంఘటించె దురమునకుఁ దగన్. 52**

**ప్రతిపదార్థం:** నరపతి= దుర్యోధన మహారాజు; అలరఁగన్= సంతోషించగా; రథ= రథాల; కరి= ఏనుగుల; తురగ= గుర్రాల; సుభట= సైనికుల; సముదయముల= సమూహాలయొక్క; దోస్(ః)+గర్వ= పొగరుయొక్క; ధురం ధర= బరువును మోసే; లీల= విలాసంతో; మెఱసి= ప్రకాశించగా; అతి బంధురములుగాన్= మిక్కిలి దట్టంగా; దురమునకున్= యుద్ధానికి; తగన్= సరిపోయే విధంగా; సంఘటించెన్= సమకూర్చాడు.

**తాత్పర్యం:** కర్ణుడు దుర్యోధన మహారాజు సంతోషపడేటట్లు తనపై బాధ్యత మోపుకొని, బాహుబల గర్వం మెరిసేటట్లు చతురంగబలాలను సంఘటించాడు.

**వ. అట్టి యెడ. 53**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కర్ణుడు సైన్యాన్ని సంఘటించిన ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అరుణాశ్వములు రుచిర రు । క్మరథంబుఁ బ్రదీప్తవేదికాధ్వజమును ను**
**ద్ధుర గాత్ర కలిత సిత భా । సుర బంధుర కంకటంబు శోభిల్లంగన్. 54**

**ప్రతిపదార్థం:** అరుణ+అశ్వములు= ఎర్రని గుర్రాలు; రుచిర= సుందరమైన; రుక్మ= బంగారు, రథంబున్= రథమూ; ప్రదీప్త= మిక్కిలి వెలుగొందే; వేదికా= తిన్నెగల; ధ్వజమునున్= పతాకం; ఉద్ధుర= మిక్కిలి బరువై; గాత్ర= దేహంతో; కలిత= కూడిన; సిత= తెల్లనైన; భాసుర= ప్రకాశించే; కంకటంబున్= కవచమూ; శోభిల్లంగన్= ఒప్పగా.

**తాత్పర్యం:** ఎర్రని గుర్రాలు, అందమైన బంగారు రథం, వెలుగొందే వేదిక గుర్తు గల పతాకం, దృఢమై తెల్లగా ప్రకాశించే కవచం అందాన్ని కలిగించగా.

**క. మొగమునఁ గయ్యపు వేడుక । చిగురొత్త నుదాత్తమూర్తిఁ జెలువొందు గురుం**
**దగు రాజులుఁ గౌరవులును । పొగడి రులివు మిగులఁ బ్రమద పూర్ణ హృదయులై. 55**

**ప్రతిపదార్థం:** మొగమునన్= ముఖంపై; కయ్యపు వేడుక= యుద్ధంపై అభిలాష; చిగురు+ఒత్తన్= పొడసూపగా; ఉదాత్తమూర్తిన్= గొప్పరూపంతో; చెలువు+ఒందు= ఒప్పునట్టి; గురున్= ద్రోణాచార్యుడిని; తగు= యోగ్యులైన; రాజులు= రాజులు; కౌరవులును= దుర్యోధనాదులును; ప్రమద= సంతోషంతో; పూర్ణ= నిండిన; హృదయులు+ఐ= మనస్సులు కలవారై; ఉలివు మిగులన్= ధ్వని అతిశయింపగా; పొగడిరి= ప్రశంసించారు.

**తాత్పర్యం:** ముఖాన యుద్ధాభిలాష పొడసూపగా, ఉదాత్తరూపంతో ప్రకాశించే ఆ ద్రోణాచార్యుని రాజశ్రేష్ఠులూ, కౌరవులూ సింహనాదాలు చేస్తూ ప్రశంసించారు.

**తే. అపుడు నీ యగ్రనందనుఁ డల్లఁ దనదు । తేరు రాధేయు నరదంబు సేరఁ బోవ**
**నిచ్చి మనమున సంతస మెసక మెసఁగ । నాదరంబున నిట్లను నతనితోడ. 56**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; నీ= నీ యొక్క; అగ్రనందనుఁడు= పెద్దకొడుకైన దుర్యోధనుడు; అల్లన్= మెల్లగా; తనదు= తనయొక్క; తేరు= రథం; రాధేయు= కర్ణుడి యొక్క; అరదంబు= రథాన్ని; చేరన్= దగ్గరకు; పోవనిచ్చి= పోనిచ్చి; మనమునన్= మనస్సులో; సంతసము= సంతోషం; ఎసకము= విజృంభణ; ఎసఁగన్= అతిశయించగా; ఆదరంబునన్= గారవంతో; అతనితోడన్= కర్ణుడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో దుర్యోధనుడు మెల్లగా తన రథాన్ని కర్ణుడి రథం కడకు పోనిచ్చి, మనస్సులో సంతోషం పెంపొందగా, సాదరంగా అతడితో ఇట్లా అన్నాడు.

**క. నీ వలన సనాథంబై । యీ వీడెంతయును మెఱసె నిం కిట మనకుం**
**గావింప వలయు కార్యము । నీ వెఱిఁగింపంగ వలయు నెయ్య మెలర్పన్. 57**

**ప్రతిపదార్థం:** నీవలనన్= నీ కారణంగా; సనాథంబు+ఐ= నాథుడు కలదై; ఈ వీడు= ఈ సైన్యం; ఎంతయును= ఎంతయో; మెఱసెన్= ప్రకాశించింది; ఇంకన్= ఇక; ఇటన్= ఇచ్చట; మనకున్= మనకు; కావింపవలయు= చేయదగిన; కార్యము= పని; నెయ్యము= స్నేహం; ఎలర్పన్= మీరగా; నీవు; ఎఱిఁగింపంగ వలయున్= తెలియజేయవలెను.

**తాత్పర్యం:** 'ఓ కర్ణా! దిక్కులేని ఈ సైన్యం నీ వలన నాథుడుగలదై ఎంతో ప్రకాశిస్తున్నది. ఇప్పుడు మనం ముందు చేయదగిన పని ఏదో తెలియజేయుము.'

**క. అనిన నతం డిట్లను 'బహు । జనరక్షకులైన నృపులు సద్బుద్ధులు గా**
**వున నీవు సెప్పఁగా నే । వినియెద; నెయ్యది దలంపు వివరింపు తగన్.' 58**

**ప్రతిపదార్థం:** అనినన్= దుర్యోధనుడు పై విధంగా అనగా; అతండు= ఆ కర్ణుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; బహుజన= సర్వప్రజలకు; రక్షకులు+ఐన= కాపాడేవారైన; నృపులు= రాజులు; సద్బుద్ధులు= మంచి జ్ఞానం కలవారు; కావునన్= కనుక; నీవు;

చెప్పఁగాన్= చెప్పితే; ఏన్= నేను; వినియెదన్= వింటాను; ఏ+అది= ఏది; తలంపు= అభిప్రాయం; తగన్= తగు విధంగా; వివరింపు(ము)= తెలియజేయుము.

**తాత్పర్యం:** పై విధంగా పలికిన దుర్యోధనుడితో కర్ణుడు ఈ విధంగా అన్నాడు. 'సర్వజనరక్షకులైన రాజులు ఉత్తమజ్ఞానం కలవారు కనుక నీ యభిప్రాయ మేమిటో తెలియజేయుము. నేను వింటాను.'

**ఉ. నావుడుఁ గర్ణుతోడ నరనాయకుఁ డిట్లను 'సర్వయోధ సం**
**భావితుఁ డైన శాంతనవు బాహుల మాటున నస్మదీయ సే**
**నా విభవంబు సెల్లెఁ బదినాళ్లును; నీ మదికెక్క నాదు యో**
**ధావలిలోన నింకఁ బృతనాధిపుఁగాఁ గొన నెవ్వఁ డర్హుఁడో? 59**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగా; కర్ణుతోడన్= కర్ణుడితో; నరనాయకుఁడు= దుర్యోధన నృపతి; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; సర్వయోధ= వీరులందరిచేత; సంభావితుఁడు+ఐన= గౌరవించబడిన; శాంతనవు= భీష్ముడి యొక్క; మాటునన్= చాటున; అస్మదీయ= మనయొక్క; సేనా= సైన్యంయొక్క; విభవంబు= వైభవం; పదినాళ్ళును= పది రోజులు; చెల్లెన్= గడిచాయి; నీ= నీయొక్క; మదికిన్= మనస్సునకు; ఎక్కన్= నచ్చేటట్లు; నాదు= నాయొక్క; యోధావలిలోనన్= వీరుల సమూహంలో; ఇంకన్= ఇకముందు; పృతనాధిపున్+కాన్= సైన్యాధిపతిగా; కొనన్= ఎన్నుకొనటానికి; ఎవ్వఁడు= ఎవరు; అర్హుఁడో?= యోగ్యుడో?

**తాత్పర్యం:** అని అనగా, అపుడు కర్ణుడితో దుర్యోధనుడు ఇట్లన్నాడు. 'వీరులందరిచేత గౌరవించబడిన భీష్మపితామహుడి ఆధిపత్యంలో మహావైభవంగా మన సేనలు పది దివసాలు యుద్ధం చేసినవి. ఇక మన యోధులలో సేనాధిపతినిగా నియమించడానికి నీకు నచ్చినవా డెవ్వడో తెలుపుము?

### ద్రోణాచార్యులకు సర్వసేనాధిపత్యంబు నిర్ణయించుట (సం. 7-5-8)

**క. సేనాపతిత్వమునకుం । బూని యొకఁడు నడపకున్నఁ బొడవడఁగదె? యా**
**సేన యనిఁ గర్ణధార వి । హీనం బగు కలము జలధి నెడలిన భంగిన్.' 60**

**ప్రతిపదార్థం:** కర్ణధార= ఓడ నడుపువాడు; విహీనంబు+అగు= లేని; కలము= ఓడ; జలధిన్= సముద్రంలో; ఎడలిన= భగ్నమైన; భంగిన్= విధంగా; సేనాపతిత్వమునకున్= సైన్యాధిపత్యాన్ని; పూని= బాధ్యత వహించి; ఒకఁడు= ఎవరైనా ఒకరు; నడపక+ఉన్నన్= నడపకపోతే; అనిన్= యుద్ధంలో; ఆసేన= ఆ సైన్యం; పొడవు+అడఁగదె?= నశింపదా?

**తాత్పర్యం:** కర్ణధారుడు లేని నావ సముద్రంలో మునిగిపోయినట్లు సైన్యాధిపతి లేని సైన్యం బలం తగ్గి యుద్ధంలో భగ్నమైపోదా?'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. కావున నొక్కరు నిరూపింపు మనవుడు గాంధారేయునకు రాధేయుం డిట్లనియె. 61**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; ఒక్కరున్= ఒకడిని; నిరూపింపుము= నిర్ణయించుము; అనవుడున్= అనగా; గాంధారేయునకున్= గాంధారి పుత్రుడైన దుర్యోధనుడితో; రాధేయుండు= రాధాపుత్రుడైన కర్ణుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కనుక సేనాధిపతిగా ఒకరిని నిర్ణయించుము - అని అనగా దుర్యోధనుడితో కర్ణుడు ఇట్లా అన్నాడు.

**సీ. 'అధిప! నీయోధులయందు సేనాపతి । త్వమునకుఁ జాలని వారుఁ గలరె?**
**యందఱు నయ విక్రమాది గుణంబుల । మాననీయుల యట్టు లైన నెల్ల**
**వారి ముఖ్యులఁ జేయవచ్చునే? యొక్కరుఁ । గైకొన్న మత్సరగ్రస్తబుద్ధి**
**నన్యులు విపరీతులై కలంగకయుండు । వాఁడు గావలయు; నెవ్వరును ద్రోణుఁ**

**తే. డనినఁ గాదన; రాతండ యర్హుఁ డాధి । పత్యమునకు; నాచార్యుండు బ్రాహ్మణుండు**
**వివిధ రణ కోవిదుఁడు వయోవృద్ధుఁ డధిక । బలుఁడు శూరుండు గట్టుము పట్ట మతని.' 62**

**ప్రతిపదార్థం:** అధిప!= దుర్యోధన మహారాజా!; నీ= నీ యొక్క; యోధుల అందున్= వీరులలో; సేనాధిపతిత్వమునకున్= సైన్యానికి అధిపతిగా ఉండటానికి; చాలని వారున్= తగనివారు; కలరె?= ఉన్నారా?; అందఱున్= వీరులంతా; నయ= నీతి; విక్రమ+ఆది= విక్రమం మున్నగు; గుణంబులన్= మంచి గుణాల చేత; మాననీయులు+అ= మన్నింపదగినవారే; అట్టులు+ఐనన్= అట్లైనను; ఎల్లవారిన్= అందరిని; ముఖ్యులన్= అధిపతులను; చేయవచ్చునే?= చేయడానికి వీలౌతుందా?; ఒక్కరున్= ఏ ఒకరిని; కైకొన్నన్= ఎన్నుకొన్నా; మత్సరగ్రస్త బుద్ధిన్= అసూయచే నిండిన బుద్ధితో; అన్యులు= ఇతరులు; విపరీతులు+ఐ= వ్యతిరేకులై; కలంగక= కలతపొందక; ఉండువారు= ఉండేవారు; కావలయున్= అవసరం; ఎవ్వరున్= ఎవరు కూడా; ద్రోణుఁడు+అనినన్= ద్రోణాచార్యుడంటే; కాదు+అనరు= వద్దనరు; ఆతండు+అ= అతడే; ఆధిపత్యమునకున్= సేనాపతిత్వానికి; అర్హుఁడు= యోగ్యుడు; ఆచార్యుండు= గురువు; బ్రాహ్మణుండు; వివిధ= అనేక విధాలైన; రణ= యుద్ధాలలో; కోవిదుఁడు= నేర్పరి; వయోవృద్ధుఁడు= వయస్సుచేత పెద్దవాడు; అధికబలుఁడు= మిక్కిలి బలం కలవాడు; శూరుండు= శౌర్యంగలవాడు; అతనిన్= అతడికి; పట్టము= సైన్యాధిపతి పదవి; కట్టుము= ఇమ్ము.

**తాత్పర్యం:** ఓ మహారాజా! నీ యోధులలో సేనాధిపతి పదవిని నిర్వహించడానికి యోగ్యత లేని వా రెవ్వరు? యుద్ధనీతిలోను పరాక్రమాది గుణాలలోను అందరు సమర్థులే. అంతమాత్రంచేత అందరిని సేనాధిపతులనుగా చేయలేము గదా! ఏ ఒక్కరిని సేనాపతినిగా చేసినా ఇతర యోధులు అసూయచేత వ్యతిరేకులై, కలత చెందకుండా ఉండటం అవసరం. ద్రోణాచార్యుడిని ఎవ్వరూ కాదనరు. ఆయన సేనాపతిత్వానికి అర్హుడు. అందరికి గురువు, బ్రాహ్మణుడు, అన్నియుద్ధ విద్యలందు మహానిపుణుడు, వయోవృద్ధుడు, మిక్కిలి బలశాలి, మహావీరుడు. అతడికే సర్వసేనాధిపతిపట్టం కట్టుము.

**వ. అనుటయుం గురురాజు దగు రాజులం గూర్చుకొని గురుం డున్న యెడకుం జని సవినయంబుగా నతని కిట్లనియె. 63**

**ప్రతిపదార్థం:** అనుటయున్= కర్ణుడు ఈ విధంగా అనగా; కురురాజు= కౌరవ రాజైన దుర్యోధనుడు; తగు= యోగ్యులైన; రాజులన్= నృపులను; కూర్చుకొని= వెంట పెట్టుకొని; గురుండు+ఉన్న= ద్రోణాచార్యుడు ఉన్న; ఎడకున్= చోటికి; చని= పోయి; సవినయంబుగాన్= వినయంతో; అతనికిన్= గురువైన ద్రోణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడు ఈ విధంగా అనేసరికి, దుర్యోధనుడు యోగ్యులైన రాజులను తన వెంట బెట్టుకొని ద్రోణాచార్యుడివద్దకు వచ్చి, వినయపూర్వకంగా ఇట్లా అన్నాడు.

**ఉ. 'ప్రాయము కల్మి నొక్కటన భవ్యధృతిన్ మహనీయశీలతన్**
**సాయక సంపదం బటు భుజావిభవంబునఁ గార్యతంత్ర శి**
**క్షాయుత బుద్ధి వృద్ధుఁడవు గావె? ధరాసురవర్య! మున్ను గాం**
**గేయుఁడు మాకు నెల్ల నెఱిఁగింపఁడె నీదు మహానుభావమున్.' 64**

**ప్రతిపదార్థం:** ధరాసురవర్య!= బ్రాహ్మణోత్తమా!; ప్రాయము కల్మిన్= వయస్సు కలిగి ఉండటం; ఒక్కటి+అని+అ= ఒకదానిలోనేనా?; భవ్యధృతిన్= గొప్ప ధైర్యంలోను; మహనీయ శీలతన్= మంచి ప్రవర్తనలోను; సాయక సంపదన్= బాణ సంపత్తిలోను; పటు= గొప్ప; భుజా= బాహువులయొక్క; విభవంబునన్= వైభవంలోను; కార్యతంత్ర= కార్య నిర్వహణలో; శిక్షాయుత బుద్ధిన్= సుశిక్షితమైన జ్ఞానంలోను; వృద్ధుఁడవు= గొప్పవాడవు; కావె?= కావా?; మున్ను= పూర్వం; గాంగేయుఁడు= భీష్ముడు; మాకున్; ఎల్లన్= అందరికి; నీదు= నీ యొక్క; మహానుభావమున్= గొప్పతనాన్ని; ఎఱిఁగింపఁడె!= తెలిపినాడుగదా!

**తాత్పర్యం:** 'ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ద్రోణాచార్యా! ఒక్క ఈడులోనే కాదు అపారమైన ధైర్యంలోను, సౌశీల్యంలోను, అస్త్రశస్త్ర సంపదలోను, బాహుబలవైభవంలోను, సుశిక్షితమైన జ్ఞానంలోను నిన్ను మించినవారు లేరు. భీష్ముడు నీ మహనీయతను మాకంతా ఇది వరకే తెలియజేశాడు.'

**వ. అని వెండియు.** **65**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ద్రోణాచర్యుడిని ప్రశంసించి, మరల.

**క. 'కనువెలుఁగు నీవు గానీ । వెనుక భవన్మతమ యూఁది వీరలు నేనుం**
**జనుదెంచెద మూఱట నెల । కొన వృషభము పజ్జ నడచు గోవుల పగిదిన్.'** **66**

**ప్రతిపదార్థం:** కను వెలుఁగు= మార్గదర్శకుడవు; నీవు+కాన్= నీవు కాగా; నీ వెనుకన్= నీవెంటనే; భవత్+మతము+అ= తమ అభిప్రాయాన్నే; ఊఁది= అనుసరించి; వీరలు= ఈ యోధులు; నేనున్; ఊరట= ఓదార్పు; నెలకొనన్= కలుగగా; వృషభము= కోడె; పజ్జన్= వెనుక; నడచు= వచ్చు; గోవుల= ఆవుల; పగిదిన్= వలె; మేము= కౌరవపక్ష సైన్యాలం; చనుదెంచెదము= వస్తాము.

**తాత్పర్యం:** 'నీవే మాకు మార్గదర్శకుడవు. నీయభిప్రాయాన్ననుసరించే మేమంతా వృషభం వెంట వచ్చే గోవుల వలె ముందుకు సాగుతాం.'

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. అనుచు నచట నున్న యవనీపతులఁ జూపి । మఱియు నిట్టులనియె మనుజ విభుఁడు**
**'దేవసేన నడపి దితిజుల గెలిచిన । షణ్ముఖుండు నీవు సరియ కాదె!** **67**

**ప్రతిపదార్థం:** అనుచున్= దుర్యోధనుడు ద్రోణునితో పైవిధంగా అంటూ; అచటన్+ఉన్న= అక్కడ ఉన్న; అవనీ పతులన్= రాజులను; చూపి; మనుజ విభుఁడు= దుర్యోధన మహారాజు; మఱియున్= ఇంకా, మరల; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా పలికాడు; దేవసేన= దేవతల సైన్యాన్ని; నడపి; దితిజులన్= రాక్షసులను; గెలిచిన= జయించిన; షణ్ముఖుండు= ఆరు ముఖాలుగల కుమారస్వామి; నీవు; సరియకాదె!= సమానులుకారా!

**తాత్పర్యం:** దుర్యోధనుడు ద్రోణుడితో ఈ విధంగా అంటూ, అక్కడ ఉన్న రాజులందరిని చూపి, దేవతల సైన్యానికి నాయకత్వం వహించి, రాక్షసులను గెలిచిన కుమారస్వామీ, నీవూ సమానులు కదా!

**విశేషం:** దేవతల ప్రార్థనపై శివపార్వతులకు పుట్టి, దేవతలకు సేనాధిపతియై తారకాసురుడిని సంహరించినవాడు షణ్ముఖుడు. ఆ కథ ఇట సూచించబడింది.

**వ. కావున. 68**

**తాత్పర్యం:** కనుక.

**తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప । వలయు' ననవుడు నమ్మహీశ్వరులు నట్ల**
**చెప్పి, 'గెలువుము నీ'వని చెలఁగి యతనిఁ । బ్రస్తుతించి ప్రార్థించిరి భరతముఖ్య! 69**

**ప్రతిపదార్థం:** భరతముఖ్య!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; సర్వసేనాధిపత్యంబు= సేనలన్నింటిపై దొరతనం; నిర్వహింపవలయున్= చేయవలెను; అనవుడున్= అనగా; ఆ+మహీశ్వరులును= ఆ రాజులును; అట్లు+అ+చెప్పి= ఆ విధంగా పలికి; నీవు; గెలువుము+అని; చెలఁగి= ఉత్సహించి; అతనిన్= ఆ ద్రోణుడిని; ప్రస్తుతించి= మిక్కిలి పొగడి; ప్రార్థించిరి= వేడుకొన్నారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ పుత్రుడు ద్రోణుడిని సర్వసేనాధిపత్యం చేపట్టవలసిందని కోరగా, అచట ఉన్న రాజులందరు కూడా అదే మాట పలికి, విజయాన్ని సాధించవలెనని అతడిని ప్రార్థించారు.

**వ. మఱియు నమ్మహీశ్వరుండు. 70**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఆ+మహీశ్వరుండు= రాజు - దుర్యోధనుడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఇంకా ద్రోణుడితో ఇట్లా అంటున్నాడు.

**క. 'సేనా సముదయ వర్తకుఁ । గా నిను నేఁ బడసినపుడ కౌంతేయులు నా**
**చే నడఁగ రెట్లు? భీష్మవి । హీనుల మగు మమ్ముఁ గావు మెల్ల విధములన్.' 71**

**ప్రతిపదార్థం:** సేనా= సేనలయొక్క; సముదయ= సమూహాన్ని; వర్తకుఁగాన్= నడిపేవాడినిగా; నిను= నిన్ను; నేన్= నేను; పడసినపుడు+అ= పొందినపుడే; కౌంతేయులు= కుంతీ పుత్రులైన ధర్మజాదులు; నాచేన్= నాచేత; అడఁగరు+ఎట్లు?= ఎట్లు అణగిపోరు?; భీష్మ విహీనులము+అగు= భీష్ముడు లేని; మమ్మున్= మమ్ముల; ఎల్లవిధములన్= అన్ని విధాల; కావుము= రక్షించుము.

**తాత్పర్యం:** సర్వసైన్యాధిపతిగా నిన్ను నేను పొందినపుడు ధర్మజాదులైన కౌంతేయులు నాచేత నశించకుండా ఎట్లుంటారు? భీష్ముడు లేక దిక్కులేని వారమైన మమ్ము అన్ని విధాల కాపాడుము.'

**వ. అని వేఁడికొనిన నయ్యందఱం గలయం గనుంగొని యాచార్యుం డి ట్లనియె. 72**

**ప్రతిపదార్థం:** అని వేఁడికొనినన్= అని ప్రార్థించగా; ఆ+అందఱన్= అక్కడివారందరిని; కలయన్+కనుంగొని= కలయచూచి; ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడు ప్రార్థించగా అందరినీ కలయజూచి ద్రోణాచార్యు డిట్లా అన్నాడు.

**ఉ. 'వేదములుం దదంగములు వింతలుగా నొక కొన్ని నేర్తు ధై**
**ర్యాది గుణంబు లెందుఁ గల వైనను నింతటి వానిఁ గాఁగ న**
**త్యాదర వృత్తి మీరు విజయాశ ననుం గొనియాటఁ జేసి యౌఁ**
**గాదన కియ్యకొంటిఁ దగఁ గౌరవనాథుని కోర్కి దీర్పఁగన్. 73**

**ప్రతిపదార్థం:** వేదములన్= ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదాలను; తద్= వాటియొక్క; అంగములున్= శిక్ష; వ్యాకరణం, ఛందస్సు, జ్యోతిషం, నిరుక్తం, కల్పం అనే వేదాంగాలు; వింతలుగాన్= ఆశ్చర్యం గొల్పేటట్లు; ఒక కొంత= కొంత భాగం; నేర్తున్= నేర్చుకొన్నాను; ధైర్య+ఆదిగుణంబులు= ధైర్యం మొదలైన మంచి గుణాలు; ఎందున్+కలవు= ఎక్కడున్నవి; ఐనను= అయినప్పటికి; ఇంతటివానిన్+కాఁగన్= ఇంత గొప్పవాడినిగా భావించి; అతి+ఆదరవృత్తిన్= మిక్కిలి గౌరవంతో; మీరు= మీరంతా; విజయ+ఆశన్= గెలుపు మీది ఆశతో; ననున్= నన్ను; కొనియాటన్+చేసి= ప్రశంసించటం వలన; ఔను+కాదు+అనక= మారుమాట్లాడక; తగన్= తగువిధంగా; కౌరవనాథుని కోర్కి= దుర్యోధనుడి కోర్కెను; తీర్పఁగన్= తీర్చుట కొరకు; ఇయ్యకొంటిన్= ఒప్పుకొన్నాను.

**తాత్పర్యం:** నేను నాలుగు వేదాలను, శిక్షాది షడంగాలను కొంతవరకు నేర్చుకొన్నాను. అయినా నాలో ధైర్యాది గుణా లెక్కడ? మీరు విజయాన్ని కోరి ఇంతగా ప్రశంసించటం వలన మారుమాట్లాడక దుర్యోధనుడి కోర్కె తీర్చుట కొరకు సైన్యాధిపత్యాన్ని అంగీకరించాను.

**విశేషం:** అస్త్ర శస్త్రాది సర్వవిద్యాపారంగతుడనైనా, 'ఏదో కొద్దిగా చదువు కొన్నానే తప్ప ధైర్య శౌర్యాదులు నాలో ఎక్కడివి?' అనటంలో ద్రోణాచార్యుడి వినయసంపద వ్యక్తమౌతున్నది.

**శా. భవ్యంబైన బలాధిపత్యమునకుం బట్టంబు గట్టుండు న;**
**న్నవ్యాకీర్ణ గజాదియై మెఱయు సైన్య శ్రేణిఁ బాలించి, కౌ**
**రవ్యోత్సాహముఁ బెంచి, మార్కొనిన, వీరవ్రాతముం ద్రుంచి, నా**
**దివ్యాస్త్రంబులఁ బంచి పాండవుల దీప్తిన్ మాయఁజేయించెదన్.** 74

**ప్రతిపదార్థం:** నన్నున్; భవ్యంబు+ఐన= మహత్తరమైన; బలాధిపత్యమునకున్= సైన్యాధిపత్యానికి; పట్టంబు+కట్టుండు= పట్టం కట్టండి; అవ్యాకీర్ణ= చెదరిపోని; గజ+ఆది+ఐ= ఏనుగులు మొదలైన చతురంగ బలాలు కలదై; మెఱయు= ప్రకాశించే; సైన్యశ్రేణిన్= సేనా సమూహాన్ని; పాలించి= రక్షించి; కౌరవ్య+ఉత్సాహమున్= దుర్యోధనాదుల ఉత్సాహాన్ని; పెంచి= పెద్దజేసి; మార్కొనిన= ఎదుర్కొన్న; వీర= వీరుల; వ్రాతమున్= సమూహాన్ని; త్రుంచి= చంపి; నా= నాయొక్క; దివ్యాస్త్రంబులన్= దేవతలచేత పొందిన ఆగ్నేయాద్యస్త్రాలను; పంచి= ప్రయోగించి; పాండవుల= పాండవుల యొక్క; దీప్తిన్= ప్రకాశాన్ని; మాయన్+చేయించెదన్= మాసిపోయేటట్లు చేస్తాను.

**తాత్పర్యం:** నన్ను అక్షౌహిణుల కొలదిగా గల ఈ గొప్ప సైన్యానికి అధిపతినిగా చేయండి. చతురంగబల సమేతమైన సేనా సమూహాన్ని నడిపి కౌరవుల ఉత్సాహాన్ని పెద్దజేసి, ఎదుర్కొన్న శత్రు సమూహాన్ని హతమార్చి, నా దివ్యాస్త్రాలను ప్రయోగించి పాండవుల తేజస్సును మాసిపొయ్యేటట్లు చేస్తాను.

**విశేషం:** ఇందులో ద్రోణాచార్యుడి అపారమైన ఉత్సాహం వ్యక్తమౌతున్నది. ఇందులో 'పాలించి, పెంచి, త్రుంచి, పంచి, చేయించెదన్ - అనే పూర్ణబిందు పూర్వక చకారముల పౌనరుక్త్యం పద్యాన్ని అందగించింది.

**వ. అని పలికినం బ్రీతచేతస్కుండై నీ తనూభవుండు గనకకలశంబులం బావన జలంబులు దెప్పించి, మంగళోపకరణ శోభితంబు గావించి, పుణ్యాహనాదంబులుం బరమాశీర్వాదంబులున్ మాగధ గీతంబులున్, వందిజనస్తుతి వ్రాతంబులుం జెలంగఁ బ్రభూత భూపతులుం దానును ద్రోణాచార్యునకు సేనాధిపత్యాభిషేక పట్టబంధం బొనర్చి పేర్చినం గని, రథికవరు లార్చి, నిజశంఖంబులు పూరించిన, నఖిలసైన్యంబులందును భేరీ మృదంగ పణవాది తూర్య నినాదంబులు నిగిడి నింగి ముట్టె; నిట్లు సకల చమూపతిత్వపదభాసితుండై భారద్వాజుండు.** 75

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అని ద్రోణుడు పలుకగా; నీ తనూభవుండు= నీ యొక్క కుమారుడైన దుర్యోధనుడు; ప్రీతచేతస్కుండు+ఐ= సంతోషించిన మనస్సు కలవాడై; కనక కలశంబులన్= బంగారు బిందెలతో; పావన జలంబులు= పవిత్రమైన నీరు; తెప్పించి; మంగళ= కళ్యాణ ప్రదమైన; ఉపకరణ= సామగ్రిచేత; శోభితంబు= అలంకృతం; కావించి= చేసి; పుణ్యాహనాదంబులున్ = పుణ్యకరమైన దివసమని వేదమంత్రపూర్వకంగా ఉచ్చరించటం; పరమ+ఆశీర్వాదంబులున్= గొప్ప దీవెనలును; మాగధ గీతంబులున్= ప్రశంసాత్మకమైన పాటలును; వందిజన= స్తుతించేవారి యొక్క; స్తుతి= స్తోత్రాల; వ్రాతంబులున్= సమూహమును; చెలంగన్= చెలరేగగా; ప్రభూత= చాలామంది; భూపతులున్= రాజులును; తానును= దుర్యోధనుడును; ద్రోణాచార్యునకున్= గురువైన ద్రోణుడికి; సేనాధిపత్య= సేనాపతిత్వానికి చెందిన; అభిషేక= స్నానం; పట్టబంధంబు= నొసటగట్టే పట్టి; ఒనర్చి= కట్టి; పేర్చినన్= పెంపుజేయగా; కని= చూచి; రథికవరులు= రథాన్నెక్కి యుద్ధం చేసేవారిలో శ్రేష్ఠులు; ఆర్చి= సింహానాదాలు చేసి; నిజ= తమ యొక్క; శంఖంబులు= శంఖాలను; పూరించినన్= ఊదగా; అఖిల సైన్యంబులందును= సర్వసేనలందును; భేరీ= దుందుభులు; మృదంగ= మద్దెలలు; పణవ+ఆది= ఉడక మొదలైన; తూర్య= వాద్యాల; నినాదంబులు= మ్రోతలు; నిగిడి= చెలరేగి; నింగి= ఆకాశాన్ని; ముట్టెన్= తాకినవి; ఇట్లు= ఈ విధంగా; సకల= సర్వవిధాలైన; చమూపతిత్వ= సేనల ఆధిపత్యపు; పద= పదవి చేత; భాసితుండు+ఐ= ప్రకాశించినవాడై; భారద్వాజుండు= భరద్వాజ మహర్షి పుత్రుడైన ద్రోణుడు.

**తాత్పర్యం:** ద్రోణుడు సేనాధిపత్యానికి అంగీకరించగా, దుర్యోధనుడు సంతసించి బంగారు కలశాలలో పుణ్య జలాలను తెప్పించి, మంగళ ద్రవ్యాలతో అలంకరించి, పుణ్యాహ నాదాలు, ఆశీర్వచనాలు, వందిమాగధ స్తుతులు చెలగగా, సర్వనృపులు, తాను ద్రోణాచార్యుడికి సేనాధిపత్యాన్ని అభిషేకించాడు. అపుడు రథిక శ్రేష్ఠులు జయధ్వానాలు చేసి, శంఖాలు పూరించగా సర్వసైన్యాలలో భేరీ మృదంగాది నాదాలు సర్వత్ర వ్యాపించినవి. ఇట్లా సర్వసేనాధిపత్యాన్ని వహించిన ద్రోణుడు.

**సీ.** **కౌరవసేనా ముఖంబునఁ దిలకమై । యొప్పిరాధేయాది యోధవరులఁ**
**గొని పాండురాజ నందనుల సైన్యములతోఁ । దొడరి ధైర్యంబు నద్భుత మహాస్త్ర**
**వీర్యంబు ననివార్య శౌర్యంబు దోర్బలౌ । దార్యంబు మెఱయ నీతనయు వలని**
**కూరిమి వెలయ నక్షోహిణిపైఁ గొంత । బలమును దొర లనేకులను గూల్చి**

**తే.** **చామర చ్ఛత్ర కేతు భూషణ తురంగ । దంతి రథహేతి వర్మయోధ వ్రజంబు**
**తునియ లిల నించి కతిపయదినము లరులు । సురలు వినుతింప విహరించె ధరణినాథ!** 76

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; కౌరవసేనా= కౌరవుల సేన అనే; ముఖంబునన్= ముఖానికి; తిలకము+ఐ= బొట్టుగా; ఒప్పి= ప్రకాశించి; రాధేయ= కర్ణుడు; ఆది= మొదలైన; యోధవరులన్= శ్రేష్ఠులైన వీరులను; కొని= వెంట తీసికొని; పాండురాజ= పాండురాజు యొక్క; నందనుల= పుత్రులైన ధర్మజాదుల యొక్క; సైన్యములతోన్= సేనలతో; తొడరి= ఎదిరించి; ధైర్యంబున్= ధైర్యం; అద్భుత= ఆశ్చర్యం గొలిపే; మహా+అస్త్ర= గొప్ప అస్త్రాల యొక్క; వీర్యంబున్= బలం; అనివార్య= వారించవీలుగాని; శౌర్యంబు= శూరత్వం; దోఃబల= బాహువుల బలం యొక్క; ఔదార్యంబు= గొప్పతనం; మెఱయన్=ప్రకాశించగా; నీ= ధృతరాష్ట్రుడవైన నీయొక్క; తనయు వలని= కొడుకుపైగల; కూరిమి= ప్రేమ; వెలయన్= ప్రకాశించగా; అక్షోహిణిపైన్= అక్షోహిణిపైగా; కొంత బలమునున్= కొంత సైన్యాన్ని; దొరలన్= రాజులను; అనేకులను= చాలా మందిని; కూల్చి= చంపి; చామర= చమరీ మృగపు వాలాలతో చేసిన వీవనల; ఛత్ర= గొడుగులు; కేతు= పతాకాలు; భూషణ= సొమ్ములు; తురంగ= గుర్రాల; దంతి= ఏనుగుల; రథ= రథాల; హేతి= ఆయుధాల; వర్మ= కవచాల; యోధ= వీరుల; వ్రజంబు= సమూహం; తునియలు= తునుకలు; ఇలన్= భూమిపై; నించి= నింపి; కతిపయ దినములు= కొన్ని దినాలు; అరులు= శత్రువులు; సురలు= దేవతలు; వినుతింపన్= ప్రశంసించగా; విహరించెన్= యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ద్రోణాచార్యుడు సర్వసేనాపతి అయి, కౌరవసేనా ముఖానికి అలంకారంగా ప్రకాశిస్తూ, కర్ణాది వీరులు తోడై నిలువగా, పాండవ సైన్యాన్ని ఎదిరించి, ధైర్యం, అద్భుతమైన అస్త్రబలం, ఎదురులేని శౌర్యం, గొప్ప బాహుబలం మెరయగా, నీ కుమారుడిపై ప్రేమమీరగా, అక్షోహిణికిపైగా సైన్యాన్ని, ఎందరో రాజులను సంహరించాడు. వారి చామరాలను, ఛత్రాలను, పతాకాలను, సొమ్ములను, గుర్రాలను, ఏనుగులను, రథాలను, ఆయుధాలను, కవచాలను, వీరవర్గాన్ని ముక్కలు ముక్కలు చేసి యుద్ధభూమినిండా కుప్పలు పోశాడు.

**విశేషం:** యుద్ధంలో విజృంభించిన ద్రోణుడి ఉత్సాహం, శౌర్య, ధైర్య, గర్వ, క్రోధాదులచే పోషించబడి, వీరరసంగా వ్యక్తమౌతున్నది. ఆగ్నేయాది దివ్యాస్త్రాల ప్రయోగించి అచ్చెరువు గొలిపేటట్లు యుద్ధం చేయటంలో అద్భుతరసం, రథగజాశ్వాలను, ఛత్ర, చామర, రథాదులను, ఆయుధాలను, అలంకారాలను తునాతునకలు చేసి కుప్పలు పోయడంలో బీభత్సరసం ధ్వనిస్తున్నది.

**క. అడవుల దవశిఖి దరికొను । వడువున ని ట్లరిబలం బవారణఁ బొడిగా**
**నడరి యతఁడాఱె ద్రుపదుని । కొడు కార్వ నుభయ జనములకున్ వగ మిగులన్. 77**

**ప్రతిపదార్థం:** అడవులన్= అడవులలో; దవశిఖ= దావాగ్ని; దరికొను= మండే; వడువునన్= విధంగా; ఇట్లు= ఇట్లా; అరి= శత్రువుల యొక్క; బలంబు= సైన్యం; అవారణన్= నిరాటంకంగా; పొడిగాన్= పొడిపొడికాగా; అడరి= విజృంభించి; ద్రుపదుని కొడుకు= ధృష్టద్యుమ్నుడు; ఆర్వన్= విజయగర్జ చేయగా; ఉభయ= కౌరవ, పాండవ పక్షాలలోని; జనములకున్= ప్రజలకు; వగ= దుఃఖం; మిగులన్= అతిశయించగా; అతఁడు= ఆ ద్రోణాచార్యుడు; ఆఱెన్= మరణించాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు దావాగ్నివలె మండి, శత్రు సైన్యాన్ని నిరాటంకంగా తుత్తునియలు చేసి, విజృంభించి, కౌరవ పాండవ పక్షాలు రెండునూ దుఃఖించగా, ధృష్టద్యుమ్నుడు విజయగర్వంతో గర్జించగా అస్తమించాడు.

**క. దుష్ట మనస్కుం డగు నా । ధృష్టద్యుమ్నుండు దక్క దేవా! సుజనో**
**త్కృష్టుఁడగు గురుని తెగుటకు । నిష్టాపముఁ బొందె భూతనికరము లెల్లన్. 78**

**ప్రతిపదార్థం:** దేవా!= ధృతరాష్ట్ర మహారాజా!; దుష్టమనస్కుండు+అగు= క్రూరమైన మనస్సుగల; ఆ ధృష్టద్యుమ్నుండు= ఆ హంతకుడైన ధృష్టద్యుమ్నుడు; తక్క= తప్ప; సుజన+ఉత్కృష్టుఁడు+అగు= సజ్జనులలో శ్రేష్ఠుడైన; గురుని= ద్రోణాచార్యుడి యొక్క; తెగుటకున్= వినాశానికి; భూత= ప్రాణులయొక్క; నికరములు= సమూహాలు; ఎల్లన్= అన్నీ; నిష్టాపమున్= దుఃఖం; పొందెన్= పొందాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర నృపతీ! దుష్టాత్ముడైన ధృష్టద్యుమ్నుడు తప్ప సర్వప్రాణులు సజ్జన శ్రేష్ఠుడైన ద్రోణాచార్యుడి మరణానికి మిక్కిలి దుఃఖించాయి.

**వ. అనిన విని యాంబికేయుండు హృదయంబు జల్లనఁ జెదర, వదనంబు వెల్లనై మొగుడ నివ్వెఱఁగంది, కొండొక ప్రొద్దు నిశ్చేష్టితుండై యుండి, గద్గద వికల కంఠుం డగుచు సంజయునితో నిట్లనియె. 79**

**ప్రతిపదార్థం:** అనినన్= ద్రోణుడు మరణించినాడని చెప్పగా; విని; ఆంబికేయుండు= అంబికా పుత్రుడైన ధృతరాష్ట్రుడు; హృదయంబు= మనస్సు; జల్లనన్= అదరగా; చెదరన్= చెదరిపోగా; వదనంబు= ముఖము; వెల్లనై= తెల్లబడి; మొగుడన్= ముడుచుకొనిపోగా; నివ్వెఱఁగు+అంది= ఆశ్చర్యపడి; కొండొకప్రొద్దు= కొంతసేపు; నిశ్చేష్టితుండు+ఐ= చేష్టలు దక్కినవాడై; ఉండి; గద్గద= వణుకుతున్న; వికల= విచ్ఛేదము పొందిన; కంఠుండు+అగుచున్= కంఠం గలవాడు అవుతూ; సంజయునితోన్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ద్రోణుని మరణవార్త విని ధృతరాష్ట్రుడు మనస్సు చెదరిపోగా నిశ్చేష్టుడై, గద్గద కంఠంతో సంజయుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** హృదయం చెదరడం, ముఖం తెల్లబడడం, నిశ్చేష్టత, కంఠం వణకడం వంటి సాత్త్వికభావాలు భయం, విషాదం, జడత్వం మొదలైన భావాలను వ్యక్తపరుస్తూ కరుణ రసాన్ని జాలువారిస్తున్నవి.

**ద్రోణాచార్యుని మరణంబు విని ధృతరాష్ట్రుండు పరితపించుట (సం.7-8-1)**

**సీ.** **'అస్త్రశస్త్రంబుల నధికుండు, వెరవరి, । భుజబలవిక్రమంబుల ఘనుండు**
**గురుఁ; డట్టివానిఁ దేఁకువలేక కదిసిరే । పాంచాలు? రతని చాపంబు దునిసె**
**నో! తేరు విఱిగెనో! సూతుండు వడియెనో! । యేమఱి యలసత నెదిరి సరకు**
**సేయమి మఱ పాత్మఁ జెందెనో! హీనాత్ముఁ । డైన ధృష్టద్యుమ్నుఁ డతనిఁ జంపె**

**తే.** **నట్టె! యచ్చెరు విది; దైవ మగ్గలంబు; । పౌరుషము కంటె ద్రోణుని పాటు వినియు**
**వేయిపఱియ లై పోవదు ఱాయి గాఁగ । నోపు నా గుండె; యే మని యుమ్మలింతు?'** **80**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; అస్త్ర= ఆగ్నేయాస్త్రాదులు; శస్త్రంబులన్= ఖడ్గం మొదలైన ఆయుధాలలో; అధికుండు= గొప్పవాడు; వెరవరి= ఉపాయశీలి; భుజ= బాహువుల; బల= బలంతో; విక్రమంబులన్= పరాక్రమములందు; ఘనుండు= గొప్పవాడు; అట్టివానిన్= అంతటివాడిని; తేఁకువలేక= భయంలేక; పాంచాలురు= ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాల దేశీయులు; కదిసిరే?= ఎదురించారో?; అతని= ఆ ద్రోణుడి యొక్క; చాపంబు= విల్లు; తునిసెనో= తెగిందో; తేరు= రథం; విరిగెనో= విరిగిపోయిందో; సూతుండు= రథసారథి; పడియెనో= పడిపోయినాడో; ఏమఱి= అకస్మాత్తుగా; అలసతన్= ఆలస్యం వలన; ఎదిరి= విరోధిని; సరకు+చేయమి= లక్ష్యపెట్టకపోవటం; మఱపు= మరచిపోవటం; ఆత్మన్= తనను; చెందెనో?= పొందెనో?; హీనాత్ముఁడు+ఐన= నీచుడైన; ధృష్టద్యుమ్నుఁడు= ద్రుపద మహారాజు కొడుకు; అతనిన్= ఆ ద్రోణుడిని; చంపెను+అట్టె!= చంపినాడా!; అచ్చెరువు+ఇది= ఇది ఆశ్చర్యము; పౌరుషము కంటెన్= పురుష ప్రయత్నానికంటె; దైవము= విధి; అగ్గలంబు= గొప్పది; ద్రోణుని పాటు= ద్రోణుడు పడిపోవటం; వినియున్= విని కూడ; వేయి పఱియలు= వేయి తునకలు; ఐపోవదు= ఐపోదు; నా గుండె= నా యొక్క హృదయం; ఱాయి= బండ; కాఁగన్+ఓపు= అయి ఉండవచ్చు; ఏమి+అని= ఏమని; ఉమ్మలింతున్?= దుఃఖిస్తాను?

**తాత్పర్యం:** ద్రోణుడు అస్త్రశస్త్రాల ప్రయోగంలో సాటిలేని మేటి; ఉపాయశాలి, పరాక్రమంలో ఘనుడు. అట్టివాడిని పాంచాలవీరులు భయంలేక ఎదిరించారో? ధనుస్సు విరిగిందో? రథం విచ్ఛిన్నమైందో? సారథి పడిపోయాడో? ఏమరిపాటు వలననో? అలసత వలననో? ఎదుటివాడిని లక్ష్యపెట్టకపోవటం వలననో! మరపు ఆవేశించిందో! దుష్టాత్ముడైన ధృష్టద్యుమ్నుడు అతడిని చంపగలిగాడా! ఇది ఆశ్చర్యం! పురుషకారం కంటె విధి బలీయమైంది గదా! ద్రోణుడి మరణవార్త విని కూడా నాగుండె వేయి ముక్కలు కాకుండా ఉన్నది. ఇది రాయి కావచ్చును. ఏమని దుఃఖింతును?'

**వ.** **అని యడ లూని పొగిలి వెండియు.** **81**

**ప్రతిపదార్థం:** అని= ధృతరాష్ట్రుడు ఈ విధంగా అని; అడలు+ఊని= ఏడ్చి; పొగిలి= పరితపించి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఈ విధంగా పలికి, దుఃఖించి, పరితాపం పొంది, మరల.

**తే.** **'మేరు వొఱగుట యినుఁడిలమీఁదఁ బడుట । యబ్ధి యింకుట గాదె ధైర్యమునఁ బేర్చి**
**ప్రభ వెలింగి గభీరత రాశి కెక్కి । యెందుఁ బొగడొందునాచార్యుఁ డిట్టు లగుట.** **82**

**ప్రతిపదార్థం:** ధైర్యమునన్= ధైర్యంతో; పేర్చి= విజృంభించి; ప్రభన్= తేజస్సుతో; వెలింగి= ప్రకాశించి; గభీరత= గాంభీర్యానికి; రాశికిన్+ఎక్కి= అధికమై; ఎందున్= ఎచ్చటైన; పొగడొందు= కీర్తించబడే; ఆచార్యుఁడు= గురువైన ద్రోణుడు; ఇట్టులు+అగుట= ఇట్లా దీనంగా హతుడు కావటం; మేరువు= మేరుపర్వతం; ఒఱగుట= వంగటం; ఇనుఁడు= సూర్యుడు; ఇలమీఁదన్= భూమిపై; పడుట= పడిపోవటం; అబ్ధి= సముద్రం; ఇంకుట= ఇగిరిపోవటం; కాదె!= కాదా!

**తాత్పర్యం:** 'ధైర్యంతో విజృంభించి, తేజస్సుతో వెలిగి; గాంభీర్యానికి పేరుగాంచి సర్వత్ర కీర్తించబడే ఆచార్యుడు ఇట్లా కావటం, ధైర్యానికి ప్రసిద్ధి కెక్కిన మేరు పర్వతం ఒరగడం, ప్రభలచేత వెలుగొందే సూర్యుడు భూమిపై పడిపోవటం, గాంభీర్యానికి పేరుగాంచిన సముద్రం ఇంకిపోవటంవలె ఉన్నది!

**విశేషం:** అలం: ఉపమ. మేరువు ఒరగటం, సముద్రం ఇంకటం వంటి అఘటనలు ఘటించటం ఎట్లో ద్రోణుడు ఒరగడం కూడా అట్లే అని ధృతరాష్ట్రుడు వాపోతున్నాడు.

**క.** **అతిలోక పరాక్రమనిధి । మతి సురగురు మిగులుఁ గురుకుమార గురుఁడు దు**
**ర్మతులగు మత్సుతులకుఁగా । మృతుఁ డయ్యెఁ బరోపకారమృతి యొప్పుఁ గదా!** **83**

**ప్రతిపదార్థం:** అతిలోక= లోకాతీతమైన; పరాక్రమ= శౌర్యానికి; నిధి= నిలయం; మతి= జ్ఞానంలో; సురగురున్= దేవగురుడైన బృహస్పతిని; మిగులున్= మించినవాడు; కురు= కౌరవ వంశీయులైన; కుమార= పుత్రులకు; గురుఁడు= ఆచార్యుడు; దుర్మతులు+అగు= దుష్టబుద్ధులైన; మత్= నా యొక్క; సుతులకున్+కాన్= కొడుకులకై; మృతుఁడు+అయ్యెన్= మరణించాడు; పర= ఇతరులకు; ఉపకార= మేలుగూర్చే; మృతి= మరణం; ఒప్పున్+కదా!= ప్రశంసనీయం కదా!

**తాత్పర్యం:** లోకాతీతమైన పరాక్రమానికి నిధి, బుద్ధిలో బృహస్పతిని మించినవాడు, కురువంశ బాలకులకు ఆచార్యుడు అయిన ద్రోణుడు దుష్టబుద్ధులైన నా పుత్రులకై మరణించాడు. పరోపకారార్థం ప్రాణాలు అర్పించటం అన్నింటికంటె ప్రశంసార్హం కదా!

**విశేషం:** అలం: అప్రస్తుత ప్రశంస. ద్రోణుడి అతిలోక పరాక్రమాదులు స్మృతికి రావటం ధృతరాష్ట్రుడి శోకానికి హేతువులైనవి. 'దుర్మతులగు సుతులు' అనటంలో ఆత్మనింద గోచరిస్తున్నది.

**తే.** **విల్లు పట్టెడు వారెల్ల వెరవు గఱచి । పోవ నెలవైన ద్రోణుని భుజము నిలువ**
**రించి పాంచాలనందనుఁ బంచి పార్థుఁ । డిట్లు సేయించెఁగా; కొరుఁ డేల చాలు?** **84**

**ప్రతిపదార్థం:** విల్లు= ధనుస్సు; పట్టెడువారు= ధరించేవారు; ఎల్లన్= అందరు; వెరవు= ప్రాణరక్షణోపాయాన్ని; కఱచి= నేర్చుకొని; పోవన్= పారిపోగా; నెలవు+ఐన= ఆధారభూతుడైన; ద్రోణుని= ద్రోణుడి యొక్క; భుజము= చేతిని; నిలువరించి= ఆడకుండ జేసి; పాంచాల నందనున్= పాంచాల దేశ రాజపుత్రుడైన ధృష్టద్యుమ్నుడిని; పంచి= ఆజ్ఞాపించి; పార్థుఁడు= అర్జునుడు; ఇట్లు= ఈ విధంగా; చేయించెన్+కాక= చేయించి ఉంటాడు; ఒరుఁడు= ఇతరుడు; ఏల చాలున్?= ఏ విధంగా సమర్థుడు?

**తాత్పర్యం:** ధనుర్ధరులంతా ప్రాణాలపై తీపితో పారిపోగా; సుపరిచితుడైన ద్రోణుడి చేతులు ఆడకుండా జేసి; ధృష్టద్యుమ్నుడిని నియమించి అర్జునుడే ఈ పన్నాగం పన్ని ఉంటాడు. ఇట్లా చేయడం మరొకరి వలన కాదు.

**క. పాముఁ బొదివి పడఁ దిగిచిన । చీమలగములట్లు ద్రోణుఁ జిక్కు పఱిచెఁ గా**
**కేమి బహుదేశసైన్యము; । లే మనఁ గల దింక సూత! యెవ్వరు మనకున్?' 85**

**ప్రతిపదార్థం:** పామున్= పామును; పొదివి= క్రమ్ముకొని; పడన్+తిగిచిన= పడగొట్టిన; చీమలగముల= చీమల గుంపుల; అట్లు= ఆ విధంగా; బహుదేశ= అనేక దేశాల; సైన్యములు= సైన్యాలు; ద్రోణున్= ద్రోణుడిని; చిక్కు+పఱిచెన్+కాక+ఏమి= చిక్కుపరచి ఉంటాయి; ఏమనన్+కలదు?= అనవలసిందేముంది?; సూత!= సంజయా!; ఇంకన్= ఇకముందు; మనకున్= మన పక్షానికి; ఎవ్వరు?= దిక్కెవ్వరు?

**తాత్పర్యం:** పామును కమ్ముకొని పడగొట్టిన చీమల గుంపువలె అనేక దేశ సైన్యాలు ద్రోణుడిని చిక్కుపరచి ఉంటాయి. ఇక చెప్పవలసింది ఏముంది? సంజయా! మన పక్షానికి దిక్కెవ్వరు?

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని పలుమాట లాడి యొల్లంబోయి యాలోనన కొంత దెప్పిఱి, యంగంబులు వడంకుచుండ మఱియు నమ్మానవేశ్వరుండు సూతనందనున కిట్లనియె. 86**

**ప్రతిపదార్థం:** అని= పైవిధంగా పలికి; పలుమాటలు+ఆడి= అనేక విధాల మాట్లాడి; ఒల్లన్+పోయి= మూర్ఛపోయి; ఆలోనన్+అ= ఆలోపుగనే; కొంత= కొంచెం; తెప్పిరి= తెప్పరిల్లి; అంగంబులు= అవయవాలు; వడంకుచుండన్= వణుకుచుండగా; మఱియున్= ఇంకా; ఆ+మానవేశ్వరుండు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; సూతనందనునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా అనేక విధాల పలికి, మూర్ఛిల్లి, ఇంతలోనే కొంత తేరుకొని, అవయవాలన్నీ వణుకుతుండగా ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**తే. 'ప్రథమ గిరిమీఁదఁ దోఁతెంచు భానుఁ బోలి । ధర్మపుత్రుండు దోఁచినఁ దమము విరియు**
**నట్లు విరియక గురునకు నడ్డపడఁగ । వచ్చునే? తమ్ము మెఱసి యెవ్వరికి నైన? 87**

**ప్రతిపదార్థం:** ప్రథమగిరిమీఁదన్= ఉదయపర్వతంపై; తోఁతెంచు= ఉదయించే; భానున్+పోలి= సూర్యుడివలె; ధర్మపుత్రుండు= ధర్మరాజు; తోఁచినన్= కనిపించగా; తమము= చీకటి; విరియునట్లు= తొలగునట్లు; విరియక= తొలగిపోక; తమ్మున్= తాము; మెఱసి= తేజస్సును చూపి; ఎవ్వరికిన్+ఐనన్= ఎవరికైన; గురునకున్= ద్రోణుడికి; అడ్డపడఁగన్= ఆదుకొనటానికి; వచ్చునే?= వీలౌతుందా?

**తాత్పర్యం:** 'పొడుపుకొండమీద ఉదయించే సూర్యుడివలె ధర్మరాజు తేజాన్ని ప్రదర్శిస్తుంటే, చీకట్లు తొలగిపోయినట్లు ప్రక్కకు తొలగిపోకుండా పరాక్రమాన్ని ప్రదర్శించి ద్రోణుడిని ఆదుకోవటం మన వారిలో ఎవరివలన అవుతుంది?

**విశేషం:** అలం: ఉపమ.

**క. సింధురము మహోద్రేకమ । దాంధంబై వచ్చులీల నాచార్యునిపై**
**గంధవహసుతుఁడు గవియ న । మంధరగతి నెవ్వఁ డాఁగు మన యోధులలోన్? 88**

**ప్రతిపదార్థం:** సింధురము= ఏనుగు; మహా+ఉద్రేక= మిక్కిలి విజృంభణతో; మద+అంధంబు+ఐ= మదించి కన్నులు కానరానిదై; వచ్చులీలన్= వచ్చే విధంగా; ఆచార్యునిపైన్= ద్రోణాచార్యుడిమీద; అమంధరగతిన్= మిక్కిలి తీవ్రంగా; గంధవహసుతుఁడు=

వాయుపుత్రుడైన భీముడు; కవియన్= మార్కొనగా; మన= మనయొక్క; యోధులలోన్= వీరులలో; ఎవ్వఁడు= ఎవడు; ఆగున్?= తట్టుకోగలడు?

**తాత్పర్యం:** ఉద్రేకించిన మదపుటేనుగు కన్నుమిన్నుగానక త్రోసుకొని వచ్చేటట్లు, అతివేగంగా భీముడు వచ్చి తాకితే మన యోధులలో అతడిని అడ్డుకొనే వారెవరు?

**విశేషం:** అలం: ఉపమ.

**చ.** **ఉఱుముచు నెల్లెడం బిడుగు లుగ్రగతిం బడ ఘోరమూర్తి యై**
**యఱిముఱిఁ గప్పుదెంచు విలయాభ్రము చాడ్పున మౌర్వినాద మే**
**డ్తెఱఁ జెలఁగన్ వడిం దొరఁగు దివ్యశరంబులు ద్రోణు తేరిపైఁ**
**బఱపు కిరీటి మీ ధరణిపాలకు జోదులచేత నిల్చునే?** 89

**ప్రతిపదార్థం:** ఉఱుముచున్= గర్జిస్తూ; ఎల్ల+ఎడన్= అంతట; పిడుగులు= పిడుగులు; ఉగ్రగతిన్= భయంకరంగా; పడన్= పడగా; ఘోర= భయంకరమైన; మూర్తి+ఐ= రూపం కలవాడై; అఱిముఱిన్= సంభ్రమంతో; కప్పుదెంచు= క్రమ్ముకొనివచ్చే; విలయ= ప్రళయ కాలమందలి; అభ్రము= మేఘం; చాడ్పునన్= వలె; మౌర్వి= అల్లెతాటి; నాదము= మ్రోత; ఏడ్తెఱన్= మిక్కిలి; చెలఁగన్= మెరయగా; వడిన్= వేగంగా; తొరఁగు= దూసుకొనివచ్చు; దివ్యశరంబులు= ఆగ్నేయాస్త్రాది దివ్యాస్త్రాలు; ద్రోణ= ద్రోణాచార్యుడియొక్క; తేరిపైన్= రథంమీద; పఱపు= వేసే; కిరీటి= అర్జునుడు; మీ= మీ యొక్క; ధరణిపాలకు= రాజగు దుర్యోధనుడి యొక్క; జోదులచేతన్= వీరులతో; నిల్చునే?= అడ్డగించబడగలడా?

**తాత్పర్యం:** గర్జిస్తూ, అంతట పిడుగులు కురుస్తూ, ఘోరమూర్తి అయి సంభ్రమంతో కమ్ముకొని వచ్చే ప్రళయకాల మేఘంవలె అల్లెత్రాటి మ్రోత మ్రోయగా, వేగంగా దూసుకొనివచ్చే ఆగ్నేయాస్త్రాదులు ద్రోణుడి రథంమీద పరిచే అర్జునుడిని, దుర్యోధనుడి యోధులు అడ్డుకొనగలరా?

**క.** **ఎవ్వఁడు దెరలెనొ? తిరుగక । యెవ్వఁడు నిల్చెనొ? కడంగి యెవ్వఁడు బిరు దై**
**క్రొవ్వునఁ జచ్చెనొ? కుంభజు । నెవ్వఁడు గావంగలేఁడ? యెయ్యది దుదియో?** 90

**ప్రతిపదార్థం:** ఎవ్వఁడు= ఏ వీరుడు; తెరలెనొ?= వెనుతిరిగెనో? ఎవ్వఁడు= ఏ యోధుడు; తిరుగక= వెనుదిరుగక; కడంగి= ప్రయత్నించి; నిల్చెనొ?= గట్టిగా నిలబడ్డాడో? ఎవ్వఁడు= ఏ వీరుడు; బిరుదు+ఐ= వీరుడై; క్రొవ్వునన్= మదించి; చచ్చెనొ?= చనిపోయినాడో?; కుంభజున్= ద్రోణుడిని; ఎవ్వఁడు= ఏ వీరుడు; కావంగలేఁడు+అ?= రక్షించలేకపోయినాడా?; ఏ+అది= ఏది; తుదియో?= పర్యవసానమో?.

**తాత్పర్యం:** ఏ వీరుడు వెనుదిరిగాడో? ఎవ్వరు వెనుదిరుగక పోరాడాడో? ఏ యోధుడు పట్టుదల వీడక గట్టిగా నిలబడ్డాడో? ఎవడు ప్రతిజ్ఞచేసి మదించి పోరి మరణించాడో? ఆ మహనీయుడిని ఎవ్వడూ రక్షించలేకపోయారా? చివరికి ఏం జరిగిందో?

**విశేషం:** ఇట ద్రోణుడి మరణ వార్త విని శోకిస్తున్న ధృతరాష్ట్రుడిలో శంక, వితర్కం, విషాదం అనే భావాలు వ్యక్తమౌతున్నవి.

**ఆ.** **గురుఁడు వడిన యపుడ కురుసైన్యములఁ గల । వారణాశ్వసుభట వర్గములును**
**బడియెఁ గాక; యేల పడకుండు? నా ధర్మ । పుత్త్రుభాగ్య మలఁతిఁ బోవునెట్లు?** 91

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; పడినయపుఁడు+అ= పడిపోయినపుడే; కురుసైన్యములన్+కల= కౌరవసైన్యంలోగల; వారణ= ఏనుగుల; అశ్వ= గుర్రాల; సుభట= ఉత్తమ సైనికుల; వర్గములును= సమూహాలు కూడా; పడియెన్+కాక= పడిపోయి ఉంటవి; ఏల= ఎట్లా; పడకుండున్?= పడిపోవు?; ఆ ధర్మపుత్త్రు భాగ్యము= ఆ ధర్మరాజు అదృష్టం; ఎట్లు= ఏ విధంగా; అలఁతి పోవున్?= తగ్గుతుంది?.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు పడిపోయినపుడే కౌరవుల చతురంగ బలాలన్నీ పడిపోయి ఉంటాయి. పడకుండా ఉండేదెట్లా? ఆ ధర్మరాజు భాగ్యం ఎట్లా తేలికగా పోతుంది?

**చ.** **నడిఁకెడువాఁడు గాఁడు గురునందనుఁ; డక్కట! తండ్రిచావు న**
**ప్పుడు మొగ తప్పి యొండుఁగడఁ బోరుచునుండెనో? యడ్డపాటు క**
**వ్వడికతనన్ ఫలింపమి నవారణ నాద్రుపదాత్మజుండు బె**
**ట్టడరి వధింపఁగా వికలుఁ డై దురపిల్లుచుఁ జూచుచుండెనో?'** **92**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; గురునందనుఁడు= గురువైన ద్రోణుడి పుత్రుడైన అశ్వత్థామ; నడిఁకెడువాఁడు కాఁడు= ఊరుకొనేవాడు కాడు; తండ్రి= ద్రోణుడు; చావున్+అప్పుడు= మరణ సమయంలో; మొగతప్పి= ఎదురుగా లేక; ఒండున్+కడన్= వేరొకచోట; పోరుచున్+ఉండెనొ?= యుద్ధం చేస్తున్నాడో?; అడ్డపాటు= అడ్డుపడటం; కవ్వడి= అర్జునుడి; కతనన్= కారణంగా; ఫలింపమిన్= ఫలించకపోవటం వలన; అవారణన్= ఎదురులేక; ఆ ద్రుపదాత్మజుండు= ఆ ద్రుపదుడి పుత్రుడైన ధృష్టద్యుమ్నుడు; బెట్టు+అడరి= మిక్కిలి విజృంభించి; వధింపఁగాన్= చంపగా; వికలుఁడు+ఐ= చెదరిన మనస్సు కలవాడై; దురపిల్లుచున్= దుఃఖిస్తూ; చూచుచుండెనో?= చూస్తూ ఉండిపోయాడో?

**తాత్పర్యం:** ద్రోణుడి పుత్రుడైన అశ్వత్థామ ఊరుకొనేవాడు కాడు, తండ్రి మరణించే వేళకు ఎక్కడో యుద్ధం చేస్తూ ఉండి ఉంటాడు. లేదా, అడ్డం వెళ్ళినపుడు అర్జునుడు నిరోధించి ఉంటాడు. అందుకే ఎదురు లేకపోవటం వలన ధృష్టద్యుమ్నుడు మిక్కిలి విజృంభించి ద్రోణుడిని చంపగా దుఃఖిస్తూ, చూస్తూ ఉండిపోయాడేమో?

**క.** **అని పనవి వనట నలఁదురి ၊ 'నిను నెద్దియు నడుగ నాకు నీవేమియుఁ జె**
**ప్పను వలవదు సంజయ! మఱి ၊ వినియెద మది గలఁగె' ననుచు వివశాత్మకుఁ డై.** **93**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; పనవి= ప్రలాపించి; వనటన్= శోకంతో; అలఁదురి= పరితపించి; సంజయ!= ఓ సంజయా!; నినున్= నిన్ను; ఎద్దియున్= ఏది కూడా; అడుగన్= అడుగను; నాకున్; నీవు; ఏమియున్= ఏదికూడ; చెప్పవలవదు= చెప్పవద్దు; మది= మనస్సు; కలఁగెన్= చెదిరి పోయింది; మఱి వినియెదన్= తర్వాత వింటాను; అనుచున్= అంటూ; వివశాత్మకుఁడు+ఐ= వశం తప్పినవాడై.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు ఈ విధంగా పరితపించి, 'ఓ సంజయా! నేను నిన్నేదీ అడుగను, నీవు నాకేమీ చెప్పకుము, ఇపుడు నా మనస్సు చెదరిపోయింది. తర్వాత వింటాను' అంటూ వశం తప్పినవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇందులో ధృతరాష్ట్రుడిలోని చింతా, విషాద, దైన్య, జడతాదులు వ్యక్తమవుతున్నవి.

**వ.** **తన కొడుకుల గెలుపు నెడ నాసమాలుటం జేసి.** **94**

**ప్రతిపదార్థం:** తన= తనయొక్క; కొడుకుల= దుర్యోధనాదుల యొక్క; గెలుపు ఎడన్= గెలుపు విషయమై; ఆస= ఆశ; మాలుటన్+చేసి= నశించటంచేత.

**తాత్పర్యం:** తన కొడుకులు గెలుస్తారన్న ఆశ వదలుకొనటం వలన.

**ఆ సొమ్మవోయి పడిన సుదతు లాక్రందన । రవముతోడ సత్వరముగ నెత్తి**
**యా నృపాలు సెజ్జయం దిడి మెలపున । శిశిర విధులు సేయ సేద తేఱి.** 95

**ప్రతిపదార్థం:** సొమ్మ+పోయి= సొమ్మసిల్లి; పడినన్= పడగా; సుదతులు= స్త్రీలు; ఆక్రందన= ఏడ్పుయొక్క; రవముతోడన్= అరుపులతో; సత్వరముగన్= వేగంగా; ఆ నృపాలున్= ఆ ధృతరాష్ట్రుడిని; ఎత్తి= పైకెత్తి; సెజ్జ అందున్= పరుపుపై; ఇడి= పడుకొనేటట్లుంచి; మెలపునన్= జాగరూకతతో; శిశిర విధులు= శైత్యోపచారాలు; చేయన్= చేయగా; సేద తేరి= అలసట తీరి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు సొమ్మసిల్లి పడిపోగా, స్త్రీలు ఆక్రందిస్తూ వెంటనే అతడిని పైకెత్తి, పరుపుపై పరుండపెట్టి, జాగ్రత్తగా శైత్యోపచారాలు చేయగా, అలసట తీరి. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. ఆసీనుండై యాతండు సూతసుతున కిట్లనియె: 'నరనారాయణులు రథిసారథులైన యా రథం బెందు సిద్ధమనోరథం బగుఁ; గవలుగడింది మగలు; సాత్యకి సత్యపరాక్రముండు; పాంచాలోత్తముండగు నుత్తమౌజుం డుదాత్తబలుండు; శిశుపాలతనయుం డగు ధృష్టకేతుండు ధీరుండు; భీష్మపాతన హేతువైన శిఖండి యఖండ పరాక్రముండు; సౌభద్రుండు రెండవరుద్రుండు, యాదవశ్రేష్ఠుండగు చేకితానుండు మానధనుండు; ద్రౌపదేయు లజేయులు; గేకయు లేవురు వేవురపెట్టు; యుయుత్సుండు బహుళ మత్సరుండు; ద్రోణవధంబ పనిగాఁ బుట్టిన ధృష్టద్యుమ్నుండు భుజసారద్యుమ్నుండు; ఘటోత్కచుండు ఘనఘోరమూర్తి; కృష్ణాశ్రితంబైన వృష్ణికుమార లోకం బలోకమాన్యంబన మిగిలిన బిరుదుతనంబునం బేర్చినయది; భీమగదాభీషణుండైన భీమసేనుండు నెవ్వరికి నలవిగాక యుండుఁ; బాండవ సేనఁ గావను గౌరవ సైన్యంబు సమయింపను దాన చాలునట్టి పరికరంబును గలదను కొలంది గాదు; కార్యవివేక శౌర్యోద్రేకధుర్యుండు ధర్మదేవత కొడుకు ధార్మికత్వసత్యాది మహాగుణ గరిష్ఠుండు యుధిష్ఠిరుం; దతని గెలువ దేవతలకు నశక్యంబు; మఱియు నొక్క విశేషంబు సెప్పెద నాకర్ణింపుము.** 96

**ప్రతిపదార్థం:** ఆసీనుండు+ఐ= కూర్చొని; ఆతండు= ఆ ధృతరాష్ట్రుడు; సూతసుతునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు; నరనారాయణులు= కృష్ణార్జునులు; రథి= రథంపైనుండి యుద్ధం చేసేవాడు; సారథి= రథం నడుపువాడు; ఐన; ఆ రథంబు= అట్టి రథం; ఎందును= ఎచ్చటనైన; సిద్ధమనోరథంబు+అగున్= సిద్ధించిన కోర్కెలు గలది అవుతుంది; కవలు= నకుల సహదేవులు; కడింది= గొప్ప; మగలు= వీరులు; సాత్యకి= కృష్ణుడి తమ్ముడైన సాత్యకి; సత్యపరాక్రముండు= నిజమైన పరాక్రమం కలవాడు; పాంచాల+ఉత్తముఁడు+అగు= పాంచాలదేశ వీరులలో శ్రేష్ఠుడగు; ఉత్తమౌజుండు= ఉత్తమౌజుడు; ఉదాత్త బలుండు= గొప్పబలశాలి; శిశుపాల తనయుండు+అగు= శిశుపాలుని కుమారుడైన; ధృష్టకేతుండు= ధృష్టకేతువు; ధీరుండు= ధైర్యవంతుడు; భీష్మ= భీష్ముడియొక్క; పాతన= పడగొట్టటానికి; హేతువు+ఐన= కారణమైన; శిఖండి= శిఖండి; అఖండ పరాక్రముండు= మొక్కవోని పరాక్రమం కలవాడు; సౌభద్రుండు= సుభద్ర పుత్రుడైన అభిమన్యుడు; రెండవ రుద్రుండు= ఈశ్వరునంతటివాడు; యాదవశ్రేష్ఠుండు+అగు= యాదవులలో ఉత్తముడైన; చేకితానుండు= చేకితానుడు; మానధనుండు= అభిమానమే ధనంగా గలవాడు; ద్రౌపదేయులు= ద్రౌపది పుత్రులైన ప్రతివింధ్యాదులు; అజయ్యులు= జయించవీలుగానివారు; కేకయులు= కేకయ దేశవీరులు; ఏవురు= ఐదుగురు; వేవురపెట్టు= వేయిమందితో సమానం; యుయుత్సుండు= ధృతరాష్ట్రుడి కొడుకైన యుయుత్సుడు; బహుళ మత్సరుండు= మిక్కిలి క్రోధం కలవాడు; ద్రోణవధంబు+అ= ద్రోణుడిని చంపటమే; పనిగాన్= కర్తవ్యంగా; పుట్టిన= జన్మించిన; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; భుజ= బాహువుల; సార= శక్తియే; ద్యుమ్నుండు= ధనంగా కలవాడు;

ఘటోత్కచుడు; ఘన= గొప్పనైన; ఘోర= భయంకరమైన; మూర్తి= రూపంకలవాడు; కృష్ణ+ఆశ్రితంబు+ఐన= శ్రీకృష్ణుడి ఆధీనంలో ఉన్న; వృష్ణికుమార లోకంబు= వృష్ణివంశ వీరుల సమూహం; అలోక= లోకాతీతమైన; మాన్యంబు= గౌరవం కలది; అనమిగిలిన= అనజాలిన; బిరుదుతనంబునన్= ప్రసిద్ధితో; పేర్చిన+అది= పెంపు కలది; భీమ= భయంకరమైన; గదా= గదచేత; భీషణుండైన= భయంకరుడైన; భీమసేనుండు= భీముడు; ఎవ్వరికిన్= ఎవ్వరికికూడా; అలవికాక+ఉండున్= సాధ్యంకాక ఉంటాడు; పాండవసేనన్= పాండవసైన్యాన్ని; కావను= రక్షించటానికి; కౌరవసైన్యంబు= కౌరవుల సేనను; సమయింపను= చంపటానికి; తాను+అ= తానె; చాలునట్టి= తగిన; పరికరంబును= సాధనం; కలదు+అను= ఉన్నదన్న; కొలంది+కాదు= పరిమితియేకాదు; కార్య= పని నడపు; వివేక= జ్ఞానం; శౌర్య= శూరత్వం; ఉద్రేక= విజృంభణ; ధుర్యుండు= ధరించినవాడు; ధర్మదేవత కొడుకు= యమధర్మరాజు అంశలో పుట్టినవాడు; ధార్మికత్వ= ధర్మాన్ని అనుసరించే గుణంలో; సత్య+ఆది= సత్యం మొదలైన; మహాగుణ= గొప్ప గుణాలచేత; గరిష్ఠుండు= మిక్కిలి గొప్పవాడు; యుధిష్ఠిరుండు= యుద్ధంలో స్థిరుడైన ధర్మరాజు; అతనిన్+గెలువన్= ఆ ధర్మజుడిని జయించటానికి; దేవతలకున్= అమరులకు కూడ; అశక్యంబు= వీలుకాదు; మఱియున్= ఇంకా; ఒక్క విశేషంబు= ఒక అతిశయం; చెప్పెదన్= చెపుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు కూర్చొని సంజయునితో ఇట్లా అన్నాడు. 'నారాయణుడైన కృష్ణుడు సారథి, నరుడైన అర్జునుడు రథాధిష్ఠితుడై యుద్ధం చేసేవాడు. ఇట్టి రథం ఎచటనైనా కోర్కెలను తీర్చగలదు. నకుల సహదేవులు మహావీరులు. సాత్యకి నిజమైన పరాక్రమం కలవాడు. పాంచాలురలో ఉత్తముడైన ఉత్తమౌజుడు ఉదాత్తబలుడు. శిశుపాలుడి కొడుకు ధృష్టకేతుడు ధీరుడు. భీష్ముడు పడిపోవటానికి కారణమైన శిఖండి మొక్కవోని పరాక్రమవంతుడు. అభిమన్యుడు రెండవ రుద్రుడు. యాదవ శ్రేష్ఠుడైన చేకితానుడు మానధనుడు. ప్రతివింధ్యాదులైన ద్రౌపది పుత్రులు అజేయులు. కేకయ నృపులు ఐదుగురు వెయ్యిమంది పెట్టు. యుయుత్సుడు మిక్కిలి క్రోధం కలవాడు. ద్రోణుడిని వధించటానికి పుట్టిన ధృష్టద్యుమ్నుడు భుజబలమే ధనంగా కలవాడు. ఘటోత్కచుడు భయంకర రూపుడు. కృష్ణుడిని ఆశ్రయించి ఉన్న వృష్ణిసంఘం లోకాతీత గౌరవంగల బిరుదు కలది. భయంకరమైన గదచేత భీకరుడైన భీముడు ఎవరికీ అలవికానివాడు. పాండవసేనను కాపాడటంలో కౌరవసేనను నశింపజేయటంలో ఇత డొక్కడే సరిపోతాడు. ఇతర పరికరాలెన్ని ఉన్నా ఇతడి ముందు సరితూగవు. ధర్మజుడు, కార్యం సాధించే వివేకం, శౌర్యోద్రేకం పుష్కలంగా కలవాడు. ధార్మికత్వం, సత్యం మొదలైన మహాగుణాలలో సాటిలేనివాడు. యుద్ధంలో స్థిరుడైన అతడిని గెలవటం దేవతలకు కూడా అశక్యం. మరొక విశేషం చెప్పుతాను వినుము.

**మ. యదు వంశంబున లోకరక్షణ పరుండై పుట్టి వ్రేపల్లె ను**
**న్మద బాల్యంబు నటించి, కంసముఖ నానాదైత్యులం ద్రుంచి బ**
**ల్లిదుఁ డా యింద్రుని పారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చి శి**
**ష్టదయాళుత్వము వూనియున్న హరి నిష్ఠం జెంది రప్పాండవుల్. 97**

**ప్రతిపదార్థం:** ఆ+పాండవులు= ఆ పాండురాజు పుత్రులు; యదువంశంబునన్= యాదవకులంలో; లోకరక్షణ పరుండు+ఐ= లోకాన్ని కాపాడేవాడై; పుట్టి= జన్మించి; వ్రేపల్లెన్= గొల్లపల్లెలో; ఉన్మద బాల్యంబు= చపల బాల్యం; నటించి= కపటంగా వర్తించి; కంస= కంసుడు; ముఖ= మొదలైన; నానా= అనేకులైన; దైత్యులన్= రాక్షసులను; త్రుంచి= చంపి; బల్లిదుఁడు= బలవంతుడైన; ఆ+ఇంద్రుని= ఆ ఇంద్రుడియొక్క; పారిజాతము= పారిజాతవృక్షం; ఇలకున్= భూమిపైకి; లీలాగతిన్= అవలీలగా; తెచ్చి= తీసికొని వచ్చి; శిష్టదయాళుత్వము= మంచివారిపై కారుణ్యం; పూని ఉన్న= కలిగి ఉన్న; హరి= శ్రీకృష్ణుడియొక్క; నిష్ఠన్= ఆశ్రయాన్ని; చెందిరి= పొందారు.

**తాత్పర్యం:** లోకరక్షణపరుడై, యదువంశంలో జన్మించి, వ్రేపల్లెలో బాల్యావస్థను నటించి, కంసాది రాక్షసులను చంపి, బలశాలియైన ఇంద్రుడి పారిజాతవృక్షాన్ని అవలీలగా దెచ్చి, సాధువులపై కారుణ్యం కలవాడైయున్న శ్రీకృష్ణుడిని ఆ పాండవులు ఆశ్రయించారు.

**వ. కావున వారల గెలుచు టరిది; యట్లుంగాక.** 98

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; వారలన్= ఆ పాండవులను; గెలుచుట= జయించటం; అరిది= అశక్యం; అట్లున్+కాక= అదీకాక.

**తాత్పర్యం:** కనుక ఆ పాండవులను జయించటం అశక్యం. అదేకాక. (తరువాతి పద్యంతో అన్వయం)

**క. హరి యాత్మ యర్జునునకు; కా। హరి కర్జునుఁ డాత్మ; హరియు నర్జునుఁడును నా**
**నిరువు రగుట క్రీడార్థం;। బరయఁగ నది యొక్క వెలుఁగ యతులం బెందున్.** 99

**ప్రతిపదార్థం:** అర్జునునకున్= అర్జునుడికి; హరి= కృష్ణుడు; ఆత్మ= జీవం; హరికిన్= శ్రీకృష్ణునికి; అర్జునుఁడు= అర్జునుడు; ఆత్మ= జీవం; హరియున్= కృష్ణుడును; అర్జునుడును నాన్= అర్జునుడు అనగా; ఇరువురు= ఇద్దరు; అగుట= కావడం; క్రీడా+అర్థంబు= ఆట కొరకే; అరయఁగన్= విచారించగా; అది= వారి ఆత్మ; ఒక్క= ఒక; వెలుఁగు+అ= ప్రకాశమే; ఎందున్= ఎచటనైనా; అతులంబు= సాటిలేనిది.

**తాత్పర్యం:** అర్జునుడికి కృష్ణుడు ఆత్మ, శ్రీకృష్ణుడికి అర్జునుడు ఆత్మ. హరి అని, అర్జును డని వేరుగా కనిపించటం ఒక క్రీడ. అదంతా సాటిలేని ఒకే ప్రకాశం.

**క. ఆ వెలుఁగు గనువెలుంగుగఁ। దా వెలసిన పుణ్యమూర్తి ధర్మసుతుం డే**
**లా వెఱచు? రణమునకు; నా। చే వచ్చెం గౌరవులకుఁ జే; టే మందున్?'** 100

**ప్రతిపదార్థం:** ఆ వెలుఁగు= ఆ కృష్ణార్జునులనే తేజస్సు; కనువెలుంగుగన్= కంటి వెలుగుగా; తాను+ఐ= తానే అయి; వెలసిన= ప్రసిద్ధికెక్కిన; పుణ్యమూర్తి= పుణ్యమే రూపంగా కలవాడు; ధర్మసుతుండు= ధర్మరాజు; రణమునకున్= యుద్ధానికి; ఏలా= ఎట్లు; వెఱచున్?= భయపడతాడు?; నాచేన్= నా వలన; కౌరవులకున్= దుర్యోధనాదులకు; చేటు= కీడు; వచ్చెన్= కలిగింది; ఏమి+అందున్?= అనవలసింది ఏమున్నది?

**తాత్పర్యం:** ఆ కృష్ణార్జునుల తేజస్సు కనువెలుగుగా తానై ప్రసిద్ధికెక్కిన పుణ్యరూపుడు ధర్మరాజు. అతడు యుద్ధానికి భయపడతాడా? నా వలన కౌరవులకంతా కీడు మూడింది. ఇక నేను చెప్పేదేమున్నది?'

**వ. అని వెచ్చనూర్చి యూరకుండి వెండియు.** 101

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా అని; వెచ్చన్+ఊర్చి= వేడి నిట్టూర్పు వదలి; ఊరకుండి= మౌనంగా ఉండి; వెండియున్= మరియు.

**తాత్పర్యం:** ఇట్లని, వేడి నిట్టూర్పు వదలి, మౌనంగా ఉండి, మరల.

**చ. 'గురుఁడును భీష్ముడుం గలనఁ గూలుదు రట్టె, కిరీటి కింక నె**
**వ్వ రెదురు? కౌరవక్షయ మవశ్యము నయ్యెడు; వార్త లేమిగాఁ**
**బురబురఁ బొక్కుచున్ వినఁగ బుద్ధిఁ దలంచెద; నైన ద్రోణు సం**
**గర పరిపాటి యెల్ల వినఁగా వలతున్ వివరించి చెప్పుమా!'** 102

**ప్రతిపదార్థం:** గురుఁడును= ద్రోణుడును; భీష్ముఁడున్= భీష్ముడును; కలనన్= యుద్ధంలో; కూలుదురు+అట్టె= కూలిపోతారా; కిరీటికిన్= అర్జునుడికి; ఇంకన్= ఇకముందు; ఎవ్వరు= ఏ వీరులు; ఎదురు= పోటీ; కౌరవక్షయము= కౌరవులయొక్క నాశనం; అవశ్యమున్= తప్పక; అయ్యెడున్= అవుతుంది; వార్తలు= సమాచారాలు; ఏమిగాన్= ఏవైనా; (లేదా) వార్తలు= వార్తలు; ఏమిగాన్= ఏమని; పురపురన్= మిక్కిలి; పొక్కుచున్= ఏడుస్తూ; వినఁగన్= వినాలని; బుద్ధిన్= మనస్సులో; తలంచెదన్= అనుకొంటాను; ఐనన్= ఐనా; ద్రోణు= ద్రోణాచార్యునియొక్క; సంగర= యుద్ధపు; పరిపాటి= క్రమం; వినగాన్= వినాలని; వలతున్= ఇష్టపడతాను; వివరించి= వివరంగా; చెప్పుమా!= చెప్పవలసింది!

**తాత్పర్యం:** 'అజేయులైన భీష్మద్రోణులు యుద్ధంలో పడిపోయారా! ఇక అర్జునుడిని ఎదుర్కొనే వారెవ్వరు? కౌరవులు తప్పక నశిస్తారు. దుఃఖపడుతూ ఎటువంటి వార్తలైనాసరే అన్నీ వినదలచుకొన్నాను. ద్రోణుడి యుద్ధక్రమమంతా వివరించుము'.

**తే.** **అనిన సంజయుఁ డిట్లను నాంబికేయు । తోడ 'నేను దెల్లంబుగ ద్రోణుసమర**
**మెఱిఁగి వచ్చితిఁ; జెప్పెద నెల్లఁ దెలియ । వినుము దిరమయి; మాటలు వేయు నేల? 103**

**ప్రతిపదార్థం:** అనినన్= ధృతరాష్ట్రుడు ఇట్లనగా; సంజయుఁడు= సంజయుడు; ఆంబికేయుతోడన్= ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటాడు; నేను; తెల్లంబుగాన్= విశదంగా; ద్రోణుసమరము= ద్రోణుడియొక్క యుద్ధాన్ని గూర్చి; ఎఱిఁగి వచ్చితిన్= తెలిసికొని వచ్చాను; ఎల్లన్= అంతా; చెప్పెదన్= తెలియజేస్తాను; తిరమయి= స్థిరచిత్తంతో; తెలియ వినుము= బాగా వినుము; మాటలు= పలుకులు; వేయున్+ఏల?= ఎక్కువ ఎందుకు?

**తాత్పర్యం:** 'ఎక్కువ మాట లెందుకు? ద్రోణాచార్యుడి యుద్ధాన్ని గూర్చి చక్కగా తెలిసికొని వచ్చాను. స్థిరచిత్తుడవై విశదంగా వినుము'. అని ధృతరాష్ట్రుడితో సంజయు డన్నాడు.

### ద్రోణుఁడు దుర్యోధనునకు ధర్మరాజుం బట్టి యిచ్చునట్లు వరం బిచ్చుట (సం. 7-11-1)

**వ.** **అట్లుసేనాధిపత్యంబు పూని కుంభసంభవుండు ముదితమనస్కుండై గారవంబునం గౌరవేంద్రునకు నరేంద్రులు విన నిట్లనియె. 104**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; సేనాధిపత్యంబు= సైన్యాధిపత్యం; పూని= వహించి; కుంభసంభవుండు= ద్రోణుడు; ముదితమనస్కుండు+ఐ= సంతోషించిన మనస్సుగలవాడై; గౌరవంబునన్= ప్రేమతో; కౌరవేంద్రునకున్= దుర్యోధనుడితో; నరేంద్రులు= రాజశ్రేష్ఠులు; వినన్= వినగా; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ద్రోణాచార్యుడు సర్వసేనాపతి అయి, సంతోషపడి, రాజశ్రేష్ఠులంతా వింటుండగా దుర్యోధనుడితో ఈ తీరున అన్నాడు.

**క.** **'నను భీష్ముని పిదప బలం । బున కెల్లను ముఖ్యుఁ జేసి పూజించితి వీ**
**వినుతాచరణఫలంబును । గనువాఁడవు; వరము గోరు కౌరవనాథా!' 105**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= దుర్యోధన మహారాజా!; ననున్= నన్ను; భీష్ముని= భీష్మునియొక్క; పిదపన్= తరువాత; బలంబునకున్= సైన్యానికి; ఎల్లను= అంతటికి; ముఖ్యున్= అధిపతినిగా; చేసి= కావించి; పూజించితివి= గౌరవించావు; ఈ= ఈ; వినుత= ప్రశంసించదగిన; ఆచరణ= నడవడికి; ఫలంబును= ఫలితాన్ని; కనువాఁడవు= పొందగలవు; వరము= వరాన్ని; కోరు= కోరుకొమ్ము.

**తాత్పర్యం:** 'దుర్యోధన మహారాజా! భీష్ముడి తరువాత నన్ను సైన్యానికంతా అధిపతిని చేసి గౌరవించావు. ఈ ప్రశంసనీయమైన ప్రవర్తనకు తగిన సత్ఫలితాన్ని పొందగలవు, వరాన్ని కోరుకొమ్ము!' అని ద్రోణుడు అన్నాడు.

**వ. అనిన విని యతండు కర్ణ దుశ్శాసనాది సుహృజ్జనంబులతో నాలోచనంబు సేసి సవినయంబుగా గురున కిట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= విని; అతండు= దుర్యోధనుడు; కర్ణ= కర్ణుడు; దుశ్శాసన= దుశ్శాసనుడు; ఆది= మొదలైన; సుహృద్+జనంబులతోన్= మిత్రులందరితోను; ఆలోచనంబు చేసి= ఆలోచించి; సవినయంబుగాన్= వినయంతో; గురునకున్= ద్రోణాచార్యుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని దుర్యోధనుడు, కర్ణుడు, దుశ్శాసనుడు మొదలైన మిత్రవర్గంతో ఆలోచించి, వినయపూర్వకంగా ద్రోణాచార్యుడితో ఇట్లా అన్నాడు.

**క. 'వర మిచ్చెదేనిఁ గోరెదఁ । బరమహితము ధర్మపుత్త్రుఁ బ్రాణముతోడన్**
**దురమునఁ బట్టి భుజాభీ । కర! కొని రావలయు మత్సకాశంబునకున్.' 107**

**ప్రతిపదార్థం:** భుజా= బాహువులచే; భీకర!= భయం గొలుపేవాడా!; వరము= వరం; ఇచ్చెదు+ఏని= ఇవ్వదలచుకొంటే; పరమ= మిక్కిలి; హితము= మేలునే; కోరెదన్= కోరుతాను; ధర్మపుత్త్రున్= ధర్మరాజును; ప్రాణముతోడన్= ప్రాణాలతో; దురమునన్= యుద్ధములో; పట్టి= బంధించి; మత్= నా యొక్క; సకాశంబునకున్= ఎదుటికి; కొని రావలయున్= తేవలెను.

**తాత్పర్యం:** 'భుజబలంతో భయం గొలిపే ద్రోణాచార్యా! నీవు వరమిస్తే చాలా మేలైనదాన్నే కోరుతాను. యుద్ధంలో ధర్మరాజును సజీవంగా బంధించి నా ముందుకు తీసికొని రావాలి'.

**విశేషం:** 'భుజాభీకర' అనే సంబోధన సాభిప్రాయమై ధర్మజుడిని బంధించే సామర్థ్యాన్ని తెలుపుతున్నది.

**వ. అని కోరుటయు భారద్వాజుండు నీ కొడుకువదనం బవలోకించి. 108**

**ప్రతిపదార్థం:** అని కోరుటయున్= అని కోరగా; భారద్వాజుండు= భరద్వాజుడి పుత్రుడైన ద్రోణుడు; నీ= నీ యొక్క; కొడుకు= పుత్రుడైన దుర్యోధనుడియొక్క; వదనంబు= ముఖం; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** ధర్మజుడిని బంధించి తెమ్మని దుర్యోధనుడు కోరగా, ద్రోణుడు అతడి వైపు చూచి.

**చ. అకట! యజాతశత్రుఁ డను నప్పలు కిప్పుడు నిక్కమయ్యె వా**
**నికిఁ గురునాథ! యిట్టు లతనిం దెగఁ జూచుట గోర కాజిఁ బ**
**ట్టికొనుట గోరి తివ్విధము డెప్పర మెంతయు నిత్తెఱంగు గో**
**ర్కికిఁ గతమేమి, పాండవుల గెల్చి ధరన్ సగ మీఁ దలంచితే? 109**

**ప్రతిపదార్థం:** కురునాథ!= దుర్యోధనా!; అకట!= ఆహా!; వానికిన్= ఆ ధర్మరాజుకు; అజాతశత్రుఁడు+అను= శత్రువులు లేనివాడనే; ఆ+పలుకు= ఆ మాట; ఇప్పుడు= ఈ సమయంలో; నిక్కము+అయ్యెన్= నిజమైనది; ఇట్టులు= ఈ విధంగా;

అతనిన్= ఆ ధర్మజుడిని; తెగఁజూచుట= చంపటం; కోరక= అడుగక; ఆజిన్= యుద్ధంలో; పట్టికొనుట= బంధించటం; కోరితి(వి)= కోరావు; ఈ+విధము= ఈ రీతి; ఎంతయున్= ఎంతో; డెప్పరము= ఆశ్చర్యకరం; ఈ+తెఱంగు= ఈ విధమైన; కోర్కికిన్= కోర్కెకు; కతము+ఏమి?= కారణమేమిటి?; పాండవులన్= పాండురాజు పుత్రులైన ధర్మజాదులను; గెల్చి= జయించి; ధరన్= భూమిని; సగము= అర్ధభాగము; ఈన్+తలంచితే?= ఇవ్వదలచావా?

**తాత్పర్యం:** 'దుర్యోధనా! ధర్మరాజుకు అజాతశత్రువనే పేరు ఇప్పుడు నిజమైందిగదా! అతడిని వధించుమని కోరక యుద్ధంలో బంధించుమని చెప్పుతున్నావు. ఇది ఆశ్చర్యకరమైన విషయం. ఇట్లా కోరటానికి కారణమేమిటి? పాండవులను జయించి, సగం రాజ్యాన్ని ఇవ్వదలచావా?

**వ. నీదు నిశ్చయంబెట్టిది? యతనిం బట్టిదెచ్చిన నేమి సేయంగల వాఁడ?' వని యడిగిన నమ్మనుజవరుం డుప్పొంగి తన మనంబున నున్న కార్యం బాచార్యునకుం దక్కటి దొరలకుం దేటపడ నిట్లనియె. 110**

**ప్రతిపదార్థం:** నీదు= నీ యొక్క; నిశ్చయంబు= నిర్ణయం; ఎట్టిది?= ఎటువంటిది?; అతనిన్= ఆ ధర్మరాజును; పట్టితెచ్చినన్= బంధించి తెస్తే; ఏమి చేయన్+కలవాఁడవు= ఏమి చేస్తావు; అని అడిగినన్= అని అడుగగా; ఆ+మనుజవరుండు= ఆ రాజగు దుర్యోధనుడు; ఉప్పొంగి= సంతోషించి; తన= తనయొక్క; మనంబునన్= మనస్సులో; ఉన్న= ఉన్నటువంటి; కార్యంబు= అభిప్రాయం; ఆచార్యునకున్= ద్రోణుడికి; తక్కటి దొరలకున్= మిగిలిన రాజులకు; తేటపడన్= విశదమయ్యేటట్లు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! నీ నిర్ణయం ఏమిటి? ధర్మరాజును బంధించి తెస్తే ఏం చేస్తావు?' అని ద్రోణుడు అడుగగా, దుర్యోధనుడు సంతోషించి, తన మనస్సులో ఉన్న అభిప్రాయాన్ని ద్రోణుడికీ, అక్కడ ఉన్న దొరలకూ తేటపడేటట్లు ఈ విధంగా అన్నాడు.

**సీ. 'ఆ ధర్మసూనుఁ గయ్యంబునఁ జంపినఁ । గోపించి గాండీవి కురుబలంబు**
**సమయించు; మన మోపి సర్వపాండవులనుఁ । జంపితిమేనిఁ బ్రచండ చక్ర**
**ధారఁ గౌరవకోటి తలలేఁటి రాజ్యంబు । గోవిందుఁ డీకున్నె గొంతికయినఁ;**
**గాన యుధిష్ఠిరుఁ గాయంబు నొంపక । తెచ్చి జూదంబాడు తెఱఁ గొనర్చి**

**తే మగుడ నడవికి ననిచినఁ దగిలి యతని । తోడఁ దమ్ములుఁ బో నంతతోన యెల్ల**
**దొసఁగు మాలు; నప్రతిహత దోర్విభూతిఁ । బెద్దకాల మే నేలుదుఁ బృథివి యెల్ల.' 111**

**ప్రతిపదార్థం:** ఆ ధర్మసూనున్= ఆ ధర్మరాజును; కయ్యంబునన్= యుద్ధంలో; చంపినన్= చంపితే; కోపించి= కోపంతో; గాండీవి= అర్జునుడు; కురుబలంబున్= కౌరవసైన్యాన్ని; సమయించున్= చంపుతాడు; మనము= మనం; ఓపి= సమర్థతతో; సర్వపాండవులను= పాండవులందరిని; చంపితిమి+ఏనిన్= చంపితే; గోవిందుఁడు= శ్రీకృష్ణుడు; ప్రచండ= మిక్కిలి తీక్ష్ణమైన; చక్ర= చక్రాయుధంయొక్క; ధారన్= అంచుచేత; కౌరవ= దుర్యోధనాదుల యొక్క; కోటి= సమూహం యొక్క; తలలు= శిరస్సులు; ఏఱి= ఖండించి; రాజ్యంబు= రాజ్యాన్ని; గొంతికయినన్= కుంతీదేవికైనా; ఈకున్నె!= ఇయ్యకుండా ఉంటాడా!; కానన్= కావున; యుధిష్ఠిరున్= ధర్మరాజును; కాయంబున్= దేహాన్ని; నొంపక= హతమార్చక; తెచ్చి= బంధించి తెచ్చి; జూదంబు= జూదం; ఆడు తెఱఁగు+ఒనర్చి= ఆడేటట్లు చేసి; మగుడన్= మళ్ళీ; అడవికిన్= అరణ్యానికి; అనిచినన్= పంపితే; అతనితోడన్+తగిలి= అతడివెంట; తమ్ములున్= తమ్ములైన భీమాదులు; పోన్= పోగా; అంతలోనన్= అంతటితో; ఎల్లదొసఁగున్= ఆపద అంతా; మాలున్= తొలగిపోతుంది; అప్రతిహత= ఎదురులేని; దోః= బాహువులయొక్క; విభూతిన్= సంపదతో; పెద్ద కాలము= చాలా కాలం; ఏన్= నేను; పృథివిన్= భూమిని; ఎల్లన్= అంతయు; ఏలుదున్= పాలిస్తాను.

**తాత్పర్యం:** 'ఆ ధర్మరాజును మనం యుద్ధంలో చంపితే అర్జునుడు కోపంతో కౌరవ సైన్యాన్ని హతమారుస్తాడు. మనం పాండవుల నందరినీ చంపితే, శ్రీకృష్ణుడు చక్రాయుధంతో కౌరవుల నందరినీ చంపి, కుంతికైనా రాజ్యాన్ని సమర్పిస్తాడు. కనుక ధర్మరాజును సజీవంగా బంధించి తెచ్చి, జూదమాడించి, మళ్ళీ అడవులకు పంపితే, అతడితోబాటు తమ్ములు కూడా పోతారు. దీనితో మన ఆపదలన్నీ తొలగిపోతాయి. అపుడు ఎదురులేని భుజబలంతో భూమండలాన్ని చాలా కాలం పరిపాలిస్తాను.'

**వ. అనిన విని కుటిలంబగు నతని యభిప్రాయంబునకు రోసి, యస్త్రగురుం డవ్వరంబునకు నేమేనియు నెడవెట్టియిచ్చువాఁడుగా నూహించి, యొక్క తెఱంగుఁ గాంచి, యన్నరనాథున కిట్లనియె. 112**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; కుటిలంబు+అగు= కుచ్చితమైన; అతని= ఆ దుర్యోధనుడియొక్క; అభిప్రాయంబునకున్= ఉద్దేశమునకు; రోసి= ఏవగించి; అస్త్రగురుండు= ద్రోణాచార్యుడు; ఆ+వరంబునకున్= ఆ వరానికి; ఏమేనియున్= ఏదైన; ఎడవెట్టి= అడ్డువెట్టి; ఇచ్చువాఁడుగాన్= ఇవ్వాలని; ఊహించి= అనుకొని; ఒక్క తెఱంగున్= ఒక ఉపాయాన్ని; కాంచి= కనుగొని; ఆ+నరనాథునకున్= ఆ దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఆ విధంగా చెప్పగా కుచ్చితమైన అతని అభిప్రాయాన్ని విని అసహ్యించుకొని, ద్రోణాచార్యుడు ఆ వరాన్ని ఏదైనా అడ్డువెట్టి ఇవ్వాలనుకొని, ఒక ఉపాయాన్ని ఆలోచించి దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**చ 'నరుఁ డెడ సొచ్చెనేని విను నా కది దుష్కర మేనొకండనే**
**సురగణమైన వ్రేలఁ గొని చూపఁగఁ జాలరు వాఁడు లేనిచోఁ**
**దిరమయి పోర నిల్చిన యుధిష్ఠిరు ద్రౌపది పుట్టినింటి వే**
**వురు వెఱఁగంది చూడ నలవుం జలముం జెడఁ బట్టి తెచ్చెదన్.' 113**

**ప్రతిపదార్థం:** వినుము= ఆలకించుము; నరుఁడు= అర్జునుడు; ఎడ+చొచ్చెన్+ఏని= అడ్డువస్తే; నాకున్= నాకు; అది= ధర్మరాజును బంధించటం; దుష్కరము= వీలుగానిది; ఏను= నేను; ఒకండనే= ఒక్కడినే కాదు; సురగణమైనన్= దేవతా సమూహమైనా; వ్రేలన్+కొని= వ్రేలెత్తి; చూపఁగన్+చాలరు= చూపలేరు; వాఁడు= ఆ అర్జునుడు; లేనిచోన్= లేకుంటే; తిరమయి= స్థిరంగా; పోరన్= యుద్ధంలో; నిల్చిన= నిలబడ్డ; యుధిష్ఠిరున్= ధర్మరాజును; ద్రౌపది= ద్రౌపదియొక్క; పుట్టినింటి= పుట్టింటివారైన పాంచాలురు; వేవురు= వెయ్యిమంది; వెఱఁగంది= ఆశ్చర్యపడి; చూడన్= చూస్తుండగా; అలవున్= బలం; చలమున్= మాత్సర్యం కూడ; చెడన్= నశించగా; పట్టి= బంధించి; తెచ్చెదన్= తెస్తాను.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! వినుము. అర్జునుడు యుద్ధంలో అడ్డగిస్తే ధర్మజుడిని బంధించడం నాచేతగాదు. నేనొక్కడినే కాదు దేవతలు కూడా అతడిని వేలెత్తి చూపలేరు. అర్జునుడు లేకుంటే యుద్ధంలో స్థిరంగా నిల్చిన ధర్మజుడిని పాంచాలురు వెయ్యిమంది ఆశ్చర్యంతో చూస్తుండగా చలం, బలం నశించగా బంధించి తెస్తాను'

**తే. అనుడు బాలిశులైన నీ తనయు లెల్ల । ధర్మజుఁడు పట్టువడున కాఁదలచి రపుడు**
**పాండుసుతులకు మొగమోడకుండ గురుని । ప్రతిన యెల్లెడఁ జాటించె రాజరాజు. 114**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; బాలిశులు+ఐన= మూర్ఖులైన; నీ= నీ యొక్క; తనయులు= కుమారులు; ఎల్లన్= అందరు; ధర్మజుఁడు= ధర్మరాజు; పట్టువడున్+అకాన్= పట్టువడుతాడనే; అపుడు= ఆ సమయంలో; తలఁచిరి= అనుకొన్నారు; రాజరాజు=

దుర్యోధన మహారాజు; పాండుసుతులకున్= పాండవులకు; మొగమోడకుండన్= సంకోచపడకుండా; గురుని= గురువైన ద్రోణుడి యొక్క; ప్రతిన= ప్రతిజ్ఞ; ఎల్లెడన్= అంతటా; చాటించెన్= ప్రకటించాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు ఈ విధంగా అనేసరికి, మూర్ఖులైన నీ కొడుకులంతా ధర్మరాజు బంధించబడుతాడనే అనుకొన్నారు. దుర్యోధనుడు పాండవులను గూర్చి సంకోచించకుండా ద్రోణుడి ప్రతిజ్ఞను అంతటా చాటించాడు.

**వ. ఇట్లు శిబిరంబునను, సేనాస్థానంబునను గలయ నాఘోషణంబు సేయించినం జెలంగి, సకల సైనికులును సింహనాదంబులు సేయ, శంఖభేరీరవంబు లుల్లసిల్లం గౌరవ సైన్యంబు వొంగె; నది యంతయుం గౌంతేయాగ్రజుండు దన చారుల చేత విని యనుజులం గూర్చి వినిపించి, వివ్వచ్చు నాలోకించి. 115**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; శిబిరంబునను= ప్రముఖులు విడిసినచోటను; సేనాస్థానంబునను= సేనలు ఉండే చోటను; కలయన్= అంతట; ఆఘోషణంబు= చాటింపు; చేయించినన్= చేయించగా; చెలంగి= ఉత్సాహించి; సకలసైనికులును= సైనికులందరు కూడా; సింహనాదంబులు+చేయన్= వీరనాదాలు చేయగా; శంఖ= శంఖాలయొక్క; భేరీ= దుందుభుల యొక్క; రవంబులు= ధ్వనులు; ఉల్లసిల్లన్= చెలరేగగా; కౌరవ= కౌరవులయొక్క; సైన్యంబు= సేన; పొంగెన్= ఉబ్బిపోయింది; అది+అంతయున్= అక్కడి సంగతులన్నీ; కౌంతేయ+అగ్రజుండు= కుంతి పెద్ద కొడుకైన ధర్మరాజు; తన= తనయొక్క; చారులచేతన్= గూఢచారుల వలన; విని; అనుజులన్+కూర్చి= తమ్ములను సమావేశపరచి; వినిపించి= ఈ విషయాలన్నీ తెలియజేసి; వివ్వచ్చున్= అర్జునుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా తామున్న శిబిరాలలో, సైనికు లుండే చోట అంతటా చాటించగా, ఉత్సాహంతో సైనికులు సింహనాదాలు చేశారు. శంఖ, దుందుభి ధ్వనులు చెలరేగగా కౌరవ సైన్యం ఉబ్బిపోయింది. అదంతా ధర్మరాజు తన గూఢచారులవలన విని, తమ్ములతో సమావేశమై సంగతంతా వినిపించి, అర్జునుడిని చూచి.

**ఆ. 'గురుని ప్రతిన వింటె? వెరవున లావునఁ । జేసి దీని బొంకు సేయవలయు;**
**నెఱుఁగు నతఁడు నిన్ను నెడవెట్టి పలికిన । వాఁడు గానఁ జెప్పవలసె నీకు. 116**

**ప్రతిపదార్థం:** గురుని= ద్రోణాచార్యుడి యొక్క; ప్రతిన= ప్రతిజ్ఞ; వింటె?= విన్నావా?; వెరవునన్= ఉపాయంతో; లావునన్= బలంతోనైనా; చేసి= ఏదైనా చేసి; దీనిన్= ఈ ప్రతిజ్ఞను; బొంకు= అసత్యం; చేయవలయున్= చేయాలి; అతఁడు= ఆ ద్రోణాచార్యుడు; ఎఱుఁగున్= తెలిసినవాడు; నిన్నున్= నిన్ను; ఎడవెట్టి= అడ్డుపెట్టి; పలికినవాఁడు= ప్రతిజ్ఞ చేశాడు; కానన్= కావున; నీకున్= నీకు; చెప్పవలసెన్= చెప్పవలసి వచ్చింది.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! ద్రోణాచార్యుడి ప్రతిజ్ఞ విన్నావా! ఉపాయం వలననైనా, బలంతో ఐనా దీనిని అసత్యం చేయాలి. అతడికి నీ సంగతి తెలుసు. నిన్ను అడ్డం పెట్టి పలుకటం వలన నీకు ప్రత్యేకించి చెప్పవలసి వచ్చింది.

**క. నాయున్నచోట నెప్పుడుఁ । బాయక కనుగలిగి నిలిచి భండనము దగం**
**జేయంగవలయు నక్కురు । నాయకు కోరికి ఫలంబునకు విముఖముగన్.' 117**

**ప్రతిపదార్థం:** ఆ+కురు నాయకు= ఆ దుర్యోధనుడి; కోరికి= కోర్కె యొక్క; ఫలంబునకున్= ఫలితానికి; విముఖముగన్= వ్యతిరేకంగా; ఎప్పుడున్= ఎల్లవేళల; నా= నాయొక్క; ఉన్నచోటన్= ఉన్న స్థలాన్ని; పాయక= విడువక; కనుగలిగి= జాగరూకతతో; నిలిచి= ఉండి; తగన్= తగినట్లు; భండనము= యుద్ధం; చేయంగవలయున్= చేయాలి.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడి కోర్కె విఫలమయ్యేటట్లు ఎప్పుడూ నన్ను యుద్ధరంగంలో వదలక కనిపెట్టి ఉండి, తగిన విధంగా పోరు సాగించాలి'.

**అర్జునుండు ధర్మరాజుతో ద్రోణుని ప్రతిజ్ఞకు వెఱవకుండునట్లు సెప్పుట (సం. 7-12-7)**

**వ. అనుటయు నర్జునుం డతని కిట్లనియె. 118**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; అర్జునుండు= అర్జునుడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా, అర్జునుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**క. 'గురుని వధియించుటయు, భూ । వర! నీ వని నొవ్వ నొండువలను సనుటయుం**
**బరికింప నొక్కరూః; పవి । దురితంబులు; వీనిఁ జేయుదునె యేః నెందున్? 119**

**ప్రతిపదార్థం:** భూవర!= ధర్మరాజా!; గురుని= గురువైన ద్రోణుడిని; వధియించుటయున్= చంపటం; నీవు; అనిన్= యుద్ధంలో; నొవ్వన్= బాధపడేటట్లు; ఒండువలను= వేరేచోటికి; చనుటయున్= పోవటమూ; పరికింపన్= పరిశీలించగా; ఒక్కరూపు= ఒకే విధమైనవి; అవి= ఈ రెండు; దురితంబులు= పాపాలు; వీనిన్= వీటిని; ఏన్= నేను; ఎందున్= ఎక్కడైనా; చేయుదునె?= చేస్తానా?

**తాత్పర్యం:** 'భూవరా! ఆచార్యుడిని వధించటం, నీవు యుద్ధంలో బాధలు పాలు కాగా నేను వేరే చోటికి పోవటం అనే ఈ రెండూ ఒకే విధమైన పాపాలు. ఈ రెంటిని నే నెక్కడైనా చేస్తానా?

**క. క్షోణీవల్లభ! విను మేఁ । బ్రాణముతో నుండ నిన్నుఁ బట్టి కొనఁగ నా**
**ద్రోణునక కాదు సగణ । స్థాణున కైనను వశంబె? తలఁ కేమిటికిన్? 120**

**ప్రతిపదార్థం:** క్షోణీవల్లభ!= ధర్మరాజా! వినుము= విను; ఏన్= నేను; ప్రాణముతోన్= జీవించి; ఉండన్= ఉండగా; నిన్నున్= నిన్ను; పట్టికొనఁగన్= బంధించటానికి; ఆ ద్రోణునకున్+అ= ఆ ద్రోణునికే; కాదు= కాదు; సగణ= భూతగణాలతో కూడిన; స్థాణునకైనను= రుద్రుడికి కూడ; వశంబె?= వీలౌతుందా? (కాదని భావం); తలఁకు= భయం; ఏమిటికిన్?= ఎందుకు?

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! వినుము. నేను జీవించి ఉండగా నిన్ను ప్రాణాలతో బంధించటం ఆ ద్రోణుడికే కాదు- భూతగణాల తోడి రుద్రుడికి కూడా సాధ్యంకాదు. నీవు భయపడవద్దు.

**విశేషం:** ఇక్కడ 'స్థాణుశబ్దం' సాభిప్రాయం. శివుడనే కాక నిశ్చలుడు అనీ అర్థం.

**చ. అలవి యెఱుంగ కిమ్మెయి దురాశఁ దలంచిరి గాక, ధార్తరా**
**ష్ట్రులు త్రిజగంబులుం గొని పటుస్ఫురణం జనుదెంచి రేనియున్**
**బలవదరాతి పుంజ మదభంజన! నీ వని భంగపడ్డ నీ**
**యిల శకలంబులై చెడదె, యింకదె వారిధి, నింగి గూలదే? 121**

**ప్రతిపదార్థం:** బలవత్= బలంగల; అరాతి= శత్రువుల; పుంజ= సమూహాల యొక్క; మద= అహంకారాన్ని; భంజన!= భగ్నం చేసేవాడా!; అలవి= బలం; ఎఱుంగక= తెలియక; ఈ+మెయిన్= ఈ విధంగా; దురాశన్= పేరాసచేత; తలంచిరి+కాక= అనుకొని ఉండవచ్చుగాక; ధార్తరాష్ట్రులు= దుర్యోధనాదులు; త్రిజగంబులున్= మూడులోకాలను; కొని= వెంబడిపెట్టుకొని; పటు= మిక్కిలి; స్ఫురణన్= స్ఫూర్తితో; చనుదెంచిరి+ఏనియున్= వచ్చినా; నీవు; అనిన్= యుద్ధంలో; భంగపడ్డన్= అవమానపడితే; ఈ+ఇల=

ఈ భూమి; శకలంబులు+ఐ= ముక్కలు ముక్కలై; చెడదె?= నశించదా?; వారిధి= సముద్రం; ఇంకదె?= ఇంకిపోదా?; నింగి= ఆకాశం; కూలదే?= కూలిపోదా?

**తాత్పర్యం:** బలవంతులైన శత్రు సమూహాల మదాన్ని అణచే ఓ ధర్మరాజా! వారు తమ బలాన్ని తెలిసికొనలేక దురాశతో ఈ విధంగా అనుకొని ఉంటారు. దుర్యోధనాదులు మూడు లోకాలను వెంటబెట్టుకొని మిక్కిలి బలంతో వచ్చినా, నీవు యుద్ధంలో భంగపడితే ఈ భూమి ముక్కలైపోదా? సముద్రాలు ఇంకవా? ఆకాశం కూలదా?

**విశేషం:** యుధిష్ఠిరుడిని 'బలవదరాతి పుంజ మదభంజన!' అని అర్జునుడు సంబోధించటం సాభిప్రాయమైన విశేషణం. దీనివలన అతడి అద్భుత బలపరాక్రమాలు వెల్లడి అయి, అతడు శత్రువులచేత భంగపడటం అశక్యం అని తేలుతున్నది.

**ఆ.** **వారి తలఁపు వొసఁగ నేరదు, పోరఁ బ । రాభవంబు మనకు రా దెఱుంగు**
**కలుగ దద్దురాత్మకులచేత; నాతలం । పిట్టు'లున్నయది, నరేంద్రముఖ్య!** 122

**ప్రతిపదార్థం:** నరేంద్ర ముఖ్య!= రాజశ్రేష్ఠా!; వారి= కౌరవుల; తలఁపు= కోరిక; పొసఁగనేరదు= తీరేది కాదు; మనకున్= పాండవులకు; పోరన్= యుద్ధంలో; పరాభవంబు= అవమానం; రాదు= కలుగదు; ఎఱుంగు= తెలిసికొమ్ము; ఆ+దురాత్మకుల చేతన్= ఆ దుర్బుద్ధులైన కౌరవులచేత; కలుగదు= సంభవించదు; నా= నా యొక్క; తలంపు= ఆలోచన; ఇట్టులు+ఉన్న అది= ఈ విధంగా ఉన్నది.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠుడవైన ధర్మజా! కౌరవుల కోర్కె తీరజాలదు. యుద్ధంలో మనకు పరాభవమనేది లేనేలేదు. ఆ దుర్బుద్ధులచేత అసలు అది కలిగేదే కాదు. ఇది నా నిశ్చితమైన అభిప్రాయం.'

**వ.** **అని పలికిన విని యుధిష్ఠిరుండు సంతుష్టాంతరంగుండై, శంఖభేరీ మృదంగాది సంగర మంగళ తూర్య స్వనంబులు సెలంగ సకల సైన్య సమేతంబుగా వెడలి, నడచి, మొగంబున నెలమి నెలకొనం గ్రౌంచవ్యూహం బమర్చె; నం దగ్రభాగంబున.** 123

**ప్రతిపదార్థం:** అని పలికినన్= అట్లనగా; విని; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; సంతుష్ట= సంతోషించిన; అంతరంగుండు+ఐ= మనస్సుకలవాడై; శంఖ= శంఖములు; భేరీ= దుందుభులు; మృదంగ= మద్దెలలు, ఆది= మున్నగు; సంగర మంగళ= యుద్ధంలో శుభకరమైన; తూర్య= వాద్యాల; స్వనములు= ధ్వనులు; చెలంగన్= ధ్వనింపగా; సకల= మొత్తం; సైన్య= సేనలతో; సమేతంబుగాన్= కూడుకొనినట్లుగా; వెడలి= కదలి; నడచి= ముందుకు సాగి; మొగంబునన్= ముఖంలో; ఎలమి= వికాసం; నెలకొనన్= తోచగా; క్రౌంచవ్యూహంబు= క్రౌంచపక్షిరూపంలో సైన్యాన్ని కూర్చటం; అమర్చెన్= సిద్ధపరచాడు; అందున్= ఆ వ్యూహంలో; అగ్రభాగంబునన్= ముందర.

**తాత్పర్యం:** అర్జునుడు ఈ విధంగా అనగా, ధర్మరాజు సంతోషించి, శంఖ,భేరీ, మృదంగాది మంగళ ధ్వనులు చెలరేగగా, సర్వసైన్యంతో ముందుకు సాగి, ముఖంలో వికాసం కనిపించగా, క్రౌంచ వ్యూహాన్ని రచించాడు. అందు ముందు భాగంలో.

**మ.** **ధవళాశ్వంబులఁ బూని కేతన కపీంద్ర స్ఫూర్తి మార్తాండ మూ**
**ర్తి విడంబింపఁగఁ జక్రగాండివధరుల్ దేజోమయాకార వై**
**భవమారం దనపై వెలుంగ నతి దీప్తంబైన తే రొప్పె శా**
**త్రవ సంఘంబు మనంబునన్ భయము గూరం గాలచక్రాకృతిన్.** 124

**ప్రతిపదార్థం:** ధవళ+అశ్వంబులన్= తెల్లని గుర్రాలను; పూని= సంధించి; కేతన= పతాకంమీది; కపీంద్రస్ఫూర్తి= హనుమంతుడి స్ఫురణ; మార్తాండమూర్తిన్= సూర్యుడి రూపాన్ని; విడంబింపఁగన్= పోలగా; చక్ర= చక్రాయుధాన్ని; గాండివ= గాండీవాన్ని; ధరుల్= ధరించిన వారైన కృష్ణార్జునులు; తేజోమయ= తేజస్సుతో నిండిన; ఆకార= రూపంయొక్క; వైభవము= ఐశ్వర్యం; ఆరన్= నిండగా; తనపైన్= తనమీద; వెలుంగన్= ప్రకాశించగా; శాత్రవ= శత్రువుల; సంఘంబు= సమూహంయొక్క; మనంబునన్= మనస్సులో; భయము= భీతి; కూరన్= నిండగా; కాలచక్ర+ఆకృతిన్= కాలచక్రం వంటి ఆకారంతో; అతిదీప్తంబు+ఐన= మిక్కిలి ప్రకాశించేది అయిన; తేరు= రథం; ఒప్పెన్= ఒప్పింది.

**తాత్పర్యం:** తెల్లని గుర్రాలతో, ధ్వజంపైగల మారుతి వెలుగులు సూర్యబింబాన్ని అనుకరిస్తుండగా, చక్రధారి అయిన శ్రీకృష్ణుడు, గాండీవధారి అయిన అర్జునుడు తేజస్సులతో నిండిన ఆకారాలతో తేరును అధిష్ఠించగా, శత్రువుల మనస్సులలో భయం నిండగా, కాలచక్రాకారంతో రథం మిక్కిలి ప్రకాశించింది.

**విశేషం:** ధవళాశ్వముల పూనినవాడు చక్రధరుఁడు. కేతన కపీంద్ర స్ఫూర్తి(న్) మార్తాండమూర్తి విడంబించినవాడు - గాండివధరుడు.

**క. ఆ రథముకెలన నుజ్జ్వల । ధీరోద్భట రేఖ మెఱసె ధృష్టద్యుమ్నో**
**దారస్యందన ముద్ధత । సారథికముఁ జారురంగచటులాశ్వమునై. 125**

**ప్రతిపదార్థం:** ఆ రథము= ఆ అర్జునుడి రథం; కెలనన్= ప్రక్కన; ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నుడి యొక్క; ఉదార= గొప్ప; స్యందనము= రథం; ఉద్ధత సారథికమున్= గర్వితుడైన సారథి కలదీ; చారు= అందమైన; రంగ= స్థానం కలదీ; చటుల= చలించే; అశ్వమును+ఐ= గుర్రాలు కలదీ అయి; ఉజ్జ్వల= మిక్కిలి ప్రకాశించునదీ; ధీర= ధైర్యం కలదీ; ఉద్భట= గొప్పదీ అయిన; రేఖన్= అందముతో; మెఱసెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** అర్జునుడి రథం ప్రక్కన, ఉద్ధతుడైన సారథితో, అందమైన రంగంతో, అశ్వాలు కదలుతుండగా, ఉజ్జ్వలం, ధీరం, మహనీయం అయిన రేఖతో ధృష్టద్యుమ్నుడి రథం ప్రకాశించింది.

**వ. మఱియు వృకోదరాది సోదరులను, నభిమన్యు ప్రభృతి కుమారులను, బాంచాలపతి ప్రముఖ బాంధవులను, ధృష్టకేతు ముఖ్యదండనాయకులను, దక్కునుం గల పరివారంబును దగ నయ్యైయెడల బలుపును, బొలుపును గలుగ నిలిపి, యుధిష్ఠిరుం డమ్మోహరంబు నడుమ నుదాత్త సన్నాహంబునను, గంభీరోత్సాహంబునను గొలిచి నిలిచె; నంతకు మున్న యక్కడ. 126**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; వృకోదర= భీముడు; ఆది= మొదలైన; సోదరులనున్= తమ్ములను; అభిమన్యు= అభిమన్యుడు; ప్రభృతి= మొదలైన; కుమారులను= కొడుకులను; పాంచాలపతి= ద్రుపదుడు; ప్రముఖ= మొదలైన; బాంధవులను= చుట్టాలను; ధృష్టకేతు= ధృష్టకేతువు; ముఖ్య= మొదలైన; దండనాయకులను= దండనాథులను; తక్కున్+కల= తక్కిన; పరివారంబును= సేనను; తగన్= తగినట్లుగా; అయ్యై+ఎడలన్= ఆయా స్థలాలలో; బలుపును= బలమూ; పొలుపును= అందమూ; కలుగన్= కలిగేటట్లుగా; నిలిపి= ఉంచి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఆ+మోహరంబు= ఆ వ్యూహం; నడుమన్= మధ్యలో; ఉదాత్త= గొప్పదైన; సన్నాహంబునను= ఏర్పాటుతోనూ; గంభీర= లోతైన; ఉత్సాహంబునను= ప్రయత్నంతోనూ; పొలిచి= ప్రకాశించి; నిలిచెన్= నిలబడ్డాడు; అంతకుమున్ను+అ= అంతకు ముందే; అక్కడన్= ఆ యుద్ధరంగంలో.

**తాత్పర్యం:** ఇంకా, భీముడు మొదలైన తోబుట్టువులను, అభిమన్యుడు మొదలైన పుత్రులను, ద్రుపదాది బంధువులను, ధృష్టకేతువు మున్నగు దండనాథులను, మిగిలిన సైన్యాన్నీ తగు రీతిలో ఆయా స్థానాలలో బలం,

అందం కలిగేటట్లు నిలిపి, ధర్మరాజు ఆ వ్యూహం మధ్యలో మంచి ఏర్పాట్లతో, గట్టి ప్రయత్నంతో వచ్చి నిలబడ్డాడు. అంతకు ముందే అక్కడ.

**క. మనవారును రణకౌతుక । జనితోద్యమ తీవ్రు లగుచు శకటవ్యూహం**
**బొనరించిరి యొప్పును బెం । పును దర్పము నుల్లసిల్ల భూవరముఖ్యా! 127**

**ప్రతిపదార్థం:** భూవరముఖ్యా!= రాజులలో శ్రేష్ఠుడవగు ధృతరాష్ట్రా!; మనవారును= కౌరవ పక్షంవారు కూడా; రణ= యుద్ధమందలి; కౌతుక= కుతూహలంవల్ల; జనిత= కలిగిన; ఉద్యమ= పూనికచే; తీవ్రులు+అగుచున్= తీవ్రతకలవారు అవుతూ; ఒప్పును= అందమూ; పెంపును= ఔన్నత్యమూ; దర్పమును= అహంకారమూ; ఉల్లసిల్లన్= ప్రకాశించగా; శకట వ్యూహంబు= శకట వ్యూహాన్ని (బండిరూపంలో పన్నిన మొగ్గరాన్ని); ఒనరించిరి= ఏర్పరచారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! మనవాళ్ళు తీవ్రమైన యుద్ధ కుతూహలం కలవారై అందం, ఔన్నత్యం, దర్పం ఉట్టిపడేటట్లు శకటవ్యూహాన్ని రచించారు.

**వ. అందు వలపట సింధురాజ కళింగపతి సంగతుండయిన వికర్ణుండును, నతనికి బాసటయై చటుల హయ బహుళంబగు బలంబులతో నక్కెలన సౌబలుండును, డాపటఁ గృతవర్మ వివింశతి చిత్రసేన సమేతుండై దుశ్శాసనుండును, నతనికిఁ బ్రాపై తత్పార్శ్వంబునఁ గాంభోజ, శక, యవన మహీశ్వరులును, నడుమం ద్రిగర్తమద్ర శిబి శూరసేన దేశాధీశ పరివృతుండును, గుంభసంభవపురఃసరుండునునై కురువిభుండును, నా ముందట నంగ జనపద చతురంగ ప్రధాన సేనా సముదీర్ణుండై కర్ణుండును నిలిచిరి; వెండియుం గలవార లెడనెడం బన్ని; రట్టియెడ. 128**

**ప్రతిపదార్థం:** అందున్= ఆ శకటవ్యూహంలో; వలపటన్= కుడిప్రక్క; సింధురాజ= సింధుదేశపు రాజైన జయద్రథుడు; కళింగపతి= కళింగదేశపురాజైన భగదత్తుడితో; సంగతుండు+అయిన= కూడినవాడైన; వికర్ణుండునున్= వికర్ణుడూ; అతనికిన్= ఆ వికర్ణుడికి; బాసట+ఐ= సహాయంగా; చటుల= చలించే; హయ= గుర్రాలచేత; బహుళంబు+అగు= నిండిన; బలంబులతోన్= సేనలతో; ఆ+కెలనన్= ఆ ప్రక్కన; సౌబలుండును= శకునియు; డాపటన్= ఎడమ ప్రక్కను; కృతవర్మ= కృతవర్మ; వివింశతి= దుర్యోధనుడి తమ్ముడైన వివింశతి; చిత్రసేన= దుర్యోధనుడి తమ్ముడైన చిత్రసేనుడితో; సమేతుండు+ఐ= కూడినవాడై; దుశ్శాసనుండునున్= దుశ్శాసనుడును; అతనికిన్= ఆ దుశ్శాసనుడికి; ప్రాపై= సహాయుడై; తద్+పార్శ్వంబునన్= అతడి ప్రక్కన; కాంభోజ= కాంభోజదేశపు; శక= శకదేశపు; యవన= యవనదేశపు; మహీ+ఈశ్వరులును= రాజులును; నడుమన్= మధ్యన; త్రిగర్త= త్రిగర్తదేశపు; మద్ర= మద్రదేశపు; శిబి= శిబిదేశపు; శూరసేన= శూరసేన దేశపు; దేశాధీశ= రాజులచేత; పరివృతుండునున్= చుట్టబడినవాడై; కుంభసంభవ పురఃసరుండును+ఐన= ద్రోణుడు ముందుగా కలవాడై; కురువిభుండునున్= దుర్యోధనుడును; ఆ ముందటన్= ఆ ముందర; అంగజనపద= అంగదేశపు; చతురంగ ప్రధాన= ముఖ్యంగా కల రథాలు, గజాలు, గుర్రాలు, కాల్బలాలు; సేనా= సేనలచేత; సముదీర్ణుండు+ఐ= ఉన్నతుడై; కర్ణుండునున్= కర్ణుడును; నిలిచిరి= మోహరించారు; వెండియున్+కలవారలు= ఇంకా తక్కిన వారు; ఎడనెడన్= అక్కడక్కడ; పన్నిరి= నిలిచారు; అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ శకటవ్యూహంలో కుడిప్రక్క జయద్రథ, భగదత్తులతో కూడినవాడై వికర్ణుడు, అతడికి సహాయంగా ఆశ్వికబలంతో శకుని, ఎడమప్రక్క కృతవర్మ, వివింశతి, చిత్రసేనులతో కూడి దుశ్శాసనుడు, అతడికి సహాయంగా ప్రక్కన కాంభోజ, శక, యవన దేశాధీశులు, నడుమ త్రిగర్త, మద్ర, శిబి, శూరసేన దేశాల రాజులు చుట్టూ ఉండగా, ద్రోణుడు ముందుండగా దుర్యోధనుడూ, ఆ ముందర అంగదేశపు చతురంగబలాలతో ఉన్నతుడైన కర్ణుడూ నిలిచారు. ఇతరులు అక్కడక్కడ నిలిచారు. ఆ సమయంలో.

**తే. దర్పదుస్సహతేజు రాధాతనూజుఁ। దిలకమై సైన్యముఖమునఁ బొలుచువాని**
**సైనికులు సూచి కడుసంతసమున నేచి। యెలుఁగు లడరంగఁ దమలోన నిట్టు లనిరి. 129**

**ప్రతిపదార్థం:** దర్ప= అహంకారంచేత; దుస్సహ= సహించరాని; తేజున్= తేజస్సుగల; రాధాతనూజున్= కర్ణుడిని; సైన్య= సైన్యంయొక్క; ముఖమునన్= ముఖంపై; తిలకము+ఐ= అలంకారమై; పొలుచువానిన్= ప్రకాశించేవాడిని; సైనికులు= బంట్లు; చూచి; కడున్= మిక్కిలి; సంతసమునన్= సంతోషంతో; ఏచి= చెలరేగి; ఎలుఁగులు= ధ్వనులు; అడరంగన్= అతిశయించగా; తమలోనన్= తమలో తాము; ఇట్టులు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** దర్పంవలన దుస్సహమైన తేజస్సు కలిగి, సైన్యం ముఖానికి అలంకారంగా ఒప్పే కర్ణుడిని చూచి సైనికులు సంతోషంతో ఉప్పొంగి, తమలో తాము ఇట్లా అనుకొన్నారు.

**మ. 'అని రాధేయుఁడు పాండునందనుల బాహాశక్తి మాయించు; నీ**
**తని దేవావలియైన మార్కొనునె? దుర్దాంతుండు భీష్ముండు పో**
**రిన యన్నాళ్ళును బక్షపాతమున వారిం బట్టి పాలార్చెఁ గా**
**క నిజం బల్గ నితండు ధీరులగు టింకం జెల్లునే వారికిన్?' 130**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధంలో; రాధేయుఁడు= కర్ణుడు; పాండునందనుల= పాండవుల యొక్క; బాహాశక్తిన్= భుజబలాన్ని; మాయించున్= నశింపజేస్తాడు; ఈతనిన్= ఈ కర్ణుడిని; దేవ+ఆవలి+ఐనన్= దేవతల సమూహమైనా; మార్కొనునె?= ఎదిరిస్తుందా?; దుర్దాంతుండు= ఎవరికిని లొంగనివాడైన; భీష్ముండు= భీష్ముడు; పోరిన= యుద్ధంచేసిన; అన్నాళ్ళును= అన్ని దినాలు; పక్షపాతమునన్= పక్షపాతంవలన; వారిన్= ఆ పాండవులను; పట్టి పాలార్చెన్= ఉపేక్షించాడు; కాక= అట్లుకాక; ఇతండు= ఈ కర్ణుడు; నిజంబు+అల్గన్= నిజంగా కోపిస్తే; వారికిన్= ఆ పాండవులకు; ధీరులు+అగుట= ధైర్యవంతులు కావటం; ఇంకన్= ఇకముందు; చెల్లునే?= సాగుతుందా?

**తాత్పర్యం:** యుద్ధంలో కర్ణుడు పాండవుల బాహుబలాన్ని నశింపజేస్తాడు. ఈతడిని దేవతలు కూడా ఎదుర్కొనలేరు. భీష్ముడు అజేయుడయినప్పటికీ పక్షపాతంతో పాండవులను ఉపేక్షించాడు. కర్ణుడే నిజంగా కోపిస్తే పాండవులకు ధీరులన్న పేరు చెల్లుతుందా?

**వ. అని యుబ్బుచుండి; రివ్విధంబున సన్నాహంబు సువిహితంబైన యనంతరంబ. 131**

**ప్రతిపదార్థం:** అని= సైనికు లీ విధంగా పలికి; ఉబ్బుచుండిరి= సంతోషిస్తుండిరి; ఇవ్విధంబునన్= ఈ రీతిగా; సన్నాహంబు= యుద్ధ ప్రయత్నం; సువిహితంబు+ఐన= చక్కగా కుదిరిన; అనంతరంబు+అ= వెంటనే.

**తాత్పర్యం:** సైనికులంతా ఈ విధంగా అనుకొని ఉబ్బిపోతుండిరి. ఇట్లా యుద్ధ ప్రయత్నాలు చక్కగా జరిగిన వెంటనే.

**చ. తగ మన సైన్యమున్ గురుఁ డుదగ్రగతిన్ నడపింపఁ జొచ్చుడున్,**
**గగనతలంబు నెత్తురులుఁ గండలు నెమ్ములు నొక్క యుమ్మడిన్**
**మొగిళులు లేకయుం గురిసె మొత్తములై పెనుగ్రద్దలాడె, బె**
**ట్టుగ వినిచెన్ శివారుతము, దుల్లెఁ గడున్ వడి నుల్క లెల్లెడన్. 132**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; మన= కౌరవుల; సైన్యమున్= సైన్యాన్ని; తగన్= తగునట్లు; ఉదగ్రగతిన్= భయంకరంగా; నడిపింపన్+చొచ్చుడున్= నడిపించటానికి పూనుకొనగా; గగనతలంబు= ఆకాశం; మొగిళులు= మేఘాలు; లేకయున్= లేకుండగనే; ఒక్క+ఉమ్మడిన్= ఒక్కసారిగా; నెత్తురులున్= రక్తములును; కండలున్= మాంసఖండములును; ఎమ్ములున్= ఎముకలును; కురిసెన్= వర్షించాయి; మొత్తములు+ఐ= గుంపులై; పెనుగ్రద్దలు= పెద్దగ్రద్దలు; ఆడెన్= తిరుగులాడినవి; బెట్టుగన్= గట్టిగా; శివా= నక్కల యొక్క; రుతము= ఊళ; వినిచెన్= వినిపించినవి; ఉల్కలు = నిప్పుకలు; ఎల్ల+ఎడన్= అంతట; కడున్= మిక్కిలి; వడిన్= వేగంగా; డుల్లెన్= రాలెను.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు తగురీతిలో భయంకరంగా మన సైన్యాన్ని నడిపించేసరికి, ఆకాశం మేఘాలు ఆవరించకుండానే మాంసఖండములూ, ఎముకలూ, నెత్తురులూ ఒక్కపెట్టున కురిసింది. పెనుగ్రద్దలు గుంపులు గుంపులుగా తిరుగులాడాయి. నక్కల ఊళలు గట్టిగా వినిపించాయి. మిక్కిలి వేగంగా ఉల్కలు అంతటా రాలాయి.

**విశేషం:** రక్తం, మాంసఖండములు, ఎముకలు కురియటం, ఉల్కలు రాలటం, నక్కలు కూయటం వంటి అపశకునాలు కౌరవులకు ముందు కలుగబోయే ఉపద్రవాలను సూచించేవి, భయాన్ని గొలిపేవి.

**తే.** **అమ్మహోత్పాతములకు భయంబు గొనక । కౌరవులు శంఖములు మ్రోయ భేరు లులియ**
**నగ్గలిక సేన నడిపించి; రంత సమద । గమనమున వారి సేనయుఁ గదియ నడచె.** **133**

**ప్రతిపదార్థం:** కౌరవులు= దుర్యోధనాదులు; ఆ+మహా+ఉత్పాతములకున్= ఆ అపశకునాలకు; భయంబు+కొనక= భయపడక; శంఖములు= శంఖాలు; మ్రోయన్= ధ్వనింపగా; భేరులు= దుందుభులు; ఉలియన్= ధ్వనించగా; అగ్గలికన్= ఆధిక్యంతో - గొప్పగా; సేనన్= సైన్యాన్ని; నడిపించిరి; అంతన్= అప్పుడు; సమదగమనమునన్= గర్వంతో కూడిన నడకతో; వారి= ఆ పాండవుల యొక్క; సేనయున్= సైన్యంకూడా; కదియనడచెన్= చేరనడిచింది.

**తాత్పర్యం:** కౌరవులు ఆ మహోత్పాతాలకు భయపడక, శంఖాలు మ్రోయగా, దుందుభులు ధ్వనించగా, ప్రశంసాపూర్వకంగా సైన్యాలను నడిపించారు. అపుడు పాండవుల సేనలు కూడా సగర్వంగా చేర నడిచాయి.

**వ.** **అప్పుడు.** **134**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కౌరవ, పాండవ సేనలు సమానంగా ముందుకు నడిచినపుడు.

**క.** **నరుఁడును రాధేయుఁడు నొం । డొరువులతోఁ బెనఁగు వేడ్క లుల్లంబులలో**
**గురువులు వాఱగ నిలిచిరి । యిరుదెఱఁగుల సైనికులకు నేడ్తెఱ మిగులన్.** **135**

**ప్రతిపదార్థం:** నరుఁడును= అర్జునుడును; రాధేయుఁడున్= కర్ణుడును; ఒండు+ఒరువులతోన్= ఒకరితో ఒకరు; పెనఁగు= యుద్ధంచేసే; వేడ్కలు= వినోదాలు; ఉల్లంబులలోన్= మనస్సులలో; గురువులు వాఱగన్= అతిశయించగా; ఇరుదెఱఁగుల= రెండు వైపుల; సైనికులకున్= సేనలోని వారికి; ఏడ్తెఱ= పరాక్రమం; మిగులన్= పెరుగగా; నిలిచిరి= నిలబడ్డారు.

**తాత్పర్యం:** రెండు పక్షాల సైనికులకు పరాక్రమం అతిశయించగా, కర్ణార్జునులు ఒకరితో ఒకరు యుద్ధంచేసే కొరకు ఉబలాటపడి నిలిచారు.

**తే.** **ఇట్టు లొండొంటిఁ గదియంగ నెలమి నడచి । బలము లొక్కింత సేపు నిశ్చలతఁ బొలిచె**
**మవ్వమెసఁగు వనంబుల మావు లెంత । యైనఁ జెలువార సొగసి యున్నట్ల పోలె.** **136**

**ప్రతిపదార్థం:** ఇట్టులు= ఈ విధంగా; ఒండు+ఒంటిన్= ఒకదానితో ఒకటి; కదియంగన్= కలియబడటానికి; ఎలమిన్= వికాసంతో; నడచి= ముందుకు నడిచి; బలములు= సేనలు; మవ్వము= కోమలత్వం; ఎసఁగు= ఒప్పు; వనంబులన్= తోటలలో; మావులు= మామిళ్ళు; ఎంత ఐనన్= ఎంతగానో; చెలువారన్= అందము మీర; సొగసి ఉన్నట్లు+అ పోలెన్= ఒప్పి ఉన్న విధంగానే; ఒక్కింత సేపు= కొంతసేపు; నిశ్చలతన్= కదలకుండ; పొలిచెన్= ఒప్పాయి.

**తాత్పర్యం:** ఈ విధంగా రెండు వైపులగల సైన్యాలు ఒకదాన్నొకటి ఎదుర్కోటానికి వికాసంతో ముందుకు సాగినవై, చిగురు తొడిగిన మామిళ్ళు, తోటలో అందంతో ఒప్పినట్లు తోచి, కొద్దిసేపు నిశ్చలత్వాన్ని పొందాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **తదనంతరంబ ద్రోణుం । డుదితార్కునిఁ గ్రేణిసేయు నుజ్జ్వల రథ మె**
**ల్ల దిశలు వెలిఁగింపఁగ బె । ట్టిదముగ మును గవిసె మొన గడిమితోఁ గదియన్.** **137**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ తరువాత; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; ఉదిత+అర్కునిన్= ఉదయించిన సూర్యుడిని; క్రేణి+చేయు= పరిహసించు; ఉజ్జ్వల రథము= మిక్కిలి వెలుగొందే రథం; ఎల్లదిశలు= దిక్కులన్నిటిని; వెలిఁగింపఁగన్= ప్రకాశించేటట్లు చేయగా; మొన= సైన్యం; కడిమితోన్= పరాక్రమంతో; కదియన్= సమీపించగా; బెట్టిదముగన్= ఉద్ధతితో; మును= మొదట; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఆ తరువాత ద్రోణుడు, ఉదయించిన సూర్యుడి వంటి తన ఉజ్జ్వలమైన రథం దిక్కులన్నిటిని వెలిగించగా, సైన్యం పరాక్రమంతో దగ్గరికి చేరగా, ఉద్ధతితో మొదట శత్రుసైన్యాన్ని ఢీకొన్నాడు.

**క.** **మన బలము గదియు బలువిడిఁ । గనుఁగొని యర్జునుఁడు దొలుతఁ గవియఁగఁ బేరు**
**బ్బునఁ దాఁకె వారి సైన్యము । వినువీథి నమర్త్య గణము వేడుకఁ జూడన్.** **138**

**ప్రతిపదార్థం:** మన బలము= మన సైన్యం; కదియు= పైకురికే; బలువిడిన్= విధమును; కనుఁగొని= చూచి; అర్జునుఁడు; తొలుతన్= మొదట; కవియఁగన్= తాకగా; వినువీథిన్= ఆకాశమార్గంలో; అమర్త్య= దేవతల; గణము= సమూహం; వేడుకన్= వినోదంతో; చూడన్= చూడగా; పేరు+ఉబ్బునన్= మిక్కిలి ఉత్సాహంతో; వారి సైన్యము= పాండవుల సైన్యం; తాఁకెన్= ఎదుర్కొన్నది.

**తాత్పర్యం:** మన సైన్యం తాకే విధాన్ని తెలిసికొని అర్జునుడు తొలుత ఆక్రమించగా, ఆకాశం నుండి దేవతలు వినోదంతో చూడగా, పాండవ సైన్యం మిక్కిలి ఉత్సాహంతో మార్కొన్నది.

**సీ.** **రథకరి తురగోత్థ పృథివీ పరాగంబు । దెసల నాకసమున దీటుకొనఁగ,**
**బాణాది హేతి సంపాత జాతములగు । మంట లర్కాంశుల మరలఁ ద్రోవ,**
**హస్తికపాల రథావయవములు భ । గ్నములగు రవము లుగ్రముగఁ జెలఁగ,**
**వివిధ సేనాం గాంగ విదళనంబునఁ గ్రమ్ము । రక్తపూరములు ఘోరంబు గాఁగఁ**

**తే.** **గలయ బెరసిన పాండవ కౌరవ ప్ర । చండ సైన్యద్వయంబు నుద్దండ సమర**
**గతులు వెక్కస మొనరించె ఖచరసాధ్య । సిద్ధులకు; ననుబోంట్లకుఁ జెప్ప నేల?** **139**

**ప్రతిపదార్థం:** రథ= రథాల; కరి= ఏనుగుల; తురగ= గుర్రాల నుండి; ఉత్థ= లేచిన; పృథివీ= నేలయొక్క; పరాగంబు= దుమ్ము; దెసలన్= దిక్కులలో; ఆకసమునన్= ఆకాశంలో; దీటుకొనఁగన్= కమ్ముకొనగా; బాణ= బాణాలు; ఆది= మొదలైన; హేతి= ఆయుధాలు; సంపాత= పడటం వలన; జాతములు+అగు= పుట్టిన; మంటలు= జ్వాలలు; అర్క= సూర్యుడియొక్క; అంశులన్= కిరణాలను; మరలన్+త్రోవన్= వెనుకకు నెట్టగా; హస్తి= ఏనుగుల; కపాల= పుర్రెలయు; రథ= రథాలయొక్క; అవయవములు= అంగాలు; భగ్నములు+అగు= విరిగిపోయే; రవములు= చప్పుళ్ళు; క్రమముగన్= వరుసగా; చెలఁగన్= ధ్వనింపగా; వివిధ= బహువిధాలైన; సేనా+అంగ= రథ, గజ, తురగ, పదాతి సేనల యొక్క; అంగ= అవయవాలు; విదళనంబునన్= ఛేదింపబడటం వలన; క్రమ్ము= కమ్ముకొన్న; రక్త= నెత్తుటి యొక్క; పూరములు= ప్రవాహాలు; ఘోరంబు= భయంకరం; కాఁగన్= కాగా; కలయ బెరసిన= కలిసి వ్యాపించిన; పాండవ= పాండవుల; కౌరవ= కౌరవ పక్షంవారి; ప్రచండ= సహించరాని; సైన్యద్వయంబున్= రెండు సైన్యాలు; ఉద్దండ= తీవ్రమైన; సమర= యుద్ధంయొక్క; గతులు= నడకలు; ఖచర= ఆకాశంలో తిరిగే; సాధ్య= సాధ్యులు; సిద్ధులకున్= సిద్ధులనే దేవ జాతులకు; వెక్కసము= దుస్సహం; ఒనరించెన్= చేసింది; మము బోంట్లకున్= మావంటివారిని గూర్చి; చెప్పన్+ఏల?= చెప్పవలసిందేముంది?

**తాత్పర్యం:** రథాలు, ఏనుగులు, గుర్రాల నుండి లేచిన దుమ్మంతా దిక్కులన్నింటా, ఆకాశమంతటా వ్యాపించింది. బాణాలు మొదలైన ఆయుధాల తాకిడిచేత రేగిన మంటలు సూర్యకిరణాలను వెనుకకు నెట్టాయి. ఏనుగుల పుర్రెలు, రథాల అంగాలు విరిగిపోయే చప్పుడులు భయంకరంగా అలముకొన్నవి. చతురంగ బలాల విచ్ఛేదం వలన కమ్ముకొన్న రక్త ప్రవాహాలు భయం గొలిపినవి. ఈ విధంగా కౌరవ, పాండవ సైన్యాలు మహోగ్రంగా పోరాడుతుంటే సిద్ధ సాధ్యాది దేవ వర్గానికే సహించరానిదిగా ఉంటే మావంటివారి సంగతి చెప్పవలసింది ఏమున్నది?'

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. పాండవ, కౌరవ యోధులు మహోగ్రంగా యుద్ధం చేస్తుండగా వీరరౌద్రాలు ఉప్పొంగాయి. వీరరస విజృంభణ వలన సర్వత్రా ధూళి అలముకోవటం, ఆయుధజ్వాలలకు సూర్యకిరణాలు వెనుదిరిగిపోవటం వంటి అద్భుత దృశ్యాలు ఏర్పడ్డవి. ఏనుగుల తలలు నుగ్గు కావటం, రథావయవాలు తునాతునకలు కావటం, రక్తపుటేరులు పారటం వంటి సన్నివేశాల వలన బీభత్సం వ్యక్తమౌతున్నది. ఇందులో వీర, రౌద్రాద్భుత, బీభత్సరసాలు కన్నులకు కట్టినట్లు వర్ణించబడ్డాయి.

**వ. ఇవ్విధంబునం దొడంగి చెల్లు సంకుల సమరంబునం దన కనకరథం బరుణ తురంగంబుల చటుల చిత్ర సంచారంబులం గొఱవి ద్రిప్పిన తెఱంగున నేదిక్కు సూచినం దానయై పెక్కు రథంబులను బుద్ధి పాండవ పాంచాల యోధులకుఁ బుట్టునట్లుగా విహరించి, వివిధ విశిఖనిచయంబులు నిగిడించుచుఁ గుంభ సంభవుండు.** **140**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; తొడంగి= పూని; చెల్లు= నడచే; సంకుల సమరంబునన్= ఘోర యుద్ధంలో; తన= తనయొక్క; కనక రథంబు= బంగారు తేరు; అరుణ తురంగంబుల= ఎర్రని గుర్రాల యొక్క; చటుల= చలించే; చిత్ర= విచిత్రమైన; సంచారంబులన్= విహరించటంవలన; కొఱవి+త్రిప్పిన= కొరవిని త్రిప్పిన; తెఱంగునన్= విధంగా; ఏ దిక్కు= ఏ వైపు; చూచినన్= చూచినా; తాను+అ+ఐ= తానేఅయి; పెక్కు రథంబులు= అనేక రథాలు; అను బుద్ధి= అనే తలపు; పాండవ= ధర్మజాదులకు; పాంచాల= పాంచాలురైన ద్రుపదాది; యోధులకున్= వీరులకు; పుట్టునట్లుగాన్= కలుగు విధంగా; విహరించి= విహారం చేసి; వివిధ= అనేకాలైన; విశిఖ= బాణాల; నిచయంబులు= సమూహాలు; నిగిడించుచున్= ప్రయోగిస్తూ; కుంభసంభవుండు= ద్రోణుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా జరిగే రెండు పక్షాల యుద్ధంలో తన బంగారు తేరు, ఎర్రని గుర్రాలు చేసే విచిత్ర విహారాలు, కొరవి త్రిప్పినట్లు ఏ దిక్కు చూచినా తానే అయి, పాండవ, పాంచాల యోధులకు అనేక రథాలలో విహరిస్తున్నట్లు తోచి, అనేక బాణజాలాలను ప్రయోగిస్తూ ద్రోణుడు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**క. కూల్చుచు గజముల నెత్తుటఁ । దేల్చుచుఁ దురగముల వీఁకఁ దేరులు మరలన్**
**వెల్చుచుఁ గాల్బలములఁ బొరి । మాల్చుచు రౌద్రముగ మారిమసఁగిన భంగిన్. 141**

**ప్రతిపదార్థం:** గజములన్= ఏనుగులను; కూల్చుచున్= సంహరిస్తూ; తురగములన్= గుఱ్ఱాలను; నెత్తుటన్= రక్తంలో; తేల్చుచున్= తేలేటట్లు చేస్తూ; వీఁకన్= బలంతో; తేరులు= రథాలు; మరలన్ వెల్చుచున్= వెనుకకు మరలిపోయేటట్లు చేస్తూ; కాల్బలములన్= పదాతి సైన్యాన్ని; పొరిమాల్చుచున్= చంపుతూ; రౌద్రముగాన్= భయంకరంగా; మారి మసఁగిన= మారి వ్యాధితో జనక్షయం జరిగిన; భంగిన్= విధంగా.

**తాత్పర్యం:** మహా భయంకరంగా మారి వ్యాధికి (ప్లేగువ్యాధికి) జన క్షయం జరిగినట్లు, ఏనుగులను కూలుస్తూ, గుఱ్ఱాలను నెత్తుట తేలుస్తూ, పరాక్రమంతో రథాలను వెనుకకు మరలిపోయేటట్లు చేస్తూ, పదాతి దళాన్ని చంపుతూ (ద్రోణుడు స్వైరవిహారం చేశాడు).

**విశేషం:** అలం: ఉపమ.

**వ. సంగర క్రీడ సలుపు నయ్యవసరంబున. 142**

**ప్రతిపదార్థం:** సంగర= యుద్ధం అనే; క్రీడ= ఆట; సలుపు= ఆడే; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ద్రోణుడు యుద్ధ క్రీడ సలిపే ఆవేళ.

**క. పాయవడు రథచయంబులు । సాయక హతిఁ జెదరుఁ బ్రళయ జలధర పటు గ**
**ర్జాయత తర్జన లీలఁ బ । లాయిత మగు పాండుసుత బలంబు నరేంద్రా! 143**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ధృతరాష్ట్ర మహారాజా!; రథ= రథాల; చయంబులు= సమూహాలు; పాయవడున్= చీలిపోతాయి; పాండుసుత= పాండవుల; బలంబు= సైన్యం; సాయక= బాణాల; హతిన్= దెబ్బకు; చెదరున్= చెదరిపోయాయి; ప్రళయ= ప్రళయకాలమందలి; జలధర= మేఘాల యొక్క; పటు= గొప్పవైన; గర్జా= ఉరుములనే; ఆయత= దీర్ఘములైన; తర్జన= అదలింపుల చేతవలె; పలాయితము+అగున్= పారిపోతుంది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! బాణాల దెబ్బకు రథ సమూహాలు చీలిపోయి, పాండవుల సైన్యం చెదరి పోయి ప్రళయకాలంలోని మేఘాల గర్జనలనే దీర్ఘమైన అదలింపులచేత వలె పలాయనం చిత్తగించింది.

**విశేషం:** అలం: ఉపమ - రూపకానుప్రాణితం. గర్జాయత తర్జన - రూపకం. లీలన్ - ఉపమ.

**క. పొదువుచు విచ్చుచు బలువిడి । నెదురుచుఁ బాఱుచును మఱి మహీభాగము గ్ర**
**క్కదలం గార్ముక విద్యా । విదుఁ డగు గురుతోడఁ బోరె వివిధ బలంబుల్. 144**

**ప్రతిపదార్థం:** వివిధ బలంబుల్= అనేక సైన్యాలు; పొదువుచున్= ఆక్రమిస్తూ; విచ్చుచున్= చీలుతూ; బలువిడిన్= బలంతో; ఎదురుచున్= ఎదుర్కొంటూ; పాఱుచును= పరుగెత్తుతూ; మఱి= మళ్ళీ; మహీభాగము= భూభాగం; గ్రక్కదలన్= మిక్కిలి కదలగా; కార్ముకవిద్యా= ధనుర్విద్యను; విదుఁడు+అగు= తెలిసిన; గురుతోడన్= ద్రోణాచార్యుడితో; పోరెన్= యుద్ధం చేశాయి.

**తాత్పర్యం:** పాండవుల చతురంగ బలాలు శత్రువులను ఆక్రమిస్తూ, చీలిపోతూ, బలంతో ఎదుర్కొంటూ, పరుగెత్తుతూ, భూమి అంతా చలించగా ధనుర్విద్యావిదుడైన ద్రోణాచార్యుడితో పోరాడాయి.

ద్రోణుఁడు పాండవ సైన్యంబుపై రేఁగి దివ్యాస్త్రంబుల శక్తి సూపుట (సం. 7-13-1)

**వ. అట్టియెడ నాచార్యుం డసమాన శౌర్యంబును, మాననీయదోస్సారంబును, దివ్యాస్త్ర ప్రభావంబును జూపినం గౌంతేయ సైన్యంబునందు. 145**

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= అప్పుడు; ఆచార్యుండు= ద్రోణుడు; అసమాన= సాటిలేని; శౌర్యంబును= శూరత్వాన్ని; మాననీయ= మన్నించదగిన; దోఃసారంబునున్= బాహుబలాన్ని; దివ్య= దేవతా సంబంధమైన; అస్త్ర= అస్త్రాలయొక్క; ప్రభావంబునున్= మహిమను; చూపినన్= చూపగా; కౌంతేయ= కుంతీపుత్రుల; సైన్యంబు+అందున్= సైన్యంలో.

**తాత్పర్యం:** అప్పుడు ద్రోణుడు సాటిలేని శూరత్వాన్ని, గౌరవించదగిన బాహుబలాన్ని, దివ్యాస్త్రాల మహిమను చూపగా పాండవ సైన్యంలో.

**సీ. తఱుచుగాఁ దెగిపడ్డ ధవళ చామరములు । డిండీరముల యొప్పుఁ బుండరీక**
**ములు మరాళంబుల పొలుపును గరవాల । ములు మీన భంగియుఁ, దలలు శిలల**
**చాడ్పును, గేశముల్ శైవాలరేఖయు, । మాంసంబు పంక సమానతయును,**
**దాల్ప భటాశ్వమాతంగాంగ భగ్నర । థముల తిట్టలు పులినములు గాఁగఁ**

**తే. ధీరవరకోటి డ్రెళ్ళిన వీరతతికి । సంభ్రమము వుట్ట సంభృతోత్సాహ లీల**
**నుబ్బి భూతబేతాళంబు లోలలాడ । నిట్టలంబగు నెత్తురు టేఱు వఱపె. 146**

**ప్రతిపదార్థం:** తఱుచుగాన్= ఎక్కువగా; తెగిపడ్డ= విరిగిపడ్డ; ధవళ= తెల్లని; చామరములు= చమరీ మృగపు వాలాలతో చేసిన వీవనలు; డిండీరముల= నురుగుల; ఒప్పున్= ఒప్పును; పుండరీకములు= తెల్లగొడుగులు; మరాళంబుల= హంసల; పొలుపును= విధమును; కరవాలములు= కత్తులు; మీన= చేపల; భంగియున్= రీతిని; తలలు= శిరస్సులు; శిలల= రాళ్ళ; చాడ్పును= విధమును; కేశముల్= వెంట్రుకలు; శైవాలరేఖయున్= నాచువలెను; మాంసంబు= మాంసం; పంకసమానతయును= బురదతోడి సమానత్వమును; తాల్పన్= ధరింపగా; భట= కాల్బలాల; అశ్వ= గుర్రాల; మాతంగ= ఏనుగుల; అంగ= అవయవాలయు; భగ్న= విరిగిన; రథముల= రథాల యొక్క; తిట్టలు= కుప్పలు; సైకతములు= ఇసుక తిన్నెలు; కాఁగన్= కాగా; ధీర= ధైర్యవంతులలో; వర= శ్రేష్ఠులయొక్క; కోటి= సమూహం; త్రెళ్ళిన= చచ్చిపడిన; వీర= యోధుల యొక్క; తతికిన్= సంఘానికి; సంభ్రమము= ఆశ్చర్యం; పుట్టన్= కలుగగా; సంభృత= నిండిన; ఉత్సాహ= ఉత్సాహం యొక్క; లీలన్= విలాసంతో; ఉబ్బి= సంతసించి; భూత= దయ్యములు; బేతాళంబులు= పిశాచాలు; ఓలలాడన్= తేలియాడగా; ఇట్టలంబు+అగు= అధికమైన; నెత్తురు+ఏఱు= రక్తపువాగు; పఱపెన్= ప్రవహింపచేశాడు.

**తాత్పర్యం:** ఏపుగా తెగిపడ్డ తెల్లని చామరాలు నురుగువలె, తెల్లని గొడుగులు హంసలవలె, కత్తులు చేపలవలె, తలలు రాళ్ళవలె, వెంట్రుకలు నాచువలె, మాంసం బురదవలె ఒప్పగా, భటుల, గుర్రాల, ఏనుగుల, రథాల అంగాల రాసులు ఇసుక తిన్నెలుకాగా, ధీరవరుల సమూహం పడిపోవుటవలన వీరులకు ఆశ్చర్యం కలుగగా, ఉత్సాహ విలాసంతో ఉబ్బి భూతబేతాళగణాలు తేలియాడేటట్లు ద్రోణుడు రక్తపుటేరును ప్రవహింపజేశాడు.

**విశేషం:** ఇక యుద్ధవీరాన్ని ఉద్దీపింపజేసే చామరాలు, గొడుగులు, కత్తులు మొదలైన సామగ్రి తునాతునకలైపోయి నెత్తురుటేరులో నురుగు, చేపలు, రాళ్ళు, నాచు మున్నగునవిగా మారి బీభత్సరసానికి ఉద్దీపకాలుగా మారిపోయినవి.

**వ. అప్పుడు. 147**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు మహాపరాక్రమంతో విజృంభించి పాండవ సైన్యాన్ని బీభత్సం పాలు చేసిన సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. గగన మధ్యంబునకు వచ్చి ఖరకరుండు । దేఱి చూడంగ రాక యుద్దీప్తుఁ డగుచు**
**నెట్లు వెలుఁగొందు ద్రోణుండు నట్ల వెలుఁగు । చున్నఁ గనుఁ గొని ధర్మజుం డురవడించి. 148**

**ప్రతిపదార్థం:** ఖరకరుండు= తీక్ష్ణమైన కిరణములు గల సూర్యుడు; గగన= ఆకాశంయొక్క; మధ్యంబునకున్= నడిమికి; వచ్చి= ఏతెంచి; తేఱిచూడంగరాక= చక్కగా చూడటానికి వీలుగాక; ఉద్దీప్తుఁడు+అగుచున్= మిక్కిలి ప్రకాశిస్తూ; ఎట్లు= ఏ విధంగా; వెలుఁగొందున్= వెలుగునో; ద్రోణుండున్= ద్రోణాచార్యుడు కూడా; అట్లు+అ= అట్లే; వెలుగుచున్నన్= ప్రకాశిస్తుండగా; కనుఁగొని= చూచి; ధర్మజుండు= ధర్మరాజు; ఉరవడించి= మిక్కిలి వేగిరపడి.

**తాత్పర్యం:** సూర్యుడు నట్టనడిమి ఆకాశంలోకి వచ్చి మండిపోతూ తేరి చూడరాకుండ వెలిగినట్లు, ద్రోణుడు యుద్ధరంగంలో వెలిగి పోవటం చూచి, ధర్మరాజు వేగిరపడ్డవాడై.

**విశేషం:** అలంకారం ఉపమ.

**వ. ధనంజయ ధృష్టద్యుమ్నుల నాలోకించి యమ్మహావీరు వారించుటకు నియోగించిన. 149**

**ప్రతిపదార్థం:** ధనంజయ= అర్జునుడిని; ధృష్టద్యుమ్నులను= పాండవ సేనానియైన ధృష్టద్యుమ్నుడిని; ఆలోకించి= చూచి; ఆ+మహావీరున్= ఆ మహాయోధుడైన ద్రోణుడిని; వారించుటకున్= అడ్డుకొనటానికి; నియోగించినన్= నియమించగా.

**తాత్పర్యం:** అర్జునుడిని, తమ సేనానియైన ధృష్టద్యుమ్నుడిని చూచి, ఆ మహావీరుడైన ద్రోణుడిని అడ్డగించటానికి నియమించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**శా. చంచత్తుంగ తురంగ సత్వరగతి స్ఫారీభవత్కేతనో**
**దంచద్దీప్తులు ప్రజ్వరిల్ల నతిసాంద్రంబై శరశ్రేణికా**
**సంచారంబు నితాంత ఘోరముగ నాచార్యున్ వడిం దాఁకె న**
**ప్పాంచాల క్షితిపాల నందనుఁడు శుంభద్వీర్యసంరంభుఁడై. 150**

**ప్రతిపదార్థం:** ఆ+పాంచాల= ఆ పాంచాల దేశపు; క్షితిపాల= రాజుయొక్క; నందనుఁడు= కుమారుడైన ధృష్టద్యుమ్నుడు; శుంభత్= ప్రకాశించే; వీర్య= బలంతో; సంరంభుఁడు+ఐ= వేగిరపాటు కలవాడై; చంచత్= చలిస్తున్న; తుంగ= ఎత్తైన; తురంగ= గుర్రాలయొక్క; సత్వర= వేగంతోకూడిన; గతి= నడకచేత; స్ఫారీభవత్= అధికమగుచున్న; కేతన= పతాకంయొక్క; ఉదంచత్= పైకెగసే; దీప్తులు= వెలుగులు; ప్రజ్వరిల్లన్= మిక్కిలి ప్రకాశించగా; అతి సాంద్రంబు+ఐ= మిక్కిలి దట్టమైన; శర= బాణాలయొక్క; శ్రేణికా= సమూహముయొక్క; సంచారంబు= ప్రసారం; నితాంత= మిక్కిలి; ఘోరముగన్= భయంకరంగా; ఆచార్యున్= ద్రోణుడిని; వడిన్= వేగంగా; తాకెన్= తాకినాడు.

**తాత్పర్యం:** పాంచాల రాజపుత్రుడైన ధృష్టద్యుమ్నుడు బల సంరంభంతో, చలిస్తున్న ఉన్నతాశ్వాలయొక్క తీవ్రమైన నడకచేత కదల్చబడిన పతాకం యొక్క దీప్తులు మిక్కిలి ప్రకాశించగా, తీవ్ర బాణజాలాన్ని విరజిమ్ముతూ మహాభయంకరంగా ద్రోణాచార్యుడిని ఢీకొన్నాడు.

**విశేషం:** ఇందలి వర్ణన వీర రసాన్ని ఉద్దీపింపజేసేది.

**వ. తదనంతరంబ. 151**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ వెంటనే.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని ఎదుర్కొన్నంతలోనే. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నరుఁ డగ్గలికం దఱుముచుఁ । బురికొలిపిన గండుమిగిలి భూరిబలంబుల్**
**గురునిఁ బొదివె నప్పార్షతు । నరదమునకు మించి రభస మత్యుగ్రముగన్. 152**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; అగ్గలికన్= పూనికతో; తఱుముచున్= వెంబడిస్తూ; పురికొలిపినన్= ప్రోత్సహించగా; గండు మిగిలి= అధిక పౌరుషంతో; భూరిబలంబుల్= అధికమగు సైన్యాలు; ఆ+పార్షతు= ఆ ధృష్టద్యుమ్నుడి; అరదమునకున్= రథాన్ని; మించి= దాటి; రభసము= వేగం; అతి+ఉగ్రముగన్= మిక్కిలి భయం గొలుపగా; గురునిన్= ద్రోణాచార్యుడిని; పొదివెన్= ఆక్రమించాయి.

**తాత్పర్యం:** అర్జునుడు పూనికతో వెంబడించి ప్రోత్సహించగా భూరిసైన్యాలు ధృష్టద్యుమ్నుడి రథాన్ని దాటి, భయంకర వేగంతో మిక్కిలి ద్రోణాచార్యుడిని ఆక్రమించాయి.

**క. పొదువుటయుం గనుఁగవఁ గెం । పొదవఁగ మెయి పొంగి ద్రోణుఁ డున్మదలీలం**
**దదనీకములఁ గలంచుచు । ముదుకం డయ్యును కుమారమూర్తిం బొలిచెన్. 153**

**ప్రతిపదార్థం:** పొదువుటయున్= ఆక్రమించగా; కనుఁగవన్= రెండు కన్నులలో; కెంపు= ఎరుపు; ఒదవఁగన్= కలుగగా; మెయి= దేహం; పొంగి= ఉప్పొంగి; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; ఉన్మత్తుగతిన్= పిచ్చివాడివలె; తద్+అనీకములన్= ఆ పాండవుల సేనలను; కలంచుచున్= కలత పెడుతూ; ముదుకండు= ముసలివాడు; అయ్యును= అయికూడ; కుమార= కుమారస్వామియొక్క, యువకుడి యొక్క; మూర్తిన్= రూపంతో; పొలిచెన్= ఒప్పాడు.

**తాత్పర్యం:** అర్జునుడి సేనలు ఆక్రమించగానే, కన్నులు ఎర్రవారగా, శరీరం ఉప్పొంగిపోయి ద్రోణాచార్యుడు, పిచ్చివాడివలె అర్జున, ధృష్టద్యుమ్నుల సైన్యాలను కలత పెడుతూ ముసలివాడైనప్పటికీ కుమారస్వామివలె కనిపించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. విను మప్పుడు నిజశక్తుల । కనురూపము గాఁగ నిలిచి యద్దెస వీరుల్**
**పెనఁగిరి రథ్యంబులు నా । తని సూతుని మేను శోణితంబునఁ దోఁగన్. 154**

**ప్రతిపదార్థం:** వినుము= ధృతరాష్ట్రా! వినుము; అప్పుడు= ఆ వేళ; ఆ+దెస= ఆ పాండవ పక్షపు; వీరుల్= యోధులు; నిజ= తమ; శక్తులకున్= బలాలకు; అనురూపము+కాఁగన్= అనుకూలంగా; నిలిచి= నిలబడి; రథ్యంబులు= గుర్రాలు; ఆతని= ద్రోణుడి; సూతుని= సారథియొక్క; మేను= దేహం; శోణితంబునన్= రక్తంలో; తోఁగన్= తేలగా; పెనఁగిరి= పోరాడారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! వినుము. అప్పుడు పాండవ వీరులు తమ తమ శక్తులకు తగినట్లు సైన్యాలకు అండగా నిలిచి, పోరి, ద్రోణుడి సారథి శరీరాన్ని, గుర్రాలను రక్తంలో ముంచారు.

**క. గురుఁ దలిగి పెలుచ నడరినఁ । గరిఘోటక భటనికాయ కాయముల సమి**
**ద్ధరణి వొలిచె నరుణపయో । ధరసంవృతమైన గగనతలము చెలువునన్. 155**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; అలిగి= కోపించి; పెలుచన్= తీవ్రంగా; అడరినన్= విజృంభించగా; కరి= ఏనుగుల; ఘోటక= గుర్రాల; భట= సైనికుల; నికాయ= సమూహాల; కాయములన్= దేహాలతో; అరుణ= ఎర్రని; పయోధర= మేఘాలచేత; సంవృత= కమ్ముకొనిన; గగనతలము= ఆకాశం; చెలువునన్= విధంగా సమిత్+ధరణి= యుద్ధభూమి; పొలిచెన్= ఒప్పారింది.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు కోపంతో విజృంభించగా, ఏనుగుల, గుర్రాల, భట సమూహాల రక్తంతో నిండి యుద్ధభూమి ఎర్రని మేఘాలతో కమ్ముకొన్న ఆకాశంవలె ఒప్పారింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు । నిప్పు లురులు చూపు లడర నిశితాస్త్రములం**
**గప్పె గురునిఁ దత్సైన్యం । బొప్పఱి తన బెట్టిదంపు టురవడిఁ దెరలన్.** **156**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ధృష్టద్యుమ్నుఁడు= పాండవ సేనాని అయిన ధృష్టద్యుమ్నుడు; నిప్పులు= అగ్నికణాలు; ఉరలు= రాలే; చూపులు= దృష్టులు; అడరన్= వ్యాపించగా; గురునిన్= ద్రోణాచార్యుడిని; తద్+సైన్యంబులన్= అతడి సేనలను; ఒప్పు+అఱి= ఒప్పునశించి; తెరలన్= పోగా; తన= తనయొక్క; బెట్టిదంపు= ఉద్ధతమైన; ఉరవడిన్= వేగంతో; నిశిత+అస్త్రములన్= వాడి బాణాలతో; కప్పెన్= ఆక్రమించాడు.

**తాత్పర్యం:** అపుడు పాండవసేనాని అయిన ధృష్టద్యుమ్నుడు, నిప్పులురాలే చూపులను సారించి, ద్రోణుడిని, అతడి సైన్యాన్ని, కలత చెందిపోయేటట్లుగా, ఉద్ధతమైన వేగంతో, వాడి బాణాలతో ఆక్రమించాడు.

**క.** **ద్రోణుని శరములు నిలుపుచు । బాణవితతి సేనమీఁదఁ బరఁగించుచు గీ**
**ర్వాణనుతు లెసఁగ నతఁ డ । క్షీణోద్ధతి నట్లు సమరకేళి సలుపఁగన్.** **157**

**ప్రతిపదార్థం:** ద్రోణుని= ద్రోణాచార్యుడి; శరములు= బాణాలు; నిలుపుచున్= ఆపుతూ; బాణవితతిన్= బాణాల సమూహాన్ని; సేనమీఁదన్= సైన్యంపై; పరఁగించుచున్= ప్రసరింపజేస్తూ; గీర్వాణ= దేవతల; నుతులు= ప్రశంసలు; ఎసఁగన్= అతిశయించగా; అతఁడు= ధృష్టద్యుమ్నుడు; అక్షీణ+ఉద్ధతిన్= తరగని అహంకారంతో; అట్లు= ఆ విధంగా; సమరకేళి= యుద్ధమనే ఆట; సలుపఁగన్= ఆడగా.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడి బాణపరంపరను అడ్డుకొంటూ, తన బాణ సమూహాన్ని శత్రుసేనల మీద ప్రయోగిస్తూ, దేవతలు ప్రశంసించగా తరగని అహంకారంతో ధృష్టద్యుమ్నుడు యుద్ధక్రీడ సలుపగా.

**క.** **ఏచిన రథికవరులు ధను । రాచార్యుని యిరుగెలంకులందుఁ దఱిమినం**
**జూచి వడి సవ్యసాచి శ । రాచిత దేహులుగఁ జేసె నందఱఁ గడిమిన్.** **158**

**ప్రతిపదార్థం:** ఏచిన= రెచ్చిపోయిన; రథికవరులు= రథాలపైగల శ్రేష్ఠులైన వీరులు; ధనురాచార్యుని= ద్రోణాచార్యుడి; ఇరు+కెలంకులందున్= రెండు వైపుల నుండి; తఱిమినన్= పరుగెత్తిరాగా; చూచి= కని; వడిన్= వేగంగా; సవ్యసాచి= అర్జునుడు; అందఱన్= రథికులనందరిని; కడిమిన్= పరాక్రమంతో; శర= బాణాలచేత; ఆచిత= కప్పబడిన; దేహులుగన్= శరీరం కలవారిగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** రెచ్చిపోయిన కౌరవులవైపుగల రథిక శ్రేష్ఠులు ద్రోణాచార్యుడి రెండు ప్రక్కల నుండి ధృష్టద్యుమ్నుడిని తరుముకొనగా, ఇది చూచి, అర్జునుడు వెంటనే ఆ రథికవరులందరి దేహాలను బాణాలతో నింపివేశాడు.

**వ. ద్రోణుండు పది బాణములు ద్రుపదసూనుమేనం గీలించినం దూలక యతం డతనిపై నిశిత విశిఖవర్షంబు గురిసె; నయ్యిరువుర శరనికరంబు లంబరంబు గప్పె; నట్టియెడఁ బాండవాగ్రజ పురోగములగు దొరలు గడంగి కుంభసంభవుదెసకుం దఱిమిన మన వలని ఘనయోధవరులు వారిం దలపడి; రందు శకుని సహదేవుం దాఁకి. 159**

**ప్రతిపదార్థం:** ద్రోణుండు= ద్రోణుడు; పదిబాణములు= పది బాణాలు; ద్రుపదసూను= ద్రుపదుని పుత్రుడైన ధృష్టద్యుమ్నుని; మేనన్= శరీరంపై; కీలించినన్= నాటింపగా; తూలక= చలించక; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; అతనిపైన్= ద్రోణుడిమీద; నిశిత= వాడి అయిన; విశిఖ= బాణాలయొక్క; వర్షంబు= వాన; కురిసెన్= కురిపించినాడు; అయ్యిరువుర= ఆ ఇద్దరి యొక్క; శరనికరంబులు= బాణాల సమూహాలు; అంబరంబు= ఆకాశాన్ని; కప్పెన్= కప్పినవి; అట్టియెడన్= అప్పుడు; పాండవ+అగ్రజ= ధర్మరాజుకు; పురోగములగు దొరలు= ముందునడచు రాజులు; కడంగి= పూనుకొని; కుంభసంభవు= ద్రోణుడి; దెసకున్= వైపునకు; తఱిమినన్= తరుమగా; మనవలని= మన వైపున ఉన్న; ఘన= గొప్పవారైన; యోధవరులు= వీరశ్రేష్ఠులు; వారిన్= పాండవులను; తలపడిరి= తాకారు; అందున్= వారిలో; శకుని; సహదేవున్= సహదేవుడిని; తాఁకి= ఎదుర్కొని.

**తాత్పర్యం:** ద్రోణుడు పది బాణాలను ధృష్టద్యుమ్నుడిపై వేయగా, అతడు కదలక ద్రోణుడిపై తీక్ష్ణమైన బాణవర్షాన్ని కురిపించాడు. ఆ ఇద్దరి బాణ సమూహాలు ఆకాశాన్ని కమ్మివేశాయి. అట్టి సమయంలో ధర్మరాజు ముందున్న యోధులు ద్రోణుడివైపు ఉరకగా, కౌరవ వీరులు వారితో పోరాడారు. అందులో శకుని సహదేవుడిని తాకి.

**మ. తురగవ్రాతము నొంచి కేతువు వెసం ద్రుంపంగ నాతండు గ్రో**
**ధరయం బుగ్రము గాక యుండియును గాంధారేశు వీతధ్వజున్**
**విరథున్ విస్ఫురితాస్త్రఘట్టితునిఁ గావింపన్ గదాభీల మూ**
**ర్తి రథం బుద్ధతి డిగ్గపాఱి యతఁ డుర్విం గూల్చెఁ దత్సారథిన్. 160**

**ప్రతిపదార్థం:** తురగ= గుర్రాల; వ్రాతమున్= సమూహాన్ని; నొంచి= బాధించి; కేతువున్= ధ్వజాన్ని; వెసన్= వెంటనే; త్రుంపంగన్= విరువగా; ఆతండున్= ఆ సహదేవుడును; క్రోధరసంబు= రోషభావం; ఉగ్రము= తీవ్రం; కాక+ఉండియును= కాకుండికూడ; గాంధార+ఈశున్= గాంధారదేశపు రాజైన శకునిని; వీతధ్వజున్= పతాకం లేనివాడినిగా; విరథున్= రథంలేనివాడినిగా; విస్ఫురిత= చలించిన; అస్త్ర= బాణాలచేత; ఘట్టితునిన్= పొదువబడినవాడినిగా; కావింపన్= చేయగా; గదా= గదచేత; ఆభీల= భయంకరమైన; మూర్తి= రూపంకలవాడు; రథంబు= రథాన్ని; ఉద్ధతిన్= అహంకారంతో; డిగ్గపాఱి= క్రిందికి ఉరికి; అతఁడు= ఆ శకుని; తద్+సారథిన్= ఆ సహదేవుడి యొక్క రథం నడుపువాడిని; ఉర్విన్= నేలపై; కూల్చెన్= కూలనేశాడు.

**తాత్పర్యం:** (శకుని సహదేవునిపై కురికి), అతడి గుర్రాలను చంపి, పతాకాన్ని విరువగా, సహదేవుడు కోపతీవ్రత లేకయే శకునియొక్క రథాన్ని, ధ్వజాన్ని విరిచి, బాణజాలంతో అతడిని ఆక్రమించాడు. అపుడు గదచేత భీకరాకారంగల వాడైన శకుని ఉద్ధతితో రథాన్ని దిగి, పరుగెత్తి సహదేవుడి సారథిని చంపాడు.

**క. సహదేవుండును గదఁ గొని । మహి కెరఁగిన యప్పు డొప్పె మనుజేశ్వర! య**
**మ్మహిత సుభట యుగము శిఖర । సహిత మహాశైలయుగ్మ సదృశాకృతియై. 161**

**ప్రతిపదార్థం:** మనుజేశ్వర!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; సహదేవుండును= సహదేవుడు కూడ; గదన్+కొని= గద చేతపట్టి; మహికిన్= భూమిపైకి; ఎరఁగినయప్పుడు= దిగినప్పుడు; ఆ+మహిత= ఆ గొప్పనైన; సుభట యుగము= వీరుల జత; శిఖర= శిఖరాలతో;

సహిత= కూడిన; మహా= గొప్ప; శైల= పర్వతముల; యుగ్మ= జంటతో; సదృశ= సమానమైన; ఆకృతి+ఐ= రూపము కలదై; ఒప్పెన్= ఒప్పారింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! సహదేవుడు గద తీసికొని భూమిపైకి దిగగా, మహావీరులైన శకుని సహదేవుల జంట శిఖరాలుగల రెండు పర్వతాల జంటవలె రాణించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క** **వింశతి శరముల నేసి వి । వింశతి ననిలజుఁ డతండు వీఁకనగుచుఁ ద**
**త్ప్రాంశుధనుర్దండము రెం । డంశములుగ నేసి వెడఁదయమ్మునఁ బెలుచన్.** **162**

**ప్రతిపదార్థం:** అనిలజుఁడు= భీముడు; వివింశతిన్= వివింశతి అనేవాడిని; వింశతి= ఇరవై; శరములన్= బాణాలతో; ఏసెన్= పరాక్రమంతో వేశాడు; అతండు= ఆ వివింశతి; వీఁకన్= పరాక్రమంతో; నగుచున్= నవ్వుతూ; తత్= ఆ భీముడి యొక్క; ప్రాంశు= ఉన్నతమైన; ధనుస్+దండము= దండం వంటి ధనుస్సును; వెడఁద= పెద్ద; అమ్మునన్= బాణంతో; పెలుచన్= ఆటోపంగా; రెండు= రెండైన; అంశములుగన్= తునుకలుగా; ఏసెన్= వేశాడు.

**తాత్పర్యం:** భీముడు ఇరవై బాణాలను వివింశతిపై ప్రయోగించగా, అతడు ఆటోపంతో ఉన్నతమైన అతడి ధనుస్సును పెద్ద బాణంతో రెండుగా విరిచాడు.

**సీ.** **మన బల మార్చినఁ గినిసి భీముఁడు గద । నతని యశ్వంబుల నవనిఁ గూల్చె;**
**భూరిశ్రవుఁడు పొలుపారి ధృష్టద్యుమ్నుఁ । గప్పె నస్త్రముల; శిఖండి యేచి**
**యాతని నిలు నిలుమని తాఁకి శరవృష్టిఁ । బొదివెఁ; బిశాచముల్ పూనుతేరు**
**లెక్కి కప్పారెడు నెలువు చర్మపుఁ గత్త । ళములతో ఖరనిస్స్వనములు సెలఁగ**

**తే.** **నసుర వల్లభు లగు నలంబుస ఘటోత్క । చులు సముద్ధతిఁ దొడరి మాయలు వొనర్చి**
**పేర్చి యొండొరు నొంచుచుఁ బెనఁగి పెనఁగి । తెల్లముగఁ జూడఁ జూడ నదృశ్యు లైరి.** **163**

**ప్రతిపదార్థం:** మన= మనయొక్క; బలము= కౌరవసైన్యం; ఆర్చినన్= బొబ్బలు పెట్టగా; భీముడు; కినిసి= కోపించి; గదన్= గదచేత; అతని= ఆ వివింశతి; అశ్వంబులన్= గుర్రాలను; అవనిన్= నేలపై; కూల్చెన్= పడవేశాడు; భూరిశ్రవుఁడు; పొలుపారి= ఒప్పారి; అస్త్రములన్= బాణాలచేత; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; కప్పెన్= ముంచాడు; శిఖండి; ఏచి= చెలరేగి; ఆతనిన్= భూరిశ్రవుడిని; నిలునిలుము+అని= ఆగు మాగు మని; తాఁకి= ఎదుర్కొని; శరవృష్టిన్= బాణాల వర్షంచేత; పొదివెన్= ఆక్రమించాడు; పిశాచముల్= పిశాచాలు; పూను= కట్టిన; తేరులు= రథాలు; ఎక్కి; కప్పు+ఆరెడు= నల్లని; ఎలువు= ఎలుగుగొడ్డు; చర్మపున్= తోలుతో చేసిన; కత్తళముతోన్= కవచంతో; ఖర= గాడిదల యొక్క; నిస్స్వనములు= ఓండ్రలు; చెలఁగన్= రేగగా; అసుర వల్లభులు+అగు= రాక్షస రాజులగు; అలంబుస= అలంబుసుడు; ఘటోత్కచులు= ఘటోత్కచుడు; సముద్ధతిన్= అహంకారంతో; తొడరి= పూని; మాయలు+ఒనర్చి= మాయాజాలం పన్ని; పేర్చి= విజృంభించి; ఒండొరున్= ఒకరినొకరు; నొంచుచున్= బాధిస్తూ; పెనఁగిపెనఁగి= మిక్కిలి పోరి; తెల్లముగన్= విశదంగా; చూడన్+చూడన్= చూస్తుండగా; అదృశ్యులు+ఐరి= కనిపించకుండా పోయారు.

**తాత్పర్యం:** మన సైన్యం సంతోషంతో కేకలు పెట్టగా భీముడు కోపించి వివింశతి రథాశ్వాలను నేలగూల్చాడు. భూరిశ్రవుడు అస్త్రజాలంతో ధృష్టద్యుమ్నుడిని కప్పాడు. అప్పుడు శిఖండి చెలరేగి భూరిశ్రవుడిని బాణాలతో

ఆక్రమించాడు. అలంబుసుడు, ఘటోత్కచుడు పిశాచాలు పూన్చిన రథాలెక్కి, నల్లని ఎలుగుబంటి చర్మంతో చేసిన కవచాలు ధరించి, గాడిదలు ఓండ్రపెడుతుండగా, అహంకారంతో మాయాజాలం పన్ని, విజృంభించి, ఒకరినొకరు అణుస్తూ, మిక్కిలిగా పోరి, అందరు చూస్తుండగా అదృశ్యులయ్యారు.

**వ. అయ్యవసరంబున.** **164**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఆ యుద్ధం జరిగేటపుడు.

**సీ. క్షత్త్రదేవుండు లక్ష్మణుతోడ సమరంబు । సేసె నుగ్రంబుగఁ; జేకితానుఁ**
**డనువిందుఁ దలపడి యద్భుతగతిఁ బోరె; । శల్యుండు నవ్వుచు శరచయమున**
**నకులు నొంచినఁ గేతనము నాతపత్రంబు । వెసఁ ద్రుంచి యాతని విరథుఁ జేసి**
**శంఖంబు పూరించె శారద్వతుని మీఁద । ధృష్టకేతుఁడు సప్తతీవ్ర దీప్త**

**తే. విశిఖములు నింప నతఁ డస్త్రవృష్టి పెల్లు । గురిసె; సాత్యకి కృతవర్మ యురము నార**
**సముల నొప్పించి డెబ్బది సాయకంబు । లేయ డెబ్బదియేడమ్ము లేసె నతఁడు.** **165**

**ప్రతిపదార్థం:** క్షత్రదేవుండు= క్షత్రదేవుడనేవాడు; లక్ష్మణు తోడన్= దుర్యోధనుడి కొడుకైన లక్ష్మణుడితో; ఉగ్రంబుగన్= భయంకరంగా; సమరంబు= యుద్ధం; చేసెన్= చేశాడు; చేకితానుఁడు; అనువిందున్= అనువిందుడిని; తలపడి= ఎదుర్కొని; అద్భుతగతిన్= ఆశ్చర్యం కొలిపేటట్లు; పోరెన్= యుద్ధం చేశాడు; శల్యుండు; నవ్వుచున్= నవ్వుతూ; శరచయంబులన్= బాణ సమూహాలచేత; నకులున్= నకులుడిని; నొంచినన్= బాధించగా; కేతనము= పతాకం; ఆతపత్రంబు= గొడుగు; వెసన్= వెంటనే; త్రుంచి= విరిచి; అతనిన్= శల్యుడిని; విరథున్= రథంలేనివాడినిగా; చేసి; శంఖంబు= శంఖం; పూరించెన్= ఊదాడు; శారద్వతునిమీఁదన్= కృపాచార్యుడిమీద; ధృష్టకేతుఁడు; సప్త= ఏడు; తీవ్ర= తీక్ష్ణాలైన; దీప్త= మండే; విశిఖములు= బాణాలు; నింపన్= నిండించగా; అతఁడు= ఆ కృపాచార్యుడు; అస్త్రవృష్టి= బాణాల వర్షం; పెల్లు= ఎక్కువగా; కురిసెన్= కురిపించాడు; సాత్యకి= కృష్ణుడి తమ్ముడైన సాత్యకి; కృతవర్మ= కృతవర్మ యొక్క; ఉరమున్= వక్షస్సును; నారసములన్= బాణాలతో; నొప్పించి= బాధించి; డెబ్బది; సాయకంబులు= బాణాలు; ఏయన్= వేయగా; అతఁడు= కృతవర్మ; డెబ్బదియేడు; అమ్ములు= బాణాలు; ఏసెన్= వేశాడు.

**తాత్పర్యం:** క్షత్రదేవుడు దుర్యోధనుడి పుత్రుడైన లక్ష్మణుడితో యుద్ధం చేశాడు. చేకితానుడు అనువిందుడితో ఆశ్చర్యం గొలిపేటట్లు పోరాడాడు. శల్యుడు నవ్వుతూ బాణాలతో నకులుడిని క్రుంగదీయగా, అతడు శల్యుడి పతాకాన్ని, గొడుగును వెంటనే విరిచి, రథంలేని వాడిగా చేసి శంఖాన్ని పూరించాడు. ధృష్టకేతువు కృపాచార్యుడిపై ఏడు తీవ్రమైన బాణాలు వేయగా అతడు గొప్ప బాణవర్షాన్ని కురిపించాడు. సాత్యకి కృతవర్మ రొమ్మును బాణాలతో నొప్పించి డెబ్బది బాణాలను వేయగా, కృతవర్మ సాత్యకిపై డెబ్భైయేడు అమ్ములు వేశాడు.

**క. సేనాపతి యగు ద్రుపద । క్ష్మానాథతనూభవుఁడు సుశర్మునిమర్మ**
**స్థానంబు నొంచె నాతఁ డ । దీనుండై యతని జత్రుదేశం బేసెన్.** **166**

**ప్రతిపదార్థం:** సేనాపతి అగు= సేనాధిపతి అయిన; ద్రుపద క్ష్మానాథ= ద్రుపదరాజు యొక్క; తనూభవుఁడు= కొడుకైనధృష్టద్యుమ్నుడు; సుశర్ముని మర్మస్థానంబున్= సుశర్మ యొక్క ఆయువుపట్లను; నొంచెన్= బాధించాడు; అతఁడు= ఆ సుశర్మ; అదీనుండు+ఐ= ధైర్యవంతుడై; అతని= ఆ ధృష్టద్యుమ్నుడి యొక్క; జత్రుదేశంబు= మూపులయొక్క సంధి ఎముకలుగల చోట; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** పాండవ సేనాని అయిన ధృష్టద్యుమ్నుడు త్రిగర్తాధిపతి అయిన సుశర్మ యొక్క మర్మస్థానాలను నొప్పించాడు. అతడు ధైర్యవంతుడై ధృష్టద్యుమ్నుడి మూపుల సంధి ఎముకలుగల చోట నొప్పించాడు.

**చ.** **బలమును దాను మత్స్యనరపాలుఁడు కర్ణునిఁ దాఁకి రెండు సే**
**నలు వినుతింప నుద్భటరణం బొనరించినఁ గంటిక్రేవఁ గెం**
**పొలయఁగ నీతనూభవుల కుబ్బుగఁ దద్రథదంతి ఘోటకం**
**బుల నుఱుమాడె నా రథికపుంగవుఁ డంబరచారు లార్వఁగన్.** 167

**ప్రతిపదార్థం:** మత్స్యనరపాలుఁడు= విరాటరాజు; తాను= తానున్నూ, బలమును= తన సైన్యం; కర్ణునిన్+తాఁకి= కర్ణునిఎదుర్కొని; రెండు సేనలు= కౌరవ పాండవ సేనలు; వినుతింపన్= ప్రశంసించగా; ఉద్భటరణంబు= తీవ్రమైన యుద్ధం; ఒనరించినన్= చేయగా; ఆ రథిక పుంగవుఁడు= ఉత్తమ రథికుడైన కర్ణుడు; అంబరచారులు= ఆకాశంలో విహరించే దేవతలు; ఆర్వఁగన్= మెచ్చుకోలుగా అరవగా; కంటిక్రేవన్= కంటికొనలందు; కెంపు+ఒలయఁగన్= ఎరుపెక్కగా; నీతనూభవులకున్= నీ కుమారులైన దుర్యోధనాదులకు; ఉబ్బుగన్= సంతోషం కలుగగా; తద్= ఆ విరాటరాజు యొక్క; రథ= రథాలను; దంతి= ఏనుగులను; ఘోటకంబులన్= గుర్రాలను; నుఱుమాడెన్= చంపాడు.

**తాత్పర్యం:** విరాటరాజు తాను, తన సైన్యం కర్ణుడిని ఎదుర్కొని కౌరవ పాండవ సేనలు ప్రశంసించగా తీవ్రమైన యుద్ధం చేశాడు. అపుడు రథిక శ్రేష్ఠుడైన కర్ణుడు దేవతలు ప్రశంసిస్తుండగా, క్రోధమూర్తి అయి నీ కుమారులైన దుర్యోధనాదులకు సంతోషం కలిగేటట్లు ఆ విరాటరాజుయొక్క చతురంగ బలాలను సంహరించాడు.

**క.** **వేడుకమైఁ దలపడి పో । రాడిరి ద్రుపదభగదత్తు లస్త్రబలము శౌ**
**ర్యాడంబరమును నెలుఁగులుఁ । జూడను వినఁ జిత్రములుగ శుంభద్భంగిన్.** 168

**ప్రతిపదార్థం:** ద్రుపద భగదత్తులు= ద్రుపదుడు, భగదత్తుడు; అస్త్రబలము= అస్త్ర సామర్థ్యం; శౌర్య= శౌర్యము యొక్క; ఆడంబరమునున్= ఆటోపాన్ని; ఎలుఁగులున్= బొబ్బలు; చూడను= చూడటానికి; వినన్= వినుటకు; చిత్రములుగన్= విచిత్రంకాగా; శుంభత్+భంగిన్= వెలుగొందుతూ; వేడుకమైన్= వినోదంగా; తలపడి= ఎదిరించి; పోరాడిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** ద్రుపదుడు, భగదత్తుడు తమ అస్త్ర సామర్థ్యం, శౌర్యాడంబరం, వీరనాదాలు చూడటానికి, వినటానికి విచిత్రంగా తోచగా వెలుగొందుతూ, వినోదంగా ఒకరినొకరు ఎదుర్కొని యుద్ధం చేశారు.

**సీ.** **పౌరవుం డభిమన్యు బలువిడిఁ దాఁకి బా । ణాసారమున ముంప నతఁడు గినిసి**
**యతని ధనుఃకేతనాతపత్రంబులు । ద్రుంచి యేనింటఁ దత్తురగములను**
**సారథి నొప్పించి శరము లేడిట స్రుక్కఁ । జేసి దర్పంబున శిరముఁ ద్రుంచు**
**టకు భల్లమరిఁ బోయుటయుఁ గృతవర్మ రెం । డమ్ముల విల్లు నయ్యమ్ముఁ దునిమెఁ**

**తే.** **బలకయును వాలుఁ గొని నరుపట్టి గవిసి । పౌరవుని రథ్యముల నేలపాలు సేసి**
**యుఱికి సూతుని బడఁదన్ని యురగ విభునిఁ । బట్టు గరుడుని క్రియఁ దల వట్టికొనియె.** 169

**ప్రతిపదార్థం:** పౌరవుండు= పౌరవుడు; అభిమన్యున్= అభిమన్యుడిని; బలువు+ఇడిన్= బలంతో; తాఁకి= మార్కొని; బాణాసారమునన్= బాణాల వర్షంలో; ముంపన్= ముంచగా; అతఁడు= అభిమన్యుడు; కినిసి= కోపించి; అతని= పౌరవుడి యొక్క;

ధనుః= ధ నుస్సు; కేతన= పతాకం; ఆతపత్రంబులు= గొడుగులు; త్రుంచి= విరిచి; ఏనింటన్= ఐదు బాణాలతో; తద్= ఆ పౌరవుడి యొక్క; తురగములను= గుఱ్ఱాలను; సారథిన్= సారథిని; నొప్పించి= బాధించి; శరములు= బాణాలు; ఏడింటన్= ఏడింటితో; స్రుక్కన్= బాధపడేటట్లు; చేసి; దర్పంబునన్= గర్వంతో; శిరము= తల; త్రుంచుటకున్= ఖండించటానికి; భల్లము+అరిబోయుటయున్= బాణం ఎక్కుపెట్టగా; కృతవర్మ; రెండు+అమ్ములన్= రెండు బాణాలతో; విల్లును= ధనుస్సును; ఆ+అమ్మున్= ఆ బాణాన్ని; తునిమెన్= త్రుంచాడు; పలకయును= డాలును; వాలున్= కత్తిని; కొని= గ్రహించి; నరుపట్టి= అభిమన్యుడు; కవిసి= విజృంభించి; పౌరవుని= పౌరవుడి; రథ్యములన్= గుఱ్ఱాలను; నేలపాలు చేసి= కూల్చి; ఉరికి= పైకురికి; సూతునిన్= సారథిని; పడన్+తన్ని= పడిపోయేటట్లు తన్ని; ఉరగవిభునిన్= సర్పరాజును; పట్టు= పట్టుకొనే; గరుడుని= గరుత్మంతుడి; క్రియన్= వలె; తల+పట్టికొనియెన్= తలను పట్టుకొన్నాడు.

**తాత్పర్యం:** పౌరవుడు అభిమన్యుడిని బలంతో తాకి బాణవర్షంలో ముంచగా, అతడు కోపించి, పౌరవుడి పతాకాన్ని, గొడుగులను, ధనుస్సును త్రుంచి, ఐదు బాణాలతో సారథిని, గుఱ్ఱాలను నొప్పించి, ఏడు బాణాలతో బాధించి, గర్వంతో శిరస్సు ఖండించటానికి ధనుస్సు ఎక్కువెట్టగా; కృతవర్మ రెండు బాణాలతో అభిమన్యుడి ధనుర్బాణాలను విరుగ గొట్టాడు. డాలు, కత్తి తీసికొని అభిమన్యుడు విజృంభించి, పౌరవుడి గుఱ్ఱాలను కూల్చి, పైకురికి సూతుడిని పడదన్ని, సర్పరాజును పట్టుకొనే గరుత్మంతుడివలె అతడి తలపట్టుకొన్నాడు.

**వ.** **ఆలోన సైంధవుండు సంభ్రమంబున శాతకృపాణ చర్మంబులు గొని, రథంబు డిగ్గనుఱికి, రయంబున నెయిది యదల్చినం గని, జనకద్వేషియగు నతని వలని రోషం బగ్గలింప నా పురందరపౌత్రుండు పౌరవుని విడిచి, యద్దెసకు లంఘించి కవిసె నప్పుడు.** **170**

**ప్రతిపదార్థం:** ఆలోనన్= అంతలో; సైంధవుండు= సింధుదేశపు రాజైన జయద్రథుడు; సంభ్రమంబునన్= వేగిరపాటుతో; శాత= తీక్ష్ణమైన; కృపాణ= బాణాలను; చర్మంబులు= డాలులు; కొని= తీసికొని; రథంబున్= రథాన్ని; డిగ్గన్+ఉఱికి= దిగి ఉరికి; రయంబునన్= వేగంగా; ఎయిది= వెంబడించి; అదల్చినన్= గద్దించగా; కని= చూచి; జనక= తండ్రులైన పాండవులకు; ద్వేషి+అగు= శత్రువైన; అతని వలని= అతడిమీద; రోషంబు= కోపం; అగ్గలింపన్= ఎక్కువ కాగా; ఆ పురందర పౌత్రుండు= ఇంద్రుడి మనుమడైన అభిమన్యుడు; పౌరవునిన్= పౌరవుడిని; విడిచి= వదలి; ఆ+దెసకున్= జయద్రథుడివైపు; లంఘించి= దూకి; కవిసెన్= ఎదుర్కొన్నాడు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ లోపుగా జయద్రథుడు వేగిరపాటుతో తీక్ష్ణమైన కత్తిని, డాలును తీసికొని, రథం దిగి ఉరికి, వెన్నంటి గద్దించాడు. అది చూచి అభిమన్యుడు తన తండ్రులకు శత్రువైన జయద్రథుడిమీద కోపం ఎక్కువకాగా, పౌరవుడిని విడిచి, ఆవైపు దూకి ఆక్రమించాడు. అప్పుడు.

**తే.** **వికట విస్ఫుర దసి చర్మ వివిధ చిత్ర । గతులు చూపఱ యెడఁద కద్భుతమొనర్ప**
**నార్జునియు సింధురాజుఁ బక్షాభిరామ । సింహ శార్దూలగతి విలసిల్లి రధిప!** **171**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; వికట= కుటిలమైన; విస్ఫురత్= ప్రకాశిస్తున్న; అసి= కత్తుల; చర్మ= డాలులయొక్క; వివిధ= అనేకాలైన; చిత్రగతులు= విచిత్రమైన పోకడలు; చూపఱ= చూచేవారి; ఎడఁదకున్= మనస్సుకు; అద్భుతము+ఒనర్పన్= ఆశ్చర్యం గొలుపగా; ఆర్జునియున్= అభిమన్యుడూ; సింధురాజున్= జయద్రథుడూ; పక్ష= కౌరవపాండవ పక్షాలకు; అభిరామ= మనోజ్ఞమైన; సింహ= సింహం; శార్దూలం= పెద్దపులి; గతిన్= వలె; విలసిల్లిరి= ఒప్పారారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అభిమన్యు, జయద్రథుల కుటిలమైన, ప్రకాశిస్తున్న కత్తుల, డాళ్ళ అనేక చిత్రవిచిత్రగతులు చూచేవారికి ఆశ్చర్యం గొలుపగా, కౌరవ పాండవ పక్షాలకు వారు సింహం వలె, పులివలె మనోజ్ఞంగా ప్రకాశించారు.

**వ. అట్టియెడ.** **172**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= అప్పుడు.

**తాత్పర్యం:** అభిమన్యు జయద్రథులు యుద్ధం చేసే ఆ సమయంలో.

**క. అఱిముఱి వ్రేసినఁ బలకం । గఱచిన సైంధవుని యలుఁగు గని నరసుతుఁ డే**
**డ్తెఱ ముఱిసిన నది రూపఱి । విఱుగుటయును వెస నతండు వెనుకకు విఱిగెన్.** **173**

**ప్రతిపదార్థం:** అఱిముఱి= సంభ్రమంతో; వ్రేసినన్= కొట్టగా; పలకన్= డాలును; కఱచినన్= గ్రుచ్చుకోగా; సైంధవుని= జయద్రథుడి; అలుఁగు= ఖడ్గము; కని= చూచి; నరసుతుఁడు= అభిమన్యుడు; ఏడ్తెఱన్= పరాక్రమంతో; ముఱిసినన్= గర్వించగా; అది= ఆ డాలు; రూపు+అఱి= పాడై; విఱుగుటయును= విరిగిపోగా; వెసన్= వెంటనే; అతండు= ఆ జయద్రథుడు; వెనుకకున్= వెనుకకు; విఱిగెన్= పారిపోయాడు.

**తాత్పర్యం:** సైంధవుడు సంభ్రమంతో ఖడ్గాన్ని విసరగా అది అభిమన్యుని డాలుకు గ్రుచ్చుకొనివిరిగింది. ఆ విరిగిన ఖడ్గాన్ని చూచి అభిమన్యుడు పరాక్రమంతో గర్వించాడు. ఆ ఖడ్గము పాడై విరుగగా జయద్రథుడు వేగంగా వెనుకకు పారిపోయాడు.

**క. విఱిగినచో నిలువక వెఱ । నుఱికెం దన రథము మీఁది 'కోడితి పో పో**
**పిఱికి' యని పలికి నుఱుముగ । నఱికెం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్.** **174**

**ప్రతిపదార్థం:** విఱిగిన చోన్= పారిపోయిన చోట; నిలువక= నిలబడక; వెఱన్= భయంతో; తన= తన యొక్క; రథము మీఁదికిన్= తేరుపైకి; ఉఱికెన్= ఉరికాడు; ఓడితి= ఓడిపోయావు; పోపో= వెళ్ళు, వెళ్ళు; పిఱికి!= పిరికివాడా!; అని పలికి= అని చెప్పి; పార్థనందనుఁడు= అభిమన్యుడు; తద్+సేనన్= జయద్రథుడి సైన్యాన్ని; వడిన్= వేగంగా; నుఱుముగన్= ముక్కలు ముక్కలుగా; నఱికెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** డాలు విరిగిపోగా జయద్రథుడు అట నిలువక భయంతో తన రథంపైకి ఉరికాడు. అప్పుడు అభిమన్యుడు 'ఓరి పిరికిపంద! నీవు ఓడిపోయావు. పోపో!' అని జయద్రథుడితో పలికి, వాడి సైన్యాన్ని ముక్కలు ముక్కలుగా ఖండించాడు.

**క. తెరలిన సైంధవుఁ గని నృప । వరులు పలువు రొక్కపెట్ట వాసవిసుతుపై**
**నురవడిఁ దఱిమిరి; మద్రే । శ్వరుఁడు గదిసి దీప్తశక్తి వైచెం బెలుచన్.** **175**

**ప్రతిపదార్థం:** తెరలిన= పారిపోయిన; సైంధవున్= జయద్రథుడిని; కని= చూచి; నృపవరులు= రాజశ్రేష్ఠులు; పలువురు= అనేకులు; ఒక్కపెట్టన్= ఒకేసారి; వాసవిసుతుపైన్= అభిమన్యుడి మీదికి; ఉరవడిన్= అతివేగంగా; తఱిమిరి= ఉరికిరి; మద్రేశ్వరుఁడు= శల్యుడు; కదిసి= మార్కొని; పెలుచన్= ఆగ్రహంతో; దీప్తశక్తిన్= మండునట్టి శక్తి అనే ఆయుధాన్ని; వైచెన్= వేశాడు.

**తాత్పర్యం:** పారిపోతున్న సైంధవుడిని చూచి కౌరవపక్షంలోని రాజులు అనేకులు ఒకేసారి అభిమన్యుడి పైకి అతివేగంగా ఉరికారు. శల్యుడు కూడ ఎదురొడ్డి, కోపంతో వెలుగులు చిమ్మే శక్తి అనే ఆయుధాన్ని అతడిపై విసిరాడు.

**క. ఉరగాంగన నలిఁ బట్టెడు । గరుడుని క్రియ శక్తి వట్టి క్రమ్మఱ వైచెన్**
**నరసుతుఁడు శల్యసూతునిఁ । బొరివోవఁగ నార్చెఁ బాండుపుత్రబలంబుల్. 176**

**ప్రతిపదార్థం:** ఉరగ+అంగనన్= ఆడపామును; నలిన్+పట్టెడు= లాఘవంతో పట్టుకొను; గరుడుని క్రియన్= గరుత్మంతుడి వలె; శక్తి+పట్టి= శక్త్యాయుధాన్ని పట్టుకొని; క్రమ్మఱన్= తిరిగి; నరసుతుఁడు= అభిమన్యుడు; శల్యసూతునిన్= శల్యుడి సారథిని; పొరి+పోవఁగన్= చచ్చునట్లు; వైచెన్= వేశాడు; పాండుపుత్ర బలంబుల్= పాండవుల సైన్యాలు; ఆర్చెన్= వీరనాదాలు చేశాయి.

**తాత్పర్యం:** ఆడపామును లాఘవంతో పట్టుకొనే గరుత్మంతుడివలె అభిమన్యుడు ఆ శక్త్యాయుధాన్నే పట్టుకొని శల్యుడి సారథిని చచ్చేటట్టు కొట్టాడు. పాండవ సైన్యాలు వీరనాదాలు చేశాయి.

**వ. అయ్యవసరంబున విరాటుండును ద్రుపదుండును ధృష్టకేతుండును యుధిష్ఠిరుండును సాత్యకియును గేకయపతులును భీమసేనుండును ధృష్టద్యుమ్నుండును శిఖండియుం గవలును ద్రౌపదేయులును సౌభద్రుం బొగడు నెలుంగులు సింహనాదంబులు నింగి ముట్ట నతనికి నుల్లాసంబును నీ కొడుకులకు రోసంబును జనియింప, నతనిం బరివేష్టించిన నవ్విజయంబు సైరింపక కూడుకొని నీ కొడుకు లతనిపైఁ బటు శరంబులు గురియ, నక్కుమారసంతతికి సంతసంబుగా శల్యుండు గద గొని యభిమన్యున కభిముఖుండై కవిసె' ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 177**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= అప్పుడు; విరాటుండును= విరాటరాజు; ద్రుపదుండును= ద్రుపదుడును; ధృష్టకేతుండును= ధృష్టకేతుడును; యుధిష్ఠిరుండును= ధర్మరాజును; సాత్యకియును; కేకయపతులును= కేకయదేశరాజులును; భీమసేనుండును= భీముడును; ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడును; శిఖండియున్= శిఖండియును; కవలును= నకుల సహదేవులును; ద్రౌపదేయులును= ద్రౌపదీ పుత్రులైన ప్రతివింధ్యాదులును; సౌభద్రున్= అభిమన్యుడిని; పొగడు= ప్రశంసించే; ఎలుంగులు= బొబ్బలు; సింహనాదంబులు= ఉత్సాహనాదాలు; నింగిముట్టన్= ఆకాశాన్ని తాకగా, అతనికిన్= ఆ అభిమన్యుడికి; ఉల్లాసంబును= ఉత్సాహం; నీ= నీయొక్క; కొడుకులకున్= పుత్రులకు; రోసమును= కోపము; జనియింపన్= కలుగగా; అతనిన్= అభిమన్యుడిని; పరివేష్టించినన్= చుట్టుముట్టగా; తద్+విజయంబు= ఆ విజయాన్ని; సైరింపక= ఓర్వక; కూడుకొని= కలిసికొని; నీ కొడుకులు= కౌరవులు; అతనిపైన్= అభిమన్యుడిమీద; పటుశరంబులు= బలమైన బాణాలు; కురియన్= కురిపించగా; ఆ+కుమారసంతతికిన్= ఆ నీ కొడుకులకు; సంతసంబుగాన్= సంతోషం కలిగేటట్లు; శల్యుండు= శల్యుడు; గద+కొని= గద తీసికొని; అభిమన్యునకున్= అభిమన్యుడికి; అభిముఖుండు+ఐ= ఎదురునిలిచి; కవిసెన్= మార్కొన్నాడు; అనినన్ విని= అనగా విని; ధృతరాష్ట్రుండు;= సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అప్పుడు పాండవులు, వారివైపుగల విరాట ద్రుపదాదియోధులు అభిమన్యుడిని ప్రశంసించగా, ఆ నినాదాలు ఆకాశాన్నంటి అతడికి ఉల్లాసాన్ని, నీ కొడుకులకు రోషాన్ని కలిగించాయి. అటువంటి గెలుపును సహించక, నీ పుత్రులు అతడిపై తీవ్రబాణాలు ప్రసరింపజేయగా, వారికి సంతోషం కలిగేటట్లు శల్యుడు గద తీసికొని, అభిమన్యుడిని ఎదుర్కొన్నాడు- అనగా, విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**తే. ఎక్కటెక్కటి పెనఁగిన నింతవట్టు । పెనఁకువలు నిట్టు లేచునే? పృథివి నింక**
**జనము లీ కురుపాండవ సంగరంబు । సెప్పికొండ్రు మనంబు లచ్చెరువు నొంద.' 178**

**ప్రతిపదార్థం:** ఎక్కటి+ఎక్కటి= ఒక్కొక్కరు; పెనఁగినన్= యుద్ధం చేస్తే; ఇంతవట్టు= ఇంతమాత్రం; పెనఁకువలు= కలహాలు; ఇట్టు= ఈ విధంగా; ఏచునే?= విజృంభిస్తాయా?; పృథివిన్+ఇంకన్= భూలోకంలో ఇకముందు; జనములు= ప్రజలు; మనంబులు=

మనస్సులు; అచ్చెరువున్+ఒందన్= ఆశ్చర్యపడగా; ఈ కురు= ఈ కౌరవుల; పాండవ= పాండవుల; సంగరంబు= యుద్ధం; చెప్పికొండ్రు= చెప్పుకొంటారు.

**తాత్పర్యం:** ఒకరితోఒకరు యుద్ధం చేస్తే ఇంతింత పెనగులాటలు ఎక్కడైనా విజృంభిస్తాయా! భూలోకంలో అందరు ఆశ్చర్యంతో ఈ కురుపాండవ సంగ్రామాన్ని గూర్చి ఇక ముందు ఎంతగానో చెప్పుకొంటారు!

**క. అని సొంపు వినియు 'నాకుం । దనివి సనదు శల్యపార్థతనయుల సమరం**
**బున తెఱఁగు సెప్పు మేర్పడ' । ననవుడు సూతసుతుఁ డిట్టు లనుఁ బతితోడన్. 179**

**ప్రతిపదార్థం:** అని= యుద్ధం యొక్క; సొంపు= సమృద్ధి; వినియున్= విన్నా; నాకున్= నాకు; తనివి+చనదు= తృప్తి తీరదు; శల్య= శల్యుడి; పార్థతనయుల= అభిమన్యుడి యొక్క; సమరంబున= యుద్ధం యొక్క; తెఱఁగు= విధం; ఏర్పడన్= వివరంగా; చెప్పుము= తెలియజేయుము; అనవుడున్= అనగా; పతితోడన్= ధృతరాష్ట్రుడితో; సూతసుతుఁడు= సంజయుడు; ఇట్టులు+అనున్= ఈ విధంగా అంటాడు.

**తాత్పర్యం:** యుద్ధాన్నిగూర్చి ఎంత విన్నా తనివి తీరటం లేదు. శల్యాభిమన్యుల యుద్ధాన్ని వివరించుమనగా ధృతరాష్ట్రుడితో సంజయుడు ఈ విధంగా అన్నాడు.

**భీమసేన శల్యుల గదా యుద్ధము (సం. 7-14-4)**

**ఉ. అమ్మెయి సూతుఁ డీల్గుటయు నగ్గలికం గద వుచ్చుకొంచు రౌ**
**ద్రమ్మున వచ్చు శల్యుఁ గని తానును జండ గదా విలాస నో**
**గ్రమ్ముగ లీల మార్కొనియె రమ్మిట రమ్మనుచున్ సమస్త సై**
**న్యమ్ములుఁ బిచ్చలింపఁగ సురాధిప పౌత్రుఁడు దీప్త గాత్రుఁడై. 180**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ విధంగా; సూతుఁడు= సారథి; ఈల్గుటయున్= చనిపోగా; అగ్గలికన్= శౌర్యంతో; గద= గదను; పుచ్చుకొంచున్= తీసికొని; రౌద్రమ్మునన్= క్రోధంతో; వచ్చు= వచ్చే; శల్యున్= శల్యుడిని; కని= చూచి; సురాధిప పౌత్రుఁడు= దేవతలకు రాజైన ఇంద్రుడి మనుమడైన అభిమన్యుడు; దీప్తగాత్రుఁడు+ఐ= జ్వలించే శరీరంగలవాడై; తానును= తానుకూడ; చండ= భయంకరమైన; గదా= గద యొక్క; విలాసన= మిక్కిలి ప్రకాశించే; ఉగ్రమ్ముగన్= తీవ్రతతో; రమ్ము+ఇట= ఇచటికి రా; రమ్ము= రా; అనుచున్= అంటూ; సమస్త సైన్యమ్ములున్= సైన్యాలన్నీ; పిచ్చలింపఁగన్= భయపడగా; లీలన్= విలాసంగా; మార్కొనియెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా సారథి మరణించగా, శౌర్యోపేతుడై గదను చేపట్టి క్రోధం వెలిగక్కుతూ వచ్చే శల్యుడిని చూచి, జ్వలించే దేహంగల వాడైన అభిమన్యుడు మహాభయంకరంగా గదను తిప్పుతూ, సేనలన్నీ భయపడగా; రా! ముందుకు రా! అంటూ అవలీలగా అతడిని యెదుర్కొన్నాడు.

**ఉ. అంతకు భీమసేనుఁడు రయం బెసఁగన్ గద నెయ్ది పట్టి య**
**త్యంత బలంబుమైఁ బిఱిఁది కాతనిఁ ద్రోచి కనద్గదాపరి**
**భ్రాంతి వెలుంగ నిల్చినఁ దిరంబయి శల్యుఁ డుదాత్తరేఖఁ గా**
**లాంతక దీప్తమూర్తి యగు నాతనిఁ దాఁకె బలంబు లార్వఁగన్. 181**

**ప్రతిపదార్థం:** అంతకు= అప్పుడు; భీమసేనుఁడు= భీముడు; రయంబు+ఎసఁగన్= వేగం మీర; గదన్= గదను; ఎయ్దిపట్టి= ఒత్తిపట్టి; అత్యంత= మిక్కిలి; బలంబుమైన్= బలంగా; పిఱిఁదికిన్= వెనుకకు; ఆతనిన్= అభిమన్యుడిని; త్రోచి= త్రోసివేసి; కనత్=

ప్రకాశించే; గదా= గదయొక్క; పరిభ్రాంతి= త్రిప్పటం; వెలుంగన్= వెలుగగా; నిల్చినన్= నిలువగా; తిరంబు+అయి= స్థిరుడై; శల్యుఁడు; ఉదాత్తరేఖన్= ఔన్నత్యంతో; కాల= ప్రళయకాలంలోని; అంతక= యముడివలె; దీప్త= ప్రకాశించే; మూర్తి అగు= రూపంగల; ఆతనిన్= ఆ భీముడిని; బలంబులు= కౌరవ సేనలు; ఆర్వఁగన్= బొబ్బలు వెట్టగా; తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** అంతలో భీముడు గదను ఒత్తిపట్టి, అభిమన్యుడిని మిక్కిలి వేగంగా వెనుకకు త్రోసి, ధగధగమెరిసేటట్లు గదను గిర్రున త్రిప్పుతూ నిలువగా, శల్యుడు స్థిరుడై, ఔన్నత్యం మెరయగా, కౌరవసేనలు ప్రశంసాపూర్వకంగా బొబ్బలు పెడుతుండగా, ప్రళయకాలంలోని యముడివలె వెలిగే భీముడిని ఎదుర్కొన్నాడు.

**వ. అట్టియెడ. 182**

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** భీముడు, శల్యుడు యుద్ధం చేసే ఆ సమయంలో.

**క. 'ఇతనికి నితండ యితనికి । నితఁడ యెదురుఁ గాక యొరుల కీ యిరువురయు**
**ద్ధతి కెదుర వశమె' యనువా । క్తతియును దూర్యస్వనములుఁ గడుఁ బె ల్లెసఁగెన్. 183**

**ప్రతిపదార్థం:** ఇతనికిన్= ఈ భీముడికి; ఇతండు+అ= ఈ శల్యుడే; ఇతనికిన్= ఈ శల్యుడికి; ఇతఁడు+అ= ఈ భీముడే; ఎదురున్= ఉజ్జీ; కాక= అట్లా కాక; ఒరులకున్= ఇతరులకు; ఈ+ఇరువుర= ఈ ఇద్దరి; ఉద్ధతికిన్= గర్వాన్ని; ఎదురన్= ఎదుర్కొనడానికి; వశమె?= వీలౌతుందా?; అను= అనే; వాక్+తతియును= మాటల సమూహమూ; తూర్య= వాద్యాలయొక్క; స్వనములున్= ధ్వనులును; కడున్+పెల్లు= అత్యధికంగా; ఎసఁగెన్= రేగినవి.

**తాత్పర్యం:** 'భీముడికి శల్యుడే, శల్యుడికి భీముడే ఉద్దీ తప్ప ఇతరు లెవ్వరు వీరి తీవ్రతను ఎదుర్కొనలేరు' అనే ప్రశంసలూ, వాద్యధ్వనులూ అంతటా వ్యాపించాయి.

**వ. ఇట్లు దలపడి శల్య సమీరనందనులు మండల ప్రచారంబులను విచిత్ర గదా ప్రసారణంబులను మెఱయుచు. 184**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తలపడి= పోరి; శల్య= శల్యుడు; సమీరనందనులు= వాయుపుత్రుడైన భీముడు; మండల ప్రచారంబులను= రెండు కాళ్ళతో మండలాకారంగా నిలిచి చేసే నడకలతోను; గదా= గదల యొక్క; ప్రసారణంబులను= చాచుటతోను; మెఱయుచున్= వెలుగొందుతూ.

**తాత్పర్యం:** ఈ విధంగా పోరి భీముడు, శల్యుడు కాళ్ళతో మండలాకారంగా కదలటం, గదలను చాచటం వంటి గదాయుద్ధ నైపుణ్యంతో ప్రకాశిస్తూ.

**క. గద లన్యోన్య సమాగతిన్ మిడుఁగుఱుల్ గ్రక్కంగ సారించుచుం**
**గదియం బాయఁగ వ్రేటు దప్ప నుసులంగా నేర్పు లంగంబులం**
**దొదవన్ ఘోర పరస్పర ప్రహతు లత్యుగ్రంబుగా నెత్తురుల్**
**సెదరింపం బదశబ్ద హుంకృతులు దిక్సీమంబులన్ దాఁటఁగన్. 185**

**ప్రతిపదార్థం:** గదలు= గదాయుధాలు; అన్యోన్య= పరస్పరం; సమాగతిన్= తాకటం; మిడుఁగుఱుల్= మిణుగురులు; క్రక్కంగన్= వెదజల్లుతుండగా; సారించుచున్= విసురుతూ; కదియన్= సమీపించగా; పాయఁగన్= ప్రక్కకు తొలగగా; వ్రేటు= దెబ్బ; తప్పన్=

తప్పిపోగా; నుసులంగా= మెదలగా; అంగంబులందున్= అవయవాలలో; నేర్పులు= నైపుణ్యాలు; ఒదవన్= నిండగా; ఘోర= భయంకరమైన; పరస్పర= ఒకరికి ఒకరు; ప్రహతులు= దెబ్బలు; అతి+ఉగ్రంబుగాన్= మిక్కిలి భీషణంగా; నెత్తురుల్= రక్తాలను; చెదరింపన్= చిమ్మగా; పదం= అడుగుల; శబ్ద= చప్పుళ్ళు; హుంకృతులు= హుంకారాలు; దిక్+సీమంబులన్= దిక్కుల కొనలను; దాఁటఁగన్= దాటగా.

**తాత్పర్యం:** గదలు ఒకదాని కొకటి తాకటం వలన మిణుగురులు రాలుతుండినవి. గదలను విసురుతూ దగ్గరికి రాగా, ప్రక్కకు ఒరిగేసరికి వ్రేటు తప్పగా- మెదిలేసరికి అంగాలలో నైపుణ్యం పెరిగింది. భీకరమైన పరస్పర ప్రహారాలు మిక్కిలి తీవ్రంగా రక్తాన్ని చిమ్మినవి. కాలి అడుగుల ధ్వనులు, హుంకారాలు దిక్కుల కొనలను దాటాయి. ఇట్లు కాగా.

**విశేషం:** ఇందు గదా యుద్ధంలోని నైపుణ్యం వర్ణించబడింది. భీమ శల్యుల పోరు యుద్ధవీరాన్ని వ్యక్తీకరిస్తున్నది.

**క. పోరెడు నప్పుడు లావును । వీరోద్రేకంబుఁ జలము వెరవును సరియై**
**మారుతియు మద్రపతియు ను । దారగతుల మెఱసి రమరతతి వినుతింపన్. 186**

**ప్రతిపదార్థం:** మారుతియున్= భీముడు; మద్రపతియును= శల్యుడును; పోరెడు+అప్పుడు= యుద్ధం చేసేటప్పుడు; లావును= బలమూ; వీర+ఉద్రేకంబున్= వీరులలోని విజృంభణమూ; చలము= మాత్సర్యం; వెరవును= ఉపాయం కూడా; సరి+ఐ= సమానమై; అమరతతి= దేవతల సమూహం; వినుతింపన్= పొగడగా; ఉదార గతులన్= గొప్ప రీతులతో; మెఱసిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** భీముడు, శల్యుడు యుద్ధం చేసేటప్పుడు బలం, ఆ వీరులిద్దరి విజృంభణం, మాత్సర్యం, ఉపాయం కూడ సమానమై, దేవతల సమూహం పొగడగా, ఉదార ప్రవర్తనతో ప్రకాశించారు.

**వ. ఇట్లు పెద్దయుంబ్రొద్దు పెనంగి. 187**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పెద్దయున్+ప్రొద్దు= చాలాసేపు; పెనంగి= పోరాడి.

**తాత్పర్యం:** ఈ రీతిగా భీమ శల్యులు చాలా సేపు యుద్ధం చేసి.

**క. అఱిముఱి నొండొరు వ్రేసిన । నెఱఁకులు దాఁకుటయు నొచ్చి నేలఁ కొఱగె బి**
**ట్టఱి యా సుభట ద్వితయము । వెఱచఱచి బలద్వయంబు వెగ డందంగన్. 188**

**ప్రతిపదార్థం:** బలద్వయంబు= కురు పాండవ సేనలు; వెఱచఱచి= భయపడి; వెగడు+అందంగన్= తల్లడిల్లగా; ఆ; సుభట= వీరుల; ద్వితయము= జంట; అఱిముఱిన్= సంభ్రమంతో; ఒండొరున్= ఒకరినొకరు; వ్రేసినన్= కొట్టగా; నెఱఁకులు= మర్మస్థానాలు; తాఁకుటయున్= తాకగా; నొచ్చి= బాధపడి; బిట్టు+అఱి= వేగం తగ్గి; నేలకున్= భూమిపై; ఒఱగెన్= వాలింది.

**తాత్పర్యం:** కురు పాండవసేనలు భయపడి తల్లడిల్లగా భీమ శల్యులు సంభ్రమంతో ఒకరినొకరు గదలతో కొట్టుకోగా, మర్మాలకు తగిలి, బాధతో వేగం తగ్గి క్రింద పడ్డారు.

**వ. అయ్యవసరంబున. 189**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** భీమ శల్యులు నేలపై పడిన సమయంలో.

**క. కృతవర్మ్ముఁడు మద్రమహీ । పతి గ్రక్కున గ్రుచ్చి యెత్తి పాయంగొని యు**
**ద్ధతి వాయఁ జనియె మారుత । సుతుఁ డాలోఁ దెలిసి లేచి శోభిల్లెఁ గడున్. 190**

**ప్రతిపదార్థం:** కృతవర్మ్ముఁడు= కృతవర్మ; మద్రమహీపతిన్= శల్యుడిని; గ్రక్కునన్= వెంటనే; గ్రుచ్చి యెత్తి= చేతులు దూర్చి పైకెత్తుకొని; పాయన్+కొని= దారిచేసికొని; ఉద్ధతి+పాయన్= దర్పం తొలగగా; చనియెన్= వెళ్ళిపోయాడు; మారుతసుతుఁడు= వాయు పుత్రుడైన భీముడు; ఆలోన్= అంతలో; తెలిసి= తేరుకొని; లేచి= నిలిచి; కడున్= మిక్కిలి; శోభిల్లెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** కృతవర్మ వెంటనే శల్యుడిని చేతులు చంకల్లో దూర్చి పైకెత్తుకొని, సైన్యంలో నుండి దారిచేసికొని, దర్పం తొలగగా వెళ్ళిపోయాడు. భీముడు అంతలోనే తేరుకొని లేచి మిక్కిలి ప్రకాశించాడు.

**క. గద సారించుచు జయమునఁ । బొదలు నతనిఁ జూచి నీదు పుత్త్రులు గోపం**
**బొదవ నడరి రుద్భటగతి । మదవత్కరి చటుల రథ సమాజంబులతోన్. 191**

**ప్రతిపదార్థం:** గద సారించుచున్= గదను చాపుతూ; జయమునన్= విజయంతో; పొదలు= ఒప్పు; అతనిన్= భీముడిని; చూచి= చూచి; నీదు= నీయొక్క; పుత్రులు= కొడుకులు; కోపంబు= క్రోధం; ఒదవన్= కలుగగా; మదవత్= మదంగల; కరి= ఏనుగుల; చటుల= చలించే, రథ= రథాల యొక్క; సమాజంబులతోన్= సమూహాలతో; అడరిరి= విజృంభించారు.

**తాత్పర్యం:** గదను చాపుతూ జయంతో వర్ధిల్లే భీముడిని చూచి, దుర్యోధనాదులు కోపం మీరగా; మదించిన ఏనుగులతో, చలించే రథబలంతో విజృంభించారు.

**వ. ఇ ట్లడరి వివిధాస్త్ర శస్త్రంబు లేయుచుం బొదివిన. 192**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; అడరి= విజృంభించి; వివిధ= అనేక విధాలైన; అస్త్ర= ఆగ్నేయాస్త్రాదులు; శస్త్ర= ఖడ్గాదులు; ఏయుచున్= వేస్తూ; పొదివినన్= ఆక్రమించగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా విజృంభించి కౌరవులు భీముడిపై అస్త్రశస్త్రాలు ప్రయోగించి ఆక్రమించగా.

**మ. కవలుం దానును నేచి యుద్ధురగతిం గౌంతేయముఖ్యుండు వీ**
**రవరానీకము వీఁకఁ గూడికొని సంరంభంబు శోభిల్లఁ గౌ**
**రవసంఘంబుఁ గలంచినన్ విఱిగె దర్పం బేది నీ సేన య**
**బ్దవితానంబు మహాసమీరణ నిరస్తంబైన చందంబునన్. 193**

**ప్రతిపదార్థం:** కవలున్= నకుల సహదేవులును; తానును= భీముడును; ఏచి= విజృంభించి; ఉద్ధురగతిన్= తీవ్రంగా; కౌంతేయముఖ్యుండు= భీముడునూ; వీరవర= శ్రేష్ఠులైన వీరుల; అనీకము= సమూహమూ; వీఁకన్= ఉత్సాహంతో; కూడికొని= కలిసికొని; సంరంభంబు= ఆటోపం; శోభిల్లన్= ప్రకాశించగా; కౌరవసంఘంబున్= కౌరవుల సమూహాన్ని; కలంచినన్= కలతపెట్టగా; నీ= నీ (ధృతరాష్ట్రుడి) యొక్క; సేన= సైన్యం; అబ్ద= మేఘాల; వితానంబు= సమూహం; మహా= గొప్ప; సమీరణ= వాయువుచేత; నిరస్తంబైన= తొలగించబడిన; చందంబునన్= విధంగా, దర్పంబు= గర్వం; ఏది= నశించి; విఱిగెన్= పాఱెను.

**తాత్పర్యం:** నకుల సహదేవులు, తాను విజృంభించి, ఉత్సాహంతో వీరవరులను కూడుకొని, ఆటోపం ప్రకాశించగా భీముడు కౌరవ సైన్యాన్ని కలత పెట్టాడు. అపుడు నీ సైన్యం, మేఘ సమూహం తీవ్రమైన వాయువుచేత పటాపంచలైనట్లు దర్పహీనమై చెల్లాచెదరైంది.

**విశేషం:** అలంకారం ఉపమ.

**వ.** **అంత నపరాహ్ణంబయ్యె; నప్పుడు శంఖ భేరీ మృదంగాది తూర్యస్వనంబులు సెలంగ సింహనాదంబులం బేర్చినపాండవసేనం జూచి వృషసేనుండు రోషావేశభీషణుండై మార్కొని మార్గణనికరంబులు నిగిడించిన.** 194

**ప్రతిపదార్థం:** అంతన్= అంతలో; అపరాహ్ణంబు+అయ్యెన్= మధ్యాహ్నం దాటింది; అప్పుడు= ఆ సమయంలో; శంఖ= శంఖాలు; భేరీ= దుందుభులు; మృదంగ+ఆది= మద్దెల మొదలైన; తూర్య= వాద్యాల; స్వనంబులు= ధ్వనులు; చెలంగన్= చెలరేగగా; సింహనాదంబులన్= సింహగర్జనలతో; పేర్చిన= అతిశయించిన; పాండవసేనన్= పాండవుల సైన్యాన్ని; చూచి; వృషసేనుండు= వృషసేనుడు; రోష= కోపం; ఆవేశ= కలుగుటవలన; భీషణుండు+ఐ= భయం గొలిపేవాడై; మార్కొని= ఎదుర్కొని; మార్గణ= బాణాల; నికరంబులు= సమూహాలు; నిగిడించినన్= వేయగా.

**తాత్పర్యం:** ఇంతలో మధ్యాహ్నమయింది. శంఖాలు, భేరులు, మద్దెలలు మొదలైన వాద్యాలు మ్రోగగా, సింహనాదాలు చెలగిన పాండవ సైన్యాన్ని చూచి వృషసేనుడు కోపం ఆవేశించగా భయంకరుడై ఎదుర్కొని బాణజాలాన్ని ప్రయోగించగా.

**మ.** **కరిగాత్రంబుల ఘోటకాంగకములం గప్పెన్ సమిద్భూమి య**
**చ్చెరువై యుండఁగ రథ్యసూత రథిక శ్రేణీవపుఃఖండముల్**
**దొరఁగెం, దుత్తుమురయ్యెఁ గాల్బలము, లస్తోక ప్రవాహంబులై**
**పరఁగెన్ రక్తనదుల్, పిశాచకుల మంభః కేలిలోలంబుగన్.** 195

**ప్రతిపదార్థం:** సమిత్+భూమి= యుద్ధ రంగము; అచ్చెరువు+ఐ+ఉండఁగన్= ఆశ్చర్యం కలదై; కరిగాత్రంబులన్= ఏనుగుల అవయవాలతోను; ఘోటక+అంగములన్= గుర్రాల అంగాలతోను; కప్పెన్= నిండింది; రథ్య= గుర్రాల; సూత= సారథుల; రథిక= రథంపై ఉండేవారి యొక్క; శ్రేణీ= సమూహాల; వపుః+ఖండముల్= దేహభాగాలు; తొలఁగెన్= విరిగిపోయాయి; కాల్బలములు= పదాతి సైన్యాలు; తుత్తుమురు+అయ్యెన్= చిన్నచిన్నముక్కలైంది; రక్తనదుల్= నెత్తురు వాగులు; అస్తోక= గొప్పగా; ప్రవాహంబులు+ఐ= పారినవై; పిశాచకులము= దయ్యాల గుంపు; అంభఃకేలి= జలక్రీడలందు; లోలంబుగన్= ఆసక్తి కలవిగా; పరఁగెన్= ఒప్పినవి.

**తాత్పర్యం:** యుద్ధభూమి ఏనుగుల, గుర్రాల అవయవాలతో నిండి ఆశ్చర్యం గొలుపుతూ ఉన్నది. గుర్రాల, సారథుల, రథికుల - ఖండించబడిన దేహభాగాలు రాలిపడ్డాయి. పదాతి దళం చిన్నచిన్నముక్కలైంది. పిశాచ గణానికి జలక్రీడలందు ఆసక్తి కలిగేటట్లు గొప్ప రక్తపుటేరులు ప్రవహించాయి.

**విశేషం:** ఇట యుద్ధవీరం వలన బీభత్సరసం ఉదయించింది.-

**తే.** **కర్ణనందనుఁ డి ట్లత్యుదీర్ణభంగిఁ । బాండురాజ తనూజుల బలము నెల్లఁ**
**గనుపు గొట్టంగఁ జొచ్చినఁ గినిసి నకులు । నాత్మజుండు శతానీకుఁ డతనిఁ దాఁకి.** 196

**ప్రతిపదార్థం:** కర్ణనందనుఁడు= కర్ణుడి పుత్రుడైన వృషసేనుడు; ఇట్లు= ఈ విధంగా అతి+ఉదీర్ణభంగిన్= మిక్కిలి గొప్ప పద్ధతిలో; పాండురాజ తనూజుల= పాండవుల; బలమును= సైన్యమును; ఎల్లన్= అంతయు; కనుపు+కొట్టంగన్= ఖండించటానికి; చొచ్చినన్= పూనుకోగా; నకులుని= నకులుడి యొక్క; ఆత్మజుండు= కుమారుడైన; శతానీకుడు; కినిసి= కోపించి; అతనిన్= ఆ వృషసేనుడిని; తాఁకి= ఎదుర్కొని.

**తాత్పర్యం:** కర్ణుడి పుత్రుడైన వృషసేనుడు మిక్కిలి తీవ్రంగా పాండవుల సైన్యాన్నంతా ఖండించటానికి పూనుకొనగా, నకులుడి పుత్రుడైన శతానీకుడు కోపించి అతడిని ఎదుర్కొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వాలమ్ములు పది మేనం । గీలించిన నాతఁ డతని కేతనము ధరం**
**గూలిచి చాపముఁ ద్రుంచిన । నాలోనన ద్రౌపదేయులందఱుఁ బెలుచన్. 197**

**ప్రతిపదార్థం:** వాలు+అమ్ములు= వాడిగల బాణాలు; పది; మేనన్= దేహంపై; కీలించినన్= నాటగా; ఆతఁడు= వృషసేనుడు; అతని= శతానీకుడి; కేతనమున్= పతాకాన్ని; ధరన్= భూమిపై; కూలిచి= పడవేసి; చాపమున్= ధనుస్సును; త్రుంచినన్= ఛేదించగా; ఆలోనన్+అ= అంతలోనే; ద్రౌపదేయులు= ద్రౌపది పుత్రులు; అందరున్= అంతా; పెలుచన్= కోపంతో.

**తాత్పర్యం:** శతానీకుడు వాడిగల పది బాణాలు వృషసేనుడి శరీరంపై నాటగా; వృషసేనుడు అతడి పతాకాన్ని విరిచి, ధనుస్సును త్రుంచాడు. అంతలోనే ద్రౌపదిపుత్రులైన ప్రతివింధ్యాదులందరు సింహనాదాలతో.

**వ. తోడంబుట్టువునకుం దలకడచి వివిధ విశిఖంబుల వృషసేనుం గప్పిన నశ్వత్థామ ప్రముఖంబై కదిసి, కౌరవానీకంబు శతానీకునిం దత్సోదరుల ననేక క్రూరాస్త్ర నిచయావృతులం జేసినం గని కౌంతేయాగ్రజుండు గడంగి, కేకయ మాత్స్య పాంచాల ప్రభృతి బలంబులతో నురవడించిన, సురాసుర సంగ్రామ సదృశ సమరం బయ్యె; నందు భీమ కర్ణ కృప ద్రోణ ద్రౌణి ధృష్టద్యుమ్న విరాటులు ప్రతాప దీపితులై మార్తాండుండు సప్తమూర్తులు దాల్చి ధరణి విహరించినట్లు వెలింగిరి; కొండొక సేపునకుఁ బాండవ సేనా సాగర సంరంభంబు సహింపం జాలక మన మొన దెరలి మరలినం జూచి యాచార్యుండు గోపాటోపంబును బటువిక్రమంబును నావేశింప నీ సైనికుల నిలు నిలు మని యదల్చి, తూణీరంబు బిగియించి, గుణంబు సారించి, సారథితో నిట్లనియె. 198**

**ప్రతిపదార్థం:** తోడంబుట్టువునకున్= తోబుట్టువైన శతానీకుడిని; తలకడచి= దాటి; వృషసేనున్= వృషసేనుడిని; వివిధ విశిఖంబులన్= అనేక బాణాలతో; కప్పినన్= ముంచగా; కౌరవ+అనీకంబు= కౌరవులసేన; అశ్వత్థామ ప్రముఖంబు+ఐ= అశ్వత్థామ ముఖ్యంగా కలదై; కదిసి= సమీపించి; శతానీకునిన్= శతానీకుడిని; తద్+సోదరులన్= అతని తోబుట్టువులను; అనేక= బహువిధాలైన; క్రూర+అస్త్ర= భయంకరమైన ఆయుధాల; నిచయ= సమూహంచేత; ఆవృతులన్= కప్పబడినవారలను; చేసినన్= చేయగా; కని= చూచి; కౌంతేయ+అగ్రజుండు= కుంతి పెద్ద కొడుకైన ధర్మరాజు; కడంగి= పూనుకొని; కేకయ= కేకయ దేశపు; మాత్స్య= మత్స్యదేశపు; పాంచాల= పాంచాలదేశపు; బలంబులతోన్= సైన్యాలతో; ఉరవడించినన్= విజృంభించగా; సుర= దేవతల; అసుర= రాక్షసుల; సంగ్రామ= యుద్ధంతో, సదృశ= సమానమైన; సమరంబు= యుద్ధం; అయ్యెన్= జరిగింది; అందున్= ఆ యుద్ధంలో; భీమ; కర్ణ; కృప; ద్రోణ; ద్రౌణి= అశ్వత్థామ; ధృష్టద్యుమ్న; విరాటులు; ప్రతాప= పరాక్రమంతో; దీపితులై= వెలుగొందినవారై; మార్తాండుండు= సూర్యుడు; సప్తమూర్తులు= ఏడు రూపాలు; తాల్చి= ధరించి; ధరణిన్= భూమియందు; విహరించినట్లు= తిరిగినట్లు; వెలింగిరి= ప్రకాశించారు; కొండొకసేపునకున్= కొంత సేపటికి; పాండవ= పాండవుల; సేనా= సైన్యం యొక్క; సంరంభంబు= ఆటోపాన్ని; సహింపన్+చాలక= ఓర్వలేక; మనమొన= మనయొక్క సైన్యం; తెరలి= కలతపడి; మరలినన్= వెనుకకు

తిరుగగా; చూచి; ఆచార్యుండు= ద్రోణుడు; కోప+ఆటోపంబునున్= కోపం యొక్క తీవ్రతయు; పటువిక్రమంబునున్= పరాక్రమమును; ఆవేశింపన్= విజృంభించగా; నీ సైనికులన్= నీయొక్క భటులను; నిలు నిలుము+అని= ఆగండాగండి అని; అదల్చి= బెదిరించి; తూణీరంబు= అమ్ములపొది; బిగియించి= బిగియగట్టి; గుణంబు= అల్లెత్రాడు; సారించి= లాగి; సారథితోన్= రథసారథితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ద్రౌపదిపుత్రులైన ప్రతివింధ్యాదులు సోదరుడైన శతానీకుడిని దాటి, వృషసేనుడిని అనేక బాణాలతో ముంచగా, కౌరవసేన అశ్వత్థామను ముందుంచుకొని సమీపించి శతానీకుడిని, అతడి తోబుట్టువులను బహువిధాలైన క్రూరాస్త్రజాలంతో కప్పగా చూచి, ధర్మరాజు ప్రయత్నపూర్వకంగా కేకయ, మత్స్య, పాంచాలాది సైన్యాలతో విజృంభించగా, దేవ, రాక్షస యుద్ధంతో సమానమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో భీమ, కర్ణ, కృప, ద్రోణ, అశ్వత్థామ, ధృష్టద్యుమ్న, విరాటులు పరాక్రమంతో వెలిగి, సూర్యుడు ఏడు రూపాలు తాల్చి భూమిపై విహరించినట్లు ప్రకాశించారు. కొంతసేపటికి పాండవ సేన యొక్క ఆటోపాన్ని సహింపజాలక మన కౌరవసైన్యం కలతపడి వెనుదిరుగగా, ఆచార్యుడు అది చూచి కోప తీవ్రత, పరాక్రమం విజృంభించగా, నీ భటులను నిలు, నిలు మని అదల్చి, అమ్ములపొది బిగియగట్టి, అల్లెత్రాడు సవరించి, సారథితో ఈ విధంగా అన్నాడు.

**సీ. 'చలమేది కౌరవ సైన్యముల్ పాఱెడు । ధర్మనందనుని యుద్దండ వృత్తిఁ**
**గంటె? యీతనిఁ దాఁకి గర్వంబు మాన్పక । నిలిచిన నిమ్మూఁక నిలుచు నెట్లు?**
**ధర్మజ భీమ సాత్యకి మాత్స్యపాంచాల । తత్తనూజులు నాకుఁ దరమె? క్రీడి**
**చాపంబు వెరవు నా చూపినయది గాదె? । విను మట్లు గాకయుఁ దనువు దాఁచు**

**తే. సమయమే యిది? సంభృతోత్సాహలీల । జయముఁ గీర్తియుఁ గోరి యస్ఖలితభంగిఁ**
**దేరు నడుపుము; చేతుల తీఁట వోవ । నడరి రథిక జనంబు వేఁటాడవలయు.' 199**

**ప్రతిపదార్థం:** చలము= మాత్సర్యం; ఏది= నశించి; కౌరవసైన్యముల్= కౌరవుల సేనలు; పాఱెడున్= పారిపోతున్నవి; ధర్మనందనుని= ధర్మరాజు యొక్క; ఉద్దండ వృత్తిన్= భయంకరమైన ప్రవర్తనను; కంటె?= చూచినావా?; ఈతనిన్= ఈ ధర్మరాజును; తాఁకి= ఎదుర్కొని; గర్వంబు= అహంకారాన్ని; మాన్పక= తగ్గించక; నిలిచినన్= ఊరకుంటే; ఈ+మూఁక= ఈ సైన్యం; నిలుచును +ఎట్లు?= ఎట్లా నిలుస్తుంది?; ధర్మజ= ధర్మరాజు; భీమ= భీముడు; సాత్యకి; మాత్స్య= విరాటుడు; పాంచాల= ద్రుపదుడు; తద్+తనూజులు= వారల కుమారులు; నాకున్= నాకు; తరమె= నాకు సాధ్యమే; క్రీడి= అర్జునుడి; చాపంబు= ధనుస్సు యొక్క; వెరవు= నైపుణ్యం; నా చూపిన+అది= నేను చూపింది; కాదె!= కాదా!; వినుము= విను; అట్లు+కాకయున్= అదేగాక; తనువు= దేహం; దాచు= కాపాడుకొనే; సమయమే+ఇది?= సమయమా ఇది?; సంభృత= నిండిన; ఉత్సాహ= ఉత్సాహం యొక్క; లీలన్= విలాసంతో; జయమున్= విజయాన్ని; కీర్తియున్= యశస్సును; కోరి= కాంక్షించి; అస్ఖలిత భంగిన్= చలించని విధంగా; తేరు= రథాన్ని; నడుపుము= తోలుము; చేతుల తీఁట= చేతుల యొక్క దురద; పోవన్= పోయేటట్లుగా; అడరి= పూని; రథిక జనంబున్= రథంపై ఉండే వీరులను; వేఁటాడవలయున్= వధించాలి.

**తాత్పర్యం:** 'కౌరవ సైన్యాలు మాత్సర్యం తొలగి పారిపోతున్నాయి. ధర్మరాజు యొక్క విజృంభణాన్ని చూచావా? ఈ ధర్మజుడిని ఎదుర్కొని గర్వాన్ని అణచకుంటే ఈ సైన్యం నిలిచేదెట్లా? ధర్మరాజు, భీముడు, సాత్యకి, విరాటుడు, ద్రుపదుడు, వారల పుత్రులను ఓడించటం నాకు అసాధ్యమైన దేమీ కాదు. అర్జునుడికి ధనుర్విద్యా నైపుణ్యం నేను నేర్పించిందే కదా! వినుము. అదేగాక, ఈ దేహాన్ని కాపాడుకొనే సమయమా ఇది? ఉత్సాహ విలాసంతో విజయాన్ని, కీర్తిని కోరి, స్థిరుడవై రథాన్ని నడుపుము. చేతుల తీట పోయేటట్లు రథికవరులను వేటాడాలి.

## ద్రోణాచార్యులు ధర్మరాజుతో యుద్ధంబు సేయుట (సం.7-15-19)

**చ. అన విని మేను వెంచి రయమారఁగ సూతుఁడు దేరు వోవని**
**చ్చినఁగని వారి సైన్యములు చెచ్చెర ధర్మజు మించి త్రోవఁ, బే**
**ర్చిన భుజసంపదం గడఁగి, సింధుర లీలఁ దెరల్చి, తాఁకె న**
**మ్మనుజ విభున్ గురుండు, పటుమార్గణ సంపిహితాంబరంబుగన్. 200**

**ప్రతిపదార్థం:** అనన్+విని= ద్రోణుడు అనగా విని; మేను= శరీరం; పెంచి= ఉబ్బించి; సూతుఁడు= సారథి; రయము+ఆరఁగన్= వేగంగా; తేరు= రథాన్ని; పోవనిచ్చినన్= నడిపించగా; కని= చూచి; వారి సైన్యములు= పాండవుల సైన్యాలు; చెచ్చెరన్= త్వరత్వరగా; ధర్మజు= ధర్మరాజును; మించి= అధిగమించి; త్రోవన్= త్రోయగా; గురుండు= ద్రోణుడు; పేర్చిన= అధికమైన; భుజ సంపదన్= బాహుబలంతో; కడఁగి= పూనుకొని; సింధుర లీలన్= ఏనుగువలె; తెరల్చి= విజృంభించి; పటుమార్గణ= బలమైన బాణాలచేత; సంపిహిత= కప్పబడిన; అంబరంబుగన్= ఆకాశం కలదిగా; ఆ+మనుజ విభున్= ఆ ధర్మరాజును; తాఁకెన్= ఢీకొన్నాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు అట్లనగా విని, సారథి శరీరం ఉప్పొంగగా రథాన్ని ముందుకు నడిపాడు. అది చూచి పాండవ సేనలు త్వర త్వరగా ధర్మరాజును దాటి త్రోసికొని ముందుకు సాగాయి. అపుడు ద్రోణాచార్యుడు అతిశయించిన బాహుబలంతో ప్రయత్నపూర్వకంగా ఏనుగు వలె విజృంభించి, ఆకాశమంతటా బాణాలను పరిచి, ధర్మరాజును ఢీకొన్నాడు.

**క. తాఁకినఁ బొగడం దగియెడు । వీఁకం బతి ద్రోణు బాణవృతుఁ జేయ నతం**
**డాఁక గొనక యతని ధనువు । వ్రేఁకని భల్లమునఁ ద్రుంచి వెస డగ్గఱియెన్. 201**

**ప్రతిపదార్థం:** తాఁకినన్= ఎదుర్కొనగా; పొగడన్+తగియెడు= ప్రశంసించదగిన; వీఁకన్= పరాక్రమంతో; పతి= ధర్మరాజు; ద్రోణున్= ద్రోణుడిని; బాణవృతున్= బాణాలచేత కప్పబడినవాడినిగా; చేయన్= చేయగా; అతండు= ఆ ద్రోణుడు; ఆఁక+కొనక= ఆగక; అతని ధనువున్= ఆ ధర్మజుడి ధనుస్సును; వ్రేఁకని= బరువైన; భల్లమునన్= బల్లెంతో; త్రుంచి= విరిచి; వెసన్= వేగంగా; డగ్గఱియెన్= సమీపించాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు ఆగక, బరువైన బల్లెంతో ధర్మజుడి ధనుస్సును విరిచి, వేగంగా అతడిని సమీపించాడు.

**వ. ఇ ట్లుద్ధతుండై యగ్గురుండు పొంగిన జలధియుం బోలెం గవిసిన ధర్మనందను చక్ర రక్షకుండగు సుకుమారుండు చెలియలికట్ట తెఱంగున నిలువరించి, నిశితశరం బతని యురంబున నాటించిన, నప్పాంచాలవరుం బ్రశంసించు నెలుంగులు సెలంగఁ బాండవ బలంబులు పేర్చి యార్చిన. 202**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఆ+గురుండు= ఆ ద్రోణాచార్యుడు; ఉద్ధతుండు+ఐ= గర్వించినవాడై; పొంగిన= ఉప్పొంగిన; జలధియున్+పోలెన్= సముద్రంవలె; కవిసినన్= విజృంభించగా; ధర్మనందను= ధర్మరాజుయొక్క; చక్రరక్షకుండు+అగు= రథచక్రాలను కాపాడే; సుకుమారుండు= సుకుమారుడనేవాడు; చెలియలికట్ట= సముద్రపు గట్టు; తెఱంగునన్= విధంగా, నిలువరించి= అడ్డుకొని; నిశిత శరంబు= తీక్ష్ణమైన బాణాన్ని; అతని= ద్రోణుడి; ఉరంబునన్= రొమ్ములో; నాటించినన్= గ్రుచ్చగా; ఆ+పాంచాలవరున్= పాంచాల దేశపు శ్రేష్ఠుడైన సుకుమారుడిని; ప్రశంసించు+ఎలుంగులు= పొగడే నినాదాలు; చెలంగన్= వ్యాపించగా; పాండవ బలంబులు= పాండవుల సైన్యాలు; పేర్చి= మిక్కిలి; ఆర్చినన్= బొబ్బలు పెట్టగా.

**తాత్పర్యం:** ఇట్లా ద్రోణాచార్యుడు గర్వించి సముద్రంవలె విజృంభించగా, ధర్మజుడి చక్రరక్షకుడైన సుకుమారుడు, చెలియలికట్ట సముద్రపు నీటిని ఆపినట్లు అడ్డుకొని, ద్రోణుడి రొమ్మున తీక్ష్ణమైన బాణాన్ని నాటాడు. అపుడు ఆ పాంచాల వీరుడైన సుకుమారుడిని ప్రశంసించే ధ్వనులు చెలరేగాయి. పాండవ సైన్యాలు జయజయధ్వానాలు చేయగా.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **పెనుగాలిఁ బెఱుగు కార్చి । చ్చును బోలెం బొదలి గురుఁడు సుకుమారునిఁ గాం**
**చన పుంఖ శరజ్వాలా । వినిపాతితుఁ జేసి తఱిమి విభునిం గదిసెన్.** **203**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; పెనుగాలిన్= గొప్పవాయువుచేత; పెఱుగు= పెంపొందే; కార్చిచ్చు= దావానలం; పోలెన్= వలె; పొదలి= ఒప్పి; సుకుమారునిన్= సుకుమారుడిని; కాంచన= బంగారపు; పుంఖ= క్రింది చివరగల; శర= బాణపు; జ్వాలా= మంటలచేత; వినిపాతితున్+చేసి= పడగొట్టి; తఱిమి= వేగంగా వచ్చి; విభునిన్= ధర్మజుడిని; కదిసెన్= ఆక్రమించాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు పెనుగాలికి రేగే దావానలంవలె చెలరేగి, సుకుమారుణ్ణి బంగారపు పుంఖంగల బాణజ్వాలలతో కూలనేసి, పరుగున వచ్చి ధర్మజుడిని తాకినాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **అప్పుడు పాండవ యోధు లొండొరుల మీఱి యుధిష్ఠిరు ముందరికి వచ్చి యాచార్యుం బొదివిన నతండు నలిరేఁగి.** **204**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; పాండవ యోధులు= పాండవ వీరులు; ఒండొరులమీఱి= ఒకరిని మించి ఒకరు; యుధిష్ఠిరు= ధర్మజుడి; ముందరికిన్= ముందుకు; వచ్చి= ఏతెంచి; ఆచార్యున్= ద్రోణాచార్యుడిని; పొదివినన్= చుట్టుముట్టగా; అతండు= ద్రోణుడు; నలిరేఁగి= మిక్కిలి విజృంభించి.

**తాత్పర్యం:** ఆ సమయంలో పాండవవీరులు ఒకరిని మించి ఒకరు ధర్మరాజు ముందుకు వచ్చి, ద్రోణాచార్యుడిని చుట్టుముట్టగా, అతడు మిక్కిలి రెచ్చిపోయి.

**సీ.** **నకులుని నైదుసాయకముల స్రుక్కించి, । సహదేవు నేడింట సాధుఁ జేసి,**
**నవవిశిఖముల మాత్స్యవరేణ్యు నడఁగించి, । యేనింట సాత్యకియేపు మాపి**
**ద్రౌపదేయుల శరత్రయములఁ గలఁచి, విం । శతి నుత్తమౌజుని చలము మాన్చి,**
**పండ్రెండు పండ్రెండు పటు మార్గణంబులఁ । బాండవాగ్రజుని శిఖండి నొంచి**

**తే.** **మఱియు మార్కొన్న రథికుల మదము సెఱిచి । మెఱుఁగుఁ దూపు లాధర్మజుమీఁద నిగుడ**
**నడర నఱిమి యుగంధరుఁ డడ్డపడిన । నవ్వి యవ్విభుఁ దెగటార్చె నారసమున.** **205**

**ప్రతిపదార్థం:** నకులునిన్= నకులుడిని; ఐదు సాయకములన్= ఐదు బాణాలచే; స్రుక్కించి= బాధించి, సహదేవునిన్= సహదేవుడిని; ఏడింటన్= ఏడు బాణాలతో; సాధున్+చేసి= చక్కఁజేసి; మాత్స్యవరేణ్యుని= విరాటరాజును; నవ= తొమ్మిది; విశిఖములన్= బాణాలచేత; అడఁగించి= అణచివేసి; ఏనింట= ఐదింట; సాత్యకి= సాత్యకియొక్క; ఏపుమాపి= ఆధిక్యాన్నితొలగించి;

ద్రౌపదేయులన్= ద్రౌపది పుత్రులైన ప్రతివింధ్యాదులను; శరత్రయములన్= మూడేసి బాణాలతో; కలఁచి= కలతపడేటట్లు చేసి; ఉత్తమౌజునిన్= ఉత్తమౌజుడిని,; వింశతిన్= ఇరవై బాణాలతో; చలము= మాత్సర్యం; మాన్చి= తొలగించి; పాండవ+అగ్రజున్= ధర్మజుడిని; పంద్రెండు= పన్నెండు; పటుమార్గణంబులన్= బలమైన బాణాలచేత; శిఖండిన్= శిఖండిని; పంద్రెండు పంద్రెండు= పన్నెండు పన్నెండు బాణాలచేత; నొంచి= బాధించి; మఱియున్= ఇంకా; మార్కొన్న= ఎదుర్కొన్న; రథికుల= రథంపై నుండి పోరేవారియొక్క; మదము= గర్వం; చెఱిచి= పోగొట్టి; మెఱుఁగు+తూపులఁన్= ప్రకాశించే బాణాలతో; ఆ ధర్మజు= ఆ ధర్మరాజు యొక్క; మేనన్= శరీరంలో; నిగుడన్= గ్రుచ్చగా; యుగంధరుఁడు= యుగంధరుడనే వీరుడు; నఱిమి= చూరుచేసి; అడరన్= ఎదుర్కొనగా; అడ్డపడిన= అడ్డగించిన; ఆ+విభున్= ఆ యుగంధరుడిని; నవ్వి; నారసమునన్= ఒక్క బాణంతో; తెగటార్చెన్=చంపాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు నకులుడిని ఐదు బాణాలతో బాధించి, సహదేవుడిని ఏడు బాణాలతో చక్కపరచాడు. విరాటరాజును తొమ్మిది బాణాలతో అణచి, సాత్యకిని ఏడు బాణాలతో బాధించాడు. ద్రౌపదిపుత్రులైన ప్రతివింధ్యాదులను మూడేసి బాణాలతో కలచివేసి, ఇరవై అమ్ములతో ఉత్తమౌజుడి మాత్సర్యాన్ని కుంచించాడు. పంద్రెండు బాణాల చొప్పున ప్రయోగించి ధర్మజుడి, శిఖండి పొగరణగించాడు. ఎదుర్కొన్న రథికులందరి మదాన్ని అణచి, వెలిగిపోయే బాణాలను ధర్మజుడిపై ప్రసరించగా, యుగంధరుడు వాటిని ముక్కలుముక్కలు చేశాడు. అడ్డుపడ్డ యుగంధరుడి చర్యకు ద్రోణుడు నవ్వి ఒక్క బాణంతో అతడిని హతమార్చాడు.

**వ. అట్టియెడఁ గేకయపతులును, బాంచాల నాథుండును, దదీయ జ్ఞాతులగు సింహసేన వ్యాఘ్రదత్తులు లోనైన యోధు లనేకు లాచార్యుం బొదివి, శౌర్యబాహువీర్యంబులు నెఱపి; రందు సింహసేనుండును; వ్యాఘ్రదత్తుండును నెట్టన నానాస్త్రంబుల నొప్పించిన నా ధనుర్ధర గురుండు. 206**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో; కేకయ పతులును= కేకయ దేశపు రాజులును; పాంచాలనాథుండును= ద్రుపదుడూ; తదీయ జ్ఞాతులును+అగు= ద్రుపదుడి పాలివారగు; సింహసేన వ్యాఘ్రదత్తులు= సింహసేనుడూ, వ్యాఘ్రదత్తుడూ; లోనైన= మొదలైన; యోధులు= వీరులు; అనేకులు= చాలా మంది; ఆచార్యున్= ద్రోణుడిని; పొదివి= చుట్టుముట్టి; శౌర్య= శూరత్వం; బాహువీర్యంబులు= భుజబలం; నెఱపిరి= చూపారు. అందున్= వారిలో; సింహసేనుండును= సింహసేనుడును; వ్యాఘ్రదత్తుఁడును= వ్యాఘ్రదత్తుడూ; నెట్టన= అడ్డులేక; నానా+అస్త్రంబులన్= అనేకాలైన బాణాలతో; నొప్పించినన్= బాధించగా; ఆ ధనుర్ధర గురుండు= ధనుస్సును పట్టినవారికి ఆచార్యుడు అయిన ద్రోణుడు.

**తాత్పర్యం:** అప్పుడు కేకయ దేశరాజులు, ద్రుపదుడు, అతని పాలివారైన సింహసేనుడు, వ్యాఘ్రదత్తుడు మొదలైన వీరులు అనేకులు ద్రోణుడిని చుట్టుముట్టి, శూరత్వాన్ని, భుజబలాన్ని ప్రదర్శించారు. వారిలో సింహసేనుడు, వ్యాఘ్రదత్తుడు అడ్డులేక అనేక బాణాలచేత నొప్పించగా ద్రోణాచార్యుడు-

**తే. కన్నుఁగవఁ గెంపు గదురంగఁ గౌరవులకుఁ । జిత్త మలరంగ నా వ్యాఘ్రదత్త సింహ**
**సేన మస్తకములు రెండు శితశరములఁ । గుండలంబులతో నేలఁ గూల నేసి. 207**

**ప్రతిపదార్థం:** కన్ను+కవన్= రెండు కన్నులలో; కెంపు= ఎరుపు; కదురంగన్= అతిశయించగా; కౌరవులకున్= దుర్యోధనాదులకు; చిత్తము+అలరంగన్= మనస్సు సంతసించగా; ఆ వ్యాఘ్రదత్త= వ్యాఘ్రదత్తుడి; సింహసేన= ఆ సింహసేనుడి; మస్తకములు= తలలు; రెండు; శితశరములన్= తీక్ష్ణమైన బాణాలతో; కుండలంబులతోన్= చెవిపోగులతో సహా; నేలన్= భూమిపై; కూలన్+ఏసి= పడగొట్టి.

**తాత్పర్యం:** తనకు కోపం అతిశయించగా, కౌరవులకు సంతోషం కలుగగా, వ్యాఘ్రదత్త, సింహసేనుల శిరస్సులను కుండలాలతో సహా తీక్ష్ణమైన బాణాలతో (ద్రోణుడు) క్రిందపడవేసి.

**క. తక్కటి రథికుల నెల్లను । జిక్కువడం జేసి పురుషసింహుండు మదం**
**బెక్కి యుధిష్ఠిరుఁ బొదివెడు । నెక్కుడు తమకమునఁ గదిసె నేడ్తెఱ మెఱయన్. 208**

**ప్రతిపదార్థం:** పురుషసింహుండు= పురుషులలో శ్రేష్ఠుడైన ద్రోణుడు; తక్కటి= తక్కిన; రథికులన్= రథంపైనుండి యుద్ధం చేసే వీరులను; చిక్కు+పడన్+చేసి= బాధించి; మదంబు+ఎక్కి= గర్వించి; యుధిష్ఠిరున్= ధర్మజుడిని; పొదివెడున్=ఆక్రమించటానికి; ఏడ్తెఱ= పరాక్రమం; మెఱయన్= ప్రకాశించగా; ఎక్కుడు= మిక్కిలి; తమకమునన్= వేగంతో; కదిసెన్= సమీపించినాడు.

**తాత్పర్యం:** వీరశ్రేష్ఠుడైన ద్రోణుడు రథికులందరిని బాధించి, గర్వించి, పరాక్రమం ప్రకాశించగా ధర్మజుడిని ఆక్రమించటానికి అతివేగంతో సమీపించాడు.

**వ. అయ్యవసరంబున నా సైన్యంబుల జనంబులు. 209**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= అప్పుడు; ఆ సైన్యంబుల= పాండవ సేనలలోని; జనంబులు= సైనికులు.

**తాత్పర్యం:** అపుడు పాండవ సేనలోని సైనికులు.

**క. 'అదె పట్టువడియె ధర్మజుఁ । దదయుం డగు ద్రోణుచేత నక్కట! నేఁ డు**
**న్మదుఁడై సుయోధనుఁడు దం । డ్రి దలిర్పఁగ నేఁగుఁ గరిపురికిఁ గొని యెలమిన్.' 210**

**ప్రతిపదార్థం:** అదె= అదే; ధర్మజుఁడు= ధర్మరాజు; అదయుండు+అగు= దయలేని; ద్రోణుచేతన్= ద్రోణుడిచేత; నేఁడు= ఈవేళ; పట్టువడియెన్= పట్టుపడ్డాడు; అక్కట!= అయ్యో!; సుయోధనుఁడు= దుర్యోధనుడు; ఉన్మదుఁడు+ఐ= మిక్కిలి గర్వించినవాడై; తండ్రి= తండ్రి అయిన ధృతరాష్ట్రుడు; తలిర్పఁగన్= సంతోషించగా; ఎలమిన్= వికాసంతో; కరిపురికిన్= హస్తినాపురానికి; కొని= తీసికొని; ఏఁగున్= పోతాడు.

**తాత్పర్యం:** 'అదుగో! నేడు ధర్మరాజు క్రూరుడైన ద్రోణుడికి పట్టువడ్డాడు. అయ్యో! దుర్యోధనుడు తండ్రి అయిన ధృతరాష్ట్రుడు సంతోషించగా సగర్వంగా అతడిని హస్తినాపురానికి తీసికొని పోతాడు.'

**వ. అనుచు సంభ్రమాకులచిత్తు లగుచు నున్నంత. 211**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; సంభ్రమ= భయంతో; ఆకుల= చెదరిన; చిత్తులు= మనస్సుకలవారు; అగుచున్= అవుతూ; ఉన్నంతన్= ఉన్నంతలో.

**తాత్పర్యం:** అంటూ పాండవ సేనలలోని సైనికులు భయంతో చెదరిపోయిన మనస్సు కలవారై ఉన్నంతలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. ధరణీభాగము గ్రక్కునం గదల రథ్యవ్రాత చంచద్గతి**
**స్ఫురణం బొప్పఁగ బాణజాలము నభంబుం గప్ప నత్యంత ని**
**ష్ఠుర సంతర్జన ఘోషభీషణ మహాటోపంబు దిగ్దంతు లా**
**తురతం బొందఁగఁ జేరవచ్చి వడిఁ బార్థుం డగ్గురుం దాఁకినన్. 212**

**ప్రతిపదార్థం:** ధరణీ భాగము= భూభాగం; గ్రక్కునన్= అతివేగంగా; కదలన్= చలించగా; రథ్య= గుర్రాల; వ్రాత= సమూహం యొక్క; చంచత్= ఎగిరే; గతి= నడక యొక్క; స్ఫురణంబు+ఒప్పఁగన్= స్ఫురించగా; బాణజాలము= బాణాల సమూహం;

నభంబున్= ఆకాశాన్ని; కప్పన్= కమ్ముకొనగా; అత్యంత= మిక్కిలి; నిష్ఠుర= కఠోరమైన; సంతర్జన= అదల్పే; ఘోష= ధ్వనిచేత; భీషణ= భయంకరమైన; మహా+ఆటోపంబు= మిక్కిలి వేగిరపాటు; దిక్+దంతులు= దిగ్గజాలు; ఆతురతన్+పొందఁగన్= భయపడేటట్లు; చేయన్= చేయగా; వడిన్ వచ్చి= వేగంగా వచ్చి; పార్థుండు= అర్జునుడు; ఆ+గురున్= ఆ ద్రోణాచార్యుడిని; తాఁకినన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** భూభాగం తీవ్రంగా కదలగా, అశ్వసమూహం యొక్క దూకే గమనం స్ఫురించగా, బాణజాలం ఆకాశాన్ని క్రమ్ముకొనగా, మిక్కిలి కఠోరమైన అదల్పే ధ్వని వలన కలిగిన మహాటోపం దిగ్గజాలకు భయం గొలుపగా, వేగంతో వచ్చి అర్జునుడు ద్రోణాచార్యుడిని ఎదుర్కొన్నాడు. అప్పుడు.

**విశేషం:** అర్జునుడు యుద్ధరంగంలో విజృంభించటం వలన వీరరసం, భూమి చలించటం, దిగ్గజాలు బెదరటం వంటి విస్మయం గొలిపే చర్యల వలన అద్భుతరసం వ్యక్తమౌతున్నది.

**వ. కౌరవయోధవరు లొక్కపెట్ట భారద్వాజునకు బాసటయై ససైన్యంబుగా సవ్యసాచిం బొదివిన, నవ్వీరుండు ఘోరాకారుండయి గాండీవచండ నిస్వనంబు లొండొండ నిగుడ, నిశిత సాయకపరంపరలు గురిసి కపాలోపలంబును, మేదో మాంస పంకంబును, నస్థిచూర్ణసికతంబును నగు శోణిత నదీ ప్రకరంబును బఱపె; నంత గభస్తిమంతుం డస్తశైలాంతరితుండైనఁ బార్థు బాణాంధకారంబునకుఁ దోడు సంధ్యాసంతమసంబు గవిసినం గురుసైనికులకుఁ దమవార లె రివారలని నిరూపింప నశక్యం బగుటయు ద్రోణ దుర్యోధనులు సమరంబు సాలించి వాహినులఁ దివియించినం, దిరంబై ధనంజయుండును, జయతూర్యస్వనంబులును, బాంచాల కేకయాది బంధుమిత్త్ర ప్రశంసా వచనంబులును, వీనులం బొలయఁ దనబలంబుల మరల్చి, ధర్మనందనుం గొలిచి చనియె; నిత్తెఱంగున రెండు సేనలుఁ దమ తమ విడిదలల కరిగి యథోచిత వ్యాపారంబుల నుండి నాఁటిరాత్రి సనిన మఱునాఁడు. 213**

**ప్రతిపదార్థం:** కౌరవయోధవరులు= కౌరవ పక్షంలోని వీరశ్రేష్ఠులు; ఒక్కపెట్టు+అ= ఒకేసారి; భారద్వాజునకున్= ద్రోణుడికి; బాసట+ఐ= సహాయంగా; ససైన్యంబుగాన్= సేనలతో; సవ్యసాచిన్= అర్జునుడిని; పొదివినన్= చుట్టుముట్టగా; ఆ+వీరుండు= యోధుడైన అర్జునుడు; ఘోర+ఆకారుండు+అయి= భయంకరమైన రూపం కలవాడై; గాండీవం= గాండీవమనే ధనుస్సు యొక్క; చండ= భయంకరమైన; నిస్వనంబులు= ధ్వనులు; ఒండొండు+అ= క్రమక్రమంగా; నిగుడన్= వ్యాపించగా; నిశిత= పదునైన; సాయక= బాణాల; పరంపరలు= వరుసలు; కురిసి= వర్షించి; కపాల+ఉపలంబును= పుర్రెలనే రాళ్ళుగలదియు; మేదన్= క్రొవ్వు; మాంస పంకంబునున్= మాంసం అనే బురద గలదియు; అస్థి= ఎముకల; చూర్ణ= పొడి అనే ఇసుక గలదియు; అగు= ఐన; శోణిత= రక్తం యొక్క; నదీ= నదుల; ప్రకరంబునున్= సమూహాన్ని; పఱపెన్= పారేటట్లు చేశాడు; అంతన్= అప్పుడు; గభస్తిమంతుండు= సూర్యుడు; అస్తశైల= అస్తమించే కొండలో; అంతరితుండు+అయినన్= కనిపించనివాడు కాగా; పార్థు= అర్జునుడి; బాణ+అంధకారంబునకున్= బాణాలు కమ్మటం వలన కలిగిన చీకటికి; తోడు= జతకు; సంధ్యాసమయంబు= సాయంకాలం; కవిసినన్= చుట్టుముట్టగా; కురుసైనికులకున్= కౌరవుల భటులకు; తమ వారలు= తమ దిక్కువారు; ఎదిరివారలు+అని= శత్రువులు అని; నిరూపింపన్= తెలిసికొనుటకు; అశక్యంబు= వీలుగానిది; అగుటయున్= కాగా; ద్రోణ దుర్యోధనులు; సమరంబు= యుద్ధం; చాలించి= ఆపి; వాహినులన్= సైన్యాలను; తివియించినన్= వెనుకకు మరల్చగా; తిరంబు+ఐ= స్థిరుడై; ధనంజయుండును= అర్జునుడు కూడా; జయ= జయధ్వానాలు; తూర్య= వాద్యాల; స్వనంబులును= ధ్వనులును; పాంచాల= పాంచాలురు; కేకయ= కేకయదేశీయులు; ఆది= మొదలైన; బంధు= చుట్టాల; మిత్ర= స్నేహితుల; ప్రశంసా= పొగడే; వచనంబులును= మాటలును; వీనులన్= చెవులలో; పొలయన్= చొరగా; తన= తన యొక్క; బలంబులన్= సేనలను;

మరల్చి= వెనుకకు త్రిప్పి; ధర్మనందనున్= ధర్మరాజును; కొలిచి= సేవించి; చనియెన్= వెళ్ళాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; రెండు సేనలున్= రెండు సైన్యాలు కూడ; తమ తమ= వారి వారి; విడిదలలకున్= శిబిరాలకు; అరిగి= పోయి; యథా+ఉచిత= తగిన; వ్యాపారంబుల నుండి= పనులలో ఉండి; నాఁటి రాత్రి= ఆ రాత్రి; చనినన్= గడువగా; మఱునాఁడు= మరుసటి దినమున.

**తాత్పర్యం:** కౌరవవీరులు ఒక్కుమ్మడిగా ద్రోణుడికి తోడై సైన్యాలతో అర్జునుడిని చుట్టుముట్టగా, ఆ వీరుడు ఘోర రూపంతో భయం గొలిపే గాండీవ ధ్వనులు అంతటా క్రమంగా వ్యాపించగా వాడిగల బాణజాలాన్ని కురిపించి, పుర్రెలనే రాళ్లు, క్రొవ్వు, మాంసం అనే బురద, ఎముకల పొడి అనే ఇసుక గల రక్తనదులను ప్రవహింపజేశాడు. అంతలో సూర్యుడు అస్తమించగా, అర్జునుడి బాణాంధకారానికి తోడు సంధ్యా సమయం వ్యాపించగా, కురు సైన్యాలకు తమ వారు, ఎదుటి వారు అని తెలిసికొన వీలుగాక, ద్రోణ దుర్యోధనులు యుద్ధం ఆపి సైన్యాలను వెనుకకు మరల్చారు. అర్జునుడు స్థిరుడై, జయధ్వానాలు, తూర్యస్వనాలు, బంధుమిత్రుల ప్రశంసలు వినిపించగా తన సైన్యాలను మరల్చి, ధర్మజుడిని సేవించి వెళ్ళాడు. ఈ విధంగా రెండు సైన్యాలు తమ తమ శిబిరాలకు చేరి, ఆయా పనులలో నిమగ్నమయ్యాయి. ఆ రాత్రి గడువగా మరునాడు.

**విశేషం:** అలం: రూపకం.

**క. రేపకడ యుభయ బలములు । నేపును నెలమియును నెసకమెసఁగ వెడలి యా**
**టోపంబున రణ సన్నా । హోపక్రమలీల మెఱయ నుజ్జ్వల భంగిన్. 214**

**ప్రతిపదార్థం:** రేపకడ= ప్రాతఃకాలంలో; ఉభయ బలములున్= కౌరవ, పాండవ సేనలు రెండును; ఏపునున్= ఆధిక్యం; ఎలమియును= వికాసం; ఎసకము= విజృంభణం; ఎసఁగన్= పెరుగగా; వెడలి= బయలుదేరి; ఆటోపంబునన్= సంభ్రమంతో; రణ= యుద్ధము యొక్క; సన్నాహ= ప్రయత్నానికి; ఉపక్రమ= ప్రారంభించే; లీల= విలాసం; ఉజ్జ్వల భంగిన్= గొప్పనైన విధంగా; మెఱయన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** ప్రాతఃకాలంలో పాండవ కౌరవ సైన్యాలు పెంపు, వికాసం, విజృంభణ అతిశయించగా బయలుదేరి, సంభ్రమంతో యుద్ధ ప్రయత్నం ప్రారంభించే విలాసం బాగా వెలుగగా.

**వ. ఉన్న సమయంబున లజ్జా విషాదంబులు మొగంబునం దోఁప ద్రోణుండు దుర్యోధనున కిట్లనియె. 215**

**ప్రతిపదార్థం:** ఉన్న సమయంబునన్= మెరుస్తున్నప్పుడు; లజ్జా విషాదంబులు= సిగ్గు, శోకం; మొగంబునన్= ముఖంపై; తోఁపన్= కనిపించగా; ద్రోణుండు= ద్రోణుడు; దుర్యోధనునకున్= దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** రెండు సైన్యాలు యుద్ధ సన్నాహంతో మెరుస్తునప్పుడు-సిగ్గు, దుఃఖం ముఖంపై కనిపించగా ద్రోణుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**చ. 'నరవర! మున్న చెప్పితి రణంబున నర్జునుఁ డొద్దనున్న నె**
**వ్వరికిని ధర్మసూనుఁ బొదువంగ నశక్య; మొకండు పార్థు ను**
**ద్ధురుఁ డయి నేల వాపికొని దోర్బల మొప్పఁగఁ బోవఁ జాలినన్**
**వెరవునఁ బట్టెదం బరులు వేవురు మార్కొనినం గలంచెదన్. 216**

**ప్రతిపదార్థం:** నరవర!= దుర్యోధన మహారాజా!; మున్ను+అ= మొదటే; చెప్పితి= చెప్పాను; రణంబునన్= యుద్ధంలో; అర్జునుఁడు= అర్జునుడు; ఒద్దన్+ఉన్నన్= దగ్గరున్నచో; ఎవ్వరికిని= ఎంతటివాడికి గూడ; ధర్మసూనున్= ధర్మరాజును; పొదువంగన్= ఆక్రమించటానికి; అశక్యము= వీలుకాదు; ఒకండు= ఒక వీరుడు; పార్థున్= అర్జునుడిని; ఉద్దురుఁడు+అయి= పరాక్రమోపేతుడై; నేల+పాపికొని= యుద్ధభూమి నుండి తొలగించుకొని; దోర్బలము= బాహుబలం; ఒప్పఁగన్= ఒప్పునట్లు; పోవన్+చాలినన్= పోగలిగితే; పరులు= ఇతరులు; వేవురు= వేయిమంది; మార్కొనిన్= ఎదుర్కొన్నా; కలంచెదన్= కలచివేస్తాను; వెరవునన్= ఉపాయంగా; పట్టెదన్= బంధిస్తాను.

**తాత్పర్యం:** 'దుర్యోధన మహారాజా! అర్జునుడు దగ్గర ఉన్నప్పుడు ధర్మరాజును బంధించటం ఎవరి వలన కూడా కాదని మొదటే చెప్పాను. వీరు డెవడైనా ఒకడు పరాక్రమంతో యుద్ధభూమి నుండి అర్జునుడిని దూరంగా కొనిపోతే, ధర్మజుడిని ఉపాయంగా పట్టుకొంటాను. ఇతరులు వెయ్యిమంది ఎదుర్కొన్నా ముప్పుతిప్పలు పెట్టుతాను.

### ద్రోణాచార్యుల రెండవ నాఁటి యుద్ధము (సం. 7-16-3)

**ఆ.** **నరుఁడు లేని చోట ననుఁ గని వెన్నిచ్చి । పాఱకున్నఁ బట్టువడియెఁ గాఁగఁ**
**దలఁపు ధర్మపుత్త్రు ధరణీశ! పాఱుట । గలిగెనేని నంత కంటె మేలు.'** **217**

**ప్రతిపదార్థం:** ధరణీశ!= దుర్యోధన మహారాజా!; నరుఁడు= అర్జునుడు; లేనిచోటన్= లేని స్థలంలో; ననున్= నన్ను; కని= చూచి; వెన్ను+ఇచ్చి= వెన్నుభాగం చూపి; పాఱకున్నన్= పారిపోకుంటే; పట్టు+పడియెన్+కాఁగన్= పట్టువడినట్లుగా; తలఁపు= భావించుము; ధర్మపుత్త్రు= ధర్మరాజు; పాఱుట+కలిగెన్+ఏనిన్= పారిపోవటమే జరిగితే; అంతకంటె మేలు= అంతకంటె మంచిది.

**తాత్పర్యం:** దుర్యోధన మహారాజా! అర్జునుడు లేనిచోట నన్ను చూచి పారిపోకుంటే ధర్మజుడు పట్టువడ్డట్టే అని భావించుము. అతడు పారిపోతే అంతకంటె మంచిది.'

**వ.** **అనిన విని సుశర్మ దుర్యోధనున కిట్లనియె.** **218**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆలకించి; సుశర్మ= త్రిగర్తాధిపుడైన సుశర్మ; దుర్యోధనునకున్= దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ద్రోణు డిట్లనగా సుశర్మ దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**క.** **'ఆ నరుఁ డెప్పుడు మము నవ । మానించుచు నునికిఁ జేసి మనుజేశ్వర! కో**
**పానలము సంతతము మా । మానసములఁ బొదువ నతని మార్కొను కడఁకన్.** **219**

**ప్రతిపదార్థం:** మనుజేశ్వర!= దుర్యోధన మహారాజా!; ఆ నరుఁడు= ఆ అర్జునుడు; ఎప్పుడున్= ఎల్లవేళల; మమున్= మమ్ములను; అవమానించుచున్+ఉనికిన్+చేసి= అవమానిస్తుండటం చేత; కోప+అనలము= క్రోధమనే అగ్ని; సంతతము= ఎల్లవేళలా; మా= మా యొక్క; మానసములన్= మనస్సులను; పొదువన్= ఆక్రమించగా; అతనిన్= ఆ అర్జునుడిని; మార్కొను= ఎదుర్కొనే; కడఁకన్= పూనికతో.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధన మహారాజా! ఆ అర్జునుడు ఎల్లప్పుడూ మమ్ములను అవమానిస్తుండటం వలన కోపమనే అగ్ని ఎల్లవేళలా మా మనస్సులను ఆక్రమించగా, అతడిని ఎదుర్కొనే ప్రయత్నంతో.

**వ. తమకించుచుందుము. నీకు బాస యిచ్చి పెద్ద కాలంబయ్యెఁ; నేఁడు రణభూమియందు నర్జునుం డొండెఁ ద్రిగర్తు లొండెం గావలయు; నే మతనిఁ బెద్ద కయ్యంబులోనం బాపికొని పోవుట నీ చిత్తంబునకు వచ్చున కాదె.' యనవుడు నతని తమ్ములు సత్యవ్రతుండును సత్యకర్ముండును సత్యవర్ముండును నిబ్బంగిన పలికిరి; వారల పక్షంబైన రథిక వర్గంబు నత్తెఱంగున నియ్యకొని యుల్లసిల్లె; నిమ్మెయిం ద్రిగర్తులు పదివేవురు దొరలు గడంగినం గని తుండికేరళ మాళవ శిలీంధ్ర మగధ మచ్ఛిల్లికాది దేశాధీశులును, బంధు మిత్త్రసహితంబుగా నివ్విధంబున వారి తోడి వారై పంతంబులు పలికి యుబ్బునం బొంగి; రిట్లప్పరుసున నగణ్య రథికోత్తము లుత్సహించి కృతస్నానులై యగ్నులం బూజించి తత్సన్నిధి సర్వయోధులు నాకర్ణింప నందఱు నిట్లనిరి.220**

**ప్రతిపదార్థం:** తమకించుచుందుము= త్వరపడుతుంటాము; నీకున్= దుర్యోధనుడవగు నీకు; బాస+ఇచ్చి= మాట ఇచ్చి; పెద్దకాలంబు+అయ్యెన్= చాలా కాలం అయింది; నేఁడు= ఈ రోజు; రణభూమి అందున్= యుద్ధరంగంలో; అర్జునుండు= అర్జునుడు; ఒండెన్= అయినా; త్రిగర్తులు+ఒండెన్= త్రిగర్తులైనా; కావలయున్= ఉండాలి; ఏము= మేము; అతనిన్= ఆ అర్జునుడిని; పెద్ద= గొప్ప; కయ్యంబులోనన్= యుద్ధంలో; పాపికొని పోవుట= దూరంగా కొనిపోవటం; నీ చిత్తంబునకున్= నీ మనస్సుకు; వచ్చున్+అ కాదె!= వచ్చిందేకదా!; అనవుడున్= అనగా; అతని తమ్ములు= ఆ సుశర్మ తమ్ములు; సత్యవ్రతుండును= సత్యవ్రతుడు; సత్యకర్ముండును= సత్యకర్ముడు కూడ; ఇబ్బంగిన్+అ= ఈ విధంగానే; పలికిరి= అన్నారు; వారల= వారి; పక్షంబైన= వైపుగల; రథికవర్గంబున్= రథసేనను నడిపేవారి సమూహం కూడా; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఇయ్యకొని= అంగీకరించి; ఉల్లసిల్లెన్= సంతసించింది; ఈ+మెయిన్= ఈ తీరున; త్రిగర్తులు= త్రిగర్త దేశానికి చెందిన; పదివేవురు= పదివేల మంది; దొరలు= అధిపతులు; కడంగినన్= పూనుకోగా; కని= చూచి; తుండి= తుండి; కేరళ; మాళవ; శిలీంధ్ర; మగధ; మచ్ఛిల్లక; ఆది= మొదలైన; దేశాధీశులును= దేశాధిపతులును; బంధు= చుట్టాల; మిత్ర సహితంబుగాన్= స్నేహితులతో కూడి; ఈ+విధంబునన్= ఈ విధంగా; వారి= త్రిగర్తుల; తోడివారై= అనుయాయులై; పంతంబులు= ప్రతిజ్ఞలు; పలికి= చేసి; ఉబ్బునన్= ఉత్సాహంతో; పొంగిరి= విజృంభించారు; ఇట్లు= ఈ విధంగా; ఆ+పరుసునన్= ఆ రీతిగా; అగణ్య= లెక్కించరాని; రథిక+ఉత్తములు= రథికులలో శ్రేష్ఠులు; ఉత్సహించి= ఉత్సాహాన్ని పొంది; కృతస్నానులు+ఐ= స్నానాలు చేసి; అగ్నులన్= గార్హపత్యం మొదలైన అగ్నులను; పూజించి= అర్చించి; తద్+సన్నిధి= ఆ అగ్నుల సమీపంలో; సర్వయోధులున్= వీరులందరును; ఆకర్ణింపన్= వినగా; అందఱున్= రథికులంతా; ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** 'మేము అర్జునుడిని ఎదుర్కోవాలని ఉబలాటపడుతుంటాము. నీకు మాట ఇచ్చి కూడా చాలా కాలం అయింది. నేడు యుద్ధరంగంలో అర్జునుడైనా ఉండాలి లేదా త్రిగర్తులైనా ఉండాలి. మేము అర్జునుడిని పెద్ద యుద్ధంనుండి తొలగించుకొనిపోవడం నీ కిష్టమైనదే కదా' అనగా, అతడి తమ్ములైన సత్యవ్రతుడు, సత్యకర్ముడు, సత్యవర్ముడు కూడా అదే మాట అన్నారు. వారివైపు గల రథికులంతా దాని కంగీకరించి సంతోషించారు. ఈ విధంగా పదివేలమంది త్రిగర్తాధిపులు సంసిద్ధులు కాగా, కేరళ, మాళవ, శిలీంధ్ర, మగధ, మచ్ఛిల్లికాది దేశాధిపతులు తమ బంధుమిత్రులతో బాటు వారికి తోడ్పడుతూ, శపథాలు చేసి, పొంగిపోయారు. ఇట్లా అసంఖ్యాకులైన రథిక శ్రేష్ఠులు ఉత్సాహంతో స్నానాలు చేసి, అగ్నిహోత్రాలను పూజించి, వాటి సమీపంలో వీరులంతా వినగా అందరూ ఇట్లా అన్నారు.

**సీ. 'అర్జునుఁ జంపుదు మతని కోడితిమేని । గోవధంబును వనితా వధంబు**
**బ్రహ్మవధంబును బరదార గమనంబు । బ్రహ్మస్వ హరణంబుఁ బరధనాప**
**హరణంబు గురుజన త్యాగంబు శరణాగ । తారక్షణము నసృతాభిరతియు**
**మద్యపానము నర్థిమానవవైముఖ్య । మును గృహదాహంబు జనుల నెట్టి**

**ఆ. గతులఁ బుచ్చు నట్టి గతులు వాటిలు నక్కి । రీటి కోలుతలకు నోట లేక**
**దురము సేసి తగిన తుది గన్న పుణ్యాత్మ । కలితగతుల మేలు గలుగు మాకు.' 221**

**ప్రతిపదార్థం:** అర్జునున్= అర్జునుడిని; చంపుదుము= చంపుతాము; అతనికిన్= అతడితో; ఓడితిమి+ఏనిన్= ఓడిపోతే; గోవధంబును= ఆవును చంపటం; వనితావధంబు= స్త్రీని చంపటం; బ్రహ్మవధంబును= బ్రాహ్మణుడిని చంపటం; పర= ఇతరుడి;దార= భార్యను; గమనంబు= పొందటం; బ్రహ్మస్వ= బ్రాహ్మణుల ధనం; హరణంబున్= దోచుకొనటం; పర= ఇతరుల; ధన= ధనాన్ని; అపహరణంబు= దొంగిలించటం; గురుజన= తల్లిదండ్రులను, పెద్దలను; త్యాగంబు= వదిలిపెట్టటం; శరణాగత= శరణు పొందిన వారిని; అరక్షణము= కాపాడకుండటం; అనృత= అసత్యంపై; అభిరతి= అభిలాష; మద్యపానమున్= కల్లు త్రాగటం; అర్థి=యాచకులైన; మానవ= మనుష్యుల యెడ; వైముఖ్యమును= విముఖతయు; గృహదాహంబు= ఇల్లు కాల్చటం; జనులన్= ప్రజలను; ఎట్టి= ఎటువంటి; గతులన్= చెడుత్రోవలకు; పుచ్చున్= తీసికొనిపోవునో; అట్టి గతులు= అట్టి దుర్గతులు; వాటిలున్= కలుగుతాయి; ఆ+కిరీటి= ఆ అర్జునుడితో; కోలుతలకున్= ఎదురు నిలిచి యుద్ధం చేయటానికి; ఓట= భయం; లేక= లేకుండ; దురము+చేసి= యుద్ధంచేసి; తుది+కన్న= మరణించినట్టి; పుణ్యాత్మ కలిగతుల మేలు= పుణ్యాత్ములు పొందే మేలు; మాకున్+కలుగున్= మాకు కలుగుతుంది.

**తాత్పర్యం:** 'మేమంతా అర్జునుడిని హతమారుస్తాము. అతడిచేత ఓడిపోతే-గోవధ, స్త్రీవధ, బ్రాహ్మణవధ, పరభార్యాగమనం, బ్రాహ్మణ వృత్తుల హరణం, పరధనాపహరణం, పెద్దలను దూరం చేయటం, శరణాగతుడిని రక్షించకపోవటం, అసత్యమాడటం, కల్లు త్రాగటం, యాచకులైన మనుష్యుల యెడ విముఖంగా ఉండటం, గృహాలను దహించటం వంటి దుష్కర్మలు చేసినవారు ఎట్టి దుర్గతి పాలౌతారో అట్టి దుర్గతిని పొందగలము. అర్జునుడికి భయపడక యుద్ధంలో ఎదుర్కొని సాహసాన్ని ప్రదర్శించి హతమైతే పుణ్యాత్ములకు కలిగే మేలు మాకు కలుగుతుంది.'

**విశేషం:** 'దురముసేసి తగిన....' అని దీనికి వావిళ్ళవారి ప్రతిలోను, తెలుఁగు విశ్వవిద్యాలయ ప్రతిలోను పాఠాంతరం ఉన్నది. అది 'దుష్కరంబు సేసి'. అనఁగా - 'చేయశక్యం కాని పనిని - అనగా అర్జునుడితో యుద్ధమును - చేసి' అని అర్థం.

**వ.** **అని సంశాపంబులు పలికి సంశప్తకు లనేక రథికముఖ్యులు బహుళ చతురంగ బలపరివృతులై కురురాజు సంతసిల్ల నుల్లాసంబునం జనిరి; గురుండును గరుడవ్యూహంబు సమకట్టి, దానికిఁ జంచువై తాను నిలిచె; దుర్యోధనుండును దమ్ములుం దలయును, కృప కృతవర్మలు గన్నులును, సింహళాభీర శూరసేన కేకయ ప్రముఖులు మెడయును, బాహ్లిక భూరిశ్రవస్సోమదత్త శల శల్యులు వలపలి ఱెక్కయు, నశ్వత్థామ సుదక్షిణ విందానువిందులు దాపలి ఱెక్కయు, శకుని పౌండ్ర కళింగాంబష్ఠమాగధులు వెన్నును, నానాజనపదసేనా సమన్వితుండై సూతపుత్రుండు పుచ్ఛంబును, సైంధవాది వివిధ దేశాధీశులు నెడనెడం గలయన్ బెరసి యొడలి పొలుపును బలుపునునై నిలువ నియోగించిన నమ్మోహరంబు మహాపవన సముద్ధూత సాగరాకారంబై యుత్సాహ నృత్యంబు సేయు చందంబునం జూడనొప్పె నందు మధ్యమ ప్రదేశంబున భగదత్తుండు గజారూఢుండై యుదయాచలంబుపైఁ బొలుచు భానుండునుంబోలెఁ దేజరిల్లుచునుండె నంత నక్కడం ద్రిగర్తాదులు పాండవసేన దక్షిణ దిక్కునకుం జని సమరంబునకు సవ్యసాచిం దొలంగం బిలుచుటయు నన్నర శార్దూలుం డన్నతో నిట్లనియె.** **222**

**ప్రతిపదార్థం:** అని= సుశర్మాదులు పైవిధంగా అని; సంశాపంబులు= శపథాలు; పలికి= చేసి; సంశప్తకులు= వెనుదిరుగమని ఒట్టు పెట్టుకొన్నవారు; అనేక= చాలామంది, రథిక ముఖ్యులు= రథిక శ్రేష్ఠులు; బహుళ= అధికమైన; చతురంగబల= రథ, గజ, తురగ, పదాతి దళాలతో; పరివృతులు+ఐ= చుట్టబడినవారై; కురురాజు= దుర్యోధనుడు; సంతసిల్లన్= సంతోషించగా; ఉల్లాసంబునన్= ఉత్సాహంతో; చనిరి= పోయారు; గురుండును= ద్రోణాచార్యుడును; గరుడ వ్యూహంబు= గరుడాకారమైన మొగ్గరము; సమకట్టి= ఏర్పరచి; నిలబడ్డాడు; దుర్యోధనుండును; తమ్ములున్= అతడి తమ్ములు; తలయును= శిరస్సుగా;

కృపకృతవర్మలు= కృపాచార్యుడు, కృతవర్మ; కన్నులును= కన్నులుగా; సింహళ= సింహళదేశపు; ఆభీర= ఆభీర దేశపు; శూరసేన= శూరసేన దేశపు; కేకయ= కేకయ దేశపు; ప్రముఖులు= ముఖ్యయోధులు; మెడయును= మెడగా; బాహ్లిక; భూరిశ్రవస్; సోమదత్త; శల; శల్యులు; వలపలి ఱెక్కయున్= కుడిరెక్కగా; అశ్వత్థామ; సుదక్షిణ; వింద; అనువిందులు; దాపలి ఱెక్కయున్= ఎడమరెక్కగా ; శకుని; పౌండ్ర; కళింగులు; అంబష్ఠ; మాగధులు; వెన్నును= వీపుగా; నానా= అనేకమైన; జనపద= గ్రామప్రాంతాల; సేనా= సైన్యములతో; సమన్వితుండు+ఐ= కూడినవాడూ; సూతపుత్రుండు= కర్ణుడు; పుచ్ఛంబును= తోకగా; సైంధవ+ఆది= సైంధవుడు మొదలైన; వివిధ అనేకులైన; దేశ+అధీశులు= దేశాధిపతులు; ఎడన్+ఎడన్= అక్కడక్కడ; కలయన్+బెరసి= కలిసేటట్లు వ్యాపించి; ఒడలి= శరీరపు; పొలువును= స్థైర్యము; బలుపునున్+ఐ= బలంగా; నిలువన్; నియోగించినన్= నియమించగా; ఆ+మోహరంబు= ఆ వ్యూహం; మహాపవన= గొప్ప వాయువుచేత; సముద్ధూత= కల్లోలితమైన; సాగర+ఆకారంబు+ఐ= సముద్రపు రూపం కలదై; ఉత్సాహ నృత్యంబు= ఉత్సాహంతో నాట్యం; చేయు చందంబునన్= చేస్తున్నట్లు; చూడన్+ఒప్పెన్= చూడటానికి తగి ఉండినది; అందున్= ఆ వ్యూహంలో; మధ్యమప్రదేశంబునన్= నడిమిభాగంలో; భగదత్తుండు; గజ+ఆరూఢుండు+ఐ= ఏనుగుపై ఎక్కినవాడై; ఉదయ+అచలంబుపయిన్= ఉదయాద్రిమీద; పొలుచు= ఒప్పు; భానుండునున్= సూర్యుని; పోలెన్= వలె; తేజరిల్లుచున్+ఉండెన్= ప్రకాశిస్తున్నాడు; అంతన్= అపుడు; అక్కడన్= అచట; త్రిగర్తాదులు= సుశర్మాదులు; పాండవసేన= పాండవసేనయొక్క; దక్షిణ దిక్కునకున్= దక్షిణపు వైపునకు; చని= వెళ్ళి; సమరంబునకున్= యుద్ధానికి; సవ్యసాచిన్= అర్జునుడిని; తొలంగన్+పిలుచుటయున్= తొలగుటకై పిలువగా; ఆ+నరశార్దూలుండు= ఆ నరశ్రేష్ఠుడు అర్జునుడు; అన్నతోన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** పై విధంగా ప్రతిజ్ఞలు చేసి సంశప్తకులు, అనేక యోధులు చతురంగ బలాలతో దుర్యోధనుడు సంతసిల్లగా ఉత్సాహంతో బయలుదేరారు. ద్రోణుడు గరుడవ్యూహం ఏర్పరచి; అందులో ముక్కుగా తాను నిలబడ్డాడు. దుర్యోధనుడు, అతడి తమ్ములు తలగా; కృప, కృతవర్మలు కన్నులుగా; సింహళులు, ఆభీర, శూరసేన, కేకయ దేశప్రముఖులు మెడగా; బాహ్లిక, భూరిశ్రవస్, సోమదత్త, శల, శల్యులు కుడిరెక్కగా; అశ్వత్థామ, సుదక్షిణ, విందానువిందులు ఎడమ రెక్కగా; శకుని, పౌండ్ర, కళింగ, అంబష్ఠ, మాగధులు వెన్నుగా; నానాజనపదసేనలతో కర్ణుడు తోకగా; సైంధవాది వివిధ దేశాధిపతులు అటనట కలయవ్యాపించగా, దేహసౌష్ఠవానికి, బలానికి తగినట్లు నియమించాడు. అపుడు ఆ వ్యూహం ఝంఝామారుతం వలన మిక్కిలి ఉప్పొంగిన సముద్రంవంటి రూపం కలదై, ఉత్సాహంతో నాట్యం చేసినట్లు కనిపించింది. ఆ వ్యూహంలో నడిమి భాగాన భగదత్తుడు ఏనుగునెక్కి, పొడుపు కొండమీద వెలిగే సూర్యుడివలె ప్రకాశిస్తున్నాడు. అపుడు అక్కడ త్రిగర్తాధిపతి అయిన సుశర్మ మొదలైన సంశప్తకులు పాండవసేనకు దక్షిణంగా వెళ్ళి ఆ యుద్ధం నుండి తొలగునట్లు తమతో యుద్ధానికై రావలసినదిగా అర్జునుడిని పిలవగా, అతడు ధర్మజుడితో ఈ విధంగా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. 'తఱిమి సుశర్మ దమ్ములును దానును నాజికి నన్నుఁ బిల్వ నే**
**నెఱుఁగని యట్టు లుండు టిది యే పురుషార్థము? వారి నెల్ల నే**
**డ్తెఱ నుఱుమాడఁ బంపుము; కడిందిగఁ జూడకు; నీకు నేమియుం**
**గఱగొఱ గాదు; పోమి గడుఁగష్టము నాకు నుదాత్తమానసా!' 223**

**ప్రతిపదార్థం:** ఉదాత్తమానసా!= గొప్ప మనస్సుగల ధర్మరాజా!; తఱిమి= ఉరువడిగా; సుశర్మ; తమ్ములును= తమ్ములూ; తానును= తానూ; ఆజికిన్= యుద్ధానికి; నన్నున్= నన్ను; పిలువన్= పిలువగా; ఏన్= నేను; ఎఱుఁగని+అట్టులు= తెలియనట్లు;

ఉండుట= ఉండటం; ఇది; ఏ పురుషార్థము?= ఏ పురుష ప్రయోజనం?; వారిని+ఎల్లన్= వారందరిని; ఏడ్తెఱన్= పరాక్రమంతో; నుఱుమాడన్= వధించటానికి; పంపుము= పంపించుము; కడిందిగన్= అసాధ్యమైనదిగా, చూడకు(ము)= భావించకుము; నీకున్= నీకునూ; ఏమియున్= ఏ విధమైన; కఱగొఱ కాదు= లోపం రాదు; పోమి= పోకుండటం; నాకున్= నాకునూ; కడున్= మిక్కిలి; కష్టము= బాధాకరం.

**తాత్పర్యం:** 'గొప్ప హృదయంగల ధర్మజా! సుశర్మ, అతని తమ్ములు నన్ను యుద్ధానికి పిలువగా వినన ట్లుండటం ఏ పురుషార్థమూ కాదు. కాబట్టి వారినందరిని పరాక్రమించి వధించటానికి నన్ను పంపించుము. ఇది నాకు అసాధ్యమైనదిగా భావించకుము. నీకే లోపమూ రాదు. పోకపోవటం నాకు కష్టాన్ని కలిగిస్తుంది.'

**వ. అనుటయు నయ్యుధిష్ఠిరుండు. 224**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అర్జునుడు ఇట్లనగా; ఆ యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు.

**తాత్పర్యం:** అర్జునుడు ఇట్లా అనగా ధర్మరాజు అపుడు.

**తే. 'గురుని బల శౌర్యములు నెఱుంగుదుము; మనకు । నతని పూనికి బొంకు సేయంగవలయు;**
**దీని కెయ్యది కార్యంబు దాని నీవు । బుద్ధి నుచితంబుగాఁ దలపోయు'మనుడు. 225**

**ప్రతిపదార్థం:** గురుని= ద్రోణాచార్యుడి; బలశౌర్యములు= బలం, వీరత్వం; ఎఱుంగుదుము= తెలిసినవాళ్ళం; అతని= ద్రోణుడి; పూనికి= ప్రయత్నం; బొంకు= అసత్యం; చేయంగన్ వలయున్= చేయాలి; దీనికిన్= ప్రతిజ్ఞను భంగపరచటానికి; మనకున్; ఏ+అది= ఏది; కార్యంబు= చేయదగింది; దానిన్= దానిని; ఈవు= నీవు; బుద్ధిన్= మనస్సులో; ఉచితంబుగాన్= తగినవిధంగా; తలపోయుము= యోచించుము; అనుడున్= అనగా.

**తాత్పర్యం:** 'ద్రోణాచార్యుడి బలశౌర్యాలు మనకు తెలియనివి కావు. అతడి ప్రతిజ్ఞను మనం వమ్ము చేయాలి. దానికి తగిన విధంగా మనస్సులో ఆలోచించుము' అనగా.

**వ. ధనంజయుం డతని కిట్లనియె. 226**

**ప్రతిపదార్థం:** ధనంజయుండు= అర్జునుడు; అతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు.

**చ. 'పిలిచినఁ బోవకుండు టిది బీదతనం బగుఁ గాన నేర్పుగాఁ**
**దలఁపదు లోక; మే నరివధం బొనరింపఁగ నెట్లుఁ బోయెదం**
**జలము బలంబు ధైర్యమును శౌర్యమునుం గలవాఁడు వీఁడు నేఁ**
**డలఘుఁడు గుంభసంభవుని నాఁగు భవత్పరిరక్షణార్థి యై.' 227**

**ప్రతిపదార్థం:** పిలిచినన్= పిలవగా; పోవకుండుట= పోకుండటం; ఇది; బీదతనంబు= పిరికితనం; అగున్= అవుతుంది; కానన్= కనుక; నేర్పుగాన్= సమర్థమైనదిగా; లోకము= లోకం; తలఁపదు= అనుకొనదు; ఏన్= నేను; అరివధంబు= శత్రు సంహారం; ఒనరింపఁగన్= చేయటానికి; ఎట్లున్= ఎట్లైనా; పోయెదన్= పోతాను; వీఁడు= ఈ సత్యజిత్తు; చలము= మాత్సర్యం; బలంబు= శక్తి; ధైర్యమును= ధైర్యం; శౌర్యమునున్= శౌర్యం కూడ; కలవాఁడు= కలిగినవాడు; అలఘుఁడు= గొప్పవాడు; నేఁడు= ఈ వేళ; భవత్= తమ యొక్క; పరిరక్షణ+అర్థి+ఐ= కాపాడుటకై; కుంభసంభవునిన్= ద్రోణుడిని; ఆఁగున్= అడ్డుకొనును.

**తాత్పర్యం:** 'శత్రువులు యుద్ధానికి ఆహ్వానిస్తే పోకపోవటం పిరికితనం. దీనిని లోకం మెచ్చదు. నేను శత్రువులను సంహరించడానికి ఎట్లైనా పోతాను. ఈ సత్యజిత్తు మాత్సర్యం, శక్తి, ధైర్యం ఉన్నవాడు; గొప్పవాడు. నేడు నిన్ను రక్షించి ద్రోణుడిని అడ్డుకొనటానికి ఇతడు కడు సమర్థుడు.'

**వ. అని పాంచాలవరుం డగు సత్యజిత్తుం జూపి. 228**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లని; పాంచాల వరుండగు= పాంచాలదేశపు వీరశ్రేష్ఠుడైన; సత్యజిత్తున్= సత్యజిత్తును; చూపి= చూపించి.

**తాత్పర్యం:** అని పాంచాలదేశపు వీరశ్రేష్ఠుడైన సత్యజిత్తును చూపించి.

**క. ఇతఁ డున్న యంతసేపును। మతి నేమియు వెఱవవలదు మార్తుర చేతన్;**
**హతుఁ డయ్యెనేని నిలుచుట। చతురతగా దనికిఁ దొలఁగి చనవలయు నృపా!' 229**

**ప్రతిపదార్థం:** నృపా!= ధర్మరాజా!; ఇతఁడు= ఈ సత్యజిత్తు; ఉన్న+అంతసేపును= బ్రతికి ఉన్నంత సేపు; మతిన్= మనస్సులో; ఏమియున్= ఏమాత్రం; వెఱవవలదు= భయపడవద్దు; మార్తుర చేతన్= శత్రువులచేత; హతుఁడు+అయ్యెన్+ఏనిన్= చనిపోతే; నిలుచుట= యుద్ధంలో నిలవటం; చతురత+కాదు= నేర్పరితనం కాదు; అనికిన్= యుద్ధం నుండి; తొలఁగి= ప్రక్కకు జరిగి; చనవలయున్= వెళ్ళిపోవాలి.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! ఈ సత్యజిత్తు ఉన్నంతసేపూ నీ వేమాత్రం భయపడవలసిన అవసరం లేదు. ఒకవేళ ఇతడు శత్రువుల చేత హతుడైతే నీవు యుద్ధంలో నిలువటం నేర్పరితనం కాదు. వెంటనే యుద్ధం నుండి తప్పుకొనటం మేలు.

**అర్జునుఁడు ధర్మరాజుచే ననుజ్ఞాతుం డై సంశప్తకులపైఁ బోవుట (సం. 7-16-14)**

**తే. అనిన నొడఁబడి యట్లకా కనుడు నన్న। రేంద్రునకు భక్తి మ్రొక్కి సురేంద్రపుత్త్రుఁ**
**డతనిచేత దీవన గొని యవ్విరోధు। లున్న దెస కేఁగె సంతోష ముత్కటముగ. 230**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఒడఁబడి= ఒప్పుకొని; అట్లు+అ+కాక= అట్లే అని; అనుడున్= అనగా; ఆ+నరేంద్రునకున్= ఆ ధర్మరాజుకు; భక్తిన్= భక్తితో; మ్రొక్కి= నమస్కరించి; సుర+ఇంద్రసుతుఁడు= దేవేంద్రుడి పుత్రుడైన అర్జునుడు; అతని చేతన్= ఆ ధర్మజుడితో; దీవన+కొని= ఆశీస్సు పొంది; సంతోషము= సంతసం; ఉత్కటముగన్= పెంపొందగా; ఆ+విరోధులు= ఆ శత్రువులు; ఉన్నదెసకున్= ఉన్న వైపునకు; ఏఁగెన్= పోయాడు.

**తాత్పర్యం:** దీనికి ధర్మరాజు అంగీకరించగా, అర్జునుడు అన్నకు భక్తితో మ్రొక్కి, దీవెనలు గొని, సంతోషంతో ఆ శత్రువులున్న వైపునకు వెళ్ళాడు.

**వ. ఇట్లు ధర్మజుని యొద్ద వాసి విజయుండు చనుటకు నుబ్బిన మన సైన్యంబులం గనుంగొని యమ్మహీపతి ధృష్టద్యుమ్నుతోఁ 'గౌరవులు గరుడ వ్యూహంబుగా మోహరించిన వారు; దీనికి నీవుం దగ మండలార్ధ వ్యూహంబు సమకట్టు'మని పనిచిన నతం డట్ల చేసె; నివ్విధంబున నుభయవ్యూహంబులును గాఢసన్నాహంబులై శంఖ భేరీ ప్రముఖ తూర్యస్వనంబులు సెలంగ నడు వాన కాలంబునం బొంగిన గంగా యమునలుం బోలె నొండొంటిం దార్కొను సమయంబున నయ్యజాతశత్రుండు ద్రుపదపుత్రు నాలోకించి గురుం జూపి. 231**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ధర్మజుని యొద్ద= ధర్మరాజు సమీపం నుండి; పాసి= తొలగి; విజయుండు= అర్జునుడు; చనుటకున్= వెళ్ళినందుకు; ఉబ్బిన= సంతోషించిన; మన సైన్యంబులన్= మన కౌరవ సైన్యాలను; కనుంగొని= చూపి; ఆ+మహీపతి= ఆ ధర్మరాజు; ధృష్టద్యుమ్నుతోన్= ధృష్టద్యుమ్నుడితో; కౌరవులు; గరుడ వ్యూహంబుగాన్= గరుడ వ్యూహరూపంలో; మోహరించినవారు= సైన్యాన్ని కూర్చారు; దీనికిన్= ఈ వ్యూహానికి; నీవున్= నీవు కూడా; తగన్= తగినట్లు; మండల+అర్ధవ్యూహంబు= అర్ధవలయాకారంగా తీర్చిన వ్యూహం; సమకట్టుము+అని= రచించుమని; పనిచినన్= ఆజ్ఞాపించగా; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; అట్లు+అ= ఆ విధంగానే; చేసెన్= చేశాడు; ఆ+విధంబునన్= ఆ రీతిగా; ఉభయ వ్యూహంబులును= రెండు మొగ్గరాలు; గాఢ సన్నాహంబులు+ఐ= బాగా సిద్ధమై; శంఖ= శంఖాలు; భేరీ= దుందుభులు; ప్రముఖ= మొదలైన; తూర్య= వాద్యాల; స్వనంబులు= ధ్వనులు; చెలంగన్= చెలరేగగా; నడువానకాలంబునన్= వానాకాలం మధ్యలో; పొంగిన= ఉప్పొంగిన; గంగాయమునలున్+పోలెన్= గంగా, యమునా నదుల వలె; ఒండు+ఒంటిన్= ఒకదాని నొకటి; తార్కొను=ఎదుర్కొనే; సమయంబునన్= వేళలో; ఆ+అజాతశత్రుండు= ఆ ధర్మరాజు; ద్రుపదపుత్రున్= ధృష్టద్యుమ్నుడిని; ఆలోకించి= చూచి; గురున్= ద్రోణాచార్యుడిని; చూపి= చూపించి.

**తాత్పర్యం:** అర్జునుడు ధర్మరాజుకు దూరంగా వెళ్ళాడు. దానికి కౌరవసైన్యం ఉప్పొంగిపోయింది. ధర్మరాజు ధృష్టద్యుమ్నుడితో 'కౌరవులు గరుడవ్యూహం పన్నారు. దానికి దీటుగా నీవు అర్ధమండలాకార వ్యూహం నిర్మించుము' అని ఆజ్ఞాపించాడు. అత డట్లాగే చేశాడు. ఆ విధంగా ఉభయ వ్యూహాలూ సమర్థంగా సన్నద్ధమయ్యాయి. శంఖభేరీమృదంగాది వాద్యాలు మ్రోగాయి. వానకాలం నడుమ ఉప్పొంగే గంగాయమునలవలె రెండుసైన్యాలు ఎదుర్కొనబోయే వేళలో ధర్మరాజు ధృష్టద్యుమ్నుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**క.** **'నేఁ డీ బ్రాహ్మణు చేతం । బోఁడిమి సెడి యేను జిక్కిపోవక యుండన్**
**వేఁడిమి మెఱయు శరంబుల । వాఁడిమి సొంపెల్లఁ జూప వలయుం జుమ్మీ!'** **232**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నేఁడు= ఈ దినం; ఈ బ్రాహ్మణు చేతన్= బ్రాహ్మణుడైన ఈద్రోణుడిచేత; పోఁడిమి+చెడి= ఒప్పుచెడి; చిక్కిపోవక ఉండన్= పట్టుపడకుండ; వేఁడిమి= ప్రతాపం; మెఱయు= ప్రదర్శించే; శరంబులన్= బాణాలతో; వాఁడిమి= తీక్ష్ణత యొక్క; సొంపు= సమృద్ధిని; ఎల్లన్= అంతయు; చూపవలయున్+చుమ్మీ= చూపించవలెను సుమా!

**తాత్పర్యం:** 'నే నీనాడు అవమానం పాలై ద్రోణాచార్యుడి చేత చిక్కకుండా, వాడిగల బాణాలతో నీ పరాక్రమాన్నంతా ప్రదర్శించాలి సుమా!'

**క.** **అనుడు నతఁడు నవ్వుచు ని । ట్లను 'నే నాఁగంగ ద్రోణుఁ డని నిను గదియం**
**జనువాఁడె? యింత యేటికి? । నను నీతఁడు గెలువలేఁడు నమ్ము మధీశా!'** **233**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; అతఁడు= ధృష్టద్యుమ్నుడు; నవ్వుచున్= నవ్వుతూ; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అధీశా!= మహారాజా!; నేను; ఆఁగంగన్= నిలువగా; ద్రోణుఁడు; అనిన్= యుద్ధంలో; నినున్= నిన్ను; కదియన్+చనువాఁడె?= దగ్గరికి రాగలడా?; ఇంత+ఏటికిన్?= ఇంతెందుకు?; ననున్= నన్ను; ఈతఁడు= ద్రోణుడు; గెలువలేఁడు= జయించలేడు నమ్ముము= విశ్వసించుము.

**తాత్పర్యం:** అనగా, ధృష్టద్యుమ్నుడు నవ్వుతూ ఇట్లా అన్నాడు. 'ధర్మరాజా! నేను అడ్డుకొంటే ఆ ద్రోణుడు నిన్ను సమీపిస్తాడా? ఇం తెందుకు? అతడు నన్ను గెలువలేడు. ఇది నిశ్చయం.'

వ. **అని పలికి పారావత వర్ణాశ్వ వర్ణనీయ రథుండగు నయ్యతిరథుండు గుంభసంభవునకు సమ్ముఖంబుగా నడుచుటయు, నా ధృష్టద్యుమ్ను దర్శనంబు దనకు నరిష్టం బగుటయు నగ్గురుం డొక్కింత విన్ననై యతని దిక్కు దేఱిచూడం జాలక క్రేడించి పాంచాల బలంబుపై నిశిత విశిఖంబులు పరఁగించుచుం బాయవడ నడరె నంతనక్కడ.** **234**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఇట్లని పలికి; పారావత= పావురాల; వర్ణ= రంగుగల- బూడిదరంగుగల; అశ్వ= గుర్రాలచేత; వర్ణనీయ= ప్రశంసించదగిన; రథుండు+అగు= రథంగల; ఆ+అతిరథుండు= రథిక శ్రేష్ఠుడగు ధృష్టద్యుమ్నుడు; కుంభసంభవునకున్= ద్రోణుడికి; సమ్ముఖంబుగాన్= ఎదురుగా, నడచుటయున్= నడవగా; ఆ ధృష్టద్యుమ్ను= ఆ ధృష్టద్యుమ్నుడి యొక్క; దర్శనంబు= కనిపించటం; తనకున్= తనకు; అరిష్టంబు+అగుటయున్= కీడు కాగా; ఆ+గురుండు= ఆ ద్రోణాచార్యుడు; ఒక్కింత= కొద్దిగా; విన్ననై= చిన్నవోయి; అతని దిక్కు= ధృష్టద్యుమ్నుడివైపు; తేఱిచూడంజాలక= చక్కగా చూడలేక; క్రేడించి= ప్రక్కకు తొలగి; పాంచాల బలంబుపైన్= పాంచాలుర సైన్యంపై; నిశిత విశిఖంబులు= తీక్ష్ణమైన బాణాలు; పరఁగించుచున్= వేస్తూ; పాయవడన్= చీలేటట్లు; అడరెన్= మించిపోయాడు; అంతన్= అప్పుడు; అక్కడన్= సంశప్తకులపైకి అర్జునుడు యుద్ధానికి పోయినచోట.

**తాత్పర్యం:** అని ధృష్టద్యుమ్నుడు పలికి, బూడిదరంగుగల అశ్వాలను పూన్చిన అందమైన రథాన్ని ఎక్కి, ఆ మహావీరుడు ద్రోణుడికి ఎదురుగా నడువగా; ఆ ధృష్టద్యుమ్నుడి దర్శనం తనకు కీడు కలిగించేది కావటం వలన ద్రోణాచార్యుడు చిన్నవోయి, అతడి దిక్కు తేరి చూడలేక ప్రక్కకు తొలగి, పాంచాల సైన్యంపై తీవ్రములైన బాణాలను ప్రసరింపజేస్తూ చీల్చుకొని ముందుకు సాగాడు. అప్పుడు అర్జునుడు యుద్ధానికి పోయినచోట. (తరువాతి పద్యంతో అన్వయం).

సీ. **క్రీడి యాఁకొనియున్న కేసరి హరిణ చ। యము మీఁదఁ జనునట్టు లా త్రిగర్త**
**వరులపై నరుగంగ వా రట మున్నర్ధ। చంద్రాకృతిగఁ నొడ్డు సంఘటించి**
**కొనియుండి యాతనిఁ గని ప్రీతి నార్పులు। బొబ్బలుఁ జెలఁగంగఁ బొంగుటయును**
**జూచుచు నా సవ్యసాచి మందస్మితుఁ। డై కృష్ణుతోడ నిట్లనియెఁ 'జూడు**

ఆ. **మెక్కుడైన రవము నెసకంపుటుబ్బునఁ। బొదలుచున్నవారు మదము కతన;**
**నెదిరిఁ దమ్ము నించుకేనియు నెఱుఁగరు। వీరు క్రొవ్వి చావ వేఁడి రకట!'** **235**

**ప్రతిపదార్థం:** క్రీడి= అర్జునుడు; ఆఁకొని+ఉన్న= ఆకలిగొన్న; కేసరి= సింహం; హరిణ= జింకల; చయము= గుంపు; మీఁదన్= పైకి; చనునట్టులు= పోయేటట్లు; ఆ త్రిగర్తవరులపైన్= ఆ త్రిగర్తదేశపు వీరులపైకి; అరుగంగన్= పోగా; వారు= ఆ సంశప్తకులు; అటమున్ను+అ= అంతకుముందే; అర్ధచంద్ర+ఆకృతిగన్= అర్ధచంద్రుడి రూపంలో; ఒడ్డు= వ్యూహం; సంఘటించికొని ఉండి= కూర్చుకొని ఉండి; ఆతనిన్= ఆ అర్జునుడిని; కని= చూచి; ప్రీతిన్= సంతోషంతో; ఆర్పులు= అరుపులు; బొబ్బలున్= సింహనాదాలును; చెలగంగన్= రేగగా; పొంగుటయును= ఉబ్బగా; చూచుచున్= చూస్తూ; ఆ సవ్యసాచి= అర్జునుడు; మందస్మితుఁడు+ఐ= చిరునవ్వు గలవాడై; కృష్ణుతోడన్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; చూడుము; ఎక్కుడైన= అధికమైన; రవమున్= ధ్వనులును; ఎసకంపు+ఉబ్బునన్= ఎక్కువైన సంతోషంతో; పొదలుచున్నవారు= అతిశయిస్తున్నారు; మదము= మదం; కతనన్= కారణంగా; ఎదిరిన్= ఎదుటివారిని; తమ్మున్= తమను; ఇంచుక+ఏనియున్= ఏమాత్రం; ఎఱుఁగరు= తెలిసికొనరు; అకట!= అయ్యో! వీరు= ఈ సంశప్తకులు; క్రొవ్వి= బలిసి; చావన్ వేఁడిరి= చావదలచుకొన్నారు;

**తాత్పర్యం:** అర్జునుడు ఆకలిగొన్న సింహం లేళ్లగుంపుపై పడినట్లు ఆ సంశప్తకులపైకి పోగా, వారు అంతకుముందే అర్ధచంద్రాకారంలో వ్యూహాన్ని పన్ని ఉన్నారు. అప్పుడు అర్జునుడిని చూచి సంతోషంతో ఆర్పులు, సింహనాదాలు చెలరేగగా వారు ఉబ్బిపోయారు. అది చూచి అర్జునుడు చిరునవ్వు నవ్వి శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు: 'చూడుము కృష్ణా! సంతోషంతో అరుస్తున్నారు. కాని ఎదుటి వారిని గూర్చి కానీ, తమను గూర్చికానీ వీరి కేమీ తెలియదు. అయ్యో! వీరంతా చావును కోరుకొంటున్నారు.'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని మఱియును. 236**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లని; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** అర్జునుడు ఇంకా అంటున్నాడు.

**క. 'తగు సంతసింపఁ గుజనుల । కగపడని విశిష్టగతికి నస్మద్దివ్యా**
**శుగములచేఁ బోఁగనుటకు । విగత భయత్వంబు సమరవిధి కొప్పుఁగదా!' 237**

**ప్రతిపదార్థం:** సంతసింపన్= సంతోషపడటం; తగున్= యోగ్యమే; కుజనులకున్= నీచులకు; అగపడని= చూడజాలని; విశిష్టగతికిన్= యోగ్యమైన స్థానానికి; అస్మద్= నాయొక్క; దివ్య+ఆశుగములచేన్= దివ్యమైన బాణాలచేత; పోన్+కనుటకున్= పోవటానికి; సమర విధికిన్= యుద్ధక్రియకు; విగత భయత్వంబు= భయపడకపోవటం; ఒప్పున్+కదా!= తగును కదా!

**తాత్పర్యం:** 'సంశప్తకులు సంతోషపడటం యోగ్యమే. నీచులకు అందని వీరస్వర్గాన్ని నా దివ్యాస్త్రాలచేత పొందటానికి వారు యుద్ధరంగంలో నిర్భయత్వాన్ని ప్రదర్శించటం సమర్థనీయమే కదా!'

**వ. అనుచుం జేర నడచి దేవదత్తంబు పూరించిన. 238**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; చేరనడచి= ముందుకు సాగి; దేవదత్తంబు= దేవదత్తమనే శంఖాన్ని; పూరించినన్= ఊదగా.

**తాత్పర్యం:** ఈ విధంగా అంటూ అర్జునుడు ముందుకు సాగి దేవదత్తమనే శంఖాన్ని ఊదగా.

**ఉ. ఆ నినదంబు సాంద్రముగ నాకసమంతయు నిండఁ బర్వుడున్,**
**మానసముల్ గలంగి, యభిమానము ధైర్యముఁ దూలి, విద్విష**
**త్సేన నితాంత నిశ్చలతఁ జిత్ర సమర్పిత మూర్తియో యనం**
**గా, నులి వేది యుండియును గ్రమ్మఱఁ దేఱె రవంబు మీఱఁగన్. 239**

**ప్రతిపదార్థం:** ఆ నినదంబు= ఆ శంఖధ్వని; సాంద్రముగన్= దట్టంగా; ఆకసము= ఆకాశం; అంతయున్= అంతటా; నిండన్= నిండేటట్లుగా; పర్వుడున్= వ్యాపించగా; మానసముల్= మనస్సులు; కలంగి= కలతపడి; అభిమానము= అహంకారం; ధైర్యమున్= ధీరత్వం కూడ; తూలన్= తొలగగా; విద్విషత్+సేన= శత్రువుల సైన్యం; నితాంత= మిక్కిలి; నిశ్చలతన్= కదలికలేనిదై; చిత్ర చిత్తరువులో; సమర్పిత= దింపిన; మూర్తియో= రూపమో; అనన్+కాన్= అనగా; ఉలివు= చలనం; ఏది= నశించి; ఉండియును= ఉండి కూడ; క్రమ్మఱన్= మరల; రవంబు= శంఖధ్వని; మీఱఁగన్= అతిశయించగా; తేఱెన్= తేరుకొన్నది.

**తాత్పర్యం:** అర్జునుడి శంఖనాదం దట్టంగా ఆకాశమంతా నిండగా మనస్సులు కలతపడి, గర్వం, ధైర్యం తొలగిపోయి, శత్రుసైన్యం ఏమాత్రం కదలక, చిత్తరువులోని బొమ్మయో అన్నట్లు చలనం లేనిదై కూడా, శంఖధ్వని ఆగిపోయేసరికి మరల తేరుకొన్నది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. ఇట్లు దెలివొంది యొండొరులం బురికొల్పికొని సంశప్తకు లొక్కపెట్ట ఫల్గునుపయిం బటు శరపరంపరలు గురిసి; రతండు దవ్వుదవ్వులఁ బదియేను వేల రథంబుల వారిం గూల్చినం బెలుచ నబ్బలంబు లడరి.240**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తెలివి+ఒంది= తేరుకొని; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; పురికొ ల్పికొని= ప్రోత్సహించుకొని; సంశప్తకులు= శపథం పూనిన త్రిగర్తాది వీరులు; ఒక్క పెట్టు+అ= ఒకేసారి; ఫల్గునుపయిన్= అర్జునుడిపై; పటు= బలమైన; శర= బాణాల; పరంపరలు = సమూహాలు; కురిసిరి= కురిపించారు; అతండు= ఆ అర్జునుడు; దవ్వు దవ్వులన్= దూర దూరంగా; పదియేనువేల= పదిహేనువేల; రథంబుల వారిన్= రథికులను; కూల్చినన్= హతమార్చగా; పెలుచన్= మిక్కిలి; ఆ+బలంబులు= ఆ సైన్యాలు; అడరి= వ్యాపించి.

**తాత్పర్యం:** ఈ విధంగా తేరుకొని ఒకరినొకరు ప్రోత్సహించుకొని, సంశప్తకులు ఒకేసారి అర్జునుడిపై బలమైన బాణజాలాన్ని కురిపించారు. అర్జునుడు దూరం నుండే పదిహేను వేల రథికులను కూల్చివేశాడు. అపుడు శత్రుసైనికులు అంతటా వ్యాపించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. శరము లొకఁడొకఁడు పదిపది । పరఁగింపఁగ మూఁట మూఁటఁ బార్థుఁడు నొంచెన్;**
**సరి నైదై దేయఁగ న । న్నరుఁ డందఱ రెంట రెంట నలి నొప్పించెన్. 241**

**ప్రతిపదార్థం:** ఒకఁడు+ఒకఁడు= ఒక్కొక్కడు; పది పది; శరములు= బాణాలు; పరఁగింపఁగన్= వేయగా; మూఁటమూఁటన్= మూడు మూడు బాణాలచేత; పార్థుఁడున్= అర్జునుడును; నొంచెన్= బాధించాడు; సరిన్= సరిగా; ఐదు+ఐదు= ఐదైదు బాణాలను; ఏయఁగన్= వేయగా; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; అందఱన్= సైనికులందరినీ; రెంటరెంటన్= రెండు రెండు బాణాలచేత; నలిన్= యోగ్యంగా; నొప్పించెన్= బాధించాడు.

**తాత్పర్యం:** ఒక్కొక్క శత్రు సైనికుడు పది పది బాణాలు వేయగా అర్జునుడు మూడు మూడు బాణాల చొప్పున ప్రయోగించి వారిని నొప్పించాడు. వారు ఒక్కొక్కరు ఐదైదు బాణాలు వేయగా వారందరిని అతడు రెండు రెండు బాణాలు వేసి మిక్కిలి బాధించాడు.

**వ. అట్టియెడ సుబాహుండు గ్రీడి కిరీటంబు దశవిశిఖంబుల నేయ నతం డతనిపై ననేక శరంబులు పరఁగించిన సుశర్ముండును సురథుండును సుధన్వుండును బాసటయై యప్పార్థుం దాఁకిన. 242**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; సుబాహుండు; క్రీడి= అర్జునుడియొక్క; కిరీటంబు= కిరీటాన్ని; దశ= పది; విశిఖంబులన్= బాణాలతో; ఏయన్= వేయగా; అతండు= అర్జునుడు; అతనిపైన్= ఆ సుబాహుడిపై; అనేక= చాలా; శరంబులు= బాణాలు; పరఁగించినన్= వేయగా; సుశర్ముండును= సుశర్మ; సురథుండును= సురథుడు; సుధన్వుండును= సుధన్వుడు కూడ; బాసట+ఐ= సహాయులై; ఆ+పార్థున్= ఆ అర్జునుడిని; తాఁకినన్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** అపుడు సుబాహుడు అర్జునుడి క-రీటాన్ని పది బాణాలతో కొట్టగా, అర్జునుడు అతడిపై అనేక బాణాలను ప్రయోగించాడు. సుశర్మ, సురథుడు, సుధన్వుడు సుబాహుడికి సహాయులై అర్జునుడిని ఎదుర్కొన్నారు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. వారి కేతనములు వడిఁ ద్రుంచి యవ్వీరుఁ । డా సుధన్వు హయ శరాసనముల**
**తునియ లవనిమీఁదఁ దొరఁగించి తన్మస్త । కంబుఁ దునిమె తేరుగముల కుఱికి. 243**

**ప్రతిపదార్థం:** వారి= సుశర్మాదులయొక్క; కేతనములు= పతాకాలు; వడిన్= వేగంగా; త్రుంచి= విరిచి; ఆ+వీరుఁడు= ఆ అర్జునుడు; సుధన్వు= సుధన్వుడి; హయ= గుర్రాలు; శరాసనముల= ధనుస్సుల యొక్క; తునియలు= తునుకలు; అవని మీఁదన్= భూమిపై; తొరఁగించి= పడేటట్లు చేసి; తేరు= రథాల; గములకున్= సమూహాలలోకి; ఉఱికి= పరుగెత్తి; తత్+మస్తకంబు= ఆ సుబాహుడి యొక్క తలను; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు సుశర్మాదుల యొక్క పతాకాలు వెంటనే విరిచి, సుధన్వుడి గుర్రాల, ధనుస్సు యొక్క ఖండాలు భూమిపై పడేటట్లు చేసి, రథాల మధ్యకు ఉరికి, సుబాహుడి తలను ఖండించాడు.

**క. ఇరువే యుద్భట రథములఁ । బొరిగొనుటయుఁ బెఱ బలంబు పురికొనక వెఱం**
**దెరలుచు గుంపులు గట్టుచుఁ । గురుపతి సైన్యంబు పొంతకుం జనుచుండెన్. 244**

**ప్రతిపదార్థం:** ఇరువేయి= రెండువేల; ఉద్భట= గొప్ప; రథములన్= రథాలను; పొరిగొనుటయున్= నశింపజేయగా; పెఱబలంబు= శత్రుసైన్యం; పురికొనక= ఆక్రమించక; వెఱన్= భయంతో; తెరలుచున్= తొలగిపోతూ; గుంపులు+కట్టుచున్= గుమిగూడి; కురుపతి= దుర్యోధనుడి యొక్క; సైన్యంబు= సేన; పొంతకున్= కడకు; చనుచుండెన్= పోతుండినది.

**తాత్పర్యం:** రెండు వేల రథాలను అర్జునుడు నశింపజేసేసరికి శత్రుసేన విజృంభించటం మాని భయంతో తొలగిపోతూ, గుంపులు గుంపులుగా దుర్యోధనుడి సేన కడకు వచ్చి చేరింది.

**వ. ఇట్లు భయభ్రాంతులైన సైనికులం గనుంగొని సుశర్మ యెలుంగెత్తి. 245**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; భయభ్రాంతులు+ఐన= బెదరిపోయిన; సైనికులన్= భటులను; కనుంగొని= చూచి; సుశర్మ= త్రిగర్తాధిపతి అయిన సుశర్మ; ఎలుంగు+ఎత్తి= గొంతెత్తి

**తాత్పర్యం:** ఈ రీతిగా బెదరిపోయిన సైనికులను చూచి సుశర్మ పెద్దకంఠధ్వనితో.

**క. 'వెఱవకుఁ డిట మరలుఁడు ము । న్నెఱుఁగరె? యర్జునునిఁ గురుమహీపతి కడ నే**
**డ్తెఱఁ బలికిన పంతంబులు? । మఱతురె నో రెద్ది రిత్త మరలిన మనకున్?' 246**

**ప్రతిపదార్థం:** వెఱవకుఁడు= భయపడకండి; ఇట= ఈవైపు; మరలుఁడు= తిరిగి రండి; అర్జునునిన్= అర్జునుడిని; మున్ను= పూర్వం; ఎఱుఁగరె?= తెలిసినవారు కారా?; కురుమహీపతి= దుర్యోధనుడి; కడన్= దగ్గర; ఏడ్తెఱన్= పరాక్రమంతో; పలికిన= చెప్పిన; పంతంబులు= శపథాలు; మఱతురె?= మరిచిపోయినారా?; మనకున్= మనందరికి; రిత్త= వట్టిగా; మరలినన్= మళ్ళిపోతే; నోరు+ఎద్ది?= మాట నిలుస్తుందా?

**తాత్పర్యం:** 'సైనికులారా! భయపడకండి. యుద్ధంవైపు మళ్ళండి. అర్జునుడు మీకు కొత్తా? దుర్యోధన సార్వభౌముడి ముందు మీరు చేసిన శపథాలు మరచిపోయారా? వట్టిగా తిరిగి పోతే మన మాటలకు విలువ ఉంటుందా?'

**వ. అని బరవసంబు సేసిన నా సైనికులు గోల్తలసేసి; రప్పుడు నారాయణ గోపాలు రెక్కడెక్కడ యని వారిం గూడి కడంగిన నిస్సాణాది తూర్యరావంబులు సెలంగుటయు వాసవి వాసుదేవు నాలోకించి. 247**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా పలికి; బరవసంబు= ధైర్యం; చేసినన్= చెప్పగా; ఆ సైనికులు= ఆ భటులు; కోల్తల= యుద్ధసన్నాహం; చేసిరి= చేశారు; అప్పుడు= ఆ సమయంలో; నారాయణ గోపాలురు= యాదవ వర్గానికి చెందిన నారాయణ, గోపాల సైన్యాలు; ఎక్కడ+ఎక్కడ= ఎక్కడున్నాయి; అని; వారిన్= వారందరిని; కూడి= కలిసికొని; కడంగినన్= పూనుకోగా; నిస్సాణ+ఆది= నిస్సాణం మొదలైన; తూర్య= వాద్యాల; రావంబులు= ధ్వనులు; చెలంగుటయున్= చెలరేగగా; వాసవి= అర్జునుడు; వాసుదేవునిన్= శ్రీకృష్ణుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని సుశర్మ ధైర్యాన్ని ప్రబోధించగా సైనికులు యుద్ధ సన్నాహం చేశారు. అపుడు నారాయణ గోపాల సైనికులు ఎక్కడెక్కడ అని, వారితో కలిసి యుద్ధానికి పూనుకొనగా, నిస్సాణాది వాద్య ధ్వనులు చెలరేగాయి. అర్జును డపుడు శ్రీకృష్ణుడిని చూచి.

**చ. 'ఒడలను బ్రాణముల్ గలుగ నూరక యుండుదురే త్రిగర్తు లి**
**ప్పుడ నుఱుమాడి పోద మటు వోవఁగనిమ్ము రథమ్ము' నావుడుం**
**గడువెస నా ధనంజయుని కాంక్షిత మెక్కడ నక్క డెల్ల నె**
**క్కుడు ముదమొప్పఁ దేరు రథికోటులపైఁ బఱపెన్ ముకుందుఁడున్. 248**

**ప్రతిపదార్థం:** ఒడలను= దేహంలో; ప్రాణముల్= ప్రాణాలు; కలుగన్= ఉన్నంత వరకు; త్రిగర్తులు= త్రిగర్త దేశపు వీరులు; ఊరక= ఊరికే; ఉండుదురే?= ఉంటారా?; ఇప్పుడు+అ= ఇప్పుడే; నుఱుమాడి= చంపి; పోదము= పాదాం; అటు= ఆ వైపు; రథమ్ము= రథాన్ని; పోవఁగనిమ్ము= పోనిమ్ము; నావుడున్= అనగా; ముకుందుఁడున్= శ్రీకృష్ణుడు కూడా; కడువెసన్= వెంటనే; ఆ ధనంజయుని= ఆ అర్జునుడి; కాంక్షితము= కోరిక; ఎక్కడ= ఏవైపో; అక్కడ= ఆ వైపు; ఎల్లన్= అంతటు; ఎక్కుడు= మిక్కిలి; ముదము+ఒప్పన్= సంతోషం మీరగా; తేరు= రథాన్ని; రథికోటులపైన్= రథికుల సమూహాలపైకి; పఱపెన్= నడిపించాడు.

**తాత్పర్యం:** 'దేహంలో ప్రాణాలు ఉన్నంత వరకు త్రిగర్త దేశపు వీరులు ఊరుకోరు. రథాన్ని వారివైపు నడిపించుము. వారినంతా ఇప్పుడే హతమారుద్దాము' అనగా, శ్రీకృష్ణుడు అర్జునుడి అభిమతానుసారం, ఎక్కడంటే అక్కడ సంతోషంతో; రథికసమూహాలపై రథాన్ని నడిపించాడు.

**క. విమలాంబుదములు పూనిన । విమానమో నాఁగ మెఱసె వెలిమావుల వే**
**గము సొంపున నయ్యరదం; । బమరేంద్రుని లీలఁ బొలిచె నతని సుతుండున్. 249**

**ప్రతిపదార్థం:** ఆ+అరదంబు= ఆ రథం; వెలిమావుల= ఉచ్చైశ్రవం వంటి తెల్లని గుర్రాల; వేగము= జవం యొక్క; సొంపునన్= సమృద్ధిచేత; విమల+అంబుదములు= తెల్లని మేఘాలు; పూనిన= కట్టిన; విమానమో= ఆకాశంలో విహరించే రథమో; నాఁగన్= అనునట్లు; మెఱసెన్= ప్రకాశించింది; అమరేంద్రుని= ఇంద్రుడి; లీలన్= వలె; అతని= ఇంద్రుడి యొక్క; సుతుండున్= కొడుకైన అర్జునుడును; పొలిచెన్= వెలుగొందాడు.

**తాత్పర్యం:** ఆ అర్జునుడి రథం ఇంద్రుడి ఉచ్చైశ్రవం వంటి తెల్లని గుర్రాల వేగసమృద్ధి వలన, తెల్లని మేఘాలు పూనిన విమానమో అన్నట్లు ప్రకాశించింది. ఇంద్రుడివలె అర్జునుడు ఒప్పారాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష - ఉపమానుప్రాణితం.

**వ. ఇట్లు మండల ప్రచారగత ప్రత్యాగతాది వివిధ గతులం దేరు సంచరింపం జేయుచు నిలింపకోటికిం గన్నుల పండువు సేయం బుండరీకాక్షుం గనుంగొని నారాయణ గోపాలురు గుపితాత్ములై యర్జున దుర్యోధనులు ద్వారకా నగరంబునకుం బోయిన నాఁడు కృష్ణుతోడి సరిగా దుర్యోధనుఁడు దమ్ముఁ గోరికొనిన వాఁడగుటం జేసి యీసునం బేర్చి య న్నరనారాయణుల మేనుల నానాస్త్రంబులు నినిచిన నరుండు దేవదత్తంబు పూరించి యవష్టంభంబునం ద్వష్టయిచ్చిన మహాస్త్రంబు ప్రయోగించినం దత్ప్రభావంబున. 250**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మండల= గుండ్రంగా; ప్రచార= తిరుగటం; గత= పోవడం; ప్రత్యాగత= తిరిగి రావటం; ఆది= మొదలైన; వివిధ= అనేకమైన; గతులన్= నడకలచేత; తేరు= రథం; సంచరింపన్+చేయుచున్= త్రిప్పుతూ; నిలింపకోటికిన్= దేవతా సమూహానికి; కన్నుల పండువు= కనువిందు; చేయన్= చేయగా; పుండరీక+అక్షున్= తెల్లతామరల వంటి కన్నులు గల కృష్ణుడిని; కనుంగొని= చూచి; నారాయణ గోపాలురు= నారాయణులు అనేపేరుగల గోపాలురు (కృష్ణుడి సైనికులు;) కుపితాత్ములు+ఐ= కోపించినవారై; అర్జున; దుర్యోధనులు; ద్వారకానగరంబునకున్= ద్వారకాపురికి; పోయిననాఁడు= వెళ్ళిననాడు; కృష్ణుతోడి= కృష్ణుడితో; సరిగాన్= సమానంగా; దుర్యోధనుఁడు; తమ్ముత్= తమను; కోరికొనినవాఁడు= కోరుకొన్నవాడు; అగుటన్+చేసి= కావటం వలన; ఈసునన్= అసూయతో; పేర్చి= విజృంభించి; ఆ+నరనారాయణుల= ఆ కృష్ణార్జునుల యొక్క; మేనుల= దేహాలపై; నానా+అస్త్రంబులు= అనేకాలైన బాణాలు; నినిచినన్= నింపగా; నరుండు= అర్జునుడు; దేవదత్తంబు= దేవదత్తమనే శంఖాన్ని; పూరించి= ఊది; అవష్టంభంబునన్= గర్వంతో; త్వష్ట= విశ్వకర్మ; ఇచ్చిన= ఇచ్చినట్టి; మహా+అస్త్రంబు= గొప్ప అస్త్రం; ప్రయోగించినన్= వేయగా; తద్+ప్రభావంబునన్= దాని మహిమచేత.

**తాత్పర్యం:** ఈ విధంగా వర్తులాకారంగా తిరగటం, పోవటం, తిరిగి రావటం వంటి బహువిధాలైన గమనాలతో రథాన్ని నడుపుతూ, దేవతలకు కనువిందు చేయగా, కృష్ణుడిని చూచి, నారాయణ గోపాలాది కృష్ణుడి సైనికులు కోపించినవారై, అర్జునుడు, దుర్యోధనుడు ద్వారకా నగరానికి పోయిననాడు కృష్ణుడికి సరిగా దుర్యోధనుడు తమను కోరుకొనటం వలన ఈర్ష్యతో విజృంభించి, కృష్ణార్జునులపై బహువిధాలైన అస్త్రాలను ప్రయోగించారు. అపుడు అర్జునుడు దేవదత్త శంఖాన్ని పూరించి గర్వంతో విశ్వకర్మ ఇచ్చిన మహాస్త్రాన్ని ప్రయోగించగా, దాని మహిమతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. గాండీవి చందమయి వా । రొండొరులకుఁ దోఁచి యొకళు లొకళుల నానా**
**చండాస్త్ర శస్త్రసముదయ । ఖండితులుగఁ జేసి పడిరి కలనం గలయన్. 251**

**ప్రతిపదార్థం:** గాండీవి= గాండీవం ధనుస్సుగా గల అర్జునుడి; చందమయి= విధమయి; వారు= ఆ సైనికులు; ఒండు+ఒరులకున్= ఒకరికొకరు; తోఁచి= కనిపించి; ఒకళులన్= ఒకరిని; ఒకళులు= ఒకరు; చండ= వాడిగల; అస్త్ర= మంత్రపూర్వకంగా వేసే బాణాల; శస్త్ర= ఖడ్గాదుల; సముదయ= సమూహంచేత; ఖండితులుగన్= తెగినవారుగా; చేసి= ఒనర్చికొని; కలనన్= యుద్ధభూమిలో; కలయన్+పడిరి= అంతటా నేలకూలారు.

**తాత్పర్యం:** ఆ సైనికులు ఒకరికొకరు గాండీవధారి అయిన అర్జునునివలె తోచి, ఒకరినొకరు వాడిగల శస్త్రాలతో ఖండించుకొని యుద్ధభూమిలో అంతటా నేలకూలారు.

**వ. ఇమ్మెయిఁ గృతార్థంబైన దివ్యాస్త్రంబు పదంపడి శాంతం బగుటయు హతశేషులు వోక పొదివి రథరథ్యకేతు సహితంబుగా సవ్యసాచి నాభీల శరజాల సంవృతుం జేసిన. 252**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; కృతార్థంబు+అయిన= సఫలమైన; దివ్య+అస్త్రంబు= దేవతా సంబంధమైన అస్త్రం; పదంపడి= తర్వాత; శాంతంబు+అగుటయున్= శాంతించగా; హతశేషులు= చావగా మిగిలినవారు; పోక= పారిపోవక; పొదివి= ఆక్రమించి; రథ= రథం; రథ్య= గుర్రాలు; కేతుసహితంబుగాన్= పతాకతోబాటు; సవ్యసాచిన్= అర్జునుడిని; ఆభీల= భయంకరమైన; శరజాల= బాణాల సమూహంతో; సంవృతున్= కప్పినవాడిగా; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** ఈ విధంగా శత్రువులను సంహరించటంలో సఫలమైన ఆ మహాస్త్రం శాంతించగా, మరణించగా మిగిలినవారు పారిపోక - రథం, గుర్రాలు, కేతనంతో సహా అర్జునుడిని భయంకరమైన బాణజాలంతో చుట్టుముట్టగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆ పార్థుఁడు గోపానల । దీపితుఁడై విశిఖశిఖల తీవ్రనిహతి న**
**త్తూపులగమి నేర్చి జముని । ప్రోపు గుడువఁ బుచ్చె వారిఁ బురువంశనిధీ! 253**

**ప్రతిపదార్థం:** పురువంశనిధీ!= ధృతరాష్ట్ర మహారాజా!; ఆ పార్థుఁడు= ఆ అర్జునుడు; కోప= కోపమనే; అనల= అగ్నిచే; దీపితుఁడు+ఐ= వెలుగొందినవాడై; విశిఖ= బాణాలనే; శిఖల= మంటల యొక్క; తీవ్ర= తీక్ష్ణమైన; నిహతిన్= దెబ్బచేత; తూపుల= బాణాల యొక్క; గమిన్= సమూహాన్ని; ఏర్చి= దహించి; వారిన్= ఆ భటులను; జముని= యముడి; ప్రోపు= పోషణం; కుడువన్= అనుభవించేటట్లు; పుచ్చెన్= చంపాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఆ అర్జునుడు కోపమనే అగ్నిచేత మండినవాడై, బాణాలనే జ్వాలల దెబ్బతో ఆ బాణ సమూహాన్ని దహించి, శత్రు సైనికులను యమధర్మరాజును సేవించటానికి పంపించాడు.

**విశేషం:** అలం: రూపకం. అర్జునుడు వారిని చంపాడనటానికి మారుగా - 'జమునిప్రోపు గుడువఁ బుచ్చె' ననటంచేత అలంకారం పర్యాయోక్తం. ప్రకారాంతరము చేత గమ్యార్థ సిద్ధి అయ్యేనేని పర్యాయోక్తాలంకారం. శత్రుసైనికులపైకి విజృంభించి వారిని హతమార్చడంలో వీరరసం వ్యక్తమౌతున్నది.

**వ. ఇవ్విధంబున విజృంభించి యట్టహాసంబు సేయుటయుం దుండి మగధ కేరళ మచ్ఛిల్లికాదు లడరి సాయక నికాయంబులం గప్పిన. 254**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; విజృంభించి= పైకెగసి; అట్టహాసంబు+చేయుటయున్= పెద్దగా నవ్వగా; తుండి, మగధ, కేరళ, మచ్ఛిల్లికాదులు= తుండి, మగధ, కేరళ, మచ్ఛిల్లికాది దేశాల వీరులు; అడరి= విజృంభించి; సాయక= బాణాల; నికాయంబులన్= గుంపులతో; కప్పినన్= ఆక్రమించగా.

**తాత్పర్యం:** అర్జునుడు ఇట్లా విజృంభించి పెద్దగా నవ్వేసరికి, తుండి, మగధ, కేరళ, మచ్ఛిల్లికాది దేశాల వీరులు పైకెగసి, అతడిని బాణజాలంతో కప్పివేయగా.

**క. నానాస్త్రంబుల నాతఁడు । పీనుఁగు పెంటలుగఁ జేయఁ బిరుసనక మహా**
**సేనలు దోడ్తో డగ్గరి । యా నరుపైఁ బెల్లుగురిసె నమ్ముల వానల్. 255**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ అర్జునుడు; నానా+అస్త్రంబులన్= అనేక బాణాలతో; పీనుఁగు పెంటలుగన్= శవాల కుప్పలుగా; చేయన్= చేయగా; మహాసేనలు= గొప్ప సైన్యాలు; బిఱుసనక= గర్వం తగ్గక; తోడ్తోన్= వెంబడే; డగ్గరి= సమీపించి; ఆ నరుపైన్ ఆ అర్జునుడిపై; అమ్ములవానల్= బాణవర్షాలు; పెల్లు= అధికంగా; కురిసెన్= కురిపించాయి.

**తాత్పర్యం:** అర్జునుడు బహువిధాలైన బాణాలతో శత్రువుల మూకలను పీనుగు పెంటలుగా మార్చగా, ప్రబలములైన ఆ సేనలు అహంకారం ఏమాత్రం తగ్గక వెంటనే అతడిని చేరి బాణవర్షాన్ని కురిపించాయి.

**క. కరి తురగ రథపదాతులు । బెరసి కదిసి చుట్టుముట్టి భీషణ హేతి**
**స్ఫురణ మెఱయఁ జేరిన న । చ్చెరువుగ విజయుండు సించి చెండాడె వడిన్. 256**

**ప్రతిపదార్థం:** కరి= ఏనుగులు; తురగ= గుర్రాలు; రథ= రథాలు; పదాతులు= కాల్బలాలు; బెరసి= కలిసి; కదిసి= సమీపించి; చుట్టుముట్టి= ఆక్రమించి; భీషణ= భయంకరమైన; హేతి= ఆయుధాల యొక్క; స్ఫురణ= అదరటం; మెఱయన్= ప్రకాశించగా; చేరినన్= సమీపించేసరికి; విజయుండు= అర్జునుడు; అచ్చెరువుగన్= ఆశ్చర్యం కలిగేటట్లు, చించి= చీల్చి; వడిన్= వెంటనే; చెండాడెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** శత్రువుల చతురంగ బలాలు కలిసి, సమీపించి చుట్టుముట్టి, భయంకరమైన ఖడ్గాద్యాయుధాలు చకచక మెరుస్తుండగా చేరేసరికి, అర్జునుడు వాటన్నిటినీ ఆశ్చర్యం గొలిపేటట్లు వెంటనే చీల్చి చెండాడాడు.

**వ. సంశప్తకులు మఱియును. 257**

**ప్రతిపదార్థం:** సంశప్తకులు= ఆ శపథాలు చేసిన వీరులు; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** సంశప్తకులు ఇంకా విజృంభించి.

**క. పెరయీఁగలగతిఁ గవియుచుఁ । బొరిఁ బొరిఁ గడుఁదురుల పగిదిఁ బొదువుచు నెరకై**
**వెరవునఁ గాకులుఁ గ్రోఁతులుఁ । బరువడిఁ జీకాకుపఱుచు భంగి నలఁచుచున్. 258**

**ప్రతిపదార్థం:** పెర ఈఁగల= తేనెటీగల; గతిన్= వలె; కవియుచున్= మీదికి ఉరుకుతూ; పొరిన్+పొరిన్= మాటిమాటికి; కడుఁదురుల= కందిరీగల; పగిదిన్= వలె; పొదువుచున్= కమ్ముతూ; ఎరకై= ఆహారానికై; వెరవునన్= ఉపాయంగా; కాకులున్= కాకులు; క్రోఁతులున్= కోతులును; పరువడిన్= వరుసగా; చీకాకుపఱుచు= బాధించే; భంగిన్= విధంగా; అలఁచుచున్= కలతపెట్టుతూ.

**తాత్పర్యం:** సంశప్తకులు తేనెటీగలవలె మీది కురుకుతూ, మాటిమాటికి కందిరీగల వలె కమ్ముకొంటూ, కాకులు, కోతులు తిండికై ఉపాయంగా చికాకు పరిచేటట్లు కలతపెట్టుతూ.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. పెనంగి; రందుఁ గొందఱు వీరావేశంబున. 259**

**ప్రతిపదార్థం:** పెనంగిరి= పోరారు; అందున్= వారిలో; కొందఱు= కొంతమంది సైనికులు; వీర+ఆవేశంబునన్= మిక్కిలి మైమరచి.

**తాత్పర్యం:** సంశప్తకులు యుద్ధం చేశారు. అందులో కొందరు సైనికులు పూర్తిగా మైమరచి ఆవేశంతో.

**సంశప్తకులందఱు నొక్కపెట్ట యర్జునురథంబుపైఁ బడుట (సం. 7-18-20)**

**క. అరదంబులు మొదలగు ను । ద్ధుర వాహనకోటి డిగ్గి దుర్దాంత గతిం**
**దురగంబులపై హరిపై । నరుపై నూడుకొనఁ బడిరి నలి నార్పులతోన్. 260**

**ప్రతిపదార్థం:** అరదంబులు= రథాలు; మొదలగు= మొదలైన; ఉద్ధుర= సమర్థమైన; వాహన= వాహనాల; కోటి= సమూహం; డిగ్గి= దిగి; దుర్దాంతగతిన్= అణచరాని విధంగా; తురగంబులపైన్= గుర్రాలమీద; హరిపైన్= కృష్ణుడిమీద; నరుపైన్= అర్జునుడిమీద; ఊడుకొనన్= కుచ్చుకొనేట్లు; నలిన్= అధికమైన; ఆర్పులతోన్= అరుపులతో; పడిరి= పడ్డారు.

**తాత్పర్యం:** రథాలు మొదలైన వాహనాలు దిగి సంశప్తకులు అరుస్తూ, అతివేగంగా గుర్రాలెక్కి, కృష్ణుడి మీద, అర్జునుడి మీద విరుచుకొని పడ్డారు.

**వ. ఇత్తెఱంగునం జేయి గాలార్పనుం జూడ్కి వఱపను రాకుండునట్లుగా గుంపులు గొనం బైపైం దొరంగినం గృష్ణు లగపడిరి తెగిరి మడిసిరి మ్రగ్గిరను మాటలతోఁ దత్సైన్యంబుల సింహనాదంబులుఁ దూర్యనినదంబులుఁ జెలంగె; నప్పుడు సెమర్చి చేడ్పడి వసుదేవ నందనుండు. 261**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; చేయి; కాలు; అర్పనున్= ఆడుటకు; చూడ్కి= చూపు; వఱపనురాక+ఉండునట్లుగాన్= ప్రసరించనీయకుండా; గుంపులు+కొనన్= గుంపులు గట్టి; పైపైన్= మీద మీద; తొరంగినన్= పడగా; కృష్ణులు= కృష్ణార్జునులు; అగపడిరి= దొరికారు; తెగిరి= ఖండితులైనారు; మడిసిరి= చచ్చారు; మ్రగ్గిరి= నశించారు; అను= అనే; మాటలతోన్= పలుకులతో; తద్= ఆ సంశప్తకుల; సైన్యంబులన్= సేనలలో; సింహనాదంబులున్= సింహగర్జలును; తూర్యనినదంబులున్= వాద్యాల మ్రోతలును; చెలంగెన్= ధ్వనించాయి; అప్పుడు= ఆ సమయంలో; చెమర్చి= చెమటబట్టి; చేడ్పడి= బాధపడి; వసుదేవనందనుండు= వసుదేవుడి పుత్రుడైన శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** ఇట్లు కాళ్ళు చేతులు ఆడకుండా; చూపులు ప్రసరించటానికి కూడ అవకాశంలేకుండా గుంపులు గుంపులుగా మీద విరుచుకుపడగా, 'కృష్ణార్జునులు దొరికారు, ఖండించబడ్డారు, చచ్చారు, నశించారు' అనే మాటలతోపాటు ఆ సంశప్తకుల సైన్యంలో సింహనాదాలు, వాద్యధ్వనులు చెలరేగాయి. అప్పుడు కృష్ణుడు చెమటబట్టి, బాధతో.

**ఆ. 'ఎచట నున్నవాఁడ? వేమైతి? ప్రాణానఁ । గలవె? యేను నిన్నుఁ గానకునికిఁ**
**దలఁకుచున్నవాఁడ ధైర్యధౌరేయ! నీ । యెలుఁగు సూపవే సురేంద్ర తనయ!' 262**

**ప్రతిపదార్థం:** ధైర్యధౌరేయ!= ధైర్యభారాన్ని మోసే అర్జునా!; ఎచటన్= ఎక్కడ; ఉన్నవాఁడవు?= ఉన్నావు?; ఏమి+ఐతి?= ఏమైనావు?; ప్రాణానన్= ప్రాణంతో; కలవె?= ఉన్నావా?; నిన్నున్= నిన్ను; కానక+ఉనికిన్= చూడలేనందుకు; తలఁకుచున్నవాఁడన్= భయపడుతున్నాను; ఓ సురేంద్ర తనయ!= దేవేంద్రుడి కుమారుడవైన అర్జునా!; నీ= నీయొక్క; ఎలుఁగు= కంఠ ధ్వనిని; చూపవే!= వినిపించవా!

**తాత్పర్యం:** 'మహాధైర్యవంతుడవైన అర్జునా! ఎక్కడున్నావు? ఏమైనావు? ప్రాణంతో ఉన్నావా? నీవు కనిపించకపోవటం వల్ల భయపడుతున్నాను. ఓ సురేంద్ర తనయా! నీ స్వరం వినిపించుము.'

**విశేషం:** 'ధైర్యధౌరేయ!' 'సురేంద్రతనయ!' అనే సంబోధనలు సాభిప్రాయాలు. వీటివలన అర్జునుడి శౌర్యం, అమరత్వం వ్యక్తమై ఎంతటి విపత్తులోనైనా అతడు ఎవ్వరికి లొంగేవాడు కాడని తెలుస్తున్నది. కృష్ణుడి మాటలలో చింత, విషాదం, ఉద్వేగం వ్యక్తమవుతున్నవి.

**వ. అనిన విని యతండు ముకుందుని మానుషభావం బూహించుచు నుత్సాహంబు వాటించి. 263**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; అతండు= ఆ అర్జునుడు; ముకుందుని= కృష్ణుడియొక్క; మానుషభావంబు= మనుష్యుడు అనే భావాన్ని; ఊహించుచున్= తలుస్తూ; ఉత్సాహంబు= ఉత్సాహాన్ని; పాటించి= చూపి.

**తాత్పర్యం:** అనగా విని అర్జునుడు శ్రీకృష్ణుడి మానవభావాన్ని మనసులో భావించి ఉత్సాహం పొంగగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అనిలాస్త్రంబు ప్రయోగిం । చిన సంశప్తకులు దెసలఁ జెదరి చొరువు చా**
**డ్పునఁ దూలఁగ బహువిధ శర । వినిహతి బడలువడఁ జేసె వెన్నుఁడు మెచ్చన్. 264**

**ప్రతిపదార్థం:** వెన్నుఁడు= శ్రీకృష్ణుడు; మెచ్చన్= ప్రశంసించేటట్లు; అనిల+అస్త్రంబు= వాయవ్యాస్త్రం; ప్రయోగించినన్= వేయగా; సంశప్తకులు= సుశర్మాదులు; దెసలన్= దిక్కులకు; చెదరి= చెదిరిపోయి, చొరువు= ఎండిన ఆకు; చాడ్పునన్= వలె; తూలఁగన్= రాలగా, బహువిధ= పెక్కురకాల; శర= బాణాల; వినిహతి= దెబ్బలతో; బడలుపడన్+చేసెన్= బాధపడేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు ప్రశంసించేటట్లు అర్జునుడు వాయవ్యాస్త్రం ప్రయోగించగా, సంశప్తకులు అంతటా చెదరిపోయి ఎండుటాకులవలె తూలిపడ్డారు. అపుడు అతడు అనేక బాణాలను వేసి వారిని బాధించాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఇట అర్జునుడి పరాక్రమం వలన వీర రసం వ్యక్తమౌతున్నది.

**క. శిరము లురంబులు గరములు । చరణంబులు రూపు మాయ శకలములై సం**
**గరధరఁ దొరఁగిరి యోధులు । గరితురగ రథాస్త్ర శస్త్ర ఖండంబులతోన్. 265**

**ప్రతిపదార్థం:** శిరములు= తలలు; ఉరంబులు= గుండెలు; చరణంబులు= కాళ్ళు; రూపుమాయన్= ఆకారాలు చెడిపోయేటట్లు; శకలములు+ఐ= ముక్కలై; సంగరధరన్= యుద్ధభూమిలో; కరి, తురగ, రథ+అస్త్ర, శస్త్ర ఖండములతోన్= ఏనుగుల, గుర్రాల, రథాల, మంత్రసహితమైన బాణాల, మంత్ర సహితంగాని బాణాల ముక్కలతో సహా; యోధులు= వీరులు; తొరఁగిరి= కూలారు.

**తాత్పర్యం:** యుద్ధభూమిలో శూరులు వారి తలలూ, గుండెలూ, కాళ్ళూ ఆకారాలు గుర్తుపట్టలేనట్లుగా ముక్కలు ముక్కలై, ఏనుగుల, గుర్రాల, రథాల, అస్త్రశస్త్రాల శకలాలతో సహా నేల కూలారు.

**వ. అట్లు గసిమసంగి కిరీటి కల్పాంతపురాంతకుండునుంబోలె బారిసమరుచుండ వెండియు వెఱచఱవక తఱిమి పెనంగు నబ్బలంబు లతని బాణపరంపరల బలితంపుఁ బరపునం జేసి. 266**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; కసిమసంగి= విజృంభించి; కిరీటి= అర్జునుడు; కల్పాంత= ప్రళయకాలంలోని; పుర+అంతకుండునున్= రుద్రుడి; పోలెన్= వలె; బారిసమరుచుండన్= చంపుతుండగా; వెండియున్= మరియు; వెఱచఱవక= భయపడక; తఱిమి= వెనుదగిలి; పెనంగు= యుద్ధం చేసే; ఆ+బలంబులు= ఆ సంశప్తక సైన్యాలు; అతని= అర్జునుడి యొక్క; బాణ పరంపరల= బాణ సమూహాలయొక్క; బలితంపు= బలిష్ఠమైన; పరపునన్+చేసి= వ్యాప్తిచేత.

**తాత్పర్యం:** ఆ విధంగా విజృంభించి, అర్జునుడు ప్రళయకాలంలోని రుద్రుడివలె వధిస్తుండగా, శత్రుసైన్యాలు భయపడక వెనుదగిలి పోరు సాగించాయి. అపుడు అర్జునుడు బాణజాలాన్ని దట్టంగా ప్రసరింపజేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. కూలురూపుఁ, దన్నికొనియెడు రూపును, । నొఱలు రూపు, నేల కొఱగు రూపు,**
**బొరలు రూపు నయ్యె నరవాజి గజములు । ప్రధనభూమి ఘోరభంగి గాఁగ. 267**

**ప్రతిపదార్థం:** నర= భటులు; వాజి= గుర్రాలు; గజములు= ఏనుగులు; ప్రధనభూమి= యుద్ధపు నేల; ఘోరభంగి= భయంకరమైన విధం; కాఁగన్= కాగా; కూలురూపున్= కూలే రూపం; తన్నికొనియెడు= గిలగిలతన్నుకొనే; రూపునున్= రూపం; ఒఱలు= ఏడ్చునట్టి; రూపున్= రూపం; నేలకున్= భూమిపైకి; ఒఱగు= ఒరిగిపోయిన; రూపున్= ఆకారం; పొరలు= పొరలాడే; రూపున్= రూపం కలవి; అయ్యెన్= అయినవి.

**తాత్పర్యం:** యుద్ధభూమి భయంకర రూపం తాల్చగా, భటులు, గుర్రాలు, ఏనుగులు కూలిపోయి, గిలగిల తన్నుకొంటూ, విలపిస్తూ, నేలకు ఒరిగి పొర్లాడే రూపాలు ధరించాయి.

**విశేషం:** అర్జునుడి పరాక్రమం వలన బీభత్సం పాలైన కౌరవసైన్యం ఇందులో వర్ణించబడింది.

**వ. ఇవ్విధంబున నసమ సమర తత్పరులై తనవలన నేమఱి యా మఱందియు బావయు నట్లుండ, నిక్కడ ధర్మజుండు పురికొల్ప నుదగ్ర సైన్యంబులు మన మొనలు దలంకం దఱిమె; నాచార్యుండును ధర్మసూను సైన్యంబులు దలంకఁ దఱిమె; నప్పుడు నీ కొడుకు దుర్ముఖుం డతనికిఁ బ్రియంబుగా ధృష్టద్యుమ్నుం దలపడినం గురుపాంచాల కుమార వర్గంబు లగ్గలికం గవిసి పోరె; నట్టియెడ. 268**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; అసమ= సాటిలేని; సమర= యుద్ధంలో; తత్పరులు+ఐ= లీనమైనవారై; తనవలనన్= తనను; ఏమఱి= ఉపేక్షించి; మఱందియున్= మరది అయిన అర్జునుడును; బావయున్= బావ అయిన కృష్ణుడును; అట్లు+ఉండన్= శత్రువులతో తగులు కొని ఉండగా; ఇక్కడన్= పాండవ పక్షంలో; ధర్మజుండు= ధర్మరాజు; పురికొల్పన్= ప్రోత్సహించగా; ఉదగ్ర సైన్యంబులు= గొప్ప సేనలు; మన= మన కౌరవుల; మొనలు= సైన్యాలు; తలంకన్= భయపడగా; తఱిమెన్= పరుగెత్తించాయి; ఆచార్యుండును= ద్రోణుడును; ధర్మసూను సైన్యంబులు= ధర్మరాజు యొక్క సేనలు; తలంకన్= చలించగా; తఱిమెన్= ఉరికించాడు; అప్పుడు; నీ కొడుకు= నీ పుత్రుడైన; దుర్ముఖుండు= దుర్ముఖుడనే వాడు; అతనికిన్= ద్రోణుడికి; ప్రియంబుగాఁన్= సంతసమయ్యేటట్లు; ధృష్టద్యుమ్నున్= పాండవసేనాని అయిన ధృష్టద్యుమ్నుడిని; తలపడినన్= ఎదుర్కొనగా; కురు= కౌరవుల, పాంచాల= పాంచాల దేశపు; కుమార= పుత్రుల; వర్గంబులు= సమూహాలు; అగ్గలికన్= ఉత్సాహంతో; కవిసి= ఉరికి; పోరెన్= యుద్ధం చేశాయి; అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఇట్లా సాటిలేని యుద్ధంలో తగుల్కొని ధర్మజుడి నుండి దూరమై కృష్ణార్జునులు పోరు సల్పుతుండగా, పాండవ పక్షాన ధర్మరాజు ప్రోత్సాహంతో మహాసైన్యాలు కౌరవ సేనలు బెదరిపోయేటట్లు తరిమాయి. ద్రోణుడును ధర్మరాజు సైన్యాలు బెదరేటట్లు తరిమి కొట్టాడు. అప్పుడు నీ పుత్రుడైన దుర్ముఖుడు ద్రోణుడికి సంతోషమయ్యేటట్లు ధృష్టద్యుమ్నుడిని ఎదుర్కొనగా కురు కుమారులు, పాంచాల వీర కుమారులు ఉత్సహించి పోరుసల్పారు. అపుడు.

**చ. గురుఁ డను తీవ్రమారుతము కోల్తల కోర్వక ధర్మపుత్ర బం**
**ధుర బల వారిదోత్కరము దూలుడు నాతఁ డదల్చి వీర సుం**
**దరముగఁ జేయి వీచిన నుదగ్ర గతిం బురికొన్నఁ గౌరవ**
**స్ఫురణము నుద్భటం బగుడు సూర్యుని మ్రింగె ధరా పరాగముల్. 269**

**ప్రతిపదార్థం:** గురుఁడు+అను= ద్రోణాచార్యుడనే; తీవ్ర మారుతము= వేగంగల గాలియొక్క; కోల్తలకున్= పరాక్రమానికి; ఓర్వక= సహించక; ధర్మపుత్ర= ధర్మరాజు యొక్క; బంధుర= దట్టమైన; వారిద= మేఘాల; ఉత్కరము= సమూహం; తూలుడున్= తూలగా; ఆతఁడు= ఆ ధర్మరాజు; అదల్చి= అదలించి; వీర= వీరత్వం; సుందరముగన్= ఒప్పగా; చేయి= చెయ్యి; వీచినన్= వీచగా; ఉదగ్ర= భయంకరమైన; గతిన్= నడకతో; పురికొన్నన్= క్రమ్మగా; కౌరవ స్ఫురణమున్= కౌరవుల సంచలనం; ఉద్భటంబు= అధికం; అగుడున్= కాగా; ధరా= నేలయొక్క; పరాగముల్= దుమ్మురేణువులు; సూర్యునిన్= సూర్యుడిని; మ్రింగెన్= కప్పాయి.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడనే తీవ్రమైన వాయువు యొక్క పరాక్రమానికి సహించక ధర్మరాజుయొక్క దట్టమైన సైన్యమనే మేఘ సమూహం తూలింది. అపుడు ధర్మజుడు అదలించి వీరత్వం ఒప్పేటట్లు చెయ్యి వీచగా, అతడి సైన్యం ఉద్ధతమైన గమనంతో క్రమ్ముకొనగా, కౌరవుల సంచలనం మితిమీరటం వలన, ధూళికణాలు సూర్యుడిని క్రమ్మివేశాయి.

**విశేషం:** గాలికి మేఘాలకు గల పరస్పర వైరుధ్యాన్ని కౌరవ పాండవ సైన్యాలపై ఆరోపించి, వాయువు, మేఘాలు ఒకదానిని మించి ఒకటి ఆధిక్యం పొందినట్లు, ఆయా సైన్యాలు ఒకదానిని మించి మరొకటి పైచెయ్యిగా ఉన్నట్లు వర్ణించబడింది. ఉభయ సైన్యాల యుద్ధోత్సాహం వలన వీరరసం వ్యక్తమౌతున్నది. 'వీర సుందరము' - చేయివీచుటలో ధర్మజుడి వీరమూర్తి ప్రత్యక్షమవుతున్నది.

**వ.** **ఇబ్బంగి నుభయ సైనికులును గలయన్ బెరసిన మణిభూషణ కిరణ జాలంబుల కతంబున ధూళికృతంబు లగు తిమిరంబుల గెలిచి పోరుచుండ ధారాళ రక్తసిక్తం బై యారజఃపటలం బడంగుటయు.** **270**

**ప్రతిపదార్థం:** ~~ఈ~~+భంగిన్= ~~ఈ~~ విధంగా; ఉభయ సైనికులును= కౌరవుల, పాండవుల భటులు కూడా; కలయన్ బెరసినన్= కలిసి చొచ్చుకొనిపోగా; మణి= మణులతో చేసిన; భూషణ= ఆభరణాల; కిరణ= వెలుగులయొక్క; జాలంబుల= సమూహాల; కతంబునన్= కారణంగా; ధూళికృతంబులు+అగు= దుమ్మువల్ల కలిగిన; తిమిరంబులన్= చీకట్లను; గెలిచి= జయించి; పోరుచుండన్= యుద్ధం చేస్తుండగా; ధారాళ= మిక్కిలి; రక్త= నెత్తురుచేత; సిక్తంబు+ఐ= తడిసి; ఆ రజః= ఆ దుమ్ము యొక్క; పటలంబు= గుంపు; అడంగుటయున్= అణగిపోగా.

**తాత్పర్యం:** ఇట్లా కౌరవ పాండవ సైనికులు పరస్పరం చొచ్చుకొని పోయి, రత్నాలు పొదిగిన ఆభరణాల వెలుగులతో దుమ్ముచేత ఏర్పడ్డ చీకట్లను గెలిచి యుద్ధం చేస్తుండగా, మిక్కుటమైన రక్తంతో తడిసి ఆ ధూళికణజాలం అణగిపోగా.

**క.** **ఇరు వాఁగును దార్కొని వి । స్ఫురణ మెఱయ నాయుధముల పొగ లేని శిఖల్**
**దరతరమ యెగయఁ బోరఁగ । ధరఁ జతురంగములు నద్భుతంబుగఁ గెడసెన్.** **271**

**ప్రతిపదార్థం:** ఇరు వాఁగును= రెండు పక్షాల వారును; తార్కొని= సమీపించి; విస్ఫురణ= విశేషంగా చలించటం; మెఱయన్= ప్రకాశించగా; ఆయుధముల= ఖడ్గ, బాణాది శస్త్రాల యొక్క; పొగలేని= ధూమం లేని; శిఖల్= మంటలు; తరతరము+అ= క్రమంగా; ఎగయన్= పైకిలేచేటట్లు; పోరఁగన్= యుద్ధం చేయగా; ధరన్= భూమిపై; చతురంగములున్= రథాలు, గజాలు, గుర్రాలు, పదాతులు అనే నాల్గు విధాలైన సేనలును; అద్భుతంబుగన్= ఆశ్చర్యపడేటట్లు; కెడసెన్= కూలాయి.

**తాత్పర్యం:** కౌరవ, పాండవ సేనలు రెండును సమీపించి, తీవ్రమైన చలనం బయలుపడగా, ఖడ్గాద్యాయుధాల నుండి జ్వాలలు అంతులేకుండా పైకెగయగా పోరు సల్పేసరికి, రథాది చతురంగ బలాలు ఆశ్చర్యం గొలిపేటట్లు భూమిపై పడిపోయాయి.

**క.** **కరిఘటలు దురగముల దళ । మరదంబుల మొత్త మనక యడరి వడిం గా**
**ల్వురు మ్రగ్గఁ జేయుచును మ్ర । గ్గిరి విస్మయ మొలయఁ జూచు ఖేచర తతికిన్.** **272**

**ప్రతిపదార్థం:** కరిఘటలు= ఏనుగుల సమూహాలు; తురగముల= గుర్రాల; దళము= సైన్యం; అరదంబుల= రథాల; మొత్తము= సమూహం; ఆనక= ఆనకుండా; అడరి= అతిశయించి; వడిన్= వేగంగా, కాల్వురు= కాలిభటులు; మ్రగ్గన్+చేయుచును= హతమారుస్తూ; చూచు= చూచునట్టి; ఖేచర తతికిన్= ఆకాశంలో చరించే దేవతల సమూహానికి; విస్మయము= ఆశ్చర్యం; ఒలయన్= కలుగగా; మ్రగ్గిరి= నశించారు.

**తాత్పర్యం:** సైనికులు, ఏనుగుల సమూహాలు, ఆశ్వికదళం, రథసేన అనక మిక్కిలి విజృంభించి హతమారుస్తూ ఆకాశంలో విహరించే దేవతలకు ఆశ్చర్యం కలిగిస్తూ వినాశానికి గురి అయ్యారు.

**ఉ.** **తేరుల యొప్పు మ్రోడుపడఁ దేఁకువ లేని పదాతి కోటి ను**
**గ్గై రుధిరంబులో మునుఁగ నానిన యేనిక పిండు పక్షముల్**
**ఘోరముగాఁగఁ ద్రెవ్వి వెసఁ గూలు కులాద్రులఁ బోల నాశ్వికుల్**
**వీర వినోదముల్ సలుపు వేడుక సొంపునఁ గూడి యెక్కినన్.** **273**

**ప్రతిపదార్థం:** తేరుల= రథాల యొక్క; ఒప్పు= సౌందర్యం; మ్రోడుపడన్= నశించగా; తేఁకువ లేని= ధైర్యం లేని; పదాతి కోటి= కాలిబంటుల సమూహం; నుగ్గు+ఐ= చూర్ణై; రుధిరంబులోన్= రక్తంలో; మునుఁగన్= మునుగగా; ఆనిన= ఉన్న; ఏనికపిండు= ఏనుగుల సమూహం; పక్షముల్= రెక్కలు; ఘోరముగాఁగన్= భయంకరంగా; త్రెవ్వి= ఖండితమై; వెసన్= వేగంగా; కూలు= కూలిపోయే; కుల+అద్రులన్= కుల పర్వతాలను; పోలన్= పోలగా; ఆశ్వికుల్= గుర్రపు రౌతులు; వీరవినోదముల్= శూరులకు సంబంధించిన క్రీడలు; సలుపు= ఆడునట్టి; వేడుక= కుతూహలం యొక్క; సొంపునన్= సమృద్ధితో; కూడి= కలిసి; ఎక్కినన్= ఎక్కగా;

**తాత్పర్యం:** రథాలు కుప్పగూలగా, పదాతి సైన్యం ధైర్యం సడలి ముక్కలు ముక్కలై రక్తంలో మునుగగా, గజ సమూహం రెక్కలు తెగి, భయం గొలిపేటట్లు కూలిపడే కులపర్వతాలవలె తోచగా, ఆశ్వికదళం వీరవినోదం సలిపే విధంగా కూడి ఎక్కువగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఆశ్వికదళం విజృంభించేసరికి రథ, గజ, పదాతి దళాలు విచ్ఛిన్నమై బీభత్సానికి గురికావడం ఇందులో వర్ణించబడింది.

**చ. నిలిచిన రూపు డొల్లి ధరణింబడి యున్న శరీర మింత లిం**
**తలు శకలంబులై నెఱయ దండడి మూఁక గలంగ నొంటి గుం**
**పులు పఱివోవ రక్త జలపూరము రొంపులు ధూళిగా రథం**
**బులు రభసంబునం బఱపి పోరిరి యోధులు గ్రోధ దీప్తులై. 274**

**ప్రతిపదార్థం:** నిలిచిన= నిలబడిన; రూపు= ఆకారం; డొల్లి= దొరలి; ధరణిన్= భూమిపైన; పడి ఉన్న= కూలి ఉన్న; శరీరము= దేహం; ఇంతలు+ఇంతలు= చిన్న చిన్న; శకలంబులై= తునుకలై; నెఱయన్= వ్యాపించగా; దండడి= తరచైన; మూఁక= సైన్యం; కలంగన్= కలతపడగా; ఒంటిన్= ఒంటరివై; గుంపులు= సమూహాలు; పఱిపోవన్= నశించగా; రక్త= నెత్తురనే; జల= నీటియొక్క; పూరము= ప్రవాహం; రొంపులు= బురదలు; ధూళిగాన్= దుమ్ముగా; యోధులు= వీరులు; క్రోధదీప్తులు+ఐ= కోపంతో వెలిగినవారై; రథంబులు= రథాలు; రభసంబునన్= వేగంగా; పఱపి= నడిపి; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** నిలబడ్డ ఆకారాలు దొరలి నేలపై పడియున్న దేహాలు చిన్న చిన్న తునకలై అంతట వ్యాపించగా. తరచు సైన్యం కలతపడగా, ఒంటరిగా గుంపులు కూలగా, రక్తపు నీటి ప్రవాహం బురదలు దుమ్ముగా మారగా. ఇట్లా వీరులు కోపంతో మండుతున్నవారై అతి తీవ్రంగా యుద్ధరంగంలో పోరాడారు.

**విశేషం:** ఇక్కడ యుద్ధం వలన సైనికుల దేహాలకు పట్టిన దుర్గతి జుగుప్సాకరంగా వర్ణించబడింది.

**క. కొమ్ములఁ గ్రుమ్మియుఁ బాదత । లమ్ములఁ జమరియును గరములం బఱిపఱి యై**
**యి మ్మెడలఁగఁ దిగిచియు నర । దమ్ముల నేనుఁగులు వీటతాటము సేసెన్. 275**

**ప్రతిపదార్థం:** ఏనుఁగులు; అరదమ్ములన్= రథాలను; కొమ్ములన్= దంతాలతో; క్రుమ్మియున్= పొడిచియు; పాదతలమ్ములన్= అరకాళ్ళ చేత; చమరియును= కొట్టియు; కరములన్= తుండాలతో; పఱిపఱి+ఐ= చెల్లా చెదరై; ఇమ్ము= అందం; ఎడలఁగన్= తొలగగా; తిగిచియున్= లాగియు; వీటతాటము= భగ్నం; చేసెన్= చేశాయి.

**తాత్పర్యం:** ఏనుగులు రథాలను దంతాలతో పొడిచి, అరకాళ్ళచే అదిమి, తుండాలతో ముక్కలు ముక్కలు చేసి అందం తొలగేటట్లు లాగి భగ్నం చేశాయి.

**క. తురగమున నరుని వ్రేయుచుఁ । గరిదంతము వెఱికి యన్యకరి వైచుచు ను**
**ద్ధుర రథము చదలఁ ద్రిప్పుచుఁ । గరులు వినోదంబు సేసెఁ గనుఁగొను ప్రజకున్. 276**

**ప్రతిపదార్థం:** తురగమునన్= గుర్రముపైగల; నరుని= సైనికుని; వ్రేయుచున్= కొడుతూ; కరిదంతము= ఏనుగు యొక్క కోరలు; పెటికి= ఊడపీకి; అన్యకరిన్= మరొక ఏనుగుపై; వైచుచున్= విసరుతూ; ఉద్ధుర రథము= బరువైన రథాన్ని; చదలన్= ఆకాశంలో; త్రిప్పుచున్= తిప్పుతూ; కరులు= ఏనుగులు; కనుఁగొను= చూచే; ప్రజకున్= జనులకు; వినోదంబు= వేడుక; చేసెన్= కలిగించాయి.

**తాత్పర్యం:** ఏనుగులు, గుర్రంపైగల భటుడిని దెబ్బ వేస్తూ, ఏనుగు దంతాన్ని పెరికి వేరే ఏనుగుపై విసరుతూ, బరువైన రథాన్ని ఆకాశంలో గిర్రున తిప్పుతూ చూచేవారికి వినోదం కలిగించాయి.

**క. ఒక్కొక్క చోట. 277**

**ప్రతిపదార్థం:** ఒక్క+ఒక్క చోటన్= ఒక్కొక స్థానంలో.

**తాత్పర్యం:** యుద్ధం జరిగే ఒక్కొకచోట.

**చ. మెఱుఁగులు గర్జితంబులును మిక్కిలి సోనయుఁ గల్గు మేఘముల్**
**గిటికొన నొప్పు నాకసము లీల రణక్షితి సూడఁ బొల్పగుం**
**దఱచగు భూషణద్యుతి వితానము పర్వ గజవ్రజంబు పె**
**ల్లొఱలుచు నెత్తురుల్ దొరఁగుచుండ నొగిం బడి యున్కి నత్తఱిన్. 278**

**ప్రతిపదార్థం:** మెఱుఁగులు= మెరుపులు; గర్జితంబులును= ఉరుములును; మిక్కిలి= అధికమైన; సోనయున్= వర్షం; కల్గు= కల; మేఘముల్= మబ్బులు; గిటికొనన్= చుట్టుకొనగా; ఒప్పు= ఒప్పిదమైన; ఆకసము= ఆకాశం; లీలన్= వలె; తఱచు+అగు= అధికమైన; భూషణ= అలంకారాల యొక్క; ద్యుతి= వెలుగుల; వితానము= సమూహం; పర్వన్= ప్రసరించగా; గజవ్రజంబు= ఏనుగుల గుంపు; పెల్లు= ఎక్కువగా; ఒఱలుచున్= అరుస్తూ - ఘీంకరిస్తూ; నెత్తురుల్= రక్తాలు; తొరఁగుచుండన్= కారుతుండగా; ఒగిన్= వరుసగా; పడి+ఉన్కి= పడి ఉండటం వలన; అత్తఱిన్= అపుడు; రణక్షితి= యుద్ధ భూమి; చూడన్= చూడటానికి; పొల్పు+అగున్= ఒప్పింది.

**తాత్పర్యం:** మెరుపు తీగలు, ఉరుములు, మిక్కిలి వర్షంచేత మేఘాలు కమ్ముకొనగా ఒప్పే ఆకాశంవలె, అధికమైన భూషణాల వెలుగుల సమూహం ప్రసరించగా, ఏనుగుల గుంపు మిక్కిలి ఘీంకరిస్తూ, రక్తాలు కారుతుండగా వరుసగా పడి ఉన్నప్పటి యుద్ధం చూడటానికి ఒప్పి ఉండింది.

**విశేషం:** అలం: ఉపమ. ఇక్కడ మేఘాలతో నిండిన ఆకాశంతో ఏనుగులతో నిండిన యుద్ధ భూమి పోల్చబడింది.

**ఆ. అశ్వసుభట తతుల యంగ ఖండంబులు । రుధిర కర్దమమున బ్రుంగియున్న**
**పెల్లు చూడ రౌద్ర బీభత్స కరుణ భ । యానకైక హేతువయ్యె నధిప! 279**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అశ్వ= గుర్రాల; సుభట= సైనికుల; తతుల= సమూహాల; అంగ ఖండంబులు= అవయవాల తునకలు; రుధిర= రక్తపు; కర్దమమునన్= బురదలో; బ్రుంగి ఉన్న= మునిగి ఉన్న; పెల్లు= అతిశయం; చూడన్= చూడగా; రౌద్ర= రౌద్రరసానికి; బీభత్స= బీభత్సరసానికి; కరుణ= కరుణ రసానికి; భయానక= భయానక రసానికి; ఏకహేతువు+అయ్యెన్= ఒకే కారణ మైనది.

**తాత్పర్యం:** గుర్రాల, భటుల సమూహాల అవయవ ఖండాలు రక్తపు బురదలో మునిగి ఉన్న అతిశయం చూడగా రౌద్ర, బీభత్స, కరుణ, భయానక రసాలకు అది ఒకే కారణంగా తోచింది.

**వ. అట్టిసమయంబున నారోహకులు పడినం దెరలం బారు వారణ హయంబులును, వాహనంబులు నిహతంబులైన వెడవెడ మెలంగు వివిధయోధులును, రుధిర మాంస మస్తిష్కమయ మహాపంకంబునం గలయ మునింగియుం, గాళులు పెఱుక రాకుండియు, గొరిజ దిగంబడియును రథకరి ఘోటకంబులు సంచరింప నేరకునికి వెడంగు పడుచుం బెనంగు కడింది మగలును రక్తాంబు తురగా వర్త కరిగిరి కలితంబైన సమరాంగణ సాగరంబు నానావిధ వాహన యానపాత్ర గతులం దఱియం జొచ్చి తమయట్టివారు గొందఱు మునింగినను వెండియు విజయధన వాంఛంజేసి వెఱవక వర్తించు వీరవ్యవహారులు నయి యెయ్యది సూచిన నెత్తుటం గెంపెక్క సైనికు లుక్కునం బొంపిరి వోవుచున్న సంకుల సంగ్రామంబునఁ జెక్కు సెమర్పక దర్పంబునం జెలంగుచు ద్రోణుం డెలుంగు సూపి కడంగి. 280**

**ప్రతిపదార్థం:** అట్టి సమయంబునన్= అప్పుడు; ఆరోహకులు= ఎక్కినవారు; పడినన్= కూలగా; తెరలన్+పారు= తొలగిపరుగెత్తే; వారణ= ఏనుగులు; హయంబులును= గుర్రాలును; వాహనంబులు= రథాలును; నిహతంబులు+అయిన= కొట్టబడగా; వెడవెడ= కొలదిగా; మెలంగు= తిరిగే; వివిధ యోధులును= వేరు వేరు వీరులును; రుధిర= రక్తం; మాంస= మాంసం; మస్తిష్క= మెదడులతో; మయ= నిండిన; మహాపంకంబునన్= మిక్కుటమైన బురదలో; కలయమునింగియున్= కలిసిపోయేటట్లు మునిగి; కాళులు= కాళ్ళు; పెఱుకరాక+ఉండియున్= లాగడానికి రాకుండియు; గొరిజ= గిట్ట; దిగంబడియును= దిగబడి; రథ= రథాలు; కరి= ఏనుగులు; ఘోటకంబులు= గుర్రాలు; సంచరింపనేరక= తిరుగలేక; ఉనికి= ఉండి; వెడంగు+పడుచున్= వికారం పొందుతూ; పెనంగు= పెనగులాడే; కడింది= కఠినులైన; మగలును= వీరులును; రక్త= నెత్తురనే; అంబు= నీరు; తురగ= గుర్రాలు అనే; ఆవర్త= సుడులు; కరి= ఏనుగులనే; గిరి= పర్వతాలతో; కలితంబైన= కూడిన; సమర= యుద్ధపు; అంగణ= రంగం అనే; సాగరంబు= సముద్రం; నానా= పలు; విధ= రకాలైన; వాహన= వాహనాలు అనే; యానపాత్ర= పడవల; గతులన్= నడకలతో; తఱియం జొచ్చి= సమీపించి; తమ అట్టివారు= తమవంటివారు; కొందఱు; మునింగినను= మునిగిపోయినా; వెండియున్= మరల; విజయ= విజయమనే; ధన= ధనమందలి; వాంఛన్+చేసి= కోరికతో; వెఱవక= భయపడక; వర్తించు= ఉండే; వీర= వీరులనే; వ్యవహారులును= బేహారులును; అయి= అయి; ఎయ్యది= ఏది; చూచినన్= చూచినా; నెత్తుటన్= రక్తంతో; కెంపు+ఎక్కన్= ఎర్రబడఁగా; సైనికులు= భటులు; ఉక్కునన్= శౌర్యంతో; పొంపిరి+పోవుచున్న= విజృంభిస్తున్న; సంకుల సంగ్రామంబునన్= వ్యాప్తమైన యుద్ధంలో; చెక్కు+చెమర్పక= ఏమాత్రం చలించక; దర్పంబునన్= గర్వంతో; చెలంగుచున్= విజృంభిస్తూ; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; ఎలుంగు= కంఠస్వరం; చూపి= ప్రదర్శించి; కడంగి= పూని.

**తాత్పర్యం:** అపుడు, వాహనాలపై ఉన్నవారు క్రిందపడిపోగా, పారిపోయే ఏనుగులు, గుర్రాలు, వాహనాలు హతమయ్యేసరికి అటనట తిరిగే పలు రకాలైన వీరులును; రక్తం, మాంసం, మెదళ్ళతో నిండిన మిక్కుటమైన బురదలో కలయమునిగి కాళ్ళు పెరకటానికి రాక గిట్టలు దిగవడి రథాలు, ఏనుగులు, గుర్రాలు తిరుగలేకపోవటం వలన తికమక పడుతూ పెనగులాడే వీరశ్రేష్ఠులు, నెత్తురు అనే నీరు, గుర్రాలనే సుడులు, ఏనుగులనే పర్వతాలు గల యుద్ధభూమి అనే సముద్రం బహువిధాలైన వాహనాలనే పడవల నడకతో సమీపించి, తమ వంటి వారు కొందరు మునిగినా ఇంకా విజయమనే ధనంమీదగల కోరికతో భయపడకుండే వీరులనే బేహారులై, ఏది చూచినా రక్తంతో ఎరుపెక్కగా, భటులు శౌర్యంతో విజృంభిస్తున్న మహాయుద్ధంలో ఏమాత్రం చలించక, గర్వంతో ఉత్సహించే ద్రోణాచార్యుడు సింహనాదం చేసి పూనుకొని.

**విశేషం:** అలం: రూపకం.

**క. కరియూథనాథుఁ బొదువం । ద్వరితోద్ధతి యానదుర్నివారం బై కే**
**సరి సనియెడు పగిది యుధి । స్థిరు దెసకుం జనియె నతని సేన దలంకన్. 281**

**ప్రతిపదార్థం:** కరి= ఏనుగుల; యూథ= సమూహం యొక్క; నాథున్= అధిపతిని; పొదువన్= ఆక్రమించటానికి; త్వరిత= వడిగలది; ఉద్ధతి= దర్పంగలది అయిన; యాన= నడకతో; దుర్నివారంబు+ఐ= వారించటానికి వీలుగానిదై; కేసరి= సింహం;

చనియెడు= పోయే; పగిదిన్= విధంగా; అతని= అతడి యొక్క; సేన= సైన్యం; తలంకన్= వణకగా; యుధిష్ఠిరు = ధర్మజుడి; దెసకున్= వైపునకు; చనియెన్= పోయాడు.

**తాత్పర్యం:** గజరాజును ఆక్రమించటానికి త్వరితం ఉద్ధతం అయిన వారింపరాని గమనంతో సింహం పోయేటట్లు ధర్మరాజు సేన వణకగా ద్రోణుడు అతడి వైపునకు వెళ్ళాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **అతి కోలాహల వికల । స్థితి యగు తన బలము మిగిలి ధీరత్వమహో**
**న్నతుఁ డగు నతండు విశిఖ । ప్రతతి పఱపె గురునిపై నరాతులు వొగడన్.** 282

**ప్రతిపదార్థం:** అతి= మిక్కిలి; కోలాహల= కలకలంచేత; వికలస్థితి అగు= చెదరిన; తన= తనయొక్క; బలమున్= సేనను; మిగిలి= దాటి; ధీరత్వ= ధైర్యంచేత; మహా+ఉన్నతుఁడు+అగు= గొప్ప ఔన్నత్యంగల వాడగు; అతండు= ఆ ధర్మజుడు; అరాతులు= శత్రువులు; పొగడన్= ప్రశంసించగా; గురునిపైన్= ద్రోణుడిపై; విశిఖ= బాణాల; ప్రతతి= సమూహం; పఱపెన్= ప్రసరింపచేశాడు.

**తాత్పర్యం:** మిక్కిలి కలకలంతో చెదరిన తన సైన్యాన్ని దాటి, ధైర్యంతో అత్యున్నతుడైన ధర్మజుడు శత్రువులు పొగడగా ద్రోణాచార్యుడిపై బాణజాలాన్ని ప్రయోగించాడు.

### ద్రోణాచార్యునిచేత సత్యజిత్తు సచ్చుట (సం.7-20-1)

**చ.** **కని ద్రుపదాన్వయోత్తముఁ డకంపిత శౌర్యుఁడు సత్యవిక్రముం**
**డనుపమ ధైర్యధుర్యుఁడు మహాబల దీప్తుఁడు సత్యజిత్తు ద్రో**
**ణుని వెసఁ దాఁకి తత్తనువు నొవ్వ దశోగ్ర శరంబు లేసి సూ**
**తుని మెయిఁ గ్రుచ్చెఁ చేర్చి పది తూపులు ధర్మజుఁ డుల్లసిల్లఁగన్.** 283

**ప్రతిపదార్థం:** కని= ఇది చూచి; ద్రుపద+అన్వయ+ఉత్తముఁడు= ద్రుపదుడి యొక్క వంశంలో శ్రేష్ఠుడు; అకంపిత శౌర్యుఁడు= చలించని శౌర్యంకలవాడు; సత్యవిక్రముండు= సత్యమైన పరాక్రమం కలవాడు; అనుపమ= సాటిలేని; ధైర్య= ధీరత్వంయొక్క; ధుర్యుఁడు= భారం మోసేవాడు; మహాబలదీప్తుఁడు= గొప్పదైన శక్తిచే వెలుగొందేవాడగు; సత్యజిత్తు= సత్యజిత్తు అనేవాడు; ధర్మజుఁడు= ధర్మరాజు; ఉల్లసిల్లఁగన్= సంతోషించగా; ద్రోణుని= ద్రోణాచార్యుడిని; వెసన్= వేగంతో; తాఁకి= ఎదుర్కొని; తద్+తనువు= అతని దేహం; నొవ్వన్= బాధపడగా; దశ= పది; ఉగ్ర= భయంకరమైన; శరంబులు= బాణాలు; ఏసి= ప్రయోగించి; పది తూపులు= పది అమ్ములు; పేర్చి= అతిశయించి; సూతుని= సారథియొక్క; మెయిన్= దేహంపై; గ్రుచ్చెన్= నాటాడు.

**తాత్పర్యం:** ధర్మజుడూ ద్రోణుడూ యుద్ధం చేయటం చూసి, ద్రుపదవంశశ్రేష్ఠుడు, చలించని శౌర్యం కలవాడు, సత్యపరాక్రముడు, సాటిలేని ధైర్యవంతుడు, మహాబలంతో ప్రకాశించేవాడు అయిన సత్యజిత్తు, ధర్మజుడు సంతోషపడగా ద్రోణాచార్యుడిని తీవ్రంగా ఎదిరించి, అతడికి బాధ కలిగేటట్లు పది భయంకరాలైన బాణాలను ప్రయోగించి, అతడి సారథి శరీరంపై పది బాణాలను నాటాడు.

**ఆ.** **గురుఁడు సత్యజిత్తు కోదండ దండంబు । దునుముటయును వేఱుధనువు వుచ్చి**
**కొని యుదాత్తరేఖఁ గ్రూరభల్లంబులు । ముప్పదింట నతనిఁ గప్పె నతఁడు.** 284

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; సత్యజిత్తు= సత్యజిత్తు యొక్క; కోదండ దండంబు= ధనుర్దండాన్ని; తునుముటయును= త్రుంచగా; వేఱు= వేరే; ధనువు= ధనుస్సు; పుచ్చికొని= తీసికొని; ఉదాత్తరేఖన్= ఉన్నతమైన పద్ధతిలో; అతఁడు= సత్యజిత్తు; క్రూరభల్లంబులు= భయంకరమైన బాణాలు; ముప్పదింటన్= ముప్పైతో; అతనిన్= ద్రోణుడిని; కప్పెన్= ఆక్రమించాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు సత్యజిత్తు ధనుర్దండాన్ని తునుమగా, వేరొక ధనుస్సు అందుకొని ఉదాత్తమైన రీతిలో అతడు ముప్పది బాణాలతో ద్రోణుడిని ఆక్రమించాడు.

**వ. తదవసరంబున సత్యజిత్తుం గూడికొని. 285**

**ప్రతిపదార్థం:** తత్+అవసరంబునన్= ఆ సమయంలో; సత్యజిత్తున్= సత్యజిత్తును; కూడికొని= కలిసికొని.

**తాత్పర్యం:** అప్పుడు సత్యజిత్తుతో కలిసి.

**క. వృకుఁడను పాంచాలకుమా । రకుఁ డఱువది తూపులం గరం బరుదుగ న**
**స్త్ర కళాచార్యుం బొదివిన । వికాసముం బొందెఁ బాండవేయ బలంబుల్. 286**

**ప్రతిపదార్థం:** వృకుఁడు+అను= వృకుడనే; పాంచాల కుమారకుఁడు= పాంచాల రాజ కుమారుడు; అఱువది తూపులన్= అరవై బాణాలతో; కరంబు= మిక్కిలి; అరుదుగన్= అసాధారణమైన రీతిలో; అస్త్రకళ= అస్త్రవిద్యయందు; ఆచార్యున్= గురువైన ద్రోణుడిని; పొదివినన్= ఆక్రమించగా; పాండవేయ బలంబుల్= పాండవ సైన్యాలు; వికాసమున్+పొందెన్= సంతోషించాయి.

**తాత్పర్యం:** వృకుడనే పాంచాల రాజకుమారుడు అసాధారణంగా అరవై బాణాలతో ద్రోణాచార్యుడిని కప్పగా, పాండవ సైన్యాలు వికాసాన్ని పొందాయి.

**చ. ఘనతర కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల సత్యజి**
**త్తనువు వృకాంగమున్ విశిఖ ధారల ముంచె గురుండు, వార లా**
**తని వడి కోర్చి మై గలయఁ దాఁకఁగ సారథి యు బ్బడంగ వా**
**హనములు బీఱువోవ సిడ మల్లల నాడఁగ సేసి రుద్ధతిన్. 287**

**ప్రతిపదార్థం:** గురుండు= ద్రోణాచార్యుడు; ఘనతర= మిక్కిలి విరివి అయిన; కోప= క్రోధం యొక్క; వేగమునన్= వేగంతో; కన్నుల= కన్నుల నుండి; నిప్పులు; రాలన్= రాలగా; సత్యజిత్+తనువు= సత్యజిత్తుయొక్క దేహాన్నీ; వృకాంగమున్= వృకుడియొక్క తనువును; విశిఖ= బాణాల యొక్క; ధారలన్= ధారలలో; ముంచెన్= మునుగ జేశాడు; వారలు=ఆ యిరువురు; ఆతని= ద్రోణుడి; వడికిన్= తీవ్రతకు; ఓర్చి= సహించి; మై= శరీరం; కలయన్= అంతటను; తాఁకఁగన్= తగిలేటట్లు; సారథి= రథాన్ని నడిపేవాడి; ఉబ్బు= పెంపు; అడంగన్= అణగగా; వాహనములు= అశ్వాది వాహనాలు; బీఱు+పోవన్= వ్యర్థంకాగా; సిడము= ధ్వజం; అల్లలన్+ఆడఁగన్= చలించగా; ఉద్ధతిన్= గర్వంతో; ఏసిరి= కొట్టారు.

**తాత్పర్యం:** మిక్కిలి కోపతీవ్రతచేత కన్నులనుండి నిప్పులు రాలగా ద్రోణాచార్యుడు సత్యజిత్తు దేహాన్ని, వృకుడి దేహాన్ని బాణధారలతో ముంచివేశాడు. ఆ ఇద్దరు ద్రోణుడి తీవ్రతను సహించి, అతడి దేహమంతటా తాకగా, సారధి పెంపు అణగిపోగా, వాహనాలు పాడుకాగా, ధ్వజం చలించగా గర్వంతో బాణజాలాన్ని వేశారు.

**ఆ. సత్యజిత్తు మేన సాయక దశకంబు । నాటి కుంభజుండు నగుచు విల్లు**
**దునుమ, నొండు వింట ద్రోణుని నొప్పించె । నతఁడు; వృకుఁడుఁ బెలుచ నడరి యేసె. 288**

**ప్రతిపదార్థం:** కుంభజుండు= ద్రోణుడు; సత్యజిత్తు= సత్యజిత్తు యొక్క; మేనన్= శరీరంపై; సాయక దశకంబు= పది బాణాలను; నాటి= గ్రుచ్చి; నగుచున్= నవ్వుతూ; విల్లు= ధనుస్సు; తునుమన్= త్రుంచగా; అతఁడు= ఆ సత్యజిత్తు; ఒండు= మరొక; వింటన్= ధనుస్సుతో; ద్రోణునిన్= ద్రోణాచార్యుడిని; నొప్పించెన్= బాధించాడు; వృకుఁడున్= వృకుడు కూడా; పెలుచన్= ఆగ్రహంతో; అడరి= విజృంభించి; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు సత్యజిత్తుపై పది బాణాలు నాటి నవ్వుతూ అతడి వింటిని త్రుంచివేయగా, అతడు మరొక ధనుస్సుతో ద్రోణుడిని బాధించాడు; అంత వృకుడు ఆగ్రహంతో విజృంభించి ద్రోణుడిపై బాణాలు ప్రయోగించాడు.

**క. కినిసి వెసన్ సత్యజితుని। ధనువు నఱికి గురుఁడు వృకునితల దునియఁగ నా**
**తని హయములు సారథియును। మును డొల్లఁగ నాఱు బాణముల్ బిట్టేసెన్. 289**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; కినిసి= కోపించి; వెసన్= వెంటనే; సత్యజితుని= సత్యజిత్తుయొక్క; ధనువు= ధనుస్సును; నఱికి= త్రుంచి; వృకుని= వృకుడియొక్క; తల= శిరస్సు; తునియఁగన్= తెగేటట్లు; ఆతని= వృకుడి; హయములు= గుఱ్ఱాలు; సారథియును= రథచోదకుడును; మును= ముందు; డొల్లఁగన్= పడగా; ఆఱు బాణముల్= ఆరు బాణాలు; బిట్టు= వెంటనే; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు కోపించి, వెంటనే సత్యజిత్తు వింటిని త్రుంచి, వృకుని తల తెగేటట్లు, అతడి గుఱ్ఱాలు, సారథి ముందు పడిపోయేట్లు ఆరు బాణాలను శీఘ్రంగా ప్రయోగించాడు.

**ఆ. అన్యచాప హస్తుఁడై సత్యజిత్తు సం। రంభజృంభణమునఁ గుంభజన్ముఁ**
**దరల నేయుటయు నతండు గెంపారెడు। నాననంబు తోడ నవుడు గఱచి. 290**

**ప్రతిపదార్థం:** అన్య= వేరొక; చాప= ధనుస్సు; హస్తుఁడు+ఐ= చేతగలవాడై; సత్యజిత్తు= సత్యజిత్తు; సంరంభ= ఆటోపంయొక్క; జృంభణమునన్= అతిశయంతో; కుంభజన్మున్= ద్రోణుడిని; తరలన్+ఏయుటయున్= తొలగేటట్లు చేయగా; అతండు= ద్రోణుడు; కెంపు+ఆరెడు= కోపంతో ఎఱ్ఱబడిన; ఆననంబు+తోడ= ముఖంతో; అవుడు= పెదవి; కఱచి= కొరికి.

**తాత్పర్యం:** సత్యజిత్తు వేరొక ధనుస్సును చేతబట్టి, ఆటోపం మీరగా ద్రోణుడు తరలి పోయేటట్లు బాణాన్ని ప్రయోగించగా, అతడు మోము ఎఱ్ఱబడగా పెదవి గరచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. ఖండములై పడం ధనువు గ్రక్కున నేయుడు సత్యజిత్తు వి**
**ల్లొండు గొనం గొనం దునియ నుద్ధతి నేయుచుఁ బెక్కు విండు లు**
**ద్దండత నుగ్గు సేసి భుజదర్పధురంధరుఁ డీతఁ డింత ద**
**క్కం డని యర్ధచంద్ర విశిఖ ప్రహతిం దల డొల్ల నేసినన్. 291**

**ప్రతిపదార్థం:** ధనువు= ధనుస్సు; ఖండములై పడన్= ముక్కలై పడేటట్లు; గ్రక్కునన్= త్వరితంగా, ఏయుడున్= వేయగానే; సత్యజిత్తు; ఒండు= మరొక; విల్లు= ధనుస్సును; కొనన్= అందుకొనగా; ఉద్ధతిన్= గర్వంతో; కొనన్= చివరిభాగాన్ని; తునియన్= ముక్కలయ్యేటట్లు; ఏయుచున్= వేస్తూ; పెక్కువిండులు= అనేక ధనుస్సులు; ఉద్దండతన్= భయం గొలిపేటట్లు; నుగ్గు+చేసి=

పొడి చేసి; భుజదర్ప= బాహుగర్వంయొక్క; ధురంధరుఁడు= భారం మోసేవాడు; ఈతఁడు= ఈ సత్యజిత్తు, ఇంత= ఇంతటితో; తక్కండు+అని= విడువడని; అర్ధచంద్ర= అర్ధ చంద్రాకారంగల; విశిఖ= బాణంయొక్క; ప్రహతిన్= దెబ్బతో; తల= శిరస్సును; డొల్లన్= దొల్లిపోయేటట్లు; ఏసినన్= వేయగా.

**తాత్పర్యం:** ద్రోణుడు సర్వజిత్తు యొక్క ధనుస్సు ముక్కలై పడేటట్లు శీఘ్రంగా బాణం వేయగా, అతడు వేరొక విల్లు అందుకొన్నాడు. దాని కొనను కూడ ద్రోణుడు త్రుంచి సత్యజిత్తు వెంట వెంటనే అనేక ధనుస్సులు తీసుకోగా, వాటిని కూడ వరుసగా ఖండించి, బాహుగర్వధురంధరుడైన సత్యజిత్తు ఇంతటితో ఆగడని, అర్ధచంద్రాకారబాణంతో అతడి తల తెగిపడేటట్లు కొట్టాడు.

**క. సాహంకారుం డగు గురు। బాహు బలంబునకు నులికి పాఱఁ దొలంగెన్**
**వాహములఁ దోలుకొని యు। త్సాహంబుఁ జలంబు నెడల ధర్మజుఁ డధిపా! 292**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధృతరాష్ట్ర మహారాజా!; సాహంకారుండు+అగు= అహంకారంగల; గురు= ద్రోణాచార్యుడియొక్క; బాహుబలంబునకున్= భుజాల శక్తికి; ఉలికి= బెదరువలన చలించి; ధర్మజుఁడు= ధర్మరాజు; వాహములన్= గుర్రాలను; తోలుకొని= నడిపించుకొని; ఉత్సాహంబున్= పూనికయు; చలంబున్= మాత్సర్యమూ; ఎడలన్= తొలగగా; పాఱన్+తొలంగెన్= పారిపోయాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అహంకరించిన ద్రోణాచార్యుడి యొక్క బాహుబలానికి ఉలికిపడి ధర్మరాజు గుర్రాలను తోలుకొని, ఉత్సాహం, మాత్సర్యం తొలగగా పారిపోయాడు.

### ద్రోణాచార్యునిచేత సూర్యదత్తుఁడు సచ్చుట (సం. 7-20-20)

**సీ. ఆతని వెనుకొన నాచార్యునకు నడ్డ। పడి వారిమొన లెల్లఁ గడఁక నొక్క**
**పెట్ట త్రోచిన దూదితిట్టలపైఁ బ్రాఁకు। నగ్గి చందంబున మ్రగ్గఁజేయు**
**నగ్గురుఁ దాఁకి మాత్స్యానుజుఁ డాఱు దూ। పుల నొంచి యార్చిన నలిగి యతని**
**తల కుండలములతో నిలఁ బడ నతఁ డేసె। ధరణి నాయక! సూర్యదత్తుఁ డిట్లు**

**ఆ. వడినఁ జూచి మత్స్యబలకోటి విచ్చినఁ। జేది మగధ కేకయాదిసేన**
**లెల్లఁ జెదరఁ దలరఁ దల్లడపడఁ గల। గుండుఁ గొనఁగఁ జేసెఁ గుంభజుండు. 293**

**ప్రతిపదార్థం:** ఆతనిన్= ధర్మజుని; వెనుకొనన్= వెంటబడగా; ఆచార్యునకున్= ద్రోణుడికి; అడ్డపడి= అడ్డగించి; వారి= పాండవుల; మొనలు+ఎల్లన్= సైన్యాలన్నీ; కడఁకన్= ప్రయత్నంతో; ఒక్క పెట్ట= ఒకేసారి; త్రోచినన్= ముందుకు త్రోయగా; దూదితిట్టలపైన్= ప్రత్తిరాసులపై; ప్రాఁకు= ప్రసరించే; అగ్గిచందంబునన్= మంటల వలె; మ్రగ్గన్+చేయు= నశింపజేసే; ఆ+గురున్= ఆ ద్రోణాచార్యుడిని; తాఁకి= ఎదుర్కొని; మాత్స్య+అనుజుఁడు= విరాటరాజు తమ్ముడు సూర్యదత్తుడు; ఆఱు= ఆరు; తూపులన్= బాణాలతో; నొంచి= అణచి; ఆర్చినన్= బొబ్బ పెట్టగా; అలిగి= కోపించి; అతని= సూర్యదత్తుడి; తల= శిరస్సు; కుండలములతోన్= చెవిపోగులతో సహా; ఇలన్= నేలపై; పడన్= పడేటట్లు; అతఁడు= ద్రోణుడు; ఏసెన్= కొట్టాడు; ధరణి నాయక!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; సూర్యదత్తుఁడు; ఇట్లు= ఈ విధంగా; పడినన్= పడగా; చూచి; మాత్స్య= మాత్స్యదేశపు; బల= సైన్యం యొక్క; కోటి= సమూహం; విచ్చినన్= చీలిపోగా; చేది= చేదిదేశపు; మగధ= మగధ దేశపు; కేకయ+ఆది= కేకయాది దేశాల; సేనలు= సైన్యాలు; ఎల్లన్= అన్నియు; చెదరన్= చెల్లాచెదరు కాగా; తలరన్= సంభ్రమించగా; తల్లడపడన్= చలించగా; కలంగుండుగొనఁగన్= క్షోభపడగా; కుంభజుండు= ద్రోణుడు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ధరణినాయకుడవైన ధృతరాష్ట్రా! ద్రోణుడు ధర్మజుడి వెంటబడగా విరాటుని తమ్ముడైన సూర్యదత్తుడు అతడిని అడ్డగించి, పాండవ సైన్యాలను ఒక్క పెట్టున ముందుకు త్రోశాడు. ద్రోణుడు ఆ సైన్యాలను దూది కుప్పలపై ప్రాకే మంటలవలె వ్యాపించి నశింపజేయగా; అతడిని ఎదుర్కొని సూర్యదత్తుడు ఆరు బాణాలతో అణచి కేకపెట్టాడు. అపుడు ద్రోణుడు కోపించి సూర్యదత్తుడి శిరస్సు కుండలాలతో సహా క్రిందపడేటట్లు కొట్టాడు. సూర్యదత్తు డిట్లా పడిపోవటం చూచి విరాటరాజు సైన్యం చీలిపోగా, ద్రోణుడు చేది, మగధ, కేకయాది దేశాల సేనలు చెల్లాచెదరయ్యేటట్లు, సంభ్రమించేటట్లు, తల్లడిల్లేటట్లు, క్షోభపడేటట్లు చేశాడు.

**విశేషం:** ఆంధ్ర మహాభారత సంశోధిత ముద్రణప్రతిలో పాదసూచిగా ఈ అంశాలు చెప్పబడ్డాయి. 'ఇచ్చట మూలమునందు ద్రోణునెదిర్చి యతనిచే సంహరింపబడినవాడు శతానీకుఁ డని యున్నది.

**శ్లో॥ నిర్దహంత మనీకాని తాని తాని పునః పునః।**
**ద్రోణం మత్స్యాదవరజః శతానీకోऽ భ్యవర్తత॥' (భం. 7-20-20)**

చిత్రశాలాప్రతి (7-21-25), కుంభకోణప్రతి 7-21-25. భండార్కరు ప్రతి పాదసూచియందు 'మత్స్యావరజః' అనుటకు 'మాత్స్యావరజః' అను పాఠము ప్రదర్శింపబడినది, T1, G2, 5 ప్రతులు.

శతానీకుఁ డనువాఁడు (విరటుని తమ్ముడు) భీష్మునిచే నిహతుడైనట్లు భీష్మపర్వము తృతీయాశ్వాసమున గలదు. భీష్మ-।3-391 తిక్కన భారతము. 6-113-24 భండార్కరు ప్రతి.

భీష్మపర్వములోనే సంహరింపబడిన శతానీకుడు ద్రోణపర్వమునందు తిరిగి కన్పించుట అసంగతముగా తోచును. దీనిని గుర్తించియే కాబోలు కొన్ని సంస్కృత ప్రతులలో (T1, G2, 5) 'మాత్స్యాదవరజః' అను పాఠము గ్రహింపబడినది. మాత్స్యుడనగా మత్స్యరాజు కుమారుడగు ఉత్తరు డని గ్రహించినచో శతానీకుడు వాని తమ్ము డగును. ఇట్లు విరటుని తమ్ముడొకడును, కుమారు డొకడును శతానీకనామము గలవారు ఇద్దఱుండిరని గ్రహించినచో వైరుద్ధ్యము తొలగును.

తిక్కన సోమయాజి దీనిని గుర్తించియే కాబోలు ఈ సందర్భమున శతానీకుని పేరు విడిచి 'సూర్యదత్తుడు' అను పేరు గ్రహించెను. ఈతడు విరటుని తమ్ము డనియే తిక్కన భావము. 'మాత్స్యానుజుఁ డాఱుదూపుల' (ద్రోణ-1-293). సూర్యదత్తుని పేరు ఈ ఘట్టమున మూల సంస్కృత ప్రతులందు కాన్పించుట లేదు.

సూర్యదత్తు డనువాడు విరటుని యనుచరు డనియు ద్రోణునిచే వధింపబడె ననియు సోరన్సన్ 'మహాభారత నామానుక్రమణిక'యందు కలదు. పు. 664. మత్స్య అనగా విరాటు డనియు మాత్స్య అనగా ఉత్తరుడనియు సోరన్సన్ వివరించెను.' (పు. 299)

**క. మెఱుమ ధనుర్దండము గుణ। ముఱుమఁగ విశిఖతతి దొరుఁగ నొక్కటఁ దఱచై**
**పఱవ రుధిరంపుఁ గాలువ। లఱిముఱి ఘనభుజుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా! 294**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ధృతరాష్ట్ర మహారాజా!; ధనుః+దండము= వింటి దబ్బ; మెఱుమన్= మెరయగా; గుణము= అల్లెత్రాడు; ఉఱుమఁగన్= గర్జించగా; విశిఖ= బాణాల; తతి= సమూహం; తొరుఁగన్= కురియగా; ఒక్కటన్= ఏకమై; రుధిరంపు= రక్తపు; కాలువలు= ఏరులు; తఱచు+ఐ= దట్టమై; పఱవన్= పారగా; అఱిముఱి= ఉత్సాహంతో; ఘనభుజుఁడు= గొప్పనైన బాహువులు గల; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! వింటిదబ్బ మెరయగా, అల్లెత్రాడు ఉరుమగా, బాణాలు కురియగా, రక్తపుకాలువలు ఏకమై బాగా ప్రవహించగా ఉత్సాహంతో ద్రోణాచార్యుడు విజృంభించాడు.

**విశేషం:** ఇందు మెఱుములు, ఉఱుములు, వర్షము - కాలువలు ఉండుటవలన బాణవర్షము స్ఫురించుచున్నది.

**క. వీరాస్థిశర్కరాఘన । భేరీ మండూక కవచ పృథులోర్మి రథ**
**స్ఫారావర్త గజ మకర । ఘోర మహిమ రక్తనదులకుం దగియె నృపా! 295**

**ప్రతిపదార్థం:** నృపా!= ధృతరాష్ట్ర మహారాజా!; వీర= వీరులయొక్క; అస్థి= ఎముకలనే; శర్కరా= ఇసుకయొక్క; ఘన= గొప్పవైన; భేరీ= దుందుభి వాద్యాలనే; మండూక= కప్పలయొక్క; కవచ= కవచాలనే; పృథుల= విరివి అయిన; ఊర్మి= అలల యొక్క; రథ= తేరులనే; స్ఫార= గొప్పవైన; ఆవర్త= సుడులయొక్క; గజ= ఏనుగు లనే; మకర= మొసళ్ళయొక్క; ఘోర= భయంకరమైన; మహిమ= గొప్పతనం; రక్త= నెత్తుటి; నదులకున్= ఏరులకు; తగియెన్= సరిపోలినది.

**తాత్పర్యం:** వీరుల ఎముకలనే లావుఇసుక యొక్క, గొప్పనైన దుందుభి వాద్యాలనే కప్పల యొక్క, విరివిగాగల కవచాలనే అలల యొక్క, రథాలనే గొప్ప సుడుల యొక్క; ఏనుగు లనే మొసళ్ళ యొక్క భయానకమైన మహిమ రక్తపు నదులకు సరిపోలింది.

**విశేషం:** రూపకం. యుద్ధపర్యవసానంగా కలిగిన జుగుప్సాకరమైన అస్థులు, విచ్ఛిన్నమైన భేరులు, కవచాలు, రథాలు, గజాలు, రక్తప్రవాహాలపై శర్కరా, మండూక, తరంగ, ఆవర్త, మకర, నద్యాదులను సుందరంగా ఆరోపించి బీభత్సరసాన్ని ఆస్వాదింపజేస్తున్నాడు కవిబ్రహ్మ.

**వ. ఇవ్విధంబునం బాండవాగ్రజుం బట్టికొన నప్పళించి తఱుము నమ్మహావీరు మార్కొని యుధామన్యుండును, నుత్తమౌజుండును, వసుదానుండును, శిఖండియును నైదైదు శరంబు లేసిరి; సాత్యకి క్షత్రధర్ములు వరుసన నూటయిరువదింటఁ బదింటం గప్పి రయ్యుధిష్ఠిరుండును; మరలి బాణ శతత్రయ ప్రయోగ తీవ్రులగు ధృష్టద్యుమ్న చేకితానుల మున్నిడుకొని పొంగి తానును బంద్రెంట నొప్పించె; నప్పు డా భారద్వాజుని మఱియునుం బలువురు పాండవ పక్షయోధవీరులు వొదివినం గని మన్నించు రాజులు రాజకుమారులు నతనికి బాసటయై కలిసి; రతండు వసుదాను వసుధం గూల్చి క్షేము జముకడ కనిచి యుధామన్యు నుత్తమౌజుని శిఖండిని సాత్యకిని బెక్కమ్ము లెమ్ములం గీలించి తన్నుం గదిసినం గని యయ్యజాతశత్రుండు వెండియుఁ గైతవంబున రణంబునకుం దొలంగం బాఱిన. 296**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; పాండవ+అగ్రజున్= పాండవులకు అన్న అయిన ధర్మజుడిని; పట్టికొనన్= పట్టుకొనటానికి; అప్పళించి= ఉత్సహించి; తఱుము= వెనుదగిలి ఉరికించే; ఆ+మహావీరున్= ఆ గొప్పవీరుడైన ద్రోణుడిని; మార్కొని= ఎదుర్కొని; యుధామన్యుండునున్= యుధామన్యుడూ; ఉత్తమౌజుండును= ఉత్తమౌజుడూ; వసుదానుండును= వసుదానుడూ; శిఖండియునున్= శిఖండియు; ఐదైదు= ఐదేసి; శరంబులు= బాణాలు; ఏసిరి= ప్రయోగించారు; సాత్యకి; క్షత్రధర్ములు= క్షత్రధర్ముడు; వరుసన= క్రమంగా; నూట ఇరువదింటన్= నూట ఇరవైబాణాలతో; పదింటన్= పదిబాణాలతో; కప్పిరి= పొదివారు; ఆ+యుధిష్ఠిరుండు= ధర్మజుడు కూడ; మరలి= మళ్ళీ; బాణశతత్రయ= మూడు వందల బాణాలను; ప్రయోగ= వేయుటలో; తీవ్రులు+అగు= అధికులైన; ధృష్టద్యుమ్న చేకితానుల= ధృష్టద్యుమ్నుడిని, చేకితానుడిని; మున్ను+ఇడికొని= ముందుంచుకొని; పొంగి= ఉబ్బి; తానును= ధర్మరాజు కూడా; పంద్రెంటన్= పన్నెండు బాణాలతో; నొప్పించెన్= బాధించాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ భారద్వాజుని= ఆ ద్రోణుని; మఱియునున్= ఇంకనూ; పలువురు= అనేకులు; పాండవ= ధర్మజాదుల; పక్ష= వైపుగల; యోధ= యుద్ధం చేసే; వీరులు= శూరులు; పొదివినన్= చుట్టుముట్టగా; కని= చూచి; నీ మన్నించు= నీవు గౌరవించే; రాజులు= నృపులు; రాజకుమారులున్= రాజపుత్రులును; అతనికిన్= ఆ ద్రోణుడికి; బాసట+ఐ= సహాయులై; కవిసిరి= ఎదుర్కొన్నారు; అతండు= ద్రోణుడు; వసుదానున్=

వసుదానుడిని; వసుధన్= భూమిపై; కూల్చి= పడవేసి; క్షేమున్= క్షేముడిని; జముకడకున్= యముడి వద్దకు; అనిచి= పంపి; యుధామన్యునిన్= యుధామన్యుడిని; ఉత్తమౌజునిన్= ఉత్తమౌజుడిని; శిఖండిని; సాత్యకిన్= సాత్యకిని; ఎక్కు+అమ్ములు= ఎక్కుపెట్టిన బాణాలు; ఎమ్ములన్= ఎముకలందు; కీలించి= తగిల్చి; తన్నున్= తనను; కదిసినన్= ఆక్రమించగా; కని= చూచి; ఆ+అజాతశత్రుండు= ధర్మజుడు; వెండియున్= మరల; కైతవంబునన్= ఉపాయంతో; రణంబునకున్= యుద్ధం నుండి; తొలంగన్+పాఱినన్= తొలగిపోగా .

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజును పట్టుకొనటానికి ఉత్సహించి తరిమే మహావీరుడైన ద్రోణుడిని ఎదుర్కొని యుధామన్యుడు, ఉత్తమౌజుడు, వసుదానుడు, శిఖండి కలిసి, ఐదైదు బాణాలు వేశారు. సాత్యకి, క్షత్రధర్ముడు వరుసగా నూట ఇరువది బాణాలతోను, పది బాణాలతోను పొదివారు. ధర్మజుడు కూడ మరలి మూడు వందల బాణాలను వేయటంలో అధికులైన ధృష్టద్యుమ్నుడిని, చేకితానుడిని ముందుంచుకొని, ఉత్సహించి, తాను కూడా పన్నెండు బాణాలతో నొప్పించాడు. అపుడు ఆ ద్రోణుడిని ఇంకా పాండవ పక్షంలోగల యోధులు చుట్టుముట్టగా చూచి నీవు గౌరవించే రాజులు, రాజకుమారులు ఆ ద్రోణుడికి సహాయులై పరుగెత్తారు. ఆ ద్రోణుడు కూడ వసుదానుడిని నేలపై కూల్చి, క్షేముడిని యమలోకానికి పంపి, యుధామన్యుడిని, ఉత్తమౌజుడిని, శిఖండిని, సాత్యకిని బాణాలతో గ్రుచ్చి, తనను ఆక్రమించటం చూచి ఆ ధర్మజుడు ఉపాయంగా యుద్ధభూమినుండి తొలగిపోగా.

**క. గురు దృఢసేనుఁడు దాఁకిన । హరి సారథి కేతురథ శరాసన శకలో**
**త్కరములతోడ నతండును । దొరఁగించెఁ దదీయ తనువు దునియలు ధరణిన్. 297**

**ప్రతిపదార్థం:** గురున్= ద్రోణుడిని; దృఢసేనుఁడు= దృఢసేనుడనేవాడు; తాఁకినన్= ఎదుర్కొనగా; అతండును= ఆ ద్రోణుడును; హరి= గుర్రాలు; సారథి= రథచోదకుడు; కేతు= పతాకం; రథ= రథం; శరాసన= ధనుస్సులయొక్క; శకల= తునకల; ఉత్కరముల తోడన్= సమూహాలతో; తదీయ తనువు= ఆ దృఢసేనుడి దేహం యొక్క; తునియలు= ముక్కలను; ధరణిన్= నేలపై; తొరఁగించెన్= పడగొట్టాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడిని దృఢసేనుడు తాకగా, ఆచార్యుడు అతడి గుర్రాలు, సారథి, కేతువు, రథం, ధనుస్సుల యొక్క ఖండాల సమూహంతోపాటు ఆ దృఢసేనుడి మేని ముక్కలను కూడ నేలపై పడవేశాడు.

**వ. ఇత్తెఱంగునం దునిమి తఱుము నతని దోర్విలాసంబు దుస్సహం బగుటయుం బాండవ బలంబులు దెరలినం గురు సైనికులు నలుగడలకు నెగచి; రట్లు విజృంభించిన కుంభసంభవు నెదుర్కొని వార్ధక్షేమియుఁ జిత్రసేనుండును సేనాబిందుండును సువర్చసుండును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును శిఖండియు సాత్యకియును సుమిత్రుండును సాయక జాలంబులు నిగిడించిన. 298**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఇట్లు; తునిమి= సంహరించి; తఱుము= తరిమికొట్టే; అతని= ఆ ద్రోణుడి; దోః+విలాసంబు= బాహువుల క్రీడ; దుస్సహంబు= ఓర్వరానిది; అగుటయున్= కాగా; పాండవ బలంబులు= పాండవ సేనలు; తెరలినన్= తొలగిపోగా; కురుసైనికులు= కౌరవుల భటులు; నలుగడలకున్= నాల్గు దిక్కులకు; ఎగచిరి= తరిమారు; అట్లు= ఆ విధంగా; విజృంభించిన= చెలరేగిన; కుంభసంభవున్= ద్రోణుడిని; ఎదుర్కొని= ఎదిరించి; వార్ధక్షేమియున్= వార్ధక్షేమి అనేవాడు; చిత్రసేనుండును= చిత్రసేనుడు; సేనాబిందుండును= సేనాబిందుడు; సువర్చసుండును= సువర్చసుడు; ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడు; చేకితానుండును= చేకితానుడు; శిఖండియున్= శిఖండి; సాత్యకియును= సాత్యకి; సుమిత్రుండును= సుమిత్రుడును; సాయక= బాణాల; జాలంబులు= సమూహాలు; నిగిడించినన్= ప్రసరింపజేయగా.

**తాత్పర్యం:** ఇట్లా శత్రువులను సంహరించి, తరిమికొట్టే ద్రోణుడి భుజవిలాసం సహించరానిది కావటం వలన పాండవ సేనలు తొలగిపోగా, కురు సైనికులు నాల్గు దిక్కులకు వారిని తరిమికొట్టారు. అట్లా విజృంభించిన ద్రోణుడిని ఎదిరించి వార్ధక్షేమి, చిత్రసేనుడు, సేనాబిందుడు, సువర్చసుడు, ధృష్టద్యుమ్నుడు, చేకితానుడు, శిఖండి, సాత్యకి, సుమిత్రుడు వరుసగా బాణాలు ప్రయోగించగా.

**తే.** **అందఱకు నన్నిరూపులై యతఁడు వోరి । యా సుమిత్త్రునిఁ గూల్చిన నతనిఁ గేక**
**యులును మాత్స్యపాంచాలురు నొక్కపెట్ట । కవిసి విరిసిరి తచ్ఛరాఘాత భీతి.** **299**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ ద్రోణుడు; అందఱకున్= శత్రువులందరికి; అన్ని రూపులు+ఐ= అన్ని ఆకారాలు గలవాడై; పోరి= యుద్ధం చేసి; ఆ సుమిత్త్రునిన్= ఆ సుమిత్రుడనేవాడిని; కూల్చినన్= చంపగా; తద్= ఆ ద్రోణుడి; శర+ఆఘాత= బాణపు దెబ్బల వలని; భీతిన్= భయంతో; అతనిన్= ఆ ద్రోణుడిని; కేకయులును= కేకయ దేశపు వారును; మాత్స్య= మత్స్య దేశ సైనికులును; పాంచాలురున్= పాంచాల దేశ భటులును; ఒక్కపెట్టు+అ= ఒకేసారి; కవిసి= చుట్టుముట్టి; విరిసిరి= చెదరిపోయారు.

**తాత్పర్యం:** ఆ ద్రోణుడు శత్రువులందరికి అన్ని రూపాలై పోరు సల్పి సుమిత్రుడిని చంపేసరికి, అతడిని కేకయ, పాంచాల సైనికులు ఒకేసారి చుట్టుముట్టి, అతడి బాణాల దెబ్బకు భయపడి చెదరిపోయారు.

**వ.** **ధృష్టద్యుమ్న సాత్యకి సేనాబిందు ప్రముఖ రథిక వరులును వసమఱియుండిరనిన విని, ధృతరాష్ట్రుం డచ్చెరువడి 'యిట్లు పేర్చిన యాచార్యు శౌర్యభుజ వీర్యంబులు సైరింప నక్కడ నెవ్వరు లేరైరి గదే, యనుటయు సంజయుం డది సెప్పెద నాకర్ణింపు'మని యిట్లను నట్లు గలంగిన కౌంతేయ సేనఁ గనుంగొని కలకల నవ్వుచుఁ గురువిభుండు కర్ణునితో నిట్లనియె.** **300**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్న= ధృష్టద్యుమ్నుడు; సాత్యకి; సేనాబిందు; ప్రముఖ= మున్నగు; రథిక= రథమెక్కి యుద్ధం చేసేవారిలో; వరులును= శ్రేష్ఠులును; వసము+అఱి= స్వాధీనం తప్పి; ఉండిరి= ఉన్నారు; అనినన్= అనగా; విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; అచ్చెరువు+పడి= ఆశ్చర్యపడి; ఇట్లు= ఈ విధంగా; పేర్చిన= అతిశయించిన; ఆచార్యు= ద్రోణుడి; శౌర్య= శూరత్వం; భుజ= బాహువుల; వీర్యంబులు= బలాలు; సైరింపన్= సహించటానికి; అక్కడన్= ఆ పాండవ పక్షంలో; ఎవ్వరు= ఎవరు గూడ; లేరు+ఐరి+కదే= లేకుండినారు కదా; అనుటయున్= అనగా; సంజయుండు; అది= ఆ సంగతి; చెప్పెదన్= చెపుతాను; ఆకర్ణింపుము+అని= వినుమని; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; కలంగిన= కలతపడిన; కౌంతేయసేనన్= కుంతీపుత్రుల సైన్యాన్ని; కనుంగొని= చూచి; కలకల నవ్వుచున్= సంతోషంగా నవ్వుతూ; కురువిభుండు= దుర్యోధన మహారాజు; కర్ణునితోన్= కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, సేనాబిందువు మొదలైన రథిక శ్రేష్ఠులు స్వాధీనం తప్పి ఉన్నారనగా విని, ధృతరాష్ట్రుడు ఆశ్చర్యపడి, 'ఇట్లా విజృంభించిన ద్రోణాచార్యుడి శూరత్వ, బాహుబలాలను సహించి ఎదుర్కొనటానికి పాండవ పక్షంలో ఎవ్వరూ లేకుండాపోయారా? అని అన్నాడు. సంజయుడు ఆ విషయం తెలుపుతాను వినుమని ఇట్లా అన్నాడు. అట్లా కలతపడ్డ పాండవ సేనను చూచి కలకల నవ్వుతూ దుర్యోధనుడు కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**క.** **'పెనుగాలిని వెసఁ గూలిన । వనము క్రియం బడిన పాండవ బలముఁ గంటే?**
**విను మింక నెన్నఁడును మొగ । కొన రీ యోడి చనువారు గురుకోల్తలకున్.** **301**

**ప్రతిపదార్థం:** పెనుగాలిని= ఝుంఝూమారుతానికి; వెసన్= వేగంగా; కూలిన= పడిపోయిన; వనము= తోట; క్రియన్= వలె; పడిన= కూలిన; పాండవ బలమున్= పాండవుల సైన్యాన్ని; కంటే?= చూచినావా?; వినుము; ఇంకన్= ఇక; ఎన్నఁడును= ఎన్నడు కూడ; గురు= ద్రోణుడి; కోల్తలకున్= ఎదుట నిల్చి యుద్ధం చేయటానికి; ఓడి చనువారు= ఓడి పారిపోయేవారు; మొగకొనరు= పూనుకొనరు.

**తాత్పర్యం:** 'ఝుంఝూమారుతానికి వెంటనే కూలిన తోటవలె ఉన్న పాండవ సేనను చూశావా? వినుము. ద్రోణాచార్యుడి ముందు నిలిచి యుద్ధం చేయటానికి ఎన్నడు కూడ ఓడి పారిపోయేవారు ఎదుటికి రాజాలరు.

**విశేషం:** ఉపమ.

**చం.** **పవనతనూజుఁ గంటె? నిజపార్శ్వములం దనవారు లేక కౌ**
**రవులు మహోగ్రభంగి నడరం గడు దైన్యముఁ బొందియున్న వాఁ**
**డవిరళ దివ్యమార్గణ దురాసదు ద్రోణునిఁ జూచి వీఁడు రా**
**జ్యవిభవకాంక్ష యెల్లఁ దెగటాఱఁగఁ బాఱెడు నట్లు సూడుమీ!'** **302**

**ప్రతిపదార్థం:** పవన తనూజున్= భీముడిని; కంటె?= చూచినావా?; నిజపార్శ్వములన్= తన ప్రక్కల; తన వారు= ఆత్మీయులు; లేక= లేకుండటంచేత; కౌరవులు= కౌరవపక్షంవారు; మహా+ఉగ్రభంగిన్= మిక్కిలి భయంకరంగా; అడరన్= విజృంభించగా; కడున్= మిక్కిలి; దైన్యమున్= దీనత్వాన్ని; పొంది ఉన్నవాఁడు= పొందాడు; అవిరళ= విస్తారమైన; దివ్య= దేవతాసంబంధమైన; మార్గణ= ఆగ్నేయాది బాణాలచేత; దురాసదున్= ఎదుర్కొన వీలుగాని వాడగు; ద్రోణునిన్= ద్రోణాచార్యుడిని; చూచి; వీఁడు= ఈ భీముడు; రాజ్య= రాజ్యానికి చెందిన; విభవ= సౌఖ్యపు; కాంక్ష= కోరిక; ఎల్లన్= అంతయు; తెగటాఱఁగన్= నశించగా; పాఱెడున్+అట్లు= పారిపోయేటట్లు; చూడుమీ!= చూడుమా!

**తాత్పర్యం:** 'ఓ కర్ణా! భీముడిని చూశావా! చుట్టూ తన వారు లేక కౌరవులు మహాభయంకరంగా విజృంభించగా మిక్కిలి దీనత్వాన్ని పొందాడు. విస్తారమైన దివ్యాస్త్రాలు కలవాడు కావటం వలన ఎదుర్కొనటానికి వీలుగాని ద్రోణాచార్యుడిని చూచి వీడు రాజ్యసుఖకాంక్ష నశించగా పారిపోయేటట్లు చూడుమా!'

**వ.** **అనిన విని కర్ణుం డతని కిట్లనియె.** **303**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విని; కర్ణుండు= కర్ణుడు; అతనికిన్= ఆ దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని కర్ణుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**ఉ.** **'భీముఁడు నట్టివాఁడె? యరిభీషణ విక్రముఁ డస్మదీయ సం**
**గ్రామ జయంబు ప్రాణములు గల్గఁగ సైఁచునె? పాండవేయు లు**
**ద్దామ బలాఢ్యు; లాహవము దక్కుదురే? యదిగాక వారు నీ**
**చే మును పడ్డపాట్లు దమ చిత్తములన్ మఱవంగ నేర్తురే?** **304**

**ప్రతిపదార్థం:** భీముఁడున్= భీమసేనుడు; అట్టివాఁడె?= అట్లా వెనుకంజ వేసేవాడా?; అరి= శత్రువులకు; భీషణ= భయంకరమైన; విక్రముఁడు= పరాక్రమశాలి; అస్మదీయ= మనయొక్క; సంగ్రామ= యుద్ధమందలి; జయంబు= విజయం; ప్రాణములు=ప్రాణాలు; కల్గఁగన్= ఉండగా; సైఁచునె?= సహిస్తాడా?; పాండవేయులు= పాండవులు; ఉద్దామ= గొప్ప; బలాఢ్యులు= శ్రేష్ఠమైన బలంగలవారు;

ఆహవము= యుద్ధం; తక్కుదురె?= వదులుదురా?; అదిగాక= అంతేగాక; నీచేన్= నీ వలన; మును= పూర్వం; పడ్డ= అనుభవించిన; పాట్లు= కష్టాలు; తమ= తమ యొక్క; చిత్తములన్= మనస్సులలో; మఱవంగన్+నేర్తురే?= మరచిపోతారా?

**తాత్పర్యం:** 'భీముడు వెనుదిరిగి పోయేవాడా? అతడు శత్రువులకు భయం గొలిపే పరాక్రమం కలవాడు. ప్రాణాలుండగా మనం యుద్ధంలో గెలవటం సహిస్తాడా? పాండవులు గొప్ప బలశాలులు; యుద్ధాన్ని వదలుకొంటారా? అదిగాక, వారు నీ చేత పూర్వం పడ్డ కష్టాలు మరచిపోతారా?

**చ.** **వినుము తదీయ యోధులును వీర గుణాఢ్యులు భీము మున్నుగాఁ**
**గొని గురుఁ దాఁక కుండుదురె? కూడుద మీతఁడు నొవ్వకుండఁగా**
**మనమును నీతనిం బలసమగ్రులమై; యటు గాక యోడి రం**
**చునికి ప్రమాద; మేను మొగమోడక చెప్పితిఁ గౌరవేశ్వరా!'** **305**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఈశ్వరా!= దుర్యోధన మహారాజా!; వినుము; తదీయ= పాండవుల; యోధులును= వీరులును; వీర= వీరులకుండే; గుణాఢ్యులు= గుణాలలో గొప్పవారు; భీమున్= భీముడిని; మున్నుగాన్+కొని= ముందుంచుకొని; గురున్= ద్రోణాచార్యుడిని; తాఁకక+ఉండుదురె?= ఎదుర్కొనక ఉంటారా?; ఈతఁడు= ద్రోణాచార్యుడు; నొవ్వకుండగాన్= బాధపడకుండగా; మనమును= మనం కూడ; బలసమగ్రులము+ఐ= సమస్తమైన సేనలు కలవారమై; ఈతనిన్= ద్రోణుడిని; కూడుదము= కలిసికొందము; అటుగాక= అట్లాకాకుండా; ఓడిరి+అంచున్= ఓడిపోయినారని; ఉనికి= ఊరుకొనటం; ప్రమాదము= ఆపత్కరం; ఏను= కర్ణుడనగు నేను; మొగము+ఓడక= మొగమాటం లేకుండ; చెప్పితిన్= చెప్పాను.

**తాత్పర్యం:** దుర్యోధన మహారాజా! విను. పాండవ పక్షయోధులంతా వీరగుణాలలో గొప్పవారు. భీముడిని ముందుంచుకొని ద్రోణాచార్యులను ఎదుర్కొనకుండా ఉంటారా? ఈతడు బాధపడకుండా మనం కూడా సమస్త సైన్యాలతో ఈ ఆచార్యుడిని కలిసికొందాం. అట్లా కాక పాండవులు ఓడిపోయినారని ఊరుకొనడం ప్రమాదమని నేను మొగమాటం లేకుండా చెప్పాను.'

**వ.** **అని పలుకునంతకుం గూడుకొని.** **306**

**ప్రతిపదార్థం:** అని పలుకునంతకున్= అని అన్నంతలోనే; కూడుకొని= కలిసికొని.

**తాత్పర్యం:** అని కర్ణుడు దుర్యోధనుడితో అన్నంత లోపలనే పాండవ వర్గమంతా కలిసికొని.

**సీ.** **హంస గౌరములగు హయములు నమృతాంశు । కేతువు మెఱయ నజాతరిపుఁడు**
**రురునిభాశ్వంబులు హరికేతనంబును । బ్రస్ఫురితములుగఁ బవనసుతుఁడు,**
**శుకవర్ణహరులు ప్రస్తుత శరభధ్వజం । బును నొప్ప సహదేవ పూర్వజుండు,**
**నంబుద చ్ఛాయ రథ్యములు శుండాల ప । తాకయు శోభిల్లఁ దదనుజుండుఁ**

**తే.** **గడఁగి తమ తమ సిడములు గ్రాల ద్రుపద । మాత్స్యసాత్యకి ముఖ యోధ మండలములు**
**దారుణాటోప విక్రమోత్సాహ లీలఁ । దోడు నడవంగ నడరిరి ద్రోణు మీఁద.** **307**

**ప్రతిపదార్థం:** హంస= హంసవలె; గౌరములు+అగు= తెల్లనివగు హయములున్= గుర్రాలును; అమృత+అంశు= అమృత కిరణుడైన చంద్రుడుగల; కేతువు= పతాకం; మెఱయన్= ప్రకాశించగా; అజాతరిపుఁడు= ధర్మరాజు; రురు= నల్లచారల

దుప్పితో; నిభ= సమానమైన; అశ్వంబులు= గుఱ్ఱాలు; హరి= సింహపు; కేతనంబును= పతాకం; ప్రస్ఫురితములుగన్= వెలుగొందగా; పవనసుతుఁడు= భీముడు; శుక= చిలుక యొక్క; వర్ణ= రంగుగల; హరులు= గుఱ్ఱాలు; ప్రస్తుత= ప్రశంసించదగిన; శరభ= సింహానికంటె బలంగల ఎనిమిది కాళ్ళ జంతువు; ధ్వజంబునున్= పతాకంగా; ఒప్పన్= ఒప్పగా; సహదేవ= సహదేవుడి కంటె; పూర్వజుండున్= అన్నయైన నకులుడును; అంబుద= మేఘాలవంటి; ఛాయ= వన్నెగల; రథ్యములు= గుఱ్ఱాలు; శుండాల= ఏనుగుగల; పతాకయున్= ధ్వజం; శోభిల్లన్= ఒప్పగా; తద్+అనుజుండున్= ఆ నకులుడి యొక్క తమ్ముడగు సహదేవుడును; కడఁగి= పూని; తమ తమ= వారి వారి; సిడములు= పతాకాలు; క్రాలన్= వెలుగొందగా; ద్రుపద= ద్రుపదుడు; మాత్స్య= విరటుడు; సాత్యకి; ముఖ= మొదలైన; యోధ= వీరుల; మండలములు= సమూహాలు; దారుణ= భయంకరమైన; ఆటోప= విజృంభణ; విక్రమ= పరాక్రమం; ఉత్సాహ= పూనికతోడి; లీలన్= విలాసంతో; తోడు నడవంగన్= వెంట రాగా; ద్రోణుమీఁదన్= ద్రోణుడిపై; అడరిరి= విజృంభించారు.

**తాత్పర్యం:** హంసలవంటి తెల్లని గుఱ్ఱాలు, చంద్ర పతాకం ప్రకాశిస్తుండగా ధర్మరాజు, కృష్ణసారమృగపు వన్నెగల గుఱ్ఱాలు, సింహధ్వజం వెలుగగా భీముడు, చిలుకవంటి రంగు గల గుఱ్ఱాలు, ప్రశంసనీయమైన శరభ పతాకంగల నకులుడు, మేఘవర్ణంగల అశ్వాలు, గజధ్వజం గల సహదేవుడు ఉత్సహించి, తమ తమ పతాకాలు ప్రకాశిస్తుండగా ద్రుపదుడు, విరాటుడు, సాత్యకి మొదలైన వీర సమూహాలు భయానకమైన విజృంభణ, పరాక్రమం, ఉత్సాహం, విలాసం ఒప్పగా తోడు నడవగా ద్రోణుడిపై దూకారు.

**వ. ఇట్లు పాండవ బలంబులు జలధరంబులు శైలంబు గప్పుకరణిం గుంభసంభవుం బొదివిన దృష్టిపథం బవరుద్ధం బగుటయు నతండు దెగియె నను దిగులు మన వారికిం బుట్టె; నట్టియెడ నీ కొడుకు గడంగి సేనలకుం జేయి వీచి యందు ముంగలియై నడచు వడముడిం దాఁకినం దమకించి సాత్యకిని గృతవర్మయు, క్షత్త్రధర్ముని సైంధవుండును, యుయుత్సుని సుబాహుండును , నకులుని దుశ్శాసనుండును, సహదేవునిఁ జిత్రవర్ముండును, ధర్మనందను శల్యుండును, ద్రుపదుని బాహ్లికుండును, విరాటుని విందానువిందులును, శ్రుతకీర్తిని వివింశతియు, శ్రుతసేనుని సాల్వుండును, శ్రుతసోమునిఁ జిత్రసేనుండును, శతానీకుని శ్రుత వర్మయుఁ, బ్రతివింధ్యుని నశ్వత్థామయు, సౌభద్రుని లక్ష్మ ణుండును, శిఖండిని వికర్ణుండును, గుంతిభోజుని దుర్ముఖుండును, గేకయ, పంచకంబును, గర్ణుండును, గాశీశ్వరుని జయుండును, బాండ్యుని జయత్సే నుండును, ధృష్టద్యుమ్నపుత్రుల బృహద్ధనుర్జయ మిత్రులును, వార్ధక్షేమిని గృపాచార్యుండును, మణిమంతుని భూరిశ్రవుండును, ఘటోత్కచుని నలంబుసుండును దలపడి; రెన్నం గొలఁదిగాదు గాని మఱియు ననేకుల మార్కొని; రిబ్బంగి భారద్వాజునిం బరిమార్పను గావను బూని యక్కడి యిక్కడి వీరు లుక్కు మిగిలి యొండొరుల కేతనంబులు గూల్చియు, ఘోటకంబుల ప్రాణంబులఁ బీల్చియు, సారథుల రూపు మాపియు, నరదంబులు పఱియలు వాపియు నాతపత్ర చామరంబుల బడలువఱిచియుఁ, జాపంబులు విఱిచియుఁ గత్తళంబుల తునియలు ధరన్ దొరలించియు, నెత్తురు లురలించియు నిత్తెఱంగున ఘోర సంగ్రామంబు సేయుచుండ మధ్యాహ్నం బయ్యె, నప్పుడు దన్నుం గవిసిన ధృష్టద్యుమ్ను నమ్ముల నవలీలం గుదియించి యగ్గురుండు వెండియుం గొందఱం జిక్కువఱిచె' ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.308**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవ బలంబులు= పాండవుల సైన్యాలు; జలధరంబులు= మేఘాలు; శైలంబు= పర్వతాన్ని; కప్పు కరణిన్= ఆక్రమించిన విధంగా; కుంభసంభవున్= ద్రోణాచార్యుడిని; పొదివినన్= కప్పగా; దృష్టిపథంబు= చూచే మార్గం; అవరుద్ధంబు+అగుటయున్= అడ్డగించబడగా; అతండు= ద్రోణుడు; తెగియెన్= హతమైనాడు; అను దిగులు= అనే భయం;

మనవారికిన్= మన కౌరవ పక్షం వారికి; పుట్టునట్టి ఎడన్= కలిగినపుడు; నీ కొడుకు= నీ యొక్క పుత్రుడు; కడంగి= పూని; సేనలకున్= సైన్యాలకు; చేయి వీచి= ప్రోత్సహించి; అందున్= పాండవ సైన్యంలో; ముంగలి+ఐ= ముందుగా; నడచు= నడుచునట్టి; వడముడిన్= భీముడిని; తాఁకినన్= ఎదుర్కొనగా; తమకించి= త్వరపడి; సాత్యకిని; కృతవర్మయున్= కృతవర్మ; క్షత్రధర్మునిన్= క్షత్రధర్ముడిని; సైంధవుండును= సైంధవుడు; యుయుత్సునిన్= యుయుత్సుడిని; సుబాహుండును= సుబాహుడు; నకులునిన్= నకులుడిని; దుశ్శాసనుండును= దుశ్శాసనుడు; సహదేవునిన్= సహదేవుడిని; చిత్రవర్ముండును= చిత్రవర్మయు; ధర్మనందనున్= ధర్మరాజును; శల్యుండును= శల్యుడును; ద్రుపదునిన్= ద్రుపదుడిని; బాహ్లికుండును= బాహ్లికుడును; విరాటునిన్= విరాట రాజును, విందానువిందులును= విందుడు, అనువిందుడును; శ్రుతకీర్తిని; వివింశతియున్; శ్రుతసేనుని; సాల్వుండును; శ్రుత సోమునిన్; చిత్రసేనుండును; శతానీకున్; శ్రుతవర్మయున్; ప్రతివింధ్యునిన్; అశ్వత్థామయున్; సౌభద్రునిన్= అభిమన్యుడిని; లక్ష్మణుండును; శిఖండిని; వికర్ణుండును; కుంతిభోజుని; దుర్ముఖుండును= దుర్ముఖుడు; కేకయ పంచకంబును= కేకయ దేశానికి చెందిన వీరులు ఐదుగురిని; కర్ణుండును= కర్ణుడును; కాశీశ్వరునిన్= కాశీరాజును; జయుండును; పాండ్యుని= పాండ్యదేశరాజును; జయత్సేనుండును; ధృష్టద్యుమ్నుని పుత్రులన్= ధృష్టద్యుమ్నుడి కొడుకులను; బృహద్ధనుర్జయ మిత్రులును= బృహద్ధనుర్జయుడి స్నేహితులును; వార్ధ్దక్షేమిని; కృపాచార్యుండును= కృపాచార్యుడు; మణిమంతుని; భూరిశ్రవుండును; ఘటోత్కచున్; అలంబుసుండును; తలపడిరి= ఎదుర్కొన్నారు; ఎన్నన్+కొలఁదికాదు= లెక్కింప వీలుగాదు; కాని; మఱియున్= ఇంకను; అనేకులు= చాలా మంది; మార్కొనిరి= ఎదుర్కొన్నారు; ఈ+భంగిన్= ఈ విధంగా; భారద్వాజునిన్= ద్రోణుడిని; పరిమార్పను= చంపటానికి; కావను= కాపాడటానికి; పూని= యత్నించి; అక్కడి= పాండవపక్షపు; ఇక్కడి= కౌరవ పక్షపు; వీరులు= యోధులు; ఉక్కు= శౌర్యం; మిగిలి= మీరగా; ఒండొరుల= పరస్పరం; కేతనంబులు= పతాకాలు; కూల్చియున్= పడవేసి; ఘోటకంబుల= గుర్రాల; ప్రాణంబులన్= ప్రాణాలను; పీల్చియున్= హరించియు; సారథుల= రథం నడిపేవారిని; రూపుమాపియున్= చంపి; అరదంబులు= రథాలు; పఱియలు= పర్రెలు; పాపియున్= చేసియు; ఆతపత్ర= ఛత్రాలను; చామరంబులన్= వీవనలను; బడలు వఱిచియున్= చించి; చాపంబులు= బాణాలు; విఱిచియున్= ఖండించి; కత్తళంబుల= కవచాల యొక్క; తునియలు= ముక్కలు; ధరన్= భూమిపై; దొరలించియున్= పడవేసి; నెత్తురు= రక్తం; ఉరలించియున్= కార్చియు; ఇత్తెఱంగున్= ఈ విధంగా; ఘోర సంగ్రామంబు= భయంకరమైన యుద్ధం; చేయుచుండన్= చేస్తుండగా; మధ్యాహ్నంబు= పట్టపగలు; అయ్యెన్= అయింది; అప్పుడు= ఆ సమయంలో; తన్నున్= తనను; కవిసిన= ఆక్రమించిన; ధృష్టద్యుమ్ను= ధృష్టద్యుమ్నుడి; అమ్ములన్= బాణాలతో; అవలీలన్= సులభంగా; కుదియించి= బాధించి; ఆ+గురుండు= ఆ ద్రోణాచార్యుడు; వెండియున్= మరల; కొందఱన్= కొందరు వీరులను; చిక్కుపఱిచెన్= బాధించాడు; అనినన్= అనగా; విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పాండవ సైన్యాలు మేఘాలు పర్వతాన్ని క్రమ్మినట్లు ద్రోణుడిని కప్పగా, చూపులు ప్రసరించక అతడు హతుడయ్యేనన్న భయం మన కౌరవ వర్గానికి తోచగా, నీ కుమారుడైన దుర్యోధనుడు ముందుకు వచ్చి చెయ్యి వీచి, అందు ముందున్న భీముడిని ఎదుర్కొన్నాడు. అపుడు త్వరపడి సాత్యకిని కృతవర్మ, క్షత్రధర్ముడిని సైంధవుడు; యుయుత్సుడిని సుబాహుడు, నకులుడిని దుశ్శాసనుడు, సహదేవుడిని చిత్రవర్మ, ధర్మరాజును శల్యుడు, ద్రుపదుడిని బాహ్లికుడు, విరాటుని విందానువిందులు, శ్రుతకీర్తిని వివింశతి, శ్రుతసేనుడిని సాల్వుడు, శ్రుతసోముని చిత్రసేనుడు, శతానీకుడిని శ్రుతవర్మ, ప్రతివింధ్యుని అశ్వత్థామ, సౌభద్రుడిని లక్ష్మణుడు, శిఖండిని వికర్ణుడు; కుంతిభోజుడిని దుర్ముఖుడు, కేకయులైదుగురిని కర్ణుడు, కాశీరాజును జయుడు, పాండ్యుడిని జయత్సేనుడు, ధృష్టద్యుమ్నుడి పుత్రులను బృహద్ధనుర్జయ మిత్రులు, వార్ధ్దక్షేమిని కృపాచార్యుడు, మణిమంతుని భూరిశ్రవుడు, ఘటోత్కచుడిని అలంబుసుడు ఎదుర్కొన్నారు. ఇట్లా లెక్కించటానికి వీలుకానంతమంది వీరులు ఒకరిపై ఒకరు యుద్ధానికి దిగారు. ఈ విధంగా ద్రోణుడిని సంహరించటానికి, రక్షించటానికి పూనుకొని పాండవ, కౌరవ పక్ష వీరులు శౌర్యం మీరగా పరస్పరం పతాకాలను కూల్చి, అశ్వాలను చంపి, సారథులను హతమార్చి, రథాలను విరుగగొట్టి, ఛత్రచామరాలను త్రుంచి, ధనుస్సులను ఖండించి, కవచాల ముక్కలను నేలపై పడవేసి,

రక్తాలు చిందిస్తూ, భయానకమైన యుద్ధం చేస్తుండగా పట్టపగలు అయింది. ద్రోణుడు అప్పుడు తనను ఎదుర్కొన్న ధృష్టద్యుమ్నుడిని బాణాలతో తేలికగా బాధించి, మరి కొందరిని చీకాకు పరచినాడని చెప్పగా విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**క. ‘వీ రిచట నివ్విధంబునఁ । బోరఁగ నర్జునునితోడఁ బోక పెనఁగు న**
**వ్వీరులు సంశప్తకు లె । ట్లైరొకొ? యాతని పరాక్రమాతిశయమునన్.’ 309**

**ప్రతిపదార్థం:** వీరు= కౌరవులు, పాండవులు; ఇచటన్= ఈ యుద్ధరంగంలో; ఈ+విధంబునన్= ఈ రీతిగా; పోరఁగన్= యుద్ధం చేయగా; అర్జునుని తోడన్= అర్జునుడితో; పోక= వెనుదిరుగక; పెనఁగు= పోరాడే; ఆ+వీరులు= ఆ వీరులైన; సంశప్తకులు= సంశప్తకులైన సుశర్మాదులు; ఆతని= అర్జునుడియొక్క; పరాక్రమ+అతిశయమునన్= శౌర్యం యొక్క ఆధిక్యంవలన; ఎట్లు+ఐరి+ఒకొ!= ఏమైనారో!

**తాత్పర్యం:** ‘కౌరవ పాండవ సైన్యాలు యుద్ధరంగంలో ఈ విధంగా పోరాటం సల్పుతుండగా, అర్జునుడితో వెనుదిరుగక యుద్ధంచేసే సుశర్మాది సంశప్తకులు అతిశయించిన అతడి పరాక్రమంముందు ఏమైనారో?’

**చ. అనవుడు నాతఁ డిట్టులను నవ్విభుతో ‘నది వెండి చెప్పెదన్**
**వినుము నరేంద్ర! యట్టి యెడ వీరరసస్ఫురణంబునన్ భవ**
**త్తనయుఁడు గంధసింధుర వితానముపై నడరించి భీమసే**
**నునిఁ గినియించె నాతఁడు గనుంగవ నిప్పులు రాలుచుండఁగన్. 310**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆతఁడు= సంజయుడు; ఆ విభుతోన్= ఆ రాజుతో; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; నరేంద్ర!= ఓ ధృతరాష్ట్ర నృపా!; వినుము; అది= సంశప్తకుల యుద్ధాన్ని గూర్చి; వెండి= మరల; చెప్పెదన్= చెపుతాను; అట్టి ఎడన్= కౌరవ, పాండవ వీరులు యుద్ధం చేస్తుండగా; భవత్+తనయుఁడు= తమ కుమారుడైన దుర్యోధనుడు; వీరరస= వీరరసం; స్ఫురణంబునన్= తోచునట్లుగా; గంధ= మదించిన; సింధుర= ఏనుగుల; వితానము= సమూహం; పైన్+అడరించి= మీదికి పంపి; భీమసేనునిన్= భీముడిని; కినియించెన్= కోపింపజేశాడు; ఆతఁడు= ఆ భీముడు; కనుంగవ= రెండు కన్నులలో; నిప్పులు= అగ్నికణాలు;రాలుచుండఁగన్=కురుస్తుండగా.

**తాత్పర్యం:** అపుడు సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. ‘ఓ మహారాజా! వినుము. సంశప్తకుల యుద్ధాన్ని గూర్చి తర్వాత వివరిస్తాను. ఇట కౌరవ పాండవ సైన్యాలు యుద్ధం చేస్తుండగా మీ కొడుకు, వీరరసం ప్రస్ఫుటమయ్యేటట్లు మదించిన ఏనుగుల గుంపును పైకి నడిపి భీముడికి క్రోధం కలిగేటట్లు చేశాడు. భీముడు అపుడు రెండు కన్నులనుండి నిప్పులు రాలుతుండగా.

**క. శరజాల మహావాత । స్ఫురణంబున నుగ్రదంతి భూరి ఘటా బం**
**ధుర వారివాహపటలము । విరియించుచు బెట్టు గవిసి విభు నొప్పించెన్. 311**

**ప్రతిపదార్థం:** శర= బాణాల; జాల= సమూహమనే; మహావాత= గొప్ప వాయువు యొక్క; స్ఫురణంబునన్= చలనం వలన; ఉగ్ర= భయంకరమైన; దంతి= ఏనుగుల; భూరి= గొప్పనైన; ఘటా= గుంపులనే; బంధుర= దట్టమైన; వారి వాహ= మేఘాల; పటలము= గుంపు; విరియించుచున్= విడిపోయేటట్లు చేస్తూ; కవిసి= ఎదుర్కొని; విభున్= దుర్యోధనుడిని; నొప్పించెన్= బాధించాడు.

**తాత్పర్యం:** భీముడి బాణజాలం అనే మహావాయువు వీచడం వలన భయంకరమైన ఏనుగుల కుంభస్థలాలు అనే దట్టమైన మేఘాల సమూహం విచ్ఛిన్నమయ్యేటట్లు చేస్తూ ఎదుర్కొని, దుర్యోధనుడిని బాధించాడు.

**విశేషం:** అలం: రూపకం.

**వ.** **అట్లు కురురాజు నొచ్చిన నడ్డంబు సొచ్చి.** **312**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; కురురాజు= దుర్యోధనుడు; నొచ్చినన్= బాధపడగా; అడ్డంబు= అడ్డం; చొచ్చి= ప్రవేశించి.

**తాత్పర్యం:** ఆ విధంగా దుర్యోధనుడు బాధపడగా అడ్డం వచ్చి.

**శా.** **వంగాధీశ్వరుఁ డేనుఁగుం గొలిపి గర్వస్ఫూర్తి దివ్యాస్త్ర వి**
**ద్ధాంగుం జేసె మరుత్తనూజు; నతఁ డుద్యత్క్రోధుఁ డై వాని మా**
**తంగంబుం బడనేసి వాఁ డొఱగుచోఁ దన్మస్తకం బుర్వి డొ**
**ల్లం గేలీ విధ మొప్ప నేయ బల మెల్లం బెల్లగిల్లెన్ వడిన్.** **313**

**ప్రతిపదార్థం:** వంగ+అధీశ్వరుఁడు= వంగదేశపు రాజు; ఏనుఁగున్= ఏనుగును; కొలిపి= పురికొల్పి; గర్వస్ఫూర్తిన్= గర్వం స్ఫుటమయ్యేటట్లు; దివ్య= దేవతాసంబంధమైన; అస్త్ర= బాణాలచేత; మరుత్+తనూజున్= భీముడిని; విద్ధ+అంగున్= ఛేదించబడిన అవయవాలుగల వాడినిగా; చేసెన్= చేశాడు; అతఁడు= ఆ భీముడు; ఉద్యత్ క్రోధుఁడు+ఐ= రేగిన కోపం కలవాడై; వాని= వంగదేశపు రాజు యొక్క; మాతంగంబున్= ఏనుగును; పడనేసి= కూల్చి; వాఁడు= వంగదేశపు రాజు; ఒఱగుచోన్= ఒరిగిపోగా; తద్+మస్తకంబు= వాడి తల; ఉర్విన్= భూమిపై; డొల్లన్= దొరలగా; కేలీ విధము= ఆటరీతిగా; ఒప్పన్= ఒప్పేటట్లు; ఏయన్= వేయగా; బలము= సైన్యం; ఎల్లన్= అంతా; వడిన్= వేగంగా; పెల్లగిల్లెన్= పారిపోయింది.

**తాత్పర్యం:** వంగదేశపు రాజు ఏనుగును పురికొల్పి, అహంకారం బయలు పడేటట్లు దివ్యాస్త్రాలచేత భీముడిని బాధించాడు. భీము డపుడు క్రోధం రెచ్చిపోగా, వంగనృపతి ఏనుగును కూల్చి, వాడు నేలకు ఒరగగా, వాడి తలను అవలీలగా కూల్చేసరికి సైన్యమంతా పారిపోయింది.

**వ.** **ఆ సమయంబున.** **314**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు.

**తాత్పర్యం:** భీముడు వంగనృపతిని చంపగా అతడి సైన్యం పారిపోయినప్పుడు.

### భగదత్తుఁడు సుప్రతీకముఁ బఱపి పాండవ సైన్యంబులం గలంచుట (సం. 7-25-19)

**క.** **దానవజయ మింద్రున కె । ద్దానివలనఁ గలిగె మున్ను దానోగ్రము న**
**య్యేనుఁగు భగదత్తుఁడు పవ । మాన తనయుఁ దెసకుఁ గొలిపె మద మెలరారన్.** **315**

**ప్రతిపదార్థం:** దానవ జయము= రాక్షసులను గెలుచుట; ఇంద్రునకున్= ఇంద్రుడికి; ఎద్దానివలనన్= దేనివలన; మున్ను= పూర్వం; కలిగెన్= కలిగిందో; దాన+ఉగ్రమున్= మదజలంచేత భయం గొలిపే; ఆ+ఏనుఁగున్= ఆ ఏనుగును; భగదత్తుఁడు; మదము= మదం; ఎలరారన్= అతిశయించగా; పవనమానతనయున్= భీముడి; దెసకున్= దిక్కునకు; కొలిపెన్= పురికొల్పాడు.

**తాత్పర్యం:** రాక్షసులతోడి యుద్ధంలో పూర్వం ఇంద్రుడికి దేనివలన జయం కలిగిందో, మదజలంచేత భయం గొలిపే అట్టి ఏనుగును భగదత్తుడు మదం అతిశయించగా భీముడివైపు పురికొల్పాడు.

**వ. ఇట్లు మన సైన్యంబు దైన్యంబు వాయం గొలుపుటయు నగ్గజంబు. 316**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మన= కౌరవుల; సైన్యంబు= సేనయొక్క; దైన్యంబు= దీనత్వం; పాయన్+కొలుపుటయున్= పోగొట్టగా; ఆ+గజంబు= ఆ సుప్రతీకమనే ఏనుగు.

**తాత్పర్యం:** ఈ విధంగా మన కౌరవసేనలోని దీనత్వాన్ని తొలగించి సుప్రతీకమనే ఆ ఏనుగు. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. కినుకమై నిగిడిన కనుఁగవ మెఱుఁగుల । గములు ముందటఁ గెంపు గడలుకొనఁగఁ**
**జెవులు మ్రొగ్గించి పూఁచిన రౌద్రతరరేఖ । వినువీథిఁ జూపఱ వేడ్కఁ బెనుప**
**గడునఁ జాఁగిన తొండంబు లయసమ । వర్తిదండము లీలఁ బట్టువఱుపఁ**
**గడు బెట్టిదపు టురవడిఁ బదన్యాస మి । లాస్థలి గ్రక్కదలంగఁ జేయ**

**ఆ. ననిలపుత్రుదెసకు నడరినఁ గని ధర్మ । తనయు సేన జనులు దల్లడిల్లి**
**చంపెఁ జంపె భీము సామజం బనియెడు । నులివు గలయఁ జెలఁగఁ గలఁగి రథిప! 317**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; కినుకమైన్= కోపంతో; నిగిడిన= విస్తరిల్లిన; కను+కవ= కన్నుల జంట వలన; మెఱుఁగుల= వెలుగుల; గములు= గుంపులు; ముందటన్= ముందుభాగంలో; కెంపు= ఎరుపును; గడలు కొలువన్= వ్యాపింపజేయగా; చెవులు; మ్రొగ్గించి= వంచి; పూఁచిన= వ్యాపించిన; రౌద్రతర రేఖ= క్రోధపు గీర; వినువీథిన్= ఆకాశమార్గంలో; చూపఱ= చూచేవారికి; వేడ్కన్= వినోదాన్ని; పెనుపన్= పెంచగా; గండునన్= పౌరుషం వలన; చాఁగిన= సాగిన; తొండంబు= తుండం యొక్క; లయ= విలయం; సమవర్తి= యమధర్మరాజు యొక్క; దండము లీలన్= దండం వలె; పట్టుపఱుపన్= చిక్కువెట్టగా; కడున్= మిక్కిలి; బెట్టిదపు= క్రూరమైన; ఉరవడిన్= వేగంతో; పదన్యాసము= కాళ్ళు మోపటం; ఇలాస్థలిన్= భూమిని; గ్రక్కదలంగన్+చేయన్= మిక్కిలి కదలేటట్లు చేయగా, అనిలపుత్రు= భీముడి; దెసకున్= వైపునకు; అడరినన్= సాగగా; కని= చూచి; ధర్మతనయుసేన= ధర్మజుడి సైన్యం; జనులు= ప్రజలు; తల్లడిల్లి= చలించి; సామజము= ఏనుగు; భీము= భీముడిని; చంపెన్= చంపింది; అనియెడు= అనే; ఉలివు= మ్రోత; కలయన్+చెలఁగన్= అంతటా ధ్వనించగా; కలఁగి= కలతపడి.

**తాత్పర్యం:** 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! సుప్రతీక గజం కోపంతో నిక్కిన కన్నులనుండి వెడలే వెలుగుల గుంపులు ముందు భాగంలో అరుణవర్ణాన్ని ప్రసరింపజేయగా, చెవులు వంచి వ్యాపింపజేసిన క్రోధరేఖ ఆకాశం నుండి చూచే దేవతలకు వినోదాన్ని కలిగించగా, పౌరుషంవలన సాగిన తొండం లయకాలపు యమధర్మరాజు దండం వలె చిక్కు వరుపగా; క్రౌర్యపు వేగంతో కాళ్ళు మోపేసరికి భూభాగం చలించగా, భీముడి వైపునకు సాగగా చూచి సైన్యం, ప్రజలు తల్లడిల్లి, ఆ ఏనుగు భీముడిని 'చంపె, చంపె' అనే కలకలం అంతటా చెలరేగగా కలతపడి.

**విశేషం:** అలం: ఉపమ, అతిశయోక్తి. ఈ పద్యంలో సుప్రతీక గజం యుద్ధరంగంలో చేసిన స్వైరవిహారం వర్ణించబడింది.

**వ. తదనంతరంబున యుధిష్ఠిరుండు. 318**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబునన్= ఆ వెంటనే; యుధిష్ఠిరుండు= ధర్మరాజు.

**తాత్పర్యం:** ఆ వెంటనే ధర్మజుడు.

**క. అలుకొందు మనముతోఁ దన । బలముం బురికొలిపి పొదివి భగదత్తుని న**
**మ్ములఁ గప్పె; నతఁడు వానిన్ । విలసిల్లు మహాంకుశమున విరియ జడియుచున్. 319**

**ప్రతిపదార్థం:** అలుక+ఒందు= కోపించిన; మనముతోన్= మనస్సుతో; తన= తనయొక్క; బలమున్= సైన్యాన్ని; పురికొలిపి= ప్రోత్సహించి; పొదివి= ఆక్రమించి; భగదత్తుని= భగదత్తుడిని; అమ్ములన్= బాణాలతో; కప్పెన్= కప్పాడు; అతఁడు= భగదత్తుడు; వానిన్= ధర్మజుడిని; విలసిల్లు= ప్రకాశించే; మహా+అంకుశమునన్= గొప్ప అంకుశంతో; విరియన్= విస్ఫారగా; జడియుచున్= బెదిరిస్తూ.

**తాత్పర్యం:** ధర్మజుడు కోపంతో తన సైన్యాన్ని పురికొలిపి ఆక్రమించి, భగదత్తుడిని బాణాలతో కప్పివేశాడు. భగదత్తుడు అపుడు విరాజిల్లే గొప్ప అంకుశంతో ఆ బాణాలు దూరంగా పడిపోయేటట్లు విదిలిస్తూ . (తరువాతి పద్యంతో అన్వయం).

**క. గజముఁ గొలిపి యాదిక్కున । గజఘోటక భటనికాయ కాయములు రథ**
**వ్రజములుఁ బొడిపొడిగా న । క్కజముగ విహరించె బాహు గర్వ స్ఫూర్తిన్. 320**

**ప్రతిపదార్థం:** గజమున్= సుప్రతీక గజాన్ని; ఆ దిక్కునన్= ఆ వైపుకు; కొలిపి= పురికొల్పి; గజ= ఏనుగుల; ఘోటక= గుర్రాల; భట= సైనికుల; నికాయ= సమూహపు; కాయములు= దేహాలు; రథవ్రజములున్= రథాల సమూహాలు; పొడిపొడిగాన్= పొడి పొడి కాగా; బాహు= భుజపు; గర్వ= అహంకారం యొక్క; స్ఫూర్తిన్= ప్రకాశంతో; అక్కజముగన్= ఆశ్చర్యం గొలిపేటట్లు; విహ రించెన్= సంచరించాడు.

**తాత్పర్యం:** సుప్రతీక గజాన్ని ఆ వైపు పురికొలిపి ఏనుగుల, గుర్రాల, భటుల గుంపుల దేహాలను, రథసమూహాలను పొడి పొడి చేసి, బాహుగర్వం ప్రకాశించగా భగదత్తుడు ఆశ్చర్యం గొలిపేటట్లు యుద్ధరంగంలో విహరించాడు.

**వ. అప్పు డాలోకించి. 321**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అప్పుడు భగదత్తుడి సైర్యవిహారం చూచి.

**చ. అలిగి దశార్ణ భూరమణుఁ డాతనిఁ దాఁకినఁ జూడ నొప్పె ఱె**
**క్కలు గల పర్వత ద్వయము కైవడి వారల దంతియుగ్మ మి**
**ట్టల మగు వీఁకఁ దత్కరిఁ బడం బొడిచెన్ వడి సుప్రతీక ము**
**త్తలపడువానిఁ జంపె భగదత్తుఁడు దోమరసప్తకంబునన్. 322**

**ప్రతిపదార్థం:** దశార్ణ= దశార్ణదేశానికి; భూ రమణుఁడు= రాజు; ఆతనిన్= భగదత్తుడిని; తాఁకినన్= ఎదుర్కొనగా; ఱెక్కలు+కల= రెక్కలున్న; పర్వత ద్వయము= రెండు పర్వతాల; కైవడి= వలె; వారల= దశార్ణనృపుడి, భగదత్తుడి; దంతియుగ్మము= ఏనుగుల జంట; చూడన్+ఒప్పెన్= చూడదగింది అయినది; సుప్రతీకము= సుప్రతీక గజం; ఇట్టలమగు= మిక్కిలి; వీఁకన్= పరాక్రమంతో; తద్= దశార్ణ దేశ నృపుడి యొక్క; కరిన్= ఏనుగును; వడిన్= వేగంగా; పడన్+పొడిచెన్= కూలనేసింది; భగదత్తుఁడు; ఉత్తల పడువానిన్= పరితపించే దశార్ణ నృపుడిని; తోమర సప్తకంబునన్= ఏడుతోమరాలనే ఆయుధాలతో; చంపెన్= హతమార్చాడు.

**తాత్పర్యం:** దశార్ణ దేశపు రాజు భగదత్తుడిని ఎదుర్కొనగా వారల ఏనుగు జంట రెక్కలుగల పర్వతాల జంటవలె చూడముచ్చటగా ఉండినది. సుప్రతీకగజం అపుడు మిక్కిలి పరాక్రమించి, దశార్ణాధీశుడి ఏనుగును పడిపోయేటట్లు పొడిచింది. భగదత్తుడు ఏడు తోమరాలతో చింతాక్రాంతుడైన అతడిని చంపివేశాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**ఆ.** **చంపి విక్రమంబు సొంపారఁ బాండవ । బలము బడలువడఁగ భద్రదంతిఁ**
**జటుల గతులఁ బఱప సాత్యకి యడ్డంబు । నడచి యేసె దొడ్డ నారసమున. 323**

**ప్రతిపదార్థం:** విక్రమంబు= పరాక్రమం; సొంపు+ఆరన్= అతిశయించగా; చంపి= హతమార్చి; పాండవ బలము= పాండవ సైన్యం; బడలు పడఁగన్= శ్రమపడగా; భద్రదంతిన్= శ్రేష్ఠమైన సుప్రతీక గజాన్ని; చటుల గతులన్= దూకే నడకలతో; పఱపన్= ముందుకు సాగించగా; సాత్యకి; అడ్డంబు నడచి= ఎదుర్కొని; దొడ్డనారసమునన్= గొప్ప బాణంతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** విక్రమం మీర దశార్ణ రాజును చంపి, పాండవ సైన్యం శ్రమపడగా, భగదత్తుడు సుప్రతీక గజాన్ని దూకిస్తూ ముందుకు సాగించేసరికి సాత్యకి అడ్డం వచ్చి పెద్ద బాణాన్ని ప్రయోగించాడు.

**చ.** **కరిపతి జిఱ్ఱనం దిరిగి క్రమ్మఱ నూల్కొని వృష్ణివీరు ను**
**ద్ధురరథ ముద్ధతిం బెనఁచి తొండమునన్ వెస నెత్తి వీచి వై**
**చె రయముమై నతం డిలకుఁ జిత్రముగా నెడ దాఁటి పోయెఁ జె**
**చ్చెర గజ మొండుమైఁ గవిసి చిందఱ వందఱ సేసె మూఁకలన్. 324**

**ప్రతిపదార్థం:** కరిపతి= గజరాజము సుప్రతీకము; జిఱ్ఱనన్= శీఘ్రంగా; తిరిగి పరిభ్రమించి; క్రమ్మఱన్= మరల; ఊల్కొని= కుదురుకొని; వృష్ణివీరు= సాత్యకియొక్క; ఉద్ధుర రథము= ఉద్ధతమైన రథాన్ని; ఉద్ధతిన్= గర్వంతో; పెనఁచి= పెనగజేసి; తొండమునన్= తొండంతో; వెసన్= వేగంగా; ఎత్తి= పైకెత్తి; రయముమైన్= వేగంగా; వీచివైచెన్= విసరివేసింది; అతండు= సాత్యకి; ఇలకున్= నేలపైకి; చిత్రముగాన్= విచిత్రంగా; ఎడ= దూరంగా; దాఁటిపోయెన్= తప్పించుకొని పోయాడు; చెచ్చెరన్= శీఘ్రంగా; గజము= సుప్రతీకం; ఒండుమైన్= మరొకవైపునకు; కవిసి= ఉరికి; మూఁకలన్= సేనలను; చిందర వందఱ= గందరగోళం; చేసెన్= చేసింది.

**తాత్పర్యం:** సుప్రతీక గజం గిర్రున తిరిగి, మరల కుదుటపడి, సాత్యకి యొక్క బలమైన రథాన్ని గర్వంతో పెనగజేసి తొండంతో పైకెత్తి తీవ్రంగా విసరివేసింది. సాత్యకి ఆశ్చర్యం గొలిపేటట్లు నేలపై దూకి దూరంగా దాటుకొన్నాడు. వెంటనే ఆ ఏనుగు మరొకవైపునకు ఉరికి సైన్యాన్ని చిందరవందర చేసింది.

**క.** **సారథి తురంగముల మెలు । పారం గాఁ బూన్చి తేర్చి యవికలమగు నా**
**తే రల్లఁ దేర సాత్యకి । బీరము వొలివోవకుండఁ బ్రియమున నెక్కెన్. 325**

**ప్రతిపదార్థం:** సారథి= సాత్యకి రథసారథి; తురంగములన్= గుర్రాలను; మెలపు+ఆరంగాన్= జాగరూకతతో; పూన్చి= కూర్చి; తేర్చి= తేరుకొనేటట్లు చేసి; అవికలమగు= చెదరని; ఆ తేరు= ఆ రథాన్ని; అల్లన్= మెల్లగా; తేరన్= తేగా; బీరము= పరాక్రమం; పొలివోవకుండన్= చెడకుండా; సాత్యకి; ప్రియమునన్= సంతోషంతో; ఎక్కెన్= ఎక్కాడు.

**తాత్పర్యం:** సారథి అశ్వాలను జాగరూకతతో తేర్చి పూన్చి, చెదరని ఆ రథాన్ని మెల్లగా తేగా, సాత్యకి పరాక్రమం చెడకుండా సంతోషంతో ఆ రథాన్ని ఎక్కాడు.

**ఉ.** **భీముఁ డుదగ్రతం గవియఁ బెల్లగు నా కరిచేతి శీకర**
**స్తోమమునం దురంగములు దోఁగి కడున్ వెగడంది యాడ్చె సం**
**గ్రామ వినోద లీలకు విఘాతము గాఁగ రథంబు నప్పు డు**
**ద్దామ పరాక్రమ స్ఫురణఁ దాఁకి సుపర్వుఁడు సచ్చె హస్తిచేన్. 326**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీముడు; ఉదగ్రతన్= భయంకరంగా; కవియన్= మార్కొనగా; పెల్లగు= అధికమైన; ఆ కరి= ఆ సుప్రతీక గజం యొక్క; చేతి= తుండములోని; శీకర= ఏనుగుతొండం చివర పుట్టు మదంయొక్క; స్తోమమునన్= సమూహంతో; తురంగములు= గుర్రాలు; తోఁగి= మునిగి; కడువెగడు+అంది= మిక్కిలి తల్లడిల్లి; సంగ్రామ= యుద్ధమనే; వినోద= క్రీడయొక్క; లీలకున్= చర్యకు; విఘాతము= అడ్డంకి; కాఁగన్= ఏర్పడగా; రథంబున్= రథాన్ని; ఈడ్చెన్= లాగాయి; అప్పుడు= ఆ సమయంలో; సుపర్వుఁడు; ఉద్దామ= అడ్డులేని; పరాక్రమ= శౌర్యం యొక్క; స్ఫురణన్= ప్రకాశంతో; తాఁకి= ఎదుర్కొని; హస్తిచేన్= ఏనుగుచేత; చచ్చెన్= మరణించాడు.

**తాత్పర్యం:** భీముడు భయంకరంగా ఎదుర్కొనగా ఆ సుప్రతీక గజము యొక్క తొండంనుండి కారే మదపు జల్లుకు అతడి రథపు గుర్రాలు నాని తల్లడిల్లి, యుద్ధక్రీడకు ప్రతిబంధకం కలిగేటట్లు రథాన్ని ఈడ్చుకొని పోయాయి. అపుడు సుపర్వుడు ఎదురులేని శౌర్యం ప్రదర్శించి కూడా సుప్రతీకంచేత మరణించాడు.

**వ. అతని పడుట గనుంగొని సౌభద్రుండును ద్రౌపదేయ పంచకంబును జేకితానుండును ధృష్టకేతుండును యుయుత్సుండును గడంగి సామజంబుపై శరవర్షంబులు గురిసిన నది కోపించి యురవడించి.327**

**ప్రతిపదార్థం:** అతని= ఆ సుపర్వుని యొక్క; పడుట= చావు; కనుంగొని= చూచి; సౌభద్రుండును= సుభద్రాపుత్రుడైన అభిమన్యుడును; ద్రౌపదేయ పంచకంబును= ప్రతివింధ్యాదులైన ద్రౌపది యొక్క ఐదుగురు కుమారులు; చేకితానుండును= చేకితానుడు;ధృష్టకేతుండును = ధృష్టకేతువు; యుయుత్సుండును= యుయుత్సుడు ; కడంగి= పూని; సామజంబుపైన్= సుప్రతీక గజంమీద; శరవర్షంబులు=బాణపు జల్లులు; కురిసినన్= కురిపించగా; అది= ఆ సుప్రతీకం; కోపించి=క్రోధంగలదై; ఉరవడించి= మిక్కిలి వేగిరపడి.

**తాత్పర్యం:** సుపర్వుడి మరణం చూచి అభిమన్యుడు, ప్రతివింధ్యాది ద్రౌపది పుత్రులు ఐదుగురు, చేకితానుడు, ధృష్టకేతువు, యుయుత్సుడును పూనుకొని గజంపై బాణవర్షాన్ని కురిపించారు. అప్పుడు అది కోపించి, అతివేగంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పదముల రథవాహంబులఁ । జదుపుచుఁ బైకొని యుయుత్సుసారథిఁ జంపెన్;**
**బెదరక యభిమన్యుని తే । రొదవిన నది యెక్కి యాతఁ డుద్ధతి నేసెన్. 328**

**ప్రతిపదార్థం:** పదములన్= పాదాలతో; రథ= రథానికిగల; వాహంబులన్= గుర్రాలను; చదుపుచున్= చంపుతూ; పైకొని= కవిసి; యుయుత్సు సారథిన్= యుయుత్సుడి రథచోదకుడిని; చంపన్= చంపగా; బెదరక= భయపడక; అభిన్యుని తేరు= అభిమన్యుడి రథం; ఒదవినన్= అందగా; అది= ఆ రథాన్ని; ఎక్కి; ఆతఁడు= యుయుత్సుడు; ఉద్ధతిన్= గర్వంతో; ఏసెన్= బాణాలను వేశాడు.

**తాత్పర్యం:** సుప్రతీక గజం తన పాదాలతో రథాశ్వాలను హతమార్చి, పైబడి యుయుత్సుడి రథసారథిని చంపగా, యుయుత్సుడు బెదరక అభిమన్యుడి రథం అండగా ఎక్కి గర్వంతో ఆ ఏనుగును కొట్టాడు.

**క. నరతనయ ప్రముఖ రథిక । వరులు నిభముమీఁద నేయు వాలమ్ములు ని**
**ష్ఠురగతి శరదభ్రముపైఁ । బరఁగు తరణికిరణ చయము పగిదిం బొలిచెన్. 329**

**ప్రతిపదార్థం:** నరతనయ= అర్జునుడి కుమారుడైన అభిమన్యుడు; ప్రముఖ= మున్నగు; రథికవరులున్= శ్రేష్ఠులైన వీరులు; ఇభము మీఁదన్= సుప్రతీక గజంపై; ఏయు= విసరునట్టి; వాలు+అమ్ములు= వాడిబాణాలు; నిష్ఠురగతిన్= తీవ్రమైన గమనంతో; శరద్+అభ్రముపైన్= శరత్కాలమందలి మేఘంపై; పరఁగు= ప్రసరించే; తరణి= సూర్యుడి యొక్క; కిరణ= కిరణాల; చయము= సమూహం; పగిదిన్= వలె; పొలిచెన్= ఒప్పారాయి.

**తాత్పర్యం:** అభిమన్యుడు మున్నగు మహావీరులు సుప్రతీకగజంమీద వేసే తీక్ష్ణమైన బాణాలు తీవ్రమైన గమనంతో శరత్కాలమందలి మేఘంమీద ప్రసరించే సూర్యకిరణాలవలె ఒప్పారాయి.

**క. రభసంబునఁ బ్రాగ్జ్యోతిష । విభుఁడు గరిం గొలుపుటయును వెస నది యరి వీ**
**రభయంకరముగ వారల । ప్రభ సెడ నరదములు వైచెఁ బలుదెసలఁ బడన్. 330**

**ప్రతిపదార్థం:** రభసంబునన్= వేగంగా; ప్రాగ్జ్యోతిషవిభుఁడు= భగదత్తుడు; కరిన్= సుప్రతీక గజాన్ని; కొలుపుటయును= పురికొల్పగా; అది= సుప్రతీకం; వెసన్= వేగంగా; అరివీర= శత్రువీరులకు; భయంకరముగన్= భయం కలిగేటట్లు; వారల= అభిమన్యుడు మొదలైన వారల; ప్రభ+చెడన్= తేజం నశించగా; అరదములు= రథాలు; పలుదెసలన్= అన్ని దిక్కులందు; పడన్= పడేటట్లుగా; వైచెన్= వేసింది.

**తాత్పర్యం:** భగదత్తుడు సంతోషంతో సుప్రతీక గజాన్ని పురికొల్పగా, ఆ గజం వేగంగా శత్రు భయంకరంగా వారల తేజస్సు నశించే విధంగా రథాలన్నింటిని అన్ని దిక్కుల పడేటట్లు విసరివేసింది.

**ఆ. ఇట్లు భీమసేను నేపు నర్జున సుత । ప్రముఖులైన యలఘు రథికవరుల**
**జృంభణంబుఁ జెడినఁ జేడ్పడి చెడి పాఱఁ । జొచ్చెఁ బాండురాజ సుతుల సేన. 331**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; భీమసేనుని= భీమునియొక్క; ఏపున్= విజృంభణ; అర్జునసుత= అభిమన్యుడు; ప్రముఖులు+ఐన= మొదలైన; అలఘు= గొప్ప; రథికవరుల= వీరశ్రేష్ఠుల; జృంభణంబున్= ఆధిక్యం; చెడినన్= నశించగా; పాండురాజ= పాండరాజు యొక్క; సుతుల= పుత్రులైన భీముడు మున్నగు వారల; సేన= సైన్యం; చేడ్పడి= బాధపడి; చెడి= పాడై; పాఱన్+చొచ్చెన్= పారిపోదొడగింది.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడి విజృంభణ, అభిమన్యుడు మున్నగు మహావీరుల ఆధిక్యం నశించగా, భీమసేనాదుల సైన్యం బాధపడి, పాడై పారిపోదొడగింది.

**క. నలి భగదత్తుఁడు గదుపుల । వెలుచు పసులవాని యట్ల విలసద్గతి న**
**బ్బలము నెగువ ధూళియు నా । కుల సంరావంబు గగన కుహరము నిండెన్.' 332**

**ప్రతిపదార్థం:** నలిన్= యోగ్యంగా; భగదత్తుడు; కదుపులన్= గోవుల గుంపును; వెలుచు= తోలే; పసులవాని= పసులకాపరి; అట్లు+అ= వలె; విలసత్+గతిన్= ఒప్పునట్లు; ఆ+బలమున్= ఆ పాండవ సైన్యాన్ని; ఎగువన్= తరుమగా; ధూళియున్= దుమ్ము, మరియు; ఆకుల= బాధతో కూడిన; సంరావంబు= మ్రోత; గగన కుహరము= ఆకాశపు గుహ; నిండెన్= నిండింది.

**తాత్పర్యం:** భగదత్తుడు గోవుల గుంపును తోలే పసుల కాపరివలె ఒప్పి, పాండవ సైన్యాన్ని తరుమగా, దుమ్ము మరియు బాధతో కూడిన మ్రోత ఆకాశమంతటా నిండింది.'

**విశేషం:** అలం: ఉపమ./

**క. అని చెప్పి సంజయుఁడు 'గురు । జన నాయక! యపుడు సవ్యసాచి రణము ది**
**క్కునఁ జిత్తం బిడి యడిగితి; । విను మయ్యోధవరు తెఱఁగు విస్పష్టముగాన్. 333**

**ప్రతిపదార్థం:** అని చెప్పి= అని వివరించి; సంజయుఁడు; కురుజననాయక!= ధృతరాష్ట్ర మహారాజా!; అపుడు= ఇంతకుముందు; సవ్యసాచి= అర్జునుడి; రణము= యుద్ధం; దిక్కునన్= వైపు; చిత్తంబు+ఇడి= మనస్సుంచి; అడిగితి(వి)= అడిగావు; ఆ+యోధవరు= ఆ వీరుడి; తెఱఁగు= విధం; విస్పష్టముగాన్= తేటపడగా; విను(ము).

**తాత్పర్యం:** అని సంజయుడు చెప్పి, 'ఓ ధృతరాష్ట్ర మహారాజా! అప్పుడు అర్జునుడు యుద్ధం చేసే వైపు ఏం జరుగుతుండినదో చెప్పవలసినది' అని అడిగావు. ఆ యోధుని సంగతి వివరంగా వినుము.'

**వ. అనవుడు నాంబికేయుం డాకర్ణనవాంఛ మిగుల 'నది సెప్పు' మనుటయు నాతనికి నా సూతనందనుం డిట్లనియె. 334**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆంబికేయుండు= అంబికాపుత్రుడైన ధృతరాష్ట్రుడు; ఆకర్ణన వాంఛ= వినే కోరిక; మిగులన్= మిక్కుటం కాగా; అది= ఆ విషయం; చెప్పుము= వివరించుము; అనుటయున్= అనగా; ఆతనికిన్= ఆ ధృతరాష్ట్రుడితో; సూతనందనుండు= సంజయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అపుడు ధృతరాష్ట్రుడు వినే కోరిక మిగులగా, ఆ విషయం వివరించవలసిందని కోరగా అతడితో సంజయు డిట్లా అన్నాడు.

**అర్జునుఁడు భగదత్తునిదెస రథంబు దోలు మని కృష్ణునితోఁ జెప్పుట (సం. 7-26-1)**

**క. అంతకు మును భగదత్తుని । దంతి యసమ సమరకేళిఁ దాఁ గని హరితోఁ**
**గుంతీసుతుఁ డిట్లను 'మన । మెంతయు వెస బలములోని కేఁగఁగ వలయున్. 335**

**ప్రతిపదార్థం:** అంతకున్ మును= అంతకు ముందు; భగదత్తుని= భగదత్తుడి యొక్క; దంతి= ఏనుగు; అసమ= అసాధారణమైన; సమర= యుద్ధమనే; కేళిన్= క్రీడను; తాన్= తాను; కని= చూచి; హరితోన్= కృష్ణుడితో; కుంతీ సుతుఁడు= అర్జునుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; మనము; ఎంతయున్= ఎంతో; వెసన్= వేగంగా; బలములోనికిన్= సైన్యంలోకి; ఏఁగఁగవలయున్= వెళ్ళవలెను.

**తాత్పర్యం:** అర్జునుడు అంతకు ముందు భగదత్తుడి సుప్రతీక గజం యొక్క అసాధారణమైన యుద్ధ క్రీడను చూచి, శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు. 'మనం వేగంగా సైన్యంలోకి చొచ్చుకొని పోవాలి!'

**వ. అది యెట్లంటేని. 336**

**ప్రతిపదార్థం:** అది= ఆ సంగతి; ఎట్లు= ఏ విధంగా; అంటి(వి)+ఏని= అంటే.

**తాత్పర్యం:** అది ఎట్లంటే.

**చ. బిరుదు జితశ్రమంబు బలభేదనశాలి మహాస్త్ర శస్త్ర పా**
**తరయము సైఁపనోపు భగదత్తుని యేనుఁగు; దాని కోల్తలం**
**దిరుగక పోర నెవ్వరికిఁ దీఱదు; నీవును నేను లేనిచో**
**భరమగు నేఁడు రాజునకుఁ బావనికిం దలఁకొందెడున్ మదిన్.' 337**

**ప్రతిపదార్థం:** భగదత్తుని= భగదత్తుడి యొక్క; ఏనుఁగు= సుప్రతీక గజం; బిరుదు= సమర్థమైనది; జితశ్రమంబు= అలసట లేనిది; బల= సైన్యాన్ని; భేదనశాలి= ఓడించే శక్తి కలది; మహా+అస్త్ర= గొప్ప బాణాల; శస్త్ర= ఖడ్గం మున్నగు ఆయుధాల; పాత= పడుటవలన; రయము= వేగాన్ని; సైఁపన్= సహించటానికి; ఓపున్= సమర్థమైనది; దాని= ఆ ఏనుగుయొక్క; కోల్తలన్+ తిరుగక= యుద్ధసన్నాహంలో వెనుదిరుక; పోరన్= యుద్ధం చేయటం; ఎవ్వరికిన్= ఎవ్వరికీ; తీఱదు= సాధ్యంకాదు; నీవును=నీవు (కృష్ణుడు) నేను(అర్జునుడు); లేనిచోన్= లేకుంటే; రాజునకున్= ధర్మరాజుకు; నేఁడు= ఈనాడు; భరము+అగున్= బరువు అవుతుంది; పావనికిన్= భీముడికి; మదిన్= మనస్సులో; తలఁకు+ఒందెడున్= బాధ కలుగుతుంది.

**తాత్పర్యం:** భగదత్తుడి సుప్రతీకగజం సమర్థమైనది. అలసట లేనిది. సైన్యాన్ని చీల్చే శక్తిగలది. బలమైన శస్త్రాస్త్రాల వేగాన్ని తట్టుకొనగలది. దానికి ఎదురై పారిపోకుండా పోరాడడం ఎవరి వల్లాకాదు. నీవు, నేను లేకుంటే ధర్మజుడికి భారం ఎక్కువౌతుంది. భీముడు మనస్సులో నొచ్చుకొంటాడు.'

**ఆ. అనిన నట్లకాక యని శౌరి యరదంబు । ద్రిప్పి యాత్మసేన దిక్కువోవ**
**నిచ్చుటయును వెనుక నెయిది సంశప్తకు । లార్చిపేర్చి కురిసి రస్త్రసమితి. 338**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అట్లు+కాక= అట్లే అగుగాక; అని; శౌరి= కృష్ణుడు; అరదంబు= రథం; త్రిప్పి= మరల్చి; ఆత్మసేన= తన సైన్యం; దిక్కు= వైపు; పోవనిచ్చుటయును= పోనిస్తుంటే; వెనుకన్= వెనుకనుండి; ఎయిది= వెంబడించి; సంశప్తకులు= శపథం పూనిన సుశర్మాదులు; ఆర్చి= అరిచి; పేర్చి= అతిశయించి; అస్త్ర సమితి= దివ్య బాణాల సమూహాన్ని; కురిసిరి= కురిపించారు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు అర్జునుడి మాటవిని రథాన్ని మరల్చి తమ సైన్యం వైపు పోనిస్తుంటే, సంశప్తకులు వెంబడించి, అరుస్తూ దివ్యాస్త్రాలను వారిపై కురిపించారు.

**వ. ఇట్లు చతుర్దశసహస్ర రథిక ముఖ్యులు బెట్టు ముట్టిన. 339**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; చతుర్దశ= పదునాలుగు; సహస్ర= వేల; రథిక ముఖ్యులు= రథికశ్రేష్ఠులు; బెట్టు= అతిశయంగా; ముట్టినన్= చుట్టు ముట్టగా.

**తాత్పర్యం:** ఈ తీరున పధ్నాలుగు వేల రథిక వీరవరులు గట్టిగా చుట్టు ముట్టగా.

**క. 'బలములఁ గావఁగఁ జనుటయు । నలవు మెఱయ మగిడి వీరి నడఁగించుటయున్**
**వలయు పనులయం దిప్పుడు । దలఁకొని యెద్దానిఁ జేయఁ దగవో నాకున్.' 340**

**ప్రతిపదార్థం:** బలములన్= సైన్యాలను; కావఁగన్= రక్షించటానికి; చనుటయున్= వెళ్ళటం; అలవు= బలం; మెఱయన్= ప్రకాశించగా; మగిడి= మరల; వీరిన్= సంశప్తకులను; అడఁగించుటయున్= అణచివేయటం; వలయు= చేయదగిన; పనుల అందున్= పనులలో; తలఁకొని= పూని; నాకున్= నాకు; ఏ+దానిన్= ఏ పనిని; చేయన్= చేయటం; తగవో= న్యాయమో.

**తాత్పర్యం:** 'మా సేనలను కాపాడటానికి వెళ్లటమా? మరల బలప్రదర్శన చేసి సంశప్తకులను అణచివేయడమా? ఈ రెండూ చేయదగినవే. ముందు ఏ పనికి పూనుకోవటం న్యాయం?'

**వ. అని వితర్కించి వివ్వచ్చుండు సంశప్తక వధంబ యుచితంబుగా నిశ్చయించి, మరలి గాండీవ గుణక్వణ మేదుర రోదసీకుహరుండును,దేవదత్త ధ్వాన విదళిత దశదిశా సందోహుండునునై దివ్యబాణంబులు పరఁగించినం గేత నాతపత్ర చామర వ్యజనంబులును, భేరీ శంఖ కాహళ మృదంగంబులును, యుగాక్ష రథాంగ కూబరంబు లును, దంతశుండాల కుంభవంశ దండంబులును, ఖురస్కంధ వాలంబులును, ధనుశ్శర ముసల ముద్గర, క్షురి కాకుంతంబులును, దనుత్రాణ కంకట మస్తక చ్ఛేదంబులును, మకుట కేయూర హార కంకణాంగు ళీయంబులును, శిరః కరవక్షః కుక్షి కటి చరణంబులును, దునియలుం బఱియలుం దుముళ్ళుం బొళ్ళు నైరాలిన నన్నేల ఘోరంబును, నభిరామంబునునై యుండె; సర్వభూతంబులును బీభత్సుం బ్రశంసించెఁ; గంసారి విస్మయ ప్రమదమగ్న మానసుండయి కిరీటిం గరతలంబున నప్పళించి యగ్గించె; నివ్విధంబుననవ్వీర రథికులం బిలుకు మార్చి పేర్చి రథాంగపాణిం జూచి 'రథం బింక రయంబున నక్కడకు నడపు' మనుటయు..341**

**ప్రతిపదార్థం:** అని; వితర్కించి= ఊహించి; విష్వచ్చుండు= అర్జునుడు; సంశప్తక వధంబు+అ= సంశప్తకులను చంపటమే; ఉచితంబుగాన్= తగిందని; నిశ్చయించి= నిర్ణయించి; మరలి= వెనుకకు తిరిగి; గాండీవ= గాండీవమనే ధనుస్సుయొక్క; గుణ= అల్లెత్రాటి; క్వణన= ధ్వనిచేత; మేదుర= దట్టమైన; రోదసీ= భూమ్యాకాశముల; కుహర= నడిమి భాగంగలవాడును; దేవదత్త= దేవదత్తమనే శంఖపు; ధ్వాన= ధ్వనిచేత; విదళిత= చీల్చబడిన; దశదిశా= పది దిక్కుల; సందోహుండును= సమూహం కలవాడును; ఐ= అయి; దివ్యబాణంబులు= దేవతా సంబంధమైన బాణాలు; పరఁగించినన్= ప్రయోగించగా; కేతన= పతాకాలు; ఆతపత్ర= గొడుగులు; చామర= చమరీ మృగపు వాలాలతో చేసిన; వ్యజనంబులును= వీవనలు; భేరీ= దుందుభులు; శంఖ= శంఖాలు; కాహళ= కాహళ వాద్యాలు; మృదంగములును= మద్దెలలును; యుగ= కాడిమ్రాకులు; అక్ష= ఇరుసులు; రథాంగ= చక్రాలు; కూబరంబులును= నొగలులును; దంత= ఏనుగుయొక్క దంతాలు; శుండ= తొండాలు; కుంభ= కుంభస్థలాలు; వంశదండంబులును= వెన్నెముకలును; ఖుర= గిట్టలు; స్కంధ= మూపులు; వాలంబులు= తోకలు; ధనుః= విండ్లు; శర= బాణాలు; ముసల= రోకళ్ళు; ముద్గర= ఇనుపగుదియలు; క్షురిక= చురకత్తులు; అంకుశంబులు= అంకుశాలు; తనుత్రాణ= కవచాలు; కంకట= కవచాలు; మస్తకచ్ఛేదంబులును= శిరస్త్రాణాలు (తలపైని కప్పులు); మకుట= కిరీటాలు; కేయూర= అంగదాలు; హార= మాలలు; కంకణ= కడియాలు; అంగుళీయకంబులును= ఉంగరాలు; శిరః= తలలు; కర= చేతులు; వక్షస్= ఎదలు; కుక్షి= కడుపులు; కటి= మొలలు; చరణంబులును= కాళ్ళును; తునియలున్= తునుకలు; పఱియలు= పఱ్ఱెలు; తుమురుళ్ళున్= చిన్నఖండాలు; పొళ్లున్+ఐ= చూర్ణాలై; రాలినన్= రాలగా; ఆ+నేల= ఆ యుద్ధభూమి; ఘోరంబునున్= భయంకరం; అభిరామంబున్+ఐ= మనోజ్ఞమై; ఉండెన్= ఉండింది; సర్వభూతంబులును= సమస్త ప్రాణులును; బీభత్సున్= అర్జునుడిని; ప్రశంసించెన్= పొగిడాయి; కంసారి= కంసుడికి శత్రువైన శ్రీకృష్ణుడు; విస్మయ= ఆశ్చర్యంతోను; ప్రమద= ఆనందంలోను; మగ్న= మునిగిన; మానసుండు+అయి= మనస్సుగలవాడై; కిరీటిన్= అర్జునుడిని; కరతలంబునన్= అరచేత; అప్పళించి= చరచి; అగ్గించెన్= ప్రశంసించాడు; ఈ+విధంబునన్= ఈ రీతిని; ఆ+వీరరథికులన్= ఆ శూరులైన; రథంపై నిలిచి యుద్ధం చేసేవారిని; పిలుకు మార్చి= చంపి; పేర్చి= విజృంభించి; రథాంగపాణిన్= చక్రహస్తుడైన శ్రీకృష్ణుడిని; చూచి; రథంబు= రథాన్ని; ఇంకన్= ఇక; రయంబునన్= వేగంగా; అక్కడకున్= పాండవులు యుద్ధం చేసేకడకు; నడుపుము= నడిపించుము; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** అని యోచించి అర్జునుడు సంశప్తకులను వధించడమే తగునని నిర్ణయించి వెనుకకు మళ్ళి, గాండీవ ధనుష్టంకారంచేత భూమ్యాకాశాల మధ్యభాగాన్ని నునుపు జేసి, దేవదత్తమనే శంఖ ధ్వనిచేత దశదిశలను చీల్చివేసి, దివ్య బాణాలను ప్రయోగించాడు. ఈ బాణజాలపు దెబ్బకు పతాకాలు, గొడుగులు, చామరాలు, దుందుభులు; శంఖాలు, కాహళులు, మద్దెలలు, కాడిమాకులు, ఇరుసులు, చక్రాలు, నొగలులు, ఏనుగు దంతాలు, తొండాలు, కుంభస్థలాలు, వెన్నెముకలు, గిట్టలు, మూపులు, తోకలు, విండ్లు, బాణాలు, రోకళ్ళు, ఇనుపగుదియలు, చురకత్తులు, అంకుశాలు, దేహరక్షణ కవచాలు, శిరస్త్రాణాలు, కిరీటాలు, కేయూరాలు, హారాలు, కడియాలు, ఉంగరాలును, తలలు, చేతులు, ఎడదలు, కడుపులు, నడుములు, కాళ్ళు, తునుకలు, పఱ్ఱెలు, సూక్ష్మఖండాలు, పొళ్ళుగా మారి రాలగా ఆ యుద్ధభూమి భయంకరమూ, సుందరమూనై ఒప్పింది. సర్వప్రాణులు అర్జునుడిని ప్రశంసించాయి. శ్రీకృష్ణుడు ఆనందాశ్చర్యాలలో మునిగినవాడై అర్జునుడిని తన చేత చరచి మెచ్చుకొన్నాడు. ఇట్లా ఆ వీరరథికులను చంపి, విజృంభించి, శ్రీకృష్ణుడివైపు చూచి 'వెంటనే రథాన్ని పాండవులు యుద్ధం చేసే వైపు నడుపు'మని అర్జును డనగా.

**విశేషం:** అర్జునుడు సంశప్తకులను వధించి బీభత్సం సృష్టించటం వలన బీభత్సుడు అనే పేరును ప్రయోగించడం సాభిప్రాయంగా ఉన్నది.

**ఆ. ఆతఁ డట్ల చేయ నరవాయి గొనక సు । శర్మ దాను ననుజచయముఁ బెలుచ**
**నెయిది 'పార్థ పార్థ యిట్లు వోఁదగునె యే । మనికిఁ బిలువఁ బిలువ' ననిన నతఁడు.** 342

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ అర్జునుడు; అట్లచేయన్= ఆ విధంగా బీభత్సాన్ని సృష్టించగా; అరవాయి+కొనక= భయపడక; సుశర్మ= త్రిగర్తదేశాధిపుడైన సుశర్మ; తాను= తను; అనుజచయమున్= సోదరవర్గం; పెలుచన్= ఆగ్రహంతో; ఎయిది= వెంబడించి; పార్థ! పార్థ!= ఓ అర్జునా! అర్జునా!, అనికిన్= యుద్ధానికి; ఏము= మేము; పిలువన్, పిలువన్= మళ్ళీ మళ్ళీ పిలువగా; ఇట్లు= ఈ విధంగా; పోఁదగునె?= పోవచ్చా?; అనినన్= అనగా; అతఁడు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆ విధంగా యుద్ధ రంగంలో బీభత్సాన్ని సృష్టించగా సుశర్మ, అతడి సోదరవర్గం భయపడక ఆగ్రహంతో వెంబడించి, 'పార్థా! పార్థ! మేము యుద్ధానికి మళ్ళీ మళ్ళీ పిలువగా నీ విట్లా పోవచ్చునా?' అనగా; అపు డర్జునుడు.

**క. 'పిలిచిన మరలమి దగ ద । బ్బలములఁ గాచుటయు వలయు; పని; యైనది; నీ**
**వలసిన విధంబు సేసెదఁ । దలఁకొను మొక తెఱఁగు దైత్యదర్పధ్వంసీ!' 343**

**ప్రతిపదార్థం:** పిలిచినన్= పిలిస్తే; మరలమి= మరల రాకుండటం; తగదు= మంచిది కాదు; ఆ+బలములన్= ఆ మన సైన్యాలను; కాచుటయున్= రక్షించటం కూడా; వలయు పని= ఆవశ్యకం; ఐనది= అయినది; దైత్యదర్పధ్వంసీ!= రాక్షసుల గర్వాన్ని అణచే ఓ కృష్ణా!; నీ= నీకు; వలసిన= కావలసిన; విధంబు= విధంగా; చేసెదన్= చేస్తాను; ఒక తెఱఁగు= ఒక మార్గం; తలఁకొనుము= చూపుము.

**తాత్పర్యం:** 'యుద్ధానికి ఆహ్వానిస్తే తిరిగి రాకుండటం తగదు, మన సైన్యాలను కాపాడటం కూడా ఆవశ్యకమే. కృష్ణా! నీవు ఎట్లా చెపితే అట్లా చేస్తాను. ఒక త్రోవ చూపుము.'

**చ. అనుచు మురారిఁ జూచుటయు నాతఁడు దేరు మరల్ప మోమునం**
**గినుక మునుంగు న వ్వొలయఁ గ్రీడి త్రిగర్తుని చాపదండకే**
**తనములు ద్రుంచి పైపడిన తమ్ముల నంతకు ప్రోలి కన్చి యా**
**తని నవలీల నొంచిన నతండు వెసంబడి మూర్ఛవోవుడున్. 344**

**ప్రతిపదార్థం:** అనుచున్= అంటూ; మురారిన్= శ్రీకృష్ణుని; చూచుటయున్= చూడగా; ఆతఁడు= కృష్ణుడు; తేరు= రథం; మరల్పన్= వెనుకకు మళ్ళింపగా; మోమునన్= ముఖంపై; కినుక= కోపం; మునుంగు= నిండిన; నవ్వు; ఒలయన్= వెలుగగా; క్రీడి= అర్జునుడు; త్రిగర్తుని= సుశర్మయొక్క; చాప దండ= ధనుస్సు దబ్బను; కేతనములు= పతాకాలను; త్రుంచి= విరిచి; పైపడిన= మీదపడ్డ; తమ్ములన్= సుశర్మ తమ్ములను; అంతకు ప్రోలికిన్= యమధర్మరాజు యొక్క నగరానికి; అన్చి= పంపి; ఆతనిన్= ఆ సుశర్మను; అవలీలన్= తేలికగా; నొంచినన్= బాధింపగా, అతండు= ఆ సుశర్మ; వెసన్= వెంటనే; పడి= కూలి; మూర్ఛ+పోవుడున్= మూర్ఛిల్లగా.

**తాత్పర్యం:** అంటూ అర్జునుడు కృష్ణుడిని చూడగా, అతడు రథాన్ని మరల్చాడు. ముఖాన కోపంతో నిండిన నవ్వు ప్రకాశించగా అర్జునుడు, సుశర్మ వింటి దబ్బను, పతాకాలను విరిచి, పైనవడ్డ సుశర్మ సోదరులను చంపి, అతడిని అవలీలగా బాధింపగా, అతడు వెంటనే మూర్ఛపోగా.

**వ. మగిడి యట నిరూపించి నారాయణు నుద్దేశించి. 345**

**ప్రతిపదార్థం:** మగిడి= తిరిగి; అట= అక్కడ; నిరూపించి= చూపి; నారాయణున్= శ్రీకృష్ణుడిని; ఉద్దేశించి= గురించి.

**తాత్పర్యం:** అర్జునుడు మరల పాండవులు యుద్ధం చేసేవైపు చూచి, శ్రీకృష్ణునితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **'పాఱెడు మన సేన పరఁగెడుఁ బెంధూళి । నభము గోలాహల క్షుభిత మయ్యె**
**భగదత్తు శుండాల మెగచుచు నున్నది । పఱపుము వెస దానిపై రథంబు'**
**నావుడు నతఁడు మహావేగమున రథ్య । ములఁ దోలఁగఁ గిరీటి యలవుఁ జలము**
**మెఱయంగ నీమొన మెఱుఁగు వాలమ్ముల । నఱుము సేయుచు సింహనాదమునకుఁ**

**తే.** **బ్రాపులై దేవదత్తంబు రవము గుణము । రావమును దిక్తటంబుల వ్రయ్యఁ జేయ**
**వచ్చి వివ్వచ్చుఁ డడ్డంబు సొచ్చె వీఁకఁ । జండచేష్టితోద్దండ వేదండమునకు.** **346**

**ప్రతిపదార్థం:** పాఱెడు= పారిపోయే; మనసేన= మనసైన్యం; పెంధూళి= మిక్కిలిదుమ్ము; పరఁగెడున్= లేస్తున్నది, నభము= ఆకాశం; కోలాహల= సందడిచేత; క్షుభితము+అయ్యెన్= కల్లోలితమైనది; భగదత్తు= భగదత్తుడి; శుండాలము= సుప్రతీకగజము; ఎగచుచునున్నది= ఎగిరిపడుతున్నది; రథమును= తేరును; వెసన్= వేగంగా; దానిపైన్= ఆ ఏనుగుపైకి; పఱపుము= నడిపించుము; నావుడున్= అనగా; అతఁడు= శ్రీకృష్ణుడు; మహావేగమునన్= మిక్కిలి వేగంగా; రథ్యములన్= గుర్రాలను; తోలఁగన్= నడపగా; కిరీటి= అర్జునుడు; అలవున్= బలము; చలము= మాత్సర్యం; మెఱయంగన్= ప్రకాశించగా; నీమొన= నీ (ధృతరాష్ట్రుని) సైన్యాన్ని; మెఱుఁగు= ప్రకాశించే; వాలు+అమ్ములన్= వాడిగల బాణాలతో; నఱుము+చేయుచున్= పొడి చేస్తూ; సింహనాదమునకున్= పెనుబొబ్బకు; ప్రాపులై= తోడై; దేవదత్తంబు= దేవదత్త శంఖము యొక్క; రవము= ధ్వని; గుణము= అల్లెత్రాటి; రావమును= నాదాన్ని; దిక్+తటంబులన్= దిక్కుల కొనలను; వ్రయ్యన్+చేయన్= చీల్చగా; వచ్చి; వివ్వచ్చుఁడు= అర్జునుడు; వీఁకన్= ఉత్సాహంతో; చండ= క్రూరమైన; చేష్టిత= చేష్టలుగల; ఉద్దండ= భయం గొలిపే; వేదండమునకున్= సుప్రతీక గజానికి; అడ్డంబు= అడ్డంగా; చొచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** 'మన సేన పారిపోతున్నది. దుమ్ము అపారంగా పైకెగయటం వలన ఆకాశమంతా సందడిచే కల్లోలితమైనది. భగదత్తుడి సుప్రతీక గజం విజృంభిస్తున్నది. రథాన్ని వేగంగా ఆ ఏనుగుపైకి నడిపించుము' అనగానే శ్రీకృష్ణుడు మహావేగంగా గుర్రాలను నడిపేసరికి, అర్జునుడు బలం, మాత్సర్యం ప్రకాశించగా నీ సైన్యాన్ని ప్రకాశించే వాడిగల బాణాలతో పొడి పొడి చేస్తూ, సింహనాదానికి దేవదత్త శంఖ ధ్వానం, అల్లెత్రాటి నాదం తోడై దిగంతాలను చీల్చగా ఉత్సహించి, క్రూర చేష్టలు చేసే భయంకరమైన సుప్రతీకగజానికి అడ్డంగా వెళ్ళాడు.'

**క.** **అన విని ధృతరాష్ట్రుం డి । ట్లను సంజయుతోడ 'భీషణాటోపత న**
**ర్జునుఁ డి ట్లెయిదిన భగద । త్తుని కతనికి నేమి భంగి దురమయ్యె నొకో!'** **347**

**ప్రతిపదార్థం:** అనన్ విని= అనగావిని; ధృతరాష్ట్రుండు; సంజయు తోడన్= సంజయుడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అర్జునుఁడు; భీషణ+ఆటోపతన్= భయంకరమైన వేగిరపాటుతో; ఇట్లు= ఈ విధంగా; ఎయిదినన్= వెంబడించగా; భగదత్తునికిన్= భగదత్తుడికి; అతనికిన్= అర్జునునికి; ఏమి భంగి= ఏ విధంగా; దురము= యుద్ధం; అయ్యెన్+ఒకో!= అయిందో!

**తాత్పర్యం:** అనగా విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు. 'అర్జునుడు భయంకరమైన వేగిరపాటుతో వెంబడించగా భగదత్తుడికీ, అర్జునుడికీ ఏ విధంగా యుద్ధం జరిగిందో!'

**ఉ.** **నావుడు నాతఁ డా ధరణినాథున కిట్లను'నట్లు దాఁకినం**
**జేవ దలిర్ప విక్రమవిశృంఖలుఁడై భగదత్తుఁ డుగ్ర బా**
**ణావలిఁ బార్థుపైఁ బఱపె; నన్నియు నవ్వుచుఁ ద్రుంచివైచి య**
**ద్దేవసముండు నొంచె దృఢ దీప్తశరంబుల దంతి నాతనిన్.** **348**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగా; ఆతఁడు= సంజయుడు; ఆ ధరణినాథునకున్= ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; అట్లు= ఆ విధంగా; తాఁకినన్= ఎదుర్కొనగా; చేవ= బలం; తలిర్పన్= అతిశయించగా; విక్రమ విశృంఖలుఁడు+ఐ= పరాక్రమం చేత అడ్డులేనివాడై; భగదత్తుఁడు= భగదత్తుడు; ఉగ్రబాణావలిన్= భయంకరమైన బాణ సమూహాన్ని; పార్థుపైన్= అర్జునుడిపై; పఱపెన్= ప్రసరింపజేశాడు; ఆ+దేవసముండు= దేవతలతో సమానుడైన ఆ అర్జునుడు; నవ్వుచున్= నవ్వుతూ; అన్నియున్= బాణాలన్నింటిని; త్రుంచి= విరిచి; దంతిన్= సుప్రతీకగజాన్ని; ఆతనిన్= భగదత్తుడిని; దృఢ= కఠినమైన; దీప్త= ప్రకాశించే; శరంబులన్= బాణాలతో; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** అనగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'అట్లా అర్జునుడు ఎదుర్కొనగా, అతిశయించిన బలంతో విక్రమంచేత అడ్డులేనివాడై భగదత్తుడు, అర్జునుడిపై భయంకరమైన బాణాలను ప్రయోగించాడు. దేవసముడైన అర్జునుడు నవ్వుతూ ఆ బాణాలన్నిటిని ఖండించి, సుప్రతీక గజాన్నీ, భగదత్తుడినీ బలమైన ప్రకాశించే బాణాలతో బాధించాడు.

**తే.** **అలుఁగుటమ్ములు దాఁకిన నలిగి భద్ర। కుంభి రౌద్రంబు సొంపారఁ గొలిపె నతఁడు**
**వారి సేనల గోపికావరుఁడు నరుఁడు। దెగిరి తెగి రను పలుకుల దిగులు వుట్ట.** **349**

**ప్రతిపదార్థం:** అలుఁగు+అమ్ములు= కత్తి పదునువంటి పదునుగల బాణాలు; తాఁకినన్= తాకగా; అలిగి= కోపించి; అతఁడు= భగదత్తుడు; భద్రకుంభి= శ్రేష్ఠమైన భద్రగజం - సుప్రతీక గజం; రౌద్రంబు= క్రోధము; సొంపు+ఆరన్= అందంమీరగా; కొలిపెన్= పురికొలిపాడు; వారి సేనలు= పాండవ సేనలు; గోపికావరుఁడున్= కృష్ణుడును; నరుఁడును= అర్జునుడు; తెగిరి, తెగిరి= చనిపోయారు, చనిపోయారు; అను పలుకులన్= అను మాటలచేత; దిగులు+పుట్టన్= భయం కలుగగా.

**తాత్పర్యం:** అతి తీక్ష్ణములైన బాణాలు తాకగా కోపించి ఆ భగదత్తుడు, పాండవ సేనలో కృష్ణార్జునులు చచ్చారు, చచ్చారు అనే మాటలతో భయపడేటట్లు, సుప్రతీక గజం యొక్క క్రోధం సొంపు మీరగా వారలపైకి దానిని పురికొల్పాడు.

**క.** **బలువిడిఁ గరి గవియుఁడు వెసఁ। దొలఁగించె రథంబు వెరవుతో హరి యదియి**
**ట్టలమగు రయమునఁ జని త। ద్బలము బడల్పడఁగఁ జేసెఁ బార్థివముఖ్యా!** **350**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= ధృతరాష్ట్ర మహారాజా!; బలువిడిన్= పరాక్రమంతో; కరి= సుప్రతీకగజం; కవియుడున్= ఎదిరించగా; వెసన్= వెంటనే; హరి= శ్రీకృష్ణుడు; వెరవుతోన్= ఉపాయంతో; రథము= రథాన్ని; తొలఁగించెన్= దూరం కొనిపోయినాడు; అది= ఆ సుప్రతీకం; ఇట్టలమగు= మిక్కిలి; రయమునన్= వేగంతో; చని= పోయి; తద్+బలము= ఆ పాండవుల సైన్యం; బడల్పడఁగన్+చేసెన్= ఆయాసపడేటట్లు చేసింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! పరాక్రమం మీర సుప్రతీక గజం విజృంభించగా శ్రీకృష్ణుడు వెంటనే ఉపాయంగా రథాన్ని ప్రక్కకు తొలగించాడు. ఆ ఏనుగు మిక్కిలి వేగంగా వెళ్ళి ఆ పాండవ సైన్యాన్ని ముప్పుతిప్పలు పెట్టింది.

**క.** **హరి నేమియు ననఁనేరక। కరిదెసఁ గనుఁగొనుచు నవుడు గఱచుచుఁ 'బో ని**
**మ్మరద'మని పలికెఁ గవ్వడి। హరులను సమ్ముఖము సేసె నతఁడుఁ గరటికిన్.** **351**

**ప్రతిపదార్థం:** కవ్వడి= అర్జునుడు; హరిన్= కృష్ణుడిని; ఏమియున్= ఏమీ; అననేరక= అనజాలక; కరి= సుప్రతీకం; దెస= వైపు; కనుఁగొనుచున్= చూస్తూ; అవుడు= పెదవి; కఱచుచున్= కొరుకుతూ - కోపంతో; అరదము= రథాన్ని; పోనిమ్ము= పోనిమ్ము; అని పలికెన్= అని అన్నాడు; అతఁడు= శ్రీకృష్ణుడు; హరులను= గుర్రాలను; కరటికిన్= సుప్రతీకగజానికి; సమ్ముఖము+చేసెన్= ఎదురుగా పోనిచ్చాడు.

**తాత్పర్యం:** అర్జునుడు కృష్ణుడిని ఏమీ అనలేక సుప్రతీకగజంవైపు చూస్తూ, కోపంతో పెదవి కొరుకుతూ, రథాన్ని పోనిమ్మన్నాడు. కృష్ణుడు రథాన్ని సుప్రతీకానికి ఎదురుగా తీసుకొనిపోయాడు.

**విశేషం:** 'కరిదెస కనుగొనుట, పెదవి గరచుట' వంటి చర్యల వలన అర్జునుడిని ఆవేశించిన క్రోధాదులు వ్యక్తమవుతున్నాయి.

**క.** **శౌరి మెయిని భగదత్తుఁడు । నారసములు నినిచి యేసె; నరుఁ డల్గి మహో**
**దారోద్ధతిఁ దచ్చాపవి । దారణ మొనరించి గ్రుచ్చెఁ దనువునఁ దూపుల్.** **352**

**ప్రతిపదార్థం:** భగదత్తుఁడు= ప్రాగ్జ్యోతిషాధిపతి అయిన భగదత్తుడు; శౌరి= కృష్ణుడి; మెయిని= దేహంపై; నారసములు= బాణాలు; నినిచి ఏసెన్= నింపివేశాడు; నరుఁడు= అర్జునుడు; అల్గి= కోపించి; మహోదార= మిక్కిలి సూటి అయిన; ఉద్ధతిన్= గర్వంతో; తద్+చాప= ఆ భగదత్తుడి వింటిని; విదారణము+ఒనరించి= చీల్చి; తనువునన్= దేహంపై; తూపుల్= బాణాలు; గ్రుచ్చెన్= నాటాడు.

**తాత్పర్యం:** భగదత్తుడు శ్రీకృష్ణుడి దేహంమీద బాణాలను నింపివేశాడు. అపుడు అర్జునుడు కోపించి మిక్కిలి గర్వంతో అతడి ధనుస్సును విరిచి, అతడి శరీరంపై బాణాలను నాటాడు.

**సీ.** **కోపంబు గదిరి ప్రాగ్జ్యోతిషపతి చతు । ర్దశ తోమరము లింద్రతనయు మీఁద**
**నడరించుటయు, నవి పొడిసేసి క్రీడి యే । నుంగు పక్కెర చిఱునుగ్గు సేయ**
**నది గప్పియున్న మేఘావలి విచ్చిన । కొండ చందంబున నుండె; శక్తి**
**గొని భగదత్తుండు దనుజభంజను వైవ । నడుమ ముత్తునియగా నఱకెఁ బార్థుఁ;**

**తే.** **డాతపత్రంబు దునిమిన నతని మకుట । మతఁడు ఘన తోమరంబున నగలఁ జేయ**
**మెచ్చుఁ గినుకయుఁ బొడమ వివ్వచ్చుఁ డుగ్ర । విశిఖసప్తతిఁ జొనిపె నవ్వీరుమేన.** **353**

**ప్రతిపదార్థం:** కోపంబు= క్రోధం; కదిరి= అతిశయించి; ప్రాగ్జ్యోతిషపతి= భగదత్తుడు; చతుర్దశ తోమరములు= పద్నాలుగు ఇనుపగుదియలు; ఇంద్రతనయుమీఁదన్= అర్జునుడి మీద; అడరించుటయున్= వేయగా; క్రీడి= అర్జునుడు; అవి= ఆ ఇనుప గుదియలను; పొడిచేసి= పొడిగా చేసి; ఏనుంగు= సుప్రతీకగజం యొక్క; పక్కెర= అంగీని; చిఱునుగ్గు= సన్ననిపొడిగా; చేయన్= చేయగా; అది= ఆ సుప్రతీకం; కప్పి ఉన్న= కమ్ముకొనిన; మేఘావలి= మబ్బులగుంపు; విచ్చిన= తొలగిన; కొండ= పర్వతం; చందంబునన్= విధంగా; ఉండెన్= ఉండినది; భగదత్తుండు; శక్తి= శక్తి అనే ఆయుధాన్ని; కొని= తీసికొని; దనుజభంజను= కృష్ణుడిని; వైవన్= కొట్టగా; పార్థుఁడు= అర్జునుడు; నడుమ= మధ్యలోనే; ముత్తునియగాన్= మూడు ముక్కలయ్యేటట్లుగా; నఱకెన్= ఖండించాడు; ఆతపత్రంబు= ఛత్రాన్ని; తునిమినన్= విరువగా; అతని= అర్జునుడి; మకుటము= కిరీటాన్ని; అతఁడు= ఆ భగదత్తుడు; ఘనతోమరంబునన్= గొప్ప చిల్లకోలతో; అగలన్+చేయన్= భేదించగా; మెచ్చున్= పొగడ్త; కినుకయున్= కోపమును; పొడమన్= కలుగగా; వివ్వచ్చుఁడు= అర్జునుడు; ఉగ్ర= భయంకరమైన; విశిఖసప్తతిన్= డెబ్బైబాణాలను; ఆ+వీరు= ఆ వీరుడైన భగదత్తుడి; మేనన్= దేహంలో; జొనిపెన్= నాటాడు.

**తాత్పర్యం:** భగదత్తుడు మిక్కిలి కోపంతో పదునాల్గు ఇనుప గుదియలు అర్జునుడి మీద వేయగా , అర్జునుడు ఆ ఇనుపగుదియలను పొడిగా చేసి, తరువాత సుప్రతీకగజం యొక్క అంగీని తుక్కు తుక్కు చేశాడు. అపుడా సుప్రతీక గజం కమ్ముకొన్న మబ్బులు తొలగిన పర్వతం వలె ఉండింది. భగదత్తుడు శక్తి అనే ఆయుధాన్ని తీసికొని కృష్ణుడిపై వేయగా; అర్జునుడు మధ్యలో దానిని మూడు ముక్కలయ్యేటట్లు నరికాడు. అంతేకాక, అతడి గొడుగును కూడ తునుమగా, భగదత్తుడు అర్జునుడి కిరీటాన్ని ఘనతోమరంతో భేదించాడు. పొగడ్త, కోపం కలుగగా అర్జునుడు భయంకరమైన డెబ్బది బాణాలను భగదత్తుడి దేహంలో నాటాడు.

మ. రభసోదగ్రతఁ బూన్చి దీప్తు లడరం బ్రాగ్జ్యోతిషాధీశ్వరుం
డభిమంత్రించి నిజాంకుశంబు దివిజేంద్రాపత్యవక్షంబు సూ
చి భుజోల్లాస విభాసియై పెలుచ వైచెం దద్బలం బెల్ల భూ
రి భయోద్రేక తరంగితం బగుచు ఘూర్ణిల్లంగ రౌద్రాకృతిన్. 354

**ప్రతిపదార్థం:** రభసు= తీవ్రమైన; ఉదగ్రతన్= అహంకారంతో; ప్రాగ్జ్యోతిష+అధీశ్వరుఁడు= భగదత్తుడు; నిజ+అంకుశంబు= తన అంకుశాన్ని; అభిమంత్రించి= మంత్రంతో సంస్కరించి; దీప్తులు= మెరుగులు; అడరన్= చిమ్మగా; పెలుచన్= ఆగ్రహించి; తద్+బలంబు+ఎల్లన్= అర్జునుడి యొక్క సైన్యం అంతయు; భయ+ఉద్రేక తరంగితంబు+అగుచున్= భయంయొక్క ఆధిక్యంతో చలిస్తున్నదై; ఘూర్ణిల్లంగన్= తిరుగగా; రౌద్రాకృతిన్= భయంకర రూపంతో; భుజ= బాహువుల; ఉల్లాస= విజృంభణచేత; విభాసి+ఐ= వెలుగుతున్నవాడై; దివిజ+ఇంద్ర+అపత్యవక్షంబు= దేవేంద్రుడి పుత్రుడైన అర్జునుడి హృదయాన్ని, చూచి= గురిచూచి; వైచెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** తీవ్రమైన అహంకారంతో భగదత్తుడు తన అంకుశాన్ని అభిమంత్రించి, మెరుగులు చిమ్మగా, ఆగ్రహించి, బాహువుల విజృంభణచేత ప్రకాశిస్తూ, భయంకరాకారుడై అర్జునుడి హృదయాన్ని గురిచూచి దాన్ని ప్రయోగించాడు. అపుడు పాండవ సైన్యమంతా మితిమీరిన భయంతో గడగడలాడింది.

**విశేషం:** ఇందులో రౌద్రరసం కన్నులకు గట్టినట్లు వర్ణించబడింది.

ఉ. అప్పుడు శౌరి పార్థునకు నడ్డముగాఁ దన మే నమర్చి ను
స్గ ప్పెసలారు పేరురమునం ధరియించిన నమ్మహాస్త్ర మం
దొప్పె నవారుణాంబుజ కృతోజ్జ్వల మాలికయై చిరస్థితిం
జొప్పడి నూతనాభ్రతల శోభితమైన మెఱుంగు చాడ్పునన్. 355

**ప్రతిపదార్థం:** అప్పుడు= భగదత్తుడు అంకుశం వేసినప్పుడు; శౌరి= శ్రీకృష్ణుడు, పార్థునకున్= అర్జునుడికి; అడ్డముగాన్= అడ్డంగా; తన= తన యొక్క; మేను= దేహం; అమర్చి= పెట్టి; నున్+కప్పు+ఎసలు+ఆరు= నున్నటి నల్లదనం అతిశయించే; పేరు+ఉరమునన్= విశాలమైన హృదయమునందు; ధరియించినన్= తాల్చగా; ఆ+మహా+అస్త్రము= ఆ గొప్పదైన అంకుశం; అందున్= ఆ హృదయంలో; నవ= క్రొత్తదగు; అరుణ= ఎర్రని; అంబుజ= కమలాలచేత; కృత= చేయబడిన; ఉజ్జ్వల= ప్రకాశించే; మాలిక+ఐ= హారమై; చిరస్థితిన్= చిరస్థాయిగా; చొప్పడి= ఉండి; నూతన+అభ్రతల శోభితము+ఐ= క్రొత్తగా ఆకాశంలో అలంకృతమైన; మెఱుంగు= విద్యుల్లత; చాడ్పునన్= వలె; ఒప్పెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** భగదత్తుడు అంకుశాన్ని ప్రయోగించినపుడు శ్రీకృష్ణుడు అర్జునుడికి అడ్డంగా తన దేహాన్ని నిలిపి, నల్లనై నిగనిగలాడే హృదయంమీద ఆ అంకుశాన్ని ధరించాడు. అప్పు డా మహాస్త్రం శ్రీకృష్ణుడి వక్షస్థలంలో అప్పుడే వికసించిన అరుణ కమలాల మాల అయి ప్రకాశిస్తూ స్థిరంగా ఉండి, క్రొత్తగా ఆకాశంలో అలంకృతమైన విద్యుల్లతవలె ఒప్పింది.

**విశేషం:** అలం: ఉపమ. భయావహమైన భగదత్తుడు ప్రయోగించిన అంకుశం శ్రీకృష్ణుడి హృదయంలో అరుణ కమలహారంగా మారడం విస్మయాన్ని కలిగించే దృశ్యం. దీని వలన అద్భుతరసం వ్యక్తమౌతున్నది.

చ. కనుఁగొని ఫల్గునుండు 'మురఘస్మర! యి ట్లగునయ్య సొంపు నొం
దిన కరుణా విశేషమునఁ దేరికి సారథి వైతి గాక యే
పనులును బూని చేయు టిది పాడియె? తేజము నీవు దప్పఁ జూ
చినఁ జెడదే? ననుం జులుకఁ జేసితి మాటలు వేయు నేటికిన్? 356

**ప్రతిపదార్థం:** ఫల్గునుఁడు= అర్జునుడు; కనుఁగొని= ఈ అద్భుతాన్ని చూచి; మురఘస్మర!= మురాసురవధ జేసిన శ్రీకృష్ణా!; సొంపును+ఒందిన= సమృద్ధమైన; కరుణా విశేషమునన్= విశేషమైన దయవలన; తేరికిన్= రథానికి; సారథివి= రథాన్ని నడిపేవాడవు; ఐతి+కాక= అయినావు గాక; ఇట్లు+అగునయ్యా!= ఇట్లా జరుగుతుందా!; ఏ పనులును= చిన్నది పెద్దది అనక ఏ పని అయినా; పూని= ప్రయత్నించి; చేయుట= చేయటం; ఇది; పాడియె?= తగునా?; తేజము= శౌర్యం; నీవు= మహిమాన్వితుడవైన నీవు; తప్పన్+చూచినన్= అన్న మాటను తప్పితే; చెడదే?= నశించదా?; ననున్= నన్ను; చులుకన్+చేసితి(వి)= తేలిక పరిచాను; మాటలు, వేయున్+ఏటికిన్= పెక్కు మాటలెందుకు?

**తాత్పర్యం:** అర్జునుడు ఈ అద్భుతమైన సన్నివేశాన్ని చూచి 'ఓ కృష్ణా! ఇట్లా నీవు చేయటం సమంజసమేనా? నాపైగల అపారమైన కరుణావిశేషంచేత నాకు సారథివైతే కావచ్చుగాక! నేను చేయదగిన శత్రు సంహారాదులను కూడా నీవే చేయటం ధర్మమా? నీవు మాట తప్పితే నా పరాక్రమానికి లోటు రాదా? వేయి మాటలు ఏల? నన్ను చులుకనచేశావు.'

**వ. అని దూఱినం గృష్ణుండు 'దొల్లి భూమిదేవి గామించి యోగనిద్రా సమయావసాన సుప్రబుద్ధుండై యున్న విష్ణుకడకుం జనుటయు, నతండు తత్సంగతిం బ్రీతుండై యన్నాతికి వరంబిచ్చుటయు, నవ్వరంబున నవ్వెలంది యం దుదయించిన నరకునకు వైష్ణవాస్త్రంబు విధేయం బగుటయు, నది భగదత్తాయత్తంబై యునికియుం, దద్ఘోర సాధనంబు దనకుఁ దక్క నొరులకు నోర్వరామియు నెఱింగించి, యిది యట్లకాక దీన నేమి యని మఱియుం దగు మాటలం గిరీటి ననునయించి విరోధిం జూపి వీఁ డిప్పరమసాధనంబు వృథయగుటం జేసి వెఱఁగు పడియున్నవాఁడు ; వీని తండ్రిని నేను దెగఁజూచిన ట్లీ క్రూరకర్మునిఁ బిలుకు మార్పు మనినఁ గొండొకతేఱి యాతండు గాండీవ గుణంబు సారించి దృఢముష్టి నేయుటయు. 357**

**ప్రతిపదార్థం:** అని; దూఱినన్= మందలించగా; కృష్ణుండు; తొల్లి= పూర్వం; భూమిదేవి= భూదేవి; కామించి= కోరి; యోగనిద్రా= యుగాంతంలో విష్ణువు పొందే నిద్ర; సమయ= కాలంయొక్క; అవసాన= సమాప్తంలో; సుప్రబుద్ధుండై= మేల్కొన్నవాడై; ఉన్న; విష్ణుకడకున్= విష్ణుమూర్తివద్దకు; చనుటయున్= వెళ్ళగా; అతండు= ఆ విష్ణువు; తద్+సంగతిన్= భూదేవియొక్క కూడికతో; ప్రీతుండై= సంతుష్టుడై; ఆ+నాతికిన్= ఆ భూదేవికి; వరంబు= వరం; ఇచ్చుటయున్= ఇవ్వగా; ఆ+వరంబునన్= ఆ వరంవలన; ఆ+వెలందియందున్= ఆ భూదేవియందు; ఉదయించిన= పుట్టిన; నరకునకున్= నరకాసురుడికి; వైష్ణవ+అస్త్రంబు= విష్ణు సంబంధమైన- అస్త్రం; విధేయంబు= స్వాధీనం; అగుటయున్= కావటం వలన; అది= ఆ వైష్ణవాస్త్రం; భగదత్త+ఆయత్తంబు+ఐ= భగదత్తుడి వశమై; ఉనికియున్= ఉండటం వలన; తద్+ఘోరసాధనంబు= ఆ భయంకరమైన అస్త్రం; తనకున్= కృష్ణుడికి;తక్కన్= తప్ప; ఒరులకున్= ఇతరులకు; ఓర్వరామియున్= సహించరాకుండటం; ఎఱింగించి= తెలిపి; ఇది+అట్లకాక= ఇది ఆ విధంగా కావలసింది; దీనన్= దీనివలన; ఏమి?= ఐనదేమిటి?; అని; మఱియున్= ఇంకా; తగుమాటలన్= తగిన మాటలతో; కిరీటిన్= అర్జునుడిని; అనునయించి= ఓదార్చి; విరోధిన్= శత్రువైన భగదత్తుడిని; చూపి= చూపించి; వీఁడు= ఈ భగదత్తుడు; ఈ+పరమ సాధనంబు= ఈ గొప్ప అస్త్రం; వృథ= వ్యర్థం; అగుటన్+చేసి= కావటం వలన; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; ఉన్నవాఁడు= ఉన్నాడు; వీని= వీడియొక్క; తండ్రిని= నరకాసురుడిని; నేను; తెగన్+చూచినట్లు= చంపినట్లు; ఈ క్రూరకర్మునిన్= దుష్కార్యాలు చేసే వీడిని; పిలుకు మార్పుము= సంహరించుము; అనినన్= అనగా; కొండొక తేఱి= కొంచెం ప్రసన్నుడై; ఆతండు= ఆ అర్జునుడు; గాండీవగుణంబు= గాండీవమనెడు ధనుస్సు యొక్క అల్లెత్రాటిని; సారించి= ఎక్కువెట్టి; దృఢముష్టిన్= బలమైన పిడికిలితో; ఏయుటయున్= వేయగా.

**తాత్పర్యం:** అని అర్జునుడు మందలించగా, శ్రీకృష్ణుడు, 'పూర్వం యుగాంతంలో పోయే నిద్రా సమయంముగియగా మేల్కొన్న విష్ణుమూర్తి కడకు భూదేవి కామించి వెళ్ళింది. అపుడు ఆ విష్ణువు భూదేవి కూడికతో ప్రసన్నుడై ఆమెకు వరాన్ని ప్రసాదించాడు. దానివలన భూదేవికి పుట్టిన నరకాసురుడికి వైష్ణవాస్త్రం స్వాధీనమైనది. అది తర్వాత అతని పుత్రుడైన భగదత్తుడి వశమైంది. కాబట్టి ఆ ఘోరమైన వైష్ణవాస్త్రం తనకు తప్ప ఇతరులకు సహించరానిది. అందుకే తాను దానిని అడ్డుకొనవలసి వచ్చింది. దీనివలన అయిందేమి?'టని శ్రీకృష్ణుడు అర్జునుడిని ఓదార్చి, శత్రువైన

భగదత్తుడిని చూపించి, వీడు ఈ దివ్యాస్త్రం వ్యర్థం కావటం వలన ఆశ్చర్యపడ్డాడు. నేను వీడి తండ్రిని చంపినట్లు నీ వీ క్రూరకర్ముడిని తెగటార్చవలసినదని చెప్పాడు. ఇది విని ప్రసన్నుడై అర్జునుడు తన గాండీవ ధనుస్సును ఎక్కుపెట్టి శక్తి కొలది వేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**భగదత్తుండు సుప్రతీకంబుతోడ నర్జునుచేఁ జచ్చుట (సం. 7-28-40)**

**ఉ. వాలిక దొడ్డనారసము వజ్రము శైలము దాఁకునాకృతిన్**
**ఫాలము మీఁదఁ దాఁకిన నిభంబు వెసం బడి కొమ్ము లూఁతగా**
**వ్రాలుడు నర్ధచంద్రరుచిర ప్రదరంబునఁ ద్రుంచె బాణ వి**
**ద్యాలసితుండు గ్రీడి భగదత్తుని కంఠ మకుంఠితోద్ధతిన్. 358**

**ప్రతిపదార్థం:** వాలిక= వాడి అయిన; దొడ్డ= పెద్ద; నారసము= బాణం; వజ్రము= వజ్రాయుధం; శైలము= పర్వతాన్ని; తాఁకు= తాకునట్టి; ఆకృతిన్= విధంగా; ఫాలముమీఁదన్= నొసటిపై; తాఁకినన్= తాకగా; ఇభంబు= సుప్రతీకగజం; వెసన్+పడి= వెంటనే పడి; కొమ్ములు= దంతాలు; ఊఁతగాన్= ఆధారంగా; వ్రాలుడున్= వాలగా; బాణవిద్యా= అస్త్రవిద్యచేత; లసితుండు= ఒప్పువాడగు; క్రీడి= అర్జునుడు; అకుంఠిత= మొక్కవోని; ఉద్ధతిన్= గర్వంతో; అర్ధచంద్ర= అర్ధచంద్రుడివలె; రుచిర= ఒప్పే; ప్రదరంబునన్= బాణంతో; భగదత్తుని= భగదత్తుడి యొక్క, కంఠము= తలను; త్రుంచెన్= నరికాడు.

**తాత్పర్యం:** వాడి అయిన గొప్ప బాణం, వజ్రాయుధం పర్వతాన్ని తాకినట్లు నొసటిని తాకగా ఆ సుప్రతీక గజం దంతాలు ఊతగా ఒరిగిపోయింది. అపుడు అస్త్రవిద్యానిపుణుడైన అర్జునుడు గర్వాతిశయంతో పొంగి, అర్ధచంద్రుడివలె ఒప్పే బాణంతో భగదత్తుడి కంఠాన్ని ఛేదించాడు.

**వ. ఇట్లు దంతిని భగదత్తునిం బరిమార్చి మాఱులేక మలయు మధ్యమ పాండవునిం గనుంగొని శకుని తమ్ములు వృషకుండును, నచలుండును దాఁకిన నతండు వృషకుని రథరథ్య సూత ధ్వజచ్ఛత్రచామరంబులు రూపఱ నఱకుటయు, నాతండు సోదరుని రథంబెక్కె నప్పుడు వారి కడ్డపడిన గాంధార వీరరథిక పంచశతంబుఁ బంచత్వంబు నొందించిన సంక్రందననందను నురవడికిం దెరలక యేకరథస్థులగు నయ్యిరువురుం బరాక్రమించిన. 359**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; దంతిని= సుప్రతీక గజాన్ని; భగదత్తునిన్= భగదత్తుడిని; పరిమార్చి= చంపి; మారులేక= ఎదురులేక; మలయు= ఒప్పే; మధ్యమ పాండవునిన్= అర్జునుడిని; కనుంగొని= చూచి; శకుని తమ్ములు= శకునియొక్క సోదరులు; వృషకుండును= వృషకుడును; అచలుండును= అచలుడును; తాఁకినన్= ఎదుర్కొనగా; అతండు= అర్జునుడు; వృషకుని= వృషకుడి యొక్క; రథ= రథం; రథ్య= గుర్రాలు; సూత= సారథి; ధ్వజ= పతాకం; చామరంబులు= వీవనలు; రూపఱన్= నశించగా; నఱకుటయున్= ఖండించగా; ఆతండు= వృషకుడు; సోదరుని= సోదరుడి యొక్క; అరదంబు= రథం; ఎక్కెన్= ఎక్కాడు; అప్పుడు= ఆ సమయంలో; వారికిన్= వృషకునికి, అచలునికి; అడ్డపడిన= సహాయంగా వచ్చిన; గాంధార= గాంధారదేశపు; వీర= శూరులైన; రథిక= రథంపై నిలిచి యుద్ధం చేసే; పంచశతంబున్= ఐదు వందలమందిని; పంచత్వంబున్+ఒందించిన= చంపిన; సంక్రందన నందనుని= ఇంద్రుడి పుత్రుడైన అర్జునుడియొక్క; ఉరవడికిన్= అతి వేగానికి; తెరలక= తొలగిపోక; ఏకరథస్థులు+అగు= ఒకే రథంపై ఉన్న; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరు కూడ; పరాక్రమించినన్= పరాక్రమం చూపగా.

**తాత్పర్యం:** ఇట్లా సుప్రతీక గజాన్ని, భగదత్తుడిని చంపి ఎదురులేకున్న అర్జునుడిని చూచి శకుని తమ్ములైన వృషకుడు, అచలుడు ఎదుర్కొన్నారు. అపుడు అర్జునుడు వృషకుడి రథాన్ని, గుర్రాలను, సారథిని, పతాకాన్ని,

గొడుగును, చామరాలను ఖండించగా, వాడు తమ్ముడి రథం ఎక్కాడు. అంతలో వారికి సహాయంగా వచ్చిన ఐదు వందల గాంధార రథిక వీరులను హతమార్చిన అర్జునుడి తీవ్రతకు తొలగిపోక, ఒకే రథంపై ఉన్న ఆ ఇద్దరు పరాక్రమాన్ని చూపగా.

**తే.** **చేరియుండుట ననువైన వారి నొక్క। నారసంబునఁ బడనేసె నరుఁడు; దానిఁ**
**జూచి కన్నీరు నించి నీ సుతులు సాలఁ। గుంది రర్జును నపుడు మార్కొనియె శకుని. 360**

**ప్రతిపదార్థం:** చేరి ఉండుటన్= దగ్గర ఉండటం వలన; అనువైన వారిన్= అందుబాటులో ఉన్నవారిని; నరుఁడు= అర్జునుడు; ఒక్క= ఒకే; నారసంబునన్= బాణంతో; పడన్+ఏసెన్= కూల్చాడు; దానిన్+చూచి= ఆ విషాద సంఘటనను చూసి; నీ సుతులు= నీ కొడుకులైన దుర్యోధనాదులు; కన్నీరు నించి= కన్నీరు కార్చి; చాలన్= మిక్కిలి; కుందిరి= బాధపడ్డారు; శకుని; అపుడు= ఆ సమయంలో; అర్జునుని= అర్జునుడిని; మార్కొనియెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు సమీపాన అందుబాటులో ఉన్న శకుని సోదరు లిద్దరిని ఒకే బాణంతో కూల్చాడు. అది చూచి నీ కొడుకులు దుర్యోధనాదులు కన్నీరు గార్చి శోకించారు. అపుడు శకుని అర్జునుడిని ఎదుర్కొన్నాడు.

**వ.** **అతండు మాయావి యగుట ననేక మాయలు గల్పించిన మొగిళ్ళు వరపి పాషాణ వృక్ష వివిధాయుధంబులు వివ్వచ్చు పైఁ గురిసెం బదంపడి తమం బడరెఁ బిదప నీళ్ళు వెల్లిగొనియె; మఱియు మహోరగ శార్దూలాది క్రూరసత్త్వంబులు గవిసె; వారి నెల్లను దోడ్తోన దివ్యాస్త్రవేదియగు నా సవ్యసాచి యడంగించి యల్లననగవుతో నిట్లనియె. 361**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ శకుని; మాయావి= మాయలు పన్నేవాడు; అగుటన్= కావటం వలన; అనేక మాయలు= ఎన్నియో మాయలు; కల్పించినన్= సృష్టించగా; మొగిళ్ళు+పరపి= మేఘాలు కమ్ముకొని; పాషాణ= రాళ్ళు; వృక్ష= చెట్లు; వివిధ= అనేకములైన; ఆయుధంబులు= శస్త్రాలు; వివ్వచ్చుపైన్= అర్జునుడిపై; కురిసెన్= వర్షించాడు; పదంపడి= తర్వాత; తమంబు= చీకటి; అడరెన్= వ్యాపించింది; పిదప= తర్వాత; నీళ్ళు= నీరు; వెల్లిగొనియెన్= ప్రవహించింది; మఱియున్= ఇంకా; మహా+ఉరగ= పెద్దపాములు; శార్దూల= పెద్దపులులు; ఆది= మొదలైన; క్రూర= దుష్టములైన; సత్త్వంబులు= మృగాలు; కవిసెన్= విజృంభించాయి; వానిన్= వాటిని; ఎల్లన్= అన్నిటిని; తోడ్తోన్= వెనువెంటనే; దివ్య= దేవసంబంధమైన; అస్త్ర= బాణాలు; వేది+అగు= తెలిసినవాడగు; ఆ సవ్యసాచి= అర్జునుడు; అడంగించి= అణచివేసి; అల్లని నగవుతోన్= చిరునవ్వుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ శకుని మాయలు పన్నేవాడు కావటం వలన అనేక మాయలు సృష్టించగా, మేఘాలు క్రమ్మి, రాళ్ళు, చెట్లు, పలువిధాలైన ఆయుధాలు, అర్జునుడిపై కురిశాయి. ఇంతలో చీకట్లు క్రమ్మినవి. తర్వాత నీరు ప్రవహించింది. ఇంకా పెద్ద పెద్ద పాములు, పులులు, క్రూరమృగాలు విజృంభించాయి. వాటి నన్నిటిని వెనువెంటనే అణచివేసి దివ్యాస్త్ర వేదియైన అర్జునుడు చిరునవ్వుతో ఇట్లా అన్నాడు.

**క.** **'మాయలు జూదము తోడన। పోయెంగా, కింక నిచటఁ బొసఁగునె యవి? మ**
**త్సాయకము లడ్డసాళ్ళే?। నీయాచవి లేదు పొమ్ము నిలువక మామా!' 362**

**ప్రతిపదార్థం:** మామా!= శకునిమామా!; మాయలు= వంచనలు; జూదము తోడన్+అ= జూదంతోనే; పోయెన్+కాక= పోయినవిలే; ఇంకన్= ఇక; అవి= ఆ మాయలు; ఇచటన్= యుద్ధరంగంలో; పొసఁగునె?= సాగుతాయా?; మత్+సాయకములు= నా బాణాలు; అడ్డసాళ్ళే?= పాచికలా?; నీ= నీకు; ఆ చవి= ఆ కపటపు జూదంలోని రుచి; లేదు= ఇట లేదు; నిలువక= ఆగకుండ; పొమ్ము= వెళ్ళిపొమ్ము.

**తాత్పర్యం:** 'శకునిమామా! నీ మాయలన్నీ జూదంతోనే పోయినవిలే! అవి యుద్ధరంగంలో పొసగవు. నా బాణాలంటే పాచిక లనుకొన్నావా? నీకా కపటపు జూదంలోని రుచి ఇచట దొరుకదు. ఆగక ఇటనుండి వెళ్ళి పొమ్ము.'

**క.** **అని పలికి వాలుటమ్ములు । తనువున నినుచుటయుఁ గలఁగి ధైర్యము మానం**
**బును వీటిఁబోవఁ బాఱెను । జననాయక! నీ మఱంది సరివారు నగన్.** 363

**ప్రతిపదార్థం:** జననాయక!= ధృతరాష్ట్ర మహారాజా!; అని పలికి= ఆ విధంగా పలికి; వాలుటమ్ములు= నిశితమైన బాణాలు; తనువునన్= దేహంలో; నినుచుటయున్= నింపగా; నీ మఱంది= నీ మరిది అయిన శకుని; కలఁగి= బాధపడి; ధైర్యము= ధీరత్వం; మానంబును= అభిమానం; వీటిన్+పోవన్= వ్యర్థంకాగా; సరివారు= తోడివారు; నగన్= నవ్వగా; పాఱెను= పారిపోయాడు.

**తాత్పర్యం:** జననాయకుడవైన ధృతరాష్ట్రా! అర్జునుడు ఆ విధంగా పలికి, నిశితమైన బాణాలు దేహం నిండా నింపగా, నీ మరది అయిన శకుని కలతపడి, ధైర్యాభిమానాలు విడిచి, తోడివారు నవ్వగా పారిపోయాడు.

**ఉ.** **ఆతఁడు పాఱినం దెరలు నచ్చటి సేనలఁ గాల్కొనంగ నీ**
**కాతత బాహువీర్యులు బకారియు సాత్యకియుం గడంగి తో**
**డై తన పార్శ్వభాగముల నార్చుచుఁ దోలఁగఁ దోలె ఖేచర**
**వ్రాతము మెచ్చఁ గ్రీడి కురురాజును ద్రోణుఁడు నున్న నేలకున్.** 364

**ప్రతిపదార్థం:** ఆతఁడు= శకుని; పాఱినన్= పారిపోగా; తెరలు= కలతపొందే; అచ్చటి= అక్కడి; సేనలన్= సైన్యాలను; కాల్కొనంగ నీక= నిలువనియ్యక; ఆతత= విరివి అయిన; బాహు= భుజములలో; వీర్యులు= బలం కలవారగు; బక+అరియున్= భీముడును; సాత్యకియున్= సాత్యకియు; కడంగి= పూని; తోడై= సహాయులై; తన= అర్జునుడి యొక్క; పార్శ్వభాగములన్= ప్రక్కలయందు; ఆర్చుచున్= సింహనాదాలు చేస్తూ; తొలఁగన్= తరుమగా; క్రీడి= అర్జునుడు; ఖేచరవ్రాతము= ఆకాశంలో విహరించే దేవతాది సమూహం; మెచ్చన్= పొగడగా; కురురాజును= దుర్యోధనుడూ; ద్రోణుఁడున్= ద్రోణాచార్యుడూ; ఉన్న నేలకున్= ఉన్నచోటికి; తోలెన్= తరిమాడు.

**తాత్పర్యం:** శకుని పారిపోగా కలతపొందే అచ్చటి సైన్యాలను నిలువనీయక బాహుబలం గల భీమ, సాత్యకులు తోడై అర్జునుడి పార్శ్వభాగాలలో సింహనాదాలు చేస్తూ తరిమారు. అపుడు అర్జునుడు ఆకాశంలో దేవతా సమూహం ప్రశంసిస్తుండగా, దుర్యోధనుడు, ద్రోణుడు ఉన్న చోటికి ఆ సైన్యాలను తరిమివేశాడు.

**ఆ.** **బలము విఱిగి రెండు పాయలై యిట్టు ల । మ్మనుజవిభుని గురుని మఱువు సొచ్చె;**
**ద్రోణుఁ బొదువుఁ డనుచు దుర్దమలీల నీ । దిక్కువారు గవిసి రుక్కు మిగిలి.** 365

**ప్రతిపదార్థం:** బలము= సేన; విఱిగి= తునియలై; రెండు పాయలు+ఐ= రెండుగా చీలి; ఇట్టులు= ఈ విధంగా; ఆ మనుజ విభుని= దుర్యోధన మహారాజుయొక్క; గురుని= ద్రోణాచార్యుడి యొక్క; మఱువు+చొచ్చెన్= చాటుకు చేరింది; ద్రోణున్= ద్రోణాచార్యుడిని; పొదువుఁడు= చుట్టు ముట్టండి; అనుచున్= అంటూ; దుర్దమలీలన్= అణచరాని విధంగా; ఆ దిక్కువారు= పాండవ పక్షంవారు; ఉక్కు మిగిలి= శౌర్యం మీరి; కవిసిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** శకునిసైన్యం తునియలై, రెండుగా చీలి దుర్యోధనుడి, ద్రోణాచార్యుడి చాటుకు చేరింది. శౌర్యం మీర, అడ్డుకొనరాని విధంగా పాండవపక్షవీరులు 'ద్రోణుడిని చుట్టుముట్టండి' అంటూ విజృంభించారు.

**క.** **చనుఁ డడ్డం బాచార్యున । కనునెలుఁగులతోడ నీసుతావళి వెస మా**
**ర్కొనుటయు మన సేనలు పురి । కొని పాండవబలముఁ దాఁకెఁ గురువంశనిధీ!** 366

**ప్రతిపదార్థం:** కురువంశనిధీ!= ధృతరాష్ట్ర మహారాజా!; ఆచార్యునకున్= ద్రోణుడికి; అడ్డంబు= సహాయంగా; చనుఁడు= వెళ్ళండి; అను= అనే; ఎలుఁగులతోడన్= అరుపులతో; నీ సుత+ఆవళి= నీ కుమారులు; వెసన్= వేగంగా; మార్కొనుటయున్= ఎదుర్కొనగా; మన సేనలు= కౌరవ సైన్యాలు; పురికొని= ఉత్సహించి; పాండవ బలమున్= పాండవసైన్యాన్ని; తాఁకెన్= అడ్డుకొన్నాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! నీ కుమారులు 'ద్రోణాచార్యుడికి సహాయంగా వెళ్ళండి' అనే అరుపులతో వేగంగా ఎదుర్కొనగా; మన కౌరవసేనలు ఉత్సహించి పాండవసైన్యాన్ని అడ్డుకొన్నాయి.

**క. గురుఁ డొడ్డుగఁ దమకంబునఁ। గురువీరులుఁ బాండుపుత్రకుల యోధులు ని**
**ర్భర సమరద్యూత కళా। నిరతిం గ్రీడించి రుగ్రనిపుణత మెఱయన్. 367**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; ఒడ్డుగన్= పందెంగా; తమకంబునన్= మోహంతో; కురువీరులున్= కౌరవవీరులును; పాండుపుత్రకుల= పాండవపక్షపు; యోధులు= వీరులు; నిర్భర= నిండిన; సమర= యుద్ధమనే; ద్యూతకళా= జూదమనే ఆటయందు; నిరతిన్= మిక్కిలి ఆసక్తితో; ఉగ్రనిపుణత= భయం గొలిపే నిపుణత్వం; మెఱయన్= ప్రకాశించగా; క్రీడించిరి= ఆడారు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు పందెంగా, మోహంతో కౌరవవీరులు, పాండవ యోధులు యుద్ధమనే జూదంలోని ఆసక్తితో, భయం గొలిపే నేర్పు ప్రకాశించగా క్రీడించారు.

**విశేషం:** అలం: రూపకం.

**వ. శరగురుఁ డెచటికిఁ దఱిమిన। వెరవున నచ్చటికి నెల్ల విక్రాంతి ధురం**
**ధరుఁ డగు ధృష్టద్యుమ్నుఁడు। బరవసము దలిర్ప నడ్డపడి పోరాడెన్. 368**

**ప్రతిపదార్థం:** శరగురుఁడు= ద్రోణాచార్యుడు; ఎచటికిన్= ఎక్కడికి; తఱిమినన్= తరిమితే; అచ్చటికిన్= అక్కడికి; ఎల్లన్= అంతా; వెరవునన్= ఉపాయంగా; విక్రాంతి= పరాక్రమ; ధురంధరుఁడు+అగు= భారం వహించిన; ధృష్టద్యుమ్నుఁడు= పాండవ సేనాని ఐన ధృష్టద్యుమ్నుడు; బరవసము= ధైర్యం; తలిర్పన్= అతిశయించగా; అడ్డపడి= ఎదిర్చి; పోరాడెన్= యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు తరిమిన చోటికెల్లా వెళ్ళి, ఉపాయంతో, పరాక్రమంతో నేర్పరి అయిన ధృష్టద్యుమ్నుడు ధైర్యం అతిశయించగా ఎదిరించి పోరాడాడు.

**చ. కురుపతి ధర్మనందను లకుంఠిత విక్రమ కౌతుకంబునం**
**బురికొలుపంగ సైన్యములు వోక పెనంగెడు రౌద్రభంగి క**
**చ్చెరువడి యున్కి నిట్టు లని చెప్పఁగ నిప్పుడు నేర నయ్యెదం**
**గరిపురనాథ! చూడ వినఁ గల్గునె యమ్మెయి కయ్య మెయ్యెడన్! 369**

**ప్రతిపదార్థం:** కరిపురనాథ!= ధృతరాష్ట్ర మహారాజా!; కురుపతి ధర్మనందనులు= దుర్యోధనుడును, ధర్మరాజును; అకుంఠిత= మొక్కవోని; విక్రమ= పరాక్రమమందలి; కౌతుకంబునన్= కుతూహలంతో; పురికొలుపంగన్= ప్రోత్సహించగా; సైన్యములు= కౌరవ, పాండవ సైన్యాలు; పోక= వెనుదిరుగక; పెనంగెడు= పోరాడే; రౌద్రభంగికిన్= భయంకరమైన పద్ధతికి; అచ్చెరువడి= ఆశ్చర్యపడి; ఉన్కిన్= ఉండటం వలన; ఇట్టులని= ఇట్లైనదని; చెప్పఁగన్= చెప్పడానికి; ఇప్పుడు= ఈ సమయంలో; నేరను+అయ్యెదన్= శక్యం కాదు; ఆ+మెయి= అటువంటి; కయ్యము= యుద్ధం; చూడన్= చూడటానికి; వినన్= వినటానికి; ఎయ్యెడన్= ఎచటనైన; కల్గునె?= ఉంటుందా?

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! దుర్యోధనుడు, ధర్మజుడు అకుంఠిత పరాక్రమమందలి కుతూహలంతో ప్రోత్సహించగా, కౌరవ పాండవ సేనలు వెనుదిరుగక పోరాడే భయంకరమైన పద్ధతికి ఆశ్చర్యచకితుడిని కావటంచేత ఈ విధంగా జరిగిందని ఇపుడు చెప్పలేకపోతున్నాను కాని, అటువంటి యుద్ధం ఇదివరకు కన్నది విన్నది ఎక్కడైనా ఉన్నదా!

**వ. అట్టియెడ. 370**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కౌరవ పాండవులు భయవిస్మయాలు కలిగేటట్లు పోరాడే సమయంలో.

**క. నీలుఁ డను రాజు గురుసుతు । పై లీలం దేరు వఱపఁ బటువిశిఖమునం**
**గీ లెడపిన జంత్రముక్రియ । నేలం బడ నేసె నతఁడు నృపుఁ డగ్గింపన్. 371**

**ప్రతిపదార్థం:** నీలుఁడు+అను రాజు= నీలుడు అనే రాజు; గురుసుతుపైన్= గురుపుత్రుడైన అశ్వత్థామపై; లీలన్= లీలగా; తేరు= రథం; వఱపన్= నడపగా; అతఁడు= ఆ అశ్వత్థామ; నృపుఁడు= దుర్యోధనుడు; అగ్గింపన్= ప్రశంసించగా; కీలు= మర; ఎడపిన= తొలగిన; జంత్రము= యంత్రం; క్రియ= వలె; పటువిశిఖమునన్= బలమైన బాణంతో; నేలన్= భూమిపై; పడనేసెన్= కూల్చాడు.

**తాత్పర్యం:** నీలుడనే రాజు అశ్వత్థామపై లీలగా తేరు నడిపేసరికి, అశ్వత్థామ దుర్యోధనుడు ప్రశంసించగా బలమైన బాణంతో, మర తొలగిన యంత్రంవలె అతడు భూమిపై పడేటట్లుకొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. చచ్చిన నీలునిఁ గనుఁగొని । విచ్చిన సైన్యంబు గురుఁడు వెనుకొనుటయు వే**
**వచ్చిన ధృష్టద్యుమ్నుని । నచ్చిన యబ్బలము మగిడినం బో రొప్పెన్. 372**

**ప్రతిపదార్థం:** చచ్చిన= చనిపోయిన; నీలునిన్= నీలుడిని; కనుఁగొని= చూచి; విచ్చిన= చీలిన; సైన్యంబు= సేనను; గురుఁడు= ద్రోణుడు; వెనుకొనుటయున్= వెన్నంటగా; వే వచ్చిన= వేగంగా వచ్చిన; ధృష్టద్యుమ్నునిన్= ధృష్టద్యుమ్నుడిని; నచ్చిన= నమ్మిన; ఆ+బలము= పాండవసేన; మగిడినన్= మరలిరాగా; పోరు= యుద్ధం; ఒప్పెన్= జరిగింది.

**తాత్పర్యం:** చనిపోయిన నీలుడిని చూచి చీలిన పాండవ సైన్యాన్ని ద్రోణుడు వెనుదగులగా, వేగంగా వచ్చిన ధృష్టద్యుమ్నుడిని నమ్మిన ఆ సేన మరలి వచ్చింది. అపుడు యుద్ధం చెలరేగింది.

**వ. అప్పుడు సంశప్తకులు నారాయణగోపాల బలంబులం గూడికొని పఱతెంచి. 373**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; సంశప్తకులు= సుశర్మాదులు; నారాయణ గోపాల= నారాయణ నామధేయులైన యాదవ వర్గానికి చెందిన; బలంబులన్= సేనలను; కూడికొని= కలిసికొని; పఱతెంచి= వచ్చి.

**తాత్పర్యం:** ఆ సమయంలో సంశప్తకులు నారాయణ గోపాల సేనలను కలిసికొని వచ్చి.

**క. 'ఓడితిమె మేము రణమునఁ । గ్రీడికిఁ? గ్రేడించి రాక గెలుపే? యతఁ డేఁ**
**డీ? డాఁగి పోయెనొకొ! మా । తోడి బవర మిట్లు దాను దొలఁగినఁ దెగునే?' 374**

**ప్రతిపదార్థం:** క్రీడికిన్= అర్జునుడికి; మేము= సంశప్తకులమైన మేము; రణమునన్= యుద్ధంలో; ఓడితిమె?= ఓడిపోయామా?; క్రేడించి= లక్ష్యపెట్టకుండా; రాక= రావటం; గెలుపే?= గెలిచినట్లా?; అతఁడు= ఆ అర్జునుడు; ఏఁడీ?= ఎక్కడున్నాడు?; డాఁగిపోయెన్+ఒకో= దాగున్నాడా?; మాతోడి= మాతో; బవరము= యుద్ధం; ఇట్లు= ఈ విధంగా; తాను= ఆ అర్జునుడు; తొలఁగినన్= తప్పించుకొన్న; తెగునే?= తీర్పు జరిగినట్లేనా?

**తాత్పర్యం:** 'అర్జునుడికి మేము ఓడినామా? యుద్ధం సాగుతుంటే లక్ష్య పెట్టకుండ రావటం గెలుపా? ఆ అర్జునుడెక్కడున్నాడు? దాగుకొన్నాడేమో! తాను తొలగిపోతే మాతో యుద్ధం ముగుస్తుందా?'

**వ. అను నెలుంగులు నింగిముట్ట దక్షిణ భాగంబునం గవిసినం గవ్వడి యట నడచి వారికిం గయ్యం బిచ్చిన నత్తెఱపి గని తఱుము కౌరవయోధుల కోలుతలకుం గాక తమ సేనలు దెరలిన భీమసేనుం డదల్చి మార్కొని.375**

**ప్రతిపదార్థం:** అను+ఎలుంగులు= అనే ధ్వనులు; నింగిముట్టన్= ఆకాశము నంటగా; దక్షిణ భాగంబునన్= దక్షిణపువైపున; కవిసినన్= క్రమ్మగా; కవ్వడి= అర్జునుడు; అట= వారివైపు; నడచి= పోయి; వారికిన్= సంశప్తకులకు; కయ్యంబు+ఇచ్చినన్= యుద్ధము నివ్వగా; ఆ+తెఱపి= ఆ అవకాశం; కని= చూచికొని; తఱుము= తరిమే; కౌరవ యోధుల= కౌరవ వీరులతో; కోలుతలకున్+కాక= యుద్ధం చేయలేక; తమ సేనలు= పాండవ సైన్యాలు; తెరలినన్= తొలగగా; భీమసేనుండు= భీముడు; అదల్చి= గద్దించి; మార్కొని= ఎదుర్కొని.

**తాత్పర్యం:** సంశప్తకులు, కృష్ణార్జునులను ఎత్తిపొడిచే ధ్వనులు మిన్ను ముట్టగా, దక్షిణ భాగాన కవిసేసరికి, అర్జునుడు వారి వైపునకు పోయి యుద్ధానికి రమ్మన్నాడు. ఆ అవకాశం చూచికొని తరిమే కౌరవసేనలను పాండవ సేనలు ఎదిరించజాలక తొలగగా, భీముడు పాండవ సేనలను గద్దించి, శత్రువులను ఎదిరించి.

**క. తల మిగిలి వచ్చు బాహ్లికు । నిలు మని విశిఖముల నొంచె; నృపతియు గురు క**
**ర్ణులు నశ్వత్థామయు న । మ్ముల వానలు గురిసి రొక్క మొగి నతనిపయిన్. 376**

**ప్రతిపదార్థం:** తల మిగిలి= ముందుకు దూసికొని; వచ్చు= వచ్చునట్టి; బాహ్లికున్= బాహ్లికుడిని; నిలుము+అని= నిలువుమని; విశిఖములన్= బాణాలతో; నొంచెన్= బాధించాడు; అతనిపయిన్= ఆ భీముడిపై; నృపతియున్= దుర్యోధనుడును; గురు= ద్రోణుడు; కర్ణులున్= కర్ణుడును; అశ్వత్థామయున్= అశ్వత్థామయు; అమ్ముల= బాణాల; వానలు= వర్షాలు; ఒక్కమొగిన్= ఒక్కసారిగా; కురిసిరి= కురిపించారు.

**తాత్పర్యం:** భీముడు దూసికొని వచ్చే బాహ్లికుడిని నిలువు మని చెప్పి బాణాలతో అణచాడు. ఆ భీముడిపై దుర్యోధనుడు, ద్రోణుడు, కర్ణుడు, అశ్వత్థామ - ఒకేసారి బాణవర్షాన్ని కురిపించారు.

**వ. అతం డందఱ కన్ని రూపులై యార్చుచు నేట్లాడె; నిట్లొక్కనిం బెక్కండ్రు బొదివినం గనుంగొని కౌంతేయాగ్రజుండు పురికొలుప నకుల సహదేవ సాత్యకి సౌభద్రు లా సమీరపుత్త్రునకు బాసటయై దుర్యోధనాదులం దలపడుటయు రెండు సేనలు గలయన్ బెరసె ని ట్లపరాహ్ణంబునం గ్రందు కయ్యంబయ్యె నం దరదంబులు దాఁకు పెల్లున డొల్లు కరులును కరవాల ధారలఁ గాననగు కుంభి కుంభమౌక్తికంబులును దురగ ఖురంబులం గరటి రదంబులను బెనంగొనుచు వ్రేలు ప్రేవులును దెగిపడియు నంకుశంబులు విడువక మిట్టిమిట్టిపడు బాహువులును దొండంబులం బెనఁచి యెత్తినం దొరఁగు హయంబులు వ్రేలు రాహుతులును ముందఱి కాళ్ళు దెగవ్రేసినఁ గూలు శుండాలంబులును సామజంబు లడరి రథ్యసారథి రథిక సహితంబుగా మల్లడి గొనం ద్రొక్కిన నేలం గలిసిన రథంబులును నాశ్వికు లొక్కమొగిఁ జెక్కినం దునిసి పడి యేమిటి యంగంబులో యను సందేహంబునకుం బట్టయి యున్న పదాతి గాత్రఖండంబులును జూచి ఖేచరులకు వెక్కసం బొనర్చె; నట్టి సంకుల సమరంబున ధృష్టద్యుమ్నుండు. 377**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ భీముడు; అందఱకున్= దుర్యోధనాదులకు; అన్ని రూపులు+ఐ= అన్ని ఆకారాలై; ఆర్చుచున్= సింహనాదాలు చేస్తూ; ఏట్లు+ఆడెన్= కొట్లాడాడు; ఇట్లు= ఈ విధంగా; ఒక్కనిన్= ఒక్క భీముడిని, పెక్కండ్రు= అనేకులు; పొదివినన్= ఆక్రమించగా; కనుంగొని= చూచి; కౌంతేయ+అగ్రజుండు= ధర్మజుడు; పురికొలుపన్= ప్రోత్సహించగా; నకుల; సహదేవ; సాత్యకి; సౌభద్రుడు= అభిమన్యుడు; ఆ సమీరపుత్త్రునకున్= ఆ భీముడికి; బాసట+ఐ= సహాయులై; దుర్యోధనాదులన్= దుర్యోధనుడు మున్నగువారిని; తలపడుటయున్= ఎదుర్కొనగా; రెండు సేనలు= కౌరవ, పాండవ సైన్యాలు; కలయన్+బెరసెన్= కలిసి చొచ్చుకొనిపోయాయి; ఇట్లు= ఈ విధంగా; అపరాహ్ణంబునన్= మధ్యాహ్నం మీరిన తర్వాత; క్రందుకయ్యంబు= దొమ్మియుద్ధం; అయ్యెన్= జరిగింది; అందున్= ఆ యుద్ధంలో; అరదంబులు= రథాలు; తాఁకు= తాకే; పెల్లునన్= ఆధిక్యంవలన; డొల్లు= పడిపోయే; కరులును= ఏనుగులును; కరవాలధారలన్= కత్తుల అంచులందు; కానన్+అగు= కనిపించే; కుంభి= ఏనుగుల; కుంభ= కుంభస్థలాలలోని; మౌక్తికంబులును= ముత్యాలూ; తురగఖురంబులన్= గుర్రాల గిట్టలయందు; కరటిరదంబులను= ఏనుగుల దంతాలయందును; పెనంగొనుచున్= పెనవేసికొని; వ్రేలు= వ్రేలాడే; ప్రేవులును= ప్రేగులు; తెగిపడియున్= విరిగిపడియు; అంకుశంబులు= అంకుశాలు; విడువక= వదలక; మిట్టిమిట్టి పడు= ఎగిరెగిరి పడే; బాహువులును= చేతులు; తొండంబులన్= తొండాలతో; పెనచి ఎత్తినన్= చుట్టి యెత్తగా; తొరఁగు= పడే; హయంబులున్= గుర్రాలును; వ్రేలు= వ్రేలాడే; రాహుతులును= రౌతులును; ముందరి కాళ్ళు= ముందు కాళ్ళు; తెగవేసినన్= ఖండించగా; కూలు= పడిపోయే; శుండాలంబులును= ఏనుగులును; సామజంబులు= ఏనుగులు; అడరి= విజృంభించి; రథ్య సారథి రథిక సహితంబుగాన్= గుర్రాలు, సారథులు, రథంపై నుండి యుద్ధం చేసే వీరుల; సహితంబుగాన్= తోడ; మల్లడిగొనన్= పెనగొనగా; త్రొక్కిన; నేలన్+కలిసిన= మట్టిలో గలిసిన; రథంబులును= రథాలు; ఆశ్వికులు= రౌతులు; ఒక్కమొగిన్= ఒకేసారి; చెక్కినన్= ఖండించగా; తునిసిపడి= రాలిపడి; ఏమిటి+అంగంబులో= దేని అవయవాలో; అను= అనే; సందేహంబునకున్= సంశయానికి; పట్టు+ఐ= నెలవై; ఉన్న= ఉన్నట్టి; పదాతి= భటుల; గాత్ర= దేహపు; ఖండంబులును= ముక్కలును; చూచు= చూచే; ఖేచరులకున్= ఆకాశంలో తిరిగే దేవాదులకు; వెక్కసంబు= బాధ; ఒనర్చెన్= కలిగించింది; అట్టి= అటువంటి; సంకుల సమరంబునన్= దొమ్మియుద్ధంలో; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు.

**తాత్పర్యం:** దుర్యోధనాదివీరులు ఒక్కసారిగా పైబడగా, భీముడు వారికందరికి అన్ని రూపాలై సింహనాదాలు చేస్తూ యుద్ధం చేశాడు. ఇట్లా ఒక్కడిని ఇంతమంది ఆక్రమించటం చూచి ధర్మజుడు పురికొలుపగా, నకుల సహదేవులు, సాత్యకి, అభిమన్యుడు ఆ భీముడికి తోడై దుర్యోధనాదులతో తలపడగా రెండు సేనలు కలియబడ్డాయి. ఇట్లా మధ్యాహ్నం దాటిన తర్వాత సంకులసమరం జరిగింది. రథాలు అతివేగంగా వచ్చి తాకేసరికి ఏనుగులు పడిపోయాయి. ఏనుగులను నరకటం చేత వాటి కుంభస్థలాలలోని ముత్యాలు ఖడ్గాల అంచులపై మెరవసాగాయి. గుర్రాల గిట్టలకు, ఏనుగుల దంతాలకు పెనవేసికొని వ్రేలాడే ప్రేగులు, తెగిపడి కూడ అంకుశాలను వదలక ఎగిరిపడే చేతులు, తొండాలతో, పెనవేసి ఎత్తగా పడిపోయే గుర్రాలు, రౌతులు ఒకచో కనిపించాయి.

ముందరి కాళ్ళు తెగవేసేసరికి ఏనుగులు కూలిపోసాగాయి, ఏనుగులు విజృంభించి రథికులను, సారథులను, గుర్రాలను పెనగొనగా ఆ తొక్కిడిలో అవి మట్టిలో కలిసిపోయాయి. రౌతులు ఒక్క దెబ్బతో ఖండించగా రాలిపడిన భటుల దేహపు ఖండాలు వేటి అవయవాలో అనే సందేహాన్ని కలిగిస్తున్నవి. ఇట్టి బీభత్స దృశ్యాలు ఆకాశంలో చరించే దేవ గంధర్వాదులకు బాధకలిగించాయి. అట్టి సామూహిక యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'మన కిది సమయము సుండీ' । యని ద్రోణునిఁ జూపి తఱుమ నమ్మొన రథికుల్**
**గని 'పొదువుఁడు సంపుఁడు పొరి । గొనుఁడు దునుముఁ డనుచుఁ 'గూడుకొని యతనిపయిన్.' 378**

**ప్రతిపదార్థం:** మనకున్= మన సైన్యానికి; ఇది; సమయము= మంచి అదను; సుండీ!= సుమా!; అని; ద్రోణునిన్= ద్రోణాచార్యుడిని; చూపి; తఱుమన్= వెనుదగులగా; ఆ+మొన= పాండవ పక్షంలోని; రథికుల్= రథంపై ఉండి యుద్ధం చేసేవారు; కని= చూసి;

పొదువుఁడు= చుట్టుముట్టండి; చంపుఁడు= చంపండి; పొరిగొనుఁడు= నశింపజేయండి; తునుముఁడు= ఖండించండి; అనుచున్= అంటూ; కూడికొని= కలిసికొని; అతనిపయిన్= ఆ ద్రోణుడిపై.

**తాత్పర్యం:** 'మన పాండవ పక్షానికి ఇది మంచి అదను సుమా!' అని ద్రోణుడిని చూపి తరుమగా, పాండవ రథికులు ఇది చూచి, 'చుట్టుముట్టండి, చంపండి, నశింపజేయండి, ఖండించండి' అంటూ ఆ ద్రోణుడిపై. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. కవిసిన నమ్మహాభుజుఁడు గన్నుల దట్టపుఁ గెంపు పెలర్ప భై**
**రవముగ దివ్యబాణ నికరం బడరించినఁ దేఱి చూడ రా**
**క వెఱఁగునొంది చిత్రములకైవడి నా ఘనయోధు లుండ నీ**
**రవుతులు జోదులున్ రథికరాజియు వారి మొనల్ గలంపఁగాన్. 379**

**ప్రతిపదార్థం:** కవిసినన్= విజృంభించగా; ఆ మహాభుజుఁడు= గొప్ప బాహువులు గల ద్రోణుడు; కన్నులన్= కన్నులలో; దట్టపున్= చిక్కనైన; కెంపు= ఎఱ్ఱదనం; ఎలర్పన్= కలుగగా; భైరవముగన్= భయంగొలిపేటట్లు; దివ్య= దేవతా సంబంధమైన; బాణ= బాణాల యొక్క; నికరంబు= సమూహం; అడరించినన్= ప్రయోగించగా; తేఱిచూడ రాక= బాగుగా చూడరాక; వెఱఁగున్+ఒంది= ఆశ్చర్యపడి; చిత్రముల కైవడిన్= బొమ్మలవలె; ఆ ఘన యోధులు+ఉండన్= ఆ మహావీరులయిన పాండవ పక్షీయులు ఉండగా; నీ= నీ యొక్క; రవుతులు= ఆశ్వికులు; జోదులున్= యోధులు; రథిక రాజియున్= రథికుల సమూహం; వారి= పాండవుల; మొనల్= సైన్యాలను; కలంపఁగాన్= కలచివేయగా.

**తాత్పర్యం:** వారు ద్రోణుడిపై విజృంభించగా, ఆ మహాబలశాలి కన్నులు ఎఱ్ఱజేసి భయంకరంగా దివ్య బాణాలను ప్రయోగించగా, తేరిచూడలేక ఆశ్చర్యపడి, ఆ పాండవవీరులు చిత్రాలవలె నిలిచిపోయారు. అపుడు నీ రథాశ్వపదాతి యోధులు వారి సైన్యాలను కలచివేయగా.

**మ. తను నత్యుద్ధతిఁ బిల్చి దుర్దమభుజా దర్పంబు శోభిల్లఁ దాఁ**
**కిన సంశప్తకకోటి నొంచి సమర క్రీడా కళా కౌతుకం**
**బున నాభీల కపీంద్రకేతన పరిస్ఫూర్జత్ప్రభా జాలముల్**
**వినువీథిం బరఁగంగ వచ్చె మగుడన్ వివ్వచ్చుఁ డచ్చోటికిన్. 380**

**ప్రతిపదార్థం:** తనున్= తనను; అత్యుద్ధతిన్= మిక్కిలి అహంకారంతో; పిల్చి= ఆహ్వానించి; దుర్దమ= అణచరాని; భుజా= బాహువుల; దర్పంబు= గర్వం; శోభిల్లన్= ఒప్పగా; తాకిన= ఎదుర్కొన్న; సంశప్తకకోటిన్= సంశప్తకుల సమూహాన్ని; నొంచి= బాధించి; సమర= యుద్ధమనే; క్రీడా= ఆట అందలి; కౌతుకంబునన్= కుతూహలంతో; ఆభీల= భయంకరమైన; కపీంద్ర= హనుమంతుడుగల; కేతన= పతాకంయొక్క; పరిస్ఫూర్జత్= ఉరిమే; ప్రభా= వెలుగుల; జాలముల్= సమూహాలు; వినువీథిన్= ఆకాశమార్గంలో; పరఁగంగన్= ప్రసరించగా; వివ్వచ్చుఁడు= అర్జునుడు; ఆ+చోటికిన్= ఆ యుద్ధం జరిగే చోటికి; మగుడన్= మరల; వచ్చెన్= వచ్చాడు.

**తాత్పర్యం:** తనను గర్వంమీర పిలిచి, తీవ్రమైన బాహు బల గర్వం ఒప్పగా ఎదిరించిన సంశప్తక సమూహాన్ని, యుద్ధ క్రీడా కుతూహలంతో అణచి, భయంకరమైన హనుమత్పతాకం విరజిమ్మే వెలుగులు ఆకాశంలో ప్రసరించగా అర్జునుడు ఆ యుద్ధరంగంలోకి వచ్చాడు.

**క. చిచ్చునకుఁ దోడు గరువలి । వచ్చిన క్రియ భీముకడకు వాసవి యిమ్మై**
**వచ్చిన మన యోధావళి । ఱిచ్చవడియె; వారిమొన దఱిమికొని వచ్చెన్. 381**

**ప్రతిపదార్థం:** చిచ్చునకున్= మంటకు; తోడు= సహాయంగా; కరువలి= గాలి; వచ్చిన క్రియన్= వచ్చినట్లు; భీముకడకున్= భీముడివద్దకు; వాసవి= అర్జునుడు; ఇమ్ము+ఐ= అనుకూలంగా; వచ్చినన్= రాగా; మన= కౌరవుల; యోధావళి= వీరసమూహం; ఱిచ్చవడియెన్= క్రియాశూన్యమైనది; వారి= పాండవుల; మొన= సైన్యం; తఱిమికొని వచ్చెన్= తరుముకొంటూ వచ్చింది.

**తాత్పర్యం:** అగ్నికి తోడై వాయువు వచ్చినట్లు భీముడి వద్దకు అర్జునుడు తోడుగా రాగా మన కౌరవయోధులు నిశ్చేష్టులయ్యారు. పాండవసైన్యం తరుముకొని వచ్చింది.

**ఉ. బాసట యై వృకోదరుఁడు పార్శ్వమునం దఱుమంగ వైరి సం**
**త్రాసనమూర్తి వాసవి శరప్రతతిం దొరఁగించి ద్రోణు ను**
**ల్లాసము మాన్చి కౌరవ బలంబులు నెత్తురు వెల్లిఁ దేలఁగాఁ**
**జేసినఁ 'గర్ణ కర్ణ మముఁ జేకొనవే' యనుచున్ భయంబునన్.** **382**

**ప్రతిపదార్థం:** వృకోదరుఁడు= భీముడు; బాసట+ఐ= సహాయంగా; పార్శ్వమునన్= ప్రక్కనుండి; తఱుమంగన్= తరుమగా; వైరిసంత్రాసనమూర్తి= శత్రువులకు భయం గొలిపే; మూర్తి= ఆకారంగల; వాసవి= అర్జునుడు; శరప్రతతిన్= బాణ సమూహాన్ని; తొరఁగించి= వేసి; ద్రోణుని= ద్రోణుడియొక్క; ఉల్లాసము= సంతోషం; మాన్చి= తొలగించి; కౌరవ బలంబులు= కౌరవ సైన్యాలు; నెత్తురు= రక్తపు; వెల్లిన్= ప్రవాహంలో; తేలఁగాన్= తేలేటట్లు; చేసినన్= చేయగా; భయంబునన్= భయంతో; కర్ణ, కర్ణ= ఓ కర్ణా, ఓ కర్ణా; మమున్= మమ్ములను; చేకొనవే!= కాపాడవే!; అనుచున్= అంటూ.

**తాత్పర్యం:** భీముడు తోడై ప్రక్కనుండి తరుమగా శత్రుభయంకరుడైన అర్జునుడు బాణజాలాన్ని ప్రయోగించి ద్రోణుడి ఉల్లాసాన్ని మాన్చి, కౌరవసైన్యాలను రక్తప్రవాహంలో తేల్చగా; భయంతో వారు 'కర్ణా! ఓ కర్ణా! మమ్మ కాపాడవే' అంటూ. (తరువాతి పద్యంతో అన్వయం).

### కర్ణార్జునుల యుద్ధము (సం. 7-31-49, 50)

**క. తన వెనుక దెసకు పాఱిన । ఘన యోధులఁ జూచి బాహుగర్వస్ఫూర్తిన్**
**దనరుచు నోడకుఁ డోడకుఁ । డని పలుకుచుఁ దాఁకెఁ గర్ణుఁ డమరేంద్రసుతున్.** **383**

**ప్రతిపదార్థం:** తన= తన యొక్క; వెనుకకున్= చాటుకు; ఓడి పాఱిన= ఓడిపోయి పారివచ్చిన; ఘనయోధులన్= గొప్ప వీరులను; చూచి; బాహు= భుజాలయొక్క; గర్వ= అహంకారపు; స్ఫూర్తిన్= ప్రకాశంతో; తనరుచున్= ఒప్పుతూ; ఓడకుఁడు+ఓడకుఁడు= భయపడకండి, భయపడకండి; అని; పలుకుచున్= అంటూ; కర్ణుఁడు= కర్ణుడు; అమరేంద్రసుతున్= అర్జునుడిని; తాఁకెన్= ఎదిరించాడు.

**తాత్పర్యం:** తన వెనుకకు ఓడిపోయి పారివచ్చిన వీరశ్రేష్ఠులను చూచి, బాహుగర్వం ప్రకాశించగా, 'భయపడకండి! భయపడకండి!' అంటూ కర్ణుడు అర్జునుడిని ఎదిరించాడు.

**వ. ఇట్లు దాఁకి యతనిపై నాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన నతండు వారుణ బాణంబున వారించి వాలమ్ములు గురియం గూడుకొని భీమ సాత్యకి ధృష్టద్యుమ్నులు శరత్రయంబులు సూత సూను మేన నాటించిన, నతండు గాండీవ నిర్గత చండమార్గణంబుల మగిడించుచు నమ్మువ్వుర చాపంబులు నవ్వుచుం ద్రుంచి, వారలు శక్తులు వైవ వానిం దునిమి పేర్చియార్చిన నర్జునుండు నారాచసప్తకంబున నవ్వీరు నొప్పించి యతనిం దల కడచి తన్నుఁ దలపడిన యతని తమ్ముల తలలు మూఁడును భూమిదేవికి బలిసేసె నంత భీముండు రథంబు డిగ్గివచ్చి గదాదండంబునఁ గర్ణబంధువులం బదివేవురం బడలు వఱిచి మరల రథస్థుఁడై వేఱొక్కవిల్లు గొని**

**విశిఖంబులు వఱపి యంగపతి యంగంబులం దురంగ శరీరంబులను నొప్పించె నాలోనన యప్పాంచాల వరసుతుండును శైనేయుండును నొండు విండ్లు గొని యతని సారథి యొఱగను జాపంబు విఱుగను నేసి; రా సమయంబున దుర్యోధనుండును ద్రోణ జయద్రథులును నెయిది శాత్రవ సముద్రంబున మునుంగకుండ నారాధేయు నుద్ధరించి రట్టియెడ.** **384**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తాఁకి= ఎదుర్కొని; అతనిపైన్= అర్జునుడిపై; ఆగ్నేయ+అస్త్రంబు= అగ్నిదేవతాకమైన బాణాన్ని; ప్రయోగించినన్= వేయగా; అతండు= ఆ అర్జునుడు; వారుణ బాణంబునన్= వారుణాస్త్రంతో; వారించి= శాంతింపజేసి; వాలు+అమ్ములు= వాడి బాణాలు; కురియన్= కురియగా; కూడుకొని= అతడితో కలిసి; భీమ; సాత్యకి; ధృష్టద్యుమ్నులు; శరత్రయంబులు= మూడు మూడు బాణాలు; సూతసూను= కర్ణుడి; మేనన్= దేహంపై; నాటించినన్= గ్రుచ్చగా; అతండు= ఆ కర్ణుడు; గాండీవ= గాండీవ ధనుస్సు నుండి; నిర్గత= వెడలిన; చండ= భయంకరమైన; మార్గణంబులన్= బాణాలను; మగిడించుచున్= మరల్చుతూ; ఆ ముప్వుర= ఆ ముగ్గురియొక్క; చాపంబులు= విండ్లు; నవ్వుచున్= నవ్వుతూ; త్రుంచి= విరిచి; వారలు= భీమాదులు; శక్తులు= శక్త్యాయుధాలను; వైవన్= వేయగా; వానిన్= ఆ ఆయుధాలను; తునిమి= ఖండించి; పేర్చి= విజృంభించి; ఆర్చినన్= సింహనాదం చేయగా; అర్జునుండు; నారాచసప్తకంబునన్= ఏడు బాణాలతో; ఆ+వీరున్= ఆ కర్ణుడిని; నొప్పించి= బాధించి; అతనిన్= కర్ణుడిని; తలకడచి= అతిక్రమించి; తన్నున్= అర్జునుడిని; తలపడిన= ఎదుర్కొన్న; అతని= కర్ణుడి; తమ్ములు= సోదరుల; తలలు= శిరస్సులు; మూఁడును= మూడు; భూమిదేవికిన్= నేలతల్లికి; బలిచేసెన్= బలి ఇచ్చారు; అంతన్= అపుడు; భీముండు; రథంబు డిగ్గివచ్చి= రథాన్ని దిగివచ్చి; గదాదండంబునన్= గదతో; కర్ణ బంధువులను= కర్ణుడి చుట్టాలను; పదివేవురన్= పదివేలమందిని; బడలు+పఱిచి= అలియునట్లు చేసి; మరలి= తిరిగి; రథస్థుఁడు+ఐ= రథమెక్కి; వేఱు+ఒక్కవిల్లున్= ఇంకొక ధనుస్సు; కొని= తీసికొని; విశిఖంబులు= బాణాలు; పఱపి= ప్రసరింపజేసి; అంగపతి= కర్ణుడి; అంగంబులన్= అవయవాలను; తురంగ శరీరంబులను= గుర్రాల దేహాలను; నొప్పించెన్= బాధించాడు; ఆలోనన్+అ= ఆలోపుగా; ఆ+పాంచాల వరసుతుండును= ఆ పాంచాల రాజపుత్రుడైన ధృష్టద్యుమ్నుడును; శైనేయుండునున్= సాత్యకియు; ఒండు= వేరే; విండ్లు= ధనుస్సులు; కొని= తీసికొని; అతని= కర్ణుడి; సారథి= రథచోదకుడు; ఒఱగను= చనిపోవునట్లును; చాపంబు= ధనుస్సు; విఱుగనున్= విరుగునట్లు; ఏసిరి= కొట్టిరి; ఆ సమయంబునన్; దుర్యోధనుండును= దుర్యోధనుడు; ద్రోణ జయద్రథులునున్= ద్రోణుడు; జయద్రథుడును; ఎయిది= వెంటపడి; శాత్రవసముద్రంబునన్= శత్రువు లనే సముద్రంలో; మునుంగకుండన్= మునిగిపోకుండ; ఆ రాధేయున్= ఆ కర్ణుడిని; ఉద్ధరించిరి= పైకెత్తారు; అట్టి ఎడన్= అప్పుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడు ఎదుర్కొని అర్జునుడిపై ఆగ్నేయాస్త్రం ప్రయోగించగా అతడు వారుణాస్త్రంతో దానిని శాంతింపజేసి వాడి అయిన బాణాలను కురిపించగా, భీముడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు అతడితో కలిసి మూడేసి బాణాలు కర్ణుడి దేహంమీద నాటారు. అపుడు గాండీవం నుండి వెడలిన భయంకరమైన బాణాలను కర్ణుడు మరలింపజేస్తూ, ఆ ముగ్గురి ధనుస్సులను కూడ నవ్వుతూ విరిచివేశాడు. భీమాదులు ముగ్గురూ శక్త్యాయుధాలను ప్రయోగించగా వాటిని ఖండించి సింహనాదం చేయగా, అర్జునుడు ఏడు బాణాలతో ఆ వీరుడిని నొప్పించి, అతడిని అతిక్రమించి తనతో తలపడ్డ కర్ణుడి తమ్ముల శిరస్సులను మూడింటిని భూదేవికి బలిగావించాడు. అపుడు భీముడు రథం దిగివచ్చి గదతో కర్ణుడి చుట్టాలను పదివేలమందిని అలసిపోయేటట్లు చేసి, మరల రథంపైకి చేరుకొని వేరొక ధనుస్సును తీసికొని బాణాలు ప్రసరింపజేసి, కర్ణుడి అవయవాలను, గుర్రాల శరీరాలను నొప్పించాడు. ఆలోపుగా పాండవ సేనాని అయిన ధృష్టద్యుమ్నుడు, సాత్యకి వేరు వేరుగా ధనుస్సులు తీసికొని కర్ణుడి సారథిని కూల్చి, అతడి ధనుస్సును ఖండించారు. ఆ సమయంలో దుర్యోధనుడు, ద్రోణుడు, జయద్రథుడును వెంటబడి, శత్రుసముద్రంలో మునిగిపోకుండా ఆ కర్ణుడిని పైకెత్తారు. అప్పుడు.

**క. ఉభయ బలంబులుఁ బురికొని । యిభరథ తురగ భటతతి మహిం గూలఁగ న**
**క్షుభితములై పోరాడెం । బ్రభువులు వెనుదన్ని చూడఁ బార్థివముఖ్యా!** **385**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= ధృతరాష్ట్ర మహారాజా!; ఉభయ బలంబులున్= కౌరవ, పాండవ సైన్యాలు రెండును; పురికొని= క్రమ్మి; ఇభ= ఏనుగుల; రథ= రథాల; తురగ= గుర్రాల; భట= సైనికుల; తతి= సమూహం; మహిన్= నేలపై; కూలఁగన్= పడగా; అక్షుభితములు+ఐ= కలత పొందనివై; ప్రభువులు= రాజులు; వెనుదన్ని చూడన్= వెనుక నిల్చి చూడగా; పోరాడెన్= యుద్ధం చేశాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కౌరవ పాండవ సైన్యాలు రెండూ కూడా క్రమ్ముకొని, ఏనుగులు, రథాలు, గుర్రాలు, సైనికుల సమూహం నేలపై కూలగా కలత పొందనివై, రాజులు వెనుక నిలిచి చూస్తుండగా యుద్ధం చేశాయి.

**సీ.** **కాలువలై పాఱు కీలాల జలములఁ । దేలిపోయెడు మృతదేహములును,**
**బ్రేవుల ప్రోవుల పెల్లునఁ జిత్రత । చ్ఛాయంబులగు మాంస సంచయములుఁ,**
**గరి హయంబుల కళేబరముల క్రిందఁ గొం । డొక తోఁచు భట గాత్ర నికరములును**
**దలల పెందఱచులో మిలమిల మెదలెడు । కర పదంబుల నవఖండములును**

**తే.** **రౌద్ర బీభత్సనర్తన రంగభంగి । నపుడు సమరాంగణము ఘోరమయ్యెఁ జూడ**
**ద్రోణఫల్గున నిష్ఠురోద్ధురనిపాత । జాతమగు నమ్మహోద్భట సంకులమున.** 386

**ప్రతిపదార్థం:** కాలువలు+ఐ= కాలువలుగట్టి, పాఱు= ప్రవహించే; కీలాల జలములన్= రక్తమనే నీటిలో; తేలిపోయెడు= తేలిపోయే; మృతదేహములును= పీనుగులును; ప్రేవుల= ప్రేగుల; ప్రోవుల= కుప్పల; పెల్లునన్= ఆధిక్యం వలన; చిత్రత+ఛాయంబులు+అగు= చిత్రించబడిన రంగులుగా తోచు; మాంససంచయములున్= మాంసపు కుప్పలును; కరి= ఏనుగుల; హయంబుల= గుర్రాల; కళేబరముల= దేహాల; క్రిందన్= క్రింద; కొండొక= చిన్నగా; తోఁచు= కనిపించే; భట= సైనికుల; గాత్ర= శరీరాల; నికరములును= గుంపులును; తలల= శిరస్సుల; పెందఱచులో= పెద్దకుప్పలో; మిలమిల మెదలెడు= మిలమిల మెదలే; కరపదంబుల= చేతుల, కాళ్ళ; నవఖండములును= క్రొత్త ముక్కలును; ద్రోణ= ద్రోణాచార్యుడి; ఫల్గున= అర్జునుడి; నిష్ఠుర= కఠినమైన; ఉద్ధుర= దట్టమై; నిపాత= పడటంవలన; జాతము+అగు= కలిగిన; ఆ మహా+ఉద్భట= ఆ మిక్కిలి అధికమైన; సంకులమునన్= దొమ్మియుద్ధంలో; రౌద్ర= రౌద్రరసం; బీభత్స= బీభత్సరసం; నర్తన= నాట్యం చేసే; రంగ= రంగం; భంగిన్= వలె; అపుడు= ఆ సమయంలో; సమర+అంగణము= యుద్ధభూమి; చూడన్= చూడటానికి; ఘోరము+అయ్యెన్= భయంకరమైనది అయింది.

**తాత్పర్యం:** కాలువలైన రక్తపు జలాలలో తేలియాడే పీనుగులు, ప్రేవుల కుప్పల ఆధిక్యంచేత చిత్రించబడిన రంగులను పోలు మాంసపు దిబ్బలు, ఏనుగుల, అశ్వాల మృతదేహాల క్రింద చిన్నవిగాతోచే భటుల దేహ సమూహాలు, తలల రాసులలో మిలమిల మెదలే కాలుసేతుల క్రొత్త ముక్కలు, ద్రోణుడు, అర్జునుడు ఆ సంకులసమరంలో అతికఠినంగా విజృంభించటంవలన యుద్ధరంగం, రౌద్ర, బీభత్సరసాల నాట్యరంగంవలె చూపునకు ఘోరమై తోచింది.

**వ.** **అంత పతంగుండు పశ్చిమాచలంబునవులకుం జనిన సంధ్యారాగంబు సొంపునఁ గెం పినుమడించు నెత్తురు మడువుల నోలలాడు భూతబేతాళంబులను, శవకబళన లోలంబులగు సృగాలంబులను, మాంసచర్వణ కోలాహల బహుళంబులగు కంకగృధ్రాది పక్షి కులంబులనుం జూచియుఁ బాండవబలంబు సమయ సముచితంబగు సమర విరామంబునకు నున్ముఖం బగుట యెఱింగియు మున్న సవ్యసాచి యురవడికింగాక తమ మొన దెరలుచునికిం జేసియు నదియ మెయిగా నాచార్యుండు దొరలకుం జెప్పి సేనలఁ దివియ నియోగించెఁ; బాండవ సైన్యంబులును మరలె; నివ్విధంబున నుభయ సైన్యంబులు నిజస్కంధావారంబులకుం జను నవసరంబున మన జనంబులు ద్రోణు ప్రతిజ్ఞాభంగంబును ఫల్గును పరాక్రమ స్ఫురణంబును నతని యెడ నచ్యుతునకుం గల సౌహార్ద విశేషంబును నుగ్గడించుచు విన్ననై పోయిరి. వేగుటయుఁ గయ్యంబునకు వెడలునప్పుడు విషాద వివర్ణవదనుం డగుచు నీ తనయుఁ డెల్ల యోధులు వినం గుంభసంభవున కి ట్లనియె.** 387

**ప్రతిపదార్థం:** అంతన్= అంతలో; పతంగుండు= సూర్యుడు; పశ్చిమ+అచలంబు= పశ్చిమగిరి, అస్తగిరి; అవులకున్= వెనుకకు; చనినన్= పోగా; సంధ్యా= సంధ్యాకాలమందలి; రాగంబు= ఎఱ్ఱదనం యొక్క; సొంపునన్= శోభకు; కెంపు= ఎఱ్ఱదనం; ఇనుమడించు= రెట్టింపగు; నెత్తురు మడువులన్= రక్తపు గుంటలలో; ఓలలాడు= తేలియాడే; భూతబేతాళంబులను= భూత బేతాళములను; శవకబళనలోలంబులు+అగు= పీనుగులను తినటంలో తగుల్కొన్న; సృగాలంబులను= నక్కలను; మాంస= మాంసాన్ని; చర్వణ= తినటంలో; కోలాహల బహుళంబులు+అగు= మిక్కిలి కలకలం చేసే; కంక= రాపులుగులు; గృధ్ర= గద్దలు; ఆది= మున్నగు; పక్షికులంబులనున్= పక్షిసమూహాలను; చూచియున్= చూచియు; పాండవ బలంబు= పాండవసేన; సమయ సముచితంబు+అగు= కాలానికి తగిన; సమరవిరామంబునకున్= యుద్ధాన్ని ఆపటానికి; ఉన్ముఖంబు+అగుట= సిద్ధం కావటం; ఎఱింగియున్= తెలిసియు; మున్ను= పూర్వం; సవ్యసాచి= అర్జునుడి; ఉరవడికిన్= తీవ్రతకు; కాక; తమ మొన= తమ సైన్యం; తెరలుచున్+ఉనికిన్+చేసియున్= పారిపోతుండటం వలన; అదియ= అదే; మెయిగాన్= సమ్మతంగా, ఆచార్యుండు+అ= ద్రోణాచార్యుడే; దొరలకున్= నాయకులకు; చెప్పి; సేనలన్= సైన్యాలను; తివియన్= మరల్చటానికి; నియోగించెన్= ఆజ్ఞాపించాడు; పాండవసైన్యంబులును= పాండవసేనలును; మరలెన్= వెనుదిరిగాయి; ఈ+విధంబునన్= ఇట్లా; ఉభయ సైన్యంబులు= కౌరవ పాండవ సేనలు రెండును; నిజస్కంధావారంబులకున్= తమ శిబిరాలకు; చను+అవసరంబునన్= వెళ్ళునప్పుడు; మన జనంబులు= కౌరవులవైపువారు; ద్రోణు= ద్రోణుడి; ప్రతిజ్ఞా భంగంబును= ప్రతిజ్ఞ వమ్ముకావటం; ఫల్గును= అర్జునుడి; పరాక్రమ స్ఫురణంబునున్= శౌర్యంయొక్క ప్రకాశం; అతని ఎడన్= అర్జునుడిపై; అచ్యుతునకున్+కల= శ్రీకృష్ణుడికి గల; సౌహార్ద విశేషంబునున్= ప్రత్యేకమైన స్నేహాన్ని; ఉగ్గడించుచున్= ప్రశంసిస్తూ; విన్ననై పోయిరి= వివర్ణులై పోయారు; వేగుటయున్= తెల్లవారగా; కయ్యంబునకున్= యుద్ధానికి; వెడలునప్పుడు= బయలుదేరేటప్పుడు; విషాద= దుఃఖం వలన; వివర్ణవదనుండు+అగుచున్ = పాలిపోయిన మొగం కలవాడౌతూ; నీ తనయుండు= దుర్యోధనుడు; ఎల్లయోధులు= వీరులందరు; వినన్= వినేటట్లు; కుంభసంభవునకున్= ద్రోణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అంతలో సూర్యుడు అస్తమించగా, సంధ్యారాగపు శోభకు ఎఱ్ఱదనం పెరిగే రక్తపు మడుగులలో తేలియాడే భూతబేతాళాలను, పీనుగులను మెక్కటంలో ఆసక్తిగల నక్కలను, మాంసం నమలటంలో సందడిగా ఉన్న రాపులుగులు, గ్రద్దలు మొదలైన పక్షిసమూహాలను చూచియు, పాండవసేన సమయోచితమైన యుద్ధ విరామానికి సిద్ధం కావటం తెలిసియు, మొదట అర్జునుడి తీవ్రతకు కాక, తమ సైన్యం పారిపోతూ ఉండటం వలన, అదియే సమ్మతమని ద్రోణుడే సేనానులకు చెప్పి సేనలను మరల్చటానికి ఆజ్ఞాపించాడు. పాండవ సైన్యాలు కూడా వెనుకకు మరలాయి. ఇట్లా రెండు సేనలు కూడా తమ శిబిరాలకు చేరే సమయంలో మన కౌరవ వర్గంవారు ద్రోణుడి ప్రతిజ్ఞ వమ్మకావటం, అర్జునుడి శౌర్యం ప్రకాశించటం, అతడిపై శ్రీకృష్ణుడికి గల విశేషమైన ప్రేమను ప్రశంసిస్తూ వివర్ణులైపోయారు. మరునాడు ప్రాతఃకాలంలో యుద్ధానికి వెళ్ళేటప్పుడు ఖేదంతో వెల్లనైన మోముగల నీ కుమారుడు దుర్యోధనుడు వీరులంతా వినగా ద్రోణాచార్యుడితో ఇట్లా అన్నాడు.

**మ. 'పెనుపారన్ వర మిచ్చి తట్లు గడిమిన్ భీమాగ్రజుం డాజిఁ గి**
**ట్టినఁ బట్టం గడు నగ్గ మైన యెడఁ గ్రేడిం తెప్డు ని ట్లైనఁ జా**
**లని వాఁడందురు నిన్నుఁ; నన్నుఁ గుటిలాలాపంబులన్ వెట్టిఁ జే**
**సిన నీ కైనది యేమి? యాశ్రితగుణశ్రేష్ఠుండు వంచించునే?' 388**

**ప్రతిపదార్థం:** పెనుపు+ఆరన్= ఔన్నత్యం మీరగా; అట్లు= ఆ విధంగా; వరము= వరం; ఇచ్చితి(వి)= ఇచ్చావు; భీమ+అగ్రజుండు= భీముడి అన్న అయిన ధర్మరాజు; ఆజిన్= యుద్ధంలో; కిట్టినన్= సమీపించగా, పట్టన్= బంధించటానికి; కడున్= మిక్కిలి; అగ్గమైన= అనుకూలించిన; ఎడన్= సందర్భంలో; ఎప్డున్= ఎప్పటికి; క్రేడింతు(వు)= ఉపేక్షిస్తావు; ఇట్లు+ఐనన్= ఈ విధంగా జరిగితే; నిన్నున్; చాలనివాఁడు= చేతగానివాడు; అందురు= అంటారు; నన్నున్= నన్ను; కుటిల+ఆలాపంబులన్= కపటపు మాటలతో; వెట్టిన్= అవివేకిని; చేసినన్= చేస్తే; నీకున్+ఐనది+ఏమి?= ఏమిలాభం?; ఆశ్రితగుణశ్రేష్ఠుండు= తన్ను ఆశ్రయించిన సుగుణములచే శ్రేష్ఠుడైనవాడు; వంచించునే?= మోసగిస్తాడా?

**తాత్పర్యం:** 'గొప్పతనం ప్రకటమయ్యేటట్లు ధర్మజుడిని బంధించి అప్పగిస్తానని మొదట వరమిచ్చావు. ధర్మజుడు యుద్ధంలో సమీపించగా, మిక్కిలి అనుకూలించినప్పుడేమో బంధించక ఉపేక్షిస్తావు. ఇట్లా అయితే నిన్ను అందరు అసమర్థు డంటారు. కపటపు మాటలతో నన్ను అవివేకుడిని చేస్తే నీ కేమి లాభం? ఆశ్రయించినవారిని ఉత్తము డెక్కడైనా మోసం చేస్తాడా?'

**వ. అనిన విని గురుం డప్రీతుం డయ్యును గటకటం బడక యతనితో నిట్లనియె. 389**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; గురుండు= ద్రోణాచార్యుడు; అప్రీతుండు+అయ్యును= సంతోషించని వాడయికూడ; కటకటంబడక= బాధపడక; అతనితోన్= దుర్యోధనుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని ద్రోణాచార్యుడు సంతోషించనివాడై కూడ, బాధపడక దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**ఆ. 'నరుని విక్రమంబు నారాయణుని మహ ।త్త్వంబు నెఱిఁగి యెఱిఁగి తగునె యిట్లు**
**వలుక? ధర్మపుత్త్రుపైఁ జేయి వదలక । వారు రారె పెక్కు వరుస లధిప! 390**

**ప్రతిపదార్థం:** అధిప!= దుర్యోధన మహారాజా!; నరుని విక్రమంబు= అర్జునుడి పరాక్రమం; నారాయణుని= శ్రీకృష్ణుడి; మహత్త్వంబున్= గొప్పతనం; ఎఱిఁగి, ఎఱిఁగి= బాగా తెలిసి కూడా; ఇట్లు= ఈ విధంగా; పలుకన్+తగునె?= పలుక వచ్చా?; ధర్మపుత్రుపైన్= ధర్మరాజుపై; చేయి వదలక= చేయి తీయకుండా; వారు= కృష్ణార్జునులు; పెక్కువరుసలు= పలుసార్లు; రారె?= రాలేదా?

**తాత్పర్యం:** దుర్యోధన మహారాజా! అర్జునుడి పరాక్రమం శ్రీకృష్ణుడి మహత్త్వం తెలిసి కూడా నీ విట్లా పలుకవచ్చా? కృష్ణార్జునులు ధర్మజుడిపై చేయితీయకుండా పలుసార్లు రాలేదా!

**ఉ. ఎవ్వరి నెట్లు సేసెదనొ యేర్పడఁ జూడుము; నేఁడు పోరికిం**
**గవ్వడి రాక యుండఁ దొలఁగంగొని పోవఁగఁ జాలువారి నీ**
**వెవ్వరి నైనఁ బంపు; మిదిఁ యేటికి? నొండొక బుద్ధి సేసెదే?**
**నవ్వుచుఁ బల్కినన్ ధరణినాథ! యసత్యము గల్గ నేర్చునే?' 391**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!= దుర్యోధన మహారాజా!; ఎవ్వరిని= ఏ వీరుడిని; ఎట్లు+చేసెదనొ= ఏం చేస్తానో; ఏర్పడన్+చూడుము= తేటపడచూడుము; నేఁడు= ఇవ్వేళ; పోరికిన్= యుద్ధానికి; కవ్వడి= అర్జునుడు, రాక ఉండన్= రాకుండ; తొలఁగన్= తొలగేటట్లు; కొనిపోవఁగన్= తీసికొని పోవటానికి; చాలువారిన్= తగినవారిని; ఈవు= నీవు; ఎవ్వరినైనన్= ఎవరినైనా; పంపుము= పంపించుము; ఇది+ఏటికిన్?= ఇదంతా ఎందుకు?; ఒండొక బుద్ధి+చేసెదు?= వేరే విధంగా ఆలోచిస్తావు?; ఏ= నేను; నవ్వుచున్= నవ్వుతూ; పల్కినన్= మాట్లాడినా; అసత్యము= అసత్యం; కల్గనేర్చునే?= కలుగగలదా?

**తాత్పర్యం:** దుర్యోధన మహారాజా! ఎవరిని ఏం చేస్తానో బాగా చూడుము. నేడు యుద్ధానికి అర్జునుడు రాకుండా దూరం తొలగ దీసికొనిపోయే సమర్థుడిని ఎవ్వరినైనా పంపించుము. ఇదంతా ఎందుకు? వేరే విధంగా ఎందు కాలోచిస్తావు? నేను నవ్వుతూ మాట్లాడినా అందులో అసత్యం ఉంటుందా?'

**వ. అనవుడు. 392**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు అట్లనగానే. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. విని సంశప్తకు 'లేము దక్క నొరు లా విన్వచ్చు భంగించి బె**
**ట్టనికిం బాపి యలంపనేర్పుగలరే!' యంచున్ వెసం బోయి పి**
**ల్చిన నప్పార్థుఁడు నుద్ధతిం జనుడు నక్షీణోగ్రశస్త్రాస్త్ర వ**
**ర్తన ఘోరంబగు సంగరం బచట రౌద్రస్ఫూర్తిమై జెల్లఁగన్. 393**

**ప్రతిపదార్థం:** విని; సంశప్తకులు= శపథం పూనిన సుశర్మాదులు; ఏము= మేము; తక్కన్= తప్ప; ఒరులు= ఇతరులు; ఆ విన్వచ్చున్= ఆ అర్జునుడిని; భంగించి= భంగపరిచి; బెట్టు= తీవ్రమైన; అనికిన్= యుద్ధానికి; పాపి= తొలగేటట్టు; అలంపన్= శ్రమపెట్టే; నేర్పు= నైపుణ్యం; కలరే?= కలవారున్నారా?; అంచున్= అంటూ; వెసన్= వెంటనే; పోయి పిల్చినన్= వెళ్ళి ఆహ్వానించగా; ఆ+పార్థుఁడు= ఆ అర్జునుడు; ఉద్ధతిన్= గర్వంతో; చనుడున్= పోగా; అక్షీణ= నశించని; ఉగ్ర= భయంకరమైన; శస్త్ర+అస్త్ర= ఖడ్గాదుల, ఆగ్నేయాస్త్రాదుల; వర్తన= ప్రసారంతో; ఘోరంబు+అగు= భయంకరమైన; సంగరంబు= యుద్ధం; అచటన్= ఆ స్థలంలో; రౌద్రస్ఫూర్తిమైన్= క్రోధం ప్రకాశించేటట్లు; చెల్లఁగన్= ప్రవర్తించగా.

**తాత్పర్యం:** ఇది విని సంశప్తకులు, 'మేము తప్ప ఇతరు లెవరైనా ఆ అర్జునుడిని భంగపరిచి, యుద్ధానికి తొలగేటట్లు చేసి శ్రమపెట్టే నేర్పు కలవారున్నారా?' అంటూ వెంటనే పోయి పిలువగా, అర్జునుడు గర్వంతో వెళ్ళగా; తరిగిపోని భయం గొలిపే శస్త్రాస్త్ర ప్రసారం వలన ఘోరమైన యుద్ధం రౌద్రం స్ఫురించేటట్లు ప్రవర్తిల్లింది.

**వ. ఇక్కడ భారద్వాజుండు పద్మవ్యూహంబు గావించినం గౌంతేయాగ్రజు ననుమతి నభిమన్యుం డయ్యొడ్డు భేదించి సొచ్చి, బృహద్బల లక్ష్మణ ప్రభృతులగు భూపతులను భూపకుమారులను బెక్కండ్రం బారిసమరి యనేక యోధ వీర విక్రమ సంకులంబునం జిక్కువడి యుక్కుమురిసినట్లు సమసిన మన మొనలు సెలంగుచుం బాండవ బలంబులు పొగులుచుం దమ తమ యునికిపట్లకుం జనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకు సౌభద్రుండు వడుట సెప్పె ననిన విని నాఁటి కయ్యంబు కలరూపంతయు నేర్పడ నెఱింగింపు మనుటయు. 394**

**ప్రతిపదార్థం:** ఇక్కడన్= కౌరవ పాండవులు యుద్ధం చేసే చోట; భారద్వాజుండు= ద్రోణుడు; పద్మవ్యూహంబు= పద్మం రూపంలో తీర్చిన మొగ్గరం; కావించినన్= పన్నగా; కౌంతేయ+అగ్రజుని= ధర్మజుడి; అనుమతిన్= ఆజ్ఞతో; అభిమన్యుండు; ఆ+ఒడ్డు= ఆ వ్యూహం; భేదించి= చీల్చి; బృహద్బల= బృహద్బలుడు; లక్ష్మణ= లక్ష్మణుడు; ప్రభృతులు+అగు= మొదలైన; భూపతులను= రాజులను; భూపకుమారులను= రాకుమారులను; పెక్కండ్రన్= చాలా మందిని; బారిసమరి= హింసించి; అనేక= పెక్కురు; యోధ= యుద్ధం చేసే; వీర= శూరుల; విక్రమ= పరాక్రమపు; సంకులంబునన్= దొమ్మిలో; చిక్కువడి= బాధపడి;ఉక్కుమురిసినట్లు= శౌర్యం ప్రకాశించేటట్లు; సమసిన= మరణించగా; మన మొనలు= మన సైన్యాలు, కౌరవసైన్యాలు; చెలంగుచున్= విజృంభిస్తూ; పాండవ బలంబులు= పాండవసేనలు; పొగులుచున్= బాధపడుతూ; తమ తమ= వారి వారి; ఉనికిపట్లకున్= స్థావరాలకు; చనియెన్= పోయాయి; అని; సంజయుండు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రుడికి; సౌభద్రుండు= సుభద్రా పుత్రుడైన అభిమన్యుడు; పడుట= కూలటం; చెప్పెన్+అనిన= చెప్పాడనగా; విని; నాఁటి కయ్యంబు= ఆనాటి యుద్ధం; కలరూపు= జరిగింది; అంతయున్= అంతా; ఏర్పడన్+ఎఱింగింపుము= వివరంగా తెలియజేయుము; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** కౌరవ పక్షాన ద్రోణుడు పద్మవ్యూహం పన్నగా ధర్మరాజు ఆజ్ఞానుసారం అభిమన్యుడు ఆ వ్యూహాన్ని భేదించి బృహద్బలుడు, లక్ష్మణుడు మున్నగు రాజులను, రాజకుమారులను అనేకులను హింసించి, అనేక వీరులను సంకుల సమరంలో చిక్కుపడి పరాక్రమం ప్రకాశించేటట్లు కూలిపోగా, మన సైన్యాలు మురుస్తూ, పాండవ సేనలు విషాదపడుతూ తమ తమ శిబిరాలకు పోయాయి. సంజయుడు ధృతరాష్ట్రుడికి అభిమన్యుడు మరణించటాన్ని చెప్పాడనగా విని, నాటి యుద్ధ వివరాలను చక్కగా చెప్పుమనగా. (ద్వితీయాశ్వాసంలోని వచనంతో అన్వయం).

**ఉ. సాత్త్వవతేయ వాఙ్మయవిశాల గృహస్ఫురిత ప్రదీపితా!**
**ప్రత్త్యయ గోచరా! విహృతి భగ్న నిశాచర! శాంత బోధసం**
**పత్త్వవినాభవన్మహిమ భాసుర! సంభృత భూసురాళి సాం**
**గత్త్వ! వివిక్త యుక్త జనకౌశల భావిత! దేవసేవితా! 395**

**ప్రతిపదార్థం:** సాత్త్యవతేయ= సత్యవతికి పుత్రుడైన వ్యాసమహర్షియొక్క; వాఙ్మయ= ఉత్తర మీమాంస, పురాణేతిహాసాలు మున్నగు వాఙ్మయ మనే; విశాల= విపులమైన; గృహ= ఇంటియందు; స్ఫురిత= వెలిగే; ప్రదీపితా!= ఉత్తమమైన దీపంవంటివాడా!; ప్రత్త్యయ గోచరా!= జ్ఞానం చేత తెలిసేవాడా!; విహృతి భగ్న నిశాచర!= విహారమాత్రం చేతనే- లీలద్వారానే నశింపజేయబడిన రక్కసులు గలవాడా!; శాంత= శాంతమును; బోధ= జ్ఞానరూపమును అగు; సంపత్తి+అవినా భవత్= సంపదను ఎడబాయనట్టి; మహిమ= గొప్పదనంతో; భాసుర!= ప్రకాశించేవాడా!; సంభృత భూసురాళి సాంగత్త్య!= బ్రాహ్మణసంఘం యొక్క సాంగత్యం కలవాడా!; వివిక్త యుక్త= ఏకాంతప్రదేశంలో యోగనిష్ఠులై ఉన్న; జనకౌశల= జనుల జ్ఞానంచేత; భావిత= భావించబడేవాడా!; దేవసేవితా!= ఇంద్రాది దేవతలచేత కొలువబడేవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వ్యాసమహర్షిచేత రచించబడిన బ్రహ్మమీమాంసయందు, పురాణేతిహాసాది వాఙ్మయంలోను నీవే ప్రకాశిస్తున్నావు. కేవల జ్ఞానంతోనే తెలియవస్తున్నావు. ధర్మధ్వంసకులైన రాక్షసులను భగ్నం చేయటం నీకు విలాసం మాత్రమే. శాంతి, జ్ఞానాలు అనే నీ నిజస్వరూపంతో వెలుగువాడవు. నీవు జ్ఞానాత్ములు, ధర్మాత్ములు అయిన బ్రాహ్మణులతో ఉంటావు. ఏకాంతంలో సమాధియందుండే యోగులే నిన్ను భావించగలరు. నీవు ఇంద్రాది దేవతలచేత సేవించబడేవాడవు.

**విశేషం:** "పద్యమునఁ దృతీయ పాదమునందలి 'సంపత్తి+అవినాభవత్ - సంపత్త్యావినాభవత్ అను పదమున సంపత్తి శబ్దము తకారద్వయయుక్త మగుటచేఁ బ్రాసమునందు తకారద్వయ యకారములు ప్రాసవర్ణముగా నున్నట్లు స్పష్టము. దానినిబట్టి తక్కిన పాదములయందలి ప్రాసవర్ణములు గూడా తకార ద్వయ యకారములతో నుండవలయును, కాని 'సాత్యవతేయ, ప్రత్యయ, సాంగత్య శబ్దములు సహజముగ ఏక తకార యకారయుతములే గాని తకారద్వయ యుక్తములు గావు. అట్లయినచోఁ బ్రాసము ఉపపన్నమగునా అను సందేహము గలుగవచ్చును. కాని ఆ శబ్దములయందలి తకారమునకు "అనచిచ" (8-4-47- పాణిని) సూత్రముచే ద్విత్వము రాఁగా, తకార ద్వయము గలుగును గావునఁ బ్రాసదోషము సంభవింపనేరదు." - తిక్కయజ్వ హరి హరనాథ తత్త్వము - శ్రీ ఓరుగంటి నీలకంఠ శాస్త్రిగారు.

**క. వేదశిరోమణి చరణా! । నా దాంత స్ఫారకరణ నైష్ఠికతరణా!**
**భేద రహిత ప్రకారా! । వాద విదూరా! విరించివర్య విహారా! 396**

**ప్రతిపదార్థం:** వేద శిరోమణి చరణా!= వేదాలకు శిరస్సులైన ఉపనిషత్తులకు అలంకారాలైన పాదాలుగలవాడా!; నాదాంత+స్ఫారకరణ!= నాదానికి (విశ్వాన్ని సృజించే) అంతఃశక్తిని కలిగించే వాడా; నైష్ఠికతరణా!= వ్రతనిష్ఠయందుండే వారిని తరింపజేసేవాడా!; భేదరహిత ప్రకారా!= భేదంలేని సాదృశ్యము కలవాడా!; వాదవిదూరా!= వివాదాలకు అందనివాడా!; విరించివర్య విహారా!= సృష్ట్యాదులను కావించే బ్రహ్మాదులగు ఉత్తమ దేవతలందు వెలసిన విహారం కలవాడా!

**తాత్పర్యం:** ఉపనిషత్తులు ప్రధానంగా నిన్నే తెలుపుతున్నవి. నాదానికి జగత్తును సృజించేశక్తి నీ వల్లనే కలుగుతున్నది. వ్రతనిష్ఠులను నీవే తరింపజేస్తున్నావు. నీవంటిది మరొకటి లేకపోవడం వల్ల నీకు నీవే సాటి. వాక్కు మున్నగు ఇంద్రియాలకు అందనివాడవు. నీ క్రీడా రూపమైన విశ్వాన్ని సృజించటం వంటివి మూర్తిత్రయంలో వెలయుచున్నవి.

**మాలిని:**

**అనుపమ హితవిద్యావ్యక్త! యోగానురక్తా!**
**దనుజ మథనలీలా! స్తవ్యశాంతానుభావ్యా!**
**జననమరణ దుఃఖోత్సారి! సర్వోపకారీ!**
**సనకముఖయతీంద్రాసన్న! నిత్యప్రసన్నా!** **397**

**ప్రతిపదార్థం:** అనుపమ= సాటిలేనంత; హిత= హితాన్ని కలుగజేసే; విద్యా= వేదవిద్యచేత; వ్యక్త!= స్పష్టమయ్యేవాడా!; యోగ+అనురక్తా!= యోగవిద్యయందు అనురాగం కలవాడా!; దనుజ= రాక్షసులను; మథన= సంహరించటమే; లీలా!= విలాసంగాకలవాడా!; స్తవ్య= స్తుతించదగిన; శాంత= శాంతరసం చేతనే; అనుభవ్యా!= అనుభవించదగినవాడా!; జనన= పుట్టుక; మరణ= చావుల రూపమైన; దుఃఖ= సంసార దుఃఖాన్ని; ఉత్సారి!= పోగొట్టువాడా!; సర్వ= స్వపరభేదం లేక విశ్వానికంతకు; ఉపకారీ!= ఉపకారం చేసేవాడా!; సనక ముఖయతీంద్ర= సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతాది జ్ఞానులకు; ఆసన్న!= దగ్గరివాడా!; నిత్యప్రసన్నా!= ఎల్లప్పుడు అనుగ్రహం కలవాడా!

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! హితాన్ని బోధించే వేదాలందే నీవు వ్యక్తమౌతుంటావు. కర్మజ్ఞానయోగాలు రెండు కూడ నీకు ప్రియమైనవి. రాక్షససంహారం నీకు విలాసమాత్రం. శాంతాత్ములే నిన్ను అనుభవిస్తారు. మోక్షమొసగి భక్తుల జనన మరణ దుఃఖాలను పోగొట్టి లోకోపకారం చేస్తుంటావు. సనకాది జ్ఞానులకు ఎల్లప్పుడు సన్నిహితుడవై నిత్య ప్రసన్నుడవు అవుతావు.

**గద్యము:**

**ఇది శ్రీమ దుభయకవి మిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ గ్రంథభాగం; శ్రీమత్= మంగళకరుడైన; ఉభయ కవిమిత్త్ర= సంస్కృతాంధ్ర కవులకు స్నేహితుడైన (సూర్యుడైన)వాడూ; కొమ్మన+అమాత్యపుత్త్ర= కొమ్మనామాత్యుడి కుమారుడూ; బుధ+ఆరాధన విరాజి= పండితులు చేసే పూజల చేత ప్రకాశించేవాడు; పండితులను పూజించటంచేత ప్రకాశించేవాడూ; తిక్కన సోమయాజి= సోమయాజి అయిన తిక్కనచేత; ప్రణీతంబు+అయిన= రచించబడిన; శ్రీ మహాభారతంబునన్= మంగళకరమైన మహాభారతంలో; ద్రోణపర్వంబునన్= ద్రోణపర్వంలో; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఇంతవరకు ఉభయకవిమిత్రుడు, కొమ్మనామాత్యపుత్రుడు, పండితులను పూజించుటచేత ప్రశస్తిపొందినవాడు (పండితుల చేత గౌరవింపబడుటచేత ప్రకాశించేవాడూ) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలోని ద్రోణపర్వంలో ప్రథమాశ్వాసం.

**ద్రోణపర్వంలో ప్రథమాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము - ద్వితీయాశ్వాసము

**క. శ్రీకర! భక్తాంభోధిసు । ధాకర! చక్ర త్రిశూల ధారణ రక్షో**
**భీకర! నిర్భరతర కరు । ణాకర దృగ్దీప్తి నికర! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీకర!= మోక్షమును సంపదను కలిగించేవాడా!; భక్త+అంభోధి= భక్తులు అనే సముద్రానికి; సుధాకర!= చంద్రుడా!; చక్ర= సుదర్శనం అనే చక్రాన్ని; త్రిశూల= మూడు మొనలు ఉండే ఆయుధాన్ని; ధారణ= ధరించటంచేత; రక్షః= రాక్షసులకు; భీకర!= భయాన్ని కలిగించేవాడా!; నిర్భరతర+కరుణా+ఆకర+దృక్+దీప్తి+నికర!= మిక్కిలి ఎక్కువైన దయకు నెలవైన కన్నులయొక్క, కాంతుల మొత్తం కలవాడా!; హరిహరనాథా!= హరియొక్క, హరుడియొక్క, స్వరూపం కల ప్రభువా!

**తాత్పర్యం:** అద్వైతమూర్తి వైన ఓ హరిహరనాథా! నీవు సంపత్కరుడవు. మోక్ష ప్రదుడవు. భక్తులు అనే సముద్రానికి పుట్టిన చంద్రుడవు. సుదర్శనం అనే చక్రాన్ని, త్రిశూలం అనే ఆయుధాన్ని ధరించి రాక్షసులకు భయం కలిగించే వాడవు. మిక్కిలి అతిశయించిన దయకు నెలవైన కన్నుల కాంతుల సమూహం కలవాడవు.

**విశేషం:** హరిగా మోక్షాన్ని, హరుడుగా ఐశ్వర్యాన్ని ఇచ్చేవాడా! "ఐశ్వర్య మీశ్వరా దిచ్ఛే న్మోక్షమిచ్ఛే జ్జనార్దనాత్" అని స్మృతి. విష్ణు శివ భక్తులనే సముద్రానికి హరిహరనాథుడు చంద్రుడైనవాడు. అంటే చంద్రుడు సముద్రాన్ని ఉప్పొంగచేసే విధంగా హరిహరనాథుడు భక్తులనే సముద్రాన్ని ఉప్పొంగ చేస్తాడని భావం. అలంకారం రూపకం. శ్రీకర, సుధాకర, భీకర, నికర - లఘు పూర్వక రేఫం అన్ని సమాసాల చివర ఉంది. కాబట్టి అంత్యప్రాసమనే శబ్దాలంకారం. 'చక్రత్రిశూల.... హరిహర' - చక్రం హరిదీ, త్రిశూలం హరుడిదీ అని క్రమంగా అన్వయించుకోవాలి కాబట్టి యథాసంఖ్యాలంకారం.

అమృతమయుడూ ఆనందప్రదుడూ అనే భావాన్ని 'సుధాకర' శబ్దంలో తిక్కన ధ్వనింపజేశాడు.

భక్తుల విషయంలో ఎంత చల్లగా ఆనందామృతాన్ని వర్షిస్తాడో, శత్రువుల విషయంలో అంత భీకరంగా వాళ్ళను తుదముట్టించటానికి చక్రం, త్రిశూలం వంటి ఆయుధాలను హరిహరనాథుడు ధరించాడని తిక్కన యుద్ధఘట్టం ప్రాముఖ్యాన్ని 'చక్ర... భీకర' అనే సంబోధనలో సూచించాడు.

అనివార్యం అయినప్పుడే దుష్టులను శిక్షించటానికి ఆయుధాలు ప్రయోగిస్తాడు కాని స్వతస్సిద్ధంగా భగవంతుడు కరుణామయుడు. ఆయన ఎల్లప్పుడూ దయ కలిగిన చూపుల కాంతులను ప్రసరిస్తూనే ఉంటాడు. అది ఆయన విధి. దయానిధి అయిన హరిహరనాథుడి తత్త్వం చివరి సంబోధనలో ఎంతో చక్కగా నిరూపించబడింది.

'కరుణాకర' అనే ప్రయోగాన్ని కేవలం భగవంతుడి దయాదృష్టి పరంగానే కాకుండా, ప్రకృత కథలోని అభిమన్యుడి వధకు అన్వయిస్తే ఇది కరుణరస స్వరూపం కూడా అవుతుంది. అపుడు ద్వితీయాశ్వాసంలోని ప్రధాన వృత్తాంతం 'నిర్భరతర కరుణాకరం' . అభిమన్యుని మరణానికి ధర్మరాజాదుల కళ్ళు, పాఠకుల కళ్ళూ, కన్నీళ్ళ కడకళ్ళు అయ్యాయి.

ఈ ఆశ్వాసంలో హరిహరుల ప్రసక్తికూడా అప్రయత్నంగా కథా సందర్భంలో చోటు చేసుకొన్నది. అర్జునుడు కైలాసానికి పోయి శివుడి కరుణ పొందినట్లు కల గనటం, శ్రీకృష్ణుడు దయాళువై సుభద్రను ఊరడించి, దారుకుడితో అర్జునుడి ప్రతిజ్ఞా

వాక్యాలను ప్రస్తావించటం, పుత్రశోకంతో కుమిలే ధర్మరాజును ఓదార్చటానికి 'వ్యాసో నారాయణో హరిః'అని ప్రస్తుతించబడే కరుణామూర్తి అయిన వేదవ్యాసుడు వచ్చి ఎన్నో ఉపకథలను చెప్పి ఉపశమింపచేయటం ఈ ఆశ్వాసంలో ప్రధానాంశాలు. వీరరస పరంగా హరిహరుల ఆయుధాల ప్రసక్తి, కరుణరసపరంగా అభిమన్యుడి మరణానంతర విశేషాలూ ఈ ప్రారంభపద్యంలో సూచించ బడ్డాయి.

## ద్రోణుని మూఁడవనాఁటి యుద్ధము (సం. 7-32-25)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దనమనుమండు మృతిం బొందుట విని ధృతరాష్ట్రుండు. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా! ప్రభూ!; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= జనమేజయ మహారాజుకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; తన మనుమండు= తన మనమడైన అభిమన్యుడు; మృతిన్= మరణాన్ని; పొందుట= పొందటం; విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** ప్రభూ! హరిహరనాథా! వైశంపాయనుడు జనమేజయ మహారాజుతో ఇట్లా అన్నాడు. ' ఆ విధంగా తన మనమడైన అభిమన్యుడు మరణించా డని విన్న ధృతరాష్ట్రుడు.

**ఉ. 'చిత్తము వొక్కెడుం బురుషసింహునిఁ, బౌత్రకులాగ్రగణ్యు, న**
**త్యుత్తమతేజు, భూరిగుణు, నొప్పెడు మెత్తని మేనివాని, నె**
**ట్లుత్తల పెట్టిరో పలువు రుగ్రమనస్కులు గూడి యక్కటా!**
**యత్తెఱఁ గెల్లఁ దేటపడునట్టులుగా వివరించి చెప్పుమా!' 3**

**ప్రతిపదార్థం:** అక్కటా!= అయ్యో!; పలువురు= చాలామంది; ఉగ్రమనస్కులు= క్రూరమైన హృదయం కలవాళ్ళు అనగా దయలేని వాళ్ళు; కూడి= ఒకటిగా గుమిగూడి; పురుష సింహునిన్= పురుషులలో శ్రేష్ఠుడిని; పౌత్రకుల+అగ్రగణ్యున్= మనుమల మొత్తంలో మొట్టమొదటగా లెక్కించదగిన వాడిని; అతి+ఉత్తమతేజున్= మిక్కిలి శ్రేష్ఠమైన పరాక్రమం కలిగినవాడిని; భూరిగుణున్= గొప్పగుణాలు కలవాడిని; ఒప్పెడు= అందగించే; మెత్తని మేనివానిన్= మృదువైన శరీరం కలవాడిని, అభిమన్యుడిని; ఎట్లు= ఏ విధంగా; ఉత్తలపెట్టిరో?= బాధపెట్టారో?; చిత్తము= నా మనస్సు; పొక్కెడున్= మిక్కిలి బాధపడుతూ ఉన్నది; అత్తెఱఁగు+ఎల్లన్= (ఆ+తెఱఁగు) ఆ విధం అంతా; తేటపడునట్టులుగాన్= తేటతెల్లమయ్యేటట్లు(స్పష్టంగా); వివరించి= విశదపరచి; చెప్పుమా= తెలుపుము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు సంజయుడిని చూచి 'అయ్యో! క్రూర మనస్సు కలిగిన చాలామంది, అందరూ ఒక్కటిగా గుమిగూడి పురుషశ్రేష్ఠుడూ, నా మనుమలు అందరిలో మొట్టమొదట లెక్కించదగినవాడూ, మిక్కిలి శ్రేష్ఠమైన పరాక్రమం కలవాడూ, గొప్ప గుణాలతో ఒప్పేవాడూ, అందమైన అతి సుకుమార శరీరం కలవాడూ అయిన అభిమన్యుడిని ఏ విధంగా బాధపెట్టారో కదా! ఆ విషయం అంతా నాకు సవిస్తరంగా స్పష్టంగా విశదీకరించి చెప్పుము. నా మనస్సు చాలా బాధపడుతూ ఉన్నది' అన్నాడు.

**విశేషం:** ఈ పద్యంలో అతి ముఖ్య విషయం 'చిత్తం పొక్కటం'. అందుకే తిక్కన 'చిత్తము వొక్కెడున్' అనే ఎత్తుగడతో ఉత్పలమాలా వృత్తాన్ని ఎన్నుకొన్నాడు. సుకుమారమూ సుందరమూ అయిన భావాన్ని ఎంతో సున్నితంగా తేటపడేటట్లు చెప్పటానికి ఉత్పలం సర్వసమర్థం అయిందని శిల్పకళా మర్మజ్ఞుడైన తిక్కన ఇక్కడ చక్కగా నిరూపించాడు. 'ఒప్పెడు మెత్తని మేనివాని', 'ఎట్లుత్తలపెట్టిరో?' 'అత్తెఱఁగెల్ల' అనే అచ్చ తెలుగు పదాల కూర్పులో అభిమన్యుడి అందచందాలూ, గుణ గణాలూ వ్యంజింపబడ్డాయి. ద్విరుక్తతకార ప్రాసం విషయాన్ని ఒత్తి చెప్పటానికి ఉద్దిష్టమైనది. ఐదు విశేషగుణాలలో అభిమన్యుడి ఉదాత్తగుణాలూ, అతని తేజస్సూ, ఓజస్సూ సౌకుమార్యం ఉట్టంకించబడ్డాయి.

పాండవులంటే సరిపడని ధృతరాష్ట్రుడికి అర్జునుడి కుమారుడిపై అంత అభిమానం కలగటానికి కారణం ఏమై ఉంటుందని మనకు ఆశ్చర్యం కలుగవచ్చు. ఆ సందేహం అభిమన్యుడికి ప్రయోగించిన ఐదు విశేషణాల వలననే నివృత్తి అవుతుంది. మానవుడికి సహజమైన జాలిగుణం అనికానీ, ముసలి కన్నీరు కారుస్తున్నాడని కానీ అనుకోవాలి. తరువాతి (4) గద్యంలో ధృతరాష్ట్రుడికి ప్రయోగించిన విశేషణం 'మానవపతి' కావటంచేత మానవతా గుణమనే అనుకోవాలి.

**వ. అనుటయు నమ్మానవపతికి సూతసూనుం డిట్లను: నట్లు భరద్వాజుండు పద్మవ్యూహంబు సంఘటించు నెడ వివిధ దేశంబుల రాజులు దళంబులును, రాజకుమారులు గేసరంబులును, గర్ణ దుశ్శాసన బహుళ సేనా పరివృతుండయి కురువిభుండు గర్ణికయునుంగా నభేద్యభంగి నొనర్చిన నది వలయాకారం బగుటం జేసి చక్రవ్యూహంబు ననంజను, నమ్మొగ్గరంబు మొగంబునం దాను దర్పంబు మెఱయ నెఱయం బొలిచి నిలిచె; మఱియు వలయు నెడలకు లావై జయద్రథ గురుపుత్త్ర కృప శకుని కృతవర్మ భూరిశ్రవ శ్శల శల్యులును, నీ కొడుకులును, మనుమలును రక్తమాల్యానులేపనాంబరాభరణంబులు శోభిల్ల నిలిచి; రంత భీమసేన ప్రముఖంబైన పాండవబలంబులు గదియ నడచె; నందు సాత్యకి ధృష్టద్యుమ్న కుంతిభోజులును, జేకితానక్షత్ర ధర్మక్షత్ర వర్మలును, ధృష్టకేతు నకుల సహదేవులును, నుత్తమౌజ శ్శిఖండి యుధామన్యులును ఘటోత్కచ విరాట ద్రుపదులును, ద్రౌపదేయ కేకయ సృంజయ సముదయంబును నుక్కునం దఱిమి యక్కుంభసంభవుం దలపడిన నవ్వి యవ్వీరుండు వాఁడి మిగులు బలుతూపులం దన వేఁడిమి సూపిన నమ్మేటి విలుకాని మొగంబున నిలువ నోర్వక యా సైనిక ప్రకరంబు దిరుగుడువడిన వెక్కసంబును వెఱఁగుపాటును వెల్లఁదనంబునుం గదురఁ గౌంతేయాగ్రజుం డూరకుండి, కర్ణికార కేతు స్స్ఫీతుండును, నుత్సాహ శౌర్యసంపద్దుర్నిరీక్ష్యుండును నగు సౌభద్రుం గనుంగొని, 'వీఁడు దక్కనొరు లీ దృఢవ్యూహంబు భేదింపంజాల' రని మనంబున నిశ్చయించి యక్కుమారు నుద్దేశించి. 4**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధృతరాష్ట్రుడు అనగానే; ఆ మానవపతికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; సూతసూనుండు= సంజయుడు ; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; అట్లు= ఆ రీతిగా; భరద్వాజుండు= భరద్వాజుడి కొడుకైన ద్రోణాచార్యుడు; పద్మ వ్యూహంబు= పద్మం మాదిరిగా సైన్యాన్ని పన్నటం; సంఘటించు+ఎడన్= కూర్చే సందర్భంలో; వివిధ దేశంబుల రాజులు= నానా దేశాల నుండి వచ్చిన రాజులు; దళంబులును= రేకులుగాను; రాజకుమారులు= రాకుమారులు; కేసరంబులును= కింజల్కములుగాను; కర్ణ+దుశ్శాసన+బహుళ+సేనా+పరివృతుండు+అయి= కర్ణుడు, దుశ్శాసనుడు, అనేకములైన సైన్యాలచేత చుట్ట బడ్డవాడై; కురువిభుండు= దుర్యోధనుడు; కర్ణికయునున్+కాన్= తామర మధ్యలో ఉండే దుద్దుగాను కాగా; అభేద్యభంగిన్= భేదించటానికి వీలుకాని విధంగా; ఒనర్చినన్= చేయగా; అది= ఆ సైన్యం; వలయ+ఆకారంబు= గుండ్రమైన ఆకారం కలిగింది; అగుటన్+చేసి= కావటం చేత; చక్రవ్యూహంబును= చక్రం ఆకారం కలిగిన వ్యూహం అని కూడా; అనన్+చనున్= అనటానికి చెల్లుతుంది; ఆ+మొగ్గరంబు+ మొగంబునన్= అట్టి ఆ పద్మవ్యూహం యొక్క ముఖభాగంలో; తాను= ద్రోణుడు; దర్పంబు+ మెఱయన్= గర్వం అతిశయించగా; నెఱయన్= నిండుదనం చెలరేగగా; పొలిచి= ప్రత్యక్షంగా కనబడి; స్థిరమై నిలిచెన్= గట్టిగా నిలిచాడు; మఱియున్= ఇంకా; వలయు+ఎడలకున్= తగిన చోట్లకు; లావు+ఐ= బలమై; జయద్రథ+ గురుపుత్త్ర+ కృప+శకుని+ కృతవర్మ+భూరిశ్రవః+శల+శల్యులును= సైంధవుడు (ధృతరాష్ట్రుడి అల్లుడు, దుస్సల మగడు) అశ్వత్థామ (ద్రోణుడి కొడుకు); కృపాచార్యుడు (ద్రోణాచార్యుల బావమఱది; ద్రోణుడికి మునుపు కౌరవులకు అస్త్రగురువు); శకుని= గాంధార దేశపురాజు (గాంధారికి తోబుట్టువు); కృతవర్మ (హృదికుడి కొడుకు - ఇతడు యదు వంశపురాజు); భూరిశ్రవుడు= సోమదత్తుడి రెండవ కుమారుడు; శలుడు= సోమదత్తుడి మూడవ కొడుకు; శల్యుఁడు= మద్రదేశపురాజు, మాద్రికి తోబుట్టువు; నీ కొడుకులును= దుర్యోధన దుశ్శాసనులతో పాటు తక్కిన నీఅందరు కుమారులున్నూ; మనుమలును= మనుమళ్ళు అందరున్నూ; రక్తమాల్య+ అనులేపన+అంబర+ఆభరణంబులు= ఎర్రని దండలు,

గంధపు పూతలూ, వస్త్రాలూ, భూషణాలూ; శోభిల్లన్= ప్రకాశిస్తూ ఉండగా; (పొలిచి) నిలిచిరి= (ఒప్పుగా) ఎదుట నిలిచారు; అంతన్= ఆ సమయంలో; భీమసేన ప్రముఖంబు+ఐన= భీముడు ముఖ్యంగా ఉండేది అయిన; పాండవబలంబును= పాండవసైన్యం కూడా; కదియన్= మార్కొనగా లేక సమీపించునట్లుగా; నడచెన్= నడిచింది; అందున్= ఆ పాండవ సైన్యంలో; సాత్యకి= సత్యకుడి కొడుకు (ఇతడికే శైనేయుడు, యుయుధానుడూ అనే పేర్లు కూడా ఉన్నాయి); ధృష్టద్యుమ్న= ద్రుపదుని కొడుకు (ఇతడు అగ్ని అంశంలో పుట్టినవాడు; నకుల= నకులుడు; సహదేవులును= సహదేవుడు అనే ముగ్గురున్నూ; ఉత్తమౌజః= ఉత్తమౌజుడు (ధృష్టద్యుమ్నుడి తమ్ముడు); శిఖండి= శిఖండి (ధృష్టద్యుమ్నుడి అన్న); యుధామన్యులును= యుధామన్యుడు (ధృష్టద్యుమ్నుడి తమ్ముడు); అను ముప్పురున్నూ; ఘటోత్కచ= ఘటోత్కచుడు (భీమసేనుడికి హిడింబయందు పుట్టిన కుమారుడు); విరాట= విరటుడు (విరాట దేశపురాజు); ద్రుపదులును= పాంచాల దేశపురాజు ద్రుపదుడున్నూ; ద్రౌపదేయ= ద్రౌపది కుమారులు; కేకయ= కేకయుడు (శిబి చక్రవర్తి నలుగురు కుమారులలో ఒకడు); సృంజయ= సృంజయుడు అనే రాజుయొక్క; సముదయంబును= సమూహమునూ; ఉక్కునన్= గర్వంతో; తఱిమి= వెంబడించి; ఆ+కుంభసంభవున్= ఆ ద్రోణుడితో; తలపడినన్= ఢీకొనగా; ఆ+వీరుండు= వీరుడైన ఆ ద్రోణుడు; నవ్వి= గేలిగా నవ్వి; వాఁడి+మిగులు= మిక్కిలి పదునుగల; బలు= బలమైన; తూపులన్= బాణాలచేత; తన వేఁడిమి= తన శౌర్యాన్ని; చూపినన్= ప్రకటించగా; ఆ+మేటి విలుకాని మొగంబునన్= ఆ గొప్ప ధనుస్సును ధరించిన అతడి ఎదుట; నిలువన్+ఓర్వక= ఎదిరించి నిలవటానికి ఓపలేక; ఆ+సైనిక+ప్రకరంబు= ఆ సైనికుల మొత్తం; తిరుగుడు పడినన్= వెనుకకు మళ్ళగా; వెక్కసంబును= సహించలేకపోవటం; వెఱఁగుపాటును= ఆశ్చర్యపడటం; వెల్లఁదనంబునున్= వెలవెలపోవటమున్నూ; కదురన్= కలుగగా; కౌంతేయ+అగ్రజుండు= కుంతీ కుమారులలో పెద్దవాడైన ధర్మరాజు; కర్ణికార+కేతు+స్ఫీతుండును= కొండగోగు చెట్టు గుర్తుగా గల జెండా చేత; అతిశయించిన వాడున్నూ; ఉత్సాహ శౌర్య సంపద్+దుర్నిరీక్షుండును= ఉత్సాహం, శూరత్వం అనే సంపద చేత చూడటానికి వీలుకాని వాడున్నూ; అగు= అయిన; సౌభద్రున్= సుభద్రాపుత్రుడైన అభిమన్యుడిని; కనుంగొని= చూచి; వీఁడు+తక్కన్= ఇతడు తప్ప; ఒరులు= ఇతరులు; ఈ+దృఢ వ్యూహంబు= ఈ గట్టిమొనను; భేదింపన్+చాలరు= భేదించటానికి (చీల్చటం చేత పగులగొట్టటానికి) సమర్థులు కారు; అని మనమునన్+నిశ్చయించి= అని మనస్సులో నిర్ణయానికి వచ్చి; ఆ+కుమారున్= ఆ అభిమన్యు కుమారుడిని; ఉద్దేశించి= తలచి లేదా భావించి.

**తాత్పర్యం:** 'పలువురు ఒక్క బాలుడిని చుట్టుముట్టి ఎట్లా బాధపెట్టారో చెప్పుము' అని ధృతరాష్ట్రుడు సంజయుడిని అడగగానే అతడు ఇట్లా అన్నాడు: ద్రోణాచార్యుడు వలయాకారంగా పద్మ(చక్ర) వ్యూహాన్ని పన్నాడు. అందులో రేకులు వివిధ దేశాలనుంచి వచ్చిన రాజులు, కింజల్కాలు రాకుమారులు, తామర నడిమిదిమ్మె కర్ణ దుశ్శాసనాదులతో కూడుకొన్న దుర్యోధనుడు. ఎవ్వరికీ భేదించటానికి వీలుకాని ఆ మొగ్గరం ముఖభాగంలో ద్రోణుడు మహాదర్పంతో మెరుస్తూ నిలిచాడు. ఎక్కడెక్కడ తగు సైన్యాన్ని ఏర్పాటు చేయాలో దానికి అనుగుణంగా సైంధవుడు, అశ్వత్థామ, కృపుడు, కృతవర్మ, శకుని, భూరిశ్రవుడు, శలుడు, శల్యుడు - తక్కిన ధృతరాష్ట్రుడి కుమారులూ, మనుమళ్ళూ అందరూ అన్ని హంగులతో అలంకరించుకొని యుద్ధానికి సంసిద్ధు లయ్యారు.

ఇక పాండవసైన్యంలో భీమసేనుడు ప్రముఖపాత్ర వహించాడు. ఆయనకు అండదండగా సాత్యకి, ధృష్టద్యుమ్న, కుంతిభోజులూ, చేకితాన క్షత్రధర్మ క్షత్రవర్మలూ, ధృష్టకేతు నకుల సహదేవులూ, ఉత్తమౌజుడూ, శిఖండీ, యుధామన్యువూ, ఘటోత్కచుడు, విరటుడూ, ద్రుపదుడూ, ద్రౌపదేయులు, కేకయుడూ, సృంజయుడూ మహాపరాక్రమంతో ద్రోణుడిని మార్కొన్నారు. అతడు చిరునవ్వుతో పాండవులపై తీవ్రబాణాలు ప్రయోగించాడు. దానితో పాండవసైన్యం సంభ్రమాశ్చర్యాలతో వెలవెల్లనై వెనుకకు మళ్ళింది. అప్పుడు ధర్మరాజు ఈ మొగ్గరాన్ని ప్రవేశించటానికి సాటిలేని ధైర్య శౌర్య సాహసాలూ, సముత్కటమైన ఉత్సాహమూ ఉన్న సమర్థుడు ఒక్క సౌభద్రుడే అని నిశ్చయించుకొని, ఆ అభిమన్యుడిని ఉద్దేశించి ఇట్లా అన్నాడు:

**విశేషం:** పద్మాకారంలో సైన్యాన్ని ఒకచోట చేర్చి, ఎక్కడెక్కడ ఏయే యోధులను కట్టుదిట్టంగా ఎట్లా ఉంచాలో అట్లా ఉంచి, ద్రోణుడు ఏర్పరిచిన వ్యూహం సమరసన్నాహం శత్రువులకు దురవగాహమైందనీ, అటువంటి దృఢ వ్యూహాన్ని అవలీలగా చొచ్చుకొని పోగలిగే సామర్థ్యం ఒక్క సౌభద్రుడికి మాత్రమే ఉన్నదని ధర్మరాజు గ్రహించటం ఈ వచనభాగంలోని విశేషం. అభిమన్యుడి శక్తి సామర్థ్యాలను ఉట్టంకిస్తూ ప్రయోగించిన విశేషణాలు అటు వీరరస స్ఫూర్తినీ, ఇటు కావ్యకళా సౌందర్యాన్నీ సముజ్జ్వలంగా ప్రకాశింప జేస్తున్నాయి.

**సీ. 'ఈ యొడ్డు భేదింప నే మెవ్వరము నేర । మర్జునుండును నీవు నచ్యుతుండుఁ**
**బ్రద్యుమ్నుఁడును దక్కఁ ; బార్థుండు మనల ను । ల్లసమాడకుండ నీ లావు మెఱపి**
**భేదించి మా కెల్లఁ బ్రియ మొనర్పు కు । మార!' యనవుడు నతఁ డాననాబ్జ మలర**
**'దీని ముఖంబు భేదించు తెఱంగు నా । కెఱిఁగించె మా తండ్రి; యేను దెఱపి**

**ఆ. సేయనేర్తుఁ, జొచ్చి చించి చెండాడెద । మూఁక లెల్లఁ జుట్టు ముట్టినపుడు**
**వెడలు నట్టి వెరవు విన ; దాని కేమి? । నా చొచ్చు నేర్పు బలువుఁ జూడు మధిప!' 5**

**ప్రతిపదార్థం:** కుమార!= పుత్రా! అభిమన్యూ!; ఈ ఒడ్డున్= ఈ వ్యూహాన్ని; భేదింపన్= చీల్చటానికి (పగులకొట్టటానికి); అర్జునుండును= మీ తండ్రియైన అర్జునుడున్నూ; నీవున్= నీవున్నూ; అచ్యుతుండున్= శ్రీకృష్ణుడున్నూ; ప్రద్యుమ్నుఁడును= శ్రీకృష్ణుడి కుమారుడైన ప్రద్యుమ్నుడున్నూ; తక్కన్= తప్ప; ఏము= మేము - అంటే ధర్మరాజాదులం; ఎవ్వరమున్= ఎవ్వరమున్నూ; నేరము= సమర్థులం కాము (ఆ కాలంలో పద్మవ్యూహాన్ని అర్జునుడు, అతడి కొడుకు అభిమన్యుడూ, శ్రీకృష్ణుడు, అతడి కొడుకు ప్రద్యుమ్నుడూ తప్ప మరెవ్వరూ పాండవ శిబిరంలో భేదించే వాళ్ళు లేరని తెలుస్తూ ఉన్నది); పార్థుండు= పృథా పుత్రుడైన అర్జునుడు; మనలన్= ప్రస్తుతం పాండవ శిబిరంలో ఉండే మనలను అందరినీ; ఉల్లసము+ఆడకుండన్= మనస్సు నొచ్చేటట్లు గేలిచేస్తూ పొడిచి పొడిచి మాటాడకుండా; నీలావున్= నీ బలాన్ని; మెఱపి= ప్రకటించి; భేదించి= పద్మవ్యూహాన్ని పగులగొట్టి; మాకున్+ఎల్లన్= మాకు అందరికీ; ప్రియము+ఒనర్పు= మేలు కలిగించుము; అనవుడున్= అని ధర్మరాజు అనగానే; అతఁడు= అభిమన్యుడు; ఆనన+అబ్జము= ముఖపద్మం; అలరన్= వికసించగా; మా తండ్రి= నా జనకుడైన అర్జునుడు; దీని+ముఖంబున్= ఈ వ్యూహం యొక్క ముఖాన్ని; భేదించు తెఱంగున్= పగులగొట్టే తీరును; నాకున్= నాకు; ఎఱిఁగించెన్= తెలిపాడు; ఏను= నేను; చొచ్చి= ప్రవేశించి; తెఱపి చేయన్= అవకాశం కలిగించటానికి లేదా సందు చేసికొనటానికి అంటే వ్యూహాన్ని పగులగొట్టి(ఛేదించ) టానికి; నేర్తున్= చాలి ఉన్నాను; మూఁకలు+ఎల్లన్= సేనలు అన్నీ; చుట్టుముట్టినపుడు= చుట్టూ నన్ను పొదివిన సమయంలో; చించి= చీల్చి, భేదించి; చెండాడెదన్= హతమారుస్తాను; వెడలునట్టి వెరవు= వ్యూహం నుండి బయటకు వచ్చే ఉపాయం; వినన్= వినలేదు; దాని కేమి?= అంత మాత్రాని కేమి?; అట్లా తెలియకపోయినంత మాత్రాన ఏమౌతుందిలే; అధిప!= రాజా! (ధర్మరాజా!); నా చొచ్చు నేర్పున్= వ్యూహాన్ని భేదించి లోపలికి పోయే నా చాకచక్యాన్ని; బలుపున్= అతిశయాన్ని; చూడుము= చూడుము.

**తాత్పర్యం:** 'ఈ మొగ్గరాన్ని భేదించటానికి నీవూ, మీ తండ్రి అర్జునుడూ, కృష్ణుడూ, ఆయన కుమారుడు ప్రద్యుమ్నుడూ తప్ప మే మెవ్వరమూ చాలం. నీ తండ్రి మమ్ములను గేలిచేసి మనస్సు గాయపడేటట్లు మాటాడకుండా నీ బలాన్ని ప్రకటించి, మాకు అందరికీ ప్రీతి కలిగించుము'. ఆ మాటలు వినగానే అభిమన్యుడి ముఖపద్మం విప్పారింది. అప్పు డతడు 'ఈ వ్యూహ ముఖాన్ని భేదించే పద్ధతి మాత్రమే నా తండ్రి నాకు తెలిపాడు. కాబట్టి ఆ అవకాశాన్ని ఇప్పుడు వినియోగించుకొంటాను. వ్యూహాన్ని భేదించి ఇదిగో ఇప్పుడే లోనికి ప్రవేశిస్తాను. నన్ను చుట్టుముట్టిన సేనల్ని హతమారుస్తాను. అయితే నాకు పద్మవ్యూహం నుండి వెలుపలికి వచ్చే ఉపాయం తెలియదు. తెలియనంత మాత్రాన ఏమౌతుంది? దాని కేమి గాని, ఇప్పుడు నేను వ్యూహాన్ని భేదించి లోపలికి చొచ్చుకొని పోయే నా నేర్పు, అతిశయం ఎలాంటివో చూడండి' అన్నాడు.

**విశేషం:** దేశీయచ్ఛందస్సులో అచ్చ తెలుగు పదాల కూర్పు నేర్పుతో ఆంధ్రావళికి మోదాన్ని కలిగించటం తిక్కన ధ్యేయం. ఈ పద్యంలో భేదించు, ముఖము, ఆననాబ్జము, ప్రియము అనే తత్సమపదాలు, వ్యక్తుల పేర్లు, సంబోధనలు తప్ప తక్కినదంతా తిక్కన నుడికారపు సొంపునకు తారకాణ. విషయమంతా చెప్పి చివరలో సంబోధనలు వాడటం ఈ పద్యంలోని మరొక విశేషం. కుమార! అధిప! అనే సంబోధనాంత శబ్దాలలో రణధర్మానికి సంబంధించిన నియమం సూచితం.

**వ. అనిన విని ధర్మనందనుండు ధనంజయ నందనున కి ట్లనియె. 6**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అభిమన్యుడు చెప్పగా; విని= ఆకర్ణించి; ధర్మనందనుండు= యమధర్మరాజు కొడుకైన ధర్మరాజు; ధనంజయ నందనునకున్= అర్జునుడి కుమారుడైన అభిమన్యుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా అభిమన్యుడు చెప్పిన మాటలు విన్న ధర్మరాజు తాను మళ్ళీ అభిమన్యుడితో ఇట్లా అంటున్నాడు:

**విశేషం:** వచన రచనలో సమత అనే లక్షణానికి ఈ వాక్యం చక్కని నిదర్శనం. పద్య రచనలో మధ్య మధ్య వచనం వ్రాయకూడదని ఒకనాటి తిక్కన అభిప్రాయం. రచనలో పరిపక్వత, మానసిక పరిపూర్ణత నెలకొన్న తర్వాత పూర్వాభిప్రాయానికి పూర్తిగా స్వస్తి పలికి నన్నయ మాదిరిగనే 'పద్యముల గద్యములన్ రచించెదన్ గృతుల్' అని భారతాంధ్రీకరణం గావించాడు. ప్రస్తుత వాక్యంలో ధర్మనందనుడు అంటే యమధర్మరాజు కుమారుడని మాత్రమే కాకుండా ధర్మంచేత ఆనందాన్ని కలిగించేవాడని భావం.

**క. తెఱపిగొని నీవు సొచ్చినఁ । బిఱుఁదన చొచ్చెదము రిపులు పెల్లగిలఁగ నం**
**దఱమును మా కిది యెంతయు । నుఱునట్టి వరంబు దీని నొసఁగుము పుత్త్రా! 7**

**ప్రతిపదార్థం:** పుత్త్రా!= కుమారా! (అభిమన్యు సంబోధనం); నీవు; తెఱపిగొని= ఎడం చేసికొని; చొచ్చినన్= వ్యూహంలో ప్రవేశిస్తే; అందఱమును= మేము అందరమూ; రిపులు= శత్రువులు; పెల్లగిలఁగన్= తొలగిపోయే విధంగా; పిఱుఁదనన్+అ= వెంటనే లేక వెనుకనే; చొచ్చెదము= ప్రవేశిస్తాము; ఇది= ఇట్లా మెలగటం; మాకున్= మాకు; ఎంతయున్= మిక్కిలి; ఉఱు+అట్టి= తగినటువంటి వరంబు= వరం; దీనిన్= ఈ వరాన్ని; ఒసఁగుము= ఇమ్ము.

**తాత్పర్యం:** కుమారా! అభిమన్యూ! నీవు ఎడం చేసికొని వ్యూహంలోకి చొరబడితే మేము అందరమూ కూడా నీ వెనుకనే శత్రువులు తొలగిపోయేటట్లు వస్తాము. ఇది మాకు తగినట్టి శ్రేష్ఠమైన వరం. ఇట్టి వరం నీవు మాకు ఇవ్వాలి.

**విశేషం:** తిక్కన కంద పద్య రచనలో సిద్ధహస్తుడు. ఎంతటి భావాన్నైనా కందంలో అందంగా పొదిగించే శిల్పకళా పారమ్యంలో ఆయనకు ఆయనే సాటి. 'ఉఱు' అనే అచ్చతెలుగు పదాన్ని 'తగు' అనే అర్థంలో తగు స్థానంలోనే తిక్కన ప్రయోగించాడు.

**చ. అనవుడు భీముఁ డిట్టులను 'నర్జుననందన! నీవు ముంద ఱి**
**మ్మొన యొకయింత సించిన నమోఘరయంబునఁ బార్షతుండు నే**
**నును ద్రుపదుండు సత్యకతనూభవుఁడున్ విరటుండు నంత నం**
**త నడఱి చింతు మెల్లెడలు దారుణవిక్రమజృంభణంబునన్.' 8**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని ధర్మరాజు చెప్పగానే; భీముఁడు= భీమసేనుడు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అన్నాడు; అర్జుననందన!= ఓ అభిమన్యూ!; నీవు; ముందఱ= ముందుగా; ఈ+మొనన్= ఈ పద్మ(చక్ర) వ్యూహాన్ని; ఒక ఇంత= కొంచెం; చించినన్= భేదిస్తే; అమోఘరయంబునన్= అడ్డుకోలేని వేగంతో; పార్షతుండున్= ద్రుపదుడున్నూ; సత్యక తనూభవుఁడున్= సాత్యకియున్నూ (ఇతడు వృష్ణివంశంలో పుట్టినవాడు); విరటుండున్= విరాట మహారాజున్నూ; అంతన్+అంతన్= అంతంతలో-

అంటే కొంతదూరంలోనే; అడరి= విజృంభించి; దారుణ= భయంకరమైన; విక్రమజృంభణంబునన్= పరాక్రమంయొక్క అతిశయంతో; ఎల్లెడలు= అన్ని వైపులూ (ప్రక్కలూ); చింతుము= చీల్చివేస్తాం (వ్రక్కలిస్తాం).

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మరాజు చెప్పిన వెంటనే భీమసేనుడు ఇట్లా అన్నాడు: 'అభిమన్యూ! నీవు ముందుగా వ్యూహాన్ని కొంచెం భేదిస్తే వెంటనే ఎవ్వరూ అడ్డుకోలేని వేగంతో నేనూ, ద్రుపదుడూ, సాత్యకీ, విరాటమహారాజూ అతి సమీపంలోనే విజృంభించి భయంకరమైన పరాక్రమస్ఫూర్తితో అన్ని దిక్కులూ (ప్రక్కలూ) వ్రక్కలిస్తాం.'

**విశేషం:** ఇది చంపకమాలావృత్తం. ఇందులోని పదాల కూర్పులో సన్నివేశానికి అనుగుణంగా మహావేగం స్ఫురిస్తూ ఉన్నది. 'అర్జున నందన!' అని సంబోధించటం సాభిప్రాయం. సంబోధనలోనే కాకుండా మొత్తం పద్యంలోని నకారాలు ద్రుతగతికి ఎంతో ఉపకరించాయి. పద్యంలో పదపదమూ తునిగిన ట్లున్నప్పటికీ 'అమోఘరయం' తో సాగినట్లు రచించటం తిక్కన సందర్భశుద్ధి గల ఔచిత్యాన్ని, భావ కళాసౌందర్యాన్ని పట్టి యిస్తున్నాయి. ఎక్కడి కక్కడ ముక్కలు ముక్కలుగా పదసముదాయాన్ని నిబంధించటంలో కూడా సైన్యాన్ని వ్రక్కలు వ్రక్కలుగా అన్ని ప్రక్కలా చీల్చి చెండాడటం అనే ప్రధాన ప్రయోజనం సాధించబడింది.

**వ. అనిన విని అభిమన్యుం డాతని యాననం బాలోకించి. 9**

**ప్రతిపదార్థం:** అనినన్= అని భీముడు అనగా; విని= సావధానంగా విని; అభిమన్యుండు= అర్జునుడి కొడుకైన అభిమన్యుడు; ఆతని= భీమసేనుడి; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** భీముడు చెప్పిన మాటలు విని అభిమన్యుడు అతడి ముఖాన్ని ఆసక్తికరంగా చూచాడు.

**విశేషం:** తర్వాతి పద్యానికి అనుబంధ ప్రాయంగా రచించబడ్డ ఈ వచనంలో అకారం మళ్ళీ మళ్ళీ వచ్చేటట్లు శబ్దాలంకార సౌందర్యాన్ని ప్రకటించటమే కాకుండా అందులో ఒక విధమైన ఆవేగాన్ని కూడా తిక్కన ధ్వనింపజేశాడు.

**చ. 'నను విను కీచకాంతక! మనంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చి య**
**మ్మొనఁ గలఁగింప కిట్లు కురుముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం**
**చిన జతనంబు నిష్ఫలము సేయుదునే? నరుఁడున్ సుభద్రయున్**
**దనయుని గాంచి సంతసము దాల్చుట యంతయు రిత్తఁబుత్తునే? 10**

**ప్రతిపదార్థం:** కీచకాంతకా!= భీమసేనా; ననున్+విను= నన్ను ఉద్దేశించి వినుము (అనగా నామాట ఆలకించుము); ద్రోణుఁడు= ప్రస్తుతం పద్మవ్యూహాన్ని పన్నిన సర్వసైన్యాధ్యక్షుడైన ద్రోణాచార్యుడు; మనంబునన్= మనస్సులో; మెచ్చన్= పొగడగా; ఆ+మొనన్+చొచ్చి= ఆ పద్మవ్యూహాన్ని ప్రవేశించి; కలఁగింపక= కలత కలిగించకుండా; ఇట్లు= ఈ విధంగా; కురుముఖ్యుఁడు= కురువంశంలో ప్రధానమైన వాడగు ధర్మరాజు; గారవించిన= గౌరవించినటువంటి; జతనంబున్= ప్రయత్నాన్ని; నిష్ఫలము+చేయుదునే?= వ్యర్థం చేస్తానా?; నరుఁడున్= తండ్రి అయిన అర్జునుడూ; సుభద్రయున్= తల్లి అయిన సుభద్రా; తనయునిన్= కుమారుడిని; కాంచి= చూచి; సంతసము తాల్చుట+అంతయున్= సంతోషాన్ని పొందటం అంతా; రిత్తపుత్తునే?= వ్యర్థం గావిస్తానా?

**తాత్పర్యం:** భీమసేనా! వినుము. ద్రోణుడు మెచ్చేవిధంగా వ్యూహాన్ని భేదించి లోపలికి ప్రవేశిస్తాను. ధర్మరాజు మన్ననతో తలపెట్టిన ప్రయత్నాన్ని వమ్ము చేస్తానా? తల్లిదండ్రులు నన్ను చూసి సంతోషించటాన్ని వ్యర్థం చేయను.

**విశేషం:** కీచకాంతకా! అనే ప్రయోగంలో ప్రస్తుతం తన ప్రయత్నం ఫలించటం అనే స్ఫురణ అభివ్యక్తం. కీచకుడి పీచమణచినట్లు-ప్రస్తుతం పద్మవ్యూహాన్ని చీల్చివేస్తానని ధ్వని. పాండవపక్షంలో కురువంశానికి చెందిన ప్రధానవ్యక్తి ధర్మరాజు. ఆయనే అభిమన్యుడిని

వ్యూహం భేదించే ప్రయత్నానికి పురికొల్పాడు. కాబట్టి అది వ్యర్థం కాదు. అట్లాగే తల్లిదండ్రులకు ఆనందాన్ని కలిగించలేనివాడు ఏ విధంగా నందనుడు అవుతాడు? అందువలన తల్లిదండ్రులు సంతోషించేటట్లు తన ప్రయత్నం ఫలవంతమౌతుంది అన్నాడు.

**చ. ఇదె యొక పిన్నవాఁ డడరి యెక్కుడు మూఁకల క్రందుఁ దోలెడున్**
**గదుపుల వెల్చు గోపకుని కైవడి నంచు జనుల్ నుతింపఁ జే**
**సెద; విని మామ ప్రీతి విలసిల్లఁగఁ దండ్రియు సంతసిల్ల బె**
**ట్టిదుఁ డగు కౌరవేంద్రునకు డెప్పర మయ్యెడు భంగిఁ బేర్చెదన్. 11**

**ప్రతిపదార్థం:** కదుపులన్= ఆవులమందలను; వెల్చు= వెడలించే(తోలే); గోపకుని కైవడిన్= గొల్లవాడివలె; ఇదె= ఇదిగో; ఒక పిన్నవాఁడు= ఒక బాలుడు; అడరి= విజృంభించి; ఎక్కుడుమూఁకల+క్రందున్= మిక్కుటమైన సేనలసందడిని; తోలెడున్= తరుముతూ ఉన్నాడు; అంచున్= అని అంటూ; జనుల్= ప్రజలు; నుతింపన్= పొగిడేటట్లు; చేసెదన్= చేస్తాను; విని= నేను చేసిన పనిని గురించి విని; మామ= మేనమామ అయిన శ్రీకృష్ణుడు; ప్రీతిన్+విలసిల్లఁగన్= సంతోషం లేక ప్రేమతో ఒప్పగా (ప్రీతిని పొందగా); తండ్రియున్= తండ్రి అయిన అర్జునుడున్నూ; సంతసిల్లన్= సంతోషించగా; బెట్టిదుఁడు+అగు= క్రూరుడూ, ఉద్ధతుడూ అయిన; కౌరవ+ఇంద్రునకున్= కౌరవులలో శ్రేష్ఠుడైన ఆ దుర్యోధనుడికి; డెప్పరము+అయ్యెడు+భంగిన్= దుస్సహం అయ్యే విధంగా; పేర్చెదన్= విజృంభిస్తాను.

**తాత్పర్యం:** 'గొల్లవాడు ఆవులమందలను అదలించి తోలేవిధంగా ఒక బాలుడు సందడిగా ఉండే మిక్కుటమైన సైన్యాన్ని తరుముతూ ఉన్నా' డంటూ ప్రజలు పొగడేటట్లు పరాక్రమిస్తాను. ఇది విని మేనమామ శ్రీకృష్ణుడూ, నా తండ్రీ ఎంతో సంతోషిస్తారు. క్రూరుడైన దుర్యోధనుడికి దుస్సహం అనిపించే విధంగా విజృంభిస్తాను.

**విశేషం:** గోవులను మళ్ళించటం అనేది ఇక్కడ ఉపమానంగా ప్రయోగించబడింది. కాని భారత యుద్ధం ప్రారంభం కాకముందు ఆవుల మందలను వెనక్కు తోలటం ఒక మహావీరకార్యంగా నిరూపించబడింది. ముఖ్యంగా ఉత్తరగోగ్రహణ సందర్భంలో అర్జునుడు ప్రదర్శించిన అవక్రపరాక్రమం ప్రజలకూ, రాజుకూ అందరికీ ఆనందాన్ని కలిగించింది. దుర్యోధనుడికి ఆనాటి సంఘటన దుస్సహంగా పరిణమించింది. సేనలను కదుపులతో పోల్చటం వలన అర్జునుడి ఆనాటి పరాక్రమాన్ని అభిమన్యుడిలో ఆరోపించినట్లయింది. గోపకులలో అతి ముఖ్యుడు శ్రీకృష్ణుడు. ఆయనకు ఆలమందలను తోలటం ఒక సరదా. అది ఆయనకు ఎంతో ప్రీతికరం. అట్లాగే అభిమన్యుడున్నూ ఎంతో సరదాగా, అవలీలగా ఆలమందలను తోలినట్లు సైన్యాన్ని తోలాడని చెప్పటం వలన పూర్వ విషయాన్ని స్ఫురణకు తెచ్చినట్లయింది. 'ఇదె' అను ఎత్తుగడలో పద్యాన్ని ప్రారంభించి అది ఏ విధంగా పలువురికి సంభ్రమాశ్చర్య సంతోషాలను కలిగించిందో తిక్కన ఎంతో నాటకీయంగా సన్నివేశాన్ని మన కళ్ళముందు సాక్షాత్కరింపజేశాడు.

**క. అనిన విని ధర్మసూనుఁడు । దను ప్రీతిం జూచి 'నీదు ధైర్యము శౌర్యం**
**బును బలమును గీర్తియు వ । ర్ధన మొందెడు' మనుడుఁ బార్థతనయుం డెలమిన్. 12**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అభిమన్యుడు చెప్పగా; ధర్మసూనుఁడు= ధర్మతనయుడు; విని= ఆకర్ణించి; ప్రీతిన్= ప్రేమతో; తనున్= తనను అనగా అభిమన్యుడిని; చూచి; నీదు+ధైర్యమున్= నీ యొక్క ధీరత్వమూ; శౌర్యంబును= శూరత్వమూ; బలమును= సత్తువా; కీర్తియున్= యశస్సూ; వర్ధనము+ఒందెడున్= అభివృద్ధి పొందుగాక; అనుడున్= అని అనిన వెంటనే; పార్థతనయుండు= అభిమన్యుడు; ఎలమిన్= ప్రీతితో.

**తాత్పర్యం:** అభిమన్యుడి మాటలు విని ధర్మరాజు ఎంతో ప్రీతితో అతడిని చూచి 'నీ ధీరత్వమూ, శూరత్వమూ, బలమూ, యశస్సూ వర్ధిల్లుగాక!' అని ఆశీర్వదించాడు. అటుపై అభిమన్యుడు ఎంతో సంతోషంతో.

**విశేషం:** మహాపరాక్రమశాలికి ఏయే గుణాలు ఉండాలో అవి అభిమన్యుడిలో ఉన్నాయి అని చెబుతూ ఆ విశిష్ట లక్షణాలతో ఇంకా వర్ధిల్ల వలసిందని దీవించటం వీరుడిని మరికొంత ప్రేరేపించటమే కాకుండా సంతోషభరితుడిని కూడా చేస్తుంది అనే విషయం ఈ పద్యంలో వెల్లడించబడింది. 'వర్ధన మయ్యెడున్' అనటంలో అభిమన్యుడి భవిష్యన్మరణ సూచనను అవితథవాక్కు అయిన ధర్మరాజునోట పలికించాడు తిక్కన. 'వర్ధన' శబ్దమునకు వృద్ధిపొందుట అని ఒక అర్థం. ఖండనము, ఛేదనము అనే అర్థాలు కూడా ఉన్నాయి. 'వృధ్' ధాతువునకు ఖండించుట ఛేదించుట అనే అర్థాలు కూడా ఉన్నాయి. అందుచేత 'వర్ధన' శబ్దం ఇక్కడ శ్లిష్టమై ప్రకరణానుగుణమైనది.

**వ. తన సారథిఁ గనుంగొని 'మన యరదంబు ద్రోణానీకంబుపైఁ బఱపు' మనుటయు నా సుమిత్రుం డర్జున పుత్త్రున కి ట్లనియె. 13**

**ప్రతిపదార్థం:** తన+సారథిన్= (అభిమన్యుడు) తన రథాన్ని నడిపే అతడిని; కనుంగొని= చూచి; మన+అరదంబున్= మన రథాన్ని; ద్రోణ+అనీకంబు+పైన్= ద్రోణాచార్యుడి సైన్యం మీదికి; పఱపుము= తోలుము (పరువెత్తేటట్లు చేయుము); అనుటయున్= అని చెప్పగా; ఆ+సుమిత్రుండు= సుమిత్రుడు అను పేరుగల ఆ సారథి; అర్జునపుత్త్రునకున్= అభిమన్యుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు తన సారథి అయిన సుమిత్రుడిని చూచి 'మన రథాన్ని ద్రోణసైన్యం మీదికి దూకించుము' అన్నాడు. అప్పుడు ఆ రథసారధి అభిమన్యుడితో ఈ విధంగా అన్నాడు:

**తే. 'బాలుఁడవు నీవు; కుంభజ ప్రముఖ సైన్య । పతులు ప్రౌఢులు; పెక్కులు బవరములకుఁ**
**జొచ్చి యెఱుఁగని నీచేతఁ జచ్చువారు । గారు; బహువిధ సమర కర్కశులు వారు.' 14**

**ప్రతిపదార్థం:** నీవు; బాలుఁడవు= పసివాడవు; కుంభజ+ప్రముఖ+సైన్యపతులు= ద్రోణాచార్యుడు మొదలైన సేనాధిపతులు; ప్రౌఢులు= ప్రౌఢి కలిగినవాళ్ళు - గొప్ప నేర్పరులు; పెక్కులు+బవరములకున్= అనేక యుద్ధాలలో; చొచ్చి= ప్రవేశించి; ఎఱుఁగని= తెలియని అనగా ప్రవేశించని (అనుభవం లేని); నీచేతన్= నీచేతిలో; చచ్చువారు కారు= చచ్చేవారు కారు అంటే చంపబడరు; వారు= ఆ ద్రోణాదులు; బహువిధ సమర కర్కశులు= అనేక విధాలైన యుద్ధాలలో కఠినులు (ఎన్నో యుద్ధాలలో పాల్గొని బాగా అనుభవాన్ని సంపాదించి ఆరితేరి ఉన్నారు అని భావం).

**తాత్పర్యం:** ' నీవా? బాలుడివి. ద్రోణాదులా? మహాప్రౌఢులు. నీచేత వాళ్ళు చావరు. నీకు యుద్ధపరిజ్ఞానం చాలదు. ఎక్కువ యుద్ధాలలో నీవు ఇంతవరకూ పాల్గొనలేదు. వాళ్ళు అనేక యుద్ధాలలో పాల్గొని ఆరితేరి ఉన్నారు.'

**విశేషం:** బాలుడివి. తెలియనివాడవు అని అభిమన్యుడిని గురించి చెప్పేటప్పుడు అచ్చ తెలుగు పదాలను ప్రయోగిస్తూ ప్రౌఢులైన ద్రోణాదులను తెలిపే సందర్భంలో సంస్కృత సమాసాలను తిక్కన ప్రయోగించటం ఎంతో ఔచిత్యంగా ఉన్నది. విషయాన్ని విడమరచి తేటతెల్లంగా చెప్పటంలో తేటగీతి పద్యం యొక్క సామంజస్యాన్ని తిక్కన చక్కగా ఇందులో నిరూపించాడు. సారథిచేత ఇట్లా అనిపించటం ఒక అపశకునంగా భావించవచ్చును.

**చ. అనవుడు నల్లనవ్వి యతఁ డాతని కిట్లను; 'దేవయుక్తుఁడై**
**యనికి బలారివచ్చినఁ బురారి గణంబులుఁ దానుఁ బన్నినం**
**గినిసి కడంగి క్రీడియును గృష్ణుఁడుఁ దాఁకిన నే జయింతు మా**
**ర్కొని యనుచుండుదున్; సరకు గొందునె ద్రోణునిఁ దోడియోధులన్?' 15**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని సుమిత్రుడు చెప్పగా; అల్ల= మందంగా, మెల్లగా; అతండు= ఆ అభిమన్యుడు; నవ్వి; ఆతనికిన్= సారథికి; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; బల+అరి= బలుడు అనే రాక్షసుడికి శత్రువైన ఇంద్రుడు; దేవయుక్తుఁడు+ఐ= దేవతలతో కూడుకొన్నవాడై; అనికిన్= యుద్ధానికి; వచ్చినన్= దండెత్తి వచ్చినప్పటికీ; పురారి= శివుడు (త్రిపురాసురులకు శత్రువు); గణంబులున్= ప్రమథ గణాలూ; తానున్= తానున్నూ; పన్నినన్= ఎదుర్కొన్నప్పటికీ; కినిసి= కోపించి; కడంగి= పూనుకొని; క్రీడియును= అర్జునుడున్నూ; కృష్ణుఁడున్= శ్రీకృష్ణుడున్నూ; తాఁకినన్= ఎదుర్కొనినప్పటికీ; ఏన్= నేను; మార్కొని= ఎదిరించి; జయింతున్= జయిస్తాను; అనుచున్+ఉండుదున్= అంటూ ఉంటాను; ద్రోణునిన్= ద్రోణాచార్యుడిని; తోడి యోధులన్= అతడితో కూడి ఉండే యుద్ధవీరులను; సరకు గొందునె?= లక్ష్యపెడతానా? (లెక్కపెడతానా?).

**తాత్పర్యం:** సుమిత్రుడు ఆ విధంగా అనగానే అభిమన్యుడు మెల్లగా నవ్వి సారథితో ఇట్లా అన్నాడు: 'దేవతలతో కలిసి ఆ దేవేంద్రుడు దండెత్తి వచ్చినా, ఈశ్వరుడు ప్రమథ గణాలతో కలిసికొని వచ్చి పోరాడినా, కోపించి ఆ కృష్ణార్జునులే నన్ను ఎదుర్కొన్నా, నేను జయించి తీరుతాను. ఇక ఆ ద్రోణుడూ, అతడి పరివారమూ నా కొక లెక్కా?'

**విశేషం:** బలారి, పురారి వాళ్ళ వాళ్ళ సైన్యాలతో దండెత్తటం ఒక ఎత్తు. కానీ తన తండ్రీ, మేనమామా దండెత్తి వచ్చినా జయిస్తాను అనటం విశేషం. ఇక్కడ తిక్కన 'కినిసి, కడంగి' - క్రీడీ, శ్రీకృష్ణుడూ ఎదిరించి రావటాన్ని సమర్థమైన అచ్చ తెలుగు అసమాపక క్రియాపదాలలో ఎంతో ఔచిత్యంగా కూర్చాడు.

**వ. అని పలికి వాని యాలాపంబు నాలంబుసేసి యభిమన్యుండు పెలుచం దఱిమిన వాఁ డనుమానించుచు మన సైన్యంబునకు సమ్ముఖంబుగాఁ దేరు నడపుటయు, వారి సేనయుం దోడన కడంగుటయుం గనుంగొని భారద్వాజ ప్రముఖ యోధు లొండొరులకుం దల మిగిలి యేచి యెదుర్కొని పెలుచ నిలిచిన, సంకుల సమరం బయ్యెఁ; నట్టియెడ. 16**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలికి= చెప్పి; వాని= ఆ సారథియొక్క; ఆలాపంబున్= మాటను; ఆలంబు+చేసి= ఉపేక్షచేసి (ఒప్పరికించి లేదా నిర్లక్ష్యం చేసి); అభిమన్యుండు= అభిమన్యుడు; పెలుచన్= ఆగ్రహముతో (ఆటోపంతో); తఱిమినన్= వెంబడించి పరుగెత్తగా; (తోలుకొనిపోగా); వాఁడు= ఆ సారథి; అనుమానించుచున్= సందేహిస్తూ; మన సైన్యంబునకున్= మన సేనకు; సమ్ముఖంబుగాన్= ఎదురుగా; తేరు= రథం; నడపుటయున్= నడిపించటమున్నూ; వారి+సేనయున్= వాళ్ళ సైన్యం కూడా; తోడన= వెంటనే; కడంగుటయున్= పూనుకోవటమున్నూ; కనుంగొని= చూచి; భారద్వాజ ప్రముఖయోధులు= ద్రోణుడు మొదలుగాగల యుద్ధవీరులు; ఒండొరులకున్= ఒకరి కొకరు; తలమిగిలి= మీరి; ఏచి= అతిశయించి; ఎదుర్కొని= తలపడి; పెలుచన్= ఆధిక్యంతో (క్రౌర్యంతో); నిలిచినన్= నిలువగా; సంకుల సమరంబు= దొమ్మియుద్ధం; అయ్యెన్= జరిగింది; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో.

**తాత్పర్యం:** సుమిత్రుడి మాటలను అభిమన్యుడు లెక్కచేయకుండా ఆటోపంతో వెంబడించగా, రథసారథి అనుమానిస్తూ మన సైన్యానికి ఎదురుగా రథాన్ని నడిపాడు. వాళ్ళ సైన్యం కూడా వెంటనే పూనుకొనగా ద్రోణాదులు ఒకరిని మించి ఒకరు అతిశయిస్తూ ఎదుర్కొన్నారు. ఈ విధంగా దొమ్మియుద్ధం జరిగింది. అప్పుడు - (తరువాతి పద్యంతో అన్వయం).

## అభిమన్యుఁడు పద్మవ్యూహంబు భేదించుకొని చొచ్చుట ( సం. 7-35-12)

**ఆ. మెఱుఁగు మెఱచినట్లు మెఱయంగ నరదంబు । కర్ణికార కేతు కాంతి వెలుఁగ**
**నంపగముల గురుని నలయించి కడచి యిం । ద్రజుని కొడుకు మొగ్గరంబు సొచ్చె. 17**

**ప్రతిపదార్థం:** అరదంబు= రథం; మెఱుఁగు మెఱచినట్లు= మెరుపు మెరిసిన విధంగా; మెఱయంగన్= ప్రకాశించగా; కర్ణికార, కేతు, కాంతి= కొండగోగు గుర్తుగల జెండాయొక్క వెలుగు; వెలుఁగన్= మెఱసిపోగా; అంపగములన్= బాణాల గుంపులచేత; గురునిన్= ద్రోణాచార్యుడిని; అలయించి= అలసట పొందేటట్లు చేసి; కడచి= దాటి; ఇంద్రజుని కొడుకు= అర్జునుడి కుమారుడైన అభిమన్యుడు; మొగ్గరంబున్= వ్యూహాన్ని; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** రథం మెరుపు మెరిసినట్లు ముందుకు దూకింది. రథంపై ఉండే కొండగోగు గుర్తు గల జెండా ప్రకాశించింది. అభిమన్యుడు బాణ పరంపరలతో ద్రోణాచార్యుడిని అలతపెట్టి పద్మవ్యూహంలో ప్రవేశించాడు.

**విశేషం:** ఈ ఆటవెలది దేశీయమైన ఛందస్సు. అందువలన ఎక్కువగా అచ్చ తెలుగు పదాలే ఉంటే అందం అని తిక్కన ఊహించినట్లుంది. 'కర్ణికారకేతు కాంతి'; 'గురుని', 'ఇంద్రజు' అనే పదాలు తప్ప పద్యమంతా తేట తెనుగు ఇంపుసొంపులతో నింపబడింది. బాలుడైన అభిమన్యుడిలో ధైర్యశౌర్యాల గుణాలు ఉన్నా, మార్దవం అనేది ఎక్కడికి పోతుంది? ఈ మార్దవమే రచనలో కూడా చోటు చేసుకొనింది. 'ఇంద్రజుని' అనే పదంలోని విరుపు తళుక్కుమనే మెరుపులోని ఝటితి స్ఫూర్తిని సూచిస్తూ ఉన్నది.

**వ ఇ ట్లనన్యభేద్యం బగు నా పద్మవ్యూహంబు భేదించి సొచ్చి సౌభద్రుండు రౌద్ర రసోల్లసితమూర్తియై యందు మహార్ణవంబునం దిరుగు మందరనగంబు చందంబునం, గాననంబునం జరియించు తీవ్రానలంబు తెఱంగునఁ గాలపక్వజనసమాజ సంహరణ క్రీడనంబు సలుపు శూలిపోలికం గేలీగతుల మెలంగి, యమ్మెయి నమ్మోహరంబు ద్రిప్పుకొలిపియుం బొడిసేసియు రూపుమాపియు రణవిహారం బొనరింప, నవ్వీరవరు నారాచాది నానావిధ విశిఖ వ్రాతంబులు, హేతి సంఘట్టనంబున మండుచుఁ, గరుల నుచ్చిపోవుచుఁ, దేరుల విఱుచుచు, హయంబుల ధట్టంబుల నుఱుము సేయుచుఁ గాల్బలంబులఁ జిదుపుచు, గేతువులం ద్రుంచుచు, నాతపత్రంబుల నుఱుమాడుచు, రథ్యంబులం గూల్చుచు, సూతుల గీటడంగించుచు, ధనువులు దునుముచు, మైమఱువుల వ్రచ్చుచు, భూషణంబుల డుల్చుచుఁ గరవాలంబులఁ ద్రోయుచు, మేనులు సించుచుఁ దూపులు దూలించుచు, జేతులు నఱకుచుఁ, సబళంబులు జడియుచు, దలలు చిదుముచు, నంకుశంబులు రాల్చుచు, నెత్తురు లురలించుచుఁ, గండలు సెక్కుచు, నెమ్ములు నలఁచుచుఁ బరఁగిన నమ్మొన చిక్కువడియును, నుడి వడియును, గలంగియుఁ, దొలంగియు, వెఱచఱచియు, విచ్చిపఱచియు దీనదశకు వచ్చినం గనుంగొని. 18**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అనన్యభేద్యంబు+అగు= ఇతరులచేత భేదించటానికి వీలుకానిది అగు; ఆ+పద్మవ్యూహంబున్= పద్మాకారం గల ఆ మొగ్గరాన్ని; భేదించి= చీల్చి; చొచ్చి= ప్రవేశించి; సౌభద్రుండు= అభిమన్యుడు; రౌద్రరస+ఉల్లసితమూర్తి+ఐ= రౌద్రం అనే రసంచేత ఒప్పిన ఆకారం కలవాడై; అందున్= ఆ సైన్యంలో; ఆ వ్యూహంలో; మహా+అర్ణవంబునన్= గొప్ప సముద్రంలో; తిరుగు మందరనగంబు చందంబునన్= తిరిగే మందర పర్వతంవలె; కాననంబునన్= అడవిలో; చరియించు= వ్యాపించు; తీవ్ర+ అనలంబు+తెఱంగునన్= తీక్ష్ణమైన కార్చిచ్చు మాదిరి; కాలపక్వజన= జీవితకాలం ముగిసిన జనులయొక్క; సమాజ= సమూహాన్ని;సంహరణ క్రీడనంబు= చంపటం అనే ఆటను; సలుపు= నిర్వర్తించే; శూలిపోలికన్= శివుడివలె; కేలీగతులన్= విలాసంగా విహరించే నడకలతో; మెలంగి= మెలగి; ఆ+మెయిన్= ఆ రీతిగా; ఆ+మోహరంబున్= ఆ వ్యూహాన్ని;త్రిప్పుకొలిపియున్= వెనుకకు మళ్ళేటట్లు చేసి; పొడిచేసియున్= నుగ్గుగావించి; రూపుమాపియున్= నశింపజేసి; రణవిహారంబు= యుద్ధంలోవిహరించటం;

ఒనరింపన్= చేయగా; ఆ+వీరవరు= వీరశ్రేష్ఠుడైన ఆ అభిమన్యుడి; నారాచాది నానా విధవిశిఖ వ్రాతంబులు= నారసము మొదలగు అనేక విధాలైన బాణాల గుంపులు; హేతిసంఘట్టనంబునన్= ఆయుధాల రాపిడి వలన; మండుచున్= మంటలు రేగుతూ; కరులన్= ఏనుగులను; ఉచ్చిపోవుచున్= చీల్చుకొని పోతూ; తేరులన్= రథాలను; విఱుచుచున్= విరగగొట్టుతూ; హయంబుల ధట్టంబులన్= గుర్రాల మొత్తాన్ని; నుఱుము సేయుచున్= తుత్తుమురు చేస్తూ; కాల్బలంబులన్= పదాతి సైన్యాన్ని (సైనికులను); చదుపుచున్= చంపుతూ (అణచివేస్తూ); కేతువులన్+త్రుంచుచున్= జెండాలను విరిచివేస్తూ; ఆతపత్రంబులన్= గొడుగులను; నుఱుమాడుచు= నుగ్గుచేస్తూ; రథ్యంబులన్= గుర్రాలను; కూల్చుచున్= నేల కూలేటట్లు చేస్తూ; సూతులన్= సారథులను; గీటు+అడంగించుచున్= చంపుతూ; ధనువులన్= విండ్లను; తునుముచున్= ముక్కలు ముక్కలు చేస్తూ; మైమఱువులన్= కవచాలను; వ్రచ్చుచున్= చీల్చివేస్తూ; భూషణంబులన్= ఆభరణాలను; డుల్చుచున్= రాలుస్తూ; కరవాలంబులన్= ఖడ్గములను; త్రోయుచున్= నెట్టివేస్తూ; మేనులు= శరీరాలు; చించుచున్= చీల్చుతూ; తూపులు= బాణాలు; తూలించుచున్= చెదరగొడుతూ; చేతులన్= హస్తాలను; నఱకుచున్= ఖండిస్తూ; సబళంబులు= ప్రాసములు అనే ఆయుధాలను; జడియుచున్= త్రిప్పుతూ; తలలు= శిరస్సులు; చిదుముచున్= త్రుంచివేస్తూ; అంకుశంబులు= బరిగోలలు; రాల్చుచున్= క్రిందపడేటట్లు చేస్తూ; నెత్తురులు= రక్తం; ఉరలించుచున్= ప్రవహింపజేస్తూ; కండలు= మాంసఖండాలు; చెక్కుచున్= ఖండిస్తూ; ఎమ్ములు= ఎముకలు; నలఁచుచున్= నలిగేటట్లు చేస్తూ; పరఁగిన= ఒప్పినటువంటి; ఆ+మొన= ఆ మొగ్గరం; చిక్కువడియును= సంకటపడియూ; సుడివడియును= చలించియు; కలంగియున్= కలతపడియు; తొలంగియున్= తొలగిపోయియు; వెఱచఱచియున్= భయపడియు; విచ్చి= చెదరి; పఱచియున్= పరుగెత్తియు; దీనదశకున్= దీనమైన పరిస్థితికి; వచ్చినన్= రాగా; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** భేదించటానికి వీలుకాని పద్మవ్యూహాన్ని అభిమన్యుడు ప్రవేశించి, సముద్రాన్ని మథించే మందరపర్వతం రీతిలో, అడవులను కాల్చివేసే కార్చిచ్చు మాదిరి, కాలం ఆసన్నమైన వాళ్ళను సంహరించే శివుడి విధంగా, యుద్ధాన్ని ఒక క్రీడగా ఎక్కడ చూచినా తానే అనే రీతిలో రణరంగ విహారం చేశాడు. మొగ్గరాన్ని మళ్ళించాడు. అతడి బాణాలు, ఖడ్గాలు మంటలు గ్రక్కుతూ రథ, గజ, తురగ, పదాతివర్గాలను చీల్చి చెండాడాయి. ఎక్కడ జెండాలు అక్కడ కూలిపోయాయి. గొడుగులు నుగ్గు అయ్యాయి. గుర్రాలు, సారథులు నశించారు. ధనుస్సులు ముక్కలయ్యాయి. కవచాలూ, ఆభరణాలు చీలి రాలిపోయాయి. రకరకాల ఆయుధాలు నామరూపాలు లేకుండా నుగ్గు నుగ్గు అయ్యాయి. తలలు తెగాయి. నెత్తురు ప్రవహించింది. కండలు చెక్కబడ్డాయి. ఎముకలు పిండి అయ్యాయి. ఆ విధంగా ఆ మొగ్గరం పూర్తిగా చిక్కుబడిపోయింది. కలతతో, భయంతో విడివడి పరుగులెత్తింది. ఇట్టి దైన్యపరిస్థితిని చూచి.

**విశేషం:** అలం: మాలోపమ.

**క. వీఁకమెయిఁ గ్రీడి కొడుకుం । దాఁకఁగ నీ కొడుకు తలఁచి తఱిమి కవిసెఁ బే**
**రాఁకలితో నున్న హరిం । దేఁకువ సెడి చేరు కరిగతిం గురుముఖ్యా! 19**

**ప్రతిపదార్థం:** కురుముఖ్యా!= ధృతరాష్ట్రా!; పేరు+ఆఁకలితోన్+ఉన్న+హరిన్= మిక్కిలి ఆకలితో ఉండే సింహాన్ని; తేఁకువ+చెడి= భయంవీడి; చేరు= సమీపించే; కరిగతిన్= ఏనుగు మాదిరి; వీఁకమెయిన్= గర్వంతో; క్రీడికొడుకున్= అర్జునుడి కొడుకైన అభిమన్యుడిని; తాఁకఁగన్= ఎదిరించటానికి; నీకొడుకు= నీ పెద్ద కొడుకైన దుర్యోధనుడు; తలఁచి= ఎంచి; తఱిమి= తరుముకొని వచ్చి; కవిసెన్= చుట్టుముట్టాడు; ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! ఆకలితో ఉండే సింహాన్ని ఏనుగు సమీపించేటట్లుగా నీ కొడుకు దుర్యోధనుడు అభిమన్యుడిని తరుముకొని వచ్చి (ఎదుర్కొన్నాడు).

**విశేషం:** అలం: ఉపమ. 'కురుముఖ్యా!' అని ధృతరాష్ట్రుడిని సంజయుడు సంబోధిస్తున్నాడు. కౌరవపక్షంలో ధృతరాష్ట్రుడు కురుముఖ్యుడయితే పాండవపక్షంలో కురుముఖ్యుడు ధర్మరాజు. ఉభయపక్షాల వారికీ కురువు మూలవంశ కర్త. సందర్భానుసారంగా కురుముఖ్యులు భేదిస్తూ వుంటారు. దుర్యోధనుడు ఆకారంలో పెద్దవాడు. అతడు పసిపిల్లవానిపై దండెత్తుతూ వున్నాడు. సింహం ఆకృతిలో ఏనుగు కంటె చిన్నది. గర్వం పొంగి ఉత్సాహం ఉరకలు వేసినప్పుడు తన ఆటోపమే కాని ఎదుటివాళ్ళ శక్తి సామర్థ్యాలు తెలియవు. 'వీఁకమెయిన్' అనే ప్రయోగంలో ఇదే భావం పాఠకులకు స్ఫురిస్తుంది. 'తేఁకువ సెడి' అనే పదబంధం కూడా ఎంతో అర్థవంతంగా ఉన్నది.

**వ. ఇట్లు సౌభద్రుఁ జెనయం జూచు సుయోధనుం జూచి శరాసనగురుండు సైనికవరులకుం జేయి వీచి యెలుంగెత్తి. 20**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సౌభద్రున్= అభిమన్యుడిని; చెనయన్= ఎదిరించటానికి; చూచు= ఆలోచించే; సుయోధనున్= దుర్యోధనుడిని; శరాసనగురుండు= ధనురాచార్యుడైన ద్రోణుడు; చూచి= కనుగొని; సైనికవరులకున్= సైన్యంలో శ్రేష్ఠులైన వారికి; చేయివీచి= చే సైగ చేసి; ఎలుంగెత్తి= బిగ్గరగా.

**తాత్పర్యం:** అభిమన్యుడిని ఎదుర్కొనటానికి ఆలోచించే సుయోధనుడిని ద్రోణుడు చూచి, తన సైనికులలో ముఖ్యులైన వాళ్ళకు చేసైగ చేసి, గొంతెత్తి బిగ్గరగా ఇట్లా అన్నాడు:

**విశేషం:** ఇచ్చట సుయోధనుడు అనే ప్రయోగం గమనింపదగింది. మంచి యోధనం - యుద్ధం చేసేవాడు సుయోధనుడు. అతడు మంచి యుద్ధమే చేసే పక్షంలో ఒక్కడే అభిమన్యుడిని ఎదుర్కొని అతడి ధాటికి తట్టుకోలేడు అని సర్వ సైన్యాధ్యక్షుడు ఊహించాడు.

**క. 'నరసుతున కగ్గమయ్యెం । గురుధరణీవల్లభుం డకుంఠితగతి మీ**
**రరుగుం డేయుం డడ్డము । చొరుఁడు వెరవు లావు నెఱయ శూరత మెఱయన్.' 21**

**ప్రతిపదార్థం:** కురు ధరణీవల్లభుండు= దుర్యోధనుడు; నరసుతునకున్= అభిమన్యుడికి; అగ్గము+అయ్యెన్= కంటపడ్డాడు; మీరు= సైనిక వీరులైన మీరు అందరూ; అకుంఠితగతిన్= మొక్కవోని విధంగా; వెరవు= ఉపాయం; లావు= బలం; నెఱయన్= నిండుకొనేటట్లుగా; శూరత= శౌర్యం; మెఱయన్= ప్రకాశించే విధంగా; అరుగుండు= పొండి; ఏయుండు= బాణాలను ప్రయోగించండి; అడ్డము చొరుఁడు= అడ్డుపడండి (అడ్డుకొనే విధంగా ప్రవేశించండి).

**తాత్పర్యం:** 'దుర్యోధనుడు అభిమన్యుడి దృగ్గోచరుడయ్యాడు. సైనిక వీరులైన మీరు కుంటువోని ఉపాయాన్ని, బలాన్ని నెరపండి. శౌర్యాన్ని నిరూపించండి. త్వరగా పొండి. బాణాలు వేయండి. అడ్డుపడండి.'

**విశేషం:** అనుకోని సంఘటన యుద్ధరంగంలో సంభవించినప్పుడు, అందులోనూ ఆ ముఖ్యమైన వ్యక్తి ఆపదలో ఉన్నాడని తెలిసినప్పుడు, సర్వసైన్యాధ్యక్షుడు ఏ విధంగా ప్రధాన సైనికులను ఆదేశిస్తాడో ఈ పద్యంలో తిక్కన చాలా చక్కగా వక్కాణించాడు. ఆపదలో ఉన్న వ్యక్తిని ఏ విధంగా ఆదుకొనాలో ద్రోణుడిచ్చిన సూచనలు ఈ కంద పద్యంలో ఒక విలక్షణ గతిలో తిక్కన తెలిపాడు. 'అకుంఠితగతి' అనే ప్రయోగం అటు సైనికవీరులను ఉద్దేశించే కాకుండా పద్య గమనానికి కూడా అన్వయించుకొనాల్సి ఉంది.

**వ. అనుచుఁ దనయరదం బద్దెస మొగంబు సేసి పురికొల్పిన. 22**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని ఆ విధంగా; సైనికవీరులకు తెలుపుతూ; తన+అరదంబు= తన రథం; ఆ+దెస+మొగంబు+చేసి= ఆ వైపు మళ్ళించి; పురికొల్పినన్= ప్రేరేపించగా.

**తాత్పర్యం:** ద్రోణుడు ఆ విధంగా సైనిక వీరులకు తెలుపుతూ, తాను తన రథాన్ని ఆ వైపు మళ్ళించి వాళ్ళను ఎంతో ప్రేరేపించగా - (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. కృపుఁడు గురు సుతుండుఁ గృతవర్మ గర్ణుండు । సోమదత్తి శలుఁడు సౌబలుండు**
**పౌరవుండు మద్రపతి వృషసేనుండు । గౌరవేశ్వరుండుఁ గడఁగి రపుడు. 23**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; కృపుఁడు= కృపాచార్యుడు; గురుసుతుండు= అశ్వత్థామ; కృతవర్మ= యదువంశంలోని వాడైన హృదికుడి కొడుకు; కర్ణుఁడు; సోమదత్తి= సోమదత్తుడి కొడుకైన భూరిశ్రవుడు; శలుఁడు= సోమదత్తుడి కొడుకు; సౌబలుండు= శకుని; పౌరవుండు= యయాతి కొడుకైన పురుసంతతివాడు; మద్రపతి= మద్రదేశాధిపతి అయిన శల్యుడు; వృషసేనుండు= కర్ణుడి కొడుకు; కౌరవేశ్వరుండు= దుర్యోధనుడు; కడఁగిరి= పూనుకొన్నారు.

**తాత్పర్యం:** ద్రోణుడి ప్రేరణతో కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ, కర్ణుడు, భూరిశ్రవుడు, శలుడు, శల్యుడు, పౌరవుడు, కౌరవేశ్వరుడు, వృషసేనుడు మొదలైన ప్రముఖులు ఒకటిగా చేరి పోరాటానికి ఉపక్రమించారు.

**వ. అట్లు గడంగి. 24**

**తాత్పర్యం:** ఆ విధంగా పూనుకొని.

**చ. ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరంబయి పల్వురు వీఁక భూమి పా**
**లకునకు నడ్డమైనఁ దవులంబడి హుమ్మని నోరికండ నాఁ**
**చికొనిన మ్రోఁగు బెబ్బులి విశేషము దోఁపఁగఁ బార్థుపట్టి సా**
**యకముల నొంచినం దెరలి రందఱు లేళులపిండు నాకృతిన్. 25**

**ప్రతిపదార్థం:** పల్వురు= అనేకులు; ప్రకట+బల+ఆఢ్యులు= ప్రసిద్ధి కెక్కిన బలంచేత శ్రేష్ఠులు; ఒక్కటన్= ఒక్కుమ్మడిగా, ఒక్కపెట్టుగా; తిరంబు+అయి= స్థిరమై; వీఁకన్= గర్వంతో; భూమిపాలకునకున్= దుర్యోధనుడికి; అడ్డము+ఐనన్= అడ్డం రాగా; తవులన్+పడి= తగిలి; హుమ్మని= హుంకరించి; నోరికండ+నాఁచికొనినన్= నోటిలోని ఆహారాన్ని అపహరించగా; మ్రోఁగు= అరచే; బెబ్బులి= పెద్దపులి; విశేషము+తోఁపన్+కన్= విధం (అతిశయం) స్ఫురించేటట్లు; పార్థుపట్టి= అర్జునుడి కొడుకైన అభిమన్యుడు; సాయకములన్= బాణాలతో; నొంచినన్= బాధపెట్టగా; అందఱున్= ఎదిరించిన శూరులందరూ, లేళులపిండు+ఆకృతిన్= జింకల గుంపువలె; తెరలిరి= చెదరిపోయారు.

**తాత్పర్యం:** మహాబలవంతులైన అనేకులు ఒక్కుమ్మడిగా దుర్యోధనుడికి రక్షగా అడ్డంనిలబడ్డారు. ఆ విధంగా అడ్డంగా ప్రవేశించిన సందర్భంలో అభిమన్యుడు, నోటిలోని మాంసపుకండను లాగుకొంటే ఆక్రోశించే పెద్దపులి వలె హుంకారం చేసి బాణాలు ప్రయోగించగా, ఎదిరించిన శూరులు అందరూ జింకల గుంపులవలె(జంకి) అదరి బెదరి చెదరిపోయారు.

**విశేషం:** ఈ పద్యం ఎత్తుగడ 'ప్రకట బలాఢ్యులు'. కానీ, వారు చివరికి ఏమయ్యారు? 'లేళులపిండు' వలె తెరలిపోయారు. ఈ మధ్యలో జరిగిన విశేషం. అదే 'హుమ్మని నోరికండ నాఁచికొనిన మ్రోఁగు బెబ్బులి విశేషం. ఇచ్చట 'విశేషము' అనటంలోనే ఎంతో విశేషం ఉన్నది. 'విశేషము' అనే పదానికి అతిశయమూ, వింతరూపమూ, భేదమూ, వృత్తాంతమూ అనే అర్థాలున్నాయి. తినే తిండిని లాగినప్పుడు బెబ్బులి గాండ్రిస్తూ అంతకుముందు లేని ఒక వింతరూపాన్ని, అతిశయమైన అవయవ విన్యాసాన్ని ప్రదర్శిస్తుంది. ఈ భేదం ఎట్లా కలిగింది? పరిస్థితుల ప్రభావం వలన. ఇట్లా అభిమన్యుడి వృత్తాంతాన్ని కూడా సమన్వయం చేసికొనవచ్చు. అలతి అలతి పదాలలో అనల్పమైన అర్థ గౌరవాన్ని శిల్పకళా పారమ్యంతో ప్రతిపాదించటం తిక్కన రచనా విశేషం.

**వ. ఇ వ్విధంబున నయ్యోధవరులు విచ్చిన, వివ్వచ్చుకొడుకు పేర్చి యార్చిన నాచార్యుండు వీఁడు వీరిచేత నిలువండని తా నరిగి యన్నరనందను నెదుర్కొనిన వారును గూడుకొని పొదివిన. 26**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; ఆ+యోధవరులు= ఆ యుద్ధవీరులు; విచ్చినన్= చెదరి విడివడిపోగా; వివ్వచ్చు కొడుకు= అర్జునుడి కుమారుడైన అభిమన్యుడు; పేర్చి= విజృంభించి; ఆర్చినన్= గర్జించగా; ఆచార్యుండు= ద్రోణుడు; వీఁడు= ఈ అభిమన్యుడు; వీరిచేన్= ఈ యోధులచేత; నిలువండు+అని= ఆగడని; తాన్= తాను; అరిగి= పోయి; ఆ+నరనందనున్= ఆ అభిమన్యుడిని; ఎదుర్కొనినన్= మార్కొనగా; వారును= ఆ యోధవరులున్నూ; కూడుకొని= ఒకటిగా కవిసికొని; పొదివినన్= చుట్టుముట్టగా.

**తాత్పర్యం:** ఈ విధంగా యుద్ధవీరులను చెదరగొట్టి, అభిమన్యుడు మిక్కిలి విజృంభించి గర్జించగా, ఆ యోధులు ఇతడిని అరికట్టలేరని ద్రోణుడు స్వయంగా తానే అభిమన్యుడిని ఎదుర్కొన్నాడు. ఇంతలో ఆ యోధవీరులు కూడా వచ్చి ద్రోణుడిని కలిసికొన్నారు. అందరూ చుట్టుముట్టగా.

**క. అతఁ డందఱ మార్గణములు । నతిరయమునఁ ద్రుంచుచుం దదంగముల శర**
**ప్రతతులు నించుచుఁ బోరఁగఁ । బతి సేనకుఁ జేయి వీచె బరవస మలరన్. 27**

**ప్రతిపదార్థం:** అతఁడు= అభిమన్యుడు; అందఱ మార్గణములున్= అందరి బాణాలను; అతిరయమున్= మిక్కిలి వేగంగా; త్రుంచుచున్= ఖండిస్తూ; తద్+అంగములన్= వాళ్ళ అవయవాలలో; శరప్రతతులు= బాణాల మొత్తము; నించుచున్= నిండిస్తూ (చేరేటట్లు చేస్తూ); పోరన్= యుద్ధం చేయగా; బరవసము= ధైర్యం; అలరన్= అతిశయించగా; పతి= దుర్యోధనుడు; సేనకున్= సైన్యానికి; చేయి వీచెన్= చేసైగ చేశాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు అందరి బాణాలను వెంటనే త్రుంచివేస్తూ, తాను అందరి అవయవాలలో బాణాల మొత్తం నింపి పోరాడుతూ ఉండగా అంతలో దుర్యోధనుడు ధైర్యం పుంజుకొని సైన్యానికి చేయి వీచాడు.

**క మనసేన పెలుచఁ గడఁగిన । వననిధి పొంగెడు విధంబు వాసవిసుతుఁ డే**
**చినఁ జెలియలికట్ట తెఱం । గును గానఁగనయ్యె నపుడు కురువంశనిధీ! 28**

**ప్రతిపదార్థం:** కురువంశనిధీ!= ఓ ధృతరాష్ట్రా!; అపుడు= ఆ సమయంలో; మనసేన= మనసైన్యం; పెలుచన్= అధికంగా; కడఁగినన్= ప్రయత్నించగా; వననిధి= సముద్రం; పొంగెడు విధంబున్= పొంగే రీతి; వాసవి, సుతుఁడు= అర్జునుడి కొడుకు - అభిమన్యుడు; ఏచినన్= విజృంభించగా; చెలియలికట్ట, తెఱంగును= ఒడ్డు విధమూ; కానఁగనయ్యెన్= చూపట్టింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రా! మన సైన్యాలు సముద్రం పొంగినట్లు అతిశయించి రాగా, వాటిని అడ్డగిస్తూ అభిమన్యుడు సముద్రపు గట్టు వలె కనిపించాడు.

**విశేషం:** ద్రోణుడి ప్రేరణతో కౌరవసైన్యం సముద్రం వలె విజృంభించి పొంగింది. వననిధితో కౌరవసైన్యాన్ని పోల్చటం వలన అది ఎంతో విస్తారమూ, గాంభీర్యమూ అయినదని తెలుస్తూ ఉన్నది. సముద్రం మాత్రం విజృంభించి చెలియలికట్ట మామూలుగానే ఉంటే ముంపు తప్పదు. అందుకే 'ఏచిన చెలియలికట్ట' తో అభిమన్యుడిని పోల్చాడు. సముద్రం, ఎంత పొంగుతూ ఉన్నదో అంతకు మించి సముద్రపు గట్టు కూడా మిక్కిలి విజృంభించిం దని చెప్పటం ఔచితీమంతంగా ఉన్నది.

**వ. ఆ సమయంబున. 29**

**తాత్పర్యం:** ఆ సందర్భంలో.

**సీ.** **రారాజుఁ గృపుఁడును భూరిశ్రవుండు మూఁ । డేసి యమ్ములు పదియేడు గురుఁడు**
**వినుము! వివింశతి వింశతి విశిఖంబు । లాచార్యసుతుఁడు బృహద్బలుండు**
**నైదు నెన్మిదియును నాఱు శల్యుఁడు, సప్త । శరములు గృతవర్మ సౌబలుండు**
**రెండు బాణములు పండ్రెండు తొమ్మిదియును । దుశ్శాసనుండును దుస్సహుండు**

**తే.** **నేసి రర్జునసుతుమీఁద నెల్లవారి । తనువులందును సాయక త్రయము లతఁడు**
**గ్రుచ్చె; నశ్మకుఁ డదరినఁ గూల నేసెఁ । దురగసూతకేతనములతోడఁగూడ.** 30

**ప్రతిపదార్థం:** వినుము= వినుము; రారాజున్= దుర్యోధనుడూ; కృపుఁడును= కృపాచార్యుడూ; భూరిశ్రవుండు= శంతనుడి సోదరుడైన బాహ్లికుడి కొడుకు; మూఁడేసి అమ్ములున్= ఒక్కొక్కరు మూడేసి బాణాలు; గురుఁడు= ద్రోణుడు; పది ఏడున్= పదిహేడున్నూ; వివింశతి= చాక్షుషుడి కొడుకు; వింశతి విశిఖంబులున్= ఇరవై బాణాలున్నూ; ఆచార్యసుతుఁడు= అశ్వత్థామ; ఐదు= ఐదు బాణాలు; బృహద్బలుండు= బృహద్బలుడు (శకుని తమ్ముడు); ఎన్మిదియును= ఎనిమిది బాణాలు; శల్యుండు= శల్యుడు; ఆఱు= ఆరు బాణాలు; కృతవర్మ; సప్త శరములున్= ఏడు బాణాలు; సౌబలుండు= శకుని; రెండు బాణములు= రెండు బాణాలు; దుశ్శాసనుండును= దుశ్శాసనుడు; పండ్రెండున్= పండ్రెండు బాణాలు; దుస్సహుండు= దుర్యోధనుడి తమ్ముడు దుస్సహుడు అనేవాడు; తొమ్మిదియును= తొమ్మిది బాణాలు; అర్జునసుతుమీఁదన్= అభిమన్యుడిపై; ఏసిరి= ప్రయోగించారు; అతఁడు= ఆ అభిమన్యుడు; ఎల్లవారి= అందరి; తనువులందును= దేహాలలో; సాయకత్రయములు= మూడేసి బాణాలు; గ్రుచ్చెన్= నాటాడు; అశ్మకుఁడు= కల్మాషపాదుడి కొడుకు అశ్మకుడు; అదరినన్= పైకొనగా(పైకి రాగా); తురగ+సూత+కేతనము+తోడన్+కూడన్= గుర్రాలు, సారథి, జెండాలతో కలిసే విధంగా; కూలన్+ఏసెన్= అతడిని కూలేటట్లు (పడగొట్టాడు), బాణాలు ప్రయోగించాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడిమీద దుర్యోధన, కృప, భూరిశ్రవులు ఒక్కొక్కరు మూడేసి బాణాలు, ద్రోణుడు పదిహేడు, వివింశతి ఇరవై, అశ్వత్థామ, బృహద్బల, శల్య, కృతవర్మ, శకుని, దుశ్శాసన, దుస్సహులు వరుసగా ఐదు, ఎనిమిది, ఆరు, ఏడు, రెండు, పండ్రెండు, తొమ్మిది బాణాలు ప్రయోగించారు. అప్పుడు అతడు అందరిమీదా మూడేసి బాణాలను తీవ్రంగా గ్రుచ్చాడు. అశ్మకుడు పైకి రాగా అతడినీ, అతడి గుర్రాలను, రథసారథిని, జెండాను నేలకూలేటట్లు చేశాడు.

**దుర్యోధన ప్రభృతి మహారథికు లందఱు నొక్కుమ్మడి నభిమన్యునిపైఁ గవియుట (సం. 7-36-22)**

**వ.** **ఇవ్విధంబున నశ్మకుండు పడినఁ దెరలు బలంబుల మరలనీక పురికొల్పుకొని యప్పటి యాచార్య ప్రభృతి యోధులును నీ కొడుకులలోనఁ గొందఱును గ్రందుగం దఱిమి యనేకాస్త్రశస్త్ర పరంపరలం బొదివిన నొదవిన కినుకం గిరీటినందనుం డందఱమేనులు నానా నిశిత విశిఖ వేగంబున నెత్తుట జొత్తిల్లం జేసి కర్ణుపయిం గవిసి.** 31

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; అశ్మకుండు= కల్మాషపాదుడి కొడుకు; పడినన్= నేలకు ఒరుగగా; తెరలు+బలంబులన్= తొలగిపోయే సైన్యాలను; మరలన్+ఈక= వెనుకకు తిరగనీయకుండా; పురికొల్పుకొని= ప్రేరేపించుకొని; అప్పటి+ఆచార్య ప్రభృతి యోధులును= ఆ సందర్భంలో అక్కడ ఉన్న ద్రోణాచార్యుడు మొదలైన యుద్ధవీరులు; నీ కొడుకుల లోనన్+కొందరును= నీ కుమారులలో కొంతమంది; క్రందుగన్= అధికంగా(దట్టంగా); తఱిమి= తోలి; అనేక+అస్త్ర+శస్త్ర పరంపరలన్= అనేకములైన అస్త్రాలు, ఖడ్గాల వరుసలతో; పొదివినన్= ఆవరించగా; ఒదవిన+కినుకన్= కలిగిన కోపంతో; కిరీటి నందనుండు= అభిమన్యుడు; అందఱమేనులు= ఆ యోధుల అందరి శరీరాలు; నానా+నిశిత+విశిఖ వేగంబునన్= రకరకాల వాడిఅయిన బాణాల వేగంతో; నెత్తుటన్= రక్తంలో; జొత్తిల్లన్+చేసి= ఎర్రబారేటట్లు చేసి; కర్ణుపయిన్= కర్ణుడి మీదికి; కవిసి= దాడిచేసి.

**తాత్పర్యం:** అశ్మకుడు నేలకూలగానే, వెనుకంజ వేసే సైన్యాన్ని తిరిగి పోనీకుండా పురికొల్పి, ద్రోణాది యోధులు, మరికొంతమంది నీ కుమారులు మిక్కిలి తీవ్రంగా ఎదుర్కొని రకరకాల అస్త్రాలతో, శస్త్రాలతో క్రమ్ముకోగా, కోపించిన అభిమన్యుడు, అప్పుడు అక్కడ ఉండే అందరి శరీరాలపైన పదునైన బాణాలు మహాతీక్ష్ణంగా నాటి నెత్తురు పారేటట్లు చేశాడు. అటుపిమ్మట కర్ణుడిపైకి దూకి.

**తే.** **కంకటము దూఱి యంగంబు గాఁడిపోవఁ । గ్రూరనారాచ మేసిన స్రుక్కె నతఁడు**
**లీల నట్టివ పఱపి భూపాల! నీదు । సుతుల వెనుకకుఁ బఱపె నుద్ధతి దలిర్ప.** **32**

**ప్రతిపదార్థం:** భూపాల!= రాజా! ధృతరాష్ట్రా!; కంకటము దూఱి= కవచంలోకి ప్రవేశించి; అంగంబు= శరీరం; కాఁడి= రంధ్రం చేసికొని; పోవన్= పోగా; క్రూర నారాచము= వాడియైన బాణం; ఏసినన్= ప్రయోగింపగా; అతఁడు= కర్ణుడు; స్రుక్కెన్= సోలి పడిపోయాడు; లీలన్= విలాసంగా; అట్టివ= అటువంటి బాణాలే; పఱపి= ఏసి; ఉద్ధతి తలిర్పన్= గర్వం అతిశయించగా; నీదు సుతులన్= నీ కొడుకులను; వెనుకకున్= వెనుకకు; పఱపెన్= తరిమాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! కవచంలోకి దూరి, శరీరం తూటు పడేటట్లు వాడియైన బాణాన్ని ప్రయోగించగా కర్ణుడు సోలి పడిపోయాడు. సవిలాసంగా అటువంటి బాణాలే నీ కుమారుల మీద కూడా ప్రయోగించి వెనుకకు పరువులు తీసేటట్లు చేశాడు.

**చ.** **అడరి నరేంద్రకోటి నుఱుమాడఁగ నత్తఱి శల్యుఁ డెంతయున్**
**వడిఁ దనుఁ దాఁకినన్ మెఱుఁగు వాలిక తూపుల మూర్ఛవుచ్చి క**
**వ్వడికొడు కేచి యుద్భట రవంబున నార్చినఁ బెల్లగిల్లి న**
**ల్గడలకుఁ బాఱె నిల్వక బలంబులు ద్రోణుఁ డెలుంగు సూపఁగాన్.** **33**

**ప్రతిపదార్థం:** అడరి= అతిశయించి; నరేంద్రకోటిన్= రాజులమొత్తాన్ని; నుఱుమాడఁగన్= తుత్తుమురు చేయగా; ఆ+తఱి= అప్పుడు; శల్యుఁడు= మద్రదేశాధిపతి అయిన శల్యుడు; ఎంతయున్= మిక్కిలి; వడిన్= వేగంగా; తనున్= తనను; తాఁకినన్= ఎదుర్కొనగా; మెఱుఁగు+వాలిక+తూపులన్= మెరుస్తూ ఉండే పొడవైన బాణాలతో; మూర్ఛపుచ్చి= మూర్ఛ కలిగించి; ఏచి= విజృంభించి; కవ్వడి కొడుకు= అభిమన్యుడు; ఉద్భట రవంబునన్= పెద్దసవ్వడితో; ఆర్చినన్= గర్జించగా; బలంబులు= సైన్యాలు; పెల్లగిల్లి= కలతచెంది; ద్రోణుఁడు= సర్వసైన్యాధిపతి అయిన ద్రోణాచార్యుడు; ఎలుంగు+చూపఁగాన్= అఱచి పిలుస్తూ ఉన్నప్పటికీ; నిల్వక= ఒకచోట స్థిరంగా ఉండకుండా; నల్గడలకున్= నాలుగు వైపులకూ; పాఱెన్= పరుగెత్తాయి.

**తాత్పర్యం:** అభిమన్యుడు అతిశయించి రాజ సమూహాన్ని తుత్తుమురు చేస్తూ ఉన్న సమయంలో మద్రాధిపతి శల్యుడు అతడిని ఎదుర్కొన్నాడు. అప్పుడు అతడు మెరుస్తూ ఉండే పొడవైన బాణాలతో శల్యుడిని మూర్ఛనొందించాడు. ఆ విధంగా విజృంభించి గట్టిగా గర్జిస్తూ ఉండగా సైన్యాలు చెల్లాచెదరై పరుగెత్తాయి. ద్రోణుడు ఎంతగా అరచి పిలుస్తూ ఉన్నా నిలవకుండా పలాయనం చిత్తగించాయి.

**విశేషం:** ఈ పద్యం చివరి రెండు పాదాలలో రెండు రకాల అరపులున్నాయి. 'ఉద్భటరవంబున' 'కవ్వడి కొడుకు' చేసిన అరపు సైన్యాలకు వెరపు గొలిపి పరుగులెత్తేటట్లు చేసింది. సర్వసైన్యాధ్యక్షుడు ద్రోణుడు 'పరువు నిలపండి పరువులెత్తకండి' అని ఎంతగా అరుస్తూ పిలిచినా నిలువకుండా వెళ్ళిపోయాయి. 'కవ్వడి కొడుకు', 'నల్గడలకు' అనే పదాలను మూడు నాల్గు పాదాల ఆరంభంలో వచ్చేటట్లు విరిచిన విరుపులు పద్యంలో ఉరవడినే కాక సైన్యం పరుగులెత్తిన విధానాన్ని ధ్వనింపజేస్తున్నాయి.

**వ. అప్పుడు.** **34**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. సురలును సిద్ధులు విద్యా । ధరులుఁ బొగడు నులివుఁ జూచు ధరణీశుల బం**
**ధురనుతి నాదంబుల నం । బరధరణీ మధ్యభాగ భరితము లయ్యెన్. '** **35**

**ప్రతిపదార్థం:** సురలును= దేవతలును; సిద్ధులున్= సిద్ధులూ; విద్యాధరులున్= విద్యాధరులూ; పొగడు+ఉలివున్= పైనుండి పొగడుతూ ఉండే ధ్వనీ; చూచు= చూస్తూ ఉన్న; ధరణీశుల= రాజుల; బంధురనుతి నాదంబులున్= అధికమైన పొగడ్తల ధ్వనులూ; అంబరధరణీ మధ్యభాగ= భూమ్యాకాశాల మధ్య ప్రదేశంలో; భరితములు= నిండినవి; అయ్యెన్= అయ్యాయి.

**తాత్పర్యం:** అపుడు దేవతలు, సిద్ధులు, విద్యాధరులు పొగడే శబ్దమూ, రాజులు ప్రశంసిస్తూ చేసిన నినాదాలూ భూనభోంతరం నిండుకొన్నాయి'.

**విశేషం:** పై నుండి దేవతలూ క్రిందినుండి రాజులూ చేసిన ప్రశంసాపూర్వక ధ్వనులు భూమ్యాకాశ మధ్యభాగంలో నిండుకొన్నాయి. దివికీ భువికీ మధ్య నెలకొన్న పొగడ్తల నినాదాలు అంతటా ఆవరించిన విషయాన్ని తెలుపుతూ ఉన్నాయి.

**చ. అన విని యాంబికేయుఁడు 'మహాద్భుత విక్రమశాలిఁ బార్థనం**
**దను మఱి యెవ్వ రట్టి యెడఁ దాఁకిరొ?' నావుడు సూతపుత్త్రుఁ డి**
**ట్లను 'నటులైన శల్యుఁ గని యాతని తమ్ముఁడు మేను వెంచి మా**
**ర్కొని పది తీవ్రబాణములు గ్రుచ్చెఁ దదంగములం జెలంగుచున్.** **36**

**ప్రతిపదార్థం:** అనన్= అని సంజయుడు చెప్పగా; విని; ఆంబికేయుఁడు= అంబికాపుత్త్రుఁడైన ధృతరాష్ట్రుడు; మహా+అద్భుత+విక్రమశాలిన్= మిక్కిలి ఆశ్చర్యకరమైన పరాక్రమంతో ప్రకాశించే వానిని; పార్థనందనున్= అర్జునుడి కొడుకైన అభిమన్యుడిని; అట్టి+ఎడన్= అటువంటి సందర్భంలో; మఱి= తర్వాత; ఎవ్వరు తాఁకిరొ= ఎవరు ఎదుర్కొన్నారో; నావుడున్= అని అడిగిన వెంటనే; సూతపుత్త్రుఁడు= సంజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; అటులు+ఐన= ఆ విధంగా అయినటువంటి (అట్లు మూర్ఛ చెందిన); శల్యున్= శల్యుడిని; కని= చూచి; ఆతని తమ్ముఁడు= అతడి తమ్ముడు; మేను= శరీరం; పెంచి= పొంగించి; మార్కొని= ఎదిరించి; చెలంగుచున్= మిక్కిలి ఉత్సాహాన్ని చూపుతూ (బొబ్బరిస్తూ); తద్+అంగములన్= ఆ అభిమన్యుడి అవయవాలలో; పది+తీవ్రబాణములు= పది పదునైన బాణాలు; గ్రుచ్చెన్= నాటాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు, అంతటి ఆశ్చర్యకరమైన పరాక్రమం గల అభిమన్యుడిని ఆ సందర్భంలో అటుపైన ఎవరు ఎదుర్కొన్నారో?' అని అడిగాడు. వెంటనే సంజయుడు ఇట్లా అన్నాడు: 'ఆ విధంగా శల్యుడిని మూర్ఛ చెందేటట్లు చేయటం చూచి అతడి తమ్ముడు ఓర్చుకోలేక దేహాన్ని పెంచి ఎదిరించి, అభిమన్యుడిపై పది పదునైన బాణాలు గాఢంగా నాటాడు.

**వ. అట్లు బెట్టేసిన వాసవికొడుకు కోపించి.**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; బెట్టు= తీవ్రంగా; ఏసినన్= బాణాలు ప్రయోగించగా; వాసవి కొడుకు= అభిమన్యుడు; కోపించి= కోపపడి.

**తాత్పర్యం:** ఆ విధంగా తీవ్రంగా బాణాలు వేయగా అభిమన్యుడు కోపించి.

**చ. హయములఁ జంపి, సూతుఁ దెగటార్చి, పతాక ధరిత్రిఁ గూల్చి, చా**
**పయుతము గాఁగ వానిఘనబాహులు రెండును ద్రుంచి, యెంతయున్**
**రయమునఁ దేరు చక్కడిచి, రాజులు రాజతనూజులుం గడున్**
**భయమునఁ దూలిపోవఁ బటు భల్ల హతిన్ దల డొల్ల నేసినన్. 38**

**ప్రతిపదార్థం:** హయములన్= గుఱ్ఱాలను; చంపి= హతమార్చి; సూతున్= రథసారథిని; తెగటార్చి= చంపి; పతాకన్= జెండాను; ధరిత్రిన్+కూల్చి= నేలపైన పడేటట్లు చేసి; చాపయుతము కాఁగన్= వింటితో కూడి యుండేటట్లు; వాని= అతని; ఘనబాహులు= పెద్దచేతులు; రెండునున్= రెండింటినీ; త్రుంచి= ఖండించి; ఎంతయున్= మిక్కిలి; రయమునన్= వేగంతో; తేరు+చక్కడిచి= రథాన్ని పగులగొట్టి; రాజులు= ప్రభువులు; రాజతనూజులున్= రాజపుత్రులున్నూ; కడున్= అధికమైన; భయమున్= భయంతో; తూలిపోవన్= పడిపోగా; పటు+భల్ల+హతిన్= తీక్ష్ణమైన బల్లెంయొక్క వ్రేటుతో; తల= శిరస్సు; డొల్లన్+ఏసినన్= క్రిందపడేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** శల్యుడి తమ్ముడి గుఱ్ఱాలను, సూతుడిని చంపి, జెండాను నేలపై పడేటట్లు చేశాడు. అటుపైన వింటితో కూడుకొని ఉన్నట్లుగానే అతడి రెండు చేతులను నరికి, మిక్కిలి వేగంతో తేరును పగులగొట్టి, రాజులూ, రాజకుమారులూ భయంతో తూలిపడిపోగా, వాడియైన బల్లెంతో అతడి, తల డుల్లిపడేటట్లుగా కూల్చాడు.

**వ. ద్రోణ కృప ద్రౌణి కృతవర్మ బృహద్బల కర్ణ ప్రముఖ యోధవరు లొండొరులఁ బేరువేరం బిలిచి బలంబులం బురికొలిపిన రథనేమి గజఘంటా తురంగ కింకిణీ స్వన సింహనాదమేదుర రోదోంతర రౌద్రంబుగా సౌభద్రుం జుట్టు ముట్టిన నతం డట్టహాసంబు చేసి లాఘవలక్ష్య శుద్ధి చిత్రత్వ దృఢత్వంబులు మెఱయఁ గృష్ణార్జునులు గావించు నేర్పు మెఱయం బోరు నవసరంబున మండలీకృత కోదండుండును బటు సంధాన స్ఫురిత శరనికరుండును నైపరివేషవలయంబు లోనం గిరణస్ఫురణ దుర్నిరీక్ష్యుండగు తపను ననుకరించుచు గుణఘోషభీషణంబుగా బెడిదంపు నారసంబులు వరఁగించి యార్చి యూర్జితగర్జితం బగుచున్ బలు పిడుగులు దొరఁగించు విలయకాల వలాహకంబు విడంబించుచు విజృంభించి భల్లాంజలీక క్షుర ప్రకూర్మ నఖర ప్రభృతి బాణ వేణికా వితానంబుల వెగడు పఱిచిన విచ్చిన వాహినుల నిలువరింప నేరక నివ్వెఱపడి యాచార్యుండు సూచుచుండె' ననవుడు ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 39**

**ప్రతిపదార్థం:** ద్రోణ, కృప, ద్రౌణి, కృతవర్మ, బృహద్బల, కర్ణ, ప్రముఖ యోధవరులు= ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ, శకుని తమ్ముడైన బృహద్బలుడు, కర్ణుడు, మొదలైన యుద్ధవీర శ్రేష్ఠులు; ఒండొరులన్= ఒకరినొకరు; పేరు+పేరన్= వాళ్ళ వాళ్ళ పేర్లతో; పిలిచి; బలంబులన్= సైన్యాలను; పురికొలిపినన్= ప్రేరేపించగా; రథనేమి= బండికంటి కడికమ్ములు; గజఘంటా= ఏనుగుల గంటలు; తురంగ కింకిణీ= గుఱ్ఱాలకు కట్టి ఉండే చిరుగంటలు; స్వన= శబ్దాలచేతనూ; సింహనాద= సింహాల గర్జనలవంటి వీరుల ధ్వనుల చేతనూ; మేదుర= దట్టమైన; రోదః+అంతర= భూమి ఆకాశాల మధ్య ప్రదేశాల చేతనూ; రౌద్రంబుగాన్= భయంకరంగా; సౌభద్రున్= అభిమన్యుడిని; చుట్టుముట్టినన్= చుట్టుకోగా; అతఁడు= ఆ అభిమన్యుడు; అట్టహాసంబు+చేసి= పెద్దనవ్వు నవ్వి; లాఘవ+లక్ష్యశుద్ధి+చిత్రత్వ+దృఢత్వంబులు= లఘుత్వమూ, సూటి అయిన గురీ, ఆశ్చర్యమూ, పటుత్వమూ; మెరయన్= ప్రకాశింపగా; కృష్ణ+అర్జునులు= కృష్ణుడూ, అర్జునుడూ; కావించు నేర్పు= చేయు చాకచక్యం; మెఱయన్=

ప్రకాశించేటట్లు; పోరు+అవసరంబునన్= పోరాడే సమయంలో; మండలీకృత కోదండుండును= వలయాకారం చేయబడ్డ అనగా గుడుసువడ్డ విల్లు కలిగినవాడూ; పటు+సంధాన+స్ఫురిత+శర+నికరుండును+ఐ= బాణాలను వింటిలో కూర్చే నేర్పుతో ఒప్పుతూ ఉన్న బాణాల మొత్తం కలవాడూ అయి; పరివేష వలయంబులోనన్= గాలిగుడి లేక పరివేష్టనం వంటి కుండలాకారంలో; కిరణ+స్ఫురణ+దుర్నిరీక్ష్యుండు+అగు= వెలుగుల యొక్క స్ఫురణ(తోచుట) స్ఫూర్తిచేత చూడటానికి వీలుకాని వాడైన; తపనున్= సూర్యుడిని; అనుకరించుచున్= సరిపోలుతూ; గుణ+ఘోష+భీషణంబుగాన్= అల్లెత్రాటి శబ్దంచేత భయంకరంగా; బెడిదంపు నారసంబులు= భీతిని కలిగించే బాణాలు; పరఁగించి= ప్రయోగించి; ఆర్చి= గర్జించి; ఊర్జిత+గర్జితంబు+అగుచున్= ఎడతెగకుండా ఉరుములు కలిగింది అవుతూ; బలుపిడుగులు= మిక్కిలి బలము లేదా అధికమూ, విస్తారమూ, తీవ్రమూ అయిన పిడుగులు; తొరఁగించు= రాల్చే; విలయకాల= ప్రళయకాలంలోని; వలాహకంబున్= మేఘాన్ని; విడంబించుచున్= పోలుతూ; విజృంభించి= అతిశయించి; భల్ల+అంజలీక, క్షురప్ర, కూర్మ, నఖర, ప్రభృతి, బాణ, వేణికా+వితానంబులన్= బల్లెం, అంజలికం, అర్ధచంద్రబాణము, తాబేటి ఆకారంగల ఆయుధం, మొదలైన బాణాలతో అల్లిన జడల మొత్తాన్నీ; వెగడు పఱిచినన్= తల్లడపడేటట్లు చేయగా; విచ్చిన+వాహినులన్= చెల్లాచెదరైన సేనలను; నిలువరింపన్+నేరక= స్థిరంగా ఒకచోట నిలబెట్టటానికి చాలక; నివ్వెఱపడి= మిక్కిలి భయపడి (చేష్టలుడిగి); ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; చూచుచుండెన్= చూస్తూ ఉన్నాడు; అనవుడున్= అనిన వెంటనే; ధృతరాష్ట్రుండు; సంజయునకున్= సంజయునికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ, బృహద్బలుడు, కర్ణుడు మొదలయిన యుద్ధవీరులందరూ ఒకరినొకరు పేర్లతో పిలుచుకొంటూ సైన్యాలను పురికొల్పారు. అపుడు రథనేమిధ్వనులూ, ఏనుగుల గంటల చప్పుళ్ళూ, గుఱ్ఱాల చిరుగంటల శబ్దాలూ, సింహనాదాలూ భూమ్యాకాశాలు నిండుకొన్నాయి. అందరూ భయంకరంగా అభిమన్యుడిని చుట్టుముట్టారు. అభిమన్యుడు అట్టహాసం చేస్తూ లఘుత్వంతో లక్ష్యశుద్ధితో చిత్రత్వ దృఢత్వాలతో మెరసిపోతూ, కృష్ణార్జునులు చూపే నేర్పును ప్రకటిస్తూ పోరాడాడు. గుడుసువడ్డ కోదండంతో బాణాల్ని చాకచక్యంగా గుంపులు గుంపులుగా ప్రయోగిస్తూ, వలయాకార పరివేషంలో వెలుగుతూ చూడడానికి వీలుకాని సూర్యుడిని అనుకరిస్తూ, అల్లెత్రాటి మోతతో భయంకరంగా తీవ్రమైన బాణాలు ప్రయోగించాడు. గట్టిగా గర్జిస్తూ పిడుగులు రాల్చే ప్రళయకాల మేఘం వలె విజృంభించి, రకరకాల ఆయుధాలతో చెల్లాచెదరైన సేనల్ని ఒక్కచోట నిలవనీయకుండా భయపడి పరుగెత్తేటట్టు చేశాడు. ఆ సన్నివేశాన్ని ద్రోణుడు చూస్తూ ఉండిపోయాడు' అని ధృతరాష్ట్రుడికి సంజయుడు చెప్పాడు. అపుడు ధృతరాష్ట్రుడు సంజయుడిని మళ్ళీ ఇట్లా అడిగాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'మనమున ఖేదము మోదముఁ । బెనఁగొనియెడు మద్బలంబుఁ బీడించెడు నా**
**మనుమఁడని వినికి నాతని । యని పని యటమీఁద నెట్టు లయ్యెం జెపుమా!' 40**

**ప్రతిపదార్థం:** నా మనుమఁడు= అభిమన్యుడు; మత్+బలంబున్= నా సైన్యాన్ని; పీడించెడున్= హతమారుస్తున్నాడు (బాధిస్తూ ఉన్నాడు); అని= ఆ ప్రకారంగా; వినికిన్= వినటంచేత; మనమునన్= మనస్సులో; ఖేదమున్= దుఃఖమూ; మోదమున్= సంతోషమూ; పెనఁగొనియెడున్= ఒకటిగా పెనవేసికొన్నాయి (మెలిగొన్నాయి); అటమీఁదన్= అటుపైన(ఆ పిమ్మట); ఆతని= ఆ అభిమన్యుడి; అనిపని= యుద్ధకార్యం; ఎట్టులు+అయ్యెన్?= ఏ విధంగా అయింది?; చెపుమా!= తెల్పుమా!

**తాత్పర్యం:** 'నా మనుమడు అభిమన్యుడు ఆ విధంగా నా సైన్యాన్ని అవలీలగా ఎదిరించి పీడించాడని విని నా మనస్సులో దుఃఖమూ, సంతోషమూ పెనగొన్నాయి. అటు పిమ్మట అభిమన్యుడి యుద్ధకార్యం ఎట్లయిందో తెల్పు' మని సంజయుడిని అడిగాడు.

**విశేషం:** అంతటి మహాయోధులు ఒక్కుమ్మడిగా పసిబాలుడిపై తలపడినప్పటికీ అతడు అందర్నీ ఎదిరించి సైన్యాన్ని చీకాకు పరచాడు అన్న వార్త ఆనందాన్ని ఆ ధృతరాష్ట్రుడికి కలిగించింది. అయితే వెంటనే 'నా సైన్యాన్ని పీడించాడు' అనే విషయం విని దుఃఖమూ కలిగింది. ఈ విధంగా రెండు విరుద్ధ భావాల సమ్మేళనం ఆ ధృతరాష్ట్రుని మనస్సులో తిష్ఠవేసికొనింది. సంకల్ప వికల్పాలకు మనస్సు కూడలి. మంచిచెడ్డలు రెండూ మనస్సులో కలుగుతూ తొలగుతూ ఉంటాయి. నిలకడ లేని మనస్సులో ఎల్లప్పుడూ ద్వైధీ భావం అంటే ద్వంద్వస్థితి కొట్టుమిట్టాడుతూనే ఉంటుంది. మనస్సుకు మారుపేరైన ధృతరాష్ట్రుడి తత్త్వాన్ని తిక్కన సూత్రప్రాయంగా సూచించాడు. మళ్ళీ మళ్ళీ ప్రయోగించిన నకారాలు ధృతరాష్ట్రుని మనోవికారానికి సూచనలు.

నా బలాన్ని పీడించాడని ఖేదమూ, అది చేసింది నా మనుమడేయని మోదమూ - అని క్రమంగా అన్వయించుకోవాలి. కావున అలంకారం - యథాసంఖ్యం.

**క. అనుటయు సంజయుఁ డిట్లను । 'వినుము జనాధీశ! యిట్లు వితిగిన సేనం**
**గనుఁగొని పోవఁగనీ క । ర్జున తనయుఁడు దనరథంబు చుట్లం బఱపున్. 41**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ధృతరాష్ట్రుడు ఈ విధంగా అనగా; సంజయుఁడు; ఇట్లు= ఈ రీతిగా; అనున్= అన్నాడు; జన+అధీశా!= రాజా!; వినుము; ఇట్లు= ఈ విధంగా; వితిగిన సేనన్= చెదరిన (ఓడిన) సైన్యాన్ని; కనుఁగొని= చూచి; అర్జునతనయుఁడు= అభిమన్యుడు; పోవఁగనీక= పోనీకుండా; తన రథంబు= తన రథము; చుట్లన్+పఱపున్= చుట్టూ పరుగెత్తించాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ధృతరాష్ట్రుడు అడిగిన వెంటనే సంజయుడు ఇట్లు చెప్పాడు. 'ఓ రాజా! వినుము. ఈ విధంగా చెల్లా చెదరై ఓడిన సైన్యాన్ని చూచి అభిమన్యుడు దానిని పోనీయకుండా తన రథం దాని చుట్టూ తిరిగేటట్లు చేశాడు.

**వ. కొఱవి ద్రిప్పిన తెఱంగు దోఁపఁ బొదివి, పోనీక పీనుంగు పెంటలు సేసిన నప్పు డక్కుమారు నాలోకించి వికాస భాసిత వదనుం డగుచు గురుండు గురుపతి నెఱను దాఁకఁబలుకవలయు నను తలంపున నతండు వినుచుండఁ గృపాచార్యుతో నిట్లనియె. 42**

**ప్రతిపదార్థం:** కొఱవి త్రిప్పిన తెఱంగు= కొరవి (నిప్పు కొఱకచ్చు) త్రిప్పినవిధం; తోఁపన్= తోచునట్లుగా; పొదివి= చుట్టుముట్టి; పోనీక= అటు ఇటు కదలనీకుండా; పీనుంగుపెంటలు= శవాలకుప్పలు; చేసినన్= చేయగా; అప్పుడు; ఆ+కుమారున్= ఆ అభిమన్యు కుమారుడిని (బాలుడైన అభిమన్యుడిని); ఆలోకించి= చూచి; వికాస,భాసిత,వదనుండు= వికాసంచేత ప్రకాశించే ముఖం కలిగినవాడు; అగుచున్= అగుచు; గురుండు= ద్రోణుడు; కురుపతి= దుర్యోధనుడి; నెఱను= (మర్మస్థానం) జీవస్థానం; తాఁకన్= గ్రుచ్చు(నాటుకొను)నట్లు; పలుకవలయున్= మాటాడవలెను; అను తలంపునన్= అనే అభిప్రాయంతో; అతండు= ఆ దుర్యోధనుడు; వినుచుండన్= వింటూ ఉండగా; కృపాచార్యుతోన్= కృపాచార్యుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** నిప్పుకట్టెను త్రిప్పే విధం తోచేటట్లుగా ముట్టడించి, అటునిటు పోనీకుండా సైన్యాన్ని శవాలకుప్పలు చేయగా, అప్పుడు ఆ అభిమన్యుడిని చూచి వికసించిన ముఖంతో ద్రోణుడు, దుర్యోధనుడి మర్మస్థానం గ్రుచ్చుకొనేటట్లుగా పలకాలి అనే ఉద్దేశంతో ఆ దుర్యోధనుడు వినేటట్లు కృపాచార్యుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. తమ్ములు నన్నలుం జెలులుఁ దండ్రులు మామలు భృత్యులుం బ్రమో**
**దమ్మునఁ దేల నిట్లు వడిఁ దాఁకెడునే? విజయాత్మజుండు, ఘో**
**టమ్ములుఁ గుంజరమ్ములు బడల్పడఁ దేరులు నుగ్గుగాఁగ నా**
**నమ్మిన యోధవీరులు వినాశము భంగము నొంద నొక్కఁడున్ . 43**

**ప్రతిపదార్థం:** విజయ+ఆత్మజుండు= అభిమన్యుడు; తమ్ములున్= తమ్ములూ; అన్నలున్= అన్నలూ; చెలులున్= స్నేహితులూ; తండ్రులున్= తండ్రులూ; మామలున్= మామలూ; భృత్యులున్= సేవకులునూ; ప్రమోదమ్మునన్= సంతోషంతో; తేలన్= తేలిపోగా; ఘోటమ్ములు= గుర్రాలూ; కుంజరమ్ములున్= ఏనుగులూ; బడల్పడన్= బడలిక (అలసట) చెందగా; తేరులు= రథాలు; నుగ్గుకాఁగన్= పొడికాగా; నా నమ్మిన యోధవీరులు= నాకు విశ్వాసపాత్రులైన యుద్ధవీరులు; వినాశమున్= చావును; భంగమున్= భంగపాటును(అవమానాన్ని); ఒందన్= పొందగా; ఒక్కఁడున్= ఒకడే; ఇట్లు= ఈ విధంగా; వడిన్= వేగంతో; తాఁకెడునే?= ఎదిరించునా?

**తాత్పర్యం:** అన్నలూ, తమ్ములూ, ఆప్తమిత్రులూ, తండ్రులూ, మామలూ, సేవకులూ అందరూ సంతోషంలో తేలిపోగా, గుర్రాలూ, ఏనుగులూ బడలిక చెందగా, తేరులు పొడి అయిపోగా, నాకు విశ్వాసపాత్రులైన యోధవీరులు చావూ, భంగపాటూ చెందగా అభిమన్యుడు ఒక్కడే ఇంతవడిగా ఎదుర్కొన్నాడు కదా!

**ఆ. అనిన వెలుకఁబాఱి యతిదీనమగు నాన । నమున నవ్వుగాని నవ్వు నెఱయ**
**సౌమదత్తి కర్ణ శల్యాదులగు యోధ । జనులతోడ నిట్టు లనియె విభుఁడు. 44**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ద్రోణుడు తనకు వినబడునట్లు అనగా; విభుఁడు= దుర్యోధనుడు; వెలుకన్+పాఱి= వెలవెలబోయి, వెల్లనై(వైవర్ణ్యాన్ని పొంది); అతిదీనము+అగు= మిక్కిలి దీనత్వాన్ని పొందిన; ఆననమునన్= ముఖంలో; నవ్వుకాని నవ్వు= నవ్వు అనటానికి వీలులేని నవ్వు; నెఱయన్= నిండగా(వ్యాపింపగా); సౌమదత్తి= భూరిశ్రవుడు; కర్ణ= కర్ణుడు; శల్య= శల్యుడు; ఆదులు+అగు= మొదలైనవారు అగు; యోధజనులతోడన్= యుద్ధవీరులతో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని ద్రోణు డనగానే దుర్యోధనుడు వెలవెలబోయి, దీనమైన ముఖంలో వెలవెలపోయేనవ్వు వ్యాపించగా, భూరిశ్రవుడు, కర్ణుడు, శల్యుడు మొదలైన యుద్ధవీరులతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** ద్రోణుడు మర్మస్థానం నాటుకొనేటట్లు మాటాడేటప్పటికి దుర్యోధనుడిలో దైన్యమూ, వైవర్ణ్యమూ ఏదో బాధతో కూడుకొన్న వెడనవ్వూ కలిగాయి. 'వెలుకఁబాఱు', 'నవ్వుగానినవ్వు' వంటి క్రొత్త ప్రయోగాలతో దుర్యోధనుడిలో ఏర్పడ్డ ఒక వినూత్నమైన మార్పును తిక్కన వ్యక్తం చేశాడు. దుర్యోధనుడు దురభిమాని. అతడు బాధ కలిగించేమాట విని సహించలేడు. అందులోనూ మర్మస్థానాన్ని గ్రుచ్చుకొనేటట్లు సర్వసైన్యాధిపతీ, గురువూ అయిన ద్రోణుడు మాట్లాడడంతో మిక్కిలి చలించిపోయాడు. అందువలననే ఒకటికి మూడు విలక్షణాలు అతడిలో చోటు చేసుకొన్నట్లు తిక్కన అభివర్ణించాడు. ఈ నవ్వుకాని నవ్వునే లోకంలో ఏడవలేక నవ్వటం అంటారు.

అలంకారం: స్వభావోక్తి.

**చ. 'పలుకులు వింటిరే ధనువు వట్టెడివారికి నెల్లనొజ్జ, దో**
**ర్బలవిదితుండు గుంభజుఁడు బాలుని నొక్కరుఁ జంచలాత్ము వెం**
**గలిఁ గడుఁ బెద్దఁ జేయుచుఁ బొగడ్తకుఁ జొచ్చె నితండు నొంపఁగాఁ**
**దలఁపడు వీనిఁ బార్థునకుఁ దాఁ గడుఁ గూర్చుట నెంత త్రుళ్ళినన్. 45**

**ప్రతిపదార్థం:** పలుకులు+వింటిరే!= ద్రోణుని మాటలు విన్నారు కదా!; ధనువుపట్టెడి వారికిన్+ఎల్లన్= విల్లును పట్టుకునే ఎల్లవారికి అనగా విలుకాండ్రు అందరికీ; కుంభజుఁడు= ద్రోణుడు; ఒజ్జ= ఉపాధ్యాయుడు; దోః+బల విదితుండు= భుజబలంచేత ప్రసిద్ధుడు; బాలునిన్= పసివాడిని; ఒక్కరున్= ఒక్కడిని; చంచల+ఆత్మున్= చలించే మనస్సు కలవాడిని; వెంగలిన్= మూఢుడిని; కడున్= మిక్కిలి; పెద్దన్+చేయుచున్= పెద్దగా చేస్తూ; పొగడ్తకున్+చొచ్చెన్= పొగడడానికి పూనుకొన్నాడు; పార్థునకున్= అర్జునుడికి; తాన్= తాను; కడున్+కూర్చుటన్= మిక్కిలి ప్రేమించటం చేత (ప్రియము, ఇష్టము అగుటచేత); ఎంత త్రుళ్ళినన్= అభిమన్యుడు ఎంతగా మిడిసిపడినప్పటికీ; వీనిన్= ఈ అభిమన్యుడిని; ఇతండు= ఈ ద్రోణుడు; నొంపఁగాన్+తలఁపఁడు= నొప్పించటానికి ఆలోచించడు.

**తాత్పర్యం:** ద్రోణుడి మాటలు విన్నారు కదా! ధనుస్సును పట్టిన ప్రతివ్యక్తికీ ఆయన గురువు. బాహుబలం చేత ప్రసిద్ధుడు. ఆయన ఒక అల్పుడైన బాలుడిని, చలించే మనస్సు కలవాడిని, మూఢుడిని, ఎంతో పెద్దచేసి పొగడటానికి పూనుకొన్నాడు. తాను అర్జునుడిని ఎంతో ఇష్టపడతాడు కాబట్టి అతని కుమారుడైన అభిమన్యుడు ఎంతగా త్రుళ్ళిపడినా, అతడిని నొప్పించాలని అనుకోడు.

**విశేషం:** దుర్యోధనుడు అసూయాగ్రస్తుడు. మహా దురభిమాని. ఇతరులలో ఉండే మంచిని గురించి ఏ మాత్రం చెప్పినా ఓర్చుకొనలేడు. 'పలుకులు వింటిరే' అని ప్రారంభించడంలోనే దుర్యోధనుడి కుళ్ళు పాఠకులకు వ్యక్తమౌతుంది. అభిమన్యుడిలో అన్ని మంచిగుణాలు ఉంటే వాటిని కాదంటూ అతడు బాలుడనీ, చంచలాత్ముడనీ, వెంగలి అనీ తక్కువపరచి మాట్లాడాడు. 'ఒక అర్భకుడిని ఆ విధంగా పెద్దచేసి పొగడుతూ ఉన్నాడే!' అని, చివరకు ద్రోణాచార్యులనే తప్పుపట్టాడు. అర్జునుడి మీద ఉండే వల్లమాలిన అభిమానం అతడి పిల్లవానిమీద కూడా ఇతనికి కొల్లగా ఉన్నది. కాబట్టి ఇతడు అభిమన్యుడిని నొప్పించడానికి ఒల్లడు అంటూ తన తప్పిదాన్ని కప్పిపుచ్చుకొనటమే గాకుండా ద్రోణుడిపై ఒక అపవాదు కూడా మోపాడు.

**చ. గురుని యుపేక్షఁ జేసి తనకున్ సమరోద్ధతి సెల్లె; దాని నీ**
**వెరవిఁడి గానలేఁడు దన వీరమకాఁ గొని విఱ్ఱవీఁగెడుం**
**బొరిగొనుఁ డందఱుం గడఁగి పోవఁగనీక దృఢాస్త్రశస్త్రని**
**ష్ఠుర పరిపాతనోగ్రముగఁ జుట్టును ముట్టి చలం బెలర్పఁగన్' 46**

**ప్రతిపదార్థం:** గురుని= ద్రోణుడియొక్క; ఉపేక్ష+చేసి= అశ్రద్ధ(నిర్లక్ష్యం) చేత; సమర+ఉద్ధతి= యుద్ధంలో దుడుకుతనం(గర్వం); తనకున్= ఆ అభిమన్యుడికి; చెల్లెన్= చెల్లింది; దానిన్= ఆ చనవును; ఈ+వెరవిఁడి= ఈ తెలివితక్కువవాడు; కానలేఁడు= తెలిసికొనలేకున్నాడు; తన+వీరము+అ+కాన్= తన శౌర్యమే అని; కొని= తలంచి; విఱ్ఱవీఁగెడున్= గర్విస్తున్నాడు; అందఱున్= మీరందరూ; కడఁగి= పూనుకొని; పోవఁగనీక= పారిపోనీకుండా; దృఢ+అస్త్ర+శస్త్ర+నిష్ఠుర+పరిపాతన+ఉగ్రముగన్= గట్టివైన, బాణాలచేతను, ఆయుధాలచేతనూ, కఠినంగా పడవైచుట చేతను, భయంకరంగా; చుట్టును= ఆ అభిమన్యుని చుట్టూ; ముట్టి= ముట్టడించి; చలంబు+ఎలర్పఁగన్= పట్టుదల అతిశయింపగా; పొరిగొనుఁడు= చంపండి.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడి అశ్రద్ధవలన వాడి దుడుకుతనం చెల్లింది. అది ఆ తెలివితక్కువ దద్దమ్మ తెలిసికొనలేక అంతా తన శూరత్వమే అని విఱ్రవీగుతూ ఉన్నాడు. మన యోధవీరులందరూ ప్రయత్నించి వాడిని పారిపోనీయకుండా చూడండి. గట్టి బాణాలతో, ఆయుధాలతో, బిగువైన దెబ్బలతో పడవైచి పట్టుదల సడలకుండా, భయంకరంగా వాడిని చుట్టుముట్టి మట్టుపెట్టండి.'

**వ. అనిన విని వార లందఱు న వ్వాసవపౌత్రుం బొదువం బోవ నవ్వీరుల వారించి దుశ్శాసనుం డిట్లనియె.47**

**ప్రతిపదార్థం:** అనినన్= అని దుర్యోధనుడు చెప్పగా; విని; వారలు= ఆ యోధవీరులు; అందఱున్= అందరున్నూ; ఆ+వాసవపౌత్రున్= ఆ ఇంద్రుని మనుమడైన అభిమన్యుడిని; పొదువన్+పోవన్= చుట్టుముట్టుటకై పోగా; ఆ+వీరులన్= ఆ యుద్ధవీరులను అందరినీ; దుశ్శాసనుండు= దుర్యోధనుడి తమ్ముడు; వారించి= నిలిపి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా దుర్యోధనుడు యుద్ధవీరులకు చెప్పగా విని వారు అందరూ అభిమన్యుడిని చుట్టుముట్టటానికి బయలుదేరారు. అప్పుడు ఆ వీరవరులను దుశ్శాసనుడు నిలిపి ఈ విధంగా అన్నాడు:

**చ. 'ఇనుఁ గబళించు రాహు క్రియ నే నొకరుండన పోయి పార్థపు**
**త్రునిఁ బరిమార్తు నీతఁడు మృతుం డగు టేర్పడ విన్నఁ గేశవా**
**ర్జునులును బిట్టు సత్తు రతిశోక భరంబునఁ జేసి యంతతో**
**మన పగ దీఱుఁ దీవ్రమగు మద్భుజదర్పము సొంపు సూడుఁడీ!' 48**

**ప్రతిపదార్థం:** ఇనున్= సూర్యుడిని; కబళించు= మ్రింగే; రాహు+క్రియన్= రాహువువలె; ఏను= నేను; ఒకరుండన= ఒక్కడనే; పోయి= అభిమన్యుడి కడకు వెళ్ళి; పార్థపుత్త్రునిన్= అర్జునుడి కొడుకును; పరిమార్తున్= హతమారుస్తాను; ఈతఁడు= ఈ అభిమన్యుడు; మృతుండు+అగుట= (చచ్చుట) మరణించటం; ఏర్పడ+విన్నన్= స్పష్టంగా వింటే; కేశవ+అర్జునులును= శ్రీకృష్ణుడూ, అర్జునుడూ; అతి+శోక+భరంబునన్+చేసి= అధికమైన దుఃఖభారంచేత; బిట్టు= వెంటనే, శీఘ్రంగా; చత్తురు= చస్తారు; అంతతోన్= అంతటితో అంటే వారి మరణంతో; మన పగ= మన విరోధం (ద్వేషం); తీఱున్= నశిస్తుంది; తీవ్రము+అగు= తీక్ష్ణమైన; మత్+భుజ+దర్పము+సొంపున్= నా భుజగర్వం యొక్క అందాన్ని; చూడుఁడీ!= చూడండి!

**తాత్పర్యం:** సూర్యుడిని మ్రింగే రాహువు మాదిరి నేను ఒక్కడినే పోయి, ఆ అభిమన్యుడిని చంపుతాను. వాడి చావు వినగానే కృష్ణార్జును లిద్దరూ శోకభారంతో వెంటనే చస్తారు. అంతటితో మన పగ అంతరించిపోతుంది. ఇప్పుడు నా భుజగర్వం యొక్క విజృంభణాన్ని చూడండి.

**విశేషం:** 'ఇనుఁ గబళించు రాహుక్రియ' అనే ప్రయోగంలోని పోలికలే అభిమన్యు-దుశ్శాసనుల ప్రవృత్తులను తెలుపుతూ ఉన్నాయి. అభిమన్యుడు సూర్యుడివలె తేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. అతడిని రాహువు మాదిరి గ్రసిస్తాను అని దుశ్శాసనుడు తన రాక్షస ప్రవృత్తిని వెల్లడించాడు. పదభంగంతో రెండు మూడు పాదాలు ఆరంభించటం, దుశ్శాసనుడి మాటల తీరును బట్టి 'పార్థపుత్రుడిని తునుమాడటాన్ని -దాని కారణంగా అర్జునుడి హానిని ధ్వనింపజేస్తున్నాయి. రాహువుతో పోలిక కాబట్టి తన బాహువుల దర్పపు సొంపు చూడండి అనటం ఎంతో ఔచిత్యవంతంగా ఉంది.

### దుశ్శాసనుఁడు అభిమన్యుడితోడం బోరి పారిపోవుట (సం. 7-38-26)

**వ. అని పలికి యార్చి యమ్ములు నిగిడించుచు, ధనంజయ నందనుం దాఁకిన నతండు షడ్వింశతి సాయకంబులు దనువునం జొనిపినం గనలి దుశ్శాసనుండు శరాసార ఘోరంబుగాఁ గవిసినం, గిరీటి కొడుకునుం బేర్చి పెనంగ నయ్యిరువుర కరలాఘవ శరలాఘవ ప్రకారంబులు రథ చిత్ర ప్రచారంబులుఁ జూప అగ్గించి; రప్పు డగ్గలిక సొంపున సుభద్రాసూనుండు నీ సుతువిల్లు ద్రుంచి, భల్లంబుల మేను సెక్కి స్రుక్కించి యతనితో నిట్లనియె. 49**

**ప్రతిపదార్థం:** అని పలికి= ఆ ప్రకారముగా మాట్లాడి; ఆర్చి= గర్జించి; అమ్ములు= బాణాలు; నిగిడించుచున్= ప్రయోగిస్తూ; ధనంజయనందనున్= అర్జునుడి కొడుకు అభిమన్యుడిని; తాఁకినన్= మార్కొనగా; అతండు= అభిమన్యుడు; షట్+వింశతి+సాయకంబులు= ఇరవైఆరు బాణాలు; తనువునన్= శరీరంలో; చొనిపినన్= గ్రుచ్చగా; కనలి= కోపించి; దుశ్శాసనుండు; శర+ఆసార+ఘోరంబుగాన్= బాణవర్షంచేత భయంకరంగా; కవిసినన్= ఎదుర్కొనగా; కిరీటి కొడుకునున్= అభిమన్యుడున్నూ; పేర్చి= అతిశయించి; పెనంగన్= పోరాడగా; ఆ+ఇరువుర+కర+లాఘవ+శర+ లాఘవ+ప్రకారంబులు= ఆ ఇద్దరి చేతిలాఘవం, బాణలాఘవం యొక్క పద్ధతులు; రథచిత్ర ప్రచారంబులున్= రథములయొక్క విచిత్రములైన సంచారాలను; చూపఁఱు= చూచేవారు; అగ్గించిరి= పొగడారు; అప్పుడు= ఆ సమయంలో; అగ్గలిక+సొంపునన్= శౌర్యం(ఉత్సాహం, పూనిక) యొక్క సొంపుతో; సుభద్రాసూనుండు= సుభద్రకొడుకు; నీ+సుతు+విల్లు= నీ కుమారుడి చాపాన్ని; త్రుంచి= విరిచి; భల్లంబులన్= బల్లెములతో; మేను= శరీరం; చెక్కి= ఖండించి; స్రుక్కించి= సోలిపోయేటట్టు చేసి; అతనితోన్= దుశ్శాసనుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అట్లు మాట్లాడి, అరచి, బాణాలు ప్రయోగిస్తూ అభిమన్యుడిని ఎదుర్కొన్నాడు. అప్పుడు అభిమన్యుడు ఇరవై ఆరుబాణాలు దుశ్శాసనుడి శరీరంలోకి చొప్పించాడు. అందుకు దుశ్శాసనుడు కోపించి బాణవర్షాన్ని కురిపిస్తూ భయంకరంగా ఎదిరించాడు. అంత అభిమన్యుడు అతిశయించి పోరాడాడు. ఆ ఇద్దరున్నూ కరలాఘవాన్ని, శరలాఘవాన్ని ప్రదర్శిస్తూ రథాలను చిత్రవిచిత్రంగా నడిపించారు. వారి యుద్ధాన్ని చూచి చూపరులు ఎంతో పొగడారు. అప్పుడు శౌర్యపు సొంపుతో సుభద్రకొడుకు నీ కుమారుడి విల్లు విరిచి, బల్లెములతో శరీరాన్ని చెక్కి సోలిపోయేటట్లు చేసి ఈ విధంగా అన్నాడు:

**చ. 'అనఘుని ధర్మనందనుని నా సభ నమ్మెయి నీవు నొవ్వఁ బ**
**ల్కిన ఫల మందఁజేసెదఁ జలింపక యించుక సేపు నిల్వుమీ !**
**నిను లఘుచిత్తుఁ గ్రూరు నవినీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం**
**చిన గరువంపుఁ దండ్రులకుఁ జిత్త మెలర్ప ఋణంబుఁ దీర్చెదన్.' 50**

**ప్రతిపదార్థం:** అనఘునిన్= పాప రహితుడిని; ధర్మనందనునిన్= ధర్మరాజును; ఆ సభన్= ఆ కౌరవసభలో; అమ్మెయిన్= ఆ విధంగా; నీవు; నొవ్వన్= బాధకలిగేటట్లు; పల్కిన ఫలము= మాటాడిన ఫలితాన్ని; అందన్+చేసెదన్= అందేటట్లు చేస్తాను; చలింపక= కదలక; ఇంచుకసేపు= కొంచెంసేపు; నిల్వుమీ!= నిలువుము!; నినున్= నిన్ను; లఘుచిత్తున్= అల్పబుద్ధిని; క్రూరున్= ఇతరులను పీడించేవాడిని; అవినీతున్= నీతిమాలినవాడిని; మద+అంధునిన్= గర్వంచేత కళ్ళు కనిపించని వాడిని; త్రుంచి= చంపి; నన్నున్= నన్ను; పెంచిన= పోషించిన; గరువంపు+తండ్రులకున్= గొప్ప వారైన జనకులకు; చిత్తము= మనస్సు; ఎలర్పన్= సంతోషించగా; ఋణంబు+తీర్చెదన్= అప్పు తీరుస్తాను.

**తాత్పర్యం:** పాపరహితుడైన ధర్మరాజును సభలో ఆ విధంగా నొప్పించి మాటాడిన ఫలితాన్ని ఇప్పుడు అందజేస్తాను. కదలకుండా కొంచెంసేపు నిలువుము. అల్పబుద్ధివి, క్రూరుడవు, అవినీతిపరుడవు, గర్వాంధుడవు అయిన నిన్ను చంపి, నన్ను పోషించిన ఆ మహనీయులైన తండ్రులకు సంతోషాన్ని కలిగించి వారి అప్పు తీరుస్తాను.(ఉద్ధరిస్తాను)

**విశేషం:** దుశ్శాసనుడికి ప్రయోగించిన విశేషణాలు పొడిపొడిగా అతి స్వల్పంగా ఉండే సమాసాలలో ఉన్నాయి. అవి వాడి అల్పత్వానికి నిదర్శనాలు. పాపరహితులను నొప్పించిన ఫలితం ఊరకపోదు. అది వడ్డీతో కూడా తీర్చవలసి ఉంటుంది. 'నన్ను పెంచిన మహనీయుల ఋణం తీర్చుకొనటానికి నీవే నాకు తగిన సాధనం' అని అభిమన్యుడు దుశ్శాసనుడిని హెచ్చరించిన విధానం అతడి మనస్తత్వానికి అనుగుణంగానే ఉన్నది.

**క. అని యతని జత్రుదేశం । బున నొకవాలమ్ము వక్షమునఁ బెక్కును గ్రు**
**చ్చినఁ ద్రెళ్ళి యెన్నఁడో చ । చ్చిన యట్లు రథంబు మీఁదఁ జేష్టడి యుండెన్. 51**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా పలికి; అతని= ఆ దుశ్శాసనుడి; జత్రుదేశంబునన్= మూపులయొక్క సంధి ఎముక లుండే ప్రదేశంలో; ఒకవాలు+అమ్మున్= ఒక వాడి అయిన బాణాన్ని; వక్షంబునన్= రొమ్మునందు; పెక్కును= చాలా బాణాలను; గ్రుచ్చినన్= నాటుకొనేటట్లు ప్రయోగించగా; త్రెళ్ళి= సోలిపడి; ఎన్నడో చచ్చిన అట్లు= ఎంతోకాలం ముందుగానే చచ్చినట్లు (చచ్చి పాతబడినట్లు); రథంబుమీఁదన్= రథంపై; చేష్టడి+ఉండెన్= చేష్టలుడిగి ఉండిపోయాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా అంటూ దుశ్శాసనుడి మూపున సంధి ఎముకల స్థానంలో ఒక వాడి అయిన బాణాన్ని, రొమ్మునందు అనేక బాణాలను అభిమన్యుడు ప్రయోగించాడు. దానితో అతడు రథంపై పడి, ఎప్పుడో చచ్చిన వాడివలె వ్యాకులపాటుతో భంగపడి అట్లే ఉండిపోయాడు.

**వ. ఇట్లు మూర్ఛిల్లిన దుశ్శాసను తేరు సారథి తొలంగఁ దోలుకొని పోయె; నంతకుమున్న కౌంతేయులు సౌభద్రుండు సొచ్చిన పథంబున నా పద్మవ్యూహంబు సేనాసందోహ సహితులై చొచ్చి యెడనెడ నడ్డపడు సైన్యంబులతో సంగరంబు సేయుచు నక్కుమారుం దలలెత్తి చూచుచు నతం డరిబలంబులం గలంచుటకు సంప్రీతులగుచుఁ దోఁతెంచువారు ముందట దుశ్శాసనుండు భంగపడుట గనుంగొని పొంగి యార్పులు నింగిముట్ట నయ్యభిమన్యు ననేక భంగులం బ్రశంసించుచుం దఱిమి; రట్టియెడ. 52**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మూర్ఛిల్లినన్= మూర్ఛచెందగా; దుశ్శాసను+తేరున్= దుశ్శాసనుని రథాన్ని; సారథి; తొలంగన్= ఆ ప్రదేశం నుండి తొలగిపోయేటట్లు; తోలుకొని పోయెన్= దూరంగా తరుముకొని పోయాడు; అంతకుమున్న= అంతకు మునుపే; కౌంతేయులు= కుంతీపుత్రులు అనగా పాండవులు; సౌభద్రుండు= అభిమన్యుడు; చొచ్చిన= ప్రవేశించిన; పథంబునన్= దారిలో; ఆ పద్మవ్యూహంబున్= ఆ పద్మవ్యూహాన్ని; సేనాసందోహ సహితులై= సైన్య సమూహాలతో కూడుకొన్న వారై; చొచ్చి= ప్రవేశించి; ఎడన్+ఎడన్= అక్కడక్కడా; అడ్డపడు+సైన్యంబులతోన్= అడ్డగించే సైన్యాలతో; సంగరంబు= యుద్ధం; చేయుచున్= చేస్తూ; ఆ+కుమారున్= కుమారుడైన ఆ అభిమన్యుడిని; తలలు+ఎత్తి+చూచుచున్= తమ శిరస్సులు పైకెత్తి చూస్తూ; అతండు= ఆ అభిమన్యుడు; అరి+బలంబులన్= శత్రువుల సైన్యాలను (పగవారి సేనలను); కలంచుటకున్= కలత కలిగించటానికి; సంప్రీతులు+అగుచున్= మిక్కిలి సంతోషాన్ని పొందినవాళ్ళు అవుతూ; తోఁతెంచువారు= వస్తూ ఉన్నవాళ్ళు; ముందటన్= ఎదురుగా; దుశ్శాసనుండు; భంగపడుటన్= భంగపాటు పొందటాన్ని; కనుంగొని= చూచి; పొంగి= సంతోషించి; ఆర్పులు= గట్టిగా అరుస్తూ చేసే నినాదాలు; నింగిన్+ముట్టన్= ఆకాశాన్ని అంటుకోగా; ఆ+అభిమన్యున్= ఆ అభిమన్యుడిని; అనేకభంగులన్= అనేక విధాలుగా; ప్రశంసించుచున్= పొగడుతూ; తఱిమిరి= విజృంభించారు; అట్టి+ఎడన్= అటువంటి సందర్భంలో.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు సొమ్మసిల్లి చచ్చినట్లు పడిపోగానే అతడి సారథి రథాన్ని దూరంగా తోలుకొని పోయాడు. అంతకుముందే పాండవులు అభిమన్యుడు ప్రవేశించిన మార్గంలో తమ సైన్యంతో ప్రవేశించి, అక్కడక్కడా అడ్డగించే సేనలతో యుద్ధంచేస్తూ, అప్పుడప్పుడూ అభిమన్యుడిని తలలెత్తి చూస్తూ, ఆ అభిమన్యుడు పగవారి సేనలను కలత నొందించటాన్ని చూచి చాలా సంతోషిస్తూ, ముందుకు చొచ్చుకొని వచ్చారు. ఆ విధంగా వస్తూ పాండవులు తమకు ఎదురుగా అభిమన్యుడిచేత దుశ్శాసనుడు భంగపాటు పొందటాన్ని చూచి ఎంతో సంతోషించి గట్టిగా అరచారు. ఆ అరపులు ఆకాశం దాకా వ్యాపించాయి. వాళ్ళు అభిమన్యుడిని ఎన్నో విధాలుగా పొగడుతూ అతడిని వెంబడించారు. అటువంటి తరుణంలో.

**సీ. రాధేయుఁ జూచి రారాజు 'దుశ్శాసనుఁ। డభిమన్యుచే నొచ్చె నకట! కంటె!**
**యనవుడు నతఁడు సేనాన్వితంబుగ నక్కు। మారు పై నడర నవ్వీరుఁ డేచి**
**ముందటి మూఁకల మ్రందించి కదిసి డె। బ్బది మూఁడు దూఁపులఁ బటురయమున**
**నొంచిన రక్తాననుండయి దివ్యాస్త్ర। జాలంబు వఱపు నా జామదగ్న్య**

**తే. శిష్యు భుజవీర్యశౌర్య విశేషభంగి। సరకుగొనక య బ్బాలుండు సమదలీలఁ**
**బెనఁగ న య్యంగరాజు దస్సిన, నెఱింగి। యతని తమ్ముఁ డయ్యర్జునసుతునిఁ దాఁకి. 53**

**ప్రతిపదార్థం:** రారాజు= దుర్యోధనుడు; రాధేయున్+చూచి= కర్ణుడిని చూచి; దుశ్శాసనుండు= నా తమ్ముడు దుశ్శాసనుడు; అకట!= ఔరా!; అభిమన్యుచేన్+నొచ్చెన్= అభిమన్యుడిచేత నొచ్చినాడు; కంటె!= చూచావా?; అనవుడున్= అని అనగానే; అతఁడు= ఆ కర్ణుడు; సేనా+అన్వితంబుగన్= సైన్యంతో కూడి; ఆ+కుమారుపైన్= ఆ అభిమన్యుడిపై; అడరన్= విజృంభించగా; ఆ+వీరుఁడు=

వీరుడైన ఆ అభిమన్యుడు; ఏచి= అతిశయించి; ముందటి మూఁకలన్= కర్ణుడికి ముందుండే సేనలను; ద్రుందించి= చంపి; కదిసి= చేరి, సమీపించి; డెబ్బది మూఁడు తూఁపులన్= డెబ్బైమూడు బాణాలతో; పటురయమునన్= మిక్కిలి తొందరగా; నొంచినన్= బాధపెట్టగా; రక్త+ఆననుండు+అయి= ఎఱ్ఱని ముఖం కలవాడై (కోపించినవాడై); దివ్య+అస్త్ర+జాలంబున్= దివ్యములైన బాణాల మొత్తాన్ని; పఱవు= ప్రయోగించే; ఆ+జామదగ్న్య+శిష్యు= ఆ పరశురాముడి శిష్యుడియొక్క; భుజవీర్య= బాహుబలంయొక్కయు; శౌర్య= శూరత్వం యొక్కయు; విశేషభంగిన్= ఆధిక్యం గల తీరును; సరకుగొనక= లక్ష్యపెట్టకుండా; ఆ+బాలుండు= ఆ అభిమన్యుడు; సమదలీలన్= గర్వంతో (సంతోషపూర్వకమైన విలాసంతో); పెనఁగన్= యుద్ధం చేయగా; ఆ+అంగరాజు= ఆ కర్ణుడు; డస్సినన్= అలసిపోగా; ఎఱింగి= తెలిసికొని; అతని తమ్ముఁడు= కర్ణుని తమ్ముడు; ఆ+అర్జున సుతునిన్= ఆ అభిమన్యుడిని; తాఁకి= మార్కొని, ఎదిరించి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కర్ణుడిని చూచి 'అయ్యో! దుశ్శాసనుడు అభిమన్యుడిచేత నొప్పించబడ్డాడు. చూచావా!' అన్నాడు. వెంటనే కర్ణుడు సైన్యంతో ఆ అభిమన్యుడి మీదికి దూకగా ఆ వీరుడు విజృంభించి కర్ణుడికి ముందుండే సేనలను చంపి, కర్ణుడిని సమీపించి డెబ్బైమూడు బాణాలను ఎడతెరిపి లేకుండా మహావేగంగా ప్రయోగించి నొప్పించాడు. దానితో కర్ణుడు కోపించినవాడై ఎఱ్ఱని మొగంతో దివ్యాస్త్రాలను ప్రయోగించాడు. పరశురాముడి శిష్యుడైన ఆ కర్ణుడి భుజబలాన్ని, శౌర్యాన్ని నిర్లక్ష్యం చేస్తూ అభిమన్యుడు గర్వంతో యుద్ధం చేశాడు. దానితో అంగరాజు (కర్ణుడు) అలసిపోయాడు. ఇది తెలిసికొని కర్ణుడి తమ్ముడు అభిమన్యుడిని ఎదుర్కొన్నాడు.

**విశేషం:** ఈ సీసపద్యంలో అభిమన్యుడిని ఒకరి తర్వాత మరొకరు ఏ విధంగా ఎదుర్కొన్నారో, వాళ్ళనందరినీ ఆ బాలుడు ఎట్లా చీల్చి చెండాడాడో తిక్కన అభివర్ణించాడు. కర్ణు డెదుర్కొన్న విధానాన్ని, అతడి భుజబల శౌర్యాన్ని అభివర్ణిస్తూ అతడు పరశురాముడి శిష్యుడనే విషయాన్ని కూడా సూచించాడు.

**చ.** **హయముల మీఁద సూతుపయి నాతని యంగములందు నస్త్రసం**
**చయ మడరించినం గమలచారు ముఖంబున నెఱ్ఱనవ్వు చె**
**న్నయి విలసిల్ల భల్లమున నన్నరసూనుఁడు ద్రుంచె విద్విష**
**ద్భయద విలాస బాహు సముదగ్రత వాని శిరంబు గ్రక్కునన్. 54**

**ప్రతిపదార్థం:** హయములమీఁదన్= గుఱ్ఱాలపైన; సూతుపయిన్= సారథిమీద; ఆతని+అంగములందున్= ఆ అభిమన్యుడి అవయవాలలో; అస్త్రసంచయము= బాణాల మొత్తం; అడరించినన్= ప్రయోగించగా; కమల+చారు+ముఖంబునన్= తామరవంటి అందమైన మొగంలో; ఎఱ్ఱనవ్వు= కోపంతోడి నవ్వు; చెన్ను+అయి= అందగించి; విలసిల్లన్= ప్రకాశింపగా; ఆ+నరసూనుఁడు= ఆ అర్జునుడి కుమారుడు; విద్విషత్+భయద= పగవాళ్ళకు భయాన్ని ఒసగునటువంటి (కలిగించునట్టి); విలాస= విలసనంతోడి; బాహు+సముదగ్రతన్= భుజబలంయొక్క అతిశయంతో; గ్రక్కునన్= తటాలున (తత్క్షణం); భల్లమునన్= బల్లెంతో; వాని శిరంబున్= అతడి తలను; త్రుంచెన్= నరికాడు.

**తాత్పర్యం:** గుఱ్ఱాలపైన, సారథిమీద అభిమన్యుడి అవయవాలందు అనేక బాణాలను ప్రయోగించగా తామరవంటి అందమైన జేవురించిన మొగంలో ఎఱ్ఱని నవ్వు ఎంతో అందగించగా, అర్జున కుమారుడు శత్రువులకు భయం కలిగించే బాహు బలాధిక్యంతో వెంటనే బల్లెం తీసికొని అతడి తల నరికాడు.

**విశేషం:** 'కమలచారు ముఖంబు' 'ఎఱ్ఱ నవ్వు చెన్ను' వంటి ప్రయోగాలలో బాలుడైన అభిమన్యుడి సహజసౌందర్యం కోపించిన సమయంలో కూడా ఏ విధంగా విలాసంతో శోభించిందో తిక్కన చక్కగా ప్రకటించాడు. నవ్వుకు సంబంధించి తిక్కన స్వయంగా

కల్పించిన ఎన్నో వినూత్న ప్రయోగాలలో 'ఎఱ్ఱనవ్వు' ఒక రసోచిత మృదుమధుర పదబంధం. కోపం వర్ణం ఎరుపు అనటం కవి సమయం. నవ్వు గాని నవ్వు వంటిదే విలక్షణమైన నవ్వు. తిక్కన తన భాగంలో రకరకాల నవ్వులనెన్నిటినో ధరించాడు. ఇది ఆతడి అభినయ కౌశలానికి నిదర్శనం. అలంకారం: స్వభావోక్తి.

**ఉ. ఇమ్మెయిఁ దమ్మునిం దునుము నేపు గనుంగొని యోహటించి, శీ**
**ఘ్రమ్మునఁ బెంపఱం దొలఁగెఁ గర్ణుఁడు పెక్కు బలంబు లప్పు డొ**
**క్కుమ్మడిఁ ద్రోచి యుద్ధత మహోదధిఁ బోలఁగ మందరమ్ము చం**
**దమ్మున నొప్పె నుద్భటవిధస్ఫురణుం డగు పార్థపుత్త్రుఁడున్. 55**

**ప్రతిపదార్థం:** కర్ణుఁడు= కర్ణుడు; ఈ+మెయిన్= ఇట్లా; తమ్మునిన్= తమ్ముడిని; తునుము+ఏపున్= వధించే గర్వాన్ని; కనుంగొని= చూచి; ఓహటించి= వెనుకంజవేసి; పెంపు+అఱన్= గర్వం నశింపగా; శీఘ్రమ్మునన్= త్వరగా; తొలఁగెన్= తొలగిపోయాడు; అప్పుడు= ఆ సందర్భంలో; పెక్కుబలంబులు= అనేక సైన్యాలు; ఒక్కుమ్మడిన్= ఒక్క పెట్టున; త్రోఁచి= ఒకరికొకరు మీరి; ఉద్ధత మహా+ఉదధిన్= పొంగే గొప్ప సముద్రాన్ని; పోలఁగన్= పోలి ఉండగా; ఉద్భట+విధ= ఆధిక్యంయొక్క విధానాన్ని; స్ఫురణుండు= తోచుట గలవాడు; అగు= అయినటువంటి; పార్థపుత్త్రుఁడున్= అభిమన్యుడున్నూ; మందరమ్ము+చందమ్మునన్= మందరపర్వతం మాదిరిగా; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు తమ్ముడిని సంహరించే ఆటోపాన్ని చూచి, కర్ణుడు వెంటనే వెనుదిరిగి వెళ్ళిపోయాడు. అప్పుడు అనేక సైన్యాలు అన్నీ ఒకటిగా చేరి మహాసముద్రంవలె పైన బడ్డాయి. ఆ సమయంలో అర్జునుడి కొడుకు తన ఆధిక్యాన్ని తెలుపుతూ మందరపర్వతం మాదిరి ఆ సైన్య సముద్రాన్ని మథింపజొచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ. సైన్యం ఉద్ధతమహోదధి అయితే పార్థుని పుత్త్రుడు 'ఉద్భట విధస్ఫురణు' డై మందర పర్వతాన్ని అనుకరించాడనీ, పదప్రయోగంలో సన్నివేశానుగుణంగా తిక్కన వీరరస స్ఫోరకమైన భాషాపటిమను ప్రదర్శించాడు.

**వ. ఇట్లు మూఁకలం గలంచి. 56**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మూఁకలన్= సేనలను; కలంచి= కలతనొందించి

**తాత్పర్యం:** ఈ విధంగా సేనలను కలత నొందించి.

**క. వెస రాధేయుని తొలఁగిన। దెసకుం జనుటయు నతండు ధృతిసెడి విఱిగెం**
**బస పొడవడఁగఁగఁ బెఱయో। ధ సమూహము పాఱె ధరణితల మద్రువంగన్. 57**

**ప్రతిపదార్థం:** రాధేయుని+తొలఁగిన+దెసకున్= కర్ణుడు తొలగిపోయిన దిక్కుకు; వెసన్= తొందరగా(వెంటనే); చనుటయున్= (అభిమన్యుడు) పోవటమున్నూ; అతండు= ఆ కర్ణుడు; ధృతి+చెడి= ధైర్యం నశించి; విఱిగెన్= పారిపోయాడు; పెఱ+యోధ+సమూహము= ఇతర వీరుల మొత్తమూ; పస+పొడవు+అడఁగఁగన్= గర్వంయొక్క అతిశయం నశించగా; ధరణితలము= భూప్రదేశం; అద్రువంగన్= అదరిపోయేటట్లుగా; పాఱెన్= పరుగెత్తింది.

**తాత్పర్యం:** కర్ణుడు ఏ వైపు తొలగివెళ్ళాడో ఆ దిక్కుకే అభిమన్యుడూ పోయాడు. అపుడు ఆ కర్ణుడు ధైర్యం చెడి పారిపోయాడు. వెంటనే ఇతర వీరులు కూడా తమ దర్పాన్ని వీడి, భూమి అదిరిపోయేటట్లుగా పరుగులు తీశారు.

**విశేషం:** రసోచిత పద ప్రయోగంలో తిక్కన నేర్పు అసాధారణం. అందులోనూ సమయ సందర్భాలకు అనుగుణంగా అచ్చతెలుగు పదాలను సమకూర్చడంలో ఆయనకు ఆయనయే సాటి. కర్ణుడు ధైర్యం చెడి పారిపోగా, అతడిని ఆశ్రయించిన తక్కిన యోధులు

ఏ విధంగా బిక్కురుమని దిక్కు కొకరుగా పరువులెత్తి పోయారో, డకారంగల పదాలలో సూచించారు. 'యోధ సమూహ' మనే పదాన్ని ఛందశ్శిల్ప మర్మజ్ఞుడైన తిక్కన విఱిచి, ఆ సందర్భాన్ని ధ్వనింపజేశాడు.

**వ. ఇ వ్విధంబున సైన్యంబులు దారును బఱచు దొరలం జూచి యాచార్యుండు. 58**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; సైన్యంబులు= సైన్యాలు; తారును= తామూ; పఱచు= పరుగులెత్తే; దొరలన్= వీరులను; చూచి= కనుగొని; ఆచార్యుండు= ద్రోణాచార్యుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా సైన్యాలూ తామూ పరుగులెత్తే వీరులను చూచి ద్రోణాచార్యుడు.

**చ. నిలు నిలు కర్ణ! యో కృపుఁడ! నీ విటు లేల కడంక దక్క, సౌ**
**బల! ధృతి దూల నేమిటికి? బాహ్లిక! యిత్తఱిఁ గౌరవేంద్ర! నీ**
**బలముఁ జలంబుఁ జూపి నిలుపందగు 'సేనల' నంచుఁ బెక్కు భం**
**గులఁ బురికొల్ప నెవ్వరును గోల్తల సేయర యేమి సెప్పుదున్! 59**

**ప్రతిపదార్థం:** కర్ణ!= ఓ కర్ణుడా!; ఓ కృపుఁడ!= ఓ కృపాచార్యా!; నిలు నిలు= నిలువుము నిలువుము(పాఱిపోకు); సౌబల=ఓ శకునీ! నీవు= నీవు; ఇటులు= ఈ విధంగా; కడంకన్= పూనికను; తక్కన్+ఏల?= వదలటం ఎందుకు?; బాహ్లిక!= బాహ్లికుడా!; ఇత్తఱిన్(ఈ+తఱిన్)= ఈ సమయంలో; ధృతిన్= ధైర్యాన్ని; తూలన్+ఏమిటికిన్?= విడవటం ఎందుకు?; కౌరవేంద్ర!= దుర్యోధనా !; నీ+బలమున్= నీ బలాన్ని; చలమున్= పట్టుదలను లేదా మాత్సర్యాన్ని; చూపి= ప్రకటించి; సేనలన్= సైన్యాలను; నిలుపన్ +తగున్= తప్పక నిలుపవలసి ఉంది; అంచున్= అని తెలుపుతూ; పెక్కు+భంగులన్= అనేక విధాలుగా; పురికొల్పన్= ప్రేరేపించగా; ఎవ్వరును= ఎవరుగానీ; కోల్తల+చేయర= (ఎదిరింపరైరి) మార్కొనటం చేయలేదే!; ఏమి+చెప్పుదున్?= ఏమి చెప్పగలను?

**తాత్పర్యం:** 'ఓ కర్ణా! ఓ కృపుడా! మీరు నిలవండి. పారిపోవద్దు. ఓ శకునీ! నీవెందుకు ప్రయత్నాన్ని విడిచావు? బాహ్లికా! నీవెందుకు ధైర్యాన్ని వదలిపెట్టావు? దుర్యోధనా! ఇప్పుడు నీవు నీ బలాన్నీ పట్టుదలనూ చూపి సేనలను నిలుపవలసి ఉన్నది' అని అంటూ అనేక విధాలుగా ప్రేరేపించినా ఎవ్వరూ ఎదుర్కొనటానికి ముందుకు రాలేదు. ఇంకేమి అనాలి?

**విశేషం:** పరుగులెత్తుతూ, ప్రయత్నించక, ధైర్యాన్ని కోల్పోయిన అందరినీ పేరుపేరునా పిలుస్తూ, ప్రత్యేకించి దుర్యోధనుడితో 'నీవైనా నీ బలాన్నీ, చలాన్నీ చూపి సేనలను నిలుపవలసి ఉంది' అని ద్రోణుడు చెప్పిన విధానం ఈ చంపకమాలలో అప్రయత్నస్ఫూర్తితో అతిసహజంగా ప్రదర్శితమైనది.

**వ. ఇట్లు ప్రళయ సమయ ధారాధరస్ఫీత నిర్ఘాతచ్ఛటాభీలంబగు నబ్బాలుని బెడిదంపు టంపఱ సైరింపంజాలక నీబలంబులువాఱిన నక్కుమార కంఠీరవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించి గుణంబుసారించి యనికిం దనివి సనక వెనుకం దవిలి వట్టియడవి ముట్టి యేర్చు కార్చిచ్చు చందంబునం జతురంగబలంబులం బొరిసమరినం దేరులు నలియం ద్రెళ్ళిన శుండాలంబులును గాలుబలంబుల పీనుంగుపెంటలమీఁద నూఁదుకొనం గూలిన ఘోటకంబులును, గుట్టపు టట్టలరాసులు మూసికొని యఱవఱలైనయరదంబులును గరటి కళేబరంబులు వొదవినంగాలుగాలం బెనఁచుకొని పడియున్న సుభట సమూహంబులును,గంకణాంగద కాంతంబులైనకరకాండంబుల గములును, ముసుంగు వడ డొల్లిన సకుండల మస్తకంబులును, వీరకటకంబులు మెఱయఁ జిక్కువడియున్న చరణంబులును, గ్రిందుపడం దొరంగిన గాత్ర ఖండంబులును దునియలైన**

**ధనురాది హేతివ్రాతంబులపైఁ బొడవు సెడక బాహువుల తోడం బొలుచు కృపాణ ప్రముఖ ప్రహరణంబులును, గొడుగుల కుప్పలును జామరంబుల ప్రోవులును, సిడంబుల తిట్టలును, నయి సంగరాంగణంబు ఘోరభంగి యయ్యెఁ నప్పుడు గగనమధ్యభాగంబున భాసమానుం డయిన మార్తాండు రెండవ మూర్తియుం బోలె నయ్యేకవీరుండు వెలింగె' ననవుడు నాంబికేయుండు సంజయున కిట్లనియె. 60**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రళయసమయ+ధారాధరస్ఫీత, నిర్ఘాత, ఛటా+ఆభీలంబు+అగు= ప్రళయకాలంలోని మేఘాలయొక్క కఠినమైన పిడుగుల మొత్తంవలె భయంకరమైనది అగు; ఆ+బాలుని+బెడిదంపు+అంపఱ= బాలుడైన ఆ అభిమన్యుడి భయంకరాలైన బాణాలు; సైరింపన్+చాలక= ఓర్చుకొనలేక; నీ బలంబులు= నీ సైన్యాలు; పాఱినన్= పరుగెత్తగా; ఆ+కుమారకంఠీరవుండు= ఆ కుమార శ్రేష్ఠుడు; సింహనాదంబు+చేసి= గర్జించి; శంఖంబు+పూరించి= శంఖాన్ని ఊది; గుణంబు సారించి= అల్లెత్రాటిని మీటి; అనికిన్= యుద్ధానికి; తనివి చనక= తృప్తిపడక; వెనుకన్+తవిలి= వెంబడించిపోయి; వట్టి అడవి= ఎండిన అడవిని; ముట్టి= తాకి; ఏర్చు= కాల్చే; కార్చిచ్చు చందంబునన్= దావానలంవలె; చతురంగబలంబులన్= రథ,గజ,తురగ పదాతివర్గం అనే నాలుగు రకాల సేనలను; బారిసమరినన్= సంహరించగా; తేరులు+నలియన్= రథాలు విరుగగా; త్రెళ్ళిన+ శుండాలంబులును= పడి చచ్చిన ఏనుగులునూ; కాలుబలంబుల+పీనుంగు పెంటలమీఁదన్= పదాతిసైన్యం యొక్క శవాలకుప్పలపైన; ఊఁదుకొనన్= పట్టుకొనగా; కూలిన ఘోటకంబులును= నేలకూలిన గుర్రాలును; గుఱ్ఱపు+అట్టలరాసులు+మూసికొని= గుర్రాల మొండెముల రాసులు కప్పివేసి; అఱవఱలు+ఐన అరదంబులున్= చిన్న చిన్న ముక్కలైన రథాలు; కరటి+కళేబరంబులు= ఏనుగుల శవాలు; పొదివినన్= క్రమ్ముకోగా; కాలుకాలన్+పెనఁచుకొని= కాలూ కాలూ పెనవేసికొని; పడి+ఉన్న= నేలకూలి ఉన్న; సుభటసమూహంబులును= కాల్బలాల మొత్తములును; కంకణ+అంగద+కాంతంబులు+ఐన= కడియాలు, బాహుపురులు (భుజాలకు కట్టుకొనే నగలు) వీనిచే ప్రకాశమానాలైన; కరకాండంబుల+గములును= బాహుదండాల మొత్తాలును; ముసుంగు+పడన్+ డొల్లిన= కప్పబడగా రాలిన; సకుండల మస్తకంబులును= కుండలాలతోడి తలలును; వీరకటకంబులు= శూరత్వానికి గుర్తులైన అందెలు అనగా గండపెండేరాలు; మెఱయన్= ప్రకాశింపగా; చిక్కువడి+ఉన్న+చరణంబులును= మెలికలుపడి ఉండే కాళ్ళును; క్రిందుపడన్= అడుగునపడి; తొరంగిన= వ్రాలిన; గాత్ర ఖండంబులును= దేహాల తునుకలును; తునియలు+ఐన+ధనుః+ఆది+హేతి+ వ్రాతంబులపైన్= ముక్కలైన విల్లు మొదలైన ఆయుధాల మొత్తములపైన; పొడవు+చెడక= రూపం నశించక; బాహువులతోడన్= భుజాలతో కూడా; పొలుచు= ఒప్పు; కృపాణ, ప్రముఖ, ప్రహరణంబులును= కత్తి, మొదలైన ఆయుధాలును; గొడుగుల కుప్పలును= ఛత్రముల రాసులును; చామరంబుల ప్రోవులును= విసనకర్రల కుప్పలును; సిడంబుల+తిట్టలును= జెండాల మొత్తాలను; అయి= కలది అగుచు; సంగర+అంగణంబు= యుద్ధభూమి; ఘోరభంగిన్+అయ్యెన్= భయంకరమైన విధం కలది అయింది; అప్పుడు= ఆ సమయంలో; గగన మధ్యభాగంబునన్= ఆకాశంయొక్క మధ్యప్రదేశంలో; భాసమానుండు+అయిన= ప్రకాశించే వాడైన; మార్తాండు= సూర్యుడి; రెండవ మూర్తియున్+పోలెన్= రెండవరూపం వలె; ఆ+ఏకవీరుండు= ఒకేఒక వీరుడైన ఆ అభిమన్యుడు; వెలింగెన్= ఒప్పినాడు; అనవుడున్= అని చెప్పిన అనంతరం; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ప్రళయకాలంలో మేఘాల నుండి వెలువడే పిడుగుల మాదిరి భయంకరంగా ఆ బాలుడు ప్రయోగించే బాణాలకు నీ సైన్యాలు తట్టుకోలేక పరుగెత్తాయి. కానీ, ఆ కుమారసింహం సింహనాదం చేస్తూ శంఖాన్ని పూరించి, అల్లెత్రాటిని సారించి, అప్పటి ఆ యుద్ధానికి తృప్తిపడక, సైన్యాన్ని వెంబడించి, కార్చిచ్చువలె చతురంగ బలాన్ని కాల్చి మసి చేశాడు. అప్పుడు తేరులు నలిగి పోయేటట్లు ఏనుగులు త్రెళ్ళిపడ్డాయి. చచ్చిన సైనిక భటులమీద గుర్రాలు కూలిపడ్డాయి. గుర్రాలను రథాలు మూసివేశాయి. ఏనుగుల కళేబరాలు, కాలూకాలూ పెనవేసికొని పడి ఉండే భటులూ, కడియాలతో బాహుపురులతో మెరిసే బాహుదండాలూ, కుండలాలలో ఉండే మొండెములూ,

గండపెండేరాలు మెరుస్తూ ఉండగా చిక్కుపడ్డ కాళ్ళూ, రాలిన శరీరాల ముక్కలూ, తునాతునకలైన విండ్లూ మొదలైన ఆయుధాలూ, కత్తులూ మొదలైన ఆయుధాలు అట్లాగే తమ చేతులలో మెరుస్తూ రూపం చెడకుండా పడి ఉండే వీరులూ, ఎక్కడ చూచినా కుప్పలు కుప్పలుగా గొడుగులూ, చామరాలూ, జెండాలూ - ఈ విధంగా యుద్ధభూమి మహా భయంకరంగా పరిణమించింది. అప్పుడు ఆకాశ మధ్యభాగంలో ప్రకాశించే రెండో సూర్యుడా అన్నట్లు అభిమన్యుడు వెలిగాడు' ఇట్లా చెప్పిన తర్వాత ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. స్వభావోక్తి.

**ఆ. 'బాలుఁడొంటి యిట్లు పలువురతోడఁ బో। రంగఁ జూచి పాండురాజతనయు**
**లందుఁ దోడు పడుటకై యొకరుండును। గడఁగ కునికి కేమి కారణంబు?' 61**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; బాలుఁడు= బాలుడైన అభిమన్యుడు; పలువురతోడన్= అనేకులతో; ఒంటి+పోరంగన్= ఒక్కడే పోరాడగా; చూచి; పాండురాజ తనయులు= పాండవులు; అందున్= ఆ సమయంలో; తోడుపడుటకై= సహాయపడటానికై; ఒకరుండును= ఒక్కడైనా; కడఁగక= పూనుకొనకుండా; ఉనికికిన్= ఉండటానికి; ఏమి కారణంబు?= కారణం ఏమిటి?

**తాత్పర్యం:** 'ఒంటిగా బాలుడు ఇట్లా పలువురితో పోరాడుతూ ఉంటే చూస్తూ ఉండిన పాండవులలో ఒక్కరు కూడా సహాయపడటానికి ఎందుకు పూనుకొనలేదు. కారణం ఏమిటి?'

**వ. అనవుడు సంజయుం డిట్లనియె. 62**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అడిగిన అనంతరం; సంజయుండు= సంజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అనగా సంజయుడు ఇట్లా అన్నాడు:

**పద్మవ్యూహంబు సొచ్చు పాండవులకు సైంధవుం డడ్డ పడుట (సం. 7-41-3)**

**చ. 'వినుము నరేంద్ర! పాండవులు విక్రమ దుర్దముఁ డైన పార్థనం**
**దనునకుఁ దోడ్పడం గడఁగి దంతితురంగ రథోత్కరంబులం**
**దునుముచు సత్వరస్ఫురణఁ ద్రోఁచిన నీ పెనుమూఁక పాయవి**
**చ్చి నిలిచి చూచుచుండె నవిచేష్టితులైరి బలాధినాథులున్. 63**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= ధృతరాష్ట్ర మహారాజా!; వినుము; పాండవులు; విక్రమ+దుర్దముఁడు+ఐన= పరాక్రమంచేత అణచటానికి వీలుకాని వాడైన; పార్థనందనునకున్= అభిమన్యుడికి; తోడ్పడన్= సహకరించటానికి; కడఁగి= పూని; దంతి= ఏనుగులు; తురంగ= గుర్రాలు; రథ= రథాలు(వీటి); ఉత్కరంబులన్= మొత్తాలను (సమూహాలను); తునుముచున్= ఖండిస్తూ;సత్వర+స్ఫురణన్= వేగంతో కూడికొన్న ఆలోచనతో (తలంపుతో); త్రోఁచినన్= త్రోసికొనిరాగా; ఈ+పెను+మూఁక= ఆ గొప్పసేన; పాయ+విచ్చి= దారిచీలి; నిలిచి= నిలబడి; చూచుచున్+ఉండెన్= చూస్తూ ఉండిపోయింది; బల+అధినాథులున్= సైన్యాధిపతులున్నూ; అవిచేష్టితులు+ఐరి= చేతలు ఉడిగినవారైనారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! వినుము. పాండవులు మహాపరాక్రమశాలి అయిన అభిమన్యుడికి సహాయపడటానికి ప్రయత్నించి, ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ వీటి సమూహాలను ఖండిస్తూ త్రోసికొని రాగా, నీ పెద్ద సైన్యం దారి చీలి నిలిచి చూస్తూనే ఉండిపోయింది. సైన్యాధిపతులున్నూ చేష్టలుడిగి అట్లాగే ఉండిపోయారు.

**విశేషం:** పాఠాంతరము: చూచుచుండి రవిచేష్టితులైన బలాధినాథులున్; ఈ+పెను+మూఁక= ఈ పెద్ద సైన్యసమూహం; పాయ+విచ్చి= దారి చీలి; నిలిచి= నిలువబడి; చూచుచుండెన్= చూస్తూ ఉండింది; బల+అధినాథులున్= సైన్యాధిపతులున్నూ; అవిచేష్టితులు+ఐరి= చేష్టలు ఉడిగినవారైరి.

**వ. పాంచాల యాదవ పాండ్య కేకయ మాత్స్యప్రముఖ మహనీయ సైన్యంబులతో న ట్లురవడించిన నయ్యుధిష్ఠిరుండను మహావాయువునకు జయద్రథుం డద్రియపోలె నడ్డపడియె' నని చెప్పుటయు విస్మితుం డగుచు వైచిత్రవీర్యుం డతని కిట్లనియె. 64**

**ప్రతిపదార్థం:** పాంచాల, యాదవ, పాండ్య, కేకయ, మాత్స్య, ప్రముఖ= పాంచాలురు, యాదవులు, పాండ్యులు, కేకయులు, విరాటుడు మొదలైన; మహనీయ+సైన్యంబులతోన్= గొప్పసేనలతో; అట్లు= ఆ విధంగా; ఉరవడించినన్= వేగిరపడగా; ఆ+యుధిష్ఠిరుండు= యుద్ధంలో స్థిరంగా నిలిచేవాడైన ఆ ధర్మరాజు; అను+మహావాయువునకున్= అనే పెద్దగాలికి; జయద్రథుండు= సైంధవుడు; అద్రి+అ+పోలెన్= కొండవలె; అడ్డపడియెన్= అడ్డుపడ్డాడు; అని= ఈ ప్రకారంగా; చెప్పుటయున్= చెప్పడమున్నూ; విస్మితుండు+అగుచున్= ఆశ్చర్యం కలిగినవాడౌతూ; వైచిత్రవీర్యుండు= విచిత్రవీర్యుని కొడుకైన ధృతరాష్ట్రుడు; అతనికిన్= ఆ సంజయునికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** పాంచాలురు, యాదవులు, పాండ్యులు, కేకయులు, మత్స్యదేశపురాజు విరాటుడూ మొదలైన మహనీయుల సైన్యాలతో ఆ విధంగా త్వరపడిన యుధిష్ఠిరుడు(ధర్మరాజు) అనే పెద్దగాలికి సైంధవుడు కొండవలె అడ్డుపడ్డాడు' అని సంజయుడు చెప్పగానే ఆశ్చర్య చకితుడైన ధృతరాష్ట్రుడు అతడితో ఈ విధంగా అన్నాడు:

**విశేషం:** అలంకారం ఉపమ.

**చ. తనయునిమీఁది కూరిమి నుదగ్రత సేనలతోడఁ బాండునం**
**దనులు రయంబుమై నడరఁ దా నొకరుండ భుజాబలంబు నే**
**పునఁ గుదియించెనే యతఁడపో! కురుసేనకు మేటి సింధురా**
**జున కది యేమహాతపము సొంపున నత్తఱి సంభవించెనో! 65**

**ప్రతిపదార్థం:** తనయునిమీఁది కూరిమిన్= కొడుకుమీది ప్రేమతో; ఉదగ్రతన్= భయంకరంగా; పాండునందనులు= పాండవులు; సేనలతోడన్= సైన్యాలతో; రయంబుమైన్= వేగంతో; అడరన్= క్రమ్మగా; తాన్= తాను; ఒకరుండు+అ= సైంధవుడు ఒక్కడే; భుజాబలంబు+ఏపునన్= బాహుబల విజృంభణంతో; కుదియించెనే?= భంగపరచాడా?; కురుసేనకున్ మేటి= కౌరవసైన్యానికి అధికుడు; అతఁడపో!= ఆ సైంధవుడే; అది= ఆ శౌర్యాతిశయం; ఏ మహాతపము+సొంపునన్= ఏ గొప్ప తపస్సుయొక్క సమృద్ధితో; సింధురాజునకున్= సైంధవుడికి; ఆ+తఱిన్= ఆ సమయంలో; సంభవించెనో!= కలిగిందో!

**తాత్పర్యం:** కొడుకుమీద ప్రేమతో భయంకరంగా పాండవులు సేనలతో సైంధవుడిని క్రమ్ముకొన్నారు. కాని, సైంధవుడు ఒక్కడే తన భుజబలంతో భంగపరచాడా! కౌరవసైన్యానికి తానే అధికుడు. అతడికి ఆ శౌర్యాతిశయం ఏ మహాతపస్సు ఫలితంగా ఆ సమయంలో ఆ విధంగా సంభవించింది?'

**వ. అనిన విని సూతసూనుఁ డమ్మానవపతి కిట్లనుఁ బాండవు లరణ్యంబున నున్ననాఁ డతండు ద్రౌపదికతంబున భీమసేనుచేత భంగపడి, సంతప్త చిత్తుండై చిత్తజారాతి నారాధించిన నతని గరిష్ఠ నిష్ఠాతిశయంబునకు భక్తవత్సలుండగు నప్పరమేశ్వరుండు ప్రీతుండై పొడసూపిన జయద్రథుండును గౌంతేయుల నివారించునట్లుగా**

**వరం బొసంగవలయునని విన్నవించిన, నద్దేవుండు '(నర్జునుండు దక్కదక్కిన నలువురు) పాండవులు నీచేత నివారితులగుట యొక్క దివసంబునం గలుగుఁగాక!' యని పలికి యంతర్హితుం డయ్యెఁ నదికారణంబుగా నట్టి గౌరవం బా రథికవరునకు దొరకొనియెఁ దత్పరాక్రమంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము.66**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధృతరాష్ట్రుడు అనగా; విని= ఆకర్ణించి; సూతసూనుఁడు= సంజయుడు; ఆ+మానవపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుకు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; పాండవులు; అరణ్యంబునన్= అడవిలో; ఉన్ననాఁడు= ఉన్నప్పుడు; అతండు= ఆ సైంధవుడు; ద్రౌపదికతంబునన్= ద్రౌపది కారణంగా; భీమసేనుచేతన్= భీముడిచేత; భంగపడి= అవమానం పొంది; సంతప్తచిత్తుండు+ఐ= మిక్కిలి తపించినమనస్సు కలవాడై; చిత్తజ+అరాతిన్= మన్మథశత్రువైన ఈశ్వరుడిని; ఆరాధించినన్= సేవించగా; అతని; గరిష్ఠ, నిష్ఠా+అతిశయంబునకున్= ఆ సైంధవుడి గొప్ప నిష్ఠ వలని ఆధిక్యానికి; భక్తవత్సలుండు+అగు= భక్తులపై వాత్సల్యం కలవాడగు; ఆ+పరమ+ఈశ్వరుండు= ఆ పరమశివుడు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; పొడచూపినన్= కనిపించగా; జయద్రథుండును= సైంధవుండునూ; కౌంతేయులన్= కుంతీకుమారులైన పాండవులను; నివారించునట్లుగాన్= అడ్డగించేటట్లు; వరంబు+ఒసంగవలయును+అని= వరమియ్యాలి అని; విన్నవించినన్= విజ్ఞప్తిచేసుకోగా; ఆ+దేవుండు= ఆ పరమేశ్వరుడు; అర్జునుండు తక్కన్= అర్జునుడు తప్ప; తక్కిన నలువురు= మిగతానలుగురు; పాండవులు; నీచేతన్= నీచేత; నివారితులు+అగుట= అడ్డగించబడినవారు కావటం; ఒక్క+దివసంబునన్= ఒక్కదినంలో; కలుగున్+కాక!= జరుగును గాక!; అని= ఆ ప్రకారంగా; పలికి= చెప్పి(మాటాడి); అంతర్హితుండు+అయ్యెన్= అదృశ్యుడయ్యాడు; అదికారణంబుగాన్= ఆ వరం కారణంగా; అట్టి గౌరవంబు= అటువంటి గౌరవం; ఆ+రథికవరునకున్= ఆ రథిక శ్రేష్ఠుడికి; దొరకొనియెన్= కలిగింది; తద్+పరాక్రమంబు+తెఱంగు= అతడియొక్క పరాక్రమ విధం; ఎఱింగించెదన్= తెలియజేస్తాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అనగా విని సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'పాండవులు అరణ్యంలో ఉన్నప్పుడు సైంధవుడు ద్రౌపది కారణంగా భీముడిచేత భంగపడి, మిక్కిలి పరితపించి, పరమేశ్వరుడిని సేవించాడు. అతడి గొప్ప నిష్ఠకు శివుడు ప్రీతిచెందినవాడై కనిపించాడు. అపుడు సైంధవుడు కుంతీపుత్రులను అడ్డగించేటట్లు వరం ఇమ్మన్నాడు. అపుడు శివుడు 'ఒక్క అర్జునుడు తప్ప తక్కిన పాండవులు నీచేత అడ్డగింపబడతారు అదీ ఒక్కదినం మాత్రమే' అని పలికి అదృశ్యమయ్యాడు. ఆ పరమశివుడి వరం కారణంగా అతడికి అటువంటి గౌరవం కలిగింది.ఇక అతడి పరాక్రమము ఎట్లాంటిదో వివరిస్తాను వినుము.

**సీ. సింధుదేశోద్భవ స్థిర వాహనంబులఁ । బూనిన యరదంబు పొలుపు మిగుల,**
**రత్నమయోగ్ర వరాహధ్వజంబు న । భస్థలిఁ జంచల ప్రభల మెఱయ,**
**సాంద్ర చంద్రాతప సదృశమై యుజ్జ్వల । చ్ఛత్ర చామరముల చాయ నిగుడ,**
**వజ్రముక్తాఫల వ్రజకిరణావళి । కలిత భూషణములు వెలుఁగుచుండఁ ,**

**తే. జిత్తమున వరగర్వంబు చిగురు లొత్తఁ । బాండుపుత్త్రుల దుర్దాంత బాహుబలము**
**మొనలపెల్లును సరకుగాఁ గొనక యేచి । యార్చి వారికి నీయల్లుఁ డడ్డపడియె. 67**

**ప్రతిపదార్థం:** సింధుదేశ+ఉద్భవ= సింధుదేశంలో పుట్టిన; స్థిరవాహనంబులు= మేలైన గుర్రాలు; పూనిన అరదంబు= కట్టినరథం; పొలుపు మిగులన్= అందం అతిశయించగా; రత్నమయ= రత్నాలచేత ప్రాచుర్యం చెందిన; ఉగ్ర, వరాహ, ధ్వజంబు= భయంకరమైన పంది గుర్తుగల జెండా; చంచల+ప్రభలన్= కదుల్తూ ఉండే కాంతులతో; నభః+స్థలిన్= ఆకాశ ప్రదేశంలో; మెఱయన్= ప్రకాశింపగా; సాంద్ర= దట్టమైన; చంద్రాతప+సదృశమై= వెన్నెలకు సాటియై; ఉజ్జ్వలత్= ప్రకాశిస్తూ ఉన్న; ఛత్ర+చామరములు= గొడుగులు, వింజామరలు, చాయ+నిగుడన్= కాంతి నింపగా (వ్యాపింపజేయగా); వజ్ర= వజ్రాలయొక్క; ముక్తాఫల= ముత్యాలయొక్క; వ్రజ=

సమూహాల; కిరణ+ఆవళిన్= కాంతుల మొత్తంచేత; కలిత భూషణములు= కూడిన ఆభరణాలు; వెలుఁగుచుండన్= ప్రకాశిస్తూ ఉండగా; చిత్తమునన్= మనస్సులో; వరగర్వంబు= వరం వలని దర్పం; చిగురులొత్తన్= మోసులెత్తగా; పాండుపుత్త్రులు= పాండవుల; దుర్దాంత, బాహు, బలమున్= అణచటానికి వీలుకాని భుజబలాన్ని; మొనల+పెల్లును= సేనల ఆధిక్యాన్ని; సరకుగాన్+కొనక= లక్ష్యపెట్టకుండా; ఏచి= విజృంభించి; ఆర్చి= గర్జించి; వారికిన్= పాండవులకు; నీ+అల్లుఁడు= నీ అల్లుడైన సైంధవుడు (దుస్సల భర్త); అడ్డపడియెన్= (ఎదిరించి నిలిచాడు) అడ్డగించాడు.

**తాత్పర్యం:** సింధు దేశానికి సంబంధించిన ఉత్తమజాతి గుర్రాలు కట్టిన రథం అందగించగా, రత్నమయమై భయంకరమైన పందిగుర్తు గల జెండా కదులుతూ రెపరెపలాడగా, నిండు వెన్నెలకు సమానంగా ప్రకాశించే గొడుగుల, వింజామరల కాంతులు వ్యాపించగా, వజ్రాల, ముత్యాల ఆభరణాల కాంతులు వెలుగుతూ ఉండగా, మనస్సులో వర గర్వం చెలరేగగా, అణచటానికి వీలుకాని పాండవుల భుజబలాన్నీ, వారి సేనల ఆధిక్యాన్నీ లెక్కచేయకుండా నీ అల్లుడు విజృంభించి, గర్జిస్తూ అడ్డుకొన్నాడు.

**వ. ఇవ్విధంబున నడ్డపడి సాత్యకిని సాయకత్రయంబునను, భీమసేనుని బాణాష్టకంబునను, ధృష్టద్యుమ్నుని నిరువది యమ్ములను, విరాటుని శిఖండిని బదిపదితూపులను, బాంచాలపతి నేడింటను, ద్రౌపదేయుల బదియేనింటను, గేకయుల నిరువదేనింటను, ధర్మసూను సప్తతి శరంబులను నేసి యాసేన నానాస్త్రంబులం గప్పెనప్పుడప్పాండవాగ్రజుం డతని కోదండంబు దుండంబులు సేసిన నా సైంధవుం డొండువింట మంటలుం బోని మార్గణమ్ము లమ్మనుజపతి మీఁదను, దదనుచరుల యంగంబులందును, బరఁగించినం బవనతనయుండు దలకడచి రభసంబున. 68**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; అడ్డపడి= అడ్డగించి; సాత్యకిని+సాయకత్రయంబునన్= సాత్యకిని మూడుబాణాలతో; భీమసేనున్, బాణ+అష్టకంబుననున్= భీమసేనుడిని ఎనిమిది బాణాలతో; ధృష్టద్యుమ్ననిన్+ఇరువది+అమ్ములనున్= ధృష్టద్యుమ్నుడిని ఇరవై బాణాలతో; విరాటునిన్, శిఖండినిన్+పది పది తూపులనున్= విరాటుడిని, శిఖండినీ పది పది బాణాలతో; పాంచాలపతిన్= ద్రుపదరాజును; ఏడింటనున్= ఏడు బాణాలతో; ద్రౌపదేయులన్= ఉపపాండవులను; పది+ఏనింటనున్= పదునైదు బాణాలతో; కేకయులన్+ఇరువది+ఏనింటనున్= కేకయులను ఇరవై ఐదు బాణాలతో; ధర్మసూనున్+సప్తతి+శరంబులనున్= ధర్మరాజును డెబ్బైబాణాలతో; ఏసి= ప్రయోగించి; ఆ సేనన్= ఆ సైన్యాన్ని; నానా+అస్త్రంబులన్= అనేకాలైన అస్త్రాలతో; కప్పెన్= కప్పివేశాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ ధర్మరాజు; అతని+కోదండంబు= ఆ సైంధవుడి విల్లు; తుండంబులు+చేసినన్= ముక్కలు చేయగా; ఆ సైంధవుండు= ఆ జయద్రథుడు; ఒండువింటన్= మరొక వింటితో; మంటలున్+పోని, మార్గణమ్ములు= మంటలను పోలిన బాణాలు; ఆ+మనుజపతి మీఁదను= ఆ రాజుపైన; తద్+అనుచరుల+అంగంబులందును= అతడిని అనుసరించి వచ్చే వాళ్ళ అవయవాలందు; పరఁగించినన్= ప్రయోగించగా; పవనతనయుండు= భీముడు; తలకడచి= మీరి, అతిశయించి; రభసంబునన్= వేగంతో.

**తాత్పర్యం:** ఈ రీతిగా సైంధవుడు అడ్డగించి సాత్యకిని మూడు బాణాలతో, భీముడిని ఎనిమిది బాణాలతో, ధృష్టద్యుమ్నుడిని ఇరవై బాణాలతో, విరాటుడిని, శిఖండిని పదేసి బాణాలతో, ద్రుపదుడిని, ఏడు బాణాలతో, ఉపపాండవులను పదునైదు బాణాలతో, కేకయులను ఇరవై అయిదు బాణాలతో, ధర్మరాజును డెబ్బైబాణాలతో నొప్పించి ఆ సైన్యాన్ని రకరకాల అస్త్రాలతో కప్పివేశాడు. అప్పుడు ధర్మరాజు సైంధవుడి వింటిని తుంటలు చేయగా, ఆ సైంధవుడు మరో విల్లు ధరించి మంటలను పోలిన బాణాలను రాజుపైనా, అతడి అనుచరుల అవయవములందు ప్రయోగించాడు. అంతలో భీముడు విజృంభించి వేగంతో.

**విశేషం:** ఆ బాణాల సంఖ్య శత్రుయోధుల సామర్థ్యానికి అనుగుణంగా ఉన్నాయనుకొనాలి.

**క. భల్లముల మూఁట గొడుగును । విల్లును బడగయును ద్రుంప వేఱొక విలు నీ**
**యల్లుఁడు గొని భీము గొడుగు । విల్లును బడగయును ద్రుంచి విరథుం జేసెన్. 69**

**ప్రతిపదార్థం:** భల్లముల+మూఁటన్= మూడు బల్లెములతో; గొడుగును= ఛత్రాన్ని; విల్లును= వింటిని; పడగయును= జెండాను; త్రుంపన్= త్రుంచివేయగా (ఖండించగా); నీ+అల్లుఁడు= నీ అల్లుడైన సైంధవుడు; వేఱు+ఒకవిలున్= మరో వింటిని; కొని= తీసికొని; భీముని గొడుగున్= భీముడి ఛత్రాన్ని; విల్లున్= ధనుస్సును; పడగయును= జెండాను; త్రుంచి= విరిచి; విరథున్+చేసెన్= రథంలేని వాడినిగా చేశాడు.

**తాత్పర్యం:** మూడు బల్లెములతో భీముడు ఛత్రాన్ని, ధనుస్సునూ, జెండాను ఖండించగా, నీ అల్లుడు మరో ధనుస్సును పూని భీముడి ఛత్రాన్ని వింటిని జెండాను త్రుంచి తేరు లేని వాడినిగా చేశాడు.

**వ. ఇట్లు వికల సాధనుం డై. 70**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకార; వికలసాధనుండు+ఐ= భగ్నమైన సాధనములు కలవాడై

**తాత్పర్యం:** ఈ విధంగా (ముక్కలైన) పగిలిన పరికరాలు కలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. అనిలసుతుండు సాత్యకి తేరిమీఁదికి । నరిగిన నీ సేన యార్చుటయును**
**సైంధవుపై వారి సైనికోత్తము లనే । కాస్త్రముల్ వఱపిన, నతఁడు వాని**
**మరలింప ము న్నభిమన్యుచేఁ గూలిన । రథదంతి హయ భటరాజికతన**
**నతి విషమంబైన యానేల నవిహత । గతి నరదంబులు గ్రందు వఱపి**

**ఆ. వారు సేసి రాహవము; దాని కోర్చి యం । దఱును దమక తమక దనిసి వెనుక**
**కొదుఁగునట్లు గాఁగ నుజ్జ్వల శరనికా । యములు గురిసె నా జయద్రథుండు. 71**

**ప్రతిపదార్థం:** అనిలసుతుండు= భీముడు; సాత్యకి, తేరిమీఁదికిన్= సాత్యకి రథంపైకి; అరిగినన్= పోగా; నీసేన= నీ సైన్యం; ఆర్చుటయును= గర్జించగా; వారి, సైనిక+ఉత్తములు= పాండవుల సైన్యంలోని శ్రేష్ఠులు; అనేక+అస్త్రముల్= పెక్కు బాణాలు; సైంధవుపైన్+పఱపినన్= సైంధవుడిమీద, ప్రయోగించగా; అతఁడు= ఆ సైంధవుడు; వానిన్= ఆ బాణాలను; మరలింపన్= వెనక్కిపోయేటట్లు చేయగా; మున్ను= ముందు; అభిమన్యుచేన్= అభిమన్యుడిచేత; కూలిన= పడిన; రథ,దంతి,హయ,భట, రాజి= తేరులు, ఏనుగులు, గుర్రాలు, కాలరుల, మొత్తం(అనగా చతురంగబలాలు); కతనన్= కారణంగా; అతి+విషమంబు+ఐన+ఆ+నేలన్= మిక్కిలి ఒడుదుడుకైన ఆ ప్రదేశంలో; అవిహతగతిన్= తిరుగులేని నడకతో; అరదంబులు= తేర్లు; క్రందు+పఱపి= దట్టంగా తోలి; వారు= పాండవసైనికులు; ఆహవము+చేసిరి= యుద్ధం చేశారు; అందఱును= అందరూ; దానికిన్= ఆ పాండవ సైన్య విజృంభణానికి; ఓర్చి= సహించి; అందఱును= ఆ పాండవులందరూ; తమక, తమక, తనిసి= తమకు తాము సమాధానపడి; వెనుకకున్= వెనకకు; ఒదుఁగునట్లు+కాఁగన్= దాగుకొనేటట్లుగా; ఆ+జయద్రథుండు= ఆ సైంధవుడు; ఉజ్జ్వల, శర, నికాయములు= మండుతూ ఉండే బాణాల మొత్తాలు; కురిసెన్= వర్షించాడు.

**తాత్పర్యం:** భీముడు సాత్యకి రథంపైకి పోగా, నీ సైన్యం గర్జించింది. అపుడు పాండవ సైన్యంలోని వీరులుఅనేక బాణాలు సైంధవుడి మీద ప్రయోగించారు. సైంధవుడు వాటిని అన్నింటినీ వెనక్కి మళ్ళించి, అంతకుముందు అభిమన్యుడిచేత చతురంగబలం పడిపోయిన కారణంగా, ఎగుడు దిగుడుగా ఉండే ఆప్రదేశంలో అప్రతిహతగమనంతో

రథాలను దట్టంగా తోలి పాండవులు పోరాడారు. ఆ పాండవులు అందరూ తమకు తాము చాలా సమాధానపడి. సైంధవుడు వారందరినీ వెనక్కు తగ్గేటట్లు మండుతూ ఉండే బాణాలు ప్రయోగించాడు.

**విశేషం:** సైంధవుడు పాండవులను అడ్డగించాడు. వారిపోరు ఘోరంగా పరిణమించింది. ఈ సందర్భంలో అంతకుమునుపు అభిమన్యుడు చతురంగ బలాన్ని చిందరవందర చేసిన సంఘటన స్మరణకు తేబడింది. అభిమన్యుడు కూల్చిన చతురంగ బలం కారణంగా అక్కడ ప్రదేశం అతి విషమంగా ఉందని అంటే సమతలంగా లేకుండా హెచ్చుతగ్గులుగా ఒడుదుడుగ్గా ఉందనీ అందువలన సైన్యం నడవటానికి కష్టంగా ఉందనీ వర్ణించబడింది. 'అవిహత గతి' అని తిక్కన ఇక్కడ తత్సమపద ప్రయోగం చేశాడు. సైన్యంలో అందరూ సంతృప్తిగా పోరాడారు అనే అభిప్రాయాన్ని 'తమక తమక తనిసి' అని అచ్చ తెలుగు పదాలలో తెలపడం విశేషం. సైంధవుడు తన బాణ ప్రయోగంతో వారందరూ వెనుకకు తగ్గేటట్లు చేయగలిగాడు.

**వ. ఇత్తెఱంగున సింధురాజు పాండవుల వేఁడిమి యుడిపిన, నుభయపార్శ్వంబులకు మున్ను దొలంగియున్న నీ బలంబులు గోల్తల సేసి య క్కౌంతేయ సైన్య సంతానంబుతోఁ దలపడినం బోరు ఘోరంబయ్యెఁ; నక్కడఁ గుంభసంభవ ప్రయత్న విశేషంబునం జేసి వాహిని మగుడ నడరి యభిమన్యుం బొదివిన నక్కుమారుండు నుక్కునం గడంగి. 72**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; సింధురాజు= సైంధవుడు; పాండవుల వేఁడిమి= పాండవుల ప్రతాపాన్ని; ఉడిపినన్= పోకార్చగా; ఉభయ పార్శ్వంబులకున్= ఇరుప్రక్కలకు; మున్ను= ముందు; తొలంగి ఉన్న= తప్పి ఉన్న; నీబలంబులు= నీ సైన్యాలు; కోల్తలచేసి= ఎదుట నిలిచి యుద్ధం చేసి (యుద్ధసన్నాహం గావించి); ఆ+కౌంతేయసైన్య సంతానంబుతోన్= పాండవసేనా సమూహంతో; తలపడినన్= ఎదుర్కొనగా; పోరు= యుద్ధం; ఘోరంబు+అయ్యెన్= భయంకరమయింది; అక్కడన్= ఆ కౌరవ పక్షంలో; కుంభసంభవ= ద్రోణుడి; ప్రయత్న విశేషంబునన్+చేసి= విశేషమైన ప్రయత్నంచేత; వాహిని= సైన్యం; మగుడన్= మళ్ళీ; అడరి= విజృంభించి; అభిమన్యున్= అభిమన్యుడిని; పొదివినన్= కలిసి చుట్టుకోగా; ఆ+కుమారుండున్= ఆ బాలుడుకూడా; ఉక్కునన్= శౌర్యంతో; కడంగి= పూని.

**తాత్పర్యం:** ఈ విధంగా సైంధవుడు పాండవుల ప్రతాపాన్ని పోకార్చాడు. అటుపై ఇరుప్రక్కలకు దూరంగా తొలగి ఉన్న నీ సైన్యాలు యుద్ధానికి సంసిద్ధం అయ్యాయి. పాండవుల సేనాసమూహాలను ఎదుర్కొనడంతో యుద్ధం భయంకరంగా పరిణమించింది. అంతలో ద్రోణుడు ఎంతో ప్రయత్నంతో సైన్యాన్ని మళ్ళీ విజృంభించేటట్లు చేసి అభిమన్యుడిని చుట్టుముట్టగా, అతడు శౌర్యంతో పూనుకొని.

**క. అభిముఖ సంవృత్తములగు । నిభతురగ స్యందనంబు లిలఁ గూల్పఁగ న**
**క్షుభితుం డగు వృషసేనుఁడు । రభసంబున నతనిఁ బటు శరంబుల నొంచెన్. 73**

**ప్రతిపదార్థం:** అభిముఖ, సంవృత్తములు+అగు= ఎదురుగా చుట్టుముట్టేవి అయిన; ఇభ= ఏనుగులు; తురగ= గుర్రాలు; స్యందనంబులు= రథాలు; ఇలన్= నేలపై; కూల్పఁగన్= కూలగొట్టగా; అక్షుభితుండు= క్షోభించనివాడు(కలతచెందనివాడు); అగు= అయిన; వృషసేనుఁడు= వృషసేనుడు; రభసమునన్= వేగిరపాటుతో; పటుశరంబులన్= తీవ్రబాణాలతో; అతనిన్= అభిమన్యుడిని; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** ఇట్లా ఎదురుగా వచ్చి చుట్టుముట్టిన ఏనుగులనూ, గుర్రాలనూ, రథాలనూ అభిమన్యుడు నేలకూల్చగా ఏ మాత్రమూ చలించని వృషసేనుడు మహావేగంగా తీవ్రబాణాలతో అభిమన్యుడిని ఎదుర్కొని నొప్పించాడు.

### వృషసేనుం డభిమన్యుం దాఁకి మూర్ఛితుం డగుట (సం. 7-43-5)

**ఉ. నొంచినఁ గెంపు సొంపునఁ గనుంగవ యొప్పఁగ సూతుఁద్రుంచి, విల్**
**ద్రుంచి తురంగ వక్త్రములఁ దూఁపులు నించి, యలంచి, మేను నొ**
**ప్పించినఁ దేరితోడ నఱపీనుఁగు నీడిచికొంచుఁ బాఱె సే**
**నాంచలభూమికిం బెలుచ నత్తురగంబులు విహ్వలంబులై. 74**

**ప్రతిపదార్థం:** నొంచినన్= బాధించగా; కెంపుసొంపునన్= కెంపువలె; కనుంగవ+ఒప్పఁగన్= కళ్ళు రెండూ ప్రకాశించగా; సూతున్+త్రుంచి= సారథిని చంపి;విల్+త్రుంచి= ధనుస్సు విరిచి; తురంగ వక్త్రములన్= గుర్రాల ముఖాలలో; తూఁపులు+నించి= బాణాలు నింపి; అలంచి= అలసట కలిగించి; మేనున్= శరీరాన్ని; నొప్పించినన్= బాధపెట్టగా; పెలుచన్= మిక్కుటంగా; ఆ+తురగంబులు= ఆ గుర్రాలు; విహ్వలంబులు+ఐ= భయంచేత అవయవాలు స్వాధీనం తప్పినవై; తేరితోడన్= రథంతో కూడా; అఱపీనుఁగున్+ఈడిచి కొంచున్= సగం చచ్చిన వృషసేనుడిని ఈడ్చుకొంటూ (లాగుకొంటూ); సేనా+అంచల+భూమికిన్= సేన చివరి ప్రదేశానికి; పెలుచన్= వేగంగా; పాఱెన్= పరుగెత్తాయి.

**తాత్పర్యం:** అట్లా నొప్పించగా, రెండు కళ్ళూ కెంపులవలె మెరసిపోతుండగా సారథిని చంపి, విల్లు విరిచి, గుర్రాల నోళ్ళలో బాణాలు నింపి, అలసట కలిగించి, వాటి శరీరాలను నొప్పించాడు. అప్పుడు భయంతో అవయవాలు స్వాధీనం తప్పిన ఆ గుర్రాలు రథంతో కూడా సగం చచ్చిన వృషసేనుడిని సేనల చివరి ప్రదేశానికి ఈడ్చుకుంటూ పరుగెత్తాయి.

**విశేషం:** అంతకుముందు పద్యం 'నొంచెన్' అని ప్రయోగించటం ఎత్తుగడలో ఒక విశేషం. సగం చచ్చిన వృషసేనుడిని ఈడ్చుకొంటూ గుర్రాలు పరుగెత్తిన సన్నివేశాన్ని తిక్కన ఎంతో నాటకీయంగా మన కళ్ళముందు నిలిపాడు. 'అఱపీనుఁగు' అనే ప్రయోగం ఎంతో వినూత్నంగా ఉన్నది.

**వ. ఇట్లు వృషసేను నరదంబు పఱచిన తెఱపిన యభిమన్యుండు నిజస్యందనంబు పఱపించినం బటు సంరంభంబున నెదుర్కొని. 75**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వృషసేను+అరదంబు= వృషసేనుడి రథం; పఱచిన+తెఱపిన= పరుగెత్తిన అవకాశంలోనే; అభిమన్యుండు= అభిమన్యుడు; నిజ+స్యందనంబు= తన రథం; పఱపించినన్= పరుగెత్తించగా; పటు+సంరంభంబునన్= తీవ్రమైన సన్నాహంతో; ఎదుర్కొని= ఎదిరించి.

**తాత్పర్యం:** ఈ విధంగా వృషసేనుడి రథం పరుగెత్తిన దారిలోనే అభిమన్యుడు తన రథాన్ని పరుగెత్తించగా తీవ్ర సన్నాహంతో ఎదిరించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. శౌర్యధుర్యుఁ డగు వసాతి భూపతి షష్టి । శితశరంబు లేయ నతఁడు దొడ్డ**
**నారసమున వాని నలిఁ దూల నేసినఁ । గూలి పెలుచఁ దన్నికొనుచుఁ జచ్చె. 76**

**ప్రతిపదార్థం:** శౌర్యధుర్యుఁడు+అగు= శూరత్వాన్ని భరించేవాడైన; వసాతిభూపతి= వసాతి రాజు; షష్టి శిత శరంబులు= అరవై వాడి అయిన బాణాలు; ఏయన్= ప్రయోగించగా; అతఁడు= అభిమన్యుడు; వానిన్= ఆ వసాతి రాజును; దొడ్డ నారసమునన్= గొప్పబాణంతో; నలిన్= విజృంభణంతో; తూలన్+ఏసినన్= పడిపోయేటట్లు ప్రయోగించగా; కూలి= క్రిందపడి; పెలుచన్= మిక్కుటంగా; తన్ని కొనుచున్= తన్నుకొంటూ; చచ్చెన్= చచ్చాడు.

**తాత్పర్యం:** శూరుడైన వసాతిరాజు అరవై తీవ్రబాణాలు ప్రయోగించగా అభిమన్యుడు ఆ వసాతి రాజును ఒక గొప్ప బాణంతో మిక్కిలి తూలిపడేటట్లు నేలకూల నేశాడు. దానితో వాడు తన్నుకొంటూ చచ్చాడు.

**క. చచ్చిన వసాతిఁ గనుఁగొని । యచ్చటి భూపతులు పెలుచ నడరుటయును వి**
**వ్వచ్చుకొడుకు కోపించినఁ । జిచ్చు మిడుతపిండు నేర్చు చెలువము దోఁచెన్. 77**

**ప్రతిపదార్థం:** అచ్చటి భూపతులు= అక్కడ ఉండే రాజులు; చచ్చిన+వసాతిన్= మరణించిన వసాతి రాజును; కనుఁగొని= చూచి; పెలుచన్= మిక్కుటంగా; అడరుటయును= చుట్టుముట్టటమున్నూ(కవియటం); వివ్వచ్చు కొడుకు= అర్జునుడి పుత్రుడు; కోపించినన్= ఆగ్రహించగా, చిచ్చు= నిప్పు(అగ్ని); మిడుత పిండున్= మిడుతల గుంపును; ఏర్చు= కాల్చు; చెలువము= విధం; తోఁచెన్= స్ఫురించింది.

**తాత్పర్యం:** అప్పుడు అక్కడ ఉండే రాజులంతా చచ్చిన వసాతి రాజును చూచి రెచ్చిపోయి, అందరూ ఒక్కుమ్మడి అభిమన్యుడిని ఆక్రమించారు. అభిమన్యుడు ఆ సందర్భంలో ఆగ్రహించటం అగ్గి మిడుతల గుంపును కాల్చిన తీరును స్ఫురింపజేసింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఆ సమయంబునం జేడ్పడి నీ సేనలు దీనదశకు వచ్చిన నానాదేశాధీశులు పరస్పరాహ్వననాదంబులు సింహనాదంబులు శింజినీ స్వనంబులుం జెలంగ ధనంజయతనయుపై నొక్కుమ్మడి నురవడించిన నయ్యతిరథవర్యుండు లేళ్ళగమిం గనిన బెబ్బులి యుబ్బుదోఁప నలిరేఁగి యందఱ నుఱుమాడిన నంగకంబుల వివిధ ఖండంబుల కెంపునను గరితురగ నరశవంబుల వికృతాకారంబుల నాయుధంబుల మెఱుంగుల నాభరణంబుల తఱచునం దత్ప్రదేశంబు దారుణ ప్రియదర్శనంబయ్యెఁ; నప్పుడు దెరలిన మూఁకలు దన్నుఁ దేఱి చూడనుం జాలక యంతంత ఱిచ్చవడిన నా గుంపులకుం గవిసి, నిలింపపతి మనుమండు సత్యశ్రవఃప్రభృతి భూపాల లోకంబు జములోకంబున కనిచినం జుట్లనుండి చూచు మానధను లగు మానవపతులు నేన నేన యని కడంగి యక్కుమారుని మీఁద నుఱికి పెనుజోఱ మొగంబునం బడిన చిఱుచేప తండంబుల చందంబున దావానలంబు దఱియం బాఱిన మృగకులంబు చాడ్పున సముద్రంబు సొచ్చిన యేఱుల చందంబున నతని యంద డిందిన. 78**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; చేడ్పడి= చలించి, వ్యాకులపడి; నీ సేనలు= నీ సైన్యాలు; దీనదశకున్+వచ్చినన్= దీనస్థితికి రాగా; నానా, దేశ+అధీశులు= అనేక దేశాల రాజులు; పరస్పర+ఆహ్వాన+నాదంబులు= ఒకరిని ఒకరు పిలుచుకొనే శబ్దాలు; సింహనాదంబులు= గర్జించుటలు; శింజినీ స్వనంబులు= అల్లెత్రాటి మ్రోతలు; చెలంగన్= ధ్వనించగా; ధనంజయ తనయుపైన్= అభిమన్యుడి మీద; ఒక్కుమ్మడిన్= ఒక్కపెట్టున; ఉరవడించినన్= పరాక్రమించగా(వేగిరపడగా); ఆ+అతిరథ వర్యుండు= అతిరథులలో శ్రేష్ఠుడైన ఆ అభిమన్యుడు; లేళ్ళ+గమిన్= జింకల గుంపును;కనిన= చూచిన; బెబ్బులి= పెద్దపులి; ఉబ్బు= విజృంభణ(అతిశయం); తోఁపన్= తోచేటట్లుగా; నలి+రేఁగి= మిక్కిలి రెచ్చిపోయి; అందఱన్= అందరినీ; నుఱుమాడినన్= పిండిచేయగా (పొడి, చూర్ణం); అంగకంబుల= అవయవాల; ఖండంబుల+కెంపునను= తునకల (ముక్కల) ఎర్రదనం చేతనూ; కరి, తురగ, నర, శవంబుల= ఏనుగులు; గుర్రాలు, భటులయొక్క పీనుగుల; వికృత+ఆకారంబులన్= వికారములైన ఆకృతుల చేతనూ; ఆయుధంబుల+మెఱుంగులన్= ఆయుధాల కాంతుల చేతనూ; ఆభరణంబుల+తఱచునన్= భూషణాల ఆధిక్యం చేతనూ; తద్+ప్రదేశంబు= ఆ స్థలం; దారుణ+ప్రియ+దర్శనంబు+అయ్యెన్= భయానకమూ, రమణీయమూ అయింది; అప్పుడు= ఆ సమయంలో; తెరలిన మూఁకలు= విచ్చిపోయిన సైన్యాలు; తన్నున్= తనను; తేఱి+చూడనున్+చాలక= పరికించి చూడలేక;

అంతంతన్= కొంతదూరంలో; ఊచ్చవడినన్= చేష్టలు వదిలి వెనుదీయగా; ఆ గుంపులకున్= ఆ(సైన్యానికి) సమూహాలపై; కవిసి= ఎదుర్కొని; నిలింపపతి మనుమండు= ఇంద్రుడి మనుమడైన అభిమన్యుడు; సత్యశ్రవః, ప్రభృతి, భూపాల, లోకంబున్= సత్యశ్రవుడు (నరిష్యంతుడి వంశంలోనివాడు, సుమతికొడుకు) మొదలగు రాజుల సమూహాన్ని; జములోకంబునకున్= యమలోకానికి; అనిచినన్= పంపగా; చుట్లనుండి= నలుప్రక్కలనుండి; చూచు మానధనులు అగు= చూస్తూ ఉన్న అభిమాన ధనులైన; మానవపతులు= రాజులు; నేన, నేన అని= అహమహమికతో; కడంగి= పూని; ఆ+కుమారుని మీఁదకున్= ఆ బాలుడిపైకి; ఉఱికి= దూకి; పెనుజోఱ+మొగంబునన్= సొఱ అనే పెద్దచేప ముఖంలో; పడిన= చిక్కుపడిన; చిఱుచేపల, తండంబుల, చందంబునన్= చిన్న చేపల మొత్తాల రీతిగా; దావ+అనలంబు= కార్చిచ్చు; తఱియన్= సమీపించగా (ఎదుర్కొనగా); పాఱిన= పరుగెత్తిన; మృగ+కులంబు+చాడ్పునన్= జింకల గుంపువలె; సముద్రంబు= సముద్రంలో; చొచ్చిన= ప్రవేశించిన; ఏఱుల+చందంబునన్= వాగులవలె; అతని+అందు+అ= అతడి అందే; డిందినన్= నశించగా (లీనమైపోగా).

**తాత్పర్యం:** అప్పుడు జడిసి దైన్యస్థితిలో నీ సైన్యం ఉండగా నానా దేశరాజులు ఒకరిని మరొకరు పిలిచికొనే శబ్దాలు, సింహనాదాలు, అల్లెత్రాటి టంకారాలూ విన్పించాయి. అందరూ ఒక్కపెట్టున అర్జునుడి కుమారుడిని ఆక్రమించారు. అతిరథ శ్రేష్ఠుడైన అభిమన్యుడు జింకల గుంపుపై బెబ్బులివలె మిక్కిలి విజృంభించి అందరినీ నుగ్గునూచం చేశాడు. అప్పుడు యుద్ధభూమి, ముక్కలు ముక్కలుగా తెగిపడ్డ అవయవాలతో, చచ్చిన ఏనుగుల గుర్రాల భటుల వికృతాకారాలతో, ఆయుధాల ఆభరణాల కాంతులతో, దట్టంగా మహాదారుణ ప్రియదర్శనంగా మారిపోయింది. విచ్చిపోయిన సైన్యాలు అతడిని తేఱిపార చూడలేక అంతంతలోనే ఊచ్చపాటుతో ఉండగా, వాటిపై అభిమన్యుడు దూకాడు. అప్పుడు నలుప్రక్కలనుండి మానధనులైన రాజులు 'నేను నేను' అంటూ ఆ బాలుడి మీదికి ఉరికి పెద్దసొర చేప ముఖంలో పడ్డ చిన్న చేపల గుంపువలె, కార్చిచ్చు అలముకోగా పరుగెత్తే జింకల రీతిగా సముద్రంలో ఉరవడితో చొచ్చుకొనిపోయే వాగులు మాదిరిగా అతనిలోనే అందరూ అణగిపోయారు.

**విశేషం:** అలం: మాలోపమ.

**ఉ.** **అచ్చట సైన్యమంతయు భయాకులతన్ నలుదిక్కులన్ వెసన్**
**విచ్చిన శల్యనందనుఁడు 'వీనికి నోడఁగ నేల మీకు? నే**
**వచ్చితిఁ బట్టి తెచ్చెద; నవారణ బెట్టు పెనంగె నేనియుం**
**జచ్చు మదీయ భూరిభుజశక్తిఁ గనుంగొనుఁ డంచు నుద్ధతిన్.** 79

**ప్రతిపదార్థం:** అచ్చటన్= ఆ రణరంగంలో; సైన్యము+అంతయున్= సేన మొత్తమూ; భయ+ఆకులతన్(భయం); భీతివలన కలిగిన కలతతో; వెసన్= వెంటనే (త్వరగా); నలుదిక్కులన్+విచ్చినన్= నాలుగు వైపులకూ; చెదరగా; శల్యనందనుడు= శల్యుడి కొడుకు (రుక్మరథుడు అనేవాడు); ఉద్ధతిన్= గర్వంతో; నేన్+వచ్చితిన్= నేను వచ్చాను; వీనికిన్= ఈ అభిమన్యుడికి; ఓడఁగన్+ఏల?= వెనుదీయటం ఎందుకు?; పట్టి+తెచ్చెదన్= బంధించి తెస్తాను; అవారణన్= అడ్డగించలేని విధంగా; బెట్టు= అధికంగా; పెనంగెన్+ఏనియున్= పోరాడినప్పటికీ; చచ్చున్= చస్తాడు; మదీయ, భూరి, భుజ, శక్తిన్= నా యొక్క అధికమైన భుజాల బలాన్ని; కనుంగొనుఁడు= చూడండి; అంచున్= అని అంటూ.

**తాత్పర్యం:** అప్పుడు యుద్ధరంగంలో సైన్యమంతా భయంతో బెదరి నలుదిక్కులకూ చెదరిపోయింది. అంతలో శల్యుడి కొడుకు రుక్మరథుడు గర్వంతో 'ఇదిగో! నేను వచ్చాను. వీడికి మీరు వెనుకంజ వేయటం ఎందుకు? వెంటనే పట్టి తెస్తాను. వారించలేని విధంగా పోరాడినప్పటికీ వాడు నా చేతులలో చస్తాడు. చూడండి నా భుజబలాన్ని' అంటూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. రుక్మరథుం డనువాఁడు పాండుపౌత్త్రుం దలపడి తొమ్మిదియమ్ము లురమ్మున భుజమ్ముల రెండును నాఁటించి వెండియు నేయం గడంగునెడ నా సుభద్రాసూనుండు. 80**

**ప్రతిపదార్థం:** రుక్మరథుండు+అనువాఁడు= రుక్మరథుడు అనే పేరుగల శల్యుడి కొడుకు; పాండుపౌత్త్రున్= పాండురాజు మనుమడిని; తలపడి= ఎదుర్కొని; ఉరమ్మునన్= వక్షఃస్థలంలో; తొమ్మిది+అమ్ములు= తొమ్మిదిబాణాలు; భుజమ్ములన్= భుజాలలో; రెండును= రెండు బాణాలున్నూ; నాఁటించి= గ్రుచ్చుకొనేటట్లు చేసి; వెండియున్= మళ్ళీ; ఏయన్+కడంగు+ఎడన్= ప్రయోగించటానికి ప్రయత్నించే సందర్భంలో; ఆ+సుభద్రాసూనుండు= ఆ అభిమన్యుడు.

**తాత్పర్యం:** రుక్మరథుడు పాండురాజు మనుమడిని ఎదిరించి (రొమ్ము) ఎదపైన తొమ్మిదీ, భుజాలపై రెండూ, బాణాలు గ్రుచ్చుకొనేటట్లు చేసి, మళ్ళీ ప్రయోగించబోయే సమయంలో అభిమన్యుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. శరముతోడ నొక్క కరము చాపము తోడ । నొకటి బొమలు గదిసి యున్న యుగ్ర**
**రేఖతోడఁ దల ధరిత్రిపైఁ బడనేసె । రయము మెఱయఁ బటు శరత్రయమున. 81**

**ప్రతిపదార్థం:** శరముతోడన్= బాణంతో కూడి ఉన్న; ఒక్క కరమున్= ఒక చేతినీ; చాపముతోడన్= వింటితోకూడిన; ఒకటిన్= ఒకచేతినీ; బొమలు+కదిసి+ఉన్న= కనుబొమలు ముడివడి ఉండే; ఉగ్రరేఖ+తోడన్= భయంకరమైన రీతితో; తలన్= శిరస్సునూ; పటు+శర+త్రయమునన్= వాడి అయిన మూడు బాణాలతో; రయము+మెఱయన్= వేగం అతిశయించగా; ధరిత్రిపైన్= నేలపై;పడన్= పడేటట్లు; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు రుక్మరథుడి బాణసహితమైన ఒక చేతిని ఒకబాణంతోనూ, విల్లుతో కూడిన అతడి మరొకచేతిని వేరొక బాణంతోనూ, కను బొమలు ముడివడి ఉన్న అతడి తలను వేరొక బాణంతోనూ - ఇట్లా మూడు బాణాలతో వడిగా నేలగూల్చాడు.

**వ. ఇ ట్లర్జునపుత్త్రుండు చిత్రకౌశలంబు సూపిన. 82**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అర్జునపుత్త్రుండు= అర్జునుడి కొడుకైన అభిమన్యుడు; చిత్రకౌశలంబు= వింత అయిన నేర్పు; చూపినన్= ప్రదర్శింపగా.

**తాత్పర్యం:** ఈ విధంగా అభిమన్యుడు నేర్పు ప్రదర్శించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. రుక్మరథుడు పడిన రోషాత్తచిత్తులై । యతని చెలులు పలువు రవనిపతులు**
**గవిసి రపుడు తేరుగములతో వడి భవ । త్పౌత్త్రుమీఁద నీదు పుత్త్రు లలర. 83**

**ప్రతిపదార్థం:** రుక్మరథుఁడు= శల్యుడి కొడుకు రుక్మరథుడు; పడినన్= నేలకూలగా; అతని+చెలులు= అతడి స్నేహితులు; పలువురు+అవని పతులు= చాలామంది రాజులు; రోష+ఆత్త+చిత్తులు+ఐ= కోపాన్ని పొందిన మనస్సులు కలవారై; అపుడు= ఆ సమయంలో;నీదు పుత్త్రులు= నీ కొడుకులు; అలరన్= సంతోషించగా; భవత్+పౌత్త్రుమీఁదన్= నీ మనుమడిపై; వడిన్= తొందరగా; తేరుగములతోడన్= రథ సమూహాలతో; కవిసిరి= విజృంభించారు.

**తాత్పర్యం:** రుక్మరథుడు ఆ విధంగా నేలకూలగా అతడి స్నేహితులు చాలామంది రాజులు కోపం పొందిన మనస్సులు కలవారై, నీ కుమారులు సంతోషించేటట్లు నీ మనుమడి పైకి వడివడిగా తమ రథ సమూహాలతో విజృంభించారు.

**విశేషం:** ఈ ఆటవెలది పద్యంలోని పదాల కూర్పులో తిక్కన చూపిన నేర్పు అప్పటి సన్నివేశాన్ని స్ఫురింపజేస్తూ ఉన్నది. ముఖ్యంగా పద్యగమనం గమనించదగింది. 'అతని చెలులు పలువు రవని పతులు గవిసిరపుడు తేరుగములతో వడి' ఇందులోని లఘువులు వడివడిగా పలువురు చెలులు ఎట్లా వచ్చి చేరారో ధ్వనింపజేస్తూ ఉన్నాయి. 'భవత్+పౌత్రు'లోని ఔత్వం వారందరూ అభిమన్యుడిపైకి దూకి కవిసిన విధానాన్ని వ్యంజింపజేస్తూ ఉన్నది.

**క. అమ్మనుజవిభుల బహుల శ । రమ్ములచే సూత కేతు రథ రథ్య సమే**
**తమ్ముగఁ బొదువంబడు తన । తమ్మునిసుతుఁ జూచి పతి ముదమ్మునఁ దేలెన్. 84**

**ప్రతిపదార్థం:** ఆ+మనుజవిభుల= ఆ రాజులయొక్క; బహుల, శరమ్ములచేన్= అనేక విధాలైన బాణాలచేత; సూత= సారథి; కేతు= జెండా(ధ్వజం); రథ= తేరు; రథ్య= గుఱ్ఱాలు(వీటితో); సమేతమ్ముగన్= కూడి ఉండేటట్లు; పొదువన్+పడు= క్రమ్మబడే; తన తమ్ముని సుతున్= అర్జున కుమారుడిని; చూచి= పరికించి; పతి= దుర్యోధనుడు; ముదమ్మునన్+తేలెన్= సంతోషంలో తేలిపోయాడు.

**తాత్పర్యం:** ఆ రాజులు అనేకవిధాలైన బాణాలతో రథమూ, గుఱ్ఱాలు , సూతుడూ, జెండా మొదలైన వాటితో అభిమన్యుడిని కమ్ముకొన్నారు. అట్లా వారిచే కలియబడ్డ అర్జునపుత్రుడిని చూచి దుర్యోధనుడు సంతోషంలో తేలిపోయాడు.

**వ. ఇట్లభిమన్యుండు మడిసెనకాఁ దలంచి దుర్యోధనుండు సంతోషింప నా సౌభద్రుండు భద్రగజంబు బరిగోలల పోట్లం గనలు కైవడిం గినిసి, గాంధర్వియైన మాయ గావించె; నది దొల్లి ధనంజయు తపంబునకుం బ్రియం బంది తుంబురు ప్రభృతు లొసంగినట్టిది; దానం జేసి యమ్మానవనాథుల యాలోకనంబులకుం బెక్కు రథమ్ములవారు దమ్ముఁ బొదివికొని యనేకాస్త్ర శస్త్రంబులు ప్రయోగించిన చందంబు దోఁచిన వారు వెగడుపడి చూచుచుండ నతండు మండల ప్రచారంబులం దేఱు మెఱయ మెఱుంగు వాలమ్ములం గూల నేసియు, వెడందతూపులం ద్రుంచి పడవైచియు, బడలు వఱచిన నన్నరపతులు నఱుకుడు వడిన యెలమావి జొంపంబుల చందంబగుటయు, నుబ్బు దక్కి వెక్కసంబును వెల్లఁబాటునుం గదిరి యక్కురువిభుండు దన కొడుకు కడిమి సైరింపంజాలక యతనిపై నడరి కొండొకసేపు గన్నుల పండువుగా భండనంబు సేసి సంరంభ విజృంభితుండగు నవ్వీరవరు విశిఖ వేగంబునకుం గాక విముఖుండయ్యె' ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె: 85**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అభిమన్యుండు= అభిమన్యుడు; మడిసెను+అ= మరణించాడు; కాన్= అని; తలంచి= భావించి; దుర్యోధనుండు; సంతోషింపన్= సంతసిల్లగా; ఆ సౌభద్రుండు= సుభద్రా పుత్రుడైన ఆ అభిమన్యుడు; భద్రగజంబు= భద్రజాతి ఏనుగు; బరిగోలల+పోట్లన్= అంకుశాల పొడుపులచేత; కనలు= కోపించే; కైవడిన్= విధంగా; కినిసి= కోపించి; గాంధర్వి+ఐన మాయన్= గంధర్వ సంబంధమైన గాంధర్వి అనే పేరుగల మాయ; కావించెన్= చేశాడు; అది= ఆ విద్య; తొల్లి= పూర్వం; ధనంజయు, తపంబునకున్= అర్జునుడి తపస్సుకు; ప్రియంబు+అంది= ఇష్టపడి; తుంబుర, ప్రభృతులు= తుంబురుడు మొదలైన వాళ్ళు; ఒసంగినట్టిది= ఇచ్చినటువంటిది; దానన్+చేసి= దానిచేత; ఆ+మానవనాథ+ఆలోకనంబులకున్= ఆ రాజుల చూపులకు; పెక్కు, రథమ్ములవారు= పెక్కండ్రు రథికులు; తమ్మున్= తమ్ము; పొదివికొని= క్రమ్ముకొని; అనేక+అస్త్ర+శస్త్రంబులు= చాలా బాణాలు, ఆయుధాలు; ప్రయోగించిన+చందంబు= ఏసినట్లుగా; తోఁచినన్= కనిపించగా; వారు= ఆ రాజులు; వెగడుపడి= (వెరగొంది) భయపడి; చూచుచుండన్= చూస్తూ ఉండగా; అతండు= అభిమన్యుడు; మండల ప్రచారంబులన్= చుట్టివచ్చుటలచేత; తేరు+మెఱయన్= రథం ప్రకాశింపగా; మెఱుంగు వాలు+అమ్ములన్= మెఱిసే వాడి అయిన బాణాలచేత; కూలన్+ఏసియున్= క్రిందపడేటట్లు ప్రయోగించియు; వెడంద+తూపులన్= పెద్ద బాణాలతో; త్రుంచి+పడవైచియున్= విరిచి క్రింద పడేటట్లు చేసి; బడలు పఱచినన్= శ్రమకలిగించగా; ఆ+నరపతులు= ఆ రాజులు; నఱుకుడు+పడిన= నరికివేయబడ్డ;

ఎలమావి, జొంపంబుల, చందంబు= లేతమామిళ్ళ చిగుళ్ళమాదిరి; అగుటయున్= కాగా; ఉబ్బు, తక్కి= గర్వం నశించి; వెక్కసంబునున్= సహించలేకుండా పోవటం; వెల్లఁబాటునున్= వెలవెల పోవటమున్నూ; కదిరి= అతిశయించి; ఆ+కురువిభుండు= ఆ దుర్యోధనుడు; తనకొడుకు+కడిమిన్= తన కుమారుడి శౌర్యాన్ని; సైరింపన్+చాలక= సహించలేకుండా; అతనిపైన్= ఆ బాలుడిపై; అడరి= విజృంభించి; కొండొకసేపు= కొంతసేపు; కన్నుల పండువుగాన్= నేత్రపర్వంగా; భండనంబు+చేసి= యుద్ధం చేసి; సంరంభ విజృంభితుండు+అగు= ఆటోపంతో చెలరేగిన వాడైన; ఆ+వీరవరు= ఆ వీరశ్రేష్ఠుని యొక్క; విశిఖ వేగంబునకున్= బాణాలవేగానికి; కాక= తట్టుకోలేక; విముఖుండు+అయ్యెన్= పెడమోము పెట్టాడు; అనినన్+విని= అనగా విని; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా చెప్పాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు చనిపోయాడు గదా! అని భావించి దుర్యోధనుడు సంతోషించగా, ఆ అభిమన్యుడు భద్రజాతి ఏనుగును అంకుశంతో పొడిస్తే ఏ విధంగా కోపపడుతుందో ఆ విధంగా కోపపడి, గాంధర్వి అనే మాయను ప్రయోగించాడు. ఆ విద్య పూర్వం అర్జునుడి తపస్సుకు మెచ్చి తుంబురుడు మొదలైన వాళ్ళు ఇచ్చినటువంటిది. దానివలన చూచే రాజులకు అనేక రథాల వాళ్ళు చుట్టుముట్టి ఎన్నో అస్త్రశస్త్రాలు తమపై ప్రయోగించినట్లు అనిపించింది. అందుకు వాళ్ళు భయపడి చూస్తూ ఉండగా, అభిమన్యుడు వలయాకారంగా తిరిగి రథం మెరసిపోగా వాడి అయిన బాణాలతో, వెడల్పైన తూపులతో వారిని కూలనేసి, త్రుంచి, పడవైచి శ్రమకలిగించాడు. అప్పుడు ఆ రాజులు నరికివేయబడిన లేత మామిడి చిగుళ్ళ మాదిరి అయ్యారు. ఓర్వలేనితనంతో, వెలవెలబోయిన దుర్యోధనుడు తన కొడుకు శౌర్యాన్ని చూచి ఓర్వలేక అతడిపై దూకి, కొంతసేపు కన్నుల పండువుగా యుద్ధంచేసి, ఆటోపంతో చెలరేగిన ఆ అభిమన్యుడి బాణవేగాలకు తట్టుకోలేక పెడమొగం పెట్టాడు' అనగా విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమ. బరిగోల= ఏనుగును బెదిరించడానికై ప్రక్కల పొడుచు, అర్ధచంద్రాకారముగా ఉక్కుతో చేసిన అలుగుగల వేణుదండం.

**ఉ. 'ఇమ్మెయి బాలుఁ డొక్కరుఁడ యిందఱిఁ దోలి వధించె నన్న నే**
**నమ్మఁగఁ నేరనయ్యెద; వినం గడు నక్కజ; మట్టు లేల చి**
**త్తమ్మున సంశయింప? విను: ధర్మ మధర్మము నోర్వకున్నె క**
**య్యమ్ము తెఱంగు సెప్పు మెటులయ్యెఁ బదంపడి సూతనందనా! 86**

**ప్రతిపదార్థం:** సూతనందనా!= సంజయా!; ఈ+మెయిన్= ఈ రీతిగా; బాలుఁడు+ఒక్కరుఁడు+అ= బాలుడు ఒక్కడే; ఇందఱిన్= ఇంతమందిని; తోలి+వధించెన్= తరిమి చంపాడు; అన్నన్= అంటే; నేన్= నేను; నమ్మఁగ నేరన్+అయ్యెదన్= నమ్మటానికి శక్యం లేనివాడ నౌతున్నాను; వినన్= వినగా; కడున్= మిక్కిలి; అక్కజము= ఆశ్చర్యం; అట్టులు+ఏల, చిత్తమ్మునన్+సంశయింపన్= అట్లు ఎందుకు మనస్సులో సందేహించటం; విను= వినుము; ధర్మము= ధర్మం(న్యాయం); అధర్మమున్= అధర్మాన్ని; ఓర్వక+ఉన్నె?= జయించకుండా ఉంటుందా?; పదంపడి= అటుపైన; కయ్యమ్ము+తెఱంగు= యుద్ధంయొక్క విధం; ఎటులు+అయ్యెన్= ఏ విధంగా అయింది; చెప్పుము= చెప్పవలసింది.

**తాత్పర్యం:** 'ఈ విధంగా ఒక్క బాలుడే ఇందరిని తరిమి చంపాడు అంటే నమ్మటానికి వీలుకాకుండా ఉన్నది. ఇది వినటానికి కూడా చాలా ఆశ్చర్యంగా ఉన్నది. ఆ విధంగా మనస్సులో సందేహించటం ఎందుకు? వినుము. ధర్మం అధర్మాన్ని జయించకుండా ఉంటుందా? ఆపైన యుద్ధపుతీరు ఏ విధంగా అయిందో చెప్పవలసింది.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**వ. అనిన నమ్మనుజవల్లభునకు సంజయుం డిట్లను 'నట్లు పెక్కండ్రురాజులు సచ్చుటయును సుయోధనుండు దెరలుటయును గని భవత్కుమారవర్గంబును దోడియోధవరులును మేనులు సెమర్ప మొగంబులు వెలవెలంబాఱ నోళ్ళెండం గాళ్ళు వడంక నలుదిక్కులుం జూచుచు ధృతి దఱిగిపోయిన వెఱచఱచి విఱిగి; రప్పుడు మగుడం గోల్తలసేసి కురువిభుండు గురుపుత్త్ర కృప కర్ణ కృతవర్మ బృహద్బల సౌబల సమేతంబుగా సౌభద్రు నెదుర్కొనిన. నతండు గెలుపు నుబ్బునం గొండొక పెద్ద యనక పిడుగు చందంబునన్ గర్జిలి యుఱికిన నయ్యరదంబుల తండంబులు లేటమొగంబు వడియె; నట్టియెడ. 87**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; ఆ+మనుజవల్లభునకున్= ఆ రాజుకు(ధృతరాష్ట్రుడికి); సంజయుండు= సంజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; పెక్కండ్రు+రాజులు= అనేక రాజులు; చచ్చుటయును= చావటమున్నూ; సుయోధనుండు= దుర్యోధనుడు; తెరలుటయును= తొలగటం లేదా కలత చెందటమున్నూ; కని= చూచి; భవత్+కుమారవర్గంబును= నీ కుమారులందరు; తోడి యోధవరులును= సహకరించే యుద్ధవీరులున్నూ; మేనులు+చెమర్పన్= శరీరాలు చెమటపట్టగా; మొగంబులు+వెలవెలంబాఱన్= ముఖాలు వెల్లబాటు (వైవర్ణ్యాన్ని) చెందగా; నోళ్ళు+ఎండన్= నోళ్ళు ఎండిపోగా; కాళ్ళు వడంకన్= కాళ్ళు వణకగా; నలు+దిక్కులన్+చూచుచున్= నాలుగువైపుల చూస్తూ; ధృతి= ధైర్యం; తఱిగిపోయినన్= నశించిపోగా; వెఱచఱచి= భయపడి; విఱిగిరి= ఓడిపోయారు; అప్పుడు= ఆ సమయంలో; మగుడన్= మళ్ళీ; కోల్తల చేసి= యుద్ధసన్నాహం కావించి; కురువిభుండు= దుర్యోధనుడు; గురుపుత్ర, కృప, కర్ణ, కృతవర్మ, బృహద్బల, సౌబల, సమేతంబుగాన్= అశ్వత్థామ, కృపాచార్యులు, కర్ణుడు, కృతవర్మ, బృహద్బలుడు, శకుని (అనువీరితో) కూడుకొన్నట్లుగా; సౌభద్రున్= అభిమన్యుడిని; ఎదుర్కొనినన్= మార్కొనగా; అతండు= అభిమన్యుడు; గెలుపు+ఉబ్బునన్= విజయోత్సాహంతో; కొండొక= అదొక; పెద్ద; అనక= అనుకోకుండా; పిడుగు చందంబునన్= పిడుగువలె; గర్జిలి= గర్జించి; ఉఱికినన్= దూకగా; ఆ+అరదంబుల+తండంబులు= ఆ రథాల సమూహాలు; లేటమొగంబు+పడియెన్= విముఖత్వాన్ని పొందాయి; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని అడుగగా ధృతరాష్ట్రుడితో సంజయుడు ఇట్లా అన్నాడు: 'ఆ విధంగా పలువురు రాజులు చావగా, దుర్యోధనుడు మరలిపోగా, తక్కిన నీ కుమారులూ, యుద్ధవీరులూ చెమటలు గ్రక్కుతూ తెల్లమొగాలు వేసికొని, ఎండిన నోళ్ళతో, వణికే కాళ్ళతో నలువైపుల చూస్తూ ధైర్యం చెడి భయపడి ఓడిపోయారు. అపుడు మళ్ళీ దుర్యోధనుడు యుద్ధసన్నాహం చేసి అశ్వత్థామ కృపాచార్య కర్ణ కృతవర్మ శకుని బృహద్బలులతో అభిమన్యుడిని ఎదిరించగా, అతడు విజయోత్సాహంతో అదొక పెద్ద తాకిడి అని అనుకోకుండా, పిడుగువలె గర్జించి, దూకగానే, రథాలు పెడమోము పెట్టాయి. ఆ సమయంలో.

**విశేషం:** అలం: ఉపమ.

**దుర్యోధనపుత్రుం డగు లక్ష్మణకుమారుం డభిమన్యునిచేఁ జచ్చుట (సం. 7-45-8)**

**చ. అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ దాఁకినఁ జూచి యుమ్మలం**
**బొదవఁగఁ బుత్త్రుఁ బెట్టి చన నోపక క్రమ్మఱు రాజుఁ గాంచి యం**
**బుదములు గొండపై నడరు పోలిక నన్నరుపట్టి నందఱుం**
**బొదువ, నతండు ఘోరశర భూరి సమీరమునం దెరల్చుచున్. 88**

**ప్రతిపదార్థం:** అదలిచి= అదలించి; లక్ష్మణుండు= దుర్యోధనుడి కొడుకు; విజయ+ఆత్మజున్= అర్జునకుమారుడైన అభిమన్యుడిని; తాఁకినన్= ఎదుర్కోగా; చూచి= కనుగొని; ఉమ్మలంబు+ఒదవఁగన్= దుఃఖం కలుగగా; పుత్త్రున్+పెట్టి, చనన్+ఓపక= కొడుకును వదలిపోవటానికి ఇష్టపడక; క్రమ్మఱు+రాజున్+కాంచి= వెనక్కి మళ్ళే దుర్యోధనుడిని చూచి; అంబుదములు+కొండపైన్+ఆడరు,

పోలికన్= మేఘాలు, కొండపై అతిశయించే విధంగా; ఆ+నరు, పట్టిన్= ఆ అర్జునుడి కుమారుడిని; అందఱున్= అందరూ; పొదువన్= చుట్టుముట్టగా; ఘోర= భయంకరమైన; శర= బాణాలనే; భూరి సమీరమున్= పెను గాలిచేత; తెరల్చుచున్= వెనకకు మరలిస్తూ.

**తాత్పర్యం:** దుర్యోధనుడి కొడుకు లక్ష్మణకుమారుడు అదలిస్తూ అభిమన్యుడిని ఎదుర్కొన్నాడు. అది చూచి దుఃఖం కలుగగా పుత్రుడిని వదలిపెట్టి పోవటానికి మనస్సు రాక వెనుకకు మళ్ళీ దుర్యోధనుడిని చూచి, మేఘాలు కొండపై విజృంభించే విధంగా, ఆ అభిమన్యుడిని అందరూ కమ్ముకొని ఎదుర్కొనగా, అతడు భయంకరమూ, అధికమూ అయిన బాణాలు అనే పెనుగాలిచేత వారిని వెనుకకు మరలిస్తూ.

**విశేషం:** అలం: ఉపమ. ఈ చంపకమాలా వృత్తంలో అభిమన్యుడు అనటానికి మారుగా 'విజయాత్మజు' 'అన్నరుపట్టి' అని తిక్కన ప్రయోగించాడు. తన్నెదుర్కొన్న లక్ష్మణుడిని మట్టుపెట్టటం, తాను విజయాన్ని పొందటం తథ్యం. అందువలన 'విజయాత్మజు' అనే ప్రయోగం సాభిప్రాయం. 'ఘోర శర భూరి సమీర' ప్రయోగం కూడా ఎంతో ఔచిత్యవంతంగా ఉన్నది. 'శర' శబ్దానికి వాడిన విశేషణం 'ఘోర'. 'సమీర' ప్రయోగానికి కూడా వాడిన విశేషణం 'భూరి', భూరి శబ్దోచ్చారణలోనే సమీరమెంతో తీవ్రంగా వెలువడుతున్నది. ఊది పారవేయడం ఈ విశేషణంలోని విశేషం. ప్రభంజన శబ్ద లక్ష్యాన్ని ఇది పరోక్షంగా నిరూపిస్తూ ఉన్నది.

**క. కదిసిన లక్ష్మణునిం బులి । కొదమను సింగంపుఁ గొదమ గొదగొని లీలం**
**పొదువుగతిఁ గిట్టి మోదము । మదము నెలర్పంగ నింద్రు మనుమఁడు గడిమిన్. 89**

**ప్రతిపదార్థం:** కదిసిన= సమీపించిన; లక్ష్మణునిన్= దుర్యోధనుడి కుమారుడైన లక్ష్మణుడిని; పులికొదమను= పులిపిల్లను; సింగంపుఁగొదమ= సింహపుపిల్ల; గొదగొని= విజృంభించి; లీలన్= అలవోకగా; లక్ష్మణునిన్= లక్ష్మణుడిని; కదిసి= చేరి; పొదువుగతిన్= కమ్మివేసేటట్లు; కిట్టి= సమీపించి; మోదమున్= సంతోషం; మదమున్= గర్వం; ఎలర్పంగన్= అతిశయించగా; ఇంద్రుమనుమఁడు= అభిమన్యుడు; కడిమిన్= శౌర్యంతో.

**తాత్పర్యం:** పులిపిల్లపై సింహపు పిల్ల విజృంభించే విధంగా తనమీదికి వచ్చే లక్ష్మణకుమారుడిని చేరి, అతడిపై దూకి, సంతోషమూ గర్వమూ అతిశయించగా ఇంద్రుడి మనుమడు శౌర్యంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**చ. ఉఱక యురంబు బాహువులు నొక్కొక యమ్మున నొవ్వనేసి నీ**
**వెఱిఁగి యెఱింగినన్ దొడరి తెక్కడఁ బోవఁగ వచ్చు? నంచు నే**
**డ్తెఱఁ దలఁ గుండలస్ఫురితదీప్తులతో నిల డొల్ల నేసె నం**
**దఱుఁ బతియుం గనుంగొనఁగ దైన్యరవంబు సెలంగ సేనలన్. 90**

**ప్రతిపదార్థం:** ఉఱక= మిన్నక; ఉరంబున్= రొమ్మును; బాహువులున్= భుజాలను; ఒక్కొక+అమ్మునన్= ఒక్కొక్క బాణంచేత; నొవ్వన్= నొచ్చేటట్లు; ఏసి= ప్రయోగించి; నీవు= నీవు (లక్ష్మణుడు అనిభావం); ఎఱిఁగి ఎఱింగి= తెలిసి తెలిసి; నన్= నన్ను; తొడరితి(వి)= మార్కొన్నావు; ఎక్కడన్+పోవఁగన్+వచ్చున్?= ఎక్కడకు పోవచ్చు?; అంచున్= అంటూ; ఏడ్తెఱన్= పరాక్రమంచేత; కుండల, స్ఫురిత, దీప్తులతోన్= కుండలాలచేత కలుగు కాంతులతో; సేనలన్= సైన్యాలలో; దైన్యరవంబు= దీనారావం; చెలంగన్= అతిశయించగా; అందఱున్= అందరూ; పతియున్= దుర్యోధనుడున్నూ; కనుంగొనఁగన్= చూస్తూ ఉండగా; తలన్= తలను; ఇలన్= నేలపై; డొల్లన్+ఏసెన్= దొర్లిపడేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** రొమ్ముపై, భుజాలపై ఒక్కొక్క బాణం నొచ్చేటట్లుగా అభిమన్యుడు ప్రయోగించి లక్ష్మణుడితో 'నీవు తెలిసి తెలిసి నన్ను ఎదిరించావు. ఇంకెక్కడకు తప్పించుకొని పోగలవు?' అంటూ పరాక్రమంతో సైన్యంలో దైన్యాన్ని కలిగిస్తూ, దుర్యోధనుడూ తక్కిన అందరూ చూస్తూ ఉండగానే, కుండల కాంతులతో వెలుగొందే అతడి తలను నేలపై, దొర్లిపడేటట్లు చేశాడు.

**తే.** **మిడుక మిడుక ని త్తెఱఁగునఁ గొడుకుఁ దునిమి । యక్కుమారుండు మెఱయుట నడలుఁ గనలుఁ**
**గడలుకొను మదితోడ నీ కొడుకు 'వీని । నొంపుఁ డందఱుఁ బైపడి చంపుఁ' డనుడు.** **91**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱఁగునన్= ఈ విధంగా; ఆ+కుమారుఁడు= ఆ అభిమన్యుడు; కొడుకున్+తునిమి= లక్ష్మణకుమారుడిని చంపి; మిడుక మిడుకన్= త్రుళ్ళి త్రుళ్ళి; మెఱయుటయును= విజృంభించగా; నీకొడుకు= దుర్యోధనుడు; అడలున్= దుఃఖమూ; కనలున్= కోపమూ; కడలుకొను+మదితోడన్= వ్యాపించే మనస్సుతో; అందఱున్= అందరూ; పైపడి= పైనపడి; వీనిన్= ఈ అభిమన్యుడిని; నొంపుఁడు= నొప్పించండి; చంపుఁడు= చంపండి; అనుడున్= అని అనిన అనంతరం.

**తాత్పర్యం:** ఈ విధంగా అభిమన్యుడు లక్ష్మణ కుమారుడిని చంపి త్రుళ్ళి త్రుళ్ళి విజృంభించగా, నీ కొడుకు దుర్యోధనుడు దుఃఖమూ, కోపమూ ముడివడ్డ మనస్సుతో, 'అందరూ ఆ అభిమన్యుడి పైన బడి నొప్పించండి చంపండి' అన్నాడు.

**క.** **కృతవర్మయుఁ గృపుఁడు గురుఁడు । నతని సుతుఁడుఁ గర్ణుఁడును బృహద్బలుఁడును భా**
**సిత శరములు గురియుచు న । చ్యుతు నల్లునిఁ బొదివి రొక్కయుమ్మడిఁ బెలుచన్.** **92**

**ప్రతిపదార్థం:** కృతవర్మయున్= కృతవర్మయునూ; కృపుఁడున్= కృపుడునూ; గురుఁడున్= ద్రోణాచార్యుడున్నూ; అతని సుతుఁడున్= అశ్వత్థామయున్నూ; కర్ణుఁడును= కర్ణుడున్నూ; బృహద్బలుఁడును= కోసల దేశాధిపతి అయిన బృహద్బలుడున్నూ; భాసిత శరములు= ప్రకాశవంతాలైన బాణాలు; కురియుచున్= వర్షిస్తూ; అచ్యుతు+అల్లునిన్= అభిమన్యుడిని; పెలుచన్= అతిశయంతో; ఒక్క ఉమ్మడిన్= ఒక్కపెట్టున; పొదివిరి= క్రమ్ముకొన్నారు.

**తాత్పర్యం:** కృతవర్మా, కృపుడూ, ద్రోణాచార్యుడూ, అశ్వత్థామా, కర్ణుడూ, బృహద్బలుడూ తమ తమ ప్రకాశవంతాలైన బాణాలను కురిపిస్తూ అతిశయంతో అందరూ ఒక్కుమ్మడిగా అచ్యుతుడి అల్లుడైన అభిమన్యుడిని క్రమ్ముకొన్నారు.

**క.** **అతఁ డందఱ విశిఖమ్ములు । వితథమ్ములు సేసి, వారి వెగడు పఱిచి యు**
**ద్ధతి సైంధవు పోరెడు నెడ । కతిరయమునఁ దేరు నడపు నా సమయమునన్.** **93**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ అభిమన్యుడు; అందఱ విశిఖమ్ములున్= అందరి బాణాలను; వితథమ్ములు చేసి= వ్యర్థం చేసి; వారిన్= ఎదిరించిన వారినందరినీ; వెగడుపఱిచి= తల్లడపడేటట్లు చేసి; ఉద్ధతిన్= గర్వంతో; సైంధవు పోరెడు+ఎడకున్= సైంధవుడు యుద్ధం చేసే చోటుకు; అతిరయమునన్= మిక్కిలి వేగంతో; తేరు+నడపు= రథాన్ని నడిపే; ఆ సమయమునన్= ఆ సందర్భంలో.

**తాత్పర్యం:** అభిమన్యుడు అందరి బాణాలను వ్యర్థం చేసి, ఎదిరించిన అందరికీ తల్లడపాటు కలిగించి, మిక్కిలి ఔద్ధత్యంతో సైంధవుడు యుద్ధం చేసే ప్రదేశానికి రథాన్ని నడుపుతూ ఉన్న సందర్భంలో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. నిషాదులు గళింగులు గజబృందంబులతో నడ్డపడిన నయ్యతిరథసింహుండు దరువాయి గొని తునుమాడ నెప్పటి యోధవీరు లెయిది పె క్కాఁబోతు లొక్కపులిం జుట్టుముట్టిన చందంబునం బొదివి పెనంగ నా జయద్రథుండును బాండవ బలంబులం ద్రోచి రానీక రభసాతిశయ ఘోరంబుగాఁ బోరుచుండె; నక్కుమారుండు గురుం బంచాశద్బాణంబులను గృతవర్మ, నశీతి సాయకంబులను, గురుతనయు దశవిశిఖంబులను, గర్ణు నొక్కబలు నారసంబునను స్రుక్కించి, కృపుని విరథుంజేసి, బృహద్బలుమేన ముప్పది నారసంబులు నాటించి, వారలకు బాసట యయి కదిసిన సైనికులం బెక్కు తెఱంగుల తూపులఁ జిక్కువఱిచి యుక్కునం గ్రోధపుత్ర బృందారకు లనురాజులను రూపడంచె; నప్పుడు శారద్వతుండు దే రాయితంబు సేసికొని కడంగి తోడి యేవురం గూడుకొని యాక్రీడి కొడుకు మీఁద మార్గణ పరంపరలు పరఁగింపం బెరిఁగిన దర్పంబునం గసిమసంగి యతండు నొప్పింపఁ బెఱవారు బీఱువోవ బృహద్బలుండు బిట్టు గవిసి నిశిత శరంబులు నిగిడించిన నన్నరనందనుండు. 94**

**ప్రతిపదార్థం:** నిషాదులున్= బోయవాళ్ళూ; కళింగులున్= కళింగదేశం వాళ్ళూ; గజబృందంబులతోన్= ఏనుగుల గుంపుతో; అడ్డపడినన్= అడ్డగించగా; ఆ+అతిరథ, సింహుండు= ఆ అతిరథ శ్రేష్ఠుడు (ఇచ్చట సింహశబ్దం శ్రేష్ఠవాచకం); (అతిరథుడు; అంటే పెక్కు విలుకాండ్రతో పోరాడే యోధుడు; మహారథుడు పదకొండు వేలమంది విలుకాండ్రతో పోరాడుతూ సారథినీ, గుఱ్ఱాలనూ కాపాడుతూ పోరాడేవాడు) తరువాయి= అనంతరం; కొని= పూని; స్వాధీనం చేసికొని; తునుమాడన్= తుంచగా; ఎప్పటి+యోధవీరులు= అప్పటి (లేదా ఎప్పటివలె) యుద్ధవీరులు; ఎయిది= వెంబడించి; పెక్కు+ఆఁబోతులు= చాలా ఎద్దులు; ఒక్క పులిన్= ఒక పులిని; చుట్టుముట్టిన+చందంబునన్= చుట్టుకొన్న విధంగా; పొదివి= క్రమ్ముకొని; పెనంగన్= యుద్ధం చేయగా; ఆ జయద్రథుండును= ఆ సైంధవుడునూ; పాండవ బలంబులన్= పాండవసైన్యాలను; త్రోచి+రానీక= మీరి రానీకుండా; (తన్నుదాటిపోనీకుండా); రభస+అతిశయ+ఘోరంబుగాన్= వేగంయొక్క అతిశయంచేత భయంకరంగా; పోరుచుండెన్= యుద్ధం చేస్తూ ఉన్నాడు; ఆ+కుమారుండు= ఆ బాలుడు (అభిమన్యుడు); గురున్= ద్రోణాచార్యుడిని; పంచాశత్+బాణంబులను= ఏభైబాణాలతో; కృతవర్మన్= కృతవర్మను; అశీతి+సాయకంబులను= ఎనభై బాణాలతో; గురు తనయున్= అశ్వత్థామను; దశవిశిఖంబులను= పదిబాణాలతో; కర్ణున్= కర్ణుడిని; ఒక్క+బలు+నారసంబునను= ఒక దృఢమైన బాణంతో; స్రుక్కించి= సోలిపోయేటట్లు చేసి; కృపునిన్= కృపాచార్యుడిని; విరథున్+చేసి= రథంలేని వాడినిగా చేసి; బృహద్బలు= కోసల దేశంరాజైన బృహద్బలుడి యొక్క; మేనన్= శరీరంపై; ముప్పది+నారసంబులు+నాటించి= ముప్పైబాణాలు నాటుకొనేటట్లు చేసి; వారలకున్= వారికి; బాసట+అయి= తోడై; కదిసిన+సైనికులన్= సమీపించిన సైనికులను; పెక్కు, తెఱంగుల, తూపులన్= పలురకాల బాణాలతో; చిక్కువఱిచి= తొట్రుపెట్టి (చిక్కులోపెట్టి); ఉక్కునన్= శౌర్యంతో; క్రోధపుత్ర, బృందారకులు+అను, రాజులను= క్రోధపుత్రుడు, బృందారకుడు అనే పేర్లుగల రాజులను; రూపు+అడంచెన్= రూపులేకుండా చేశాడు (చంపాడు); అప్పుడు= ఆ సమయంలో; శారద్వతుండు= కృపాచార్యుడు; తేరు= రథం; ఆయితంబు+చేసికొని= సిద్ధం చేసికొని; కడంగి= పూని; తోడి+ఏవురన్+కూడుకొని= వెంబడి ఉన్న అయిదుగురు వీరులను కలిసికొని; ఆ+క్రీడికొడుకు మీఁదన్= ఆ అర్జునుడి కొడుకుపైన; మార్గణ+పరంపరలు= బాణాల వరుసలు; పరఁగింపన్= ప్రయోగించగా; పెరిగిన+దర్పంబునన్= అతిశయించిన గర్వంతో; కసి మసంగి= ఖండించి; అతండు= ఆ అభిమన్యుడు; నొప్పింపన్= బాధపెట్టగా; పెఱవారు= ఇతరులు; బీఱుపోవన్= వ్యర్థంకాగా; బలహీనత చెందగా; బృహద్బలుండు= కోసలదేశపు రాజు బృహద్బలుడు; బిట్టు+కవిసి= తీవ్రంగా చుట్టుముట్టి; నిశిత, శరంబులు, నిగిడించినన్= తీవ్రములైన (తీక్ష్ణములైన) బాణాలు ప్రయోగించగా; ఆ+నరనందనుండు= ఆ అర్జునుడి కుమారుడు.

**తాత్పర్యం:** బోయవాళ్ళూ, కళింగదేశం వాళ్ళూ ఏనుగుల గుంపుతో అడ్డుకొన్నారు. అతిరథ శ్రేష్ఠుడైన అభిమన్యుడు అటుపైన పూనుకొని సైన్యాన్ని సంహరించాడు. ఎప్పటివలె అప్పటి యుద్ధవీరులు వెంబడించి పెక్కు ఎద్దులు ఒక్క పులిని చుట్టుకొన్నట్లుగా క్రమ్ముకొని పోరాడుతూ ఉండగా, అక్కడ సైంధవుడు పాండవసైన్యాన్ని తననుమీరి పోనీకుండా

వేగాతిశయంతో భయంకరంగా యుద్ధంచేస్తూ వచ్చాడు. అప్పుడు అభిమన్యుడు ద్రోణాచార్యుడిని ఏభై, కృతవర్మను ఎనభై, అశ్వత్థామను పది బాణాలతో, కర్ణుడిని ఒక దృఢమైన బాణంతో సొక్కిపోయేటట్లు చేశాడు. కృపుడిని తేరులేని వాడినిగా చేశాడు. బృహద్బలుడి శరీరంపై ముప్పై బాణాలు నాటాడు. పై చెప్పిన అందరికీ తోడుగా పోరాడుతూ ఉండే సైనికులను రకరకాల బాణాలతో చిక్కుపెట్టాడు. క్రోధపుత్రుడూ, బృందారకుడూ అనే రాజులను మట్టుపెట్టాడు. అంతలో కృపాచార్యుడు మళ్ళీ రథాన్ని సిద్ధం చేసికొని, తనతో కూడా ఐదుగురు యోధులను తీసికొని, ఆ అభిమన్యుడి మీద వరుసలు వరుసలుగా బాణాలు గుప్పించాడు. అభిమన్యుడు అతిశయించిన గర్వంతో ఆ బాణాలను ఖండించి తాను నొప్పించగా తక్కినవాళ్ళు బలహీనులైపోయారు. ఇంతలో కోసలదేశాధిపతి బృహద్బలుడు తీవ్రంగా చుట్టుముట్టి వాడి బాణాలు ప్రయోగించగా అభిమన్యుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. చాపము కేతువుం దునిమి సారథి నశ్వములన్ వధించుడుం**
**గోప మెలర్ప ఖేటకముఁ గ్రూర కృపాణముఁ గొంచుఁ దేరు సా**
**టోపత డిగ్గి వే కవియుడుం బటు భల్ల హతిం గృతాంత సే**
**వాపరుఁ జేసె హృత్పుటము వ్రచ్చి బృహద్బలు భూరిదోర్బలున్. 95**

**ప్రతిపదార్థం:** చాపమున్= వింటిని; కేతువున్= జెండాను; తునిమి= ఖండించి; సారథిన్= సూతుడిని; అశ్వములన్= గుర్రాలను; వధించుడున్= చంపగానే; కోపము+ఎలర్పన్= క్రోధము అతిశయించగా; ఖేటకమున్= డాలును, క్రూర కృపాణమున్= తీవ్రమైన ఖడ్గాన్ని; కొంచున్= తీసికొంటూ; స+ఆటోపతన్= ఆటోపంతో; తేరున్+డిగ్గి= రథాన్ని దిగి; వే+కవియుడున్= వేగంగా సమీపించగా; భూరి+దోర్బలున్= అధికమైన భుజబలం కలవాడైన; బృహద్బలున్= కోసల దేశాధీశుడిని; పటు, భల్ల, హతిన్= గట్టి బల్లెంయొక్క పోటుచేత; హృద్+పుటమున్= దొప్పవంటి హృదయమును; వ్రచ్చి= చీల్చి; కృతాంత+సేవాపరున్= యముడిని సేవించడంలో ఆసక్తి కలవాడినిగా అనగా చచ్చినవాడినిగా; చేసెన్= కావించాడు- అర్జునకుమారుడు అభిమన్యుడు తన్నెదిరించిన బృహద్బలుడిని చంపివేశాడు.

**తాత్పర్యం:** చాపాన్నీ, ధ్వజాన్నీ (జెండాను) ఖండించి సారథినీ, గుర్రాలనూ చంపగానే కోపంతో డాలునూ, ఖడ్గాన్నీ తీసికొని ఆటోపంతో రథం దిగి, వేగంగా బృహద్బలుడు సమీపించాడు. బాహుబలంతో సమీపించిన ఆ బృహద్బలుడిని అభిమన్యుడు తీవ్రమైన బల్లెంతో, దొప్పవంటి అతడి హృదయాన్ని చీల్చి యమలోకానికి పంపాడు.

**వ. ఇ ట్లింద్రపౌత్త్రుండు గోసలేంద్రునిం దెగఁ జూచినఁ జూచి యేచి తదీయ బంధు భూపతు లొక్క మొగి నురవడించిన నతండు వారల యేపు మాపి కర్ణుండు డాసినం గర్ణోపాంతంబు గర్ణికానారాచంబుల నొప్పించె; నయ్యిరువురు నొండొరుల మేనులు నెత్తురుల జొత్తిల్లం జేసిన సంధ్యా సమయ సూర్యబింబ ప్రతిబింబంబులుం బోలె బొలిచి; రా సమయంబున సూతనందను నాయకు లార్వురు గర్వంబునఁ దన్నుం గదిసినం గవ్వడి కొడుకు చిత్రవధ విహారంబు సలుపు నప్పుడు కుంభసంభవ ప్రభృతి రథికవరుల శరంబులు మగిడించుచు వారిపైఁ దూపులు నిగిడించుచునికి యద్భుతంబయ్యె; నట్టియెడ. 96**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఇంద్రపౌత్త్రుండు= ఇంద్రుడి మనుమడైన అభిమన్యుడు; కోసల+ఇంద్రునిన్= కోసల దేశాధిపతి అయిన బృహద్బలుడిని; తెగన్+చూచినన్= తునుమాడగా; చూచి= ఆ సన్నివేశాన్ని పరికించి; ఏచి= అతిశయించి; తదీయ, బంధు, భూపతులు= అతడి చుట్టాలైన రాజులు; ఒక్కమొగిన్= ఒక్క పూనికతో; ఉరవడించినన్= వేగిరపడగా (పరాక్రమించగా); అతండు= ఆ అభిమన్యుడు; వారల= చుట్టుముట్టిన బృహద్బలుని చుట్టాలయొక్క; ఏపు మాపి= గర్వాన్ని తొలగించి; కర్ణుండు+డాసినన్=

కర్ణుడు సమీపించగా; కర్ణ+ఉపాంతంబున్= చెవికొనలో; కర్ణికా, నారాచంబులన్= కర్ణికలు అనే బాణాలతో; నొప్పించెన్= బాధపెట్టాడు; ఆ+ఇరువురున్= ఆ అభిమన్యుడు, కర్ణుడు; ఒండొరుల= ఇరువురి; మేనులు= శరీరాలు; నెత్తురులన్= నెత్తుటితో; జొత్తిల్లన్+చేసినన్= ఎర్రనయ్యేటట్లు చేయగా; సంధ్యా సమయ= సంజవేళలో; సూర్య= సూర్యుడియొక్క; బింబ+ప్రతిబింబంబులున్+పోలెన్= బింబం ప్రతిబింబం విధంగా; పొలిచిరి= మసిలారు; ఆ+సమయంబునన్= ఆ సందర్భంలో; సూతనందను= కర్ణుడి యొక్క; నాయకులు= దళపతులు (పంద్రెండుమంది భటుల అధిపతిని నాయకుడంటారు); ఆర్వురు= ఆరుమంది; గర్వంబునన్= ఆటోపంతో; తన్నున్= తనను; కదిసినన్= సమీపించగా (మార్కొనగా); కవ్వడి కొడుకు= అర్జునుడి కుమారుడు; చిత్రవధ విహారంబు= విచిత్రంగా చంపుతూ తిరగటం; సలుపు+అప్పుడు= చేస్తూ ఉన్నసమయంలో; కుంభసంభవ+ప్రభృతి= ద్రోణుడు మొదలైన; రథికవరుల= రథికశ్రేష్ఠుల; శరంబులు= బాణాలు; మగిడించుచున్= మరలిస్తూ; (వెనుకకు పంపుతూ); వారిపైన్= ద్రోణుడు మొదలైన వారిపై; తూపులు= బాణాలు; నిగిడించుచున్+ఉనికి= ప్రయోగిస్తూ ఉండటం; అద్భుతంబు+అయ్యెన్= ఆశ్చర్యకరం అయింది; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో.

**తాత్పర్యం:** బృహద్బలుడు మరణించగానే అది చూచి అతడి బంధువులు రెచ్చిపోయి, అందరూ ఒక్క పూనికతో పరాక్రమించారు. అపుడు అభిమన్యుడు అందరి గర్వాన్ని తుదముట్టించి, కర్ణుడు తన్ను ఎదుర్కొనగా అతడి చెవికొనను కర్ణికలు అనే బాణాలతో నొప్పించాడు. ఇరువురూ,శరీరాలు నెత్తురు కారుతూ సంధ్యాకాలంలోని సూర్యబింబం, దాని ప్రతిబింబంవలె ప్రకాశించారు. ఆ సమయంలో కర్ణుడి దళపతులు ఆరుమంది తనను ఎదుర్కొన్నారు. వెంటనే అభిమన్యుడు చిత్రవిచిత్రంగా వారిని వధిస్తూ విహారం చేశాడు. ద్రోణాదులు ప్రయోగించిన బాణాలను వెనుకకు మళ్ళించి వారిపై తానూ బాణాల వర్షం కురిపించాడు.అది చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది. ఆ సమయంలో.

**తే.** **మగధపతి సూనుఁడైన యశ్మంతకుండు । బాలుఁ డయ్యును బ్రౌఢదోర్బలము మెఱయఁ**
**దాఁకుటయు, సూతు తలయు రథ్యముల తలలు । నతని తలతోన యభిమన్యుఁ డవనిఁ గూల్చె. 97**

**ప్రతిపదార్థం:** మగధపతి సూనుఁడు+ఐన= జరాసంధుడి కొడుకైన; అశ్మంతకుండు= అశ్మంతకుడు అనే పేరుగలవాడు; బాలుఁడు+అయ్యును= పసివాడైనప్పటికీ; ప్రౌఢ దోః+బలము= ప్రౌఢులయొక్క మిక్కిలి నేర్పుగల భుజ బలం; మెరయన్= ఒప్పుచుండగా; తాఁకుటయున్= ఎదిరించటమున్నూ; సూతు, తలయున్= సారథి శిరస్సును; రథ్యముల తలలు= గుర్రాల తలలు; అతని+తలతోన్+అ= ఆ అశ్మంతకుడి శిరస్సుతోనే; అభిమన్యుఁడు; అవనిన్= నేలపైన; కూల్చెన్= పడవైచాడు.

**తాత్పర్యం:** మగధపతి కొడుకు అనగా జరాసంధుని కుమారుడు, అశ్మంతకుడు అనేవాడు బాలుడైనప్పటికీ మహాప్రౌఢుడి వలె భుజబలంతో అభిమన్యుడిని ఎదిరించాడు. అపుడు అభిమన్యుడు అతడి సారథి శిరస్సునూ గుర్రాల తలలను అతడి శిరస్సుతో పాటు నేలకూల్చాడు.

**వ.** **ఇట్లు పూర్వ వైరంబు దలంచి తలపడిన మాగధు కుమారు నవలీల నేలం గలిపి సింహనాదంబు సేసినం దత్సంరంభంబు సైరింపంజాలక దుశ్శాసన సూనుండు సరభసంబుగాఁ గవిసి ఘోటకంబుల నంబక చతుష్టయంబునను, సారథి నొక్కనారసంబుననుం దదీయ తనువు పది బాణంబులను బెలుచ నొప్పించినం జంచదరుణ కమలచారు విలోచనుం డగుచు సౌభద్రుం డతనిఁ బ్రదీప్త సప్త నారాచ నిపాత పీడితుం జేసె డగ్గఱి. 98**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పూర్వవైరంబున్+తలంచి= ఇంతకు మునుపు జరాసంధుడిని భీముడు చంపిన విరోధాన్ని (శత్రుత్వాన్ని) భావించి; తలపడిన= ఎదిరించిన; మాగధుకుమారున్= మగధదేశ ప్రభువైన జరాసంధుడి కొడుకు అశ్మంతకుడిని; అవలీలన్= సులభంగా (చులకనగా); నేలన్+కలిపి= చంపి; సింహనాదంబు+చేసినన్= సింహంవలె గర్జించగా; తద్+సంరంభంబు=

ఆ వేగిరపాటు; సైరింపన్+చాలక= సహించలేక; దుశ్శాసన సూనుండు= దుశ్శాసనుని కొడుకు; సరభసంబుగాన్= వేగంతో; కవిసి= చుట్టుముట్టి; ఘోటకంబులన్= గుర్రాలను; అంబక+చతుష్టయంబునన్= నాలుగు బాణాలతో; సారథిన్= సూతుని (రథమును నడపువానిని); ఒక్క నారసంబుననున్= ఒక బాణముతో; తదీయ+తనువు= అతడి శరీరాన్ని; పదిబాణంబులను= పది బాణాలతో; పెలుచన్= అధికంగా, నొప్పించినన్= బాధపెట్టగా; చంచత్+అరుణ, కమల, చారు విలోచనుండు= ప్రకాశిస్తూ ఉండే ఎర్రని తామరలవంటి మనోహరమైన కన్నులు కలవాడు; అగుచున్= అవుతూ; సౌభద్రుండు= సుభద్ర కొడుకు; అతనిన్= దుశ్శాసన కుమారుడిని; ప్రదీప్త, సప్త, నారాచ, నిపాత, పీడితున్= మండుతూ ఉండే ఏడు బాణాలు పడటం చేత పీడించబడే వాడినిగా; చేసి= ఒనర్చి; డగ్గఱి= సమీపించి.

**తాత్పర్యం:** పూర్వం జరాసంధుడిని భీముడు చంపిన పగను తలచుకొని తలపడ్డ అశ్మంతకుడిని అవలీలగా చంపి సింహగర్జన చేయగా, ఆ ఆటోపాన్ని సహించలేని దుశ్శాసనుడి కొడుకు అతివేగంతో చుట్టుముట్టి గుర్రాలను నాలుగు బాణాలతో, సారథిని ఒక బాణంతో, అతడి శరీరాన్ని పదిబాణాలతో నొప్పించగా, ఎర్రదామరల వంటి కళ్ళు కలిగినవాడై అభిమన్యుడు ఆ దుశ్శాసన కుమారుడిని ప్రకాశవంతములైన ఏడు బాణాలు ప్రయోగించి పీడించి, సమీపించి.

**ఉ. ఇంతకు మున్న నీ జనకుఁ డెంతయు నోటఱి పాఱె; నీవె నా**
**పొంతకు వచ్చి; తింక నెట వోనగు? నం' చొక దొడ్డనారసం**
**బెంతయు బెట్టిదంపు వడి నేయుడు ద్రోణసుతుండు దాని నిం**
**తింతలు సెక్కలై యిలపయిం దొరఁగన్ వెస నేసె; నేసినన్. 99**

**ప్రతిపదార్థం:** ఇంతకుమున్న+అ= ఇంతకు మునుపే; నీ జనకుఁడు= నీ తండ్రి అయిన దుశ్శాసనుడు; ఎంతయున్= మిక్కిలి; ఓటఱి+పాఱెన్= ఓడి పరుగెత్తాడు; నీవు+ఎ= నీవే; నా పొంతకున్= నా సమీపానికి; వచ్చితి(వి)= వచ్చావు; ఇంకన్= ఇకపైన; ఎట, పోన్+అగున్?= ఎక్కడికి పోవటానికి వీలవుతుంది?; అంచున్= అంటూ; ఒక+దొడ్డ+నారసంబున్= ఒక గొప్ప బాణాన్ని; ఎంతయున్= మిక్కిలి; బెట్టిదంపు+వడిన్= భయం కలిగించే వేగంతో; ఏయుడున్= ప్రయోగించగానే; ద్రోణసుతుండు= అశ్వత్థామ; దానిన్= ఆ బాణాన్ని; ఇంతింతలు, చెక్కలు+ఐ= చాలా అల్పములైన ముక్కలై - అనగా నుగ్గునూచములై; ఇలపయిన్= నేలమీద; తొరఁగన్= పడేటట్లు; వెసన్+ఏసెన్= వేగంగా ప్రయోగించాడు; ఏసినన్= అట్లు ప్రయోగించగా.

**తాత్పర్యం:** 'ఇంతకు ముందే నీ తండ్రి ఓడి పరుగెత్తి పారిపోయాడు. ఇప్పుడు నీవే నా సమీపానికి వచ్చావు. ఇక నీవు ఎక్కడికి పోవటానికి అవుతుంది?' అంటూ ఒక గొప్ప బాణాన్ని అభిమన్యుడు ప్రయోగించాడు. వెంటనే అశ్వత్థామ దాన్ని నుగ్గునూచం చేసి నేలమీద పడేటట్లు చేశాడు. అట్లు చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అతని దిక్కును జూడక యతఁడు రయము । మెఱసి నీ పౌత్త్రుచాపంబు నఱికి, సూతుఁ**
**గూల్చి, యాఱమ్ము లురమున గ్రుచ్చుటయును । నొండు దేరిపై కబ్బాలుఁ డుఱికె నధిప! 100**

**ప్రతిపదార్థం:** అతఁడు= అభిమన్యుడు; అతని దిక్కును= అశ్వత్థామవైపు; చూడక= చూడకుండా; రయము+మెఱసి= వేగం అతిశయించి; నీ, పౌత్త్రు, చాపంబు+నఱికి= నీ మనవడి విల్లు ఖండించి; సూతున్= సారథిని; కూల్చి= చంపి; ఉరమునన్= రొమ్మునందు; ఆఱు+అమ్ములు= ఆరు బాణాలు; గ్రుచ్చుటయును= గాఢంగా నాటుకొనేటట్లు చేయగా; అధిప!= ఓ ధృతరాష్ట్రా!; ఆ+బాలుఁడు= ఆ దుశ్శాసనుడి కొడుకు; ఒండు తేరిపైకిన్= మరొక రథంమీదికి; ఉఱికెన్= దూకాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు అప్పుడు అశ్వత్థామవైపు చూడకుండా మహావేగంతో నీ మనవడి విల్లు త్రుంచి, సారథిని చంపి, రొమ్మున ఆరుబాణాలు నాటుకొనేటట్లు చేశాడు. అప్పుడు బాలుడైన ఆ దుశ్శాసనుడి కొడుకు మరో రథం మీదికి దూకాడు.

**వ. అంత నపరాహ్ణం బయ్యె; నా సమయంబున శత్రుంజయుండును, జంద్రకేతుండును, సువర్చసుండును, సూర్యభానుండును, మేఘవేగుండును, మొత్తం బై, తాఁకిన ధనంజయ తనయుండు మేటి మగలగు నమ్మహీశుల మేనులు నానాస్త్రంబుల ననేక ఖండంబులు గావించి గాంధారపతి సేరినం గ్రూరనారాచ జాలంబుల జర్జరిత శరీరుం జేసి దుర్యోధను దెసకు నడరుటయు నంగపతి యాచార్యున కిట్లనియె.101**

**ప్రతిపదార్థం:** అంతన్= అప్పుడు; అపర+అహ్ణంబు+అయ్యెన్= మధ్యాహ్నం అయింది; ఆ సమయంబునన్= ఆ సందర్భంలో; శత్రుజయుండును= శత్రుంజయుడూ; చంద్రకేతుండును= చంద్రకేతువూ; సువర్చసుండును= సువర్చసుడూ; సూర్యభానుండును= సూర్యభానుడూ; మేఘవేగుండును= మేఘవేగుడూ(వీరందరూ శకుని అనుచరులు); మొత్తంబు+ఐ= ఒక్కటై (గుంపుగా కలిసి ఒక్కటై); తాఁకినన్= ఎదుర్కొనగా; ధనంజయ తనయుండు= అర్జునుడి కుమారుడు; మేటి మగలు= గొప్పశూరులు; అగు= అయినటువంటి; ఆ+మహీశుల= ఆ రాజుల; మేనులు= శరీరాలు; నానా+అస్త్రంబులన్= అనేకాలైన అస్త్రాలతో; అనేకఖండంబులు= పెక్కు ముక్కలు; కావించి= చేసి; గాంధారపతి+చేరినన్= శకుని చేరగా; క్రూర, నారాచ, జాలంబులన్= భయంకరములైన (కఱకైన) బాణాల మొత్తంతో; జర్జరిత, శరీరున్+చేసి= శిథిలమూ లేక జీర్ణమూ అగు దేహం కలవాడిని గావించి; దుర్యోధను+దెసకున్= దుర్యోధనుడివైపుకు; అడరుటయున్= విజృంభించటమున్నూ; అంగపతి= కర్ణుడు; ఆచార్యునకున్= ద్రోణాచార్యుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అంతలో మధ్యాహ్న సమయమయింది. అప్పుడు శత్రుంజయుడూ, చంద్రకేతుడూ, సువర్చసుడూ, సూర్యభానుడూ, మేఘవేగుడు అనే శకుని అనుచరులంతా కలిసి అభిమన్యుడిని ఎదుర్కొన్నారు. అభిమన్యుడు ఆ గొప్ప శూరుల శరీరాలను అనేక బాణాలతో పెక్కు ముక్కలు చేసి, శకుని తనను సమీపించగా భయంకరములైన బాణాల సమూహంతో అతడి శరీరాన్ని తూట్లు పొడిచి, నెత్తుటితో తడిసిపోయేటట్లు చేశాడు. పిమ్మట దుర్యోధనుడివైపు విజృంభించాడు. అది చూచి కర్ణుడు ద్రోణాచార్యుడితో ఇట్లా అన్నాడు:

**క. 'చండగతి వీరరథికులఁ । జెండుచు నేతెంచి రాజుఁ జేరెడు సౌభ**
**ద్రుం డిట్టులు నీ కూరక । యుండ నగునె? ప్రతివిధాన మొనరింపు తగన్'. 102**

**ప్రతిపదార్థం:** సౌభద్రుండు= అభిమన్యుడు; చండగతిన్= తీవ్రమైన రీతిలో; వీర రథికులన్= శూరులైన రథికులను; చెండుచున్= చంపుతూ; ఏతెంచి= వచ్చి; రాజున్= దుర్యోధనుడిని; చేరెడున్= సమీపించాడు; ఇట్టులు= ఈ విధంగా; నీకున్= నీకు; ఊరక+ఉండన్+అగునె?= మిన్నక ఉండవచ్చునా?; తగన్= తగునట్లు; ప్రతివిధానము= బదులు చేయటం (మారుసేత); ఒనరింపు= కావించుము(చేయుము).

**తాత్పర్యం:** 'అభిమన్యుడు తీవ్రమైన విధంగా శూరులైన రథికులను చెండాడుతూ వచ్చి, దుర్యోధనుడిని సమీపించాడు. ఈ విధంగా నీకు ఊరక ఉండవచ్చునా? దీనికి ప్రతిగా తగినపని ఏదో దాన్ని వెంటనే చేయుము.'

**క. అని పలికి పతికి నడ్డము । సనుటయు గురుఁ డచటి యోధచయముం గలయన్**
**గనుఁగొని 'యభిమన్యుఁడు న । ర్జునుఁడును నని నొక్కరూప చుండీ! తలఁపన్. 103**

**ప్రతిపదార్థం:** అని+పలికి= ఆ విధంగా మాటాడి; పతికిన్+అడ్డము+చనుటయున్= దుర్యోధనుడికి అడ్డంగా పోగా; గురుఁడు= ద్రోణాచార్యుడు; అచటి, యోధ, చయమున్= అక్కడ ఉండే వీరుల మొత్తాన్ని; కలయన్+కనుఁగొని= అంతటా లేక బాగా చూచి; తలఁపన్= ఆలోచించగా; అభిమన్యుఁడున్= ఈ అభిమన్యుడూ; అర్జునుఁడునున్= ఆ అర్జునుడూ; అనిన్= యుద్ధం చేయటంలో; ఒక్కరూప+చుండీ!= ఒక్క విధమే సుమా! (అనగా భేదం లేనివారే).

**తాత్పర్యం:** ఆ విధంగా అని, దుర్యోధనుడికి అడ్డం పోగా, ద్రోణుడు అక్కడ ఉండే యోధులను అందరినీ కలియ చూచి, 'ఆలోచించగా అర్జునుడూ, అభిమన్యుడూ యుద్ధం చేయటంలో ఒక్క విధమే. వీరిరువురూ భేదం లేనివారే.

**వ. చూడం బిన్నవాఁడు గాని యలంతులం బోయెడు వాఁడు గాఁడు, మన మందఱముం గూడికొని యొక్కపెట్ట యక్కుమారుపై నురవడింపవలయు' నని పురికొలిపి బరవసంబు సేసె; నప్పు డప్పాండు పౌత్త్రు బాణంబులం బీడితుండై సూతపుత్త్రుండు గుంభసంభవు నాలోకించి 'నా దెస సూడుము; వీఁడు నొప్పించె; నిలువం దగు నెలవగుట నసము డింపక యూల గఱచుకొని యున్నవాఁడ; గాండీవిఁ గలనం గలిసి యెఱుంగుదుమ కాదె! యతనిచే యింత బెట్టిదంబుగా, దని చెప్పిన విని యల్లన నగి యతం డతని కిట్లనియె. 104**

**ప్రతిపదార్థం:** చూడన్= చూడటానికి; పిన్నవాఁడు+కాని= బాలుడుకాని; అలంతులన్+పోయెడువాఁడు+కాఁడు= అంత తేలిగ్గా (నశించే) చచ్చేవాడు కాడు - లేదా సాధించబడేవాడు కాడు; మనము+అందఱమున్= మనమంతా; కూడికొని= కలిసికొని; ఒక్కపెట్ట= ఒక్కుమ్మడిగా; ఆ+కుమారుపైన్= ఆ బాలుడిపై; ఉరవడింపవలయున్= పరాక్రమించాలి; అని+పురికొలిపి= అని ప్రేరేపించి; బరవసంబు+చేసెన్= ధైర్యాన్ని కలిగించాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+పాండుపౌత్త్రు+బాణంబులన్= పాండురాజు మనుమడైన అభిమన్యుడి బాణాలతో; పీడితుండు+ఐ= పీడింప (బాధింప) బడ్డవాడై; సూతపుత్త్రుండు= కర్ణుడు; కుంభసంభవున్= ద్రోణుడిని; ఆలోకించి= చూచి; నా+దెస+చూడుము= నావైపు చూడుము; వీఁడు= ఈ అభిమన్యుడు; నొప్పించెన్= బాధిస్తూ ఉన్నాడు; నిలువన్+తగు+నెలవు+అగుటన్= నిలవటానికి, యోగ్యమైన, ప్రదేశం, కావటంచేత; అసము+డింపక= దర్పం చెడకుండా; ఊలకఱచుకొని= ప్రాణాన్ని బిగబట్టుకొని; ఉన్నవాఁడన్= ఉన్నాను; గాండీవిన్= అర్జునుడిని; కలనన్= యుద్ధంలో; కలిసి= ఎదుర్కొని; ఎఱుంగుదుమ+కాదె!= తెలిసికొని ఉన్నాం కదా!; అతని+చే= ఆ అర్జునుడి చేయి; ఇంత, బెట్టిదంబు+కాదు= ఇంత భయంకరం కాదు; అని+చెప్పినన్= అని అనగా; విని; అల్లనన్= మెల్లగా; నగి= నవ్వి; అతండు= ద్రోణాచార్యుడు; అతనికిన్= కర్ణుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వీడు చూడటానికి బాలుడు కాని, అంత తేలికగా వశం అయ్యేవాడు కాడు. అసాధ్యుడైన వీడిపైకి మనమంతా గుమిగూడి ఒక్కుమ్మడిగా పరాక్రమించాలి' అని ప్రేరేపించి ధైర్యాన్ని కలిగించాడు. ఆ సమయంలో అభిమన్యుడి బాణాలతో పీడించబడ్డ కర్ణుడు ద్రోణాచార్యుడిని చూచి 'నా వైపు చూడుము. వీడు నన్ను బాధిస్తూ ఉన్నాడు. ఇది నిలువలసిన ప్రదేశం అయినందువలన దర్పం చెడకుండా ప్రాణాన్ని బిగబట్టుకొని ఉన్నాను. గాండీవితో యుద్ధానికి తలపడి ఉన్నాం. అతడి శక్తి సామర్థ్యాలు మనకు తెలుసు. కాని, అర్జునుడిచేయి వీడి చేయంత బెట్టిదంకాదు' అనగానే విని మెల్లగా నవ్వుతూ ద్రోణుడు కర్ణుడితో ఈ విధంగా అన్నాడు:

**సీ. 'కవచధారణ మను ఘనవిద్య, గవ్వడి । కే నెఱింగించితి; నితఁడు దాని**
**నేర్చుట నీతని నెట్టన నొప్పింప । శక్యంబు గాదు; వంచన గుణంబు**
**నఱకంగఁ జాపంబు విఱుగ నేయఁగ ఘోట । కములఁ జంపఁగ, సూతు సమయఁ జేయ**
**నగుఁ; జాలు దేని నీ వట్ల సేయుము; చేత । ధనువుండ న వ్వీరుఁ జెనయ వశమె**

**ఆ. దేవతలకు నైనఁ? గావున నొక్క మై । విల్లు ద్రుంచి తఱిమి విరథుఁ జేసి**
**చూచికొంద మలవు చొప్పునఁ దెగునె యీ । రథికవరుని పటుపరాక్రమంబు?' 105**

**ప్రతిపదార్థం:** ఏను= ద్రోణుడనైన నేను; కవచ ధారణము+అనువిద్యన్= 'కవచధారణం' అనే పేరుగల విద్యను; కవ్వడికిన్= అర్జునుడికి; ఎఱింగించితిన్= తెలియజేశాను; ఇతఁడు= ఈ అర్జునుడి కొడుకు; దానిన్= ఆ విద్యను; నేర్చుటన్= నేర్చుకొనటం

వలన; నెట్టనన్= నిజంగా లేదా తెగువవపూని; ఈతనిన్= అభిమన్యుడిని; నొప్పింపన్= బాధపెట్టటానికి; శక్యంబుకాదు= వీలుకాదు(సాధ్యం కానే కాదు); వంచనన్= మోసంచేత; గుణంబున్= అల్లెత్రాటిని;నఱకంగన్= త్రెంచటం చేతనూ; చాపంబున్= వింటిని; విఱుగన్+ఏయఁగన్= విరగగొట్టటం చేతనూ; ఘోటకములన్+చంపఁగన్= గుర్రాలను చంపటం చేతనూ; సూతున్+సమయన్+చేయన్= సారథిని హతమార్చటం చేతనూ; అగున్= అవుతుంది; చాలుదు(వు)+ఏని= సమర్థుడవే అయితే-లేదా శక్తి కలదేని;నీవు; అట్లు+చేయుము= ఆ విధంగా చేయవచ్చును; చేతన్+ధనువు= చేతిలో విల్లు; ఉండన్= ఉండగా; ఆ+వీరున్= వీరుడైన ఆ అభిమన్యుడిని; దేవతలకున్+ఐనన్= అమరులకైనా; చెనయన్+వశమె?= ఎదిరించటానికి (తాకటానికి) సాధ్యమా?; కావునన్= కాబట్టి; ఒక్కమైన్= ఒక్కపెట్టున; విల్లున్+త్రుంచి= ధనుస్సును ముక్కలు చేసి; తఱిమి= పరుగెత్తించి లేదా కవిసి; విరథున్+చేసి= రథంలేని వాడినిగా చేసి;చూచికొందము= ఆలోచిద్దాం; ఈ రథికవరుని= రథికశ్రేష్ఠుడైన ఈ వీరునియొక్క; పటు పరాక్రమంబు= తీవ్రమైన శౌర్యం; అలవుచొప్పునన్= పరిశ్రమించటం చేత; తెగును+ఎ?= నశిస్తుందా?

**తాత్పర్యం:** నేను కవచధారణం అనే విద్యను అర్జునుడికి తెలియజేశాను. అభిమన్యుడు ఆ విద్యను తండ్రివలన నేర్చుకొన్నాడు. ఆ విద్యవలన అతడిని నొప్పించటానికి సాధ్యంకాదు. వంచనచేత, అల్లెత్రాటిని త్రెంచాలి, విల్లు విరవాలి, గుర్రాలను, సూతుడిని కూల్చాలి. ఇవన్నీ ఒక్కుమ్మడి జరగాలి. నీ చేతనైతే ఈ పని చేయుము. చేతిలో ధనువుండగా దేవతలైనా అతడిని సమీపించలేరు. మనం అతడిని ఎదిరించి జయించలేము.'

**విశేషం:** కవచధారణ విద్యా ప్రభావం ఈ సీసపద్యంలో వివరించబడింది. కవచాన్ని ధరించి ఉన్నంతకాలం ఎవ్వరూ అభిమన్యుడిని ఏమీ చెయ్యలేరు. ముందు అతడి చేతిలో విల్లు లేకుండా చెయ్యాలి. ద్రోణాచార్యుడి అధర్మయుద్ధానికి ఇదే నాంది. వంచనతో ఏమేమి చేయాలో ద్రోణుడు ఇందులో తెలిపాడు. 'ఒక్కమై విల్లు ద్రుంచి విరథుఁజేసి' అనే ప్రయోగం వలన ఏదో ఒక విధంగా అతడిని హతమార్చాలి అనే నిర్ణయానికి వచ్చారు. 'చూచికొందము' అనే మాట వ్యావహారికంగా ఎంతో అర్థవంతమైనది. 'వాడి సంగతి నేను చూచుకొంటాను' వంటి ప్రయోగాలు మనం వింటూనే ఉంటాం. అదే అర్థంలోనే ఇక్కడ కూడా ప్రయోగించినట్లు విదితమౌతూ ఉన్నది.

**కర్ణుఁడు మొదలగు యోధులు వంచనచే అభిమన్యుని విరథుఁ జేయుట (సం. 7-47-31)**

**చ.** **అన విని సూతసూనుఁడు భయం బెదఁ గూరినవాఁడ పోలె నై**
**వెనుక కొదింగి యా రథికవీరు పిఱిందికిఁ జుట్టి వచ్చి వం**
**చనకు సహాయులై యచటి సైనికు లన్నరపుత్త్రు బిట్టు మా**
**ర్కొని పెనఁగంగఁ జేరి యలఘు ప్రదరంబున విల్లు ద్రుంచినన్.** 106

**ప్రతిపదార్థం:** అనన్= అనగా; సూతసూనుఁడు= కర్ణుడు; విని; భయంబు= భీతి; ఎదన్+కూరినవాఁడ+పోలెన్+ఐ= మనస్సులో నాటుకొన్నవాడి వలె అయి; వెనుకకున్+ఒదింగి= వెనుకకు ముడుచుకొని (దాగి); ఆ రథికవీరు+పిఱిందికిన్= ఆ రథిక శ్రేష్ఠుడి వెనుకకు; చుట్టివచ్చి= తిరుగుకొని వచ్చి; వంచనకున్= తన మోసానికి; సహాయకులు+ఐ= సహాయపడేవారై; సైనికులు= యోధులు; ఆ+నరపుత్త్రున్= ఆ అర్జున కుమారుడిని; బిట్టు= మిక్కిలి; మార్కొని= ఎదుర్కొని; పెనఁగంగన్= పోరాడగా; చేరి= కర్ణుడు సమీపించి; అలఘు+ప్రదరంబునన్= గొప్ప బాణంతో; విల్లున్+త్రుంచినన్= విల్లు త్రుంచగా.

**తాత్పర్యం:** అని ద్రోణుడనగానే విని కర్ణుడు మనస్సులో భీతి నాటుకొన్నవాడు మాదిరిగా వెనుకకు ఒదిగి, ఆ రథికశ్రేష్ఠుడైన అభిమన్యుడి వెనుకకు మరలివచ్చి, వంచనకు సహకరించే సైనికులందరూ ఆ అర్జునకుమారుడిని ముందువైపు ఎదుర్కొని పోరాడుతూ ఉండగా, కర్ణుడు గొప్ప బాణంతో అభిమన్యుడి విల్లు త్రుంచాడు.

**వ. ఆ లోన. 107**

**తాత్పర్యం:** అంతలో.

**క. గురుఁ డశ్వంబులఁ గూల్చెను । సరభసముగఁ గృపుడు సంపె సారథి నిమ్మై**
**నరసుతుఁ డనాయుధుండును । విరథుండును నగుట సూచి వెఱపేది వడిన్. 108**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; అశ్వంబులన్= గుఱ్ఱాలను; కూల్చెన్= చంపాడు; కృపుఁడు= కృపాచార్యుడు; సరభసముగన్= మిక్కిలి వేగంతో; సారథిన్+చంపెన్= సూతుడిని హతమార్చాడు; ఈ+మైన్= ఈ విధంగా; నరసుతుఁడు= అభిమన్యుడు; అనాయుధుండును= ఆయుధాలు లేనివాడునూ; విరథుండును= రథం లేని వాడున్నూ; అగుటన్+చూచి= కావటం గ్రహించి; వెఱపు+ఏది= భయం తొలగి; వడిన్= తొందరగా.

**తాత్పర్యం:** ద్రోణుడు గుఱ్ఱాలను, కృపుడు రథసారథినీ క్షణంలో కూల్చారు. ఆ విధంగా అభిమన్యుడు ఆయుధాలూ, రథమూ లేనివా డయ్యాడు. ఇది గ్రహించి, భయాన్ని వదిలి, తొందరగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. శకుని కృతవర్మ శల బా । హ్లిక గురుసుతు లాదిగా ననేకు లడరి య**
**స్త్ర కలాపంబుల శస్త్ర । ప్రకరంబుల నొంచి చిక్కువఱిచి యలఁచినన్. 109**

**ప్రతిపదార్థం:** శకుని= గాంధారపతి; కృతవర్మ= యదువంశపురాజైన కృతవర్మ; శల= బాహ్లికుడి కొడుకైన శలుడు; బాహ్లిక= శంతనుడి సహోదరుడైన బాహ్లికుడు; గురుసుతులు= అశ్వత్థామ; ఆదిగాన్= మొదలుగా; అనేకులు= పలువురు; అడరి= చుట్టుముట్టి; అస్త్రకలాపంబులన్= బాణాల మొత్తాలచేత; శస్త్రప్రకరంబులన్= ఆయుధాల సమూహాలచేత; నొంచి= బాధించి; చిక్కుపఱిచి= తొట్రుపెట్టి (చిక్కులు కలిగించి); అలఁచినన్= కలత కలిగించగా - అనగా శ్రమపరచగా.

**తాత్పర్యం:** శకుని, కృతవర్మ, శలుడూ, బాహ్లికుడూ (సోమదత్తుడి తండ్రి) అశ్వత్థామ మొదలుగా పలువురు అదే అదనుగా విజృంభించి రకరకాల అస్త్రాల శస్త్రాల సమూహాలతో బాధించి, చిక్కులుపెట్టి శ్రమ కలిగించగా.

**విశేషం:** తిక్కన వరుసగా క్రియాపదాలు కూర్చి రచనకు అందాన్ని సమకూర్చటమే కాకుండా, అప్పటి ఆ సన్నివేశం యొక్క చందాన్ని అక్కడక్కడా తన రచనలో ధ్వనింపజేస్తూ ఉంటాడు. అది ఆయన శిల్పకళ లోని ఒక వైచిత్రి. ప్రస్తుతం కంద పద్యాంతంలో ఉన్న మూడు అసమాపక క్రియలూ అట్టి శిల్పకళాదృష్టిని స్ఫురింపజేస్తున్నాయి.

**క. వాలును బలకయుఁ గొని య । బ్బాలుఁడు రయమార గగనభాగంబున కు**
**న్మీలిత ధృతిసారుండై । లీల నెగసిపోయె మండలీభూతగతిన్. 110**

**ప్రతిపదార్థం:** వాలును+పలకయున్+కొని= కత్తినీ, పలకనూ(కేడెమునూ) గ్రహించి; ఆ+బాలుఁడు= అభిమన్యుడు; రయము+ఆరన్= వేగం అతిశయించగా; గగన భాగంబునకున్= ఆకాశవీథికి; ఉన్మీలిత, ధృతి, సారుండు+ఐ= విరిసిన ధైర్యంయొక్క చేవ కలవాడై; మండలీభూత+గతిన్= వలయాకారం అయిన గమనంతో; లీలన్= విలాసంగా; ఎగసిపోయెన్= ఎగిరాడు.

**తాత్పర్యం:** కత్తీ, పలకా తీసికొని అభిమన్యుడు మహావేగంతో ఆకాశవీథికి, విరిసిన ధైర్యసారం కలవాడై మండలాకార గమనంతో ఎగిరాడు.

**క. తన విద్య కలిమి వినతా । తనయుని భంగిం జరింపఁ దమతమపైఁ దెం**
**పున నుఱుకు నను తలంపున । మన యోధులు భయము గొనిరి మనుజాధీశా! 111**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= రాజా!; తన విద్య కలిమిన్= తన విద్యయొక్క పేర్మిచేత; వినతాతనయుని భంగిన్= (వైనతేయుడి) గరుత్మంతుడి వలె; చరింపన్= తిరుగుతూ ఉండగా; తెంపునన్= సాహసంతో; తమ తమ పైన్= తమ తమ మీదికి; ఉఱుకును= దూకుతాడు; అను తలంపునన్= అనే భావంతో; మన యోధులు= మన యుద్ధవీరులు; భయము కొనిరి= భీతిచెందారు.

**తాత్పర్యం:** ఓ రాజా! ధృతరాష్ట్రా! అభిమన్యుడు తన విద్యయొక్క పేర్మిచేత గరుత్మంతుడి వలె తిరుగుతూ ఉండగా, సాహసంతో ఇతడు ఎక్కడ తవమీదికి దూకుతాడో అని భావిస్తూ యుద్ధవీరులు మిక్కిలి భయపడ్డారు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**చ.** **ఎడగని వాలు బల్లెమున నేసె వెసం దునియంగఁ ద్రోణుఁ డ**
**ప్పుడు శకలంబులై పలక భూమిపయిం దొరఁగంగఁ జేసె నె**
**క్కుడువడిఁ గర్ణుఁ; డా శిశు వకుంఠగతిన్ దన తేరిమీఁద నొ**
**ప్పెడు ఘనచక్రముం గొని యుపేంద్రుఁడు లీల నటించు చాడ్పునన్.** **112**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; ఎడన్+కని= సమయం చూచి; వెసన్= వేగంగా; తునియంగన్= తునకలు అగునట్లు; బల్లెమునన్= బల్లెముతో; వాలున్= అభిమన్యుడి చేతి ఖడ్గాన్ని; ఏసెన్= కొట్టాడు; అప్పుడు= ఆ సమయంలో; కర్ణుఁడు; ఎక్కుడు+వడిన్= అధికమైన వేగంతో; శకలంబులు+ఐ= తునియలై; పలక= కేడెము; భూమిపయిన్+తొరఁగంగన్= భూమిమీద పడేటట్లు; చేసెన్= చేశాడు; ఆ+శిశువు= అభిమన్యుడు; అకుంఠగతిన్= కుంటుపోని (మొక్కవోని) విధంగా; తన తేరిమీఁదన్= తనరథంపై; ఒప్పెడి, ఘన, చక్రమున్= ఒప్పుచుండిన గొప్ప చక్రాన్ని; కొని= పూని(గ్రహించి); ఉప+ఇంద్రుఁడు= శ్రీ మహావిష్ణువు; లీలన్, నటించు,చాడ్పునన్= క్రీడించే విధంగా.

**తాత్పర్యం:** ద్రోణుడు అదను చూచి మహావేగంగా అభిమన్యుడి చేతి కత్తిని బల్లెంతో తునుకలయ్యేట్లు చేశాడు. అదే సమయంలో కర్ణుడు మిక్కిలి వేగంతో పలక ముక్కలై నేల పడేటట్లు చేశాడు. బాలుడైన ఆ అభిమన్యుడు ఏ మాత్రం చలించకుండా, కుంటువోని విధంగా తన రథంమీద ఉండే గొప్ప చక్రాన్ని తీసికొని శ్రీ మహావిష్ణువు క్రీడించే విధంగా. (తరువాతి గద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **సంరంభ విజృంభితుండై.** **113**

**ప్రతిపదార్థం:** సంరంభ= ఆటోపముతో; విజృంభితుండు+ఐ= చెలరేగినవాడై

**తాత్పర్యం:** ఆటోపంతో చెలరేగినవాడై.

**సీ.** **నెత్తుటఁ జొత్తిల్లి నెఱసిన యలుక ను। గ్రంబైన వదనంబు కాంతి పరఁగఁ,**
**గౌరవ సైనికోత్కరమున కతి భయ। దంబగు సింహనాదంబు సెలఁగ,**
**నింగికి నిగుడు రథాంగరోచులు మణి। కంకణద్యుతులతోఁ గలసి వెలుఁగ,**
**సిక్కు సూపిన గంధసింధురం బను రేఖ। దలఁపించు పటుగతి చెలువు మెఱయఁ,**

**తే.** **కుంభసంభవుఁ డున్న దిక్కునకుఁ గవిసి। యడ్డపడు సేనఁ జించి చెండాడు నక్కు**
**మారవరుమేని యొప్పును మగతనంబుఁ। జలము బలముఁ గీర్తించె నిర్జరగణంబు.** **114**

**ప్రతిపదార్థం:** నెత్తుటన్+జొత్తిల్లి= నెత్తురుచేత; ఎట్టినై నెఱసిన+అలుకన్= నిండిన కోపంతో; ఉగ్రంబు+ఐన, వదనంబు= భయంకరమైన ముఖంయొక్క; కాంతి+పరఁగన్= కాంతి ఒప్పారగా; కౌరవసైనిక+ఉత్కరమునకున్= కౌరవసైన్యసమూహానికి; అతి+భయదంబు+

అగు= మిక్కిలి భీతిని (ఇచ్చేది) కలిగించేది అగు; సింహనాదంబు+చెలఁగన్= సింహపుగర్జన ధ్వనించగా; నింగికిన్+నిగుడు= ఆకాశానికి వ్యాపించే; రథాంగ+రోచులు= చక్రం యొక్క కాంతులు; మణి,కంకణ, ద్యుతులతోన్= రత్నపు కడియాల కాంతులతో; కలసి+వెలుఁగన్= చేరి ప్రకాశించగా; సిళ్ళు+చూపిన= బరిగోల లేదా అంకుశం చూపిన; గంధసింధురంబు= మదపుటేనుగు; అను+రేఖ+తలపించు= అనే విధంగా తోచు; పటు+గతి+చెలువు= ఆటోపం గల గమన విశేషం యొక్క అందం; మెఱయన్= వెలుగొందగా; కుంభసంభవుఁడు= ద్రోణుడు; ఉన్న+దిక్కునకున్= ఉండేవైపుకు; కవిసి= చేరి; అడ్డపడుసేనన్= అడ్డం వచ్చిన సైన్యాన్ని; చించి= ఛేదించి; చెండాడు= హతంచేసే; ఆ+కుమారవరు= కుమార శ్రేష్ఠుడైన ఆ అభిమన్యుడి; మేని+ఒప్పును= శరీరం యొక్క సౌందర్యాన్ని; మగతనంబున్= శౌర్యాన్ని; చలమున్= మాత్సర్యాన్ని (పట్టుదలను); బలమున్= శక్తినీ; నిర్జర+గణంబు= దేవతలసమూహం; కీర్తించెన్= పొగడింది.

**తాత్పర్యం:** నెత్తుటితో తడిసి ఎర్రనై, నిండిన కోపంతో భయంకరంగా ఉన్న ముఖము యొక్క కాంతి దీపించగా, కౌరవసైన్య సమూహానికి భీతి కలిగించే సింహనాదాలు ఒప్పుచుండగా, ఆకాశానికి వ్యాపించే చక్రకాంతులు రత్న కంకణ కాంతులతో కలిసి ప్రకాశించగా; (బరిగోలను) అంకుశాన్ని చూపిన మదపుటేనుగు అనే విధంగా తోచు ఆటోపంతో కూడిన గమన విశేషం యొక్క అందం ఒప్పుతుండగా ద్రోణుడుండే దిక్కుచేరి అడ్డంవచ్చే సైన్యాన్ని చీల్చి చెండాడుతూ ఉన్న ఆ అభిమన్యుడి ముఖ సౌందర్యాన్ని, శౌర్యాన్ని, మాత్సర్యాన్ని, బలాన్నీ దేవతలు కీర్తించారు.

**విశేషం:** అప్రతిమాన ప్రతాపంతో ప్రకాశించే అభిమన్యుడి ప్రతికదలికా, ప్రతిభావమూ, ప్రతిశబ్దమూ ఎంతో శోభాయమానంగా, సంతోషాన్ని కలిగించింది. ప్రస్తుత సీసపద్యం అభిమన్యుడి సౌందర్యదీప్తికీ, శౌర్యపటుత్వానికీ ప్రతీక. ఇందులోని తేటగీతి తేటతెల్లమైన దేవతల ప్రశంసాగీతికి సాంకేతిక సూచన. అలంకారం: ఉపమ.

**వ. అట్టియెడ.** **115**

**తాత్పర్యం:** అటువంటి సందర్భంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. శకుని కృతవర్మ కృప కర్ణ శల్య ముఖ్యు । లైన యోధులు పెక్కండ్రు రఖిల దిశలఁ**
**బొదివి యతని కరంబునఁ బొలుచు చక్ర । మలఁతి తునియలుగా నేసి రాగ్రహమున.** **116**

**ప్రతిపదార్థం:** శకుని, కృతవర్మ, కృప, కర్ణ, శల్య, ముఖ్యులు+ఐన+యోధులు= శకుని, కృతవర్మ, కృపాచార్యుడు, కర్ణుడు, శల్యుడు వంటి ప్రముఖులైన యుద్ధవీరులు; పెక్కండ్రురు= అనేకులు; అఖిల దిశలన్= అన్నివైపులందు; పొదివి= ఆక్రమించి (చుట్టుముట్టి); అతని+కరమునన్= ఆ అభిమన్యుడి చేతిలో; పొలుచు+చక్రమున్= అందగించే లేక ప్రకాశించే చక్రాన్ని; ఆగ్రహమునన్= కినుకతో; అలఁతి+తునియలు+కాన్= చిన్న ముక్కలుగా (తుత్తుమురుగా); ఏసిరి= బాణాలు ప్రయోగించారు.

**తాత్పర్యం:** శకుని, కృతవర్మ, కృపుడు, కర్ణుడు, శల్యుడు మొదలైన ప్రసిద్ధ యుద్ధవీరులు అనేకులు అన్నివైపులా అభిమన్యుడిని ఆక్రమించి, అతడి చేతిలోని చక్రాయుధాన్ని ఆగ్రహంతో చిన్న చిన్న ముక్కలై పడేటట్లు చేశారు.

**వ. ఏసిన నతండు రయంబున.** **117**

**తాత్పర్యం:** (ఆ విధంగా చక్రాయుధాన్ని ముక్కలు అయ్యేటట్లు) ప్రయోగించగా, అభిమన్యుడు వేగంతో.

**క. గద గొని యశ్వత్థామం । గదియుడు దంభోళికొదమ కైవడి మెఱుఁగుల్**
**పొదలించు దానిఁ గని కడు । బెదరి యతఁడు రథము డిగ్గి పిఱిఁదికిఁ జనియెన్.** **118**

**ప్రతిపదార్థం:** గద కొని= గదాయుధాన్ని పూని; అశ్వత్థామన్= అశ్వత్థామను; కదియుడున్= సమీపించగా(చేరగా); దంభోళి+కొదమ+కైవడిన్= వజ్రాయుధపు పిల్ల మాదిరి; మెఱుఁగుల్= కాంతులు; పొదలించు+దానిన్= వెదచల్లే ఆ గదను; కని= చూచి; అతఁడు= అశ్వత్థామ; బెదరి= భయపడి; రథము డిగ్గి= రథాన్ని దిగి; పిఱిందికిన్= వెనుకకు; చనియెన్= వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** గదాయుధాన్ని తీసికొని అశ్వత్థామను సమీపించగా, వజ్రాయుధపు కూనవలె మెఱుగులు గ్రక్కే ఆ గదను అశ్వత్థామ చూచి, బెదరిపోయి, రథం దిగి వెనుకకు మళ్ళాడు.

**విశేషం:** కందపద్యాన్ని వివిధగతి భేదాలతో నడిపించే సామర్థ్యం తిక్కనగారికి ఉన్నంతగా తక్కిన కవులకు లేదు అనటం అతిశయోక్తి కాదు. 'దంభోళి' అనే పదం యొక్క ఉచ్చారణే కొంత భీకరం అనిపిస్తుంది. ఈ పద్యం చివరిపాదం యొక్క నడక అశ్వత్థామ బెదరి వెనుకకు వెళ్ళిన పద్ధతిని ధ్వనింపజేస్తూ ఉన్నది.

**వ. సుభద్రాతనయుం డతని రథ్యంబులను సారథినిం జదియ మోఁది మనజోదుల యమ్ముల నేదు వెఱిఁగిన చందంబున సౌబలుని దెసకు నడచి యాతనికి నడ్డపడిన గాంధారుల సప్తవింశతి రథికులం బొరిగొనుటయుం, బురికొని తన్ను మార్కొనిన వసాతీయులం బదుండ్ర నేనుంగుల తోడన పీనుంగులఁ గావించి, యందంద తఱిమిన కేకయ సప్తకంబు రథ సహితంబుగా నగ్గలిక నుగ్గు (గ్గ)సేసి, డస్సి తూఁగాడుచుఁ దొలంగిన యోధుల నుల్లసం బాడుచు, నఱిమిన వారి నుఱుమాడుచు, వీరవ్రతంబు ధీరత్వ నిష్ఠం జలుపుచుండె. 119**

**ప్రతిపదార్థం:** సుభద్రాతనయుండు= అభిమన్యుడు; అతని+రథ్యంబులను= అశ్వత్థామయొక్క గుఱ్రాలనూ; సారథినిన్= సూతుడినీ; చదియన్+మోఁది= చచ్చేటట్లు మోది; మన+జోదులన్= మన యుద్ధవీరులను; అమ్ములన్= బాణాలతో; ఏదు= ముండ్లపంది; పెఱిఁగిన చందంబునన్= విజృంభించిన విధంగా, సౌబలుని+దెసకున్= శకునివైపు; నడచి= నడిపించి; ఆతనికిన్= ఆ శకునికి; అడ్డపడిన+గాంధారులన్= రక్షణగా అడ్డుపడ్డ గాంధారదేశం వారిని; సప్తవింశతి+రథికులన్= ఇరవై ఏడుమంది (రథికులను) శూరులను; పొరిగొనుటయున్= చంపగా; పురికొని= క్రమ్ముకొని; తన్నున్= తనను; మార్కొనిన= ఎదుర్కొన్న; వసాతీయులన్= వసాతిరాజులను; పదుండ్రన్= పదిమందిని; ఏనుంగులతోడన్+అ= ఏనుగులతో కూడా; పీనుంగులన్+కావించి= శవాలుగా చేసి; అందంద= అక్కడక్కడ; తఱిమిన= తనమీదికి వచ్చిన; కేకయసప్తకంబున్= ఏడుమంది కేకయులను; రథసహితంబుగాన్= తేరులతోకూడా; అగ్గలికన్= విలాసంగా (పూనికతో); నుగ్గుచేసి= పొడిచేసి; డస్సి= అలసి; తూఁగాడుచున్+పోరు తొలంగిన+యోధులన్= ఊగుతూ యుద్ధం వీడి ప్రక్కకుపోయే యుద్ధవీరులను; ఉల్లసంబు+ఆడుచున్= ఎత్తిపొడుపు మాటలు పలుకుతూ; ఆఱిమిన వారిన్= ఆక్రమించిన (బాధించిన) వాళ్ళను; నుఱుమాడుచున్= చూర్ణం గావిస్తూ; వీరవ్రతంబున్= వీరుడు ఆచరించే పుణ్యకార్యాన్ని; ధీరత్వనిష్ఠన్+సలుపుచుండెన్= ధైర్యం యొక్క పూనికతో నిర్వర్తించాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు అశ్వత్థామ గుఱ్ఱాలను, రథసారథినీ చావమోదాడు, మన యోధుల బాణాలతో ముండ్లపందివలె అయి శకునివైపుకు మరలాడు. అతడికి రక్షగా ఉండి అడ్డపడ్డ ఇరవై ఏడుగురు శూరులైన గాంధారులను చంపాడు. ఆవరించి తనను ఎదుర్కొన్న పదిమంది వసాతి రాజులను ఏనుగులతోపాటు పీనుగులను చేశాడు. అక్కడక్కడా మీదికి ఉరుకుతున్న ఏడుగురు కేకయులను రథాలతో పాటు సవిలాసంగా నుగ్గునూచం కావించాడు. అలసి యుద్ధానికి విముఖంగా తొలగిపోయే యోధులను ఎత్తిపొడుపు మాటలతో నొప్పించాడు. ఆక్రమించిన వాళ్ళను చూర్ణం చేస్తూ వీరవ్రతాన్ని మహాధీరత్వంతో నిర్వర్తించాడు.

**ఉ. ఆ సమయంబునం గడఁగి । యాయిత మైన రథంబుతోడ దౌ**
**శ్శాసని రా నతం డడరి సారథిఁ జంపి హయంబులం బడన్**
**వ్రేసిన నాతఁ డల్గి గద వే కొని యుద్ధతిఁ దేరు డిగ్గ ను**
**ద్భాసితమూర్తులం బొలిచె భ్రాతృకుమారయుగం బుదాత్తమై. 120**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ సందర్భంలో; కడఁగి= ప్రయత్నించి; ఆయితము+ఐన, రథంబుతోడన్= సిద్ధమైన తేరుతో; దౌశ్శాసని= దుశ్శాసనుడి కొడుకు; రాన్= రాగా; అతండు= అభిమన్యుడు; అడరి= విజృంభించి; సారథిన్+చంపి= సూతుడిని సంహరించి; హయంబులన్= గుఱ్ఱాలను; పడన్ వ్రేసినన్= చంపగా; ఆతడు= దుశ్శాసనుడి కొడుకు; అల్గి= కోపపడి; గదన్= గదాయుధాన్ని; వేకొని= శీఘ్రంగా తీసికొని; ఉద్ధతిన్= గర్వంతో; తేరున్+డిగ్గన్= రథాన్ని దిగగా; భ్రాతృ+కుమార, యుగంబు= అన్నదమ్ముల కొడుకుల జంట; ఉదాత్తము+ఐ= ప్రియమైనదై (ఒప్పిదమై); ఉద్భాసితమూర్తులన్= మిక్కిలి ప్రకాశమానాలైన రూపాలచేత; పొలిచెన్= అందగించింది.

**తాత్పర్యం:** అంతలోనే రథాన్ని సిద్ధం చేసికొని దుశ్శాసనుడి కొడుకు రాగా, అభిమన్యుడు విజృంభించి అతడి సారథినీ, గుఱ్ఱాలనూ హతమార్చాడు. అపుడు దౌశ్శాసని కోపపడి గదను తీసికొని రథం దిగిరాగా ఆ అన్నదమ్ముల కొడుకుల జంట ఎంతో ఒప్పిదమై ప్రకాశమాన రూపాలతో అందగించింది.

**అభిమన్యు దుశ్శాసన సుతు లిరువురుఁ జచ్చుట (సం. 7-48-8)**

**తే.** **ఇవ్విధంబునఁ గదిసి నరేంద్రముఖ్య! । నీదు మనుమలు సూపఱ నెమ్మనముల**
**కద్భుతంబును శోకంబు నావహిల్ల । లావు వెరవును మెఱయఁ జలంబు నెఱయ.** 121

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రముఖ్య!= రాజశ్రేష్ఠా!(ధృతరాష్ట్ర మహారాజా!); ఈ+విధంబునన్= ఇట్లా; కదిసి= సమీపించి; నీదు మనుమలు= నీ మనుమళ్ళు; చూపఱ+నెఱ+మనములకున్= చూచేవాళ్ళ నిండైన మనస్సులకు; అద్భుతంబును= ఆశ్చర్యమూ; శోకంబున్= దుఃఖమూ; ఆవహిల్లన్= కలిగేటట్లు; లావు= బలం; వెరవు= ఉపాయం; మెఱయన్= ప్రకాశించగా; చలంబు= (మత్సరం) పట్టుదల; నెఱయన్= నిండుకోగా.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లా ఒకరినొకరు కదనంలో కవిసిన నీ మనుమళ్ళు చూచేవాళ్ళకు ఆశ్చర్యం, శోకం కలిగేటట్లు, బలమూ, ఉపాయమూ ప్రకాశించగా పట్టుదల నిండుకోగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ.** **ఒండొరుమీఁది కోపమున నుగ్రతఁ బోరి రుదగ్రులై గదల్**
**మండఁగ, నెత్తురుల్ సెదర మాంసము పిండిగ నెంపనుగ్గు లొం**
**డొండ ధరిత్రిపైఁ దొరఁగ నొప్పెడు మేనులు వ్రాల వానిలో**
**నుండక ప్రాణముల్ వెడలె నుబ్బునఁ గ్రాలఁగ దేవకామినుల్.** 122

**ప్రతిపదార్థం:** ఒండొరు మీఁది కోపమునన్= ఒకరిపై మరొకరికి ఉండే క్రోధం (అలుక) చేత; ఉదగ్రులు+ఐ= భయంకరులై; గదల్+మండఁగన్= గదలు మంటలు రేగగా; నెత్తురుల్+చెదరన్= రక్తం చిందిపడగా; మాంసము+పిండిగన్= మాంసం ముద్దయినట్లుగా; ధరిత్రిపైన్= నేలమీద; ఎమ్ము+నుగ్గులు= ఎముకల చూర్ణం (పొడి); ఒండు+ఒండ= క్రమక్రమంగా; తొరఁగన్= రాలగా; ఉగ్రతన్= భయంకరంగా; పోరిరి= పోరాడారు; ఒప్పెడు మేనులు= అందమైన శరీరాలు; వ్రాలన్= పడిపోగా; దేవకామినుల్= అప్సరసలు; ఉబ్బునన్+క్రాలఁగన్= సంతోషంతో తేలగా; వానిలోన్= ఆ శరీరంలో; ఉండక= ఉండలేక; ప్రాణముల్+వెడలెన్= ప్రాణాలు పోయాయి. (అనగా ఆ ఇరువురూ మరణించారు).

**తాత్పర్యం:** ఒకరిపై ఒకరు కోపంతో గదలు నిప్పులు రాలేటట్లు, నెత్తురు చిందేటట్లు, మాంసం ముద్ద అయ్యేటట్లు, ఎముకలపొడి నేలపై రాలేటట్లు భయంకరంగా యుద్ధం చేశారు. ఆ ఇరువురి అందమైన శరీరాలు నేలరాలగా అప్సరసలు చాలా సంతోషించారు. వాళ్ళ ప్రాణాలు శరీరాలలో నిలవలేక వెలుపలికి వెళ్ళాయి.

**వ. ఇ త్తెఱంగున.** 123

**తాత్పర్యం:** ఈ విధంగా.

**చ. వనగజ మంబుజాకర మవారణఁ జొచ్చి కలంచి యాడఁగా**
**మనమునఁ గొంకులేక కృప మాలిన బోయలు ముట్టి చంపు చా**
**డ్పున భవదీయ సేన పొరిపుచ్చఁగ జుట్టునుముట్టి పార్థనం**
**దను నలయించి నిర్దయ విధంబునఁ జంపి రనేక సైనికుల్.** 124

**ప్రతిపదార్థం:** వనగజము= అడవి యేనుగు; అంబుజాకరమున్= తామరకొలనిని; అవారణన్+చొచ్చి= అడ్డులేకుండా ప్రవేశించి; కలంచి= కలత కలిగించి; ఆడఁగాన్= వినోదించగా; మనమునన్= మనసులో; కొంకు+లేక= జంకులేకుండా; కృపమాలిన+బోయలు= దయవదలిపెట్టిన బోయవాళ్ళ; ముట్టి= సమీపించి; చంపుచాడ్పునన్= చంపేవిధంగా; భవదీయసేనన్= నీ సైన్యాన్ని; పొరిపుచ్చఁగన్= చంపగా; అనేకసైనికుల్= పలువురు భటులు; పార్థనందనున్= అభిమన్యుడిని; చుట్టునుముట్టి= చుట్టుకొని; అలయించి= అలసట కలిగించి; నిర్దయ విధంబునన్= దయ లేనివిధంగా; చంపిరి= చంపారు.

**తాత్పర్యం:** అడవి యేనుగు కొలనులోకి అడ్డులేకుండా ప్రవేశించి క్రీడిస్తూ ఉండగా, మనస్సులో జంకు లేకుండా దయలేని బోయవాళ్ళు దగ్గరచేరి చంపే విధంగా అభిమన్యుడు నీ సైన్యాన్ని చంపగానే, అనేక సైనికులు అభిమన్యుడిని చుట్టుముట్టి అలసట కలిగించి దయమాలి చంపారు.

**వ. అట్టి యెడ.** 125

**తాత్పర్యం:** ఆ సందర్భంలో.

**సీ. జగము లన్నియును దేజంబున వెలిఁగించి । యపరాద్రి సేరిన తపనుమాడ్కిఁ,**
**దఱచైన కానలు దరికొని నీఱుగాఁ । జేసి యాఱిన దవశిఖి విధమున,**
**గగనంబుతో రాయు కరడులుగల జలం । బివురఁ బాఱిన మహార్ణవము కరణి,**
**నున్నతగతి సెడి యుర్విపైఁ గడు విన్న । నై పడియున్న సుధాంశుభంగి**

**తే. బీరమునఁ దమవారికిఁ బెం పొనర్చి । యరుల సమయించి వసమతీ యనువు దప్పి**
**తెగియుఁ జూడ్కికిఁ జాల వ్రేఁగగుచుఁ బొలిచె । మహితమూర్తిశోభితుఁ డభిమన్యుఁ డధిప!** 126

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; మహిత+మూర్తి+శోభితుఁడు= ఒప్పిదమైన ఆకారంచేత ప్రకాశించేవాడు (అయిన); అభిమన్యుఁడు; తేజంబునన్= తన కాంతిచేత; జగములు+అన్నియున్= లోకాలు అన్నీ; వెలిఁగించి= వెలిగేటట్లు చేసి; అపర+అద్రిన్= పడమటి కొండను(అస్తగిరిని); చేరిన= పొందిన; తపను, మాడ్కిన్= సూర్యుడివలె; తఱచు+ఐన కానలు= దట్టము అయినట్టి అడవులు; దరికొని= కాల్చి; నివుఱు(నీఱు)+కాన్+చేసి= బూడిద కావించి; ఆఱిన= ఆరిపోయిన; దవశిఖి+విధమునన్= కార్చిచ్చు మాదిరి; గగనంబుతోన్+రాయు= ఆకాశంతో ఒరసికొనే; కరడులు= అలలు; కల= కలిగిన; జలంబు= నీరు; ఇవురన్+పాఱిన= ఇంకిపోయిన; మహా+అర్ణవము, కరణిన్= పెద్ద సముద్రంవలె; ఉన్నత,గతి,చెడి= ఉపరి(పై) (లేదా గొప్ప) సంచారాన్ని విడిచి; ఉర్విపైన్= నేలమీద; కడు+విన్ననై= మిక్కిలి దైన్యాన్ని పొంది; పడి+ఉన్న= పడిపోయి ఉన్న; సుధాంశు+కరణిన్= చంద్రుడివలె; బీరమునన్= శౌర్యంచేత; తమవారికిన్= తన పక్షంవారైన పాండవులకు; పెంపు+ఒనర్చి= పేర్మిని కలిగించి; అరులన్= శత్రువులను; సమయించి= చంపి;

వసము+అఱి= వశం తప్పి (స్వాధీనతను కోల్పోయి); అనువు తప్పి= అవకాశం లేదా అనుకూల్యం చెడి; తెగియున్= చచ్చియు; చూడ్కికిన్= చూపునకు; చాలఁవ్రేఁగు+అగుచున్= మిక్కిలి బరువు అవుతూ; పొలిచెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! మహనీయమైన ఆకారంతో ప్రకాశించే అభిమన్యుడు తన తేజస్సుతో లోకాల నన్నిటినీ వెలిగించి పడమటి కొండను చేరిన సూర్యుడి మాదిరి, దట్టమైన అడవులను కాల్చి బూడిదచేసి ఆరిపోయిన దావాగ్ని వలె, ఆకాశంతో ఒరుసుకొనే అలలుండే నీళ్ళు ఇంకిపోయిన మహాసముద్రం మాదిరిగా, పై సంచారాన్ని విడిచి, నేలపైన మిక్కిలి దీనంగా పడి ఉండే చంద్రుడివలె, శౌర్యంతో పాండవులకు ఎంతో పెంపు కలిగించి, శత్రువులను సంహరించి, వశంతప్పి, అనుకూలత చెడి మరణించికూడా, చూపునకు మిక్కిలి భారం అవుతూ ప్రకాశించాడు.

**విశేషం:** అలం: మాలోపమ. ఒకటికి నాలుగు సీసపద్య పాదాలలో మాలోపమాలంకార శోభితంగా మహిత శోభితుడైన అభిమన్యుడి ఆకార గుణ విశేషాదులు అభివర్ణించబడ్డాయి. తేజస్సు, ప్రతాపం, సౌందర్యం అనే లక్షణాలు వశం తప్పి (స్వాధీనత చెడి) అనుకూలత్వాన్ని కోల్పోయినా, చూచేవారికి మహాభారంగా యుద్ధరంగంలో పడివుండే దృశ్యాన్ని తిక్కన ఇక్కడ వర్ణించాడు. అభిమన్యుడి మరణాన్ని తెలిపే మొదటిపద్యం ఇది.

**ఉ.** **నెత్తుటఁ దోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండె; నక్కుమా**
**రోత్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె సితాయుధ ఖండభూషణో**
**దాత్తమణిప్రతానములు తారల చందము నొంది యంద మై**
**యత్తఱి నుల్లసిల్లె వసుధాధిప! చూపఱపిండు చూడ్కికిన్.** 127

**ప్రతిపదార్థం:** వసుధా+అధిప!= రాజా! చూపఱ, పిండు, చూడ్కికిన్= చూచేవాళ్ళయొక్క మొత్తం చూపులకు; నెత్తుటన్+తోఁగి= రక్తంతో తడిసి; నేల= భూమి; ఎఱ, నింగి, తెఱంగునన్= ఎర్రటి ఆకాశం మాదిరి; ఉండెన్= ఉండింది; ఆ+కుమార+ఉత్తముఁడు= కుమారశ్రేష్ఠుడైన ఆ అభిమన్యుడు; అందున్= ఆ నేలమీద; చంద్రు క్రియన్= చంద్రుడివలె; ఒప్పెన్= ప్రకాశించాడు; సిత+ఆయుధ+ఖండ= విరిగిన తెల్లని ఆయుధాల ముక్కలు; భూషణ= నగలైన; ఉదాత్త, మణి, ప్రతానములు= గొప్ప రత్నాల మొత్తాలు; తారల, చందమున్= నక్షత్రాలవలె; ఒంది= పొంది; ఆ+తఱిన్= ఆ సందర్భంలో; అందము+ఐ= చక్కదనమూ, సౌందర్యమూ కలిగినదై; ఉల్లసిల్లెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** రాజా! చూచేవాళ్ళ చూపులకు నెత్తుటితో తడిసిన నేల, ఎర్రని ఆకాశంవలె ఉండింది. అభిమన్యుడు ఆ నేలమీద చంద్రుడి విధంగా ఒప్పారాడు. తెల్లటి ఆయుధాల ముక్కలూ, విరిగిన ఆభరణాలలోని గొప్పగొప్ప మణులూ నక్షత్రాల మాదిరి ఉండగా ఎంతో అందంగా ఆ సందర్భంలో అగుపించాడు.

**విశేషం:** అంతకుముందు సీసపద్యం చివరిపాదంలో 'సుధాంశుభంగి' అని ఉన్నది. ప్రస్తుత పద్యం ఉత్పలమాలా వృత్తంలో 'చంద్రుక్రియ' విరిగిన వివిధాయుధాలు నగలలోని, మణులూ నక్షత్రాల మాదిరి పడి ఉండగా ప్రకాశించినట్లు తిక్కన అభివర్ణించాడు. చంద్రుడి ప్రసక్తికి అనుగుణంగా 'ఉత్పలమాల' లో విషయాన్ని వివరించటం తిక్కన ఛందశ్శిల్పజ్ఞతను సూచిస్తూ ఉన్నది.

**సీ.** **కరికళేబరములు ధరణీధరములు, దు । రంగ గాత్రమ్ములు గ్రాహసమితి,**
**నరశరీరములు మీనములు, గౌక్షేయక । క్షురికాది శస్త్రంబు లురగకులము,**
**రుధిరార్ద్రశరములు రుచిర ప్రవాళముల్, । ప్రేవుల ప్రోవులు ఫేనతతులు,**
**నెత్తురు వెల్లువ నీఁకులు భూషణ । స్తోమాస్థిచయము తుమురు లిసుక**

**ఆ. గాఁగ నంబురాశి కరణి సంగ్రామ భూ । భాగ మొప్పు మిగుల భవ్యయోగ**
**నిద్ర నున్న విష్ణునికిఁ బాటి యగుచు శో । భిల్లె నమ్మురారియల్లుఁ డందు. 128**

**ప్రతిపదార్థం:** కరి+కళేబరములు= ఏనుగుల దేహాలు; ధరణీధరములు= కొండలు; తురంగ+గాత్రమ్ములు= గుర్రాల శరీరాలు; గ్రాహ+సమితి= మొసళ్ళ గుంపు; నరశరీరములు= మానవుల దేహాలు; మీనములు= చేపలు; కౌక్షేయక+క్షురిక+ఆది, శస్త్రంబులు= ఖడ్గాలూ, క్షురికలూ (మంగలికత్తి వంటివి) మొదలైన ఆయుధాలు; ఉరగకులము= పాములమొత్తం; రుధిర+ఆర్ద్ర, శరములు= నెత్తుటితో తడిసిన బాణాలు; రుచిర+ప్రవాళముల్= ప్రకాశించే పగడాలు; ప్రేవుల+ప్రోవులు= పేగుల మొత్తాలు; ఫేన+తతులు= నురుగుల గుంపులు; నెత్తురు+వెల్లువ= రక్తంయొక్క ప్రవాహం; నీళులు= నీళ్ళు; భూషణ, స్తోమ అస్థి చయముల తుమురు= ఆభరణాల మొత్తం యొక్కయూ, ఎముకల మొత్తం యొక్కయూ పొడుము (రాలినపొడి); ఇసుక+కాఁగన్= ఇసుక కాగా (అయినట్లుగా); అంబురాశి+కరణిన్= సముద్రం మాదిరి; సంగ్రామ+భూభాగము= యుద్ధంయొక్క రంగస్థలం; ఒప్పు+మిగులన్= అందం అతిశయించగా; భవ్య, యోగనిద్రన్+ఉన్న= శ్రేష్ఠమైన యోగనిద్రలోఉండే; విష్ణునికిన్+పాటి+అగుచున్= విష్ణుదేవుడితో సాటి అవుతూ; అందున్= ఆ రణరంగంలో; ఆ+మురారి+అల్లుఁడు= శ్రీకృష్ణుడి మేనల్లుడు; శోభిల్లెన్= వెలుగొందాడు.

**తాత్పర్యం:** ఆ రణరంగం ఒక మహాసముద్రం వలె ఉన్నది. అందులో ఏనుగుల దేహాలే కొండలు, గుర్రాల శరీరాలే మొసళ్ళు, మానవుల దేహాలే చేపలు, ఖడ్గాలూ కత్తులూ మొదలైన ఆయుధాలే పాములు, నెత్తుటితో తడిసిన బాణాలే పగడాలు, ప్రేగులే నురుగు, రక్త ప్రవాహమే నీరు, ఆభరణాల ఎముకల పొడియే ఇసుక. అటువంటి రణరంగం అనే మహాసముద్రంలో యోగనిద్రలో ఉండే విష్ణువునకు సాటిగా శ్రీకృష్ణుడి మేనల్లుడు అభిమన్యుడు వెలుగొందాడు.

**విశేషం:** భవ్యయోగనిద్రలో ఉండే మహావిష్ణువుతో అభిమన్యుడిని పోల్చడం ఇందులోని విశేషం. అర్జున పుత్త్రుడనో, సుభద్రాతనయుడనో, బాలుడనో అనకుండా మురారి అల్లుడని పేర్కొనటం ఎంతో ఔచిత్యవంతం. మామపోలికలు మేనల్లుడిలో కన్పించాయి అనే సూచన 'అమ్మురారి యల్లుఁడు' అనే ప్రయోగంలో సుస్పష్టం. అలంకారం: రూపకం.

**వ. అ బ్బాలుండు. 129**

**తాత్పర్యం:** బాలుడైన అభిమన్యుడు.

**విశేషం:** అభిమన్యుడిని తిక్కన ఎక్కువగా ఆ శిశువు, ఆ బాలుడు, ఆ కుమారశ్రేష్ఠుడు వంటి విశేషగుణాలతోనే పేర్కొన్నాడు. ఒక్క పిల్లవాడిని అంతమంది మహాయోధులు ఆ విధంగా చుట్టుముట్టి అన్యాయంగా హతమార్చారే అన్న అభిప్రాయానికి ఇటువంటి విశేషణాలే ఎంతో రసస్ఫోరకంగా ఉంటాయి అని తిక్కన ఉద్దేశం. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. మహితలావణ్యమును, సుకుమారమైన । యంగమును, బూర్ణచంద్ర నిభాననంబుఁ**
**గ్రొత్తపెంపుగ నెంతయుఁ గొమరు మిగిలి । చెన్నుఁ దలకట్టునై పడియున్నఁ జూచి. 130**

**ప్రతిపదార్థం:** మహిత, లావణ్యమునున్= మిక్కిలి ఒప్పిదమైన శరీరకాంతితో; సుకుమారము+ఐన= కోమలమైన; అంగమును= దేహమున్నూ; పూర్ణచంద్ర, నిభ+ఆననంబున్= నిండుచందురుడితో సమానమైన ముఖమున్నూ; క్రొత్త పెంపుగన్= నవోదయంగా; ఎంతయున్= మిక్కిలి; కొమరు మిగిలి= అందం అతిశయించి; చెన్ను+తలకట్టును+ఐ= అందమైన తలపాగా కలిగి; పడి+ఉన్నన్+చూచి= (రణరంగంలో నేలపై) పడి ఉండగా చూచి.

**తాత్పర్యం:** గొప్ప సౌందర్యంతో కోమలమైన దేహాన్నీ, నిండు చందురుడితో సమానమైన ముఖాన్నీ కలిగి అందం అతిశయించగా, తలపాగాతో నేలపై పడి ఉండే అభిమన్యుడిని చూచి.

**విశేషం:** అలం: ఉపమ. 'మహిత' అనే విశేషణాన్ని అభిమన్యుడిని ఉద్దేశించి తిక్కన పలుమారులు ప్రయోగించాడు. 'లావణ్యం' అనటంవలన అభిమన్యుడిలోని నైగనిగ్యం విదితం. అందగాళ్ళలో చంద్రుడు అందరికంటె మేలుబంతి. అందుకే అభిమన్యుడి అందాన్ని అనేక సందర్భాలలో కవి చంద్రుడితో పోల్చాడు. అందమైన తలపాగాతో పడి ఉండటం మరొక విశేషం. అది పరివేషం వలె అందాన్ని ఇనుమడింపజేస్తూ ఉన్నదని ధ్వని.

**క. నీ సైనికు లెంతయు సం । తోసిల్లుచు నార్చి రపుడు దుఃఖితులై కుం**
**తీ సుతులవారు, దీనద । శాసంగతులైరి బాష్పజలములు దొరఁగన్. 131**

**ప్రతిపదార్థం:** అపుడు= ఆ సమయంలో; నీ సైనికులు= నీ సేనలు(యుద్ధవీరులు); ఎంతయున్= మిక్కిలి; సంతోసిల్లుచున్= సంతోషిస్తూ (ఆనందపడుతూ); ఆర్చిరి= గర్జించారు; కుంతీసుతులవారు= పాండవులు అనే నీకు సంబంధించినవాళ్ళు; దుఃఖితులు+ఐ= దుఃఖాన్ని పొందినవారై; బాష్పజలమును= కన్నీటిని; తొరఁగన్= కారుస్తుండగా; దీనదశా సంగతులు+ఐరి= దైన్యంతో కూడినవారు అయ్యారు.

**తాత్పర్యం:** అప్పుడు నీ సైనికులు ఎంతో సంతోషంతో అరచి బొబ్బలు పెట్టారు. కుంతీ కుమారులైన పాండవులు మిక్కిలి దుఃఖంతో కన్నీరు కారుస్తూ దైన్యాన్ని పొందారు.

**విశేషం:** 'కుంతీసుతులవారు' అనటం ఒక క్రొత్త ప్రయోగం. 'పాండవులు అనే నీకు సంబంధించిన బంధువుల' అనే అర్థంలో 'వారు' అనే పదం ప్రయుక్తం.

**క. నెఱి దప్పంబడి పెల్లుగ । నొఱలెడి నరవాజికరుల యులి వభిమన్యుం**
**డఱిమురిఁ బడుటకు వగ మదిఁ । బఱిగొన నిల పెలుచ నఱచుభంగిఁ జెలంగెన్. 132**

**ప్రతిపదార్థం:** నెఱి+తప్పంబడి= ప్రజ్ఞ తప్పి; పెల్లుగన్= అధికంగా; ఒఱలెడి= పడిపోయే; నర,వాజి, కరుల= సైనికుల, గుర్రాల, ఏనుగుల; ఉలివు= శబ్దం; అభిమన్యుండు= అభిమన్యుడు; పడుటకున్= ఒరిగి నేలపై పడటానికి; అఱిముఱిన్= కలతతో; మదిన్= మనస్సులో; వగ+పఱిగొనన్= దుఃఖం బాధించగా; ఇల= భూమి; పెలుచన్= అధికంగా; అఱచుభంగిన్= అఱచినట్లుగా; చెలంగెన్= ఒప్పింది.

**తాత్పర్యం:** ప్రజ్ఞ తప్పి మిక్కిలి విలపిస్తూ భటులు, గుర్రాలు, ఏనుగులు చేసే శబ్దం, అభిమన్యుడు నేలకు ఒరిగినందుకుగా మనస్సులోని కలతతో దుఃఖం బాధించగా భూమి (నేల) యే అధికంగా అరుస్తూ ఉన్నట్లు అనిపించింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. గజతురగ పదాతివర్గం చేసే ఘోషకు నేలయే విలపిస్తుందన్నట్లు ఊహించటం ఈ పద్యంలోని విశేషం.

**వ. ఆ సమయంబున. 133**

**తాత్పర్యం:** ఆ సందర్భంలో.

**క. 'పెక్కంద్రు గూడి యిమ్మెయి । నొక్కనిఁ జంపుట యధర్మ మోహో!' యని న**
**ల్దిక్కులను బెద్దయెలుఁగున । నక్కజముగ భూత సంచయంబులు వలికెన్. 134**

**ప్రతిపదార్థం:** పెక్కండ్రు+కూడి= అనేకులు ఒకటిగా గుమిగూడి; ఈ+మెయిన్= ఈ విధంగా; ఒక్కనిన్= ఒకే ఒక పసిబాలుడిని; చంపుట= చంపటం; ఓహో!= అయ్యో; అధర్మము= అవినీతి(అన్యాయం); అని= అంటూ; నల్+దిక్కులను= నాలుగువైపులా; అక్కజముగన్= ఆశ్చర్యంగా; పెద్ద ఎలుఁగునన్= పెద్దశబ్దంతో (బిగ్గరగా); భూతసంచయంబులు= భూతాల మొత్తాలు (అనగా సమస్త ప్రాణికోటి, పంచభూతాలు); పలికెన్= ఘోషించాయి.

**తాత్పర్యం:** 'ఈ విధంగా అనేకులు గుమిగూడి ఒక్కడిని చంపటం అధర్మం' అంటూ నాలుగు దిక్కుల నుండి ఆశ్చర్యంగా పెద్దధ్వనితో సమస్త భూతకోటి ఘోషించింది.

**వ. ఇట్లు శౌర్య సార సంపాదిత రౌద్రుండైన సౌభద్రుండు పడుటయు, వారి బలంబులు ఱిచ్చపడి, భండనంబు దక్కి తలరిన, ధర్మపుత్త్రుండు ప్రబలయోధవీరలోకంబు నాలోకించి యిట్లనియె. 135**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; శౌర్య, సార, సంపాదిత, రౌద్రుండు+ఐన= పరాక్రమం యొక్క అతిశయంచేత సంపాదించబడిన రౌద్రరసం కలవాడైన; సౌభద్రుండు= సుభద్రాపుత్రుడైన అభిమన్యుడు; పడుటయున్= (నేలకు ఒరగగా) నేలకూలగా; వారి+బలంబులు= ఆ పాండవుల సేనలు; ఱిచ్చపడి= చేష్టలు దక్కి (సంభ్రమపాటు చెంది); భండనంబు దక్కి= యుద్ధాన్ని ఉడిగి (విరమించి); తలరినన్= కలతచెందగా; ధర్మపుత్త్రుండు= ధర్మరాజు; ప్రబల, యోధవీర, లోకంబున్= మిక్కిలి బలవంతులైన; యుద్ధవీరుల సమూహాన్ని; ఆలోకించి= చూచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పరాక్రమాతిశయంచేత రౌద్ర రసాకారుడైన అభిమన్యుడు నేలకొరగటం చేత పాండవసేనలు చేష్టలు దక్కి, పోరు మాని, కలతచెంది ఉండగా ధర్మరాజు యుద్ధవీరులను చూచి ఇట్లా అన్నాడు:

**విశేషం:** సౌభద్రుడికి ప్రయోగించిన విశేషణం ఎంతో గంభీరంగా ఉన్నది. కానీ, వెంటనే 'పడుటయు' అనే క్రియాపదం ఎంతో దైన్యాన్ని సూచిస్తూ ఉన్నది. ఇచ్చట ఆదేశంచేత కలిగిన వకారం వలన దైన్యస్థితి వలె ఆవిష్కరించబడింది. అదే పరుషాన్ని ప్రయోగించి ఉంటే అంతగా ఆ దైన్యం అభివ్యక్తం అయి ఉండేది కాదు.

**సీ. 'మార్బలంబులు సొచ్చి, మాతంగములఁ గూల్చి, రథరాజిఁ గలఁచి, తురంగమములఁ**
**ద్రుంచి, పదాతులం దునుమాడి పెక్కండ్రు । సైనిక ప్రవరుల సమయఁ జూచి**
**మూఁకల విరియించి, వీఁక నాచార్యాది । యోధుల నెల్లను నొక్కదెసకు**
**వెలిచి, వియచ్చరుల్ వినుతింప నాకంబు । చూఱగొన్నట్టి యర్జునతనూజుఁ**

**ఆ. జూచి మనకు నేల శోకింప! వైరుల । గం డడంచి గెలుపు గంద ముచిత**
**భంగిఁ; బ్రొద్దుకొలఁది పరికించి మనసైన్య । ముల మరల్త మెలమి దలకొనంగ.' 136**

**ప్రతిపదార్థం:** మార్బలంబులు+చొచ్చి= శత్రుసైన్యాలలో దూరి; మాతంగములన్+కూల్చి= ఏనుగులను పడగొట్టి; రథరాజిన్= రథాల వరుసను; కలఁచి= కలతకలిగించి; తురంగమములన్= గుర్రాలను; త్రుంచి= చంపి; పదాతులన్= కాల్బలాన్ని; తునుమాడి= సంహరించి (ఇట్లు చతురంగ బలాలనూ హతంచేసి అని భావం); పెక్కండ్రు= అనేకులు; సైనిక ప్రవరులన్= సేనలలో ఉండే శూరులను; (సైనిక శ్రేష్ఠులను); సమయన్+చూచి= చంపజూచి; మూఁకలన్+విరియించి= దట్టంగా గుమిగూడి ఎదిరించిన భటులను చెదరగొట్టి; వీఁకన్= ఉత్సాహంతో; ఆచార్య+ఆది, యోధులన్+ఎల్లను= ద్రోణుడు మొదలైన శూరులను అందరినీ; ఒక్క, దెసకున్, వెలిచి= ఒకవైపు తెచ్చి; వియత్+చరుల్= దేవతలు; వినుతింపన్= పొగడుతూ ఉండగా; నాకంబు= స్వర్గాన్ని; చూఱగొన్నట్టి= కొల్లగొట్టినటువంటి; అర్జునతనూజున్= అభిమన్యుడిని; చూచి= కనుగొని; మనకున్= మనకు; శోకింపన్?+ఏల?= దుఃఖపడటం ఎందుకు?; వైరుల, గండు+అడంచి= శత్రువుల గర్వం (పోకార్చి) అణచి; గెలుపు కందము= గెలుపును పొందుదాం;

ఉచితభంగిన్= తగినవిధంగా; ప్రొద్దుకొలఁది= ప్రొద్దు ఉన్నంతవరకూ; పరికించి= చూచి; ఎలమి+తలకొనంగన్= ధైర్యం కలుగగా( వికాసం ఒనగూడేటట్లు); మన సైన్యములన్= మన సేనలను; మరల్తము= శిబిరానికి మరలిద్దాం.

**తాత్పర్యం:** 'శత్రు సైన్యాలలో దూరి, ఏనుగులను, రథాలను, గుర్రాలను, కాల్బలాన్ని నేలకూల్చి అనేక శూరులు కలిసి తనను చంపజూచినప్పుడు ఆ మూకలను చెదరగొట్టి, ద్రోణాదియోధులందరినీ ఒక దిక్కుకు తెచ్చి, దేవతలు పొగడుతూ ఉండగా, స్వర్గాన్ని కొల్లగొట్టిన అభిమన్యుడిని చూచి మన కెందుకు దుఃఖం? శత్రువుల గర్వాన్ని అణచి మనం జయిద్దాం. ప్రొద్దు ఎంతఉందో చూచి, ధైర్యంగా మన సేనలను శిబిరాలకు మరలిద్దాం.'

**విశేషం:** 'యుద్ధం అన్నప్పుడు విజయమో, వీరస్వర్గమో! ఆ వీరస్వర్గాన్ని విజయుడి కొడుకు తన అసమాన పరాక్రమాన్ని చూపి పొందగలిగాడు. అందుకు మనం దుఃఖపడాల్సిన పనిలేదు. ఇక విజయం మనం సాధించాలి' అంటూ ధర్మరాజు చెప్పిన మాటలలో అతడికి యుధిష్ఠిరుడనే పేరు ఏ విధంగా సార్థకమో సూచించబడింది. 'అర్జునతనూజు' అనే ప్రయోగంలో తండ్రి నుండి పుణికి పుచ్చుకొన్న అభిమన్యుడి కీర్తిధావళ్యం ప్రతిబింబిస్తూ ఉన్నది.

**వ. అని పలికి బరవసంబు సేసి సేనలం బురికొల్పికొని యవష్టంభ విజృంభితుండయి నిలిచెఁ; బదంపడి యరుణకిరణుం డపరమహీధరంబు మౌళికి సరసీరుహశేఖరంబై చెలువారం, దదనంతరంబ రిత్తచోట్లును నెత్తుటన్ జొత్తిల్లుచున్నట్లుండెఁ; బిండుగట్టి పిశాచనిశాచరులు నలిరేఁగి రక్తపానంబును మాంసఖాదనంబునుం జేయుచు మోదంబునం బొందుచు నాడుచు పాడుచుండు కలకలంబునను గుణపభక్షణవ్యగ్ర విహంగ సముదయతుములంబునను, బలలఖాదన సంరంభ శివా నివహ కోలాహలంబునను, బరమాభీలంబైన సంధ్యాకాలంబు నిరూపించి నిజ శిబిరంబులకు నుభయబలంబులుం బోయె; నప్పుడు నీ కొడుకు లుబ్బునం గొమరు మిగిలి యరిగిరి; కౌంతేయులు చిన్నఁబోయిన యాననంబులతో శోకసంతప్త చిత్తులయి చని; రివ్విధంబున ధర్మతనయుండు దననికేతనంబున కరిగి యచట నిఖిల పరిజనంబులుం దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారులై యున్న సమయంబునం దమ్ముని దెస కూరిమి నారం గూరినవగ పెంపున ధైర్యంబు సొంపటి వివర్ణవదనుం డగుచు నిట్లనియె. 137**

**ప్రతిపదార్థం:** అని+పలికి= ఆ ప్రకారంగా మాటాడి; బరవసంబు+చేసి= ధైర్యం చేసి; సేనలన్= సైన్యాలను; పురికొల్పికొని= కలిసేటట్లు గావించి (ప్రేరేపించి); అవష్టంభ+విజృంభితుండు+అయి= గర్వంతో విజృంభించినవాడై; నిలిచెన్= నిలిచాడు;పదంపడి= పిదప; అరుణకిరణుండు= సూర్యుడు; అపరమహీధరంబు మౌళికిన్= అస్త్రాద్రిశిఖరానికి (పడమటి కొండ కొనకు); సరసీరుహశేఖరంబు+ఐ= తామర సిగదండయై; చెలువారన్= ఒప్పగా; తద్+అనంతరంబు+అ= ఆ పిదప; రిత్తచోట్లును= శూన్యప్రదేశాలున్ను; నెత్తుటన్= రక్తంతో; జొత్తిల్లుచున్నట్లు+ఉండెన్= ఎర్రవారినట్లుగా తోచాయి; పిండుగట్టి= గుంపుగాచేరి; పిశాచ, నిశాచరులు= ప్రేతాలు, రాక్షసులు; నలిరేఁగి= విజృంభించి; రక్తపానంబును= నెత్తురు త్రాగటం; మాంసఖాదనంబునున్= మాంసం తినటం; చేయుచున్= చేస్తూ; మోదంబునన్ పొందుచున్= సంతోషిస్తూ; ఆడుచున్, పాడుచుండు కలకలంబునను= ఆడుతూ పాడుతూ చేసిన అలజడి చేతను; కుణప; భక్షణ, వ్యగ్ర, విహంగ, సముదయ, తుములంబునను= పీనుగులను తినటంలో ఆసక్తిగల పక్షుల దొమ్మి పోరాటం వలనను; పలల, ఖాదన, సంరంభ, శివా నివహ కోలాహలంబునను= మాంసాన్ని తినటంలో తొందరపాటుగల ఆడునక్కల మొత్తం చేసే పెద్ద రొదచేతను; పరమ+ఆభీలంబు+ఐన= మిక్కిలి భయంకరమైన; సంధ్యాకాలంబున్= సంధ్యాసమయాన్ని; నిరూపించి= తెలిపి; నిజశిబిరంబులకున్= తమ విడిది గృహాలకు; ఉభయ సైన్యంబులును+పోయెన్= ఇరువురి సేనలున్నూ పోయాయి; అప్పుడు= ఆ సందర్భంలో; నీ కొడుకులు= దుర్యోధనుడు మొదలైన నీ కొడుకులు; ఉబ్బునన్= సంతోషంతో; కొమరు మిగిలి= అందం అతిశయించి; అరిగిరి= పోయారు; కౌంతేయులు= కుంతీపుత్రులు; చిన్నఁబోయిన+ఆననంబులతోన్=(దుఃఖించు)

కాంతిహీనాలైన ముఖాలతో; శోక, సంతప్త, చిత్తులు+అయి= దుఃఖంతో మిక్కిలి తపించిన మనస్సులు కలవారై; చనిరి= పోయారు; ఈ+విధంబునన్= ఇట్లా; ధర్మతనయుండు= ధర్మరాజు; తన, నికేతనంబునకున్+అరిగి= తన నివాసానికి- శిబిరానికి పోయి; అచటన్= అక్కడ; నిఖిల పరిజనంబులున్= పరివారం అంతయు; తానును= తానూ; సన్నాహంబులు= ప్రయత్నాలు; ఎడలించి= సడలించి; శూన్య+ఆకారులు+ఐ= శూన్యమైన ఆకారాలు కలవారై; ఉన్న, సమయంబునన్= ఉండే సందర్భంలో; తమ్మునిదెస= అర్జునుడి యెడ; కూరిమిన్= ప్రేమతో; ఆరన్= నిండుకోగా; కూరిన, వగ, పెంపునన్= నాటుకొన్న దుఃఖాతిశయంతో; ధైర్యంబు= ధైర్యం; సొంపు+అఱి= ఒప్పు నశించి; వివర్ణవదనుండు+అగుచున్= వన్నె చెడిన ముఖం గలవాడై.

**తాత్పర్యం:** అని ధర్మరాజు పలికి, సేనలకు ధైర్యం కలిగించి గర్వాటోపంతో నిలిచాడు. తరువాత సూర్యుడు అస్తమించాడు. శూన్యప్రదేశాలు నెత్తుటితో ఎఱ్ఱబారిన ట్లగుపించాయి. భూతప్రేతాలు, రాక్షసులు విజృంభించి రక్తపానం, మాంసభక్షణం చేస్తూ ఆనందంతో ఆడిపాడి అలజడి కలిగించాయి. మాంసాన్ని తినే తొందరపాటులో పక్షులు దొమ్మిపోరాటానికి దిగాయి. మాంసభక్షణపు తొట్రుపాటులో ఆడునక్కల గుంపు పెద్దరొదలు చేశాయి. ఆ విధంగా సంధ్యాసమయం భయంకరంగా పరిణమించింది. ఉభయ పక్షాలవారు వారి వారి శిబిరాలకు తరలారు. అపుడు నీ కొడుకులు సంతోషాన్ని పొందగా కుంతీపుత్రులు సంతాపంతో క్రుంగిపోయారు. తన శిబిరానికి పోయిన ధర్మరాజు, పరిజనమూ తానూ అప్పటికి అన్ని సన్నాహాలు చాలించి, శూన్యాకారులై ఉండే సందర్భంలో అర్జునుడిపై ప్రేమ నిండుకోగా మనస్సులో నాటుకొన్న దుఃఖాతిశయంచేత ధైర్యానికి సంబంధించిన సొంపుచెడి, వన్నె తరిగిన మొగంతో: (తరువాతి పద్యంతో అన్వయం).

**అభిమన్యుని మరణమునకు ధర్మరాజు దుఃఖించుట (సం. 7-49-1)**

**మ. 'గురు శారద్వత ముఖ్యయోధ వరసంగుప్తంబు, నిర్భేద్య, ము**
**ద్ధుర మా సైన్యము; దానిఁ జొచ్చి ననుఁ బ్రీతుం జేయఁగాఁ బూని యొ**
**క్కరుఁడున్ గోవులలోనఁ జొచ్చు బలు సింగం బొక్కొ నా నట్లు సొ**
**చ్చి రయంబార ననేకవీరశిరముల్ చెండాడె నుద్దండుఁ డై. 138**

**ప్రతిపదార్థం:** ఆ+సైన్యము= ఆ కౌరవసేన; గురు= ద్రోణాచార్యుడు; శారద్వత= కృపాచార్యుడు; ముఖ్య= ప్రధానులు ముఖ్యులుగా గల; యోధవర= వీరశ్రేష్ఠులచేత; సంగుప్తంబు= బాగుగా రక్షించబడేది; నిర్భేద్యము= భేదించటానికి వీలుకానిది; ఉద్ధురము= బరువైనది లేదా నిలకడ కలిగింది; నన్= నన్ను; ప్రీతున్+చేయఁగాన్+పూని= సంతుష్టుడిని చేయటానికి; ప్రయత్నించి; ఒక్కరుఁడున్= ఒక్కడే; దానిన్+చొచ్చి= ఆ సైన్యాన్ని ప్రవేశించి; గోవులలోనన్= ఆవులలో; చొచ్చు= ప్రవేశించే; బలుసింగంబు+ఒక్కొ+ నాన్= మిక్కిలి బలం గలిగిన సింహమో అనునట్లు; అట్లు+చొచ్చి= ఆ విధంగా ప్రవేశించి; రయంబు+ఆరన్= వేగం యొక్క అతిశయంతో; అనేక వీర శిరముల్= పలువురు యోధుల తలలు; ఉద్దండుఁడు+ఐ= గొప్పవాడై - భయంకరుడై; చెండాడెన్= నరికి నేల కూల్చాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు, కృపుడు మొదలైన మహాయోధులచేత రక్షించబడేది, భేదించటానికి వీలుకానిది, నిలకడ కలది అయిన కౌరవసైన్యాన్ని, నాకు ప్రీతి కలిగించటానికి తా నొక్కడే ఆ సైన్యంలో దూరి ఆవుల మందలోకి సింహం చొచ్చినట్లుగా చొచ్చుకొని పోయి, మహావేగంతో ఎందరో వీరుల తలలను ఉద్దండుడై నరికి నేలకూల్చాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఈ సందర్భంలోని గతి అభిమన్యుడు రణరంగంలోనికి చొచ్చుకొని పోయిన స్థితికి సూచన. 'ఒక్కరుఁడున్' , 'చొచ్చిరయంబార' అనే ప్రయోగాలలో పదాలు విరిచి పాదారంభంలో కూర్చిన వైనం ఏ విధంగా పద్మవ్యూహాన్ని ఛేదించి లోనికి దూసుకొని పోయాడో 'శిల్పకళాపారగుఁ' డైన తిక్కన మత్తేభవిక్రీడితం యొక్క ఛందోరీతిలో ధ్వనింపజేశాడు.

**క. ఈసును రోసముఁ గల దు । శ్శాసను నొప్పించి పఱపి చతురంగములన్**
**గాసిలఁ జేయుచు న ట్లు । ల్లాసముతో మెలఁగఁగాఁ దలంబె యొరులకున్! 139**

**ప్రతిపదార్థం:** ఈసును= ఈర్ష్యయూ; రోసమున్= రోషమున్నూ; కల, దుశ్శాసనున్= కలిగిన దుశ్శాసనుడిని; నొప్పించి= బాధించి;పఱపి= పరుగు లెత్తేటట్లు చేసి; చతుః+అంగములన్= రథ, గజ, తురగ, పదాతిబలాన్ని; గాసిలన్ చేయుచున్= నాశనం చేస్తూ (బాధపెడుతూ); అట్లు= ఆ విధంగా; ఉల్లాసముతోన్= సంతోషంతో; మెలఁగఁగాన్= మెలగటానికి; ఒరులకున్= ఇతరులకు; తలంబు+ఎ!= శక్యమా!

**తాత్పర్యం:** ఈర్ష్యా, రోషమూ ఉన్న దుశ్శాసనుడిని నొప్పించి, పరుగులు తీయించి, చతురంగ బలాన్ని (అనగా రథ, గజ, తురగ పదాతి సైన్యాలను) నేలకూల్చి ఆ విధంగా సంతోషంతో వీరవిహారం చేయటానికి ఇతరులకు శక్యమా?

**విశేషం:** ఈ కందపద్యంలో అభిమన్యుడి సమరోల్లాసం సకారప్రాసలో ఎంతో హృద్యంగా వ్యంజితమైనది. ఆ ఉల్లాసంలో దుశ్శాసనుడిని నొప్పించిన వైనం కూడా అభివ్యక్తం.

**తే. కొడుకుఁ బొడగాన కర్జునుఁ డడిగె నేని । వానితో నింక నే మనువాఁడ? హరికి**
**నతని గారాబు చెలియలి కధికదుఃఖ । మేన చేసితి; వగవంగ నేమి గలదు? 140**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు= అర్జునుడు; కొడుకున్+పొడఁగానక= అభిమన్యుడిని కాన(చూడ)లేక; అడిగెన్+ఏని= అడిగితే; ఇంకన్= ఇకపైన; వానితోన్= ఆ అర్జునుడితో; ఏమి+అనువాఁడన్?= ఏమని చెప్పగలను?; హరికిన్= శ్రీకృష్ణుడికి; అతని, గారాబు, చెలియలికిన్= అతడికి ప్రియమైన (ముద్దు) చెల్లెలికి అనగా సుభద్రకు; ఏను+అ= నేనే; అధిక దుఃఖమున్= మిక్కిలి శోకాన్ని; చేసితిన్= కలిగించాను; వగవంగన్+ఏమి కలదు?= దుఃఖించటం వలన ఏమి ప్రయోజనం?

**తాత్పర్యం:** అర్జునుడు వచ్చి ఏడీ - నా కొడు కెక్కడ? అగుపించడంలేదే? అని అడిగితే ఏమని చెప్పగలను? శ్రీకృష్ణుడికీ అతడి కూరిమి చెల్లెలు సుభద్రకు నేనే ఇంత వంత కలిగించాను. ఇపుడు దుఃఖించి ఏమి ప్రయోజనం?

**విశేషం:** అభిమన్యుడిని అధికంగా అభిమానించే అర్జునుడూ, అచ్యుతుడూ, అతడి చెల్లెలు సుభద్రా - వీళ్ళకందరికీ నేనే ఆరని తీరని ఆవేదన కలిగించా నని ధర్మరాజు బాధపడుతూ 'వగచినందువలన ఏమౌతుంది?' సాధారణంగా లోకంలో అనుకొనే ఊరట వాక్యం పలికాడు.

**క. బాలుఁడు సుకుమారుఁడు పె । క్కాలములం జొచ్చి యెఱుఁగఁ డనక మొన సొరం**
**జాలుదు చొరు మని పనిచితి; । నేలా న న్నాస దోస మెఱుఁగఁగ నిచ్చున్? 141**

**ప్రతిపదార్థం:** బాలుఁడు= పసివాడు; సుకుమారుఁడు= కోమలదేహం కలవాడు; పెక్కు= అనేకములైన; ఆలములన్= యుద్ధాలలో; చొచ్చి= ప్రవేశించి; ఎఱుఁగఁడు= తెలియడు; అనక= అని తలచక; మొన+చొరన్= సైన్యంలోకి చొరబడటానికి; చాలుదు(వు)= తగి ఉన్నావు; అని+పనిచితిన్= అని అంటూ పంపాను; ఆస= ఆశ; నన్నున్= నన్ను; ఏలా, దోసము+ఎఱుఁగఁగన్+ఇచ్చున్?= దోషాన్ని ఏ విధంగా తెలిసికొననిస్తుంది?

**తాత్పర్యం:** అభిమన్యుడు చిదిమిన పాలుగారే చిన్నారి బాలుడూ, కోమలదేహం కలవాడూ, ఎన్నడూ యుద్ధాలలో ప్రవేశించనివాడూ అనికూడా ఆలోచించకుండా 'సైన్యంలో చొచ్చుకొని పోవటానికి నీవు సమర్థుడ' వని పంపాను. నన్ను ఆశ, దోషాన్ని తెలియనీయకుండా చేసింది.

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. ఆశ దోషాన్ని కప్పివేస్తుంది. అది సాధ్యమా? కాదా? అనే విషయాన్ని కూడా తెలియనీయదు. సరిగ్గా అభిమన్యుడి విషయంలో ఇదే జరిగింది. యుద్ధాలలో పాల్గొన్న అనుభవం ఎంతమాత్రమూ లేని ఒక సుకుమారుడైన పసిబాలుడిని యుద్ధానికి పురికొల్పటం ఎంత అవివేకం? అని ధర్మరాజు తన దోషపూరితమైన దురాశను గూర్చి దురపిల్లటం ఈ పద్యంలోని విశేషం. 'ఆస-దోసమని అనుప్రాసలో పైకి శాబ్దిక సౌందర్యం అభివ్యక్తమైనా - అంతరాంతరాలలో అది ప్రాసవలె ఏ విధంగా బాధిస్తున్నదో కూడా చివరి వాక్యంలో సూచించబడింది.

**క. కుడువను గట్టను బూయను। దొడువను బోఁబనిచి కాక తొలుత మొన సౌరం**
**గొడుకుం బనుచుట కెవ్వఁడు। గడఁగునె! నాయట్టి పాపకర్ముఁడు దక్కన్. 142**

**ప్రతిపదార్థం:** కుడువను= భుజించటానికిన్నీ;కట్టను= మేలిబట్టలు కట్టుకొనటానికిన్నీ; పూయను= గంధద్రవ్యాలు పూసికొనటానికిన్నీ;తొడువను= ఆభరణాలు ధరించటానికిన్నీ; పోన్= పోవగా; పనిచి+కాక= పంపకుండా; తొలుతన్= మొదటగా; మొనచొరన్= యుద్ధానికి పోవగా; కొడుకున్= కుమారుడిని; పనుచుటకున్= పంపటానికి; నా+అట్టి= నావంటి; పాపకర్ముఁడు+తక్కన్= పాపి తప్ప; ఎవ్వఁడున్= ఎవ్వడుగానీ; కడఁగునె!= ప్రయత్నిస్తాడా!

**తాత్పర్యం:** కూడు తినటానికో, గుడ్డ కట్టుకొనటానికో, మైపూతలు పూసికొనటానికో, నగలు తొడుగుకొనటానికో పంపాలిగాని, అలా కాకుండా తొలుతగా యుద్ధానికి పొమ్మని పంపటానికి నావంటి పాపి తప్ప మరెవ్వరైనా ప్రయత్నిస్తారా?

**విశేషం:** ముద్దు ముద్దుగా చిన్నపిల్లలను అలరించటానికో లేక ముద్దూ మురిపెమూ చెల్లించుకొనటానికో చెప్పే పనులు, చేసే విధులూ ఎన్నో ఉన్నాయి. అవి కాదని భీకరమైన సంగరభూమికి పోరా! అని పంపేవాడు ఎంత పాపాత్ముడై ఉండాలి?అని ధర్మరాజు తన్ను తాను ఆత్మ విమర్శన చేసికొంటూ ఆవేదన చెందటం ఈ కందపద్యంలోని విశేషం. ధర్మరాజు తా నెంత పాపకర్మకు పూనుకొన్నాడో దానికతడు ఎంత ఆవేదన పొందాడో చిట్టచివరి పాదాలలో చక్కగా అభివ్యక్తమైంది. కందపద్యాన్ని నడపటంలో, అందులో విభిన్న భావాలకు అనుగుణంగా మనస్తత్త్వాన్ని అభివ్యక్తం చేయటంలో తిక్కనగారిని మించిన కవి 'న భూతో న భవిష్యతి'.

**తే. వానితోడిద లోకమ్మై యేను బోవ। నైతిఁ బోఁగన్నఁ బుత్త్ర శోకాతురత్వ**
**మున నితాంత వివర్ణతఁ బొందుచుండఁ జూడకుండెడివాఁడ నర్జును మొగంబు. 143**

**ప్రతిపదార్థం:** ఏను= ధర్మజుడైన నేను; వానితోడిద లోకము+ఐ= వాడిని విడువకుండా వాడే లోకమై లేదా వాడిని అనుసరిస్తూ అదే లోకమై; పోవన్+ఐతిన్= పోలేకపోయాను (వాడివలె నేను కూడా వాడితో చావలేకపోయాను అని భావం); పోన్+కన్నన్= పోవటం చూడగలిగితే(అలా పోగలిగి ఉంటే, లేదా పోవటం సంభవించి ఉంటే); పుత్త్రశోక+ఆతురత్వమునన్= పుత్రశోకం వలన కలిగిన బాధచేత; నితాంత, వివర్ణత= అధికంగా వెల్లబాటు చెందటం, లేదా మిక్కిలి వన్నె చెడటం; పొందుచుండన్= కలుగుతూ ఉండే; అర్జును మొగంబున్= అర్జునుడి ముఖాన్ని; చూడకుండెడివాఁడన్= చూడకపోయేవాడిని.

**తాత్పర్యం:** నేను అభిమన్యుడితో కూడా వాడే లోకమై పోలేకపోయాను. అట్లా పోగలిగి ఉంటే పుత్ర శోకంతో కుమిలి మిక్కిలి వివర్ణుడై ఉండే అర్జునుడి ముఖాన్ని చూడకుండా ఉండేవాడిని.

**విశేషం:** ఈ పద్యంలోని భావమంతా 'వానితోడిదలోకమై' అనే జాతీయమైన పలుకుబడితో ముడిపెట్టబడి ఉన్నది. పుత్రమరణవార్త విన్న అర్జునుడిని ఏ విధంగా చూడగలను అనే ధర్మరాజు ఆవేదన ఈ తేటగీతి పద్యంలో తేటతెల్లం చేయబడింది. వాడితో కూడా నేనూ పోకపోతినే అనే వాక్యంలో ఎంతగా భరింపరాని బాధ చోటు చేసుకొని ఉన్నదో తిక్కన ఎంతో చక్కగా హృదయం ముక్కలయ్యే తీరులో, అతి సహజంగా మొదట తేటగీతి పాదంలో తెలిపాడు. కుమారుడి మరణానికి మిక్కిలిగా విలపించే

అర్జునుడిని ఏ విధంగా చూడగలను? అభిమన్యుడితో పాటు నేను కూడా మరణించి ఉంటే సరిపోయేది. అప్పుడు అర్జునుడి దుఃఖపూరిత వదనాన్ని చూడకుండే వాడిని గదా! అనే భావం చక్కగా హృదయాన్ని హత్తుకొనే రీతిలో వర్ణించబడింది.

**ఉ. వాసవునంత వానికిని వచ్చిన యాపదఁ దీర్చుఁ గాలకే**
**యాసురు లట్టి బల్పగఱ నైనను వ్రేల్మిడిఁ ద్రుంచు నాజి న**
**వ్వాసవి యాత్మజుండు పగవారలచే హతుఁడైన దుర్దశం**
**జేసి యలంతఁ జేడ్పడఁగఁ జేసె; విధాతృని నేమి సెప్పుదున్! 144**

**ప్రతిపదార్థం:** ఆ+వాసవి= ఆ అర్జునుడు; వాసవు+అంతవానికిన్= ఇంద్రు నంతటి వాడికి; వచ్చిన+ఆపదన్= కలిగిన విపత్తును;తీర్చున్= తొలగిస్తాడు; కాలకేయ+అసురులు+అట్టి= కాలకేయ రాక్షసులవంటి; బల్పగఱన్+ఐనను= గొప్ప శత్రువులనైనా; వ్రేల్మిడిన్= చిటికె వేయునంతలో; ఆజిన్= యుద్ధంలో; త్రుంచున్= సంహరించాడు; ఆత్మజుండు= కుమారుడు; పగవారలచేన్= శత్రువులచేత; హతుండు+ఐన= చంపబడిన; దుర్దశన్+చేసి= కష్టదశచేత; అలంతన్= అలసటతో; చేడ్పడఁగన్= చేటును పొందేటట్లు; చేసెన్= చేశాడు; విధాతృనిన్= బ్రహ్మను; ఏమి చెప్పుదున్?= ఏమి అనగలను?

**తాత్పర్యం:** ఆ అర్జునుడు ఇంద్రునంతటి వాడికి కలిగిన విపత్తును తొలగించాడు. కాలకేయాదులంతటి రాక్షసులను చిటికెవేసే లోపల యుద్ధంలో కూల్చాడు. అలాంటి అర్జుననికి కడుపు కోత కలిగేటట్లు అతని కొడుకు శత్రువులచేత హతుడయ్యేటట్లు విధాత చేస్తే ఆ విధాత చేతలను ఏమనాలి?

**విశేషం:** కాలకేయులు: వీరు మరీచిపుత్రులు. తల్లి కాలక. వీరు మునులను, దేవతలను బాధిస్తూ పగలు సముద్రం యొక్క అడుగున దాగిఉండేవారు. అగస్త్యుడు సముద్రజలపానం చేయగానే వీరు బయటపడ్డారు. ఈ కాలకేయాసురుల సంతతి వాళ్ళనే అర్జునుడు సంహరించాడు. తన పరాక్రమంతో దేవేంద్రుడికి కష్టాన్ని కలిగించే కాలకేయులను త్రుటిలో చంపిన అర్జునుడికి, ఇప్పు డింతటి దుర్దశ, చేటు కలిగించిన బ్రహ్మను ఏమనాలి? అనే ధర్మజుడి మానసికవేదన ఈ ఉత్పలంలో వివరించబడింది.

**చ. కొడుకు వధించి రన్నఁ గురుకోటికి నెట్టన యల్గి రూపుమా**
**పెడున కడంగి పార్థుఁ డెద బేర్చిన శోకము నార్పఁ జాలునే?**
**పుడమి ధనంబు నాకము విభూతియుఁ జేరెన యేని నల్ల న**
**వ్వెడు నభిమన్యు నెమ్మొగము వే యగు పాలును బోల నేర్చునే? 145**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు= అర్జునుడు; కడంగి= పూని; కొడుకున్+వధించిరి+అన్నన్= అభిమన్యుడిని చంపారు అని చెప్పగానే; కురుకోటికిన్= కౌరవుల మొత్తానికి; నెట్టన= వెంటనే (తొందరగా); అల్గి= కోపించి; రూపుమాపెడున= చంపితీరుతాడు; ఎదన్= మనస్సులో; పేర్చిన, శోకమున్= అతిశయించిన పుత్రశోకాన్ని; ఆర్పన్+చాలును+ఏ?= పోకార్చ గలుగునా?; పుడమిన్ ధనంబు= భూలోక ఐశ్వర్యం; నాకము+విభూతియున్= స్వర్గసంపదయున్నూ; చేరిన ఏనిన్= దొరికినప్పటికిన్నీ; అల్ల+నవ్వెడు+అభిమన్యు+నెమ్మొగము= మందంగా నవ్వే అభిమన్యుడినిండు మొగం; వేయగు పాలును= సహస్రాంశము నైనా (వెయ్యోభాగమునైనా); పోలనేర్చునే?= సరిపోలునా?

**తాత్పర్యం:** కొడుకును చంపారని వినగానే అర్జునుడు కౌరవుల మొత్తాన్నీ వెంటనే హతమార్చకుంటాడా! అయినా అది అర్జునునిమనస్సులో రేగినపుత్రశోకాన్ని ఆర్పగలదా! భూలోక సంపదా, స్వర్గలోకంలోని ఐశ్వర్యమూ అంతా లభించినప్పటికీ ఆ అభిమన్యుడి చిరునవ్వు తోడి నిండుమొగానికి వెయ్యో భాగమైనా సరిపోలుతుందా?'

**విశేషం:** ఈ చంపకమాలావృత్తంలో అభిమన్యుడి చావు విని కౌరవులందరిని అర్జునుడు చంపక వదలిపెట్టుతాడా! ఆతడి పుత్రశోకాన్ని ఆర్పటానికి వీలవుతుందా? అని అర్జునుడిని గురించి ధర్మజుడు మొదట భావించి, వెంటనే ఎన్ని సంపదలున్నా, స్వర్గ సంపద లభించినా అభిమన్యుడి ముఖ సౌందర్యానికి అవి ఏ మాత్రమూ సాటిరావు అని ఈ పద్యం చివరి పాదంలో తిక్కన ధర్మజసంతాప రూపంలో నిరూపించాడు.

**వ. అని మఱియు ననేక ప్రకారంబులం బలవించుచున్న సమయంబునం గృష్ణద్వైపాయన మునీంద్రుం డయ్యెడకు విజయంచేయుటయు, నవ్విభుండు ప్రత్యుత్థానంబు సేసి, దండప్రణామం బాచరించి, యాసన విన్యాసన ప్రముఖ పూజావిశేషంబుల నారాధించి య మ్మహాత్ముతో నిట్లనియె. 146**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం; మఱియున్= ఇంకా; అనేక ప్రకారంబులన్= అనేక విధాలుగా; పలవించుచున్న= విలపిస్తూ ఉండే; సమయంబునన్= సందర్భంలో; కృష్ణద్వైపాయన మునీంద్రుండు= వ్యాస మునీంద్రుడు; ఆ+ఎడకున్= ఆ చోటుకు; విజయం చేయుటయున్= విచ్చేయగా; ఆ+విభుండు= ఆ రాజు(ధర్మరాజు); ప్రత్యుత్థానంబు+చేసి= పైకిలేచి స్వాగతంపలికి; దండప్రణామంబు+ఆచరించి= కర్ర నేలపై పడినట్లు సాష్టాంగ నమస్కారం చేసి; ఆసన, విన్యాసన, ప్రముఖ, పూజా, విశేషంబులన్= ఆసనం ఉంచటం మొదలైన విశేషార్చనలతో; ఆరాధించి= పూజించి; ఆ+మహాత్ముతోన్= ఆ వేదవ్యాస మునీంద్రుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని పలురకాలుగా దుఃఖిస్తూ ఉండగా వ్యాసమునీంద్రుడు అక్కడికి వచ్చాడు. ధర్మరాజు లేచి, ఎదురేగి సాష్టాంగ దండప్రణామం చేసి, ఆసనాది విధులతో పూజించి, ఆ మహామునితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** 1. ప్రస్తుత వచనభాగంలో వేదవ్యాసుని రాక - ఆయన్ని ధర్మరాజు అతిథిపూజా విశేషాలతో ఆహ్వానించిన విషయం అభివర్ణితం. నన్నయ రచనా విధానంలో ఉండే ఔచిత్యాన్ని గుర్తించిన తిక్కన, సందర్భానుసారంగా వ్యర్థ పదరహితంగా వచన రచన ఏ విధంగా నిర్వర్తించాడో విస్పష్టం. వేదవ్యాసుని ఆగమనాన్ని ఏదో ఒక పద్యంలో నిబంధించి ఉండవచ్చును. కానీ, కథాగమన వైచిత్రికి వచనం ఎంత అనుకూలమో ఈ వచన భాగంలో తిక్కన సూచించాడు.

2. 'వేదవ్యాసాగమనము,నారదుఁ డకంపనునకు మృత్యుదేవతా ప్రభావం బెఱింగించుట, సువర్ణష్ఠీవి చరిత్రము, షోడశరాజ చరిత్రము, అను వృత్తాంతములతో కూడిన కథాభాగము (ద్రోణ.2. 146-224) భండార్కరు ప్రతి ప్రధాన పాఠమునందు విడువబడినది.అనుబంధమునందు 220 పంక్తులు గల ఈగ్రంథ భాగము చేర్పఁబడినది. (అను-1-8 పుట 264). ఈ భాగము చిత్రశీలాప్రతి, పి.పి.యస్. శాస్త్రి ప్రతి. కుంభకోణ ప్రతి - వీనియందు ప్రధాన పాఠముగా చేర్పఁబడియున్నది.

భండార్కరు ప్రతి సంపాదక వర్గమువా రీలోపము నీ క్రింది విధముగా సమర్థించియున్నారు. 'ఈ కథలన్నియు శాంతి పర్వమున కన్పించుచున్నవి. శారదాప్రతియందు ద్రోణపర్వమున నీ భాగము విడువబడినది. శాంతిపర్వమునం దీకథలు సందర్భోచితముగా కాన్పించుచున్నవి. ద్రోణపర్వమునం దివి యంతగా తగి యుండలేదు. ద్రోణపర్వమునందలి షోడశరాజ వృత్తాంతమున ఒక అసందర్భమును కలదు. పరశురాముడిని పదునార్గురు మహారాజులలో చేర్చుట యుక్తము కాదు. సంస్కృత శాంతి పర్వమునందు పరశురాముడి స్థానమున సగరుడు పేర్కొనఁబడి యున్నాడు. ఇది యుచితముగా కాన్పించును. మృత్యుదేవతా ప్రభావము తరువాత ద్రోణపర్వమున ఫలశ్రుతి కూడ చేర్పబడియున్నది. ఈ అంశములను బట్టి చూడఁగాఁ బైవృత్తాంతము లన్నియు శాంతిపర్వమున మొదట వ్రాయఁబడె ననియు, తరువాత ద్రోణపర్వమునందు ప్రక్షిప్తములుగా చేర్పఁబడినట్లును విశదమగుచున్నది.'

తెలుగుభారతమున వేదవ్యాసాగమనము, నారదుఁ డకంపనునకు మృత్యుదేవతా ప్రభావం బెఱింగించుట, సువర్ణష్ఠీవి చరిత్రము, షోడశరాజ చరిత్రము అను ఘట్టములు కలవు. శాంతిపర్వమున నీ కథాంశములు కొన్ని మార్పులతో తిరిగి కాన్పించును.

ఇచట అకంపనుని వృత్తాంతము లేదు. పర్వత నారద వృత్తాంత మధికముగా నున్నది (శాంతి 229- 290). తెలుఁగు భారతమున ద్రోణపర్వమునగాని, శాంతి పర్వమునగాని, షోడశరాజ చరిత్రమునందు సగరుని ప్రశంస చేర్చబడలేదు. పరశురాముని వృత్తాంతమే యున్నది. షోడశరాజ వృత్తాంతమునకు సంబంధించిన పద్యములు తెనుఁగున రెండు పర్వములందును ఒకే రీతిగానున్నవి.' (ఆంధ్రమహాభారతము. సంశోధితముద్రణము. ద్రోణపర్వము. ద్వితీయాశ్వాసము. పాదసూచి. పు. 354 - 355).

**సీ. 'పరసేన భేదింపఁ బనిచితి నేను సౌ । భద్రుని వాఁడు నబ్బలము సొచ్చె;**
**వెనుక నేమును జొచ్చి చనఁగ సైంధవుఁడు మ । మ్మాఁగినఁ దోడ్పడ ననువు దప్పె;**
**నప్పుడు పెక్కండ్రు రప్పాడి న వ్వీరుఁ । బొదివిన నాఁఅడిఁ బోయె నట్లు**
**సుకుమారమూర్తిఁ బుత్త్రకు నొంటిమైఁ బిన్న । పాపని నలుఁగుల పాలు పడఁగఁ**

**ఆ. బనిచి తాను బ్రతుకు పాపాత్ముఁ డెందును । గలఁడె? విపుల శోకజలధి మునిఁగి**
**పేర్చు తల్లడమున బిమ్మిటి కొనియెడుఁ । జిత్త; మింక నేమి సేయువాఁడ?' 147**

**ప్రతిపదార్థం:** ఏను= ధర్మజుడనైన నేను; సౌభద్రునిన్= అభిమన్యుడిని; పరసేనన్= శత్రుసైన్యాన్ని; భేదింపన్= భేదించటానికై; పనిచితిన్=పంపాను; వాఁడున్= ఆ అభిమన్యుడుకూడా; ఆ+బలము= ఆ సైన్యం; చొచ్చెన్= ప్రవేశించాడు;వెనుకన్= అతడి వెనుక; ఏమును= మేమున్నూ; చొచ్చి+చనఁగన్= ప్రవేశించి పోగా; మమ్మున్= మమ్ము; సైంధవుఁడు= జయద్రథుడు; ఆఁగినన్= అడ్డగించగా; తోడ్పడన్= సహాయ పడటానికి; అనువు= (అనుకూల్యం) అవకాశం; తప్పెన్= తప్పిపోయింది; అప్పుడు= ఆ సందర్భంలో; పెక్కండ్రురు= అనేకులు; ఆ+పాడిన్= ఆ వివాదంలో; ఆ+వీరున్= వీరుడైన అభిమన్యుడిని; పొదివినన్= చుట్టుముట్టగా; ఆఅడిఁబోయెన్= మరణించాడు; అట్లు= ఆ విధంగా; సుకుమారమూర్తిన్= కోమలమైన స్వరూపం కలవాడిని; పుత్త్రకున్= కుమారుడిని; పిన్నపాపనిన్= పసిపిల్లవాడిని; ఒంటిమైన్= ఒంటిగా; అలుఁగులపాలు+పడఁగన్= బాణాల వశం అయ్యేటట్లు; పనిచి= పంపి; బ్రతుకు= జీవించునట్టి; పాపాత్ముఁడు= కఠినుడు; ఎందునన్= ఎందైనా; కలఁడె?= ఉన్నాడా?; విపుల, శోక, జలధిన్= విస్తారమైన శోకం అనే సముద్రంలో; మునిఁగి= మునిగి; పేర్చు+తల్లడమునన్= అతిశయించే బాధ (కలత)తో; చిత్తము= మనస్సు; బిమ్మిటి కొనియెడున్= స్మారకం తప్పిపోతూ ఉన్నది; ఇంకన్= ఇకపై;ఏమి+చేయువాఁడన్?= ఏమి చేయగలను?

**తాత్పర్యం:** 'నేను అభిమన్యుడిని శత్రుసేనను భేదించటానికి పంపాను.వాడున్నూ ఆ సైన్యంలో ప్రవేశించాడు. అతడి వెనుక మేము పోవటానికి ప్రయత్నించగా సైంధవుడు మమ్మల్ని అడ్డగించాడు. అభిమన్యుడికి సహకరించే అవకాశం అంతటితో తప్పిపోయింది. అప్పుడు పలువురు ఆ వీరుడిని చుట్టుముట్టి అన్యాయంగా హతమార్చారు. కోమల స్వరూపుడూ, పసిపాపడూ అయిన కుమారుడిని ఆ విధంగా ఒంటిగా బాణాలపాలు కావటానికి పంపి, తాను జీవించే కఠినాత్ము డెక్కడైనా ఉన్నాడా? అతి విస్తారమైన శోకసముద్రంలో మునిగి మిక్కిలి తల్లడపాటు చెంది మనస్సు ప్రజ్ఞ కోల్పోగా ఇంక చేసే దేముంది?'

**వ. అనిన విని మునీశ్వరుం డమ్మనుజేశ్వరున కిట్లనియె : 148**

**ప్రతిపదార్థం:** అనినన్= అని ధర్మరాజు అనగా; విని; మునీశ్వరుండు= వేదవ్యాసుడు; ఆ+మనుజ+ఈశ్వరునకున్= ఆ రాజుకు (ధర్మరాజుకు); ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు పలుకగా వేదవ్యాసుడు విని అతడితో ఇట్లా అన్నాడు:

**చ. 'పలువురు రాజులం దునిమె బల్లిదుఁ డాతఁడు పిన్నపాపఁడే?**
**యలుగుల పాలు సేయకభియాతులు పువ్వుల కోల సాఁతురే?**
**కలఁగుదురే విపద్దశల కాఱియ నార్యులు సావు లింత విం**
**తలె? గరుడోరగ ద్యుచర దానవకోటుల చావుఁ జూడమే?' 149**

**ప్రతిపదార్థం:** బల్లిదుఁడు= మిక్కిలి బలవంతుడు;పలువురు+రాజులన్= పెక్కుమంది రాజులను; తునిమెన్= సంహరించాడు; ఆతఁడు= ఆ అభిమన్యుడు; పిన్నపాపఁడు+ఏ?= పసిబాలుడా?; అభియాతులు= శత్రువులు లేదా పైకి దండెత్తి వచ్చేవాళ్ళు; అలుఁగుల+పాలు+చేయక= బాణాలపాలు కావించకుండా; పువ్వులకోల= పూలబాణం; చాఁతురే?= ప్రయోగిస్తారా?; ఆర్యులు= పెద్దలు, పూజ్యులు; విపద్+దశలన్= ఆపదలయొక్క పరిస్థితులలో; కాఱియన్= బాధతో; కలఁగుదురు+ఏ?= కలత చెందుతారా?; చావులు= మరణాలు; ఇంత వింతలు+ఏ?= ఇంత ఆశ్చర్యకరమైనవా?; గరుడ+ఉరగ, ద్యుచర, దానవ, కోటుల, చావున్= గరుడులు, నాగులు, ఖేచరులు (దేవతలు); రాక్షసులయొక్క మరణాన్ని; చూడమే!= చూస్తూనే ఉన్నాం గదా!

**తాత్పర్యం:** 'మిక్కిలి బలవంతుడైన ఆ అభిమన్యుడు చిన్నబాలుడా? అంతమంది రాజులను అంతం చేశాడు. పైకి దండెత్తి వచ్చే శత్రువులు బాణాలు ప్రయోగించకుండా పూలబాణాలు ప్రయోగిస్తారా?అన్నీ తెలిసిన పెద్దలు ఆపదలలో బాధతో కలత చెందుతారా? చావులు ఆశ్చర్యకరములా! గరుడులు, నాగులు, ఖేచరులు (ఆకాశంలో సంచరించే దేవతలు) రాక్షసులు మొదలైన వారి చావును మనం చూడటం లేదా?'

**క. 'ఎప్పాట నెవ్వరికి విధి । దప్పింప వశంబె? ధైర్యధనఘనుఁ డవు నీ**
**విప్పరుసున నడలుట గడు । నొప్పదు; శమియింప వలయు నుర్వీనాథా!' 150**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= రాజా! (ధర్మరాజా అని సంబోధన); ఎప్పాటన్(ఏ+పాటన్)= ఏవిధంగానైనా; ఎవ్వరికిన్= ఎవ్వరికైనా; విధిన్= కాలానుగుణంగా ప్రవర్తించే కర్మ పరిస్థితిని; తప్పింపన్+వశంబె?= తప్పించుకొనటానికి వీలౌతుందా?; నీవు; ధైర్యధన ఘనుఁడవు= ధైర్యమే ధనంగా కలిగిన వాళ్ళలో గొప్పవాడవు; ఈ+పరుసునన్= ఈ విధంగా; అడలుట= శోకించటం; కడున్= మిక్కిలి; ఒప్పదు= తగదు; శమియింపన్ వలయున్= శాంతించాలి.

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఎక్కడైనా, ఎవ్వరికైనా విధిని తప్పించుకోవటం సాధ్యమా? నీవు ధీరులలో మేటివి. ఈ విధంగా వ్యథ చెందటం తగదు. నీవు శాంతించాలి.'

**విశేషం:** ఉర్వీనాథా! అనే సంబోధనలో నీవు క్షమ(ఓర్పు) వహించాలి అని సూచన. భూమి (ఉర్వి) సహనానికి మారుపేరు. అట్టి ఉర్వికి అధినాథుడవైన నీవు బేలవు కావటం తగదు. ఉత్తమవీరుడికి ఉండవలసిన ప్రసిద్ధగుణం ధైర్యం, అట్టి ధైర్యధనులలో నీవు ఘనుడవై ఉండి కూడా ఈ విధంగా శోకించటం ఎంతమాత్రమూ సబబు కాదు. వ్యాసుడు శమప్రాధాన్యాన్ని నొక్కి వక్కాణించాడు. ద్విత్వపకార ప్రాస నొక్కి చెప్పటానికి ఎంతో దోహదకారిగా ప్రయుక్తం.

**వ. అనిన సాత్యవతేయునకుం గౌంతేయాగ్రజుం డిట్లనియె. 151**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; సాత్యవతేయునకున్= సత్యవతీపుత్రుడైన వ్యాస మునీంద్రుడికి; కౌంతేయ+అగ్రజుండు= కుంతీపుత్రులలో అందరికంటే ముందుపుట్టిన వాడైన ధర్మరాజు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా ధర్మరాజు వ్యాసుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** వ్యాస ధర్మజుల పేర్లు నేరుగా చెప్పకుండా ఫలానావాళ్ళ కుమారులని ఇరువురి తల్లుల పేర్లను స్ఫురింపజేయటం ఇందులోని విశేషం.

**చ. 'వెరవును లావునుం గలిగి విక్రమసంపద నొప్పి ధీరు లై**
**పరఁగిర కాని తమ్ము మృతభావ వికారము వొందకుండ సు**
**స్థిరముగఁ బ్రాణరక్షణము సేయఁగ రాజులు సాల రైరె? యె**
**వ్వరుఁ దలపోయ మృత్యు వనివార్యమె? తాపసముఖ్య! యిమ్మెయిన్.' 152**

**ప్రతిపదార్థం:** తాపసముఖ్య!= మౌనులలో ప్రధానమైనవాఁడా! (వేదవ్యాస మునీంద్రా!); వెరవును= ఉపాయమున్నూ; లావున్= బలమున్నూ;కలిగి= ఉండి; విక్రమసంపదన్= పరాక్రమం యొక్క సంపత్తుచేత; ఒప్పి= ప్రకాశించి; ధీరులు+ఐ= ధైర్యం కలవారై; పరఁగిరి+అ+కాని= ఒప్పినారే కాని; తమ్మున్= తమను; మృతభావ వికారము= చస్తాం అనే అభిప్రాయం వలన కలిగిన మానసికమైన గిట్టనితనాన్ని (వికృతి); పొందకుండన్= కలుగకుండా; ఎవ్వరున్= ఎవ్వరుకూడా; సుస్థిరముగన్= దృఢంగా లేదా నిలకడగా; ప్రాణరక్షణము+చేయఁగన్= ప్రాణాలను కాపాడటం చేయటానికి; రాజులు= ప్రభువులు; చాలరు+ఐరె?= సమర్థులు కాకపోయారా?; ఈ+మెయిన్= ఈ విధంగా; తలపోయన్= ఆలోచించగా; మృత్యువు= మరణం; అనివార్యము+ఎ?= నివారించటానికి సాధ్యం కానిదా?

**తాత్పర్యం:** 'మునివర్యా! ఉపాయమూ బలమూ ఉండి పరాక్రమంతో ధీరులై ప్రకాశించారే కాని, చస్తాం అనే మనోవికారం తమ్ము పొందకుండా రాజులు నిలకడగా ప్రాణరక్షణ చేయటానికి సమర్థులు కాలేకపోయారు గదా! బాగా ఆలోచిస్తే మృత్యువును అవశ్యం అనుభవించి తీరవలసిందే!'

**విశేషం:** వ్యాసుడి ఓదార్పు మాటలతో కొంత ఉపశమనాన్ని పొందిన ధర్మజుడు రాజులు యుద్ధంలో తమ పరాక్రమాన్ని ప్రకటించటం సహజం. విజయమో, వీరస్వర్గమో! రణరంగంలో ప్రాణరక్షణ ప్రయత్నం అవసరం. విధి వక్రించినప్పుడు మృత్యువు అనివార్యమే కదా! అని సమాధాన పడినట్లు తిక్కన చంపకమాలా వృత్తంలో వివరించాడు. ఈ పద్యంలో రకారం ప్రాసస్థానంలోనే కాక అక్కడక్కడా ఒకింత విరివిగా ప్రయోగించబడింది. అది అగ్నివంటి పరాక్రమ స్ఫూర్తినే గాక మానసికంగా పొందే దుఃఖాగ్నికి కూడా సూచన.

**వ. అనుటయుఁ, బారాశర్యుండు పాండవాగ్రజున కిట్లనుఁ 'దొల్లి యిట్లు పుత్త్రమరణశోకాతురుండైన యకంపనుం డనురాజు నారదమునిచేత మృత్యుప్రకారంబు దెల్లంబుగా విని యుపశమితశోకుం డయ్యె నని విందు మయ్యితిహాసంబు తెఱం గెఱింగించెద; నది నీయంతఃకరణంబు సంతాపంబు మాన్చి శాంతి యొనర్చు నవహితుండ వై యాకర్ణింపుము. 153**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని అనగా; పారాశర్యుండు= పరాశరమహర్షి కుమారుడైన వ్యాసుడు; పాండవ+అగ్రజునకున్= పాండవులలో పెద్దవాడైన ధర్మరాజుకు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటూ ఉన్నాడు; తొల్లి= పూర్వం; ఇట్లు= ఈ విధంగానే; పుత్రమరణ శోక+ఆతురుండు+ఐన= కుమారుడి చావువలన దుఃఖంతో బాధపడేవాడైన; అకంపనుడు+అను, రాజు= అకంపనుడు అనే పేరుగల ప్రభువు; నారదమునిచేతన్= నారదమునీంద్రుడి చేత; మృత్యుప్రకారంబు= మృత్యువుయొక్క విధము; తెల్లంబుగాన్= స్పష్టంగా; విని; ఉపశమిత, శోకుండు+అయ్యెన్= అణగిన లేదా నశించిన దుఃఖం కలవాడు అయ్యాడు; అని+విందుము= అని వింటూ ఉన్నాం; ఆ+ఇతిహాసంబు= పరంపరగా చెప్పుకొనే ఆ పూర్వకథయొక్క; తెఱంగు= క్రమం; ఎఱింగించెదన్= తెలియజేస్తాను; అది= ఆ కథ; నీ+అంతఃకరణంబు= నీ ఆత్మ(మనస్సు) యొక్క; సంతాపంబు= వ్యథ; మాన్చి= మానేటట్లు చేసి; శాంతి+ఒనర్చున్= శాంతి కలిగిస్తుంది; అవహితుండవు+ఐ= సావధానుడవై; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అనగానే వ్యాసమహర్షి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: 'పూర్వం ఇట్లాగే పుత్రుడి మరణం వలన కలిగిన దుఃఖంతో బాధపడే అకంపనుడు అనే రాజు, నారదుడు తెలిపిన మృత్యుప్రకార విధానాన్ని స్పష్టంగా విని చిత్తశాంతి పొందాడు. ఆ కథను నీకు చెప్పుతాను ఏకాగ్రతతో వినుము. అది నీ మనసులోని బాధను తొలగించి శాంతిని కలిగిస్తుంది.

**విశేషం:** 1. సాధారణంగా లోకంలో శోకంతో విలపించే వ్యక్తులు తమకు కలిగిన దుఃఖం మరెవ్వరికీ కలిగి ఉండదని భావిస్తూ ఉంటారు. అటువంటి సందర్భంలో పూర్వం ఎందరో ప్రసిద్ధులు పొందిన కష్టపరంపరలను ప్రస్తుత సంఘటనలకు అన్వయిస్తూ చెప్పటం వలన ఎంతో ఉపశమనం కలుగుతుంది. వ్యాసుడు ధర్మరాజుకు అకంపనవృత్తాంతం - అందులో ఉన్న పుత్రశోకం వివరించటానికి అదే కారణం.

2. వ్యాస - ధర్మరాజుల పేర్లను వాళ్ళ తండ్రుల పేర్లు స్ఫురించేటట్లు అపత్యార్థంలో ప్రయోగించటం ఇందులోని విశేషం. అకంపన వృత్తాంతంలోని కథ పుత్ర మరణానికి సంబంధించినదే కావటం వలన ప్రస్తుత సందర్భానికి చక్కగా అదికింది.

**సీ. పగతు రకంపను పై నెత్తి వచ్చి క । య్యము సేసి యాతని నడఁగఁ బట్టి**
**కొనుటయుఁ జూచి తత్తనయుండు హరియను । వాఁడు దోర్దర్పదుర్వారమూర్తి**
**యవ్విరోధులమీఁద నదరి బల్విడిఁ దండ్రి । విడిపించి విక్రమ విహరణమునఁ**
**దనివోక మఱియు నుద్ధతిఁ గరిరథఘోట । భటనికాయంబుల బడలు పఱుప**

**ఆ. నుగ్రు లగు ననేకయోధులు చలమునఁ । గూడుకొని మహాస్త్ర ఘోరశస్త్ర**
**తతుల నక్కుమారు మృతుఁ జేసి; రప్పుడు । గనలి రభసమున నకంపనుండు. 154**

**ప్రతిపదార్థం:** పగతురు= శత్రువులు; అకంపనుపైన్= అకంపనుడిమీదికి; ఎత్తివచ్చి= దండెత్తివచ్చి; కయ్యము+చేసి= యుద్ధం చేసి; ఆతనిన్= ఆ అకంపనుడిని; అడఁగన్= లోబడేటట్లు; పట్టికొనుటయున్= బంధించటాన్ని; చూచి= కనుగొని; తద్+తనయుండు= ఆ అకంపనుడి కొడుకు; హరి+అనువాఁడు= హరి అనే పేరుగలవాడు; దోః+దర్ప+దుర్వార మూర్తి= బాహువుల (భుజముల)యొక్క గర్వంచేత అడ్డగించటానికి వీలుకాని స్వరూపం కలవాడు; ఆ+విరోధులమీఁదన్= ఆ శత్రువులపైన; అదరి= విజృంభించి; బల్విడిన్= శౌర్యంతో (లేదా వెంటనే); తండ్రిన్= తండ్రిని; విక్రమ విహరణమునన్= పరాక్రమం యొక్క విహారంతో; విడిపించి= విమోచన కలిగించి;తనివోక= తృప్తిపడక; మఱియున్= మళ్ళీ; ఉద్ధతిన్= గర్వంతో; కరి, రథ, ఘోట, భట, నికాయంబులన్= ఏనుగులు, తేరులు, గుర్రాలు, కాలుబలము యొక్క గుంపులను; బడలుపఱుపన్= శ్రమపెట్టగా (నొప్పించగా); ఉగ్రులు+అగు+అనేకయోధులు= భయంకరులైన పెక్కుమంది యుద్ధవీరులు; చలమునన్= పట్టుదలతో;కూడుకొని= ఒకటిగా క్రమ్ముకొని; మహా, అస్త్ర,ఘోర, శస్త్ర, తతులన్= గొప్ప, బాణాల (భయంకరాలైన) తీవ్రములైన ఆయుధాల సమూహాలతో; ఆ+కుమారున్= ఆ అకంపనుడి కొడుకును; మృతున్+చేసిరి= చచ్చినవాడిని చేశారు; అప్పుడు= ఆ సందర్భంలో; అకంపనుండు; కనలి= కోపించి; రభసమునన్= వేగంతో.

**తాత్పర్యం:** శత్రువులు అకంపనుడి మీదికి దండెత్తి అతడిని స్వాధీనం చేసికొని బంధించారు. అది చూచి అతడి కొడుకు హరి అనేవాడు వారింప సాధ్యంకాని భుజగర్వంతో ఆ శత్రువులపైన విజృంభించి వెంటనే తండ్రిని తన పరాక్రమంతో విడిపించి, అంతటితో తృప్తిపడక మళ్ళీ గర్వంతో చతురంగబలాల్ని శ్రమపెట్టగా భయంకరులైన శత్రుయోధులు వివిధాస్త్రశస్త్రాలతో అతడిని చంపారు. అప్పుడు అకంపనుడు మిక్కిలి కోపించి వేగంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. విపినంబు నడఁచు దవశిఖి । కుపమాస్థానమయి పగఱ యొప్పు సెఱిచి యా**
**త్మపురము సొత్తెంచెం దూ । ర్యపటు ధ్వను లెసఁగ ననిమిషాధిపు భంగిన్. 155**

**ప్రతిపదార్థం:** విపినంబున్= అడవిని; అడఁచు= అణచు(హరించే); దవశిఖికిన్= కార్చిచ్చుకు; ఉపమస్థానము+అయి= పోలిక చోటై (నిధానమై); పగఱ= శత్రువుల; ఒప్పున్= అందాన్ని; చెఱిచి= నశింపజేసి; అనిమిష+అధిపు భంగిన్= దేవతల ప్రభువైన ఇంద్రుడివలె; తూర్య పటు ధ్వనులు= వాద్యాల బలమైన శబ్దాలు; ఎసఁగన్= అతిశయించగా; ఆత్మపురము= తన నగరం; చొత్తెంచెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** అడవిని కాల్చే దావాగ్నితో పోల్చదగినవాడై శత్రువుల అందాన్ని నశింపజేసి, వాద్యాల మ్రోతలు అతిశయించగా దేవేంద్రుడి వలె తన నగరంలో ప్రవేశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు గెలిచి వచ్చియు. 156**

**తాత్పర్యం:** ఈ విధంగా జయించి వచ్చియున్నా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. పుత్త్రుఁ దలఁచి తలఁచి పొగులుచు నున్న య । న్నరవరేణ్యు కడకు నారదుండు**
**నెమ్మి వచ్చుటయును నిభృతుఁడై యాసనా । ర్ఘ్యాది పూజనంబు లాచరించి. 157**

**ప్రతిపదార్థం:** పుత్త్రున్= కొడుకును; తలఁచి, తలఁచి= పదే పదే స్మరించి; పొగలుచున్= దుఃఖిస్తూ; ఉన్న= ఉండే; ఆ+నరవరేణ్యు కడకున్= ఆ రాజశ్రేష్ఠుడి దగ్గరకు; నెమ్మిన్= ప్రీతితో(అనుగ్రహంతో); నారదుండు= నారద మహర్షి; వచ్చుటయును= రాగా; నిభృతుఁడు+ఐ= వినయం కలవాడై; ఆసన+అర్ఘ్య+ఆది, పూజనంబులు= పీటవేయటం, పాదాలు కడగటం మొదలైన సేవలు; ఆచరించి= చేసి.

**తాత్పర్యం:** కుమారుడిని పదే పదే తలచుకొని బాధపడుతూ ఉండే ఆ అకంపనమహారాజు దగ్గరకు నారదుడు ఎంతో ప్రీతితో రాగా, ఆ మహర్షికి వినయంతో ఆసనం వేసి అన్ని మర్యాదలూ చేసి. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. అతనికడ నుండి యమ్మహీపతి యత్తాపస ముఖ్యునకు నిజవృత్తాంతం బెఱింగించి, కొడుకు గుణంబు లగ్గించి వానిం గోలుపోవుటం జేసి విజయంబు ప్రియంబు సేయకున్నదని తన వగపును తెలిపి మఱియును. 158**

**ప్రతిపదార్థం:** అతని కడన్+ఉండి= ఆ నారదుడి దగ్గరనే ఉండి; ఆ+మహీపతి= ఆ అకంపన మహారాజు; ఆ+తాపసముఖ్యునకున్= ఆ మునిశ్రేష్ఠుడికి; నిజ+వృత్తాంతంబు= తన కథ; ఎఱింగించి= తెలియజేసి; కొడుకు గుణంబులు= పుత్రుడి సుగుణాలు; అగ్గించి= పొగడి; వానిన్= ఆ కుమారుడిని; కోలుపోవుటన్+చేసి= పోగొట్టుకొనటం చేత; విజయంబు= జయించటం; ప్రియంబు= ప్రీతి; చేయకున్నది= కలిగించకుండా ఉన్నది; అని= ఆ ప్రకారంగా; తన+వగపును= తన దుఃఖాన్ని; తెలిపి= వెల్లడించి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** నారదుడి దగ్గర కూర్చుండి తన వృత్తాంతాన్ని చెప్పాడు. కొడుకు గుణాలను కీర్తించాడు. అతడిని పోగొట్టుకొనటం వలన విజయం కలిగినా అది సంతోషాన్ని కలిగించటం లేదని దుఃఖాన్ని ప్రకటించాడు. అంతేకాక.

**విశేషం:** అకంపనుడు పుత్రమరణంతో ప్రకంపను డయ్యాడు. విస్తారంగా సామ్రాజ్యాన్ని వ్యాపింపజేశాడు. కానీ, అతడికి విజయం ప్రియం కలిగించలేదని తనకడకు విజయం చేసిన నారదుడికి విన్నవించటం ఈ వచనరచనలోని విశేషం.

**క. 'మునినాయక! మృత్యువు ప్రభు। వని విందుము లోకమునకు; నది యెట్లొకొ! త**
**జ్జననంబుఁ దత్ప్రభావము। వినఁ దలఁచెద; నుచితమేని వినిపింపు తగన్. 159**

**ప్రతిపదార్థం:** మునినాయక!= మునిశ్రేష్ఠుడవైన నారదా!; లోకమునకున్= సమస్త ప్రపంచానికి; మృత్యువు= మృత్యుదేవత; ప్రభువు= రాజు; అని+విందుము= అని వింటూ ఉన్నాం; అది+ఎట్లు+ఒకొ!= అది ఏ విధంగానో!; తద్= ఆ మృత్యువుయొక్క; జననంబు= పుట్టుక; తద్= దానియొక్క; ప్రభావము= మాహాత్మ్యం; వినన్= వినటానికి; తలఁచెదన్= కోరుతున్నాను; ఉచితము+ఏని= తెలియదగినది అయితే; తగన్= తగునట్లు (యుక్తం అగునట్లు); వినిపింపు= వినిపించుము.

**తాత్పర్యం:** 'నారదమునీంద్రా! ఈ లోకానికి మృత్యుదేవత ప్రభువు అని వింటున్నాం. అది ఎట్లాగో, దాని పుట్టుకనూ, మాహాత్మ్యాన్నీ వినాలని ఆసక్తిగా ఉన్నది. నేను అడిగింది సమంజసము, తెలియదగినది అని అనుకొంటే సముచితంగా వివరించవలసింది.'

**విశేషం:** ఏ విషయమైనా శ్రోతయొక్క అభ్యర్థననూ అందులో ఉండే ఔచిత్యాన్నీ పురస్కరించుకొనే మహనీయులు సమాధానమిస్తారు. ఆసక్తికరమైన విషయాన్ని అడగటం శ్రోతయొక్క ధర్మం. చెప్పటం కథకుడి విధి. తెలిసిన వారు తమకు తెలుసును గదా అని ఊరక ఎదుటివారికి చెప్పటం నిష్ప్రయోజనం. నిరర్థకం. అందులోనూ తాత్త్విక విషయం ఊరక తేరక చెప్పరాదు. శ్రోత పదే పదే ఆసక్తితో ఉత్కంఠతో అడిగినప్పుడే చెప్పాలి. మృత్యువు యొక్క పుట్టుకనూ, దాని ప్రభావాన్నీ చెప్పవలసిందని అకంపనుడు నారదుడిని అర్థించిన విధానం ఈ వచన రచనలో ప్రధానాంశం.

**నారదుఁ డకంపనునకు మృత్యుదేవతా ప్రభావం బెఱింగించుట (సం. అను. 1-8-67 పంక్తి)**

**వ. అనిన విని యమ్మహాత్ముండు గరుణాయత్తచిత్తుండై యతనికిట్లను ' బంధుమరణ శోకం బుడుపం జాలెడు మృత్యుప్రకారకథ వినుట మేలు; నీ వవధానపరుండవై వినుము సెప్పెదం; బ్రజాపతి ప్రజల సృజియించి పదంపడి సంహారంబు లేమిం జేసి భూమికిఁ దదీయభారంబు దుర్భరం బగుటయు, ననుసంధించి చింతాక్రాంతుండై తత్సంహారంబునకు నుపకరణంబు గానక కటకటంబడిన నతని యింద్రియంబుల వలన మహాజ్వలనంబు జనియించి యెల్ల దిక్కులం బరఁగి చరాచరాత్మకంబైన భూతవ్రాతంబు దహింపం గడంగుటయు భువన హితార్థంబుగా భవుండు సని కమలభవు శరణు సొచ్చినం, బ్రజ్వరిల్లుచున్న యమ్మహానుభావుం డద్దేవు నాలోకించి యాదరభరితాంతఃకరణుం డై. 160**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అకంపనుడు అడుగగా; విని; ఆ+మహాత్ముండు= (త్రికరణశుద్ధి గల త్రిలోక సంచారి అగు) ఆ నారదుడు; కరుణా+ఆయత్త+చిత్తుండు+ఐ= దయకు అధీనమైన మనస్సు కలవాడై; అతనికిన్= ఆ అకంపనుడికి; ఇట్లు= ఇట్లా; అనున్= అంటున్నాడు; బంధుమరణ శోకంబు= చుట్టాల చావుకు సంబంధించిన; మానసికమైన దుఃఖము; ఉడుపన్+చాలెడు= పోగొట్టగలిగే; మృత్యు ప్రకార కథ= మృత్యుదేవత యొక్క విధమునకు చెందినట్టి వృత్తాంతం; వినుట= వినటం; మేలు= శుభం; నీవు; అవధాన పరుండవు+ఐ= మనస్సును నిలపటంలో ఆసక్తి కలవాడవై (అనగా శ్రద్ధాసక్తులు కలవాడవై); వినుము; చెప్పెదన్= చెబుతున్నాను; ప్రజాపతి= బ్రహ్మ; ప్రజలన్= సంతతిని (జనాన్ని); సృజియించి= పుట్టించి; పదంపడి= పిదప; సంహారంబు లేమిన్+చేసి= వినాశం లేకపోవటం చేత; భూమికిన్= భూదేవికి; తదీయభారంబు= ఆ సంతతియొక్క బరువు; దుర్భరంబు+అగుటయున్= భరించటానికి వీలుకాకపోవటాన్ని; అనుసంధించి= మనస్సులో యోచించి; చింతా+ఆక్రాంతుండు+ఐ= దిగులుతో ఆవరింపబడ్డవాడై; తద్+సంహారంబునకున్= ఆ ప్రాణికోటియొక్క వినాశానికి; ఉపకరణంబు= సాధనం; కానక= చూడలేక; కటకటంబడినన్= కోపించగా; అతని+ఇంద్రియంబులవలనన్= బ్రహ్మయొక్క ఇంద్రియాలనుండి; మహాజ్వలనంబు=

పెద్దమంట; జనియించి= పుట్టి; ఎల్లదిక్కులన్= అన్నివైపులా; పరcగి= వ్యాపించి; చర+అచర+ఆత్మకంబు+ఐన= స్థావర జంగమాత్మకమైన; భూతవ్రాతంబున్= ప్రాణిసమూహాన్ని; దహింపన్+కడంగుటయున్= కాల్చటానికి పూనుకోవటమున్నూ; భువన+హితార్థంబుగాన్= లోకాల మేలు కొరకై; భవుండు= శివుడు; చని= పోయి; కమలభవున్, శరణు, చొచ్చినన్= బ్రహ్మకు శరణాగతుడు కాగా; ప్రజ్వరిల్లుచున్న= మండుతూ ఉండే; ఆ+మహా+అనుభావుండు= గొప్పవాడూ మిక్కిలి ఉదారుడూ అయిన బ్రహ్మ; ఆ+దేవున్ = ఆ పరమశివుడిని; ఆలోకించి= చూచి; ఆదరభరిత+అంతఃకరణుండు+ఐ= దయతో కూడిన హృదయం కలవాడై.

**తాత్పర్యం:** అని అకంపనుడు అడిగిన వెంటనే మహాత్ముడైన నారదమహర్షి దయాళువై ఈ విధంగా చెప్పాడు.'బంధు మరణానికి కలిగే దుఃఖాన్ని పోగొట్టే మృత్యువు యొక్క వృత్తాంతాన్ని వినటం శుభప్రదం. నీవు శ్రద్ధాసక్తులతో వినుము. చెప్పుతున్నాను. బ్రహ్మ ప్రాణికోటిని సృష్టించి ఆ ప్రాణికోటికి సంహారం లేకపోవటంతో అది భూమికి భారమైంది. ఎట్లా ఈ భారాన్ని నివారించటమా? అని ఆలోచించి చింతతో అందుకు తగిన సాధనం అగుపించక కోపించగా, అతడి ఇంద్రియాలనుండి మంటపుట్టి అన్నివైపులా వ్యాపించి జీవ, నిర్జీవ ప్రపంచాన్నంతా దహించటానికి పూనుకొన్నది. అపుడు లోకాల మేలు కొరకు శివుడు బ్రహ్మను శరణువేడగా, అతడు పరమశివుడిని చూచి ఎంతో మన్ననా, దయా కలవాడై.

**క. 'నీ కోరికి యప్రతిహత। మే కార్యముc గోరి వచ్చి తెతిcగింపు మమే**
**యాకార! కామహర! యది। సేకొని యీక్షణమ యేను జేసెద' ననుడున్. 161**

**ప్రతిపదార్థం:** నీ+కోరికి= నీయొక్క ఇచ్ఛ; అప్రతిహతము= అనివార్యం (అడ్డం చెప్పరానిది); ఏ కార్యము= ఏమి పని; కోరి= ఇష్టపడి; వచ్చితి(వి)= వచ్చావు?; అమేయ+ఆకార!= తెలిసికొనటానికి శక్యంకాని (లేదా పరిమితం కాని) ఆకారం కలవాcడా!; కామహర!= మన్మథుడిని హరించినవాడా!; ఎఱిcగింపుము= తెల్పుము అది= నీవు కోరిన ఆ కార్యం; చేకొని= గ్రహించి; ఈ క్షణము+అ= ఇప్పుడే; ఏను= నేను; చేసెదన్= నిర్వర్తిస్తాను; అనుడున్= అన చెప్పిన వెంటనే.

**తాత్పర్యం:** తెలిసికొనటానికి వీలుకాని స్వరూపం కలవాడా! మన్మథుడిని దహించినవాడా! పరమశివా! నీ ఇచ్ఛ అనివార్యం. అడ్డు చెప్పరానిది. ఏ పని ఆశించి మీరు వచ్చారో చెప్పండి. వెంటనే ఆ పని నేను చేస్తాను' అన్నాడు. బ్రహ్మదేవుడు. ఆ విధంగా అనిన అనంతరం. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అభవుc డిట్టు లనియె 'నఖిల సృష్టిక్రియా। కర్త వగుట నీవ కలుగc జేయc**
**గలిగి భూతకోటి యెలమిc బొందcగc గోప। మెత్తి రూపుమాప నేల యిపుడు? 162**

**ప్రతిపదార్థం:** అభవుcడు= ఈశ్వరుడు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు; అఖిల, సృష్టి, క్రియా, కర్తవు+అగుటన్= సమస్తమైన సృష్టియొక్క కార్యాన్ని చేసేవాడవు కావటం చేత; ఈవు+అ= నీవే; చేయన్+కలిగి= సృష్టి చేయటానికి సమర్థత ఉండి; భూతకోటి= ప్రాణిప్రపంచం; ఎలమిన్= సంతోషాన్ని; పొందcగన్= పొందుతూ ఉండగా; ఇపుడు= ఈ సమయంలో; కోపము+ఎత్తి= కోపం పూని (కోపాన్ని ప్రసరింపజేసి); రూపుమాపన్+ఏల?= సంహారం చేయటం ఎందుకు? (నశింపచేయటం లేదా చంపటం ఎందుకు?)

**తాత్పర్యం:** శివు డీ విధంగాఅన్నాడు: 'సమస్తసృష్టినీ చేయగలిగిన నీవు ప్రాణికోటి సంతోషాన్ని పొందుతూ ఉండగా ఎందుకు కోపం పూని నశింపజేస్తున్నావు?

**విశేషం:** సృష్టించినవాడే సంహారం గావించటం సమంజసంగా లేదు అని అంటూ సంహార కారకుడుగా భావింపబడే శివుడే సంరక్షణ చేయటానికి సముద్యుక్తుడు కావటం ఇందులోని విశేషం.

**వ. నాకుంగా 'లోకంబులం గరుణాలోకంబున నా(వ)దరింపు' మనిన విని యంబుజాసనుండు 'నాయందుఁ గోపంబును గామంబును లేవు; వినుము! ప్రజాభారపీడితయైన భూమిదేవి దన డప్పి యెఱింగించినం దదీయహితంబు సేయం బూని సంహారంబు గావించువాఁడనైదానికి నుపాయంబు విచారించి, యెద్దియుం గాననైతి; నది కారణంబుగా నన్నుఁ గ్రోధంబు వొందె' ననవుడు భూతనాథుండు. 163**

**ప్రతిపదార్థం:** నాకున్ కాన్= నా కోసంగా; లోకంబులన్= (నీచే సృష్టించబడ్డ ఈ లోకాన్ని); కరుణా+ఆలోకంబునన్= దయాదృష్టితో; ఆదరింపుము= అనుగ్రహించుము; అనినన్= అనగా; అంబుజ+ఆసనుండు= పద్మం ఆసనంగా కలవాడైన బ్రహ్మ; విని; నాయందున్= నాలో; కోపంబును= క్రోధమున్నూ; కామంబును= కోరికయున్నూ; లేవు; వినుము; ప్రజా, భార, పీడిత+ఐన+భూమిదేవి= జనం (సంతతి) యొక్క బరువుచేత; పీడింప (బాధింప) బడేది అయిన భూదేవి; తన, డప్పి= తన శ్రమ; ఎఱింగించినన్= తెలుపగా; తదీయ హితంబు= ఆమెయొక్క మేలు; చేయన్+పూని= చేయటానికి ప్రయత్నించి; సంహారంబు+కావించువాఁడను+ఐ= చంపటం చేస్తూ ఉండేవాడిని; దానికిన్= అందుకు; ఉపాయంబు+విచారించి= ఉపాయాన్ని ఆలోచించి; ఎద్దియున్= దేనినీ; కానన్+ఐతిన్= చూడలేకపోయాను; అది కారణంబుగాన్= ఆ కారణంచేతనే; క్రోధంబు= కోపం; నన్నున్= నన్ను; పొందెన్= చేరింది; అనవుడున్= అనిన వెంటనే; భూతనాథుండు= శివుడు.

**తాత్పర్యం:** నా కొరకైనా నీవు ఈ లోకాలను దయతో అనుగ్రహించాల్సింది' అని శివుడు అడుగగా, బ్రహ్మ 'నాలో నిజానికి కోపంగానీ, మరే కోరికగానీ లేవు. వినుము. నా సృష్టివలన కలిగిన ప్రజయొక్క భారాన్ని మోయలేక శ్రమపడే భూదేవి తన బాధను తెలుపగా ఆమె మేలుకోరి సంహారం చేస్తూ ఉన్నాను. ఎంత ఆలోచించినా ఏదీ ఉపాయం కనిపించటంలేదు. ఆ కారణం చేతనే కోపం వచ్చి నన్ను చేరింది' అనగా, ఆ మాటలు వినిన వెంటనే శివుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'నాకుంగా' - భూతనాథుడు అనే ప్రయోగాలు ఎంతో అర్థవంతంగా, ఔచిత్యస్ఫోరకంగా కూర్చబడ్డాయి. 'ఆవరింపు' అనే ప్రయోగం కన్నా 'ఆదరింపు' అన్నదే అర్థవంతం, నిజానికి బ్రహ్మలో కామక్రోధాలు లేవు కాని, భూదేవి మేలు కోరి తాను సంహారానికి పూనుకొన్నానని బ్రహ్మ శివుడికి చెప్పటం ఈ వచనంలోని విశేషం.

**ఉ. 'అనఘవిచార! నీ వరయు మన్నఁ దగం గడు నిష్ఠ లోక పా**
**లన మొనరింతుఁ గాన యనలం బయి నీ దగు నల్క లోక ము**
**న్మునుమిడి కాల్పఁ జొచ్చినఁ గనుంగొని యేఁగృప పుట్టి చెప్పెదం**
**జనునె మహోగ్రకోపవివశత్వము నీకుఁద్రిలోకనాయకా! 164**

**ప్రతిపదార్థం:** అనఘ విచార!= పాప రహితమైన ఆలోచనకలవాడా!; నీవు+అరయుము+అన్నన్= నీవు రక్షింపు మనగా; తగన్= తగునటుల; కడునిష్ఠన్= మిక్కిలి నిష్ఠతో; లోకపాలనము= లోకాలను పాలించటం; ఒనరింతున్+కాన= కావిస్తున్నాను కాబట్టే అనలంబు+అయి= నిప్పై; నీది+అగు+అల్కన్= నీదైన కోపంతో; లోకమున్= లోకాన్ని; మునుము+ఇడి+కాల్పన్= వరుసపెట్టి కాల్చటానికి; చొచ్చినన్= పూనుకొనగా; కనుంగొని= చూచి; ఏన్= నేను; కృప+పుట్టి= దయకలిగి; చెప్పెదన్= చెప్పుతూ ఉన్నాను; త్రిలోకనాయకా!= మూడు లోకాలకు ప్రభువైనవాడా!; మహా+ఉగ్ర, కోప, వివశత్వము= (మిక్కిలి)గొప్ప భయంకరమైన క్రోధంతో వశం తప్పిపోవటం; నీకున్= నీకు; చనునె!= తగునా!

**తాత్పర్యం:** 'పాపరహితమైన ఆలోచన కలవాడా! నీవు రక్షింపు మనగా తగునట్లు మిక్కిలి నిష్ఠతో లోకాన్ని పాలిస్తున్నాను కాబట్టే నీ కోపంతో నిప్పై లోకాన్ని వరుసపెట్టి కాల్చటానికి పూనుకోగా చూచి, నేను దయ కలిగి చెబుతూ ఉన్నాను. ముల్లోకాలకు ప్రభువైన వాడా! భయంకరమైన కోపంతో వశం తప్పిపోవటం నీకు తగునా?

**వ. చరాచరంబు లన్నియు నొక్కపెట్ట భస్మీభూతంబులు సేయ నేల? ధరణీభారంబు వాయుటకై యుచిత సంహారంబు గలుగునట్లుగ నొండుదెఱంగు దలంపుము; కోపం బుపసంహారింపు; మివ్వరంబు నా కొసంగు' మనవుడు నిహత పాపకళంకుండైన యా శంకరు పలుకులకు నతం డయ్యలుక నడంచిన నయ్యనలం బాఱుటయును భువనంబులు ప్రమోదంబు నొంది యా శంకర శతానందుల నభినందించె; నట్లు క్రోధోపశమనం బాచరించు సమయంబున. 165**

**ప్రతిపదార్థం:** చరాచరంబులు= తిరుగునవి, తిరుగనివి (జీవ-నిర్జీవములు అజడములు జడములు); అన్నియున్= అన్నీ; ఒక్కపెట్ట= ఒక్కుమ్మడిగా; భస్మీభూతంబులు+చేయన్+ఏల?= బూడిద చేయటం ఎందుకు?; ధరణీభారంబు+పాయుటకై= భూమియొక్క భారాన్ని తొలగించటానికై; ఉచితసంహారంబు= తగు విధంగా మితంగా వినాశం; కలుగునట్లుగన్= కలిగేటట్లు; ఒండుతెఱంగు= మరొకక్రమం (పద్ధతి); తలంపుము= యోచించుము; కోపంబు+ఉపసంహరింపుము= కోపాన్ని అణచుకొమ్ము (మరలించుము); ఈ+వరంబు= ఈ వరాన్ని; నాకున్+ఒసంగుము= నాకు ఇమ్ము; అనవుడున్= అనిన వెంటనే; నిహత, పాప, కళంకుండు+ఐన= నిర్మూలించబడ్డ పాపం యొక్క మచ్చ కలవాడైన; ఆ+శంకరు= ఆ పరమేశ్వరుడి; పలుకులకున్= మాటలకు; అతండు= ఆ బ్రహ్మ; అలుకన్= కోపాన్ని; అడంచినన్= అణచివేయగా; ఆ+అనలంబు= ఆ అగ్ని; ఆఱుటయును= నశించటమున్నూ; భువనంబులు= లోకాలు; ప్రమోదంబున్+ఒంది= సంతోషాన్ని పొంది;ఆ+శంకర, శతానందులన్= ఆ శివుడినీ, బ్రహ్మనూ; అభినందించెన్= పొగిడాయి; అట్లు= ఆ విధంగా; క్రోధ+ఉపశమనంబు= కోపాన్ని అణచివేయటం; ఆచరించు+సమయంబునన్= చేసిన సందర్భంలో.

**తాత్పర్యం:** ఎందుకిట్లా ఒక్కుమ్మడిగా చరాచరజగత్తును బూడిదచేయటం? భూభారం తొలగటానికి తగిన సంహారకార్యం మరొక్కటి ఆలోచించుము. కోపాన్ని వదలిపెట్టుము' అని పరమశివుడు పలికాడు. పాపకళంకం తొలగిన ఆ శివుని మాటలతో బ్రహ్మ తన కోపాన్ని అణచుకొన్నాడు. అగ్గి ఆరిపోయింది. లోకాలు సంతోషించి బ్రహ్మనూ పరమేశ్వరుడినీ కీర్తించాయి.

**విశేషం:** 'కోపాన్ని ఉపసంహరించు' మని శంకరుడు అడిగాడు. శతానందుడు క్రోధాన్ని ఉపశమింపజేశాడు. ఇక్కడ శంకరుడు అనగా సంతోషాన్ని కలిగించేవాడు అట్లా శతానందుడు శబ్దంలో కూడా ఆనందం కలిగించే వాడు అనే అర్థం ప్రస్ఫుటం. లోకాలకు ఆనందం కలిగించిన సందర్భంలో ఈ ఇరువురినీ తిక్కన ఇట్లా పేర్కొనటం ఎంతో ఔచిత్యవంతంగా ఉన్నది.

**సీ. కమలాసనుని యింద్రియముల రక్తాస్యయు । నసితాంగియును నరుణాంబరయును**
**నగు నింతి జనియించి యల్లన నగుచుఁ గెం । జాయ రంజిల్లు లోచనము లలర**
**నా జగన్నాథుల నలవోకవోలెఁ గ । న్గొని దక్షిణమునకుఁ జన నజుండు**
**మెలపుతో 'మృత్యువ! మృత్యువ! యెట వోయెదె?' । దని పలుమాఱు సాంత్వనము దోఁపఁ**

**తే. బిలిచి 'సంహారబుద్ధి నా కొలయఁ బొడము । కనలునం దుద్భవించితి గాన నీవు**
**దొడరి (గి) వాసి లేకెల్ల జంతువుల సంహ । రింపు నా పంపుమై; నీకుఁ బెంపు గలదు.' 166**

**ప్రతిపదార్థం:** కమల+ఆసనుని= బ్రహ్మయొక్క; ఇంద్రియములన్= ఇంద్రియాల నుండి; రక్త+ఆస్యయున్= ఎఱ్ఱటి ముఖం కలదియున్నూ; అసిత+అంగియునున్= నల్లటి అవయవాలు కలదియున్నూ; అరుణ+అంబరయునున్= ఎఱ్ఱటి వస్త్రాలు కలదియున్నూ; అగు+ఇంతి= ఐన స్త్రీ; జనియించి= పుట్టి; అల్లనన్= మెల్లగా; నగుచున్= నవ్వుతూ; కెంజాయ+రంజిల్లు= ఎఱ్ఱటి రంగుతో ప్రకాశించే; లోచనములు+అలరన్= కళ్ళు వికసించగా; ఆ జగన్నాథులన్= ఆ లోక నాయకులను; అలవోక+పోలెన్= (లీలవలె) నిర్లక్ష్యంగా; కన్గొని= చూచి; దక్షిణమునకున్= దక్షిణంవైపు; చనన్= పోగా; అజుండు= బ్రహ్మ; మెలపుతోన్= నేర్పుతో;

మృత్యువ!, మృత్యువ!= ఓ మృత్యువా! మృత్యువా!; ఎట+పోయెదు?= ఎక్కడికి పోతావు; అని= ఆ ప్రకారంగా; పలుమారు= అనేక పర్యాయాలు; సాంత్వనము+తోఁపన్= ఓదార్పు తోచేటట్లుగా; పిలిచి= ఆహ్వానించి; నాకున్= నాకు; సంహారబుద్ధి= వినాశం చేయాలనే సంకల్పం; ఒలయన్= కలుగగా; (ప్రవేశించగా); పొడము+కనలునందున్= పుట్టిన కోపం నుండి; ఉద్భవించితి(వి)= పుట్టావు; కానన్= కాబట్టి; నీవు; తొడగి= యత్నించి(పూని); వాసిలేక= తారతమ్యం(భేదం) లేకుండా; ఎల్ల జంతువులన్= అన్ని ప్రాణులనూ; నా పంపుమైన్= నా ఆజ్ఞచేత; సంహరింపు(ము)= నాశనం గావించుము; నీకున్= నీకు; పెంపు= గౌరవం; కలదు= కలుగుతుంది.

**తాత్పర్యం:** బ్రహ్మదేవుడి ఇంద్రియాల నుండి ఎర్రటి మొగంతో, నల్లటి అవయవాలతో, ఎర్రటి వస్త్రంతో ఒక స్త్రీ జన్మించి, మెల్లగా నవ్వుతూ ఎర్రబారిన కళ్ళతో ఆ లోకనాయకులను చూచి, నిర్లక్ష్యభావంతో దక్షిణంవైపు పోసాగింది. అప్పుడు బ్రహ్మ ఆమెను ఓదార్చుతూ మృత్యువా! మృత్యువా! అని నేర్పుగా పిలిచి, 'సంహరించే సంకల్పం నాలో కలిగినప్పుడు ఆ కోపంనుండి నీవు పుట్టావు కాబట్టి, తారతమ్యం లేకుండా అన్ని ప్రాణులను సంహరించుము. నా ఆజ్ఞతో చేసే ఈ పనివలన నీకు గౌరవం సిద్ధిస్తుంది.'

**వ. అనిన విని మృత్యుదేవత దుఃఖిత యయినం గన్నీరు దొరంగె; నయ్యశ్రుబిందువులు పద్మజుండు పాణిపుటంబునం బట్టి లోకహితార్థంబుగా ననేకభంగుల ననునయించిన, నక్కాంత గాడ్పున నల్లాడు తీఁగ తెఱంగునం జలించి, యంజలి ఘటించి య వ్విరించి కి ట్లనియె. 167**

**ప్రతిపదార్థం:** అనినన్= అని బ్రహ్మ చెప్పగా; విని; మృత్యుదేవత= మృత్యువు; దుఃఖిత+అయినన్= దుఃఖించింది కాగా; కన్నీరు తొరంగెన్= కన్నీరు కారింది; ఆ+అశ్రుబిందువులు= ఆ కన్నీటి చుక్కలు; పద్మజుండు= బ్రహ్మ; పాణి+పుటంబునన్= దొప్పవంటి చేతిలో; పట్టి= పట్టుకొని; లోక హితార్థంబుగాన్= లోకం యొక్క మేలు కొఱకుగా; అనేక భంగులన్= వివిధ విధాలుగా; అనునయించినన్= ఓదార్చగా; ఆ+కాంత= ఆ స్త్రీ; గాడ్పునన్= గాలిచేత; అల్లాడు= మిక్కిలిగా కదలు; తీఁగ+తెఱంగునన్= తీగవలె; చలించి= కదలిపోయి; అంజలి ఘటించి= చేతులు జోడించి; ఆ+విరించికిన్= ఆ బ్రహ్మ దేవుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పింది.

**తాత్పర్యం:** అనగా విని మృత్యుదేవత శోకించగా కన్నీరు కారింది. ఆ కన్నీటి బిందువులను బ్రహ్మ చేతిలో పట్టి లోకశ్రేయస్సు నుద్దేశించి ఆమెను పలురకాలుగా ఓదార్చాడు. ఆమె గాలికి కదలాడే తీగవలె వణకుతూ చేతులు జోడించి ఆ బ్రహ్మతో ఇట్లా అన్నది:

**తే. 'నీవు సృజియించి తటె నన్ను దేవదేవ! । యేను గ్రూరకర్మములకు నెట్టు లోర్తు?**
**బంధు మరణ శోకార్తులై పనవు జనుల । వివిధ భంగుల యెలుఁగులు వినఁగఁ జాల. 168**

**ప్రతిపదార్థం:** దేవదేవ!= (దైవాలకు దైవమైన ఓ మహానుభావా!) బ్రహ్మదేవా!; నన్నున్= నన్ను; నీవు; సృజియించితి(వి)+అటె!= సృష్టించావటకదా!; ఏను= నేను; క్రూరకర్మములకున్= నొప్పించే (దయలేని) పనులకు; ఎట్టులు= ఏ విధంగా; ఓర్తున్?= సహించగలను?; బంధు,మరణ,శోక+ఆర్తులు+ఐ= చుట్టాల చావు వలన దుఃఖంతో ఆర్తిచెందిన వాళ్ళయి; పనవు= ప్రలాపించే (మిక్కిలిగా దుఃఖించే); జనుల= ప్రజల; వివిధ భంగుల+ఎలుఁగులు= రకరకాల కంఠధ్వనులు (ఆర్తనాదాలు); వినఁగన్+చాలన్= వినలేను.

**తాత్పర్యం:** 'ఓ దేవదేవా! నీవు నన్ను పుట్టించినావటగా! నేను దయమాలిన పనులకు ఎట్లా ఓర్చుకొనగలను? చుట్టాల (మరణానికి) చావుకు మిక్కిలి మానసిక దుఃఖంతో ఆర్తులైన వాళ్ళు, చచ్చిపోయిన బంధువులను మాటిమాటికి స్మరిస్తూ చేసే రకరకాల ఏడ్పులతోడి కంఠస్వరాలు నేను వినజాలను.

**వ. ఈ యధర్మంబునకు వెఱతు; నీవు నా మీఁదఁ గృపసేయు; మిట్లు నన్నుం బనుపక తపశ్చరణంబునకుం బనుపవలయు; నివ్వరం బిమ్ము; భవదనుజ్ఞ వడసి ధేనుకాశ్రమంబునకుం జనియెద' నని పలికినం బరమేష్ఠి య న్నీరజాక్షి నిరీక్షించి. 169**

**ప్రతిపదార్థం:** ఈ+అధర్మంబునకున్= (ఈ ధర్మవిరుద్ధ కార్యానికి) ఈ పాపానికి; వెఱతున్= భయపడుతూ ఉన్నాను; నీవు; నామీఁదన= నాపై; కృప+చేయుము= దయచూపుము; ఇట్లు= ఈ విధంగా; నన్నున్= నన్ను; పనుపక= పంపక (నియోగించక) తపస్+చరణంబునకున్= తపస్సు చేసికొనటానికి; పనుపవలయున్= పంపాలి; ఈ+వరంబు+ఇమ్ము= ఈ వరం ఇమ్ము; భవత్+అనుజ్ఞ= నీ యొక్క అనుమతి; పడసి= పొంది; ధేనుక+ఆశ్రమంబునకున్= ధేనుక అనే పేరుగల ఆశ్రమానికి; చనియెదన్= పోతాను; అని= ఆ ప్రకారంగా; పలికినన్= మాటాడగా; పరమేష్ఠి= బ్రహ్మ; ఆ+నీరజాక్షిన్= కమలాలవంటి కన్నులు గలదైన ఆ స్త్రీని; నిరీక్షించి= చూచి.

**తాత్పర్యం:** ఈ ధర్మంకాని పనికి జంకుతాను. నామీద దయయుంచి ఈ పనికి నన్నుపంపకుండా తపస్సు చేయటానికి పంపుము. నాకీ వరం ఇమ్ము. నేను ధేనుకాశ్రమానికి వెళ్ళుతాను' - అని అనగా బ్రహ్మ ఆమెను చూచి.

**సీ. 'నినుఁ బ్రజా సంహారమునకునై కల్పించి । నాఁడఁ గావున నీ మనంబునందుఁ**
**బొడమిు విచారంబు నుడిగింపు; మిట్లు గాఁ । గలయది యైన యిక్కార్యమునకు**
**నన్యథాత్వం బేల యగుఁ? బ్రజా సంహర । ణము ననిందిత సమయముగఁ జేయు**
**మీ వవశ్యంబును' నావుడుఁ గడుభయం । బున నప్పటికి నియ్యకొని మృగాక్షి**

**తే. నలువ వదనంబు సూచుచు నిలిచె; నతఁడు । ప్రీతుఁడై లోకములఁ గృప పెంపుతోడి**
**దృష్టిఁ గనుఁగొన నవి పరితుష్టిఁ బొందెఁ । జంద్రమౌళియుఁ దన యిచ్చఁ జనియెఁ బ్రీతి. 170**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; ప్రజాసంహారమునకున్+ఐ= ప్రజల (ప్రాణుల) యొక్క వినాశానికై; కల్పించినాఁడన్= కలిగించాను; కావునన్= కాబట్టి; నీ+మనంబునందున్= నీ మనస్సులో; పొడము= పుట్టే; విచారంబున్= సంతాపాన్ని (ఆలోచనను లేదా సందేహాన్ని); ఉడిగింపుము= మానివేయుము (అణచివేయుము); ఇట్లుకాన్= ఈ విధంగానే; కల+అదియైన= జరగవలసిందైన; ఈ+కార్యమునకున్= ఈ పనికి; అన్యధాత్వంబు= మరొకవిధంగా కావటం; ఏల+అగున్?= ఎందుకౌతుంది?; ప్రజాసంహరణమున్= ప్రాణి సంహారాన్ని (జన వినాశనాన్ని); అనిందిత+సమయముగన్= నిందించబడని (దూషించబడని) ఆజ్ఞగా; ఈవు= నీవు; అవశ్యంబును= తప్పకుండా; చేయుము= ఆచరించుము; నావుడున్= అనగానే; కడు+భయంబునన్= మిక్కిలి భీతితో; మృగ+అక్షి= జింకకన్నుల వంటి కన్నులు కలిగిన ఆ మృత్యువు; అప్పటికిన్= ఆ సమయానికి; ఇయ్యకొని= సమ్మతించి(ఒప్పుకొని); నలువ వదనంబున్= బ్రహ్మముఖాన్ని; చూచుచున్= చూస్తూ; నిలిచెన్= నిలిచింది; అతడు= ఆ బ్రహ్మ; ప్రీతుఁడు+ఐ= సంతోషించినవాడై; లోకంబులన్= లోకాలను; కృప పెంపు తోడి దృష్టిన్= దయయొక్క అతిశయంతోడి చూపుతో; కనుఁగొనన్= చూడగా; అవి= ఆ లోకాలు; పరితుష్టిన్= మిక్కిలి సంతృప్తిని; పొందెన్= పొందాయి; చంద్రమౌళియున్= శివుడున్నూ;తన+ఇచ్ఛన్= తన కోరిక మేరకు; ప్రీతిన్= సంతోషంతో; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** నిన్ను జన వినాశానికై నేనే కల్పించాను. కాబట్టి నీ మనస్సులో కలిగే విచారాన్ని విడువుము. ఇది ఈ విధంగా జరగవలసి ఉన్న పని. దీనికి విరోధం ఎందుకు ఏర్పడుతుంది? జన వినాశాన్ని నిందలేని ఆజ్ఞగా నీవు తప్పకుండా నిర్వర్తించాలి' అని అనగానే మృత్యువు మిక్కిలి భీతితో ఆ సమయానికి సరే అని ఒప్పుకొని,

బ్రహ్మ మొగాన్ని చూస్తూ అట్లే నిలిచిపోయింది. అందుకు బ్రహ్మ సంతోషించాడు. లోకాల నన్నింటినీ ఎంతో దయగల చూపుతో చూడగానే అవి ఎంతో సంతృప్తిచెందాయి. పరమేశ్వరుడున్నూ మనస్సులో ఎంతో సంతోషించి మరలివెళ్ళాడు.

**విశేషం:** ఇందులో మృగాక్షి అనే పదం సాభిప్రాయం. మృత్యువు మిక్కిలి భీతితో ఉన్న సందర్భం. కాబట్టి ఆ సందర్భంలో ఆమె చూపులు కూడా జింకచూపుల వలె మిక్కిలి సంచలించాయి అని ధ్వని. సంచలించే చూపులు నలుదిక్కులూ చూస్తాయి. కాబట్టి 'నలువ' అనే ప్రయోగం కూడా ఔచిత్యస్ఫోరకం. చంద్రుడు ఆహ్లాదకారి.అతడిని నెత్తిమీద పెట్టుకొన్న శివుడు కూడా లోకాలకు ఆహ్లాదాన్ని కలిగించాలనే ఉద్దేశంతోనే నలువ దగ్గరకు వచ్చాడు. వచ్చిన పని సానుకూలం కావటంతో అతడు కువలయానందకరుడై శంకరుడై మరలివెళ్ళాడు.

**వ. మృత్యుదేవియుం బరమేష్ఠికిం బ్రణమిల్లి. 171**

**తాత్పర్యం:** మృత్యుదేవత కూడా బ్రహ్మకు నమస్కరించి.

**తే. అచటు వాసి రయంబున నరిగి ధేను । కాశ్రమంబున నియమంబు లాచరించి**
**నందకౌశికి యనియెడు నదులఁ బెక్కు । వ్రతము లొనరించి మఱియుఁ దీర్థముల నెల్ల. 172**

**ప్రతిపదార్థం:** అచటు+పాసి= ఆ ప్రదేశం విడిచి (తొలగి); రయంబునన్= వేగంతో; అరిగి= పోయి; ధేనుక+ఆశ్రమంబునన్= ధేనుకాశ్రమంలో; నియమంబులు+ఆచరించి= వ్రతనిష్ఠలు చేసి; నంద+కౌశికి+అనియెడు+నదులన్= నంద, కౌశికి అనే పేర్లుగల నదులలో; పెక్కు వ్రతములు+ఒనరించి= అనేకములైన (ఉపవాసాది పుణ్యకార్యాలు) నోములు నోచి; మఱియున్= ఇంకా; ఎల్ల+తీర్థములన్= అన్ని పుణ్యక్షేత్రాలలో (మహర్షులు స్నానం చేసే పుణ్యోదక స్థలాలలో).

**తాత్పర్యం:** వెంటనే మృత్యువు ఆ ప్రదేశం విడిచి ధేనుకాశ్రమంలో ఎన్నో వ్రతాలు చేసి, నంద, కౌశిక అనే నదులలో అనేక పుణ్యకార్యాలు చేసి, ఇంకా చాలా పుణ్యక్షేత్రాలలో (తీర్థాలలో).

**విశేషం:** శుంభ నిశుంభులను చెండాడేందుకు గౌరి నుండి పుట్టిందే కౌశికి. శుంభనిశుంభాది రాక్షసులను తునుమాడినతర్వాత నదీ రూపంలో వెలసింది. నంద - అంటే ఆనందాన్ని కలిగించేది. వ్రతాలు నిర్వహించటానికి కౌశికి, నంద అనే రెండు నదులూ ఎంతో అనుకూలంగా ఉన్నట్లు - అక్కడ చేసిన వ్రతాలు త్వరలో ఫలిస్తాయి అని సూచన.

**వ. అద్దేవు నుద్దేశించి పెద్దకాలం బనేక విధంబుల దుష్కరంబులగు తపంబులు సేయుచుం బోయి హిమశైల శిఖరంబున సంయతాత్మయై యున్నఁ, జతురానను౦ డమ్మానినికిం బొడసూపి, 'మృత్యువ! నీ వత్యంతనిష్ఠుర నిష్ఠా నియమంబు లేల యనుష్ఠించెద?' వనిన నయ్యంగన 'సమాధానంబున నున్న ప్రజల మెడలు నులిచి చంపంజాల; నన్ను నీ పనికిం బంపకు; మధర్మభయంబున ని న్నాశ్రయించెద; నార్తనైన నాకు శరణంబ వగు' మని ప్రణమిల్లిన నతం డి ట్లనియె. 173**

**ప్రతిపదార్థం:** ఆ+దేవున్+ఉద్దేశించి= ఆ దైవాన్ని గురించి; పెద్దకాలంబు= చాలాకాలం; అనేకవిధంబులన్= పెక్కురకాల; దుష్కరంబులు+అగు+తపంబులు= చేయశక్యంకాని అనగా కఠినములైన తపస్సులు; చేయుచున్= చేస్తూ; పోయి= చని; హిమశైల శిఖరంబునన్= హిమవత్పర్వతంయొక్క చివరిభాగంలో; చతుః+ఆననుండు= నలువ (బ్రహ్మ); పొడసూపి= కన్పించి; మృత్యువ!= ఓ మృత్యువా!; నీవు; అత్యంత, నిష్ఠుర, నిష్ఠా, నియమంబులు+ఏల?= మిక్కిలి కఠినములైన వ్రతనిష్ఠలు నియమములు ఎందుకు?; అనుష్ఠించెదవు?= నిర్వర్తిస్తున్నావు?; అనినన్= అనగా; ఆ+అంగన= ఆ మృత్యువు; సమాధానంబునన్+ఉన్న= చక్కగా ఉంటూ

ఉన్న; ప్రజల+మెడలు= జీవుల కుత్తుకలు; నులిచి= మెలిపెట్టి; చంపన్+చాలన్= చంపలేను; నన్నున్= నన్ను; ఈ+పనికిన్+పంపకుము= ఈ కార్యానికి నియోగించవద్దు; అధర్మభయంబునన్= అధర్మం వలని భీతిచేత; నిన్నున్+ఆశ్రయించెదన్= నిన్ను పొందాను; ఆర్తను+ఐన+నాకున్= (ఆర్తురాలు) దుఃఖిత అయిన నాకు; శరణంబవు+అగుము+అని= శరణం కమ్ము అని; ప్రణమిల్లినన్= నమస్కరించగా; అతండు= ఆ బ్రహ్మ; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దైవాన్ని ఉద్దేశించి పెక్కురీతుల కఠిన తపస్సులు చేస్తూ హిమవత్పర్వత శిఖరం మీద నియమనిష్ఠలతో ఉండగా, బ్రహ్మదేవుడు ఆమెకు ప్రత్యక్షమై, 'ఓ మృత్యువా! నీవెందుకు కఠిన నియమనిష్ఠలతో తపస్సు చేస్తున్నావు?' అని అడిగాడు. ఆమె ఇట్లా అన్నది: 'సుఖంగా ఉన్న ప్రజల మెడలు నులిమి చంపలేను. న న్నీ పనికి పంపబోకండి. అధర్మ భయంతో నిన్ను శరణువేడుతున్నాను. ఆర్తురాలను నన్ను కరుణించుము' అని నమస్కరించింది. అప్పు డా బ్రహ్మ మృత్యువుతో ఇట్లా అన్నాడు:

**ఆ. 'ఇంతి! నీ కధర్మ మేల యయ్యెడు? నాదు । పనుపు సేయ నిన్నుఁ బరమధర్మ**
**మొందు, విమల కీర్తియును జెందు; నట్లుగా । వరము లిత్తు మేను హరుఁడు నీకు. 174**

**ప్రతిపదార్థం:** ఇంతి!= ఓ స్త్రీ! (మృత్యువా! అని సంబోధన); అధర్మము= ధర్మవిరుద్ధం, లేక పాపం; నీకున్= నీకు; ఏల+అయ్యెడున్?= ఎందుకు అవుతుంది?; నాదు+పనుపు= నా ఆజ్ఞ; చేయన్= నిర్వర్తించగా (ఆచరింపగా); నిన్నున్= నిన్ను; పరమ+ధర్మము+ఒందున్= ఉత్కృష్టమైన ధర్మమే పొందుతుంది; విమలకీర్తియును= నిర్మలమైన యశస్సున్నూ; చెందున్= కలుగుతుంది; అట్లుగాన్= అట్లా అయ్యేటట్లు; ఏను= నేనూ; హరుఁడున్= శివుడూ; నీకున్= నీకు; వరములు+ఇత్తుము= వరాలు ఇస్తాం.

**తాత్పర్యం:** ఓ మృత్యుదేవతా! నీ కిది అధర్మం ఎందు కౌతుంది? నా ఆజ్ఞ నిర్వర్తించటం వలన నిన్ను ధర్మమే పొందుతుంది. నీకు దీనివలన నిర్మలమైన యశస్సుకూడా కలిగేటట్లు నేనూ, శివుడూ వరాలు ఇస్తున్నాం.

**విశేషం:** 'ఇంతి' అని మృత్యుదేవతను బ్రహ్మ సంబోధిస్తూ, 'ప్రజల మెడలు నులిచి చంపుట' పాపకార్యం కాదని, అది పరమధర్మమై విమలకీర్తి కలిగిస్తుంది. అని తెల్పిన విషయం- ఆటవెలది ఛందస్సులో తిక్కన వివరించటం సందర్భసముచిత ఛందశ్శిల్ప పారీణతకు చక్కని నిదర్శనం.

**వ. ఏ మనుసంధించిన పనికి నీకు భయం బేల? చతుర్విధ భూతకోట్ల నుపసంహరింపు ' మనిన నత్తన్వి 'దేవా! దేవర యాజ్ఞ దలమోచి చేయుదానం గాక! యొక్క విన్నపం బవధరింపుము; లోభంబును గ్రోధంబును నీర్ష్య యు నసూయయు కలిగించి జంతువుల శరీరంబుల వికృతిం బొందింపవలయు' ననవుడు నతం డట్ల యయ్యెడు; నదియునుంగాక నీ యశ్రుబిందువు లెన్ని యన్నియు రోగంబులై జనంబులం జావం జేయంగలయవి; దానం జేసి యధర్మంబు నిన్నుం బొరయనేరదు; ప్రాణి మారణంబు నీకుం బరమధర్మంబగు; భవదీయశుభం బేను గోరెద; నీవు ధర్మస్వరూపంబ; వీ విశ్వంబునకు నీశ్వరి; వట్లు గావునఁ బ్రాణ సంయమనంబు భవదధీనంబు; సర్వజీవులయెడం గామరోషంబు లుడిగి జీవంబుల నాకర్షింపుము; తత్ప్రకారంబు ధర్మతత్త్వంబు; నీకు భయం బేమి? మిథ్యావర్తనుల నధర్మంబ సమయించుఁ బో' మ్మనిన నమ్మానిని శాపభీతిని దన్ను నధర్మంబు వొంద దనుమాటను దన్నియోగం బంగీకరించె; నవ్విరించి వచనంబుల తెఱంగున నాధివ్యాధులు గాత్రహానిం జేయ నా మృత్యుదేవత ప్రాణాపహారిణి యగుటం బ్రాణంబులు దేహంబులం బాసి, దేవాదిభావంబులం బొందుచు మగుడ మనుష్యత్వంబు నొందుచుండు. 175**

**ప్రతిపదార్థం:** ఏము= నేనూ, పరమేశ్వరుడూ; అనుసంధించిన+పనికిన్= నియమించే కార్యానికి; నీకున్+భయంబు+ఏల?= నీకు జంకు ఎందుకు?; చతుః+ విధ+భూతకోట్లన్= నాలుగు రకాల ప్రాణిసమూహాలను; ఉపసంహరింపుము= సంహరించుము; అనినన్= అనగా; ఆ+తన్వి= ఆ మృత్యువు; దేవా!= ప్రభూ!; దేవర ఆజ్ఞ= ప్రభువుయొక్క ఆనతి; తలమోచి= శిరసా వహించి; చేయుదానన్+కాక= ఆచరించేదానిని అగుదును కానీ; ఒక్క+విన్నపంబు= ఒక విజ్ఞప్తి; అవధరింపుము= వినుము; లోభంబును= అత్యాశయున్నూ; క్రోధంబునున్= కోపమున్నూ; ఈర్ష్యయున్= ఓర్వలేనితనమున్నూ; అసూయయున్= మంచి గుణాలలో దోషాన్ని ఆరోపించటమూ; కలిగించి= కలిగేటట్లు చేసి; జంతువుల శరీరంబులన్= ప్రాణుల దేహాలలో; వికృతిన్+పొందింపన్ వలయున్= వికారాన్ని కలిగించాలి; అనవుడున్= అనిన అనంతరం; అతండు= బ్రహ్మ; అట్లు+అ+అయ్యెడున్= అట్లే అగుగాక!; అదియునున్+కాక= అంతేకాకుండా; నీ అశ్రు బిందువులు= నీ కన్నీటిబొట్లు; ఎన్ని= ఎన్నో; అన్నియున్= అన్నీ; రోగంబులు+ఐ= వ్యాధులై; జనంబులన్= ప్రజలను; చావన్+చేయన్+కలయవి= చచ్చేటట్లు కావింపగలవు; దానన్+చేసి= అందువలన; అధర్మంబు= పాపం; నిన్నున్= నిన్ను; పొరయన్ నేరదు= పొందజాలదు; ప్రాణి మారణంబు= ప్రాణులను చంపటం; నీకున్= నీకు; పరమ ధర్మంబు= ఉత్కృష్టమైన ధర్మం (పుణ్యం); అగున్= అవుతుంది; భవదీయ+శుభంబు= నీ క్షేమం (మేలు); ఏను+కోరెదన్= నేను కోరుతున్నాను; నీవు; ధర్మస్వరూపంబవు= ధర్మమే మూర్తిగా ఉండేదానివి; ఈ+విశ్వంబునకున్= ఈ జగత్తుకు; ఈశ్వరివి= యజమానురాలివి; అట్లు+కావునన్= ఆ విధంగా కావటంచేత; ప్రాణ+సంయమనంబు= ప్రాణాలను బంధించటం; భవత్+అధీనంబు= నీ స్వాధీనం; సర్వ+జీవుల+ఎడన్= అన్నిప్రాణుల విషయంలో; కామ, రోషంబులు+ఉడిగి= కోరిక, కోపం విడిచి; జీవంబులన్= ప్రాణాలను; ఆకర్షింపుము= నీవైపు లాగుకొమ్ము; తద్+ప్రకారంబు= అట్లా చేయటం; ధర్మతత్త్వంబు= ధర్మంయొక్క స్వభావం (యథార్థస్థితి); తద్+ప్రకారంబు= ఆ విధం; నీకున్+భయంబు+ఏమి?= నీకు భీతి ఎందుకు?; మిథ్యావర్తనులన్= కపటంగా ప్రవర్తించేవాళ్ళను; అధర్మంబు+అ= అధర్మమే; సమయించున్+పొమ్ము= నశింపజేస్తుంది పో; అనినన్= అనగానే; ఆ+మానిని= మానవతి అయిన ఆ మృత్యువు; శాపభీతిని= శాపభయంచేత; తన్నున్= తనను; అధర్మంబు+పొందదు= పాపం కలుగదు; అనుమాటన్= అనే మాటను బట్టి; తద్+నియోగంబున్= ఆ బ్రహ్మయొక్క ఆదేశాన్ని; అంగీకరించెన్= సమ్మతించింది; ఆ+విరించి= ఆ బ్రహ్మ; వచనంబుల+తెఱంగునన్= మాటల క్రమాన్నిబట్టి; ఆధి+వ్యాధులు= మానసికరోగాలు, శారీరకములైన జబ్బులు; గాత్ర+హానిన్= శరీరానికి కీడు; చేయన్= కావించగా; ఆ+మృత్యుదేవత= ఆ మరణదేవత; ప్రాణ+అపహారిణి+అగుటన్= ప్రాణాలు తీసేది కావటం వలన; ప్రాణంబులు= ప్రాణాలు; దేహంబులన్+పాసి= శరీరాలను వదలి; దేవ+ఆది+భావంబులన్= దేవతా స్వరూపాలను; పొందుచున్= ప్రాపిస్తూ; మగుడన్= మళ్ళీ; మనుష్యత్వంబున్+ ఒందుచుండున్= మానవత్వాన్ని పొందుతూ ఉంటాయి.

**తాత్పర్యం:** 'ఇది మేము నియమించిన పని. దీనికి నీకు భయ మెందుకు? నాలుగు విధాలైన ప్రాణులసమూహాన్ని సంహరించుము' అని బ్రహ్మ చెప్పగా మృత్యుదేవత 'దేవా! నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. నా విన్నపం ఒకటి ఉన్నది ఆలకించండి. లోభక్రోధాలు, ఈర్ష్యాసూయలు ప్రాణుల దేహాన్ని వికారం చెయ్యాలి' అని అడిగింది. అందుకు బ్రహ్మ సరే! అంటూ ఇట్లా చెప్పాడు: 'నీ కన్నీటి చుక్కలన్నీ రోగాలై జననాశనం చేస్తాయి. దీనివలన నీ కే పాపమూ అంటదు. ప్రాణిసంహారం నీ పరమధర్మం. నీ శుభాన్ని నేను ఆకాంక్షిస్తున్నాను. ధర్మంయొక్క స్వరూపమే నీవు. ఈ విశ్వానికి నీవే యజమానురాలివి. కామక్రోధాలు విడిచి ప్రాణులను ఆకర్షించుము. ఇది ధర్మతత్త్వం యొక్క క్రమపద్ధతి. నీకు భయ మెందుకు? కపట ప్రవర్తన గలవాళ్ళను ఆ అధర్మమే నిర్మూలిస్తుంది' అనగానే అధర్మం తనను అంటుకోదు అనే అభయవాక్యంతో మృత్యువు, బ్రహ్మ ఆదేశాన్ని అంగీకరించింది. ఆ బ్రహ్మవాక్కులను అనుసరించి మానసికరోగం, శారీరకమైన జబ్బు (ఆధివ్యాధులు) శరీరాలకు కీడు కలిగించగా మృత్యుదేవత ప్రాణాలను అపహరించటంతో ప్రాణాలు శరీరాలను విడిచి దేవత్వాన్ని పొందుతూ మళ్ళీ మానవత్వాన్ని చేరుకొంటున్నాయి.

**విశేషం:** ఈ వచనంలో మృత్యువుయొక్క తత్త్వం దాని మహత్త్వం వివరింపబడ్డాయి. 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' అనే భగవద్గీతలోని భావం 'మగుడ మనుష్యత్వంబు నొందుచుండు' అనే తుదివాక్యంలో సూచించబడింది. సాంత్వనానికీ, ఉపదేశానికీ వచనం ఏ విధంగా అనుకూలమో ప్రస్తుత వచనభాగం నిరూపిస్తుంది.

**తే. భీమనాదుండు భీముఁ డుద్దాముఁ డప్ర । తర్క్యతేజోమయుఁడు జగత్ప్రాణుఁ డొడలు**
**మనుపఁ జెఱుపంగ నొడయండు సనుట మగుడ । నరుగుదెంచుట వింతగా దతని కెందు. 176**

**ప్రతిపదార్థం:** భీమనాదుండు= భయంకరమైన శబ్దం కలవాడూ; భీముఁడు= భయంకరమైనవాడూ; ఉద్దాముఁడు= స్వతంత్రుడూ, మరియు గంభీరుడూ; అప్రతర్క్య+తేజోమయుఁడు= తర్కించటానికి వీలుకాని పరాక్రమం కలవాడూ (అయిన); జగత్ప్రాణుఁడు= వాయువు; ఒడలున్= శరీరాన్ని; మనుపన్= కాపాడటానికీ; చెఱుపంగన్= నశింపచేయటానికీ; ఒడయండు= ప్రభువు!; చనుట= పోవుట; మగుడన్= మరలా; అరుగుదెంచుటన్= వచ్చుట; ఎందున్= ఎక్కడా; అతనికిన్= ఆ వాయువుకు; వింత+కాదు= ఆశ్చర్యం కాదు.

**తాత్పర్యం:** భయంకరంగా హోరుమని శబ్దంచేసే వాడూ, భయంకరుడూ, సర్వ స్వతంత్రుడూ, గంభీరుడూ ఊహించటానికి వీలుకాని పరాక్రమమూ తేజస్సూ కలవాడూ అయిన వాయువు ఈ శరీరాన్ని కాపాడటానికీ, నశింపజేయటానికీ సమర్థుడైన ప్రభువు. పోవటం మళ్ళీ రావటం అతడి కేమీ వింత కాదు.

**విశేషం:** జగత్ప్రాణుడైన వాయువు యొక్క స్వభావాలు నాలుగు విశేషణాలలో చెప్పబడ్డాయి. అతడు జీవకోటిలో ప్రవేశించటం నిర్గమించటం పర్యాయక్రమంగా ఆచరిస్తూ ఉన్నాడని సూచించబడింది. వాయువుకు ఎన్నో పర్యాయపదాలు ఉండగా జగత్ప్రాణుడని ప్రస్తుత సందర్భానికి సముచితంగా ఉన్న పదం ప్రయోగించటం విశేషం.

**క. నరు లమరు లగుదు, రమరులు । నరు లగుదురు; గాన నీదు నందనునకు భూ**
**వర! వగవ నేల? యతనికిఁ । జిరవీరస్వర్గ సుఖము సేకుఱి యుండున్. 177**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; నరులు= మానవులు; అమరులు+అగుదురు= దేవతలు ఔతారు; అమరులు= దేవతలు; నరులు+అగుదురు= మానవులు అవుతూ ఉంటారు; కాన= కాబట్టి; నీదు+నందనునకున్= నీ కుమారుడి కొరకై; వగవన్+ఏల?= దుఃఖించటం ఎందుకు?; అతనికిన్= నీ కొడుకైన అభిమన్యుడికి; చిర, వీర, స్వర్గ, సుఖము= శాశ్వతమైన వీరులకు లభించే స్వర్గసౌఖ్యం; చేకుఱి+ఉండున్= లభించి ఉంటుంది.

**తాత్పర్యం:** ఓ రాజా! మానవులు దేవతలుగా, దేవతలు మానవులుగా అవుతూ ఉంటారు. కాబట్టి నీ కుమారుడి కై దిగులు పడవద్దు. అతడికి శాశ్వతమైన వీరస్వర్గం లభించి ఉంటుంది. అతడు స్వర్గంలో సౌఖ్యం అనుభవిస్తూ ఉండగా, నీవు ఇక్కడ అతడి కోసం విలపించటం ఎందుకు? అని భావం.

**విశేషం:** ఎంత పుణ్యం చేస్తే అంత స్వర్గసౌఖ్యం. పుణ్యఫలాన్ని స్వర్గంలో అనుభవించిన తర్వాత మళ్ళీ కర్మభూమిలో మానవత్వం. అభిమన్యుడు పుణ్యపురుషుడు. అతడు స్వర్గసౌఖ్యాన్ని అందుకొన్నాడు - అని అంటూ దేవత్వ-మానవత్వాల పర్యాయక్రమాన్ని వ్యాసుడు ధర్మజుడికి తెలిపాడు. నరులు అమరులు కావటానికి, ఆ అమరులే మరల మానవులు కావటానికి వారి వారి కర్మఫల సంస్కారాలే కారణం అనే విషయం ఇందు సూచితం. వీరుడైన అభిమన్యుడికి స్వర్గసౌఖ్యం తప్పక లభించి ఉంటుందనే నిర్ధారణ ఈ పద్యంలో తుదివాక్యం.

**క. అగణిత దుఃఖాత్మక మి । జ్జగ; మాతఁడు దీనిఁ దొఱఁగి సౌఖ్యాత్మకమై**
**వగ చెంతలఁ జేరని య । జ్జగమునఁ బుణ్యాత్మ పురుష సంగతి వడసెన్. 178**

**ప్రతిపదార్థం:** ఈ+జగము= ఈ లోకం; అగణిత దుఃఖ+ఆత్మకము= ఎన్నరాని వగపుతో కూడుకొన్నది; ఆతఁడు= ఆ అకంపనుడి కొడుకు; దీనిన్= దుఃఖభూయిష్ఠమైన ఈ లోకాన్ని; తొఱఁగి= విడిచి; సౌఖ్య+ఆత్మకము+ఐ= సుఖంతో కూడుకొన్నదై; వగ+చెంతలన్= దుఃఖంయొక్క దరిదాపులలో (సమీపంలో); చేరని= సమీపించని; ఆ+జగమునన్= ఆ లోకంలో; పుణ్యాత్మ, పురుష, సంగతిన్= పుణ్యాత్ములైన పురుషులయొక్క సహవాసాన్ని (చేరికను); పడసెన్= పొందాడు.

**తాత్పర్యం:** ఈ జగత్తు దుఃఖంతో కూడుకొన్నది. అతడు ఈ లోకాన్ని విడిచి, కేవలం సుఖంతో కూడుకొన్న, దుఃఖం దరి చేరని ఆ లోకంలో పుణ్యపురుషుల సాంగత్యాన్ని పొందాడు.

**విశేషం:** పుణ్యాత్ము లందరూ చేరేది సౌఖ్యాత్మక లోకం. అందుకే దాన్ని నాకం అంటారు. అక్కడ దుఃఖంయొక్క స్పర్శ రవంతకూడా ఉండదు. దీనినే తిక్కన 'వగచెంతలఁజేరని' అని ఎంతో సొగసుగా చెప్పాడు. మహోదాత్తములైన భావాలను తేటతెల్లం చేయటానికి అచ్చ తెలుగు ఏ విధంగా సర్వ సమర్థమో పై ప్రయోగం ద్వారా నిరూపించాడు.

**వ. నీకు వగవఁ బని లేదు; బ్రహ్మ కల్పితంబైన యీ నిశ్చయంబు నిరూపించి ధీరులు దెగిన వారలకు వగవ' రని చెప్పిన నారదునకు నయ్యకంపనుం డిట్లనియె. 179**

**ప్రతిపదార్థం:** నీకున్= నీకు; వగవన్+పని, లేదు= బాధపడాల్సిన పనిలేదు; బ్రహ్మ, కల్పితంబు+ఐన= బ్రహ్మదేవుడిచేత కల్పించబడినదైన; ఈ+నిశ్చయంబు= ఈ నిర్ణయం; నిరూపించి= తెలిసికొని; ధీరులు= అన్నీ తెలిసినవాళ్ళు (ధైర్యం కలవారు); తెగినవారలకున్= మరణించిన వాళ్ళకై; వగవరు= దుఃఖించరు; అని= ఆ ప్రకారంగా; చెప్పినన్= చెప్పగా; నారదునకున్= నారదమహర్షికి; ఆ+అకంపనుండు= ఆ అకంపనమహారాజు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు:

**తాత్పర్యం:** బ్రహ్మ కల్పిత నిశ్చయాన్ని గ్రహించి, ధీరులు మృతులను గూర్చి దుఃఖించరన్న నారదుడితో అకంపనుడు ఈ విధంగా అన్నాడు:

**క. 'మునినాథ! నీవు సెప్పఁగ । ననఘుం బగు నీ సమంచితాఖ్యానం బే**
**విని గతశోకుఁడ నైతిని; । మనము ప్రియంబందె నతి సమాధానమునన్.' 180**

**ప్రతిపదార్థం:** మునినాథ!= ముని శ్రేష్ఠుడవైన ఓ నారదా!; నీవు; చెప్పఁగన్= చెబుతూ ఉండగా; అనఘంబు+అగు= పాపరహితమైన దైన; ఈ+సమంచిత+ఆఖ్యానంబున్= మిక్కిలి యోగ్యమైన ఈ కథను; ఏన్= నేను; విని; గత శోకుఁడను+ఐతిని= పోగొట్టబడ్డ దుఃఖం కలవాడిని అయ్యాను; అతి+సమాధానమునన్= మిక్కిలి అంగీకారంతో; మనము= మనస్సు; ప్రియంబు+అందెన్= ప్రీతి చెందింది.

**తాత్పర్యం:** 'ఓ మునిశ్రేష్ఠా! నీవు సమయ సముచితంగా చెప్పిన పవిత్రమైన, యోగ్యమైన కథ విని, నా శోకం నశించింది. మనస్సు ఎంతో సమ్మతితో ప్రీతి చెందింది.'

**విశేషం:** సందర్భానికి అనుగుణంగా చెప్పిన కథవలన వ్యథ తీరటమే కాకుండా మనస్సెంతో ప్రీతిని పొందిందనటం ఈ పద్యంలోని విశేషం. కేవలం 'సమాధానం' అనకుండా దానికి ముందు 'అతి' ని చేర్చటం ఈ సందర్భంలో ఎంతో అర్థవంతంగా ఉన్నది. అది ఎంతో విశిష్టార్థంలో ప్రయుక్తం కావటం వలన 'గతశోకుఁడు' కావటానికి పరిపుష్టిని కలిగించింది. ఆఖ్యానం ఎంతో సందర్భశుద్ధి, ఔచిత్యం కలిగి ఉన్నది కాబట్టి అది 'అనఘం' కాగలిగింది. సముచితమైన ఆఖ్యానాన్ని విన్నందువలన మనస్సుకు ప్రశాంతి, శోకరాహిత్యం, అఘరహితమైన ఆత్మానందం సిద్ధిస్తాయి అని ఈ పద్యంలో సూచించబడ్డాయి. కథను అందరూ చెప్పవచ్చు. కాని, దానిలో స్వారస్యం ఉండాలంటే దాన్ని ద్రష్టలైన మునులే చెప్పాలి. ఇక్కడ దివ్యర్షి నారదుడు విజ్ఞానప్రదుడు. సమంచితాఖ్యానాన్ని సమయసముచితంగా చెప్పాడు.

**వ. అనుచు వినతుం డగుటయు, నమ్ముని దనదైన యశోక వనంబునకుం జనియె నని పలికి పారాశర్యుండు. 181**

**ప్రతిపదార్థం:** అనుచున్= ఆ విధంగా అంటూ; వినతుండు+అగుటయున్= నమ్రుడు (వినయంతో వంగినవాడు); కావటమున్నూ; ఆ+ముని= ఆ నారదుడు; తనదైన= తనకు సంబంధించినదైన; అశోకవనంబునకున్= అశోకవనానికి; చనియెన్= వెళ్ళాడు;అని= ఆ ప్రకారంగా; పలికి= చెప్పి; పారాశర్యుండు= వేదవ్యాసుడు.

**తాత్పర్యం:** అని వినయంతో నమస్కరించాడు. నారదుడు తనదైన అశోకవనానికి వెళ్ళాడని చెప్పి, వ్యాసమునీంద్రుడు.

**విశేషం:** ఈ సందర్భంలో నారదుడు ఆత్మజ్ఞానాన్ని ఇచ్చినవాడుగా స్పష్టం. ఆత్మజ్ఞాని ఐహిక దుఃఖానికి అతీతుడు. ఇట్లు చెప్పిన కథ శోకరాహిత్యానికి సంబంధించినది. కాబట్టి, కథ చివరలో కూడా నారదుడు 'తనదైన అశోకవనంబునకుంజనియె' ననటం సమయ సముచితంగా ఉన్నది. పూర్వం గతశోకుడిని చేసే అభ్యాసాన్ని చెప్పిన నారదుడు ప్రస్తుత వచనంలో 'అశోక వనమునకు' చనినాడని వ్యాసుడు చెప్పటం అర్థమహితం.

**క. ఈ యితిహాసం బాయువు, । శ్రీయును, నారోగ్యమును, విశిష్టగుణంబుం**
**జేయు జనములకు జగతీ । నాయక! వ్రాసినఁ బఠించినం దగ వినినన్. 182**

**ప్రతిపదార్థం:** జగతీనాయక!= రాజా!; జనములకున్= ప్రజానీకానికి; ఈ+ఇతిహాసంబు= ఈ కథ; వ్రాసినన్= వ్రాసిననూ; పఠించినన్= చదివిననూ; తగన్= తగునట్లు; వినినన్= వినిననూ; ఆయువున్= పరిపూర్ణమైన ఆయుస్సునూ; శ్రీయునున్= సంపదయున్నూ; ఆరోగ్యమున్= రోగములు లేకుండుటయున్నూ; విశిష్ట గుణంబున్= శ్రేష్ఠమైన గుణమున్నూ; చేయున్= కలుగజేస్తుంది.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఈ కథను వ్రాసినా, చదివినా, విన్నా, మానవాళికి ఆయుస్సు, సంపద, ఆరోగ్యం, శ్రేష్ఠమైన గుణం కలుగుతుంది.

**విశేషం:** ఫలశ్రుతి రూపంలో అకంపనోపాఖ్యానం ముగిసింది. ప్రస్తుతాఖ్యాన శ్రవణం వలన ఆయురారోగ్య సంపదలే కాకుండా వాటిని మించిన శ్రేష్ఠగుణం కలుగుతుంది అనటం గమనార్హం.

**వ. అభిమన్యుండును భండనంబున పిఱుసనక శరశరాసనాది వివిధాయుధంబులఁ బరబలంబుల బడలువఱిచి వీరస్వర్గ సౌఖ్యంబును ప్రఖ్యాతియుం బడసె; నీకు నడలం బని లే దని చెప్పిన విని ధర్మతనయుండు దనమనంబున నుత్తమక్షత్త్రధర్మంబు తెఱం గిట్టిద యగుట దలపోసియు, శూరులు పుణ్యలోకంబున సుఖంబుండుటయుం దెలిసియు, నెవ్వగ విడిచి, వెండియు వేదవ్యాసమునీశ్వరుతో నిట్లనియె. 183**

**ప్రతిపదార్థం:** అభిమన్యుండును= నీ కుమారుడైన అభిమన్యుడున్నూ; భండనంబునన్= యుద్ధంలో; పిఱుసనక= వెనుదీయక; శర+శరాసన+ఆది+వివిధ+ఆయుధంబులన్= బాణం; విల్లు మొదలైన అనేకాలైన ఆయుధాలతో; పరబలంబులన్= శత్రుసేనలను; బడలు వఱిచి= శ్రమపెట్టి; వీర స్వర్గసౌఖ్యంబున్= వీరస్వర్గానికి సంబంధించిన సుఖాన్ని; ప్రఖ్యాతియున్= ప్రసిద్ధియునూ; పడసెన్= పొందాడు; నీకున్= నీకు; అడలన్+పని, లేదు= దుఃఖించాల్సిన పనిలేదు; అని= ఆ ప్రకారంగా; చెప్పినన్= చెప్పగా; విని; ధర్మతనయుండు= ధర్మరాజు; తన, మనంబునన్= తన మనస్సులో; ఉత్తమ, క్షత్త్ర, ధర్మంబు, తెఱంగు= శ్రేష్ఠమైన క్షత్రియులయొక్క ధర్మవిధానము; ఇట్టిది+అ+అగుటన్= ఇటువంటిదే కావటం; తలపోసియున్= తలచుకొనియు; శూరులు= శూరత్వం కలవారు; పుణ్యలోకంబునన్= పుణ్యలోకంలో; సుఖంబు+ఉండుటయును= సుఖంగా ఉండుటమున్నూ; తెలిసియున్= గ్రహించియు; నెఱ+వగ= నిండైన దుఃఖం; విడిచి= వదలిపెట్టి; వెండియున్= మరల; వేదవ్యాసమునీశ్వరుతోన్= వ్యాసమునీంద్రుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అభిమన్యుడు యుద్ధంలో వెనుకాడక వివిధాయుధాలతో శత్రుబలాలను ఓడించి, వీరస్వర్గ సౌఖ్యాన్నీ, కీర్తినీ పొందాడు. కాబట్టి, నీవు శోకించ నవసరం లేదు' - అని చెప్పగా విని ధర్మరాజు ఉత్తమక్షత్రియ ధర్మపద్ధతి అటువంటిదే కదా అని మనస్సులో తలపోసి, శూరులు పుణ్యలోకాలలో సుఖిస్తారని తెలిసి, తీవ్రమైన శోకాన్ని విడిచి, మరల వేదవ్యాస మునీంద్రుడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'మును ప్రసిద్ధిఁ బొంది చనిన భూపాలక । శ్రేష్ఠు లెవ్విధమునఁ జేసి రొక్కొ**
**క్రతువు? లవ్విశిష్ట కర్మజాతముఁ దెలి । యంగఁ జెప్పి నన్ను నాదరింపు.' 184**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; ప్రసిద్ధిన్+పొంది= కీర్తిని గడించి; చనిన= పోయిన; భూపాలక శ్రేష్ఠులు= ఉత్తములైన రాజులు; క్రతువులు= యజ్ఞాలు; ఏ+విధమునన్= ఎట్లా ; చేసిరి+ఒక్కొ= చేశారో; ఆ+విశిష్ట, కర్మ, జాతమున్= అట్టి శ్రేష్ఠములైన కర్మలయొక్క సమూహాన్ని; తెలియంగన్= తెలిసేటట్లుగా; చెప్పి= వివరించి; నన్నున్= నన్ను; ఆదరింపు(ము)= అనుగ్రహించుము.

**తాత్పర్యం:** 'పూర్వం మిక్కిలి ప్రఖ్యాతి కెక్కి మరణించిన రాజశ్రేష్ఠులు యజ్ఞాలు ఏ విధంగా చేశారో, ఆ ఉత్తమకర్మలేవో నాకు తెలియజేసి నన్ను అనుగ్రహించవలసింది.'

**వ. అనిన విని యమ్మనుజపతి తలంపు గనుంగొని కృష్ణద్వైపాయనుండు నీ విట్లడుగుట నీ కొడుకు దొంటి మహారాజుల యట్టివాఁడు గావున న క్కుమారునకు వారలకుం బుణ్యగతి దారతమ్యం బెట్టిదియో యని యరయుటగా నోపు నని యూహించెద' ననవుడు నతండు' మీ దివ్యచిత్తంబున నవధరించినదానిం గాదన నెట్లు వచ్చు? న వ్వానిని వినవలతు నానతియిండు.' 185**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ఆ+మనుజపతి, తలంపు= ఆ రాజుయొక్క (ధర్మజుడి) అభిప్రాయం; కనుంగొని= తెలిసికొని; కృష్ణద్వైపాయనుండు= వేదవ్యాసుడు; నీవు; ఇట్లు+అడుగుట= ఈ విధంగా అడగటం; నీకొడుకు= నీ కుమారుడైన అభిమన్యుడు; తొంటి= పూర్వపు; మహారాజుల+అట్టివాఁడు= చక్రవర్తుల వంటివాడు; కావునన్= కాబట్టి; ఆ+కుమారులకున్= ఆ అభిమన్యుడికీ; వారలకున్= ఆ పూర్వరాజులకూ; పుణ్యగతిన్= పుణ్యం పొందటంలో; తారతమ్యంబు= భేదం; ఎట్టిదియో= ఎటువంటిదో; అని; కాన్+ఓపును+అని= తెలుసుకొనటానికిగా అభిప్రాయపడినట్లుందని; ఊహించెదన్= ఊహిస్తున్నాను; అనవుడున్= అని చెప్పిన వెంటనే; అతండు= ధర్మరాజు; మీ+దివ్య+చిత్తంబునన్= మీ శ్రేష్ఠమైన మనస్సులో; అవధరించిన+దానిన్= తలచిన(నిశ్చయించిన)దాన్ని; కాదు+అనన్+ఎట్లు+వచ్చున్?= కాదని ఎట్లా అనగలను?; ఆ+వానిని= మీరూహించిన లేక తలచిన వాటినే; వినన్= వినటానికి; వలతున్= ఇష్టపడుతూ ఉన్నాను; ఆనతి+ఇండు= సెలవియ్యండి (చెప్పండి).

**తాత్పర్యం:** అనగానే వ్యాసుడు విని ఆ ధర్మరాజు అభిప్రాయం తెలిసికొని ఇట్లన్నాడు: 'నీ విప్పుడు ఈ విధంగా అడగటం నీ కుమారుడు పూర్వపు మహారాజుల వంటివాడు కాబట్టి వారికీ అభిమన్యుడికీ పుణ్యగతిలో తారతమ్యం ఎటువంటిదో తెలియటానికే అని ఊహిస్తున్నాను' అన్నాడు. అపుడు ధర్మరాజు, 'మీ దివ్యమైన మనస్సులో మీ రేది తలచి, నిశ్చయించుకొన్నారో దానిని నేను ఎట్లా కాదనగలను? మీరు తలచిన దాన్నే వినాలని ఎంతో ఇష్టపడుతూ ఉన్నాను. సెలవియ్యండి.'

**చ. అనుటయు న మ్ముని ప్రవరుఁ డాతని కిట్లను 'నధ్వర ప్రవ**
**ర్తనులుఁ దపఃప్రదీప్తులును దానసమగ్రు లుదాత్తశీలురుం**
**జనియెడు నట్టిచోటు లొక సంపదయే? రణశూరకోటి క**
**ర్జునసుతుఁ డత్యుదాత్త మగు చోట సుఖస్థితి నుండు భూవరా! 186**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని ధర్మరాజు అడుగగా; ఆ+ముని+ప్రవరుఁడు= మునిశ్రేష్ఠుడైన ఆ వ్యాసుడు; ఆతనికిన్= ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; భూవరా!= రాజా!; అధ్వరప్రవర్తనులున్= యజ్ఞాలు ప్రవర్తింపజేసినవాళ్ళూ(యజ్ఞాలు నడిపేవాళ్ళూ); తపః+ప్రదీప్తులున్= తపస్సుచేత మిక్కిలి ప్రకాశించేవాళ్ళూ; దానసమగ్రులున్= దానంచేత పరిపూర్ణమైన వాళ్ళూ; ఉదాత్తశీలురున్= గొప్పశీలం కలవాళ్ళూ; చనియెడు+అట్టి+చోటులు= పోయే ప్రదేశాలు; రణశూరకోటికిన్= యుద్ధంలోని శూరుల సమూహానికి; ఒక సంపదయే?= ఒక సంపత్తేనా? (సంప్రతి అని పాఠాంతరం - సంప్రతియే?= లెక్కయా?); అర్జునసుతుఁడు= అర్జునుడి కొడుకైన అభిమన్యుడు; అతి+ఉదాత్తము+అగుచోటన్= మిక్కిలి గౌరవప్రదం, ప్రియమైనట్టి ప్రదేశంలో; సుఖస్థితిన్= సంతోషస్థితిలో; ఉండున్= ఉంటాడు.

**తాత్పర్యం:** అనగానే ఆ ముని శ్రేష్ఠుడు (వ్యాసుడు) అతడితో (ధర్మరాజుతో) ఇట్లా అన్నాడు: 'ఓ రాజా!యజ్ఞాలు నిర్వర్తించే వాళ్ళూ, తపస్సుచేత ప్రకాశించే వాళ్ళూ, దానం చేసేవాళ్ళూ, గొప్పశీలం కలవాళ్ళూ పోగలిగే ప్రదేశాలు యుద్ధంలో మరణించే శూరులకు (ఒక లెక్కా?) ఒక సంపత్తేనా? అర్జునుడి కొడుకు మహోదాత్తమైన చోట సౌఖ్యస్థితిలో ఉన్నాడు.

**విశేషం:** యజ్ఞం, తపస్సు, దానం చేసినవారు మహోన్నత శీలం కలవారు ఏ ఉదాత్తమైన ప్రదేశాన్ని చేరి సౌఖ్యాన్ని పొందుతారో, అట్టి మిక్కిలి ఉదాత్తమైన ప్రదేశంలోనే అభిమన్యుడు సౌఖ్యంగా ఉన్నాడని ప్రస్తుత పద్య సారాంశం. అర్జునసుతుడు - అత్యుదాత్తమైన చోట, సుఖస్థితి' అనే ఈ మూడు పద ప్రయోగాలు గ్రహించదగినవి. అర్జునసుతుడనే ప్రయోగంలో కీర్తిధావళ్యం సూచితం. కీర్తిని పొందినవారు అందరికీ అతీతమైన సామాన్యులకు లభ్యంకాని మిక్కిలి ఉదాత్తస్థానంలో స్వర్గసౌఖ్యాన్ని అనుభవిస్తారనే విషయాన్ని అభిమన్యుడి విషయంలో రూఢిచేయటం ప్రస్తుత పద్యంలోని ప్రధానమైన విశిష్టమైన విశేషం.

**వ. అది యట్లుండె, మహితాత్ము లయిన మహీపతుల వరిష్ఠకర్మానుష్ఠానంబు తెఱం గెఱుంగుట మేల కాదె! యంతలంతలు మానుసులు మడిసిరి గాని పుడమి నిత్యులై నిలువంబడ; రది వినుటయు నీ మనశ్శోకోప శమనంబు సేయుం; జెప్పెద నాకర్ణింపుము. 187**

**ప్రతిపదార్థం:** అది+అట్లు+ఉండెన్= అది అట్లా ఉండనీ; మహిత+ఆత్ములు+అయిన= గొప్ప మనస్సు కలవారైన (మహాత్ములైన); మహీపతులు= రాజుల; వరిష్ఠ, కర్మ+అనుష్ఠానంబుల తెఱంగు= మిక్కిలి శ్రేష్ఠమైన కర్మల నడవడుల (నడపుటలందుగల) తీరు; ఎఱుంగుట= తెలియటం; మేలు+అ+కాదె!= శ్రేయస్కరమే కదా!; అంతలంతలు+మానుసులు= అంతంతటి యోధులు; మడిసిరి+కాని= మరణించారు కాని; పుడమిన్= భూమియందు; నిత్యులు+ఐ= శాశ్వతులై; నిలువంబడరు= స్థిరంగా ఉండలేకపోయారు; అది= ఆ విషయం; వినుటయున్= వినుటయున్నూ; నీ, మనః+శోక+ఉపశమనంబు= నీ మనస్సునందలి దుఃఖానికి ఊరట; చేయున్= కలిగిస్తుంది; చెప్పెదన్= చెబుతూ ఉన్నాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** అది అట్లా ఉండనీ. గొప్పవారైన రాజులు మిక్కిలి గొప్ప కార్యాలు చేసిన పద్ధతిని తెలిసికొనటం మంచిదే కదా! అంతటి మహానుభావులు సైతం గతించారు కాని, భూమిమీద శాశ్వతంగా నిలిచి ఉండలేదు. వారి కథలు వినటం చేత నీ మనోదుఃఖం తగ్గుతుంది. చెప్పుతాను వినుము.

**విశేషం:** మహనీయులైన మహీశుల శ్రేష్ఠకర్మానుష్ఠాన విధానాలు తెలిసికొనటం ఎంతో మంచిది. ఎంత మహోన్నతులైనా, ఈ లోకంలో శాశ్వతంగా నిలిచినవారు లేరు. మానసికమైన దుఃఖాన్ని ఉపశమింపజేసే దృష్టాంత పూర్వకమైన ఉపాఖ్యానం మరొకటి వినుము- అని సువర్ణష్ఠీవి వృత్తాంతాన్ని చెప్పటానికి పూనుకొన్నాడు. సావధానంగా వినుమని హెచ్చరిస్తూ ఉన్నాడు.

**వేదవ్యాస మునీంద్రుఁడు ధర్మజునకు సువర్ణష్ఠీవి చరిత్రంబు సెప్పుట (సం. అను 1-8-300 పంక్తి)**

**క. 'జనపాలక! సృంజయుఁ డను । మనుజేంద్రుఁడు పుణ్యమూర్తి మహిమాస్పదుఁ డి**
**వ్వననిధి వలయములోని య । వని నొక్కఁడ యేలు దుర్నివారస్ఫురణన్. 188**

**ప్రతిపదార్థం:** జనపాలక!= రాజా!; పుణ్యమూర్తి= పుణ్యస్వరూపుడూ; మహిమ+ఆస్పదుఁడు= మహిమకు (గొప్పతనానికి) నెలవైన వాడూ (అయిన); సృంజయుండు+అను, మనుజ+ఇంద్రుఁడు= సృంజయుడు అనే పేరుగల రాజు; దుర్నివార+స్ఫురణన్= నివారించలేని స్ఫూర్తితో; ఈ+వననిధి వలయములోని+అవనిన్= వలయాకారంగల సముద్ర మధ్యభాగంలోని భూమిని (సముద్రంచేత చుట్టబడిన సమస్త భూప్రపంచాన్ని); ఒక్కఁడు+అ= ఒక్కడే; ఏలున్= పాలిస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ రాజా! పుణ్యస్వరూపుడూ, మహిమకు నివాసమైనవాడూ అయిన సృంజయుడు అనే రాజు సముద్రంచేత ఆవరించబడిన సమస్త భూమినీ తా నొక్కడే (ఏకచ్ఛత్రాధిపత్యంగా) పరిపాలిస్తూ ఉన్నాడు.

**విశేషం:** 'మహిమాస్పదుఁడు' అనే ప్రయోగం ఈ కథలో కావ్యార్థ సూచనవంటిది. 191 వచనభాగంలోని 'అసమాన మహిమానందంబునం బ్రకాశుండై' అనేది సృంజయుడి సంపద్వైభవాన్ని ప్రస్తుత ప్రయోగం తెలుపుతూ ఉన్నది. 'చతురబ్ధి వేలావలయిత భూమి'ని 'అవ్వననిధి వలయములోని అవని' అని తిక్కన ఎంతో సంగ్రహంగా పేర్కొన్నాడు. ఏకచ్ఛత్రాధిపతియై పరిపాలిస్తున్నాడనే భావాన్ని 'అవని నొక్కఁడ యేలు' నని తిక్కన ప్రయోగించాడు. 'దుర్నివార స్ఫురణన్' అనే చివరి ప్రయోగంలో అనివార్య స్ఫూర్తిని తెలిపాడు.

**వ. సంతానార్థి యయి సంతతంబును భూసుర పూజనంబులు సేయుచుండు నా నరపతికి నారదుండు సఖుం డగుట నతని పాలికిఁ బలుమాఱు నరుగుదెంచుచుండు; నొక్కనాఁడు విప్రవరు లతిప్రయత్నంబునం గూడికొని యమ్మునివరునితో నిమ్మహీపతి కోర్కి దీర్పవలదే యని చెప్పిన. 189**

**ప్రతిపదార్థం:** సంతాన+అర్థి+అయి= సంతానాన్ని కోరినవాడై; సంతతంబును= ఎల్లప్పుడున్నూ; భూసుర, పూజనంబులు= బ్రాహ్మణపూజలు; చేయుచుండున్= చేస్తూ ఉన్నాడు; ఆ+నరపతికిన్= ఆ రాజుకు; నారదుండు= నారదమహర్షి; సఖుండు+అగుటన్= మిత్రుడు కావటంచేత; అతని పాలికిన్= ఆ రాజుకడకు; పలుమాఱున్= (అనేక పర్యాయాలు) చాలామార్లు; అరుగుదెంచుచుండున్= వస్తూ ఉంటాడు; ఒక్కనాఁడు= ఒకదినం; విప్రవరులు= బ్రాహ్మణశ్రేష్ఠులు; అతి ప్రయత్నంబునన్= మిక్కిలి ప్రయత్నంతో; కూడికొని= అందరూ కలిసికొని; ఆ+మునివరునితోన్= ఆ మునిశ్రేష్ఠుడితో; ఈ+మహీపతి కోర్కి= ఈ రాజు కోర్కెను; తీర్పవలదే= తీర్చవచ్చుగదా!; అని+చెప్పినన్= అని చెప్పగా.

**తాత్పర్యం:** సంతాన వాంఛగల సృంజయుడు నిరంతర బ్రాహ్మణార్చనలు చేశాడు. అతడికి నారదుడు మిత్రుడు కావటం వలన అప్పుడప్పుడూ ఇరువురూ సమావేశం అయ్యేవారు. ఒక సందర్భంలో బ్రాహ్మణులందరూ నారదుడితో సృంజయుడి కోర్కె తీర్చవలసిందని చెప్పారు.

**విశేషం:** భూసురార్చన చేశాడు కాబట్టి ఆ విప్రులే సృంజయుడి కోర్కెను నారదుడికి చెప్పటం సమంజసంగా ఉన్నది. ప్రభువు ప్రత్యేకంగా అడుగకుండా బ్రాహ్మణు లడగటం ఏమిటి? అని అనిపించవచ్చును. నిరంతరం రాజు క్షేమాన్ని కోరే పురోహితులు ఆ రాజు లోలోపల కుమిలిపోతూ ఉంటే అతడి కాంక్షను విన్నవించటం సముచితమే కదా!

**క. 'అతఁ డతనితోడ 'భవదీ । ప్సిత మెయ్యది నాకు నేల చెప్ప?' వనుడు 'నం**
**చితగుణుఁడు రూపసియు నగు । సుతుఁ గోరుదు నెపుడు నేను సురగణవంద్యా! 190**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ నారదమహర్షి; అతనితోడన్= ఆ సృంజయుడితో; భవత్+ఈప్సితము= నీయొక్క కోర్కె; ఎయ్యది?= ఏది?; నాకున్= నాకు; ఏల= ఎందుకు; చెప్పవు?= చెప్పకున్నావు?; అనుడున్= అనిన వెంటనే; సురగణవంద్యా!= దేవతా సమూహంచేత నమస్కరించబడేవాడా!; ఏను= నేను; ఎపుడున్= ఎల్లప్పుడూ; అంచిత+గుణుఁడు= ఒప్పిదములైన గుణాలు కలవాడూ; రూపసియున్= రూపు (అందం) కలవాడున్నూ; అగు= అయినట్టి; సుతున్= కుమారుడిని; కోరుదున్= ఇష్టపడతాను.

**తాత్పర్యం:** నారదముని సృంజయుడితో ' నీకోర్కె ఏమిటి? ఎందుకు నాకు చెప్పకుండా ఉన్నావు? అనగానే 'దేవతా గణంచేత కీర్తింపబడే నారదమునీంద్రా! నేను నిరంతరమూ సద్గుణ సంపన్నుడు, రూపవంతుడూ అయిన కుమారుడిని కోరుకుంటూ ఉంటాను.

**విశేషం:** ఈ కందపద్యం తుదిలో 'సురగణవంద్యా!' అని ఉన్నది. 'సురగుణ' అనే పాఠాంతరం ఒకటి ఉన్నది. అదికొంత అన్వయక్లిష్టం. అయినా అర్థవైశిష్ట్యం కలదిగా అనిపిస్తూ ఉన్నది. అర్థవంతంగా ఉంటుంది. సృంజయుడు తనకు 'అంచిత గుణు' డైన సుతుడు కావాలని కోరుతూ ఉన్నాడు. ఆతడి కోరికను తీర్చే నారదుడిలో కూడా వంద్యములైన సురగుణాలు ఉన్నాయనటం సాభిప్రాయం.

**వ. అక్కుమారుండును మూత్రపురీష లాలాశ్రుస్వేదంబులు సువర్ణంబు లగునట్టివాఁడు గావలయు' ననిన నమ్మహీపతికి నమ్మహాత్ముం డవ్వరం బిచ్చె; నా సృంజయుండు నత్తెఱంగుతనయుం బడసి సువర్ణష్ఠీవి యను పేరిడి ప్రియంబునం బెనుచుచు వానివలనం గనకం బనుదినంబు నుత్తరోత్తరాభివృద్ధి యగుచుండ సమృద్ధి నొంది, శయనాసన సదన ప్రాకార ప్రభృతి సమస్త వస్తువులను కాంచన మయంబులు గావించికొని యసమాన మహిమానందంబునం బ్రకాశుం డై. 191**

**ప్రతిపదార్థం:** ఆ+కుమారుండునున్= ఆ పుత్రుడున్నూ; మూత్ర, పురీష, లాలా+స్వేదనంబులు= మూత్రమూ, మలమూ, లాలాజలమూ, కన్నీరు, చెమటలు; సువర్ణంబులు+అగు+అట్టివాఁడు= బంగారాలు అయ్యేటటువంటివాడు; కావలయున్= కావాలి; అనినన్= అనగా; ఆ+మహీపతికిన్= ఆ రాజుకు; ఆ+మహాత్ముండు= మహనీయుడైన ఆ నారదుడు; ఆ+వరంబు+ఇచ్చెన్= ఆ వరం ఇచ్చాడు; ఆ సృంజయుండున్; ఆ+తెఱంగు+తనయున్= ఆ విధమైన కొడుకును; పడసి= పొంది; సువర్ణష్ఠీవి+అను పేరు+ఇడి= సువర్ణష్ఠీవి అనే నామకరణం చేసి; ప్రియంబునన్= ప్రేమతో; పెనుచుచున్= పోషిస్తూ; వానివలనన్= అతడి వలన; కనకంబు= బంగారు; అనుదినంబున్= ప్రతిదినమూ; ఉత్తరోత్తర+అభివృద్ధి= మరీమరీ ఎడతెగని పెంపు; అగుచుండన్= అవుతూ ఉండగా; సమృద్ధిన్+ఒంది= పెంపును పొంది; శయన+ఆసన, సదన ప్రాకార, ప్రభృతి= పడకా, పీటా, ఇల్లూ ప్రహరీ మొదలైన; సమస్త వస్తువులును= అన్ని పదార్థాలు; కాంచనమయంబులు= బంగారుమయంగా; కావించుకొని= చేసికొని; అసమాన, మహిమ+ఆనందంబునన్= సాటిలేని; మహిమవలని సంతోషంతో; ప్రకాశుండు+ఐ= వెలుగుతూ ఉన్నవాడై.

**తాత్పర్యం:** ఆ కొడుకు యొక్క మూత్రం, మలం, కన్నీరు, చెమట - ఇవన్నీ బంగారంగానే కావాలి' అన్నాడు. నారదుడు అతడికి ఆ వరం ఇచ్చాడు. ఆ సృంజయుడు అట్లాంటి కొడుకును పొంది, సువర్ణష్ఠీవి అనే పేరు పెట్టి అనురాగంతో పెంచసాగాడు. ఆ కొడుకు వలన ప్రతిరోజూ బంగారాన్ని పొందుతూ క్రమక్రమాభివృద్ధి పొంది, పడకలు, గద్దెలు, ఇండ్లు, ప్రాకారాలు, మొదలైన వస్తువులన్నీ బంగారుమయం చేసికొని సాటిలేని మహిమతో, ఆనందంతో ప్రకాశిస్తూ.

**క. విలసిల్లుచు నుండఁగ మ్రు । చ్చిలి పట్టి కుమారునోరఁ జీర దుఱిమి వెం**
**గలు లగు క్రూరులు కొందఱు । వెలువడఁ గొనిపోయి యొక్క విపినములోనన్. 192**

**ప్రతిపదార్థం:** విలసిల్లుచున్+ఉండఁగన్= ప్రకాశిస్తూ ఉండగా; వెంగలులు= తెలివితక్కువవాళ్ళు (మూఢులు); అగు= అయిన; కొందఱు= కొంతమంది; క్రూరులు= పీడించే నీచులు; ముచ్చిలిపట్టి= దొంగతనంతో పట్టుకొని; కుమారు+నోరన్= ఆ పసిపిల్లవాడి నోటిలో; చీరన్= గుడ్డను; తుఱిమి= క్రుక్కి; వెలువడన్= వెలుపలికి; కొనిపోయి= తీసికొనిపోయి; ఒక్క+విపినము లోనన్= ఒక అడవిలో.

**తాత్పర్యం:** ఆ విధంగా సృంజయుడు ప్రకాశిస్తూ ఉండగా అవివేకులైన కొందరు క్రూరులు ఆపిల్లవాడిని దొంగ తనంగా పట్టుకొని, నోటిలో గుడ్డ తురిమి వెలుపలికి తీసికొని వెళ్ళి ఒక అడవిలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** దొంగిలించిన వ్యక్తులను తిక్కన వెంగలులు, క్రూరులు అని ప్రయోగించాడు. పిల్లవాడివలన కొల్లగా బంగారం కలుగుతూ ఉన్నది అని విన్న దొంగలు అతడి మేనంతా బంగారం ఉంటుందని అవివేకంతో అపహరించారు. పీడించే మనస్తత్వం ఉన్న క్రూరులు కాబట్టి పిల్లవాడిని చంపారు. అంతేకాదు. తమలో తాము పోట్లాడుకొని చంపుకొనటం వారి వెంగలితనాన్ని, క్రూరత్వాన్ని మరీ ప్రస్ఫుటం చేస్తూ ఉన్నది. పిల్లవాడి అరుపుపైకి వినిపించకుండా దొంగలు నోటిలో గుడ్డ తురుముట అనే విషయాన్ని శబ్దాలంకారం గల 'కుమారు నోరఁ జీర దుఱిమి' అనే ప్రయోగంలో తిక్కన స్పష్టం చేశారు. 'తుఱిమి' లోని శకట రేఫ క్రూరుల క్రౌర్యాన్ని ధ్వనింపజేస్తూ ఉన్నది.

**ఆ. కడుపు (వ) వ్రచ్చి యొడలు గలయంగ జల్లించి । పాపి పాపి చూచి, పసిఁడి గాన**
**కచట శవము వైచి యరుగుచునుండి త । త్కర్మ ఫలముఁ దమ్ముఁ గలఁచుటయును. 193**

**ప్రతిపదార్థం:** కడుపున్= పొట్టను; వ్రచ్చి= చీల్చి; ('వచ్చి' అని ఉస్మానియా ప్రతి. వ్రచ్చి అని పాఠాంతరమే అర్థవంతం); ఒడలు= శరీరం; కలయంగన్= అంతటా(అందరూ); జల్లించి= శోధించి(చంపి); పాపి, పాపి= విడదీసి విడదీసి; చూచి= చూచి; అచటన్= ఆ శరీరంలో; పసిఁడి+కానక= బంగారును చూడక; శవమున్= పీనుగును; వైచి= పడవేసి; తద్+కర్మ+ఫలమున్= ఆ క్రూర కార్యంయొక్క ఫలితమున్నూ; తమ్మున్= తమను (అనగా ఆ దొంగలను); కలఁచుటయును= కలత కలిగించటమూ.

**తాత్పర్యం:** కడుపును చీల్చి, ఒళ్ళంతా గాలించి, అక్కడ బంగారు కనిపించకపోవటంతో శవాన్ని పారవైచి పోతూ ఉండగా, వాళ్ళు చేసిన కర్మఫలం వారిలో కలత కలిగించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అర్థగౌరవం దృష్టితో పరిశీలిస్తే ఈ పద్యంలో కొన్ని పదాలకు నానార్థాలు స్ఫురిస్తాయి. కలయ శబ్దానికి అంతటా అనియే కాకుండా ప్రస్తుత సందర్భాన్ని బట్టి 'అందరూ' అనే అర్థాన్ని కూడా అన్వయించుకొనవచ్చును. అట్లే 'జల్లించి' అనటానికి 'చంపి' అనే అర్థంకూడా సరిపోతుంది. 'పాపి పాపి' అనే ప్రయోగం క్రూరులైన దొంగల పరంగా పాపాత్ముడు అనే అర్థంలో సందర్భ సముచితంగా ఉన్నది.

**వ. ఆ పాపాత్ములు తమలోనం గలహించి, యొండొరుల వధియించి, యందఱు నధోగతిం జెందిరి; సృంజయుండును గొడుకుం గానక వెదకి తత్కళేబరంబు గని పరలోక క్రియలు నిర్వర్తించి, శోకంబునం బలవించుచున్న న న్నరేంద్రు కడకు నారదుం డరుగుదెంచి యతనిచేత నర్చితుండై. 194**

**ప్రతిపదార్థం:** ఆ+పాపాత్ములు= ఆ పాపచిత్తులు; తమలోనన్= తమలో తాము; కలహించి= తగవులాడి; ఒండొరులన్= ఒకరినొకరు; వధియించి= చంపుకొని; అందఱున్= అందరూ; అధోగతిన్= నాశనం (తక్కువస్థితిని); చెందిరి= అయ్యారు (పొందారు); సృంజయుండునున్= సృంజయుడున్నూ; కొడుకున్= కుమారుడిని; కానక= కాంచక; వెదకి= అన్వేషించి; తద్+కళేబరంబున్= అతడియొక్క శవాన్ని; కని= చూచి; పరలోకక్రియలు= ఉత్తరలోక క్రియలు (అంత్యకర్మలు); నిర్వర్తించి= జరిపి; శోకంబునన్= దుఃఖంతో; పలవించుచున్నన్= విలపిస్తూ ఉండగా; ఆ+నరేంద్రుకడకున్= ఆ రాజు దగ్గరకు; నారదుండు= నారదముని; అరుగుదెంచి= వచ్చి; అతనిచేతన్= ఆ సృంజయుడి చేత; అర్చితుండు+ఐ= పూజించబడినవాడై.

**తాత్పర్యం:** ఆ పాపాత్ములైన దొంగలు తమలో తాము కలహించుకొని ఒకరినొకరు చంపుకొన్నారు. సృంజయుడు తన కుమారుడికై వెదకి, కళేబరానికి పరలోక క్రియలు నిర్వర్తించాడు. కుమారుడి మరణానికి ఎంతో విలపించాడు. అప్పుడు నారదుడు అతడి కడకు వచ్చి అర్ఘ్యాసనాది విధులతో అర్చించబడి.

**క. 'జననాథ! యిట్లు శోకం । బునఁ గుందినఁ దనువు విడిచి పోదె యుసుఱు? స**
**చ్చిన వారలు వత్తురె యే । డ్చినఁ? జెలిమిం జేసి హితము సెప్పెద నీకున్. 195**

**ప్రతిపదార్థం:** జననాథ!= రాజా!; ఇట్లు= ఈ విధంగా; శోకంబునన్= దుఃఖంతో; కుందినన్= తపించినచో; ఉసుఱు= ప్రాణం; తనువు+విడిచి= శరీరం వదలిపెట్టి; పోదె!= పోదా!; చచ్చినవారలు= మరణించిన వాళ్ళు; ఏడ్చినన్= దుఃఖిస్తే; వత్తురె?= వస్తారా?; చెలిమిన్+చేసి= స్నేహంచేత; నీకున్= నీకు; హితము= (తగినది) మేలు; చెప్పెదన్= చెప్పుతాను.

**తాత్పర్యం:** 'రాజా! ఎందుకిట్లా దుఃఖంతో తపిస్తావు? ప్రాణం శరీరాన్ని విడిచిపోకుండా ఉంటుందా? ఎంత ఏడ్చినా చచ్చినవాళ్ళు మళ్ళీ తిరిగి వస్తారా? చెలిమిచేత నీకు నేను హితం చెప్పుతున్నాను.

**విశేషం:** ప్రాణాలు శరీరాన్నివిడిచిపోవటం తథ్యం, ఎంత ఏడ్చినా చచ్చినవాళ్ళు మళ్ళీ తిరిగి రారు - అనే రెండు వాక్యాలు చావు నిత్యం అనే సత్యాన్ని చాటుతూ ఉన్నాయి. ఒక స్నేహధర్మం హితం చెప్పటం. హితం చెప్పటమే అతడి లక్ష్యం కాబట్టి హితుడౌతాడు. ఈ విధంగా ఇందులో మార్మికమూ, ధార్మికమూ అయిన జీవితసత్యాలు సూచించబడ్డాయి.

### షోడశ రాజ చరిత్రము (సం. అను. 1-8-360 పంక్తి)

**వ. అవధానాయత్తం బగు చిత్తంబుతో విను' మని యి ట్లనియె. 196**

**ప్రతిపదార్థం:** అవధాన+ఆయత్తంబు+అగు+చిత్తంబుతోన్= అవధానం చేత సంసిద్ధం అయిన మనస్సుతో; వినుము= ఆకర్ణింపుము; అని; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** నిలకడ గల మనస్సుతో వినుము' - అని ఇట్లా అన్నాడు:

**సీ. సంవర్తుఁ డను మహాసంయమి దేవతా । గురుతోడి యీసున నరుగుదెంచి**
**పూని యుపద్రష్టయై నడపంగ, హి । మాచల పాదంబునందు శక్ర**
**వరుణ ప్రభృతులైన సురలు మహామునీం । ద్రులును సహాయులై మెలఁగుచుండ**
**శాలా ప్రముఖ భవ్య సాధనంబులు గన । కమయంబులుగ వస్త్రకాంచనాజ్య**

**ఆ. దధి పయః ఫలాది తర్పణ ద్రవ్య స । మృద్ధి సకల జనులు మెచ్చ,ఁ బెక్కు**
**లధ్వరములు సేసె; నట్టి మరుత్తుండు । నిత్యపదవి నుండ నేర్చెనయ్య? 197**

**ప్రతిపదార్థం:** సంవర్తుఁడు+అను, మహాసంయమి= సంవర్తుడు అనే పేరుగల గొప్ప ముని; దేవతాగురు తోడి+ఈసునన్= బృహస్పతి తోడి ఈర్ష్యతో (ఓర్వలేనితనంతో); అరుగుదెంచి= వచ్చి; ఉపద్రష్ట+ఐ= యజ్ఞకార్యం నిర్వర్తించే ఋత్విక్కై; పూని= ప్రయత్నించి; నడపంగన్= యజ్ఞం నిర్వర్తించగా; హిమ+అచల, పాదంబునందున్= హిమాలయ పర్వతంయొక్క అడుగుభాగంలో; శక్ర, వరుణ, ప్రభృతులు+ఐన, సురలు= దేవేంద్రుడు, వరుణుడు మొదలైన దేవతలు; మహామునీంద్రులును= గొప్ప ఋషీశ్వరులున్నూ; సహాయులు+ఐ= తోడుగా ఉన్నవారై; మెలఁగుచుండన్= ఒప్పుచుండగా; శాలా, ప్రముఖ, భవ్య సాధనంబులు= చావడి మొదలైన శ్రేష్ఠములైన ఉపకరణాలు; కనకమయంబులుగన్= బంగారుమయాలుగా; వస్త్ర, కాంచన+ఆజ్య దధి పయః

ఫల+ ఆది తర్పణ+ద్రవ్య సమృద్ధిన్= గుడ్డలూ, బంగారు, నెయ్యి, పెరుగు, పాలు, పండ్లు మొదలైన దేవతలకు తృప్తి కలిగించే, మంచిపదార్థాల పెంపుచేత; సకల జనులు= సమస్త ప్రజలూ; మెచ్చన్= పొగడగా; పెక్కు+లు+అధ్వరములు= అనేక యజ్ఞాలు; చేసినట్టి= నిర్వర్తించినట్టి; మరుత్తుండు= మరుత్తుడు అనే పేరుగల సార్వభౌముడు; నిత్యపదవిన్= శాశ్వతమైన స్థానంలో; ఉండనేర్చెన్+అయ్యె= ఉండగలిగాడా?

**తాత్పర్యం:** సంవర్తుడనే మహర్షి బృహస్పతితో ఈర్ష్యపడి, ఉపద్రష్ట (ఋత్విక్కు) అయి వచ్చి పూనికతో యజ్ఞకార్యం నిర్వహించగా, హిమాలయ పర్వతంయొక్క అడుగుభాగంలో దేవేంద్రుడు, వరుణుడు మొదలైన దేవతలూ, మునీంద్రులూ సహాయంగా ఉంటూ ఉండగా యజ్ఞానికి కావాల్సిన శాలాదులు బంగారుమయాలుగా, వస్త్రాలు, బంగారు, నెయ్యి, పెరుగు, పాలు, పండ్లు మొదలైన తర్పణానికి అవసరమైన మంచివస్తువులు నిండుగా ఉండగా, అందరూ పొగడేటట్లు అనేక యాగాలు చేసిన మరుత్తుడు అనే చక్రవర్తి శాశ్వతమైన పదవిలో ఉండగలిగాడా?

**విశేషం:** షోడశ చక్రవర్తులలో మరుత్తుడు నిర్వహించిన యజ్ఞయాగాదులు అతడు పొందిన శాశ్వత పదవి ఈ పద్యంలో తెలుపబడినవి. సంవర్తు డుపద్రష్టగా శక్రవరుణాది సురులు మునీంద్రులు సహాయులుగా సాగిన యజ్ఞంలో తర్పణ ద్రవ్య సమృద్ధి సమస్త జనులను అలరింపజేసింది. షోడశరాజుల చరిత్రలను వారి మహత్తర కార్యకలాపాలను తిక్కన సీసపద్యాలలో వివరించాడు. ఇదే మొదటి సీసం.

**సీ.** **సన్మార్గమున రాజ్యసంపద నొంది భూ । సురపూజ లొనరించి, సువ్రతముల**
**బృందారకులఁ బ్రీతిఁ బొందించెఁ దన కర్థిఁ । బర్జన్యుఁ డేఁ టేఁటఁ బసిఁడివాన**
**కనకమయములైన కర్కట ఝషనక్ర । కూర్మచయముతోడఁ గురియుచుండ**
**నయ్యర్థ మెల్ల ధనార్థుల కిచ్చుచుఁ । గురు జాంగలంబునఁ బరమనిష్ఠ**

**ఆ.** **నశ్వమేధముఖము లైన రాజార్హయ । జ్ఞములు పెక్కు సేసె సకలజనులుఁ**
**బొగడునట్టి పాడి(ట) నెగడె సుహోత్రుఁ డ । వ్విభుఁడు దెగియె ననఁగ వినమె అధిప!** **198**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; సుహోత్రుఁడు= సుహోత్రుడనే పేరుగల రాజు; సన్మార్గమునన్= మంచిమార్గంలో; రాజ్యసంపదన్+ఒంది= సామ్రాజ్య సంపత్తిని పొంది; భూసుర+పూజలు= బ్రాహ్మణ సేవలు; ఒనరించి= చేసి; సువ్రతములన్= మంచి వ్రతాలతో; బృందారకులన్= దేవతలను; ప్రీతిన్+పొందించెన్= సంతోషపెట్టాడు; అర్థిన్= ప్రీతితో (ఆసక్తితో); తనకున్= తనకు; పర్జన్యుఁడు= వరుణదేవుడు; ఏఁటేఁటన్= ప్రతిసంవత్సరమూ; కనకమయములు+ఐన= బంగారు మయములైన; కర్కట= ఎండ్రకాయలు; ఝష= చేపలు; నక్ర= మొసళ్ళు; కూర్మ= తాబేళ్ళు; చయములతోడన్= మొత్తంతో; పసిఁడివానన్= బంగారువానను; కురియుచుండన్= వర్షిస్తూ ఉండగా; ఆ+అర్థము+ఎల్లన్= ఆ ధనమునంతటినీ; ధన+అర్థులకున్= ధనాన్ని యాచించేవారికి; ఇచ్చుచున్= ఇస్తూ; పరమనిష్ఠన్= మిక్కిలి ఎడతెగని శ్రద్ధతో; కురు+జాంగలంబునన్= కురుక్షేత్రానికి సంబంధించిన మెరకనేలలో (ఒకానొక దేశంలో); అశ్వమేధ ముఖములు+ఐన= అశ్వమేధాలు మొదలైన; రాజ+అర్హ యజ్ఞములు= రాజులకు తగిన యజ్ఞాలు; పెక్కు+చేసెన్= అనేకాలు చేశాడు; సకలజనులున్= సమస్త ప్రజలున్నూ; పొగడు+అట్టి= నుతించే; పాడి(ట)న్= విధంగా; నెగడెన్= ఒప్పినాడు; ఆ+విభుఁడు= ఆ ప్రభువు; తెగియెన్= మరణించాడు; అనఁగన్= అంటూ ఉండగా; వినమె!= వింటున్నాం కదా!

**తాత్పర్యం:** సుహోత్రుడనే రాజు సక్రమమార్గంలో రాజ్యాన్ని సంపాదించి, బ్రాహ్మణులకు సేవలు చేసి, మంచి మంచి వ్రతాలతో దేవతలను సంతృప్తి పరచాడు. ఎంతో ప్రీతితో వరుణుడు ప్రతిసంవత్సరమూ, బంగారుమయాలైన ఎండ్రకాయలను, చేపలను, తాబేళ్ళను వర్షింపజేస్తూ ఉండగా, తన ధనాన్ని యాచకులకు ఇస్తూ, మిక్కిలి నిష్ఠతో

కురుభూములకు సంబంధించిన మెరకనేలలో అశ్వమేధాది యజ్ఞాలు చాలా నిర్వర్తించాడు. సమస్త ప్రజలూ ఎంతో కీర్తించారు. ఆ ప్రభువున్నూ చివరకు మరణించాడని వింటూనే ఉన్నాం గదా.

**సీ. కాంచనాలంకార కాంతంబులై రూఢి । కెక్కిన గజములు పెక్కువేలు,**
**జవసత్త్వ రూపాది సకల గుణములఁ బెం । పెసఁగిన హయము లనేక లక్ష,**
**లమల సువర్ణమయము లగు కొమ్ములం । గొమరారు పశువులు గోటు, లూర్జి**
**తాంగక విలసదజావికంబులు గణ । నాతీతములు, గన్య లప్రమేయ**

**ఆ. లఖిల రత్నవిరచితాభరణంబు ల । నల్పములు, మహీసురావళులకు**
**నిచ్చి చేసెఁ గ్రతువు లెన్నియేనియు నంగుఁ । డతఁడు నన్యలోక గతుఁడు గాఁడె? 199**

**ప్రతిపదార్థం:** అంగుఁడు= అంగుడు అనేరాజు; కాంచన+అలంకార; కాంతంబులు+ఐ= బంగారు ఆభరణాలచేత ప్రకాశించేవై; రూఢికిన్+ఎక్కిన గజములు= ప్రసిద్ధి కెక్కిన ఏనుగులు; పెక్కువేలు= ఎన్నో (అనేకములైన) వేలు; జవ, సత్త్వ, రూప+ఆది, సకల, గుణంబులన్= వేగమూ, బలమూ, రూపమూ మొదలైన అన్ని గుణాలతో; పెంపు+ఎసఁగిన+హయములు= ఆధిక్యంతో అతిశయించే గుఱ్ఱాలు; అనేకలక్షలు= పెక్కు లక్షలు; అమల, సువర్ణమయములు+అగు+కొమ్ములన్= నిర్మలమైన బంగారుమయాలైన కొమ్ములతో; కొమరారు, పశువులు= అందగించే గొడ్లు; కోటులు= కోట్లు; ఊర్జిత+అంగక+విలసత్+అజ+అవికంబులు= దృఢమైన శరీరాలతో ప్రకాశించే మేకలు, గొఱ్ఱెలు; గణన+అతీతములు= లెక్కకు మిక్కుటాలు; కన్యలు= వివాహం కాని స్త్రీలు; అప్రమేయలు= ఊహించశక్యంకాని వారు; అఖిల, రత్న, విరచిత+ఆభరణంబులు= అన్ని రత్నాలతో బాగుగా కూర్చబడిన నగలు; అనల్పములు= విస్తారములు లేదా అల్పములు కానివి; మహీసుర+ఆవళులకున్= బ్రాహ్మణుల సమూహాలకు; ఇచ్చి= దానం చేసి; ఎన్ని ఏనియున్= ఎన్నో (లెక్కలేనన్ని); క్రతువులు= యజ్ఞాలు; చేసెన్= చేశాడు; అతఁడు= ఆ అంగుడు; అన్యలోక+గతుఁడు+కాఁడె?= పరలోకగతుడు అనగా దివంగతుడు కాలేదా?

**తాత్పర్యం:** అంగుడు అనే రాజు ఎన్నోవేల బంగారు ఆభరణాలతో ప్రకాశించే ప్రసిద్ధికెక్కిన ఏనుగులనూ, వేగమూ, బలమూ, రూపమూ మొదలైన అన్ని సుగుణాలతో మిక్కిలి అతిశయించే అనేక లక్షల గుఱ్ఱాలనూ, స్వచ్ఛమైన బంగారు కొమ్ములతో అందగించే కోట్లకొలది పశువులనూ, లెక్కకు మిక్కిలిగా, గొప్ప శరీరాలతో ఒప్పుతూ ఉండే మేకలనూ గొఱ్ఱెలనూ, మితిలేని కన్నెలనూ, విలువగలిగిన సకల రత్నాలతో పొదిగిన ఎన్నో నగలనూ బ్రాహ్మణ బృందాలకు ఇచ్చి, ఎన్నో యజ్ఞాలు చేశాడు. అట్టిరాజు అంగుడు దివంగతుడు కాలేదా?

**సీ. ఏడు దీవులయందుఁ గ్రీడాగతులఁ దన । రథము చరింప నరాతు లనఁగ**
**వినియు నెఱుంగక విభవ మార్జించుచోఁ । బ్రజల నొప్పింపని పరమపుణ్య**
**కర్మంబునకు మెచ్చి గారవంబునఁ దన । కక్షయధనము ఫాలాక్షుఁ డొసఁగ**
**నశ్వమేధములు జాహ్నవిపొంత శిష్టజ । నాకీర్ణములుగఁ బె క్కాచరించెఁ;**

**ఆ. దారకములు వృష్టిధారలు లెక్కింప । వచ్చుఁగాని యతని యిచ్చుగోవు**
**లెన్నఁ గొలఁది గాదు; సన్నుతిపాత్ర మా । శిబికి నుర్వి నునికి సెల్లె నయ్య? 200**

**ప్రతిపదార్థం:** ఏడు దీవుల అందున్= సప్తద్వీపాలలో; క్రీడాగతులన్= విహారలీలలతో (ఆటలనడకలతో); తన, రథము, చరింపన్= తన తేరు తిరుగగా; అరాతులు+అనఁగన్= శత్రువులు అనే పేరు; వినియున్+ఎఱుంగక= ఏనాడూ వినక (శత్రువులు లేకుండా); విభవము+ఆర్జించుచోన్= సంపదను(గొప్పతనాన్ని) సంపాదించే సందర్భంలో; విభవమున్+ఆర్జించుచోన్= సంపదను గడించేటప్పుడు;

ప్రజలన్= ప్రజలను; నొప్పింపని= బాధించని; పరమ, పుణ్య, కర్మంబునకున్= ఉత్కృష్టములైన ధర్మముయొక్క కార్యానికి; మెచ్చి= పొగడి; గారవంబునన్= ప్రీతితో; తనకున్= తనకు; ఫాలాక్షుఁడు= శివుడు; అక్షయ ధనము= తరగని సంపద; ఒసఁగన్= ఈయగా; జాహ్నవి+పొంతన్= గంగ+ఒడ్డున; శిష్టజన+ఆకీర్ణములుగన్= సజ్జనుల సందడి (ఎడం లేక నిండినవి) కలవిగా; అశ్వమేధములు= గుర్రాలను పశువులుగా చేసే యజ్ఞాలు; పెక్కు= చాలా; ఆచరించెన్= నిర్వహించాడు; తారకములు= నక్షత్రాలు; వృష్టిధారలు= వానచినుకులు; లెక్కింపన్ వచ్చున్= లెక్కపెట్టవచ్చును; కాని= కానీ; అతని+ఇచ్చు గోవులు= అతడు దానం చేసే ఆవులు; ఎన్నన్= లెక్కించటానికి; కొలఁదికాదు= పరిమితి లేదు; సన్నుతి పాత్రము= మిక్కిలి పొగడదగింది అగు; ఆ శిబికిన్= ఆ శిబిచక్రవర్తికి; ఉర్విన్= భూమియందు; ఉనికి= ఉండటం; చెల్లెనయ్యె?= చెల్లినదా?; (సూ॥ తద్ధర్మ భూతక్రియ లార్వార్థ పదకంబులు ప్రశ్నార్థకంబులగు. - ప్రౌఢ. క్రియ -3) వీలయినదా?; (భూలోకంలోనే శాశ్వతంగా ఉండటం జరగలేదు కదా!)

**తాత్పర్యం:** సప్త ద్వీపాలలో విహారలీలలతో తేరు నడవగా, శత్రువు లనేమాట వినీ తెలియక, ధనార్జనవేళ ప్రజలను బాధించక, అతడి పుణ్యకార్యాలకు మెచ్చి పరమశివుడు అక్షయధనాన్ని ప్రసాదించగా, శిష్టులతో ఎడం లేకుండా నిండిపోయిన గంగ ఒడ్డున ఎన్నో అశ్వమేధయాగాలు శిబి చక్రవర్తి నిర్వర్తించాడు. చుక్కలను, వాన చినుకులను లెక్కించవచ్చునేమో కాని అతడు చేసిన గోవుల దానానికి మితిలేదు. అట్లా పొగడదగిన శిబిచక్రవర్తి శాశ్వతంగా ఈ లోకంలో ఉండగలిగాడా?

**సీ. యౌవనంబునఁ దప మాచరింపఁగఁ దండ్రి । పంపున నరిగిన పెంపు కలిమి,**
**సేతువు జలధిఁ బ్రఖ్యాతంబుగా నొన । ర్చిన మర్త్యలోక పావన విభూతి,**
**త్రైలోక్య కంటకు దశముఖు బంధుయు । క్తంబుగాఁ జంపిన కలితనమ్ము,**
**బాలురమరణంబు వాటిల్ల కుండంగఁ । జేసిన యత్యంత చిత్రమహిమ**

**ఆ. గలిగి యశ్వమేధములు మున్నుగా ననే । కాధ్వరము లొనర్చి యఖిల జనులఁ**
**దల్లి వోలె నరసి దశరథ రాముండు । గాలవశత నొందెఁ గాదె యధిప!** 201

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; యౌవనంబునన్= యుక్తవయస్సులో; తపము+ఆచరింపఁగన్= తపస్సు చేయుటకు; తండ్రి+పంపునన్= తండ్రియొక్కఆజ్ఞతో; అరిగిన= (అడవులకు) పోయిన; పెంపు+కలిమి= గౌరవసంపద; జలధిన్= సముద్రముపై; సేతువున్= వంతెనను; ప్రఖ్యాతంబుగాన్= మిక్కిలి ప్రసిద్ధిగా; ఒనర్చిన= చేసిన; మర్త్యలోక= మానవలోకమందలి; పావన+విభూతి= పవిత్రమైన ఐశ్వర్యం; త్రైలోక్యకంటకున్= ముల్లోకాలకు కఠినుడూ, క్షుద్రశత్రువూ అయిన; దశముఖున్= రావణుడిని; బంధుయుక్తంబుగాన్= బంధుసమేతంగా; చంపిన+కలితనమ్ము= సంహరించిన సామర్థ్యం; బాలుర మరణంబు= పసిపిల్లల చావు; పాటిల్లకుండంగన్= కలుగకుండా; చేసిన= కావించిన; అత్యంత, చిత్ర, మహిమ= మిక్కిలి ఆశ్చర్యకరమైన (ప్రసిద్ధి ఐన) మహత్త్వం; కలిగి= పొంది; అశ్వమేధములు= అశ్వమేధయజ్ఞాలు; మున్నుగాన్= మొదలుగా; అనేక+అధ్వరములు+ఒనర్చి= పెక్కు యజ్ఞాలు చేసి; అఖిలజనులన్= సమస్త ప్రజలను; తల్లిపోలెన్= తల్లివలె; అరసి= కాపాడి; దశరథరాముండు= దశరథుడి కొడుకైన రాముడు; కాలవశతన్= చావుకు అధీనం కావటం; పొందెన్+కాదె!= పొందాడు కదా!

**తాత్పర్యం:** ఓ రాజా! యౌవనంలోనే తపస్సు చేయడానికి, తండ్రి ఆజ్ఞతో అడవులకు పోయిన గౌరవమూ, సముద్రంపైన ప్రసిద్ధంగా వంతెన నిర్మించిన ప్రసిద్ధ పవిత్రవైభవం, ముల్లోకాలకు కంటకుడైన రావణుడిని బంధుసమేతంగా కూల్చిన సామర్థ్యం, శిశుమరణాలు కలగకుండా కావించిన ఆశ్చర్యకరమైన మహత్త్వం కలిగి ఉండి, అశ్వమేధాది యజ్ఞాలు ఎన్నోచేసి, సమస్త ప్రజానీకాన్ని తల్లివలె పోషించిన దశరథ రాముడు కాలధర్మం చెందాడుకదా!

**విశేషం:** శ్రీరాముడి అశ్వమేధాది యజ్ఞ నిర్వహణదక్షత, యౌవనంలోనే తండ్రి ఆజ్ఞను పాటించి, అడవుల కేగి, వారధి నిర్మించి దశకంఠుని దునుమాడిన వృత్తాంతాలు 'కట్టె, కొట్టె, తెచ్చె' అని మూడు ముక్కలలో చెప్పబడ్డాయి. శ్రీరాముడి ప్రత్యేక గుణాలలో ప్రస్తుత సందర్భానికి తగినది 'బాలుర మరణంబు వాటిల్లకుండఁగఁ జేయుట' సమస్త ప్రజలను తల్లివలె నరయటం విశేషం. తండ్రి అనటం కంటె తల్లి అనటంలో వాత్సల్యానికి ప్రాముఖ్యం. సహజవాత్సల్యంలో సారళ్యానికి, నైర్మల్యానికి, నిర్వ్యాజప్రేమకు స్థానం. అప్పుడే అది 'రామరాజ్యం' అనే ప్రసిద్ధిని చాటగలుగుతుంది.

**సీ.** **పూర్వవంశ్యులఁ గావఁ బూని వియద్గంగ । నవని భాగీరథి యనఁగఁ బఱపి**
**శక్రుండు మెచ్చఁ బరాక్రమంబునఁ బేర్చి । యప్రతిహతముగ నశ్వమేధ**
**యాగంబు లొనరించునప్పుడు వేయు వే । లరదంబులందుఁ గన్యల నలంకృ**
**తలఁ జేసి యునిచి, రథంబు రథంబున । కిభములు నూఱు నూఱేసి, యేనుఁ**

**తే.** **గేనుఁగునకు గుఱ్ఱములు వేయేసి పాటి । హయము హయమున కట్ల గోచయ మమర్చి,**
**భూరి భూరి యుతంబుగ భూసురులకు । నొసఁగినట్టి భగీరథుం డున్నవాఁడె?** **202**

**ప్రతిపదార్థం:** పూర్వవంశ్యులన్= పూర్వులైన తన వంశంలోని వాళ్ళను; కావన్= కాపాడటానికి; పూని= ప్రయత్నించి; వియద్గంగన్= ఆకాశగంగను; అవనిన్= భూలోకంలో; భాగీరథి+అనఁగన్= భాగీరథి అనగా; పఱపి= ప్రవహింప (పరువెత్త) జేసి; శక్రుండు= దేవేంద్రుడు; మెచ్చన్= పొగడగా, పరాక్రమంబునన్= మగటిమి (విక్రమం)తో; పేర్చి= అతిశయించి; అప్రతిహతముగన్= అనివార్యంగా (అడ్డులేకుండా); అశ్వమేధయాగంబులు= అశ్వమేధయజ్ఞాలు; ఒనరించు+అప్పుడున్= చేసే సందర్భంలో; వేయువేలు= వేలు వేలు; అరదంబులందున్= రథాలలో; కన్యలన్= అవివాహితలైన స్త్రీలను; అలంకృతలన్= అలంకరించబడిన వాళ్ళుగా; చేసి, ఉనిచి= రథాలలో కూర్చోబెట్టి; రథంబు, రథంబునకున్= తేరు తేరుకు; నూఱు, నూఱు+ఏసి= వందవంద వంతున; ఇభములు= ఏనుగులు; ఏనుఁగు+ఏనుఁగునకున్= ఒక్కొక్క ఏనుగుకూ; వేయి+ఏసి పాటి= వేయివంతున; గుఱ్ఱములు= గుఱ్ఱాలు; హయమునకున్= గుఱ్ఱానికి, గుఱ్ఱానికీ; అట్లు+అ= ఆ విధంగానే; గో, చయము+అమర్చి= గోవులమొత్తం ఏర్పాటు చేసి; భూరి, భూరి, యుతంబుగన్= అధికమైన బంగారంతో కూడా; భూసురులకున్= బ్రాహ్మణులకు; ఒసఁగినట్టి= దానం కావించినట్టి (ఇచ్చినటువంటి); భగీరథుండు= భగీరథుడు; ఉన్నవాఁడె?= ఉన్నాడా?

**తాత్పర్యం:** తన పూర్వులైన సగరులకు ఉత్తమగతి కలిగించటానికై అంతకుముం దెవ్వరూ చేయలేని పనికి తాను పూనుకొని, ఆకాశగంగను భాగీరథి అనే పేరుతో భూలోకంలో ప్రవహింపజేసి, దేవేంద్రుడు ప్రశంసించేటట్లు తన పరాక్రమంతో అడ్డులేకుండా అశ్వమేధయజ్ఞాలు కావించే సందర్భంలో వేలవేల రథాలలో అలంకరించిన కన్నెలను ఉంచి, రథరథానికి నూరు నూరువంతున ఏనుగులను, ఏనుగు ఏనుగుకీ వెయ్యేసి గుఱ్ఱాలను, ప్రతి గుఱ్ఱానికీ అదే విధంగా వెయ్యి గోవులను ఏర్పాటు చేసి, అధికంగా బంగారుతో కూడ బ్రాహ్మణులకుఇచ్చిన భగీరథుడు ఉన్నాడా?

**సీ.** **అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగు గం । ధర్వులు హృద్యవాదన మొనర్ప,**
**నప్సరోనికురుంబ మాటలుఁ బాటలు । నై వినోదింపంగ, నమరగణము**
**బహువిధాలంకార భంగుల విన్నాణ । ములు సూప, దివ్యమునులు నుతింప**
**మనుజలోకం బెల్లఁ గనకాన్నవస్త్రభూ । షణ దానములఁ దృప్తి సనఁగ నశ్వ**

**ఆ.** **మేధ సమితిఁ జేసి మెప్పించె నింద్రుని; । శతతమాధ్వరమున నతఁడు హయము**
**నాస పడిన నిచ్చె నా దిలీపునిఁ జూపు । మా! ధరిత్రి నిపుడు మనుజనాథ!** **203**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= రాజా!; విశ్వావసుండు+ఆదిగాన్+కలుగు, గంధర్వులు= విశ్వావసుడు మొదలుగా ఉన్న గంధర్వులు; అర్థిన్= కోరిక; హృద్య, వాదనము+ఒనర్పన్= మనోహరంగా వీణ మొదలగువాటిని వాయించటం చేయగా; అప్సరస్+నికురుంబము= అప్సరసల సమూహం; ఆటలున్+పాటలున్+ఐ= ఆటపాటలు కలిగి; వినోదింపంగన్= ఆనందించగా; అమరగణము= దేవతల మొత్తం; బహువిధ+అలంకార భంగులన్= పలురకాల ఆభరణాల విధాలతో; విన్నాణములు+చూపన్= అందాలు (నేర్పులు) ప్రదర్శించగా; దివ్యమునులు= దేవర్షులు; నుతింపన్= పొగడగా; మనుజ లోకంబు+ఎల్లన్= మానవ సమూహమంతా; కనక+అన్న, వస్త్ర, భూషణ, దానములన్= బంగారమూ, కూడూ, గుడ్డా, నగల దానాలచేత; తృప్తిన్ చనఁగన్= సంతుష్టి చెందగా; అశ్వమేధ సమితిన్= అశ్వమేధాల సమూహాన్ని (అనేకాలైన అశ్వమేధాలను); చేసి= కావించి; ఇంద్రునిన్+మెప్పించెన్= దేవేంద్రుడిని మెప్పించాడు; శతతమ+అధ్వరమునన్= నూరవయజ్ఞంలో; అతఁడు= ఇంద్రుడు; హయమున్= గుర్రాన్ని; ఆసపడినన్= కోరగా; ఇచ్చెన్= ఇచ్చాడు; ఆ+దిలీపునిన్= ఆ దిలీపమహారాజును; ధరిత్రిన్= ఇలలో; ఇపుడు= ఇప్పుడు; చూపుమా!= చూపగలవా!

**తాత్పర్యం:** ఓ రాజా! విశ్వావసుడు మొదలైన గంధర్వు లెంతో సంతోషంతో వీణ మొదలైన వాద్యాలు వాయించగా, అప్సరసస్త్రీలు ఆడుతూ పాడుతూ అలరించగా, దేవతలు రకరకాల అలంకారాలు ధరించి అందాలు చూపగా, ఋషులు కీర్తించగా, మానవులు పసిడీ, కూడూ, గుడ్డా, తొడవులూ మొదలైన దానాలు గ్రహించి సంతృప్తి పడగా, ఎన్నో అశ్వమేధాలు చేసి దిలీపుడు ఇంద్రుడిని మెప్పించాడు. నూరవ యజ్ఞాన్ని చేస్తూ ఉండగా, ఆ గుర్రాన్ని తన కిమ్మని దేవేంద్రుడు అడుగగానే ఇచ్చివేశాడు. అట్టి ఆ దిలీపుడిని ఇపుడు మనం చూడగలమా?

**సీ.** **జనన మాదిగఁ బాకశాసనుకరమునఁ। బ్రవహించు నేయును బాలుఁ ద్రావి,**
**ద్వాదశదినము లాతఁడు గారవింపంగ। వర్ధిల్లి, పండ్రెండు వత్సరముల**
**ప్రాయ మై రాజ్యసంప్రాప్తికి నేతెంచి,। యర్కుని యుదయంబు నస్తమయము**
**నగునట్లు పొలిమేర లైన మహాక్షేత్ర। మంతయు నొక్కండ యనుభవించి,**

**ఆ.** **యన్న పర్వతముల నాజ్యనదుల విప్ర। భోజనము లొనర్చి, రాజసూయ**
**ములును నశ్వమేధములుఁ జేసె మాంధాతృఁ డింద నిలిచెనే నరేంద్రముఖ్య!** 204

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రముఖ్యా!= రాజశ్రేష్ఠుడా!; జననము+ఆదిగన్= పుట్టింది మొదలుగా; పాకశాసను కరమునన్= ఇంద్రుడి చేతిలో; ప్రవహించు= ప్రవహించునట్టి; నేయునున్+పాలున్+త్రావి= నెయ్యీ, పాలూ త్రాగి; ద్వాదశదినములు= పంద్రెండు దినాలు; ఆతఁడు= ఆ ఇంద్రుడు; గారవింపంగన్= ఆదరించగా; వర్ధిల్లి= అభివృద్ధి చెంది; పంద్రెండు, వత్సరముల, ప్రాయము+ఐ=పంద్రెండు సంవత్సరాల వయస్సై; రాజ్య, సంప్రాప్తికిన్+ఏతెంచి= రాజ్యాన్ని పొందటానికై వచ్చి; అర్కుని ఉదయంబున్= సూర్యుడి ఉదయమూ; అస్తయమున్= అస్తమించటమూ; అగునట్లు= అయ్యేటట్లు; పొలిమేరలు+ఐన= హద్దులుగా ఉండే; మహాక్షేత్రము+ అంతయున్= విస్తారమైన భూవలయమంతటినీ; ఒక్కండు+అ= ఒక్కడే; అనుభవించి= భోగించి; అన్న పర్వతములన్= అన్నపు కొండలతో; ఆజ్యనదులన్= నేతి నదులతో; విప్ర భోజనములు+ఒనర్చి= బ్రాహ్మణుల భోజనాలు కూర్చి; రాజసూయములును= రాజసూయ యాగాలూ; అశ్వమేధములున్= అశ్వమేధయజ్ఞాలూ; మాంధాతృడు= మాంధాతృ చక్రవర్తి; చేసెన్= నిర్వహించాడు; ఇందు+అ= ఇక్కడే (ఇహలోకంలోనే); నిలిచెనే?= ఉండినాడా?

**తాత్పర్యం:** రాజముఖ్యా! మాంధాతృ చక్రవర్తి తాను పుట్టింది మొదలు ఇంద్రుడి చేతి నుండి ప్రవహించునట్టి, నెయ్యీ, పాలూ త్రాగి పదిరెండు దినాలు ఆయన ఆదరించగా పెరిగి, పంద్రెండు సంవత్సరాల వయస్సులోనే రాజ్యాన్ని పొంది, ఉదయాస్త పర్వతాలే హద్దులుగా విశాలమైన భూమండలాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా అనుభవించి,

పర్వతాల అంతటి అన్నరాసులతో నదులవలె ప్రవహించే నేతులతో బ్రాహ్మణులకు అన్న సంతర్పణం చేశాడు. రాజసూయాలూ, అశ్వమేధాలూ చేశాడు. కాని, అతడు ఈ లోకంలో శాశ్వతంగా నిలిచాడా?

**సీ. అనిమిషాసుర యుద్ధమున నసురావళి । సమయించి, వర్ణాశ్రమముల నేర్ప**
**రించి, భూమి యలంకరించి, యగ్నిష్టోమ । హయమేధ వాజపేయాతిరాత్ర**
**పౌండరీకము లనఁ బరఁగిన యధ్వరం । బు లనేకములు సేసి, భూసురులకు**
**నఖిల భూములఁ గలయర్థంబు లెల్లను । దనకని యేమియు నునుప కిచ్చె;**

**ఆ. శుక్రునల్లుఁ డనఁగ శోభిల్లు తనయందు । ధర్మతత్త్వ మూర్జితముగ నియమ**
**నిష్ఠుఁడై యయాతి నెగడె శాశ్వతుఁ డయ్యె । నే నృపాల! య మ్మహీశ్వరుండు. 205**

**ప్రతిపదార్థం:** నృపాల!= రాజా; యయాతి= యయాతి మహారాజు; అనిమిష+అసుర, యుద్ధమునన్= దేవ, దానవుల యుద్ధంలో; అసుర+ఆవళిన్= రాక్షసుల సమూహాన్ని; సమయించి= చంపి; వర్ణ+ఆశ్రమములన్= వర్ణాలను, ఆశ్రమాలను; ఏర్పరించి= నిర్ణయించి; భూమి+అలంకరించి= (యజ్ఞ యాగాదులు చేయటానికై) భూ ప్రదేశాన్ని సింగారించి; అగ్నిష్టోమ, హయమేధ, వాజపేయ+అతిరాత్ర, పౌండరీకములు+అనన్= అగ్నిష్టోమం, హయ(అశ్వ)మేధం, వాజపేయం, అతిరాత్రం, పౌండరీకం అని; అనన్= అనగా; పరఁగిన= ఒప్పిన; అనేకములు= పెక్కు; అధ్వరములు= యజ్ఞాలు; చేసి= నిర్వహించి; అఖిల+భూములన్= అన్ని ప్రాంతాలలో; కల+అర్థంబులు= ఉండే ధనాలు; ఎల్లను= అన్నింటినీ; తనకున్+అని+ఏమియున్+ఉనుపక= తన కొరకు అని ఏమీ ఉంచుకొనక; భూసురులకున్= బ్రాహ్మణులకు; ఇచ్చెన్= ఇచ్చాడు; నియమనిష్ఠుఁడు+ఐ= ఏర్పరచుకొన్న నిశ్చయాన్ని (ప్రతిజ్ఞ) ఎడతెగని శ్రద్ధతో నెరవేర్చేవాడై; శుక్రు+అల్లుఁడు+అనఁగన్= శుక్రాచార్యుల అల్లుడు అనగా; శోభిల్లు= ప్రకాశించే; తన అందున్= తనలో; ఊర్జితముగన్= గొప్పగా; ధర్మతత్త్వము= ధర్మస్వరూపం; నెగడెన్= ఒప్పింది; ఆ+మహీశ్వరుండు= ఆ రాజు; శాశ్వతుఁడు+అయ్యెనే?= స్థిరంగా నిత్యంగా ఉన్నారా?

**తాత్పర్యం:** ఓ రాజా! యయాతి, దేవాసురుల యుద్ధంలో పాల్గొని రాక్షసులను సంహరించాడు. వర్ణాశ్రమ ధర్మాలు, ఏర్పాటు చేశాడు. భూమిని సింగారించి అగ్నిష్టోమం, అశ్వమేధం, వాజపేయం, అతిరాత్రం, పౌండరీకం వంటి ఎన్నో యజ్ఞ యాగాదులు చేశాడు. సమస్త భూములలో సంప్రాప్తించే సంపదలను తనకని ఏమీ ఉంచుకొనకుండానే మొత్తం సంపత్తినీ బ్రాహ్మణులకు దానం చేశాడు. శుక్రుడి అల్లుడని ప్రసిద్ధికెక్కి ఎంతో శోభించే అతడు, నియమాలను నిష్ఠతో అనుష్ఠిస్తూ గొప్పగా ధర్మతత్త్వంతో ప్రకాశించాడు. ఆ రాజు ఈ లోకంలో శాశ్వతంగా ఉండగలిగాడా?

**విశేషం:** యయాతి అనేక విధాల యజ్ఞాలు నిర్వర్తించాడు. అందులో అతి ముఖ్యమైనవి హయమేధం, అగ్నిష్టోమం, అతిరాత్రం, వాజపేయం, పౌండరీకం అనేవి.

హయమేధం: దీనినే అశ్వమేధం అనికూడా పిలుస్తారు. నూరు అశ్వమేధాలు చేస్తే ఇంద్రపదవి లభిస్తుంది. మేధ్య అనగా హింసించటం. గుర్రాలను హింసించటం వలన దీని కా పేరు వచ్చింది. ఇటువంటిదే నరమేధం మొదలైనవి.

అగ్నిష్టోమం : ఇది జ్యోతిష్టోమంలో ఒక భాగం. ఎక్కువగా వసంత ఋతువులో ఆచరించబడే యజ్ఞం. అగ్నికి సంబంధించిన స్తోత్రాలు ఇందులో అధికంగా ఉంటాయి.

అతిరాత్రం : ఇది రాత్రి గడిచిపోతూ ఉన్నదనే సందర్భంలో చేయటంవలన దీనికీ పేరు వచ్చింది. ఇది కూడా జ్యోతిష్టోమంలోని ఒక భాగమే. ఇంతటికి జ్యోతిష్టోమం అంటే ఏమిటి? జ్యోతిస్సుల స్తోమం - జ్యోతిష్టోమం అని అర్థం. జ్యోతిస్సులు సామలు - అంటే సామమంత్రాలు. ఇందులో సంస్థ ముఖ్యావయవం. దీనికి పదహారుమంది ఋత్విక్కులు కావాలి. ముఖ్యంగా స్వర్గాన్ని కోరేవాళ్ళు దీనిని నిర్వహిస్తారు. దీనినే సోమయాగం అని కూడా అంటారు.

వాజపేయం : వాజంపేయం వాజపేయం అయినది. ఇది నెయ్యిని మాత్రమే త్రాగి చేయవలసిన యాగం.

పౌండరీకం : ఇది ఒక యజ్ఞభేదం. పుండరీక సంబంధమైనది పౌండరీకం. ఈ యజ్ఞాదు లన్నీ ఆయా పేర్లకు అనుగుణంగా నిర్వర్తించబడుతూ ఉంటాయి.

సత్త్రయాగం : ఇది 13 దినాలు మొదలు 100 దినాల వరకు జరిపే యజ్ఞం.

**సీ. ఓర్వక పెక్కండ్రు రుర్వీశు లొక్కటఁ బైనెత్తి వచ్చిన భండనమున**
**వారి హేతిచ్ఛత్ర వాహన ధ్వజములు । నఱికిన నడు నడు నడిఁకి వార**
**లభయంబు వేఁడిన నందఱఁ గృపఁ గాచి । యేలె; నీ పెన్నేల యెల్లఁ దాన**
**కొని యధ్వరములు పెక్కు లొనర్చి వేడుకఁ । బాయసమ్ములు నపూపములు మోద**

**ఆ. కములు లోనుగాఁగఁ గల వంటకముల ను । ర్వీసురావళులకుఁ బ్రీతిఁ జేసి**
**దక్షిణలుగ మణివితానంబు లిచ్చిన । యంబరీషుఁ డేమి యయ్యెఁ? జెపుమ. 206**

**ప్రతిపదార్థం:** పెక్కండ్రురు= అనేకులు; ఉర్వీశులు= రాజులు; ఓర్వక= సహించక; ఒక్కటన్= ఒక్కుమ్మడిగా; పైన్+ఎత్తి వచ్చినన్= దండెత్తి పైకి రాగా; భండనమునన్= యుద్ధంలో; వారి= ఆ శత్రురాజుల; హేతి, ఛత్ర, వాహన, ధ్వజములు= ఆయుధాలు, గొడుగులు, గుర్రాలు, జెండాలు; నఱికినన్= ఖండించగా; వారలు= ఆ శత్రురాజులు; నడునడు+నడిఁకి= నడునడు మంటూ వణకి (నడునడు= ధ్వన్యనుకరణ శబ్దం); అభయంబున్= భయంలేకుండా ఉండటాన్ని; వేఁడినన్= ప్రార్థించగా; అందఱన్= వాళ్ళను అందరినీ; కృపన్= దయతో; కాచి= కాపాడి; తాను+అ= తానే; ఈ+పెను నేల ఎల్లన్= ఈ (విశాలమైన) గొప్ప రాజ్యాన్ని అంతటినీ; ఏలెన్= పరిపాలించాడు; కొని= పూని; పెక్కులు= అనేకాలు; అధ్వరములు= యాగాలు; ఒనర్చి= చేసి; వేడుకన్= సంతోషంతో; పాయసమ్ములు= పరమాన్నాలూ; అపూపములు= పిండివంటలు; మోదకములు= కుడుములు; లోనుగాఁగన్+కల= మొదలుగా ఉన్న; వంటకములన్= వంటకాలతో; ఉర్వీసుర+ఆవళులకున్= బ్రాహ్మణుల సమూహాలకు; ప్రీతిన్+చేసి= ప్రీతి కలిగించి; మణివితానములు= మణుల మొత్తాలు; దక్షిణలుగన్+ఇచ్చిన= కానుకలుగా ఇచ్చిన; అంబరీషుఁడు= అంబరీషమహారాజు; ఏమి+అయ్యెన్?= ఏమైనాడు?; చెపుమ!= చెప్పుమా!

**తాత్పర్యం:** ఎందరో రాజులు ఒక్కసారిగా ఓర్వలేక యుద్ధంలో దండెత్తి పైకి రాగా, వాళ్ళ ఆయుధాలు, గొడుగులు, వాహనాలు, జెండాలు నరికి, గజగజ వణికే ఆ రాజులు శరణు వేడగా అందరినీ దయతో కాపాడి, తానే ఇంతపెద్ద సామ్రాజ్యాన్ని పరిపాలించాడు. లెక్కలేనన్ని యాగాలు చేశాడు. మణులను బ్రాహ్మణులకు దక్షిణలుగా ఇచ్చాడు. అట్టి ఆ అంబరీష మహారాజు ఇపు డేమైనాడో! నీవే చెప్పుము.

**సీ. లక్షభార్యల నుపలాలించి యొక్కొక్క । వెలఁదికి వేవురు వేవు రాత్మ**
**జులు గాఁగఁ బదికోటు లలఘుమూర్తులఁ గాంచె; । వారును దోర్బలోజ్జ్వలులు నార్య**
**చరితులునై పేర్చి తురగమేధంబు లం । దఱు బహుదక్షిణోదాత్త భంగిఁ**
**జేయుచుఁ దనపంపు సేసి వర్తింపంగఁ । దానును విశ్రుతాధ్వరము లొప్పఁ**

**తే. బెంపు సొంపును సువ్రత సంపదయును । నిర్మల శ్రద్ధయును గర్మనిపుణతయును**
**నెఱయ శశిబిందుఁ డొనరించి నెగడె; నతఁడు । వడయఁ జాలెనె యెన్నఁడుఁ జెడని యొడలు? 207**

**ప్రతిపదార్థం:** శశిబిందుఁడు= శశిబిందుడు అనే రాజు; లక్షభార్యలన్= లక్షమంది భార్యలను; ఉపలాలించి= బుజ్జగించి; ఒక్కొక్క వెలఁదికిన్= ఒక్కొక్క భార్యకు;వేవురు+వేవురు= వెయ్యిమంది, వెయ్యిమంది; ఆత్మజులు+కాఁగన్= కుమారులు కాగా;

పదికోటులు= పదికోట్లమంది; అలఘు+మూర్తులన్= గొప్ప స్వరూపం కలిగినవాళ్ళను; కాంచెన్= కన్నాడు; వారునున్= వారున్నూ; దోస్+బల+ఉజ్జ్వలులున్= భుజశక్తిచేత (అడ్డులేనివాళ్ళు) ప్రకాశించేవాళ్ళు; ఆర్యచరితులున్+అయి= పూజ్యమైన నడవడి కలవారున్నూ అయి; పేర్చి= విజృంభించి; అందరున్= అందరూ; తురగ మేధంబులు= అశ్వమేధాలు; బహు, దక్షిణ+ఉదాత్త భంగిన్= అనేక దక్షిణలను ధారాళమైన (ప్రియమైన) విధంతో; చేయుచున్= నిర్వహిస్తూ; తన పంపు చేసి= తన ఆజ్ఞ నెరవేర్చి; వర్తింపంగన్= ఉండగా; తానును= తానున్నూ; విశ్రుత+అధ్వరములు= ప్రసిద్ధి కెక్కిన యాగాలు; ఒప్పన్= తగునట్లు; పెంపుసొంపును= అతిశయ సంతోషాన్నీ (పాలన సమృద్ధిని); సువ్రతసంపదయును= మంచి వ్రతములయొక్క సంపత్తియున్నూ; నిర్మలశ్రద్ధయును= నిష్కపట మయిన శ్రద్ధయున్నూ; నెఱయన్= నిండుకొనగా; ఒనర్చి= చేసి; నెగడెన్= ఒప్పారాడు; అతఁడు= ఆ శశిబిందుడు; ఎన్నఁడున్= ఎప్పుడున్నూ; చెడని ఒడలు= నశించని శరీరాన్ని; పడయన్+చాలెనె?= పొందగలిగాడా?

**తాత్పర్యం:** శశిబిందుడు లక్షమంది భార్యలను బుజ్జగించి ఒక్కొక్కరి వలన వేయిమంది కలుగగా పదికోట్ల మంది కుమారులను కన్నాడు. వారు బాహుబలంతో ప్రకాశిస్తూ పవిత్రచరిత్రులై అందరూ అనేక దక్షిణలు ధారాళంగా ఇచ్చి అశ్వమేధయాగాలు చేశారు. తండ్రి ఆజ్ఞ కుమారులు ఆ విధంగా పాటించి ప్రవర్తించగా, ఆ శశిబిందుడున్నూ వ్రతనిష్ఠల, శ్రద్ధపాలన సమృద్ధి ఒప్పగా ప్రసిద్ధ యాగాలు నిర్వర్తించాడు. కాని, అతడు శాశ్వత శరీరాన్ని పొందగలిగాడా!

**విశేషం:** 'కర్మనిపుణత' అనే ప్రయోగం 'యోగః కర్మసు కౌశలం' అనే గీతావాక్యాన్ని స్ఫురింపజేస్తూ ఉన్నది. పదికోట్ల పుత్రులను కని ఎన్నో వ్రతాలు, యాగాలు నిర్వహించిన శశిబిందు చక్రవర్తి కూడా తుట్టతుదకు మట్టిలో కలిసిపోయాడు. శాశ్వత శరీరులెవ్వరూ లేరు అని ప్రస్తుతపద్య సారాంశం.

**సీ.** **అధికతపంబున నగ్ని నారాధించి । ప్రత్యక్ష మగుటయు బ్రహ్మచర్య**
**వృత్తంబు దమమును వేదవిత్త్వము నహిం । సయుఁ బాత్రదానంబు శమము వరము**
**గాఁ గోరికొని వేదికాస్థలి మణికన । కాత్మిక యై ముప్పదాఱు యోజ**
**నముల దైర్ఘ్యము నంత కమరు విస్తారంబుఁ । గలుగంగ నొనరించి క్రతువు సేసి**

**తే.** **విప్రతతులకు దాని నతిప్రియముగ । నిచ్చి, తనపేర గయ నుతి కెక్క వటము**
**పొగడు వడయంగఁ బుణ్యుఁడై నెగడె గయుఁడు । భూవరోత్తమ! యతఁ డెందుఁ బోయెఁ జెపుమ!208**

**ప్రతిపదార్థం:** భూవర+ఉత్తమ!= రాజశ్రేష్ఠా!; గయుఁడు= గయుడనే రాజు; అధికతపంబునన్= గొప్ప తపస్సుతో; అగ్నిన్= అగ్నిదేవుడిని; ఆరాధించి= సేవించి; ప్రత్యక్షము+అగుటయున్= అగ్ని సాక్షాత్కరించటమున్నూ; బ్రహ్మచర్యవృత్తంబున్= బ్రహ్మచర్యంగల జీవనమూ; దమమును= ఇంద్రియ నిగ్రహమూ; వేదవిత్త్వమున్= వేదాలను తెలిసికొనే భావమున్నూ; అహింసయున్= హింస చేయకుండటమున్నూ; పాత్రదానంబు= యోగ్యులైన వాళ్ళకు దానం చేయటమున్నూ; శమమున్= అంతరింద్రియ నిగ్రహమున్నూ; వరముగాన్= వరంగా; కోరికొని= ఇష్టపడి గ్రహించి; వేదికాస్థలి= యజ్ఞంచేసే తిన్నెయొక్క ప్రదేశం; మణి, కనక+ఆత్మిక, ఐ= మణులూ బంగారంతో కూడుకొన్నదై; ముప్పదాఱు యోజనముల దైర్ఘ్యమున్= ముప్పైఆరు ఆమడల పొడవును; అంతకున్+అమరు= అనే కొలతలో; ఒప్పునట్టి(కుదురునట్టి); విస్తారంబున్= వెడల్పున్నూ; కలుగంగన్+ఒనరించి= అయ్యేటట్లు చేసి; క్రతువు+చేసి= యజ్ఞం కావించి; విప్రతతులకున్= బ్రాహ్మణుల మొత్తాలకు; ఇచ్చి= ఒసగి; తనపేరన్= తన పేరుతో; వటము= మఱ్ఱిచెట్టు; గయన్= గయాక్షేత్రంలో; నుతికెక్కన్= ప్రశస్తి కెక్కగా; పొగడు+పడయంగన్= కీర్తిని పొందగా; పుణ్యుఁడు+ఐ= ధార్మికుడై; నెగడెన్= వర్ధిల్లాడు; అతఁడు= ఆ గయుడు; ఎందున్+పోయెన్= ఎక్కడికి పోయాడో; చెపుమ!= చెప్పుమా!

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠా! గయుడు తీవ్రమైన తపస్సు చేసి అగ్నిని ఆరాధించాడు. అతడు ప్రత్యక్షం కాగానే తనకు బ్రహ్మచర్య జీవనం, అంతరింద్రియ, బహిరింద్రియ నిగ్రహం, వేద విజ్ఞానం, అహింసా స్వభావం, పాత్రత నెరిగిన దానం చేసే గుణం వరాలుగా ఇమ్మని కోరుకొన్నాడు. ముప్పైఆరు యోజనాలు పొడవూ అంతే వెడల్పు ఉండే యజ్ఞవేదిక రత్నాలతో బంగారుతో కూడుకొని ఉండేటట్లుగా నిర్మించి యజ్ఞం చేసి బ్రాహ్మణులకు ఎంతో ప్రీతి కలిగించాడు. తన పేరుతో గయాక్షేత్రంలో మఱ్ఱిచెట్టు ప్రసిద్ధి కెక్కగా ధార్మికుడై కీర్తికెక్కాడు. కాని, ఇప్పుడు అతడుఎందు బోయాడో!

**సీ.** **ఇరువది యేవురు పరిణత పాచకు । లభ్యాగతులకును నతిథులకును**
**బాటించి క్రొత్తగాఁ బవలును రేలును । వలయు నన్నము లిడ వెలసెఁ బశువు**
**లర్థి నుత్తమగతికై తామ చనుదేర । విశసించు నమరులు వేడ్కతోడఁ**
**బొడసూపి కడుపారఁ గుడువ హవిర్భాగ । ములు వెట్టు నివ్విధమున మహాద్భు**

**తే.** **తముగ నొనరించె సత్త్రయాగము దదుత్స । వంబుఁ గొనియాడ వచ్చిన వార లెల్లఁ**
**బ్రచుర పుణ్యాత్ముఁ డన నొప్పె రంతిదేవుఁ । డవ్విభునకును వలసె లోకాంతరంబు.** **209**

**ప్రతిపదార్థం:** పరిణతపాచకులు= ఆరితేరిన వంటగాళ్ళు; ఇరువది వేవురు= ఇరవైవేలమంది; అభ్యాగతులకును= భోజనానికి రండని స్వయంగా సాదరంతో పిలువబడే ఆహూతులకు; అతిథులకును= నిర్దిష్ట సమయంలో కాకుండా భోజనానికై అనుకొనకుండా ఆగంతకులై వచ్చే యాచకులకున్నూ; పాటించి= ఆదరించి; క్రొత్తగాన్= ఎప్పటికప్పుడు రుచులు కొత్తగా; పవలును= పగలూ; రేలునూ= రాత్రులున్నూ; వలయు= కావలసిన; అన్నములు= చతుర్విధాలైన భోజనాలు (అన్నాలు); ఇడన్= పెట్టగా; పశువులు= గోవులు; అర్థిన్= ఇష్టంతో; ఉత్తమగతికై= సద్గతి కోసమై (అనగా స్వర్గాపేక్షతో); తాము+అ= తమకు తామే; వెలసెన్= చేరాయి; చనుదేరన్= బయలుదేరగా; విశసించు= చంపు; అమరులు= దేవతలు; వేడ్కతోడన్= కుతూహలంతో (అభిలాషతో); పొడచూపి= ప్రత్యక్షమై; కడుపారన్= కడుపునిండా; కుడువన్= తినటానికి; హవిస్+భాగములు= యజ్ఞద్రవ్యాల విభాగాలు; పెట్టున్= ఉంచును; ఈ+విధమునన్= ఇట్లా; సత్త్రయాగము= మంచివారిని కాపాడే యాగం; మహా+అద్భుతముగన్= మిక్కిలి ఆశ్చర్యకరంగా; ఒనరించెన్= చేశాడు; తద్+ఉత్సవంబున్= ఆ యాగానికి సంబంధించిన ఉత్సవాన్ని; కొనియాడన్= పొగడటానికి; వచ్చిన వారలు+ఎల్లన్= వచ్చినవారంతా; ప్రచుర, పుణ్యాత్ముఁడు+అనన్= ప్రసిద్ధి కెక్కిన ధర్మాత్ముడు అనగా; ఒప్పెన్= ప్రకాశించాడు; ఆ+విభునకున్= ఆ ప్రభువునకున్నూ; లోక+అంతరంబు= అన్యలోకం; వలసెన్= తప్పనిది అయింది.

**తాత్పర్యం:** రంతిదేవుడు, ఇరవైవేలమంది ఆరితేరిన వంటవాళ్ళను నియమించి రాత్రింబవళ్ళూ అభ్యాగతులకూ, అతిథులకూ క్రొత్త క్రొత్త రుచులతో వారి వారికి ఇష్టమైన భోజనాలు ఏర్పాటు కావించాడు. సద్గతికోసం తమకు తామై ఎంతో సంతోషంతో గోవులు అతడి యాగానికి వచ్చి చేరాయి. దేవతలు వేడుకతో ప్రత్యక్షమై, కడుపార భుజించటానికి అతడు యజ్ఞద్రవ్యాలు మనకు పిలిచి పెడతా డని సంతోషపడ్డారు. ఆ విధంగా సత్రయాగాన్ని ఎంతో ఆశ్చర్యం కలిగేటట్లు రంతిదేవుడు నిర్వహించాడు. ఆ ఉత్సవాన్ని చూచి మెచ్చినవారంతా ఇత డెంత పుణ్యాత్ముడో అన్నారు. అట్టి పుణ్యాత్ముడు కూడా పరలోకానికి పోక తప్పలేదు.

**సీ.** **శరభసింహవ్యాఘ్ర సత్త్వ చయంబుల । నేడిక లె ట్లట్ల యెక్కి యాడి**
**కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున । దమియింపఁగా సర్వదమన నామ**
**మిడియె నమ్మును; పదంపడి మహారాజ్య ప । దస్థుఁడై కాళింది తటమునందు**
**భాగీరథీ తీర భాగంబునను సర । స్వతి సమీపంబున వాజిమేధ**

**తే. రాజసూయాది వివిధాధ్వరము లొనర్చి। కనక నిర్మిత కరితురంగమ రథంబు**
**లసదృశప్రీతి విప్రులఁ కొసఁగె భరతుఁ। డన్నరేంద్ర చంద్రుండును జన్నవాఁడ. 210**

**ప్రతిపదార్థం:** శరభ, సింహ, వ్యాఘ్ర, సత్త్వ+చయంబులన్= మీగండ్ల మెకం, సింహం, పులి, మొదలైన జంతువుల మొత్తాలను; ఏడికలు= పొట్టేళ్ళు; ఎట్లు= ఏ విధమో; అట్లు+అ= ఆ విధంగా; ఎక్కి ఆడి= పైకెక్కి ఆడి; కట్టుచున్= బంధిస్తూ; విడుచుచున్= విడిపిస్తూ; కణ్వ+ఆశ్రమంబునన్= కణ్వమహర్షి యొక్క ఆశ్రమంలో; దమియింపన్+కాన్= అణచగా; ఆ+ముని= ఆ కణ్వమహాముని; సర్వదమన, నామము= సర్వదమనుడు (అన్నింటిని అణచేవాడు అని భావం) అనేపేరు; ఇడియెన్= పెట్టాడు; పదంపడి= అటుపైన; మహారాజ్యపదస్థుఁడు+ఐ= గొప్ప సామ్రాజ్యపదవిలో ఉన్నవాడై; కాళింది తటమునందున్= యమునానది ఒడ్డున; భాగీరథీతీర భాగంబునను= గంగానదియొక్క ఒడ్డు ప్రదేశంలో; సరస్వతి సమీపంబునన్= సరస్వతీనది చెంత; రాజసూయ+ఆది, వివిధ+అధ్వరములు= రాజసూయం మొదలైన అనేక విధాలైన యజ్ఞాలు; ఒనర్చి= చేసి; కనక, నిర్మిత, కరి, తురంగ, రథంబులు= బంగారుతో నిర్మించబడ్డ ఏనుగులు, గుర్రాలు, తేరులు; అసదృశ+ప్రీతిన్= సాటిలేని సంతోషంతో; విప్రులకున్= బ్రాహ్మణులకు; ఒసఁగెన్= ఇచ్చాడు; ఆ+నర+ఇంద్ర(నరేంద్ర) చంద్రుండును= ఆ రాజశ్రేష్ఠుడున్నూ; చన్నవాఁడు+అ= పోయినవాడే కదా!

**తాత్పర్యం:** శరభం, సింహం, పులివంటి క్రూరజంతువులను పొట్టేళ్ళవలె బంధిస్తూ, విడిపిస్తూ, వాటిపై కెక్కి ఆడుతూ, కణ్వాశ్రమంలో వాటిని అణచివేయటాన్ని చూచి కణ్వుడు సర్వదమనుడు అనే పేరు పెట్టాడు. అతడే తర్వాత మహారాజ్య పదవిని అధిష్ఠించి, గంగా, యమునా, సరస్వతీ నదీ తీరాలలో రాజసూయం మొదలైన అనేక యజ్ఞాలు నిర్వర్తించాడు. అతడు బంగారుతో నిర్మించబడ్డ ఏనుగులను, గుర్రాలను, తేరులను సాటిలేని సంతోషంతో సవన కార్యకలాపాలలో పాల్గొన్న సద్బ్రాహ్మణులకు ఇచ్చాడు. ఆ రాజ శ్రేష్ఠుడున్నూ ఇహలోకాన్ని విడిచి వెళ్ళినవాడే.

**సీ. మిట్టుఁ బల్లంబు నై మెలఁగంగఁ దనరథ। ప్రముఖ వాహనములఁ బఱప నను**
**గా కున్న మేదినిఁ గడుసమస్థలి గాఁగ। వెరవున నొనరించి, విశ్రుతముగఁ**
**దనపేరఁ బృథివినాఁ జనఁ జేసి, గోరూప। యైన యవ్వసుమతి నమరగణముఁ**
**బనిచి యోషధులును బహురత్నములుఁ బిది। కించి జగంబుఁ ఘోషించె పృథుఁడు;**

**తే. సేసె నానాధ్వరము లవి సెప్ప నేల,। సకల ధాత్రియు బ్రాహ్మణసమితి కిచ్చె;**
**నమ్మహానుభావునకును నతుల యశము। కాక సుస్థిరమయ్యెనే కాయ మనఘ 211**

**ప్రతిపదార్థం:** మిట్టున్+పల్లంబున్+ఐ= మిట్ట, పల్లం (హెచ్చుతగ్గులు కలదియై); మేదిని= భూమి; మెలఁగఁగన్= వర్తించగా (ఉండగా); తన= తనయొక్క; రథ, ప్రముఖ, వాహనములన్= తేరు మొదలైన వాహనాలను; పఱపన్= పరువెత్తించటానికి; అనువు+కాకున్నన్= అనుకూలంగా లేకుండగా; కడున్= మిక్కిలి; సమస్థలి+కాఁగన్= చదునైనస్థలం అయ్యేటట్లుగా; వెరవునన్= ఉపాయంతో; ఒనరించి= చేసి; విశ్రుతముగన్= మిక్కిలి ప్రసిద్ధి కెక్కిందిగా; తనపేరన్= తన పేరుతో; పృథివి+నాన్= పృథివి అనగా; చనన్+చేసి= చెల్లే (ఒప్పే) టట్లు ఒనర్చి; గోరూప+అయిన= గోవుయొక్క ఆకారంలో ఉన్నది అయిన; ఆ+వసుమతిన్= ఆ భూమిని; అమరగణమున్= దేవతాసమూహాన్ని; పనిచి= పంపి; ఓషధులును= ఓషధులూ (మందుచెట్లు); బహురత్నములును= అనేక రత్నాలును; పిదికించి= పిండించి; జగంబున్= లోకాన్ని; పృథుఁడు= పృథు చక్రవర్తి; పోషించెన్= పోషించాడు; నానా+అధ్వరములు= అనేక యజ్ఞాలు; చేసెన్= చేశాడు; అని+చెప్పన్+ఏల?= వాటిని చెప్పటం ఎందుకు?; సకలధాత్రియున్= సమస్త భూమినీ; బ్రాహ్మణులకున్= బ్రాహ్మణులకు; ఇచ్చెన్= ఇచ్చాడు; ఆ+మహానుభావునకున్= మిక్కిలి ఉదారుడైన ఆ

మహనీయుడికి; అతుల, యశము+అ= సాటిలేని కీర్తియే; కాక= తక్క (కాని); కాయము= శరీరం; సుస్థిరము= మిక్కిలి శాశ్వతం; అయ్యెనే?= అయిందా?

**తాత్పర్యం:** మిట్ట పల్లాలుగా ఉండి రథం మొదలైన వాహనాలు పోవటానికి అనుకూలంగా లేని భూమిని చదునుచేసి, దానిని తన పేర పృథ్వి అని ఒప్పారేటట్లు చేసి, గోరూపంలో ఉన్న భూదేవిని, ఓషధులూ, రత్నాలూ పిదుకవలసిందిగా ఆజ్ఞాపించి, లోకాన్ని పృథువు పోషించాడు. అతడు చేసిన వివిధ యజ్ఞాలను గురించి చెప్పవలసిన పనిలేదు. సమస్త భూమినీ అతడు బ్రాహ్మణులకు దానమిచ్చాడు. మహోదారుడైన ఆ మహనీయుడి యశస్సు నిలిచింది కాని శరీరం సుస్థిరం కాగలిగిందా!

**సీ. బ్రహ్మవిద్వేషంబు పరికించి కోపించి । యవిధేయుఁ డైన సహస్రబాహుఁ**
**బరిమార్చి నృపతులఁ దర మిడి తునుమాడె । నిరువది యొక్కమా ఱెల్లచోట**
**నందఱ యేలెడు నన్ని భూములుఁ దాన । యేలె ధర్మోజ్జ్వల పాలనమున;**
**రాజయోగ్యములు ధరాసురార్హంబులు । నగు నధ్వరములు పె క్కాచరించెఁ**

**ఆ. గశ్యపునకు నిచ్చి కాశ్యపి యను పేరఁ । జనఁగఁ జేసె నుర్వి జామదగ్న్యు**
**వినమె యమ్మహాత్ముఁడును బరితోష వి । భ్రాంతి గలిగెనేని బ్రదుక లేఁడు. 212**

**ప్రతిపదార్థం:** బ్రహ్మవిద్వేషము= బ్రాహ్మణుడి యెడ కోపం; పరికించి= చూచి; కోపించి= క్రోధం వహించి; అవిధేయుఁడు+ఐన= వినయం లేనివాడైన; సహస్రబాహున్= వెయ్యి చేతులున్న కార్తవీర్యార్జునుడిని; పరిమార్చి= చంపి; నృపతులన్= రాజులను; తరమిడి= వరుసపెట్టి విడువకుండా; ఇరువది ఒక్కమాఱు= ఇరవై ఒక్కసారులు; తునుమాడెన్= సంహరించాడు; ఎల్లచోటన్= అన్నిచోట్ల; అందఱ ఏలెడు= అందరూ పరిపాలించే; అన్ని భూములున్= అన్ని ప్రదేశాలున్నూ; తాన= తానే; ధర్మ+ఉజ్జ్వల, పాలనమునన్= ధర్మంచేత ప్రకాశించే రక్షణతో; ఏలెన్= పోషించాడు; రాజ యోగ్యములు= రాజులకు తగినవి; ధరాసుర+అర్హంబులున్= బ్రాహ్మణులకు తగినవియున్నూ; అగు+అధ్వరములు= అయిన యజ్ఞాలు; పెక్కు= అనేకములు; ఆచరించెన్= చేశాడు; ఉర్విన్= భూమిని; కశ్యపునకున్= కశ్యపమహర్షికి; ఇచ్చి= ఒసగి; కాశ్యపి అనుపేరన్= కాశ్యపి అనే పేరుతో; చనఁగన్= ఒప్పేటట్లుగా; చేసెన్= చేశాడు; జామదగ్న్యున్= జమదగ్ని కుమారుడైన పరశురాముడి గురించి; వినమె!= వినలేదా?; ఆ+మహాత్ముఁడును= ఆ మహనీయుడున్నూ; పరితోష= సంతోషంయొక్క; విభ్రాంతి కలిగెన్+ఏని= విభ్రాంతి కలిగితే; బ్రదుకలేఁడు= జీవించబోడు.

**తాత్పర్యం:** అవిధేయుడైన కార్తవీర్యుడిలో ఉన్న బ్రాహ్మణద్వేషాన్ని చూచి, కోపించి అతడిని సంహరించాడు. అంతటితో ఊరుకోక రాజులనందరినీ విడువకుండా పరిమార్చి ఇరవై ఒక్క పర్యాయాలు దండెత్తి వారి రాజ్యాలను తానే ధర్మనిష్ఠతో ఉజ్జ్వలంగా పరిపాలించాడు. రాజులూ, బ్రాహ్మణులూ చేయవలసిన వివిధ యజ్ఞాలూ తాను చేశాడు. ఈ సమస్త భూమినీ కశ్యపుడికి ధారాదత్తం చేసి, కాశ్యపి అనే పేరు భూమికి కలిగేటట్లు చేశాడు. ఆ పరశురాముడిని గురించి విన్నాముకదా! అట్టి ఆ మహాత్ముడున్నూ పరితోష భంగం కలిగితే కాని శాశ్వతంగా జీవించలేకపోయాడు.

**చ. నలుమడి నీకు నమ్మనుజ నాయకు లేమిటఁ జూడ వచ్చినం**
**దలఁప భవత్సుతుండును ను (నను) దాత్తుఁడు వారలకంటె, నెందునుం**
**గలయది, దీని కేల యధికంబగు నెవ్వగ నింత నొవ్వ; ని**
**త్తెలివి మనంబునం జొనుపు ధీరతసారత గూర్పు నేర్పునన్. 213**

**ప్రతిపదార్థం:** ఏమిటన్= ఏ విషయంలో; చూడన్+వచ్చినన్= ఆలోచించవచ్చినా (ఏ విషయంలో చూచినప్పటికిన్నీ); ఆ+మనుజనాయకులు= ఆ రాజులు; నీకున్= నీకు; నలుమడి= నాలుగు రెట్లు అధికం; తలఁపన్= ఆలోచించగా; వారలకంటెన్= వారందరికంటె; భవత్+సుతుండునున్= నీ కుమారుడును; ఉదాత్తుఁడు= గొప్పవాడు(అనుదాత్తుఁడు అనే ఉస్మానియా ప్రతిలోని ప్రయోగం వలన; విపరీతార్థం స్ఫురిస్తూ ఉన్నది); ఎందునున్= ఎక్కడా; కల+అది= ఉండేది; దీనికిన్= సర్వసాధారణమైన ఈ విషయానికి; అధికంబు+అగు+నెవ్వగన్= మిక్కిలి సంతాపంతో; ఇంత నొవ్వన్+ఏల?= ఇంతగా బాధపడటం ఎందుకు?; ధీరత సారత= ధైర్యం యొక్క చేవదనాన్ని; కూర్చు= కలిగించే; నేర్పునన్= నైపుణ్యంతో; ఈ+తెలివిన్= దేహాత్మాది భేదజ్ఞానాన్ని లేదా ప్రసన్నత్వాన్ని; మనంబునన్= మనస్సులో; చొనుపు= చొప్పించుము.

**తాత్పర్యం:** ఏ విషయంలో చూచినా ఆ రాజులు నీకు నాలుగురెట్లు అధికులు. ఆలోచించగా నీ కొడుకు ఆ రాజులకంటె గొప్పవాడు, ధీరోదాత్తుడూ. ఎక్కడా మరణం ఉండేదే! దీనికొరకు ఎందుకు ఇంతగా బాధపడి తపించిపోతావు? ధైర్యం తెచ్చుకొని దేహాత్మలకు సంబంధించిన జ్ఞానాన్నీ, ప్రసన్నతనూ నీ మనస్సులోకి చొప్పించుము.

**విశేషం:** నలుమడి అనే ఎత్తుగడతో చంపకమాలను ప్రారంభించటం ఒక విశేషం. 'ఎందునుం గలయది' అనేది చక్కని జాతీయం. 'ఎక్కడా ఉండేదే ఇది' అనే అర్థంలో సర్వసాధారణమైన లోకసహజమైన నిత్య సత్యాన్ని చెప్పేటప్పుడు ఇటువంటి జాతీయాన్ని మామూలుగా మనం ప్రయోగిస్తూ ఉంటాం. ముఖ్యంగా ఓదార్పు చెప్పేటప్పుడు ఈ వాక్యాన్ని అంటూ ఉండటం అతి సహజం.

**వ. అని నారదుండు. 214**

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా నారదమహర్షి.

**తే. ఆయువును బుణ్యమును జిరశ్రీయుఁ జేయఁ । జాలు షోడశరాజన్య చరిత మిట్లు**
**సెప్ప, నేర్పడఁగా విని సృంజయుండు । పాండవాగ్రజ! యేమియుఁ బలుక కుండె. 215**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజ!= పాండవులలో మొదట పుట్టినవాడా!(ధర్మరాజా! అని సంబోధన); ఆయువునున్= ఆయుస్సునూ; పుణ్యమును= పుణ్యాన్నీ (సుకృతాన్నీ); చిరశ్రీయున్= శాశ్వతమైన సంపదనూ; చేయన్+చాలు= కలిగించటానికి సమర్థమైన; షోడశరాజన్య చరితము= పదహారుమంది పట్టభద్రులైన ప్రభువుల చరిత్ర; ఇట్లు= ఈ విధంగా; చెప్పన్= వక్కాణించగా; ఏర్పడఁగాన్= తేటపడేటట్లుగా; విని; సృంజయుండు; ఏమియున్= ఏమీ; పలుకక+ఉండెన్= మాటాడకుండా ఉండిపోయాడు.

**తాత్పర్యం:** ధర్మరాజా! ఆయుస్సూ, పుణ్యమూ, శాశ్వతసంపదా కలిగించటానికి సర్వసమర్థమైన షోడశరాజ చరిత్రను చెప్పగా సృంజయుడు తేటతెల్లంగా విని ఏమీ మాటాడకుండా ఉండిపోయాడు.

**విశేషం:** అంత మహామహులైన ఆ మహారాజులు అందరూ అంతరించిపోగా ఇక తన కుమారుడి సంగతి ఏముంది? అని సృంజయుడికి ఆ రాజుల చరిత్ర వినగానే అవగతమయింది. దేహం శాశ్వతం కాదనే నిశ్చయానికి వచ్చాడు. నారదుడు చెప్పినదంతా అంగీకారయోగ్యమే. పరిపూర్ణమైన సమ్మతికి సూచనగా మారుమాటాడకుండా - అనగా కుమారుడి ప్రస్తావనే ఎత్తకుండా మౌనం వహించాడు.

**చ. పలుకక యున్న యద్ధరణిపాలుఁ గనుంగొని యమ్మునీంద్రుఁ 'డేఁ**
**దెలియఁగఁ జెప్పినంతయు నతిస్థిరమై భవదీయ బుద్ధియం**
**దొలసెనొ? బూదిలోనఁ గ్రమ మొందఁగ వేల్చిన నేయి వోలె ని**
**ష్ఫల మయి పోయెనో' యనుడుఁ బ్రాంజలియై తగ నాతఁ డిట్లనున్. 216**

**ప్రతిపదార్థం:** పలుకక+ఉన్న= మాటాడకుండా ఉండే; ఆ+ధరణిపాలున్= ఆ రాజును; కనుంగొని= చూచి; ఆ+మునీంద్రుఁడు= మునిశ్రేష్ఠుడైన ఆ నారదుడు;ఏన్= నేను; తెలియఁగన్+చెప్పిన+అంతయున్= తేటపడగా తెలిపినదంతా; అతి స్థిరము+ఐ= మిక్కిలి నిలుకడ కలిగిందిగా అయి; భవదీయ+బుద్ధి అందున్= నీ యొక్క మనస్సులో; ఒలసెనో= చేరిందా (ప్రవేశించిందా)?; బూదిలోనన్= బూడిదలో; క్రమము+ఒందఁగన్= సొరిది, ప్రవేశించగా; వేల్చిన= హోమాదులలో సమర్పించిన; నేయి+పోలెన్= నెయ్యివలె; నిష్ఫలము+అయి+పోయెనో?= వ్యర్థమైపోయిందా?; అనుడున్= అనగానే; ఆతఁడు= సృంజయుడు; ప్ర+అంజలి+ఐ= మిక్కిలి చేతులు జోడించినవాడై (నమస్కరించినవాడై); తగన్= ఒప్పిదంగా; ఇట్లు= ఇట్లా; అనున్= అంటున్నాడు.

**తాత్పర్యం:** మారు మాటాడకుండా ఉండే సృంజయుడిని చూచి ఆ నారదుడు 'నేను తేటతెల్లంగా చెప్పిన విషయమంతా నీ మనస్సులో నిలకడగా ప్రవేశించిందా? లేక బూడిదలో పోసిన నెయ్యివలె వ్యర్థమైపోయిందా?' అన్నాడు. వెంటనే సృంజయుడు చేతులు జోడించి నమస్కరిస్తూ తగు రీతిలో ఇట్లా అంటున్నాడు:

**విశేషం:** మిత్రుడి హితాన్ని కోరి నారదుడు షోడశరాజుల చరిత్రను వివరించాడు. అంతా చెప్పిన తర్వాత అది ఆదేశం కాదు కాబట్టి, మైత్రీధర్మంతో చివరలో మరల మెల్లగా తాను చెప్పినదానికి మతి సమ్మతి పడిందా? అని అడుగుతున్నాడు. మూలంలో 'శూద్రాపతి కొనర్చిన శ్రాద్ధమువలె వ్యర్థమయ్యెనా' అని ఉండగా తిక్కన 'బూడిదలోన గ్రమ మొందఁగ వేల్చిన నేయివోలె నిష్ఫల మయిపోయెనో?' అని ఎంతో చక్కని ఉపమానంతో సుందరంగా తేటతెల్లం కావించాడు. అలంకారం: ఉపమ.

**తే.** **'పుత్త్రశోకాపహంబును బుణ్యతమము । నైన యాఖ్యానమున నాదు మానసంబు**
**కలఁక యంతయుఁ బాసె; నిష్కల్మషుండ । నైతి నీ దయఁ జేసి సంయమివరేణ్య!'** **217**

**ప్రతిపదార్థం:** సంయమివరేణ్య!= మునిశ్రేష్ఠా!; నీ దయన్+చేసి= నీ కరుణచేత; పుత్రశోక+అపహంబునున్= పుత్రమరణశోకాన్ని పోగొట్టగలిగేదీన్నీ; పుణ్యతమమున్= మిక్కిలి పవిత్రమైనదీన్నీ; ఐన+ఆఖ్యానమునన్= అయినట్టి కథచేత; నాదు మానసంబు+కలఁక= నా మనస్సులోని పాపం లేదా సందేహం; పాసెన్= తొలగింది; నిష్కల్మషుండన్+ఐతిన్= నిర్మలుడిని అయ్యాను.

**తాత్పర్యం:** 'నారదమునీంద్రా! నీ దయచేత పుత్రశోకాన్ని పోగొట్టేది, పుణ్యాన్ని కలిగించేది అయిన కథ విన్నాను. దానివలన నా మనస్సులోని సందేహం తొలగిపోయింది. నేను కల్మషం లేనివాడినయ్యాను.'

**వ.** **అనిన విన యత్తపోధనుండు ప్రీతుండై 'నీ కెద్ది వలయు నడుగు; మిచ్చెద' ననుటయు సృంజయుండును 'దేవా! నీవు ప్రసన్నుండ వగు నంతకంటె మిక్కిలి వలయునది యెయ్యది? భవత్ప్రసాద భాజనంబు లయిన వారికి దుర్లభంబులగు వస్తువులుం గలవే?' యనుటయు నమ్మునివరుండు.** **218**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; ఆ+తపోధనుండు= తపస్సే ధనంగా కలిగిన ఆ నారదుడు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; నీకున్+ఎద్ది+కావలయున్= నీకు ఏది(మి) కావాలి; అడుగుము= కోరుము; ఇచ్చెదన్; అనుటయున్= అని అనగా; సృంజయుండునున్= సృంజయుడున్నూ; దేవా= ప్రభూ; నీవు; ప్రసన్నుండవు+అగు+అంతకంటెన్= దయగలిగినవాడవు (సంతోషించినవాడవు) అయినదానికంటె; మిక్కిలి, వలయు+అది= అధికంగా కావలసింది; ఎయ్యది?= ఏది(ఏముంది?); భవత్= మీయొక్క; ప్రసాద= అనుగ్రహానికి; భాజనంబులు= పాత్రులు; అయినవారికిన్= అయినటువంటి వాళ్ళకు; దుర్లభంబులు+అగు+వస్తువులున్= పొందటానికి శక్యంకాని వైన పదార్థాలున్నూ; కలవే?= ఉండునా?; అనుటయున్= అని అనటమున్నూ; ఆ+మునివరుండు= ఆ ముని శ్రేష్ఠుడు.

**తాత్పర్యం:** అనగా విని నారదుడు సంతోషించి 'నీకేమి వరం కావాలో అడుగుము. ఇస్తాను' అన్నాడు. సృంజయుడిట్లా పలికాడు: 'దేవా! నీవు నాపట్ల దయచూపటం కంటె మరేం కావాలి? నీ అనుగ్రహానికి పాత్రులయిన వారికి సాధ్యంకాని వస్తువులు ఉంటాయా?' ఆ మాటలు విని నారదుడు ఇట్లా అన్నాడు:

**క. 'మ్రుచ్చుల మూఢత్వము నం। జచ్చి నరకవాసమునకుఁ జనిన తనయు నేఁ**
**దెచ్చెద మగుడఁగ వే నీ। కిచ్చెద వగ పుడుగు మింకనేనియు నధిపా!' 219**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; మ్రుచ్చుల= దొంగల; మూఢత్వమునన్= అవివేకంచేత; చచ్చి= చనిపోయి; నరకవాసమునకున్= పాపాత్ములను బాధించే లోకంలో నివసించటానికి; చనిన= పోయిన; తనయున్= కుమారుడిని; ఏన్= నేను; మగుడఁగన్= తిరిగి మరల; తెచ్చెదన్= తీసికొని వస్తాను; వే= తొందరగా; నీకున్= నీకు; ఇచ్చెదన్= ఇస్తాను; ఇంకన్+ఏమియున్= ఇకనైనా; వగపు= దుఃఖం; ఉడుగుము= చాలించుము లేదా మానుము.

**తాత్పర్యం:** 'ఓ రాజా! దొంగల అవివేకం చేత మరణించి నరకలోకంలో ఉండే నీ కుమారుడిని నేను ఇప్పుడే మళ్ళీ తెస్తాను. తొందరగా నీకు ఇస్తాను. ఇకనైనా నీవు దుఃఖాన్ని మానుము.'

**విశేషం:** కథా ప్రారంభంలో దొంగలను వెంగలులు అయినందువలననే వాళ్ళ చావు వాళ్ళే తెచ్చుకొన్నారు అన్నాడు. ప్రస్తుతం ఆ వెంగలి శబ్దానికి పర్యాయంగా 'మూఢత్వము' అని ప్రయోగించాడు. పురాకృత దుష్కృతం వలన 'నరకవాసమునకు' పోయి ఉంటాడని ఊహించవలసి ఉన్నది.

**వ. అని చెప్పిన. 220**

**తాత్పర్యం:** అని చెప్పగా.

**క. దేవముని యిమ్మెయిం దగు। దీవన యిచ్చుటయు నరుగుదెంచె సువర్ణ**
**ష్ఠీవి కడు నద్భుతంబుగ;। నా విభుఁడుఁ బ్రమోద సంభృతాత్ముం డయ్యెన్. 221**

**ప్రతిపదార్థం:** దేవముని= దేవర్షి అయిన నారదుడు; ఈ+మెయిన్= ఈ విధంగా; తగు= అనుకూలమైన; దీవన+ఇచ్చుటయున్= ఆశీర్వాదం చేయటమున్నూ; సువర్ణష్ఠీవి= సృంజయుడి కుమారుడైన సువర్ణష్ఠీవి; కడున్+అద్భుతంబుగన్= మిక్కిలి ఆశ్చర్యంగా; అరుగుదెంచెన్= వచ్చాడు; ఆ+విభుఁడున్= ఆ రాజున్నూ; ప్రమోద, సంభృత+ఆత్ముండు= సంతోషంచేత మిక్కిలిగా భరించబడ్డ మనస్సు కలవాడు; అయ్యెన్= అయ్యాడు.

**తాత్పర్యం:** నారదముని ఆ విధంగా తగిన దీవెన ఈయగానే సువర్ణష్ఠీవి మిక్కిలి ఆశ్చర్యకరంగా అక్కడకు వచ్చాడు. ఆ సృంజయుడున్నూ సంతోషభరితస్వాంతను డయ్యాడు

**విశేషం:** ష్ఠీవనం అనగా ఉమ్మివేయటం, అంటే వెళ్ళగ్రక్కటం లేదా వెలువరచటం. సువర్ణాన్ని(బంగారాన్ని) వెళ్ళగ్రక్కేవాడు కాబట్టి సువర్ణష్ఠీవి అనేది అన్వర్థనామధేయం. చనిపోయిన వాళ్ళను మళ్ళీ రప్పించటం అద్భుతం. మానవలోకానికి దుర్లభంగా ఉండేవి మహాశ్చర్యాన్ని కలిగిస్తాయి. ఆ ఆశ్చర్యమే ప్రకృష్టమైన మోదానికి కుదురు.

**వ. ఇవ్విధంబున నత్తపస్వి యిచ్చిన యక్కుమారునకు సృంజయుం డస్త్ర శిక్షగావించి, వివాహం బొనరించి, యతండు యాగంబులఁ ద్యాగంబుల భోగంబులం దనమనంబునకుఁ బ్రియంబు సేయుచు సంతానవంతుండై నెగడిన, నతం డత్యంత సంతోషంబునం బొదలె నిట్లా సువర్ణష్ఠీవి యశిక్షితా స్త్రుండును నకృత వివాహుండును నయాగకర్తయు నత్యాగవిదితుండును నభోగభాగియు నసంతానవంతుండును నగు సమయంబున సమయుట కారణంబుగా న న్నారదుండు గారుణ్యంబునం గ్రమ్మఱ వానిం గలిగించె; నది యట్లుండె; నవ్విశేషంబులన్నియు సంపన్నంబులయి శౌర్యంబున శత్రుధైర్యంబు దూలించి మేలిమి వడసి నాకలోక సౌఖ్యంబునం బొందిన వాసవపౌత్త్రునకు వగచుట వివేకంబు తెరువుగాదు; వినుమీ లోకంబు దుఃఖబహుళం**

**బగుటయుఁ దపోదానాద్యనుష్ఠానంబుల మానవులు సురలోక సుఖంబు సాధింపం జూచుట సుప్రసిద్ధంబు గాదె! నీ వయ్యర్జున నందనుఁ డెట్టి పుణ్యపరులుం బడయ నరిది యగు పదంబున నునికి దెలియుటకును బావనంబులైన పలువుర భూపతుల వృత్తాంతంబులు వినుటకును ఫలంబయిన పరిజ్ఞానంబున సమాధాన సుస్థిరుండవై యుండుము; పోయి వచ్చెద' నని పలికి, పారాశర్యుం డంతర్ధానంబు సేయుటయు, ధర్మసూనుం డుపశమితశోకుం డయ్యును వివ్వచ్చుండు వచ్చిన వానితో నే మనువాఁడ నను తలంపు పుట్ట నూరకుండె' నని సంజయుండు సెప్పుటయు.** **222**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; ఆ+తపస్వి+ఇచ్చిన= ఆ నారదముని తెచ్చి యిచ్చిన; ఆ+కుమారునకున్= ఆ సువర్ణష్ఠీవి అనే పుత్రుడికి; సృంజయుండు= సృంజయుడు; అస్త్రశిక్షన్+కావించి= బాణ ప్రయోగ విద్యాభ్యాసం చేయించి; వివాహంబు+ఒనరించి= పెండ్లి చేసి; అతండు= ఆ కుమారుడు; యాగంబులన్= యజ్ఞాలతో; త్యాగంబులన్= దానాలతో; భోగంబులన్= సుఖాలతో; తన మనంబునకున్= తన మనస్సుకు; ప్రియంబు+చేయుచున్= ప్రీతిని కలిగిస్తూ; సంతానవంతుండు+ఐ= సంతతి కలవాడై; నెగడినన్= ఒప్పగా; అతండు= అతడు; అత్యంత+సంతోషంబునన్= మిక్కిలి ఆనందంతో; పొదలెన్= వర్ధిల్లాడు; ఇట్లు= ఈ విధంగా; ఆ సువర్ణష్ఠీవి= ఆ సృంజయుడి కొడుకు సువర్ణష్ఠీవి; అశిక్షిత+అస్త్రుండునున్= శస్త్రవిద్య నేర్వనివాడును; అకృత వివాహుండును= చేయబడని వివాహం కలవాడున్నూ (అనగా పెండ్లి కానివాడున్నూ); అయాగకర్తయున్= యజ్ఞాలు చేయనివాడున్నూ; అత్యాగవిదితుండునున్= త్యాగం లేకుండుటం వలన తెలియబడనివాడున్నూ (అనగా త్యాగం లేనివాడున్నూ); అభోగభాగియున్= భోగాలు అనుభవించని వాడున్నూ; అసంతానవంతుండునున్= సంతానం లేనివాడున్నూ; అగు+సమయంబునన్= అయిన సందర్భంలో;సమయుట= మరణించటం; కారణంబుగాన్= హేతువుగా; ఆ+నారదుండు= ఆ నారదమహర్షి; కారుణ్యంబునన్= దయతో; వానిన్= ఆ సువర్ణష్ఠీవిని; క్రమ్మఱన్= మళ్ళీ; కలిగించెన్= సృష్టించాడు; అది+అట్లు+ఉండెన్= అది అట్లా ఉండనీ; ఆ+విశేషంబులు+అన్నియున్= పైన చెప్పిన ఆ వృత్తాంతాలు అన్నీ; సంపన్నంబులు+అయి= సమృద్ధంగా ఉన్నవై; శౌర్యంబునన్= శూరత్వంతో; శత్రు+ధైర్యంబున్+తూలించి= విరోధుల ధైర్యాన్ని తొలగించి; మేలిమిన్+పడసి= ఆధిక్యాన్ని పొంది; నాక, లోక, సౌఖ్యంబునున్= స్వర్గలోక సుఖాన్ని; పొందిన= ప్రాపించిన; వాసవపౌత్రునకున్= ఇంద్రుడి మనుమడికై; వగచుట= దుఃఖించటం; వివేకంబు, తెరువు, కాదు= తెలివి కలిగిన దారికాదు; వినుము= ఆకర్ణించుము; ఈ లోకంబు= ఈ జగత్తు; దుఃఖ+బహుళంబు+అగుటన్= బాధలూ, వ్యసనాలతోదట్టమైనది కావటంచేత; తపస్+దాన+ఆది+అనుష్ఠానంబులన్= తపస్సూ, దానమూ (త్యాగమూ), మొదలైన నడవడులతో (ఆచరించటం); మానవులు= నరులు; సుర, లోక, సుఖంబున్= దేవలోక సౌఖ్యాన్ని; సాధింపన్+చూచుట= సమకూర్చుకొనటానికి ఆలోచించటం; సుప్రసిద్ధంబు+కాదె!= మిక్కిలి ప్రసిద్ధం కదా!? నీవు= నీవు (ధర్మరాజువైన నీవు అని భావం); ఆ+అర్జున నందనుఁడు= ఆ అర్జునుడి కొడుకు; ఎట్టి= ఎటువంటి; పుణ్యపరులకున్= పుణ్యము (ధర్మము) నందు ఆసక్తి కలవారికిన్నీ; పడయన్= పొందటానికి; అరిది+అగు+పదంబునన్= దుర్లభమైన స్థానంలో; ఉనికి= ఉండటం; తెలియుటకును= తెలిసికొనటానికి; పావనంబులు+ఐన= పవిత్రాలైన; పలువురు, భూపతుల, వృత్తాంతంబులు= అనేకరాజుల కథలు; వినుటకును= వినటానికి; ఫలంబు+అయిన, పరిజ్ఞానంబునన్= ఫలితమైన (ప్రయోజనమైన) తెలివితో; సమాధాన, సు, స్థిరుండవు+ఐ+ఉండుము= చిత్తము యొక్క స్థైర్యంతో మిక్కిలి నిలకడ కలవాడవై ఉండుము; పోయి వచ్చెదన్= పోయివస్తాను; అని+పలికి= అని చెప్పి; పారాశర్యుండు= పరాశర మహర్షి పుత్రుడైన వ్యాసుడు; అంతర్ధానంబు+చేయుటయున్= అదృశ్యం కావటమున్నూ; ధర్మసూనుండు= ధర్మరాజు; ఉపశమిత, శోకుండు+అయ్యున్= అణచబడిన దుఃఖం కలవాడు అయినప్పటికీ; వివ్వచ్చుండు= అర్జునుడు; వచ్చినన్= రాగా; వానితోన్= అతడితో; ఏమి+అనువాఁడన్= ఏమని చెప్పగలవాడను; అను+తలంపు= అనేచింత (ఊహ); పుట్టన్= కలుగగా; ఊరకుండెన్= మిన్నక ఉన్నాడు; అని= ఈ ప్రకారంగా; సంజయుండు= సూతుడు; చెప్పుటయున్= చెప్పగా.

**తాత్పర్యం:** ఈ విధంగా నారదుడు బ్రతికించి ఇచ్చిన కొడుకుకు బాణవిద్య నేర్పి, పెండ్లి చేశాడు. అతడు యాగాలూ, త్యాగాలు చేసి, భోగాల ననుభవించి తనకు సంతోషం కలిగిస్తూ సంతానవంతుడైనాడు. ఇట్లా సువర్ణష్ఠీవి

శస్త్రశిక్ష లేనివాడు, వివాహంకానివాడు, యాగాలు చేయనివాడు, త్యాగాల వలన కీర్తి కెక్కనివాడు భోగాల ననుభవించనివాడు, సంతానం లేనివాడు అయిన సమయంలో చనిపోవటం వలన ఆ నారదుడు అతడిని దయతో తిరిగి బ్రతికించాడు. అది అట్లుండగా; ఆ విశేషాలన్నీ గొప్పగా ఉండి, పరాక్రమంతో శత్రువులను చంపి, కీర్తిపొంది, స్వర్గలోక సౌఖ్యం పొందిన అభిమన్యుడిని గూర్చి దుఃఖించటం వివేకం కాదు. వినుము. ఈ లోకం దుఃఖమయం. తపోదానాదులతో మానవులు దేవలోకం చేరాలనుకొనటం ప్రసిద్ధం. అభిమన్యుడు అటువంటి పుణ్యాత్ములు పొందే అరుదైన లోకాన్ని పొంది ఉన్నాడని తెలపటానికే చక్రవర్తుల చరిత్రం చెప్పాను. దాని ఫలంగా కలిగే పరిజ్ఞానంతో నిమ్మళించిన మనస్సుకలవాడవై ఉండుము. పోయివస్తాను' అని వ్యాసుడు అంతర్ధానమయ్యాడు. ధర్మరాజు తన శోకాన్ని ఉపశమింపజేసికొన్నా, అర్జునుడు వస్తే ఏమని చెప్పాలి?' అనే చింతతో ఊరక ఉండిపోయాడు - అని సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు.

**విశేషం:** 'నాకలోక సౌఖ్యంబునన్' అని ప్రయోగించినప్పుడు వెంటనే అభిమన్యుడిని 'ఆ వాసవ పౌత్రు' డని తెలపటం సాభిప్రాయం. వ్యాసుడు నిష్క్రమించటానికి ముందుగా 'సమాధానసుస్థిరుండవై ఉండుము' అని ఆదేశించటం ఎంతో అర్థవంతమైన ప్రయోగం.

**తే.** **'అతనితో ధృతరాష్ట్రుఁ డిట్లనియెఁ 'గ్రీడి । సంగరమున సంశప్తక సమితి నేమి**
**సేసె? సుతువార్త యెవ్వరు సెప్పి? రాతఁ । డట్లు దెగుట యెఱింగి యెట్లయ్యెఁ జెపుమ!'** **223**

**ప్రతిపదార్థం:** అతనితోన్= సంజయుడితో; ధృతరాష్ట్రుఁడు; ఇట్లు; అనియెన్= అన్నాడు; క్రీడి= అర్జునుడు; సంగరమునన్= యుద్ధంలో; సంశప్తకసమితిన్= సంశప్తకుల సమూహాన్ని; ఏమి+చేసెన్?= ఏమి చేశాడు?; ఎవ్వరు= ఎవరు;సుతువార్తన్= అభిమన్యుడి మరణవృత్తాంతం; చెప్పిరి?= చెప్పారు?; ఆతఁడు= ఆ అభిమన్యుడు; అట్లు= ఆ విధంగా; తెగుట= మరణించటం; ఎఱింగి= తెలిసికొని; ఎట్లు+అయ్యెన్?= ఏ విధంగా అయ్యాడు?; చెపుము= చెప్పుమా!(వినిపించవలసింది).

**తాత్పర్యం:** సంజయుడితో ధృతరాష్ట్ర డీ విధంగా అన్నాడు: అర్జునుడు యుద్ధంలో సంశప్తకులను ఏమిచేశాడు? ఎవరు కుమారుడి మరణవార్త తెలిపారు? అభిమన్యుడు ఆ విధంగా మరణించటం తెలిసికొని అర్జునుడు ఏ విధంగా అయ్యాడు? చెప్పవలసింది.

**విశేషం:** సంశప్తక సమితి: ఆర్యావర్తానికి వాయవ్యభాగంలో ఉండే త్రిగర్త దేశానికి సుశర్మ అధిపతి. అతడి సోదరులే సత్యరథుడు, సత్యసేనుడు, సత్యకర్ముడు, మొదలైనవారు. వీరు దుర్యోధనుడి పక్షంలో చేరి అర్జునుడిని చంపాలని దృఢ ప్రతిజ్ఞ చేసి పోరాడి, చివరకు అర్జునుడి చేతిలోనే మరణించారు. అట్లా మరణించినవాళ్ళే సంశప్తక సమూహం.

**క.** **అనిన విని సూతసుతుఁ డి । ట్లనుఁ బేరడవులు దహించు ననలము చందం**
**బున సంశప్తక సేనల । ననిమిషపతి సుతుఁడు దీవ్రుఁడై పొరివుచ్చెన్.** **224**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని; సూతసుతుఁడు= సంజయుడు; ఇట్లు; అనున్= అన్నాడు; పేరు+అడవులు+దహించు= (పెద్ద) గొప్ప అడవులను కాల్చే; అనలము+చందంబునన్= అగ్నివలె; సంశప్తక సేనలన్= సంశప్తకుల సైన్యాలను; అనిమిషపతి సుతుఁడు= దేవేంద్రుడి కొడుకు - అనగా అర్జునుడు; తీవ్రుఁడు+ఐ= పరాక్రమం కలవాడై; పొరివుచ్చెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** అనగా విని సంజయుడు ఇట్లా అన్నాడు: 'గొప్ప అడవులను కాల్చే కార్చిచ్చు వలె సంశప్తక సైన్యాలను అర్జునుడు పరాక్రమంతో విజృంభించి సంహరించాడు.

**విశేషం:** అలం: ఉపమ. 'పేరడవులు దహించు ననలము చందంబు' అనే ఉపమానాన్ని తిక్కన సందర్భోచితంగా ప్రయోగించాడు. తీవ్రుడై అనగా మిక్కిలి వేడిమి కలవాడై అని అర్థం. పై ఉపమానానికి ఇది ఎంతో అనుగుణంగా ఉన్నది. పొరిపుచ్చు అను పదానికి సాధారణార్థం చంపటం. కానీ బాధించటం అనే అర్థాన్ని కూడా ఇచ్చట గ్రహించవచ్చును. అర్జునుడిని 'అనిమిషపతి సుతుడు' అని అనటంలో కూడా రెప్పపాటులోపలనే శత్రువులను కూల్చివేశాడు అనే ధ్వని సూచితం.

**అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ దుర్నిమిత్తంబులం గని కృష్ణునితోఁ జెప్పుట (సం. 7-50-1)**

**వ. అట్లు మర్దించి మగుడు నప్పుడు మాధవు నాలోకించి. 225**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; మర్దించి= సంహరించి; మగుడు+అప్పుడు= (శిబిరానికి) మరలివచ్చే సమయంలో; మాధవున్= శ్రీకృష్ణుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అట్లా చంపి తిరిగి వచ్చేటప్పుడు కృష్ణుడిని చూచి.

**చ. 'కలయఁగ దుర్నిమిత్తములు గానఁగ నయ్యెఁ; మదీయ చిత్తముం**
**గలఁగెడు; మేను వ్రానుపడఁగాఁ దొడఁగెన్; గురుఁ డారయంగఁ గే**
**వలుఁడె? నృపాలుఁ డేదెసకు వచ్చెనొ?' యన్న నతండు రాజుఁ ద**
**మ్ములు సుఖు లొండుమై నశుభముం గల దిప్పు డెఱుంగ నయ్యెడున్.' 226**

**ప్రతిపదార్థం:** కలయఁగన్= అంతటా; దుర్నిమిత్తములు= దుశ్శకునాలు; కానఁగన్+అయ్యెన్= కనిపిస్తున్నాయి; మదీయచిత్తమున్= నా మనస్సుకూడా; కలఁగెడున్= కలతచెందుతూ ఉన్నది; మేను= దేహం; వ్రానుపడఁగాన్+తొడఁగెన్= వ్రానువలె అయిపోవటం (నిశ్చేష్టత చెందటం)ప్రారంభించింది; ఆరయంగన్= ఆలోచించగా; గురుఁడు= ద్రోణుడు; కేవలుఁడు+ఎ!= సామాన్యుడా!; నృపాలుఁడు= ధర్మరాజు; ఏ+దెసకు+వచ్చెను+ఒ= ఎటువంటి దుర్గతి పాలైనాడో!; అన్నన్= అనగా; అతఁడు= శ్రీకృష్ణుడు; రాజున్= ధర్మరాజూ; తమ్ములున్= అతడి తమ్ముళ్ళునూ (భీమ, నకుల, సహదేవులున్నూ); సుఖులు= సుఖంగా ఉన్నారు; ఒండు+మైన్= మరియొకవైపున; అశుభమున్= అమంగళమున్నూ (కీడున్నూ); కలదు= ఉన్నది; ఇప్పుడు= ఇప్పుడే; ఎఱుంగన్+అయ్యెడున్= తెలియ నౌతుంది.

**తాత్పర్యం:** 'అంతటా దుశ్శకునాలే కన్పిస్తున్నాయి. నా మనస్సు కూడా కలత చెందుతూ ఉన్నది. శరీరం స్తంభించటం మొదలైంది. ఆలోచించగా ద్రోణుడు సామాన్యుడా! ధర్మరాజు ఎటువంటి దుర్గతికి వచ్చాడో!' అనగానే కృష్ణుడు 'రాజూ, ఆయన తమ్ములూ (ధర్మరాజూ భీమ, నకుల సహదేవులున్నూ) సుఖంగా ఉన్నారు. మరొకవైపున అమంగళం ఇప్పుడే తెలియబోతూ ఉన్నది.'

**విశేషం:** ఈ చంపకమాలా వృత్తం చివరిపాదం తుదివాక్యం త్రికాలవేది అయిన శ్రీకృష్ణుడి మాట. 'అశుభముం గలదు. ఇప్పు డెఱుంగ నయ్యెడున్' అను వాక్యంలో 'అశుభము' అనే పదానికి 'చావు' అనే అర్థం కూడా ఉన్నది. అది ఇప్పుడే తెలియబోతూ ఉన్నది అన్నాడు. అభిమన్యుడి మరణం శ్రీకృష్ణుడికి తెలుసు. సంశప్తకులతో పోరాడేటప్పుడు చెప్పటం అసంగతం. శిబిరానికి వస్తూ ఉన్నాడు కాబట్టి తాను చెప్పినా చెప్పకపోయినా విషయం తెలిసిపోతుంది. అర్జునుడు తనకు తానుగా దుర్నిమిత్తాలు అంటున్నాడు. అందువలన తాను కూడా సూచనగా అశుభం తెలియబోతూ ఉన్నది అని తెలిపాడు.

**వ. అని పలికెఁ; దదనంతరంబ యద్దామోదర ధనంజయులు సంధ్యా సముచిత కరణీయంబు లాచరించి యరుగుదెంచి నిజ శిబిరంబు సొత్తెంచి; రది చిట్లిన చిత్రరూపంబులు గల కుడ్యంబునుం బోలె వివర్ణాకారులైన జనులవలనం బాడటియున్నం, దత్ప్రకారం బనుసంధించి య న్నరుండు నారాయణున కిట్లనియె. 227**

**ప్రతిపదార్థం:** అని పలికెన్= ఆ ప్రకారంగా చెప్పాడు; తద్+అనంతరంబు+అ= దాని తర్వాత; ఆ+దామోదర, ధనంజయులు= ఆ కృష్ణార్జునులు; సంధ్యా, సమయ, సముచిత+కరణీయంబులు= సాయం సమయానికి తగినపనులు; ఆచరించి= నిర్వర్తించి; అరుగుదెంచి= వచ్చి; నిజ శిబిరంబున్+చొత్తెంచిరి= తమ దండు విడిదిచేసిన చోటు ప్రవేశించారు; అది= ఆ శిబిరం; చిట్లిన+చిత్రరూపంబులు కల+కుడ్యంబునున్+పోలెన్= పగిలిన చిత్రలేఖనాలతోడి గోడలవలె; వివర్ణ+ఆకారులు+ఐన= వన్నె చెడిన రూపాలు కలవారైన; జనుల వలనన్= జనులవలన; పాడఱి+ఉన్నన్= నశించి ఉండగా; తద్+ప్రకారంబు+అనుసంధించి= దాని రీతిని ఉద్దేశించి; ఆ+నరుండు= ఆ అర్జునుడు; నారాయణునకున్= కృష్ణుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** కృష్ణార్జునులు సంధ్యావందనం చేసి, 'కాంతిహీనమై, చింతాక్రాంతమై ఉన్న నిజశిబిరాన్ని' చేరారు. ఆ శిబిరం పగిలిన చిత్రలేఖనా లుండే గోడలవలె ఉన్నది. అక్కడ ఉండే జనాలు పాలిపోయిన మొగాలతో ఉన్నారు. ఆ ప్రకారాన్ని గమనించి అర్జును డిట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమ. చిట్లిన చిత్రలేఖనాలుండే గోడలతో శిబిరాన్ని పోల్చటం ఒక వినూత్న కల్పన. ఆ పోలికలో నిర్జీవుడైన అభిమన్యుడు ద్యోతకం. అర్జునుడిని నరుడు అని పేర్కొన్నప్పుడు శ్రీకృష్ణుడిని నారాయణుడని తెల్పటం అపూర్వమైన ఆ ఇరువురి పూర్వమైత్రిని సూచించటమే.

**నరనారాయణులు:** వీరిరువురూ మైత్రికి మారుపేరు. నరసింహావతారంలోని నరరూపం నరుడు. సింహరూపం నారాయణుడు. వీరు బదరికాశ్రమంలో తీవ్ర తపస్సు చేశారు. ప్రహ్లాదుడికీ ఈ ఇరువురికీ యుద్ధం ఎంతోకాలం జరిగింది. చివరకు విష్ణువుయొక్క అంశములే వీరిరువురని ప్రహ్లాదుడు గ్రహించాడు. సహస్ర కవచుడిని సంహరించటానికి కొన్నివేల సంవత్సరాలు ఇరువురూ ఒకరి తర్వాత ఒకరుగా తపస్సు చేసి ఆ రాక్షసుడి తొమ్మిది వందల తొంభై తొమ్మిది కవచాలు భేదించారు. మిగిలిన ఆ ఒక్క కవచంతోనే కర్ణుడు పుట్టాడు. అతడిని సంహరించటానికే కృష్ణార్జునులుగా పుట్టారు.

**క. 'సైనికులు నన్నుఁ గనుఁగొని । యాననములు వాంచి తొలఁగి యరిగెద రది యే**
**మో నేఁడు వేణు వీణా । గానస్వనములును వీటఁ గలుగవు కృష్ణా! 228**

**ప్రతిపదార్థం:** కృష్ణా!= కృష్ణా!; సైనికులు= సేనలు; నన్నున్+కనుఁగొని= నన్ను చూచి; ఆననములు+వాంచి= ముఖాలు వంచి; తొలఁగి+అరిగెదరు= తప్పుకొని పోతూ ఉన్నారు; నేఁడు= ఈనాడు; అది ఏమో= అది ఎందుకో; వేణు+వీణా+గాన స్వనములు= పిల్లన గ్రోవి, విపంచి అనే వాద్యాల సంగీత ధ్వనులు; వీటన్= శిబిరంలో; కలుగవు= లేవు.

**తాత్పర్యం:** 'కృష్ణా! ఈ సైనికులు నన్ను చూచి తలలు వంచుకొని, ప్రక్కలకు ఒదుగుకొని వెళ్ళిపోతూ ఉన్నారు. అది ఎందువలన? శిబిరాలలో పిల్లనగ్రోవి, వీణలకు సంబంధించిన సంగీత ధ్వనులు వినిపించటం లేదు.

**క. ఈ మేలు ప్రజ కొనర్చిన । యా మహిమకు నెలవు గొంతి యగ్రతనయుఁ డో,**
**భీముఁ డొకొ, తమ్ముఁగుఱ్ఱలొ । కో, మఱి యెవ్వరొకొ! తలఁపుఁ గొలఁదికి మీఱెన్. 229**

**ప్రతిపదార్థం:** ఈ మేలు= ఈ శుభము; ప్రజకున్+ఒనర్చిన= జనానికి కావించిన; ఆ మహిమకున్= అట్టి మహత్త్వానికి; నెలవు= స్థానం; గొంతి+అగ్రతనయుఁడో!= ధర్మరాజో!; భీముఁడొకొ!= భీముడో!; తమ్ముఁగుఱ్ఱలు+ఒకో!= నకుల సహదేవులో!; మఱి+ఎవ్వరొకొ!= ఇంకెవ్వరో!; తలఁపు+కొలఁదికిన్+మీఱెన్= ఊహకు మితి మీరుతూ ఉన్నది.

**తాత్పర్యం:** ఈ శుభాన్ని ప్రజలకు కలిగించిన ఆ మహత్త్వానికి స్థానం ధర్మరాజో, భీముడో, నకుల సహదేవులో మ రెవ్వరో, ఊహకు అందటం లేదు.

**విశేషం:** ఒకొ, ఒకో అనే ప్రయోగాలు ఒకటికి మూడుమారులు వరుసగా ఈ కందపద్యంలో అందంగా కూర్చబడ్డాయి. తర్వాత ఆటవెలదిలో కూడా ఒకో ఒక్కొ అనే సందేహార్థాన్ని తెలిపే పదాలు ప్రయోగించ బడ్డాయి. 'ఒకో' ప్రయోగంలో ఏదో తడబాటు, సందేహం ఊహించలేని అనర్థం చోటు చేసికొన్నట్లు ప్రతి పాఠకుడికీ స్ఫురిస్తుంది.

**ఆ. అలరు మొగముతోడ నభిమన్యుఁ డేలొకో । యెదురు రాఁడు; నాకు నెట్టివార్త**
**చెవులు సోఁకు నొక్కొ! చేవెట్టి కలఁచిన । భంగిఁ ద్రిప్పికొనఁ దొడంగె మనము. 230**

**ప్రతిపదార్థం:** అలరు+మొగముతోడన్= వికసించే ముఖంతో; అభిమన్యుఁడు= అభిమన్యుడు; ఏలొకో= ఎందుకో; ఎదురు రాఁడు= ఎదురుగా రాకున్నాడు; నాకున్= నాకు; చెవులన్= చెవులలో; ఎట్టివార్త= ఎటువంటి వృత్తాంతం (సమాచారం); చోఁకును+ఒక్కొ!= తగులునో (వినిపించునో)!; చే+పెట్టి కలఁచిన+భంగిన్= చేయిపెట్టి కలత కలిగించినట్లుగా; మనము= మనస్సు; త్రిప్పికొనన్+తొడంగెన్= క్షోభించటానికి మొదలైంది.

**తాత్పర్యం:** వికసించే ముఖంతో ముద్దుల కుమారుడు అభిమన్యుడు ఎందుకో ఎదురు రాకున్నాడు! ఈ చెవులకు ఎటువంటి వార్త వినబడుతుందో! చెయ్యిపెట్టి కలచివేసినట్లుగా మనస్సులో క్షోభ మొదలైంది.

**విశేషం:** అలం: ఉపమ. వికసించే ముఖంతో అభిమన్యుడు ఎదురుగా ఎందుకు రాకున్నాడో! - అనే సందేహం అర్జునుడికి కలిగింది. ఏ చెడ్డ వార్త వినవలసి వస్తుందో! - అనే అనుమానం కూడా కలుగుతూ ఉన్నది. ఏదో బయటకు చెప్పలేని ఒక మానసిక వైకల్యం ఏర్పడుతూ ఉన్నది. దీనినే తిక్కన చక్కని జాతీయంలో 'చేవెట్టి కఁలచినభంగి' 'త్రిప్పికొనఁ దొడంగె' అను ప్రయోగాలలో పేర్కొన్నాడు. 'అభిమన్యుడు - వార్త, భంగి' అను మూడు సంస్కృత పదాలు తప్ప తక్కిన ఆటవెలది పద్యం అంతా అచ్చతెనుగు నుడికారపు సొంపుతో 'అలరు'ట గమనార్హం.

**క. పలుమాటల కిటు మఱుమా । టలు వలుకని కృష్ణుతో నడలు మది మొలవం**
**బలుకుచు ధర్మసుతుని విడి । దల కరిగెను మోము వెల్లఁదనమునఁ గదురన్. 231**

**ప్రతిపదార్థం:** పలుమాటలకున్= పెక్కుమాటలకు; ఇటు= ఇట్లా; మఱుమాటలు+పలుకని= బదులు మాటలు మాటాడని; కృష్ణుతోన్= కృష్ణుడితో; మదిన్= మనస్సులో; అడలు+మొలవన్= దుఃఖం అంకురించగా; పలుకుచున్= మాటాడుతూ; మోము= మొగము; వెల్లఁదనమునన్= వివర్ణత్వంతో; కదురన్= అతిశయించగా; ధర్మసుతుని, విడిదలకున్= ధర్మరాజు శిబిరానికి; అరిగెన్= పోయాడు.

**తాత్పర్యం:** పెక్కుమాటలకు ఒక్కమాట కూడా బదులు పలుకని కృష్ణుడితో, మనస్సులో దుఃఖం చిగురించగా మాటాడుతూ, ముఖంలో వివర్ణత కలుగగా ధర్మరాజు ఉన్న శిబిరానికి పోయాడు.

**విశేషం:** ఇందలి పదబంధాలు ఎక్కడికక్కడ తునిగిపోయినట్లు అర్జునుడి వికలమైన మనస్సు ఎట్లా శకలాలు కానున్నదో ధ్వనింపజేస్తూ ఉన్నాయి. కందపద్యాన్ని రకరకాల గతులలో నడిపించే సర్వసమర్థుడైన తిక్కన ముందుగా కొన్ని లఘువులు తర్వాత ఒక గురువు మరల కొన్ని లఘువులు ఒక గురువూ వచ్చేటట్లు ఒక విచిత్రమైన లయగతిని ఇందులో పాటించాడు. అది సంశయగ్రస్తమైన మనస్సులోని సంతాపం అప్పుడప్పుడే చిగుళ్ళు తొడిగితే ఎట్లా ఉంటుందో రచనా శిల్పం ద్వారా అభివ్యక్తమైనది.

**వ. ఇవ్విధంబున నరిగి, యన్నరపతి బంధు మిత్త్రులును మాన్యరాజన్యులుం దానును నొక్కయెడ నున్నం దత్ప్రదేశంబునకుం గేశవుండును దోడన చనంజని, వా రుమ్మలించి యునికియు వారలలోన సుభద్రాసూనుండు లేమియుం జూచి, సవ్యసాచి యడుగులు దొట్రువడ నక్కొలువులోనికిం బోయి కలయంగనుంగొని యెలుంగు రాల్పడ నిట్లనియె. 232**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; అరిగి= పోయి; ఆ+నరపతి= ఆ రాజు (అనగా ధర్మరాజు); బంధుమిత్రులును= బంధువులూ, మిత్రులూ; మాన్య+రాజన్యులున్= గారవించదగిన రాజ శ్రేష్ఠులూ; తానునున్= తానున్నూ; ఒక్క+ఎడన్= ఒకచోట; ఉన్నన్= ఉండగా; తద్+ప్రదేశంబునకున్= ఆ చోటుకు; కేశవుండునున్= శ్రీకృష్ణుడున్నూ; తోడన్+అ= తనతో కూడా; చనన్= పోగా; చని= పోయి; వారు= ధర్మరాజు, బంధుమిత్రులు, రాజన్యులు; ఉమ్మలించి= దుఃఖించి; ఉనికియున్= ఉండటమున్నూ; వారలలోనన్= ఆ అందరిలో; సుభద్రాసూనుండు= అభిమన్యుడు; లేమియున్= లేకుండటమున్నూ; చూచి= కనుఁగొని; సవ్యసాచి= అర్జునుడు; అడుగులు= పాదాలు; తొట్రుపడన్= తడబడగా; ఆ+కొలువులోనికిన్= ఆ రాజ సభలోకి; పోయి= అరిగి; కలయన్= అంతటా; కనుంగొని= చూచి; ఎలుంగు రాల్పడన్= గద్గదిక స్వరంతో (డగ్గుత్తికతో); ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా వెళ్ళి, ఆ ధర్మరాజు బంధుమిత్రులతో, రాజశ్రేష్ఠులతో కలిసి ఒకచోట ఉండగా, అక్కడికి శ్రీకృష్ణుడు వెంటరాగా వెళ్ళి, వారందరూ దుఃఖిస్తూ ఉండటం, వారిలో అభిమన్యుడు లేకపోవటం గమనించి,అర్జునుడు తడబడే అడుగులతో ఆ కొలువులోకి ప్రవేశించి అంతటా కలయజూచి గొంతు బొంగురుపోగా ఇట్లా అన్నాడు:

**క. 'ఆననములు వెలవెల్లం । గా నడ లొదవినది మీకుఁ; గానఁ దడవ మీ**
**లో నభిమన్యుఁడు లేఁడే । మో, నాకుం జెప్పుఁ; డేల యూరకయుండన్. 233**

**ప్రతిపదార్థం:** మీకున్= మీకు(అనగా ధర్మరాజాదులకు అని భావం); ఆననములు= ముఖాలు; వెల వెల్లన్+కాన్= (తెల తెల్లగా) వెల్లబోయేటట్లు; అడలు+ఒదవినది= దుఃఖం కలిగింది; కానన్= తెలియను; తడవన్= వెదుకగా; మీలోన్= మీలో; అభిమన్యుఁడు= అభిమన్యుడు; లేఁడు= లేకున్నాడు; ఏమో!= ఎందుకో!; నాకున్= నాకు; చెప్పుఁడు= చెప్పండి; ఊరక+ఉండన్+ఏల?= మిన్నక (మాటాడకుండా) ఉండటం ఎందుకు?

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! మీకు ముఖాలు వెల్లబాటు కలిగేటట్లు విన్నబాటు (దుఃఖం) కలిగింది. ఎందుకో తెలియదు. ఎంత వెదికినా మీలో అభిమన్యుడు మాత్రం కనిపించటం లేదు. నాకు చెప్పండి. ఊరక ఎందు కిట్లా మౌనంగా ఉన్నారు?

**క. ధనురాచార్యుఁడు దగఁ బ । న్నిన పద్మవ్యూహ మొరులు నేరరు చొరు మం**
**చనుమానింప కతనిఁ జొరు । మనరుగదా! మీ యుపాయ మాఱడిఁ బోవన్. 234**

**ప్రతిపదార్థం:** ధనుస్+ఆచార్యుఁడు= ద్రోణుడు; తగన్= తగునట్లుగా; పన్నిన+పద్మవ్యూహము= ఏర్పరచిన (సిద్ధపరచిన) పద్మాకారం గల యుద్ధవ్యూహం; ఒరులు= ఇతరులు; నేరరు= చొరజాలరు; మీ ఉపాయము= మీయొక్క ఉపాయం; ఆఱడిన్+పోవన్= వ్యర్థంకాగా; అతనిన్= ఆ అభిమన్యుడిని; అనుమానింపక= సందేహించకుండా; చొరుము= ప్రవేశించుము; అనరుకదా!= అని మీరు అనలేదు కదా!

**తాత్పర్యం:** ద్రోణుడు ఏర్పరిచిన పద్మవ్యూహాన్ని ఇతరులు ప్రవేశించ లేరు. మీ ఉపాయం వ్యర్థంకాగా, అనుమానించకుండా ఆ అభిమన్యుడిని అందులో ప్రవేశించు మని మీరు అనలేదుకదా!

**ఉ. అమ్మొనసొచ్చు చొప్పు తెలియన్ వినె; నంతియకాని యిమ్ములం**
**గ్రమ్మఱు భంగి వాఁడు వినఁగానఁడు దీని నెఱుంగ కుర్కిఁ బా**
**పమ్మునఁ బోయి మీరు సొరఁ బంచిన నుక్కునఁ జొచ్చి యోధబృం**
**దమ్ములచేత మ్రగ్గఁడుగదా! కురువీరులు సుట్టుముట్టినన్. 235**

**ప్రతిపదార్థం:** ఆ+మొన+చొచ్చు+చొప్పు= ఆ వ్యూహాన్ని ప్రవేశించే విధం; తెలియన్= తెలియగా; వినెన్= విన్నాడు; అంతియ,కాని= అంతే కాని; ఇమ్ములన్= ఇంపుతో; క్రమ్మఱు+భంగిన్= అందుండి మరలివచ్చే విధాన్ని; వాఁడు= ఆ అభిమన్యుడు; వినన్+ కానఁడు=విని ఎరుగడు; దీనిన్= దీనిని; ఎఱుంగక+ఉన్కిన్= తెలియకపోవటం చేత; పాపమ్మునన్+పోయి= పాపకార్యానికి ఒడిగట్టి; మీరు= మీరందరు; చొరన్+పంచినన్= ప్రవేశించటానికి పంపగా; ఉక్కునన్= శౌర్యంతో; చొచ్చి= ప్రవేశించి; కురువీరులు= కౌరవవీరులు; చుట్టుముట్టినన్= చుట్టూ వచ్చి ముట్టడించగా; యోధ+బృందమ్ముల చేతన్= వీరుల సమూహంచేత; మ్రగ్గఁడు కదా!= చావడు కదా!

**తాత్పర్యం:** ఆ వ్యూహాన్ని ప్రవేశించే విధం మాత్రమే అతడికి ఎరుక. అంతేకాని అనుకూలంగా అందులోనుండి వెలుపలికి మరలిరావటం అతడు విని ఎరుగడు. దీనిని తెలియకపోవటం చేత పాపకార్యానికి ఒడిగట్టి మీరు అతడిని ప్రవేశించటానికి పంపగా, అతడు శౌర్యంతో ప్రవేశించి కురువీరులు చుట్టూచేరి ముట్టడించటంతో యుద్ధవీరుల సమూహంచేత మరణించలేదు కదా!

**మ. హరిమేనల్లుఁడు, గొంతి కూర్చు మనుమం, డస్మత్తనూజుండు, సం**
**గరకేళీ నిపుణుండు, దివ్య శరశిక్షాశాలి యవ్వీరు నె**
**వ్వరొకో నేలకుఁ దెచ్చి? రొక్కరునిచే వాఁడేల చిక్కుం? బొరిం**
**బొరిఁ బెక్కండ్రురు విచ్చుచుం బొదువుచుం బోరాట గల్గెం జుమీ! 236**

**ప్రతిపదార్థం:** హరిమేనల్లుఁడు= శ్రీకృష్ణుడికి మేనల్లుడూ; గొంతి, కూర్చు, మనుమండు= కుంతీదేవి ప్రేమించే మనుమడు; అస్మద్+తనూజుండు= నా కుమారుడూ; సంగర, కేళీ, నిపుణుండు= యుద్ధక్రీడలో విశారదుడూ; దివ్య, శర, శిక్షాశాలి= దివ్యములైన (గొప్పవైన )అస్త్రములయొక్క నేర్పుచేత ప్రకాశించేవాడూ(అయిన); ఆ+వీరున్= ఆ వీరుడిని; ఎవ్వరొకో= ఎవ్వరు; నేలకున్+తెచ్చిరి= పడగొట్టారో; ఒక్కరునిచేన్= ఒకడిచేత; వాఁడు= ఆ అభిమన్యుడు; ఏల చిక్కున్?= ఎట్లా లోబడతాడు(మరణిస్తాడు)?; పెక్కండ్రురు= అనేకులు; పొరిన్ పొరిన్= పలుమార్లు; విచ్చుచున్= తొలగుతూ; పొదువుచున్= క్రమ్ముతూ; పోరు+ఆట= రణక్రీడ (యుద్ధం చేయటం); కల్గెన్+చుమీ= కలిగి ఉంటుంది కాబోలు!

**తాత్పర్యం:** శ్రీ కృష్ణుడి మేనల్లుడూ, కుంతికి కూరిమి మనుమడూ, నా కుమారుడూ, యుద్ధక్రీడా చతురుడూ, దివ్యాస్త్రాల నేర్పుతో ప్రకాశించేవాడూ అయిన ఆ వీరుడిని ఎవరు నేల కూల్చారో? ఒక్కడి చేత వాడు ఎందుకు మరణిస్తాడు? (ఒక్కడికైతే వాడు లోబడడు). పలువురు మాటిమాటికి తొలగుతూ (కమ్ముకొంటూ) ఎదుర్కొంటూ యుద్ధం చేయటం జరిగి ఉంటుంది.

**విశేషం:** పద్యం యొక్క ఎత్తుగడ పరమగంభీరంగా ఉన్నది. అభిమన్యుడితో తమకుండే సంబంధాన్ని చెప్పేటప్పుడు మొట్టమొదట శ్రీకృష్ణుడిని, తర్వాత కుంతీదేవినీ, చివరగా తననూ అర్జునుడు ప్రస్తావించాడు. ముందుగా పెద్దలను చెప్పి, తర్వాత తనను గురించి చెప్పుకొనటం చక్కని సంప్రదాయం. ముందుగా మూడు విశేషణాలలో సంబంధ బాంధవ్యాలను తెలుపుతూ, చివరి రెండు విశేషణాలలో యుద్ధక్రీడా చాతుర్యాన్నీ, అస్త్ర విద్యా ప్రకాశత్వాన్నీ తిక్కన వివరించాడు. 'విచ్చుచుం బొదువుచుం బోరాట' సల్పినట్లుగా అభివర్ణించటం తిక్కనకు తెలిసిన యుద్ధ తంత్రాన్ని వెల్లడిస్తూ ఉన్నది.

**క. గురులకు భక్తుఁ డుదారుఁడు, । గరుణ గలఁడు, శౌర్య ధైర్య గాంభీర్యధురం**
**ధరుఁడు, మొగమోడు నా సుర । వరపౌత్రుఁడు లేమి కోర్వవచ్చునె చెపుఁడా! 237**

**ప్రతిపదార్థం:** గురులకున్= పెద్దలకు; భక్తుఁడు= సేవ చేసేవాడు; ఉదారుఁడు= గొప్పవాడు; కరుణగలఁడు= దయగలవాఁడు; శౌర్య, ధైర్య, గాంభీర్య, ధురంధరుఁడు= శూరత్వం, ధీరత్వం, క్రోధశోకాదులచేత వికారం పొందని స్వభావం అనే వాటియొక్క

భారాన్ని భరించేవాడు; మొగమోడున్= మొగమోటమి కలవాడూ; ఆ+సురవర పౌత్రుండు, లేమికిన్= ఆ ఇంద్రుడి మనుమడు లేకుండటానికి; ఓర్వవచ్చును+ఎ?= సహించవచ్చునా?; చెపుఁడా!= చెప్పండి.

**తాత్పర్యం:** పెద్దల యెడ భక్తి గలవాడూ, గొప్పవాడూ, దయగలవాడూ, శౌర్యం, ధైర్యం, గాంభీర్యం అనే గుణాల భారాన్ని భరించేవాడూ, మొగమోటమి కలవాడూ, ఇంద్రుడి మనుమడూ లేకపోవటాన్ని సహించవచ్చునా! చెప్పండి.

**క. అన్నగుమోమును, నత్తెలి । గన్నులు, నవ్వెడఁద యురముఁ గన్నారంగాఁ**
**గన్నను బ్రదుకుదుఁ; గానక । యున్నను బ్రాణంబు లెట్టు లుండఁగ నేర్చున్? 238**

**ప్రతిపదార్థం:** ఆ+నగుమోమునున్= ఆ నవ్వే ముఖాన్ని; ఆ+తెలికన్నులున్= ఆ తెల్లని కన్నులున్నూ; ఆ+వెడఁద+ఉరమున్= ఆ విశాలమైన వక్షస్థలమున్నూ; కన్నారంగాన్= కన్నులారా; కన్నను= చూడగలిగితే; బ్రదుకుదున్= జీవిస్తాను; కానక+ఉన్నన్= చూడకుంటే; ఎట్టులు= ఏ విధంగా; ప్రాణములు+ఉండఁగన్+నేర్చున్= ప్రాణాలు ఉండగలుగుతాయి (జీవించగలను అని భావం).

**తాత్పర్యం:** ఆ నవ్వుముఖాన్ని, ఆ తెల్లని కన్నులను, ఆ విశాలవక్షఃస్థలాన్నీ కళ్ళారా చూడగలిగితే జీవిస్తాను. చూడక పోతే ఎట్లా జీవించగలను?

**విశేషం:** అభిమన్యుడిలో అర్జునుడిని ఆకట్టుకొన్న అతిముఖ్య లక్షణాలు మూడు. అవి అతడి అందాన్నీ, క్షత్రియోచిత గాంభీర్యాన్నీ వెల్లడించేవి. ఏడుపుమొగంతో ఎదురువస్తే ఎప్పుడూ అపజయమే. కాని, నవ్వుమొగం ఆనందానికీ, అఖండ విజయానికీ సంకేతం. ముఖానికి మరీ సౌందర్య స్ఫూర్తిని కలిగించేవి కళ్ళు. అవి తెల్లని కళ్ళు అయితే ముఖకాంతి ఇనుమడిస్తుంది. దేదీప్యమానంగా వెలిగే ఆ తెల్లని కన్నుల నవ్వు మొగంతో ఎదురుగా అభిమన్యుడు రాలేదే? అని అర్జునుడి ఆవేదన. చిన్నకందంలో అభిమన్యుడి అందాన్ని తిక్కన చక్కగా ఆవిష్కరించాడు. వెడదయురము సుక్షత్రియ లక్షణం. అచ్చతెలుగు పదాలలో ఉండే మాధుర్యం తిక్కన కూర్పులో మిక్కిలి ఇనుమడించింది. ఈ పద్యం మొత్తంలో 'ప్రాణంబులు' అనే ఒక తత్సమం తప్ప తక్కిన పద్యమంతా సహజ సుందరమైన తెలుగు పలుకుబడితో ఎంతో శోభించింది.

**సీ. హంసతూలిక పాన్పునందుఁ బొందెడు మేను । కఠినంపు నేలతోఁ గదిసె నేఁడు;**
**గొడుగుల నీడ పై నడరఁ జెన్నగు మోము। పొరిఁ బర్వు పెందూళి బ్రుంగె నేఁడు;**
**లలనలు లీలమైఁ గొలువ నుండెడు భోగి । వఱళులలో నున్నవాఁడు నేఁడు;**
**నానాజనములకు నాథుఁడై శోభిల్లు । దొర యనాథత్వంబుఁ బొరసె నేఁడు;**

**ఆ. వినయరతుఁడు, హృదయవిదుఁడు, సుభద్ర గా । రాబుపట్టి, మగలరాజు, మాన**
**ధనుఁడు, దివిజరాజు మనుమఁడు, నా చెలి । కాఁడు, ముద్దులాఁడు లేఁడు నేఁడు. 239**

**ప్రతిపదార్థం:** హంసతూలిక+పాన్పునందున్= హంస తూలికా తల్పంపై; పొందెడుమేను= పరుండే శరీరం; నేఁడు= ఈనాడు; కఠినంపు+నేలతోన్+కదిసెన్= గరుకైన గట్టి నేలతో చేరింది; గొడుగులనీడ= గొడుగులయొక్క నీడ; పైన్+అడరన్= మీదపడగా (పైన వ్యాపించగా); చెన్ను+అగు, మోము= అందగించే ముఖం; నేఁడు= ఈనాడు; పొరిన్= మాటికి; పర్వు, పెను+ధూళిన్= వ్యాపించే ఎక్కువ దుమ్ముతో; బ్రుంగెన్= కమ్మ(ప్ప)బడింది; లలనలు= ఇంతులు(స్త్రీలు); లీలమైన్= విలాసంతో; కొలువన్= సేవించగా; ఉండెడు భోగి= ఉండే సుఖపురుషుడు; నేఁడు= ఈనాడు; వఱళులలోన్+ఉన్నవాఁడు= నక్కల (మధ్య) నడుమ ఉన్నవాడు; నానాజనములకున్= సమస్త ప్రజలకు; నాథుఁడు+ఐ= ప్రభువై; శోభిల్లుదొర= ప్రకాశించే నాయకుడు; నేఁడు= ఈనాడు; అనాథత్వంబున్= అనదతనాన్ని (అనగా దిక్కులేనితనాన్ని); పొరసెన్= పొందాడు; వినయరతుఁడు= విశిష్టమైన నీతియందు ఆసక్తి కలవాడు; హృదయవిదుఁడు= మనస్సు తెలిసికొనేవాడు అనగా ఇంగితజ్ఞుడు; సుభద్రగారాబు పట్టి= సుభద్ర ముద్దులకొడుకు;

మగలరాజు= వీర శ్రేష్ఠుడు (పురుషోత్తముడు); మానధనుఁడు= అభిమానమే ధనంగా కలవాడు; దివిజరాజు మనుమఁడు= ఇంద్రుడి పౌత్రుడు; నా+చెలికాఁడు= నా మిత్రుడు; ముద్దులాఁడు= మనోజ్ఞుడు; నేఁడు లేఁడు= ఈనాడు లేడు.

**తాత్పర్యం:** హంసతూలికా తల్పంమీద పవ్వళించే శరీరం ఈనాడు కటికనేలలో కలిసింది. గొడుగుల నీడలో అందగించే ముఖం మాటిమాటికీ వ్యాపించే పెద్దదుమ్ముతో క్రమ్మకొనబడింది. స్త్రీలు విలాసంతో సేవించగా ప్రకాశించే సుఖవంతుడు ఈనాడు నక్కల నడుమ పడి ఉన్నాడు. సమస్త ప్రజలకు ప్రభువై ఉండే దొర ఈనాడు దిక్కులేనితనాన్ని పొందాడు. మిక్కిలి వినయపరుడూ, ఇంగితజ్ఞుడూ, సుభద్ర ముద్దుల కొడుకూ, వీరశ్రేష్ఠుడూ, అభిమానధనుడూ, ఇంద్రుడి మనవడూ, నా మిత్రుడూ అయిన ఆ మనోజ్ఞుడు నేడు లేడు.

**విశేషం:** తిక్కన సీసపద్యపాదాలలో అభిమన్యుడి పూర్వస్థితికీ, ఇప్పటి స్థితికీ ఉండే తారతమ్యాన్ని తెలుపుతూ ఆటవెలదిలో అతడి అందచందాలు, అందరినీ అలరించే అతడి గుణగణాలు అభివర్ణించాడు. వందిమాగధులు మేలు కొలుపులతో మేలుకొనేవాడిని నక్కలు అరుపులతో మేల్కొలుపుతూ ఉన్నాయా అనే భావాన్ని తిక్కన వదలివేశాడు. తక్కిన విషయం మూలానికి సన్నిహితంగా ఉన్నా, ఎంతో స్వతంత్రంగా భాసిస్తూ, విస్పష్టతనూ విశదత్వాన్నీ సంతరించుకొన్నది. కుమారుడిని 'నా చెలికాడు' అనటం విశేషం. చక్కగా నీతి శాస్త్రాన్ని ఆకళించుకొన్న తిక్కన అభిమన్యుడి అప్పటి వయస్సును బట్టి 'చెలికాడు' అని ప్రయోగించటం ఔచిత్యవంతంగా ఉన్నది. మగలరాజు అనే ప్రయోగంలో మహాశూరులకే అతడధిపుడు అని ప్రకటిస్తూ, చివరిపాదంలోని శబ్దాలంకారం గమనార్హం. అది పైకి వినటానికి అందంగా ఉన్నా, అందులో అర్జునుడి మనఃక్షోభ పాఠకుడి మనస్సును కదలించి వేస్తుంది.

**ఉ. అక్కట! మందభాగ్యునకు నట్టి తనూభవరత్న మెవ్విధిన్**
**డక్కు? విధాత నిర్దయుఁ; డొడంబడునే కడు మేలి వస్తువుల్**
**పెక్కుదినంబు లుక్కి? యరిబృందము పిల్చినఁ బోటు బంటనై**
**యక్కడ కేల పోయితి? మహాగుణభూషణుఁ గోలుపోయితిన్.' 240**

**ప్రతిపదార్థం:** అక్కట!= అయ్యో!; మందభాగ్యునకున్= తక్కువ అదృష్టం కలవాడికి; అట్టి, తనూభవ, రత్నము= అటువంటి పుత్రశ్రేష్ఠం; ఏ+విధిన్= ఏ విధంగా; దక్కున్?= దక్కుతుంది?; విధాత= బ్రహ్మ; నిర్దయుఁడు= దయలేనివాడు; కడుమేలి వస్తువుల్= మిక్కిలి గొప్పవస్తువులు; పెక్కు+దినంబులు+ఉన్కి= చాలా దినాలు ఉండటం; ఒడంబడునే?= అనుకూలించేనా?; అరి, బృందము, పిల్చినన్= పగవారి గుంపు పోరుకు పిలువగా; పోటుబంటను+ఐ= శూరుడనై; అక్కడకున్= ఆ సంశప్తకులతో పోరాడే చోటుకు; ఏల?= ఎందుకు?; పోయితిన్= పోయాను; మహా, గుణ, భూషణున్= గొప్ప గుణాలు ఆభరణాలుగా ఉన్నవాడిని; కోలుపోయితిన్= పోగొట్టుకొన్నాను.

**తాత్పర్యం:** 'అయ్యో! నావంటి దౌర్భాగ్యుడికి అటువంటి పుత్రరత్నం ఎట్లా దక్కుతుంది? బ్రహ్మ దయలేనివాడు. మిక్కిలి గొప్ప వస్తువులను చాలా దినాలు ఉంచటానికి అతడు సమ్మతించడు. శత్రువులైన ఆ సంశప్తక సైన్యం పిలవగానే నే నక్కడికి ఎందుకు పోయాను? మహోదాత్త గుణాలే ఆభరణాలుగా శోభించే అభిమన్యుడిని పోగొట్టుకొన్నాను.'

**వ. అనుచుఁ జదికిలం బడి ఫల్గునుండు. 241**

**తాత్పర్యం:** అంటూ నేలమీద కూలబడి అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. హా! యను, ధర్మరాజ తనయా! యను, న న్నెడఁబాయ నీకుఁ జ**
**న్నే?' యనుఁ, దల్లి నేఁప జనునే! యనుఁ, గృష్ణుఁడు వీఁడె వచ్చె రా**
**వే! యను, నొంటి వోకఁ దగవే! యను, నేగతిఁ బోవువాఁడ నే**
**నో యభిమన్యుఁడా! యనుఁ, బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే! యనున్. 242**

**ప్రతిపదార్థం:** హా!+అనున్= దుఃఖాన్ని తట్టుకోలేక హా! అని అంటాడు; ధర్మరాజ తనయా+అనున్= ధర్మరాజు కొడుకా! అంటాడు; నీకున్+నన్నున్+ఎడన్+పాయన్+చన్నే!= నీకు, నన్ను, వదలి వెళ్ళటం తగునా!; అనున్= అంటాడు; తల్లిన్+ఏఁపన్+చనునే!= (మీ) అమ్మను బాధించటం తగునా?; అనున్= అంటాడు; కృష్ణుఁడు= నీ మేనమామ కృష్ణుడు; వీఁడె, వచ్చెన్= ఇతడే వచ్చాడు; రావే!+అనున్= తొందరగా రా అంటాడు; ఒంటిపోక, తగవే= ఒంటరిగా పోవటం న్యాయమా?; అనున్= అంటాడు; ఓ+అభిమన్యుడా!; నేను+ఏగతిన్+పోవువాఁడన్= (కుమారా!) ఓ అభిమన్యూ! నేను ఏ విధంగా పోగలను; అనున్= అంటాడు; ప్రియ+ఉక్తులన్= ప్రీతిగల మాటలతో; ఉత్తరన్= ఉత్తరను; తేర్పవే!= తేరుకొనేటట్లు చేయవే!; అనున్= అంటాడు.

**తాత్పర్యం:** దుఃఖాన్ని భరించలేక అర్జునుడు హా! ధర్మరాజ కుమారా! నన్నెడబాయటం నీకు తగునా? తల్లిని బాధించటం ధర్మమా! ఇదిగో నీ మేనమామ కృష్ణుడు వచ్చాడు. తొందరగా రా! ఒంటిగా వెళ్ళిపోవటం యుక్తమా! ఓ అభిమన్యూ! నే నేమైపోతానో! ఉత్తరను మంచి మాటలతో ఊరడించుము అని అనేకవిధాలుగా విలపించాడు.

**విశేషం:** ఈ పద్యం ప్రారంభమే సంతాపార్థకం అయిన హాకారం. ప్రతిపాదం మొదట్లో యతిస్థానంలో సంబోధన అంతమయ్యేటట్లు దుఃఖాన్ని అభివ్యక్తం చేయటం ఈ రచనలోని విశిష్టత. తమలో పెద్దవాడు ధర్మరాజు. ఆయన వంశాన్ని నిలపవలసిన వాళ్ళలో అభిమన్యుడు ముఖ్యుడు. అందువలన ధర్మరాజ తనయా! అని అన్నట్లు తెలుపబడింది. మేనమామ కృష్ణుడు 'ఇడుగో! వచ్చాడు రావే' అనటం వలన అభిమన్యుడికీ, కృష్ణుడికీ మధ్య ఉండే సాన్నిహిత్యం, అన్యోన్య ప్రేమవాత్సల్యాలు వెల్లడింపబడ్డాయి. ఒంటిగా నీవు వెళ్ళావు. నేనెట్లా వెళ్ళేది? తల్లి నెందుకు బాధపెడతావు? నీ ఉత్తరను తేర్చుము అని అందరితో అభిమన్యుడికి ఉండే సంబంధ బాంధవ్యాన్ని చక్కగా తిక్కనామాత్యుడు ఈ ఉత్పలమాలావృత్తంలో వివరించాడు.

**వ. అని మఱియు ననేక ప్రకారంబులం బలవించి యుధిష్ఠిరు నాననం బాలోకించి. 243**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; మఱియున్= ఇంకా; అనేక ప్రకారంబులన్= పెక్కు విధాలుగా; పలవించి= దుఃఖించి; యుధిష్ఠిరు+ఆననంబు= ధర్మరాజు ముఖం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అంటూ పెక్కురీతులతో దుఃఖించి ధర్మరాజు ముఖాన్ని చూచి.

**ఉ. 'పావని సేరి యుండఁ డొకొ! పార్షతుఁ డచ్చట లేఁడె? యొండుమైఁ**
**బోవఁగఁ బంచితే ద్రుపదుఁ? బోరికి సాత్యకి రాక తక్కెనే?**
**భూవర! మత్స్యనాథుఁ డెట వోయెనొ! డెప్పరమైన నీకునుం**
**గావఁగ రాక తక్కెనొ! తెగం గత మేమి సుభద్ర పట్టికిన్? 244**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా! (ధర్మజుడి సంబోధన); పావని= భీముడు; చేరి+ఉండఁడు+ఒకొ!= సమీపించి ఉండలేదా?; పార్షతుఁడు= పృషతుడి కొడుకు అనగా ద్రుపదుడు; అచ్చటన్= అక్కడ; లేఁడె?= లేడా?; ద్రుపదున్= ఆ పార్షతుని; ఒండుమైన్+పోవఁగన్= మరో చోటుకు పోవటానికై; పంచితే?= పంపావా?; సాత్యకి= సత్యకాత్మజుడు; పోరికిన్ రాక= యుద్ధానికి రాకుండా;తక్కెనే?= నిలిచిపోయాడా?; మత్స్యనాథుఁడు= విరాటరాజు; ఎట పోయెనొ?= ఎక్కడకు పోయాడో?; నీకునున్+డెప్పరమైనన్=

నీకున్నూ మిక్కుటం కాగా (అశక్యం - దుస్సహం కాగా); కావఁగన్+రాక= రక్షించటానికి (వీలు)కాక; తక్కెనొ= తప్పిపోయిందా!; సుభద్రపట్టికిన్= అభిమన్యుడికి; తెగన్= చావటానికి; కత మేమి(కతము+ఏమి)= కారణం ఏమిటి?

**తాత్పర్యం:** ధర్మరాజా! భీముడు ఆ సమీపంలో లేడా? ద్రుపదుడు ఎక్క డున్నాడు? అతడిని మరోచోటికి పంపావా? సాత్యకి యుద్ధానికే రాలేదా? విరాటుడు ఎక్కడకు పోయాడు? అప్పుడు నీకూ అసాధ్యం కావటంతో కాపాడటానికి వీలు లేకపోయిందా? అభిమన్యుడు మరణించటానికి కారణం ఏమిటి?

**విశేషం:** తన తర్వాత తన అంతటివాడు భీముడు. ఇక పాండవసైన్యానికి అధిపతిగా ఉన్నవాడు ద్రుపదుడి కొడుకు. ఇట్లా ఈ పద్యంలో వారి వారి ప్రాధాన్యాన్ని బట్టి అర్జునుడు తమ సైన్యంలో ఉండే ప్రముఖులను అందరినీ అడిగాడు. అంతకుముందు వాక్యంలో యుధిష్ఠిరుడు అని ఉన్నది. యుద్ధంలో స్థిరంగా నిలిచే ధర్మరాజుకు అభిమన్యుడిని కాపాడటం అశక్యమైనదా? అని చివరగా ధర్మరాజును పేర్కొనటం జరిగింది. ధర్మరాజు తాను నిమిత్త మాత్రుడు. అవసరం వచ్చినప్పుడు ఎంతటిపనికైనా సమర్థుడు. మొదట్లోనే నీ వేమి చేస్తూ ఉండినావు అని అడగటం ఒక విధంగా నిందాపాత్రం అవుతుంది. ఇన్ని ఆలోచించి ఈ పద్యంలో యోధుల క్రమాన్ని చెప్పటం జరిగింది.

**అర్జునుఁడు ధర్మరాజు నభిమన్యుండు సచ్చిన విధంబు నడుగుట (సం. 7-50-45)**

**క. పడుఁ గాక యేమి? పగఱం । గడిమి మెఱసి చంప నొంపఁ గనియెనె నృప! నీ**
**కొడు కిట యట సూడక యె । క్కుడు మగఁటిమి నుఱికి పేరు గొనియెనె పోరన్? 245**

**ప్రతిపదార్థం:** నృప!= రాజా!; నీ కొడుకు= అభిమన్యుడు; పడున్‌కాక+ఏమి?= యుద్ధంలో చస్తే ఏమి?; కడిమి+మెఱసి= శౌర్యాన్ని అతిశయింపజేసి; పగఱన్= శత్రువులను; చంపన్+నొంపన్+కనియెనె= చంపటానికి, నొప్పించటానికి, శక్తుడయ్యాడా?; ఇట అట చూడక= అటూ ఇటూ దిక్కులు చూడకుండా అనగా పరాకుపడకుండా; ఎక్కుడు+మగఁటిమిన్= ఎక్కువ పరాక్రమంతో; ఉఱికి= దూకి, విజృంభించి; పోరన్= యుద్ధంలో; పేరు+కొనియెనె?= పేరు తెచ్చుకొన్నాడా? (శూరుడనిపించుకొన్నాడా?).

**తాత్పర్యం:** ' ఓ రాజా! నీ కొడుకు అభిమన్యుడు యుద్ధంలో మరణిస్తే మరణించాడు. అతడు శౌర్యంతో శత్రువులను చంపి బాధించ గలిగాడు కదా! భీతితో అటూ ఇటూ దిక్కులు చూడకుండా, పరాకు పడకుండా అధిక పరాక్రమంతో యుద్ధరంగంలోకి విజృంభించి దూకి పేరు తెచ్చుకొన్నాడా?

**విశేషం:** అభిమన్యుడి మరణానికి ఎంతో దుఃఖించిన అర్జునుడు, ఎట్లా మరణించాడు? అని అడుగుతూ 'పడుఁగాక యేమి' అని కొంత ఉపశమనాన్ని పొందినవాడివలె మాట్లాడాడు. వీరస్వర్గాన్ని అలంకరించిన అభిమన్యుడు శత్రువులను ఎట్లా చంపి నొంపి తన మగటిమిని ప్రదర్శించాడు? అందరూ అతడిని శూరుడు అని కీర్తించారా? అని అడిగాడు. అతని శరీరం నశించినా, అతడు ప్రదర్శించిన రణ నైపుణ్యమే పుణ్యాన్ని కలిగిస్తుందని ఇందులోని భావం.

**వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి చింతించి. 246**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; పలికి= మాటాడి; నిట్టూర్పు, నిగిడించి= దీర్ఘంగా నిశ్వసించి; చింతించి= ఆలోచించి.

**తాత్పర్యం:** అని మాటాడి దీర్ఘనిశ్వాసలు వదులుతూ చింతతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. పలువురు సుట్టుముట్టుకొని బాణకృపాణ ముఖాస్త్ర శస్త్ర పం**
**క్తులఁ గడు నొంపఁగాఁ దనకుఁ దోడ్పడు వారలు లేక నన్ మదిం**
**దలఁపఁడ? యత్తఱిన్ రిపువధంబున కెయ్యది తండ్రి! యేను గొం**
**దలమునఁ బొందకుండ నని తాఁ బలుమాఱును జీరకుండునే? 247**

**ప్రతిపదార్థం:** పలువురు= అనేకులు; చుట్టుముట్టుకొని= చుట్టూ గుమిగూడి (పరివేష్టించి); బాణ, కృపాణ, ముఖ+అస్త్ర శస్త్ర పంక్తులన్= బాణాలు; ఖడ్గాలు (కత్తులు); మొదలైన అస్త్రాల యొక్క, ఆయుధాల యొక్క వరుసలచేత; కడునొంపగాన్= మిక్కిలి బాధించగా; తనకున్= తనకు; తోడ్పడువారలు+లేక= సహాయపడేవారు లేక; నన్= నన్ను; మదిన్= మనస్సులో; తలఁపఁడె?= తలచకుండా ఉంటాడా?; ఆ+తఱిన్= అప్పుడు; తండ్రి!= జనకా!; ఏను= నేను; కొందలమునన్+పొందకుండన్= కలత పొందకుండా; రిపు+వధంబునకున్= శత్రువులను చంపటానికి; ఎయ్యుము= వెంబడించుము; అని పలుమాఱునున్= అని అనేక పర్యాయాలు; చీరకుండునే?= పిలవకుండా ఉంటాడా?

**తాత్పర్యం:** అనేకులు చుట్టూ చేరి, బాణాలు, ఖడ్గాలు మొదలైన అస్త్రాలూ, ఆయుధాలూ ప్రయోగించగా తనకు సహాయపడేవారు లేక నన్ను మనస్సులో తలచుకొనకుండా ఉంటాడా? అప్పుడు 'తండ్రీ! నేను కలత పొందకుండా శత్రువులను చంపటానికి వెంబడించుము' అని ఎన్నోమార్లు పిలిచే ఉంటాడు.

**క. అక్కట! తప్పఁ దలంచితి । నక్కొలఁదులవాఁడె కృష్ణు నల్లుఁడు? పోరన్**
**స్రుక్కునె! బాహాగర్వము । దక్కునె! నా కొడుకు మిన్ను దలపైఁ బడినన్. 248**

**ప్రతిపదార్థం:** అక్కట!= అరెరే!; తప్పన్= పొరపాటుగా; తలంచితిన్= ఆలోచించాను; కృష్ణు+అల్లుఁడు= అభిమన్యుడు; ఆ+కొలఁదులవాఁడె?= అంత తక్కువవాడా? (పిరికివాడా?); పోరన్= యుద్ధంలో; స్రుక్కునె= భయపడుతాడా?; నా కొడుకు= నా కుమారుడు; మిన్ను, తలపైన్+పడినన్= ఆకాశం విరిగి తలమీదపడ్డా; బాహాగర్వమున్= భుజదర్పాన్ని; తక్కునె?= విడిచివేస్తాడా?

**తాత్పర్యం:** అరెరే! ఎంత తప్పుగా ఆలోచించాను. కృష్ణుడి అల్లుడు (అంత అల్పుడా!) అంత పిరికివాడా! యుద్ధంలో భయపడుతాడా? లేదు. నా కొడుకు మిన్ను విరిగి మీదపడ్డా భుజగర్వాన్ని వీడడు.

**విశేషం:** 'ఒంటరిగా పోరాడుతూ యుద్ధంలో స్రుక్కి ఎవ్వరూ సహాయపడక పోగా నన్ను తప్పక తలచుకొని ఉంటాడు, అనేక పర్యాయాలు పిలిచి ఉంటాడు' అని భావించిన అర్జునుడు వెంటనే 'ఎంత తక్కువగా ఆలోచించాను, అంచనావేసినాను' అన్నాడు. ఇక్కడ అభిమన్యుడిని గురించి చెప్పుతూ మొదట 'కృష్ణునల్లుడు' అని తర్వాత 'నా కొడుకు' అన్నాడు. సూక్ష్మాతిసూక్ష్మంగా పరిశీలిస్తే కాని ఇటువంటి ఔచిత్యాలు వెంటనే అవగతం కావు. తిక్కన ప్రతిపదాన్నీ, ఎక్కడ ఏది సమంజసమో గమనిస్తూ ఆచి తూచి ప్రయోగిస్తాడు. ఆ పద ప్రయోగంలోనే పాత్రల మనస్తత్వం, సన్నివేశ ప్రాముఖ్యం, రసపరిపోషణాది వివిధాంశాలు సమన్వయించ బడుతూ ఉంటాయి.

**ఆ. పిన్న నగవుతోడఁ జెన్నెసలారు సౌ । భద్రుమొగము సూడఁ బడయకున్న**
**వాఁడ; నా మనంబు వ్రయ్యలై పోః దిది । ఱాతఁ జేసినది యొకో తలంప! 249**

**ప్రతిపదార్థం:** పిన్న నగవుతోడన్= మందహాసంతో; చెన్ను+ఎసలారు= అందం అతిశయించే; సౌభద్రు మొగమున్= అభిమన్యుడి ముఖాన్ని; చూడన్+పడయకున్న+వాఁడన్= చూడలేక పోతూ ఉన్నాను; నా మనంబు= నా మనస్సు; వ్రయ్యలు+ఐ+పోదు= తుత్తునియలై పోవటం లేదు; తలంపన్= ఆలోచించగా; ఱాతన్= శిలతో(బండతో); చేసినది+ఒకో!= చేసిందా ఏమి!

**తాత్పర్యం:** మందహాసంతో అందగించే ఆ అభిమన్యుడి ముఖాన్ని చూడలేకపోతున్నాను. నా మనస్సు (హృదయం) ఎందుకు ముక్కలు ముక్కలై పోవటం లేదో! ఆలోచిస్తే ఇది (ఈ మనస్సు) శిలతో చేసిందా ఏమి? అనిపిస్తుంది.

**విశేషం:** మాటిమాటికి అర్జునుడికి అభిమన్యుడి నవ్వు మొగమే గుర్తుకు వస్తూ ఉన్నది. 'సౌభద్రుమొగము' అనటం వలన అతడిలో అతడి తల్లిపోలికలు ఎక్కువ ఉన్నట్లు అనిపిస్తూ ఉన్నది. 'కృష్ణునల్లుడు' అని అంతకుముందు పేర్కొనటం వలన మేనమామ పోలికలున్నట్లు విదితమౌతున్నది. తన గుండె బండ కాకపోతే ఎందుకు వ్రయ్యలైపోదు? అని విలపించటం ఈ పద్యంలోని విశేషం.

**క. పలువురు క్రూరత బాలునిఁ। జలము కొని వధించునపుడు శౌరిని నన్నుం**
**దలఁప రొకో మనముల వా। రలు దానికి నేమి నీఁగ రాదయ్యెడినో! 250**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ పగవారు; పలువురు= అనేకులు; క్రూరతన్= నిర్దయతో; బాలునిన్= కుమారుడిని; చలముకొని= మత్సరించి; వధించునప్పుడు= చంపేటప్పుడు; మనములన్= మనస్సులలో; శౌరిన్= శ్రీకృష్ణుడిని; నన్నున్= నన్ను; తలఁపరు+ఒకో!= తలచుకొనలేదా!; దానికిన్= అటువంటి పనికి (చేతకు); నీఁగరాదు+అయ్యెడినో+ఏమి= త్రిప్పికొట్టడం సాధ్యంకాదా ఏమి?

**తాత్పర్యం:** ఆ శత్రువులు అనేకులు ఆ విధంగా అభిమన్యుడిని క్రూరులై మత్సరించి సంహరించే సందర్భంలో మనస్సులో వారు శ్రీకృష్ణుడినీ, నన్నూ తలచుకొనలేదా! వారు చేసిన పనిని త్రిప్పికొట్టడం సాధ్యంకాదా ఏమి?

**క. కటకట! పేరిన పెన్నె। త్తుట జొత్తిలియున్న మేనితోఁ గొడు కేచ**
**క్కటిఁ బడియున్నాఁడో? య। చ్చోటు సూపెడు వారు లేరె? చూచెద వానిన్. 251**

**ప్రతిపదార్థం:** కటకట!= అక్కటా!; పేరిన పెను+నెత్తుటన్= గడ్డకట్టిన (గట్టిపడ్డ) అధికరక్తంచేత; జొత్తిలి+ఉన్నమేనితోన్= తడిసి ఉన్న శరీరంతో; కొడుకు= కుమారుడు; ఏ+చక్కటిన్= ఏ రీతిలో; పడి ఉన్నాడో= ఆ+చోటు= ఆ ప్రదేశం; చూపెడువారు లేరె?= చూపేవారు లేరా?; వానిన్+చూచెదన్= అతడిని చూస్తాను.

**తాత్పర్యం:** అక్కటా! పేరుకొన్న అధికరక్తంతో తడిసి ఉన్న శరీరంతో ఆ అభిమన్యుడు ఏ రీతి, ఎక్కడ పడి ఉన్నాడో? చూపేవారే లేరా? వాడిని చూస్తాను.

**విశేషం:** ఇక్కడ 'చక్కటి' అనే పదం దిక్కు, స్థలం, సమీపం, రీతి అనే వివిధార్థాలలోనూ ప్రస్తుత సందర్భానికి సరిపోతుంది.

**సీ. పడియుండి వాఁ డిలఁ బొడిచిన చందురు। క్రియఁ దత్తలము వెలిఁగింప కున్నె!**
**యే మని నాతోడఁ బ్రేముడించు నొకో! సు। భద్ర పుత్త్రునిఁ జూడఁ బడయ కున్కిఁ;**
**బగతుర నిర్జించి మొగము పోటుల నొచ్చి। పొడసూపరాఁడయ్యెఁ గొడుకు నాకు;**
**నడలునఁ దల్లడ పడియెడు ద్రౌపది। వంత మాన్పింప నెవ్వరికి వశమె?'**

**తే. యని యలంతమైఁ బలుమాట లాడుచుండి। తలఁచి మఱియును ధర్మనందనుని యాన**
**నంబు వీక్షించి నిర్జరనాథ తనయుఁ। డెలుఁగు గుత్తుకఁ దగులంగ నిట్టు లనియె. 252**

**ప్రతిపదార్థం:** పడియుండి= రణరంగంలో పడిఉండి; వాఁడు= ఆ అభిమన్యుడు; ఇలన్+పొడిచిన+చందురు క్రియన్= భూమి యందు ఉదయించిన చంద్రుడివలె; తద్+తలమున్= ఆ పడిఉండే స్థలాన్ని; వెలిగింపకున్నె!= ప్రకాశింపజేయకుంటాడా!; సుభద్ర; పుత్త్రునిన్= సుభద్రయొక్క కుమారుడిని; చూడన్+పడయన్+ఉన్కిన్= చూడలేకపోవటం చేత; నాతోడన్= నాతో; ఏమి+అని= ఏమని; ప్రేముడించునో= ప్రేమించునో; నాకున్= నాకు; కొడుకు= కుమారుడు; పగతురన్+నిర్జించి= శత్రువులను జయించి; మొగము పోటులన్= ముఖములోని పొడుపులతో; నొచ్చి= బాధపడి; పొడచూపరాఁడు+అయ్యెన్= కనిపించనివాడు అయ్యాడు; అడలునన్= దుఃఖంతో; తల్లడపడియెడు+ద్రౌపదిన్= చలించిపోయే ద్రౌపదిని; వంత+మాన్పింపఁగన్= దుఃఖాన్ని తీర్చగా; ఎవ్వరికిన్+వశమె?= ఎవరికైనా సాధ్యమా?; అని= ఆ ప్రకారంగా; అలంతమైన్= అలసటచేత; పలుమాటలు= చాలామాటలు; ఆడుచుండి= పలుకుతూ ఉండి; తలఁచి= తలచుకొని; మఱియున్= మరల; ధర్మనందనుని+ఆననంబున్= ధర్మరాజు ముఖాన్ని; వీక్షించి= చూచి; నిర్జరనాథ తనయుండు= అర్జునుడు; ఎలుఁగు= కంఠధ్వని; కుత్తుకన్+తగులంగన్= గొంతునుండి వెడలకుండగా

డగ్గుత్తిక పడగా; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ రణరంగంలో పడిపోయిన అభిమన్యుడు భూమిలో పుట్టిన చంద్రుడివలె ఆ ప్రదేశాన్ని వెలిగించకుండా ఉంటాడా? కుమారుడిని చూడలేక పోవటం చేత సుభద్ర నన్ను ఏమని ప్రేమిస్తుంది? కొడుకు శత్రువులను జయించి మొగమునందలి దెబ్బలతో నొచ్చి కనిపించకుండా పోయాడనే దుఃఖంతో చలించే ద్రౌపదిని ఊరార్చటానికి ఎవరికి శక్యమౌతుంది? అని అలసటతో పెక్కుమాటలు మాటాడుతూ కుమారుడిని తలచుకొని మళ్ళీ ధర్మరాజును చూచి అర్జునుడు కంఠధ్వని గొంతునుండి సరిగ వెలువడని స్థితిలో ఇట్లా అన్నాడు:

**వ. సంశప్తక సమితి తోడం దమకించి పోరి పోరి కౌరవసైనికుల సింహనాదంబుల వింటి; నప్పు డెలుంగెత్తి యుయుత్సుం డాడినమాటల నాకర్ణించితి. 253**

**ప్రతిపదార్థం:** సంశప్తక సమితితోడన్= సంశప్తక సైన్య సమూహంతో; తమకించి= తొందరపడి; పోరి, పోరి= పోరాడి, పోరాడి; కౌరవసైనికుల సింహనాదంబులు= కౌరవుల సైన్యం చేసే సింహనాదాలు; వింటిని= విన్నాను; అప్పుడు= ఆ సందర్భంలో; యుయుత్సుండు= (ధృతరాష్ట్రుడికి వైశ్య స్త్రీయందు పుట్టి, ధృతరాష్ట్రుడి తర్వాత ఇంద్రప్రస్థానికి రాజైనవాడు) యుయుత్సుడు; ఎలుంగు+ఎత్తి= గొంతెత్తి; ఆడినమాటలన్+ఆకర్ణించితిన్= పలికినమాటలు విన్నాను.

**తాత్పర్యం:** సంశప్తక సమూహంతో వేగంగా విరివిగా పోరాడే సమయంలో కౌరవుల సైన్యం చేసిన సింహనాదాలు విన్నాను. అప్పుడు యుయుత్సుడు పలికిన మాటలు విన్నాను.

**సీ. 'పెనఁగంగఁ జాలరు బీభత్సుతో మీరు; । బాలుని నొక్కరుఁ బలువు రిట్లు**
**సంపితి; రిది మీకు సంతోషకాలమే? । యేడ్తురు గా, కార్వ నేల చెపుఁడ!**
**హరికి నర్జునునకు నప్రియం బొనరించి । బ్రదుకంగ వచ్చునే భవునకైన?**
**నది యట్టులుండె; నీ యధికపాపము ఫలం । బెట్లును జెఱుపక యేల తక్కు?'**

**ఆ. నవియె నివ్విధమున నరిసేన యోధుల । నతఁడు వలుక వీనులార వినియుఁ**
**దెలియనైతి; వాసుదేవుండు వినియెన । యని తలంచి దాని నంత గొనక. 254**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు(కౌరవయోధులు); బీభత్సుతోన్= అర్జునుడితో; పోరంగన్+చాలరు= యుద్ధం చేయలేరు; బాలునిన్= అభిమన్యుడిని; ఒక్కరున్= ఒక్కడిని; ఇట్లు= ఈ విధంగా; పల్వురు= అనేకులు; చంపితిరి= సంహరించారు;మీకున్= మీకు;ఇది= ఇది; సంతోషకాలంబె?= సంతోషించటానికి సమయమా!; ఏడ్తురుగాక= దుఃఖిస్తారుగాక! (రాబోయే ఆపదను తలచుకొని); ఆర్వన్+ఏల?= సింహనాదాలు చేయటం (గర్జించటం) ఎందుకు?; చెపుఁడ= చెప్పండి; హరికిన్= కృష్ణుడికీ; అర్జునునకున్= అర్జునుడికీ; అప్రియంబు+ఒనర్చి= అహితాన్ని కలిగించి; భవునకున్=ఐనన్= శివుడికైనా; బ్రదుకంగ వచ్చునె?= జీవించవచ్చునా?; అది= ఆ విషయం; అట్టు+ఉండెన్= అట్లా ఉండనీయండి;ఈ+అధిక పాపముఫలంబు= ఈ గొప్ప పాపం వలని ప్రయోజనం; ఎట్లును= ఏ విధం చేతనైనా; చెఱుపక+ఏల+తక్కున్?= నశించనీయకుండా ఎందుకు విడుస్తుంది?; అనియెన్= అన్నాడు; ఈ+విధమునన్= ఇట్లా; అరి, సేన, యోధులన్= శత్రుసైన్యం యొక్క యుద్ధవీరులను (ఉద్దేశించి); అతఁడు= ఆ యుయుత్సుడు;పలుకన్= మాటాడగా; వీనులార వినియున్= చెవులారా వినికూడా; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; వినియెన= విన్నాడులే అని; తలంచి= తలచి; దానిన్= దానిని (ఆ విషయాన్ని); అంత కొనక= అంతగా లక్ష్యపెట్టక; తెలియన్+ఐతిన్= గ్రహించలేకపోయాను.

**తాత్పర్యం:** 'మీరు అర్జునుడితో యుద్ధానికి చాలరు. ఒక్క బాలుడిని ఈ విధంగా మీరు పలువురు చంపారు. ఇది మీకు సంతోషసమయమా! త్వరలోనే ఏడవబోతారు. ఎందు కిట్లా గర్జిస్తారు? చెప్పండి. శ్రీకృష్ణార్జునులకు కీడు చేసి శివుడు కూడా జీవించలేడు. మీ పాపఫలం ఊరక పోదు. అది మిమ్మల్ని నాశనం చేసి తీరుతుంది' . ఇట్లు పలికే యుయుత్సుడి మాటలను చెవులారా విని కూడా శ్రీృష్ణుడు విన్నాడు కదా! అని నిర్లక్ష్యం చేసి ఆ విషయం ఏమిటో గ్రహించలేకపోయాను.

**క. మనుజాధిప! తగు సమయం । బున నీ వెఱిఁగింపఁ గన్నఁ బొరివుచ్చనె వే**
**చనుదెంచి నీ సుతుం బొది । వినయెడఁ దత్క్రూర యోధవీరుల నెల్లన్.' 255**

**ప్రతిపదార్థం:** మనుజాధిప!= రాజా! (ధర్మరాజా!); తగు సమయంబునన్= తగిన కాలంలో; నీవు+ఎఱిఁగింపన్+కన్నన్= నీవు తెలియజేసి ఉంటే; వేచనుదెంచి= నేను వెంటనేవచ్చి; నీ సుతున్= అభిమన్యుడిని; పొదివిన+ఎడన్= ఎదిరించినచోట; తద్+క్రూర యోధ వీరులన్+ఎల్లన్= ఆ క్రూరులైన యుద్ధవీరులను అందరినీ; పొరిపుచ్చనె?= చంపి ఉండనా?

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! తగిన సమయంలో నీవు నాకు తెలియజేసి ఉంటే, వెంటనే వచ్చి అభిమన్యుడిని ఆక్రమించిన ఆ చోటనే, ఆ క్రూరయుద్ధవీరులను అందరినీ అంతంచేసి ఉండేవాడిని.'

**క. అని పలికి మఱియుఁ గొడుకుం । బనవుచు శోకమున మునుఁగు ఫల్గునునిఁ దగం**
**దనకరములఁ బొదువుచు ని । ట్లను హరి చిత్తంబులోన నడ లూనంగన్. 256**

**ప్రతిపదార్థం:** అని+పలికి= అని మాటాడి; మఱియున్= ఇంకా; కొడుకున్+పనవుచున్= కుమారుడిని గురించి విలపిస్తూ; శోకమునన్+మునుఁగు, ఫల్గుననిన్= దుఃఖంలో నిమగ్నుడైన అర్జునుడిని; తగన్= ఒప్పునట్లు; తన కరములన్+పొదువుచున్= తన చేతులతో పట్టుకొంటూ; హరి= శ్రీకృష్ణుడు; చిత్తములోనన్= మనస్సులో; అడలు= చింత; ఊనంగన్= పొందగా; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఆ విధంగా మాటాడి, మళ్ళీ కొడుకును తలచి విలపిస్తూ దుఃఖంలో నిమగ్నుడైన అర్జునుడిని శ్రీకృష్ణుడు తన చేతులతో పట్టుకొంటూ మనస్సులో చింత కలుగగా ఈ విధంగా అన్నాడు:

**చ. 'ఇటు దగునయ్య శూరులకు నెల్లను బోకడ యిట్ల కాదె! యే**
**మిటికి నలందురన్? మొనలు మేకొని యాయుధ జీవనంబు నూఁ**
**దుటయు నెఱుంగవే? రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్త్రుఁ డె**
**క్కటి దివి చూఱకోల్ ప్రియము కా కిది యప్రియమే తలంపఁగన్? 257**

**ప్రతిపదార్థం:** ఇటు+తగునయ్యా= ఇట్టి వంత తగునా?; శూరులకున్+ఎల్లన్= వీరులకు అందరికీ; పోకడ= మరణం; ఇట్ల+కాదె!= ఇట్లే కదా!; ఏమిటికిన్+నలందురన్= దురపిల్లటం ఎందుకు?; మొనలు= సేనలు; మేకొని= పూని; ఆయుధజీవనంబున్= ఆయుధంచేత జీవించటం; ఊఁదుటయున్= పూనుకొనటమున్నూ; ఎఱుంగవె?= తెలియవా?; రిపులన్= శత్రువులను; త్రుంచి= సంహరించి; ఇలన్= భూమిలో; యశంబున్+నించి= కీర్తిని నింపి; పుత్త్రుఁడు= కుమారుడు; ఎక్కటిన్= ఒంటరిగా; దివి+చూఱకోల్= స్వర్గం చూరగొనటం; ఇది; ప్రియము+అ+కాక= హితమే కాక (మేలే అవుతుందిగాని); తలంపఁగన్= ఆలోచించగా; అప్రియమే?= అహితమా?

**తాత్పర్యం:** ఇట్లా విలపించటం తగునా? శూరులకు అందరికీ మరణం ఈ విధంగానే కదా! దుఃఖించటం ఎందుకు? యుద్ధానికి సేనలను సమీకరించి, ఆయుధమే జీవనంగా, ఎదిరించటమే వీరధర్మం. ఇది ఎఱుగవా? శత్రువులను సంహరించి, ఈ భూమిలో కీర్తిని నింపి నీ కుమారుడు ఒంటరిగా స్వర్గాన్ని చూరగొనటం హితమే కాని అహితం ఎట్లా అవుతుంది?

**విశేషం:** శ్రీకృష్ణోపదేశంలో వీరధర్మం వివరించబడింది. 'ఆయుధజీవనం' అనే ప్రయోగం వీరుడి కర్తవ్యాన్ని చక్కగా నిరూపిస్తూ ఉన్నది. వీరమరణాన్ని పొందిన వారికై విలపించటం తగదని - అభిమన్యుడు స్వర్గాన్ని చూరగొనటం హితమే కాని అహితం కాదని శ్రీకృష్ణుడు నిర్ధారించాడు.

**ఆ. ఎఱుఁగవలయుదాని నెఱిఁగి కోవిదుఁ డగు । నట్టి నీకు వగవ నగునె పార్థ!**
**నీదు వంత సూచి నీ వార లందఱు । దీను లైరి; వీరిఁ దేర్పవలదె? 258**

**ప్రతిపదార్థం:** పార్థ!= అర్జునా!; ఎఱుఁగవలయుదానిన్= తెలియవలసినదాన్ని; ఎఱిఁగి= తెలిసి; కోవిదుఁడు+అగు+అట్టి నీకున్= పండితుడవైనట్టి నీకు; వగవన్+అగునె?= చింతించతగునా?; నీ వారలు+అందఱున్= నీ జనులంతా; నీదు, వంత, చూచి= నీ దుఃఖాన్ని చూచి; దీనులు+ఐరి= దైన్యం వహించారు; వీరిన్= వీళ్ళను; తేర్పవలదె?= ఊరడించ వద్దా?

**తాత్పర్యం:** పార్థా! తెలియదగు పరమార్థాన్ని తెలిసి పండితుడవైన నీవు ఇట్లా విలపించటం తగదు. నీ వారందరూ నీ దుఃఖాన్ని చూచి దీనులయ్యారు. వాళ్ళను నీవు ఊరడించవద్దా?

**విశేషం:** ఏది ఎరుగవలయునో దానిని ఎరిగినవాడే కోవిదుడు. ఆఎరుక ఐహికబంధవ్యామోహాలకు అతీతం. అర్జునుడికి తానింతకు మునుపు చేసిన గీతోపదేశం వలన మోహం వినష్టమై స్మృతి కలిగింది. ప్రజ్ఞ కలిగిన పండితు డయ్యాడు. పండితులు విలపించరాదు. అందుకే 'కోవిదుఁడగునట్టి నీకు వగవ నగునె' అని శ్రీకృష్ణుడు సూచనా మాత్రంగా హెచ్చరించాడు. కోవిదుడైనవాని ధర్మం ఇతరుల దైన్యాన్ని తొలగించి తేర్చవలసి ఉన్నది. తన దుఃఖాన్ని చూచి ఇతరులు దుఃఖించేటట్లు కోవిదుడు వ్యవహరించ కూడదని ఇందులోని సారాంశం. ప్రాణాతిప్రాణంగా ప్రేమించే వ్యక్తులను కోల్పోయినప్పుడు కలిగే వంతకు అంతు లేదు. ఆ సందర్భంలో మనస్సు నెంతో చిక్కబట్టుకొన్నా, ప్రక్కనున్న ఆప్తుల విలాపాన్ని చూడగానే దుఃఖం కట్టలు తెగి ప్రవహిస్తుంది. అందుకే 'నీదు వంత సూచి నీ వారలందఱు దీనులైరి' అని కృష్ణుడు అర్జునుడిని హెచ్చరించటం ఎంతో సహజంగా ఉన్నది. 'నిన్ను చూచి విలపించే వారిని ఓదార్చవలసిన బాధ్యత నీది. నీవే ఈ విధంగా పూర్తిగా స్వాస్థ్యాన్ని తప్పి ప్రవర్తిస్తే తక్కిన బంధువుల పరిస్థితి ఏమౌతుంది?' అని శ్రీకృష్ణుడు అర్జునుడిని ఓదార్చాడు.

**వ. వీరలం జూచి తగుమాట లాడు' మనిన నత్యంత శోకాక్రాంతస్వాంతుం డగుచు సుభద్రాకాంతుండు గద్గదకంఠంబుతోడం దోడంబుట్టువుల కిట్లనియె. 259**

**ప్రతిపదార్థం:** వీరలన్= నీవారైన వీరినందరినీ; చూచి= కనుగొని; తగుమాటలు+ఆడుము= తగిన పలుకులు పలుకుము; అనినన్= అనగా; అత్యంత, శోక+ఆక్రాంత+స్వాంతుండు+అగుచున్= మిక్కిలి దుఃఖంచేత ఆక్రమించబడిన మనస్సు కలవాడౌతూ; సుభద్రాకాంతుండు= అర్జునుడు; గద్గదకంఠంబుతోడన్= డగ్గుత్తికతోడి స్వరంతో; తోడంబుట్టువులకున్= అన్నదమ్ములకు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వీళ్ళను చూచి తగిన మాటలు మాట్లాడుము! అనగానే అర్జునుడు అధిక దుఃఖంపొంగి పొరలిన హృదయంతో, డగ్గుత్తికతో అన్నదమ్ములను చూచి ఇట్లా అన్నాడు.

**చ. 'మనసిజమూర్తి యైన యభిమన్యుని మాటలు వీనులార నే**
**వినవలతుం; దదీయమృతి వేడ్క నొనర్చిన వారు గ్రక్కునం**
**జని తగ వానిఁ గాంచి సుఖ సంగతిమై జరియించునట్లుగా**
**ననిచెద; నేఁటి పోరు దెలియంగల భంగియు మీరు సెప్పుఁడా!' 260**

**ప్రతిపదార్థం:** మనసిజమూర్తి= మన్మథుడివంటి ఆకారం కలవాడు; ఐన= అయినటువంటి; అభిమన్యునిమాటలు= అభిమన్యుడిని గురించిన పలుకులు; వీనులారన్= చెవులారా; నేన్= నేను; వినవలతున్= వినటానికి ఇష్టపడుతూ ఉన్నాను; తదీయమృతిన్= వాడి చావును; వేడ్కన్= సంతోషంతో (ఇష్టపడి); ఒనర్చినవారు= చేసినవాళ్ళు; గ్రక్కునన్+చని= వెంటనే పోయి (అనగా స్వర్గానికి పోయి); తగన్= తగునట్లు; వానిన్= ఆ అభిమన్యుడిని; కాంచి= చూచి; సుఖసంగతిమైన్= సుఖమైన పొందికతో; చరియించు+అట్లు+కాన్= తిరిగే విధంగా; అనిచెదన్= పంపుతాను; నేఁటిపోరున్= ఈనాడు జరిగిన యుద్ధ ప్రకారాన్ని; తెలియన్+కల+భంగియున్= తెలిసి ఉన్నంతవరకు; మీరు= మీరందరూ; చెప్పుఁడా!= చెప్పండి!

**తాత్పర్యం:** 'మన్మథుడివంటి రూపం కలవాడైన ఆ అభిమన్యుడి మాటలు చెవులార వినాలని కోరుతున్నాను. వాడి చావును ఇష్టపడి చేసినవాళ్ళు వెంటనే స్వర్గానికిపోయి, ఆ అభిమన్యుడిని చూచి సుఖమైన పొందికతో తిరిగే విధంగా పంపుతాను. మీరు నేడు జరిగిన యుద్ధ ప్రకారాన్ని నాకు విశదంగా తెలపండి.'

**విశేషం:** ఈ పద్యంలో మూడురకాల భావాలు ఒక్కసారిగా అర్జునుడి మనస్సులో చోటు చేసుకొన్నట్లు చెప్పబడ్డాయి. అభిమన్యుడి మాటలు వినాలని ఆసక్తిగా ఉన్నది అని అన్నాడో లేదో వెంటనే వాడిని చంపిన వాళ్ళను కూడా వెంటనే వాడి దగ్గరకు పోయేటట్లు చేస్తాను అన్నాడు. అంతలోనే ఈనాటి యుద్ధప్రకారం మీకు తెలిసినంతవరకు చెప్పండి అంటున్నాడు. తాను దుఃఖాన్ని ఓర్చుకోలేక కసితో శత్రువులను చంపవచ్చును. అయితే వాళ్ళు చేరేది కూడా నా కొడుకు చేరిన చోటే. అక్కడ సుఖకరమైన చెలిమితో ఉంటారు అని అంటున్నాడు. ఎటువంటి వారైనాసరే యుద్ధంలో మరణిస్తే స్వర్గసౌఖ్యమే కదా అనే భావం భంగ్యంతరంగా చెప్పబడింది.

**వ. అని మఱియును. 261**

**తాత్పర్యం:** అని ఇంకా (ఇట్లా అన్నాడు).

**చ. 'అలవుఁ జలంబు శౌర్యమును నస్త్రమహత్త్వముఁ గల్గు నిందఱున్**
**గలుగఁగ నెట్లు సచ్చు బలఘస్మరుచే నయినం బ్రచండదో**
**ర్బల విభవాభిరాముఁడు సుభద్ర సుతుం? డిది యెన్ని భంగులం**
**దలఁచినఁ బోల; దేమిటికతంబున నా ఘనుఁ డిట్టు లయ్యెనో? 262**

**ప్రతిపదార్థం:** అలవున్= బలమున్నూ; చలంబున్= మత్సరమున్నూ; శౌర్యమునున్= శూరత్వమున్నూ; అస్త్రమహత్త్వమున్= అస్త్రాలవలన గొప్పతనమున్నూ; కల్గు+ఇందఱున్+కలుగఁగన్= కలిగినట్టి మీరు అందరూ ఉండగా; బల+ఘస్మరుచేన్+ అయినన్= (బలుడనే రాక్షసుడికి నాశకుడైన) ఇంద్రుడిచేత అయినప్పటికీ; ప్రచండ+దోస్ బలవిభవ+అభిరాముఁడు= తీవ్రమైన భుజాల శక్తియొక్క ప్రాభవంచేత (ప్రకాశించే) ఒప్పువాడు; సుభద్రసుతుండు= అభిమన్యుడు; ఎట్లు చచ్చున్?= ఏ విధంగా మరణిస్తాడు?; ఎన్ని+భంగులన్+తలంచినన్= ఎన్ని విధాలుగా తలపోసినా; ఇది పోలదు= ఇది సరిపడదు; ఏమిటి కతంబునన్= ఏ కారణంచేత; ఆ ఘనుఁడు= అంత గొప్పవాడు; ఇట్టులు+అయ్యెనో!= ఈ విధంగా అయినాడో!

**తాత్పర్యం:** బలమూ, పట్టుదలా, శౌర్యమూ, వివిధాస్త్రాల గొప్పతనమూ కలిగిన మీరందరూ ఉండగా, ఇంద్రుడిచేతనైనా మరణించని ప్రచండ భుజబల ప్రాభవంతో మనోహరుడైన ఆ సుభద్ర కొడుకు ఏ విధంగా మరణిస్తాడు? ఎన్ని విధాల ఆలోచించినా సమాధానం కుదరటం లేదు. ఏ కారణంచేత అంతటి గొప్పవా డీ విధంగా అయినాడు?

**విశేషం:** తిక్కన వీరుల ప్రసిద్ధగుణాలు నాల్గింటితో పద్యాన్ని ఆరంభించి, అంతటి వీరులు అండగా నుండగా బలఘస్మరుడైన ఇంద్రుడి చేతనైన బ్రుంగని ప్రచండ దోర్బల విభవాభిరాముడైన అభిమన్యు డెట్లా మరణించాడనటంలో అర్జునుడు తర్కించిన విధానం చక్కగా చంపకమాలావృత్తంలో వివరించబడింది.

**క. మిమ్మునుఁ బాంచాలురఁ గడు । నమ్మి చెడితి; వాని రక్షణమ్మునఁ బ్రౌఢ**
**త్వ మ్మిట్లు లేమి యెఱిఁగిన । నెమ్మెయిఁ గాచికొననేరనే యబ్బాలున్. 263**

**ప్రతిపదార్థం:** మిమ్మునున్= ధర్మరాజాదులైన మిమ్మల్ని; పాంచాలురన్= ద్రుపదరాజుకు సంబంధించిన వాళ్ళను; నమ్మి= విశ్వసించి; చెడితిన్= నాశనమయ్యాను; వాని రక్షణమ్మునన్= ఆ అభిమన్యుడి సంరక్షణలో; ఇట్లు= ఈ విధంగా; ప్రౌఢత్వమ్ము= నేర్పరితనం; లేమి= మీలో లేకపోవటం; ఎఱిఁగినన్= తెలిసిఉంటే; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; ఆ+బాలున్= ఆ బాలుడిని; కాచికొననేరనే!= రక్షించుకొని ఉండలేనా!

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! మిమ్మల్ని, ద్రుపదుడికి సంబంధించిన వాళ్ళనీ నమ్మి చెడ్డాను. అభిమన్యుడిని రక్షించటంలో మీరు నేర్పరులు కారు అని తెలిసి ఉంటే, ఏ విధంగానైనా నేనే వాడిని రక్షించుకొని ఉండలేనా!

**విశేషం:** మీరు ఇంతవాళ్ళూ అంతవాళ్ళూ అనుకొని నమ్మినందుకు నాశనమైపోయాను. మనపక్షం వాళ్ళూ, మామ పక్షంవాళ్ళూ ఇంతమరీ పనికిమాలిన వాళ్ళని తెలిసిఉంటే నే నేవిధంగానైనా వాడిని కాపాడుకొని ఉంటాను అని ఇందలి భావం. ప్రౌఢత్వ మ్మిట్లు అనే ఆ పదాల విరుపులో ఒక విధమైన విసురుతోపాటు, వీళ్ళింత అసమర్థులా? అన్న అధిక్షేపమూ, ఇటు మీ నేర్పరితనం వీగి వ్యర్థమైపోయిందా? అన్న వెక్కసమూ ధ్వనిస్తూ ఉన్నాయి.

**క. రథవితతి వఱపి మీ రవి । తథముగఁ గలియంగ మిమ్ముఁ దాఁకి కలఁచి యే**
**రథికులు సమయించిరి యరి । మథన భుజా విభవు నక్కుమారోత్తమునిన్?' 264**

**ప్రతిపదార్థం:** మీరు= మీరు (ధర్మరాజాదులు); అవితథముగన్= నిజంగా (వ్యర్థం కాకుండా); రథవితతిన్+వఱపి= రథాలను పరుగెత్తేటట్లుచేసి; కలియంగన్= ఎదుర్కోగా; మిమ్మున్+తాఁకి= మిమ్మల్ని ఎదిరించి; కలఁచి= కలత కలిగించి; ఏ రథికులు= ఏ శూరులు; అరి, మథన, భుజా, విభవున్= శత్రువులను హతమార్చే భుజబల పరాక్రమం కలవాడిని; ఆ+కుమార+ఉత్తమున్= ఆ పుత్రరత్నాన్ని; సమయించిరి?= చంపారు?

**తాత్పర్యం:** మీరు నిజంగా రథాలను తోలి కమ్ముకోగా మిమ్మల్ని ఎదిరించి, కలత కలిగించి ఏ శూరులు ఆ భుజబల సంపన్నుడైన పుత్రరత్నాన్ని చంపారు?'

**విశేషం:** ప్రస్తుతం కందపద్యం ప్రాసస్థానంలో ఉన్న థకారం శత్రుఛీత్కారానికి (తన కుమారుడు) అభిమన్యుడు శత్రువులను మథించటంలో చూపే వైలక్షణ్యానికీ, కలత చెందిన మనస్సులోని క్రోధపూరిత కర్కశత్వానికీ సూచన. కుమార శ్రేష్ఠుడైన ఆ అభిమన్యుడు అసామాన్యుడు, 'అరిమథన భుజావిభవుడు'. అట్టి పరాక్రమవంతుడిని ఏ రథికులు చంపారు?

**వ. అని యంతకంత కగ్గలించు నుమ్మలికంబునం గలంగి, యంత నిలువక. 265**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా పలికి; అంతకు+అంతకున్= ఎంతో రెట్టింపుగా; అగ్గలించు= అధికమయ్యే; ఉమ్మలికంబునన్= దుఃఖంతో; కలంగి= కలతచెంది; అంతన్= దానితో; నిలువక= ఆగక.

**తాత్పర్యం:** అని అంతకంతకూ అధికమయ్యే దుఃఖంతో కలతచెంది, అంతటితో ఆగక.

**క. 'ఉక్కును నస్త్రబలము మీ । కెక్కడియది? సాలరైతి రిందఱు? నని న**
**య్యొక్కరుఁ గావఁగ మీ రీ । తక్కువ కోర్చితిరి? మిమ్ముఁ ద క్కన నేలా? 266**

**ప్రతిపదార్థం:** ఉక్కున్= బలమునూ; అస్త్రబలము= దివ్యాస్త్రములయొక్క శక్తి (సంపద); మీకున్= మీకు; ఎక్కడి+అది?= ఎక్కడుంది?; అనిన్= యుద్ధంలో; ఆ+ఒక్కరున్= ఆ ఒక్కబాలుడిని; కావఁగన్= కాపాడటానికి; చాలరు+ఐతిరి= శక్తులు కాలేకపోయారు; మీరు; ఈ+తక్కువకున్= ఇంత హీనత్వానికి (నిందకు అని భావం); ఓర్చితిరి= సహించారు; మిమ్మున్= మిమ్మల్ని; తక్కు+అనన్+ఏలా?= మరొకటి అనటం ఎందుకు?

**తాత్పర్యం:** దివ్యాస్త్రబలమూ, శారీరక బలమూ మీకు ఎక్కడుంది? యుద్ధంలో ఆ ఒక్క బాలుడిని కాపాడలేని అసమర్థు లయ్యారు. ఎంత హైన్యాన్ని సహించారు? ఇది నిందాకరం కాదా! మిమ్మల్ని మరొకటి అనటం ఎందుకు?

**విశేషం:** మిమ్మల్ని వేరే అనటం అనవసరం. ఇంత తక్కువతనానికి పాల్పడి అసమర్థులై ఒక బాలుడిని కాపాడలేకపోయారు. తక్కువతనానికి ఓర్చినారు. తక్కువ అననేలా? అని అర్జునుడు ఆవేదనను వ్యక్తం చేయడంలో సాధారణ విషయాన్నే కొంత విలక్షణంగా చెప్పటం జరిగింది. ఇట్టి తెలుగు పలుకుబడి వల్లనే మహాభారతకథ మన ఆంధ్రప్రాంతానికి చెందిందా? అనిపిస్తుంది. శరీరబలమూ - అస్త్రబలమూలేని ఇంత చవటలని తెలియకపోయెనే? అసంఖ్యాకంగా ఇందరుండి కూడా ఒక్క పిల్లవాడిని దక్కించుకొనలేకపోయారు. ఇంత హీనత్వానికి సహించారు. ద్విత్వకకార ప్రాసలో మిక్కిలి బలాన్ని నొక్కి చెప్పడమే కాకుండా అది ఒక్క బాలుడిని కాపాడటానికి సహకరించలేదే అన్న వెక్కసం నిందార్థంలో ప్రతిఫలించింది. తిక్కన పదప్రయోగ వైచిత్రిలో ఇట్టి వెన్నో!

**క. బలహీనులు సంగర భీ । తులు నగు మి మ్మెఱిఁగి యెఱిఁగి తొలఁగి తనూజుం**
**దలఁపక యొంటి మెలఁగు వెం । గలి నగు నను దూఱుకొందుఁగా కే మందున్? 267**

**ప్రతిపదార్థం:** బలహీనులు= శక్తిలేనివారు; సంగరభీతులు= యుద్ధానికి భయపడేవారు; అగు+మిమ్మున్= అయిన మిమ్మల్ని; ఎఱిఁగి+ఎఱిఁగి= తెలిసి తెలిసీ; తొలఁగి= వీడి; తనూజున్+తలఁపక= కుమారుడిని గురించి స్మరించకుండా; ఒంటిమెలఁగు+వెంగలిన్= ఒంటరిగా ఉండే మూఢుడిని; అగు+ననున్= అయిన నన్ను; దూఱుకొందున్+కాక= నిందించుకొంటాను కాని; ఏమి+అందున్= ఏమి అనగలను?

**తాత్పర్యం:** మీరు యుద్ధానికి భయపడేవారని, బలం లేనివాళ్ళనీ తెలిసి తెలిసీ, కుమారుడిని గూర్చి తలచకుండా ఒంటిగా ఉండిపోయిన మూఢుడిని అయిన నన్ను నేనే నిందించుకొంటాను. ఇంతకంటె ఏమనగలను?

**విశేషం:** చివరకు ఈ పద్యంలో మిమ్మల్ని అనడం ఎందుకు? మీరు ఎటువంటివారో తెలిసికూడా నేను ఆ సమయానికి కుమారుడికి దూరంగా ఉండి, వాడిని గురించి కొంచెం కూడా ఆలోచించకుండా ఒంటరి మూఢుడనయ్యాను. నన్ను నేను నిందించుకొనటం తప్ప మిమ్మల్ని అనటం కూడా తప్పే అంటున్నాడు. ఎదుటివాళ్లను తిట్టటం కంటే తన్ను తానే నిందించుకొనటంలో ఎంతో బలీయమైన అధిక్షేపం పరోక్షపద్ధతిలో అభివ్యక్తమౌతూ ఉంటుంది. 'ఒంటి మెలఁగు వెంగలి' అనే ప్రయోగంలో ప్రతిపదమూ సాభిప్రాయం. ఈ అచ్చతెలుగు ప్రయోగం తిక్కన అర్థగౌరవ స్ఫూర్తికి దృష్టాంతం. జాతీయమైన తెలుగు పలుకుబడిలో అవి అలతి అలతి పదములైనప్పటికి ఎంతో విశాలమైన అర్థం ఏ విధంగా అభివ్యక్తమౌతుందో పై మాటలు తెలుపుతూ ఉన్నాయి.

**తే.** **మానుసులు వోలె నున్నార; లేను లేని। తఱి మహాగుణశాలి నా తనయుఁ గాచి**
**కొనఁ గడంగర? సింగారమునకుఁ గాక। మఱువులును గైదువులు మీకు మానమునకె?'** **268**

**ప్రతిపదార్థం:** మానుసులు+పోలెన్+ఉన్నారలు= మానవుల ఆకారంలో ఉన్నారు; ఏను, లేని, తఱిన్= నేను లేని సమయంలో; మహాగుణశాలిన్= ఉత్తమ గుణాలతో ప్రకాశించేవాడిని; నా తనయున్= నా కొడుకును; కాచికొనన్+కడంగరు+అ= రక్షించటానికి ప్రయత్నించలేదు కదా!; సింగారమునకున్+కాక= అలంకారానికి కాకుండా; మఱువులున్= కవచాలు; కైదువులున్= ఖడ్గాలు; మీకున్= మీకు; మానమునకున్+ఎ?= అభిమానానికా?

**తాత్పర్యం:** మీరు మానవాకారాలతో ఉన్నారు అంతే. నేను లేని సమయంలో ఉత్తమగుణాలతో ప్రకాశించే నా కొడుకును రక్షించటానికి మీరు కొంతైనా ప్రయత్నించారా? మీకు ఈ కవచాలూ, ఖడ్గాలూ అలంకారానికే కాని అభిమానానికి కాదా?'

**విశేషం:** 'మానుసులు వోలె నున్నారు' అనే ప్రయోగంలో మానిసి శబ్దానికి కేవలం మనుష్యుడు అనే అర్థాన్నే కాక యోధుడు, భటుడు అనే అర్థాలనుకూడా గ్రహించవచ్చును. మఱువులు కైదువులు ధరించేవాళ్ళు యోధులు. ఇక్కడ యోధులు మాదిరి అవి ధరించినందువలన మానుసులుగా ఉన్నారే కాని నిజానికి మీకు మగతనం లేదు అని భావం. స్త్రీలు సింగారాన్ని ఇష్టపడతారు. మానిసి అనగా మనుష్య స్త్రీ, మీరూ ఆడంగుల మాదిరి ఆభరణప్రాయంగా ధరించేవారే కాని అభిమానం ఎక్కడపోయింది? అంటున్నాడు. పౌరుషాన్ని ప్రకటించలేని ఆయుధాలు వట్టి తొడవులే కాని ప్రయోజనం ఏమిటి అని భావం. మానుసులు అని ఆద్యక్షరాన్ని దీర్ఘంగా చెప్పటంలో ఎంతో వెక్కసం కాకుధ్వనిలో స్ఫురిస్తూ ఉన్నది. అభిమానం ఆవంతకూడా లేని మీరూ మనుషులేనా అనటం ఎత్తిపొడుపు. ఆవేదనతోడి అవహేళనకు ఇది పరకాష్ఠ.

**వ.** **అని భంగించి యూర్పులు సందడింప మొగంబు బిగువారం గ్రోధశోకంబులు మనంబునఁ బెనంగొనం గన్నీరొలుక నూరకున్న, నెల్లవారు నతనికి మాఱుపలుకను దేఱిచూడను వెఱచియుండి; రప్పు డచ్యుతుం డొక్కరుండు ననునయాలాపంబులం దేర్చుచుండం బాండవాగ్రజుండు గుపితాఖండలనిభుండగు నా సవ్యసాచితో సాంత్వన స్వరంబున నిట్లనియె.** **269**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; భంగించి= అవమానకరంగా మాట్లాడి; ఊర్పులు= నిట్టూర్పులు, దీర్ఘంగా నిశ్వాసాలు; సందడింపన్= అతిశయించగా; మొగంబు= ముఖం; బిగువారన్= (గర్వం) అభిమానంతో అతిశయించగా; క్రోధ+శోకంబులు= కోపమూ, దుఃఖమూ; మనంబునన్= మనస్సులో; పెనంగొనన్= ఆవరించగా; కన్నీరు+ఒలుకన్= బాష్పజలం స్రవింపగా (కారగా); ఊరక+ఉన్నన్= మౌనంతో ఉండగా; ఎల్లవారున్= అందరూ; అతనికిన్= అర్జునుడితో; మాఱుపలుకను= మారుమాటాడటానికి; తేఱిచూడను= బాగా పరికించటానికి; వెఱచి+ఉండిరి= భయపడి ఉన్నారు; అప్పుడు= ఆ సమయంలో; అచ్యుతుండు+ఒక్కరుండు= కృష్ణు డొక్కడు; అనునయ+ఆలాపంబులన్= ఊరడింపు మాటలతో; తేర్చుచుండన్= ఓదారుస్తూ ఉండగా (ప్రసన్నత కలిగిస్తూ ఉండగా); ఆ పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; కుపిత+ఆఖండలనిభుండు+అగు= కోపించిన ఇంద్రుడితో సమానమైన వాడైన; ఆ+సవ్యసాచితోన్= ఆ అర్జునుడితో; సాంత్వన స్వరంబునన్= ఊరడించే (ఓదార్చే) ఎలుగుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆవిధంగా అవమానకరంగా మాట్లాడి, నిట్టూర్పులు నిగిడించి, ముఖం బిరుసెక్కగా, కన్నీరు కారగా, కోపం దుఃఖం మనస్సులో పెనగొనగా అతడు ఊరకుండినప్పుడు, అందరూ అతడివైపు తేరిచూడటానికీ, అతడితో మారుపలకటానికీ భయపడ్డారు. అప్పుడు కృష్ణు డొక్కడే ఉపశమన వాక్యాలతో తేర్చుతూ ఉండగా, కోపించిన ఇంద్రుడివలె ఉన్న అర్జునుడితో ధర్మజుడు ఊరడించే స్వరంతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఏడ్పూ, కోపమూ రెండూ ఒక్కమారుగా సంగమించినప్పుడు ముఖాన్ని బిగించటం కన్నీరుకార్చటం సహజం. అది ఎంతో గంభీరంగా చూచేవారికి కనిపిస్తుంది. ఆ సందర్భంలో ఎదుటివారు ఊరక చూస్తూ ఉండటం తప్ప ఒక్కమాటకూడా మాటాడలేరు. కోపతాపాలు పెనవేసికొన్న వ్యక్తితో సామాన్యులు ఎదురుగా మాటాడలేరు. అన్నింటికీ అతీతుడైన అసాధారణ వ్యక్తి మాత్రమే ఆ సందర్భంలో ఓర్పుతో ఓదార్పు చెప్పగలుగుతాడు.

**ధర్మరా జర్జునుని కభిమన్యుండు సచ్చిన విధంబు సెప్పుట (సం. 7-51-1)**

**సీ. 'అనఘ! సంశప్తక హననంబునకు నీవు । సనిన నొడ్డన మేర్చికొని కడంగి**
**నడచి ద్రోణునిఁ దలఁపడితి మవ్వీరు మో । హర మేము సొరఁ జాలమైతి మనఁగ**
**నేల తద్బాణార్చు లేర్చిన నక్కడఁ । దేఱిచూడను లేక త్రిప్పికొంటి**
**మమ్మొన భేదింప నభిమన్యుఁ డోపుఁ బొ । మ్మనియెడు తలఁపు నా కపుడు పుట్టి,**

**ఆ. వానిఁ బిలిచి 'నీవు వాకిలిఁ బుచ్చు మం । దఱము మొగ్గరంబుఁ దఱియఁ జొచ్చె**
**దము వడిని భవత్పథంబున' ననుడు నం । భోధి సొచ్చు కరటి పోల్కిఁ జొచ్చి. 270**

**ప్రతిపదార్థం:** అనఘ!= దోషరహితుడవైన ఓ అర్జునా!; నీవు; సంశప్తక, హననంబునకున్= సంశప్తకుల వధించటానికి; చనినన్= వెళ్ళగా; ఒడ్డనము+ఏర్చికొని= వ్యూహాన్ని పన్ని; కడంగి= పూని; నడచి= ముందుకు కదలి; ద్రోణునిన్= ద్రోణాచార్యుడిని; తలపడితిమి= తాకాము; ఆ+వీరు+మోహరమున్= ఆ వీరుడి వ్యూహాన్ని; ఏము= మేము; చొరన్+చాలము+ఐతిమి= ప్రవేశింపలేక పోయాము; అనంగన్+ఏల?= అనటం ఎందుకు?; తద్+బాణ+అర్చులు= అతడి బాణాల జ్వాలలు; ఏర్చినన్= కాల్చగా; అక్కడన్= ఆ వైపున; తేఱిచూడను లేక= తలెత్తి చూడటానికి సాధ్యం కాక; త్రిప్పికొంటిమి= వెనక్కు మరలాము; ఆ+మొనన్= ఆ సేనను; భేదింపన్= భేదించటానికి (చీల్చటానికి); అభిమన్యుఁడు+ఓపున్+పొమ్ము= అభిమన్యుడు సమర్థుడౌనుపో; అనియెడు తలఁపు= అనే ఉద్దేశం; అపుడు= ఆ సమయంలో; నాకున్= నాకు; పుట్టి= కలిగి; వానిన్+పిలిచి= ఆ అభిమన్యుడిని పిలిచి; నీవు; వాకిలిన్+పుచ్చుము= త్రోవను కలిగించుము; అందఱమున్= మేమంతా; మొగ్గరమున్= వ్యూహాన్ని; వడిన్= వేగంగా; భవత్=+పథంబునన్= నీ దారిలోనే; తఱియన్+చొచ్చెదము= సమీపించగా ప్రవేశిస్తాము; అనుడున్= అనిన పిదప; అంభోధిన్+చొచ్చు= సముద్రాన్ని ప్రవేశించే; కరటి+పోల్కిన్= ఏనుగు వలె; చొచ్చి= ప్రవేశించి.

**తాత్పర్యం:** 'దోష రహితుడవైన అర్జునా! నీవు సంశప్తకులను చంపటానికి అటు పోగా, వ్యూహాన్ని పన్ని పూని ముందుకు నడచి ద్రోణుడితో ఎదుర్కొన్నాము. అతడు పన్నిన వ్యూహాన్ని మేము ప్రవేశింపలేకపోయాం అని అనటం ఎందుకు? అతడి బాణజ్వాలలు మండించగా అక్కడ తలెత్తి చూడటానికి కూడా వీలుకాక వెనక్కు మరలాము. ఆ మొన భేదించటానికి అభిమన్యుడు సమర్థుడు అనే తలపు నాకు కలిగింది. అప్పుడు అభిమన్యుడిని పిలిచి 'నీవు త్రోవ కల్పిస్తే మేమందరమూ వేగంగా నీవు కల్పించిన దారిలోనే ప్రవేశిస్తాము' అనగానే అతడు సముద్రాన్ని ప్రవేశించే ఏనుగు విధంగా లోనికి చొచ్చాడు.

**విశేషం:** అలం: ఉపమ. ప్రస్తుత ఆటవెలదిలో అభిమన్యుడు మొగ్గరాన్ని ప్రవేశించే విషయం ప్రతిపాదితం. 'వాకిలిఁ బుచ్చుము' అనే ప్రయోగం ద్వారంలో దారి ఏర్పరచే అనే అర్థంలో ప్రయుక్తం. 'అంభోధి జొచ్చు కరటి'కి అభిమన్యుడు పోల్చబడ్డాడు. అరణ్యంతో రణరంగాన్ని పోల్చి ఉంటే అభిమన్యుడిని సింహంగా పేర్కొని ఉండవచ్చును. కానీ ఇక్కడ సముద్రంలో ప్రవేశించే ఏనుగుగా ఉపమింపబడ్డాడు. నీళ్ళలోకి ఎంతో ఆసక్తిగా ఏనుగు ప్రవేశిస్తుంది. అందులో ఆనందంగా క్రీడిస్తూ ఉంటుంది. ఏదైనా మొసలి పట్టుకుంటే దాని బలం ముందు దీని బలం హుళక్కి. అట్లని ఊరక ఉంటుం దని కాదు. ఎంతగా తన శక్తి సామర్థ్యాలు చూపినా,

అడ్డంకి ఏర్పడినప్పుడు ఏమీ చేయలేదు. చివరకు అంత పెద్ద ఏనుగు అక్కడ బందీగా చిక్కుకొని పోతుంది అనే భావం ఈ ఉపమానంలో సూచితం.

**క. నీ యుపదేశముఁ దనచే । దోయి బలువుఁ దోడు గాఁగ ద్రోణుఁ గడచి వే**
**పోయి మొనఁ జొచ్చి సైన్యము । పాయ వడఁగఁ గలఁగఁ జెదరఁ బఱవఁగఁ జేసెన్. 271**

**ప్రతిపదార్థం:** నీ+ఉపదేశమున్= నీవు నేర్పి ఉండటమున్నూ; తనచేదోయి బలువున్= తన రెండు భుజాల దృఢత్వమున్నూ; తోడుకాఁగన్= సహాయం కాగా; ద్రోణున్+కడచి= ద్రోణుడిని దాటి; వే+పోయి= వేగంగా పోయి; మొనన్+చొచ్చి= వ్యూహాన్ని దూరి; సైన్యము పాయవడఁగన్= వ్యూహం రెండుగా చీలినట్లుగా; కలఁగన్= కలత పొందేటట్లు; చెదరన్= చెదరిపోయేటట్లు; పఱవఁగన్= పారిపోయేటట్లు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** నీవు నేర్పిన విద్యా, తన రెండు భుజాలశక్తీ అండగా ఉండగా ద్రోణాచార్యులను దాటి, వేగంగా వ్యూహాన్ని చీల్చి కౌరవసైన్యం కలతతో చెదిరి పోయేటట్లు చేశాడు.

**విశేషం:** ఈ కందపద్యం చివరిపాదంలో ఒకటికి నాలుగు క్రియలను వరుసగా ప్రయోగిస్తూ అవి అన్నీ సర్వలఘువులుగా అభిమన్యుడి ఉరవడినీ, లాఘవాన్నీ ధ్వనింపజేసేటట్లు తిక్కన ప్రయోగించాడు. ఇందు 'పాయ'లోని ఆది దీర్ఘాక్షరం సైన్యాన్ని భేదించటాన్ని వ్యంజింపజేస్తూ ఉన్నది. ఏ విషయమునైనా అందంగా కందంలో నిబంధించగలిగే శిల్పకళలో తిక్కన సిద్ధహస్తుడు. ఈ కళానైపుణ్యం ఇందులో ఛాయామాత్రంగా ప్రదర్శించబడింది.

**క. కని కుంభజముఖ్యులు వా । నిన పొదువఁగ నేముఁ జొచ్చి నిరతిశయ రయం**
**బున వానికిఁ దోడ్పడుటకుఁ । జనఁ జన మా కడ్డపడియె సైంధవుఁడు వడిన్. 272**

**ప్రతిపదార్థం:** కుంభజముఖ్యులు= ద్రోణాచార్యాదులు; వానిన్+అ= ఆ అభిమన్యుడినే; పొదువఁగన్= కమ్ముకొనగా; కని= చూచి; ఏమున్= మేమున్నూ; చొచ్చి= ప్రవేశించి; నిరతిశయరయంబునన్= అధికవేగంతో; వానికిన్= ఆ అభిమన్యుడికి; తోడ్పడుటకున్+చనన్+చనన్= సహాయపడటానికి పోగా పోగా; వడిన్= వేగంగా; సైంధవుఁడు= జయద్రథుడు; మాకున్= మాకు అందరికీ; అడ్డపడియెన్= అడ్డుపడ్డాడు.

**తాత్పర్యం:** ద్రోణాదులు ఆ అభిమన్యుడినే చుట్టుముట్టి కమ్ముకొనగా చూచి, మేమున్నూ ప్రవేశించి, అధికవేగంతో అభిమన్యుడికి సహాయపడాలని అతిప్రయత్నంతో పోగా, మమ్మల్ని జయద్రథుడు అడ్డుకొన్నాడు.

**విశేషం:** 'చనన్ చనన్' అనే ద్విరుక్తి 'నిరతిశయ రయాన్ని సూచిస్తూ ఉన్నది. అభిమన్యుడిపై ఉండే వాత్సల్యాతిశయాన్నీ, అతడికి ఏమి ముప్పు జరుగుతుందో - తప్పించాలి అనే ఔచిత్యాన్నీ ఒకటికి రెండు మార్లు వెంట వెంటనే ఉపయోగించిన ఆ క్రియాపదాలు సూచిస్తున్నాయి. పాండవు లెంతగా వ్యూహాన్ని ప్రవేశించటానికి తొందరపడ్డారో దానిని మించిన మహావేగం సైంధవుడిలో చోటు చేసికొన్నది.

**వ. అతండు రుద్రవరానుభావంబునం జేసి యక్షుద్రబలుం డగుటనే మతని మిగులం జాలక చిక్కితి; మా సౌభద్రుం జుట్టుముట్టి గురుకర్ణ కృతవర్మ కృపగురు పుత్త్రాది యోధవీరులు పెక్కండ్రు సిక్కు వఱుపం, జేవ సెడక వాఁడు బలంబు మెఱయఁ జలంబు నెఱయ నా రాధేయ ప్రముఖులం బఱపియు, బృహద్బల లక్ష్మణ ప్రభృతులగు రాజుల రాకుమారులఁ బలువురం జంపియు, సొంపారెం; బదంపడి పదాతియు గదాపాణియునై రథాంగపాణి యల్లుండు దూఁగాడుచుం బోరాడునెడ దుశ్శాసన తనయుండు దాఁకి వానిచే విరథుండై తానును గదగొని**

**పెలుచం దలఁపడియె; నత్తెఱంగున నైన గదారణంబున వారిరువురుం బరస్పర నిహతులై పడి; రివ్విధంబున నక్కుమారుండు దన తండ్రులకును మామలకును రూఢియగు రణక్రీడం గీర్తిపరిస్ఫూర్తియు నాకలోక సుఖంబునుం జేకొనియె' నని చెప్పుటయు.** **273**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ సైంధవుడు; రుద్రవర+అనుభావంబునన్+చేసి= శివుడి వరంయొక్క ప్రభావంచేత; అక్షుద్రబలుండు+అగుటన్= మహాబలుడు కావటంవలన; ఏము= మేము; అతనిన్= ఆ సైంధవుడిని; మిగులన్+చాలక= మీరలేక; చిక్కితిమి= చిక్కుకొన్నాము; ఆ+సౌభద్రున్= ఆ అభిమన్యుడిని; చుట్టుముట్టి= కమ్ముకొని; గురు, కర్ణ, కృతవర్మ, కృప, గురుపుత్ర+ఆది, యోధవీరులు= ద్రోణాచార్యుడు, కర్ణుడు, కృతవర్మ, కృపాచార్యుడు, అశ్వత్థామ మొదలైన యుద్ధవీరులు; పెక్కండ్రు= అనేకులు; చిక్కు+పఱుపన్= ఇరుకునపెట్టగా; చేవ+చెడక= (సామర్థ్యం) ధైర్యం నశించక; వాఁడు= ఆ అభిమన్యుడు; బలంబు మెఱయన్= శక్తి ప్రకాశించేటట్లుగా; చలంబు నెఱయన్= మాత్సర్యం అతిశయించేటట్లు; ఆ+రాధేయ ప్రముఖులన్= ఆ కర్ణుడు మొదలైన ప్రసిద్ధులను; పఱపియున్= (అవమాన పరచియు) పరుగెత్తేటట్లు చేసియూ; బృహద్బల, లక్ష్మణ, ప్రభృతులు+అగు, రాజులన్= బృహద్బలుడు, లక్ష్మణకుమారుడు మొదలైన వాళ్ళు అగు రాజులను; రాజకుమారులన్= రాజకుమారులను; చంపియున్= సంహరించియున్నూ; సొంపారెన్= అందగించాడు; పదంపడి= పిమ్మట; పదాతియున్= కాలిబంటున్నూ; గదాపాణియున్+ఐ= గదను చేతిలో ధరించినవాడున్నూ అయి; రథాంగపాణి+అల్లుండు= చక్రాన్ని చేతిలో ధరించిన కృ(వి)ష్ణుని యొక్క మేనల్లుడు; తూఁగాడుచున్= ఊగుతూ; పోరాడు+ఎడన్= యుద్ధం చేసే సందర్భంలో; దుశ్శాసన తనయుండు= దుశ్శాసనుడి కొడుకు; తాఁకి= ఎదుర్కొని; వానిచేన్= ఆ అభిమన్యుడిచేత; విరథుండు+ఐ= రథంలేనివాడై; తానునున్= తానున్నూ (ఆ దుశ్శాసనుడి కొడుకున్నూ); గదన్+కొని= గదను తీసికొని; పెలుచన్= ఆగ్రహంతో; తలపడియెన్= ఎదిరించాడు; ఆ+తెఱంగునన్= ఆ విధంగా; ఐన= అయినటువంటి; గదారణంబునన్= గదాయుద్ధంలో; వారు+ఇరువురున్= ఆ ఇద్దరూ; పరస్పర నిహతులు+ఐ= ఒకరి నొకరు చంపుకొన్నవారై; పడిరి= నేలకూలారు; ఈ+విధంబునన్= ఇట్లా; ఆ+కుమారుండు= ఆ బాలుడు (కుమారుడు); తన తండ్రులకునున్= తన తండ్రులకూ; మామలకును= మామలకూ; రూఢి+అగు= ప్రసిద్ధమైనదైన; రణక్రీడన్= యుద్ధవిహారంలో; కీర్తి+పరిస్ఫూర్తియున్= యశస్సు యొక్క పరిపూర్ణతనూ; నాకలోకసుఖంబునున్= నాక (స్వర్గ) లోకసౌఖ్యాన్ని; చేకొనియెన్= పొందాడు; అని= ఆ ప్రకారంగా; చెప్పుటయున్= చెప్పగా.

**తాత్పర్యం:** సైంధవుడు రుద్రుడి వరబలంవలన అజేయుడు కావటంతో మేము అతడిని మించి ముందుకు పోలేక ఆగిపోయాము. గురు కర్ణ కృతవర్మ కృపాశ్వత్థామాది యోధులు పెక్కుమంది అభిమన్యుడిని చుట్టుముట్టి చిక్కులు పెట్టినా, వెనకాడక అతడు బలం, మాత్సర్యం ప్రకాశించగా కర్ణాది వీరులను పారద్రోలాడు. బృహద్బలుడు, లక్ష్మణుడు మొదలైన రాజులను, రాకుమారులను చాలామందిని చంపాడు. ఆ తరువాత పాదచారి అయి చేతితో గద తిప్పుతూ, తూగుతూ పోరాడే సమయంలో దుశ్శాసనుడి కొడుకు ఎదుర్కొన్నాడు. ఇరువురూ గదలతో యుద్ధం చేసి; ఒకరు నొకరు చంపుకొని నేలకూలారు. ఈ విధంగా అభిమన్యుడు తన తండ్రులకూ, మామలకూ యుద్ధక్రీడలో కీర్తిని తెచ్చాడు. స్వర్గలోక సుఖాలు పొందాడు' అని చెప్పగా.

**విశేషం:** విషయాన్ని విపులంగా విడమరచి వివరించటానికి వచన రచన ఏ విధంగా అనుకూలిస్తుందో ప్రస్తుత యుద్ధవర్ణనలో ప్రకటితం. ఎవ్వరెవ్వరు ఏ రీతిలో ఎదుర్కొన్నారో వారిని అభిమన్యుడు ఏ రూపంలో రూపుమాపాడో వివరించటానికి ఈ వచనం ఉద్దేశించబడింది. తిక్కన కేవలం అర్థగౌరవ దృష్టితోనే రచన చేస్తాడు. శబ్దసౌందర్యాన్ని అంతగా పాటించడు - అని పలువురు భావిస్తారు. కానీ ఆ రెండింటినీ సమన్వయపరుస్తూ అనితరమైన గాంభీర్యాన్నీ సౌందర్యాన్నీ తన కూర్పు నేర్పులో ప్రదర్శించిన సందర్భాలు కొల్లలుగా ఉన్నాయి. 'రుద్రవరం - అక్షుద్రబలం - సౌభద్రుండు' పెక్కండ్రు చిక్కుపఱుప చేవ సెడక'. 'బలంబు మెఱయఁ జలంబు నెఱయ' వంటి ఎన్నో ఉదాహరణలు చూపవచ్చును. 'రథాంగపాణి అల్లుండు' అనటంలో అభిమన్యుడు పదాతియై చక్రాన్ని ధరించి చేసిన యుద్ధం సూచితం.

**క.	తెల్లముగ సుతుపడుట విని । జల్లని డెందంబు సెదర, సంధులు ప్రిదులం,**
**దల్లడ మగ్గలమై మూ । ర్ఛిల్లె నరుఁడు బంధు లెల్లఁ జేష్టలు దక్కన్.	274**

**ప్రతిపదార్థం:** సుతుపడుట= కుమారుడు మరణించటం; తెల్లముగన్= స్పష్టంగా; విని; డెందంబు= హృదయం; జల్లని+చెదరన్= జల్లుమని చెదరిపోగా; సంధులు+ప్రిదులన్= కీళ్ళు సడలిపోగా (ఊడిపోగా); తల్లడము= దుఃఖం; అగ్గలము+ఐ= అధికమై; బంధులు+ఎల్లన్= చుట్టాలు అందరూ; చేష్టలు+తక్కన్= చేతలు ఉడిగి ఉండగా; నరుఁడు= అర్జునుడు; మూర్ఛిల్లెన్= సొమ్మసిల్లాడు.

**తాత్పర్యం:** కుమారుడి మరణం స్పష్టంగా విని, గుండె జల్లుమని చెదరిపోగా, ఎక్కడి కీళ్ళక్కడ ఊడిపడేటట్లు అధిక దుఃఖంతో అర్జునుడు సొమ్మసిల్లి పడిపోయాడు. బంధువులందరూ నిశ్చేష్టు లయ్యారు.

**విశేషం:** ద్విరుక్తలకారపౌనఃపున్యం వలన గుండె ఝల్లుమనే తల్లడపాటు, విలవిలలాడుతూ సొమ్మసిల్లి పడిపోయే పరిస్థితి వ్యంజించబడ్డాయి.

**వ.	ఇట్లు పరవశుండైనఁ గృష్ణయుధిష్ఠిరులు గరతలంబుల నెత్త, నొక్కింతసేపునకు సేదదేఱి సైంధవుం దలంచి యతండు.	275**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; పరవశుండు+ఐనన్= ఒళ్ళు మరచినవాడు కాగా; కృష్ణయుధిష్ఠిరులు= కృష్ణుడున్నూ, ధర్మరాజున్నూ; కరతలంబులన్= తమ అరచేతులతో; ఎత్తి= పైకెత్తగా; ఒక్కింత సేపునకున్= కొంచెం సేపటికి; సేదదేఱి= సొమ్మదెలిసి; సైంధవున్+తలంచి= జయద్రథుడిని తలచుకొని; అతండు= అర్జునుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా సొమ్మసిల్లగా కృష్ణుడూ, ధర్మరాజు కలిసి అతడిని తమ చేతులతో ఎత్తిపట్టారు. కొంతసేపటికి అతడు తేరుకొని సైంధవుడిని తలచి.

**ఆ.	అవుడు గఱచి యెఱ్ఱ నగు నాననంబుతో । బొమలు ముడిచి, చెమట పొడమ, మేను**
**కంప మొందఁ, గనలు గదిరిన కటికి న । వ్వెసక మెసఁగ నన్న కిట్టు లనియె.	276**

**ప్రతిపదార్థం:** అవుడు+కఱచి= పెదవి కొఱికి; ఎఱ్ఱన+అగు+ఆననంబుతోన్= జేగురించిన ముఖంతో; బొమలు ముడిచి= కనుబొమలు ముకుళించి; చెమట పొడమన్= (శరీరంలో) చెమట పుట్టగా; మేను+కంపము+ఒందన్= ఒళ్ళు వణకిపోగా; కనలు, కదిరి, కటికి, నవ్వు= కోపం అతిశయించిన క్రూరమైన నవ్వు; ఎసక మెసఁగన్= ఒప్పుతూ ఉండగా; అన్నకున్= ధర్మరాజుకు; ఇట్టులు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** పెదవి కొరికి, జేగురించిన ముఖంతో కనుబొమలు ముడిచి, ఒళ్ళంతా చెమట పుట్టగా, వణికిపోతూ కోపం అతిశయించిన క్రూరమైన నవ్వు నవ్వి ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అర్జునుడు అంతకు మునుపే దుఃఖాతిశయంతో ఒళ్ళుమరచి సొమ్మసిల్లి పడిపోయాడు. తేరుకున్న తరువాత పట్టరాని కోపం సైంధవుడిపైన కలిగింది. ఎక్కువ కోపం వచ్చినప్పుడు శారీరకంగా ఎటువంటి మార్పులు వస్తాయో ఈ ఆటవెలది పద్యంలో తిక్కన చాలా చక్కగా వివరించాడు. ఆయన ఈ భారతంలో ఎన్నో నవ్వులను ప్రస్తావించి ఉన్నాడు. కోపం అతిశయించినప్పుడు కలిగే నవ్వును ఆయన ఇక్కడ కటికి నవ్వు అని తెలిపాడు. బొమముడిపాటు, చెమట కలగటం, శరీరం కంపించటం వంటి సాత్త్విక భావాలను ఆటవెలది పద్యంలో అర్థవంతంగా తిక్కన వివరించాడు.

**మ. 'వినుఁడీ! నాదు ప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులున్; సింధురా**
**జు నవశ్యంబును నెల్లి సంపుదు భయస్థుండై నినుం జొచ్చినన్,**
**వనజాక్షున్ శరణంబు వేఁడినను, గర్వం బేది నన్నుం దగం**
**గనినం, బోరు దొఱంగి పోయిన నెఱుంగం గాని సత్యవ్రతా! 277**

**ప్రతిపదార్థం:** సత్యవ్రతా!= సత్యాన్నే నిష్ఠగా ఆచరించేవాడా (ధర్మరాజా!); నీవున్= నీవున్నూ; నిఖిల+ఉర్వీనాథులున్= ఈ రాజులు అందరున్నూ; నాదు+ప్రతిజ్ఞన్= నా ప్రతినను; వినుఁడీ!= వినండి!; భయస్థుండై= భయంతో కూడినవాడై; నినున్+చొచ్చినన్= నీ శరణు చొచ్చినప్పటికీ; వనజాక్షున్= శ్రీకృష్ణుడిని; శరణంబున్+వేఁడినన్= రక్షణ కోరినప్పటికీ; గర్వంబు+ఏది= గర్వం తొలగి; నన్నున్= నన్ను; తగన్= తగునట్లు; కనినన్= చూచినప్పటికీ; పోరు+తొఱంగి+పోయినన్= యుద్ధం చేయకుండా తొలగి పోయినప్పటికీ; ఎఱుంగన్+కాని= తెలియనుగాని - చెప్పలేను కాని; ఎల్లి= రేపు; అవశ్యంబును= తప్పకుండా; సింధురాజున్= సైంధవుడిని; చంపుదున్= సంహరిస్తాను.

**తాత్పర్యం:** సత్యవ్రతుడవైన ఓ ధర్మరాజా! నీవూ, సమస్త రాజులూ నా ప్రతిజ్ఞ వినండి. ఆ సైంధవుడు నిన్ను శరణుజొచ్చినా, కృష్ణుడిని రక్షణ కోరినా, గర్వం విడిచి నన్నే వచ్చి ఆశ్రయించినా, యుద్ధం చేయకుండా కౌరవులను విడిచి మరెక్కడికైనా పారిపోతే చెప్పలేనుగాని, అట్లాకాని పక్షంలో రేపు తప్పకుండా అతడిని చంపి తీరుతాను.

**విశేషం:** అర్జునుడు తాను ప్రతిజ్ఞ చేస్తూ అన్నను సత్యవ్రతా! అని సంబోధించటం విచిత్రంగా ఉన్నది. అతడు సత్యవ్రతుడై ఉంటేనే తన ప్రతిజ్ఞను వినటానికి అర్హుడు. ముఖ్యంగా అన్నను ఉద్దేశించి 'వినండీ' అని చెప్తూ ఉన్న ప్రతిజ్ఞ. ఎవరి దగ్గరనో చేసినందువలన ఫలితం లేదు. సత్యవ్రతుల ముందు చేసిన ప్రతిజ్ఞే ప్రతిజ్ఞ. అదే సత్వరం ఫలించటానికి సమర్థం. తన ప్రతిజ్ఞకు సత్యవ్రతులు సాక్షిభూతులు. సత్యాన్ని నిర్వహించటంలో అనుజులు అన్నను అనుసరించాలి. కాబట్టి 'నీవు అనుసరించే సత్యవ్రతం యొక్క ఫలితం, నిన్ను అనుసరించే నాలో కూడా ప్రస్తుతం సిద్ధించి తీరుతుం'దన్న ప్రగాఢ విశ్వాసానికి ఈ సంబోధన ఎంతో సమర్థనీయంగా ఉన్నది. అన్న అజాత శత్రువు. ఆ సైంధవుడు వచ్చి శరణు కోరితే కాదనడు. అందువలన మొట్టమొదటగా 'నినుం జొచ్చినన్' అన్నాడు. అన్ని విషయాలలో నిరంతరం తమకు అండదండగా ఉండి కాపాడుతూ ఉన్న ఆ శ్రీకృష్ణుడు శరణాగత పరిరక్షకుడై సైంధవుడిని కాపాడటానికి ప్రయత్నించినా, చివరకు నన్నే వచ్చి ప్రసన్నుడవు కమ్ము అని ప్రార్థించినా వాడిని వదిలేది లేదు - అని అర్జునుడు ప్రతిజ్ఞ చేశాడు. ఈ చేసిన ప్రతిజ్ఞను బట్టి ఆ సైంధవుడు ఏ విధంగానూ తప్పించుకొనటానికి వీలులేదు అని స్పష్టమౌతూ ఉన్నది.

ఇందుకు మూలం: **శ్లో॥ "సత్యం వః ప్రతిజానామి । శ్వోఽస్మి హంతా జయద్రథమ్!**
**నచేత్ వధభయాద్భీతో । ధార్తరాష్ట్రాన్ ప్రహాస్యతి॥**
**న చాస్మాన్ శరణం గచ్ఛేత్ । కృష్ణం వా పురుషోత్తమమ్।**
**భవన్తం వా మహారాజ శ్వోఽస్మి హంతా జయద్రథమ్॥** (ద్రోణ. 51.20-21)

**క. బాలధ్వంసకు నా దు । శ్శీలుం గాచుటకు నన్నుఁ జెనకిన నస్త్ర**
**జ్వాలలఁ గౌరవ యోధులఁ । దూలించుచు వానిఁ గవియుదుం జటుల గతిన్. 278**

**ప్రతిపదార్థం:** బాలధ్వంసకున్= బాలుడిని హతం చేసిన వాడిని; ఆ+దుశ్శీలున్= ఆ దుష్టస్వభావుడిని; కాచుటకున్= రక్షించటానికి; నన్నున్+చెనకినన్= నన్ను తాకితే; అస్త్రజ్వాలలన్= బాణాల మంటలచేత; కౌరవయోధులన్= కౌరవవీరులను; తూలించుచున్= పడగొడుతూ; చటుల గతిన్= తీవ్రవేగంతో; వానిన్+కవియుదున్= ఆ సైంధవుడిని ఎదుర్కొంటాను.

**తాత్పర్యం:** బాలుడిని సంహరించినవాడూ, పరమ దుష్టస్వభావుడూ అయిన అతడిని (ఆ సైంధవుడిని) కాపాడటానికి నన్ను ఎదిరిస్తే బాణజ్వాలలతో ఆ కౌరవవీరులను నేలకూలుస్తూ, తీవ్రంగా ఆ సైంధవుడిని మార్కొంటాను.

**ఆ. ఇట్లు సేయనైతి నేని గురుద్రోహి। గతికి, బ్రహ్మఘాతిగతికి, మద్య**
**పానరతుని గతికి, మానార్హ జనపరి। వాదిగతికిఁ బోవువాఁడ నధిప! 279**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఇట్లు= ఈ విధంగా; చేయన్+ఐతిన్+ఏని= చేయలేకపోతే; గురు, ద్రోహిగతికిన్= గురుద్రోహం చేసినవాడి దుర్గతికి; బ్రహ్మ, ఘాతి, గతికిన్= బ్రహ్మహత్య చేసినవాడి దుర్గతికి; మద్య, పానరతుని, గతికిన్= సుర లేక కల్లుయొక్క త్రాగటంలో ఆసక్తి కలిగిన వాడి దుర్గతికి; మాన+అర్హ, జన, పరివాది+గతికిన్= గౌరవ యోగ్యులు (పాత్రులు) అయిన వారిని నిందించినవాడి దుర్గతికి; పోవువాఁడన్= పోయిన వాడినౌతాను.

**తాత్పర్యం:** రాజా! ఈ విధంగా చేయలేకపోతే, గురువుకు ద్రోహం చేసినవాడు పొందే అధోగతికి, బ్రహ్మహత్య చేసినవాడికి కలిగే దుర్గతికి, మద్యాన్ని త్రాగటంలో ఆసక్తి కలిగినవాడికి, గౌరవయోగ్యులను నిందించినవాడికి ప్రాప్తించే దుర్గతికి పోయిన వాడినౌతాను.

**విశేషం:** సైంధవుడిని రేపు సాయంకాలంలోపల సంహరించటం తథ్యం. ఎవరు వాడికి సాయం వచ్చినా తన ప్రతిజ్ఞ జరిగి తీరవలసిందే అని అంతకు ముందు నిర్ధారణ చేసిన అర్జునుడు ఆ ప్రతిజ్ఞను మరికొంత ఈ పద్యంలో తీవ్రతరం చేశాడు. గురుద్రోహం, బ్రహ్మహత్య, మద్యపానం, గౌరవపాత్రులను నిందించటం - అనే దుర్గుణాలు కలవాడు ఎటువంటి అధోగతి పాలౌతాడో, అటువంటి దుర్గతి పాలౌతాను అని చెప్పాడు. ఇందులో మద్యపానం ఎంత హీనమైనదో తెలుపబడింది. అదే విధంగా గౌరవానికి అర్హులైన వారిని నిందించేవాడు కూడా లోకం దృష్టిలో ఎంత పతితుడో, వాడు పొందే దుర్గతి ఎంత అపకీర్తికరమో తెలుపబడింది.

**వ. మఱియు నొక్క ప్రతిన యవధరింపుము. 280**

**తాత్పర్యం:** ఇంకా ఒక ప్రతిజ్ఞ వినుము.

**చ. అనిమిష దైత్యకింపురుషు లాదిగ నెవ్వరు వచ్చి కాచినం**
**దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్త్రుఁడు గ్రుంకకుండుము**
**న్న నరవరేణ్య! యిత్తెఱఁగు నా కొనరింపఁగ రాక యున్న నే**
**ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగ గాండివంబుతోన్.' 281**

**ప్రతిపదార్థం:** నరవరేణ్య!= మానవశ్రేష్ఠ! (ధర్మరాజా!); అనిమిష= దేవతలు (రెప్పపాటులేనివాళ్ళు); దైత్య= రాక్షసులు (దితి కొడుకులు); కింపురుషులు= కొంచెం నరరూపం గల దివిజులు; ఆదిగా= మొదలుగా; ఎవ్వరు వచ్చి కాచినన్= ఎవరు వచ్చి రక్షించినా; తోయజమిత్త్రుఁడు= సూర్యుడు; గ్రుంకకుండ మున్ను+అ= అస్తమించటానికి మునుపే; ఎల్లి= రేపు; సైంధవునిన్= జయద్రథుడిని; తునుముదున్= సంహరిస్తాను; ఇత్తెఱఁగు= ఇలా; నాకున్= నాకు; ఒనరింపఁగన్+రాక+ఉన్నన్= చేయడానికి కాకుండా ఉంటే; నృపులు+అందఱున్= రాజులంతా; చూడఁగన్= చూస్తూ ఉండగా; గాండివంబుతోన్= గాండీవం అనే వింటితో కూడా; నేను= నేను; అనలము+చొచ్చువాఁడన్= అగ్ని ప్రవేశం చేస్తాను.

**తాత్పర్యం:** ధర్మరాజా! దేవతలు, రాక్షసులు కింపురుషులు మొదలగువారు ఎవ్వరు వచ్చి కాపాడినా, రేపు సూర్యుడు అస్తమించే లోపల ఆ సైంధవుడిని సంహరిస్తాను. అట్లా చేయకపోతే రాజులంతా చూస్తూ ఉండగానే నేను గాండీవం తో కూడా అగ్నిలో దూకుతాను.

**విశేషం:** ఇంతకు ముందు చేసిన ప్రతిజ్ఞల్లో మొదటిది తనకూ కృష్ణుడికీ ధర్మరాజుకూ సంబంధించినది. ఎదిరించిన కౌరవసైన్యాన్ని మహావేగంతో సంహరిస్తాను అన్నాడు. అట్లా చేయలేకపోతే తన కెన్నో రకాల దుర్గతులు కలిగినట్లే అని తెలిపాడు. ప్రస్తుత ప్రతిజ్ఞ

చేసే ముందు అన్నను సావధానుడవై విను మని హెచ్చరించాడు. 'అవధరింపుము' అని అదే పనిగా చెప్పటం వలన ఆ ప్రతిజ్ఞ యొక్క తీవ్రత వ్యక్తమవుతుంది. ఇంతకుముందు ప్రతిజ్ఞలో కూడా 'ఎల్లి' అని ఉన్నది. కాని 'ఎల్లి ఎంత లోపల' అనేది ఈ ప్రతిజ్ఞలో స్పష్టం చేశాడు. 'తోయజమిత్రుడు గ్రుంకకుండుమున్న' అని కాలనిర్దేశం. ఈ ప్రతిజ్ఞ మూడవ పాదం మొదటి అక్షరం దగ్గర ఆగింది. అటుపై నరవరేణ్య! అని అన్నకు సంబోధన. ఏవార్థకంతో నిశ్చయంచేసిన ప్రతిజ్ఞ ప్రకారం అక్కడకు సైంధవుడి తల తెగినట్టే. అయితే మరో విషయం ఉన్నది.

ఒకవేళ ప్రతిజ్ఞ నెరవేర్చలేకపోతే, దాని ప్రాయశ్చిత్తం ప్రతిజ్ఞ కంటె మహాభయంకరంగా ఉంటుంది. మూడవ పాదం రెండవ అక్షరం నుండి, ప్రతిజ్ఞ నెరవేర్చకపోతే పరిణామం ఎంత దారుణంగా ఉంటుందో తెలుపబడింది. 'గాండీవముతో' నృపులందఱు చూస్తూండగ, అనలము సొచ్చువాడ అని చెప్పాడు. అన్ని పనులలోనూ తన విజయనామ సార్థక్యానికి సహకరించిన దివ్య సాధనం గాండీవం. గాండీవి అను పేరు అర్జునుడికి ఏర్పడింది గాండీవం వలననే. అంటే గాండీవం - తానూ వేరు వేరు కాదు. ప్రతిజ్ఞ నేరవేర్చకపోతే తనతోపాటు గాండీవం కూడా అగ్నిపాలు కావలసిందే అని నిష్కర్షగా చెప్పుతూ ఆ అస్త్రం యొక్క ఉత్కర్షను మరో విధంగా ఉట్టంకించాడు.

అగ్నిలోనే ఎందుకు గాండీవంతో గాండీవి ప్రవేశిస్తాను అంటున్నాడో - ఇది కొంత ఆలోచించవలసిన విషయం. ఆ గాండీవం తనకు ఏ విధంగా లభించిందో దానితో ముడిపడి ఉన్నది దాని అంతం కూడా. అదే ఇందులో ఉన్న రహస్యం.

గాండీవం దివ్యధనుస్సు. దానిని బ్రహ్మ, ప్రజాపతి, ఇంద్రుడు, వరుణుడు ఎన్నో వేల సంవత్సరాలు ధరించారు. చివరకు అది వరుణుడి దగ్గర నుండి అగ్ని గ్రహించాడు. ఖాండవ దహన సందర్భంలో అగ్నిని ఇంద్రుడు బాధించకుండా కాపాడటానికి అగ్ని అర్జునుడికి ఇచ్చాడు. దానిని మరే ఆయుధం తాకినా అది బూడిదైపోవలసిందే. అదే అర్జునుడికి అతి ముఖ్యమైన ఆయుధం. అగ్ని నుండి సంక్రమించిన ఆ దివ్యాస్త్రం తనతో కూడా మళ్ళీ ఆ అగ్నిలోనే ప్రవేశించటం జరగాలి అని అర్జునుడి ప్రతిజ్ఞలో ఉన్న అసలు రహస్యం.

**వ.** **అని పెలుచం బలికి, యప్పరమ కోదండంబు దెప్పించి, సజ్యంబు గావించి, గుణధ్వని నిగుడం జేయుటయుఁ, బద్మనాభుండు పాంచజన్యంబు పూరించె, దేవేంద్ర పుత్త్రుండు దేవదత్తం బొత్తె; నన్నాదంబులును దత్సైనిక సింహనాదంబులును దూర్యనినదంబులును నింగి వొంగం జెలంగె; నగ్గాండీవంబును నృత్తంబు సేసిన చందంబు నొందె; నస్త్రంబు గవదొనలు వెలువడి వెలింగె; నయ్యవసరంబునం గొండొక దెలివొంది పవననందనుఁ డప్పురందరనందను వదనంబు వీక్షించి.** **282**

**ప్రతిపదార్థం:** అని= ఆప్రకారంగా; పెలుచన్= గట్టిగా, అతిశయముగా; పలికి= ప్రతిజ్ఞచేసి; ఆ+పరమ, కోదండంబున్= ఆ ఉత్కృష్టమైన విల్లును; తెప్పించి= తెచ్చేటట్లు చేసి; సజ్యంబు కావించి= నారి ఎక్కుపెట్టి; గుణధ్వని= అల్లెత్రాటిమోత; నిగుడన్+చేయుటయున్= వ్యాపించేటట్లు చేయగా; పద్మనాభుండు= శ్రీకృష్ణుడు; పాంచజన్యంబున్+పూరించెన్= తన శంఖమైన పాంచజన్యాన్ని ఊదాడు; దేవేంద్ర పుత్త్రుండు= అర్జునుడు; దేవదత్తంబు+ఒత్తెన్= తన శంఖమైన దేవదత్తాన్ని ఊదాడు; ఆ+నాదంబులును= ఆ రెండు శంఖాల శబ్దాలున్నూ; తద్+సైనిక+సింహనాదంబులును= ఆ సేనలయొక్క గర్జనలవంటి అరవులున్నూ; నింగి= ఆకాశం; పొంగన్+చెలంగెన్= అతిశయించేటట్లు (ఉబ్బేటట్లు) ఒప్పింది; ఆ+గాండీవంబు= ఆ గాండీవం అనే విల్లు; నృత్తంబు చేసిన+చందంబున్+ఒందెన్= నర్తించిన విధంగా అయింది; అస్త్రంబు= బాణం; కవదొనలు= అమ్ముల పొదుల జంటలు; వెలువడి= వెలుపలికి వచ్చి; వెలింగెన్= ప్రకాశించాయి; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో; కొండొక= కొంత; తెలివొంది= సంతోషించి, వికాసాన్ని పొంది; పవననందనుండు= భీముడు; ఆ+పురందరనందను+వదనంబు= ఆ అర్జునుడి ముఖం; వీక్షించి= చూచి.

**తాత్పర్యం:** అని గట్టిగా పలికి, ఆ దివ్యకోదండాన్ని తెప్పించి నారి సారించి గుణధ్వని చేశాడు. శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించాడు. అర్జునుడు కూడా దేవదత్తాన్ని ఒత్తాడు. ఆ నాదాలూ, సైనికుల సింహనాదాలూ, వాద్యరవాలూ కలిసి

ఆకాశాన్ని అంటాయి. గాండీవం నృత్యం చేసినట్లయింది. అస్త్రాలూ, అమ్ములపొదులూ వెలువడి వెలిగాయి. ఆ సమయంలో కొంత తేరుకొన్న భీముడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. 'అతి తీవ్రమైన నీదగు । ప్రతిన కుపోద్బలము గాఁగ బరఁగిన ధీరో**
**ద్ధతి పాంచజన్య రవమున । ధృతి తూలక యున్నె కురుపతికి నింద్రసుతా!' 283**

**ప్రతిపదార్థం:** ఇంద్రసుతా!= అర్జునా!; అతి తీవ్రము+ఐన= మిక్కిలి తీక్ష్ణమైన; నీది+అగు ప్రతినకున్= నీ ప్రతిజ్ఞకు; ఉపోద్బలము+కాఁగన్= ప్రోత్సాహకంగా, ధైర్యం చెప్పినట్లుగా; పరఁగిన= ఒప్పిన; ధీర+ఉద్ధత= ధీరతతోడి ఉద్వృత్తికల (ధీరత మరియు ఆటోపంకల); పాంచజన్య, రవంబునన్= శ్రీకృష్ణుడి పాంచజన్యం అనే శంఖం యొక్క శబ్దంచేత; కురుపతికిన్= ఆ దుర్యోధనుడికి; ధృతి= ధైర్యం; తూలక+ఉన్నె?= చెడకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! మిక్కిలి తీవ్రమూ, కఠోరమూ అయిన నీ ప్రతిజ్ఞకు ప్రోత్సాహకంగా (ధైర్య గాంభీర్యాలూ, గర్వోద్దీపనలూ) ధీరతా, ఆటోపమూ కలిగిన శ్రీకృష్ణుడి పాంచజన్యం యొక్క మ్రోతతో ఆ దుర్యోధనుడి ధైర్యం నశించకుండా ఉంటుందా?'

**విశేషం:** ఇంతకు పూర్వం వచనంలో కూడా 'పవననందనుడు ఆ పురందర నందనుని వదనంబు' అని పేర్కొనబడింది. ఇచ్చట భీముడు అర్జునుడిని సంబోధిస్తూ ఇంద్రసుతా! అని పేర్కొన్నాడు. అర్జునుడి ప్రతిజ్ఞా వాక్యాలు, వెంటనే పాంచజన్య దేవదత్తాలను పూరించటం - ఆ ధ్వని దేవేంద్రాదులను అలరించింది. ప్రతిజ్ఞ ఫలించాలంటే ముందుగా దేవతలు తథాస్తు అని అనుగ్రహించాలి. అట్టి అనుగ్రహాన్ని ఇంద్రుడు అతడి కుమారుడికి కలిగిస్తాడు అని సూచన.

శ్రీకృష్ణుడు పూరించిన పాంచజన్య శబ్దం విజయుడి విజయానికి ఆమోదాన్ని తెలిపే ముందుసూచన. పాంచజన్య శబ్దం సాందీపని కుమారుడిని తెచ్చి ఇచ్చే సందర్భంలో యముడిని కూడా హడలెత్తించింది. ప్రభాసతీర్థంలో చనిపోయిన గురుపుత్రుడిని అక్కడ పంచజనుడు అనే రాక్షసుడు మ్రింగాడని భావించి వాడి శరీరాన్ని చీల్చగా అందులో ఉన్న శంఖమే పాంచజన్యమైంది. ఆ మహా గంభీర నినాదం దుర్యోధనుడి ధైర్యాన్ని తప్పక నశింపజేసి ఉంటుందని సారాంశం.

**వ. అని యగ్గించె; నా సమయంబునం గోపంబు పెంపునను బూనికిపై భరంబునను భీమసేనుని సల్లాప సౌహార్దంబునను దన డెందంబు శోకంబు డిందువడం గలయం గనుంగొని విజయుని వంది మాగధసందోహంబులు సంస్తుతించె; నట్టియెడ నిక్కడ. 284**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; అగ్గించెన్= పొగడాడు; ఆ సమయంబునన్= ఆ సందర్భంలో; కోపంబు+పెంపునను= క్రోధంయొక్క అతిశయంచేతను; పూనికిపైన్= ప్రయత్నంపై; భరంబునను= భారం చేతనూ (పూనికి+వైభవంబునను= ప్రయత్నంయొక్క విభవము చేతనూ); భీమసేనుని= భీముడి; సల్లాప సౌహార్దంబునను= హితవచనాలతోడి మంచి మనస్సు చేతనూ; తన= తనయొక్క (అర్జునుడియొక్క); డెందంబు+శోకంబు= మనస్సులోని దుఃఖం; డిందువడన్= తగ్గగా (అణగగా); కలయన్= అంతటా (బాగుగా); కనుంగొని= చూచి; విజయునిన్= అర్జునుడిని; వందిమాగధ సందోహంబులున్= స్తుతి పాఠకుల మొత్తములున్నూ; సంస్తుతించెన్= పొగడాయి; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఇక్కడన్= ఈ మన కురుసైన్యంలో.

**తాత్పర్యం:** అని పొగడాడు; ఆ సమయంలో కోపతీవ్రతచేతను, ప్రయత్నాలు చేసే కార్యభారంచేతను, భీమసేనుడి హితవాక్యాల స్నేహభావంచేతను తన మనస్సు దుఃఖం తగ్గగా అంతటా కలయచూచిన అర్జునుడిని వందిమాగధగణాలు కీర్తించాయి. అదే సమయంలో మన కురుసైన్యంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. జననాథ! పాంచజన్య । ధ్వనిఁ గూడి చెలంగు దేవదత్తరవంబున్**
**విని, భీతి సంభ్రమంబుల । మన సైన్యము లెల్ల ఘూర్ణమానము లయ్యెన్. 285**

**ప్రతిపదార్థం:** జననాథ!= ఓ రాజా (ధృతరాష్ట్రా!); పాంచజన్యధ్వనిన్+కూడి= శ్రీకృష్ణుడి శంఖమైన పాంచజన్యం యొక్క శబ్దంతో కూడుకొని; చెలంగు= ధ్వనించు; దేవదత్తరవంబున్= అర్జునుడి దేవదత్త శంఖ ధ్వనిని; విని; భీతి సంభ్రమంబులన్= భయంచేతనూ, తొట్రుపాటుచేతనూ; మన సైన్యములు+ఎల్లన్= మన సేనలు అన్నీ; ఘూర్ణమానములు+అయ్యెన్= తిరుగుడు పడినట్లుగా అయ్యాయి (మిక్కిలి భ్రమణం (కదలిక) చెందినవి అయ్యాయి).

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! పాంచజన్య శబ్దంతో కూడుకొన్న దేవదత్త శబ్దాన్ని విని, మన సైన్యాలు భయంతో, తొట్రుపాటుతో మిక్కిలి చలించి పోయాయి.

**విశేషం:** ప్రస్తుత కందపద్యంలో నరనారాయణు లిద్దరూ వారి వారి శంఖాలు పూరించిన విషయం తెలుపబడింది. ఇరువురూ ఏకాభిప్రాయానికి వచ్చినప్పుడు ఎంతటి దుస్తర కార్యమైనా అనాయాసంగా ఫలించి తీరుతుంది అని సూచన. ధ్వని విని భీతితో సైన్యాలు ఏ విధంగా కలత చెందినవో 'ఘూర్ణమాన' అనే ప్రయోగంలో పద్యాంతమున ప్రకటితం.

**క. అప్పుడు వేగులవారలు । సెప్పిన నంతయు నెఱింగి సింధువిభుఁడు దన్**
**గప్పెడు నెవ్వగపెల్లున । నిప్పులఁ బడినట్లు గాలు నిలువఁగ లేమిన్. 286**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; వేగులవారలు= త్వరగా వార్తలు అందజేసే గూఢచారులు; చెప్పినన్= తెలుపగా; సింధువిభుఁడు= సైంధవుడు; అంతయున్+ఎఱింగి= విషయమంతా తెలిసికొని (అనగా అర్జునుడి ప్రతిజ్ఞను బాగుగా తెలిసికొని); తన్= తనను; కప్పెడు= ముంచివేసే; నెవ్వగపెల్లునన్= అధికమైన చింతతో; నిప్పులన్+పడినట్లు= అగ్నిలో పడినట్లు; కాలు+నిలువఁగన్+లేమిన్= కాలు నిలపటానికి కాకుండటం చేత.

**తాత్పర్యం:** వెంటనే వేగులవాళ్ళు చెప్పగా, అర్జునుడి ప్రతిజ్ఞను బాగుగా తెలిసికొని సైంధవుడు తనను అధికమైన విచారం (చింత) ఆవరించగా అగ్నిచేత తపించబడ్డట్లుగా కాలు నిలపటానికి సాధ్యంకాక.

**విశేషం:** 'నెవ్వగపెల్లు' అంటే అధికమైన విచారం యొక్క అతిశయం. అధికమైన విచారం ఆవరిస్తే మనస్సు క్షణం కుదురుగా ఉండలేదు. చితాగ్ని చచ్చిన శరీరాన్ని కాలిస్తే చింతాగ్ని క్షణక్షణోద్వేగంతో మనస్సును దహించి వేస్తుంది. చింతను అగ్నితో పోల్చటం పరిపాటి. 'నిప్పులలో పడ్డట్లుగా కాలు నిలవకపోవటం' అనే అచ్చ తెలుగు పలుకుబడి, సైంధవుడి అప్పటి మనః పరిస్థితిని కళ్ళకు కట్టినట్లుగా తెలుపుతూ ఉన్నది. చారుడు అనగా వేగువాడు, వేగరి. కాని, తిక్కన ఇచ్చట వేగులవారలు అనటంవలన అతి త్వరగా వార్తలను అందించేవాళ్ళు అని గ్రహించవలసి ఉన్నది. అన్యాయంచేసిన వ్యక్తి కొంత సుదూరంగా ఉండి, ప్రాణాపాయానికి గురి అవుతూ ఉన్నాడని తెలిసినప్పుడు, అత డేదో ఒక ఉపాయంతో బ్రతికి బయటపడటానికి గూఢచారులు వెంటనే వార్తను ఆ నిర్దిష్టవ్యక్తికి తెలపటం అనే పద్ధతి ఆనాటి యుద్ధ తంత్రంతో ఒక భాగంగా ఉన్నట్లు విదితం.

**అర్జునుని ప్రతిజ్ఞ విని సైంధవుఁడు భయపడి దుర్యోధనునితోఁ జెప్పికొనుట (సం. 7-52-1)**

**క. చని యాప్తు లైన బల వ । న్మనుజేంద్రులు గొలువనున్న మానవనాథుం**
**గని యిట్లను సిగ్గు గడచి । తన యుల్లముఁ గలఁచి వెఱపు దల్లడవెట్టన్. 287**

**ప్రతిపదార్థం:** చని= పోయి; ఆప్తులు+ఐన= ప్రాణ స్నేహితులైన; బలవత్+మనుజ+ఇంద్రులు= బలంకలిగిన రాజులు; కొలువన్= సేవిస్తూ ఉండగా; ఉన్న+మానవనాథున్= ఉండే రాజును అనగా దుర్యోధనుడిని; కని= చూచి; తన+ఉల్లమున్= తన మనస్సును;

కలఁచి= కలత కలిగించి; వెఱపు= భయం; తల్లడ+పెట్టన్= చలింపజేయగా (బాధపెట్టగా); సిగ్గుగడచి= సిగ్గు విడిచి; ఇట్లు= ఇట్లా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** చింతతో కాలు నిలువలేకపోటంచేత త్వరగా దుర్యోధనుడి దగ్గరకు పోయి, బలవంతులైన రాజులతో కొలువుదీరి ఉన్న అతడిని చూచి భయం తనను బాధపెట్టగా, సిగ్గు విడిచి ఇట్లా అన్నాడు.

**ఉ. ఏ నొకరుండనే తనకు నెగ్గొనరించితి? నేల నాపయిం**
**బూనినవాఁడు ఫల్గునుఁడు? పోర వధింపగ నెట్టి పాడి? మీ**
**కీ నెఱిసంతసంబు వగ పేటికి నా కెట యేని పోయెదన్**
**వాని ప్రతిజ్ఞ కడ్డపడు వారె సురాసుర సిద్ధసాధ్యులున్. 288**

**ప్రతిపదార్థం:** తనకున్= ఆ అర్జునుడికి; ఏను= నేను; ఒకరుండనే+ఎగ్గొనరించితిన్?= ఒక్కడినే కీడు చేశానా?; ఏల= ఎందువలన; ఫల్గునుఁడు= అర్జునుడు; పోరన్= యుద్ధంలో; వధింపఁగన్= చంపటానికి; నాపయిన్= నా మీద; పూనినవాఁడు= ప్రయత్నిస్తున్నాడు; ఎట్టిపాడి= ఎటువంటి ధర్మం (ఏమి న్యాయం); మీకున్= మీకు; ఈ నెఱి+సంతసంబు= ఈ సంతోషించటం; నాకున్= నాకు; వగపు+ఏటికి?= చింత ఎందుకు?; ఎటఏని+పోయెదన్= ఎక్కడికైనా వెళ్ళుతాను; వాని ప్రతిజ్ఞకున్= ఆ అర్జునుడి ప్రతినకు; సుర+అసుర, సిద్ధ, సాధ్యులున్= దేవతలు, రాక్షసులు, సిద్ధులు, సాధ్యులు కూడా; అడ్డపడువారె?= అడ్డుపడేవారేనా?

**తాత్పర్యం:** ఆ అర్జునుడికి నే నొక్కడినే కీడు చేశానా? ఎందుకు అతడు యుద్ధంలో నన్నే వధించటానికి ప్రయత్నిస్తున్నాడు? ఇది ఏమి ధర్మం? మీకు సంతోషించటం ఏమి న్యాయం? నాకు ఈ చింత ఎందుకు? ఎక్కడికైనా వెళ్ళిపోతాను. ఆ అర్జునుడి ప్రతిజ్ఞకు దేవదానవులు సిద్ధసాధ్యులు కూడా అడ్డుపడలేరు.

**విశేషం:** ఈ పద్యాలలో భయచకితుడైన సైంధవుడి మనస్థితి చాలా చక్కగా ఆవిష్కరించబడింది. నేనొక్కడినేనా అతడికి కీడు చేసింది, ఎందుకు మరి నన్నే చంపటానికి ప్రయత్నం? మీరందరూ సంతోషంగా ఉండటం నేను మాత్రం ఇట్లా చింతించటమా? ఇది ఏమి ధర్మం? అని తనకు రక్షణ దొరకదని సందేహపడ్డాడు. 'ఎక్కడికైనా పోయి దాగుకొంటాను. ఇంతకంటె ఏమి చేసేది?' అని భీతితో పరుగెత్తి వెళ్ళటానికి ఆలోచించాడు. అర్జునుడి ప్రతిజ్ఞ సామాన్యమైనది కాదు అని బాగా తెలిసిపోయింది. అందుకే అతడిని దేవతలు కూడా జయించలేరంటూ ఉన్నాడు. ప్రాణభీతి కలిగినప్పుడు ఒక వ్యక్తి ఎట్లా రకరకాలుగా ఆలోచించి ఎక్కడనో ఒక చోట తలదాచుకొనటానికి సంసిద్ధుడౌతాడో ఇందులో తెలుపబడింది. విడివిడి వాక్యాల కూర్పు భయభ్రాంత మనస్కతకు సూచన.

**వ. అనుచుం గొలువు గనుంగొని. 289**

**తాత్పర్యం:** అని అంటూ సభను అంతా చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. ద్రోణ కర్ణ శల్య దుర్యోధనులుఁ గృప । బాహ్లికులును జముఁడు వట్టికొన్న**
**వాని నైనఁ గావ వలఁతురు వలచిన । నొల్లకున్న నెట్టు లొకొ యెఱుంగ.' 290**

**ప్రతిపదార్థం:** ద్రోణ, కర్ణ, శల్య, దుర్యోధనులున్= ద్రోణుడు, కర్ణుడు, శల్యుడు, దుర్యోధనులునూ; కృప+బాహ్లికులునున్= కృపుడూ, బాహ్లికుడున్నూ; జముఁడు, పట్టికొన్న వానిన్+ఐనన్= మృత్యువుకు చిక్కినవాడు అయినప్పటికీ; వలచినన్= కోరితే; కావన్+వలతురు= రక్షించటానికి ఇష్టపడతారు; ఒల్లకున్నన్= ఇష్టపడక పోతే; ఎట్టులు+ఒకొ!= ఎట్లో!; ఎఱుంగన్= తెలియను.

**తాత్పర్యం:** ద్రోణుడూ, కర్ణుడూ, శల్యుడూ, దుర్యోధనుడూ, కృపుడూ, బాహ్లికుడూ - వీరందరున్నూ అనుకొంటే మృత్యువుకు లోనైనవాడినైనా రక్షించటానికి సర్వసమర్థులు. కాని, అట్లా అనుకోకపోతే మరి ఏ మౌతుందో తెలిసికొనలేకుండా ఉన్నాను.'

**విశేషం:** సైంధవుడికి భయంతోపాటు సందేహంకూడా బాగా కమ్ముకొనేసింది. ద్రోణాదులు ఇష్టపడితే మృత్యువునుండైనా కాపాడగలిగే సమర్థులు. కాని, ఇష్టం లేకపోతే ఏ విధమో, అదే తెలియటంలేదు అంటున్నాడు. వలతురు అనే క్రియాపదం 'కామిస్తారు, కోరుతారు ఇష్టపడతారు' అనే అర్థాలలో వాడబడింది. వాళ్ళకు అక్కర అనుకుంటే ఎంతటి పనికైనా సంసిద్ధులే కానీ నా విషయం ఏ విధం? అని సంశయగ్రస్త మనస్తత్వంలో మరీ పిరికివాడై పలాయనం చిత్తగించటానికి సర్వసన్నద్ధంగా ఉన్నాడు.

**వ. అని వెండియు. 291**

**తాత్పర్యం:** అని మరియు.

**క. 'పెదవులు దడుపుచుఁ గాళ్ళున్ । గుదివడ వడఁకుచు, మనంబు గొందలపడఁగా**
**నిది 'యేటి మాట లాడెదఁ? । దుదిఁ బార్థుఁడు గానకుండఁ దొలఁగగ వలయున్. 292**

**ప్రతిపదార్థం:** పెదవులు+తడుపుచున్= పెదవులు ఎండిపోగా తడపుకొంటూ; కాళ్ళున్+గుదివడన్= కాళ్ళున్నూ కట్టువడగా; వడకుచున్= కంపిస్తూ; మనంబు= మనస్సు; కొందల పడన్= కలత చెందగా; ఇది+ఏటి, మాటలు+ఆడెదన్= ఇది ఎందుకు ఇట్లా మాటాడుతూ ఉన్నాను; తుదిన్= చివరకు; పార్థుడు కానకుండన్= అర్జునుడు చూడకుండా; తొలఁగనవలయున్= తొలగిపోవాలి.

**తాత్పర్యం:** పెదవులు ఎండిపోగా తడుపుకొంటూ, కాళ్ళు కట్టువడగా వణకుతూ, మనస్సు మరీ కలత చెందగా నే 'నెందుకిట్లా మాట్లాడుతూ ఉన్నాను? చివరకు పార్థుడికి కనిపించకుండా తొలగిపోవటమే శరణ్యం' అని అనుకొన్నాడు.

**విశేషం:** భయమూ, సందేహమూ, తనకు రక్షణ దొరకదనే స్థిరనిశ్చయం ఏర్పడ్డప్పుడు, ఆసన్నమవుతున్న చావును తప్పించుకొనటానికి సైంధవుడికి చివరకు ఒకే ఒక ఉపాయం తట్టింది. అదే అర్జునుడికి కనిపించకుండా ఎక్కడికైనా వెళ్ళి దాగుకొనటం. ఇక్కడ శారీరకంగా అతనిలో కలిగే మార్పులు నోరెండిపోవటం, కాళ్ళు క్రుంగిపోవటం. గుదివడన్= కాళ్ళు వెనుదీయటం; తగ్గటం, క్రుంగటం అనే అర్థాలున్నాయి. 'గుదివడన్' అనే పదానికి వణకటం అని ఉన్నది. రెండో అర్థాన్ని గ్రహిస్తే పునరుక్తి అవుతుంది. అందువలన క్రుంగు అనే అర్థాన్నే గ్రహించటం స్వారస్యం. గురివడు= కట్టుపడు - శబ్దరత్నాకరం.

**వ. మీయందఱచేత ననుజ్ఞాతుండనకదా! పోయివచ్చెద' ననవుడు నిజకార్యధురంధరుండగు నక్కురుధరణీవరుం డతని కిట్లనియె. 293**

**ప్రతిపదార్థం:** మీ+అందఱచేతన్= కొలువులో ఉండే ప్రముఖులైన మీ అందరిచేత; అనుజ్ఞాతుండను+అ+కదా!= అనుమతిని పొందినవాడినే కదా!; పోయివచ్చెదన్= పోయివస్తాను; అనవుడున్= అని అనిన వెంటనే; నిజ, కార్య, ధురంధరుండు+అగు= తన, పనియొక్క భారాన్ని భరించినవాడైన; ఆ+కురుధరణీవరుండు= ఆ దుర్యోధనుడు; అతనికిన్= ఆ సైంధవుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** మీ అందరిచేత అనుమతి పొందినట్లే కదా! పోయివస్తాను' - అని అనగా తన కార్యాన్ని సాధించటంలో నిపుణుడైన దుర్యోధనుడు అతడితో ఇట్లా అన్నాడు.

**మ. 'ముని నీ వెన్నితి విక్రమాఢ్యు లని మమ్ముం గొందఱన్; ద్రౌణి పెం**
**పును, హార్దిక్యుబలంబు, సౌబలుని యేపుం జేవయున్, సోమద**
**త్తుని ధైర్యంబును శౌర్యమున్, శలు మహా దోర్దర్పముం గూడ నె**
**న్నిన నీ కెట్లగుఁ జూడు మిట్టి మగలు న్వేయేల ని న్నిత్తురే? 294**

**ప్రతిపదార్థం:** నీవు; విక్రమ, బల+ఆఢ్యులు+అని= పరాక్రమమూ, శక్తి కలిగినవాళ్ళు అని; మమ్మున్+కొందఱున్= దుర్యోధనాదులైన మమ్మల్ని కొందరిని; ద్రౌణి పెంపును= అశ్వత్థామ ఔద్ధత్యాన్ని; హార్దిక్యు బలంబున్= కృతవర్మ శక్తినీ; సౌబలుని+ఏపున్= శకుని గర్వాన్ని; చేవయున్= బలాన్ని; సోమదత్తుని, ధైర్యంబును, శౌర్యమున్= సోమదత్తుడి ధీరతనూ శూరతనూ; శలు= శల్యుడి యొక్క; మహా+దోస్+దర్పమున్= గొప్ప బాహుగర్వాన్ని; కూడన్= కూడా (సయితం); మును= పూర్వం; ఎన్నితి(వి)= గణించావు; ఎన్నిన నీకున్= అట్లా గణించిన (లెక్కించిన) నీకు; ఎట్లు+అగున్+చూడుము= ఎట్లా అవుతుందో చూడుము; వేయి+ఏల?= పలుమాటలు ఎందుకు?; ఇట్టి+మగలున్= ఇటువంటి శూరులు; నిన్ను+ఇత్తురే?= నిన్ను అప్పజెప్పుతారా?

**తాత్పర్యం:** 'నీవు పూర్వం మమ్మల్ని కొందరిని గొప్ప బలపరాక్రమ సంపన్నులు అని గణించావు. అందులో అశ్వత్థామ ఉద్ధతినీ, కృతవర్మ బలాన్నీ, శకుని గర్వాన్నీ బలాన్నీ, సోమదత్తుడి ధీరతనూ శూరత్వాన్నీ, శలు బాహుబల గర్వాన్నీ లెక్కించావు. అట్లా నీవు లెక్కించిన ఆయా శూరుల వలన నీకు ఏమి జరుగుతుందో చూస్తూ ఉండుము. అంత గొప్ప వీరులు నిన్ను అర్జునుడికి అప్పగిస్తారా!

**విశేషం:** దుర్యోధను డిచ్చిన హామీ ఒక కొత్త తీరులో ఉన్నది. ఇంతకు ముందు నీవు ఒక్కొక్కరి శక్తిసామర్థ్యాలను తెలిపి ఉన్నావు. కదా! వారందరూ నీవు గణించిన బలపరాక్రమాలనూ, బాహుబలదర్పాలనూ, ఏ విధంగా ప్రకటిస్తారో చూస్తూ ఉండుము. నిన్ను విడిచి వాళ్ళెక్కడకు పోతారు? అని అన్నాడు. ఇది ఔద్ధత్యంలో భుజబలదర్పంతో గంభీరంగా చెప్పిన సందర్భం కాబట్టి తిక్కన ఇక్కడ మత్తేభ విక్రీడిత వృత్తాన్ని ప్రయోగించాడు.

**క. నమ్ముము, వెఱవకు; మేనును । దమ్ములునుం గోట నీకుఁ దాత్పర్యముమై**
**నిమ్మేటి మగలు సూరెల । నెమ్మి నిలువ నింద్రుఁ డైన నీ కెదురగునే?' 295**

**ప్రతిపదార్థం:** నమ్ముము= మమ్ములను విశ్వసించుము; వెఱవకుము= భయపడకుము; ఏనునున్= దుర్యోధనుడైన నేనూ; తమ్ములునున్= నా తమ్ముళ్ళునూ; నీకున్= నీకు; కోట= దుర్గం వంటి వాళ్ళు; ఈ+మేటిమగలు= ఈ గొప్ప శూరులు; తాత్పర్యముమైన్= తత్పరతతో నీ రక్షణలోనే ఆసక్తితో; నెమ్మిన్= ప్రీతితో; సూరెలన్= ప్రక్కభాగాలలో, పార్శ్వంగా; నిలువన్= ఉండగా; నీకున్= నీకు; ఇంద్రుఁడు+ఐనన్= దేవేంద్రుడైనా; ఎదురు+అగునే?= ఎదురౌతాడా?

**తాత్పర్యం:** మమ్మల్ని నమ్ముము. భయపడవద్దు. నేనూ నా తమ్ముళ్ళూ నీకు కోటవలె ఉంటాము. ఇక ఈ మన శూరులంతా ని న్నెంతో జాగ్రత్తగా, శ్రద్ధతో, ప్రీతిపూర్వకంగా ప్రక్కభాగాలలో నిలిచి సహకరిస్తారు. ఆ దేవేంద్రుడైనా నీకు ఎదురు రాలేడు.'

**విశేషం:** 'నిన్నిత్తురే' అని అంతకు ముందు చెప్పిన దుర్యోధనుడు ఈ పద్యంలో 'భయపడకు మమ్మల్ని నమ్ము' అని గట్టిగా హామీ ఇచ్చాడు. కోటవలె మేము ఉంటాం అని అన్నట్లుగానే దుర్యోధనుడు ఇతరులు ప్రవేశించటానికి, సైంధవుడిని కనిపట్టటానికి వీలుకాని విధంగా ద్రోణాచార్యుల చేత వ్యూహం ఏర్పాటు చేయించాడు. కోట అనే మాటను అక్షరాలా చెప్పినట్లుగానే ఆచరించాడు. మాట ఇస్తే తనను నమ్మిన వాళ్ళకు ప్రాణాల్ని కూడా ధారపోసే మనస్తత్వం దుర్యోధనుడిది. కోటవలె నిన్ను కాపాడితే ఆ అర్జునుడు కాదు వాళ్ళ బాబు కూడా ని న్నేమీ చేయలేడనటం ఎంతో సహజంగా ఉన్నది.

**వ. అని చుట్టనున్న రాజులం జూపిన నూఱడిల్లి, యంత నిలువక నీ కొడుకుం దోడ్కొని ద్రోణుని కడకుం జని జయద్రథుండు దనకు నర్జునునకు ధనుర్విద్యా విభవంబు నందలి వాసి యెట్టి? దని యడిగిన, నతండు 'నీకు నతనికి నాచార్యకంబు సమప్రకారంబ; యవ్వీరుండు వివిధ శ్రమంబుల యలజడి కోర్చి యలఘు ప్రయోగంబులు పెక్కులు సాధించుటం జేసి నీకంటె నధికుండై యుండు; నది యట్లుండె; నేను గలుగ నీ వా సవ్యసాచికి వెఱవ వలదు; మద్బాణంబుల మఱువున నున్న నిన్ను దేవతలకుం దేఱిచూడవచ్చునే? వివ్వచ్చునకుం బ్రవేశింపరాని బంధురవ్యూహంబు పన్నించెదఁ; గులధర్మంబు శిథిలంబు గాకుండ సమరంబు సేయు'మని చెప్పి వెండియు. 296**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; చుట్టన్+ఉన్న+రాజులన్= సమీప ప్రదేశాలలో లేదా నలు ప్రక్కల ఉండే రాజులను; చూపినన్= చూపించి నంతనే; ఊఱడిల్లి= ఉపశమించి (స్వస్థత-కుదురుపాటు చెంది); అంతన్= అంతటితో; నిలువక= ఆగక; నీ కొడుకున్= నీ కుమారుడైన దుర్యోధనుడిని; తోడ్కొని= తీసికొని; ద్రోణుని+కడకున్= ద్రోణాచార్యుల దగ్గరకు; చని= పోయి; జయద్రథుండు= సైంధవుడు; తనకున్+అర్జుననకున్= తనకూ, ఆ అర్జునుడికీ; ధనుః+విద్యా, విభవంబు+అందలి, వాసి= విలువిద్యయొక్క నేర్పులోని అంతరం (భేదం); ఎట్టిది+అని+అడిగినన్= ఎటువంటిది అని అడుగగా; అతండు= ఆ ద్రోణాచార్యుడు; నీకున్+అతనికిన్= నీకూ, అతనికీ; ఆచార్యకంబు= నేర్పటం అనగా ఉపాధ్యాయత్వం; సమప్రకారంబు+అ= సమానమే (సమానమైన పద్ధతి కలదియే); ఆ+వీరుండు= ఆ అర్జునుడు; వివిధ శ్రమంబుల+అలజడికిన్= పలు విధాల, పరిశ్రమల అలసటకు; ఓర్చి= సహించి; అలఘు ప్రయోగంబులు= గొప్పప్రయోగాలు; పెక్కులు= అనేకాలు; సాధించుటన్+చేసి= సాధించటం చేత; నీకంటెన్+అధికుండు+ఐ+ఉండున్= నీకంటె గొప్పవాడై ఉంటాడు (ఉన్నాడు); అది+అట్లు+ఉండెన్= దానిని అట్లా ఉండనీ; నేను కలుగన్= నేను ఉండగా; నీవు; ఆ+సవ్యసాచికిన్= ఆ అర్జునుడికి; వెఱవవలదు= భయపడవద్దు; మత్+బాణంబుల, మఱువునన్+ఉన్న, నిన్నున్= నా బాణాల మరుగులో ఉండే నిన్ను; దేవతలకున్= దేవతలకు కూడా; తేఱి చూడవచ్చున్+ఏ?= చూడటానికి వీలౌతుందా?; వివ్వచ్చునకున్= అర్జునుడికి; ప్రవేశింపరాని= చొచ్చుకొని రావటానికి వీలుకాని; బంధుర వ్యూహంబున్= గొప్ప వ్యూహాన్ని; పన్నించెదన్= ఏర్పాటు చేయిస్తాను; కులధర్మంబు= నీవర్ణ ధర్మం (క్షత్రియుడవుగా నీవు చేయాల్సిన కర్తవ్యం); శిథిలంబు+కాకుండన్= సడలిపోకుండా; నశించకుండా ఉండేటట్లు; సమరంబు+చేయుము= యుద్ధం చేయుము; అని= ఆ విధంగా; చెప్పి= తెలిపి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని తనచుట్టూ ఉన్న రాజులను చూపించాడు. సైంధవుడు ఊరడిల్లాడు. అయినా అంతటితో ఆగక దుర్యోధనుడిని వెంటబెట్టుకొని ద్రోణుడివద్దకు వెళ్ళి, తనకూ అర్జునుడికీ ధనుర్విద్యా వైభవంలో ఉన్న తేడాను తెలుపుమని ఆయనను కోరాడు. 'నీకూ, అర్జునుడికీ ఆచార్యకం ఒకటే, కాని, అర్జునుడు వివిధ పరిశ్రమలకు ఓర్చి గొప్ప గొప్ప ప్రయోగాలు అనేకం సాధించటం చేత నీకంటె అధికుడు' అని ద్రోణుడు చెప్పాడు. అంతేగాక 'నేనుండగా నీవు ఆ సవ్యసాచికి భయపడవద్దు. నా బాణాల రక్షణలో ఉన్న నిన్ను దేవతలకు కూడా తేరిచూడటానికి వీలుకాదు. అర్జునుడు ప్రవేశించటానికి వీలులేని గట్టి సేనా వ్యూహాన్ని పన్నుతాను. నీవు మాత్రం క్షత్రియధర్మం చెడకుండా యుద్ధం చేయుము' అని అన్నాడు ఇంకా.

**క. శ్రుతు లభ్యసించి తతుల । క్రతువులు సేసితి కులంబు రక్షించితి వీ**
**వితరుల క్రియ మృత్యుభయా । న్వితుఁడవు గాఁ దగునె మేదినీవర! యింకన్. 297**

**ప్రతిపదార్థం:** మేదినీవర!= రాజా! (సైంధవా! అని సంబోధన); ఈవు= నీవు; శ్రుతులు+అభ్యసించితి(వి)= వేదాలు వల్లె వేశావు; అతుల, క్రతువులు+చేసితి(వి)= సాటిలేని యజ్ఞాలు కావించావు; కులంబు, రక్షించితివి= వంశాన్ని కాపాడావు; ఇతరుల

క్రియన్= సర్వసామాన్యులైన తక్కినవాళ్ళవలె; మృత్యుభయ+అన్వితుఁడవు= చావువలన భీతి కలవాడవు; కాన్+తగునే?= కావడం న్యాయమా!

**తాత్పర్యం:** రాజా! సైంధవా! నీవు వేదాలు వల్లెవేశావు. సాటి లేని యజ్ఞాలు చేశావు. కులాన్ని కాపాడావు. సర్వసామాన్య లైన ఇతరుల మాదిరి చావంటే భీతి కలవాడవు కావటం ధర్మమా?

**విశేషం:** అంతకు ముందు వచనంలో 'కులధర్మంబు శిథిలంబు కాకుండ సమరంబు సేయు'మని ద్రోణుడు తెలిపాడు. 'స్వధర్మే నిధనం శ్రేయః' అనే వాక్య సారాన్ని మరల తెలుపుతూ ఉన్నాడు. ఇక్కడ పేరు పెట్టి పిలవకుండా మేదినీవర! అని సంబోధించటం వలన నీ క్షత్రియత్వాన్ని నిలుపుమని హెచ్చరించినట్లయింది. 'కులంబు రక్షించితివి' అనే వాక్యం కూడా ఇప్పటి దాకా నీ వర్ణధర్మాన్ని కాపాడావు. ఇకపైన కూడా ఆ ధర్మాన్ని విడువవద్దు అన్నాడు. అజ్ఞానులైన పిరికివాళ్ళు చావంటే భయపడుతారు. కాని, నీవు అందరివలె కాదు. వేదాలు చదివావు. అంటే ఎంతో విజ్ఞానాన్ని ఆర్జించావు. పైగా సాటిలేనన్ని యజ్ఞాలు కూడా చేసి ఉన్నావు. ఇంత చదివీ, ఇన్ని చేసీ, ఇతరులవలె మృతికి వెరవటం తగదు అని అంటూ స్వధర్మాన్ని పాటించటమే కర్తవ్యం అని పదే పదే సైంధవుడికి ద్రోణుడు తెలిపాడు.

**క. యాదవ కౌరవ పాండవు । లాదిగఁ గల యఖిలనృపులు నవ్యయ వృత్తిన్**
**మేదిని నిలుతురె క్రమమునఁ । బోదురు గా కెల్ల జనులుఁ బోవు తెరువునన్. 298**

**ప్రతిపదార్థం:** యాదవ, కౌరవ, పాండవులు= యదువంశానికి సంబంధించిన వాళ్ళూ, కురువంశానికి చెందిన వాళ్ళూ, పాండురాజు కుమారులు; ఆదిగన్+కల= మొదలుగా ఉండే; అఖిల నృపులు= రాజులందరూ (సమస్త రాజులు); అవ్యయవృత్తిన్= నాశం లేని ప్రవర్తనతో; మేదినిన్= భూలోకంలో; నిలుతురు+ఎ?= స్థిరంగా ఉంటారా?; ఎల్లజనులు, పోవు, తెరువునన్= అందరూ పోయేదారిలో; క్రమమునన్= వరుసగా; పోదురు కాక= పోతారు కదా! (అనగా ఎటువంటివారికినీ ఈ భూమిపైన నిలకడ లేదు; యాదవాదులందరున్నూ సామాన్యులవలెనే క్రమంగా మరణిస్తారు అని భావం.)

**తాత్పర్యం:** యాదవులు, కౌరవులు, పాండుకుమారులూ మొదలుగా ఉండే సమస్త రాజులున్నూ వినాశంలేని ప్రవర్తనతో భూలోకంలోనే స్థిరంగా ఉంటారా? అందరూ పోయే దారిలోనే క్రమంగా వారందరూ పోతారు.

**విశేషం:** 'మృత్యువుకు భయపడటం క్షత్రియుడవైన నీకు తగదు' అని పూర్వపద్యంలో చెప్పి, ప్రస్తుత పద్యంలో ఎవ్వరూ శాశ్వతంగా ఈ లోకంలోనే ఉండిపోరు. కాలక్రమంగా అందరూ కాలధర్మాన్ని పొందేవాళ్ళే, మృత్యువు ఎవరికైనా అనివార్యం. దాన్ని గురించి చింతించటం అవివేకం. మన ధర్మాన్ని మనం తప్పక నిర్వర్తించి తీరాలి - అని లోకసహజమైన రీతిలో ద్రోణుడు సైంధవుడి మృత్యుభయాన్ని నివారించాడు. మృత్యువు ఎక్కడకు పోయినా, ఎప్పుడైనా తప్పకుండా సమయం ప్రకారం వచ్చి తీరుతుంది అని, ఎవరికైనా మృత్యువు ఖాయం అని నిర్ధారణ చేశాడు. ఇంతకు ముందు ఎవ్వరూ ఏర్పాటుచేయని విధంగా గొప్ప వ్యూహాన్ని నీ ప్రాణరక్షణకు సిద్ధం చేస్తాను. భయపడవద్దని పూర్తి హామీ ఇస్తూ కూడా మృత్యువును తప్పించుకొనలేము అనే శాశ్వత సత్యాన్ని చెప్పి ద్రోణుడు అతడిని ఊరటపరచాడు.

**క. తపములు దానంబులుఁ జే । సి పడయు లోకంబు లెల్లఁ జేయలఁతులు భూ**
**మిపులకు సంగరవిద్యా । నిపుణతఁ దలఁ కుడిగి పోర నేర్చినఁ జాలున్.' 299**

**ప్రతిపదార్థం:** సంగరవిద్యానిపుణతన్= యుద్ధవిద్యలోని నేర్పరితనం చేత; తలఁకు+ఉడిగి= బెదరు వదలిపెట్టి; పోరన్+నేర్చిన= పోరాడటానికి నేర్చితే; చాలున్= చాలును; భూమిపులకున్= రాజులకు; తపములున్= తపస్సులున్నూ; దానంబులున్= దానాలున్నూ; చేసి= కావించి; పడయు+లోకంబులు+ఎల్లన్= పొందే ఉత్తమ లోకాలు అన్నీ; చే+అలఁతులు= చేతికి అందుబాటులో ఉండేవే.

**తాత్పర్యం:** యుద్ధవిద్యలో నేర్పరితనంతో, బెదరు విడిచిపెట్టి పోరాడటానికి సర్వసమర్థులై సన్నద్ధంగా ఉండే రాజులకు తపస్సులూ, దానాలు చేసి పొందే ఉత్తమ లోకాలన్నీ (కరతలామలకాలే) చేతికి అందుబాటులో లోబడి ఉండేవే.'

**విశేషం:** ప్రస్తుత పద్యంలో మరణం తరువాత ఉత్తమ లోకప్రాప్తిని గురించి వివరించాడు. ద్రోణుడు ఒకవైపున ధైర్యం చెబుతూనే మరోవైపు పరలోకప్రాప్తిని గురించి వివరిస్తున్నాడు. ఇటువంటి మాటలు ఇంకా భయాన్ని రేకెత్తించవచ్చును అని మనకు అనిపిస్తుంది. అతడు కావాలని పనిగట్టుకొని ధర్మాలు వల్లించటంలేదు. అప్రయత్నంగా అతడి నుండి ఆ మాటలు వస్తూ ఉన్నాయి. మృత్యుభీతిని తప్పించాలంటే ఆ మృత్యువు యొక్క స్వాభావికమైన ధర్మాన్నీ, తదనంతర లోకప్రాప్తినీ తెలపటం సముచితం. అటువంటి ఉపదేశం అంతర్ముఖంగా ఒక బలిష్ఠమైన నిశ్చయాన్ని ప్రతిష్ఠింపజేస్తుంది. వీరోచితంగా పోరాడే శక్తిసామర్థ్యాలను కలిగిస్తుంది. ఈ పద్యంలో 'చేయలఁతులు' అనే అచ్చ తెలుగు పదబంధాన్ని తిక్కన ప్రయోగించాడు. చే+అలఁతులు అని దీని విభజన. ఇందులో అలఁతి అనే శబ్దానికి అల్పమూ, తేలిక, సూక్ష్మము, చిన్నది అనే అర్థాలున్నాయి. అంటే చేతిలో తేలిగ్గా ఇమిడి (లోబడి) పోగలిగే సూక్ష్మమైన లేక చిన్నదైన వస్తువు వంటిది అని గ్రహించవలసి ఉన్నది.

**క. అని యూఱడిల్లఁ బలికిన । విని యతఁడు గలంకు దేఱి, విభుఁడుం దానుం**
**జని సంగ్రామోత్సాహం । బునఁ బొదలిరి తూర్యఘోషములు దివి ముట్టన్. 300**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; ఊఱడిల్లన్+పలికినన్= ఉపశమనం కలిగేటట్లు మాటాడగా; అతఁడు= సైంధవుడు; కలంకు తేఱి= కలతనుంచి తేరుకొని అనగా కలత విడిచి; విభుఁడున్+తానున్= దుర్యోధనుడున్నూ, తానూ; చని= పోయి; తూర్యఘోషములు= వాద్యాల మ్రోతలు; దివిముట్టన్= ఆకాశాన్ని తాకగా; సంగ్రామ+ఉత్సాహంబునన్= యుద్ధాన్ని గూర్చిన ప్రయత్నంతో; పొదలిరి= ప్రకాశించారు (ఒప్పారారు).

**తాత్పర్యం:** ఆ విధంగా ద్రోణుడు సైంధవుడిని ఊరడించగా అతడు విని, కలత నుండి తేరుకొని, వాద్యాల మ్రోతలు మిన్నుముట్టుతూ ఉండగా యుద్ధప్రయత్నంతో దుర్యోధనుడూ తానూ మిక్కిలి ప్రకాశించారు.

**విశేషం:** ద్రోణుని ఊరడింపు మాటలు సైంధవుడిని కలత నుండి తేర్చడమే కాకుండా దుర్యోధన సైంధవులను ఇరువురునీ రణోత్సాహానికి పురికొల్పాయి. చింత తొలగి దాని స్థానే ఉత్సాహం కలిగినప్పుడు, ఆ ఉత్సాహాన్ని ద్విగుణీకృతం చేసే వాద్యాల చప్పుడు విన్నప్పుడు ఒక కొత్త శోభ, అంతకు ముందు లేని ఉబ్బు, ప్రవర్ధమానమైన గర్వమై పెరిగి ప్రకాశిస్తూ వ్యాపిస్తాయి. 'పొదలిరి' అనే క్రియా పదంలో ఆ ఇరువురూ ఎట్లా ఒప్పారినారో తెలుపబడింది.

**వ. సర్వసైన్యంబులును దైన్యంబు వాసి కయ్యంబుకడంక నుల్లసిల్ల సైనికోత్తముల సింహనాదంబులు సెలంగె; నిత్తెఱంగున భవత్తనయు శిబిరంబు సముద్యమ సుముఖం బయ్యె; నంత నక్కడ పాండవాగ్రజుండు పాంచాలమాత్స్య పాండ్య యాదవ కేకయాది రాజలోకంబు శోకంబు దగుమాటల మలుఁగం జేసి విడిదలకుం జన నియమించి, యనుజుల నచ్యుతునిం బెట్టికొనియున్న యెడ నగ్గోవిందుండు గాండీవి కిట్లనియె. 301**

**ప్రతిపదార్థం:** సర్వసైన్యంబులును= అన్ని సేనలున్నూ; దైన్యంబు+పాసి= దీనత్వాన్ని విడిచి; కయ్యంబు+కడంకన్= యుద్ధంయొక్క ప్రయత్నంతో; ఉల్లసిల్లన్= సంతోషించగా; సైనిక+ఉత్తములు= సైనిక శ్రేష్ఠుల అనగా యోధవీరుల; సింహనాదంబులు+చెలంగెన్= గర్జనలవంటి అరుపులు ఒప్పాయి; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; భవత్+తనయు శిబిరంబు= నీ కుమారుడి సైన్యం విడిదిచేసిన చోటు; సముద్యమ, సుముఖంబు+అయ్యెన్= మిక్కిలి ప్రయత్నంతో ఎదురుముఖం (అభిముఖంగా) కలిగిందిగా అయింది;అంతన్=

పిమ్మట(ఆ సమయంలో); అక్కడన్= పాండవ శిబిరం ఉన్న చోట; పాండవ+అగ్రజుండు= పాండవులలో పెద్దవాడైన ధర్మజుడు; పాంచాల, మాత్స్య, పాండ్య, యాదవ, కేకయ+ఆది, రాజలోకంబు= ద్రుపదుడు, విరటుడు, పాండ్యరాజు, యాదవ ప్రముఖులు, కేకయదేశపు రాజు మొదలైన రాజుల సమూహంయొక్క; శోకంబున్= దుఃఖాన్ని; తగుమాటలన్= ఉచితాలైన మాటలతో; మలుఁగన్+చేసి= ఉపశమించేటట్లు కావించి; విడిదలకున్= వారి వారి శిబిరాలకు; చనన్= పోయేటట్లు; నియమించి= ఆజ్ఞాపించి; అనుజులన్= తమ్ముళ్ళను; అచ్యుతునిన్= శ్రీకృష్ణుడిని; పెట్టికొని+ఉన్న+ఎడన్= ఉంచుకొని ఉండే సందర్భంలో; ఆ+గోవిందుండు= ఆ కృష్ణుడు; గాండీవికిన్= అర్జునుడికి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** సైన్యాలన్నీ దైన్యాన్ని వదలి యుద్ధోత్సాహంతో పొంగారగా, యుద్ధవీరులు సింహనాదాలు చేశారు. ఈ విధంగా దుర్యోధనుడి శిబిరం ఎదురుదాడికి సిద్ధమై ప్రకాశించింది. ఇక అక్కడ ధర్మరాజు పాంచాల, మాత్స్య, పాండ్య, యాదవ, కేకయాది రాజుల శోకాన్ని తగిన మాటలతో మాన్చి, వారిని విడిదులకు పంపాడు. తమ్ముళ్ళతో కృష్ణుడితో కూడి ఉన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. ‘నాతోఁ దలపోయక రో । షాతురతం బ్రతినవట్టి తవనీనాథ**
**వ్రాతంబు వినఁగ; నిట్టులు । చేతఃకున డెప్పరంబు సేసితి కంటే! 302**

**ప్రతిపదార్థం:** నాతోన్= నాతో కూడా; తలపోయక= ఆలోచించకుండా; రోష+ఆతురతన్= కోపం యొక్క వేగంతో; అవనీనాథ, వ్రాతంబు= రాజులయొక్క సమూహం; వినఁగన్= వినేటట్లుగా; ప్రతిన పట్టితి(వి)= ప్రతిజ్ఞ పట్టావు; ఇట్టులు= ఈ విధంగా; చేతఃకునన్= సాహసంతో; డెప్పరంబు+చేసితి(వి)= అశక్యమైన దాన్నిగా చేశావు; కంటే!= చూశావా!

**తాత్పర్యం:** నాతో ఆలోచించకుండానే కోపవేగంతో రాజులందరూ వినేటట్లు ఇట్లా సాహసంతో అశక్యమైన ప్రతిజ్ఞ చేశావు; చూచావా!

**విశేషం:** ‘అంత తీవ్ర ప్రతిజ్ఞ చేసేటప్పుడు ముందూ వెనకా ఆలోచించకుండా, కనీసం ఆప్తమిత్రుడనైన నాతో కూడా సంప్రదించకుండా, సమస్తరాజ సమూహ సమక్షంలో అందరూ వినేటట్లు ఇంతసాహసానికి ఒడిగట్టావు. ఇది నిజంగా అశక్యమైనది’ అని కృష్ణుడు అన్నాడు. అఘటనఘటనా సమర్థుడైన కృష్ణుడికే అర్జునుడి ప్రతిజ్ఞ ఆశ్చర్యాన్ని కలిగించింది. డెప్పరము అనే పదాన్ని ఈ సందర్భంలో వివిధార్థాలు స్ఫురించేటట్లు తిక్కన ఎంతో అర్థవంతంగా ప్రయోగించాడు. ‘డెప్పరము’ అనే పదానికి, ఆపద, అశక్యం, అధికమైనది, ఆపద కలిగించేది, ఆశ్చర్యాన్ని కలిగించేది - అనే అర్థా లున్నాయి. ఆ అర్థాలన్నీ ఈ సందర్భంలో సరిపోతాయి. సాహసం అనే అర్థంలో చేతఃకు అను అచ్చ తెనుగు పదం ఎంతో అర్థవంతంగా ఉన్నది. ఎంత బరువైన భావాన్నయినా అచ్చ తెనుగులో అతిసులభంగా అవలీలగా, ప్రస్ఫుటం చేయవచ్చునని ఇటువంటి పదాల కూర్పుల వలన విదితమౌతూ ఉన్నది. ‘కామక్రోధోద్భవమైన వేగాన్ని అరికట్టిన వాడే యోగ్యుడు, సుఖి అయిన నరుడు’ అని గీతోపదేశ సందర్భంలో తెలిపిన భావంయొక్క స్ఫురణ ‘రోషాతుర’ అనే ప్రయోగంలో అభివ్యక్తమైంది.

**క. అస్తమయమునకు మును రిపు । మస్తకముం దునుమవలయు; మన కిది సాలన్**
**దుస్తరమును నగు; నస్త । వ్యస్తం బగునేని నాకు వగపు గదిరెడున్. 303**

**ప్రతిపదార్థం:** అస్తమయమునకున్+మును= సాయంకాలానికి (అంటే ప్రొద్దు గ్రుంకకముందే) మునుపే; రిపు= శత్రువుయొక్క; మస్తకమున్= తలను; తునుమవలయున్= నరికివేయాలి; ఇది= ఈ పని; మనకున్= మనకు; చాలన్= మిక్కిలి; దుస్తరమునున్= అసాధ్యమే; అగున్= అవుతుంది; అస్తవ్యస్తము= వ్యత్యస్తం; అగున్+ఏని= అయితే; నాకున్= నాకు; వగపు+కదిరెడున్= చింత కలుగుతుంది.

**తాత్పర్యం:** పొద్దుగుంకే లోపల శత్రువు తల నరికివేయాలి. ఈ పని చాలా దుష్కరమే అవుతుంది. వ్యత్యస్తం అయిందా - నాకు చింత కలుగుతుంది.

**విశేషం:** సాయంకాలం లోపల తల నరికివేయాలి. ఇది అంత తేలికైన పనేమీ కాదు. చాలా దుష్కరమైనది. దీనికి వ్యతిరేకంగా జరిగితే మాత్రం నాకు మిగిలేది వగపే అని కృష్ణుడు అన్నాడు. ఇది చాలా పకడ్బందీగా ఒక పథకం ప్రకారం మహానిగూఢంగా ఎంతో చురుకుగా జరగవలసిన పని అని తెలుస్తూ ఉన్నది. ఏ కొంచెం పొరపొచ్చెం, తప్పిదమూ జరిగినా అది తనకు దుఃఖాన్నీ కీడునూ కలిగిస్తుందని, క్రీడిని బహుజాగరూకుడిగా ఉండవలసిందిగా కృష్ణుడు సూచిస్తూ ఉన్నాడు.

**వ.** **మన వేగుల వారు వచ్చిరి; వారు సెప్పిన తెఱంగు వినుము: 'నీవు ప్రతిజ్ఞ సేసినప్పుడు మ్రోసిన చిందంబులపెల్లునన్ బెదరి యవ్వీటివారు గవ్వడి కొడుకు చావునకుం గోపించి యిప్పుడ యెత్తి వచ్చు నని రథకరితురంగంబుల నాయితంబుసేయుచుండ, సైంధవుఁడు దనచారులచేత నీ యాడిన మాటలు విని, వెఱచఱచి కురురాజు గొలువున్న చోటికిఁ జని, సిగ్గఱి నిన్ను నగ్గించి, నీ ప్రతిన యెఱిఁగించి, యతం డలిగిన మీరు గావలే రని పలికి, తా నెందేనియుం బోయెద ననిన, నమ్మనుజపతి గురు కృతవర్మ కృప కర్ణ శల్యాశ్వత్థామ ప్రభృతులగు మేటి మగలం బేర్కొని 'వీరును నా తమ్ములును గలుగ నరునకు నిన్ను జుట్టనవ్రేలనుం జూపవచ్చునే' యని భయంబు వాపె; భారద్వాజుండును మహోత్సాహుండై దురవగాహ వ్యూహ విధానంబున జయద్రథుం జేరకుండ నిన్ను నిలువరించువాఁడయ్యె; అది యట్టిద; వా రొక్కొక్కరుండు గెలువరాని యట్టి జెట్టి జోదు; లందఱు నొక్కపనికిం దలకొని నిలిచిన గెలుచుట యశక్యంబు గాదె! ఇక్కార్యం బార్యు లగు నాప్తజనంబులం గూర్చికొని విచారింపవలయు' ననవుడు వివ్వచ్చుండు నవ్వుచు నిట్లనియె.** **304**

**ప్రతిపదార్థం:** మన, వేగులవారు= మన గూఢచారులు; వచ్చిరి= వచ్చారు; వారు= ఆ చారులు చెప్పిన; తెఱంగు= చెప్పిన విధం; వినుము; నీవు ప్రతిజ్ఞ చేసినప్పుడు= నీవు శపథం చేసిన సందర్భంలో; మ్రోసిన చిందంబుల పెల్లునన్= శబ్దించిన శంఖాల అతిశయంచేత; బెదరి= భయపడి; ఆ+వీటివారు= ఆ శిబిరంలోని వాళ్ళు; కవ్వడి= అర్జునుడు; కొడుకు చావునకున్= అభిమన్యుడి మరణానికి; కోపించి= కోపపడి; ఇప్పుడు+అ= ఈ క్షణమే; ఎత్తి వచ్చును+అని= దండెత్తి వస్తాడని; రథ, కరి, తురంగంబులన్= తేరులను, ఏనుగులను, గుఱ్ఱాలను; ఆయితంబు+చేయుచుండన్= సిద్ధం చేస్తూ ఉండగా; సైంధవుఁడు= జయద్రథుడు; తన చారులచేతన్= తన వేగులవాళ్ళ వలన; నీ, ఆడిన, మాటలు= నీవు పలికిన ప్రతిజ్ఞా వాక్యాలు; విని; వెఱచఱచి= భయపడి; కురురాజు= దుర్యోధనుడు; కొలువు+ఉన్న చోటికిన్= సభను తీర్చిన ప్రదేశానికి; చని= పోయి; సిగ్గు+అఱి= సిగ్గు విడిచి; నిన్నున్= నిన్ను; అగ్గించి= పొగడి; నీ ప్రతిన ఎఱిఁగించి= నీ శపథం తెలిపి; అతండు= అర్జునుడు; అలిగినన్= కోపించగా; మీరు కావలేరు= మీరు నన్ను కాపాడలేరు; అని పలికి= అని మాటాడి; తాను= ఆ సైంధవుడు; ఎందేనియున్+పోయెదన్+అనినన్= ఎక్కడికైనా వెళ్ళిపోతాను అని చెప్పగా; ఆ+మనుజపతి= ఆ దుర్యోధనుడు; గురు, కృతవర్మ, కృప, కర్ణ, శల్య+అశ్వత్థామ ప్రభృతులు+అగు= ద్రోణుడు, కృతవర్మ, కృపాచార్యులు, కర్ణుడు, శల్యుడు, అశ్వత్థామ మొదలైనవారగు; మేటిమగలన్= గొప్పశూరులను; పేర్కొని= పేర్లుపెట్టి ఉచ్చరించి; వీరును= ఈ పేర్కొన్న శూరులునూ; నా తమ్ములునున్= నా తమ్ముళ్ళునూ; కలుగన్= ఉండగా; నిన్నున్= నిన్ను; జుట్టనవ్రేలనున్= చూపుడు వ్రేలితో (తర్జనితో); చూపవచ్చునే?= చూపటానికి అవుతుందా?; అని; భయంబు+పాపెన్= అని భయాన్ని పోగొట్టాడు; భారద్వాజుండునున్= ద్రోణాచార్యుడున్నూ; మహా+ఉత్సాహుండు+ఐ= మిక్కిలి ఉత్సాహం (ప్రయత్నం) కలవాడై; దుర్+అవగాహ వ్యూహ విధానంబునన్= ప్రవేశించటానికి వీలుగాని మొగ్గరం యొక్క ఉపాయంచేత; జయద్రథున్= సైంధవుడిని; చేరకుండన్= సమీపించకుండా; నిన్నున్= నిన్ను; నిలువరించువాఁడు+అయ్యెన్= నిలుపు (ఆపు) లేదా ఎదుర్కొనేవాడు అయ్యాడు; అది+అట్టిది+అ= అది అటువంటిదే; వారు= ఆ కౌరవవీరులు; ఒక్కొక్కరుండు+అ= ఒక్కొక్కడున్నూ; గెలువరాని+అట్టి జెట్టిజోదులు= జయించటానికి వీలుకానటువంటి శూరులైన (శ్రేష్ఠులైన) యోధులు; అందఱున్= ఆ వీరులందరూ; ఒక్క పనికిన్=

ఒకే కార్యానికి; తలకొని= యత్నించి; నిలిచినన్= నిలబడితే; గెలుచుట= జయించటం; అశక్యంబు+కాదె!= అసాధ్యం అవుతుంది కదా!; ఈ+కార్యంబు= ఈపని; ఆర్యులు+అగు+ఆప్తజనంబులన్= పూజ్యులైన ప్రాణమిత్రులను; కూర్చికొని= ఒకటిగా సమావేశ పరచి; విచారింపన్ వలయున్= ఆలోచించాలి; అనవుడున్= అనిన అనంతరం; విచ్చుండు= అర్జునుడు; నవ్వుచున్= నవ్వుతూ; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** మన గూఢచారులు వచ్చారు, ఇట్లా చెప్పారు వినుము. 'నీవు ప్రతిజ్ఞ చేసినప్పుడు మ్రోగించిన శంఖనాదాల ఆర్భటికి బెదరిపోయి కౌరవపక్షంవారు, కొడుకు చావుకు కోపించి అర్జునుడు ఇప్పుడే యుద్ధానికి రావచ్చునని చతురంగబలాలను సిద్ధంచేయటం మొదలు పెట్టారు. సైంధవుడు తన గూఢచారుల వలన నీ ప్రతిజ్ఞ గురించి తెలిసికొని, భయపడి, దుర్యోధనుడు కొలువు తీర్చిన చోటికిపోయి, సిగ్గువదలి, నిన్ను కీర్తించి, నీ ప్రతిజ్ఞను తెలిపి, నీవు కోపిస్తే కాపాడగలిగినవారు వారిలో లేరని చెప్పి, తానెక్కడికైనా పారిపోతానని అన్నాడు. దుర్యోధనుడు, ద్రోణ, కృతవర్మ, కృప, కర్ణ, శల్యాశ్వత్థామాదులను పేర్కొని, వారూ, కౌరవ సోదరులూ ఉండగా అర్జునుడు అతడివైపు వేలెత్తి చూపలేడని భయం పోగొట్టాడు. ద్రోణాచార్యుడు కూడా ఉత్సాహాతిశయంతో అసాధ్యమైన వ్యూహాన్ని రచించి నీవు సైంధవుడిని సమీపించకుండ అడ్డగించటానికి సిద్ధమయ్యాడు. అది అట్లాగే జరుగుతుంది. కౌరవవీరులలో ఒక్కొక్కరు గెలువరాని జగజెట్టులు. వారందరూ కలిసి ఒక్కటిగా నిలిచి ఒకపని సాధించటానికి పూనుకొన్నప్పుడు వారిని గెలవటం అసాధ్యంకాదా? కాబట్టి ఆత్మీయులైన ఉత్తములతో ఆలోచించి మనకార్యాన్ని నిశ్చయించాలి' అనగానే అర్జునుడు నవ్వుతూ ఇట్లా అన్నాడు.

**అర్జునుఁడు కృష్ణునితోఁ దన ప్రతిజ్ఞావిషయంబులైన వాక్యంబులు సెప్పుట (సం. 7-53-31)**

**క. వారి నెఱుంగుదు నేనును; । వారలు న న్నెఱుఁగుదురు; భవత్సాహాయ్య**
**స్ఫార బలోద్ధతి గలుగఁగ । వారే తప్పింపఁ జాలువా రీపూన్కిన్? 305**

**ప్రతిపదార్థం:** నేనునున్= నేనున్నూ; వారిన్= ఆ కౌరవపక్షంలోని వాళ్ళను; ఎఱుంగుదున్= ఎరుగుదును; వారలున్= కౌరవపక్షం వాళ్ళున్నూ; నన్నున్= నన్ను; ఎఱుఁగుదురు= ఎరుగుదురు; భవత్+సాహాయ్య, స్ఫార, బల+ఉద్ధతి= నీయొక్క తోడ్పాటు అనే ఒప్పిదమైన బలగర్వం; కలుగఁగన్= ఉండగా; ఈ పూన్కిన్= ఈప్రయత్నాన్ని; తప్పింపన్+చాలువారు= భగ్నం కలిగించేవాళ్ళు; వారే?= వాళ్ళేనా?

**తాత్పర్యం:** నాకు వారు తెలుసు, వారికి నేను తెలుసు. నీ సహకారం అనే బలగర్వమే నాకు తోడుగా ఉంటే ఈ ప్రయత్నాన్ని తప్పించగలిగేవారు వారేనా? (ఈ ప్రయత్నాన్ని భంగపరచటానికి నీ సహాయం ఉన్నంతకాలమూ ఎవరివలనా వీలుకాదని భావం.)

**విశేషం**: శ్రీకృష్ణుడు అంతకుముందు 'అర్యులైన ఆప్తజనాన్ని సమకూర్చుకో - వారితో విచారించు' అన్నాడు. అర్జునుడికి శ్రీకృష్ణుడి కంటె ఆప్తుడైన వ్యక్తి ఎవ్వడున్నాడు? అతడే నిజంగా ఆర్యుడైన ఆప్త స్నేహితుడు. అసలు రహస్యం శ్రీకృష్ణుడి మాటలలోనే అర్థమయింది. అందుకే అర్జునుడు నవ్వుతూ నీయొక్క తోడ్పాటు అనే బలగర్వం నాకుంటే చాలు ఈ ప్రయత్నాన్ని మరెవ్వరు భంగపరిచే సమర్థులు కారు; ఎవ్వరూ అంతటి వాళ్ళు కౌరవపక్షంలో లేరు - అనే అర్జునుడి దృఢవిశ్వాసం ఇందులో పరోక్షంగా సూచితం.

**వ. ఏను జయద్రథుం జంపుటకుం దమకించి తఱుమునప్పడు నాకు నెవ్వరడ్డంబు సొచ్చి రేనియు. 306**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; జయద్రథున్= సైంధవుడిని; చంపుటకున్= సంహరించటానికి; తమకించి= తొందరపడి; తఱుమునప్పుడు= వెంబడించి, పరుగెత్తించేటప్పుడు; నాకున్= నాకు; ఎవ్వరు+అడ్డంబు+చొచ్చిరి+ఏనియున్= ఎవ్వరైనా అడ్డం (నివారించటానికై) ప్రవేశిస్తే.

**తాత్పర్యం:** నేను జయద్రథుడిని చంపటానికి తొందరగా వెంబడించి వేటాడుతుంటే ఎవరు నాకు అడ్డం వచ్చినా.

**మ.** **పటు నారాచ పరంపరా ప్రసర దర్పం బేర్పడం బేర్చి త**
**ద్భట సంఘంబును ఘోటక వ్రజము శుంభత్స్యందనౌఘంబు ను**
**ద్భట కుంభి ప్రకరంబునుం బొదివి విధ్వంసంబు గావించి నె**
**త్తుట జొత్తిల్లెడునట్లు సేయుదు సమిద్భూభాగ మత్యుగ్రతన్.** **307**

**ప్రతిపదార్థం:** పటు+నారాచ= తీవ్రములైన బాణాల; పరంపరాప్రసర= వరుసల వ్యాపనం యొక్క; దర్పంబు= గర్వం; ఏర్పడన్= కలిగేటట్లు (స్పష్టపడేటట్లు); పేర్చి= విజృంభించి; తత్+భట, సంఘంబును= ఆ కౌరవులయొక్క భటుల మొత్తాన్ని; ఘోటక+వ్రజమున్= గుర్రాల మొత్తాన్ని; శుంభత్+స్యందన+ఓఘంబున్= శోభిస్తూ ఉండే రథాల మొత్తాన్ని; ఉద్భట, కుంభి, ప్రకరంబునున్= గొప్ప యేనుగుల సమూహాన్ని; పొదివి= ఆక్రమించి (క్రమ్మి); విధ్వంసంబు కావించి= హతం చేసి; సమిత్+భూభాగము= రణరంగం; అతి+ఉగ్రతన్= మిక్కిలి ఘోరంగా; నెత్తుటన్= రక్తంతో; జొత్తిల్లెడు అట్లు= తడిసేటట్లు; చేయుదున్= చేస్తాను.

**తాత్పర్యం:** తీవ్రబాణ పరంపరలను ప్రయోగించే గర్వం అతిశయించేటట్లు విజృంభించి, భటులు, గుర్రాలు, రథాలు, ఏనుగులు - వీటి మొత్తాలను చుట్టుముట్టి మట్టుపెట్టి రణరంగాన్ని నెత్తుటితో తడిపి వేస్తాను.

**విశేషం:** ప్రస్తుత పద్యం మత్తేభవిక్రీడితం, ఇందులో ఉద్భట కుంభి ప్రకరంబు యొక్క ప్రసక్తి కూడా సందర్భవశాత్తూ ప్రకటితమైంది. ప్రతిజ్ఞా వాక్య విషయాలు చెప్పే అర్జునుడి గర్వాతిశయాన్ని ఈ పద్యం వివరిస్తూ ఉన్నది. అర్జునుడు చెప్పే పద్ధతిలోని ఉద్ధతి మత్తేభ విక్రీడిత వృత్తగతిలో ప్రతిఫలించింది.

**క.** **కౌరవ సైన్యంబులఁ గల । వీరుల యస్త్రములు నాదు వివిధాస్త్రగతి**
**క్రూర ప్రవాహముల కెదు । రే! రాజీవాక్ష! యాదరింపకు వారిన్.** **308**

**ప్రతిపదార్థం:** రాజీవాక్ష!= కృష్ణా!; కౌరవ సైన్యంబులన్= కౌరవసేనలలో; కల= ఉన్నట్టి; వీరుల అస్త్రములు= వీరుల బాణాలు; నాదు= నాయొక్క; వివిధ+అస్త్ర, గతి, క్రూర, ప్రవాహములకున్= రకరకాల అస్త్రాల పోకడలచేత నొప్పించే ప్రవృత్తులకు; ఎదురు+ఏ!= సాటియే!; వారిన్= ఆ కౌరవులను; ఆదరింపకు= లక్ష్యపెట్టకుము.

**తాత్పర్యం:** ఓ కృష్ణా! ఆ కౌరవ వీరుల అస్త్రాలు, నా యొక్క రకరకాల అస్త్రాల పోకడలతో నొప్పించే ప్రవృత్తులకు ఎదురు నిల్వగలవా? వాళ్ళను లక్ష్యపెట్టవద్దు.

**క.** **వెఱఁగుపడి కుంభభవుఁడుం । బెఱరథికులుఁ జూచుచుండ బీరము లావున్**
**మెఱయఁ జలము నెఱయఁగఁ దల । దఱిఁగెద సైంధవుని; నేల తలఁకెదు కృష్ణా!** **309**

**ప్రతిపదార్థం:** కృష్ణా!= కృష్ణా!; కుంభసంభవుఁడున్= ద్రోణాచార్యుడూ; పెఱరథికులున్= ఇతర వీరులూ; వెఱఁగుపడి= నిశ్చేష్టులై; చూచుచున్+ఉండన్= చూస్తూ ఉండగా; బీరమున్= శౌర్యమూ; లావున్= బలమూ; మెఱయన్= ప్రకాశించేటట్లు; చలము= మాత్సర్యం; నెఱయఁగన్= నిండేటట్లుగా; సైంధవుని తలన్= సైంధవుడి శిరస్సును; తఱిఁగెదన్= నరికివేస్తాను; ఏల?= ఎందుకు; తలఁకెదు?= భయపడతావు?

**తాత్పర్యం:** ఓ కృష్ణా! ఆ ద్రోణాచార్యుడు, తక్కిన వీరులు భయచకితులై చూస్తూ ఉండగా నా శౌర్యమూ, బలమూ, ప్రకాశించేటట్లు, మాత్సర్యం నిండుకొనేటట్లు ఆ సైంధవుడి తలను నరికివేస్తాను. ఎందుకు నీవు భయపడతావు?

**విశేషం:** ఈ కందపద్యంలోని ప్రాసస్థానాలలోని శకటరేఫల పరుషోచ్చారణ వెక్కసమైన కసితో కరకరమని సైంధవుడి తలను నరికే తీరును సూచిస్తూ ఉన్నది. ఒక విధమైన లయ పద్ధతిలో వాని తల నరికి నాట్యం చేయిస్తాను అన్నట్లు పద్యగతి సాగింది. ప్రతిజ్ఞా నిర్వహణలో ఇది ఎట్లా జరుగుతుందో అన్న సంకోచం శ్రీకృష్ణుడిని కొంత చలింపజేస్తూనే ఉన్నది. ఆప్తజన సహకారం వలన తప్పక తన ప్రతిజ్ఞ నెరవేరుతుంది అని అర్జునుడి నమ్మకం. ఇతడు నన్నే నమ్మినాడు. దుస్తరమైన ఈ కార్యాన్ని ఎట్లా ఫలింపజేయాలి? అనే సందేహమూ, సంతాపమూ కృష్ణుడిని చలింపజేస్తున్నాయి. అది గమనించి అర్జునుడు 'తలఁకెదు కృష్ణా!' అంటున్నాడు.

**క.** **కురుపతి బలముల యేలా, । చరాచరములైన భూతజాలము లెల్లం**
**దరతరమ యడ్డపడినం । దెరలిచి పడవైతు సింధుదేశాధీశున్.** **310**

**ప్రతిపదార్థం:** కురుపతి బలముల+ఏల?= దుర్యోధనుడి సేనలనే ఏల?; చర+అచర, భూతజాలములు+ఎల్లన్= జంగమ స్థావరాలైన జీవరాసులు అన్నీ; తరతరమ= పరంపరగా (వరుసపెట్టి) లేదా మిక్కిలిగా; అడ్డపడినన్= ఎదుర్కొన్నప్పటికీ; తెరలిచి= తొలగించి; సింధుదేశ+అధీశున్= సైంధవుడిని; పడవైతున్= చంపివేస్తాను.

**తాత్పర్యం:** ఒక్క కురుపతి సైన్యాలు ఏమిటి? సమస్త చరాచర ప్రాణికోటిమొత్తం వరుసపెట్టి ఎదుర్కొన్నా తొలగించి, సైంధవుడిని చంపిపడేస్తాను.

**ఆ.** **గురుని యలవుఁ జలము వెరవును గలఁచి నీ । యాన, గాండివంబు నాన, దివ్య**
**శరము లాన, యెల్లి సైంధవు తల యెల్ల । భంగిఁ దునిమివైతుఁ బగఱు దలఁక.** **311**

**ప్రతిపదార్థం:** పగఱు= శత్రువులు; తలఁకన్= భీతి చెందగా; గురుని= ద్రోణాచార్యుడి; అలవున్= బలాన్ని; చలమున్= మాత్సర్యాన్ని; వెరవును= ఉపాయాన్ని; కలఁచి= కలత నొందించి; నీ+ఆన= నీమీద ఒట్టు; గాండీవంబు+ఆన= నా గాండీవ ధనుస్సుమీద ఒట్టు; దివ్యశరములు+ఆన= దివ్యాస్త్రాల మీద ఒట్టు; ఎల్లభంగిన్= అన్ని విధాల చేత; ఎల్లి= రేపు; సైంధవుని తలన్= సైంధవుడి శిరస్సును; తునిమివైతున్= ఖండిస్తాను.

**తాత్పర్యం:** పగవారు భీతిచెందేటట్లుగా ద్రోణుడి బలాన్నీ మాత్సర్యాన్నీ ఉపాయాన్నీ కలచివేసి నీమీద ఒట్టు, గాండివంపైన ఒట్టు, దివ్యాస్త్రాలపై ఒట్టు ఏ విధంగానైనా సరే రేపు ఆ సైంధవుడి తలను ఖండించివేస్తాను.

**విశేషం:** సైన్యాధ్యక్షుడు ద్రోణుడు శౌర్యాన్నీ, మాత్సర్యాన్నీ, చాతుర్యాన్నీ ఎంత ప్రదర్శించినా వాటి నన్నిటినీ లెక్కచేయకుండా అతడికి కలత కలిగించేటట్లు చేయటం రేపటి యుద్ధంలోని ప్రధాన కర్తవ్యం. అటుపైన మొదటగా శ్రీకృష్ణుడిమీద ఒట్టు పెట్టుకున్నాడు. తాను పూర్ణంగా నమ్ముకున్న వ్యక్తిపైన ఒట్టుపెట్టి, పిమ్మట తన కీర్తికీ, స్ఫూర్తికీ మూలమైన గాండీవంపైన, చివరకు దివ్య బాణాలపైన ఒట్టు పెట్టుకొనటం ఈ పద్యంలోని విశేషం.

**చ.** **కనియెదు సైంధవుం గడచి క్రందుగ నాకు నెదుర్చు రాజులం**
**దునుమఁగ భూషణోత్కరముతోఁ బదహస్తశిరంబు లుర్విపైఁ**
**బెనఁగొని చారు భంగియును భీషణ రేఖయుఁ దాల్ప, నెత్తురున్**
**నెనడును గ్రోలి భూతములు నిక్కుచు నీల్గుచుఁ జొక్కుచుండఁగన్.** **312**

**ప్రతిపదార్థం:** సైంధవున్+కడచి= సైంధవుడిని దాటి (మీరి); క్రందుగన్= దట్టంగా; నాకున్+ఎదుర్చు రాజులన్= నన్ను ఎదిరించే రాజులను; తునుమఁగన్= చంపగా; భూషణ+ఉత్కరములతోన్= నగల మొత్తంతో; పద, హస్త, శిరంబులు= కాళ్ళూ, చేతులూ, తలలూ; ఉర్విపైన్= నేలపై; పెనఁగొని= ఒకదాని కొకటి పెనవేసికొని; చారుభంగియును= మనోహరమైన విధమూ; భీషణ రేఖయున్= భయంకరత్వమున్నూ; తాల్పన్= పొందగా; నెత్తురున్= రక్తమున్నూ; నెనడును= ఎముకలలోని (మూలుగు) గుజ్జు లేక కొవ్వున్నూ; క్రోలి= ఆస్వాదించి; భూతములు= పిశాచాలూ; నిక్కుచున్= ఉబ్బుతూ; నీల్గుచున్= నీల్గుతూ; చొక్కుచుండఁగన్= పారవశ్యాన్ని పొందుతూ ఉండగా; కనియెదు(వు)= చూడగలుగుతావు.

**తాత్పర్యం:** సైంధవుడిని దాటి న న్నెదిరించి వచ్చే రాజులను నేను చంపగా, వారి నగల మొత్తంతో కాళ్ళూ, చేతులూ, తలలూ పెనవేసికొని ఉండే మనోహరమూ, భయంకరమూ అయిన పద్ధతిలో నెత్తురు, ఎముకలలోని క్రొవ్వు త్రాగి నిక్కుతూ నీలుగుతూ పరవశత్వాన్ని పొందే పిశాచాల విన్యాసాలతో యుద్ధభూమిని చూడగలుగుతావు.

**విశేషం:** తిక్కన అక్కడక్కడా రణరంగం యొక్క బీభత్స దృశ్యాన్ని వర్ణిస్తూ కొన్ని కొన్ని సన్నివేశాలలో మనోహరత్వంలో భయంకరత్వమూ ఎట్లా మిళితమై ఉంటుందో తెలిపి ఉన్నాడు. ప్రస్తుత పద్యంలో కూడా అట్టి చారు భంగినీ, భీషణ రేఖనూ ప్రసక్తికి తెచ్చాడు. 'నిక్కుచు నీల్గుచు' వంటి రచనా విధానంలోని పస తిక్కననుండియే చేమకూరవంటి కవులు గ్రహించారని చెప్పవచ్చును.

**క. అవ్వలి సైనికు లడలఁగ । నవ్వుచు మనవార లార్వ నారాయణ! న**
**న్నెవ్వరు మార్కొన లేమికి । నొవ్వం గురురాజు నేఁ దునుముదును ద్రోహిన్. 313**

**ప్రతిపదార్థం:** నారాయణా!= శ్రీకృష్ణా!; అవ్వలి సైనికులు= శత్రు సైనికులు (ఆవైపు సేనలు); అడలఁగన్= దుఃఖించగా; మనవారలు= మన సైనికులు; నవ్వుచున్= నవ్వుతూ; ఆర్వన్= గర్జించగా; కురురాజు= దుర్యోధనుడు; నన్నున్= నన్ను; ఎవ్వరున్= ఎవరుకానీ; మార్కొనలేమికిన్= ఎదుర్కొనలేకపోవటానికి; నొవ్వన్= బాధపడగా; నేన్= నేను; ద్రోహిన్= ద్రోహం కలవాడైన సైంధవుడిని; తునుముదును= సంహరిస్తాను.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! అవతలివైపు సేనలు దుఃఖించగా, మనవాళ్ళు నవ్వుతూ సింహనాదాలు చేయగా, ఆ కురురాజు నన్నెవ్వరూ ఎదిరించలేకపోవటానికి వెతచెందగా, ద్రోహి అయిన ఆ సైంధవుడిని నేను సంహరిస్తాను.

**తే. సాధనము గాండివం బటె! సమరకర్త । యర్జునుం డటె! సారథి యబ్జనాభుఁ**
**డటె! మరల్పఁగ వచ్చునే యా రథంబు । హరునకైనను నెఱుఁగక యంటిగాక, 314**

**ప్రతిపదార్థం:** సాధనము= రణ పరికరమైన విల్లు; గాండివంబు+అటె!= గాండీవమంట!; సమరకర్త= యుద్ధం చేసేవాడు; అర్జునుండు+అటె!= అర్జునుడంట; సారథి= రథం తోలేవాడు; అబ్జనాభుఁడు+అటె!= శ్రీకృష్ణుడంట!; ఆ+రథంబున్= ఆ తేరును; హరునకున్+ఐనన్= శివుడికైనా; మరల్పఁగన్+వచ్చునే?= మళ్ళించటానికి సాధ్యమవుతుందా?; ఎఱుఁగక= తెలియక; అంటి+కాక= అంటివి.

**తాత్పర్యం:** యుద్ధ పరికరమా గాండీవం. యుద్ధం చేసేవాడా అర్జునుడు, అతడి రథాన్ని నడిపేవాడు సాక్షాత్తూ అబ్జనాభుడైన శ్రీకృష్ణుడు. ఆ రథాన్ని మళ్ళించటానికి శివుడికైనా సాధ్యమా! నీవు తెలియక అట్లా అన్నావు.

**విశేషం:** ఇందులో అర్జునుడి పరిపూర్ణ విశ్వాసం వ్యక్తమౌతూ ఉన్నది. గాండీవంపై ప్రగాఢమైన నమ్మకం. దానిని ధరించిన తనయందు పరిపూర్ణమైన ఆత్మవిశ్వాసం. తనకు తోడుగా ఉన్న శ్రీకృష్ణుడి యెడ భక్తి. ముక్కంటి కూడా ఎదిరించి వెనుదిరిగి

పోవలసిందే అని చెప్పటం ఈ పద్యంలోని విశేషం. అంతా చెప్పి చివరలో కృష్ణుడిలో 'ఏఱుఁగక యంటివిగాక' అని అనటం గట్టిగా తనలో నాటుకొన్న అచల బల విశ్వాసాన్ని వ్యక్తం చేయటమే.

**క. పూనఁగ రాదే నాకె । ద్దానిం? బూనినను నీవు దలకొని తీర్చం**
**గా నునికి గలుగ నే నీ । చే నుండఁగ నిట్టు లేల చెప్పెదు చెపుమా! 315**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; ఏ+దానినిన్= దేనినైనా; పూనఁగన్+రాదే?= యత్నించరాదా?; నీవు= నీవు(కృష్ణుడు అని భావం); తలకొని= పూని; తీర్చంగాన్+ఉనికి= సరిపెట్టటానికి ఉండటం; కలుగన్= జరుగగా; ఏను= నేను; నీచేన్+ఉండఁగన్= నీ చేతిలో ఉండగా అనగా నీ అధీనంలో ఉండగా; ఇట్టులు= ఈ విధంగా; ఏల= ఎందుకు; చెప్పెదు?= చెబుతున్నావు? చెపుమా= తెలుపుము.

**తాత్పర్యం:** నీవు పూనుకొని అన్నీ తీర్చటానికి ఉండగా, నేను దేనికి ప్రయత్నించినా ప్రయత్నించవచ్చును గదా! నేను నీ అధీనంలో ఉండగా ఎందు కిట్లా అంటున్నావు చెప్పుము.

**విశేషం:** నేను దేనికీ ప్రయత్నించరాదా - అంటే దేనికైనా పూనుకొనవచ్చును గదా! ముఖ్యంగా నీవు నాకు అన్నీ సరిపెట్టటానికి సంసిద్ధంగా ఉన్నప్పుడు నేను దేనికైనా పూనుకొనవచ్చును. నేను నీ అధీనంలోనే ఉన్నప్పుడు ఎందుకిట్లా అంటున్నావో చెప్పు మని అర్జునుడు అనే మాటలలో శ్రీకృష్ణుడినే తాను అన్నిటికీ పరిపూర్ణంగా నమ్ముకొన్నానని, అంతా ఆయన చేతులలోనే ఉన్నది అని తెలుస్తూ ఉన్నది. 'నీచే నుండగా' అనే వాక్యం నేటికీ వ్యవహారంలో ఉన్నది. ఎంతో సజీవమైన, నిత్య వ్యవహార యోగ్యమైన భాషను తిక్కన ప్రయోగించా డనటానికి ఇటువంటి వెన్నో ప్రయోగాలు చూపవచ్చును. అట్లాగే 'తీర్పంగానునికి' అనే ప్రయోగం కూడా జాతీయమైన పలుకుబడితో భావపరిపుష్టి కలిగి ప్రజాబాహుళ్యం చేత నిత్యమూ వ్యవహరించబడుతూనే ఉన్నది.

**క. ఈ ప్రతిన యెట్టి తెఱఁగున । నప్రతిహతవృత్తి నెగడునట్టి తెఱఁగు లో**
**క ప్రభువ! నీవ చేయ న । తిప్రకట పరాక్రమ ప్రదీప్తుఁడ నగుదున్. 316**

**ప్రతిపదార్థం:** లోకప్రభువ!= లోకేశ్వరా! (కృష్ణా!); ఈ ప్రతిన= ఈ ప్రతిజ్ఞ; ఎట్టి+తెఱఁగునన్= ఏ విధంగా; అప్రతిహత+వృత్తిన్= విఘ్నం లేని ప్రవర్తనతో, అడ్డులేక మారుదెబ్బలేని ఉపాయంతో(నడవడికతో); నెగడున్= పూర్తి అవుతుందో; అట్టి తెఱఁగు= అటువంటి విధం; నీవు+అ+చేయన్= నీవే చేస్తూ ఉండగా; అతి, ప్రకట, పరాక్రమ, ప్రదీప్తుఁడన్= మిక్కిలి, ప్రసిద్ధమైన శౌర్యంచేత బాగుగా ప్రకాశించే (వెలుగొందే) వాడను; అగుదున్= అవుతాను.

**తాత్పర్యం:** లోకేశ్వరా! నేను చేసిన ఈ ప్రతిజ్ఞ ఏ విధంగా ప్రతిబంధకం లేని వర్తనతో పూర్తిగా నిర్వర్తించబడుతుందో అట్లా నీవే చేస్తూ ఉండగా, నేను ప్రసిద్ధంగా శౌర్యాన్ని ప్రదర్శించి ప్రకాశిస్తాను.

**విశేషం:** శ్రీకృష్ణుడు సాధారణ వ్యక్తి కాదు. ఆయన అన్ని లోకాలకు ప్రభువు. ఆయన ఆదేశాన్ని అనుసరించే అంతా ప్రవర్తిల్లుతూ ఉన్నది. అటువంటి మహాత్ముడు తనకు అండగా ఉండి సర్వమూ తానే నిర్వహిస్తున్నాడు. శ్రీకృష్ణుడి మాటలలో చెప్పాలంటే తాను కేవలం నిమిత్త మాత్రుడు. అంతా చేసేది ఆయనే. పైకి లోకం నేను ప్రతాపాన్ని ప్రకటించినట్లుగా భావిస్తూ ఉన్నది. నే నింతగా పరాక్రమంతో ప్రకాశించటానికి మూలమైన ఆలంబనం ఆ లోక ప్రభువు యొక్క అనుగ్రహపూర్ణమైన ఆలోకనమే. శ్రీకృష్ణుడే అంతా చేస్తూ ఉన్నాడనే భావానికి లోకప్రభువ! అనే సంబోధన సర్వవిధాలా సమర్థనీయంగా ఉన్నది.

**క. మమ్ము నరయు భరమున నీ । విమ్మెయిఁ దలపోసి; తింక నిచ్చట నేలా**
**నెమ్మది నిద్రింపంగాఁ । బొమ్ము; ప్రభాతమున రథముఁ బూన్పఁగ వలయున్. 317**

**ప్రతిపదార్థం:** మమ్మున్= మమ్మల్ని; అరయు,భరమునన్= రక్షించే భారంచేత; నీవు= నీవు(కృష్ణుడవు అని భావం); ఈ+మెయిన్= ఈ విధంగా; తలపోసితి(వి)= తలచావు; ఇంకన్= ఇంకా; ఇచ్చటన్= ఈ చోట; ఏలా?= ఎందుకు ఉండటం; నెమ్మదిన్= సుఖంగా, నిశ్చింతగా; నిద్రింపంగాన్= నిదురించటానికి; పొమ్ము= పోవలసింది; ప్రభాతమునన్= ఉదయాననే; రథమున్+పూన్పంగన్+వలయున్= రథాన్ని సిద్ధం చేయవలసి ఉన్నది (ఉదయాన్నే రథం ఏర్పాటు చేయవలసిన పని ఉన్నది కాబట్టి తొందరగా ఇప్పుడు నిద్రించటానికి పోవలసింది అని భావం).

**తాత్పర్యం:** మమ్మల్ని కాపాడే భారాన్ని వహించినందువల్ల నీవు ఈ విధంగా తలపోశావు. ఇంక ఇక్కడ ఉండటం ఎందుకు? నిశ్చింతగా నిద్రించటానికి పోవలసింది. రేపు ఉదయాన్నే తేరు సిద్ధం చేయవలసి ఉన్నది కదా!

**విశేషం:** 'అరయు భరము' అనే ప్రయోగం చాలా అర్థవంతమైనది. మమ్మల్ని రక్షించే బరువు బాధ్యతలున్న నీవు మా బాగోగులు తెలిసికొనాలని ఎప్పటి కప్పుడు విచారణ జరుపుతూ ఈ విధంగా తలపోశావు - అంతే కాని నీకు తెలియంది ఏమున్నది? మేము జాగరూకులమై ఉన్నామా? లేదా? అని పరిశీలించటానికి నీవు ఆ విధంగా ఏమీ తెలియనట్లుగా నటిస్తావు అని ఎంతో భావాన్ని ఆ ప్రయోగంలో కవి నిక్షిప్తం గావించాడు.

**వ. అని యివ్విధంబున సల్లాపంబులు సేయుచు నరనారాయణు లత్యంత కుపితాంతఃకరణు లగుచుఁ బాములు రోఁజు పోల్కి నిట్టూర్పులు నిగిడించుచున్నం, బురందరాది బృందారకులు భయంబుగొని దీన నేమి పుట్టునో! యని చింతాక్రాంతు లైరి; వారిధులు సంక్షోభించె, సరిత్ప్రవాహంబులు ప్రతిగమన వ్యాకులంబు లయ్యెఁ, గాననశైల సహితంబుగా మహి సంచలించె, మఱియు మాతంగ తురంగ నరనికరంబుల నాశంబులు దెలుపునుత్పాతంబు లనేకంబులు దోఁచె, విశేషించి కౌరవస్కంధా వారంబున దారుణ వాయువులు విషమ గతులం జరించుటయు, నుల్కానిర్ఘాతంబులు నలుగడలం బడుటయుఁ, గరిహరి నికరంబులు బహుళంబులగు బాష్పజలంబులు విడుచుటయు మొదలుగాఁ బెక్కుదుర్నిమిత్తంబులు పుట్టినం బోటుమగ లగు భూపతులు లోనుగా నెల్లజనంబులుం బుల్లపడి యుండి' రనవుడు సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 318**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; ఈ+విధంబునన్= ఇట్లా; సల్లాపంబులు+చేయుచున్= సంభాషణలు సాగిస్తూ; నర, నారాయణులు= అర్జునుడూ, కృష్ణుడూ; అత్యంత కుపిత+అంతఃకరణులు+అగుచున్= మిక్కిలి కోపించిన మనస్సు కలవాళ్ళు అవుతూ; పాములు= సర్పాలు; రోఁజు పోల్కిన్= బుసకొట్టినట్లు; నిడు+ఊర్పులు= దీర్ఘనిశ్వాసాలు; నిగిడించుచున్నన్= వ్యాపింప జేస్తూ ఉండగా; పురందర+ఆది, బృందారకులు= దేవేంద్రుడు మొదలైన దేవతలు; భయంబుకొని= భీతిచెంది; దీనన్+ఏమి, పుట్టును +ఓ+అని= దీని వలన ఏమి కలుగుతుందో అని; చింతా+ఆక్రాంతులు+ఐరి= దిగులుతో ఆక్రమించబడినవారు అయ్యారు;వారిధులు = సముద్రాలు; సంక్షోభించెన్= కలతచెందాయి; సరిత్+ప్రవాహంబులు= నదుల వెల్లువలు; ప్రతిగమన= ఎదురుగా పయనించటంచేత; వ్యాకులంబులు+అయ్యెన్= కలత చెందినవి అయ్యాయి; మహి= భూమి; కానన, శైల, సహితంబుగాన్= అడవులు కొండలతో కూడుకొని; సంచలించెన్= మిక్కిలి కదలిపోయింది; మఱియున్= ఇంకా; మాతంగ, తురంగ, నర, నికరంబుల=ఏనుగులు, గుర్రాలు, మానవుల యొక్క మొత్తాల; నాశంబులు తెలుపు= నశించిపోవటాన్ని తెలిపే; ఉత్పాతంబులు+అనేకంబులు= అప శకునాలు పెక్కులు; తోఁచెన్= కన్పించాయి; విశేషించి= మిక్కిలి అనగా ప్రత్యేకించి; కౌరవస్కంధావారంబునన్= కౌరవులు విడిది చేసి వసించినచోట; దారుణ వాయువులు= భయంకరమైన గాలులు; విషమగతులన్= ప్రతికూలమైన (చలనములు) నడకలతో; చరించుటయున్= తిరగటమున్నూ; ఉల్కా నిర్ఘాతంబులు= ఉల్కలు, పిడుగులు; నలుగడలన్+పడుటయున్= నాలుగు వైపులా పడటమున్నూ; కరి, హరి, నికరంబులు= ఏనుగుల, గుర్రాల సమూహం; బహుళంబులు+అగు, బాష్పజలంబులు= అధికమైన కన్నీళ్ళు; విడుచుటయున్= కార్చుటయున్నూ; మొదలుగాన్+పెక్కు, దుర్నిమిత్తంబులు= మొదలైన (మున్నగు) అనేకములైన

అపశకునాలు; పుట్టినన్= కలుగగా; పోటు, మగలు+అగు భూపతులు= యుద్ధవీరులైన రాజులు; లోనుగాన్= మొదలుగా; ఎల్ల+జనంబులున్= ప్రజలందరున్నూ; పుల్లపడి+ఉండిరి= స్తంభించి ఉండిపోయారు; అనవుడున్= అనిన వెంటనే; సంజయునకున్= సంజయుడికి; ధృతరాష్ట్రుండు; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని సంభాషణలు సాగిస్తూ కృష్ణార్జునులు మిక్కిలి కోపించిన హృదయాలతో బుసలుకొడుతున్న పాములవలె నిట్టూర్పులు విడుస్తుండగా ఇంద్రాది దేవతలు భయపడి, దానివలన ఎటువంటి తీవ్ర పరిణామాలు కలుగుతాయో అని విచారంలో మునిగారు. సముద్రాలు కల్లోల మయ్యాయి. నదులు అపసవ్యంగా ప్రవహించాయి, పర్వతారణ్యాలతో భూమి కంపించింది. చతురంగ బల నాశనాన్ని సూచించే అపశకునాలు తోచాయి. ప్రత్యేకంగా కౌరవుల సైన్య శిబిరాలలో పెనుగాలులు ఎడాపెడా వీచాయి, ఉల్కలూ, పిడుగులూ నాలుగువైపులా పడ్డాయి. ఏనుగులూ, గుర్రాలూ విరివిగా కన్నీరు కార్చాయి. ఇటువంటి అపశకునాలను గమనించి, వీరులైన రాజులు స్తంభించి ఉండిపోయారు. ఈ సంగతి విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు :

**తే.** **'అట్లు దమలోనఁ దగుమాట లాడి యాడి, । కోపరసవేగమునఁ గుంది కుంది, వగలఁ**
**బొంది పొంది పురందరనందనుండు । నచ్యుతుండు నా రాత్రి యెట్లైరి చెపుమ!'** **319**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; తమలోనన్= తమలో తాము; తగు మాటలు= యుక్తములైన సంభాషణలు; ఆడి+ఆడి= మిక్కిలిగా మాటాడి; కోపరస+వేగమునన్= కోపమనెడి రసముయొక్క అతిశయంతో; కుంది+కుంది= మిక్కిలిగా శోకించి; వగలన్= చింతలను; పొంది పొంది= అధికముగా అనుభవించి; పురందర నందనుండునున్= అర్జునుడున్నూ; అచ్యుతుండున్= శ్రీకృష్ణుడున్నూ; ఆ రాత్రి= ఆనాటి రాత్రి; ఎట్లు+ఐరి= ఏమయ్యారు; చెపుమ!= తెలుపుమా!

**తాత్పర్యం:** 'ఆ విధంగా తమలో తాము తగిన సంభాషణలు సాగిస్తూ, కోపాతిశయంతో మిక్కిలి శోకించి, చింతలను అధికంగా అనుభవించి ఆ అర్జునుడూ, కృష్ణుడూ ఆ రాత్రి ఏమయ్యారో చెప్పవలసింది.'

**విశేషం:** ఈ పద్యంలో అతిశయార్థంలో ఆడి యాడి, కుంది కుంది, పొంది పొంది అనే ప్రయోగాలను తిక్కన కూర్చాడు. ఇట్టి కూర్పు ఔత్సుక్యాన్ని కూడా తెలియజేస్తుంది. ధృతరాష్ట్రుడి ఉత్కంఠకు అనుగుణంగా ఇక్కడ ఇట్టి రచనా పద్ధతి పాటించబడింది.

### శ్రీకృష్ణుండు పుత్రశోకాతురయైన సుభద్ర నూఱడించుట (సం. 7-54-11)

**వ.** **అని యడిగిన నా సూతసూనుం డంబికాసూనున కిట్లను: 'నమ్మురారి చిత్తం బారాధించి యర్జునుం డట మున్న యొక్కనాఁడు శిబిరంబునకు సుభద్రయుం బాంచాలియు నుత్తరయును వచ్చి యచ్చటన యునికిం జేసి యచ్చెలువల శోకానలంబు లుడుగునట్టి మాట లాడ నతనిం బ్రార్థించి పంచిన.** **320**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; అడిగినన్= అడుగగా; ఆ సూతసూనుండు= ఆ సంజయుడు; అంబికా సూనునకున్= ధృతరాష్ట్రుడికి; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు; ఆ+మురారి చిత్తంబు= ఆ శ్రీకృష్ణుడి మనస్సు; ఆరాధించి= సేవించి; అర్జునుండు= అర్జునుడు; అటమున్న= అంతకు మునుపే; ఒక్కనాఁడు= ఒక దినం; శిబిరంబునకున్= దండు విడిదిచేసి ఉన్నచోటుకు; సుభద్రయున్= సుభద్రయున్నూ; పాంచాలియున్= ద్రౌపదియున్నూ; ఉత్తరయునున్= ఉత్తరయున్నూ; వచ్చి= వచ్చి; అచ్చటన్+ఉనికిన్+చేసి= అక్కడ ఉండటం చేత; ఆ+చెలువల= ఆ స్త్రీల; శోక+అనలంబులు= దుఃఖాలనే నిప్పులు (దుఃఖాగ్నులు); ఉడుగునట్టి= చల్లారే; మాటలు+ఆడన్= మాటలు చెప్పటానికి; అతనిన్= ఆ శ్రీకృష్ణుడిని; ప్రార్థించి= వేడుకొని; పంచినన్= పంపగా.

**తాత్పర్యం:** అని అడుగగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: 'ఆ శ్రీకృష్ణుడి మనస్సును ప్రసన్నం చేసికొని అర్జునుడు అంతకుముందే ఒకనాడు శిబిరానికి వచ్చి ఉన్న సుభద్ర, ద్రౌపది, ఉత్తరలను గుర్తుచేసుకొని, వారల మనస్సులలోని శోకాగ్నిని చల్లార్చమని అతడిని వేడుకొని వారి వద్దకు పంపాడు.

**తే.** **అమ్ముకుందుండు గ్రొత్తయై యడలు దనదు। డెంద మలఁపంగఁ జెలియలి మందిరమున**
**కరిగి పురపురఁ బొక్కెడు నా సుభద్రఁ। గాంచి యిట్లను నెంతయు గారవమున.** **321**

**ప్రతిపదార్థం:** ఆ+ముకుందుండు= ఆ శ్రీకృష్ణుడు (మోక్షాన్ని ఇచ్చేవాడు అని వ్యుత్పత్తి); క్రొత్త ఐ= వింత అయి; అడలు= దుఃఖించు; తనదు+డెందంబున్= తన హృదయం; అలఁపంగన్= అలతను కలిగించగా; చెలియలి మందిరంబునకున్= చెల్లెలు సుభద్ర ఇంటికి; అరిగి= పోయి; పురపురన్+పొక్కెడు= పురపురమని దుఃఖించే; ఆ సుభద్రన్= ఆ సుభద్రను; కాంచి= చూచి; ఎంతయున్= మిక్కిలి; గారవమునన్= ప్రీతితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= అంటున్నాడు:

**తాత్పర్యం:** ఆ శ్రీకృష్ణుడు తనలో ఎన్నడూ కలుగని క్రొత్త రకమైన దుఃఖం మనస్సుకు అలత కలిగించగా, చెల్లెలు సుభద్ర మందిరానికి పోయి, పురపురమని వాపోయే ఆమెను చూచి ఎంతో ఆదరంగా ప్రీతితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అందరి దుఃఖాన్ని పోగొట్టి మోక్షాన్ని ప్రసాదించే ఆ శ్రీకృష్ణుడిలో కూడా ఏదో ఇంతకు మునుపు ఎన్నడూ లేని దుఃఖం ఎంతో క్రొత్తగా మనస్సును అలముకొన్నట్లు చెప్పటం ఇందలి విశేషం. గారాబు చెల్లెలు సుభద్రను ఎట్లా ఊరడించటమా అని ఒకవైపు, అల్లారు ముద్దుగా తమ చేతులలో పెరిగిన మేనల్లుడు అభిమన్యుడు పూర్తిగా ముద్దూ మురిపెమూ తీరకముందే పరలోకగతుడయ్యాడే అన్న ఆవేదన మరొకవైపు, కలచివేయగా ఏదో ఒక క్రొత్తరకమైన దుఃఖానికి గురైనట్లుగా తెలపటం ఎంతో వింతగా ఉన్నది. ఆ వింతనే తిక్కన 'క్రొత్తయై' అని ప్రయోగించాడు.

**క.** **'రాచూలికి నుచితం బగు। నాచారముగాదె రణమునం దరులఁ దెగం**
**జూచుచుఁ దిరుగని నడపున। నేచి యమరలోకమునకు నేఁగుట తరుణీ!** **322**

**ప్రతిపదార్థం:** తరుణీ!= స్త్రీ! (సుభద్రా! అని సంబోధన); రాచూలికిన్= రాజపుత్రుడికి; రణమునందున్= యుద్ధంలో; అరులన్+తెగన్+చూచుచున్= శత్రువులను చంపుతూ; తిరుగని నడపునన్= రణం నుండి మరలని విధంగా; ఏచి= విజృంభించి; అమరలోకమునకున్+ఏఁగుట= (వీర) స్వర్గానికి పోవటం; ఉచితంబు+అగు= తగినటువంటిదగు లేదా యుక్తమైనదగు ఆచారం; కాదె!= నడవడియే కదా!

**తాత్పర్యం:** 'సుభద్రా! యుద్ధంలో శత్రువులను చంపుతూ, వెనుతిరుగకుండా విజృంభించి పోరి స్వర్గలోకానికి పోవటం రాచపుట్టుక పుట్టినవానికి తగిన ఆచారమేకదా!

**విశేషం:** యుద్ధంలో వెనుదిరిగి రాకుండా పోరాడటం వీరధర్మం. అటువంటి వీరుడు రణరంగంలో మరణిస్తే వీరస్వర్గం. రాజకుమారులకు యుద్ధంలో శత్రువులను తెగనరకటం యోగ్యమైన నడవడి. ఏ విధంగా చూచినా అభిమన్యుడు దుఃఖించదగినవాడు కాడని శ్రీకృష్ణుడి అభిప్రాయం.

**క.** **నీ కొడుకు తుచ్ఛమగు నీ। లోకంబు దొరంగి పుణ్యలోకమ్మునకుం**
**బోకకు ని ట్లధికం బగు। శోకముఁ బొందంగ నగునె సుదతీ! నీకున్?** **323**

**ప్రతిపదార్థం:** సుదతీ!= స్త్రీ (సుభద్రా అని సంబోధన) (మంచి దంతములు కలది అని వ్యుత్పత్తి); నీ కొడుకు= అభిమన్యుడు; తుచ్ఛము+అగు= నీచమైన; లోకంబు+తొరంగి= ఈ ప్రపంచాన్ని విడిచి; పుణ్యలోకమ్మునకున్+పోకకున్= స్వర్గలోకానికి

పోయినందుకు; నీకున్= నీకు; ఇట్లు= ఈ విధంగా; అధికంబు+అగు+శోకంబున్= మిక్కిలి దుఃఖాన్ని; పొందంగన్+అగునె?= పొందటం తగునా?

**తాత్పర్యం:** సుభద్రా! నీ కొడుకు అభిమన్యుడు ఈ నీచమైన ప్రపంచాన్ని విడిచి స్వర్గలోకాన్ని చేరాడు. అటువంటి పుణ్యపురుషుడి గురించి నీవు మిక్కిలి దుఃఖించటం తగునా?

**విశేషం:** కుమారుడి (అభిమన్యుడి) మరణానికి ఏ విధంగా ఆలోచించినా దుఃఖపడవలసిన పనే లేదు అంటున్నాడు. ఈ తుచ్ఛమైన లోకాన్ని వదలిపెట్టినందుకు, పైగా పుణ్యలోకప్రాప్తి కలిగినందుకు రెండు విధాలా సంతోషించవలసిన విషయమే కానీ అధికంగా శోకాన్ని పొందటం తగదని సహేతుకంగా శ్రీకృష్ణుడు సుభద్రను ఊరడించాడు.

**ఆ.** **బ్రహ్మచర్యమునఁ దపంబున నుత్తమ । దానములను బడయఁ దలఁచునట్టి**
**గతులకంటె సౌఖ్యకారిణి యగు గతిఁ । బొందె నీసుతుండు గుంద నేల? 324**

**ప్రతిపదార్థం:** నీ సుతుండు= నీ కొడుకు; బ్రహ్మచర్యముననన్= బ్రహ్మచర్యవ్రతం చేత; తపంబునన్= తపస్సుచేత; ఉత్తమదానములన్= శ్రేష్ఠములైన దానాలచేత; పడయన్+తలఁచు+అట్టి= పొందదలచే; గతులకంటెన్= సద్గతులకంటె; సౌఖ్యకారిణి+అగు+గతిన్= సుఖాన్ని కలిగించే ఉత్తమగతిని; పొందెన్= పొందాడు.

**తాత్పర్యం:** నీ కొడుకు బ్రహ్మచర్యవ్రతం చేతా, తపస్సుచేతా, శ్రేష్ఠములైన దానాల చేతా పొందాలి అనుకొనే సద్గతులకంటె ఎక్కువ సౌఖ్యాన్ని కలిగించే ఉత్తమోత్తమ గతిని పొందాడు.

**ఉ.** **క్షత్రియకాంత పుత్త్రకుని గాంచుట వాఁ డతిలోకవీరుఁడై**
**ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కుటకుఁ దా నది గాకయు వీరపత్ని నా**
**నీ త్రయి నెందునుం బ్రణుతి కెక్కిన నీవు తనూజుబీరమున్**
**శత్రువధోత్సవంబు విని సంతస మందక కుందఁ బాడియే! 325**

**ప్రతిపదార్థం:** క్షత్రియకాంత= క్షత్రియవంశంలో పుట్టిన ఇంతి; పుత్రకునిన్+కాంచుట= కుమారుడిని కనటం; వాఁడు= ఆ కుమారుడు; అతిలోక వీరుఁడు+ఐ= లోకాతిశయుడైన శూరుడై; ధాత్రిన్= (భువి) పుడమిలో; ప్రసిద్ధికిన్+ఎక్కుటకున్= ప్రఖ్యాతిని పొందటానికి; అది కాకయున్= అంతే గాకుండా; తాన్= తాను; వీరపత్నినాన్= వీరుడి ఇల్లాలు అనగా; ఈత్రయిన్= ఈ మూడింటి చేతన్నూ (అనగా పుత్రుడిని కనటం, వాడు లోకాతిశయంగా వీరుడై ప్రసిద్ధిని కాంచటం, తాను వీరపత్ని కావటం అనే ఈ మూడింటి వలన); ఎందునున్= ఎప్పుడున్నూ; ప్రణుతికిన్+ఎక్కిన నీవు= పొగడ్త కాంచిన నీవు; తనూజుబీరమున్= కొడుకు శౌర్యాన్ని; శత్రు+వధ+ఉత్సవంబు= పగవాళ్ళను చంపిన ఆహ్లాదమున్నూ; విని; సంతసము+అందక= సంతోషపడకుండా; కుందన్+పాడియే?= దుఃఖించటం ధర్మమా?

**తాత్పర్యం:** క్షత్రియ వంశంలో పుట్టిన ఓ సుభద్రా! నీవు పుత్రుడిని కన్నావు. ఆ కన్న కుమారుడు లోకాతిశయ శౌర్యంతో ఎంతో ప్రసిద్ధి కెక్కాడు. అంతే కాకుండా నీవు వీరపత్నివి. ఈ విధంగా నీవు పైచెప్పిన మూడింటి చేత ఎల్లప్పుడూ పొగడ్త కెక్కావు. కుమారుడి శౌర్యాన్ని, శత్రువులను సంహరించిన సమరోత్సాహాన్ని గురించి విన్నావు. సంతోషించకుండా దుఃఖించటం ధర్మమా?

**విశేషం:** పుత్రుడిని కనటం కాదు ముఖ్యం. వాడు మహావీరుడై ప్రసిద్ధికెక్కాలి. పదిమందీ వాడిని కీర్తించాలి. వాడున్నూ తనధర్మాన్ని అందరూ ప్రశంసించేటట్లు నిర్వహించాలి. అట్లా నిర్వహించినప్పుడే ఆతడి తల్లిదండ్రులు సంతోషిస్తారు. అప్పుడే వాడు పుత్రుడు.

నందనుడూ అనే మాటలకు సార్థక్యం కలిగించిన వాడౌతాడు. అట్టి బిడ్డను కన్నతల్లి వీరమాతగా కూడా ప్రసిద్ధికెక్కుతుంది. వీరపత్నియే కాకుండా వీరమాతగా కూడా పేరుకెక్కినప్పుడు చింతించవలసిన పనేలేదు - అని క్షత్రియ వంశంలో పుట్టి స్త్రీ తన జాత్యుచిత ధర్మాన్ని గౌరవిస్తూ ఎట్లా కీర్తికెక్కాలో సూచింపబడింది.

**వ. అట్లుం గాక. 326**

**తాత్పర్యం:** ఆ విధంగా కాకుండా.

**క. కాలం బైనం బోవక । యీలోకమునందు నిలువ నెవ్వరి వశ? మి**
**ట్లేల యవివేకజనముల । పోలిక శోకానలమునఁ బొగులుచు నుండన్. 327**

**ప్రతిపదార్థం:** కాలంబు+ఐనన్= కాలం ముగియగా, అంటే కాలం తీరిపోగానే; పోవక= మరణించకుండా; ఈ లోకమునందున్+నిల్వన్= ఈ మర్త్య (మానవ) లోకంలోనే నిలిచి ఉండటానికి (బ్రతికి ఉండటానికి); ఎవ్వరి వశము?= ఎవరికి శక్యం?; అవివేక జనంబుల+పోలికన్= తెలివి తక్కువ జనుల మాదిరి; శోక+అనలమునన్= దుఃఖాగ్నిచేత; పొగులుచున్= కుమిలిపోతూ; ఇట్లు= ఇట్లా; ఉండన్+ఏల?= ఉండటం ఎందుకు?

**తాత్పర్యం:** కాలం (ముగియ) తీరగానే మరణించకుండా ఈ మర్త్యలోకంలోనే శాశ్వతంగా నిలిచి ఉండటానికి ఎవరికీ వీలు (శక్యం)కాదు. తెలివి లేని వాళ్ళవలె దుఃఖాగ్ని చేత కుమిలిపోతూ ఇట్లా ఉండటం ఎందుకు?

**విశేషం:** 'కాలంబైనన్' అనే ప్రయోగానికి కాలం సంప్రాప్తిస్తే అనే అర్థం కూడా పొసగుతుంది. 'సంప్రాప్తే సన్నిహితే కాలే' అనే శంకరుల వాక్యం లోని భావమే పై ప్రయోగంలో స్పష్టం. 'ఐనన్' అనే క్రియాపదానికి 'జరిగితే, పరిణమిస్తే, ప్రాప్తిస్తే, సిద్ధిస్తే' అనే అర్థాలున్నాయి. కాబట్టి కాలం సమీపిస్తే లేదా కాలం ముగిస్తే అని రెండు రకాలుగా అర్థం సరిపోతుంది. 'అవివేక జనములు' అంటే తెలివిలేనివాళ్ళు, మూఢులు అని భావం. మంచి చెడ్డలను బాగా ఆలోచించి ఆత్మవిమర్శ చేసికొని ప్రశాంత జీవనాన్ని సాగించేవాడు వివేకి. దీనికి పూర్తిగా విపర్యయం విమోహి అనగా అవివేకి. వివేకి శాశ్వత సత్యాన్ని తెలిసికొని భ్రమప్రమాదాలు లేకుండా ప్రశాంతచిత్తుడై పరమానందాన్ని పొందగా, అవివేకి అజ్ఞానంతో ఐహికమే నిత్యమని భ్రమించి, వ్యామోహం చేత శోకనిమగ్నుడౌతాడు అని ఎంతో సందర్భానుసారంగా తిక్కన ఈ పదాన్ని ప్రయోగించాడు.

**క. తగుమాట లాడి కోడలి । వగ పుడుపుము; నీవు ధైర్యవతి; వి ట్లడలం**
**దగునె? నినుఁ జూచి కాదే । మగుడుం జిత్తముల వగలు మా కందఱకున్. 328**

**ప్రతిపదార్థం:** తగు+మాటలు+ఆడి= తగిన (యోగ్యమైన, సమయ సముచితమైన); ఊరడింపు పలుకులు పలికి; కోడలి వగపున్= ఉత్తర దుఃఖాన్ని; ఉడుపుము= పోగొట్టుము; నీవు= నీవు; ధైర్యవతివి= ధీరురాలవు; ఇట్లు+అడలన్+తగునె!= ఇట్లా, దుఃఖించటం తగునా!; నినున్+చూచి+కాదే= నిన్ను చూచియే కదా!; మాకున్+అందఱకున్= మా అందరికీ; చిత్తములన్= మనస్సులలో; వగలు= శోకాలు; మగుడున్= తొలగిపోతాయి.

**తాత్పర్యం:** సమయానికి అనుగుణంగా ఊరడింపు మాటలు చెప్పి, నీ కోడలు ఉత్తర దుఃఖాన్ని పోగొట్టుము. నీవు ధైర్యవతివై ఉండి ఇట్లా దుఃఖించటం తగునా? నీవు సంతోషంతో ఉండటం చూస్తేనే కదా మా అందరి మనస్సులలో దుఃఖం తొలగిపోతుంది.

**విశేషం:** 'తగు మాటలాడి' వంటి తిక్కన ప్రయోగాలను ఆయన తర్వాత వాగ్గేయకారులైన త్యాగరాజు వంటి ప్రముఖులు తమ కీర్తనలలో గ్రహించారు. సుఖంలో పొంగిపోకుండా దుఃఖంలో క్రుంగిపోకుండా స్థిరంగా ఉండగలిగే నిశ్చలత్వాన్నే ధైర్యం అంటారు.

అటువంటి ధైర్యం కలది అని సుభద్రను శ్రీకృష్ణుడు పేర్కొన్నాడు. అంత ధైర్యవతి అయి ఉండి కూడా ఆమె పుత్రమరణానికి తట్టుకోలేక బిట్టు వాపోయింది. అందుకు కృష్ణుడు నీవే ఇట్లా అయితే నిన్ను చూచి మేమందరం కూడా మరల భోరుమని విలపించవలసి వస్తుంది. కాబట్టి ధైర్యంగా ఉండి, అందరికీ ధైర్యం కలిగించాలని కోరాడు.

**ఉ. నీమగఁ డెల్లి సైంధవు ననిం దెగటార్చి శిరంబు దెచ్చినం**
**గోమలి! నీదు పాదములకుం దగు పీఠము సేయు; మాతఁ డు**
**ద్దామ భుజాబలాఢ్యుఁ డది దప్పదు; వాని ప్రతిజ్ఞ దప్పినన్**
**భూమి వడంకదే! తరణి పొల్పు దలంకదె! వార్ధి యింకదే! 329**

**ప్రతిపదార్థం:** కోమలి!= ఓ సుభద్రా!; నీ మగఁడు= నీ భర్తఅయిన అర్జునుడు; ఎల్లి= రేపు; అనిన్= యుద్ధంలో; సైంధవున్= జయద్రథుడిని; అనిన్= యుద్ధంలో; తెగటార్చి= చంపి; శిరంబున్+తెచ్చినన్= తలను తీసికొనిరాగా (తేగా); నీదు పాదములకున్= నీ కాళ్ళకు; తగు పీఠము= తగిన పీట; చేయుము= కావించుము; ఆతఁడు= అర్జునుడు; ఉద్దామ, భుజా, బల+ఆఢ్యుఁడు= అధికమైన భుజముల యొక్క బలంచేత శ్రేష్ఠుడు; అది తప్పదు= ఆతడి ప్రయత్నం చెడదు; వాని ప్రతిజ్ఞ, తప్పినన్= అతడి ప్రతిజ్ఞ తప్పితే; భూమి వడంకదే!= భూకంపం కలుగదా!; తరణి పొల్పు= సూర్యుడి చందం; తలంకదె!= తొలగిపోదా; వార్ధి= సముద్రం; ఇంకదే!= ఎండిపోదా!

**తాత్పర్యం:** సుభద్రా! నీ భర్త రేపు యుద్ధంలో సైంధవుడిని చంపి, తలను తేగా నీ పాదాలకు తగిన పీఠంగా చేసికొనుము. ఆ అర్జునుడు అధికభుజబల శ్రేష్ఠుడు, అతడి ప్రయత్నం విఫలం కాదు. అతడి ప్రతిజ్ఞ విఫలమే అయితే భూమి కంపిస్తుంది. సూర్యుడు కాంతి తరిగిపోతాడు. సముద్రం ఒక్క నీటిచుక్క కూడా లేకుండా ఎండి పోతుంది.

**విశేషం:** ఈ పద్యంలో విఫలం కాని అర్జునుడి కఠోర ప్రతిజ్ఞ శ్రీకృష్ణుడి మాటలలో తెలుపబడింది. తెగిన సైంధవుడి తల సుభద్ర పాదాలమీద వచ్చి వాలుతుంది అంటున్నాడు. అర్జునుడు బాహుబలాఢ్యుడయితే ఆమె కోమలి. పైకి కోమలియే కాని ఎంతో ధైర్యవతి. ఆమె లక్షణాలే చాలా వరకు అభిమన్యుడిలో పరిపూర్ణంగా ప్రతిఫలించాయి. ప్రతిజ్ఞా ప్రయత్నాన్ని 'అది తప్పదు' అని చెప్పటం ఎంతో గంభీరంగా ఉన్నది. అట్లా చెప్పటంలోనే శిల్పకళా పారమ్యం యొక్క పొల్పు ఉన్నది.

**క. నా పలుకు నమ్ము; మర్జునుఁ । డా పాపాత్మకుని నెల్లి యనిఁ జంపి ముదం**
**బాపాదించుం; గులమున । కీపెంపున కెలమి వొందుఁ డీవును నతఁడున్. 330**

**ప్రతిపదార్థం:** నా, పలుకు, నమ్ముము= నా మాట నమ్మ్ముము; అర్జునుఁడు= నీ పెనిమిటి అర్జునుడు; ఆ పాపాత్మకునిన్= పాపచిత్తుడైన ఆ సైంధవుడిని; ఎల్లి= రేపు; అనిన్= యుద్ధంలో; చంపి= సంహరించి; కులమునకున్= రాజవంశానికి; ముదమున్+ఆపాదించున్= సంతోషాన్ని కలిగిస్తాడు; ఈ పెంపునకున్= ఈ గౌరవానికి; ఈవునున్= నీవున్నూ; అతఁడున్= అతడున్నూ (అర్జునుడున్నూ); ఎలమిన్+పొందుఁడు= సంతోషాన్ని పొందండి.

**తాత్పర్యం:** నా మాటలు నమ్మ్ముము. అర్జునుడు ఆ పాపాత్ముడైన సైంధవుడిని రేపే చంపి సంతోషాన్ని కలిగిస్తాడు. ఈ రాజవంశం గారవానికి నీవూ, నీ భర్తా కారకులై పరమానందాన్ని పొందండి.'

**విశేషం:** పాపాత్ములను నిర్మూలించటం వలన ప్రతిజ్ఞ నిర్వహించబడటమే కాదు. అది ఆ వంశంయొక్క కీర్తిప్రతిష్ఠలను, గౌరవ మర్యాదలను కాపాడి అందరకూ ఆనందాన్ని కలిగిస్తుంది. అది వ్యక్తిగత ద్వేషంగా పైకి కనిపించినా, సంఘ శ్రేయస్సే దాని పరమలక్ష్యం. కృష్ణుడు చివరలో సైంధవుడిని చంపి, కులగౌరవాన్ని పెంచి, నీవూ, మీ శ్రీవారూ సంతోషాన్ని పొందండి అని తెలిపాడు.

**వ. అని యనేక ప్రకారంబులం బలికె; నప్పు డగ్గోవిందుం గనుంగొనుట నుత్కటం బయిన శోకంబున సుభద్ర యాకులతం బొంది. 331**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; అనేక ప్రకారంబులన్= ఎన్నో రీతులతో; పలికెన్= ఓదార్పు మాటలు చెప్పాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+గోవిందున్+కనుంగొనుటన్= ఆ కృష్ణుడిని చూడటం చేత; ఉత్కటంబు+అయిన, శోకంబునన్= మిక్కుటమైన దుఃఖంతో; సుభద్ర= సుభద్ర; వ్యాకులతన్+పొంది= మిక్కిలి కలత చెంది.

**తాత్పర్యం:** అంటూ ఎన్నో విధాలుగా ఓదార్పు మాటలు పలికాడు. శ్రీకృష్ణుడిని చూడటం చేత పొంగిన శోకంతో సుభద్ర కలతచెందింది. (ఇట్లా అన్నది.)

**ఉ.. 'అక్కట! పుత్త్ర! నిన్నుఁ గని నంతియ పుణ్యమ కాని నాకు నీ**
**వెక్కుడు భక్తి సేసి నను నెప్పుడు నారయ నీకుమారకు**
**ల్మక్కువ నాకడం దిరుగ లాలన సేయుచునుండునట్టి యా**
**మిక్కిలి నోము లేద? యిట మీఁదికి నెవ్వరు దిక్కు సెప్పుమా! 332**

**ప్రతిపదార్థం:** అక్కట! పుత్ర!= అయ్యో కుమారా!; నిన్నున్= నిన్ను; కనినంతియ పుణ్యము+అ+కాని= కడుపారా కన్న సుకృత విశేషమే కాని; ఈవు= నీవు; నాకున్= నాకు; ఎక్కుడు, భక్తి, చేసి= మిక్కిలి భక్తి కలిగి; ననున్= నన్ను; ఎప్పుడున్= సదా; ఆరయన్= విచారించగా; నీ కుమారకుల్= నీ కొడుకులు; మక్కువన్= కూర్మితో; నాకడన్+తిరుగన్= నా దగ్గర తిరుగుతూ ఉండగా; లాలన+చేయుచున్= బుజ్జగిస్తూ; ఉండునట్టి= ఉండగలిగే; ఆ మిక్కిలి, నోము, లేదు+అ?= ఆ గొప్ప నోము నోచుకోలేదా?; ఇటమీఁదికిన్= ఇకపైన; దిక్కు+ఎవ్వరు?= గతి ఎవ్వరు లేరా? శరణం ఎవ్వరు?; చెప్పుమా!= చెప్పుము.

**తాత్పర్యం:** అయ్యో! పుత్రా! నిన్ను కడుపారా కన్న పుణ్యమే కాని, నీవు నాకు ఎక్కువ భక్తి కలిగి నన్నెప్పుడూ ఆదరిస్తుండగా, నీ కొడుకులు నా దగ్గర ఇష్టంతో తిరుగుతూ ఉండగా, బుజ్జగించగలిగే ఆ నోము నేను నోచుకొనలేదా? ఇకపైన నా గతి ఏమిటి? నీవే చెప్పుము.

**విశేషం:** ఇందులో సుభద్ర ఆవేదన అభివ్యక్తం. 'అక్కట పుత్త్ర' అని సంతాపార్థకంతో ఉత్పలమాలావృత్తం ఆరంభమైనది. పుత్రుడు పుట్టటం గొప్ప పుణ్యమే. కాని, ఆ పుత్రుడి భక్తి ప్రపత్తుల వలన తల్లికి కలిగే ఆనందం ఎటువంటిదో ఈ పద్యంలో సూచించబడింది. 'పుత్రపౌత్రాభివృద్ధిరస్తు' అని పెద్దలు ఆశీర్వదిస్తూ ఉంటారు. కాని, అభిమన్యుడి కుమారులు తన చెంతకు వచ్చినప్పుడు వారిని లాలనతో పాలన చేసే భాగ్యం నాకు కరవైనదని సుభద్ర వాపోయింది. చివరగా 'ఇటుపైన తన కెవ్వరు దిక్కు' అని కుమారుడి మృతికి కుమారిల్లింది. దేనికైనా చేసికొని పుట్టాలి అంటారు పెద్దలు. అప్పుడు దిక్కులేని ఆ శోచనీయస్థితి చెప్పరానిది. తనకు భవిష్యత్తులో పౌత్రులతో ఆడిపాడి బ్రతికే అదృష్టం లేకపోయింది - అనే ఆవేదన ఎంతో చక్కగా ఈ పద్యంలో ఆవిష్కరించబడింది.

**ఉ. బాలుఁడ వైన నీ వరిది బంటుతనంబునఁ బ్రౌఢవీర భూ**
**పాలురఁ గుంభజ ప్రభృతి బాహుబలాఢ్యులఁ గిట్టి నేలకుం**
**గోలకుఁ దెచ్చి యి ట్లగుటకున్ వెఱఁగందుచు వంతఁ బొందుచున్**
**లోలతఁ జూడ కున్నె జనలోకము నీదగు రూపురేఖయున్. 333**

**ప్రతిపదార్థం:** బాలుఁడవు+ఐన, నీవు= చిన్నవాడవయినట్టి నీవు; అరిది+బంటుతనంబునన్= అరుదైన శౌర్యంతో; ప్రౌఢ, వీర, భూపాలురన్= నేర్పుగల శూరులైన రాజులను; కుంభజ, ప్రభృతి, బాహు, బల+ఆఢ్యులన్= ద్రోణుడు మున్నగు భుజశక్తిగల శ్రేష్ఠులను; కిట్టి= సమీపించి; నేలకున్+కోలకున్+తెచ్చి= భంగపరిచి; ఇట్లు= ఈ విధంగా; అగుటకున్= (వీరశయనం అలంకరించటానికి) కావటానికి; వెఱఁగందుచున్= ఆశ్చర్యపడుతూ; వంతన్+పొందుచున్= దుఃఖిస్తూ; నీది+అగు, రూపు రేఖయున్= నీదైన సౌందర్యం యొక్క అతిశయాన్ని; జనలోకము= జనసమూహం; లోలతన్= లోలత్వంతో; చూడకున్నె?= చూడకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** చిన్నపిల్లవాడవైన నీవు ఆశ్చర్యకరమైన శౌర్యంతో భుజబలశ్రేష్ఠులైన ద్రోణాదులను సమీపించి బాణపరంపరలతో వాళ్ళను నేలపడవైచి, వీరశయనం అలంకరించినందుకు ఆశ్చర్యపడుతూ, దుఃఖపడుతూ, నీ సౌందర్యాతిశయాన్ని జనసమూహం ఆసక్తితో చూడకుండా ఉంటుందా?

**విశేషం:** అభిమన్యుడి పరాక్రమాతిశయాన్ని గుర్తు తెచ్చుకొన్న సుభద్ర, బాలుడయినప్పటికీ అతడు చూపిన ఆశ్చర్యకరమైన ప్రతాపం ద్రోణాది మహావీరులకే చెనకరానిది అయినది. కాని, చివరకు విధి వ్యథనే మిగిల్చిందని సుభద్ర పరితాపం. 'బాలుడవైన నీవని' ఉత్పలమాలావృత్తంలో అభిమన్యుడి సౌకుమార్యాన్ని స్ఫురణకు తెచ్చే రీతిలో సుభద్ర పలికిన మాటలను తిక్కన ఎంతో చక్కగా పొందుపరచాడు. ఇందులో 'నేలకుం గోలకుఁ దెచ్చి' అనే ప్రయోగం గమనార్హం.

**తే.** **మేను మృదుశయ్య సగము నా మేనిమీఁద । సగముగాఁ జేర్చుకొని ముద్దు మిగుల నిద్ర**
**సేయునట్టి నీ విప్పుడు చెనఁటి నేలఁ । దనువు వొందుట కోర్చితే తండ్రి! చెపుమ!** **334**

**ప్రతిపదార్థం:** తండ్రి!= నాయనా అభిమన్యూ (ఆదరార్థకం); మేను= శరీరం; మృదుశయ్యన్= మెత్తని పడకపై; సగమున్= అర్ధాన్ని (సగం భాగాన్ని); నా మేనిమీఁదన్= నా శరీరంపైన; సగముగాన్+చేర్చుకొని= అర్ధభాగంగా చేర్చుకొని; ముద్దుమిగులన్= ముచ్చట మీరగా; నిద్ర+చేయు అట్టి= నిదురించే; నీవు; ఇప్పుడు= ఈ సమయంలో; చెనఁటినేలన్= కరకు నేలమీద; తనువు+పొందుటకున్= శరీరాన్ని పడవేయటం కొరకు; ఓర్చితి+ఏ= సహించినావా; చెపుమ!= చెప్పుము.

**తాత్పర్యం:** నాయనా! అభిమన్యూ! నీవు నీ శరీరం సగం మెత్తని పడకమీద, తక్కిన సగం నా శరీరం మీద చేర్చి ఎంతో ముచ్చటగా నిద్రపోయే వాడవు. ఇప్పుడు ఇచ్చట ఈ కటిక నేలమీద ఇట్లా శరీరాన్ని చేర్చటానికి ఏ విధంగా ఓర్చుకొన్నావు? చెప్పుము.

**విశేషం:** రణరంగంలో చనిపోయి, కటికి నేలమీద పడి ఉండే కుమారుడిని తలచి, చిన్నతనంలో తన ఒడిలో ఒడలు చేర్చి ఎంతో ముద్దుగా పవ్వళించి ఉండే దృశ్యాన్ని తలచుకొనింది సుభద్ర. మెత్తటి పడకమీద సగం, తన మేనిమీద సగం శరీరం చేర్చి ముద్దుగా నిద్రపోయే చిన్ననాటి సన్నివేశం గుర్తుకు వచ్చింది. వాత్సల్యానికి ఇది ఒక మచ్చు తునక. మృదుశయ్యకు చెనటి నేలకు పోలిక, చెనఁటి నేల అవటం విశేషం. అది కఠినమైన, శూన్యమైన, వ్యర్థమైన, దైవబలాన్ని కోల్పోయిన నేల. ఇట్లే చావుకూ నిద్రకూ పోలిక. నిద్ర ఒకవిధంగా చావుతో సమానమే. అందుకే చావుకు పెద్ద నిద్దురకు పర్యాయం అయింది. నిద్రలో ముఖకళ తరుగదు. అట్లే చెన్ను తరగని రీతిలో నిద్రించే వాడి మాదిరి అభిమన్యుడు పవళించి ఉన్నాడని ఇందులోని విశేషం.

**క.** **వంది జనంబులు మాగధ । బృందంబులు సంస్తుతింపఁ బెంపొందుదు మ్రో**
**లం దిరిగెడు క్రవ్యాదుల । క్రందున నీవీను లిపుడు కటకటఁ బడవే?** **335**

**ప్రతిపదార్థం:** వంది జనంబులున్= స్తుతించి జీవించే బట్టుల మొత్తాలున్నూ; మాగధ బృందంబులున్= వంశవీర్యాదులను పొగడే మాగధుల మొత్తాలున్నూ; సంస్తుతింపన్= మిక్కిలి పొగడగా; పెంపొందుదు(వు)= అతిశయించే వాడవు (వర్ధిల్లేవాడవు); ఇపుడు= ఈ సమయంలో; మ్రోలన్+తిరిగెడు= ఎదుట సంచరించే; క్రవ్యాదుల= మాంసం తినే ప్రాణుల; క్రందునన్= మ్రోతచేత; నీ వీనులు= నీ చెవులు; కటకటన్+పడవే?= కష్టపడవా?

**తాత్పర్యం:** మేలు కొలుపులతో, స్తుతిపాఠాలతో, మాగధుల సమూహాలు నిన్ను స్తుతిస్తూ ఉండగా అప్పుడు ఎంతో వర్ధిల్లేవాడవు. ఇప్పుడు నీ ఎదుట తిరుగుతూ మాంసం తినే ప్రాణులు చేసే కటువైన చప్పుడుకు నీ చెవులు ఎంత కష్టపడ్డాయో!

**విశేషం:** రాజవంశ్యులకు స్తుతిపాఠాలు పాడించుకొనటం సర్వసాధారణం. అది వారి పరంపరల్లో గౌరవ మర్యాదలతో కూడుకొన్న సంప్రదాయం. ఆచారంగా ఏర్పడి పోయిన స్తుతిపాఠాలలో ప్రత్యేకించి పొగడ్తలు ఉండకపోవచ్చును. అవి వాళ్ళకు మామూలు దినచర్య. అయినా ఆ వందిమాగధుల స్తుతులు వినటానికి ఎంతో ఇంపుగా ఉంటాయి. మనస్సుకు కొంతైనా ఇష్టాన్ని కలిగిస్తాయి కాని, శ్మశానంలో మాంసం తినటానికి వచ్చిన ప్రాణుల అరపులు ఎంత కర్ణకఠోరంగా ఉంటూ మనస్సుకు కష్టాన్ని కలిగిస్తాయో. ఈ రెండింటికీ ఉండే తారతమ్యాన్ని తిక్కన ఎంతో చక్కగా కందంలో వివరించారు. క్రవ్యం అంటే మాసం. దాన్ని తినేవాడు క్రవ్యాదుడు. క్రందు అనే శబ్దానికి దారుణమైన ధ్వని, ఏడ్పు, సందడి, అతిశయం అనే అర్థాలూ ఉన్నాయి. కటకటపడటం అంటే కోపించటం బాధపడటం కలత చెందటం. అర్థవత్పద ప్రయోగ నైపుణ్యం తిక్కన ఎరిగినంతగా మరెవ్వరికీ తెలియదనటం అతిశయోక్తి కాదు.

**చ.** **అనిలతనూజు లావు గలఁ డందురు, సాత్యకి శౌర్యశాలి నాఁ**
**జను, ద్రుపదుండు సంగరవిశారద భావము పూనియుండు, మా**
**త్స్యుని బటు విక్రమాఢ్యుఁ డని చూతురు, పాండవు లింద ఱుండి యొ**
**క్కనికిఁ గడంగ లేర నినుఁ గావఁగ; నేమన నేర్తుఁ బుత్త్రకా!** 336

**ప్రతిపదార్థం:** పుత్త్రకా!= కుమారా!; అనిలతనూజున్= భీమసేనుడిని; లావు+కలఁడు+అందురు= బలం కలవాడు అని అంటారు; సాత్యకి= సత్యకతనూజుడు; శౌర్యశాలి, నాన్+చనున్= శౌర్యంచేత ప్రకాశించేవాడు అనదగును; ద్రుపదుండు= ద్రుపద మహారాజు; సంగర, విశారద, భావము= యుద్ధంలో నేర్పరితనం; పూని ఉండున్= కలిగి ఉంటాడు; మాత్స్యునిన్= మత్స్యదేశపురాజైన విరటుడిని; పటు, విక్రమ+ఆఢ్యుఁడు+అని= మిక్కిలి పరాక్రమంచేత శ్రేష్ఠుడు అని; చూతురు= గణిస్తారు; పాండవులు+ఇందఱు+ఉండి= పాండవులు ఇంతమంది ఉండి కూడా; నినున్+కావఁగన్= నిన్ను కాపాడటానికి; ఒక్కనికిన్= ఒక్కడి కొరకు; కడంగ లేర!= ప్రయత్నించలేరా!; ఏమి+అనన్+నేర్తున్?= ఏమని చెప్పగలను?

**తాత్పర్యం:** కుమారా అభిమన్యూ! ఆ భీమసేనుడిని బలం కలవాడని అంటారు. సాత్యకిని మహాశూరు డనవచ్చును. ద్రుపదుడు యుద్ధంలో ఎంతో నేర్పరితనాన్ని కలిగి ఉంటాడు. విరాట మహారాజు అధిక పరాక్రమ శోభితుడు అని ఎన్నబడ్డాడు. ఇక ఇందరు పాండవు లుండి కూడా ఒక్క నిన్ను కాపాడటానికి ప్రయత్నమే చేయలేదా? ఏమని చెప్పేది?

**విశేషం:** భీముడి బలం, సాత్యకి శౌర్యం, ద్రుపదుడి యుద్ధనైపుణ్యం, విరాటుడి విక్రమం ఇవన్ని అంతగా ఉండి, పాండవు లెంత ప్రయత్నించినా ఒక బాలుడిని కాపాడుకొనలేకపోయారు అనే బాధ చంపకమాలావృత్తంలో ఎంతో గంభీరంగా ప్రతిపాదించబడింది. 'ఒక్కనికి' అనే ప్రయోగంలోని విరుపు చివుక్కుమనిపించి శత్రువుల చేతులలో చిక్కుకొని పోయిన అభిమన్యుడి దురవస్థను సూచిస్తున్నది.

**సీ.** **ఈలోక మెల్లఁ బాడిల్లును బోలెనై । యున్నది నీవు లేకునికిఁ జేసి;**
**నీవు వేగమ గండు నెఱసి బంధులఁ బ్రీతిఁ । బొందఁ జేయుట గలవోలె నయ్యెఁ;**
**జిష్ణుని కొడుకవు కృష్ణునల్లుండ వీ । వరులచేఁ బడుట చోద్యంబు గాదె!**
**చెలువంపు మేనును జెన్ను మొగంబునై । యెప్పుడు పొడసూపె దింకఁ గుఱ్ఱ?**

**తే.** **యకట! యుత్తర యొప్పెడు నది మనంబు । దీని కెంతయు మెత్తన; యేను నిన్ను**
**వేఁడికొనియెద! వచ్చి యివ్వేలఁది వంత । దీపి దళుకొత్తుపలుకులఁ దేర్ప వన్న!** 337

**ప్రతిపదార్థం:** కుఱ్ఱ!= బాలుడా!; నీవు, లేక+ఉనికిన్+చేసి= నీవు లేకుండటం చేత; ఈ లోకము+ఎల్లన్= ఈ ప్రపంచమంతా; పాడు+ఇల్లును+పోలెన్+ఐ+ఉన్నది= శూన్య గృహం మాదిరి అయి ఉన్నది; నీవు= నీవు(అభిమన్యుడు); వేగమ= తొందరగా; గండు నెఱపి= శౌర్యాన్ని ప్రకటించి (నింపి); బంధులన్= చుట్టాలను; ప్రీతిన్+పొందన్+చేయుట= సంతోషాన్ని కలుగజేయటం; కలవోలెన్+అయ్యెన్= స్వప్నంవలె అయిపోయింది; జిష్ణుని కొడుకవు= అర్జునుడి కుమారుడవు; కృష్ణు+అల్లుండవు= కృష్ణుడికి మేనల్లుడవు; ఈవు= నీవు; అరులచేన్+పడుట= శత్రువుల చేతిలో చావటం; చోద్యంబు కాదె!= వింతకాదా!; చెలువంపు మేనును= సుందరమైన శరీరమూ; చెన్ను మొగంబునున్= అందమైన ముఖమూ; ఐ= కలిగి; ఇంకన్= ఇంకా; ఎప్పుడు= ఎపుడు; పొడ చూపెదు= కనిపిస్తావు; అకట!= అయ్యో!; ఉత్తర= నీ భార్య ఉత్తర; ఒప్పెడునది= యోగ్యురాలు (సమ్మతిస్తుంది); దీనికిన్= ఈ ఉత్తరకు; ఎంతయున్= మిక్కిలి; మనంబు, మెత్తన= హృదయం మృదువు; ఏను= నేను; నిన్నున్= నిన్ను; వేఁడుకొనియెదన్= ప్రార్థిస్తాను; వచ్చి= (పోయిన నీవు మళ్ళీ ఒకసారి) వచ్చి; ఈ+వెలఁది, వంతన్= ఈ ఇంతి (నీ భార్య) దుఃఖాన్ని; తీపి+తళుకు+ఒత్తుపలుకులన్= మాధుర్యం అతిశయించే మాటలతో; తీర్పవు+అన్న!= ఊరడించవా!

**తాత్పర్యం:** అభిమన్యూ! నీవు లేకపోవటం చేత ఈ ప్రపంచమంతా పాడుపడ్డ ఇల్లువలె అయిపోయింది. నీవు నీ శౌర్యాన్ని నింపి చుట్టాలను సంతోషింప జేసినదంతా ఒక స్వప్నం మాదిరి అయిపోయింది. అర్జునుడి కుమారుడవూ, కృష్ణుడి మేనల్లుడవూ అయి ఉండీ నీవు శత్రువుల చేత చావటం ఎంతో వింతగా ఉన్నది. నీవు సుందర శరీరంతో అందమైన ముఖంతో ఇంకెప్పుడు కనిపిస్తావో! అయ్యో! నీ భార్య ఉత్తరను చూడుము. ఎంతో మెత్తని మనస్సు కల నీ ఇల్లాలి దుఃఖాన్ని నీ తీపి మాటలతో తీర్చటానికి ఒకసారి వచ్చి పో - అని నేను వేడుకొంటున్నాను. ఇట్లా వచ్చిపోతే ఆమె మనస్సు కూడా కొంత కుదురుపాటులో సమ్మతి పడుతుంది. ఆమె ఎంతో యోగ్యురాలు.

**విశేషం:** కోడలు కొరకైనా ఒకసారి వచ్చిపో - అని కొడుకును సుభద్ర వేడుకొనటం ఇందులోని విశేషం. ఎందుకు వచ్చిపో అని అర్థిస్తూ ఉందో దానికి కారణం కూడా చెప్పటం జరిగింది. 'మనంబు దీనికెంతయు మెత్తన' అని చెప్పటంలో కోడలి మనస్తత్వాన్ని అత్త ఎంతగా అర్థం చేసికొన్నదో విదితమౌతుంది. 'ఒప్పెడునది' అనే ప్రయోగం ఉత్తర యోగ్యురాలు అనే కాకుండా ఒక్కసారి నీవు వస్తే, మధురవాక్యాలతో ఊరడిస్తే ఆమె మనస్సు సమ్మతించి సమాధానపడుతుంది, అది ఎంతైనా సముచితంగా ఉంటుంది అని ఎన్నో విధాలుగా అర్థాన్ని చెప్పుకోవటానికి అనుకూలంగా కూర్చబడింది. జిష్ణుడి కొడుకవు అని తెల్పటంలో జయశీలుడైన అర్జునుడి కొడుకు వైన నీకు అపజయం ఎట్లా కలుగుతుంది? అట్లా జరగటం ఎంత వైపరీత్యం! అది నిజంగా ఎంత వింత? అని సాభిప్రాయంగా జిష్ణుశబ్దాన్ని తిక్కన ప్రయోగించాడు.

**చ.** **అలఘు తపంబులం, బ్రకట యాగములన్ మునిచోదిత వ్రతం**
**బుల మహనీయదానములఁ బుణ్య చరిత్రములన్ మహాత్ము లెం**
**తలు రమణీయ విశ్రుత పదంబుల కేఁగుదు; రంతకంటె ను**
**జ్జ్వల మగు సద్గతిం బడయు వాసవపౌత్ర! పవిత్రవర్తనా!'** **338**

**ప్రతిపదార్థం:** వాసవపౌత్ర!= ఇంద్రుడి మనవడివైన అభిమన్యూ!; పవిత్రవర్తనా!= పరిశుద్ధమైన (నిర్మలమైన) నడవడి కలవాడా!; అలఘు+తపంబులన్= గొప్ప తపస్సుల చేతనూ; ప్రకట యాగములన్= ప్రసిద్ధాలైన యాగాల చేతనూ; ముని,చోదిత, వ్రతంబులన్= మహర్షులు చెప్పిన నోముల చేతనూ; మహనీయదానములన్= గొప్పదానాల (ఈవుల) చేతనూ; పుణ్యాచరిత్రములన్= పవిత్రములైన నడవడుల చేతనూ; మహాత్ములు= మహనీయులు; ఎంతలు= ఎటువంటి; రమణీయ, విశ్రుత, పదంబులకున్= రమ్యమయి ప్రసిద్ధికెక్కిన సద్గతులకు; ఏఁగుదురు= పోవుదురో; అంతకంటెన్= వాటి అన్నింటికంటె; ఉజ్జ్వలము+అగు= శ్రేష్ఠమైనదైన; సద్గతిన్= ఉత్తమగతిని; పడయు= పొందుము.

**తాత్పర్యం:** ఇంద్రుడి మనుమడవైన ఓ అభిమన్యూ! పరిశుద్ధమైన నడవడి కలవాడా! గొప్ప గొప్ప తపస్సులచేత, ప్రసిద్ధ యాగాలచేత, మహర్షులు చెప్పిన నోములచేత, గొప్పదానాల చేత, పవిత్ర ప్రవర్తనల చేత మహాత్ములు ఎటువంటి రమ్యమైన, ప్రసిద్ధమైన ఉత్తమగతులు పొందారో, వాటికంటె ఉజ్జ్వలమైన (శ్రేష్ఠతమమైన) ఉత్తమ గతిని పొందుము.'

**విశేషం:** వాసవపౌత్ర! పవిత్రవర్తనా! అనే రెండు సంబోధనలు ప్రస్తుత పద్యంలో ప్రతిపాదించబడ్డ విషయానికి ఎంతో అనుగుణంగా ఔచిత్య స్ఫోరకంగా అతికాయి. సాభిప్రాయాలైన సంబోధనలను కూర్చటంలో తిక్కన అక్కడక్కడ చూపిన నేర్పు అప్రతిమానం. పరలోకగతుడైన అభిమన్యుడు ఇహలోకాన్ని వదలి వెళ్ళాడు. మళ్ళీ ఈ మహీతలానికి మనం ఎంత పిలిచి మొత్తుకొన్నా రాడు. ఇహంతో సంబంధం తెగిపోయింది. పరంతో సంబంధం కుదురుకొనింది. స్వర్గలోక సంబంధాన్ని పురస్కరించుకొని 'వాసవపౌత్ర' అని సంబోధించటం చాలా అర్థవంతంగా ఉన్నది.

అట్లాగే ఇందులో తపస్సులూ, యాగాలూ, వ్రతాలూ, దానాలు చెప్పుతూ 'పుణ్యచరిత్రములన్' అనే ఒక విశేషణాన్ని తిక్కన పేర్కొన్నాడు. పుణ్యచరిత్రము లనగా 'పవిత్ర వర్తనలు'. అందుకే సంబోధనలో తిక్కన 'పవిత్రవర్తనా' అని సుభద్రనోట పలికించాడు.

**వ. అని బహుప్రకారంబులం బలవించుచున్న సమయంబునం బాంచాలి యేతెంచి యిరుగేల నుత్తరా సుభద్రలం బొదివి, తానును వారును నడలూని పుడమిం బడి వివశతం బొంది వికలాక్రందనంబు సేయుచున్న నన్నారాయణుండును శోకసంతాపితాంతఃకరణుం డగుచు నుచితవచనంబుల నయ్యువిదల నెట్టకేలకు నూరార్చి, మగుడి పాండవులపాలికిం జనుదెంచె; నప్పుడు ధర్మతనయుం డమ్మాధవ ధనంజయులను భీమసేనునిం గవలను నితరపరిజనంబులను నిజనివాసంబులకుం బోవం బనిచి, తాను నభ్యంతర మందిరంబునకు నరిగె; గృష్ణుండును జిష్ణుతోన తదీయసదనంబునకుం జని, విమల జలంబులం గృతాచమనుం డయి యొక్క వివిక్త ప్రదేశంబునం దర్భశయ్య గావించి దాని నక్షతగంధపుష్పంబుల నలంకరించి యాయుధంబు లర్చించి, చుట్టు నిడి, కవ్వడి నందుండు మని నియోగించి 'నీవు నిశాసమయంబునం జేయు దేవపూజ యింతకు మున్న చేయ వని తలంపించిన నతండును బాదప్రక్షాళనంబు నుపస్పర్శనంబును నాచరించి, తాను నిత్యంబును నడపు త్ర్యంబక పూజనంబు తెఱంగున మాల్యానులేపన ధూప దీప నైవేద్యంబు జనార్దనునకు సమర్పించిన, నమ్మహాత్ముండు సంభావించి యాప్తులగు దౌవారికజనంబుల శస్త్రహస్తులై కొలిచి యుండునట్లుగా సంఘటించి, యా సవ్యసాచిం జూచి, నీవు సుఖనిద్ర సేయు; మేన నీకు శుభంబు గోరి యుండెదఁ; బోయి వచ్చెద' నని పలికి దారుకుండు దోడ నరుగ నాత్మగేహంబునకుం బోయి.** **339**

**ప్రతిపదార్థం:** అని= అట్లా పలికి; బహుప్రకారంబులన్= అనేక విధాలుగా; పలవించుచున్న= దుఃఖిస్తూ ఉన్న; సమయంబునన్= సందర్భంలో; పాంచాలి= ద్రౌపది; ఏతెంచి= వచ్చి; ఇరు కేలన్= రెండు చేతులతో; ఉత్తరా సుభద్రలన్= ఉత్తరను, సుభద్రను; పొదివి= చేరదీసికొని పట్టుకొని; తానును= ఆ పాంచాలియు; వారునున్= ఆ ఉత్తరాసుభద్రలున్నూ; అడలు+ఊని= దుఃఖించి; పుడమిన్+పడి= నేలపై పడి; వివశతన్+పొంది= మూర్ఛిల్లి; వికల+ఆక్రందనంబు= కలవరించే ఏడ్పుల అరపు; చేయుచున్నన్= కావిస్తూ ఉండగా; ఆ+నారాయణుండును= ఆ శ్రీకృష్ణుడును; శోక+సంతాపిత+అంతఃకరణుండు= దుఃఖంచేత మిక్కిలి తపించబడ్డ మనస్సు కలవాడు; అగుచున్= అవుతూ; ఉచితవచనంబులన్= తగిన మాటలతో; ఆ+ఉవిదలన్= ఆ స్త్రీలను; ఎట్టకేలకున్= చిట్టచివరకు; ఊరార్చి= ఊరడించి; మగుడి= మళ్ళీ; పాండవుల పాలికిన్= పాండవుల కడకు; చనుదెంచెన్= వచ్చాడు; అప్పుడు= ఆ సమయంలో; ధర్మతనయుండు= ధర్మరాజు; ఆ, మాధవ ధనంజయులనున్= ఆ కృష్ణార్జునులను; భీమసేనునిన్= భీముడిని; కవలనున్= అమడలైన నకుల సహదేవులను; ఇతర పరిజనంబులన్= తక్కిన పరివారాన్ని (బలగాన్ని); నిజనివాసంబులకున్=

తమ విడిది గృహాలకు; పోవన్+పనిచి= పోయేటట్లు (ఆజ్ఞాపించి) పంపి; తానును= తానున్నూ; అభ్యంతరమందిరంబునకున్= లోపలి గృహానికి; అరిగెన్= పోయాడు; కృష్ణుండును= కృష్ణుడున్నూ; జిష్ణుతోన్+అ= అర్జునుడితోనే; తదీయ, సదనంబునకున్+చని= అతడిఇంటికి పోయి; విమలజలంబులన్= నిర్మలమైన నీటితో; కృత+ఆచమనుండు+అయి= ఆచమనం చేసినవాడై; ఒక్క, వివిక్త ప్రదేశంబునన్= ఒక ఏకాంతస్థలంలో; దర్భశయ్య కావించి= దర్భలతో పడకచేసి; దానిన్, ఆ పడకను; అక్షత, గంధ, పుష్పంబులన్= సేసబ్రాలు (పసుపుగాని కుంకుమగాని రాచిన బియ్యం) గంధమూ, పూలతో; అలంకరించి= సింగారించి (క్రైసేసి); ఆయుధంబులు+అర్చించి= శస్త్రాలను పూజించి; చుట్టున్+ఇడి= చుట్టూ ఉంచి; కవ్వడిన్= అర్జునుడిని; అందున్+ఉండుము= అక్కడే ఉండుము; అని, నియోగించి= అని ఆజ్ఞాపించి (కోరి); నీవు; నిశాసమయంబున్= రాత్రిపూట; చేయు+దేవపూజ= చేసే దైవసేవ; ఇంతకుమున్న= ఇంతకుముందే; చేయవని= నిర్వర్తించవని; తలంపించినన్= తలచేటట్లు చేయగా; అతండును+ఆ అర్జునుడున్నూ; పాదప్రక్షాళనంబున్= కాళ్ళు కడుగుకోవటం; ఉపస్పర్శనంబునున్= ఆచమనమున్నూ; ఆచరించి= చేసి; తాను= తాను; నిత్యంబును= ప్రతిదినమున్నూ; నడపు= నిర్వర్తించే; త్ర్యంబక పూజనంబు, తెఱంగునన్= శివపూజ వలె; మాల్య+అనులేపన, ధూప, దీప, నైవేద్యంబు= దండలూ, పూతలూ(గంధాదులు) (అగరుబత్తి) సాంబ్రాణి పొగలూ, దీపాలూ, నివేదింపదగిన వస్తువూ; జనార్దనునకున్= శ్రీకృష్ణుడికి; సమర్పించినన్= సమర్పించగా; ఆ+మహాత్ముండు= మహనీయుడైన ఆ కృష్ణుడు; సంభావించి= సమ్మానించి; ఆప్తులు+అగు= క్షేమం కోరేవాళ్ళయిన; దౌవారిక జనంబులన్= ద్వారపాలకులను; శస్త్రహస్తులు+ఐ= ఆయుధాలు చేత ధరించినవారై; కొలిచి+ఉండునట్లుగాన్= సేవించి ఉండేటట్లుగా; సంఘటించి= ఏర్పాటు చేసి; ఆ+సవ్యసాచిన్= ఆ అర్జునుడిని; చూచి= కనుగొని; నీవు; సుఖనిద్ర+చేయుము= సుఖంగా నిద్రించుము; ఏన= నేనే; నీకున్+శుభంబున్+కోరి+ఉండెదన్= నీకు మేలుకోరి ఉంటాను; పోయి+వచ్చెదన్= పోయి వస్తాను; అని+పలికి= అని చెప్పి; దారుకుండు= తన రథసారథి అయిన దారుకుడు; తోడన్= తనతోకూడా; అరుగన్= రాగా; ఆత్మ గేహంబునకున్= తనయొక్క ఇంటికి(శిబిరానికి); పోయి= చని.

**తాత్పర్యం:** అని పలురకాలుగా శోకిస్తున్న సమయంలో ద్రౌపది వచ్చి, రెండు చేతులతో ఉత్తరాసుభద్రలను కౌగిలించుకొని, తాను కూడా వారితో కలిసి నేలపైబడి మూర్ఛిల్లి గుండెలు పగిలేటట్లు రోదిస్తూ ఉండగా, శ్రీకృష్ణుడు కూడ శోకంతో తపించే మనస్సుతో చలించి కూడా తేరుకొని, తగిన మాటలతో ఆ వనితలను చిట్టచివరకు ఓదార్చి, తిరిగి పాండవుల వద్దకు వచ్చాడు. అప్పుడు ధర్మరాజు అందరినీ వారి వారి నివాసాలకు పంపి, తాను తన మందిరానికి వెళ్ళాడు. కృష్ణుడు అర్జునుడితో కలిసి అతడి మందిరానికి వెళ్ళి, మంచినీటితో ఆచమనం చేసి, ఒక ఏకాంత స్థలంలో దర్భశయ్య ఏర్పాటు చేసి, దానిని అక్షతలతో గంధ పుష్పాదులతో అలంకరించి, ఆయుధాలను పూజించి, చుట్టూ ఉంచి, అర్జునుడిని అక్కడ ఉండుమని ఆజ్ఞాపించి, 'నీవు రాత్రివేళ చేసే దైవపూజ ఇంతకుముందు చేయలే'దని హెచ్చరించి, చేసేటట్లు స్ఫూర్తిని కలిగించాడు. దానితో అర్జునుడు కూడా పాదాలు కడుగుకొని, ఆచమించి, తాను రోజూ చేసే త్ర్యంబకపూజను శ్రీకృష్ణుడికే షోడశోపచారాలతో చేశాడు. శ్రీకృష్ణుడు అర్జునుడిని సమ్మానించి, శస్త్రపాణులైన భటులను అతడికి రక్షగా నిలిపి, అర్జునుడిని సుఖనిద్ర పొమ్మని, అతడి శుభం కోరి తాను మసలేటట్లు చెప్పి, దారుకుడిని వెంటపెట్టుకొని తన నివాసానికి వెళ్ళాడు.

**ఆ. సెజ్జయందు మేను సేర్చి యర్జునకార్య । చింతఁ బలుకకుండి కొంతవడికిఁ**
**బవ్వళించెఁ గురునృపాలక! జలశాయి । దారుకుండు గొలిచి యూరకుండ. 340**

**ప్రతిపదార్థం:** కురునృపాలక!= కురురాజా!; ధృతరాష్ట్రా!; జలశాయి= శ్రీకృష్ణుడు; సెజ్జఅందున్= పక్కమీద; మేను= శరీరాన్ని; చేర్చి= ఉంచి-పరుండి; అర్జునకార్యచింతన్= అర్జునుడి పనిని గురించిన ఆలోచనతో; పలుకక+ఉండి= మాట్లాడకుండ ఊరకుండి; కొంతవడికిన్= కొంతసేపటికి; దారుకుండు= సారథి; కొలిచి= సేవిస్తూ; ఊరక+ఉండన్= మిన్నకుండా (నిశ్శబ్దంగా) వేచి ఉండగా; పవ్వళించెన్= పడుకొన్నాడు (నిద్రించాడు).

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! శ్రీకృష్ణుడు పక్కమీద మేనువాల్చి అర్జునుడి ప్రతిజ్ఞను తీర్చేపనిని గురించి ఆలోచిస్తూ నిశ్శబ్దంగా ఉండి కొంతసేపటికి నిద్రపోయాడు. సారథి ఊరక ప్రక్కన నిలబడి ఆతడిని సేవిస్తూ ఉండిపోయాడు.

**వ. ఆ సమయంబున నవ్వీటివా రెల్లను దమయుల్లంబుల నెవ్వగలు నివ్వటిల్లం గన్నుమూయక విన్ననయి యుండి. 341**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ సందర్భంలో; ఆ+వీటివారు+ఎల్లను= ఆ దండు (శిబిరం)లోని వాళ్ళంతా; తమ+ఉల్లంబులన్= తమ మనస్సులలో; నెవ్వగలు= అధిక విచారం; నివ్వటిల్లన్= కలుగగా (నిండుకోగా); కన్నుమూయక= నిద్రించకుండా; విన్ననయి+ఉండి= చిన్నబోయి ఉండి.

**తాత్పర్యం:** అప్పుడు ఆ శిబిరంలోని వారందరూ తమ మనస్సులలో పెద్ద దిగులు పెరగగా నిద్రపట్టక చిన్నబోయి ఉండి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'అభిమన్యుఁ డీల్గిన నర్జునుఁ డధిక శో । కావేశ మొంది సాహసికవృత్తి**
**నతి దుర్ఘటం బైన ప్రతిన యిట్టులు పట్టు । నే? కౌరవులు దీని నెట్టు లైనఁ**
**దప్పింపఁ జూతురు; దర్పంబు వెరవును । గలవారు వారి కగ్గలము గలరు;**
**కడు దెప్పరం బైన కార్యంబు వాటిల్లె; । నెమ్మెయి నిది నిర్వహించువాఁడొ**

**ఆ. యకట! దినములోన నాసైంధవునిఁ జంప । నబ్బకున్న నతని కగ్ని సొరఁగ**
**వలయు; నాతఁ డనృతవాదిగాఁ; డిక్కార్య । మెట్టు లగునొ! మనకు నేది గతియొ!' 342**

**ప్రతిపదార్థం:** అభిమన్యుఁడు; ఈల్గినన్= మరణించగా; అర్జునుఁడు; అధిక, శోక+ఆవేశము+ఒంది= మిక్కిలి దుఃఖంతో ఒడలు మరచిన స్థితిని పొంది; సాహసికవృత్తిన్= తెగువ కలవాడి నడవడితో; అతి+దుర్ఘటంబు+ఐన= మిక్కిలి ఘటించటానికి వీలుకానిదైన; ప్రతిన= ప్రతిజ్ఞ; ఇట్టులు+పట్టునే?= ఈ విధంగా పూనునా?; దీనిన్= ఈ ప్రతిజ్ఞను; కౌరవులు= దుర్యోధనాదులు; ఎట్టులు+ఐనన్= ఏ విధంగానైనా; తప్పింపన్= తప్పిపోయేటట్లు(ప్రతికూలమయ్యేటట్లు); చూతురు= చూస్తారు (ఆలోచిస్తారు); వారికిన్= ఆ కౌరవులకు; దర్పంబు= గర్వం; వెరవును= ఉపాయమున్నూ; కలవారు= ఉన్నవారు; అగ్గలము కలరు= అధికంగా (మిక్కుటంగా) ఉన్నారు; కడు+దెప్పరంబు+ఐన= మిక్కిలి అశక్యమైన; కార్యంబు+పాటిల్లెన్= పని కలిగింది; ఇది= ఈ పని; ఏ+మెయిన్= ఏ విధంగా; నిర్వహించువాడొ!= నెరవేరుస్తాడో!; అకట!= అయ్యో!; ఆ సైంధవునిన్= ఆ సైంధవుడిని; దినములోనన్= ఒక్కదినం లోపల; చంపన్+అబ్బక+ఉన్నన్= చంపటం ఈడేరకపోతే; అతనికిన్= అర్జునుడికి; అగ్ని+చొరఁగన్+వలయున్= అగ్నిలో ప్రవేశించవలసి ఉన్నది; ఆతఁడు= అర్జునుడు; అనృతవాది+కాఁడు= అసత్యం పలికేవాడు కాడు; ఆ+కార్యము= ఆ ప్రతిజ్ఞా కార్యం; ఎట్టులు+అగునొ?= ఎట్లా ఔతుందో!; మనకున్= మనకు; ఏది గతియో!= ఏది ఉపాయమో! (మార్గమో!).

**తాత్పర్యం:** 'అభిమన్యుడు మరణించగానే అర్జునుడు దుఃఖంతో ఒళ్ళు మరచి, తెగువరి అయి సాధించటానికి వీలుకాని ప్రతిజ్ఞ చేశాడు. కౌరవులు ఈ ప్రతిజ్ఞను ఎట్లాగైనా వమ్ముచేయటానికి చూస్తారు. ఆ కౌరవులలో గర్వం, ఉపాయం ఉన్నవాళ్ళు మిక్కుటంగా ఉన్నారు. ఇది శక్యం కాని పని; ఏ విధంగా దీన్ని నెరవేర్చటమో. అయ్యో! ఆ సైంధవుడిని ఇంక ఒక్క దినంలో చంపలేకపోతే అర్జునుడు అగ్నిలో ప్రవేశించాలి. అతడు అసత్యవాది కాడు. ఈ పని ఎట్లా అవుతుందో? మన గతి ఏమిటో?'

**విశేషం:** జలశాయి అయిన కృష్ణుడు పవళించిన అనంతరం ఊరివారంతా అభిమన్యుడి మరణానికి కన్నుమూయలేదు. అభిమన్యుడి మరణానంతరం క్రమంగా జరుగబోయే అనర్థాలు ఏ విధంగా ఉంటాయో అని ఊరివారు భావించిన తీరు సీసపద్యంలో అభివర్ణితం. అభిమన్యుడి మృతికి తగినట్లుగ, అర్జునుడు చేసిన ప్రతిజ్ఞ సామాన్యమైనది కాదు. అర్జున ప్రతిజ్ఞ విని కౌరవులు ఊరకుండరు. ఏ విధంగానైనా ప్రతిజ్ఞకు ప్రతికూల కార్యక్రమాలు ఎంతో ప్రతిభావంతంగా చేపడుతారు. అర్జునుడు సైంధవుడిని చంపటానికి అవకాశం ఏర్పడకపోతే తానే అగ్నిలో ప్రవేశిస్తానని అంటున్నాడు. సత్య నిర్వహణలో అర్జునుడు అన్న ధర్మరాజు కన్నా తక్కువ వాడు కాడు. అనృతవాది కాని అర్జునుడి పరిస్థితి మరి ఎట్లో అని పౌరులు భావించిన విధానం గమనార్హం. పౌరుల అభిప్రాయాలను వెల్లడించటానికి అనువుగా ఇక్కడ తిక్కన సీసపద్యాన్ని ప్రవేశపెట్టటం ఆయన శిల్పదృష్టికి నిదర్శనం.

**వ. అని వెండియు. 343**

**తాత్పర్యం:** అని మఱియు.

**క. 'మన చేసిన సుకృతంబుల । వినుతఫలము లెల్ల నెల్లి వివ్వచ్చుఁడు సిం**
**ధునరేంద్రుఁ జంపునట్లుగ । నొనరి యొదవవలయు' నని దృఢోక్తిఁ బలుకుచున్. 344**

**ప్రతిపదార్థం:** వివ్వచ్చుఁడు= అర్జునుడు; సింధునరేంద్రున్= సైంధవుడిని; చంపు అట్లుగన్= సంహరించేటట్లుగా; మన, చేసిన, సుకృతంబుల= మనం పూర్వం చేసిన పుణ్యకార్యాల; వినుతఫలములు+ఎల్లన్= పొగడబడే ఫలితములు అన్నీ; ఎల్లి= రేపు; ఒనరి= అనుకూలించి; ఒదవ వలయున్+అని= సిద్ధించాలి అని; దృఢ+ఉక్తిన్= గట్టి మాటగా; పలుకుచున్= పలుకుతూ.

**తాత్పర్యం:** 'మనం పూర్వం చేసికొన్న పుణ్యకార్యాల ఫలమంతా రేపు అర్జునుడు సైంధవుడిని చంపేటట్లుగా అనుకూలించి సిద్ధించాలి' అని మిక్కిలి గట్టిగా చెప్పుతూ.

**విశేషం:** అర్జునుడు సైంధవుడిని సంహరించాలంటే మన పుణ్యకార్య ఫలాలన్నీ పండి అనుకూలించి రేపే సిద్ధించవలసి ఉన్నది. అర్జునుడి సుకృతం అటుంచి ముందు మన సుకృతాలు ఫలించాలి అని గట్టిగా అందరూ వక్కాణించారు. 'మనం బ్రతికి బయటపడాలంటే సైంధవుడు చచ్చితీరాలి' అని వారి అభిప్రాయం. పౌరులందరు తమ సుకృతాలు ఫలించటానికి సైంధవుడి వధ అవశ్యం జరిగి తీరవలసిందే అని భావించిన తీరును తిక్కన చక్కని కందంలో స్పష్టీకరించాడు.

**ఆ. అగ్రపుస్తకంబు లర్చించి చూచుచుఁ । బరమ నియతిమై నుపశ్రుతులకుఁ**
**బోవుచును శుభంబు లావహించుటఁ గాంచి । చెలఁగి యొండొరులకుఁ జెప్పికొనుచు. 345**

**ప్రతిపదార్థం:** అగ్రపుస్తకములు= అతి ముఖ్యములైన గ్రంథాలు; అర్చించి= పూజించి; చూచుచున్= చూస్తూ (ఆలోచిస్తూ); పరమ+నియతిమైన్= శ్రేష్ఠమైన నియమంతో; ఉపశ్రుతులకున్= శుభాశుభ సూచకాలైన ఇతరుల సంభాషణలను వినుటకు; పోవుచును= వెళ్ళుతూ; శుభంబులు= మేళ్ళు; ఆవహించుటన్= కలుగుటను; కాంచి= చూచి; చెలఁగి= సంతోషించి; ఒండొరులకున్= ఒకరికొకరు; చెప్పికొనుచున్= చెప్పికొంటూ.

**తాత్పర్యం:** శుభప్రదాలైన అతిముఖ్య గ్రంథాలను పూజించి చూస్తూ, ఎంతో నిష్ఠతో శుభాశుభ సూచకాలైన ఇతరుల సంభాషణలను వినటానికి వెళ్ళుతూ, శుభాలు కలగటం చూచి, సంతోషించి ఒకరి కొకరు చెప్పుకొంటూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** సంకట పరిస్థితులు ఏర్పడ్డప్పుడు సందేహ నివారణకో లేక సత్ఫల సంసిద్ధికో, శుభాశుభాలను నిర్దేశించే అతి ముఖ్య గ్రంథాలను పరిశీలించటం, వాటిని అర్చిస్తే శుభాలు కలుగుతాయి అని భావించటం ఒక సంప్రదాయంగా కనిపిస్తూ ఉన్నది.

భవిష్యత్తులో జరుగబోయే శుభాశుభాలకు సంబంధించి ముందుగానే కొన్ని సూచనలు గ్రహించటం అనేది కూడా పూర్వం మన పెద్దలు పాటించారు. వీటినే వాళ్ళు ఉపశ్రుతులు అన్నారు.

**క. 'గురునట్టివారు పదివే । వురు గాచిన నెల్లి సైంధవుని పగలిటిలోఁ**
**పొరిగొనునట్లుగ నరునకు । వరమిండీ వేల్పులార! వారని కరుణన్.' 346**

**ప్రతిపదార్థం:** వేల్పులార!= ఓ దేవతలారా!; వారని కరుణన్= ఉడుగని దయతో; గురు+అట్టివారు= ద్రోణాచార్యునంతటి వాళ్ళు; పదివేవురు= పదివేలమంది; కాచినన్= కాపాడినా; ఎల్లి= రేపు; పగలిటిలోన్= పగటిలోపలనే; సైంధవునిన్= సైంధవుడిని; పొరిగొనునట్లుగన్= చంపునట్లుగా; నరునకున్= అర్జునుడికి; వరము+ఇండీ= వరం ఈయండి.

**తాత్పర్యం:** 'ఓ దేవతలారా! పదివేలమంది ద్రోణాచార్యు నంతటివాళ్ళు వచ్చి కాపాడినప్పటికీ, రేపు పగటి పూటనే సైంధవుడిని చంపేటట్లు అపారకరుణతో అర్జునుడికి వరమీయండి.'

**వ. అని ప్రార్థించుచు దైవంబుల కేటికోళ్ళు నిరూపించుచు మఱియు బహుప్రకారంబులం బలుకుచుండిరి; రాత్రి సాలం జనిన మేలుకని దామోదరుండు దారుకు నాలోకించి. 347**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; ప్రార్థించుచున్= ప్రార్థన చేస్తూ; దైవంబులకున్= దేవతలకు; ఏటికోళ్ళు= నమస్కారాలు; నిరూపించుచున్= ఆచరిస్తూ; మఱియున్= ఇంకా; బహుప్రకారంబులన్= అనేకవిధాలుగా; పలుకుచుండిరి= మాటాడుతూ ఉన్నారు; రాత్రి+చాలన్+చనినన్= రాత్రి చాలాకాలం గడిచిపోగా; దామోదరుండు= శ్రీకృష్ణుడు; మేలుకని= మేల్కాంచి; దారుకున్= రథసారథి అయిన దారుకుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని ప్రార్థనలు చేస్తూ దేవతలకు మ్రొక్కులు మ్రొక్కుకొంటూ అనేకవిధాలుగా మాట్లాడుకొంటూ రాత్రి చాలాసేపు గడిపారు. అప్పుడు శ్రీకృష్ణుడు మేలుకొని దారుకుడిని చూచి (తరువాతి పద్యంతో అన్వయం).

**శ్రీకృష్ణుఁడు దారుకుతో అర్జును ప్రతిజ్ఞా విషయంబులైన వాక్యంబులం గొన్ని సెప్పుట (సం. 7-56-27)**

**చ. 'నరుఁ డిటు లాడునే నృపగణంబు వినంగ? జయింపవచ్చునే**
**గురుకురు సేనలం దరణి గ్రుంకక మున్న తలంపఁ జాల దు**
**స్తర మిది యాతఁ డీ ప్రతిన దప్పకయుండఁగ దీర్చునట్టుగాఁ**
**బొరయక యున్న దుర్దశలఁ బొందనె పాయని నిందఁ గుందనే! 348**

**ప్రతిపదార్థం:** నృపగణంబు= రాజసమూహం; వినంగన్= వింటూ ఉండగా; ఇటులు= ఈ విధంగా; నరుఁడు= అర్జునుడు; ఆడునే!= (ప్రతిజ్ఞావాక్యాలు) మాటాడునే!; తరణి= సూర్యుడు; క్రుంకక+మున్నె= అస్తమించకముందే; గురు, కురు, సేనలన్= గొప్ప కౌరవ సైన్యాలను; జయింపవచ్చునే!= గెలువటానికి అవుతుందా!; తలంపన్+చాలన్= ఊహించలేకున్నాను; ఇది+దుస్తరము= ఇది కష్టం; ఆతఁడు= అర్జునుడు; ఈ+ప్రతిన= ఈ ప్రతిజ్ఞ; తప్పక+ఉండఁగన్= తప్పకుండా; తీర్చునట్లుగాన్= నెరవేర్చేటట్లుగా; పొరయక ఉన్నన్= కలిగించకుండా ఉంటే; దుర్దశలన్= దురదృష్టాలను; పొందనె?= పొందకుండా ఉంటానా?; పాయని, నిందన్= శాశ్వతమైన నిందతో; కుందనే!= బాధపడనా!

**తాత్పర్యం:** అందరు రాజులు వింటూ ఉండగా అర్జునుడు ఆ విధంగా ప్రతిజ్ఞ చేశాడు. సూర్యుడస్తమించక ముందే గొప్ప కౌరవసైన్యాలను జయించటానికి వీలవుతుందా? ఏమో! ఊహించలేకున్నాను. ఇది తరించరానిది. ఆ అర్జునుడు

ఈ ప్రతిజ్ఞను తప్పకుండా నెరవేర్చేటట్లు చూడాలి. అలా నేను చేయకపోతే దుస్థితుల పాలుకానా? శాశ్వతమైన నింద పడనా?

**విశేషం:** తరింపచేసేవాడు తరణి. అతడు అస్తమించేలోపుగా అర్జునుడి ప్రతిజ్ఞ నెరవేరటం అంత సులువు కాదు. అది దుస్తరం. ఇక్కడ తిక్కన దుస్తరమనే ప్రయోగాన్ని ఛందోనుగుణంగా విరిచి చెప్పటంలో ఎంతో మహార్థస్ఫూర్తి వ్యంగ్య ప్రాయంగా సూచించబడింది. 'అర్జునుడి ప్రతిజ్ఞ నెరవేరకపోతే నింద అతడికి కాదు, నాకు కలుగుతుంది' అని దారుకుడితో శ్రీకృష్ణుడు వివరించిన విషయం చంపకమాలావృత్తంలో నిబంధించబడింది. 'నరుఁ డిటులాడునే' అని ఎత్తుగడ. 'పాయని నిందఁ గుందనే' అని చివరివాక్యం. ఈ రెండు వాక్యాలకు సమన్వయప్రాయంగా మధ్యవాక్యాలు కూర్పబడ్డాయి.

**క. కడుఁ గూర్తుఁ గవ్వడికి న । య్యొడలు గలుగ నేను బ్రతికియుండుదుఁ గా; కె**
**క్కడి బ్రదుకు నాకు నాతం । డెడలిన; నప్పార్థుఁ గాతు నెల్ల విధములన్. 349**

**ప్రతిపదార్థం:** కవ్వడికిన్= అర్జునుడికి; కడున్= మిక్కిలి; కూర్తున్= ప్రియం కలిగిస్తాను; ఆ+ఒడలు+కలుగన్= ఆ అర్జునుడి శరీరం ఉంటేనే; ఏను= నేను; బ్రతికి+ఉండుదున్+కాక= జీవించి ఉండగలను; ఆతండు+ఎడలినన్= ఆ అర్జునుడు దూరమైతే; నాకున్= నాకు; ఎక్కడి బ్రదుకు= జీవనం ఎక్కడిది; ఎల్లన్+విధములన్= అన్ని విధాలా; ఆ+పార్థున్= ఆ అర్జునుడిని; కాతున్= కాపాడుతాను.

**తాత్పర్యం:** అర్జునుడు నాకు చాలా ఇష్టమైనవాడు. అతడి దేహం ఉంటేనే నేను జీవించి ఉండగలుగుతాను. అతడే దూరమైతే నాకు ఇం కెక్కడి బ్రతుకు? అన్నివిధాలా ఆ అర్జునుడిని రక్షిస్తాను.

**విశేషం:** నరనారాయణ మైత్రి ఏ విధంగా విడదీయరానిదో ఈ పద్యంలో కృష్ణార్జునపరంగా వివరించబడింది. ఒకరు లేకపోతే మరొకరు ఉండటం అసంభవం. బాహ్యంగా గానీ ఆంతరంగికంగా కానీ ఆ ఇరువురి అనుబంధం ఆ విధంగా విడదీయరానిది. ప్రతిజ్ఞ చేసింది అర్జునుడే కావచ్చును. కాని, దానిని నిర్వహించవలసిన బాధ్యత కృష్ణుడిమీదనే ఉన్నది. ఎట్లయినా అతడి ప్రతిజ్ఞ నెరవేరేటట్లు చూడాలి. ఈ సందర్భంలో ఆతడిని ఎదుర్కొనే అన్ని కష్టాలనుండి కాపాడాలి. అన్నివిధాలా అతడిని రక్షించగలిగినప్పుడే మా మైత్రికి సార్థకత అని కృష్ణుడు నిజమైన మైత్రిలో నీవూ-నేనూ అనే భేదం ఎట్లు ఉండదో వివరించాడు. ఎల్లప్పుడూ ఆతడూ నేనూ ఒకటిగా ఉంటూ ఉన్నాము. అతడికి కావలసినది అది ఏదైనా నేనే సమకూర్చుతున్నాను. ఒకే ప్రాణం రెండు శరీరాలు. అతడు ప్రాణాలు విడిస్తే నేను కూడా తప్పక మరణించి తీరవలసిందే'.

**క. నాలో సగ మర్జునుఁడే । నాలమునం దతని కగుట యరుదే! యెమ్మై**
**వ్రాలెదనో? రిపు లెట్టులు । గూలెదరో? చూడు; నాకుఁ గురుబల మెదురే? 350**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు= ఆ నరుడు; నాలోన్+సగము= నాలో అర్థభాగం; ఏను=నేను; ఆలము+అందున్= యుద్ధంలో;ఆతనికిన్+అగుట= ఆ అర్జునుడికి అనుకూలం కావటం; అరుదే!= ఆశ్చర్యమా!; ఎమ్మైన్= ఏ విధంగా; వ్రాలెదనో= మీరెదనో; రిపులు=శత్రువులు;ఎట్టులు+కూలెదరో?= ఏ విధంగా నశిస్తారో?; చూడు= పరికించుము; నాకున్= నాకు; కురుబలము= కౌరవసైన్యం; ఎదురే?=లెక్కా?

**తాత్పర్యం:** ఆ అర్జునుడు నాలో అర్థభాగం. నేను అతడికి యుద్ధంలో అనుకూలంగా ఉండటం ఒక ఆశ్చర్యమా! ఎట్లా విజృంభిస్తానో,శత్రువులు ఏ విధంగా నేలగూలుతారో చూస్తూ ఉండుము. ఈ కురుసైన్యం నాకు ఒక లెక్కా?

**విశేషం:** 'అర్జునుడు తనలో సగం కాబట్టి, అతడి పక్షం నేనూ యుద్ధం చేయటంలో ఆశ్చర్యపడాల్సిం దేముంది? మిత్రుడంటే 'విపత్తి సౌఖ్య సదృశ క్రియుడు' కదా! ప్రస్తుతం ఆపదలో చిక్కుకొన్న అర్జునుడిని రక్షించటానికి నేనే శత్రువులను చీల్చి చెండాడుతాను.' అని కృష్ణుడు చెప్పిన ప్రతి వాక్యంలోనూ తనకూ అర్జునుడికీ అన్ని విషయాలలోనూ అభేదమే అన్న అభిప్రాయం అభివ్యక్తమైనది.

**తే. ఎల్లి సచరాచరములగు నెల్ల భూత । ములును నాదగు నేర్పును, బలముఁ, బాండు**
**తనయులకు నేను గూర్చుటయును నెఱుంగ । వలయు దారుక! యేచెదఁ గలనిలోన. 351**

**ప్రతిపదార్థం:** దారుక!= (రథసారథివైన) ఓ దారుకా!; నాది+అగు, నేర్పును= నాది అయిన చాకచక్యాన్ని; బలమున్= శక్తిని; పాండు తనయులకున్= పాండవులకు; ఏను= నేను; కూర్చుటయునున్= ప్రియం కలిగించటాన్నీ; ఎల్లి= రేపు; సచర+అచరములు+అగు+ఎల్ల, భూతములునున్= జంగమములు, స్థావరములును అయిన అన్ని ప్రాణులున్నూ; ఎఱుంగన్+వలయున్= తెలిసికొనటం సంభవిస్తుంది; కలనిలోనన్= యుద్ధంలో; ఏచెదన్= విజృంభిస్తాను.

**తాత్పర్యం:** దారుకా! నా నేర్పూ, శక్తీ, పాండవులకు నేను ప్రియం కలిగించటాన్ని, రేపు స్థావర జంగమాత్మకమైన ప్రాణికోటి తెలిసికొనటం సంభవిస్తుంది. యుద్ధంలో విజృంభిస్తాను.

**విశేషం:** 'యుద్ధంలో విజృంభించి తన నైపుణ్యాన్నీ, బలాన్నీ ప్రాణికోటి మొత్తం చూస్తూ ఉండగా రేపు ప్రకటిస్తాను' అని అర్జునుడికి బదులు తానే యుద్ధం చేసేటట్లు కృష్ణు డిందులో పేర్కొన్నాడు. అంతకు ముందు 'కవ్వడికిఁ గూర్తుఁ' నన్న కృష్ణుడు 'పాండు తనయులకు తాను కూర్చుట యెట్టిదో రేపు చూపుతాను' అంటున్నాడు. ఈ పద్యంలో కూర్చుట, కూర్తు అను ప్రయోగాల్ని తిక్కన అసాధారణమైన విశిష్టమైన అర్థంలో అక్కడక్కడా ప్రయోగించాడు. కూర్చుటలో ఎంతో విడదీయరాని అనుబంధాన్ని తిక్కన ప్రతిపాదించాడు. అర్థవంతాలైన అచ్చ తెలుగు పదాలు కూర్చటంలో ఆయనకు ఆయనయే సాటి. కృష్ణుడు తన సారథికి పాండవులతో తనకు గల ప్రగాఢ మైత్రిని కొంత విస్తరించి వివరించాడు.

**క. ఇనుఁ డస్తమింపకుండఁగ । మును సైంధవుఁ జంపువాఁడ; మునుకొని పరు లే**
**చినఁ జిత్రవధ విహారం । బున నప్పుడు రౌద్రరసము పొడ వేర్పఱుతున్. 352**

**ప్రతిపదార్థం:** ఇనుఁడు= సూర్యుడు; అస్తమింపక+ఉండఁగన్+మును= అస్తమించక ముందు; సైంధవున్= సైంధవుడిని; చంపువాఁడన్= సంహరించగలవాడను; మునుకొని= ముందుగా; పరులు= శత్రువులు; ఏచినన్= విజృంభిస్తే; అప్పుడు= ఆ సమయంలో; చిత్రవధ విహారంబునన్= ఆశ్చర్యంగా చంపటం యొక్క క్రీడా విహారంచేత; రౌద్రరసము+పొడవు= రౌద్రరసం యొక్క ఆకారం; ఏర్పఱుతున్= ఏర్పాటు చేస్తాను.

**తాత్పర్యం:** పొద్దు గుంకకముందే ఆ సైంధవుడిని సంహరిస్తాను. శత్రువులే ముందుగా విజృంభిస్తే వాళ్ళనందరినీ చిత్ర విచిత్ర పద్ధతులలో చంపుతూ క్రీడా విహారం సాగిస్తాను. రౌద్రరసంయొక్క ఆకారం ఎట్లా ఉంటుందో ఏర్పడేటట్లు చేస్తాను.

**విశేషం:** 'చిత్రవధ విహారము' తో 'రౌద్రరసము పొడవేర్పఱుతున్' అనే వాక్యంలో దయారస సముద్రుడైన కృష్ణుడు అర్జునుడి ప్రతిజ్ఞ నెరవేర్చటం కొరకు రౌద్రరసమే తా నవుతానని చెప్పటం విశేషం. పవిత్రమూ, అవ్యాజమూ అయిన స్నేహధర్మంలో వాడే వీడు కావటం సహజం. అర్జునుడు చేయవలసిన పని తానే చేస్తానని పదే పదే చెప్పటం వలన తన రథసారథిని యుద్ధానికి సంసిద్ధం కావాల్సిందని హెచ్చరించినట్లయింది.

**ఉ. సైంధవుఁ డొక్క డేల? యనిఁ జావకపోవఁగ నేర్తు రెట్లు గ**
**ర్వాంధుఁడు కౌరవేశ్వరుఁడు నందఱు దమ్ములు, నెల్ల మిత్త్రులున్,**
**బంధులుఁ దోడు వచ్చిన నృపాలురుఁ బాండవకీర్తి సర్వది**
**క్సింధుర దంతకాండములఁ జెందఁగఁ జేయుట కేను బూనఁగన్. 353**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; పాండవ కీర్తిన్= పాండు కుమారులయొక్క యశస్సును; సర్వ, దిక్+సింధుర, దంత, కాండములన్= అన్ని దిగ్గజాల యొక్క దంత సమూహాలను; చెందఁగన్+చేయుటకున్= పొందేటట్లు కావించటానికి; పూనఁగన్= ప్రయత్నించగా; సైంధవుఁడు+ఒక్కఁడు+ఏల?= సైంధవుడు ఒక్కడే ఏమి?; గర్వ+అంధుఁడు= దర్పంచేత కళ్ళు మూసికొని పోయినవాడు (అయిన); కౌరవ+ఈశ్వరుఁడున్= దుర్యోధనుడున్నూ; అందఱు తమ్ములున్= (అతడి అందరు సహోదరులున్నూ) తమ్ముళ్ళు అందరున్నూ; ఎల్లన్+మిత్రులున్= స్నేహితులు అందరున్నూ; బంధులున్= చుట్టాలున్నూ; తోడు వచ్చిన+నృపాలురున్= సహాయంగా వచ్చిన సామంతరాజులున్నూ; అనిన్= యుద్ధంలో; చావక+పోవఁగన్= మరణించకుండా; ఎట్లు నేర్తురు?= ఏ విధంగా ఉండగలరు?, సమర్థులవుతారు?

**తాత్పర్యం:** నేను పాండవుల కీర్తిని అన్ని దిక్కులలో వ్యాపింప చేయటానికి ప్రయత్నించగా, ఒక్క సైంధవుడు ఏమిటి? దర్పంచేత గ్రుడ్డివాడైన ఆ దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్ళు అందరూ, మిత్రులందరూ, చుట్టాలు, సహాయంగా వచ్చిన రాజులూ యుద్ధంలో చావకుండా ఎట్లా ఉండగలరు?

**విశేషం:** 'పాండవుల కీర్తి అన్ని దిక్కులలో వ్యాపించేటట్లు చేస్తాను' అనే భావాన్ని అన్ని దిగ్గజాల దంత సమూహాలను చేరేటట్లు చేస్తాననటం ఒక క్రొత్తరూప కల్పన. ఏనుగుల దంతాలు తెల్లగా ఉంటాయి. అట్లాగే కీర్తికూడా తెల్లగా ఉంటుంది. ఆ సామ్యాన్ని పురస్కరించుకొని కీర్తిని ఆ దంతాలకు చెందేటట్లు చేస్తాననటం విశేషం. సహజంగానే ఏనుగుల దంతాలు తెల్లగా ఉండగా పాండవుల కీర్తిచేత ఆ తెలుపు కలిగేటట్లు చేస్తాను అంటున్నాడు. చెందటం అంటే - సిద్ధించటం, చేరటం, వసించటం, కూడుకొనటం, సమీపించటం అనే అర్థా లున్నాయి. అంటే అంతకుముందు ఉండేదాన్ని మరికొంత ప్రజ్వలింపజేయటం అని కూడా అర్థం పొసగుతుంది.

ఇక గర్వాంధుడు అని దుర్యోధనుడికి ప్రయోగించిన విశేషణం కూడా ఎంతో అర్థవంతంగా ఉన్నది. తండ్రి ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డి అయితే ఆయనను మించిన గ్రుడ్డితనం వీడు తన గర్వంతో తెచ్చిపెట్టుకొన్నాడు. అహంకారమూ, మదమూ కళ్ళకు కప్పిన మొప్పె దుర్యోధనుడు. వాడి బటువు చూచికొనే సైంధవుడు యుద్ధరంగానికి వచ్చి ఉన్నాడు. కాబట్టి, సైంధవు డేమిటి వాడికి సహాయంగా వచ్చిన సమస్త యోధులను సంహరిస్తా నంటున్నాడు శ్రీకృష్ణుడు.

**వ. అది క్రమంబునం జూచెద; వెల్లి నీవు మనయరదంబు పన్ని శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకంబులను గనకమణి మాలికాలంకృతంబులం జేసి పూన్చి, గరుడధ్వజంబు సంఘటించి, చక్ర గదా శార్ఙ్గ ప్రముఖాస్త్ర శస్త్రంబులు దగు తెఱంగున నునిచికొని మైమఱువు దొడిగిరమ్ము; పాంచజన్య రవం బాకర్ణించి నప్పడ వేగంబ యెయిది కొను' మనిన విని దారుకుండు. 354**

**ప్రతిపదార్థం:** అది= శత్రువులను ఎదుర్కొనటం లేదా వాళ్ళను సంహరించటం; క్రమంబునన్+చూచెదవు= క్రమంగా నీవే చూస్తావు (అది అడుగుపెట్టినప్పుడు సామర్థ్యంతో పూనికతో నిర్వహించాల్సిన పని అని భావం); ఎల్లి= రేపు; నీవు; మన+అరదంబున్+పన్ని= మన రథాన్ని ఏర్పాటు చేసి (యుద్ధానికి సిద్ధం చేసి); శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకంబులనున్= శైబ్యమూ, సుగ్రీవమూ, మేఘపుష్పమూ, వలాహకమూ అనే గుర్రాలను (మేఘపుష్పాన్నే పుష్పకం అనికూడా వ్యవహరిస్తారు); కనక, మణి, మాలికా+అలంకృతంబులన్= బంగారు, మణుల దండలతో అలంకరించబడిన వాటినిగా; చేసి= ఒనర్చి; పూన్చి= రథాలకు కట్టి; గరుడధ్వజంబున్= గరుత్మంతుడి గుర్తున్న జెండాను; సంఘటించి= కూర్చి, అమర్చి; చక్ర, గదా, శార్ఙ్గ ప్రముఖ+అస్త్ర+శస్త్రంబులున్= సుదర్శనచక్రం, గద, విల్లు, బాణాలు, ఆయుధాలు; తగు తెఱంగునన్= తగినవిధంగా; ఉనిచికొని= ఉంచుకొని(ఉండునట్లు చేసికొని); మైమఱువున్= కవచాన్ని; తొడిగి= ధరించి; రమ్ము= రావలసింది; పాంచజన్యరవంబు= పాంచజన్యం అనే శంఖం యొక్క ధ్వని; ఆకర్ణించినప్పుడు+అ= విన్నప్పుడే; వేగంబ= త్వరగా; ఎయిదికొనుము= వెంబడించుము (రమ్ము); అనినన్= అని కృష్ణుడు చెప్పగా; విని; దారుకుండు= శ్రీకృష్ణుడి రథసారథియైన దారుకుడు.

**తాత్పర్యం:** నా శత్రు సంహారాన్ని ఒక వరుసలో నీవే చూస్తావు. రేపు నీవు మన రథాన్ని సిద్ధం చేయుము. శైబ్య,సుగ్రీవ,మేఘపుష్ప, వలాహకాలనే గుర్రాలను బంగారుమణుల దండలతో అలంకరించి, గరుడధ్వజాన్ని నిలిపి, చక్రం, గద, శార్ఙ్గం మొదలైన అస్త్రశస్త్రాలను రథంలో పదిలంగా ఉంచుము. నీవు కవచాన్ని తొడుగు కొని రమ్ము.పాంచజన్యంపూరించగానే నీవు విజృంభించుము' అని అనగా, ఆ మాటలు విని దారుకుడు. (తరువాతి పద్యంతోఅన్వయం).

**విశేషం:** శ్రీకృష్ణుడు తాను అర్జునుడికి రథసారథి. తనకు రథసారథి దారుకుడు. యుద్ధానికి సర్వ సన్నద్ధుడై తానే యుద్ధాన్ని చేస్తానని, అందుకు అవసరమైన అన్ని ఏర్పాట్లతో రేపు ఉదయం బయలుదేరాలని చెప్పుతూ ఎట్లా సంసిద్ధం కావాలో దారుకుడికి శ్రీకృష్ణుడు వివరించాడు. మనం మన ఇంటిలోని పెంపుడు జంతువులకు ఎట్లా పేర్లు పెట్టుకొంటామో అట్లే నాలుగు గుర్రాల పేర్లు కూడా ఈ వచన భాగంలో తెలుపబడ్డాయి.

**చ.** **'అలఘువిచార! యట్ల తగు; నప్పని సేసెద; నంత సేయఁగా**
**వలయునె? యెవ్వ రక్కడ నవార్యులు క్రీడికి సారథిత్వముం**
**దలకొని నీ వనూన శుభదం బగు వర్తన మాచరింప నీ**
**నిలుపును బార్థు చాలుటయు నేఁడుగదా భువనం బెఱింగెడున్.** 355

**ప్రతిపదార్థం:** అలఘు విచార!= గొప్ప ఆలోచన కలవాడా! (శ్రీకృష్ణా! అని సంబోధన); అట్లు+అ+తగున్= అట్లే, తప్పనిసరి అవుతుంది; ఆ+పని చేసెదన్= (మీరు చెప్పిన) ఆ కార్యం చేస్తాను; అంత= ఆ కొలది; చేయఁగాన్+వలయును+ఎ!= చేసి తీరవలసిందేనా!; నీవు; సారథిత్వమున్= సారథిగా ఉండటాన్ని; తలకొని= వహించి లేదా అవలంబించి; అనూన= గొప్ప; శుభదంబు+అగు= మేలు కలిగించేదైన; వర్తనమున్+ఆచరింపన్= (స్థితిని కలిగించగా) వృత్తి లేదా నడవడిని నిర్వహించగా; క్రీడికిన్= అర్జునుడికి; అక్కడన్= ఆ యుద్ధంలో; అవార్యులు= అడ్డగించ దగనివాళ్ళు; ఎవ్వరు= ఎవరు (ఉన్నారు); నీ+నిలుపునున్= నీ స్థైర్యం లేదా ప్రాపును; పార్థు+చాలుటయున్= అర్జునుడి సామర్థ్యమున్నూ; భువనంబు= లోకం; నేఁడు కదా!= ఈ దినం కదా!; ఎఱింగెడున్= తెలిసికొన గలుగుతుంది.

**తాత్పర్యం:** 'గొప్ప ఆలోచన కల ఓ శ్రీకృష్ణా! నీవు చెప్పినట్లే చేయదగును. నీవు ఆదేశించిన పని చేస్తాను. కాని, అంత చేయటం అవసరమా? అర్జునుడికి నీవు సారథిగా ఉండి గొప్ప శుభాన్ని గూర్చే స్థితిని కలిగిస్తే (శుభప్రదమైన వృత్తిని పాటిస్తే) ఇక అర్జునుడు అడ్డగించటానికి సాధ్యంకానివాళ్ళెవరున్నారక్కడ? నీ స్థైర్యాన్ని, ఆ అర్జునుడి సామర్థ్యాన్ని లోకం ఈ రోజు కదా తెలిసికొంటుంది'

**విశేషం:** 'అలఘువిచార!' అనే పద్యం ఎత్తుగడ గానీ, సాభిప్రాయమైన ఆ సంబోధన లోని అర్థవిశేషం గానీ ఎంతో గంభీరంగా, ఔచిత్య స్ఫోరకంగా, ఆ మొత్తం సన్నివేశాన్ని మనముందు ఉంచే విధంగా అభివ్యక్తమైనది. పార్థుడికి నీవు నిర్వహించే సారథ్యం. శుభప్రదమై సత్‌స్థితిని కలిగిస్తుంది. నీ ప్రాపు, అతడి సామర్థ్యం లోకానికి ఈ దినమే వెల్లడి అవుతాయి. అని దారుకుడు దృఢంగా తన నిశ్చయాన్ని తెలిపాడు. కాని, తాను సారథిగా ఉండి రథికుడు చెప్పేదాన్ని ఎట్లా కాదంటాడు? అందుకే 'అట్ల తగు అప్పని సేసెద' అని అన్నాడు. మళ్ళీ వెంటనే 'అంత సేయగా వలయునె' అని మనస్సులోని అసలు విషయాన్ని బయటపెట్టాడు.

**వ.** **అని సవినయంబుగాఁ బలికి దనుజమర్దను తమకంబు వారించె; నంతఁ 'బాంచజన్య రవాభిజ్ఞానంబు సవిశేషంబుగా నతనిచేత వినికొని తత్కాలంబున నాలంబులోనికి నరదంబు గొనివచ్చెద' ననియె; వెండియు వాసుదేవుండు సూతునితోడ సముచిత సల్లాపంబులు సేయుచుండె; నంత నట బీభత్సుండు ప్రతిజ్ఞోత్సాహంబు నిర్వహించు తెఱంగు దలంచుచు దామోదర కృత స్థండిల శయనంబున నుండి శోకనిద్రా వివశుండయ్యె; నయ్యవసరంబునం గలలోనం గృష్ణుం డతనిపాలికిం బోయిన, నాతండు భక్తిం బ్రత్యుత్థానంబు సేసి తనయున్న సెజ్జ యిచ్చి, తొలంగి నిలుచుండ, నమ్మురారి యాసీనుండై యుండి యతని కి ట్లనియె.** 356

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; సవినయంబుగాన్= వినయంతో కూడుకొన్నట్లుగా; పలికి= మాటాడి; దనుజమర్దను+తమకంబున్= రాక్షసులను సంహరించేవాడైన శ్రీకృష్ణుడియొక్క తొందరపాటును; వారించెన్= నివారించాడు; అంతన్= అటుపిమ్మట; పాంచజన్య రవ+అభిజ్ఞానంబు= పాంచజన్య శబ్దంయొక్క ఎఱుకను (గుర్తును); సవిశేషంబుగాన్= విశేషసహితంగా; అతనిచేతన్= ఆ కృష్ణుడివలన; వినికొని= విని; తద్+కాలంబునన్= ఆ సమయంలో; అరదంబు= రథం; ఆలంబులోనికిన్= యుద్ధంలోకి; కొనివచ్చెదన్= తీసికొని వస్తాను; అనియెన్= అన్నాడు; వెండియున్= పిదప; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; సూతునితోడన్= రథసారథితో; సముచిత సల్లాపంబులు= తగిన సంభాషణలు; చేయుచుండెన్= చేస్తూ ఉన్నాడు; అంతన్= ఆ సమయంలో; అట= అక్కడ; బీభత్సుండు= అర్జునుడు; ప్రతిజ్ఞా+ఉత్సాహంబున్= శపథం యొక్క ప్రయత్నాన్ని; నిర్వహించు తెఱంగున్= దర్భశయ్యపైన (స్థండిలం అనగా, వ్రతాదులు పూనినవాళ్ళు పవళించటానికి దర్భాదుల చేత సంస్కరించబడ్డ భూమి); ఉండి; శోకనిద్రా వివశుండు+అయ్యెన్= దుఃఖంచేత నిద్రచేత; ఒళ్ళు మరచిన వాడు అయ్యాడు; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో; కలలోనన్= స్వప్నంలో; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; అతనిపాలికిన్= అర్జునుడి దగ్గరకు; పోయినన్= పోగా; ఆతండు= ఆ అర్జునుడు; భక్తిన్= భక్తితో; ప్రత్యుత్థానంబున్+చేసి= లేచి నిలబడి; తన+ఉన్న సెజ్జన్= తాను ఉండే పడకను; ఇచ్చి; తొలంగి, నిలుచుండన్= (గౌరవాన్ని ప్రకటిస్తూ మర్యాదగా) కొంత దూరంలో నిలిచి ఉండగా; ఆ+మురారి= ఆ శ్రీకృష్ణుడు; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై ఉండి; అతనికిన్= అర్జునుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు:

**తాత్పర్యం:** అని దారుకుడు విన్నవించి శ్రీకృష్ణుడి తొందరను తగ్గించాడు. పాంచజన్యం మ్రోగిన గుర్తును తెలిసికొని రణరంగంలోకి రథాన్ని తెస్తానని చెప్పాడు దారుకుడు. ఆ తరువాత అతడితో శ్రీకృష్ణుడు తగిన మాటలాడుతూ ఉండిపోయాడు. ఇక అక్కడ అర్జునుడు ప్రతిజ్ఞను నిర్వహించే విధాన్ని తలచుకొంటూ శ్రీకృష్ణుడు ఏర్పాటు చేసిన దర్భశయ్యమీద శోకంతో నిద్రలో మునిగిపోయాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు కలలో అతడిని సమీపించాడు. అతడు వినయంతో లేచి తన సెజ్జ మీద శ్రీకృష్ణుడిని కూర్చుండబెట్టి, సమీపంలో తాను నిలబడి ఉండగా శ్రీకృష్ణుడతడితో ఇట్లా అన్నాడు:

**క. వగపున కెడ యీకుము; నె । వ్వగఁ గుందిన మానవుండు వైరులచేతన్**
**దెగుఁ గాని తనదు కార్యముఁ । దగ నొనరింపంగ లేఁడు; తగునే వగవన్?' 357**

**ప్రతిపదార్థం:** వగపునకున్= దుఃఖానికి; ఎడ+ఈకుము= సందు ఈయవద్దు; నెవ్వగన్= మిక్కిలి దుఃఖంతో; కుందిన= కుమిలిన (బాధపడిన); మానవుండు= నరుడు; వైరులచేతన్= శత్రువులచేత; తెగున్+కాని= నశిస్తాడు కాని; తనదు కార్యమున్= తన పనిని; తగన్= తగునట్లు; ఒనరింపఁగన్+లేఁడు= చేయలేడు; వగవన్= దుఃఖించగా; తగునే?= న్యాయమా?(యుక్తమా?)

**తాత్పర్యం:** దుఃఖానికి అవకాశం ఇవ్వవద్దు. దుఃఖంతో బాధపడే నరుడు శత్రువుల చేత నశిస్తాడే కాని తన పనిని తాను తగు విధంగా చేయలేడు. దుఃఖించటం సబబా?

**విశేషం:** దుఃఖించటం వలన తన వినాశాన్ని తానే తెచ్చుకొన్న ట్లవుతుంది. కాబట్టి శోకించటం తగదు అని ఈ పద్యంలోని సారాంశం.

**వ. అనిన విని యతం డతని కిట్లనియె. 358**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; విని= ఆకర్ణించి; అతండు= అర్జునుడు; అతనికిన్= శ్రీకృష్ణుడితో; ఇట్లు= ఇట్లా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని అర్జునుడు శ్రీకృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**క. 'వగ పింక నెన్నఁటికి దెగు? । మిగిలి ప్రతిన పూరగింప మేకొని చను నా**
**మగటిమియు లావు మాన్చుట । తగవే గురునకు నతండు దానికిఁ బూనన్. 359**

**ప్రతిపదార్థం:** వగపు= దుఃఖం; ఇంకన్= ఇక; ఎన్నఁటికిన్= ఎప్పటికి; తెగున్?= నశిస్తుంది?; అతండు= ద్రోణాచార్యుడు; దానికిన్= నా ప్రతిజ్ఞకు భంగం కలిగించటానికి; పూనన్= ప్రయత్నించగా; మిగిలి= అతిశయించి; ప్రతిన= ప్రతిజ్ఞ; పూరగింపన్= నెరవేర్చటానికి; మేకొని=పూని; చను= పోయే; నామగటిమియున్= నా శౌర్యాన్నీ (పౌరుషాన్నీ); లావున్= బలాన్నీ; మాన్చుట= మానేటట్లు (విడిచేటట్లు) చేయటం; గురునకున్= ద్రోణాచార్యుడికి; తగవే?= తగినదేనా?

**తాత్పర్యం:** ఈ దుఃఖం ఇంకెప్పటికి నశిస్తుంది? ఆ ద్రోణుడు నా ప్రతిజ్ఞాభంగానికి ప్రయత్నించగా, నా ప్రతిజ్ఞను నెరవేర్చటానికి పూనుకొని యుద్ధరంగానికి పోయే నా శౌర్యాన్నీ, బలాన్నీ (విరమింపజేయడం) మానేటట్లు చేయటం ఆ ఆచార్యుడికి తగినదేనా?

**క. ఇనతనయ సహిత మడ్డము । సనుదెంచు జనంబు పెల్లు సైంధవుఁడు బలం**
**బున కెల్ల వెనుక నునికియు । మనమునఁ దలపోయ వగపు మానునె నాకున్?' 360**

**ప్రతిపదార్థం:** ఇనతనయ+సహితము= కర్ణుడితో కూడుకొన్నదై; అడ్డము+చనుదెంచు= అడ్డుగా వచ్చే; జనంబు+పెల్లు= జనంయొక్క గుంపు (అతిశయం లేదా ఆధిక్యం); సైంధవుఁడు= సింధుదేశపు రాజైన జయద్రథుడు; బలంబునకున్ ఎల్లన్= సైన్యానికి అంతటికీ; వెనుకన్+ఉనికియున్= వెనుకవైపు ఉండటమున్నూ; మనమునన్= మనస్సులో; తలపోయన్= ఆలోచించగా; నాకున్= నాకు; వగపు= దుఃఖం; మానునె?= ఆగుతుందా? (తగ్గుతుందా?)

**తాత్పర్యం:** కర్ణుడితో కూడా అడ్డగించటానికి వచ్చే ఆ సైన్యసమూహం యొక్క అతిశయమున్నూ, సైంధవుడు సైన్యానికంతటికీ వెనుక దాగి ఉండటమున్నూ ఆలోచించగా నాకు దుఃఖం ఆగుతుందా?'

**విశేషం:** 'జనంబు పెల్లు' అను ప్రయోగాలలో తత్సమమూ అచ్చ తెలుగు పదం చక్కగా కూర్చబడ్డాయి. కంద పద్యంలో ఆఱవగణం జగణం ఉండి తీరాలి. ఆ సందర్భంలో 'పెల్లు' పద్యగతికి ఒక విలక్షణ స్ఫూర్తిని కలిగించింది. సైంధవుడు దాగే విషయాన్ని 'బలంబున కెల్ల వెనుకనునికి' అని తిక్కన పేర్కొన్నాడు. ఈ ప్రయోగంలో కూడా బలంబు అను తత్సమం తర్వాత అన్నీ అచ్చతెనుగు పదాలే. ఇట్లే చివరిపాదం ఆది ప్రయోగం 'మనము' తప్ప మిగిలిన అచ్చతెనుంగు పదాలలో అనితరమైన అర్థస్ఫూర్తిని కన్నులకు కట్టేటట్లు వెల్లడించే ప్రత్యక్షీకరణ నాటకీయతను ప్రదర్శించాడు.

### కృష్ణార్జునులు స్వప్నమందుఁ గైలాసమునకుఁ బోవుట (సం. 7-57-24)

**వ. అనిన నచ్యుతుం 'డది యట్టిద! కాదె!' యని పలికి తదీయ హితార్థియై యుపాయంబువిచారించి, యుప స్పర్శనంబాచరించి,తూర్పు మొగంబై యుండి, యవ్విజయు వీక్షించి, శూలపాణికిం బరమ సాధనం బైన పాశుపతంబు నీకుంబ్రస్ఫుట పరిజ్ఞానం బయిన నీవు జయద్రథవధం బవశ్యంబును జేయుదు; వమ్మహాస్త్రంబు కలిమి సమంత్రక ముష్టిక స్థానక విజ్ఞానంబుగాఁ గ్రొత్త సేసికొనుట మేలు; తదర్థంబుగా నద్దేవుఁ జిత్తంబున నిలిపి సభక్తిక ధ్యానంబు సేయు' మనవుడుఁ గిరీటియుం గృతాచమనుండును భూసమాసీనుండును నై పరమేశ్వర స్మరణ తత్పరత్వంబున నుండి, కృష్ణుండును దానును గగనంబున కెగయుటయు, నతండు దన వలచేయి వట్టికొని చనుదేరం దా రిరువురు నుత్తరాభిముఖులై పోవుటయుం గాంచె; నవ్విధం బున వారలు చారణసిద్ధ గంధర్వ సేవితంబైన పథంబున వివిధ విశేషంబు లాలోకించుచుం బోయికైలాసంబుఁగని,**

**యందు సరిత్సరోవర సుందరంబును బుష్పలతా భూషితంబును రమ్యతరు సంతాన కాంతంబును నయిన కుబేర విహారస్థానంబు సూచుచుం జనిచని, దాని కనతి దూరంబున మహనీయ మణిమయంబయి తేజరిల్లు మహామందిరంబు సొచ్చి, యచ్చటఁ బ్రమథగణ పరివృతుండును, బార్వతీ సహితుండును, బ్రద్యోతన సహస్ర ప్రభా విభాసమానుండును, దివ్యోత్తమ సేవ్య మానుండును, మహాముని ప్రస్తూయమానుండును, నప్సరోజన సంగీత మంగళమహిత పురోభాగుండును నై పేరోలగంబున నుండి శోభిల్లు శంకరు దర్శించి, సప్రణవోచ్చారణంబుగా దండ ప్రణామంబు లాచరించి యున్న నన్నరనారాయణుల దెసం బ్రసాదమందస్మిత సుందర విలోకనంబు లొలయ నయ్యిందుధరుండు మధురస్వనంబున నిట్లనియె. 361**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; అది+అట్టిద+కాదె!= అది అటువంటిదే కదా!; అని+పలికి= అని మాటాడి; తదీయ, హిత+అర్థి+ఐ= ఆతడి యొక్క మేలు కోరినవాడై; ఉపాయంబున్+విచారించి= ఉపాయాన్ని ఆలోచించి; ఉపస్పర్శనంబు+ఆచరించి= ఆచమనం చేసి; తూర్పుమొగంబు+ఐ+ఉండి= తూర్పువైపు మొగం కలవాడై ఉండి; ఆ+విజయున్= ఆ అర్జునుడిని; వీక్షించి= చూచి; శూలపాణికిన్= పరమేశ్వరుడికి; పరమసాధనంబు+ఐన+పాశుపతంబు= ఉత్కృష్ట (శ్రేష్ఠ)మైన పరికరమైన పాశుపతం; నీకున్= నీకు; ప్రస్ఫుట+పరిజ్ఞానంబు+అయినన్= వికసించే విశిష్టమైన ఎఱుక కలిగింది అయితే; నీవు; జయద్రథ+వధంబున్= సైంధవుడిని చంపటాన్ని; అవశ్యంబునున్= తప్పకుండా; చేయుదువు= చేస్తావు; ఆ+మహా+అస్త్రంబు కలిమి= ఆ గొప్ప అస్త్రం కలిగి ఉండటంచేత; సమంత్రక, ముష్టిక, స్థానక, విజ్ఞానంబుగాన్= మంత్ర పూర్వకంగా పిడికిలికి సంబంధించిన ప్రదేశంలో ఉండే విశేషజ్ఞానం కలిగిందిగా; క్రొత్త, చేసికొనుట= క్రొత్తగా సంపాదించటం; మేలు= శుభం; తద్+అర్థంబుగాన్= (దానికొఱకై) ఆ ప్రయోజనానికై; ఆ+దేవున్= ఆ శివుడిని; చిత్తంబునన్+నిలిపి= మనస్సులో నిలిపి; సభక్తిక ధ్యానంబు+చేయుము= భక్తిపూర్వకంగా ధ్యానాన్ని చేయాల్సింది; అనవుడున్= అనిన వెంటనే; కిరీటియున్= అర్జునుడున్నూ; కృత+ఆచమనుండు+అగుచున్= ఆచమనం చేసినవాడు ఔతూ; భూ+సమాసీనుండున్+ఐ= భూమిపై బాగా ఆసీనుడై; పరమేశ్వర స్మరణ తత్పరత్వంబునన్+ఉండి= శివుడిని స్మరించే ఆసక్తితో ఉండి; కృష్ణుండునున్+తానునున్= శ్రీకృష్ణుడున్నూ, తానున్నూ; గగనంబునకున్= ఆకాశానికి; ఎగయుటయున్= ఎగురుటయున్నూ; అతండు= కృష్ణుడు; తనవలచేయి, పట్టికొని, చనుదేరన్= తన కుడిచేయి పట్టుకొని రాగా; తారు= తాము; ఇరువురును= ఇద్దరున్నూ; ఉత్తర+అభిముఖులు+ఐ= పోవుటయున్= ఉత్తరం వైపుగా పోవటమున్నూ; కాంచెన్= చూచాడు; ఆ+విధంబునన్= ఆ రీతిగా; వారలు= ఆ కృష్ణార్జునులు; చారణ, సిద్ధ, గంధర్వ సేవితంబు+ఐన, పథంబునన్= చారణులు, సిద్ధులు, గంధర్వులచేత (సేవించు) పూజించబడే మార్గంలో; వివిధ విశేషంబులు+ఆలోకించుచున్= రకరకాల వింతలు చూస్తూ; పోయి; కైలాసంబున్+కని= కైలాసాన్ని చూచి; అందున్= ఆ కైలాసంలో; సరిత్+సరోవర+సుందరంబునున్= నదులు సరస్సులచేత అందమైనదియును; పుష్ప లతా భూషితంబునున్= పూలూ, తీగలచేత అలంకరించబడినదియున్నూ; రమ్య+తరు+సంతాన+కాంతంబునున్= అందమైన చెట్ల గుంపుచేత ప్రకాశించేదిన్నీ; అయిన, కుబేర, విహార, స్థానంబు= అయినటువంటి కుబేరుడు వేడుకగా తిరిగే వనప్రదేశం; చూచుచున్+చని+చని= చూస్తూ పోయి పోయి; దానికిన్= ఆ విహారస్థలానికి; అనతిదూరంబునన్= చాలా తక్కువ దూరంలో; మహనీయ, మణి, మయంబు+అయి= గొప్ప మణులు కలిగినదై; తేజరిల్లు= ప్రకాశించే; మహామందిరమ్ము= గొప్పనివాసం; చొచ్చి= ప్రవేశించి; అచ్చటన్= ఆ మందిరంలో; ప్రమథగణ పరివృతుండును= ప్రమథుల మొత్తంచేత పరివేష్టించ బడ్డవాడున్నూ; పార్వతీ సహితుండును= పార్వతితో కూడుకొన్న వాడున్నూ; ప్రద్యోతన, సహస్ర, ప్రభా, విభాసమానుండును= వేయిమంది సూర్యులయొక్క కాంతులచేత మిక్కిలి ప్రకాశించేవాడున్నూ; దివ్యోత్తమ సేవ్యమానుండునున్= శ్రేష్ఠులైన దివ్యులచేత పూజించబడే వాడున్నూ; మహాముని ప్రస్తూయమానుండును= గొప్ప ఋషులచేత కీర్తించబడేవాడున్నూ; అప్సరస్, జన, సంగీత, మంగళ, మహిత, పురోభాగుండును+ఐ= అప్సరస్ స్త్రీల సంగీతంచేత, కల్యాణకరమైన గొప్ప ముంగిలి ప్రదేశం కలవాడున్నూ అయి; పేరోలగంబునన్= పెద్ద కొలువులో; ఉండి; శోభిల్లు= ప్రకాశించే; శంకరున్= శివుడిని; దర్శించి= చూచి; సప్రణవ+ఉచ్చారణంబుగాన్= ఓంకార సహితమైన ఉచ్చారణ కలిగేటట్లుగా;

దండ+ప్రణామంబులు+ఆచరించి+ఉన్నన్= కర్రవలె నేలపైబడి అష్టాంగాలు నేలకు తాకేటట్లుగా నమస్కారాలు చేసి ఉండగా; ఆ+నర+నారాయణుల దెసన్= ఆ నరుడూ, నారాయణుడూ - ఇరువురి వైపు; ప్రసాద మంద స్మిత సుందర విలోకనంబులు+ఒలయన్= ప్రసన్నమైన చిరునవ్వులతో, రమణీయములైన చూపులు ప్రసరించగా; ఆ+ఇందుధరుండు= చంద్రుడిని తలపై ధరించిన ఆ శివుడు; మధుర స్వరంబునన్= మాధుర్యం గల కంఠధ్వనితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అర్జునుడు అనగా శ్రీకృష్ణుడు 'అది అంతే' అని పలికి, అతడికి మేలు చేయగోరి ఆచమించి తూర్పు మొగంగా కూర్చుండి అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'ఈశ్వరుడికి శ్రేష్ఠమైన సాధనం పాశుపతం. దానిని నీవు సమగ్రజ్ఞాన స్ఫూర్తితో స్మరిస్తే సైంధవుడిని తప్పక చంపగలవు. ఆ మహాస్త్రాన్ని మంత్రసహితంగా నీ గుప్పిట నిలిచేటట్లు క్రొత్తగా సన్నిధానం చేసికొనటం మేలు. కాబట్టి, ఆ దేవదేవుడిని మనసులో స్మరించి భక్తితో ధ్యానం చేయుము' అనగా అర్జునుడు ఆచమించి నేలపైకూర్చుండి శివధ్యాన తత్పరుడయ్యాడు. ఆ ధ్యానంతో కృష్ణుడూ అర్జునుడూ ఆకాశానికి ఎగశారు. కృష్ణుడు అర్జునుడి కుడిచేయి పట్టుకొని ముందుకు తీసికొనిపోతూ ఉండగా; వారు చారణులు, సిద్ధులు మొదలైనవారు విహరించే మార్గంలో అనేక విశేషాలు చూస్తూ కైలాసానికి చేరుకొన్నారు. నదులతో, సరోవరాలతో, పూలలతలతో సుందరంగా శోభించే కుబేర విహారక్షేత్రాన్ని దర్శించి దూరంగా ఉన్న ఒక గొప్ప మణిమయ భవనంలో ప్రవేశించి, అందులో ప్రమథగణాలతోనూ, పార్వతీదేవితోనూ కూడుకొని వేయిసూర్యుల వెలుగుతో వెలుగొందే శివుడిని మహామునులు సేవిస్తున్న సమయంలో దర్శించారు. ఓంకారంతో దండప్రణామం చేశారు. పరమశివుడు ఆ నరనారాయణులను చిరునవ్వు చిందే ముఖంతో దయామయమైన చూపులతో చూచి, తియ్యని మాటలతో ఇట్లా అన్నాడు:

**క. 'స్వాగతమే మీ యిద్దఱ । యాగమనంబునకు హేతు వగు కోర్కి యను**
**ద్వేగంబున నెఱిఁగింపుఁడు; । వేగమ యొడఁ గూర్తు నెల్ల విధముల దానిన్.' 362**

**ప్రతిపదార్థం:** స్వాగతమే!= క్షేమమే కదా!; మీ+ఇద్దఱ= మీ ఇరువురి; ఆగమనంబునకున్= రాకకు; హేతువు+అగు కోర్కి= కారణమైన వాంఛ; అనుద్వేగంబునన్= ఉద్వేగం అనగా భీతి, కలతా లేకుండా; ఎఱిఁగింపుఁడు= తెల్పండి; ఎల్లవిధములన్= అన్నివిధాలా; దానిన్= ఆ మీ కోర్కెను; వేగము+అ= తత్ క్షణమే (తొందరగా); ఒడఁ గూర్తున్= తీరుస్తాను.

**తాత్పర్యం:** 'క్షేమమే కదా! మీ ఇద్దరి రాకకు కారణం ఏమిటో! ఉద్వేగం లేకుండా చెప్పండి. వెంటనే మీ కోర్కెను అన్ని విధాల తీరుస్తాను.'

**విశేషం:** తమ ఇంటికి వచ్చిన అతిథులను రాగానే క్షేమసమాచారాలు అడగటం ప్రథమధర్మం. వా రే ఉద్దేశంతో ఆశ్రయించారో అది తెలిసికొనటం ద్వితీయధర్మం. వెంటనే వారి కోర్కె తీర్చటం తృతీయధర్మం. ఇక్కడ 'అనుద్వేగకర' మైన తీరులో తెలుపండి. అనటం చాలా చక్కగా ఉన్నది. 'కలతా, తొట్రుపాటు, బాధ లేకుండా నిర్భయంగా అడగండి' అంటూ అభయమీయటం గమనార్హం. అనుద్వేగ కరమైన వాక్యం సాత్త్వికమైన వాచిక తపస్సును తెలుపుతుంది.

**వ. అనినం బ్రీత చేతస్కులగుచు నుత్థితులై లలాటంబుల నంజలిపుటంబులు ఘటించి నిలిచి వాసుదేవార్జునులు తమ చిత్తంబులు భక్తిరసంబున జొత్తిల్లుచుండ. 363**

**ప్రతిపదార్థం:** అనినన్= అని శంకరుడు పలుకగా; ప్రీత+చేతస్కులు+అగుచున్= ప్రీతి చెందిన మనస్సులు కలవారౌతూ; ఉత్థితులు+ఐ= పైకి లేచినవారై; లలాటంబులన్= నొసటి ప్రదేశాలలో; అంజలి పుటంబులు= దొప్పలవంటి దోసిళ్ళు (చేమోడ్పులు);

ఘటించి= కూర్చి; నిలిచి= ఎదుట నిలిచి; వాసుదేవ+అర్జునులు= శ్రీకృష్ణుడూ, అర్జునుడూ; తమ+చిత్తంబులు= తమ మనస్సులు; భక్తిరసంబునన్= భక్తి అనే రసంతో; జొత్తిల్లుచుండన్= రంజిల్లుచుండగా

**తాత్పర్యం:** అనగా సంతోషించి శ్రీకృష్ణార్జునులు లేచి నుదుట దొప్పలవంటి చేతులు మొగిడ్చి, తమ మనస్సులు భక్తిరసంతో రంజిల్లుతూ ఉండగా.

**చ. 'రవి శశివహ్నిలోచన ! సుర ప్రతివీర విమర్దన క్రమా!**
**భువనమయాత్మకా! భుజగభూషణ! పోషితభక్త! సంయమి**
**స్తవన కథావధానపర! దర్పకదర్ప హరా! నిరస్త సం**
**భవమరణాది వైకృత! యపారగుణా! గుణ దోష వర్జితా! 364**

**ప్రతిపదార్థం:** రవి, శశి, వహ్ని, లోచన!= సూర్యుడు, చంద్రుడు, అగ్ని కన్నులుగా కలవాడా!; సుర, ప్రతివీర, విమర్దన, క్రమా!= దేవతలకు (ప్రతివీరులైన) శత్రువులైన రాక్షసులను చంపుటలో సామర్థ్యం (బలిమి) కలవాడా!; భువన, మయ+ఆత్మకా!= సకలలోకాలు కలిగినట్టి వాడా! విశ్వమయమైన(స్వరూపం) ఆత్మకలవాడా!; భుజగభూషణ!= సర్పాలు ఆభరణాలుగా కలవాడా!; పోషితభక్త!= పోషించబడిన (రక్షించబడిన) భక్తులు కలవాడా!; సంయమి, స్తవన, కథా+అవధాన, పర= ఋషీశ్వరుల స్తోత్రాలు కథలు మనస్సున నిలుపుటలో ఆసక్తి కలవాడా!; దర్పక, దర్ప, హరా!= మన్మథుడి గర్వాన్ని హరించినవాడా!; నిరస్త, సంభవ, మరణ+ఆది, వైకృత!= తిరస్కరించబడిన పుట్టుక, చావు మొదలైన వికారాలు కలవాడా!; అపారగుణా!= హద్దులేని గుణాలు కలవాడా!; గుణదోష వర్జితా!= గుణాలను, దోషాలను వదలినవాడా!

**తాత్పర్యం:** సూర్య చంద్రాగ్నులు కన్నులైనవాడా! అమరుల శత్రువులైన అసురులను మర్దించే బలం కలవాడా! లోకములే తానైనవాడా! పాములు ఆభరణంగా కలవాడా! భక్తులను పోషించేవాడా! మహర్షుల స్తోత్రాలను, కథలను మనస్సునందు నిలుపుటలో ఆసక్తి కలవాడా! మన్మథుడి గర్వాన్ని హరించినవాడా! చావు, పుట్టుకలు మొదలైన వికారాలకు అతీతుడైనవాడా! హద్దులేని వాత్సల్యాది గుణాలు కలవాడా! త్రిగుణాలు దోషాలు వర్జించినవాడా!

**విశేషం:** ఇది శివస్తుతి పద్యం. ఆరంభంనుండి పద్యం చివరివరకు అన్నీ సంబోధనలే. శివుడి మూడునేత్రాల ప్రసక్తితో పద్యారంభం. చిట్టచివర తొమ్మిదవ సంబోధనలో అపారగుణ! అని వెంటనే పద్యాంతాన్ని గుణ దోషవర్జితా! అని గుణాతీతమైన తత్త్వంతో పరిసమాప్తం చేశాడు.

**క. జగములు గలిగింపఁగ నవి । దగు వర్ధన మొంద నిలుపఁ దఱితో వానిం**
**దెగఁ జేయ నీవ నేర్పరి । వగుట శ్రుతులు సెప్పు నిర్మలాద్భుతమూర్తీ! 365**

**ప్రతిపదార్థం:** నిర్మల+అద్భుత మూర్తీ!= పవిత్రమైన, ఆశ్చర్యకరమైన స్వరూపం కలవాడా! (ఓ పరమేశ్వరా! అని సంబోధన); జగములు= లోకాలు; కలిగింపఁగన్= సృష్టించగా; అవి= ఆ లోకాలు; తగు వర్ధనము+ఒందన్+నిలుపన్= (సరి అయిన) తగిన (ఉనికి) అభివృద్ధిని (స్థితి-నడవడి) పొందటానికై రక్షించగా; తఱితోన్= సమయానుకూలంగా, లేదా వెనువెంటనే; వానిన్= ఆ లోకాలను; తెగన్+చేయన్= నశింపచేయగా; ఈవు+అ= నీవే; నేర్పరివి= సమర్థుడవు; అగుటన్= కావటాన్ని; శ్రుతులు= వేదాలు; చెప్పున్= వక్కాణిస్తున్నాయి.

**తాత్పర్యం:** పవిత్రమైన, ఆశ్చర్యకరమైన స్వరూపం కలవాడా! లోకాలు సృష్టించటానికి, అవి తగిన (ఉనికి) స్థితిని పొంది రక్షించబడటానికి, కాలం గడువు తీరగా వెంటనే నశింపజేయటానికి నీవే సర్వసమర్థుడ వని వేదాలు నొక్కి వక్కాణిస్తున్నాయి.

**విశేషం:** 'తగు వర్ధన మొంద నిలుప' అనే ప్రయోగంలో 'నిలుపన్' అను క్రియాపద మొక్కటే చాలు. కానీ దానికి అనుబంధంగా పేర్కొన్న వాక్యంలో 'తగు వర్తనము' అనే పాఠాంతరము అనేకార్థాలలో ప్రయుక్తమైంది సరి అయిన నడవడి లేదా జీవనం కలిగేటట్లు,లేక యోగ్యమైన స్థితి, ఉనికి ఉండేటట్లు అనే అర్థాలు స్ఫురిస్తున్నాయి. అట్లే 'తఱితో' అనే ప్రయోగం కూడా. అనేకార్థస్ఫూర్తి కలిగి ఉన్నది. నిర్మలాద్భుతమూర్తీ! అని సంబోధన శివుడి పరంగా అతడి స్వరూప స్వభావాలను సమన్వయిస్తూ కూర్చబడింది. శివుడు కాటిబూడిద, పుర్రె, పులితోలు, ప్రమథగణంతో శ్మశానవాటికా సంచారం కలిగి పైకి అమంగళకరంగా అపవిత్రంగా కనిపిస్తాడు. కాని, అతడు పరమ నిర్మలుడు. ఇట్టి వైరుద్ధ్యం వలన మనకు ఎంతో ఆశ్చర్యం కలిగిస్తుంది ఆయన స్వరూపం - అని తిక్కన తన ప్రయోగంలో నిరూపించాడు.

**క. ప్రకృతి యనఁ బురుషుఁ డనఁగా ।వికృతు లనం బరఁగుచున్న వీనికి నెల్లన్**
**సకలాత్మక! నీ విభవము । యకృత్రిమాధారభూతమై యుండు శివా! 366**

**ప్రతిపదార్థం:** శివా!= మంగళకరమైనవాడా!; సకలాత్మక!= సమస్తమూ నీవై ఉండేవాడా!; ప్రకృతి+అనన్= పంచభూతాత్మకమై, సత్త్వాదిగుణ సామాన్యావస్థతో ఒప్పే స్వభావం అనగా; పురుషుఁడు+అనఁగాన్= సమస్త విశ్వానికి కారణభూతుడైన పురుషుడు అనేటట్లుగా; వికృతులు+అనన్= వికారాలు అనగా; పరఁగుచున్న= ఒప్పుతూ ఉండే; వీనికిన్+ఎల్లన్= వీటి అన్నింటికీ; నీ+విభవము= నీయొక్క గొప్పతనం, మహత్త్వం; అకృత్రిమ+ఆధారభూతము+ఐ+ఉండున్= సహజమైన (ఆదరువుకు) ఆలవాలానికి తగినదై ఉంటుంది.

**తాత్పర్యం:** మంగళకరమైనవాడా! ఓ శివా! అన్నీ నీవై ఉండేవాడా! ప్రకృతీ, పురుషుడూ మొదలైన వికారాలన్నింటికి నీ మహత్త్వమే సహజమైన ఆధారం.

**విశేషం:** అవ్యక్తమైన పరమాత్మ ప్రకృతిపురుష రూపంలో వ్యక్తం కావటమే వికృతి. విశ్వసృష్టికొరకు పరమాత్మ మాయను తన అధీనంలో ఉంచుకొని అనేక వికారాలను లీలామాత్రుడై ప్రదర్శిస్తూ ఉంటాడు. అతి సహజమైన ఆ స్వభావమే అన్నింటికీ ఆధారభూతమౌతూ ఉంటుంది. సర్వమూ తానే అయిన ఆ పరమశివుడు శుభానికీ, సుఖానికీ, మోక్షానికీ మూలం. కృత్రిమత్వం లేని సహజస్థితిలో పొందే ఆనందానికి అతడే గమ్యం. కృత్రిమత్వంలో స్వచ్ఛత ఉండదు. అది పై పై మెరుగులతో భ్రమప్రమాదాలు కలిగిస్తుంది. శివా! సకలాత్మకా! అనే రెండు సంబోధనలూ పరమేశ్వరుడి నిశ్చల, నిర్మల సహజగమ్య స్థితిని సూచిస్తూ, అన్నింటికీ అతీతమైన అతని విభవాన్ని ప్రతిపాదిస్తూ ఉన్నాయి.

**క. అవ్యక్త మప్రమేయము । సువ్యక్త మనాది భక్తి సుగమ మగమ్యం**
**బవ్యయము త్రిలోచన! నీ । దివ్య మహిమ యాగమోపదేశము రుద్రా!' 367**

**ప్రతిపదార్థం:** త్రిలోచన!= మూడు కన్నులు కలవాడా!; రుద్రా!= భయంకరుడవూ, మహనీయుడవూ అయిన ఓ పరమేశ్వరా!; నీ దివ్య+మహిమ= దివియందు పుట్టిన శ్రేష్ఠము, ఆశ్చర్యకరమైన నీ మాహాత్మ్యం; అవ్యక్తము= సృష్టికి బీజమై తెలియరాని మూల ప్రకృతి; అప్రమేయము= మితి చెప్పటానికి లేదా ఊహించటానికి అశక్యం; సువ్యక్తము= స్పష్టంగా తెలియబడేది; అనాది= ఆదిలేనిది అనగా నిత్యమైనది; భక్తిసుగమము= భక్తిచేత సులభమైనది; అగమ్యంబు= గమించటానికి లేదా పొందటానికి అశక్యమైనది; అవ్యయము= వ్యయం లేనిది (శుభమైనది); ఆగమ+ఉపదేశము= వేదాల హితవాక్యాలు కలిగినది.

**తాత్పర్యం:** త్రిలోచనా! రుద్రా! నీ దివ్య మహత్త్వం తెలియసాధ్యం కానిది. అపరిమితమైంది. సుస్పష్టమైంది. ఆదిలేనిది, భక్తిచేత సులభంగా పొందటానికి సులభమైనది, మరియు సాధ్యంకానిది, అక్షయమైంది, వేదాలచేత ఉపదేశింపబడింది.

**విశేషం:** పరమాత్మను ఇదమిత్థం అని నిర్వచించటం కష్టం. అందుకే అవ్యక్తం సువ్యక్తం సుగమం అగమ్యం అని ఉన్నట్లూ లేనట్లూ ద్వంద్వాత్మకంగా ప్రతిపాదించబడింది. అప్రమేయం, అనాది, అవ్యయం అనేవి మనబుద్ధిమేరకు అతీతమైన తత్త్వాన్ని ప్రకటిస్తున్నాయి. ఆ పరమాత్మను తెలిసికొనటానికి వేదమే ప్రమాణం అని తెలుపబడింది. రుద్రా! త్రిలోచన! అనే రెండు సంబోధనలు శివుడికి ప్రయోగించబడ్డాయి. ఇందులో రుద్రశబ్దం భయంకరత్వాన్నే గాక, గొప్పతనాన్ని కూడా తెలుపుతూ ఉన్నది. అన్నింటికి ప్రమాణమైన వేదమే రుద్రుడి మహనీయతను వివరించగలుగుతుంది.

**వ. అని మఱియు ననేక ప్రకారంబుల నవాఙ్మానసగోచరుండగు నప్పరమేశ్వరుం బ్రస్తుతించి; రప్పుడచ్యుతుండు పార్థునిం బాశుపతం బర్థింపు మని కఱపిన, నతం డవ్వరంబు వేఁడుటకై విశ్వేశ్వరుం దప్పక చూచి తాను మున్ను ముకుందునందు సమర్పించిన నిశాసమయ పూజా ద్రవ్యంబు లగు మాల్యానులేపనంబు లద్దేవుని దివ్యదేహంబునం గాంచి యచ్చెరువంది, యమ్మురహర పురహరుల యేకత్వంబు మనంబునం గొనియాడి, 'దేవా! భవదీయ దివ్యాస్త్రంబు దయసేయు' మని విన్నవించుటయు భక్తవత్సలుం డగు శక్తినాథుండు గృష్ణు లిరువురను దరహాసంబుతో నవలోకించి. 368**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారంగా; మఱియున్= మరల; అనేక ప్రకారంబులన్= వివిధ విధాలుగా; అవాక్+మానస, గోచరుండు+అగు= మాటలకూ మనస్సుకూ అందని (గోచరం కాని) వాడైన; ఆ+పరమేశ్వరున్= ఆ మహేశ్వరుడిని; ప్రస్తుతించిరి= కొనియాడారు; అప్పుడు; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; పార్థునిన్= అర్జునుడిని; పాశుపతంబు= పశుపతికి సంబంధించిన దివ్యాస్త్రము; అర్థింపుము= వేడుము(కోరుము); అని, కఱపినన్= అని నేర్పగా (బోధించగా); అతండు= ఆ అర్జునుడు; ఆ+వరంబు= దేవతాదులచే పొందబడే ఆ కోరిక; వేఁడుటకై= అర్థించుటకై; విశ్వేశ్వరున్= విశ్వనాథుడైన ఆ శివుడిని; తప్పక= చలించకుండా - శ్రద్ధతో; చూచి= పరికించి; తాను; మున్ను= అంతకుమునుపు; ముకుందునందున్= శ్రీకృష్ణుడియందు; సమర్పించిన= పూజ్యభావంతో ఇచ్చిన; నిశాసమయ+పూజాద్రవ్యంబులు+అగు= రాత్రివేళ అర్చించే (పూతవస్తువులైన) మంచి వస్తువులైన; మాల్య= దండలు; అనులేపనంబులు= మైపూతలు అనగా చందనాదులు; ఆ+దేవుని= ఆ దేవుడైన శివుడి; దివ్యదేహంబునన్= దివ్యమైన శరీరంలో; కాంచి= చూచి; అచ్చెరువు+అంది= ఆశ్చర్యపడి; ఆ+మురహర, పురహరుల= ఆ హరి హరుల (మురాసురుడిని చంపినవాడు విష్ణువు, త్రిపురాసురులను సంహరించినవాడు ఈశ్వరుడు); ఏకత్వంబు= ఒక్కరే అనుభావం; మనంబునన్= మనస్సులో; కొనియాడి= ప్రశంసించుకొని; దేవా!= ప్రభూ!; భవదీయ, దివ్య+అస్త్రంబు= మీయొక్క ఆశ్చర్యకరమైన (దివ్యమైన) అస్త్రం; దయచేయుము= (కరుణించుము) ఇమ్ము; అని+విన్నవించుటయున్= అని మనవి చేయటమున్నూ; భక్తవత్సలుండు+అగు= భక్తులయందు వాత్సల్యం (దయ) కలవాడైన; శక్తినాథుండు= పార్వతీపతి; కృష్ణులు+ఇరువురనున్= కృష్ణార్జునులను; దరహాసంబుతోన్= చిరునవ్వుతో; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని పలురకాలుగా వాక్కులకూ, మనస్సుకూ గోచరించని ఆ పరమేశ్వరుడిని కీర్తించారు. అప్పుడు శ్రీకృష్ణుడు అర్జునుడిని - 'పాశుపతాన్ని కోరు' మని సూచించాడు. ఆ సూచనమేరకు అర్జునుడు ఏకాగ్రభావంతో దేవదేవుడిని చూచి, తాను పూర్వం శ్రీకృష్ణుడికి సమర్పించిన రాత్రిపూజాద్రవ్యాలు దండలు, గంధపు పూతలు మొదలైన వాటిని ఆ పరమేశ్వరుడి దేహంమీద గమనించి, ఆశ్చర్యపడి, ఆ హరిహరుల ఏకత్వాన్ని నుతించి 'దేవా! మీ దివ్యాస్త్రాన్ని దయచేయు' మని వేడుకొన్నాడు. భక్తవత్సలుడైన ఆ పరమశివుడు ఇరువురు కృష్ణులను చిరునవ్వుతో చూచి.

**విశేషం:** మూలంలో రాత్రి పూజా ప్రసక్తి ఉన్నది. కాని, ఆ మాల్యానులేపనాలు పరమేశ్వరుడి దివ్య దేహంలో చూచి ఆశ్చర్యపడి హరిహరు లిరువురూ ఒకరే అని భావించిన విషయం లేదు. దీనిని తిక్కన తాను నమ్మిన హరిహరనాథ తత్త్వాని కనుగుణంగా అనుసంధించాడు. కృష్ణు లిరువురు అనటంలో అర్జునుడూ, కృష్ణుడూ ఇద్దరూ ఒక్కటే అనే విషయాన్ని తిక్కన వెల్లడించాడు. హరిహరుల ఏకత్వంవలెనే కృష్ణార్జునుల ఏకత్వం కూడా అని సూచన. హరిహరుల ఏకత్వం రూపంలో కాగా, కృష్ణార్జునుల ఏకత్వం నామంలో.

**తే. అమృతమయ మగు నుల్ల పద్మాకరమున । నాదు బాణాసనంబు బాణములు నున్న**
**యవి; దృఢవ్రతులారా! మీ రచటి కరిగి । వానిఁ దెం డిచ్చటికి' నని యాన తిచ్చె. 369**

**ప్రతిపదార్థం:** దృఢవ్రతులార!= గట్టిదైన పట్టుదల (దీక్ష) కలవారా!; అమృతమయము+అగు= అమృతంతో నిండినదైన; ఉల్లపద్మ+ఆకరమునన్= చేరువ నున్న తామర పూవులకు నిలయమైన సరోవరంలో; నాదు బాణాసనంబు= నా విల్లూ; బాణములున్= బాణాలూ; ఉన్న+అవి= ఉన్నాయి; మీరు; అచటికిన్= అక్కడికి; అరిగి= వెళ్ళి; వానిన్= వాటిని; ఇచ్చటికిన్= ఇక్కడికి; తెండు= తీసికొనిరండి; అని; ఆనతి+ఇచ్చెన్= ఆజ్ఞను ఇచ్చాడు.

**తాత్పర్యం:** 'ఓ వీరులారా! నా విల్లూ, బాణాలూ అమృతమయమైన పద్మాల సరస్సులో ఉన్నాయి. మీరు అక్కడికి పోయి వాటిని ఇక్కడికి తీసికొని రండి' అని ఆజ్ఞ ఇచ్చాడు.

**విశేషం:** ఉల్ల= అంత దూరమూ అంత దగ్గరా కాని; అల్ల= దూరస్థ; ఇల్ల= సమీపస్థ; ఉల్ల= దూరము దగ్గర కాని.

**వ. అ ట్లనుగ్రహించినం జిత్తానువర్తన తత్పరులగు తత్పరిసరవర్తులు కొందఱు దోడ్కొని పోవం బోయి పరమమునులగు నన్నర నారాయణులు త్రిణయన నిర్దిష్టంబైన యద్దివ్యసరస్సునందు. 370**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; అనుగ్రహించినన్= కరుణించగా; చిత్త+అనువర్తన, తత్పరులు+అగు= మనస్సును అనుసరించి నడవటంలో ఆసక్తి కలవారైన; తద్+పరిసరవర్తులు= ఆ దగ్గరనే మెలగేవాళ్ళు; కొందఱు= కొంతమంది; తోడ్కొని పోవన్= తీసికొనిపోగా; పోయి= వారితో కూడా చని; పరమమునులు+అగు= శ్రేష్ఠులైన మహర్షులగు; ఆ+నర, నారాయణులు= కృష్ణార్జునులు (పూర్వం నరుడు, నారాయణుడు అనే పేర బదరికాశ్రమంలో కొన్ని వేల ఏండ్లు తపస్సు చేసినవాళ్ళు); త్రిణయనన= ఈశ్వరుడిచేత; నిర్దిష్టంబు+ఐ= నిర్దేశించ బడినదైన(ఫలానా అని తెలుపబడినదైన); ఆ+దివ్య సరస్సునందున్= ఆ దివ్య సరోవరంలో (పద్మాకరంలో).

**తాత్పర్యం:** అని ఆ పశుపతి కరుణించగా ఆయన భావం తెలిసి మసలే కొందరు వారిని వెంటబెట్టుకొని తీసికొని పోగా శ్రీకృష్ణార్జునులు శివుడు చూపిన ఆ సరోవరంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నాలుకలు గ్రోయుచు విష । జ్వాలలు నిగుడంగ నుగ్రసర్పద్వయ మా**
**భీలాకృతి నుండఁగ బి । ట్టాలోకించి జనితాద్భుతాత్మకు లగుచున్. 371**

**ప్రతిపదార్థం:** ఉగ్ర, సర్ప, ద్వయము= భయంకరమైన, పాముల జంట; విషజ్వాలలు= విషపు మంటలు; నిగుడంగన్= వ్యాపింపజేయగా; నాలుకలు(జిహ్వలు); క్రోయుచున్= ఎగుడు దిగుడుగా (విషమంగా) చూస్తూ; ఆభీల+ఆకృతిన్= భయంకరమైన ఆకారంతో; ఉండఁగన్= ఉండగా; బిట్టు= తొందరగా; ఆలోకించి= చూచి; జనిత+అద్భుత+ఆత్మకులు+అగుచున్= ఆశ్చర్యం కలిగినవారు అవుతూ.

**తాత్పర్యం:** భయంకరమైన పాములజంట విషపుమంటలు వ్యాపించగా, నాలుకలను ఎగుడుదిగుడుగా చాస్తూ భయంకరాకారంతో వేగంగా వస్తుండగా; వాటిని మిక్కిలి ఆశ్చర్యంతో ఆ ఇరువురూ చూచి వెంటనే.

**వ. అవ్విధం బద్దివ్యాస్త్ర విలాసంబుగా నెఱింగి, పాదప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి యమ్మహోరగంబుల కుపస్థానంబు సేసి, వేదవిదులగు నమ్మహాత్ములు నియతాత్ములై శతరుద్రీయంబు జపించుచు నప్రమేయ ప్రభావుండగు భవునిం దమభావంబులలో నిలిపికొని యుండం దదీయానుభావంబునం జేసి యాదందశూకంబులు ముందటి చందంబు విడిచి విల్లును నమ్ముసునై యున్నం జూచి యా సవ్యసాచియు శౌరియు సమ్మదంబునం బొదలి వానిం బుచ్చుకొని వచ్చి శంభు సన్నిధిం బెట్టుటయు. 372**

**ప్రతిపదార్థం:** ఆ+విధంబు= ఆ ప్రకారం (ఆ తీరు); ఆ+దివ్య+అస్త్ర విలాసంబుగాన్= ఆ దివ్యమైన అస్త్రాల యొక్క క్రీడగా(లీలగా); ఎఱింగి= గ్రహించి; పాదప్రక్షాళన+ఉపస్పర్శనంబులు= కాళ్ళు కడుగుకొనటం, ఆచమనం చేయటాలు; ఆచరించి= చేసి(ఒనర్చి); ఆ+మహా+ఉరగంబులకున్= ఆ పెద్దపాములకు; ఉపస్థానంబు+చేసి= సేవచేసి (స్మరించి); వేదవిదులు+అగు= వేదాలు తెలిసినవాళ్ళయిన; ఆ+మహాత్ములు= ఆ మహనీయులు; నియత+ఆత్ములు+ఐ= నియమంతోడి మనస్సులు కలవారై; శతరుద్రీయంబు= యజుర్వేదంలోని 'నమక' మనే వేదభాగం; జపించుచున్= జపిస్తూ; అప్రమేయ+ప్రభావుండు= ఊహించటానికి శక్యంకాని మాహాత్మ్యం (ప్రకాశం) కలవాడు; అగు= ఐన; భవునిన్= పరమేశ్వరుడిని; తమ+భావంబులలోన్= తమ మనస్సులలో; నిలిపికొని+ఉండన్= స్థిరపరచుకొని ఉండగా; తదీయ+అనుభావంబునన్+చేసి= అతనియొక్క (ఆ పరమేశ్వరుడి యొక్క) మాహాత్మ్యం (ప్రభావం) చేత; ఆ+దందశూకంబులు= ఆ పాములు; ముందటి, చందంబు= పూర్వరూపం; విడిచి= వదలి; విల్లును= బాణాసనమూ; అమ్మునున్+ఐ= బాణమున్నూ అయి; ఉన్నన్+చూచి= ఉండగా కనుగొని; ఆ+సవ్యసాచియున్= ఆ అర్జునుడూ; శౌరియున్= శ్రీకృష్ణుడున్నూ; సమ్మదంబునన్= మిక్కిలి సంతోషంతో; పొదలి= ఒప్పి; వానిన్= ఆ వింటినీ, బాణాన్నీ; పుచ్చుకొని= గ్రహించి; వచ్చి= దూరంనుండి సమీపానికి చనుదెంచి (నడచి); శంభు+సన్నిధిన్= పరమేశ్వరుడి సమక్షంలో (ముందర); పెట్టుటయున్= దించటమున్నూ.

**తాత్పర్యం:** ఆ తీరు ఆ దివ్యాస్త్రాల లీలగా తెలిసికొని, వారిద్దరూ కాళ్ళు కడిగికొని, ఆచమించి నియమంతో శతరుద్రాన్ని (నమకాన్ని) జపిస్తూ మహానుభావుడైన శివుడిని తమ భావాలలో నిలిపికొని ఉండగా, పరమేశ్వరుడి మాహాత్మ్యం వలన ఆ పాములు ముందటి రూపాలు వదలి విల్లు, బాణంగా మారాయి. శ్రీకృష్ణార్జునులు వాటిని చూచి సంతోషించి, వాటిని తీసికొని వచ్చి శివుడి సమక్షంలో ఉంచగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **నీలలోహితవర్ణుండు బాలుఁ డొక్క। బ్రహ్మచారి మహాబల భవ్యమూర్తి**
**హరుని పార్శ్వంబు నందుండి, యలిగి యా శ। రాసనము పుచ్చికొని శర మరి నమర్చి.** **373**

**ప్రతిపదార్థం:** నీల లోహిత వర్ణుండు= నలుపుతో కూడిన ఎరుపు రంగు కలవాడు (నీలమూ, కుంకుమ పూవురంగూ కలిసిన దేహచ్ఛాయ కలవాడు); మహా,బల, భవ్య, మూర్తి= గొప్ప శక్తిచేత యోగ్యమైన స్వరూపం కలవాడు; బాలుఁడు= పసిపిల్లవాడూ (అయిన); ఒక్క బ్రహ్మచారి= బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించే ఒక వటువు; హరుని పార్శ్వంబు+అందుండి= శివుడి ప్రక్క వైపు నుండి; అలిగి= కోపించి; ఆ+శరాసనము= ఆ విల్లు; పుచ్చికొని= తీసికొని; శరము= బాణం; అరిన్= వింటి అల్లెత్రాడు మధ్యలో; అమర్చి= పొందికగా ఏర్పరచి.

**తాత్పర్యం:** నలుపుతో కూడిన ఎరుపురంగు కలవాడూ, గొప్పబలంచేత యోగ్యమైన స్వరూపం కలవాడూ, పసిబాలుడూ అయిన బ్రహ్మచారి ఒకడు శివుడి ప్రక్కవైపు నుండి, కోపించి విల్లు తీసికొని, బాణాన్ని అల్లెత్రాటి మధ్యలో అనుసంధించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ.** **తెగవాపుటయుం దదీయ స్థానకంబును ముష్టి ప్రకారంబును నేకాగ్రదృష్టిం గనుంగొను గాండివికి మన్మథ మథనుండు మంత్రస్వరూపం బనుగ్రహించినం బరిగ్రహించి.** **374**

**ప్రతిపదార్థం:** తెగవాపుటయున్= అల్లెత్రాటిని లాగుటయు; తదీయ, స్థానకంబును= ఆ బ్రహ్మచారియొక్క నిలబడిన తీరున్నూ (ఏ స్థానంలో ఏది ఎట్లా పట్టుకొని ప్రయోగించాలో ఆ పద్ధతియున్నూ); ముష్టిప్రకారంబును= పిడికిలి యొక్క విధమున్నూ; ఏకాగ్రదృష్టిన్= ఒకే విషయంపై మనస్సు నిలిపి చూచే చూపున్నూ; కనుంగొను+గాండివికిన్= చూచే అర్జునుడికి; మన్మథమథనుండు= మన్మథుడిని ధ్వంసం చేసిన మహేశ్వరుడు; మంత్రస్వరూపంబున్= మంత్రం యొక్క స్వభావాన్ని (విధానాన్ని); అనుగ్రహించినన్= దయచేయగా; పరిగ్రహించి= ప్రీతితో పుచ్చుకొని.

**తాత్పర్యం:** అల్లెత్రాటిని లాగటం, ఆ బ్రహ్మచారి నిలబడిన తీరును, పిడికిలి పట్టినతీరును, ఏకాగ్రదృష్టితో చూచే అర్జునుడికి మహేశ్వరుడు మంత్రస్వరూపాన్ని అనుగ్రహించగా దానిని స్వీకరించి.

**క. పురహరుఁ డనుమతి సేయఁగ । శరము శరాసనము దివ్యసరసిన యిడి య**
**న్నరుఁడు సనుదెంచి యాశం । కరు ముఖకమలంబు తెలివిఁ గాంచి ముదమునన్. 375**

**ప్రతిపదార్థం:** పురహరుఁడు= శంకరుడు; అనుమతి సేయఁగన్= అనుమతించగా; శరము= బాణం; శరాసనము= విల్లు; దివ్య సరసిన్+అ= ఆ అమృతమయమైన సరోవరమునందే; ఇడి= ఉంచి; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; చనుదెంచి= వచ్చి; ఆ+శంకరు= ఆ పరమేశ్వరుడి యొక్క; ముఖ కమలంబు= తామరవంటి ముఖం యొక్క; తెలివిన్= ప్రసన్నత్వాన్ని; కాంచి= చూచి; ముదమునన్= సంతోషంతో.

**తాత్పర్యం:** శివుని, అనుజ్ఞ ప్రకారం బాణాన్నీ, విల్లునూ ఆ అమృతమయమైన ఆ సరోవరంలోనే ఉంచి, అర్జునుడు వెంటనే వచ్చాడు. అప్పుడు శంకరుడి ముఖంలో ఉన్న ప్రసన్నత్వాన్ని చూచి ఎంతో సంతోషంతో- (తరువాతి వచనంతో అన్వయం).

**విశేషం:** అర్జునుడు 'శంకరు ముఖ కమలంబు తెలివి గాంచి' నాడు. ఇందులో శంకర పదం సాభిప్రాయం. సంతోషాన్ని కలిగించేవాడు శంకరుడు. అందుకే అతడి ముఖపద్మం కూడా ఎంతో సంతోషంతో ఉండినది. ఇక్కడ 'తెలివి' అనే పదానికి సంతోషం అనే కాకుండా, ప్రసన్నత, ప్రకాశం, అంగీకారం, వివేకం, వికాసం అనే అర్థాలను కూడా అన్వయించుకొనవచ్చును. పద్యాంతంలోని 'ముదమునన్' అనే ప్రయోగం కూడా 'శంకర' పద సార్థక్యాన్ని చాటుతూ ఉన్నది.

**వ. తనకు నరణ్యంబున నయ్యీశానుం డిచ్చిన వరంబును, దత్కాల సందర్శన ప్రకారంబునుం దలంపించిన నెఱింగి, యప్పశుపతి యతనిపైఁ గరుణార్ద్రంబగు కటాక్షవీక్షణం బొలయ 'నది యట్ల కాక దానికి నన్యథాత్వంబు గలదే?' యనియె నప్పు డప్పాశుపతాస్త్రంబు బ్రస్ఫుటంబుగాఁ బడసినవాఁడై పార్థుండు పులక పటల పరికలిత దేహుం డగుచుం దన యుత్సాహం బప్రతిహతంబయ్యె నని మనంబున నిశ్చయించెఁ దదనంతరంబ. 376**

**ప్రతిపదార్థం:** తనకున్= అర్జునుడైన తనకు; అరణ్యంబునన్= అరణ్యంలో (అరణ్యవాస సందర్భంలో); ఆ+ఈశానుండు= ఆ పరమేశ్వరుడు; ఇచ్చిన+వరంబును= ప్రసాదించిన వరాన్ని; తద్+కాల, సందర్శన ప్రకారంబునున్= ఆ సందర్భంలోని చూడటం యొక్క విధాన్ని; తలంపించినన్= జ్ఞప్తికి తేగా (పోలి ఉండగా); ఎఱింగి= తెలిసికొని(గ్రహించి); ఆ+పశుపతి= ఆ పరమేశ్వరుడు; అతనిపైన్= అర్జునుడిపై; కరుణా+ఆర్ద్రంబు+అగు= దయచేత చెమ్మగిల్లినదైన; కటాక్ష, వీక్షణంబు+ఒలయన్= కడగంటి చూపు ప్రసరింపగా (జాలువారగా); అట్లకాక= అట్లే అగుగాక; దానికిన్= ఆ వరానికి; అన్యథాత్వంబు= వేరొక విధంగా కావటం (వ్యతిరేకం); కలదే?= జరుగుతుందా?; అనియెన్= అన్నాడు; అప్పుడు= ఆ సందర్భంలో; ఆ+పాశుపత+అస్త్రంబున్= ప్రసిద్ధమైన పాశుపతాస్త్రాన్ని; ప్రస్ఫుటంబుగాన్= సుస్పష్టంగా (తేటతెల్లంగా); పడసినవాఁడు+ఐ= పొందినవాడై; పార్థుండు= అర్జునుడు; పులక, పటల, పరికలిత, దేహుండు+అగుచున్= పులకరింతల మొత్తంచేత కూడుకొన్న శరీరం కలవాడై; తన+ఉత్సాహంబు= తన కోరిక; అప్రతిహతంబు+అయ్యెన్= తిరస్కరించబడనిది అయింది; అని+మనంబునన్= అని మనస్సులో; నిశ్చయించెన్= స్థిరపరచుకొన్నాడు; తద్+అనంతరంబు+అ= దాని తర్వాత.

**తాత్పర్యం:** అరణ్యంలో శివుడు తన కిచ్చిన వరం, ఆ సమయంలో దర్శనమిచ్చిన విధం తోచగా, శివు డాతడిపై దయామయమైన చూపులు సారించి 'అది అంతే. దానికి మరొక విధంగా జరగటం కలగదు'- అని అన్నాడు. అప్పుడు అర్జునుడు పాశుపతాస్త్రాన్ని సుస్పష్టంగా పొంది, పులకరింతలతో పొంగిపోతూ, వారించరాని ఉత్సాహంతో మనసులో తన కోరిక నెరవేరినదని నిశ్చయించుకొన్నాడు. ఆ తరువాత.

**విశేషం:** 'పులక పటల పరికలిత' అనే ప్రయోగం భారతావతారికలో హరిహరనాథుడు కనిపించి అనుకంపాతిశయంతో మంత్ర ద్రష్ట కావ్య స్రష్టఅయిన తిక్కయజ్వను పిలిచిన సందర్భంలో అతడికి ఆనంద పారవశ్యాన్ని తెలిపేటప్పుడు ప్రయుక్తమైనది.

**తే. భవునిచే సాదరానుజ్ఞ వడసి శౌరి । ఫల్గునులు పలుమాఱుఁ దత్పదయుగంబు**
**ఫాలములు సోఁకఁ బ్రణమిల్లి బహుళరోమ । హర్ష సంభృతగాత్రులై యరుగుదెంచి. 377**

**ప్రతిపదార్థం:** శౌరి+ఫల్గునులు= శ్రీ కృష్ణార్జునులు; భవునిచేన్= ఈశ్వరుడిచేత; సాదర+అనుజ్ఞ= దయతో కూడుకొన్న అనుమతి; వడసి= పొంది; పలుమాఱున్= అనేక పర్యాయాలు; తద్+పదయుగంబు= ఆ శివుడి పాదములజంట; ఫాలములు= నొసళ్ళు; సోఁకన్= తగులగా; ప్రణమిల్లి= నమస్కరించి; బహుల రోమ హర్ష సంభృత గాత్రులు+ఐ= సంతోషం వలన దట్టమైన వెంద్రుకలతో (పులకరింతల వలన నిక్కపొడుచుకొన్న దట్టమైన వెంట్రుకలతో) చక్కగా భరించబడ్డ శరీరాలు కలవారై; అరుగుదెంచి= పోయి.

**తాత్పర్యం:** కృష్ణార్జును లిరువురు ఈశ్వరుడిచేత ఆదరపూర్వకమైన అనుమతి పొంది అనేక పర్యాయాలు ఆ పరమశివుడి అడుగులపై తమ నొసళ్ళు తాకేటట్లు నమస్కరించి, సంతోషంతో పులకరించిన శరీరాలు కలవారై పోయి.

**విశేషం:** ఈశ్వరానుజ్ఞ పొందిన కృష్ణార్జునులు పదే పదే శివుడి పాదాలపై తమ ఫాలభాగాలు నిలిపి, ప్రణామం చేశారు. ఆ సందర్భంలో వారిరువురు మహానంద భరిత పులకిత గాత్రులయ్యారు. ఇచ్చట తేటగీతి పద్యంలో 'వడసి, సోక, అరుగుదెంచి' అనే అచ్చతెలుగు క్రియాపదాలు ప్రయుక్తాలు. సాదరానుజ్ఞ, శౌరి ఫల్గునులు, తత్పదయుగంబు, ఫాలములు, అనే తత్సమపదాల మధ్య ఫల్గునులకు అనుగుణంగా పలుమారు ఫాలములకు వెంటనే సోక అనే అచ్చతెలుగు పదములు తేటగీతిలో ఒక సమతను సాధించటానికి ప్రయోగించాడు. చివరగా 'బహుల రోమహర్ష సంభృతగాత్రులై' అను సమాసంలో ఎంతో గాంభీర్యంతోడి భక్తి ప్రపత్తులు వెల్లడించబడ్డాయి.

**వ. నిజ శిబిరంబు సొత్తెంచి; రివ్విధంబున నర్జునుండు గల గాంచెఁ; గృష్ణుండు దారుకుతోడం దగు మాటలాడుచుండఁ దెలతెల వేగె; నది యాధనంజయస్వప్నాంత సమయంబై సంఘటించె నని యిట్లు సంజయుండు సవ్యసాచి యంతర్వర్తనంబు తెఱంగు ధృతరాష్ట్రున కెఱింగించె ననుటయు. 378**

**ప్రతిపదార్థం:** నిజ+శిబిరంబు= తన దండు విడిచినచోట; చొత్తెంచిరి= ప్రవేశించిరి; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; అర్జునుండు+కలన్+కాంచెన్= అర్జునుడు కలకన్నాడు; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; దారుకునితోడన్= రథసారథి దారుకుడితో; తగు మాటలు+ఆడుచుండన్= తగిన పలుకులు పలుకుతుండగా; తెలతెల, వేగెన్= (తెలతెలమని) తెల్లగా తెలవారింది; అది= అట్లు తెల్లవారటం; ఆ+ధనంజయ, స్వప్న+అంత సమయంబు+ఐ= ఆ అర్జునుడి కలయొక్క చివరికాలమై; సంఘటించెన్= సంభవించినది; అని+ఇట్లు= అని ఈ విధంగా; సంజయుండు; సవ్యసాచి+అంతర్వర్తనంబు+తెఱంగు= అర్జునుడి ఆంతరంగికమైన వర్తనముయొక్క తీరు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రుడికి; ఎఱింగించెన్= తెలిపాడు; అనుటయున్= అని చెప్పుటయున్నూ.

**తాత్పర్యం:** వారు తమ శిబిరానికి వచ్చారు. ఆ తీరుగా అర్జునుడు కలకన్నాడు. కృష్ణుడు దారుకుడితో తగినమాటలు మాట్లాడుతూనే ఉన్నాడు. అంతలో తెల్లవారింది. అప్పుడే అర్జునుడి కల కూడా ముగిసింది.

**క. 'మునినాథ! దేవకీసుతుఁ । డును సంక్రందనతనూజుఁడుం బూనిన యా**
**పని యెమ్మెయిఁ గడతేఱెనొ । వినవలతుం; దేటపఱుపవే పరిపాటిన్.' 379**

**ప్రతిపదార్థం:** మునినాథ!= మునీశ్వరా!; దేవకీసుతుఁడును= దేవకీకుమారుడైన కృష్ణుడును; సంక్రందన తనూజుడును= ఇంద్రుడి కొడుకైన అర్జునుడును; పూనిన= ప్రయత్నించిన; ఆ+పని= ఆ కార్యం; ఏ+మెయిన్= ఏ విధంగా; కడతేఱెనొ= పూర్తి అయిందో; పరిపాటిన్= క్రమాన్ని అనుసరించి; వినవలతున్= వినటానికి ఇష్టపడుతూ ఉన్నాను; తేటపఱుపవే= స్పష్టం చేయవలసింది.

**తాత్పర్యం:** వైశంపాయన మునీంద్రా! దేవకి కుమారుడైన కృష్ణుడూ, ఇంద్రుడి కొడుకైన అర్జునుడూ ప్రయత్నించిన కార్యం ఏ విధంగా పూర్తి అయిందో క్రమపద్ధతిలో వినాలని ఇష్టపడుతూ ఉన్నాను. దానిని స్పష్టం చేయవలసింది.'

**విశేషం:** ఈ పద్యాంశంలో ఉండే 'పరిపాటిన్' అనే ప్రయోగాన్ని పరిశీలించవలసి ఉంది. 'జరిగింది జరిగినట్లుగా, మొదటినుండి చివరిదాకా యావద్వృత్తాంతాన్ని సవిస్తరంగా క్రమం తప్పకుండా' అనే భావం ఆ పదంలో ఇమిడి ఉన్నది. విషయాన్ని సమగ్రంగా తెలిసికొనాలనే శ్రోతయొక్క ఉత్కంఠను కూడా ఆ పదం సూచిస్తుంది. సంప్రదాయ బద్ధంగా కార్యాన్ని నిర్వహించటంలో ఉండే శ్రద్ధాతాత్పర్యాలనూ కర్మప్రాధాన్య సిద్ధాంతాన్నీ ఆ ప్రయోగం వ్యక్తం చేస్తుంది.

**వ. అని అడుగుటయు. 380**

**తాత్పర్యం:** అని జనమేజయుడు అడుగుటయున్నూ - (మూడవ ఆశ్వాసంలోని వచనంతో అన్వయం).

**ఆశ్వాసాంతము**

**చ. లలిత చతుర్దళాఢ్య కమల ప్రసవ ప్రసరత్సరస్వతీ**
**విలసన సౌరభోద్గమ నివిష్ట! మహామహిమాభిరామ! కే**
**వల సుఖితానుభూతిమయ వైభవ సార! జగజ్జనిస్థితి**
**ప్రళయ విధాన కేళి పరిపాటి వికస్వర! నిత్యభాస్వరా! 381**

**ప్రతిపదార్థం:** లలిత, చతుః+దళ+ఆఢ్య కమలప్రసవ= అందమైన, నాలుగు రేకులచేత సంపన్నమైన (శ్రేష్ఠమైన) తామర పూవునుండి; ప్రసరత్+సరస్వతీ విలసన = జాలువారు పలుకుల లీల అనెడి; సౌరభ+ఉద్గమ; నివిష్ట!= సువాసనా ప్రసారమునందు ఉన్నవాడా!; మహా మహిమ+అభిరామ!= గొప్ప మాహాత్మ్యంచేత (ఐశ్వర్యం చేత); ఒప్పిదమైనవాడా!; కేవల సుఖితా-అనుభూతి మయ వైభవ సార!= స్వచ్ఛమైన (ఏకమైన) సౌఖ్యం యొక్క అనుభవమయమైన విభవంయొక్క సారం కలవాడా!; జగత్+జని, స్థితి, ప్రళయ, విధాన, కేళి, పరిపాటి, వికస్వర!= లోకం (విశ్వం) యొక్క పుట్టుక, నిలుపుదల గిట్టుట అనే విధంయొక్క క్రీడ (ఆట) యందలి అనుక్రమంచేత వికసించేవాడా!; నిత్యభాస్వరా!= ఎల్లప్పుడు ప్రకాశించేవాడా!

**తాత్పర్యం:** మనోజ్ఞములైన నాలుగు దళాలను కలిగియున్న తామరపూవునుండి జాలువారు వాగ్లీల అనే వాసనను వెలువరించటంలో ఏకాగ్రత కలవాడా! గొప్ప విభవంచేత ఒప్పిదమైన వాడా! కేవల సౌఖ్యానుభవంతో నిండుకొన్న ఐశ్వర్యం యొక్క సారం కలవాడా! లోకాలను సృష్టించటం, నిలపటం, విలీనం చేయటం అనే విధానాన్ని అనుక్రమంతో కూడుకొన్న ఒక క్రీడగా నిర్వహిస్తూ వికసించేవాడా! ఎల్లప్పుడు ప్రకాశించేవాడా!

**విశేషం:** నాలుగు రేకుల తామర వేదాలకు సూచన. వేదాలే సురభిళ నిశ్వాసంగా వెలుగొందే పరమాత్మా! అని మొదటి సంబోధనలోని సారాంశం. 'కేవల సుఖితానుభూతి' అనే విశేషణంలోని కేవల శబ్దం కైవల్య పదాన్ని బ్రహ్మానంద విభూతినీ సూచిస్తుంది. సృష్టిస్థితి సంహారాలు అనేవి పరమాత్మకు క్రీడలవంటివి. అయితే వాటిని ఒక క్రమాన్ని అనుసరించి నిర్వహించటం ఆయనకు పరిపాటి. అదే పరిపాటి శబ్దంలోని వైశిష్ట్యం. వికసించటం ప్రకాశించటం, సత్యం-శివం-సుందరం అనే మూడింటికీ ఆధారపీఠంగా ఉండటం ఆ పరమాత్మ లక్షణం. నాలుగుదళాల కమలం వంటి వాక్కులు అనే వాసనలు వెలువడినట్లు తిక్కన భావించిన తీరు అప్రతిమానం. సౌరభంలో సంస్కారాల సౌరు గుబాళింపజేస్తూ సౌరభోద్గమ నివిష్టుడుగా హరిహరనాథుడిని మన అందరి హృదయపీఠంలో కూర్చొనబెట్టటం అద్వైతాన్ని అభిమానించే ఆంధ్రుల అదృష్టం.

**క. హృదయ సరసిరుహ మధుపా । స్వద విహృతి విశేష! నిహత పాపోన్మేషా!**
**వదన సముత్థిత వేదా! । మదవదసుర హరణ కరణ మంత్ర వినోదా! 382**

**ప్రతిపదార్థం:** హృదయ, సరసిరుహ, మధుప+ఆస్పద, విహృతి, విశేష!= పద్మంవంటి హృదయమనెడి మధురమైన స్థానవిశేషమునందు విహారంచేత అతిశయించినవాడా!; నిహత పాప+ఉన్మేషా!= కొట్టబడ్డ పాపాలయొక్క అభివృద్ధి కలవాడా!; వదన సముత్థిత వేదా!= ముఖంనుండి పుట్టిన వేదాలు కలవాడా!; మదవత్+అసుర హరణ కరణ మంత్ర వినోదా!= పొగరుగల రాక్షసులయొక్క సంహరించటం అనే కార్యాన్ని ఆలోచించటంలో ఆనందం కలవాడా!;

**తాత్పర్యం:** హృదయపద్మంలో మధురస్థానవిశేషంలో విహారక్రీడతో విలసిల్లేవాడా! సకల పాపాల పెరుగుదలను సమయించేవాడా! ముఖంనుండి పుట్టిన వేదాలు కలవాడా! పొగరు కలుగు రాక్షసులను సంహరించే కార్యాలోచనలో ఆనందం కలవాడా!

**విశేషం:** హృదయ కేంద్రం పరమాత్మ స్థానం. ఆ స్థానాన్ని సులువుగా తెలిసికొనటానికి పద్మంతో హృదయాన్ని పోల్చటం పరిపాటి. పద్మంయొక్క నడిమిభాగంలో సూక్ష్మాతిసూక్ష్మ స్థానంలో ఉండే మకరందాన్ని ఎంతో సున్నితంగా, మహాసుకుమారంగా అనాయాసంగా గ్రహించగలిగే నేర్పూ ఓర్పూ తుమ్మెదకు సహజసిద్ధంగా అలవడింది. సాధకుడు తుమ్మెదవలె బ్రహ్మానంద మకరందాన్ని ఆస్వాదించగలిగితే 'బ్రహ్మవి ద్బ్రహ్మైవ భవతి' అన్నట్లు ఆ పరబ్రహ్మమే తాను కాగలుగుతాడు. హృదయంలో విహార విశేషంతో వర్ధిల్లే హరిహరనాథుడిని తిక్కన మనీషి అద్వైతి అయి దర్శించాడు.

ఈ పద్యంలోని చివరిపాదం లయాత్మకమైన ఒక మంత్రంవలె సాగింది. శబ్దాలంకార సౌందర్యంతోపాటు అర్థగాంభీర్యాన్ని పుడికిపుచ్చుకొన్నది. అగ్నిబీజమైన రకారం లయవిన్యాసాన్ని ప్రదర్శించింది. మంత్రిగా తిక్కన తాను నెఱపిన మంత్ర వినోదాన్ని శత్రుసంహార సందర్భంలో హరిహరనాథుడికి కూడా అన్వయించి ఒక రకమైన అభేదాన్ని నెలకొల్పాడు. తిక్కన అర్థవత్ శాబ్దిక సౌందర్య సమన్వయ స్ఫూర్తికి ఇది ఒక చక్కని నిదర్శనం.

**మాలిని.**

**ముని సముదయ హృద్యా! మూలవిద్యాzనవద్యా!**
**వినమదమృతవృష్టీ! విశ్వలోకైక దృష్టీ!**
**మనన సుగమమూర్తీ! మంత్రరూప ప్రకీర్తీ!**
**జనిమృతి భిషగాత్మా! శశ్వదాహ్లాదవర్త్మా !** **383**

**ప్రతిపదార్థం:** ముని, సముదయ, హృద్యా!= మహర్షుల సమూహానికి, హృద్యమైనవాడా!; (ఇచ్చట హృద్యశబ్దానికి మనస్సులో పుట్టినవాడు అని కానీ హృదయానికి ఇంపైనవాడు అని కానీ అర్థం గ్రహించవచ్చును); మూలవిద్యా+అనవద్యా!= ప్రధానమైన విద్యచేత అనింద్యుడా!; వినమత్+అమృతవృష్టీ!= మిక్కిలి నమస్కరించేవారికి అమృతపు వర్షమైనవాడా! విశ్వలోక+ఏక దృష్టీ!= సమస్త జగత్తుకూ ఒకే లక్ష్యమైన వాడా!; లేదా అభిప్రాయం కలవాడా!; మనన, సుగమ, మూర్తీ= నిరంతర చింతన లేక ధ్యానం చేత (సులభంగా) సులువుగా పొందదగిన స్వరూపం కలవాడా!; మంత్రరూప ప్రకీర్తీ!= జపం మననంచే కాపాడే రహస్యాలగు ఓం నమోనారాయణాయ ఓం నమశ్శివాయ వంటి మంత్రముల రూపమైన మిక్కిలి కీర్తి కలవాడా!; జని, మృతి, భిషక్+ఆత్మా!= పుట్టుకచావు (అను రోగాలు) లకు వైద్యుడవైన వాడా!; శశ్వత్+ఆహ్లాద, వర్త్మా!= నిత్యమైన సంతోషానికి దారి అయినవాడా!

**తాత్పర్యం:** మునిజనుల మనస్సులలో పుట్టి అందే రమించి ఇంపు కలిగించేవాడా! మూలభూతమైన ఆధ్యాత్మ విద్యచేత చెప్పదగినవాడా! (మొదలి చదువుచేత దోసములు లేనివాడా!), వినమ్రులకు అమృతవర్షమైనవాడా! సమస్త జగత్తుకూ ఒకే దృష్టి (లక్ష్యం) యైనవాడా! చింతన లేక ధ్యానం చేత సులభమైనవాడా! మంత్రరూపమైన ప్రసిద్ధయశస్సు కలవాడా! జననమరణాలకు వైద్యుడవైన వాడా! శాశ్వతమైన ఆనందానికి మార్గమైనవాడా!

**విశేషం:** తిక్కన ఆశ్వాసాంతములలోని మూడు పద్యాలలో ఒక క్రమపద్ధతిని అనుసరించాడు. ప్రతి ఆశ్వాసాంతంలోనూ చివరి పద్యం మాలినీవృత్తం. మొదటి పద్యం చంపకమాల లేక ఉత్పలమాల. రెండవపద్యం కందం.

ప్రస్తుతం మాలినీ వృత్తంలోని ఒక్కొక్క పాదంలో రెండేసి అంత్యానుప్రాసలు గల సంబోధనలు కూర్చబడ్డాయి. మునులకు హృద్యుడైతే, వినమ్రులకు అమృతవృష్టి భగవంతుడు, పరమసులభుడని అభ్యాసపరులూ, గమ్య మెరిగిన అనుభవజ్ఞులూ సర్వ సమర్థ సద్గురువుల సందేశం. మంత్రరూప జపసాధనతో ప్రణామాంజలితో కొందరు పరమార్థాన్ని గుర్తిస్తే మననంతో, మౌనంతో, పలువురు జనన మరణ రహితమైన, శాశ్వతానంద ప్రదమైన సత్యాన్ని దర్శించారు. పద్ధతులు భిన్నమైనా అందరి లక్ష్యమూ విశ్వలోకైక దృష్టియే. 'వైద్యో నారాయణో హరిః' అన్నట్లు జనన మరణ సంసార పరిభ్రమణను శాశ్వతంగా అరికట్టి, పథ్యాన్ని నిర్దేశించేవాడు పరమాత్మ. అతడే భిషగాత్మ. మునిజనం హృద్యమూ అనవద్యమూ అయిన మూలవిద్యను గ్రహించి, వినమ్రులై అమృత దృష్టితో ద్రష్టలై, ధ్యానంతో పరమసులభుడైన పరమాత్మను దర్శించి, నిర్భరమైన దివ్యానుభూతితో మంత్ర రూపంలో ప్రకీర్తించి, జనన మరణా లనే రోగాలను మహాభిషగ్వర్యులై నిర్జించి, చివరకు శాశ్వతమైన బ్రహ్మానంద పదాన్ని ఎంతో సులువుగా పొందగలిగారు.

ఈ ఆశ్వాసాంతపద్యాల్లో తిక్కన ఆధ్యాత్మికానుభవం అక్షరాక్షరంలోనూ ప్రతిఫలించింది. వైదిక కర్మ నిష్ఠమగు వర్తనచేత- అనగా యజ్ఞయాగాది కర్మానుష్ఠానంచేత తిక్కన సోమయాజి అయ్యాడు. కాని, దానిని మించిన అద్వితీయానుభవాన్ని ఆయన హరిహరాద్వైత భావనతో సాధించగలిగాడు. కర్మనుండి జ్ఞానం, జ్ఞానం తర్వాత ధ్యానం - ఇట్లా ఒక మెట్టునుండి మరొక మెట్టు అధిరోహించి చివరకు సర్వసమన్వయాత్మకమైన అద్వైతశిఖరాన్ని చేరి బ్రహ్మానంద సామ్రాజ్య పదవీ పట్టాభిషిక్తుడయ్యాడు. ఆశ్వాసాంతంలోని ప్రతిపద్యమూ అందులోని పదపదమూ, ఆయన అద్వైతానంద విభూతికి పరమావధి.

**గద్యము.**

**ఇది శ్రీ మదుభయ కవిమిత్త్ర, కొమ్మనామాత్య పుత్త్ర, బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబున ద్రోణపర్వంబునందు ద్వితీయాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ గ్రంథం; శ్రీమత్+ఉభయకవిమిత్త్ర= సంపద్యుక్తుడైన ఉభయకవిమిత్రుడు; కొమ్మనామాత్య పుత్త్ర= కొట్టరువు కొమ్మనామాత్యుడి కుమారుడు; బుధ+ఆరాధన, విరాజి= విద్వాంసులను సేవించటంచేత ప్రకాశించువాడు (అయిన) తిక్కన సోమయాజి+ప్రణీతంబు+అయిన= యజ్ఞం చేసినవాడైన తిక్కనచేత చేయబడినదైన; శ్రీ మహాభారతంబునన్= శ్రీ మహాభారతమునందు; ద్రోణపర్వంబునందున్= ద్రోణపర్వంలో; ద్వితీయ+ఆశ్వాసము= రెండవ ఆశ్వాసం.

**తాత్పర్యం:** ఈ మహాగ్రంథం ఉభయ కవిమిత్రుడు, కొమ్మనామాత్య పుత్రుడూ, విద్వాంసులను పూజించటంచేత మిక్కిలి ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శ్రీమహాభారతంలో ద్రోణపర్వంలోని రెండవ ఆశ్వాసం.

**ద్రోణపర్వంలో ద్వితీయాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము - తృతీయాశ్వాసము

**క. శ్రీ రమ్యతాద్రివరపు । త్రీరమణీయత్వ సుభగ దివ్యవిలాసో**
**దార! వనమాలికోరగ । హార పరిష్కార సార! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= లక్ష్మీదేవి యొక్క; రమ్యతా= సౌందర్యంచేతను; అద్రి వరపుత్రీ= పర్వతరాజైన హిమవంతుడి కొమార్తె అయిన పార్వతీదేవి యొక్క; రమణీయత్వ= సౌందర్యంచేతను; సుభగ= అందమైన; దివ్య విలాస= మహిమాన్వితాలైన లీలలచేత; ఉదార!= గొప్పవాడా!; వనమాలికా= తోమాల (వైజయంతి); ఉరగ హార= పాముదండ (వాసుకి) అనే; పరిష్కారసార!= శ్రేష్ఠమైన అలంకారాలను కలవాడా!; హరిహరనాథా!= హరిహరనాథుడా!

**తాత్పర్యం:** లక్ష్మీ పార్వతుల యొక్క సౌందర్యంచేత అందమైన విలాసాలు కలవాడా! వైజయంతిని, నాగహారాన్ని ఆభరణశ్రేష్ఠాలుగా ధరించినవాడా! ఓ హరిహరనాథా! (అవధరించుము).

**విశేషం:** అలం: యథాసంఖ్యం (క్రమాలంకారం). హరికి సతి లక్ష్మి, శివుడి భార్య పార్వతి; హరికి తోమాల, శివుడికి వాసుకి అలంకారాలు. ఇట్లా క్రమాన్వయం చెప్పుకోవాలి కాబట్టి క్రమాలంకారం - లేదా - యథాసంఖ్యం.

**అర్జునుఁడు నిజస్వప్న వృత్తాంతంబు ధర్మరాజాదులతోఁ జెప్పుట (సం. 7-58-1)**

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు= వ్యాసమహర్షి శిష్యుడైన వైశంపాయనుడు; జనమేజయునకున్= పరీక్షిన్మహారాజు పుత్రుడైన జనమేజయుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** హరిహరనాథా! వ్యాస శిష్యుడైన వైశంపాయనుడు పరీక్షిన్మహారాజు పుత్రుడైన జనమేజయుడితో ఈ విధంగా అన్నాడు.

**ఆ. పార్థుఁ డిట్లు ప్రతిన వట్టిన నది నిర్వ । హించు పనికిఁ గృష్ణుఁ డివ్విధమునఁ**
**బూని రాత్రి యన్ని పోకలఁబోవుట । విని విచిత్రవీర్యతనయుఁ డులికె. 3**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు+ఇట్లు ప్రతిన పట్టినన్= అర్జును డీవిధంగా ప్రతిజ్ఞ చేయగా (అనగా సైంధవుడిని హతమారుస్తానని); అది= ఆ ప్రతిజ్ఞను; నిర్వహించు పనికిన్= నెరవేర్చే కార్యానికి; కృష్ణుఁడు= శ్రీకృష్ణుడు; ఈ+విధమునన్= ఈ ప్రకారంగా; పూని= ప్రయత్నించి; రాత్రి= రాత్రివేళ; అన్ని పోకలన్+పోవుట= అన్నివిధాలైన నడకలు నడవటం (కైలాసాదులకు వెళ్ళటం మొదలైన పోకడలు); విని; విచిత్ర వీర్యతనయుఁడు= ధృతరాష్ట్రుడు; ఉలికి= బెదరి.

**తాత్పర్యం:** సైంధవుడిని హతమారుస్తానని అర్జునుడు ప్రతిజ్ఞ పూనాడు. అది నెరవేరటానికి రాత్రి శ్రీకృష్ణుడు మార్గాన్ని చూపాడు. ఆ విషయాన్ని విన్న ధృతరాష్ట్రుడు ఉలికిపడ్డాడు.

క. 'ఇమ్మెయి వేగినఁ బాండవు । లెమ్మెయిఁ గార్యంబు నడపి? రెఱిఁగింపుము; చి
త్తమ్ము కలంగెడు సంజయ! । నమ్మితి నగ్గురుఁడు గాచెనా మిమ్ము ననిన్?' 4

ప్రతిపదార్థం: సంజయ!= ఓ సంజయుడా!; ఈ+మెయిన్= ఈ విధంగా; వేగినన్= తెల్లవారగా; పాండవులు; కార్యంబున్= తాము చేయవలసిన పనిని; ఏ+మెయిన్= ఏ విధంగా; నడపిరి?= సాగించినారు?; ఎఱిఁగింపుము= నాకు తెలియజేయుము; చిత్తమ్ము= నా మనసు; కలంగెడున్= చీకాకు పడుతూ ఉన్నది; నమ్మితిన్= (గురుడిని) నమ్మినాను; అనిన్= యుద్ధంలో; మిమ్మున్= మీ అందరిని; ఆ+గురుఁడు= ఆ గురువైన ద్రోణాచార్యుడు; కాచెనా?= కాపాడెనా?

తాత్పర్యం: 'ఓ సంజయా! ఈ విధంగా తెల్లవారగా, పాండవులు తమ ప్రయత్నాలు ఏ విధంగా సాగించారో నాకు తెలుపుము. నా మనస్సు కలతగా ఉంది. నమ్మిన ఆ గురుడు ద్రోణుడు మిమ్ములను యుద్ధంలో కాపాడెనా?'

వ. అని అడిగిన నమ్మహీశ్వరునకు సూతసూనుం డిట్లను; 'నట్లు ప్రభాతం బగుటయు. 5

తాత్పర్యం: ఆ విధంగా ధృతరాష్ట్రుడు అడుగగా సంజయుడు ఇట్లా అన్నాడు: 'ఆ విధంగా తెల్లవారగా. (తరువాతి పద్యంతో అన్వయం).

క. వందిజన తుములముల యా । నందిత మాగధ సుగీత నాదంబుల ప్ర
స్పందిత పాఠక రవముల । క్రందున ధర్మజుఁడు మేలుకనియె నరేంద్రా! 6

ప్రతిపదార్థం: నరేంద్రా!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); వందిజనతుములముల= వందిజనుల సందడులచేత; ఆనందిత= సంతోషపెట్టిన; మాగధ= పొగడ్తలతో జీవించే వారి; సుగీత= మంచిపాటల; నాదంబులన్= శబ్దాలతో; ప్రస్పందిత= మిక్కిలి కదలికగల; పాఠక రవములన్= స్తుతి పాఠకుల శబ్దాలయొక్క; క్రందునన్= సవ్వడితో; ధర్మజుఁడు= ధర్మరాజు; మేలుకనియెన్= నిదురమేలుకొన్నాడు.

తాత్పర్యం: ఓ రాజా! వందిమాగధులు పొగడ్తలతో స్తోత్రాలు చేస్తూ ఉండగా, తరచు వినిపించే వారి స్తుతి పాఠాల సవ్వడికి ధర్మరాజు నిదుర మేల్కొన్నాడు.

విశేషం: రాజాంతఃపురాలలో ప్రాచీనకాలంలో వందిమాగధులైన బట్టువారు పొగడ్తలతో పాటలు పాడి ప్రభువులను నిదుర మేల్కొల్పటం ఒక సంప్రదాయంగా ఉండేది.

వ. ఇట్లు మేలు కని తగు తెఱంగున మజ్జనశాలకుంజని, మంత్రపూతంబులగు జలంబులు సముచిత పరిచారికా జనంబులు గనక కలధౌత కలశంబులఁ దేరఁ గృతస్నానుండయి, లఘుధౌతాంబర పరిధానంబును బరిమళ బహుళాంగ రాగానులేపనంబును సురభి కుసుమ మాలికాభరణధారణంబును నాచరించి, దేవార్చనంబు దీర్చి యగ్నికార్యంబు నిర్వర్తించి, కక్ష్యాంతరంబునకు వెడలి, విప్రనికరంబులకు ధేనుప్రకరంబులు గాంచన సంచయంబులు వస్త్రవిసరంబులు మణిభూషణ పుంజంబులుం జిత్తంబు రంజిల్ల నొసంగి తదాశీర్వాదంబులు గైకొనుచు నేనుంగు మొగసాల గడచి యాస్థాన మండపంబునకు వచ్చి. 7

ప్రతిపదార్థం: ఇట్లు మేలుకని= ఈ విధంగా నిదురనుండి లేచి; తగు తెఱంగునన్= తగినవిధంగా; మజ్జనశాలకున్+చని= స్నాన గృహమునకు వెళ్ళి; మంత్రపూతంబులు+అగు జలంబులు= మంత్రాలచేత పవిత్రమైన నీటిని; సముచిత= తగిన; పరిచారికా జనంబులు= దాసీజనాలు; కనక= బంగారు; కలధౌత= వెండి; కలశంబులన్= పాత్రములతో; తేరన్= తీసికొనిరాగా; కృత+స్నానుండు+అయి= స్నానమాడి; లఘుధౌత+అంబర పరిధానంబును= తేలిక అయిన తెల్లని ధోవతిని; పరిమళ=

సువాసనలతో; బహుళ= విస్తారమైన; అంగరాగానులేపనంబును= మైపూతలు బాగా పూసికొనటం; సురభి= మంచివాసనలతో ఉన్న; కుసుమమాలికా= పూలమాలలయొక్క; ఆభరణ= (కిరీటాది) నగలయొక్క; ధారణంబును= ధరించటమున్నూ; ఆచరించి= చేసి; దేవ+అర్చనంబు+తీర్చి= దేవపూజచేసి; అగ్నికార్యంబు నిర్వర్తించి= ఔపాసనాదికాలను చేసి; కక్ష్యా+అంతరంబునకున్= లోపలికి; వెడలి= వెళ్ళి; విప్రనికరంబులకున్= బ్రాహ్మణసమూహాలకు; ధేనుప్రకరంబులు= ఆవుల మందలను; కాంచన సంచయంబులు= బంగారపు మొత్తములును; వస్త్రవిసరంబులు= గుడ్డల సమూహమును; మణిభూషణ పుంజంబులు= రత్నాలు పొదిగిన నగల సమూహాన్ని; చిత్తంబు= (వారి) మనసులు; రంజిల్లన్= సంతసించగా; ఒసంగి= ఇచ్చి; తదాశీర్వాదంబులు= ఆ విప్రుల దీవెనలను;కైకొనుచున్= తీసికొంటూ; ఏనుంగు మొగసాలన్= ఏనుగుల కొట్టమును; కడచి= దాటి; ఆస్థానమండపంబునకున్= సభామంటపానికి; వచ్చి= వచ్చి.

**తాత్పర్యం:** వందిమాగధుల స్తోత్రాలతో ధర్మరాజు నిద్రలేచి జలకాలాడు గదికి వెళ్ళాడు. ఆ స్నానశాలకు దాసీజనం సుగంధద్రవ్యాలతో నిండిన మంత్రజలాలను బంగారు వెండి గిండీలతో తీసికొని వచ్చారు. ఆ నీళ్ళతో ధర్మజుడు స్నానమాడి, పరిశుభ్రమైన వస్త్రాలను, సుగంధద్రవ్యాలను, పూలమాలలనూ ధరించి, దేవతార్చనలు చేసి, ఇంటిలోనికి వెళ్ళి, బ్రాహ్మణులకు ఆవులను, బంగారాన్ని, వస్త్రాలనూ దానం చేసి వారి ఆశీర్వాదాలను పొంది, ఏనుగు మొగసాలను దాటి సభాస్థలికి వచ్చి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఆనాటి రాజభోగ విశేషాలను చాటుతున్న దీ వచనం.

**తే.** **ఉదయధరణీధరంబుపై నొప్పు దివస । నాథు నెనయుచు సింహాసనంబుమీఁదఁ**
**బొలిచె లీలావతీ కరకలిత చామ । రములు వొలయంగ నుచిత జనములు గొలువ. 8**

**ప్రతిపదార్థం:** ఉదయ ధరణీ ధరంబుపైన్= తూర్పుకొండమీద; ఒప్పు= విలసిల్లే; దివసనాథు= సూర్యుని; ఎనయుచున్= సరిపోలుతూ; సింహాసనంబుమీఁదన్= సింహాసనంపైన; లీలావతీ= అందగత్తెల (దాసీజనాల); కరకలిత= చేతులతో ధరింపబడిన; చామరములు= వింజామరాలు; పొలయంగన్= ఒప్పారగా; ఉచిత జనములు= తగినవారు; కొలువన్= సేవించగా; పొలిచెన్= (ధర్మరాజు) ఒప్పి ఉండినాడు.

**తాత్పర్యం:** సేవకులు సేవిస్తుండగా, దాసీ జనం వింజామరాలు వీస్తుండగా, ఉదయపర్వతంమీద ప్రకాశించే సూర్యుడిని తలపిస్తూ ధర్మరాజు సింహాసనాసీనుడై ఉన్నాడు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**వ.** **కొలువున్న సమయంబున దౌవారికుఁడు వచ్చి 'దామోదరుండు వచ్చె' నని యెఱింగించిన 'నవ్విభుండు వేగంబ తత్ప్రవేశంబు నడపు' మనిన వాఁ డట్లుచేయ నమ్మహాత్ముండు ప్రీతి నేతెంచుటయు, నుచితాసన విన్యాసంబున నత్యాదర ముఖవికాసంబున నతనికి సత్కారంబు సేసి గారవించి తదాననం బాలోకించి యి ట్లనియె. 9**

**ప్రతిపదార్థం:** కొలువు+ఉన్న సమయంబునన్= (ధర్మరాజు) కొలువుదీరి ఉన్నప్పుడు; దౌవారికుఁడు= ద్వారపాలకుడు (వాకిలి కావలి కాచేవాడు); వచ్చి; దామోదరుండు= శ్రీకృష్ణుడు; వచ్చెను+అని ఎఱింగించినన్= వచ్చి ఉన్నాడని తెలుపగా; ఆ+విభుండు= ధర్మరాజు; వేగంబు+అ, తత్+ప్రవేశంబు నడపుము+అనిన= వెంటనే అతడిని లోనికి ప్రవేశపెట్టుము అనగా; వాఁడు+అట్లచేయన్= వా డా విధంగా చేయగా; ఆ+మహాత్ముండు= ఆ మహనీయుడు; ప్రీతిన్+ఏతెంచుటయున్= ప్రేమతో రాగా; ఉచిత+ఆసన విన్యాసంబునన్= తగిన ఆసనాన్ని ఉంచి; అతి+ఆదర, ముఖవికాసంబునన్= మిక్కిలి ప్రీతితో కూడిన ముఖవికాసంతో; అతనికిన్= శ్రీకృష్ణుడికి; సత్కారంబు చేసి= మర్యాద చేసి; గారవించి= గౌరవించి; తద్+ఆననంబు+ఆలోకించి= అతడి ముఖాన్ని చూచి.

**తాత్పర్యం:** ధర్మరాజు కొలువు దీరి ఉండగా ద్వారపాలకుడు వచ్చి 'శ్రీకృష్ణుడు వచ్చాడు' అని తెలిపాడు. వెంటనే ధర్మరాజు 'ఆయనను లోనికి ప్రవేశపెట్టు'మని పలుకగా అతడట్లాగే చేశాడు. అప్పుడు ఆ మహనీయుడు సంతోషంతో రాగా, ఆతడికి తగిన ఆసనమిచ్చి, గౌరవభావంతో సంతోషంగా సత్కారాలు చేశాడు.

**క. 'జ్ఞానమ్ములు దెలివొందం। గా నత్యంతంబు సుఖముగా నింద్రియ సం**
**తానంబు ప్రసన్నముగా। నీ నిశ శుభవృత్తి గడపితే మధుమథనా!' 10**

**ప్రతిపదార్థం:** మధుమథనా!= మధుసూదనా! (శ్రీకృష్ణా!); జ్ఞానమ్ములు= ప్రజ్ఞలు; తెలివొందంగాన్= వికసించగా; అత్యంతంబు= మిక్కిలి; సుఖముగాన్= సుఖంగా; ఇంద్రియ సంతానంబు= పంచేంద్రియాల సమూహం; ప్రసన్నముగాన్= నిర్మలంగా ఉండగా; ఈ నిశన్= ఈ రాత్రిని; శుభవృత్తిన్= మంగళకరమైన వర్తనంతో; కడపితే?= గడిపావా?

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! ప్రజ్ఞలు వికసించగా, ఇంద్రియసమూహం కలత చెందకుండగా ఈ రాత్రి ప్రశాంత మనస్సుతో సుఖంగా గడిపావా?

**క. అనుటయు హరి ధర్మతనూ। జున కిట్లనుఁ 'బ్రీతి నిన్నుఁ జూడఁగనెపుడున్**
**జనసుత! శోభనములు నా। కనూనముల కాదె? దీని నడుగఁగ నేలా?' 11**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ఆ విధంగా ధర్మరాజు ప్రశ్నించగా; హరి= శ్రీకృష్ణుడు; ధర్మతనూజునకున్+ఇట్లు+అనున్= ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు; జననుత!= ప్రజలచేత కీర్తింపబడేవాడా!; ఎపుడున్= అన్ని సమయాలలో; నిన్నున్= నిన్ను; ప్రీతిన్+చూడన్= ప్రేమతో చూడగా; నాకున్= నాకు; శోభనములు= (మంగళకరమైన) క్షేమాలు; అనూనముల కాదె!= తక్కువ కావుకదా! (అనగా-విస్తారంగా కలుగును కదా!); దీనిని= ఈ విషయాన్ని; అడుగఁగన్+ఏలా?= ప్రశ్నించటం ఎందుకు?

**తాత్పర్యం:** అని ధర్మరాజు పలుకగా శ్రీకృష్ణు డిట్లా అన్నాడు - 'ప్రజల మన్ననలందుకునే ఓ ధర్మరాజా! సంతోషంతో నిన్ను ఎప్పుడు చూచినా నాకు శుభపరంపరలు మిక్కుటంగా కలుగుతూ ఉంటాయికదా! ఇక ఈ అంశాన్ని గురించి ప్రత్యేకంగా అడగటం ఎందుకు?'

**వ. అని పలికె నట్టియెడ భీమ నకుల సహదేవులును; సాత్యకి ద్రౌపదేయ ఘటోత్కచులును, బాంచాల మాత్స్య కేకయులును, మఱియుం దగువారుం జనుదెంచి సముచితంబుగాఁ బ్రవేశించి యుధిష్ఠిరునకుం బొడసూపి, యతండు నియోగింప నుచితాసనంబుల నుండిరి; సాత్యకిం గృష్ణుండు నిజాసనంబున నునిచికొనియెం; దదనంతరంబ యెల్లవారలు వినుచుండ నన్నరపతి నారాయణున కిట్లనియె. 12**

**ప్రతిపదార్థం:** అని పలికెన్= ఆ విధంగా పలికాడు; అట్టియెడన్= ఆ సమయాన; భీమ నకుల సహదేవులును= భీమసేనుడూ, నకుల సహదేవులూ; సాత్యకి ద్రౌపదేయ ఘటోత్కచులును= సాత్యకీ, ఉపపాండవులూ, ఘటోత్కచుడూ; పాంచాల మాత్స్యకేకయులును= పాంచాల మాత్స్య కేకయ దేశీయులూ; మఱియున్= ఇంకనూ; తగువారున్= తగినవారునూ; చనుదెంచి= వచ్చి; సముచితంబుగాన్= తగిన రీతిలో; ప్రవేశించి= లోనికి వచ్చి; యుధిష్ఠిరునకున్= ధర్మరాజునకు; పొడసూపి= కానుపించి; అతండు= ధర్మరాజు; నియోగింపన్= ఉత్తరువుచేయగా; ఉచిత+ఆసనంబులన్= (తమకు) తగిన పీఠాలలో; ఉండిరి= కూర్చున్నారు; సాత్యకిన్= సాత్యకిని; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; నిజ+ఆసనంబునన్= తాను కూర్చున్న స్థానంలో; ఉనిచికొనియెన్= కూర్చుండబెట్టుకొన్నాడు; తదనంతరంబు+అ= ఆ మీదట; ఎల్లవారలు= సభలోని వారంతా; వినుచుండన్= వింటూ ఉండగా; ఆ+నరపతి= ఆ రాజు(ధర్మరాజు); నారాయణునకున్= శ్రీకృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ధర్మజుని ప్రశ్నలకు శ్రీకృష్ణుడు ఆ విధంగా సమాధానం చెప్పాడు. ఆ సమయాన భీమ నకుల సహదేవులూ, సాత్యకి ద్రౌపదేయ ఘటోత్కచులూ, పాంచాల మత్స్య కేకయులూ, ఇంకా తగినవారూ ధర్మజుడి ఆజ్ఞ ప్రకారం తమ తమ స్థానాలలో కూర్చున్నారు. శ్రీకృష్ణుడు సాత్యకిని తన ఆసనంలో సరసన కూర్చొనబెట్టుకొన్నాడు. ఆ సమయాన అందరూ వింటుండగా శ్రీకృష్ణుడితో ధర్మరాజు ఈ విధంగా చెప్పాడు:

**ఉ. 'పంకజనాభ! మాపడినపాటులు రాజ్యము గోలుపోకయుం**
**గింకకు మూలమై కడఁగి గెల్పుకిరీటికి నీఁ దలంచి యీ**
**వంకకు వ్రాలి భక్తజనవత్సలతన్ రథచోదకుండ వై**
**తిం కిట మమ్ముఁగావు మని యేటికిఁ జెప్పఁగ మాటిమాటికిన్? 13**

**ప్రతిపదార్థం:** పంకజనాభ!= పద్మనాభుడా!; మాపడిన పాటులు= మేం పడిన కష్టాలు; రాజ్యము కోలుపోకయున్= రాజ్యాన్ని పోగొట్టుకొనటమూ; కింకకున్= నీ కోపానికి; మూలమై= ప్రధానకారణమై; కడఁగి= పూనుకొని; కిరీటికిన్= అర్జునుడికి; గెల్పు= జయాన్ని; ఈన్+తలంచి= ఇయ్యదలచి; ఈ వంకకున్= మా పక్కకు; వ్రాలి= చేరి; భక్తవత్సలతన్= భక్తుడిమీది దయతో; రథచోదకుండవు+ఐతి(వి)= సారథివి అయినావు; ఇంకన్= ఈ మీద; ఇటన్= ఇక్కడ; మమ్ము= మమ్మలను; కావుము+అని= కాపాడుమని; చెప్పఁగన్ మాటిమాటికిన్ ఏటికిన్?= మళ్ళీ మళ్ళీ చెప్పటం ఎందుకు?

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణా! రాజ్యాన్ని కోలుపోయి మేము పడ్డ కష్టాలన్నీ నీ కోపానికి మూలం కాగా, భక్తవత్సలతతో మా ప్రక్కకు వచ్చి, అర్జునుడికి సారథివైనావు. అటువంటప్పుడు మాటిమాటికీ మమ్మ కాపాడుమని నీకు చెప్పవలెనా?

**వ. అర్జును ప్రతిన చిత్తంబున నిలుపుము; దుఃఖామర్ష మహార్ణవ మగ్నులమైన మమ్ముం దీరంబు సేరుపం దేపవు**
**నీవ కాదె?' యనిన విని యచ్యుతుం డతని కి ట్లనియె. 14**

**ప్రతిపదార్థం:** అర్జును ప్రతిన= అర్జునుడి శపథాన్ని; చిత్తంబునన్= నీ మనసులో; నిలుపుము= నిల్పుకొనుము; దుఃఖ+అమర్ష, మహా+అర్ణవ, మగ్నులము+ఐన= దుఃఖకోపాలనే మహాసముద్రాలలో మునిగినవారమైన మమ్మున్= మా అందరిని; తీరంబు,చేరుపన్= గట్టెక్కించటానికి; తేపవు= తెప్పవు; నీవు+అ+కాదె!= నీవేకదా!; అనినన్+విని= అనగా విని; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; అతనికిన్= ఆ ధర్మరాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడి ప్రతిజ్ఞను (సైంధవుని చంపుతానన్న ప్రతిజ్ఞను) నీమనస్సులో నిలుపుకొనుము. దుఃఖకోప మహాసముద్రంలో మునిగిన మా అందరినీ గట్టెక్కించే తెప్పవు నీవే కదా!' అన్న ధర్మరాజుతో శ్రీకృష్ణు డీవిధంగా అన్నాడు:

**విశేషం:** అలం: రూపకం.

**మ. విను నేఁ డర్జునుఁ డన్యసైన్యముల నుర్విం గూల్చుచుం బ్రేత భూ**
**త నికాయంబులు మాంస భక్షణము రక్తస్వైర పానంబుఁ జే**
**సి నలిం గ్రాలఁగఁ గ్రీడసల్పు నిను మెచ్చించుం దుదిన్ సైంధవుం**
**డను వానిం దెగటార్చి పేర్చు రిపుధైర్యక్షేపణాటోపతన్. 15**

**ప్రతిపదార్థం:** విను= వినుము; నేఁడు= ఈదినం; అర్జునుఁడు= అర్జునుడు; అన్యసైన్యములన్= శత్రుసేనలను; ఉర్విన్= భూమిపై; కూల్చుచున్= చంపుతూ; ప్రేత భూత నికాయంబులు= దయ్యాల పిశాచాల గుంపులు; మాంసభక్షణము= మాంసాన్ని తినటం;

రక్తం= నెత్తురును; స్వైరపానంబున్+చేసి= స్వేచ్ఛగా త్రాగి; నలిన్= బాగుగా; క్రాలఁగన్= ఒప్పగా; క్రీడసల్పున్= ఆటలాడును; నినున్= నిన్ను; మెచ్చించున్= మెప్పించును; తుదిన్= ఆఖరున; సైంధవుండు+అను వానిన్= సైంధవుడనే పేరు కలవాడిని; తెగటార్చి= చంపి; రిపు= శత్రువుల; ధైర్య= ధైర్యమును; క్షేపణ= పోగొట్టేటి; ఆటోపతన్= విజృంభణంతో; పేర్చున్= చెలరేగుతాడు.

**తాత్పర్యం:** ఈ రోజు అర్జునుడు శత్రుసైన్యాలను చంపుతూ, భూతప్రేతాలు ఆ చనిపోయిన వారి మాంసాన్ని తింటూ, వారి నెత్తురును యథేచ్ఛగా త్రాగుతూ ఉండగా ఆఖరున సైంధవుడిని చంపి శత్రువుల ధైర్యాన్ని పోగొట్టి సంభ్రమంగా విజృంభిస్తాడు.

**వ. క్రోధ శోక జ్వర విముక్తుండ వై శాంతిం బొందు ' మను నవసరంబున ధనంజయుండు వచ్చి ధర్మనందనునకు మ్రొక్కి నిలిచినం జూచి యతండు సంతసంబున సముత్థితుండై కౌఁగిలించుకొని దీవించి దరస్మిత రుచిరాననుండై. 16**

**ప్రతిపదార్థం:** క్రోధ శోక జ్వర ముక్తుడవు+ఐ శాంతిన్+పొందుము= కోపదుఃఖా లనే జ్వరమును వదలి శాంతముతో ఉండుము; అను అవసరంబునన్= అనే సమయాన; ధనంజయుండు= అర్జునుడు; వచ్చి; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; మ్రొక్కి= నమస్కారం చేసి; నిలిచినన్= నిలువగా; చూచి; అతండు= ధర్మరాజు; సంతసంబునన్= సంతోషంతో; సముత్థితుండు+ఐ= లేచి; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; దీవించి= ఆశీర్వాదం చేసి; దరస్మిత రుచిర+ఆననుండు+ఐ= చిరునవ్వుతో ప్రకాశించే ముఖం కలవాడు అయి.

**తాత్పర్యం:** కోపం, దుఃఖం అనే జ్వరం నుండి విముక్తుడవై శాంతి పొంది ఉండుము' - అని అంటున్న సమయంలో అర్జునుడు వచ్చి ధర్మరాజుకు నమస్కరించి నిలువబడగా చూచి, అతడు ఆసనంనుండి సంతోషంతో లేచి అర్జునుడిని కౌగిలించుకొని ఆశీర్వదించి చిరునవ్వు నవ్వి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'గెలుపు ధ్రువము నీకును మెయిఁ । దలతలమనుచాయ దోఁచె; దైత్యాంతకుఁడుం**
**దెలివొంది యున్నవాఁ'డని । పలికిన నా విభునితోడఁ బార్థుఁడు నెమ్మిన్. 17**

**ప్రతిపదార్థం:** గెలుపు ధ్రువము= నీకు విజయం నిశ్చయం; నీకున్= నీకు; మెయిన్= శరీరంలో; తలతలమనుచాయ= తళతళమని ప్రకాశించే కాంతి; తోఁచెన్= కానవస్తూ ఉన్నది; దైత్యాంతకుఁడున్= శ్రీకృష్ణుడు (దైత్య సంహారి); తెలివి+ఒంది ఉన్నవాఁడు= జాగరూకుడై ఉన్నాడు; అని పలికినన్= అని చెప్పగా; నెమ్మిన్= ప్రీతితో; ఆ విభుని తోడన్+పార్థుఁడు= ధర్మరాజుతో అర్జునుడు.

**తాత్పర్యం:** 'విజయం కలగటం తథ్యం. నీ శరీరంలో తళతళలాడే కాంతి కన్పిస్తున్నది. శ్రీకృష్ణుడు కూడా తెలివొంది ఉన్నాడు' - అని పలుకగా అర్జునుడు అతడితో ప్రీతితో - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'దేవరకు నధికభద్రము; । యీా వసుదేవసుతు కరుణ నే నత్యాశ్చ**
**ర్యావహము గంటి; నది వినఁ । గావలయును బంధు మిత్ర గణ సహితముగన్'. 18**

**ప్రతిపదార్థం:** దేవరకున్= ఏలినవారికి (అనగా మీకు); అధిక భద్రము+అ= మిక్కిలి క్షేమమే; ఈ వసుదేవసుతు= ఈ వాసుదేవుడి కుమారుడైన కృష్ణుడు కరుణన్= దయతో; ఏను= నేను; అతి+ఆశ్చర్యావహమున్= మిక్కిలి వింత అయిన విషయాన్ని; కంటిన్= చూచాను; అది= దానిని; బంధుమిత్రగణ సహితముగన్= బంధువులతో, స్నేహితులతో అందరితో కలిసి; వినఁగాన్ వలయున్=వినవలెను.

**తాత్పర్యం:** 'దేవరవారైన మీకు మిక్కిలి కుశలమే. ఈ వాసుదేవుడి దయతో నే నొక అద్భుతాన్ని చూచాను. బంధుమిత్రుల సమూహాలతో కలిసి ఆ విశేషాన్ని మీరు వినవలెను.'

వ. అని పలికి స్వప్నంబున ఫాలలోచనువలనం బరమోత్కర్షంబు వడసిన తెఱం గేర్పడం జెప్పిన నతండును గొలువు వారును విస్మయ ప్రమోదంబులతో వృషభధ్వజు నుద్దేశించి నమస్కరించిరి; తదనంతరంబ యన్నరపతిచేత నన్నుజ్ఞాతులయి యా సకలయోధులుం బొంగి సంగర సన్నాహంబులు మెఱయ వెడలిరి; కృష్ణార్జున సాత్యకులు నతనికి నభివాదంబులు సేసి సహర్షంబుగా వెలువడి యర్జునావాసంబున కరిగి; రందుఁ గృష్ణుండు రథంబు వన్ని, జైత్రంబులగు మంత్రంబులు ప్రయోగించి యుజ్జ్వలంబు సేసిన నది బాలభానుండునుం బోలె దేజోమయంబై వెలుంగుచుండ సమర సన్నద్ధుండై ధనుర్బాణ పాణియై యర్జునుండు విప్రాశీర్వాదంబులతో నమ్మహనీయ స్యందనంబునకుం బ్రదక్షిణంబునుఁ బ్రణామంబునుం జేసి యారోహణం బాచరించి మేరు శిఖరంబునం బొలుచు భాస్కరుని భంగి శోభిల్లెఁ గృష్ణ సాత్యకులు నొగలను నతని పిఱుందను గూర్చున్న నా ఫల్గునుండు బుధశుక్ర సమేతుం డగు చంద్రు చందంబున నొప్పె; న ట్లొప్పివారు పుణ్యపాఠక రవంబులును వందిమాగధ ధ్వనులును వినుచుం జని రప్పుడు దమకు విజయప్రదంబులు గౌరవులకు విపరీతంబులు నైన గంధవాహాది నానానిమిత్తంబు లనుసంధించి యా సవ్యసాచి సాత్యకితో నిట్లనియె. 19

**ప్రతిపదార్థం:** అని పలికి= ముందర చెప్పినట్లుగా మాటాడి; స్వప్నంబునన్= కలలో; ఫాలలోచనువలనన్= ఈశ్వరుడి వలన; పరమోత్కర్షంబు పడసిన= శ్రేష్ఠమైన మేలుపొందిన; తెఱంగు+ఏర్పడన్+చెప్పినన్= పద్ధతిని స్పష్టంగా చెప్పగా; అతండును= ధర్మరాజును; కొలువువారును= సభలో ఉండేవారును; విస్మయ ప్రమోదంబులతోన్= సంతోషాశ్చర్యాలతో; వృషభధ్వజున్= ఈశ్వరుడిని; ఉద్దేశించి= తలచుకొని; నమస్కరించిరి= నమస్కారం చేశారు; తదనంతరంబు+అ= ఆ మీద; ఆ+నరపతిచేతన్= ఆ రాజువలన; అనుజ్ఞాతులై= ఉత్తర్వునంది; ఆ సకలయోధులు= ఆ సైనికులంతా; పొంగి= ఉబ్బి; సంగర సన్నాహంబులు= యుద్ధప్రయత్నాలు; మెఱయన్ వెడలిరి= బయల్పడగా వెళ్ళారు; కృష్ణ+అర్జున సాత్యకులు; అతనికిన్+అభివాదంబులు+చేసి= ధర్మజుడికి నమస్కారాలు చేసి; సహర్షంబుగాన్= సంతోషంతో; వెలువడి= బయటకు వెళ్ళి; అర్జున+ఆవాసంబునకున్= అర్జునుడి స్థావరానికి; అరిగిరి= వెళ్ళారు; అందున్= అక్కడ; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; రథంబు పన్ని= తేరును సిద్ధం చేసి; జైత్రంబులు+అగు= విజయాన్ని కల్గించే; మంత్రంబులు= మంత్రాలను; ప్రయోగించి= (ఆ రథంపైకి) నడిపించి; ఉజ్జ్వలంబు చేసినన్= వెలిగే విధంగా చేయగా; అది= ఆ తేరు; బాలభానుండునున్+పోలెన్= ఉదయ సూర్యుడి మాదిరిగా; వెలుంగుచుండన్= ప్రకాశిస్తూ ఉండగా; సమర సన్నద్ధుండు+ఐ= యుద్ధం చేయటానికి సిద్ధంగా; ధనుర్బాణపాణి+ఐ= విల్లమ్ములు చేతిలో కలవాడుగా; అర్జునుఁడు; విప్ర+ఆశీర్వాదంబులతోన్= బ్రాహ్మణుల ఆశీర్వచనాలతో; ఆ+మహనీయ స్యందనంబునకున్= ఆ మహత్తుకల తేరుకు; ప్రదక్షిణంబునున్= ప్రదక్షిణమూ; ప్రణామంబునున్= నమస్కారమూచేసి; ఆరోహణంబు+ఆచరించి= ఎక్కి; మేరు శిఖరంబునన్+పొలుచు= మేరుపర్వత శిఖరాన కనిపించే; భాస్కరుని భంగిన్= సూర్యుడివలె; శోభిల్లెన్= అందగించాడు; కృష్ణసాత్యకులు= కృష్ణుడు, సాత్యకియు; నొగలను= తేరు నొగలపై; అతని పిఱుందను= అతడికి వెనుకగా; కూర్చున్నన్= కూర్చొనగా; ఆ ఫల్గునుండు= ఫల్గునుడనే పేరున్న అర్జునుడు; బుధశుక్ర సమేతుండు+అగు= బుధ, శుక్ర గ్రహాలతో కూడి ఉన్న; చంద్రుచందంబునన్= చంద్రుడివలె; ఒప్పెన్= అమరి ఉన్నాడు; అట్లు+ఒప్పి; వారు= అర్జున కృష్ణ సాత్యకులు; పుణ్య= మంగళకరమైన; పాఠకరవంబులును= స్తుతిపాఠకులఘోషలను; వందిమాగధ ధ్వనులు= వందిమాగధుల గీతధ్వనులను; వినుచున్; చనిరి= వెళ్ళారు; అప్పుడు= ఆ సమయాన; తమకున్= తమకు (పాండవులకు); విజయప్రదంబులు= విజయాలను కలిగించేవి; కౌరవులకున్= దుర్యోధనాదులకు; విపరీతంబులు= వ్యతిరేకాలైనవి; గంధవాహ+అది= గాలులు మొదలైన; నానా నిమిత్తంబులు= అనేక శకునాలను; అనుసంధించి= కూర్చి; ఆ సవ్యసాచి= ఆ అర్జునుడు; సాత్యకితోన్+ఇట్లనియెన్= సాత్యకితో ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అర్జునుడు కలలో ఈశ్వరానుగ్రహాన్ని పొందిన విషయం చెప్పగా సభలోని వారంతా ఆశ్చర్యంతో సంతోషాన్ని తెల్పుతూ వృషభకేతనుడికి నమస్కరించారు. తరువాత రాజాజ్ఞతో సైనికులంతా సంతోషంతో యుద్ధ సన్నద్ధులైనారు. కృష్ణార్జున సాత్యకులు ధర్మరాజునకు నమస్కారం చేసి బయటకు వచ్చి అర్జునుడి శిబిరానికి వెళ్ళారు.

అక్కడ కృష్ణుడు యుద్ధానికి రథాన్ని సిద్ధంచేసి విజయానికి ఆధారాలైన మంత్రాలతో దానిని ప్రకాశింపజేయగా ఆ తేరు ఉదయ సూర్యుడి మాదిరి శాంతితో వెలుగుతూ ఉండింది. యుద్ధ సన్నద్ధుడైన అర్జునుడు బ్రాహ్మణాశీర్వాదాలను పొంది విల్లునూ, అమ్ములనూ ధరించి ఆ మహనీయమైన తేరుకు ప్రదక్షిణ నమస్కారం చేసి, తేరెక్కి, మేరు పర్వత శిఖరాన వెలిగే సూర్యుడిని తలపిస్తూ ప్రకాశించాడు. శ్రీకృష్ణుడు నొగలమీదా; సాత్యకీ, అర్జునుడూ వెనుకా కూర్చున్నారు. ఆ ఫల్గునుడు బుధ, శుక్ర గ్రహాలతో కలిసి అందంగా ప్రకాశించే చంద్రునివలె ఒప్పారుతూ, పాఠకుల మంగళ వచనాలనూ, వందిమాగధుల స్తోత్రాలనూ వింటూ వెళ్ళే సమయాన పాండవులకు అనుకూలంగానూ, కౌరవులకు వ్యతిరేకంగానూ గాలులు వీచటం మొదలైన నానావిధ శకునాలను సమన్వయించి అర్జునుడు సాత్యకితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమ.

### అర్జునుఁడు సాత్యకిని ధర్మరాజురక్షణంబునకు నియోగించుట (సం. 7-60-27)

**క. 'మనకు నిమిత్తము లెంతయు । ననుకూలము లయ్యెఁ; గెలుతు; మాహవమున కేఁ**
**జనియెదఁ బ్రతిజ్ఞ తీర్పఁగ; । ననఘా! ధర్మసుతు రక్ష కరుగుము నీవున్. 20**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపము లేనివాడా!; మనకున్= మనకు; నిమిత్తములు= శకునాలు; ఎంతయున్+అనుకూలములు+అయ్యెన్= మిక్కిలి ఒద్దికగా ఉన్నాయి; గెలుతుము= జయిస్తాము; ఆహవమునకున్= యుద్ధానికి; ఏన్= నేను; చనియెదన్= వెళ్ళుతాను; ప్రతిజ్ఞన్+తీర్పఁగన్= శపథాన్ని నెరవేర్చటానికి; నీవున్= నీవు; ధర్మసుతు రక్షకున్= ధర్మరాజును కాపాడటానికి; అరుగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! మనకు శకునాలు చాలా బాగున్నాయి. నేను నా శపథాన్ని నెరవేర్చటానికి వెళ్ళుతాను. నీవు ధర్మరాజును కాపాడేందుకు వెళ్ళుము.

**క. 'విను! సింధురాజవధయును । మనుజాధిపరక్షణంబు మనకు సరియ కా**
**వున నే నొకపని నీ వొక । పని మేకొని చేయు టరయఁ బాడియ కాదే! 21**

**ప్రతిపదార్థం:** విను= వినుము; సింధురాజ వధయును= సైంధవుడిని చంపటం; మనుజాధిప రక్షణంబు= రాజైన ధర్మరాజును కాపాడటం; మనకున్ సరియ= మనకు సమానమే; కావునన్= అందువలన; నేను+ఒకపనిన్; నీవు+ఒకపనిన్= నేనొకపనిని, నీవొక పనినీ; మేకొని= పూనుకొని; చేయుట= చేయటం; అరయన్= చూడగా; పాడి+అ కాదే!= న్యాయం కదా!

**తాత్పర్యం:** మనకు సైంధవుడిని చంపటమూ, ధర్మరాజును కాపాడటమూ రెండూ సమానమే. కాబట్టి నే నొక పనీ, నీ వొక పనీ పూనుకొని చేయటం న్యాయం కదా!

**ఆ. ఏను నిలిచినట్ల కా నూఱడిల్లు నీ । వున్న న న్నరేశ్వరోత్తముండు;**
**నిర్భరుండ వగుము నీవు నాదెస; నాకు । హరి గలండు; గలఁడె యచట నితఁడు? 22**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; నిలిచినట్లు+అ, కాన్= ప్రక్కనే నిలిచినట్లుగా; నీవు+ఉన్నన్= నీవు ప్రక్కన ఉంటే; ఆ+నరేశ్వరుండు= ఆ ధర్మరాజు; ఊఱడిల్లున్= ఊరట చెందుతాడు; నాదెసన్= నన్నుగూర్చి; నీవు= నీవు; నిర్భరుండవు+అగుము= భయం లేక ఉండుము; నాకున్ హరికలండు= నాకు శ్రీకృష్ణుడున్నాడు; అచటన్= ఆ దిక్కులో (అనగా ధర్మరాజు ఉన్నచోట); ఇతఁడు= ఈ శ్రీకృష్ణుడు; కలఁడె?= ఉన్నాడా?

**తాత్పర్యం:** నీవు తన ప్రక్క ఉండగా నేను తోడున్నట్లుగా ధర్మరాజు ఊరట చెందుతాడు. నీవు ఆయన ప్రక్కన ఉండుము. నాకు దిక్కుగా శ్రీకృష్ణు డున్నాడు కాబట్టి భయం వద్దు. ఆయన చెంత శ్రీకృష్ణుడున్నాడా? లేడుకదా.

**వ. ఎల్లభంగుల రాజరక్షణార్థంబుగా నీకుఁ బోవలయును; బరాక్రమధుర్యుండగు నాచార్యుప్రతిన యెఱుంగవే!' యనుటయు, 'నట్ల కాక' యని యతండు ధర్మనందనుపాలికిం జనియె; నజ్జననాథుండు సమరోత్సాహ సముజ్జ్వలుం డయి వచ్చి నిజ సైన్యంబు నలంకరించి చిహ్నంబులు మెఱయ నెఱయం బొలిచి నిలిచె' ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 23**

**ప్రతిపదార్థం:** ఎల్లభంగులన్= అన్ని విధాలుగా; రాజరక్షణ+అర్థంబుగాన్= రాజును కాపాడేందుకు (ధర్మరాజును కాపాడటానికి); నీకున్+పోవలయును= నీవు పోయి తీరవలెను; పరాక్రమధుర్యుండు+అగు= శత్రువులను జయించటంలో సామర్థ్యం కలవాడైన; ఆచార్యుప్రతిన= ద్రోణాచార్యులు చేసిన శపథం; ఎఱుంగవే?= తెలియదా?; అనుటయున్= అని(అర్జునుడు) అనగా; అట్లకాక+అని= అట్లే అని (అనగా సరే అని); అతండు= సాత్యకి; ధర్మనందనుపాలికిన్= ధర్మరాజు వద్దకు; చనియెన్= వెళ్ళాడు; ఆ+జననాథుండు= ఆ ధర్మరాజు; సమర+ఉత్సాహ సముజ్జ్వలుండు+అయి, వచ్చి= యుద్ధమందలి ఉత్సాహంతో ప్రకాశించినవాడై; వచ్చి; నిజసైన్యంబున్+అలంకరించి= తన సేనకు అలంకారంగా; చిహ్నంబులు+ (తమ తమ) గుర్తులు; మెఱయన్= ప్రకాశించగా; నెఱయన్+పొలిచి నిలిచెన్= వ్యాపించేటట్లుగా నిలిచాడు; అనినన్+విని= అని చెప్పగా విని; సంజయునకున్ ధృతరాష్ట్రుండు+ఇట్లు+అనియెన్= సంజయుడితో ధృతరాష్ట్రుడీ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఏ విధంగా చూచినా రాజును కాపాడేందుకు నీవు పోవలెను. ద్రోణాచార్యుడి శపథం నీకు తెలియును కదా!' అనగా, సరే అని సాత్యకి ధర్మరాజు వద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో ధర్మరాజు సమరోత్సాహంతో వెలుగుతూ ఉన్నాడు' అని చెప్పగా విన్న ధృతరాష్ట్రుడు సంజయుడితో ఈ విధంగా చెప్పాడు.

**సీ. పుత్రశోకానలంబును గ్రోధవహ్నియు । మనమున ముప్పిరి గొనఁగ మృత్యు**
**భంగి నేతెంచు బీభత్సునిఁ గౌరవుల్ । సెనకఁజాలర యేమి చేటు; మూఁడె**
**నో? పురిలో నొక్కయుమ్మడి నింటింట । నార్తనాదములు పెక్కయ్యె; నెల్ల**
**రవముల మిగిలి సైంధవునింటి దిక్కున । నాక్రందనధ్వను లతిశయిల్లె;**

**తే. నేను ద్రోణుండు భీష్ముండుఁ బూని చెప్ప । శౌరి మాటలు మీ రాజు సరకుగొనఁడ**
**సంధి గానీక కర్ణుండు సౌబలుండు । దుస్ససేనుండు నందఱఁ ద్రుంచికొనిరి. 24**

**ప్రతిపదార్థం:** పుత్రశోక+అనలంబును= కొడుకు చనిపోవటం వలన కలిగిన దుఃఖమనే అగ్ని; క్రోధవహ్నియున్= కోపమనే అగ్ని; మనమునన్= హృదయంలో; ముప్పిరి గొనఁగన్= దట్టంగా వ్యాపించగా; మృత్యుభంగిన్= యముడివలె; ఏతెంచు= వచ్చే; బీభత్సునిన్= అర్జునుడిని; కౌరవుల్= కౌరవులు; చెనకన్+చాలరు+అ= ఎదుర్కొనలేరు; ఏమి= ఎటువంటి (ఏ); చేటు= కీడు; మూఁడెనో= ముంచుకొని వచ్చిందో; పురిలోన్= నగరంలో; ఒక్క+ఉమ్మడిన్= ఒక్కసారిగా; ఇంటన్+ఇంటన్= ఇంటింటిలో; ఆర్తనాదములు= ఏడుపులు, పెడబొబ్బలు; పెక్కు+అయ్యెన్= మిక్కుటమయ్యాయి; ఎల్లరవములన్= అన్ని నాదాలను; మిగిలి= మించి; సైంధవు+ఇంటి దిక్కునన్= సైంధవుడి ఇంటివైపు; ఆక్రందన ధ్వనులు= ఏడుపుల చప్పుళ్ళు; అతిశయిల్లెన్= ఎక్కువయ్యాయి; ఏనున్= నేను(ధృతరాష్ట్రుడూ); ద్రోణుండున్; భీష్ముండున్; పూని= పూనుకొని; చెప్పన్= చెప్పినప్పటికీ; శౌరిమాటలు= శ్రీకృష్ణుడి హితవులు; మీరాజు= మీకు ప్రభువైన దుర్యోధనుడు; సరకున్+కొనఁడు+అ= లెక్క చేయడు; కర్ణుండు; సౌబలుండు= శకుని; దుస్ససేనుండు= దుశ్శాసనుడు; సంధి కానీక= సంధి కాకుండా చేసి; అందఱన్= (తమవారిని) అందరినీ; త్రుంచికొనిరి= చంపుకొన్నారు.

**తాత్పర్యం:** 'కొడుకు చనిపోవటంవలన కలిగిన శోకాగ్నీ, సైంధవుడిపై పగసాధించాలన్న కోపాగ్నీ ముప్పేటగా ముసురుకొన్న యముడివలె అర్జునుడు రాగా కౌరవులు అతడిని ఎదుర్కొనలేరు. ఏమి కీడు జరిగిందో కాని నగరంలో ఒక్కసారిగా ఇంటింటా ఏడ్పులూ, పెడబొబ్బలూ పిక్కటిల్లాయి. ఆర్తనాదాలన్నింటికంటె సైంధవుడి ఇంట్లో ఏడ్పుల చప్పుళ్ళు మిక్కుటంగా వినబడుతున్నాయి. మీ రాజైన దుర్యోధనుడికి నేనూ, ద్రోణుడూ, భీష్ముడూ ఎంత ప్రయత్నించి చెప్పినా శ్రీకృష్ణుడి మాటలు లెక్కచేయడు. కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు సంధి కానీయక అందరినీ చంపుకొన్నారు.

**ఉ. ఎక్కటి పోరె; రుద్రునకు నేమిటఁ దక్కువ ఫల్గునుండు? వాఁ**
**డొక్కఁడ యయ్యెనే? జగము లొక్కట మ్రింగఁగఁజాలు; కేశవుం**
**డెక్కినవాఁడు వాని నొగ; లేల చలం? బని యెంత సెప్పినం**
**దక్కఁడు రాజ్యలోభము మదంబున నా కొడు; కేమి సేయుదున్? 25**

**ప్రతిపదార్థం:** ఎక్కటి== ఒక్కడే; పోరెన్= యుద్ధం చేశాడు; రుద్రునకున్= ఈశ్వరుడికి; ఫల్గునుండు= అర్జునుడు; ఏమిటన్= ఎందులో; తక్కువ?= తగ్గినాడు? (అనగా ద్వంద్వ యుద్ధంలో శివుడితో తానొక్కడే అర్జునుడు పోట్లాడాడని భావం); వాఁడు= అర్జునుడు; ఒక్కడు+అ అయ్యెనే?= ఒకడే అయ్యాడా?; జగములు= లోకాలను; ఒక్కటన్= ఒకేమారు; మ్రింగఁగన్+చాలు= మ్రింగివేయగల; కేశవుండు= శ్రీకృష్ణుడు; వాని నొగలు= అర్జునుడి రథం యొక్క నొగలు; ఎక్కినవాఁడు= ఎక్కి ఉన్నాడు (సారథిగా ఉన్నాడు); ఏల చలంబు?= మాత్సర్యం ఎందుకు?; అని; ఎంత= ఎంతగా; చెప్పినన్= చెప్పినప్పటికీ; రాజ్యలోభము మదంబునన్= రాజ్యాన్ని అత్యాశతో పొందాలనే మదంవలన; నా కొడుకు= నా కుమారుడు; తక్కఁడు= వదలడు; ఏమి చేయుదున్?= ఏమి చేయగలను?

**తాత్పర్యం:** 'ఒక్కడే నిలిచి శివుడితో అర్జునుడు యుద్ధం చేశాడు. ఆతడిని ఏ విధంగా తక్కువగా అంచనా వేయగలం? ఆ అర్జును డొక్కడే లోకాలను హతమార్చగల శక్తి కలవాడు. అటువంటి వాడి తేరెక్కి సారథిగా శ్రీకృష్ణు డున్నాడు; వారిపై మనకు మాత్సర్యం ఎందుకు?' అని ఎంతగా చెప్పినా నా కుమారుడు రాజ్య లోభ మదంతో తన నిర్ణయాన్ని మానకుండా ఉన్నాడు. ఏమి చేయగలను?

**వ. అది యట్లుండె. 26**

**తాత్పర్యం:** దాని నట్లుండనిమ్ము.

**తే. క్రీడి యమ్మెయి వచ్చినఁ గూడఁ బాఱి । యెడలు గలఁగంగఁ గౌరవు లేమి సేసి?**
**రది యెఱుంగఁగఁ జెప్పవే యనఘ! నీతి । యయ్యె నేమి దా దుర్ణయ మయ్యె నేమి?' 27**

**ప్రతిపదార్థం:** క్రీడి= అర్జునుడు; ఆ+మెయిన్= ఆ ప్రకారం; వచ్చినన్= రాగా; కూడన్= వెన్నంటి; పాఱి= పరుగెత్తి; ఎడలుకలఁగంగన్= మనసులు కలతచెందగా; కౌరవులు+ఏమిచేసిరి?= కౌరవు లేమిచేశారు?; అది ఎఱుంగఁగన్ చెప్పవే= తెలిసేటట్లుగా చెప్పుము; అనఘ!= పుణ్యాత్ముడా!; నీతి అయ్యేనేమి?= ధర్మం అయినా; తాన్= అది; దుర్ణయము= దుర్నీతి అయినా కానిమ్ము(చెప్పుము).

**తాత్పర్యం:** అర్జును డా విధంగా వెన్నంటి తరుమగా పరుగెత్తిన కౌరవు లేమి చేశారు? అది ధర్మమైనా, అధర్మమైనా నాకు తెలియజెప్పుము'

**వ. అనుటయు నా సూతనందనుం డంబికానందనున కి ట్లనియె. 28**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ సూతనందనుండు= సూతుడి కుమారుడైన సంజయుడు; అంబికానందననునకున్= ధృతరాష్ట్రుడితో (అంబిక కుమారుడు); ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఈ విధంగా అన్నాడు.

**సీ. 'అధిప! చెప్పెద నీకు నంతయు నివ్విలా । పము గతజల సేతు బంధనంబు;**
**మాయ జూదము మున్న మాన్పవ, పదపడి । సంధి గావింపవ, సకల జనులు**
**నిను లుబ్ధుఁడు నధర్మనిరతుండు నని దూఱు । దురు; దూఱ కే లుండుదురు నరేంద్ర!**
**పాండుఁ దవ్విధమునఁ బాలించె రాజ్యంబు । పాండవు లెక్కుడు ప్రబ్బి యశము**

**తే. లాభమును భరతాన్వయోల్లాస మెసఁగఁ । దగ నొనర్చిరి వారలఁ దగునె వారి**
**తండ్రిపాలైన సిరి వాపఁ దనయు మీఁదఁ । బెట్టె దేల? నీ దుర్నీతి ముట్టవచ్చె. 29**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; నీకున్+అంతయున్+చెప్పెదన్= నీకు అన్ని విషయాలు చెపుతాను; ఈ+విలాపము= ఈ దుఃఖం; గతజలసేతు బంధనంబు= పోయిన నీటి ప్రవాహానికి వారధి కట్టునట్లు; మాయజూదము= మోసపు జూదమును; మున్న= తొలుతనే; మాన్పవు+అ= ఆపినావు కావు; పదపడి= ఆ మీద; సంధి కావింపవు+అ= సంధి చేశావు కావు; సకలజనులు= సమస్త జనులూ; నినున్= నిన్ను; లుబ్ధుఁడు= లోభి; అధర్మనిరతుండు= అన్యాయమైన పనులు చేయటంలో ఆసక్తి కలవాడు; అని దూఱుదురు= అని దూషిస్తారు; నరేంద్ర!= ఓ రాజా!; దూఱక= తిట్టక; ఏల+ఉండుదురు?= ఎందుకుంటారు?; పాండుఁడు= పాండురాజు; ఆ+విధమునన్= ఆ ప్రకారంగా (అనగా ధర్మంగా); రాజ్యంబు= రాజ్యాన్ని; పాలించెన్= ఏలాడు; పాండవులు= పాండు కుమారులు; ఎక్కుడు= మిక్కిలి; ప్రబ్బి= వృద్ధిచెంది; యశము= కీర్తిని; లాభమును; భరతాన్వయ+ఉల్లాసము+ఎసఁగన్= భరతవంశానందం అతిశయించగా; తగన్= తగినట్లు; ఒనర్చిరి= చేశారు; వారలన్= పాండవులను; తండ్రిపాలు+ఐన సిరి= తండ్రి భాగపు సంపదను; పాపన్+తగునె?= తప్పింపవచ్చునా?; ఏల= ఎందుకు; తనయుమీఁదన్= కుమారుడి మీద; పెట్టెదు?= నెపం పెట్టుతున్నావు?; నీ దుర్నీతి= నీ మోసపునీతి; ముట్టన్‌వచ్చెన్= తాకవచ్చింది.

**తాత్పర్యం:** 'ఓ రాజా! నీకు అన్ని విషయాలు వివరిస్తాను. గత జల సేతుబంధనమైన ఈ ఏడుపెందుకు? తొలుతనే మోసపు జూదాన్ని మాన్పలేదు. ఆ తరువాత సంధీ కావించలేదు. లోకులంతా నిన్ను లోభివనీ, అన్యాయపరుడవనీ తిట్టకుండా ఎట్లా ఉంటారు? పాండురాజు రాజ్యాన్ని (ధర్మంగా) పాలించాడు. పాండుకుమారుల అభివృద్ధిని చూడలేక, వారి తండ్రిపాలు వారికి ఈయక తప్పించుకొనవచ్చునా? తప్పంతా నీ కుమారుడిపై తోస్తున్నావు. నీ కపటనీతితో నీ కుమారుడినే తప్పు పట్టుతున్నావు. నీ దుర్నీతి ఫలం అనుభవించే కాలం నీకు దాపురించింది.

**ఉ. కౌరవు లేమి సేయుదురు? గాండివ ఘోషముఁ బాంచజన్య తీ**
**వ్రారవమున్ సహింప దివిజావలికిన్ వశమే? వియచ్చరుల్**
**పేరుకొనంగ నాదృఢకపిధ్వజమైన రథంబు తోడనుం**
**బోలిరి పోరు భంగి విను భూవర! శోకము దక్కి ధీరతన్.' 30**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); గాండివ ఘోషము= గాండీవముయొక్క శబ్దం (అనగా గాండీవం అల్లెత్రాటి టంకారము); పాంచజన్య= పాంచజన్యమనే పేరుకల శంఖంయొక్క; తీవ్రారవమున్= భయంకరమైన శబ్దమును (శంఖం ఊదినపుడు కలిగే శబ్దంయొక్క తీవ్రతా); సహింపన్= ఓర్చుకొనటానికి; దివిజ+ఆవలికిన్= దేవతా సమూహానికి; వశమే?= సాధ్యమా?(అనగా

సాధ్యము కాదు కాబట్టి); కౌరవులు+ఏమి చేయుదురు?= కౌరవులేమి చేయగలరు?; (అయినా) వియత్+చరుల్= దేవతలు (ఆకాశంలో తిరిగేవారు); పేరుకొనంగన్= స్తుతిస్తూ ఉండగా; ఆ దృఢ= ఆ స్థిరమైన; కపిధ్వజము+ఐన= కపికేతనంగల; రథంబు తోడనున్= తేరితో (అనగా కపికేతనంతో దృఢంగా ఉన్న తేరితో); పోరిరి= యుద్ధం చేశారు; కౌరవులు= గాంధారీ సుతులు; ఏమి చేయుదురు?= ఇంతకంటె ఏమి చేయగలరు?; పోరుభంగిన్= యుద్ధం తీరును; శోకము దక్కి= దుఃఖాన్ని మానుకొని; వినుము= వినుము.

**తాత్పర్యం:** గాండీవ ఘోషమూ, పాంచజన్య రవమూ సహించటం దేవతా సమూహానికైనా సాధ్యమా? అయినా దేవతలు కీర్తిస్తుండగా కౌరవులు అర్జునునితో యుద్ధం చేశారు. ఓ రాజా! నీ దుఃఖాన్ని వదలి వారి యుద్ధగతిని నీవు వినుము.

**వ.** **అని పలికి యిట్లనియె: 'రేపకడ గురుండు సంగరోత్సాహదీప్తుం డయి వెడలి శంఖంబు పూరించి సైన్యంబులోనం గలయ మెలంగు నప్పుడు మనయోధు లాయుధంబు లంకించుచు నొండొరులతోడ బిరుదులు వలుకుచు నది యేమి యర్జునుండు దడసె, గోవిందుండు దఱిమికొన రాఁడు, భీమసేనుండు గడంగి పొడసూపం డనుచు సింహనాద శంఖరవ జ్యాఘోషంబులు సెలంగం బొంగుచున్న సమయంబున నా కుంభసంభవుండు సైంధవుం గనుంగొని 'నీవును భూరిశ్రవుండును గర్ణుండును శల్యుండును నశ్వత్థామయు వృషసేనుండును గృపాచార్యుండును గూడుకొనియుండుండు; మన బలంబులలో మేలేఱి పదునాలుగువే లేనుంగులను నఱువది వేలు రథంబులను, లక్ష గుఱ్ఱంబులును, బది లక్షలు పదాతులను గైకొనుండు; నా తీర్చు మోహరంబునకు యోజనత్రయ మాత్ర ప్రదేశంబునం బిఱిందిదెస బలసి నిలువుం డట్లైన నిన్ను దేవతలకుం దేఱి చూడరాదు పాండవు లెంతటి వా?' రనిన విని యతండు పెద్దయు నూఅడిల్లి యా రథికవరులు పరివేష్టింప నరిగె; భారద్వాజుండును ద్వాదశగవ్యూతి దీర్ఘంబును బంచగవ్యూతి విస్తృతంబును గా శకట వ్యూహంబు సమకట్టి దానికిఁ బశ్చిమార్ధంబున గర్భవ్యూహంబుగాఁ బద్మవ్యూహంబు వన్నించి తన్మధ్యంబు మొదలుకొని యోలిన సేనాముఖంబు దెసకుం జాలి నిగుడునట్లుగా సూచీవ్యూహంబుఁ గావించి, సూచీముఖంబునం గృతవర్మయు నటపిఱుందఁ గాంభోజరాజును మఱియు బిఱుసన నాప్తులైన శతసహస్ర యోధుల మున్నిడికొని కురురాజును మూలస్థానంబునఁ బూర్వోక్తప్రకారంబున నా జయద్రథుండును నిలుచునట్లుగా నొనర్చిన నమ్మహా వ్యూహంబు వేడుకం జూచి ఖేచరులు మెచ్చి; రట్టియెడ.** **31**

**ప్రతిపదార్థం:** అని పలికి ఇట్లు+అనియెన్= అని ఈ విధంగా చెప్పాడు; ఆ రేపకడన్= ఆ ఉదయాన; గురుండు= ద్రోణాచార్యుడు; సంగర+ఉత్సాహ, దీప్తుండు+ఐ= యుద్ధం మీది ఆసక్తితో ప్రకాశిస్తూ; వెడలి= బయలుదేరి; శంఖంబు పూరించి= శంఖనాదం చేసి; సైన్యంబులోనం గలయ మెలంగునప్పుడు= సైన్యంలో తిరుగుతున్నప్పుడు; మన యోధులు= మన వీరులు; ఆయుధంబులు+ అంకించుచున్= ఆయుధాలను ఝళిపిస్తూ; ఒండొరులతోడన్; ఒకళ్ళొకళ్ళతో; బిరుదులు పలుకుచున్= పొగరు మాటలు మాట్లాడుతూ (తమ తమ సామర్థ్యాన్ని పొగడుకుంటూ); ఇది ఏమి అర్జునుండు తడసెన్?= ఏమిది అర్జునుడు ఆలస్యం చేశాడు?; గోవిందుండు= శ్రీకృష్ణుడు; తఱిమికొన రాఁడు= తరుముకొని రావటం లేదు; భీమసేనుండు కడంగి పొడసూపండు= భీముడు ప్రయత్నంతో కానరాడు; అనుచున్= అని చెప్పుతూ; సింహనాద శంఖరవ జ్యాఘోషంబులు= సింహనాదాలు, శంఖశబ్దాలు, వింటిమ్రోతలు; చెలంగన్= ధ్వనింపగా; పొంగుచున్న= చలరేగుతున్న; సమయంబునన్= వేళలో; ఆ కుంభసంభవుండు= ఆ ద్రోణుడు; సైంధవున్+కనుంగొని= సైంధవుడిని చూచి; నీవును; భూరిశ్రవుండును; కర్ణుండును; శల్యుండును; అశ్వత్థామయు; వృషసేనుండును; కృపాచార్యుండును; కూడుకొని ఉండుండు= కలిసి ఉండండి; మన బలంబులలోన్= మన సైన్యంలో; మేలేఱి=

మేలైన వారిని ఎన్నుకొని; పదునాలుగువేలు ఏనుంగులను; అఱువది వేలు రథంబులను; లక్ష గుఱ్ఱంబులును; పదిలక్షలు పదాతులను= పదాతిదళాన్ని; కైకొనుండు= తీసికొనుడు; నాతీర్చు మోహరంబునకున్= నేను ఏర్పాటు చేసే మొగ్గరానికి; యోజనత్రయ మాత్ర ప్రదేశంబునన్= మూడు యోజనాల దూరంగా; పిఱిందిదెసన్= వెనుకభాగంలో; బలసి= చుట్టుకొని; నిలువుండు= నిలిచి ఉండండి; అట్లు+ఐన= ఆ మాదిరి ఉంటే; నిన్ను దేవతలకున్= నిన్ను దేవతలకు కూడా; తేఱి చూడరాదు= తలయెత్తి చూడశక్యం కాదు; పాండవులు+ఎంతటివారు?= పాండవులు ఏపాటివారు?; అనినన్ విని; అతఁడు= సైంధవుడు; పెద్దయున్ ఊఱడిల్లి= మిక్కిలి ఉపశమించి; ఆ రథికవరులు= తేరెక్కి యుద్ధం చేసే వీరులు; పరివేష్టింపన్= చుట్టూ రాగా; అరిగెన్= వెళ్ళాడు; భారద్వాజుండును= ద్రోణుడును; ద్వాదశగవ్యూతి దీర్ఘంబును= ఇరవైనాలుగు కోసుల పొడవును; పంచగవ్యూతి= పది కోసులు; విస్తృతంబును= విస్తారం కలది; కాన్= అయిన; శకటవ్యూహంబున్= బండి ఆకారంతో మొగ్గరాన్ని; సమకట్టి= సిద్ధంచేసి; దానికిన్+పశ్చిమార్ధంబునన్= దానికి పడమటి దిక్కులో సగాన; గర్భవ్యూహంబుగాన్= గర్భమున మొగ్గరంగా; పద్మవ్యూహంబున్= తామరవంటి మొగ్గరాన్ని; పన్నించి= ఏర్పాటుచేసి; తద్+మధ్యంబు మొదలుకొని= ఆ నడిమినుండి; ఓలిన= వరుసగా; సేనాముఖంబు దెసకున్= సేన మొగం దిక్కుకు; చాలి= పడిపోయి; నిగుడునట్లుగాన్= పొడవగునట్లుగా; సూచీ వ్యూహంబు కావించి= సూదిమాదిరి మొగ్గరం చేసి; సూచీముఖంబునన్= ఆ సూది మొదట; కృతవర్మయున్; అట పిఱుందన్= ఆ వెనుక; కాంభోజరాజును; మఱియున్= ఇంకా; పిఱుసన= వెనుక; ఆప్తులు+ఐన= కావలసిన వారైన; శతసహస్రయోధులన్= లక్షమంది సైనికుల; మున్ను+ఇడికొని= ముందుగా పెట్టుకొని; కురురాజును= సుయోధనుడిని; సూచీమూలస్థానంబునన్= సూది మొదటను; పూర్వ+ఉక్త ప్రకారంబునన్= ముందు చెప్పినట్లుగా; ఆ జయద్రథుండును= ఆ సైంధవుడును; నిలుచునట్లుగాన్= ఉండే విధంగా; ఒనర్చినన్= చేయగా; ఆ+మహావ్యూహంబు= ఆ పెద్ద మొగ్గరపు విధానంయొక్క; వేడుకన్= ఉత్సుకతతో; చూచి; ఖేచరులు= దేవతలు; మెచ్చిరి= మెచ్చుకొన్నారు.

**తాత్పర్యం:** అని పలికి ఇంకా ఇట్లా అన్నాడు. ‘ఆ తెల్లవారే సమయంలో ద్రోణాచార్యుడు యుద్ధంచేసే ఉత్సాహంతో ఉప్పొంగి’ ముందుకుసాగి శంఖాన్ని పూరించాడు. సైన్యంలో నలుమూలల తిరిగాడు. ఆ సమయంలో మనవీరులు తమ తమ బిరుదాలను పేర్కొంటూ, ఆయుధాలను ఝళిపిస్తూ ‘ఇది ఏమిటి? అర్జునుడు ఆలస్యం చేస్తున్నాడు?’ అంటూ సింహనాదాలూ, వింటిత్రాటి మ్రోతలూ చేస్తూ పొంగిపోతున్నారు. ఆ సమయంలో ద్రోణాచార్యుడు సైంధవుడిని చూచి ‘నీవూ, భూరిశ్రవసుడూ, కర్ణుడూ, శల్యుడూ, అశ్వత్థామా, వృషసేనుడూ, కృపాచార్యుడూ కలిసి ఉండండి. మన బలాలలో మేలైనవాటిని ఎన్నికచేసి, పదునాలుగువేల ఏనుగులను, అరవైవేల రథాలను, లక్షగుర్రాలను, పదిలక్షలమంది కాల్బలాలను సమీకరించండి. నేను రచించే యుద్ధవ్యూహానికి మూడామడల దూరంలో ఉన్న ప్రదేశంలో వెనుకభాగంగా మూగి నిలవండి. ఆ విధంగా ఉంటే నిన్ను దేవతలు కూడా సమీపించలేరు. ఇక పాండవులు ఎంతటివారు?’ అన్నాడు. ఆ మాటలు విని సైంధవుడు ఎంతో ఊరడిల్లాడు. రథికవరులు చుట్టూ మూగి నడువగా నిర్దిష్టప్రాంతానికి వెళ్ళాడు. ఇక ద్రోణాచార్యుడు ఇరవైనాలుగు కోసుల పొడవూ, పది కోసుల విస్తారం ఉండే శకటవ్యూహాన్ని తీర్చాడు. దానికి పడమటి సగభాగంలో గర్భవ్యూహంగా పద్మవ్యూహాన్ని రచించాడు. దాని మధ్యభాగం మొదలుకొని సేనాముఖంవరకు వ్యాపించి ఉండే సూచీవ్యూహాన్ని అమర్చాడు. దాని ముఖంలో కృతవర్మనూ అతడి వెనుక కాంభోజరాజునూ, మరియు మరికొంత వెనుకభాగంలో నూరువేల వీరులను ముందుంచుకొని దుర్యోధనుడుండేటట్లు చేశాడు. సూచీవ్యూహంలోని కేంద్రస్థానంలో సైంధవుడిని (ఇదివరలో చెప్పినట్లు) నిలిపాడు. ఆ మహావ్యూహాన్ని దేవతలు ఉత్సాహంతో చూచి అబ్బురంగా మెచ్చుకొన్నారు. ఆ సమయంలో.

**విశేషం:** ద్రోణాచార్యుడు యుద్ధంలో అనేక విధాలైన వ్యూహాలను నిర్మించి సైంధవుడిని కాపాడటానికై ఏర్పాటు చేశాడు. యుద్ధగతిని నడపటంలో వ్యూహ నిర్మాణంలో ద్రోణుడి ప్రజ్ఞ మన కింద స్పష్టంగా తెలుస్తూ ఉన్నది.

## ద్రోణుని నాల్గవనాటి యుద్ధము (సం.7-63-28)

**క. 'మొనలోన నిలువ నొల్లక । తన చతురంగములతో నుదగ్రుం డై య**
**ర్జును నాఁగుదు నేనొకఁ డన' । యని దుర్మర్షణుఁడు సనియె నార్పులు నిగుడన్. 32**

**ప్రతిపదార్థం:** మొనలోనన్= సైన్యంలో; నిలువన్= నిలుచుటకు; ఒల్లక= ఇష్టపడక; తన= తనదైన; చతురంగములతోన్= రథగజ తురగ పదాతులతో; ఉదగ్రుండు+ఐ= కోపంకలవాడై; ఏను+ఒకఁడన= నేనొక్కడనే; అర్జునున్= అర్జునుడిని; ఆఁగుదున్= ఆపు తాను; అని= అని చెపుతూ; దుర్మర్షణుఁడు= దుర్మర్షణు డనేవాడు; ఆర్పులు= అరుపులు; నిగుడన్= వ్యాపించగా; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** దుర్మర్షణుడనే వాడు (కౌరవులలో ఒకడు) యుద్ధంలోని మొగ్గరంలో నిలవటానికి ఇష్టపడక, తన చతురంగబలాలతో విజృంభించి వెళ్ళి, తా నొక్కడే అర్జునుడిని ఆపుతానని అరుపులు వ్యాప్తినందగా వెళ్ళాడు.

**వ. చని యయ్యొడ్డనంబునకు వేయునే నూరువిండ్లపెట్టు దవ్వున ముందటం బన్నె; దుశ్శాసన వికర్ణులు సింధురాజ రక్షణ కార్యార్థులై నిజబలంబులతో నమ్మెయి నచ్చేరువకుం బోయి సన్నద్ధులైరి; ద్రోణాచార్యుం డభేద్యంబగు నా శకటవ్యూహంబు ముఖంబున నిలిచి ధవళ వస్త్రంబులు సితోష్ణీషంబును శ్వేతవర్మంబును నరుణాశ్వంబులును వేదికాధ్వజంబును వెలయ నుద్దండ కోదండుండై దండధరుకైవడిం బొలిచె; నట్లు కుంభ సంభవ సంరక్షితంబైన యా సైన్యంబు సాగర గిరి గహన సహితంబుగా మహి యెల్ల మ్రింగ నప్పళించున ట్లున్నం గనుంగొని కౌరవులును గురుపతియును బ్రముదిత హృదయులై; రా సమయంబున. 33**

**ప్రతిపదార్థం:** చని= వెళ్ళి; ఆ+ఒడ్డనంబునకున్= ఆ వ్యూహానికి; వేయు ఏనూఱు విండ్లపెట్టు దవ్వునన్= వేయి అయిదువందల విండ్ల దూరాన; ముందటన్= ముందర; పన్నెన్= యుద్ధానికి సిద్ధపడినాడు; దుశ్శాసన వికర్ణులు; సింధురాజు= సైంధవుని; రక్షణ కార్యార్థులు+ఐ= కాపాడే పనికై; నిజబలంబులతోన్= తమ సైన్యంతో; ఆ+మెయిన్= ఆ విధంగా; ఆ+చేరువకున్+పోయి=దగ్గరకు పోయి; సన్నద్ధులు+ఐరి= సిద్ధపడినారు; ద్రోణాచార్యుండు; అభేద్యంబు+అగు= చీల్చుటకు వీలుకాని; ఆ శకట వ్యూహ ముఖంబు నన్ నిలిచి= బండి ఆకారంతో ఉండే మొగ్గరం మొనలో నిలిచి; ధవళ వస్త్రంబులు= తెల్లని ధోవతులును; సిత+ ఉష్ణీషంబును= తెల్లని తలపాగా; శ్వేతవర్మంబును= తెల్లని కవచమును; అరుణ+అశ్వంబులును= ఎర్రని గుర్రాలును; వేదికా ధ్వజంబును= చదరమైన తిన్నెగుర్తుగా గల కేతనమును; వెలయన్= ఒప్పి ఉండగా; ఉద్దండ కోదండుండు+ఐ= పొడవగు విల్లు కలవాడై; దండ ధరుకైవడిన్= యముడి మాదిరి; పొలిచెన్= ప్రత్యక్షమాయెను; అట్లు; కుంభసంభవ సంరక్షితంబు+ఐన= ద్రోణుడిచే కాపాడబడిన; ఆ సైన్యంబు= ఆ కౌరవసేన; సాగర, గిరి, గహన, సహితంబుగాన్= సముద్రాలూ, కొండలూ, అడవులతోనూ;మహి ఎల్లన్= భూమినంతటినీ; మ్రింగన్= మింగుటకు; అప్పళించునట్లు+ఉన్నన్= ప్రయత్నిస్తూఉన్నట్లు ఉండగా; కనుంగొని= చూచి; కౌరవు లును; కురుపతియును= దుర్యోధనుడునూ; ప్రముదిత హృదయులు+ఐరి= సంతోషించారు; ఆ సమయంబునన్= ఆ వేళలో.

**తాత్పర్యం:** దుర్మర్షణుడు ఆ వ్యూహానికి పదిహేను వందల విండ్ల దూరాన ముందుగా సిద్ధమై నిలువగా, దుశ్శాసన వికర్ణులు (సైంధవుడిని కాపాడే పనిలో) తమ సైన్యంతో ఆ సమీపానికి సిద్ధంగా వెళ్ళారు. ద్రోణాచార్యుడు శత్రువులకు చీల్చరాని శకట వ్యూహాన్ని ఏర్పాటు చేసి, తాను స్వచ్ఛమైన తెల్లని కవచంతో, తలపాగాతో, వస్త్రాలతో, ఎర్రని గుర్రాలతో, వేదికా ధ్వజంతో, భయంకరమైన విల్లమ్ములతో యముడిని తలపిస్తూ ఉన్నాడు. వారి సేన సముద్రాలతో, కొండలతో, అడవులతో నిండిన ప్రపంచాన్ని మ్రింగటానికి నోరుతెరచి సిద్ధంగా ఉన్నట్లు ఉండగా దుర్యోధనాదులు చూచిసంతోషించారు.

**క. చూపులు మిఱుమిట్లు గొనఁగ । నేపారిన వానరేంద్రు నెసకంబున ను**
**ద్దీపిత మగుపడఁగ భయద । రూపంబునఁ గ్రాలఁగా నరుఁడు దోతెంచెన్. 34**

**ప్రతిపదార్థం:** చూపులు మిఱుమిట్లు కొనఁగన్= తన చూపులు నిప్పురవలవలె వెలుగగా; ఏపారిన= విజృంభించిన; వానరేంద్రు నెసకంబునన్= హనుమంతుడి విజృంభణంతో; ఉద్దీపితము= మిక్కిలి వెలుగొందేది; అగు పడఁగన్= అయిన ధ్వజం; భయదరూపంబునన్= చూచేవారికి భయాన్ని కలిగించే ఆకారంతో; క్రాలన్= ప్రకాశించగా; నరుఁడు= అర్జునుడు; తోతెంచెన్= వచ్చెను.

**తాత్పర్యం:** కన్నులు మిరుమిట్లు గొలిపే చూపులతో అతిశయించిన కపిధ్వజంతో ఒప్పి, చూచేవారికి భయాన్ని కలిగిస్తూ అర్జునుడు వచ్చాడు.

**సీ.** **అమ్మహా వీరున కనతిదూరంబున । బిరుదు మూఁకల నడపించి ద్రుపద**
**సూతియు నకులుని సుతుఁడు శతానీకుఁ । డును మొగ్గరం బమర్చిన మృదంగ**
**శంఖ భేరీ ధ్వాన సంగమ మేదుర । సింహనాదంబులు సెలఁగ నొప్పె**
**నప్పార్థుఁ డొ డ్డరయం బెట్టు కొలఁది న । బ్బలముముందటఁ దేరు నిలిపి యొత్తు**

**తే.** **దేవదత్తంబు రవముతోఁ దీవ్ర పాంచ । జన్య నినదంబు భూరినిస్వనయుతముగ**
**నిగుడు వానర రావంబు నింగి ముట్టె । నపుడు మన సేన బెగ్గల మగ్గలించె.** 35

**ప్రతిపదార్థం:** ఆ+మహావీరునకున్= ఆ గొప్పవీరుడైన అర్జునుడికి; అనతి దూరంబునన్= దగ్గర; బిరుదు మూకలన్= పేరున్న సైనికులను; నడపించి= నడచునట్లు చేసి; ద్రుపదసూతియున్= ద్రుపదుని కుమారుడును; నకులుని సుతుఁడున్= నకులుడి కుమారుడును; శతానీకుఁడును= శతానీకుడనే పేరుకలవాడును; మొగ్గరంబు+అమర్చినన్= సైనిక వ్యూహాన్ని ఏర్పరుపగా; మృదంగ, శంఖ, భేరీ ధ్వాన సంగమ= శంఖముల, నగారాల శబ్దాలతో కలసి; మేదుర= దట్టమైన; సింహనాదంబులు= సింహగర్జనలు; చెలఁగన్= ధ్వనించగా; ఒప్పెన్= తగి ఉండినది; ఆ+పార్థుఁడు= ఆ అర్జునుడు; ఒడ్డు+అరయన్ పెట్టుకొలఁదిన్= అంతయు వెదుకగా శక్తికొద్దీ; ఆ+బలము= ఆ సైన్యానికి; ముందటన్= ముందుగా; తేరు నిలిపి= తన రథాన్ని ఆపి; ఒత్తు దేవదత్తంబు రవముతోన్= తన శంఖం దేవదత్తాన్ని ఊదిన శబ్దంతో; తీవ్ర= తీవ్రమైన; పాంచజన్య నినదంబు= శ్రీకృష్ణుడి శంఖమైన పాంచజన్యముయొక్క; నిస్వనయుతముగన్= శబ్దంతో; నిగుడు= విజృంభించే; వానరరావంబు= కపిధ్వజం యొక్క పెనుశబ్దం; నింగిముట్టన్= ఆకాశాన్నంటగా; అపుడు= ఆ సమయాన; మనసేన= మనసైన్యం; బెగ్గలము= భయం; అగ్గలించెన్= ఎక్కువాయెను.

**తాత్పర్యం:** ఆ మహావీరు డర్జుననికి దగ్గరగా పేరుమోసిన సైనికులను నడపించి, ద్రుపదుడి కుమారుడు ధృష్టద్యుమ్నుడూ, నకులుడి కుమారుడు శతానీకుడూ వ్యూహాన్ని ఏర్పాటు చేయగా, శంఖ, నగారా శబ్దాలు ఎక్కువై సింహనాదాలు ఒప్పుతూ ఉండగా అర్జునుడు విజృంభించాడు. ఆ సైన్యానికి ముందు తన తేరును నిలిపి దేవదత్త శబ్దం, పాంచజన్య శబ్దంతో కలిసి ఉండిన శబ్దానికి కేతనంలో ఉన్న వానరుడు కావించిన శబ్దం ఆకాశాన్నంటింది. ఆ శబ్దానికి మన సైన్యం మిక్కిలి భయపడింది.

**ఆ.** **మొరపవాన పెల్లు గురిసె; నుల్కాతతి । డొల్లెఁ బడియె; పిడుగు లెల్లకడల**
**నస్మదీయ బలమునందుఁ బదంపడి । యధిప! తూర్యనినద మతిశయిల్లె.** 36

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; మొరపవాన= గులకరాళ్ళ వాన; పెల్లు= ఎక్కువగా; కురిసెన్= కురిసింది; ఉల్కాతతి= (తోక) చుక్కల సమూహం; డొల్లెన్= రాలిపడ్డాయి; ఎల్లకడలన్= అన్ని దిక్కులలో; పిడుగులు= పిడుగులు; పడియెన్= పడ్డాయి; అస్మదీయ బలమునందున్= మన సైన్యంలో; తూర్యనినదము= తూర్య వాద్యాల శబ్దము (కొమ్ముబూరల శబ్దం); అతిశయిల్లెన్= ఎక్కువైనది.

**తాత్పర్యం:** ఓ రాజా! అపుడు గులకరాళ్ళవాన కురిసింది. అన్ని దిక్కులలో చుక్కలు రాలాయి, పిడుగులు పడ్డాయి. కొమ్ముబూరల శబ్దం మన సైన్యంలో ఎక్కువ అయినది.

**వ. అయ్యవసరంబున నీ యోధు లొండొరులం బిలిచికొని పురికొలిపికొనుచు సింహనాదంబులతోడం జెలంగి; రంత. 37**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; నీ యోధులు= నీ పక్షంలోని వీరులు; ఒండొరులన్+పిలిచికొని= ఒకరినొకరు పిలిచికొని; పురికొలిపికొనుచున్= ప్రేరేపించుకొంటూ; సింహనాదంబులతోడన్= యుద్ధగర్జనలతో; చెలంగిరి= విజృంభించారు; అంతన్= ఆ మీదట.

**తాత్పర్యం:** ఆ సమయంలో నీ సైన్యంలోని వీరులు ఒకరినొకరు పిలిచికొని ప్రేరేపించుకొంటూ సింహనాదాలతో విజృంభించారు. ఆ మీదట.

**క. 'చెలియలికట్ట సముద్రము । నిలిపిన క్రియ నేన పార్థు నిలిపెద' ననుచుం**
**దలమిగిలి వెడలె మొనకును । బలువిడి దుర్మర్షణుండు పార్థివముఖ్యా! 38**

**ప్రతిపదార్థం:** పార్థివముఖ్యా!= ఓ రాజశ్రేష్ఠుడా!; సముద్రము= సంద్రాన్ని; చెలియలికట్ట నిలిపినక్రియన్= (దాని పొంగును) చెలియలికట్ట నిలిపినట్లుగా; నేను+అ= నేనే; పార్థున్= అర్జునుడిని; నిలిపెదన్= ఆపుతాను; అనుచున్= అని పల్కుతూ; మొనకును= (తన) సైన్యానికి; తలమిగిలి= ముందు మిగిలి; బలువిడి= అతిశయించి; దుర్మర్షణుండు; వెడలెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'సముద్రాన్ని చెలియలికట్ట అడ్డుకొన్నట్లుగా, అర్జునుడిని నేను అడ్డుకొంటాను' అని సైన్యంకంటె ముందుకు సాగి దుర్మర్షణుడు విజృంభించాడు.

**క. కని విజయుఁ డలరి హరి కి । ట్లను 'నేనికగములతోడ నడరెడుఁ గడఁకన్**
**మును దుర్మర్షణుఁ డిదె యిం । దు నడపు; మరదంబు వీఁడు తొలుముద్ద యగున్.' 39**

**ప్రతిపదార్థం:** కని= (దుర్మర్షణుడిని) చూచి; విజయుఁడు+అలరి= అర్జునుడు సంతోషించి; హరికిన్= కృష్ణుడితో; ఇట్లనున్= ఈ విధంగా అన్నాడు; ఏనికగములతోడన్= ఏనుగుల గుంపులతో; దుర్మర్షణుఁడు; కడఁకన్= పట్టుదలతో; ఇదె= ఇదిగో; అడరెడున్= విజృంభిస్తున్నాడు; అరదంబున్= మనతేరును; ఇందున్= ఇక్కడకు (వీని దగ్గరకు); నడపుము= తోలుము; వీఁడు= ఈ దుర్మర్షణుడు; తొలు ముద్దయగున్= (మనకు) తొలి కబళమవుతాడు (యుద్ధంలో); అని అర్జునుడు శ్రీకృష్ణుడితో అన్నాడు.

**తాత్పర్యం:** విజృంభించి వచ్చే దుర్మర్షణుడిని చూచి శ్రీకృష్ణుడితో అర్జునుడు 'మన రథాన్ని ఆ వైపునకు తోలుము. ఈ దుర్మర్షణుడు మనకు యుద్ధంలో తొలి కబళమవుతాడు' అని అన్నాడు.

**ఆ. అనిన నట్ల చేసె నతఁ డా ధనంజయుఁ । డగ్గజేంద్రరాజి నస్త్రసమితిఁ**
**బొదివెఁ గారుమొగులు భూధరనికరంబు । బహులవృష్టిఁ గప్పుభంగిఁ దోఁప. 40**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అర్జును డనగా; అట్లు+అ చేసెన్= ఆ విధంగానే తేరును తోలాడు; ఆ ధనంజయుఁడు= ఆ అర్జునుడు; ఆ+గజేంద్రరాజిన్= ఆ ఏనుగుల గుంపును; అస్త్రసమితిన్= ఆయుధాల సమూహంతో; కారుమొగులు= కారుమేఘము (నల్లని మబ్బు); భూధరనికరంబు= కొండల గుంపును; బహుల= విస్తారమైన; వృష్టిన్= వానచేత; కప్పుభంగిన్= కమ్ముకొనే విధంగా; తోఁపన్= తోచేటట్లుగా; పొదివెన్= కమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు కోరినట్లుగా తేరును శ్రీకృష్ణుడు తోలాడు. ఆ దుర్మర్షణుడి గజముల సమూహాన్ని తన అమ్ములతో అర్జునుడు - కార్మొయిలు పెద్దవానతో కొండలను కమ్ముకొన్నట్లుగా కమ్ముకొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఒక్కఁ డని కడఁగి రథికులు । పెక్కండ్రు నిశాత విశిఖ భీమాకృతిఁ బే**
**రుక్కునఁ బొదివిరి నరు నతఁ । డెక్కుడు మద మొలయఁ జేతి యేడ్తెఱ సూపెన్. 41**

**ప్రతిపదార్థం:** ఒక్కఁడు+అని= ఒకడే అని; పెక్కండ్రు= అనేకులు; రథికులు= రథస్థులైనవారు; కడఁగి= పూని; నిశాత= వాడి అయిన; విశిఖ= బాణముల; భీమాకృతిన్= భయంకరాకారంతో; పేరు+ఉక్కునన్= గొప్పశౌర్యంతో; నరున్= అర్జునుడిని; పొదివిరి= క్రమ్ముకొన్నారు; అతఁడు= ఆ అర్జునుడు; ఎక్కుడు మదము= మిక్కిలి గర్వం; ఒలయన్= ప్రకటంకాగా; చేతి= తన చేతి; ఏడ్తెఱ= శక్తిని; చూపెన్= చూపినాడు.

**తాత్పర్యం:** అర్జును డొక్కడే అని మన సైనికు లనేకులు వాడి బాణాలతో మిక్కిలి బలంతో అతనిని క్రమ్ముకొన్నారు. అర్జునుడు తన భుజబలాన్ని అతిశయంగా చూపించాడు.

**వ. అప్పుడు. 42**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. పలు తలలు ముఖవికాసము । వొలియక పడియున్న సమర భూభాగము పె**
**ల్లలరిన తామర కొలనిం । దలపించెన్ గగన చర వితతి పులకింపన్. 43**

**ప్రతిపదార్థం:** పలు తలలు= పెక్కు తలలు; ముఖవికాసము= ముఖాలకాంతి; పొలియక= చెడిపోక; పడి ఉన్నన్= (యుద్ధభూమిలో); పడి ఉండగా; సమర భూభాగము= యుద్ధభూమి; పెల్లు= ఎక్కువగా; అలరిన= వికసించిన; తామరకొలనిన్= తామర లున్న కోనేటిని; గగనచర వితతి= దేవతా సమూహం; పులకింపన్= సంతోషించగా; తలపించెన్= జ్ఞాపకానికి తెచ్చింది.

**తాత్పర్యం:** యుద్ధభూమిలో సైనికుల తలలు ముఖకాంతి చెడకుండా పడి ఉన్నాయి. ఆ భూమి చూచేటందుకు విచ్చుకొన్న తామరలుండే కోనేటిని తలపిస్తూ దేవతలను పులకింపజేసింది.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. తొడవు లొప్పార నెత్తుట దోఁగి పెక్కు । గజము లొక్క యెడన పడి కరము వొలిచె**
**జంట మెఱుఁగులతో నెఱసంజకెంపు । గదురఁ జెలువొందు మొగిళుల గమియుఁ బోలె. 44**

**ప్రతిపదార్థం:** తొడవులు= నగలు; ఒప్పారన్= అందంగా ఉండగా; నెత్తుటన్= నెత్తురులో; తోఁగి= పొర్లాడి; పెక్కు గజములు= ఏనుగుల గుంపు; ఒక్క ఎడన్+అ పడి= ఒక్కచోటనే పడి; జంట మెఱుఁగులతోన్= మెరుపుల జతతో; నెఱసంజ= నిండు సంధ్య; కెంపు= ఎఱ్ఱదనం; కదురన్= ఎక్కువగా; చెలువొందు= అందమయిన; మొగిళుల గమియున్= మేఘాల సమూహం; పోలెన్= వలె; కరము= మిక్కిలి; పొలిచెన్= ఒప్పారింది.

**తాత్పర్యం:** (యుద్ధరంగంలో) నెత్తుటిలో పొర్లాడు ఏనుగుల గుంపు ఒక్కచోటనే పడి ఉన్నది. (ఆ దృశ్యం) చూడటానికి మెరుపులతో కూడిన నిండు సంధ్యతో ఒప్పిన మేఘమాలవలె ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు గనుపుకొట్టు కవ్వడికి నోహటింపక నీ సైనికులు పైపయిం గ్రమ్మి వివిధాస్త్రశస్త్రంబు లతనిపైఁ గురియ నతండు హస్తిహస్తంబుల నశ్వశరీరంబుల రథిక సారథి రథావయవంబులఁ బదాతి గాత్ర ఖండంబులం బ్రథన భూమిం గప్పె; నట్టియెడ మఱియును. 45**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కనుపుకొట్టు= ఖండిస్తూ ఉన్న; కవ్వడికిన్= అర్జునుడికి; ఓహటింపక= వెనుదీయక; నీ సైనికులు; పైపయిన్+క్రమ్మి= మీద మీద క్రమ్ముకొని; వివిధ+అస్త్రశస్త్రంబులు= అనేకములైన బాణాలను; అతనిపైన్= ఆ అర్జునుడిమీద; కురియన్= కురిపించగా (వానవలె); అతండు= అర్జునుడు; హస్తి= ఏనుగులు; హస్తంబులన్= తొండాలతో; అశ్వశరీరంబులన్= గుర్రాల శరీరాలతో; రథిక= సైనికుల; సారథి= సారథుల; రథ= రథముల; అవయవంబులన్= శరీరభాగాలతో; పదాతి= కాల్బలాల; గాత్ర= శరీరాల; ఖండంబులన్= ముక్కలతో; ప్రథన భూమిన్= యుద్ధరంగాన్ని; కప్పెన్= కప్పివేశాడు; మఱియును= ఇంకను.

**తాత్పర్యం:** తమ సైన్యాన్ని తుండెతుండెములుగా అర్జునుడు చీలుస్తూ ఉండగా వెనుదీయక మన సైనికులు అతడి మీద అనేక బాణాలను వర్షంవలె కురిపించారు. అపు డాతడు (మన) కాల్బలముల ఏనుగుల తొండాలను, గుర్రాలశరీరాలను, రథికులనూ సారథులను, రథభాగాలను, ముక్కలుముక్కలుగా చేసి, వాటితో యుద్ధభూమిని కప్పివేశాడు.

**క. 'పార్థుఁడు వేఁడీ? పొదువుడు; । బార్థుఁడ యెట వోయె దింక? బార్థుఁడ! రావే;**
**పార్థుఁడ! యిక్కడ నెయ్దుము । పార్థునిఁ బట్టుఁ డను నులివు బహుళం బయ్యెన్. 46**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు వేఁడీ?= పార్థు డెక్కడ?; పొదువుఁడు= క్రమ్ముకొనండి; పార్థుఁడ!= అర్జునా!; ఎటు పోయెదు+ఇంకన్= ఇంక ఎక్కడకు పోతావు?; పార్థుడ! రావే= అర్జునా! రమ్ము; పార్థుఁడ!= అర్జునా!; ఇక్కడ= ఈ చోట; ఎయ్దుము= వెంబడించుము; పార్థునిన్ పట్టుఁడు= అర్జునుడిని పట్టుకొనండి; అను ఉలివు= అనే శబ్దం; బహుళంబు+అయ్యెన్= ఎక్కువయింది.

**తాత్పర్యం:** 'అర్జునుఁడెక్కడ? అర్జునా! ఇంక ఎక్కడకు పోతావు? అర్జునా! రా; అర్జునుడిని ఇక్కడ వెంబడించండి. అర్జునుడిని పట్టుకొనండి' అనే కలకలం ఎక్కువైనది.

**వ. ఇవ్విధంబున సంకులసమరంబుగాఁ బెక్కు లట్ట లాడ నమ్మోహరంబు వోక పెనంగిన. 47**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ పైప్రకారంగా; సంకుల సమరంబుగాన్= దొమ్మిపోరు జరుగగా; పెక్కులు= అనేకములైన; అట్టలు+ఆడన్= తల తెగిన శరీరాలు ఆడుతూ ఉండగా; ఆ+మోహరంబు= ఆ సైన్యం; పోక= వెనుకకు తగ్గకుండా; పెనంగినన్= యుద్ధం చేయగా.

**తాత్పర్యం:** ఈ రీతిగా తీవ్రయుద్ధం జరిగింది. తలలు తెగిన మొండెములు ఆడాయి. ఐనా ఆ కౌరవసైన్యం వెనుదీయకుండా పోరాడగా.

**సీ. అలిగిన గాండీవి యమ్ము లొక్కుమ్మడి । ముందటి దెసను బిఱిందివలన**
**వలపట దాపట సెలలు పె క్కవిసిన । తెఱఁగునఁ గవిసిన విఱుగు విల్లుఁ**
**దునియు ఖడ్గంబును దొరఁగు నెత్తురు మ్రొగ్గు । నేనుంగుఁ బడుకాలు మానిసియును**
**డొల్లుగుఱ్ఱంబును ద్రెళ్ళుతేఱును గూలు । రథికుండు నొఱగు సారథియు నైన**

**తే. మరలె దుర్మర్షణుఁడు దోన తెరలె సేన । యపుడు సమ్మెట కోలల నంకుశములఁ**
**జేఁకోలల వ్రేటుల నీఱతాఱ । యదలుపుల వాహనంబులు సెదరి పఱచె. 48**

**ప్రతిపదార్థం:** అలిగిన= కోపగించిన; గాండీవి= అర్జునుడి; అమ్ములు= బాణాలు; ఒక్క+ఉమ్మడి= ఒక్కపెట్టున; ముందటి దెసను= ముందరను; పిఱిందివలన= వెనుకను; వలపటన్= కుడిప్రక్కను; దాపటన్= ఎడమప్రక్కను; సెలలు= బాణాలు; పెక్కు= దండిగా; అవిసిన= విరిసిన; తెఱఁగునన్= విధంగా; కవిసినన్= క్రమ్ముకొనగా; విఱుగు విల్లున్= ముక్కలయ్యే ధనుస్సులు; తునియు= విఱుగు; ఖడ్గంబును= కత్తియును; తొరగు నెత్తురు= ప్రవహించే నెత్తురు; మ్రొగ్గు= ఒరిగిపడే; ఏనుంగు= ఏనుగులు; పడు కాలుమానిసియును= క్రిందపడే కాల్బలమును; డొల్లు గుఱ్ఱంబును= దొర్లే గుర్రం; త్రెళ్ళు= పడిపోయిన; తేఱును= రథమును; కూలు రథికుండున్= పడిన వీరుడును; ఒఱగు సారథియున్= ప్రక్కకు ఒరిగిపడు సారథియూ; అయినన్= కాగా; దుర్మర్షణుడు మరలెన్= దుర్మర్షణుడు వెనుకకు మళ్ళాడు (వెన్నిచ్చాడు); తోన= వెంటనే; సేనతెరలెన్= సైన్యం తొలగింది; అపుడు= ఆ సమయాన; సమ్మెటకోలలన్= సమ్మెటవంటి అమ్ములతోను; అంకుశములన్= అంకుశాలతోనూ; చేఱు= దగ్గర అయిన; కోలల వ్రేటులన్= అమ్ముల దెబ్బలతో; ఈఱతాఱు= పరుషమైన; అదలుపులన్= బెదరింపులతో; వాహనంబులు= (సైనికుల) వాహనాలు; చెదరి= చెదరిపోయి; పఱచెన్= పరుగుతీశాయి.

**తాత్పర్యం:** కోపగించిన అర్జునుడి బాణాలు ఒక్కసారిగా ముందు వెనుకల, కుడియెడమల, చాలా ఎక్కువగా క్రమ్ముకొన్నవి. అందువలన మనవారి విండ్లు విరిగిపోయాయి. నెత్తుటి ప్రవాహంలో కత్తులు తునిగిపోయాయి, చతురంగ బలాలూ కూలిపోయాయి. వీరులు, సారథులు పడిపోగా దుర్మర్షణుడు వెన్నిచ్చి తొలగిపోగా, సమ్మెటపోటువంటి అంకుశాల పోట్లతోనూ, బాణాల దెబ్బలతోనూ, పరుషమైన అదలింపులతోను (మన) వాహనాలన్నీ చెల్లాచెదరయ్యాయి.

**క. అనుటయు ధృతరాష్ట్రుండి । ట్లను సూతతనూజుతోడ 'నప్పుడు నరు మా**
**ర్కొన నెవ్వఁ డేనిఁ గలిగెనో? । చనిరో యందఱును ద్రోణు జంటకు భీతిన్?' 49**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (సంజయుడు) ఆ విధంగా చెప్పగా; సూత తనూజుతోడన్= సంజయుడితో; ధృతరాష్ట్రుఁడు+ఇట్లు+అనున్= ధృతరాష్ట్రుడీ విధంగా అన్నాడు; అపుడు= ఆ సమయాన; నరున్= అర్జునుడిని; మార్కొనన్= ఎదుర్కొనటానికి; ఎవ్వఁడేనిఁ గలిగెనో?= ఎవ్వడైనా ఉన్నాడా?; అందఱును= అంతమందీ; భీతిన్= భయంతో; ద్రోణు జంటకున్= ద్రోణుడి జతకు; చనిరో?= వెళ్ళినారా?

**తాత్పర్యం:** సంజయుడు చెప్పిన దానిని విని, ధృతరాష్ట్రుడు ఇట్లా అడిగాడు: 'అర్జునుడిని ఎదుర్కొనటానికి ఎవరైనా మిగిలారా లేక భయంతో అంతమందీ ద్రోణుడి జతకై ఆయన వద్దకు పరుగెత్తారా?

**ఉ. నావుడు నాతఁడమ్మనుజనాథున కిట్లను 'నట్టిచోట దం**
**తావళరాజి మున్నుగ నుదాత్త గుణ స్వన ఘంటికా మహా**
**రావము లుల్లసిల్ల సమరప్రియుఁ బాండవసింహుఁ దాఁకి య**
**స్త్రావళిఁ గప్పె దీప్తముఖుఁడై యువరాజు మహాద్భుతంబుగన్. 50**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగా; ఆతఁడు= సంజయుడు; మనుజనాథునకున్+ఇట్లనున్= ధృతరాష్ట్రుడితోడ ఈ విధంగా అన్నాడు; అట్టిచోటన్= ఆ సందర్భంలో; దంతావళరాజి= ఏనుగుల సమూహం; మున్నుగన్= తనకు ముందుగా రాగా; ఉదాత్త= గంభీరమైన; గుణస్వన= అల్లెత్రాటి శబ్దాలూ; ఘంటికామహారావములు= ఏనుగులపై వ్రేలాడవేసి ఉంచే గంటలనాదాలూ; ఉల్లసిల్లన్= ఎక్కువకాగా; యువరాజు= దుశ్శాసనుడు; దీప్తముఖుఁడు+ఐ= (కోపంతో) వెలిగేముఖంతో; సమరప్రియున్= యుద్ధంమీద ఆసక్తికలవాడైన; పాండవసింహున్= అర్జునుడిని; తాఁకి= ఎదుర్కొని; మహాద్భుతంబుగన్= మిక్కిలి ఆశ్చర్యకరంగా; అస్త్రావళిన్= బాణసమూహంతో; కప్పెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** (ధృతరాష్ట్రుడా విధంగా అనగానే) సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: ఆ యుద్ధ భూమిలో తన ముందున్న ఏనుగుల సమూహాల ఘంటానినాదాలు, వీరుల ధనుష్టంకారాలు ముమ్మరంకాగా

యువరాజైన దుశ్శాసనుడు భయంకరంగా వెలిగిపోతూ, యుద్ధప్రియుడైన అర్జునుడిని మహాద్భుతంగా ఎదుర్కొన్నాడు.

**వ. ఇట్లు దుశ్శాసనుండు దలపడినం గ్రోధావేశంబునం బెలుచ నవ్వి కవ్వడి దేవదత్తం బొత్తి గాండీవ జ్యానినాదంబు రోదసీ కుహరంబున మేదురంబుగాఁ జిత్రంబులగు రథయాతాయాతంబులనుం బటుబాణ పాతంబులను నగ్గజంబులు వెగడుపడి పంక నిమగ్నంబులుం బోలె నిశ్చేష్టితంబులుగాఁ దదారోహకుల తలలు డొల్లుచప్పుళ్ళు మహావాత పతితంబు లగు తాళఫలంబుల రవంబు ననుకరింప మఱియును గరవాల గదాధనుస్సాయక సహితంబులగు బాహువులు బహువిధ మహానాగంబుల భంగి రణభూమి నభిరామ ఘోరంబుగా ననేక ప్రకార క్రూరశరంబులు దాఁకి తునియు రూపును రుధిరంబు దొరఁగు రూపును నొఱలు రూపును ద్రుళ్ళి కెడయురూపును దూఁగు రూపును బడి పొరలు రూపును నెత్తురు గ్రక్కు రూపును జిక్కురూపును రూపుసెడు రూపును నై కరి తురగ నర నికరంబులు వికలంబులుగా విజృంభించిన నతని సంరంభంబు సైరింపం జాలక సబలంబుగా నయ్యువరాజు వాఱిన వెనుకొని యప్పాండవ మధ్యముండు. 51**

**ప్రతిపదార్థం:** ఇట్లు దుశ్శాసనుండు తలపడినన్= ఈ విధంగా (అనగా ముందు పద్యంలో చెప్పిన మాదిరి) దుశ్శాసనుడు ఎదుర్కొనగా; క్రోధ+ఆవేశంబునన్= కోపంతో కూడిన సంరంభంతో; పెలుచ నవ్వి= పెద్దగా నవ్వి; కవ్వడి= అర్జునుడు; దేవదత్తంబు+ఒత్తి= దేవదత్తమనే పేరున్న తన శంఖాన్ని పూరించి; గాండీవ జ్యా నినాదంబు= గాండీవంయొక్క అల్లెత్రాటి శబ్దం; రోదసీ కుహరంబునన్= గుహవంటిదైన భూమ్యాకాశ మధ్యభాగంలో; మేదురంబు కాన్= దట్టంకాగా; చిత్రంబులు+అగు= ఆశ్చర్యకరమైన; రథయాతాయాతంబులను= తేరుల పోకయును రాకయును; పటుబాణ పాతంబులను= తీవ్రమైన బాణములపాటును; ఆ+గజంబులు= ఆ ఏనుగులు; వెగడుపడి= భయపడి; పంకనిమగ్నంబులున్+పోలెన్= బురదలో కూరుకొనిపోయిన వాటి మాదిరిగా; నిశ్చేష్టితంబులు కాన్= చైతన్యరహితాలు కాగా; తదారోహకుల= ఆ ఏనుగుల మీద ఎక్కినవారి; తలలుడొల్లు చప్పుళ్ళు= దొర్లే తలలు చేసే చప్పుళ్ళు; మహావాత= పెనుగాలిచేత; పతితంబులగు తాళఫలంబుల= రాలిపడే తాటిపండ్ల; రవంబులన్= శబ్దాలను; అనుకరింపన్= అనుసరించగా; మఱియును= ఇంకను; కరవాల= కత్తులు; గదా= గదలు; ధనుస్సాయక= విల్లమ్ములతో; సహితంబులు+అగు= కూడుకొన్న; బాహువులు= చేతులు; బహువిధమహానాగంబుల భంగిన్= అనేక రకాలైన పెనుపాముల వలె; రణభూమి= యుద్ధరంగం; అభిరామ= అందానికి; ఘోరంబుగాన్= భయంకరంగా; అనేక ప్రకార= నానావిధాలైన; క్రూరశరంబులు= వాడిబాణాలు; తాఁకి= తగిలి; తునియు రూపును= తునిసిన ఆకారమును; రుధిరంబు= రక్తము; తొరఁగు= ప్రవహించు; రూపును= ఆకారమును; ఒఱలురూపును= రోదించే ఆకారమును; త్రుళ్ళి= ఎగిరిపడి; కెడయురూపును= చచ్చే ఆకారమును; తూగురూపును= నిద్రపోయినట్లు తూగే ఆకారమును; పడి పొరలురూపును= క్రిందపడి పొర్లాడే ఆకారమును; నెత్తురు క్రక్కురూపును= నెత్తురు క్రక్కే ఆకారమును; చిక్కురూపును= కృశించిన ఆకారమును; రూపుసెడు రూపును= ఆకారం చెడిన రూపును; కరి తురగ నర నికరంబులు= ఏనుగులు, గుర్రాలు, పదాతి సైన్యాల గుంపులు (చతురంగ బలా లని భావం); వికలంబులుగాన్= ముక్కలయ్యేటట్లు; విజృంభించినన్= అర్జునుడు చెలరేగగా; అతని సంరంభంబు= అర్జునుడి యుద్ధాతిశయ గర్వాన్ని; సైరింపన్+చాలక= ఓర్వలేక; సబలంబుగాన్= ససైన్యంబుగా; ఆ+యువరాజు= ఆ దుశ్శాసనుడు; పాఱినన్= పరుగెత్తగా; ఆ+పాండవమధ్యముండు= ఆ అర్జునుడు; వెనుకొని= తరిమి.

**తాత్పర్యం:** ఆ విధంగా దుశ్శాసనుడు ఎదుర్కొనగా మిక్కిలి కోపంతో అర్జునుడు నవ్వి, దేవదత్తాన్ని పూరించి గాండీవపు అల్లెత్రాటి టంకారం భూమ్యాకాశ మధ్యభాగంలో అలముకొనగా, దట్టంగా బాణాలు వేయగా, రథాలు అటు ఇటు పర్వెత్తగా, బాణాల తాకిడికి ఏనుగులు బురదలో మునిగినట్లు కదలలేక, వాటిమీద ఉన్న సైనికుల తలలు దొరలు చప్పుళ్ళు పెనుగాలికి క్రిందపడే తాటిపండ్లవలె ఉన్నాయి. అంతేకాక ఖడ్గాలతో, గదలతో, ధనుస్సులతో ఒప్పిన చేతులు పెనుపాములవలె ఉండి, రణభూమి భయంకరంగా ఉండింది. అనేక విధాలైన వాడి బాణాల తాకిడికి

తూనిగే రూపము, నెత్తురుకారే రూపము, రోదించే రూపము, ఎగిరిపడి చచ్చే రూపము, తూగిపడే రూపము, పడి పొర్లాడే రూపము, నెత్తురు క్రక్కేరూపము, కృశించే రూపము, ఆకారం చెడిన రూపము పొంది - ఏనుగుల, గుఱ్ఱాల, సైనికుల సమూహాలు ముక్కలయ్యేటట్లుగా అర్జునుడు విజృంభించగా. అతడి ధాటికి తట్టుకోలేక దుశ్శాసనుడు తన సైన్యంతో పరుగెత్తుతూ ఉంటే, అర్జునుడు వెంటబడి తరిమికొట్టాడు.

**చ. 'నిలు నిలు మెందుఁ బోఁ గలవు? నీ విటు పాఱినఁ జావు దప్పునే?**
**యలవుఁ జలంబుఁ బోవిడిచి యా సభ నించుక శంక లేక నీ**
**పలికిన యన్నియున్ మఱచి భంగపుఁ జచ్చుట దెచ్చికొంటి పె**
**ద్దలు వగఁబొంద, నన్నకును దమ్ములకున్ దలవంపుగా నిసీ!' 52**

**ప్రతిపదార్థం:** నిలుము, నిలుము+ఎందున్+పోన్+కలవు?= ఆగాగుము ఎక్కడకు పోయెదవు?; నీవు+ఇటు పాఱినన్= నీవు ఈ విధంగా పరుగెత్తితే; చావుతప్పునే= చావు తప్పిపోవునా?; అలవు= బలమును; చలంబు= పంతమును; పోవిడిచి= వదలి; ఆ సభన్= జూదమాడిన సభలో; ఇంచుక శంకలేక= ఒకింత అనుమానం లేకుండా; నీ పలికిన అన్నియున్= నీవు ప్రేలిన ప్రేలాపనలు (మాటలు) అన్నీ; మఱచి= మరచిపోయి; పెద్దలు వగపొందన్= ఇంటిలో పెద్దలు దుఃఖపడగా; అన్నకును తమ్ములకున్= నీ అన్నదమ్ములకు; తలవంపుగాన్= సిగ్గుచేటుగా; భంగపు+చచ్చుట= అవమానంతో కూడిన చావును; తెచ్చికొంటి(వి)= తెచ్చు కొన్నావు; ఇసీ= ఛీ!

**తాత్పర్యం:** 'ఓ దుశ్శాసనా! నిలు నిలు. ఎక్కడకు తప్పించుకొని పోయెదవు? నీవీ మాదిరి పరుగెత్తితే చావు తప్పుతుందా? బలమునూ, పట్టుదలనూ వదలి, సభలో జంకు లేకుండా మాటాడిన నీ మాటలను మరచి, పెద్దలు, దుఃఖించగా, అన్నకు, తమ్ములకు తలవంపు కలిగేటట్లుగా, అవమానంతో కూడిన చావు తెచ్చుకొన్నావు. ఛీ!

**విశేషం:** తిక్కనామాత్యుని నాటకీయ సంభాషణా చాతుర్యం ఈ పద్యంలో వ్యక్తమవుతూ ఉన్నది.

**వ. అని పలుకుచు నీకొడుకు పెడతలయు వెన్నును బదితూపుల నేపారి యేసిన నతండు మరలియుం జూడక ద్రోణాచార్యుం జూచుచుం బాఱె; బీభత్సుండును సైంధవుని దెసకు మనసునిగుడ మనమొనపయి నడచి యగ్రభాగంబున నున్న యగ్గురుం గనుంగొని యనతి దూరంబున నిలిచి నమస్కరించి కృష్ణుం డనుమతి సేయ జేతులు మొగిచి యి ట్లనియె. 53**

**ప్రతిపదార్థం:** అని పలుకుచున్= పై విధంగా హెచ్చరిస్తూ; నీ కొడుకు= నీ కుమారుడైన దుశ్శాసనుడి; పెడతలయు= తలవెనుక భాగాన; వెన్నును= వీపును; పదితూపులన్= పది వాడి బాణాలతో; ఏపారి= అతిశయించి; ఏసినన్= కొట్టగా; అతండు= ఆ దుశ్శాసనుడు; మరలియుంజూడక= తిరిగి చూడక; ద్రోణాచార్యున్ చూచుచున్= ద్రోణాచార్యులవారిని చూస్తూ; పాఱెన్= పరుగెత్తాడు (అనగా ఆనాటి సేనానాయకుడైన ద్రోణుడి దగ్గరకు సహాయానికై పరుగెత్తాడు); బీభత్సుండును= అర్జునుడునూ; సైంధవుని దెసకున్= సైంధవుడున్న దిక్కునకు (వానిమీదికి); మనసు నిగుడన్= మనసుపోగా; మనమొనపయి నడచి= మన సేనమీదకు వచ్చి; అగ్రభాగంబునన్+ఉన్న= మొన మొదటిలో ఉన్న; ఆ+గురున్+కనుంగొని= ఆ గురువైన ద్రోణాచార్యుడిని చూచి; అనతి దూరంబునన్ నిలిచి= దగ్గరగా నిలిచి; నమస్కరించి= దండంపెట్టి; కృష్ణుండు+అనుమతి చేయన్= శ్రీకృష్ణుడు ఉత్తరువీయగా; చేతులు మొగిచి= నమస్కారం చేసి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని అర్జునుడు హెచ్చరిస్తూ నీ కుమారుడైన దుశ్శాసనుడి తలవెనుకా వీపుమీదా పదిబాణాలతో కొట్టి, దుశ్శాసనుడు తిరిగి చూడకుండా గురువుగారైన ద్రోణాచార్యుడి చాటుకు పరుగెత్తేటట్లు చేశాడు. అర్జునుడు తన

మనస్సు సైంధవుడున్న దిక్కుకు పోగా అటు పోవటానికి ప్రయత్నిస్తూ, కృష్ణానుమతితో ఆచార్యుడికి చేతులు జోడించి ఈ విధంగా అన్నాడు:

**అర్జునుఁడు ద్రోణునిచే ననుజ్ఞాతుండై మొగ్గరంబు సొచ్చుట (సం.7-66-1)**

**ఉ. 'మేలుదలంపు శోభనము మేకొని చేయుము నాకుఁ బాండుభూ**
**పాలుని ధర్మనందనుని పంకజనాభుని యట్ల కావె! మ**
**త్పాలన వృత్తి కీవు నినుఁ బ్రార్థన సేసి భవత్ప్రసాద లీ**
**లాలసితుండ నై మొన దలంకఁగఁ జొచ్చెద భూసురోత్తమా!' 54**

**ప్రతిపదార్థం:** భూసురోత్తమా!= బ్రాహ్మణశ్రేష్ఠుడా!; మేలుదలంపు= నా మేలును తలచుకొనుము; నాకున్= నాకు; శోభనము= మంచిని; మేకొని చేయుము= సమ్మతితో చేయుము; నాకు; పాండుభూపాలుని, ధర్మనందనుని, పంకజనాభుని అట్లు+అ కావె?= నాకు (మీరు) పాండురాజు; ధర్మరాజు, శ్రీకృష్ణు డెట్లో అట్లే కదా?; ఈవు= నీవు; మత్పాలనవృత్తిన్= నన్ను కాపాడటానికి; నినున్ ప్రార్థన చేసి= నిన్ను వేడుకొని; భవత్+ప్రసాద= నీ యనుగ్రహమనే; లీలా= విలాసంచేత; లసితుండను+ఐ= వెలుగుతూ; మొనన్= సేనావ్యూహమును; తలంకఁగన్= భయపడేటట్లుగా; చొచ్చెదన్= చొచ్చుకొని పోతాను.

**తాత్పర్యం:** 'ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! నన్ను కాపాడటంలో మీరు పాండురాజు, ధర్మరాజు, శ్రీకృష్ణుడు ఎట్లో, అట్లే కదా! నా మేలును మనసులో భావించి నన్ను కాపాడు మని ప్రార్థిస్తూ ఉన్నాను. నీ దయచేత ఈ సేనావ్యూహాన్ని భయపడేటట్లుగా చేసి మొగ్గరంలోకి ప్రవేశిస్తాను.'

**క. 'నను నశ్వత్థామను నీ। వనఘా! సరికూర్మిఁ బెనిచి తట్లగుటను ద్రో**
**హిని సైంధవుఁ జంపఁగఁ బూ। నిన నా యుచిత ప్రతిజ్ఞ నెఱపుము కరుణన్.' 55**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్మా!; ననున్= నన్నూ; అశ్వత్థామను= అశ్వత్థామనున్నూ; సరికూర్మిన్+పెనిచితి= సమానమైన ప్రేమతో పెంచావు; అట్లు+అగుటన్= ఆ కారణం చేత; ద్రోహిని= ద్రోహం చేసిన; సైంధవున్= సైంధవుడిని; చంపఁగన్= చంపటానికి; పూనిన నా ఉచిత ప్రతిజ్ఞన్= ఆరంభించిన న్యాయమైన నా శపథాన్ని; కరుణన్= దయతో; నెఱపుము= నెరవేర్చుము.

**తాత్పర్యం:** 'పుణ్యాత్మా! నన్నూ అశ్వత్థామనూ సమానమైన ప్రేమతో పెంచావు. ద్రోహి అయిన సైంధవుడిని చంపటానికి నేను చేసిన ప్రతిజ్ఞ నెరవేరేటట్లు చేయుము.

**తే. 'అనుడుఁ బిన్నన వ్వొలయఁగ నస్త్రగురుఁడు। నరునిపైఁ జూడ్కి నాటించి 'నన్ను గెలువ**
**కెట్లు సైంధవుఁ జేరె'దం చేసె రథ్య। ములును హరియును నతఁడు నమ్ముల మునుంగ. 56**

**ప్రతిపదార్థం:** అనుడున్= ఆ విధంగా అర్జును డనగా; పిన్ననవ్వు= చిరునవ్వు; ఒలయఁగన్= కలుగగా; అస్త్రగురుఁడు= ధనురాచార్యుడు; నరునిపైన్+చూడ్కి నాటించి= అర్జునుడిని చూచి; నన్ను గెలువక= నన్ను జయింపకుండా; ఎట్లు= ఏ విధంగా; సైంధవున్+చేరెదు?= సైంధవుడి దగ్గరకు పోగలవు?; అంచున్= అని అంటూ; రథ్యములును= గుర్రాలు; హరియును= శ్రీకృష్ణుడును; అతఁడున్= అర్జునుడును; అమ్ములన్ మునుంగన్= బాణవర్షంలో మునిగిపోగా; ఏసెన్= వేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు సైంధవుడిని చంపటానికి ఆచార్యుడి అనుమతి కోరాడు. అందు కాయన చిరునవ్వుతో 'నన్ను గెలువకుండా సైంధవుడిని నీవు ఎట్లా సమీపిస్తావు?' అని చెపుతూ గుర్రాలనూ, శ్రీకృష్ణుడినీ, అర్జునుడినీ బాణవర్షంలో ముంచాడు.

**వ. ఇ త్తెఱుంగున నేయుటయు నని సేయుటకై య మ్మహాత్మునకు విజ్ఞాపనంబు సేసి. 57**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఏయుటయున్= బాణాలను ప్రయోగించగా; అని= యుద్ధం; చేయుటకై= చేయటానికి; ఆ+మహాత్ముంనకున్= ఆ గొప్పవాడైన ద్రోణాచార్యుడికి; విజ్ఞాపనంబు+చేసి= మనవి చేసి.

**తాత్పర్యం:** పై విధంగా (ఆచార్యుడు) తమ్ము బాణవర్షంలో ముంచివేయగా; యుద్ధం చేయటానికి ఆయన అనుమతి కోసం అర్జునుడు ప్రార్థించాడు.

**విశేషం:** ధర్మయుద్ధం కనుక గురుడి ఆమోదంతో యుద్ధంచేద్దామని అర్జునుడు ఆయన అనుమతి కోరాడు.

**క. అనుమతుఁడై విజయుం డా । తనిమీఁద నిశాత విశిఖ తతి వఱపి రయం**
**బున నవ నారాచము లే । సిన నడుమన నఱకె నతఁడు శీఘ్రత మెఱయన్. 58**

**ప్రతిపదార్థం:** అనుమతుఁడై= అనుమతిని పొంది (ద్రోణాచార్యుని ఉత్తరువును పొంది); విజయుండు= అర్జునుడు; ఆతని మీఁదన్= ద్రోణుడిమీద; నిశాత విశిఖతతి= వాడి బాణాల సమూహం; వఱపి= వేసి; రయంబునన్= శీఘ్రంగా; నవనారాచములు= తొమ్మిది బాణాలను; ఏసినన్= వేయగా; అతఁడు= ఆ ద్రోణుడు; శీఘ్రత= వడి; మెఱయన్= బయలుపడగా; నడుమన= మధ్యలోనే; నఱకెన్= త్రుంచివేసెను.

**తాత్పర్యం:** ద్రోణుని అనుమతిపొంది అర్జును డాతడిని తొమ్మిది బాణాలతో కొట్టటానికి ప్రయత్నించాడు. ద్రోణుడు తన వడి ప్రకాశించగా ఆ బాణాలను నడుమనే త్రుంచివేసినాడు.

**తే. నఱికి తోడన హరిమేను నరుని యొడలు । నేయ గురువిల్లు విఱుగంగ నేయఁ దలఁచె**
**న క్కిరీటి యాలోనన యతని మౌర్వి । వికలముగఁ జేసె నాధనుర్వేదవిదుఁడు. 59**

**ప్రతిపదార్థం:** ఆ ధనుర్వేదవిదుఁడు= ధనుర్వేదంలో ప్రవీణుడైన ఆ ద్రోణాచార్యుడు; నఱికి= (అర్జునుడు వేసిన) బాణాలను నఱికి; హరిమేను= శ్రీకృష్ణుడి శరీరాన్ని; నరుని యొడలు= అర్జునుడి శరీరాన్ని; ఏయన్= కొట్టగా; ఆ+కిరీటి= అర్జునుడు; గురువిల్లున్= ఆచార్యుడి వింటిని; విఱుగంగన్= ముక్కలయ్యేటట్లుగా; ఏయన్+తలఁచెన్= బాణాలను ప్రయోగించగా తలచుకొన్నాడు; ఆలోనన= అంతలోనే; అతని మౌర్వి= ఆ అర్జునుడి అల్లెత్రాడును; వికలముగన్+చేసెన్= ముక్కలు చేశాడు.

**తాత్పర్యం:** ధనుర్విద్యావేత్త అయిన ద్రోణాచార్యుడు అర్జునుడి బాణాలను నరకి, శ్రీకృష్ణుడి మీద, అర్జునుడి మీద బాణాలు వేయగా, అర్జునుడు ఆచార్యుని ధనుస్సును విరువ దలచుకొన్నాడు, అంతలోనే ఆచార్యుడు అర్జునుడి అల్లెత్రాటిని నిరుపయోగంగా చేశాడు.

**విశేషం:** యుద్ధరంగంలో వీరుని మెలకువను వేగాన్నీ తెలియజేస్తూ ఉన్నది ఈ వర్ణన.

**క. రహితగుణచాపుఁ డగు న । య్యహితాంతకుఁ బొదివె కేశవాశ్వ పతాకా**
**సహితంబుగ రుచిర స్మిత । మహితుఁ డగుచు న గ్గురుండు మార్గణ వితతిన్. 60**

**ప్రతిపదార్థం:** రహితగుణచాపుఁడు+అగు= అల్లెత్రాడులేని విల్లు కలవాడైన; ఆ+అహితాంతకున్= శత్రువులను చంపే ఆ అర్జునుడిని; కేశవ= శ్రీకృష్ణుడితోనూ; అశ్వపతాకా సహితంబుగన్= గుర్రాలతోను, జెండాతోనూ; రుచిరస్మిత మహితుఁడు+అగుచున్= ఒప్పిదమయిన చిరునవ్వుతో నిండినవాడై; మార్గణవితతిన్= అమ్ముల సమూహంతో; ఆ+గురుఁడు= ఆ గురుడు; పొదివెన్=కప్పాడు.

**తాత్పర్యం:** తునిగిన వింటినారి కలవాడూ, శత్రుసంహారకుడూ అయిన అర్జునుడిని శ్రీకృష్ణసహితంగా గుర్రాలూ, పతాకమూ కప్పబడే విధంగా, ఒక చిరునవ్వుతో ద్రోణుడు తన బాణ సమూహంతో కప్పివేశాడు.

**వ. ఇవ్విధంబునం గుంభసంభవుండు విజృంభించిన విచ్చవ్చుం డలిగి సజ్యశరాసనుండై యాధనురాచార్యుం బటు బాణ విసరవేగంబున నతిక్రమించి కెలంకుల బలంబుల నాక్రమించిన. 61**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; కుంభసంభవుండు= ద్రోణుడు; విజృంభించినన్= చెలరేగగా; విచ్చవ్చుండు= అర్జునుడు; అలిగి= కోపించి; సజ్యశర+ఆసనుండు+ఐ= అల్లెత్రాడు బిగించిన విల్లు కలవాడై; ఆ+ధనురాచార్యున్= ఆ ద్రోణుడిని; పటుబాణ విసరవేగంబునన్= బలమైన బాణాల సమూహం ప్రయోగించే వేగంతో; అతిక్రమించి= దాటి; కెలంకుల బలంబులన్= ప్రక్కన ఉన్న సేనలను; ఆక్రమించినన్= వశపరుచుకోగా.

**తాత్పర్యం:** ద్రోణాచార్యు డా విధంగా విజృంభించగా, అర్జునుడు తన విల్లుకు అల్లెత్రాడు బిగించి ఎక్కుపెట్టి అనేక బాణ సమూహాలతో ద్రోణాచార్యుడిని దాటి వేగంగా ప్రక్కన ఉన్న సైన్యాన్ని ఆక్రమించుకోగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. కులిశంబు తాఁకున కూలిన కులపర్వ । తంబుల కరణి మత్త ద్విపములు**
**బలుగాలిఁ దూలిన జలధరపంక్తుల । చాడ్పున నుద్భట స్యందనములు**
**గీలుకాఁ డెడలింపఁ గెడసిన బొమ్మల । కైవడిఁ బడు తురంగవ్రజంబు**
**బెడిదంపు వట్టోడిఁ బడిన పేరడవి చం । దంబున బహుల పదాతి చయము**

**తే. 'వికటముగఁ ద్రెళ్ళె నలుగడ విచ్చె నొక్క । పెట్ట వెస డొల్లె నిలఁ జాపకట్టు పడియెఁ**
**జండ గాండీవ నిర్ముక్త శాత వివిధ । కాండ దారుణ ప్రహతులఁ గౌరవేంద్ర!. 62**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= కౌరవరాజా! (ధృతరాష్ట్రా!); కులిశంబు తాఁకునన్= వజ్రాయుధం దెబ్బకు; కూలిన= పడిపోయిన; కులపర్వతంబుల కరణిన్= సప్త కుల పర్వతాల మాదిరి; మత్తద్విపములున్= మదపుటేనుగులును; బలుగాలిన్= పెనుగాలికి; తూలిన= తూలిపడిన; జలధరపంక్తుల చాడ్పునన్= మేఘాలవరుసలవలె; ఉద్భటస్యందనములు= మిక్కుటమైన తేరులును; కీలుకాఁడు= సూత్రధారి; ఎడలింపఁగన్= వదలిపెట్టగా; ఎడసిన= తొలగిపోయిన; బొమ్మలకైవడిన్= బొమ్మల మాదిరి; పడు= పడిపోయే; తురంగవ్రజంబున్= గుర్రాల సమూహమును; బెడిదంపు= భయంకరమైన; వట్టోడిన్= ప్రవాహంలో; పడిన= పడిపోయిన; పేరడవి= పెద్ద అడవి; చందంబునన్= మాదిరి; బహులపదాతిచయమున్= విస్తారమైన కాలి బంటుల గుంపును; వికటముగన్= వికారంగా; త్రెళ్ళెన్= కూలింది; నలుగడన్= నలువైపులా; విచ్చెన్= విరిసిపోయింది; ఒక్కపెట్ట= ఒక్కమారుగా; వెసడొల్లెన్= శీఘ్రంగా దొర్లింది; ఇలన్= భూమి మీద; చాపకట్టుపడియెన్= చాపచుట్టవలె పడినది; చండ= భయమును కల్గించే; గాండీవ= గాండీవం నుండి; నిర్ముక్త= విడువబడిన; శాత= వాడి అయిన; వివిధకాండ= అనేకములయిన బాణముల; దారుణ= కఠినమైన; ప్రహతులన్= దెబ్బలవలన; పడియెన్= పడిపోయింది.

**తాత్పర్యం:** ఓ కౌరవరాజా! అర్జునుడి గాండీవం నుండి వెడలిన వాడి బాణాలు తాకుటచేత వజ్రాయుధం దెబ్బకు కూలే కొండల మాదిరి ఏనుగులు కూలినవి. పెనుగాలి తాకిడికి తూలిపోయే మేఘాల వలె తేరులు ఎగిరిపోయాయి. సూత్రధారి సళ్ళింపగా తునిసిపోయే బొమ్మలవలె గుర్రాలు పడ్డాయి. పదాతి సమూహం పెద్ద ప్రవాహంలో బడిన పెద్ద అడవి మాదిరి అయింది. ఈ సన్నివేశం చూడగా మొత్తం సైన్యం భూమిమీద చాపకట్టుగా పడినట్లయింది.

**ఆ. అడ్డుపడి గురుండు దొడ్డనారసము వ । క్షంబు దూఱ నేయ సవ్యసాచి**
**యొల్లఁ బోయి తెలిసి పెల్లేసె న క్కుంభ । జన్ముమీఁద నిశితసాయకములు. 63**

**ప్రతిపదార్థం:** గురుండు= ద్రోణుడు; అడ్డుపడి= అడ్డంగా వచ్చి (అర్జునుడి బాణాల నుండి సైన్యమును కాపాడటానికై); దొడ్డ= పెద్దదైన; నారసమున్= వాడి బాణాన్ని; వక్షంబు= గుండెలో; దూఱన్+ఏయన్= దూసికొనిపోయేటట్లు కొట్టగా; ఒల్లన్+పోయి= మూర్ఛపోయి; తెలిసి= మూర్ఛనుండి తేరుకొని; సవ్యసాచి= అర్జునుడు; ఆ+కుంభజన్ముమీఁదన్= ఆ కుంభజన్ముడైన ద్రోణుడిమీద; నిశిత సాయకములు= వాడి బాణాలను; పెల్లు+ఏసెన్= ఎక్కువగా వేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడికి ద్రోణుడు అడ్డుపడి, ఒక వాడి బాణంతో అర్జునుడి గుండె చీలేవిధంగా కొట్టాడు. ఆ దెబ్బకు అర్జునుడు మూర్ఛిల్లి, ఆపై తేరుకొని వాడి బాణాలను ద్రోణుడి మీద గుప్పించాడు.

**వ. అతండును.** **64**

**తాత్పర్యం:** ఆ ద్రోణుడును.

**క. హరి నైదువిశిఖముల న । న్నరు డెబ్బదిమూఁట గేతనము మూఁటను స**
**త్వరుఁ డై యేయుచు శితశర । పరంపరలు తద్రథంబుపైఁ బరఁగించెన్.** **65**

**ప్రతిపదార్థం:** హరిన్+ఐదు విశిఖములన్= శ్రీకృష్ణుడిని అయిదు వాడి బాణాలతోను; ఆ+నరున్= ఆ యర్జునుడిని; డెబ్బది మూఁటన్= డెబ్భైమూడు (బాణాల) తోను; కేతనమున్= ధ్వజమును; మూఁటను= మూడింటితోను; సత్వరుఁడు+ఐ= తొందరకాడై; ఏయుచున్= కొట్టుతూ; శితశరపరంపరలు= వాడి బాణాల వరుసలు; తద్రథంబుపైన్= ఆ అర్జునుడి తేరుమీద; పరఁగించెన్= వేశాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు (సారథి అయిన) శ్రీకృష్ణుడి మీద అయిదింటినీ, అర్జునుడిమీద డెబ్భైమూడింటిని, తేరుటెక్కెంమీద మూడింటిని, అతి వేగంగా వేస్తూ వాడి బాణాల వరుసను అర్జునుడి తేరుమీద ప్రయోగించాడు.

**క. కరములు నిగుడఁగ నొప్పెడు । తరణిఁ బొదువు వర్షదంబుదముక్రియ నట్లా**
**స్ఫురితాస్త్రుఁ బార్థు నత్యు । ద్ధుర బాణ సమగ్రుఁడైన ద్రోణుఁడు పొదివెన్.** **66**

**ప్రతిపదార్థం:** కరములు= కిరణాలు; నిగుడన్+ఒప్పెడు= వ్యాపించగా అందగించే; తరణిన్= సూర్యుడిని; పొదువు= క్రమ్ముకొనే; వర్షత్+అంబుదము క్రియన్= వర్షించే మేఘం మాదిరిగా; అట్లు= ఆ విధంగా; ఆ, స్ఫురిత+అస్త్రున్= ప్రకాశించే బాణాలు కలవాడైన ఆ; పార్థున్= అర్జునుడిని; అతి+ఉద్ధుర= మిక్కిలి భయంకరమైన; బాణసమగ్రుఁడు+ఐ= బాణాలతో నిండినవాడైన; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; పొదివెన్= క్రమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** కిరణాలతో అందంగా కన్పించే సూర్యుడిని వర్షించే మేఘం క్రమ్ముకొన్నట్లు, ప్రకాశించే బాణాలతో ఒప్పిన అర్జునుడిని మిగుల భయంకరమైన బాణాలతో కూడుకొని ఉన్న ద్రోణాచార్యుడు కమ్ముకొన్నాడు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**వ. పొదివిన యగ్గురు ప్రాపున భవదీయ సైనికులు గొందఱాకృష్ణులం జేరి పరాక్రమించుట గుండ్లు దేలి బెండ్లు మునింగిన ట్లయ్యె; నిబ్బంగి నక్కిరీటి కుమారుండయ్యును వృద్ధుండగు గలశ భవునిం గడవంజాలక చిక్కువడి యున్నం జూచి విచారించి యచ్యుతుం డతని కి ట్లనియె.** **67**

**ప్రతిపదార్థం:** పొదివిన= క్రమ్ముకొన్న; ఆ+గురు= ఆ ఆచార్యుడైన ద్రోణుడి; ప్రాపునన్= అండతో; భవదీయ సైనికులు= నీ సేన; కొందఱు= కొంతమంది; ఆ+కృష్ణులన్+చేరి= ఆ శ్రీకృష్ణార్జునులను చేరి; పరాక్రమించుట= సామర్థ్యం చూపటం; గుండ్లుదేలి బెండ్లు మునింగినట్లు= గుండ్రాళ్ళు తేలి బెండులు నీటిలో మునిగిపోయిన విధంగా; అయ్యెన్= అయింది; ఈ+భంగిన్= ఈ విధంగా; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; కుమారుండు+అయ్యున్= వయసులో ఉన్నవాడయినప్పటికీ; వృద్ధుండు+అగు= ముసలి అయిన; కలశభవున్= ద్రోణుడిని; కడవన్+చాలక= అతిక్రమించలేక; చిక్కుపడి ఉన్నన్= కష్టపడి ఉండగా; చూచి; విచారించి= యోచించి; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; అతనికిన్= అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు క్రమ్ముకోగా, ద్రోణుడి అండతో నీ సైనికులు కృష్ణార్జునులను ఎదుర్కొని పరాక్రమించటం బెండ్లు మునిగి గుండ్లు తేలాడినట్లుగా ఉన్నది. అపుడు యువకుడైనా అర్జునుడు ద్రోణాచార్యుడిని దాటి పోలేకపోయాడు. అపుడు శ్రీకృష్ణుడు అర్జునుడితో ఈ విధంగా అన్నాడు:

**క.** **'రిత్త దడవు గాకుండఁగ । నిత్తఱి నాచార్యుతోడి యీ సుడిగి వెసం**
**జొత్తము శకటవ్యూహము । చిత్తంబున నొండు దలఁపు సేర్పకు మింకన్.'** **68**

**ప్రతిపదార్థం:** రిత్త= వ్యర్థంగా; తడవు= ఆలస్యం; కాకుండఁగన్= కాకుండా; ఈ+తఱిన్= ఈ సమయంలో; ఆచార్యుతోడి= ఆచార్యుడి మీది; ఈసు+ఉడిగి= అసూయ వదలివేసి; వెసన్= వెంటనే; శకట వ్యూహమున్= శకట వ్యూహంలోనికి; చొత్తము= ప్రవేశింతాము; చిత్తంబునన్= నీ మనస్సులో; ఒండుదలఁపు= వేరే యోచనను; ఇంకన్ చేర్పకుము= ఇంక చేరనీయవద్దు.

**తాత్పర్యం:** 'అనవసరంగా ఆలస్యం కానీయకుండా ఇప్పు డాచార్యుడి మీది ఈసును వదలి, మనసులో వేరే యోచన లేకుండా ఈ శకటవ్యూహంలోనికి వెంటనే ప్రవేశించుదాము.

**అర్జునుఁడు ద్రోణాచార్యుల నతిక్రమించి కురుసైన్యంబు సొచ్చుట (సం. 7-66-30)**

**చ.** **అనవుడుఁ గ్రీడి 'నీదు హృదయంబున నెయ్యది దోఁచెఁ గృష్ణ! దా**
**నిన తగఁ జేయువాఁడ' నని నెమ్మిగఁ బల్కినఁ బ్రీతిఁ గుంభజ**
**న్మునకుఁ బ్రదక్షిణంబుగ సముద్ధతి నాతఁడు దేరు వోవ ని**
**చ్చిన శరజాలముల్ వరఁగఁ జేయుచుఁ బార్థుఁడు వోవుచుండఁగన్.** **69**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని శ్రీకృష్ణుడు చెప్పగా; క్రీడి= అర్జునుడు; కృష్ణ!; నీదు హృదయంబునన్= నీ మనస్సులో; ఏ+అది తోఁచెన్= ఏమి తోచిందో; దానిన= దానినే; తగన్+చేయువాఁడన్= తగునట్లు చేస్తాను; అని నెమ్మిగన్+పల్కినన్= అని ప్రీతిగా చెప్పగా; ఆతఁడు= కృష్ణుడు; ప్రీతిన్= ప్రేమతో; కుంభజన్మునకున్= ద్రోణుడికి; సముద్ధతిన్= గర్వంతో; ప్రదక్షిణంబుగన్= సవ్యంగా; తేరుపోవనిచ్చినన్= తేరును పోనీయగా; శరజాలములన్= బాణాల గుంపులను; పరఁగన్+చేయుచున్= వేస్తూ; పార్థుఁడు= అర్జునుడు; పోవుచున్+ఉండఁగన్= వెళ్ళుతుండగా.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి మాటలకు అర్జునుడు 'కృష్ణా! నీ మనసుకు తోచినట్లు చేయుము. దానికి తగినట్లు నేనూ చేస్తాను' అని ప్రీతిగా చెప్పాడు. అంత శ్రీకృష్ణుడు సగర్వంగా తేరును ద్రోణుడికి ప్రదక్షిణంగా పోనిచ్చాడు. అర్జునుడు బాణవర్షం కురిపించి పోతూఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ.** **కనుంగొని నవ్వుచు భారద్వాజుండు.** **70**

**తాత్పర్యం:** (అర్జునుడి పోకను) చూచి ద్రోణుడు నవ్వుతూ.

క. 'కలవే యెందును నిట్టివి? । బలసూదనతనయ! పగఱఁ బరిమార్పక వి
చ్చలవిడిఁ బ్రతిష్ఠితుఁ డవుగఁ । దలఁచెదు పోలు నొకొ!' యనుచుఁ దగిలెఁ బిఱుందన్. 71

**ప్రతిపదార్థం:** బలసూదనతనయ!= ఇంద్రుడి కుమారుడా! ఇట్టివి= ఇపుడు నీ చేష్టవంటివి; ఎందును గలవే?= ఎక్కడైనా ఉన్నాయా?; పగఱన్= శత్రువులను; పరిమార్పక= చంపక; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; ప్రతిష్ఠితుఁడవుగన్= నిలదొక్కుకున్నవాడవుగా, శాశ్వతుడవుగా; తలఁచెదు= తలచుకొంటున్నావు; పోలున్+ఒకొ!= ఇది తగునా!; అనుచున్; పిఱుందన్ తగిలెన్= వెంబడించాడు.

**తాత్పర్యం:** 'అర్జునా! ఇటువంటివి! ఎక్కడైనా ఉన్నాయా? శత్రువును చంపకుండా స్వేచ్ఛగా (నీవు) శాశ్వతుడ వనుకొంటున్నావు.' "ఇది తగునా" అంటూ ద్రోణు డతనిని తరిమినాడు.

వ. ధనంజయుండును. 72

**తాత్పర్యం:** అర్జునుడును.

క. గురుఁ డవు గాక పగతుఁడవె? । దురమునఁ గుపితుఁడగు ని న్నెదుర్కొన నా కొ
క్కరునకు శక్యమె? యా । పురహరున కగుం గాక!' యనుచు నరుగుచు నుండెన్. 73

**ప్రతిపదార్థం:** గురుఁడవుకాక పగతుఁడవె?= (నాకు) గురుడివి కాక శత్రుడవా?; దురమునన్= యుద్ధంలో; కుపితుఁడు+అగు= కోపగించిన; నిన్నున్= నిన్ను; ఎదుర్కొనన్= ఎదుర్కొనటానికి; నాకున్+ఒక్కరునకున్ శక్యమె?= నా ఒక్కడికి సాధ్యమా?; ఆ పురహరునకున్= ఈశ్వరుడికి; అగున్+కాక= సాధ్యమగునుగాక!; అనుచున్= అంటూ; అరుగుచున్+ఉండెన్= వెళ్ళుతున్నాడు.

**తాత్పర్యం:** '(అర్జునుడు ద్రోణుడితో) నాకు గురుడవు కాక శత్రుడవా? యుద్ధంలో కోపగించిన ని న్నెదుర్కొనటానికి నాకు సాధ్యమా? అది శివుడికొక్కడికే సాధ్యం' అని వెళ్ళసాగాడు.

వ. ఇవ్విధంబున సైన్యంబు సొచ్చు నా సవ్యసాచి చక్రరక్షకులగు పాంచాల కుమారులు యుధామన్యుండును నుత్తమౌజుండును దోడన వచ్చి చొచ్చి; రప్పుడు కృతవర్మయుం గాంభోజుండును శ్రుతాయువుఁ దమతమ యున్న చోట్లన యుండి తలలెత్తి చూచి కపిధ్వజ వేదికా కేతనంబుల కతంబునఁ గవ్వడి వెనుకం గలశభవు రాకయుం గని యుత్సాహంబు మిగిలి తగులువడ నడ్డపడుటకు నప్పళించుచుండ నప్పు డప్పాండవ వీరునిం గేకయ ప్రభద్రక నారాయణ గోపాల ప్రభృతులు పొదివి రెవ్వ; రెట్లు పొదివినం బ్రతిజ్ఞాతత్పరుం డగు న న్నరుండు సామజంబు సరోవరంబు దఱియం జొచ్చు తెఱంగున నబ్బల ప్రకరంబు బడలువడం జేయుచుం బోవం బోవ. 74

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; సైన్యంబు చొచ్చు= సేనలోకి దూరు; ఆ సవ్యసాచి= ఆ అర్జునుడి; చక్రరక్షకులు +అగు= తేరును కాపాడేవారైన; పాంచాల కుమారులు= ద్రుపదుడి కుమారులు; యుధామన్యుండును, ఉత్తమౌజుండును=ఈపేర్లు కలవారు; తోడన్+అ వచ్చి= కూడా వచ్చి; చొచ్చిరి= (సేనలోనికి) చొరపడ్డారు; అప్పుడు= ఆ సమయాన; కృతవర్మయున్; కాంభోజుండునున్; శ్రుతాయువున్; తమ తమ ఉన్న చోట్లన ఉండి= తమ తమ స్థానాలలోనే ఉండి; తలలు+ఎత్తి చూచి= తలలు పైకెత్తి చూచి; కపిధ్వజ వేదికా కేతనంబుల కతంబునన్= కపిధ్వజమూ, వేదికా, జెండాలు కారణంగా; కవ్వడి వెనుకన్= అర్జునుడి వెనుక; కలశభవు రాకయున్+కని= ద్రోణుడు రావటమును చూచి; ఉత్సాహంబు మిగిలి= ప్రయత్నంతో అతిశయించి; తగులు వడన్+అడ్డపడుటకున్= వెంటపడి అడ్డుకొనటానికి; అప్పళించుచున్+ఉండన్= ఆరాటపడుతూ ఉండగా; అప్పుడు; ఆ+ పాండవ వీరుని= ఆ అర్జునుడిని; కేకయ, ప్రభద్రక, నారాయణ గోపాల ప్రభృతులు= ఈ మొదలైన వారు; పొదివిరి= కమ్ముకొన్నారు;ఎవ్వరు+ఎట్లు

పొదివినన్= ఎవ్వరే విధంగా కమ్ముకొన్నా; ప్రతిజ్ఞా తత్పరుండు+అగు= తన శపథంమీద పట్టుదల కలవాడైన; ఆ+నరుండు= ఆ అర్జునుడు; సామజంబు= ఏనుగు; సరోవరంబు దఱియన్+చొచ్చు తెఱంగునన్= తామరకొలనులో ప్రవేశించిన విధంగా; ఆ+బలప్రకరంబున్= ఆ సైన్య సమూహాన్ని; బడలువడన్+చేయుచున్= ఆయాస పడేటట్లుగా చేస్తూ; పోవన్+పోవన్= పోగా పోగా.

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా సేనా సమూహంలో దూరిన అర్జునుడికి చక్రరక్షకులుగా పాంచాలరాజ కుమారులు యుధామన్యుడు, ఉత్తమౌజుడు కూడా వచ్చి చేరారు. అపుడు కృతవర్మ, కాంభోజుడు, శ్రుతాయువు మొదలైన వారు తలలెత్తి చూశారు. వారి వారి రథకేతనాలు గుర్తింపుగా ద్రోణార్జునులను గుర్తించి ఉత్సాహంతో అడ్డుకొనటానికి ఆరాటపడుతూ ఉండగా, కేకయ భద్రకాదులు అర్జునుడిని ఎదుర్కొన్నారు. అయినా, తన ప్రతిజ్ఞను నిలుపుకొనటానికి నిశ్చయించి అర్జునుడు తామరమడుగులో ప్రవేశించు ఏనుగు వలె ఆ సైన్యంలోకి చొచ్చుకొని వెళ్ళాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. కదిసి శరాసన గురుఁ డిరు । వది యేనుశరంబు లేయఁ బార్థుఁడు వానిం**
**గుదియించి విశాలాస్య । ప్రదరము లడరింపఁ గుంభభవుఁ డెడఁ ద్రుంచెన్. 75**

**ప్రతిపదార్థం:** కదిసి= దగ్గరకు చేరి; శరాసన గురుఁడు= ధనురాచార్యుడైన ద్రోణుడు; ఇరువది ఏను శరంబులు+ఏయన్= ఇరవై ఐదు బాణాలతో కొట్టగా; పార్థుఁడు= అర్జునుడు; వానిన్ కుదియించి= ఆ బాణాలను మరలించి; విశాలాస్య ప్రదరములు= పెద్దవైన మొగాలతో ఉన్న బాణాలను; అడరింపన్= వేయగా; కుంభసంభవుఁడు= ద్రోణుడు; ఎడన్= దూరాన; త్రుంచెన్= వాటిని ముక్కలు చేశాడు.

**తాత్పర్యం:** దగ్గరికి వచ్చి ద్రోణుడు ఇరువది అయిదు బాణాలతో కొట్టగా అర్జునుడు వాటిని త్రిప్పి కొట్టాడు. అర్జును డేసిన పెనుముఖాలు గల బాణాలను మధ్యలోనే ద్రోణుడు త్రుంచాడు.

**క. విజయుం డను శైలము గల । శజ ధారాధరము గప్పె శరవృష్టి మహా**
**ద్విజు నతఁ డేయక కడున । క్కజముగ నయ్యంపసోన గ్రక్కున మాన్పెన్. 76**

**ప్రతిపదార్థం:** విజయుండు+అను శైలమున్= అర్జునుడనే కొండను; కలశజ ధారాధరము= ద్రోణుడనే మేఘం; శరవృష్టిన్= అంపవానతో, జలవృష్టితో; కప్పెన్= క్రమ్మివేసింది; అతఁడు= ఆ అర్జునుడు; మహాద్విజున్= బ్రాహ్మణ శ్రేష్ఠుడిని (ద్రోణుడిని); ఏయక= కొట్టక (అనగా ఎదురేయక); కడున్+అక్కజముగన్= మిక్కిలి ఆశ్చర్యకరంగా; ఆ+అంపసోనన్= ఆ బాణవర్షాన్ని; గ్రక్కునన్= త్వరగా; మాన్పెన్= ఆపాడు.

**తాత్పర్యం:** అర్జునుడనే కొండను ద్రోణుడనే మేఘం బాణవర్షంతో కప్పింది. కాని ఆ మహాద్విజుడిని ఎదురు దెబ్బతీయకుండా ఆశ్చర్యంగా ఆ అంపవానను మాన్పాడు.

**విశేషం:** అలం: ఉపమ. రూపకం. శరవృష్టి - అనుచో శ్లేషము.

**ఆ. మఱియు నిరువదేను మార్గణంబుల నరు । డెబ్బదింటఁ గృష్ణు నుబ్బి యేసి**
**గురుఁడు నారసములఁ గురియంగ నవి యాఁగ । నలవి గామి నతఁడు నతఁడు నొచ్చి. 77**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; ఇరువది+ఏను= ఇరవై అయిదు; మార్గణంబులన్= బాణములతో; నరున్= అర్జునుడిని; డెబ్బదింటన్= డెబ్బయితో; కృష్ణున్= శ్రీకృష్ణుడిని; ఉబ్బి ఏసి= విజృంభించి కొట్టి; గురుఁడు= ద్రోణుడు (ధనురాచార్యుడు);

నారసములన్= వాడి బాణాలను; కురియంగన్= (వానవలె) కురిపించగా; అవి= ఆ బాణాలు; ఆఁగన్= ఆపటానికి; అలవికామిన్= సాధ్యంకాకపోవటంచేత; అతఁడున్+అతఁడున్= కృష్ణార్జునులు; నొచ్చి= బాధపడి.

**తాత్పర్యం:** ధనురాచార్యుడు ఇరవై అయిదు బాణాలతో అర్జునుడిని, డెబ్భైతో శ్రీకృష్ణుడిని కొట్టటమేకాక వాడి బాణాల వాన కురిపించాడు, ఆ బాణవర్షం ఆపటానికి వీలు కాక ఆ ఇర్వురు బాధపడ్డారు.

**వ. అమ్మేటివిలుకాని వంచించి కృతవర్మని సైన్యంబు సొచ్చుటయు, నగ్గురుండు సేయునది లేక సేనాముఖ రక్షణంబునకుం జనియె; నప్పార్థుని మార్కొని కృతవర్మ పదియమ్ము లేసిన నక్కిరీటి యొక్కవాల మ్మురమ్మున నాటించి మఱియును నారాచత్రయంబున నొప్పించె; నా భోజపతి యన్నరనారాయణులం గనుంగొని నవ్వుచు నిరువదేసేసి తూపులం బరగించిన ధనంజయుం డతని ధనువుఁ దునిమి యేకవింశంతి విశిఖంబుల నొప్పించిన, నొండు కోదండంబు గొని హార్దిక్యుండు బాణ పంచక యుగంబు విప్పచ్చు వక్షంబున గ్రుచ్చె; నప్పు డా సవ్యసాచిం జూచి యితండు దవులు వడియె నిది గా దని తలంచి దామోదరుండు. 78**

**ప్రతిపదార్థం:** ఆ+మేటి విలుకానిన్ వంచించి= ఆ పెద్దవిల్లు కలవాడైన (గొప్పవీరుడు) వాడిని మోసగించి; కృతవర్మని సైన్యంబు చొచ్చుటయున్= కృతవర్మ (నాయకుడుగా గల) సైన్యంలో ప్రవేశించుటయు; ఆ+గురుండు= ఆ ద్రోణుడు; చేయునది లేక= ఏమీ చేయలేక; సేనాముఖరక్షణంబునకున్+చనియెన్= సేన మొదలును కాపాడటానికి వెళ్ళాడు; ఆ+పార్థునిన్= ఆ అర్జునుడిని; మార్కొని= ఎదుర్కొని; కృతవర్మ పదిఅమ్ములు+ఏసినన్= కృతవర్మ పదిబాణాలేయగా; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; ఒక్క+వాలమ్ము= ఒక వాడి అయిన బాణాన్ని; ఉరమ్మునన్= గుండెలో; నాటించి= గ్రుచ్చి; మఱియును= ఇంకా; నారాచత్రయంబునన్ నొప్పించెన్= మూడు వాడి అయిన బాణాలతో బాధించాడు; ఆ భోజపతి= భోజరాజయిన కృతవర్మ; ఆ+నరనారాయణులన్+కనుంగొని= ఆ అర్జున కృష్ణులను చూచి; ఇరువదే నేసి తూపులు= ఇరవై అయిదేసి బాణాలను; ఏపున్+పరఁగించినన్= శీఘ్రంగా వేయగా; ధనంజయుండు= అర్జునుడు; అతని ధనువున్= ఆతడి విల్లును; తునిమి= త్రుంచివేసి; ఏకవింశతి= ఇరవై ఒక్క; విశిఖంబులన్= బాణాలచేత; నొప్పించినన్= బాధించగా; ఒండు కోదండంబున్+కొని= వేరొక విల్లు తీసికొని; హార్దిక్యుండు= కృతవర్మ; బాణపంచకయుగంబున్= పది బాణాలను; విప్పచ్చు వక్షంబునన్ గ్రుచ్చెన్= అర్జునుడి గుండెలో గ్రుచ్చాడు; ఆ+వీరుండును= ఆ అర్జునుడు; తదీయ= హార్దిక్యుడి; స్తనాంతరంబునన్= చనులమధ్యగా; తొమ్మిది అంబకంబులు దూర్చెన్= తొమ్మిది బాణాలను గ్రుచ్చాడు; అప్పు డా సవ్యసాచిన్+చూచి= అపు డా అర్జునుడిని చూచి; ఇతండు= అర్జునుడు; తవులు పడియెన్= చిక్కు పడ్డాడు; ఇది కాదని తలంచి= ఈ పద్ధతి కాదని తలచుకొని; దామోదరుండు= శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** ఆ గొప్ప విలుకాడిని మోసగించి కృతవర్మ సైన్యంలోనికి చొరబడ్డాడు. అపుడు తాను చేయగలిగిన దేమీ లేదని ద్రోణుడు మొగ్గరం మొనకు వెళ్ళాడు. కృతవర్మ అర్జునుడిని ఎదుర్కొని పది బాణాలతో కొట్టగా అర్జునుడు ఒక పదునైన బాణాన్ని అతని ఎదలో నాటాడు. అంతేకాక మరో మూడు బాణాలతో కూడ నొప్పించాడు. కృతవర్మ కృష్ణార్జునులను చూచి నవ్వుతు ఒక్కొక్కరి మీద ఇరువది బాణాలు వేయగా, అర్జునుడు అతని ధనుస్సును త్రుంచి, ఇరువది ఒక్క బాణాలతో, అతనిని నొప్పించాడు. తరువాత కృతవర్మ వేరొక ధనుస్సు తీసుకొని పదిబాణాలు అర్జునుని ఎదలో నాటుకొనేటట్లు కొట్టాడు. అప్పుడు కృష్ణుడు అర్జునుని చూచి, ఇతడు చిక్కున పడ్డాడు. ఇది పద్ధతి కాదు అని ఆలోచించి

**క. 'తడవయ్యె నితఁడు మన కె । క్కడి బంధుం? డేల కృప దెగంబాఱుము' నా**
**పుడుఁ గీలెడసిన జంత్రము । వడువునఁ బడ నేసె నతని వాసవి యధిపా! 79**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); తడవు+అయ్యెన్= ఆలస్యమైనది; ఇతఁడు= ఈ కృతవర్మ; మనకున్+ఎక్కడి బంధుండు?= ఎక్కడి బంధువయ్యా! (అనగా శత్రుపక్షంవాడు కనుక మనకు బంధువు కాడు); ఏల కృప?= ఎందుకు జాలి?;

తెగన్+పాఱుము= తెగవేయుము (చంపుము); నావుడున్= అని శ్రీకృష్ణు డనగా; కీలు+ఎడసిన జంత్రము వడువునన్= కీలు (సీల); తొలగించిన యంత్రం మాదిరి; అతనిన్= ఆ కృతవర్మను; వాసవి= అర్జునుడు; పడనేసెన్= క్రింద పడేటట్లు కొట్టాడు (అనగా చనిపోయేటట్లు).

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు 'ఆలస్యమౌతూ ఉన్నది. ఏ డెక్కడి బంధువు? త్వరగా పడవేయు' మని అర్జునుడిని హెచ్చరించగా, వెంటనే అతడు ఆ కృతవర్మను నేలపై పడేటట్లు చేశాడు.

**వ. ఇట్లు భోజపతిం గ్రూరనారాచంబుల మూర్ఛితుం జేసి. 80**

**తాత్పర్యం:** ఆ విధంగా భోజరాజైన కృతవర్మను వాడిబాణాలతో మూర్ఛిల్లేటట్లుగా చేసి.

**తే. కడచి కాంభోజ సైన్యంబు గలఁగఁ బెలుచఁ । జొచ్చు విప్వచ్చు వెనుకన చొరక యుండ**
**ముట్టి యాఁగె నా కృతవర్మ మూర్ఛదేఱి । వచ్చి రథ చక్ర రక్షకద్వయముఁ గడిమి. 81**

**ప్రతిపదార్థం:** కడచి= అతిక్రమించి; కాంభోజ సైన్యంబు= కాంభోజ దేశపు సేన; కలఁగన్= కలతచెందగా; పెలుచన్+చొచ్చు= త్వరగా ప్రవేశించే; విప్వచ్చు వెనుకన= అర్జునుడి వెనుకనే; చొరక ఉండన్= ప్రవేశించకుండా; ముట్టి= తాకి; ఆ కృతవర్మ= ఆ కృతవర్మ; మూర్ఛతేఱి= మూర్ఛనుండి లేచి; వచ్చి= వచ్చి; రథ చక్రరక్షక ద్వయమున్= రథచక్రరక్షకుల నిద్దరినీ; కడిమిన్= ప్రయత్నంతో; ఆఁగెన్= ఆపాడు.

**తాత్పర్యం:** కాంభోజ సైన్యం కలతచెందేటట్లు ఆ సైన్యంలోకి అతివేగంగా ప్రవేశిస్తున్న అర్జునుడిని అనుసరించకుండా ఉండేటట్లు, అతని చక్రరక్షకు లిద్దరిని, మూర్ఛదేరిన కృతవర్మ అడ్డుకొని ఆపాడు.

**వ. ఇవ్విధంబున నుత్తమౌజుని యుధామన్యుం బోనీక భోజపతి శరచతుష్టయంబును సాయకత్రయంబునుఁ దనువులం గీలించిన, నయ్యిరువురుం బదేసిబాణంబుల నతని నేసి, తత్కోదండంబు దుండంబులు సేసిన నతండు. 82**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారం; ఉత్తమౌజుని, యుధామన్యున్= (వీరిర్వురను) ఉత్తమౌజుని, యుధామన్యుని; పోనీక= (ముందుకు) పోనీయక; శరచతుష్టయంబును= నాల్గు బాణాలను; సాయకత్రయంబును= మూడు బాణాలను; తనువులన్ కీలించినన్= వారి శరీరాలలో నాటగా; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరునూ; పదేసి బాణంబులన్= పదిబాణాలతో (ఒక్కొక్కరునూ పదిబాణాలతో); అతనిన్+ఏసి= వాడిని కొట్టి; తద్+కోదండంబు= వాడి విల్లును; తుండంబులు చేసినన్= ముక్కలు చేయగా; అతండు= ఆ కృతవర్మ.

**తాత్పర్యం:** చక్రరక్షకులైన ఉత్తమౌజుడిని, యుధామన్యుడిని ముందుకుపోనీయకుండా, కృతవర్మ నాల్గు, మూడు బాణాలు వారి శరీరాలలో నాటగా, వారు ఒక్కొక్కరు పదేసి బాణాలతో కృతవర్మ విల్లును ముక్కలు చేశారు.

**ఉ. వేఱొక విల్లు పుచ్చుకొని విండులు రెండును ద్రుంచి మేనులం**
**దూఱఁగ నేసె బెట్టిదపుఁ దూపుల వారును వాని యమ్ములన్**
**గీఱఁగ నొండు విండ్లు గొని కిన్క యెలర్పఁగ నేసి రెమ్మెయిం**
**దీఱద గండి గాంచి నరు తేరిపథంబునఁ బోవ వారికిన్. 83**

**ప్రతిపదార్థం:** వేఱు+ఒకవిల్లున్= మరియొక వింటిని; పుచ్చుకొని= అందుకొని; విండులు రెంటిని= రెండు విండ్లను (అనగా ఆ ఇద్దరి విండ్లనూ); త్రుంచి= విరిచి; బెట్టిదపు= భయంకరమైన; తూపులన్= బాణాలతో; మేనులన్= శరీరాలందు;

దూఱఁగన్+ఏసెన్= దూరేటట్లుగా (శరీరంలో చొచ్చేటట్లుగా)కొట్టాడు; వారును= ఆ ఇరువురును; వాని అమ్ములన్= అతడి బాణాలను; గీఱఁగన్= చీల్చగా; ఒండు విండ్లుగొని= వేరు విండ్లను తీసికొని; కిన్క ఎలర్పఁగన్= కోపం ఎక్కువకాగా; ఏసిరి= కొట్టారు; వారికిన్= ఆ ఇద్దరికినీ; ఏ+మెయిన్= ఏ విధంగానూ (ఏ ఉపాయంతోనూ); నరుతేరి పథంబునన్= అర్జునుడి తేరు పోయే బాటలో; గండికాంచి= సందుచూచి; పోవన్= వెళ్ళుటకు; తీఱద= కుదరలేదు.

**తాత్పర్యం:** కృతవర్మ వేరొక విల్లు తీసికొని వారి ఇద్దరి విండ్లనూ త్రుంచివేసి బాణాలతో వారిని నొప్పించాడు. వారు కూడా అతడి బాణాలను చీల్చారు. అయినా అర్జునుడి రథం వెళ్ళే మార్గంలో వారు పోలేకపోయారు.

**అర్జునుఁడు శ్రుతాయుధ ప్రముఖ మహారథికులం జంపుట (సం.7-67-36)**

**వ. అట్లు చొచ్చు వివ్వచ్చుం జూచి శ్రుతాయుధుం డను రాజు రభసంబున నెదిర్చి మార్గణ త్రయంబున నేసి వాసుదేవునిపై సప్తతి ప్రదరంబులు నిగిడించి. 84**

**ప్రతిపదార్థం:** అట్లు చొచ్చు వివ్వచ్చున్+చూచి= పై విధంగా దూసికొని చొచ్చే అర్జునుడిని చూచి; శ్రుతాయుధుండు+అను రాజు= శ్రుతాయుధుడనే పేరున్న రాజు; రభసంబునన్= వేగంగా; ఎదిర్చి= ఎదురుకొని; మార్గణత్రయంబునన్= మూడు అమ్ములతో; ఏసి= కొట్టి; వాసుదేవునిపైన్= శ్రీకృష్ణుడిమీద; సప్తతి= డెబ్బై; ప్రదరంబులు= బాణాలను; నిగిడించి= సంధించి.

**తాత్పర్యం:** ఆ విధంగా దూసికొని పోతూ ఉన్న అర్జునుడిని శ్రుతాయుధుడనే రాజు ఎదుర్కొన్నాడు. మూడు బాణాలు అర్జునుడిమీద, డెబ్బై బాణాలు శ్రీకృష్ణుడి మీద ప్రయోగించాడు.

**తే. వెడఁదతూపునఁ గేతువు వ్రేయఁ గ్రీడి । నవతి విశిఖంబు లేయ నన్నరవరుండు**
**డెబ్బదేనమ్ము లడరింప నుబ్బి విల్లు । ద్రుంచి యుర మేడుశరముల నొంచె నరుఁడు. 85**

**ప్రతిపదార్థం:** వెడఁద తూపునన్= విశాలమైన బాణంతో; కేతువు వ్రేయన్= జెండాను కొట్టగా; క్రీడి= అర్జునుడు; నవతి= తొంభై; విశిఖంబులు= బాణాలను; ఏయన్= వేయగా; ఆ+నరవరుండు= ఆ శ్రుతాయుధుడు; డెబ్బది+ఏనమ్ములు= డెబ్బై అయిదు బాణాలను; అడరింపన్= గుప్పించగా; ఉబ్బి= పెరిగి; విల్లుత్రుంచి= (వాడి) ధనుస్సును త్రుంచివేసి; ఉరము= (వాడి) గుండెను; ఏడు శరములన్= ఏడు బాణాలతో; నరుఁడు= అర్జునుడు; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** శ్రుతాయుధుడు అర్జునుడి జెండాను పడగొట్టగా, అర్జునుడు తొంభై బాణాలను అతడిమీద వేశాడు. ఆ రాజు డెబ్బై అయిదు బాణాలను అర్జునుడిమీద వేయగా, అర్జునుడు విజృంభించి ఆతడి విల్లు త్రుంచి, ఏడు బాణాలతో అతడి గుండెను కొట్టి బాధించాడు.

**క. కోపించి యాతఁడొండొక । చాపము గొని నవనిశాతసాయకములు బా**
**హోపరితలముల నురమున । నేపున నాటుటయుఁ బార్థు డెలన వ్వొలయన్. 86**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ఆ శ్రుతాయుధుడు; కోపించి= కోపంతో; ఒండొక చాపముకొని= వేరొక విల్లును తీసికొని; నవ నిశాత సాయకములు= తొమ్మిది వాడిబాణాలు; బాహోపరితలములన్= చేతులకు పైభాగాన; ఉరమునన్= గుండియలో; ఏపునన్= గట్టిగా; నాటుటయున్= గ్రుచ్చుటయు; పార్థుఁడు= అర్జునుడు; ఎలనవ్వు+ఒలయన్= చిరునవ్వు కలుగగా.

**తాత్పర్యం:** శ్రుతాయుధుడు కోపంతో ఇంకొక విల్లు తీసికొని తొమ్మిది పదునైన బాణాలతో అర్జునుడి బాహువుల పైభాగాన గుండెలో దట్టంగా నాటేటట్లు వేశాడు. అపు డర్జునుడు చిరునవ్వుతో (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి తదంగములందు సప్తతి**
**క్రూరశిలీముఖంబు లతిఘోరముగాఁ దొరఁగింపఁ బ్రస్ఫుర**
**ద్భూరి గదాభిరాముఁ డయి దుర్దమ లీల రథంబు డిగ్గి యా**
**ధీర గుణోత్తరుం డతని తేరిదెసం గవిసెం రయంబునన్. 87**

**ప్రతిపదార్థం:** (అర్జునుడు చిరునవ్వుతో); సారథిన్+కూల్చి= శ్రుతాయుధుడి తేరు తోలువాడిని చంపి; తద్+అంగములందున్= వాని శరీరం మీద; సప్తతి= డెబ్భై; క్రూరశిలీముఖంబులు= వాడిబాణాలను; అతి ఘోరముగాన్= మిక్కిలి భయంకరంగా; తొరఁగింపన్= ప్రవాహం మాదిరి వేయగా; ప్రస్ఫురత్= బాగా కనిపించే; భూరిగదా= పెద్ద గదతో; అభిరాముఁడు+అయి= (వర్ణింప తగిన విధంగా) అందగాడయి; దుర్దమలీలన్= అణచటానికి వీలుకాని చేష్టతో; రథంబు డిగ్గి= తేరు దిగి; ఆ ధీరగుణ+ఉత్తరుండు= ధీరగుణంతో శ్రేష్ఠుడయిన ఆ అర్జునుడు; రయంబునన్= వేగంగా; అతని తేరిదెసన్= అతడి తేరుండే దిక్కునకు; కవిసెన్= కమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** (అర్జునుడు) చిరునవ్వుతో శ్రుతాయుధుడి సారథిని చంపాడు. తేరి గుర్రాలను చంపాడు. డెబ్బై వాడిబాణాలతో అతడి శరీరాన్ని తూట్లు పొడిచాడు. అపు డాతడు భయంకరమైన గదను తీసికొని, తేరు దిగి, శీఘ్రంగా అర్జునుడి తేరుండే వైపు విజృంభించాడు.

**వ. ఆ రాజు వరుణ తనయుం డనియు, నగ్గద వరుణు వరంబున వచ్చిన దనియు, దాని నిచ్చునప్పుడు 'దీని ధరించినవాడు రిపుల కజేయుండగుఁ బోటెక్కించుకొనని వానిమీఁదం బ్రయోగించిన వానిన మరలి వధియించు' ననియు చెప్పె ననియును బెద్దలవలన విందుము. 88**

**ప్రతిపదార్థం:** ఆ రాజు= ఆ శ్రుతాయుధుడు వరుణ తనయుండు+అనియున్= వరుణుడి కుమారుడనీ; ఆ+గద; వరుణ వరంబునన్+వచ్చినది+అనియున్= వరుణుడి వరంచేత ఆ గద వచ్చిందనీ; వరుణుండు= వరుణుడు; అతనికిన్= ఆశ్రుతాయుధునికి; దానిన్+ఇచ్చునప్పుడు= ఆ ఆయుధాన్ని ఇచ్చేటపుడు; దీనిన్ ధరించినవాఁడు= దీనిని చేతకలవాడు; రిపులకున్= శత్రువులకు; అజేయుండు+అగున్= జయింపరానివాడవుతాడు; పోటెక్కించుకొననివానిమీఁదన్= ఆయుధాన్ని ఎక్కుపెట్టనివాడిమీద; ప్రయోగించినన్= వేసిన; వానిన= వాడినే; మరలి వధియించున్+అని చెప్పెన్+అని= తిరిగిపోయి చంపునని చెప్పెనని; పెద్దలవలనన్ విందుము= పెద్దల మూలంగా విన్నాము.

**తాత్పర్యం:** ఆ యుద్ధం చేసే రాజు శ్రుతాయుధుడు వరుణుడి కుమారుడని, అతడి చేతిలోని గద వరుణుడి దయతో వచ్చిందని,'దానిని చేతబట్టిన వాడు శత్రువులకు జయింపశక్యంకాని వాడౌతాడని, యుద్ధ సన్నద్ధుడు కానివాడి మీద దాన్ని ప్రయోగిస్తే అది తిరిగి వచ్చి ప్రయోగించిన వాడినే హతమారుస్తుందని పెద్దలు చెప్పగా విన్నాము.

**ఉ. కాలము ప్రాప్తమైన మదిఁ గానఁడ! యన్నియమంబు మేదినీ**
**పాలకుఁ డప్పు డట్లగుటఁ బంకజనాభుని వైచె నాతఁ డా**
**భీల గదం దదంసమునఁ బెట్టిన నూతన బుష్పమాలయుం**
**బోలి వెలింగెఁ గాని యది భూవర! నొంపద యించుకేనియున్. 89**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా! (ఓ ధృతరాష్ట్రా! అని సంజయుడన్నాడు); కాలము= సమయం (చావు); ప్రాప్తము+ఐనన్= సిద్ధమైతే; మదిన్= మనసులో; ఆ+నియమంబున్= నియమాన్ని (అనగా తనగదకున్న నియమాన్ని); మేదినీపాలకుఁడు= రాజు (శ్రుతాయుధుడు); కానఁడు+అ= గుర్తించలేకపోయినాడు; అప్పుడు= ఆ సమయంలో; అట్లు+అగుటన్= అందువలన; ఆతఁడు= ఆ రాజు; ఆభీల= భయంకరమైన; గదన్= గదచేత; పంకజనాభునిన్= పద్మనాభుడైన శ్రీకృష్ణుడిని; వైచెన్= కొట్టాడు; అది= ఆ గద; తద్+అంసమునన్= అతడిభుజంమీద; పెట్టినన్ నూతన పుష్పమాలయున్ పోలి= కొత్తగా అలంకరించిన పూలమాలవలె; వెలింగెన్= వెలిగింది; కాని; ఇంచుకేనియున్= కొంచెమైనా; నొంపదు+అ= బాధించనే బాధించదు.

**తాత్పర్యం:** కాలం దాపురిస్తే నియమాలు ఏవీ జ్ఞాపకానికిరావు; అందువలన ఆ శ్రుతాయుధుడు తన గదతో శ్రీకృష్ణుడిని కొట్టాడు. ఆ భయంకరమైన గద దెబ్బ ఆయన నేమీ చేయకుండా మెడలో క్రొత్తగా అలంకరించిన పూలమాలవలె వెలిగింది.

**వ. ఇట్లు గోవిందునకుఁ గుసుమాభరణంబై పొలిచి యా క్షణంబ. 90**

**తాత్పర్యం:** ఈ విధంగా శ్రీకృష్ణుడికి పూలమాలగా ఒప్పి వెంటనే.

**ఆ. అశని కరణి వచ్చి యా శ్రుతాయుధునిపై । నమ్మహోజ్జ్వలాయుధమ్ము వడినఁ**
**బార్థు చేత మున్ను బాహులు దెగిపడ్డ । యతఁడు కొండ గూలినట్లు కూలె. 91**

**ప్రతిపదార్థం:** అశనికరణి వచ్చి= వజ్రాయుధం మాదిరి వచ్చి; ఆ శ్రుతాయుధునిపైన్= ఆ శ్రుతాయుధుడి మీద; ఆ+మహా+ఉజ్జ్వల= ఆ మిక్కిలి ప్రకాశించే; ఆయుధమ్ము పడినన్= ఆయుధం పడగా; పార్థుచేతన్= అర్జునుడి వలన; మున్ను= అదివరకే; బాహులు దెగిపడ్డ అతఁడు= చేతులు తెగిపడి ఉన్న వాడు; కొండ కూలినట్లు= కొండకూలి క్రిందపడినట్లు; కూలెన్= కూలిపడిపోయాడు.

**తాత్పర్యం:** శ్రుతాయుధుడు విసిరిన గద, వజ్రాయుధం మాదిరి తిరిగి వచ్చి అతడి మీదనే పడింది. అంతకు ముందే అర్జునుడిచేత చేతులు తెగగొట్టబడి ఉన్న శ్రుతాయుధుడు కొండకూలిన విధంగా కూలిపడ్డాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఇంద్రుడి వజ్రాయుధం కొండల రెక్కలను ఖండించేది. అప్పుడు కొండ నేల కూలేది, అయితే ఇక్కడ వజ్రాయుధంవంటి అతని ఆయుధంచేత అంతకుముందే బాహువులు తెగిపడిన శ్రుతాయుధుడు నేల కూలాడు.

**వ. ఇట్లు వరుణతనయుఁడు పడిన గనుంగొని. 92**

**తాత్పర్యం:** ఈ విధంగా వరుణకుమారుడు పడిపోగా చూచి.

**క. అచ్చటి బలములు బ్రభువులు । నచ్చెరువును భయము మనములం దడరంగా**
**విచ్చిన నట చనియెడు వి । వ్వచ్చుని గాంభోజవిభుఁడు వడి మార్కొనియెన్. 93**

**ప్రతిపదార్థం:** అచ్చటి బలములు= అక్కడి సైన్యాలు; ప్రభువులు= రాజులు; అచ్చెరువును భయము= ఆశ్చర్యమూ, భయమూ; మనములందున్= మనస్సులలో; అడరంగాన్= ఎక్కువకాగా; విచ్చినన్= చెదరిపోగా; అట చనియెడు= ఆ మార్గాన వెళ్ళుతున్న; వివ్వచ్చునిన్= అర్జునుడిని; కాంభోజవిభుఁడు= కాంభోజరాజు; వడిన్= శీఘ్రంగా; మార్కొనియెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** ఆ చోట ఉన్న సైన్యాలు, రాజులు ఆశ్చర్యమూ, భయమూ మనస్సులలో ఎక్కువై విచ్చిపోగా, అపుడాదిక్కున పోయే అర్జునుడిని కాంభోజరాజు ఎదుర్కొన్నాడు.

**వ. ఇట్లు మార్కొనుటయు. 94**

**తాత్పర్యం:** ఈ విధంగా ఎదుర్కొనగా.

**సీ. అర్జునుం డతని నేడమ్ముల నేసినఁ । బదియేను శరములఁ బార్థుఁ గృష్ణు**
**విశిఖత్రయమున నవ్విభుఁ డేయ నాతని । విజయుఁ డస్త్రద్వయ విహతుఁ జేయ,**
**బాణముల్ మూఁటను బటుశక్తిఁ గ్రీడి నొ । ప్పించి కాంభోజుండు పేర్చి యార్చె;**
**నరుఁ డల్గి వెసఁ బదునాలుగు దూపుల । సూతాశ్వకోదండ కేతనములఁ**

**తే.** **గూల్చి దొడ్డ నారసమున గుండెకాయ । వగుల బెట్టేయుటయు, నతిప్రబల పవన**
**భూరి రయమునఁ గూలు మహీరుహంబు । తెఱఁగు దోఁప సుదక్షిణుఁ డొఱలి కెడసె. 95**

**ప్రతిపదార్థం:** అర్జునుండు+అతనిన్= అర్జును డా కాంభోజరాజును; ఏడు+అమ్ములన్+ఏసినన్= ఏడు బాణాలతో కొట్టగా; పదిఏను శరములన్= పదునైదు బాణాలతో; పార్థున్= అర్జునుడిని; విశిఖత్రయమునన్= మూడు బాణాలతో; కృష్ణున్= శ్రీకృష్ణుడిని; అ+విభుఁడు= ఆ కాంభోజరాజు; ఏయన్= కొట్టగా; ఆతనిన్= ఆ రాజును; విజయుఁడు= అర్జునుడు; అస్త్రద్వయవిహతున్+చేయన్= రెండు బాణాలతో పడగొట్టగా; పటుశక్తిన్= తీవ్రమైన బలంతో; కాంభోజుండు= కాంభోజరాజు; బాణముల్ మూఁటను= మూడు బాణాలతో; క్రీడిన్= అర్జునుడిని; నొప్పించి= బాధించి; పేర్చి ఆర్చెన్= విజృంభించి సింహనాదం చేశాడు; నరుఁడు= అర్జునుడు; అల్గి= కోపించి; వెసన్= వేగంతో; పదునాలుగు తూపులన్= పదునాలుగు బాణాలతో; సూత+అశ్వ కోదండ కేతనములన్= సారథిని, వింటినీ; తేరు గుర్రాలనూ, ధ్వజాన్నీ; కూల్చి= పడగొట్టి; దొడ్డనారసమునన్= పెద్ద ప్రాణాంతకమైన వాడి బాణంతో; గుండెకాయ పగులన్= గుండె పగులగా; బెట్టు+ఏయుటయున్= గట్టిగా కొట్టుటయు; అతి ప్రబల= మిక్కిలి శక్తిమంతమైన; పవన= గాలియొక్క; భూరిరయమునన్= పెనువేగంతో; కూలు= పడిపోయే; మహీరుహంబు తెఱఁగున్= చెట్టువలె; తోఁపన్= తోచగా; సుదక్షిణుఁడు= (కాంభోజుడు) సుదక్షిణుడు; ఒఱలి= దొర్లుతూ; కెడసెన్= పడిపోయాడు.

**తాత్పర్యం:** అర్జునుడు త న్నెదుర్కొన్న కాంభోజరాజును ఏడుబాణాలతో కొట్టాడు. బదులుగా ఆతడు పదిహేను బాణాలతో అర్జునుడినీ, మూటితో శ్రీకృష్ణుడినీ వేశాడు. అర్జునుడు రెండు బాణాలతో అతడిని పడగొట్టాడు. వెంటనే ఆ రాజు మూడు వాడిబాణాలతో అర్జునుడిని నొప్పించాడు. సింహనాదం కూడా చేశాడు. అంత అర్జునుడు కోపంతో పదునాలుగు బాణాలతో అతడి సారథిని, గుర్రాలనూ, వింటినీ, పతాకాన్నీ పడగొట్టాడు. తీవ్రమైన వాడిబాణంతో గుండె పగుల కొట్టాడు. ఆ పెనుదెబ్బ తాకిడికి పెనుగాలి వేగానికి నేలకూలే పెద్ద చెట్టువలె కాంభోజరాజు సుదక్షిణుడు దొర్లుతూ క్రింద పడ్డాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **ఇట్లు కాంభోజపతి వడుటయు శూరసేన శిబి వసాతి ప్రముఖానేకదేశంబుల బలంబు లబ్బలమర్దననందనుం జుట్టుముట్టిన, నతండు దఱచు వాలంపగముల నాఱువేల రథంబుల రూపుమాపినం, గనుకనిం దెరలినం గని శ్రుతాయువు నయుతాయువును గాండీవి రెండు గెలంకుల సాయక సహస్రంబులు నిగిడించుచుం గవిసి; రప్పుడు శ్రుతాయువు చేతి తోమరంబున నొచ్చిన వ్వివ్వచ్చుం బిడుగు వడిన వానిం గొఱవిఁ జూడిన తెఱంగున నయుతాయువు నాలోనన శూలంబు వైచి సోలంజేసిన విషాదంబున గరుడధ్వజుండు సొగయ నా కపిధ్వజుండు నిజధ్వజదండం బొక్కింత యూఁతగొనిన నక్కురు సైన్యంబుల సింహనాదంబులుం దూర్య నినదంబులుం జెలంగె; నంత శౌరి ప్రబోధింపం దేటి ధనంజయుం డైంద్రాస్త్రంబు ప్రయోగించుటయు, నది వివిధాయుధాకారంబులం గవిసి నయ్యిరువుర హస్తమస్తక శకలంబులు ధరం దొరంగించి తదనుచరులం బంచశతరథిక వీరయోధుల వధియించి చూపఱకు విస్మయం బాపాదింప నిలింపపతిసుతుండు దటిమికొని పోవు తఱి నయ్యిద్దఱ కొడుకులు నియుతాయువు దీర్ఘాయువును శోకవేగంబున నరవాయి గొనక పయింబడిన నుద్దవిడి గవ్వడి వారలం దండ్రులం గూడ ననిచి మహార్ణవంబు గలంచు మందరంబు చందంబున నీ బలంబులం దిరుగుడువడం జేయుచు నురవడించు సమయంబున. 96**

**ప్రతిపదార్థం:** ఇట్లు కాంభోజపతి పడుటయున్= ఈ విధంగా కాంభోజరాజు చనిపోగా; శూరసేన; శిబి, వసాతి; ప్రముఖ= మొదలైన; అనేకదేశంబుల= నానాదేశాల; బలంబులు= సైన్యాలు; ఆ+బలమర్దన నందనున్+చుట్టుముట్టిన= ఆ అర్జునుడిని క్రమ్ముకొనగా; అతండు= ఆ అర్జునుడు; తఱచు= దట్టమైన; వాలు+అంపగములన్= వాడి అయిన బాణసమూహంతో; ఆఱువేల రథంబులన్; రూపుమాపినన్= నాశనంచేయగా; కనుకనిన్= సంభ్రమంతో (తొందరగా); తెరలినన్= తొలగిపోగా; కని= చూచి; శ్రుతాయువు, అయుతాయువును= ఈ పేర్లున్న వారిద్దరూ; సాయక సహస్రంబులు నిగుడించుచున్= వేల బాణాలను గుప్పిస్తూ; గాండీవి=

అర్జునుడి; రెండు కెలంకులన్= రెండు ప్రక్కలనూ; కవిసిరి= కమ్ముకొన్నారు; అప్పుడు= ఆ సమయంలో; శ్రుతాయువు= శ్రుతాయువు; చేతి తోమరంబునన్= చేతిలో ఉన్న తోమరమనే ఆయుధంతో; నొచ్చిన= బాధితుడైన; విప్వచ్చున్= అర్జునుడిని; పిడుగు పడినవానిన్= పిడుగు నెత్తిన పడ్డవాడిని; కొఱవిన్+చూడిన తెఱంగునన్= కొరవితో కాల్చినట్లుగా; అయుతాయువు= అయుతాయువు; ఆలోనన= అంతలోనే; శూలంబు వైచి= శూలాన్ని వేసి; సోలన్+చేసిన= సొమ్మసిల్లచేయగా; విషాదంబునన్= దుఃఖంతో; గరుడధ్వజుండు= శ్రీకృష్ణుడు; సొగయన్= మూర్ఛిల్లగా; ఆ కపిధ్వజుండు= ఆ అర్జునుడు; నిజధ్వజదండంబు= తన జెండా కొయ్యను; ఒక్కింత ఊఁతగొనినన్= కొంత ఆధారంగా నిలువగా; ఆ+కురు సైన్యంబుల= ఆ కురుసేనలయొక్క; సింహనాదంబులు = సింహనాదాలు; తూర్యనినదంబులు చెలంగెన్= తూర్య శబ్దాలు ఒప్పాయి; అంతన్= అంతలో; శౌరి= కృష్ణుడు; ప్రబోధింపన్= మేల్కొలుపగా (అనగా ప్రేరేపించగా); తేఱి= తెప్పరిల్లి; ధనంజయుండు= అర్జునుడు; ఐంద్రాస్త్రంబు ప్రయోగించుటయున్= ఇంద్రదేవతాకమైన బాణాన్ని వేయగా; అది= ఆ అస్త్రం; వివిధ+ఆయుధ+ఆకారంబులన్+కవిసి= అనేకాయుధాల రూపాలలో(వచ్చి) క్రమ్ముకొని; ఆ+ఇరువురన్= ఆ శ్రుతాయువు, అయుతాయువులయొక్క; హస్త మస్తక శకలంబులు= చేతుల, శిరస్సుల, ముక్కలను; ధరన్+తొరంగించి= భూమిమీద దొర్లించి; తద్+అనుచరులన్= వారిని అనుసరించే వారిని; పంచశతరథిక వీరయోధులన్= అయిదు వందల రథవీరులను; వధియించి= చంపి; చూపఱకున్= చూచేవారికి; విస్మయంబు+ఆపాదింపన్= ఆశ్చర్యం కలిగించగా; నిలింపపతి సుతుండు= దేవరాజకుమారుడు (అర్జునుడు); తఱిమికొనిపోవుతఱిన్= తరిమికొనిపోయ్యేటప్పుడు; ఆ+ఇద్దఱకొడుకులు= ఆ ఇద్దరి కుమారులు; నియుతాయువు దీర్ఘాయువు= అను పేర్లున్న వారు; శోకవేగంబునన్= దుఃఖంవలన కలిగిన తొందరలో; అరవాయిగొనక= సందేహించక; పయిబడినన్= తనమీద పడగా; ఉద్దవిడిన్= ఎక్కువగా; కవ్వడి= అర్జునుడు; వారలన్= ఆ ఇద్దరి నీ; తండ్రులన్+కూడన్= తండ్రులను చేరగా; అనిచి= పంపి (అనగా చంపి); మహార్ణవంబున్= పెనుసంద్రాన్ని; కలచు= కలియబెట్టే; మందరంబు చందంబునన్= మందరపర్వతం మాదిరి; నీ బలంబులన్= నీ సైన్యాన్ని (కురుసేనను); తిరుగుడువడన్= కలగునట్లు; చేయుచున్= చేస్తూ; ఉరవడించు సమయంబునన్= దూకే వేళలో.

**తాత్పర్యం:** కాంభోజరాజు పడిపోగా, శూరసేన, శిబి, వసాతి మొదలైనవారు అర్జునుడిని చుట్టుముట్టారు. ఆతడు తన అంపవానతో వారి ఆరువేల రథాలను హతమార్చాడు. దానిని చూచి శ్రుతాయువు, అయుతాయువు అర్జునుడికి రెండు ప్రక్కలా చేరి, వేల సంఖ్యలో బాణాలు వేసి అతడిని నొప్పించారు. శ్రుతాయువు ప్రయోగించిన తోమరంతో బాధితుడైన అర్జునుడిని, పిడుగునెత్తిన పడినవాడిని కొరివితో కాల్చినట్లు, అయుతాయువు శూలాన్ని విసిరి సొమ్మసిల్లచేశాడు. అది చూచి కృష్ణుడు కూడ సొమ్మసిల్లాడు. అర్జునుడు తన జెండా కొయ్యను ఊఁతగా గొనగా కురు సైన్యాల సింహనాదాలు, వాద్యధ్వనులు చెలరేగాయి, అప్పుడు శ్రీకృష్ణుడు ప్రబోధింపగా అర్జునుడు తెప్ప రిల్లుకొని ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. అది వివిధాయుధ ఆకారాలతో విజృంభించి శ్రుతాయు అయుతాయువుల చేతులను తలలను ముక్కలు చేసి నేలమీద దొర్లించి, వారి అనుచరులను అయిదువందలమంది రథవీరులను వధించి, చూచేవారికి ఆశ్చర్యం కలిగిస్తూ ఉండగా, శ్రుతాయు అయుతాయువుల సుతులు నియతాయు దీర్ఘాయువులు శోకక్రోధాలతో అర్జునుడి మీదికి విజృంభించారు. అర్జునుడు వీరితండ్రుల దగ్గరికే వీళ్లను కూడ పంపాడు(చంపాడు). మహా సముద్రాన్ని కలచివేసే మందర పర్వతం వలె, నీ సైన్యాన్ని కలత నొందిస్తూ విజృంభించిన సమయంలో

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ.** **కురునరేశ్వరుండు పురికొల్పఁ బ్రాచ్యక । ళింగ దాక్షిణాత్య్యులంగబలము**
**మ్లేచ్ఛతతియు బెరయ మెయికొని తాఁకిరి । గజఘటాసమృద్ధిఁ గారుకొనుచు.** 97

**ప్రతిపదార్థం:** కురునర+ఈశ్వరుండు= దుర్యోధనుడు; పురికొల్పన్= ప్రేరేపించగా; ప్రాచ్య, కళింగ, దాక్షిణ్యాతులు= తూర్పుదిక్కులోని కళింగులూ, దక్షిణ దిక్కులోని సైన్యాలూ; మ్లేచ్ఛతతియున్= ఆటవికుల సమూహమూ; బెరయన్= కూడగా; మెయికొని= విజృంభించి; గజఘటాసమృద్ధిన్= ఏనుగుల గుంపు ఎక్కువగా; కారుకొనుచున్= క్రమ్ముకొంటూ; తాఁకిరి=ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పురికొల్పగా తూర్పున ఉన్న కాళింగులూ, దక్షిణదిక్కులోని అంగబలాలూ, ఆటవికుల గుంపూ కలిసి విజృంభించి, ఏనుగుల సమూహంతో అర్జునుడిని కమ్ముకొన్నారు.

**వ. అట్టియెడ గాండీవ ముక్త మార్గణవర్గంబు వేగంబున. 98**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడ= ఆ సమయంలో; గాండీవ= గాండీవమునుండి; ముక్త=విడువబడిన;మార్గణ, వర్గంబు= బాణసమూహము యొక్క; వేగంబునన్= వేగము వలన

**తాత్పర్యం:** ఆ సమయంలో గాండీవం వదలిన బాణసమూహవేగముచేత. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. చేతులుఁ దొండములు శిరో । వ్రాతముఁ గుంభస్థలములు వడిఁ దొరఁగె ధరి**
**త్రీతలమున నంకుశ బహు । హేతి శకల సహితముగ మహీవరముఖ్యా! 99**

**ప్రతిపదార్థం:** మహీవర ముఖ్యా!= ఓ రాజశ్రేష్ఠా!; చేతులున్= చేతులును; తొండములున్= తొండాలును; శిరోవ్రాతమున్= తలల మొత్తాలు; కుంభస్థలములున్= కుంభస్థలాలు; ధరిత్రీ తలమునన్= భూమి మీద; అంకుశ= అంకుశాలతో; బహుహేతి= అనేకములైన కత్తుల; శకల సహితముగన్= ముక్కలతో కూడా; వడిన్+తొరఁగెన్= శీఘ్రంగా దొర్లాయి.

**తాత్పర్యం:** ఓ రాజా! చేతులూ, తొండాలూ, తలల సమూహాలు, కుంభస్థలాలూ అంకుశాలతో, కత్తుల ముక్కలతో సహా భూమిమీద దొర్లాయి.

**తే. ఇవ్విధంబున నుఱుమాడ నీడఁ బోక । యవనపారద శక బర్బరాదు లైన**
**మ్లేచ్ఛబలములు ధైర్యంబు మిక్కుటముగఁ । బొదివి పోరెను గ్రీడి యద్భుతము నొంద. 100**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; నుఱుమాడన్= చంపగా; ఈడఁబోక= వెనుకంజ వేయకుండా; యవనపారద శక బర్బర+ఆదులు+ఐన= ఈ మున్నగు జాతులవారు; మ్లేచ్ఛబలములు= ఆటవికుల సైన్యాలు; ధైర్యంబు మిక్కుటముగన్= ధైర్యం ఎక్కువ కాగా; క్రీడి= అర్జునుడు; అద్భుతమున్+ఒందన్= ఆశ్చర్యపడగా; పొదివి= క్రమ్ముకొని; పోరెను= యుద్ధం చేశాయి.

**తాత్పర్యం:** యవనులు, పారదులు, శకులు మొదలైన ఆటవికుల సేనలు ఒక్కటిగా చేరి, అర్జునుడు తమవారిని చంపుతున్నా వెనుకంజ వేయకుండా, అత డాశ్చర్యపడేటట్లు యుద్ధం చేశాయి.

**క. తుంగమడువుఁ జొచ్చిన మా । తంగమునకు మిగిలి యడవి దరికొను కార్చి**
**చ్చుం గడచి యబ్బలంబుల । భంగించె నతండు ఘోర బహు విధ గతులన్. 101**

**ప్రతిపదార్థం:** అతండు= అర్జునుడు; తుంగమడువున్+చొచ్చిన= తుంగతోనిండి ఉండే మడుగులో దూకిన; మాతంగమునకున్ మిగిలి= మదపుటేనుగును అతిశయించి; అడవిన్= అడవిని; దరికొను= కాల్చే; కార్చిచ్చున్= దావాగ్నిని; కడచి= మీరి; ఆ+బలంబులన్= ఆ సైన్యాలను; ఘోర బహువిధ గతులన్= భయంకరమైన అనేక విధాలుగా; భంగించెన్= భంగపరచాడు.

**తాత్పర్యం:** తుంగతో నిండిన మడుగులోకి దూకిన మదపుటేనుగు చేష్టను మించేటట్లుగా, అడవిని కాల్చే దావాగ్నిని అతిశయించేటట్లుగా అర్జునుడు ఆ సైన్యాన్ని భంగపరచాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు నారాయణ మారుత ప్రేరితంబగు నరజ్వలనంబు శరజ్వాలాజాలంబున భవత్సేనాకాననంబు రూపుమాపె; నప్పుడు. 102**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నారాయణ మారుత ప్రేరితంబు+అగు= నారాయణుడనే వాయువు చేత ప్రేరేపించబడిన; నరజ్వలనంబు= అర్జునుడనే అగ్ని; శరజ్వాలాజాలంబునన్= తన బాణా లనే అగ్నిజ్వాలా సమూహంతో; భవత్+సేనా కాననంబున్= నీ సేన అనే అడవిని; రూపుమాపెన్= హతమార్చింది; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** నారాయణుడనే గాలిచేత ప్రేరేపించబడిన అర్జును డనే అగ్ని తన బాణాలనే జ్వాలలతో నీ సైన్యమనే అడవిని కాల్చి రూపుమాపింది. ఆ సమయంలో.

**విశేషం:** అలం: రూపకం.

**తే.** **అర్జునుం డను పర్జన్యు నస్త్ర వృష్టిఁ। బల్లమును మిట్టునని యేఱుపఱుపరాక**
**యుండ నెత్తురు వెల్లు లొండొండ పెరిఁగె। నుబ్బి భూతబేతాళంబు లోలలాడ.** **103**

**ప్రతిపదార్థం:** అర్జునుండు+అను వర్జన్యు= అర్జునుడనే మేఘంయొక్క; అస్త్రవృష్టిన్= బాణవర్షంతో; పల్లమును మిట్టును+అని= ఇది పల్లం, ఇది మిట్ట అని; ఏఱుపఱుప రాకన్= వేరుచేయలేక; ఉండన్= ఉండగా; నెత్తురు వెల్లులు= నెత్తురు వెల్లువలు; (వానిలో); భూతబేతాళంబులు= భూతప్రేతాలు; ఉబ్బి= చెలరేగి; ఓలలాడన్= ఈదులాడగా; ఒండొండ పెరిగెన్= క్రమంగా పెరిగింది.

**తాత్పర్యం:** అర్జునుడనే మేఘం కురిసిన బాణవర్షంచేత మిట్టపల్లాలను వేరుచేయలేని స్థితి ఏర్పడింది. (ఆ బాణాల తాకిడికి) నెత్తురు వెల్లువలై పారింది. లోతైన నెత్తురుటేరులలో భూతబేతాళాలు ఓలలాడాయి.

**విశేషం:** అలం: రూపకం.

**వ.** **ఇమ్మెయి నద్భుత విక్రమంబున నతిక్రమించి కడంగు కవ్వడి నంబష్ఠపతి యగు శ్రుతాయువు మార్కొని నొగ నొగం దాఁక నరదంబు వఱపుటయు.** **104**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ ప్రకారం; అద్భుత విక్రమంబునన్= ఆశ్చర్యాన్ని కలిగించే శౌర్యంతో; అతిక్రమించి= దాటి; కడంగు కవ్వడిన్= ఉద్యమించే అర్జునుడిని; అంబష్ఠపతి అగు శ్రుతాయువు= అంబష్ఠ దేశరాజయిన శ్రుతాయువు; మార్కొని= ఎదుర్కొని; నొగనొగన్ తాఁకన్= (తనతేరు) కాడి కాడిని (అర్జునుడి తేరుకాడిని) తాకేటట్లుగా; అరదంబు పఱపుటయున్= తేరును తోలటమూ.

**తాత్పర్యం:** ఆశ్చర్యాన్ని కలిగించే శౌర్యంతో అర్జునుడు ముందుకు పోగా అంబష్ఠదేశరాజు శ్రుతాయువు ఎదుర్కొని (తనతేరు) నొగ (క్రీడితేరు) నొగను తాకేటట్లు తన తేరును తోలగా.

**చ.** **అతని శరాసనంబును హయంబులఁ ద్రుంచిన నాశ్రుతాయు వు**
**ద్ధృతగద నొప్పఁ బట్టి దనుజాంతకు వ్రేసె నరుండు దద్గదా**
**హతి యొనరించె నొండుగద నాతఁడు వెండియు విక్రమించినన్**
**శతమఖసూతి యాతని భుజంబులుఁ గంఠముఁ ద్రుంచె వ్రేల్మిడిన్.** **105**

**ప్రతిపదార్థం:** అతని శరాసనంబును= ఆ శ్రుతాయువు విల్లును; హయంబులన్= గుర్రాలను; త్రుంచినన్= చంపగా; ఆ శ్రుతాయువు; ఉద్ధృతగదన్= పైకెత్తిన గదను; ఒప్పన్+పట్టి= బాగా పట్టుకొని; దనుజాంతకున్ వ్రేసెన్= శ్రీకృష్ణుడిని కొట్టాడు; నరుండు= అర్జునుడు; తద్+గదా హతి ఒనరించెన్= అతడి గదను త్రుంచాడు; ఆతఁడు= ఆ శ్రుతాయువు; వెండియున్= మరలా; విక్రమించినన్= విజృంభించగా; శతమఖసూతి= (నూరు యజ్ఞాలు చేసిన ఇంద్రుడి కుమారుడైన) అర్జునుడు; వ్రేల్మిడిన్= చిటికవేసే కాలంలో; ఆతని= ఆ శ్రుతాయువుయొక్క; భుజంబులున్= చేతులు; కంఠమున్= గొంతును; త్రుంచెన్= త్రుంచివేశాడు.

**తాత్పర్యం:** ఆ శ్రుతాయువు వింటినీ గుర్రాలనూ అర్జునుడు చంపాడు. అంత శ్రుతాయువు గదతో శ్రీకృష్ణుడిని కొట్టాడు. ఆ గదను అర్జునుడు త్రుంచాడు. ఆ శ్రుతాయువు మళ్ళీ విజృంభించాడు. అర్జునుడు (చిటికె) వేసే లోపల అతడి చేతులనూ, గొంతునూ త్రుంచివేశాడు.

**వ. ఇత్తెఱంగున ద్రోణాచార్యుం గడచి కృతవర్మని బెట్టుపటిచి, శ్రుతాయుధునిం గూల్చి, కాంభోజపతిం బడవైచి శ్రుతాయుః ప్రభృతుల నులిపి తతిమి భవదీయ సైన్యంబు సొచ్చి బహువిధ యోధ ప్రాణంబుల బాణనాళంబులం బీల్చి కొనుచుం బెలుచ నడరు ఫల్గునుం గనుంగొని నీ కొడుకు దేరు దోలుకొని యొంటిమై నక్కుంభసంభవు కడకుం జని కటకటంబడుచు నతని కిట్లనియె. 106**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ద్రోణాచార్యున్+కడచి= ద్రోణాచార్యుడిని దాటి; కృతవర్మని; బెట్టుపటిచి= గట్టిగా పడవేసి; శ్రుతాయుధునిన్+కూల్చి= శ్రుతాయుధుడిని చంపి; కాంభోజపతిన్+పడవైచి= కాంభోజరాజును పడగొట్టి; శ్రుతాయుః ప్రభృతులను= శ్రుతాయువు మొదలైన వారిని; నులిపి తతిమి= చెదరగొట్టి; భవదీయ సైన్యంబున్= నీ సేనలోకి; చొచ్చి= దూరి; బహువిధయోధ ప్రాణంబులన్= చాలామంది వీరుల ప్రాణాలను; బాణనాళంబునన్= బాణనాళాలతో; పీల్చికొనుచున్= పీల్చివేస్తూ; పెలుచన్+అడరు= దండిగా విజృంభించే; ఫల్గునున్+కనుంగొని= అర్జునుడిని చూచి; నీ కొడుకు= (దుర్యోధనుడు) నీ కుమారుడు; తేరుతోలుకొని= తన తేరును తోలుకొంటూ; ఒంటిమైన్= ఒకడే; ఆ+కుంభసంభవు కడకున్= ఆ ద్రోణాచార్యుడి దగ్గరకు; చని= వెళ్ళి; కటకటంబడుచున్= కష్టపడుతూ; అతనికిన్= ద్రోణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు ద్రోణాచార్యుడిని దాటుకొని కృతవర్మను తీవ్రంగా బాధించాడు. శ్రుతాయువును చంపాడు. కాంభోజపతిని పడగొట్టాడు. శ్రుతాయువు మొదలైన వారిని నలియగొట్టాడు, తరిమాడు. నీ సేనలోకి దూరి తన బాణాలతో చాలా మంది ప్రాణాలను పీల్చివేసి విజృంభిస్తూ ఉంటే, అర్జునుడిని చూచిన నీ కొడుకు తన తేరును తోలుకొంటూ ద్రోణుడి దగ్గరకుపోయి మనస్సునొచ్చుకొని ఇట్లా అన్నాడు.

## దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట (సం. 7-69-1)

**చ. 'నిను నవలీల దాఁటి ప్రజ నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్న య**
**ర్జునుఁ దలయెత్తి యైన నటు సూడవు పాండవపక్షపాతి నీ**
**మన మటు గాన నెప్పుడును మాదెసఁ గప్ప యెలుంగుఁ బాము వై**
**యునికి యెఱుంగ వచ్చె; నటు లూఱట గా వర మిచ్చినాఁడవో? 107**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; అవలీలన్= సులభంగా; దాఁటి= తప్పుకొని; ప్రజన్ నేలకున్ కోలకున్+తెచ్చుచున్న= సైనికులను కిందామీద చేస్తున్న; అర్జునున్= అర్జునుడిని; తలఎత్తి ఐనన్+అటుచూడవు= ఆ ప్రక్కకు తలయెత్తికూడా చూడకున్నావు; నీ మనము= నీ మనస్సు; పాండవ పక్షపాతి= పాండవులమీద పక్షపాతం కలిగింది; అటుగానన్= నీ మనస్సట్లా ఉన్నది కాబట్టి; ఎప్పుడును= అన్ని సమయాలలో; మాదెసన్= మా మీద; కప్పఎలుంగుపామవై= కప్పగొంతుతో అరిచే పాముగా; ఉనికి= ఉండటం; ఎఱుంగవచ్చెన్= తెలియవచ్చింది; అటులు= ఆ విధంగా; ఊఱటగాన్= సహాయంగా (అంటే పాండవులకు సాయంగా); వరము+ఇచ్చినాఁడవో?= వరమిచ్చావా?

**తాత్పర్యం:** నిన్ను సులభంగా దాటి సైన్యాన్ని తల్లక్రిందులు చేస్తూ ఉన్న అర్జునుడి దిక్కు నీవు తలఎత్తి అయినా చూడటంలేదు. నీ మనసెప్పుడూ పాండవ పక్షపాతియే. మా వైపు కప్పగొంతుతో అరిచే పాము వలె ఉండే నీ తత్త్వం తెలిసింది. ఆ దిక్కున ఉండేవారికి ఊరటగా నీవు వరమిచ్చినట్లుగా ఉన్నదే!

**విశేషం:** దుర్యోధనుడు - విజృంభించి తన సైన్యాన్ని నాశనంచేస్తూ ఉన్న అర్జునుడిని ఎదుర్కొనకుండా ద్రోణాచార్యుడుపాండవపక్ష పాతిగా ఉన్నాడని ఆయనను దెప్పుడు మాటలతో ఎత్తిపొడుస్తున్నాడు. కాబట్టే కప్పగొంతుతో ఉండే పామని ఆయనను అన్నాడు.

**క. నిను నమ్మి యొండువలనికిఁ । జనక జయద్రథుఁడు నిలిచె సైన్యములో నా**
**తనిఁ జంపెడు తేనియపూ । సినకత్తివి గాక మానిసివె? యూహింపన్'. 108**

**ప్రతిపదార్థం:** నినున్ నమ్మి= నిన్ను నమ్ముకొని; జయద్రథుఁడు= సైంధవుడు; ఒండువలనికిన్= ఇంకొకచోటికి; చనక= వెళ్ళకుండా; నిలిచెన్= నిలిచాడు; సైన్యములోన్= మన సైన్యంలో; ఆతనిన్= ఆ సైంధవుడిని; చంపెడు= చంపునటువంటి; తేనియ పూసిన కత్తివి గాక= తేనెపూసిన కత్తి మాదిరి వాడవు కాకుండా; (నీవు) మానిసివె?= మనుష్యుడవా?

**తాత్పర్యం:** సైంధవుడు నిన్ను నమ్మాడు. ఇంకో చోటికి పోకుండా నిలిచాడు. నీవు తేనెపూసిన కత్తిలాగా అతడిని చంపే మనసుతో ఉన్నావు. ఊహిస్తే నీవు మనిషివేనా?' (అని తోస్తూ ఉన్నది)

**విశేషం:** తన పక్షంలో ఉంటూ ద్రోణుడు తేనెపూసిన కత్తి మాదిరి ఉన్నాడని తిరస్కరిస్తూ మాటాడినాడు దుర్యోధనుడు.

**వ. అని పలికి కార్యదాహంబునం జేసి తన రాజసం బడంచుకొని యతండు. 109**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని అంటూ; కార్యదాహంబునన్+చేసి= పనియందలి ఆశతో; తన= తనయొక్క; రాజసంబు= రజోగుణం వలన ఏర్పడే అహంకారమును; అడంచుకొని= అణచుకొని; అతండు= ఆ దుర్యోధనుడు

**తాత్పర్యం:** అని మాట్లాడి, పనిమీద ఆశతో తన కుండే అహంకారాన్ని అణగించుకొన్నాడు దుర్యోధనుడు.

**తే. సైంధవున కడ్డమున్న రాజవ్రజంబు । పార్థు రాకకు వెలువెలఁ బాఱఁ జొచ్చె!**
**నార్తిఁ బలుకు నా మాటల కలుగ కకట! । చావకుండంగ నాతనిఁ గావవయ్య! 110**

**ప్రతిప్రదార్థం:** సైంధవునకున్= సైంధవుడికి; అడ్డము+ఉన్న= (కాపుగా) అడ్డముండే; రాజవ్రజంబు= రాజుల సమూహం; పార్థురాకకున్= అర్జునుడు వచ్చే విధానానికి; వెలువెలన్+పాఱజొచ్చెన్= తెల్లపోతున్నారు; ఆర్తిన్= బాధతో; పలుకు= చెప్పే; నా మాటలకున్= నా పలుకులకు; అలుఁగకు= కోపపడకు; అకట!= అయ్యో!; చావక+ఉండన్= చావకుండా ఉండేటట్లు; ఆతనిన్= సైంధవుని; కావవయ్య!= రక్షించుమయ్యా!

**తాత్పర్యం:** సైంధవుడికి రక్షగా ఉండే రాజులు, అర్జునుడు చొచ్చుకువచ్చే తీరుకు వెలవెలపోతున్నారు. బాధతో మాట్లాడే నా మాటలకు అలుగవద్దు. సైంధవుడు చావకుండా ఉండేటట్లు అతడిని కాపాడు.

**వ. అనిన విని యాచార్యుం డతని కి ట్లనియె. 111**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; విని= విని; ఆచార్యుండు= ద్రోణుడు; అతనికిన్= ఆ దుర్యోధనుడికి; ఇట్లు+అనియెన్= ఈవిధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాటలకు ద్రోణాచార్యు డీ విధంగా అన్నాడు.

**క. 'నీ మాటకు మా యశ్వ । త్థామ వచనములకు నేఁ బదరుదునె? విను మా**
**దామోదరు మతి ముంగలి । గా మారుతవేగ ఘోటకస్ఫురణ మెయిన్. 112**

**ప్రతిపదార్థం:** నీ మాటకున్= నీ పలుకుకూ; మా అశ్వత్థామ వచనములకున్= మా అశ్వత్థామ మాటలకూ (దుర్యోధనుడినీ అశ్వత్థామనూ ద్రోణుడు పుత్రవాత్సల్యంతో చూచాడు); నేన్= నేను; పదరుదునె?= కోపిస్తానా?; వినుము; ఆ దామోదరుమతి= ఆ శ్రీకృష్ణుడి తలపుకంటె; ముంగలిగాన్= ముందుగా; మారుతవేగ= గాలియొక్క వేగంకల; ఘోటక= గుర్రాలయొక్క; స్ఫురణ మెయిన్= స్ఫూర్తితో.

**తాత్పర్యం:** (ఓ సుయోధనా!) నీ మాటకూ అశ్వత్థామ మాటకూ నేను కోపిస్తానా? నా మాటవినుము. ఆ కృష్ణుడి తలపు ముందుపోగా వాయువేగంకల గుర్రాల యొక్క స్ఫూర్తితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. చనునప్పు డతని యమ్ములు । వెనుకఁ బ్రజం దాఁకుచుండు వివ్వచ్చుని నేఁ**
**జననీక యాఁగువాఁడనె? । కనికని యిటు లేల పలుకఁ గౌరవనాథా! 113**

**ప్రతిపదార్థం:** చనునప్పుడు= పోయేటప్పుడు (వేగంతో); అతని అమ్ములు= ఆ అర్జునుడి బాణాలు; వెనుక ప్రజం= వెనుక ఉండే సైన్యాన్ని; తాకుచుండు= తాకుతూ ఉంటాయి (అటువంటప్పుడు); విన్వచ్చుని= బీభత్సుడిని (అర్జునుడిని); నే జననీక= నేను ముందుకు పోనియ్యకుండా; ఆగువాఁడనె?= ఆపేవాడినా? కనికని= చూస్తూ చూస్తూ; కౌరవనాథా!= కురురాజా!; ఇటులు+పలుకన్+ఏల?= ఈ విధంగా ఎందుకు మాట్లాడుతావు?

**తాత్పర్యం:** (అర్జునుడు ఆ విధంగా) పోయేటప్పుడు, ఆతడి బాణాలు వెనుక ఉండే సైన్యాన్ని తాకుతూ ఉంటాయి. అటువంటి సమయంలో బీభత్సుడిని ముందుకు పోనీకుండా నే నాపగలనా? దుర్యోధనా! చూస్తూ చూస్తూ నీవు ఈ విధంగా మాట్లాడటం ఎందుకు?

**విశేషం:** ఇందులో అర్జునుడి రథవేగంయొక్క అతిశయం వర్ణించబడింది. బాణాలకంటె ముందుగా రథం పోతున్నదని భావం.

**వ.** **అది యట్లుండె; నొకహితంబు సెప్పెద నాకర్ణింపుము; సేనాముఖంబు విడిచి యే నర్జును వెనుకం బోయినం బాండవ బలంబు లురులం దోఁ తెంచు మనయొడ్డు గలంగిన సైంధవుం గాచు టరిది; యట్లుంగాక రాజమధ్యంబున ధర్మరాజుం బట్టెద' నని యాడిన 'నాకు నప్పని యేమఱందగునే యతనిన వేచి నిలిచెద; విశేషించి వృద్ధ నగుటంజేసి శీఘ్రయానం బశక్యంబయి యుండు; గాండీవియు నీవును దుల్యవయో వర్తనులరు; శంక లేక వానితో విరోధంబు గొన్నవాఁడవు తగు సహాయులం గూర్చికొని యడ్డపడుము; చయ్యనం జను' మని పలికిన నతండు.** **114**

**ప్రతిపదార్థం:** అది అట్లుండెన్= అది అట్లుండనీ; ఒక్క హితంబు చెప్పెదన్= ఒక మంచి మాట చెప్పుతున్నాను; ఆకర్ణింపుము= వినుము; సేనాముఖంబు విడిచి= సేన మొదలు వదిలి; ఏన్= నేను; అర్జును వెనుకన్+పోయినన్= అర్జునుడి వెనుక పోతే; పాండవ బలంబులు= పాండవ సైన్యాలు; ఉరులన్+తోఁతెంచున్= ఉర్లపడుతూ వస్తాయి; మన ఒడ్డు కలంగినన్= మన వ్యూహం చెదరిపోతే; సైంధవున్+కాచుట+అరిది= సైంధవుడిని కాపాడటం సాధ్యం కాదు; అట్లున్+కాక= ఆ విధంగా కాకుండా; రాజమధ్యంబునన్= రాజుల మధ్యలో; ధర్మరాజున్+పట్టెదను+అని= ధర్మరాజును బందీ చేస్తానని; ఆడిన నాకున్= ప్రతిజ్ఞ చేసిన నాకు; ఆ+పని ఏమఱన్+తగునే?= ఆ పనిని మరిచిపోవచ్చునా?; అతనిన= అతడినే (ఆ ధర్మరాజునే); వేచి నిలిచెదన్= కాచుకొని ఉంటాను; విశేషించి= మీదు మిక్కిలి; వృద్ధను+అగుటన్+చేసి= ముసలివాడను కావటంవలన; శీఘ్రయానంబు= వేగంగా నడపటం; అశక్యంబు+అయి ఉండున్= అసాధ్యంగా ఉన్నది; గాండీవియున్= అర్జునుడూ; నీవును= నీవునూ (దుర్యోధనుడూ); తుల్యవయోవర్తునులరు= సమానమైన వయస్సు, నడవడీ కలవారు; శంక లేక= అనుమానించకుండా; వానితోన్= అర్జునుడితో; విరోధంబు కొన్నవాఁడవు= పగ తెచ్చుకొన్నవాడవు; తగు సహాయులన్ కూర్చికొని= తగిన సహాయకులను ఏర్పాటు చేసికొని, అడ్డుపడుము= (అర్జునుని) అడ్డుకొనుము; చయ్యనన్ చనుము= వెంటనే వెళ్ళుము; అని పలికినన్= అని మాట్లాడగా; అతండు= ఆ దుర్యోధనుడు.

**తాత్పర్యం:** 'దానిని అట్లా ఉండనీ. ఒక మేలి మాట చెప్పుతాను విను. సేన మొదట అర్జునుడి వెనుకపోతే పాండవ సైన్యం విజృంభించి వస్తుంది. మనసైన్యం కలకబారితే సైంధవుడిని కాపాడటం సాధ్యంకాదు. అంతేకాక రాజసభామధ్యంలో ధర్మరాజును బంధిస్తానని చెప్పాను. ఆ పని మరువ తగునా? పైగా, నేనా ముసలివాడిని; త్వరగా నడవలేనివాడిని. అర్జునుడూ నీవూ సమానమైన వయసులో ఉన్నవారు, సందేహించక అతడితో వైరం తెచ్చుకొన్నావు. తగినవారి సహాయంతో అతడి దారికి అడ్డుపడుము. త్వరగా పొమ్ము.' అని ద్రోణుడు చెప్పగా విని దుర్యోధనుడు.

**చ.** **'నినుఁ గృతవర్మ గెల్చి యవనీపవర ప్రకరంబు నోర్చి పే**
**ర్చిన నరు నేన కాదు సురసేనయు నింద్రుఁడు నైనఁ దాఁక నే**
**ర్చునె? యది కార్యతంత్రముగఁ జూచిత యేని భవన్నియోగమున్**
**గొనకొని చేసెదన్ యశము గోల్పడకుండఁగఁ జూడు మెమ్మెయిన్'.** **115**

**ప్రతిపదార్థం:** నినున్= నిన్ను; కృతవర్మన్ గెల్చి= కృతవర్మనూ గెల్చి; అవనీప వర ప్రకరంబున్= రాజశ్రేష్ఠుల సమూహాన్ని; ఓర్చి= ఓడించి; పేర్చిన= విజృంభించిన; నరున్= అర్జునుడిని; నేను+అ కాదు= నేనే కాదు; సురసేనయున్= దేవసేనా; ఇంద్రుఁడునైనన్= ఇంద్రుడు అయినా; తాఁక నేర్చునే?= ఎదురుకొనగలరా?; అది= ఆ విధంగా ఎదుర్కొనటం; కార్యతంత్రముగన్= పనిగా; చూచిత ఏని= చూచినట్లైతే; భవత్+నియోగమున్= నీ ఉత్తర్వును; గొనగొని= ప్రయత్నంతో; చేసెదన్= చేస్తాను; ఏ+మెయిన్= ఎట్టయినా; యశము= కీర్తిని; కోల్పడకుండన్= పోగొట్టుకొనకుండా; చూడుము.

**తాత్పర్యం:** 'నిన్ను కృతవర్మనూ గెలిచి, ప్రముఖులైన రాజులనందరినీ ఓడించి విజృంభిస్తూ ఉండే అర్జునుడిని నేనే కాదు - దేవతా సైన్యంతో ఇంద్రుడు కూడా ఎదుర్కొనలేడు. అర్జునుడిని ఎదుర్కొనటమే కార్యోపాయంగా నీవు భావించినట్లయితే నీ ఆజ్ఞ ప్రకారం తప్పకుండా అట్లే చేస్తాను. కాని, ఏ విధంగానైన కీర్తి కోల్పోకుండా చూడు.

**వ. అనుటయు నగ్గురుం డక్కురుపతిఁ గనుంగొని 'నీవు నిక్కంబ పలికితి; కిరీటి యట్టివాఁడ; నేఁడొక్క యద్భుతంబు సూపెద; నిక్కవచధారణంబుచేత రక్షితుండవై యతనిం దలపడుము; కృష్ణుండును సమస్తజనంబులు వెఱఁగుపడం దదీయ శరంబులు నీ తనువుఁ దాఁకకుండ గల యవి' యని చెప్పి యొక్క పసిండికత్తళంబునం దా శక్తి యావహించి యిచ్చినం బుచ్చుకొని, ప్రీతుం డగుచు నియతాత్ముండై దానిం దొడుగునప్పు డాచార్యుం 'డిది దొల్లి దేవ సంరక్షణార్థంబుగా నజుండు దేవేంద్రున కిచ్చె; నది యతం డంగిరసునకు, నంగిరసుండు బృహస్పతికి, బృహస్పతి యగ్నివైశ్యునకు, నగ్నివైశ్యుండు నాకును దీని నొసంగి' రని యెఱింగించి, సమంత్రకంబుగాఁ దొడిగి నానావిధ వాక్యంబుల దీవన లిచ్చి పొమ్మని యనుజ్ఞ సేసిన నమ్మహీపతి యుబ్బి యరదంబు సత్వరంబు సేసి యనేక రథకరితురగ నరనికరంబులు దన్నుం బరివేష్టింప వివిధ తూర్యనాదంబులు నింగిముట్ట విమ్వచ్చు వెనుకొనియె; నట్టియెడ నిక్కడ. 116**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (దుర్యోధనుడు) అని అనగా (అనగా తమ పేరు పోకుండా చూడుమని ప్రార్థించగా); ఆ+గురుండు= గురువైన ద్రోణాచార్యుడు; ఆ+కురుపతిన్= ఆ దుర్యోధనుడిని; కనుంగొని= చూచి; నీవు నిక్కంబు+అ పలికితివి= నీవు నిజం చెప్పావు; కిరీటి అట్టివాఁడు+అ= అర్జునుడు అంతటివాడే; నేఁడు= ఈ రోజు; ఒక్క అద్భుతంబు చూపెదన్= ఒక వింత చూపిస్తాను; ఈ కవచ ధారణంబుచేతన్= ఈ కవచాన్ని వేసికొనటంచేత; రక్షితుండవు+ఐ= కాపాడబడినవాడవై; అతనిన్+తలపడుము= ఆ అర్జునుడిని ఎదుర్కొనుము; కృష్ణుండును సమస్తజనంబులున్= కృష్ణుడును తక్కిన జనులందరూ; వెఱఁగు పడన్= ఆశ్చర్యపడగా; తదీయ శరంబులు= ఆ అర్జునుడు వేసే బాణాలు; నీ తనువున్= నీ శరీరాన్ని; తాఁకకుండన్+కల అవి= తాకకుండా ఉంటాయి; అని చెప్పి= ఆ మాదిరి చెప్పి; ఒక్క పసిండి కత్తళంబునందున్= ఒక బంగారు కవచంలో; ఆ శక్తి= ఆ శక్తిని (అనగా అర్జునుడిని బాణాలు తగులని శక్తిని); ఆవహించి= నిలిపి; ఇచ్చినన్= ఇయ్యగా; పుచ్చుకొని= తీసికొని; ప్రీతుండు+అగుచు= సంతోషంతో; నియత+ఆత్ముండు+ఐ= నియమంతో; దానిన్+తొడుగుచున్నప్పుడు= దానిని తొడుగుకొనేటప్పుడు; ఆచార్యుండు= ద్రోణుడు; తొల్లి= వెనుక; దేవసంరక్షణార్థంబుగాన్= దేవతలను కాపాడేటందుకై; అజుండు= బ్రహ్మ; ఇది= ఈ కవచం; దేవ+ఇంద్రునకున్+ఇచ్చె= ఇంద్రుడికిచ్చాడు; అతండు+అంగిరసునకున్= ఆయన ఆంగిరసుడికి; అంగిరసుండు బృహస్పతికిన్= ఆంగిరసుడు దేవతల గురువైన బృహస్పతికి; బృహస్పతి యగ్నివైశ్యునకున్= దేవగురువు అగ్నివైశ్యునకు; అగ్నివైశ్యుండు నాకును= అగ్నివైశ్యుండు నాకు (ద్రోణునకు); ఒసంగిరి= ఇచ్చారు; అని= అని చెప్పి; ఎఱింగించి= తెలిపి; సమంత్రకంబుగాన్= మంత్ర సహితంగా; తొడిగి= కప్పి; నానావిధవాక్యంబులన్= అనేక రకాలైన మాటలతో; దీవనలు+ఇచ్చి= ఆశీర్వచనాలు చెప్పి; పొమ్మని= వెళ్ళమని; అనుజ్ఞ చేసినన్= ఉత్తర్వు ఈయగా; ఆ+మహీపతి= ఆ దుర్యోధనుడు; ఉబ్బి= సంతోషించి; అరదంబు సత్వరంబు చేసి= తేరును సిద్ధంచేసి; అనేక రథకరితురగ నరనికరంబులు= నానా చతురంగబలాలు; తన్నున్+పరివేష్టింపన్= తనను అనుసరించగా; వివిధ తూర్యనాదంబులు= అనేక రకాలయిన తూర్య శబ్దాలు; నింగి ముట్టన్= ఆకాశాన్ని అంటగా; విమ్వచ్చున్= అర్జునుడిని; వెనుకొనియెన్= వెన్నంటాడు; అట్టి ఎడన్= ఆ సమయంలో; ఇక్కడన్= ఈ ప్రక్క.

**తాత్పర్యం:** అనగా, ఆ గురుడైన ద్రోణుడు ఆ సుయోధనుడితో 'నీవు నిజమే చెప్పావు. అర్జును డటువంటివాడే ఈ రోజు ఒక ఆశ్చర్యం చూపిస్తాను. ఈ కవచాన్ని ధరించి దానిచేత కాపాడబడుతూ అతడిని ఎదుర్కొనవలసింది. శ్రీకృష్ణుడు, మిగిలిన జనులందరూ ఆశ్చర్యపడగా అతడి బాణాలు నీ శరీరానికి తగలవు' అని చెపుతూ ఒక బంగారు కవచాన్ని మంత్రశక్తితో నింపి ఇచ్చాడు. దానికి ఆతడు సంతోషించి దానిని తొడుగుకొనేటప్పుడు - 'దీనిని వెనుక దేవతలను కాపాడేందుకు బ్రహ్మ ఇంద్రుడికి ఇచ్చాడు. ఆతడు అంగిరసుడికి ఇచ్చాడు. అంగిరసుడు బృహస్పతికి, బృహస్పతి అగ్నివైశ్యుడికీ, అగ్నివైశ్యుడు నాకూ ఇచ్చాడు' అని తెలిపి, మంత్రపూర్వకంగా కవచాన్ని, అనేక వాక్యాలతో ఆశీర్వదించి పొమ్మని ఉత్తర్వు చేశాడు. దానికి ఆ రాజు (దుర్యోధనుడు) సంతోషించి, శీఘ్రంగా తేరును సిద్ధంచేసి నానావిధాలైన చతురంగ బలాలు త న్ననుసరింపగా అనేక తూర్యనాదాలతో ఆకాశాన్నంటే శబ్దంతో బీభత్సుడి వెనుకవైపునుండి దాడిచేసినపుడు; ఇక్కడ.

**చ. సరభసవృత్తిఁ బాండుసుతసైన్యము లొక్కట నేచినం గడుం**
**దిర మయి నీ బలంబులు నుదీర్ణత సూపిన జాహ్నవీ సము**
**ద్ధుర యమునాభిఘట్టనముతో నెనవచ్చె నరేంద్ర! యప్డు సం**
**గర మతిఘోరమయ్యెఁ నొకకాలము నట్టివి సూడ మెయ్యెడన్.** **117**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= ఓ రాజా!; సరభసవృత్తిన్= త్వరత్వరగా; పాండుసుత సైన్యములు= పాండవుల సైన్యాలు; ఒక్కటన్= ఒక్కుమ్మడిగా; ఏచినన్= విజృంభించగా; కడున్+తిరమయి= మిక్కిలి స్థిరంగా; నీ బలంబులు= నీ సైన్యాలు; ఉదీర్ణత చూపినన్= తీవ్రపరాక్రమం చూపగా; జాహ్నవీ= గంగానదితో; సముద్ధుర= వేగవతి అయిన; యమునాభిఘట్టనముతోన్= యమునానది తాకిన విధంలో; ఎనవచ్చెన్= సరివచ్చింది; అప్డు= ఆ సమయంలో; సంగరము= యుద్ధం; అతి ఘోరము+అయ్యెన్= మిక్కిలి భయంకరంగా అయింది; ఒక కాలమున్= ఏ కాలంలోనూ; అట్టివి= అటువంటివి; ఏ+ఎడన్= ఎక్కడా; చూడము= చూడలేదు.

**తాత్పర్యం:** తొందరగా పాండవసైన్యాలు ఒక్కుమ్మడిగా విజృంభించాయి. అయితే నీ సైన్యాలు స్థిరంగా నిలిచాయి. ఆ గొప్పగా నిలవడం గంగా యమునా సంగమం మాదిరి తోచింది. ఓ రాజా! ఆ యుద్ధం వంటి యుద్ధాన్ని, ఏ కాలానా, ఎక్కడా చూడ లేదు.

**వ. అ య్యవసరంబున.** **118**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**ఆ. నడుమ భానుఁ దాల్చు నభముఁ గనుంగొని । దాని మిగులు బుద్ధి ధరణి భాను**
**యుగము దాల్చె ననఁగ నొప్పిరి తీవ్రతే । జమున గురుఁడు ద్రుపదసంభవుండు.** **119**

**ప్రతిపదార్థం:** నడుమన్= మధ్యలో; భానున్+తాల్చు= సూర్యుడిని ధరించే; నభమున్+కనుంగొని= ఆకాశాన్ని చూచి; దానిన్+మిగులు బుద్ధిన్= ఆ ఆకాశాన్ని అతిశయించే తలపుతో; ధరణి= భూదేవి; భాను యుగమున్= ఇద్దరు సూర్యులను; తాల్చెన్= మోస్తున్నదో; అనఁగన్= అని అన్నట్లు; తీవ్రతేజమునన్= తీక్ష్ణకాంతితో; గురుఁడు= ద్రోణుడు; ద్రుపద సంభవుండు= ద్రుపదుడి కొడుకు (ధృష్టద్యుమ్నుడు); ఒప్పిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** నడిమిభాగాన ఆకాశం మోసే సూర్యుడిని చూచి, దానిని అతిశయించేటట్లు భూదేవి ఇద్దరు సూర్యులను మోస్తున్నదా అన్నట్లు ద్రోణ ధృష్టద్యుమ్నులు వెలిగారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఆకాశం ఒక సూర్యుడినే మోస్తుంది. భూదేవి ఇద్దరు సూర్య సమ తేజస్సు కలవారిని మోస్తూ ఉన్నట్లున్నది అని భావము.

**వ. ఇట్లు ద్రోణ ధృష్టద్యుమ్నులు మెఱసి పోరి; రప్పు డప్పాంచాలవరుండు గురుని శరవర్షంబులు వారించుచు మిగిలి మన వాహినిపై నడరి నేల నెత్తుటం దోఁచిన, నతని కోల్తలకుం గాక యొదిఁగి యచ్చటి ప్రజ మూఁడు గుంపు లయ్యెఁ; నప్పుడు ద్రోణుండు గినిసినం బాంచాల కేకయ ప్రముఖ బలంబులు గలంగం బడిన మగుడనస్మత్సైన్యంబులు పురికొనుటయు ధర్మసూనుండు సోదరాదియోధ వీర సహితంబుగా నురవడించినం, గని, వికర్ణ వివింశతి చిత్రసేనులు భీమసేనుని, బాహ్లికుండు ద్రౌపదేయులను, దుశ్శాసనుండు సాత్యకిని, శకుని నకుల సహదేవులను, సోమదత్తుండు శిఖండిని, నలంబుసుండు ఘటోత్కచునిం, దలపడిరి; శల్యుండు సింధురాజుకడ నుండియు నగ్గలిక నమ్మొగ్గరంబు మొగంబునకుం జనుచు మరలుచునికింజేసి తత్కాల సన్నిహితుం డయిన యుధిష్ఠిరుం దాఁకె; నివ్విధంబునం దార్కొనిన యద్దొరలు నానా ప్రకార దారుణ విచిత్ర సంగరంబులు సేసి పల్లవితాశోకపుష్పిత కింశుక వనంబులం బోలి పొలిచి; రా సమయంబున దుస్ససేనుండు శైనేయుని మూర్ఛితుం జేసిన నాలోనన తెలిసి యతండు ప్రచండ భంగిం బెనంగెఁ; గవల యమ్ముల కోహటించి గాంధారరాజు ద్రోణు దెసకుం బాఱె; నట్టియెడ. 120**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ద్రోణ ధృష్టద్యుమ్నులు= ద్రోణుడు, ధృష్టద్యుమ్నుడును; మెఱసి పోరిరి= విజృంభించి యుద్ధం చేశారు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+పాంచాలవరుండు= ఆ పాంచాలశ్రేష్ఠుడు (ధృష్టద్యుమ్నుడు); గురుని= ద్రోణుడియొక్క; శరవర్షంబులు= అంప వానలు; వారించుచున్= అడ్డుకొంటూ; మిగిలి= అతిశయించి; మనవాహినిపైన్= మనసేన మీదకు; అడరి= విజృంభిస్తూ; నేల నెత్తుటన్+తోఁచినన్= భూమి నెత్తురులో కన్పించగా; అతని కోల్తలకున్+కాక= వానికి ఎదురు నిల్చి యుద్ధం చేయలేక; ఒదిఁగి= అణగి; అచ్చటి ప్రజ= అక్కడి సేన; మూఁడు గుంపులు+అయ్యెన్= మూడు భాగాలుగా అయింది; అప్పుడు, ద్రోణుండు కినిసినన్= ఆ సమయంలో ద్రోణుడు కోపించగా; పాంచాల కేకయ ప్రముఖ బలంబులు= పాంచాల దేశ, కేకయ దేశ ముఖ్యసేనలు; కలంగన్+పడిన= చీకాకు పడగా; మగుడన్= మరలా; అస్మద్+సైన్యంబులు= మన సైన్యాలు; పురికొనుటయున్= విజృంభించగా; ధర్మసూనుండు= ధర్మరాజు; సోదరాదియోధ వీర సహితంబుగాన్= సోదరులు మొదలైన యుద్ధవీరులతో; ఉరవడించినన్= వేగంగా రాగా; కని= చూచి; వికర్ణ వివింశతి చిత్రసేనులు= ఈ పేర్లు కలవారు; భీమసేనునిన్= భీముడిని; బాహ్లికుండు= బాహ్లికుడు; ద్రౌపదేయులను= ద్రౌపది కుమారులయిన ఉపపాండవులను; దుశ్శాసనుండు= దుశ్శాసనుడు; సాత్యకిని= సాత్యకినీ; శకుని నకుల సహదేవులను= శకుని నకులుడినీ, సహదేవుడినీ; సోమదత్తుండు శిఖండిని= సోమదత్తుడు శిఖండినీ; అలంబుసుండు ఘటోత్కచునిన్= అలంబుసుడనే రాక్షసుడు ఘటోత్కచుడినీ; తలపడిరి= ఎదుర్కొన్నారు; శల్యుండు సింధురాజు కడన్+ఉండియున్= శల్యుడు సైంధవుడి దగ్గర ఉన్నప్పటికినీ; అగ్గలికన్= శౌర్యంతో; ఆ+మొగ్గరంబు+ మొగంబునకున్= ఆ వ్యూహం మొదటికి; చనుచున్= పోతూ; మరలుచునికిన్+చేసి= తిరిగి వస్తూ ఉన్నందున; తత్కాల= ఆ సమయంలో; సన్నిహితుండు+అయిన= దగ్గరగా ఉన్న; యుధిష్ఠిరున్+తాఁకెన్= ధర్మరాజును ఎదుర్కొన్నాడు; ఈ+విధంబునన్= ఈ మాదిరిగా; తార్కొనిన= ఎదుర్కొన్న; ఆ+దొరలు= ఆ రాజులు; నానా ప్రకార= అనేక విధాలుగా; దారుణ= భయంకరమైన; విచిత్ర సంగరంబులు= చూచేవారికి ఆశ్చర్యకరమైన యుద్ధాలు; చేసి; పల్లవిత= చిగురించిన; అశోక= అశోకములు; పుష్పిత= పూచిన; కింశుక వనంబులన్+పోలి= మోదుగు తోటలవలె; పొలిచిరి= ఒప్పినారు; ఆ సమయంబునన్= ఆ సమయంలో; దుస్ససేనుండు= దుశ్శాసనుడు; శైనేయునిన్= సాత్యకిని; మూర్ఛితున్+చేసినన్= మూర్ఛిల్లచేయగా; ఆలోనన్= అంతలోనే; తెలిసి= ఒడలు తెలిసి; అతండు = సాత్యకి; ప్రచండ భంగిన్= భయంకరంగా; పెనంగెన్= పోరాడాడు; కవల అమ్ములకున్= నకుల సహదేవుల బాణాలకు; ఓహటించి= వెనుకంజవేసి; గాంధారరాజు= శల్యుడు; ద్రోణుదెసకున్= ద్రోణుడున్న దిక్కుకు; పాఱెన్= పరుగెత్తాడు; అట్టి ఎడన్=ఆ సమయంలో.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడూ ద్రోణుడూ విజృంభించి యుద్ధం చేస్తూ ఉండగా, ధృష్టద్యుమ్నుడి బాణవర్షానికి భూమి నెత్తురుమయం కాగా, అతడితో ఎదురు నిల్చి యుద్ధంచేయలేక ఒదిగిపోయిన మన సేన మూడు భాగాలయింది. అంత ద్రోణుడు కోపంతో విజృంభించగా పాంచాల కేకయ సైన్యాలు చీకాకు పడ్డాయి. మరలా మన సైన్యాలు పుంజుకున్నాయి. అంతలో సోదరులతో కూడి ఉండే ధర్మరాజు ఎదురెత్తి వచ్చాడు. వాళ్ళను చూచి వికర్ణ వివింశతి చిత్రసేనులు భీముడినీ, బాహ్లికుడు ఉపపాండవులనూ, దుశ్శాసనుడు సాత్యకినీ, శకుని నకుల సహదేవులనూ, సోమదత్తుడు శిఖండినీ, అలంబుసుడు ఘటోత్కచుడినీ ఎదుర్కొన్నారు. శల్యుడు సైంధవుడి ప్రక్కనే ఉన్ననూ, ఆ సైన్యం ముందుకూ వెనుకకూ వస్తూ పోతూ, దగ్గరగా కనుపించిన ధర్మరాజును ఎదుర్కొన్నాడు. ఈ విధంగా ఆ దొరలు భయంకరంగా చిత్ర విచిత్రమయిన విధంగా యుద్ధం చేస్తూ, చూచేవారికి వింతగా చిగిర్చిన అశోకాలూ, పూచిన మోదుగులవలె కనపడ్డారు. అప్పుడు దుశ్శాసనుడు సాత్యకిని మూర్ఛిల్ల చేశాడు. అంతలోనే సాత్యకి లేచి భయంకరంగా యుద్ధం చేశాడు. నకుల సహదేవుల బాణాల దెబ్బకు శకుని భయపడి ద్రోణుడున్న దిక్కుకు పరుగెత్తాడు.

**విశేషం:** అలం: ఉపమ. ఆ యుద్ధ విశేషాన్ని కూడా తిక్కన కవి సాహిత్యస్ఫూర్తిని కలిగిస్తూ ఆలంకారికంగా వర్ణించాడు.

**క. మనమూఁక యొదిఁగి గుంపులు । గొని యెప్పటి యట్ల యగుడు గురుఁ డతిరభసం**
**బున ధృష్టద్యుమ్నుని భీ । ముని ధర్మజుఁ బొదివి యుగ్రముగ నేసె నృపా! 121**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); మన మూఁక= మన సైన్యం; ఒదిఁగి= అణగి; గుంపులుగొని= గుంపులుకట్టి; ఎప్పటి అట్ల అగుడున్= ఎప్పటి మాదిరి కాగా (అనగా వెనుకటి వచనంలో వర్ణించిన మాదిరి యుద్ధం కాగా); గురుఁడు= ద్రోణుడు; అతిరభసంబునన్= మిక్కిలి వేగంగా; ధృష్టద్యుమ్నుని, భీముని; ధర్మజున్= ధర్మరాజునూ; పొదివి= క్రమ్ముకొని; ఉగ్రముగన్= భయంకరంగా; ఏసెన్= కొట్టాడు (బాణవర్షమును కురిపించాడు).

**తాత్పర్యం:** ఓ రాజా! మన సైన్యం ఒదిగి గుంపులుగా అయింది. ద్రోణుడు చాల వేగంగా ధృష్టద్యుమ్న, భీమ, ధర్మరాజులను క్రమ్ముకొని భయంకరంగా బాణాలు వేశాడు.

**వ. అయ్యవసరంబున. 122**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. ఉభయ బలంబులుఁ బురికొని । యిభ తురగ స్యందనంబు లిలఁ బ్రోవులుగా**
**సభయాశ్చర్యాత్మకులై । నభశ్చరులు వొగడ నీసునం బోరాడెన్. 123**

**ప్రతిపదార్థం:** ఉభయ బలంబులున్= ఇరువాగు సేనలు; పురికొని= విజృంభించి; ఇభ= ఏనుగులు; తురఁగ= గుర్రాలు; స్యందనంబులు= తేరులు; ఇలన్= భూమిమీద; ప్రోవులుగాన్= కుప్పలుగా కాగా; నభశ్చరులు= ఆకాశంలో తిరిగే దేవతలు మొదలగువారు; సభయ+ఆశ్చర్య+ఆత్మకులు+ఐ= భయాశ్చర్యాలతో కూడినవారై; పొగడన్= కీర్తించగా; పోరాడెన్= యుద్ధంచేశాయి.

**తాత్పర్యం:** ఇరుపక్షాల సేనలూ కమ్ముకొని (చతురంగ బలాలైన) ఏనుగులూ, గుర్రాలూ, తేరులూ, భూమిమీద కుప్పలుగా కూలేటట్లు పోరాడారు. ఆకాశంలో తిరిగే దేవతలు మొదలైనవారు ఈ స్థితిని ఆశ్చర్యంతో, భయంతోనూ చూస్తూ పొగడారు.

## ధృష్టద్యుమ్న ద్రోణాచార్యుల యుద్ధము (సం. 7-72-22)

**వ. అట్టి సంకుల సమరంబున సుస్థిరోత్సాహుండై నిజవ్యూహం బభేద్యంబగునట్లుగా శుంభదవష్టంభంబునం బేర్చి కుంభసంభవుండు ధృష్టద్యుమ్ను మిగిలి పాండవసైన్యంబు దైన్యంబు నొందించుచున్న నప్పాంచాల కులప్రదీపకుండు కోపోద్దీపితుం డయి పారావతవర్ణంబులగు తన రథ్యంబుల నగ్గురు నరుణాశ్వంబులం బెరయ నరదంబు వఱపించి పలకయు వాలునుంగొని సాహసికత్వంబున నతని తేరికడ నొగఁద్రొక్కి యెక్కి కాఁడిపయిం జిత్రగతులు మెఱసి తఱచై తొరఁగు తదీయ శరంబులు నిజ శరీరంబుఁ జోఁకనీకుండెడు నాలోఁ జేయార్పు రాకుండియుఁ దమకంబునం గృపాణంబు విసరినం దద్రథ తురంగంబుల యంగంబులు వెడవెడ దాఁకు కొలఁది నయ్యాచార్యుండు రయంబున. 124**

**ప్రతిపదార్థం:** అట్టి= ఆ విధమైన; సంకుల సమరంబునన్= దట్టమయిన యుద్ధంలో; సుస్థిర+ఉత్సాహుండు+ఐ= దృఢమయిన ఉత్సాహంకలవాడయి; నిజవ్యూహంబు= తన మొగ్గరం; అభేద్యంబుగాన్= చీల్చరానిదిగా; శుంభత్+అవష్టంభంబునన్+పేర్చి= ప్రకాశించే అహంకారంతో విజృంభించి; కుంభసంభవుండు= ద్రోణుడు; ధృష్టద్యుమ్నున్+మిగిలి= ధృష్టద్యుమ్నుడిని దాటి; పాండవసైన్యంబును= పాండవసేనను; దైన్యంబున్+ఒందించుచున్నన్= దురవస్థ పొందిస్తూ ఉంటే; ఆ+పాంచాల కుల ప్రదీపకుండు= ఆ పాంచాల రాజవంశాన్ని ప్రకాశింపచేసేవాడు(ధృష్టద్యుమ్నుడు); కోపోద్దీపితుండు+అయి= కోపంతో వెలుగుతూ; పారావత వర్ణంబులు+అగు= పావురాల రంగుగల; తన రథ్యంబులన్= తన గుఱ్ఱాలను; ఆ+గురు= ఆ గురుని (ద్రోణుని); అరుణాశ్వంబులన్= ఎఱ్ఱని గుఱ్ఱాలను; బెరయన్= చేరగా; అరదంబు= తేరును; వఱపించి= తోలి; పలకయు వాలునున్+కొని= డాలూ కత్తీ తీసికొని; సాహసికత్వంబునన్= తెంపరితనంతో; అతని తేరికడన్= ద్రోణుడి తేరువద్ద; నొగన్+త్రొక్కి ఎక్కి= నొగను తొక్కి పైకి ఎక్కి; కాఁడిపయిన్= నొగ కాడిమీద; చిత్రగతులు= చిత్రగతులతో; మెఱసి= రేగి; తఱచై= ఎక్కువగా; తొరఁగు= పడుతూ ఉండే; తదీయ= ఆ ద్రోణుడి; శరంబులు= బాణాలు; నిజశరీరంబున్= తన ఒంటిమీద; చోఁకనీకుండెడున్ ఆలోన్= తగులనీకుండునంతలో; చేయార్పు= చేయి తీయటానికి; రాకుండియున్= రాకుండినప్పటికి; తమకంబునన్= పట్టుదలతో; కృపాణంబు విసరినన్= కత్తి విసరగా; తద్రథ= ఆ ద్రోణుడి తేరి; తురంగంబుల= గుఱ్ఱాల యొక్క అంగంబులు= దేహాలను; వెడ వెడన్= కొంత కొంత; తాఁకు కొలఁది= తగులగా; ఆ+ఆచార్యుండు= ఆ ద్రోణాచార్యుడు; రయంబునన్= వేగంగా.

**తాత్పర్యం:** ఆ సంకుల యుద్ధంలో సుస్థిరంగా ఉన్న ఉత్సాహంతో, తన యుద్ధ వ్యూహం చీల్చరానిదన్న అహంకారంతో విజృంభించి ద్రోణుడు, ధృష్టద్యుమ్నుడిని దాటి, పాండవ సైన్యాన్ని దురవస్థపాలు చేస్తూ ఉండగా, పాంచాలకుల దీపకుడైన ధృష్టద్యుమ్నుడు కోపంతో మండిపోతూ, పావురాల రంగున్న తన తేరి గుఱ్ఱాలను ఆ గురుడి ఎఱ్ఱని గుఱ్ఱాలను, తాకేటట్లు తన తేరిని తోలి, డాలూ, కత్తీ తీసికొని సాహసంతో ఆయన తేరు దగ్గర నొగమీద కాలుపెట్టి యెక్కి కాడి మీద కాలు మోపుకొని అనేక విధాల విజృంభించి, విస్తారంగా పడే ద్రోణుడి బాణాలను తన ఒంటిని తాకనీయకుండా, అంతలోనే చేయితీయటానికి వీలుపడకున్నా పట్టుదలగా కత్తిని పట్టి విసరగా, అది ద్రోణుని తేరి గుఱ్ఱాల ఒడలిని తాకగా ఆ ఆచార్యుడు వేగంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అలుఁగు చెక్కలుగాఁ జేసి హరుల సూతుఁ। దునిమి సిడమును బలకయు ద్రుంచి వైచి**
**మేను లక్షించి కులిశంబుఁ బోని దొడ్డ। నారసం బేయ సాత్యకి నడుమ నఱకె. 125**

**ప్రతిపదార్థం:** అలుఁగున్= కత్తిని; చెక్కలుగాన్+చేసి= ముక్కలుగా చేసి; హరులన్= గుఱ్ఱాలను; సూతున్= సారథిని; తునిమి= చంపి; సిడమును పలకయున్= ధ్వజాన్ని, డాలును; త్రుంచివైచి= ముక్కలు చేసి; మేనున్= శరీరాన్ని; లక్షించి= గురిచూచి;

కులిశంబుబోని= వజ్రాయుధంవంటి; దొడ్డ= పెద్ద; నారసంబు+ఏయన్= వాడి బాణాన్ని వేయగా; సాత్యకి నడుమ నఱకెన్= సాత్యకి (దానిని) మధ్యలోనే నరకివేశాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడి కత్తిని ముక్కలు చేసి, గుర్రాలను, సారథినీ చంపి, పతాకాన్నీ, డాలునూ ముక్కలు చేసి, వజ్రాయుధం వంటి వాడి నారసంతో వేయగా దానిని సాత్యకి మధ్యలోనే నరకివేశాడు.

**వ. ఇట్లు శినిపుంగవుండు సింగంబు వొదివిన కురంగంబుఁ గాచు చందంబున ధృష్టద్యుమ్ను రక్షించి తొలంగంగొనిపోయె' ననిన విని యాంబికేయుండు సంజయున కి ట్లనియె. 126**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; శినిపుంగవుండు= సాత్యకి; సింగంబు పొదివిన= సింహం కమ్ముకున్న; కురంగంబున్= జింకను; కాచుచందంబునన్= కాపాడే విధంగా; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; రక్షించి= కాపాడి; తొలంగన్+కొనిపోయెన్= తప్పించి తీసికొనిపోయాడు; అనినన్= అని చెప్పగా; విని; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్+ఇట్లు+అనియెన్= సంజయునితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా సాత్యకి, సింహం కమ్ముకొనిన జింకను కాపాడే విధంగా ధృష్టద్యుమ్నుడిని రక్షించి, తప్పించి తీసికొనిపోయాడని సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'పులివాతి కండ గొనుగతి - నలవున బాంచాల తనయు నయ్యెడరునకుం**
**దొలఁగించిన సాత్యకిపై । నలుక వొడమకుండు నెట్టు లాచార్యునకున్?' 127**

**ప్రతిపదార్థం:** పులివాతి కండన్= పులినోటి దగ్గరి మాంసపు ముక్కను; కొనుగతిన్= తీసుకొనిపోయే విధంగా; అలవునన్= బలంతో; పాంచాలతనయున్= పాంచాలరాజు కొడుకైన ధృష్టద్యుమ్నుడిని; ఆ+ఎడరునకున్= ఆ ప్రమాదానికి; తొలగించిన= తప్పించిన; సాత్యకిపైన్= సాత్యకిమీద; ఆచార్యునకున్= ద్రోణాచార్యుడికి; ఎట్టులు= ఏ విధంగా; అలుక= కోపం; ఎట్టులు= ఏ విధంగా; పొడమక+ఉండున్= కలుగకుండా ఉంటుంది?

**తాత్పర్యం:** 'ద్రోణాచార్యుడు ధృష్టద్యుమ్నుడిని హతమార్చేటందుకు సిద్ధం కాగా సాత్యకి తప్పించాడు. అది పులి నోటి దగ్గరి కడి అయిన మాంసపు ముక్కను హరించినట్లయింది. ఆ సందర్భంలో పులికి ఎంత కోపం వస్తుందో ఆ విధంగానే ద్రోణుడికి సాత్యకిమీద కోపం రాకుండా ఉంటుందా?

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అనుటయు నమ్మానవపతికి సూతసూనుం డిట్లను 'నట్లు సేసినం గినిసి గురుండు ఱెక్కలు గల పెనుబాము కైవడి సాత్యకిపైఁ గవియుటయు, నతండు నిజసారథి నాలోకించి 'యివ్విప్రుండు ధర్మతనయ భయంకరుం డితని మార్కొనవలయు'నని పలికి తేరు సమ్ముఖంబు సేయించె; నిత్తెఱంగున. 128**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ఆ+మానవపతికిన్= ఆ రాజుకు (ధృతరాష్ట్రునితో); సూతసూనుండు= సంజయుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; అట్లు చేసినన్= ఆ విధంగా చేయగా (సాత్యకి ధృష్టద్యుమ్నుడిని తప్పించగా); గురుండు= ద్రోణుడు; ఱెక్కలుకల= రెక్కలలో ఉన్న; పెనుబాము కైవడిన్= పెద్దపాము మాదిరిగా; సాత్యకిపైన్+కవియుటయున్= సాత్యకి మీదకు దూకుటయు; అతండు= ఆ సాత్యకి; నిజసారథిన్+ఆలోకించి= తన సారథిని చూచి; ఆ+విప్రుండు= ఆ బాపడు; ధర్మతనయ భయంకరుండు= ధర్మరాజుకు భయంకలిగించేవాడు; ఇతనిన్ మార్కొనవలయును= ఇతడిని ఎదుర్కొనవలెను; అని పలికి= అని చెప్పి; తేరు సమ్ముఖంబు చేయించెన్= తేరును ఎదురుగా పోనిచ్చాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా.

**తాత్పర్యం:** ఆ విధంగా అనిన ధృతరాష్ట్రుడితో సంజయుడు ఈ విధంగా అన్నాడు; 'ఆ విధంగా సాత్యకి చేయగా కోపగించుకొన్న గురుడు ద్రోణాచార్యుడు రెక్కలున్న పెద్దపాము మాదిరిగా సాత్యకిమీదకి దూకాడు. అందుకు ఆతడు తన సారథితో 'ఈ బ్రాహ్మణుడు ధర్మరాజునకు భయంకరుడు; ఇతడిని ఎదుర్కొనటానికి మన తేరును అతడి ఎదుటికి పోనిమ్మ'ని అన్నాడు. ఈ విధంగా - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తలపడి చాపరుచులు మెఱుఁ । గుల గములుగ గుణనితాంత ఘోషంబులు గ**
**ర్జలుగా నారథికోత్తమ । జలదయుగము మెఱసి సాంద్ర శర వర్షములన్. 129**

**ప్రతిపదార్థం:** తలపడి= ఎదుర్కొని; చాపరుచులు= విండ్ల కాంతులు; మెఱుఁగులగములుగన్= మెఱుపుల సమూహాలుగా; గుణ= అల్లెత్రాటి; నితాంత ఘోషంబులు= ఎడతెగని శబ్దాలు; గర్జలుగాన్= మేఘాల గర్జనలుగా; ఆ రథిక+ఉత్తమ జలదయుగము= సైనిక శ్రేష్ఠులనే ఆ మేఘాల జంట; మెఱసి= పెరిగి (విజృంభించి); సాంద్ర= దట్టమైన; శరవర్షములన్= బాణాల వానతో.

**తాత్పర్యం:** ద్రోణ సాత్యకులు ఎదుర్కొన్నారు. వారి ధనుస్సుల కాంతులు మెఱుపుల సమూహాలుగా, అల్లెత్రాటి టంకారధ్వనులు మేఘాల గర్జనలుగా ఆ రథికోత్తములు అనే మేఘాల జంటవిజృంభించి, దట్టమైన బాణవర్షాలతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: రూపకం.

**వ. అంతకంతకుం గదిసి భల్లంబుల నేట్లాడం దొడంగిన. 130**

**ప్రతిపదార్థం:** అంతకున్+అంతకున్ కదిసి= క్రమక్రమంగా సమీపించి; భల్లంబులన్= బల్లేలతో; ఏట్లాడన్+తొడంగినన్= పోట్లాట మొదలుపెట్టగా.

**తాత్పర్యం:** అంతకంతకు కమ్ముకొని బల్లేలతో పోట్లాడగా.

**చ. గొడుగులు గేతనంబులును గూలెఁ దనూద్గత రక్తధార లో**
**ల్కెడు గజదానతోయముల లీల వహించె బలద్వయంబు న**
**ప్పుడు వెఱఁగందె నచ్చెరువుఁ బొందె వియచ్చరకోటి యిట్లు పో**
**రెడు నెడ ద్రోణువిల్లు వెస రెండుగ సాత్యకి ద్రుంచెఁ ద్రుంచినన్. 131**

**ప్రతిపదార్థం:** గొడుగులు= గొడుగులును; కేతనంబులును= జెండాలును; కూలెన్= కూలిపోయాయి; తను+ఉద్గత= శరీరం నుండి వెడలిన; రక్తధారలు= నెత్తుటి ధారలు; ఒల్కెడు= జారుతూ ఉన్న; గజదానతోయముల లీలన్= ఏనుగుల మదజలాల విధమును; వహించెన్= పొందాయి; బలద్వయంబు= రెండు ప్రక్కల సేనలు; అప్పుడు= ఆ సమయాన; వెఱఁగు+అందెన్= భయపడినవి; వియత్+చరకోటి= ఆకాశంలో తిరిగే దేవతలు మొదలైనవారు; అచ్చెరువున్+పొందెన్= ఆశ్చర్యపడ్డారు; ఇట్లు పోరెడు+ఎడన్= ఈ మాదిరి యుద్ధం చేసేటప్పుడు; సాత్యకి= సాత్యకి; ద్రోణువిల్లు= ద్రోణుడి వింటిని; వెసన్= శీఘ్రంగా; రెండుగన్= రెండుగా (అనగా రెండు ముక్కలుగా); త్రుంచెన్= త్రుంచాడు; త్రుంచినన్= త్రుంచగా.

**తాత్పర్యం:** (ఆ యుద్ధంలో) గొడుగులూ జెండాలూ కూలిపోయాయి. (సైనికుల) శరీరాల నుండి వెలువడే నెత్తురు ఏనుగుల మదజలం మాదిరి పడింది. ఇరుసైన్యాలూ అపుడు భయపడ్డాయి. దేవతలు ఆశ్చర్యపడ్డారు. ఆ సమయంలో సాత్యకి ద్రోణుడి విల్లు రెండుగా విరిచాడు. అట్లా విరువగా.

**విశేషం:** అలం: ఉపమ. విలువిద్యలో సాత్యకికి గల మెలకువలు దేవతలను కూడా ఆశ్చర్యపరచాయి.

**క. గురుఁ డొండొకవిల్లెత్తిన । సరభసముగ నదియుఁ దునిమె సాత్యకి; మఱియుం**
**ద్వరితముగ నెక్కువెట్టఁగ । శరాసనము లెన్నియేనిఁ జక్కడిచె వడిన్. 132**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; ఒండు+ఒకవిల్లు= ఇంకొక విల్లును; ఎత్తినన్= ఎత్తుకోగా; సరభసముగన్= వేగంగా; అదియున్= దానిని కూడా; సాత్యకి= సాత్యకి; తునిమెన్= త్రుంచివేశాడు; మఱియున్= ఇంకా; త్వరితముగన్= తొందరగా; శర+అసనము= బాణములకు ఆసనమైన (పీఠమైన) విల్లు; ఎక్కుపెట్టఁగన్= ఎక్కుపెట్టగానే; ఎన్ని ఏనిన్= ఎన్నిటిని అయినా; వడిన్= వెంటనే; చక్కడిచెన్= నాశనం చేశాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు ఇంకో వింటిని ఎక్కుపెట్టేటప్పటికి సాత్యకి దానిని త్రుంచివేశాడు. ఆయన త్వరత్వరగా ఎత్తుకొని ఎక్కుపెట్టిన విండ్లనన్నింటిని త్వరత్వరగా విరిచివేశాడు.

**వ. అట్టి యెడ నాచార్యుం డాత్మగతంబున. 133**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆచార్యుండు= ద్రోణుడు; ఆత్మగతంబునన్= మనస్సులో

**తాత్పర్యం:** ఆ సమయంలో ద్రోణుడు తన మనసులో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'రామునందును గార్తవీర్యక్షితీశు । నందు నరునందు భీష్మునియందుఁ దక్కఁ**
**గలుగునే యెందు నీ యస్త్రబలము? వీని । యాశు విక్రమ మద్భుతంబయ్యెఁ జూడ'. 134**

**ప్రతిపదార్థం:** రామునందున్= పరశురాముడి లో; కార్తవీర్యక్షితి+ఈశునందున్= కార్తవీర్యార్జునుడనే రాజులోనూ; నరునందున్= అర్జునుడి లో; భీష్ముని అందును= (కౌరవులకూ పాండవులకూ తాతగారైన) భీష్ముని లో; తక్కన్= కాకుండా; ఎందున్= ఎక్కడైనా; ఈ+అస్త్రబలము= ఈ ధనుర్విద్యాశక్తి; కలుగునే?= ఉంటుందా?; వీని= ఈ సాత్యకి యొక్క; ఆశువిక్రమము= వేగమగు శౌర్యం; చూడన్= చూడగా; అద్భుతంబు+అయ్యెన్= ఆశ్చర్యంగా ఉన్నది.

**తాత్పర్యం:** 'పరశురాముడిలోనూ, (వేయి చేతులు గల) కార్తవీర్యుడిలోనూ, అర్జునుడిలోనూ, కురుపితామహుడైన భీష్ముడిలోనూ తప్ప ఇటువంటి ధనుర్విద్యాబలమూ, వేగంగా విజృంభించటమూ మరెక్కడా కానరాదు. చూస్తూ ఉంటే చాలా అద్భుతంగా ఉన్నది'.

**వ. అని యగ్గించెఁ; జారణసిద్ధ సాధ్యులు సంకీర్తనంబులు సేసిరి; వెండియు నొండు కోదండంబు గొని యగ్గురుండు దొరంగించిన శరంబులు శైనేయుండు దుత్తుమురు సేసిన. 135**

**ప్రతిపదార్థం:** అని అగ్గించెన్= అని పొగిడాడు; చారణ సిద్ధ సాధ్యులు= ఆకాశంలో తిరిగే చారణులు, సిద్ధులు, సాధ్యులు; సంకీర్తనంబులు; చేసిరి= పొగడారు; వెండియున్= మరల; ఒండుకోదండంబుకొని= ఇంకొక విల్లును తీసికొని; ఆ+గురుండు= ఆ ద్రోణుడు; తొరంగించిన శరంబులు= వేసిన బాణాలు; శైనేయుండు= సాత్యకి; తుత్తుమురు చేసినన్= పొడిగా చేయగా.

**తాత్పర్యం:** ఆ విధంగా సాత్యకిని పొగిడాడు. ఆకాశంలో తిరిగే సిద్ధచారణ సాధ్యులూ కీర్తించారు. ఆ సమయాన ద్రోణుడు ఇంకొక విల్లును తీసికొని బాణాలు వేయగా, వాటిని సాత్యకి పొడిపొడి చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఏ వీరునకైనను నిది । భావారూఢంబు గానిపనియే?' యనుచున్**
**మీ వారెల్లను బెలుచం । గైవారము సేసి రతనిఁ గౌరవనాథా! 136**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ఓ ధృతరాష్ట్రా!; ఏ వీరునకున్+ఐనను= ఎటువంటి వీరుడికైనా; ఇది= ఈ విక్రమం; భావారూఢంబు కాని= మనసుకు ఎక్కని; పనియే?= చేష్టయా?; అనుచున్= అంటూ; మీవారు+ఎల్లరును= మీ సైన్యమంతా; అతనిన్= సాత్యకిని; పెలుచన్= త్వరగా; కైవారము చేసిరి= పొగిడారు.

**తాత్పర్యం:** 'ఏ వీరుడికైనా ఈతడి శౌర్యం మనసుకెక్కదా?' అని మీవారంతా (సాత్యకిని) పొగిడారు. (అని సంజయుడు ధృతరాష్ట్రుడితో అన్నాడు.)

**వ. అప్పలుకులు సహింపక. 137**

**తాత్పర్యం:** ఆ మాటలకు ఓర్వలేక.

**శా. ఆగ్నేయాస్త్రము ద్రోణుఁ డేసిన సముద్యజ్జ్వాలికామాలికో**
**ద్విగ్నం బయ్యె నభంబు, వారుణ శరావిర్భావముం జేసెఁ గ్రో**
**ధాగ్ని స్ఫూర్తి వెలుంగ నాశినివరుం డబ్బాణముల్ త్రాస ని**
**ర్మగ్నవ్యోమ చరంబు లై తొడరి పోరంజొచ్చె నొండొంటితోన్. 138**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; ఆగ్నేయ+అస్త్రమున్= ఆగ్నేయాస్త్రాన్ని; ఏసినన్= వేయగానే; నభంబు= ఆకాశం; సముద్యత్= పైకెగసే; జ్వాలికామాలికా= అగ్నిజ్వాలల మాలలచేత; ఉద్విగ్నంబు= భయపడినది; అయ్యెన్= అయింది; ఆ శినివరుండు= ఆ శిని వంశంలో మొనగాడైన సాత్యకి; క్రోధ+అగ్ని స్ఫూర్తి= కోపమనే నిప్పు తోచేటట్లు; వెలుంగన్= ప్రకాశించగా; వారుణ శర+ఆవిర్భావమున్+చేసెన్= వారుణాస్త్రాన్ని పుట్టించాడు; ఆ+బాణముల్= ఆ బాణాలు; త్రాస= భయంలో; నిర్మగ్న= మునిగిన; వ్యోమచరంబులు+ఐ= ఆకాశంలో తిరిగేవారు కలవై; తొడరి= ఎదిరిస్తూ; ఒండు+ఒంటితోన్= ఒకదానితో మరొకటి (ఆగ్నేయ వారుణాస్త్రాలు); పోరన్+చొచ్చెన్= యుద్ధం చేస్తూ ఉన్నాయి.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు ఆగ్నేయాస్త్రాన్ని వేయగా ఆకాశం అగ్నిజ్వాలల మాలలతో మండుతూ భయపడింది. దానికి సాత్యకి కోపంతో రగులుతూ వారుణాస్త్రాన్ని సృష్టించి వేశాడు. ఆ రెండు అస్త్రాలు ఆకాశచారులకు భయాన్ని కలిగిస్తూ ఎదుర్కొని ఒకదానితో మరొకటి యుద్ధం చేయసాగాయి.

**క. ఘోరంబు గాఁగ హాహా । కారము లెసఁగంగ బలయుగంబును డయ్యం**
**బోరి పెడఁబాసి శాంతము । లై రెండును నిలిచె నమ్మహాస్త్రము లధిపా! 139**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా! (ధృతరాష్ట్ర మహారాజా!); ఘోరంబుగాఁగన్= భయంకరంగా; హాహాకారములు+ఎసఁగంగన్=హాహా అనే శబ్దాలు ఎక్కువ కాగా; బలయుగంబును= ఇరువాగుల సైన్యమూ; డయ్యన్= అలసిపోగా; ఆ+మహాస్త్రములు= ఆ దివ్యాస్త్రములు; పోరి= యుద్ధం చేసి; పెడన్+పాసి= ఎడమై; శాంతములు+ఐ= శాంతించినవై; రెండును= రెండూ; నిలిచెన్= ఆగాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఆ రెండు దివ్యాస్త్రాలూ భయంకరంగా తలపడటంచేత సేనలలో హాహాకారాలు పుట్టాయి. రెండువైపులా ఉన్న సేనలూ అలసిపోయేటట్లు అవి యుద్ధం చేసి, క్రమంగా విడివడి, శాంతించి నిలిచాయి (ఆగాయి).

**వ. ఆ సమయంబున ధర్మజ భీమ నకుల సహదేవులు శైనేయునకు బాసటయై తటిమిన ధృష్టద్యుమ్న ప్రముఖ రథిక వరులుం దలకడచి భారద్వాజుం దాఁకుటయు, దుశ్శాసను మున్నిడికొని మన దిక్కు రాజకుమార వర్గంబు వారలతోఁ దలపడిన నుభయ బలంబులుం బురికొని యోహరిసాహరిం బెనఁగుచుండె; నప్పు డక్కడ. 140**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ వేళలో; ధర్మజ భీమ నకుల సహదేవులు= ఈ నలుగురూ; శైనేయునకున్= సాత్యకికి; బాసట+ఐ= తోడుగా (సహాయంగా); తఱిమినన్= (శత్రువులను) తరుమగా; ధృష్టద్యుమ్న ప్రముఖ= ధృష్టద్యుమ్నుడూ మొదలైన; రథిక వరులు= సైన్యంలోని మొనగాళ్ళు; తల కడచి= అతిక్రమించి (ముందు మిగిలి); భారద్వాజున్+తాఁకుటయున్= ద్రోణుడిని ఎదుర్కొనగా; మనదిక్కు రాజకుమార వర్గంబు= మన ప్రక్కన ఉండే రాజకుమారులు; దుశ్శాసనున్+మున్నిడికొని= దుశ్శాసనుడిని ముందుంచుకొని; వారలతోన్= పాండవులతో; తలపడినన్= యుద్ధానికి దిగగా; ఉభయ బలంబులున్= రెండు ప్రక్కల సైనికులునూ; పురికొని= క్రమ్ముకొని; ఓహరి సాహరిన్= తండోపతండాలుగా (గుంపులు గుంపులుగా); పెనఁగుచుండెన్= యుద్ధం చేస్తూ ఉన్నారు; అప్పుడు+అక్కడన్= అప్పుడు ఆ యుద్ధరంగంలో.

**తాత్పర్యం:** ధర్మజ భీమ నకుల సహదేవులు సాత్యకికి సహాయంగా శత్రువులను తరిమారు. ధృష్టద్యుమ్నుడు మొదలైన సేనానులు ద్రోణాచార్యుడిని ఎదుర్కొన్నారు. దుశ్శాసనుడిని ముందుంచుకొని మన రాజకుమారులు పాండవులను ఎదుర్కొని గుంపులు గుంపులుగా యుద్ధం చేయసాగారు.

**క. నరుఁడు దనతేరు వోయెడు । తెరువున కైనంతసేనఁ దీవ్రాస్త్రములన్**
**ధరఁగూల్పఁగ నయ్యెడ న । య్యరదముఁ గృష్ణుండు నడపు టద్భుత మయ్యెన్.** **141**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; తన తేరు= తన రథం; పోయెడు= వెళ్ళుతున్న; తెరువునకున్= దారికి (బాటకు); ఐనంత సేనన్= సాధ్యమైనంత సేనను; తీవ్ర+అస్త్రములన్= భయంకరమయిన బాణాలతో; ధరన్+కూల్పఁగన్= చంపగా; ఆ+ఎడన్= ఆ సమయంలో; ఆ+అరదమున్= ఆ తేరును (అర్జునుడున్న తేరును); కృష్ణుండు= కృష్ణుడు; నడపుట= తోలుట; అద్భుతము+అయ్యెన్= ఆశ్చర్యమైంది.

**తాత్పర్యం:** అర్జునుడు వాడి బాణాలతో తన తేరు వెళ్ళేబాట వరకు కావలసిన సైన్యాన్ని చంపాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు ఆ తేరును తోలిన విధం ఆశ్చర్యంగా ఉన్నది.

**వ. ఇ వ్విధంబున రౌద్రరసంబు దళుకొత్త దర్పంబున సైంధవుం డున్న దిక్కునకుం బోవం బోవ.** **142**

**తాత్పర్యం:** ఈ మాదిరిగా రౌద్రరసం మెరయగా గర్వంతో సైంధవుడుండే దిక్కునకు పోగా పోగా.

### విందానువిందు లర్జునుచేత మృతిఁబొందుట (సం. 7-74-17)

**క. విందానువిందు లేక । స్యందనగతు లై కడంగి సైన్యంబులు దా**
**రుం దెప్పదెరల నా సం । క్రందననందనుని మీఁదఁ గవిసిరి గడిమిన్.** **143**

**ప్రతిపదార్థం:** విందానువిందులు= విందుడు, అనువిందుడు అనే పేరు కలవారు; ఏకస్యందనగతులు+ఐ= ఒకే తేరులో పోతూ; కడంగి= ప్రయత్నించి; సైన్యంబులు= సేనలు; తారును= తాము; తెప్పదెరలన్= చాలా వేగంగా; ఆ సంక్రందననందనుమీఁదన్= ఆ అర్జునుడి మీద; కడిమిన్= పరాక్రమంతో; కవిసిరి= కమ్ముకొన్నారు.

**తాత్పర్యం:** విందానువిందులు ఒకే తేరులో పోతూ, సైన్యాలతో కూడి ఆ అర్జునుడి మీదకు సాహసంతో సాగి, ఆతడి చుట్టూ కమ్ముకొన్నారు.

**వ. ఇ ట్లవంతీశ్వరు లురవడించి.** **144**

**తాత్పర్యం:** ఈ విధంగా అవంతిరాజులు చాలా వేగంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. హరులపయిన్ మురారిపయి నాతని మేనను బాణ వర్షముల్**
**గురిసి; రతండు వారి నతిఘోరశరంబుల నొంప ధీరతం**
**దెరలక వారుఁ దద్రథముఁ దేల్చిరి తూపుల వెల్లి; నల్గి య**
**య్యిరువుర విండులుం దునిమి యేపున మూఁకల పె ల్లడంచుచున్. 145**

**ప్రతిపదార్థం:** హరులపయిన్= గుఱ్ఱాలమీద; మురారి పయిన్= శ్రీకృష్ణుడిమీదను; ఆతని మేనను= అర్జునుడి ఒంటిమీదను; బాణవర్షముల్ కురిసిరి= అమ్ములవానను కురిపించారు; అతండు= ఆ అర్జునుడు; వారిన్= విందానువిందులను; అతిఘోర శరంబులన్= మిక్కిలి వాడి బాణాలతో; నొంపన్= బాధించగా; ధీరతన్= ధైర్యంతో; తెరలక= తొలగిపోకుండా; వారు = అవంతి రాజులు(విందుడు, అనువిందుడు) తద్+రథమున్= వాని తేరును; తూపుల వెల్లిన్= బాణాల వెల్లువలో; తేల్చిరి= తేలకొట్టారు; అల్గి= కోపించి; ఆ+ఇరువుర విండులున్= ఆ విందానువిందుల విండ్లను; తునిమి= విరిచి; ఏపునన్= విజృంభించి; మూఁకల= సైన్యాల; పెల్లు= అతిశయాన్ని; అడంచుచున్= అణస్తూ.

**తాత్పర్యం:** విందానువిందులు అర్జునుడి గుఱ్ఱాలమీదా, శ్రీకృష్ణుడిమీదా, ఆతడి శరీరం మీదా బాణాల వాన కురిపించారు. అర్జునుడు విందానువిందులను వాడిబాణాలతో చాలా బాధించాడు. వారునూ ధైర్యం సడల కుండా బాణప్రవాహంలో తేల్చారు. అర్జునుడు వారి విండ్లనూవిరిచాడు. విజృంభించి వారి సైన్యాల గర్వాన్ని అణగించాడు.

**క. తోడన కడువేగంబునఁ। గ్రీడి తురంగముల సూతుఁ గేతనమును దు**
**న్మాడుచు విందుని దల యిల। పై డొల్లగ నేసెఁ దీవ్రభల్లప్రహతిన్. 146**

**ప్రతిపదార్థం:** తోడన= వెంటనే; కడువేగంబునన్= చాలా తొందరగా; క్రీడి= అర్జునుడు; తురంగములన్= గుఱ్ఱాలను; సూతున్= సారథిని; కేతనమున్= పతాకాన్ని; తున్మాడుచున్= త్రుంచివేస్తూ; విందుని తల= విందుడనే వాడి తలను; ఇలపైన్ డొల్లగన్= భూమిమీద దొర్లగా; తీవ్ర= వాడి అయిన; భల్లప్రహతిన్= బల్లెపు పోటుతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వెంటనే చాలా వేగంగా (విందుడి) తేరు గుఱ్ఱాలను, సూతుడిని, పతాకాన్నీ త్రుంచివేస్తూ, వాడి అయిన బల్లెపుపోటుతో విందుడి తల భూమిమీద దొర్లేటట్లు కొట్టాడు.

**వ. ఇట్లు దలఁ దునుముటయు బలుగాలిం గూలు తరువు పోలికం బడిన యగ్రజు నాలోకించి యనువిందుం డలుకయు నుమ్మలికంబు నుల్లంబునం బెనంగొన గదఁ గొని సంరంభంబున. 147**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తలన్+తునుముటయున్= తలను త్రుంచగా; బలుగాలిన్= పెనుగాలికి; కూలు= పడిపోయే; తరువు పోలికన్= చెట్టుమాదిరిగా; పడిన= పడిపోయిన (అనగా చనిపోయిన); అగ్రజున్+ఆలోకించి= అన్నను చూచి; అనువిందుండు= అనువిందుడనే వాడు; అలుకయున్= కోపమును; ఉమ్మలికంబున్= దుఃఖమును; ఉల్లంబునన్= మనసులో; పెనంగొనన్= పెనగొనగా; గదన్+కొని= గదను తీసికొని; సరంభంబునన్= తొందరగా.

**తాత్పర్యం:** విందుడి తలను అర్జునుడు త్రుంచగా పెనుగాలికి పడిపోయే చెట్టు వలె ఆతడు పడిపోయాడు; అట్లా పడిన అన్నను చూచి అనువిందుడు కోపంతోనూ, దుఃఖంతోనూ గదను తీసికొని త్వరత్వరగా (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**చ. అరదము డిగ్గి తీవ్రగమనాతిశయంబునఁ గిట్టి బాహువి**
**స్ఫురణ దలిర్ప దానవనిషూదను ఫాలము వ్రేసి యార్వ ను**
**ద్ధుర రభసం బెలర్ప గదద్రుంచి పదంబులు బాహుశాఖలున్**
**శిరమును ద్రెంచి వాని బలిసేసె ధనంజయుఁ డాజిభూమికిన్. 148**

**ప్రతిపదార్థం:** ; అరదము డిగ్గి= తేరు దిగి; తీవ్రగమన+అతిశయంబునన్= చాలా వేగంగా; కిట్టి= సమీపించి; బాహు విస్ఫురణ తలిర్పన్= భుజముల బలం వికసించగా; దానవనిషూదను= రాక్షస శత్రువైన శ్రీకృష్ణుడి; ఫాలము వ్రేసి= మొగము మీద కొట్టి; ఆర్వన్= అట్టహాసంచేయగా; ధనంజయుడు= అర్జునుడు; ఉద్ధుర రభసంబు ఎలర్పగన్= గొప్ప వేగం అతిశయించగా; గదద్రుంచి= (అనువిందుని) గదను ముక్కలుగా చేసి; పదంబులు= కాళ్ళు; బాహుశాఖలున్= కొమ్మలవంటి చేతులను; శిరమును= తలను; త్రెంచి= తుంచివేసి; ఆజిభూమికిన్= యుద్ధరంగానికి; వానిన్= అనువిందుని; బలి చేసెన్= బలి చేశాడు.

**తాత్పర్యం:** అనువిందుడు రథం దిగి అధికవేగంతో సమీపించి భుజబలం ప్రకాశించగా రాక్షస శత్రువైన శ్రీకృష్ణుడి నుదురుపై కొట్టి అర్వగా, అర్జునుడు వాడి గదవిరుగగొట్టి కాళ్ళూ, చేతులూ, శిరస్సూ ఖండించి యుద్ధభూమికి బలి యిచ్చాడు.

**ఆ. దొరలు పడిన సేన దూలక యవ్వీరుఁ । జుట్టుముట్టుటయును బెట్టు గవియు**
**కాఱుచిచ్చు దఱచుఁ గానల నీఱుగఁ । జేయు పగిదిఁదోఁపఁ జేసె నతఁడు. 149**

**ప్రతిపదార్థం:** దొరలు పడినన్= తమ రాజులు చనిపోగా; సేన తూలక= సైన్యం తూలిపోకుండా; ఆ వీరున్= ఆ వీరుడిని (అర్జునుడిని) చుట్టుముట్టుటయును= చుట్టుక్రమ్ముకోగా; బెట్టు= దట్టంగా; కవియు= కమ్ముకొనే; కాఱుచిచ్చు= దావాగ్ని; కానలన్= అడవులను; నీఱుగన్= బూడిదగా; చేయు పగిదిన్= చేసేటట్లుగా; అతఁడు= ఆ అర్జునుడు; తోఁపన్+చేసెన్= తోచునట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** (విందానువిందులు) తమ దొరలు పడినా సేనలు తొలగిపోకుండా ఆ వీరుడిని చుట్టుముట్టాయి. అప్పుడు దట్టంగా చుట్టుముట్టిన కార్చిచ్చు అరణ్యాలను కాల్చి బూడిదచేసే విధం తోచేటట్లు ఆ సైన్యాలను అర్జునుడు హతమార్చాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇ వ్విధంబున. 150**

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. అచ్చోటు గదలి వివ్వచ్చుండు సనఁజన । నతని మైవాడును హయ చయంబు**
**డప్పియు నతనికి నప్పుడు సైంధవుఁ । డున్నెడ దూరమై యుండుటయును**
**గని సంతసము నొంది కౌరవయోధులు । సింహనాదంబులు సేసి తఱుమ**
**నా రథికోత్తముం డచ్యుతుఁ జూచి ర । థ్యమ్ముల మేనుల నలుఁగు లుండ**

**తే. నురవడింపవు వీరల సరకు గొనక । వీని నిప్పుడ యమ్ములు విడిచి తడవు**
**మనుడు నతఁ డిది పోలున యనుడుఁ దేరు । డిగ్గి సారించెఁ గ్రీడి గాండివ గుణంబు. 151**

**ప్రతిపదార్థం:** వివ్వచ్చుండు= అర్జునుడు; ఆ+చోటుకదలి= ఆ చోటును విడచి; చనన్ చనన్= వెళ్ళగా; అతనిమైవాడును= ఆ అర్జునుడి శరీరం వాడిపోవుట (అలసిపోవుట); హయచయంబు= గుఱ్ఱాల సమూహానికి; డప్పియున్= దాహము; అతనికిన్=

అర్జునుడికి; అప్పుడు= ఆ సమయాన; సైంధవుఁడున్+ఎడన్+దూరమై ఉండుటయును= సైంధవుడు దూరంగా ఉండటమున్ను; కని= చూచి; కౌరవ యోధులు= కౌరవసేనానులు; సంతసమున్+ఒంది= సంతోషపడి; సింహనాదంబులు= సింహనాదాలు (గర్జనలు); చేసి; తఱుమన్= తరుమగా; ఆ రథిక+ఉత్తముఁడు= ఆ రథికులలో మొనగాడు (అర్జునుడు); అచ్యుతున్+చూచి= శ్రీకృష్ణుడిని చూచి; రథ్యమ్ముల= తేరు గుఱ్ఱాల; మేనులన్= ఒంటిమీద; అలుఁగులు= బాణాల మొనలు; ఉండన్= తగులుకొని ఉండగా; ఉరవడింపపు= వేగంగా పోవు; వీరలన్= ఈ కౌరవులను; సరకు గొనక= లెక్కచేయకుండా; వీనిని= ఈ గుఱ్ఱాలను; ఇప్పుడు= వెంటనే; అఱ్ఱులు= మెడలు; విడిచి= విడిపించి (తీసి); తడవుము= తాకుము (మెడమీది పట్టీలను తీసి పశువులను దువ్వటం వానిని ప్రోత్సాహకంగా తడవుట సంప్రదాయం); అనుడున్= అనగా; ఆతఁడు= శ్రీకృష్ణుడు; ఇది పోలున= ఇది తగినదే; అనుడున్= అనగా; తేరు డిగ్గి= తేరిమీదనుండి దిగి; గాండివగుణంబున్= గాండీవం యొక్క అల్లెత్రాటిని; క్రీడి= అర్జునుడు; సారించెన్= చక్కచేశాడు.

**తాత్పర్యం:** (అర్జునుడు అనువిందుని చంపిన తరువాత) ఆ చోటు దాటి వెళ్ళగా వెళ్ళగా శరీరం అలసిపోయింది. గుఱ్ఱాలు దప్పికతో అలసినవి. సైంధవుడూ దూరంగా ఉన్నాడు. కనుక కౌరవ సైన్యాలు సంతోషంతో సింహనాదం చేస్తూ ఆతడిని తరుమవచ్చాయి. శ్రీకృష్ణుడిని చూచి అర్జునుడు; గుఱ్ఱాల ఒంటిమీద బాణాలు గ్రుచ్చుకొని ఉన్నాయి. అందువల్ల అవి వేగంగా పోలేవు కాబట్టి 'వాళ్ళను లెక్కచేయకుండా గుఱ్ఱాలను తోలి మెడలు మీది పట్టీలను తీసి వాటి శరీరాలను తడవుము' అనుచుండగా కృష్ణుడు అట్లే చేశాడు. అర్జునుడు తేరు దిగి గాండీవాన్ని సారించాడు. (శత్రువుల గుండియలు గుభేలు మనేటట్లు).

**చ.** **ఎడఁగని యబ్బలంబు గడు నేడ్తెఱఁ గిట్టి మహాస్త్రశస్త్రము**
**ల్గడువడిఁ గుప్పఁగూరఁగఁ జలంబున బైఁదొరఁగింప నేచి క**
**వ్వడి వివిధోజ్జ్వలాస్త్రముల వాని వెసన్ మగిడించి తాఁకు పె**
**ల్లడరఁగఁ జేసె మింటికల యంతయుఁ జిట్టలు గట్టుమంటలన్.** **152**

**ప్రతిపదార్థం:** ఎడఁగని= తెరపిచూచి; ఆ+బలంబు= ఆ శత్రుసైన్యం; కడున్= మిక్కిలి; ఏడ్తెఱన్= పరాక్రమంతో; కిట్టి= సమీపించి; మహాస్త్రశస్త్రముల్= శక్తిగల గొప్ప బాణాలు; కడువడిన్= మిక్కిలి తొందరగా; కుప్పఁగూరఁగన్= కుప్పపడేటట్లు; చలంబునన్= పట్టుదలతో; పైఁదొరఁగింపన్= మీద పడేటట్లు వేయగా; కవ్వడి= అర్జునుడు; ఏచి= పెరిగి; వివిధ= నానా విధాలుగా; ఉజ్జ్వల= వెలిగే; అస్త్రములన్= బాణాలతో; వానిన్= ఆ బాణాలను; వెసన్= వెంటనే; మగిడించి= త్రిప్పి; మింటి కలయంతయున్= ఆకసం అంతా; చిట్టలు గట్టుమంటలన్= (చూచేవారికి) అబ్బురమయ్యే మంటలతో; తాకు= తాకిడిని(యుద్ధాన్ని); పెల్లు+అడర చేసెన్= మిక్కిలి ఎక్కువయ్యేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** ఆ ఎడము చూచి శత్రుసైన్యం విజృంభించి పెనుబాణాలు కుప్పలు కుప్పలుగా పట్టుదలతో ప్రయోగించాయి. ఆ బాణాలను తీవ్రబాణాలతో మరలించి ఆకాశమంతా ఆశ్చర్యం గొలిపే మంటలు వ్యాపించే విధంగా అర్జునుడు యుద్ధాన్ని ముమ్మరం చేశాడు.

**వ.** **ఇ త్తెఱంగున.** **153**

**తాత్పర్యం:** ఈ విధంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **లావును వెరవును మెఱయఁగ । నీవీరులు పాండుపుత్త్రునిం బొదివినచో**
**నావీరుని యక్కజ మగు । లావు వెరవుఁ గరతలామలకమై తోఁచెన్.** **154**

**ప్రతిపదార్థం:** లావును= బలమున్నూ; వెరవును= ఉపాయమున్నూ; మెఱయఁగన్= ప్రకాశంకాగా; నీ వీరులు= నీ వైపు ఉన్న వీరులు (కౌరవుల పక్షాన ఉన్నవీరులు); పాండు పుత్రునిన్= అర్జునుడిని; పొదివినచోన్= క్రమ్ముకొన్నప్పుడు; ఆ వీరుని=ఆ వీరుడి

(అర్జునుడి); అక్కజము+అగు= ఆశ్చర్యం కలిగించేదైన; లావు= బలం; వెరవున్= ఉపాయమున్నూ; కరతల+ఆమలకము+ఐ= అరచేతిలో ఉసిరికపండై; తోఁచెన్= కనిపించింది.

**తాత్పర్యం:** బలమూ, ఉపాయమూ ప్రకాశించగా నీ వీరులు అర్జునుడిని చుట్టుముట్టగా, ఆశ్చర్యకరమైన అతడి బలము, ఉపాయమూ అరచేతిలో ఉసిరికపండువలె సులభంగా కనిపించింది.

**వ. అట్టి యెడఁ జతురంగంబులు. 155**

**తాత్పర్యం:** ఆ సమయంలో రథగజతురగ పదాతి బలాలు.

**క. నొచ్చినఁ జచ్చినఁ దెరలిన । విచ్చిన నయ్యెడరు సూచి విసువక పైపైఁ**
**జొచ్చినఁ గడుఁ గ్రిక్కిఱిసిన । నచ్చట మన సేనలోన నార్పులు వెడలెన్. 156**

**ప్రతిపదార్థం:** నొచ్చినన్= నొప్పి కలుగగా; చచ్చినన్= చనిపోగా; తెరలినన్= కలగిపోగా (చికాకు); విచ్చినన్= విడిపోగా; ఆ+ఎడరు= ఆ ఆపదను; చూచి; విసువక= విసిగిపోకుండా; పైపైన్+చొచ్చినన్= మీదమీదకు పోగా; కడున్+క్రిక్కిఱిసినన్= మిక్కిలి ఒత్తిడికాగా; అచ్చటన్= ఆ యుద్ధసమయంలో; మనసేనలోనన్= మన సైన్యంలో; ఆర్పులు= అరుపులు; వెడలెన్= బయలుదేరినవి.

**తాత్పర్యం:** చతురంగబలాలు బాధపడినా, చచ్చిపడినా, కలతచెందినా, విడిపోయినా ఆ ఆపదలను చూచి కూడా విసుగుచెందక మీదిమీదికి రాగా, మిక్కిలి ఒత్తిడికి గురికావటం చేత అక్కడ మనసేనలలో అరుపులు చెలరేగాయి.

**వ. ఆ ఫల్గునుండు పాదచారియై యునికిం దేఁకువ సెడియును గెలుపున కాస పడియును నిట్లు గ్రమ్మిన కౌరవ సైన్యంబు పొంగిన సముద్రంబు పోలిక యగుటకుం దగిన తరంగంబుల చందంబున నిగుడు శర పరంపరల వలనను, ఘోషంబు చాడ్పునం జెలంగు తూర్య నాదంబుల వలనను వివిధ సత్త్వంబుల విధంబున నుల్లసిల్లు మాతంగ తురంగ సుభట స్యందన సందోహంబుల వలనను జలియింపక చెలియలికట్టయుం బోలె నవి నిలువరించి యవ్విక్రమ కుతూహలి విజృంభించిన. 157**

**ప్రతిపదార్థం:** ఆ ఫల్గునుండు= ఆ అర్జునుడు; (ఉత్తరఫల్గునీ నక్షత్రంలో పుట్టినవాడు); పాదచారి ఐ= నడుస్తున్నవాడై; ఉనికిన్= ఉండటంతో; తేఁకువ+చెడియును= ధైర్యం లేకపోయినను; గెలుపునకున్= జయమునకు; ఆసపడియును= ఆసపడి; ఇట్లు క్రమ్మిన= ఈ విధంగా కమ్ముకున్న (ముందు చెప్పినట్లుగా); కౌరవసైన్యంబు= కౌరవసేన; పొంగిన సముద్రంబు పోలికన్= ఉప్పొంగిన సముద్రం వలె; అగుటకున్= అవుటకు; తగిన= సరిపోయిన; తరంగంబుల చందంబునన్= అలలమాదిరిగా; నిగుడు= పెరుగు; శర పరంపర వలనను= బాణాల వరుసలవలనను; ఘోషంబు చాడ్పునన్= సముద్ర ఘోషమువలె; చెలఁగు= ధ్వనించు; తూర్యనాదంబుల వలనను= వాద్యశబ్దాల వలనను; వివిధ సత్త్వంబుల వధంబునన్= వివిధ ప్రాణులను చంపుటచేత; ఉల్లసిల్లు= సంతోషించే; మాతంగ= ఏనుగుల; తురంగ= గుర్రాల; సుభట= మంచి సైనికుల; స్యందన= తేరుల; సందోహంబుల వలనను= గుంపులవలనను; చలియింపక= చీకాకు పడకుండా; చెలియలికట్టయున్+పోలెన్= చెలియలికట్ట మాదిరిగా; (దాటి సముద్ర ముప్పొంగదు); నిలువరించి= ఆపి; ఆ+విక్రమ కుతూహలి= శౌర్యమునం దాసక్తికలవాడైన ఆ అర్జునుడు; విజృంభించినన్= విజృంభించగా.

**తాత్పర్యం:** అర్జునుడు తేరు దిగి నడుస్తూ ఉండటంతో ధైర్యం లేకున్నా మనసైనికులు జయం మీది ఆశతో క్రమ్ముకొన్నారు. అలలవలె వ్యాపించే బాణాలతో, సాగర ఘోషవలె చెలరేగే వాద్య ధ్వనులతో, వివిధ జలచరాలతో విలసిల్లే గజ తురగ భట రథ సమూహాలతో కూడి సముద్రంవలె ఉన్న ఆ కౌరవ సైన్యానికి జంకక చెలియలికట్టవలె దాని పొంగును ఆపి, అర్జునుడు విజృంభించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ. పటుభల్ల నికరంబు పరఁగినఁ బఱియలై । యఱవఱ లయ్యెడు నరదములును**
**నానార్ధచంద్ర బాణ వ్రాత మడరినఁ । దునియ లై మేదినిఁ దొరఁగు కరులు**
**శాతనారాచ పుంజంబులు నిగిడినఁ । గుదురులై కూలెడు ఘోటకములు**
**వివిధాస్త్ర తతులు పర్విన్ఁ గండలై వండఁ । దఱిగినట్లుండు పదాతి చయము**

**తే. నగుచు బీభత్స రౌద్ర మహాద్భుతములు । మూర్తిమంతంబులుగ మన మొనలు రక్త**
**మాంస మేదోస్థి మస్తిష్కమయతఁ జూడ । ఘోర రూపంబులై పరిక్షోభ మొందె. 158**

**ప్రతిపదార్థం:** పటు= తీవ్రమయిన; భల్ల నికరంబు= బల్లెముల సమూహము; పరఁగినన్= వ్యాపించగా; పఱియలు+ఐ= ముక్కలై; అఱవఱలు+అయ్యెడు= చిన్నచిన్న ముక్కలుగా అవుతూఉన్న; అరదములును= తేరులును; నానా= అనేకములైన; అర్ధచంద్రబాణవ్రాతము= అర్ధచంద్రాకారంలో ఉన్న అనేక బాణాల సమూహము; అడరినన్= విజృంభించగా; తునియలు+ఐ= ముక్కలై; మేదినిన్= భూమిమీద; తొరఁగు= పడిపోయే; కరులున్= ఏనుగులును; శాత= వాడి అయిన; నారాచ పుంజంబులు= ఇనుప బాణాల సమూహము; నిగిడినన్= వ్యాపించగా; కుదురులు+ఐ= చుట్టకుదురుల మాదిరి; కూలెడు= పడిపోయే; ఘోటకములున్= గుర్రాలును; వివిధ+అస్త్రతతులు= నానా విధాలైన బాణాల సమూహాలు; పర్వినన్= వ్యాపించగా; కండలు+ఐ= కండలుగా; వండన్= వంటకు తగినట్లు; తఱిగినట్లు ఉండు= తరిగిన విధంగా ఉండే; పదాతి చయమున్= కాల్బలాల సమూహమును; అగుచున్= ఔతూ; బీభత్స రౌద్రమహా+అద్భుతములు= బీభత్సం, రౌద్రం, అద్భుతరసాలు; మూర్తిమంతంబులుగన్= ఆకారాలు చెందినట్లుగా; మనమొనలు= మన సైన్యాలు; రక్త+మాంస+మేదః+అస్థి+మస్తిష్క+మయతన్= నెత్తురు, మాంసం, మెదడు, ఎముకలు, పుర్రెలు, నిండి ఉండటంచేత; చూడన్= చూడటానికి; ఘోర రూపంబులు+ఐ= భయంకరమయిన ఆకారాలు కలిగినవై; పరిక్షోభము+ఒందెన్= చీకాకు పడ్డాయి.

**తాత్పర్యం:** అర్జునుడు బల్లేలతో కొట్టగా తేరులు ముక్కలయ్యాయి. అర్ధచంద్రాకార బాణాల దెబ్బలకు ఏనుగులు ముక్కలుగా పడ్డాయి. ఇనుప బాణాల దెబ్బలకు గుర్రాలు చుట్టకుదురులుగా పడ్డాయి. వివిధ బాణాలతాకిడికి పదాతిసైన్యం వంటకు తరిగే కండలుగా అయ్యాయి. ఈ స్థితి చూచేవారికి బీభత్స రౌద్ర అద్భుత రసాలను మూర్తీభవించినట్లు; (మనసైన్యాలు) నెత్తురు, మాంసము, మెదడు, ఎముకలు, పుర్రెల గుంపుతో నిండి భయంకరాకారంతో మిక్కిలి కలత పొందాయి.

**వ. ఇవ్విధంబునఁ గురుసేనం గనుపుకొట్టి నవ్వుచున్న కవ్వడిం గనుంగొని కమలనాభుండు. 159**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; కురుసేనన్= కౌరవసైన్యాన్ని; కనుపుకొట్టి= ముక్కలు చేసి; నవ్వుచు+ఉన్న; కవ్వడిన్= అర్జునుని; కనుంగొని= చూచి; కమలనాభుండు= పద్మమును నాభిగాగలవాడు-(విష్ణు స్వరూపుడైన కృష్ణుడు)

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా కౌరవసైన్యాన్ని ముక్కలుగా చేసి నవ్వుతూన్న అర్జునుడిని చూచి శ్రీకృష్ణుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పెటికితి నలుఁగులు మేనులు । నెఱిఁ బడ నెల్లెడలఁ గలయ నివిరితి హరు లి**
**త్తఱి నీళులు ద్రావక తె । ప్పిఱి వెట్లొకొ? శత్రు సైన్య భీకర మూర్తీ! 160**

**ప్రతిపదార్థం:** శత్రు సైన్య భీకరమూర్తీ!= విరోధి సైన్యానికి భయం కలిగించేవాడా! (అని అర్జునుడిని సంబోధించాడు కృష్ణుడు); అలుఁగులు+పెటికితిన్= బాణముల ముక్కలను పైకి తీశాను (గుర్రాలకు గ్రుచ్చుకొన్న బాణాల ముక్కలను); మేనులు= శరీరాలు; నెఱిఁబడన్= చక్కబడగా; ఎల్లెడలన్ కలయన్= అంతటా; నివిరితిన్= నిమిరాను; చక్కనొత్తినాను; హరులు= గుర్రాలు; ఈ+తఱిన్ = ఈ సమయంలో; నీళులు త్రావక= నీళ్ళు తాగకుండా; తెప్పిఱవు= తెప్పిరిల్లవు; ఎట్లొకొ?= ఏమి చేయాలో?

**తాత్పర్యం:** శత్రుసైన్యానికి భయం కలిగించే అర్జునా! ఈ గుర్రాల ఒడళ్ళమీద గ్రుచ్చుకొన్న బాణాల ముక్కలను పెరికివేశాను. ఒడలంతా నిమిరాను. కాని, నీళ్ళు త్రాగితే కాని ఇవి తెప్పిరిల్లవు. ఏమి చేయాలో?

**క. వెన్నుమునుఁగఁ దివియఁగలే । కున్నను ద్రావఁదగు నీళు లొదవిన హయముల్**
**నిన్ను గెలిపించు' ననవుడుఁ । గన్నుల నగి యర్జునుండు గల వివె యనుచున్. 161**

**ప్రతిపదార్థం:** వెన్నుమునుఁగన్= వీపు తడిసేటట్లుగా మునిగి; తివియఁగన్= బయటికి రాగా; లేక+ఉన్నను= లేకపోయినా; త్రావన్+తగు నీళులు+ఒదవినన్= త్రాగటానికి తగినన్ని నీళ్ళు కలిగితే; హయముల్= (ఈ) గుర్రాలు; నిన్ను గెలిపించున్= నిన్ను గెలిపింపజేయగలవు; అనవుడున్= అనగా; అర్జునుండు= అర్జునుడు; కన్నులన్+నగి= నవ్వును కళ్ళలోనే చూపించి; ఇవె= ఇవిగో; కలవు= ఉన్నాయి (ఇవిగో నీళ్ళున్నాయి); అనుచున్= అని అంటూ.

**తాత్పర్యం:** ఈ గుర్రాలకు వెన్ను తడిసి వెలికి వచ్చేటంతమాత్రం లేకపోయినా, (దప్పిక తీరడానికి) త్రాగేటందుకు తగిన నీళ్ళుంటే చాలును, అవి నీకు జయాన్ని కలిగిస్తాయి' అని కృష్ణుడు అనగా, తాను కన్నులతోనే నవ్వుతూ 'ఇవిగో నీళ్ళు అని అర్జునుడు అంటూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**అర్జునుఁడు దివ్యాస్త్రముల ధరఁ బగిల్చి కొల నుత్పాదించుట (సం. 7-74-32)**

**మ. ధర దివ్యాస్త్ర హతిం బగిల్చి కొల నుత్పాదించి వే దానికి**
**న్శర జాలంబుల నిల్లుగట్ట మన సైన్యంబుల్ వెఱంబొందె, న**
**చ్చెరు వందెన్ సురసంఘముల్; హరి నుతించెం బొంగి యప్పార్థు; భూ**
**వర! మున్నిట్టివి సూడరున్ వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్. 162**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); ధరన్= భూమిని; దివ్యాస్త్రహతిన్= దివ్యబాణాల దెబ్బతో; పగిల్చి= చీల్చి; కొలనున్= కోనేటిని; ఉత్పాదించి= పుట్టించి; వే= వెంటనే; దానికిన్= ఆ కొలనికి; శరజాలంబులన్= బాణాల సమూహాలతో; ఇల్లుకట్టన్= ఇంటిని కట్టగా; మన సైన్యంబుల్= మన సేనలు; వెఱన్+పొందెన్= భయపడ్డాయి; సురసంఘముల్= దేవసమూహాలు; అచ్చెరువు+అందెన్= ఆశ్చర్యపడ్డాయి; హరి= శ్రీకృష్ణుడు; పొంగి= సంతోషంతో; ఆ+పార్థున్= ఆ అర్జునుడిని; నుతించెన్= పొగడాడు; మున్ను= ఇదివరకు; ఇట్టివి= ఇటువంటివి; త్రిలోకంబులన్= ముల్లోకాలలో; ఏ+వారున్= ఎవరుకూడా; చూడరున్ వినరున్= చూడలేదు, వినలేదు.

**తాత్పర్యం:** అర్జునుడు దివ్యాస్త్రాలతో భూమిని చీల్చి, కోనేటిని ఏర్పరచి, వెంటనే బాణాలతో దానికి ఇంటినికూడ కట్టాడు. దానిని చూచి మన సైన్యాలు భయపడ్డాయి. దేవ సమూహాలు ఆశ్చర్యపడ్డాయి. సంతోషంతో శ్రీకృష్ణుడర్జునుడిని ప్రశంసించాడు. ఓ రాజా! ఇటువంటి వింతను ఇంతవరకు ముల్లోకాలలో ఎవరూ చూడలేదు, వినలేదు.

**తే. హర్షమందస్మితము తోడ నమ్మురారి । యపుడ హయముల మెయివెట్టునట్లు సేసి**
**తఱిమి నీళులు ద్రావించి తడవి మగుడఁ । దెచ్చె మన యోధు లెల్లను బిచ్చలింప. 163**

**ప్రతిపదార్థం:** ఆ+మురారి= ఆ శ్రీకృష్ణుడు; హర్ష మందస్మితముల తోడన్= సంతోషంతో కూడిన చిరునవ్వుతో; అపుడు+అ= ఆ సమయాన; హయములన్= గుర్రాలను; తఱిమి= తోలి; మెయి+పెట్టు+అట్లు,చేసి= కొలనిలో శరీరాలు పెట్టేటట్లు చేసి అనగా అవి కొలనిలోనికి దిగేటట్లు చేసి; నీళులు త్రావించి= నీళ్ళు త్రాగించి; తడవి= వాటి ఒడళ్ళను నిమిరి; మగుడన్= మళ్ళీ; మన యోధులు= మన సైనికులు; ఎల్లను= అందరూ; పిచ్చలింపన్= భయపడగా; తెచ్చెన్= తీసికొని వచ్చాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు సంతోషంతోనూ, చిరునవ్వుతోనూ ఆ గుఱ్ఱాలను కొలనిలోనికి తోలి నీళ్ళు త్రాగించి, వాటి శరీరాలను నిమిరి, మన సైనికులు అందరూ భయపడుతుండగా మళ్ళీ తోలుకొని వచ్చాడు.

**వ. ఇట్లు సేదదీర్చి. 164**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సేద+తీర్చి= అలసటను పోగొట్టి

**తాత్పర్యం:** ఈ విధంగా గుఱ్ఱాల అలుపును పోగొట్టి.

**క. మును దివ్యాస్త్ర బలంబున । జనియించిన నీరితోన సంభూతం బై**
**యొనరిన ఖాణము మేపెం । దనివు సనం దురగములకు దర్ప మెలర్పన్. 165**

**ప్రతిపదార్థం:** మును= అదివరకే; దివ్య+అస్త్ర బలంబునన్= దివ్యాస్త్రాల శక్తితో; జనియించిన= పుట్టిన; నీరితోనన్= నీళ్ళతో; సంభూతంబు+ఐ= పుట్టి; ఒనరిన= కలిగిన; ఖాణము= గుఱ్ఱాల దాణాను; తనివు చనన్= తృప్తిగా; తురగములకున్= గుఱ్ఱాలకు; దర్పము+ఎలర్పన్= గర్వం ప్రకాశించగా; మేపెన్= మేపించాడు (అనగా మేతగా పెట్టాడు).

**తాత్పర్యం:** దివ్యమైన అస్త్రాల ప్రభావంతో పుట్టిన నీళ్ళతోపాటు అంతకుముందే కలిగిన గుఱ్ఱపు దాణాను గుఱ్ఱాలచేత సగర్వంగా తృప్తితీరా తినిపించాడు.

**వ. మేపి కట్టాయితం బయి మనమూఁకల నడుమం బడంతుల పిండులోనం గ్రాలెడు విలాసియుం బోలె విలసిల్లుచు నమ్మహనీయ రథ్యంబులం బూన్చినఁ బాండవమధ్యముం డా రథం బల్లన యెక్కె; నా తడవున దుర్యోధనుం డనతి దూర వర్తి యై వారలం గని వేగంబున వచ్చుచుండె; వార లక్కడ చూడ; రయ్యవసరంబుననచ్చటి భూవల్లభులెల్ల వెల్లనైన మొగంబులతోడ వెఱఁగంది డెందంబులు గుందుచుండం దమలో ని ట్లనిరి. 166**

**ప్రతిపదార్థం:** మేపి= గుఱ్ఱాలకు దాణాలుమేపి; కట్టాయితంబు+అయి= బాగా సిద్ధమయి; మనమూఁకల నడుమన్= మన సేనల మధ్య; పడంతుల పిండులోనన్= స్త్రీల గుంపులో; క్రాలెడు= వెలిగేటటువంటి; విలాసియున్+పోలెన్= విలాసవంతుడివలె; విలసిల్లుచున్= వెలుగుతూ (ప్రకాశిస్తూ); ఆ+మహనీయ= ఆ గొప్పశక్తిగల; రథ్యంబులన్+పూన్చినన్= గుఱ్ఱాలను సన్నద్ధం చేయగా; పాండవ మధ్యముండు= అర్జునుడు; ఆ రథంబు= ఆ తేరును; అల్లనన్= మెల్లగా; ఎక్కెన్= ఎక్కినాడు; ఆ తడవునన్= ఆ సమయాన; దుర్యోధనుండు; అనతిదూరవర్తి ఐ= దగ్గరగా నడుస్తూ; వారలన్+కాంచి= ఆ సైన్యాన్ని చూచి; వేగంబునన్= వేగంగా వచ్చుచుండెన్= వస్తూ ఉన్నాడు; వారలు= ఆ కృష్ణార్జునులు; అక్కడ చూడరు= ఆ దిక్కు చూడలేదు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; అచ్చటి భూవల్లభులు+ఎల్లన్= అక్కడ ఉండే రాజులందరూ; వెల్లనైన మొగంబులతోడన్= వెలవెలబోయిన మొగాలతో (భయపడిన మొగాలతో); వెఱఁగు+అంది= భయపడి; డెందంబులు= మనస్సులు; కుందుచుండన్= కుములుతూ ఉండగా; తమలోన్+ఇట్లు+అనిరి= తమలో తాము (ఒకరితో ఒకరు) ఇట్లా అనుకొన్నారు.

**తాత్పర్యం:** ఆ విధంగా గుఱ్ఱాలను మేపి, శ్రీకృష్ణుడు మన సేనమధ్యలో ఆడువారి నడుమ ఉన్న రసికుడివలె ప్రకాశిస్తూ, మహనీయ శక్తి కలిగిన గుఱ్ఱాలను పూన్చిరథాన్ని సిద్ధం చేయగా, ఆ తేరు మీదికి అర్జునుడు మెల్లగా ఎక్కాడు. ఆ సమయంలో దుర్యోధనుడు దూరంనుండి వారిని చూచి వేగంగా వారిని సమీపించాడు. వారు ఆ దిక్కు చూడలేదు. అక్కడి రాజులు భయంతో పాలిపోయిన మొగాలతో కుములుతూ తమలో తాము ఈ విధంగా మాట్లాడుకొన్నారు.

**చ. చతురంగంబులు నొక్కపెట్ట వివిధాస్త్ర జ్వాలలం గప్పఁగా**
**నతివేగంబున ఖ్రింగెఁ గ్రోలె ఘనమాయన్ రూ పడంగించె నా**
**నితఁ డన్నింటిని రిత్త పుచ్చుచు మదం బేపార నిమ్మై రణ**
**క్షితియుం బీనుఁగు పెంటఁ జేసెఁ జెనయం జిట్టాడఁగా శక్యమే! 167**

**ప్రతిపదార్థం:** చతురంగంబులున్= రథ గజ తురగ పదాతులును; ఒక్కపెట్టన్= ఒకమారే; వివిధ+అస్త్రజ్వాలలన్= అనేక విధాలయిన బాణాల మంటలతో; కప్పఁగాన్= కప్పివేయగా; అతివేగంబునన్= మిక్కిలివేగంగా; ఖ్రింగెన్= మింగివేశాడు; క్రోలెన్= త్రాగాడు; ఘనమాయన్= పెద్దమాయతో; రూపు+అడంగించెన్= నాశనం చేశాయి; నాన్= అనగా; ఇతఁడు= ఈ అర్జునుడు; అన్నింటిని= పైన చెప్పినవానిని అంతనూ; రిత్తపుచ్చుచున్= అబద్ధం చేస్తూ; మదంబు+ఏపారన్= గర్వం ఎక్కువ కాగా; ఈ+మెయిన్= ఈ విధంగా; రణక్షితియున్= యుద్ధభూమిని కూడా; పీనుఁగుపెంటన్+చేసెన్= పీనుగుల కుప్పగా చేశాడు (ఇతడిని); చెనయన్= ఎదిరించగా; చిట్టాడఁగాన్= సంచరించగా; శక్యమే= సాధ్యమా!

**తాత్పర్యం:** 'చతురంగ బలాలు ఒక్కసారిగా అనేకమైన అస్త్రాలను అతివేగంగా ప్రయోగించగా, మాయాబలంతో శత్రుసైన్యాన్ని కప్పి, మ్రింగి, త్రాగి, రూపులేకుండా చేశాడా అన్నట్లు అర్జునుడు వాటన్నింటిని నిరుపయోగంగా చేస్తూ, గర్వాతిశయంతో వింతగా ఈ రణరంగాన్నంతా పీనుగుల కుప్పలుగా మార్చాడు. ఇటువంటి అర్జునుడిని సమీపించటం, ఎదురించటం సాధ్యమా?

**సీ. కురుసేన పైఁబడ్డ సరకు సేయక మంచు । విరియించు భానుని వెరవు మెఱసి,**
**యిది నడుగల నని యించుక గొంకక । తన ఘోటకంబులఁ దడవఁ బనిచి**
**కొల నక్కజంబుగ నలుఁగుల మొన ఘటి । యించి యమ్ముల దానికిల్లు గట్టి**
**సారథి లీల నశ్వముల కార్యము దీర్చు । నంతకు నవ్వుచు నవుల నిలిచి,**

**ఆ. గారవమునఁ దాను గానివాఁడును బోలె । నరద మెక్కె నింక నడ్డపడఁగ**
**నలవియే పురారి కైనను? వీనిచేఁ । జచ్చువాఁడు గాక సైంధవుండు. 168**

**ప్రతిపదార్థం:** కురుసేన= కౌరవసైన్యాలు; పైన్+పడ్డన్= మీదపడగా; సరకు చేయక= లెక్క పెట్టకుండా; మంచు= మంచును; విరియించు= విప్పజేయు; భానుని= సూర్యుడి; వెఱవు= పద్ధతిని (ఉపాయాన్ని); మెఱసి= ప్రకాశించి; ఇది= ఈ ఉండే చోటు; నడు కలను= యుద్ధరంగానికి నడుమ అని (యుద్ధ మధ్యంలో); ఇంచుక గొంకక= కొంచెమైనా జంకకుండా; తన ఘోటకంబులన్= తన గుఱ్ఱాలను; తడవన్+పనిచి= చేతులతో నిమురజేసి; అక్కజంబుగన్= ఆశ్చర్యంగా; అలుఁగుల మొనన్= బాణాల కొనలతో; కొలను= కోనేటిని; ఘటియించి= తయారుచేసి; అమ్ములన్= బాణాలతో; దానికిన్= ఆ కోనేటికి; ఇల్లుగట్టి= ఇంటినికట్టి; సారథి= బండి తోలువాడు (శ్రీకృష్ణుడు); లీలన్= ఆటగా; అశ్వముల= గుఱ్ఱాల; కార్యము తీర్చునంతకున్= పని పూర్తిచేసే దాకా; నవ్వుచున్= చిరునవ్వుతో; అవ్వల నిలిచి= దూరంగా నిలిచి; గారవమునన్= మర్యాదతో(దర్పంతో); తాను కాని వాఁడును పోలెన్= తాను సంబంధములేని వాడి మాదిరి; అరదము+ఎక్కెన్= తేరుమీదకు ఎక్కాడు; ఇంక అడ్డ పడఁగన్= అతడికి ఇంక అడ్డం పోవటానికి; పురారికైనను= ఈశ్వరుడికైనను; అలవియే?= సాధ్యమా?; సైంధవుండు= సైంధవుడు; వీనిచేన్= ఈ అర్జునుడిచేత; చచ్చువాఁడుగాక= చనిపోయేవాడు కాకుండా (తప్పుకోగలడా); (అని సైనికులు అనుకొన్నారు).

**తాత్పర్యం:** కౌరవసేనలు మీదపడినా లెక్కపెట్టకుండా మంచును విరియజేసే సూర్యుడివలె ప్రకాశించి, తా నుండేది యుద్ధరంగ మధ్యంలో అని సందేహించకుండా తన గుఱ్ఱాలను కృష్ణుడిచేత నిమిరించాడు. చూచేవారికి

ఆశ్చర్యకరంగా బాణాలను వేసి కోనేరును పుట్టించి దానికి ఇల్లు కూడ కట్టాడు. తన రథసారథి విలాసంగా ఆ గుఱ్ఱాల పని పూర్తి చేసేటంతవరకూ చిరునవ్వుతో దూరంగా నిలిచి చూస్తూ ఉండి, ఆ మీద దర్పంతో అంతదాకా జరిగిన పనులకూ తనకూ సంబంధం లేనట్లుగా తేరెక్కాడు. ఇటువంటి అర్జునుడిని అడ్డుకొనటానికి ఈశ్వరుడికి కూడా సాధ్యంకాదు. అర్జునుడి చేతిలో చావకుండా సైంధవుడు తప్పించుకొనలేడు (అని సైనికులు అనుకొంటూ ఉన్నారు).

**వ. అనుచు నీ యోధ వీరులందఱును బెండు వడి యుండిరి గాని యందు నొకండేనియు మార్కొనువాఁడు లేఁడయ్యె నట్లు గోపాల దేవుండును గ్రీడియు బాల క్రీడ విధంబుగా విహరించి యనాయాస గమన విలాసంబు మెఱయం జని చని ప్రొద్దువాలుట గనుంగొని పాంచజన్య దేవదత్తంబు లొత్తి, రయంబు గైకొని యరిగి; రా చక్కటిం గొందఱు నరపతు లొండొరులం బురికొల్పికొని యడ్డపడి తవులు వెట్టి బెట్టు పెనంగి సముద్రంబు సొచ్చిన యేఱులుం బోలె నడంగి; రట్లు సైన్యంబు గడచి బలితంపు వల వ్రచ్చికొని వెలువడిన మహా మత్స్యంబులును రాహు ముఖంబు వెడలిన చంద్రార్కులుం బోలెఁ బొలిచి యట వోవుచుండ నయ్యెడ సైనికులు సింధురాజు పని సాలించి తొలఁగి; రిత్తెఱంగున దుస్తరంబు లగు బహుళ బలంబుల నిస్తరించి యయ్యిరువురుం దలలెత్తి చూచి తమలో నిట్లనిరి. 169**

**ప్రతిపదార్థం:** అనుచున్= అనుకొంటూ (సైంధవుడి చావు తప్పదంటూ); నీ యోధ వీరులు+అందఱును= నీ సైన్యంలోని మొనగాండ్లందరూ; బెండుపడి ఉండిరి కాని= బలహీనపడి ఉన్నారు కాని; అందున్= వారిలో; ఒకండేనియున్= ఒకడైనా; మార్కొను వాఁడు= ఎదిరించేవాడు; లేఁడు+అయ్యెన్= లేకున్నాడు; అట్లు= ఆ విధంగా; (వెనుకటి పద్యంలో వివరించిన విధంగా); గోపాలదేవుండును క్రీడియున్= శ్రీకృష్ణార్జునులు; బాలక్రీడ విధంబుగా= పసి పిల్లల ఆటమాదిరిగా; విహరించి= తిరిగి; అనాయాసగమన విలాసంబు= సుఖంగా నడిచే చేష్ట; మెఱయన్= ప్రకాశించగా; చని చని= పోయి పోయి; ప్రొద్దువాలుట= సూర్యుడస్తమించే సమయాన్ని; కనుంగొని= గుర్తించి; పాంచజన్య దేవదత్తములు= పాంచజన్యము, దేవదత్తమూ అనే పేరుగల తమ శంఖాలను; ఒత్తి= ఊది; రయంబుగైకొని= వేగంగా; అరిగిరి= వెళ్ళారు; ఆ చక్కటిన్= ఆ ప్రక్క; కొందఱు నరపతులు= కొంతమంది రాజులు; ఒండొరులన్= ఒకరినొకరు; పురికొల్పుకొని= హెచ్చరించుకొని; అడ్డపడి= ఆ ఇద్దరికీ అడ్డంగా వచ్చి; తవులు పెట్టి= వెంటపడి; బెట్టుపెనంగి= గట్టిగా పెనగులాడి (యుద్ధంచేసి); సముద్రంబు చొచ్చిన ఏఱులన్ పోలెన్= సముద్రంలో కలిసిన నదుల మాదిరిగా; అడంగిరి= అణగిపోయినారు (తమ ఆకారాలు లేకుండా పోయారు); అట్లు= ఆ విధంగా; సైన్యంబు గడచి= సైన్యాన్ని దాటి; బలితంపు వలన్= పెద్ద వలను; వ్రచ్చికొని= చీల్చుకొని; వెలువడిన= బయటపడిన; మత్స్యంబులును= చేపలును; రాహుముఖంబు వెడలిన= రాహుగ్రహము నోటినుండి బయటపడిన; చంద్ర+అర్కులున్ పోలెన్= చంద్ర సూర్యుల మాదిరిగా; పొలిచి= ఒప్పి ఉండి; అట పోవుచుండన్= ఆ దిక్కులో వెళ్ళుతూ ఉండగా; అయ్యెడన్= అక్కడ(యుద్ధరంగంలో); సింధురాజు పనిచాలించి= సైంధవుడి సేవ చాలించి; సైనికులు; తొలఁగిరి= దూరంగా పోయారు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; దుస్తరంబు+అగు=దాటడానికి వీలులేని; బహుళ బలంబులు= ఎక్కువ అయిన సైన్యాలను; నిస్తరించి= దాటిపోయి; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరూ; తలలు+ఎత్తి= తలలు మీదికి ఎత్తి; చూచి; తమలోన్= తమలో తాము (కృష్ణార్జునులు); ఇట్లు+అనిరి= ఈ విధంగా అన్నారు.

**తాత్పర్యం:** ఆ విధంగా నీ సైనికులంతా బలహీనులయి ఉండిపోయారు. ఒక్కడు కూడా ధైర్యంతో ఎదుర్కొనేవాడు లేకుండాపోయాడు. (వెనుక వర్ణించినట్లు) కృష్ణార్జునులు పిల్లల ఆటగా తిరిగి అనాయాసంగా సాగే నడకల హొయలు మెరయగా ప్రొద్దువాలుట గమనించి, తమ శంఖాలు పాంచజన్య దేవదత్తాలను ఒత్తి, వేగంగా వెళ్ళారు. ఆ ప్రక్కలోని రాజులు ఒకళ్ళొకళ్ళు హెచ్చరికలతో అడ్డుపడి పెనగులాడి సముద్రంలో కలిసిపోయే ఏరుల వలె అణగిపోయారు.

ఆ విధంగా సైన్యాన్ని దాటుకొని పెను వలను త్రెంచుకొని వచ్చే పెద్ద చేపల మాదిరిగాను, రాహువు నోటినుండి వెలువడిన చంద్రసూర్యుల మాదిరిగాను ఆ దిక్కులో వారు పోతూ ఉండగా, సైనికులంతా సింధురాజు సేవ మానుకొని తొలగి పోయారు. ఈదటానికి అనువుగాని సముద్రం వంటి ఆ సైన్యాన్ని దాటి, తల లెత్తి వారిద్దరు (కృష్ణార్జునులు) తమలో తాము ఇట్లా మాట్లాడుకొన్నారు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. వీఁడె సైంధవుండు! వీని చుట్లను గృప । శల్య గురుతనూజ సౌమదత్తి**
**కర్ణ కర్ణ సుతులు గావలి యున్నారు; । పోటు మగలు గాన పూఁచి పట్టి. 170**

**ప్రతిపదార్థం:** వీఁడె సైంధవుండు= ఇతడే సైంధవుడు; వీని చుట్లను= వీడికి అన్నివైపుల; కృప శల్య గురుతనూజ సౌమదత్తి శల్య కర్ణ కర్ణ సుతులు= కృపుడు, శల్యుడు, అశ్వత్థామ, బాహ్లికుడు, కర్ణుడు, వృషసేనుడు (మొదలైనవారు); పోటు మగలు= పేరు మోసిన వీరులు; కానన్= అయినందుచేత; పూఁచిపట్టి= ప్రయత్నంతో; కావలి ఉన్నారు= కాపుదలగా ఉన్నారు.

**తాత్పర్యం:** (కృష్ణార్జునులు తమలో తాము) ఈ ఎదురుగా ఉన్నవాడే సైంధవుడు. పేరుకెక్కిన పెద్ద యోధులు కనుక కృపుడు, శల్యుడు, అశ్వత్థామ, బాహ్లికుడు, కర్ణుడు, వృషసేనుడు, సైంధవుడికి అన్నివైపుల గట్టి కాపలా ఉన్నారు.'

**వ. అని పలికి వారలలో నా జయద్రథుం దప్పక చూచి వెండియు. 171**

**తాత్పర్యం:** అని చెప్పి వాళ్ళలో సైంధవుడిని బాగా చూచి మరల ఇట్లా అన్నారు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'వీ రేమి గాచెదరు? తా । నే రూపున బ్రదుకు? వీర లేల? సురలు జం**
**భారియుఁ గాచినఁ దన్నును । బారిసమరి కాక నింగిఁ బడనిచ్చెదమే?' 172**

**ప్రతిపదార్థం:** వీరు+ఏమి కాచెదరు?= ఈ సైనికులు ఏ విధంగా సైంధవుడిని కాపాడగలరు?; తాను+ఏరూపున బ్రదుకున్?= వీ డేవిధంగా బ్రతుకుతాడు?; వీరలు+ఏల?= వీరే కాదు; సురలు= దేవతలు; జంభారియున్= ఇంద్రుడును; కాచినన్= కాపాడినా; బారి సమరి= చంపి; కాక= కాకుండా; నింగిన్= ఆకాశాన్ని; పడనిచ్చెదమే?= పడనిస్తామా?

**తాత్పర్యం:** 'ఈ వీరులు సైంధవుడిని ఏమి కాపాడగలరు? ఇక అతడు ఎట్లా బతుకుతాడు? ఈ వీరులే కాదు - దేవతలూ దేవేంద్రుడూ కూడా కలిసి కాపాడటానికి ప్రయత్నం చేసినా అతడిని చంపికాని పొద్దుక్రుంక నీయం.

**క. అను పలుకులు నీ యోధులుఁ । దనయులు వినుచుండ ఘోరతరదుర్గము లె**
**ల్లను గడచి లాభదేశము । సనఁ జొచ్చిన వణిజులట్ల సమ్మదలీలన్. 173**

**ప్రతిపదార్థం:** అను పలుకులు= అని (కృష్ణార్జునులు) మాటాడే మాటలు; నీ యోధులున్, తనయులున్= నీ సైనికులూ, కుమారులూ; వినుచుండన్= వింటూ ఉండగా; ఘోరతర= భయంకరమైన; దుర్గములు+ఎల్లను= కోటలన్నింటినీ; కడచి= దాటి; లాభదేశమున్= అదృష్టమును కలిగించే దేశంలోకి; చనన్+చొచ్చిన= ప్రవేశించిన; వణిజులు+అట్లు+అ= వ్యాపారుల మాదిరి; సమ్మదలీలన్= సంతోషంతో.

**తాత్పర్యం:** ఆ మాటలు నీ కుమారులు, సైనికులూ వింటూ ఉండగా భయంకరమైన కోటలను దాటి లాభసాటి అయిన దేశంలో అడుగుపెట్టిన వ్యాపారుల వలె (కృష్ణార్జునులు) సంతోషంతో.

**వ. ఒప్పిన యప్పురుష సత్తములం గనుంగొని యారథిక జనంబులు విస్మయంబునం దమలో ని ట్లనిరి. 174**

**ప్రతిపదార్థం:** ఒప్పిన= ప్రకాశించిన; ఆ+పురుష సత్తములన్= ఆ పురుషశ్రేష్ఠులను; కనుంగొని=చూచి; ఆ,రథికజనంబులు=రథంమీది నుండి యుద్ధంచేసే ఆ వీరులు; విస్మయంబునన్= ఆశ్చర్యముతో; తమలోన్= తమలో తాము; ఇట్లు+అనిరి= ఈ విధంగా అనుకొన్నారు.

**తాత్పర్యం:** ఆ విధంగా ప్రకాశించే ఆ పురుషశ్రేష్ఠులను చూచి, ఆ రథికులు ఆశ్చర్యపడి తమలో తాము ఈ విధంగా అనుకొన్నారు.

**తే. పెక్కు నదు లీఁది వెడలుట, పేర్చు దావ । శిఖలు గడచుట, దారుణాశీవిషముల**
**బారి దప్పుట గాదె! కుంభజముఖోగ్ర శూరయోధుల మిగిలి వచ్చుటఁ దలంప. 175**

**ప్రతిపదార్థం:** కుంభజముఖ= ద్రోణుడు మొదలయిన; ఉగ్ర= తీవ్రమయిన; శూరయోధులన్= శూరులయిన వీరులను; మిగిలి వచ్చుట= దాటుకొని రావటం; తలంపన్= భావించగా; పెక్కునదులు= అనేకములయిన నదులను; ఈఁది వెడలుట= ఈది గట్టెక్కటమును; పేర్చు= ఎక్కువైన; దావశిఖలు= దావాగ్ని మంటలను; కడచుట= దాటటం; దారుణ= భయంకరమయిన; ఆశీవిషముల= పాముల; బారి తప్పుట= దెబ్బ తప్పించుకొనటం; కాదె!= కాదా!.

**తాత్పర్యం:** ద్రోణుడు మొదలైన క్రూరవీరశూరులను దాటి యుద్ధంలో ముందుకు రావటం - ఆలోచించి చూస్తే, అనేక నదులను ఈది ఒడ్డుకెక్కటం, కమ్ముకొని విజృంభించిన దావాగ్నిజ్వాలలను దాటటం, భయంకర సర్పాల బారిన పడకుండా తప్పించుకోవటం కాదా!

**విశేషం:** అలం: నిదర్శన.

**వ. అనుచు నాకృష్ణుల నుపలక్షించి. 176**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని అనుకొంటూ; ఆ, కృష్ణులన్= ఆ కృష్ణార్జునులను, ఉపలక్షించి= చూచి

**తాత్పర్యం:** అని పలుకుతూ ఆ కృష్ణార్జునులను చూచి.

**క. 'గురుముఖ బహురథిక శరో । త్కరములచే నైన క్రొత్త గంట్లను సుమనో**
**భరిత నవకర్ణికార । స్ఫురితాచలయుగము భంగిఁ బొలిచిరి చూడన్.' 177**

**ప్రతిపదార్థం:** గురుముఖ= గురువైన ద్రోణుడు మొదలయిన; బహురథిక= అనేకులయిన వీరుల; శర+ఉత్కరములచేన్= బాణ సమూహాల వలన; ఐన= అయినటువంటి; క్రొత్తగంట్లను= కొత్త గాయాలను; సుమనోభరిత= పూలతో కూడిన; నవ= క్రొత్త; కర్ణికార= కొండగోగులతో; స్ఫురిత= అందగించిన; అచల యుగము= కొండలజంట; భంగిన్= మాదిరిగా; చూడన్= చూడటానికి; పొలిచిరి= ఒప్పారారు.

**తాత్పర్యం:** 'ద్రోణాదులయిన చాలామంది రథిక వీరులు బాణాలతో కొట్టటం వల్ల కలిగిన క్రొత్త గాయాలతో అప్పుడే పూచిన క్రొత్త కొండగోగుపూలతో ఒప్పారే రెండు కొండల వలె కృష్ణార్జునులు చూడ ముచ్చటగ అగుపించారు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అని యగ్గించుచు సింధువి । భునిదెస విగతాశు లైరి భూవల్లభ! య**
**వ్వనజాక్షు లెఱ్ఱసెర లొ । ప్ప నతని వీక్షించి యార్చి బరవస మలరన్. 178**

**ప్రతిపదార్థం:** భూవల్లభ!= ఓ రాజా! (ఓ ధృతరాష్ట్రా!); అని అగ్గించుచున్= ఆ విధంగా కీర్తిస్తూ; సింధువిభుని దెసన్= సైంధవుడిని గూర్చి; విగత+ఆశులు+ఐరి= ఆస వదలుకొన్నారు; (సైంధవుడిని కాపాడలేమను నమ్మకంతో ఉండిపోయారు); ఆ+వనజ+అక్షులు= ఆ తామరస నేత్రులు (కృష్ణార్జునులు); ఎఱ్ఱసెరలు+ఒప్పన్= కోపంవలన ఏర్పడే కంటి ఎర్రజీరలు అమరగా; అతనిన్= ఆ సైంధవుడిని; వీక్షించి= చూచి; బరవసము+అలరన్= ధైర్యం అతిశయించగా; ఆర్చి= పెద్దగా అరచి (సింహనాదం చేసి).

**తాత్పర్యం:** ఓ రాజా! ఆ విధంగా ప్రశంసిస్తూ సైంధవుడిమీద మన సైనికులు ఆశ వదలుకొన్నారు. కృష్ణార్జునులు కోపంతో కన్నులలో ఎర్రజీరలు ఒప్పారగా సైంధవుడిని చూచి, గర్వంతో పెనుబొబ్బపెట్టి సింహనాదం చేసి.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్రమహాభారతము

## ద్రోణపర్వము - చతుర్థాశ్వాసము

**క. శ్రీమత్త్వాయుష్మత్త్వ సు। ధీమత్త్వ ప్రద కటాక్ష దీపిత భక్త**
**స్తోమారామవసంతా!। వ్యామోహ ప్రశమకరణ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీమత్త్వ= సంపదను కలిగి ఉండటం; ఆయుష్మత్త్వ= ఆయుస్సును కలిగి ఉండటం; సుధీమత్త్వ= శ్రేష్ఠమైన, విజ్ఞానమును కలిగి ఉండటం; ప్రద= ఇచ్చునటువంటి; కటాక్ష= కడకంటిచూపుతో; దీపిత= ప్రకాశింపజేయబడిన (వెలిగేటట్లు చేసిన); భక్తస్తోమ= భక్త సమూహమనే; ఆరామ= ఉద్యానవనానికి; వసంతా!= వసంత ఋతువువంటివాడా! (అనగా భక్తులనే ఉద్యానవనం చిగిర్చి వెలగటానికి వసంత ఋతువు వంటి వాడు హరిహరనాథుడని భావం); వ్యామోహ= మూఢత్వమును (అజ్ఞానమును); ప్రశమకరణ!= పోగొట్టేవాడా!; హరిహరనాథా!= హరిహరనాథస్వామీ!

**తాత్పర్యం:** ఐశ్వర్యాన్ని, ఆయుష్యాన్ని, విజ్ఞానాన్ని అనుగ్రహించే కడగంటి చూపుతో ప్రకాశింపచేయబడిన భక్త సమూహము అనే ఉద్యానవనానికి వసంతుని వంటివాడా! అజ్ఞానాన్ని అణగించేవాడా! ఓ హరిహరనాథా!

**విశేషం:** అలం: రూపకం. హరిహరులను ఇర్వురనూ ఒకే విధంగా ఒకే గుణవిశేషంతో వర్ణించాడు తిక్కన.

### సాత్యకి మొగ్గరంబు సొరంగఁదొడంగుట (సం. 7-89-38)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2**

**తాత్పర్యం:** వైశంపాయనముని జనమేజయుడితో ఈ విధంగా అన్నాడు:

**తే. 'ధర్మపుత్త్రుండు పనుప సాత్యకి గడంగి। తన బలము దెస నడచుట వినిన యాంబి**
**కేయుఁ డర్జునుఁ గలియ శైనేయుఁ బోవ। విడిచిరే మనవా?' రని యడుగుటయును. 3**

**ప్రతిపదార్థం:** ధర్మపుత్త్రుండు పనుపన్= ధర్మరాజు పంపగా; సాత్యకి కడంగి= సాత్యకి పూనుకొని; తన బలము దెసన్= తన సైన్య మున్న దిక్కుకు; నడచుట= పోవటం; వినిన= విన్నట్టి; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; అర్జునున్= అర్జునుడిని; కలయన్= కలియటానికి; శైనేయున్= సాత్యకిని; పోవన్= పోవుటకు; మనవారు= మనసైన్యాలు; విడిచిరే?= వదలినారా?; అని అడుగుటయును= అని అడుగగా.

**తాత్పర్యం:** 'ధర్మరాజు పంపగా సాత్యకి పూనికతో కౌరవబలాలవైపు పోవటం విని ధృతరాష్ట్రుడు 'సాత్యకి ఆ విధంగా అర్జునుడిని కలియటానికి పోతూ ఉంటే మనవారు అతడిని ఎదుర్కొనకుండా, పోనిచ్చారా?' అని అడుగగా.

**వ. సంజయుం డతని కిట్లను; 'నట్లు మఱందిం బనిచి యుధిష్ఠిరుం డాచార్యుల నవలోకించి యాశిని వరుపిఱుందన తటిమె; నప్పుడు ధృష్టద్యుమ్నుం డవష్టంభంబున నెలుంగెత్తి పురికొల్పి పాండవసైనికులు గవిసిన మనవారును మార్కొనిరి; తదనంతరంబ. 4**

**ప్రతిపదార్థం:** సంజయుండు; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనున్= ఈ ప్రకారంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; మఱందిన్+పనిచి= మేనమరదిని ఆజ్ఞాపించి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఆచార్యువలను= ద్రోణుని దిక్కు; అవలోకించి= చూచి; ఆ శినివరు= ఆ శినివంశంలో ఉత్తముడైనవాని (సాత్యకి); పిఱుందన్= వెంటనే; తఱిమెన్= తరిమాడు; అప్పుడు= ఆ సమయంలో; ధృష్టద్యుమ్నుండు= పాండవసేనాని అయిన ధృష్టద్యుమ్నుడు (ద్రుపదుడి కుమారుడు); అవష్టంభంబునన్= గర్వంతో; ఎలుంగు+ఎత్తి= గొంతెత్తి; పురికొల్పన్= ప్రేరేపించగా; పాండవ సైనికులు= పాండవ బలాలు; కవిసినన్= క్రమ్ముకొనగా; మనవారును= మనసైన్యాలు కూడా; మార్కొనిరి= ఎదుర్కొన్నారు; తదనంతరంబు+అ= ఆ మీదట.

**తాత్పర్యం:** ధర్మరాజు మేనమరది అయిన సాత్యకిని ఆ విధంగా ఆజ్ఞాపించి, ద్రోణుడున్న దిక్కు చూచి, అతడిని వెంటనే తరిమాడు. ఆ సమయంలో ధృష్టద్యుమ్నుడు గర్వంతో గొంతెత్తి ప్రేరేపించగా పాండవ సైనికులు మనవారిని క్రమ్ముకొన్నారు. మన సైనికులు కూడ ఎదుర్కొన్నారు. ఆ మీద (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తలలను గరముల వక్ష। స్థ్సలముల జఘనములఁ దొడలఁ జరణంబుల న**
**య్యిలఁ గప్పెడు సాత్యకి కో। ల్తల కోర్వక నీ బలము గలంగంబడియెన్. 5**

**ప్రతిపదార్థం:** ఆ+ఇలన్= ఆ యుద్ధరంగంలో; తలలను= తలలను; కరములన్= చేతులను; వక్షస్థ్సలములన్= రొమ్ములను; జఘనములన్= నడుములను; తొడలన్= తొడలను; చరణంబులన్= పాదాలను; కప్పెడు= కప్పివేసే; సాత్యకి= సాత్యకియొక్క; కోల్తలకున్= ఎదురు యుద్ధానికి; ఓర్వక= ఆగలేక; నీ బలము= నీ సైన్యం; కలంగంబడియెన్= చికాకు పడింది.

**తాత్పర్యం:** ఆ యుద్ధరంగంలో ఎదురు నిలిచిన సాత్యకి యుద్ధపద్ధతి నీ సైన్యం తలలను, చేతులను, గుండెలను, నడుములను, తొడలను, పాదాలను నరికి నేలనంతటను పరువగా అతడి-దాడికి తాళలేక నీ సైన్యం చీకాకుపడింది.

**క. విచ్చిన మూఁకల కడ్డము। సొచ్చిన నేడ్వురు నృపాల శూరోత్తములం**
**బుచ్చె జముం గొలువఁగ వి। వ్వచ్చుమఱఁది పెఱ నృపాల వర్గము దెరలన్. 6**

**ప్రతిపదార్థం:** విచ్చినమూఁకలకున్= చెదరిన సైన్యానికి; అడ్డము చొచ్చినన్= అడ్డంగా దూరిన (సహాయంగా సాత్యకి సైనికుల మధ్య అడ్డంగా దూరిన); ఏడ్వురు= ఏడుగురు; నృపాలశూర+ఉత్తములన్= రాజవీర శ్రేష్ఠులను; వివ్వచ్చుమఱఁది= అర్జునుడి మేనమరది (సాత్యకి); పెఱనృపాల వర్గము= మిగిలిన రాజసమూహం; తెరలన్= (భయంతో) తొలగిపోగా; జమున్+కొలువంగన్= యముడిని సేవించటానికి; పుచ్చెన్= పంపాడు (అనగా చంపాడని భావం).

**తాత్పర్యం:** చెదరిపోయిన సైన్యాలకు సాయంచేయటానికి (నిలపటానికి) అడ్డంగా వచ్చిన రాజవీర శ్రేష్ఠులను ఏడుగురుని, యుద్ధరంగంలోని తక్కిన రాజులు బెదరి, చెదరిపోగా, సాత్యకి యముడికి సేవ చేయటానికై వారిని పంపాడు.

**విశేషం:** అలం: పర్యాయోక్తం. చంపెను అనటానికి 'పుచ్చె జముం గొలువఁగ' అని భంగ్యంతరంచే చెప్పటంచేత అలంకారం పర్యాయోక్తము.

**సీ. ఆ సమయంబున నతని మార్కొని కుంభ। భవుఁ డేడు తూపులు వఱపె మేన**
**నతఁ డస్త్రసప్తకహతుఁ జేసె; నాతని। నగ్గురుఁ డాఱింట నశ్వములను**
**సూతు నాతని నొంచె; నాత డయ్యాచార్యు। నేపుమైఁ బదియును నేడు నాఱు**
**నెనిమిదియును బదునెనిమిదియును శాత। శరముల నొప్పించి తురగచయము**

**ఆ. నాల్గు సాయకముల నడికించి సారథి। నొక్క మార్గణమున ను బ్బడంచి**
**యార్చుటయును ద్రోణుఁ డలిగి । వాలమ్ములఁ బొదివెఁ దద్రథంబు మద మెలర్ప. 7**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= సాత్యకి ఆ విధంగా యుద్ధం చేసేటప్పుడు; కుంభ భవుఁడు= ద్రోణాచార్యుడు; అతనిన్= ఆ సాత్యకిని; మార్కొని= ఎదుర్కొని; ఏడుతూపులు= ఏడు బాణాలు; మేనన్= అతడి శరీరంలో; పఱపెన్= నాటాడు; అతండు= ఆ సాత్యకి; అస్త్రసప్తక= ఏడు బాణాలతో; హతున్+చేసెన్= (ఆచార్యుడిని) దెబ్బతినేటట్లు చేశాడు; ఆ+గురుఁడు= ఆ ద్రోణాచార్యుడు; ఆతనిని= సాత్యకిని; ఆఱింటన్= ఆరింటితోను; అశ్వములను= గుర్రాలను; సూతున్= సారథిని; ఆతనిన్= ఆ సాత్యకిని; నొంచెన్= బాధించాడు; ఆతఁడు= ఆ సాత్యకి; ఏపుమైన్= విజృంభణంతో; ఆ+ఆచార్యున్= ఆ ద్రోణాచార్యుడిని (గురువును); పదియును= పదింటితోను; ఏడు= ఏడింటితోను; ఆఱు= ఆఱింటితోను; ఎనిమిదియును= ఎనిమిదింటితోను; పదునెనిమిదియును= పదునెనిమిదింటితోను; శాత= వాడియైన; శరములన్= బాణాలతో; నొప్పించి= బాధించి; తురగచయమున్= గుర్రములను; నాల్గు సాయకములన్= నాల్గు బాణాలతో; అడికించి= భయపెట్టి; సారథిని= సూతుని; ఒక్క మార్గణమునన్= ఒక వాడి అమ్ముతో; ఉబ్బు+అడంచి= గర్వాన్ని నాశంచేసి; ఆర్చుటయును= సింహనాదం చేయటంతో; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; అలిగి= కోపించి; మదము= గర్వము; ఎలర్పన్= ఎక్కువ కాగా; తద్రథంబున్= ఆ సాత్యకియొక్క తేరును; వాలమ్ములన్= వాడి అయిన బాణాలతో పొదివెన్= క్రమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా యుద్ధం జరిగేటప్పుడు ద్రోణుడు సాత్యకిని ఏడు బాణాలతో కొట్టాడు. అందుకు బదులుగా సాత్యకి కూడా ఏడు బాణాలతో ద్రోణుని కొట్టాడు. అపుడు ద్రోణుడు వరుసగా సాత్యకి మీద ఆరు బాణాలు వేసి అతడిని, సూతుడిని, గుర్రాలను దెబ్బతీశాడు. అందు కా సాత్యకి విజృంభించి ఆచార్యుడిని పది, ఏడు, ఆరు, ఎనిమిది, పద్దెనిమిది సంఖ్యలు గల వాడి బాణాలతో బాధించాడు. గుర్రాలను నాల్గు బాణాలతో భయపెట్టి, సూతుడిని ఒక తూపుతో హతమార్చి సింహనాదం చేశాడు. ద్రోణుడి కంతట కోపం ఎక్కువ కాగా వాడి అయిన బాణాలతో సాత్యకి తేరును క్రమ్ముకొన్నాడు.

**వ. ఇట్లు బాణజాలంబు గుప్పి గురుండు సాత్యకి నుపలక్షించి. 8**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; బాణజాలంబు= బాణముల యొక్క సమూహము; గుప్పి= ప్రయోగించి; గురుండు= ద్రోణుడు; సాత్యకిన్= సాత్యకిని; ఉపలక్షించి= చూచి

**తాత్పర్యం:** ఈ విధంగా బాణాల సమూహాన్ని గుప్పిస్తూ ద్రోణుడు సాత్యకిని చూచి.

**క. 'నా చేతి బలువు గని నీ । యాచార్యుం డోడి తొలఁగి యరిగెను నీవే**
**త్రోచి యట వోవు వాఁడవు । సూచెదుగా కెట్లు నిన్ను స్రుక్కించెదనో! 9**

**ప్రతిపదార్థం:** నా చేతి బలువు= నా భుజశక్తిని; కని= చూచి; నీ ఆచార్యుండు= నీ గురువైన అర్జునుడు; ఓడి= ఓడిపోయి; తొలఁగి= తప్పుకొని; అరిగెను= వెళ్ళాడు; నీవే త్రోచి= నీవే చొచ్చుకొని; అటపోవువాఁడవు= ఆ విధంగా పోతావు; నిన్నున్= నిన్ను; ఎట్లు= ఏ విధంగా; స్రుక్కించెదనో= బలహీనుని చేస్తానో; చూచెదుగాక!= చూస్తావు కదా!.

**తాత్పర్యం:** నా చేతి బలాన్ని చూచి నీ గురుడు (అర్జునుడు) ఓడి పారిపోయాడు. నీవు కూడ త్వరగా అట్లే పోతావు. ని న్నేవిధంగా బలహీనుని చేస్తానో చూడు'.

**క. అనవుడు 'ధర్మాత్మజు పను । పున నే గాండీవికడకుఁ బోయెద; న న్నిం**
**తన నేటికిఁ? దడవయ్యెడు । ననుగ్రహము సేయు; మర్థ మది పెద్దలకున్.' 10**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; ధర్మరాజు పనుపునన్= ధర్మరాజు ఆజ్ఞతో; ఏన్= నేను; గాండీవికడకున్= అర్జునుడి దగ్గరకు; పోయెదన్= వెళ్ళుతాను; నన్నున్= నన్ను; ఇంత+అనన్= ఇన్నిమాట లనగా; (వెనుకటి పద్యంలో ద్రోణుడాడిన వ్యంగ్యమైన మాటలు); ఏటికిన్?= ఎందుకు?; తడవు+అయ్యెడున్= ఆలస్యమవుతూ ఉన్నది; అనుగ్రహము చేయుము= దయ చూపుము; పెద్దలకున్= పెద్దవారికి; అది అర్థము= అది తగి ఉంటుంది.

**తాత్పర్యం:** ధర్మరాజు ఆజ్ఞచేయగా ‘ నే నర్జునుడి దగ్గరకు పోతూ ఉన్నాను. ఇన్ని మాటలతో నన్నెందుకు బాధిస్తావు? ఆలస్యమవుతూ ఉన్నది. నామీద దయ చూపుము. పెద్దవారి కది ధర్మం’.

**క. అని పలికి తొలఁగిపోవుట । మనమున నూహించి దైత్యమర్దనుతమ్ముం**
**డను సూతుతోడ ‘ద్రోణుఁడు । మనలం బోనీక పెనఁగు మాత్సర్యమునన్. 11**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాటలాడి; తొలఁగిపోవుట= తప్పించుకొనిపోవటాన్ని; మనమునన్= తన మనసులో; ఊహించి= తలచికొని; దైత్యమర్దను తమ్ముండును= సాత్యకియు; (దితి కుమారులయిన రాక్షసులను చంపిన వాడికి - శ్రీకృష్ణుడికి తమ్ముడని); సూతుతోడన్= తన సారథితో; అనున్= ఇట్లా అన్నాడు; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; మనలన్= మనలను; పోనీక= తప్పుకొని పోనీయకుండా; మాత్సర్యమునన్= మచ్చరంతో (పట్టుదలతో); పెనఁగున్= పోరాడుతాడు.

**తాత్పర్యం:** సాత్యకి ద్రోణుడితో ఆ మాటలు మాట్లాడి (అర్జునుడిలాగానే) (ద్రోణుణ్ణి) తొలగి పోవడం మంచిదని మనసులో ఊహించి తన సారథితో ఈ విధంగా అన్నాడు. ద్రోణుడు మాత్సర్యంతో మనలను ముందుకు పోనీకుండా యుద్ధం చేస్తాడు.

**వ. తడసినఁ గర్జంబు దప్పు; నితనికి నోసరించి పోవలయు; విను మిదియె బాహ్లికబలం; బదే యంగసైన్యం; బల్లదె దాక్షిణాత్యసేన; వీనియం దొక్కసందున వెడలు ద’, మని గడంగి యడ్డపడిన నొప్పించి చిక్కువఱిచి పోద మనిన నట్ల కాక యని యద్దారుకానుజుండు ద్రోణునకుం దొలంగించి తేరు దోలందీవ్రబాణంబులు గురియుచు నగ్గురుండు వెనుతవుల నయ్యాదవ సింహుండు సింహవిక్రమంబున నంగచమూచ్ఛేదనంబు సేసి చను నెడఁ గృతవర్మ యాతనిఁ దాఁకి. 12**

**ప్రతిపదార్థం:** తడసినన్= ఆలస్యం చేస్తే; కర్జంబు= పని; తప్పున్= చెడిపోతుంది; ఇతనికిన్= ఈ ద్రోణుడికి; ఓసరించి= తప్పుకొని; పోవలయున్= వెళ్ళవలసి ఉన్నది; ఇదియె బాహ్లిక బలంబు= ఇదిగో బాహ్లికుడి సేన; అదే అంగసైన్యంబు= అదుగో అంగదేశపు సేన; అల్లదె= ఆ దూరంగా కనుపించేదే; దాక్షిణాత్యసేన= దక్షిణ దిక్కునుండి వచ్చినవారి సైన్యం; వీని అందున్= ఈ సేనలో; ఒక్క సందునన్= ఒక సందులో (మధ్యలో దూరి అని భావం); వెడలుదము= వెళ్ళుదాము; అనినన్= అనగా; కడంగి= పూనుకొని; అడ్డపడినన్= అడ్డంరాగా; నొప్పించి= బాధించి; చిక్కుపఱిచి= చికాకుపెట్టి; పోదము+అనినన్= వెళ్ళుదా మనగా; అట్లు+అ కాక+అని= అట్లే అని; ఆ+దారుకానుజుండు= ఆ దారుకుడి తమ్ముడు; ద్రోణునకున్ తొలంగించి= ద్రోణుడిని తప్పించి; తేరు తోలన్= తేరును తోలగా; ఆ+గురుండు= ఆ ద్రోణుడు; తీవ్రబాణంబులన్+కురియుచున్= వాడి బాణాలను వర్షంవలె కురిపిస్తూ; వెనుతవులన్= వెన్నంటగా; ఆ+యాదవ సింహుండు= సింహమువంటి ఆ యాదవుడు; సింహ విక్రమంబునన్= సింహము శౌర్యం వంటి శౌర్యంతో; అంగచమూ= అంగసైన్యాన్ని; ఛేదనంబు చేసి= చంపి; చనుఎడన్= పోయేటప్పుడు; కృతవర్మ; ఆతనిన్+తాఁకి= ఆతడిని తలకొని.

**తాత్పర్యం:** ఆలస్యం అయితే పని చెడిపోతుంది. ఇతడిని తప్పించుకొని పోవలసియుంది. ఈ బాహ్లిక, అంగ, దాక్షిణాత్య సేనలలో సందుచేసికొని వెళ్ళుదాము. ఎవరైనా అడ్డుపడితే నొప్పించి చీకాకు పరిచి వెళ్ళుదాము’. అనగా అట్లే అని దారుకుడి తమ్ముడైన సారథి ద్రోణుని తప్పించి తేరును తోలాడు. గురుడు తీవ్ర బాణాలు కురిపిస్తూ వెంటబడగా, ఆ యాదవసింహం సాత్యకి సింహ పరాక్రమంతో అంగసైన్యాన్ని చీల్చుకొని వెళ్ళుతూ ఉండగా, కృతవర్మ అతడిని ఎదుర్కొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆ అమ్ము లతని మేనం । దూఱంగా నేసి నాల్గు తురగాంగములన్**
**గీఱించినఁ గని ద్రోణుం । డూఱడి ధర్మజుని దెసకు నున్ముఖుఁ డయ్యెన్. 13**

**ప్రతిపదార్థం:** ఆఱు+అమ్ములు= ఆరు బాణాలను; అతని మేనన్= ఆ సాత్యకి శరీరంలో; తూఱంగాన్= చొచ్చుకొని పోయేటట్లు; ఏసి= కొట్టి; నాల్గు= నాల్గుబాణాలతో; తురగ+అంగములన్= గుర్రాల శరీరాలను; గీఱించినన్= చీల్చివేయగా; కని= చూచి; ద్రోణుండు; ఊఱడి= ఊరటతో; ధర్మజుని దెసకున్= ధర్మరాజు దిక్కుకు; ఉన్ముఖుఁడు+అయ్యెన్= ముందుకు సాగాడు.

**తాత్పర్యం:** ఆరు బాణాలను సాత్యకి శరీరంలోకి దూరేటట్లువేసి, నాలుగింటితో గుర్రాల శరీరాలను చీల్చాడు. దానిని (కృతవర్మ యుద్ధగతిని) చూచి ద్రోణుడు ఊరటతో ధర్మజు డున్న వైపునకు పోవటానికి ఉద్యుక్తుడయ్యాడు.

**వ. అక్కడ మొగమయ్యు నిక్కడ నేమఱక యుండె; నప్పుడు. 14**

**ప్రతిపదార్థం:** అక్కడన్= ధర్మరాజు ఉన్నచోట; మొగము+అయ్యున్= మొగము ఉన్నా; ఇక్కడన్= ఈ యుద్ధం జరిగే చోట; ఏమఱక= ఏమరుపాటు లేకుండా; ఉండెన్; అప్పుడు.

**తాత్పర్యం:** ఆ దిక్కునకు మొగమున్నా (ధర్మజుడి దిక్కునకు మొగమయినా) ఇక్కడ ఈ యుద్ధం జరిగే స్థితికి ఏమరుపాటులేకుండా ఉన్నాడు. అప్పుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కృతవర్మయొడల సాత్యకి । శితసాయకములు పదాఱు సెరివినఁ గోపో**
**ద్ధతి మెఱయఁగఁ బలుదూపుల । నతఁ డాతని నుచ్చిపోవునట్లుగ నేసెన్. 15**

**ప్రతిపదార్థం:** కృతవర్మ ఒడలన్= కృతవర్మ ఒంటిమీద; సాత్యకి; శితసాయకములు= వాడిబాణాలు; పదాఱు చెరివినన్= పదునారింటితో గ్రుచ్చగా; కోప+ఉద్ధతి= కోపంవలని దర్పం; మెఱయఁగన్= ప్రకాశించగా; పలుతూపులన్= అనేక బాణాలతో; అతఁడు= కృతవర్మ; ఆతనిన్= సాత్యకిని; ఉచ్చిపోవునట్లుగన్= గ్రుచ్చిదూసికొని పోయేటట్లుగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** వాడి అయిన పదహారు బాణాలను కృతవర్మ శరీరంలో గ్రుచ్చాడు. కోపంతో కృతవర్మ అనేక బాణాలు సాత్యకి ఒంటిలో దూసుకొని పోయేటట్లు కొట్టాడు.

**వ. వెండియు. 16**

**ప్రతిపదార్థం:** వెండియున్= మరలా

**తాత్పర్యం:** ఇంకను. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. విలు దునుమాడి వక్షమున వే పదియమ్ములు నాఁట నాతఁ డు**
**జ్జ్వలఘనశక్తి వైచి కృతవర్మని బాహువు నొంచి ధైర్య ని**
**శ్చలమతి నొండు విల్లు గొని సారథిఁ జంపిన సూతకృత్యమున్**
**వలనుగఁ బూని యా రథికవర్యుఁడు నిల్చె నితాంతధీరతన్. 17**

**ప్రతిపదార్థం:** విలు తునుమాడి= వింటిని త్రుంచివేసి; వేః= వెంటనే; పది అమ్ములన్= పది బాణాలను; వక్షమునన్= గుండెలో; నాఁటన్= గ్రుచ్చగా; ఆతఁడు= సాత్యకి; ఉజ్జ్వల ఘనశక్తి వైచి= మండుతున్న పెద్ద శక్త్యాయుధాన్ని వేసి; కృతవర్మని= కృతవర్మయొక్క; బాహువు నొంచి= భుజమును నొప్పించి; ధైర్యనిశ్చలమతిన్= ధైర్యంతో నిశ్చలమైన మనస్సుతో; ఒండు విల్లు కొని= వేరొకవిల్లును తీసికొని; సారథిన్+చంపినన్= సారథిని చంపగా; ఆ రథిక వర్యుఁడు= ఆ వీరశ్రేష్ఠుడు; సూతకృత్యమున్= సారథి పనిని; నితాంతధీరతన్= మిక్కిలి ధైర్యంతోను; వలనుగన్+పూని= ఉపాయంతోనూ పూనుకొని; నిల్చెన్= నిలిచాడు.

**తాత్పర్యం:** కృతవర్మ సాత్యకి విల్లును త్రుంచి, పది వాడి బాణాలను అతడి గుండెలో గ్రుచ్చాడు. అప్పుడు పెద్ద శక్తితో సాత్యకి కృతవర్మ అతడి భుజాన్ని నొప్పించి ధైర్యనిశ్చలమతితో ఇంకొక విల్లు తీసుకొని సారథిని చంపాడు. అయినా అతడు ధైర్యంతో ఉపాయంగా సారథ్యం చేపట్టి యుద్ధరంగంలో నిలిచాడు.

**వ. నిలిచియు సాత్యకి దెసం దఱుమక భీమసేన పురస్సరంబైన బలంబున కడ్డపడ నరిగె; నవ్విధంబున నతని బెట్టు వఱిచి యా శైనేయుం డచటు గడచి చనియె' ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 18**

**ప్రతిపదార్థం:** నిలిచియున్= ఆగియు; సాత్యకిదెసన్= సాత్యకి వైపు; తఱుమక= తరుమకుండా; భీమసేన పురస్సరంబు+ఐన= భీముడు నాయకుడుగా ఉన్న; బలంబునకున్= సైన్యానికి; అడ్డపడన్= అడ్డం పోవటానికి; అరిగెన్= వెళ్ళాడు; ఆ+విధంబునన్= ఆ ప్రకారంగా (వెనుక వివరించిన విధంగా); అతనిన్= ఆ కృతవర్మను; బెట్టుపఱిచి= ఎక్కువగా కష్టపెట్టి; ఆ శైనేయుండు= ఆ సాత్యకి; అచటు గడచి= ఆ చోటు దాటి; చనియెన్= వెళ్ళాడు; అనినన్ విని= అని చెప్పగా విని; ధృతరాష్ట్రుండు; సంజయునికిన్+ఇట్లు+అనియెన్= సంజయుడితో ముందు చెప్పబోయే విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** కృతవర్మ ధైర్యంగా నిలిచికూడా సాత్యకి ఉన్న దిక్కుకు వెళ్ళకుండా, భీముడు నాయకుడుగా ఉండే సైన్యానికి అడ్డుపడటానికె వెళ్ళాడు. సాత్యకి కూడా ఆ కృతవర్మను మిక్కిలి కష్టపెట్టి, ఆ చోటు వీడి వెళ్ళాడన్నది విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**చ. గురు కృతవర్మ ముఖ్యు లతిఘోరపరాక్రమ శీలు; రట్టి నా**
**దొరలను సైన్యసాగరము దోర్బల సంపద గాసి సేసె న**
**న్నరుఁ డది గాక క్రమ్మఱ వినం గడు విస్మయ మి ట్లజయ్యుఁ డై**
**వెరవున లావునం బరిభవించుచు సాత్యకి యేపు సూపెనే? 19**

**ప్రతిపదార్థం:** గురు= ద్రోణుడు; కృతవర్మముఖ్యులు= కృతవర్మ మొదలైన వారు; అతిఘోర పరాక్రమశీలురు= మిక్కిలి భయంకరంగా శత్రువులను ఆక్రమించుకొనేవారు (జయించేవారు); అట్టి= అటువంటి; నా దొరలను= నా నాయకులను; సైన్యసాగరమున్= సేనా సముద్రాన్ని; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; దోర్బల సంపదన్= భుజశక్తితో (భుజబల మనే సంపదతో); గాసి+చేసెన్= కష్టపెట్టాడు; అదిగాక= అంతమాత్రమే కాకుండా; సాత్యకి; ఇట్లు+అజయ్యుఁడు+ఐ= ఈ విధంగా అజేయుడుగా; వెరవునన్= ఉపాయంతో; లావునన్= బలంతో; పరిభవించుచున్= అవమానిస్తూ; ఏపు చూపెనే?= తన గొప్పతనాన్ని చూపినాడా? (అని); వినన్= వినగా (ఈ విషయాలు); కడు విస్మయము= మిక్కిలి ఆశ్చర్యకరం.

**తాత్పర్యం:** ద్రోణుడు, కృతవర్మ మొదలయిన మొనగాండ్రు మహాభయంకరమైన పరాక్రమం కలవారు. అటువంటి నా సేనానులనూ, సేనాసముద్రాన్నీ తన భుజబలంతో అర్జునుడు కష్టపెట్టాడు. అంతేకాదు. అజేయుడుగా ఉపాయం తోనూ బలంతోనూ మన సైన్యాన్ని అవమానిస్తూ తన గొప్పతనాన్ని చూపుతున్నాడా? ఇది వినటానికి వింతగా ఉన్నది.

**మ. హరియుం బార్థుఁడు నట్లు నేర్పు గల బాహాశక్తిమైఁ జొచ్చుచో**
**దొరలున్ సేనలు బెల్లుఁ గూలుటకు నా దుర్యోధనుం డెంత యా**
**తురతం బొందెనొ? దంతి ఘోటక పదాతుల్ సాత్యకిస్ఫార దో**
**స్స్ఫురణన్ మ్రగ్గుట కెట్లు దాను ననుజుల్ శోకించెనో యక్కటా!' 20**

**ప్రతిపదార్థం:** హరియున్= కృష్ణుడును; పార్థుఁడున్= అర్జునుడును; అట్లు= ఆ విధంగా; నేర్పు కల= నేర్పున్న; బాహాశక్తి మైన్= భుజబలంతో; చొచ్చుచోన్= దూరేటపుడు (సైన్యాలు చొరబారేటప్పుడు); దొరలున్= రాజులును (నాయకులును); సేనలున్= సైన్యాలూ; పెల్లు కూలుటకున్= ఎక్కువగా నశించటానికి; ఆ దుర్యోధనుండు; ఎంత ఆతురతన్= ఎంత ఆరాటాన్ని; పొందెనో?= అందినాడో?; దంతి= ఏనుగులు; ఘోటక= గుర్రాలు; పదాతుల్= కాల్బలం; సాత్యకి= సాత్యకియొక్క; స్ఫార= విస్తారమైన; దోఃస్ఫురణన్= భుజశక్తితో; మ్రగ్గటకున్= నాశనం కావటానికి; తాను= దుర్యోధనుడు; అనుజుల్= తోబుట్టువులు (సోదరులు); అక్కటా!= అయ్యో!; ఎట్లు= ఏ విధంగా; శోకించెనో!= దుఃఖపడ్డాడో!

**తాత్పర్యం:** శ్రీకృష్ణార్జునులు నేర్పు, భుజబలం చూపుతూ సైన్యంలోకి చొచ్చుకొని పోయినందుకూ, పెక్కుమంది సైనికులు నశించినందుకూ దుర్యోధను డెంతగా ఆరాటపడ్డాడో? సాత్యకి భుజశక్తికి నశించిన ఏనుగులనూ, గుఱ్ఱాలనూ కాల్బలమునూ చూచి తన తమ్ములతో కలిసి తా నెంతగా దుఃఖించాడో!'.

**వ. అనవుడు సూతసూనుం డమ్మానవపతి కి ట్లనియె. 21**

**ప్రతిపదార్థం:** అనవుడు= అని అనగా; సూతసూనుండు= సూతునికొడుకైన సంజయుడు; ఆ+మానవపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజునకు; ఇట్లు+అనియెన్= ఇట్లన్నాడు

**తాత్పర్యం:** అనగా సంజయుడు ఆ రాజుతో (ధృతరాష్ట్రుడితో) ఈ విధంగా అన్నాడు.

**క. 'నీ యవినయంబు పెంపున । నీ యాపద సంభవించె; నింక వగచినం**
**బాయునె? యితరుల క్రియ శో । కా యత్తుఁడ వగుట నీకు నర్హమె యధిపా! 22**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా!; నీ అవినయంబు పెంపునన్= నీ అడకువ లేమి కారణంగా; ఈ ఆపద= ఈ కష్టం; సంభవించెన్= కలిగింది; ఇంక వగచినన్= ఇంక ఏడ్చినప్పటికినీ; పాయునె?= పోవునా? (ఈ దుఃఖం పోదు అని); ఇతరుల క్రియన్= ఇతరుల మాదిరిగా (సామాన్యుల వలె); శోక+ఆయత్తుఁడవు+అగుట= దుఃఖవశుడవవటం; నీకున్ అర్హమె?= నీకు తగునా? (అనగా తగదు).

**తాత్పర్యం:** ఓ రాజా! నీ అవినయం కారణంగా ఈ ప్రమాదం కలిగింది. ఇపుడు దుఃఖించిన ప్రయోజన మేమి? సామాన్యులవలె దుఃఖించటం తగునా? (ఓ రాజా! చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకొన్నట్లుంటుంది నీ ఈ చేష్ట - అని సంజయుడు ధృతరాష్ట్రుడితో అన్నాడు.)

**వ. సుస్థిరుండ వై సమర ప్రకారంబు వినుము; 'సాత్యకి యత్తెఱంగునం జని కాంభోజసేనం జొచ్చిన నందలి మేటి మగలు దలపడి; రట్టియెడం గుంభసంభవుండు. 23**

**ప్రతిపదార్థం:** సుస్థిరుండవు+ఐ= స్థిరంగా ఉన్నవాడవై; సమరప్రకారంబు= యుద్ధ విధానం; వినుము; సాత్యకి ఆ+తెఱంగునన్= సాత్యకి ఆ విధంగా; చని= వెళ్ళి; కాంభోజసేనన్= కాంభోజదేశపు సేనలోనికి; చొచ్చినన్= ప్రవేశించగా; అందలి= ఆ సేనలోని; మేటి మగలు= గొప్పవీరులు; తలపడిరి= ఎదుర్కొన్నారు; అట్టి ఎడన్= ఆ సమయంలో; కుంభసంభవుండు= ద్రోణుడు.

**తాత్పర్యం:** దృఢచిత్తంతో యుద్ధ విధానాన్ని వినుము. సాత్యకి ఆ విధంగా కాంభోజసేనలో ప్రవేశించగా వారిలోని గొప్పవీరులు సాత్యకిని ఎదుర్కొన్నారు. అటువంటప్పుడు ద్రోణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కని కృతవర్మకు సారథి । నొనర్చి తన కృత్యమునకు నునిచి కడఁగి యా**
**శినివరు వెనుకొన ధర్మసు । తుని దొర లయ్యస్త్రగురునిఁ దొడర నడరినన్. 24**

**ప్రతిపదార్థం:** (కుంభసంభవుండు= ద్రోణుడు); కని= చూచి; కృతవర్మకున్= కృతవర్మకు; సారథిన్+ఒనర్చి= సూతుడిని ఏర్పాటుచేసి; తన కృత్యమునకున్+ఉనిచి= (వాడిని) తాను చేస్తున్న పనికి నియమించి; కడఁగి= యత్నించి; ఆ శినివరున్= ఆ శినివంశ శ్రేష్ఠుడిని (సాత్యకిని); వెనుకొనన్= వెన్నంటగా; ధర్మసుతుదొరలు= ధర్మరాజు పక్షాన ఉన్న రాజులు; ఆ+అస్త్రగురునిన్= ఆ ధనురాచార్యుడిని; తొడరన్= ఎదుర్కొనటానకి; అడరినన్= విజృంభించగా.

**తాత్పర్యం:** (ద్రోణాచార్యుడు) చూచి కృతవర్మకు సారథిని ఏర్పాటుచేసి తానుచేస్తున్న పనిని-యుద్ధాన్ని-అతనికి అప్పగించి, సాత్యకిని తాను వెంటాడగా, ధర్మరాజు పక్షంలోని సేనా నాయకులు ద్రోణాచార్యుని ఎదుర్కొనటానికి విజృంభించగా

క. వారిఁ గృతవర్మ మార్కొని । దారుణ శర శిఖల నేర్చి తల్లడపఱుపం
గా రయము గుంది నిలిచిరి । వా రొండొరుఁ జూచుచును వివర్ణాకృతులై. 25

**ప్రతిపదార్థం:** కృతవర్మ; వారిన్ మార్కొని= వారిని ఎదుర్కొని; దారుణ శరశిఖలన్= భయంకరమైన బాణాగ్ని జ్వాలలతో; ఏర్చి= కాల్చి; తల్లడ పఱుపన్= తల్లడిల్లజేయగా; వారు= ఆ సైనికులు(పాండవ పక్షంవారు); ఒండొరున్ చూచుచున్= ఒకరినొకరు చూస్తూ; వివర్ణ+ఆకృతులు+ఐ= తెల్లబడిన ముఖం కలవారయి; రయము= వేగం; కుంది= తగ్గి; నిలిచిరి= నిలిచారు.

**తాత్పర్యం:** కృతవర్మ వారిని ఎదుర్కొని, భయంకరమైన బాణాగ్ని జ్వాలలతో కాల్చి తల్లడిల్లజేయగా, ఆ సేనా నాయకులు వెలవెల పోయిన ముఖాలతో ఒకరినొకరు చూస్తూ, తమ వేగం మందగిల్లగా నిలిచారు.

వ. ఇట్లు హార్దిక్యుబలు విడి కోహటించిన రథికులం బురికొలిపికొని వృకోదరుండు సోదరపుత్త్రమిత్త్ర సహితంబుగా నతనిపై గవిసె; నట్టి సమయంబున నయ్యనిలజుండును ధృష్టద్యుమ్నుండును శరత్రయంబులను, ధర్మనందన ద్రుపదులు బాణపంచకంబులను, హైడింబుం డేడమ్ములను, మత్స్యపతి పదియేనింటను, సహదేవుం డిరువదేనింటను, శిఖండి యిరువదింటను, ద్రౌపదేయులు డెబ్బది తూపులను, నకులుండు సాయక శతంబునను నొక్కుమ్మడి నమ్మేటివిలుకానిం బొదివిన నతండు. 26

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; హార్దిక్యుబలువిడికిన్= హార్దిక్యుని పద్ధతికి (యుద్ధపద్ధతికి); ఓహటించిన= వెనుకంజ వేసిన; రథికులన్= రథవీరులను; పురికొలిపికొని= ప్రేరేపించుకొంటూ; వృకోదరుండు= భీమసేనుడు; సోదర పుత్త్ర మిత్త్ర సహితంబుగాన్= తోబుట్టువులతో, కుమారులతో, స్నేహితులతోకూడా; అతనిపైన్= ఆ హార్దిక్యుని మీదకు; కవిసెన్= క్రమ్ముకొన్నాడు; అట్టి సమయం బునన్= ఆ వేళలో; ఆ+అనిలజుండును= ఆ భీమసేనుడును; ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడుకూడా; శరత్రయంబునన్= మూడు బాణాలతోను; ధర్మనందన ద్రుపదులు= ధర్మరాజు, ద్రుపదుడును; బాణపంచకంబులను= ఐదు బాణాలతోను; హైడిం బుండు= హిడింబ కుమారుడైన ఘటోత్కచుడు; ఏడు అమ్ములను= ఏడు బాణాలను; మత్స్యపతి= విరాటరాజు; పది ఏనింటను= పదునైదు బాణాలతోను; సహదేవుండు; ఇరువది+ఏనింటను= ఇరవై అయిదు బాణాలతోను; శిఖండి; ఇరువదింటను= ఇరువది తోను; ద్రౌపదేయులు= ఉపపాండవులు; డెబ్బదితూపులను= డెబ్భై బాణాలతోను, నకులుండు; సాయకశతంబునను= నూరు బాణాలతోను; ఒక్కుమ్మడిన్= ఒక్కటిగా; ఆ+మేటి విలుకానిన్= ఆ గొప్ప విలుకాడిని; పొదివినన్= క్రమ్ముకోగా; అతండు= ఆ హార్దిక్యుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా కృతవర్మ యుద్ధపద్ధతికి వెనుకంజ వేసిన సేనాపతులను పురికొల్పుతూ సోదర పుత్రమిత్ర సహితంగా భీముడు అతడి మీదకు దూకాడు. ఆ సమయంలో భీమ ధృష్టద్యుమ్నులు మూడు బాణాలతోను, ధర్మనందన ద్రుపదులు ఐదు బాణాలతోను, ఘటోత్కచుడు ఏడింటితోను, విరాటరాజు పదునైదింటితోను, సహ దేవుడు ఇరువది ఐదుతోను, శిఖండి ఇరువదితోను, ఉపపాండవులు డెబ్బై బాణాలతోనూ, నకులుడు నూరు బాణాలతోనూ ఒక్కసారిగా ఆ గొప్ప విలుకాడిని కృతవర్మను క్రమ్ముకొన్నారు. అందుకాతడు(తరువాతి పద్యంతో అన్వయం).

సీ. ఇద్దైదు శరముల నందఱ ద్రుక్కించి, । భీముని నేడింట బెట్టు వఱిచి
ధనువుఁ గేతనమును దునిమి డెబ్బది తూపు । లతిరయంబున నుర మాడ నేయ
సోలిన యమ్మరుత్సుతుఁ జూచి యందఱు । నా కృతవర్మపై నడరి; రంతఁ
దెలిసి వృకోదరుం డలఘు దారుణసము । జ్జ్వలశక్తి నాతని వైవ నతఁడు

తే. ముత్తునియఁ జేయ దొడ్డ విల్లెత్తి యతని । యొడలు నెత్తురు వఱ్ఱు సేయుటయు నాస
మీరనందనుఁ దక్కటి వారి నొంచె । మూఁడు మూఁడ మ్ము లేసి యవ్వాడిమగఁడు. 27

**ప్రతిపదార్థం:** అందఱన్= ఎదిరి వీరు లందరిని; ఐదు+ఐదు శరములన్= అయిదయిదు బాణాలతో; స్రుక్కించి= మూర్ఛిల్లచేసి; భీమునిన్= భీమసేనుడిని; ఏడింటన్= ఏడు బాణాలతో; బెట్టువఱిచి= ఎక్కువగా బాధపెట్టి; ధనువున్= వింటిని; కేతనమును= పతాకాన్ని; తునిమి= త్రుంచి వేసి; డెబ్బది తూపులన్= డెబ్బై బాణాలతో; అతిరయంబునన్= మిక్కిలి తొందరగా; ఉరము+ఆడన్= గుండియలో గ్రుచ్చుకొనేటట్లు; ఏయన్= కొట్టగా; సోలిన= సొమ్మసిల్లిన; ఆ+మరుత్సుతున్= ఆ వాయుతనయుడైన భీముడిని; చూచి; అందఱున్= (పాండవ) సైనికులందరునూ; ఆ కృతవర్మపైన్= ఆ కృతవర్మమీదకు; అడరిరి= (బాణాలు వేస్తూ) అతిశయించారు; అంతన్+తెలిసి= అంతలోనే ఒళ్ళు తెలిసి; వృకోదరుండు= భీమసేనుడు; అలఘు= పెద్దదైన; దారుణ= భయంకరమైన సముజ్జ్వలశక్తిన్= మిక్కిలి వెలుగుతూ ఉన్న శక్త్యాయుధాన్ని; అతనిన్= ఆ కృతవర్మను వైవన్= కొట్టగా; అతఁడు= ఆ కృతవర్మ; దొడ్డవిల్లు+ఎత్తి= పెద్దబాణాన్ని తీసికొని; ముత్తునియన్+చేయన్= (ఆ శక్తిని) మూడు ముక్కలు చేయగా; అతని+ఒడలు= ఆ కృతవర్మ ఒంటిని; నెత్తురు వఱ్జు= నెత్తుటి ప్రవాహం; చేయుటయు= చేయగా; ఆ+వాఁడిమగఁడు= ఆ వీరుడైన సైనికుడు (కృతవర్మ); మూఁడు మూఁడు+అమ్ములు+ఏసి= మూడు మూడు బాణాలతో కొట్టి; సమీర+నందనున్= వాయుకుమారుడైన భీముడిని; తక్కటి వారిన్= మిగిలిన వారలను; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** కృతవర్మ తన్నెదిరించిన వీరులందరిని బాధించి అయిదయిదు బాణాలతో పాండవ సైన్యాన్ని బాధించాడు. ఏడింటితో భీముడిని పెద్ద దెబ్బ కొట్టాడు. వింటినీ పతాకాన్నీ త్రుంచివేసి, డెబ్బది బాణాలతో గుండెమీద కొట్టగా భీముడు సొమ్మసిల్లాడు. అపు డా సైనికులంతా కృతవర్మపైకి వెళ్ళారు. అంతలో భీముడు మూర్ఛనుండి తేరుకొన్నాడు. ఒక భయంకరమైన శక్తిని అతడిపై వేయగా దానిని కృతవర్మ మూడు ముక్కలు చేశాడు. అంత భీముడు ఒక పెద్ద విల్లు తీసికొని కృతవర్మ శరీరాన్ని నెత్తురు వఱ్రోడునట్లుగా చేశాడు. దానికి బదులుగా ఆతడు భీముడినీ, మిగిలినవారినీ మూడేసి బాణాలతో కొట్టాడు.

**తే.** **అందఱును జుట్టుముట్టి తీవ్రాస్త్రజాల । కములఁ గృతవర్మ నొంప, శిఖండి గదిసి**
**యాక్రమించిన విలు ద్రుంచె నాతఁ డప్పు । డతని చాపంబు దునిమె నుగ్రాసి వైచి.** **28**

**ప్రతిపదార్థం:** అందఱును= భీమసేనాదు లంతా; చుట్టుముట్టి= చుట్టూ క్రమ్ముకొని; తీవ్ర+అస్త్రజాలకములన్= భయంకరమైన బాణాలతో; కృతవర్మన్= కృతవర్మను; నొంపన్= నొప్పించగా; శిఖండి; కదిసి= అతిక్రమించి; ఆక్రమించినన్= క్రమ్ముకోగా; విలుత్రుంచెన్= అతడి వింటిని త్రుంచివేసినాడు; ఆతఁడు= కృతవర్మ; అప్పుడు= అపుడు; ఉగ్ర+అసిన్= భయంకరమైన కత్తితో; వైచి= కొట్టి(వేసి); అతని చాపంబున్= ఆ శిఖండి వింటిని; తునిమెన్= ముక్కలు చేశాడు.

**తాత్పర్యం:** కృతవర్మను భీమసేనాదులు చుట్టుముట్టి తీవ్రాస్త్రాలతో బాధించారు. శిఖండి క్రమ్ముకోగా అతడి విల్లును కృతవర్మ త్రుంచాడు. వెంటనే పెద్దకత్తి విసరి కృతవర్మ శిఖండి ధనువును ముక్కలు చేశాడు.

**క.** **ఆలోనన భోజపతిన్ । వాలమ్ముల బొదివి రెల్లవారలు దానం**
**దూల కతఁడు బలువిలు గొని । క్రాలుచు నా భీమముఖ్య రథికుల నొంచెన్.** **29**

**ప్రతిపదార్థం:** ఆలోనన= అంతలోనే; ఎల్లవారును= అందరును (అనగా పాండవపక్షంలోని వీరులంతా); వాలు+అమ్ములన్= వాడి అగు బాణాలతో; భోజపతిన్= భోజరాజును; పొదివిరి= కమ్ముకొన్నారు; దానన్= అందుకు; అతఁడు= భోజరాజయిన కృతవర్మ; తూలక= తూలిపోకుండా; బలువిలుకొని= బలమైన విల్లును తీసికొని; క్రాలుచున్= ప్రకాశిస్తూ; ఆ భీమముఖ్యరథికులన్= ఆ భీమసేనుడు మొదలైన రథికవీరులను; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** అంతలోనే (శీఘ్రంగా) పాండవ సైనికులు మొత్తంగా వాడిబాణాలతో భోజరాజును క్రమ్ముకొన్నారు. అంతమాత్రానికి జంకకుండా ఆతడు కూడా పెద్ద విల్లును చేపట్టి వెలుగుతూ భీమాది రథికులనందరను నొప్పించాడు.

**వ. అప్పుడు.** **30**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**ఉ. ఒండొక చాప మెత్తికొని యుగ్రత శాంతనవాంతకుండు వే**
**దండము వోలెఁ గిట్టిన నుదగ్రత సింహనఖోపమ స్ఫుర**
**త్కాండములం దదంగము రథంబుపయిం బడ నేసె భోజనా**
**థుం డది యాజికిం దొలఁగఁ దోలె రయంబున సూతుఁ డార్తుఁ డై.** **31**

**ప్రతిపదార్థం:** శాంతనవ+అంతకుండు= శిఖండి (భీష్ముడి చావుకు కారణమైనవాడు); ఒండొక చాపము= ఇంకొక విల్లును; ఎత్తికొని= తీసికొని; ఉగ్రతన్= భయంకరంగా; కిట్టినన్= సమీపించగా; ఉదగ్రతన్= భయంకరమైన; సింహనఖ= సింగపు గోళ్ళతో; ఉపమ= సాటియయిన స్ఫురత్+కాండములన్= ప్రకాశించుచున్న బాణాలతో; తదంగమున్= ఆ శిఖండి శరీరాన్ని; భోజనాథుండు= భోజరాజయిన కృతవర్మ; రథంబుపయిన్= తేరిమీద పడేటట్లుగా వేశాడు (కొట్టాడు); అది= దానిని; సూతుఁడు= సారథి; ఆర్తుఁడు+ఐ= భయంతో; ఆజికిన్= యుద్ధరంగానికి; తొలఁగన్+తోలెన్= తొలగిపోయేటట్లుగా తోలాడు.

**తాత్పర్యం:** శిఖండి ఇంకొక విల్లుతో మదపుటేనుగువలె భయంకరంగా ఎదుర్కొన్నాడు. కృతవర్మ సింహపు గోళ్ళవలె వాడి అయి భయంకరమైన బాణాలతో కొట్టి ఆ శిఖండి శరీరం తేరుమీద పడేటట్లు చేశాడు. ఆ స్థితికి సారథి భయపడి శిఖండిని యుద్ధభూమినుండి తొలగించి దూరంగా తీసికొనిపోయాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు శిఖండి గం డడంగిపోయినం గని మత్స్యచేదికేకయాది సైన్యంబులు బరవసంబు సేసి యురవడించిన నా కృతవర్మ మర్మభేదనస్ఫార నారాచ పరంపరా ప్రవాహంబున వానినెల్లం గలంచె; తత్కలకలం బాలించి సాత్యకి య ట్లబ్బలంబులు వికలంబు లగుట యాలోకించి, విజయునకుం దోడ్పడం బదంపడి పోఁదగు; రాజు వలనారయవలయు నని యూహించి తనకు నడ్డపడిన భరద్వాజుని తోడి సమరంబు సాలించి మరలి యరదంబు దోలుకొని యరుగుదెంచి కృతవర్మునిం దాఁకి యేసిన, నతండును బొగలేని మంటచందంబున నుద్దీపించి సాయకజ్వాలలు నిగిడించిన నవి మగిడించి యా శైనేయుండు.** **32**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; శిఖండి; గండు+అడంగిపోయిన్+కని= మగటిమి నశించిపోగా చూచి (బలం ఉడిగిపోగా);మత్స్య, చేది, కేకయ+ఆది సైన్యంబులు= మత్స్యదేశంయొక్క, చేదిదేశంయొక్క, కేకయదేశంయొక్క సైన్యాలు; బరవసంబు చేసి= ధైర్యం చేసి; ఉరవడించినన్= దూకగా; ఆ కృతవర్మ; మర్మభేదన= ప్రాణాలను తీసే (చీల్చే); స్ఫార= వాడి అయిన; నారాచపరంపరా= నారసముల వరుసతో; ప్రవాహంబునన్= సమూహంతో (నది ఉరవడివలె పడుతూ ఉండే బాణాల గుంపుతో); వానిన్+ఎల్లన్= ఆ బాణాలన్నిటినీ; కలంచెన్= చికాకు పరచాడు; తద్+కలకలంబు= ఆ శబ్దాన్ని; ఆలించి= విని; సాత్యకి; అట్లు= ఆ విధంగా; ఆ+బలంబులు= ఆ సేనలు; వికలంబులు+అగుట= చెదరిపోవటం; ఆలోకించి= చూచి; విజయునకున్+తోడ్పడన్= అర్జునుడికి సహాయపడటానికి; పదంపడి= మరల; పోన్+తగున్= పోవచ్చును; రాజు= ధర్మరాజు; వలను= దిక్కును (అనగాఅతడి వైపు); ఆరయవలయును= చూడవలెను; అని ఊహించి= అని తలపోసి; తనకున్+అడ్డపడిన= తన దారికడ్డంవచ్చిన; భరద్వాజునితోడి= ద్రోణుడితో; సమరంబు చాలించి= యుద్ధం ఆపి; మరలి= తిరిగి; అరదంబు తోలుకొని= తేరును తోలుకొని; అరుగు దెంచి= వచ్చి; కృతవర్మునిన్+తాఁకి= కృతవర్మను ఎదుర్కొని; ఏసినన్= కొట్టగా; అతండును= ఆ కృతవర్మకూడ; పొగ లేని మంట చందంబునన్= పొగలేని మంట మాదిరిగా (సాధారణంగా పొగలేనిదే మంటరాదు); ఉద్దీపించి= విజృంభించి; సాయకజ్వాలలు=

బాణాగ్ని మంటలను; నిగిడించినన్= ఎగయించగా; అవి= ఆ మంటలను; ఆ శైనేయుండు మగిడించి= ఆ సాత్యకి బాణాగ్ని జ్వాలలను త్రిప్పికొట్టి.

**తాత్పర్యం:** శిఖండి శక్తి అడగిపోగా చూచిన కృతవర్మ, మత్స్య చేది కేకయాది సైన్యాలు ప్రవాహవేగంతో రాగా మర్మభేదం కావించే బాణాలతో ఆ సైన్యాన్ని కలచాడు. ఆ కలకలం విన్న సాత్యకి, ఆ సైన్యాలు చీకాకు పడటంచూచి, 'అర్జునుడికి సహాయంగా తరువాత పోవచ్చును, ముందురాజైన ధర్మజుడి దిక్కు చూడవలసి ఉన్నది' -అని ద్రోణుడు అడ్డం వచ్చినప్పటికినీ అతడితో యుద్ధం చేయకుండా, తన తేరును తోలుకొనిపోయి, కృతవర్మని తాకి కొట్టాడు. అందు కాతడు పొగలేని మంటవలె విజృంభించాడు. ఆ సాత్యకి కృతవర్మడి బాణాగ్ని జ్వాలలను త్రిప్పికొట్టి

**విశేషం:** అలం: ఉపమ.

**శా.** **భల్లం బొక్కట విల్లు ద్రుంచి రయ మొప్పన్ నాల్గిటన్ వాజులం**
**ద్రెళ్ళన్ బెట్టుగ నేసి సూతుతల సందీప్తైక బాణాహతిన్**
**డొల్లం జేసి యదల్చి, యి ట్లతని యాటోపంబు మాన్పించి యు**
**త్ఫుల్లాస్యుండయి పోవ నడ్డపడినం ద్రుంచెం ద్రిగర్తావళిన్.** **33**

**ప్రతిపదార్థం:** (సాత్యకి) భల్లంబు+ఒక్కటన్= ఒక్క బల్లెంతో; విల్లుత్రుంచి= కృతవర్మ వింటిని త్రుంచివేసి; రయము+ఒప్పన్= వేగం ఒప్పగా; నాల్గిటన్= నాల్గు బాణాలతో; వాజులన్= తేరిగుర్రాలను; త్రెళ్ళన్= తునిసిపడేటట్లు; బెట్టుగన్= గట్టిగా; ఏసి= కొట్టి; సూతుతలన్= సారథి తలను; సందీప్త= మండుతున్న; ఏక బాణ+ఆహతిన్= ఒక బాణం దెబ్బతో; డొల్లన్+చేసి= దొర్లిపోయేటట్లుగా చేసి (పడగొట్టి); ఇట్లు= ఈ విధంగా; అదల్చి= బెదరించి; అతని= కృతవర్మయొక్క; ఆటోపంబు= గర్వాన్ని; మాన్పించి= ఆపి వేసి; ఉత్ఫుల్ల= వికసించిన; ఆస్యుండు+అయి= మొగం కలవాడయి; పోవన్= పోగా; అడ్డపడినన్= దారికడ్డం రాగా; త్రిగర్త+ఆవళిన్= త్రిగర్త దేశపు సైన్యాన్ని; త్రుంచెన్= నరికివేసెను.

**తాత్పర్యం:** ఒక బల్లెంతో కృతవర్మ వింటిని (సాత్యకి) త్రుంచాడు. నాల్గు బాణాలతో తేరిగుర్రాలను కూల్చాడు. ఒక మండే బాణంతో సారథితలను దొర్లునట్లు చేశాడు. ఈ విధంగా కృతవర్మ గర్వాన్ని మాన్పించాడు. వికసించిన ముఖంతో పోబోయే అతడి దారికి అడ్డం రాగా, త్రిగర్తదేశసైన్యాన్ని కూడ సాత్యకి హతమార్చాడు.

**వ.** **ఇట్లు కృతవర్మ విరథుం డైన రయంబునం బురికొని యురవడించిన పాండవ సైన్యంబులం గని కుంభసంభవుం డా శినివరు విక్రమ విహారంబున కడ్డపడం గడంగక యా సైన్యంబుల సంరంభంబు దన విజృంభణంబున వారించి నిలిచె; నిత్తెఱంగునం ద్రిగర్తసేనఁ జిక్కువఱిచి తఱిమి చను నయ్యాదవరత్నంబు ప్రయత్నంబునకు భంగంబు సేయ నుత్తుంగ మాతంగంబును గొలిపి జలసంధుండు మదాంధుం డయి మార్కొనుటయు.** **34**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కృతవర్మ విరథుండయినన్= కృతవర్మ తేరులేనివాడు కాగా (రథం విరిగినవాడుగా); రయంబునన్= వేగంగా; పురికొని= క్రమ్ముకొని; ఉరవడించిన= వేగిరపడిన; పాండవసైన్యంబులన్+కని= పాండవసేనను చూచి; కుంభవసంభవుండు= ద్రోణాచార్యుడు; ఆ శినివరు= ఆ శినివంశములో ఉత్తముడైన వాని (సాత్యకిని); విక్రమ= శౌర్యమనే; విహారంబునకున్= ఆటకు; అడ్డపడన్= అడ్డం పోవటానికి; కడంగక= పూనుకోకుండా; ఆ సైన్యంబుల= ఆ సైన్యాల; సంరంభంబున్= ఆటోపమును; తన విజృంభణంబునన్= తన అతిశయంతో; వారించి= అడ్డుకొని; నిలిచెన్= నిలచాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; త్రిగర్తసేనన్= త్రిగర్తదేశ సైన్యమును; చిక్కువఱిచి= చీకాకుచేసి; తఱిమి= తఱుమివేసి; చను= పోతూ ఉన్న; ఆ+యాదవ

రత్నంబు= ఆ యాదవ వంశములో శ్రేష్ఠుడైన (సాత్యకి); ప్రయత్నంబునకు= చేసేపనికి; భంగము చేయన్= అవమానం చేయటానికి; ఉత్తుంగ మాతంగంబును= పెద్ద ఏనుగు నొకదానికి; కొలిపి= ఉసికొల్పి; జలసంధుండు= జలసంధుడనే రాజు; మదాంధుండయి= పొగరుతో కన్నులు కనబడకుండా; మార్కొనుటయున్= ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** కృతవర్మ విరథుడు కాగా, పాండవ సైన్యాలు వేగంగా దూకుడుతో క్రమ్ముకోవటాన్ని ద్రోణుడు చూచి, శినివంశంలో ఉత్తముడయిన సాత్యకి వీరవిహారానికి అడ్డంపోకుండా, పాండవసైన్యాల ఆటోపాన్ని తన అతిశయంతో అడ్డుకొని నిలచాడు. త్రిగర్తదేశ సైన్యాన్ని భంగపరచి తరిమివేసి పోతూ ఉండే ఆ మేటి యాదవుడైన సాత్యకి చేసే పనికి భంగం కలిగించటానికి, జలసంధుడనే రాజు పొగరుబోతుతనంతో ఒక మదపుటేనుగును అతడి మీదకు ఉసికొల్పి ఎదుర్కొనగా.

**జలసంధుం డను రాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట (సం. 7-91-24)**

**క. ప్రదర ప్రవాహమునన । మ్మదవద్ద్విరదంబు పటుగమన ముడిపి ముదం**
**బొదవిన సాత్యకి విలు బె । ట్టు దునిమె న మ్మగధనాథుఁడు మహోగ్రుం డై. 35**

**ప్రతిపదార్థం:** ప్రదర ప్రవాహమునన్= బాణాల వెల్లువలో; ఆ+మదవత్+ద్విరదంబు= ఆ మదపుటేనుగుయొక్క; పటుగమనము= తీవ్రమైన వేగాన్ని; ఉడిపి= ఆపి; ముదంబు+ఒదవిన= సంతోషపడిన; సాత్యకి విలు= సాత్యకివింటిని; ఆ+మగధనాథుఁడు= ఆ మగధదేశపు రాజు; మహా+ఉగ్రుండు+ఐ= మిక్కిలి భయంకరుడై; బెట్టు= మిక్కిలి; తునిమెన్= త్రుంచాడు.

**తాత్పర్యం:** మాగధుడైన జలసంధుడు ఉసికొల్పిన మదపుటేనుగు వేగాన్ని తన బాణాల వరదతో సాత్యకి ఆపాడు. ఆ జలసంధుడు మహాకోపంతో సాత్యకివింటిని త్రుంచివేశాడు.

**తే. తునిమి నవ్వుచు నేఁబది తూపు లురము । నందు నాఁటిన శైనేయుఁ డలిగి బెట్టి**
**దంపు విలుగొని యాతని ధనువు నఱకి । యుఱక యఱువది యమ్ములు వఱపె మేన. 36**

**ప్రతిపదార్థం:** తునిమి= త్రుంచి (జలసంధుడు సాత్యకి విల్లును తునిమి); నవ్వుచున్= నవ్వుతూ; ఏఁబది తూపులు= ఏబది బాణాలు; ఉరమునందున్= గుండెమీద; నాటినన్= గ్రుచ్చగా; శైనేయుఁడు= సాత్యకి; అలిగి= కోపించి; బెట్టిదంపు విల్లు కొని= పెద్ద విల్లు తీసికొని; ఆతని ధనువు నఱకి= వింటిని తెగనరికి; ఉఱక= గురి చూచి; అఱువది అమ్ములు= అరవై బాణాలు; మేనన్= అతడి ఒడలిమీద; పఱపెన్= వేశాడు.

**తాత్పర్యం:** జలసంధుడు సాత్యకి విల్లును త్రుంచివేసి, యాభైబాణాలను అతడి గుండెమీద నాటాడు. దానికి కోపించి సాత్యకి, పెద్ద విల్లుతో అతడి వింటిని నరకివేసి, అరువది బాణాలతో గురిచూచి అతడి ఒడలిమీద కొట్టాడు.

**వ. దానికిం జలింపక జలసంధుండు. 37**

**ప్రతిపదార్థం:** దానికిం= అందులకు; చలింపక= జంకక; జలసంధుండు= జలసంధుడనేవాడు.

**తాత్పర్యం:** అందుకు జలసంధుడు భయపడక.

**చ. పటుగతి నా శినిప్రవరు బాహువుఁ దోమర కీలితంబు సే**
**యుటయును గాక త్రుంచె ధను వుగ్రకృపాణము వైచి యాతఁ డు**
**త్కట మగు నల్క నొండువిలు గైకొని వాని నికృత్తహస్తునిం**
**ద్రుటిత శిరస్కునిం బ్రదరధూత మదావళుఁ జేసి యార్చినన్. 38**

**ప్రతిపదార్థం:** (ఆ జలసంధుడు) పటుగతిన్= తీవ్రమైన పద్ధతితో; ఆ శినిప్రవరు= ఆ సాత్యకియొక్క; బాహువున్= భుజమును; తోమర కీలితంబు= తోమరమనే ఆయుధపు దెబ్బ తగిలేటట్లు; చేయటయును= చేయటమే; కాక= కాక; ధనువు= విల్లును; ఉగ్రకృపాణము= భయంకరమైన కత్తిని; వైచి= వేసి; త్రుంచెన్= త్రుంచాడు; ఆతఁడు= ఆ సాత్యకి; ఉత్కటము+అగు అల్కన్= ఎక్కువ కోపంతో; ఒండు విలు= ఇంకో వింటిని; కైకొని= తీసికొని; వానిన్= ఆ జలసంధుడిని; నికృత్తహస్తునిన్= నరకబడిన చేయికలవాడుగాను; త్రుటిత శిరస్కునిన్= త్రుంచబడిన తలకల వాడినిగాను; ప్రదరధూతమదావళున్= బాణం దెబ్బతో ఎగురగొట్టబడిన మదపుటేనుగు కలవాడినిగాను; చేసి; ఆర్చినన్= సింహనాదం చేయగా.

**తాత్పర్యం:** జలసంధుడు సాత్యకి బాహువును తోమరంతో కొట్టటమే కాకుండా, పెద్ద కత్తితో ఆతడి విల్లును కూడా త్రుంచాడు. దానికి కోపించిన సాత్యకి ఇంకొక విల్లు తీసుకొని, అతడి చేతిని నరికాడు. తలను త్రుంచాడు. బాణం దెబ్బతో మదపుటేనుగును ఎగురకొట్టి సింహనాదం చేశాడు.

**క. పెలుకుఱి యచ్చటి మూఁకలు । గలఁగిన గని తన ముఖంబు కయ్యంబునకున్**
**బలియురఁ గృతవర్మాదుల । నిలిపి గురుఁడు వచ్చి యా శినిప్రభుఁ దాఁకెన్. 39**

**ప్రతిపదార్థం:** అచ్చటి మూఁకలు= అక్కడ ఉన్న సైనికులు; పెలుకుఱి= భయంతో వణుకుతూ; కలఁగినన్= చికాకు పడగా; కని= చూచి; తన ముఖంబు= తాను ఎదురుగా చేస్తున్న; కయ్యంబునకున్= యుద్ధానికి; బలియురన్= బలవంతులయిన; కృతవర్మ+ఆదులన్= కృతవర్మ మొదలయిన వారిని; నిలిపి= నిలిపి ఉంచి; గురుఁడు= ద్రోణుడు; వచ్చి= వచ్చి; ఆ శినిప్రభున్= ఆ శిని వంశపు రాజును (సాత్యకిని); తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** తన సైన్యం భయంతో వణుకుతూ చికాకుపడగా, ఆచార్యుడైన ద్రోణుడు చూచి, బలవంతులైన కృతవర్మాదులను తాను చేస్తున్న యుద్ధాన్ని చేయటానికి నిలిపి, తాను ఆ శినివంశరాజు (సాత్యకి)ని ఎదుర్కొన్నాడు.

**వ. ఇవ్విధంబునం గడంగిన కుంభసంభవుం జూచి యతని ప్రాపున దుర్మర్షణ దుస్సహ వికర్ణ దుర్ముఖ దుశ్శాసన చిత్రసేన ప్రముఖు లగు కురు కుమారు లొక్కపెట్ట కవిసి మిక్కుటం బగు తూర్యరవంబులతోఁ బెక్కమ్ముల సాత్యకిం బొదువ నత్తుములంబులకు దుర్యోధనుం డేతెంచి తమ్ములం గలిసినం గనుంగొని గురుండు వార లతని కోపుదు రను బుద్ధిఁ బాండవసేనాముఖంబునకుం జనుదెంచిన నయ్యచ్యుతానుజుం డారథికు లందఱ కన్నిరూపు లయి వారల శరాసారంబులు నివారించుచు నొకని నొకని ననేక బాణజాలంబుల నొప్పించుచుండ నక్కౌరవేశ్వరుం డుద్దామగతిని గవిసి వాలమ్ము లాతని తనువునం జొనిపిన నతండు. 40**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; కడంగిన= పూనిన; కుంభసంభవున్+చూచి= ద్రోణాచార్యుడిని చూచి; అతని ప్రాపునన్= అతడి అండతో; దుర్మర్షణ దుస్సహ వికర్ణ దుర్ముఖ దుశ్శాసన చిత్రసేన ప్రముఖులు+అగు కురుకుమారులు= దుర్మర్షణుడు, దుస్సహుడు, వికర్ణుడు, దుర్ముఖుడు, దుశ్శాసనుడు, చిత్రసేనుడు మొదలైన ముఖ్యులైన కురుకుమారులు; ఒక్కపెట్టన్= ఒక్కమారుగా; కవిసి= క్రమ్ముకొని; మిక్కుటంబు+అగు= ఎక్కువైన; తూర్యరవంబులతోన్= కొమ్ము శబ్దాలతోను; పెక్కు+అమ్ములన్= చాల బాణాలతో; సాత్యకిన్ పొదువన్= సాత్యకిని క్రమ్ముకొనగా; ఆ+తుములమునకున్= ఆ సంకుల యుద్ధానికి; దుర్యోధనుండు= దుర్యోధనుడు; ఏతెంచి= వచ్చి; తమ్ములన్ కలిసినన్= తన తమ్ముళ్ళను చేరుకొనగా; కనుంగొని= చూచి; గురుండు= ద్రోణుడు; వారలు= ఆ కౌరవ కుమారులు; అతనికిన్= ఆ సాత్యకికి; పాండవ సేనాముఖంబునకున్= పాండవుల సేనల మొగకు; చనుదెంచినన్= రాగా; ఆ+అచ్యుత+అనుజుండు= ఆ కృష్ణుడి తమ్ముడు; ఆ రథికులు+అందఱకున్= ఆ కౌరవ

సేనానుల కందరికీ; అన్ని రూపులు+అయి= అన్నివిధాలైన ఆకారాలతో; వారల= ఆ కౌరవుల; శరాసారంబులన్= బాణవర్షాన్ని; నివారించుచున్= ఆపుచు; వారిన్= ఆ కౌరవులను; ఒకనిన్+ఒకనిన్= ఒకొక్కళ్ళను; అనేకబాణజాలంబులన్= మిక్కిలి బాణాల గుంపుతో; నొప్పించుచుండన్= బాధిస్తూ ఉండగా; ఆ+కౌరవ+ఈశ్వరుండు= ఆ దుర్యోధనుడు; ఉద్దామగతిని= భయంకరమైన విధంగా; కవిసి= కమ్ముకొని; వాలమ్ములు= వంకరైన బాణాలను; ఆతని తనువున్+చొనిపినన్= ఆ సాత్యకి శరీరంలో గ్రుచ్చగా; అతండు= ఆ సాత్యకి.

**తాత్పర్యం:** ఈ విధంగా సాత్యకిని ఎదుర్కొన్న ద్రోణుని చూచిన కౌరవులు, అతడి అండతో దుర్మర్షణ, దుస్సహ, వికర్ణ, దుర్ముఖ, దుశ్శాసన, చిత్రసేనాదులయిన కురుకుమారులు తూర్యనాదాలతో, అనేక బాణాలతో సాత్యకిని క్రమ్ముకొనగా, ఆ సంకులసమరానికి దుర్యోధనుడు వచ్చి తన తమ్ములతో కలుసుకొన్నాడు. దానిని చూచిన ద్రోణుడు వారందరూ సాత్యకిని ఆపగలరు - అన్న బుద్ధితో పాండవసేన మొగకు మరల తాను వచ్చాడు. ఆ సమయంలో సాత్యకి ఆ కౌరవసేనానుల కందరికీ అనేక రకాలుగా కానవస్తూ, బాణాలతో వారిని బాధిస్తూ ఉండగా, దుర్యోధనుడు భయంకరమైన విధంగా క్రమ్ముకొన్నప్పుడు సాత్యకి (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నగుచు విలు దునిమి తీవ్రా । శుగముల నొంచుటయు నీదు సుతు లెల్లను నా**
**మృగపతివిక్రముపైఁ దఱ । చుగ నిగిడించిరి ప్రదీప్త సునిశిత శరముల్. 41**

**ప్రతిపదార్థం:** నగుచున్= ఆ సాత్యకి నవ్వుతూ; విలు తునిమి= ఆ దుర్యోధనుడి వింటిని త్రుంచివేసి; తీవ్ర+ఆశుగములన్= వాడి అయిన బాణాలతో; నొంచుటయున్= బాధించగా; నీదు సుతులు+ఎల్లన్= నీ కొడుకు లంతా; ఆ మృగపతి విక్రముపైన్= ఆ సింహపరాక్రముడిమీద; ప్రదీప్త= మండుతున్న; సునిశిత= వాడి అయిన; శరముల్= బాణాలను; తఱచుగన్= వరుసగా; నిగిడించిరి= ప్రయోగించారు.

**తాత్పర్యం:** సాత్యకి నవ్వుతూ దుర్యోధనుడి విల్లు త్రుంచివేసి, వాడి అయిన బాణాలతో అతడిని నొప్పించాడు. నీ కుమారులందరూ సింహవిక్రముడైన సాత్యకిమీద మండే వాడిబాణాలను ప్రయోగించారు.

**క. చిక్కు వడక సాత్యకి యొ । క్కొక్కరు నయిదయిదు దృఢ మహోగ్రాస్త్రములన్**
**స్రుక్కించి యెనిమిదిటఁ బే । రుక్కున నక్కురునృపాలు నొడలం గ్రుచ్చెన్. 42**

**ప్రతిపదార్థం:** సాత్యకి చిక్కుపడక= సాత్యకి కష్టపడకుండా; ఒక్కొక్కరు= కౌరవకుమారులు ఒక రొకరు; అయిదు+అయిదు= ఐదు ఐదుగా; దృఢ, మహా+ఉగ్ర+అస్త్రములన్= చేవగల భయంకరమైన బాణాలతో; స్రుక్కించి= బాధపెట్టి; పేరు+ఉక్కునన్= పెద్దబలంతో; ఎనిమిదిటన్= ఎనిమిది బాణాలతో; ఆ+కురునృపాలు= ఆ సుయోధనుడి; ఒడలన్ గ్రుచ్చెన్= ఒంటిమీద గుచ్చాడు.

**తాత్పర్యం:** సాత్యకి సంకటపడకుండ ఆ కౌరవులను ఒక్కొక్కరిని భయంకరమైన ఐదుబాణాలతో బాధించి, దుర్యోధనుడి ఒంటిమీద ఎనిమిది బాణాలను పెనుబలంతో గ్రుచ్చాడు.

**ఉ. అంతటఁ బోక రత్నమయ మైన భుజంగ పతాక గూల్చి య**
**త్యంత రయంబుమై ధనువు నశ్వచయంబును సూతుమేను నిం**
**తింతలు వ్రయ్యలై పడఁగ నేసిన బెగ్గిలి తేరు డిగ్గి భూ**
**కాంతుఁడు వాఱె సేన కలఁగంబడి మ్రోయ నతండు నవ్వఁగన్. 43**

**ప్రతిపదార్థం:** అంతటన్+పోక= ఆ మాత్రంతోనే ఆగకుండా (దుర్యోధనుడి శరీరాన్ని బాణాలతో గ్రుచ్చటంతోనే); రత్నమయము+ఐన= రత్నాలు తాపిన; భుజంగ పతాకన్= సర్పకేతనాన్ని; కూల్చి= పడగొట్టి; అత్యంతరయంబుమైన్= మిక్కిలి వేగంగా; ధనువున్= వింటిని; అశ్వచయంబును= గుఱ్ఱాలను; సూతుమేనున్= సారథి శరీరాన్ని; ఇంత+ఇంతలు= చిన్న చిన్న; వ్రయ్యలు+ఐ= ముక్కలుగా; పడఁగన్= క్రిందపడగా; ఏసినన్= కొట్టగా; బెగ్గిలి= భయపడి; భూకాంతుఁడు= రాజు (దుర్యోధనుడు); సేన= తన సైనికులు; కలఁగన్+పడి= చీకాకుపడి; మ్రోయన్= అరవగా; అతండు= ఆ సాత్యకి; నవ్వఁగన్= నవ్వుతూ ఉండగా; తేరు డిగ్గి= తేరు దిగి; పాఱెన్= పరుగెత్తిపోయాడు.

**తాత్పర్యం:** అంతటితో ఆగకుండ సాత్యకి రత్నాలు తాపిన భుజంగ పతాకాన్ని పడగొట్టి, వేగంగా వింటిని, గుఱ్ఱాలను, సారథి శరీరాన్ని చిన్నచిన్న ముక్కలుగా చీల్చి పడగొట్టగా, సుయోధనుడు భయపడి, తేరు దిగి తన సైన్యాలు కలకలంతో శబ్దంచేస్తూ ఉండగా, సాత్యకి నవ్వుతూ ఉండగా, - పరుగెత్తిపోయాడు.

**వ. ఇట్లు పాఱి చిత్రసేను నరదం బెక్కె నక్కోలాహలం బాలించి కృతవర్మ తనరథంబు రయంబున నద్దెసకుం బఱపం బనిచి యురవడి నరుగుదెంచినం గని శినిపుంగవుండును నిజస్యందనంబు సమ్ముఖంబు సేయించెఁ; నయ్యిరువురుం గొఱవి గొఱవిం దాఁకిన తెఱంగునం దలపడి యొండొరులపైఁ బ్రచండ బాణంబులు పరఁగించుచుం బోరునెడ జనార్దనానుజుండు హార్దిక్యు నతిక్రమించి. 44**

**ప్రతిపదార్థం:** (సుయోధనుడు) ఇట్లు పాఱి= ఈ ప్రకారం పరుగెత్తి; చిత్రసేను అరదంబు+ఎక్కెన్= చిత్రసేనుడి తేరుమీదికి ఎక్కాడు; ఆ+కోలాహలంబు ఆలించి= ఆ కలకలాన్ని విని; కృతవర్మ; తన రథంబున్= తన తేరును; రయంబునన్= వేగంగా; ఆ+దెసకున్= ఆ దిక్కుకు; పఱపన్= తోలగా; పనిచి= చేసి; ఉరవడిన్= వేగంగా; అరుగుదెంచినన్= రాగా; కని= చూచి; శినిపుంగవుండును= శిని వంశంలో శ్రేష్ఠుడును (సాత్యకి); నిజస్యందనంబును= తన తేరును; సమ్ముఖంబు చేయించెన్= కృతవర్మ తేరుకు ఎదురుగా పోనిచ్చాడు; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరు (సాత్యకి, కృతవర్మలు); కొఱవి కొఱవిన్ తాఁకిన తెఱంగునన్= మంటలతో నున్న కొరవి ఒకదాని నొకటి తాకినట్లుగా; తలపడి= ఎదుర్కొని; ఒండొరులపైన్= ఒకరిపై నొకరు; ప్రచండ బాణంబులు= తీవ్రమైన బాణాలను; పరఁగించుచున్+పోరు+ఎడన్= వేస్తూ యుద్ధం చేసేటప్పుడు; జనార్దన+అనుజుండు= జనార్దనుడి తోబుట్టు వైన సాత్యకి; హార్దిక్యున్= కృతవర్మను; అతిక్రమించి= మిగిలి.

**తాత్పర్యం:** ఈ విధంగా సుయోధనుడు పరుగెత్తి చిత్రసేనుడి తేరుమీదికి ఎక్కాడు. ఆ కలకలాన్ని విన్న కృతవర్మ తన తేరును ఆ దిక్కుకు తరుముకొని వచ్చాడు. ఆ ఉరవడిని చూచి, సాత్యకి తన తేరును కృతవర్మ తేరుకు ఎదురుగా పోనిచ్చాడు. ఆ ఇద్దరూ కొరవి - కొరవి తాకినట్లుగా తలపడి, ఒకరిమీద ఒకరు భయంకరమైన బాణాలను వేసుకొంటూ యుద్ధం చేసేటప్పుడు, సాత్యకి కృతవర్మను మించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. హయములను సూతు నొంచి శరాసనంబుఁ । ద్రుంచి మెఱుఁగులు వెరిఁగిన దొడ్డనార
సంబు మే నుచ్చిపో నేయఁ జచ్చినట్ల । మూర్ఛ వోయి మోఁకాళులు మోవఁబడియె. 45**

**ప్రతిపదార్థం:** హయములను= గుఱ్ఱాలను; సూతున్= సారథిని; నొంచి= బాధించి; శరాసనంబును= వింటిని; త్రుంచి= ముక్కలు చేసి; మెఱుఁగులు= కాంతులు; పెరిఁగిన= ఎక్కువైన; దొడ్డ నారసంబు= పెద్ద వాడి అయిన బాణాన్ని; మేను+ఉచ్చిపోన్= శరీరాన్ని దూసుకొని పోగా; ఏయన్= కొట్టగా; చచ్చినట్లు+అ మూర్ఛపోయి= చచ్చినట్లు మూర్ఛపోయి; మోఁకాళులు మోవన్+పడియెన్= మోకాళ్ళు తన్ను మోయగా పడిపోయాడు(అనగా కుదించుకు పడిపోయాడు).

**తాత్పర్యం:** సాత్యకి కృతవర్మ గుఱ్ఱాలను చంపి, సారథిని బాధపెట్టి, వింటిని ముక్కలుచేసి, తళతళలాడే వాడి అయిన పెద్దబాణం అతడి శరీరాన్ని చీల్చుకొని పోయేటట్లు కొట్టగా అతడు చచ్చినట్లు మూర్ఛపోయి తన మోకాళ్ళమీద కుదియ పడ్డాడు.

**వ. ఇత్తెఱంగునం దేరిపయిఁ గూలిన కృతవర్మం దెగియెన కాఁ దలంచి ధనంజయుం గలయం దమకించి సాత్యకి యక్కడఁ బోవ నా భోజపతి దెప్పిఱి సన్నద్ధుండై మరలి చని యెప్పటి నెలవున నిలిచి యనిలతనయ ప్రముఖుల కడ్డపడినం జూచి యాచార్యుం డచ్చోటి కతనిం జాలించి శౌర్యధుర్యుం డగు నా శినివరుం డట సనుట సైరింపం జాలక రయంబున. 46**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; తేరిపయిన్= తేరుమీద; కూలిన= పడిన; కృతవర్మన్= కృతవర్మను; తెగియెన కాన్+తలంచి= చనిపోయినాడనే తలచుకొని; ధనంజయున్= అర్జునుడిని; కలయన్= చేరగా; తమకించి= తొందరపడి; సాత్యకి అక్కడ పోవన్= సాత్యకి ఆ చోటకు పోగా; ఆ భోజపతి= ఆ భోజరాజైన కృతవర్మ; తెప్పిఱి= తేరుకొని; సన్నద్ధుండు+ఐ= సిద్ధంగా; మరలి చని= తిరిగి పోతూ; ఎప్పటి నెలవునన్= ఎప్పటిచోటున; నిలిచి= నిలబడి; అనిల తనయ ప్రముఖులకున్= భీమాది ముఖ్యమైన వారికి; అడ్డపడినన్= అడ్డంపోగా; చూచి; ఆచార్యుండు= ద్రోణుడు; ఆ+చోటికిన్= ఆ యుద్ధభూమికి; అతనిన్ చాలించి= అతడిని ఆపి; శౌర్యధుర్యుండు= వీరవరుడు; అగు= అయిన; ఆ శినివరుండు= ఆ సాత్యకి; అట చనుట= ఆ దిక్కునకు పోవటం; సైరింపన్+చాలక= ఓర్వలేక; రయంబునన్= వేగంగా.

**తాత్పర్యం:** ఈ విధంగా తేరుమీద పడిపోయిన కృతవర్మను చనిపోయాడని భావించిన సాత్యకి, అర్జునుడిని చూడటానికి తొందరపడుతూ పోగా, కృతవర్మ తెప్పరిల్లి లేచి ఎప్పటి మాదిరిగా భీమాదులకు అడ్డుపడగా చూచి, ద్రోణాచార్యుడు ఆ చోటి కతడిని నిలిపి, వీరవరుడైన సాత్యకి ధనంజయుడి దిక్కునకు పోవటం ఓర్వలేక మిక్కిలివేగంతో (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మగుడఁ జనియాఁ గి నిశితము । లగు నారాచములు మూఁట నతని నుదుట బె
ట్టుగ నాటినఁ ద్రిశిఖరయుత । నగము క్రియం బొలిచె నతఁడు నరవరముఖ్యా! 47**

**ప్రతిపదార్థం:** నరవరముఖ్యా!= ఓ రాజశ్రేష్ఠుడా! (ఓ ధృతరాష్ట్రా!); మగుడన్+చని= తిరిగి వెళ్ళి; ఆగి= ఆపి; నిశితములు+అగు= వాడి అయిన; నారాచములు= తీవ్రమైన బాణాలు; మూఁటన్= మూడింటిని; అతని నుదుటన్= అతడి నెన్నుదురులో; బెట్టుగన్= దట్టంగా; నాఁటినన్= గ్రుచ్చగా; అతఁడు= ఆ సాత్యకి; త్రిశిఖర యుత నగము క్రియన్= మూడు కొండ కొమ్ములతో ఉన్న కొండవలె (త్రికూటాచలంవలె); పొలిచెన్= ఒప్పినాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! ద్రోణాచార్యుడు సాత్యకిని ఆపి, వాడి అయిన మూడు బాణాలను అతడి నెన్నుదుటిలో నాటాడు. అప్పుడు సాత్యకి శిఖరాలు మూడింటితో కూడుకొన్న కొండవలె ఒప్పాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఆ రథికవరుండును గురునిపైఁ గ్రూర నారాచంబులు నిగుడించె; నిట్లు దొడంగి యయ్యిరువురు నొండొరు శరజాలంబులు వారించుచుఁ దురంగంబుల యంగంబుల రుధిరంబులు పూరించుచు సారథుల నొప్పించుచు మేనుల వాలమ్ముల గుప్పించుచు నసదృశంబు లగు కరలాఘవంబులు సదృశంబులుగా బోరునప్పుడు. 48**

**ప్రతిపదార్థం:** ఆ రథికవరుండు= ఆ రథికశ్రేష్ఠుడు (సాత్యకి); గురునిపైన్= ద్రోణాచార్యుడి మీద; క్రూరనారాచంబులు= వాడి అయిన బాణాలను; నిగుడించెన్= పరచాడు (వేశాడు); ఇట్లు= ఈ విధంగా; తొడంగి= పూనుకొని; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరును (ద్రోణసాత్యకులు); ఒండొరు శరజాలంబులు= ఒకరొకరి బాణాల గుంపును; వారించుచున్= అడ్డుకొంటూ; తురంగంబుల= గుర్రాల; అంగంబులన్= శరీరాలమీద; రుధిరంబులు= నెత్తురులు; పూరించుచున్= నింపుతూ; సారథుల నొప్పించుచున్= సారథులను బాధిస్తూ; మేనులన్= ఒడళ్ళమీద; వాలు+అమ్ములన్= వాడి బాణాలను; గుప్పించుచున్= కురిపిస్తూ; అసదృశంబులు+అగు= సాటిలేని; కరలాఘవంబులు= చేతివాటాలు; సదృశంబులుగాన్= సమానంగా; పోరునప్పుడు; యుద్ధం చేసేటప్పుడు.

**తాత్పర్యం:** ఆ సాత్యకి కూడ ద్రోణుడిమీద వాడిబాణాలను ప్రయోగించాడు. ఆ ఇద్దరూ పూనుకొని ఒకళ్ళొకళ్ళ బాణాలను తప్పుకొంటూ, గుర్రాల మేనులు నెత్తురుతో నింపుతూ, సారథులను బాధిస్తూ ఒడళ్ళమీద వంకర అయిన వాడి బాణాలు కురిపిస్తూ సాటిలేని చేతివాటాలతో సమానంగా యుద్ధం చేస్తూ ఉన్నప్పుడు.

**మ. ధనురాచార్యుఁడు కేశవానుజు ధనుర్దండంబు ద్రుంచెన్; గదం**
**గొని వైచెన్ వడి నాతఁ డగ్గురుఁ డెడం గ్రూరంపు భల్లంబునం**
**దునుమం గ్రక్కున నొండు విల్లు గొని యాదోర్దర్పదుర్దాంతు మై**
**ఘనబాణంబుల నొంచె నించె నతఁ డాకాశంబు గర్జాధ్వనిన్. 49**

**ప్రతిపదార్థం:** ధనుః+ఆచార్యుఁడు= ద్రోణాచార్యుడు; కేశవ+అనుజు ధనుర్దండంబున్= కృష్ణుడి తమ్ముడైన సాత్యకి యొక్క వింటి దబ్బను; త్రుంచెన్= త్రుంచివేశాడు; ఆతఁడు= సాత్యకి; గదన్+కొని= గదను తీసికొని; వడిన్= త్వరగా; వైచెన్= కొట్టాడు; ఆ+గురుఁడు= ఆ ద్రోణాచార్యుడు; ఎడన్= సందుచూచి; క్రూరంపు= తీవ్రమయిన; భల్లంబునన్= బల్లెంతో; తునుమన్= త్రుంచగా (ఆ గదను త్రుంచగా); గ్రక్కునన్= వేగంగా; ఒండు విల్లు కొని= ఇంకొక వింటిని తీసికొని; ఆ దోర్దర్ప= ఆ భుజబల గర్వమునందు; దుర్దాంతు= అణచటానికి వీలుకాని బలంకలవాడియొక్క; మైన్= ఒంటిని; ఘనబాణంబులన్= గొప్ప బాణాలతో; అతఁడు= ఆ సాత్యకి; నొంచెన్= బాధించాడు; గర్జాధ్వనిన్= సింహగర్జనంతో; ఆకాశంబు నించెన్= ఆకాశాన్ని పూరించాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు సాత్యకి వింటి దబ్బను విరిచాడు. వెంటనే సాత్యకి గదతీసి, ఆచార్యుడిమీద వేశాడు. ఆయన అదనుచూచి వాడి బల్లెంతో ఆ గదను ముక్కలు చేశాడు. సాత్యకి వెంటనే మరొక విల్లు ఎత్తి, భుజ బలగర్వంలో అణచటానికి సాధ్యంకాని ఆచార్యుడి మేనిమీద గొప్ప బాణాలు గ్రుచ్చి, బాధించి, ఆకాశమంతా ప్రతిధ్వనించేటట్లు సింహగర్జన చేశాడు.

**ఆ. అలిగి గురుఁడు శక్తి నడరింప నది విధి । ప్రేరణమునఁ జేసి తేరు దాఁకెఁ**
**గాని యతనిఁ దాఁకఁ గానద యతఁడు త । ద్బాహుశాఖ నొంచెఁ బటుశరమున. 50**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; అలిగి= కోపించి; శక్తిన్+అడరింపన్= శక్తి అనే ఆయుధాన్ని (సాత్యకిమీదకు) వేయగా; అది= ఆ శక్తి; విధిప్రేరణమునన్+చేసి= దైవవిలాసంతో; తేరుతాఁకెన్+కాని= తేరు తాకింది కాని; అతనిన్+తాఁకన్+కానదు+అ= సాత్యకిని తాకలేకపోయింది; అతఁడు= ఆ సాత్యకి; తద్బాహుశాఖన్= అతడి శాఖ వంటి చేతులను; పటుశరమునన్= తీవ్రబాణంతో; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు కోపంతో సాత్యకిమీద శక్త్యాయుధాన్ని వేశాడు. అది దైవవిధి కారణంగా సాత్యకిని తాకకుండా అతడి తేరును తాకింది. సాత్యకి తీవ్రమైన బాణంతో ద్రోణుడి భుజాన్ని నొప్పించాడు.

**వ. నొంచినం గోపించి.** 51

**తాత్పర్యం:** నొప్పించగా కోపించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. చాపాచార్యుఁడు సాత్యకి । చాపము దునుమాడి సూతు సమ్మూర్ఛితుఁ గా**
**నేపారియేయ రథ్య । వ్యాపారము దాన నడపి యతఁ డని సేసెన్.** 52

**ప్రతిపదార్థం:** చాపాచార్యుఁడు= ధనురాచార్యుడు; సాత్యకి చాపమున్= సాత్యకి వింటిని; తునుమాడి= త్రుంచి (ముక్కలు చేసి); సూతున్= సారథిని; సమ్మూర్ఛితున్+కాన్= మూర్ఛపోయిన వానినిగా; ఏపారి ఏయన్= మిగిలి కొట్టగా; అతఁడు= ఆ సాత్యకి; రథ్యవ్యాపారము= సారథి రథికుల పనిని; తాను+అ నడపి= తానే చేసి; అని చేసెన్= యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు సాత్యకి విల్లును త్రుంచాడు. సూతుడిని మూర్ఛపోగొట్టాడు. కాని, సాత్యకి తానే సారథిగాను, రథికుడుగాను రెండు పనులను చేస్తూ యుద్ధం చేశాడు.

**వ. ఆలోన నతని రథచోదకుండు తెలిసిన నెలమిం బొంది.** 53

**ప్రతిపదార్థం:** ఆలోనన్= ఆ లోగా; అతని రథచోదకుండు= సాత్యకి సారథి; తెలిసినన్= తేరుకొనగా; ఎలమిన్= పొంది; సంతసించి.

**తాత్పర్యం:** అంతలోనే తన సారథికి స్పృహ రాగా సంతసించి.

**క. బలువిడి బహుభంగుల ను । జ్జ్వల శరములఁ బోరి పోరి శైనేయుఁడు బె**
**ట్టిలఁ బడ సారథి నేసినఁ । దొలఁగంగాఁ బఱచె ద్రోణుతురగములు వెసన్.** 54

**ప్రతిపదార్థం:** శైనేయుఁడు= సాత్యకి; బలువిడిన్= శీఘ్రముగా; బహుభంగులన్= అనేకరకాలుగా; ఉజ్జ్వల= ప్రకాశించే; శరములన్= బాణాలతో; పోరి పోరి= యుద్ధంచేసి చేసి; సారథిన్= (ద్రోణుడి) సారథిని; ఇలన్= భూమిమీద; పడన్= పడగా; బెట్టు= గట్టిగా; ఏసినన్= కొట్టగా; ద్రోణుతురగములు= ద్రోణుడి గుఱ్ఱాలు; వెసన్= త్వరగా; తొలఁగంగాన్= తొలగి పోగా (యుద్ధంనుండి తప్పుకొని పోవునట్లు); పఱచెన్= పరుగెత్తినవి.

**తాత్పర్యం:** సాత్యకి అనేక విధాలుగా, శీఘ్రంగా, వెలిగే బాణాలతో యుద్ధం చేసి, తీవ్రంగా సారథిని నేల పడగొట్టగా ద్రోణుడి గుఱ్ఱాలు యుద్ధరంగం నుండి తొలగి ఆవలికి పరుగెత్తాయి.

**ఆ. అచటి రాజలోక మగ్గురు నరదంబు । సనిన దిక్కు సనుచు సంభ్రమమున**
**నాఁగి కొనుఁడు పట్టుఁ డలుపుఁ డేయుఁ డ । శ్వముల ననఁగఁ దెరలె సైన్యసమితి.** 55

**ప్రతిపదార్థం:** అచటి రాజలోకము= అక్కడి రాజసమూహం; ఆ+గురునరదంబు= ఆ గురుడి తేరు; చనిన దిక్కు= పోయినదిక్కుకు; చనుచున్= పోతూ; సంభ్రమమునన్= తొందరతో; ఆఁగికొనుఁడు= ఆపండి; పట్టుఁడు= పట్టుకొనండి; అదలుపుఁడు= బెదిరించండి; అశ్వములన్+ఏయుఁడు= గుఱ్ఱాలను కొట్టండి; అనఁగన్= అనగా; సైన్యసమితి= సైన్యసమూహం; తెరలెన్= పరుగెత్తింది.

**తాత్పర్యం:** (సాత్యకి విజృంభణానికి) అక్కడి రాజులు ద్రోణుడి తేరు పోయిన దిక్కుకు త్వర త్వరగా వెళ్ళుతూ (ఆయనను) ఆపండి, పట్టుకొనండి, బెదిరించండి, గుఱ్ఱాలను పడగొట్టండి - అనగా సైన్యసమూహం పరుగెత్తింది.

**వ. ఇ వ్విధంబున నిజరథంబు విఫల మనోరథం బై పోయిన నదియ పోకగాఁ బోయి సన్నద్ధుం డై సముద్ధతం బైన పాంచాల బలంబుచేతం గలంగు తనమూఁకలం బురికొలిపికొని కుంభసంభవుం డవష్టంభ విజృంభణంబున సేనాముఖంబునం బొలిచి నిలిచె; నిత్తెఱంగున ద్రోణ కృతవర్మ దుర్యోధనాదులగు జెట్టి జోదుల బెట్టు వఱచి చిఱునవ్వొలయ సాత్యకి సారథితో ని ట్లనియె. 56**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; నిజరథంబు= తన తేరు; విఫల మనోరథంబు+ఐపోయినన్= ఫలింపని కోరిక గలదై; అదియ పోకగాన్ పోయి= అదే పోకగా పోయి; సన్నద్ధుండు+ఐ= యుద్ధానికి తయారయి; సముద్ధతంబైన= గర్వంతో ఉన్న; పాంచాల బలంబులచేతన్= పాంచాల దేశపు సైన్యం వలన; కలంగు= చీకాకుపడే; తనమూఁకలన్= తన సైన్యాలను; పురికొలిపికొని= హెచ్చరిస్తూ (ప్రేరేపిస్తూ); కుంభసంభవుండు= ద్రోణాచార్యుడు; అవష్టంభ= గర్వంయొక్క; విజృంభణంబునన్= అతిశయంతో; సేనాముఖంబునన్ పొలిచి= సేనమొగంలో కానవచ్చి; నిలిచెన్= నిలిచాడు; ఈ+తెఱంగునన్= ఈ ప్రకారంగా; ద్రోణ= ద్రోణుడు; కృతవర్మ దుర్యోధన+ఆదులు= కృతవర్మ, దుర్యోధనుడు మొదలగువారు; అగు జెట్టిజోదులన్= శ్రేష్ఠులయిన మేటి వీరులను; బెట్టు వఱచి= మిక్కిలి బాధించి, తరిమి; చిఱునవ్వు+ఒలయన్= చిరునవ్వు కలుగగా; సాత్యకి; సారథితోన్; ఇట్లు+అనియెన్= తన సూతుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తన తేరు వ్యర్థమై - పోయినదే పోకగా పరుగెత్తి పోగా యుద్ధానికి సిద్ధమైన పాంచాలసేనచేత చికాకు పడుతూ ఉన్న తన సైన్యాన్ని ప్రేరేపించి ద్రోణాచార్యుడు గర్వంతో సేన మొదట నిలిచాడు. సాత్యకి, ద్రోణ కృతవర్మ దుర్యోధనాదులయిన వీరులను తరిమికొట్టి, చిరునవ్వు నవ్వుతూ తన సారథితో ఈ విధంగా అన్నాడు.

**క. 'ఇక్కడఁ గృష్ణుల తేజము, । నక్కడఁ బవమాననందనాది జనుల పే**
**రుక్కును గెలిపించె మనలఁ; । జిక్కక వెడలితిమి శత్రుసేనలచేతన్. 57**

**ప్రతిపదార్థం:** ఇక్కడ= ఈ చోట; కృష్ణుల తేజము= కృష్ణార్జునుల శౌర్యం; అక్కడన్= ఆ చోట; పవమాన నందన+ఆది జనుల పేరు+ఉక్కును= భీమసేనుడు మొదలయిన మనుష్యుల గొప్పశక్తి; మనలన్ గెలిపించెన్= మనలను గెలిపించినది; శత్రుసేనలచేతన్= శత్రుసేనల చేతికి; చిక్కక= చిక్కుకోకుండా; వెడలితిమి= బయటపడ్డాము.

**తాత్పర్యం:** 'శ్రీకృష్ణార్జునుల శౌర్యం ఇక్కడా, భీమాది జనుల పెనుబలం అక్కడా మనలను గెలిపించింది. శత్రుసేనల చేతికి దొరకకుండా తప్పించుకొని బయటపడ్డాము.'

**వ. అని పలికి యర్జును డున్న దిక్కునకు రథంబు రయంబునం బఱపం బంచిన వాఁడును నట్ల చేయ విమలాశ్వవేగంబునం జారు భీషణం బగు నత్తేరు నీ వారికి దుర్నిరీక్ష్యంబై నభంబున భానురథంబు సనుచందంబున. 58**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని మాట్లాడి; అర్జునుండు+ఉన్న, దిక్కునకున్= అర్జునుడు ఉన్నవైపు; రథంబు= రథాన్ని; రయంబునన్= వేగంగా; పఱపన్= పోనిమ్మని; పంచినన్= ఆజ్ఞాపించగా; వాఁడును= సారథికూడా; అట్లు+అ+చేయన్= ఆ విధంగానే చేయగా; విమల+అశ్వవేగంబునన్= తెల్లనిగుర్రాలవేగంతో; చారు భీషణంబు+అగు= అందంగానూ, భయంకరంగానూఉన్న; ఆ+తేరు= ఆ రథం; నీ వారికిన్= నీ పక్షంవారికి (కౌరవవీరులకు); దుర్నిరీక్ష్యంబు+ఐ= చూడటానికి శక్యం కానిదై; నభంబునన్= ఆకాశంలో; భానురథంబు= సూర్యరథం; చను= వెళ్ళే; చందంబునన్= విధంగా.

**తాత్పర్యం:** అని చెప్పి, (సాత్యకి) అర్జునుడి వైపు తన తేరును శీఘ్రంగా తోలుమని సారథికి ఉత్తర్వు చేశాడు. వాడు (సారథి) సుందరం, భయంకరం అయిన, ఆ తేరును తోలాడు. కౌరవసేనకు ఆ రథం తెల్లని అశ్వాల వేగంతో ఆకాశంలో సూర్యరథంవలె చూడటానికి శక్యం కానిదై తోచింది.

### సుదర్శనుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట (సం. 7-94-6)

**క. అరుగఁగ సుదర్శనుం డను । ధరణీపతి యడ్డపడియె దర్ప మలర న**
**య్యిరువురుఁ బెనంగుటయు న । చ్చెరువుం గావించె నచటి సేనల కెల్లన్. 59**

**ప్రతిపదార్థం:** అరుగఁగన్= (సాత్యకి ఆ విధంగా) వెళ్ళగా; సుదర్శనుండు+అను ధరణీపతి= సుదర్శను డనే రాజు; అడ్డపడియెన్= అడ్డుపడ్డాడు; ఆ+ఇరువురున్=ఆ ఇద్దరూ (సుదర్శన సాత్యకులు); దర్పము+అలరన్= గర్వం వికసించగా; పెనంగుటయును= పోట్లాడగా; అచటి సేనలకున్+ఎల్లన్= అక్కడ ఉన్న సేనలకంతా (ఇరువాగులవారికి); అచ్చెరువు కావించెన్= ఆశ్చర్యాన్ని కలిగించింది.

**తాత్పర్యం:** (సాత్యకి వెళ్ళుతూ ఉండగా) సుదర్శను డనేరాజు అతడికి అడ్డుపడ్డాడు. ఆ ఇద్దరూ గర్వాతిశయంతో చేసిన పెనగులాట రెండు ప్రక్కల సైన్యాలకూ ఆశ్చర్యం కలిగించింది.

**వ. అట్టి యెడ నమ్మహీనాథుండు. 60**

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆ సుదర్శను డనే రాజు.

**క. పలు తునియలు సేయుచుఁ దూ । పుల దనదెసఁ జేరనీక పోర శినివరుం**
**డలిగి తురగముల సారథి । నిలఁగూల్చి తదుత్తమాంగ మేద్దెఱ నఱకెన్. 61**

**ప్రతిపదార్థం:** పలు తునియలు చేయుచున్= అనేక రకాలుగా ముక్కలు చేస్తూ; తూపులు= బాణాలు; తనదెసన్= తన దిక్కుకు; చేరన్+ఈక= చేరనీయకుండా; పోరన్= యుద్ధం చేయగా; శినివరుండు= సాత్యకి; అలిగి= కోపించి; తురగములన్= గుఱ్ఱాలను; సారథిన్= సూతుడిని; ఇలన్= భూమిమీద; కూల్చి= పడగొట్టి; తద్+ఉత్తమ+అంగమున్= అతడి తలను; ఏడ్తెఱన్ నఱకెన్= పరాక్రమంతో త్రుంచాడు.

**తాత్పర్యం:** సాత్యకి వేసే బాణాలను తనదగ్గరికి రానీయకుండా ముక్కలు ముక్కలు చేస్తూ యుద్ధం చేసే సరికి, సాత్యకి కోపించి, అతడి గుఱ్ఱాలనూ, సారథినీ పడగొట్టి భయంకరంగా అతడి తలను త్రుంచాడు.

**వ. నఱకి నిజసారథిం జూచి. 62**

**తాత్పర్యం:** (సుదర్శనుడి) తలను నరికివేసి, తన సారథిని చూచి.

**క. 'గురుఁ డను జలనిధిఁ గడచితి; । నొరులు దలంపంగ నాకు నులిగాలువ లీ**
**నరపతుల సరకు గొన నీ । వరదము సననిమ్ము నేఁటి యని కలయకుమీ! ॥ 63**

**ప్రతిపదార్థం:** గురుఁడు+అను జలనిధిన్= గురువనే సముద్రాన్ని; కడచితిన్= దాటాను; ఒరులు= ఇతరులు; నాకున్; తలంపంగన్= ఆలోచింపగా; నులిగాలువలు= పిల్లకాలువలు; ఈ నరపతులన్= ఈ రాజులను; సరకుగొనన్= లెక్కపెట్టను; నీవు; అరదము చననిమ్ము= తేరును పోనిమ్ము; నేఁటి అనికిన్= ఈ దినం యుద్ధానికి; అలయకుమీ!= అలసిపోవద్దు!

**తాత్పర్యం:** గురువైన ద్రోణు డనే సముద్రాన్ని దాటిన నేను, పిల్లకాలువల వంటి ఈ ఇతర రాజులను లెక్కచేయను. నీవు తేరును తోలుము. ఈనాటి యుద్ధానికి కలతపడవద్దు.'

**వ. అనవుడు వాఁడు నగుచు 'నీ విక్రమంబునకు నా వెరవు సంగడంబు గాదె! సంగరంబున నేమి సేయుదు? నెవ్వని పైఁ దేరు నడపుదు?' ననిన విని శినివరుండు వివ్వచ్చుచేతం జచ్చిన కరితురగ నరనికాయంబుల తిట్టలు సూపి 'యజ్జాడం దేరు వఱపు; మదె గాండీవగుణ చండనాదంబు వీతెంచుచున్న యది; నేఁడు పాండవ మధ్యముం డిచ్చిన ధనుర్విద్యా విలాసంబు మెఱయను బాండుసూనుల కేను జేయు భక్తి స్నేహంబులు నెఱపను వలయు; నా కడంక గని కురువిభుం డిరువురు ఫల్గునులను బుద్ధికలంగు నట్లు సేసెద' నని పలుకు నవసరంబున నద్దెసం గాంభోజ యవన సైన్యంబు లతని కడ్డపడం గడంగిన నవ్వీరుండు గుణంబు సారించి యబ్బలంబువలనికి దేరు వఱపించి. 64**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; వాఁడు= సాత్యకి యొక్క సారథి; నగుచున్= నవ్వుతూ; నీ విక్రమంబునకున్= నీ శౌర్యానికి; నా వెరవు= నా నేర్పరితనం; సంగడంబుకాదె!= తోడు కదా! (సాత్యకి శౌర్యానికి సారథి బండితోలు నేర్పరితనం చక్కని స్నేహితుడి వంటిదని భావం); సంగరంబునన్= యుద్ధంలో; ఏమి చేయుదున్?= నేనేమి చేయవలెను?; ఎవ్వనిపైన్ తేరునడపుదును?= ఎవడిమీదకు తేరును తోలవలయును?; అనినన్ విని= అనిన సారథి మాటలు విని; శినివరుండు= సాత్యకి; వివ్వచ్చుచేతన్+చచ్చిన= అర్జునుడిచేత చనిపోయిన; కరి, తురగ, నరనికాయంబుల= ఏనుగుల, గుర్రాల, మానవుల గుంపుల; తిట్టలు= రాశిని (కళేబరాల గుట్టలని భావం); చూపి; ఆ+జాడన్= ఆ దిక్కునకు; తేరు పఱపుము= తేరును తోలుము; అదె= అదిగో; గాండీవగుణ= గాండీవము అల్లెత్రాటి; చండనాదంబు= భయంకరమైన శబ్దం; వీతెంచుచున్న అది= వినవస్తూ ఉన్నది; నేఁడు= ఈ దినం; పాండవ మధ్యముండు= అర్జునుడు; ఇచ్చిన= నేర్పిన; ధనుర్విద్యా విలాసంబు మెఱయను= విలువిద్య యొక్క వైశిష్ట్యం ప్రకాశించటానికీ; పాండుసూనులకున్= పాండుపుత్రులకు; ఏను= నేను; చేయు భక్తి స్నేహంబులు= చేసే భక్తీ స్నేహమూ; నెఱపను వలయున్ = ప్రదర్శించవలసి ఉన్నది; నా కడంకన్+కని= నా పూనికను చూచి; కురువిభుండు= దుర్యోధనుడు; ఇరువురు ఫల్గునులు= ఇద్దరు ఫల్గునులు (ఇద్దరు అర్జునులు); అను బుద్ధి కలంగునట్లు= అనే తలంపుతో చీకాకు పడేటట్లు, చేసెదన్= చేస్తాను; అని= అంటూ; పలుకు అవసరంబునన్= మాటాడే సమయంలో; అద్దెసన్= ఆ వైపున; కాంభోజ యవన సైన్యంబులు= కాంభోజ యవన సైన్యాలు; అతనికిన్= ఆ సాత్యకికి; అడ్డపడన్+కడంగినన్= అడ్డం రావటానికి ప్రయత్నించగా; ఆ+వీరుండు= ఆ వీరుడు; గుణంబు సారించి= అల్లెత్రాటిని సిద్ధంగా లాగి; ఆ+బలంబు వలనికిన్= ఆ సైనికులు ఉన్న ప్రక్కకు; తేరు పఱపించి= తన రథాన్నితోలించి.

**తాత్పర్యం:** సాత్యకి మాటలకు ఆతడి సారథి నవ్వుతూ 'నీ శౌర్యానికి నా నేర్పరితనం నెచ్చెలికదా! యుద్ధంలో తేరును ఏ దిక్కుకు ఎవరిమీదకు తోలేది?' అని అడిగాడు. అందుకు సాత్యకి అర్జునుడిచే హతమైన ఏనుగులు, గుర్రాలు, సైనికుల కుప్పలున్న దిక్కు చూపి, ఆ దిక్కు తేరు నడపుమన్నాడు. అదిగో భయంకరమైన 'గాండీవజ్యాధ్వని వినిపిస్తూ ఉన్నది. అర్జునుడు నేర్పిన ధనుర్విద్యా విలాసాన్ని మెరిపించటానికి, పాండుకుమారుల మీద నా కున్న భక్తి విశేషాలు చాటటానికీ, నా ప్రయత్నాన్ని చూచి దుర్యోధనుడు యుద్ధరంగంలో ఇర్వురు అర్జును లున్నారే అని కలతచెందటానికి తగినట్లు చేస్తాను.' అని అంటూ ఉండే సమయంలో, కాంభోజ యనవ సైన్యాలు అతడి కడ్డురాగా; ఆ వీరుడు తన అల్లె త్రాటిని సారించాడు. ఆ సైనికుల దిక్కుకు తేరుతోలించాడు.

**క. నానాస్త్రంబులు ముందఱ । వే నిగుడన్ బడలువడిన వీరభటులపై**
**నేనుంగుల గుఱ్ఱంబుల । పీనుంగుల మీఁద దేరు పెలుచం బఱపెన్. 65**

**ప్రతిపదార్థం:** నానాస్త్రంబులు= అనేక రకాలైన బాణాలు; ముందఱన్= ముందుగా (తమ ముందు); వే నిగుడన్= వేగంగా గ్రుచ్చుకోగా; బడలుపడిన= అలసిపోయిన; వీరభటులపైన్= వీరులయిన సేనలమీద; ఏనుంగుల= ఏనుగుల; గుర్రంబుల= గుర్రాలయొక్క; పీనుంగులమీఁదన్= పీనుగులమీదుగా; తేరు= రథాన్ని; పెలుచన్= త్వరగా; పఱపెన్= తోలాడు.

**తాత్పర్యం:**అంతకు మునుపే అనేకాస్త్రాలు తమ మీద వేగంగా గ్రుచ్చుకోగా అలసిపోయిన వీర సైనికుల మీదుగా, ఏనుగుల, గుర్రాల, పీనుగుల మీదుగా త్వరగా తన తేరును తోలించాడు.

**వ. ఇవ్విధంబున వెండియుం గిరాతశకబర్బర పారద యవన ప్రముఖ మ్లేచ్ఛసేనల రూపడంచి నీ మూఁకలు గలఁ గం దటిసి చిత్ర వర్మంబు మైచాయగా నారాచంబులు నఖంబులును విల్లు బలుమొగంబును నై బెబ్బులి వోలెం బోవం బోవ దుర్యోధన దుశ్శాసన చిత్రసేన వివింశతి శకుని దుస్సహ దుర్ధర్షణ క్రథప్రభృతి రథికనికరంబు రభసంబునం బోకు పోకు మను నెలుంగులతోఁ బిఱిందిదెసం దఱిమినం దత్కలకలంబు విని యతండు సూతు నాలోకించి. 66**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; వెండియున్= ఇంకను; కిరాత, శక, బర్బర, పారద, యవన, ప్రముఖ= కిరాత, శక, బర్బర, పారద, యవనులు మొదలగు; మ్లేచ్ఛసేనల= మ్లేచ్ఛసైనికుల; రూపు+అడంచి= నాశంచేసి; నీ మూఁకలు= నీ సేనలు; కలఁగన్= చికాకుపడగా; తఱిసి= దగ్గరకుపోయి; చిత్రవర్మంబు= రంగులున్న కవచం; మైచాయగాన్= శరీరపురంగు కాగా; నారాచంబులు= వాడిబాణాలు; నఖంబులును= గోళ్ళును; విల్లు బలుమొగంబునున్+ఐ= విల్లు బలమైన ముఖం గలదై; బెబ్బులిపోలెన్= పెద్దపులి మాదిరిగా; పోవన్+పోవన్= పోగా పోగా; దుర్యోధన, దుశ్శాసన, చిత్రసేన, వివింశతి, శకుని, దుస్సహ, దుర్ధర్షణ, క్రథ, ప్రభృతి= ఈ మొదలయిన; రథిక నికరంబు= సేనానుల సమూహం; రభసంబునన్= ఆర్భాటంతో; పోకుము పోకుము= పోవద్దు పోవద్దు; అను= అనేటటువంటి; ఎలుంగులతోన్= గొంతెత్తి పిలిచే శబ్దాలతో; పిఱింది దెసన్= వెనుకవైపులో; తఱిమినన్= తరుమగా; తత్కలకలంబు విని= ఆ కల్లోలాన్ని విని; అతండు= సాత్యకి; సూతున్+ఆలోకించి= సూతుడిని చూచి.

**తాత్పర్యం:** కిరాతులు, శకులు, బర్బరులు, పారదులు, యవనులు, - మొదలయిన ఆటవిక సైనికులను నాశనం చేసి, నీ సైనికులను చీకాకుపరచి, కవచం రంగులు ఒంటిరంగులుగా, బాణాలు గోళ్ళుగా, విల్లు బలమైన ముఖంగా పెద్దపులిమాదిరి పోగా, పోగా, దుర్యోధన దుశ్శాసన చిత్రసేన వివింశతి శకుని దుస్సహ దుర్ధర్షణ క్రథులు మొదలైన వీరుల సమూహాలు పోకు పోకుమని అదలిస్తూ వెన్నంటి ఆర్భాటంగా తరుముకొని రాగా, ఆ కలకలాన్ని విని తన సారథిని చూచి.

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'మందగతిఁ జనుము నావెను । కం దగిలెడు సైన్యజలధి గ్రక్కున శోషిం**
**పం దీవ్రశరార్చుల నం । దంద వడిం బఱపి నగుచు నరుగుద' మనినన్. 67**

**ప్రతిపదార్థం:** (సారథిని చూచి); మందగతిన్= నెమ్మదిగా; చనుము= వెళ్ళుము; నా వెనుకన్= నా వెనుకప్రక్క; తగిలెడు= తాకేటటువంటి; సైన్యజలధిన్= సేనాసముద్రాన్ని; గ్రక్కునన్+శోషింపన్= వేగమే ఎండిపోయేటట్లు; తీవ్రశర+అర్చులన్= వాడి అయిన బాణాగ్నులను; అందంద= అక్కడక్కడ; వడిన్+పఱపి= శీఘ్రంగా; నగుచున్= నవ్వుతూ; అరుగుదము+అనినన్= వెళ్ళుదాము అనగా.

**తాత్పర్యం:** 'నెమ్మదిగా పొమ్ము. నా వెనుక తాకే సేనా సముద్రాన్ని శీఘ్రంగా ఎండిపోయేటట్లు వాడి అయిన బాణాలనే అగ్నులను అక్కడక్కడ వ్యాపింపజేసి నవ్వుతూ మనం వెళ్ళుదాము' అనగా.

**విశేషం:** అలం: రూపకం.

**క. అతఁ డట్ల చేయ నబ్బల । మతిరయమున నెయిది పొదువ నరిగి కరిచతు**
**శ్శతియు హయత్రిశతియు వసు । మతిఁ గూల్చెను శినివరుండు మద మెలరారన్. 68**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ సారథి; అట్లు+అ చేయన్= ఆ ప్రకారమే చేయగా ఆ+బలము= ఆ కౌరవసైన్యం; అతిరయమునన్= మిక్కిలివేగంగా; ఎయిది= వెంబడించి; పొదువన్= క్రమ్ముకోగా; శినివరుండు= సాత్యకి; మదము+ఎలరారన్= దర్పం అతిశయించగా; అరిగి= వెళ్ళి; కరిచతుశ్శతియున్= నాలుగు వందల ఏనుగులను; హయత్రిశతియున్= మూడువందల గుఱ్ఱాలను; వసుమతిన్= భూమిమీద; కూల్చెన్= పడగొట్టాడు.

**తాత్పర్యం:** సాత్యకి చెప్పిన విధంగానే సారథి తేరు తోలగా, శీఘ్రంగా కురుసేన వేగంగా వెంబడించి క్రమ్ముకోగా - సాత్యకి దర్పాతిశయంతో నడిచి నన్నూరు ఏనుగులను, మున్నూరు గుఱ్ఱాలను హతమార్చాడు.

**వ. అంత నిలువక చలంబున నా సేన శైనేయుపై బెట్టు గిట్టె; నట్టియెడ. 69**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతటితో; నిలువక= ఆగక; చలంబునన్= మత్సరంతో; ఆ సేన; శైనేయుపైన్= సాత్యకి మీద; బెట్టు= తీవ్రంగా; కిట్టెన్= తాకెను; అట్టి+ఎడన్= ఆ సమయంలో

**తాత్పర్యం:** అంతమాత్రంతో నిలువకుండా మత్సరంతో ఆ సేన సాత్యకిమీద తీవ్రంగా దాడిచేసింది; అప్పుడు.

**క. నర తురగ ద్విరద రథో । త్కరములలో నతని శరము దాఁకనిరూపుం**
**బరికించియుఁ గానం ద । త్త్వరితత్వంబునకు వేఱ వర్ణన యేలా? 70**

**ప్రతిపదార్థం:** నర తురగ ద్విరద రథ+ఉత్కరములలోన్= చతురంగ బలాలలో (రథగజ తురగ పదాతులలో); అతని శరము= సాత్యకియొక్క బాణం; తాఁకని రూపున్= తగులని ఆకారాన్ని; పరికించియున్= పరిశీలించి చూచికూడా; కానన్= కానలేనైతిని; తత్+త్వరితత్వంబునకున్= ఆ సాత్యకియొక్క వేగానికి (బాణప్రయోగ లాఘవశక్తికి); వేఱ= వేరే; వర్ణన+ఏలా?= వర్ణించటమెందుకు?

**తాత్పర్యం:** (కౌరవుల) చతురంగ బలాలలో సాత్యకి బాణం తగులని శరీరం వెదకి చూచినా కానరాదు. కాబట్టి ఆతడి అస్త్రప్రయోగ లాఘవశక్తిని వేరే వర్ణించటమెందుకు?

**క. 'నరుబాహాస్ఫురణమునకు । సరి యగు నెక్కు డగుఁ గాని సాత్యకి భుజ వి**
**స్ఫురణం బల్పము గా' దని । సురనికురుంబంబు పొగడుచుం జూచె నృపా! 71**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ ధృతరాష్ట్ర చక్రవర్తీ!; నరుబాహాస్ఫురణమునకున్= అర్జునుడి భుజశక్తి వ్యక్తీకరణానికి; సరి అగున్+ఎక్కుడగున్‌కాని= సమానమో లేక ఎక్కువో అవుతుంది కాని; సాత్యకి భుజవిస్ఫురణంబు+అల్పముకాదు= సాత్యకి భుజశక్తి తక్కువైనది కాదు; అని= అంటూ; సురనికురుంబంబు= దేవతాసమూహం; పొగడుచున్= కీర్తిస్తూ; చూచెన్= చూచింది.

**తాత్పర్యం:** ఓ రాజా! 'సాత్యకి భుజబలం తక్కువైంది కాదు. అర్జునుడి భుజశక్తికి సమానమో లేక ఒక్కింత ఎక్కువో అవుతుంది' అని దేవతాసమూహం పొగడుతూ చూచింది.

**మ. కురుముఖ్యుండును దోడి సైనికులుఁ బెక్కుల్ దూపు లొక్కుమ్మడిం**
**గురియం బిన్నటి నవ్వుతో నతఁడు తత్కోదండ సూతాశ్వకే**
**తురథంబుల్ వికలత్వముం బొరయఁగా దోర్దర్పదుర్దాంతుఁ డై**
**వెరవుం జేవయు లావునుం దెలిపె నుర్వీనాథ! యా సేనకున్. 72**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథ!= ఓ రాజా!; కురుముఖ్యుండును= దుర్యోధనుడును; తోడి సైనికులు= కూడి ఉన్న సేనయు; పెక్కుల్ తూపులు= పెక్కుబాణాలు; ఒక్కుమ్మడిన్ కురియన్= ఒక్కసారి (వానవలె) కురియగా; అతఁడు= సాత్యకి; పిన్నటి నవ్వుతోన్= చిరునవ్వుతో; తద్+ఆ కౌరవుల; కోదండ= విండ్లు; సూత= సారథులు; అశ్వ= గుఱ్ఱాలు; కేతు= జెండాలు; రథంబుల్= తేరులు;

వికలత్వమున్+పొరయఁగాన్= ముక్కలు కాగా; దోర్దర్ప= భుజబలంచేత; దుర్దాంతుఁడు+ఐ= జయించటానికి సాధ్యంకానివాడయి; ఆ సేనకున్= ఆ కురుసేనకు; వెరవున్= ఉపాయాన్ని; చేవయున్= శక్తిని; లావును= బలాన్ని; తెలిపెన్= తెలియజేశాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! దుర్యోధనుడు, అతడి వెంట నున్న సైనికులు ఒక్కుమ్మడిగా పెక్కుబాణాలు కురిపించారు. సాత్యకి చిరునవ్వుతో వారి విండ్లను, సారథులను, గుఱ్ఱాలను, పతాకలను, తేరులను, ముక్కలుచేసి, అజేయుడై తన భుజబలాన్ని, ఉపాయాన్ని, శక్తిని ఆ సేనకు తెలియజేశాడు.

**వ. అప్పుడు.** **73**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. కదిసి నరేంద్రుఁడు సూతుని । మదమును దురగముల యుబ్బు మానిచి నిశిత**
**ప్రదరముల నతని యంగము । పొదివె శకుని దోడుపడఁగ భుజబల మలరన్.** **74**

**ప్రతిపదార్థం:** నరేంద్రుఁడు= సుయోధనుడు; కదిసి= చేరి; సూతుని మదమును= సారథి దర్పాన్ని; తురగముల ఉబ్బున్= గుఱ్ఱాల ఉత్సాహాన్ని; మానిచి= మాన్పివేసి; నిశిత ప్రదరములన్= వాడి అయిన బాణాలతో; భుజబలము+అలరన్= భుజశక్తి వికసించగా; శకుని తోడుపడఁగన్= శకుని సహాయంకాగా; అతని అంగమున్ పొదివెన్= అతడి శరీరమును క్రమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** శకుని తనకు సహాయపడగా తన భుజబలం అతిశయించగా దుర్యోధనుడు సాత్యకిని సమీపించి, అతని సారథి గర్వాన్ని, గుఱ్ఱాల ఉత్సాహాన్ని తగ్గించి వాడి బాణాలతో అతడి శరీరాన్ని కప్పివేశాడు.

**వ. పొదివిన నొదవిన కోపంబు నాటోపంబున.** **75**

**ప్రతిపదార్థం:** పొదివినన్= కప్పివేయగా; ఒదవిన= కలిగిన; కోపంబు+ఆటోపంబునన్= కోపము యొక్క వేగిరపాటుతో

**తాత్పర్యం:** అట్లు కప్పివేయగా కలిగిన కోపం యొక్క వేగంతో.

**మ. ధరణీనాథ! మురాంతకానుజుఁడు గాంధారేశు చాపంబునుం**
**గురువంశాగ్రణి సూతుకంఠము నతిక్రూరాస్త్రపాతంబునం**
**గరమాశ్చర్యము గాఁగఁ ద్రుంచినఁ దురంగస్తోమ మా మేదినీ**
**శ్వరు తే రచ్చటు వాయ నీడ్చికొని పెల్చంబాఱె దుర్వారమై.** **76**

**ప్రతిపదార్థం:** ధరణీనాథ!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); మురాంతక+అనుజుఁడు= సాత్యకి; గాంధార+ఈశు చాపంబునున్= శకుని వింటిని; కురువంశ+అగ్రణి సూతుకంఠమున్= దుర్యోధనుడి సారథికుత్తుకను; అతి క్రూర+అస్త్రపాతంబునన్= మిక్కిలి తీవ్రమయిన బాణాలను కురిపించటంచేత (వాడి బాణాలను వర్షపాతంవలె వేశాడని భావం); కరము= మిక్కిలి; ఆశ్చర్యముకాఁగన్= మిక్కిలి వింత గొల్పేటట్లు; త్రుంచినన్= నరకగా; తురంగ స్తోమము= గుఱ్ఱాల సమూహం (తేరు గుఱ్ఱాలు); ఆ మేదినీశ్వరుతేరున్= ఆ రాజుతేరును (దుర్యోధనుడి తేరును); అచ్చటు పాయన్= ఆ చోటును పాసిపోవటానికి; ఈడ్చికొని= లాగికొని; దుర్వారము+ఐ= అడ్డుకొనరానట్లుగా; పాఱెన్= పరుగెత్తింది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర చక్రవర్తీ! సాత్యకి, శకుని విల్లునూ, దుర్యోధనుడి సారథి కుత్తుకనూ మిక్కిలి భయంకరమైన బాణాలతో, చూచేవారు ఆశ్చర్యపడేటట్లుగా త్రుంచివేశాడు. దుర్యోధనుడి తేరి గుఱ్ఱాలు అతని తేరును అడ్డుకొనటానికి వీలులేని విధంగా అక్కడి నుండి లాగి కొని వెళ్ళాయి.

**వ. ఇత్తెఱంగునం బాఱిన.** 77

**తాత్పర్యం:** ఈ విధంగా పరుగెత్తగా.

**క. తమ్ములు దొరలును నేపఱి । యమ్మనుజాధిపునిపజ్జ కరుగుటయును సై**
**న్యమ్ము వెఱచఱచి విచ్చిన । నెమ్మదిఁ దన యరుగు దెస శినిప్రభుఁ డరిగెన్.** 78

**ప్రతిపదార్థం:** తమ్ములున్= తన తమ్ములును; దొరలును= నాయకులును; ఏపు+అఱి= శక్తి ఉడిగి; ఆ+మనుజ+అధిపుని పజ్జకున్= ఆ రాజు ప్రక్కకు; అరుగుటయును= వెళ్ళగా; సైన్యమ్ము= సేన; వెఱచఱచి= భయపడి; విచ్చినన్= విడి పోగా; శిని ప్రభుఁడు= సాత్యకి; తన అరుగుదెసన్= తాను వెళ్ళే దిక్కుకు; నెమ్మదిన్= నెమ్మదిగా; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** (దుర్యోధనుడి) తమ్ములు, సేనానులు బలం ఉడిగి దుర్యోధనుని కౌరవసైన్యం భయపడి ప్రక్కకు వెళ్ళగా చెల్లాచెదరైపోగా, సాత్యకి తాను వెళ్ళుతున్న వైపు వెళ్ళాడు.

**వ. అనిన విని యాంబికేయుండు సంజయున కి ట్లనియె.** 79

**ప్రతిపదార్థం:** ఆంబికేయుండు= అంబికయొక్క కుమారుడు, ధృతరాష్ట్రుడు

**తాత్పర్యం:** అనగా సంజయుడితో ధృతరాష్ట్రుడు ఈ విధంగా అన్నాడు:

**క. 'పులికిఁ బసులు వాఱిన క్రియ । నలవుఁ జలము సిగ్గు విడిచి య ట్లొక్కని కో**
**ల్లల కోర్వక విఱిగిన పు । త్రుల నే మని విందు నేను రోయక యింకన్?'** 80

**ప్రతిపదార్థం:** పులికిన్ పసులు పాఱిన క్రియన్= పులిని చూచి పశువులు పర్వెత్తినట్లుగా; అలవున్= బలమును; చలమున్= పట్టుదలను; సిగ్గున్= సిగ్గును; విడిచి= వదలివేసి; అట్లు= ఆ మాదిరిగా; ఒక్కని= ఒకనియొక్క; కోల్లలకున్= ఎదురు దాడికి; ఓర్వలేక= ఓపలేక; విఱిగిన= ఓడిపోయిన; పుత్రులను= కొడుకులను (గురించి); ఇంకన్= ఇకమీదట; ఏను= నేను; రోయక= అసహ్యించుకోకుండా; ఏమని విందున్?= ఏమి గొప్పగా వినగలను?

**తాత్పర్యం:** 'ఒక్కడి బాణాలకు ఆ విధంగా పులిని చూచి పరుగెత్తే పశువులమాదిరి సిగ్గూ, బిడియమూ, పట్టుదలా, బలమూ వదలి పరుగెత్తిన కురు కుమారుల ఓటమికి అసహ్యపడకుండా ఇంకా ఏమని వినగలను?

**క. అనుడు నతఁ డవ్విభుని కి । ట్లను 'నీవును నగ్రసుతుఁడు నవినయములు సే**
**సినఁ బాటిల్లిన యాపద । వినకుండఁగ వశమె? మీఁదు విను తెలియంగన్.** 81

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; అతఁడు= ఆ సంజయుడు; ఆ విభునికిన్= ఆ ధృతరాష్ట్రుడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; నీవును+అగ్రసుతుఁడును= నీవూ, నీ పెద్దకొడుకూ (దుర్యోధనుడును); అవినయములు= నీతిమాలిన పనులు; చేసినన్= చేయగా; పాటిల్లిన= కలిగిన, ఆపద= కష్టాన్ని; వినకుండఁగన్ వశమె?= వినకపోవటానికి సాధ్యమా?; తెలియంగన్= స్పష్టంగా (తెలిసేటట్లుగా); మీఁదు విను= ఆ పై కథను వినుము.

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. 'నీవూ నీ పెద్దకొడుకూ చేసిన అవినీతివలన కలిగిన ప్రమాదాలను వినకుంటే ఎలా? ఆ మీద జరిగిన కథను వినుము.

**విశేషం:** ఈ పద్యంలో సంజయుడు ఈ కలుగుతూ ఉన్న ప్రమాదాలను ధృతరాష్ట్ర దుర్యోధనుల అవినీతి ఫలితాలుగా తెలియజెప్పాడు.

**వ. అట్లు గాసి యై కోపించి నీ కొడుకు పురికొల్ప నంబష్ఠ టేంకణ పారద ప్రముఖ దేశంబుల బలంబులు దుశ్శాసన పురస్సరంబుగా రయంబునం జని సాత్యకిం జుట్టుముట్టిన నా జెట్టిమగండు నిజభుజ విక్రమాటోపంబునకుం బాటవంబు దలకొల్పిన. 82**

**ప్రతిపదార్థం:** అట్లు గాసి ఐ= ఆ విధంగా కష్టపడి; కోపించి= కోపం చేసికొని; నీకొడుకు= నీ కొడుకైన దుర్యోధనుడు; పురికొల్పన్= ప్రేరేపించగా; అంబష్ఠ, టేంకణ, పారద ప్రముఖ= ఈ పేర్లుగల; దేశంబుల బలంబులు= దేశాల సైన్యాలు; దుశ్శాసన పురస్సరంబుగాన్= దుశ్శాసనుడిని ముందుపెట్టుకొని; రయంబునన్+చని= శీఘ్రంగా వెళ్ళి; చుట్టుముట్టినన్= చుట్టూ క్రమ్ముకోగా; ఆ జెట్టిమగండు= వీరశ్రేష్ఠుడు; నిజభుజ విక్రమ+ఆటోపంబునకున్= తన భుజబల విజృంభణానికి; పాటవంబు తలకొల్పినన్= నైపుణ్యం పూనిక కలిగించగా.

**తాత్పర్యం:** నీ సైనికులు, కుమారులు ఓడిపోగా, కోపంతో నీ కొడుకు దుర్యోధనుడు పురికొల్పగా, అంబష్ఠ, టేంకణ, పారద మొదలైన దేశాల సైన్యాలు దుశ్శాసనుడిని ముందుంచుకొని వేగంగా సాత్యకిని చుట్టుముట్టగా, సాత్యకి, తన భుజబల విజృంభణానికి నైపుణ్యాన్ని కల్పించి పోరు సాగించాడు.

**మ. విఱిగెం బెక్కు రథంబు; లొక్క మొగి నుర్విం గూలె శుండాలముల్;**
**దఱచై రాలె దురంగమావయవ సంతానంబు; లింతింత లై**
**కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబు లై**
**పఱచెన్ నెత్తురు భూతకోటి విహరింపం బ్రస్తుతింపన్ సురల్. 83**

**ప్రతిపదార్థం:** విఱిగెన్+పెక్కురథంబులు= పెక్కుతేర్లు విరిగినవి; ఒక్క మొగిన్= ఒక్కవరుసగా; శుండాలముల్= ఏనుగులు; ఉర్విన్+కూలెన్= భూమిమీద పడ్డాయి (అనగా చనిపోయాయి); తురంగమ+అవయవ, సంతానంబులు= గుర్రాల శరీరపు భాగాలు; తఱచై= విస్తారంగా; రాలెన్= రాలిపోయాయి (అనగా పడిపోయాయి); భట+అంగకంబులు= సైనికులయొక్క శరీరాలు; ఇంతింతలు+ఐ= చిన్న చిన్న ముక్కలుగా; కుఱుకుల్+కట్టెన్= రాశులు కట్టాయి (కుప్పలుగా అయినవి); రణక్షోణిన్= యుద్ధభూమిలో; భూతకోటి= పిశాచాల సమూహం; విహరింపన్= తిరగగా; సురల్ ప్రస్తుతింపన్= దేవతలు కీర్తించగా; నెత్తురు= రక్తము; ప్రవాహంబులు+ఐ+పఱచెన్= ప్రవాహంగా పారింది.

**తాత్పర్యం:** సాత్యకి భుజాటోపానికి అనేక రథాలు విరిగిపోయాయి, ఏనుగులు ఒక వరుసగా భూమిమీద కూలాయి; గుర్రాల శరీరాలు చిన్న ముక్కలై విస్తారంగా నేలరాలాయి, భటుల శరీరాలు యుద్ధరంగంలో రాసిపోసినట్లయ్యాయి, నెత్తురు ప్రవహిస్తూ ఉండగా, పిశాచసమూహం విహరించగా, దేవతలు కీర్తించగా (సాత్యకి యుద్ధం సాగింది).

### దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి పాఱిపోవుట (సం. 7-97-29)

**క. రోషమున దుస్ససేనుఁడు । పాషాణప్రథన నిపుణ పార్వతికతతిన్**
**భీషణముగఁ గవియింప జి । గీషం బొదువుటయుఁ జూడ్కిఁ గెంపారంగన్. 84**

**ప్రతిపదార్థం:** దుస్ససేనుఁడు= దుశ్శాసనుడు; రోషమునన్= రోషంతో; పాషాణ ప్రథన నిపుణ= రాళ్ళ యుద్ధంలో నేర్పరులైన; పార్వతిక తతిన్= కొండజాతివారిని; భీషణముగన్= భయంకరంగా; కవియింపన్= ఆక్రమింపచేయగా; జిగీషన్= జయేచ్ఛతో; పొదువుటయున్= క్రమ్ముకొనుటయు; చూడ్కి= తన చూపు; కెంపారంగన్= ఎర్రబడగా (అనగా కోపం కలుగగా).

**తాత్పర్యం:** దుశ్శాసనుడు కోపంతో రాళ్ళ యుద్ధంలో నేర్పరులైన కొండజాతివారిని భయంకరంగా ప్రేరేపించాడు. జయాశతో వారు క్రమ్ముకోగా సాత్యకి చూపు ఎర్రబడగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. శినివరుఁ డాఱా లెల్లను । దునియలుగా నేయ మగిడి తొరఁగుచు నవి వై**
**చినవారిన నొప్పింపఁగ । గనుకని నమ్మూఁక విచ్చెఁ గౌరవనాథా! 85**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ఓ కురురాజా!; శినివరుఁడు= సాత్యకి; ఆ ఱాలు+ఎల్లను= ఆ రాళ్ళన్నిటిని; తునియలుగాన్+ఏయన్= ముక్కలు చేయగా; మగిడి= మరల; తొరఁగుచున్= వ్రాలుచూ; అవి= ఆ రాళ్ళు; వైచిన వారిన్+అ= వేసినవారినే; నొప్పింపఁగన్= బాధించగా; కనుకని= సంభ్రమంతో (తొట్రుపాటుతో); ఆ+మూఁక= ఆ సైన్యం; విచ్చెన్= విరిసిపోయింది.

**తాత్పర్యం:** ఓ రాజా! సాత్యకి ఆ రాళ్ళ నన్నింటిని ముక్కలు చేయగా, అవి తిరిగి రాళ్ళు వేసిన వారిపైకి వెళ్ళి బాధించగా, ఆ సైన్యం భయంతో విచ్చిపోయింది.

**తే. విచ్చుటయు నంటఁదాఁకి యవ్వీరుఁ డంప । వెల్లిఁ దేల్చిన వెగడంది పెల్లగిల్లి**
**యధిప! దుశ్శాసనుఁడు మొదలైన యోధ । గణము లెల్లను ద్రోణుని కడకుఁ బఱచె. 86**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; విచ్చుటయున్= విడిపోవుటయు; అంటన్+తాఁకి= తాకునట్లుగా దగ్గరై; ఆ+వీరుఁడు= ఆ సాత్యకి; అంపవెల్లిన్= బాణప్రవాహంలో; తేల్చినన్= తేల్చగా; వెగడు+అంది= భయపడి; పెల్లగిల్లి= లేచి; దుశ్శాసనుడు మొదలైన యోధగణములు+ఎల్లను= దుశ్శాసనుడు మొదలైన యుద్ధవీరులసమూహాలన్నీ; ద్రోణుని కడకున్= ద్రోణుడి దగ్గరకు; పఱచెన్= పరుగెత్తెను.

**తాత్పర్యం:** ఓ రాజా! వీరుడయిన ఆ సాత్యకి విచ్చిపోయిన సైన్యాన్ని అంటదాకి బాణప్రవాహంలో తేల్చగా భయపడి లేచి దుశ్శాసనుడు మొదలైన వీరులసమూహాలన్నీ ద్రోణుడి దగ్గరకు పరుగెత్తటం జరిగింది.

**వ. ఇవ్విధంబునఁ దన చేరువకుం జనిన యా దుశ్శాసనునిం గనుంగొని మున్ను శైనేయు చన్నదెసం బుట్టిన యక్కోలాహలం బాకర్ణించుచున్న యగ్గురుం డి ట్లనియె. 87**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; తన చేరువకున్= తన దగ్గరకు; చనిన= పోయిన; ఆ దుశ్శాసనునిన్+కనుంగొని= ఆ దుశ్శాసనుడిని చూచి; మున్ను= ఇదివరకు; శైనేయు చన్నదెసన్= సాత్యకి వెళ్ళిన దిక్కులో; పుట్టిన= కలిగిన; ఆ+కోలాహలంబు= ఆ కలకలాన్ని; ఆకర్ణించుచున్న= వింటూ ఉన్న; ఆ+గురుండు= ఆ ద్రోణుడు; ఇట్లు+అనియెన్= ఈ ప్రకారంగా అన్నాడు.

**తాత్పర్యం:** తన దగ్గరకు చేరిన దుశ్శాసనుడిని చూచి, అంతకుముందే సాత్యకి పోయిన దిక్కులో కలిగిన కలకలాన్ని వింటూ ఉన్న ద్రోణుడు ఇట్లా అన్నాడు:

**క. 'ఏమి యువరాజ విభునకు । సేమమె? సైంధవుని నేమి సేసె నరుఁడు? నీ**
**వేమిటి కి ట్లీరథిక । స్తోమముతో విఱిగి? తెందుఁ జొచ్చెద వింకన్? 88**

**ప్రతిపదార్థం:** ఏమి= ఏమి; యువరాజ విభునకు సేమమె?= యువరాజైన దుర్యోధనుడు క్షేమంగా ఉన్నాడా?; నరుఁడు= అర్జునుడు; సైంధవునిన్= సైంధవుడిని; ఏమి చేసెన్?= ఏమి చేశాడు?; నీవు= నీవు (దుశ్శాసనా! నీవు); ఏమిటికిన్= ఏ కారణంగా; ఇట్లు= ఈ విధంగా; రథికస్తోమముతోన్= సేనానుల వరుసతో; విఱిగితి= ఓడిపోయావు?; ఇంకన్ ఎందున్ చొచ్చెదవు?= ఇంక ఎక్కడికి పోతావు?

**తాత్పర్యం:** 'ఏమయింది? యువరాజైన దుర్యోధనుడు క్షేమమా? అర్జునుడు సైంధవుడిని ఏమి చేశాడు? నీవు ఈ విధంగా ఈ వీరుల సమూహంతో కూడ ఎందుకు ఓడిపోయావు? ఇం కెక్కడికి పోతావు?

**క. అడుకులు ది న్నట్లగునే? । కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁ బఱచితి నాఁ**
**డొడ లెఱుఁగక పాండుసుతుల । నుడిగి మడుగ వలసె; నిప్పు డొక సాత్యకిచేన్. 89**

**ప్రతిపదార్థం:** కడుపునన్= కడుపులో; కుట్టు+ఎత్తినపుడు= నొప్పి కలిగినప్పుడు; అడుకులు= అటుకులు; తిన్నట్లు+అగునే?= తిన్నవిధంగా ఔతుందా?; నాఁడు= వెనుక; ఒడలు+ఎఱుఁగక= ఒళ్ళు తెలియక; పాండుసుతులన్= పాండు కుమారులను; కడున్= మిక్కిలి; పఱచితి= కష్టపెట్టావు; ఇపుడు= ఈ సమయంలో; ఒక సాత్యకిచేన్= ఒక సాత్యకి వలన; ఉడిగి= కష్టపెట్టబడి; మడుగ వలసెన్= అణగిపోవలసి వచ్చింది.

**తాత్పర్యం:** కడుపు కుట్టినపుడు అటుకులు తిన్నట్లుగా వెనుక పాండవులను కష్టపెట్టావు. ఇపుడు ఒక్క సాత్యకి చేత కష్టపెట్టబడి అణిగిపోవలసి వచ్చింది.

**విశేషం:** అలం: నిదర్శన.

**వ. భీమార్జునుల బారినుండి యేమి గాఁ గలవాఁ డ?' వని పలికి యలుక వొడమిన నంత నిలువక. 90**

**ప్రతిపదార్థం:** భీమా+అర్జునుల, బారినుండి= భీమార్జునుల వలన కలిగే ప్రమాదం నుండి; ఏమి,కాన్+కలవాఁడవు= ఏ మౌతావు?; అని; పలికి; అలుక+పొడమినన్= కోపం కలుగగా; అంత= అంతటితో; నిలువక= ఆగక

**తాత్పర్యం:** భీమార్జునులచేత చిక్కి ఏ మౌతావో అని, కోపంతో ద్రోణుడు అంతతో ఆగక

**చ. 'మఱచితె యా సభన్ భువనమాన్య గుణోత్తర యాజ్ఞసేని నీ**
**పఱచిన పాటుఁ? బాండవులఁ బల్కిన పల్కులు? నాఁటి క్రొవ్వు నే**
**డ్తెఱయును నెందుఁ బోయె? రణధీరుల వారల నల్గఁ జేసి సి**
**గ్గఱి తుది; నిట్టు లైతి; తగు నక్కట! తియ్యన గావె ప్రాణముల్? 91**

**ప్రతిపదార్థం:** ఆ సభన్= ఆ సభలో (జూదమాడిన సభలో); భువనమాన్య గుణోత్తర= లోకంలో గౌరవించదగిన గుణవిశేషములు కలిగిన ఆమెను; యాజ్ఞసేనిన్= ద్రౌపదిని; నీ పఱచినపాటు= నీవు కష్టపెట్టిన విధము; ఆ సభన్= ఆ సభలో; పాండవులన్= పాండవులను; పల్కిన పలుకులు?= ఆడినమాటలు?; మఱచితె?= మరిచావా?; నాఁటి క్రొవ్వు= అప్పటి పొగరుయొక్క; ఏడ్తెఱయును= ఆ గొప్పతనం; ఎందున్+పోయెన్?= ఇప్పు డెక్కడికి పోయింది?; రణధీరులన్= యుద్ధవీరులను; వారలన్= పాండవులను; అల్గన్+చేసి= కోపింప చేసి; సిగ్గు+అఱి= సిగ్గువీడి; తుదిన్= చివరకు; ఇట్టులు+ఐతి= ఈ విధంగా అయ్యావు (ఈ భంగపాటు పడ్డావు); తగున్= తగి ఉన్నది; అక్కట!= అయ్యో!; ప్రాణముల్= ప్రాణాలు; తియ్యన కావె!= తీపి కదా!

**తాత్పర్యం:** ఆ సభలో లోకమాన్య గుణోత్తర అయిన ద్రౌపదిని అవమానపరచిన విషయం, పాండవులను పలికిన మాటలు మరిచావా? అప్పటి కొవ్వు, దర్పం ఇప్పు డెక్కడికిపోయాయి? యుద్ధవీరులైన వారికి కోపం కలిగించి, సిగ్గువీడి తుదకు ఇట్లయ్యావు. అయ్యో! పాపం! ప్రాణాలు తీపే కదా!

**ఆ. బ్రతుకఁ దలఁచితేని బాండునందనులకు । నింక నైనఁ బుడమి యిచ్చునట్లు**
**గాఁగ నన్నతోడఁ గార్యంబుఁ జెప్పు మ । వ్వెడఁగు భీష్ము బుద్ధి వినక చెడియె! 92**

**ప్రతిపదార్థం:** బ్రతుకన్+తలఁచితేని= బ్రతికి ఉండటానికి ఇష్టముంటే; పాండునందనులకున్= పాండుకుమారులకు; ఇంకన్+ఐనన్= ఇప్పటికైనా; పుడమి ఇచ్చునట్లుగాఁగన్= రాజ్యం ఇచ్చేటట్లుగా; అన్నతోడన్= నీ అన్న అయిన సుయోధనుడితో, కార్యంబున్ చెప్పుము= చేయవలసిన పనిని చెప్పుము; ఆ+వెడఁగు= ఆ వెర్రివాడు (దుర్యోధనుడు); భీష్మబుద్ధిన్= భీష్ముడి సలహాను; వినక= వినకుండా; చెడియెన్= చెడిపోయాడు.

**తాత్పర్యం:** బ్రతుకుమీద ఆశ ఉంటే ఇప్పటికైనా పాండుకుమారులకు రాజ్యాన్ని ఇచ్చేటట్లుగా, చేయవలసిన పనిని మీ అన్నతో చెప్పుము. ఆ అవివేకి భీష్ముడి మాట వినక చెడిపోయాడు.

**వ. ఇట్లు సేయఁజాల వైతేని.** 93

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; చేయన్+చాలవు+ఐతి+ఏని= చేయలేని వాడవైతే

**తాత్పర్యం:** ఈ విధంగా చేయలేకపోతే.

**క. ఎటు వోవ వచ్చు? నిను ముం । దట నిడుకొని పోరనున్న తగు రాజుల నె**
**క్కటుఁ దోలెడి సాత్యకి నీ । వట దఱుముదు గాక! యొదుఁగ నగునే నీకున్?'** 94

**ప్రతిపదార్థం:** ఎటు పోవవచ్చున్?= ఎక్కడికి పోదగును?; నినున్ ముందటన్ ఇడుకొని= నిన్ను ముందుగా పెట్టుకొని; పోరన్= యుద్ధం చేయగా; ఉన్న= ఉన్నటువంటి; తగురాజులన్= తగిన దొరలను; సాత్యకి; ఎక్కటు= ఒక్కడుగా; తోలెడి= తరుముతున్నాడు; నీవున్= నీవు కూడా; అట తఱుముదు గాక= ఆ దిక్కులో తరిమి వేయుదువు గాక; నీకున్= నీకు; ఒదుఁగ నగునే?= అణగిపోవచ్చునా?

**తాత్పర్యం:** నిన్ను ముందు పెట్టుకొని యుద్ధానికై ఉన్న రాజులను సాత్యకి ఒకడే తరుముతూ ఉన్నాడు. నీవు కూడ అక్కడ శత్రువులను తరుము. అట్లా తరుమక అణగి పోవచ్చునా?'

**క. అనుటయు నతండు వినియును । వినని చెవులు సేసి మగుడ విక్రమమునకున్**
**గొనకొని యేమియుఁ బలుకక । చనియె శిని ప్రవరుపజ్జ సమరంబునకున్.** 95

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; అతండు= ఆ దుశ్శాసనుడు; వినియును= విన్నప్పటికినీ; వినని చెవులు చేసి= చెవిలో వినబడనట్లుగా నటించి; మగుడన్= మరల; విక్రమమునకున్= విజృంభించటానికి; గొనకొని= పూనుకొని; ఏమియున్ పలుకక= బదులేమీ చెప్పక; శినిప్రవరు పజ్జన్= సాత్యకి దిక్కుకు; సమరంబునకున్= యుద్ధానికి; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ద్రోణుడి మాటలు విని, విననట్లుగా దుశ్శాసనుడు ఏమీ బదులు చెప్పక సాత్యకి వైపు యుద్ధానికై మరల శౌర్యంతో పూనుకొని వెళ్ళాడు.

**వ. తదనంతరంబ యాచార్యుం డవార్యదోర్వీర్యంబు మెఱయం దఱిమి మెఱుంగు వాలమ్ముల వేఁడిమి సూపిన.** 96

**ప్రతిపదార్థం:** తత్+అనంతరంబ= ఆ తరువాత; ఆచార్యుండు= ద్రోణుడు; అవార్య= అడ్డుకొనసాధ్యంకాని; దోః+వీర్యంబు= భుజ పరాక్రమము; మెరయన్= ప్రకాశించగా; తఱిమి= శత్రుసైన్యాన్ని తరుమగొట్టి; మెఱుంగు,వాలు+అమ్ముల= మెరుస్తున్నవాడి బాణాల యొక్క; వేఁడిమి= వేడిని; చూపినన్= చూపగా

**తాత్పర్యం:** ఆ తరువాత ద్రోణాచార్యుడు అడ్డుకొనటానికి వీలు లేని భుజబలం ప్రకాశించగా శత్రుసైన్యాలను తరుముతూ - మెరిసే వాడిబాణాల వేడి చూపించగా.

**శా. పాండుక్ష్మావరసూను సైన్యములు దర్పం బేదుడున్ వీరకే**
**తుం డుగ్రంబునఁ దాఁకి యగ్గురుని సూతున్ నొంచి యేనమ్ము లు**
**ద్దండుం డై తను వాడ నేయుటయు నాతం డల్గి దీప్తోజ్జ్వల**
**చ్చండాస్త్రంబునఁ గూల్చె నా ద్రుపదసంజాతున్ మహోదగ్రతన్.** 97

**ప్రతిపదార్థం:** పాండుక్ష్మావరసూను సైన్యములు= పాండురాజు కుమారుని సేనలు; దర్పంబు+ఏదుడున్= గర్వం నశించగా; వీర కేతుండు= వీరకేతుడనేవాడు; ఉగ్రంబునన్= కోపంతో; తాఁకి= తలపడి; ని+గురుని= ఆ ద్రోణుడిని; సూతున్= సారథిని; నొంచి= నొప్పించి; ఏను+అమ్ములు= ఐదు బాణాలు; ఉద్దండుండు+ఐ= అతిశయించినవాడై; తను వాడన్+ఏయుటయున్= ఒంటిమీద నాటగా కొట్టటంతో; ఆతఁడు= ద్రోణుడు; అల్గి= కోపించి; దీప్త+ఉజ్జ్వలత్+చండ+అస్త్రంబునన్= ప్రకాశిస్తూ ఉండే తీవ్రమయిన బాణంతో; మహా+ఉదగ్రతన్= మిక్కిలి భయంకరంగా; ఆ ద్రుపద సంజాతునిన్= ఆ ద్రుపదుడి కుమారుడిని (వీరకేతుని); కూల్చెన్= చంపాడు.

**తాత్పర్యం:** (ద్రోణుడి బాణాల తాకిడికి) శ్రేష్ఠుడైన పాండు రాజు కుమారుని సైన్యాలు గర్వాన్ని కోల్పోవగా, వీరకేతుడు ఆచార్యుడి సారథిని వాడి బాణాలతో నొప్పించాడు. ఆ ద్రుపదపుత్రుడిని ఆచార్యుడు ప్రకాశించే తీవ్రమైన వాడి బాణంతో కూల్చాడు.

**వ. ఇట్లు వీరకేతుండు వడినం గినిసి యతని యన్నలుందమ్ములు నగు చిత్రకేతుండును సుధన్వుండును జిత్రవర్మయు జిత్రరథుండును ద్రోణురథంబు బాణమయంబు సేసిన నతండు. 98**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వీరకేతుండు పడినన్= వీరకేతుడు చనిపోగా; కినిసి= కోపించి; అతని అన్నలున్ తమ్ములున్= వాని అన్నదమ్ములు; అగు= అయిన; చిత్రకేతుండును, సుధన్వుండును, చిత్రవర్మయు, చిత్రరథుండును= ఈ పేరులు కలవారు; ద్రోణురథంబు= ద్రోణుడి తేరును; బాణమయంబు చేసి= బాణాలతో ముంచివేయగా; అతండు= ఆ ద్రోణుడు.

**తాత్పర్యం:** వీరకేతుడు పడిపోగా ఆతడి సోదరులు చిత్రకేతుడు, సుధన్వుడు, చిత్రవర్మ, చిత్రరథుడు అనేవారు ద్రోణాచార్యుడి తేరును బాణాలతో ముంచారు. దాని కాతడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వారల రథ్యంబులఁ ద । త్సారథులం బొడ వడంచి ధరఁ దొరగించెన్**
**వారిశిరంబులు పువ్వు ల । వారణమెయి దుల్చు గంధవహుఁడుం బోలెన్. 99**

**ప్రతిపదార్థం:** (ఆ ద్రోణుడు) వారల రథ్యంబులన్= చిత్రకేతు మొదలగు వారి గుర్రములను; తద్+సారథులన్= వారి సారథులను; పొడవు+అడంచి= నాశంచేసి; ధరన్= భూమిమీద; వారి శిరంబులు= ఆ నలుగురి తలలు; పువ్వులన్= పూలను; అవారణ మెయిన్= అడ్డులేక; డుల్చు= రాల్చు; గంధవహుఁడున్+పోలెన్= వాయుదేవుడి వలె; తొరఁగించెన్= పడేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** ఆ ద్రోణుడు, చిత్రకేతుడు మొదలయిన నల్గురు సోదరులగుర్రాలను, సారథులను చంపి, అడ్డులేకుండా వాయుదేవుడు పూలను రాల్చినట్లు వారి తలలను భూమిమీద పడేటట్లుచేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అప్పు డాలోకించి ధృష్టద్యుమ్నుండు గెంజాయ రంజిల్లు కన్నులం గన్నీ రొలుకం గవిసి కుంభసంభవు నురంబునం గ్రూర నారాచంబులు సొనిపిన మనమూఁకలు హాహాకారంబుఁ లెసంగ నతండు మూర్ఛిల్లిన న ప్పాంచాలవరుండు. 100**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఆలోకించి= చూచి; ధృష్టద్యుమ్నుండు; కెంజాయ రంజిల్లు కన్నులన్= ఎర్రని రంగుతో కూడిన కన్నులతో (కోపంతో); కవిసి= మీదకు దూకి; కుంభసంభవున్= ద్రోణుడిని; ఉరంబునన్= రొమ్ముపై; క్రూర= భయంకరమైన; నారాచంబులు= వాడిబాణాలు; చొనిపినన్= చొప్పించగా; మనమూఁకలు= మన సైన్యాలు; హాహాకారంబులు= దుఃఖసూచకమైన హాహా అను శబ్దాలు; ఎసంగన్= అతిశయించగా; అతండు= ద్రోణుడు; మూర్ఛిల్లినన్= మూర్ఛపోగా; ఆ+పాంచాలవరుండు= ఆ పాంచాల దేశీయులలో మొనగాడు (ధృష్టద్యుమ్నుడు).

**తాత్పర్యం:** అప్పుడు ధృష్టద్యుమ్నుడు ఆ సన్నివేశాన్ని చూచి, ఎర్రబారిన కన్నులనుండి కన్నీరు కారుస్తూ. కుపితుడై ద్రోణాచార్యుడిని ఎదుర్కొని, అతడి వక్షంమీద క్రూరమైన బాణాలను నాటాడు. ఆ దెబ్బకు ఆచార్యుడు మూర్ఛిల్లాడు. మన సేనలు హాహాకారాలు చేశాయి. అప్పుడు ధృష్టద్యుమ్నుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **పలకయును వాలునుం గొని యలఘుజవము । మెఱయ నేలకు లంఘించి మెఱుఁగు మెఱచి**
**నట్లు సని తల గోయుట కప్పళించి । యెగిరె నగ్గురు తేరిపై నేపు మెఱయ. 101**

**ప్రతిపదార్థం:** పలకయును= డాలును; వాలునున్+కొని= కత్తిని తీసికొని; అలఘు జవము= గొప్పవేగం; మెఱయన్= ప్రకాశించగా; నేలకున్= భూమిపైకి; లంఘించి= దూకి; మెఱుఁగు= మెఱుపు; మెఱచినట్లు= వెలిగేటట్లుగా; చని= వెళ్ళి; తలకోయుటకున్= (ద్రోణుడి) తల నరకుటకు; అప్పళించి= ప్రయత్నించి; ఆ+గురుతేరిపైన్= ఆ గురుడి తేరుమీదకు (ద్రోణుడి తేరు మీదకు); ఏపు మెఱయన్= దర్పం ప్రకాశించగా; ఎగిరెన్= ఎగశాడు.

**తాత్పర్యం:** (ధృష్టద్యుమ్నుడు) కత్తిని, డాలును తీసికొని సాటిలేని శక్తితో ప్రకాశిస్తూ భూమిపైకి దూకి, మెరుపు మెరసినట్లు (క్షణంలో) వెళ్ళి, ద్రోణుడి తల నరికే ప్రయత్నంతో దర్పంతో అతడి తేరుమీదకు ఎగిరాడు.

**వ.** **అంతటం దెలిసి యాచార్యుండు ధైర్యధురంధరుండై యెదురు గదియంబడినప్పటికి సాధనంబు లగు జేనకొలంది తూపుల నతని నొప్పించినం గడుఁదురులు గఱచిన వెగడు పడునట్లు మొగతిరిగి యా ద్రుపదనందనుండు నిజస్యందనంబునకు వచ్చి విల్లు గొని పెల్లేసిన. 102**

**ప్రతిపదార్థం:** అంతటన్+తెలిసి= ఆ మీద ఒళ్ళు తెలిసి (మూర్ఛనుండి తేరుకొని); ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; ధైర్యధురంధరుండు+ఐ= ధైర్యభారమును వహించినవాడై; ఎదురు కదియన్+పడిన+అప్పటికిన్= ఎదుర్కొన్న ఆ సమయానికి; సాధనంబులు+అగు= సాధనము లయిన; జేనకొలందితూపులన్= జేనెడు పరిమాణం గల బాణాలతో; అతనిన్+నొప్పించినన్= ఆ ధృష్టద్యుమ్నుడిని బాధించగా; కడుఁదురులు= కందిరీగలు; కఱచినన్= కుట్టగా; వెగడుపడునట్లు= తల్లడిల్లేటట్లు; మొగ తిరిగి= వెను తిరిగి; ఆ ద్రుపదనందనుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; నిజస్యందనంబునకున్= తన తేరికి; వచ్చి; విల్లు కొని= వింటిని తీసికొని; పెల్లు+ఏసినన్= ఎక్కువగా బాణాలు వేయగా.

**తాత్పర్యం:** మూర్ఛనుండి తేరుకొని, ద్రోణుడు ధైర్యంతో ఎదుర్కొనినప్పుడు అప్పటికి చేతి కందిన సాధనాలయిన జానెడు పొడవు బాణాలతో ధృష్టద్యుమ్నుడిని బాధించగా, కందిరీగలు కరిచినట్లుగా బాధపడి వెనుతిరిగి, తన తేరిమీదకు వచ్చి విల్లందుకొని విస్తారంగా బాణాలు వేయగా.

**విశేషం:** అలం: ఉపమ.

**క.** **గురుఁ డతని సూతుఁ దునుముడుఁ । దురగములు రథంబు ననికి దొలఁగఁ దిగువ నా**
**ధరణీసురోత్తముఁడు బం । ధుర పాండవ సైన్య సమితిఁ దోలెం బెలుచన్. 103**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; అతని సూతున్= ఆ ధృష్టద్యుమ్నుడి సారథిని; తునుముడున్= త్రుంచగా (చంపగా); తురగములు= గుర్రాలు; రథంబున్= తేరును; అనికిన్= యుద్ధానికి; తొలఁగన్= తొలగిపోయేటట్లు; తిగువన్= లాగగా; ఆ ధరణీ సుర+ఉత్తముఁడు= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు; బంధుర= దట్టమైన; పాండవ= పాండవులయొక్క; సైన్యసమితిన్= సేనాసమూహాన్ని; పెలుచన్= కోపంతో; తోలెన్= తరిమాడు (పశువులను తోలిన విధంగా తరిమాడు).

**తాత్పర్యం:** ద్రోణుడు ధృష్టద్యుమ్నుడి సారథిని చంపాడు. గుర్రాలు తేరును యుద్ధరంగం నుండి తొలగిపోయేటట్లు లాగాయి. అప్పుడు ఆ భూసురశ్రేష్ఠుడు దట్టమైన పాండవ సేనాసమూహాన్ని కోపంతో త్వరగా తరిమివేశాడు.

**క. కలశజుని తెంపుఁ బెంపును । బలిమియునుం జూచి యపుడు పాండునృప తనూ**
**జుల దెస సైనికు లెవ్వరు । నలపు మెఱసి కడఁగఁ జాల రైరి నరేంద్రా! 104**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ఓ రాజా!; కలశజుని= ద్రోణుడి; తెంపున్= సాహసాన్నీ; పెంపును= గొప్పతనాన్నీ; బలిమియునున్+చూచి= బలమునూ చూచి; అపుడు= ఆ సమయాన; పాండునృప తనూజుల దెస= పాండురాజు కుమారుల దిక్కు; సైనికులు+ఎవ్వరున్= ఏ సైనికులూ కూడా; అలవు మెఱసి= బలం ప్రకాశింపజేసి; కడఁగన్+చాలరైరి= పూనుకొనలేకపోయారు.

**తాత్పర్యం:** ద్రోణుడి తెంపును, సాహసాన్నీ, బలాన్నీ చూచిన పాండవ సైనికులెవ్వరూ సాహసంతో ద్రోణుడి దిక్కుకు వెళ్ళలేకపోయారు.

**వ. అట్టి యెడ. 105**

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

**ఆ. అవ్విధమునఁ బల్కి యాచార్యుఁ డట పుచ్చ । నరిగి దుస్ససేనుఁ డాశిని ప్ర**
**వీరుఁ దాఁకుటయును గౌరవపతి త్రిగ । ర్తుని బలంబుఁ బనిచెఁ దోడుపడఁగ. 106**

**ప్రతిపదార్థం:** ఆ+విధమునన్= ఆ ప్రకారంగా; పల్కి= మాటాడి; ఆచార్యుఁడు+అటపుచ్చన్= ద్రోణాచార్యుడు అటు పంపగా; దుస్ససేనుఁడు= దుశ్శాసనుడు; అరిగి= వెళ్ళి, ఆ శిని ప్రవరున్= ఆ శినివంశవీరుడిని(సాత్యకిని); తాఁకుటయును= ఎదుర్కొనటమూ; కౌరవపతి= దుర్యోధనుడు; తోడుపడఁగన్= సహాయపడగా; (దుశ్శాసనుడికి సహాయంకాగా); త్రిగర్తుని బలంబున్= త్రిగర్త దేశసైన్యాన్ని; పనిచెన్= ఆజ్ఞాపించాడు.

**తాత్పర్యం:** (సంజయుడు ధృతరాష్ట్రుడితో) ఆ విధంగా చెప్పి, ఇంకా ఇట్లా చెప్పాడు. ద్రోణాచార్యుడు దుశ్శాసనుడిని సాత్యకిపైకి పంపాడు. ఆ దుశ్శాసనుడికి సాయంగా దుర్యోధనుడు త్రిగర్తదేశ సేనను పంపాడు.

**వ. ఆ సంశప్తకులలో దండిమగలు మూఁడువేల రథంబులవారు బెట్టు గిట్టిన నా వృష్ణివీరుండు పంచశత ముఖ్య రథికులం బంచత్వంబు నొందించి, పెఱచతురంగ బలంబుల నెత్తుట జొత్తిల్లం జేసిన, నా త్రిగర్త సైన్యంబు దైన్యంబు నొంది ద్రోణు దెసకుం బఱచినం బోవక యువరాజు శైనేయుతోడ నానానిశిత శరంబుల దురంబు సేయ నతండు. 107**

**ప్రతిపదార్థం:** ఆ సంశప్తకులలో= ఆ సంశప్తక తెగవారిలో; దండిమగలు= మేటి మొనగాండ్రు; మూఁడువేల రథంబులవారు= మూడువేల సంఖ్యగల రథికులు; బెట్టుగిట్టినన్= విజృంభించి సమీపించగా; ఆ వృష్ణివీరుండు= ఆ యాదవవీరుడు (సాత్యకి); పంచశత ముఖ్యరథికులన్= అయిదువందల మంది ముఖ్య రథికులను; పంచత్వంబున్+ఒందించి= చంపి; పెఱ= ఇతర; చతురంగ బలంబులన్= చతురంగ బలాలను (రథ గజ తురగ పదాతులను); నెత్తుటన్= నెత్తురులో; జొత్తిల్లన్= మునుగగా; చేసినన్= చేయగా; ఆ త్రిగర్త సైన్యంబు= ఆ త్రిగర్త దేశపు సేనలు; దైన్యంబున్+ఒంది= డిల్లపడి (దీనత్వమును పొంది); ద్రోణుదెసకున్= ద్రోణుడున్న దిక్కునకు; పఱచినన్= తరుమగా; పోవక= పోకుండా; యువరాజు= దుశ్శాసనుడు; శైనేయుతోడన్= సాత్యకితో; నానానిశిత శరంబులన్= అనేకము లయిన వాడిబాణాలతో; దురంబు చేయన్= యుద్ధం చేయగా; అతండు= ఆ సాత్యకి.

**తాత్పర్యం:** సంశప్తకులలో త్రిగర్త దేశీయులైన మేటి మొనగాండ్రు రథికులు మూడువేలమంది విజృంభించి మీదికి రాగా, ఆ వృష్ణివీరుడయిన సాత్యకి అయిదు వందలమందిని హతమార్చాడు. మిగిలిన చతురంగ బలాలను నెత్తుట ముంచాడు. దానితో ఆ త్రిగర్త సైన్యం దీనత్వాన్ని పొంది ద్రోణుడి దెసకు పరుగెత్తిపోయింది. అయినా తాను పోకుండా దుశ్శాసనుడు, సాత్యకితో నానా విధాలయిన వాడి బాణాలతో యుద్ధం చేశాడు. దానికి సాత్యకి. (తరువాతి పద్యంతో అన్వయం).

**దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి యోడుట (సం. 7-99-28)**

**క. ధనువు దునిమి నవ్విన, నీ। తనయుఁడు పటు శక్తి వైచెఁ దలఁకక యది ప**
**ల్తునియలుగఁ జేసె సాత్యకి;। విను మాతం డతని నొండు విలు గొని నొంచెన్. 108**

**ప్రతిపదార్థం:** ధనువు తునిమి= వింటిని త్రుంచివేసి; నవ్వినన్= నవ్వగా; నీ తనయుఁడు= నీ కొడుకు; తలఁకక= జంకకుండా; పటుశక్తి వైచెన్= తీవ్రమయిన శక్త్యాయుధాన్ని వేశాడు; అది= ఆ శక్తిని; సాత్యకి; పల్+తునియలుగన్+చేసెన్= అనేకములయిన ముక్కలుగా చేశాడు; వినుము= (ఆ మీద) వినుము; అతండు= ఆ దుశ్శాసనుడు; అతనిన్= ఆ సాత్యకిని; ఒండు విలు కొని= వేరొక వింటిని తీసికొని; నొంచెన్= బాధపెట్టాడు.

**తాత్పర్యం:** సాత్యకి దుశ్శాసనుడి విల్లును త్రుంచి నవ్వాడు. నీ కొడుకు వెనుకాడక, తీవ్రమయిన శక్తిని వేశాడు. దాని నాతడు పెక్కు ముక్కలు చేశాడు. అందు కాతడు వేరొక విల్లును తీసికొని సాత్యకిని బాధించాడు.

**ఆ. అలిగి కృష్ణుతమ్ముఁ డతని చాపంబును। సూతుఁ దురగములను గేతనంబుఁ**
**దునిమి సొగయ నేసియును భీమసేను ప్ర। తిజ్ఞ దలఁచి చంపఁ దెగక చనియె. 109**

**ప్రతిపదార్థం:** కృష్ణు తమ్ముఁడు= సాత్యకి; అలిగి= కోపించి; అతని చాపంబును= దుశ్శాసనుడి వింటిని; సూతున్= సారథిని; కేతనంబున్= ధ్వజమును (జెండాను); తునిమి= ఖండించి; సొగయన్ ఏసియును= మూర్ఛిల్లునట్లు కొట్టినప్పటికిని; భీమసేను ప్రతిజ్ఞ= భీముడి శపథాన్ని; తలఁచి= తలచుకొని; చంపన్+తెగక= చంపే సాహసం చేయక; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడి తమ్ముడైన సాత్యకి కోపించి దుశ్శాసనుడి విల్లునూ, సారథినీ, ధ్వజాన్నీ పడగొట్టి మూర్ఛపోయేటట్లు చేశాడు. కాని, భీముడి శపథాన్ని తలచుకొని అతడిని చంపటానికి తెగించక వెళ్ళిపోయాడు.

**విశేషం:** పాండవ కౌరవుల జూదానికి తరువాత సభాపర్వంలో దుశ్శాసనుడు ద్రౌపదిని చాలా నీచంగా అవమానించాడు. ఆ సమయంలో భీమసేనుడు రణరంగంలో దుశ్శాసనుడి గుండెను చీల్చి అందరి ఎదుట అతడి రక్తాన్ని ఆస్వాదిస్తానని ప్రతిజ్ఞ చేశాడు. అది సాత్యకి తలపునకు రావటంచేత దుశ్శాసనుడిని చంపక వదలి పెట్టాడు.

**వ. అట ధర్మజ భీమ నకుల సహదేవులు సాత్యకి సేనఁ దఱియం జొచ్చుట యెఱింగి సైన్యంబులం బురికొల్పికొని ధృష్టద్యుమ్నాది యోధుల ము న్నిడికొని తఱిమిన మనవారును మార్కొని పెనంగి రా శైనేయుండును నీ సేన బడలువడం జేయుచు మున్నీటం బెనుఁ జోఁ దఱిసి పోవు తెఱంగునం బోవుచుండె; నంత నక్కడఁ గవ్వడియును యుగాంత కాలరుద్రుని కైవడి రౌద్రరసమయమూర్తియై తన మునుము మొనల బారి సమరుచుండె; మోహరంబు మొగంబున గురుండును గౌంతేయ బలంబులం బొరిగొనుచుండె; నివ్విధంబున నమ్మువ్వురచేతను బ్రజాక్షయం బగుచుండం గురుపతి భరద్వాజు నాజి యరసిపోవవచ్చి యచ్చటం బాండవ**

**సైనికుల సంరంభంబుఁ జూచి యేచి యొక్కరుండును దలకడచి యమ్మొన వనజ వనంబు సొచ్చు వారణంబును బోలెఁ దఱియం జొచ్చి భీమసేనుం బదిబాణంబులను, నకుల సహదేవ ద్రుపద విరాట ద్రౌపదేయుల సాయక త్రయంబులను, గేకయు లేవురను శరద్వయంబులను ధృష్టద్యుమ్నుని నిరువదింటను శిఖండిని మూఁటను ధర్మనందనుని నైదు దూపులను నేసి మఱియు ననేక తురగ ద్విరద రథనికరంబులం బటు ప్రదర శతంబుల నొప్పించె; నప్పుడు.** **110**

**ప్రతిపదార్థం:** అటన్= ఆచోట (పాండవుల వైపు); ధర్మజ భీమ నకుల సహదేవులు= ఈ నలుగురును; సాత్యకి; సేనన్= సేనను; తఱియన్+చొచ్చుట= సమీపించి ప్రవేశించటాన్ని; ఎఱింగి= తెలిసి; సైన్యంబులన్= సేనలను; పురికొల్పికొని= ప్రేరేపించుకొని; ధృష్టద్యుమ్న+ఆది యోధులన్= ధృష్టద్యుమ్నుడు మొదలయిన వీరులను; మున్ను+ఇడికొని= ముందుంచుకొని; తఱిమినన్= తరుమగా; మనవారును= మన (కౌరవుల) సైన్యం; మార్కొని= ఎదుర్కొని; పెనగిరి= యుద్ధంచేశారు; ఆ శైనేయుండును= ఆ సాత్యకియు; నీ సేనన్= నీ సైన్యాన్ని; బడలు వడన్+చేయుచున్= అలసిపోజేస్తూ; మున్నీటన్= సముద్రంలో; పెనుజోఁఱ= పెద్ద సొరచేప; తఱిసి= దగ్గరకు పోయి; పోవు తెఱంగునన్= పోయే విధంగా; పోవుచుండెన్= పోతూ ఉన్నాడు; అంతన్= ఆ మీద; అక్కడన్= ఆ యుద్ధరంగంలో; కవ్వడియున్= అర్జునుడును; యుగాంత కాలరుద్రుని కైవడిన్= ప్రళయకాలంలోని కాలరుద్రుడి వలె; రౌద్రరసమయ మూర్తి ఐ= రౌద్రరసం మూర్తీభవించిన విధంగా; తన మునుము= తన ముందున్న; మొనలన్= సైన్యాలను; బారి సమరుచుండెన్= నాశము చేయుచుండెను; మోహరంబు మొగంబునన్= సేన మొదట; గురుండును= ద్రోణుండును; కౌంతేయబలంబులన్= పాండవసేనలను; పొరిగొనుచుండెన్= హతం చేస్తూ ఉన్నాడు; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ఆ+మువ్వురచేతను= ఆ ముగ్గురివలన (సాత్యకి, ద్రోణ, అర్జునులచేత); ప్రజాక్షయంబు= జననాశం; అగుచుండన్= అగుచుండగా; కురుపతి= దుర్యోధనుడు; భరద్వాజునాజి= ద్రోణుడి యుద్ధమును; అరసి పోవచ్చి= చూచిపోవుటకు వచ్చి; అచ్చటన్+పాండవ సైనికుల సంరంభంబున్+చూచి= ఆ చోట పాండవ సేనయొక్క ఆర్భాటాన్ని చూచి; ఏచి= విజృంభించి; ఒక్కరుండును= ఒక్కడే; తలకడచి= ముందుదాటి; ఆ+మొనన్= ఆ సేనలో; వనజవనంబు చొచ్చు= తామరకొలనిలో ప్రవేశించే; వారణంబునున్ పోలెన్= ఏనుగువలె; తఱియన్+చొచ్చి= దగ్గరకు పోయి; భీమసేనున్+పదిబాణంబులను= భీముడిని పదిబాణాలతోను; నకుల సహదేవ ద్రుపద విరాట ద్రౌపదేయుల సాయక త్రయంబులను= నకులుడిని, సహదేవుడిని, ద్రుపదుడిని, విరాటుడిని, ఉపపాండవులను మూడేసి బాణాలతోను; కేకయులు+ఏవురను= కేకయ దేశీయు లయిదుగురను; శరద్వయంబులను= రెండు బాణాలతోను; ధృష్టద్యుమ్నుని ఇరువదింటను= ధృష్టద్యుమ్నుడిని ఇరువది బాణాలతోను; శిఖండిని మూఁటను= శిఖండిని మూడు బాణాలతోను; ధర్మనందనుని ఐదు తూపులను= ధర్మరాజును అయిదు బాణాలతోను; ఏసి= కొట్టి; మఱియున్= ఇంకనూ; తురగ ద్విరద రథనికరంబులన్= గుర్రాలను, ఏనుగులను, తేరులను; పటు= తీవ్రమయిన; ప్రదరశతంబులన్= నూర్లకొలది బాణాలతో; నొప్పించెన్= బాధించాడు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** పాండవుల దిక్కు ధర్మజ భీమ నకుల సహదేవులు నలుగురూ సాత్యకి సేనను సమీపించటానికి సేనలను పురికొల్పుతూ ధృష్టద్యుమ్నాదులను ముందిడుకొని తరిమారు. అపుడు మనసేనకూ వారికీ తీవ్రమయిన యుద్ధం సాగింది. సాత్యకి కౌరవసేన అలసిపోయేటట్లుచేస్తూ సముద్రంలో దూరే సొరచేపవలె ఆ సైన్యంలోకి దూరిపోతూ ఉన్నాడు. అర్జును డారంగంలో ప్రళయకాల రుద్రుడివలె, మూర్తీభవించిన రౌద్రరసం మాదిరిగా తన ముందున్న మనసేనను నాశంచేస్తూ ఉన్నాడు. సేన మొదటద్రోణుడు కూడా పాండవ సైన్యాన్ని హతమారుస్తూ ఉన్నాడు. ఈ ప్రకారంగా సాత్యకి, అర్జున, ద్రోణులచేత జననాశం అవుతూ ఉన్నది. ద్రోణుడి యుద్ధాన్ని చూచి పోవచ్చిన దుర్యోధనుడు పాండవుల ఆర్భాటాన్ని చూచి, ఏకాకిగా ఆ సైన్యం తలకడచి తామర కొలనిలో దూకే ఏనుగు మాదిరిగా ఎదిరి సైన్యంలోకి వెళ్ళి, భీముడిని పదిబాణాలతోను, నకుల సహదేవ ద్రుపద విరాట ఉపపాండవులను మూడేసి

బాణాలతోను, అయిదుగురు కేకయులను రెండేసి బాణాలతోను, శిఖండిని మూటితోను, ధృష్టద్యుమ్నుడిని ఇరువది బాణాలతోను, శిఖండిని మూడు బాణాలతోను, ధర్మజుడిని అయిదు తూపులతోను కొట్టి, గుర్రాలను, ఏనుగులను, తేరులను వందలకొలది తీవ్రమయిన బాణాలతో బాధించాడు. అపుడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **అతని చాపంబుఁ గుంతీసుతాగ్రజుండు। నఱకఁ బెఱవారు వొదివిన నుఱక వారి**
**నెల్ల గుంభజుఁ డమ్ములవెల్లిఁ దేల్చి। యురవడించి యా సైన్యంబు ను బ్బడంచె.** **111**

**ప్రతిపదార్థం:** అతని చాపంబున్= ఆ దుర్యోధనుడి వింటిని; కుంతీ సుత+అగ్రజుండు నఱకన్= కుంతి కుమారులలో పెద్దవాడయిన ధర్మరాజు నరుకగా; పెఱవారు= ఇతరులు; పొదివినన్= క్రమ్ముకోగా; ఉఱక= లెక్కపెట్టక; వారిన్+ఎల్లన్= వారందరినీ; కుంభజుఁడు= ద్రోణుడు; అమ్ముల వెల్లిన్= బాణాల వెల్లువలో; తేల్చి= తేలజేసి; ఉరవడించి= వేగిరపాటుతో; ఆ సైన్యంబు= ఆ సేనయొక్క; ఉబ్బు+అడంచెన్= గర్వాన్ని అణచాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడి విల్లును ధర్మరాజు నరికాడు. మిగిలినవారు అతడిని క్రమ్ముకొన్నారు. అందరను ద్రోణుడు బాణాలవెల్లువలో ముంచెత్తాడు. ఎదిరి సైన్యపు దర్పాన్ని అణచాడు.

**వ.** **కౌరవపతియు మగిడి యా సైంధవు కడకుం జనియె; దదనంతరంబ కేకయ మహీనాథుండు మార్కొని.** **112**

**తాత్పర్యం:** దుర్యోధనుడు మరల వెనుదిరిగి సైంధవుడి వద్దకు వెళ్ళాడు. తరువాత కేకయరాజు కౌరవసేనను ఎదుర్కొని.

**క.** **గురుఁ డెన్ని శరము లేసిన। వెరవున నన్నింటి నన్నివిశిఖంబులఁ దా**
**మరలిచి బ్రహ్మాస్త్ర పరి। స్ఫురణము సూపిన దదస్త్రమునన యడంచెన్.** **113**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణుడు; ఎన్ని శరములు+ఏసినన్= ఎన్ని బాణాలు ప్రయోగించినప్పటికిని; వెరవునన్= ఉపాయంతో; అన్నింటిన్= అన్ని బాణాలను; అన్ని విశిఖంబులన్= అన్ని బాణాలతో; తాన్+మరలిచి= తాను త్రిప్పికొట్టి; బ్రహ్మాస్త్ర పరిస్ఫురణము చూపినన్= బ్రహ్మాస్త్రపు శక్తిని చూపగా; తద్+అస్త్రమునన= ఆ బాణముతోనే; అడంచెన్= నశింపజేశాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు వేసిన బాణాలన్నింటిని కేకయరాజు అన్ని విధాలుగా తిప్పికొట్టి, అతడు ప్రయోగించిన బ్రహ్మాస్త్ర శక్తిని తన బ్రహ్మాస్త్రంతో అణచాడు.

**క.** **మఱియు నతని మెయి బాణము। లఱువది గిఱిగొలుప నా బృహత్ క్షత్రుం డే**
**డ్తెఱ సూతు నొంప నాతం। డఱిముఱి నారాచతతుల నవ్విభుఁ బొదివెన్.** **114**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; అతని మెయిన్= అతడి శరీరంలో; బాణములు= ములుకులు; అఱువది గిఱిగొలుపన్= అరవై చుట్టుకొనేటట్లు చేయగా; ఆ బృహత్ క్షత్రుండు= ఆ బృహత్క్షత్రుడు; ఏడ్తెఱన్= విజృంభణంతో; సూతున్+నొంపన్= సూతుడిని బాధించగా; ఆతండు= ఆచార్యుడు; అఱిముఱిన్= సంభ్రమంతో; నారాచతతులన్= బాణాల సమూహాలతో; ఆ+విభున్= బృహత్క్షత్రుడిని; పొదివెన్= క్రమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** ఆచార్యుడు అరువది బాణాలను బృహత్ క్షత్రుడిని చుట్టుకొనేటట్లు వేశాడు. అతడు విజృంభించి ద్రోణుడి సారథిని నొవ్వజేశాడు. దానికి ద్రోణుడు సంభ్రమంతో ఆ బృహత్ క్షత్రుడిని బాణ సమూహంతో క్రమ్ముకొన్నాడు.

**తే. చిక్కువడఁ జేసి చనుమఱ యొక్క దొడ్డ । నారసమ్మున బిట్టేయ నరవరుండు**
**ద్రెళ్ళెఁ; శిశుపాల తనయుండు ధృష్టకేతుఁ । డమ్మహావీరుపై వీఁక నడరి యపుడు. 115**

**ప్రతిపదార్థం:** చిక్కుపడన్+చేసి= అతడిని చిక్కుపడేటట్లుగా చేసి; చనుమఱన్= చన్నుభాగాన; ఒక్కదొడ్డ నారసమ్మునన్= ఒక్క బాణంతో; బిట్టు+ఏయన్= గట్టిగా కొట్టగా; నరవరుండు= గొప్పవాడైన బృహత్క్షత్రుడు; త్రెళ్ళెన్= చనిపోయాడు; శిశుపాలతనయుండు= శిశుపాలుడి కుమారుడైన; ధృష్టకేతుఁడు= ధృష్టకేతుడు అనేవాడు; ఆ+మహావీరుపైన్= ఆ గొప్పవీరుడైన ద్రోణుడిమీద; వీఁకన్= సాహసంతో; అడరి= విజృంభించి; అపుడు= ఆ సమయాన.

**తాత్పర్యం:** అతడిని చిక్కులలో పడవేసి, రొమ్ముమీద పెద్దవాడి బాణంతో తీవ్రంగా కొట్టగా ఆ రాజశ్రేష్ఠుడు మరణించాడు. అప్పుడు శిశుపాలుడి కొడుకు ధృష్టకేతుడు ఆ మహావీరుడైన ద్రోణుడి మీదికి సాహసంతో దూకాడు.

**క. పెనుమంట నుఱుకు శలభం । బును బోలెం గవిసి, కోలుపులిఁ గోలన్ వ్రే**
**సిన మాడ్కి నేసె నఱువది । సునిశిత బాణముల నశ్వసూత యుతముగన్. 116**

**ప్రతిపదార్థం:** పెనుమంటన్= పెద్దమంటలో; ఉఱుకు= దూకే; శలభంబునుపోలెన్= మిడుతవలె; కలిసి= పరుగెత్తుకొని వచ్చి; కోలుపులిన్= పెద్దపులిని; కోలన్= కర్రతో; వ్రేసిన మాడ్కి= కొట్టినట్లు; అరువది సునిశిత బాణములన్= అరవై వాడి బాణాలతో; అశ్వ, సూత, యుతముగన్= గుర్రాలతోను, సారథితోను కూడినట్లుగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** (ధృష్టకేతుడు) పెద్దమంటలో దూకే మిడతవలె పరుగెత్తి, పెద్దపులిని కర్రతో కొట్టినట్లు అరవై వాడి బాణాలతో గుర్రాలను సారథితోకూడ కలిపి కొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. బాణఘట్టనఁ గటకటఁ బడి గురుండు । విల్లు ద్రుంచిన నొండొకవింట నొంచె;**
**నాతఁ డక్కుంభసంభవుఁ డతని విరథుఁ । జేసి యా విలు దునిమినఁ జేవ సెడక. 117**

**ప్రతిపదార్థం:** గురుండు= ద్రోణుడు; బాణఘట్టనన్= బాణాలను ఘట్టించుట చేత; కటకటన్+పడి= బాధపడి; విల్లున్+త్రుంచినన్= వింటిని త్రుంచగా; ఆతఁడు= ధృష్టకేతుడు; ఒండు+ఒక వింటన్= మరొక విల్లుతో; నొంచెన్= బాధించాడు; ఆ+కుంభసంభవుఁడు= ఆ ద్రోణుడు; అతనిన్= ఆ ధృష్టకేతువును; విరథున్+చేసి= రథం లేనివాడిగా చేసి; ఆ విలు= ఆ వింటిని; తునిమినన్= త్రుంచగా; చేవ చెడక= బలం తగ్గక.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు బాణాలు ఘట్టించి ధృష్టకేతువు విల్లును త్రుంచాడు. అతడు వేరొక విల్లుతో ఆచార్యుడిని బాధించాడు. ఆ ద్రోణుడు అతడిని విరథుడిని చేసి, విల్లును త్రుంచివేసినా ధైర్యం నశించకుండా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. గద వైచిన నది ద్రోణుని । ప్రదరంబుల నడఁగఁ దోమరము శక్తియు బె**
**ట్టిదముగ నతఁ డడరించిన । మదమున నయ్యోధవరుఁడు మడియించె నెడన్. 118**

**ప్రతిపదార్థం:** గద వైచినన్= గదతో కొట్టగా; అది= ఆ గద; ద్రోణుని ప్రదరంబులన్= ద్రోణుడి యొక్క వాడిబాణాలతో; అడఁగన్= నశించగా; తోమరమున్ శక్తియున్= తోమరం; శక్తి అనే ఆయుధాలతో; బెట్టిదముగన్= తీవ్రంగా; అతఁడు అడరించినన్= అతడు ప్రయోగించగా; మదమునన్= అహంకారంతో; ఆ+యోధవరుఁడు= ఆ సైనిక శ్రేష్ఠుడు; ఎడన్= మధ్యలోనే; మడియించెన్= నాశనం చేశాడు.

**తాత్పర్యం:** అతడు గదను విసరగా, అది ద్రోణుడి వాడిబాణాలతో నశించింది. తరువాత తోమర, శక్తి ఆయుధాలతో తీవ్రంగా అతడు అదరించగా ద్రోణాచార్యుడు వాటిని నడుమనే నాశనం చేశాడు.

**వ. ఇట్లు విగత సాధనుం జేసి. 119**

**తాత్పర్యం:** ఈ ప్రకారంగా పోయిన సాధనాలు కలవాడినిగా చేసి.

**క.. ఆలోనన మెఱుఁగారెడు । వాలిక నారసము చేదివరు హృదయమునం**
**గీలించినఁ బొడ వెగయుచు । నేలం బడి తన్నికొని చనియె జము కడకున్. 120**

**ప్రతిపదార్థం:** ఆలోననన్+అ= ఆ లోగానే; మెఱుఁగారెడు= వాడి అయిన; వాలిక నారసము= వంకరైన తీవ్రబాణాన్ని; చేదివరు హృదయమునన్= చేదిరాజైన ధృష్టకేతుడి గుండెలో; కీలించినన్= తగిలించగా; పొడ వెగయుచున్= ఆకారం ఎగిసిపడుతూ; నేలన్+పడి= భూమిమీద పడి; తన్నికొని= గిజగిజలాడి; జముకడకున్= యముడి వద్దకు; చనియెన్= వెళ్ళాడు. (అనగా చనిపోయాడు).

**తాత్పర్యం:** అంతలోనే వాడి బాణం చేదిరాజైన ధృష్టకేతుడి గుండెలో నాటగా, ఆతడు ఎగిరి నేలపైబడి, గిజగిజ తన్నుకొని యముడి దగ్గరకు వెళ్ళాడు.

**క. కని యాతని కొడు కడలుం । గనలుం బిరికొనఁగఁ దన్నుఁ గవిసినఁ బొదివెన్**
**ధనురాచార్యుఁడు శీఘ్రం । బున బెబ్బులికొదమ లేడిఁ బొదివిన మాడ్కిన్. 121**

**ప్రతిపదార్థం:** కని= చూచి; ఆతని కొడుకు= ఆ ధృష్టకేతుడి కుమారుడు; అడలున్+కనలున్= భయం, కోపం; పిరికొనఁగన్= పెనవేసికొనగా; తన్నున్= తనను (ద్రోణుడిని); కవిసినన్= క్రమ్ముకొనగా; ధనురాచార్యుఁడు= ద్రోణాచార్యుడు; శీఘ్రంబునన్= వేగంగా; బెబ్బులి కొదమ= పెద్దపులి పిల్ల; లేడిన్= జింకను; పొదివిన మాడ్కిన్= క్రమ్ముకొన్న విధంగా; పొదివెన్= క్రమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** ధృష్టకేతుడి కొడుకు కోపభయాలు పెనవేసుకోగా ద్రోణుడిని క్రమ్ముకొన్నాడు. దానికి ద్రోణాచార్యుడు పెద్దపులిపిల్ల జింకను క్రమ్ముకొన్నట్లుగా చాలా వేగంగా అతడిని క్రమ్ముకొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. పొదివి యవలీల నాతని బొలియఁ జేయ । సమదగతి మాఱుకొని జరాసంధ తనయుఁ**
**డస్త్రగురు నొంచుటయు నతం డల్గి యతని । గూల్చెఁ దత్సైనికులు గనుంగొనుచు నుండ. 122**

**ప్రతిపదార్థం:** పొదివి= క్రమ్ముకొని; అవలీలన్= అనాయాసంగా; ఆతనిన్= ధృష్టకేతుడి కుమారుని; పొలియన్+చేయన్= చంపగా; జరాసంధ తనయుఁడు= జరాసంధుడి కుమారుడు; సమదగతిన్= ఆటోపంతో; మాఱుకొని= ఎదుర్కొని; అస్త్రగురున్= ధనురాచార్యుడిని (ద్రోణుని); నొంచుటయున్= నొవ్వజేయుటయు; అతఁడు+అల్గి= ధనురాచార్యుడు కోపించి; తత్సైనికులు కనుంగొనుచున్+ఉండన్= వాడి సేనలు చూచుచుండగనే; అతనిన్ కూల్చెన్= అతడిని చంపాడు.

**తాత్పర్యం:** ద్రోణుడు ధృష్టకేతుడి కుమారుడిని అనాయాసంగా చంపాడు. దానికి జరాసంధుడి కొడుకు ఆటోపంతో ఆచార్యుని ఎదుర్కొని నొవ్వజేశాడు. అందుకు ధనురాచార్యుడు కోపించి, అతడి సేనల ఎదుటనే అతడిని హతమార్చాడు.

వ. **అట్టియెడ వడముడి ధృష్టద్యుమ్నుండు విన నవ్విప్రవరుం డప్రతిహత దపస్సిద్ధుండు గా కేమి చూపులన దహించు నట్లు తూపులవేఁడిమిం బగఱ రూపడంచుచున్నవాఁ డనిన నా ద్రుపదనందనుం డతని మార్కొనం గడంగునెడ నాతనిం దలకడచి.** 123

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= అటువంటి సమయంలో; ధృష్టద్యుమ్నుండు వినన్= ధృష్టద్యుమ్నుడు వినేటట్లుగా; వడముడి= భీమసేనుడు; ఆ+విప్రవరుండు= ఆ బ్రాహ్మణ శ్రేష్ఠుడు (ద్రోణుడు); అప్రతిహత= ఎదురులేని; తపః+సిద్ధుండు గాక+ఏమి= తపస్సిద్ధి కలవాడా ఏమి?; చూపులను= చూచినంత మాత్రాన; దహించు అట్లు= కాల్చేటట్లుగా; తూపుల వేఁడిమిన్= బాణాగ్నిచేత; పగఱ= శత్రువుల; రూపు+అడంచుచున్నవాఁడు= నాశం చేస్తున్నాడు; అనినన్= అనగా; ఆ ద్రుపదనందనుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; అతనిన్ మార్కొనన్ కడంగుఎడన్= అతడిని ఎదుర్కొన ప్రయత్నిస్తూ ఉండగా; ఆతనిన్= ఆచార్యుడిని; తల కడచి= అతిక్రమించి.

**తాత్పర్యం:** ఆ సమయాన భీముడు ధృష్టద్యుమ్నుడు వినేటట్లుగా 'ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు (ద్రోణుడు) ఎదురులేని తపశ్శక్తి కలవాడా ఏమి? చూచినంత మాత్రాన కాల్చివేసేటట్లుగా, బాణాగ్నితో శత్రునాశం చేస్తున్నాడు' అనగానే ఆతడు ఆచార్యుడిని ఎదుర్కొనటానికి ప్రయత్నిస్తూ అతిక్రమించి.

ఆ. **క్షత్రవర్మ గురుని చాపంబు ద్రుంచిన । వేఱ యొక్క దొడ్డ విల్లు రయము**
**మెఱయఁ గొని యతండు మెఱుఁగులు గిఱికొను । నారసమున వాని నామ మడఁచె.** 124

**ప్రతిపదార్థం:** క్షత్రవర్మ= క్షత్రవర్మ అనేవాడు; గురుని చాపంబు త్రుంచినన్= ద్రోణాచార్యుడి విల్లు త్రుంచగా; అతండు= ఆచార్యుడు; వేఱ ఒక్క దొడ్డవిల్లు= ఇంకొక పెద్దవిల్లు; రయము మెఱయన్= వేగం ప్రకాశించగా; కొని= తీసికొని; మెఱుఁగులు= మిణుగురులు(మంటలు); గిఱికొను= చుట్టుకొను; నారసమునన్= వాడి బాణముతో; వాని= ఆ క్షత్రవర్మయొక్క; నామము+అడఁచెన్= చంపాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడి విల్లును క్షత్రవర్మ త్రుంచాడు. దాని కాచార్యుడు వేరొక విల్లును తీసికొని నిప్పులు చెరిగే బాణాలతో అతడిని చంపాడు.

ఉ. **అప్పుడు చేకితానుఁడు శతాశుగముల్ గురుమేనఁ గ్రుచ్చి తే**
**రొప్పఱ సూతు నొంచి తురగోద్ధతి మాన్ప నతండు గన్నులన్**
**నిప్పులు రాలఁ దద్భుజము నిష్ఠుర బాణహతంబు సేసి వే**
**కప్పె శరాళి సూతుఁడు దెగన్ హరు లోటఱి గ్రేళ్ళు వాఱఁగన్.** 125

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; చేకితానుఁడు= చేకితాను డనే యాదవరాజు; గురుమేనన్= గురుడగు ద్రోణుడి శరీరంలో; శత+ఆశుగముల్ గ్రుచ్చి= నూరు వాడి బాణాలను గ్రుచ్చి; తేరు; ఒప్పు+అఱన్= అందం నశించగా (నాశంచేసి); సూతున్+నొంచి= సారథిని బాధించి; తురగ+ఉద్ధతిన్= గుర్రాల ఏపును; మాన్పన్= మాన్పించగా; అతండు= ఆ ద్రోణుడు; కన్నులన్ నిప్పులు రాలన్= కన్నులనుండి నిప్పులు రాలగా (కోపంతో); తద్= ఆ చేకితానుడి; భుజము= చేతిని; నిష్ఠురబాణహతంబు చేసి= తీవ్రమయిన బాణంతో పడగొట్టి; సూతుఁడు తెగన్= సారథి చావగా; హరులు= గుర్రాలు; ఓటఱి= నిస్సత్వంగా; క్రేళ్ళు పాఱఁగన్= ఎగిరిపడగా; శరాళిన్ కప్పెన్= బాణ సమూహంతో కప్పాడు.

**తాత్పర్యం:** చేకితాను డనే యాదవరాజు ద్రోణుడి శరీరంలోకి వాడి బాణాలను గ్రుచ్చి, తేరును నాశంచేసి, సారథిని నొప్పించి గుర్రాల వేగాన్ని తగ్గించాడు. అందు కాచార్యుడు తీవ్రమయిన బాణాలతో చేకితానుడి భుజాన్ని పడగొట్టాడు. అతడి సూతుడు హతుడయ్యేటట్లు, గుర్రాలు ఎగిరిపడేటట్లు బాణాలతో కప్పివేశాడు.

వ. **ఇట్లు చేకితానుం డోటమి కోర్చి యమ్మెయిన తొలంగె; నిత్తెఱంగున.** 126

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; చేకితానుండు= చేకితానుడను యాదవరాజు; ఓటమికిన్+ఓర్చి= ఓడిపోవుటను సహించి; ఆ+మెయిన= ఆ విధంగా; తొలంగెన్= యుద్ధభూమి నుండి తొలగిపోయాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా

**తాత్పర్యం:** ఈ విధంగా చేకితాను డోడిపోయి వెంటనే యుద్ధం నుండి తొలగిపోయాడు. ఈ ప్రకారంగా.

**క.** **పెక్కండ్రు దొరలు దన పే। రుక్కున రూపఱఁగ ద్రోణుఁ డుద్ధతిఁ దోడ్తో**
**నెక్కఁగ నితఁడు కుమారుం। డొక్కొ! యనఁగ ముదుకఁడయ్యు నుగ్రత మెఱసెన్.** 127

**ప్రతిపదార్థం:** పెక్కం(డ్రు దొరలు= చాలా మంది రాజులు; తన పేరు+ఉక్కునన్= తన దొడ్డ బలంతో; రూపఱఁగన్= నశించి పోగా; ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; ఉద్ధతిన్= గర్వంతో; తోడ్తోన్+ఎక్కఁగన్= వెంటనే విజృంభించగా; ఇతఁడు= ఈ ద్రోణుడు; ముదుకఁడు+అయ్యున్= ముసలివాడైననూ; కుమారుండు+ఒక్కొ!= పసివాడో!; అనఁగన్= అనుకొనగా; ఉగ్రతన్ మెఱసెన్= కోపంతో వెలిగాడు.

**తాత్పర్యం:** తన బలంతో చాలామంది రాజులు నశించగా ద్రోణుడు దర్పంతో విజృంభించాడు. ముదుసలి అయినా కోపంతో ఆయన వెలిగిన తీరు ద్రోణుడు పసివాడో అన్నట్లు ఉండినది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ.** **ఆసమయంబునం బాంచాలపతి 'యీ బ్రాహ్మణుండు వృషభంబులుం బోని భూపాలుర నెల్లరను సృగాలంబుల కాహారంబు సేయుచున్నవాఁడు; వారింపవలదే' యని కడంగి మొనలం బురికొలిపికొనుచు నక్కజం బగు కయ్యంబు సేయుచుండం బాండవాగ్రజుం డాత్మగతంబున.** 128

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ వేళలో; పాంచాలపతి= పాంచాలదేశానికి రాజయిన ద్రుపదుడు; ఈ బ్రాహ్మణుండు= ఈ బ్రాహ్మణుడైన ద్రోణుడు; వృషభంబులున్+పోని= ఎద్దులవంటి (ఆబోతులవంటి); భూపాలురన్+ఎల్లరను= రాజులనందరిని; సృగాలంబులకున్= నక్కలకు; ఆహారంబు చేయుచున్నవాఁడు= ఆహారంగా చేస్తున్నాడు (అనగా చంపుతున్నాడు); వారింపవలదే?= అడ్డుకొనవద్దా? (అనగా అడ్డుకొనవలయును); అని కడంగి= అని ప్రయత్నించి; మొనలన్+పురి కొలిపికొనుచున్= సేనలను ప్రేరేపించుకొనుచు; అక్కజంబు+అగు= ఆశ్చర్యాన్ని కలిగించే; కయ్యంబు చేయుచుండన్= యుద్ధంచేస్తూ ఉండగా; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; ఆత్మగతంబునన్= తనలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో పాంచాల దేశరాజు ద్రుపదుడు (ద్రోణుడి యుద్ధగతిని వర్ణిస్తూ) 'ఈ బ్రాహ్మణుడు ఆబోతులవంటి రాజులనందరినీ నక్కలవాత వేస్తున్నాడు. దానిని అడ్డుకొనవద్దా' అని ప్రయత్నంతో తన సేనలను ప్రేరేపిస్తూ, ఆశ్చర్యకరంగా యుద్ధంచేస్తూ ఉండగా, పాండవాగ్రజు డయిన ధర్మరాజు తనలో (ఇట్లా అనుకొన్నాడు).

**విశేషం:** అలం: ఉపమ.

### ధర్మరాజు భీముని నర్జునునకుఁ దోడ్పడఁ బుచ్చుట (సం.7-102-4)

**ఉ.** **అర్జునుఁ డొంటి వోయె నని యక్కడఁ బుచ్చితి బాహుసారవి**
**స్ఫూర్జితు సాత్యకిం బెలుచఁ బోవుటయుం గనుఁగొంటి నిద్దఱున్**
**దుర్జయ శత్రుసైన్యముల దొండడి నేమయి రొక్కొ! విక్రమా**
**వర్జిత వైరిభీముఁడును వారికిఁ దోడుగ నేఁగు టెట్లొకో?** 129

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు+ఒంటి పోయెనని= అర్జునుడు ఒక్కడే వెళ్ళాడని; అక్కడన్= ఆ చోటికి; బాహుసారవిస్ఫూర్జితున్= భుజశక్తిచే ప్రకాశించేవాడిని; సాత్యకిన్= సాత్యకిని; పుచ్చితిన్= పంపాను; పెలుచన్+పోవుటయున్= (అతడు) శీఘ్రంగా

పోవటమును; కనుఁగొంటిన్= చూచాను; ఇద్దఱున్= అర్జున సాత్యకు లిద్దరూ; దుర్జయ= గెలువరాని; శత్రుసైన్యముల= విరోధిమూకల; దొండడిన్= సమ్మర్దంలో; ఏమయిరి ఒక్కొ!= ఏమయ్యారో? (అని ధర్మరాజు సందేహిస్తున్నాడు. అర్జున సాత్యకులు మహావీరులయినా తన సంబంధం వారిని గూర్చి ఆందోళనను ఆయనకు కల్గించింది); విక్రమ= శౌర్యంతో; ఆవర్జితవైరి= ఆకర్షింపబడిన శత్రువులు గల; భీముఁడును= భీమసేనుడు కూడా; వారికిన్= అర్జున సాత్యకులకు; తోడుగన్= సహాయంగా; ఏఁగుట= పోవటం; ఎట్లొకో?= ఎట్లా ఉంటుందో?

**తాత్పర్యం:** 'అర్జును డొక్కడే వెళ్ళాడని తోడుగా సాత్యకిని పంపాను. ఆతడు వేగంగా పోవటమూ చూచాను. ఆ ఇద్దరునూ దుర్జయులైన విరోధి కలమూకల సమ్మర్దంలో ఏ మయ్యారో? తన భుజబలంతో విరోధుల నాకర్షించు భీముడిని కూడా వారికి తోడుగా పంపితే ఎట్లా ఉంటుందో?

**క.** **తమ్మునిఁ దలంచి కృష్ణుని । తమ్ముఁ బనిచె; నాతనిం బదంపడి తన చి**
**త్తమ్మునఁ దలఁపఁడ ధర్మజుఁ । డెమ్మెయి వాఁ డొక్కొ నారె? యీ యున్నజనుల్.** **130**

**ప్రతిపదార్థం:** తమ్మునిన్+తలంచి= తన తమ్ముడైన అర్జునుడిని తలచుకొని; కృష్ణు తమ్మున్ పనిచెన్= కృష్ణుడి తమ్ముడైన సాత్యకిని పంపాడు (అర్జునుడికి సాయంగా); ఆతనిన్= ఆ సాత్యకిని; పదంపడి= ఆ మీదట; తన చిత్తమునన్ తలఁపఁడు+అ= తన మనసులో తలచుకోనే లేదు సుమా!; ఈ ఉన్న జనుల్= ఈ చుట్టూ ఉన్నవారు; ధర్మజుఁడు+ఎమ్మెయివాఁడొక్కొ!= ధర్మరాజెటువంటివాడో!; నారె?= అనరా?

**తాత్పర్యం:** తన తమ్ముడైన అర్జునుడికి సాయంగా కృష్ణుడి తమ్ముడైన సాత్యకిని పంపాడు. కాని, ఆ మీదట ఆ సాత్యకి ఏమయ్యాడో అనే తలంపు కూడా ఈ ధర్మరాజుకు లేకపోయెనే అని జను లనుకొంటారు కదా!

**విశేషం:** ధర్మరాజు తన సోదరుడి మేలును మాత్రం కోరి సాత్యకిని తోడు పంపాడు. కాని, సాత్యకి క్షేమాన్ని మాత్రం ఈ ధర్మరాజు తలచుకొనలేదు. ఈతడు విశ్వాసహీను డని జనులు భావిస్తా రేమో అన్న తలంపుతో సాత్యకికి తోడుగా భీమసేనుడిని పంపటం భావ్యమేమో! అని ధర్మరాజు తలచుకొన్నాడు. అనగా లోకాపవాదం తనకు రాకుండవలెనంటే సాత్యకి క్షేమంకూడా తన బాధ్యతే అన్న తలంపు ధర్మజున కున్నది అని అర్థం.

**తే.** **పెక్కుచోటుల నెఱిఁగిన యుక్కులావుఁ । గలుగు నీతనిఁ బనుచుట కలుక నేల?**
**యితఁడు గలయ నయ్యిరువుర కెలమి వచ్చుఁ । బనుతు నే నటు శోకంబు వాయవలయు.** **131**

**ప్రతిపదార్థం:** పెక్కుచోటులన్= అనేక స్థలాలలో; ఎఱిఁగిన= తెలిసిన; ఉక్కులావు= ధైర్యం, బలం; కలుగు= ఉన్నట్టి; ఈతనిన్= ఈ భీముడిని; పనుచుటకున్= పంపుటకు; అలుకన్+ఏల?= జంకటం ఎందుకు?; ఇతఁడు కలయన్= ఈ భీముడు చేరగా; ఆ+ఇరువురకున్= ఆ అర్జునసాత్యకులకు; ఎలమి= సంతోషం; వచ్చున్= కలుగుతుంది; ఏన్+అటు శోకంబు పాయవలయున్= నే నావిధమయిన దుఃఖమును (చింతను) వదలవలయును.

**తాత్పర్యం:** అనేక స్థలాలలో భీముడి బలం, ధైర్యం తెలిసిన నేను అర్జునసాత్యకులకు తోడుగా ఇతడిని పంపితే ఆ ఇద్దరికీ సంతోషం కలుగుతుంది. చింత మాని ఇతడిని అటు పంపుతాను'.

**వ.** **అని బహువిధంబుల విచారించి నిశ్చయించి.** **132**

**ప్రతిపదార్థం:** అని; బహు, విధంబులన్= అనేక విధాల; విచారించి= ఆలోచించి; నిశ్చయించి= నిర్ణయించి

**తాత్పర్యం:** అని నానావిధాలుగా యోజించి నిశ్చయం చేసికొని.

**ఆ.** **భీముఁ జేర నరిగి 'బీభత్సు నీ తమ్ము' । నని యెలుంగు గళమునందుఁ దగుల**
**నశ్రు లొలుక మాట యట సెప్పలేఁ డతఁ । డార్తి సూచి యిట్టు లనియె నతఁడు.** **133**

**ప్రతిపదార్థం:** భీమున్ చేరన్+అరిగి= భీముడి యొద్దకు వెళ్ళి; బీభత్సు నీ తమ్మున్+అని= బీభత్సు డయిన నీ తమ్ముడు అని; ఎలుంగు= స్వరం; గళమునందున్= గొంతులోనే; తగులన్= తగుల్కొనగా (గొంతు లోనేఆగిపోగా); అశ్రులు+ఒలుకన్= కన్నీళ్ళు జారగా; మాట= పలుకు; అట చెప్పలే డతఁడు= ఆ ధర్మరాజు అక్కడ చెప్పలేకున్నాడు; అతఁడు= భీముడు; ఆర్తి= (ధర్మజుడి) దుఃఖాన్ని; చూచి; ఇట్లు+అనియెన్= ఈ ప్రకారంగా అన్నాడు.

**తాత్పర్యం:** (ధర్మరాజు) భీముడి దగ్గరికి వెళ్ళి 'బీభత్సు డయిన నీ తమ్ముడు' అని, ఆపైన మాట పెగిలిరాక కన్నీళ్ళతో నిలిచాడు. ఆతడి ఆర్తిని చూచి భీమసేను డిట్లా మాటాడినాడు.

**విశేషం:** తిక్కన తన రచనలో ఏ ఘట్టమునం దయినా నాటకీయమైన చతురిమను చూపగలడనుట ఈ ఆటవెలదిలో మనం గుర్తించవచ్చును. ధర్మరాజు అర్జునుడికి సాయంగా యుద్ధరంగానికి వెళ్ళుమని భీముడిని కోరటం తన ఉద్దేశం. దానిని వాచ్యంగా కాకుండా తన చేష్టలతో వ్యక్తీకరించాడు. తగు విధంగా భీముడి సమాధానం కూడా ఉంటుంది. అందుకే 'మాట అట సెప్పలేఁడు' అనీ 'అతఁ డార్తి సూచి యిట్టు లనియె' ననీ వర్ణించాడు.

**క.** **'ఏము గలంగిన యప్పుడు । నీ మహిమయ మమ్ముఁ దేర్చు నీకును గలఁగన్**
**భూమీశ! తగునె యివ్విధ । మేమిటఁ బాటిల్లెఁ, బనుపు మేపని కైనన్'.** **134**

**ప్రతిపదార్థం:** భూమీశ!= ఓ రాజా! (ధర్మజా!); ఏము కలంగిన అప్పుడు= మేము చీకాకు చెందిన సమయంలో; నీ మహిమయ= నీ గొప్పదనమే; మమ్మున్+తేర్చున్= మా అందరను దరిచేరుస్తున్నది; నీకును కలఁగన్= నీవు చీకాకు పడగా; తగునె?= తగునా? (న్యాయమా); ఈ+విధము= ఇప్పటి నీ ఆర్తి; ఏమిటన్= ఏ కారణంగా; పాటిల్లెన్?= కలిగింది?; ఏపనికి+ఐనన్= ఎటువంటి పనికైనా; పనుపుము= ఉత్తర్వు చేయుము.

**తాత్పర్యం:** 'ఓ రాజా! మేము చీకాకు పడిన సమయంలో నీ మహిమ కారణంగా మా చీకాకుల నుండి తేరుకొంటున్నాము. నీవు చీకాకు పడవచ్చునా? ఇప్పటి నీ ఆర్తికి కారణ మేమిటి? ఏ పనికైనా నన్ను పంపుము.'

**చ.** **అనవుడు నాతఁ డిట్లనియె ' నక్కడ నప్పుడు బాంచజన్య ని**
**స్వనము వినంగ నైన నట సాత్యకిఁ బుచ్చితి; నేమి పుట్టెనో!**
**యను వెత నిప్పు డద్దెస భయంబు దిగంబడ నీవు వోయి పా**
**ర్థునిఁ గని సింహనాదమున రోదసి నింపుము మాకు నింపుగన్.** **135**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా (భీము డట్లనగా); ఆతఁడు= ధర్మరాజు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; అక్కడన్= ఆ చోట (ఆ యుద్ధరంగంలో); అప్పుడు; పాంచజన్యనిస్వనము= పాంచజన్యమనే శంఖనాదం; వినంగన్+ఐనన్= వినరాగా; అటన్= ఆ చోట; ఏమిపుట్టెనో?= ఏమైనదో?; అనువెతన్= అన్నభయంతో; సాత్యకిన్+పుచ్చితిన్= సాత్యకిని పంపాను; ఇపుడు= ఈ సమయంలో; ఆ+దెసన్= ఆ దిక్కులో; భయంబు దిగంబడన్= భయం తొలగగా; నీవు పోయి= నీవు వెళ్ళి; పార్థునిన్= అర్జునుడిని; కని= చూచి; రోదసిన్= భూమ్యాకాశముల మధ్య భాగం; మాకున్+ఇంపుగన్= మాకు ప్రీతిగా; సింహనాదమునన్= సింహగర్జనంతో; నింపుము= నిండచేయుము.

**తాత్పర్యం:** అని భీము డనగా ధర్మరాజు అతడితో ఇట్లా అన్నాడు: 'ఆ వైపు రణరంగంలో పాంచజన్య శబ్దం మాత్రమే వినవచ్చింది. అక్కడ ఏమాయెనో? అని సాత్యకిని పంపాను. కాని ఆ దిక్కున జరిగేదానికై నాకు కలిగిన భయాన్ని పోగొట్టటానికై నీవక్కడకు పోయి అర్జునుడిని చూచి (సంతోష చిహ్నంగా) ఆకాశమంతా నిండేటట్లు సింహనాదం చేసి నాకు సంతోషాన్ని కలిగించుము.

**క. నీతమ్ముఁగుఱ్ఱ రూపసి, । నీతి విదుఁడు, సకల సుగుణ నిధి, మద్భక్తుం**
**డాతని కెడరగునో యను । చేతోగతి పల్లటిల్లఁ జేయదె తాల్మిన్? 136**

**ప్రతిపదార్థం:** నీ తమ్ముఁగుఱ్ఱ= పసివాడైన నీ తమ్ముడు; రూపసి= అందగాడు; నీతివిదుఁడు= నీతిని తెలిసినవాడు; సకల సుగుణనిధి= అన్ని మంచి గుణములపుట్ట; మద్భక్తుండు= నా యెడ భక్తికలవాడు; ఆతనికిన్= అతనికి; ఎడరు+అగునో= ప్రమాదమగునో; అను చేతోగతి= అనే మనసుపోక; తాల్మిన్= ఓరిమిని; పల్లటిల్లన్= చలించేటట్లు; చేయదె?= చేయదా?

**తాత్పర్యం:** పసివాడు నీ తమ్ముడు అందగాడు, నీతి పద్ధతి తెలిసినవాడు, మంచిగుణా లున్నవాడు, మీదు మిక్కిలి నాకు భక్తుడు. అటువంటి వాడికి కీడు కలుగుతుందేమో అనే మనోభావం నా ఓర్మిని చలింపజేయదా?'

**ఆ. అనిన భీముఁ డిట్టు లనియెఁ 'దద్రథము ర । థ్యముల సారథిని శరాసనంబు**
**నెఱుఁగు దతని కొలఁది యెఱిఁగిన యదియ నీ । కేల వగవ? నిపుడ యేను బోదు. 137**

**ప్రతిపదార్థం:** అనినన్= ధర్మజు డట్లనగా; భీముఁడు+ఇట్టులు+అనియెన్= భీముడీ విధంగా అన్నాడు; తద్రథమున్= అతడి తేరును; రథ్యములన్= గుఱ్ఱాలను; సారథిని= తేరు తోలేవానిని; శరాసనంబును= వింటిని; ఎఱుఁగుదు(వు)= తెలిసినవాడవు; అతని కొలఁది ఎఱిఁగిన అదియ నీకున్= అతడి బలం నీకు తెలిసిందే; నీకున్+ఏల వగవన్?= నీవు దుఃఖపడ నేల?; ఏను= నేను; ఇపుడు+అ= ఇపుడే; పోదున్= పోతాను.

**తాత్పర్యం:** భీముడు ధర్మరాజుతో ఈ విధంగా అన్నాడు: 'అతడి తేరును, గుఱ్ఱాలను, సారథిని, వింటినీ, బలాన్నీ తెలిసిన నీకు దుఃఖ మెందుకు? నే నిపుడే వెళ్ళుతున్నాను.

**వ. దేవరయాజ్ఞఁ దల నిడికొని చని యా కృష్ణుల కృష్ణానుజునిం గలసి యిక్కడ కెఱుక సేయుదు' నని పలికి పాంచాల నందనుం గనుంగొని 'కుంభసంభవు బలిమియు నతని ప్రతిజ్ఞ తెఱంగును నెఱుంగుదు; వేమఱకుండుము; నాకుం బోక కర్జంబు గాదు; గాకున్న నేలినవాని యానతి నడపవలయు' ననవుడు నతండు. 138**

**ప్రతిపదార్థం:** దేవర ఆజ్ఞ= రాజుగారి ఉత్తర్వు; తలన్+ఇడికొని= మోసికొని (శిరోధార్యంగా); చని= వెళ్ళి; ఆ కృష్ణులన్= ఆ శ్రీకృష్ణార్జునులను; కృష్ణానుజునిన్= సాత్యకిని; కలసి= కలసికొని; ఇక్కడకున్+ఎఱుక చేయుదును=ఇక్కడికి తెలియచేస్తాను; అని పలికి= అని చెప్పి; పాంచాల నందనున్+కనుంగొని= ధృష్టద్యుమ్నుడిని చూచి; కుంభసంభవు బలిమియున్= ద్రోణుడి బలాన్నీ; అతని ప్రతిజ్ఞ తెఱంగునున్= ఆతడి మాట (శపథం తీరును); ఎఱుంగుదువు= తెలిసినవాడవు (అతడి ప్రతిజ్ఞ ధర్మజుడిని బందీచేయటం); ఏమఱక+ఉండుము= మరువకుండా ఉండుము; నాకున్+పోక కర్జంబుకాదు= నేను వెళ్ళవలసిన పని కాదు; కాకున్నన్= కాకుంటే; ఏలినవాని ఆనతిన్= రాజాజ్ఞను; నడపవలయును= నెరవేర్పవలయును; అనవుడున్= అనగా; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు.

**తాత్పర్యం:** రాజాజ్ఞను శిరసావహించి వెళ్ళి కృష్ణార్జునులను, సాత్యకిని కలసికొని అక్కడి విషయాలు తెలియజేస్తాను' అని, ధృష్టద్యుమ్నుడితో 'ద్రోణుడి ప్రతిజ్ఞను, బలాన్ని తెలిసినవాడవు. జాగ్రత్తగా ఉండుము. నేను పోవటం తగిన పనికాదు. కాని, రాజాజ్ఞ దాటరానిది. దానిని చేసి తీరవలయును' అనగా ఆతడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'వినుము భవత్సేనాపతి । తనువునఁ బ్రాణములు గలుగ ధర్మజు దెసకుం**
**జనుదెంచువాఁడె ద్రోణుం? । డనుమానము దక్కి యరుగు మర్జును కడకున్.' 139**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ భీమసేనా! వినుము; భవత్+సేనాపతి తనువునన్= మీ సేనానాయకుడి ఒంటిలో; ప్రాణములు కలుగన్= ప్రాణా లుండగా; ద్రోణుండు= ద్రోణుడు; ధర్మజు దెసకున్ చనుదెంచువాఁడె?= ధర్మజుడి దిక్కుకు రాగలడా? (అనగా రాలేడని); అనుమానము తక్కి= సందేహం వదలి; అర్జును కడకున్= అర్జునుడి దగ్గరకు; అరుగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** 'ఓ భీమసేనా! ఇదిగో వినుము. నీ సేనాని మేనిలో ప్రాణాలుండగా ద్రోణుడు ధర్మరాజు దిక్కుకు రాగలడా? సందేహించకుండా అర్జునుడి యొద్దకు వెళ్ళుము' అని అన్నాడు.

**వ. అనిన ధృష్టద్యుమ్ను పలుకుల కూఱడిల్లి యనిలతనయుం డన్న చరణంబులకుం బ్రణతుండై యాలింగనంబును నాశీర్వాదంబునుం బడసి యున్న యప్పుడు శౌరి శంఖ విరావంబు వీతెంచిన న వ్విభుం డవ్వీరున కి ట్లనియె. 140**

**ప్రతిపదార్థం:** అనిన ధృష్టద్యుమ్ను పలుకులకు= ఆ విధంగా చెప్పిన ధృష్టద్యుమ్నుడి మాటలకు; ఊఱడిల్లి= ఓదార్పునంది; అనిల తనయుండు= భీమసేనుడు; అన్న చరణంబులకున్= ధర్మజుడి పాదాలకు; ప్రణతుండు+ఐ= నమస్కారం చేసి; ఆలింగనంబును= కౌగిలియు; ఆశీర్వాదంబునున్ పడసి= ఆశీస్సులను పొంది; ఉన్న అప్పుడు= ఉండే సమయాన; శౌరి= శ్రీకృష్ణుడి; శంఖవిరావంబు= శంఖధ్వని; వీతెంచినన్= వినరాగా; ఆ+విభుండు= ఆ ధర్మరాజు; ఆ+వీరునకున్+ఇట్లు+అనియెన్= ఆ వీరుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అనుమానం వదలి అర్జునుడి యొద్దకు వెళ్ళు'మని ధృష్టద్యుమ్నుడు పలుకగా ఊరడిల్లి, భీమసేనుడు తన అన్నగారి పాదాలకు నమస్కరించాడు. ఆయన కౌగిలించుకొని ఆశీస్సు లందించాడు. అపుడు కృష్ణుడి శంఖధ్వని వినరాగా ఆ రాజు ఆ వీరుడితో ఇట్లా అన్నాడు:

**క. 'విను పాంచజన్య పటు ని । స్వన మదె యిది మఱఁది యెడరు సైరింపక కృ**
**ష్ణుని రణము సేయు రభసం । బని తలఁచెద నెయ్యు మెయ్యు మధిక రయమునన్.' 141**

**ప్రతిపదార్థం:** పాంచజన్య పటునిస్వనము= పాంచజన్య శంఖంయొక్క పెనురవం; అదె వినుము= అదుగో వినుము; ఇది= ఈ శబ్దం; మఱఁది ఎడరు= తన మేన మరది అర్జునుడి భంగపాటును; సైరింపన్= ఓర్వలేక; కృష్ణుని రణము చేయు= కృష్ణుడు యుద్ధం చేసే; రభసంబు+అని= వేగమని; తలఁచెదన్= తలచుకొంటున్నాను; అధిక రయమునన్= మిక్కిలి తొందరగా; ఎయ్యుము ఎయ్యుము= (వారిని) వెంబడించుము.

**తాత్పర్యం:** 'పాంచజన్య శంఖారావం వినవస్తూ ఉన్నది. అదిగో! వినుము. తన మేనమరది అయిన అర్జునుడి భంగపాటున కోర్వక శ్రీకృష్ణుడు చేసే రభస మది' అని తలుస్తున్నాను. చాలా తొందరగా వారిని వెంబడించి వెళ్ళుము' (అని ధర్మజుడు భీముడితో అన్నాడు).

**వ. అనవుడు సవిశేష కల్పితంబగు రథంబు రవంబును దూర్య నినదంబును దనసింహనాదంబునుం జెలంగ విశోకుని సారథ్య సామర్థ్యంబున రథ్యంబులు నెఱయ మెఱయం గదలి గొనయంబు సారించి కురుబలంబు నవలోకించుచు నడరు నవ్వడముడిం దలపడి నీ కొడుకులు దుశ్శల చిత్రసేనకుండభేది వివింశతి దుర్ముఖ దుస్సహులును వికర్ణ శలవిందానువింద సుముఖ దీర్ఘబాహు సుదర్శన బృందారకులును సుహస్త సుషేణ దీర్ఘలోచనాభయ రౌద్రకర్మ సువర్మ దుర్విమోచనులును వివిధ విశిఖంబులు వరఁగించుటయు, లేళ్ళగమిం జూచి పొంగు సింగంబు చందంబునం జెలంగి యా శరంబులు వారించుచు వారిం గదిసి బృందారకుం దెగఁ జూచి యభయ రౌద్రకర్మ దుర్విమోచనులను ముువ్వుర మూఁడు వెడండ దూపులం దునిమిన. 142**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని ధర్మరాజు చెప్పగా; సవిశేష కల్పితంబు+అగు రథంబు రవంబును= అన్ని విశేషాలతో సిద్ధం చేసిన తేరు సవ్వడిని (అనగా అన్ని హంగుల యుద్ధ పరికరాలతో సన్నద్ధమయిన తేరు నడకలో విన్పించే శబ్దమును); తూర్యనినదంబును= తూర్యనాదాలును; తన సింహనాదంబును= తాను కావించే సింహనాదమును; చెలంగన్= ధ్వనించగా; విశోకుని సారథ్య సామర్థ్యంబు నన్= విశోకుడనే సూతుడి శక్తితో; రథ్యంబులు= గుఱ్ఱాలు; నెఱయన్= గొప్పగా వ్యాపించగా (అనగా గొప్పగా పరుగులు వారగా); మెఱయన్= ప్రకాశించగా; కదలి= నడచి (యుద్ధానికి బయలుదేరి); గొనయంబుసారించి= అల్లెత్రాటిని లాగి (వింటినారిని లాగి శబ్దంచేసి); కురుబలంబున్= కౌరవసేనను; అవలోకించుచున్= చూస్తూ; అడరు= విజృంభించే; ఆ+వడముడిన్+తలపడి= ఆ భీమసేనుడిని ఎదుర్కొని; నీ కొడుకులు= నీ కుమారులయిన; దుశ్శల, చిత్రసేన, కుండభేది, వివింశతి, దుర్ముఖ, దుస్సహులును, వికర్ణ, శల, వింద+అనువింద, సుముఖ, దీర్ఘబాహు సుదర్శన బృందారకులును, సుహస్త, సుషేణ, దీర్ఘలోచన+అభయ, రౌద్రకర్మ, సుశర్మ, దుర్విమోచనులును= ఈ పేర్లు కల నీ కొడుకులు; వివిధ విశిఖంబులు= అనేకరకాలయిన బాణాలను; పరఁగించుటయున్= వేయుటయు; లేళ్ళగమిన్+చూచి పొంగు= జింకలగుంపును చూచి ఉప్పొంగే (చెలరేగే); సింగంబు చందంబునన్= సింహంవలె; చెలంగి= ఒప్పి; ఆ శరంబులు= కౌరవులు ప్రయోగించిన బాణాలను; వారించుచున్= ఆపుచు; వారిన్+కదిసి= కౌరవులను దాటి; బృందారకున్+తెగన్+చూచి= బృందారకు డనే వాడిని చంపి; అభయ, రౌద్రకర్మ, దుర్విమోచనులను మువ్వురన్= ఈ ముగ్గురిని; మూఁడు= మూడు; వెడంద తూపులన్= వాడి అయిన విశాలమయిన బాణాలతో; తునిమినన్= చంపగా.

**తాత్పర్యం:** ధర్మరాజు చెప్పగా భీమసేనుడు, సర్వాంగసన్నద్ధమైన రథంతో, విశోకుడనే సారథి సారథ్యంలో, రథనాద తూర్యనాద సింహనాదాలతో ఒప్పుతూ వింటినారిటంకార శబ్దంతో యుద్ధానికి వెళ్ళాడు. కౌరవసైన్యాన్ని చూస్తూ పేట్రేగిన భీమసేనుడిని, నీ కొడుకులైన దుశ్శల, చిత్రసేన, కుండభేది, వివింశతి, దుర్ముఖ, దుస్సహ, వికర్ణ, శల, విందా, అనువింద, సుముఖ, దీర్ఘబాహు, సుదర్శన, బృందారక, సుహస్త, సుషేణ, దీర్ఘలోచన, అభయ, రౌద్రకర్మ, సుశర్మ, దుర్విమోచను లనేవారు అనేకవిధాలైన వాడి బాణాలను వేశారు. అందు కాతడు లేళ్ళ గుంపును చూచి ఉప్పొంగే సింహం మాదిరి, కౌరవులు వేసిన బాణాలను ఆపుకొంటూ వారిని దాటి, బృందారకుడిని చంపి, అభయ రౌద్రకర్మ దుర్విమోచనులనే ముగ్గురిని మూడు బాణాలతో హతమార్చగా.

**విశేషం:** అలంకారం ఉపమ.

**క.** **చలమునఁ బోవక పెనఁగిన । నల వేర్పడ నతఁడు విందు ననువింద సుశ**
**ర్ముల జంపి, సుదర్శను బె । ట్టిలపైఁబడి యపుడు సావ నేసె నరేంద్రా!** **143**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); చలమునన్= మత్సరంతో; పోవక= వెళ్ళిపోక (తప్పుకొని పోకుండా); పెనఁగినన్= పోట్లాడగా; అలవు= బలం; ఏర్పడన్= స్పష్టం కాగా; అతఁడు= ఆ భీమసేనుడు; విందున్= విందుడినీ; అనువింద సుశర్మలన్= అనువిందుడినీ, సుశర్మనూ; చంపి= చంపివేసి; సుదర్శనున్= సుదర్శనుడిని; బెట్టు+ఇలపైన్+పడి= భయంకరంగా భూమిమీద పడి; చావన్= చని పోగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** ఓ రాజా ధృతరాష్ట్రా! (నీ కొడుకులు) వెనుకకు తిరిగిపోకుండా మత్సరంతో యుద్ధం చేయగా, భీముడు తన బలం స్పష్టపడేటట్లు విందుడినీ అనువింద సుశర్ములనే వారినీ చంపి, సుదర్శనుడు భూమిమీద పడి చచ్చేటట్లుగా కొట్టాడు.

**క.** **పెఱవారు వెఱచి నలుగడఁ । బఱచిన వాయుసుతుఁ డార్చి పఱపె రథం బా**
**తెఱపిన యరుగుట గని గురుఁ । డుఱక యతనిఁ దాఁకఁ గప్పె నుగ్రాస్త్రములన్.** **144**

**ప్రతిపదార్థం:** పెఱవారు= ఇతరులు (శత్రువులు); వెఱచి= భయపడి; నలుగడన్+పఱచినన్= నాలుగు దిక్కులకు పరుగెత్తగా (పారిపోగా); వాయుసుతుఁడు= భీమసేనుడు; ఆర్చి= సింహనాదం చేసి; రథంబున్= తన తేరును; పఱపెన్= తోలాడు; ఆ తెఱపిన= ఆ బాటనే; అరుగుటన్+కని= వెళ్ళటం చూచి (భీముడట్లే పోవటం చూచి); గురుఁడు= ద్రోణుడు; ఉఱక= లెక్కపెట్టక; ఉగ్రాస్త్రములన్= భయంకరమైన బాణాలతో; అతనిన్+తాఁకన్= వానిని తాకగా; కప్పెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** ఇతరులు భయపడి నాలుగుదిక్కులకూ పరుగెత్తేటట్లుగా చేసి, భీముడు సింహనాదం చేస్తూ, తన తేరు నా దిక్కుకు తోలించాడు. దానిని చూచిన ద్రోణుడు భీముని లెక్కపెట్టక, భయంకరమైన బాణాలతో అతడిని కప్పివేశాడు.

**వ. ఇట్లు నిలువరించి, నిటలంబున నారాచంబు నాటించి, యక్కుంభసంభవుండు దనమనంబున 'వీఁడు వివ్వచ్చునట్లు నన్ననుసరింపఁ గలవాఁ'డని తలంచి యప్పవనతనయు నుద్దేశించి. 145**

**ప్రతిపదార్థం:** ఇట్లు నిలువరించి= ఈ విధంగా నిలిపి; నిటలంబునన్= నెన్నుదుట; నారాచంబున్= వాడి బాణాన్ని; నాటించి= నాటుకొనేటట్లు చేసి; ఆ+కుంభసంభవుండు= ఆ ద్రోణుడు; తనమనంబునన్= తన మనస్సులో; వీఁడు= ఈ భీమసేనుడు; వివ్వచ్చున్+అట్లు= అర్జునుడి మాదిరిగనే; నన్ను+అనుసరింపన్+కలవాఁడు= న న్ననుసరించి వచ్చేవాడు; అని తలంచి= అని ఊహించి; ఆ+పవనతనయునుద్దేశించి= ఆ భీముడిని గూర్చి.

**తాత్పర్యం:** ఆ విధంగా నిలిపి, నెన్నుదుట వాడిబాణాన్ని నాటి, ఆ ద్రోణుడు మనసులో 'ఆ అర్జునుడు నన్ననుసరించి వెళ్ళినట్లుగానే ఇతడు కూడా అనుసరిస్తా' డని తలచుకొని (భీముడితో) ఇట్లా అన్నాడు:

**క. 'నను గెలిచి కాక నీ కి । మ్మొన సొరఁగా నెట్లు వచ్చు? మును నీ తమ్ముం**
**డనుమతుఁడై కాదే చొరఁ । గనియె' ననుడు నతఁడు గన్నుఁగవ గెంపారన్. 146**

**ప్రతిపదార్థం:** నను గెలిచి కాక= నన్ను జయించకుండా (అనగా అస్త్రగురుడ నగు నన్ను గెలువక); నీకున్= నీకు (భీమసేనుడికి); ఈ+మొనన్= ఈ వ్యూహంలోకి; చొరఁగాన్= ప్రవేశించగా; ఎట్లు వచ్చున్?= ఏ విధంగా సాధ్యమవుతుంది? మును= వెనుక; నీ తమ్ముండు= నీ తమ్ముడైన అర్జునుడు; అనుమతుఁడు+ఐ కాదే= నా ఉత్తర్వు నంది కదా!; చొరన్+కనియెన్= లోనికి వెళ్ళ గలిగాడు; అనుడున్= అనగా; అతఁడు= భీముడు; కన్నుఁగవ= కన్నులు రెండును; కెంపారన్= ఎర్రబడగా (అనగా కోపం కలుగగా).

**తాత్పర్యం:** 'ఓ భీమసేనా! తొలుత నన్ను గెలిస్తే గాని ఈ సేనలోకి ప్రవేశించటం సాధ్యం కాదు. ఇదివరకు నా అనుమతితోనే నీ తమ్ముడు కూడా సేనలోకి చొచ్చుకొని వచ్చాడు' అనగా, భీముడు కోపంతో తన కన్నులు రెండూ ఎర్రబడగా (ఇట్లా అన్నాడు). (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'నరుఁ డొక రథికుని యనుమతిఁ । జొరఁ దలఁచునె? మనుజ సేన సురబల మైనం**
**దెరలిచికొని విచ్చలవిడి । నరుగుం దనవలయు నెడకు; నది యట్లుండెన్. 147**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; ఒక రథికుని అనుమతిన్= ఒకానొక రథికుడి ఉత్తర్వుతో; చొరన్+తలఁచునె?= లోనికి వెళ్ళగోరునా?; మనుజసేన= మానవసైన్యం; సురబలము= దేవసేన; ఐనన్= అయినప్పటికినీ; తెరలిచికొని= చీల్చికొని; విచ్చల విడిన్= తనకు తోచినట్లు; తనవలయు+ఎడకున్= తాను వెళ్ళదలచుకొన్న చోటికి; అరుగున్= వెళ్ళుతాడు; అది అట్లు+ ఉండెన్= దాని నట్లా ఉండనిమ్ము.

**తాత్పర్యం:** 'ఒక రథికుడి అనుమతితో అర్జునుడు తాను వెళ్ళదలచుకొన్నచోటికి వెళ్ళుతాడా? మానవసేన అయినా, దేవతాసైన్యమైనా, తాను పోవలసిన చోటుకి చీల్చుకొని వెళ్ళ గలడు. అది అట్లా ఉండనిమ్ము. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. ప్రియములు వల్కి ని న్ననుసరింపఁగఁ బార్థుఁడు గాఁడు సుమ్ము! దు**
**ర్జయ భుజశక్తి నిర్మథిత శత్రుఁడు భీముఁడు గాని; నీవు దం**
**డ్రియు గురుడుం బ్రియుండు నని ప్రీతి యొనర్తెదఁ బూని వైరికిన్**
**జయ మొనరింతు గాక! యని సైఁతునె దర్పము సూపకుందునే?' 148**

**ప్రతిపదార్థం:** ప్రియములు పల్కి= తీయని మాట లాడి; నిన్నున్+అనుసరింపఁగన్= నిన్ననుసరించటానికి (నీ వెంట నడిచే దానికి); పార్థుఁడు గాఁడు సుమ్మ!= అర్జునుడు కాడు సుమా!; దుర్జయ= జయింపరాని; భుజశక్తి= భుజబలంతో; నిర్మథితశత్రుఁడు= మర్దింపబడిన శత్రువులు కలవాడు; భీముఁడు= భీముడు; కాని= కాకుంటే; నీవు; తండ్రియున్, గురుఁడున్, ప్రియుండున్+అని= తండ్రివంటివాడవు, గురుడవు, ప్రియమైనవాడవు అని; ప్రీతి+ఒనర్చెదన్= (మీకు)సంతోషం కలిగిస్తాను; పూని వైరికిన్= ప్రయత్నంతో విరోధికి; జయము+ఒనరింతు+కాక!+అని= జయం కలిగించడానికి; సైఁతునె= సహిస్తానా? దర్పము= గర్వము; చూపక+ఉందునే= చూపకుండా ఉంటానా?

**తాత్పర్యం:** తియ్యని మాటలతో ని న్ననుసరించటానికి నే నర్జునుడను గాను. భుజబలంతో శత్రువులను మథించిన వాడను - భీముడను. నీవు నాకు తండ్రి వంటివాడవని, గురుడివని, ఇష్టమైనవాడివని నీకు సంతోషాన్ని కలిగిస్తాను. అంతేకాని శత్రువుకు ప్రయత్నించి నీవు జయంకలిగించడాన్ని మాత్రం నేను సహించను. నా గర్వం చూపకుండా ఉంటానా?

**వ. అని పలికి. 149**

**తాత్పర్యం:** అని మాట్లాడి.

**మ. గద సారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సాలించి య**
**మ్ముదుకం డుర్వికి దాఁటి పోయె; నది రశ్మల్ మింటఁ బర్వంగ బె**
**ట్టిదమై మ్రోయుచు వచ్చి బల్పిడుగు మాడ్కిం దాఁకుడున్ గుఱ్ఱముల్**
**సదిసెన్, సారథి మ్రగ్గె, దేరు వొలిసెన్ సైన్యంబు భీతిల్లఁగన్. 150**

**ప్రతిపదార్థం:** గద సారించి= గదను ఊపి; చెలంగి వైచినన్= ఉత్సాహంతో వేయగా; భుజాగర్వంబు= భుజబలం; చాలించి= వదలి; ఆ+ముదుకండు= ఆ ముసలివాడు; ఉర్వికిన్= భూమికి; దాఁటిపోయెన్= దాటుకొనిపోయాడు; అది= ఆగద; రశ్మల్= కాంతులు; మింటన్+పర్వంగన్= ఆకాశంలో వ్యాపించగా; బెట్టిదము+ఐ= తీవ్రమై; మ్రోయుచు వచ్చి= శబ్దం చేస్తూ వచ్చి; బల్పిడుగు మాడ్కిన్= పెను పిడుగు మాదిరిగా; తాఁకుడున్= తగులగా; సైన్యంబు భీతిల్లగన్= (మన) సైన్యం భయపడగా; గుఱ్ఱముల్ చదిసెన్= గుర్రాలు నలిగిపోయాయి; సారథి= సూతుడు; మ్రగ్గెన్= చచ్చాడు, తేరు పొలిసెన్= రథం నాశమయింది.

**తాత్పర్యం:** (భీమసేనుడు) గదను చాచి వేయగా భుజబలం చాలించి ఆ వృద్ధుడు (ద్రోణుడు) రథం మీద నుండి భూమి మీదికి ఉరికి తొలగి వెళ్ళాడు. ఆ గద ఆకాశం దాకా కాంతులను వ్యాపింపచేస్తూ, పెద్దశబ్దంచేస్తూ, పెద్ద పిడుగువలె తాకేటప్పటికి మన సైన్యం భయపడేటట్లుగా గుర్రాలు, సారథి చనిపోగా, తేరు నుగ్గునుగ్గయింది.

**వ. అప్పు డమ్మేటిమగండు. 151**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ఆ+మేటిమగండు= ఆ గొప్పవీరుడు

**తాత్పర్యం:** అపు డా గొప్ప మొనగాడు.

**క.** **మన మూఁక దటిసి యుద్ధతిఁ । జనఁ జన నీనందనులు వెసం దాఁకియు ను**
**బ్బిన యతని వీఁక కోర్వక । కనుకని సిగ్గు సెడి పాఱఁగా గురుఁ డంతన్.** 152

**ప్రతిపదార్థం:** మన మూఁక దటిసి= మన సేన దగ్గరకు వచ్చి; ఉద్ధతిన్ చనన్+చనన్= దర్పంతో పోగా పోగా; నీ నందనులు= నీ కుమారు లయిన కౌరవులు; వెసన్+తాఁకియున్= తొందరగా ఎదుర్కొని నప్పటికినీ; ఉబ్బిన= పెరిగిన; అతని వీఁకకున్= ఆతడి ఉత్సాహానికి; ఓర్వక= సహించలేక; కనుకని= సంభ్రమంతో; సిగ్గు చెడి= సిగ్గు వదలి; పాఱఁగాన్= పారిపోగా; అంతన్= ఆ మీదట; గురుండు= ద్రోణుడు.

**తాత్పర్యం:** మన సేనను ఎదుర్కొని దర్పంతో పోగా పోగా, నీ కొడుకులు త్వరగా అతడిని ప్రతిఘటించి, అతడి పరాక్రమానికి ఆగలేక, భయంతో సిగ్గు వదలి పరుగెత్తారు. అంతట గురుడు.

**క.** **ఒండొక తే రెక్కి సము । ద్దండతఁ జని భీమసేనుఁ దాఁకి శరము లొం**
**డొండ నిగిడించి నొంచిన । గం డడఁగక యతఁడు గనలు గదిరిన మదితోన్.** 153

**ప్రతిపదార్థం:** (ద్రోణుడు) ఒండొక తేరు+ఎక్కి= మరియొక తేరుమీది కెక్కి; సముద్దండతన్= గొప్పగా; చని= వెళ్ళి; భీమసేనున్ తాఁకి= భీముడిని ఎదుర్కొని; శరములు= బాణాలు; ఒండొండన్= ఒకదానితో ఒకటిగా (వరుసగా); నిగిడించి= వేసి; నొంచినన్= బాధించగా; గండు= పొగరు, గర్వం; అడఁగక= తగ్గక; అతఁడు= భీముడు; కనలు= కోపం; కదిరిన= నిండిన; మదితోన్=మనసుతో.

**తాత్పర్యం:** ద్రోణుడు ఇంకొక తేరెక్కి, గొప్పగా వెళ్ళి భీముడితో తలపడి వరుసగా బాణాలు వేసి బాధించాడు. బలగర్వం తగ్గకుండా మిక్కిలి కోపం నిండిన మనసుతో భీముడు(తరువాతి పద్యంతో అన్వయం).

**చ.** **అరదము డిగ్గి యప్పటు శరావళి కోర్చి మొగంబు వాంచి స**
**త్వరుఁ డయి వాన పైఁ గురియ వంచిన మస్తక మొప్పఁ బోవు సుం**
**దర వృషభంబు లీలఁ జని దర్ప మెలర్పఁగ నొక్కచే నొగల్**
**వెరవునఁ బట్టి తేరు ప్రజ విస్మయ మందఁగ వీచి వైచినన్.** 154

**ప్రతిపదార్థం:** (భీమసేనుడు) అరదము డిగ్గి= తన తేరును దిగి; ఆ+పటు శర+ఆవళికిన్+ఓర్చి= ఆ ద్రోణుడిచే వేయబడిన తీవ్రబాణపంక్తిని ఓర్చుకొంటూ; మొగంబు వాంచి= తన మొగమును వంచుకొని (బాణాలు తగులకుండా); సత్వరుఁడు+అయి= వేగం కలవా డయి; వాన పైన్ కురియన్ వంచిన మస్తకము= వాన మీద కురుస్తున్నా వంచిన తలను; ఒప్పన్+పోవు= తగిన విధంగా నడిచే; సుందరవృషభంబు లీలన్= అందమైన ఆబోతు వలె; చని= వెళ్ళి; దర్పము+ఎలర్పఁగన్= గర్వం ఒప్పగా; ఒక్కచేన్= ఒక చేతితో; నొగల్= తేరి నొగలను; వెరవునన్+పట్టి= ఉపాయంతో పట్టుకొని; తేరున్= తేరును (ద్రోణుడి తేరును); ప్రజ= చూచే జనం; విస్మయము+అందఁగన్= ఆశ్చర్యపడగా; వీచి వైచినన్= విసరివేయగా.

**తాత్పర్యం:** తన రథం మీది నుండి ఎగిరి క్రిందికి దూకి, ద్రోణుడు ప్రయోగించే తీవ్రబాణ సమూహాన్ని ఓర్చుకొంటూ, ముఖం వంచుకొని, మిక్కిలి వేగంగా - మీద వర్షం కురుస్తుంటే తలనువంచి పరుగెత్తే అందమైన ఆబోతు వలె వెళ్ళి, గర్వం అతిశయించగా, ఒక్కచేతితో ద్రోణుడి తేరి నొగలను పట్టి ఎత్తి, అందరు చూచి ఆశ్చర్యపడేటట్లు ఆ రథాన్ని విసిరివేయగా (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ.

**భీముఁడు ద్రోణాది రథికుల నతిక్రమించి యర్జునుఁ జేరఁబోవుట (సం. 7-102-88)**

**ఆ.** **నుగ్గునూచ మైన నగ్గురుఁ డొండొక । యరద మెక్కి యల్ల నరిగె సేన**
**మొగమునకు రయంబు మిగుల విశోకుఁడు । దేర భీముఁ డెక్కెఁ దేరు ప్రీతి.** 155

**ప్రతిపదార్థం:** నుగ్గునూచము+ఐనన్= (రథం విసరివేయగా) పొడిపొడికాగా; ఆ+గురుఁడు= ఆ ద్రోణుడు; ఒండొక అరదము+ఎక్కి= వేరొక తేరు నెక్కి; అల్లన్+అరిగెన్= నెమ్మదిగా వెళ్ళాడు; సేన మొగమునకున్= సేన మొదటికి; విశోకుఁడు= భీముడి సారథి అయిన విశోకుడు; రయంబు మిగులన్= మిక్కిలి వేగంతో; తేరన్= తీసికొని రాగా; భీముఁడు= భీమసేనుడు; ప్రీతిన్= ప్రేమతో; తేరున్= రథాన్ని; ఎక్కెన్= ఎక్కాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా వేయటంవలన తేరు ముక్కలు ముక్కలయింది. అంత గురుడు వేరొక తేరెక్కి సేనాముఖానికి మెల్లగా వెళ్ళాడు. తన సారథి విశోకుడు మిక్కిలి వేగంగా రథం తీసికొనిపోగా, ప్రీతితో భీమసేనుడు ఆ తేరుఎక్కాడు.

**వ. ఇవ్విధంబున ధనురాచార్యు బెట్టు పఱచి బిట్టు సను నా జెట్టిబిరుదున కెదుర్పం జాలక భోజబలంబును గాంభోజానీకంబును యవనాది మ్లేచ్ఛ సైన్యంబులునుం బసులు పులికిం బాఱు తెఱంగునం గలంగి పఱచె;న న ట్లప్రతిహతగతిం బోయి సాత్యకి సమరోల్లాసంబు గనుంగొనుచు నట కడచి యవ్వడముడి దివ్యరథంబు మెఱయఁ గౌరవ్యయోధులతోడం బెనంగు సవ్యసాచిం జూచి సింహనాదంబు సేసిన, నతనిం గనుంగొని ప్రియంబున నయ్యర్జునుండును హరియును గర్జారవంబుల గగనంబు నినిచి; రమ్మహారవంబు లాకర్ణించి యుధిష్ఠిరుండు భీము సంజ్ఞాపనంబునకు సంతుష్టాంతరంగుండై తన లోనన యతని నగ్గించి యన్నర నారాయణుల యెలుంగులు వినం గనుటకుం బొంగుచు, నప్పార్థుండు దన ప్రతిజ్ఞ నెఱపి వచ్చి తన్నుం గౌఁగిలించికొనుటం గోరుచుం, గౌరవపతి యిమ్మెయిం దమ్ములు బంధులుం దెగంబొలియుట దెలిసి యయినను దీరునకుం జొచ్చి యున్నవారినైనం గాచి కొనునొకో! యని యూహించుచుఁ గయ్యంబు సేయుచుండె' ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 156**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ధనురాచార్యున్= ద్రోణాచార్యుడిని; బెట్టు పఱచి= మిక్కిలి బాధించి; బిట్టు చను= త్వరగా వెళ్ళుతున్న; ఆ జెట్టి బిరుదునకున్= ఆ మహావీరునకు; ఎదుర్పన్+చాలక= ఎదుర్కొనలేక; భోజబలంబును= భోజదేశ సైన్యమును; కాంభోజ+అనీకంబును= కాంభోజసైన్యమును; యవనాది మ్లేచ్ఛ సైన్యంబులును= యవనులు మొదలైన మ్లేచ్ఛ సేనలును; పసులు= పశువులు; పులికిన్+పాఱు తెఱంగునన్= పులిని చూచి పరుగెత్తే విధంగా; కలంగి= బెదరి; పఱచెన్= పరుగెత్తాయి; అట్లు= ఆ విధంగా; అప్రతిహతగతిన్+పోయి= ఎదురు లేని విధంగా వెళ్ళి (తనను అడ్డుకొనేవాడు లేడన్నట్లుగా వెళ్ళి); సాత్యకి సమర+ఉల్లాసంబు కనుంగొనుచున్= సాత్యకియొక్క యుద్ధోత్సాహాన్ని చూస్తూ; అట కడచి= ఆ చోటు దాటి; ఆ+వడముడి= ఆ భీమసేనుడు; దివ్యరథంబు మెఱయన్= దేవతా రథం ప్రకాశించగా; కౌరవ్యయోధులతోడన్= కౌరవులలోని మొనగాండ్రతో; పెనంగు= యుద్ధం చేసే; సవ్యసాచిన్+చూచి= అర్జునుడిని చూచి; సింహనాదంబు చేసినన్= సింహగర్జనం చేయగా; అతనిన్+కనుంగొని= ఆ భీముడిని చూచి; ప్రియంబునన్= ప్రేమతో; ఆ+అర్జునుండును హరియును= ఆ అర్జునుడూ, కృష్ణుడూ; గర్జారవంబులన్= గర్జాధ్వనులతో; గగనంబు నినిచిరి= ఆకాశం నింపారు; ఆ+మహారవంబులు= ఆ పెను శబ్దాలను; ఆకర్ణించి= విని; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; భీము సంజ్ఞాపనంబునకున్= భీముని యొక్క సైగకు; సంతుష్ట+అంతరంగుండు+ఐ= సంతోషంతో కూడిన మనస్సుతో; తనలోనన= తన మనస్సులోనే; అతనిన్+అగ్గించి= ఆ భీముడిని పొగడి; ఆ నరనారాయణుల= ఆ అర్జునుడి కృష్ణుడి; ఎలుంగులు= కంఠధ్వనులు; వినన్= వినటానికి; కనుటకున్= చూడటానికీ; పొంగుచున్= సంతోషిస్తూ; ఆ+పార్థుండు= ఆ అర్జునుడు; తన ప్రతిజ్ఞ నెఱపి వచ్చి= తన శపథాన్ని సాగించి వచ్చి (మాట నిలుపుకొని వచ్చి); తన్నున్+కౌఁగిలించుకొనుటన్+కోరుచున్= తనను కౌగిలించుకొనుటకై ఆశపడుతూ; కౌరవపతి= దుర్యోధనుడు; ఈ+మెయిన్= ఈ ప్రకారంగా; తమ్ములు బంధులు= తన తమ్ములు, బంధువులును; తెగన్+పొలియుట= చనిపోవటం; తెలిసి= తెలిసినవాడై; అయినను= ఉన్నా; తీరునకున్+చొచ్చి= సంధికి వచ్చి; ఉన్న వారిన్+ఐనను= మిగిలి ఉన్నవారి నైనను; కాచికొనునొకో!= రక్షించుకొన కలుగునో! అని= అని అలా; ఊహించుచున్= తలచుకొంటూ; కయ్యంబు= యుద్ధాన్ని; చేయుచున్+ఉండెన్+అనినన్= చేస్తూ ఉండినాడనగా; విని= విన్నవాడై; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** భీముడు ఈ విధంగా ద్రోణుడిని మిక్కిలి బాధించి వెళ్ళుతుండగా మహావీరుడైన భీముడిని ఎదుర్కొనలేక భోజకాంభోజ యవనాది సేనలు పులిని చూచి పారిపోయే పశువుల మాదిరిగా భయపడి పరుగెత్తాయి. తనను అడ్డుకొనే నాథుడే లేకపోగా సాత్యకి యొక్క యుద్ధోత్సాహాన్ని చూస్తూ ఆ చోటు దాటి, తన దివ్య రథం మెరుస్తుండగా కౌరవులలోని మొనగాండ్రతో యుద్ధం చేస్తూ ఉన్న అర్జునుడిని చూచి సింహనాదం చేయగా భీముని చూచి ప్రీతితో కృష్ణార్జునులు తమ సింహనాదాలతో ఆకాశాన్ని నింపారు. ఆ పెను సవ్వడులు విన్న ధర్మరాజు భీముడు చేసిన సంజ్ఞకు సంతోషించి, మనస్సులో అతనిని పొగడి, కృష్ణార్జునుల గొంతులు వినటానికీ, చూడటానికీ పొంగిపోతూ, అర్జునుడు తన ప్రతిజ్ఞను నిలుపుకొని వచ్చి, తనను కౌగిలించుకోవాలనికోరుతూ, యుద్ధంలో తన సోదరులూ, బంధువులూ ఈ రీతిగా చచ్చిపోవటం చూచి అయినా, సంధికి వచ్చి, మిగిలి ఉన్నవారినైనా దుర్యోధనుడు రక్షించుకోగలడా?' అని అనుకొంటూ ఉన్నాడని విన్న ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అంటూ ఉన్నాడు.

**ఆ. ఇట్లు సింహనాద మిచ్చిన భీముని। మార్కొనంగ మగఁడు మన బలమునఁ**
**గలిగెనే మదాత్మజులఁ గాల్పఁ బుట్టిన। చిచ్చు వాఁడు; వానిఁ జెనయు టరిది. 157**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారం; సింహనాదము+ఇచ్చిన= సింహగర్జన చేసిన; భీముని= భీమసేనుడిని; మార్కొనఁగన్= ఎదుర్కొనగలిగిన; మగఁడు= మొనగాడు; మన బలమునన్= మన సేనలో; కలిగెనే?= ఉన్నాడా?; మత్+ఆత్మజులన్= నా కుమారులను; కాల్పన్+పుట్టిన= కాల్చటానికై పుట్టిన (అనగా చంపటానికై పుట్టిన); చిచ్చు వాఁడు= అగ్గి అయిన వాడు; వానిన్= భీమసేనుడిని (అటువంటి వాడిని); చెనయుట= ఎదుర్కొనటం; అరిది!= ఆశ్చర్యమే సుమా!

**తాత్పర్యం:** అ ట్లా సింహగర్జనం చేసిన భీముడిని ఎదుర్కొన గల మొనగాడు మన బలంలో ఉన్నాడా? అతడు నా కొడుకును కాల్చటానికే పుట్టిన అగ్గివంటి వాడు. అతడిని ఎదుర్కొనటం అసాధ్యం.'

**చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మనుజేంద్రు 'కప్డు కర్ణుఁ డ**
**య్యనిలతనూజు మార్కొని రయంబున వింశతి సాయకంబు లే**
**సిన, నతఁడేడు తొమ్మిదులు చెచ్చెర నేసి సిడం బొకంట నే**
**పునఁ గుదియించె నా రథికపుంగవు లట్లు దొడంగి యుద్ధతిన్. 158**

**ప్రతిపదార్థం:** అనవుడు= అనగా; ఆతఁడు= ఆ సంజయుడు; ఆ+మనుజ+ఇంద్రునకున్= ఆ రాజేంద్రుడితో; ఇట్టులు+అనున్= ఈ విధంగా అన్నాడు; అప్డు= ఆ సమయాన; కర్ణుఁడు= రాధేయుడు; ఆ+అనిలతనూజున్= ఆ భీమసేనుడిని; మార్కొని= ఎదుర్కొని; రయంబునన్= తొందరగా; వింశతి సాయకంబులు+ఏసినన్= ఇరువది బాణాలను వేయగా; అతఁడు= ఆ భీముడు; ఏడు తొమ్మిదులు= అరువది మూడు(బాణాలను); చెచ్చెరన్+ఏసి= వేగంగా వేసి; సిడంబు= కేతనమును; ఒకంటన్= ఒక బాణంతో; ఏపునన్= గర్వంతో; కుదియించెన్= కుదియచేశాడు (క్రుంగదీశాడు); ఆ+రథికపుంగవులు= ఆ రథిక శ్రేష్ఠులు; అట్లు= ఆ ప్రకారంగా; తొడంగి= పూనుకొని; ఉద్ధతిన్= దర్పంతో.

**తాత్పర్యం:** అనగా విని సంజయుడు ఇట్లా చెప్పాడు. 'ఆ సమయంలో కర్ణుడు భీముడిని ఎదుర్కొని వేగంగా ఇరవై బాణాలను అతడిపై వేయగా, ఆ భీముడు కూడా అరవైమూడు బాణాలను వేగంగా వేసి, ఒక బాణంతో కర్ణుడి రథకేతనాన్ని గర్వంతో విరుగగొట్టాడు. ఆ విధంగా ఆ రథిక శ్రేష్ఠులిద్దరూ తలపడి, దర్పంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. పెనంగు నెడ భీమసేనుండు. 159**

**తాత్పర్యం:** పెనగులాడేటప్పుడు భీమసేనుడు.

**క. సూతసుతు విల్లు ద్రుంచిన । నాతఁడు బలు వింట నొంచె నతని వెస మరు**
**త్సూతి యదియుఁ ద్రుంచుచు ద । త్సూతునిఁ దురగములఁ ద్రుంచె దుర్దమలీలన్. 160**

**ప్రతిపదార్థం:** సూతసుతు విల్లు త్రుంచినన్= కర్ణుడి వింటిని త్రుంచివేయగా; ఆతఁడు= ఆ కర్ణుడు; బలువింటన్= పెద్దవిల్లుతో; అతనిన్= ఆ భీమసేనుడిని; నొంచెన్= బాధించాడు; వెసన్= వేగంగా; మరుత్సూతి= వాయుపుత్రుడయిన భీముడు; అదియున్= ఆ బాణాగ్ని; త్రుంచుచున్= ముక్కలు చేస్తూ; తత్సూతునిన్= అతడి సారథిని; తురగములన్= గుర్రాలను; దుర్దమలీలన్= అణచవీలుకాని విలాసంతో; త్రుంచెన్= చంపాడు.

**తాత్పర్యం:** కర్ణుడి విల్లును త్రుంచాడు. అంత కర్ణుడు వేరొక విల్లుతో భీముడిని బాధించాడు. దానిని కూడా త్రుంచివేస్తూ అణచటానికి వీలుకాని విలాసంతో భీముడు ఆ కర్ణుడి సారథినీ, గుర్రాలనూ చంపి వేశాడు.

**ఆ. విరథుఁడై యతండు వృషసేను రథ మెక్కఁ । బాఱుటయును, గలఁగఁ బాఱె సేన;**
**లట్టియెడ నృపాలుఁ డాచార్యు పాలికిఁ । జనియె తేరు దోలికొని రయమున. 161**

**ప్రతిపదార్థం:** విరథుఁడు+ఐ= తేరులేనివాడై; అతండు= ఆ కర్ణుడు; వృషసేను రథము+ఎక్కన్= వృషసేనుడి తేరు మీదికి ఎక్కగా; పాఱుటయును= పరుగెత్తగా; సేన= (మన) సేన; కలఁగన్+పాఱెన్= చిందరవందరగా పరుగెత్తింది; అట్టి ఎడన్= ఆ సమయంలో; నృపాలుఁడు= దుర్యోధనుడు; రయమునన్= వేగంగా; ఆచార్యపాలికిన్= ద్రోణాచార్యుడి దగ్గరకు; తేరు తోలికొని= రథం తోలుకొంటూ; చనియెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** (కర్ణుడు) అతడు తేరులేనివాడై పరుగెత్తి వృషసేనుడి తేరుమీద ఎక్కాడు. దానిని చూచిన సేన కలత చెందింది. అప్పుడు దుర్యోధనుడు గురువయిన ద్రోణుడి వద్దకు తన తేరు తోలుకొని వెళ్ళాడు.

### దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట (సం.7-105-1)

**వ. చని యడచిపాటు గదుర నతనితో ని ట్లనియె. 162**

**తాత్పర్యం:** (ఆ విధంగా) వెళ్ళి, తొందరపాటుతో ద్రోణాచార్యుడితో ఇట్లా అన్నాడు:

**క. 'నరుఁడును సాత్యకియు వృకో । దరుఁడును మనసేనఁ గలఁచెదరు; సైంధవుఁ జే**
**రిరి; నీకుఁ దగునె నరునిం । జొరనిచ్చితయేని వారిఁ జొరనీ ననఘా! 163**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా! నరుఁడును= అర్జునుడును; సాత్యకియున్= సాత్యకియును; వృకోదరుఁడును= భీముడును; మనసేనన్+కలఁచెదరు= మన సేనను చీకాకు పరుస్తారు; (వారు); సైంధవున్+చేరిరి= సైంధవుడికి దగ్గరయ్యారు; నరునిన్+చొరనిచ్చితయేని= అర్జునుడిని ప్రవేశింపనిచ్చినప్పటికీ; వారిన్+చొరనీన్= సాత్యకి, భీములను చొరనివ్వటానికి; నీకున్+తగునె?= నీకు న్యాయమా?

**తాత్పర్యం:** అర్జునుడు, సాత్యకి, భీముడు మన సేనలను చీకాకు పరచి సైంధవుడి దగ్గరకు చేరారు. అర్జునుడిని చొరనిచ్చినా, సాత్యకినీ, భీముడినీ చొరనీయటం నీకు తగునా?

**క. సమరంబున నీ వోడుట । సముద్ర మింకుట; జయించె సాత్యకి గురుఁ గ**
**య్యమున నని యెసఁగు జనవా । దము మేలుగఁ దలఁచి తొక్కొ! ధనురాచార్యా! 164**

**ప్రతిపదార్థం:** ధనురాచార్యా!= ధనుర్విద్యా గురువా!; సమరంబునన్= యుద్ధంలో; నీవు+ఓడుట= నీవు ఓడిపోవటం; సముద్రము+ఇంకుట= సముద్రం ఇంకిపోవటం వంటిది (అనగా సముద్రంలో నీరు ఇంకిపోవటం ఎంత వింతయో యుద్ధంలో ధనురాచార్యుడయిన ద్రోణుడు ఓడిపోవటం అట్టిదే); సాత్యకి= ఆశైనేయుడు; గురున్= గురువయిన మిమ్ము; కయ్యమునన్= యుద్ధంలో; జయించెన్= జయించాడు; అని ఎసఁగు= అని వ్యాపించే; జననాదము+అ= నలుగురిమాటయే; మేలుగన్= శ్రేష్ఠంగా; తలఁచితి+ఒక్కొ?= తలచుకొన్నావా?

**తాత్పర్యం:** ధనురాచార్యా! యుద్ధంలో నీవు ఓడిపోవటం సముద్రం ఇంకిపోవటం వంటిది. ఇక సాత్యకి ధనురాచార్యుడవయిన నిన్ను గెలిచా డని లోకులు అనుకొనటమే మేలుగా తలచుకొన్నావా?

**విశేషం:** అలం: నిదర్శన.

**క.** **ఈ భంగి నీ వడంగుట । మా భాగ్యము గాక యింక మాటలు వల దీ**
**క్షోభం బెట్టు లుడుగుఁ జెపు । మా! భవదీయ బలశౌర్యమతులకుఁ దగఁగాన్.'** **165**

**ప్రతిపదార్థం:** ఈ భంగిన్= ఈ విధంగా; నీవు+అడంగుట= నీ వణగిపోవటం; మా భాగ్యముకాక= మా అదృష్టం కాక; ఇంకన్ మాటలు వలదు= ఇంక మాట్లాడ నక్కరలేదు; ఈ క్షోభంబు+ఎట్టులు+ఉడుగున్= ఈ ఆరాట మెట్లా పోతుందో; భవదీయబల శౌర్యమతులకున్= నీ బలానికి, పరాక్రమానికీ, బుద్ధికి తగఁగాన్= తగినట్లుగా; చెపుమా!= చెప్పవలయును సుమా!

**తాత్పర్యం:** ఈ మాదిరిగా నీ వణగిపోవటం మా అదృష్టం (మా దౌర్భాగ్యం) కాక వేరేముంది? ఊరకే మాటలెందుకు? మా ఈ క్షోభ తీరే విధ మేమిటి? నీ బలానికీ, బుద్ధికీ, శక్తికీ తగిన విధంగా చెప్పవలసింది.'

**చ.** **అనవుడు నాతఁ డిట్టు లను 'నక్కడ నిక్కడ నొక్క రూపునన్**
**మన మొనకైన యీ యెడరు మాన్పఁగ నోపిన యంత మాన్చెద;**
**న్వినుము! విశిష్ట కార్య మవనీవర! సైంధవుఁ గాచికోల య**
**ర్జునునకు నీకునుం గలిగె జూదము నేఁ డధికంపుటొడ్డుగన్.** **166**

**ప్రతిపదార్థం:** అవనీవర!= రాజశ్రేష్ఠా!; అనవుడున్= ఆ విధంగా చెప్పగా; ఆతఁడు+ఇట్టులు+అనున్= ఆ ద్రోణు డీవిధంగా అన్నాడు; అక్కడన్+ఇక్కడన్= ఆ చోట ఈచోట (దుర్యోధనుడి తమ్ములు మొదలయిన వారున్నచోట, తానున్న ఈ చోట); ఒక్కరూపునన్= ఒకే విధంగా; మనమొనకైన ఈ ఎడరు= మన సేనకు కలిగిన ఈ భంగపాటు; మాన్పఁగన్= పోగొట్టటానికి; ఓపినఅంత మాన్చెదన్= చేతనైనంతగా పోగొట్టుతాను; వినుము= (నా ప్రతిజ్ఞ) వినుము; విశిష్టకార్యము= విశేషమైన పని; సైంధవున్+కాచికోల= సైంధవుడిని కాపాడుకొనటమే; నేఁడు= ఈ దినం; అర్జుననకున్= అర్జునుడికీ; నీకునున్= నీకునూ; అధికంపుటొడ్డుగన్= విశేషమైన పందెంతో; జూదము= పాచికల ఆట; కలిగెన్= ఏర్పడింది.

**తాత్పర్యం:** దుర్యోధను డావిధంగా వ్యంగ్యంగా దెప్పగా విని, అందుకు బదులుగా ద్రోణుడు ఇట్లా అన్నాడు: 'ఓ దుర్యోధనా! యుద్ధరంగంలో అక్కడా, ఇక్కడా (అనగా నీ తమ్ములకూ, నాకూ) మన సేన పొందిన భంగపాటును పోగొట్టటానికి నా శక్తితో ప్రయత్నిస్తాను. ఇప్పటి మన ప్రత్యేక కర్తవ్యం - సైంధవుడిని కాపాడుకొనటమే. ఈ దినం జరిగే యుద్ధం నీకూ అర్జునుడికీ జరిగే పాచికలాటవంటిది. దాని పందెం చాలా భారీగా ఉంటుంది.

**క.** **మును శకుని బుద్ధిమై గెలి । చిన యది యస్థిరపు గెలుపు; సెడకీ జూదం**
**బున వెడలఁ బాటు సూవే । మన వెరవును లావు కలిమి మనుజాధీశా!** **167**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= ఓ రాజా! (దుర్యోధనా!); మును= ఇదివరలో; శకుని బుద్ధిమైన్= శకుని తెలివితో; గెలిచిన అది= జయించటం (సభాపర్వంలో గెలిచింది); అస్థిరపు గెలుపు= (నిలవని గెలుపు) నిలుకడ లేని జయం; చెడక= నశించిపోక; ఈ జూదంబునన్= ఈ నాటి జూదంలో; వెడలన్+పాటు= బైట పడటం (అనగా జయించటం); మన వెరవును= మన ఉపాయమూ; లావును= బలమూ; సూవే!= సుమా!

**తాత్పర్యం:** ఓ రాజా! ఇదివరలో శకుని తెలివితేటలతో పొందిన గెలుపు శాశ్వతమైన గెలుపు కాదు. ఈ దినం స్థిరంగా మనం ఈనాటి జూదంలో గట్టెక్కటమే మన ఉపాయమూ, బలమూ సుమా!

**వ. కావున నీవు సమరోత్సాహుండ వై సాహాయ్యంబునకు నద్దెస నున్న కర్ణాదులం గొని కవ్వడి మొదలగు నమ్మువ్వురకుం జాలి సింధురాజ రక్షణంబు నిర్వహింపు; మేను సేనాముఖంబున నిలిచి తక్కినయందఱి నిలువరించుట మేలు; నీతో వచ్చుట కర్జంబు గాదు పొ' మ్మనుటయు నతండు మరలి తన్నుందాన పురికొలిపికొనుచు నట సనియె; నప్పుడు యుధామన్యుండు నుత్తమౌజుండును మున్ను కృతవర్మచేత నివారితులై నరునితోడ నఱుమం జనక కెలని కుఱికి మనమొనఁ దెరల్చికొని బయలికి వెడలి కపిధ్వజ గాండీవ గుణరావంబుల కతన నతని యున్న యెడ యుపలక్షించి తిరిగి వచ్చి బలుపున మన బలంబు వాయఁ బాపికొని చొచ్చి వివ్వచ్చుం జేరవచ్చుచున్నం గని యక్కురువిభుండు వారల వారింపం గడంగిన. 168**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; నీవు సమర+ఉత్సాహుండవు+ఐ= నీవు యుద్ధంలో ఆశ కలవాడవై; సాహాయ్యంబునకున్= నీకు సాయానికై; ఆ+దెసన్+ఉన్న= ఆ వైపు ఉన్న; కర్ణాదులన్+కొని= కర్ణుడు మొదలైనవారిని పిలుచుకొని; ఆ+మువ్వురకున్+చాలి= ఆ మూగురికి తగినట్లుగా (అనగా భీమార్జున సాత్యకులకు తగినట్లుగా); సింధురాజ రక్షణంబు= సైంధవుడిని కాపాడటం; నిర్వహింపుము= నెరవేర్చుము; ఏను సేనాముఖంబునన్+నిలిచి= నేను సేన మొగలో ఉండి; తక్కిన అందఱి నిలువరించుట మేలు= మిగిలిన వారినంతా ఆపటం మేలు; నీతోన్ వచ్చుట= నీతో కలిసి రావటం; పనికాదు= కార్యంకాదు; పొమ్ము= నీవు వెళ్ళుము; అనుటయున్= అనగా; అతండు= ఆ దుర్యోధనుడు; మరలి= తిరిగి; తన్నున్+తాన= తనను తాను; పురికొలిపికొనుచున్= ప్రేరేపించుకొంటూ; అట చనియెన్= ఆ దిక్కుగా వెళ్ళాడు; అప్పుడు= ఆ సమయంలో; యుధామన్యుండును, ఉత్తమౌజుండును; మున్ను= ఇదివరకు; కృతవర్మచేత నివారితులై= కృతవర్మచేత అడ్డుకొనబడినవారై; నరునితోడన్+అఱుమన్ చనక= అర్జునుడితో కలిసిఆక్రమించుకోవటానికి పోకుండా; కెలనికిన్= ప్రక్కకు; ఉఱికి= దూకి; మన మొనన్+తెరల్చికొని= మనసేనను దాటుకొని; బయలికిన్ వెడలి= బయటకు వెళ్ళి; కపిధ్వజ= కపికేతనము వలననూ; గాండీవగుణ రావంబుల కతనన్= గాండివపు నారి ధ్వనివలననూ; అతని ఉన్న ఎడ= ఆతడుండే చోటును; ఉపలక్షించి= చూచి; తిరిగి వచ్చి= మరలివచ్చి; బలువునన్= శక్తితో; మనబలంబు= మనసేన; పాయన్= పాయునట్లు; పాపికొనిచొచ్చి= తొలగించుకొని ప్రవేశించి; వివ్వచ్చున్+చేరవచ్చుచున్నన్= అర్జునుడిని చేరబోవటాన్ని; కని= చూచి; ఆ+కురువిభుండు= ఆ కౌరవరాజు దుర్యోధనుడు; వారలన్= ఆ ముగ్గురు సైనికవరులను; వారింపన్+కడంగినన్= అడ్డుకోవటానికి పూనుకొనగా.

**తాత్పర్యం:** నీవు యుద్ధోత్సాహంతో, సహాయంగా కర్ణాదులను తీసికొని సైంధవుడికి కాపుగా నిలిచి, అర్జునుడు మొదలయిన ఆ ముగ్గురినీ ఎదుర్కొనుము, నేను సేన మొగాన నిలిచి తక్కిన వారి నందరినీ ఆపుతాను (నిలువరిస్తాను.) అది సరి అయిన పని. నేను నీతో రావటం తగిన పనికాదు'. అని పొమ్మనగానే, దుర్యోధనుడు తనను తానే పురికొల్పుకొంటూ అక్కడికి వెళ్ళాడు. ఆ సమయాన యుధామన్యుడూ, ఉత్తమౌజుడూ అదివరకు కృతవర్మచేత అడ్డుకొనబడి అర్జునుడితో కలిసి ముందుకు దూకలేక, ప్రక్కకు తప్పుకొని, మన సేనను దాటుకొని బయటకు వెళ్ళారు. అపుడు వినవచ్చిన గాండీవరావం కపికేతనం గలగల మూలాన అర్జునుడి ఉనికి తెలిసికొని, తిరిగి వచ్చి బలంతో మన సైన్యాన్ని పాయతరిమి, అర్జునుడిని చేరపోయారు. అపుడు దుర్యోధనుడు వారిని చూచి, అడ్డుకొన ప్రయత్నించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

క. **ఆ యిరువురతో నజ్జన । నాయకునకు నయ్యె దారుణం బగు రణ మం**
**దాయత నృపచాపము రో । షాయత్తత నుత్తమౌజుఁ డార్చుచుఁ దునిమెన్.** 169

**ప్రతిపదార్థం:** ఆ ఇరువురతోన్= ఆ యుధామన్యు ఉత్తమౌజులతో; ఆ+జననాయకునకున్= ఆ రాజునకు (దుర్యోధనుడికి); దారుణంబు+అగు= భయంకరమైన; రణము+అయ్యెన్= యుద్ధమైనది; అందున్= ఆ యుద్ధంలో; ఆయత నృపచాపము= పొడవైన రాజు వింటిని; రోష+ఆయత్తతన్= రోషానికి వశుడౌటచే; ఉత్తమౌజుఁడు= ఉత్తమౌజుడు; ఆర్చుచున్= అరుస్తూ; తునిమెన్= త్రుంచివేశాడు.

**తాత్పర్యం:** రాజైన దుర్యోధనుడికి యుధామన్యు ఉత్తమౌజులతో దారుణమైన యుద్ధం జరిగింది. పెద్దదయిన ఆ రాజు వింటిని ఆ యుద్ధంలో యుధామన్యుడు సింహనాదం చేస్తూ త్రుంచివేశాడు.

తే. **తునిమి తోడన యురము మాడ సునిశితాస్త్ర । చయము నిగుడింప రా జొండు చాప మెత్తి**
**యతని హయముల సారథి నవనిఁ గూల్చె; । నాతఁ డరిగె యుధామన్యు నరదమునకు.** 170

**ప్రతిపదార్థం:** తునిమి= త్రుంచి (ఉత్తమౌజుడు సింహనాదం చేస్తూ దుర్యోధనుడి వింటిని త్రుంచగా); తోడన= వెంటనే; ఉరమాడన్= గుండెలో తాకేటట్లుగా; సునిశిత+అస్త్రచయము నిగుడింపన్= వాడి అయిన బాణాలు వేయగా; రాజు= దుర్యోధనుడు; ఒండు చాపము+ఎత్తి= వేరొక విల్లును తీసికొని; అతని హయములన్= ఆ ఉత్తమౌజుడి గుఱ్ఱాలను; సారథిన్= సూతుడిని; అవనిన్+కూల్చెన్= భూమిమీద పడవేశాడు (అనగా చంపాడు); ఆతఁడు= ఉత్తమౌజుడు; యుధామన్యు నరదమునకున్= యుధామన్యుడి తేరు మీదకు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ఉత్తమౌజుడు దుర్యోధనుడి విల్లు త్రుంచి, వాడిబాణాలతో అతడి గుండెలో కొట్టాడు. అంత దుర్యోధనుడు ఇంకొక విల్లు నందుకొని వాడి గుఱ్ఱాలనూ, సారథినీ చంపాడు. అపుడు అతడు యుధామన్యుడి తేరుమీదికి వెళ్ళాడు.

క. **అరిగి తురగముల సూతుం । బొరిగొన విరథుఁడయి నృపతి పొలివోవక యు**
**ద్ధుర గతిఁగద గొని చని త । త్తురగంబుల సారథిని జిదుర్పలు సేసెన్.** 171

**ప్రతిపదార్థం:** అరిగి= (యుధామన్యుడి తేరు మీదకు) వెళ్ళి; తురగములన్ సూతున్ పొరిగొనన్= గుఱ్ఱాలను, సారథిని చంపగా; నృపతి పొలివోవక= రాజు చచ్చుపడకుండా; ఉద్ధురగతిన్= నిలుకడగా; గదకొని= గదతీసికొని; చని= వెళ్ళి; తత్తురగంబులన్= అతడి గుఱ్ఱాలను; సారథిని= సూతునీ; చిదుర్పలు= ముక్కలుగా; చేసెన్.

**తాత్పర్యం:** ఉత్తమౌజుడు (యుధామన్యుడి తేరుమీదకు వెళ్ళి) దుర్యోధనుడి తేరి గుఱ్ఱాలనూ సారథినీ చంపగా, అతడు చచ్చుపడకుండా విజృంభించి గదతో అతడి గుఱ్ఱాలనూ సారథినీ ముక్కలుముక్కలుగా చేశాడు.

తే. **రథము డిగ్గి తొలంగి రా రథికు ల మ్మ । హీశుఁడేతెంచి యెక్కె మద్రేశు తేరు;**
**వారు నీ యోధు లిరువుర బారిసమరి । యా రథము లెక్కి యర్జునుఁ జేరఁ జనిరి.'** 172

**ప్రతిపదార్థం:** రథము డిగ్గి తొలంగిరి+ఆరథికులు= ఆ సేనానులు ఉత్తమౌజుడూ, యుధామన్యుడూ తేరు నుండి దిగి తొలగిపోయారు; ఆ+మహీశుఁడు= ఆ రాజయిన దుర్యోధనుడు; మద్రేశు తేరున్= మద్రభూపతియొక్క తేరుమీదకు; ఎక్కెన్= ఎక్కాడు; వారు= యుధామన్యు ఉత్తమౌజులు; నీ యోధులు+ఇరువురన్= నీ సైనికులయిన యిద్దరిని; బారిసమరి= హింసించి; ఆ రథములు+ఎక్కి= వారి తేరులెక్కి; అర్జునున్+చేరన్+చనిరి= అర్జునుడి వద్దకు వెళ్ళారు.

**తాత్పర్యం:** యుధామన్యూత్తమౌజులు తేరునుండి దిగితొలగిపోయారు. దుర్యోధనుడు శల్యుడి తేరు ఎక్కాడు. దుర్యోధనుడినీ, శల్యుడినీ చావబాది, వారిద్దరూ ఆ తేరెక్కి అర్జునుడి వద్దకు చేరుకొన్నారు.'

**వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లను 'మనవా రెల్లం గర్ణుండు గౌంతేయుం గెలుచు నని యాస పడుదు రా ధర్మతనయుం డాతని యాటోపంబు దలంచి రేలెల్లను గన్ను మూయండు. 173**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని చెప్పగా; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్+ఇట్లు+అనున్= సంజయుడితో ఈ విధంగా అన్నాడు; మనవారు+ఎల్లన్= మనవారంతా; కర్ణుండు= కర్ణుడు; కౌంతేయున్= కుంతికుమారుడయిన అర్జునుడిని; గెలుచున్+అని= జయిస్తాడని; ఆసపడుదురు= ఆశతో ఉంటారు; ఆ ధర్మతనయుండు= ఆ ధర్మరాజు; ఆతని ఆటోపంబు తలంచి= ఆ కర్ణుడి ఉరవడిని తలచుకొని; రేలు+ఎల్లను= రాత్రులంతా; కన్నుమూయండు= నిద్రపోడు.

**తాత్పర్యం:** (యుధామన్యూత్తమౌజులు దుర్యోధన శల్యులను అతిక్రమించి అర్జునుడిని చేరబోయారని) అనగా, ధృతరాష్ట్రుడు సంజయుడితో 'మనవారంతా కర్ణుడు అర్జునుడిని గెలుస్తా డని ఆశతో ఉంటారు. వాడి బలాన్ని తలచుకొని ధర్మరాజు రాత్రులలో నిద్రపోకుండా ఉన్నాడు.

**ఆ. అట్టి జెట్టి యనిలుపట్టి చే విరథుఁడై । పోయి పోయినట్లు పోయెఁ గాని;**
**మరలి కయ్యమునకుఁ జొరఁ డెట్టు? లాతని । తెఱఁగు సెప్పు నాకుఁ దేటపడఁగ. 174**

**ప్రతిపదార్థం:** అట్టి జెట్టి= అటువంటి వీరుడు; అనిలుపట్టిచేన్= భీముడి చేత; విరథుఁడు+ఐ= రథాన్ని పోగొట్టుకొని; పోయి పోయినట్లు పోయెన్+కాని= తిరిగి చూడకుండా పోయినట్లుగా పోయాడు కానీ; మరలి కయ్యమునకున్= మళ్ళీ యుద్ధానికి; చొరఁడు+ఎట్టులు?= రాడేమి?; ఆతని తెఱఁగు= ఆ కర్ణుడి పద్ధతి; నాకు తేటపడఁగన్= నాకు అర్థమయ్యేటట్లు; చెప్పు= చెప్పుము.

**తాత్పర్యం:** అటువంటి మొనగా డయిన వీరుడు కర్ణుడు, భీముని వలన తేరులేనివాడై పోయినవాడట్లేపోయాడు. మళ్ళీ యుద్ధానికి రాలేదు. ఆ విధ మెట్లా అయిందో నాకు స్పష్టంగా చెప్పవలసింది.

**చ. 'అనవుడు నాతఁ డిట్టు లను నన్నరనాథున "కట్లు సూతనం**
**దనుఁ బొరివుచ్చి భీముఁడు మదంబున నర్జును దిక్కు వోవఁ గాఁ**
**గని యతఁ డాయితం బయి తగం దనపే రెలుఁగెత్తి పిల్చె; నా**
**ధ్వని విని యావృకోదరుఁ డుదగ్రగతిన్ మరలెన్ మహీశ్వరా! 175**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆతడు= ఆ సంజయుడు; ఆ+నరనాథునకున్= ఆ రాజయిన ధృతరాష్ట్రుడితో; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; మహీశ్వరా!= ఓ రాజా!; అట్లు= ఆ ప్రకారంగా; సూతనందనున్= కర్ణుడిని; పొరివుచ్చి= యుద్ధంలో తరిమి; భీముఁడు= భీమసేనుడు; మదంబునన్= గర్వంతో; అర్జును దిక్కు+పోవఁగాన్= అర్జును డుండే చోటికి పోగా; కని= చూచి; అతఁడు= ఆ కర్ణుడు; ఆయితంబు+అయి= సిద్ధమయి; తగన్= తగినట్లుగా; తనపేరు= తన పేరును (ఓ భీమా! అని); ఎలుఁగెత్తి= గొంతెత్తి; పిల్చెన్= పిలిచాడు; ఆ ధ్వని విని= ఆ పిలుపు విని; వృకోదరుఁడు= భీముడు; ఉదగ్ర గతిన్= భయంకరంగా; మరలెన్= తిరిగాడు (కర్ణుడు తనను పేరు పెట్టి పిలిచేటప్పటికి భీముడు కోపాటోపంతో తిరిగాడు).

**తాత్పర్యం:** భీమసేనుడు కర్ణుడిని పారిపుచ్చి, అర్జునుడి వద్దకు పోగా చూచికర్ణుడు మరలా సన్నద్ధుడై భీముడిని పేరుపెట్టి పిలిచాడు. ఆ పిలుపునకు తీవ్రమయిన కోపంతో భీముడు తిరిగాడు.

**వ. అట్లు దార్కొని అర్కప్రతాపు లగు నయ్యిరువురు నొండొరువుల శరంబులు దూలించుచు దురంగంబుల యంగంబులం దూపులం గీలించుచు సారథుల బెట్టు పఱచుచుం జాపంబులు విఱుచుచు మైమఱువు లఱువుళ్ళు సేయుచు మేనులు నెత్తుట జొత్తిల్లం జేయుచు నొండొరులకు వేఁడిమి సూపి యేపునం బెనంగు నెడ నయ్యనిలతనయుండు. 176**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; తార్కొని= చేరువయి; అర్క ప్రతాపులు+అగు= సూర్యుడితో సమానమయిన శౌర్యం కలవారయిన; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరూ (కర్ణ భీములు); ఒండొరువుల శరంబులు తూలించుచున్= ఒకరొకరి బాణాలను తొలగిస్తూ; తురంగంబుల= గుర్రాల; అంగంబులన్= శరీర భాగాలను; తూపులన్= బాణాలతో; కీలించుచున్= నాటుతూ; సారథులన్= సూతులను; బెట్టు పఱచుచున్= మిక్కిలి చీకాకు పరుస్తూ; చాపంబులు విఱుచుచున్= విండ్లను విరుస్తూ; మైమఱువులు= కవచాలను; అఱువుళ్ళు చేయుచున్= శిథిలపరుస్తూ; మేనులు= ఒళ్ళు; నెత్తుటన్ జొత్తిల్లన్ చేయుచున్= నెత్తురులో మునుగజేస్తూ; ఒండొరులకున్= ఒకరొకరికి; వేఁడిమి= దర్పమును; చూపి= చూపుతూ; ఏపునన్= గొప్పగా; పెనంగు ఎడన్= పోట్లాడేటప్పుడు; ఆ+అనిల తనయుండు= ఆ వాయుదేవుడి వరాన బుట్టిన భీముడు.

**తాత్పర్యం:** ఆ విధంగా దగ్గరయి, సూర్యతేజంతో వా రిద్దరు ఒకరిపై నొకరు బాణాలు గుప్పిస్తూ గుర్రాల శరీరాంగాలను బాణాలతో గ్రుచ్చుతూ, సారథులను చీకాకుపరుస్తూ, విండ్లను విరుస్తూ, కవచాలను చూర్ణం చేస్తూ, శరీరాలను నెత్తురులో మునుగచేస్తూ ఒకరు మరియొకరిమీద గొప్పతనాన్ని చూపి యుద్ధం చేసేటప్పుడు ఆ భీమసేనుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. విలు దురుము సేసి గుఱ్ఱం । బుల సూతునిఁ బిలుకుమార్చి భుజగనిభ శరం**
**బులఁ జేడ్పఱిచిన సిగ్గఱి । కలఁగి పఱచి యొండు రథముఁ గర్ణుం డెక్కెన్.' 177**

**ప్రతిపదార్థం:** (భీమసేనుడు) విలుతురుము చేసి= వింటిని ముక్కలుగా చేసి; గుఱ్ఱంబులన్, సూతునిన్= గుర్రాలను, సారథినీ; పిలుకుమార్చి= చంపివేసి; భుజగనిభ శరంబులన్= పాములవంటి బాణాలతో; చేడ్పఱిచినన్= బాధించగా; సిగ్గఱి= సిగ్గువదలి; కలఁగి పఱచి= చీకాకుతో తొలఁగిపోయి; కర్ణుఁడు= కర్ణుడు; ఒండు రథమున్= ఇంకొక తేరుమీదికి; ఎక్కెన్= ఎక్కాడు.

**తాత్పర్యం:** భీమసేనుడు కర్ణుడి విల్లు త్రుంచాడు. గుర్రాలను సారథినీ చంపాడు. పాములవంటి తీవ్రమైన బాణాలతో బాధించాడు. అందుకు సిగ్గువదలి, చీకాకుపడి, ప్రక్కకు పోయి ఇంకొక తేరుమీదికి కర్ణుడు ఎక్కాడు.'

**క. అనిన విని ధృతరాష్ట్రుం డి । ట్లను 'నమ్మినబంటు పిఱికియై యిటు పఱవం**
**గని మందబుద్ధి దుర్యో । ధనుఁ డేమని తలఁచెనొక్కొ! తన చిత్తమునన్. 178**

**ప్రతిపదార్థం:** అనినన్= సంజయు డీ విధంగా చెప్పగా; విని= విని; ధృతరాష్ట్రుఁడు+ఇట్లు+అనున్= ధృతరాష్ట్రు డీ విధంగా అన్నాడు; నమ్మినబంటు= తాను మిక్కిలిగా నమ్మిన సైనికుడు (సేవకుడు); పిఱికి ఐ= పిరికివాడుగా; ఇటు పఱవన్= ఈ విధంగా ఓడి పరుగెత్తగా; కని= చూచి; మందబుద్ధి= బుద్ధిలేని; దుర్యోధనుఁడు= దుర్యోధనుడు; తన చిత్తమునన్= తన మనస్సులో; ఏ మని తలఁచెనొక్కొ!= ఏ మని తలచుకొన్నాడో?;

**తాత్పర్యం:** సంజయుడు కర్ణుడి అవస్థను చెప్పగా ధృతరాష్ట్రుడు 'తన నమ్మిన బంటు ఈ విధంగా పిరికివాడుగా పరుగెత్తటం చూచి బుద్ధిహీనుడయిన దుర్యోధను డేమనుకొన్నాడో?

**విశేషం:** ఈ పద్యంలో పుత్రపక్షపాతి అయిన ధృతరాష్ట్రుడు దుర్యోధనుడిని బుద్ధిహీనుడిగా పేర్కొనటం వింత.

**వ. అది యట్లుండె; నా కర్ణుని బింకంబు పిదప నెట్లయ్యె?' ననవుడు సంజయుం డతని కిట్లనియె. 179**

**తాత్పర్యం:** అది అట్లా ఉండనీ, ఆ కర్ణుని డాంబికం ఆ తర్వాత ఏమయినది?' అనగా సంజయు డాతడితో ఈ విధంగా అన్నాడు:

**తే. ఆననంబునఁ గ్రోధమహానలంబు । భీషణముగ రాధేయుండు భీము దెసకు**
**మరలి యురవడిఁ గవియ నయ్యిరువురకు మ । హాద్భుతం బగు సంగ్రామ మయ్యె నధిప! 180**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; ఆననంబునన్= ముఖంలో; క్రోధమహా+అనలంబు= కోప మనే పెనుమంట; భీషణముగన్= భయంకరంగా; రాధేయుండు= కర్ణుడు; భీము దెసకున్= భీముడి దిక్కుగా; మరలి= తిరిగి; ఉరవడిన్= వేగంగా; కవియన్= క్రమ్ముకోగా; ఆ+ఇరువురకునున్= ఆ ఇద్దరికినీ; మహాద్భుతంబు+అగు= మిక్కిలి అచ్చెరు వయిన; సంగ్రామము+అయ్యెన్= యుద్ధమైనది.

**తాత్పర్యం:** పెనుమంటవలె కోపం ముఖంలో భయంకరంగా కానరాగా కర్ణుడు భీముడి దిక్కుగా తిరిగి వేగంగా క్రమ్ముకొనగా - ఆ ఇద్దరికీ ఆశ్చర్యకర మయిన పెద్ద యుద్ధం జరిగింది.

**క. బలు డేగల కైవడి బె । బ్బులుల పగిది మత్తకరుల పోలిక దర్పో**
**జ్జ్వల సింహంబుల చాడ్పున । నలవుఁ జలము మెఱయఁ బెనఁగి రా రథికవరుల్. 181**

**ప్రతిపదార్థం:** బలు డేగల కైవడిన్= బలమైన డేగల మాదిరిగా; బెబ్బులుల పగిదిన్= పెద్దపులుల మాదిరిగను; మత్తకరుల పోలికన్= మదపుటేనుగుల మాదిరిగను; దర్పోజ్జ్వల= గర్వం ఎక్కువయిన; సింహంబుల చాడ్పునన్= సింహముల మాదిరిగను; అలవు= బలము; చలము= పట్టుదల; మెఱయన్= వెలుగగా; ఆ రథికవరుల్= ఆ రథిక శ్రేష్ఠులు; పెనఁగిరి= పోట్లాడారు.

**తాత్పర్యం:** ఆ వీరులిద్దరును బలమైన డేగలు, పెద్దపులులు, మదపుటేనుగులు, గర్వంతో ప్రకాశించే సింహాలూ, పోట్లాడినట్లుగా ఉపాయమూ మత్సరమూ అతిశయించగా పోట్లాడారు.

**విశేషం:** అలం: మాలోపమ.

**క. పెనఁగునెడం గర్ణుని ది । క్కునఁ జతురంగములు బెట్టు గోల్తల నా భీ**
**మునిమీఁదఁ గవిసి మంత్రిం । చిన యట్టులు గూలె నతని చేతి బలువునన్. 182**

**ప్రతిపదార్థం:** పెనఁగునెడన్= యుద్ధం చేసేటప్పుడు; కర్ణుని దిక్కునన్= కర్ణుడి వైపున ఉన్న; చతురంగములు= నాల్గు విధా లయిన బలాలు (రథ, గజ, తురగ, పదాతులు); బెట్టు= పెద్దగా, కోల్తలన్= యుద్ధసన్నాహంతో; ఆ భీమునిమీఁదన్= ఆ భీముడిపైకి; కవిసి= దూకి; మంత్రించిన అట్టులు= మంత్రించిన విధంగా (మంత్రముగ్ధ లయినట్లు); అతనిచేతి బలువునన్= ఆ భీముడిచేతి బలంతో; కూలెన్= పడిపోయాయి.

**తాత్పర్యం:** యుద్ధం చేసేటప్పుడు కర్ణుడి వైపున ఉండే చతురంగ బలాలు ఆ భీముడిమీద విజృంభించి, మంత్రించిన విధంగా అతడి చేతిబలానికి కూలిపోయాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**వ. అనవుడు నాంబికేయుండు. 183**

**తాత్పర్యం:** అనగా ధృతరాష్ట్రుడు.

**క. 'తొడరెడు కొలఁదియె వానికి? । వడముడి భుజవిక్రమంబు వారల మన మె**
**ప్పుడు వినమొ? కర్ణు వినమో? । యడిబీరపుఁ దులువ గెలుచు నటె పాండవులన్? 184**

**ప్రతిపదార్థం:** వానికిన్= ఆ కర్ణుడికి; తొడరెడు కొలఁదియె?= ఎదిరించే సాటివాడా?; వడముడి భుజ విక్రమంబు= భీమసేనుడి భుజబలం; వారలన్= పాండవులను గూర్చి; మనము+ఎప్పుడు వినమొ?= మనము ఎప్పుడూ వినలేదా?; కర్ణుని వినమో?= కర్ణుడిని గూర్చి వినమా? (వినలేదా?); అడి బీరపు తులువ= వ్యర్థమయిన తుంటరివాడు; పాండవులన్ గెలుచున్+అటె?= పాండవులను గెలువగలడా?

**తాత్పర్యం:** ఆ కర్ణుడికి (పాండవులను) ఎదిరించటం సాధ్యమా? భీముడి భుజబలమును గూర్చి, పాండవులను గూర్చి మన మెపుడూ వినలేదా? తుంటరిగా వ్యర్థంగా మాటాడే కర్ణుడినిగూర్చి మనం వినలేదా? ఇతడు పాండవులను గెలువగలడా?

**విశేషం:** దుందుడుకుతనంతో మాటాడే కర్ణుడి మాటలూ చేష్టలూ మనకు తెలియును. పాండవుల శక్తీ మనకు తెలియును. పనికి రాని మాటలు తప్ప మరేమీ చేతకాని కర్ణుడు పాండవులను గెలవగలడా? అని ధృతరాష్ట్రుడు తన మనస్సులోని భావాన్ని వెళ్ళగ్రక్కాడు.

**ఉ.** **సూతసుతుండు పాండునృపసూనులఁ బోర జయించు నంచు గ**
**ర్వాతిశయంబునన్ మనమదాంధుఁడు కృష్ణుఁ దృణీకరించి సం**
**ప్రీతిగ సంధి సేయఁడ యపేతకళంకులు వారు; వారి కే**
**లా తగ వేది దైవము దలంచు రణంబునఁ జేటు? సంజయా!** **185**

**ప్రతిపదార్థం:** సంజయా!= ఓ సంజయుడా!; సూత సుతుఁడు= కర్ణుడు; పాండు నృపసూనులన్= పాండురాజు కుమారులను; పోరన్+జయించుచున్+అంచున= యుద్ధంలో గెలుస్తా డంటూ; గర్వాతిశయంబునన్= మిక్కిలి పొగరుబోతుతనంతో; మన మద+అంధుఁడు= మత్తుతో కళ్ళుతెలియని గ్రుడ్డిగా ఉండే మనవాడు (దుర్యోధనుడు); కృష్ణున్= శ్రీకృష్ణుడిని; తృణీకరించి= లెక్కించకుండా; సంప్రీతిగన్= ప్రీతి గలుగునట్లుగా; సంధి చేయఁడు+అ= సంధి చేసికొనలేదు; అపేత కళంకులు వారు= ఆ పాండవులు పాపాలు లేనివారు (తొలగిన పాపాలు కలవారు); వారికిన్= అటువంటి వారికి; దైవము= దేవుడు; తగవు+ఏది= న్యాయాన్ని పోగొట్టి; రణంబునన్= యుద్ధంలో; ఏలా?= ఎట్లా?; చేటు+తలంచున్?= కీడు తలుస్తాడు? (అనగా తలవడు).

**తాత్పర్యం:** ఓ సంజయా! కర్ణుడు పాండవులను యుద్ధంలో జయిస్తా డని అహంకారంతో, మదంతో గ్రుడ్డిగా మనవాడు శ్రీకృష్ణుడిని తృణీకరించి సంతోషంగా వారితో సంధికి ఒప్పుకొనలేదు. నిర్దోషు లయిన వారికి దైవం కూడా వ్యతిరేకి కాడు. యుద్ధంలో వారికెట్లా చేటు తలపెడతాడు?

**వ.** **తానును దమ్ములుం జెడుదు; రింతియ కాక యొండు గలదే? యది యట్లుండె; భండనంబు తెఱంగు సెప్పు' మనిన నమ్మనుజపతికి నా సూతసంభవుం డి ట్లనియె.** **186**

**ప్రతిపదార్థం:** తానును (దుర్యోధనుడు); తమ్ములున్= దుర్యోధనుని తమ్ములూ; చెడుదురు= నాశనమౌతారు; ఇంతియ,కాక= ఇదికాక; ఒండు= మరొకటి; కలదే; ఉన్నదా? అది, అట్టుండెన్= అది అట్లా ఉండనిమ్ము; భడనంబు= యుద్ధంయొక్క; తెఱంగు= విధము; చెప్పుము; అనినన్; ఆ+మనుజపతికిన్= ఆ ధృతరాష్ట్రమహారాజుకు; ఆ సూతసంభవుండు= సూతవంశములో జన్మించినవాడు-సంజయుడు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడూ, అతడి తమ్ముళ్ళూ నాశనమౌతారు - అంతకంటే ఇంకేముంది?' యుద్ధగతిని చెప్పుము. అనగా ధృతరాష్ట్రుడితో సంజయు డిట్లా అన్నాడు:

**చ.** **సమసిన సేనఁ జూచి రభసంబునఁ గర్ణుఁడు భీముఁ గిట్టి ద**
**ర్పము సిగురొత్త ముప్పది శరంబుల నొంచినఁ గెంపు సొంపు వ**
**క్రమునకు నొప్పు సేయఁగ నతండు వెసన్ విలు ద్రుంచి సూతు ప్రా**
**ణముఁ గొనినం జలం బెడఁ బెనంగొన వాహన చోదకుండు నై!** **187**

**ప్రతిపదార్థం:** సమసిన సేనన్+చూచి= నాశమైన సైన్యాన్ని చూచి; రభసంబునన్= తొందరగా; కర్ణుఁడు= కర్ణుడు; భీమున్+కిట్టి= భీముడిని ఎదుర్కొని; దర్పము చిగురొత్తన్= గర్వం మొలవగా; వక్త్రమునకున్= తన మొగానికి; కెంపుసొంపు= కోపం మూలాన ఎఱ్ఱబడిన అందం; ఒప్పుచేయఁగన్= తగి ఉండగా; అతండు= ఆ భీముడు; వెసన్= శీఘ్రంగా; విలుద్రుంచి= (కర్ణుడి) విల్లు ద్రుంచి; సూతుప్రాణమున్+కొనినన్= (కర్ణుడి) సారథిని చంపగా; చలంబు= పట్టుదల; ఎదన్= హృదయంలో; పెనంగొనన్= పెనవేసికొనగా; వాహనచోదకుండున్+ఐ= సారథిగా కూడనయి (కర్ణుడు సారథి చనిపోవటంతో తానే రథాన్ని తోలుకొంటూ యుద్ధం చేయవలసి వచ్చింది).

**తాత్పర్యం:** తన సేన నాశంకాగా చూచిన కర్ణుడు తొందరగా భీముడితో తలపడ్డాడు. తన గర్వం చిగురించగా ముప్పై బాణాలతో భీముడిని నొప్పించాడు. ఆ కారణంగా అతడి మొగం ఎఱ్ఱబడింది. భీముడు కర్ణుడి సారథిని చంపి, విల్లును విరిచాడు. కర్ణుడు తానే రథాన్ని తోలుకొంటూ యుద్ధం చేయవలసి వచ్చింది.

**వ. కర్ణుండు శక్తి వైచిన.** 188

**తాత్పర్యం:** కర్ణుడు శక్తి అనే ఆయుధాన్ని వేయగా.

**క. ఎనిమిది తునియలుగా నది । దునిమి, మరున్నందనుండు తొమ్మిది శరముల్**
**తను వాడ నేయ బలువిలు । గొని యన్నియుఁ గర్ణుఁ డేసె గ్రూరాస్త్రంబుల్.** 189

**ప్రతిపదార్థం:** మరుత్+నందనుండు= భీముడు; అది= ఆ శక్తిని; ఎనిమిది తునియలుగాన్= ఎనిమిది ముక్కలుగా; తునిమి= ముక్కలు చేసి; తొమ్మిది శరముల్= తొమ్మిది బాణాలను; తనువు+ఆడన్= ఒంటిలో నాటుకొనగా; బలువిలు కొని= పెద్ద విల్లును తీసికొని; అన్నియు క్రూర+అస్త్రంబుల్= భీముడు వేసినన్ని తీవ్రబాణాలనూ; ఏసెన్= వేశాడు (కొట్టాడు).

**తాత్పర్యం:** కర్ణుడు వేసిన శక్త్యాయుధాన్ని భీముడు ఎనిమిది ముక్కలుగా త్రుంచి, కర్ణుడి ఒంటిలో నాటుకొనేటట్లు తొమ్మిది అమ్ములను వేశాడు. కర్ణుడు పెద్దవింటిని తీసికొని వాడి అయినవీ, అన్నే లెక్క గలవీ అయిన బాణాలతో భీముడిని కొట్టాడు.

**క. వాని నెడ నఱికి యప్పవ । మాన తనూభవుండు నిశిత మార్గణములు పై**
**పై నిగిడింపఁగ రాధా । సూనుండును సాయకముల సోనలు గురిసెన్.** 190

**ప్రతిపదార్థం:** ఆ+పవమాన తనూభవుండు= వాయుదేవుడి కుమారు డయిన ఆ భీముడు; వానిన్= ఆ కర్ణుడి బాణాలను; ఎడన్ నఱికి= మధ్యలోనే నరికివేసి; నిశితమార్గణములు= వాడి బాణాలను; పైపై నిగిడింపఁగన్= మీద మీద వేయగా; రాధాసుతుండును= రాధయొక్క కొడుకైన కర్ణుడు కూడ; సాయకముల సోనలు= బాణాల వర్షాలు; కురిసెన్= కురిపించాడు.

**తాత్పర్యం:** ఆ కర్ణుడి అస్త్రాలను నడుమనే తెగనరికి, భీమసేనుడు వాడిబాణాలను మీద మీద వేయగా, రాధా కుమారు డైన కర్ణుడు బాణ వర్షాలు కురిపించాడు.

**క. చెలఁగు పటు సింహనాదం । బులు ఱంకెలు గాఁగ వారు పొలిచిరి వృషభం**
**బుల క్రియ నొండొరులకు మా । ర్మలయుచుఁ దాఁకుచు నుదాత్తరభసోజ్జ్వలు లై.** 191

**ప్రతిపదార్థం:** చెలఁగు= శబ్దం చేసే; పటు సింహనాదంబులు= దట్టమయిన సింహనాదాలు; బలు ఱంకెలుగాఁగన్= పెద్ద ఎద్దుల రంకెల మాదిరి కాగా; వారు= కర్ణ భీములు; వృషభంబుల క్రియన్= ఆబోతుల మాదిరిగా; ఒండొరులకున్= ఒకళ్ళొకళ్ళకు; మార్మలయుచున్= ఎదురు ఉద్యమిస్తూ; తాఁకుచున్= ఎదురు తాకుతూ; ఉదాత్త రభసోజ్జ్వలు లై= గంభీరమయిన ఉద్రేకంతో

ప్రకాశిస్తూ; పొలిచిరి= ఒప్పారారు.

**తాత్పర్యం:** భయాన్ని గొల్పే సింహనాదాలు రంకెలుగా, కర్ణభీములు ఆబోతులవలె ఒకరినొకరు ఎదుర్కొంటూ గంభీరమయిన వేగంతో కూడిన ఉత్సాహంతో ప్రకాశించారు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ.** **అత్తఱిఁ గర్ణువిల్లును హయంబులు నుగ్గుగఁజేసి నెత్తుటన్**
**జొత్తిల మేన బాణములు సొన్పి మరుత్సుతుఁ డార్చె నార్చినం**
**జిత్తము తల్లడిల్లఁ గురుసింహుఁడు దుర్జయుఁ బన్ప నాతఁ డ**
**త్యుత్తమ సాహస ప్రకటితోద్ధతి నాజగజెట్టిఁ దాఁకినన్.** **192**

**ప్రతిపదార్థం:** ఆ+తఱిన్= ఆ సమయంలో (కర్ణభీములు పోట్లాడేటప్పుడు); కర్ణువిల్లును= కర్ణుడి ధనుస్సును; హయంబులు= గుఱ్ఱాలను; నుగ్గుగన్+చేసి= పొడిగా చేసి; నెత్తుటన్= నెత్తురులో; జొత్తిలన్= ఎఱ్ఱబారగా; మేనన్= ఒంటిలో; బాణములు చొన్పి= బాణాలను దోపి; మరుత్సుతుఁడు= భీముడు; ఆర్చెన్= సింహనాదం చేశాడు; ఆర్చినన్= అట్లా సింహనాదం చేయగా; చిత్తము తల్లడిల్లన్= మనస్సు కలవరపడగా; కురుసింహుఁడు= దుర్యోధనుడు; దుర్జయున్+పన్పన్= దుర్జయుడిని పంపగా; ఆతఁడు= ఆ దుర్జయుడు; అత్యుత్తమ= మిక్కిలి శ్రేష్ఠమయిన; సాహస ప్రకటిత= ధైర్యంచేత వ్యక్తం చేయబడిన; ఉద్ధతిన్= గర్వంతో; ఆ జగజెట్టిన్+తాఁకినన్= ఆ మేటి వీరు డయిన భీముడిని ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** కర్ణ భీములు పోట్లాడేటప్పుడు భీముడు కర్ణుడి విల్లునూ, గుఱ్ఱాలనూ చూర్ణంగా చేసి, నెత్తుటితో ఎఱ్ఱబడేటట్లు అతడి ఒంటినిండా బాణాలను గుచ్చి ఒక్క పెద్ద అరుపు (సింహనాదం) అరిచాడు. ఆ శబ్దానికి మనస్సు తల్లడిల్లి, దుర్యోధనుడు దుర్జయుడిని పంపాడు. వాడు గొప్ప సాహసంతో ఆ జగజెట్టి అయిన భీముడితో తలపడ్డాడు.

**తే.** **బలము లచ్చెరువంద న ట్లలవు మెఱయ। నీ సుతుఁ డనిలసుతుఁ దాఁకి నిశితసాయ**
**కముల నొప్పించి రథతురంగముల నొంచి। సూతు నో నేయఁ గ్రోధ విస్ఫూర్తి నతఁడు.** **193**

**ప్రతిపదార్థం:** బలములు= సేనలు; అచ్చెరువు+అందన్= అబ్బురపడగా; అట్లు= ఆ విధంగా; అలవు మెఱయన్= బలం అతిశయించగా; నీ సుతుఁడు= నీ కొడుకు (దుర్జయుడు); అనిలసుతున్= భీముడిని; తాఁకి= ఎదుర్కొని; నిశిత సాయకములన్= వాడి బాణాలతో; నొప్పించి= బాధించి; రథతురంగముల నొంచి= తేరునూ గుఱ్ఱాలనూ బాధించి; సూతున్= సారథిని; నోనేయన్= నొచ్చునట్లు కొట్టగా; అతఁడు= ఆ భీముడు; క్రోధవిస్ఫూర్తిన్= కోపం బయల్పడగా.

**తాత్పర్యం:** సేనలు ఆశ్చర్యపడేటట్లు ఉపాయంతో దుర్జయుడు భీమసేనుడిని ఎదుర్కొన్నాడు. వాడి బాణాలతో నొప్పించాడు, గుఱ్ఱాలను బాధించాడు. సూతుడిని నొవ్వజేశాడు. అప్పుడు భీముడు క్రోధం ప్రకటమయ్యేటట్లుగా(తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **తురగముల తలలు సూతుని। శిరము నతని మస్తకంబు శితశరషట్క**
**స్ఫురణమున ధరణిమీఁదం। దొరఁగించెం గర్ణుఁ డేడ్పుతోఁ గనుఁగొనఁగన్.** **194**

**ప్రతిపదార్థం:** తురగముల తలలు= (దుర్జయుడి) గుఱ్ఱాల తలలు; సూతుని శిరమున్= సారథి తలనూ; అతనిమస్తకంబు= దుర్జయుని తలయును; శిత,శర,షట్క= ఆరువాడి బాణాల; స్ఫురణమునన్= తోచటంతో (తాకుటతో); కర్ణుఁడు= కర్ణుడు; ఏడ్పుతో కనుఁగొనఁగన్= ఏడుస్తూ చూస్తుండగా; ధరణిమీఁదన్= భూమిమీద; తొరఁగించెన్= దొర్లునట్లు చేశాడు (పడగొట్టాడు).

**తాత్పర్యం:** కర్ణుడు ఏడుస్తూ చూస్తుండగా భీమసేనుడు ఆరు వాడి బాణాలతో దుర్జయుడి గుర్రాల తలలను, సారథి తలను, దుర్జయుడి తలను భూమిమీద దొర్లేటట్లుగా కొట్టాడు.

**వ. ఆలోనన సూతసూనుండు రథంబు సన్నద్ధంబు సేసికొనినవాఁడగుట నప్పాండవతనయుం దలపడియె; నమ్మేటిమేగలు కోపంబులు నాటోపంబులు చలంబులు శౌర్యంబులు మెఱయు తెఱంగునం బెనంగి; రట్టి యెడ. 195**

**ప్రతిపదార్థం:** ఆలోనన= అంతలోనే; సూతసూనుండు= కర్ణుడు; రథంబున్= తేరును; సన్నద్ధంబు= సిద్ధం; చేసికొనినవాఁడు+అగుటన్= చేసికొన్నవాడయినందున; ఆ+పాండు తనయున్= ఆ భీమసేనుడిని; తలపడియెన్= ఎదుర్కొన్నాడు; ఆ+మేటిమగలు= ఆ గొప్ప వీరులు; కోపంబులు= కోపాలూ; ఆటోపంబులు= గర్వాలూ; బలంబులు= శక్తులూ; చలంబులు= మాత్సర్యాలూ; మెఱయు= ప్రకాశించు; తెఱంగునన్= విధంగా; పెనఁగిరి= పోట్లాడారు; అట్టియెడన్= అటువంటి సమయంలో.

**తాత్పర్యం:** కర్ణుడంతలోనే తేరును సిద్ధం చేసికొని, భీముడిని ఎదుర్కొన్నాడు. ఆ గొప్పవీరులిద్దరు కోపాలూ,ఆటోపాలూ, పట్టుదలలూ, శౌర్యధైర్యాలూ ప్రకాశించేటట్లు పోరాడారు. ఆ సందర్భంలో.

**మ. ఖరనారాచము భీము వక్షమున నా కర్ణుండు బాహాబలా**
**భరణుం డై నిగిడింప నుచ్చి చని భూభాగంబు నాఁటంగ నా**
**తురతం బొంద కతండు నిష్ఠుర గదం ద్రుంచెం దురంగంబులన్,**
**ధరణిం గూల్చె ధనుర్విలాస మలరం దత్సూతునిం గేతువున్. 196**

**ప్రతిపదార్థం:** ఖరనారాచము= వాడి బాణం; భీము వక్షమునన్= భీముడి గుండెలో; ఆ కర్ణుండు= ఆ కర్ణుడు; బాహాబల+ఆభరణుండు+ఐ= భుజబలమే అలంకారంగా; నిగిడింపన్= ఏయగా; ఉచ్చి చని= గ్రుచ్చుకొనిపోయి (దూసుకొనిపోయి); భూభాగంబు నాఁటంగన్= భూమిలో నాటు కోగా; అతండు= ఆ భీముడు; ఆతురతన్+పొందక= భయపడక; నిష్ఠుర గదన్= కఠినమైన గదతో; తురంగంబులన్= గుర్రాలను; త్రుంచెన్= చంపాడు; ధనుర్విలాసము+అలరన్= విలువిద్య అందగించగా; తద్= ఆ కర్ణుడి; సూతునిన్= సారథిని; కేతువున్= పతాకాన్ని; ధరణిన్+కూల్చెన్= భూమిమీద పడగొట్టాడు.

**తాత్పర్యం:** కర్ణుడు భుజబలం రాణించగా ఒక క్రూర బాణాన్ని భీముడి వక్షంలో సంధించాడు. ఆ బాణం అతడి గుండెలో దూసుకొని పోయి నేలమీద పడింది. అయినా అతడు కలత చెందకుండా, గట్టి గదతో కర్ణుడి తేరు గుర్రాలను బాదాడు. బాణ విద్యా చాతుర్యంతో సారథిని, కేతువును నేలమీద పడగొట్టాడు.

**మ. విరథుం డయ్యును రాధనందనుఁడు దోర్వీర్యం బవార్యంబుగా**
**శరజాలంబుల భీముఁ గప్పుట మహాశ్చర్యంబు గావించె భూ**
**వరుఁ డంతం దన తమ్ము నా రథికుఁ గావం బంచె నా దుర్ముఖుం**
**డు రయం బారఁగఁ దాఁకె భీమునకు నాటోపంబు దీపింపఁగన్. 197**

**ప్రతిపదార్థం:** విరథుండు+అయ్యును= రథం లేనివాడైనప్పటికినీ; రాధనందనుఁడు= కర్ణుడు; దోర్వీర్యంబు= భుజబలం; అవార్యంబుగాన్= ఎదుర్కొనలేనిదిగా (అడ్డులేనట్లు); శరజాలంబులన్= బాణాల గుంపుతో; భీమున్+కప్పుట= భీముడిని కప్పివేయుటం; మహాశ్చర్యంబు కావించెన్= (చూచేవారికి) చాలా వింత గొల్పింది; భూవరుఁడు= రాజు దుర్యోధనుడు; అంతన్= ఆ సమయంలో; ఆ రథికున్+కావన్= ఆ వీరు డయిన కర్ణుడిని కాపాడటానికి; తన తమ్మున్+పంచెన్= తన తమ్ముడిని పంపాడు; ఆ దుర్ముఖుండు= ఆ దుర్ముఖుడు; రయంబు+ఆరఁగన్= వేగంగా; భీమునకున్= భీమసేనుడికి; ఆటోపంబు= దర్పం

(తనయొక్క); దీపింపఁగన్= వెలుగగా (తెలియగా); తాఁకెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** తేరు విరిగిన వాడయినను కర్ణుడు, తన అమ్ముల గుంపుతో, సాటిలేని భుజబలంతో భీముడిని కప్పివేయటం, చూచేవారికి వింత గొల్పింది. ఆ సమయంలో దుర్యోధనుడు కర్ణుడికి బాసటగా తన తమ్ముడయిన దుర్ముఖుడిని పంపాడు. ఆ దుర్ముఖు డతివేగంగా తన దర్పం ప్రకాశించేటట్లు భీముడిని ఎదుర్కొన్నాడు.

**క. అయ్యంగరాజుతోడం । గయ్యము సేయుచును దుర్ముఖు ప్రాణంబుల్**
**సయ్యన తొమ్మిది యమ్ములఁ । గ్రుయ్యక డయ్యక యతండు గొనియె నరేంద్రా! 198**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ఓ రాజా!; ఆ+అంగరాజుతోడన్= ఆ కర్ణుడితో; కయ్యము చేయుచును= యుద్ధం చేస్తూనే; అతండు= ఆ భీమసేనుడు; చయ్యనన్= వేగంగా; తొమ్మిది అమ్ములన్= తొమ్మిది బాణాలతో, క్రుయ్యక డయ్యక= వెనుదీయక అలసిపోకుండా; దుర్ముఖ ప్రాణంబుల్= దుర్ముఖుడి ప్రాణాలను; కొనియెన్= తీసికొన్నాడు (చంపాడు).

**తాత్పర్యం:** ఓ రాజా! భీమసేనుడు కర్ణుడితో యుద్ధం చేస్తూనే వేగంగా తొమ్మిది బాణాలను తీసికొని వెనుదీయకుండా అలసిపోకుండా ఆ దుర్ముఖుడిని హతమార్చాడు.

**వ. ఇట్లు భవదాత్మజుండు వడుటయు. 199**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; భవత్+ఆత్మజుండు= మీ యొక్క కుమారుడు; పడుటయు= పడిపోగా

**తాత్పర్యం:** ఈ విధంగా నీ కుమారుడు చనిపోగా.

**ఉ. ఆతనిఁ జూచి కన్నుఁగవ నశ్రులు గ్రమ్మఁగ సూతసూతి శో**
**కాతురుఁడై తదీయ రథ మల్లన యెక్కఁగ భీమసేనుఁ డు**
**ద్ద్యోతితహేమ భూషిత చతుర్దశ మార్గణ విద్ధుఁ జేయుడు**
**న్నాతశరంబు లన్ని వెస నాఁటె నతండును దద్భుజంబులన్. 200**

**ప్రతిపదార్థం:** ఆతనిన్+చూచి= ఆ దుర్ముఖుడిని చూచి; సూతసూతి= కర్ణుడు; కన్నుఁగవన్ అశ్రులు క్రమ్మఁగన్= రెండు కన్నులను కన్నీళ్ళు క్రమ్ముకోగా; శోకాతురుఁడు+ఐ= దుఃఖంతో బాధపడ్డవాడై; తదీయ రథమున్= అతని తేరును; అల్లన ఎక్కఁగన్= మెల్లగా ఎక్కగా; భీమసేనుఁడు= భీముడు; ఉద్ద్యోతిత= మండుతూ ఉన్న (ప్రకాశించే); హేమ భూషిత= బంగారుతో అలంకరింపబడిన; చతుర్దశ మార్గణ= పదునాలుగు బాణాలతో; విద్ధున్+చేయుడున్= బాధించగా; అన్ని= అదే సంఖ్య గల (ఆ లెక్కతోనే పదునాలుగు); శాతశరంబులన్= వాడి బాణాలను; అతండును= ఆ కర్ణుడు కూడా; తద్భుజంబులన్= అతడి భుజాలలో (భీముడి భుజాలలో); వెసన్+నాఁటెన్= వెంటనే నాటుకొనేటట్లు చేశాడు (అనగా త్వరగా నాటాడు).

**తాత్పర్యం:** దుర్ముఖుడి గతిని చూచి కర్ణుడు, కన్నీరు కారుస్తూ, దుఃఖంతో కూడిన బాధతో మెల్లగా తన తేరెక్కాడు. అప్పుడు భీముడు బంగారంతో అలంకరింపబడిన పదునాల్గు బాణాలతో కర్ణుడిని బాధించాడు. అంత కర్ణుడు కూడా అదే సంఖ్యగల బాణాలను భీముడి భుజాలలో నాటాడు.

**వ. దానం గనలి అనిలతనయుండు. 201**

**ప్రతిపదార్థం:** దానన్= దానివలను; కనవి= కోపించి; అనిలతనయుండు= వాయుపుత్రుడైన భీముడు

**తాత్పర్యం:** అందువలన భీముడు కోపించి,

**ఆ. వాఁడి నారసములు మూఁడు కర్ణుని ఱొమ్ము । గాఁడ నేయ నాన గడచి నొవ్వ**
**భయము గదురఁ జేయ రయమున నరదంబు । దోలికొని యతండు దొలఁగఁ బాఱె. 202**

**ప్రతిపదార్థం:** (భీముడు) వాఁడి= వాడి అయిన; నారసములు= ప్రాణాలు తీసే పదునైన బాణాలను; మూఁడు= మూటితో; కర్ణుని ఱొమ్మున్= కర్ణుడి గుండెను; కాఁడన్+ఏయన్= లోతుగా గ్రుచ్చుకొనేటట్లుగా; ఏయన్= కొట్టగా; ఆన గడచి= సిగ్గును మించి; నొవ్వ= నొప్పి; భయము కదురన్+చేయన్= భయమును కలిగించగా; రయమునన్= వేగంగా; అరదంబున్= తేరును; తోలికొని; అతండు= ఆ కర్ణుడు; తొలఁగన్+పాఱెన్= తొలగిపోయాడు.

**తాత్పర్యం:** ప్రాణాలు తీసే వాడి బాణాలు మూటితో కర్ణుడి గుండెలో గ్రుచ్చుకొనేటట్లు కొట్టాడు. ఆ దెబ్బకు కర్ణుడు నిట్టూర్పుతో భయం కలుగగా తేరును తోలుకొని అక్కడ నుండి తొలగిపోయాడు.’

**వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 203**

**తాత్పర్యం:** (ఆ విధంగా సంజయుడు చెప్పగా) విని, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**క. విను పౌరుషము నిరర్థక; । మనుమానము లేదు దైవ మధికంబు; మరు**
**త్తనయునిచే నారాధా । తనయుం డి ట్లగుట నెవ్విధంబునఁ దలఁపన్. 204**

**ప్రతిపదార్థం:** విను= వినుము; మరుత్+తనయునిచేన్= వాయుపుత్రుడైన భీమునిచేత; ఆ రాధాతనయుండు= ఆ కర్ణుడు; ఇట్లు+అగుట= ఈ విధంగా కావటం (ఓడి పరుగెత్తటం); ఏ+విధంబునన్= ఏ ప్రకారం; తలఁపన్= తలచినప్పటికిని; పౌరుషము= పురుషశక్తి; నిరర్థకము= వ్యర్థం; దైవము+అధికంబు= దైవశక్తి ఎక్కువయినది; అనుమానము లేదు= సందేహం లేదు.

**తాత్పర్యం:** ఓ సంజయా! దైవశక్తి ముందు మానవశక్తి నిరర్థకం. ఇందులో సందేహం లేదు. వాయునందను డైన భీముడిచేత రాధాతనయు డైన కర్ణుడు ఈ విధంగా పరాజితుడు కావటం తలచుకొంటే (అంతే ననిపిస్తూ ఉన్నది).

**విశేషం:** లోకంలో మానవు డెంతటివాడైనా, అతడి బలం, దైవబలం ముందు వ్యర్థమని కర్ణుడు భీముడిచేత పరాజితుడు కావటం తెలుపుతూ ఉన్నది - అని ధృతరాష్ట్రుడు చెపుతూ ఉన్నాడు.

**క. అట్టన నేల? మహాబలు । పట్టికి సుర ఖచర దనుజ పన్నగులు మా**
**ర్వెట్ట రనినఁ గర్ణాదుల । కెట్టు నిలువవచ్చు వాని యెదురం దిరమై! 205**

**ప్రతిపదార్థం:** అట్టు+అనన్+ఏల?= అట్లా అనటం ఎందుకు? (ముందన్నట్లు దైవమానుష బలాలను గూర్చి); మహాబలు పట్టికిన్= భీముడికి (వాయుదేవుడికి మహాబలుడనే పేరున్నది); సుర, ఖచర, దనుజ, పన్నగులు= దేవతలు, గంధర్వులు, రాక్షసులు, నాగులు; మార్వెట్టరు= ఎదిరించలేరు; అనినన్= అనగా; కర్ణ+ఆదులకున్= కర్ణుడు మొదలయినవారికి; వాని యెదురన్= ఆ భీముడి కెదురుగా; తిరమై= స్థిరంగా (గట్టిగా); ఎట్టు= ఏ విధంగా; నిలువవచ్చున్?= నిలువగలరు?

**తాత్పర్యం:** దైవమానవ శక్తులను గూర్చి ఎందుకు? దేవతలు, గంధర్వులు, రాక్షసులు, నాగులూ భీముడిని ఎదిరించలేరంటే కర్ణాదులు అతడి కెదురుగా స్థిరంగా ఎట్లా నిలువగలరు?

**క. పాండవుల గెలుచు నాజి ని । తం డని యగ్గించు సూతతనయుని మత్పు**
**త్రుం; డతఁడు భీము నేపున । గం డడఁగినఁ జూచి మనసు గందక యున్నే? 206**

**ప్రతిపదార్థం:** పాండవులన్= పాండవులను; ఆజిని= యుద్ధంలో; ఇతండు= ఈ కర్ణుడు; గెలుచున్= జయిస్తాడు; అని= అంటూ; సూత తనయుని= కర్ణుడిని; మత్+పుత్రుడు= నా కుమారుడు దుర్యోధనుడు; అగ్గించున్= పొగడుతుంటాడు; అతండు= ఆ కర్ణుడు; భీము ఏపునన్= భీముడి శక్తికి; గండు+అడఁగినన్= బలం అణగిపోగా; చూచి; మనసు= మనస్సు; కందక= తాపం లేకుండా; ఉన్నే?= ఉంటుందా? (అని సంజయుడితో ధృతరాష్ట్రుడు అన్నాడు).

**తాత్పర్యం:** 'కర్ణుడు పాండవులను యుద్ధంలో జయిస్తాడు' అని అంటూ కర్ణుడిని దుర్యోధనుడు పొగడుతుంటాడు, భీముడి శక్తికి కర్ణుడి బలం అణగిపోగా చూచి మనసుకు కష్టం కలుగకుండా ఉంటుందా?

**క. వినఁడె జరాసంధాదులఁ । దునుముట; మన దుర్జయుండు దుర్ముఖుఁడును భీ**
**మునితోడఁ బెనఁగువా రే । మని కర్ణునిఁ గావఁ బనిచె నబ్బాలకులన్? 207**

**ప్రతిపదార్థం:** జరాసంధ+ఆదులన్= జరాసంధుడు మొదలైన వారిని; తునుముట= చంపటం (భీముడు వారిని ఇదివరకే చంపి ఉండటాన్ని); వినఁడె?= వినలేదా?; మన దుర్జయుండు దుర్ముఖుఁడును= మన దుర్జయ దుర్ముఖులు; భీమునితోడన్= భీముడితో; పెనఁగువారు= యుద్ధం చేసేవారు; ఆ+బాలకులన్= ఆ పసివాండ్రను; కర్ణునిన్+కావన్= కర్ణుడిని కాపాడటానికి; ఏమని= ఏమనుకొని; పనిచెన్?= పంపాడు?

**తాత్పర్యం:** జరాసంధాదులను భీముడు చంపిన సంగతి వినలేదా? ఆ భీముడితో యుద్ధానికి దుర్జయ దుర్ముఖులా? కర్ణుడిని కాపాడటానికి ఆ పసివారిని ఏమని పంపాడు?

**విశేషం:** భీముడు జరాసంధాదులను ఇదివరకే చంపి ఉన్నాడు. అంతటి బలశాలితో పెనగులాటకు పసివారు దుర్జయ దుర్ముఖులు తగినవారేనా? వారిని కర్ణుడికి అండగా దుర్యోధనుడు పంపటమా? దీనిని చూస్తే దుర్యోధనుడి తెలివిలేనితనం తెలుస్తూ ఉన్నది- అని ధృతరాష్ట్రుడు సంజయుడితో అన్నాడు. దీనివలన శక్తికి మించిన బరువు నెత్తిన పెట్టి నట్లయింది.

**క. పవనజుఁ డొక్కఁడె పెఱపాం । డవులను సాత్యకియు హరియు డాఁ తురె యుగ్రా**
**హవమునఁ బ్రాణములావున । నవిజయ్యులు వారిఁ దొడర నగునే తనకున్?' 208**

**ప్రతిపదార్థం:** పవనజుఁడు+ఒక్కఁడె= భీము డొక్కడే (అనగా ఒకడే చాలును); ఉగ్ర+ఆహవమునన్= భయంకరమయిన యుద్ధంలో; పెఱ పాండవులను= మిగిలిన పాండవులను; సాత్యకియున్ హరియున్= సాత్యకి, శ్రీకృష్ణులు; డాఁతురె?= దాచుకొందురా?; ప్రాణము లావునన్= ప్రాణశక్తితో; అవిజయ్యులు= గెలువరానివారు; వారిన్= ఆ ఇద్దరినీ; తనకున్= దుర్యోధనుడికి; తొడరన్+అగునే?= ఎదుర్కొన సాధ్యమా?

**తాత్పర్యం:** భీము డొకడే కాదు - మిగిలిన పాండవులూ, శ్రీకృష్ణ సాత్యకులూ భయంకర యుద్ధంలో ఒడలు దాచుకొంటారా? బలంలో వారందరూ అజేయులు. దుర్యోధనుడు వారి నెదుర్కొనగలడా?'

**చ. అని పలుమాట లాడుటయు నమ్మనుజేంద్రునితోడ నాతఁ డి**
**ట్లను 'విష మెత్తి క్రోలి యది యంగము నారట పెట్ట నన్యులం**
**గినిసిన యట్ల మీఁదు పరికింపక యమ్మెయి నీవు పాండునం**
**దనులకుఁ జెట్టవై, హృదయతాపము వచ్చినఁ బల్కె దొండులన్. 209**

**ప్రతిపదార్థం:** అని= ఆ విధంగా; పలుమాటలు+ఆడుటయున్= నానావిధాలుగా మాట్లాడటం (విని); ఆ+మనుజ+ఇంద్రుని తోడన్= ఆ ధృతరాష్ట్రుడితో; ఆతఁడు= ఆ సంజయుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; విషము ఎత్తి క్రోలి= విషాన్ని

చేతితో ఎత్తుకొని త్రాగి; అది= ఆ విషం; అంగమున్= శరీరాన్ని; ఆరటపెట్టన్= బాధపెట్టగా; అన్యులన్= ఇంకొక్కరిని; కినిసిన అట్లు= కోపించిన విధంగా; మీఁదు పరికింపక= ముందుచూపు లేకుండా; నీవు; ఆ+మెయిన్= ఆ విధంగా; పాండునందనులకున్= పాండవులకు, చెట్టవు+ఐ= శత్రుడవై; హృదయతాపము= నీ మనసుకు కష్టం; వచ్చినన్= రాగా; ఒండులన్= ఇతరులను; పల్కెదు= మాటలంటున్నావు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు పై విధంగా ఎన్నో మాట లనగా వినిన సంజయుడు ఆతడితో ఇట్లా అన్నాడు: 'విషాన్ని స్వయంగా చేత నెత్తికొని త్రాగి, అది శరీరాన్ని ఆరాటపెట్టగా ఇతరుల మీద కోపగించుకొన్నట్లు, ముందు యోచన లేకుండా ఆ ప్రకారంగా నీవు పాండవులకు వైరివై, నీ మనసుకు బాధ కలిగితే వేరొక్కరిని మాట లంటున్నావు.'

**విశేషం:** అలం: ఉపమ. ఈ పద్యంలో ఒక మంచి లౌకిక న్యాయం సంజయుడిద్వారా కవి చెప్పించాడు. అది స్వయంగా విషాన్ని త్రాగినందువలన కడుపులో మంటపుడితే ఆ తపనకు లోకంలో ఎవరినో ఎందు కాడిపోసు కొనటం? ముందు వెనుకలు చూడకుండా పాండవులను కష్టపెట్టి, అది ఎదురు దెబ్బ తగిలితే ఆ దెబ్బ మూలాన కలిగే బాధను తట్టుకొనలేక ఎదుటివారిని దూషించటం వంటిది ఈ నీ యారాట మని సంజయుడు ధృతరాష్ట్రుడితో అనటం అతడి మనస్తత్వం ఎటువంటిదో తెలుపుతూ ఉన్నది.

**వ. ఊరక బవరంబు తెఱంగు వినుము; నీ తనయులు దుర్మర్షణుండును, దుర్మదుండును, దుస్సహుండును, విజయుండును, విచిత్రుండును గర్ణునోటమి సయిరింపం జాలక వడముడిం దొడరి తూపు లడరించినం జూచి యా సూతసూనుండు దాను నతనిపయిం గవిసి యేసిన దద్విశిఖంబుల వారించుచు మారుత నందనుండు. 210**

**ప్రతిపదార్థం:** ఊరక= మాటాడకుండా; బవరంబు తెఱంగున్= యుద్ధగతిని; వినుము; నీ తనయులు= నీ కుమారులు; దుర్మర్షణుండు, దుర్మదుండును, దుస్సహుండును, విజయుండును, విచిత్రుండును= ఈ పేర్లవారు; కర్ణుని ఓటమి= కర్ణు డోడిపోవటం; సయిరింపన్+చాలక= ఓర్వలేక; వడముడిన్+తొడరి= భీముడిని ఎదుర్కొని; తూపులు+అడరించినన్= బాణాలు వేయగా; చూచి= చూచినవాడైన; ఆ సూతసూనుండు= ఆ సూతుడి కుమారుడయిన కర్ణుడు; తాను= తానుకూడా; అతనిపయిన్= ఆ భీముడిమీద; కవిసి ఏసినన్= క్రమ్ముకొని వేయగా; తద్విశిఖంబులన్ వారించుచున్= ఆ వాడి బాణాలను తొలగించుకొంటూ; మారుతనందనుండు= భీమసేనుడు.

**తాత్పర్యం:** ఊరక మాటాడకుండా యుద్ధం తీరును వినుము' అని సంజయుడు ధృతరాష్ట్రుడితో అన్నాడు. 'నీ కొడుకులు దుర్మర్షణ, దుర్మద, దుస్సహ, విజయ, విచిత్రులు కర్ణు డోడటాన్ని సైపచాలక ఉమ్మడిగా భీముడిమీద తలపడి బాణాలు వేస్తూ ఉండగా, కర్ణుడు కూడా అతడిని క్రమ్ముకొని బాణాలు వేస్తే భీముడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. ఏచి కురుకుమారు లేవురఁ దురగ సా। రథులతోడఁ గూడ రయము మెఱయ**
**వసుధఁ గూల్చె మెఱుఁగు వాలారు తూపు లా। ఱాఱు నిగుడఁజేసి యద్భుతముగ. 211**

**ప్రతిపదార్థం:** ఏచి= విజృంభించి; కురుకుమారులు+ఏవురన్= కౌరవ కుమారు లైదుగురిని; తురగ సారథులతోడన్= తేరి గుఱ్ఱాలతోనూ, సూతులతోనూ; కూడ= కలిపి; రయము మెఱయన్= వేగం (అతిశయించగా) ప్రకాశించగా; మెఱుఁగు= వెలిగే; వాలారు= వాడి అయిన; తూపులు= ములుకులు; ఆఱు+ఆఱు= ముప్పది ఆరు; నిగుడన్+చేసి= నిగుడింపజేసి (కొట్టి); అద్భుతముగన్= ఆశ్చర్యకరంగా; వసుధన్+కూల్చెన్= భూమిమీద పడేటట్లు కొట్టాడు.

**తాత్పర్యం:** భీమసేనుడు విజృంభించి కురుకుమారు లైదుగురిని తేరి గుర్రాలతోనూ, సారథులతోను కలిపి మెరిసే వాడిబాణాలు ముప్పది ఆరింటితో వేగంగా కొట్టి, ఆశ్చర్యం కలిగేటట్లు భూమిమీద పడేటట్లు చేశాడు (అనగా చంపాడు).

**క. అనిఁ బడిన రాచకొడుకులఁ। గని కర్ణుం 'డేటి బ్రదుకుగా బ్రదికెద నే**
**నని యింక నెన్నఁటికి లా। వని భీముని నొంపవలదె?' యని తెం పెసఁగన్. 212**

**ప్రతిపదార్థం:** అనిన్+పడిన= యుద్ధంలో పడిపోయిన (చనిపోయిన); రాచకొడుకులన్+కని= రాజకుమారులను చూచి; కర్ణుండు= కర్ణుడు; ఏటి బ్రదుకుగాన్ బ్రదికెదన్+ఏను+అని= ఏమి బ్రతుకుగా నేను బ్రతుకుతున్నాను (నా దేటి బ్రదుకని); ఇంకన్+ఎన్నఁటికి లావు?= బలం ఇప్పుడు కాకపోతే మరి ఎప్పటికి?; అనిన్= యుద్ధంలో; భీమునిన్+నొంపవలదె?= భీముడిని బాధింపవద్దా?; అని= అనుకొంటూ; తెంపు+ఎసఁగన్= సాహసంతో.

**తాత్పర్యం:** యుద్ధంలో పడిపోయిన రాజకుమారులను చూచి కర్ణుడు 'నా బ్రదుకేమి బ్రదుకు? నాకు బలం ఇప్పుడు కాకపోతే ఎప్పటికి? యుద్ధంలో భీముడిని బాధించవద్దా?' అనుకుంటూ సాహసంతో (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. కదిసి డెబ్బదేను కాండంబు లాతని। మేనఁ బఱపి యుబ్బు మిగిలి నవ్వ**
**నతఁడు నూటయేను శితవిశిఖంబుల। నతని నేసి చాపయష్టిఁ ద్రుంచె. 213**

**ప్రతిపదార్థం:** కదిసి= సమీపించి; డెబ్బది+ఏను కాండంబులు= డెబ్బది అయిదు బాణాలను; ఆతని మేనన్= ఆ భీముడి ఒంటిపై; పఱపి= వేసి; ఉబ్బు మిగిలి= గర్వ మెక్కువ కాగా; నవ్వన్= నవ్వగా; అతఁడు= ఆ భీముడు; నూటయేను= నూటయిదు; శితవిశిఖంబులన్= వాడి బాణాలతో; అతనిన్+ఏసి= ఆ కర్ణుడిని కొట్టి; చాపయష్టిన్= వింటి దబ్బను; త్రుంచెన్= విరిచాడు.

**తాత్పర్యం:** భీముడిని సమీపించి డెబ్బది అయిదు బాణాలను అతడి శరీరంమీద పరచి, గర్వంతో నవ్వి నిలిచాడు. భీముడు కర్ణుడి శరీరంలోకి నూటయిదు వాడి బాణాలను వేసి, అతడి వింటిదబ్బను త్రుంచాడు.

**మ. రయమారన్ బలువిల్లు పుచ్చుకొని యా రాధాసుతుం డేయ దు**
**ర్జయుఁ డమ్మారుతి వొంగి సూతుని వెసం జానేసి విల్ ద్రుంచుచున్**
**హయ సందోహముఁ గూల్చి హాస్యమునకున్ హాసంబు సేయన్ గద**
**న్భయదాకారత వైచె నాతఁ డది భగ్నం బయ్యె నా భీముచేన్. 214**

**ప్రతిపదార్థం:** ఆ రాధాసుతుండు= రాధా కుమారు డయిన కర్ణుడు; రయమారన్= త్వరగా; బలువిల్లు= పెద్ద ధనుస్సును; పుచ్చుకొని= తీసికొని; ఏయన్= కొట్టగా; దుర్జయుఁడు= గెలువరానివాడయిన; ఆ+మారుతి= ఆ భీముడు; పొంగి= విజృంభించి, సూతునిన్= కర్ణుడి సారథిని; వెసన్= వెంటనే; చాన్+ఏసి= చావగొట్టి; విల్ త్రుంచుచున్= వింటిని ముక్కలు చేస్తూ; హయసందోహమున్+కూల్చి= తేరు గుర్రాలను చంపి; హాస్యమునకున్= ఎగతాళికి; హాసంబు చేయన్= నవ్వగా; ఆతఁడు= ఆ కర్ణుడు; గదన్= గదను; భయదాకారతన్= భయంకరంగా; వైచెన్= వేసెను; ఆ భీముచేన్= ఆ భీముడివలన; అది భగ్నంబు+అయ్యెన్= ఆ గద ముక్కలయింది.

**తాత్పర్యం:** రాధాకుమారు డయిన కర్ణుడు వేగంగా పెద్ద విల్లును తీసికొని, దుర్జయు డయిన భీమసేనుడిని కొట్టాడు. ఆ భీముడు రేగి, కర్ణుడి సారథిని చావగొట్టి, అతడి విల్లును ముక్కలు చేస్తూ గుర్రాలను చంపాడు. ఎగతాళిగా నవ్వాడు. కర్ణుడు భయంకరంగా గదను విసిరాడు. దానిని భీముడు తునాతునకలు చేశాడు.

**వ. ఇట్లు గద ద్రుంచి పైపై నేయు పావని బరవసంబునకుం దెరలక యొండు కోదండంబు గొని కర్ణుం డతని తనుత్రాణంబు దునియలు సేసి పెల్లేసిన నతండును దదీయ కంకటంబును భుజంబును భేదించె; నిప్పరుసునఁ బాదచారియై పెనఁగు నయ్యోధవరుం జూచి భూవరుండు సత్వరుండై పనుపం జిత్ర విచిత్ర చిత్రాక్షచారు చిత్రులును చిత్రధ్వజ చిత్రాయుధ చిత్రకర్ములును శరాసారంబులు బరఁగించుచు ధర్మపుత్రానుజుం దాఁకిన నతండు మహావాత పతిత భూరుహ ప్రతతిభంగి దోఁప నక్కుమార సప్తకంబును, రథసప్తకంబును, రథసప్తి సారథి సహితంబుగాఁ బొడవడంగం జేసె; నా సందునఁ గల్పితస్యందనుం డై యాసూతనందనుం డప్పాండు నందనునిపై నురవడించిన. 215**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; గదన్+త్రుంచి= గదను ముక్కలుచేసి; పైపైన్+ఏయు= మీద మీద వేస్తున్న; పావని= పవన తనయుడైన భీముడి; బరవసంబునకున్+తెరలక= ధైర్యానికి చలింపక; ఒండు కోదండంబు కొని= వేరొక వింటిని తీసికొని; కర్ణుండు; అతని= భీముడి; తను త్రాణంబులు= శరీరాన్ని కాపాడుతూ ఉన్న కవచాలను; తునియలు చేసి= ముక్కలుగా చేసి; పెల్లు+ఏసినన్= మిక్కిలిగా కొట్టగా; అతండును= ఆ భీముడు కూడా; తదీయ= ఆ కర్ణుడి; కంకటంబును= కవచాన్ని; భుజంబును భేదించెన్= జబ్బను చీల్చాడు; ఈ+పరుసునన్= ఈ విధంగా; పాదచారియై= నడుస్తూ; పెనఁగు= యుద్ధం చేసే; ఆ+యోధవరున్+చూచి= ఆ వీర శిఖామణిని చూచి; భూవరుండు= రాజయిన దుర్యోధనుడు; సత్వరుండు+ఐ= తొందరతో; పనుపన్= పంపగా; చిత్ర విచిత్ర చిత్రాక్ష చారుచిత్రులును= ఈ పేర్లు గలవారు; చిత్రధ్వజ చిత్రాయుధ చిత్రకర్ములును= ఈ పేర్లున్నవారు; శరాసారంబులు= బాణవర్షాలు; పరఁగింపుచున్= వేస్తూ; ధర్మపుత్ర+అనుజున్+తాఁకినన్= ధర్మరాజు తమ్ముడిని ఎదుర్కొనగా; అతండు= ఆ భీముడు; మహావాత= పెనుగాలివలన; పతిత= పడిపోయిన; భూరుహప్రతతి భంగి తోఁపన్= చెట్ల వరుస మాదిరి తోచగా; ఆ+కుమారసప్తకంబును= ఆ ఏడుగురు కుమారులను; రథసప్తకంబును= ఏడు రథాలనూ; రథసప్తి సారథి సహితంబుగాన్= గుర్రాలను తేరులను సారథులను కూడా; పొడవు+అడంగన్+చేసెన్= ఆకారం నశింపగా చేశాడు (చంపాడు); ఆ సందునన్= ఆ వ్యవధిలో; కల్పిత స్యందనుండు+ఐ= రథాన్ని ఏర్పరచుకొనిన వాడై; ఆ సూతనందనుండు= ఆ సూతుడి కుమారుడు (కర్ణుడు); ఆ+పాండునందనునిపైన్= ఆ పాండు రాజకుమారుడిమీద; ఉరవడించినన్= దూకగా.

**తాత్పర్యం:** ఈ విధంగా గదను ముక్కలు చేసి మీద వేస్తూ దూకుతూ ఉన్న భీముడి ఉద్వేగానికి కలగిపోకుండా, వేరొక విల్లు తీసికొని, భీముడి కవచాన్ని ముక్కలు చేసి ఎక్కువగా కొట్టగా, ఆ భీముడు కర్ణుడి కవచాన్ని, జబ్బను చీల్చాడు. పాదచారి అయిన కర్ణుడు పెనగటం చూచిన దుర్యోధనుడు తన సోదరులను ఏడుగురను - చిత్ర, విచిత్ర, చిత్రాక్ష, చారుచిత్ర, చిత్రధ్వజ, చిత్రాయుధ, చిత్రకర్ములను భీముడి మీదికి పంపాడు. వారు ధర్మరాజు తమ్ముడిని ఎదుర్కొన్నారు. వారందరిని పెనుగాలికి పడిపోయే చెట్ల మాదిరిగా భీముడు పడగొట్టాడు. వారి రథాలనూ, గుర్రాలనూ సారథులనూ పడగొట్టాడు. ఆ వ్యవధానంలో మరొకరథాన్ని అమర్చుకొని కర్ణుడు భీముడి మీదకు దూకాడు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**క. అటిముటి నిరువుర శరములు । తఱుచుగ నొండొరుల బెట్టు దాఁకిన నయ్యి**
**ద్దఱు నెత్తుటఁ దోఁగి కడున్ । వఱలిరి కల్పాంత నవదివాకరుల క్రియన్. 216**

**ప్రతిపదార్థం:** అటిముటిన్= సంభ్రమంతో (తొట్రుపాటుతో); ఇరువుర శరములు= ఇద్దరి బాణాలు; తఱుచుగన్= దట్టంగా; ఒండొరులన్= ఒకరినొకరిని; బెట్టుతాఁకినన్= తీవ్రంగా తాకగా (ఎదుర్కొనగా); ఆ+ఇద్దఱు= ఆ కర్ణభీములు ఇర్వురును; నెత్తుటన్+తోఁగి= నెత్తురులో మునిగి; కడున్= మిక్కిలిగా; కల్పాంత= ప్రళయకాలంలోని; నవ= క్రొత్త; దివాకరుల క్రియన్= సూర్యుల మాదిరి; వఱలిరి= ఒప్పారు.

**తాత్పర్యం:** ఇద్దరి బాణాలు తత్తరగా, అధికంగా, తీవ్రంగా ఒకరివి మరొకరిని తాకగా, ఇద్దరు నెత్తుట తడిసి ప్రళయకాలపు క్రొత్త సూర్యులవలె ప్రకాశించారు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**క.** **అరదములు చిత్ర గతులం । జరియింపఁగ ధైర్యములును శౌర్యంబులు ను**
**ద్ధుర బాహా వీర్యంబులు । సరి యై మెఱయంగ నధిక సంరంభములన్.** **217**

**ప్రతిపదార్థం:** అరదములు= తేరులు; చిత్రగతులన్+చరియింపఁగన్= ఆశ్చర్యకరంగా అనేక విధాలుగా తిరుగాడగా; ధైర్యములు= (ఇద్దరి) ధైర్యాలును; శౌర్యంబులును= పరాక్రమాలును; ఉద్ధుర= దట్టమైన; బాహావీర్యంబులు= భుజబలాలును; సరి+ఐ= సమానంగా (అనగా కర్ణ భీముల వీరములు సమానంగా); మెఱయంగన్= ప్రకాశించగా (బయల్పడగా); అధిక= ఎక్కువైన; సంరంభములన్= ఆటోపాలతో.

**తాత్పర్యం:** వారి రథాలు ఆశ్చర్యకరంగా అనేక విధాలుగా తిరుగగా, ధైర్యశౌర్య బహువీర్యాలు సమానంగా ప్రకాశించగా, అధికమైన ఆటోపంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ.** **ఒండొరు మీఁద సాయకము లొక్క మొగిం బరఁగింతు రేపు మై**
**నొండొరు బాణముల్ నఱకి యుర్విపయిన్ నెఱయింతు రుగ్రులై**
**యొండొరు మేనులన్ శరము లుచ్చిచనన్ నిగిడింతు; రిట్టు లు**
**ద్దండతఁ బోరి రాఱని మదంబుల నొండొరు మీఱు నాసలన్.** **218**

**ప్రతిపదార్థం:** సాయకములు= అమ్ములను; ఒండొరు మీఁదన్= ఒకరిమీద నొకరు; ఒక్కమొగిన్+పరగింతురు= ఒక్క ఉదుటున వేస్తారు; ఏపుమైన్= బలంగా; ఒండొరు బాణముల్ నఱకి= ఒకరి బాణాలను ఇంకొకరు నరికివేసి; ఉర్విపయిన్= భూమిమీద; నెఱయింతురు= వ్యాపింప చేస్తారు; ఉగ్రులు+ఐ= కోపం గలవారయి; ఒండొరు మేనులన్= ఒకరి ఒంటిమీద ఇంకొకరు; శరములు= బాణాలు; ఉచ్చి చనన్= దూసికొని పోయేటట్లు; నిగుడింతురు= వేస్తారు; ఇట్టులు= ఈ ప్రకారంగా; ఆఱని మదంబులన్= చల్లారని దర్పాలతో (నశించని మదంతో); ఒండొరు మీఱు= ఒకరిని మరొకరు మించాలనే; ఆసలన్= కోరికలతో; ఉద్దండతన్= భయంకరంగా; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** ఒకరిమీద మరొకరు ఒక్క ఊపున బాణాలు వేస్తూ, ఒకరి బాణాలను ఇంకొకరు నరికివేస్తూ, భూమినిండా పడేటట్లు చేస్తూ, భయంకరువై, ఒకరి శరీరంలో మరొకరు బాణాలు దూసుకుపోనిస్తూ, తగ్గని మదంతో ఒకరినొకరు మించాలనే కోరికతో తీవ్రంగా యుద్ధం చేశారు.

**క.** **మరుదాత్మజుఁ డేచిన న । న్నరుఁడు హరియు సంతసంబునం బొదలుదు రు**
**ద్ధురతం గర్ణుఁడు మిగిలినఁ । గర ముబ్బు విభుండు దమ్ము గమియుం దానున్.** **219**

**ప్రతిపదార్థం:** మరుత్+ఆత్మజుఁడు= వాయుపుత్రు డయిన భీముడు; ఏచినన్= విజృంభించగా; ఆ+నరుఁడు హరియున్= ఆ అర్జునుడును, కృష్ణుడును; సంతసంబునన్= సంతోషంతో; పొదలుదురు= ఒప్పుతారు; ఉద్ధురతన్= గర్వంతో; కర్ణుఁడు మిగిలినన్= కర్ణుడు అతిశయించగా; విభుండు= రాజయిన దుర్యోధనుడు; తమ్ముగమియున్= తమ్ముల సమూహమును; తానున్= తానును; కరము+ఉబ్బున్= మిక్కిలి సంతోషిస్తాడు.

**తాత్పర్యం:** వాయుపుత్రు డయిన భీముడు (కర్ణుడిని) విజృంభిస్తే కృష్ణార్జునులును, దర్పంతో కర్ణుడు అతిశయిస్తే దుర్యోధనుడు, అతడి తమ్ములు చాలా సంతోషించారు.

**తే. సూతనందనునకు నెడ సొచ్చి చొచ్చి। సమదుఁ డగు భీమసేనుచేఁ జచ్చి చచ్చి**
**బలము లఱుగ నా కర్ణుండు దొలఁగిపోవఁ। జూచుఁ దెగిపోఁడు పడిన నీ సుతులఁ జూచి. 220**

**ప్రతిపదార్థం:** సూతనందనునకున్= కర్ణుడికి; ఎడచొచ్చి చొచ్చి= మధ్యలో వెళ్ళి వెళ్ళి; సమదుఁడు+అగు= మదంతో కూడిన; భీమసేనుచేన్= భీముడి చేతిలో; చచ్చి చచ్చి= చనిపోయి; బలములు= సేనలు; అఱుగన్= క్షయించగా; ఆ కర్ణుండు తొలఁగిపోవన్= ఆ కర్ణుడు తప్పుకొనిపోగా; చూచున్= చూస్తాడు; పడిన నీ సుతులన్+చూచి= చనిపోయిన నీ కుమారులను చూచి; తెగిపోఁడు= వెళ్ళిపోడు.

**తాత్పర్యం:** కర్ణుడికి కొంతదూరంగా వెళ్ళి, భీముడి చేత సేనలు చచ్చిపోగా, కర్ణుడు తొలగిపోవచూస్తాడు. కాని, యుద్ధంలో కూలిన నీ కుమారులను చూచి తాను తప్పుకోడు.

**వ. శోకంబునం గోపంబునం గర్ణు విక్రమాటోపంబు దీపించిన. 221**

**తాత్పర్యం:** దుఃఖంతో, కోపంతో కర్ణుడి శౌర్యం, ఆటోపం ప్రకాశించగా.

**క. గొడుగునను వింటి కొమ్ముల। సిడమున నరదంబునందు సెల లవిసి కడున్**
**వడి నిగిడెడు చాడ్పున న। వ్వడముడి దెస నమ్ము లడరె వసుధాధీశా! 222**

**ప్రతిపదార్థం:** వసుధాధీశా!= ఓ ధృతరాష్ట్ర చక్రవర్తీ!; గొడుగునను= (తేరు కున్న) గొడుగుతోను; వింటి కొమ్ములన్= వింటి దబ్బ కొమ్ములతోను; సిడమునన్= ధ్వజంతోను; సెల లవిసి= బాణాలు వేసి; కడున్= మిక్కిలి; వడి నిగిడెడు చాడ్పునన్= వేగంగా పడే విధంగా; ఆ+వడముడి దెసన్= ఆ భీముడి దిక్కుగా; అమ్ములు+అడరెన్= బాణములతిశయించాయి.

**తాత్పర్యం:** ఓ రాజా! భీముని గొడుగు మీద, వింటికొమ్ముల మీద, ధ్వజం మీద తేరి మీద మిక్కిలి వేగంగా పడేటట్లు కర్ణుని బాణాలు విజృంభించాయి.

**క. దానికి మనమున నించుక। యైనను దలఁకక సమీరణాత్మజుఁ డవి పై**
**రానీక నిలిపి యతనిం। దా నిరువది నారసములఁ దలరఁగఁజేసెన్. 223**

**ప్రతిపదార్థం:** దానికిన్= ఆ యుద్ధగతికి; సమీరణ+ఆత్మజుఁడు= వాయుపుత్రు డయిన భీముడు; ఇంచుకైనను= ఎంతమాత్రము (కొంచెమైనను); తలఁకక= జంకకుండా; అవి= ఆ బాణాలు; పైరానీక నిలిపి= మీరకుండా నిలిపి; అతనిన్= ఆ కర్ణుడిని; తాను= తాను (భీముడు); ఇరువది నారసములన్= ఇర్వై బాణాలతో; తలరఁగన్+చేసెన్= చలింపజేశాడు.

**తాత్పర్యం:** అందుకు భీముడు కాసంత అయినా జంకకుండా, ఆ బాణాలను పైకి రానీయకుండా, కర్ణుడు చలించేటట్టు ఇరువది బాణాలతో కొట్టాడు.

**వ. అప్పుడు. 224**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. మనవారు వారి వారలు । ననిలతనయు విక్రమంబు నగ్గింప సుయో**
**ధనుఁడు దనయొద్ది యోధుల । ననుజులనుం గర్ణుఁ గావుఁ డని పనుచుటయున్. 225**

**ప్రతిపదార్థం:** మనవారున్= మనసేనలోని వాళ్ళను (కౌరవులు); వారి వారలున్= పాండవులవైపు ఉన్నవారును; అనిల తనయు విక్రమంబున్= భీముడి శౌర్యాన్ని; అగ్గింపన్= పొగడగా; సుయోధనుఁడు= దుర్యోధనుడు; తన ఒద్ది= తన దగ్గరనున్న; యోధులన్= వీరులను; అనుజులన్= తోబుట్టువులను; కర్ణున్+కావుఁడు= కర్ణుడిని కాపాడండి; అని= అంటూ; పనుచుటయున్= పంపటమును.

**తాత్పర్యం:** మన సేనలూ, పాండవ పక్షంవారూ భీముడి పరాక్రమాన్ని పొగడుతూ ఉండగా, దుర్యోధనుడు తన దగ్గర ఉన్న వీరులనూ, తమ్ములనూ 'కర్ణుడిని కాపాడండి' అని పంపగా.

**భీమసేనుచేత శత్రుంజయాది కురుకుమారులు చచ్చుట (సం. 7-112-30)**

**వ. అప్పుడు శత్రుంజయుండును శత్రుసహుండును సుదేహుండును మదనుండును ద్రుముండును జిత్రబాహుండును వికర్ణుండును గర్ణ రక్షణ పరులై కడిమివెలయఁ దలకడచి యొక్కట భీమసేనుం దాఁకి ధరాధరంబు నంబుధారలం గప్పు జలధరంబుల చందంబున నతని నతినిబిడ పరంపరలఁ బొదవినం బెరిఁగిన దర్పంబునం బొదలి యతండు దృఢైకముష్టి నిర్ముక్తమార్గణ సప్తకంబున వారిం బిలుకుమార్చి యార్చిన, నా సింహనాదంబు విని ధర్మతనయుం డది విజయాగ్రజుండు నిజవిజయం బెఱింగించునట్లుగా నెఱింగి మనంబునం బొంగి ద్రోణుదెసకుఁ దఱిమి కయ్యంబు సేసె; నట్లు పలువురు దమ్ములు వొలిసిన దుర్యోధనుండు దనమనంబున జూదంబునప్పుడు విదురుండు సెప్పినట్ల యగుచున్నదని విషాదంబునొంది యా సభ నమ్మెయిఁ బాండవులఁ బఱచిన పాపఫలం బనుభవించె' ననవుడు వైచిత్రవీర్యుండు. 226**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయాన; శత్రుంజయుండును, శత్రుసహుండును, సుదేహుండును, మదనుండును, ద్రుముండును, చిత్రబాహుండును, వికర్ణుండును= ఈ పేర్లుగల దుర్యోధనుడి తమ్ములు; కర్ణ రక్షణపరులు+ఐ= కర్ణుడిని కాపాడటంలో ఆసక్తికలవారయి; కడిమి వెలయన్= పరాక్రమం ప్రకాశించగా; తల కడచి= ముందుకు దూకి; ఒక్కటన్= ఒక్కమారుగా; భీమసేనున్+తాఁకి= భీముడిని ఎదుర్కొని; ధరాధరంబున్= కొండను; అంబుధారలన్= వానతో; కప్పు= కప్పివేసే; జలధరంబుల చందంబునన్= మేఘాల మాదిరిగా; అతనిని= ఆ భీముడిని; అతినిబిడశరంబులన్= మిక్కిలి దట్టమయిన బాణాలతో; పొదవినన్= క్రమ్ముకోగా; పెరిఁగిన దర్పంబునన్= ఎక్కువయిన గర్వంతో; పొదలి= ఒప్పి; అతండు= ఆ భీముడు; దృఢ+ఏకముష్టి= గట్టిగా పట్టుకొన్న పిడికిలినుండి; నిర్ముక్త= వదలబడిన; మార్గణసప్తకంబునన్= ఏడు బాణాలతో; వారిన్+పిలుకుమార్చి= ఆ శత్రుంజయాదులను చంపి; ఆర్చినన్= సింహనాదం చేయగా; ఆ సింహనాదంబు= ఆ సింహనాదం; విని= విన్నవాడై; ధర్మతనయుండు= ధర్మరాజు; అది= ఆ అరచుట; విజయ+అగ్రజుండు= భీముడు; నిజవిజయంబు+ ఎఱింగించునట్లుగాన్= తన జయాన్ని తెల్పుతున్నట్లుగా; ఎఱింగి= తెలిసికొని; మనంబునన్= మనసులో; పొంగి= సంతోషించి; ద్రోణుదెసకున్= ద్రోణు డున్న వైపునకు; తఱిమి= (తన తేరును) తోలి; కయ్యంబు చేసెన్= యుద్ధం చేశాడు; అట్లు పలువురు= ఆ విధంగా చాలామంది; తమ్ములు= తన సోదరులు; పొలిసినన్= చనిపోగా; దుర్యోధనుండు తనమనంబునన్= తన మనస్సులో దుర్యోధనుడు; విదురుండు= విదురుడు; జూదంబు+అప్పుడు= (కౌరవపాండవులు) జూదం ఆడినప్పుడు; చెప్పిన+అట్లు+అ= చెప్పినట్లుగానే; అగుచున్+ఉన్నది+అని= జరుగుతూ ఉన్నదని; విషాదంబున్+ఒంది= విచారపడి; ఆ సభన్= ఆ కురుసభలో; ఆ+మెయిన్= ఆ విధంగా; పాండవులన్= పాండవులను; పఱచిన= అవమానించిన; పాపఫలంబు= పాపానికి ఫలం; అనుభవించెన్= అనుభవించాడు; అనవుడున్= అనగా విని; వైచిత్రవీర్యుండు= ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** శత్రుంజయుడు మొదలయిన వారు కర్ణుడిని కాపాడవలె ననే ఆసక్తితో ఒక్కుమ్మడిగా పరాక్రమం ఉట్టిపడే విధంగా ముందుకు వెళ్ళి, వర్షంతో మేఘమాల కొండను కప్పివేసే విధంగా భీముడిని చుట్టుముట్టి, బాణవర్షంతో కప్పివేశారు.

అందువలన పెరిగిన కోపంతో భీముడు పిడికిలి బిగించి గట్టిగా ఏడు బాణాలు వదలి, శత్రుంజయాది సోదరులను ఏడుగురిని చంపి సింహనాదం చేశాడు. ఆ సింహనాదం విన్న ధర్మరాజు ఆ శబ్దం భీముడు తన విజయాన్ని తెలుపటంగా గుర్తించి, మనసులో పొంగి, ద్రోణు డున్న వైపునకు చొచ్చుకొనిపోయి యుద్ధం చేశాడు. ఆ విధంగా తన తమ్ములు చాలామంది చనిపోగా దుర్యోధనుడు తన మనస్సులో. 'అలనాడు జూదమాడేటప్పుడు విదురుడు చెప్పినట్లే ఇప్పుడు జరుగుతున్న'దని దుఃఖించి, ఆ సభలో ఆ విధంగా పాండవులను అవమానించిన పాపఫలం ఈ విధంగా పొందాడు' - అని సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు.

**క. 'గతవృత్తములకు వగవం । గత మేమి? యతండు వెఱ్ఱి; కార్యము నా దు**
**ర్మతిఁ దప్పెఁ నోర్చి కొడుకుల । కత వినియెదఁ జెప్పు చెప్పఁగలయది యెల్లన్.' 227**

**ప్రతిపదార్థం:** గత వృత్తములకున్= జరిగిపోయిన కథలకు (వెనుకటి గాథలకు); వగవన్+కతము+ఏమి?= ఏడ్చుటకు కారణ మేముంది?; అతండు= ఆ దుర్యోధనుడు; వెఱ్ఱి= పిచ్చివాడు; కార్యము= చేయవలసిన పనిని; నా+దుర్మతిన్ తప్పెన్= నా చెడుబుద్ధి వలన తప్పిపోయింది; ఓర్చి= ఓర్చుకొని(ఓర్పుతో); కొడుకుల కత వినియెదన్= నా కుమారుల కథ నంతా వింటాను; చెప్పఁగల అది ఎల్లన్= చెప్పవలసిన దంతా; చెప్పు= చెప్పుము.

**తాత్పర్యం:** 'జరిగిపోయిన చరిత్రను తలచుకొని దుఃఖించటం దేనికి? దుర్యోధనుడు వెర్రివాడు. నా చెడ్డబుద్ధి వలననే తాను చేయతగిన పని తప్పిపోయింది. ఓర్మితో నా కొడుకుల కథనంతా వింటాను. నీవు చెప్పవలసిన దంతా చెప్పుము.'

**విశేషం:** ఈ పద్యంలో విధి బలవత్తరమనే సత్యమును ధృతరాష్ట్రుడు గుర్తించిన విషయం వ్యక్తమవుతూ ఉన్నది.

**వ. అనిన నతనికి సంజయుం డిట్లను 'న ట్లనిలజుఁ డార్చినం బేర్చి కర్ణుఁ డతనిపయిం గవిసి ఘోర సంగ్రామంబు సేయుచుండ నీ సేన భీమసేనుఁ జుట్టుముట్టిన నతండు బెట్టిదంబులగు భల్ల ప్రముఖ బాణంబులఁ గేతు ఛత్ర చామరంబులు సూతరథరథ్య రథికావయవంబులు దురంగమాతంగ సుభటాంగంబులుఁ దునియలై దొరఁగి పెరుఁగు నెత్తురుటేఱుల వెంబడిం బాఱంజేయుటయుఁ బతితశేషం బగు నబ్బలం బిరుగెలంకులం దొలంగి యంపవెట్టునేల కవుల సని చూచుచుండె; వెండియు రాధేయుండు రయంబున నతనిం దాఁకి పోరె; నట్టి యెడ నమ్మారుతనందనుండు. 228**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడికి; సంజయుఁడు+ఇట్లనున్= సంజయు డీ విధంగా అన్నాడు; అట్లు= ఆ ప్రకారంగా; అనిలజుఁడు= భీమసేనుడు; ఆర్చినన్= సింహనాదం చేయగా; పేర్చి= విజృంభించి; కర్ణుఁడు+అతని పయిన్+కవిసి= కర్ణుడు అతడి మీదకు దూకి; ఘోర సంగ్రామంబు= భయంకరమైన యుద్ధం; చేయుచుండన్= చేస్తూ ఉండగా; నీ సేన= నీ సైన్యం; భీమసేను చుట్టుముట్టినన్= భీముడిని క్రమ్ముకోగా; అతండు= ఆ భీముడు; బెట్టిదంబులు+అగు= బలమయిన; భల్లప్రముఖ= బల్లెములు మొదలుగా; బాణంబులన్= అమ్ములను; కేతుచ్ఛత్ర చామరంబులు= ధ్వజం, గొడుగు, చామరాలు; సూత రథ రథ్య రథికావయవంబులు= సారథులు, తేరులు, గుర్రాలు, సైనికుల అవయవాలు; తురంగ మాతంగ సుభటాంగంబులు= గుర్రాలు, ఏనుగులు, మంచి సైనికుల అవయవాలు; తునియలు+ఐ= ముక్కలుగా; తొరఁగి= దొరలి; పెరుఁగు= ఎక్కువయిన; నెత్తుఱుటేరుల వెంబడిన్= నెత్తురు ప్రవాహాల ననుసరించి; పాఱన్+చేయుటయున్= పరుగెత్తేటట్లుగా చేయగా; పతిత శేషంబు+అగు= పడిపోగా మిగిలిన; ఆ+బలంబు= ఆ సేన; ఇరు, కెలంకులన్+తొలంగి= రెండుప్రక్కలకు తప్పుకొంటూ;

అంపపెట్టు= బాణాల తాకిడి; నేలకున్= భూమికి; అవుల చని= అవతలికి పోయి; చూచుచుండెన్= చూస్తూ ఉండిపోయింది; వెండియున్= మరలా; రాధేయుండు= కర్ణుడు; రయంబునన్= శీఘ్రంగా; అతనిన్+తాఁకి= ఆ భీముడిని ఎదుర్కొని; పోరెన్= యుద్ధం చేశాడు; అట్టి ఎడన్= ఆ సమయంలో; ఆ+మారుత నందనుండు= ఆ భీమసేనుడు.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అనగా సంజయుడు ఈ విధంగా చెప్పాడు: 'భీముడి సింహనాదానికి కర్ణుడు విజృంభించి, అతడి మీదకు దూకి భయంకరమయిన యుద్ధం చేస్తూ ఉండగా, నీ సేన భీమసేనుని చుట్టు ముట్టింది. భీమసేనుడు బలమైన బల్లెములు మొదలైన వాడి బాణాలతో తేరుల కున్న పతాకలనూ సారథులనూ గుర్రాలనూ సుశిక్షితులయిన సైనికులనూ తునియలుగా చేసి, నెత్తుటి నదుల్లో కొట్టుకుపోయేటట్లు చేయగా, పడిపోగా మిగిలిన సేన ఇరువైపులకు తప్పుకొని బాణాలు పడేప్రదేశానికి దూరంగా వెళ్ళి చూస్తూ నిలబడింది. మళ్లీ కర్ణుడు వేగంగా భీముని ఎదుర్కొన్నాడు అపుడు భీముడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆభీలతఁ గర్ణుని క । ర్ణాభరణము చుక్కపడిన యట్లు పడఁగ సం**
**శోభిత శరమున నేసి మ । హాభల్ల మురస్ స్థలమ్ము నాడఁగ నేసెన్. 229**

**ప్రతిపదార్థం:** ఆభీలతన్= భయంకరంగా; కర్ణుని= కర్ణుడియొక్క; కర్ణాభరణము= చెవికుండలం; చుక్కపడినఅట్లు= నక్షత్రం రాలినట్లుగా; పడఁగన్= పడిపోయేటట్లు; సంశోభిత శరమునన్+ఏసి= బాగా వెలిగే బాణంతో కొట్టి; మహాభల్లము= పెను బల్లెమును; ఉరస్ స్థలమ్ము= గుండెలో; నాడఁగనేసెన్= నాటుకొనేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** కర్ణుడి చెవికుండలం చుక్క రాలిపడినట్లుగా పడేటట్లు బాగా వెలిగే బాణంతో భీముడు భయంకరంగా కొట్టి, ఒక పెద్ద బల్లెమును అతడి గుండెలో నాటుకొనేటట్లు వేశాడు.

**క. ఆలోనన యారథికుని । ఫాలస్థలి నోలి నెనయఁ బది నారసముల్**
**గీలించిన నవి యచ్చట । నీలోత్పలమాల వోలె నెఱయం బొలిచెన్. 230**

**ప్రతిపదార్థం:** ఆలోనన= అంతలోనే; ఆ రథికుని= ఆ కర్ణుడి; ఫాలస్థలిన్= నెన్నుదుటిలో; ఓలిన్= వరుసగా; ఎనయన్= పొందగా (ఒప్పి ఉండగా); పది నారసముల్= పది వాడి బాణాలను; కీలించినన్= నాటించగా; అవి= ఆ బాణాలు; అచ్చటన్= ఆ ముఖాన, గుండెలోను; నీలోత్పల మాలవోలెన్= నల్లకలువ దండవలె; పొలిచెన్= ఒప్పారాయి.

**తాత్పర్యం:** అంతలోనే ఆ కర్ణుడి నెన్నుదుట వరుసగా పది వాడిబాణాలను వేయగా అవి అతడి ముఖాన నల్ల కలువ దండవలె రాణించాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. అలిగి బాణశతంబున నాతఁ డతని । నొంచె; నవ్వీరు చాపంబు ద్రుంచె నతఁడు**
**పఱపె బలువింటఁ గర్ణుండు పటు శరములఁ । బట్టపవలింటి సూర్యుని ప్రభలు వొలయ. 231**

**ప్రతిపదార్థం:** అలిగి= కోపించి; బాణశతంబునన్= నూరు బాణాలతో; ఆతఁడు= ఆ కర్ణుడు; అతనిన్= ఆ భీముడిని; నొంచెన్= నొప్పించాడు; అతఁడు= ఆ భీముడు; ఆ+వీరుచాపంబున్= ఆ కర్ణుడి వింటిని; త్రుంచెన్= తునియచేశాడు; కర్ణుండు; బలువింటన్= పెద్ద విల్లుతో; పట్టపవలింటి= మిట్టమధ్యాహ్నమందలి; సూర్యుని ప్రభలు= సూర్యకాంతులు; పొలయన్= వ్యాపించగా; పటు= తీవ్రమైన; శరములన్= బాణములను; పఱపెన్= వేసెను.

**తాత్పర్యం:** కోపంతో కర్ణుడు నూరు బాణాలువేసి భీముడిని నొప్పించాడు. భీముడు కర్ణుడి విల్లు త్రుంచాడు. కర్ణుడు పెద్ద విల్లుతో పట్టపగలింటి సూర్యుడి కాంతి వ్యాపించినట్లు అనేక తీవ్ర బాణాలు భీముడిమీద వేశాడు.

**వ. ఇట్లేయు నా సూతనందను విల్లు విదుర్పు దోఁపక గుడుసువడుటఁ జక్రాకృతిం బొలుచు ననలశిఖల చెలువు దాల్చెఁ నట్టి రయంబునకు భయంబు గొనక భీముండు నిగిడించు హేమ లిప్తనారాచధారలు గగన లక్ష్మి కనకాభరణంబుల చెన్ను చేకొనియెఁ నప్పుడు కోపంబు రూపంబు గైకొన్న కైవడి నుదీర్ణుండై యక్కర్ణుండు. 232**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఏయు= ఈ విధంగా బాణాలు వేస్తున్న; ఆ సూతనందను= ఆ కర్ణుడి; విల్లు= ధనుస్సు; విదుర్పు= బాణాలు వదలటం; తోఁపక= అగుపించక; గుడుసు+పడుటన్= గుండ్రంగా అగుటచే; చక్ర+ఆకృతిన్+పొలుచు= చక్రాకారంలోఉన్న; అనలశిఖల= అగ్ని జ్వాలల; చెలువు= సొగసు; తాల్చెన్= పొందెను; అట్టి రయంబునకున్= అటువంటి వేగానికి; భయంబు కొనక= భయపడక; భీముండు నిగిడించు= భీముడు వేసే; హేమలిప్త= బంగారు పూత గల; నారాచధారలు= తీవ్రమయిన బాణాల వాదరలు; గగనలక్ష్మి= ఆకాశలక్ష్మియొక్క కనక+ఆభరణంబుల చెన్నున్= బంగారు నగల అందాన్ని; చేకొనియెన్= పొందెను; అప్పుడు; కోపంబు= కోపం; రూపంబు గైకొన్న కైవడిన్= ఆకారం పొందిన విధంగా, ఉదీర్ణుండు+ఐ= అతిశయించినవాడై

**తాత్పర్యం:** ఒకదాని వెంటఒకటిగా, అతివేగంగా బాణాలు వదలే కర్ణుడి వింటి యొక్క బాణాల విదిలింపు అగుపించక, అది అట్లె గుండ్రంగా వంగి ఉండటం వల్ల, చక్రాకారంలో ప్రవేశించే అగ్నిజ్వాలల సొంపుపొందింది. కర్ణుడు బాణాలు వేసే వేగానికి భయపడకా భీముడు ప్రయోగించే బంగారు పూతబాణాలు, ఆకాశలక్ష్మికి బంగారు ఆభరణాలు అందాన్ని పొందాయి. అప్పుడు కోపమేరూపెత్తినట్లు కర్ణుడు విజృంభించి(తరువాతి పద్యంతో అన్వయం)

**విశేషం:** అలంకారం: ఉపమ, ఉత్ప్రేక్ష.

**చ. పవనజు చాపమున్ హరుల పగ్గములుం దునుమాడి కాఁడితో**
**నవి పెనఁగాడఁగా వెడఁదయమ్మునఁ గేతువు గూల్చి సూతు మే**
**నవియగ నేసినం బఱచె నాతఁడు ఫల్గును చక్రరక్షు తే**
**రి వెనుకకుగ్రశక్తి యడరించెఁ జలింపక భీముఁ డత్తఱిన్. 233**

**ప్రతిపదార్థం:** పవనజు చాపమున్= భీముడి వింటిని; హరుల పగ్గములున్+తునుమాడి= గుర్రాల పగ్గాలను త్రెంచివేసి; అవి= ఆ గుర్రాలు; కాఁడితోన్= నొగలతో; పెనఁగాడఁగాన్= పెనగులాడగా; వెడద అమ్మునన్= విశాలమైన బాణంతో; కేతువు కూల్చి= తేరి పతాకాన్ని పడగొట్టి; సూతుమేను= సారథి ఒడలు; అవియఁగన్= బ్రద్దలయ్యేటట్లు (దెబ్బతినగా); ఏసినన్= కొట్టగా; ఆతఁడు= ఆ సారథి; ఫల్గును= అర్జునుడి; చక్రరక్షు తేరి వెనుకకున్= చక్రరక్షకుడగు భీముడి తేరి వెనుక ప్రక్కకు; పఱచెన్= పర్వెత్తాడు; ఆతఁడు= భీముడు; ఉగ్రశక్తి= భయంకరమైన శక్త్యాయుధాన్ని; అడరించెన్= వేశాడు; ఆ+తఱిన్= ఆ సమయాన; భీముఁడు; చలింపక= జంకకుండా.

**తాత్పర్యం:** కర్ణుడు భీముడి విల్లును త్రుంచాడు, గుర్రాల పగ్గాలను త్రెంచాడు. ఆ గుర్రాలు కాడితో పెనగులాడగా పెద్ద బాణంతో పతాకాన్ని పడగొట్టాడు. సూతుడి శరీరం చీలేటట్లు కొట్టగా అతడు అర్జునుడికి చక్రరక్షకుడి తేరు వెనుకకు పరుగెత్తాడు. ఆ సమయంలో భీముడు బెదరకుండా భయంకరమైన శక్త్యాయుధాన్ని ప్రయోగించాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అది సూతనందనుఁడు దొ । మ్మిది శరములఁ దునుముటయు సమీరసుతుఁడు బె**
**ట్టిదముగ వాలుఁ బలకయు । న్మదమునఁ గొన నతఁడు పలక నఱకె; నఱకినన్. 234**

**ప్రతిపదార్థం:** అది= ఆ శక్తిని; సూతనందనుఁడు= కర్ణుడు; తొమ్మిది శరములన్= తొమ్మిది బాణాలతో; తునుముటయున్= త్రుంచుటయు; సమీరసుతుఁడు= వాయునందనుడైన భీముడు; బెట్టిదముగన్= గట్టిగా; వాలున్= కత్తియు; పలకయున్= పలకను; మదమునన్+కొనన్= గర్వంతో తీసికొనగా; అతఁడు= ఆ కర్ణుడు; పలక నఱికెన్= పలకను నరికాడు; నఱకినన్= ఆ విధంగా నరకగా.

**తాత్పర్యం:** ఆ శక్తిని తొమ్మిది బాణాలతో కర్ణుడు త్రుంచాడు, అపుడు భీముడు బలమయిన కత్తిని, పలకను దర్పంతో తీసికొన్నాడు. కర్ణుడు ఆ పలకను నరికాడు. అట్లా నరకగా (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. కరవాలంబున వైచి యా రథికువిల్ ఖండింప నొండొక్క ని**
**ష్ఠుర చాపం బతఁ డెత్తునంతకు జవాటోపంబుఁ గోపంబు మ**
**చ్చరముం దేటపడన్ వియచ్చరులు మెచ్చన్ భీముఁ డా సూతసూ**
**తి రథం బల్లల నాడ దానిపయికిం దెం పొప్ప లంఘించినన్. 235**

**ప్రతిపదార్థం:** కరవాలంబునన్ వైచి= కత్తితో కొట్టి; ఆ రథికువిల్ ఖండింపన్= ఆ వీరుడి (కర్ణుడి) వింటిని ముక్కలు చేయగా; అతఁడు= ఆ కర్ణుడు; ఒండొక్క= ఇంకొక; నిష్ఠుర చాపంబున్= కఠినమైన వింటిని; ఎత్తునంతకున్= చేతికి తీసికొనేటంతలో; జవాటోపంబున్= వేగంయొక్క విజృంభణము; కోపంబు= కోపము; మచ్చరమున్= ద్వేషము; తేటపడన్= బయల్పడగా; వియచ్చరులు= దేవతలు; మెచ్చన్= మెచ్చుకొనగా; భీముఁడు= భీమసేనుడు; ఆ సూతసూతి= ఆ కర్ణుడి; రథంబు+అల్లలన్+ఆడన్= తేరు అల్లాడగా (తేరు ఊగిపోగా); దాని పయికిన్= ఆ తేరు మీదకు; తెంపు+ఒప్పన్= సాహసంతో; లంఘించినన్= దూకగా.

**తాత్పర్యం:** భీముడు కత్తిని విసరి కర్ణుడి వింటిని విరిచాడు. కర్ణుడు వేరొక విల్లును ఎత్తుకొనేటంతలో నేర్పూ, దర్పమూ, ద్వేషమూ తేటపడేటట్లు, దేవతలు మెచ్చుకోగా, విధంగా కర్ణ డుండే రథం అల్లలనాడేటట్లు, సాహసంతో భీము డా తేరిమీదికి దూకాడు.

**వ. అతండు కేతనంబునకుం గుదురుగాఁ బెనుపొనరం గావించిన పీఠంబు నడుగున నొదింగినం దేరిపయి నతనిం గానక భీమసేనుండు నలుదిక్కులుం బరికించి యతని పాఱుటయు లేకున్న, నయ్యరదంబు క్రిందఁ దూఱెనను తలంపున నతనిం బట్టికొనువాఁడై డిగ్గనుఱుకుటయుం, దోడన తోఁచి రాధేయుండు రథచిత్రగతులు మెఱయ రయంబారఁ బెక్కునారాచంబు లొక్కమొగిం దనువునఁ జొనుపుచు నేచిన నయ్యనిలతనయుండు సాధన వైకల్యంబున వెడంగు పడియును వెన్నీక మున్ను వివ్వచ్చుచేతం జచ్చిన సామజంబుల హయంబులఁ బుచ్చికొని డాచేత నొడ్డుకొనుచు వలచేత వైచుచుఁ బెనంగె; నవియును వివిధ విశిఖంబులఁ దునియలు సేయుచు నెఱకులు నో నేయుచుఁ గర్ణుండు గదిసి తఱుమఁ దదీయ స్యందనంబునకు దుర్గమం బగు నని యతం డర్జునాస్త్ర పతితంబు లైన చతురంగంబుల తిట్టల యోలంబు సొచ్చిన. 236**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ కర్ణుడు; తన కేతనంబునకున్= తన ధ్వజానికి; కుదురుగాన్= క్రింద చుట్టు కుదురుగా (పీఠంగా); పెనుపు+ఒనరన్+కావించిన= గొప్పగా చేసిన; పీఠంబు అడుగునన్= పీటక్రింద; ఒదింగినన్= దాగుకొనగా; తేరిపయిన్= తేరిమీద; అతనిన్+కానక= అతడిని చూడక; భీమసేనుండు; నలుదిక్కులు పరికించి= నాలుగు దిక్కులా చూచి; అతని పాఱుటయు లేకున్నన్= వాడు పరుగెత్తుటకూడా లేకపోగా; ఆ+అరదంబు క్రిందన్= ఆ తేరు క్రిందుగా; తూఱెన్+అను తలంపునన్= దూరి ఉండవచ్చుననే భావంతో; అతనిన్+పట్టుకొనువాఁడై= కర్ణుడిని పట్టుకొనవలెనని; డిగ్గన్+ఉఱుకుటయున్= క్రిందికి దూకగా; తోడన

తోఁచి= వెంటనే కనబడి; రాధేయుండు= కర్ణుడు; పెక్కు నారాచంబులు= అనేకములైన వాడిబాణాలను; ఒక్క మొగిన్= ఒక్క వరుసగా; తనువునన్ చొనుపుచున్= ఒంటిమీద వేస్తూ; ఏచినన్= విజృంభించగా; ఆ+అనిల తనయుండు= ఆ భీమసేనుడు; సాధన వైకల్యంబునన్= ప్రయత్నం విచ్ఛేద మయినందున; వెడంగు పడియును= భయపడి కూడా; వెన్ను+ఈక= వీపు చూపకుండా (పారిపోక); మున్ను= అంతకుముందు; విచ్చుచేతన్+చచ్చిన= అర్జునుడిచేత చచ్చిన; సామజంబుల= ఏనుగులను; హయంబులన్+పుచ్చికొని= గుర్రాలను తీసికొని; డాచేతన్= ఎడమచేతితో; ఒడ్డుకొనుచున్= అడ్డం పెట్టుకొంటూ; వలచేత వైచుచు= కుడిచేతితో కొట్టుతూ; పెనంగెన్= యుద్ధం చేశాడు; అవియును= ఆ ఏనుగులు, గుర్రాలూ; వివిధ విశిఖంబులన్ తునియలు చేయుచున్= అనేక రకాలయిన బాణాలతో ముక్కలు చేస్తూ; నెఱఁకులు= మర్మములను; నోన్+ఏయుచున్= నొవ్వచేస్తూ; కర్ణుండు కదిసి తఱుమన్= కర్ణుడు క్రమ్ముకొని తరుమగా; తదీయస్యందనంబునకున్= అతడి తేరుకు; దుర్గమంబు+అగునని= పోలేక (ముందుకు) పోవునని; అతండు= ఆ భీముడు; అర్జున+అస్త్ర పతితంబులు+అయిన= అర్జునుడి బాణాలకు పడిన (నేలరాలిన); చతురంగంబుల తిట్టలన్= చతురంగ బలాల గుట్టలలో; ఒలంబు సొచ్చినన్= మరుగు చొచ్చి పోగా.

**తాత్పర్యం:** కర్ణుడు, తన ధ్వజానికి క్రింద కుదురుగా చేసిన పీఠం క్రింద దాగుకొన్నాడు. భీము డాతడిని వెదకుతూ తేరు మీద కన్పించకపోగా, నాలుగు దిక్కులా చూచి, అతడు పారిపోవటంకూడ కనబడకపోయేసరికి, తేరు క్రింద దూరుకొన్నాడని తలంచి తానూ క్రిందకు పోయి పట్టుకొనవలె భీముడు రథం మీద నుండి క్రిందికి దూకాడు వెంటనే కర్ణుడు పీఠం క్రింది నుండి బయటికి వచ్చి, తన రథం చిత్రగతుల మేరయగా, వేగంగా అనేక బాణాలను భీముని శరీరంలో గ్రుచ్చుకొనేటట్లు వేశాడు. అందుకు భీముడు తన ప్రయత్నం భంగమయినందుకు భయపడినప్పటికినీ వెనుకాడకుండా, అంతకుముందు అర్జునుడిచేత చంపబడిన యుద్ధరంగంలోని గుర్రాలను, ఏనుగులను ఎడమచేతితో తనకు అడ్డం పెట్టుకొంటూ, కుడిచేత కర్ణుడి మీద విసురుతూ యుద్ధం చేశాడు. కర్ణుడు వివిధ బాణాలతో ముక్కలు చేస్తూ, మర్మస్థానాలను నొప్పిస్తూ భీముని తరుమగా, భీముడు తన రథం మీదికి వెళ్ళటం సాధ్యం కానిపని అని తలచి, అర్జునుని బాణాలచేత చచ్చిపడి ఉన్న చతురంగబలాల గుట్టల చాటున దాగుకొన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. మొనలతోడను దనతోడ మున్ను పెనఁగి । శ్రమము నొందియు న ట్లరదమున కరిగి**
**వెండియును బోరి కడు డస్సి బెండు వడిన । యన్నిరాయుధుఁ జూచి సూతాత్మజుండు. 237**

**ప్రతిపదార్థం:** మొనలతోడను= సైన్యాలతోను; తన తోడన్= తనతోను (కర్ణుడితో); మున్ను పెనఁగి= ఇదివరకే యుద్ధం చేసి; శ్రమమున్+ఒందియున్= అలసిపోయికూడా; అట్లు+అరదమునకు+అరిగి= ఆ ప్రకారంగా తేరి క్రిందకు పోయి; వెండియును= మరల; పోరి= యుద్ధం చేసి; కడు డస్సి= మిక్కిలి అలసిపోయి; బెండుపడిన= (తేలిక అయిన) బలాన్ని కోలుపోయిన; ఆ+నిరాయుధున్+చూచి= ఆ ఆయుధాలు లేని వాడిని చూచి (అస్త్ర శస్త్రములు లేనివాడిని); సూత+ఆత్మజుండు= కర్ణుడు.

**తాత్పర్యం:** సేనలతోనూ, తనతోనూ యుద్ధం చేసి అలసిపోయి, ఆ విధంగా తేరుక్రిందికి దిగి, తనతో యుద్ధం చేసి మిక్కిలి అలసి బలహీనుడయిన ఆ ఆయుధహీనుడిని చూచి కర్ణుడు.

**క. మనమునఁ గుంతీవాక్యం । బును నొలసిన నేయు టుడిగి పోయి కదిసి న**
**వ్వున మోమొప్ప నతని కి । ట్లను వింటం గడుపు లీల నల్లఁ బొడుచుచున్. 238**

**ప్రతిపదార్థం:** మనమునన్= తన మనస్సులో (కర్ణుడి మనస్సులో); కుంతీవాక్యంబును= కుంతి మాటలను (ఉద్యోగ పర్వంలో కుంతి కర్ణుడి జన్మాదికాలను చెప్పినప్పటిమాటలను, ఆ సందర్భంలో ఒక్క అర్జునుడిని దక్క తక్కిన పాండవులలో ఎవ్వరినీ చంపనని ఇచ్చిన మాటను); ఒలసినన్= తలపునకు రాగా; ఏయుట+ఉడిగి= బాణాలు వేయటం మాని; పోయి= భీముడి దగ్గరకు పోయి; కదిసి= తాకి; నవ్వున మోము+ఒప్పన్= నవ్వుతో తన మొగముండగా; వింటన్= విల్లుతో; లీలన్= విలాసంగా; అల్లన్+పొడుచుచున్= నెమ్మదిగా గ్రుచ్చుతూ; అతనికిన్= ఆ భీముడితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు.

**తాత్పర్యం:** కుంతి కిచ్చిన మాటలు గుర్తు రాగా, కర్ణుడు బాణాలు వేయటం ఆపి, భీముడికి దగ్గరగావెళ్ళి, నవ్వుమొగంతో తన విల్లును వాని కడుపుమీద అలవోకగా పొడుస్తూ (ఎగతాళిగా) ఇట్లా అంటున్నాడు:

**కర్ణుండు భీమసేను నవమానించి నీచోక్తులు పలుకుట (సం. 7-114-69)**

**ఆ. 'తిండిపోత! నీకు భండనం బేటికి? । గడవఁ జేరి మనసు కాంక్ష దీఱ**
**నోపుకొలఁది మ్రింగి యూరక నీ వింటి । కడన యుండు మింక నడిచి పడక.' 239**

**ప్రతిపదార్థం:** తిండిపోత!= తిండిమీదనే ఆశ కలవాడా! నీకు భండనంబు+ఏటికిన్= నీకు యుద్ధమెందుకు?; మనసు కాంక్షతీఱన్= మనసులోని ఆశ తీరేటట్లుగా; కడవన్+చేరి= అన్నంవండిన కుండను సమీపించి; ఓపుకొలఁది= శక్తి ఉన్నంతదాకా; మ్రింగి= తిని; నీవు+ఇంటి కడన= నీవు ఇంటివద్దనే; ఊరక ఉండుము= ఊరకుండుము (అనగా నోరు మూసికొని ఉండుము); ఇంకన్= ఇక మీదట; అడిచిపడకు= త్రుళ్ళిపడకుము.

**తాత్పర్యం:** 'ఓరీ తిండిపోత! నీకు తిండితిప్ప యుద్ధ మెందుకు? నీ మనసులో ఆశతీరేటట్లుగా భోజనపాత్ర వద్దకు చేరి, చాలినంతతిండిని మ్రింగి, ఇంటివద్దనే ఊరక కూర్చొనుము. త్రుళ్ళింత వద్దు.'

**వ. అని మఱియును. 240**

**తాత్పర్యం: అని, ఇంకను.**

**క. వనమున ఫలమూలంబులు । దిని ముని వై యుందుగాక ధీరోద్ధతిమై**
**నని సేయ నీకు వచ్చునె? । చను మచటికి నుడిఁగి మడఁగి శాంతుఁడపోలెన్. 241**

**ప్రతిపదార్థం:** వనమునన్= అడవిలో; ఫలమూలంబులు= పండ్లు, దుంపలు; తిని; మునివై ఉందు(వు)కాక!= ఋషివై ఉంటావుకాని; ధీరోద్ధతిమైన్= ధైర్యంతోనూ, దర్పంతోనూ; అని చేయన్= యుద్ధం చేయటానికి; నీకు వచ్చునె?= నీ చేత నవుతుందా?; అచటికిన్= ఆ వనాలకు; ఉడిఁగి= యుద్ధంమాని; మడిఁగి= అడగి; శాంతుఁడ పోలెన్= శాంతమూర్తివలె; చనుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** అడవిలో పండ్లనూ కందమూలాలనూ తింటూ మునివృత్తితో ఉందువుగాక! దర్పంతో విజృంభించి యుద్ధం చేయటం నీ వల్ల అవుతుందా? యుద్ధంమాని, తగ్గి శాంతమూర్తివలె ఆ వనాలకు వెళ్ళుము.

**వ. అట్లు నీ యొడ లుండ దేని. 242**

**తాత్పర్యం:** ఆ విధంగా నీ ఒడ లుండకుంటే.

**క. చేయలఁతిం గని సమరము । సేయుము; నను బోఁటి తోడఁ జెనయకు; నరనా**
**రాయణులు వారె యచటికిఁ । బోయెదవేఁ బోయి బ్రదుకుపొంక ముడుగుమీ!' 243**

**ప్రతిపదార్థం:** చే+అలఁతిన్+కని= నీ చేయియొక్క ఒడుపును గుర్తించి; సమరము చేయుము= యుద్ధం చేయుము; ననుబోఁటి తోడన్= నావంటి వాడితో; చెనయకు= ఎదిరించవద్దు; నరనారాయణులు వారె= అదిగో నరనారాయణులు వారున్నారు; అచటకిన్+పోయెదవేన్= అక్కడికి పోతే; పోయి బ్రదుకు= అటుపోయి బ్రదికిపో; పొంకము+ఉడుగుమీ!= గర్వము వదులు సూమా; వదలుమా!

**తాత్పర్యం:** నీ చేతి సత్తా తెలిసికొని యుద్ధం చేయుము. నా బోటివాడితో తలపడవద్దు. అరుగో నరనారాయణులు వారే! అక్కడకు పోతే పోయి బ్రదుకు. గర్వము వదలుకొమ్ము.'

**విశేషం:** ఈ పద్యంలో కర్ణుడు తనకున్న అక్కసునంతా వెళ్ళబోసికొన్నాడు. భీముడు తనతో కయ్యానికి తగిన చేవ లేనివాడని, కృష్ణార్జునుల నీడలో బ్రదికిపోవటం మంచి దనీ, ధ్వనివిశేషంతో మాట్లాడాడు.

**క. అని పలికె నట్టియెడఁ గృ । ష్ణుని పనుపున నర్జునుండు సునిశిత నారా**
**చనితాంతపాతముల నా । తనిఁ బిఱుసనఁ జేసి భీము దైన్యము వాఁపెన్. 244**

**ప్రతిపదార్థం:** అని పలికెన్= అని మాట్లాడాడు (కర్ణు డా విధంగా ఎగతాళిగా మాట్లాడాడు); అట్టి ఎడన్= ఆ సమయాన; కృష్ణుపనుపునన్= కృష్ణుడి ఉత్తరువుతో; అర్జునుఁడు= అర్జునుడు; సునిశిత= మిక్కిలి వాడి అయిన; నారాచ= నారసముల (వాడిబాణాల); నితాంతపాతములన్= ఎడతెగని ధారతో (వర్షధారవలె బాణాలను కురిపించటంతో); ఆతనిన్+పిఱుసనన్= అతడు వెనుకకు వెళ్ళేటట్లుగా; చేసి; భీముదైన్యము+పాపెన్= భీముడి దుఃఖాన్ని తొలగించాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా కర్ణుడు మాట్లాడి భీముడిని దీనునిచేయగా, కృష్ణుడి ఉత్తర్వుతో అర్జునుడు ఎడతెగని వాడి బాణాల వానతో ఆతడు వెనుతిరిగిపోయేటట్లు చేసి, భీముడి దుఃఖాన్ని పోగొట్టాడు.

**క. మండెడు బలునారసముల । వెండియు నా రజ్జులాని వివ్వచ్చుం డు**
**ద్దండత నేసిన యెడ నవి । ఖండించెను గురుసుతుండు గర్వం బలరన్. 245**

**ప్రతిపదార్థం:** మండెడు= మండుతూ ఉండే; బలు నారసములన్= పెను బాణాలతో; వెండియున్= మరల; ఆ రజ్జులానిన్= వ్యర్థమైన మాటలు మాట్లాడేవాడిని (పనికిరాని మాటలాడే వాడిని); వివ్వచ్చుండు= అర్జునుడు; ఉద్దండతన్= ఎక్కువగా; ఏసిన ఎడన్= (బాణాలు వేసి) కొట్టగా; గురుసుతుండు= అశ్వత్థామ; గర్వంబు+అలరన్= పొగరు వికసించగా; అవి= ఆ బాణాలను; ఖండించెను= త్రుంచివేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు మండుతూ ఉండే బలమైన బాణాలతో పనికిమాలిన మాటలు మాట్లాడే కర్ణుడిని మళ్ళీ కొట్టగా వాటి నన్నిటినీ గురుపుత్రు డయిన అశ్వత్థామ గర్వంతో త్రుంచివేశాడు.

**వ. అప్పు డశ్వత్థామ యఱువది నాల్గు నారసంబుల నొప్పించిన నన్నరుండు నిలు నిలు మని యదలించినం దెరలి యతండు కరులగమిఁ జొచ్చె; నాలోనన యమ్మారుతి సారథి యగు విశోకుండు తేరాయితంబు సేసి తెచ్చిన నెక్కి యాతండు విన్నని మొగంబుతోడఁ గవ్వడి కడకుఁ జనియె; నప్పుడు సాత్యకియు నద్దిక్కునకు సగర్వగమనంబునం బోయె' ననిన విని వైచిత్రవీర్యుండు సంజయునితో ని ట్లనియె. 246**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయాన; అశ్వత్థామ; అఱువదినాల్గు నారసంబులన్= అరవై నాలుగు వాడిబాణాలతో; నొప్పించినన్= బాధించగా; ఆ+నరుండు= ఆ అర్జునుడు; నిలుము+నిలుము+అని అదలించినన్= ఆగాగుమని అదరించగా; తెరలి= తొలగి; అతండు= అశ్వత్థామ; కరులగమిన్= ఏనుగుల గుంపులో; చొచ్చెన్= దూరాడు; ఆలోనన= అంతలోనే; ఆ+మారుతి సారథి అగు= ఆ భీముడి తేరు తోలేవాడైన; విశోకుండు= విశోకుడనే పేరున్నవాడు; తేరు+ఆయితంబు చేసి= తేరును సిద్ధం చేసి; తెచ్చినన్= తీసికొని రాగా; ఎక్కి; ఆతండు= భీముడు; విన్నని మొగంబు తోడన్= చిన్నబోయిన మొగంతో; కవ్వడికడకున్+చనియెన్= అర్జునుడి ఒద్దకు వెళ్ళాడు; అప్పుడు సాత్యకియున్= ఆ సమయంలో సాత్యకికూడా; ఆ+దిక్కునకున్= ఆ అర్జును డున్న వైపునకు; సగర్వ= గర్వంతో కూడుకొన్న; గమనంబునన్= నడకతో; పోయెన్+అని= పోయాడని; విని; వైచిత్రవీర్యుండు= ధృతరాష్ట్రుడు; సంజయునితోన్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** అపు డశ్వత్థామ అరవైనాలుగు బాణాలు వేసి నొప్పించాడు. దానికి అర్జునుడు ఆగుమాగుమని అతడిని హెచ్చరించాడు. అతడు తొలగిపోయి ఏనుగుల గుంపులో దూరాడు. ఈలోగా భీముడి సారథి విశోకుడనేవాడు

ఇంకొక తేరును సిద్ధం చేసి తెచ్చాడు. భీము డా తేరెక్కి ఖిన్నుడుగా అర్జునుడి యొద్దకు చేరాడు. ఆ సమయాన సాత్యకి అర్జును డుండే చోటికి సగర్వంగా నడుస్తూ వెళ్ళాడు. అని చెప్పగా విన్న ధృతరాష్ట్రుడు సంజయుడితో ఈ విధంగా అన్నాడు:

**క. 'బలియురతోఁ బగ గొనినం । గలుగునె మే లెల్లభంగిఁ గౌంతేయులకుం**
**గల పా లీఁ దగుఁ దోడ్తోఁ । గలిమియు గీర్తియును బొలియఁగా విన వశమే? 247**

**ప్రతిపదార్థం:** బలియురతోన్= బలవంతులతో; పగ కొనినన్= వైరం తెచ్చుకొంటే; కలుగునె మేలు?= క్షేమం కలుగుతుందా?; ఎల్లభంగిన్= అన్ని విధాలుగా; కౌంతేయులకున్+కలపాలు= పాండవుల కున్న భాగాన్ని; తోడ్తోన్= వెంటనే; ఈన్+తగున్= ఇవ్వటం మంచిది; కలిమియున్= సంపదయును; కీర్తియును= మంచిపేరును; పొలియగాన్= నశించగా; వినన్ వశమే?= వినగలమా?

**తాత్పర్యం:** బలవంతులతో వైరం వలన క్షేమం కలుగుతుందా? ఏ విధంగా చూచినా పాండవుల పాలు వెంటనే ఇచ్చివేయటం మంచిది. (లేకుంటే) సంపదా, కీర్తి చెడిపోవటాన్ని వినగలమా?

**క. విను మడుగులపైఁ బడి యై । నను, నెంగిలి గుడిచి యైన నరులకుఁ బగ బోఁ**
**గొని యరుల కినుకడఁచి బ్రదు । కనవలయు నిహమ్ముఁ బరముఁ గలుగునె చెడినన్? 248**

**ప్రతిపదార్థం:** వినుము= (ఓ సంజయా!) వినుము; అడుగులపైన్+పడి ఐనను= కాళ్ళమీద పడి అయినా; ఎంగిలి కుడిచి ఐనన్= ఎంగిలి తిని ఐనా; నరులకున్= మానవులకు; పగ= వైరం; పోఁగొని= పోగొట్టుకొని; అరుల కినుక= శత్రువుల కోపాన్ని; అడఁచి= పోగొట్టి; బ్రదుకన వలయున్= బ్రదుకవలయును; చెడినన్= చెడిపోతే (నాశమైతే); ఇహమ్మున్+పరమున్= ఇహపరాలు (అనగా బ్రదికి ఉన్నపుడు కానీ చనిపోయిన తరువాత కానీ సుఖం); కలుగునె?= కలుగుతుందా?

**తాత్పర్యం:** సంజయా! వినుము. శత్రువుల పాదాల మీద పడిగాని, వాళ్ళ ఎంగిలి తినిగాని, వాళ్ళ కోపాన్నిపోగొట్టి, పగను వదలి బ్రతకటం మానవులకు మంచిది. నాశనమైపోతే ఇహపరాలు (ఇహలోకపరలోక సుఖాలు) ఉంటాయా?

**క. తా నెఱుఁగఁ డొరులు సెప్పిన । నైనను విననేరఁ డట్టి యతిబాలిశు నిం**
**కే నే మందుఁ? గొడుకు దు । ర్మాని గనునె బ్రదుకు పోకరాకలు దెలియన్. 249**

**ప్రతిపదార్థం:** తాను+ఎఱుఁగఁడు= తనకు తెలియదు; ఒరులు= ఇతరులు; చెప్పిన నైనను= చెప్పినప్పటికినీ; విన నేరఁడు= వినటానికి ఇష్టపడడు; అట్టి= అటువంటి; అతిబాలిశున్= పెద్ద మూర్ఖుడిని; ఏమని+అందున్?= ఏ మనగలను?; కొడుకు= కుమారుడు; దుర్మాని= దురభిమానం కలవాడు; బ్రదుకు పోక రాకలు= ప్రాణం పోవటం, రావటం; కనునె?= గుర్తించునా?

**తాత్పర్యం:** మిక్కిలి మూర్ఖుడయిన నా కొడుకు దురభిమాని. తనకు తెలియదు ఇంకొకరు చెపితే వినడు. బ్రదుకు రాకపోకలు తెలియని ఆ మూర్ఖుడు అయిన కొడుకును నే నే మనగలను?

**విశేషం:** దుర్యోధనుడి మౌర్ఖ్యం వలన ధృతరాష్ట్రుడు పొందిన ఆరాటానికి ఈ పద్యం ఒక దృష్టాంతం మాత్రమే.

**వ. అది యట్లుండె. 250**

**తాత్పర్యం:** దాని నట్లా ఉండనిమ్ము.

**ఆ. గురునిఁ గడచి నరుఁడు కురుసేన సొచ్చిన । యపుడ తెగియెఁ గార్య; మదియుఁ గాక**
**కలసి రట్టి బల్లిదులు భీమసాత్యకు । లకట! సైంధవుండు హతుఁడ కాఁడె! 251**

**ప్రతిపదార్థం:** గురునిన్= ద్రోణుడిని; కడచి= దాటి; నరుఁడు= అర్జునుడు; కురుసేన చొచ్చిన అపుడు+అ= కౌరవసేనలోకి దూసికొని వచ్చినపుడే; కార్యము= పని (మనపని); తెగియెన్= తీరింది; అదియున్+కాక= అంతే కాకుండా; అట్టి బల్లిదులు= నరుని వంటి బలవంతులు; భీమసాత్యకులు= భీముడు సాత్యకికూడా; కలసిరి= చేరుకొన్నారు; అకట!= అయ్యో!; సైంధవుండు హతుఁడు+అ కాడె!= సైంధవుడు చచ్చినట్టే!

**తాత్పర్యం:** గురువైన ద్రోణాచార్యుడిని అర్జునుడు దాటి, కౌరవసేనలోనికి దూసుకొని వచ్చినపుడే మనపని అయిపోయింది. అతడికి తోడుగా అంతటి బలశాలులు భీముడూ, సాత్యకీ చేరుకొన్నారు. అయ్యో! ఇక సైంధవుడు చచ్చిపోకుండా ఉండగలడా?

**వ.** **సమర విశేషంబు తెఱంగెఱింగింపు' మనిన నమ్మహీపతి కతం డిట్లను 'నట్లు శైనేయుండు గౌంతేయులఁ గూడం బోవ నలంబుసుం డనురాజు బలంబు మెఱయ నతని మార్కొనిన నయ్యిరువురకుఁ బరస్పర బాణభంజనంబును వర్మ విదారణంబును మర్మభేదనంబును ధనుర్దళనంబును భూచర ఖేచర విస్మయ కరంబును నగు సంగరం బయ్యె; నొక్కింత సేపునకు నాశినిపుంగవుండు.** **252**

**ప్రతిపదార్థం:** సమర విశేషంబు= యుద్ధవిశేషాల; తెఱంగు= పద్ధతి; ఎఱింగింపుము+అనినన్= తెలుపు మనగా; ఆ+మహీపతికిన్= ఆ ధృతరాష్ట్ర రాజునకు; అతండు= ఆ సంజయుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; అట్లు= ఆ విధంగా; శైనేయుండు= సాత్యకి; కౌంతేయులన్= కుంతి కుమారులను (భీమార్జునులను); కూడన్+పోవన్= చేరబోగా; అలంబుసుండు+అను రాజు= అలంబుసు డనే పేరు గల రాజు; బలంబు మెఱయన్= తనబలం తెలియగా; అతనిన్ మార్కొనినన్= ఆ సాత్యకిని ఎదుర్కొనగా; ఆ+ఇరువురకున్= సాత్యకి, అలంబుసులకు; పరస్పర= ఒకరితో ఒకరి; బాణ భంజనంబును= బాణాలను విరుచుకొనటమును; వర్మవిదారణంబును= కవచాలను చీల్చుకొనటమును; మర్మ భేదనంబును= మర్మస్థలాలను భేదించటం; ధనుర్దళనంబును= విల్లు త్రుంచుకొనటమును; భూచర= భూమిమీద తిరుగువారికి; ఖేచర= ఆకాశంలో తిరిగేవారికి; విస్మయకరంబును= ఆశ్చర్యాన్ని కలిగించేదిగాను; అగు= అయిన; సంగరంబు+అయ్యెన్= యుద్ధమయింది; ఒక్కింత సేపునకున్= కొంతకాలానికి; ఆ శినిపుంగవుండు= ఆ సాత్యకి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడు యుద్ధ విశేషాలు వివరించుము'. అనగా సంజయుడు ఆ రాజుతో 'ఆ విధంగా సాత్యకి కుంతి కుమారులను చేరబోయేటప్పటికి అలంబుసు డనే రాజు తన శక్తితో వారి నెదుర్కొన్నాడు. అపుడా ఇద్దరునూ ఒకరి బాణాలను మరొకరు విరిచారు. కవచాలను చీల్చుకొన్నారు. ఆయువు పట్లను నొప్పించుకొన్నారు. విండ్లను విరుచుకొన్నారు. ఆ యుద్ధం భూమ్యాకాశ మార్గాలలో తిరిగేవారికి ఆశ్చర్యాన్ని కల్గించింది. తరువాత కొంత సేపటికి సాత్యకి.

**క.** **తురగములఁ జంపి సారథి । శిరము దునిమి కుండలములఁ జెలువారెడు న**
**న్నరపతి తల యిలఁ బడ ను । ద్ధుర భంగి వెడంద వాతితూపుల నేసెన్.** **253**

**ప్రతిపదార్థం:** తురగములన్+చంపి= గుర్రాలను చంపి; సారథి శిరము తునిమి= సారథి తలను త్రుంచి; కుండలములన్+చెలువారెడు= చెవికున్న కుండలాలతో అందంగా ఉన్న; ఆ+నరపతి తల= ఆ అలంబుసుని తలను; ఇలన్+పడన్= భూమిమీద పడగా; ఉద్ధురభంగిన్= భయంకరంగా; వెడంద= విశాలమైన; వాతితూపులన్= ముఖాలు గల బాణాలతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** అలంబుసుడి గుర్రాలను చంపి, సారథిని తలతునిమి, చెవి కుండలాలతో అందంగా ఉన్నవాడి తల భూమిమీద పడేటట్లు పెద్దమొనగల బాణాలతో కొట్టాడు.

**క.** **ఏసి యెలమి నరుగఁగ దు । శ్శాసనుఁడు మొగంబుగా వెసన్ నీ కొడుకుల్**
**డాసిన నవ్వీరుఁ డనా । యాసంబున దుస్ససేను హయములఁ జంపెన్.** **254**

**ప్రతిపదార్థం:** (సాత్యకి అలంబుసుని తల నేల బడవేశాడు) ఏసి ఎలమి నరుగఁగన్= కొట్టి సంతోషంతో వెళ్ళగా; నీ కొడుకుల్= నీ కుమారులు; దుశ్శాసనుఁడు; మొగంబుగాన్= ముందుగా (అనగా నాయకుడుగా); వెసన్= త్వరగా; డాసినన్= చేరగా (సాత్యకి దగ్గరకు); ఆ+వీరుఁడు= ఆ వీరుడు (సాత్యకి); అనాయాసంబునన్= శ్రమ లేకుండా; దుస్సేను= దుశ్శాసనుడి; హయములన్= గుర్రాలను; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** సాత్యకి అలంబుసుడి తల నేలబడ వేసి ఆనందంగా వెళ్ళుతుండగా, నీ కొడుకులు దుశ్శాసనుడిని నాయకుడుగా ముందుంచుకొని, వేగంగా సాత్యకిని సమీపించగా, ఆ వీరుడు అనాయాసంగా దుశ్శాసనుడి గుర్రాలను చంపాడు.

**వ.** **చంపి, యతని రథంబునకుఁ గవియుడుఁ ద్రిగర్తు లనేకు లడ్డంబు సొచ్చిన నతండు సేయం గలవారిం బంచశత రథికులం బంచత్వంబు నొందించి బలంబుల బడలువడం జేయఁ బెఱవారు విఱిగిన నాసత్యకసుతుండును మెఱసి చన శూరసేన సైనికులు దొడరుటయు, దోర్విలాసంబు నెఱపి పఱపి కళింగులు గవిసినన్ గం డడంచి కడచి గాండీవిం గనుంగొని జలాశయంబు వెలువడి సింధురంబు సుస్థలంబు సేరిన ట్లాశ్వాసించుచున్న నచ్యుతుం డయ్యోధవరు నాలోకించి నరు నుద్దేశించి.** **255**

**ప్రతిపదార్థం:** (సాత్యకి దుశ్శాసనుడి గుర్రాలను చంపాడు) చంపి అతని రథంబునకున్ కవియుడున్= చంపిన తరువాత దుశ్శాసనుడి తేరుమీదకు పరుగెత్తగా; త్రిగర్తులు= త్రిగర్త దేశస్థులు; అనేకులు= చాలామంది; అడ్డంబు చొచ్చినన్= అడ్డం రాగా; అతండు= ఆ సాత్యకి; చేయన్+కలవారిన్= యుద్ధం చేయగల చేవ ఉన్నవారిని; పంచశతరథికులన్= ఏబదిమంది వీరులను; పంచత్వంబున్+ఒందించి= చంపి; బలంబులన్= సేనలను; బడలువడన్+చేయన్= అలసిపోయేటట్లు చేయగా; పెఱవారు= తక్కిన వారు; విఱిగనన్= చెదరిపోగా; ఆ సత్యకసుతుండును= ఆ సాత్యకి; మెఱసి చనన్= మెరుపు వలె వెలిగి వెళ్ళగా; శూరసేన సైనికులు= శూరసేన దేశపు సేనలు; తొడరుటయున్= ఎదుర్కొనగా; దోర్విలాసంబు నెఱపి= భుజశక్తిని చూపి; పఱపి= వ్యాపింపజేసి; కడచి= దాటి; గాండీవిన్+కనుంగొని= అర్జునుడిని కనుగొని; జలాశయంబున్= కొలనునుండి; వెలువడి= బయటకు వచ్చి; సింధురంబు= మదపుటేనుగు; సుస్థలంబున్= మంచిచోటికి (ప్రమాదం లేనిచోటికి); చేరినట్లు= చేరినట్లుగా; ఆశ్వాసించుచున్న= ఊర్పులు వదలుతూ ఉండగా; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు; ఆ+యోధవరున్= ఆ వీరశిఖామణిని; ఆలోకించి= చూచి; నరున్+ఉద్దేశించి= అర్జునుడిని ఉద్దేశించి.

**తాత్పర్యం:** దుశ్శాసనుడి గుర్రాలను చంపి, అతడి తేరుమీదకు సాత్యకి పరుగెత్తేటప్పుడు త్రిగర్త సేనలు అడ్డుపడితే వారిలోని వీరులను ఏబదిమందిని హతమార్చి, సేనలు అలసేటట్లు చేయగా, మిగిలినవారు చెదరిపోగా, సాత్యకి మెరుపువలె మెరసి వెళ్ళాడు. అపుడు శూరసేన దేశసైనికులు భుజబలంతో అతడిని ఎదుర్కొనగా సాత్యకి వారిని పారిపోయేటట్లుచేశాడు. కళింగులు క్రమ్ముకొనగా వారి బలాన్ని నాశంచేసి, ముందుకు సాగి అర్జునుని చూచి కొలనునుండి బయటకు వచ్చి ఏనుగు ప్రమాదం లేనిచోటికి చేరిన విధంగా నిట్టూరుస్తూ ఉన్న సాత్యకిని చూచి, కృష్ణు డర్జునుడితో (ఇట్లన్నాడు).

**మ.** **కృతవర్మాదులఁ జెప్ప నేల? గురు నక్షీణ ప్రభావంబు ము**
**న్నితఁ డెబ్బంగి నడంచె నొక్కొ! యొకరుం డి ట్లేపుమై రాకకుం**
**గత మాధర్మజుపంపు నీ దెస సమగ్ర స్నేహముం జూపెఁ జూ**
**చితె? నీ శిష్యుని సాత్యకిం బటుభుజాశ్రీ గర్వనిర్వాహకున్.** **256**

**ప్రతిపదార్థం:** కృతవర్మ+ఆదులన్+చెప్పన్+ఏల?= కృతవర్మ మొదలైన వారిని గూర్చి చెప్పుట ఎందుకు?; గురు= ద్రోణుడి; అక్షీణప్రభావంబు= తరగని శక్తి; మున్ను= ఇదివరకు; ఇతడు+ఎబ్భంగిన్= ఏ ప్రకారంగా; అడంచెన్+ఒక్కొ!= అణగార్చినాడో!; ఒకరుండు= ఒకడు; ఇట్లు+ఏపుమైన్= ఈ విధంగా గర్వంతో; రాకకున్= వచ్చుటకు; కతము= కారణం; ఆ ధర్మజుపంపు= ధర్మరాజు ఆజ్ఞ; నీ దెస సమగ్ర స్నేహమున్ చూపెన్= నీ దిక్కున నిండైన స్నేహాన్ని చూపాడు; నీ శిష్యుని= నీ శిష్యుడి; పటుభుజాశ్రీ= దృఢమైన భుజ బలం సంపద వలని; గర్వనిర్వాహకున్= దర్పంతో ఉండే వాడిని; చూచితె?= చూచావా?

**తాత్పర్యం:** నీ శిష్యుడిని భుజబలగర్వ నిర్వహకుడైన సాత్యకిని చూచావా! కృతవర్మాదులనుసరే ముందుగా ద్రోణాచార్యుని తరుగని శక్తిని ఏవిధంగా అణగించాడో! ఒక్కడే గర్వంతో ఇక్కడికి రావటానికి కారణం ఆ ధర్మరాజు ఆజ్ఞే. నీ పట్లనిండైన స్నేహాన్ని చూపాడు.

**వ.** **మన కింత ప్రియం బగునే!' యనిన నయ్యింద్రనందనుం డిట్లను 'నితని రాక నా కప్రియంబై తోఁచె నెట్లంటేని ధర్మరాజ రక్షణంబున కితనిం జాలించి వచ్చితి; మీ రథికుం డచ్చట లేమి నతం డే మగునో యెఱుంగ; మా భూపతియును భరద్వాజుబారి నున్నవాఁడు సైంధవుండును నేలకు వ్రాలండు; ప్రొద్దునుం బెద్దయు వ్రాలె నది యట్లుండె; బలసారోదారులైన గురు కృతవర్మాదులను ననేక యోధవీరులతోడం బోరి రథ్యసారథి సహితంబుగా నిప్పురుషార్థపరుండు దప్పిం బడి తెప్పిఱంగానని యాలోనన కయ్యంబున డయ్యనివాఁడును సహాయ సంపన్నుండును నగు భూరిశ్రవుం డదె తలపడఁ గడంగెడు నక్కురు సింహుండు శక్తి చాతుర్య శౌర్యధైర్యాస్త్ర వీర్య సమగ్రుండును గావున నిద్ది సాత్యకికి చాల డెప్పరం బైన తెఱంగు వాటిల్లె; బాండవాగ్రజుం డీయన నిక్కడ కేల పుత్తెంచె? గురుం డామిషంబునకు వేచు డేగచందంబునఁ దనకు వేచుట దలంపవలవదే?' యనుచున్న సమయంబున నాసోమదత్త సూనుండు శైనేయున కడ్డంబు వచ్చి నిలు నిలు మని యదల్చి వెండియు.** **257**

**ప్రతిపదార్థం:** (శ్రీకృష్ణుడు అర్జునుడితో) మనకున్+ఇంత ప్రియంబు అగునే?= మన కింత ఇష్టమయినది జరిగిందికదా? (అనగా ఆ చేసిన పని చాలా ప్రీతికరం); అనినన్= అనగా; ఆ+ఇంద్రనందనుండు= ఆ అర్జునుడు; ఇట్లు+అనున్= ఈ ప్రకారంగా అన్నాడు; ఇతని రాక= ఈ సాత్యకి ఇక్కడకురావటం; నాకు+అప్రియంబై తోఁచెన్= నాకిష్టం కానిదిగా తోస్తున్నది; ఎట్లు+అంటి(వి)+ఏని= ఏమనగా; ధర్మరాజరక్షణంబునకున్= ధర్మరాజును కాపాడేటందుకు; ఇతనిన్+చాలించి వచ్చితిమి= ఇతడిని నిలిపి వచ్చాము; ఈ రథికుండు+అచ్చట లేమిని= ఈ వీరు డక్కడ లేకుండట వలన; అతండు= ఆ ధర్మరాజు; ఏమగునో ఎఱుంగము= ఏమవుతాడో మనకు తెలియదు; ఆ భూపతియును= ఆ రాజుకూడా; భరద్వాజు బారిన్+ఉన్నవాఁడు= ద్రోణాచార్యుడి వలన కలిగే ఉపద్రవంలో ఉన్నాడు; సైంధవుండును నేలకు వ్రాలండు= సైంధవుడు కూడా నేలబడలేదు (చావలేదు); ప్రొద్దునున్+పెద్దయున్ వ్రాలె= సూర్యాస్తమయం కాబోతున్నది; అది అట్లుండెన్= దాని నట్లుండనీ; బలసార= దట్టమయిన బలంతో; ఉదారులు+ఐన= గొప్పవారయిన; గురుకృతవర్మాదులగు ననేకులు= ద్రోణుడు, కృతవర్మ మొదలయినవారు చాలామంది; యోధవీరులతోడన్= యుద్ధవీరులతో; పోరి= యుద్ధం చేసి; రథ్యసారథి సహితంబుగాన్= రథిక సారథులతో; ఇప్పురుషార్థపరుండు= నాలుగు పురుషార్థములను ఆశతో కోరేవాడు; తప్పింపన్+పడి= తప్పించబడి (ప్రమాదం నుండి తప్పించబడి); తెప్పిఱన్+కాని= తప్పించుకొన్నదానిని చూడని; ఆలోనన= అంతలోనే యుద్ధంలో; డయ్యనివాఁడును= అలసిపోనివాడును; సహాయ సంపన్నుండును= సహాయ శక్తి కలాడును; అగు= అయిన; భూరిశ్రవుండు= భూరిశ్రవు డనేవాడు; శక్తి= బలం; చాతుర్య= నేర్పు; శౌర్యధైర్య= వీరుడి ధైర్యంతో; అస్త్రవీర్య సమగ్రుండును= ధైర్యంలో నిండైనవాడును (అనగా శక్తి చాతుర్య శౌర్య ధైర్యాలతో); కావునన్= అయినందున; ఇద్ది= ఈ రావటం; సాత్యకికిన్ చాల డెప్పఱుంబు+ఐన తెఱంగు= సాత్యకికి మిక్కిలి కష్టాన్ని కల్గించే పద్ధతి; పాటిల్లెన్= కలిగింది; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; ఈయనన్= ఈ సాత్యకిని; ఇక్కడ కేల పుత్తెంచె?= ఈ చోటి కెందుకు పంపాడో; గురుండు= ద్రోణుడు; ఆమిషంబునకున్= మాంసపుముద్దకు; వేచు= ఎదురుచూచే; డేగ చందంబునన్= డేగవలె; తనకున్= తనకొరకై; వేచుట= కాచుకొని ఉండటం; తలంచవలదే?=

తలచుకోవద్దా?; అనుచున్న సమయంబునన్= అనుకొనేవేళలో; ఆ సోమదత్తసూనుండు= ఆ సోమదత్తుడి కొడుకు (భూరిశ్రవుడు); శైనేయునకున్= సాత్యకికి; అడ్డంబు వచ్చి= అడ్డువచ్చి; నిలు నిలుము= ఆగాగుము; అని; అదల్చి= బెదరించి;

**తాత్పర్యం:** మన కెంత ఆనందంగా ఉన్నది!' అనిన శ్రీకృష్ణుడితో అర్జునుడు 'సాత్యకి ఈ రావటం నా కానందంగా లేదు' అన్నాడు. 'ఎందుకంటే ధర్మరాజును కాపాడేటందుకు ఈ రథికుడిని నిలిపి వచ్చాము. ఇతడు లేకుండటం మూలాన ఆయన ఏమవుతాడో? తెలియదు. ఆయన ద్రోణాచార్యుడి ప్రమాదకర దృష్టిలో ఉన్నాను సైంధవుడా - ఇంకా చావ లేదు. ప్రొద్దు వ్రాలిపోతూ ఉన్నది. అది అట్లా ఉండగా - మహాబలవంతుడైన ద్రోణ, కృతవర్మాదు లనేకులతో పోట్లాడి ఈ పురుషార్థపరుడు గుఱ్ఱాలతో సారథితో అలసి, దాహానికి లోనయ్యాడు.తరుకొనేలోగానే అంతదాక యుద్ధంలో అలుపెరుగనివాడు, సహాయం కలవాడు అయిన భూరిశ్రవుడు అదిగో యుద్ధానికి సిద్ధమయి వస్తున్నాడు. ఆ కురుసింహుడు బలమూ, నేర్పూ, వీరత్వం, ధైర్యం కల అస్త్రబలంతో ఉండేవాడు. అందువలన అతని రాక సాత్యకికి చాలా కష్టం కలిగిస్తుంది. ధర్మరాజు ఇపు డీయన నెందు కిక్కడకు పంపాడో? ఆచార్యుడు మాంసానికై ఎదురుచూచే డేగ మాదిరిగా తనకై కాచుకోవటం ఆయన తలచుకోవద్దా?' అని అంటూ ఉన్న సమయంలో ఆ సోమదత్త కుమారుడు సాత్యకికి అడ్డం వచ్చి నిలు నిలుమని అదలించి.

**విశేషం:** అలం: ఉపమ.

### భూరిశ్రవుండు సాత్యకితో యుద్ధంబు సేసి మడియుట (సం.7-117-1)

**సీ.** **'తేఁకువ లేక పుత్తెంచిన యప్పాండ । వజ్యేష్ఠునకుఁ దలవంపుఁ గాఁగ**
**వచ్చుచో మార్కొని చచ్చినవారల । బంధులోకమునకుఁ బ్రమదఁ మెసఁగ**
**నంతంతఁ జనుదేరఁ నాదటఁ గనుఁగొను । శౌరికిఁ బ్రాణంబు జల్లనంగఁ**
**బెనఁగించి గెలిపింతు నని యాస సేయు కి । రీటికి నాలావు దేటపడఁగ**

**తే.** **నాయుధంబులఁ దునిమి రథ్యములఁ గూల్చి । సూతుఁ దెగటార్చి తనువున శోణితంబు**
**వఱపి పఱుపుదు నిలిచిన నుఱకపట్టి । వ్రచ్చి పడవైతు నెందుఁ బోవచ్చు నీకు?'** 258

**ప్రతిపదార్థం:** తేఁకువ లేక పుత్తెంచిన= ధైర్యంలేక పంపిన; ఆ+పాండవజ్యేష్ఠునకున్= ఆ పాండురాజు కొడుకులలో పెద్దవాడికి (ధర్మరాజుకు); తలవంపుకాఁగన్= అవమానం కలిగేవిధంగా; వచ్చుచోన్= అక్కడనుండి వచ్చేటప్పుడు; చచ్చిన వారలన్= చనిపోయిన వారిని; బంధులోకమునకున్= బంధువుల సమూహానికి; ప్రమదము+ఎసఁగన్= సంతోషం కలగగా; అంతంతన్+చనుదేరన్= నెమ్మదిగా రాగా; ఆదటన్+కనుఁగొను శౌరికిన్= ప్రేమతో చూచే కృష్ణుడికి; ప్రాణంబు జల్లు+అనంగన్= ప్రాణం చెదరగా; పెనఁగించి= పోట్లాడించి; గెలిపింతును+అని= గెలిపిస్తానని; ఆసచేయు= ఆశపడే; కిరీటికిన్= అర్జునుడికి; నా లావు= నాబలం; తేటపడఁగన్= బాగా తెలియగా; ఆయుధంబులన్+తునిమి= ఆయుధాలను త్రుంచి; రథ్యములన్+కూల్చి= గుఱ్ఱాలను చంపి; సూతున్+తెగటార్చి= సారథిని చంపి; తనువునన్= ఒంట్లో; శోణితంబు పఱపి= నెత్తురు వ్యాపింపజేసి; పఱుపుదున్= పరుగెత్తిస్తాను; నిలిచినన్= ఒకవేళ ఎదిరించి నిలిచినట్లయితే; ఉఱక పట్టి= ఊరకే పట్టుకొని (సునాయాసంగా పట్టుకొని); వ్రచ్చి= చీల్చి; పడవైతున్= పడవేస్తాను; ఎందున్+పోవచ్చు నీకున్?= నీకు ఎక్కడకు పోవటానికి సాధ్యం?' (అని భూరిశ్రవుడు సాత్యకితో అన్నాడు).

**తాత్పర్యం:** 'ధైర్యంలేక నిన్ను పంపిన ధర్మరాజుకు కవమానం కలిగేటట్లు, వచ్చేటప్పుడు నిన్ను దారిలో ఎదుర్కొని, చచ్చినవారి బంధువులకు ఆనందం కలిగేటట్లు, నెమ్మది నెమ్మదిగా రావటం గమనించి ప్రేమతో చూచే కృష్ణుడికి గుండె గతుక్కుమనేటట్లు, యుద్ధం చేసి గెలిపిస్తానని ఆశపడే కిరీటికి నా బలం తెలిసేటట్లు

- ఆయుధాలను ముక్కలు చేసి, గుర్రాలను చంపి, ఒంటి నిండా నెత్తురు వ్యాపింపజేసి నిన్ను పారిపోయేటట్లు చేస్తాను; ఒకవేళ నీవు నిలిస్తే ఊరకే పట్టుకొని సునాయాసంగా చీల్చిపారవేస్తాను. నీ వింక ఎక్కడికిపోగలవు?'

**క. అనిన విని నవ్వి 'నాతో । నని సేఁతకుఁ దెంపు సేసి యడరెడు రథికుం**
**గనుట యది నాకుఁ బండువు; । వినవే మీ కెల్ల వేరువి త్తని నన్నున్?' 259**

**ప్రతిపదార్థం:** అనినన్= అనగా (భూరిశ్రవు డావిధంగా అనగా); విని నవ్వి= విని నవ్వినవాడై; నాతోన్= నాతో (సాత్యకితో); అని చేఁతకున్= యుద్ధం చేయటానికి; తెంపుచేసి= సాహసించి; అడరెడు= త్రుళ్ళిపడే; రథికున్+కనుట= వీరుడిని చూడటం; అది= ఆ చూడటం; నాకున్+పండువు= నాకు పండుగ; నన్నున్= నన్నుగూర్చి (సాత్యకినిగూర్చి); మీకు+ఎల్లన్= మీ అందరికీ (కౌరవపక్షం వారికి); వేరువిత్తు+అని= నాశకుడ నని; వినవే?= వినలేదా?

**తాత్పర్యం:** అని భూరిశ్రవుడు అనగా, సాత్యకి నవ్వి 'నాతో యుద్ధం చేయటానికి సాహసంతో త్రుళ్ళిపడే వీరుడిని చూడటం నాకు పండుగ. మీ అందరికీ నేను నాశకుడనని వినలేదా?'

**వ. అని పలికి సాత్యకి మఱియును. 260**

**తాత్పర్యం:** అని మాట్లాడి సాత్యకి ఇంకనూ (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'ఎదుర నుండ వెఱచి మద మఱి దవ్వుగా । వచ్చి యొదిఁగి తేల? పెచ్చు వెఱిగి**
**ప్రేలె; దిపుడ పట్టి నాలుక గోసెద; । మాను మాను రిత్తమాట లేల?' 261**

**ప్రతిపదార్థం:** ఎదురన్+ఉండన్ వెఱచి= ఎదురుగా నిలవటానికి భయపడి; మదము+అఱి= దర్పం నశించి; దవ్వుగాన్ వచ్చి= దూరంగా వచ్చి; ఒదిఁగితి(వి)+ఏల?= ఒదిగిపోయా వెందుకు? (భయంతో గునిసినట్లు); ఏలపెచ్చుపెఱిగి ప్రేలెదు?= ఎందుకు ఊరకే పెచ్చుపెరిగి ప్రేలుతున్నావు? (వదరుతున్నావు?); ఇపుడ పట్టి= ని న్నిపుడే పట్టుకొని; నాలుక కోసెదన్= నాలుకను కోసివేస్తాను; మాను మాను= మానుకో మానుకో; రిత్తమాటలు+ఏల?= ఒట్టి మాట లెందుకు? (వ్యర్థమైన ప్రేలు డెందుకు?)

**తాత్పర్యం:** '(ఓ భూరిశ్రవా!) ఎదురుగా నిలువటానికి భయపడి, దర్పాన్ని కోల్పోయి దూరంగా వచ్చి ముడుచుకు పోతున్నావెందుకు? ఊరకే పేట్రేగి ప్రేలుతున్నావు. ని న్నిపుడే పట్టుకొని నాలుక కోసివేస్తాను. పనికిరాని మాట లెందుకు? వెంటనే మానుకొమ్ము.

**వ. అనియె న ట్లియ్యిరువురు నొండొరులఁ బరుసంబులు పలుకుచుఁ దలపడి పలుదెఱంగుల మెఱుంగుటమ్ము లొండొరులపై నిగిడించుచు నొకళ్ళొకళ్ళ మార్గణంబులు మగిడించుచు వర్మంబులు వ్రయ్య నేయుచుఁ దనువులు నెత్తుట జొత్తిల్లం జేయుచుఁ దమ్ము సేన లేనికపోరు సూచునట్లు సూడం బోరి పోరి పరస్పర తురంగ విదారణంబును మిథస్సూత మారణంబును నన్యోన్యధ్వజపాతనంబును నితరేతరధనుశ్ఛేదనంబును జేసి యాసునం గరవాలంబులుఁ బలకలుం గొని పాదచారు లై చేరి వివిధ చిత్రగతులం బెనంగి పాసి యించుకసేపు దప్పిక తీర్చికొని క్రమ్మఱఁ గదిసి పలకలు పఱియలు గావించి యలుఁగుల నొడ్డనంబుల నంగవంచనంబులను వ్రేటుపోటుల సవదరింపకుండం గాచికొను నోజ మెఱయుచుండి విన్నాణంబుతగులున మేనులు బెరసిన మల్లయుద్ధప్రకారం బగు పెనంకువకుఁ జొచ్చి; రప్పుడా భూరిశ్రవుండు మేలుచే యయి పోరుట గనుంగొని కృష్ణుండు జిష్ణున కి ట్లనియె. 262**

**ప్రతిపదార్థం:** అనియెన్= అన్నాడు; అట్లు= ఆ విధంగా; ఆ+ఇరువురున్= ఆ భూరిశ్రవ స్సాత్యకులు; ఒండొరులన్= ఒకరి నొకరు; పరుసంబులు పలుకుచున్= దురుసుమాటలు మాటాడుతూ; తలపడి= ఎదుర్కొని; పలు తెఱంగులన్= అనేక విధాలుగా; మెఱుంగు+అమ్ములు= మండే బాణాలను; ఒండొరులపైన్ నిగిడించుచున్= ఒకరిమీద ఒకరు వేస్తూ; ఒకళ్ళొకళ్ళ మార్గణంబులు= ఒకరు ఇంకొకరి అమ్ములను; మగిడించుచున్= వెనుకకు త్రిప్పుతూ; వర్మంబులు= కవచాలు; వ్రయ్యలు చేయుచున్= చీల్చుతూ; తనువులు= శరీరాలు; నెత్తుట జొత్తిల్లన్+జేయుచున్= నెత్తురులో మునుగజేస్తూ; తమ్మున్= తమ ఇరువురినీ; సేనలు= సైనికులు; ఏనికపోరు= ఏనుగులతో పోట్లాట; చూచునట్లు= చూచేవిధంగా; చూడన్= చూడగా; పోరి, పోరి= పోట్లాడి పోట్లాడి; పరస్పర తురంగ విదారణంబును= ఒకరొకరి గుర్రాలను చంపటం; మిథస్సూత మార్గణంబును= ఒకళ్ళొకళ్ళ సారథులను చంపటం; అన్యోన్య ధ్వజపాతనంబును= ఒకరు ఇంకొకరి కేతనాలను పడగొట్టటం; ఇతర+ఇతర ధనుః+ఛేదనంబును= ఒకరు మరియొకరి విండ్లను త్రుంచివేయటం; చేసి= చేసి; ఈసునన్+కరవాలంబులు= అసూయతో కత్తులు; పలకలున్+కొని= డాళ్ళు తీసికొని; పాదచారులు+ఐ చేరి= నడచి దగ్గరకు వెళ్ళి; వివిధ చిత్రగతులన్+పెనంగి= అనేక విధాలగు గతులతో పోట్లాడి; పాసి= ప్రక్కకు తొలగి; ఇంచుకసేపు= కొంతకాలం; దప్పిక దీర్చుకొని= ఆయాసం వలన కలిగిన దాహాన్ని పోగొట్టుకొని; క్రమ్మఱన్+కదిసి= మరల ఎదుర్కొని; పలకలు పఱియలు కావించి= డాళ్ళను ముక్కలు చేసి; అలుఁగులన్+ఒడ్డనంబులన్= కత్తుల వ్యూహాలతో; అంగవంచనంబులును= ఒకరి నొకరు మోసగించటం; వ్రేటుపోటులన్= దెబ్బల తాకిడిని; సవదరింపకుండన్= తాల్చకుండా; కాచికొను ఓజన్= కాపాడుకొనే నేర్పు; మెఱయుచుండి= ప్రకాశిస్తూ ఉండి; విన్నాణంబు తగులునన్= నేర్పుతో; మేనులు బెరసిన= ఒడళ్ళు దాచుకోగా; మల్లయుద్ధ ప్రకారంబు+అగు= ముష్టియుద్ధ విధానంతో; పెనంకువకున్= యుద్ధానికి; చొచ్చిరి= మొదలు పెట్టారు; అప్పుడు= ఆ సమయాన; ఆ భూరిశ్రవుండు= ఆ భూరిశ్రవుడు; మేలు చేయి అయి= పై చేయి అయి; పోరుట= యుద్ధం చేయటం; కనుంగొని= గుర్తించి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; జిష్ణునకున్= అర్జునుడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా భూరిశ్రవుడూ సాత్యకీ ఒకరి నొకరు తీవ్రంగా దూషించుకొంటూ ఢీకొని, అనేక విధాలుగా మెరిసే బాణాలను వేసుకొంటూ, ఒకరు వేసిన బాణాలను ఇంకొకరు త్రిప్పికొట్టుతూ, కవచాలను చీలుస్తూ, శరీరాలు నెత్తుట మునిగేటట్లుగా చేస్తూ, సైనికులు తమ ఇద్దరినీ ఏనుగుల పోట్లాట చూచినట్లు చూడగా పోట్లాడి పోట్లాడి, ఒకరి గుర్రాలను వేరొకరు చంపుతూ, ఒకరి సారథిని మరొకరు హతమారుస్తూ, ఒకరి కేతనాన్ని మరొకరు పడగొట్టుతూ ఒకరి అమ్ములను మరొకరు విరుస్తూ, అసూయతో కత్తీ డాలూ తీసుకొని, పాదచారులుగా అనేక రకాలుగా పోట్లాడారు. కొంత దూరానికి వెళ్ళి దాహాన్ని తీర్చుకొని మళ్ళీ చేరి, డాళ్ళను తునకలు చేసి కత్తులను త్రిప్పుతూ ఉపాయంగా శరీరాలు తప్పించుకొంటూ, వ్రేటుపోటుల తాకిడి తగులకుండా బలం మెరయగా నేర్పుతో ఒళ్ళు రాచుకోగా మల్లయుద్ధంలో పెనగులాటకు పూనుకొన్నారు. ఆ సమయంలో భూరిశ్రవుడు పై చేయిగా యుద్ధం చేయటం చూచిన శ్రీకృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**చ. పెనుమొనతోడ మున్ పెనఁగి పెద్దయు డయ్యుటఁ జేసి సోమద**
**త్తునిసుతుచేతఁ జిక్కి కడుదుర్దశఁ బొందె శినిప్రవీరుఁ డీ**
**తనిఁ దగుఁ గావ నీకయి కదా యిట రాక! మృగేంద్రు బారిఁ జొ**
**చ్చిన కరివోలె నయ్యెఁ; వెసఁ జేకొని కావుము పాండవోత్తమా! 263**

**ప్రతిపదార్థం:** పాండవోత్తమా!= పాండవశ్రేష్ఠా అర్జునా!; శినిప్రవీరుఁడు= సాత్యకి; పెను మొనతోడన్= పెద్దసేనతో; మున్ పెనఁగి= ముందు పోట్లాడి; పెద్దయున్= మిక్కిలి; డయ్యుటన్+చేసి= అలసిపోయినందున; సోమదత్తుని సుతుచేతన్+చిక్కి= భూరిశ్రవుడికి; దొరికి; కడు దుర్దశన్+పొందెన్= మిక్కిలి దీనావస్థను చెందాడు; ఈతనిన్= ఇతడిని; కావన్+తగున్= కాపాడదగి ఉన్నది; ఇటు రాక= ఈ దిక్కుకు రావటం; నీకయికదా!= నీ కొరకు కదా!; మృగేంద్రుబారిన్= సింహానికి; చొచ్చిన= ప్రవేశించిన; కరివోలెన్+అయ్యెన్= ఏనుగు మాదిరిగా అయింది; వెసన్= త్వరగా; చేకొని= కైకొని; కావుము= కాపాడుము. (సాత్యకిని కాపాడుము).

**తాత్పర్యం:** 'ఓ పాండవోత్తమా! ఇదివరకే పెద్ద సేనతో పోట్లాడి మిక్కిలి అలసిపోయినందున (సాత్యకి) సోమదత్తుడి కొడుకయిన భూరిశ్రవుడి చేతికి చిక్కి, చాలా దీనమయిన స్థితిలో ఉన్నాడు. శినివంశంలో శ్రేష్ఠుడయిన ఇతడిని కాపాడవలసి ఉన్నది. నీ కొరకే వచ్చి సింహం బారిన పడ్డ ఏనుగు మాదిరి అయినాడు, త్వరగా ఆ సాత్యకిని కాపాడుము.' (అని శ్రీకృష్ణుడు అర్జునుడిని కోరాడు).

**విశేషం:** అలంకారం ఉపమ.

**క.** **అనునెడ భూరిశ్రవసుం। డనూనబల మొప్ప దానవాంతకు ననుజ**
**న్మునిఁ బట్టి పుడమిపై వై। చినఁ గ్రిందై యోపినంత సేయుచునుండెన్. 264**

**ప్రతిపదార్థం:** అను+ఎడన్= శ్రీకృష్ణు డట్లా అనేటప్పటికి; భూరిశ్రవసుండు= భూరిశ్రవసుడు; అనూన బలము+ఒప్పన్= మిక్కిలి బలం అమరగా; దానవ+అంతకు అనుజన్మునిన్= శ్రీకృష్ణుడి తోబుట్టును (సాత్యకిని); పట్టి= పట్టుకొని; పుడమిపైన్‌వైచినన్= భూమిమీద వేయగా; క్రిందై= తాను క్రింద ఉండి (తగ్గిపోయి); ఓపిన అంత= శక్తి కొలది; చేయుచు+ఉండెన్= పోట్లాడుతూ ఉన్నాడు.

**తాత్పర్యం:** అని శ్రీకృష్ణు డర్జునుడితో సాత్యకిని కాపాడవలసి ఉన్నదని అంటూ ఉండగానే సాటిలేని బలంతో భూరిశ్రవసుడు శ్రీకృష్ణుడి తోబుట్టునైన సాత్యకిని పట్టుకొని భూమిమీద వేయగా, క్రిందయిన సాత్యకి తన యోపినకొలది శక్తివంచన లేక పోట్లాడుతూ ఉన్నాడు.

**వ.** **అమ్మురహరుండు మఱియుం దఱిమి ధనంజయుతో 'నీకుం దోడ్పడ వచ్చి నీ శిష్యుండొరులచేత దురవస్థం బొంద నూరకునికి యుచితంబగునే?' యనిన నతం డిట్లనియె. 265**

**ప్రతిపదార్థం:** ఆ+మురహరుండు= ఆ మురుని చంపినవాడు (శ్రీకృష్ణుడు); మఱియున్= ఇంకను; తఱిమి= తొందరపెట్టి; ధనంజయుతోన్= అర్జునుడితో; నీకున్+తోడ్పడవచ్చి= నీకు సహాయంగా వచ్చి; నీ శిష్యుండు= నీ శిష్యుడు; ఒరులచేతన్= ఇంకొకరిచేత; దురవస్థంబు+ఒందన్= కష్టపడుతుండగా; ఊరకునికి= ఊరకుండటం; ఉచితంబు+అగునే?= న్యాయమా?; అనినన్+అతండు+ఇట్లు+అనియెన్= అనగా అర్జునుడు శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'ఆ శ్రీకృష్ణు డర్జునుడిని ఇంకా తొందరపెట్టె 'నీకు సహాయంగా వచ్చిన నీ శిష్యుడు ఇతరులచేత కష్టపడుతూ ఉండగా ఊరకొనుట న్యాయమా?' అని అనగా అతనితో అర్జును డిట్లా అన్నాడు.

**తే.** **ఒండు దెసఁ జక్కఁ జూడరాకుండునట్లు। గాఁగ రథములు పయి పయిఁ గ్రమ్మె వార**
**లెక్క టెక్కటి పోరెద రిపుడు నాకు। నేయఁగాఁ దగ; దీరెండు నిటుల నుండ. 266**

**ప్రతిపదార్థం:** ఒండు దెసన్= ఇంకొక దిక్కు; చక్కన్+చూడన్= బాగా చూడటానికి; రాక+ఉండునట్లు= సాధ్యం కానట్లుగా; కాఁగన్= కాగా; రథములు= తేరులు; పయిపయిన్ క్రమ్మెన్= మీద మీద చుట్టుకొన్నాయి; వారలు= ఆ సాత్యకి భూరిశ్రవులు; ఎక్కటెక్కటి పోరెదరు= ఒక్కొక్కరే యుద్ధం చేస్తున్నారు; ఇపుడు నాకున్= ఈ సమయంలో; ఈ రెండు= ఈ తేరులు క్రమ్ముకొని ఉండగాను; వీరెక్కటి యుద్ధం చేస్తుండగాను; ఇటులు+ఉండన్= ఈ విధంగా ఉండగా; ఏయఁగాన్ తగదు= కొట్టటం సరికాదు. (న్యాయం కాదు)

**తాత్పర్యం:** 'ఇంకొక దిక్కుకు చక్కగా చూడ సాధ్యం కానట్లుగా తేరులు మీద మీద క్రమ్ముకొన్నాయి. అంతేకాదు వాళ్ళిద్దరూ (సాత్యకి భూరిశ్రవసులు) ఎక్కటి యుద్ధం చేస్తున్నారు. ఈ సమయంలో నేను బాణంతో కొట్టటం న్యాయం కాదు. ఈ రెండూ ఇట్లా ఉన్నా'

**విశేషం:** ఆనాటి యుద్ధాలలో ఎక్కటి యుద్ధంలో వీరులుండగా మరొక్కరు దూరి అందులో ఒకనిని కొట్టటం యుద్ధనీతి కాదు.

**వ. నెచ్చెలి చావునుం జూడం జాల; నీ రథికులను వారించెద; నయ్యోధవరునిం గాచెద' ననియె; నప్పుడు సాత్యకి చాల డస్సిన సౌమదత్తి యతిక్రమించి యెగసి పడవైచి వాని వలచేయు నురంబును నిరుగాలం ద్రొక్కి యెక్కుడు మదంబున మణికంకణ కిరణ స్ఫురణ సుందరంబగు కరంబు మెఱయం గృపాణం బెత్తి గళంబు దునియ వేయువాఁడై పూఁచిన నా భుజం బింద్రధ్వజంబునుం బోలెఁ బొలిచి నీ సైనికుల చూడ్కులకు వేడ్కలు సేయ వాసుదేవుండు వేగిరపడి యేయు మేయు మని పలికిన బార్థుం డక్కౌరవోత్తముం జిత్తంబున నగ్గించుచు వెడందవాతియమ్ము గ్రక్కునం దొడిగి గాఢాకర్షణంబును దీవ్రతేజంబును రయంబునుం బరఁగంజేసి యేసినం దునిసిపడి యబ్బాహువు మహాభుజంగంబు చందంబున శోభిల్లె; నిచ్చటి సేనలెల్ల దురపిల్లె నా భూరిశ్రవుండు దన్ను నఫలితప్రయత్నునిం జేసినవాఁడు గాండీవి యగు టెఱింగి యాఱని కోపంబున గర్హించు మనంబుతో నతని దిక్కు సూచి తగునెలుంగున ని ట్లనియె. 267**

**ప్రతిపదార్థం:** నెచ్చెలి చావును చూడన్+చాలన్= మిత్రుడి చావును చూడలేను; ఈ రథికులను= ఈ రథ వీరులను; వారించెదన్= అడ్డగిస్తాను; ఆ+యోధవరునిన్+కాచెదన్= ఆ వీరశ్రేష్ఠుడిని కాపాడుతాను; అనియెన్= అన్నాడు; అప్పుడు= ఆ సమయాన; సాత్యకి చాల డస్సినన్= సాత్యకి చాలా అలసిపోగా; సౌమదత్తి= భూరిశ్రవసుడు; అతిక్రమించి ఎగసి= మీరి, పై కెగసి; పడవైచి= క్రిందకు త్రోసి; వాని వలచేయున్= సాత్యకి కుడిచేతిని; ఉరంబును= ఎదను (గుండెను); ఇరుగాలన్+త్రొక్కి= తన రెండు కాళ్ళతో త్రొక్కి; ఎక్కుడు మదంబునన్= మిక్కిలి గర్వంతో; మణికంకణ కిరణ స్ఫురణసుందరంబు+అగు= మణులు పొదిగిన కడియాల కాంతి తళ తళలాడే అందమయిన; కరంబు= చేయి; మెఱయన్= ప్రకాశించగా; కృపాణంబు+ఎత్తి= కత్తి ఎత్తి; గళంబు తునియ వేయువాఁడు+ఐ= (సాత్యకి) కంఠం తునిగేటట్లు వేసేవాడుగా; పూఁచినన్= పూనగా; ఆ భుజంబు= ఆ భూరిశ్రవుడి చేయి; ఇంద్రధ్వజంబునున్+పోలెన్ పొలిచి= ఇంద్రుడి టెక్కెం మాదిరిగా ఒప్పి; నీ సైనికుల చూడ్కులకున్= నీ సేన చూపులకు; వేడ్కలు+చేయన్= సంతోషాన్ని కల్గించగా; వాసుదేవుండు= కృష్ణుడు; వేగిరపడి ఏయుము+ఏయుము+అని పలికినన్= తొందరపడి కొట్టు కొట్టు అని చెప్పగా; పార్థుండు= అర్జునుడు; ఆకౌరవ+ఉత్తమున్= ఆ కౌరవశ్రేష్ఠుడిని; చిత్తమునన్+అగ్గించుచున్= మనస్సులో పొగడుతూ; వెడందవాతి అమ్ము= విశాలమైన వాడి అయిన బాణాన్ని; గ్రక్కునన్+తొడగి= వెంటనే సంధించి; గాఢ+ఆకర్షణంబును= దట్టంగా లాగగల శక్తికలదియు; తీవ్రతేజంబును= మిక్కిలి శక్తికలదియు; రయంబును= వేగమును; పరగన్+చేసి= ప్రవర్తిల్లగా (వ్యాపించగా) చేసి; ఏసినన్= కొట్టగా; తునిసిపడి= తెగిపడి; ఆ+బాహువు= ఆ చేయి (కత్తి నెత్తిన భూరిశ్రవసుని చేయి); మహాభుజంగంబు చందంబునన్= పెనుబాము మాదిరిగా; శోభిల్లెన్= ప్రకాశించింది; ఇచ్చటి సేనలు+ఎల్లన్= ఇక్కడి సైన్యమంతా; దురపిల్లెన్= దుఃఖపడింది; ఆ భూరిశ్రవుండు; తన్ను= తనను; అఫలిత ప్రయత్నున్ చేసినవాఁడు= సిద్ధించని ప్రయత్నమున్నవాడినిగా చేసినవాడు; గాండీవి= అర్జునుడు; అగుట+ఎఱింగి= కావటం తెలిసికొని; ఆఱని కోపంబునన్= చల్లారని కోపంతో; గర్హించు= అసహ్యించే; మనంబుతోన్= మనస్సుతో; అతని దిక్కు చూచి= అతడి ప్రక్కచూచి; తగు ఎలుంగునన్= తగిన గొంతుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** 'మిత్రుడి చావు చూడలేను. ఆ వీరులను అడ్డుకొంటాను ఈ వీరుడిని కాపాడుతాను' అని అన్నాడు. ఆ సమయంలో చాలా అలసిన సాత్యకిని భూరిశ్రవుడు మిగిలి, పైకెత్తి క్రింద పడవేసి తన రెండు కాళ్ళతో అతడి గుండెను, కుడిచేతిని త్రొక్కిపట్టి, గర్వంతో చేతికంకణాలలోని మణులు కాంతి తళతళలాడే అందమయిన చేతితో, మెరిసే కత్తి నెత్తి, సాత్యకి కంఠాన్ని నరికి వేయటానికి పూనుకొన్నాడు. ఆ భూరిశ్రవుడి చేయి, చూచేవారికి ఇంద్రధ్వజంవలె ఒప్పింది. అపుడు నీ సేనలకు సంతోషం కలిగింది. దానిని చూచి కృష్ణుడు వేగంగా వేయుమని అర్జునుని త్వరపెట్టాడు. అపుడు అర్జును డా కౌరవశ్రేష్ఠుడిని మనసులో మెచ్చుకొని,

విశాలమూ వాడికలదీ అయిన బాణాన్ని వెంటనే వింట సంధించి, బాగా లాగి - మిక్కిలి వేగం, వాడి వెలుగూ వ్యాపించగా కొట్టాడు. కత్తి నెత్తిన భూరిశ్రవుడి చేయి తెగిపోయి, పెనుబాము మాదిరిగా ప్రకాశించింది. నీ సేనలు దుఃఖించాయి. తన ప్రయత్నాన్ని సిద్ధించకుండా చేసినవాడు అర్జునుడని తెలిసికొని, ఆరని కోపంతో, అసహ్యించుకొనే మనసుతో ఆ దిక్కు చూచి తగిన గొంతుతో భూరిశ్రవు డీ విధంగా అన్నాడు:

**ఉ. 'నీ దెసఁ జూడ నొండొకరినిం దగ మార్కొని పోరుచుండఁ బెం**
**పేది వినీచకర్మమున కియ్యకొనం దగునే? భవాదృశుం**
**డీదురుపాయ మగ్గురుఁడొ యింద్రుఁడొ రుద్రుడొ నీకుఁ జెప్పె దా**
**మోదరుఁ డింతపాపమున కోర్వఁగఁ జేయునె నిన్ను నర్జునా!' 268**

**ప్రతిపదార్థం:** అర్జునా!= ఓ అర్జునా!; నీదెసన్+చూడన్= నీ దిక్కుగా నేను చూడలేదు; ఒండు+ఒకరినిన్+తగ మార్కొని= మరొక్కడిని తగినట్లు ఎదుర్కొని; పోరుచుండన్= యుద్ధం చేస్తూ ఉండగా; పెంపు+ఏది= పెద్దరికం నశించి; వినీచకర్మమునకున్= మిక్కిలి నీచమయిన పనికి; భవాదృశుండు= నీవంటివాడు; ఇయ్యకొనన్+తగునే?= అంగీకరించవచ్చునా?; ఈ దురుపాయము= ఈ మోసపు ఉపాయం; ఆ+గురుఁడొ= ఆ గురువగు ద్రోణాచార్యుడా?; ఇంద్రుఁడొ= ఇంద్రుడా!; రుద్రుఁడొ!= పాశుపతాస్త్రాన్ని నీకు ఒసగిన ఈశ్వరుడా?; నీకున్+చెప్పెన్?= నీకు చెప్పాడు?; దామోదరుఁడు= శ్రీకృష్ణుడు; నిన్నున్= నిన్ను; ఇంత పాపమునకున్= ఇటువంటి పాపపు పనికి; ఓర్వఁగన్+చేయునె?= సహింపజేస్తాడా?

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! నేను నీ దిక్కు చూడలేదు. ఇంకొకరితో ఎదుర్కొని పోరాడుతూ ఉండగా మర్యాద లేక ఇట్టి నీచమయిన పనికి పూనుకొంటావా? ఈ నీచోపాయాన్ని నీకు అస్త్రవిద్యాగురువైన ద్రోణుడా, నీ పుట్టుకకు ఆధారమైన ఇంద్రుడా, నీకు పాశుపతాస్త్రాన్ని ఇచ్చిన రుద్రుడా ఎవరు చెప్పారయ్యా! దామోదరు డింత పాపాని కొడికట్టేటట్లు చేస్తాడా?'

**విశేషం:** అస్త్రవిద్యలో ధర్మతత్త్వాన్ని బోధించిన ద్రోణుడి శిష్యుడవు, దేవరాజయిన ఇంద్రుడి వరాన పుట్టిన వాడవు, పరమేశ్వరుడి దయావిశేషంతో (మహాతపశ్శక్తితో) పాశుపతాస్త్రాన్ని సాధించిన నీవు శ్రీకృష్ణుడి ప్రేరణతో ఇట్టి నీచమయిన పనిచేస్తావా?' ఇదేమి న్యాయమని భూరిశ్రవుడు అర్జునుడిని ప్రశ్నించాడు.

**వ. అనిన విని అబ్బాహ్లికపౌత్రు నాలోకించి. 269**

**తాత్పర్యం:** అనగా విని ఆ బాహ్లికుడి మనుమడిని చూచి.

**చ. 'నృపతులు సొచ్చి పోరునెడ నెయ్యురు బంధులుఁ దోడుపాటు నీ**
**చపుఁ బనియే? నినుం బగఱు సంపఁగఁ గావఁగ లేని మీ బలా**
**ధిపతుల దూఱు సాత్యకి యతిశ్రమ మొందిన చోటఁ దాఁకి క**
**ష్టపఱిచి చంపె దీ; వతఁడు సచ్చునె యూఱడి యేను గల్గఁగన్? 270**

**ప్రతిపదార్థం:** నృపతులు= రాజులు; చొచ్చి= ప్రవేశించి; పోరు ఎడన్= యుద్ధం చేసేటప్పుడు; నెయ్యురు= మిత్రులు; బంధులు= బంధువులు; తోడుపాటు= తోడ్పడటం (సాయపడటం); నీచము+పనియే?= నీచ మయిన పనియా?; నినున్= నిన్ను; పగఱు= పగవాండ్రు (శత్రువులు); చంపఁగన్= చంపివేయగా; కావఁగన్ లేని= కాపాడలేని; మీ బల+అధిపతులన్= మీ సేనా నాయకులను; దూఱు(ము)= తిట్టుము; సాత్యకి అతిశ్రమము+అందినచోటన్+తాఁకి= సాత్యకి మిక్కిలి అలసిన సమయాన ఎదుర్కొని; కష్టపఱిచి= బాధపెట్టి; ఈవు చంపెద(వు)= నీవు చంపబోతున్నావు; అతఁడు= ఆ సాత్యకి; చచ్చునె?= చనిపోతాడా?; ఏనున్+కల్గఁగన్=

నే నుండగా; ఆఱడి= నిందయా?

**తాత్పర్యం:** రాజులు యుద్ధం చేసేటప్పుడు మిత్రులు, బంధువులు తోడ్పాటుగా రావటం నీచకార్యమా? నిన్ను శత్రువులు చంపుతూ ఉండగా కాపాడలేని మీ దండునాయకులను దూషించుము. చాల శ్రమనందిన సాత్యకిని అవమానించి చంపటానికి పూనినావు. నే నుండగా అతడు చనిపోతాడా? నిందపడతాడా?

**వ. మీ రందఱు నట్టకాదే? యధర్మపరులయి యభిమన్యు ననుచితంపు జంపు చంపితి' రని నిరుత్తరుం జేసి, యప్పుడు దన్ను నీ కొడుకులుం గొందఱు రాజులును నిందించిన నత్తెఱంగునన పలికి వారల పలుకుల నుడిపి, యా సౌమదత్తి నుపలక్షించి శోకించి, యతనికుందు మాన్పం దలంచి. 271**

**ప్రతిపదార్థం:** మీరందరును= (కౌరవ పక్షమువారు) మీరంతా; అట్టు+అ కాదే!= ఆ విధంగానే కదా! (అన్యాయంగా); అధర్మపరులు+అయి= ధర్మం లేని వారుగా; అభిమన్యున్= అభిమన్యుడిని; అనుచితంపు= ఉచితం కాని; చంపుచంపితిరి= చావు కలిగేటట్లుగా చంపారు; అని= అని చెప్పి; నిరుత్తరున్+చేసి= బదులు చెప్పలేనట్లు చేసి; అప్పుడు= ఆ సమయంలో; తన్నున్= అర్జునుడిని; నీకొడుకులు కొందఱు రాజులును= నీ కుమారులు; మరికొందరు రాజులును; నిందించినన్= తిట్టగా; ఆ+తెఱంగునన పలికి= అదే విధంగా మాటాడి; ఆ సౌమదత్తిన్= ఆ సోమదత్త కుమారు డయిన భూరిశ్రవుడిని; ఉపలక్షించి= చూచి; శోకించి= దుఃఖపడి; అతని కుందు మాన్పన్+తలంచి= అతడి బాధను పోగొట్ట నెంచి.

**తాత్పర్యం:** అభిమన్యుడిని మీరంతా అధర్మంతో చంపారుకదా!' అని మాటాడకుండా చేశాడు. అపు డర్జునుడిని, నీ కొడుకులూ, మరికొంతమంది రాజులూ నిందించగా, అదే విధంగా అర్జునుడు వారి నోరులు మూయించాడు. భూరిశ్రవుడి యెడ అనుకంపతో అతడి నుద్దేశించి అతడి మనసులోని బాధను పోగొట్టనెంచి.

**తే. 'క్షత్ర ధర్మంబు కీడునఁ గటకటా మ । హాత్మ! నీయట్టి వాని కి ట్లధిక పీడ**
**సేయ వలసె; నా ప్రతిన చర్చింపు; మెల్ల । పనులకును మూల మా సుయోధనుఁడ సూవె! 272**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= ఓ మహనీయుడా!; క్షత్త్రధర్మంబు కీడునన్= క్షత్రియధర్మం వలని పాపంచేత; కటకటా!= అయ్యయ్యో!; నీ అట్టివానికిన్= నీ వంటివానికి; అధికపీడ చేయవలసెన్= మిక్కిలి కష్టాన్ని కలిగించ వలసి వచ్చింది; నా ప్రతిన= నా శపథాన్ని; చర్చింపుము= యోచింపుము; ఎల్ల+పనులకున్= అన్ని పనులకును (కౌరవపాండవులకు సాగిన, సాగుతున్న స్పర్థలకు); మూలము= మొదలు (ఆధారం); ఆ సుయోధనుఁడు+అ చూవె!= ఆ దుర్యోధనుడే సుమా!

**తాత్పర్యం:** 'ఓ మహాత్మా! క్షత్రియ ధర్మం కారణంగా నీ వంటి వాడిని ఇట్లా బాధింపవలసి వచ్చింది. నా శపథాన్ని గూర్చి యోచింపుము. ఈ అన్నిపనులకు (మంచి చెడ్డలకు) ఆ సుయోధనుడే కారణం.

**వ. అన్నరపతి నరకంబునం బడం గలవాఁడు; నీవు సద్గతిం బొందు' మనవుడు నతండు శైనేయు విడిచి యపసవ్యకరంబున శరంబులు వఱుచుకొని ప్రాయోపవేశనమతి నుండి ప్రాణాయామ పరాయణుండై యోగయుక్తుండయ్యె; నంత నొడలి కుత్సాహంబు వచ్చి లేచి సాత్యకి గరవాలం బమర్చికొని మాధవధనం జయభీమాశ్వత్థామ కృపకర్ణులు వలదు వలదని యెలుంగెత్తి వారింప క్రోధోన్మాదంబున శిరశ్ఛేదనంబు సేసిన భూరిశ్రవుండు సిద్ధచారణ గణాభినందితుం డగుచుఁ బుణ్యలోకంబున కరిగె; నా శినివరుండు దన్ను వారించిన వారల నుద్దేశించి యభిమన్యు వధప్రకారం బుపన్యసించె; నప్పుడు మన సైనికు లిట్టు దగునే యనువారును, గోపం బేమి సేయింప? దనువారును నతని చేతఁబడినవాఁ డుడుగునే? యనువారును**

**గోపం బేమి సేయింప? దనువారును నతని చేతఁబడినవాఁ డుడుగునే? యనువారును నై రనిన**
**విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె.** 273

**ప్రతిపదార్థం:** ఆ+నరపతి= ఆ రాజు (దుర్యోధనుడు); నరకంబున్+పడన్+కలవాఁడు= నరకానికి పోతాడు (కష్టాలకు లోనవుతాడు); నీవు సద్గతిన్+పొందుము= నీవు పుణ్యలోకాలకు పొమ్ము; అనవుడున్= అనగా; అతండు= ఆ భూరిశ్రవుడు; శైనేయున్ విడిచి= సాత్యకిని వదలి; అపసవ్య కరంబునన్= ఎడమచేతితో; శరంబులు= బాణాలు; పఱచుకొని= క్రింద పరుచుకొని; ప్రాయోపవేశన మతిన్+ఉండి= ప్రాయోపవేశ బుద్ధితో; ప్రాణాయామ పరాయణుండు+ఐ= ఊపిరిని తన ఇష్టప్రకారం నిలపటానికి సిద్ధపడినవాడై; యోగయుక్తుండు+అయ్యెన్= ధ్యానంతో కూర్చున్నాడు; అంతన్= ఆ మీదట; ఒడలికిన్= ఒంటికి; ఉత్సాహంబు లేచి వచ్చి= శక్తి కలిగి; సాత్యకి; కరవాలంబు+అమర్చికొని= కత్తిని చేతబట్టుకొని; మాధవ ధనంజయ భీమ+అశ్వత్థామ కృపకర్ణులు= వీరందరూ; వలదు వలదు= వద్దు వద్దు; అని= అంటూ; ఎలుంగు+ఎత్తి వారింపన్= గొంతెత్తి అడ్డుకోగా; క్రోధ+ఉన్మాదంబునన్= కోపం వలన కలిగిన మత్తుతో; శిరస్+ఛేదనంబు చేసినన్= (భూరిశ్రవుడి) తలను కత్తిరించగా; భూరిశ్రవుండు; సిద్ధచారణ గణ+అభినందితుండు+ అగుచున్= సిద్ధచారణ గణాలతో కీర్తింపబడుతూ; పుణ్యలోకంబునకున్+అరిగెన్= సద్గతికి పోయాడు; ఆ శినివరుండు= ఆ శినివంశశ్రేష్ఠుడు (సాత్యకి); తన్ను వారించిన వారలన్+ఉద్దేశించి= తన్నడ్డుకొన్నవారిని ఉద్దేశించి (చూచి); అభిమన్యువధ ప్రకారంబు= అభిమన్యుడిని చంపిన విధానాన్ని; ఉపన్యసించెన్= వివరించాడు; అప్పుడు= ఆ సమయంలో; మన సైనికులు; ఇట్లు తగునే? అనువారున్= ఈ విధంగా చేయవచ్చునా? అనేవారును; కోపంబు+ఏమి చేయింపదు?+అనువారును= కోపం ఏ పనిని చేయించదు? అనేవారును (కుపితులకు ధర్మాధర్మ వివక్ష ఉండదు); అతనిచేతన్= సాత్యకి చేతిలో; పడిన; వాడు= సాతకి; ఉడుగునే= ఊరకుంటాడా?; అనువారును= అనేవారును; ఐరి= అయ్యారు; అనినన్ విని= అని చెప్పగా విని; ధృతరాష్ట్రుండు సంజయునకున్+ఇట్లు+అనియెన్= ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** రాజైన ఆ దుర్యోధనుడు నరకానికి పోతాడు నీవు స్వర్గానికి పోతావు.' అంటూ అర్జునుడు అనగా, ఆ భూరిశ్రవుడు సాత్యకిని వదలి ఎడమచేతితో బాణాలను క్రిందపరుచుకొని ప్రాయోపవేశ బుద్ధితో సమాధిలోకి వెళ్ళాడు. అపుడు సాత్యకి ఉత్సాహంతో కత్తిని చేతబట్టి శ్రీకృష్ణార్జునులును, భీమ, అశ్వత్థామ కర్ణులును వలదని గొంతెత్తి వారించినా, కోపంతో ఒడలు తెలియక భూరిశ్రవుడి తలను నరికివేశాడు. సిద్ధచారణ గణాలు కీర్తిస్తూ ఉండగా అతడు సద్గతికి పోయాడు. తనను అడ్డుకొన్నవారందరికి సాత్యకి అభిమన్యుడిని (కౌరవులు) చంపిన పద్ధతిని గూర్చి వివరించాడు. ఆ సమయాన మనసేనలోని వారు 'ఈ విధంగా చేయవచ్చునా?' అనీ, 'కోపం ఎంతటి పనినైనా చేయించగల'దనీ, 'సాత్యకి చేతపడితే అతడు చంపకుండా మానుకుంటాడా, అని అన్నారని చెప్పిన సంజయుడి మాటలకు ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు:

**క. 'గురు కృతవర్మాది రథిక । వరులకు నవిజయ్యుఁ డైనవాఁడు శినివరుం**
**డరయఁగ మహాద్భుతం బ । క్కురువరుచే నాతఁ డిట్లగుట సూతసుతా!'** 274

**ప్రతిపదార్థం:** సూతసుతా!= సారథి కుమారుడా (సంజయా!); గురుకృతవర్మ+ఆది రథిక వరులకున్= ద్రోణుడు, కృతవర్మ మొదలయిన వీరవరులకు; అవిజయ్యుఁడు+ఐనవాఁడు= జయించ వీలుకానివాడు; శినివరుండు= శినివంశ శ్రేష్ఠుడు (సాత్యకి); అరయఁగన్= పరిశీలింపగా; ఆ+కురువరుచేన్= ఆ కురువంశం వాడయిన భూరిశ్రవుడి మూలాన; ఆతఁడు; ఇట్లు+అగుట= ఈ విధంగా కావటం (అవమానానికి లోనుకావటం); మహా+అద్భుతంబు= చాలా అబ్బురంగా ఉన్నది.

**తాత్పర్యం:** 'ఓ సంజయా! ద్రోణుడు, కృతవర్మ మొదలయిన వీరవరులకు సైతం జయించటానికి వీలుకానివాడు సాత్యకి. ఈ కురువంశంవాడయిన భూరిశ్రవుడి అవమానానికి అతడు గురికావటం చాలా వింతగా ఉన్నది' (అని ధృతరాష్ట్రుడు సంజయుడితో అన్నాడు).

**సంజయుఁడు ధృతరాష్ట్రునకు సాత్యకి పరాభవ కారణంబు చెప్పుట (సం. 7-119-1)**

**వ. అనవుడు నతఁ డమ్మహీపతి కిట్లను 'దీనికిం గారణంబు గల దాకర్ణింపుము; సోమవంశవరుం డగు యయాతి నందనుం డయిన యదుని కులంబున జనియించిన దేవమీఢునకుఁ బుట్టిన శూరుని కొడుకు వసుదేవుండు రూపగుణంబులఁ బ్రసిద్ధుండై పెరుఁగుచుండ దేవకుం డను భూవల్లభుండు దన పుత్రికి దేవకీదేవికి స్వయంవర మహోత్సవం బాచరించిన నవ్వసుదేవునకై యయ్యాదవాన్వయజాతుం డగు శిని యవ్వనితఁ బరాక్రమంబునఁ దేరఁ గూడిన రాజలోకంబుఁ దొడరి పోరంజాలక నిలిచిన సోమదత్తుం డొక్కరుండును బోక పెనంగె; నయ్యిరువురు నొండొరులచేత విరథులై కృపాణంబులు గొని ధరణికి లంఘించి పోరునెడ నయ్యదువీరుం డాక్రమించి బాహ్లికతనయుం గొప్పువట్టి యొఱగం దిగిచి యనుకంప పెంపునం జంప నొల్లక తన్ని విడిచినం బోయి సిగ్గు పెంపునఁ దలయెత్తి తిరుగనేరక వనంబున కరిగి హరు నుద్దేశించి పెద్దకాలంబు దపంబు సేసిన నప్పరమేశ్వరుండు ప్రత్యక్షంబై వరంబు వేడుమనినఁ దత్కాలంబునకు శినియును దదీయసుతుండును గడచనుటం జేసి శినిమనుమని ననిం బడవైచి తన్నం జాలు తనయు నీవలయు నని యడిగిన నద్దేవుం' డట్ల యగుం గాక! 'యని యానతిచ్చి యంతర్హితుం డయ్యెఁ దద్వరప్రభావంబున భూరిశ్రవుండు సాత్యకి నిట్లు సేసె నని చెప్పిన నాంబికేయుండు గయ్యం బటమీఁద నెట్లు సెల్లె? ననుటయు సంజయుం డి ట్లనియె. 275**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; అతఁడు= ఆ సంజయుడు; ఆ+మహీపతికిన్= ఆ రాజునకు (ధృతరాష్ట్రుడితో); ఇట్లు+అనున్= ఈ ప్రకారంగా అన్నాడు; దీనికిన్+కారణంబు కలదు= దీనికి నిమిత్తమున్నది (సాత్యకిని భూరిశ్రవుడు అవమానించటానికి); సోమవంశవరుండు+అగు= చంద్రవంశంలో శ్రేష్ఠుడయిన; యయాతినందనుండు+అయిన= యయాతి కొడు కయినటువంటి; యదుని కులంబునన్= యదుడి వంశంలో; జనియించిన= పుట్టిన; దేవమీఢునకున్ బుట్టిన= దేవమీఢుడనే వాడికి పుట్టిన; శూరునికొడుకు వసుదేవుఁడు= శూరు డనే వాడికొడుకు వసుదేవుడు; రూపగుణంబులన్ ప్రసిద్ధుండు+ఐ= గుణంలో, ఆకారంలో పేరు పొందినవాడయి; పెరుఁగుచుండన్= పెరుగుతూ ఉండగా; దేవకుండు+అను భూవల్లభుండు= దేవకు డనేరాజు; తన పుత్రికిన్= తన కూతురికి; దేవకీదేవికిన్= దేవకీదేవి అనే ఆమెకు; స్వయంవర మహోత్సవంబు+ఆచరించినన్= స్వయంవరాన్ని చాటగా; ఆ+వసుదేవునకై= ఆ వసుదేవుడి కొరకై; ఆ+యాదవ+అన్వయ జాతుండు+అగు= ఆ యాదవకులంలో పుట్టిన వాడయిన; శిని= శిని అనేవాడు; ఆ+వనితన్+పరాక్రమంబునన్+తేరన్= ఆ స్త్రీని శౌర్యంతో తీసికొని రాగా (ఇతరులను జయించి); కూడిన రాజ లోకంబు= అక్కడ చేరిన రాజులందరూ; తొడరి= ఎదిరించి; పోరన్+చాలక= యుద్ధం చేయలేక; నిలిచినన్= నిలిచిపోగా; సోమదత్తుఁడు+ఒక్కరుండునున్= సోమదత్తు డొక్కడే; పోక పెనంగెన్= వెన్నిచ్చిపోకుండా యుద్ధం చేశాడు; ఆ+ఇరువురు= ఆ శిని, సోమదత్తులు; ఒండొరులచేతన్= ఒకరితో ఒకరు; విరథులు+ఐ= తేర్లు పోగొట్టుకొన్నవారయి; కృపాణంబులు కొని= కత్తులు తీసికొని; ధరణికిన్ లంఘించి= భూమిమీదకు దూకి; పోరు ఎడన్= యుద్ధం చేసేటప్పుడు; ఆ+యదువీరుండు= ఆ యాదవవీరుడు(శిని); ఆక్రమించి= క్రమ్ముకొని; బాహ్లికతనయున్= బాహ్లికుడికొడుకును (సోమదత్తుని); కొప్పు+పట్టి ఒఱగన్+తిగిచి= జుట్టుపట్టి క్రిందకు లాగి; అనుకంప పెంపునన్= దయాధిక్యంతో; చంపన్+ఒల్లక= చంపటానికి ఇష్టపడక; తన్ని విడిచినన్= కొట్టి వదలగా; పోయి= వెళ్ళి; సిగ్గు పెంపునన్= ఎక్కువైన సిగ్గుతో(అవమానంతో); తలయెత్తి తిరుగ నేరక= తల పైకెత్తి తిరుగ లేక; వనంబునకున్+అరిగి= అడవికి వెళ్ళి; హరున్+ఉద్దేశించి= ఈశ్వరుడిని గూర్చి; పెద్దకాలంబు= చాలాకాలం; తపంబు చేసినన్= తపస్సు చేయగా; ఆ+పరమేశ్వరుండు ప్రత్యక్షంబు+ఐ= ఆ పరమశివుడు ఎదుట నిలిచి; వరంబు వేడుము+అనినన్= కోరికను కోరుకొనుమనగా; తత్కాలంబునకున్= ఆవేళకు; శినియును, తదీయ సుతుండును= శినీ, వాడి కొడుకుకూడా; కడ చనుటన్+చేసి= చనిపోవటంచేత; శినిమనుమని= శిని మనుమడిని; అనిన్+పడవైచి= యుద్ధంలో క్రింద తోసి; తన్నన్+చాలు= తన్నగల్గిన;

తనయున్= కొడుకును; ఈ వలయున్+అని= ఈయవలయు నని; అడిగినన్= అడుగగా; ఆ+దేవుఁడు+అట్లు+అ+అగు+కాక!= ఆ విధంగానే అవుగాక!; అని ఆనతి+ఇచ్చి= అని ఆజ్ఞచేసి; అంతర్హితుండు+అయ్యెన్= మాయమయినాడు; తద్వర ప్రభావంబునన్= ఆ వరముయొక్క శక్తిచేత; భూరిశ్రవుండు సాత్యకిన్+ఇట్లు చేసెన్= భూరిశ్రవుడు సాత్యకిని ఈ విధంగా చేశాడు; అని చెప్పినన్= అని చెప్పగా; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; కయ్యంబు+అటమీఁదన్= యుద్ధం తరువాత; ఎట్లుచెల్లెన్?= ఏ విధంగా సాగింది?; అనుటయున్= అనగా; సంజయుండు+ఇట్లు అనియెన్= సంజయు డీవిధంగా అన్నాడు:

**తాత్పర్యం:** చంద్రవంశంలో గొప్పవా డయిన యయాతి కుమారుడూ యదువంశంవాడూ దేవమీఢునికి పుట్టిన శూరునికొడుకు వసుదేవుడు అందచందాలలో పేరుపొందుతూ, పెరుగుతూ వచ్చాడు. దేవకు డనే రాజు తన కూతురు దేవకీదేవికి స్వయంవరం చాటాడు. ఆ వసుదేవుడికిగాను యాదవకులంలో పుట్టిన శిని బలపరాక్రమాలతో ఆమెను తీసికొని వచ్చాడు. స్వయంవరానికి వచ్చిన రాజులలో ఎవరూ, అతడిని ఎదిరించి పోరాడలేకపోగా, సోమదత్తు డొక్కడు మాత్రం వెన్నిచ్చి పోకుండా యుద్ధం చేశాడు. శిని, సోమదత్తులు ఒకరితేరును ఇంకొకరు విరిచారు. తేరులు లేనివారై భూమిమీదకు దూకి యుద్ధం చేశారు. ఆ యాదవరాజు, వీరుడూ అయిన శిని బాహ్లికుడి కుమారు డయిన సోమదత్తుని జుట్టు పట్టి లాగి, క్రింద త్రోసి, తన్ని, అవమానించి దయతలచి చంపకుండా వదలిపెట్టాడు. అవమాన భారంతో తల ఎత్తుకొనలేక అడవులు పట్టిపోయి పరమేశ్వరుడిని ఉద్దేశించి సోమదత్తుడు తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయి వరం కోరుకొమ్మన్నాడు. ఆ వేళకు శినీ, అతడి కొడుకూ కూడా కాలగతిలో కలసిపోయారు కాబట్టి, అతడి మనుమడిని యుద్ధంలో తన్నగలిగే వాడిని, తనకు కొడుకుగా ప్రసాదించుమని కోరాడు. ఆయన సరే అన్నాడు. ఆ తర్వాత శివుడు అంతర్హితు డయ్యాడు. ఆ వరశక్తి వలన భూరిశ్రవుడు సాత్యకిని ఈ విధంగా అవమానించగలిగాడు.' అని సంజయుడు చెప్పాడు. 'ఆ తరువాత యుద్ధం ఎట్లా సాగిం?' దని ధృతరాష్ట్రుడు అడుగగా సంజయుడు దాని ప్రకారం చెపుతూ ఉన్నాడు.

**ఆ. సౌమదత్తి యిట్లు సచ్చినఁ దదనంత । రంబు రథము సింధురాజు దెసకు**
**నరుఁడు నడపఁ బంచె నారాయణు నపుడు । గురుసుతాది రథికవరులు నృపుఁడు. 276**

**ప్రతిపదార్థం:** సౌమదత్తి= సోమదత్తుడి కుమారు డయిన భూరిశ్రవుడు; ఇట్లు చచ్చిన్= ఈ విధంగా చనిపోగా; తద్+అనంతరంబు= ఆ మీదట; నరుఁడు= అర్జునుడు; రథము= తన తేరును; సింధురాజుదెసకున్= సైంధవు డున్న దిక్కునకు; నారాయణున్= శ్రీకృష్ణుడిని; నడపన్= తోలుటకు; పంచెన్= ఉత్తర్వు చేశాడు; అపుడు= ఆ సమయంలో; గురుసుత+ఆది= అశ్వత్థామ మొదలగు; రథికవరులు= వీరులలో మొనగాండ్రు; నృపుఁడు= రాజయిన దుర్యోధనుడును.

**తాత్పర్యం:** భూరిశ్రవు డీ విధంగా చనిపోగా, తనతేరును సైంధవు డున్న దిక్కునకు తోలు మని అర్జునుడు శ్రీకృష్ణునకు ముదల ఇచ్చాడు. అపు డశ్వత్థామ మొదలయిన మొనగాండ్రును, రాజయిన దుర్యోధనుడును. (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. బరవసంబు సేసి యడ్డపడి; రట్టి యెడ కర్ణ సాత్యకులకుఁ గయ్యంబయ్యెఁ; నత్తెఱంగు వివరించెద వినుము; కృష్ణుండు త్రికాలవేది యగుటఁ దన తమ్మునికి భూరిశ్రవుని వలనం బుట్టు నెడరు తెఱం గెఱింగి తొలునాఁటి రాత్రి నిజసారథి యగు దారుకునితోడఁ బార్థుని ప్రతిన నెరపం బూని పలుకు నెపంబున మన యరదం బాయితంబు సేసికొని యెల్లి గయ్యంబునకుం గొని రమ్మని చెప్పెనప్ప డెట్టి యడియాలంబులతోఁ బాంచన్యంబుం బూరింపం గలవాఁడై పలికె నా చందంబున నంతకు మున్న యాసూతునకు నేతేరవలయు**

**తడవు గనుంగొని శంఖంబు పూరించిన వాఁడును శైల్యసుగ్రీవ మేఘ పుష్పవలాహకంబు లను వాహంబుల వేగంబు నెఱయ మెఱయం బొలుచు గరుడకేతనంబు గ్రాలఁ దేరు తత్కాలంబున కొదవ నాలంబులోనికిఁ దెచ్చిన నయ్యచ్యుతుండు మెచ్చుచు నాశైనేయున కిచ్చినం జూచి కౌంతేయుం డచ్చెరువందిన నతనికి నవ్విధంబు గొంత సూచించె; నిట్లు సాత్యకి సన్నద్ధుం డై. 277**

**ప్రతిపదార్థం:** బరవసంబుచేసి= ధైర్యంచేసి; అడ్డపడిరి= అడ్డుకొన్నారు; అట్టి ఎడన్= ఆ సమయంలో; కర్ణ సాత్యకులకున్ కయ్యంబు+అయ్యెన్= కర్ణుడికీ సాత్యకికీ పోట్లాట జరిగింది; ఆ+తెఱంగు= ఆ పద్ధతి; వివరించెదన్= తెలియచెపుతాను; వినుము; కృష్ణుండు; త్రికాలవేది= మూడు కాలాలూ తెలిసినవాడు; అగుటన్= అయినందున; తన తమ్మునకున్= తనకు తమ్ము డయిన సాత్యకికి; భూరిశ్రవుని వలనన్= భూరిశ్రవుడి మూలాన; పుట్టు= కలుగు; ఎడరు తెఱంగు= ఆపదయొక్క విధం; ఎఱింగి= తెలిసి; తొలునాఁటి రాత్రి= అంతకు ముందు రాత్రి; నిజ సారథి+అగు= తన సారథి అయిన; దారుకునితోడన్= దారుకుడితో; పార్థుని ప్రతిన= అర్జునుడి శపథాన్ని; నెరపన్+పూని= నెగ్గజేయ నిశ్చయించుకొని; పలుకు నెపంబునన్= మంతనమాడే మిషతో; మన+అరదంబు+ఆయితంబు చేసికొని= మన తేరును సిద్ధం చేసికొని; ఎల్లి= రేపు (మరునాడు); కయ్యంబునకున్+కొని రమ్మ= యుద్ధానికి తీసికొని రావలసింది; అని చెప్పెన్= అని చెప్పాడు; అప్పుడు= ఆమాట చెప్పిన సమయంలో; ఎట్టి అడియాలంబులతోన్= ఎటువంటి గురుతులతో; పాంచజన్యంబున్= తన శంఖమును; పూరింపన్+కలవాడై= అటువంటి శబ్దం చేసేవాడుగా; పలికెన్= చెప్పాడు; ఆ చందంబునన్= ఆ విధంగా; అంతకు మున్న= అంతకంటే ముందుగానే; ఆ సూతునకున్= ఆ సారథికి; ఏతేరవలయు= రావలసిన; తడవు కనుంగొని= సమయం గుర్తుంచుకొని; శంఖంబు పూరించినన్= శంఖాన్ని ఊదగా; వాఁడును= దారుకుడును; శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, వలాహకంబులను= శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకా లని పిలువబడే; వాహంబులన్= గుర్రాలను; వేగంబు నెఱయమెఱయన్ పొలుచు= వేగం తెలియగా ప్రకాశించే; గరుడ కేతనంబు= గరుడ ధ్వజం; క్రాలన్= ప్రకాశించగా; తేరు= తేరు; తత్కాలంబునకున్= ఆ సమయానికి; ఒదవన్= కలుగగా; ఆలంబులోనికిన్+తెచ్చినన్= యుద్ధంలోనికి తీసికొనిరాగా; ఆ+అచ్యుతుండు= ఆ శ్రీకృష్ణుడు; మెచ్చుచున్= మెచ్చుకొంటూ; ఆ శైనేయునకున్+ఇచ్చినన్= ఆ సాత్యకికి ఈయగా; చూచి= చూచినవాడై; కౌంతేయుడు+అచ్చెరువు+అందినన్= కుంతి కొడుకయిన అర్జునుడు ఆశ్చర్యపడగా; అతనికిన్= ఆ అర్జునుడికి; ఆ+విధంబు= ఆ పద్ధతిని (ఉపాయాన్ని); కొంత సూచించెన్= కొంచెం తెలియజేశాడు; ఇట్లు= ఈ ప్రకారం; సాత్యకి సన్నద్ధుండు+ఐ= సాత్యకి సిద్ధమయి.

**తాత్పర్యం:** ధైర్యంతో (భూరిశ్రవుడు చనిపోగా అర్జునుడి తేరు సైంధవుడి దిక్కునకు శ్రీకృష్ణుడు తోలగా) అశ్వత్థామ మొదలయిన వీరులు అర్జునుడికి అడ్డం వచ్చారు. అప్పుడు కర్ణ సాత్యకులు పోరుట జరిగింది. దానిని వివరిస్తాను వినుము. (అని సంజయు డన్నాడు). త్రికాలవేది అయిన శ్రీకృష్ణుడు తన తమ్ము డయిన సాత్యకికి భూరిశ్రవుడి మూలాన కలిగే ఆపదను తెలిసికొని ముందురోజు రాత్రి తన సారథి అయిన దారుకుడితో పార్థుడి ప్రతిజ్ఞను నెగ్గించటానికి నిశ్చయించి మాట్లాడే నెపంతో 'మన తేరును సిద్ధంచేసికొని రేపు యుద్ధరంగానికి తీసికొని రావలసింది' అని చెప్పాడు. ఆ సమయంలో ఏ గురుతుతో పాంచజన్యాన్ని పూరిస్తా నని చెప్పాడో ఆ విధంగా అంతకంటే ముందుగానే ఆ సారథికి తేరు తేవలసిన సమయాన్ని గుర్తుంచుకొని శంఖాన్ని ఊదాడు. అపుడు దారుకుడు శైబ్య సుగ్రీవ మేఘపుష్ప వలాహకాలనే గుర్రాలను వేగం మెరయగా గరుడకేతనంతో ఆ సమయానికి ఆ తేరును సరిగా యుద్ధరంగంలోకి తీసికొని రాగా, ఆ శ్రీకృష్ణుడు అతడిని మెచ్చుకొని, సాత్యకికి ఆ తేరు నిచ్చాడు. దాని కర్జునుడు అబ్బురపడ్డాడు. శ్రీకృష్ణు డా ఉపాయాన్ని కొంచెం తెలియజేశాడు. ఈ విధంగా సాత్యకి యుద్ధానికి సిద్ధమయ్యాడు (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ఏచి నరునకు సాహాయ్య మాచరించు । కౌతుకంబున నేతేరఁ గర్ణుఁ డతని**
**నధిక సంరంభమునఁ దాఁకె నక్కిరీటి । కని జనార్దనుతోఁడ ని ట్లనియె నగుచు. 278**

**ప్రతిపదార్థం:** ఏచి= విజృంభించి; నరునకున్= అర్జునుడికి; సాహాయ్యము+ఆచరించు= సహాయము చేసే; కౌతుకంబునన్= ఉత్సాహంతో; ఏతేరన్= రాగా; కర్ణుఁడు= కర్ణుడు; అతనిన్= ఆ సాత్యకిని; అధిక సంరంభమునన్= మిక్కిలి ఆటోపంతో; తాఁకెన్= ఎదుర్కొన్నాడు; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; కని= చూచి; జనార్దనుతోడన్= శ్రీకృష్ణుడితో; నగుచున్= నవ్వుతూ; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడికి సాయం చేయాలనే ఆసతో సాత్యకి విజృంభించి రాగా, కర్ణుడు చాలా ఆటోపంతో అతడిని ఎదుర్కొన్నాడు. ఆ స్థితిని చూచి నవ్వుతూ అర్జునుడు శ్రీకృష్ణుడితో ఈ విధంగా అన్నాడు.

**క. 'భూరిశ్రవుండు సచ్చుట । సైరింపక సూతసుతుఁడు సాత్యకితోడం**
**బోరం దొడంగె; మనము వి । చారింపక యెయ్యవలయు సరిగొనకుండన్.' 279**

**ప్రతిపదార్థం:** భూరిశ్రవుండు చచ్చుట= భూరిశ్రవుడు చనిపోవటం; సైరింపక= ఓర్వలేక; సూతసుతుఁడు= కర్ణుడు; సాత్యకితోడన్= సాత్యకితో; పోరన్+తొడంగెన్= యుద్ధానికి పూనుకొన్నాడు; మనము= మనం; విచారింపక= సందేహించకుండా; సరిగొనకుండన్= చంపకుండా; ఎయ్యవలయున్= వెంబడించవలెను.

**తాత్పర్యం:** 'భూరిశ్రవుడు చావటాన్ని సహించక కర్ణుడు సాత్యకితో యుద్ధానికి పూనుకొన్నాడు. అతడు చావకుండా మనం నిస్సందేహంగా అతడిని వెంబడించాలి.

**ఆ. అనుఁడు నతఁడు సాలు నతనికి నా చక్ర । రక్షకులు గడంగి రయము మెఱయఁ**
**గదిసి తోడుపడిరి కావున నక్కడి । చింతవలవ దని మురాంతకుండు. 280**

**ప్రతిపదార్థం:** అనుఁడున్= అర్జునుడు అట్లా అనగా; ముర+అంతకుండు= శ్రీకృష్ణుడు; అతనికిన్= ఆ కర్ణుడికి; అతఁడు= సాత్యకి; చాలున్= పోరుతో సరిపోతాడు - సరి ఉజ్జీ అని భావం; ఆ చక్రరక్షకులు= ఆ సాత్యకి రథచక్రాలను రక్షించే వీరులు (అంగరక్షకుల వంటివారు); కడంగి= పూనుకొని; రయము మెఱయన్= వేగం ప్రకాశించేటట్లు; కదిసి= సమీపించి, కూడి; తోడుపడిరి= సహాయపడ్డారు; కావునన్= కాబట్టి; అక్కడి చింత= ఆ వైపు దిగులు (సాత్యకికి కీడు కలుగుతుందనే బెంగ); వలవదు+అని= వద్దని.

**తాత్పర్యం:** అర్జునుడి మాటలు విని శ్రీకృష్ణు డిట్లా అన్నాడు. 'ఆ కర్ణుడికి సాత్యకి అన్నింట సరితూగుతాడు. అంతేకాక, అతడి చక్రరక్షకులు అప్రమత్తంగా పూనికతో వేగంగా అతడిని సమీపించి తోడుపడ్డారు. కాబట్టి ఆ వైపు దిగులు నీవు పెట్టుకొనవద్దు.'

**వ. తేరును సైంధవుని దెసకుం దరిమె; నప్పుడు శైనేయరాధేయుల పో రెల్లవారును వెఱఁగుపడి చూచుచుండి; రత్తెఱంగు సంగరంబు సురాసుర గంధర్వుల యందునుం గలుగదు; వినుమ; టట్లు పోరి యన్నారాయణానుజుండు. 281**

**ప్రతిపదార్థం:** తేరును సైంధవుని దెసకున్+తరిమెన్= సైంధవు డున్న దిక్కుకు తోలాడు; అప్పుడు శైనేయరాధేయుల పోరు= ఆ సమయంలో సాత్యకి కర్ణుల యుద్ధం; ఎల్లవారును= అందరూ; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; చూచుచున్+ఉండిరి= చూస్తూ ఉన్నారు; ఆ+తెఱంగు సంగరంబు= ఆ విధమయిన యుద్ధం; సుర+అసుర గంధర్వుల యందును= దేవతలూ, రాక్షసులూ, గంధర్వులలో కూడా; కలుగదు= ఉండదు; వినుము= వినవలసింది; అట్లు పోరి= ఆ విధంగా యుద్ధం చేసి; ఆ+నారాయణ+అనుజుండు= ఆ నారాయణుడి తమ్ముడు (సాత్యకి).

**తాత్పర్యం:** (శ్రీకృష్ణుడు) తేరును సైంధవు డున్న ప్రక్కకు తోలాడు. ఆ సమయంలో కర్ణ సాత్యకుల యుద్ధం అందరూ ఆశ్చర్యంతో చూడసాగారు. ఆ విధమయిన యుద్ధం దేవతలలోగాని, రాక్షసులలోగాని జరుగలేదు. ఆ విధంగా యుద్ధంచేసి ఆ నారాయణుడి తమ్ముడు.

**కర్ణుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి యోడిపోవుట (సం. 7-120)**

**చ. నిరుపమశక్తిఁ గర్ణుమెయి నెత్తురు వఱ్ఱుగఁ జేసి సూతునిం**
**దురగములన్ సిడంబు వెసఁద్రుంచి రథంబును నాతపత్రముం**
**దర మిడి నుగ్గు సేసె వసుధావర! తమ్ములు రాజుఁ జూడ న**
**ప్పరుషత సూచి చేయఁగల పార్థివు లాతనిఁ జుట్టుముట్టినన్. 282**

**ప్రతిపదార్థం:** వసుధావర!= ఓ రాజా!; నిరుపమ శక్తిన్= సాటిలేని బలంతో; కర్ణుమెయిన్= కర్ణుడి శరీరాన్ని; నెత్తురు వఱ్ఱుగన్‌చేసి= రక్తం ప్రవాహంగా చేసి; సూతునిన్= సారథిని; తురగములన్= గుర్రాలను; సిడంబు= కేతనమును; వెసన్+త్రుంచి= శీఘ్రంగా ముక్కలు చేసి; రథంబును= తేరును; ఆతపత్రమున్= గొడుగును; తరమిడి= వరుసగా; నుగ్గు చేసెన్= పొడి చేశాడు; తమ్ములు= దుర్యోధనుడి తమ్ములును; రాజు= దుర్యోధనుడును; చూడన్= చూస్తుండగా; ఆ+పరుషతన్= ఆ కాఠిన్యాన్ని; చూచి= చూచి; చేయన్+కల పార్థివులు= చేవ గల (శక్తి ఉన్న) రాజులు; ఆతనిన్= అతడిని; చుట్టుముట్టినన్= చుట్టు క్రమ్ముకొనగా.

**తాత్పర్యం:** ఓ రాజా! సాటిలేని బలంతో కర్ణుడి ఒళ్ళంతా నెత్తురుమయంగా చేసి, అతడి సారథినీ, గుర్రాలనూ, కేతనాన్నీ త్వరగా త్రుంచివేసి - తేరునూ, గొడుగునూ వరుసగా, తమ్ములతో గూడా దుర్యోధనుడు చూడగా పొడిచేశాడు. ఆ వీరత్వాన్ని చూచి, శక్తిగల రాజులు సాత్యకిని చుట్టుముట్టగా.

**క. శరవేగము రథగమన । స్ఫురణ విచిత్రతయు మెఱయఁ బోరి యతం డ**
**య్యరదములగములు సుడివడఁ । దెరల మరలఁ బఱవఁజేసె దీపించె నృపా! 283**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; (కురురాజులు తన్ను చుట్టుకొనగా సాత్యకి) శరవేగము= బాణాలు వేయటంలో తొందర; రథ గమన స్ఫురణ= తేరుల వేగంగా పోయే ప్రకాశం; విచిత్రతయున్= చమత్కారం; మెఱయన్= ప్రకాశించగా; పోరి= యుద్ధంచేసి; అతండు= ఆ సాత్యకి; ఆ+అరదముల గములు= ఆ తేరులగుంపులు; సుడివడన్= కలతచెందగా; తెరలన్= తొలగిపోయేటట్లు; మరలన్= తిరిగి; పఱవన్+చేసెన్= పరుగెత్తేటట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! తనను చుట్టుకొన్న కురురాజుల మీద బాణాలు వేయటంలో వేగం, తేరులు వెళ్ళే వేగం తీరూ, చిత్రవిచిత్రమైన గతులూ ప్రకాశిస్తూ యుద్ధంచేసి, ఆ సాత్యకి ఆ తేరుల గుంపును సుళ్ళు తిరిగి కలతపడేటట్లూ దూరంగా పోయేటట్లూ తిరిగి పరుగులెత్తేటట్లూ చేశాడు.

**క. అనుటయు ధృతరాష్ట్రుఁడు గృ । ష్ణుని రథమును రథ్యములను సూతుఁడు నగుటన్**
**శినివరునకు నుత్సాహం । బనూన మయి చూవె యంత యధికుం డయ్యెన్. 284**

**ప్రతిపదార్థం:** అనుటయున్= సంజయు డావిధంగా చెప్పగా; ధృతరాష్ట్రుఁడు= ధృతరాష్ట్ర చక్రవర్తి; కృష్ణుని= శ్రీకృష్ణుడి; రథమును= తేరునూ; రథ్యములును= గుర్రాలూ; సూతుఁడున్= సారథీ; అగుటన్= అయినందువలన; శినివరునకున్= సాత్యకికి; ఉత్సాహంబు+అనూనము+అయి= సంతోషం ఎక్కువయి; అంత అధికుండు+అయ్యెన్= అంత గొప్పవా డయ్యాడు (బలం కలవాడయ్యాడు; చూవె!= సుమా!

**తాత్పర్యం:** సంజయుడితో ధృతరాష్ట్రుడు ఇట్లా అన్నాడు: 'శ్రీకృష్ణుడి తేరూ, గుర్రాలూ, సూతుడూ అయినందువలన సాత్యకి ఉత్సాహంతో పాటు సాటిలేని బలంతో కూడి మేటి వీరుడయ్యాడు.'

**వ. అనిన విని సంజయుం డతని కిట్లను నట్టియెడ మున్ను దారకుండు దేరు దెచ్చుసంరంభంబు సూచి యది కృష్ణుని పనుపని యెఱుంగని వాఁడగుటఁ గయ్యంబు గజిబిజిగాఁ దలంచుచు వాని పిన్నతమ్ముండు మేలిమి రథంబునం దగు తురంగంబులం బూన్చికొని వివిధాయుధంబు లమర్చికొని కేతనోద్ద్యోతితంబు సేసి యా రథంబు వచ్చిన జాడ నేతెంచి సన్నిహితుం డగుటయు, సాత్యకి సముచితంబుగా నయ్యరదం బెక్కి విక్రమాటోపంబు సూపుచుండ రథాంగధరుని సారథి రథసహితంబుగా నతనికడకుఁ జనియె; నీ కొడుకులు కర్ణుం గల్పితరథోదీర్ణుం గావించి రనవుడు నాంబికేయుం 'డట్లు కిరీటిం గలిసి భీముం డేమి సేసె' నని యడిగిన. 285**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= అనగా విని; సంజయుండు+అతనికిన్+ఇట్లు+అనున్= ధృతరాష్ట్రుడితో ఈ విధంగా అన్నాడు; అట్టి ఎడన్= ఆ సమయంలో; మున్ను= ముందుగా; దారకుండు= దారకు డనే వాడు (ఆ కృష్ణుడి సారథి); తేరుతెచ్చు సంరంభంబు చూచి= తేరును తీసికొనివచ్చే తొందరను చూచి; అది= ఆ తేరు తీసికొని రావటం; కృష్ణుని పనుపు= శ్రీకృష్ణుడి ఉత్తర్వు; అని ఎఱుంగని వాఁడు+అగుటన్= అని తెలియని వాడయినందున; వాని, పిన్నతమ్ముడు= అతడి చిన్న తమ్ముడు. కయ్యంబు= యుద్ధము; గజిబిజికాన్; తలంచుచు; మేలిమి= ఉత్తమమైన రథంబునన్= రథమునందు; తగు తురంగంబులన్+పూన్చికొని= తగిన గుర్రాలను సిద్ధం చేసికొని; వివిధ+ఆయుధంబులు+అమర్చికొని= నానా విధాలయిన ఆయుధాలను ఏర్పాటు చేసికొని; కేతన+ఉద్ద్యోతితంబు చేసి= జెండాను ఎగురవేసి; ఆ రథంబు వచ్చిన జాడన్+ఏతెంచి= ఆ తేరు వచ్చిన బాటనే వచ్చి; సన్నిహితుండు+అగుటయున్= దగ్గరగా వచ్చుటయు; సాత్యకి సముచితంబుగాన్= సాత్యకి తగినట్లుగా; ఆ+అరదంబు+ఎక్కి= ఆ తేరు నెక్కి; విక్రమ+ఆటోపంబు చూపుచుండన్= శౌర్యంయొక్క దర్పాన్ని చూపిస్తూ ఉండగా; రథాంగధరుని= శ్రీకృష్ణుడి యొక్క(చక్రధారియొక్క); సారథి= సూతుడు; రథసహితంబుగాన్= తేరుతోకూడా; అతని కడకున్+చనియెన్= సాతకి దగ్గరకు వెళ్ళాడు; నీ కొడుకులు= నీకుమారులు; కర్ణున్+కల్పిత రథ+ఉదీర్ణున్+కావించిరి= ఏర్పాటు చేసిన తేరుమీద కెక్కించారు; అనవుడున్= అనగా; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; అట్లు కిరీటిన్+కలిసి= ఆ విధంగా అర్జునుడిని కలసికొని; భీముం డేమి చేసెను?= భీము డేమి చేశాడు?; అని అడిగినన్= అని అడుగగా.

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రుడితో ఈ విధంగా అన్నాడు: 'ఆ సమయంలో ముందుగా దారకుడు త్వర త్వరగా రథం తీసుకురావటాన్ని సాత్యకి చూచాడు. కాని, అది శ్రీకృష్ణుని ఆదేశం మేరకు తన సైన్యాం వస్తున్నదని తెలియక, అతని చిన్న తమ్ముడు తగిన గుర్రాలు కట్టి, జెండాను కూర్చి, వివిధ ఆయుదాలు అమర్చి సిద్ధం చేసి తెచ్చిన ఉత్తమ రథాన్ని అధిరోహించి తన పరాక్రమాన్ని చూపుతూ ఉండగా అపుడు శ్రీకృష్ణుడి తేరును తోలుకొని సారథి అతడి దగ్గరకు వెళ్ళాడు. నీ కొడుకులు కర్ణుడికి తగిన తేరును సిద్ధం చేసి దానిమీద కెక్కించారు.' అనగానే ధృతరాష్ట్రుడు 'అర్జునుడిని చేరి భీము డేమి చేశాడు?' అని అడుగగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ఆతనికి సంజయుం డిట్టు లనియె; 'గర్ణు । చేత నవమానింతుం డయి చిన్నఁ బోయి**
**పార్థుపాలికి నరిగియుఁ బలుకకుండెఁ । గినుక నెరియు మనంబుతో మనుజనాథ! 286**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ఓ రాజా!; అతనికిన్= ఆ ధృతరాష్ట్రుడితో; సంజయుడు+ఇట్టులు+అనియెన్= సంజయుడితో ఈ విధంగా అన్నాడు; కర్ణుచేతన్+అవమానితుండు+అయి= కర్ణుడిచేత అవమానపడి; చిన్నఁబోయి= సిగ్గుపడి; పార్థుపాలికిన్= అర్జునుడి దగ్గరకు; అరిగియున్= వెళ్ళికూడా; కినుకన్= కోపంతో; ఎరియు= మండుతున్న; మనంబుతోన్= మనసుతో; పలుకకుండెన్= మాట్లాడకుండా ఉండిపోయాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడితో సంజయుడిట్లా అన్నాడు: 'కర్ణుడిచేత ఆ విధంగా అవమానించబడి (భీముడు) సిగ్గుతో అర్జునుడి యొద్దకు చేరికూడా కోపంతో మండే మనసుతో ఏమీ మాట్లాడకుండా ఉండిపోయాడు.

**వ. పదంపడి త న్నా సూతపుత్రుండు పలికిన పలుకు లా ఫల్గునుతో నుగ్గడించి 'వానిం దొడరి, యే నెల్లభంగులం బరిమార్తు' ననిన నాతం 'డవి నా చెవి సోఁక నాడుట నన్నుఁ బలుకుట గాక నీకుం బని యేమి నీ వటుండు' మని పలికి రాధేయు రథంబున కభిముఖుం డై. 287**

**ప్రతిపదార్థం:** పదంపడి= ఆ మీద; తన్నున్= తనను (భీముడిని); ఆ సూతపుత్రుండు= ఆ కర్ణుడు; పలికిన పలుకులు= మాటాడిన మాటలు(అవమానకరమైన మాటలు); ఆ ఫల్గునుతోన్= ఆ అర్జునుడితో; ఉగ్గడించి= చెప్పి; వానిన్+తొడరి= ఆ కర్ణుడిని ఎదుర్కొని; ఏ నెల్లభంగులన్= నేనన్ని విధాలా; పరిమార్తున్= చంపుతాను; అనినన్= అనగా; ఆతండు= ఆ అర్జునుడు; అవి= ఆ మాటలు; నా చెవి సోఁకన్+ఆడుట= నా చెవికి వినబడేట్లుగా చెప్పటం; నన్నున్+పలుకుట గాక= నన్నే అనటంకాక; నీకున్+పని ఏల?= నీ కెందుకు (ఆ మాటలు నన్నే అన్నవి వాటికి బదులు నే నిస్తాను. నీకెందుకు? - అని అంటున్నాడు); నీవు+అటు+ఉండుము= నీవట్లా ఉండుము (నీవు మాటాడవద్దు); అని పలికి= అని చెప్పి; రాధేయు రథంబునకున్= కర్ణుడి తేరునకు; అభిముఖుండు+ఐ= ఎదురుగా నిలిచి.

**తాత్పర్యం:** తరువాత భీముడు అర్జునుడితో కర్ణుడు తన్నాడిన మాటలన్నీ చెప్పి, అతడినెదుర్కొని అన్నివిధాల హతమారుస్తా నన్నాడు. అందు కర్జునుడు 'ఆ మాటలు నా చెవిని వేయటం వలన అవి నన్ను అన్నట్లే. నీకెందుకు? అతడికి బదులు నే నిస్తాను. నీ వూరకుండుము' అని కర్ణుడి తేరున కెదురుగా పోయి (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'ఏమిర కర్ణ! భీము నటులేటికిఁ దిట్టి; తతండు దోల సి**
**గ్గేమియు లేక పాఱునెడ నెవ్వరు దిట్టిరి నిన్ను గెల్పు సం**
**గ్రామములోనఁ దప్పిదము గల్గిన యంతన యింతగర్వ మే**
**లా? మును ని న్నెఱుంగమె? చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే? 288**

**ప్రతిపదార్థం:** ఏమిర కర్ణ!= ఏరా కర్ణా!?; భీమున్+అటులు+ఏటికిన్ తిట్టితి(వి)= భీముడిని ఆ విధంగా (అవమానకరంగా) ఎందుకు తిట్టావు?; అతండు= ఆ భీముడు; తోలన్= తరుమగా; సిగ్గు+ఏమియు లేక= ఎంతమాత్రం సిగ్గు లేక; పాఱున్+ఎడన్= పరుగెత్తిన సమయంలో; నిన్నున్+ఎవ్వరు తిట్టిరి?= నిన్నెవరు తిట్టారు?(అవమానించారు?); సంగ్రామములోనన్= యుద్ధంలో; గెల్పు= జయం; తప్పిదము కల్గినన్= తప్పిపోతే; అంతన్+అ= అంతలోనే; ఇంత గర్వము+ఏలా?= ఇంత గర్వమెందుకు?; మును= ఇంతకుముందు; నిన్నున్+ఎఱుంగమె?= నీ సంగతి తెలియనిదా?; చలంబునన్= పట్టుదలతో; ఇప్డు= ఈసమయాన; సాత్యకి= సాత్యకి (నిన్ను); గెల్వఁడే?= జయించలేదా?

**తాత్పర్యం:** 'ఏరా కర్ణా! భీముడిని ఆ విధంగా ఎందుకు తిట్టావు? అతడు తరిమినపుడు సిగ్గు లేక పరుగెత్తావే! అపుడు ని న్నెవరయినా తిట్టారా? యుద్ధంలో ఓటమి తప్పా? ఇంత గర్వ మెందుకురా! ఇంతకు ముందు నీ గురించి తెలియదా? ఇపుడు సాత్యకి నిన్ను గెలువలేదా?

**క. గెలుపును నోటమియును ననిఁ । గలుగవె? యెడపెట్టి యెట్టిఘనులకు నిమ్మెఁ**
**బలుకుదురే తగువారిం । దులువా! నీకులము గుణముఁ దోఁచెం బ్రజకున్. 289**

**ప్రతిపదార్థం:** తులువా!= తుంటరీ!; అనిన్= యుద్ధంలో; గెలుపును ఓటమియును= జయాపజయాలు; కలుగవె?= కలుగవా?; ఎడ పెట్టి= తొలగించి; ఎట్టి ఘనులకున్= ఎంత గొప్పవారైనా; తగువారిన్= సాటివారిని; ఈ+మెయిన్= ఈ విధంగా; పలుకుదురే?= మాటాడుదురా?; నీ కులము= నీ వంశమూ; గుణమున్= గుణమూ; ప్రజకున్+తోఁచెన్= జనులకు కూడా తెలుసు.

**తాత్పర్యం:** యుద్ధంలో ఎంత గొప్పవారికైనా గెలుపోటములు కలుగవా? ఈ వాస్తవాన్ని మరచి ఈ విధంగా సాటివారిని మాట్లాడతారా? ఓ తుంటరీ! నీ కులము, గుణం సామాన్య ప్రజలకు కూడా తెలిసివచ్చిందిరా!

**వ. ఇంత వట్టును వెలారింతు నీ మాటలు మఱవకుండు; మిదియునుం గాక నాయసన్నిధిన ధర్మంబున నభిమన్యుని విల్లు దునిమితివి; దానికి నీవు గనుంగొనుచుండ ధర్మప్రకారంబున వృషసేనుని తల దునుము దు; మఱియు నీతోడంగూడ నప్పు డప్పాపం బాచరించిన వారిని నిన్ను నెట్లు సేసెదనో యటుచూడు' మని పలికితఱిమిన మనసైన్యంబు లఱిముఱినతనిపైఁగవిసినఁదత్సమరవిహారంబు దారుణంబయ్యెఁ మిహిరుండును మందరశ్మి యగుచు వచ్చెఁ నా సమయంబున సుయోధనుండు రాధేయున కిట్లనియె. 290**

**ప్రతిపదార్థం:** ఇంతవట్టును= ఇంతమాత్రం; వెలారింతును= చెపుతాను; ఈ మాటలు= ఈ పలుకులు; మఱవక+ఉండుము= మరచిపోవద్దు; ఇదియునున్+కాక= ఇది మాత్రమే కాదు; నా+అసన్నిధిని= నేను దగ్గర లేనపుడు; అధర్మంబునన్= ధర్మానికి వ్యతిరేకంగా; అభిమన్యుని విల్లు తునిమితివి= అభిమన్యుడి విల్లు త్రుంచావు; దానికిన్= ఆ పనికై; నీవు కనుంగొనుచుండన్= నీవు చూస్తూ ఉండగా; ధర్మప్రకారంబునన్= ధర్మమార్గంలో (అనగా మోసమునగాక); వృషసేను తల తునుముదున్= వృషసేనుడి తలను త్రుంచుతాను; మఱియున్ నీతోడన్‌కూడన్= ఇంకా నీతో కలసి; అప్పుడు= ఆ సమయాన; ఆ+పాపంబు+ఆచరించిన వారిని= ఆ దోషం చేసిన వారినీ; నిన్నున్= నిన్ను కూడా; ఎట్లు చేసెదనో= ఏ విధంగా చేస్తానో; అటు చూడుము అని పలికి= ఆ విధంగా చూడుమని చెప్పి; తఱిమినన్= తరుమగా; మనసైన్యంబులు= మనసేనలు; అఱిముఱిన్= తొందరగా; అతనిపైన్= అతడిమీద; కవిసినన్= క్రమ్ముకోగా; తద్+సమరవిహారంబు= ఆ యుద్ధగతి; దారుణ ప్రకారంబు+అయ్యెన్= భయంకరమైనది; మిహిరుండును= సూర్యుడుకూడా; మందరశ్మి అగుచున్ వచ్చెన్= కాంతిహీనుడుగా అయ్యాడు; ఆ సమయంబునన్= ఆ వేళలో; సుయోధనుండు= దుర్యోధనుడు; రాధేయునకున్+ఇట్లు+అనియెన్= కర్ణుడితో ఇట్లాఅన్నాడు:

**తాత్పర్యం:** నే నంతమాత్రం చెపుతాను. ఈ మాటలు మరచిపోవద్దు. ఇంతే కాదు - నేను లేనపుడు అధర్మంగా, న్యాయానికి వ్యతిరేకంగా అభిమన్యుడి విల్లు త్రుంచావు. దానికై నీవు చూస్తూ ఉండగానే ధర్మపద్ధతిలో వృషసేనుడి తలను త్రుంచుతాను. ఇంకా నీతో కలసి ఆ అన్యాయం చేసిన వారి నేవిధంగా చేస్తానో చూడుము' అంటూ తరుమగా, మనసేనలు తొందరగా అతడిని క్రమ్ముకోగా ఆ యుద్ధగతి చాలా భయంకరంగా మారింది. సూర్యుడు కూడా కాంతిహీను డయ్యాడు. అపుడు దుర్యోధనుడు కర్ణుడితో ఈ విధంగా అన్నాడు:

**విశేషం:** అర్జునుడు కర్ణుడితో నేను లేనప్పుడు నా బిడ్డ డయిన అభిమన్యుడిని నీవూ, మరికొందరూ అధర్మంగా చంపారు. నీవు, వారూ చూస్తూ ఉండగా ధర్మపద్ధతితో నీ కొడుకయిన వృషసేనుడిని నేను తల త్రుంచుతాను. దానికి నీ వేమి చేయగలవు?'అని హెచ్చరించాడు.

**సీ. 'శైనేయుఁడును భీమసేనుండు నిరుదెస । రా నర్జునుఁడు సింధురాజు దెసకు**
**నేడ్తెఱఁ దఱిమెడు నింక నొక్కించుక । ప్రొద్దాఁగి పెనఁగినఁ బ్రొద్దు దాను**
**నస్తమించెడును నీయట్టి జోదునకు శ । ల్యుండును గురునందనుండుఁ గృపుఁడు**
**దుశ్శాసనుఁడు నేను దోడ్పడ నతనికిఁ । జేయార్పవచ్చునె? చేటుకాల**

**ఆ. మైనఁ బ్రతిన వట్టె నంతియ తనతోడి । వార సోదరులును వీరు సనిన**
**నేల యెల్ల మనము యేలుద మిత్తఱి । నలవుఁ జలముఁ జూపవలయు నీవు.' 291**

**ప్రతిపదార్థం:** శైనేయుఁడును= సాత్యకీ; భీమసేనుండును= భీముడూ; ఇరుదెస రాన్= రెండు ప్రక్కల రాగా (చక్రరక్షకులవలె రాగా); అర్జునుఁడు= అర్జునుడు; సింధురాజుదెసకున్= సైంధవుడి దిక్కునకు; ఏడ్తెఱన్+తఱిమెడు= విజృంభణంతో తరుముతున్నాడు; ఇంకన్

ఒక్కించుక ప్రొద్దు= ఇంక కొంతసేపు; ఆఁగి పెనఁగినన్= నిలిపి యుద్ధంచేస్తే; ప్రొద్దు తాను= సూర్యుడు తానుకూడా; అస్తమించెడును= అస్తమిస్తాడు; నీ అట్టి జోదునకున్= నీవంటి వీరుడికి; శల్యుండును, గురునందనుండు, కృపుఁడు, దుశ్శాసనుఁడు, నేను తోడ్పడన్= శల్యుడు, అశ్వత్థామ, కృపాచార్యుడు, దుశ్శాసనుడూ, నేనూ తోడు కాగా; చేయార్పవచ్చునె?= చేయి కదల్చ సాధ్యమా?; చేటుకాలమైనన్ ప్రతిన పట్టెన్= (తనకు) చెడిపోయే కాలం కాగా శపథం చేశాడు; అంతియ= అంతమాత్రమే; తనతోడి వార సోదరులును= తన బంధువులు, సోదరులు; వీరు+చనినన్= వీరంతా పోగా; నేల ఎల్లన్= రాజ్యమంతటినీ; మనము+అ ఏలుదము= మనమే పాలిద్దాం; ఈ+తఱిన్= ఈ సమయంలో; అలవున్= బలమూ; చలమున్= పట్టుదలా; నీవు చూపవలయున్= నీవు చూపించవలెను.

**తాత్పర్యం:** 'సాత్యకీ, భీమసేనుడూ రెండు ప్రక్కల రాగా అర్జునుడు సైంధవు డున్న దిక్కునకు విజృంభణంతో సేనను తరుముతున్నాడు. ఇంక కొంత సేపు అతడిని ఆపగలమేని సూర్యు డస్తమిస్తాడు. నీవంటి వీరుడికి శల్యుడూ, అశ్వత్థామా, కృపాచార్యుడూ, దుశ్శాసనుడూ, నేనూ తోడుకాగా అతడికి చేయి కదిలించటం సాధ్యమా! పోగాలం వచ్చి వా డటువంటి ప్రతిజ్ఞ చేశాడు. వీడితోకూడా వాడి సోదరులు కూడ పోయే వారే. వీరి అనంతరం రాజ్యమంతా మనమే ఏలుదాం. ఈ సమయంలో నీవు ఉపాయమూ, పట్టుదలా చూపించవలయును' (అని దుర్యోధనుడు కర్ణుడితో అన్నాడు).

**వ. అనిన సూతనందనుం డమ్మానవపతి నాలోకించి. 292**

**తాత్పర్యం:** అనగా కర్ణు డారాజును (దుర్యోధనుడిని) చూచి.

**చ. 'అనిలతనూజు బాణముల నంగము లెల్లను జాల నొచ్చె నై**
**నను నను మీఱ వచ్చునె? రణంబునఁ గ్రీడికి మేదినీశు మ**
**న్నన గల మేటిబంటు ప్రధనంబున నింతలు సేయ కున్న నొ**
**ప్పునె? యనిఁ బేర్చువాఁ డ నట భూవర! దైవము నేర్చు' నావుడున్. 293**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా! (దుర్యోధనా!); అనిల తనూజు బాణములన్= భీముడి బాణాలతో; అంగములు+ఎల్లను= అవయవాలన్నీ; చాల నొచ్చెన్= మిక్కిలి బాధ చెందినవి; ఐనను= అయినప్పటికినీ; క్రీడికిన్= అర్జునుడికి; రణంబునన్= యుద్ధంలో; ననున్ మీఱవచ్చునె?= నన్నతిశయింపవచ్చునా?; (నన్నుమీరవచ్చునా); మేదినీశు= రాజుయొక్క; మన్నన కల మేటిబంటు= ఆదరంగల గొప్ప వీరుడు; ప్రధనంబునన్= యుద్ధంలో; ఇంతలు చేయకున్నన్= ఈ మాత్రం చేయనట్లయితే; అటన్= అక్కడ; ఒప్పునె?= తగునా?; అనిన్= యుద్ధంలో; పేర్చువాఁడన్= విజృంభించేవాడిని; దైవము+అ నేర్చు= దేవుడికే తెలియును; నావుడున్= అనగా.

**తాత్పర్యం:** ' భీముడి బాణాల తాకిడికి నా ఒడలంతా నొచ్చి ఉన్నది. అంతమాత్రాన అర్జునుడు యుద్ధంలో నన్ను మీరగలడా? రాజుగారి ఆదరమున్న మేటిబంటును. ఈ మాత్రం కూడా యుద్ధం నేను చేయకుండటం ధర్మమా? యుద్ధంలో విజృంభిస్తాను. ఆ మీద దైవ మున్నాడు.' అని కర్ణుడు తన రాజభక్తిని చాటుకొన్నాడు. అతడి మాటలు విని (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. ఆతండు ప్రీతుం డయ్యె; నయ్యవసరంబున భీమ సాత్యకి సహాయుం డగు నా సవ్యసాచి గాడ్పు తోడు గల యగ్నిదేవుండునుం బోలె దేజరిల్లె; భల్లాది బాణంబులు నీ బలంబులపై నిగిడింపఁ జతురంగంబుల యవయవంబులుఁ జామర ఛత్రకేతుక శకలంబులుఁ గోదండ గదాదండాది హేతిఖండంబులుఁ గీడ్వెరసి పాఱు నెత్తురుటేఱులఁ దెట్టువలు గట్టె; నట్టియెడ దుర్యోధన కర్ణవృషసేన శల్య కృపాశ్వత్థామలు గడంగి తమతోడన తఱుము జయద్రథుం బిఱిందికిఁ ద్రోచికొని ప్రొద్దులావునం జేవయెక్కి యక్కిరీటిం దాఁకి**

**తీవ్రశరంబులు పరఁగించిన నవి యతం డొక్కొక్కటిం బెక్కు తునియలు సేయం దఱిమి యందఱు నొక్కుమ్మడి యొక్కొక్కరుండు పె క్కమ్ము లమ్మధుసూదన ధనంజయ తనువులం బఱపిన నన్నరుం డుఱక యొక్కొక్కరినిం బెక్కు నారాచంబుల స్రుక్కించి. 294**

**ప్రతిపదార్థం:** ఆతండు= ఆ దుర్యోధనుడు; ప్రీతుండు+అయ్యెన్= సంతోషించాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; భీమ సాత్యకి సహాయుండు+అగు= భీమసాత్యకుల తోడు కలవా డయిన; ఆ సవ్యసాచి= ఆ అర్జునుడు; గాడ్పుతోడు కల= గాలి సహాయంగా ఉన్న; అగ్నిదేవుండునున్+పోలెన్= అగ్నిదేవుడి మాదిరిగా; తేజరిల్లెన్= వెలిగాడు; భల్లాది బాణంబులు= బల్లెములు మొదలయిన బాణాలను; నీ బలంబులపైన్ నిగిడింపన్= నీ సేనలమీద వేయగా; చతురంగంబుల= నాలుగు విధాలయిన (రథ, గజ, తురగ, పదాతుల) సైన్యముల; అవయవంబులు= శరీరంలోని భాగాలు; చామర+ఛత్ర, కేతు, శకలంబులు= (రాచరికమును చాటే) వింజామరాలు, గొడుగులు, పతాకాలు - వీటి ముక్కలు; కోదండ= విండ్లు; గదా= గదలు; దండ+ఆది= కర్రలు మొదలైన; హేతి= ఆయుధాల యొక్క; ఖండంబులు= ముక్కలు; కీడ్పరసి= చెడిపోయి; పాఱు= ప్రవహిస్తున్న; నెత్తురు+ఏఱులన్= రక్త ప్రవాహాలలో; తెట్టువలుకట్టెన్= గుంపులుగా గుట్టలయినవి; అట్టి ఎడన్= ఆ సమయంలో; దుర్యోధన కర్ణ వృషసేన శల్య కృప+అశ్వత్థామలు= వీరందరునూ;కడంగి= పూనుకొని; తమతోడన తఱుము= తమతో కలిసి తరుముతూ ఉన్న; జయద్రథున్+పిఱిందికిన్ త్రోచికొని= సైంధవుడిని తమవెనుకకు త్రోసికొని; ప్రొద్దులావునన్= ప్రొద్దు అధికం అయినందు వలన; చేవ ఎక్కి= ధైర్యం ఎక్కువై; ఆ+కిరీటిన్+తాఁకి= ఆ అర్జునుడిని ఎదుర్కొని; తీవ్రశరంబులు= వాడి బాణాలు వేయగా; అవి= ఆ బాణాలను; అతండు= అర్జునుడు; ఒక్కొక్కటిం= ఒక్కొక్కదానిని; పెక్కుతునియలు చేయన్= అనేకములైన ముక్కలు చేయగా; తఱిమి= తరుముకొని; అందఱున్= ఆ వీరులందరును; ఒక్కుమ్మడి= ఒక గుంపుగా; ఒక్కొక్కరుండు= ఒక డొక్కడే; పెక్కు+అమ్ములు= అనేక బాణాలను; ఆ+మధుసూదన, ధనంజయ తనువులన్= ఆ శ్రీకృష్ణార్జునుల శరీరాలలో;పఱపినన్= వ్యాపింపజేయగా (చొప్పించగా); ఆ+నరుండు= ఆ అర్జునుడు; ఉఱక= లెక్కించక; ఒక్కొక్కరిని= ఒకరొకరిని; పెక్కు నారాచంబులన్= అనేకము లయిన వాడి బాణాలతో; స్రుక్కించి= మూర్ఛిల్లజేసి.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడు సంతోషించాడు. భీముడు, సాత్యకి తోడు రాగా అర్జునుడు, గాలి తోడైన అగ్నిదేవుడి మాదిరిగా వెలుగుతూ, బల్లెములు, బాణాలూ నీ సేనమీద గుప్పించగా,చతురంగ అవయవాలు చామరమునూ గొడుగునూ పతాకాలనూ ముక్కలు, విండ్లూ గదలూ మొదలైన ఆయుధాలు ముక్కలు సొగసు బాసి నెత్తురుటేరుల ప్రవాహంలో కుప్పలు గట్టి తేలాడయి. దుర్యోధనుడు కర్ణవృషసేన శల్య కృపాశ్వత్థామలు పూనికతో తమతోకూడా శత్రు సైన్యాల తరుముకొని వచ్చే సైంధవుడిని వెనుకకు నెట్టి, ప్రొద్దు ఎక్కువ కావటం వల్ల ధైర్యం ఎక్కువై ఆ అర్జునుడిని ఎదుర్కొని వాడి బాణాలు వేశారు. వాటిని ఆత డొక్కొక్క దానిని ముక్కలు చేశాడు. అందరూ గుంపుగా ఒకేమారు విడిగా ఒక్కొక్కడు అనేక బాణాలు ఆ కృష్ణార్జునుల శరీరాలలో గ్రుచ్చుకొనేటట్లువేశారు. ఆ అర్జునుడు లెక్కసేయక, ఒక్కొక్కరిని పెక్కు వాడి బాణాలతో మూర్ఛిల్లజేశాడు.

### కర్ణార్జునుల ద్వంద్వ యుద్ధము (సం.7-120)

**క. సింధుపతిదెసకు మదవ । త్సింధురగతిఁ గవియఁ జూచి ధీరోద్ధతిఁ గో**
**పాంధమతి నడ్డపడియె వ । సుంధర గ్రక్కదల సూతసూనుం డధిపా! 295**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా!; సింధుపతి దెసకున్= సింధుదేశపు రాజుదిక్కుకు (సైంధవుడి దిక్కుకు); మదవత్+సింధురగతిన్= మదపుటేనుగు మాదిరిగా; కవియన్+చూచి= క్రమ్ముకొన చూచి; ధీరోద్ధతిన్= ధైర్యాతిశయంతో; కోప+అంధమతిన్= కోపం వలన గ్రుడ్డిదైన మనస్సుతో; వసుంధర= భూమి; గ్రక్కదలన్= అదరగా; సూతసూనుండు= కర్ణుడు; అడ్డపడియెన్= అడ్డంగా వచ్చాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! (ధృతరాష్ట్రా!) సైంధవు డున్న దిక్కునకు మదపుటేనుగువలె అర్జునుడు దూకగా చూచి, దర్పాతిశయంతో, కోపం పెల్లుబుకగా గ్రుడ్డిదైనమనస్సుతో భూమి అదరగా కర్ణు డడ్డుపడ్డాడు.

**వ. అప్పుడు. 296**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**ఆ. పదియు నేను నిశిత బాణంబు లర్జునుఁ। డనిలనందనుండు శినివరుండు**
**మూఁడు మూఁడు మెఱుఁగు వాఁడి తూపులు మేను। గాఁడ నేయ నొచ్చి కర్ణుఁ డలిగి. 297**

**ప్రతిపదార్థం:** పదియునేను= పదునైదు; నిశిత బాణంబులు= వాడిబాణాలు; అర్జునుఁడు= అర్జునుడును; అనిలనందనుండు= భీముడు; శినివరుండు= సాత్యకి; మూఁడు మూఁడు= మూడేసి; మెఱుఁగు వాఁడితూపులన్= మెరిసే వాడిబాణాలను; మేను కాఁడన్= ఒంటిలో నాటుకొనేటట్లు; ఏయన్= కొట్టగా; నొచ్చి= బాధపడి; కర్ణుఁడు+అలిగి= కర్ణుడు కోపించి.

**తాత్పర్యం:** పదిహేను వాడి బాణాలు అర్జునుడును, భీమ సాత్యకులు మూడేసి వాడి బాణాలు ఒంటిలో గ్రుచ్చుకొనేటట్లు వేయగా, కర్ణుడు కోపించి.

**క. అఱువది యఱువదియమ్ముల। నెఱఁకులు నోనాడ నేసి నిలిపి తన రయం**
**బెఱిఁగించె ముప్వురకు న। త్తెఱఁ గద్భుతరసమువెల్లిఁ దేల్చె జనములన్. 298**

**ప్రతిపదార్థం:** అఱువది+అఱువది అమ్ములన్= అరవై అరవైగా బాణాలతో; నెఱఁకులు నోనాడన్= మర్మాలు నొవ్వగా; ఏసి= కొట్టి; నిలిపి= ఆపి; ముప్వురకున్= అర్జున, భీమ, సాత్యకులు ముగ్గురికి; తన రయంబు= తనవేగమును(బాణాలు వేయుటలోని వేగమును); ఎఱిఁగించెన్= తెలిపాడు; ఆ+తెఱఁగు= ఆ పద్ధతి; జనములన్= చూచే జనాలను; అద్భుతరసము= ఆశ్చర్య రసం; వెల్లిన్+తేల్చెన్= వెల్లువలో తేల్చింది.

**తాత్పర్యం:** (కర్ణుడు) అరువది అరువది బాణాలతో ఆయువు పట్లునొచ్చేటట్లుకొట్టి, తన వేగాన్ని తెలియజేశాడు. అది చూచేవారి నంతా అద్భుతరస ప్రవాహంలో ముంచింది.

**ఆ. నరుఁడు నూఱు తీవ్రశరముల నయ్యోధ। వరుని తనువు రక్తవారిఁ దోఁప**
**నాతఁ డట్టి నూఱు లై దడరించె న। వ్వేగమునకు రోష వివశుఁ డగుచు. 299**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; నూఱు తీవ్రశరములన్= నూఱు వాడి బాణాలతో; ఆ+యోధవరుని తనువు= ఆ వీరవరుని ఒడలు;రక్తవారిన్+తోఁపన్= నెత్తుటిలో కానరాగా; ఆతఁడు= ఆ కర్ణుడు; అట్టి నూఱులు= ఆ విధమైన నూరులు; ఐదు+అడరించెన్= అయిదింటిని వేశాడు (అనగా అయిదు నూరు బాణాలను వేశాడు); ఆ+వేగమునకున్= ఆ తీవ్రతకు; రోషవివశుఁడు+అగుచున్= కోపంతో పరవశుడౌతూ.

**తాత్పర్యం:** అర్జునుడు నూరు వాడి బాణాలతో కొట్టి, ఆ వీరశ్రేష్ఠుడి శరీరాన్ని నెత్తుటితో తడిసి కనుపించేటట్లుగా చేశాడు. ఆ కర్ణుడు అటువంటివి అయిదు నూర్ల బాణాలను వేశాడు. ఆ వేగానికి అర్జునుడు కోపంతో వివశుడవుతూ.

**క. ఆ విజయుఁడు గర్ణుని విలు। వావిరిఁ దునుమాడి విపుల వక్షము నవ బా**
**ణావిద్ధము సేసి యతని। జీవము గొనునట్టి ఘన విశిఖ మేసె వడిన్. 300**

**ప్రతిపదార్థం:** ఆ విజయుఁడు= ఆ అర్జునుడు; కర్ణుని విలు= కర్ణుడి వింటిని; వావిరి= వెంటనే; తునుమాడి= త్రుంచివేసి; విపుల వక్షము= వెడద అయిన గుండెను; నవబాణ= తొమ్మిది బాణాలతో; ఆవిద్ధము చేసి= తొలిచి; అతని= ఆ కర్ణుడి; జీవము కొనునట్టి= ప్రాణం తీసేటటువంటి; ఘనవిశిఖము= గొప్ప బాణాన్ని; వడిన్= త్వరగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** ఆ అర్జునుడు వేగంగా కర్ణుడి విల్లు త్రుంచివేశాడు. తొమ్మిది బాణాలతో విశాలమయిన అతడి గుండెను తొలిచాడు. ఆతడి ప్రాణాలను తోడే వాడిబాణంతో కొట్టాడు.

**వ. అది యర్ధచంద్రసాయకంబున నశ్వత్థామ త్రుంచె; నంతం గాంచన భాసితంబగు శరాసనంబు గొని రాధేయుండు రయంబునఁ దీవ్రశరంబులు పరఁగింప నర్జునుఁడు 'నిలునిలు కర్ణ! యర్జును నెఱుంగవే?'యనుచు ననేక చండకాండంబులం గప్పినఁ గర్ణుండు 'నిలునిలు మర్జున! కర్ణు నెఱంగవే?' యనుచు నతని బహుపటు ప్రదరంబులం బొదివె; న ట్లయ్యిరువురు నొండొరుల కదృశ్యమూర్తులై సుర లగ్గింపంబోరుచుండం గౌరవపతి తన వారి నెలుంగెత్తి కర్ణునకుఁ దోడ్పడుం డని పనిచె; నక్కొలందికిం గిరీటి కోపాటోపంబున. 301**

**ప్రతిపదార్థం:** అది= ఆ బాణమును; అర్ధచంద్ర సాయకంబునన్= అర్ధచంద్రాకారంలో ఉన్న బాణంతో; అశ్వత్థామ త్రుంచెన్= అశ్వత్థామ త్రుంచివేశాడు; అంతన్= ఆ మీదట; కాంచన భాసితంబు+అగు= బంగారు వన్నె గల; శరాసనంబుకొని= విల్లును తీసికొని; రాధేయుండు= కర్ణుడు; రయంబునన్= వేగంగా; తీవ్రశరంబులు పరఁగింపన్= వాడి బాణాలు వేయుగా; అర్జునుండు= అర్జునుడు; నిలు నిలు కర్ణ!= ఆగు మాగుము కర్ణ!; అర్జునున్+ఎఱుంగవే?= అర్జునుడిని తెలియవా?; అనుచున్= అంటూ; అనేక చండ కాండంబులన్ కప్పినన్= మిక్కిలి తీవ్రమైన బాణాలతో కప్పగా; కర్ణుండు= కర్ణుడు; నిలు నిలుము+అర్జున!= ఓ అర్జునా! ఆగుమాగుము; కర్ణున్+ఎఱుంగవే?= కర్ణుడిని తెలియవా?; అనుచున్= అంటూ; అతనిన్= ఆ అర్జునుడిని; పటు= తీవ్రమైన; ప్రదరంబులన్= బాణాలతో; పొదివెన్= కప్పాడు; అట్లు+ఆ+ఇరువురున్= ఆ విధంగా ఆ ఇద్దరూ; ఒండొరులకున్= ఒకరికొకరు; అదృశ్యమూర్తులు+ఐ= కానరాకుండా; సురలు+అగ్గింపన్= దేవతలు కీర్తించగా; పోరుచుండన్= యుద్ధం చేస్తుండగా; కౌరవపతి= దుర్యోధనుడు; తనవారిన్= తన సైనికులను; ఎలుంగు+ఎత్తి= పెద్ద గొంతుతో; కర్ణునకున్+తోడ్పడుండు+అని పనిచెన్= సహాయపడండని పంపాడు; ఆ+కొలందికిన్= ఆ పరిమితికి; కిరీటి= అర్జునుడు; కోప+ఆటోపంబునన్= కోపంతోడి విజృంభణంతో.

**తాత్పర్యం:** ఆ (అర్జునుడి) బాణాన్ని అశ్వత్థామ అర్ధచంద్రాకారం గల బాణంతో త్రుంచాడు. ఆ మీద బంగారురంగు విల్లు తీసికొని కర్ణుడు వేగంగా వాడి బాణాలను వేయగా, అర్జునుడు 'కర్ణా! ఆగాగు' మంటూ 'అర్జును నెరుంగవా?' అని తీవ్రబాణాలు వేసి కప్పాడు. దానికి కర్ణుడు 'అర్జునా! నిలునిలు'మంటూ, 'కర్ణుడిని గూర్చి నీకు తెలియదా?' అంటూ తీవ్రమయిన బాణాలతో అర్జునుడిని కప్పాడు. ఒకరి కొకరు అగుపడకుండా ఆ ఇద్దరూ చేసే యుద్ధం దేవతలు పొగడే విధంగా సాగింది. అపుడు దుర్యోధనుడు తన సైనికులను ఎలుగెత్తి పిలుస్తూ కర్ణుడికి తోడ్పడవలసిందిగా పంపాడు. ఆ పనికి అర్జునుడు కోపాటోపంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. తురగవ్రాతముఁ గూల్చి, సూతు తనువుం దున్మాడి, విద్వేషి భీ**
**కర నారాచపరంపరానిహతి నంగం బార్తి నొందింప నా**
**తురుఁ డై కర్ణుఁడు దర్పహీనుఁ డగుడున్ ద్రోణాత్మజుం డెయ్యి యా**
**త్మరథస్థుండుగఁ జేసి యేసె విజయున్ మద్రేశుఁడుం దోడ్పడన్. 302**

**ప్రతిపదార్థం:** (అర్జునుడు కోపాటోపంతో) తురగవ్రాతమున్+కూల్చి= (కర్ణుడి) గుఱ్ఱాలను పడగొట్టి; సూతు తనువున్+తున్మాడి= సారథి శరీరాన్ని త్రుంచి; విద్వేషిన్= శత్రువును (కర్ణుడిని); భీకర= భయంకరమైన; నారాచపరంపరా నిహతిన్= వాడి బాణాల మొత్తంతో కొట్టటంచేత; అంగంబు= ఒడలిని; ఆర్తిన్+ఒందింపన్= బాధపెట్టగా; ఆతురుఁడు+ఐ కర్ణుఁడు= బాధపడినవాడై కర్ణుడు; దర్పహీనుఁడు+అగుడున్= గర్వాన్ని పోగొట్టుకొన్నవాడు కాగా; ద్రోణ+ఆత్మజుండు= అశ్వత్థామ; ఎయ్డి= సహాయపడి (ఆదుకొని); ఆత్మరథస్థుండుగన్+చేసి= తన రథంమీద ఉండేటట్లుగా చేసి; మద్ర+ఈశుఁడున్ తోడ్పడన్= శల్యుడు కూడా తోడ్పడగా; విజయున్= అర్జునుడిని; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** కర్ణుడి గుఱ్ఱాలను పడగొట్టి, సారథిని చంపి, భయంకరమైన బాణాలతో మోది, శరీరాన్ని బాధపెట్టగా గర్వహీనుడై కర్ణుడు బాధపడ్డాడు. అపు డశ్వత్థామ ఆదుకొని, తన రథం మీదకి ఎక్కించుకొని, శల్యుడు సహాయపడగా అర్జునుడిని బాణాలతో కొట్టాడు.

**తే. కృపుఁడు వృషసేనుఁడును వారికెడన కూడి । పార్థు తనువునఁ దూపులు పఱపి; రట్లు**
**పొదువు నలువుర పిఱుఁదను బొంచి సింధు । వరుఁడు నిగిడించె నమ్ములు నరుని మీఁద. 303**

**ప్రతిపదార్థం:** కృపుఁడు= కృపాచార్యుడు; వృషసేనుఁడును= వృషసేనుడు (కర్ణుడి కొడుకు); వారి కెడన కూడి= వారి ప్రక్కనే (శల్యాశ్వత్థామల ప్రక్కనే) చేరి; పార్థు తనువునన్= అర్జునుడి ఒంటిమీద; తూపులు= బాణాలను; పఱపిరి= ప్రయోగించారు (గుప్పించారు); అట్లు= ఆ విధంగా; పొదువు= క్రమ్ముకొన్న; నలువుర పిఱుఁదను= నలుగురి వెనుక; పొంచి= దాగి; సింధువరుఁడు= సైంధవుడు; నరునిమీఁదన్= అర్జునుడి మీద; అమ్ములు నిగిడించెన్= బాణాలు వేశాడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడు, వృషసేనుడు శల్యాశ్వత్థామల ప్రక్కకు చేరి, అర్జునుడి శరీరం మీద బాణాలు వేశారు. వారి నల్వుర వెనుక దాగికొని సైంధవుడు కూడ అర్జునుడి మీద బాణాలు వేశాడు.

**క. గురుతనయ ప్రముఖ రథిక । వరుల భుజావిక్రమంబు వారించుచు ని**
**ర్భరరోషమునం బార్థుఁడు । శరంబు లఱిముఱి నిగిడ్చె సైంధవుమీఁదన్. 304**

**ప్రతిపదార్థం:** గురుతనయ ప్రముఖ= అశ్వత్థామ మొదలగు మొనగాండ్రైన; రథికవరుల= సైనిక శ్రేష్ఠుల; భుజావిక్రమంబు= భుజబలాన్ని; వారించుచున్= అడ్డుకొంటూ; నిర్భరరోషమునన్= ఎక్కువయిన కోపంతో; పార్థుండు= అర్జునుడు; శరంబులన్= బాణాలను; అఱిముఱి= విస్తారంగా; సైంధవుమీఁదన్= సైంధవుడిపైన; నిగిడ్చెన్= వేశాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామాది రథికశ్రేష్ఠుల భుజవిక్రమమును అడ్డుకొంటూ ఎక్కువ కోపంతో అర్జునుడు సైంధవుడి మీద బాణాలను వేశాడు.

**వ. ఆ సమయంబున సుయోధనుండు సేనలకుం జేయి వీచిన నొక్కుమ్మడిం గవ్వడిఁ గదిసి వివిధ హేతివ్రాతంబులు మేన నించి నొంచిన గలంక లేక కడంగి. 305**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ వేళలో; సుయోధనుండు= దుర్యోధనుడు; సేనలకున్= తన సైనికులకు; చేయి వీచినన్= చేయి ఊపగా (సైగ చేయగా); ఒక్క+ఉమ్మడిన్= ఒక్క గుంపుగా; కవ్వడి కదిసి= అర్జునుడిని తాకి; వివిధ హేతివ్రాతంబులు= నానా విధ ఆయుధ సమూహాలు; మేన నించి= అతడి శరీరం నిండా నింపి; నొంచినన్= నొప్పించగా; కలంక లేక కడంగి= చీకాకు పడకుండా పూనుకొని.

**తాత్పర్యం:** అర్జునుడు సైంధవుడి మీద బాణాలు వేసిన సమయంలో దుర్యోధనుడు తన సేవలకు చేయి ఊపగా వా రొక్కగుంపుగా అర్జునుడిని క్రమ్ముకొని, అనేక విధాలైన ఆయుధాలతో అతడి ఒడలిని నొప్పించారు. అయినా అర్జునుడు చీకాకు పడకుండా ప్రయత్నంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**శా.** **గాండీవంబు గుణంబు ఘోరరవ మాకాశంబునం బర్వ వే**
**దండస్యందన ఘోటకంబులు మహాస్త్ర క్రూరపాతంబుల**
**న్ఖండీభూతములున్ విదారితములు న్భగ్నంబులుం గా సము**
**ద్దండుం డై యడరం గలంగి పఱచెన్ తత్సైన్యసంతానముల్.** **306**

**ప్రతిపదార్థం:** గాండీవంబు గుణంబు= గాండీవంయొక్క అల్లెత్రాటి; ఘోరరవము= భయాన్ని కలిగించే శబ్దం; ఆకాశంబునన్+పర్వన్= ఆకాశమంతా వ్యాపించగా; వేదండస్యందన= ఏనుగులూ, రథాలూ; ఘోటకంబులు= గుర్రాలూ; మహా+అస్త్ర= గొప్ప అస్త్రముల; క్రూరపాతంబులన్= భయంకరంగా మీదపడటం వలన; తత్సైన్యసంతానముల్= ఆ సేనల సమూహాలు; ఖండీభూతములున్= ముక్కలుగా నయినవీ; విదారితములున్= ఖండితములయినవీ; భగ్నంబులున్+కాన్= విరిగినవీకాగా; సముద్దండుండు+ఐ= మించినవాడై; అడరన్= విజృంభించగా; కలంగి= సంక్షోభం పొంది; పఱచెన్= పరుగెత్తాయి.

**తాత్పర్యం:** గాండీవానికుండే అల్లెత్రాటి టంకార శబ్దం ఆకాశం అంతా వ్యాపించగా, ఏనుగులు రథాలు గుర్రాలు భయంకరమయిన బాణాలతాకిడికి ముక్కలుగా చీల్చబడినవీ, భగ్నమయినవీ కాగా, అర్జునుడి విజృంభణకు ఆ సేనల సమూహాలు సంక్షోభించెంది పారిపోయాయి.

**వ.** **ఇట్లు ప్రచండమూర్తియై మధ్యందిన మార్తాండుండునుం బోలె వెలింగి వివ్వచ్చుండు వియ్యచ్చరుల కచ్చెరువందించె; వెండియు దొరలందఱు నొక్కటఁ దఱుమ నతం డదల్చి యమ్ముల వెల్లిం దేల్చి తెరల్చి దీప్తబాణపాత పూర్వకంబుగా జయద్రథునకుం గవిసిన నమ్మహారథుండు.** **307**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రచండమూర్తి ఐ= భయాన్ని కలిగించే ఆకారం కలవాడై; మధ్యందిన= మట్టమధ్యాహ్నంలోని; మార్తాండుండునున్+పోలెన్= సూర్యుడి మాదిరిగా; వెలింగి= ప్రకాశించి; వివ్వచ్చుండు= అర్జునుడు; వియత్+చరులకున్= ఆకాశంలో తిరిగేవారికి (దేవతలకు); అచ్చెరువు+అందించెన్= ఆశ్చర్యాన్ని కలిగించాడు; వెండియున్= ఇంకను; దొరలందఱును= సేనానులందరూ; ఒక్కటన్= ఒక్కటిగా; తఱుమన్= మూకుమ్మడిగా తరుమగా; అతండు= ఆ అర్జునుడు; అదల్చి= అదరగొట్టి; అమ్ములవెల్లిన్+తేల్చి= బాణప్రవాహంలో తేలజేసి; తెరల్చి= తొలగించి; దీప్త= వెలుగుతూ ఉన్న (వేడిగల); బాణపాతపూర్వకంబుగాన్= బాణాలను వేస్తూ; జయద్రథునకున్= సైంధవుడిమీదకు; కవిసినన్= దూకగా; ఆ+మహారథుండు= ఆ గొప్ప రథికుడయిన సైంధవుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా భయంకరమూర్తి అయి, మట్టమధ్యాహ్నపు సూర్యుడివలె మండుతూ అర్జునుడు ఆకాశచారులను ఆశ్చర్యపరచాడు. ఆ సేనానులందరూ మూకుమ్మడిగా తరుముకొని రాగా, వారి నదల్చి బాణాలవెల్లువలో తేల్చి తరిమి, మండే బాణాలతో సైంధవుడి మీదకు దూకాడు. ఆ మహారథుడైన సైంధవుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **పావక హయకేతన గాం । డీవములం బార్థుపైఁ గడింది వడిన్ సై**
**న్యావళియు దేవతలు నా । నా విధములఁ బొగడ నాఁటె నారాచంబుల్.** **308**

**ప్రతిపదార్థం:** (సైంధవుడు) పోవక= పరుగెత్తిపోకుండా; హయ= గుర్రాలను; కేతన= జెండాను; గాండీవములన్= (అర్జునుడి విల్లయిన) గాండీవాన్ని; పార్థుమైన్= అర్జునుడి ఒంటిమీద; కడింది వడిన్= మిక్కిలి వేగంగా; సైన్యావళియున్= సేనా సమూహమూ; దేవతలు= దేవతలూ; నానావిధములన్+పొగడన్= అనేక రకాలుగా కీర్తించగా; నారాచంబుల్= వాడి బాణాలను; నాఁటెన్= నాటాడు.

**తాత్పర్యం:** (సైంధవుడు) పరుగెత్తిపోకుండా గుర్రాల మీద, జెండా మీద, గాండీవం మీద అర్జునుడి శరీరం మీద, సేనలమీద దేవతలంతా అనేక విధాల పొగడగా వాడి బాణాలు నాటాడు.

**క. విజయుం డతని వరాహ । ధ్వజమును సారథిశిరంబు నొక్కట న**
**క్కజముగఁ బడవేసిన నీ । ప్రజ తామరపాకు నీటి భంగిం దలఁకెన్. 309**

**ప్రతిపదార్థం:** విజయుండు= అర్జునుడు; అతని= ఆ సైంధవుడి; వరాహధ్వజమును= వరాహం (పంది) గుర్తుగా గల కేతనాన్ని; సారథిశిరంబు= సూతుడి తలను; అక్కజముగన్= ఆశ్చర్యంగా; ఒక్కటన్= ఒక్కటిగా; పడవేసినన్= పడగొట్టగా; నీ ప్రజ= నీ జనం; తామరపాకు నీటి భంగినన్= తామరాకుమీది నీరు మాదిరి; తలఁకెన్= కదలాడింది. (ఊఁగి).

**తాత్పర్యం:** అర్జును డా సైంధవుడి వరాహ కేతనాన్ని, సూతుడి తలను ఒకేసారి ఆశ్చర్యంగా నేల పడగొట్టాడు. అది చూచిన నీ సేన తామరాకుమీది నీరు మాదిరిగా భయంతో వణకిపోయింది.

**విశేషం:** అలంకారం ఉపమ.

**క. ప్రాణములు గలుగు నంతకుఁ । ద్రాణపరాయణత నీదు రథికోత్తము ల**
**క్షీణజవమునఁ బ్రసారిత । బాణు లగుచు నతని కడ్డపడిరి నరేంద్రా! 310**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); ప్రాణములు కలుగునంతకున్= ప్రాణాలు ఉన్నంత దాకా; త్రాణపరాయణతన్= కాపాడే ఆశతో; నీదు రథికోత్తములు= నీ సైనికోత్తములు; అక్షీణ జవమునన్= తగ్గని వేగంతో; ప్రసారిత= వేయబడిన; బాణులు+అగుచున్= బాణాలు కలవారుగా; అగుచున్= అవుతూ; అతనికిన్= ఆ సైంధవుడికి; అడ్డపడిరి= అడ్డం పడ్డారు (ఆదుకొన్నారు).

**తాత్పర్యం:** ఓ రాజా! నీ సేనానులు ప్రాణాలున్నంతదాకా తరుగని శక్తితో అతడిని కాపాడే పట్టుదలతో బాణాలు ప్రయోగిస్తూ అడ్డుపడ్డారు.

**వ. ఇవ్విధంబునఁ గృపాశ్వత్థామ శల్య వృషసేనులు దెంపు సేసి సైంధవున కడ్డం బైనం జూచి యా సవ్యసాచి యతనిఁ దెగఁ జూడ నెడ గానక యవుడు గఱచుచుఁ బ్రొద్దుదిక్కు గనుంగొనినఁ గేశవుం డిట్లనియె.311**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= పైన చెప్పిన విధంగా; కృప+అశ్వత్థామ శల్య వృషసేనులు= ఈ పేర్లు కలవారు; తెంపు చేసి= సాహసం చేసి; సైంధవునకున్+అడ్డంబు+ఐనన్= సైంధవుడికి అడ్డమై రాగా; చూచి= చూచినవాడై; ఆ సవ్యసాచి= ఆ అర్జునుడు; అతనిన్+తెగన్+చూడన్= ఆ సైంధవుడిని చంపటానికి; ఎడ కానక= అవకాశం తెలియక; అవుడు కఱచుచున్= తన పెదవిని పంటితో నొక్కుతూ (కోపంతో చేసే పని); ప్రొద్దుదిక్కు= సూర్యుడి వైపు; కనుంగొనినన్= చూడగా; కేశవుండు+ఇట్లు+అనియెన్= కృష్ణుడు ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా కృపాశ్వత్థామ శల్య వృషసేనులు సాహసంతో సైంధవుడి కాపాడటానికి అడ్డంగా (అర్జునుడి దెబ్బ తగులకుండా) నిలబడగా, ఆ అర్జునుడు సైంధవుడిని చంపేదారి తోచక, కోపంతో పెదవి నొక్కుకుంటూ సూర్యుడి దిక్కు చూడగా, కృష్ణుడు ఇట్లా అన్నాడు.

**ఆ. 'చక్కఁ జలము పెనఁగఁ జన దింక నినుఁడు ప । శ్చిమధరాధరంబు సేరఁ బోయె;**
**దీని కొక యుపాయ మేను గల్పించెదఁ । దానఁజేసికాని దాయ వడఁడు. 312**

**ప్రతిపదార్థం:** చక్కన్= సరిగా (న్యాయంగా); చలము= మత్సరంతో (పట్టుదలతో); పెనఁగన్= పోట్లాడగా; ఇంకన్= ఇకమీద; చనదు= పనికారాదు; ఇనుఁడు= సూర్యుడు; పశ్చిమధరాధరంబు= పడమటికొండను; చేరన్+పోయెన్= చేరబోతున్నాడు; దీనికిన్= ఈ పనికి (అనగా ఈ పెనుగులాటకు); ఒక ఉపాయము= ఒక మార్గాన్ని; ఏను కల్పించెదన్= నేను ఏర్పరుస్తాను; దానన్+చేసి కాని= దానితోకాని (ఆ ఉపాయంవలన కాని); దాయ= విరోధి; పడఁడు= పడిపోడు (చనిపోడు).

**తాత్పర్యం:** ' సూటిగ పట్టుదలతో పెనగులాట ఇకమీద పనికిరాదు. సూర్యుడు పడమటి కొండను చేరబోతున్నాడు. దీనికి ఒక ఉపాయాన్ని నేను చూపిస్తాను. దానితోగాని శత్రువు పడిపోడు.

**విశేషం:** సూర్యు డస్తాద్రికి చేరుతున్నాడు. అదే జరిగితే అర్జునుడి ప్రతిజ్ఞ భంగమవుతుంది. కనుక సరి అయిన మార్గంలో గాక, నేను చెప్పే ఉపాయంతో శత్రువును పడగొట్టాలని శ్రీకృష్ణుడు అర్జునుడితో అన్నాడు. ఇది ఒక యుద్ధ తంత్రం.

**వ. అది యెయ్యది యంటేని. 313**

**తాత్పర్యం:** ఆ ఉపాయ మేమంటే.

**క. ఇనమండలంబు మఱువడ । నొనరించెదఁ దమము పాండవోత్తమ! యది గ్రుం**
**కిన చంద మైన సైంధవుఁ । డును గౌరవ యోధులుం గడుం బ్రమదమునన్. 314**

**ప్రతిపదార్థం:** పాండవ+ఉత్తమ!= పాండవులలో శ్రేష్ఠుడా! (ఓ అర్జునా!); ఇనమండలంబున్= సూర్యమండలాన్ని; మఱువడన్= మరుగుపడేటట్లు (కనపడకుండా); తమము= చీకటి; ఒనరించెదన్= చేస్తాను; అది క్రుంకిన చందము+ఐనన్= (ఆ చీకటి) సూర్యుడు అస్తమించిన విధం కాగా; సైంధవుఁడును= సైంధవుడునూ; కౌరవయోధులున్= కురు సేనావీరులునూ; కడున్ ప్రమదమునన్= మిక్కిలి సంతోషంతో.

**తాత్పర్యం:** ఓ పాండవోత్తమా! సూర్యమండలాన్ని మరుగుపడేటట్లుగా చీకటిని కలిగిస్తాను. అది సూర్యుడు అస్తమించిన విధం కాగా సైంధవుడూ మిగిలిన కౌరవవీరులూ చాలా సంతోషంతో.

**వ. ప్రతిజ్ఞా భంగ మయ్యె నని కయ్యంబుకడంక దక్కి విచ్చలవిడి నొండొరుల మెచ్చుచుఁ బొంగి చెలంగుదు; రప్పుడు నీవూన్కి దీర్చికొ'మ్మని పలికినం బరాక్రమంబు సవ్యాజం బయ్యె నని మనోవ్యథంజెందు సవ్యసాచిం గనుంగొనుచు నమ్మాధవుండు మాయాతిమిరంబునఁ దిమిరవైరిం గప్పిన. 315**

**ప్రతిపదార్థం:** ప్రతిజ్ఞా భంగంబు+అయ్యెన్+అని= శపథం విఫల మైనదని; కయ్యంబు కడంకన్= యుద్ధ ప్రయత్నాన్ని; తక్కి= మానుకొని; విచ్చలవిడిన్= యథేచ్ఛగా (ఇష్టం వచ్చినట్లుగా -హద్దు లేకుండా); ఒండొరులన్ మెచ్చుచున్= ఒకరినొకరు మెచ్చుకొంటూ (తమ ప్రయత్నం వలన అర్జునుడి ప్రతిజ్ఞ భంగమైనదని); పొంగి= సంతోషించి; చెలంగుదురు= తిరుగుతారు; అప్పుడు= ఆ సమయాన; నీ పూన్కి= నీ ప్రతిన; తీర్చుకొమ్ము= నెరవేర్చుకొమ్ము; అని= అంటూ; పలికినన్= చెప్పగా; పరాక్రమంబు= శత్రువును జయించటం; సవ్యాజంబు= నెపంతో కూడినది; అయ్యెన్+అని= అయిన దని; మనోవ్యథన్+చెందు= మనసులో బాధపడుతూ ఉన్న; సవ్యసాచిన్+కనుంగొనుచున్= అర్జునుడిని చూస్తూ; ఆ+మాధవుండు= ఆ కృష్ణుడు; మాయాతిమిరంబునన్= మోసపు చీకటితో; తిమిరవైరిన్= సూర్యుడిని (చీకటికి విరోధి); కప్పినన్= కప్పివేయగా.

**తాత్పర్యం:** ప్రతిన భంగమైనదని యుద్ధ ప్రయత్నం మాని, కౌరవవీరులు తమలోతాము ఒకరినొకరు మెచ్చుకొంటూ సంతోషంతో తిరుగుతారు. అపుడు నీ ప్రతిన తీర్చికొమ్ము' అని చెప్పగా శత్రువును జయించటానికి ఒక్క మిష కావలసి వచ్చిందని (ఉపాయం కావలసి వచ్చిందని) చీకాకుపడే అర్జునుడిని చూస్తూ, శ్రీకృష్ణుడు మాయ చీకటిని కలిగించి సూర్యుడిని కప్పివేయగా.

**క. అది రవి గ్రుంకుటగాఁ గొని । మద మెసకంబెసఁగ నార్చి మన సైన్యంబుల్**
**వొదలెఁ దల యెత్తి హర్షా । స్పదమతి సింధుపతి యపుడు పడమర సూచెన్. 316**

**ప్రతిపదార్థం:** అది= ఆ చీకటి; రవి= సూర్యుడు; క్రుంకుట కాన్= అస్తమించటంగా; కొని= తలచికొని; మన సైన్యంబుల్= మన సేనలు; మదము= గర్వం; ఎసకం బెసఁగన్= ఎక్కువ కాగా; ఆర్చి= సింహనాదం చేసి; పొదలెన్= తిరిగినవి; సింధుపతి= సైంధవుడు; హర్ష+ఆస్పదమతిన్= ఆనందంతో కూడిన మనసుతో; తల ఎత్తి= తన తల పైకెత్తి; పడమర చూచెన్= పడమటి దిక్కుకు చూచాడు. (అంటే సూర్యాస్తమయంతో తనకున్న ప్రమాదం తప్పిందని).

**తాత్పర్యం:** అది సూర్యాస్తమయంగా భావించి మన సేనలు గర్వాతిశయంతో సింహనాదాలు చేశాయి. ఆనందంతో నిండిన మనస్సుతో సైంధవుడు తల ఎత్తి, పడమటి దిక్కుకు చూచాడు.

**వ. తదవసరంబున. 317**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**ఆ. 'ఎలమిఁ దేరిమీఁద నిలుచుండి పడమ ర । ట్టెత్తి చూచుచున్న యిద్దురాత్ము**
**మస్తకంబు దునుము మసలక' యని యర్జు । నునకుఁ జూపె సైంధవుని మురారి. 318**

**ప్రతిపదార్థం:** ఎలమిన్= సంతోషంతో; తేరిమీఁదన్= రథంమీద; నిలుచుండి= నిలిచి; పడమర= పడమటి దిక్కుకు; అట్టు+ఎత్తి చూచుచున్+ఉన్న= మెడ ఎత్తి చూస్తూ ఉన్న; ఈ+దురాత్ము= ఈ దుర్మార్గుడి యొక్క; మస్తకంబున్= తలను; మసలక= ఆలస్యం చేయక; తునుము= త్రుంచుము; అని= అంటూ; అర్జుననకున్= అర్జునుడికి; మురారి= శ్రీకృష్ణుడు; సైంధవునిన్+చూపెన్= సైంధవుడిని చూపించాడు.

**తాత్పర్యం:** 'సంతోషంతో తేరిమీద నిలుచుని పడమటి దిక్కుకు మెడ ఎత్తి చూచే ఈ దుర్మార్గుడి తలను వెంటనే త్రుంచివేయుము' అంటూ శ్రీకృష్ణుడు అర్జునుడికి సైంధవుడిని చూపించాడు.

### అర్జునుఁడు సైంధవుని తల దునుముట (సం. 7-121-31)

**క. అతఁడు గని గంధమాల్యా । ర్చిత మై దొన మెఱయుచున్న శితశర ముగ్రో**
**ద్ధతి నేయ డేగ పులుఁగును । గతిఁ గొనుక్రియ నది హరించె గ్రక్కున శిరమున్. 319**

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ అర్జునుడు; కని= చూచి; గంధమాల్య+అర్చితమై= గంధమాల్యాలతో పూజించబడినదై; దొనన్= అమ్ముల పొదిలో; మెఱయుచున్న= ప్రకాశిస్తూ ఉన్న; శితశరము= వాడి అయిన బాణాన్ని; ఉగ్ర+ఉద్ధతిన్= తీవ్రమైన కోపంతో; ఏయన్= వేయగా (కొట్టగా); డేగ= సాళువం; పులుగును= పిట్టను; గతిన్= వెళ్ళేటప్పుడు; కొనుక్రియన్= తీసికొనిపోయేటట్లు (తన్నుకొనిపోయేటట్లుగా); గ్రక్కునన్= వేగంగా; అది= ఆ బాణం; శిరమున్= తలను; హరించెన్= గ్రహించింది.

**తాత్పర్యం:** అర్జునుడు చూచి, గంధపుష్పాలతో పూజించినట్టి అమ్ముల పొదిలో మెరుస్తూ ఉన్న వాడిబాణాన్ని కోపాటోపంతో సంధించి వేయగా, డేగ పిట్టను పోతూ పోతూ తన్నుకొనిపోయేటట్లు వేగంగా అతడి తలను ఆ బాణం హరించింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అప్పుడు సత్వరుండై.** 320

**తాత్పర్యం:** ఆ సమయంలో తొందర కలవాడై.

**ఆ. శౌరి 'పార్థ! పార్థ! సైంధవు తల యిలఁ । బడిన నొప్ప; దది నభంబునంద**
**నిలువఁజేయు; మేను నీ కెఱింగించెద । నత్తెఱంగు దెలియ' ననిన నతఁడు.** 321

**ప్రతిపదార్థం:** శౌరి= శ్రీకృష్ణుడు; పార్థ! పార్థ!= అర్జునా! అర్జునా!; సైంధవుతల= సైంధవుడి తల; ఇలన్+పడన్+ఒప్పదు= భూమిమీద పడదగదు; అది= ఆ తల; నభంబునందున్+అ= ఆకాశంలోనే; నిలువన్+చేయుము= నిలిచేటట్లుగా చేయుము; ఏను= నేను; ఆ+తెఱంగు= ప్రకారం; తెలియన్= స్పష్టంగా; నీకున్+ఎఱింగించెదన్= నీకు తెలుపుతాను; అనినన్= అనగా; అతడు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు 'ఓ అర్జునా! అర్జునా! సైంధవుడి తల నేల మీద పడకూడదు. దానిని ఆకాశంలో నిలిచేటట్లు చేయుము. దానికి కారణం నేను చెపుతాను.' అనగా అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పటు శరముల మీఁదికి డా । పటికిన్ వలపటికి నపర భాగమునకు ముం**
**దటికిఁ జదల నడపె సము । త్కటరయమున శిరమున్ గందుక క్రీడ గతిన్.** 322

**ప్రతిపదార్థం:** పటు శరములన్= తీవ్రమైన బాణాలతో; శిరమున్= (సైంధవుడి) తలను; కందుక క్రీడ గతిన్= బంతి ఆటవలె; మీఁదికిన్= పైకి; డాపటికిన్= ఎడమకు; వలపటికిన్= కుడికీ; అపర భాగమునకున్= వెనుకకూ, ముందటికిన్= ముందరికీ; చదలన్= ఆకాశంలో; నడపెన్= తిప్పాడు.

**తాత్పర్యం:** గట్టి బాణాలతో మీదకు, కుడియెడమలకు, ముందు వెనుకలకు ఆకాశంలో మిక్కిలి వేగంగా (సైంధవుడి) తలను బంతి ఆటవలె నడపాడు.

**విశేషం:** అలంకారం ఉపమ.

**వ. అట్టియెడ.** 323

**తాత్పర్యం:** అటువంటి సమయాన.

**క. మాయపుఁ జీఁకటి విరియుడుఁ । దోయజమిత్త్రుండు మగుడఁ దోఁచెఁ బ్రజకుఁ గో**
**పాయత్తు లై బలంబులఁ । జేయంగలవారు గడఁగి శితబాణములన్.** 324

**ప్రతిపదార్థం:** మాయము+చీఁకటి= అబద్ధపు చీకటి; విరియుడున్= విచ్చిపోగా; తోయజమిత్త్రుండు= పద్మమిత్త్రుడైన సూర్యుడు; ప్రజకున్= జనులకు; మగుడన్+తోఁచెన్= మళ్ళీ కానుపించాడు; బలంబులన్= సేనలలో; చేయన్+కలవారు= శక్తి ఉన్నవారు; కోపాయత్తులు+ఐ= కోపంతో సిద్ధపడినవారై; శిత బాణములన్= వాడి బాణాలతో; కడఁగి= పూనుకొని.

**తాత్పర్యం:** మాయచీకటి విచ్చిపోగా సూర్యుడు మళ్ళీ కానవచ్చాడు. కోపంతో నిండిన మనస్సులతో సేనలలో శక్తికలవారు వాడిబాణాలతో విజృంభించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నరుఁ బొదివి; రతఁడు వారల । యురవడి వివిధాస్త్రతతుల నుడుపుచు నింగిం**
**దిరుగ మును నడపుచుండెడు । శిరమును నేమరక యుండెఁ జిత్రస్ఫురణన్. 325**

**ప్రతిపదార్థం:** నరున్= అర్జునుడిని; పొదివిరి= క్రమ్ముకొన్నారు; అతఁడు= నరుడు; వారల= ఆ వీరుల; ఉరవడిన్= వేగాన్ని (దూకుడును); వివిధ+అస్త్రతతులన్= అనేక విధాల బాణాల సమూహాలతో; ఉడుపుచున్= నిలుపుతూ; నింగిన్= ఆకాశంలో; తిరుగన్= తిరుగగా; మును= ఇదివరకు; నడపుచున్+ఉండెడు= నడుపుతూ ఉన్న; శిరమును= తలను; చిత్రస్ఫురణన్= ఆశ్చర్యం కలిగేటట్లు; ఏమరక ఉండెన్= మరచిపోకుండా ఉన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడిని చుట్టు ముట్టారు. వారి దూకుడును నానావిధాలయిన బాణాలతో వారిస్తూ, ఆకాశంలో ఇదివరకే తిరుగుతూ ఉన్న (సైంధవుడి) తలను ఏమరుపాటు చెందకుండా ఆశ్చర్యంగా త్రిప్పుతూ ఉన్నాడు.

**వ. ఇ ట్లత్యాశ్చర్యకరణ పరిణత బాహువీర్యుం డై విక్రమవిహారంబు సలుపుచుండి. 326**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అతి+ఆశ్చర్యకరణ= మిక్కిలి ఆశ్చర్యాన్ని కలిగించే; పరిణత= పరిపూర్ణతను పొందిన; బహు వీర్యుండు+ఐ= బహుబలము కలవాడై; విక్రమ, విహారంబు= పరాక్రమముతో కూడిన విహారము; సలుపుచు+ఉండి= చేయుచు ఉండి.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆశ్చర్యాన్ని కలిగించే పరిణతమైన భుజబలంతో వీరవిహారం చేస్తూ ఉండి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'దనుజవైరి! యెంతతడ వింక నిలుపంగ । వలయు సింధురాజు తల నభమున?**
**నెచట వైచువాఁడ? నేమిటి కివ్విధ । మాచరింప వలసె? ననిన నతఁడు. 327**

**ప్రతిపదార్థం:** దనుజవైరి!= రాక్షసులకు శత్రువైన వాడా! (శ్రీకృష్ణా!); సింధురాజు తల= సైంధవుడి తలను; నభమునన్= ఆకసంలో; ఎంత తడవు= ఎంతకాలం; నిలుపంగ వలయున్?= నిలుప వలెను?; ఇంకన్= ఇంకా; ఎచటన్ వైచువాఁడన్?= ఎక్కడ వేయుదును?; ఈ+విధము= ఈ ప్రకారంగా; ఏమిటికి= ఎందుకోసం; ఆచరింపవలసెన్?= చేయవలసి వచ్చింది?; అనినన్= అని అడుగగా; అతఁడు= శ్రీకృష్ణుడు.

**తాత్పర్యం:** 'కృష్ణా! ఎంతకాలం ఈ సైంధవుడి తలను ఆకాశంలో నిలుపవలెను? ఎక్కడ వేయవలెను? ఎందుకు ఈ విధంగా చేయవలసి వచ్చింది?' అనగా, దానికి అతడు.

**వ. 'వినుము. వృద్ధక్షత్త్రుం డను సింధుదేశాధీశుండు సంతానకర తపోవిశేషంబున నీ జయద్రథుం బడసె; నితండు కుమారుండై వర్తిల్లు సమయంబున నొక్కనాఁ డశరీరవాణి 'వీఁడు సంగ్రామంబున నేమఱి తల దునుమంబడు' నని యాదేశించిన నతం డెల్లవారును విన 'వీని మస్తకంబు మహిం బడ నెవ్వఁడేసె వాని శిరంబు శకలశతం బయ్యెడు' మని తన తపంబు బలిమిం బలికి, యతనిఁ బట్టంబు గట్టి వనంబునకు నియతుండై యరిగె; నట్లుగావున. 328**

**ప్రతిపదార్థం:** వినుము= అర్జునా! వినుము; వృద్ధక్షత్త్రుండు+అను= వృద్ధక్షత్రుడనే పేరుకల; సింధుదేశ+అధీశుండు= సింధుదేశపురాజు; సంతానకర= పిల్లలను కలిగించే; తపోవిశేషంబునన్= గొప్ప తపస్సుతో; ఈ జయద్రథున్+పడసెన్= జయద్రథుడనే వీడిని పొందాడు; ఇతండు= ఈ జయద్రథుడు; కుమారుండు+ఐ= వయస్సు వచ్చిన కొడుకుగా; వర్తిల్లు సమయంబునన్= తిరుగాడేటప్పుడు; ఒక్కనాఁడు= ఒకానొక రోజున; అశరీరవాణి= ఆకాశవాణి; వీఁడు= ఈ జయద్రథుడు;

సంగ్రామంబునన్= యుద్ధంలో; ఏమఱి= ఏమరుపాటున ఉండగా; తల; తునుమన్+పడున్= త్రుంచబడుతాడు; అని ఆదేశించినన్= అని ఉత్తర్వు చేయగా; అతండు= ఆ సింధురాజు; ఎల్లవారును వినన్= అక్కడున్న వారంతా వినగా; వీని మస్తకంబు= ఈ (కుమారుడి) తలను (సైంధవుడి తలను); మహిన్+పడన్= భూమిమీద పడగా; ఎవ్వఁడు+ఏసెన్= ఎవడు కొడతాడో; వాని శిరంబు= అతడి తల; శకలశతంబు+అయ్యెడున్+అని= నూరు ముక్కలవుగాక అని; తన తపంబు బలిమిన్= తన తపోబలంతో; పలికి= చెప్పి; అతనిన్= ఆ సైంధవుడిని; పట్టంబు కట్టి= పట్టాభిషేకం చేసి; వనంబునకున్= అడవికి; నియతుండు+ఐ అరిగెన్= నియమంతో వెళ్ళాడు; కావునన్= అందుచేత.

**తాత్పర్యం:** 'అర్జునా! వినుము. వృద్ధక్షత్రుడనే సింధుదేశపు రాజు పిల్లలకొరకై చేసిన గొప్ప తపస్సువలన జయద్రథుడు అనే పేరుగల కుమారుడు పుట్టాడు. వయసులో వీడు తిరుగుతూ ఉన్నప్పుడు ఒకానొక దినం ఆకాశవాణి 'ఈ జయద్రథుడు ఏమరుపాటులో ఉండగా యుద్ధంలో ఇతడి తల త్రెంచబడుతుం'దని ఆదేశించింది. అప్పుడు అక్కడ వారంతా వినేటట్లు 'ఇతడి తలను ఎవడు భూమిమీదకు పడకొడతాడో వాడి తల నూరువ్రక్కలవుతుంది' అని తన తపశ్శక్తితో వృద్ధక్షత్రుడు అన్నాడు. ఆ కారణంగా.

**క. ఈ తల పుడమిం బడనీ । కాతనితొడమీఁద వైచునది; యాపని వి**
**ఖ్యాతం బగు పాశుపతము । చేతన యగుఁగాక! యొంటఁ జెల్లునె మనకున్? 329**

**ప్రతిపదార్థం:** ఈ తల= ఈ సైంధవుడి తలను; పుడమిన్+పడనీక= భూమిమీద పడకుండా; ఆతని తొడమీఁద వైచునది= ఆ వృద్ధక్షత్రుడి తొడమీద (ఒడిలో) వేయవలసింది; ఆ పని= ఆ వేసే పని; విఖ్యాతంబు+అగు= ప్రశస్తమైన; పాశుపతము చేతన= పాశుపతాస్త్రం వలననే; అగున్+కాక= అవుతుంది; మనకున్= మనకు; ఒంటన్= వేరొకదానితో; చెల్లునె?= సాగుతుందా?(అనగాసాగదని).

**తాత్పర్యం:** ఈ సైంధవుడి తలను భూమిమీద పడనీయకుండా ఆ వృద్ధక్షత్రుడి తొడపై పడేటట్లు చేయుము. ఆ పని పాశుపతాస్త్రం వలననే అవుతుంది. దానిశక్తి అట్టిది. వేరొక దానివలన కాదు.

**వ. ఆ వృద్ధక్షత్త్రుండు శమంతపంచక సమీపంబున నుండు; నీ వమ్మహనీయాస్త్రంబు నాశ్రయింపు' మనవుడు నర్జునుం డట్లకాక యని భక్తియుక్తంబుగా నియతమతిం దత్ప్రయోగం బాచరించిన నద్దివ్యసాధనంబు సాయక పరంపరాకారాంబయి యా శిరం బట గొని చని తదాశ్రమ ద్వారంబు సొచ్చునప్పు డజ్జనపతి జపయుక్తుండై యుండ నమ్మహాస్త్రంబు మాహాత్మ్యంబున నమ్మస్తకం బతని తొడమీఁదఁ బడిన నతండు తదీయ స్పర్శంబున నెఱింగి దిగ్గన లేచుచుం ద్రోచిన నది భూతలపతితం బగుటయు. 330**

**ప్రతిపదార్థం:** ఆ వృద్ధక్షత్త్రుండు= ఆ వృద్ధక్షత్రుడనే వాడు; శమంతక పంచక సమీపంబునన్= శమంత పంచకమనే కొలకుల దగ్గర; ఉండున్= ఉంటాడు; నీవు; ఆ+మహనీయాస్త్రంబున్= ఆ మహాస్త్రాన్ని; ఆశ్రయింపుము= సాయం కోరుము; అనవుడున్= అనగా; అర్జునుండు; అట్లు+అ కాక!= అంతే అగుగాక!; అని= అంటూ; భక్తియుక్తంబుగాన్= భక్తితో కూడా; నియతమతిన్= నియమంతో కూడిన మనస్సుతో; తత్ప్రయోగంబు+ఆచరించినన్= ఆ అస్త్రాన్ని వేయగా; ఆ+దివ్యసాధనంబు= ఆ దైవశక్తికల ఆయుధం; సాయక పరంపరా+ఆకారంబు+అయి= బాణాల వరుస రూపం అయి; ఆ శిరంబు+అటగొని చని= ఆ తలను అక్కడికి తీసికొనిపోయి; తద్+ఆశ్రమద్వారంబు= ఆ వృద్ధక్షత్రుడు ఉన్న ఆశ్రమం వాకిలిలోనికి; చొచ్చునప్పుడు= వెళ్ళేటప్పుడు; ఆ+జనపతి= ఆ రాజు (వృద్ధక్షత్రుడు); జపయుక్తుండు+ఐ ఉండన్= జపం చేసికొంటూ ఉండగా (ధ్యానంలో ఉండగా); ఆ+మహా+అస్త్రంబు= ఆ దివ్యాస్త్రం యొక్క; మాహాత్మ్యంబునన్= శక్తితో; ఆ+మస్తకము= ఆ తల (సైంధవుడి తల); అతని

తొడమీఁదన్+పడినన్= అతడి తొడపై పడగా; అతండు= ఆ వృద్ధక్షత్రుడు; తదీయ= దానియొక్క; స్పర్శంబునన్= తాకుటవలన; ఎఱింగి= తెలిసి; దిగ్గన లేచుచున్= త్వరగా (తొట్రుపాటుతో) లేస్తూ; త్రోచినన్= త్రోయగా; అది= ఆ తల; భూతల పతితంబు+అగుటయున్= భూమి మీద పడగా.

**తాత్పర్యం:** ఆ వృద్ధక్షత్రుడు శమంత పంచకమనే చోట ఉంటాడు. ఈ మహత్త్వం కల పాశుపతాస్త్రాన్ని సహాయం కోరుకొనుము.' అనగా అర్జునుడు అట్లే యని మిక్కిలి భక్తితో నియమంగా దానిని (పాశుపతాన్ని) వేయగా, ఆ దివ్యబాణం బాణాల వరుసగా మారి, ఆ తలను మోసికొనిపోయి వృద్ధక్షత్రుని ఆశ్రమద్వారాన్ని ప్రవేశించేటప్పుడు జపంలో ఉన్న ఆ రాజు తొడమీద ఆ తల అస్త్రమాహాత్మ్యంతో పడింది. ఆ రాజు దాని తాకిడికి దిగ్గనలేస్తూ దాన్ని తోశాడు. అది క్రిందపడి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **పగిలి యాతని తల నూఱు పఱియలయ్యెఁ । శౌరి విజయుని నగ్గించె; సకల భూత**
**ములు మహాద్భుతరసమున మునిఁగె; నపుడు । సంహరించె నయ్యస్త్ర మా సవ్యసాచి.** **331**

**ప్రతిపదార్థం:** పగిలి= చీలి; ఆతని తల= ఆ వృద్ధక్షత్రుడి తల; నూఱు పఱియలు+అయ్యెన్= నూరు ముక్కలయింది; శౌరి= కృష్ణుడు; విజయునిన్= అర్జునుడి; అగ్గించెన్= పొగడాడు; సకలభూతములు= అన్ని ప్రాణులూ; మహా+అద్భుత రసమునన్= గొప్ప అద్భుతరసంలో; మునిఁగెన్= మునిగాయి (అనగా ఆశ్చర్యాన్ని పొందాయి); అపుడు= ఆ సమయంలో; ఆ సవ్యసాచి= ఆ అర్జునుడు; ఆ+అస్త్రము= ఆ అస్త్రాన్ని; సంహరించెన్= ఉపసంహరించాడు.

**తాత్పర్యం:** ఆ వృద్ధక్షత్రుడి తల నూరు ముక్కలుగా చీలింది. కృష్ణుడు అర్జునుడిని పొగిడాడు. ప్రాణు లంతా ఆశ్చర్యంలో మునిగారు. అర్జునుడు ఆ అస్త్రాన్ని ఉపసంహరించాడు.

**క.** **ఇవ్విధమున సైంధవు తలఁ । గవ్వడి యట నడపుశక్తి గనుఁగొని సేనల్**
**నివ్వెఱఁగందె; మనంబుల । క్రొవ్వడఁగెను దొరల కెల్లఁ గురువంశనిధీ!** **332**

**ప్రతిపదార్థం:** కురువంశనిధీ!= కురువంశమునకంతకూ నిధియైనవాడా! (ఓరాజా!); ఈ+విధమునన్= ఈ ప్రకారంగా; సైంధవు తల= సైంధవుడి తలను; కవ్వడి= అర్జునుడు; అట నడపు శక్తిన్+కనుఁగొని= అక్కడ నడిపించే శక్తిని చూచి; సేనల్= మన సేనలు; నివ్వెఱఁగు+అందెన్= ఆశ్చర్యపోయాయి; దొరలకున్+ఎల్లన్= మనరాజులకందరికీ; మనంబులన్= మనసులలో; క్రొవ్వు+అడఁగెను= గర్వము అణగింది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్రా! ఆ విధంగా అర్జునుడు సైంధవుడి తలను నడిపించిన విధానాన్ని చూచి సేనలు భయపడ్డాయి. రాజులందరికీ పొగరణిగింది.

**సీ.** **సైంధవు ఘోరకబంధంబు దల యిలఁ । బడునంతకును దేరిపైన నిలిచి**
**మఱి కూలుటయు విస్మయము గావించెఁ జూ । పఱ కట్లు పార్థుండు ప్రతిన నెఱపె;**
**నీ తనూభవులు గన్నీళ్లు దొరఁగ న । త్యంత శోకముఁ బొంది; రచ్యుతుండు**
**నన్నరుండును బరమానంద కందళి । తాత్ములై; రత్తఱి ననిలసుతుఁడు**

**ఆ.** **నలిఁ జెలంగి సింహనాదంబు సేసిన । విని యుధిష్ఠిరుండు విజయు పూన్కి**
**నెఱయు టెఱిఁగి హర్షనిర్భరాకృతి యయ్యె । నుల్లసిల్లి రతని యోధు లెల్ల.** **333**

**ప్రతిపదార్థం:** సైంధవు= సైంధవుడి; ఘోర కబంధంబు= భయంకరమైన మొండెం; తల= అతడి తల; ఇలన్+పడునంతకును= భూమిమీద పడేదాకా; తేరి పైన్+అ నిలిచి= తేరుమీదనే నిలిచి ఉండి; మఱి కూలుటయు= ఆ మీద పడటం; చూపఱకున్= చూచేవారికి; విస్మయము కావించెన్= ఆశ్చర్యాన్ని కలిగించింది; అట్లు= ఆ ప్రకారం; పార్థుండు= అర్జునుడు; ప్రతిన నెఱపెన్= తన ప్రతిజ్ఞను తీర్చుకొన్నాడు; నీ తనూభవులు= నీ కుమారులు; కన్నీళ్ళు తొరఁగన్= కన్నీళ్ళు కారగా; అత్యంత శోకమున్+పొందిరి= మిక్కిలి దుఃఖపడ్డారు; అచ్యుతుండున్= శ్రీకృష్ణుడును; ఆ+నరుండును= ఆ అర్జునుడును; పరమానంద= మిక్కిలి సంతోషంతో; కందళిత+ఆత్ములు+ఐరి= వికసించిన మనస్సుకలవారయ్యారు; ఆ+తఱిన్= ఆ సమయాన; అనిలసుతుఁడు= భీమసేనుడు; నలిన్+చెలంగి= ఎక్కువగా విజృంభించి; సింహనాదంబు చేసినన్= సింహగర్జనం సేయగా; విని= విన్నవాడై; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; విజయుపూన్కి= అర్జునుడి ప్రతిజ్ఞ; నెఱయుట+ఎఱిఁగి= నెరవేరుట తెలిసి; హర్షనిర్భర= సంతోషంతో నిండిన; ఆకృతి+అయ్యెన్= ఆకారం కలవా డయ్యాడు; అతనియోధులు+ఎల్లన్= అతడి సైనికులంతా; ఉల్లసిల్లిరి= సంతోషించారు.

**తాత్పర్యం:** సైంధవుడి తల భూమిమీద పడేదాకా భయంకరమైన అతడి మొండెం తేరిమీదనే నిలిచి ఉండి ఆ మీదట పడిపోవటం ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆ విధంగా అర్జునుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నాడు. నీ కొడుకులు కన్నీళ్ళు దొర్లగా చాలా దుఃఖించారు. కృష్ణార్జునులు సంతోషం నిండిన మనసు కలవారయ్యారు. అపుడు భీమసేనుడు చాలా విజృంభించి సింహనాదం చేశాడు. దానిని విన్న ధర్మరాజు సంతోషంతో నిండిన ఆకారం కలవా డయ్యాడు. ఆతడి సైనికులంతా సంతోషించారు.

**వ. అచ్చట నార్పులుఁ దూర్యనినదంబులుఁ జెలంగెఁ; దద్బలంబులుఁ బరమప్రమోదంబునుం బొందె నని సంజయుండు సైంధవవధ ప్రకారంబు ధృతరాష్ట్రున కెఱింగించె నని చెప్పినఁ జిత్తంబు గౌతుకాయత్తంబగుచుండ నటమీఁది వృత్తాంతం బెఱింగింపు మనుటయు.** 334

**ప్రతిపదార్థం:** అచ్చటన్= ఆ చోట; ఆర్పులు= అరచుటలు; తూర్య నినదంబులు= తూర్య శబ్దాలు (కొమ్ముబూర ఊదినట్లు ఊదే శబ్దం); చెలంగెన్= చెలరేగాయి; తద్బలంబులు= ఆ సేనలు; పరమ ప్రమోదంబునున్+పొందెన్= మిక్కిలి సంతోషాన్ని పొందాయి; అని= అంటూ; సంజయుండు= సంజయుడు; సైంధవవధ ప్రకారంబు= సైంధవుడిని చంపిన తీరును; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రుడికి; ఎఱింగించెన్= తెలిపాడు; అని చెప్పినన్= అని చెప్పగా; చిత్తంబు= మనసు; కౌతుక+ఆయత్తంబు= ఆసక్తితో సిద్ధమయినది; అగుచుండన్= అవుతూ ఉండగా; అటమీఁది= ఆ మీదటి; వృత్తాంతంబు= ఆపై విషయాన్ని; ఎఱింగింపుము+అనుటయున్= తెలియచేయుమనగా.

**తాత్పర్యం:** ఆ సేనలో అరుపులూ, తూర్యశబ్దాలూ చెలరేగాయి. ఆ సేనలు చాలా సంతోషించాయి - అని సంజయుడు సైంధవవధ విధానాన్ని ధృతరాష్ట్రుడికి చెప్పాడు. అని చెప్పగా ఆ మీద కథను తెలుపుమని ఆసక్తితో ఉన్న మనసుతో అడిగాడు ధృతరాష్ట్రుడు.

## ఆశ్వాసాంతము

**ఉ. బిందు చిదాత్మనాదమయ పీఠ! చతుష్కల! సద్విహార! ని**
**ష్యంది సుధాకృతీ! పరమ సౌఖ్య విధాయక! చిత్స్వరూప! ని**
**ష్పంద నిరంజనాస్ఖలిత శాశ్వత నిర్మల వైభవా! మహా**
**నంద రసైకతాత్మ లయనక్రమ! నిష్కల! బోధపుష్కలా!** 335

**ప్రతిపదార్థం:** బిందు చిత్+ఆత్మనాదమయ పీఠ!= బిందువు చైతన్య స్వరూపమయిన ఆత్మ నాదం అనే ఈ శక్తులు స్థానంగా కలవాడా! (ప్రణవ స్వరూపము ప్రజ్ఞాస్వరూపము, ఆత్మస్వరూపము అయిన శబ్దమే స్థానముగా కలవాడా. జ్ఞానశక్తీ, ఇచ్ఛాశక్తీ, క్రియా శక్తులనే మూటినీ కలవాడని భావం); చతుష్కల!= నాలుగు కళావిశేషాలతో ఒప్పినవాడా! (ఆ నాలుగు కళలకే ప్రకాశ, అనంత, జ్యోతిష్మతీ, ఆయతనములని పేర్లున్నవి. సద్విహార!= మంచివారిలో తిరుగువాడా! (సత్పురుషులనగా ఋష్యాదులు); నిష్యంది= స్రవించే (జారుచున్న); సుధాకృతీ!= అమృతస్వరూపుడా! (మహాయోగుల సమాధ్యవస్థలో పొందే అనిర్వచీయానందానికే "నిష్యందిసుధ" అని యోగతత్త్వ విశేషాలు తెలిసినవారు చెబుతుంటారు); పరమసౌఖ్య= శ్రేష్ఠమైన సంతోషాన్ని; విధాయక!= నిర్ణయించేవాడా!; చిత్స్వరూప!= జ్ఞానమే ఆకారమైనవాడా!; నిష్పంది= కదలనటువంటి; నిరంజన= ఆసక్తిలేని; అస్థలిత= స్థిరమైన, జారిపోని; శాశ్వత= ఎల్లప్పుడూ ఉండే; నిర్మల= స్వచ్ఛమైన; వైభవా!= సంపదకలవాడా!; మహానందరస= నిండైన సంతోషమనే రసము యొక్క; ఏకతాత్మ!= ఏకత్వమునందు; ఆత్మలయనక్రమ= ఆత్మలీనం గావించుట అనే తీరు కలవాడా! నిష్కల!= భాగాలు లేని అఖండమూర్తీ!; బోధపుష్కలా= విజ్ఞాన ఘనమూర్తీ!

**తాత్పర్యం:** స్వామీ! నీవు 'బిందుచిదాత్మమయ'మైన ముక్కాలి పీటమీద అధివసించి ప్రపంచ వ్యాపారమును గావించెదవు. ప్రకాశాది నాలుగు కళలూ నీకున్నవి. ప్రపంచమంతా నీవు స్వచ్ఛమైన రూపంతో తిరుగుతున్నావు. యోగీశ్వరుల యోగనిష్ఠలో స్రవించే అమృతధారవు నీవు. అందువలన నీవు సర్వశ్రేష్ఠమయిన మోక్షమును కలిగిస్తున్నావు. చేతనాచేతనమూ. నాశరహితం, దేనియందునూ ఆసక్తం కానిదీ, అదృష్టమైనదీ అయిన ఈశ్వర భావ ప్రకాశం నీది. ప్రపంచంలోని మహానందమనే ఏకైకరసమునందు ఆత్మను లీనం గావించువాడవు.

**క. ఆస్తిక చేతస్సహితా! । కౌస్తుభరత్నాస్థిమాలికా శబలిత వ**
**క్షస్థల! సుమహిత నిగమ । ప్రస్తవనీయ ప్రకార! పరమోదారా!** **336**

**ప్రతిపదార్థం:** ఆస్తిక= ఆస్తికులయిన వారి (దైవ విశ్వాసమున్నవారి); చేతస్సహితా!= మనస్సులతో కూడి ఉన్న వాడా!; కౌస్తుభరత్న= కౌస్తుభమనే రత్నంతోనూ; అస్థిమాలికా= ఎముకల హారంతోనూ; శబలిత వక్షస్థల= చిత్రమయిన వర్ణంతో ఉన్న ఎదురురొమ్ము కలవాడా; సుమహిత= చాలా గొప్పవైన; నిగమ= వేదాలలో; ప్రస్తవనీయ ప్రకార!= కొనియాడదగిన విధము కలవాడా!; పరమోదారా!= మిక్కిలి దయాగుణము కలవాడా!.

**తాత్పర్యం:** ఆస్తికుల మనస్సులతో కూడుకొన్నవాడా! కౌస్తుభరత్నంతోను (విష్ణుని పరంగా) ఎముకల మాలికతోను (శివుని పరంగా) చిత్రమైన వర్ణంకల వృక్షస్థలము కలవాడా! చాల గొప్పవైన వేదాలలో స్తుతింపబడిన విధము కలవాడా! మిక్కిలి దయాగుణం కలవాడా!

**మాలిని:**

**శ్రుతి ఫలరస భావస్తుత్యమూర్తీ! నతార్తి**
**ప్రతిహనననితాంత ప్రౌఢహేలా! వినోదా**
**యితభువన వితానాహీన నిర్వాహ! మోహ**
**వ్యతికర తిమిర ప్రధ్వంసనా దీపరూపా!** **337**

**ప్రతిపదార్థం:** శ్రుతిఫల= వేదములనే ఫలములయొక్క; రసభావ= రసత్వంతో; స్తుత్యమూర్తీ!= స్తుతింపదగిన ఆకారం కలిగినవాడా! (పరబ్రహ్మ శ్రుతిరస భావమూర్తి అనీ - ఆ రసఫలమే ఈ పరతత్త్వంగా మూర్తిత్వమును పొందినదనీ భావం. పరబ్రహ్మతత్త్వము= వేదరస స్వరూపం); నతార్తి= నతుల (భక్తుల) కష్టాలను; ప్రతిహనన= నశింపజేయటంలో; నితాంత= మిక్కిలి; ప్రౌఢహేలా!= నేర్పరియైనవాడా! (అనగా కష్టాలతో సర్వార్పణంగా నమస్కారంచేసి నీవే దిక్కనిన వారికష్టాలను తొలగించుటలో మిక్కిలి నేర్పరి అయినావాడా - అని); వినోదాయిత= వినోదంగా ఒప్పిన; భువన= ప్రపంచముల; వితాన= సంబంధమైన; అహీన నిర్వాహ!= ఉత్తమముగా పరిపాలనము సేయువాడా! (అనగా ప్రపంచ సృష్టిస్థితి లయాలను నిరుపమానంగా పాలించేవాడా - అని భావం); మోహవ్యతికర= అజ్ఞాన సంబంధమైన; తిమిర= చీకటిని; ప్రధ్వంసనా= నశింపజేయటంలో; దీపరూపా!= దీపాకారం కలవాడా! (వెలుగయిన వాడా).

**తాత్పర్యం:** శ్రుతులయిన వేదాలచేత తెలియజేయబడే రసభావం నీ స్వరూపం. భక్తుల బాధలను తొలగించటం నీ కొక ఆట. చతుర్దశభువనాలలో లోటులేమీ లేకుండా పరిపాలన చేస్తూ ఉంటావు. భక్తుల మనసులలోని అజ్ఞానాంధకారమును తొలగించే, అంతటను ప్రకాశించే దీపముయొక్క ఆకారం కలవాడా! మోహాంధకారాన్ని తొలగించే ప్రదీపస్వరూపా!

**గద్యము:**

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతంబయిన శ్రీమహా భారతంబున ద్రోణపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.**

**తాత్పర్యం:** ఈ మహాభారతం సంస్కృతాంధ్ర భాషా కవీశ్వరులకు స్నేహితుడూ (సూర్యుడివంటి వాడూ), కొమ్మనామాత్యుడి కుమారుడూ, పండితుల పూజలచేత ప్రకాశిస్తున్నవాడూ అయిన తిక్కన సోమయాజిచేత రచితమయిన శ్రీమహాభారతంలోని ద్రోణపర్వంలో నాలుగవ ఆశ్వాసం.

**ద్రోణపర్వంలోని చతుర్థాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము - పంచమాశ్వాసము

**క. శ్రీధామ లసదపాంగ । వ్యాధూత ప్రణత దురితవర్గ! నిరోహ**
**ద్బోధాత్మక దేహా! జగ । దాధార విహార నిపుణ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ= సంపదలకు; ధామ= నిలయమై; లసత్= ప్రకాశిస్తున్న; అపాంగ= కడకంటి చూపులచేతనే; వ్యాధూత= ఎగురగొట్టబడిన; ప్రణత= (తనకు) నమస్కరిస్తూ ఉన్న భక్తులయొక్క; దురితవర్గ!= పాపాల సమూహం కలవాడా!; నిరోహత్= మొలకెత్తుతున్న; బోధాత్మక= జ్ఞానరూపమైన; దేహా!= శరీరంకలవాడా!; జగత్= ప్రపంచానికి; ఆధార= ఆశ్రయమైన; విహార= విలాసక్రీడయందు; నిపుణ!= సమర్థుడవైనవాడా!; హరిహరనాథా!= శివకేశవాత్మకుడవైన ఓ ఆదిదేవా! (అవధరింపుము= సావధానంగా వినండి).

**తాత్పర్యం:** నిన్నాశ్రయించిన భక్తుల పాపాలను, అనగా పాపఫలాలైన దుఃఖాలను కడగంటి చూపులచేతనే పోగొట్టి వారికి సంపదల ననుగ్రహించి నిర్మూలిస్తావు. మోక్షాన్ని కోరే భక్తుల హృదయాలలో జ్ఞానరూపంతో ఆవిర్భవించి, వారికి మోక్షలక్ష్మిని ప్రసాదిస్తావు. ఈ ప్రపంచమంతా నీ లీలావిలాసమే. ఈనాడు నాకు హరిహరరూపంతో సాక్షాత్కరించిన ఓ పరమేశ్వరా! (నే చెప్పబోయే కథను సావధానంగా వినుము.)

**కృష్ణార్జునులు సల్లాపంబు లొనరించుచు ధర్మజుకడ కరుగుచుండుట (సం. 7 - 122 - 1)**

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె: నట్లద్భుతోదారంబగు నరనారాయణుల విక్రమ విహారంబు విని వెఱఁగంది యాంబికేయుండు సంజయు దిక్కు మొగంబై. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథా!; వైశంపాయనుండు= వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= జనమేజయ మహారాజునకు(తో); ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు; అట్లు= ఆ విధంగా; అద్భుత= ఆశ్చర్యాన్ని కలిగించే; ఉదారంబు+అగు= గొప్పదైన అనగా గొప్ప ప్రయోజనాన్ని సాధించిన (సైంధవవధ సామాన్య విషయం కాదు. సైంధవుడి తల భూమిపై పడకుండా అతడి తండ్రి తొడమీద పాశుపతాస్త్రం ద్వారా పడవేయించటం ఆశ్చర్యకరం కాదా! మరియు పార్థుని ప్రాణాలకే ముప్పుగా పరిణమించిన సైంధవవధరూప ప్రతిజ్ఞ నెరవేర్చటం గొప్ప ప్రయోజనాన్ని సాధించిందే అయింది); నరనారాయణుల= నర నారాయణులనబడే బదరికాశ్రమవాసులగు ఋషులు; వారి అంశచేత జన్మించిన వారలు ఈ అర్జునుడు, కృష్ణుడున్ను - వీరిద్దరియొక్క; విక్రమ విహారంబు= పరాక్రమంతో కూడిన విహారాన్ని గూర్చి; విని; వెఱఁగు= నిశ్చేష్టత్వాన్ని; అంది= పొంది; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు (ఆంబికాయాః అపత్యం పుమాన్ ఆంబికేయః - అంబిక అనే ఆమె కుమారుడు ధృతరాష్ట్రుడు, కావున ఆంబికేయుడు); సంజయు దిక్కు మొగంబు+ఐ= సంజయుడివైపు అభిముఖుడై.

**తాత్పర్యం:** ఓ హరిహరనాథా! వైశంపాయన ఋషి జనమేజయమహారాజుతో అనంతర కథను ఈ విధంగా చెప్పాడు: ధృతరాష్ట్రుడు అర్జునుడి, శ్రీకృష్ణుడి పరాక్రమ ప్రదర్శనలను గురించి విన్నాడు. చేష్టలు సన్నగిల్లి, భయ భ్రాంతుడయ్యాడు. ఆ తరువాత జరిగిన కథను వినగోరి సంజయుడిని చూచి ధృతరాష్ట్రుడు ఇట్లా ప్రశ్నించాడు.

**క. 'ఇవ్విధమున సైంధవుఁ డా । కవ్వడిచేఁ బడిన పిదపఁ గౌరవు లెట్లై**
**రవ్వార్త సెప్పు' మనవుడు । నవ్విభునకు నాతఁ డిట్టు లనియె నరేంద్రా! 3**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= జనమేజయమహారాజా!; ఈ+విధమునన్= ఈ ప్రకారంగా; సైంధవుఁడు= సింధుదేశపు రాజయిన జయద్రథుడు; ఆ+కవ్వడిచేన్= ఆ సవ్యసాచిచేత (అనగా అర్జునుడిచేత); పడిన పిదపన్= సంహరించబడిన తరువాత; కౌరవులు= దుర్యోధనుడు మొదలైన మావారు; ఎట్లు= ఏ విధంగా (అనగా ఎట్టి ప్రవృత్తి కలవారు); ఐరి= అయినారో; ఆ+వార్త= ఆ విషయాన్ని; చెప్పుము= వినిపించుము; అనవుడున్= అనగా; ఆ+విభునకున్= ఆ ధృతరాష్ట్రుడికి; ఆతఁడు= ఆ సంజయుడు; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓ సంజయా! సైంధవుడు పార్థుడిచేత సంహరించబడిన తరువాత మా వారైన దుర్యోధనాదులు-ఏం చేశారో ఆ విషయాన్ని చెప్పు' మని అడుగగా - జనమేజయ మహారాజా! సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పటానికి ప్రారంభించాడు. (ఇది వైశంపాయనుడి వాక్యం).

**వ. అట్లు పాండవ బలంబులు పొంగి కడంగి కుంభసంభవుమీఁదం గవిసి కయ్యంబు సేసె; నా సమయంబున నిక్కడ. 4**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; పాండవ బలంబులు= పాండవుల సైన్యాలు; పొంగి= ఉత్సాహంతో విజృంభించి; కడంగి= ప్రయత్నపూర్వకంగా; కుంభసంభవుమీఁదన్= ద్రోణాచార్యుడిపై; కవిసి= తలపడి; కయ్యంబు= యుద్ధం; చేసెన్= చేశాయి; ఆ సమయంబునన్= అదే సమయంలో; ఇక్కడన్= ఇచ్చట (కౌరవసైన్యంలో).

**తాత్పర్యం:** సైంధవవధతో పాండవుల సైన్యాలు ఉత్సాహంతో పెల్లుబికి, ద్రోణాచార్యులపై తలపడి యుద్ధం చేయ ప్రారంభించాయి. ఆ సమయంలోనే ఇక్కడ కౌరవసైన్యంలో.

**చ. కృపుఁడును ద్రౌణియుం గడఁగి క్రీడిపయిన్ శర వర్షముల్ మహో**
**గ్రపు రభసంబునం గురియఁగా నవి మాన్చి యతండు వారలం**
**గుపితుఁడు గాకయున్ విశిఖ కోటుల నల్లన కప్పు పెల్లునం**
**గృపుని శరీర మొయ్య నొఱగెన్ రుధిరచ్యుతి మూర్ఛ వచ్చినన్. 5**

**ప్రతిపదార్థం:** కృపుఁడును= కృపాచార్యుడూ; ద్రౌణియున్= అశ్వత్థామా(అనగా వీరిద్దరూ); కడఁగి= ప్రయత్నపూర్వకంగా; క్రీడిపయిన్= అర్జునుడిపై; శరవర్షముల్= బాణాలవర్షాలు; మహోగ్రపు రభసంబునన్= మిక్కిలి భయంకరమైన వేగంతో; కురియఁగాన్= కురిపించగా; అవి= ఆ బాణాలను; మాన్చి= శమింపచేసి; అతండు= ఆ అర్జునుడు; వారలన్= ఆ కృపాచార్య, అశ్వత్థామలను; కుపితుఁడు= కోపం కలవాడు; కాకయున్= కాకుండానే (అనగా వారిపై కోపపడక); విశిఖకోటులన్= బాణాల సమూహాలచేత; అల్లన= మెల్లగా (అనగా తీక్ష్ణంగా గాయపరచకుండే విధంగా); కప్పుపెల్లునన్= కప్పివేయటంలోని అతిశయంతో; కృపుని శరీరము = కృపాచార్యుడి దేహం; రుధిరచ్యుతిన్= రక్తంకారటంచేత; మూర్ఛ= తెలివితప్పుట; వచ్చినన్= రాగా; ఒయ్యన్= మెల్లగా; ఒఱగెన్= వాలింది. (అనగా తెలివి కోల్పోయి రథంమీద వాలిపోయాడని భావం).

**తాత్పర్యం:** కృపాచార్యుడు, అశ్వత్థామ అర్జునుడిమీద బాణవర్షం కురిపించారు. అర్జునుడు ఆ బాణాలను ఖండించాడే కాని వారిపై కోపం చూపించలేదు. కాని, మెల్లగా బాణవర్షం కురిపించాడు. వలసినంత వేగంగా బాణాలు వేయనప్పటికీ కృపాచార్యుడి శరీరంనుండి ఆ మాత్రం బాణాల తాకిడిచేతనే నెత్తురు ధారగా కారిపోవటం చేత అతడు మూర్ఛపోయాడు.

**వ. ఇట్లు కృపాచార్యుండు రథంబుమీఁదం బడినఁ దత్సారథి దేరు దొలంగం దోలుకొని పోయె; నశ్వత్థామయు నోహటించి తొలంగెఁ; దక్కటి రథికులు పైఁబెట్టంజాలక యంతంత నిలిచి;రట్లు శారద్వతుండు దనయమ్ముల మూర్ఛిల్లుట సూచి సవ్యసాచి వగచె; నప్పు డన్నరునిఁ గౌఁగిలించుకొని నారాయణుం డి ట్లనియె: 6**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కృపాచార్యుండు= అశ్వత్థామ మేనమామ అయిన కృపాచార్యుడు; రథంబుమీఁదన్= రథంపై; పడినన్= వాలిపోగా; తద్+సారథి= ఆ కృపుడియొక్క సారథి; తేరు= రథాన్ని; తొలంగన్= (యుద్ధభూమినుండి) తొలగిపోయే విధంగా; తోలుకొని పోయెన్= తోలుకొనిపోయాడు; అశ్వత్థామయున్= అశ్వత్థామకూడ; ఓహటించి= వెనుకాడి; తొలంగెన్= తొలగిపోయాడు (అర్జునుడిని ఎదిరించలేక వెనుదిరిగి పోయాడని భావం); తక్కటి రథికులు= మిగిలిన రథికులు; పైన్+పెట్టన్+చాలక= ఎదిరించలేక; అంతన్+అంతన్= కొంతదూరాన; నిలిచిరి= ఉండిపోయారు; అట్లు= ఆ విధంగా; శారద్వతుండు= కృపాచార్యుడు; తన+అమ్ములన్= తనయొక్క (అర్జునుడి యొక్క) బాణాలతో; మూర్ఛిల్లుట= తెలివితప్పి పడిపోవటం; చూచి= కనిపెట్టి; సవ్యసాచి= అర్జునుడు; వగచెన్= దుఃఖించాడు; అప్పుడు= ఆ సమయాన(అర్జునుడి దుఃఖావస్థను మాన్పటానికి); ఆ+నరునిన్= ఆ అర్జునుడిని; నారాయణుండు= కృష్ణుడు; కౌఁగిలించుకొని= అక్కున చేర్చుకొని; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా కృపాచార్యుడు రథంమీద మూర్ఛిల్లటం చూచి, సారథి రథాన్ని రణభూమినుండి తొలగించి తోలుకొనిపోయాడు. అశ్వత్థామ కూడా అర్జునుడిని ఎదిరించలేక వెనుదిరిగాడు. మిగిలిన రథికవీరులు అంతంత దూరంలో చూస్తూ నిలుచుండిపోయారు. అర్జునుడు తన బాణాలకు కృపాచార్యుడు మూర్ఛిల్లటంతో దుఃఖావస్థకు లోనయ్యాడు. అది కనిపెట్టి ఓదార్చటానికై కృష్ణుడు అర్జునుడిని ఆలింగనం చేసికొని ప్రశంసిస్తూ ఇట్లా పలికాడు:

**విశేషం:** కృపాచార్యుడి మూర్ఛ చూచి అర్జునుడు విలపించిన ప్రకారం సంస్కృతభారతంలో ద్రోణపర్వం 47వ అధ్యాయం 13వ శ్లోకంనుండి 23వ శ్లోకం వరకు విపులంగా వర్ణించబడింది. ఈ విషయం అంతా "అప్పుడు" అనే మాటతో సంగ్రహించటం జరిగింది. ఆ సమయాన అర్జునుడిపై తలపడదలచిన కర్ణుడిని సాత్యకి అడ్డుకోవటం, కర్ణసాత్యకుల యుద్ధం, కర్ణ పరాజయం, అర్జునుడు కర్ణుడిని గద్దించటం, కర్ణపుత్రుడైన వృషసేనుడిని వధించటానికి అర్జునుడి ప్రతిజ్ఞ - ఇత్యాద్యంశాలు వర్ణించిన పిమ్మట కృష్ణుడు అర్జునుడిని ప్రశంసించటం కలదు. (సంస్కృతభారతం గోరఖపూర్ ప్రతి ననుసరించి అనువాదంలో ఈ మార్పు గోచరిస్తున్నది.)

**క. 'కురుబలముఁ దొడరి గెలువఁగ । సుర గణముల కైన నరిది శూరోత్తమ! నీ**
**వురవడి గెలిచితి భాగ్య । స్ఫురణంబును బాహు బలముఁ బొగడం దగదే? 7**

**ప్రతిపదార్థం:** శూరోత్తమ!= శూరులలో శ్రేష్ఠుడవగు ఓ అర్జునా!; కురుబలమున్= కౌరవసైన్యాన్ని; తొడరి= ఎదిరించి; గెలువఁగన్= గెలవటానికి; సురగణములకున్+ఐన= దేవతల సమూహాలకైనా కూడా; అరిది= అశక్యం (అనగా శక్యంకాదు); నీవు+ఉరవడిన్= నీవు అతివేగంగా (అనగా అనాయాసంగా); గెలిచితి(వి)= ఓడించావు (కావున నీయొక్క); భాగ్యస్ఫురణంబును= అదృష్టస్ఫూర్తి మరియు; బాహుబలమున్= భుజబలం (అనగా పరాక్రమం); పొగడన్= ప్రశంసించటానికి; తగదే?= తగింది కాదా! (నీ అదృష్టానికీ, పరాక్రమానికీ నిన్ను ప్రశంసిస్తున్నా నని భావం.)

**తాత్పర్యం:** ఈ కౌరవసైన్యాన్ని గెలవటం ఆ దేవతలందరు ఏకమై వచ్చినా సాధ్యం కాదు. అట్టి సైన్యాన్ని సునాయాసంగా గెలిచావు. ఈ గెలుపునకు నీ అదృష్టమే కాదు, నీ పరాక్రమం కూడా కారణమే. అందువల్ల నీ అదృష్టాన్ని, పరాక్రమాన్ని ప్రశంసించనక్కరలేదా!.

**క. ఆ వృద్ధక్షత్త్రు తపము । వావిరి నోర్వంగ నీకు వచ్చినటుల దు**
**ర్భావుఁ డగు కర్ణు నోర్వం । గా వచ్చినఁ గాదె నాకుఁ గడుఁ బ్రీతి యగున్!' 8**

**ప్రతిపదార్థం:** ఆ వృద్ధక్షత్త్రు తపము వానిరిన్= సైంధవుడి తండ్రి అయిన ఆ వృద్ధక్షత్ర మహారాజు తపస్సుయొక్క ఉత్కర్షను; ఓర్వంగన్= జయించటానికి; నీకున్= అర్జునుడవైన నీకు (ముక్కంటినే గెలిచి పాశుపతాస్త్రాన్ని సంపాదించినవాడవైన నీకని అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని); వచ్చిన+అటులు= వచ్చిన విధంగా; ఓర్వంగన్+వచ్చినటులు= జయించజాలిన విధంగా అని అన్వయక్రమం; దుర్భావుఁడు+అగు= ఊహించరానివాడైన (అనగా ఊహకందని పరాక్రమము గలవాడని భావము); కర్ణుని= రాధేయుడిని; ఓర్వంగాన్ వచ్చినన్= ఓడించజాలిన (నాడే); నాకున్= నీ శ్రేయము కోరే నాకు (కృష్ణునకు); కడున్= మిక్కిలి; ప్రీతి= సంతోషము; అగున్+కాదె!= కలుగును కదా!

**తాత్పర్యం:** వృద్ధక్షత్రుడు సైంధవుని తండ్రి, తన కుమారుని తల నేల గూల్చినవాని తల తుత్తునియలగుటకు తన తపస్సును ధారపోసినాడు. అతడి తపోమహిమ అట్టిది. దానిని గూడ పాశుపతాస్త్ర ప్రభావంచేత జయించావు. అర్జునా! నీవు ఇక జయించవలసినవాడు కర్ణుడు. ఇంద్రుడిచ్చిన శక్త్యాయుధంతో ఊహ కందకుండా నిలిచాడు. అతడిని కూడ నీవు జయించిననాడు నా కెంతో సంతోషం కలుగుతుంది. నీ శ్రేయస్సును కోరేవాడను కదా!

**విశేషం:** ఇవి శ్రీకృష్ణుడు అర్జునుడితో అనిన మాటలు. 'నీకు' అనగా పాశుపతాస్త్రాన్ని సాధించిన నీకు అని 'నాకు' అనగా సర్వవిధాల నీ శ్రేయాన్ని కోరే నాకు అని అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని. ఇంతేగాక ఆ వృద్ధక్షత్రు అనే సమాసంలోని 'ఆ' అను మాట పూర్వపరామర్శకమై వృద్ధక్షత్రుడు పుత్రప్రాప్తికై చేసిన తపస్సు మొదలైన విషయాలను జ్ఞప్తికి తెస్తుంది. ఈ పద్యంలోని పదాల అర్థవిశేషం గమనిస్తే తప్ప పద్యాభిప్రాయం స్పష్టంకాదు.

**చ. అనవుడు నాతఁ డిట్లను 'మహాత్మ! భవత్కరుణం బ్రతిజ్ఞ యే**
**ను నెఱపఁ గంటిఁ బాండవమనోరథసిద్ధి భవద్దయా సమృ**
**ద్ధి నగుట వింతయే? భవ దధీనులకున్ విజయంబు బ్రాఁతె? నీ**
**పను పొనరించు వార; మట భారము నీయది గాదె యెప్పుడున్!' 9**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆతఁడు= అర్జునుడు; ఇట్లు= ఈ విధంగా; అనున్= పలుకుతున్నాడు; ఓ మహాత్మ!= ఓ మహానుభావా!(కృష్ణా!); భవత్+కరుణన్= (భవత్ శబ్దము పూజ్యార్థం)= పూజ్యుడవగు నీయొక్క దయచేత; ప్రతిజ్ఞ= సైంధవ వధ రూపమైన ప్రతిన; ఏను= నేను; నెఱపన్+కంటిన్= నిర్వహించజాలితిని; పాండవ మనోరథసిద్ధి= పాండవులయొక్క అభీష్టముల యొక్క సిద్ధి (అనగా పాండవులమగు మా కోరికలు నెరవేరటం); భవత్+దయా+సమృద్ధిన్= నీ దయాతిశయం చేత; అగుట= కలుగుట; వింత+ఏ?= ఆశ్చర్యమా?; భవత్+అధీనులకున్= నీ అధీనులైన వారలకు (నిన్ను ఆశ్రయించిన వారలకని భావం); విజయంబు= కార్యసాఫల్యం; బ్రాఁతి+ఎ?= దుర్లభమా? (తప్పక లభిస్తుందని తాత్పర్యం); నీ పనుపు= నీ ఆనతిని; ఒనరించువారము= పాటించేవారం; అట= ఆ తరువాత; భారము= కార్యం నిర్వహించే భారం; ఎప్పుడున్= ఎట్టి సందర్భంలోనైనా; నీ అది= నీది; కాదె?= కాదా? (నీదే అనిభావం.)

**తాత్పర్యం:** కృష్ణుడి పలుకులు విని అర్జునుడు ఈ విధంగా అన్నాడు. 'ఓ మహానుభావా! కృష్ణా! నేను ఈ ప్రతిజ్ఞ నిర్విఘ్నంగా నెరవేర్చానంటే అదంతా నీ దయయే. కేవలం నాదే కాదు. మా పాండవులందరి కోరిక లీడేరటం నీ పరిపూర్ణ దయా ఫలితమే. దీనిలో వింత లేదు. నిన్నాశ్రయించినవారికి కార్యసిద్ధి దుర్లభం కాదు. మేము నీవు చెప్పినట్లు చేయువారం. ఆపైన భారం ఏ విషయంలోనైనా నీదే కదా!'

**తే. అనుడు నుద్గత మందస్మితాస్యుఁ డగుచు । దనుజమర్దనుఁ డతనితో 'ధర్మతనయుఁ**
**గానఁ బోవంగ వలయు భాస్కరుఁడు గ్రుంకు । చున్నవాఁ' డని పలికిన నన్నరుండు. 10**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగానే; ఉద్గత= పొడసూపిన; మందస్మిత= చిరునవ్వు గల; ఆస్యుఁడు= ముఖం కలవాడు; అగుచున్= ఔతూ; దనుజమర్దనుఁడు= రాక్షససంహారి అయిన కృష్ణుడు; అతనితోన్= ఆ అర్జునుడితో; ధర్మతనయున్= ధర్మనందనుడైన ధర్మరాజును; కానన్= చూడటానికి; పోవంగవలయున్= పోవలయును; భాస్కరుఁడు= సూర్యుడు; గ్రుంకుచున్నవాఁడు= అస్తమిస్తున్నాడు; అని= ఇట్లు; పలికినన్= పలుకగా; ఆ+నరుండు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** అర్జునుడి మాటలు విని కృష్ణుడు చిరునవ్వుతో ఇట్లా అన్నాడు: 'ఓ పార్థా! ధర్మరాజును మనం చూడపోవలె. సూర్యాస్తమయం ఔతూ ఉన్నది.' ఈ పలుకులు విని అర్జునుడు (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. 'అట్లు కాక' యనుటయుఁ గదిలి, భీమసేనుండును సాత్యకియును యుధామన్యుండును నుత్తమౌజుండును సముచితసల్లాపంబులు సేయుచుఁ దో నేతేర సాంద్ర శోణిత పూర సేకంబున ఘోరంబైన సంగ్రామ తలంబునం జని చని శౌరి సవ్యసాచి నాలోకించి. 11**

**ప్రతిపదార్థం:** అట్లు= అట్లే; కాక= కానీ; అనుటయున్= అనగానే; కదిలి= బయలుదేరి; భీమసేనుండును= భీముడు; సాత్యకియును= సాత్యకి; యుధామన్యుండును= యుధామన్యుడు; ఉత్తమౌజుండును= ఉత్తమౌజుడు; సముచిత సల్లాపంబులు+చేయుచున్= సందర్భోచితాలైన మాటలు మాట్లాడుకొంటూ; తోన్+ఏతేరన్= వెంట వస్తూ ఉండగా; సాంద్రశోణితపూర సేకంబునన్= దట్టమైన రక్తప్రవాహపు జల్లుతో; ఘోరంబు+ఐన= భయంకరంగా ఉన్న; సంగ్రామ తలంబునన్= రణరంగస్థలాన; చని చని= వెళ్ళి వెళ్ళి (కొంతదూరంవెళ్ళి అని భావం); శౌరి= కృష్ణుడు; సవ్యసాచిన్= అర్జునుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** 'సూర్యాస్తమయం కావస్తూ ఉన్నది. ధర్మరాజును చూడటానికి వెళ్ళుదాము' అనే కృష్ణుడి మాటకు పార్థుడు 'సరే' అన్నాడు. అప్పుడు భీముడు, సాత్యకి, యుధామన్యుడు, ఉత్తమౌజుడు యథోచితంగా సంభాషిస్తూ వెంట నడిచారు. వారు నడిచే రణభూమి అంతా రక్తప్రవాహం గడ్డకట్టి భయంకరంగా ఉన్నది. ఆ రణభూమిని చూచి కృష్ణుడు అర్జునుడితో ఈ విధంగా పలికాడు:

**విశేషం:** యుధామన్యుడు, ఉత్తమౌజుడు - వీరిద్దరు పాంచాలురు. అర్జునుడికి చక్ర రక్షకులు. సాత్యకి అర్జునుడికి పృష్ఠ రక్షకుడు. భీష్మపర్వంలో ఈ విషయం ప్రస్తావించబడింది. ఈ శ్లోకం చూడండి. శ్లో ॥ పృష్ఠగోయోర్జునస్యాసి యుయుధానో మహారథః । చక్రరక్షే చ పాంచాల్యే యుధామ న్యూత్తమౌజసౌ॥ (యుయుధాన= సాత్యకి).

**చ. 'కరులు రథంబు లశ్వములు కాలుబలంబు చమూపతుల్ మహీ**
**శ్వరు లఖిలాస్త్ర శస్త్రములు చామరముల్ గొడుగుల్ సిడంబు లా**
**భరణము లిత్తెఱంగునను బార్థ! కడుం జెలువొందెఁ జూడ సం**
**గరమహి చిత్ర వస్త్రమునఁ గప్పిన చందముఁ దోఁపఁ జేయుచున్. 12**

**ప్రతిపదార్థం:** పార్థ!= ఓ అర్జునా!; కరులు= ఏనుగులు; రథంబులు= రథాలు; అశ్వములు= గుర్రాలు; కాలుబలంబు= సైనికులు; చమూపతుల్= సైన్యాధ్యక్షులు; మహీశ్వరులు= రాజులు; అఖిల+అస్త్ర శస్త్రములు= అస్త్రాలు, శస్త్రాలు అన్నీ కూడా; చామరముల్= వింజామరాలు; గొడుగుల్= ఛత్రాలు; సిడంబులు= ధ్వజాలు; ఆభరణములు= కిరీట కేయూరాది ఆభరణాలు (వీటన్నింటిని); ఈ+తెఱంగునను= ఈ విధంగా; చూడన్= చూస్తూ ఉంటే (గజ రథాశ్వాదులు రణరంగాన పడిఉన్న తీరు చూస్తూఉంటే అని భావం); సంగరమహి= రణభూమి; చిత్ర వస్త్రమునన్= రంగురంగుల వస్త్రంతో; కప్పిన చందమున్= కప్పిన విధానాన్ని; తోఁపన్+ చేయుచున్= స్ఫురింపజేస్తూ; కడున్= మిక్కిలి; చెలువు+ఒందెన్= ప్రకాశిస్తూ ఉన్నది.

**తాత్పర్యం:** 'అర్జునా! ఈ రణభూమి చూచావా? రణాన తెగిపడిన చతుర్విధ సైన్యం, సేనాపతులు, రాజులు వారి ధ్వజ రథాదులు, ఆభరణాలు, శస్త్రాలు ఈ భూమిని కప్పివైచినవి. వీటిని చూస్తుంటే ఎంతో అందంగా రంగురంగుల వస్త్రంతో రణభూమిని కప్పినట్లుగా భాసిస్తూ ఉన్నది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. రణభూమిని చిత్ర వస్త్రాలంకృతంగా ఊహించి చెప్పటంచేత ఇది ఉత్ప్రేక్షాలంకారం.ఈ అలంకారం అర్జునుడి వీరవిహారాన్ని పరాక్రమాతిశయాన్ని సూచిస్తుంది. అర్జునుడి పరాక్రమాతిశయాన్ని ప్రస్తుతించటానికి కృష్ణు డీవిధంగా రణభూమిని వర్ణించాడు. దీనిని అలంకారకృత వస్తుధ్వని అంటారు. మరియొక విశేషం: ఈ పద్యం మూడవపాదంలో 'అఖిలాస్త్ర విత్తములు' అనే పాఠం 'అఖిలాస్త్ర శస్త్రములు' అనే దానికి బదులుగా కానవస్తున్నది. దానికి అర్థం అస్త్రాలన్నింటిని బాగా తెలిసినవారు అని. ఈ మహాసేనాపతులు అట్టివారని అన్వయం. అంతేగాక పద్యంలోని మరోపాదం సంస్కృతమూలానికి చాలా దగ్గరగా ఉన్నది. అదేమంటే "ఆభరణము లిత్తెఱంగునను బార్థ! కడుం జెలువొందె జూడు సంగరమహి" దీని అర్థం: ఆభరణములు+ఉన్న+ఈ తెఱఁగు= ఆభరణాలు పడియున్న వైనం (కర్త) రణభూమిని చిత్ర వస్త్రాలంకృతగా ఉన్నట్లు తోపింపజేస్తూ మిక్కిలి ప్రకాశిస్తూ ఉన్నది చూశావా? - అని అర్జునుడితో కృష్ణుడు పలికిన వాక్యం మూలంలో ఉన్న "మహీతలం నరవర పశ్య దుర్దృశమ్" అనే ఘట్టానికి తగినట్లుగా ఉన్నది.

**వ. భవదీయ బాహావిహారంబు నుదారత్వం బిట్లుండునే?' యని యగ్గించుచు నరిగి సమయోచితం బగుటయును ప్రతియోధులు టిచ్చవడియునికిం జేసియు సమరంబు సాలించి తమరాక కెదురు చూచుచుం గూడికొని యున్న యుధిష్ఠిరాదుల సమీపంబగుటయుం బాంచజన్యంబు పూరించినం బాండవాగ్రజుండు. 13**

**ప్రతిపదార్థం:** (ఓ అర్జునా!) భవదీయ బాహావిహారంబు+ఉదారత్వంబు= నీ బాహువుల వీరవిహారంయొక్క గొప్పతనం; ఇట్లు= ఈ విధంగా; ఉండునే?= ఉంటుందా? (ఈనాటి నీ వీరవిహారం మిక్కిలి ఆశ్చర్యకరంగా ఉన్నది. ఇంతకుముందెన్నడూ చూడలేదని భావం); అని= అంటూ; అగ్గించుచున్= ప్రశంసిస్తూ; అరిగి= వెళ్ళి; సమయ+ఉచితంబు= సమయానికి తగింది; అగుటయును=కాగా; ప్రతియోధులు= శత్రువీరులు; టిచ్చవడి= చేష్టలు కోల్పోయి; ఉనికిన్+చేసియున్= ఉండటంచేతకూడ; సమరంబు= యుద్ధం; చాలించి= ఆపివేసి; తమరాకకున్= తాము రావటానికి; ఎదురుచూచుచున్= ఎదురుచూస్తూ; కూడికొని+ఉన్న= గుమిగూడి ఉన్నటువంటి; యుధిష్ఠిర+ఆదుల= ధర్మరాజు మొదలయినవారికి; సమీపంబు+అగుటయున్= దగ్గర కావటంవలన; పాంచజన్యంబు= పాంచజన్యం అనే తన (కృష్ణు) శంఖాన్ని; పూరించినన్= (కృష్ణుడు) పూరించిన వెంటనే; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! ఈ నాటి నీ బాహువుల వీరవిహారంయొక్క గొప్పతనం ఎంతో ఆశ్చర్యకరంగా ఉందే' అని కృష్ణుడు అర్జునుడిని ప్రశంసిస్తూ, ఇద్దరూ రణభూమిని చూస్తూ ముందుకు నడిచారు. ఇక ప్రొద్దుపోవటాన్ని, శత్రువీరులు అలసి నిశ్చేష్టులై ఉండటాన్ని చూచి యుద్ధం ఆపుచేయించారు. తమరాకకై ఎదురుచూస్తూ గుమికూడి యున్న ధర్మరాజాదులు కానవస్తూ ఉండగా, కృష్ణుడు తన పాంచజన్యాన్ని విజయసూచకంగా పూరించాడు. అది విని ధర్మరాజు

**విశేషం:** 'బాహావిహారంబు' అనే దానికి బదులు 'బాహా వీర్యవిలాసంబు' అనే పాఠం తగినట్టుగా ఉన్నది.

**సైంధవుని సంహరించి కృష్ణార్జునులు వచ్చి ధర్మజునకు నమస్కరించుట (సం. 7-124-1)**

**తే. రథము డిగ్గి హర్షాశ్రులు గ్రమ్ముదేర । నెదురు కొనుటయు సంభ్రమ మెసక మెసఁగఁ**
**బార్థుఁడును గేశవుండును బాదచారు । లై రయంబునఁ జని మ్రొక్కి రవ్విభునకు. 14**

**ప్రతిపదార్థం:** రథము= రథాన్ని; డిగ్గి= దిగి; హర్ష+అశ్రులు; ఆనందబాష్పాలు; క్రమ్ముదేరన్= కమ్ముకొంటూ ఉండగా; ఎదురు కొనుటయున్= ఎదుర్కొనగా; పార్థుడును= అర్జునుడూ; కేశవుండును= కృష్ణుడూ; సంభ్రమము= తొందరపాటు; ఎసకము+ఎసఁగన్= అతిశయిస్తూ ఉండగా; పాదచారులు+ఐ= కాలినడకన వస్తూ; రయంబునన్= వేగంగా; చని= వెళ్ళి; ఆ+విభునకున్= ఆ ధర్మరాజునకు; మ్రొక్కిరి= నమస్కారం చేశారు.

**తాత్పర్యం:** (ధర్మరాజు) రథం దిగి ఆనందబాష్పాలు కన్నులవెంట రాలగా కృష్ణార్జునులను ఎదుర్కొంటూ ఉంటే వారిద్దరూ తొందర తొందరగా రథం దిగి పాదచారులై వచ్చి ఆ ధర్మరాజుకు ప్రణామం చేశారు.

**విశేషం:** ధర్మరాజు రథం దిగటం కృష్ణుడిపై ఆదరాన్ని సూచించగా కృష్ణార్జునుల సంభ్రమాతిశయం ధర్మరాజుపై వారికిగల ఆదరభావాన్ని సూచిస్తుంది. ధర్మరాజు ఆనందాశ్రువులు, కృష్ణుడియందుగల భక్తిని, అర్జునుడిపై గల వాత్సల్యాన్ని స్ఫురింపజేస్తాయి. ఇది భావధ్వని. దీనితో ఈ పాత్రల మనస్తత్త్వం చక్కగా నిరూపితమయింది.

**వ. ఇట్లు ప్రణమిల్లిన. 15**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రణమిల్లినన్= నమస్కరించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా కృష్ణార్జునులు ధర్మరాజునకు నమస్కారం చేయగా.

**క. నరపతి యానందాశ్రులు । గరసరసిరుహముల నొత్తి కను దనియఁగ న**
**య్యిరువురఁ జూచుచు మేనులు । గరుపాఱఁగ గ్రుచ్చి యొక్క కౌఁగిటఁ జేర్చెన్. 16**

**ప్రతిపదార్థం:** నరపతి= ధర్మరాజు; ఆనంద+అశ్రులు= ఆనందబాష్పాలను; కర సరసిరుహములన్= కమలాలవంటి చేతులతో; ఒత్తి= తుడుచుకొని; కను= కన్నులు; తనియఁగన్= తృప్తినిపొందే విధంగా; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరిని (కృష్ణార్జునులను); చూచుచున్= చూస్తూ; మేనులు= వారివారి శరీరాలు; గరుపాఱఁగన్= గగుర్పొడిచే విధంగా; గ్రుచ్చి= ఆనించి; ఒక్కకౌఁగిటన్= ఒకే కౌగిలిలో; చేర్చెన్= చేర్చాడు. (ఇద్దరిని విడివిడిగా గాక ఒకేసారి కౌగిలించుకొన్నాడని భావం).

**తాత్పర్యం:** ధర్మరాజు ఆనందాతిశయంతో కన్నులలో నిండిన కన్నీటిని తుడిచికొంటూ, కన్నులార వారిద్దరిని చూస్తూ ఒకేసారి వారిద్దరిని గాఢంగా కౌగిలించుకొన్నాడు. ఆ కౌగిలిచేత వారిద్దరి శరీరాలు పులకితమైనాయి.

**విశేషం:** 'అలం: పరికరం. 'ఒక్క కౌఁగిట' అనే పదంలో 'ఒక్క' అనే విశేషణం సాభిప్రాయం కాబట్టి ఇది పరికరాలంకారం. ఈ అలంకారం చేత ధర్మరాజు ఆ ఇద్దరిని సమానంగా ఆదరించాడనే భావం ధ్వనిస్తూ ఉన్నది.

**వ. ఇ వ్విధంబున నాలింగనంబు సేసి యర్జుననితో ని ట్లనియె. 17**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇట్లా; ఆలింగనంబు+చేసి= కౌగిలించుకొని; అర్జుననితోన్= పార్థుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** వారిద్దరిని గాఢంగా ఆలింగనం చేసికొన్న తరువాత ధర్మరాజు అర్జునుడిని చూచి ఇట్లా అన్నాడు:

**క. 'చే నెత్తురు గాకుండం । గా నా సైంధవునిఁ జంపి క్రమ్మఱ మీరల్**
**రా నోచితి నా భాగ్యం । బేన పొగడు నట్టిదయ్యె నీతని కరుణన్.' 18**

**ప్రతిపదార్థం:** చే= చేయి; నెత్తురు+కాకుండన్+కాన్= రక్తంతో తడియకుండానే; ఆ సైంధవునిన్= (మన అభిమన్యువధకు మూలకారణంగా నిలిచిన) ఆ జయద్రథుడిని; చంపి= సంహరించి; మీరల్= మీరిద్దరు (కృష్ణార్జునులు); క్రమ్మఱన్= తిరిగి; రాన్= రావటానికి; నోచితిన్= పుణ్యం చేసికొన్నాను; నా భాగ్యంబు= నా అదృష్టం; ఈతని కరుణన్= ఈ కృష్ణుడి అనుగ్రహం వలన; ఏను+అ= నేనే; పొగడునట్టిది+అయ్యెన్= ప్రశంసించుకొనవలసినంతటిదయింది.

**తాత్పర్యం:** 'చేతికి నెత్తురంటకుండా మీరిద్దరూ సైంధవుడిని సంహరించి నన్ను చేరుట నా పుణ్యం. నా అదృష్టాన్ని మెచ్చుకోవాలి. ఎవరో కాదు నేనే. ఇదంతా ఈ మహానుభావుడి అనుగ్రహం వలననే సిద్ధించింది.'

**క. అని వాసుదేవుఁ జూపిన । విని యాతఁడు 'నీదు కోపవేగంబున దు**
**ర్జనుఁ డా జయద్రథుఁడు వొలి । సిన నెవ్వరి కెట్లు సేయఁ జెల్లదె?' యనినన్.** 19

**ప్రతిపదార్థం:** అని= పలికి; వాసుదేవున్= కృష్ణుడిని; చూపినన్= (చేత నిర్దేశిస్తూ) చూపగా; విని= (కృష్ణుడు) విని; ఆతఁడు= కృష్ణుడు; దుర్జనుఁడు= దుష్టుడయిన; ఆ జయద్రథుఁడు= ఆ సైంధవుడు; నీదుకోపవేగంబునన్= నీ (ధర్మరాజు) క్రోధాని కున్న తీవ్రతతో; పొలిసినన్= మరణించగా; ఎవ్వరికిన్= ఎవరికైనా; ఎట్లు= ఏ విధంగానైనా; చేయన్= చేయుటకు; చెల్లదు+ఎ?= తగియుండదా?; అనినన్= అనగా (కృష్ణుడు ధర్మరాజుతో ఈ విధంగా పలుకగా).

**తాత్పర్యం:** అని పలుకుతూ కృష్ణుడిని చూపాడు ధర్మరాజు. అంటే ధర్మరాజు అభిప్రాయంలో కృష్ణుడే విజయానికి కారణమన్నమాట. ఈ అభిప్రాయాన్ని గమనించి కృష్ణుడు ధర్మరాజుతో 'సైంధవవధతో చేకూరిన ఈ విజయానికి కారణం ఆ కౌరవులు మీకు కలిగించిన కోపమే. మీబోటి సత్పురుషుల కోపావేశం ఎంత పనైనా చేయిస్తుంది. అటువంటప్పుడు ఆ అర్జునుడే కాదు మరెవ్వరైనా కేవలం జయద్రథుడిని వధించుటే కాదు. అంతకంటె దుస్సాధ్యమైన ఏ కార్యమైనా సులభంగా చేయగలుగుతారు. దీనిలో ఆశ్చర్య మేమి?' అని పలుకగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** ఇక్కడ వాసుదేవ పదం కృష్ణ పర్యాయంగా ప్రయోగించుటవలన ధర్మరాజు తన మనస్సులో కృష్ణుడిని భావించిన తీరు వ్యక్తమవుతున్నది. కృష్ణుడిని వసుదేవ పుత్రుడిగానే మాత్రం ధర్మరాజు అనుకొనటం లేదు. అతడిని భగవంతుడిగా భావించాడు. వాసుదేవ పదం భగవత్పర్యాయం. విష్ణు సహస్రనామంలో ఈ వాసుదేవపదం ఉన్నది. శంకరాచార్యులు ఈ పదాన్ని తన విష్ణు సహస్రనామ భాష్యంలో ఇట్లా నిర్వచించారు. 'వాసయతి జగదాచ్ఛాదయతి మాయయేతి వాసుః స ఏవ దేవ ఇతి వాసుదేవః శ్లో॥ ఛాదయామి జగత్ విశ్వం భూత్వా సూర్య ఇవాంశుభిః' (మహా - భా - శాంతి - 141/41) ఇతి భగవద్వచనాత్॥" (విష్ణు సహస్ర. భాష్యం 709 వ నామం). అనగా తన మాయచేత ఈ సమస్త ప్రపంచాన్ని ఆచ్ఛాదించేవాడు కాబట్టి 'వాసు' అని అంటారు. అట్టి దేవుడు కాబట్టి వాసుదేవుడైనాడు అని ఆ భాష్యం సారాంశం. 'బహూనాం జన్మనామంతే' అనే గీతా శ్లోకం (7/19)లోని 'వాసుదేవః' అనే పదానికి భగవద్గీతా వ్యాఖ్యాతలు కూడా భగవత్పరంగా ఇదే అర్థం వ్రాశారు. అంతేగాక భగవంతుడు తాను సర్వప్రపంచాన్ని వ్యాపించి ఉండటంచేత, సర్వభూతాలకు (ప్రాణులకు) తాను నివాసభూతుడు కావటంచేతను వాసుదేవుడైనాడని యజుర్వేద సంధ్యావందనంలోని ఈ శ్లోకం చెప్తున్నది.

**శ్లో॥ వాసనాత్ వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్ ।**
**సర్వభూత నివాసోఽసి వాసుదేవ నమోఽస్తుతే" ॥**

కాబట్టి ఇక్కడి వాసుదేవ పదం ఎంతో అర్థవంతం.

**వ. అ మ్మహీపతి య మ్మహాత్ము నుద్దేశించి. 20**

**ప్రతిపదార్థం:** ఆ+మహీపతి= ఆ ధర్మరాజు; ఆ+మహాత్మున్= మహాత్ముడైన ఆ శ్రీకృష్ణుడిని; ఉద్దేశించి= గురించి.

**తాత్పర్యం:** ఆ ధర్మరాజు మహానుభావుడైన ఆ శ్రీకృష్ణుడిని సంబోధిస్తూ (ఇట్లా పలికాడు). (తరువాతి పద్యంతో అన్వయం).

**క. దేవాసురసంఘంబులు। నీ వలిగిన రూ పడంగు నీ కూరిమి సౌ**
**ఖ్యావహ మఖిల జగములకు। దేవ! భవద్భక్తు లరులఁ దీర్చుట యరుదే! 21**

**ప్రతిపదార్థం:** దేవ!= ఓ దేవా!; (కృష్ణ భగవానుడా!); నీవు+అలిగినన్= నీవే కోపించినట్లైతే; దేవ+అసుర సంఘంబులు= దేవతల సమూహాలు, రాక్షసుల సమూహాలు; రూపు+అడంగున్= నశిస్తాయి; నీ కూరిమి= నీ ప్రేమ; అఖిల జగములకున్= సమస్త లోకాలకు; సౌఖ్య+ఆవహము= సుఖాన్ని కలుగజేసేది; భవద్భక్తులు= నీయందు భక్తి కలిగి ఉన్నవారు; అరులన్= శత్రువులను; తీర్చుట= నశింపచేయటం; అరుదు+ఏ!= ఆశ్చర్యమా!

**తాత్పర్యం:** ఆదిదేవుడవైన శ్రీకృష్ణా! నీవు కోపిస్తే, ఈ దేవతలు, రాక్షసులు నశిస్తా రనగా ఈ మానవుల లెక్క ఏమి? నీవు దయదలిస్తే ఈ సమస్త లోకాలలోని వారందరూ సుఖిస్తారు. కాబట్టి నిన్ను సర్వాత్మనా భజించే భక్తులు శత్రువులను జయించటంలో ఆశ్చర్య మేముంది? (మా శత్రు నిర్మూలనం, అంటే ఈ జయద్రథవధ నీ అనుగ్రహంతోనే కలిగిందని శ్రీకృష్ణుడితో ధర్మరాజు పలికిన ఈ మాటలలో తేటపడుతుంది.)

**విశేషం:** ఇక్కడ 'దేవ' అనే పదంతో కృష్ణుడిని సంబోధించటం శ్రీకృష్ణుడి ఆదిదేవత్వాన్ని సూచిస్తుంది - అప్పుడే దేవాసుర వినాశాది రూప పద్యార్థం సుసంభావిత మౌతుంది.

**వ. అని మఱియు ననేక ప్రకారంబులం బ్రస్తుతించి, భీష్మాదు లతని కతన మడియుట యుగ్గడించి 'నీవు కోపించినట్లు వర్తించుటఁ గౌరవులు సెడిర కాఁ దలంచెద' ననుటయు నచ్యుతుం డా భూపాలు నాలోకించి 'ధర్మోత్కృష్టుండవగు నీకు నరిష్టం బాచరించిన వారికిఁ జెడకుండ వచ్చునే?' యనునెడ ననిలసుతుండును సాత్యకియును దనువులఁ గ్రొత్తగంట్లు గొమరార నద్ధరణీపతి చరణంబులకుఁ బ్రణతులైన, నతం డెత్తి కౌఁగిలించుకొని వారలు కుంభసంభవ కృతవర్మాదుల సంరంభంబు మర్దించుట పేర్కొని యభినందించెఁ; యుధామన్యుండును నుత్తమౌజుండును దగిన తెఱంగునం గాంచిన వారి నుచిత వచనంబుల సంభావించెఁ; దదీయ సైన్యం బెల్లను బ్రమోద భరితంబై కయ్యంబునకుం గాలు ద్రవ్వుచుండె; నా సమయంబున శోక విస్మయ వివశుం డగుచు దుర్యోధనుం డంతర్గతంబున. 22**

**ప్రతిపదార్థం:** అని= పలికి; మఱియున్= ఇంకా; అనేక ప్రకారంబులన్= అనేక విధాలుగా; ప్రస్తుతించి= పొగడి; భీష్మ+ఆదులు= భీష్ముడు మొదలైనవారు; అతని కతనన్= ఆ శ్రీకృష్ణుడి కారణంగానే (ఆ శ్రీకృష్ణుడి అనుగ్రహంతోనే అని భావం); మడియుట= నశించిపోవటాన్ని; ఉగ్గడించి= కీర్తించి; నీవు= శ్రీకృష్ణుడు; కోపించినట్లు= కోపపడేటట్లు; వర్తించుటన్= ప్రవర్తిస్తూ ఉండటంచేత; కౌరవులు= దుర్యోధనుడు మొదలైన కౌరవులు; చెడిరి కాన్= చెడిపోయినట్లు; తలంచెదన్= తలుస్తాను; అనుటయున్= అనగానే; అచ్యుతుండు= కృష్ణుడు; ఆ భూపాలున్= ఆ రాజును అనగా ధర్మరాజును; ఆలోకించి= చూచి; ధర్మ+ఉత్కృష్టుండవు+అగు= ధర్మంచేత శ్రేష్ఠుడవయినట్టి; నీకున్= ధర్మరాజునకు; అరిష్టంబు= కీడు; ఆచరించిన వారికిన్= చేసినవారికి; చెడక+ఉండన్+వచ్చునే?= చెడిపోకుండా ఉండటానికి సాధ్యమవుతుందా? (అట్టివారు చెడిపోతారని భావం); అను+ఎడన్= అంటూ ఉండే సమయాన; అనిల సుతుండును= వాయునందనుడు (భీముడు); సాత్యకియును= సాత్యకికూడా; తనువులన్= శరీరాలపై; క్రొత్తగంట్లు= (యుద్ధంలో)

అప్పుడే ఏర్పడిన గాయాలు; కొమరు+ఆరన్= ప్రకాశిస్తూ ఉండగా; ఆ+ధరణీ పతి చరణంబులకున్= ఆ ధర్మరాజు పాదాలకు; ప్రణతులు+ఐనన్= నమస్కారం చేసినవారు కాగా; అతండు= ఆ ధర్మరాజు; ఎత్తి= (వారిద్దరిని పైకి) లేవనెత్తి; కౌఁగిలించుకొని= ఆలింగనం చేసికొని; వారలు= ఆ భీమసేన సాత్యకులు; కుంభసంభవ, కృతవర్మ+ఆదుల సంరంభంబు= ద్రోణాచార్యులు కృతవర్మ మొదలైనవారి యుద్ధవేగాన్ని; మర్దించుట= అణగద్రొక్కటాన్ని; పేర్కొని= ప్రస్తావించి (వారిద్దరి యుద్ధనైపుణ్యాన్ని కొనియాడి అని భావం); అభినందించెన్= అభినందించాడు (వారిద్దరి వీరత్వానికి తన సంతోషాన్ని ధర్మరాజు తెలిపాడని భావం); యుధామన్యుండును= యుధామన్యుడనేవాడు; ఉత్తమౌజుండును= ఉత్తమౌజుడనే అతడు (వీరిద్దరు); తగిన తెఱంగునన్=తగిన విధంగా; కాంచినన్= (తనను) సమీపించటం తోడనే - అనగా వినయంతో అంజలిబద్ధులై ధర్మరాజును సమీపించిన వెంటనే; ఉచిత వచనంబులన్= సముచిత సల్లాపాలతో; సంభావించెన్= గౌరవించాడు; తదీయ సైన్యంబు+ఎల్లను= ఆ ధర్మరాజు సైన్యమంతా; ప్రమోద భరితంబు+ఐ= సంతోషంతో నిండినదై; కయ్యంబునకున్= యుద్ధానికి; కాలుద్రవ్వుచున్+ఉండెన్= సన్నద్ధమౌతూ ఉన్నది; ఆ సమయంబునన్= అదే సమయాన; శోకవిస్మయ వివశుండు+అగుచున్= దుఃఖం ఆశ్చర్యం - ఈ రెంటికి లోనవుతూ; దుర్యోధనుండు= సుయోధనుడు (దుర్యోధనుడికి తన సైన్య పరాజయంచేత దుఃఖం, సైంధవుడిని వధించిన తీరు చూస్తూ ఉంటే విస్మయం కల్గిందని భావం); అంతర్గతంబునన్= స్వగతంగా.

**తాత్పర్యం:** అని పలికిన తరువాత మళ్ళీ కూడా శ్రీకృష్ణుడిని ధర్మరాజు అనేక విధాలుగా స్తుతించాడు. అతడు పురాణ పురుషుడనే విషయాన్ని స్పష్టపరిచాడు. భీష్మాదులను జయించుట కృష్ణుడి అనుగ్రహం లేకుండా సాధ్య మయ్యేది కాదన్నాడు. 'కౌరవుల అధర్మాచరణం నీకు కోపహేతువయింది. ఆ నీ కోపమే కౌరవుల నాశనానికి దారి తీసింది' అని ధర్మరాజు కృష్ణుడితో తాను భావించిన తీరు చెప్పిన వెంటనే కృష్ణుడు, 'అదేదీ కాదు నీబోటి ధర్మనిష్ఠునికి అరిష్టం తలపెట్టినవారికి చెడిపోవటం ఎట్లాగూ తప్పదు.' అని అంటూ ఉండగానే, యుద్ధంలో తమ శరీరం మీద ఏర్పడిన కొత్త గాయాలు ప్రకాశిస్తూ ఉండగా భీముడు, సాత్యకి వచ్చి ధర్మరాజుకు పాదాభివందనం చేశారు. వారిద్దరినీ లేవనెత్తి ధర్మరాజు ఆలింగనం చేసికొని, ద్రోణ కృతవర్మల విజృంభణాన్ని వారు అణచివేయడాన్ని ప్రస్తావించి అభినందించాడు. ఇంతలో యుధామన్యుడు, ఉత్తమౌజుడు అనేవారు వినయంగా ధర్మరాజును దర్శించగా, వారిని కూడా సముచితవచనాలతో గౌరవించాడు. శత్రువిజయంచేత ధర్మరాజుసైన్యంలో ఆనందోత్సాహాలు పెరిగి, మళ్ళీ యుద్ధానికి ఆ సైన్యం కాలు ద్రవ్వసాగింది. అదే సమయాన దుర్యోధనుడు దుఃఖానికి, ఆశ్చర్యానికి తీవ్రంగాలోనై, తన మనస్సులో (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** దుర్యోధనుని ఆశ్చర్యం సైంధవవధకు, దుఃఖం తనపక్షపరాజయానికి 'అని మఱియు అనేక ప్రకారంబులం బ్రస్తుతించి భీష్మాదు లతని కతన మడియుట యుగ్గడించి' అనే ఈ వచనంలో కృష్ణుని స్తుతించిన అనేక ప్రకారా లేవి అంటే - సంస్కృత మూలంలో "బాల్యాత్ప్రభృతి శ్రీకృష్ణ కర్మాణి శ్రుతవానహమ్'' (ద్రోణ- 149 అధ్యా. 13వ శ్లో. నుండి 35వ శ్లోకం వరకు) అనే శ్లోకం మొదలుకొని 20 శ్లోకాల భావం 'అనేక ప్రకారంబులం బ్రస్తుతించి' అనే వాక్యంతో సంగ్రహించబడింది. కృష్ణుని పురాణ పురుషత్వాన్ని సూచించే ఎన్నో అంశాలు ఈ శ్లోకాలలో ఇమిడి ఉన్నాయి. వాటిని సూచించటానికి ఈ ఒక్కమాట వచనంలో పొదగబడింది. ఆ అంశాలను వివరించటం ప్రకృతం విస్తృతికి దారి తీస్తుంది. పూర్తిగా విడుచుటకు మనసొప్పక తిక్కన కవిబ్రహ్మ, 'మూలాన్ని చూడవచ్చు కదా ఎవరికైనా విశేష జిజ్ఞాస ఉంటే' అనే అభిప్రాయంతో ఈ మాత్రం సూచనప్రాయంగా చెప్పినట్లు భావించాలి. అదే కవిబ్రహ్మ ప్రత్యేకత.

**ఉ. 'ద్రోణుఁడు గర్ణుఁడుం గృపుఁడు ద్రోణసుతుండును నేల వాని గీ**
**ర్వాణులకైననుం జెనయవచ్చునె? యెవ్వరు నాజిఁ గౌరవ**
**త్రాణ పరాయణత్వమున దర్పము సూపఁగ లేమి దెల్ల మ**
**క్షీణ పరాక్రముం డయిన క్రీడికి నిక్కపుటల్క వచ్చినన్.'** **23**

**ప్రతిపదార్థం:** అక్షీణ పరాక్రముండు+అయిన= తరుగు అనేది లేని పరాక్రమం గల; క్రీడికిన్= అర్జునుడికి; నిక్కపుటల్క (నిక్కము+అల్క)= నిజమైన కోపం (ప్రణయకోపాదులు పైకి కోపాలైనా అవి నిజానికి కోపాలు కావు కదా! కావున శత్రువులపై చూపేదే నిజమైన కోపం); వచ్చినన్= వచ్చినట్లయితే; ద్రోణుఁడు= ద్రోణాచార్యులు; కర్ణుఁడున్= కర్ణుడు (తన ప్రాణ స్నేహితుడు); కృపుఁడు= కృపాచార్యులు; ద్రోణసుతుండునున్= ద్రోణాచార్య పుత్రుడు అశ్వత్థామ; ఏల?= ఎందుకు? (వీరందరిమాట ఎందుకు? అని భావం); గీర్వాణులకున్+ఐననున్= దేవతలకైనా కూడా; ఆజిన్= యుద్ధంలో; వానిన్= ఆ అర్జునుడిని; చెనయన్‌వచ్చునే?= ఎదిరించ సాధ్యం అవుతుందా? (కాదని భావం); ఎవ్వరున్= ఈ ద్రోణాదులలో ఎవ్వరైనా; ఆజిన్= యుద్ధంలో (ఈ పదం వెనక వాక్యంలో కూడా అన్వయించింది); కౌరవ త్రాణపరాయణత్వమునన్= కౌరవులమైన మా రక్షణ అందలి తత్పరత్వంచేత (తృతీయార్థే సప్తమీ); దర్పము= భుజదర్పాన్ని; చూపఁగలేమి= చూపలేకపోవటం; తెల్లము= స్పష్టం.

**తాత్పర్యం:** 'అర్జునుడి పరాక్రమానికి క్షీణత్వమనేదే లేదు. అట్టి అర్జునుడికే నిజంగా కోపం వచ్చిననాడు ఈ ద్రోణకర్ణకృపాశ్వత్థామలేకాదు, ఆ దేవతలైనా అతడి ముందు యుద్ధంలో నిలువలేరు. ఈ ద్రోణ కర్ణాదులకు 'కౌరవులమైన మమ్ము రక్షించాలి' అనే తత్పరత ఉంటే ఉండుగాక! కాని, వారు యుద్ధంలో అర్జునుడి కెదురుగా నిలిచి తమ భుజబలాన్ని చూప శక్తిలేనివారని నేడు స్పష్టమయింది.'

**వ.** **అనుచు నుత్సాహ రహితంబైన చిత్తం బుత్తలపడఁ గుంభసంభవు పాలికిం బోయి, పరుల జయంబును, దమవారు సమయుటయు నుగ్గడించి మఱియును.** **24**

**ప్రతిపదార్థం:** అనుచున్= అనుకొంటూ (మనస్సులో ఇట్లా భావిస్తూ); ఉత్సాహ రహితంబు+ఐన= ఉత్సాహం లేనట్టి; చిత్తంబు= మనస్సు; ఉత్తలపడన్= తత్తరపాటు చెందుతూ ఉండగా; కుంభసంభవు పాలికిన్= ద్రోణాచార్యుల సమీపానికి; పోయి= వెళ్ళి; పరుల జయంబును= శత్రువులకు కలిగిన విజయాన్ని; తమవారు= తమ యోధులు, బంధువులు మొదలైనవారు; సమయుటన్= నశించటాన్ని; ఉగ్గడించి= చెప్పి; మఱియును= మళ్ళీ కూడా.

**తాత్పర్యం:** అని దుర్యోధనుడు తనలో తాను తర్కించుకొంటూ ఉత్సాహాన్ని కోల్పోయిన మనస్సు తత్తరపాటు చెందుతుండగా, ద్రోణాచార్యుల సమీపానికి వెళ్ళి 'శత్రువుల విజయాన్ని, తమవారి మరణాన్ని చెప్పి ఇంకా ఇట్లా అన్నాడు: (తరువాతి పద్యంతో అన్వయం.)

**సీ.** **'బల్లిదుఁ డగు భీష్ముఁ బడవైచి సోదర । వర్గంబుఁ దాను ననర్గళముగఁ**
**గ్రాలెడు నేచి శిఖండి యింతకు మున్న । పొలిసె నేడక్షౌహిణులు, గిరీటి**
**చేత సైంధవుపాటు సెప్ప జిట్టలు నాకుఁ । బూని మేలెంచి కాంభోజవిభుఁడు**
**జలసంధుఁడును సుదర్శనుఁడును లోను గాఁ । గలుగు భూపతులు పెక్కండ్రు నేఁడు**

**తే.** **గలనఁ గూలిరి; వీరి లోకంబ యైన । నొండెఁ బాంచాల బలమును బాండవులను**
**దండినై తెగఁ జూచిన నొండెఁ గాక । యెట్లు వాయు నా కిందఱ ఋణము? సెపుమ!** **25**

**ప్రతిపదార్థం:** శిఖండి= ద్రుపదమహారాజు కుమారుడు శిఖండి; బల్లిదుఁడు+అగు= అతి బలశాలిఅయిన; భీష్మున్= భీష్ముడిని; పడన్‌వైచి= పడిపోయే విధంగా చేసి; సోదరవర్గంబున్= ధృష్టద్యుమ్నుడు మొదలైన సోదరుల సమూహాన్నీ; తాను= శిఖండి; అనర్గళముగన్= అడ్డులేకుండా; ఏచి= అతిశయించి; మిక్కిలి; క్రాలెడున్= ప్రకాశిస్తూ ఉన్నాడు; ఇంతకున్‌మున్ను+అ= ఇంతకంటే

ముందే; ఏడు+అక్షౌహిణులు= ఏడు అక్షౌహిణుల సైన్యం; పొలిసెన్= నశించింది; కిరీటిచేతన్= అర్జునుడిచేత; సైంధవుపాటు= జయద్రథుడి మరణం; చెప్పన్= చెప్పటానికీ; చిట్టలు= ఆశ్చర్యం (ఆశ్చర్యం కలిగించే విధంగా ఉన్నది); నాకున్= నా కోసం; పూని= పనిగట్టుకొని; ఏతెంచి= వచ్చి; కాంభోజ విభుఁడు= కాంభోజదేశపురాజు; జలసంధుఁడును= జలసంధుడు; సుదర్శనుఁడును= సుదర్శనుడు; లోనుగాన్+కలుగు= మొదలుగా సమర్థులైన; భూపతులు= రాజులు; పెక్కంద్రు= చాలామంది; నేఁడు= ఈనాడు; కలనన్= యుద్ధంలో; కూలిరి= పడిపోయారు; వీరిలోకంబు+అ+ఐనన్= ఈ వీరులు పొందిన లోకమైనా; ఒండెన్= ఒకటే; పాంచాల బలమును= పాంచాల సైన్యాన్ని; పాండవులను= ధర్మరాజాదులను; దండిని+ఐ= బలశాలినై; తెగన్+చూచినన్= సంహరించినా; ఒండెన్= ఒకటే (ఈ రెంటిలో ఏదైనా తనకు సమానమే కాని ఈ రెండు తప్ప మరో పక్షం తనకు అభిమతం కాదని దుర్యోధనుడి భావం); కాక= కాదంటే (ఈ రెంటిలో ఏదో ఒకటి చేయనిపక్షంలో); నాకున్= దుర్యోధనునకు; ఇందఱ ఋణము= (తనకై ప్రాణాలు ధారవోసిన) ఇందరి (రాజుల) బాకీ; ఎట్లు= ఏ విధంగా; పాయున్?= తీరుతుంది?; చెపుము!= చెప్పండి!; (మరో విధంగా తాను ఋణవినిర్ముక్తుణ్ణి కాలేనని దుర్యోధనుడి భావం.)

**తాత్పర్యం:** 'బలిష్ఠుడైన భీష్ముడిని పడగొట్టి శిఖండి, తన సోదరవర్గం అడ్డులేకుండా వెలిగిపోతున్నారు. మన ఏడక్షౌహిణుల సైన్యం ఇంతకుముందే నశించింది. అర్జునుడి చేత జరిగిన సైంధవపతనాన్ని చెప్పటానికే ఆశ్చర్యకరంగా ఉంది. నాకై ప్రాణాలు లెక్కచేయక యుద్ధానికి వచ్చిన కాంభోజరాజు, జలసంధుడు, సుదర్శనుడు మొదలైన రాజులు పెక్కుమంది ఈ రోజు యుద్ధంలో మరణించారు. ఇక నాకు ఆ రాజులమాదిరి వీరస్వర్గాన్ని అలంకరించటమో లేదా పాంచాలసైన్యాన్ని, ధర్మరాజాదులను బలశాలినై తెగనరకడమో తప్ప, నాకై ప్రాణాలర్పించిన ఇందరు వీరుల ఋణం ఏ విధంగా తీరుతుందో చెప్పు.

**విశేషం:** భీష్ముడిని జయించినవాడు అర్జునుడే అయినా నిమిత్తం మాత్రం శిఖండే - కాశీరాజు కూతురు అంబ భీష్ముడిపై వైరంతో తపస్సుచేసి రెండో జన్మలో ద్రుపదరాజునకు, శిఖండి అయి, స్త్రీగా జన్మించి, తరువాత పురుషత్వం పొందింది. నైష్ఠిక బ్రహ్మచారి కావటంచేత భీష్ముడు స్త్రీలతో యుద్ధం చేయడు. శిఖండి పురుషత్వం పొందిన స్త్రీగానే భీష్ముని భావన. ఈ అదను చూచికొని శిఖండిని ముందరపెట్టుకొని అర్జునుడు భీష్ముడితో యుద్ధం చేశాడు. భీష్ముడు శిఖండిని చూడకుండా ఉండటానికై వెనుదిరిగి అర్జునుడితో యుద్ధం చేశాడు. (శిఖండి జన్మవృత్తాంతం ఉద్యోగపర్వంలోని అంబోపాఖ్యానంలో ఉన్నది చూడండి). కాబట్టి దుర్యోధనుడు 'శిఖండి భీష్ముని పడవైచి' నట్లు చెప్పటంలో అసందర్భమేమీ లేదు.

**క. నరుఁ డనుఁగుబంటు గావునఁ । బొరిగొనఁ జొర వీవు; సూతపుత్త్రుఁ డొకఁడ మా**
**ర్తుర మార్కొనియెడు; నతనికి । వెరవును గఱతలును లేవు వీరుం డగుటన్.** 26

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; అనుఁగుబంటు= ప్రియశిష్యుడు; కావునన్= కాబట్టి; ఈవు= నీవు; పొరిగొనన్+చొరవు= చంపటానికి తలపెట్టటం లేదు; సూతపుత్త్రుఁడు= కర్ణుడు; ఒకఁడు+అ= ఒకడే; మార్తురన్= శత్రువులను; మార్కొనియెడున్= ఎదుర్కొంటాడు; వీరుండు+అగుటన్= (అతడు) పరాక్రమశాలి కాబట్టి; అతనికిన్= కర్ణుడికి; వెరవును= ఉపాయం (సులభంగా కార్యం సాధించే ఆలోచనాశక్తి); కఱతలును= దుశ్చేష్టలుకూడా. (పైకి ఒకటి లోన ఒకటి అనే విధంగా కుటిల ప్రవృత్తులు); లేవు.

**తాత్పర్యం:** ఆచార్యా! అర్జునుడేమో తమకు ప్రియశిష్యుడు; అందుకే అతడిని సంహరించ బూనుకొనటం లేదు. ఇక మిగిలినవారిలో కర్ణుడొకడే నిష్కపటవర్తనుడు, మహావీరుడు. అతడొక్కడు మాత్రం శత్రుజయానికై పాటుపడతాడు. కాని, కార్యం సాధించే సులభోపాయం మాత్రం అతడికి తొందరగా తట్టదు. (ఉపాయశాలులైన మీరేమో నా విషయంలో కపటంగా ప్రవర్తిస్తున్నారని భావం.)

**విశేషం:** కర్ణుడికి ఉపాయం, దుశ్చేష్టలు లేవని చెప్పటంచేత ఈ రెండూ తమకున్నాయని ద్రోణుడిని గూర్చిన ఎత్తిపొడుపు ధ్వనిస్తూ ఉన్నది.

**వ. అతఁడునుం బోరి పోరి చేడ్పడి సైంధవుం గోలుపోయె' ననవుడుఁ గటగటంబడి యాచార్యుం డతని కి ట్లనియె. 27**

**ప్రతిపదార్థం:** అతఁడునున్= ఆ కర్ణుడు; పోరి పోరి= యుద్ధంచేసి చేసి; చేడ్పడి= నశించి (అశక్తుడై); సైంధవున్= జయద్రథుడిని; కోలుపోయెన్= పోగొట్టుకొన్నాడు (సాధ్యమైనంతవరకు పోరాడినా సైంధవుడిని రక్షించుకొనలేకపోయాడని); అనవుడున్= అనగానే; కటకటన్+పడి= బాధపడి; ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; అతనికిన్= ఆ దుర్యోధనుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ కర్ణుడు సైంధవుడిని రక్షించుకొనటానికి ఎంతగానో యుద్ధం చేశాడు. కాని, సాధ్యం కాక సైంధవుడిని వదలుకొన్నాడు.' ఈ మాట వినగానే ద్రోణాచార్యుడు ఎంతో బాధపడి, దుర్యోధనుడిని చూచి ఇట్లా అన్నాడు:

**విశేషం:** 'పోరి పోరి' అనే ద్విరుక్తిచేత కర్ణుడి ప్రయత్నాతిశయం వ్యక్తమగుటయే కాకుండా ద్రోణాచార్యులు అంత శ్రద్ధగా పోరాడి సైంధవుడిని రక్షించలేదనే దుర్యోధనుడి అభిప్రాయం కూడా ధ్వనిస్తున్నది.

**చ. 'నను మది దూఁటు వోవు వచనంబుల నేటికి నిట్లు నొంప? న**
**ర్జునుని జయింపరామి పలుచోటులఁ జెప్పనె? దేవకోటికై**
**నను నవిజయ్యు భీష్ముఁ బ్రధనంబున నాతఁడు సంపఁ గౌరవుల్**
**మన రని తోఁచె నాకు; నభిమానముఁ గాచుటకై పెనంగెదన్. 28**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; మది= మనస్సు; తూఁటు+పోవు= చిల్లులు పడే; వచనంబులన్= మాటలతో; ఇట్లు= ఇట్లా; నొంపన్= నొప్పించటం; ఏటికిన్?= ఎందుకు?; అర్జునుని జయింపరామి= అర్జునుడిని జయించలేకపోవటం అనే విషయం; పలు చోటులన్= అనేక సందర్భాలలో; చెప్పనె?= చెప్పలేదా?; దేవకోటికిన్+ఐననున్= దేవతల సమూహానికైనా కానీ; అవిజయ్యున్= జయింపశక్యంకాని; భీష్మున్= భీష్ముడిని; ప్రధనంబునన్= యుద్ధంలో; ఆతఁడు= ఆ అర్జునుడు; చంపన్= సంహరించగా; కౌరవుల్= కౌరవులు (మీరు); మనరు+అని= జీవించరని; నాకున్= నాకు (ద్రోణాచార్యులకు); తోఁచెన్= తోచింది (అయినా); అభిమానమున్= ఆత్మగౌరవం; కాచుటకై= రక్షించుకొనటానికి; పెనంగెదన్= యుద్ధం చేస్తూ ఉన్నాను.

**తాత్పర్యం:** 'దుర్యోధనా! నన్నిట్లా మనస్సు చిల్లులుపడే మాటలతో ఎందుకు వేధిస్తావు? నేనింతకు ముందే ఎన్నో సందర్భాలలో అర్జునుడిని జయించటం కష్టం - అనే విషయం చెప్పనే చెప్పాను. దేవతలంతా ఒక్కటైనా జయింప సాధ్యంకాని ఆ భీష్ముడినే యుద్ధంలో జయించాడు అర్జునుడు. అప్పుడే 'కౌరవులు ఇక జీవించరని నాకు తోచింది. అయినా నేను యుద్ధం చేస్తున్నానంటే విజయం సాధిస్తానని కాదు - నా ఆత్మగౌరవం కాపాడుకొనటానికే.

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి. 'దేవకోటికైనను నవిజయ్యు' అనే భీష్ముడి విశేషణంలో అట్టి భీష్ముడినే జయించిన సవ్యసాచికి ఎదురై నిలిచేవాడు మన సైన్యంలో లేనే లేడని ద్రోణాచార్యుల అభిప్రాయమైనట్లు వ్యక్తమవుతూ ఉన్నది.

**ఆ. శకునిచేతి యడ్డసాళ్ళులు నేఁడు గాం। డీవ ముక్త బహు పటిష్ఠ బాణ**
**మూర్తిఁ గవిసి నీకు నార్తి యొనర్పంగ। నాఁకగొనఁగ నెట్టు లగు కుమార! 29**

**ప్రతిపదార్థం:** కుమార!= వత్సా దుర్యోధనా!; శకునిచేతి+అడ్డసాళ్ళులు= శకునిచేతి పాచికలు; నేఁడు= ఈనాడు; గాండీవ= గాండీవమనే అర్జునుడి ధనుస్సునుండి, ముక్త= విడువబడిన; బహు పటిష్ఠ= మిక్కిలి సామర్థ్యం గల; బాణ= బాణాల; మూర్తిన్= ఆకారాన్ని; కవిసి= పొంది; నీకున్= దుర్యోధనుడికి; ఆర్తి+ఒనర్పఁగన్= బాధ కలిగిస్తూ ఉంటే; ఆఁక+కొనఁగన్= ఆపటానికి; ఎట్టులు= ఎట్లా; అగున్?= సాధ్యం అవుతుంది?

**తాత్పర్యం:** వత్సా దుర్యోధనా! ఆనాడు శకునిచేతి పాచికలే ఈనాడు అర్జునుడి గాండీవంనుండి వెలువడే బలమైన బాణరూపాన్ని ధరించి నిన్ను బాధిస్తూ ఉన్నాయి. వాటిని ఆపటం ఎవరికి సాధ్యమౌతుంది?

**విశేషం:** అలం: రూపకం.

**క.** **భూరమణ! విదురుఁ డమ్మెయి । వారింపఁగ నతుల పుణ్యవతిఁ గృష్ణను మీ**
**వా రెల్లఁ జూడఁ బఱచిన । క్రూరపుఁ బాపంబు ఫలము గుడువక యున్నే?** **30**

**ప్రతిపదార్థం:** భూరమణ!= రాజా దుర్యోధనా!; విదురుఁడు= మీ పినతండ్రి విదురుడు; ఆ+మెయిన్= ఆ విధంగా; వారింపఁగన్= నివారించినా కూడా; అతులపుణ్యవతిన్= సాటిలేని పుణ్యాత్మురాలయిన; కృష్ణన్= ద్రౌపదిని; మీవారు+ఎల్లన్= మీ వారందరు; చూడన్= చూస్తూ ఉండగా; పఱచిన క్రూరపు+పాపంబు= అవమానించిన ఆ క్రూరమైన పాపఫలం; ఫలము+కుడువక+ఉన్నే?= అనుభవించక తప్పుతుందా?

**తాత్పర్యం:** ఓ రాజా! విదురుడు ఆ విధంగా వద్దని చెపుతూఉన్నా, పుణ్యాత్మురాలైన ద్రౌపదిని, మీ వారందరు చూస్తూ ఉండగా అవమానించిన ఘోరమైన పాపఫలం అనుభవించక తప్పుతుందా?

**క.** **ఆ సభ నీవును మీ దు । శ్శాసనుఁడును గర్ణుఁడును బ్రశస్త చరిత్రో**
**ద్భాసితు లగు పాండవులకుఁ । జేసిన కీ డెల్లభంగిఁ జెఱుపదె? మిమ్మున్.?** **31**

**ప్రతిపదార్థం:** ఆ సభన్= ఆ సభలో; నీవును= దుర్యోధనుడు; మీ దుశ్శాసనుఁడును= మీ (సోదరుడు) దుశ్శాసనుడు; కర్ణుఁడును= కర్ణుడు కూడా; ప్రశస్తచరిత్ర+ఉద్భాసితులు+అగు= ప్రశంసాపాత్రమైన నడవడితో ప్రకాశించేటటువంటి; పాండవులకున్= పాండురాజు కుమారులైన ధర్మరాజాదులకు; చేసిన= ఆచరించిన; కీడు= అపకారం; ఎల్లభంగిన్= సర్వవిధాల; మిమ్మున్= మీ అందరిని; చెఱుపదె?= నశింపజేయదా? (నశింపజేయక తప్పదు).

**తాత్పర్యం:** ఆ సభలో నీవు, నీ అనుజుడు దుశ్శాసనుడు, నీ ఆప్తమిత్రుడు కర్ణుడు ప్రశంసాపాత్రమైన నడవడితో ప్రకాశించే ఆ పాండవులకు చేసిన అపకారం ఊరకపోదు. అన్నివిధాల అది మిమ్మల్ని నశింపచేస్తుంది.

**విశేషం:** 'ప్రశస్త చరిత్రోద్భాసితులు' అనే పదం పాండవుల పవిత్రతను వ్యక్తీకరిస్తూ, అదే కౌరవుల పాలిట వినాశహేతువనే భావాన్ని దృఢపరుస్తూ ఉన్నది. 'ఇక మేం ఎంత చేసినా అది బూడిదలో పోసిన పన్నీరే' అనే ద్రోణాభిప్రాయాన్ని వ్యక్తీకరించటం జరిగింది.

**ఉ.** **అన్ని విధంబులం బఱిచి యైనను నక్కటికంబు లేక వా**
**రి న్నెఱి మాలి కానలఁ జరింపఁగఁ బంచినఁ బోయి వచ్చి య**
**య్యన్నయుఁ దమ్ములుం దమకు నయ్యు సగం బిల వేఁడి కాన కి**
**ట్లున్నను, వారి మార్కొనుట కోర్చితి నేనొక బ్రాహ్మణుండనే?** **32**

**ప్రతిపదార్థం:** అన్ని విధంబులన్= సర్వవిధాల; పఱిచి+ఐనను= భంగపాటు కలిగించికూడా; అక్కటికంబు= కనికరం అనేది; లేక= లేకుండగా; వారిన్= ఆ పాండవులను; నెఱిమాలి= నీతి తప్పి; కానలన్= అడవులలో; చరింపఁగన్= నివసించటానికి; పంచినన్= పంపినా కూడా; పోయివచ్చి= వెళ్ళి వచ్చి; ఆ+అన్నయున్= ఆ జ్యేష్ఠభ్రాత ధర్మరాజు; తమ్ములున్= సోదరులైన భీమాదులు; తమకున్= తమవంతుగా వచ్చే; అయ్య సగంబు+ఇలన్= తండ్రి సగభాగం భూమిని; వేఁడి= (ఇమ్మని) ప్రార్థించి; కానక=పొందక; ఇట్లు+ఉన్ననున్= ఈ విధంగా ఉన్నప్పటికి కూడా (చేసేది లేక పూనుకొన్నది ధర్మయుద్ధమే అయినా); వారిన్= అట్టి పాండవులను; మార్కొనుటకున్= ఎదిరించటానికి; ఓర్చితిన్= సహించాను; నేను ఒక= ఇట్టి అన్యాయాన్ని సహించే నేను కూడా; బ్రాహ్మణుం డన్+ఏ?= బ్రాహ్మణజాతికి చెందినవాడనేనా? (నా బ్రాహ్మణత్వం వ్యర్థం).

**తాత్పర్యం:** దుర్యోధనా! మీరెన్నో విధాల పాండవుల నవమానపరచారు. అయినా వారు సహించారు. దయ అనేది లేక వనవాసానికి పంపారు. ఆ వనవాస అజ్ఞాతవాసాదులను కూడా చేసి వచ్చి, తమ తండ్రి సగభాగం రాజ్యం ఇమ్మని అర్థించి, దానిని పొందలేక, న్యాయంగా రావలసిన రాజ్యానికై మార్గాంతరం లేక యుద్ధానికి పూనుకొన్నారు. నీవేమో అన్యాయంగా వారితో యుద్ధానికి తలపడ్డావు. అయినా వారితో యుద్ధం చేయటానికి నే నొప్పుకొని నీ అధర్మవర్తనాన్ని సహించానంటే నేను బ్రాహ్మణుడనేనా? నా బ్రాహ్మణత్వం ఎందుకు?

**విశేషం:** తాను బ్రాహ్మణుడై ఉండి నే నొక బ్రాహ్మణుండనే?' అని చెప్పటంచేత ఇది అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని అయింది. జాతిని బట్టి మాత్రం బ్రాహ్మణుడు కాడు, బ్రాహ్మణవిధి నిర్వర్తించినవాడే బ్రాహ్మణుడు. తాను అధర్మవర్తనాన్ని ఆమోదించటంచేత తన బ్రాహ్మణ్యం నశించిందనే ద్రోణాచార్య భావన ఇక్కడ ధ్వనిస్తూ ఉన్నది.

**క. నీవును నచ్చటఁ బన్నిన । నీ వారును సైంధవుని ననిం బడకుండం**
**గావఁగ జాలిరె? యేనును । నీ వాఁడన కానె? యేల నిందింపంగన్.?' 33**

**ప్రతిపదార్థం:** నీవును= నీవయినా (దుర్యోధనుడు); అచ్చటన్= ఆ రణరంగాన; పన్నిన నీ వారును= యుద్ధానికి తలపడిన నీవారు అనగా కర్ణాదులయినా; సైంధవునిన్= జయద్రథుడిని; అనిన్= యుద్ధంలో; పడకుండన్= పడిపోకుండా; కావంగన్+చాలిరి+ఎ?= కాపాడుకొన్నారా? (కాపాడుకోలేదు కదా!); ఏనును= నేనుకూడా; నీవాఁడను+అ= నీ పక్షం వహించినవాడినే; కాను+ఎ?= కాదా? (అటువంటప్పుడు నన్నుమాత్రం); నిందింపంగన్ ఏల?= నిందించటమెందుకు?

**తాత్పర్యం:** సైంధవుడిని రక్షించాలని నీవూ, నీవారైన కర్ణాదులు పూనుకొని ఉండికూడా అతడిని రక్షించలేకపోయారు కదా! వారందరు నీ వారనేకదా నీవు నిందించటం లేదు! నేను మాత్రం నీవాడను కానా? నన్నుమాత్రం ఎందుకు నిందిస్తున్నావు?'

**విశేషం:** 'కావగఁ జాలర' అని పాఠాంతరం. రక్షించటానికి సామర్థ్యం లేనివారా? అని దాని అర్థం. సమర్థులై ఉండికూడా రక్షించ లేకపోయా రంటే అది అసాధ్యం అనే విషయం వెల్లడిస్తుంది. ఆ సైంధవ రక్షణ నాకు కూడా అసాధ్యమే అయినప్పుడు నన్ను మాత్రం నిందించటం దేనికి? అని తాత్పర్యం. 'కావఁగఁ జాలర' - అనే దానికి రక్షించటానికి సమర్థులు కానే కాదని కూడా అర్థం చెప్పవచ్చును.

**వ. అని వీడనాడి వెండియు. 34**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా చెప్పి; వీడనాడి= పోవటానికి అనుమతించి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి దుర్యోధనుడిని పోవటానికి అనుమతించాడు. (కాని దుర్యోధనుడి ఉత్సాహం నశింపచేయటం తగదనే భావంతో) మళ్ళీ (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పాంచాలురుఁ బాండవులు ను। దంచిత గర్వమున ననికిఁ దఱిమి యొడలు మం**
**డించుచు నుండఁగ ని ట్లుడి। కించెద వొకవలన నీవుఁ గీడుపలుకులన్'. 35**

**ప్రతిపదార్థం:** పాంచాలురు= ధృష్టద్యుమ్నుడు మొదలైన పాంచాలదేశపు రాజులు; పాండవులున్= అర్జునుడు మొదలైనపాండవులు; ఉదంచిత గర్వమునన్= గొప్ప గర్వంతో; అనికిన్= యుద్ధానికి; తఱిమి= తలపడి; ఒడలు= శరీరం; మండించుచున్+ ఉండఁగన్= దహింపజేస్తూ ఉంటే; ఈవు= నీవేమో; ఒక వలనన్= ఒకవైపున; కీడుపలుకులన్= చెడు మాటలతో; ఇట్లు= ఈ విధంగా; ఉడికించెదవు= బాధిస్తూ ఉన్నావు. (ఇది నీకు తగిన పనేనా?)

**తాత్పర్యం:** ఓ వైపు యుద్ధానికి తలపడి పాంచాలురు, పాండవులు నా శరీరాన్ని ఉడికింపజేస్తూ ఉంటే రెండోవైపు నీవు నన్ను నిందావాక్యాలతో వేధిస్తూ ఉన్నావు. ఇది నీకు తగిన పనేనా?'

**ద్రోణుఁడు పాంచాలురఁ జంపక కవచంబు విడవ నని ప్రతిజ్ఞ సేయుట (సం.7-126-32)**

**వ. అని పగతుర యుత్సాహం బుపన్యసించి. 36**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; పగతుర+ఉత్సాహంబు= శత్రువుల యుద్ధోత్సాహాన్ని; ఉపన్యసించి= విశదీకరించి.

**తాత్పర్యం:** అని, శత్రువులు విజయ గర్వంతో చూపే యుద్ధోత్సాహాన్ని విప్పి చెప్పి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** శత్రువుల యుద్ధోత్సాహోపన్యాసం వలన ప్రకృతంలో యుద్ధం ముంచుకొనివస్తుంది కాబట్టి దానికై అందరు సిద్ధం కావలెగాని స్వపక్షవ్యక్తి దూషణ తగదనే భావం సూచితమైనది.

**క. 'పలుకులఁ బని లే దీ రే। తలపెట్టక పోరువా రుదగ్రత నేనుం**
**జలము మెఱయఁ బాంచాలురఁ। బొలియింపక కత్తళంబు పుచ్చ నరేంద్రా! 37**

**ప్రతిపదార్థం:** ఓ నరేంద్రా!= ఓ రాజా! (దుర్యోధనా!); ఈరు+ఏ= మీరే; తలపెట్టక= తలపోయకుండా (జరిగిన విషయాలేవీ మనస్సులో పెట్టుకొనకుండా); ఉదగ్రతన్= భయంకరంగా; పోరువారు= యుద్ధంచేస్తారు; పలుకులన్= మాటలతో; పని లేదు= అవసరంలేదు (చెప్పవలసిన పనిలేదు); నేనున్= నేను కూడా; చలము= పట్టుదల; మెఱయన్= ప్రకాశించే విధంగా (అభినివేశంతో); పాంచాలురన్= శిఖండి మొదలగువారిని; పొలియింపక= సంహరించకుండా; కత్తళంబు= కవచాన్ని; పుచ్చన్= విడువను.

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఇప్పుడు జరిగినదానిని గూర్చి విచారించకుండా శత్రుభయంకరంగా యుద్ధానికి తలపడటానికి మీరు సిద్ధంగా ఉండండి. నేను కూడా పాంచాలురను - అనగా శిఖండి మొదలైనవారిని సంహరించే వరకు ఈ కవచాన్ని విడువను.

**క. కావున మన సైన్యంబులు। సేవ సెడక సంగరంబు సేయునటులుగా**
**నీ వుత్సహించి నిజ బా। హా విభవము సూపు శక్తి కనురూపముగన్.' 38**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; మన సైన్యంబులు= మన సేనలు; చేవ= ధైర్యం; చెడక= చెడకుండా; సంగరంబు= యుద్ధం, చేయునటులుగాన్= చేసే విధంగా; నీవు+ఉత్సహించి= నీవు ఉత్సాహాన్ని కనబరచి; శక్తికిన్= సామర్థ్యానికి; అనురూపముగన్= తగినట్టుగా; నిజ బాహా విభవము= నీ బాహుబలవైభవాన్ని; చూపు(ము)= ప్రదర్శించుము.

**తాత్పర్యం:** కాబట్టి మన సైన్యానికి, ధైర్యంతో యుద్ధం చేసే ఉత్సాహం కలగజేయటానికి నీవు ఉత్సాహంగా నీ భుజబలాన్ని ప్రదర్శించుము.'

**వ. అని తెంపు సేసి. 39**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; తెంపు+చేసి= సాహసించి (యుద్ధానికి సన్నద్ధుడై).

**తాత్పర్యం:** అని దుర్యోధనుడికి చెప్పవలసింది చెప్పి, ద్రోణుడు తాను సాహసించి - అనగా యుద్ధానికి సిద్ధమై (దుర్యోధనుడితో మళ్ళీ ఇట్లా అన్నాడు).

**క. 'భూసురభక్తియు వృద్ధో । పాసనముం గలిగి ధర్మపథవర్తన ని**
**త్యాసక్తుఁడ వగు మనఘా! । నా సుతు బోధింపు వగపునకుఁ జొరకుండన్.' 40**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పుణ్యాత్మా!; వగపునకున్= దుఃఖానికి; చొరకుండన్= లోనుగాకుండా ఉండేటట్లు; నా సుతున్= నా కుమారుడైన అశ్వత్థామకు; బోధింపు(ము)= (నా మాటగా) తెలుపుము (ఏమని అనగా); భూసురభక్తియున్= బ్రాహ్మణుల యెడల భక్తిభావం; వృద్ధ+ఉపాసనము= తపోజ్ఞాన విద్యాదులచేత పెద్దలైనవారిని సేవించటం; కలిగి= కలవాడవై; ధర్మపథవర్తన నిత్యాసక్తుఁడవు= ధర్మమార్గ ప్రవృత్తిలోనే ఎల్లప్పుడు ఆసక్తిగలవాడవు; అగుము= కమ్ము అని.

**తాత్పర్యం:** అనఘా! బ్రహ్మణులందు భక్తి భావం కలిగి, పెద్దలను సేవిస్తూ, ధర్మమార్గాన నడచుకోవటంలో ఎడతెగని ఆసక్తి కలిగి ఉండుము, అని నా కుమారుడు అశ్వత్థామ దుఃఖానికి లోనుకాకుండా బోధించు.

**విశేషం:** నాయనా దుర్యోధనా! నా కుమారుడికి నా ఉపదేశాన్నందించి పుణ్యం కట్టుకో. నేనేమో యుద్ధానికి వెళ్ళుతున్నాను. మళ్ళీ తిరిగి వస్తానో లేదో, ఒకవేళ జరుగకూడనిదేదైనా జరిగితే నా కుమారుడు ఆ దుఃఖానికి తట్టుకోలేడు. ఆ దుఃఖాన్ని అతిక్రమించటానికి నా సందేశాన్ని వినిపించు - అని అశ్వత్థామను ఉద్దేశించి చెప్పిన సందేశమే అయినా, ఇది పరోక్షంగా దుర్యోధనునికి కూడ వర్తించే అవకాశం ఉంది. 'వగుమనఘా' అనే పై పాఠం కూడా ఉన్నది. కానీ ఇది దుర్యోధనుడికి కూడ ఉపదేశిస్తున్నట్లు తోస్తుంది. కాని ఇది అశ్వత్థామకు పంపిన ఉపదేశమే. ఈ సంస్కృతమూలం చూడండి. శ్లో॥ రాజన్ బ్రూయాః సుతం మే త్వ మశ్వత్థామాన మాహవే । నసోమకాః ప్రమోక్తవ్యా జీవితం పరిరక్షతా॥ యచ్చ పిత్రాZను శిష్టోZసి తద్ వచః పరిపాలయ॥ ఆనృశంస్యే దమే సత్యే చార్జవే చ స్థిరో భవ । ధర్మార్థ కామకుశలో ధర్మార్థావ ప్యపీడయన్ ॥ ధర్మప్రధాన కార్యాణి కుర్యాశ్చేతి పునఃపునః చక్షుర్మనోభ్యాం సంతోష్యా విప్రాః పూజ్యాశ్చ శక్తితః । న చైషాం విప్రియం కార్యం తే హి వహ్ని శిఖోపమాః ॥ (ద్రోణ. 151/ 35-38 గీతా ప్రెస్ ప్రతి) అని.

**వ. 'నా చేతఁ దెగని పాంచాలురు గలిగిరేనియు వారిం బోనీక పొదివి తెగఁ జూచునది' యని చెప్పుము.' 41**

**ప్రతిపదార్థం:** నాచేతన్= ద్రోణుడిచేత; తెగని పాంచాలురు= సంహరించబడకుండా ఉన్న పాంచాలరాజులు (ధృష్టద్యుమ్నాదులు); కలిగిరి+ఏనియున్= (మిగిలి) ఉన్నట్టయితే; వారిన్= ఆ పాంచాలరాజులను; పోనీక= విడిచిపెట్టక; పొదివి= చుట్టుముట్టి; తెగన్+ చూచునది= నిహతులయ్యేటట్లు చూడాలి; అని= ఇట్లా; చెప్పుము= నా మాటగా చెప్పుము.

**తాత్పర్యం:** 'ఒకవేళ నా చేత చావకుండా మిగిలిపోయిన పాంచాలరాజు లెవరైనా ఉంటే వారిని విడిచిపెట్టక చుట్టుముట్టి, ఏ విధంగానైనా సంహరించాలి' అని నా మాటగా చెప్పుము.'

**క. అని పలికి గాఢ నిశ్చయ । మున వదనం బెలమిఁ బొంద మును కలఁగిన నీ**
**మొన లెల్ల నొక్క మొగముగ నొనరిచితలకొలిపె భూసురోత్తముఁ డనికిన్. 42**

**ప్రతిపదార్థం:** భూసుర+ఉత్తముఁడు= ఆ బ్రాహ్మణోత్తముడైన ద్రోణుడు; అని= ఇట్లా; పలికి= చెప్పి; గాఢనిశ్చయమునన్= దృఢమైన నిశ్చయంతో; వదనము= ముఖం; ఎలమిన్= వికాసాన్ని; పొందన్= పొందుతూ ఉండగా; మును= అంతకుముందు; కలఁగిన= కలత చెందిన; నీ మొనలు+ఎల్లన్= నీ సైన్యాలనన్నింటిని (ఇది సంజయుడు ధృతరాష్ట్రుడిని సంబోధిస్తూ పల్కిన మాట); ఒక్క మొగముగన్= ఏకముఖంగా; ఒనరిచి= చేసి; అనికిన్= యుద్ధానికి; తలకొలిపెన్= సిద్ధం చేశాడు.

**తాత్పర్యం:** ద్రోణు డిట్లా పలికి, గట్టి పట్టుదల ముఖాన దీపిస్తూ ఉండగా సైన్యాన్నంతా సమీకరించి, యుద్ధానికి పురికొల్పాడు.

**వ.** **అ ట్లాచార్యుండు పురికొల్పినం గౌరవపతి సమర సముత్సాహ రహితం బగు మనంబుతో సూతనందనుఁ జేర నరిగి యి ట్లనియె.** 43

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; పురికొల్పినన్= ప్రేరేపించిన వెంటనే; కౌరవపతి= దుర్యోధనుడు; సమర సముత్సాహ రహితంబు+అగు= యుద్ధోత్సాహం లేనట్టి; మనంబుతోన్= మనస్సుతో; సూతనందనున్= కర్ణుడిని; చేరన్+అరిగి= సమీపించి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ద్రోణాచార్యుడు ప్రేరేపించగా, దుర్యోధనుడు యుద్ధోత్సాహమనేది లేక చిన్నవోయిన మనస్సుతో కర్ణుడి దగ్గరకి వెళ్ళి ఇట్లా అన్నాడు:

**క.** **'అరుల కభేద్యం బగు న । ప్పరుసున బలుమోహరంబు పన్నించి తుదిం**
**జొర విడిచెఁ గాని గురుఁ డ । న్నరు నాఁగఁడ; యతఁడు గీడు నాకుం జూడన్?** 44

**ప్రతిపదార్థం:** గురుఁడు= ఆ ద్రోణాచార్యుడు; అరులకున్= శత్రువులకు; అభేద్యంబు+అగు+అ+పరుసునన్= భేదింపరానట్టి విధంగా; బలువు+మోహరంబు= బలమైన వ్యూహాన్ని; పన్నించి= నిర్మింపజేసి; తుదిన్= చివరకు; చొరన్= ప్రవేశించటానికి; విడిచెన్+కాని= అర్జునుడిని వదలిపెట్టాడే తప్ప; గురుఁడు= ద్రోణాచార్యుడు; ఆ+నరున్= ఆ అర్జునుడిని; ఆగఁడు+అ= ఆపలేక పోయాడు; నాకున్+చూడన్= నేను ఆలోచించగా; అతఁడు= గురుడైన ద్రోణుడే; కీడు= నాకు హానికరుడు.

**తాత్పర్యం:** సైంధవ రక్షణకై శత్రువులకు చొరరాని బలమైన చక్రవ్యూహాన్నేమో పన్నాడు. కాని చివరకు శత్రుప్రవేశాన్ని ఉపేక్షించాడు. అర్జునుడిని ఆపలేదు. ఆలోచించగా గురుడే మనకు హానికరుడు.

**క.** **ఒకఁ డట్లు సొచ్చి, భూప । ప్రకరంబులఁ గూల్చి, సింధురాజుఁ దునిమె నె**
**ట్లొకొ? యతని కడిమి కుంభజు । నికి వారింపంగ రామి నిక్కమె? యరయన్.** 45

**ప్రతిపదార్థం:** ఒకఁడు+అట్లు= (అర్జునుడు) ఒక్కడు ఆ విధంగా; చొచ్చి= (వ్యూహాన్ని ఛేదించుకొని) ప్రవేశించి; భూపప్రకరంబులన్= (సైంధవ రక్షణకై నిలిచిన) రాజుల సమూహాన్ని; కూల్చి= సంహరించి; సింధురాజున్= సైంధవుడిని; తునిమెన్= వధించాడు; ఎట్లు+ఒకొ?= (ఇది) ఎట్లు సంభవం?; అతని కడిమి= ఆ అర్జునుడి పరాక్రమం; కుంభజునికిన్= ద్రోణాచార్యులకు; వారింపంగరామి = నివారించటానికి శక్యం కాకుండా ఉండటం; అరయన్= ఆలోచిస్తే; నిక్కమె?= నిజమా? (నిజంకాదని భావం).

**తాత్పర్యం:** అర్జునుడు ఒక్కడే ఆ విధంగా దుర్భేద్యమైన వ్యూహంలో ప్రవేశించి, రక్షణకై నిలిచిన రాజులందరినీ సంహరించి, సైంధవుడిని వధించటం ఎట్లా సంభవం? ఆలోచిస్తే ఆ అర్జునుడి వీరవిహారాన్ని ద్రోణాచార్యులు ఆపలేకపోయాడనటం నిజమా?

**విశేషం:** ఈ పద్యం నాలుగవ చరణం చివర 'నిక్కం బరయన్' అనే పాదానికి కూడా నిక్కంబు+ఎట్లొకో? అని అన్వయించి అర్థం చెప్పాలి. ఇది దూరాన్వయ దోషం. కాబట్టి దీనికంటె 'నిక్కమె యరయన్' అనే పాఠమే బాగుంది. మూలానికి అనుగుణమైన అర్థం ఇదే. ద్రోణుడికి పార్థుడిని ఆపే శక్తి ఉండికూడా ఆ పని చేయలేదనేదే దుర్యోధనుడి భావం.

క. **తన మాట నమ్మి సైంధవు । మొనకుం దెచ్చితిమి గాక! ము న్నెఱిఁగిన నా**
**తని నింటఁ బెట్టి వత్తుము; । మన సేనయు నివ్విధమున మడియక యుండున్.** 46

**ప్రతిపదార్థం:** తనమాట= ద్రోణుడి మాట; నమ్మి= విశ్వసించి; సైంధవున్= జయద్రథుడిని; మొనకున్= వ్యూహానికి; తెచ్చితిమి కాక= తీసికొని వచ్చామే కాని; మున్ను+ఎఱిఁగినన్= ముందే తెలిసి ఉంటే; ఆతనిన్= ఆ సింధురాజును; ఇంటన్= ఇంటిలోనే; పెట్టి వత్తుము= ఉంచి వచ్చేవారం; మనసేనయున్= మన సైన్యంకూడా; ఈ+విధమునన్= ఈ విధంగా; మడియక= నశించకుండా; ఉండున్= ఉండేది.

**తాత్పర్యం:** సైంధవుడిని రక్షిస్తాననే ద్రోణుడి మాట నమ్మి, అతడిని రణరంగానికి తెచ్చాం కానీ, లేకుంటే ఇంట్లోనే ఉంచి వచ్చేవారం. మన సైన్యం కూడ ఈ విధంగా నశించకుండా ఉండేది.

**విశేషం:** 'ఆతని మాట' అని ఆనక 'తన మాట' అని చెప్పటంచేత ఆచార్యుడు తా నిచ్చిన మాట తానే నిలబెట్టుకొనలేదనే దుర్యోధనుడి అభిప్రాయం ధ్వనిస్తూ ఉన్నది.

క. **మన మెంత సెట్టలమొ ఫ । ల్గునుపై నాతనికి నంత గూర్మి గలిగె? నే**
**మనఁ గల? దింక నతనిఁ గొని । యని సేయుద మనుట కార్య మగునే మనకున్?'** 47

**ప్రతిపదార్థం:** మనము= నీవు, నేను, మన వారు; ఎంత= ఎంతటి; చెట్టలమొ= ద్రోహబుద్ధి గలవారమో; ఫల్గునుపైన్= అర్జునుడిపై; ఆతనికిన్= ఆ ద్రోణాచార్యులకు; అంత= అంతటి; కూర్మి= ప్రేమ; కలిగెన్?= కలిగింది? (ఇంతకంటె); అనన్= అనటానికి; ఏమి కలదు?= ఏమున్నది?; ఇంకన్= ఇకముందు; అతనిన్= ఆ ద్రోణాచార్యులను; కొని= ఆశ్రయించి; అని= యుద్ధాన్ని; చేయుదము= చేద్దాము; అనుట= అనటం; మనకున్= కౌరవులకు; కార్యము+అగునే?= ప్రయోజనకారియేనా?

**తాత్పర్యం:** ఆ ద్రోణుడికి మనమెంత కానివారమై పోయామో! అంతగా అర్జునుడిపై అభిమానం పెరుగుతూ ఉన్నది. ఈ విషయంలో ఇంతకంటె చెప్పేది ఏమీ లేదు. అటువంటప్పుడు ఆ ఆచార్యుడినే ఆశ్రయించి పాండవులతో యుద్ధం చేద్దామని అనుకోవటం మనకు ప్రయోజనకారి అవుతుందా?

చ. **అన విని కర్ణుఁ డిట్లనియె 'నగ్గురు దూఱఁగ నేల? యాతఁ డో**
**పినటుల పోరుఁ గాక; నరుబీరము లావును నెక్కుడైన వా**
**ని నుడుప వచ్చునే విధియ నేర్చు విషం బిడి యిల్లు గాల్చి కా**
**ననమున కేఁగఁ జేసి యొక నాశముఁ గంటిమె గొంతిసంతతిన్?** 48

**ప్రతిపదార్థం:** అనన్= ఇట్లా పలుకగా; విని= విన్న తరువాత; కర్ణుఁడు= (దుర్యోధనుడి ప్రాణస్నేహితుడు) కర్ణుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు; ఆ+గురున్= ఆ ద్రోణాచార్యులను; దూఱఁగన్+ఏల?= నిందించటమెందుకు?; ఆతఁడు= ఆ ద్రోణుడు; ఓపినటులు+అ= యథాశక్తిగానే; పోరున్+కాక= యుద్ధం చేస్తే చేయవచ్చును (అయినా); నరుబీరము= అర్జునుడి పరాక్రమం; లావును= సామర్థ్యం (ఈ రెండూ); ఎక్కుడు+ఐనన్= అధికమైనప్పుడు; వానిన్= ఆ బలశౌర్యాలను; ఉడుపన్‌వచ్చును+ఏ? = తొలిగింప శక్యమా?; విధి+అ= దైవమే; నేర్చు= (ఆ పనిచేయటానికి) సమర్థమవుతుంది-పాండవులను హతమార్చటం ఎవరివలనా

కాదు ఆ దైవానికే తప్ప (ఎట్లాగంటే); విషంబు+ఇడి= విషాన్నిచ్చి (భీముడికి విషం పెట్టిన విషయం ఈ సందర్భంలో అనుసంధించాలి); ఇల్లు+కాల్చి= లక్కమేడను దహించి; కాననమునకున్= అడవికి (ద్యూతంతో జయించి); ఏఁగన్+చేసి= పోయేటట్లు చేసి; కుంతిసంతతిన్= కుంతి సంతానానికి (పాండవులకు); ఒక నాశము= ఒక విధమయిన నాశాన్నయినా; కంటిమి+ఎ?= కనుగొన్నామా?

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడి మాటలు విని, కర్ణుడు ఇట్లా అన్నాడు: 'ఆ ఆచార్యుడిని ఎందుకు దూషిస్తావు?అతడు శక్తికొలది యుద్ధం చేస్తూనే ఉన్నాడు. అంత చేసినా ఒకవేళ అర్జునుడి బలపరాక్రమాలు ఎక్కువైతే, వాటిని తగ్గించటం అతడికి సాధ్యమా? ఆ పనిచేయటానికి దైవానికే సాధ్యమౌతుంది. ఇంతెందుకు? మనం పాండవుల వినాశానికి ఎంతో ప్రయత్నించాం, భీముడికి విషమిచ్చాం, పాండవులందరిని లక్కఇంటిలో దహింపజూచాం, ద్యూతంలో ఓడిపోయారనే మిషతో వనవాసానికి పంపాం. అయినా వారికి ఒక కొంచెమైనా చేటు సంభవించిందా? (కాబట్టి పాండవులను నశింపజేయటం దైవం తలిస్తే తప్ప మన కెవరికీ సాధ్యం కాదనటం స్పష్టం - అటువంటప్పుడు ఆచార్యులను నిందించటమెందుకు? దైవమే ప్రధానం.)

**క. కావున మన సైంధవునిన్ । దైవము తెగటార్చె నంతఁ దలరి మనమునం**
**జేవ సెడ నేల? పోరం । గా విధి పంచినటు లయ్యెఁ; గడఁగన వలయున్.' 49**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; మన సైంధవునిన్= మన జయద్రథుడిని; దైవము+అ= అదృష్టమే; తెగటార్చెన్= హతమార్చింది; అంతన్= అంతగా; తలరి= బాధపడి; మనమునన్= మనస్సులో; చేవ= ధైర్యం; చెడన్+ఏల?= కోల్పోవటమెందుకు?; పోరంగాన్= (శక్తివంచన లేకుండా) యుద్ధం చేస్తూనే ఉండగా; విధి= దైవం; పంచిన+అటులు+అయ్యెన్= ఆజ్ఞాపించిన విధంగా అయింది; కడ= పరిణామం; కనవలయున్= చూడాలి. (మనం చేయవలసిన ప్రయత్నం చేస్తూనే ఉన్నాం కాని, మనమనుకొన్నది ఇంతవరకు అయిందా? దైవం ఏది తలుస్తుందో ఇప్పుడు ఆ పరిణామం చూడాలి).

**తాత్పర్యం:** కాబట్టి, మన సైంధవుడిని సంహరించింది దైవమే. అంతగా బాధపడి ధైర్యం చెడగొట్టుకొనవద్దు. మనం పోరు సాగించాలన్నదే దైవాజ్ఞ. చివరకు ఏమౌతుందో చూద్దాం. '

**క. అనునెడఁ బాండవ సేనలు । మొనసి కదియ నడచె; నీదు మొనలుం దగ మా**
**ర్కొనియె; నిటు లుభయ బలములు । ననిమిషులకు వేడ్క వుట్టునట్లుగఁ దాఁకెన్. 50**

**ప్రతిపదార్థం:** అను+ఎడన్= అని అనేటప్పుడు; పాండవ సేనలు; పాండవుల సైన్యాలు; మొనసి= వ్యూహంగా ఏర్పడి; కదియన్= ఎదుర్కొనటానికి; నడచెన్= కదిలాయి; నీదు మొనలున్= నీ సైన్యాలు కూడా; తగన్= సముచితంగా; మార్కొనియెన్= ఎదుర్కొన్నవి; ఇటులు= ఇట్లా; ఉభయ బలములు= ఉభయ సైన్యాలు; అనిమిషులకున్= దేవతలకు; వేడ్క= కుతూహలం; పుట్టునట్లు= కలిగే విధంగా; తాఁకెన్= ఢీకొన్నవి.

**తాత్పర్యం:** కర్ణు డిట్లా అంటూ ఉండగానే, పాండవుల సైన్యాలు యుద్ధానికి సంసిద్ధమై మీ సైన్యాన్ని ఎదుర్కొనటానికి కదిలాయి. మీ సైన్యాలు కూడా వెంటనే వాటితో ఢీకొన్నాయి. ఆ దృశ్యం దేవతలకు కూడా కుతూహలం కలిగించే విధంగా ఉన్నది.

**క. తురగము తురగముఁ గరి కరి । నరుఁడు నరుఁడు దేరు తేరు నలిఁ దాఁకిన య**
**ప్పరుసఁదన మేమి సెప్పదుఁ? । పొరి మిడుఁగుఱు లెగసి కైదువుల పొడి రాలెన్. 51**

**ప్రతిపదార్థం:** తురగము= అశ్వం; తురగమున్= అశ్వాన్ని; కరి= ఏనుగు; కరిన్= ఏనుగును; నరుఁడు= మనుష్యుడు (కాలినడకనే యుద్ధం చేసే సిపాయి); నరుఁడు= సిపాయిని; తేరు= రథం; తేరు= రథాన్ని; నలిన్= ఉత్సాహంతో; తాఁకిన= ఢీకొన్న; ఆ+పరుసఁదనము= ఆ కాఠిన్యం; ఏమి+చెప్పుదున్?= ఏమని చెప్పాలి?; పొరి= అధికంగా; మిడుఁగుఱులు= నిప్పురవ్వలు; ఎగసి= పైకి వెళ్ళి (ఆకాశాన్నంటి); కైదువులపొడి= ఆయుధాల తుమురు; రాలెన్= క్రిందపడింది.

**తాత్పర్యం:** ఉభయపక్ష చతురంగ సైన్యాలు ఒకదానితో మరొకటి ఢీకొంటూ ఉంటే ఆ ఆయుధాల తాకిడికి. నిప్పురవ్వలు ఆకాశాన్నంటాయి. ఆయుధాల నుగ్గునుగ్గైనపొడి కింద రాలింది.

**వ.** **అట్టియెడ నీ కొడుకు సైంధవుని చావునకు దుఃఖితుం డగుటఁ బ్రాణంబుల దెస నిరపేక్షుం డయి కడంగినం గని ద్రోణ కృపకర్ణులు వారింపం ద్రోచి తలకడచి దర్ప ప్రచండగతిం బాండవ సైన్యంబు సొచ్చి నిశిత వివిధ విశిఖ పరంపరలు పరఁగించినఁ, జతురంగంబుల యంగంబులు ధరం దొరఁగి చిక్కుపడి మదకల మాతంగంబు గలంచిన కమలాకరంబు చందంబయ్యె; నప్పు డందుఁ జేయంగల బలుమగ లెల్ల నొక్కమొగిం గవిసి నమ్మహీపతిం బొదివిన నతండు భీమసేనుఁ బదిబాణంబులను నకుల సహదేవ ద్రుపద విరాటద్రౌపదేయుల మూఁడు మూఁడు మార్గణంబులను, శిఖండిని నూటను, ధృష్టద్యుమ్ను డెబ్బదింటను, ధర్మపుత్ర సాత్యకుల నైదైదమ్ములను, ఘటోత్కచు నఱువది నాలుగింటను నొప్పించి కేకయ చేది ప్రముఖ యోధవరుల ననేక సాయకంబుల బెట్టు పఱిచి సింహనాదంబు సేసిన.** 52

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; నీ కొడుకు= నీ పుత్రుడు దుర్యోధనుడు; సైంధవుని చావునకున్= జయద్రథుడి మరణానికి; దుఃఖితుండు+అగుటన్= దుఃఖం కలిగి ఉండటంవలన; ప్రాణంబులదెసన్= ప్రాణాలపై; నిరపేక్షుండు+అయి= అపేక్షలేనివాడై; కడంగినన్+కని= యుద్ధం చేయటానికి ఉద్యమిస్తూ ఉంటే చూచి; ద్రోణకృప కర్ణులు= ద్రోణుడు, కృపుడు,కర్ణుడు ఈ ముగ్గురు; వారింపన్= ఇంత సాహసం పనికిరాదని వారిస్తూ ఉంటే; త్రోచి= (అడ్డం వచ్చినవారిని) ప్రక్కకు తొలగజేసి; తలకడచి= దాటిపోయి; దర్పప్రచండగతిన్= గర్వంయొక్క తీవ్రస్థాయితో (పరాకాష్ఠను చేరిన దర్పంతోనని భావం); పాండవ సైన్యంబు+చొచ్చి= పాండవుల సైన్యాన్ని ప్రవేశించి; నిశిత వివిధ విశిఖ పరంపరలు= తీక్ష్ణములైన అనేక బాణాల వరుసలను; పరఁగించినన్= వ్యాపింపజేస్తూ ఉంటే; చతురంగ బలంబుల+అంగంబులు= చతురంగ సైన్యంయొక్క శరీరావయవాలైన శిరస్సు, మొండెం, బాహువులు మొదలైనవి; ధరన్= భూమిపై; తొరఁగి= పడిపోయి; చిక్కుపడి= ఒకదానితో ఒకటి కలిసిపోయి; మదకల మాతంగంబు= మదించిన ఏనుగు (మదం కలయతి గచ్ఛతీతి మదకలః, 'కల గతే సంఖ్యానేచ' చురాదిః); కలంచిన కమలాకరంబు చందంబు= అవలోడించిన సరస్సు విధంగా; అయ్యెన్= అయింది; అప్పుడు= ఆ సమయాన; అందున్= అక్కడ; చేయన్+కల= సమర్థులైనట్టి; బలు(పు)+మగలు+ఎల్లన్= బలిష్ఠులైన వీరులందరు; ఒక్కమొగిన్= ఒకే పర్యాయం; కవిసి= ఎదిరించి; ఆ+మహీపతిన్= ఆ దుర్యోధనుడిని; పొదివినన్= చుట్టుముట్టిన వెంటనే; అతండు= ఆ దుర్యోధనుడు; భీమసేనున్= భీముడిని; పదిబాణంబులన్= పది బాణాలతో; నకుల సహదేవ ద్రుపద విరాట ద్రౌపదేయులన్= నకులుడిని, సహదేవుడిని, ద్రుపదరాజును, విరాటరాజును ద్రౌపది కుమారులను (ఉపపాండవులైన ప్రతివింధ్యాదులను); మూఁడు మూఁడు మార్గణంబులను= మూడేసి బాణాలతో; శిఖండిని= శిఖండిని (భీష్మవధకు నిమిత్తమైన ద్రుపదరాజు కుమారుడిని); నూటను= నూరు బాణాలతో; ధృష్టద్యుమ్నున్= పాండవుల సేనాపతి అయిన ధృష్టద్యుమ్నుడిని; డెబ్బదింటను= డెబ్భైబాణాలతో; ధర్మపుత్ర సాత్యకులన్= ధర్మరాజును మరియు సాత్యకిని; ఐదు+ఐదు+అమ్ములను= ఐదేసి బాణాలతో; ఘటోత్కచున్= ఘటోత్కచుడనే రాక్షసుడిని (భీముడి వలన హిడింబ అను రాక్షసస్త్రీయందు పుట్టినవాడిని); అఱువది నాలుగింటను= అరువది నాలుగు బాణాలతో; నొప్పించి= బాధించి; కేకయ చేది ప్రముఖ యోధవరులన్= కేకయ చేది దేశాలకు చెందిన ముఖ్యులైన వీర శ్రేష్ఠులను; అనేక సాయకంబులన్= లెక్కలేనన్ని బాణాలతో; బెట్టు= మిక్కిలి; పఱిచి= పడగొట్టి; సింహనాదంబు= సింహనాదాన్ని; చేసినన్= చేయగానే.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ సమయంలో నీ కొడుకు దుర్యోధనుడు సైంధవవధవలన కలిగిన దుఃఖంచేత ప్రాణాలకు తెగించి యుద్ధానికి పూనుకొన్నాడు. ద్రోణ, కృప, కర్ణులు ఎంత వారించినా వినలేదు. పాండవ సైన్యంలో ప్రవేశించి ఘోరంగా యుద్ధం చేశాడు. చతురంగ బలాలు అతడి ధాటికి నేలకూలాయి. ఆ సమయాన ఆ రణరంగం మదగజం కల్లోలపరిచిన కమలాకరం మాదిరి భాసించింది. ఆ దుర్యోధనుడి యుద్ధావేశం చూచి, పాండవసైన్యంలో సమర్థులైన వీరులందరు ఒకేసారి దుర్యోధనుడిపై తలపడ్డారు. అప్పుడు దుర్యోధనుడు వారినందరిని ఎదిరించాడు. భీముడిని పది బాణాలతో, నకులాదులను మూడేసి బాణాలతో, శిఖండిని నూరు బాణాలతో, ధృష్టద్యుమ్నుడిని డెబ్భైబాణాలతో, ధర్మరాజును సాత్యకిని ఐదేసి బాణాలతో, ఘటోత్కచుడిని అరువది నాలుగు బాణాలతో, కేకయ చేది దేశాల వీరశ్రేష్ఠులను లెక్కలేనన్ని బాణాలతో కొట్టి పడవేసి, తన విజయసూచకంగా సింహనాదాన్ని చేశాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ. దుర్యోధనుడి ధాటికి నేలకూలిన చతురంగ సైన్యం యొక్క శరీరావయవాలతో చెల్లాచెదరై ఉన్న రణరంగాన్ని మదగజం కలచిన కాసారంతో పోల్చటం చేత ఇది ఉపమాలంకారం - ఈ అలంకారం దుర్యోధనుడు అవలీలగా ఇంతగా పరాక్రమించాడనే భావాన్ని ధ్వనిస్తూ ఉన్నది. దీనిని అలంకారకృత వస్తుధ్వని అని అంటారు.

**క.** **ఆ ధర్మనందనుఁడు స । క్రోధాత్ముం డగుచు నేసెఁ గోదండము ను**
**గ్గై ధరఁ దొరఁగఁగ; నాతఁ డ । బోధంబునఁ దేరి మీఁదఁ బొలుపఱి వ్రాలెన్.** 53

**ప్రతిపదార్థం:** ఆ ధర్మనందనుఁడు= ఆ ధర్మరాజు; సక్రోధ+ఆత్ముఁడు+అగుచున్= కోపంతో కూడిన మనస్సు కలవాడై; కోదండము (దుర్యోధనుడి) ధనుస్సు; నుగ్గు+ఐ= తునియలై; ధరన్= భూమిపై; తొరఁగఁగన్= పడిపోయే విధంగా; ఏసెన్= (బాణాలతో) కొట్టాడు (దుర్యోధనుడిని అని శేషం); అతఁడు= (అట్లా ధర్మరాజుచేత నిహతుడైన) ఆ దుర్యోధనుడు; అబోధంబునన్= (తెలివితప్పి అని భావం); తేరిమీఁదన్= రథంపైన; పొలుపు+అఱి= ఒప్పు చెడి; వ్రాలెన్= వాలిపోయాడు.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనుడి విజృంభణం చూచి ధర్మరాజుకు కోపం పెరిగి దుర్యోధనుడితో తలపడి, అతడి ధనుస్సు తుత్తునియలై నేలమీదపడేటట్లు, అతడు స్పృహ కోల్పోయి రథంమీదే వాలిపోయేటట్లు బాణాలు వేశాడు.

**తే.** **ఇట్లు మూర్ఛిల్లుటయుఁ గౌరవేశ్వరుండు । సచ్చె ననియెడు నెలుఁగులు శంఖ కాహ**
**ళారవంబులు సెలఁగఁ బ్రియంబు నొందె । వారి బలములు, ద్రోణుఁ డేపారి కదిసె.** 54

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మూర్ఛిల్లుటయున్= (దుర్యోధనుడు) మూర్ఛపొందిన వెంటనే; కౌరవ+ఈశ్వరుఁడు= కురురాజైన దుర్యోధనుడు; చచ్చెన్+అనియెడు= మరణించాడనే; ఎలుఁగులు= కంఠాలు (కంఠధ్వనులు); శంఖ కాహళ+ఆరవంబులు= శంఖాలు, తూటుకొమ్ములు అనే వాటి ధ్వనులు; చెలఁగన్= చెలరేగుతూ ఉంటే; వారి బలములు= ఆ పాండవుల సైన్యాలు; ప్రియంబున్+ఒందెన్= సంతోషాన్ని పొందాయి (సంతోషించాయి); (అప్పుడు) ద్రోణుఁడు= ద్రోణాచార్యులు; ఏపారి= విజృంభించి; కదిసెన్= ఎదుర్కొన్నాడు; (ఆ పాండవసైన్యాల నెదుర్కొన్నాడని భావం. 'వారి బలములు' అనే పదం దేహళీ దత్త దీపన్యాయంగా పూర్వోత్తర వాక్యాల్లో అన్వయిస్తుంది.)

**తాత్పర్యం:** దుర్యోధనుడు తెలివితప్పి ఈ విధంగా పడిపోవటం చూచి కురురాజు మరణించా డనే అరుపులు, శంఖకాహళధ్వనులు చెలరేగగా పాండవసైన్యం చెప్పలేనంత సంతోషాన్ని పొందింది. ఇది చూచి, ద్రోణుడు విజృంభించి ఆ పాండవసైన్యంతో తలపడ్డాడు.

**వ. అంత. 55**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత

**తాత్పర్యం:** ఈ ఆర్భాటం చెలరేగిన తరువాత

**క. తెలివొంది 'యుధిష్ఠిర! నిలు । నిలు మని రభసమునఁ దాఁకు నీ సుతుఁ గని యా**
**బల మేచిన నీ బలముం । బెలుచ నిగుడ నపుడు రణము భీషణ మయ్యెన్. 56**

**ప్రతిపదార్థం:** తెలివి+ఒంది= తేరుకొని; యుధిష్ఠిర!= ఓ ధర్మరాజా!; నిలునిలుము+అని= ఆగాగు అని (అంటూ); రభసమునన్= వేగంగా; తాఁకు= ఎదిరిస్తూ ఉన్న; నీ సుతున్= నీ కుమారుడిని (దుర్యోధనుడిని); కని= చూచి; ఆబలము+ఏచినన్= ఆ పాండవ సైన్యం చెలరేగుతూ ఉండేటప్పుడు; నీబలమున్= నీ సైన్యం కూడా; పెలుచన్= వెంటనే; నిగుడన్= విజృంభించగా; అపుడు= ఆ సమయాన; రణము= యుద్ధం; భీషణము= భయంకరం; అయ్యెన్= అయింది. (భయంకరంగా సాగిందని భావం).

**తాత్పర్యం:** మూర్ఛనుండి తేరుకొని 'యుధిష్ఠిరా! నిలు నిలు' మని వేగంగా అతడి నెదుర్కొనే నీ కొడుకును చూచి పాండవసైన్యం విజృంభించగా, వెనువెంటనే నీ సైన్యం కూడా విజృంభించింది. ఆ సమయాన ఆ యుద్ధం భయంకరం అయింది.

**వ. అనిన విని ధృతరాష్ట్రుం డట్టియెడ 'నాచార్యుం డెవ్విధంబున నరివధంబు సేసె? నిందలి యందలి చేయంగల సైనికోత్తము లెత్తెఱంగునం బెనంగిరి? చెప్పు' మనవుడు సంజయుం డిట్లను న ట్లుభయబలంబులుఁ బురికొని పోరుచు నుద్దండ రయంబు మెఱసి యుధిష్ఠిర ప్రముఖ పాండవులును, శైనేయాది యాదవులును, ద్రుపద ప్రభృతి పాంచాలురును, విరాట పురస్సరమాత్స్యులును, గుమార వర్గంబును మఱియు ననేక దండనాయకులును సాయకాసారంబు పరఁగించుచు భారద్వాజుపై నడరిన; నతం డత్యుదీర్ణుండయి కర్ణుండు మొదలుగాఁ గల బలుమగ లిరుగెలంకుల సంరంభంబునం దఱుమ విజృంభించె; నయ్యవసరంబున నెగసిన ధరణీపరాగంబు జనంబుల చూడ్కులు నిగుడనీక యుండె; నాలోనన శుండాల సుభట ఘోటకంబుల యంగంబులం గ్రమ్ముదెంచు రుధిరం బది యడంచిన నమ్మొనల కడంక రెట్టించె; నప్పుడు కౌరవుల దిక్కున ఘూక సృగాల రవంబులు సెలంగ వా రది సరకుసేయక సమరోన్మత్తులై నెత్తురు టేఱులు వాఱఁ గేలి సలిపి; రా సమయంబునఁ గేకయ రథికులును ధృష్టద్యుమ్న తనయులును లోనగు వారిం బెక్కండ్ర నక్కుంభసంభవుండు నుఱిపియు మఱియు బలువురఁ బఱపియుఁ గడిమి నెఱపం బ్రతాపశీలుం డగు శిబి సాహసరసికుండై. 57**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= సావధానంగా విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆచార్యుండు= ద్రోణాచార్యుడు; ఏ+విధంబునన్= ఏ విధంగా; అరివధంబు= శత్రువధ; చేసెన్?= చేశాడు?; ఇందలి+అందలి= ఈ వైపు (స్వపక్షంలో), ఆ వైపు (పరపక్షంలో) ఉన్న; చేయన్+కల= సమర్థులైనట్టి; సైనిక+ఉత్తములు= సైనిక శ్రేష్ఠులు; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; పెనంగిరి?= యుద్ధం చేశారు?; చెప్పుము+అనవుడున్= (సంజయా)! చెప్పుము అని అనగా; సంజయుండు; ఇట్లు= ఈ (చెప్పబోయే) విధంగా; అను(న్)= పలుకుతాడు; అట్లు= ఆ విధంగా; ఉభయ బలంబులున్= రెండుపక్షాల సైన్యాలు కూడా; పురికొని= అతిశయించి (ఒకదానికంటె మరొకటి అతిశయించాలి అనే కోరికతో నని భావం); పోరుచున్+ఉండన్= యుద్ధం చేస్తూ ఉండగా; ఉద్దండరయంబు= గొప్పవేగం; మెఱసి= ప్రకాశించి; యుధిష్ఠిర ప్రముఖ

పాండవులును= ధర్మరాజు మొదలైన పాండవులు; శైనేయ+ఆది యాదవులును= సాత్యకి మొదలైన యాదవవీరులు; ద్రుపద ప్రభృతి పాంచాలురును= ద్రుపదరాజు మొదలైన పాంచాలదేశ వీరులు; విరాట పురస్సర మాత్స్యులును= విరాటరాజు మొదలైన మత్స్యదేశ యోధులు; కుమారవర్గంబును= ప్రతివింధ్యుడు మొదలైన పాండవ కుమారుల సమూహం; మఱియున్= అంతేగాక; అనేక దండనాయకులును= అనేకులైన సేనానాయకులు కూడా; సాయక+ఆసారంబు= బాణాలవర్షం; పరఁగించుచున్= కలుగజేస్తూ; భారద్వాజుపైన్= ద్రోణాచార్యుడిపై; అడరినన్= చెలరేగుతూ ఉంటే; అతండు= ఆ ద్రోణుడు; అతి+ఉదీర్ణుండు+అయి= మిక్కిలి ఉద్రేకం కలవాడై; కర్ణుడు మొదలుగాన్+కల= కర్ణుడు మొదలైన; బలు(పు) మగలు= బలిష్ఠులైన వీరులు; ఇరు+కెలంకులన్= రెండువైపులందు; సంరంభంబునన్= వేగంగా; తఱుమన్= ఎదిరించగా; విజృంభించెన్= చెలరేగాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఎగసిన= పైకి లేచిన; ధరణీపరాగంబు= భూమిధూళి; జనంబుల చూడ్కులు= జనుల చూపులను; నిగుడన్+ఈక= ఆననీయక; ఉండెన్= ఉన్నది (జనులచూపులు ప్రసరించలేకుండా ఉండేటంత దట్టంగా ధూళి వ్యాపించిందని భావం); ఆలోననన్= అంతలోనే; శుండాల-సుభట-ఘోటకంబుల+అంగంబులన్= ఏనుగుల, యోధుల అశ్వాల శరీరాలనుండి; క్రమ్మ+తెంచు= వ్యాపించునట్టి; రుధిరంబు= నెత్తురు; అది= దాన్ని (ఆ ధూళిని); అడంచినన్= అణగద్రొక్కిన వెంటనే; ఆ మొనలకడంక= ఆ సైన్యాల ఔద్ధత్యం; రెట్టించెన్= రెండింతలైంది; అప్పుడు= ఆ సమయంలో; కౌరవుల దిక్కునన్= కౌరవుల దిశాభాగంలో(కౌరవులవైపున); ఘూక సృగాల రవంబులు= గుడ్లగూబల ధ్వనులు, నక్కల ధ్వనులు; చెలంగన్= వ్యాపిస్తూ ఉండగా; వారు= ఆ కౌరవవీరులు; అది= ఆ ధ్వనిని; సరకు+చేయక= లెక్కచేయకుండా; (అపశకునం అని కూడా విచారించకుండా అని భావం.); సమర+ఉన్మత్తులై= యుద్ధోన్మాదం కలవారై; నెత్తురు+ఏఱులు= రక్తం వరదలు; పాఱన్= పారే విధంగా; కేలి(ళి)= యుద్ధక్రీడ; సలిపిరి= చేశారు, (అవలీలగా యుద్ధం చేశారని భావం.); ఆ సమయంబునన్= కేకయదేశానికి చెందిన రథికులు (రథంపై ఉండి యుద్ధం చేసేవారు రథికులు); ధృష్టద్యుమ్న తనయులును= ధృష్టద్యుమ్నుడి కుమారులు; లోనగువారిన్= మొదలైన వారిని; పెక్కండ్రన్= అనేకులను; ఆ+కుంభసంభవుఁడు= ఆ ద్రోణాచార్యుడు; నుఱిపియున్= చూర్ణంచేసి; మఱియున్= అంతేగాక; పలువురన్= అనేకులను; పఱపియున్= పలాయనం చేయించి; కడిమి= పరాక్రమాన్ని; నెఱపన్= విస్తరింపజేస్తూ ఉండే సమయంలో; ప్రతాపశీలుండు+అగు= పరాక్రమించే స్వభావం గలిగిఉన్న; శిబి= శిబి అనే వీరుడు; సాహస రసికుండు+ అయి= సాహసం చేయటానికి మక్కువగలవాడై.

**తాత్పర్యం:** అని సంజయుడు చెప్పగా విని ధృతరాష్ట్రుడు. సంజయా! ఆ సమయంలో ద్రోణాచార్యుడు ఎట్లా శత్రువధ చేశాడు? ఇరుపక్షాల్లో ఉన్న మేటి మొనగాళ్ళు ఏ విధంగా యుద్ధం చేశారు? చెప్పుమని అడుగగా, సంజయుడు ఈ విధంగా అన్నాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఉభయసైన్యాలు భయంకరంగా పోరాడుతూ ఉండే సమయంలోనే ధర్మరాజు మొదలైన పాండవులు, సాత్యకి మొదలైన యాదవవీరులు, ద్రుపదుడు మొదలైన పాంచాలవీరులు, విరాటరాజు మొదలైన మత్స్యదేశం యోధులు, ఉపపాండవులు, అంతేగాక మరెందరో దండనాయకులు ద్రోణాచార్యుడిపై బాణవర్షం కురిపిస్తూ యుద్ధం చేస్తూ ఉండగా, ద్రోణాచార్యుడు మహోద్రేకంతో కర్ణుడు మొదలైన మన యోధాగ్రేసరులు ఇరువైపులా శత్రుసైన్యాలను ఎదిరించగా విజృంభించాడు. ఆ యుద్ధ సంరంభంలో ఎగసిన ధూళి ఆకాశాన్ని కప్పింది. అది ఎవ్వరికీ చూడరానంత దట్టంగా దెసల వ్యాపించింది. అంతలోనే ఆ యుద్ధంలో హతమైన చతురంగబలాల శరీరాలనుండి రక్తం ప్రవాహంగా పారింది. దానితో ఆ ధూళి అంతా అణగింది. మళ్ళీ ఉభయసైన్యాలు అంతకు రెండింతలుగా విజృంభించి తలపడ్డాయి. అప్పుడు, కౌరవులవైపు గుడ్లగూబల కూతలు, నక్కల అరుపులు వ్యాపించగా, అది అపశకునమని లెక్కచేయకుండానే మీ సైన్యంలోని యోధులు నెత్తురు వరదగా ప్రవహించే విధంగా పోరాడారు. ద్రోణాచార్యుడు పాండవపక్షీయులైన కేకయ

వీరులను మరియు ధృష్టద్యుమ్నుడి పుత్రులను మరెందరినో మహావీరులను హతమార్చాడు. కొందరిని పరుగులు తీయించాడు. ఇంత గొప్పగా ద్రోణుడు యుద్ధం చేస్తూ ఉంటే అప్పుడు శిబి అనే ప్రతాపశాలి సాహసానికి పూనుకొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఉరవడిఁ దాఁకుటయును బది । శరము లతని మేనఁగ్రుచ్చె సాయకగురుఁ డ**
**చ్చెరువగు మగఁటిమి; నతఁడు । ద్ధురుఁడై తత్సూతు శిరము ద్రుంచెం బెలుచన్ 58**

**ప్రతిపదార్థం:** ఉరవడిన్= అతి వేగంతో; తాఁకుటయును= ఎదిరిస్తూ ఉండగా; పదిశరములు= పదిబాణాలు; అతని మేనన్= ఆ శిబి శరీరంలో; సాయక గురుఁడు= బాణవిద్యాగురువైన ద్రోణాచార్యులు; అచ్చెరువు+అగు= ఆశ్చర్యకరమైన; మగఁటిమిన్= పరాక్రమంతో; క్రుచ్చెన్= నాటుకపోయేటట్లు వేశాడు; అతఁడు= ఆ శిబి; ఉద్ధురుఁడు+ఐ= (ఆ బాణాఘాతాలకు) చలించనివాడై; పెలుచన్= క్రోధంతో; తద్+సూతు శిరము= ఆ ద్రోణాచార్యుడి సారథి తలను; త్రుంచెన్= తెగగొట్టాడు.

**తాత్పర్యం:** అతి వేగంగా వచ్చి ద్రోణాచార్యుడిని ఎదుర్కొనగా (శిబి), తత్క్షణమే ద్రోణాచార్యుడు పదిబాణాలు ఆశ్చర్యకరమైన పరాక్రమంతో అతడి శరీరంలో నాటుకుపోయే విధంగా కొట్టాడు. శిబి కూడ చలించకుండ కోపంతో ద్రోణుడి సారథి శిరస్సు తెగనరికాడు.

**తే. త్రుంచి తోడన ముప్పదితూపు లతని । యొడల నాటుడు హయముల మెడలు సూతు**
**గళము నజ్జనపతి కుత్తుకయును దునిమె । ఘోర భల్ల షట్కమ్మునఁ గుంభభవుఁడు. 59**

**ప్రతిపదార్థం:** త్రుంచి= (సారథి శిరాన్ని) తెగన్+ఏసి; తోడన్+అ= వెంటనే; ముప్పది తూపులు= ముప్పది బాణాలను; అతని+ఒడలన్= ఆ ద్రోణుడి శరీరంలో; నాటుడున్= గ్రుచ్చుకొనేటట్లు వేయగానే; కుంభభవుఁడు= కుంభసంభవుడు (ద్రోణుడు); ఘోర భల్లషట్కమునన్= భయంకరములైన భల్లములు అనే బాణాలు ఆరింటితో; హయముల మెడలు= అశ్వాల కంఠాలను (అశ్వాలు నాలుగు కాబట్టి నాలుగు బాణాలతో); సూతుగళమున్= సారథి కంఠాన్ని (ఒక బాణంతో); ఆ+జనపతి కుత్తుకయును= ఆ శిబిరాజు కంఠాన్ని మరియొక బాణంతో (మొత్తం ఆరుబాణాలతో); తునిమె(న్)= తెగగొట్టాడు.

**తాత్పర్యం:** ద్రోణుడి సారథి తల నరికిన వెనువెంటనే, ముప్పది బాణాలు ద్రోణుడి శరీరంలో గ్రుచ్చుకొనేటట్లు కొట్టాడు. ద్రోణాచార్యుడు ఆరు భయంకరాలైన భల్లా లనే బాణాలతో గుర్రాల మెడలను, సారథి కంఠాన్ని, ఆ శిబి గళాన్ని తెగవేశాడు.

**వ. అప్పుడు. 60**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ద్రోణుడిట్లా ఆ శిబిని సంహరించిన సమయంలో.

**తే. భానుమంతునిఁ జంపిన పగ మనమునఁ । బెట్టికొని యుండి యాతని పట్టి భీమ**
**సేనుపై వడిఁ గాళింగ సేనతోడఁ । గవిసి నారాచధారలఁ గప్పి యొప్పె. 61**

**ప్రతిపదార్థం:** భానుమంతునిన్= తన తండ్రియైన భానుమంతుడిని; చంపిన పగ= చంపినటువంటి వైరాన్ని; మనమునన్= మనస్సులో; పెట్టికొని+ఉండి= పెట్టుకొన్నవాడై; ఆతని పట్టి= ఆ భానుమంతుడి కుమారుడు; భీమసేనుపైన్= భీముడిపై; వడిన్=

వేగంగా; కాళింగ సేనతోడన్= కళింగదేశపు సైన్యంతో; కవిసి= చుట్టుముట్టి; నారాచ ధారలన్= బాణాల పరంపరలతో; కప్పి= కప్పివేసి; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** తన తండ్రి అయిన భానుమంతుడిని భీముడు చంపాడన్న పగతో, అతడి కుమారుడు కళింగసైన్యంతో భీమసేనుడిని చుట్టుముట్టి, అతడిపై బాణవర్షం కురిపించాడు.

**క. కినిసి బకమర్దనుఁడు వెసఁ । దన యరదము వాని తేరు దాఁకఁ బఱపి, యా**
**తని మీఁద నుఱికి క్రుమ్మెం । గనుకని నెంపపొడి సెదరఁ గాలం గేలన్. 62**

**ప్రతిపదార్థం:** కినిసి= కోపించి; బకమర్దనుఁడు= బకాసురుని చంపిన భీముడు; వెసన్= వేగంగా; తన+అరదము= తన రథాన్ని; వాని తేరుదాఁకన్= ఆతని రథాన్ని తాకేటట్టు; పఱపి= తోలి; ఆతనిమీఁదన్= అతనిపైకి; ఉఱికి= దుమికి; కనుకనిన్= సంభ్రమంతో; ఎంపపొడి= ఎముకల నుగ్గు; చెదరన్= చెదరిపడేటట్టు; కాలన్= కాలితో; కేలన్= చేతితో; క్రుమ్మెన్= పొడిచాడు.

**తాత్పర్యం:** భీముడు కోపించి తన రథాన్ని వాడి రథాన్ని తాకేటట్టు తీసికొని వెళ్ళి, వాడి రథంపై పడి, వాడి ఎముకలన్నీ నుగ్గునుగ్గయి చెదరిపడేటట్లు కాలితో, చేతితో క్రుమ్మాడు.

**విశేషం:** బకుడనే రాక్షసుడిని సంహరించటంచేత భీముడికి బకమర్దనుడనే పేరు కలిగింది. బకుని మర్దించినవాడు బకమర్దనుడు- (మర్దించు= సంహరించు) భీముడు బకాసురుడిని సంహరించి ఏకచ్ఛక్రపురవాసులను రక్షించిన కథ మహాభారతం ఆదిపర్వంలో ఉన్నది. అంతటి రాక్షసుడినే జయించిన భీముడికి ఈ రాజకుమారుడు ఒక లెక్కా? అనే అర్థం స్ఫురిస్తూ ఉన్నది.

## భీమసేనుఁడు దుర్మద దుష్కర్ణులం జంపుట (సం.7-130-22)

**వ. అమ్మహోగ్ర సముద్ధతిం జూచి పాంచాల సైనికులు సింహనాదంబులు సేసిన సహింపక సూతసుతుండును తత్సోదరులును నవ్వీరుం బొదివిన, నతం డద్భుతంబుగా ధ్రువు నరదంబు మీఁదికి లంఘించి వానిఁ బిడికిటి పోటునఁ జావం బొడిచి, జయరాతునిపైఁ గవిసి యాతని నతని సూతునిఁ గాళ్ళు లిరుగేలం బట్టి బె ట్టిలపై వ్రేసి గతాసులం జేసిన నలిగి కర్ణుండు శక్తివైవ మలంగి వెరవున నొడిసికొని దానిన యవ్వడముడి యతనిపై వైచినం గని గాంధార మహీవల్లభుండు భల్లంబున నడుమన నఱకె; నంతఁ గురుకుమారు లమ్మారుతిం జుట్టుముట్టి విశిఖంబులు నిగిడించినఁ గోపించి దుర్మదుని తేరి కురవడించి తురంగంబులం బొరివుచ్చి సారథిం జదిపిన నాతండు దుష్కర్ణు స్యందనం బెక్కె; నయ్యిరువురు నప్పాండుతనయు తనువున మెఱుంగుటమ్ములు గిరిగొలుపం గిట్టి యా రథంబు గూల నవలీలం దన్ని, దుర్యోధన ద్రౌణి కృప కృతవర్మ కర్ణ శల్య బాహ్లికులు సూచుచుండ నక్కుమారుల నిద్దఱం గాల నొక్కనిం గేల నొక్కనింగా సమయించె; నివ్విధంబునం జిత్రవధ విహారంబున విజృంభించు నా భీమసేనుం జూచి, రుద్రుండు రభసోద్రేకంబునం బాండవేయులకుఁ డోడ్పడం జనుదెంచెంగాక! మానవు లిట్టివారునుం గలరే! యనుచు నీ వారెల్లను వెఱచఱిచి యుద్ధతొ క్కతెరువునం బోకపఱచి రక్కుమార కంఠీరవుం డుక్కునం దమసేన దిక్కుసూచి యెట్టి విరిదామరలం దెగడుకన్నులం గౌంతేయాగ్రజు నుపలక్షించి కేలుమొగిచి ఫాలంబునం జేర్చునప్పుడు తన్మూర్తి నతండును నకుల సహదేవ ద్రుపద విరాటులును దేఱి చూడ శంకించి మాఱు మొగంబులతో నగ్గించి రా సమయంబున. 63**

**ప్రతిపదార్థం:** ఆ+మహా+ఉగ్ర+సముద్ధతిన్= ఆ గొప్ప భయంకరమైన విజృంభణాన్ని; చూచి= ప్రత్యక్షంగా చూచి; పాంచాల సైనికులు= పాంచాలదేశపు సైనికులు; సింహనాదంబులు= సింహనాదాలను; చేసినన్= చేయగా; సహింపక= తట్టుకోలేక; సూత సుతుండును= సూతపుత్రుడూ (కర్ణుడూ); తద్+సోదరులును= ఆ మృతవీరుడి సోదరులూ; ఆ+వీరున్= వీరుడైన ఆ భీమ సేనుడిని; పొదివినన్= ఎదిరించగా; అతండు= ఆ భీముడు; అద్భుతంబుగాన్= ఆశ్చర్యం కలిగే విధంగా; ధ్రువు+అరదంబు మీఁదికిన్=ధ్రువుడనే వాడి రథంపైకి; లంఘించి= దుమికి; వానిన్= ఆ ధ్రువుడిని; పిడికిటి పోటునన్= పిడికిలితో పొడిచి కొట్టటంతో; చావన్= మరణించే విధంగా; పొడిచి= పొడిచి; జయరాతునిపైన్= జయరాతుడనే వానిపైకి; కవిసి= ఉరికి; ఆతనిన్= అతడిని; ఆతని సూతునిన్= ఆ జయరాతుడి సారథిని; కాళ్ళులు= పాదాలను; ఇరు+కేలన్= రెండు చేతులతో; పట్టి= పట్టుకొని; బెట్టు= అత్యంతమూ; ఇలపైన్= భూమిమీద; వ్రేసి= పడవేసి; గత+అసులన్= మృతులనుగా; చేసినన్= చేయగా; అలిగి= కోపించి - క్రోధంతో అని భావం; కర్ణుఁడు= కర్ణుడు; శక్తిన్= శక్తి అనే ఆయుధాన్ని; వైవన్= వేయగా; ఆ+వడముడి= ఆ భీముడు; మలంగి= ప్రక్కకు లాగి; వెరవునన్= ఉపాయంతో; ఒడిసికొని= పట్టుకొని; దానిన్+అ= ఆ శక్తి అనే ఆయుధాన్నే; అతనిపైన్= అతడిమీదనే; వైచినన్= వేయగా; కని= చూచి; గాంధార మహీవల్లభుండు= గాంధారదేశం రాజు (శకుని); భల్లంబునన్= భల్లం అనే బాణంతో; నడుమన్+అ= నడిమధ్యలోనే; నఱకెన్= నఱికి వేశాడు; అంతన్= ఆ సమయంలో; కురుకుమారులు= కౌరవులు; ఆ+మారుతిన్= ఆ వాయునందనుడిని(భీముడిని); చుట్టుముట్టి= క్రమ్ముకొని; విశిఖంబులు= బాణాలను; నిగిడించినన్= వెలువరించగా; కోపించి= క్రోధం గలవాడై; దుర్మదుని తేరికిన్= దుర్మదుడి రథంపైకి; ఉరవడించి= చెలరేగి; తురంగంబులన్= అశ్వాలను; పొరి పుచ్చి= సంహరించి; సారథిన్= సారథిని; చదిపినన్= చంపివేయగా; ఆతండు= ఆ దుర్మదుడు; దుష్కర్ణ స్యందనంబు= దుష్కర్ణుని రథాన్ని; ఎక్కెన్= ఎక్కాడు; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరుకూడా; ఆ+పాండు తనయు తనువునన్= ఆ భీముడి శరీరంలో; మెఱుంగు +అమ్ములు= (పదనుతో) మెరుస్తూ ఉన్న బాణాలను; గిరిగొలుపన్= నాటగా; కిట్టి= సమీపించి; ఆ+రథంబు= ఆ రథము; కూలన్= కూలిపోగా; అవలీలన్= అనాయాసంగా; తన్ని= కాలితో తన్ని (ఆ రథాన్ని పక్కకు నెట్టి అని భావం); దుర్యోధన= దుర్యోధనుడు; ద్రౌణి= ద్రోణపుత్రుడు (అశ్వత్థామ); కృప= కృపాచార్యులు; కృతవర్మ= కృతవర్మ; కర్ణ= కర్ణుడు; శల్య= శల్యుడు; బాహ్లికులు= బాహ్లికుడు అను వారలు; చూచుచుండన్= చూస్తూ ఉండగా; ఆ+కుమారులన్+ఇద్దఱన్= ఆ ఇద్దరు కురు కుమారులను (దుర్మద దుష్కర్ణులను); కాలన్= పాదంతో; ఒక్కనిన్= ఒక్కడిని; కేలన్= చేతితో; ఒక్కనిన్+కాన్= ఒక్కడిని అనే విధంగా; సమయించెన్= చంపి వేశాడు; ఈ విధంబునన్= ఈ విధంగా; చిత్రవధ విహారంబునన్= ఆశ్చర్యం గొలిపే విధంగా చేసిన శత్రు వధల విహారంతో; విజృంభించు+ఆ+భీమసేనున్= చెలరేగుతున్న ఆ భీముడిని; చూచి= చూచినవారై; నీ వారు+ఎల్లను= (ఓ ధృతరాష్ట్ర మహారాజా!) నీ సైన్యంలోని వారందరు; పాండవేయులకున్= పాండవులకు; తోడ్పడన్= సహాయం చేయటానికి; రుద్రుండు= ప్రళయకాల శివుడు; రభస+ఉద్రేకంబునన్= వేగాతిశయంతో; చనుదెంచెన్= వచ్చాడు; కాక!= కాకున్నచో!; మానవులు= మనుష్యులు; ఇట్టివారునున్= ఇంతటివారు కూడా (ఇంతటి పరాక్రమశాలులు అని భావం); కలరు+ఏ!= ఉన్నారా!; అనుచున్= అనుకుంటూ; వెఱ చఱచి= భయపడి ('వెఱచి పఱచిరి' అని పాఠాంతరం, భయపడి పారిపోయారు అని అర్థం.); ఇద్దఱు= ఇరువురూ; ఒక్క తెరువునన్= ఒకే మార్గంలో; పోకపఱచిరి= పోకుండా పరుగెత్తిపోయారు; ఆ+కుమార కంఠీరవుండు= ఆ కుమారసింహము (భీముడు); ఉక్కునన్= దర్పంతో; తమ సేనదిక్కు= తమ సైన్యం వైపు; చూచి; ఎట్టవిరి+ తామరలన్= ఎఱ్ఱని వన్నెగల వికసించిన కమలాలను; తెగడు= నిందించేటటువంటి (అనగా అట్టి కమలాలకంటె గొప్పగానున్న అని భావం); కన్నులన్= కన్నులతో; కౌంతేయ+అగ్రజున్= పాండవుల అన్న అగు ధర్మరాజును; ఉపలక్షించి= చూచి; కేలు మొగిచి= చేతులు జోడించి; ఫాలంబునన్= నుదుట; చేర్చు+అప్పుడు= చేర్చే సమయంలో;తద్+మూర్తిన్= ఆ భీముడి ఆకారాన్ని (భయంకరాకారాన్ని); ఆతండును= ఆ ధర్మరాజు; నకుల సహదేవ ద్రుపద విరాటులును= నకుల సహదేవులు, ద్రుపద విరాట రాజులును; తేఱిచూడన్= స్పష్టంగా చూడటానికి; శంకించి= జంకి; మాఱుమొగంబులతోన్= వెనుదిరిగిన ముఖాలతో; అగ్గించిరి= పొగడారు; ఆ సమయంబునన్= అప్పుడు.

**తాత్పర్యం:** భయంకరంగా సాగిన ఆ శత్రుసంహార విజృంభణాన్ని పాంచాల సైనికులు చూచి, సింహనాదాలు చేశారు. అది సహించక కర్ణుడు, కళింగరాజ కుమారుని సోదరులు ధ్రువ జయరాతులు భీముడితో తలపడ్డారు. భీముడు ధ్రువుడి రథంపైకి దుమికి, అతడిని పిడికిటిపోటుతో సంహరించాడు. మరియు జయరాతుడి మీద తలపడి అతడిని, అతడి సారథిని - ఇద్దరిని, చేతులతో వాళ్ళ కాళ్ళుపట్టి పైకెత్తి, భూమిపై గట్టిగా కొట్టి చంపాడు. అప్పుడు మిక్కిలి కోపంతో కర్ణుడు శక్త్యాయుధాన్ని భీముడిపై ప్రయోగించాడు. వస్తున్న ఆ శక్తిని భీముడు ఉపాయంతో పట్టుకొని తిరిగి దానిని ఆ కర్ణుడిపై ప్రయోగించాడు. అది చూచి, శకుని మధ్యలో ఆ శక్త్యాయుధాన్ని భల్లంతో ఖండించాడు. ఆ సమయంలో కౌరవకుమారులు దుర్మద దుష్కర్ణులు ఆ భీమసేనుడిని చుట్టుముట్టి, బాణాలు గుప్పించారు. దానికి భీముడు కోపించి, దుర్మదుడి రథంపైకి లంఘించి అశ్వాలను, సారథిని తెగటార్చాడు. అప్పుడు దుర్మదుడు తన రథం విడిచి దుష్కర్ణుని రథంపైకి ఎక్కాడు. వారిరువురు కూడా కలిసి భీముడిపై బాణవర్షం కురిపించారు. భీముడు వారి రథాన్ని తన్నివేసి, ఆ దుర్మదదుష్కర్ణుల నిద్దరినీ కాలితో ఒక్కడిని, చేతితో మరొక్కడిని సంహరించివేశాడు. ఇదంతా, దుర్యోధనుడు, అశ్వత్థామ, కృపాచార్యులు, కృతవర్మ, కర్ణుడు, శల్యుడు, బాహ్లికుడు వీరందరూ చూస్తూనే ఉన్నారు. ఈ విధంగా ఆశ్చర్యకరంగా శత్రువధచేసి చెలరేగుతున్న భీముడిని చూచి మీ కురుసైనికులు - ప్రళయకాలరుద్రుడు పాండవ సహాయార్థం కౌరవసైన్యంలో వీరవిహారం చేస్తున్నాడే తప్ప ఇతడు భీముడా? కాదు - మానవులలో ఇట్టివారుంటారా? అని నీ వారంతా భయపడ్డారు. ఆ వీరులిద్దరినీ ఒక విధంగా తెగటార్చి భీముడు గొప్ప దర్పంతో వెనుదిరిగి తమ సైన్యాన్ని చూచాడు. అప్పుడు అతడి కన్నులు వికసించిన ఎర్రకమలాలవలె ఉన్నాయి. అన్న ధర్మరాజును చూచి, అంజలి ఘటించాడు. అప్పటి ఆ భీముడి ఆకారం చాలా భయంకరంగా ఉన్నది. దానిని ధర్మరాజు, నకుల సహదేవులు, ద్రుపద విరాటులు ఎవ్వరూ కూడా తేరి చూడలేకపోయారు. ముఖాలు చాటు చేసికొన్నారు. భీముడిని ప్రస్తుతించారు. ఆ సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. కురుసైన్యం భీముడిని పాండవ సహాయార్థం వచ్చిన ప్రళయ రుద్రుడిగా భావించింది. ఇది ఉత్ప్రేక్షాలంకారం. దీనివలన భీముడి పరాక్రమాతిశయం, శత్రుసంహార సౌలభ్యం వ్యక్తమౌతాయి. ఇక్కడ - 'నీవారెల్లరు వెఱచఱచి' అనే పాఠంకంటె 'వెఱచి పఱచిరి' అనే పాఠం మూలానుగుణంగా ఉన్నది - సంస్కృతమూలం ఇట్లా ఉన్నది. **శ్లో॥ 'రుద్రోఽయం భీమరూపేణ ధార్తరాష్ట్రేషు యుధ్యతి । ఏవ ముక్త్వా పలాయంతే సర్వే భారత! పార్థివాః'** (ద్రోణ - 55-42) మరియు **'వెఱ చఱచి (యుద్ధభూమ్కి తెరువునం బోక పఱచి) రక్కుమార కంఠీరవుండు...'** ఈ పాఠం అనన్వితంగా ఉన్నది. కావున సవరించి అర్థం వ్రాయవలసి వచ్చింది. కొన్ని ప్రతులలో కుండలీకరణంలో ఇచ్చి ఉన్న వాక్యం లేదు. అన్వయం సరిపోయింది. **'వెఱచి పఱచిరిద్దరిద్దఱ నొక్క తెరువునం బోక పఱచి యక్కుమార...'** - అనే విధంగా అన్వయానుగుణంగా, ఆ వాక్యం మార్చి అర్థం వ్రాయవలసి వచ్చింది - గమనించాలి.

**క. కడువడి గురుఁ డనిలజుపై । నడరిన రాధాతనూభవాదులు దోడై**
**కడఁగుటయుఁ గనుంగొని నీ । కొడుకుగమియుఁ గదిసె నుదిత కోపస్ఫురణన్. 64**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యులు; కడు= మిక్కిలి; వడిన్= వేగంతో; అనిలజుపైన్= భీముడిపై; అడరినన్= విజృంభించగా; రాధాతనూభవ+ఆదులు= రాధేయుడు (కర్ణుడు); మొదలైనవారు; తోడు+ఐ= సహాయంగా వచ్చినవారై; కడఁగుటయున్= తల పడుతూ ఉంటే; కనుంగొని= చూచి; నీ కొడుకు+గమియున్= నీ కుమారుల సమూహం కూడా; ఉదిత= కలిగిన; కోపస్ఫురణన్= కోపస్ఫూర్తితో; కదిసెన్= ఎదుర్కొన్నది.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు మిక్కిలి వేగంగా భీముడిపై చెలరేగాడు. కర్ణాదులు అతడికి తోడైనారు. ఇది చూచి, నీ కుమారులు (కౌరవులు) కూడా మిక్కిలి కోపంతో కలిసి ఎదుర్కొన్నారు.

**తే.** **వారిఁ దలపడి పోరిరి దారుణముగ। ధర్మసుతుఁడును గవలు నుద్దండవృత్తిఁ**
**దఱుమ ద్రుపద విరాట సాత్యకులు మఱియుఁ । జేయఁ గలయట్టి మేదినీ నాయకులును.** **65**

**ప్రతిపదార్థం:** వారిన్= ఆ కర్ణాదులను; తలపడి= ఎదిరించి; ధర్మసుతుఁడును= ధర్మరాజు; కవలును= నకుల సహదేవులు కూడా; దారుణముగన్= భయంకరంగా; పోరిరి= యుద్ధం చేశారు, మఱియున్= అంతేగాక; ద్రుపద విరాట సాత్యకులు= ద్రుపదరాజు, విరాటరాజు, సాత్యకి - ఈ ముగ్గురు; చేయన్+కల+అట్టి= సమర్థులైన; మేదినీ నాయకులును= రాజులు కూడా; ఉద్దండ వృత్తిన్= భయంకర ప్రవృత్తిని (అనగా శత్రువుల పొగరునని భావం); తఱుమ(న్)= తరిమివేయటానికి (అణచటానికి) ('వారిఁ దలపడి పోరిరి' అని అన్వయం).

**తాత్పర్యం:** భీముడిపై తలపడిన కర్ణాదులను, నీ కుమారులను కూడా ఎదిరించి, వారి పొగరు అణచటానికి ధర్మరాజు, నకులసహదేవులు, ద్రుపద విరాట సాత్యకులు - అంతేగాక పాండవ సైన్యంలో కడు సమర్థులైన రాజులందరు కూడా కలిసి యుద్ధం చేశారు.

**వ.** **అయ్యవసరంబున సోమదత్తుండు దనకు సాత్యకి సన్నిహితుఁ డగుటయు నతనితో నిట్లనుఁ 'బ్రాయోపవిష్టుండగు భూరిశ్రవుం జంపి తది బోయ చందంబు గాక రాజ ధర్మం బగునే? యీ రేయి నీవు నాచేత బ్రదికి పోవు వాఁడవే?' యని పలికి సింహనాదంబు సేసి శంఖంబు పూరించిన నా శైనేయుఁడు, 'భూరిశ్రవుండు సచ్చుట యొప్పదేని ని న్నొప్పెడునట్లు సంపెద; నిటు రమ్ము శలుని చావొప్పు నొప్పదని యుగ్గడింప వది యేమి? నీకెట్లయినం గాని కా' దని భంగించె; నిత్తెఱంగున నొండొరుల నో నాడి యేటులాడం దొడంగి; రప్పుడు నీ కొడుకు ఘోటక స్యందన సందోహ సమేతంబుగా నక్కౌరవునకుం దోడ్పడియె; శకునియుఁ దన బలంబునుం దానును నాతనిం గూడుకొనియె; నవ్విధంబునం బలువు రొక్కనిపైఁ గవిసినం గని ధృష్టద్యుమ్నుండు భూరి సైన్య సమేతుండై వారల నెదుర్కొనం బోరు ఘోరం బయ్యె; నట్టియెడ.** **66**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయాన; సోమదత్తుండు= సోమదత్తుడు (భూరిశ్రవుడి తండ్రి); తనకున్= (సోమ దత్తుడికి); సాత్యకి= సాత్యకి; సన్నిహితుండు+అగుటయున్= (యుద్ధం చేయటానికి); సమీపానికి రావటంతో; ఆతనితోన్= ఆ సాత్యకితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= పలికాడు; ప్రాయోపవిష్టుండు+అగు= ప్రాయోపవేశం చేసిన; భూరిశ్రవున్= భూరిశ్రవుడనే తన కుమారుడిని; చంపితి= సంహరించావు; అది= అట్లు అస్త్రసన్న్యాసం చేసిన వానిని చంపుట; బోయచందంబు+కాక= దారిదోపిడీ చేసే బోయవాడి తీరు (అవుతుందే) తప్ప; రాజ ధర్మంబు+అగునే?= రాజులకు తగిన ధర్మం అవుతుందా?; ఈ రేయి= ఈ రాత్రి; నీవు (సాత్యకి); నా చేతన్= (సోమదత్తుడిచేత); బ్రదికి పోవువాఁడవు+ఏ?= (సంహరించబడక); బ్రతికిపోతావా?; అని= ఇట్లా; పలికి= చెప్పి; సింహనాదంబు+చేసి= సింహనాదాన్ని చేసి; శంఖంబు= శంఖాన్ని; పూరించినన్= పూరించగా; ఆ శైనేయుఁడు= శిని అనే వాడి మనుమడు, ఆ సాత్యకి; భూరిశ్రవుండు+చచ్చుట= భూరిశ్రవుడు మరణించటం; ఒప్పదు+ఏనిన్= తగింది కాకుంటే; నిన్ను (సోమదత్తుడు నిన్ను); ఒప్పెడు+అట్లు= తగిన విధంగా; చంపెదన్= సంహరిస్తాను; ఇటు రమ్ము= ఈ వైపురా; శలుని చావు= శలుడు అనే నీ రెండవకుమారుడి (భూరిశ్రవుడి తమ్ముడి) సంహారం; ఒప్పును= తగుతుంది; ఒప్పదు= తగదు; అని (ఇట్లు తగుతుందని కాని తగదని కాని అని భావం); ఉగ్గడింపవు= చెప్పవు; అది+ఏమి?= ఆ తటస్థభావం ఎందుకు?; నీకున్= (సోమదత్తుడికి); ఎట్లు+అయినన్+కాని= ఎట్లానన్నా కాని, (ఆ విషయం నీ అభిప్రాయంలో ఎట్లాగైనా ఉండనీ); కాదు+అని= (నిజానికి అది అధర్మం) కాదు అని; భంగించెన్= ఖండించాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఒండొరులతోన్= ఒకరినొకరు;

నోన్+ఆడి= నొచ్చునట్లు నిందించుకొని; ఏటులాడన్+తొడంగిరి= యుద్ధం చేయబూనారు; అప్పుడు= ఆ సమయాన; నీ కొడుకు= నీ (ధృతరాష్ట్రుడి) కుమారుడు దుర్యోధనుడు; ఘోటక స్యందన సందోహ సమేతంబుగాన్= అశ్వరథ సమూహంతో కూడి (అట్టి ఆశ్విక రథిక సమూహంతో కూడి వచ్చి అని భావం); ఆ+కౌరవునకున్= ఆ కురువంశీయుడైన సోమదత్తుడికి; తోడ్పడియెన్= సహాయం చేశాడు; శకునియున్= శకుని కూడా; తన బలంబునున్= తన సైన్యం మరియు; తానునున్= తానుకూడా; ఆతనిన్= అతడిని; కూడుకొనియెన్= కలిశాడు (సహాయం చేయటానికి యుద్ధానికి వచ్చాడని భావం); ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; పలువురు= అనేకులు; ఒక్కనిపైన్= ఏకాకి అయిన సాత్యకిపై; కవిసినన్= తలపడగా; కని= చూచి; ధృష్టద్యుమ్నుండు= పాండవ సైన్యాధిపతి అయిన ధృష్టద్యుమ్నుడు; భూరి సైన్య సమేతుండు+ఐ= గొప్ప సైన్యం వెంట తీసికొన్నవాడై; వారలన్= ఆ దుర్యోధనాదులను; ఎదుర్కొనన్= ఎదిరించగా; పోరు= యుద్ధం; ఘోరంబు+అయ్యెన్= భయంకరమయింది - (భయంకరంగా సాగింది అని భావం); అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో సాత్యకి తనకు దగ్గరగారాగా, సోమదత్తుడు చూచి ఇట్లా అన్నాడు: 'నా తనయుడు భూరిశ్రవుడు (బాహుదండం ఛిన్నం కాగా) ప్రాయోపవేశం చేసి సమాధిలో ఉండగా అతడి తల నరికావు. నీవు చేసింది కిరాతకుడి పనే కాని, అది రాజధర్మమా? కాబట్టి ఈ రాత్రికి నీవు నా చేతిలో చావవలసిందే. బ్రతికి పోలేవు' అని పలికి, సింహనాదాన్ని చేసి శంఖం పూరించాడు. అప్పుడు సాత్యకి, భూరిశ్రవుడిని సంహరించటం తగినపని కాకుంటే, నిన్ను తగినట్లే చంపుతాను ఇటురా, అయితే నీ రెండవ కుమారుడు శలుడిని సంహరించటం ఒప్పుతుందా? ఒప్పదా? దానిని గూర్చి చెప్పవేమి? నీవెట్లనుకుంటున్నావో కాని అదిమాత్రం అధర్మం కా' దని ఖండించాడు. ఈ విధంగా ఒకరినొకరు దూషించుకొంటూ యుద్ధానికి తలపడ్డారు. ఆ సమయంలో దుర్యోధనుడు ఆశ్విక రథిక బలాలతో వచ్చి, ఆ సోమదత్తుడికి తోడ్పడ్డాడు. శకుని కూడా తన సైన్యాన్ని వెంట తీసికొని సహాయం చేయటానికి సోమదత్తుడిని కలిశాడు. ఈ విధంగా పెక్కుమంది కౌరవవీరులు ఒక్కడుగా నున్న సాత్యకితో తలపడటం చూచి, ధృష్టద్యుమ్నుడు గొప్ప సైన్యంతో వచ్చి వారిని ఎదుర్కొన్నాడు. యుద్ధం భయంకరమైంది- ఆ సమయాన (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. సోమదత్తుఁడు తొమ్మిది సునిశితాస్త్ర । ముల శినిప్రభు నేసిన నలిగి యతఁడు**
**నతని నన్నియమ్ములన మూర్ఛితునిఁ జేయ । రథము దొలఁగఁగంగఁ దోలె సారథి గలంగి. 67**

**ప్రతిపదార్థం:** సోమదత్తుఁడు; తొమ్మిది; సునిశిత+అస్త్రములన్= వాడి బాణాలతో; శినిప్రభువున్= సాత్యకిని; ఏసినన్= కొట్టగా; అలిగి= కోపించి; అతఁడు= ఆ సాత్యకి; అన్ని+అమ్ములను+అ= అంతే సంఖ్యగల (అనగా తొమ్మిది) బాణాలతో; మూర్ఛితునిన్+చేయన్= మూర్ఛపొందినవాడినిగా చేయగా; సారథి= ఆ సోమదత్తుడి రథసారథి; కలంగి= కలతచెంది; రథము= ఆ రథాన్ని; తొలఁగంగన్= రణభూమినుండి తొలగి వెళ్ళిపోయేటట్లు; తోలెన్= తోలుకొనిపోయాడు.

**తాత్పర్యం:** సోమదత్తుడు సాత్యకిని తొమ్మిది బాణాలతో కొట్టగా, ఆ సాత్యకి కూడా సోమదత్తుడిని మళ్ళీ తొమ్మిదే బాణాలతో కొట్టి మూర్ఛ పొందించాడు. అది చూచి, సారథి కలత చెంది, రణభూమినుండి రథాన్ని దూరంగా తోలుకొనిపోయాడు.

**మ. కని ద్రోణాత్మజుఁ డేచి సాత్యకి భుజాగర్వంబు మాన్పింతుఁ బొ**
**మ్మని పోఁ బో నడుమన్ ఘటోత్కచుఁడు ఘోరాకార దైత్య వ్రజం**

బును దానును బటుభంగిఁ దాఁకుటయు నీపుత్త్రుండుఁ గర్ణుండుఁ ద
క్కిన వారున్ వెఱ వానితోడి యనికిం గ్రేడించి రుర్వీశ్వరా! 68

**ప్రతిపదార్థం:** ఉర్వీశ్వరా!= ఓ రాజా!; కని= చూచి; ద్రోణ+ఆత్మజుఁడు= అశ్వత్థామ; ఏచి= విజృంభించి; సాత్యకి భుజాగర్వంబు= సాత్యకియొక్క భుజదర్పాన్ని; మాన్పింతున్= మాన్పించివేస్తాను; పొమ్ము+అని= పో అని (నిశ్చయంగా అని భావం); పోన్+పోన్= వెళ్తూ వెళ్తూ ఉంటే; నడుమన్= మార్గమధ్యంలోనే; ఘటోత్కచుఁడు= ఘటోత్కచుడనే రాక్షసుడు - (భీముడి వలన హిడింబ అనే రాక్షసస్త్రీయందు జనించినవాడు); ఘోర+ఆకార దైత్య వ్రజంబును= భయంకరాకారం గల రాక్షసుల సమూహం; తానున్= తాను (ఘటోత్కచుడు) కూడా; పటుభంగిన్= సమర్థంగా; తాఁకుటయున్= ఎదుర్కొనగా; నీ పుత్రుండు= నీ కుమారుడు దుర్యోధనుడు; కర్ణుండు; తక్కినవారున్= మిగిలినవారు (ఇతరులు); వెఱన్= భయంతో; వానితోడి అనికిన్= ఆ ఘటోత్కచుడితో యుద్ధం చేయటానికి; క్రేడించిరి= తొలగిపోయారు.

**తాత్పర్యం:** సోమదత్తుడు మూర్ఛపోవటం చూచి అశ్వత్థామ, సాత్యకి భుజదర్పాన్ని అణచివేస్తానని పో బోవగా, మార్గమధ్యంలోనే ఘటోత్కచుడు ఎంతో భయంకరమైన రాక్షససైన్యంతో అతడిని ఎదుర్కొన్నాడు. దుర్యోధనుడు, కర్ణుడు, ఇతర యోధులు ఆ ఘటోత్కచుడితో యుద్ధం చేయటానికి భయపడి తప్పుకొన్నారు.

**విశేషం:** 'క్రీడించిరి' అనే ఉస్మానియా పాఠం అర్థానుగుణంగా లేదు. 'కేడించిరి' అనే పాఠమే ప్రకృతానికి సరిపోయేవిధంగా ఉన్నది. క్రేడించిరి అని కూడా కొన్ని ప్రతులలో ఉన్నది - ఈ రెండును సమానార్థకాలే - సంస్కృతమూలం -

"శ్లో॥ తనయా స్తవ కర్ణశ్చ వ్యథితాః ప్రాద్రవన్ దిశః" (156/71).

వ. అట్లు సంధ్యాసమయ సంవర్ధిత బలుండగు నప్పూర్వగీర్వాణుని కోల్తల కోర్వక మేటి మగలెల్లం దొలంగిన. 69

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; సంధ్యాసమయ సంవర్ధిత బలుండు+అగు= సంధ్యా సమయంలో వృద్ధిపొందిన బలం గలవాడైన; ఆ+పూర్వగీర్వాణుని= ఆ రాక్షసుడి (ఘటోత్కచుడి); కోల్తలకున్= ఆ ఘటోత్కచుడి యుద్ధసన్నాహమునకు; ఓర్వక= ఓపికలేక - తట్టుకోలేక అని భావం; మేటి మగలు+ఎల్లన్= గొప్ప వీరులందరూ; తొలంగిన(న్)= తొలగిపోగా.

**తాత్పర్యం:** ఆ విధంగా సంధ్యాసమయంలో పెరిగిపోయే బలం కలవాడైన ఆ ఘటోత్కచుడి యుద్ధసన్నాహాన్ని సహించలేక, గొప్ప గొప్ప వీరులు కూడా ప్రక్కకు తొలగిపోగా (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** గీర్వాణులు అంటే దేవతలు. దేవతలకు వాక్కు బాణాలుగా పనిచేస్తాయి. కాబట్టి మొదట దేవతలుగా ఉండటంచేత రాక్షసులు పూర్వదేవ పూర్వగీర్వాణ పదాలచేత వ్యవహరించబడినారు. కాబట్టి ఘటోత్కచు డిచ్చట పూర్వగీర్వాణ పద వాచ్యుడయ్యాడు.

క. గురుసుతుఁ డొక్కరుఁడును సు। స్థిరుఁ డై తద్బాణనిహతిఁ దెరలక యతి ని
ష్ఠుర నారాచంబులు పది। యురమున నాటింప దానవోత్తముఁ డలుకన్. 70

**ప్రతిపదార్థం:** గురు సుతుఁడు+ఒక్కరుఁడును= అశ్వత్థామ ఒక్కడే; సుస్థిరుఁడు+ఐ= నిలుకడ కలవాడై; తద్బాణ నిహతిన్= ఆ ఘటోత్కచుడి బాణాలదెబ్బకు; తెరలక= చలింపక; అతి నిష్ఠురనారాచంబులు పది= పది కఠినాలైన బాణాలను; ఉరమునన్= రొమ్మున; నాటింపన్= నాటేటట్లు చేయటం తోడనే; అలుకన్= కోపంతో; దానవ+ఉత్తముఁడు= ఆ రాక్షసశ్రేష్ఠుడు ఘటోత్కచుడు.

**తాత్పర్యం:** ఒక్క అశ్వత్థామ మాత్రం ఆ ఘటోత్కచుడి బాణాలదెబ్బకు ఏమాత్రం కలత చెందకుండా, మిక్కిలి తీక్ష్ణములైన పదిబాణాలు అతడి వక్షఃస్థలంలో గ్రుచ్చుకొనేటట్లు కొట్టాడు. ఆ బాణాఘాతంతో ఘటోత్కచుడు కోపం చెంది (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వడిఁ జక్రంబున వైచిన । నడుమన గురునందనుండు నఱకెం; బుణ్యం**
**బెడలిన నరు సంకల్పము । వడువున నది వమ్ముగాఁగ వసుధాధీశా! 71**

**ప్రతిపదార్థం:** వడిన్= వేగంగా; చక్రంబునన్= చక్రంతో; వైచినన్= వేయగా; నడుమన్+అ= నడిమి త్రోవలోనే; గురునందనుండు= గురుపుత్రుడు అశ్వత్థామ; నఱకెన్= నరికివేశాడు; వసుధా+అధీశా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా! (అది ఎట్లా అంటే); పుణ్యంబు= ఈ జన్మలో సుఖఫలాన్నిచ్చే పూర్వజన్మార్జిత కర్మవిశేషం; ఎడలిన= నశించినటువంటి; నరు సంకల్పము వడువునన్= మనుష్యుడి సంకల్పం విధంగా; (మనుష్యుడు కార్యం నెరవేరటానికి సంకల్పిస్తాడు. ఆ సంకల్పం నెరవేరాలంటే దైవానుకూల్యం కావాలి. దైవమనగా పూర్వజన్మలో అతడు చేసిన మంచి చెడు పనులే - మంచి పనులే పుణ్యం, చెడు పనులే పాపం. కాబట్టి పుణ్యం నశిస్తే సుఖానుకూల కార్యసిద్ధికై చేసే సంకల్పం వ్యర్థమౌతుంది. ఆ విధంగా అని భావం.); అది= ఆ చక్రాయుధం; వమ్ము= వ్యర్థం; కాఁగన్= అయ్యేటట్లు; నఱకెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఘటోత్కచుడు వెంటనే చక్రాయుధాన్ని ప్రయోగించాడు. పుణ్యం క్షీణించిన మానవుడి సంకల్పం వ్యర్థమైన విధంగా అశ్వత్థామ మధ్యలోనే ఆ చక్రాయుధం వ్యర్థమయ్యేటట్లు దాన్ని నరికివేశాడు.

**విశేషం:** అలం: ఉపమ. దైవబలం లేని మనుష్యుడి సంకల్పం వ్యర్థమయిన విధంగా ఆ చక్రాయుధం వ్యర్థమైంది అని చెప్పటం చేత ఇది ఉపమాలంకారం. దీనివలన ఏ పని చేయటానికి సంకల్పించినా పురుష ప్రయత్నంతోపాటు దైవబలం కూడా కావాలి అనే అర్థం ధ్వనిస్తూ ఉన్నది. 'వసుధాధీశా!' అని ధృతరాష్ట్రుడిని సంబోధిస్తూ చెప్పటాన్ని బట్టి 'నీ కుమారులూ నీవూ ఎంతటి దైవబలం గలవారో విచారించుకో!' అనే అర్థం ధ్వనిస్తూ ఉన్నది.

### అంజనపర్వుం డశ్వత్థామతో యుద్ధంబు సేసి చచ్చుట (సం.7-131-44)

**వ. అప్పుడద్దనుజుని తనయుం డంజనపర్వుం డశ్వత్థామం దలపడి బలుతూపులం బొదివిన బెదరక యతం డ య్యసుర వీరుని విల్లుద్రుంచి విరథుం జేయుటయు, వాఁడు కరవాలంబు గొనినం, దునిమె గద వైచిన దుమురు సేసె, నింగి కెగసి మ్రోఁగుచుం బాషాణ వర్షంబు గురియ నదియును వారించి యమ్మాయావి మేన మేఘంబున గిఱికొను తరణి కిరణంబులంగ్రేణిసేయు పటు బాణంబుల నిగిడించె; మగిడి యొండు రథంబున నరుదెంచినఁ దల ద్రెంచె; నిట్లు గురుపుత్రుండు వానిం బరిమార్చి పేర్చి పాండవ బలంబులఁ బరిమార్పం దొడంగినం గని కడంగి హిడింబా నందనుండు 'నిలు నిలు నా బారిం బడి యెందుఁ బోవచ్చు?' ననవుడు నా రథికుం డతని నవలోకించి. 72**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ఆ+దనుజుని తనయుండు= ఆ ఘటోత్కచుడి కుమారుడైన; అంజనపర్వుండు= అంజనపర్వుడనే రాక్షసుడు; అశ్వత్థామన్= అశ్వత్థామతో; తలపడి= యుద్ధానికి పూనుకొని; పలు తూపులన్= అనేక బాణాలను; పొదివినన్= గ్రుచ్చుకొనజేయగా; బెదరక= భయపడక; అతండు= ఆ అశ్వత్థామ; ఆ+అసురవీరుని విల్లు= ఆ రాక్షసవీరుడి అనగా అంజనపర్వుడి ధనుస్సును; త్రుంచి= తెగగొట్టి; విరథున్= రథం లేనివాడినిగా; చేయుటయున్= చేయటం తోడనే; వాఁడు= ఆ అంజనపర్వుడు; కరవాలంబు= ఖడ్గాన్ని; కొనినన్= గ్రహించగానే; తునిమెన్= తునకలుగా చేశాడు; గద= గదను;

వైచినన్= వేసిన వెంటనే; తుమురు+చేసెన్= తుత్తునియలుగా చేశాడు; నింగికిన్= ఆకాశానికి; ఎగసి= ఎగిరిపోయి; మ్రోఁగుచున్= అరుస్తూ; పాషాణవర్షంబు= రాళ్ళవర్షం; కురియన్= కురిపిస్తూ ఉంటే; అదియును= దాన్ని కూడా; వారించి; ఆ+మాయావిమేనన్= మాయావి అయిన ఆ అంజనపర్వుడి శరీరంలో; మేఘంబునన్= మబ్బులో; గిటికొను= వ్యాపించిన; తరణికిరణంబులన్= సూర్యకిరణాలను; క్రేణిచేయు= పరిహసిస్తూ ఉన్న (అట్టి సూర్యకిరణాలను మించిన అని భావం); పటుబాణంబులన్= సమర్థమైన అనగా తీక్ష్ణమైన బాణాలను; నిగిడించెన్= నాటజేశాడు; మగిడి= మళ్ళీ; ఒండురథంబునన్= మరియొక రథంపై; అరుదెంచినన్= రాగానే; తలన్= శిరమును; త్రెంచెన్= తెగగొట్టాడు; ఇట్లు= ఈ విధంగా; గురుపుత్రుండు= ద్రోణుడి కుమారుడు అశ్వత్థామ; వానిన్= ఆ అంజనపర్వుడనే రాక్షసుడిని; పరిమార్చి= సంహరించి; పేర్చి= విజృంభించి; పాండవ బలంబులన్= పాండవుల సైన్యాలను; పరిమార్పన్= సంహరించటానికి; తొడంగినన్= పూనుకొంటూ ఉంటే; కని= చూచి; కడంగి= తలపడి; హిడింబానందనుండు= హిడింబ అనే రాక్షసి భీముని భార్య; వారి కుమారుడు ఘటోత్కచుడు; నిలు నిలు= ఆగు ఆగిపొమ్ము; నాబారిన్= నా గురిలో; పడి= పడ్డావు కాబట్టి (క్త్వాప్రత్యయం హేత్వర్థకం); ఎందున్= ఎక్కడికి; పోవచ్చును?= పోగలవు? (ఎక్కడికి కూడా పారిపోవటం నీ శక్యంకాదని భావం.); అనవుడున్= అనగానే; ఆ రథికుండు= రథం అధిష్ఠించి యుద్ధం చేస్తూ ఉన్న ఆ అశ్వత్థామ; అతనిన్= ఆ అంజనపర్వుడిని; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఆ సమయంలో ఆ ఘటోత్కచుడి కుమారుడు అంజనపర్వుడు అశ్వత్థామను ఎదుర్కొన్నాడు.ఎన్నో బాణాలతో నొప్పించాడు. దానికి ఆ అశ్వత్థామ బెదరిపోలేదు. మీదు మిక్కిలి ఆ రాక్షసవీరుడి ధనువును విరగగొట్టాడు. రథాన్ని కూడా కూలద్రోశాడు. అప్పుడు ఆ అంజనపర్వుడు ఖడ్గాన్ని పుచ్చుకోగా ఆ ఖడ్గాన్ని కూడా తునకలు చేశాడు. వాడు గద వేయగా దానిని కూడా తుత్తుమురు చేశాడు. ఇక ఆ రాక్షసుడు ఆకాశాని కెగిరి రాళ్ళవర్షం కురిపించగా, దానిని కూడా అశ్వత్థామ నివారించి, మాయాబలంతో విజృంభిస్తూ ఉన్న ఆ రాక్షసుడి శరీరంలో మేఘాన్ని కప్పిన సూర్యకిరణాలను మించిన తీక్ష్ణమైన బాణాలను నాటాడు. ఆ అంజనపర్వుడు మరియొక రథంపై కూర్చుని, మళ్ళీ యుద్ధానికి వచ్చాడు. రావటం తోడనే అశ్వత్థామ వాడి తల నరికాడు. ఈ విధంగా విజృంభించి ఆ రాక్షసుడిని వధించి, పాండవసైన్యాన్ని సంహరింప పూనుకొన్నాడు. అదిచూచి, ఘటోత్కచుడు 'అశ్వత్థామా! పారిపోక నిలువు; నీవు నా బారినుండి తప్పించుకొనలేవు; ఎక్కడికీ పోలేవు' అని అంటూ తనను ఎదిరించిన ఘటోత్కచుడిని అశ్వత్థామ చూచి (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అంజనపర్వుడి శరీరంలో గ్రుచ్చిన బాణాలు మబ్బులో ప్రసరించిన సూర్యకిరణాలను పరిహసించాయి అని చెప్పటంచేత ఇది ఆర్థీ ఉపమ. సూర్యకిరణాలు ప్రసరించిన నల్లనిమేఘం ఎఱ్ఱబారినట్లు ఆ రాక్షసుడి నల్లనిశరీరం కూడా బాణాలు గ్రుచ్చుకొనటంతో రక్తం స్రవించి ఎఱ్ఱబారి ఉండటం వలన ఉపమ. దీనితో అంజనపర్వుడి శరీరం తూట్లుపడేటట్లు అశ్వత్థామ యుద్ధం చేశాడని, దానితో అంజనపర్వుడు తాళలేకపోయాడని, అశ్వత్థామ ప్రతాపాతిశయం వ్యక్తమవుతూ ఉన్నది.

**ఆ. 'వలదు రన్న! పిన్నవాఁడవు తండ్రి నే । నకట! నిన్నుఁ జూచి యలుగ రాదు;**
**పెనఁగు మొరులతోడ' ననవుడుఁ బుత్ర శో । కాభితప్తుఁ డైన యతఁడు గనలి. 73**

**ప్రతిపదార్థం:** వలదుర+అన్న!= వద్దురా నాయనా! (నీవు నాతో యుద్ధం చేయటం తగదని భావం); (ఎందుకంటే) పిన్నవాఁడవు= (నీవు) చిన్నవాడవు; ఏన్= నేను; తండ్రిని= జనకస్థానీయుడను; అకట!= అయ్యో!; నిన్నున్= భీమసేన కుమారుడవగు నిన్ను; చూచి= నాతో యుద్ధానికి తలపడుతూ ఉంటే కూడా చూచి; అలుగరాదు= నేను కోపించకూడదు - (కావున నేను యుద్ధం ఎట్లా చేస్తాను? చేయను అని భావం); ఒరులతోడన్= వేరే మరెవ్వరితోనైనా; పెనఁగుము= యుద్ధం చేయుము (నాతో మాత్రం

వద్దని భావం); అనవుడున్= అనగానే; పుత్రశోక+అభితప్తుఁడు+ఐన= పుత్రుడు (అంజనపర్వుడు) మరణించుటచేత కలిగిన శోకంతో తాపం పొందిన; అతఁడు= ఆ ఘటోత్కచుడు; కనలి= మండిపడి.

**తాత్పర్యం:** 'నీవేమో చిన్నవాడవురా నాయనా! ఘటోత్కచా! నేను తండ్రివంటివాడిని; నీపై కోపం చూపించకూడదు. నాతో కాదు మరెవరితోనైనా నీవు యుద్ధం చేయి' అని అనటంతోడనే పుత్రశోకంతో కుమిలిపోతున్న ఘటోత్కచుడు, కోపించి ఇట్లా అన్నాడు: (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'ఎక్కడి తండ్రివి? నీవే । నక్కౌంతేయులకుఁ గొడుకనై పగతుర పే**
**రుక్కు సహింతునె? తనయుం । గ్రక్కించెద నిపుడ పట్టి కండలు దిందున్.' 74**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు (అశ్వత్థామ); ఎక్కడి తండ్రివి?= ఎక్కడి నుండి వచ్చిపడిన (నా) తండ్రివి?; ఏన్= నేను; ఆ+కౌంతేయులకున్= ఆ ధర్మరాజాదులకు; కొడుకను+ఐ= కుమారుడనై ఉండి; పగతుర+పేరు+ఉక్కు= శత్రువుల ప్రతాపాతిశయాన్ని; సహింతునె?= సహిస్తానా?; ఇపుడు+అ= ఇప్పుడే; పట్టి= పట్టుకొని; తనయున్= నా కుమారుడిని; క్రక్కించెదన్= కక్కునట్లు చేస్తాను (మరియు); కండలు= మాంసపు ముక్కలను అనగా నీ (అశ్వత్థామ) శరీరాన్ని ముక్కలుచేసి (ఆ మాంసపు ముక్కలనని భావం); తిందున్= తింటాను.

**తాత్పర్యం:** 'అశ్వత్థామా! నీవు నాకు ఎక్కడినుండి ఊడిపడిన తండ్రివి?' నేను పాండవులకు కొడుకునై ఉండి శత్రువుల ప్రతాపాన్ని సహిస్తానా! ఇప్పుడే నిన్ను పట్టి నీవు దిగమ్రింగిన నా కొడుకును క్రక్కిస్తాను నీ కండలు తింటాను.

**క. అని పలికి యిరుసులంతలు । సునిశిత బాణమ్ము లేయుచుం దఱిమిన ద్రో**
**ణుని కొడుకు వాని నన్నిటిఁ । దునుమ నసుర మాయఁ బెఱిగి దుర్దాంతగతిన్. 75**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికి= చెప్పి; ఇరుసులంతలు= ఇరుసులంత ఉన్న; సునిశిత బాణమ్ములు= తీక్ష్ణములైన బాణాలను; ఏయుచున్= వేస్తూ; తఱిమినన్= వేగిరపడుతూ ఉన్నప్పటికీ; ద్రోణుని కొడుకు= అశ్వత్థామ; వానిన్+అన్నిటిన్= ఆ బాణాల నన్నింటిని; తునుమన్= తుమురు చేసిన వెంటనే; అసుర= ఆ ఘటోత్కచుడు; మాయన్= మాయతో; దుర్దాంతగతిన్= ఆపరాని పోకడతో; పెఱిగి= పెరిగిపోయి.

**తాత్పర్యం:** అని పలికి ఇరుసులను పోలిన వాడిబాణాలు ప్రయోగిస్తూ తరుమగా, అశ్వత్థామ వానినన్నింటిని ఖండించాడు. అప్పుడు ఘటోత్కచుడు మాయాశక్తిచే అణచరాని విధంగా పెరిగి - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. గిరియై పఱతేర నశని । శరమును, మేఘత్వమొంది సాయక వృష్టిం**
**గురిసినఁ బవనాస్త్రంబును । బరువడి నిగిడించి గురుని పట్టి దెరల్చెన్. 76**

**ప్రతిపదార్థం:** గురుని-పట్టి= అశ్వత్థామ; గిరి+ఐ-పఱతేరన్= (ఘటోత్కచుడు) కొండ అయి రాగా; అశని-శరమును= వజ్రబాణాన్నీ; మేఘత్వము+ఒంది= మేఘరూపంపొంది; సాయక-వృష్టిన్= బాణవర్షాన్ని; కురిసినన్= కురియగా; పవన+అస్త్రంబును= వాయవ్యాస్త్రాన్నీ; పరువడిన్= క్రమముగా; నిగిడించి= ప్రయోగించి; తెరల్చెన్= తొలగించెను.

**తాత్పర్యం:** పర్వతరూపాన్ని ధరించి పరుగెత్తి వస్తూ ఉంటే వజ్రాస్త్రాన్ని ప్రయోగించి, మరల మేఘంగా మారి బాణవర్షాన్ని కురిపిస్తూ ఉంటే వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించి అశ్వత్థామ అతడిని తొలగించాడు.

**విశేషం:** ఈ పద్యంలో అస్త్రయుద్ధం వర్ణింపబడింది. పర్వతానికి వజ్రం విరుగుడు; మేఘానికి గాలి విరుగుడు. కావున పర్వతమై

వస్తూ ఉంటే వజ్రాస్త్రాన్ని (ఇంద్రాస్త్రాన్ని), మేఘంగా మారినప్పుడు వాయురూపమైన వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించినట్టు వర్ణించబడింది.

**సీ. హైడింబుఁ డల్గి యుగ్రాకృతిఁ గవిసిన । దనుజ గణంబు మాతంగ తురగ**
**రథ నివహంబుతో రారాజు మొన లెల్ల । నొక్కెత్తుగాఁ బ్రేల్చి యురవడింప**
**న న్నరనాథుండు విన్నఁబోయిన గురు । తనయుండు 'నీకు నీ యనికి నేమి**
**పని? నీవు సంభ్రమింపకుము; దానవుల న । క్కడి మానవులను ప్రేల్మిడి నడంతు'**

**ఆ. ననిన సంతసిల్లి యతఁడు సౌబలుఁ జూచి । వీరె ద్రౌణిబాణదారితాంగు**
**లైరి పాండుసుతులు; దేరిగములతోడ । సత్వరముగ నరిగి జయము గొనుము'. 77**

**ప్రతిపదార్థం:** హైడింబుఁడు= హిడింబాకుమారుడు ఘటోత్కచుడు; అల్గి= కోపించి; ఉగ్ర+ఆకృతిన్= భయంకరమైన ఆకారంతో; కవిసినన్= ఎదుర్కొనగా; దనుజగణంబు= రాక్షసుల సమూహం; రారాజు మొనలు+ఎల్లన్= దుర్యోధనుడి సైన్యాన్నంతటిని; మాతంగ, తురగ రథ నివహంబుతోన్= గజాలు, అశ్వాలు, రథాలు అనగా రథికులు; అనేవాని సమూహంతోపాటు; ఒక్క+ఎత్తు+కాన్= ఒకే ఎత్తుగడతో అనగా ఒకేసారి; ప్రేల్చి= దగ్ధం చేసి; ఉరవడింపన్= విజృంభిస్తూ ఉంటే; ఆ+నరనాథుండు= ఆ దుర్యోధన నృపతి; విన్నన్+పోయినన్= ఖిన్నుడు కాగా; (చూచి ఆ దుర్యోధనుడితో) గురుతనయుండు= ద్రోణాచార్య పుత్రుడు అశ్వత్థామ; నీకున్= (దుర్యోధనుడికి); ఈ+అనికిన్= ఈ యుద్ధానికి; ఏమిపని= పని ఏమి; నీవు= నీవు (దుర్యోధనుడు); సంభ్ర మింపకుము= తొందరపడకుము; దానవులను= ఆ రాక్షసులను; అక్కడి మానవులను= అక్కడ ఉన్న (శత్రుపక్షంలోనున్న) మనుష్యులను; ప్రేల్మిడిన్= త్రుటిలో; అడంతున్= అణచివేస్తాను; అనినన్= అని పలుకగా; సంతసిల్లి= సంతోషపడి; అతఁడు= ఆ దుర్యోధనుడు; సౌబలున్= శకునిని; చూచి= చూచి (పలికాడని భావం); వీరు+ఎ= ఈ కనపడే; పాండు సుతులు= పాండవులు; ద్రౌణి బాణ+దారిత+అంగులు+ఐరి= అశ్వత్థామ బాణాలచేత చీల్చివేయబడిన శరీరాలు గల వారయినారు; తేరిగములతోడన్= రథ(రథిక) సమూహాలతో సహా; సత్వరముగన్= తొందరగా; అరిగి= వెళ్ళి; జయము= విజయాన్ని; కొనుము= గ్రహించుము (పొందుము అని భావం) - ఇచ్చట 'తేరిగములతోడ' అనే పదం దేహళీదత్త దీపన్యాయంగా అన్వయిస్తుంది - పాండవుల రథికవర్గంతో సహా అశ్వత్థామ బాణాలకు గురయినారని నీవు (శకుని) రథికవర్గం వెంట నిడుకొని జయాన్ని పొందుమని కూడా అర్థం పర్యవసిస్తుంది.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు మహాకోపంతో భయంకరాకారం తాల్చి అశ్వత్థామ నెదుర్కొన్నాడు. అతడి సైన్యంలోని రాక్షసవీరులందరూ విజృంభించారు. దుర్యోధనుడి చతురంగబలాన్ని ఒకేసారి దగ్ధం చేశారు. దానిచేత దుర్యోధనుడు ఖిన్నుడై యుద్ధానికి పూనుకొంటూ ఉంటే అశ్వత్థామ వారించి 'రారాజా! నీవెందుకయ్యా యుద్ధానికి? నేనొక్క క్షణంలో ఆ రాక్షసవీరుల్నే గాక పాండవ సైన్యాన్నంతటినీ అణచివేస్తాను' అని అంటూ ఉంటే దుర్యోధనుడు సంతోషపడ్డాడు. శకునితో ఇట్లా అన్నాడు. 'ఇదిగో ఈ పాండవులూ వారి సైన్యం మన అశ్వత్థామ బాణాల ధాటికి శరీరాలు చిల్లులుపడి అణగిపోయినట్టే; ఇక నీవు రథికవర్గంతో వేగంగా వెళ్ళి జయాన్ని స్వీకరించుము.'

**వ. అని యవ్వలను సూపి కృప కృతవర్మ కర్ణ వృషసేనులను దుశ్శాసన ప్రముఖులైన కొందఱు దమ్ములను నిరూపించి 'వీరును నీవును గూడుకొని కవియుం'డని పనిచిన నతండును బింకంబుతోడం బోయె; నశ్వత్థామ భీమనందనుల సంగ్రామంబు భీమంబయ్యె; నట్టి యెడ నా ఘటోత్కచుండు. 78**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; ఆ+వలను= ఆ వైపు; చూపి= చేతితో చూపి; కృప కృతవర్మ కర్ణ వృషసేనులను= కృపుడు, కృతవర్మ, కర్ణుడు, వృషసేనుడు అనేవారిని; దుశ్శాసన ప్రముఖులు+ఐన= దుశ్శాసనుడు మొదలైన; కొందఱు+తమ్ములను= కొంతమంది సోదరులను; నిరూపించి= చూపి; వీరును= ఈ చూపినవారలు; నీవును= నీవుకూడా; కూడుకొని= కలిసి (వెళ్ళి); కవియుండు+అని= తలపడండి అని; పనిచినన్= పంపగా; అతండును= ఆ శకునియు; బింకంబుతోడన్= గర్వంతో; పోయెన్= వెళ్ళాడు; అశ్వత్థామ, భీమనందనుల సంగ్రామంబు= అశ్వత్థామ ఘటోత్కచుల యుద్ధం; భీమంబు+అయ్యెన్= భయంకరమై కొనసాగింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ ఘటోత్కచుండు= ఆ ఘటోత్కచుడు.

**తాత్పర్యం:** అని ఆ వైపు చూపి, 'ఈ కృప కర్ణాది యోధులు దుశ్శాసనుడు మొదలైన నా తమ్ములు నీ వెంట వస్తారు. వీరితో కూడా నీవు యుద్ధానికి వెళ్ళుము' అని తనను పంపుతూ ఉంటే, శకుని గర్వంతో యుద్ధానికి వెళ్ళాడు. ఇక అశ్వత్థామ ఘటోత్కచుల యుద్ధం భయంకరం అయింది. ఆ సమయంలో ఘటోత్కచుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. పటుబాణాహతి ద్రోణి యంగము చలింపం జేసి తచ్చాప ము**
**త్కట వేగంబునఁ ద్రుంచినం గినిసి యాతం డొండు వి ల్లెత్తి యు**
**ద్భట బాహాబల శౌర్యముల్ నెఱపె నా దైత్యుండు సైన్యంబు నొ**
**చ్చుటయుం జచ్చుటయున్ మహీపతికి మెచ్చుం బ్రీతియుం జేయఁగన్. 79**

**ప్రతిపదార్థం:** పటుబాణ+ఆహతిన్= సమర్థమైన - అనగా తీక్ష్ణమైన బాణాల తాకిడితో; ద్రోణి+అంగము= అశ్వత్థామ శరీరం; చలింపన్+చేసి= కదలించివేసి; అనగా నొప్పించి; తద్+చాపము= ఆ అశ్వత్థామ ధనుస్సును; ఉత్కట వేగంబునన్= గొప్పవేగంతో; త్రుంచినన్= తెగగొట్టగా (శరీరాన్ని నొప్పించడమేమి ధనువును త్రుంచడమేమి - రెండూ ఒకేసారి జరిగినవని తెలుపటానికి 'ఉత్కట వేగంబునన్' అనే మాట వాడటం జరిగింది); కినిసి= కోపపడి; ఆతండు= ఆ అశ్వత్థామ; ఒండువిల్లు+ఎత్తి= మరొక ధనువును తీసికొని; ఉద్భట బాహాబల శౌర్యముల్= మిక్కిలి బాహు బలపరాక్రమాలను; నెఱపెన్= ప్రదర్శించాడు; (ఎంతటి గొప్ప బాహుబలం పరాక్రమం ప్రదర్శించాడంటే - దానితో); ఆ దైత్యుండు= ఆ ఘటోత్కచుడు; నొచ్చుటయున్= పరితాపాన్ని పొందటం; సైన్యంబు= ఆ రాక్షససైన్యం; చచ్చుట+యున్= మృతి చెందటం (అనే ఈ రెండూ); (ఇచ్చట యథాసంఖ్యాలంకారంచేత క్రమాన్వయం); మహీపతికిన్= దుర్యోధనుడికి; మెచ్చున్= మెప్పును; ప్రీతి+యున్= సంతోషాన్నీ; చేయఁగన్= కలిగించగా; (బాహుబల శౌర్యముల్ నెఱపె' అనే తరువాతి వాక్యంతో అన్వయం).

**తాత్పర్యం:** తీక్ష్ణ బాణాల తాకిడితో అశ్వత్థామ శరీరాన్ని కంపింపచేసి, ఆతడి ధనుస్సును అతివేగంగా త్రుంచగా, ఆ అశ్వత్థామ రెండోవిల్లు తీసుకొని ఆ ఘటోత్కచుడిని నొప్పించడంచేత, అతని సేనను చంపడంచేత దుర్యోధనుడికి మెప్పును, సంతోషాన్ని కలిగించగా,

**విశేషం:** అలం: యథాసంఖ్యం. 'నాదైత్యుండు సైన్యంబు నొచ్చుటయుం జచ్చుటయు' అనేచోట క్రమాన్వయం వలన యథా సంఖ్యాలంకారం.

**వ. ఇ ట్లసురబలంబు నశ్వత్థామ సించి చెండాడం బాండవ బలంబులు దర్పం బేది మార్వెట్ట లేక చూచుచుండ నుద్దండ పరాక్రముం డగు నా ఘటోత్కచుండు దర్పంబున నెక్కటెక్కటి తలపడి పరిఘంబున వైచినం బట్టుకొని యతండు దానిన యద్దానవునిపై వైచుటయు, వాఁడు దొలంగ నుఱికి ద్రుపద నందన స్యందనంబునకుం బోయె; నయ్యుగ్ర సాధనం బతని తురంగ సారథి రథంబుల రూ పడంచిన. 80**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; అసురబలంబున్= రాక్షససైన్యాన్ని; అశ్వత్థామ= అశ్వత్థామ; చించి= చీల్చి; చెండాడన్=

ఖండిస్తూ ఉండగా; పాండవ బలంబులు= పాండవ సేనలు; దర్పంబు= దర్పం; ఏది= ఉడిగి; మార్పెట్టలేక= ఎదిరించలేక; చూచుచున్+ఉండన్= చూస్తూ ఉండగా; ఉద్దండ పరాక్రముండు+అగు= భయంకరమైన పరాక్రమం కలవాడైన; ఆ+ఘటోత్కచుండు= ఆ ఘటోత్కచుడు; దర్పంబునన్= గర్వంతో; ఎక్కటి+ఎక్కటి= ఒకరితో నొకరు; తలపడి= ఢీకొని; పరిఘంబునన్= పరిఘము అనే ఆయుధ విశేషంతో; వైచినన్= కొట్టగా; పట్టుకొని= (ఎదురువస్తూ ఉన్న ఆ పరిఘాయుధాన్ని) చేత తీసికొని; అతండు= ఆ అశ్వత్థామ; దానిన్+అ= ఆ పరిఘాయుధాన్ని; ఆ+దానవునిపైన్= ఆ ఘటోత్కచుడిపై; వైచుటయున్= ప్రయోగించటం తోడనే; వాఁడు= ఆ ఘటోత్కచుడు; తొలంగన్= పక్కకు పోయేవిధంగా; ఉటికి= లంఘించి; ద్రుపదనందన స్యందనంబునకున్= ద్రుపదుడి కుమారుడైన ధృష్టద్యుమ్నుడి రథంపైకి; పోయెన్= వెళ్ళాడు; ఆ+ఉగ్రసాధనంబు= ఆ భయంకరమైన ఆయుధం; అతని తురంగ సారథి రథంబులన్= ఆ ఘటోత్కచుడి గుర్రాలను, సారథిని, రథాన్ని; రూపు+అడంచినన్= నశింపజేయగానే.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ ఘటోత్కచుడి సైన్యాన్ని అశ్వత్థామ చీల్చి చెండాడుతూ ఉంటే, పాండవుల సైన్యాలు గర్వముడిగి, ఎదుర్కొనలేక చూస్తూ ఉండిపోయాయి. భయంకర పరాక్రమం కలిగిన ఆ ఘటోత్కచుడు గర్వంతో అశ్వత్థామ నెదుర్కొని అతడిపై పరిఘాయుధాన్ని ప్రయోగించాడు. అశ్వత్థామ ఎదురుగా వస్తూ ఉన్న ఆ ఆయుధాన్ని గ్రహించి, తిరిగి దానినే ఆ ఘటోత్కచుడిపై విసిరాడు. ఘటోత్కచుడు తప్పుకొని లంఘించి ధృష్టద్యుమ్నుడి రథంపై చేరాడు. ఆ పరిఘాయుధం ఘటోత్కచుడి అశ్వ రథ సారథులను నుగ్గు నుగ్గు చేసింది. ఆ సమయాన (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఇనుపముండ్లు చుట్టూ ఉన్న ఇనుపరోకలి విధంగా ఉండే ఆయుధవిశేషాన్ని పరిఘమని అంటారు. (ఇనుపముండ్ల రోకలి).

**ఆ. ఒక్క తేరిమీఁద నుండి ధృష్టద్యుమ్న। భీమసేన సుతులు పెనఁగి రస్త్ర**
**గురుతనూజు వీఁకఁ దెరలక యంత ను। ద్దామసేనతోడ భీముఁ డడరె. 81**

**ప్రతిపదార్థం:** ఒక్కతేరి మీఁదన్+ఉండి= ఒకే రథంపై ఉన్నవారై; ధృష్టద్యుమ్న భీమసేన సుతులు= ధృష్టద్యుమ్నుడి కొడుకు, భీముడి కుమారుడు ఘటోత్కచుడు (ఈ ఇద్దరు); వీఁకన్= ఉత్సాహం; తెరలక= తగ్గక; అస్త్ర గురు తనూజున్= అస్త్ర విద్యా గురువైన ద్రోణుడి పుత్రుడిని - అశ్వత్థామను; పెనఁగిరి= ఎదుర్కొన్నారు; అంతన్= అంతలోనే; భీముఁడు= భీమసేనుడును; ఉద్దామ సేనతోడన్= గొప్ప సైన్యంతో; అడరెన్= విజృంభించాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్న ఘటోత్కచులిద్దరూ ఒకే రథంపై ఉంటూనే అమితోత్సాహంతో అశ్వత్థామను ఎదుర్కొన్నారు. అంతలోనే గొప్ప సైన్యం తీసికొని భీముడు కూడా యుద్ధం చేయటానికి వారికి సహాయంగా అశ్వత్థామను ఎదుర్కొన్నాడు.

**వ. అప్పు డశ్వత్థామ నవ్వుచు నమ్ముువ్వురం గ్రొవ్వుఱ నేసి భాసమాన మార్గణంబులు నిగిడించిన. 82**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; అశ్వత్థామ; నవ్వుచున్= మందహాసం చేస్తూ; ఆ+మువ్వురన్= ఆ ముగ్గురిని; క్రొవ్వు+అఱన్= మదమడగేటట్లు; ఏసి= కొట్టి; భాసమాన మార్గణంబులు= ప్రకాశిస్తూ ఉన్న బాణాలను; నిగిడించినన్= ప్రయోగించగానే.

**తాత్పర్యం:** అప్పుడు అశ్వత్థామ నవ్వుతూ ఆ ధృష్టద్యుమ్న ఘటోత్కచ భీములను ముగ్గురినీ మదం ఉడిగేటట్లు మెరిసే బాణాలతో కొట్టాడు. సైన్యంమీద అంతటా బాణాలు నింపాడు. దానితో (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. భటగాత్రంబుల ఘోటకాంగముల శుంభత్కుంభి కాయంబులం**
**జటుల స్యందన ఖండ సంచయములన్ సంగ్రామరంగంబు గ**
**ప్పుట చూడన్ వెఱఁగయ్యె నబ్బలములుం బోకేచి క్రమ్మంగ నె**
**త్తుటఁ దేల్చెం బొరిమార్చె నాతఁ డడరం ద్రుంచెన్ మథించెం గడున్. 83**

**ప్రతిపదార్థం:** భటగాత్రంబులన్= సైనికుల శరీరాలతో; ఘోటక+అంగములన్= గుర్రాల శరీరాలతో; శుంభత్+కుంభి+కాయంబులన్= ప్రకాశిస్తూ ఉన్న ఏనుగుల శరీరాలతో; చటుల స్యందన ఖండ సంచయములన్= మనోహరాలైన రథాల తునుకల సమూహాలతో; సంగ్రామ రంగంబు= రణరంగం; కప్పుట= కప్పివేయటం; చూడన్= చూస్తూ ఉంటే; వెఱఁగు+అయ్యెన్= అద్భుతమయింది; ఆ+బలములున్= ఆ రాక్షససైన్యాలు కూడా; పోక= పొరిపోక; ఏచి= విజృంభించి; క్రమ్మంగన్= ఎదుర్కొనగా; ఆతఁడు= ఆ అశ్వత్థామ; నెత్తుటన్= రక్తంలో; తేల్చెన్= తేలేటట్లు చేశాడు; పొరిమార్చెన్= సంహరించాడు; అడరన్= క్షోభించే విధంగా; త్రుంచెన్= ఖండించాడు; కడున్= మిక్కిలి; మథించెన్= నుగ్గునుగ్గు చేశాడు.

**తాత్పర్యం:** సైనికుల శరీరాలతో, ఏనుగుల శరీరాలతో, రథాల ముక్కల సమూహాలతో యుద్ధరంగం నిండి పోవడం ఆశ్చర్యాన్ని కలిగించింది. మిగిలిన సైన్యాలు పారిపోక విజృంభిస్తూ ఉంటే ఆ అశ్వత్థామ వాటిని కూడా రక్తంలో ముంచెత్తాడు. కొంత సైన్యాన్ని సంహరించాడు. కొంత సైన్యం కాళ్ళు చేతులు నరికాడు. మరికొంత సైన్యాన్ని నుగ్గు నుగ్గు చేశాడు.

**వ. ఇట్లేకాక్షౌహిణీ బలక్షయం బాపాదించి యాతపత్ర శత పత్రంబును జామరమరాళంబును గేశ శైవాలంబును నాయుధమీనంబును మాంసమేదో మస్తిష్క పంకంబును; రక్త జలోద్రిక్తంబును నగు నదీప్రవాహంబు నుత్పాదించె; నప్పుడు దర్పంబున సురథుండును శత్రుంజయుండును బలానీకుండును బృషధ్రుండును జయానీకుండును జయుఁడును జంద్రసేనుండును జండ రయంబునఁ గదిసి బాణంబులు వరఁగించిన, నప్పాంచాల కుమారుల నమానుష విక్రమంబున సమయించినం గోపించి, కుంతిభోజ తనూజు లొక్కపెట్ట పదుమువ్వు రతనిం బొదివినఁ బదుమూఁడు మేటి తూపులం గీటడంచి కెరలి జము చందంబున గర్జిల్లి ఘటోత్కచుం గాలదండంబుఁ బోని కోలం దేలిపైఁ ద్రెళ్ళ మూర్ఛిల్ల నేసిన నోసరిల నయ్యరదంబు దోడన ధృష్టద్యుమ్నుండు గొనిపోవుటయుఁ, బొంగి సింగంబు చాడ్పున గర్జిల్లిన నిర్జరు లగ్గురునందను నగ్గించి; రంతయుం గనుంగొని. 84**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఏక+అక్షౌహిణీ బలక్షయంబు= ఒక అక్షౌహిణీ సైన్యనాశనాన్ని; ఆపాదించి= చేసి; ఆతపత్ర శతపత్రంబును= శ్వేతచ్ఛత్రాలే కమలాలుగా గలిగినట్టి; చామర మరాళంబును= చామరాలే హంసలుగా కలిగినటువంటి; కేశశైవాలంబును= వెంట్రుకలే నాచుగా గలదైన; ఆయుధమీనంబును= ఆయుధాలే చేపలుగా గలిగి ఉన్నటువంటి; మాంసమేదో మస్తిష్క పంకంబును= మాంసం క్రొవ్వు మెదడు ఇవి బురదగా గలిగినటువంటి; రక్తజల+ఉద్రిక్తంబును= నెత్తురు అనే నీరు అతిశయించి ఉన్నటువంటిదయి (రక్తజలంచే ఉద్రిక్తము - తృతీయా తత్పురుష సమాసం); అగు= అయినట్టి; నదీ ప్రవాహంబు= నదీ ప్రవాహాన్ని; ఉత్పాదించెన్= పుట్టించాడు; అప్పుడు= ఆ సమయంలో; దర్పంబునన్= గర్వంతో; సురథుండును= సురథుడు; శత్రుంజయుండును= శత్రుంజయుడు; బలానీకుండును= బలానీకుడు; పృషధ్రుండును= పృషధ్రుడు; జయానీకుండును= జయానీకుడు; జయుఁడును= జయుడు; చంద్రసేనుండు= చంద్రసేనుడు (అనే వీరందరు); చండ రయంబునన్= భయంకరమైన వేగంతో; కదిసి= ఎదిరించి; బాణంబులు= బాణాలను; పరఁగించినన్= వ్యాపింపజేయగా; ఆ+పాంచాల కుమారులన్= ఆ పాంచాల రాజగు ద్రుపదుడి కుమారులైన సురథాదులను; అమానుష విక్రమంబునన్= మనుష్యులకు సాధ్యంకాని పరాక్రమంతో;

సమయించినన్= సంహరించగా; కోపించి= కోపం కలిగి; కుంతిభోజ తనూజులు= కుంతిభోజుడి కుమారులు; ఒక్కపెట్టు+అ= ఒకేసారి; పదుముప్వురు= పదమూడుమంది; అతనిన్= ఆ అశ్వత్థామను; పొదివినన్= ముట్టడించగా; పదమూఁడు మేటి తూపులన్= పదుమూడు దృఢములైన బాణాలతో; గీటడించి= సంహరించి; కెరలి= చెలరేగి; జముచందంబునన్= యమునివలె; గర్జించి= సింహగర్జన చేసి; ఘటోత్కచున్= ఘటోత్కచుడిని; కాలదండంబున్+పోని= కాలదండాన్ని పోలియున్నట్టి; కోలన్= బాణంతో; తేరిపైన్= రథంపై; త్రెళ్ళి= పడిపోయి; మూర్ఛిల్లన్+ఏసినన్= మూర్ఛపొందేటట్లు కొట్టగానే; ఓసరిలన్= పడిపోగా; తోడన్+అ= వెంటనే; ధృష్టద్యుమ్నుండు; ఆ+అరదంబు= ఆ రథాన్ని; కొనిపోవుటయున్= తీసికొనిపోయిన వెంటనే; పొంగి= పొంగిపోయి; సింగంబు చాడ్పునన్= సింహంవలె; గర్జిల్లినన్= గర్జిస్తూ ఉంటే; నిర్జరులు= దేవతలు; ఆ+గురునందనున్= ఆ అశ్వత్థామను; అగ్గించిరి= ప్రస్తుతించారు; అంతయున్= ఈ విషయాన్నంతా; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** ఈ విధంగా (అశ్వత్థామ) ఒక అక్షౌహిణీ సైన్యాన్ని సంహరించాడు. దానితో బయలు వెడలిన రక్తమంతా నదివలె ప్రవహించింది. ఆ నదిలో శ్వేతచ్ఛత్రాలు కమలాలవలె, చామరాలు హంసలవలె, వెంట్రుకలు నాచువలె, శస్త్రాలు చేపలవలె, మాంసం క్రొవ్వు, మెదడు బురదవలె, రక్తమంతా జలంవలె భాసించాయి. అంతలోనే ద్రుపదుడి కుమారులు సురథుడు, శత్రుంజయుడు, బలానీకుడు, పృషధ్రుడు, జయానీకుడు, జయుడు, చంద్రసేనుడు అనేవారు గర్వంతో భయంకరమైన వేగంతో అశ్వత్థామను ఎదుర్కొని బాణాలు ప్రయోగించారు. అశ్వత్థామ మానవులెవ్వరికి సాధ్యంకాని పరాక్రమంతో ఎదుర్కొని వీరినందరినీ సంహరించాడు. ఇది చూచి కుంతిభోజుడి కుమారులు కోపించి, ఒకేసారి పదుమూడుమంది అశ్వత్థామ నెదుర్కొన్నారు. అశ్వత్థామ వారిని పదముగ్గురినీ పదమూడు బాణాలతోనే సంహరించాడు. ఇక యమధర్మరాజువలె విజృంభిస్తూ గర్జించి, ఘటోత్కచుడిపై మృత్యుదండంవంటి బాణాన్ని ప్రయోగించాడు. ఆ దెబ్బతో ఘటోత్కచుడు రథంపై పడిపోయి మూర్ఛపొందాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడు ఆ రథాన్ని రణరంగంనుండి తీసికొని వెళ్ళాడు. వెంటనే అశ్వత్థామ సింహంవలె గర్జించగా, అతడి పరాక్రమాన్ని దేవతలంతా ప్రస్తుతించారు. ఇదంతా గమనించి (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: రూపకం. రక్తప్రవాహాన్ని నదీప్రవాహంగా రూపించటం వలన ఇది రూపకాలంకారం - నదిలో ఉండవలసిన కమలాలు, హంసలు, నాచు, బురద, నీరు, ఇక్కడ కూడా ఉన్నట్లు ఆతపత్రాలే కమలాలని చామరాలే హంసలని - ఈ విధంగా అన్నింటిని రూపించి చూపటం జరిగింది - కాబట్టి దీనిని సావయవ రూపకాలంకారం అంటారు. ఈ అలంకారంచేత అశ్వత్థామ పరాక్రమం అలోకసామాన్యం అనే విషయం ధ్వనిస్తూ ఉన్నది.

**ఆ. పాండవాగ్రజుండు పవనాత్మజునిఁ గూడి । తటిమి సాత్యకియును దాను గవిసె;**
**నంత మూర్ఛ దేటి హైడింబుఁ డొక్కతే । రనువుగాఁగఁ జేసికొని కడంగె. 85**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజుండు= పాండవ జ్యేష్ఠుడు ధర్మరాజు; పవన+ఆత్మజునిన్= వాయునందనుడైన భీముడిని; కూడి= కూడుకొని-వెంట తీసికొని అని భావం; తటిమి= వేగంగా; సాత్యకియును= సాత్యకి; తాను= తాను (ధర్మరాజు); కవిసెన్= తలపడ్డాడు; అంతన్= అంతలోనే; హైడింబుఁడు= హిడింబానందనుడైన ఘటోత్కచుడు; మూర్ఛ తేటి= మూర్ఛనుండి తేరుకొని; ఒక్కతేరు= ఒక రథాన్ని; అనువుకాఁగన్= అనుకూలంగా ఉండేవిధంగా; చేసికొని= సిద్ధం చేసికొని; కడంగెన్= యుద్ధానికి ఉద్యమించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు వెంటనే భీముడితో కలిసి సాత్యకి, తాను అశ్వత్థామ నెదుర్కొన్నారు. అంతలోనే ఘటోత్కచుడు మూర్ఛనుండి తేరుకొన్నాడు. అనువైన రథాన్ని సిద్ధం చేసికొని యుద్ధానికి ఉపక్రమించాడు.

**విశేషం:** 'గవిసె నంత' అనే పాఠమే నిర్దుష్టం - 'గవిసి రంత' అనే ఈ పాఠం దుష్టం. అందుకు సూత్రప్రమాణం - ఆత్మార్థం బభిహితంబగుచో దల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతు విశేషణంబులకగు'' బాల. క్రియ - 120

**వ. తోడన ధృష్టద్యుమ్నుండును బరవసంబు సేసినం దత్సైన్యంబు లొక్క మొగిన మొనయుటయును మనమూఁకలును సోమదత్త బాహ్లిక పురస్సరంబుగా నురవడించిన సందడి కయ్యంబయ్యె; నందు సంజ చీఁకటి చూపునకుఁ జొరవయీకున్నను సైనిక నికర వివిధాభరణ మణి కిరణ కలాపంబులుఁ జర్మవర్మాతపత్ర కేతుకీలిత రత్నరశ్మిజాలంబులు నాలోకనంబు నాపాదించె; నట్లిరువాఁగును గలయ బెరసి పోరునప్పుడు. 86**

**ప్రతిపదార్థం:** తోడన= వెంటనే; ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడు (పాండవ సైన్యాధిపతి); బరవసంబు= ధైర్యం; చేసినన్= చేయగా; తద్+సైన్యంబులు= ఆ పాండవుల సేనలు; ఒక్కమొగిన్+అ= ఏకముఖంగా; మొనయుట+యును= వ్యూహంగా ఏర్పడిన తరువాత; మన మూఁకలును= మన సేనలుకూడా; సోమదత్త బాహ్లిక పురస్సరంబుగాన్= సోమదత్తుడిని, బాహ్లికుడిని, ముందుంచుకొని; ఉరవడించినన్= విజృంభిస్తూ ఉండగా; సందడి కయ్యంబు= సంకుల సమరం; అయ్యెన్= ఏర్పడ్డది; అందున్= ఆ జనసమ్మర్దంలో; సంజచీఁకటి= సంధ్యా సమయంలోని అంధకారం; చూపునకున్= దృష్టికి; చొరవ= ప్రవేశం; ఈక+ఉన్నను= ఇవ్వకపోయినా కూడా; సైనిక నికర= సైనికుల సమూహాలయొక్క; వివిధ+ఆభరణ= పలు రకాలైన ఆభరణాలయొక్క; మణికిరణ కలాపంబులున్= మణులకాంతుల సమూహాలు; చర్మ= డాలు; వర్మ= కవచాలు; ఆతపత్ర= గొడుగులు; కేతు= ధ్వజములు అనే వానిఅందు; కీలిత= పొదుగబడి ఉన్న; రత్న= రత్నాలయొక్క; రశ్మిజాలంబులు= కాంతిపుంజాలు; ఆలోకనంబు= వెలుతురును; ఆపాదించెన్= పుట్టించినది; అట్లు= ఆ విధంగా; ఇరువాఁగును= రెండు సైన్యాలు; కలయన్= కలిసిపోయిన విధంగా; బెరసి= కూడి; పోరునప్పుడు= యుద్ధం చేసే సమయంలో.

**తాత్పర్యం:** వెంటనే ధృష్టద్యుమ్నుడు పరాక్రమించగా ఆ పాండవుల సైన్యాలు తత్క్షణం వ్యూహంగా ఏర్పడ్డాయి. మన సైన్యాలుకూడా సోమదత్త, బాహ్లికులను ముందుంచుకొని విజృంభించాయి. దానితో సంకులసమరం ఏర్పడింది. అప్పుడు ఆ సంధ్యా సమయంలోని చీకట్లో చూపానకుండా పోయింది. అయినా సైనికులు ధరించిన ఆభరణాలలోని మణులకాంతులు, డాలులు, కవచాలు, ఛత్రాలు, ధ్వజాలు అనే వాటిలో పొదగబడిన రత్నాల కాంతులు వెలుతురును పుట్టించాయి. అట్లు ఆ రెండుసైన్యాలు కలిసిపోయిన విధంగా మిక్కిలి యుద్ధంచేసే సమయాన (తరువాతి పద్యంతో అన్వయం).

### భీమసేనునిచేత బాహ్లికుఁడు సచ్చుట (సం. 7-132-8)

**క. శినివరుఁడు సోమదత్తుఁడుఁ। బెనఁగఁగఁ దోడ్పడియె వచ్చి భీముఁడు గడఁకం
దన మఱఁదికి నక్కౌరవుఁ। డెనయే? యని బిరుదులాడి యేడ్తెఱ నొంచెన్. 87**

**ప్రతిపదార్థం:** శినివరుఁడు= శినివంశ శ్రేష్ఠుడు సాత్యకి; సోమదత్తుఁడున్; పెనఁగఁగన్= యుద్ధం చేయగా (ఒకరితో ఒకరు యుద్ధం చేస్తూ ఉంటే); భీముఁడు= భీమసేనుడు; కడఁకన్= ప్రయత్నపూర్వకంగా (కల్పించుకొని అని భావం); వచ్చి= సమీపించి; తోడ్పడియెన్= సహాయపడ్డాడు; తన మఱఁదికిన్= తన మరది అయిన సాత్యకికి; ఆ+కౌరవుఁడు= ఆ కురువంశీయుడు-సోమదత్తుడు; ఎన+ఏ?= సాటియా?; అని= ఈ విధంగా; బిరుదులు+ఆడి= పౌరుషవాక్యాలు పలికి; ఏడ్తెఱన్= పరాక్రమంతో; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** సాత్యకి, సోమదత్తుడు - వీరిద్దరు పరస్పరం యుద్ధం చేస్తుండగా, భీముడు వచ్చి, ఈ సోమదత్తుడు మా సాత్యకికి సాటియా? అని పౌరుషవాక్యములు పలికి సోమదత్తుడిని తన పరాక్రమంతో బాధించాడు.

**వ. అట్టియెడ.** **88**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. అనలశిఖపోని నారస । మున సాత్యకి యేయు నెడను ముద్గరమున భీ**
**ముని కొడుకు వైచె రెంటం । దనువున నొ వ్వడరి సోమదత్తుఁడు సోలన్.** **89**

**ప్రతిపదార్థం:** సాత్యకి; అనిల శిఖ+పోని= అగ్నిజ్వాలవంటి; నారసమునన్= బాణంతో; ఏయు+ఎడను= కొట్టే సమయంలో; భీముని కొడుకు= భీమసేనుడి కుమారుడు - ఘటోత్కచుడు; ముద్గరమునన్= ఇనుపరోకలివలె ఉన్న ఆయుధవిశేషంతో (పరిఘాయుధంతో); వైచెన్= కొట్టాడు; రెంటన్= ఆ రెండింటితో; తనువునన్= శరీరమందు; నొవ్వు= నొప్పి; అడరి= అతిశయించి; సోమదత్తుఁడు= సోమదత్తుడు; సోలన్= మూర్ఛపోగా.

**తాత్పర్యం:** సోమదత్తుడిని సాత్యకి అగ్నిజ్వాలవంటి బాణంతో కొట్టే సమయంలోనే, ఘటోత్కచుడు ఇనుపరోకలి విధంగా ఉండే ముద్గరాయుధంతో కొట్టాడు. ఈ రెండు దెబ్బలకు సోమదత్తుడు శరీరంలో నొప్పి మిక్కుటమై సొమ్మసిల్లాడు. ఆ సమయంలో.

**చ. తనయుఁడు మూర్ఛవోయిన నుదగ్రత బాహ్లికుఁ డచ్యుతానుజ**
**న్మినిఁ దలపడ్డ నాతనికి మించి వృకోదరుఁ డన్నరేంద్రు నే**
**సిన నతఁ డుగ్రశక్తి వయిచెన్ మెయి నాటుడు సోలి యంతలో**
**నన తెలివొంది ముద్గరమునం బవనాత్మజుఁ డేచి వైచినన్.** **90**

**ప్రతిపదార్థం:** తనయుఁడు= తన కుమారుడు సోమదత్తుడు; మూర్ఛ+పోయినన్= మూర్ఛపోగానే; ఉదగ్రతన్= రౌద్రభావంతో - క్రోధంతోనని భావం; బాహ్లికుఁడు; అచ్యుత+అనుజన్మినిన్= శ్రీకృష్ణుడి తమ్ముడైన సాత్యకిని; తలపడ్డన్= ఎదుర్కొనగా; వృకోదరుఁడు= భీముడు; ఆతనికిన్= ఆ బాహ్లికుడికంటె; మించి= అతిశయించి; ఆ+నరేంద్రున్= ఆ బాహ్లికుడనే కురువంశీయ రాజును; ఏసినన్= కొట్టగా (బాణాలతో అని భావం); అతఁడు= ఆ బాహ్లికుడు; ఉగ్రశక్తి= భయంకరమైన శక్తి అనే ఆయుధాన్ని; వయిచెన్= ప్రయోగించాడు; (ఆ శక్త్యాయుధం) మెయి నాటుడున్= శరీరంలో గ్రుచ్చుకోగానే; సోలి= మూర్ఛపోయి; అంతలోనన= అంతలోనే; తెలివి+ఒంది= (మూర్ఛదేరి) తెలివొంది; ముద్గరమునన్= ముద్గరాయుధంతో; పవన+ఆత్మజుఁడు= వాయునందనుడు భీముడు; ఏచి= విజృంభించి; వైచినన్= కొట్టగా.

**తాత్పర్యం:** తన కుమారుడు సోమదత్తుడు మూర్ఛపోగా, అతడి తండ్రి బాహ్లికుడు సాత్యకితో తలపడ్డాడు. అప్పుడు భీముడు బాహ్లికుడిని అతడికంటె అధికంగా బాణాలతో కొట్టాడు. వెంటనే బాహ్లికుడు భీముడిపై భయంకరమైన శక్త్యాయుధాన్ని ప్రయోగించాడు. దానితో భీముడు ఒక్క త్రుటికాలం మూర్ఛపోయి, వెంటనే తెలివొంది ముద్గరాయుధంతో ఆ బాహ్లికుడిని కొట్టాడు - దానితో (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తల వ్రయ్యలైన నిష్ఠుర । కులిశహతిం బగిలి కూలు కులపర్వతముం**
**దలఁపించుచుఁ గురువృద్ధుం డిలఁ । గూలెం బ్రతిబలంబు లే పారంగన్. 91**

**ప్రతిపదార్థం:** తల= ఆ బాహ్లికుని శిరం; వ్రయ్యలు+ఐనన్= బద్దలు కాగా; నిష్ఠుర కులిశహతిన్= కఠినమైన వజ్రాయుధపు దెబ్బతో; పగిలి= పగిలిపోయి; కూలు= కూలిపోయినటువంటి; కులపర్వతమున్= కులపర్వతాన్ని; తలఁపించుచున్= తలంపునకు తెస్తూ; కురువృద్ధుండు= కురువంశంలో వయోవృద్ధుడైన ఆ బాహ్లికుడు; ప్రతిబలంబులు= శత్రుసైన్యాలు; ఏపారంగన్= విజృంభించగా; ఇలన్= భూమిపై; కూలెన్= కూలిపోయాడు.

**తాత్పర్యం:** కురువృద్ధుడైన బాహ్లికుడు తలపగిలి, కఠినమైన వజ్రాయుధపు దెబ్బతో పగిలిపోయి నేలగూలిన కులపర్వతంవలె కూలిపోయాడు. దానితో పాండవసేనలో ఉత్సాహంతో కూడిన విజృంభణం పెరిగింది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అయ్యవసరంబున దశరథసుత సన్నిభం బగు భవత్కుమార దశకం బా కిమ్మీర వైరిం బొదువుటయు దశ నిశిత బాణంబులం బ్రాణంబులు గొనియెఁ గర్ణానుజుండగు వృకరథుండు గడంగి వచ్చినం బొరివుచ్చె సౌబల సోదరులు పన్నిరువురు బరవసంబు సేసినం బడనేసె నిట్లు పటు పరాక్రమంబునం బేర్చిన భీమసేనుమీఁద శూరసేన వసాతి మాళవ త్రిగర్త బాహ్లిక ప్రముఖంబు లగు దేశంబుల బలంబులు బలువిడిం గవిసినం గని కౌంతేయాగ్రజుండు సైన్య సంతాన సమేతంబుగా నురవడించి భుజాటోపంబు సూపిన నవి మడిసియు జడిసియుఁ జిక్కువడియు నుక్కు మడిఁగియు వెఱంగుపడి చూచుచుండ నాచార్యుని దుర్యోధనుండు పురికొల్పిన నతం డుత్సాహదీప్తుండై యా ధర్మతనయుఁ దాఁకి వాయవ్య యామ్య వారుణాగ్నేయ త్వాష్ట్ర సావిత్రంబు లగు సాయకంబులు వరుస నేయ నయ్యై యస్త్రంబుల నవ్విభుండు ప్రత్యస్త్రంబుల వారించిన నతం డైంద్రాస్త్రంబున నిజ ప్రతిజ్ఞ నెఱపం జూచిన నదియు నట్ల యడంగుటయుం గోపించి సకల భూత భయంకరంబగు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన నమ్మహీపతియు నమ్మహనీయాస్త్రంబునన సమయించె నంత ధృష్టద్యుమ్నుం డతని కడ్డపడిన నా రథికుతోడి యనికిం గ్రేడించి కుంభసంభవుండు. 92**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; దశరథ సుత సన్నిభంబు+అగు= శ్రీరాముడి పోలిన; భవత్కుమార దశకంబు= నీ పుత్రులు పదిమంది (దశకము= దశసంఖ్యాక సమూహం - కుమారాణాం దశకం - అని షష్ఠీతత్పురుషసమాసం); ఆ కిమ్మీర వైరిన్= ఆ భీమసేనుడిని; పొదువుటయున్= ఎదిరించిన వెంటనే; దశ నిశితబాణంబులన్= పది తీక్ష్ణబాణాలతో; ప్రాణంబులు= ప్రాణాలను; కొనియెన్= గ్రహించాడు (అనగా సంహరించాడు); కర్ణ+అనుజుండు+అగు= కర్ణుని తమ్ముడైన; వృకరథుండు= వృకరథుడు; కడంగి= సాహసించి; వచ్చినన్= (యుద్ధానికి) వచ్చిన వెంటనే; పొరివుచ్చెన్= సంహరించాడు; సౌబల సోదరులు= శకుని తోబుట్టువులు; పన్నిరువురు= పంద్రెండుగురు; బరవసంబు+చేసినన్= ధైర్యం చేయగా; పడన్+ఏసెన్= పడగొట్టెను (అనగా సంహరించాడు); ఇట్లు= ఈ విధంగా; పటుపరాక్రమంబునన్= సమర్థమైన పరాక్రమంతో; పేర్చిన= చెలరేగుతూ ఉన్న; భీమసేను మీఁదన్= భీముడిపై; శూరసేన వసాతి మాళవ త్రిగర్త బాహ్లిక ప్రముఖంబులు+అగు= శూరసేనం, వసాతి, మాళవం, త్రిగర్తం, బాహ్లికం అనేవి ప్రధానంగా ఉన్న; దేశంబుల బలంబులు= దేశాల సైన్యాలు; బలువిడిన్= పరాక్రమంతో; కవిసినన్= తలపడగా; కని= చూచి; కౌంతేయ+అగ్రజుండు= పాండవుల అన్న ధర్మరాజు; సైన్య సంతాన సమేతంబుగాన్= సైన్యాల పరంపరతో కూడి; ఉరవడించి= వేగిరపడి వచ్చి; భుజ+ఆటోపంబు= భుజముల బలాతిశయాన్ని; చూపినన్= చూపగా; అవి= ఆ సైన్యాలు; మడిసియున్= చచ్చియు; జడిసియున్= బెదరిపోయి; చిక్కువడియున్= సంకటాలలో చిక్కి; ఉక్కుమడిఁగియున్= గర్వం అణగి; వెఱంగుపడి= ఆశ్చర్యపోయి; చూచుచుండన్= చూస్తూ ఉంటే; ఆచార్యుని= ద్రోణాచార్యులను; దుర్యోధనుండు; పురికొల్పినన్=

ప్రేరేపించగా; అతండు= ఆ ద్రోణాచార్యుడు; ఉత్సాహదీప్తుండు+ఐ= ఉత్సాహంతో ప్రకాశిస్తూ ఉన్నవాడై; ఆ ధర్మతనయున్= ఆ ధర్మరాజును; తాఁకి= ఎదుర్కొని; వాయవ్య యామ్య వారుణ+ఆగ్నేయ త్వాష్ట్ర సావిత్రంబులు+అగు= వాయువు యముడు వరుణుడు అగ్ని త్వష్ట సూర్యుడు దేవతలుగా గలిగిన; సాయకంబులు= బాణాలు అనగా దివ్యాస్త్రాలు; వరుసన్= క్రమంగా; ఏయన్= ప్రయోగించగా; అయ్యై అస్త్రంబులన్= (ఆ+ఆ+అస్త్రంబులన్) ఆయా అస్త్రాలను; ఆ+విభుండు= ఆ ధర్మరాజు; ప్రత్యస్త్రంబులన్= మారుబాణాలతో; వారించినన్= నివారిస్తూ ఉండగా; అతండు= ఆ ద్రోణాచార్యుడు; ఇంద్ర+అస్త్రంబునన్= ఇంద్రదేవతాకమైన దివ్యాస్త్రంతో; నిజ ప్రతిజ్ఞ= తన ప్రతిజ్ఞను; నెఱపన్+చూచినన్= నెరవేర్చటానికి చూడగా; అదియున్= ఆ ఇంద్రాస్త్రం కూడా; అట్లు+అ= ఆ విధంగానే; అడంగుటయున్= నశించగా (ధర్మరాజు దానిని గూడా ప్రత్యస్త్రంచేత నివారించుట చేత); కోపించి= మండిపడి; సకల భూత భయంకరంబు+అగు= సకల ప్రాణులకు భయాన్ని కొలిపే; బ్రహ్మ+అస్త్రంబు= బ్రహ్మ దేవతాకమైన దివ్యాస్త్రాన్ని; ప్రయోగించినన్= ప్రయోగించగా; ఆ+మహీపతియున్= ఆ ధర్మరాజు కూడా; ఆ+మహనీయ+అస్త్రంబునన్+అ= ఆ పూజ్యమైన బ్రహ్మాస్త్రంతోనే (బ్రహ్మాస్త్రానికి బ్రహ్మాస్త్రమే విరుగుడు దానికి మరే అస్త్రం విరుగుడు - కాదు కావున ప్రత్యస్త్రంగా ప్రయోగించాడు); సమయించెన్= ఖండించాడు; అంతన్= అటు తరువాత; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; అతనికిన్= ఆ ద్రోణాచార్యులకు; అడ్డుపడినన్= అడ్డుపడుతూ ఉంటే; ఆ రథికుతోడి+అనికిన్= ఆ ధృష్టద్యుమ్నుడితో యుద్ధానికి; క్రేడించి= అలక్ష్యం చేసి; కుంభసంభవుఁడు= ద్రోణుడు.

**తాత్పర్యం:** ఆ సమయాన శ్రీరాముడివంటి నీ కుమారులు పదిమంది ఆ భీముడిని ఎదిరించారు. వెంటనే భీముడు వారిని పది వాడిబాణాలతో సంహరించాడు. అంతలో కర్ణుడి తమ్ముడు వృకరథుడు సాహసించి రాగా, అతడిని కూడా సంహరించాడు. శకుని తోబుట్టువులు పండ్రెండుగురు తలపడుతూ ఉండగా వారిని కూడా పడవేశాడు. ఈ విధంగా భీముడు అవక్రపరాక్రమంతో విజృంభిస్తూ ఉంటే, శూరసేన వసాతి మాళవ త్రిగర్త బాహ్లిక దేశాల సైన్యాలు వెనువెంటనే అతడిని ఎదిరించాయి. ఇది చూచాడు ధర్మరాజు. వెంటనే గొప్ప సైన్యంతో చేరవచ్చి తలపడ్డాడు. ఆ ధాటికి శత్రుసైన్యాలు ఆగలేకపోయాయి. సైన్యం కొంత నశించింది. కొంత ఖండితమై భయభ్రాంతమైంది. మరికొంత చిక్కులో పడి దుఃఖాక్రాంతమైంది, కొంత సైన్యం గర్వముడిగి ఆశ్చర్యంగా చూస్తూ ఉంది. ఈ పరిస్థితిని గమనించి, దుర్యోధనుడు వెళ్ళి ద్రోణాచార్యుడిని యుద్ధానికి ప్రేరేపించాడు. అతడు అమితోత్సాహంతో ఆ ధర్మరాజును దివ్యాస్త్రాలతో ఎదుర్కొన్నాడు. ధర్మరాజు ఆ దివ్యాస్త్రాలను ప్రత్యస్త్రాలు ప్రయోగించి శమింపజేశాడు. ఇది కాదని దుర్యోధనుడి కిచ్చిన మాట నెరవేర్చటానికి ద్రోణుడు ధర్మరాజుపై ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. అది కూడ విఫలం కాగానే సకల ప్రాణిలోక భయంకరమైన బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. దానిని ధర్మరాజు తిరిగి బ్రహ్మాస్త్రంతోనే నివారించాడు. అంతలో ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని అడ్డుకొన్నాడు. ధృష్టద్యుమ్నుడిని అలక్ష్యంచేసి ద్రోణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ.** **ద్రుపదుని సేనపై నడరి తోలినఁ జూచి వృకోదరుండు దే**
**వపతిసుతుండుఁ దాఁకి యనివారణ నగ్గురు నొంప నేచి యు**
**గ్రపువడి మాత్స్యకేకయ ముఖం బగు పాండవ సైన్య మొక్క పె**
**ట్ట పరఁగి నీ బలంబుల కడంక యడంచి మదించి పేర్చినన్.** 93

**ప్రతిపదార్థం:** ద్రుపదుని సేనపైన్= ద్రుపదరాజు సైన్యంమీద; అడరి= విజృంభించి; తోలినన్= పారిపోయేటట్లు చేయగా; చూచి= గమనించి (శ్లో॥ తే హన్యమానా ద్రోణేన పాంచాలాః ప్రాద్రవన్ భయాత్ । పశ్యతో భీమసేనస్య పార్థస్య చ మహాత్మనః' (ద్రోణ. 157/44) అని సంస్కృత మూలం.); వృకోదరుండు= భీముడు; దేవపతి సుతుండున్= ఇంద్రసుతుడు అర్జునుడు,

ఈ ఇద్దరు; తాఁకి= (ద్రోణుడిని) ఎదుర్కొని; అనివారణన్= ఆటంకం లేకుండా (వెంటనే అని భావం); ఆ+గురున్= ఆ ద్రోణాచార్యుడిని; నొంపన్= (బాణాలతో) నొప్పిస్తూ ఉంటే; ఏచి= విజృంభించి; ఉగ్రపువడిన్= భయంకరమైన వేగంతో; మాత్స్యకేకయ ముఖంబు+అగు= మత్స్య కేకయదేశాల సైన్యం ముఖభాగంలోగల; పాండవసైన్యము= పాండవులసేన; ఒక్కపెట్టు+అ= ఒకేసారి; పరఁగి= చుట్టుముట్టి; నీ బలంబుల కడంక= నీ సైన్యాల గర్వాన్ని; అడంచి= అణచి; మదించి= గర్వించి; పేర్చినన్= విజృంభించగా.

**తాత్పర్యం:** ద్రుపదుడి సైన్యంపై విజృంభించి దానిని పారద్రోలాడు. దీనిని గమనిస్తూ వెంటనే భీమార్జునులు ద్రోణాచార్యుల నెదుర్కొని నిరాటంకంగా బాణాలతో నొప్పిస్తుంటే, అదే సమయంలో నీ సైన్యాన్ని, పాండవ సేనలు - ప్రధానంగా మత్స్య కేకయాది సైన్యాలు వేగంగా చుట్టుముట్టాయి. నీ సైన్యాల గర్వముడిగించి మదాతిరేకంతో ఇంకా విజృంభిస్తూనే ఉండగా (తరువాతి వచనంతో అన్వయం).

**వ. కనుంగొని కౌరవేశ్వరుండు కర్ణుని కిట్లనియె. 94**

**ప్రతిపదార్థం:** కనుంగొని= చూచి; కౌరవ+ఈశ్వరుండు= కౌరవరాజు దుర్యోధనుడు; కర్ణునికిన్= కర్ణుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అది చూచి దుర్యోధనుడు కర్ణుడితో ఇట్లా అన్నాడు:

**క. 'పాండవ పాంచాలాదులు । గండు మిగిలి బెట్టు దఱుమఁ గౌరవబల మొం**
**డొండ కలంగెడు నీ దగు । దండితనము సూపి కావఁ దగు తఱి వచ్చెన్.' 95**

**ప్రతిపదార్థం:** పాండవ పాంచాలాదులు= పాండవ పాంచాల ప్రభృతి యోధులు; గండు= పౌరుషం; మిగిలి= అతిశయించి; బెట్టు= మిక్కిలి; తఱుమన్= తరుముతూ ఉంటే; కౌరవబలము= కౌరవసైన్యం; ఒండు+ఒండు+అ= క్రమక్రమంగా; కలంగెడున్= కలత జెందుతూ ఉన్నది (కావున); నీది+అగు= నీదైన; దండితనము= గొప్పతనాన్ని; చూపి= ప్రదర్శించి; కావన్+తగు; తఱి= కాపాడటానికి తగిన సమయం; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** 'పాండవ పాంచాల ప్రముఖ యోధులు మహాపౌరుషంతో మన సైన్యాన్ని తరుముతూ ఉంటే క్రమక్రమంగా సైన్యానికి ధైర్యం దెబ్బతినిపోతూ ఉన్నది. కాబట్టి నీవు విక్రమించి, ఈ మన సైన్యాన్ని కాపాడవలసిన సమయం ఆసన్నమైనది.

**వ. అనవుడు. 96**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కర్ణుడితో ఇట్లా అనిన వెంటనే.

**శా. 'చంపం జాలుదు నే నొకండన భుజాశక్తిన్ నరున్ వెండి మ**
**ర్దింపం జుల్కన భీమముఖ్యుల భవత్తేజంబు రాజ్యంబుఁ బా**
**లింపం బూనిన యేను గల్గఁగ రిపుల్ జృంభింతురే? చూడు నా**
**తెంపుం బెంపును' నంచుఁ గర్ణుఁడు మహోదీర్ణాకృతిం బొల్చినన్. 97**

**ప్రతిపదార్థం:** నేను+ఒకండన్+అ= నేనొక్కడనే; భుజాశక్తిన్= (నా) భుజబలంతో; నరున్= అర్జునుడిని; చంపన్+చాలుదున్= చంప జాలుతాను; వెండి= మరియు; భీమ ముఖ్యులన్= భీముడు మొదలైనవారిని; మర్దింపన్= నుగ్గునుగ్గు చేయటం; చుల్కన= తేలిక; భవత్+తేజంబు= నీ పౌరుషాన్ని; రాజ్యంబున్= రాజ్యాన్ని; పాలింపన్+పూనిన= పరిపాలించటానికి తలపెట్టిన; ఏను= నేను; కల్గఁగన్= ఉండగా; రిపుల్= శత్రువులు; జృంభింతురే?= విజృంభిస్తారా? (విజృంభించలేరని భావం); నా తెంపున్= నా సాహసాన్ని; పెంపును= పరాక్రమాతిశయాన్ని; చూడు= (ఇక) చూడు; అంచున్= అంటూ; కర్ణుఁడు= కర్ణుడు; మహా(మహత్)+ఉదీర్ణ+ ఆకృతిన్= గొప్ప గర్వంతో కూడిన ఆకారంతో; పొల్చినన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! భుజబలంతో అర్జునుని నేనొక్కడినే చంపగలను. తరువాత భీముడు మొదలైన వారిని మర్దించటం తేలికైన పని. నీ క్షాత్రతేజస్సు రాజ్యాన్ని పరిపాలించటానికి పూనుకొంటే, నేనుండగా ఈ శత్రువులు విజృంభిస్తారా? నా సాహసాన్ని, పరాక్రమాతిశయాన్ని చూడు, అంటూ కర్ణుడు గొప్ప గర్వాన్ని ప్రదర్శిస్తూ, ప్రకాశిస్తూ ఉంటే (తరువాతి పద్యంతో అన్వయం).

### కృపాచార్యుండు గర్ణు నుపాలంభించుట (సం. 7-133-12)

**వ. కనుంగొని గృపాచార్యుం డలంతి నవ్వుతో నతని కి ట్లనియె. 98**

**ప్రతిపదార్థం:** కనుంగొని= చూచి; కృపాచార్యుండు= కృపాచార్యుడు; అలంతి నవ్వుతోన్= మందహాసంతో; అతనికిన్= ఆ కర్ణుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడు, చిరునవ్వునవ్వి కర్ణుడితో ఇట్లా పలికాడు:

**చ. 'అగు నగు! మేలు మేలు! మనుజాధిపుఁడున్ మహి యేలు మాటల**
**న్మగఁటిమి యిమ్మెయిన్ నెఱపినం జెడుఁ బాండుతనూజ కోటియుం**
**దగు మును ఘోషయాత్రను బదంపడి గోగ్రహణంబునందుఁ బే**
**రు గొనిన నీకు ని ట్లనుట క్రొవ్వులు దక్కుము; సాలు నిన్నియున్. 99**

**ప్రతిపదార్థం:** అగును+అగున్!= అవునవును!; మేలు మేలు!= మంచిది మంచిది! (పరిహాస గర్భిత వచనమిది); మనుజ+అధిపుఁడున్= దుర్యోధనుడు; మహి= ఈ భూమిని; ఏలు మాటలన్= పాలిస్తాడనే మాటలతో మాత్రం; మగఁటిమి= పౌరుషాన్ని; ఈ+మెయిన్= ఈ విధంగా; నెఱపినన్= చూపుతూ ఉంటే; పాండు తనూజకోటియున్= పాండవుల సమూహం; చెడున్!= నశిస్తుంది! (నశించక ఉంటుందా? అని ఎత్తిపొడుపు. నశించదని భావం.); మును= పూర్వం; ఘోషయాత్రను= ఘోషయాత్రా సమయంలో; పదంపడి= అటు తరువాత; గోగ్రహణంబునందున్= ఉత్తర గోగ్రహణ సమయంలో; పేరు+కొనిన నీకున్= పేరు(కీర్తి) తెచ్చుకొన్న నీకు; ఇట్లు= ఈ విధంగా; అనుట= అనటం; తగున్!= యుక్తమే (ఇదికూడా ఎత్తిపొడుపు మాటయే - కర్ణుడు ఘోషయాత్రలో పారి పోయాడు - ఉత్తర గోగ్రహణంలో అర్జునుడిచే జయించబడ్డాడు); క్రొవ్వులు= గర్వోక్తులు; తక్కుము= తగ్గించుకొనుము; ఇన్ని యున్= ఈ మాత్రం మాటలు; చాలున్= సరిపోతాయి.

**తాత్పర్యం:** అవునౌను! మేలు మేలు! దుర్యోధనుడు భూమండలాన్ని పరిపాలిస్తాడనే ఈ పౌరుషవాక్యాలు పలికి నంత మాత్రాన పాండవులు నశిస్తారా? ఇదివరకు ఘోషయాత్రలో, ఉత్తర గోగ్రహణంలో కూడా పేరు తెచ్చుకొన్న నీవు ఇట్లా మాట్లాడుట తగునా! ఈ పొగరుబోతుమాటలు కట్టిపెట్టుము. ఇంతవరకు మాట్లాడింది చాలు.'

**విశేషం:** కర్ణుడికి పాండవులను గెలిచేటంత సామర్థ్యం లేదు. ఇతడి మాటలు బూటకాలే. నమ్మదగినవి కావు - అని కృపుడు దుర్యోధనుడితో చెప్పక చెప్పినట్లయింది. ఈ కృపాచార్యుడి అభిప్రాయం ఇక్కడ ధ్వనిస్తూ ఉన్నది.

**వ. అని వెండియు.** **100**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడిని ఎత్తిపొడిచి మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నిన్నును బాండుతనూజుల । నెన్నండును బోరఁ జూచి యెఱుఁగని వారిం**
**గన్నట్లు పలుక నేటికి । నిన్ని సెనటి రజ్జు లనికి నివి దోడ్పడునే?** **101**

**ప్రతిపదార్థం:** ఎన్నండును= ఏనాడుకూడా; నిన్నును= నిన్ను(కర్ణుడిని); పోరన్= యుద్ధంలో; చూచి+ఎఱుఁగని వారిన్= చూచినట్లే తెలియనివారిని; పాండుతనూజులన్= పాండవులను; కన్న+అట్లు= చూచినవిధంగా; పలుకన్= పలుకటానికి; ఇన్ని+చెనఁటి రజ్జులు= ఇన్ని కుత్సితాలైన వ్యర్థప్రలాపాలు; ఏటికిన్?= ఎందుకు?; అనికిన్= యుద్ధానికి; ఇవి= ఈ వ్యర్థప్రలాపాలు; తోడ్పడును+ఏ?= తోడ్పడుతాయా? (తోడ్పడవని భావం).

**తాత్పర్యం:** ఎన్నడూ నిన్నూ, పాండవులనూ యుద్ధంలో చూచి ఎరుగని వారిని చూచి మాట్లాడినట్లు మాట్లాడటం ఎందుకు? నీవు పలికిన ఇన్ని వ్యర్థప్రలాపాలూ యుద్ధానికి తోడ్పడేవేనా?

**క. క్రీడికి మును మన మందఱు । నోడు టెఱుఁగు; దన్నలును ఘటోత్కచుఁడు దగం**
**దోడు పడ బంధునృపతులుఁ । గూడి నడవ మనకు గెలుపు గొన నెట్టు లగున్?'** **102**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; మనము+అందఱును= మనమందరం; క్రీడికిన్= అర్జునునకు; ఓడుట= ఓడిపోవటం; ఎఱుఁగుదు= తెలిసినవాడవు (మనం జయించుట ఇంతవరకు జరుగలేదని భావం); (ఇప్పుడు ఆ అర్జునునకు); అన్నలును= ధర్మజ భీములు; ఘటోత్కచుఁడున్= ఘటోత్కచుడు; తగన్= తగినవిధంగా; తోడుపడన్= సహాయం చేస్తూ ఉండగా; బంధు నృపతులున్= బంధువులైన రాజులు కూడా; కూడి నడవన్= కూడుకొని తోడై నడువగా; మనకున్= నీకు నాకు మాత్రం కాదు మనందరికీ; గెలుపు+కొనన్= (వారితోపోరి యుద్ధంలో) గెలుపు సాధించటానికి; ఎట్టులు= ఏ విధంగా; అగున్?= సాధ్యమవుతుంది? (సాధ్యంకాదని భావం).

**తాత్పర్యం:** మనమందరం ఇదివరకు యుద్ధంలో అర్జునుడికి ఓడిపోవటం నీకు తెలుసు. ఇప్పుడు అర్జునుడొక్కడు కాడు, అతడికి ధర్మరాజు, భీముడు, ఘటోత్కచుడు, అంతేగాక బంధువులైన ఇతర రాజులు తోడుగా ఉండగా అతడిని గెలవటం ఎట్లా సాధ్యం అవుతుంది?'

**చ. అనవుడుఁ గర్ణుఁ డిట్టు లను 'నాడిన యంతయుఁ జేయఁ జాలు బం**
**టున కెటు లన్న నేమగుఁ? గడుం బెలుచన్ మును మ్రోసికాదె వృ**
**ష్టి నిగుడఁజేయు నంబుదము సెల్లదు నీ పలు కింతవట్టు సైఁ**
**పన తగు నింక నేమనినఁ బాఱుఁడ! నాలుక గోయుదుం జుమీ!'** **103**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగానే; కర్ణుఁడు= కర్ణుడు; ఇట్టులు= ఈ విధంగా; అనున్= అంటాడు; ఆడిన+అంతయున్= చెప్పినదంతా కూడా; చేయన్+చాలు= చేయటానికి సమర్థుడైన; బంటునకున్= వీరునకు; ఎటులు+అన్నన్= ఎట్లా అన్నాకూడా;

ఏమి+అగున్= ఏమవుతుంది? (ఏమీ కాదని భావం) (ఎట్లాగూ చేస్తాడు కాబట్టి చేతకు ముందుకాని, చేసిన తరువాత కాని చెప్పటం ఒకటే - కావున నేను ముందుగా చెప్పటం తప్పుకాదు ఎట్లా+అంటే?); కడున్= మిక్కిలి; పెలుచన్= బిగ్గరగా; మును= మొదట; మ్రోసికాదె!= గర్జన చేసిన తరువాతనే కదా!; అంబుదము= వర్షకాల మేఘం; వృష్టి(న్)= వానను (ఇక్కడ దృష్టి అనే ఉస్మానియా ప్రతిపాఠం కంటే 'వృష్టి' అనే ఈ బాలసరస్వతీ బుక్ డిపో మద్రాసు ప్రతి ప్రకృతానుకూలంగా ఉన్నది. కాబట్టి ఆ పాఠాన్నే గ్రహించటం జరిగింది. శ్లో॥'శూరాగర్జంతి సతతం ప్రావృషీవ బలాహకాః' అని మూల సంస్కృతం (158/25); నిగుడన్+చేయున్= వ్యాపింపచేస్తుంది (కావున); నీ పలుకు= నీ మాట (నీవు నన్ను ఆక్షేపించిన తీరు అని భావం); చెల్లదు= తగింది కాదు; ఇంతవట్టు= ఈ మాత్రం; సైఁపనన్= సహించటమే (ఇప్పటివరకు నీ వాడిన మాటలు సహించటం అని భావం); తగున్= తగుతుంది; ఇంకన్= మళ్ళీ; ఏమి+అనినన్= ఏమైనా మాట్లాడితే; పాఱుఁడ!= ఓ బ్రాహ్మణుడా! (ఇంతవరకు బ్రాహ్మణుడనే గౌరవంతో క్షమించానని భావం); నాలుకన్= నాలుక (జిహ్వను); కోయుదున్+చుమీ!= కోస్తాను సుమా! (ఇకముందు ఇటువంటి మాటలు రాకుండా జాగ్రత్త! అనే కర్ణుడి హెచ్చరిక ధ్వనిస్తూ ఉన్నది).

**తాత్పర్యం:** అని అనగానే కర్ణుడు 'చెప్పినదంతా చేసే సామర్థ్యమున్న వీరుడికి ఎట్లా చెప్పినా చెల్లుతుంది. వర్షాకాలం లోని మేఘం మొదట గర్జించేకదా తరువాత వర్షిస్తుంది. నీవన్నమాట చెల్లదు. ఓ బ్రాహ్మణుడా! నీవేదో అన్నావు పోనీ, ఇంతవరకు బ్రాహ్మణుడవనే గౌరవంతో సహించాను. ఇంక మరేదైనా మాట్లాడావంటే నీ నాలుకను కోసేస్తాను జాగ్రత్త!

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం. 'ఆడిన యంతయుఁ జేయఁ జాలు బంటున కెటు లన్న నేనుగున్' అనే 'సామాన్య' వీరవృత్తాంతాన్ని మేఘరూప 'విశేష' వృత్తాంతంతో సమర్థించటం జరిగింది. కావున అర్థాంతరన్యాసాలంకారం. విశేషంతో సామాన్యాన్ని సమర్థించే ఈ అర్థాంతరన్యాసాలంకారంలో 'విశేషం' వైధర్మ్యంలో ఉన్నది. సామాన్య వీరవృత్తాంతంచేత ప్రస్తుత కర్ణవృత్తాంతం ప్రతీయమాన మగుటచే కర్ణుడు చేతకు ముందు తాను చేస్తా' నని చెప్పటంలో తప్పులేదనే విషయాన్ని మేఘవృత్తాంతంతో సమర్థించుకొనటం కొరకే సామాన్య వీరవృత్తాంతాన్ని ప్రస్తావించాడని తాత్పర్యం.

**వ. అని పలికి మఱియును. 104**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికి= చెప్పి; మఱియును= మరల.

**తాత్పర్యం:** ఇట్లా తాను బీరాలు పలుకటం సమర్థించుకొని మరల. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'నరు నద్దెసఁ గలవారిని। గురుబల ముబ్బు సెడఁ బొగడి కొఱ కొఱ గాఁగన్**
**గురుని గురుతనయు మద్రే। శ్వరు నను నేమిటికిఁ గాని వారిం జేయన్.' 105**

**ప్రతిపదార్థం:** నరున్= అర్జునుడిని; ఆ+దెసన్+కలవారిని= ఆవైపున్నవారిని (పాండవపక్షంలోనివారిని); కురుబలము+ఉబ్బు= కౌరవసైన్యంలోని ఉత్సాహం; చెడన్= నశించేటట్లు; పొగడి= పొగడి; కొఱకొఱ= కోపము; కాఁగన్= పుట్టగా; గురునిన్= ద్రోణుడిని; గురుతనయున్= అశ్వత్థామను; మద్రేశ్వరున్= శల్యుడిని; ననున్= (కర్ణుడిని); కానివారిన్= అసమర్థులనుగా; చేయన్+ఏమిటికిన్= చేయుటమెందుకు?

**తాత్పర్యం:** అర్జునుడిని, అర్జునుడి పక్షంలో ఉన్నవారిని పొగడి, కౌరవసైన్యంయొక్క ఉత్సాహాన్ని చెరిచి, కోపం కలిగేటట్లుగా, ఆచార్యుడిని, ఆచార్యపుత్రుడు అశ్వత్థామను, శల్యుడిని, నన్ను అసమర్థులను చేస్తున్నావు. ఎందుకు?'

**క. అని మామఁ బలుకు పలుకులు । విని యశ్వత్థామ క్రోధవివశుం డయి గ్ర**
**క్కున వాలు వెతికికొని క । ర్ణుని దెసకుం గవియ భూవరుం డెడ సొచ్చెన్. 106**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; మామన్= మామ అయిన కృపాచార్యుడి నుద్దేశించి; పలుకు పలుకులు= పలికే మాటలు; విని= విన్నవాడై; అశ్వత్థామ= కృపుడి సోదరి కుమారుడు; క్రోధ వివశుండు+అయి= కోపంతో తనను తాను నిగ్రహించుకొనలేని వాడయి; గ్రక్కునన్= శీఘ్రంగా; వాలు= ఖడ్గాన్ని; పెతికికొని= దూసికొని; కర్ణుని దెసకున్= కర్ణుడి వైపునకు; కవియన్= ఉరుకగా; భూవరుఁడు= దుర్యోధనుడు; ఎడ+చొచ్చెన్= అడ్డగించాడు.

**తాత్పర్యం:** ఇట్లా తన మామయైన కృపాచార్యులతో కర్ణుడు మాట్లాడటం విని, అశ్వత్థామ కోపం పట్టలేక వెంటనే కత్తి దూసి కర్ణుడిపైకి ఉరుకుతూ ఉంటే, దుర్యోధనుడు అతడిని అడ్డగించాడు.

**ఆ. నృపతితోడఁ గూడి కృపుఁడును నెడ సొచ్చె । వార లతనిఁ బట్టి 'వలదు రోష**
**ముడుగ వలయు' ననిన నుగ్రత నాతఁడు । పెనఁగఁ గర్ణుఁ డిట్టు లనియెఁ గనలి. 107**

**ప్రతిపదార్థం:** నృపతి తోడన్+కూడి= దుర్యోధనుడితో కూడుకొని; కృపుఁడునున్= కృపాచార్యుడు కూడా; ఎడ+చొచ్చెన్= అడ్డువచ్చాడు; వారలు= ఆ దుర్యోధన కృపులు; ఆతనిన్= ఆ అశ్వత్థామను; పట్టి= (పోకుండా) పట్టుకొని; రోషము= కోపం; ఉడుగవలయున్= మానాలి; అనినన్= అని అంటూ ఉంటే; ఆతఁడు= ఆ అశ్వత్థామ; ఉగ్రతన్= క్రోధంతో; పెనఁగన్= (తప్పుకొని పోవటానికి) పెనగులాడుతూ ఉండగా; కర్ణుఁడు; కనలి= మండిపడి; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడితోపాటు కృపాచార్యుడు కూడా వచ్చి అడ్డుపడి కోపం పనికిరాదని కోపాన్ని విడువుమని చెప్పినా అశ్వత్థామ వినకుండా, కోపోద్రిక్తుడై పెనగులాడుతుంటే, కర్ణుడు కోపంతో ఇట్లా అన్నాడు.

**క. 'విడు విడు మాతం డిమ్మెయి । నడిచిపడఁగ నేల పట్టె దవనీశ్వర! నీ**
**వుడిపెడు తెఱఁగున నా బిరు । దుడుగునె నా చేయిదాఁకి యుడిగిన భంగిన్?' 108**

**ప్రతిపదార్థం:** అవనీశ్వర!= ఓ రాజా! (దుర్యోధనా!); విడు విడుము= (ఆ అశ్వత్థామను) విడిచివేయండి; ఆతండు= ఆ అశ్వత్థామ; ఈ+మెయిన్= ఈ విధంగా; అడిచి పడఁగన్= మిడిసిపడుతూ ఉంటే; ఏల పట్టెదు?= ఎందుకు పట్టుతావు?; ఆ బిరుదు= ఆ శూరుడు; నా చేయి= నా చేతిదెబ్బ; తాఁకి= తగిలి; ఉడిగిన భంగిన్= నశించే విధంగా; నీవు= దుర్యోధనుడు; ఉడిపెడి తెఱఁగునన్= మాన్పే పద్ధతితో; ఉడుగునె?= నశిస్తాడా? (నశించడని భావం).

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! ఆ అశ్వత్థామ అంతగా మిడిసిపడుతూ ఉంటే ఆపటమెందుకు? వదలుము! వదలుము! నా చేతిదెబ్బ తగిలి ఆగినట్లుగ నీవు ఆపే పద్ధతిలో ఈ వీరుడు ఆగుతాడా?

**క. అనుడుఁ గృపాచార్యుం డి । జ్జన పతికిం గాఁగ నేను సైరించిన నే**
**మని పలికితేని నీకుం । జనియెం; బొ మ్మింక వలదు సంభ్రమ మనియెన్. 109**

**ప్రతిపదార్థం:** అనుడున్= ఇట్లా పలుకగానే; కృపాచార్యుండు= అశ్వత్థామ మేనమామ; ఈ+జనపతికిన్+కాఁగన్= ఈ రాజుకు కాబట్టి (ఈ దుర్యోధనుడి ప్రయోజనార్థమై); ఏను= నేను; సైరించినన్= సహిస్తూ ఉంటే; ఏమి+అని= ఏ మాట (ఏదో అని భావం. ఏ మాట మాట్లాడినా దాని మంచి చెడులలో వివక్ష లేదనే అర్థాన్ని 'అని' ఏమి అనే పదంతో చేరి సూచిస్తూ ఉండటం లోకవ్యవహారం); పలికితి(వి)+ఏనిన్= మాట్లాడినా కూడా; నీకున్= (కర్ణుడికి); చనియెన్= చెల్లింది; పొమ్ము= నిశ్చయం; ఇంక= ఇక; సంభ్రమము= సంక్షోభం; వలదు= వద్దు; అనియెన్= అని పలికాడు.

**తాత్పర్యం:** అనిన వెంటనే కర్ణుడితో కృపాచార్యుడు 'ఈ రాజును చూచి నిన్ను క్షమించాను కాబట్టి నీ వేమి మాట్లాడినా చెల్లింది. ఇంక అలజడి వద్దు, పొమ్ము!' అని అన్నాడు.

**వ. అప్పు డక్కురుపతి గురుపుత్త్రు నుద్దేశించి. 110**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయాన; ఆ+కురుపతి= ఆ కురురాజు దుర్యోధనుడు; గురుపుత్రున్= ఆచార్యపుత్రుడైన అశ్వత్థామను; ఉద్దేశించి= గురించి.

**తాత్పర్యం:** ఆ సందర్భంలో ఆచార్య కుమారుడయిన అశ్వత్థామతో దుర్యోధనుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'గురుఁడును నీవును మద్రే। శ్వరుఁడును గర్ణుండు గృపుఁడు సౌబలుఁడు ననున్**
**ధర యేలింపఁగ నున్నా। రరు; మీకుం దగునె సంగరములోఁ గలఁగన్. 111**

**ప్రతిపదార్థం:** గురుఁడును= ఆచార్యుడు (ద్రోణుడు); నీవును= (అశ్వత్థామ); మద్రేశ్వరుఁడును= మద్రదేశాధిపతి(శల్యుడు); కర్ణుండున్= కర్ణుడు; కృపుఁడు= కృపాచార్యుడు; సౌబలుఁడు= శకుని; (మీరందరు) ననున్= నన్ను; ధర= భూమి; ఏలింపఁగన్+ ఉన్నారరు= పాలింపజేయటానికున్నారు; సంగరములోన్= యుద్ధంలో; కలఁగన్= కలవరపడటానికి; మీకున్= మీకందరికీ; తగునె? = తగుతుందా?

**తాత్పర్యం:** 'ఓ అశ్వత్థామా! ఆచార్యుడు మీ తండ్రి, ఆచార్యపుత్రుడవు నీవు, శల్యుడు, కర్ణుడు, కృపాచార్యుడు, మా మామ శకుని, మీరందరూ నాతో ఈ భూమండలాన్ని పరిపాలింపజేయటానికే ఉన్నారు. మీరు కలహించుకొని యుద్ధంలో సంక్షోభం సృష్టించటం మీకు తగుతుందా?

**క. క్షమియింపు' మనుడు నతఁ డురు। శమ మొందినఁ గర్ణుఁడుం బ్రశాంతుం డై వి**
**క్రమకేళి సలుపఁ బ్రతిసై। న్యము దెస మొగమయ్యెఁ బటుగుణధ్వని సెలఁగన్. 112**

**ప్రతిపదార్థం:** క్షమియింపుము= క్షమించుము; అనుడున్= అనగానే; అతఁడు= ఆ అశ్వత్థామ; ఉరుశమము= శాంతిని; ఒందినన్= పొందగా (శాంతించగానే అని భావం); కర్ణుఁడున్= కర్ణుడు కూడా; ప్రశాంతుండు+ఐ= శాంతించినవాడై; విక్రమకేలి+చలుపన్= పరాక్రమ క్రీడ చేయటానికి (అవలీలగా పరాక్రమించటానికి అని భావం); పటుగుణధ్వని= బిగువైన అల్లెత్రాటి టంకారధ్వని; చెలఁగన్= చెలరేగుతూ ఉండగా; ప్రతిసైన్యముదెస మొగము+అయ్యెన్= శత్రుసైన్యాభిముఖుడయ్యాడు.

**తాత్పర్యం:** కర్ణుడిని క్షమించండి' అని అనగానే దుర్యోధనుడి మాట ప్రకారం అశ్వత్థామ శాంతించాడు. కర్ణుడు కూడా శాంతించి, ఇక ధనుష్టంకారం చేస్తూ యుద్ధం చేయటానికి శత్రుసైన్యాభిముఖుడయ్యాడు.

**విశేషం:** ఉస్మానియా ప్రతి ఆదరించిన 'ఉరుశమ' అనే పాఠమే అనుగుణంగా ఉండటంచేత అదే గ్రహించబడింది.

**వ. ఇట్లు గడంగినం బ్రత్యర్థి పార్థివు లయ్యోధవరు నాలోకించి 'పాండవులకుఁ బాటిల్లిన యనర్థంబుల కెల్లను మూలంబు వీఁడ కాఁడె!, వీనిం బొదువుఁడు, పోనీకుఁడు, పడవైవుం' డనుచు దలపడిన నా సూతసూనుఁడు నిజనామాంకితంబులగు నారాచంబుల నన్నరపతులఁ గరుల నరులఁ దురంగంబుల నరదంబుల రూపుమాపి యేపునఁ దదీయాంగంబులు రుధిరంబున మునుంగునట్లు సేసినం జూచి సవ్యసాచి సాయకజాలంబులు**

**నిగిడించుచుం గవిసిన నతండు మూఁడు మార్గణంబులు దన తనువునఁ జొనుపుటయుం గినిసి యక్కిరీటి ముప్పది శరంబుల నొప్పించి భుజ శిఖరంబున బలు నారసంబులు నాఁటించినం జేతి విల్లు వడియెం; బడుటకుఁ దలంకక యక్కర్ణుం డాక్షణంబ విల్లు పుచ్చుకొని వివ్వచ్చుండు వెడంగుపడునట్టి వేగంబున వివిధ విశిఖంబులు నిగిడించిన. 113**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; కడంగినన్= తలపడుతూ ఉండగా; ప్రత్యర్థి పార్థివులు= శత్రురాజులు; ఆ+యోధవరులన్= ఆ వీరశ్రేష్ఠులను; ఆలోకించి= చూచి; పాండవులకున్= మన ధర్మరాజాది పాండవులకు; పాటిల్లిన= కలిగినటువంటి; అనర్థంబుల కున్+ఎల్లను= అనర్థాలన్నింటికి; మూలంబు= కారణం; వీఁడు+అ= వీడే (ఈ కర్ణుడే); కాడు+ఎ?= కాడా?; వీనిన్= ఈ కర్ణుడిని; పొదువుఁడు= క్రమ్మండి; పోనీకుఁడు= తప్పించుకొనిపోకుండా చూడండి; పడవైవుండు= (కొట్టి క్రింద) పడవేయండి; అనుచున్= అంటూ; తలపడినన్= యుద్ధానికి సిద్ధపడగా; ఆ సూత సూనుఁడు= ఆ సూతపుత్రుడు కర్ణుడు; నిజనామ+అంకితంబులు+అగు= తన పేరు ముద్రించబడి ఉన్నటువంటి; నారాచంబులన్= బాణాలతో; ఆ+నరపతులన్= ఆ శత్రురాజులను; కరులన్= ఏనుగులను; నరులన్= సైనికులను; తురంగంబులన్= గుర్రాలను; అరదంబులన్= రథాలను; రూపుమాపి= నశింపజేసి; ఏపునన్= అధికంగా; తదీయ+అంగంబులు= ఆ చతురంగబలాల శరీరాలు; రుధిరంబునన్= రక్తంలో; మునుంగునట్లు= మునిగిపోయేటట్లు; చేసినన్= చేయగా; చూచి= గమనించి; సవ్యసాచి= అర్జునుడు; సాయకజాలంబులు= బాణాలసమూహాలు; నిగిడించుచున్= ప్రయోగిస్తూ; కవిసినన్= ఎదుర్కొనగా; అతండు= ఆ కర్ణుడు; మూఁడు మార్గణంబులు= మూడు బాణాలను; తన తనువునన్= తన శరీరంలో; చొనుపుటయున్= క్రుచ్చుకొనేటట్లు వేయగా; కినిసి= కోపించి; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; ముప్పది శరంబులన్= ముప్పై బాణాలతో; నొప్పించి= నొప్పి కలిగేటట్లు కొట్టి; భుజ శిఖరంబునన్= భుజ శిరస్సుపై; బలు నారసంబులు= దృఢములైన బాణాలు; నాటించినన్= క్రుచ్చుకొనేటట్లు చేయగా; చేతివిల్లు= చేతిలో ఉన్న ధనుస్సు; పడియెన్= క్రిందపడ్డది; పడుటకున్= పడినందుకు; తలంకక= బాధపడక; ఆ+కర్ణుండు; ఆ క్షణంబు+అ= వెంటనే; విల్లు= ధనుస్సును; పుచ్చుకొని= తీసికొని;వివ్వచ్చుండు= బీభత్సుడు - అర్జునుడు (కూడా); వెడంగు పడునట్టి= ఆశ్చర్యపడేటటువంటి; వేగంబునన్= వేగంతో; వివిధ విశిఖంబులు = పలురకాలైన బాణాలు; నిగిడించినన్= వ్యాపింపజేస్తూ ఉండగా.

**తాత్పర్యం:** ఇట్లా కర్ణుడు యుద్ధోన్ముఖుడై వస్తూ ఉండగా శత్రురాజులు అతడిని చూచి (అనగా పాండవపక్షీయులైన వారు). 'మన పాండవులకు ఇన్ని అనర్థాలు కలిగాయంటే అన్నింటికీ వీడే కారణం. ఇంకా చూస్తారేమి? వీనిని ఆక్రమించండి. పారిపోనీకండి, పడగొట్టండి' అని పలుకుతూ కర్ణుడితో యుద్ధానికి తలపడ్డారు. కర్ణుడు ఆ శత్రురాజులను, చతురంగబలాలను తనపేరు చెక్కబడిన బాణాలతో గాయపరిచి నెత్తుటితో వారి శరీరాలు మునిగేటట్లు చేశాడు. అది చూచిన సవ్యసాచి అనేక బాణాలు ప్రయోగిస్తూ కర్ణుడిని ఎదుర్కొన్నాడు. కర్ణుడు అర్జునుడిని మూడుబాణాలతో కొట్టగా అర్జునుడు కర్ణుడిని ముప్పైబాణాలతో నొప్పించటమే గాక అతడి భుజం కొసన బలువైన బాణాలు నాటాడు. దానితో ఆ కర్ణుడి చేతివిల్లు క్రిందికి జారిపడింది. అందుకు కర్ణుడు కలత చెందక వెంటనే వేరొకవిల్లు పుచ్చుకొని అర్జునుడికి ఆశ్చర్యం కలిగేవిధంగా వివిధ బాణాలను ప్రయోగించగా (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** బీభత్సుడు అనే పదానికి తెలుగులో వివ్వచ్చుడు అనే పదం (వికృతి) - యుద్ధరంగాన్ని శత్రుసైన్య రక్తమాంసాదులచేత బీభత్సంగా చేసేవాడు కాబట్టి అర్జునుడికి ఆ పేరు. అట్టి అర్జునుడే కర్ణుడి బాణవేగం చూచి ఆశ్చర్యపడ్డాడంటే ఇక కర్ణుడి ఇప్పటి యుద్ధం తీరు అనన్యాదృశం అనే భావం వ్యక్తమవుతూ ఉన్నది. కాబట్టి 'వివ్వచ్చుడు' అనే పదం ఇక్కడ సార్థకం. ఇది పదద్యోత వస్తుధ్వని.

మ. కడక న్నెఱ్ఱనిచెల్వుఁ దాల్ప నతఁ డుగ్రస్ఫూర్తి విల్ ద్రుంచి యె
క్కుడు వేగంబున సూతుమస్తకముతోఁ గూడం దురంగాంగముల్
గడికండంబులు సేసి యా రథికుమైఁ గాఁడంగఁ బెక్కమ్ము లే
యుడు నొవ్వారినఁ బాఱి యెక్కెఁ గృపుతే రుర్వీశ! నిర్లజ్జుఁ డై. 114

**ప్రతిపదార్థం:** ఉర్వీశ!= ఓ ధృతరాష్ట్ర మహారాజా! కడకన్ను= కనుకొలుకు; ఎఱ్ఱని చెల్వున్= ఎరుపువన్నె అందాన్ని; తాల్పన్= పొందగా; అతఁడు= ఆ అర్జునుడు; ఉగ్రస్ఫూర్తిన్= భయంకరమైన స్ఫురణతో, అనగా చూచేవారికి భయం గొలిపే ఆకారంతో; విల్= విల్లును; త్రుంచి= తెగగొట్టి; ఎక్కుడు వేగంబునన్= మిక్కిలి వేగంతో; సూతుమస్తకముతోన్+కూడన్= సారథి శిరస్సుతోపాటు; తురంగ+అంగముల్= అశ్వాల శరీరాలను; కడికండంబులు+చేసి= ముక్కలు ముక్కలుగా చేసి; ఆ రథికుమైన్= ఆ రథికుడి అనగా కర్ణుడి శరీరాన; కాఁడంగన్= నాటుకొనే విధంగా; పెక్కు+అమ్ములు= వివిధ బాణాలను; ఏయుడున్= వేయగానే; నొవ్వు+ఆరినన్= నొప్పి నిండగా - నొప్పి మిక్కిలి కలుగగా అని భావం; పాఱి= పారిపోయి; (కర్ణుడు) నిర్లజ్జుఁడు+ఐ= సిగ్గులేనివాడై; కృపుతేరు= కృపాచార్యుడి రథాన్ని; ఎక్కెన్= ఎక్కాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడి కనుకొలకు అతి క్రోధంతో ఎఱ్ఱబారగా, భయంకరమైన తేజస్సుతో మిక్కిలి వేగంగా కర్ణుడి ధనుస్సును త్రుంచివేశాడు. సారథి శిరస్సుతోపాటు గుఱ్ఱాల శరీరాలను తుత్తునియలుగా చేసి, ఆ కర్ణుడి శరీరాన్ని బాణాలతో నింపివేశాడు. కర్ణుడు ఆ బాణఘాతాల నొప్పికి ఆగలేక పారిపోయి, సిగ్గు విడిచి కృపుడి రథంపైకి ఎక్కినాడు. (తాను కృపాచార్యులను ఇంతకుముందు అనరాని మాటలన్నాడు. ఆలాంటి కృపాచార్యుడి రథంపైకి ఎక్కుతున్నాననే సిగ్గుకూడా కర్ణుడికి అప్పుడు లేకుండా పోయింది.)

వ. ఇవ్విధంబున రాధేయుం డోడి పాఱిన నీడంబోవు మన సైనికులం గనుంగొని కురువిభుండు. 115

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; రాధేయుండు= కర్ణుడు; ఓడి= పరాజయాన్ని పొంది; పాఱినన్= పారిపోగా; ఈడంబోవు= వెనుదిరిగిపోతున్న; మన సైనికులన్= మన సైనికులను; కనుంగొని= చూచి; కురువిభుండు= దుర్యోధనుడు.

**తాత్పర్యం:** ఇట్లా కర్ణుడు పరాభూతుడై పారిపోగానే మన సైనికులు కూడా వెనుదిరిగిపోవటాన్ని గమనించి దుర్యోధనుడు (తరువాతి పద్యంతో అన్వయం).

క. 'నిలువుఁడు; వెఱపేటికి నేఁ । గలుగఁగ? గాండీవిఁ దక్కుఁ గల పాండవులన్
గెలిచెద నిదె చూడుఁడు నా । యలవుఁ జలము' ననుచు నడచె నన్నరుమీఁదన్. 116

**ప్రతిపదార్థం:** నిలువుఁడు= (పారిపోక) నిలవండి; నేన్= నేను; కలుగఁగన్= ఉండగా; వెఱపు= భయం; ఏటికిన్?= ఎందుకు?; గాండీవిన్= గాండీవ ధనుర్ధారి అయిన అర్జునుడిని; తక్కున్+కల= మిగిలిన; పాండవులన్= పాండవులను; గెలిచెదన్= గెలుస్తాను; ఇదె= ఇదిగో; నా+అలవున్= నా సామర్థ్యాన్ని; చలమున్= పట్టుదలను; చూడుఁడు= చూడండి; అనుచున్= అని అంటూ; ఆ+నరుమీఁదన్= ఆ అర్జునుడిపైకి; నడచెన్= (యుద్ధానికి) వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ఓ సైనికులారా! పారిపోకండి. నిలువండి. నేనున్నాను కదా! భయమెందుకు? ఆ అర్జునుడినీ, తక్కిన పాండవులనూ గెలుస్తాను. ఇదిగో! నా శక్తి, నా పట్టుదల చూతురుగాని' అని పలుకుతూ ఆ అర్జునుడిపైకి యుద్ధానికి వెళ్ళాడు.

వ. అప్పుడు కృపాచార్యుం డాచార్యనందనున కి ట్లనియె. 117

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కృపాచార్యుండు= కృపాచార్యుడు; ఆచార్యనందనునకున్= అశ్వత్థామతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు యుద్ధానికి వెళ్ళటం గమనించిన కృపాచార్యుడు అశ్వత్థామను చూచి ఇట్లా అన్నాడు:

**చ. 'శలభము వహ్నిమీఁదఁ జను చందము గాదె! నృపాలుఁ డర్జునుం**
**దలపడఁ బోక; యాతని శితప్రదరంబుల బారి కగ్గ మై**
**యెలసినఁ గావఁగా వశమె? యీతని నీవును నేను నుండి మొ**
**క్కలమునఁ బోవనీఁ; దగదు గ్రమ్మన నెయ్యుము నిల్పు మవ్విభున్.' 118**

**ప్రతిపదార్థం:** నృపాలుఁడు= దుర్యోధనుడు; అర్జునున్= అర్జునుడిని; తలపడన్+పోక= ఎదుర్కొనటానికి వెళ్ళటం; శలభము= మిడుత; వహ్నిమీఁదన్= అగ్నిపైకి; చనుచందము= వెళ్ళేవిధం; కాదె?= కాదా? (అవుతుందని భావం) శలభం (మిడుత) దీపపు శిఖను చూచి పండుగా భ్రమించి దానిని పట్టుకొనటానికి వెళ్ళి ఆ అగ్నిలో పడి చస్తుంది. కాబట్టి దుర్యోధనుడు అర్జునుడిని జయిస్తానని వెళ్ళటం శలభం మంటపైకి వెళ్ళటం వంటిదే అవుతుందని భావం; ఆతని శితప్రదరంబుల బారిన్= ఆ యర్జునుడి తీక్ష్ణములైన బాణాల గురికి; అగ్గము+ఐ= అధీనమై; ఎలసినన్= (అర్జునుడికి) వశమైన ఎడల; ఈతనిన్= ఈ దుర్యోధనుడిని; నీవును= (అశ్వత్థామ); నేనున్= (కృపాచార్యుడు); ఉండి= ఉండి కూడా; (ఆ దుర్యోధనుడికి రక్షణగా నిలిచి కూడా అని భావం); కావఁగాన్= కాపాడటానికి; వశమె?= వశమవుతుందా? కాదని భావం. (కాబట్టి) నీవును, నేనును ఉండి కూడా; ఈతని; మొక్కలమునన్= పౌరుషానికి; పోవన్+ఈన్+తగదు= పోనీయటం యుక్తంకాదు; క్రమ్మనన్= శీఘ్రంగా; ఎయ్యుము= వెంబడిం చుము; ఆ+విభున్= ఆ దుర్యోధనుడిని; నిల్పుము= ఆపుము.

**తాత్పర్యం:** దుర్యోధనుడు అర్జునుడితో తలపడటానికి వెళ్ళటమంటే మిడుత నిప్పుమీదికి వెళ్ళటంవంటిదే కదా! నీవు, నేను ఉన్నా దుర్యోధనుడు అర్జునుడి వాడిబాణాల బారినపడి చిక్కుకొంటే, ఇతడిని కాపాడటం సాధ్యమా? ఇతడిని పౌరుషంతో వెళ్ళనీయటం తగదు. వెంటనే అతడిని వెంబడించి ఆపుము.

**విశేషం:** ఈతని 'నీవును నేను నుండి' అనే వాక్యం దేహలీదత్త దీపన్యాయంగా వెనకవాక్యంలో ముందువాక్యంలో కూడా అన్వయిస్తుంది. కాబట్టి నీవు నేను ఉండి కూడా ఈతడిని కావగా వశమె? అని, నీవూ నేనూ ఉండగా ఈతడిని స్వయంగా యుద్ధానికి వెళ్ళనివ్వటం యుక్తం కాదు అని అభిప్రాయం ఏర్పడుతుంది.

**క. అనుటయు గురునందనుఁ డ । మ్మనుజాధిపు నెయిది 'యేను మాన్చెద బీ**
**భత్సుని కడఁక; యేమి మూఁడినఁ । జనియెదు తల కడచి సాహసక్రియ?' ననుడున్. 119**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; గురునందనుఁడు= అశ్వత్థామ; ఆ+మనుజాధిపున్= ఆ రాజును (దుర్యోధనుడి); ఎయిది= వెంబడించి; (దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు); ఏను= నేను; బీభత్సుని కడఁక= అర్జునుడి విజృంభణాన్ని; మాన్చెదన్= అరికడతాను; ఏమి= ఏ అనర్థం; మూఁడినన్= వాటిల్లగా; తలకడచి= అతిక్రమించి; సాహసక్రియన్= సాహసకార్యానికి; చనియెదు?= వెళ్ళుతావు?; అనుడున్= అనగానే.

**తాత్పర్యం:** ఈ విధంగా కృపాచార్యుడు పలుకగానే అశ్వత్థామ దుర్యోధనుడిని అడ్డగించి ఇట్లా అన్నాడు: 'నేను ఆ అర్జునుడి విజృంభణాన్ని అణచివేస్తాను. ఏ కీడు కలిగిందని నీవు అతిక్రమించి సాహసంతో వెళ్ళుతున్నావు అని అనగా.

ఆ. 'గురుఁడు పాండవులకుఁ గూర్చు; నీవును దానిని । నెఱిఁగి బవరమున నుపేక్ష సేయు;
దిది మదీయ భాగ్యహీనత గాక నీ । వేచితేని నెవ్వ రెదురు సెపుమ! 120

**ప్రతిపదార్థం:** గురుఁడు= ఆచార్యుడు (ద్రోణుడు); పాండవులకున్= ధర్మరాజాదులకు; కూర్చున్= ప్రియాన్ని చేస్తాడు; నీవును= నీవుకూడా; దానిన్= ఆ విషయాన్ని; ఎఱిఁగి= తెలిసికొని; బవరమునన్= యుద్ధంలో; ఉపేక్ష= అశ్రద్ధ; చేయుదు(వు)= చేస్తావు; ఇది= నీవట్లా చేయుటం; మదీయ భాగ్యహీనత= నా దురదృష్టం; కాక= అలాకాకుండా (ఉపేక్ష చేయక అని భావం); నీవు+ ఏచితి(వి)+ఏనిన్= నీవు విజృంభిస్తే; ఎవ్వరు+ఎదురు?= ఎవ్వరు ఎదురుగా నిలుస్తారు? (నిన్ను ఎదిరించి పోరాడే వీరు లెవ్వరూ లేరని భావం); చెపుమ!= చెప్పుమా!

**తాత్పర్యం:** ద్రోణాచార్యులకు పాండవులంటే ఇష్టం. అది తెలిసి నీవు కూడ యుద్ధంలో అశ్రద్ధ చూపుతావు. అట్లా నీవు ఉపేక్షించటం నా దురదృష్టం. ఒకవేళ నీవు ఉపేక్ష చేయక శ్రద్ధగా శక్తినంతా ధారపోసి యుద్ధంలో విజృంభిస్తే, నీ కెదురుగా యుద్ధంచేసే వీరులెవరైనా ఉన్నారా? నీవే చెప్పుము.

క. పలువురు బంధులు నాకై । పొలిసిరి; మీరింకఁ బాండుపుత్రుల దెస రా
వలవదు; పాంచాలాదుల । వలన నిలిచి గెలువుఁ డేను వారలఁ దీర్తున్.' 121

**ప్రతిపదార్థం:** పలువురు= అనేకులైన; బంధులు= బంధువులు; నాకై= నాకొరకు; పొలసిరి= మరణించారు; ఇంకన్= మరి; మీరు= నీవు, మీవారు; పాండుపుత్రుల దెస(న్)= పాండవులవైపునకు; రావలవదు= రావద్దు; పాంచాల+ఆదులవలనన్= ద్రుపదరాజు మొదలైనవారు ఉన్నదిక్కుగా; నిలిచి= ఉండి; గెలువుఁడు= గెలువండి; ఏను= నేను; వారలన్= ఆ పాండవులను; తీర్తున్= నశింపజేస్తాను.

**తాత్పర్యం:** ఎంతోమంది బంధువులు నాకొరకు పోరాడి నశించారు. మీరికమీద పాండవులవైపునకు రావద్దు. ద్రుపదరాజు మొదలగు వారితో యుద్ధంచేసి గెలువండి. నేను పాండవులతో యుద్ధం చేస్తాను. వారినిసంహరిస్తాను.'

వ. అనిన విని యశ్వత్థామ భూమీశ్వరున కిట్లనియె: 122

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని; అశ్వత్థామ= అశ్వత్థామ; భూమీశ్వరునకున్= రాజునకు (దుర్యోధనుడితో); ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు అట్లా పలుకగా విని, అశ్వత్థామ అతనితో ఈ విధంగా అన్నాడు:

క. గురునకు నాకును బాండవు । లరయఁగఁ గూరిమికిఁ బాత్ర మగుదుర యైనన్
దురమునఁ జుట్టఱికంబను । గరు సిడికొను టేల కలుగుఁ? గౌరవనాథా! 123

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ఓ కురురాజా దుర్యోధనా!; గురునకున్= ద్రోణాచార్యులకు; నాకును= (అశ్వత్థామకు); అరయఁగన్= విచారిస్తే; పాండవులు= ధర్మరాజాదులు; కూరిమికిన్= ప్రేమకు; పాత్రము+అగుదురు+అ= తగినవారే; ఐనన్= అయినాకూడా; దురమునన్= యుద్ధంలో; చుట్టఱికంబు+అను= బంధుత్వమనే; గరుసు= మర్యాద; ఇడికొనుట= ఇచ్చికొనటం; ఏల= ఎట్లు; కలుగున్?= కలుగుతుంది?

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! ద్రోణాచార్యుడికీ, నాకూ పాండవులు ఇష్టులే. అయినా యుద్ధంలో బంధుత్వాలు లెక్కకేల వస్తాయి?

ఉ. పెక్కు రణంబులం గనియుఁ బెద్దయు నమ్మవు నన్ను మద్గురుం

**దక్కినవారు మేము విను దాఁపము ప్రాణము లోపినట్లు పే**
**రుక్కునఁ బోర దైవగతి యున్నటు లుండెడుఁ గాక; పాండవుల్**
**మిక్కిలివారు నీ తలఁపు। మే గెలువన్ వశమే మహీశ్వరా!** 124

**ప్రతిపదార్థం:** ఓ మహీశ్వరా!= ఓ రాజా!; పెక్కురణంబులన్= అనేక యుద్ధాలను; కనియున్= చూచికూడా; పెద్దయున్= పెద్దగా; నన్నున్ (అశ్వత్థామను); మద్గురున్= నా తండ్రి ద్రోణాచార్యులను; నమ్మవు= నమ్మటం లేదు; తక్కినవారున్= మిగిలినవారును; మేమున్= మేమును; ప్రాణములు= ప్రాణాలు; దాఁపము= దాచుకొనేవారం కాము; విను= వినుము; ఓపినట్లు= చేతనయినంతవరకు; పేరు+ఉక్కునన్= మిక్కిలి పౌరుషంతో; పోరన్= యుద్ధంచేయగా; దైవగతి= దైవం పోకడ; ఉన్నటులు= ఉండే తీరుగా; ఉండెడున్+కాక= ఉండనీ (దైవం తలచినట్లే జరిగేదేదో జరుగనీ, మా ప్రయత్నలోపం మాత్రం లేదని భావం); (ఎందుకనగా) పాండవుల్= పాండవులు; మిక్కిలివారు= అధికులు; నీ తలఁపు= నీ అభిప్రాయం; మే= ప్రకారం; గెలువన్ వశమే?= గెలుపు సాధ్యమవుతుందా? (సాధ్యం కాదని భావం)

**తాత్పర్యం:** 'ఓ రాజా! ఎన్నో యుద్ధాలలో నన్ను, మా తండ్రిని ద్రోణాచార్యులను విక్రమిస్తూ ఉంటే చూచి కూడా నీవు అంతగా నమ్మటం లేదు. మేముకాని, ఇతరులుకాని ప్రాణాలు దాచుకొని యుద్ధం చేసేవారం కాము. శ్రద్ధగా విను. మాకు సాధ్యమయినంతవరకు మహాపౌరుషంతో యుద్ధం చేస్తాం. ఆపై దైవం ఏం తలిస్తే అట్లా జరుగుతుంది. పాండవులు మిక్కిలి బలపరాక్రమశాలులు. నీ అభిప్రాయం ప్రకారం వారిని మేము జయించటం సాధ్యమను కొంటున్నావా?

**వ. మా కిరువురకుం దోడు కృప కర్ణ కృతవర్మ మద్రపతులు గల రెట్లును బాండవ సైన్యంబు సమయింతు; మూఁడడు' మని వెండియు.** 125

**ప్రతిపదార్థం:** మాకున్+ఇరువురకున్= మా ఇద్దరికి; తోడు= సహాయంగా; కృప-కర్ణ-కృతవర్మ-మద్రపతులు= కృపాచార్యులు, కర్ణుడు, కృతవర్మ, శల్యుడు, కలరు= ఉన్నారు; ఎట్లును= ఏ విధంగానైనా; పాండవ సైన్యంబు= పాండవుల సైన్యాన్ని; సమయింతుము= నశింపజేస్తాము; ఊఁఱడుము= ఊరడిల్లండి; అని= ఇలా పలికి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** మా ఇద్దరికి తోడుగా కృపాచార్యులు, కర్ణుడు, కృతవర్మ, మద్రదేశాధిపతి శల్యుడు ఉన్నారు. పాండవ సైన్యాన్ని ఎలాగయినా నశింపజేస్తాము. మీరు శాంతించండి' అని పలికి మళ్ళీ (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'మమ్మ కాదు నీ వెవ్వరి నమ్మ; వెట్లు। నమ్మకున్నను నే మగు? నరవరేణ్య!**
**ప్రతిబలంబుల లోనికిఁ బసుల నడుమ। సొచ్చు పులివోలెఁ జొచ్చెదఁ జూడు నన్ను.** 126

**ప్రతిపదార్థం:** నరవరేణ్య!= ఓ దుర్యోధనా!; నీవు; మమ్ము+అ కాదు= మా ముగ్గురినే కాదు; ఎట్లు= ఏ విధంగానైనా; ఎవ్వరిన్= ఎవ్వరిని కూడా; నమ్మవు= విశ్వసించవు; నమ్మక+ఉన్నను= నమ్మకపోయినప్పటికీ; ఏమి+అగున్?= ఏమవుతుంది? (నీవు విశ్వసించినా విశ్వసించకున్నా మా కర్తవ్యంలో ఏ మార్పు లేదని భావం); ప్రతిబలంబులలోనికిన్= శత్రుసైన్యాల లోపలికి; పసుల నడుమ+చొచ్చుపులి వలెన్= పశువుల మధ్యన చొచ్చే పెద్దపులి వలె; చొచ్చెదన్= ప్రవేశిస్తాను; నన్నున్ (అశ్వత్థామను); చూడు!= చూడుమా! (శత్రుసైన్యంలోనికి నేనెలా ప్రవేశించి విక్రమిస్తానో చూడుమని భావం).

**తాత్పర్యం:** ఓ రాజా! నీవు మమ్మేకాదు. ఎవ్వరినీ కూడా ఎట్లాగూ నమ్మవు. అయినా నీ నమ్మికతో మా కేమి

పని? ఇదిగో నే నిప్పుడు శత్రుసైన్యంలోనికి పశువులమంద నడుమ పులి ప్రవేశించినట్లు చొచ్చుకొనిపోయి విక్రమిస్తాను చూడుము.

**విశేషం:** అలం: ఉపమ. 'పసుల నడుమ సొచ్చు పులివోలె' అనే చోట ఉపమాలంకారం - దీనితో క్షణంలో శత్రుసైన్యసంహారం చేయటం ధ్వనిస్తూ ఉన్నది.

**వ. నీచెప్పిన పాంచాలురం బఱపెదఁ, దక్కిన బలంబులం గలంచెదం; గౌంతేయులు దార్కొనినను మార్కొని నిలువరించెద' నని పలికి తలకడచి నడచె; నప్పుడు గడంగిన కవ్వడికి మించి పాంచాల కేకయ ప్రభృతిసేన లొక్కపెట్ట కవియుటయు, నా జెట్టి బిరుదు వివిధ విశిఖ పరంపరలు పరగించినన్ బడలు వడియును బలుదెసలం బాఱియు నబ్బలంబులు వికలంబు లైనఁ బదుండ్రు రాజులు నిలు నిలు మనుచుఁ బరవసంబు సేసిన, వారల జముని వశంబు సేసి యేచిన యయ్యాచార్యసుతుం జూచి రోషావిష్టుండై ధృష్టద్యుమ్నుండు దాఁకి 'నీవు గొందఱ నిర్జించితి నని దుర్జయత్వం బెక్కించుకొనకు; మేను జుమ్ము వచ్చినవాఁడ'ననుటయు నతండు 'నిన్నకాదె వెదకెద మద్బాణంబులకుఁ బ్రాణంబు లిత్తుగా' కనవుడు నప్పాంచాల వరుండతని నుపలక్షించి. 127**

**ప్రతిపదార్థం:** నీ చెప్పిన పాంచాలురన్= నీవు నిర్దేశించినట్టి పాంచాలవీరులను; పఱపెదన్= పారిపోయేటట్లు చేస్తాను; తక్కిన బలంబులన్= మిగిలిన సైన్యాలను; కలంచెదన్= నొప్పిస్తాను; కౌంతేయులు= పాండవులు; తార్కొనినను= సమీపించినప్పటికీ; మార్కొని= ఎదిరించి; నిలువరించెదన్= కదలకుండా చేస్తాను; అని= ఈ విధంగా; పలికి= చెప్పి; తలకడచి= అతిక్రమించి; నడచెన్= వెళ్ళాడు (దుర్యోధనుడిని దాటవేసి వెళ్ళాడు యుద్ధానికని భావం); అప్పుడు= ఆ సమయాన; కడంగిన కవ్వడికిన్= తలపడుతూ ఉన్న అర్జునుడిని; మించి= అతిక్రమించి (అర్జునుడి కంటే ముందుగా అని భావం); పాంచాల కేకయ ప్రభృతి సేనలు= పాంచాల కేకయ మొదలగు దేశాల సైన్యాలు; ఒక్కపెట్టు+అ= ఒకేసారి; కవియుటయున్= ఎదుర్కొనగా; ఆ జెట్టి బిరుదు= ఆ శ్రేష్ఠవీరుడు (అశ్వత్థామ); వివిధ విశిఖ పరంపరలు= పలువిధాలైన బాణాల వరుసలను; పరఁగించినన్= వ్యాపింప జేయగా; బడలు పడియును= అలసట జెంది; పలుదెసలన్= నాలుగుదిక్కులా; పాఱియున్= పారిపోయి; ఆ+బలంబులు= ఆ సైన్యాలు; వికలంబులు+ఐనన్= చెల్లాచెదరు కాగా; పదుండ్రు రాజులు= పదుగురు (శత్రు) రాజులు; నిలుము+నిలుము+అనుచున్= ఆగు ఆగు అంటూ; బరవసంబు+చేసినన్= ధైర్యం చేయగా, ఎదిరించగా అని భావం; వారలన్= ఆ శత్రురాజులను; జముని వశంబు+చేసి= యముడి (మృత్యు) వశం చేసి - అనగా సంహరించి; ఏచిన+ఆ+ఆచార్యసుతున్= విజృంభిస్తున్న ఆ ద్రోణాచార్యుడి కుమారుడిని (అశ్వత్థామను); చూచి; రోష+ఆవిష్టుఁడు+ఐ= క్రోధావేశం గలవాడై; ధృష్టద్యుమ్నుండు= పాండవ సైన్యాధిపతి అయిన ధృష్టద్యుమ్నుడు; తాఁకి= ఎదుర్కొని; నీవు= ఓ అశ్వత్థామా! నీవు; కొందఱిన్= ఏ కొందరినో; నిర్జించితిన్+అని= జయించానని; దుర్జయత్వంబు= (శత్రువులకు) జయింప శక్యంకాని వాడననే భావాన్ని; ఎక్కించుకొనకుము= ఆరోపించుకొనకుము; ఏను+ చుమ్ము= నేను సుమీ!; వచ్చినవాఁడను= (నిన్ను ఎదుర్కొనటానికి) వచ్చిన వ్యక్తిని; అనుటయున్= అనగానే; అతండు= ఆ అశ్వత్థామ; నిన్నున్+అ= నిన్నే; వెదకెదన్= వెదుకుచున్నాను; కాదు+ఎ!= కాదా!; మత్+బాణంబులకున్= నా బాణాలకు; ప్రాణంబు= (నీ) ప్రాణాన్ని; ఇత్తు+కాక= ఇత్తువుగానీ; అనవుడున్= అనగానే; ఆ+పాంచాల వరుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; అతనిన్= ఆ అశ్వత్థామను; ఉపలక్షించి= చూచి.

**తాత్పర్యం:** నీవు చెప్పినట్లు పాంచాలవీరులైన ధృష్టద్యుమ్నాదులను పారద్రోలుతాను. మిగిలిన సైన్యాలను కలచివేస్తాను. ఒకవేళ పాండవులే ఎదురైనా ఎదిరించి కదలకుండా చేస్తాను' అని దుర్యోధనుడితో అశ్వత్థామ పలికి, దుర్యోధనుడిని దాటవేసి యుద్ధానికి వెళ్ళాడు. ఆ సమయంలో అర్జునుడు తలపడటానికి ఉపక్రమించగా, అతడిని దాటి, పాంచాల కేకయ సైన్యాలు మరి ఇతర సైన్యాలు ఒకేసారి అశ్వత్థామను చుట్టుముట్టాయి. ఆ మహావీరుడైన

అశ్వత్థామ ఆ సైన్యంపై బాణవర్షం కురిపించాడు. దానితో కొంత సైన్యం అలసి సొమ్మసిల్లింది. మరికొంత సైన్యం పారిపోయింది. మిగిలిన సైన్యం చెదరిపోయింది. అది చూచి కొంతమంది శత్రురాజులు 'నిలు నిలు' మని అంటూ ధైర్యం చేసి అశ్వత్థామను ఎదుర్కొన్నారు. వెంటనే అశ్వత్థామ వారినందరినీ యముడివశం చేసి విజృంభించగా, అతడిని చూచి ధృష్టద్యుమ్నుడు. వెంటనే క్రోధావేశంతో అశ్వత్థామతో తలపడి 'అశ్వత్థామా! నీవు ఏ కొందరినో జయించి దుర్జయుడినని అనుకోవద్దు. నీతో యుద్ధం చేయటానికి వచ్చింది నేను సుమా! అని అనగా, అందుకు అశ్వత్థామ 'నిన్నే కదా నేను వెదకుతున్నది. ఇక దొరికావు. నా బాణాలకు నీ ప్రాణాలను ఇత్తువులే!' అని ధృష్టద్యుమ్నుడితో అన్నాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ఆ అశ్వత్థామను చూచి (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'ఏను జుమ్ము వచ్చిన వాఁడన్' ఈ ధృష్టద్యుమ్నుడి వాక్యంలోని 'ఏను' అనే పదం మీ తండ్రి వధకై పుట్టిన ధృష్టద్యుమ్నుడను అనే అర్థం ధ్వనిస్తూ ఉన్నది. ఇది అర్థాంతర సంక్రమిత వాక్యధ్వని. దీనితో 'మీ తండ్రినే సంహరించే శక్తి గల నాకు నీవొక లెక్కా?' అనే అర్థం ధ్వనించటంచేత ఇది వ్యంగ్యార్థంచేత భాసించే అర్థశక్తిమూల ధ్వని.

**క. 'మీ తండ్రికి నే మృత్యువ । నై తోఁచినవాఁడ నగుట యట్లుండె; నినుం**
**జూత మట సనక డగ్గఱు । మా తలఁకక; వలదు రిత్తమాటలు మనకున్. 128**

**ప్రతిపదార్థం:** మీ తండ్రికిన్= మీ తండ్రి ద్రోణాచార్యులకు; నేన్= నేను; మృత్యువను+ఐ= మృత్యుదేవతనై; తోఁచినవాఁడను= ఆవిర్భవించినవాడను; అగుటన్= కావటం; అట్లు+ఉండెన్= అట్లా ఉండనీ; నినున్= నిన్ను; చూతము= చూస్తాం; అట+చనక= అటుగా వెళ్ళక; తలఁకక= భయపడక అనగా ధైర్యంగా; డగ్గఱుమా= దగ్గరికి రా; మనకున్= మన ఇద్దరికి; రిత్తమాటలు= వ్యర్థ ప్రలాపాలు; వలదు= వద్దు.

**తాత్పర్యం:** 'మీ తండ్రి ద్రోణాచార్యులకు నేను మృత్యువుగా అవతరించాను - అది అట్లా ఉండనీ; నీ పరాక్రమ మెంతటిదో చూస్తాము. తొలగిపోక ఇటురమ్ము! మనమధ్య వ్యర్థప్రలాపాలతో పనిలేదు.

**వ. అనియె నట్లయ్యిరువురును నొండొరులం బరుసంబులు పలుకుచుం బలు దెఱంగుల మెఱుంగుటమ్ముల నే ట్లాడి; రట్టియెడ. 129**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని అన్నాడు (ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామతో అన్నాడని భావం); ఇట్లు= ఈ విధంగా; ఆ+ఇరువురును= ఆ ఇద్దరు; ఒండొరులన్= పరస్పరంగా; పరుసంబులు= కఠినమైన మాటలు; పలుకుచున్= మాట్లాడుకొంటూ; పలు తెఱంగుల= అనేక విధాలైన; మెఱుంగు+అమ్ములన్= తళతళ మెరుస్తూ ఉన్న అనగా తీక్ష్ణములైన బాణాలతో; ఏట్లాడిరి= యుద్ధం చేశారు; అట్టి+ఎడన్= అప్పుడు.

**తాత్పర్యం:** అని ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామతో అన్నాడు: ఆ విధంగా వారిద్దరూ పరస్పరం పరుషాలు పలుకుతూ పలురకాలైన వాడిబాణాలతో యుద్ధం చేశారు. ఆ సమయంలో.

**మ. ధనువుం గేతువుఁ ద్రుంచి, సారథిని రథ్యవ్రాతముం గూల్చి, యే**
**పునఁ బాంచాల తనూజు వెల్గొడుగు సొంపున్ వమ్ము గావించి, యా**
**తని పార్శ్వంబుల యోధవీరశతముం దన్మాన్యులన్ ముప్పురం**
**దునిమెన్ ద్రోణసుతుండు రాజు వొగడన్ దోర్వర్గ దుర్వారుఁ డై. 130**

సారథిని= రథసారథిని; రథ్యవ్రాతమున్= రథానికున్న గుఱ్ఱాల సమూహాన్ని (నాలుగు గుఱ్ఱాలను); కూల్చి= కూలజేసి; ఏపునన్= విజృంభణంతో అనగా విజృంభిస్తూ; పాంచాల తనూజు= పాంచాలరాజు కుమారుడైన ధృష్టద్యుమ్నుడియొక్క; వెల్+గొడుగు= శ్వేతచ్ఛత్రంయొక్క; సొంపున్= అందాన్ని; వమ్ముకావించి= వ్యర్థం చేసి - అనగా శ్వేతచ్ఛత్రాన్ని భగ్నంచేసి; ఆతని పార్శ్వంబులన్= ఆ ధృష్టద్యుమ్నుడి ఇరుపార్శ్వాలను అనగా పార్శ్వ రక్షకులను; యోధవీరశతమున్= నూరుగురు వీరయోధులను; తద్+మాన్యులన్= ఆ సేనలో శ్రేష్ఠులైన; ముప్వురన్= ముగ్గురు యోధులను; రాజు= దుర్యోధనుడు; పొగడన్= పొగడేటట్లు; దోర్గర్వదుర్వారుఁడు+ఐ= బాహుబలగర్వంచేత (శత్రువులకు) నివారింపశక్యం కానివాడై; తునిమెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ ధృష్టద్యుమ్నుడి విల్లును, ధ్వజాన్ని తెగగొట్టాడు. సారథిని, రథానికున్న అశ్వాలను కూల గొట్టాడు. ఇంకా విజృంభించి అతడి శ్వేతచ్ఛత్రాన్ని ఖండించాడు. అంతేగాక అతడి పార్శ్వరక్షకులుగా, అతడికై యుద్ధం చేస్తూ ఉన్న నూరుమంది యోధులనేగాక ఆ సైన్యంలో ముఖ్యులైన ముగ్గురు యోధులను బాహుబల గర్వంతో నివారింప సాధ్యంకానివాడై దుర్యోధనుడు పొగడగా విక్రమించాడు.

**వ. ఇవ్విధంబున వైరివధం బాపాదించి సింహనాదంబు సేసిన యశ్వత్థామ కట్టెదుర నిలువలేక పాండవ పాంచాల సైనికులు సెల్లాచెద రైనం గని ధర్మజ సమీరసూనులు ససైన్యంబుగా నతనిం బొదివినం గురుపతియును గురుసమేతుం డయి సేనలతోడ నడరినన్ బలుకయ్యంబయ్యె; నప్పుడు విజయుండును మన ప్రజమీఁదఁ గవిసె; నా సమయంబున నంబష్ఠ శిబివంగాది దేశంబుల బలంబులు భీమసేనుచేత మ్రగ్గె; నా సమయంబున మగధ మద్ర వంగాంబష్ఠాది దేశంబుల బలంబుల సవ్యసాచి సమయించినం గని కినిసి ద్రోణుండు వాయవ్య బాణంబునఁ గౌంతేయుల మొనలఁ జొక్కాకుల చందంబునం దూలం జేసిన.131**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; వైరివధంబు= శత్రుసంహారాన్ని; ఆపాదించి= చేసి; సింహనాదంబు= సింహ నాదాన్ని; చేసిన+అశ్వత్థామ కట్టెదురన్= చేసినటువంటి అశ్వత్థామ ముందర; నిలువలేక= నిలువటానికి సామర్థ్యం లేక;పాండవ పాంచాల సైనికులు= పాండవుల సైన్యాలు, పాంచాల సైన్యాలు కూడా; చెల్లాచెదరు+ఐనన్= మిక్కిలి చెదరిపోగా; కని= చూచి; ధర్మజ సమీరసూనులు= ధర్మతనయ వాయునందనులు (ధర్మరాజు భీముడు - ఈ ఇద్దరు); ససైన్యంబుగాన్= సైన్యంతో సహా (వచ్చి); అతనిన్= ఆ అశ్వత్థామను; పొదివినన్= ఎదిరించగా; కురుపతియును= కురురాజు దుర్యోధనుడు కూడా; గురు సమేతుండు+అయి= ద్రోణాచార్యసహితుడై; సేనలతోడన్= సైన్యంతో (వచ్చి); అడరినన్= విజృంభించగా; బలుకయ్యంబు+అయ్యెన్= గొప్ప యుద్ధం జరిగింది; అప్పుడు= ఆ సమయంలో; విజయుండును= అర్జునుడు కూడా; మన ప్రజమీఁదన్= మన సేనాజనంపై; కవిసెన్= లంఘించాడు; ఆ సమయంబునన్= అదే సమయంలో; మగధ, మద్ర, వంగ, అంబష్ఠ ఆది - దేశంబుల బలంబులు= మగధదేశం, మద్రదేశం, వంగదేశం, అంబష్ఠదేశం మొదలైన దేశాలనుండి వచ్చిన సైన్యాలు; సవ్యసాచి= అర్జునుడు; సమయించినన్= సంహరించగా; కని= చూచి; కినిసి= కోపించి; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; వాయవ్య బాణంబునన్= వాయువు - దేవతగా గలిగిన బాణంతో - అనగా వాయవ్యాస్త్రంతో; కౌంతేయుల మొనలన్= పాండవుల సైన్యాలను; చొక్కాకుల చందంబునన్= ఎండుటాకులవలె; తూలన్+చేసినన్= చెదరిపోయే విధంగా చేయగా.

**తాత్పర్యం:** ఈ విధంగా శత్రుసంహారం చేసి సింహనాదం చేసిన అశ్వత్థామను ఎదిరించి యుద్ధం చేయలేక పాండవ పాంచాల సైనికులు చెల్లాచెదరైపోయారు. అది చూచి ధర్మరాజు భీముడు సేనాసహితంగా వచ్చి అతడిని ఎదుర్కొన్నారు. ఇది గమనించిన దుర్యోధనుడు ద్రోణాచార్యులను వెంట నిడుకొని గొప్ప సైన్యంతో వచ్చి వారిపై విజృంభించాడు. యుద్ధం ఘోరంగా జరిగింది. అప్పుడు అర్జునుడు కూడా మన సైన్యంమీద విజృంభించాడు. అంతలోనే అంబష్ఠ శిబి వంగాది దేశాల సైన్యాలు భీమునిచేత చచ్చాయి. అప్పుడే అర్జునుడు మగధ మద్ర వంగదేశాల సైన్యాలతో పాటు ఇతర దేశాల సైన్యాలను కూడ సంహరించాడు. అది చూచి ద్రోణుడు కోపించి వాయవ్యాస్త్రాన్ని పాండవసైన్యంపై సంధించి సైన్యాన్ని ఎండుటాకుల వలె పడగొట్టగా (తరువాతి పద్యంతో అన్వయం).

### సోమదత్తుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట (సం.7-136-12)

క. **'అలిగి నరుఁడు భీముఁడు నిరు। గెలఁకుల నయ్యస్త్రగురునిఁ గిట్టి శరౌఘం**
**బులఁ దేల్చిన మగుడ ననికిఁ। దలకొని వడి నురవడించెఁ దత్సైన్యంబుల్.** 132

**ప్రతిపదార్థం:** నరుఁడున్= అర్జునుడూ; భీముఁడున్= భీమసేనుడూ; అలిగి= కోపించి; ఇరు+కెలఁకులన్= రెండువైపుల; ఆ+ అస్త్రగురునిన్= అస్త్రవిద్యాగురుడైన ఆ ద్రోణాచార్యుడిని; కిట్టి= చేరి; శర+ఓఘంబులన్= బాణాల ప్రవాహాలతో; తేల్చినన్= తేల్చగా; మగుడన్= మళ్ళీ; తత్సైన్యంబుల్= ఆ పాండవసైన్యాల; అనికిన్= యుద్ధానికి; తలకొని= సిద్ధపడి; వడిన్= వేగంగా; ఉరవడించెన్= విజృంభించాయి.

**తాత్పర్యం:** అర్జునుడూ, భీముడూ కోపించి ఆ ద్రోణాచార్యుడికి రెండువైపుల చేరి, అతడిని బాణాల ప్రవాహంలో ముంచెత్తారు. ఆ పాండవసైన్యాలు మళ్ళీ యుద్ధానికి తలపడి, వేగంగా విజృంభించాయి.

తే. **అధిపతియు నస్త్రగురుఁడు బేరగ్గలికలఁ। దఱుమఁ జతురంగములుఁ బేర్చి యుఱక వారి**
**మొనలతోఁ దాఁకి గాండీవ ముక్త విశిఖ। శిఖల వేఁడిమి కోటఱి చెదరి పఱచె.** 133

**ప్రతిపదార్థం:** అధిపతియున్= కురురాజు దుర్యోధనుడును; అస్త్రగురుఁడున్= ద్రోణాచార్యుడును; పేరు+అగ్గలికలన్= గొప్ప ఉత్సాహాలతో; తఱుమన్= తరుముతూ ఉండగా; చతురంగములున్= చతురంగ సైన్యాలు; పేర్చి= విజృంభించి; ఉఱక= లక్ష్య పెట్టక; వారిన్= వారిని; మొనలతోన్= సేనలతో; తాఁకి= ఢీకొని; గాండీవ= గాండీవమనే అర్జునుడి వింటినుండి; ముక్త= విడువ బడిన; విశిఖ= బాణాలయొక్క; శిఖల వేఁడిమికిన్= జ్వాలల వేడికి; ఓటఱి= బలహీనమై; చెదరి పఱచెన్= చెదరిపోయి పరుగెత్తాయి (పాండవుల సేనలపై పడిన కౌరవసేనలు అర్జునుడి బాణజ్వాలలకు తట్టుకొనలేక చెల్లాచెదరై పరుగులు తీశాయని భావం).

**తాత్పర్యం:** కురురాజు దుర్యోధనుడూ, కుమారుల అస్త్రవిద్యా గురువు ద్రోణుడూ పెద్ద ఉత్సాహంతో (పాండవుల సైన్యాలను) తరుముతూ ఉంటే మీ చతురంగబలాలు కూడా పాండవసేనపై విజృంభించాయి. ఆ సమయంలో అర్జునుడు తన గాండీవ ధనువునుండి విడిచిన బాణజ్వాలలవేడికి బలహీనపడి మీ సైన్యాలు చెల్లాచెదరైపారిపోయాయి.

వ. **అట్టియెడ సోమదత్తుండు సమరోల్లాసంబునం బాండవ సైనికుల 'నిలు నిలు' మని యదల్చుచు నిల్చినం గనుంగొని సాత్యకి యతనితోడం దలపడినం దత్సంగ్రామంబు భీమం బయ్యె నందు.** 134

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయాన; సోమదత్తుండు= భూరిశ్రవసుడి తండ్రి సోమదత్తుడు; సమర+ఉల్లాసంబునన్=

యుద్ధోత్సాహంతో; పాండవ సైనికులన్= పాండవుల సైనికులను; నిలుము+నిలుము+అని= ఆగండి ఆగండి అని; అదల్చుచున్= బెదరిస్తూ; నిల్చినన్= నిలువగా; కనుంగొని= చూచి; సాత్యకి; అతనితోడన్= ఆ సోమదత్తుడితో; తలపడినన్= ఢీకొనగా; తద్+సంగ్రామంబు= ఆ యుద్ధం; భీమంబు+అయ్యెన్= భయంకరంగా సాగింది; అందున్= ఆ యుద్ధంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో సోమదత్తుడు యుద్ధోత్సాహంతో పాండవ సైనికులను ఎదుర్కొని నిలునిలుమని అదలిస్తూ నిలబడగా, సాత్యకి చూచి, అతడితో యుద్ధానికి తలపడ్డాడు. ఆ యుద్ధం భయంకరమైంది. ఆ యుద్ధంలో.

**సీ.** **సాత్యకి వి ల్లర్ధచంద్ర బాణంబున । నఱికి యా బాహ్లీక నందనుండు**
**ముప్పదేనమ్ముల నొప్పింప, నత డొండు । విలు గొని యాతని నలుఁగుటమ్ము**
**లైదింట నేసి మహారజత, ధ్వజం । బిలఁ గూల్చి ధనువు; సెక్కలుగఁ జేసెఁ**
**జిఱునవ్వుతో నాతఁ డుఱక వేఱొక వింట । నేట్లాడఁగా భీముఁ డేసె నపుడు**

**తే.** **దాఁకి మీ తండ్రిపై ఘటోత్కచుఁడు వైచెఁ । బరిఘమును; నది దునిమె నక్కురువరేణ్యుఁ;**
**డపుడు హయ సారథులఁ జంపి యతని యుసుఋ । గొనియె బలు నారసమున నా శినివరుండు.135**

**ప్రతిపదార్థం:** ఆ బాహ్లీక నందనుండు= ఆ సోమదత్తుడు; సాత్యకి విల్లు= సాత్యకి ధనువును; అర్ధచంద్ర బాణంబునన్= అర్ధచంద్రాకార బాణంతో; నఱికి= తెగగొట్టి; ముప్పదేను+అమ్ములన్= ముప్పదిఅయిదు బాణాలతో; నొప్పింపన్= నొప్పి పుట్టిస్తూ ఉండగా; అతండు= ఆ సాత్యకి; ఒండువిల్లు= రెండో ధనుస్సును; కొని= తీసికొని; ఆతనిన్= ఆ సోమదత్తుడిని; అలుఁగు+అమ్ములు+ఐదింటన్= అయిదు తీక్ష్ణములైన బాణాలతో; ఏసి= కొట్టి; మహారజతధ్వజంబు= బంగారు ధ్వజాన్ని; ఇలన్= భూమి మీద; కూల్చి= కూలగొట్టి; ధనువు= విల్లును; చెక్కలుగన్= ముక్కలుగా; చేసెన్= చేశాడు; చిఱునవ్వుతోన్= మందహాసంతో; అతఁడు= ఆ సోమదత్తుడు; ఉఱక= లక్ష్యపెట్టక; వేఱు+ఒకవింటన్= మరియొక ధనువుతో; ఏట్లాడఁగాన్= యుద్ధం చేస్తూ ఉంటే; అపుడు= అదే సమయంలో; భీముఁడు= భీమసేనుడు; తాఁకి= ఢీకొని; మీ తండ్రిపైన్= మీకు తండ్రి వరుసయైన సోమదత్తుడిపై; ఏసెన్(బాణాలు) వేశాడు - అనగా కొట్టాడు; మరియున్ ఘటోత్కచుఁడు= ఘటోత్కచుడు కూడా; పరిఘమును= పరిఘమనే ఆయుధాన్ని (ముండ్ల గుదియను); వైచెన్= వేశాడు; ఆ+కురువరేణ్యుఁడు= ఆ సోమదత్తుడు; అది= ఆ పరిఘాయుధాన్ని; తునిమెన్= తుత్తునియలు చేశాడు; అపుడు= ఆ సమయంలో; ఆ శినివరుండు= ఆ సాత్యకి; హయసారథులన్= (ఆ సోమదత్తుడి) రథాశ్వాలను రథసారథిని కూడా; చంపి= సంహరించి; అతని+ఉసుఋన్= ఆ సోమదత్తుడి ప్రాణాన్ని; బలునారసమునన్= బలువైన బాణంతో; కొనియెన్= గ్రహించాడు (సంహరించాడని భావం).

**తాత్పర్యం:** ఆ సోమదత్తుడు అర్ధచంద్రాకార బాణంతో సాత్యకి వింటిని నరికి, ముప్పయి అయిదు బాణాలతో అతడిని నొప్పించాడు. సాత్యకి మరొక వింటిని తీసికొని, అయిదు వాడిబాణాలు సోమదత్తుడిమీదవేసి, గొప్పదైన అతడి వెండిటెక్కాన్ని నేలగూల్చాడు. విల్లు ముక్కలు చేశాడు. సోమదత్తుడు చిరునవ్వుతో, ధైర్యంగా వేరొక వింటిని చేపట్టి బాణాలను ప్రయోగించాడు. అప్పుడు భీముడు సోమదత్తుడిని ఎదుర్కొన్నాడు. ఘటోత్కచుడు పరిఘను వేశాడు. దానిని సోమదత్తుడు భగ్నం చేశాడు. అంతలో సాత్యకి బలమైన బాణంతో సోమదత్తుడి గుర్రాలను, సారథిని చంపి, అతడి ప్రాణాలను తీశాడు.

**విశేషం:** 'అపుడు తాఁకి మీ తండ్రిపై' అనే వాక్యం దేహళీ దీప న్యాయంగా వెనుకముందులకు అన్వయిస్తుంది. 'అపుడు తాఁకి మీ తండ్రిపై భీముడు ఏసెన్' అని, 'అపుడు తాఁకి మీ తండ్రిపై ఘటోత్కచుడు పరిఘమును వైచెన్' అని కూడా వాక్యార్థం ఏర్పడుతుంది. ఈ వాక్యార్థం ఏర్పడటానికే 'మరియు' అనే మాటతో వాక్యయోజనం చేసి వ్యాఖ్యానించటం జరిగింది.

**క. మారుతి యిమ్మెయి నక్కురు । వీరునిఁ జంపించి మోము వికసిల్లఁగఁ దాఁ**
**బోరెడు నెప్పటి మునుము మ । హీరమణుల మీఁదఁ దటిమె నిభపురనాథా! 136**

**ప్రతిపదార్థం:** ఇభపురనాథా!= ఓ హస్తినపుర ప్రభువా! - ధృతరాష్ట్రా!; మారుతి= వాయునందనుడు భీముడు; ఈ+మెయిన్= ఈ విధంగా; ఆ+కురువీరునిన్= ఆ కౌరవవంశవీరుడైన సోమదత్తుడిని; చంపించి= సంహరింపజేసి; మోము= ముఖం; వికసిల్లఁగన్= వికాసాన్ని అనగా సంతోషాన్ని పొందగా; తాన్= తాను; పోరెడు= యుద్ధం చేస్తూ ఉన్న; ఎప్పటి మునుము= ఇంతకు ముందటి వరుసలో నున్నటువంటి; మహీరమణుల మీఁదన్= రాజులపైకి; తటిమెన్= పరుగుతీశాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! భీముడు ఈ విధంగా ఆ సోమదత్తుడిని సాత్యకిచేత చంపించి, తానెంతో సంతోషించి, తాను అంతకుముందు యుద్ధం చేస్తూ ఉన్న రాజులపైకి పరుగుతీశాడు.

**ఉ. చచ్చిన సోమదత్తుఁ గని సాత్యకిపై మనవారు గ్రమ్మినం**
**జెచ్చెర ధర్మజుం డతనిఁ జేకొని వారలఁ దూలఁ దోలుడున్**
**వచ్చి గురుండు విల్ నఱికి వైచి సిడంబును డొల్లఁ జేసి మే**
**నుచ్చి చనంగ నేయ నతఁ డుద్భట రోష మహోగ్ర మూర్తి యై. 137**

**ప్రతిపదార్థం:** చచ్చిన సోమదత్తున్= మరణించిన సోమదత్తుడిని; కని= చూచి; సాత్యకిపైన్= సోమదత్తుడిని సంహరించిన ఆ సాత్యకిపై; మనవారు= మన కౌరవ పక్షీయులైన యోధులు; క్రమ్మినన్= చుట్టుముట్టగా; చెచ్చెఱన్= వేగంగా; ధర్మజుండు= ధర్మరాజు; అతనిన్= ఆ సాత్యకిని; చేకొని= ఆదుకొని; వారలన్= ఆ కౌరవయోధులను; తూలన్= తొలగిపోయేటట్లు; తోలుడున్= తోలగా; గురుండు= ద్రోణాచార్యుడు; వచ్చి= సమీపించి; విల్= ఆ ధర్మరాజు విల్లు; నఱికివైచి= విరగగొట్టి; సిడంబును= ధ్వజాన్ని; డొల్లన్+చేసి= పడగొట్టి; మేన్= శరీరాన్ని; ఉచ్చి చనంగన్= క్రుచ్చుకొని బయట వెడలేటట్లుగా; ఏయన్= బాణాన్ని ప్రయోగించగా; అతఁడు= ఆ ధర్మరాజు; ఉద్భటరోష మహోగ్రమూర్తి ఐ= పెద్ద కోపంతో భయంకరమైన ఆకారం గలవాడై.

**తాత్పర్యం:** సోమదత్తుడు మరణించటం చూచి, మనవారు సాత్యకిమీద దండెత్తగా, అది గమనించిన ధర్మరాజు వెంటనే సాత్యకిని ఆదుకొని, మన యోధులను తొలగచేశాడు. అంతలోనే ద్రోణుడు వచ్చి ధర్మరాజు విల్లు నరికి ధ్వజాన్ని పడగొట్టి అతని శరీరం తూట్లు పడేవిధంగా బాణాలు ప్రయోగించాడు. దానితో ధర్మరాజు మహాకోపంతో భయంకరరూపం తాల్చి,

**క. వేఱొక విలు గొని యెమ్ముల । గీఱ మెఱుఁగు నారసముల గిటికొలిపిన నో**
**టాఱి మెయిం గ్రొన్నెత్తురు । వాఱ నతఁడు దేరిమీఁదఁ బడి మూర్ఛిల్లెన్. 138**

**ప్రతిపదార్థం:** వేఱు+ఒక= మరియొక; విలు= ధనుస్సును; కొని= తీసికొని; ఎమ్ములన్= ఎముకలను; గీఱన్= ఒరసి నొప్పి పుట్టేవిధంగా; మెఱుఁగు నారసములు= తీక్ష్ణములైన బాణాలను; గిటికొలిపినన్= నాటగా; ఓటారి= బలాన్ని కోల్పోయి; మెయిన్= శరీరమందు; క్రొన్నెత్తురు= క్రొత్త నెత్తురు; పాఱన్= ప్రవహించగా; అతఁడు= ఆ ద్రోణాచార్యులు; తేరిమీఁదన్= రథంమీద; పడి= పడిపోయి; మూర్ఛిల్లెన్= మూర్ఛపోయాడు.

**తాత్పర్యం:** ఇంకొక ధనుస్సు తీసుకొని ఎముకలకు గ్రుచ్చుకొనే విధంగా ద్రోణుడి శరీరంలో వాడిబాణాలు నాటాడు. దానితో బలం కోల్పోయి ద్రోణుడు శరీరంమీద క్రొత్త నెత్తురు ప్రవహించగా, ఆ రథంమీదనే తూలిపడి మూర్ఛపోయాడు.

**వ.** **కొండొక సేపునకు సేద దీఱి యక్కుంభసంభవుండు విజృంభించి వాయుదైవత్యం బగు శరం బేయుటయు నా భూవిభుండు దద్దేవతాకంబగు సాయకంబున శమియింపం జేసి పెల్లేసినం గని కృష్ణుం డతని కి ట్లనియె.** **139**

**ప్రతిపదార్థం:** కొండొక సేపునకున్= కొంతసేపటికి; సేద+తీఱి= తెప్పరిల్లి; ఆ+కుంభసంభవుండు= ఆ ద్రోణాచార్యుడు; విజృంభించి= చెలరేగి; వాయుదైవత్యంబు+అగు= వాయువు దేవతగా గలిగిన; శరంబు= బాణాన్ని; ఏయుటయున్= ప్రయోగించగానే; ఆ భూవిభుండు= ఆ ధర్మరాజు; తద్+దేవతాకంబు+అగు= ఆ వాయుదేవతాకమైన; సాయకంబునన్= బాణం అనగా అస్త్రంతో; శమియింపన్+చేసి= శాంతింపజేసి; పెల్లు+ఏసినన్= ఎక్కువగా (బాణాలతో) కొట్టగా; కని= చూచి; కృష్ణుండు; అతనికిన్= ఆ ధర్మరాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** కొంతసేపటికి ద్రోణాచార్యుడు మూర్ఛనుండి తేరుకొని మళ్ళీ చెలరేగాడు. పాండవసేనపై వాయవ్యాస్త్రాన్ని ప్రయోగించాడు. అది చూచి ధర్మరాజు తానుకూడా వాయవ్యాస్త్రాన్నే ప్రత్యస్త్రంగా ప్రయోగించి, దానిని శమింపజేశాడు. అంతేగాక ఎన్నో బాణాలు అతడిపై గుప్పించాడు. అది చూచి కృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**క.** **'నినుఁ బట్టఁ గుంభజుండు ప్ర । తిన సేయు టెఱుంగు; దతనిఁ దేఁకువ సెడి మా**
**ర్కొనఁ దగదు; నీకు భీముం । డని సేయు మొగమునఁ బొదువు మక్కురుసేనన్.** **140**

**ప్రతిపదార్థం:** (ఓ ధర్మరాజా!) నినున్= నిన్ను; పట్టన్= పట్టివేయటానికి (బంధించటానికి అని భావం); కుంభజుండు= ద్రోణుడు; ప్రతిన+చేయుట= ప్రతిజ్ఞ చేయటం; ఎఱుగుదు(వు)= తెలిసినవాడవు (కావున); అతనిన్= ఆ ద్రోణుడిని; తేఁకువ= భయం; చెడి= నశించి; మార్కొనన్= ఎదిరించటానికి; నీకున్ తగదు (కాబట్టి); భీముండు; అని= యుద్ధం; చేయు మొగమునన్= చేసే వైపున; ఆ+కురుసేనన్= ఆ కౌరవసైన్యాన్ని; పొదువుము= ఎదిరించుము.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ద్రోణుడు నిన్ను పట్టుకొంటానని ప్రతిజ్ఞ చేయటం నీకు తెలుసు. అటువంటప్పుడు భయం వీడి నీ వతడితో యుద్ధానికి తలపడటం తగదు కాబట్టి, భీముడు యుద్ధం చేసే వైపునకు వెళ్ళి కౌరవసైన్యాన్ని ఎదిరించుము.

**తే.** **ఇతని వధియించుటకు జనియించె నెవ్వఁ । డతఁడ యీతని తోడఁ బోరాడుఁ గాక!'**
**యనుడు నొక్కింత యూహించి యానృపాలుఁ । డరిగె; ద్రోణుండు ద్రుపద సైన్యమున కడరె.** **141**

**ప్రతిపదార్థం:** ఎవ్వఁడు= ఏ ధృష్టద్యుమ్నుడయితే; ఇతనిన్= ఈ ద్రోణుడిని; వధియించుటకున్= వధించటానికి; జనియించెన్= పుట్టాడో; ఆతఁడు+ఆ= ఆతడే; ఈతనితోడన్= ఈ ద్రోణుడితో; పోరాడున్+కాక= యుద్ధం చేయనీ (నీవు మాత్రం ఆ ద్రోణుడితో పోరాడవద్దు అని అవధారణార్థక 'అ' కారంచేత ధ్వనిస్తూ ఉన్నది); అనుడున్= అనగానే; ఒక్కింత= ఒక్కక్షణం; ఊహించి= ఆలోచించి; ఆ నృపాలుఁడు= ఆ ధర్మరాజు; అరిగెన్= (ఆ వైపునకు) వెళ్ళాడు; (ఇక) ద్రోణుండు= ద్రోణాచార్యుడు; ద్రుపదు సైన్యమునకున్= పాంచాల సైన్యానికై; అడరెన్= విజృంభించాడు. (పాంచాల సైన్యంతో యుద్ధం చేయటానికి తలపడ్డా డని భావం.)

**తాత్పర్యం:** ఈ ద్రోణుడిని సంహరించటానికి ఏ ధృష్టద్యుమ్నుడయితే పుట్టాడో అతడే ఇతడితో పోరు సలుపుతాడు. నీవు వద్దు' అని కృష్ణుడు పలుకగానే ధర్మరాజు ఒక క్షణం విచారించి, భీముడు యుద్ధం చేసే వైపు వెళ్ళాడు. ఇక ద్రోణుడు కూడా పాంచాల సైన్యంతో యుద్ధానికి పూనుకొన్నాడు.

**వ. అట్లు సని యుధిష్ఠిరుండు దన తమ్మునకుఁ బెను బ్రాపయ్యె; నయ్యనిలసుతుండును సాత్యకియు ధృష్టద్యుమ్నుండును బరవసంబు సేసినఁ గృప కర్ణ కలశభవులు గడఁగి; రయ్యుభయ సైనికోత్తములు సంరంభంబునం బేర్చిన సైన్యద్వయంబును రయంబునం గలయన్ బెరసినం బెందూళి యెగసి తఱితోఁ గవియుదెంచు దమంబునకుం దోడుపడి చూడ్కులు నిగుడనీకున్నను దమకంబునం దమ తమ పేళ్ళు బిరుదులు నుగ్గడించుచు నగ్గలిక సొంపునను సన్నల నుద్దేశంబుల నద్దెస నిద్దెస వీరులు వోరుచుండ నంధకారం బతిసాంద్రంబై చిక్కుపఱిచె; నట్టియెడ బిట్టడరి పాండవు లుద్దండ బాహాసంపదలు సూపిన నేపఱి కౌరవబలంబులు గలఁగి చీకాకు పడి చీఁకటి కతంబునం గూడుకొనంగానక పలుదెసలఁ దొలంగి పొలుపఱిన నయ్యాచార్యుండు ధైర్యంబు మెఱయ దుర్యోధనుం గూర్చుకొని యుద్దామ సామర్థ్యంబున సకల చతురంగంబులం బూఁచున ట్లొనర్చి యొక్క మోహరంబుగా నమర్చి, యం దగ్రభాగంబునం దాను నిలిచి యిరు గెలంకుల నశ్వత్థామ సౌబలుల నునిచి నడుకొన శల్యు నిలిపి యన్నరేంద్రుండు వెన్నుదన్ని నిలుచునట్లు సేసె ననుటయు; ధృతరాష్ట్రుండు సంజయునితో నిత్తెఱంగునం బన్ని బహుళ తిమిరంబున సమరం బెట్లు సేసి రని యడిగిన నతం డతని కిట్లను - నా సమయంబున నక్కురు భూపాలుఁడు దమ కాలుబలంబుల నెల్ల నాయుధంబులు పెట్టి దివియలు పట్ట నియోగించిన. 142**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; చని= వెళ్ళి; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; తన తమ్మునకున్= తన సోదరుడైన భీమసేనునకు; పెనుప్రాపు+అయ్యెన్= పెద్ద అండ అయ్యాడు; ఆ+అనిలసుతుండును= ఆ వాయునందనుడు - భీముడు; సాత్యకియున్= సాత్యకీ; ధృష్టద్యుమ్నుండును= ధృష్టద్యుమ్నుడూ; బరవసంబు+చేసినన్= ధైర్యం చూపగా; కృప కర్ణ కలశభవులు= కృపుడు, కర్ణుడు, ద్రోణుడు; కడంగిరి= (యుద్ధం చేయటానికి) పూనుకొన్నారు; ఆ+ఉభయ సైనికోత్తములు= ఆ ఇరువైపులలోని యోధ శ్రేష్ఠులు; సంరంభంబునన్= తొందరగా; పేర్చిన సైన్యద్వయంబును= మోహరించిన రెండు సేనలు; రయంబునన్= వేగంగా; కలయన్= అంతటను; బెరసినన్= వ్యాపించగా; పెందూళి= పెద్ద దుమ్ము; ఎగసి= పైకి లేచి; (ఏం చేసిందంటే); తఱితోన్= అదనుతో- ఆ సమయాన; కవియుదెంచు= అలముకొన్న; తమంబునకున్= చీకటికి; తోడుపడి= సహాయపడి; చూడ్కులు= చూపులను; నిగుడనీకున్నను= ప్రసరింపజేయకుండా ఉన్నప్పటికీ (చీకటికి ధూళి తోడై కంటిచూపును ఆనకుండా చేసినప్పటికి కూడా అని భావం); తమకంబునన్= ఉత్సాహంతో; తమ తమ పేళ్ళు= తమ తమ నామధేయాలను; బిరుదులను= శౌర్య చిహ్నంగా వచ్చిన మారుపేర్లను; ఉగ్గడించునన్= పేర్కొంటూ; అగ్గలిక సొంపునను= ఉత్సాహాధిక్యంతో (యుద్ధం చేయాలనే ఉత్సాహం మిక్కుటంగా ఉన్నది కాబట్టి అని భావం); సన్నలన్= సంజ్ఞలతో; ఉద్దేశంబులన్= ఊహలతో; ఆ+దెసన్= ఆ వైపున; ఈ+దెసన్= ఈ వైపునను; వీరులు= యోధులు; పోరుచుండన్= యుద్ధం చేస్తూ ఉండగా; అంధకారంబు= చీకటి; అతిసాంద్రంబు+ఐ= మిక్కిలి దట్టమై; చిక్కు+పఱిచెన్= చిక్కు కలుగజేసింది (ఆ దట్టమైన అంధకారం స్వ పర భేదాన్ని గుర్తించకుండా చేసి చిక్కుపెట్టిందని భావం); అట్టి+ఎడన్= ఆ సమయంలో; బిట్టు= మిక్కిలి; అడరి= విజృంభించి; పాండవులు= ధర్మరాజాదులు; ఉద్దండ బాహాసంపదలు= గొప్ప భుజబల శోభలను - అనగా గొప్ప భుజ పరాక్రమాన్ని; చూపినన్= చూపగా; ఏపు+అఱి= ఆధిక్యం తగ్గి; కౌరవబలంబులు= కౌరవసేనలు; కలఁగి= కలతజెంది; చీకాకుపడి= చెదరిపోయి; చీఁకటి కతంబునన్= చీకటి కారణాన; కూడుకొనన్+కానక= ఒకచోట గుమిగూడలేక; పలుదెసలన్= పలు దిక్కులకు; తొలంగి= తొలగిపోయి (అనగా పారిపోయి); పొలుపు= ఒప్పు; అఱినన్= నశించిపోగా; ఆ+ఆచార్యుండు= ఆ ద్రోణాచార్యుడు; ధైర్యంబు= ధీరభావం; మెఱయన్= ప్రకాశిస్తూ ఉండగా; దుర్యోధనున్= కురురాజు దుర్యోధనుడిని; కూర్చుకొని= వెంట పెట్టుకొని; ఉద్దామ సామర్థ్యంబునన్= గొప్ప సామర్థ్యంతో; సకల చతురంగంబులన్= సమస్తమైన చతురంగసైన్యాన్ని; పూఁచునట్లు+ఒనర్చి= (యుద్ధానికి) పూనుకొనే విధంగా చేసి; ఒక్క మోహరంబుగాన్= ఒక

వ్యూహంగా; అమర్చి= ఏర్పరచి; అందున్= ఆ వ్యూహంలో; అగ్రభాగంబునన్= ముందటిభాగంలో; తాను= ద్రోణుడు తనకు తాను; నిలిచి= ఉండి; ఇరు+కెలంకులన్= రెండువైపుల అనగా రెండు ప్రక్కలలో; అశ్వత్థామ సౌబలులన్= అశ్వత్థామను, శకునిని; ఉనిచి= ఉంచి; నడుకొనన్= నడిమి ప్రదేశాన; శల్యున్= శల్యుడిని; నిలిపి= ఉంచి; ఆ+నర+ఇంద్రుండు= ఆ దుర్యోధనుడు; వెన్నుదన్ని= వెంబడించి; నిలుచునట్లు= నిలిచేవిధంగా - సైన్యాన్ని అనుసరిస్తూ అన్ని కోణాలనుండి రక్షిస్తూ ఉండే విధంగా అని భావం; చేసెన్= చేశాడు; అనుటయున్= అని చెప్పగానే; ధృతరాష్ట్రుండు; సంజయునితోన్= ఈ భారతకథను చెపుతున్న సంజయుడితో (ఇట్లా అడిగాడు); ఈ+తెఱంగునన్= ఈ విధంగా; పన్ని= (సైన్యాన్ని) మోహరించి; బహులతిమిరంబునన్= చిమ్మచీకటిలో; సమరంబు= యుద్ధం; ఎట్లు= ఏ విధంగా; చేసిరి?= చేశారు?; అని= ఈ విధంగా; అడిగినన్= అడుగగా; అతండు= సంజయుడు; అతనికిన్= ధృతరాష్ట్రుడితో; ఇట్లు; అనున్= అన్నాడు; ఆ సమయంబునన్= చీకటి అలుముకొన్న ఆ సమయాన; ఆ+కురుభూపాలుఁడు= ఆ కురురాజు దుర్యోధనుడు; తమ కాలుబలంబులన్+ఎల్లన్= తమ పదాతిదళాన్నంతా; ఆయుధంబులు= ఆయుధాలను; పెట్టి= క్రిందపెట్టి - విడిచి అని భావం; దివియలు= దివిటీలను; పట్టన్= పట్టుకొనటానికి; నియోగించినన్= ఆజ్ఞాపించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ ధర్మరాజు వెళ్ళి తన తమ్ముడు భీముడికి పెద్దఅండగా నిలిచాడు. ఇక ఆ భీముడు, సాత్యకి, ధృష్టద్యుమ్నుడు - ఈ ముగ్గురు ఎదుర్కొంటూ ఉంటే కృపుడు, కర్ణుడు, ద్రోణుడు వారితో యుద్ధానికి తలపడ్డారు. ఆ ఇరుపక్షాల యోధముఖ్యులు వెంటనే సైన్యాన్ని సమాయత్తం చేశారు. రెండుపక్షాల సైన్యాలు కలియబడ్డాయి. దానితో పెద్ద ధూళి చెలరేగి ఆ సమయాన అలముకొన్న చీకటికి తోడుకాగా సైనికులకు చూపు అగపడకున్నా, యుద్ధోత్సాహంతో తమ తమ పేర్లు బిరుదులు పేర్కొంటూ సంజ్ఞలతో ఊహలతో గుర్తించి ఇరువైపుల యుద్ధం చేస్తుండగా చీకటి దట్టమై చిక్కుపరచింది. అప్పుడు పాండవులు మిక్కిలి విజృంభించి బాహుబల సంపదలు చూపగా, వారి ధాటికి తట్టుకొనలేక మీ సైన్యం ఆ గాఢాంధకారంలో ఎటూకానక సామర్థ్యం నశించి చెదరిపోయింది. మళ్ళీ ఏకం కాలేకపోయింది. అప్పుడు ద్రోణాచార్యుడు ధైర్యంగా దుర్యోధనుడిని వెంట తీసికొని, మన సైన్యానికి ధైర్యం కలుగజేసి, ఒక వ్యూహంగా సేనను మలచాడు. ద్రోణుడు ఆ వ్యూహానికి మొదటిభాగాన తానే స్వయంగా నిలిచి, ఇరుపార్శ్వాలలో అశ్వత్థామను, శకునిని నిలిపాడు. శల్యుడిని మధ్యభాగాన ఉంచాడు. దుర్యోధనుని సేనకు వెన్నుదన్నుగా నిలిపాడు. ఇట్లా సంజయుడు చెప్తుతూ ఉండగా ధృతరాష్ట్రుడు - 'ఓ సంజయా! చీకట్లు అంతగా వ్యాపించి చూపులు ఆనలేదుకదా! మరి యుద్ధం ఎట్లా చేశారు?' అని అడుగగా, సంజయుడు 'ఆ సమయంలో దుర్యోధనుడు పదాతిదళాలను ఆయుధాలను విడిచి దివిటీలు పట్టుకొమ్మని ఆదేశించాడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మున్నాపని మానుసులం । గ్రన్నన పతి సంఘటింపఁగాఁ బనిచిన సం**
**పన్నంబుగ నొడఁగూర్చిన । నున్నత కరదీప నికర ముజ్జ్వలితముగన్. 143**

**ప్రతిపదార్థం:** మున్ను= మొదట; ఆ పనిన్= ఆ కార్యాన్ని; క్రన్నన్+అ= తొందరగానే; సంఘటింపఁగాన్= చేసేటట్లు; మానుసులన్= మనుష్యులను; పతి= రాజు (దుర్యోధనుడు); పనిచినన్= ఆజ్ఞాపించగానే; సంపన్నంబుగన్= సిద్ధంగా; ఒడన్+కూర్చినన్= చేసినవెంటనే; ఉన్నత కర దీప నికరము= ఎత్తైన దివిటీల సమూహాన్ని; ఉజ్జ్వలితముగన్= ప్రజ్వలితంగా.

**తాత్పర్యం:** 'మొదట ఆ పని చేయాలి' అని దుర్యోధనుడు మనుష్యులను నియోగించాడు. వారు ఆ దివిటీల పనిని తొందరగా సిద్ధం చేశారు. అప్పుడు (పదాతివర్గాలు) ఎత్తైన ఆ దివిటీల సమూహాన్ని ప్రకాశవంతంగావెలిగేటట్లు.

**వ. చేసికొని యప్పదాతి వర్గంబులు దివియలు దెచ్చిన నద్ధరణివరుండు రథంబున నైదును, గరికి మూఁడును, దురంగంబున నొండును నియతంబుగాఁ బట్టించి మఱియు వానికెలంకులను గేతనంబులకును దగం బట్టునట్లు సేసి, వెండియు మోహరంబు ముందటను బార్శ్వంబులను బిఱుందను బ్రభలు నిగుడం బొడవుగా నెత్తిపట్టం బనిచిన, నవ్వెలుంగు నింగికి నేలకుం జాలి పొలిచె; నట్టియెడ మణి భూషణంబులను రత్నకేతనంబులను వివిధాయుధంబులను బ్రతిప్రభలు ప్రజ్వరిల్ల శోభిల్లి నీ సైన్యం బొప్పె; నప్పుడు పాండవ బలంబునను రథంబునకుం బదియును గరికేడును దురంగంబునకు రెండునుగాఁ దత్ప్రకారంబునం గర దీపికాలోకం బాలోకనీయం బయ్యె; నయ్యవసరంబున నయ్యస్త్రగురుఁడు మధ్యందినమార్తాండు పగిదిం బ్రదీప్తమూర్తియై వెలుంగ నమ్మనుజపతి యనుజన్ములతో ని ట్లనియె. 144**

**ప్రతిపదార్థం:** చేసికొని= (దివిటీలను ప్రజ్వలితంగా) ఒనర్చి; ఆ+పదాతివర్గంబులు= ఆ కాలుబలముల సమూహాలు; దివియలు= దివిటీలను; తెచ్చినన్= తేగా; ఆ+ధరణివరుండు= ఆ రాజు దుర్యోధనుడు; రథంబునకున్= రథానికి; ఐదును= అయిదు దివిటీలను; కరికిన్= గజానికి; మూఁడును= మూడు దివిటీలను; తురంగంబునకున్= గుర్రానికి; ఒండును= ఒక దివిటీని; నియతంబుగాన్= విధిగా; పట్టించి= పట్టేవిధంగా చేసి; మఱియున్= మరియు, అంతేగాక; వానికెలంకులను= ఆ రథాదుల పార్శ్వభాగాలలో; కేతనంబులకును= ధ్వజాలకు కూడా; తగన్= తగినవిధంగా; పట్టునట్లు+చేసి= పట్టించి; వెండియున్= మఱియు; మోహరంబు ముందటను= వ్యూహానికి ముందుభాగాన; పార్శ్వంబులన్= ప్రక్కలకు; పిఱుందను= వెనుకభాగానకూడా; ప్రభలు= కాంతులు; నిగుడన్= వ్యాపించగా; పొడవుగాన్= ఎత్తుగా; ఎత్తిపట్టన్= లేవనెత్తి పట్టుకొనేందుకు; పనిచినన్= నియోగించగా; ఆ+వెలుంగు= ఆ వెలుగు; నింగికిన్= ఆకాశానికి; నేలకున్= భూమికి; చాలి= సరిపడి; పొలిచెన్= ఒప్పింది; అట్టి+ఎడన్= ఆ సమయాన; మణిభూషణంబులను= మణిమయభూషణాలతో; రత్నకేతనంబులను= రత్నఖచిత ధ్వజాలతో; వివిధ+ ఆయుధం బులను= అనేకాలైన ఖడ్గాద్యాయుధాలతో; ప్రతిప్రభలు= ప్రతిఫలించిన కాంతులు; ప్రజ్వరిల్లన్= వెలుగొందగా; శోభిల్లి= ప్రకాశించి; నీ సైన్యంబు= నీ సేన; ఒప్పెన్= ఒప్పింది; అప్పుడు= అదే సమయంలో; పాండవ బలంబునను= పాండవుల సైన్యంలోకూడా; రథంబునకున్= రథానికి; పదియును= పది దివిటీలు; కరికిన్= ఏనుగుకు; ఏడును= ఏడు దివిటీలు; తురంగంబునకున్= అశ్వానికి; రెండును= రెండు దివిటీలు; కాన్= ఉండేటట్టు; తద్+ప్రకారంబునన్= ఆ విధంగా; కర దీపికా= చేదివిటీలయొక్క; ఆలోకంబు= వెలుగు; ఆలోకనీయంబు+అయ్యెన్= చూడదగినదయింది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఆ+అస్త్రగురుఁడు= ఆ అస్త్రవిద్యాగురువు అనగా ద్రోణుడు; మధ్యందిన మార్తాండు పగిదిన్= మట్టమధ్యాహ్న సూర్యుడివలె; ప్రదీప్తమూర్తి ఐ= వెలుగొందుతున్న ఆకారం కలవాడై; వెలుంగన్= ఒప్పుతూ ఉండగా; ఆ+మనుజపతి= ఆ రాజు అనగా దుర్యోధనుడు; అనుజన్ములతోన్= (తన) తమ్ములతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** చేసుకొని పదాతిదళాలు దివిటీలు తేగానే, దుర్యోధనుడు రథానికి అయిదుదివిటీల చొప్పున, ఏనుగుకు మూడు చొప్పున, అశ్వానికి ఒకటి చొప్పున ఆ దివిటీలను విధిగా పట్టించాడు. మరియు వాటికి రెండు వైపుల ధ్వజాలకు దివిటీలు ఏర్పరచాడు. వ్యూహానికి ముందుభాగంలో, ఇరువైపుల, వెనుకభాగంలో కాంతులు విరజిమ్మే విధంగా పొడవుగా దివిటీలను ఎత్తిపట్టించగా, ఆ కాంతులు ఆకాశాన భూమిపైన వలసినంతగా ప్రసరించాయి. అంతేగాక ఆ దివిటీల కాంతులు మణిభూషణాలు రత్నధ్వజాలు ఆయుధాలు - వీటి అన్నింటిలో ప్రతిఫలించి ద్విగుణీకృతంగా భాసిల్లాయి. ఇక పాండవసైన్యంలో కూడా రథానికి పది, గజానికి ఏడు, అశ్వానికి రెండు చొప్పున దివిటీలను పట్టించారు. ఆ సైన్యంకూడా దివిటీలప్రకాశంతో మిక్కుటంగా చూడ ముచ్చటగొల్పింది. ఆ సమయంలో ఆ ద్రోణాచార్యుడు మట్టమధ్యాహ్న సూర్యుడివలె వెలుగొందాడు. అది చూచి దుర్యోధనుడు తన తమ్ములతో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపమ. ద్రోణుడిని మధ్యందిన మార్తాండునితో పోల్చటం చేత ఉపమాలంకారం. మధ్యందినమున్నంతవరకే ఆ సూర్యుడు వెలుగొంది తరువాత తన ప్రకాశాన్ని కోల్పోతాడు కాబట్టి ఈ ద్రోణుడిట్లా వెలుగొందటం తాత్కాలికమే - శాశ్వతంకాదు అనే అనిష్టార్థాన్ని సూచిస్తూ ఉన్నది.

**తే. 'శల్య కృతవర్మ ముఖ యోధ సమితిఁ గూర్చి । కొని మహోద్యోగమున మీరు కుంభజన్ము**
**చెంత కా ద్రుపదాత్మజుఁ జేరకుండ । నాఁగు' డొరు లెల్లవారల నతఁడు గెలుచు.' 145**

**ప్రతిపదార్థం:** మీరు= సోదరులారా! మీరు; శల్య కృతవర్మ ముఖయోధ సమితిన్= శల్యుడు, కృతవర్మ మొదలైన యోధులవర్గాన్ని; కూర్చికొని= కూడగట్టుకొని; మహా+ఉద్యోగమునన్= గొప్ప ప్రయత్నంతో (ఏం చేయాలంటే); కుంభజన్ముచెంతకున్= ద్రోణాచార్యుడి సమీపానికి; చేరకుండన్= రాకుండా; ఆ ద్రుపదాత్మజున్= ఆ ద్రుపదుడి తనయుడగు ధృష్టద్యుమ్నుడిని; ఆఁగుఁడు= ఆపండి; అతఁడు= ఆ ద్రోణాచార్యుడు; ఒరులు+ఎల్లవారలన్= ఇతరులనందరినీ; గెలుచున్= గెలుస్తాడు.

**తాత్పర్యం:** 'ఓ సోదరులారా! మీరు శల్యుడు, కృతవర్మ మొదలైన యోధులసమూహాన్ని కూడగట్టుకొని, తీవ్రప్రయత్నంతో ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడిని సమీపించకుండా ఆపండి. ద్రోణుడు మిగిలినవారినందరినీ గెలుస్తాడు.'

**విశేషం:** ద్రుపదుడు తన వైరాన్ని తీర్చుకొనటానికి తపస్సుచేసి, ద్రోణవధకై పొందినవాడు ధృష్టద్యుమ్నుడు. కాబట్టి 'అతడు ద్రోణుడిని సమీపించకుండా ఆపండి' అని అనటంలోని ఆంతర్యాన్ని 'ద్రుపదాత్మజున్' అనేపదం ధ్వనిస్తూ ఉన్నది. అతడు తప్ప పాండవసేనలో మరే వీరుడూ ద్రోణుడిని జయించేవాడు లేడనే అర్థం కూడా ఆ ధ్వనిచే స్ఫురిస్తూ ఉన్నది. ఈ అర్థమంతా మూలంలో వాచ్యంగా ఉన్నది.

### పాండవ కౌరవ వీరుల ద్వంద్వ యుద్ధము (సం.7-139-22)

**వ. పదంపడి యా ధృష్టద్యుమ్నుం బరిమార్చు, కిరీటిం గర్ణుండును, భీమసేనుని నేనును గెలుతు' మని పలికి బలంబులకుఁ జేయివీచి కడంగిన, నెదిరి సేనయు నురవడింప నెన్నండును జూడవినంబడని యట్టి బవరంబయ్యెఁ; బాండవాగ్రజుండుఁ దన దొరల ద్రోణుమీఁదం గవియుం డని పనిచి, తానును దఱిమిన, నమ్మనుజపతిం గృతవర్మయు, సాత్యకిని భూరియు, సహదేవు రాధేయుండును , వాయుసూను సుయోధనుండును, నకులుని శకునియు, శిఖండిఁ గృపాచార్యుండును, బ్రతివింధ్యుని దుశ్శాసనుండును, ఘటోత్కచుని గురుపుత్రుండును, బాంచాల విభుని వృషసేనుండును, మత్స్యరాజును మద్రేశ్వరుండును, శతానీకునిఁ జిత్రసేనుండును, నర్జునుని యలంబుసుండునుం దలపడి; రిట్లు గురుని నొంపను రక్షింపను బూని మఱియు ననేకు లనేకులఁ దార్కొనిరి; సోమక సైన్యంబు సమయించు నక్కుంభసంభవుని ధృష్టద్యుమ్నుండు మార్కొనియెఁ; నట్టియెడ. 146**

**ప్రతిపదార్థం:** పదంపడి= తరువాత; ఆ ధృష్టద్యుమ్నున్= ఆ ధృష్టద్యుమ్నుడిని; పరిమార్చు= సంహరించే; కిరీటిన్= అర్జునుడిని; కర్ణుండును= కర్ణుడూ; భీమసేనునిన్= భీముడిని; నేనును= నేను అనగా దుర్యోధనుడు; గెలుతుము= గెలుస్తాం; అని= ఇట్లా; పలికి= చెప్పి; బలంబులకున్= సైన్యాలకు; చేయివీచి= చేయి కదలించి అనగా సంజ్ఞచేసి; కడంగినన్= యుద్ధానికి పూనుకొన్న వెంటనే; ఎదిరిసేనయున్= శత్రుసైన్యం కూడా; ఉరవడింపన్= విజృంభించగా; ఎన్నండును= ఏనాడు కూడా; చూడ వినంబడని+అట్టి= చూడనట్టి విననట్టి; బవరంబు= యుద్ధం; అయ్యెన్= అయింది; పాండవ+అగ్రజుండు= పాండవుల అన్న ధర్మరాజు; తన దొరలన్= తనకు సహాయంగా వచ్చిన రాజులను; ద్రోణుమీఁదన్= ద్రోణుడిపై; కవియుండు+అని= ఉద్యమించండి

అని; పనిచి= పంపి; తానును, ధర్మరాజు కూడా; తఱిమినన్= (ద్రోణుడిపైకి) పరుగిడగా; ఆ+మనుజపతిన్= ఆ ధర్మరాజును; కృతవర్మయున్= కృతవర్మ; సాత్యకి; భూరియున్= భూరి అనే కురువంశరాజు; సహదేవున్= సహదేవుడిని; రాధేయుండును= కర్ణుడు; వాయుసూనున్= భీముడిని; సుయోధనుండును= దుర్యోధనుడు; నకులునిన్= నకులుడిని; శకునియున్= శకుని; శిఖండిన్= శిఖండిని; కృపాచార్యుండును= కృపాచార్యుడూ; ప్రతివింధ్యునిన్= ప్రతివింధ్యుడిని; దుశ్శాసనుండును= దుశ్శాసనుడు; ఘటోత్కచునిన్= ఘటోత్కచుడిని; గురుపుత్రుండును= ద్రోణపుత్రుడు అశ్వత్థామ; పాంచాల విభునిన్= పాంచాలరాజు ద్రుపదుడిని; వృషసేనుండును= వృషసేనుడు; అర్జునునిన్= అర్జునుడిని; అలంబుసుండును= అలంబుసుడు అనే రాక్షసుడు; తలపడిరి= డీకొన్నారు; (ద్రోణుడిపైకి వెళ్ళకుండా నిరోధించారని భావం); ఇట్లు= ఈ విధంగా; గురునిన్= ద్రోణుడిని; నొంపను= బాధించటానికి; రక్షింపను= రక్షించటానికి; పూని= ఉద్యమించి; మఱియున్= ఇంకా; అనేకులు= పలువురు; అనేకులన్= పలువురిని; తార్కొనిరి= డీకొన్నారు- పాండవ పక్షీయులు ద్రోణుడిపైకి పరుగుతీస్తూ ఉంటే, కౌరవపక్షీయులు వారిని వెళ్ళకుండా నిరోధించారు; సోమకసైన్యంబు= సోమకసైన్యాన్ని; సమయించు+ఆ+కుంభసంభవునిన్= సంహరించే ఆ ద్రోణాచార్యులను; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; మార్కొనియెన్= ఎదుర్కొన్నాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** తరువాత ధృష్టద్యుమ్నుడిని చంపుతాడు. అర్జునుడిని కర్ణుడు జయిస్తాడు. భీముడిని నేను గెలుస్తాను.' అని పలికి సైన్యాలకు చేతితో కదలిపొండని సంజ్ఞ చేశాడు దుర్యోధనుడు. తాను కూడా పోరాడటానికి కదిలాడు. శత్రుసైన్యం కూడా విజృంభించింది. ఇక ఆ యుద్ధంతీరు ఎన్నడూ కూడా ఇంతకుముందు చూడలేదు, వినలేదు. అప్పుడు ధర్మరాజు తనవారిని ద్రోణుడిమీదికి యుద్ధానికి పంపాడు. అంతేకాక తాను కూడా ద్రోణుడిపైకి పోరాడటానికి వెళ్ళుతూ ఉంటే కృతవర్మ ఎదుర్కొన్నాడు. ఇట్లే సాత్యకిని భూరి అనే అతడు, సహదేవుడిని కర్ణుడు, భీముడిని దుర్యోధనుడు, నకులుడిని శకుని, శిఖండిని కృపాచార్యుడు, ప్రతివింధ్యుడిని దుశ్శాసనుడు, ఘటోత్కచుడిని అశ్వత్థామ, ద్రుపదరాజును వృషసేనుడు, విరాటరాజును శల్యుడు, శతానీకుడిని చిత్రసేనుడు, అర్జునుడిని అలంబుసుడనే రాక్షసుడు అడ్డగించి ద్రోణుడిపైకి వెళ్ళకుండా నిలిపి యుద్ధం చేశారు. పాండవపక్షీయులేమో ద్రోణుడిని డీకొనటానికి వెళ్ళుతూ ఉంటే కౌరవపక్షీయులు ద్రోణుడిని రక్షించటానికి, పాండవపక్షీయులను అటు వెళ్ళకుండా ఆపి వారితో యుద్ధానికి తలపడ్డారు. ఆ సందర్భంలో ఎందరో ఎందరితోనో యుద్ధానికి తలపడ్డారు. పేర్లు లెక్కించి చెప్పటం సాధ్యంకాదు. ద్రోణుడు సోమకసైన్యంతో పోరాడుతూ దానిని హతమార్చాడు. అట్టి సమయంలో ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని ఎదుర్కొన్నాడు. ఆ సమయాన. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'గురుని నొంపను రక్షింపను' అనే చోట యథాసంఖ్యాలంకారం. 'ధర్మరాజాదులు గురుని నొంపను బూని తలపడిరి- కృతవర్మాదులు గురుని రక్షింపను బూని తలపడిరి' అనేవిధంగా అన్వయం. 'మఱియు ననేకులు అనేకులతో తార్కొనుటకు' కూడా కారణం ఇదియే.

**సీ.** **పాండవాగ్రజుని చాపము ద్రుంచెఁ గృతవర్మ; । యతఁ డొండు విలు గొని యతని నొంచె;**
**ధనువును దునిమి హస్తం బుచ్చిపో శక్తి । యడరింప వేఱ శరాసనంబు**
**గొని హయ సూతులఁ గోదండంబును బొడి । సేసి హార్దిక్యుండు సెలఁగి యేసె**
**నరనాయకుఁడు గృపాణముగొన్న నఱకెఁ । దోమరముఁ బూనిన రూపుమాపి మఱువుఁ**

**తే.** **బఱియలుగఁ జేసి తనువునఁ బఱపె నార । సంబు; లిట్లమ్మహాబలు చటుల విక్ర**
**మంబు దుస్సహ మగుడు నమ్మానవేంద్రుఁ । డనికిఁ దొలఁగిన గురుబల మలరె నధిప!** **147**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; కృతవర్మ; పాండవ+అగ్రజుని చాపము= ధర్మరాజు విల్లు; త్రుంచెన్= తెగవేశాడు; అతఁడు= ఆ ధర్మరాజు; ఒండువిలు= ఇంకో విల్లు; కొని= తీసికొని; అతనిన్= ఆ కృతవర్మను; నొంచెన్= నొప్పించాడు - అనగా యుద్ధం చేశాడు; ధనువును= ఆ కృతవర్మ ధనుస్సును; తునిమి= తునుకలు చేసి; హస్తంబు= చేతిని; ఉచ్చిపోన్= చీల్చుకొనిపోయే విధంగా; శక్తి= శక్త్యాయుధాన్ని; అడరింపన్= ప్రయోగించగా; వేఱు+అ= వేరే; శరాసనంబు= ధనుస్సును; కొని= తీసికొని; హయసూతులన్= అశ్వాలను, రథసారథిని కూడా; కోదండంబును= ధనువును; పొడి+చేసి= చూర్ణంచేసి - ధర్మరాజు రథమునకున్న అశ్వాలను అతడి సారథిని సంహరించి అతడి ధనుస్సును కూడా తెగగొట్టి అని భావం; హార్దిక్యుండు= కృతవర్మ; చెలఁగి= చెలరేగి; ఏసెన్= బాణాలను ప్రయోగించాడు; నరనాయకుఁడు= ధర్మరాజు; కృపాణము= ఖడ్గాన్ని; కొన్నన్= గ్రహించగానే; నఱకెన్= ఖండించాడు; తోమరమున్= తోమరాన్ని; పూనినన్= పట్టుకోగానే; రూపుమాపి= ధ్వంసంచేసి; మఱువున్= కవచాన్ని; పఱియలుగన్+చేసి= ఛిన్నంచేసి; తనువునన్= శరీరంపై; నారసంబులు= బాణాలను; పఱపెన్= వ్యాపింపచేశాడు - అనగా శరీరమంతటా బాణాలతో కొట్టాడని భావం; ఇట్లు= ఈ విధంగా; ఆ+మహాబలు చటుల విక్రమంబు= గొప్ప బలంగల ఆ కృతవర్మ అందమైన పరాక్రమం; దుస్సహము+అగుడున్= సహించరానిది కాగా; ఆ+మానవ+ఇంద్రుండు= ఆ ధర్మరాజు; అనికిన్= యుద్ధానికి - యుద్ధంనుండి అని భావం; తొలఁగినన్= తొలగిపోగా; కురుబలము= (మీ) కౌరవసైన్యం; అలరెన్= సంతోషించింది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! కృతవర్మ ధర్మరాజు విల్లు తెగగొట్టాడు. వెంటనే అతడు మరో విల్లు గ్రహించి, ఆ కృతవర్మను బాణాలతో నొప్పించాడు, అతడి వింటిని ముక్కలు చేసి శక్త్యాయుధాన్ని అతడిపై ప్రయోగించాడు. అది అతడిచేతిని చీల్చుకొనిపోయింది. అయినా ఆ కృతవర్మ వేరొక ధనుస్సును తీసికొని ధర్మరాజు రథానికున్న గుర్రాలను, సారథిని సంహరించాడు. మరియు అతడి ధనువును కూడా నుగ్గునుగ్గు చేశాడు. ధర్మరాజు ఖడ్గాన్ని గ్రహించాడు. దాన్నికూడ నరికివేశాడు. వెంటనే తోమరాన్ని ధర్మరాజు తీసికొనగా దానిని కూడ నశింపజేశాడు. అంతేకాక ధర్మరాజు కవచాన్ని తూట్లుపడే విధంగా చేసి, ఆ ధర్మరాజు శరీరంలో ఎన్నో బాణాలు నాటాడు. ఇక ధర్మరాజు ఆ కృతవర్మ యుద్ధాన్ని సహించలేకపోయాడు. వెంటనే యుద్ధభూమినుండి తొలగిపోయాడు. అది చూచి మీ కౌరవసేనలో సంతోషం ఉప్పొంగింది.

**క. భూరియు శినివరుఁడు శరా । సారము లొండొరులమీఁద సరిఁ బఱపి వడిం**
**బోరునెడ భల్లమున నా । కౌరవు విలు ద్రుంచె సత్యకసుతుం డధిపా! 148**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; భూరియున్= భూరి అనే కురువీరుడు; (మరియు) శినివరుఁడు= సాత్యకి; శర+ఆసారములు= బాణధారలు; ఒండొరులమీఁదన్= ఒకరు మరియొకరిపైన పరస్పరం; సరిన్= సమంగా; పఱపి= వ్యాపింపజేసి; వడిన్= వేగంగా; పోరునెడన్= యుద్ధం చేసే సమయంలో; భల్లమునన్= భల్లమనే బాణంతో; ఆ కౌరవువిలున్= ఆ కురువంశీయుడగు భూరియొక్క విల్లును; సత్యకసుతుండు= సాత్యకి; త్రుంచెన్= తెగగొట్టాడు.

**తాత్పర్యం:** భూరి, సాత్యకి ఈ ఇరువురు ఒకరిపై మరియొకరు సమానంగా బాణవర్షాన్ని కురిపిస్తూ వేగంగా యుద్ధం చేస్తూ ఉండగా ఓ ధృతరాష్ట్ర మహారాజా! మీ కురువంశీయుడైన భూరియొక్క విల్లును సాత్యకి ఒక భల్లంతో విరుగగొట్టాడు.

**ఆ. త్రుంచి మేను గాఁడఁ దూపులు నిగిడింప । నాతఁ డొండు వింట నతని నొంచి**
**ధనువు దునుమఁ గోప మినుమడి యై శక్తిఁ । ద్రెళ్ళ వైచె శినివరేణ్యుఁ డతని. 149**

**ప్రతిపదార్థం:** త్రుంచి= ఆ భూరివిల్లును తెగవేసి; మేను= శరీరాన్ని; కాఁడన్= గ్రుచ్చుకొనే విధంగా; తూపులు= బాణాలను;

నిగిడింపన్= ప్రయోగించగా; ఆతఁడు= ఆ భూరి; ఒండువింటన్= మరియొక విల్లుతో; అతనిన్= ఆ సాత్యకిని; నొంచి= నొప్పించి; ధనువు= విల్లును; తునుమన్= త్రుంచగా; కోపము= కోపం; ఇనుమడి ఐ= రెట్టింపై; శినివరేణ్యుఁడు= సాత్యకి; అతనిన్= ఆ భూరిని; త్రెళ్ళన్= పడిపోయేటట్లు అనగా - మరణించేవిధంగా; శక్తిన్= శక్తి అనే ఆయుధంతో; వైచెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** ఆభూరి (యొక్క) ధనుస్సును త్రుంచి, శరీరంపైబాణాలు నాటాడు. వెంటనే ఆ భూరి మరియొక ధనుస్సును తీసికొని ఆ సాత్యకిని బాణాలతో నొప్పించి, అతడి ధనుస్సును ముక్కలు చేశాడు. దానితో సాత్యకికి కోపం రెండింతలైనది. శక్త్యాయుధాన్ని భూరిపై ప్రయోగించాడు. దానితో భూరి మరణించాడు.

**వ. ఇట్లు సాత్యకి చేతం జచ్చిన భూరిం జూచి భారద్వాజపుత్రుం డతని పయిం గవియుటయు ఘటోత్కచుండు 'నిలునిలు' మని యెలుంగు సూపి దొడ్డ తూపు లడరించిన నతం డవి మగిడించి పెల్లేసిన నేదు వెఱిగిన ట్లయ్యసురవరుండు దశవిశిఖంబులు రయంబున నురంబునఁగ్రుచ్చిన మూర్ఛవచ్చి యమ్మేటిజోదు కేతుదండం బవలంబించి. 150**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సాత్యకిచేతన్= సాత్యకిచేత; చచ్చినభూరిన్= మరణించిన భూరి అనే రాజును; చూచి; భారద్వాజపుత్రుండు= ద్రోణపుత్రుడు అశ్వత్థామ; అతనిపయిన్= ఆ సాత్యకిపై; కవియుటయున్= తలపడగానే; ఘటోత్కచుండు= ఘటోత్కచుడు; నిలు నిలుము+అని= ఆగాగు అని; ఎలుంగు+చూపి= కంఠధ్వని చేసి (పెద్దగా అరచి అని భావం); దొడ్డతూపులు= దృఢమైన బాణాలను; అడరించినన్= ప్రయోగించగా; అతండు= ఆ అశ్వత్థామ; అవి= ఆ బాణాలను; మగిడించి= త్రిప్పికొట్టి; పెల్లు= అధికంగా; ఏసినన్= బాణాలతో కొట్టగా; ఏదు= ముండ్లపంది; వెఱిగినట్లు= చెలరేగినవిధంగా; ఆ+అసురవరుండు= ఆ ఘటోత్కచుడు; దశవిశిఖంబులు= పదిబాణాలను; రయంబునన్= వేగంగా; ఉరంబునన్= వక్షఃస్థలంలో; క్రుచ్చినన్= క్రుచ్చుకొనేటట్లు కొట్టగా; మూర్ఛవచ్చి= మూర్ఛవస్తున్నట్లయి తెలివి కోల్పోతున్నట్లు తోచి; ఆ+మేటిజోదు= ఆ యోధశ్రేష్ఠుడు అశ్వత్థామ; కేతుదండంబు= ధ్వజస్తంభాన్ని; అవలంబించి= పట్టుకొని;

**తాత్పర్యం:** ఇట్లా సాత్యకిచేత మరణించిన భూరిని చూచి అశ్వత్థామ, సాత్యకి నెదుర్కొనటానికి ఉద్యమించగా, ఘటోత్కచుడు అశ్వత్థామను 'నిలు నిలు' మని పెద్దగా అరుస్తూ అడ్డుకొని అతడిపై దృఢమైన బాణాలను ప్రయోగించాడు. వెంటనే అశ్వత్థామ ఆ బాణాలను త్రిప్పికొట్టటమే కాక, ఆ ఘటోత్కచుడిని దృఢమైన బాణాలతో నొప్పించాడు. అప్పుడు ఘటోత్కచుడు ముండ్లపంది విజృంభించినట్లు చెలరేగిపోయి, పదిబాణాలతో ఆ అశ్వత్థామను వక్షఃస్థలంలో వేగంగా కొట్టాడు. దానితో అశ్వత్థామకు మూర్ఛవచ్చినట్లయి ఆ రథంమీదనే ధ్వజస్తంభాన్ని ఆనుకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆలోనన తెలిసి మెఱుఁగు । వాలిక నారసము దైత్యువక్షమున వెసం**
**గీలించిన నరదముపై । సోలిపడుడుఁ దేరు దొలఁగ సూతుఁడు దోలెన్. 151**

**ప్రతిపదార్థం:** ఆలోననన్+అ= అంతలోనే; తెలిసి= తెలివి పొంది - మూర్ఛదేరి అని భావం; మెఱుఁగు= తళతళ మెరుస్తూ ఉన్న; వాలిక= దీర్ఘమైన; నారసము= బాణాన్ని; దైత్యువక్షమునన్= ఆ ఘటోత్కచుడి రొమ్ములో; కీలించినన్= క్రుచ్చుకొనేటట్లు వేయగా; అరదముపైన్= రథంపై; సోలి= మూర్ఛపోయి; పడుడున్= పడిపోయిన వెంటనే; సూతుఁడు= ఆ ఘటోత్కచుడి సారథి; తేరు= రథాన్ని; తొలఁగన్= రణరంగంనుండి తొలగిపోయే విధంగా; తోలెన్= తోలాడు. (ఇట్లు అశ్వత్థామ తాకిడికి తట్టుకోలేక మూర్ఛిల్లిన ఘటోత్కచుడిని రథచోదకుడు రణరంగానికి దూరంగా తీసికొని వెళ్ళాడని భావం).

**తాత్పర్యం:** అంతలోనే తెలివి పొంది, ఆ ఘటోత్కచుడి వక్షంలో దృఢమైన, తీక్ష్ణమైన బాణంతో కొట్టాడు. వెంటనే ఆ ఘటోత్కచుడు ఆ దెబ్బకు ఆగలేక సొమ్మసిల్లి, రథంపై ఒరిగాడు. అది గమనించి, సారథి ఆ రథాన్ని ప్రక్కకు తీసికొని వెళ్ళాడు.

**క. భీముఁడుఁ గురుపతియు శర । స్తోమము లొండొరులమీఁదఁ దొరఁగించుచు ను**
**ద్దామాంభోద పిహిత రవి । సోముల చందమున నొప్పుచుం బోరునెడన్. 152**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీమసేనుడు; కురుపతియున్= దుర్యోధనుడు; శరస్తోమములు= బాణాల సమూహాలను; ఒండొరుల మీఁదన్= ఒకరు మరియొకరిపై; తొరఁగించుచున్= వర్షించుకుంటూ (ఉండేటప్పుడు); ఉద్దామ= గొప్ప; అంభోద= మేఘాలచేత; పిహిత= కప్పబడిన; రవిసోముల= సూర్యచంద్రుల; చందమునన్= విధాన; ఒప్పుచున్= ప్రకాశిస్తూ; పోరు+ఎడన్= యుద్ధం చేసేటప్పుడు.

**తాత్పర్యం:** భీమ దుర్యోధనులు ఒకరినొకరు బాణసమూహంతో కప్పుకొంటూ, పెద్ద మేఘాలు కప్పివేసి సూర్యచంద్రులవలె ప్రకాశిస్తూ యుద్ధం చేసే సమయంలో.

**విశేషం:** అలం: ఉపమ. 'రవి సోముల చందమున' అనేటప్పుడు ఉపమాలంకారం. దానిచేత భీమ దుర్యోధనులు పరస్పరం కనబడనంత దట్టంగా బాణాలు ప్రయోగిస్తూ యుద్ధం చేశారనే విషయం ప్రకృతంలో ధ్వనిస్తూ ఉన్నది. ఇది అలంకారకృత వస్తుధ్వని.

**చ. ధనువు సిడంబుఁ ద్రుంచి సముదగ్రత భీముఁడు మేను నొంప న**
**మ్మనుజవిభుండు వేఱొక సమగ్రబలం బగు చాప మెత్తి యా**
**యనమెయిఁ గాఁడ విల్ విఱుగునట్లుగ నేసిన నొండువింట న**
**య్యనిలజుఁ డేడు నారసము లా నృపు గాత్రమునందుఁ గ్రుచ్చుచున్. 153**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీమసేనుడు; ధనువున్= ఆ దుర్యోధనుడి ధనుస్సును; సిడంబున్= ధ్వజాన్ని; త్రుంచి= తెగవేసి; సముదగ్రతన్= ఔద్ధత్యంతో అనగా గర్వంతో; మేనున్= దుర్యోధనుడి శరీరాన్ని; నొంపన్= నొప్పించగా; ఆ+మనుజ విభుండు= ఆ దుర్యోధనుడు; వేఱొక సమగ్ర బలంబు+అగు= మరియొక బలిష్ఠమైన; చాపము= విల్లు; ఎత్తి= తీసికొని; ఆయనమెయిన్= ఆ భీముడి శరీరంలో; కాఁడన్= క్రుచ్చుకొనే విధంగా; విల్= ధనుస్సు; విఱుగునట్లుగన్= విరిగిపోయే విధంగానూ; ఏసినన్= బాణాలతో కొట్టగా; ఒండు వింటన్= మరో ధనుస్సుతో; ఆ+అనిలజుఁడు= ఆ వాయునందనుడు, భీముడు; ఏడు నారసములు= ఏడుబాణాలను; ఆ నృపగాత్రమునందున్= ఆ రాజు అనగా దుర్యోధనుడి శరీరంలో; క్రుచ్చుచున్= నాటుకపోయేటట్లు చేస్తూ.

**తాత్పర్యం:** భీముడు, దుర్యోధనుడి ధనుస్సును, ధ్వజాన్ని ముక్కలు చేసి, గర్వం ప్రదర్శిస్తూ అతడి శరీరాన్ని, బాణాలతో నొప్పింపగా, దుర్యోధనుడు వేరే ధనుస్సును - మహాదృఢమైన దానిని గ్రహించి భీముడి శరీరం నొప్పి పుట్టే విధంగా, అతడి ధనుస్సు విరిగేవిధంగా చేయగా, అప్పుడు భీముడు మరొకవిల్లు గ్రహించి ఏడుబాణాలతో దుర్యోధనుడిని కొట్టి శరీరాన్ని గాయపరిచాడు.

**చ. విలు దునుమాడి వెండియును విండులు నా ల్గతఁ డెత్త నెత్త ను**
**త్తలముగఁ ద్రుంచి వైచె గదఁ దత్తురగంబుల సూతుఁ జంప న**
**గ్గలమగు భీతి రాజు దొలఁగన్ వెస దాఁటుడుఁ గాన కాతఁడుం**
**బొలిసెనకాఁ దలంచి మదిఁ బొంగి వృకోదరుఁ డార్చె; నార్చినన్. 154**

**ప్రతిపదార్థం:** విలు= ధనుస్సును; తునుమాడి= తునుకలు చేసి; వెండియున్= మళ్ళీ; అతఁడు= ఆ దుర్యోధనుడు; నాల్గు విండులు= నాలుగు ధనువులను; ఎత్తన్+ఎత్తన్= ఎత్తుతూ పోతూ ఉండగా; ఉత్తలముగన్= వేగంగా; త్రుంచివైచెన్= త్రుంచివేశాడు; గదన్= గదతో; తద్+తురగంబులన్= అతడి అశ్వాలను; సూతున్= సారథిని; చంపన్= సంహరించగా; అగ్గలము+అగు= అధికమైన; భీతిన్= భయంతో; రాజు= దుర్యోధనుడు; తొలఁగన్= తొలగిపోగా; వెసన్= తొందరగా; దాఁటుఁడున్= దాటినంతనే; కానక= గుర్తించక; ఆతఁడున్= ఆ దుర్యోధనుడును; పొలసెను+అ+కాన్= మరణించియే ఉండవచ్చును అని; తలంచి= అనుకొని; మదిన్= మనస్సులో; పొంగి= ఎంతో సంతోషించి; వృకోదరుఁడు= భీముడు (తోడేలు పొట్టవంటి పొట్ట గలవాడు కాబట్టి భీముడికి ఆ పేరు); ఆర్చెన్= సింహనాదం చేశాడు; ఆర్చినన్= ఆర్వగా.

**తాత్పర్యం:** విల్లును ముక్కలు చేసి, అతడు మళ్ళీ విల్లెత్తాడో లేదో మళ్ళీ తునుకలు చేశాడు. ఇట్లా నాలుగు విల్లులను ఖండించాడు. అంతేకాక గదతో ఆ దుర్యోధనుడి రథానికున్న అశ్వాలను, సారథిని సంహరించాడు. అప్పుడు దుర్యోధనుడు విపరీతభయంతో యుద్ధంమాని, వేగంగా అక్కడినుండి అగపడకుండా వెళ్ళగా అతడు మరణించాడనే భావించి భీముడు సింహనాదం చేశాడు. ఆ సింహనాదానికి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఉస్మానియా ప్రతిలో 'జావ' అనే పాఠానికి చూపిన 'జంప' అనే పాఠాంతరం ప్రకృతానుగుణమగుటచేత గ్రహించటం జరిగింది.

**వ. మన మూఁకలు నట్లకాఁ దలంచి హాహాకారంబులతో నాకులతం బొందె; నందలి జనంబులు ప్రమదంబునం జెలంగి రక్కౌరవేంద్రుండు వేఱొక్క తేరెక్కి తోఁచినం గని యెల్లవారును డిందుపడిరి ; కర్ణ సహదేవులు సముదీర్ణ విక్రమంబు వెలయం బెనంగునప్పుడు. 155**

**ప్రతిపదార్థం:** మన మూఁకలు= మన సైన్యాలు; అట్లు+అ= అట్లాగే; కాన్+అయినట్టుగా+తలంచి= అనుకొని, అనగా దుర్యోధనుడు మరణించాడనే భావించి; హాహాకారంబులతోన్= హా హా (అయ్యో! అయ్యో!) అనే ఆర్తధ్వనులతో, అనగా దుఃఖాతిశయంతో 'హా హా' అని అరుస్తూ; ఆకులతన్= వ్యాకులభావాన్ని; పొందెన్= పొందాయి; అందలి జనంబులు= ఆ పాండవ పక్షంలో ఉండే జనులు; ప్రమదంబునన్= సంతోషంతో; చెలంగిరి= నినాదం చేశారు; (అంతలోనే) ఆ+కౌరవేంద్రుండు= ఆ దుర్యోధనుడు; వేఱొక్క తేరు= మరియొక రథాన్ని; ఎక్కి= అధిరోహించి; తోఁచినన్= దర్శనమీయగానే; ఎల్లవారును= అందరూ (ఇరువైపుల వారందరూ - అని భావం); డిందుపడిరి= ఉపశమించారు (చెలరేగటాలు మానారు!); కర్ణసహదేవులు= కర్ణుడును, సహదేవుడును; సముదీర్ణ విక్రమంబు= గొప్ప పరాక్రమం; వెలయన్= ప్రకాశించగా; పెనంగునప్పుడు= యుద్ధం చేసే సమయంలో.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! మన సైన్యాలు కూడా దుర్యోధనుడు మరణించాడనే భావించి హాహాకారాలు చేస్తూ కలతనొందాయి. పాండవసైన్యాలు సంతోషంతో సింహనాదాలు చేశాయి. ఇంతలో దుర్యోధనుడు వేరొకరథంపై కూర్చొని దర్శనమివ్వటంతో అందరు సద్దుమణిగారు. కర్ణ సహదేవులు గొప్ప పరాక్రమంతో యుద్ధం చేస్తుండగా

**క. అమ్మాద్రీసుతుఁ డేపునఁ । దొమ్మిది వాలమ్ము లొడలఁ దూర్చిన నతిరో**
**షమ్మునఁ గర్ణుండు దదం । గమ్ములు నొప్పించెఁ దీవ్రకాండ శతమునన్. 156**

**ప్రతిపదార్థం:** ఆ+మాద్రీసుతుఁడు= ఆ సహదేవుడు; ఏపునన్= విజృంభణతో; తొమ్మిది వాలు+అమ్ములు= తొమ్మిది తీక్ష్ణములైన బాణాలను; ఒడలన్= కర్ణుడి శరీరాన; తూర్చినన్= గ్రుచ్చుకొనేటట్లు కొట్టగా; కర్ణుండు; అతి రోషమ్మునన్= మిక్కిలి కోపంతో; తీవ్ర కాండశతమునన్= వాడి అయిన నూరుబాణాలతో; తద్+అంగంబులు= ఆ సహదేవుడి శరీరావయవాలను; నొప్పించెన్= నొప్పించాడు - నొప్పి పుట్టేవిధంగా కొట్టాడని భావం.

**తాత్పర్యం:** ఆ సహదేవుడు విజృంభించి కర్ణుడిని తొమ్మిది తీక్ష్ణములైన బాణాలతో కొట్టి, శరీరాన్ని గాయపరచగా, కర్ణుడు మహాకోపంతో అతని అవయవాలను వంద వాడిబాణాలతో నొప్పించాడు.

**వ. ఇట్లు సహదేవుం బొదివి రాధేయుండు. 157**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సహదేవున్= సహదేవుడిని; పొదివి= మర్దించి అనగా నుగ్గునుగ్గు చేసి; రాధేయుండు= కర్ణుడు.

**తాత్పర్యం:** కర్ణు డీ విధంగా సహదేవుడిని ఆక్రమించి.

**చ. రయమున విల్లు ద్రుంచిన పరాక్రమ మొండొక వింటఁ జేయఁగా**
**హయముల సూతుఁ జంపుటయు నాతఁడు ఖడ్గము ఖేటకంబు ని**
**ర్భయముగఁ బుచ్చుకొన్న బహు బాణములం దునుమాడె నన్యదు**
**ర్జయ మగు లావునం గడువెసన్ గద వైవ నడంచె నవ్వుచున్. 158**

**ప్రతిపదార్థం:** రయమునన్= వేగంగా; విల్లున్= విల్లును; త్రుంచినన్= విరుగగొట్టగా; ఒండు+ఒకవింటన్= మరియొక ధనుస్సుతో; పరాక్రమము= విక్రమించటం; చేయఁగాన్= చేస్తూ ఉంటే; హయములన్= అశ్వాలను; సూతున్= సారథిని; చంపుటయున్= సంహరించగానే; అతఁడు= ఆ సహదేవుడు; ఖడ్గమున్= కత్తిని; ఖేటకంబున్= డాలును; నిర్భయముగన్= భయం అనేది లేక; పుచ్చుకొన్నన్= తీసికొనగానే; బహుబాణములన్= అనేక బాణాలతో; తునుమాడెన్= తునకలు చేశాడు; అన్యదుర్జయము+అగు= ఇతరులకు జయింపరాని; లావునన్= (బాహు) బలంతో; కడు వెసన్= మిక్కిలి వేగంతో; గదన్= గదను; వైవన్= వేయగా; నవ్వుచున్= నవ్వుతూ; అడంచెన్= అణచివేశాడు - మధ్యలోనే ఆ గదను కర్ణుడు ఖండించాడు.

**తాత్పర్యం:** (కర్ణుడు) వెనువెంటనే సహదేవుడి ధనువును ముక్కలు చేశాడు. ఆ సహదేవుడు వేరొక విల్లు తీసికొని విక్రమించాడు. అంతలోనే కర్ణుడు సహదేవుడి రథానికున్న అశ్వాలను, సారథిని సంహరించాడు. వెంటనే సహదేవుడు కత్తి డాలు తీసికొని, నిర్భయంగా పోరాటాని కుపక్రమించగానే, కర్ణుడు అనేక బాణాలతో వాటిని ముక్కలు చేశాడు. అప్పుడు సహదేవుడు అన్యులు అసాధ్యంకాని బాహుబలంతో మిక్కిలి వేగంగా కర్ణుడి పైకి గదను విసరగా, కర్ణు డా గదను నవ్వుతూ కిందపడేటట్టు చేశాడు.

**వ. దానం బెండువడక యప్పాండు నందనుండు. 159**

**ప్రతిపదార్థం:** దానన్= దానిచేత; బెండు+పడక= బలహీనం కాక, నిరుత్సాహపడక; ఆ+పాండునందనుండు= ఆ సహదేవుడు.

**తాత్పర్యం:** సహదేవుడు అందుకు నిరుత్సాహపడక

**కర్ణుఁడు సహదేవుని వింటికోపునం బొడుచుచు నవమానించుట (సం. 7-141-12)**

**ఆ. శక్తివైవ నిశితచక్రంబు నిగిడింప । వరుస నదియు నిదియు వ్రయ్యలయ్యు**
**దునియ లయ్యు నేలఁ దొరఁగంగఁ జేసి పె । ల్లేసి, తెరలుటయును నెయ్దె నతఁడు. 160**

**ప్రతిపదార్థం:** (సహదేవుడు) శక్తిన్= శక్త్యాయుధాన్ని; వైవన్= వేయగా; నిశితచక్రంబు= పదునైన తన రథచక్రాన్ని; వరుసన్= క్రమంగా; నిగిడింపన్= ప్రయోగించగా; అతఁడు= ఆ కర్ణుడు; పెల్లు= మిక్కిలి; ఏసి= బాణాలతో కొట్టి; అదియున్= ఆ

శక్తి; ఇదియున్= ఈ చక్రం; వ్రయ్యలు+అయ్యున్= ముక్కలై కూడా; తునియలు+అయ్యున్= తునకలై (అదియు వ్రయ్యలయ్యు ఇదియు తునియలయ్యు అని వరుసగా అన్వయం;) నేలన్= భూమిపై; తొరఁగంగన్= పడిపోయేటట్లు; చేసి= చేసి; తెరలుటయు నున్= తొలగిపోతూ ఉండగా, రణాన్ని వీడిపోతూ ఉండగా; అతఁడు= కర్ణుడు; ఎయ్దెన్= వెంబడించాడు.

**తాత్పర్యం:** (ఆ సహదేవుడు) కర్ణుడిపైకి శక్త్యాయుధాన్ని, తరువాత రథచక్రాన్ని ప్రయోగించాడు. ఆ రెండూ కర్ణుడి బాణాలకు తునకలుగా మారి నేలగూలాయి. ఇంకా కూడా కర్ణుడు సహదేవుడిని బాణాలతో కొట్టాడు. నిరాయుధుడైన సహదేవుడు ఆ కర్ణుడిధాటికి ఆగలేక రణంనుండి నిష్క్రమిస్తూ ఉంటే కర్ణుడు అతడిని వెంబడించాడు.

**విశేషం:** పెల్లేసినవాడు, ఎయ్దినవాడు= వెంబడించినవాడు కర్ణుడు; తెరలినవాడు సహదేవుడు. అదేవిధంగా అన్వయించి అర్థాన్ని గ్రహించాలి. కొంచెం అర్థభ్రాంతి అయ్యే అవకాశం ఉండుటచేత ఈ విధంగా వివరించవలసి వచ్చింది. సహదేవుడు ప్రయోగించింది రథచక్రం కాని చక్రాయుధం కాదు. దానికి సంస్కృతమూలం శ్లో॥ "శక్తిం చిక్షేప కర్ణాయ తా మప్యస్యాచ్ఛిన చ్ఛరైః । ససంభ్రమం తత స్తూర్ణ మవప్లుత్య రథోత్తమాత్ । సహదేవో మహారాజ! దృష్ట్వా కర్ణం వ్యవస్థితమ్ । రథచక్రం ప్రగృహ్యాజౌ ముమోచాధిరథిం ప్రతి." (ద్రోణ. 167/10,11) చివరకు ఏ ఆయుధమూ లేక రణమునుండి వైదొలగాడు సహదేవుడు - ఆ సంస్కృత మూలశ్లోకం ఇంతకుముందే ఉదాహరించబడింది.

**వ. ఇత్తెఱంగునఁ గర్ణుండు గదిసి నిశ్చేష్టితుండగు సహదేవు నాలోకించి, కుంతి మాటలు దలంచి, యొండు సేయ నొల్లక యల్లన వింటికోపునం గడుపు వొడిచి నవ్వుచు 'నెక్కుడైన పగఱ నుక్కునం దలపడకు; మల్ల వాఁడె నరుండు గురుసేనతోడ బిరుదై పెనంగెడు; నతని కడకుం బొ' మ్మని పలికి పోయె; నక్కుమారుండును నట్లు గర్ణునేటులను మాటలను గడునొచ్చి తన బ్రదుకునకు రోయుచుం బోయి వేఱొక్క రథం బెక్కె; మత్స్య మద్రేశ్వరులు జంభవాసవుల చందంబున సమరంబు సేయు సమయంబున నా శల్యుండు. 161**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; కర్ణుండు; కదిసి= సమీపించి; నిశ్చేష్టితుండు+అగు= చేష్టలు దక్కి ఉన్నటువంటి; సహదేవున్= సహదేవుడిని; ఆలోకించి= చూచి; కుంతి మాటలు= కుంతి మాటలను; తలంచి= తలచుకొని; ఒండు= అన్యం; చేయన్= చేయటానికి; ఒల్లక= ఇష్టపడక; వింటికోపునన్= వింటికొనతో; కడుపున్= ఉదరభాగాన్ని; పొడిచి= పొడిచివేసి; నవ్వుచున్= మందహాసం చేస్తూ (ఇట్లా అన్నాడు); ఎక్కుడు+ఐన= అధికులైన; పగఱన్= శత్రువులను; ఉక్కునన్= పొగరుతో; తలపడకు= ఎదిరించకుము; అల్లా= అదిగో; వాఁడె= ఆ కనబడేవాడే; నరుండు= అర్జునుడు; కురుసేనతోడన్= కౌరవసైన్యంతో; బిరుదు+ఐ= మేటి అయి; పెనంగెడున్= యుద్ధం చేస్తున్నాడు; అతనికడకున్= అతడివద్దకు; పొమ్ము= వెళ్ళుము; అని= ఇట్లా; పలికి= చెప్పి; పోయెన్= కర్ణుడు వెళ్ళిపోయాడు; ఆ+కుమారుండునున్= ఆ సహదేవుడు; అట్లు= ఆ విధంగా; కర్ణుని+ఏటులను= కర్ణుడి బాణాల దెబ్బలతోను; మాటలను= (ఎత్తిపొడుపు) మాటలతోను; కడున్= మిక్కిలి; నొచ్చి= బాధపడి; తన బ్రదుకునకున్= తాను జీవించియుండటానికి; రోయుచున్= అసహ్యించుకొంటూ; పోయి= (అక్కడినుండి) వెళ్ళి; వేఱు+ఒక్కరథంబు= మరో రథాన్ని; ఎక్కెన్= అధిరోహించాడు; మత్స్యమద్రేశ్వరులు= విరాటరాజు, శల్యుడు (వీరిద్దరు); జంభవాసవుల చందంబునన్= జంభాసురుడు, ఇంద్రుడూ, జంభవాసవులు - వారిద్దరి విధాన; సమరంబు= యుద్ధాన్ని; చేయు సమయంబునన్= చేసే సమయంలో; ఆ శల్యుండు= ఆ శల్యుడు.

**తాత్పర్యం:** ఇట్లా కర్ణుడు సహదేవుడిని సమీపించి, చేష్టలు దక్కి చూస్తూ ఉన్న సహదేవుడిని చూడగానే కుంతి తనతో అన్నమాటలు (అనగా - అర్జునుడిని ఒక్కడినే తప్ప మరెవ్వరిని రణంలో, అవకాశం ఎదురై వచ్చినా వధించకుండా ఉంటాననే తన మాటలు) జ్ఞాపకం వచ్చాయి. కాబట్టి సహదేవుడిని సంహరించటానికి మనస్సు

రాక, కేవలం వింటికొనతో అతడి ఉదరభాగాన్ని పొడుస్తూ నవ్వుతూ 'తనకంటె అధికుడైన శత్రువుతో పొగరుతో తలపడటం అవివేకం. ఇట్లా ఎప్పుడూ చేయకుము. అదుగో మీ అర్జునుడు కురుసైన్యంతో పోరాడుతూ ఉన్నాడు అతడిదగ్గరికి వెళ్ళుము' అని చెప్పి, కర్ణుడు అక్కడినుండి వెళ్ళిపోయాడు. సహదేవుడు ఆ కర్ణుడి బాణఘాతాల తోను ఈ సూటిపోటి మాటలతోను మనస్సులో చాలా బాధపడి తన బ్రతుకునకు తానే అసహ్యపడుతూ వెంటనే వేరొక రథం ఎక్కి అక్కడినుండి వెళ్ళిపోయాడు. విరాట శల్యులు జంభాసుర దేవేంద్రులవలె యుద్ధం చేసే సమయంలో ఆ శల్యుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** కుంతి కర్ణుడి దగ్గరకు వెళ్ళి 'నీవు నా కుమారుడవు. కన్యగా ఉన్నప్పుడు సూర్యునివలన కలిగినవాడవు. పాండవులకు జ్యేష్ఠభ్రాతవు. కౌరవపక్షాన్నివీడి పాండవపక్షం చేరి రాజ్యాన్ని నీవే అనుభవించుము' అని అర్థించింది. అందుకు కర్ణుడు అది తనకు ధర్మం కాదని లోక సమ్మతమూ కాదని కుంతి అభ్యర్థనను తిరస్కరిస్తూనే ఇట్లా అన్నాడు: **శ్లో॥ న చతేऽయం సమారంభో మయి మోఘో భవిష్యతి । వధ్యాన్ విషహ్యాన్ సంగ్రామే న హనిష్యామి తే సుతాన్ । యుధిష్ఠిరంచ భీమంచ యమౌ చైవార్జునాదృతే॥'** (ఉద్యోగ 146/20,21) నీవిట్లా రావటం వృథా కాదు. అర్జునుడు తప్ప మరెవ్వరైనా నీ కొడుకులు - యుధిష్ఠిరాదులు యుద్ధంలో తటస్థించి సంహరించే అవకాశం వచ్చినా సంహరించను' అని - ఇది కర్ణుడు కుంతి కిచ్చిన మాట. ఆ మాట నిలబెట్టుకొనటానికే సహదేవుడిని సంహరించక కర్ణుడు విడిచిపెట్టాడు.

**క. హరులను సూతునిఁ జంపిన । విరటుఁడు పొలివోక వివిధ విశిఖచయంబుల్**
**గురియ శతానీకుఁడు శ । ల్యురథం బస్త్రములఁ బొదివె నుద్ధతభంగిన్. 162**

**ప్రతిపదార్థం:** (శల్యుడు) హరులను= (ఆ విరాటరాజుయొక్క) అశ్వాలను; సారథిని= సారథిని; చంపినన్= సంహరించగా; విరటుఁడు= విరాటరాజు; పొలివోక= నిరుత్సాహపడక; వివిధ విశిఖ చయంబుల్= అనేకములైన బాణాల సమూహాలను; కురియన్= కురిపించగా; (అప్పుడే చేరి) శతానీకుఁడు= విరాటుడి తమ్ముడు శతానీకుడనేవాడు; శల్యురథంబు= శల్యుడి రథాన్ని; ఉద్ధతభంగిన్= గర్వించిన విధాన; గర్వంతో చెలరేగి; అస్త్రంబులన్= బాణాలతో; పొదివెన్= కప్పివేశాడు.

**తాత్పర్యం:** విరాటుడి అశ్వాలను, సారథిని చంపాడు. అప్పుడు విరాటుడు నిరుత్సాహపడక ఆ శల్యుడిపై బాణవర్షం కురిపించాడు. అంతలోనే విరాటుడి తమ్ముడు శతానీకుడు విజృంభించి శల్యుడి రథాన్ని బాణాలతో కప్పివేశాడు.

**వ. ఇట్లు మత్స్యానుజుండు దాఁకిన. 163**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; మత్స్య+అనుజుండు= మత్స్యదేశపురాజైన విరాటుడి తమ్ముడు శతానీకుడు; తాఁకినన్= (శల్యుడిని) ఎదుర్కొనగా.

**తాత్పర్యం:** ఈ విధంగా విరాటుడి తమ్ముడు శతానీకుడు (తనను) ఎదుర్కొనగా.

**తే. అతనిఁ గూల్చె మద్రేశుఁ డయ్యరద మెక్కి । విరటుఁ డడలును గినుకయుఁ బిరిగొనంగ**
**ముట్టె నాతని; నాతండు మూర్ఛవోవ । నేయ సారథి దొలఁగంగ నెగచె రథము. 164**

**ప్రతిపదార్థం:** మద్రేశుఁడు= శల్యుడు; ఆతనిన్= ఆ శతానీకుడిని; కూల్చెన్= పడగొట్టాడు - సంహరించాడని భావం; విరటుఁడు= విరాటరాజు; ఆ+అరదము= ఆ శతానీకుడి రథాన్ని; ఎక్కి= అధిరోహించి; అడలును= భయం; కినుకయును= కోపం;పిరిగొనంగన్=

ఆవహింపగా; ఆతనిన్= ఆ శల్యుడిని; ముట్టెన్= ఎదుర్కొన్నాడు; ఆతండు= ఆ శల్యుడు; ఆతనిన్= ఆ విరాటుడిని; మూర్ఛ= మూర్ఛ; పోవన్= పోయేవిధంగా; ఏయన్= కొట్టగా; సారథి= ఆ విరాటుడి సారథి; రథమున్= రథాన్ని; తొలఁగంగన్= రణరంగంనుండి తొలగిపోయే విధంగా; ఎగచెన్= తరిమాడు.

**తాత్పర్యం:** శల్యుడు శతానీకుడిని సంహరించాడు. విరాటుడు తన తమ్ముడి రథం ఎక్కి భయం, కోపం-తన మనస్సునావహింపగా, ఆ శల్యుడిని ఎదిరించాడు. కాని, ఆ శల్యుడు విరాటుడిని మూర్ఛపోయేటట్లు బాణాలతో కొట్టగా, వెంటనే అతడి సారథి ఆ రథాన్ని రణరంగంనుండి తొలగించి తీసికొని వెళ్ళాడు.

**విశేషం:** 'ఆతనిన్' అనే పదం దేహళీదత్త దీపన్యాయంచేత అన్వయించి రెండర్థాలు. 'ముట్టెనాతని' అని, 'ఆతని నాతఁడు మూర్ఛపోవ' అని శల్యవిరాటులను చెప్పుతుంది.

**వ. ఇవ్విధంబున విరటుండు వికలుఁ డగుటయు నా చక్కటి సైన్యంబులు శల్యునురవడికిం గాక తెరలినం దఱిమి ధనంజయుండు నిలువరించిన బలాఢ్యుం డగు నలంబుసుం డతని మేన మార్గణంబులు గ్రుచ్చి పేర్చిన నప్పాండవ మధ్యముండు. 165**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; విరటుండు= విరాటరాజు; వికలుండు+అగుటయున్= విఫలం కాగా; ఆ చక్కటి సైన్యంబులు= ఆ వైపు సైన్యాలు; శల్య+ఉరవడికిన్= శల్యుడి ధాటికి; కాక= తాళలేక; తెరలినన్= (ప్రక్కకు) తొలగగా; తఱిమి= పరుగుతీసి (వచ్చి); ధనంజయుండు= అర్జునుడు; నిలువరించినన్= నిలిచిపోయేటట్లు చేయగా; బల+ఆఢ్యుండు= బల సంపన్నుడైన; అలంబుసుండు= ఆలంబుసుడనే రాక్షసుడు; అతని మేనన్= ఆ అర్జునుడి శరీరాన; మార్గణంబులు= బాణాలు; క్రుచ్చి= నాటి; పేర్చినన్= విజృంభిస్తూ ఉంటే; ఆ+పాండవమధ్యముండు= ఆ అర్జునుడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా విరాటరాజు విఫలుడు కాగా, ఆ వైపు సైన్యాలు శల్యుడిధాటికి తట్టుకొనలేక తొలగిపోగా, అర్జునుడు పరుగుపరుగున వచ్చి, వాటిని ఆదుకొని నిలువరించాడు. అలంబుసుడనే బలాఢ్యుడైన రాక్షసుడు అర్జునుని శరీరంమీద బాణాలను గ్రుచ్చి రెచ్చిపోగా, అర్జునుడు.

**ఉ. చాపముఁ గేతువుం దునిమి, సారథి నశ్వములన్ వధింప ను**
**త్కోపవికారుఁడై యసుర క్రూర కృపాణము గొన్న నేసి ను**
**గ్గై పృథివీస్థలిం దొరఁగున ట్లలయించి చతుశ్శిలీముఖా**
**టోపము సూప నాతఁడు గడున్ వెసఁ బాఱె భయార్తమూర్తి యై. 166**

**ప్రతిపదార్థం:** (ఆ పాండవమధ్యముడు) చాపమున్= ధనుస్సును; కేతువున్= ధ్వజాన్ని; తునిమి= ఖండించి; సారథిన్= సూతుడిని; అశ్వములన్= గుర్రాలను; వధింపన్= వధించగా; ఉత్కోపవికారుఁడు+ఐ= గొప్ప కోపవికారం కలవాడై; అసుర= ఆ అలంబుసుడు అనే రాక్షసుడు (విరథుడై); క్రూరకృపాణము= భయంకరమైన ఖడ్గాన్ని; కొన్నన్= తీసికొనగా - అనగా ప్రయోగించటానికి పైకి ఎత్తగానే; నుగ్గు+ఐ= నుసి నుసి అయి; పృథివీస్థలిన్= భూమిపై; తొరఁగునట్లు= పడేవిధంగా; ఏసెన్= బాణాలతో కొట్టాడు; ఇట్లు+అలయించి= ఇట్లా అలసట పుట్టేటట్లు చేసి; చతుః+శిలీముఖ+ఆటోపము= నాలుగు బాణాలతో ఆడంబరం; చూపన్= చూపినవెంటనే; (రథాశ్వ సారథులను, ధనురాద్యాయుధాలను లేకుండా చేసి యుద్ధంలో అలుపు పుట్టించి మరీ నాలుగుబాణాలు ప్రయోగించి శరీరాన్ని నొప్పించగా); ఆతఁడు= ఆలంబుసుడు; కడున్= మిక్కిలి; వెసన్= శీఘ్రంగా; భయార్తమూర్తి+ఐ= భయంతో ఆర్తిని చెందిన ఆకారం గలవాడై; పాఱెన్= పారిపోయాడు.

**తాత్పర్యం:** అలంబుసుడి చాపాన్ని, ధ్వజాన్ని, సారథిని, అశ్వాలను నేలకూల్చాడు. దానితో మిక్కిలి కోపంతో ఆ అలంబుసుడు భయంకర ఖడ్గాన్ని ఎత్తిన వెంటనే దానిని కూడా తుత్తునియలు చేశాడు. ఇట్లా యుద్ధంలో ఆ అలంబుసుడిని అలసేటట్లు చేసి, నాలుగు దృఢములైన బాణాలతో కొట్టగా, ఆ రాక్షసుడు భయకంపితుడై యుద్ధరంగంనుండి వేగంగా పారిపోయాడు.

**విశేషం:** 'చతుశ్మతిన్ సమాటోపము' అని ఉస్మానియా ప్రతి ఆదరించి చూపిన పాఠం మూలానుగుణంగా లేదు. పాఠాంతరంగా చూపిన పాఠమే మూలానికి విధేయంగా ఉండటంచేత అదే గ్రహించి వ్యాఖ్యానించటం జరిగింది. సంస్కృతమూలంలో ఇట్లా ఉన్నది. శ్లో॥నవభిశ్చ శితైర్బాణై ర్ధ్వజం చిచ్ఛేద భారత । సారథిం చ త్రిభిర్బాణై స్త్రిభిరేవ త్రివేణుకమ్ । ధను రేకేన చిచ్ఛేద చతుర్భిశ్చతురో హయాన్ । పునః సజ్యం కృతం చాపం తదప్యస్య ద్విధాzచ్ఛినత్ । విరథస్యోద్యతం ఖడ్గం శరేణాస్య ద్విధాzకరోత్ । అథైనం నిశితైర్బాణై శ్చతుర్భిర్భరతర్షభ! పార్థోzవిధ్యద్రాక్షసేన్ద్రం సవిద్ధః ప్రాద్రవద్రథాత్' (ద్రోణ. 167/44-47) అని.

**సీ.** **నకులనందనుఁడు నీనందనుతోఁ బోరు । నెడ నా శతానీకుఁ డేచి యతని**
**కంకట మంగంబు గ్రక్కునఁ బాసిపోఁ । బడ వేసి విల్లును సిడముఁ ద్రుంపఁ,**
**దలఁకక యొండు కోదండంబు గొని నీదు । పుత్త్రుండు నొంప నా చిత్రసేను**
**శరముల కోర్చి తత్తురగంబులను సూతుఁ । ధరఁ గూల్చె వెస భవత్పౌ త్త్రుఁ డపుడు.**

**తే.** **గలఁక లేక యతండు శీఘ్రమున నిరువ । దేను దూపుల నొంచిన నెసక మెసఁగఁ**
**గినుక నాతఁ డా ధనువును దునుమ నక్కు । మారుఁ డేఁగె హార్దిక్యుని తేరిపైకి.** 167

**ప్రతిపదార్థం:** నకుల నందనుండు= నకులుడి కుమారుడు శతానీకుడు; నీ నందనుతోన్= నీ కుమారుడైన చిత్రసేనుడితో; పోరునెడన్= యుద్ధం చేసే సమయంలో; శతానీకుఁడు; ఏచి= విజృంభించి; అతని కంకటము= ఆ చిత్రసేనుని కవచం; అంగంబు= శరీరాన్ని; పాసి= విడిచి; పోఁబడన్= పోయి పడే విధంగా; ఏసి= బాణాలు వేసి; విల్లును= ధనుస్సును; సిడమున్= ధ్వజాన్ని; త్రుంపన్= ఖండించగా; తలఁకక= చలించక; ఒండు= మరియొక; కోదండంబు= ధనుస్సును; కొని= తీసికొని; నీదుపుత్త్రుండు= నీ కుమారుడు చిత్రసేనుడు; నొంపన్= బాణాలతో నొప్పి కలుగజేయగా; ఆ చిత్రసేను శరములన్= ఆ చిత్రసేనుడి బాణాలను; ఓర్చి= సహించి; అపుడు= ఆ సమయంలో; భవత్+పౌత్త్రుండు= మనుమడు అయిన ఆ శతానీకుడు; తద్+తురంగంబులను= అతని అశ్వాలను; సూతున్= సారథిని; ధరన్= భూమిపై; వెసన్= శీఘ్రంగా; కూల్చెన్= పడగొట్టాడు - అనగా సంహరించాడు; అతండు= ఆ చిత్రసేనుడు; కలఁక లేక= జంకు లేక; శీఘ్రముగన్= వేగంగా; ఇరువదేను తూపులన్= ఇరువది అయిదు బాణాలతో; నొంచినన్= నొప్పి పుట్టించగా; ఆతఁడు= ఆ శతానీకుడు; కినుకన్= కోపంతో; ఎసకము= విజృంభణం; ఎసఁగన్= అతిశయించగా; ఆ ధనువును= ఆ విల్లును; తునుమన్= విరుగగొట్టగా; ఆ+కుమారుఁడు= ఆ చిత్రసేనుడు; హార్దిక్యుని తేరిపైకిన్= హార్దిక్యుడి రథంపైకి; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** నకులుడి కుమారుడు శతానీకుడు నీ కుమారుడైన చిత్రసేనుడితో యుద్ధం ప్రారంభించగానే శతానీకుడు చిత్రసేనుడి కవచాన్ని బాణాలతో ఛిన్నంచేసి, తొలగిపోయి క్రిందపడేటట్లు చేశాడు. ధనువును, ధ్వజాన్ని నరికివేశాడు. వెంటనే చిత్రసేనుడు మరో విల్లును చేపట్టి ఆ శతానీకుడి శరీరాన్ని నొప్పి పుట్టేటట్లు గట్టిగా కొట్టాడు. అయినా శతానీకుడు ఆ బాధకు తట్టుకొని వెంటనే చిత్రసేనుడి అశ్వాలను సారథిని కూల్చివేశాడు. వెంటనే చిత్రసేనుడు శతానీకుడిని ఇరువది అయిదు బాణాలను శరీరంలో గ్రుచ్చుకొని నొప్పి పుట్టేటట్లు ప్రయోగించాడు. అప్పుడు శతానీకుడు మిక్కిలి కోపంతో విజృంభించి, చిత్రసేనుడి విల్లును ముక్కలు చేశాడు. దానితో చిత్రసేనుడు నిరాయుధుడై రథాశ్వ సారథులను, కవచాన్ని కూడా కోల్పోయి హార్దిక్యుడి రథంమీదికి పారిపోయి ఎక్కాడు.

**క. ద్రుపదుఁడు వృషసేనుండును । నుపమానాతీత ఘోర యుద్ధంబున బా**
**ణ పరీత శోణిత ప్లుత । వ పురుజ్జ్వలులైరి కౌరవక్షితినాథా! 168**

**ప్రతిపదార్థం:** కౌరవ క్షితినాథా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ద్రుపదుఁడు= ద్రుపదరాజు; వృషసేనుండును= కర్ణుడి కుమారుడు వృషసేనుడు; ఉపమాన+అతీత ఘోర యుద్ధంబునన్= సాటిలేని భయంకరమైన యుద్ధంలో; బాణ= బాణాలతో; పరీత= వ్యాప్తమైన; శోణిత= నెత్తురుతో; ప్లుత= తడిసిన; వపుః= శరీరాలతో; ఉజ్జ్వలులు= ప్రకాశిస్తున్నవారు; ఐరి= అయ్యారు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ద్రుపదరాజు, కర్ణుడి కుమారుడు వృషసేనుడు యుద్ధానికి తలపడ్డారు. ఆ యుద్ధం సాటిలేని విధంగా భయంకరంగా సాగింది. ఇద్దరి శరీరాలూ బాణాలతో చీల్చబడి రక్తధారలతో నిండిపోయాయి.

**వ. అట్టియెడ నాకర్ణ పట్టి చేయి బెట్టిదంబయి వచ్చినం బాంచాల బలంబు నిజపతికిం దలకడచి యతనిం బొదివి యా సైనికోత్తము నంపసోన కోటఱి పఱచినం బ్రదీప్తుండై యతండు మెఱసె; దుశ్శాసనుండు ధర్మనందన నందనుండును బోరునెడ నప్పాండుపౌత్రుం డతని ఫాలంబున వాలిక నారసంబులు మూఁడు నాటించినం ద్రిశిఖరయుత శైలంబులీల నయ్యువరా జొప్పి యవ్వీరుం గ్రూర శరంబులం గప్పి కేతు సారథి రథంబులం దిల ప్రమాణ శకలంబులు సేసిన. 169**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ కర్ణుపట్టి చేయి= ఆ వృషసేనుడి హస్తమే - హస్తలాఘవమే; బెట్టిదంబు+అయి= భయంకరమై; వచ్చినన్= రాగా; పాంచాలబలంబు= ద్రుపదుడి సైన్యం; నిజపతికిన్= తమరాజుకు (విరాటుడికి); తలకడచి= (దాటవేసి) ముందుకుపోయి; అతనిన్= ఆ వృషసేనుడిని; పొదివి= ఎదిరించి; ఆ సైనికోత్తముని+అంపసోనకున్= ఆ వీరశ్రేష్ఠుడైన వృషసేనుడి బాణవర్షానికి; ఓటఱి= ఓడిపోయి; పఱచినన్= పారిపోగా; ప్రదీప్తుండు+ఐ= వెలుగొందుతూ ఉండి; అతండు= ఆ వృషసేనుడు; మెఱసెన్= రాణించాడు (ఇక్కడినుండి దుశ్శాసన ప్రతివింధ్యుల యుద్ధవర్ణన); దుశ్శాసనుండు= దుర్యోధనుడి తమ్ముడు దుశ్శాసనుడు; ధర్మనందన నందనుండును= ధర్మరాజు కొడుకు ప్రతివింధ్యుడు; పోరునెడన్= యుద్ధంచేసే స్థలంలో; ఆ+పాండుపౌత్రుండు= ఆ పాండురాజు మనుమడు ప్రతివింధ్యుడు; అతని ఫాలంబునన్= ఆ దుశ్శాసనుడి నుదుట; వాలిక నారసంబులు మూఁడు= తీక్ష్ణములైన మూడు బాణాలను; నాటించినన్= గుచ్చుకొనేటట్లు కొట్టగా (అప్పుడు); త్రిశిఖరయుత శైలంబు లీలన్= మూడు శిఖరాలతో కూడిఉన్న పర్వతంవలె; ఆ+యువరాజు= యువరాజైన ఆ దుశ్శాసనుడు; ఒప్పి= రాణించి; ఆ+వీరున్= ఆ వీరుడిని అనగా ప్రతివింధ్యుడిని; క్రూరశరంబులన్= భయంకరములైన బాణాలతో; కప్పి= కప్పివేసి; కేతు, సారథి రథంబులన్= ధ్వజాన్ని, సారథిని, రథాన్ని (మూడింటిని); తిలప్రమాణ శకలంబులు= నువ్వులగింజలంత ముక్కలుగా; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో వృషసేనుడిదే పై చేయి అయింది. ద్రుపదసైన్యాలు తమ రాజు తగ్గిపోవటాన్ని చూచి, అతడికి ముందుగా నిలిచి, వృషసేనుడిని ఎదిరించి పోరాడాయి. కాని, వృషసేనుడి బాణవర్షాన్ని తట్టుకొనలేక పారిపోయాయి. ఇట్లా ద్రుపదుడి పరాజయంతో వృషసేనుడొక వెలుగు వెలిగాడు. ఇక దుశ్శాసనుడు ప్రతివింధ్యుడిని ఎదిరించి పోరే స్థలంలో - ప్రతివింధ్యుడు దుశ్శాసనుడి నుదుట మూడు తీక్ష్ణములైన బాణాలతో కొట్టగా, అవి దుశ్శాసనుడి నుదుట గ్రుచ్చుకొన్నాయి. వాటితో ఆ దుశ్శాసనుడు మూడు శిఖరాలతో కూడిన పర్వతంవలె శోభిల్లాడు. వెంటనే విజృంభించి దుశ్శాసనుడు ఆ ప్రతివింధ్యుడిపై బాణాలు గుప్పించి అతడి ధ్వజాన్ని, సారథిని, రథాన్ని, నువ్వులగింజలంత తుత్తునియలు చేయగా.

**విశేషం:** అలం: నిదర్శన. నుదుట మూడుబాణాలు నాటింది దుశ్శాసనుడు. అట్లా నాటగా ప్రకాశించినవాడు ప్రతివింధ్యు డని సంస్కృతమూలం. ఆ మూల సంస్కృత శ్లోకాలివి - శ్లో॥ ప్రతివింధ్యంతు సమరే కుర్వాణం కర్మ దుష్కరమ్ । దుశ్శాసన స్త్రిభిర్బాణైర్లలాటే సమవిధ్యత । సోతి విద్ధో బలవతా తవపుత్రేణ ధన్వినా । విరరాజ మహాబాహుః సశృంగ ఇవ పర్వతః ॥' (ద్రోణ-168/ 36, 37) ఇక్కడ 'త్రిశిఖరయుత శైలంబులీలన్' ఉపమాలంకారం. నాటిన బాణాలు అట్లా గ్రుచ్చుకొనిపోయి నిలిచిన వనగా ఆ వీరుడి బాణప్రయోగంలోని బాహుబలాతిశయం వ్యక్తమవుతున్నది. ఇది ఈ నిదర్శనాలంకారంచేత ఏర్పడిన వస్తుధ్వని.

**క. వింధ్యాద్రి వోలె నాప్రతి । వింధ్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి ద**
**ర్పాంధ్యమతి నడరి దీప్తా । వంధ్యాస్త్రము లక్కుమారవరుపైఁ బఱపెన్. 170**

**ప్రతిపదార్థం:** వింధ్య+అద్రి+పోలెన్= వింధ్యపర్వతంవలె; ఆ ప్రతివింధ్యుఁడు - ఆ ధర్మరాజు కుమారుడు; అచలిత+ఉగ్రమూర్తి= చలించని భయంకరమైన ఆకారం; వెలయన్= ప్రకాశించగా; నిలిచి= విరథుడై భూమిపై నిలిచియే; దర్ప+అంధ్యమతిన్= దర్పంతో అంధత్వమేర్పడిన బుద్ధితో - మిక్కిలి దర్పంతోనని భావం (దర్పాత్ ఆంధ్యం దర్పాంధ్యం - దర్పాంధ్యయుతా మతిః; మధ్యమ పద లోప కర్మధారయ సమాసం); అడరి= చెలరేగి; దీప్త+అవంధ్య+అస్త్రములు= దీప్తములైన - అనగా పదను తళుకును చూపు తున్న, వ్యర్థములు కాని, బాణాలతో; ఆ+కుమారవరుపైన్= ఆ దుశ్శాసనుడిపై; పఱపెన్= వ్యాపింపజేశాడు.

**తాత్పర్యం:** ప్రతివింధ్యుడు వింధ్యపర్వతంవలె చలించక భయంకరాకారంతో నిలిచి, గర్వం అతిశయించగా చెలరేగి, వాడి అయిన బాణాలను ఆ దుశ్శాసనుడిపై కురిపించాడు.

**విశేషం:** 'వింధ్యాద్రివోలె' అనునప్పుడు ఉపమాలంకారం. దీనిచేత - మేఘం ఎంత వర్షధారలు కురిపించినా వింధ్యాద్రి కేమీ కానట్లు దుశ్శాసనుడి బాణవర్షంతో ప్రతివింధ్యుడు ఏమీ కాక నిలుకడగా నిలిచాడని అతడి ధైర్యాతిశయం ధ్వనిస్తూ ఉన్నది.

**ఆ. అలిగి వెడఁదవాతియమ్మున నాతని । ధనువుఁ దునియ నేసి తనువునందు**
**నిశిత విశిఖచయము నిగిడించె నీ కొడు;। కంతఁ దత్సహోదరాళి గదిసి. 171**

**ప్రతిపదార్థం:** అలిగి= కోపించి; నీ కొడుకు= దుశ్శాసనుడు; వెడఁద వాయి+అమ్మునన్= వెడల్పయిన మూతి గల బాణంతో (ఔపవిభక్తికం); అతని ధనువున్= ఆ ప్రతివింధ్యుడి విల్లును; తునియన్= తునకలయ్యేటట్లు; ఏసి= కొట్టి; తనువునందున్= శరీరంపై; నిశిత విశిఖచయము= వాడిఅయిన బాణాలసమూహాన్ని; నిగిడించెన్= చొప్పించాడు; అంతన్= అంతలోనే; తద్+ సహోదర+ఆళి= అతడి సోదరులసమూహం కూడా; కదిసి= చేరుకొని.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అప్పుడు నీ కొడుకు దుశ్శాసనుడు మిక్కిలి కోపంతో ఆ ప్రతివింధ్యుడి వింటిని, వెడల్పైన మూతిగల బాణంతో నరికి, అతడి శరీరంలో తీక్ష్ణములైన బాణాలసమూహాన్ని చొప్పించాడు. అంతలోనే ఆ ప్రతివింధ్యుడి సోదరవర్గం కూడా అతడికి తోడుగా యుద్ధం చేయటానికి చేరింది. అట్లా చేరుకొని.

**వ. కయ్యంబు సేయ నందు భీమసేననందనుం డగు శ్రుతసోము నరదం బయ్యుధిష్ఠిర తనయుం డెక్కి యొక్క సముద్దండం బగు కోదండంబు పుచ్చికొని భండనంబు సేసె; మనవారు నయ్యువరాజున కడ్డంబు సొచ్చి పెనంగిరి; నకులుండును శకునియు సమాన విక్రమంబుల సమరంబు సేయునెడ నా సొబలుండు.172**

**ప్రతిపదార్థం:** కయ్యంబు+చేయన్= యుద్ధం చేయగా; అందున్= ఆ యుద్ధంలో; భీమనందనుండు+అగు శ్రుతసోముని+అరదంబు= భీముడి కుమారుడైన శ్రుతసోముడి రథాన్ని; ఆ+యుధిష్ఠిర తనయుండు= ఆ ధర్మరాజు కుమారుడైన ప్రతివింధ్యుడు; ఎక్కి= ఆరోహించి; ఒక్క సముద్దండంబు+అగు= ఓ భయంకరమైన; కోదండంబు= ధనుస్సును; పుచ్చికొని= తీసికొని; భండనంబు=

యుద్ధం; చేసెన్= చేశాడు; మనవారు= (ఓ ధృతరాష్ట్ర మహారాజా!) మనపక్షంవారు; ఆ+యువరాజునకున్= ఆ దుశ్శాసనుడికి; అడ్డంబు+చొచ్చి= అడ్డంగా నిలిచి; పెనంగిరి= యుద్ధం చేశారు (ఇక నకుల శకునుల యుద్ధవర్ణన); నకులుండు= నకులుడు; శకునియున్= శకుని; సమాన విక్రమంబులన్= సమానమైన పరాక్రమాలతో; సమరంబు= యుద్ధం; చేయు+ఎడన్= చేసే సమయంలో (ఎట్లా యుద్ధం జరిగిందంటే); ఆ సౌబలుండు= ఆ శకుని.

**తాత్పర్యం:** యుద్ధం చేయగా, భీముడి కుమారుడైన శ్రుతసోముడి రథాన్ని యుధిష్ఠిరుడి కుమారుడు ఆరోహించి, ఓ భయంకరమైన, దృఢమైన విల్లును తీసికొని యుద్ధం చేశాడు. అప్పుడు మనవారు కూడా దుశ్శాసనుడికి తోడుగా వచ్చి యుద్ధం చేశారు. నకులుడు, శకుని సమానస్థాయిలో పరాక్రమిస్తూ ఉండగా ఆ శకుని. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ.** **ఒక బలు తూ పురంబు గొని యుచ్చి చనం గర మల్గి యేయుడున్**
**నకులుఁడు మూర్ఛ వోవుటయు నాదము రోదసి నిండ నార్చె; నం**
**తకుఁ దెలివొంది చాపముఁ బతాకయుఁ ద్రుంచి యతండు నీమఱం**
**దికి నరసా వొనర్చె ఘన తీవ్ర సముజ్జ్వల మార్గణంబులన్.** **173**

**ప్రతిపదార్థం:** ఒక= ఒక; బలు= బలిష్ఠమైన; తూపు= బాణాన్ని; కొని= తీసికొని; ఉరంబు= వక్షాన్ని; ఉచ్చి= చీల్చి; చనన్= పోయేవిధంగా; కరము= మిక్కిలి; అల్గి= కోపించి; ఏయుడున్= ప్రయోగించగానే; నకులుఁడు= నకులుడు; మూర్ఛ+పోవుటయును= అచేతనత్వాన్ని పొందగానే; నాదము= ధ్వని; రోదసిన్= ఆకాశంలో; నిండన్= నిండిపోయే విధంగా; ఆర్చెన్= సింహనాదాన్ని చేశాడు; అంతకున్= అంతలోనే; తెలివి+ఒంది= తెలివిని పొంది (మూర్ఛనుండి తేరుకొని అని భావం); చాపమున్= ధనుస్సును; పతాకయున్= ధ్వజాన్ని; త్రుంచి= తెగగొట్టి; అతండు= ఆ నకులుడు; నీ మఱందికిన్= (ఓ ధృతరాష్ట్ర మహారాజా!) నీ భార్య తోబుట్టువైన శకునికి; ఘన= గట్టి; తీవ్ర= తీక్ష్ణములైన; సముజ్జ్వల= ప్రకాశిస్తూ ఉన్న; మార్గణంబులన్= బాణాలతో (ధ్వజాన్ని ధనువును ఖండించి); అర+చావు= సగం చావును; ఒనర్చెన్= కలుగజేశాడు (జీవన్మృతుడిని చేశాడని భావం - బ్రతికినా చచ్చినవాడితో సమానంగా ఉండేవాడు జీవన్మృతుడు).

**తాత్పర్యం:** ఓ బలిష్ఠమైన బాణాన్ని తీసి, ఆకర్ణాంతం లాగి, కోపంతో అతడి వక్షస్స్థలం చీల్చిపోయే విధంగా కొట్టగానే ఆ నకులుడు మూర్ఛపోగా శకుని ఆకాశం అంతా నిండేవిధంగా సింహనాదం చేశాడు. నకులుడు వెంటనే తేరుకొని దృఢమైన వాడిబాణాలతో ఆ శకుని విల్లును, ధ్వజాన్ని తుత్తునియలుగా చేసి, ముష్టిపై తొడలపై కొట్టి, గాయపరచి, సగం చచ్చినవాడినిగా చేశాడు.

**విశేషం:** ఇక్కడ అరసావు అనే మాటలో సంస్కృత మూలార్థం ధ్వనిస్తూ ఉన్నది. సంస్కృతమూలం ఇట్లా ఉన్నది.

**శ్లో॥ అథాస్య సశరం చాపం ముష్టిదేశేzచ్ఛినత్ తదా**
**ధ్వజం చ త్వరితం ఛిత్వా రథాద్ భూమౌ వపాతయత్**
**విశిఖేన చ తీక్ష్ణేన పీతేన నిశితేన చ**
**ఊరూ నిర్భిద్య చైకేన నకులః పాండునందనః**
**శ్యేనం సపక్షం వ్యాధేన పాతయామాస తం తదా**
**సోzతివిద్ధో మహారాజ రథోపస్థ ఉపావిశత్**
**ధ్వజయష్టిం పరిక్లిశ్య కాముకః కామినీం యథా**
**తం విసంజ్ఞం నిపతితం దృష్ట్వా శ్యాలం తవానఘ!**
**అపో వాహ రథేనాశు సారథి ర్ధ్వజినీ ముఖాత్. (ద్రోణ. 169/14-19)**

తిక్కన ఈ అర్థాన్నంతా 'అరసావు' అనే మాటతో సంక్షిప్తీకరించాడు. అందుకే 'పడుటయు' అనే పదానికి మూలానుగుణంగా 'మూర్ఛపడిపోగానే' అని వివరించటం జరిగింది. శకుని పరాజితుడై జీవన్మృతుడు అయ్యాడు.

**వ. ఇట్లు గాంధారపతి పడుటయుఁ దత్సారథి దేరు దొలంగఁ దోలుకొని పోయెఁ; గృపాచార్యుతోడ రణక్రీడఁ జలుపుచుండ శిఖండి కోదండంబు బిసకాండంబుగా ఖండించి యతండు శక్తి వైవ నదియును దునిమిన ఘనంబగు ధనువు గొని తోరంపు నారసంబున నతనిం దేరిపై సొగయ నేసి, యగ్గౌతముండు గోపంబునఁ జంపఁ దలంపెత్తి వెండియు నేయ నిగుడునంతకు నద్దెస యోధులు పలువు రొక్కట నుక్కున నురవడించిన మన దిక్కు సైనికులు శారద్వతుం గడచి కడిమి నెఱయఁ బోరిరి; మఱియు ననేక ద్వంద్వ యుద్ధంబులు సెల్లుచుండ సంకులసమరం బయ్యెఁ; నయ్యవసరంబున. 174**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; గాంధారపతి= గాంధారదేశపురాజు (శకుని); పడుటయున్= మూర్ఛపడి పోగానే; తద్+సారథి= అతడి సారథి; తేరు= రథాన్ని; తొలంగన్= (రణరంగం నుండి) తొలగిపోయే విధంగా; తోలుకొనిపోయెన్= తోలుకొనిపోయాడు (ఇది నకుల శకునుల యుద్ధ వర్ణన; ఇక కృప - శిఖండుల యుద్ధవర్ణన ప్రారంభం); శిఖండి= ద్రుపదపుత్రుడు శిఖండి; కృపాచార్యుతోడన్= కృపాచార్యుడితో; రణక్రీడన్= యుద్ధక్రీడను; చలుపుచు+ఉండన్= చేస్తూ ఉండే సమయలో; (ఆ శిఖండి); కోదండంబు= (ఆ కృపాచార్యుడి) ధనుస్సును; బిసకాండంబు+కాన్= తామరతూడు కాగా - తామరతూడువలె (అనాయాసంగా అని భావం); ఖండించి= భగ్నం చేసి; అతండు= ఆ కృపాచార్యుడు; శక్తిన్= శక్తిని; వైవన్= వేయగా; అదియును= ఆ శక్తినికూడ; తునిమినన్= త్రుంచగా; ఘనంబు+అగు= దృఢమైన; ధనువు= ధనుస్సును; కొని= తీసికొని; తోరంపు నారసంబునన్= దృఢమైన బాణంతో; ఆతనిన్= ఆ శిఖండిని; సొగయన్= మూర్ఛిల్లే విధంగా; ఏసి= కొట్టి; ఆ+గౌతముండు= ఆ కృపాచార్యుడు; కోపంబునన్= కోపంతో; చంపన్= చంపటానికి; తలంపు+ఎత్తి= కోరిక పొడమి; వెండియున్= మరల; ఏయన్= బాణం వేయటానికి; నిగుడు+అంతకున్= ఉద్యమించే లోపల; ఆ+దెస యోధులు+పలువురు= ఆ వైపు వీరులు అనేకులు; ఒక్కటన్= ఒకేసారి; ఉక్కునన్= గర్వంతో; ఉరవడించినన్= విజృంభించగా; మన దిక్కు సైనికులు= మనవైపు వీరులు; శారద్వతున్= ఆ కృపాచార్యుడిని; గడచి= దాటిపోయి; కడిమి= శౌర్యం; నెఱయన్= అతిశయించగా; పోరిరి= యుద్ధం చేశారు; మఱియున్= ఇంకా కూడ; అనేక ద్వంద్వయుద్ధంబులు= అనేకాలైన ద్వంద్వయుద్ధాలు; చెల్లుచుండన్= జరుగుతుండగా; సంకుల సమరంబు= తుములమైన యుద్ధం; అయ్యెన్= అయింది; ఆ+అవసరంబునన్= ఆ సమయాన.

**తాత్పర్యం:** ఇట్లా శకుని మూర్ఛపోగానే అతడి సారథి ఆ రథాన్ని రణరంగంనుండి మరల్చాడు. (ఈ నకుల శకునుల యుద్ధం శకుని పరాజయంతో ముగిసింది.) శిఖండి కృపాచార్యుడి విల్లును తామరతూడు మాదిరి విరుగగొట్టాడు. ఆ కృపాచార్యుడు శక్తిని వేయగా, దాన్ని కూడా దృఢమైన బాణంతో ఖండించాడు. అప్పుడు కృపాచార్యుడు దృఢమైన విల్లును తీసికొని పెద్దబాణంతో శిఖండి రథంపై సొమ్మసిల్లిపడేటట్లుకొట్టాడు. అప్పుడు కృపుడు ఆ శిఖండిని కోపంతో చంపబూని, దృఢమైన బాణాన్ని ఎక్కుపెట్టి ప్రయోగించటానికి పూనుకోగా, అంతలోనే ఆ వైపున్న వీరులు ఒక్కపెట్టున కృపాచార్యుడిపై విజృంభించారు. అది చూచి మన వీరసైనికులు కృపుడిని దాటవేసి ముందుకు వచ్చి, ఆ వైపు సైనికులతో వీరోచితంగా యుద్ధం చేశారు. అనేక ద్వంద్వయుద్ధాలతో అది ముమ్మరయుద్ధంగా మారింది. ఆ సమయాన.

సీ. ఏచి ధృష్టద్యుమ్నుఁ డాచార్యు నురమున । వెస నాఁటె నైదునారసము; లాతఁ
డాతని నిరువదేనమ్ముల నొంచి విల్ । దునిమిన నొండువిల్ గొని యతండు
మంటలు గ్రమ్మెడు మహితాస్త్ర మేయుడుఁ । గాలంబు గా కిది కలశజునకు
ననుచు నీవారు భయం బంద నేకాద । శాస్త్రంబు లొక ముష్టి నలవరించి

తే. యేసి కర్ణుండు దునియలు సేసె నడుమ; । నంతఁ గురురాజు యువరాజు నడర గురుసు
తుండు శకునియు శల్యుండుఁ దోడుపడిరి । వార లేడ్వుర తాఁకు నవ్వీరుఁ డోర్చె. 175

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నుఁడు; ఏచి= విజృంభించి; ఆచార్య+ఉరమునన్= ద్రోణాచార్యుల వక్షస్స్థలాన; వెసన్= వేగంగా; ఐదు నారసములు= అయిదు బాణాలను; నాఁటెన్= నాటాడు (క్రుచ్చుకొనిపోయేటట్లు గట్టిగా కొట్టాడని భావం); అతఁడు=ఆ ద్రోణాచార్యుడు; ఆతనిన్= ఆ ధృష్టద్యుమ్నుడిని; ఇరువది+ఏను+అమ్ములన్= ఇరువది అయిదు బాణాలతో; నొంచి= నొప్పి పుట్టించి (కొట్టి అని భావం); విల్= ధనుస్సును; తునిమినన్= ఖండించగా; ఒండు విల్= మరొక ధనువును; కొని= తీసికొని; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; మంటలు= అగ్నిజ్వాలలు; క్రమ్మెడు= వ్యాపింపజేస్తూ ఉన్న; మహిత+అస్త్రము= మాన్యమైన అనగా దివ్యమైన బాణాన్ని; ఏయుడున్= ప్రయోగించగానే; ఇది= ఈ దివ్యబాణం; కలశజునకున్= ద్రోణాచార్యుడికి; కాలంబు= మృత్యువు; కాక= తప్ప (మరేమి?); అనుచున్= అంటూ; నీవారు; భయంబు= భీతిని; అందన్= పొందగా; కర్ణుండు= కర్ణుడు; ఏకాదశ+అస్త్రంబులు= పదకొండుబాణాలను; ఒక ముష్టిన్= ఒక పిడికిటిలో; అలవరించి= పట్టుకొని; ఏసి= ప్రయోగించి; నడుమన్= మార్గమధ్యంలోనే; తునియలు+చేసెన్= తునకలు చేశాడు; అంతన్= అంతలోనే; కురురాజు= దుర్యోధనుడు; యువ రాజును= దుశ్శాసనుడు కూడా; అడరన్= పూనుకొనగా; శకునియున్= శకుని; శల్యుండును= శల్యుడు; తోడుపడిరి= తోడుగా వచ్చారు; వారలు+ఏడ్వుర తాఁకు= ఆ ఏడుగురు యోధుల తాకిడిని; ఆ+వీరుఁడు= ఆ ధృష్టద్యుమ్నుడు; ఓర్చెన్= తట్టుకొన్నాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు విజృంభించి, ద్రోణాచార్యుడిని వెంటనే అయిదు బాణాలతో వక్షస్స్థలంలో కొట్టాడు. ఆ ద్రోణుడు ఇరువది అయిదు బాణాలతో ధృష్టద్యుమ్నుడిని కొట్టి, అతడి విల్లుకూడ విరుగగొట్టగా, వెంటనే ధృష్టద్యుమ్నుడు వేరొక విల్లు తీసికొని మంటలు గ్రక్కే దివ్యబాణాన్ని ప్రయోగించాడు. అది చూచి ఈ బాణం ద్రోణుడికి మృత్యువుగాకేమి? - అని మీపక్షంవారు అనుకొంటూ భయకంపితులయ్యారు. వెంటనే కర్ణుడు పదకొండుబాణాలు ఏకంగా వేసి మార్గమధ్యంలోనే ఆ దివ్యబాణాన్ని తునియలు చేశాడు. అంతలోనే దుర్యోధనుడు, దుశ్శాసనుడు వచ్చి చేరారు. వారి వెంట శకుని శల్యుడు కూడా తోడు వచ్చారు. ఇట్లా ఏడుగురు కురువీరులు ఎదుర్కొన్నా ధృష్టద్యుమ్నుడు వారి తాకిడికి తట్టుకొన్నాడు.

క. ద్రుమసేనుఁ డడరి పటు బా । ణము లుద్ధతిఁ బఱపె సూతనందనుపైఁ గో
పము గదిరి యతఁడు వాని శి । రము గుండలదీప్త మై ధరం బడ నేసెన్. 176

**ప్రతిపదార్థం:** (అంతలో) ద్రుమసేనుఁడు= ద్రుమసేనుడనేవాడు; అడరి= చెలరేగి; పటుబాణములు= సమర్థములైన బాణాలను; ఉద్ధతిన్= గర్వంతో; సూతనందనుపైన్= కర్ణుడిపై; పఱపెన్= ప్రయోగించాడు; అతఁడు= ఆ కర్ణుడు; కోపము= క్రోధం; కదిరి= అతిశయించి; వాని శిరము= ఆ ద్రుమసేనుడి తల; కుండల దీప్తము+ఐ= చెవికమ్మలతో ప్రకాశిస్తున్నదై; ధరన్= భూమిపై; పడన్= పడిపోయేవిధంగా; ఏసెన్= బాణాలతో కొట్టాడు.

**తాత్పర్యం:** అంతలో ద్రుమసేనుడు కర్ణుడిని ఎదిరించాడు. పెద్ద గర్వంతో అతడిపై దృఢమైన బాణాలు వర్షించాడు. దానితో కర్ణుడికి కోపం పెరిగి, ఆ ద్రుమసేనుడి తల కుండలాల ప్రకాశంతో భూమిపై పడేవిధంగా బాణాలతో కొట్టాడు.

**వ. ఇట్లు ద్రుమసేనుండు సచ్చినం బేర్చిన కోపంబునఁ గర్ణుకోదండంబు దునిమి ధృష్టద్యుమ్నుండు నఱిమిన, నొండు బలు వింటం బెనంగు నతనిం గూడుకొని కురురాజు మొదలగు నేగురు రథికులు పెలుచనేసి; రా సమయంబున సాత్యకి సమదగతిం గవిసి 'నిలు నిలు' మని యదల్చి రాధేయుం దలపడియె; న య్యిరువుర యుక్కును నొక్కరూపున నక్కజం బై యుండె; నట్టియెడ వృషసేనుండు వచ్చి శైనేయు నేయుటయు, నతండు వాలమ్ములు నిగిడించి వానిం దేరిపయిం ద్రెళ్ళి మూర్ఛిల్లం జేసినం బుత్రశోక పీడితుం డగు సూతపుత్రుం డచ్యుతానుజు నానాస్త్ర పీడితుం గావించె; నంతకుం దెలిసి తనయుండును దోడుపడియె; నట్లడరు నయ్యిద్దఱ నా శినివరుండు గినుక యెక్కిన యేడ్తెఱం జిక్కువఱిచె; నప్పుడు గాండీవ గుణ దేవదత్త మహారావంబును హాహా కారంబును వీతెంచిన నయ్యంగరాజు రారాజున కిట్లనియె. 177**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ద్రుమసేనుండు= ద్రుమసేనుడు; చచ్చినన్= మరణించగా; పేర్చిన కోపంబునన్= అతిశయించిన క్రోధంతో; కర్ణుకోదండంబు= కర్ణుడి ధనుస్సును; తునిమి= తునియలుచేసి; ధృష్టద్యుమ్నుండు; నఱిమినన్= పొడిచేయగా; ఒండు బలువింటన్= రెండో దృఢమైన విల్లుతో; పెనంగు+అతనిన్= యుద్ధం చేస్తూ ఉన్న ఆ కర్ణుడిని; కూడుకొని= చేరి; కురురాజు మొదలగు+ఏగురు రథికులు= దుర్యోధనుడు మొదలైన అయిదుగురు రథికులు; పెలుచన్= దృఢంగా; ఏసిరి= బాణాలతో కొట్టారు; ఆ సమయంబునన్= ఆ సమయంలో; సాత్యకి; సమదగతిన్= గర్వవిజృంభణయుక్తంగా - అనగా గర్వాతిరేకంతో; కవిసి= (వారినందరిని) ఎదిరించి; నిలుము+నిలుము+అని= ఆగు ఆగు అని; అదల్చి= గద్దించి; రాధేయున్= కర్ణుడిని; తలపడియెన్= ఎదుర్కొన్నాడు; ఆ+ఇరువుర+ఉక్కును= ఆ సాత్యకి కర్ణులిద్దరి పరాక్రమం కూడ; ఒక్క రూపునన్= ఏకరూపంలో - అనగా ఒకే విధంగా; అక్కజంబు+ఐ= ఆశ్చర్యాన్ని కొలుపుతున్నదై; ఉండెన్= ఉన్నది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; వృషసేనుండు= కర్ణుడి కుమారుడైన వృషసేనుడు; వచ్చి= అక్కడికి చేరి; శైనేయున్= శినికి పౌత్రుడైన సాత్యకిని; ఏయుటయున్= బాణాలతో కొట్టగానే; అతండు= ఆ సాత్యకి; వాలు+అమ్ములు= తీక్ష్ణములైన బాణాలను; నిగిడించి= ప్రయోగించి; వానిన్= ఆ వృషసేనుడిని; తేరిపయిన్= రథంపైన; త్రెళ్ళి= కూలి; మూర్ఛిల్లన్= మూర్ఛపోయే విధంగా; చేసినన్= చేయగానే; పుత్రశోక పీడితుండు+అగు= పుత్రుడు మరణించాడనే భావనతో కలిగిన దుఃఖంతో బాధపడిన; సూతపుత్రుండు= కర్ణుడు; అచ్యుత+అనుజున్= కృష్ణుడి తమ్ముడైన సాత్యకిని; నానా+అస్త్రపీడితున్= పలు బాణాలతో బాధపొందినవాడినిగా; కావించెన్= చేశాడు; అంతకున్= అంతలోనే; తెలిసి= మూర్ఛతేరుకొని; తనయుండును= అతడి కుమారుడు వృషసేనుడు కూడ; తోడుపడియెన్= తోడ్పడ్డాడు; అట్లు= ఆ విధంగా; అడరు+ఆ+ఇద్దఱన్= చెలరేగుతూ ఉన్న ఆ తండ్రి కొడుకులిరువురిని; ఆ శినివరుండు= ఆ శినివంశశ్రేష్ఠుడు సాత్యకి; కినుక+ఎక్కిన+ఏడ్తెఱన్= కోపం పెల్లుబికిన పరాక్రమంతో; చిక్కుపఱిచెన్= కష్టపెట్టాడు; అప్పుడు= ఆ సమయంలో; గాండీవగుణ దేవదత్త మహారావంబును= అర్జునుడి గాండీవ ధనుష్టంకారధ్వని, దేవదత్తమనే శంఖనాదం; హాహాకారంబును= సైనికుల ఆర్తనాదం కూడ; వీతెంచినన్= వినబడగా; ఆ+అంగరాజు= ఆ కర్ణుడు; రారాజునకున్= దుర్యోధనుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రుమసేనుడు మరణించగా, ధృష్టద్యుముడు అతిశయించినకోపంతో కర్ణుడి విల్లును తుత్తునియలు చేసి, కసితో పొడి చేశాడు. అప్పుడు కర్ణుడు మరియొక బలిష్ఠమైన విల్లును తీసికొని యుద్ధంచేస్తూ ఉండగా, దుర్యోధనుడు మొదలైన అయిదుగురు మహావీరులు కర్ణుడికి తోడై, దృష్టద్యుమ్నుడిని బాణాలతోకొట్టారు. అప్పుడు సాత్యకి గర్వంతో విజృంభించి 'నిలునిలు' మని కర్ణుడివైపు పరుగు తీసి, కర్ణుడినిఎదుర్కొన్నాడు. ఆ సాత్యకి కర్ణుల యుద్ధం సమానస్థాయిలో ఉండి, ఆశ్చర్యం కలుగజేసింది. ఆ సమయంలో కర్ణుడికొడుకు వృషసేనుడు వచ్చి, సాత్యకిని బాణాలతో కొట్టగా, సాత్యకి దృఢమైన బాణాలతో కొట్టి ఆ వృషసేనుడు రథంపైమూర్ఛ ల్లేటట్లుచేశాడు. కర్ణుడు తన కొడుకు మరణించాడని భ్రమించి పుత్రదుఃఖంతో సాత్యకిని పెక్కుబాణాలతోబాధించాడు.

అంతలోనే కర్ణపుత్రుడు వృషసేనుడు మూర్ఛనుండి తేరుకొని తన తండ్రికి తోడ్పడ్డాడు. చెలరేగిన ఆ తండ్రి కొడుకు లిద్దరిపై సాత్యకి మిక్కిలి కోపంతో బాణాలు నింపాడు. ఇంతలోనే అర్జునుని గాండీవ ధనుష్టంకారధ్వని, దేవదత్తాన్ని పూరించిన ధ్వని, సైనికుల హాహాకారం వినిపించగా కర్ణుడు దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు:

**కర్ణ దుర్యోధనులు దురాలోచన సేసి సాత్యకిం దలపడుట (సం. 7-145-55)**

**క. 'అదె పార్థుఁడు దన మునుమున। కొదవిన సేనలఁ గలంచునులి వడఁ డితనిం**
**గదియఁగ రాకుండఁగ మును। పొదువుదమే సాత్యకిం బ్రభూత బలముతోన్? 178**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు= అర్జునుడు; అదె= అదిగో (అక్కడ ఉన్నాడని చేతితో చూపటం); అతఁడు= ఆ అర్జునుడు; తన మునుమునకున్= తన ముందువరుసకు; ఒదవిన సేనలన్= కలిగిన సైన్యాలను; కలంచునులివు= కలతబెట్టేశబ్దం; ఇతనిన్= ఈ సాత్యకిని; కదియఁగన్= సమీపించటానికి; రాకుండఁగన్= రాకపోయే విధంగా; మును= ముందుగా; ప్రభూత బలముతోన్= గొప్ప సైన్యంతో; సాత్యకిన్= సాత్యకిని; పొదువుదమే?= చుట్టుముట్టుదామా!

**తాత్పర్యం:** 'అదిగో అర్జునుడు ఆ వైపున ఉన్న సైనికవీరులతో యుద్ధంచేసే సందడిలో ఉన్నాడు. అతడు సాత్యకిని ఆదుకొనటానికి చేరకముందే, మనం గొప్ప సైన్యంతో సాత్యకిని ముట్టడించుదాము.

**వ. అట్లయిన వీఁ డభిమన్యుపోయిన పోకం బోవు; నది నీకు విజయంబునకుఁ గారణం బగు; వీనిం బలువురు ముట్టుట యెఱింగెనేని వివ్వచ్చుండు వచ్చు నతం డెఱుంగకుండ నక్కడ నిలువరించి పోరం జాలు బల్లిదుల నట పుచ్చవలయు' ననుటయు, నమ్మనుజవిభుం 'డిది లెస్సకర్జం' బని గాంధారపతిం గనుంగొని 'నీవు పదివేలేనుంగులు నన్ని యరదంబులుం గొని దుశ్శాసన సుబాహు దుష్ప్రధర్షణ దుర్విషహులు దోడుగాఁ గ్రీడిపై నడచి కయ్యంబు సేయు; మద్దిక్కునం దక్కిన పాండవులు నున్నవా; రయ్యన్నదమ్ములం బొదివి గెలువు' మనిన నతం డమ్మెయికిం జనియెఁ దదనంతరంబ. 179**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; అయినన్= అయితే; వీఁడు= ఈ సాత్యకి; అభిమన్యుపోయిన పోకన్= అభిమన్యుడు చచ్చిన (విధమైన) చావును; పోవును= చస్తాడు; అది= ఆ సాత్యకి మరణం; నీకున్= ఓ దుర్యోధనా! నీకు; విజయంబునకున్= విజయానికి; కారణంబు= కారణం; అగున్= అవుతుంది; వీనిన్= ఈ సాత్యకిని; పలువురు= అనేకులు (వీరులు); చుట్టుముట్టుట= ముట్టడించటం; ఎఱింగెనేనిన్= ఒకవేళ తెలిసికొన్నాడా!; వివ్వచ్చుండు= అర్జునుడు; వచ్చును= (సాత్యకిని రక్షించటానికి) వస్తాడు (కాబట్టి); అతండు= ఆ అర్జునుడు; ఎఱుంగకుండన్= తెలిసికొనకుండా; అక్కడన్= ఆ వైపున; నిలువరించి= నిలిపివేసి; పోరన్+ చాలు= యుద్ధం చేయటానికి సమర్థులైన; బల్లిదులన్= బలిష్ఠులైన వీరులను; అట= అటువైపు; పుచ్చవలయున్= పంపాలి; అనుటయున్= అనగానే; ఆ+మనుజ విభుండు= ఆ దుర్యోధనుడు; ఇది= ఈ నీవు చెప్పినది; లెస్స కర్జంబు= మంచిపని; అని= పలికి; గాంధార పతిన్= శకునిని; కనుంగొని= చూచి; నీవు= ఓ శకుని మామా! - నీవు; పదివేలు+ఏనుంగులు= పదివేల గజాలను; అన్ని= అదే లెక్కగా పదివేలు; అరదంబులున్= రథాలను; కొని= వెంట తీసికొని; దుశ్శాసన సుబాహు దుష్ప్రధర్షణ దుర్విషహులు= దుశ్శాసనుడు, సుబాహువు, దుష్ప్రధర్షణుడు, దుర్విషహుడు అనేవారు; తోడుగాన్= సహాయులు కాగా; క్రీడిపైన్= అర్జునుడిపై; నడచి= దండెత్తి; కయ్యంబు= యుద్ధం; చేయుము= సాగించుము; ఆ+దిక్కునన్= ఆ వైపున; తక్కిన పాండవులున్= అర్జునుడే కాక మిగిలిన పాండవులు కూడ; ఉన్నవారు= ఉన్నారు; ఆ+అన్న+తమ్ములన్= ఆ అన్నదమ్ములనందరిని; పొదివి= ఆక్రమించి; గెలువుము= జయించుము; అనినన్= అనగానే; అతండు= ఆ శకుని; ఆ+మెయికిన్= ఆ వైపునకు; చనియెన్= వెళ్ళాడు; తద్+అనంతరంబు+అ= అటు తరువాత.

**తాత్పర్యం:** అట్లా చేస్తేనే ఈ సాత్యకి అభిమన్యుడు చచ్చిన విధంగా చస్తాడు; అది నీ గెలుపునకు కూడా కారణ మవుతుంది. ఒకవేళ మనమందరం ఈ సాత్యకిని ముట్టడించామని తెలిస్తే, తప్పక అర్జునుడు ఇతడిని ఆదుకొనటానికి వస్తాడు, కాబట్టి ఈ విషయం అతడికి తెలియకుండా అర్జునుడిని అక్కడే కదలనివ్వకుండా నిలిపి యుద్ధం చేయగల బలిష్ఠులైన మన వీరులను కొందరిని పంపాలి' అని కర్ణుడు సలహా ఇవ్వగా విని దుర్యోధనుడు 'ఇది చాలా మంచిపని' అని వెంటనే శకునిని చూచి, నీవు పదివేల ఏనుగులను, పదివేల రథాలను తీసికొని-దుశ్శాసనుడు, సుబాహువు, దుష్ప్రధర్షణుడు, దుర్విషహుడు అనే నా తమ్ములు తోడుగా గొని ఆ అర్జునుడిని ఎదుర్కొని యుద్ధం చేయుము అక్కడనే మిగిలిన భీమాది పాండవులు ఉన్నారు. ఆ అన్నదమ్ములనందరిని గెలిచి విజయం సాధించుము' అని ఆ వైపే తక్కిన పాండవులు కూడ ఉన్నారు. ఆ అన్నదమ్ములను ఎదుర్కొని గెలువుము. అని అనగా, అతడు ఆ వైపు వెళ్ళాడు. తరువాత

**క.** **చేయఁగల రథికులును రా । ధేయుఁడు బలయుతము గాఁగఁ దెప్పదెరల శై**
**నేయుపయిఁ గవిసి బహువిధ । సాయకములు గురిసి రథిక సంరంభమునన్.** **180**

**ప్రతిపదార్థం:** చేయన్+కల= సమర్థులైన; రథికులును= వీరులు; రాధేయుఁడు= కర్ణుడు; బలయుతము= సైన్యంతో కూడినవారు; కాఁగన్= క్రాయి; తెప్పదెరలన్= అతివేగంగా; శైనేయుపయిన్= సాత్యకిపై; కవిసి= కలయబడి; బహువిధసాయకములు= అనేక విధాలైన బాణాలను; అధిక సంరంభమునన్= మిక్కిలి వేగంగా; కురిసిరి= కురిపించారు.

**తాత్పర్యం:** సమర్థులైనవీరులు, కర్ణుడు సైన్యంతో కూడి ఆ సాత్యకిపై కలియబడ్డారు. విజృంభించి అనేకవిధాలైన బాణాలను అతడిమీద కురిపించారు.

**వ.** **అతండును గోపాటోపంబున.** **181**

**ప్రతిపదార్థం:** అతండును= ఆ సాత్యకి కూడా; కోప+ఆటోపంబునన్= కోపాడంబరంతో (మిక్కిలి కోపంతో అని భావం).

**తాత్పర్యం:** ఆ సాత్యకి కూడా మిక్కిలి కోపంతో (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **కరుల కరంబులు హయముల । శిరములు రథసంచయంబు చెక్కలును సమి**
**ద్ధరఁ గప్పి క్రమ్మఱఁగ నె । త్తురు టేఱులు వఱపి దానిఁ దొలఁగం ద్రోచెన్.** **182**

**ప్రతిపదార్థం:** కరుల కరంబులు= ఏనుగుల తొండాలను; హయముల శిరములు= గుర్రాల తలలను; రథసంచయంబు చెక్కలును= రథాల సమూహాల ముక్కలను; సమిత్+ధరన్= యుద్ధభూమియందు; కప్పి= కప్పివేసి; కమ్మఱఁగన్= మళ్ళీ; నెత్తురు+ఏఱులు= రక్తపునదులు; పఱపి= ప్రవహింపజేసి; దానిన్= ఆ ఏనుగు తొండము మొదలగు వాటిని; తొలఁగన్= తొలగిపోయేవిధంగా; త్రోచెన్= తోసివేశాడు.

**తాత్పర్యం:** ఏనుగులతొండాలతో గుర్రాలతలలతో రథాల చెక్కలముక్కలతో యుద్ధభూమినంతా మొదట కప్పి, వెంటనే నెత్తురునదులను ప్రవహింపజేసి, ఆ ఏనుగులతొండాలు మొదలగు వాటినన్నిటిని తొలగింపజేశాడు.

**విశేషం:** ఇట్లా యుద్ధవర్ణన చేయటంచేత సాత్యకి యుద్ధనైపుణి, హస్తలాఘవం వ్యక్తమవుతూ ఉన్నాయి.

**క. శినివరు నద్భుత విక్రమ । మున కోర్వక కలఁగఁబడిన మొనఁ గనుఁగొని నీ**
**తనయుఁడు తనయరదము నా । తని యరదముమీఁద నత్యుదగ్రతఁ బఱపెన్. 183**

**ప్రతిపదార్థం:** శినివరు+అద్భుత విక్రమమునకున్= సాత్యకియొక్క ఆశ్చర్యకరమైన ఆ పరాక్రమానికి; ఓర్వక= తట్టుకోలేక; కలఁగన్+పడిన నీ మొనన్= కలతజెందిన నీ సైన్యాన్ని; కనుఁగొని= చూచి; నీ తనయుఁడు= ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ కుమారుడు దుర్యోధనుడు; తన+అరదమున్= తన రథాన్ని; ఆతని+అరదము మీఁదన్= ఆ సాత్యకి రథంపైకి; అతి+ఉదగ్రతన్= అతి కోపంతో; పఱపెన్= పంపాడు (సాత్యకిపై యుద్ధానికి వెళ్ళాడని భావం).

**తాత్పర్యం:** ఆ సాత్యకి అద్భుత పరాక్రమానికి ఓర్వలేక కలతచెందిన సైన్యాన్ని చూచి, నీ తనయుడు ఆ సాత్యకి ధాటికి కౌరవసైన్యం తట్టుకోలేకపోయింది. దుర్యోధనుడు, వెంటనే తన రథాన్ని సాత్యకి రథంవైపు మిక్కిలి కోపంతో నడిపించాడు.

**వ. అయ్యిరువురు నక్కజం బగు కయ్యంబు సేయునెడ నా శైనేయుండు. 184**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరువురున్= ఆ సాత్యకి దుర్యోధనులు ఇద్దరూ కూడా; అక్కజంబు+అగు= ఆశ్చర్యకరమైన; కయ్యంబు= యుద్ధం; చేయు ఎడన్= చేసే సమయంలో; ఆ శైనేయుండు= ఆ శినివంశజుడైన సాత్యకి.

**తాత్పర్యం:** ఆ ఇద్దరూ ఆశ్చర్యం గొలిపే యుద్ధం చేస్తూ ఉండగా, సాత్యకి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తురగముల సూతుఁ జంపినఁ । గురుపతి పొలివోక యతని గురుసున నేయం**
**గరమలిగి ధనువు దునుముడుఁ । బరవస మఱి యొరుని తేరుపైకిం బోయెన్. 185**

**ప్రతిపదార్థం:** తురగములన్= గుర్రాలనూ; సూతున్= సారథినీ; చంపినన్= చంపగా; కురుపతి= కురురాజు దుర్యోధనుడు; పొలివోక= నిరుత్సాహపడక; అతనిన్= ఆ సాత్యకిని; గురుసునన్= జీవస్థానంలో; ఏయన్= కొట్టగా; కరము= మిక్కిలి; అలిగి= కోపించి; ధనువున్= విల్లును; తునుముడున్= తునకలు చేయగా; బరవసము= ధైర్యం; అఱి= నశించి; ఒరుని= మరి ఒకరి అనగా కృతవర్మయొక్క; తేరుపైకిన్= రథంపైకి; పోయెన్= పోయెను.

**తాత్పర్యం:** అశ్వాలను, సారథిని చంపగా, దుర్యోధనుడు నిరుత్సాహపడక, ఆ సాత్యకిని, ఆయువుపట్టులో కొట్టగా, సాత్యకి మిక్కిలికోపించి దుర్యోధనుడి విల్లును తెగగొట్టాడు. అప్పుడు దుర్యోధనుడు ధైర్యాన్ని కోల్పోయి మరొకరి రథం ఎక్కివెళ్ళాడు.

**వ. ఇ వ్విధంబున. 186**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ఈ రీతిగా సాత్యకితో పరాజయం పొందగా.

**తే. పతి గలంగ శైనేయుఁ డ బ్బలము బాణ । నిహతిఁ దూలించె; నక్కడ నీ మఱంది**
**యడరి యర్జునుతో విస్మయావహముగ । నాహవము సేసెఁ దగు సహాయంబు కలిమి. 187**

**ప్రతిపదార్థం:** పతి= ప్రభువైన దుర్యోధనుడు; కలంగన్= కలత చెందగా; శైనేయుఁడు= సాత్యకి; ఆ+బలమున్= ఆ కౌరవసైన్యాన్ని; బాణనిహతిన్= శరాఘాతంతో; తూలించెన్= తొలగిపోయేటట్లు చేశాడు; ఆ+కడన్= ఆ వైపు; నీమఱంది= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నీ భార్య గాంధారి సోదరుడు శకుని; అడరి= విజృంభించి; తగుసహాయంబు= వలసినంత సహాయం; కలిమిన్= ఉండటంచేత; విస్మయ+ఆవహముగన్= ఆశ్చర్యం కలిగే విధంగా; అర్జునుతోన్= అర్జునుడితో; ఆహవము= యుద్ధం; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కలత చెందగా, సాత్యకి కౌరవసైన్యాన్ని బాణాలతో చెదరగొట్టాడు. నాథుడు లేని ఆ కౌరవసైన్యం సాత్యకి ధాటికి ఆగలేక పారిపోయింది. అక్కడ నీ మరది శకుని, తగినంత సహాయం కలిగి ఉండటంచేత అర్జునుడితో యుద్ధం ఆశ్చర్యం కలిగేటట్లు సాగించాడు.

**చ. అతని సుతుం డులూకుఁడు నుదగ్రతఁ గృష్ణునిమేనఁ బార్థుపై**
**శితశరకోటి నించి విలసిల్లఁగ సౌబలుసూతుఁ జంపి యు**
**ద్ధతిఁ దురగంబులం దునిమి తద్ఘన చాపముఁ ద్రుంచె న న్నరుం**
**డతఁడు తనూజు తేరి పయి కాత్మ చలింపఁగఁ బోయి వెండియున్. 188**

**ప్రతిపదార్థం:** అతని సుతుండు= ఆ శకుని కుమారుడు; ఉలూకుఁడున్= ఉలూకుడనే వాడు కూడా; ఉదగ్రతన్= గొప్పగా; కృష్ణుని మేనన్= శ్రీకృష్ణుడి శరీరంపై; పార్థుపైన్= అర్జునుడిపైన; శితశరకోటిన్= వాడి అయిన బాణాల సమూహాన్ని; నించి= నింపి; విలసిల్లఁగన్= ఉల్లాసం చూపుతూ ఉండగా; ఆ+నరుండు= ఆ అర్జునుడు; సౌబలుసూతున్= శకుని సారథిని; చంపి= సంహరించి; ఉద్ధతిన్= గర్వంతో; తురగంబులన్= గుర్రాలను; తునిమి= ఖండించి; తద్+ఘనచాపము= దృఢమైన ఆ శకుని విల్లును; త్రుంచెన్= తెగగొట్టాడు (అప్పుడు); అతఁడు= ఆ శకుని; తనూజు తేరిపయికిన్= తన కొడుకైన ఉలూకుడి రథంపైకి; ఆత్మ= ధైర్యం; చలింపఁగన్= చలించిపోతూ ఉండగా; పోయి= వెళ్ళి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ఆ శకుని కుమారుడు ఉలూకుడు కూడా తోడుగా వచ్చి, కృష్ణుడిమీద అర్జునుడిమీద గొప్పగా వాడి బాణాల సమూహాన్ని నింపి ప్రకాశించగా, అంతలోనే అర్జునుడు శకుని సారథిని, గుర్రాలను, విల్లును ఖండించి వేశాడు. శకుని ధైర్యం కోల్పోయి వెంటనే తన కుమారుడి రథంపైకి వెళ్ళాడు. వెళ్ళి మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. వాఁడుఁ దోడ్పడఁ గడఁగి విజయుఁ నేసె; । నతఁడు వారలు నేడ్పడునట్లు గాఁగ**
**గడఁక గల యోధవీరులు బడలు వడఁగ । బలము సెడి పాఱఁ దనవింటి బలుపు సూపె. 189**

**ప్రతిపదార్థం:** వాఁడు= అతడు అనగా తన కుమారుడు ఉలూకుడు; తోడ్పడన్= సహాయపడగా; కడఁగి= పూని; విజయున్= అర్జునుడిని; ఏసెన్= బాణాలతో కొట్టాడు; అతఁడు= ఆ అర్జునుడు; వారలు= ఆ తండ్రి కొడుకులు శకుని, ఉలూకులు; నేడ్పడునట్లు+కాఁగన్= బాధపడేవిధంగా (మరియు); కడఁక+కల యోధవీరులు= పూనికగల వీరయోధులు; బడలు+పడఁగన్= అలసట చెందేటట్లు; బలము+చెడి= శక్తి శిథిలమయి; పాఱన్= పారిపోయే విధంగా; తన వింటి బలుపు= తన గాండీవ ధనువు యొక్క బలాన్ని; చూపెన్= చూపాడు.

**తాత్పర్యం:** కొడుకు ఉలూకుడు తనకు తోడ్పడగా శకుని పూనిక వహించి అర్జునుని బాణాలతో కొట్టాడు. ఆ అర్జునుడు తండ్రి కొడుకులిద్దరు బాధనొందేటట్లు, వారికి తోడైనవచ్చిన ఇతర వీరులు అలసిపోయేటట్లు, వారి సైన్యం బలహీనమై పరుగెత్తేటట్లు తన గాండీవ బలం ఎటువంటిదో తెలిసే విధంగా బాణాలు కురిపించాడు.

**వ. ఇట్లు వివ్వచ్చుండు పేర్చిన యా సమయంబున ధృష్టద్యుమ్నుండు. 190**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; వివ్వచ్చుండు= అర్జునుడు; పేర్చిన+ఆ సమయంబునన్= విజయగర్వంతో ఉబ్బిపోయే ఆ సమయంలోనే; ధృష్టద్యుమ్నుండు.

**తాత్పర్యం:** ఈ విధంగా అర్జునుడు విజృంభించగా ఆ సమయంలోనే, అక్కడ ధృష్టద్యుమ్నుడు.

**క. తటిమి గురు వింటి గొనయం। బఱిముఱిఁ దునియంగ నేయ నతఁ డాతని నే**
**డ్తెఱ నొండు వింట నేసిన। నుఱక తునిమె నాతఁ డ మ్మహోగ్రశరంబుల్. 191**

**ప్రతిపదార్థం:** తటిమి= ఎదుర్కొని; గురువింటి గొనయంబు= ద్రోణాచార్యుడి ధనువు నారిని; అఱిముఱిన్= వెంటనే; తునియంగన్= తునకలయ్యేటట్లు; ఏయన్= కొట్టగా; ఆతఁడు= ఆ ద్రోణాచార్యుడు; ఆతనిన్= ఆ ధృష్టద్యుమ్నుడిని గూర్చి; ఏడ్తెఱన్= వేగంతో; ఒండువింటన్= రెండవ ధనుస్సుతో; ఏసినన్= బాణాలు ప్రయోగించగానే; ఆ+మహా+ఉగ్రశరంబుల్= ఆ గొప్ప భయంకరములైన బాణాలను; ఉఱక= అవలీలగా; ఆతఁడు= ధృష్టద్యుమ్నుడు; తునిమెన్= తునకలు చేశాడు.

**తాత్పర్యం:** (ఆ వైపు ధృష్టద్యుమ్నుడు) ద్రోణాచార్యుడిని ఎదుర్కొని, అతడి వింటినారిని వెంటనే తెగగొట్టగా, ద్రోణాచార్యుడు మరొక విల్లు గ్రహించి ధృష్టద్యుమ్నుడిపై వేగంగా భయంకరమైన బాణాలు ప్రయోగిస్తూ ఉంటే - వాటిని అవలీలగా ధృష్టద్యుమ్నుడు తునకలు చేశాడు.

**వ. వెండియు నాచార్యుం డేయు సాయకంబులు ద్రుంచుచు నంగంబులు నొంచుచు మిగిలి మార్గణజాలంబుల సైన్యంబు దైన్యంబు నొందించె; నట్లు సాత్యకి సవ్యసాచి ధృష్టద్యుమ్నులచేతం గలయం గలంగి కౌరవానీకంబు గాందిశీకం బగుటయుఁ, బాంచజన్య దేవదత్తాది శంఖరవంబులు సెలంగం బాండవ బలంబులు గూడికొని వెన్నడిం గవిసినం గని భీషణరోషాతిరేక విధేయుం డయి రాధేయుండు. 192**

**ప్రతిపదార్థం:** వెండియున్= మళ్ళీ; ఆచార్యుండు+ఏయు= ద్రోణాచార్యుడు ప్రయోగిస్తూ ఉన్న; సాయకంబులు= బాణాలను; త్రుంచుచున్= ఖండిస్తూ; అంగంబులు= శరీరావయవాలను; నొంచుచున్= నొప్పిస్తూ; మిగిలి= అతిశయించి; మార్గణజాలంబులన్= బాణాల సమూహాలతో; సైన్యంబు= ఆ శత్రుసైన్యాన్ని; దైన్యంబున్= దీనత్వాన్ని; ఒందించెన్= పొందింపజేశాడు; అట్లు= ఆ విధంగా; సాత్యకి, సవ్యసాచి, ధృష్టద్యుమ్నుల చేతన్= సాత్యకి, అర్జునుడు, ధృష్టద్యుమ్నుడు అనే ముగ్గురు పాండవపక్ష వీరులచేత; కలయన్= అంతటను; కలంగి= కలతచెంది; కౌరవ+అనీకంబు= కౌరవుల సైన్యం; కాందిశీకంబు+అగుటయున్= భయంతో పారిపోయిన వెంటనే; పాంచజన్య దేవదత్త+ఆది శంఖరవంబులు= పాంచజన్యమనే శ్రీకృష్ణుడి శంఖం, దేవదత్తమనే అర్జునుడి శంఖం మొదలుగాగల (ఇతర వీరుల) శంఖాల ధ్వనులు; చెలంగన్= ధ్వనిస్తూ ఉండగా; పాండవ బలంబులు= పాండవుల సైన్యాలు; కూడికొని= ఏకమై; వెన్నడిన్ కవిసినన్= వెన్నంటి తరుముతూ ఉంటే; కని= చూచి; భీషణ రోష+అతిరేక విధేయుండు+అయి= భయంకరమైన కోపాతిశయానికి వశుడై; రాధేయుండు= కర్ణుడు.

**తాత్పర్యం:** మళ్ళీ ద్రోణాచార్యుడు వేసిన బాణాలనన్నింటినీ ఖండించి, ద్రోణాచార్యుడి శరీరావయవాలను బాణాలతో మిక్కిలి నొప్పిస్తూ, మరీ విజృంభించి కౌరవసైన్యానికి దిక్కుతోచని స్థితి కల్పించాడు. ఆ విధంగా సాత్యకి, అర్జునుడు, ధృష్టద్యుమ్నుడు - వీరు ముగ్గురిచేత కౌరవసైన్యం కలతచెంది పారిపోయింది. అపుడు కృష్ణుడు పాంచజన్యాన్ని, అర్జునుడు దేవదత్తాన్ని, ధృష్టద్యుమ్నాదులు తమ తమ శంఖాలను పూరించగా, పాండవసైన్యం ఉత్సాహంతో ఏకమై కౌరవసైన్యాన్ని వెంటాడి తరుముతూ ఉండగా, అది చూచి కర్ణుడు మిక్కిలి భయంకరమైన

కోపావేశంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. తలలుం జేతులుఁ గాళ్ళులుం దనువులున్ ధాత్రీస్థలిం బెక్కు తి**
**ట్టలు గావించి రథప్రతానములు ఘోటశ్రేణులున్ వారణా**
**వలులుం జేడ్పడఁ బైపయిం దఱిమి దుర్వారైక దర్పోద్ధతిం**
**జలముం జేవయుఁ జూపె నుద్భటభుజా సంరంభ రౌద్రంబుగన్. 193**

**ప్రతిపదార్థం:** తలలున్= శిరస్సులను; చేతులున్= హస్తాలను; కాళ్ళులున్= పాదాలను; తనువులున్= శరీరాలను; ధాత్రీస్థలిన్= రణభూమియందు; పెక్కుతిట్టలు= మిక్కుటమైన కుప్పలు; కావించి= చేసి; రథప్రతానములు= రథాల సమూహాలును; ఘోటశ్రేణులున్= అశ్వాల సమూహాలును; వారణ+ఆవలులున్= గజాల సమూహాలును; చేడ్పడన్= బాధపడే విధంగా; పైపయిన్= ముందు ముందుకు; తఱిమి= ఉరికించి పారిపోయే విధంగా వెంబడించి; దుర్వార+ఏక దర్ప+ఉద్ధతిన్= నివారించరాకుండా ఉన్న గర్వం యొక్క ఔద్ధత్యంతో - మిక్కిలి గర్వంతో; ఉద్భట= గొప్ప; భుజాసంరంభ= భుజముల ఆటోపంచేత; రౌద్రంబుగన్= భయం కలిగించే విధంగా; చలమున్= పౌరుషాన్నీ; చేవయున్= సామర్థ్యాన్ని; చూపెన్= చూపాడు.

**తాత్పర్యం:** (మిక్కిలి కోపంతో ఆ కర్ణుడు) శత్రువుల తలలను, చేతులను, కాళ్ళను శరీరాలను కుప్పలు కుప్పలుగా రణరంగాన అంతటా పడేటట్లు చేసి, రథాలు, గుర్రాలు, ఏనుగులు బాధతో రణరంగం నుండి పారిపోయే విధంగా తరిమి అడ్డుకొనసాధ్యంకాని తన గర్వాధిక్యాన్ని, మాత్సర్యాన్ని, శక్తిని-భయంకరమైన గొప్ప భుజబల విజృంభణంతో చూపించాడు.

**వ. ఇ వ్విధంబున విజృంభించి నొంచినం బఱిపఱియై పఱచు న వ్వాహినుల వెనుకొను నా సూతనందనుం జూచి తలంకి ధర్మతనయుం డర్జునునితో నిట్లనియె. 194**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; విజృంభించి= రేగిపోయి; నొంచినన్= నొప్పింపగా; పఱి పఱి ఐ= చెల్లాచెదరై; పఱచు+ఆ+వాహినులన్= పరుగెత్తుతున్న ఆ సైన్యాలను; వెనుకొను+ఆ+సూతనందనున్= వెంబడిస్తూ ఉన్న ఆ కర్ణుడిని; చూచి; తలంకి= చలించిపోయి; ధర్మతనయుండు= ధర్మరాజు; అర్జునునితోన్= అర్జునుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా రెచ్చిపోయి, బాణాలతో నొప్పిస్తూ ఉండగా, తట్టుకొనలేక చెల్లాచెదరై పారిపోయే పాండవుల సైన్యాలను వెంటాడే కర్ణుని చూచి కలతచెంది ధర్మరాజు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. నడురేయి తీవ్రభానుఁడు । పుడమి వెలసె నను తలంపు పుట్టించుచు ను**
**గ్గడు వగు తేజంబున వెలిఁ । గెడుఁ గర్ణుఁడు బాణరుచులు గిఱికొన దెసలన్. 195**

**ప్రతిపదార్థం:** నడురేయి= నడిమి రాత్రి; తీవ్రభానుఁడు= చండకిరణుడు - అనగా సూర్యుడు; పుడమిన్= భూమిపై; వెలసెన్+అను తలంపు= ఉదయించాడా అనే ఊహను; పుట్టించుచున్= కలిగిస్తూ; ఉగ్గడువు+అగు= అధికమైన; తేజంబునన్= తేజస్సుతో; బాణరుచులు= బాణాల కాంతులు; దెసలన్= దిక్కులయందు; గిఱికొనన్= వ్యాపించగా; కర్ణుఁడు= కర్ణుడు; వెలిఁగెడున్= ప్రకాశిస్తూ ఉన్నాడు.

**తాత్పర్యం:** ఆ కర్ణుడి బాణాల కాంతులు దిక్కులన్నింట వ్యాపించి ప్రకాశిస్తూ ఉండగా - కర్ణుడు నడిరాత్రిలో సూర్యుడు ఉదయించాడని అనిపించేటట్లు వెలిగాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఇక్కడ కర్ణుడియందు నడిరాత్రి ఉదయించిన సూర్యుడితో తాదాత్మ్యం ఊహించటంచేత ఉత్ప్రేక్షాలంకారమే కాని ఉపమకాదు. సూర్యుడు అర్ధరాత్రంలో ఉదయించినట్లు ఊహించుటచేత ఉపమాంశం కవి కల్పితమేకాని స్వతస్సిద్ధం కాదు కదా!

**ఆ. 'ఇట్లు దఱిమెనేని యిప్పుడ యీతఁ డి। ద్దిక్కు వారినెల్ల నొక్కయెత్తు**
**గాఁగఁ బిలుకుమార్చుఁ గావున నెమ్మెయి। నైనఁ బ్రతివిధాన మాచరింపు'. 196**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; తఱిమెనేని= వెంబడిస్తూ ఉన్నట్టయితే; ఇప్పుడు+అ= ఈ సమయంలోనే (ఇంకా ఆలస్యం లేకుండా); ఈతఁడు= ఈ కర్ణుడు; ఈ+దిక్కువారిని+ఎల్లన్= ఈ మనవైపున ఉన్నవారినందరిని; ఒక్క+ఎత్తు+గాన్= ఒకే పర్యాయం; పిలుకుమార్చున్= సంహరిస్తాడు; కావునన్= కాబట్టి; ఏ+మెయిన్+ఐనన్= ఏ విధంగానైనా; ప్రతివిధానము= ప్రతిక్రియను; ఆచరింపు(ము)= చేయుము.

**తాత్పర్యం:** ఈ కర్ణుడు ఇట్లాగే తరుముతూ పోతూ ఉండగా, మనం ఉపేక్ష చేశామంటే ఈ సైన్యాన్నంతా ఒకేసారి ఇప్పుడే సంహరించి వేస్తాడు. కాబట్టి ఏ విధంగానైనా దీనిని అడ్డుకొనే విధంగా ప్రయత్నించుము'.

**వ. అనిన విని యతం డచ్యుతు నాలోకించి 'రాధేయు రభసంబున కిమ్మోహరం బోహటించిన భూపతి భీతుండయ్యె భారద్వాజుండును బైకొని యొక్క వలన మొనలం దెరల్చెడి నే నదల్చి యిక్కర్ణు నుక్కడంచి యక్కుంభసంభవు సంరంభంబు వారించెదఁ దేరు నడపు' మనుటయు నద్దనుజమర్దనుం డతని కిట్లనియె. 197**

**ప్రతిపదార్థం:** అనినన్= (ఇట్లా ధర్మరాజు) పలుకగా; విని; అతండు= ఆ అర్జునుడు; అచ్యుతున్= కృష్ణుడిని; ఆలోకించి= చూచి; రాధేయు రభసంబునకున్= కర్ణుడి వేగానికి; ఈ+మోహరంబు= సైన్యం; ఓహటించినన్= వెనుదీయగా; భూపతి= ధర్మరాజు; భీతుండు+అయ్యెన్= భయపడిపోయాడు; భారద్వాజుండును= ద్రోణాచార్యుడు కూడా; పైకొని= విజృంభించి; ఒక్కవలనన్= ఒక వైపున; మొనలన్= మన సైన్యాలను; తెరల్చెడిన్= తొలగిపోయేటట్లు చేస్తున్నాడు (పారద్రోలుతున్నాడని భావం); (కావున ఏన్= నేను; అదల్చి= అదలించి; ఈ+కర్ణు+ఉక్కు= ఈ కర్ణుడి పొగరును; అడంచి= అణచివేసి; ఆ+కుంభసంభవు సంరంభంబు= ఆ ద్రోణాచార్యుడి వేగాన్ని; వారించెదన్= నివారిస్తాను; తేరు= రథాన్ని; నడపుము= కర్ణుడివైపు నడిపించుము; అనుటయున్= అనగానే; ఆ+దనుజ మర్దనుండు= ఆ కృష్ణుడు (దైత్యులను సంహరించినవాడు కాబట్టి కృష్ణుడికి ఆ పేరు); అతనికిన్= ఆ అర్జునుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజు అనగానే, అర్జునుడు కృష్ణుడిని చూచి 'మన సైన్యం కర్ణుడి వేగాన్ని తట్టుకొనలేక పారిపోతూ ఉండగా ధర్మరాజు భీతిల్లిపోయాడు. ఒకవైపు ద్రోణాచార్యుడు కూడా విజృంభిస్తూ సైన్యాన్ని పారద్రోలుతూ ఉన్నాడు. కాబట్టి ముందుగా ఈ కర్ణుడి పొగరు అణుస్తాను. తరువాత ద్రోణాచార్యుల యుద్ధవేగాన్ని నివారిస్తాను. కాబట్టి కర్ణుడివైపు రథాన్ని నడిపించుము' అని అనగా, కృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. 'వినుము నిశాసమయంబున। దనుజులకుం బేర్చు బాహుదర్పము శౌర్యం**
**బును; గావున హైడింబుం। డనిఁ గర్ణుని నోర్చుఁ; బనుత మతని నతనికిన్' 198**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ అర్జునా! వినుము; నిశా సమయంబునన్= రాత్రి సమయాన; దనుజులకున్= రాక్షసులకు; బాహు దర్పము= భుజగర్వం; శౌర్యంబును= పరాక్రమం (ఈరెండూ); పేర్చున్= అతిశయిస్తాయి; కావునన్= కాబట్టి; హైడింబుండు=

హిడింబా కుమారుడు ఘటోత్కచుడు; అనిన్= యుద్ధంలో; కర్ణునిన్= కర్ణుడిని; ఓర్చున్= ఓడిస్తాడు (అందుకే); అతనిన్= ఆ ఘటోత్కచుడిని; అతనికిన్= ఆ కర్ణుడిపైకి; పనుతము= పంపుదాము.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! రాక్షసులకు రాత్రి సమయంలో బాహుబలం పరాక్రమం అతిశయిస్తాయి; కాబట్టి మన హిడింబాసుతుడు ఘటోత్కచుడే ఈ సమయంలో కర్ణుడిని యుద్ధంలో ఓడిస్తాడు. కాబట్టి ఆ కర్ణుడిపైకి ఘటోత్కచుడినే పంపుదాము.

**వ అని వెండియు. 199**

**తాత్పర్యం:** ఇట్లా పలికి మళ్ళీ (అర్జునుడితో కృష్ణుడు ఇట్లా అన్నాడు).

**క. 'మన మంతకు వేఱొక ది । క్కున నడతము; భీమసుతునకును మాయలుఁ బెం**
**పొనరిన దివ్యాస్త్రంబులు । ననేకములు గలవు; వలవ దనుమానింపన్. 200**

**ప్రతిపదార్థం:** మనము= మనం; అంతకున్= అంతవరకు; వేఱు+ఒక దిక్కునన్= వేరే వైపునకు; నడతము= నడుద్దాము - వేరే వైపునకు యుద్ధం చేయటానికి వెళ్ళుదామని భావం; భీమసుతునకును= భీముడి కుమారుడైన ఘటోత్కచుడికి; మాయలున్= రాక్షస మాయలు; పెంపు+ఒనరిన= అతిశయించిన; దివ్య+అస్త్రంబులు= దివ్యములైన అస్త్రాలు; అనేకములు= అనేకాలు; కలవు= ఉన్నవి (కాబట్టి); అనుమానింపన్= సంశయించటం; వలవదు= వద్దు.

**తాత్పర్యం:** 'అంతవరకు మనము వేరేవైపున యుద్ధానికి నడుద్దాము. ఘటోత్కచుడికి ఎన్నో మాయలు తెలుసు; దివ్యాస్త్రాలు కూడా ఎన్నో అతడి వద్ద ఉన్నవి. కాబట్టి అనుమానించ అక్కరలేదు.

**వ. అని చెప్పి ఘటోత్కచుం బిలిచిన నతండు సన్నాహ సంరంభమూర్తి స్ఫూర్తి మెఱయం జనుదెంచి 'పనియేమి?' యనుటయు. 201**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; చెప్పి= పలికి; ఘటోత్కచున్= ఘటోత్కచుడిని; పిలిచినన్= పిలువగానే; అతండు= ఆ ఘటోత్కచుడు; సన్నాహ సంరంభమూర్తి స్ఫూర్తి= యుద్ధయత్నోద్రేకానికి తగిన ఆకార స్ఫురణ (యుద్ధ సన్నద్ధుడై ఉనికి అని భావం); మెఱయన్= మెరుస్తూ ఉండగా; చనుదెంచి= వచ్చి; పని= చేయవలసిన కార్యం; ఏమి?= ఎట్టిది?; అనుటయున్= అనగానే.

**తాత్పర్యం:** అని పలికి, ఘటోత్కచుడిని పిలువగా, ఆ ఘటోత్కచుడు యుద్ధానికి సన్నద్ధమైన ఆకారస్ఫురణ ప్రకాశించగా వచ్చి 'నే నేం చేయాలి?' అని అడుగగా

**ఉ. 'పాండవ సైన్యముల్ సెదరి పాఱెడుఁ గర్ణునిచేత నొచ్చి, యు**
**ద్దండత నీదు శౌర్యమును దర్పము నేర్పడ నిల్వరింపు; మీ**
**తం డని రాత్రి నీకుఁ గడుఁ దక్కువ; తండ్రులకున్ జయంబు పు**
**త్రుం డొసఁగంగఁ గాన్పు మహి రూఢికి నెక్కదె? గెల్వు మీతనిన్.' 202**

**ప్రతిపదార్థం:** (ఓ ఘటోత్కచా!) కర్ణుని చేతన్= కర్ణుడిచేత - కర్ణుడి బాణాల ధాటికి; నొచ్చి= బాధ కలిగి; పాండవ సైన్యముల్= (మన) పాండవ సైన్యాలు; చెదరి= చెదరిపోయి; పాఱెడున్= పారిపోతూ ఉన్నాయి; ఉద్దండతన్= (శత్రువులకు) భయంకొల్పే విధంగా; నీదు శౌర్యమును= నీ వీరత్వం; దర్పమును= భుజదర్పం కూడా; ఏర్పడన్= ప్రకటితమయ్యే విధంగా; నిల్వరింపుము=

నిలిచే విధంగా చేయుము (కర్ణుడిని ఎదుర్కొని మన సైన్యాలు పారిపోకుండా చూడుము అని భావం); ఈతండు= ఈ కర్ణుడు; అనిన్= యుద్ధంలో; రాత్రి= రాత్రి సమయాన; నీకున్= నీకంటె; కడున్= మిక్కిలి; తక్కువ= హీనబలుడే (రాక్షసులకు రాత్రి సమయంలో బలమెక్కువ కాబట్టి రాక్షసుడవైన నీముందు కర్ణుడు ఈ రాత్రి సమయాన యుద్ధంలో నిలువలేడని భావం); పుత్రుండు= కుమారుడు; తండ్రులకున్= జనకులకు; జయంబు= యుద్ధ విజయాన్ని; ఒసఁగంగ కాన్పు= ఇవ్వగా చూడగలగడం; మహిన్= భూమిపై; రూఢికిన్= ప్రసిద్ధికి; ఎక్కదె?= ఎక్కడా? (అట్టి పుత్రుడు ఈ లోకంలో కీర్తి పొందుతాడు కదా అని భావం) (కాబట్టి); ఈతనిన్= ఈ కర్ణుడిని; గెల్వుము= జయించుము - కర్ణుడిని జయించి తండ్రులకు విజయం కలుగజేసి మంచి పుత్రుడనే కీర్తి గడించుము అని భావం.

**తాత్పర్యం:** 'ఓ ఘటోత్కచా! కర్ణుడి బాణాఘాతాలకు ఆగలేక మన పాండవసైన్యాలు పారిపోతూ ఉన్నాయి. నీ భుజదర్పాన్ని, పరాక్రమాన్ని చూపి కర్ణుడిని ఎదుర్కొని, మన సైన్యం పారిపోకుండా ఆపుము. ఈ కర్ణుడు రాత్రి యుద్ధంలో నీ ముందు నిల్వలేడు. పుత్రుడు తండ్రులకు విజయం చేకూర్చగలగటం లోకప్రసిద్ధమేకదా. కాబట్టి కర్ణుడిని జయించుము.

**విశేషం:** 'నీకు' అని నొక్కి చెప్పటంలో రాత్రియందు విజృంభించే నిశాచరుడవైన నీ ముందు ఎవ్వరూ ఈ రాత్రి యుద్ధంలో ఆగలేరు అనే అర్థం ధ్వనిస్తూ ఉన్నది. మరియు 'తండ్రులకున్ జయంబు పుత్రుండొసఁగంగఁ గాన్పు మహిరూఢికి నెక్కదె?' అనే సామాన్యార్థంచేత సమర్థనీయమైన 'ఓ ఘటోత్కచా! పుత్రుడవైన నీవు కర్ణుడిని జయించి తండ్రులకు విజయం చేకూర్చి కీర్తి గడించుమా' అనే ప్రకృత విశేషార్థం ధ్వనింపజేయుటచేత ఇది అర్థాంతరన్యాసాలంకారం.

### అలంబుసుండు ఘటోత్కచునిచేతఁ జచ్చుట (సం. 7-149-15)

**వ. అనియె; ధనంజయుండును దదనురూపంబులైన యాలాపంబుల ననుమతి సేసినం గడంగి ఘటోత్కచుండు గర్ణుదెసకుం గవిసె; నట్టియెడ జటాసురసుతుం డగు నలంబుసుం డేతెంచి కురుపతిం గాంచి 'నాకుఁ బాండవుల దెసం బూర్వవైరంబు గలదు; నీకును బ్రియంబుగా వారిని, వారి వారిని వధియించెద' నని పలికి యతండు ప్రీతుండై యభినందింప, నా సూతనందనుం గలిసి తలకడచి హిడింబానందనుం దాఁకిన దారుణ రణం బయ్యె; నయ్యిరువురును వివిధ విశిఖ స్ఫురణంబుల నొండొరులఁ దెరల్పం జాలక రథికు లగుట యుడిగి మాయలకుం జొచ్చి మహోరగ గరుడాకారంబులను, వారణ కంఠీరవ రూపంబులను, రవిసైంహికేయాకృతులను, మేఘమారుతమూర్తులను మఱియు బహు విధ వికారాకారంబులను జూపుచుం బోరి యేపునం గదిసి బాహాబాహిం బెనంగునపుడు మేనులు బెరసిన నా భీమనందనుండు. 203**

**ప్రతిపదార్థం:** అనియెన్= (అని కృష్ణుడు ఘటోత్కచుడితో) అన్నాడు; ధనంజయుండును= అర్జునుడు కూడా; తద్+ అనురూపంబులు+ఐన+ఆలాపంబులన్= ఆ కృష్ణుడి మాటలకు అనుగుణాలైన పలుకులతో; అనుమతి+చేసినన్= అనుజ్ఞ ఇవ్వగానే; కడంగి= యుద్ధోద్యుక్తుడయి; ఘటోత్కచుండు= భీముడి కుమారుడు ఘటోత్కచుడనే వాడు; కర్ణుదెసకున్= కర్ణుడివైపునకు; కవిసెన్= పరుగుతీశాడు; అట్టియెడన్= ఆ సమయంలో; జటాసురసుతుండు+అగు= జటాసురుడి కుమారుడైన; అలంబుసుండు= అలంబుసుడనే రాక్షసుడు; ఏతెంచి= వచ్చి; కురుపతిన్= దుర్యోధనుడిని; కాంచి= చూచి; నాకున్= నాకు; పాండవుల దెసన్= పాండవులవైపు; పూర్వవైరంబు= ఇంతకు ముందు నుండి వైరం; కలదు= ఉన్నది; నీకును= ఓ దుర్యోధన మహారాజా! నీకు కూడా; ప్రియంబు+కాన్= ఇష్టమయ్యే విధంగా; వారిని= ఆ పాండవులను; వారి వారినిన్= ఆ పాండవుల పక్షీయులను; వధియించెదన్= వధిస్తాను; అని= ఇట్లా; పలికి= చెప్పి; అతండు= ఆ దుర్యోధనుడు; ప్రీతుండు+ఐ= సంతోషించినవాడై; అభినందింపన్= అభినందించగా; ఆ

సూతనందనున్= ఆ సూతపుత్రుడైన కర్ణుడిని; కలసి= కలసికొని; తలకడచి= అతిక్రమించి; హిడింబానందనున్= హిడింబ కొడుకైన ఘటోత్కచుడనే రాక్షసుడిని; తాఁకినన్= ఎదుర్కొనగా; దారుణ రణంబు= (వారిద్దరికి) భయంకరమైన యుద్ధం; అయ్యెన్= సాగింది; ఆ+ఇరువురును= ఆ ఇద్దరు - అనగా అలంబుస ఘటోత్కచులు కూడా; వివిధ విశిఖ స్ఫురణంబులన్= అనేక విధాలైన బాణాల స్ఫురణతో (అనగా తీక్ష్ణములైన బాణాలతో అని భావం); ఒండొరులన్= ఒకరి నొకరు; తెరల్పన్+చాలక= ఉడిగింపలేక; రథికులు+అగుట= రథంపై నుండి యుద్ధం చేయటం; ఉడిగి= మానివేసి; మాయలకున్= సహజమైన రాక్షసమాయ లకు; చొచ్చి= ప్రవేశించి - రాక్షసమాయలు ప్రయోగించి యుద్ధం చేయటానికి ఉపక్రమించి; మహా+ఉరగ గరుడ+ఆకారంబులను= పెద్ద సర్పం మరియు గరుత్మంతుడి ఆకారాలను (ఒకడు పెద్ద సర్పంగా మారగా మరొకడు ఆ సర్పానికి శత్రువైన గరుత్మంతుడి ఆకారాన్ని ధరించి పోరాడా డని భావం); (ఇట్లే) వారణ కంఠీరవ రూపంబులను= గజ సింహ శరీరాలను; రవిసైంహికేయ+ఆకృతులను= సూర్యుడు మరియు రాహువు రూపాలను; మేఘ మారుతమూర్తులను= మేఘస్వరూపాన్ని, దానికి విరుగుడుగా వాయురూపాన్ని; మఱియున్= ఇంతేగాక; బహువిధ వికార+ఆకారంబులను= ఇంకా ఎన్నో విధాలైన వికృతములైన ఆకారాలను; చూపుచున్= చూపిస్తూ; పోరి= యుద్ధం చేసి; ఏపునన్= విజృంభణంతో; కదిసి= ఎదుర్కొని; బాహాబాహిన్= బాహాబాహి యుద్ధంతో (బాహాసు బాహాసు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తం ఇతి బాహా బాహి - అని విగ్రహవాక్యం బాహుయుద్ధం ఇది. ఏ ఆయుధం లేక ఇద్దరు బాహువులతోనే పోరాడటం) (ఈ విధంగా); పోరి= పోరాడి; మేనులు= వారిద్దరి శరీరాలు; బెరసినన్= కూడగా; ఆ భీమనందనుండు= ఆ ఘటోత్కచుడు.

**తాత్పర్యం:** అని అనగా అప్పుడు అర్జునుడు కూడా కృష్ణుడు చెప్పిన దానికి తగినట్లుగా చెప్పి, ఘటోత్కచుడిని కర్ణుడితో యుద్ధం చేయటానికి అనుమతించగా, వెంటనే ఘటోత్కచుడు కర్ణుడు ఉన్న వైపునకు వెళ్ళాడు. ఆ సమయంలో జటాసురుడి కుమారుడు అలంబుసుడు అనే రాక్షసవీరుడు దుర్యోధనుడిని కలిసి, 'నాకు పాండవులపై ఇదివరకే పగ ఉన్నది. కాబట్టి నీకు సంతోషం కలిగేటట్లు ఆ పాండవులను, వారికి సంబంధించిన వారిని సంహరిస్తా' నని పలుకగా, దుర్యోధనుడు ఆ అలంబుసుడిని సంతోషంతో అభినందించాడు. వెంటనే ఆ అలంబుసుడు కర్ణుడి వైపు వెళ్ళి అతడిని దాటవేసి, ఘటోత్కచుడిని ఎదుర్కొనగా యుద్ధం భయంకరమైంది. వారిద్దరూ వివిధ బాణాలతో ఒకరినొకరు అణగించలేక రథాలుదిగి, మాయలకు పూనుకొని మహాసర్పగరుడపక్షిరూపాలను, గజసింహరూపాలను, సూర్యరాహురూపాలను, మేఘవాయురూపాలను, ఇంకా అనేకానేక వికృతరూపాలను చూపుతూ పోరాడి, ఒకరితో ఒకరు కలియబడి బాహాబాహియుద్ధం చేసేటప్పుడు, వారి శరీరాలు ఒకదానితో మరొకటి చేరగా- ఘటోత్కచుడు.

**క. పట్టి బలువుగ జటాసురు । పట్టిం బడవైచి, యురము పాదమునఁ గడున్**
**బిట్టుగఁ ద్రొక్కి, యతని తల । యట్టకుఁ బాయంగఁ జేసి యార్చెం బెలుచన్. 204**

**ప్రతిపదార్థం:** (ఘటోత్కచుడు) జటాసురు పట్టిన్= జటాసురుడి కొడుకైన ఆ అలంబుసుడిని; బలువుగన్= బలంగా; పట్టి= పట్టుకొని; పడవైచి= (క్రింద) పడవేసి; ఉరము= వక్షఃస్థలాన్ని; పాదమునన్= పాదంతో; కడున్= మిక్కిలి; బిట్టుగన్= శీఘ్రంగా; తొక్కి= అదిమి; అతనితల= అతడి శిరస్సు; అట్టకున్= మొండెమునకు; పాయఁగన్= ఎడబాసే విధంగా; చేసి; పెలుచన్= గట్టిగా; ఆర్చెన్= సింహనాదం చేశాడు.

**తాత్పర్యం:** (ఆ ఇద్దరి శరీరాలు పెనవేసికొనగానే ఘటోత్కచుడు) ఆ అలంబుసుడిని పట్టుకొని, క్రిందపడవైచి, అతని రొమ్మును పాదంతో త్రొక్కి, అతడి తలను శరీరంనుండి వేరుచేసి వెంటనే బిగ్గరగా సింహనాదం చేశాడు.

**ఆ. ఆర్చి నెత్తు రుట్ట నమ్మస్తకము వట్టి । కొని యతం డుదాత్త ఘోర భంగి**
**భ్రమరివాఱి కురునృపాలకు నరదంబు । నందు వైచి యిట్టు లనియె నధిప! 205**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఆర్చి= సింహనాదం చేసి; నెత్తురు= రక్తం; ఉట్టన్= కారగా; ఆ+మస్తకము= ఆ తలను; పట్టి= పట్టుకొని; అతండు= ఆ ఘటోత్కచుడు; ఉదాత్త ఘోరభంగిన్= గొప్ప భయంగొలిపే విధంగా; భ్రమరివాఱి= చుట్టూ తిరిగి (దుర్యోధనుని రథం ఎక్కడ ఉన్నదో చూడటానికని భావం); కురునృపాలకు+అరదంబునందున్= కురురాజైన దుర్యోధనుడి రథం మీద; వైచి= వేసి; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** సింహనాదం చేసి, ఆ ఘటోత్కచుడు ఆ అలంబుసుడి తలను నెత్తురు కారుతూ ఉండగా పట్టుకొని చూపరులకు భయంకొల్పే విధంగా చుట్టూ తిరిగి, దుర్యోధనుడి రథం లోకి ఈ తలను విసరివేశాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ కుమారుడైన దుర్యోధనుడితో ఘటోత్కచుడు ఇట్లా అన్నాడు.

**క. 'కొను మిదె నీ మిత్రుని తల; । విను మిట్టుల మాఱులేని విక్రమమునఁ గ**
**ర్ణునిఁ ద్రుంచెద; వరుసం బొరి । గొనియెద నిను; భీమసేను కొడుక నెఱుఁగవే?' 206**

**ప్రతిపదార్థం:** ఇదె= ఇదిగో; నీ మిత్రుని తల= (ఓ దుర్యోధనా!) నీ మిత్రుడైన అలంబుసుని తలకాయ; కొనుము= తీసికొనుము; వినుము= శ్రద్ధగా వినుము; ఇట్టులు+అ= ఇట్లే; మాఱులేని విక్రమమునన్= సాటిలేని పరాక్రమంతో; కర్ణునిన్= నీ మిత్రుడైన కర్ణుడిని కూడా; త్రుంచెదన్= సంహరిస్తాను; వరుసన్= క్రమంగా; నినున్= నిన్ను; పొరిగొనియెదన్= సంహరిస్తాను; భీమసేను కొడుకన్= భీముడి కుమారుడను (నేను); ఎఱుఁగవే?= తెలియలేవా?

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! ఇదిగో నీ స్నేహితుడైన అలంబుసుని తల తీసికొనుము. ఇదే విధంగా సాటిలేని పరాక్రమంతో కర్ణుడిని కూడా చంపివేస్తాను. వరుసగా నీ వంతు వచ్చినప్పుడు నిన్ను కూడా సంహరిస్తాను. నేనెవడనో తెలియదా? భీముడి కుమారుడిని.'

**విశేషం:** భీమసేన తనయు డనే విషయం అందరికీ తెలిసిందే అయినా మళ్ళీ తనకు తానే భీమసేన తనయుడనని చెప్పుకొనటంలోని తాత్పర్యం ఏమిటి? 'నిన్ను తొడలు విరుగగొట్టుతానని ప్రతిజ్ఞ చేశాడు మా తండ్రి భీమసేనుడు. అతడి ప్రతిజ్ఞకు బద్ధుడనై నిన్నిప్పుడే సంహరించేవాడను కాని, వదిలాను.' - ఈ అర్థం 'వరుసన్' అనే పద సహాయంతో ప్రధానంగా వ్యక్తమవుతూ ఉన్నది. ఇది అర్థాంతర సంక్రమిత వాచ్యధ్వని.

**వ. అని పలికి యసురవరుం డరుణం బగు తన యరదం బెక్కి గృధ్రకేతనంబు గ్రాల నీలోన్నతం బయిన తన రూపంబున కనురూపం బైన దంష్ట్రాయుగళంబును బింగళోద్బుద్ధ జటాకేశ కలాపంబును భీషణంబులుగాఁ గనక భూషణంబుల కతంబునఁ దటిల్లతా వికటంబగు నంబుదంబు కైవడిఁ గర్ణుపయిం గవిసి ఘనశరంబు లేయ నతండును జండభంగి నెదుర్కొని నిశితనారాచంబులఁ గప్పెఁ; నిప్పరుసునం దలపడి యమ్మనుజ దనుజులు మహాద్భుతకరం బగు సంగరంబు సేయునెడ వివిధాయుధ వ్యాపార ఘోర విచేష్టిత విగళిత రక్తసిక్తంబు లగు నంగంబుల యచలత్వంబున గైరిక గిరిద్వయంబు చందంబున నొప్పెఁ; ర ట్లెక్కువ తక్కువలు**

**లేక పోరిపోరి రాధేయుం డొక్క దివ్యాస్త్రంబు ప్రయోగించిన నది భైమసేని ప్రత్యస్త్రంబున నడంచి, మాయాసైన్యం బడరించిన నమ్మాయా సైన్యంబు సాయక శూల ముద్గరాది హేతి వ్రాతంబులును బలల వర్షంబులునుం గురియం గురువాహిని గలంగి పాఱిన, నా సూతసూనుం డొక్కరుండును నవష్టంభ విజృంభణంబు మెఱయ నిలిచి మహనీయాస్త్రబలంబున నమ్మాయ మాయించుటయు హైడింబుండు చక్రంబు వైచినం జక్కడిచె, గద నిగిడించిన మగిడించె, గగనంబున కరిగి తరుపాషాణ పటలంబులు పరఁగించినం దునిమి ధరం దొరఁగించె, మఱియు రథికత్వంబునం గడంగిన నయ్యోధవరుండు తురగ సారథి సహితంబుగా రథంబు శకలంబులు సేసి యతని తను వేదు వెఱిగిన తెఱంగుగా మెఱుంగుటమ్ములు గిఱిగొల్పినం గెరలి య న్నిశాచరనాథుండు. 207**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికి= చెప్పి; అసురవరుండు= రాక్షస శ్రేష్ఠుడగు ఆ ఘటోత్కచుడు; అరుణంబు+అగు= ఎర్రనైన; తన+అరదంబు= తన రథాన్ని; ఎక్కి= ఆరోహించి; గృధ్రకేతనంబు= గద్ద అనే పక్షి గురుతుగా కలిగిన ధ్వజం; క్రాలన్= ఒప్పగా; నీల+ఉన్నతంబు+అయిన= నల్లగాను, పొడవుగాను ఉన్నట్టి; తన రూపంబునకున్= తన ఆకారానికి; అనురూపంబు+ఐన= తగి ఉన్నటువంటి; దంష్ట్రా యుగళంబును= కోరలజంట; పింగళ+ఉద్బద్ధ జటాకేశ కలాపంబును= ఎరువు, పసుపు కలసిన వన్నె కలిగి, పైకి లేచి యున్నటువంటి జడలు కట్టుకపోయిన వెంట్రుకల సమూహం కూడా (ఈ రెండూ అని భావం); భీషణంబులు+కాన్= భయంకరములై ఉండగా; కనక భూషణంబుల కతంబునన్= బంగారు ఆభరణాల కారణాన; తటిత్+లతా వికటంబు+అగు=మెరుపు తీగతో అందమై ఉన్న; అంబుదంబు కైవడిన్= మేఘంవలె; కర్ణుపయిన్= కర్ణుడిపైకి; కవిసి= పరుగెత్తి; ఘనశరంబులు+ఏయన్= దృఢములైన బాణాలను వేయగా; అతండును= ఆ కర్ణుడు కూడా; చండభంగిన్= భయంకొల్పే విధంగా; ఎదుర్కొని= ఎదిరించి; నిశితనారాచంబులన్= తీక్ష్ణములైన బాణాలతో; కప్పెన్= కప్పివేశాడు; ఈ+పరుసునన్= ఈ విధంగా; తలపడి= యుద్ధానికి దిగి; ఆ+మనుజదనుజులు= ఆ మనుష్య రాక్షసులైన కర్ణుడు, ఘటోత్కచుడు; మహా+అద్భుతకరంబు+అగు= మిక్కిలి ఆశ్చర్యం కలిగించేటటువంటి; సంగరంబు= యుద్ధం; చేయునెడన్= చేసే సమయంలో; వివిధ+ఆయుధ వ్యాపార ఘోర విచేష్టిత విగళిత రక్తసిక్తంబులు+అగు= అనేకములైన ఆయుధాలు (ఒకరిపై ఒకరు) ప్రయోగించుట అనే భయంకరమైన చేష్టచే విడివడిన నెత్తురుచేత తడిసినటువంటి; అంగంబుల+అచలత్వంబునన్= శరీరాల పర్వతాకారంతో (అచలః, పర్వతః, తస్య భావః అచలత్వం, పర్వతత్వం పర్వతధర్మః పర్వతాకారత్వేన తాదృశౌన్నత్య రూపేణ ప్రకృతే పరిణమతి); గైరిక గిరిద్వయంబు చందంబునన్= ఎర్రజాజు కొండల జంట వలె; ఒప్పిరి= ప్రకాశించారు; అట్లు= ఆ విధంగా; ఎక్కువ తక్కువలు లేక= ఆధిక్య న్యూనత్వాలు లేకుండా; పోరిపోరి= యుద్ధం చేసి చేసి; రాధేయుండు= కర్ణుడు; ఒక్క దివ్యాస్త్రంబు= ఓ దివ్యాస్త్రాన్ని; ప్రయోగించినన్= సంధించి ఘటోత్కచుడిపై వేయగా; అది= దానిని; భైమసేని= భీమసేనుడి కుమారుడగు ఘటోత్కచుడు; ప్రత్యస్త్రంబునన్= ఆ దివ్యాస్త్రానికి విరుగుడుగా ఉండే మరో దివ్యాస్త్రంతో; అడంచి= నివారించి; మాయాసైన్యంబు= మాయతో సృష్టించిన సైన్యాన్ని; అడరించినన్= వ్యాపింప చేయగా; ఆ+మాయాసైన్యంబు= ఆ మాయతో ఏర్పడిన సేనను; సాయక శూల ముద్గర+ఆది హేతి వ్రాతంబులును= బాణాలు, శూలాలు ముండ్లరోకళ్ళు మొదలైన ఆయుధ సమూహాలను; పలల వర్షంబులను= మాంస వర్షాలను; కురియన్= కురిపించగా; కురువాహిని= కౌరవసైన్యం; కలంగి= వ్యథచెంది; పాఱినన్= పారిపోగా; ఆ సూతసూనుండు+ఒక్కరుండునున్= ఆ కర్ణుడుఒక్కడే; అవష్టంభ విజృంభణంబు= గర్వాతిశయం; మెఱయన్= ప్రకాశించగా; నిలిచి= తొలగిపోక నిలిచి; మహనీయ+ అస్త్రబలంబునన్= గొప్పవైన అస్త్రాల బలంతో; ఆ+మాయన్= ఆ రాక్షస మాయను; మాయించుటయున్= నివారించిన వెంటనే; హైడింబుండు=హిడింబా తనయుడగు ఘటోత్కచుడు; చక్రంబు= చక్రాయుధాన్ని; వైచినన్= వేయగా; చక్కడిచెన్= ఖండించాడు; గద= గదను; నిగిడించి నన్= ప్రయోగించగా; మగిడించెన్= తిప్పికొట్టాడు; గగనంబునకున్= ఆకాశానికి; అరిగి= వెళ్ళి; తరుపాషాణ పటలంబులు=చెట్లు, బండల సమూహాలను; పరఁగించినన్= వ్యాపింపజేయగా; తునిమి= తునకలు చేసి; ధరన్= భూమిపై; తొరఁగించెన్ = పడగొట్టాడు; మఱియున్= ఇంకా; రథికత్వంబునన్= రథారోహకభావంతో; కడంగినన్= యుద్ధం చేయబూనగా (రథంపై ఆరోహించి

విల్లమ్ములతో యుద్ధానికి ఉపక్రమించగా అని భావం); ఆ+యోధవరుండు= ఆ యోధులలో శ్రేష్ఠుడైన కర్ణుడు; తురగ సారథి సహితంబుగాన్= అశ్వాలతో, సారథితో కూడుకొని ఉన్న; రథంబు= రథాన్ని; శకలంబులు+చేసి= ముక్కలు చేసి; అతని తనువు= ఆ ఘటోత్కచుడి శరీరం; ఏదు= ముండ్లపంది; పెఱిగిన తెఱంగు+కాన్= విజృంభించిన విధం ఏర్పడేటట్లు (క్రియా విశేషణంగా 'గిఱిగొల్పినన్' అనేదానితో అన్వయిస్తుంది) (ముండ్లపంది యుద్ధానికి విజృంభిస్తుందా అనే భావం కలిగే విధంగా అని తాత్పర్యం); మెఱుంగు+అమ్ములు= తళతళలాడే బాణాలను; గిఱిగొల్పినన్= గ్రుచ్చుకొనే విధంగా నాటగా; కెరలి= చెలరేగి; ఆ+నిశాచర నాథుండు= ఆ రాక్షసుల రాజు ఘటోత్కచుడు.

**తాత్పర్యం:** అని చెప్పి, వెంటనే ఆ ఘటోత్కచుడు ఎర్రని తన గ్రద్దచిహ్నంగల జెండా ఒప్పగా, నల్లని ఎత్తైన తన రథంపై కూర్చొని రూపానికి తగినట్లు కోరలజంట, ఎరుపుపసుపు కలిసిన వన్నె కలిగి, పైకి నిక్కి జడలుగట్టిన వెంద్రుకల సమూహము భయంకరాలై ఉండగా; బంగారునగలు శరీరంమీద ప్రకాశిస్తూ ఉన్నకారణంగా మెరుపులతో కూడిన మేఘంవలె కర్ణుడి మీదికి పరుగెత్తి దృఢమైన బాణాలతో కొట్టాడు. కర్ణుడు కూడా ప్రచండంగా అతడిని ఎదుర్కొని, వాడి అయిన బాణాలు అతడిపై కురిపించాడు. ఈ విధంగా మనుష్యుడైన కర్ణుడు, రాక్షసుడైన ఘటోత్కచుడు మిక్కిలి ఆశ్చర్యకరమైన యుద్ధం చేయగా, ఒకరిపై మరొకరు ప్రయోగించిన వివిధాయుధాల వల్ల రక్తం కారుతున్న శరీరాలతో గైరికాదిధాతువులతో ఎర్రగా ఉన్న రెండు కొండలవలె ప్రకాశించారు. ఆ ఇద్దరూ ఒకరు తక్కువ, ఒకరు ఎక్కువ కాకుండా సమానస్థాయిలో పోరాడారు. కర్ణుడు ఒక దివ్యాస్త్రాన్ని ప్రయోగించగా, ఘటోత్కచుడు దానికి విరుగుడుగా ప్రత్యస్త్రాన్ని ప్రయోగించి దాన్ని అణచివేశాడు. మాయాసైన్యాన్ని సృష్టించాడు. ఆ మాయాసైన్యం శత్రుసైన్యంపై బాణాలను, శూలాలను, ముండ్ల రోకళ్ళను- ఇంకా ఎన్నో విధాలైన ఆయుధాలను మాంసఖండాలను కురిపిస్తూ ఉండగా కౌరవసైన్యం తట్టుకోలేక పారిపోసాగింది. అయినా ఆ కర్ణుడు ఒక్కడే నిలిచి తన దర్పం చాటుతూ దివ్యాస్త్రాల బలంతో ఆ మాయాసైన్యాన్ని రూపుమాపాడు. వెంటనే ఘటోత్కచుడు చక్రాయుధాన్ని ప్రయోగించాడు. కర్ణుడు దానిని ఖండించివేశాడు. ఘటోత్కచుడు గద విసిరాడు. దానిని కూడా కర్ణుడు తుత్తునియలు చేశాడు. ఇక ఘటోత్కచుడు తాను ఆకాశానికి చేరి చెట్లవర్షం, రాళ్ళవర్షం కురిపిస్తూ ఉంటే వెంటనే కర్ణుడు ఆ చెట్లను, రాళ్ళను తునుకలుగాచేసి భూమిపై పడేటట్లు చేశాడు. ఇక ఘటోత్కచుడు రథంపై ప్రత్యక్షమై యుద్ధానికి ఉపక్రమించగా కర్ణుడు ఆ ఘటోత్కచుడి గుర్రాలను, సారథిని ఖండించి, రథాన్ని తునుకలు చేశాడు. అంతేకాక, ఆ ఘటోత్కచుడి శరీరం నిండా బాణాలు నాటాడు. ఆ సమయంలో ఘటోత్కచుడు ముండ్లపంది యుద్ధానికి విజృంభిస్తూ ఉన్నదా- అన్నట్లు భాసించాడు. అప్పుడు ఆ ఘటోత్కచుడు చెలరేగి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

"తటిల్లతా వికటంబగు" అనే పాఠంకంటే-సంశోధిత ముద్రణలో పాఠాంతరంగా చూపబడిన తటిల్లత రాజిత" అనే పదమే ఉచితంగా ఉంటుంది.

**సీ.** **మాయాముఖంబున మార్గణజాలంబు । ద్రావఁ గర్ణుం డది వ్రయ్య నేసి**
**చెలఁగినఁ గడుఁబెక్కుశిరములతోఁడి మ । హాకృతి గైకొని నదియుఁ దునుమఁ**
**జచ్చె వీఁ డని మన సైన్యంబు లుబ్బంగఁ । బడియుండి వివిధ రూపములు దాల్చి**
**భంగించె నవియును ద్రుంగఁగ నేసిన । శైలమై తద్వజ్ర సాయకమున**

**తే. సమసి రథికుఁడై తన చుట్టుఁ జాతురంగ । మైన బల మేచి తఱుమంగ నడరి దీప్త**
**భూరి శరముల నాసూతపుత్రు నొంచి । యెక్కుడై త్రుంచె నతని వి ల్లక్కజముగ. 208**

**ప్రతిపదార్థం:** మాయా ముఖంబునన్= మాయతో (ఏర్పడిన) నోటితో; మార్గణజాలంబు= (కర్ణుడు వేసిన) బాణాల సమూహాలను; ద్రావన్= ద్రాగివేయగా; కర్ణుండు= కర్ణుడు; అది= ఆ మాయా కల్పిత ముఖాన్ని; వ్రయ్యన్= పగిలిపోయేటట్లు; ఏసి= బాణాలు వేసి; చెలఁగినన్= అర్భాగా (ఆ ఘటోత్కచుడు); కడున్= మిక్కిలి; పెక్కుశిరములతోడి; మహా+ఆకృతిన్= అనేకములైన తలలతో కూడిన పెద్ద ఆకారాన్ని; కైకొనన్= గ్రహించగా; (కర్ణుడు) అదియున్= ఆ శిరోబహుళమైన ఆకారాన్ని కూడా; తునుమన్= ఖండించగా; వీఁడు= ఈ ఘటోత్కచుడు; చచ్చెన్= మరణించాడు; అని= అని (అనుకొని); మన సైన్యంబులు= ఓ ధృతరాష్ట్ర మహారాజా! మన కౌరవసేనలు; ఉబ్బంగన్= ఉబ్బిపోయేటట్లు; పడియుండి= పడిపోయి; (వెంటనే ఆ ఘటోత్కచుడు) వివిధ రూపములు= పలు విధాలైన ఆకారాలను; తాల్చి= ధరించి; భంగించెన్= (కర్ణుడు వేసిన బాణాలను) భగ్నం చేశాడు (అప్పుడు కర్ణుడు); అవియును= ఆ వివిధాకృతులను కూడా; త్రుంగఁగన్= తునుకలయ్యే విధంగా; ఏసినన్= కొట్టగా (ఆ ఘటోత్కచుడు); శైలము+ఐ= పర్వతమై (పర్వతరూపం ధరించినవాడై అని భావం); తద్+వజ్రసాయకమునన్= ఆ కర్ణుడి వజ్రరూప దివ్యాస్త్రంచేత; సమసి= (ఆ పర్వతరూపం) నశించి; రథికుడు+ఐ= రథారోహణం చేసినవాడై (ఆ ఘటోత్కచుడు); తన చుట్టున్= తనకు నాలుగువైపులా; చాతురంగము+ఐన బలము= చతురంగ సైన్యం; ఏచి= విజృంభించి; తఱుమంగన్= (ఆ కౌరవసైన్యాన్ని) తరుముతూ ఉండగా; అడరి= చెలరేగి; దీప్తభూరిశరములన్= తళతళ మెరుస్తూ ఉన్న అనేకములైన బాణాలతో; ఆ సూతపుత్రున్= ఆ కర్ణుడిని; నొంచి= నొప్పించి; ఎక్కుడై= (ఆ కర్ణుడి కంటె యుద్ధంలో) ఆధిక్యం కలవాడై; అతని విల్లు= ఆ కర్ణుడి ధనుస్సును; అక్కజముగన్= ఆశ్చర్యం కలిగే విధంగా; త్రుంచెన్= ముక్కలు చేశాడు.

**తాత్పర్యం:** మాయతో పెద్ద నోరు సృష్టించి, దానితో ఆ కర్ణుడు వేసిన బాణాలనన్నింటినీ మ్రింగివేయగా, కర్ణుడు ఆ ఘటోత్కచుడి మాయా కల్పిత ముఖాన్ని దివ్యాస్త్రాలతో మటుమాయం చేసి రెచ్చిపోతూ ఉండగా వెంటనే ఘటోత్కచుడు అనేక ముఖాలు గల పెద్ద ఆకారాన్ని ధరించాడు. కర్ణుడు దానిని కూడా నశింపజేయగా, ఘటోత్కచుడు ఈ దెబ్బతో చచ్చిపోయే ఉంటాడని మనసైన్యం ఉప్పొంగిపోయింది. కాని వెంటనే ఘటోత్కచుడు ఒక్కటేమిటి - అనేక రూపాలతో దిక్కులన్నీ వ్యాపించి కర్ణుడు వేసిన బాణాలను భగ్నం చేశాడు. అప్పుడు కర్ణుడు తన దివ్యాస్త్రబలంతో ఆ ఘటోత్కచుడి ఆ పెక్కు రూపాలను నశింపజేశాడు. ఘటోత్కచుడు వెంటనే పర్వతమై నిలిచాడు. కర్ణుడు వజ్రరూపమైన ఇంద్రాస్త్రాన్ని అనుసంధించి ఆ పర్వతరూపాన్ని ఖండించాడు. ఇక ఘటోత్కచుడు తన చుట్టూ చతురంగ బలంతో కూడుకొని రథం అధిరోహించి యుద్ధానికి దిగాడు. రెచ్చిపోయి, కర్ణుడిపై బాణాలు కురిపించి నొప్పించాడు. అంతేకాక కర్ణుడి విల్లును తునుకలు చేశాడు. ఆ ఘటోత్కచుడు కర్ణుడి కంటె అధికుడై విక్రమించాడు అని అందరూ ఆశ్చర్యపోయారు.

**వ. ఆ సమయంబున బకుని తోడంబుట్టు వగు నలాయుధుం డను నసురేంద్రుండు వడముడి వలనివైరంబు పెద్ద కాలం బేనియు మనం బెరియింపం దటి వేచికొని యుండి యన్నిశాసంగ్రామంబునకు ససైన్యంబుగాఁ జనుదెంచి దుర్యోధనుం గని త న్నెఱింగించుకొని యతనితో నిట్లనియె. 209**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అదే సమయంలో; బకుని తోడంబుట్టువు+అగు= బకాసురుడి సోదరుడైన; అలాయుధుండు +అను= అలాయుధుడు అనే (పేరుగల); అసుర+ఇంద్రుండు= రాక్షసశ్రేష్ఠుడు; వడిముడివలని వైరంబు= భీమసేనుడి వలన ఏర్పడిన శత్రుత్వం (భీముడు ఏకచక్రపురంలో తన సోదరుడు బకాసురుడిని చంపినవైరం); పెద్దకాలంబు+ఏనియున్=చాలా కాలంగా; మనంబు= మనస్సును; ఎరియింపన్= కాలుస్తూ ఉండగా; తటి= (తగిన) సమయం; వేచికొని ఉండి=ఎదురుచూచుకొంటూ

ఉండి; ఆ+నిశాసంగ్రామంబునకున్= ఆ రాత్రి యుద్ధానికి; ససైన్యంబుగాన్= సైన్యంతో కూడి ఉండేటట్లు (సైన్యంతో కూడా అని భావం) (క్రియా విశేషణం); చనుదెంచి= వచ్చి; దుర్యోధనున్= దుర్యోధనుడిని; కని= చూచి; తన్నున్= తనను; ఎఱింగించు కొని= తెలియజేసికొని; అతనితోన్= ఆ దుర్యోధనుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అదే సమయాన బకాసురుడి సోదరుడు అలాయుధుడు అనే రాక్షసుడు రాత్రియుద్ధం చేసి భీముడిపై పూర్వవైరాన్ని సాధించుకొనటానికి సైన్యసమేతంగా దుర్యోధనుడిని చేరాడు. (భీముడు ఏకచక్రపురంలో బ్రాహ్మణ కుటుంబాన్ని, ఆ ఊరి ప్రజలను కష్టాలనుండి కాపాడటానికి బకుడనే రాక్షసుడిని సంహరించాడు. అదీ అలాయుధుడికి భీముడిపైనున్న పూర్వవైరం. ఇంతకాలం ఆ రాక్షసుడి మనస్సును కాల్చివేస్తున్నది ఆ వైరం. తగిన సమయానికి నిరీక్షిస్తున్నాడు. ఆ పగ తీర్చుకొనటానికి ఈ రాత్రియుద్ధం తగిన సమయంగా భావించాడు.) అలాయుధుడు దుర్యోధనుడిని సమీపించి, తా నెవడో ఎందుకు వచ్చాడో పరిచయం చేసికొని మరీ ఇట్లా అన్నాడు.

**విశేషం:** పరిచయ ఘట్టం మూలంలో విస్తృతంగా ఉన్నది. తిక్కన 'త న్నెఱింగించుకొని' అనే మాటతో దానినంతా సంగ్రహించాడు.

**అలాయుధాసురుండు ఘటోత్కచునితో యుద్ధంబు సేసి చచ్చుట (సం. 7-151-1)**

**క. 'భీమునిఁ దత్సోదరులను । భూమీశ్వర! యిపుడ పట్టి పొరివుచ్చెద; ను**
**ద్దామత మ్రింగెదఁ గృష్ణుని । తో మిత్రగణంబుతోఁ సుతులతోఁ గూడన్. 210**

**ప్రతిపదార్థం:** భూమీశ్వర!= ఓ దుర్యోధన మహారాజా!; భీమునిన్= భీమసేనుడిని; తద్+సోదరులను= అతడి తోబుట్టువులైన ధర్మరాజాదులను; పట్టి= పట్టుకొని; ఇపుడు+అ= ఇప్పుడే; పొరివుచ్చెదన్= సంహరిస్తాను (సంహరించి, వారినందరిని); కృష్ణునితోన్= వారు నమ్ముకొన్న కృష్ణుడితో; మిత్రగణంబుతోన్= (వారి) స్నేహితుల సమూహంతో; సుతులతోన్= వారి పుత్రులతో; కూడన్= సహితంగా; ఉద్దామతన్= భయం కలిగించే విధంగా; మ్రింగెదన్= మ్రింగివేస్తాను.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధన మహారాజా! భీముడిని, అతని అన్నదమ్ములను, ఆ పాండవులకు అండగా ఉన్న కృష్ణుడిని, ఆ పాండవుల స్నేహితులనూ, కుమారులనూ ఇప్పుడే చంపి మ్రింగివేస్తాను.

**వ. నీకును నీ వారికిం గయ్యంపు టలజడి గాకుండునట్లుగా నరిసేన సమయించెద' ననియె; నప్పుడు ద్రోణద్రౌణి కృప కృతవర్మ మద్రపతి ప్రముఖ యోధవీరులు వెఱఁగుపడి చూచుచుండం బేర్చి హైడింబుండు గవిసినం గర్ణుదెస నఖిలజనంబులును నిరాశులైరి; సుయోధనుం డలాయుధు నాలోకించి. 211**

**ప్రతిపదార్థం:** నీకును= ఓ దుర్యోధనా! నీకును; నీవారికిన్= నీకు సంబంధించిన వారలకు; కయ్యము+అలజడి= యుద్ధం వల్లనైన కలత; కాక+ఉండునట్లు+కాన్= లేకుండా ఉండే విధంగా; అరిసేనన్= శత్రుసైన్యాన్ని; సమయించెదన్= సంహరిస్తాను; అనియెన్= (అని) పలికాడు; అప్పుడు= ఆ సమయంలోనే; ద్రోణ= ద్రోణుడు; ద్రౌణి= ద్రోణపుత్రుడు - అశ్వత్థామ; కృప= కృపుడు; కృతవర్మ= కృతవర్మ; మద్రపతి= శల్యుడు (మద్రదేశాధిపతి కావున ఈతడికి ఆ పేరు); ప్రముఖ= మొదలుగా గల; యోధవీరులు= యుద్ధం చేసే వీరులు; వెఱఁగుపడి= ఆశ్చర్యపడి; చూచుచుండన్= చూస్తూ ఉండగా; పేర్చి= విజృంభించి; హైడింబుండు= ఘటోత్కచుడు; కవిసినన్= పైబడుతూ ఉండగా; కర్ణుదెసన్= కర్ణుడిపై; అఖిల జనంబులును= జనులందరు; నిరాశులు+ఐరి= ఆశలేనివారయ్యారు- అనగా జీవితాశయం వదలుకొన్నారు; సుయోధనుండు= దుర్యోధనుడు; అలాయుధున్= ఆ బకాసురుడి సోదరుడైన అలాయుధుడనే రాక్షసుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** నీకూ, నీ పక్షాన ఉన్నవారికీ ఇక యుద్ధక్లేశం లేకుండా చేస్తాను. ఈ శత్రుసైన్యాన్నంతా వధిస్తాను' అన్నాడు. ఇక అక్కడ ద్రోణుడు, అశ్వత్థామ, కృపుడు, కృతవర్మ, శల్యుడు మొదలైన మహాయోధులు ఆశ్చర్యపడిచూస్తూఉండగా, ఘటోత్కచుడు కర్ణుడి మీద విజృంభించటాన్ని చూచి జనులందరూ కర్ణుడిపై ఆశ వదలుకొన్నారు. అప్పుడు దుర్యోధనుడు అలాయుధుని చూచి

**తే. 'భీమతనయుండు మాయపుఁ బెనఁకువలను । గర్ణు నొప్పించుచున్నాఁడు; గడఁగి వానిఁ**
**దాఁకి గెలువు నీ' వనవుడు దైత్యవిభుఁ డు । దగ్రగతిఁ జని తాఁకె నా దైత్యవిభుని. 212**

**ప్రతిపదార్థం:** (ఓ అలాయుధా!) భీమతనయుండు= భీముడి కొడుకు ఘటోత్కచుడు; మాయము+పెనఁకువలను= రాక్షసమాయలతో కూడిన యుద్ధాలతో; కర్ణున్= కర్ణుడిని; నొప్పించుచున్నాఁడు= బాధిస్తున్నాడు (కాబట్టి); నీవు= (సమర్థుడవైన) నీవు; కడఁగి= విజృంభించి; తాఁకి= ఎదుర్కొని; వానిన్= ఆ ఘటోత్కచుడిని; గెలువు(ము)= జయించుము; అనవుడున్= అనగానే; దైత్యవిభుఁడు= ఆ అలాయుధుడు; ఉదగ్రగతిన్= భయంకరమైన పోకడతో; చని= వెళ్ళి; ఆ దైత్యవిభునిన్= ఆ ఘటోత్కచుడిని; తాఁకెన్= ఢీకొన్నాడు.

**తాత్పర్యం:** 'ఓ అలాయుధా! ఘటోత్కచుడు తన మాయాయుద్ధాలతో కర్ణుడిని బాధిస్తూ ఉన్నాడు. నీవు అతడని ఎదుర్కొని గెలువుము అని దుర్యోధనుడు అనగానే అలాయుధుడు రోషభీషణంగా వెళ్ళి, ఘటోత్కచుడిని ఢీకొన్నాడు.

**విశేషం:** ఘటోత్కచు డనక భీమతనయుడని చెప్పటం అలాయుధుడికి భీముడి యెడ గల పూర్వవైరానుసంధాన సూచనార్థం. దీనిచేత 'ఓ అలాయుధా! నీ వా ఘటోత్కచుడిని చంపి ఆ భీముడిపై గల వైరాన్ని కొంతవరకైనా తీర్చుకొనుము' - అనే అర్థం ధ్వనిస్తూ ఉన్నది. 'మాయపుఁ బెనఁకువలను' అను పదంచేత 'ఆ ఘటోత్కచుడి ఉక్కడంచటానికి మాయా యుద్ధతంత్రాన్ని తెలిసిన నీవే సమర్థుడ'వని కూడా దుర్యోధనుడి అభిప్రాయ రూపమైన అర్థం వ్యక్తమవుతూ ఉన్నది.

**క. అరదము మొదలైన సకల । పరికరములు రూపునేపుఁ బ్రాయంబును న**
**య్యిరువురు దనుజాధిపులకు । సరియై యొప్పారెఁ జూడ జగతీనాథా! 213**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అరదము మొదలు+ఐన= రథం మొదలుగా గల; సకల పరికరములున్= సాధానాలన్నీ (మరియు); రూపు= రూపం; ఏపున్= విజృంభణం; ప్రాయంబునున్= వయస్సు కూడా; ఆ+ఇరువురు దనుజ+అధిపులకున్= ఆ ఇద్దరు రాక్షస శ్రేష్ఠులకు; చూడన్= కనుకొనగా; సరియై= సమానమై; ఒప్పారెన్= భాసించాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఘటోత్కచుడు, అలాయుధుడు - అనే ఆ ఇద్దరు రాక్షసవీరులు రథం మొదలైన యుద్ధసాధనాలలో, రూపంలో, విజృంభించి పోరు సల్పటంలో, వయస్సులో - ఒకటేమి? అన్నింటిలో కూడా సమానులై భాసించారు.

**వ. ఇ ట్లేపు మెఱయ నిరువురుం దలపడి పోరు వారలం జూచి సూతసూనుండు మరుత్సూనుపయిం గవిసిన నతండు దన సుతుం డలాయుధుచేత నొచ్చునో యను తలంపునఁ గర్ణునిఁ గ్రేడించి యమ్మేటి రక్కసునిమీఁద నాటోపంబున నడరుటయుఁ, దదనుచరులగు నిశాచరు లనేకు లొక్కమొగి నతనిం బొదివిన కినుక నమ్ములగములు వఱపి యవ్వీరుండు వారిం బఱపిన. 214**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఏపు= విజృంభణం; మెఱయన్= ప్రకాశించగా; ఇరువురున్= ఇద్దరుకూడా; తలపడి= కలియబడి; పోరువారలన్= యుద్ధంచేసే ఆ ఘటోత్కచుడు అలాయుధుడు అనే రాక్షసవీరులను; చూచి; సూతసూనుండు= కర్ణుడు; మరుత్+సూనుపయిన్= వాయునందనుడయిన భీముడిపై; కవిసినన్= దాడిచేయగా; అతండు= ఆ భీముడు; తన సుతుండు= తన కుమారుడగు ఘటోత్కచుడు; అలాయుధుచేతన్= తాను సంహరించిన బకాసురుడి సోదరుడైన అలాయుధుడి చేత; నొచ్చునో = చనిపోవునేమో; అను తలంపునన్= అనే ఊహతో; కర్ణునిన్= కర్ణుడిని; క్రేడించి= లెక్కచేయక దాటి; ఆ+మేటి రక్కసుమీఁదన్= ఆ అలాయుధుడనే రాక్షసశ్రేష్ఠుడిపై; ఆటోపంబునన్= యుద్ధాడంబరంతో; అడరుటయున్= చెలరేగగానే; తద్+అనుచరులు+అగు= ఆ అలాయుధుడి సహచరులైన; నిశాచరులు+అనేకులు= రాక్షసులు పలువురు; ఒక్క మొగిన్= ఒకేసారి; అతనిన్= ఆ భీముడిని; పొదివినన్= ఎదుర్కొనగా; ఒదవిన కినుకన్= పుట్టిన కోపంతో; అమ్ములగములు= బాణాల సమూహాలను; పఱపి= ప్రయోగించి; ఆ+వీరుండు= వీరుడైన ఆ భీమసేనుడు; వారిన్= ఆ సహచర రాక్షసులను; పఱపినన్= పారద్రోలగా.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ ఘటోత్కచుడు, అలాయుధుడు - ఇద్దరూ ఒకరితో ఒకరు యుద్ధానికి తలపడి విజృంభించి పోరుతూ ఉంటే చూచి, కర్ణుడు భీముడిపై యుద్ధంచేయటానికి ఉరికాడు. కాని ఆ భీముడు తన కుమారుడు ఘటోత్కచుడు అలాయుధుడి చేతిలో చిక్కి మరణిస్తాడో ఏమో - అనే అనిష్టశంకతో కర్ణుడిని లెక్కచేయక దాటవేసి, ఆ అలాయుధుడిపైకి విజృంభించి పరుగుతీస్తూ ఉండగా, ఆ అలాయుధుడి అనుచరుడైన రాక్షసవీరులు ఒకేసారి భీముడిపైకి దూసికొని వచ్చారు. వారినందరిని భీముడు బాణాలు గుప్పించి పారద్రోలగా

**తే.** **పోక నిలిచి యమ్మారుతపుత్త్రుఁ డేయు । సాయకంబులఁ గొన్నింటిఁ జంచదస్త్ర**
**కుంఠితంబులఁ గావించి కొన్ని యురము । నందు డిందంగ మెఱసె న య్యసురవరుఁడు.** **215**

**ప్రతిపదార్థం:** ఆ+అసురవరుఁడు= ఆ అలాయుధుడు; పోక= తానొక్కడు మాత్రం తొలగిపోక; నిలిచి= ఆ భీముడికి ఎదురు నిలిచి; ఆ+మారుత పుత్త్రుఁడు= ఆ వాయునందనుడు భీముడు; ఏయు= వేసే; సాయకంబులన్= బాణాలలో; కొన్నింటిన్= కొన్ని బాణాలను; చంచత్+అస్త్రకుంఠితంబులన్= తళతళ మెరుస్తూ ఉన్న బాణాలతో మొక్కవోయినవాటినిగా; కావించి= చేసి; కొన్ని= మరికొన్ని బాణాలు; ఉరమునందున్= వక్షఃస్థలమందు; డిందంగన్= క్రుచ్చుకొనిపోయి ఉండగా; మెఱసెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** అలాయుధుడు తన సైన్యం తొలగి పారిపోయినా తా నొక్కడు మాత్రం తొలగిపోక, భీముడికి ఎదురుగా నిలిచి, ఆ భీముడు వేసిన బాణాలను కొన్నింటిని తన బాణాలతో ఖండించాడు. అయినా కొన్ని బాణాలు మాత్రం కొట్టువడక వచ్చి అతడి వక్షస్స్థలం చీల్చగా భాసించాడు.

**క.** **భీముఁడు గద వైచిన ను । ద్దామ గదాప్రహతి నది యతండు సదిపి యు**
**గ్రామేయ వివిధ విశిఖ । స్తోమంబుల నతని నొంచె దుర్జయలీలన్.** **216**

**ప్రతిపదార్థం:** భీముఁడు= భీమసేనుడు; గద= గదను; వైచినన్= వేయగా; అది= దానిని; ఉద్దామగదా ప్రహతిన్= భయంకరమైన గదయొక్క దెబ్బతో; అతండు= ఆ అలాయుధుడు; చదిపి= నశింపజేసి; ఉగ్ర= భయంకరములైన; అమేయ= లెక్కలేనన్ని; వివిధ= అనేక విధాలైన; విశిఖ= బాణాలయొక్క; స్తోమంబులన్= సమూహాలతో; దుర్జయ లీలన్= జయించరాని విధంగా; అతనిన్= ఆ భీముడిని; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** భీముడు గద ప్రయోగించగా ఆ అలాయుధుడు తాను భయకరమైన గదనే ప్రయోగించి ఆ గదను

వ్యర్థం చేసి, భయంకరాలైన బాణాలు లెక్కలేనన్నింటిని ఆ భీముడిపై వేసి, బాధించాడు.

**వ. నిజ బలంబులం బురికొల్పిన నవి పాంచాల సైన్యంబుల బడలు పఱిచె; నప్పుడు శౌరి సవ్యసాచిం జూచి 'రాత్రి యుద్ధంబున రాక్షసులు వేర్చిరి; వీరి మరల్ప నకుల సహదేవ సాత్యకి ప్రభృతుల నియోగింపుము; కర్ణదెసకు శిఖండి ధృష్టద్యుమ్న ప్రముఖులం బనుపుము; గురుని ప్రాపున నురవడించు నరపతుల నీవు నిలువరింపు' మనునెడ నలాయుధుం డనిలతనయు ధనువు దునిమి యతండు వేఱొక్కవిల్లెత్తికొను సందున సారథి రథ్యంబుల సోలనేసినం బొలివోవక యబ్బలుమగండు గదాహస్తుండయి గొదకొన వాఁడును గదగొని మార్కొని ఘోరంబు గాఁ బోర గదలు దుము రగుటయు రథావయవంబులుఁ గరిదంతంబులు లోనుగా దొరకొన్నవియ సాధనంబులుగా నొండొరుల నొప్పింపం దొడంగిన. 217**

**ప్రతిపదార్థం:** నిజ బలంబులన్= తన సైన్యాలను; పురికొల్పినన్= ప్రేరేపించగా; అవి= ఆ సైన్యాలు; పాంచాల సైన్యంబులన్= పాంచాలదేశపు సేనలను; బడలు+పఱిచెన్= అలయింపజేశాయి; అప్పుడు= ఆ సమయంలో; శౌరి= కృష్ణుడు; సవ్యసాచిన్= అర్జునుడిని; చూచి= చూచి (ఇట్లా అన్నాడు); రాత్రి యుద్ధంబునన్= రాత్రి యుద్ధంలో; రాక్షసులు= ఆ రాక్షసవీరులు; పేర్చిరి= అతిశయించారు; వీరిన్= ఈ రాక్షసులను; మరల్పన్= తొలగించటానికి; నకుల సహదేవ సాత్యకి ప్రభృతులన్= నకులుడు, సహదేవుడు, సాత్యకి మొదలైన వీరులను; నియోగింపుము= పంపుము; కర్ణదెసకున్= కర్ణుడివైపునకు; శిఖండి ధృష్టద్యుమ్న ప్రముఖులన్= శిఖండి, ధృష్టద్యుమ్నుడు మొదలైనవారిని; పనుపుము= పంపుము; గురుని ప్రాపునన్= ద్రోణాచార్యుడి రక్షణలో; ఉరవడించు నరపతులన్= ఎదుర్కొంటూ ఉన్న రాజులను; నీవు= ఓ అర్జునా! నీవు; నిలువరింపుము= నిలిపివేయుము; అను+ఎడన్= అనే సమయంలో; (అక్కడ) అలాయుధుండు= బక సోదరుడు-అలాయుధాసురుడు; అనిల తనయు ధనువున్= వాయునందనుడైన భీమసేనుడి ధనుస్సును; తునిమి= ఖండించి; అతండు= ఆ భీముడు; వేఱు+ఒక్క+విల్లు= మరియొక ధనువును; ఎత్తికొను సందునన్= తీసికొనే అవకాశంలో; సారథి రథ్యంబులన్= అతని సారథిని, అశ్వాలను; సోలన్= మూర్ఛపోయి రథం నుండి తొలగిపోయే విధంగా; ఏసినన్= కొట్టగా; పొలి+పోవక= భంగపడక; ఆ+బలుమగండు= ఆ బలశాలియైన వీరుడు భీముడు; గదా హస్తుండు+అయి= గద చేతిలో తీసికొన్నవాడయి; గొదకొనన్= విజృంభించగా; వాఁడును= ఆ అలాయుధుడు కూడ; గద= గదను; కొని= తీసికొని; మార్కొని= డీకొని; ఘోరంబు+కాన్= భయంకరంగా; పోరన్= యుద్ధం చేయగా; గదలు= ఆ ఇద్దరి గదలు; తుమురు+అగుటయున్= చూర్ణమయిన వెంటనే; రథ+అవయవంబులున్= రథాల చక్రాలు, నొగళ్ళు, కాడులు మొదలైనవి; కరి దంతంబులు= ఏనుగుల దంతాలు; లోనుగాన్= మొదలుగా; దొరకొన్నవి+అ= లభించినవియే; సాధనంబులుకాన్= సాధనాలు కాగా (దొరికినవి దొరికినట్లే రథాల చక్రాలు నొగళ్ళు, కాణీలు, ఏనుగుల దంతాలు మొదలైన వాటిని ఆయుధాలుగా ఉపయోగించి అని భావం); ఒండొరులన్= పరస్పరం; నొప్పింపన్+తొడంగినన్= బాధించటానికి పూనుకొనగా.

**తాత్పర్యం:** అంతేకాక, తన సైన్యాలను ఆ అలాయుధుడు శత్రుసైన్యంపై ప్రేరేపించాడు. ఆ సైన్యాలు పాంచాల సైన్యాలతో పోరాడి ఆ సైన్యాలను అలసిపోయేటట్లు చేశాయి. ఇది గమనించి కృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'అర్జునా! రాత్రి యుద్ధంలో రాక్షసులు అతిశయించారు. కాబట్టి ఈ రాక్షస వీరులను మరల్చటానికి నకుల సహదేవులు సాత్యకి మొదలైన వారిని పంపించుము. ఇక కర్ణుడిపైకి శిఖండి, ధృష్టద్యుమ్నుడు మొదలైన వారిని పంపుము. నీవేమో ద్రోణుడి రక్షణ నిమిత్తం పోరాడుతూ ఉన్న రాజులను ఆపుము.' అని అర్జునుడితో కృష్ణుడు చెప్తుతూ ఉండే సమయంలో, అక్కడ అలాయుధుడు భీముడి ధనుస్సును ముక్కలు చేశాడు. భీముడు మరో

ధనుస్సును తీసికొనే లోపలనే భీముడి సారథిని, గుఱ్ఱాలను సంహరించివేశాడు. భీముడు క్రుంగిపోక గద తీసికొని ఆ అలాయుధుడిపైకి ఉరుకగా; ఆ అలాయుధుడు కూడా గద తీసికొని భీముడి నెదుర్కొన్నాడు. యుద్ధం ఘోరంగా సాగింది. వారిద్దరి గదలు తుమురైపోయాయి. ఇక ఆ ఇద్దరూ రథచక్రాలు, రథాల నొగళ్ళు, ఏనుగుల దంతాలు మొదలుగా రణరంగాన ఏ సాధనం దొరికితే దానితో ఒకరినొకరు నొప్పించటానికి పూనుకొనగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కని హరి 'గర్ణునితోడం । బెనఁగు ఘటోత్కచునిఁ బిలిచి భీముఁడు వల; ది**
**ద్దనుజుని మర్దింపుము నీ' । వన నాతం డతని విడిచి యతనికిఁ గవిసెన్. 218**

**ప్రతిపదార్థం:** కని= ఈ విషయం గమనించి (యుద్ధంలో భీము డలసినట్లు గమనించి అని భావం); హరి= కృష్ణుడు; కర్ణుని తోడన్= కర్ణుడితో; పెనఁగు= యుద్ధం చేసేటటువంటి; ఘటోత్కచునిన్= ఘటోత్కచుడిని; పిలిచి= దగ్గరికి పిలిచి (అతడితో ఇట్లా అన్నాడు); (ఓ ఘటోత్కచా!); భీముఁడు= మీ తండ్రి భీమసేనుడు; వలదు= ఆ అలాయుధుడితో యుద్ధం చేయవద్దు; నీవు= నీవే; ఈ+దనుజునిన్= ఈ అలాయుధుడనే రాక్షసుడిని; మర్దింపుము= పిండి పిండి చేసి సంహరించుము; అనన్= అని చెప్పిన వెంటనే; ఆతండు= ఆ ఘటోత్కచుడు; ఆతనిన్= ఆ కర్ణుడిని; విడిచి= వదలివేసి; అతనికిన్= ఆ అలాయుధుడితో; కవిసెన్= తలపడ్డాడు.

**తాత్పర్యం:** అది చూచి శ్రీకృష్ణుడు కర్ణుడితో యుద్ధం చేస్తున్న ఘటోత్కచుడిని పిలిచి, 'ఓ ఘటోత్కచా! అలాయుధుడితో నీవే పోరాడి అతడిని చంపు. భీముడు చేసిన యుద్ధం చాలు. ఇక వద్దు' అని చెప్పిన వెంటనే కర్ణుడిని వదలివేసి, ఘటోత్కచుడు అలాయుధుడితో తలపడ్డాడు.

**క. నకులాదులు నా దైత్య । ప్రకరంబుఁ దెరల్చి రేఁచి రాధేయుఁడు నే**
**లకుఁ గోలకుఁ దెచ్చెను సో । మకుల శిఖండ్యాది రథిక మర్దనుఁ డగుచున్. 219**

**ప్రతిపదార్థం:** నకుల+ఆదులున్= నకులుడు మొదలైనవారు; ఆ దైత్యప్రకరంబున్= ఆ రాక్షససమూహాన్ని; తెరల్చిరి= పారి పోయేటట్లు చేశారు; (ఇక) రాధేయుఁడు= కర్ణుడు; ఏఁచి= విజృంభించి; శిఖండి+ఆది రథిక మర్దనుఁడు+అగుచున్= శిఖండి మొదలైన రథికులను నుగ్గు చేస్తూ (మరియు); సోమకులన్= సోమకవీరులను (పాంచాల దేశవీరులను); నేలకున్ కోలకున్+తెచ్చెను= బాణాలకు గురిచేశాడు- అనగా బాణాలతో కొట్టాడు.

**తాత్పర్యం:** నకులుడు మొదలైన వారు రాక్షసవర్గంపై పడి తరిమివేశారు. కర్ణుడు విజృంభించి, సోమకుడు శిఖండి మొదలైన రథికులను బాధించాడు, పాంచాల వీరులలో కొందరిని నేలగూల్చాడు. మరి కొందరిని బాణాల ధాటికి ఆగలేకుండా చేశాడు.

**వ. ఆ విక్రమంబు వీక్షించి సన్నద్ధుం డయి సమీరనందనుం డా సూతనందనుం దలపడినం దోడ్పడి నకులాదులు నానాస్త్రంబులు గురిసిరి; కిరీటి పాంచాలురం గూర్చికొని కుంభసంభవ సైన్యంబుఁ బొదివి సమయించుచుండె; నలాయుధుండు ఘటోత్కచునిం బరిఘ పాతంబున సోలంజేసిన, నాలోనన తెలిసి యతండు. 220**

**ప్రతిపదార్థం:** ఆ విక్రమంబున్= ఆ కర్ణుడి పరాక్రమాన్ని; వీక్షించి= చూచి; సన్నద్ధుండు+అయి= యుద్ధానికి ఉద్యమించినవాడయి; సమీరనందనుండు= వాయుపుత్రుడు భీముడు; ఆ సూతనందనున్= ఆ కర్ణుడిని; తలపడినన్= ఎదుర్కొనగా; తోడ్పడి=

సహాయంగా వచ్చి; నకుల+ఆదులు= నకులుడు మొదలైనవారు; నానా+అస్త్రంబులు= అనేకాలైన అస్త్రాలను; కురిసిరి= కురిపించారు; కిరీటి= అర్జునుడు; పాంచాలురన్= ఆ పాంచాలవీరులను; కూర్చికొని= వెంటపెట్టుకొని; కుంభసంభవ సైన్యంబున్= ద్రోణాచార్యుడి సైన్యాన్ని; పొదివి= ఎదుర్కొని; సమయించుచున్+ఉండెన్= సంహరిస్తూ ఉన్నాడు; అలాయుధుండు= అలాయుధుడు; ఘటోత్కచునిన్= ఘటోత్కచుడిని; పరిఘ పాతనంబునన్= పరిఘాయుధం (ముండ్లగదతో పడవేయటంతో) దెబ్బతో; సోలన్+చేసినన్= మూర్ఛపోయే విధంగా చేయగా; ఆలోనన్+అ= అంతలోనే; తెలిసి= తెలివిని పొంది; అతండు= ఆ ఘటోత్కచుడు.

**తాత్పర్యం:** ఆ కర్ణుడి విజృంభణాన్ని చూచి భీముడు యుద్ధానికి సిద్ధమయి కర్ణుడిని ఢీకొన్నాడు. నకులుడు మొదలైనవారు ఆ భీముడికి తోడుగా వెళ్ళి బాణాలు కురిపించారు. అక్కడ అర్జునుడు పాంచాలవీరులతో కూడి ద్రోణుడిసైన్యాన్ని ఎదుర్కొని సంహరిస్తూ ఉన్నాడు. మరోవైపు అలాయుధుడు ఘటోత్కచుడిపై పరిఘాన్ని విసిరాడు. దానితో ఘటోత్కచుడు మూర్ఛిల్లి, వెనువెంటనే మేల్కొని - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. గదఁద్రిప్పి బెట్టు వైచిన । నది రథ్యంబులను సూతునరదము సిడముం**
**జిదురుపలు సేయ నతఁ డం । బుదమై గర్జిల్లె నభము బూరటిలంగన్. 221**

**ప్రతిపదార్థం:** గదన్= గదను; త్రిప్పి= చుట్టూ తిప్పి; బెట్టు= గట్టిగా; వైచినన్= వేయగా; అది= ఆ గద; రథ్యంబులను= అశ్వాలను; సూతున్= సారథిని; అరదమున్= రథాన్ని; సిడమున్= ధ్వజాన్ని; చిదురుపలు+చేయన్= తుమురు చేయగా; అతఁడు= ఆ అలాయుధుడు; అంబుదము+ఐ= మేఘంగా మారి; నభము= ఆకాశం; బూరటిలంగన్= నిండుగా; గర్జిల్లెన్= గర్జించాడు.

**తాత్పర్యం:** గద గిరగిరా తిప్పి, గట్టిగా ఆ అలాయుధుడిపై విసరగా అది అతడి సారథిని, అశ్వాలను, రథాన్ని, ధ్వజాన్ని చూర్ణం చేయగా, వాడు మేఘంగా మారి ఆకాశం పిక్కటిల్లే విధంగా గర్జించాడు.

**వ. ఇట్లు మాయ గైకొని నెత్తురు సోనతోఁ బిడుగులు వడంజేయ, వాయు తనయ తనయుండును దివి కెగసి తనమాయ నమ్మాయ మాయించినఁ, గ్రమ్మఱ బకభ్రాత భూచారి యయినఁ, దోడన హైడింబుండును డిగ్గిన నయ్యిరువురకుం దరువుల పాషాణంబుల భీషణం బగు రణంబు వాలి సుగ్రీవ సమరసమంబై చెల్లె; మగుడ వివిధాయుధంబుల నా యోధు లాయోధనంబు సేసి; రట్టియెడఁ గరవాలంబు గొని మదంబునఁ గవిసినచో ఘటోత్కచుం డలాయుధుం దలవట్టి బలువిడి నిలంబడ దిగిచి మెడ దెగవ్రేసి యార్చినం బేర్చిన పాండవ బలంబులఁ దూర్యనినదంబులు సింహనాదంబులుం జెలంగె; నప్పుడు. 222**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మాయ+కైకొని= రాక్షసమాయ గ్రహించి అనగా ప్రయోగించి; నెత్తురు సోనతోన్= రక్తవర్షంతోపాటు; పిడుగులు= పిడుగులు; పడన్+చేయన్= పడేటట్లు చేయగా; వాయుతనయ తనయుండును= వాయుదేవుడి కుమారుడి (వాయుతనయుడు అనగా భీముడు అతనితనయుడు (కుమారుడు) ఘటోత్కచుడు; దివికిన్= ఆకాశానికి; ఎగసి= ఎగిరివెళ్ళి; తన మాయన్= తన రాక్షస మాయతో; ఆ+మాయన్= ఆ అలాయుధుడి (రాక్షస) మాయను; మాయించినన్= మాయం చేయగా - అనగా నశింపజేయగా; క్రమ్మఱన్= మరల (అవ్యయం); బక భ్రాత= బకాసురుడి సోదరుడైన ఆ అలాయుధుడు; భూచారి+అయినన్= భూమిపై సంచరించే వాడు కాగా - అనగా ఆకాశం వీడి భూమియందుండి యుద్ధం చేయటానికి క్రిందికి దిగగా; హైడింబుండును= ఘటోత్కచుడు కూడ; డిగ్గినన్= (ఆకాశం నుండి భూమికి) దిగగా; ఆ+ఇరువురకున్= ఇద్దరికి; తరువులన్= చెట్లతో; పాషాణంబులన్= రాళ్ళతో; భీషణంబు+అగు= భయంకరమైన; రణంబు= యుద్ధం; వాలి సుగ్రీవసమర

సమంబు+ఐ= వాలి సుగ్రీవుల పోరాటంతో సమానమై; చెల్లెన్= సాగింది; మగుడన్= మళ్ళీ; వివిధ+ఆయుధంబులన్= అనేక విధాలైన ఆయుధాలతో; ఆ యోధులు= ఆ ఇద్దరు రాక్షసవీరులు; ఆయోధనంబు+చేసిరి= యుద్ధం చేశారు; అట్టి ఎడన్= ఆ సమయంలో; కరవాలంబు= ఖడ్గాన్ని; కొని= తీసికొని; మదంబునన్= గర్వంతో; కవిసినచోన్= ఎదుర్కొనేటప్పుడు (అలాయుధుడు తన రాక్షసమాయ నశించగా కత్తి చేతబట్టి ఘటోత్కచుడితో తలపడటానికి రాగా ఆ సమయాన); ఘటోత్కచుండు= ఘటోత్కచుడు; అలాయుధున్= అలాయుధుడిని; తల+పట్టి= తల పట్టుకొని; బలువిడిన్= పరాక్రమంతో; ఇలన్= భూమిపై; తిగిచి= లాగి; మెడన్= కంఠాన్ని; తెగవ్రేసి= తెగగొట్టి; ఆర్చినన్= సింహనాదం చేయగా; పేర్చిన పాండవ బలంబులన్= ఉప్పొంగిన పాండవుల సైన్యాలలో; తూర్యనినదంబులు= యుద్ధవాద్యాల ధ్వనులు; సింహనాదంబులున్= సింహనాదాలు; చెలఁగెన్= ధ్వనించాయి; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా అలాయుధుడు మాయామేఘంగా మారి, నెత్తురుతోపాటు పిడుగులు పడేటట్లుచేయగా, వర్షించాడు. వెంటనే ఘటోత్కచుడు కూడా ఆకాశానికెగిరి తానుకూడా రాక్షసమాయను ప్రయోగించి, ఆ అలాయుధుడి మాయను మటుమాయం చేశాడు. అప్పుడు అలాయుధుడు భూమిపైకి దిగి యుద్ధానికి ప్రత్యక్షం కాగానే ఘటోత్కచుడు కూడా వెంటనే భూమికి దిగివచ్చి, అతడితో యుద్ధానికి తలపడ్డాడు. ఆ యుద్ధం చెట్లతో రాళ్ళతో పూర్వపు వాలిసుగ్రీవుల యుద్ధం వలె భయంకరంగా సాగింది. మళ్ళీ వారిద్దరూ వివిధాయుధాలతో యుద్ధం సాగించారు. ఆ సమయంలో అలాయుధుడు ఖడ్గాన్ని గ్రహించి ఘటోత్కచుడి మీదికిరాగా, ఘటోత్కచుడు అతడి శిరస్సును పట్టుకొని క్రింద పడవేసి, కంఠాన్ని నరికివేశాడు. విజయగర్వంతో సింహనాదం చేశాడు. అది చూచి ఉప్పొంగిన పాండవసైన్యాల్లో వాద్యాలధ్వనులు సింహనాదాలు చెలరేగాయి. అప్పుడు.

**క. పటుగతిఁ జని కురుపతిముం । దట వైచెం జేత నున్న తల రౌద్రం బు**
**ద్భటముగ ఘటోత్కచుం డు । త్కట శోకము వొంది రతఁడుఁ దత్సైనికులున్. 223**

**ప్రతిపదార్థం:** ఘటోత్కచుండు= ఘటోత్కచుడు; రౌద్రంబు= క్రోధం; ఉద్భటము+కన్= అధికం కాగా; పటుగతిన్= శక్తిగల నడకతో - అనగా వేగంగా; చని= వెళ్ళి; చేతన్+ఉన్న తలన్= చేతిలో ఉన్న తలను; కురుపతి ముందటన్= కురురాజైన దుర్యోధనుడి ఎదుట; వైచెన్= పడవేశాడు; అతఁడు= ఆ దుర్యోధనుడు; తద్+సైనికులున్= ఆ దుర్యోధనుడి సేనలో ఉన్న వీరులు కూడ; ఉత్కటశోకము= గొప్ప దుఃఖాన్ని; పొందిరి= పొందారు.

**తాత్పర్యం:** ఘటోత్కచుడు క్రోధాతిశయంతో దుర్యోధనుడివైపు వేగంగా వెళ్ళి, తన చేతిలోనున్న అలాయుధుడి తలను ఆ దుర్యోధనుడి ముందర పడవేశాడు. అది చూచి దుర్యోధనుడు, అతని సైనికవీరులు కూడా మిక్కిలి దుఃఖాన్ని పొందారు.

**క. మును బకుననుజుని వలనం । దనతమ్ములుఁ దాను బ్రదుకఁ దలఁచి యతఁడు స**
**చ్చిన విభుఁడు భీమసేను ప్ర । తిన పారం బెయ్యు నని మదిం దలఁచె నృపా! 224**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; విభుఁడు= దుర్యోధనుడు; బకు అనుజునివలనన్= బకాసురుడి తమ్ముడైన అలాయుధుడి వలన; తన తమ్ములున్= తన తమ్ములైన దుశ్శాసనాదులు; తానున్= తాను; బ్రదుకన్= జీవించటానికి (తుమున్నర్థకం); మును= మొదట; తలఁచెన్= అనుకొన్నాడు (కాని); అతఁడు= ఆ అలాయుధుడు; చచ్చినన్= మరణించగానే; భీమసేను ప్రతిన= భీముడి ప్రతిజ్ఞ అనగా 'తాను దుర్యోధనాదులను సంహరిస్తా' నని భీముడు చేసిన ప్రతిజ్ఞ; పారంబు= కడను; ఎయ్యున్+అని= చేరుతుందని; మదిన్= మనస్సులో; తలఁచెన్= భావించాడు (భీముడి ప్రతిజ్ఞ నెరవేరుతుందనీ, ఇక తమకు జీవితాశ లేదనీ దుర్యోధనుడనుకొన్నాడు.)

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇంతకుముందు బకాసురుడి తమ్ముడు అలాయుధుడి వలన తానూ, తన తమ్ములు నిశ్చింతగా బ్రదుకవచ్చు నని అనుకొన్న దుర్యోధనుడు-వాడు చావగానే ఇక భీముడు చేసిన ప్రతిజ్ఞ నెరవేరుతుందని తన మనస్సులో భావించాడు.

**వ. అట్టియెడఁ గర్ణుండు కౌంతేయ సైన్య సంతానంబు నానాస్త్ర ఘట్టనంబుల విఘటితంబు సేయుచున్న నవ్వాయునందననందనుండు నిజస్యందనం బెక్కి యుక్కు మెఱయం దలపడియె; నయ్యిద్దఱుం బెద్దసేపు శరపరంపరల సరి యై సంగరంబు సేసిరి; పదంపడి రాధేయుండు రథ్యంబులం జంపిన రథ సమేతంబుగా నా ఘటోత్కచుం డదృశ్యుండైన నీ సైనికులు దల్లడిల్లి 'యెక్కడ వచ్చి యెవ్వరి నేమి సేయునో' యనుచు మేనులు వడంక నలుగడలుం గనుంగొనుచుండిరి; హైడింబుండును మహాంబుదంబు చందంబునఁ జదలం దోఁచి మెఱుముచు నుఱుముచు బాణ కృపాణ ముసల ముద్గర కుంత క్షురికాది హేతివ్రాతంబులుం బరుషోపల పటలంబులుం దొరఁగింపం దోడి దానవులు మొగిళ్ళయి యొక్క మొగి నట్లు చేయ నా సూతసుతునకుం బ్రతివిధాన మాచరింప నలవిగామిఁ గౌరవ బలంబున రథంబులు గజంబులుఁ దురగంబులుఁ ద్రెళ్ళను గూలను డొల్లను దొడంగె; నొండు గడకుం గడంగు తలంపులు దక్కి తలలుఁ గప్పికొని యుండి యోధులు భగ్నాపరభాగులై పడంజొచ్చి; రప్పు డిద్దెస వా రెల్ల నాఖండల ప్రముఖ బృందారకులు పాండునందనులకుం దోడ్పడి యిట్లు సేసెద రను వగ వెగడంది కలంగంబడి; రయ్యవసరంబున.225**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; కర్ణుండు; కౌంతేయ సైన్య సంతానంబు= పాండవుల సేనాసమూహాన్ని; నానా+అస్త్రఘట్టనంబులన్= అనేకములైన అస్త్రాల ప్రయోగాలతో; విఘటితంబు= విచ్ఛిన్నం; చేయుచున్నన్= చేస్తూ ఉండగా; ఆ+వాయునందన నందనుండు= ఆ వాయునందనుడైన భీముడి నందనుడు ఘటోత్కచుడు; నిజస్యందనంబు= తన రథాన్ని; ఎక్కి; ఉక్కు= ప్రతాపం; మెఱయన్= మెరుస్తూ ఉండగా; తలపడియెన్= (కర్ణుడిని) ఎదుర్కొన్నాడు; ఆ+ఇద్దఱున్= ఆ కర్ణ ఘటోత్కచులిద్దరు; పెద్దసేపు= చాలాసేపు; శరపరంపరలన్= బాణాల వరుసలయందు; సరియై= సమానులై (వరుసబాణాలు ప్రయోగించటంలో యుద్ధమందు సమానులై); సంగరంబు= యుద్ధం; చేసిరి= చేశారు; పదంపడి= పిమ్మట; రాధేయుండు= కర్ణుడు; రథ్యంబులన్= గుర్రాలను; చంపినన్= చంపగా; రథసమేతంబుగాన్= రథంతో కూడ; ఆ ఘటోత్కచుండు= ఆ ఘటోత్కచుడు; అదృశ్యంబు+ఐనన్= మాయం కాగా; నీ సైనికులు= ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ (కౌరవ) సైనికులు; తల్లడిల్లి= భయపడి; ఎక్కడన్= ఏవైపు; వచ్చి= ప్రత్యక్షమై వచ్చి; ఎవ్వరిన్= ఏ వ్యక్తిని; ఏమి+చేయునో= ఏం చేస్తాడో; అనుచున్= అంటూ; మేనులు= శరీరాలు; వడంకన్= వణకగా; నలు+కడలున్= నాలుగు దిక్కుల; కనుంగొనుచుండిరి= చూస్తూ ఉన్నారు; హైడింబుండును= హిడింబానందనుడు ఘటోత్కచుడును; మహా+అంబుదంబు చందంబునన్= గొప్ప మేఘం వలె; చదలన్= ఆకాశంలో; తోఁచి= కనిపించి; మెఱుముచున్= మెరుస్తూ; ఉఱుముచున్= గర్జిస్తూ; బాణ కృపాణ ముసల ముద్గర కుంత క్షురికా+ఆది హేతివ్రాతంబులున్= బాణాలు, ఖడ్గాలు, రోకళ్ళు, ముద్గరాలు (ముండ్లవంటి రోకళ్ళు); ఈటెలు, చురకత్తులు మొదలైన ఆయుధాల సమూహాలును; పరుష+ఉపల పటలంబులున్= కఠినములైన రాళ్ళ రాసులను; తొరఁగింపన్= దొర్లిస్తూ ఉంటే (ఆకాశాన్నుండి క్రుమ్మరిస్తూ ఉంటే); తోడిదానవులు= వెంటనున్న రాక్షసులు కూడ; మొగిళ్ళు+అయి= మేఘాలుగా మారి; ఒక్కమొగిన్= ఒక్క పెట్టున; అట్లు చేయన్= అదేవిధంగా చేస్తూ ఉండగా (ఆయుధవర్షాలను కురిపిస్తూ ఉండగా); ఆ సూతసుతునకున్= ఆ కర్ణుడికి; ప్రతివిధానము= దానికి విరుగుడు; ఆచరింపన్= చేయటానికి; అలవి+కామిన్= సాధ్యం కాకపోవటంచేత; కౌరవ బలంబునన్= కౌరవ సైన్యంలో; రథంబులు= రథాలు; త్రెళ్ళను+తొడంగెన్= కూలటం ప్రారంభించాయి; గజంబులు= ఏనుగులు; కూలను తొడంగెన్= క్రిందపడ ప్రారంభించాయి; తురంగంబులు= గుర్రాలు; డొల్లను+తొడంగెన్=

క్రిందపడటం ప్రారంభించాయి (ఇక్కడ తొడంగెన్ అను క్రియ మూడు తుమర్థ క్రియలతో అన్వయిస్తూ ఉన్నది); యోధులు= సైనికవీరులు; ఒండు+కడకున్= రెండోవైపునకు; కడంగు తలంపులు= తిరిగి వెళ్ళిపోయే కోరికలను; తక్కి= విడిచి; తలలు= తలలు; కప్పి కొని+ఉండి= ఆచ్ఛాదించుకొని; యోధులు= సైనికవీరులు; భగ్న+అపరభాగులు+ఐ= విరిగిన వెన్నుభాగాలు కలవారై; పడన్+చొచ్చిరి= క్రింద పడుతూ ఉన్నారు; అప్పుడు= ఆ సమయంలో; ఈ+దెసవారు+ఎల్లన్= ఈ కౌరవులవైపు వారందరు; ఆఖండల ప్రముఖ బృందారకులు= ఇంద్రుడు మొదలైన దేవతలు; పాండునందనులకున్= పాండవులకు; తోడ్పడి= సహాయపడి; ఇట్లు= ఈ విధంగా; చేసెదరు= చేస్తారు; అను= అనే; వగన్= చింతతో; వెగడు+అంది= భయపడి; కలంగన్+పడిరి= కలత చెందారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సమయంలో కర్ణుడు, పాండవులసైన్యాన్ని వివిధములైన అస్త్రాలు ప్రయోగించి, విచ్ఛిన్నం చేస్తూఉండగా, ఘటోత్కచుడు తన రథంపై కూర్చొని ప్రతాపాతిశయంతో కర్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు. ఆ ఇద్దరూ చాలాసేపు ఎక్కువ తక్కువలు లేక సమానంగా బాణాల పరంపరలను కురిపిస్తూ యుద్ధం చేశారు. తరువాత కర్ణుడు ఘటోత్కచుడి రథాశ్వాలను సంహరించాడు. వెంటనే ఘటోత్కచుడు తన రథంతో సహా కనపడకుండా మాయమయ్యాడు. అప్పుడు కౌరవసైనికులు 'ఎక్కడ ప్రత్యక్షమై ఎవ్వరిని ఏం చేస్తాడో?' అని భయపడి వణకిపోతూ నలుదిక్కులనూ బెదురుచూపులతో చూస్తూ ఉన్నారు. ఆ ఘటోత్కచుడు ఆకాశాన పెద్ద మేఘంగా సాక్షాత్కరించి, ఉరుముతూ మెరుస్తూ బాణాలు, ఖడ్గాలు, రోకళ్ళు, ఈటెలు, చురకత్తులు, ముళ్ళగుదియలు - ఇంకా ఎన్నో ఆయుధాలను, మరియు రాళ్ళను కురిపిస్తూ ఉంటే, ఇక ఆ ఘటోత్కచుడికి తోడుగా వచ్చిన రాక్షసులు కూడ మేఘాలుగా మారి, వారుకూడ అట్లేచేయగా కర్ణుడు ఆ ఘోరకర్మను ఆపలేకపోయాడు. కౌరవసైన్యంలో రథాలు చూర్ణమయ్యాయి. గజాలు క్రుంగిపోయాయి. అశ్వాలు గాయపడ్డాయి. ఇక సైనికులు తలలు పగిలి వెన్నుభాగం విరిగిపోయి పడిపోతూ ఉన్నారు. ఇది చూచి, కౌరవసైనికులు 'ఇది సామాన్య యుద్ధంకాదు. పాండవులకు సహాయం చేయటానికి ఇంద్రాది దేవతలు వచ్చి ఈ యుద్ధం చేస్తున్నారు. లేకుంటే ఇంత భయానక పరిస్థితి కొనసాగుతుందా?' - అని భావించి, భయపడిపోయి, ఆత్మరక్షణకై పరుగుతీశారు. ఆ సమయంలో.

**శా.** **ధీరత్వం బొకఁడుం సహాయముగ రాధేయుండు దివ్యాస్త్ర సం**
**చారోల్లాసము సూపెఁ జూపుటయు రక్షస్సంచయానేక మా**
**యా రూపావళి భాస్కరాంశుల నదృశ్యాకారమై పోవు నీ**
**హారంబుం దలఁపించుచున్ విరిసె నే నాశ్చర్యముం బొందితిన్.** **226**

**ప్రతిపదార్థం:** ధీరత్వంబు+ఒకఁడున్= ధైర్యమొక్కటే; సహాయము+కన్= సహాయం కాగా; రాధేయుండు= కర్ణుడు; దివ్య+అస్త్ర సంచార+ఉల్లాసము= దివ్యాస్త్రాలను ప్రయోగించటంలో ఉత్సాహాన్ని; చూపెన్= చూపాడు; చూపుటయున్= చూపిన వెంటనే; రక్షస్సంచయ+అనేక మాయా రూపావళి= ఆ రాక్షసుల గుంపుయొక్క మాయికమైన రూపాల సమూహం; భాస్కర+అంశులన్= సూర్యుడి కిరణాలతో; అదృశ్య+ఆకారము+ఐపోవు= కానరాని ఆకారం గలదై పోయేటటువంటి; నీహారంబున్= మంచును; తలఁపించుచున్= స్మరణకు తెస్తూ; విరిసెన్= విచ్చుకపోయింది అనగా విడిపోయింది (మాయాజాలం నశించిపోయిందని భావం);

ఏన్= ఓ ధృతరాష్ట్ర మహారాజా! నేను (సంజయుడు); ఆశ్చర్యమున్= ఆశ్చర్యాన్ని; పొందితిన్= పొందాను.

**తాత్పర్యం:** కర్ణుడు ధైర్యమాత్ర సహాయుడై ఉత్సాహంతో దివ్యాస్త్రాలు ప్రయోగించగానే ఆ రాక్షస సమూహం యొక్క మాయారూపజాలం, సూర్యకిరణాలకు అదృశ్యమైపోయే మంచువలె వీడిపోయింది. అది చూచి - ఓ ధృతరాష్ట్ర మహారాజా! నేను ఆశ్చర్యపడ్డాను.

**చ. మగుడఁగ దానవప్రవరు మాయ సమంచిత దివ్యబాణ శ**
**క్తి గుదియఁ జేసి తొంటితన తీవ్రత గైకొని నీదుసైన్యముల్**
**బెగడువడన్ మదించి యతి భీమ సముద్ధతి నింక నెమ్మెయిం**
**దెగఁ డను భీతి యోధులమదిన్ జనియింపఁగ నాక్రమించినన్. 227**

**ప్రతిపదార్థం:** మగుడఁగన్= మళ్ళీ; దానవ ప్రవరు మాయ= రాక్షసశ్రేష్ఠుడైన ఘటోత్కచుడి మాయ; సమంచిత దివ్య బాణ శక్తిన్= (అందరిచేత) పూజించబడే దివ్యాస్త్రశక్తిని; కుదియన్+చేసి= అణచివేసి; తొంటి తన తీవ్రతన్= మొదట్లో ఉన్న తన వేగాన్ని; కైకొని= గ్రహించి; నీదు సైన్యముల్= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నీ సైన్యాలు; బెగడు+పడన్= భయపడే విధంగా; మదించి= గర్వించి; అతిభీమసముద్ధతిన్= మిక్కిలి భయంకరమైన విజృంభణంతో; ఇంకన్= మరి; ఏ+మెయిన్= ఏ విధంగా కూడ; తెగఁడు+అను= (ఘటోత్కచుడు) మరణించడు అనే; భీతి= భయం; యోధుల మదిన్= యుద్ధం చేసే సైనికవీరుల మనస్సులో; జనియింపఁగన్= పుట్టే విధంగా; ఆక్రమించఁగన్= ఆవరిస్తూ ఉండగా.

**తాత్పర్యం:** మళ్ళీ ఆ ఘటోత్కచుడి మాయ, కర్ణుడి దివ్యాస్త్రశక్తిని అణచివేసి ఇదివరకటి తీవ్రతను పొంది నీ సైన్యాలు భయపడేవిధంగా 'ఇక ఈ ఘటోత్కచుడు ఏ విధంగా కూడా మరణించటం జరగని పని' అని మనస్సులో అనిపించేవిధంగా అంతటా ఆవరిస్తూ ఉండగా.

**వ. వార లందఱు సూతనందనుం జూచి యాతండు గలంగమికి నచ్చెరువందుచు నగ్గించి యతని నుద్దేశించి, 'యన్నిశాచరుం డిందఱ సమయింపకుండం గాచికొనుము; నీవును బ్రదుకు; మాఖండలుండు గవచకుండలంబులు గొనునప్పుడు నీకు నొసంగిన మహాశక్తి యింక నెన్నఁటికి? భీమార్జునులు ని న్నేమి సేసెద? రిప్పుడు బ్రదికిన మఱి చూచికొంద; మప్పరమ సాధనంబు వీనిమీఁదం బ్రయోగింపు' మనునెడ నారక్కసుం డామేటి మగని గీటడంచువాఁడై యాటోపంబునం గదిసి తదీయ రథ్యంబులఁ బటు గదా పాతంబునం బొలియించె; న ట్లవ్వీరుండు విరథుం డగుటయుం దఱిమి యద్దనుజుండు గదాంతర పాతాభితాడితుం జేసిన నోసరిలి యతం డాసైనికుల యాలాపంబుల నాలించి తనకుఁ జావు దప్పించుకొన నది దప్ప నొండుపాయంబు లేమిం జేసి. 228**

**ప్రతిపదార్థం:** వారలు+అందఱు= ఆ సైన్యంలోని వీరులందరు; సూతనందనున్+చూచి= కర్ణుడిని చూచి; ఆతండు= ఆ కర్ణుడు; కలంగమికిన్= కలత చెందకపోవటానికి; అచ్చెరువు= ఆశ్చర్యం; అందుచున్= పొందుతూ; అగ్గించి= పొగడి; అతనిన్= ఆ కర్ణుడిని; ఉద్దేశించి= గురించి (ఇట్లా అన్నారు - ఓ కర్ణా!); ఈ+నిశాచరుండు= ఈ ఘటోత్కచుడనే రాక్షసుడు; ఇందఱన్= ఇంతమందిని; సమయింపక+ఉండన్= చంపకుండా ఉండే విధంగా; కాచికొనుము= రక్షించుకొమ్ము; నీవును= ఓ కర్ణా!

- నీవు కూడా; బ్రదుకుము= జీవించుము (రాబోయే మృత్యువు నుండి నిన్ను నీవు రక్షించుకొమ్ము) (దానికి ఉపాయం ఏముంది?); ఆఖండలుండు= ఇంద్రుడు (బ్రాహ్మణరూపంలో యాచకుడై వచ్చి నిన్ను యాచించి); కవచ కుండలంబులు= పుట్టుకతో వచ్చిన నీ కవచాన్ని చెవుల కుండలాలను; కొను అప్పుడు= నీ నుండి తీసికొన్నప్పుడు; నీకున్= నీకు (ఆ కవచకుండలాలకు బదులుగా); ఒసంగిన మహాశక్తి= ఇచ్చినట్టి గొప్ప శక్తి అనే ఆయుధం; ఇంకన్= మరి; ఎన్నఁటికిన్?= ఎప్పటికి?; (ఆ శక్తిని మరేదో తగిన సమయానికని దాచిపెట్టావు కాని ఇక సమయ నిరీక్షణం తగదు - ఇంతకంటె తగిన సమయం మరేది? (ఎందుకంటే?); భీమ+అర్జునులు= భీముడు, అర్జునుడు ఈ ఇద్దరు; నిన్నున్+ఏమి+చేసెదరు?= నిన్నేం చేయగలరు?; ఇప్పుడు= ఈ భయంకరమైన ఆపద ముంచుక వచ్చే సమయంలో; బ్రదికినన్= చావు తప్పించుకొని జీవించి ఉన్నట్లయితే; మరి= తరువాత; చూచికొందము= (ఆ భీమార్జునుల విషయం) చూద్దాము (కావున); ఆ+పరమసాధనంబు= ఆ శ్రేష్ఠమైన ఆయుధాన్ని; వీనిమీఁదన్= ఈ ఘటోత్కచుడిపై; ప్రయోగింపుము= ప్రయోగించి వేయుము; అను+ఎడన్= అని అంటూ ఉండే సమయంలో; ఆ రక్కసుండు= ఆ రాక్షసుడు (ఘటోత్కచుడు); ఆ మేటిమగనిన్= ఆ శ్రేష్ఠవీరుడైన కర్ణుడిని; గీటడంచువాఁడై= సంహరించేవాడై; ఆటోపంబునన్= ఆడంబరంతో; కదిసి= సమీపించి; తదీయ రథ్యంబులన్= ఆ కర్ణుడి రథాశ్వాలను; పటుగదాపాతంబునన్= దృఢమైన గదను పడవేయటంచేత; పొలియించెన్= సంహరించాడు; అట్లు= ఆ విధంగా; ఆ+వీరుండు= ఆ పరాక్రమశాలి అయిన కర్ణుడు; విరథుండు= రథంలేనివాడు; అగుటయున్= అయిన వెంటనే; తఱిమి= వేగిరపడి అనగా వేగంగా; గదాంతర పాత+అభితాడితున్= మరియొక గద ప్రయోగించటం చేత కొట్టబడిన వాడినిగా; చేసినన్= చేయగా; ఓసరిలి= పక్కకు తొలగిపోయి; అతండు= ఆ కర్ణుడు; ఆ సైనికుల+ఆలాపంబులన్= ఆ సైనికవీరుల సంభాషణలను; ఆలించి= విని; తనకున్= తనకు; చావున్= మరణాన్ని; తప్పించుకొనన్= తప్పించుకొనటానికి; అది= ఆ ఇంద్రుడిచ్చిన శక్తిని ప్రయోగించటం; తప్పన్= తప్పితే; ఒండు+ఉపాయంబు= వేరేమార్గం; లేమిన్+చేసి= లేకపోవటం వలన.

**తాత్పర్యం:** సైనికవీరులందరు కర్ణుడు ఏ మాత్రం కలత చెందకుండా ఉండటం చూచి ఆశ్చర్యపడుతూ అతడిని పొగిడి, 'ఈ రాక్షసుడు అందరిని సంహరించకుండా కాపాడుము. నిన్ను నీవు కాపాడుకొనుము. ఇంద్రుడు కవచకుండలాలు నీ నుండి తీసికొనేటప్పుడు నీ కిచ్చిన మహాశక్తి వినియోగం ఇంకెప్పటికి? భీమార్జునులు నిన్నేమిచేయగలరు? ఇప్పుడు మనం బ్రతికితే, తరువాతి సంగతి ఆలోచించుకొందాము. ఆ మహాయుధాన్ని వీడిమీద ప్రయోగింపుము' అని అంటూ ఉన్న సమయంలో ఆ రాక్షసుడు మేటివీరుడైన కర్ణుని సంహరించాలని, గర్వాతిశయంతో సమీపించి, అతడి రథాశ్వాలను, బలమైన గదనువేసి చంపాడు. ఆ విధంగా విరథుడైన కర్ణుడిని తరిమి వెంటనే వేరొక గదతో కొట్టగా, కర్ణుడు ప్రక్కకు తొలగి, ఆ సైనికుల మాటలు విని, తాను చావు తప్పించుకొనటానికి అంతకంటె వేరు మార్గంలేనందువల్ల.

కర్ణుఁ డింద్రదత్తం బైన శక్తిచేత ఘటోత్కచునిం జంపుట (సం. 7-154-5)

**ఉ.** **వైరివినాశనక్రియకు వాసవుఁ డిచ్చిన డాఁచియున్న యా**
**ఘోరపుశక్తి నాలుకలు గ్రోయ మెఱుంగులు ప్రజ్వరిల్ల ఘుం**
**టారవ మభ్రవీథి నిగుడం దగఁ గేల నమర్చి పేర్చి య**
**వ్వైరికిఁ బూఁచినం దలఁకి వాఁడు మహోన్నతఘూర్ణితాకృతిన్.** **229**

**ప్రతిపదార్థం:** వైరి వినాశన క్రియకున్= శత్రువులను నశింపజేసే పనికి; వాసవుఁడు= ఇంద్రుడు; ఇచ్చిన= ఇచ్చినటువంటిదగు (మరియు); డాఁచిఉన్న= దాచి ఉంచినది (తనకు ప్రధాన శత్రువు అర్జునుడు కావున అతడిపై ప్రయోగించటానికి ఇంతవరకు ఎవరిపై ప్రయోగించకుండా రక్షించబడుతూ వచ్చిందని భావం); ఆ= అట్టి (ప్రయోగించిన వెంటనే వైఫల్యమనేది లేకుండా తప్పక శత్రుసంహారం చేసేదని తాత్పర్యం); ఘోరపుశక్తి= భయంకరమైన శక్తి ఆకారంలో ఉండే ఆయుధాన్ని - 'కేలనమర్చి' అనే మూడవపాదంలోని పదంతో అన్వయం; నాలుకలు= ఆ శక్తి నోళ్ళలోని నాలుకలు, క్రోయన్= చాస్తూ ఉండగా; మెఱుంగులు= తళతళకాంతులు; ప్రజ్వరిల్లన్= దీపించగా; (మరియు) ఘంటారావము= ఆ శక్తి నడుమునకు కట్టుకొన్న గంటల చప్పుడు; అభ్రవీథిన్= ఆకాశమార్గంలో; నిగుడన్= వ్యాపించగా; తగన్= తగినట్లుగా; కేలన్= చేతిలో; అమర్చి= ధరించి; పేర్చి= అతిశయించి; ఆ+వైరికిన్= ఆ ఘటోత్కచుడి పైకి; పూఁచినన్= పూనుకొనగా; తలఁకి= భయపడి; వాఁడు= ఆ ఘటోత్కచుడు; మహా+ఉన్నత ఘూర్ణిత+ఆకృతిన్= మిక్కిలి ఎత్తుగా పెరిగి ఉండి తిరుగుడు పడిన ఉన్న శరీరంతో.

**తాత్పర్యం:** శత్రువును నశింపచేయటానికి-ఇంద్రుడిచ్చినది, తాను దాచిఉంచినది అయిన ఆ మహాభయంకర శక్త్యాయుధం నాలుకలుకోస్తూ ఉండగా, కాంతులు ప్రజ్వరిల్లుతూ ఉండగా, ఘంటల మ్రోత ఆకాశం నిండగా చేతపట్టి, విజృంభించి, ఆ ఘటోత్కచుడి మీద ప్రయోగించటానికి పూనుకోగా, అతడు భయపడి మిక్కిలిగా తిరుగుడుపడుతున్న ఆకారంతో (తరువాతి పద్యంతో అన్వయము)

**తే.** **తెరలి పాఱఁగఁ దలఁచుచో దృష్టితోడఁ । గూడికొను ముష్టి మృత్యువు తోడఁబుట్టు**
**వనఁగఁ జాలు నద్దివ్యసాధనము వైచె । గగన తలమున భూతసంఘములు మ్రోయ.** **230**

**ప్రతిపదార్థం:** తెరలి= తొలగిపోయి; పాఱఁగన్= పారిపోవటానికి; తలఁచుచోన్= తలపెట్టుకొన్నట్లయితే; దృష్టితోడన్= చూపుతో; కూడికొను= కూడుకొని ఉన్నట్టి; ముష్టి= కుత్తుక నలిపే పిడికిలితో సమానమైనది (కావుననే); మృత్యువు తోడఁ బుట్టువు+అనఁగన్= మృత్యుదేవతకు సోదరి అనటానికి; చాలు+ఆ+దివ్యసాధనమున్= తగియున్నటువంటి ఆ (ఇంద్రుడిచ్చిన శక్తి అనే) దివ్యమైన ఆయుధాన్ని; గగనతలమునన్= ఆకాశభాగాన; భూతసంఘములు= విద్యాధరాది దేవయోని విశేషముల సమూహాలు; మ్రోయన్= హర్షధ్వానాలు చేస్తూ ఉండగా; వైచెన్= ప్రయోగించాడు (లేదా ఆకాశమందలి ప్రాణివర్గం ఆర్తనాదాలు చేయగా ప్రయోగించాడు అని కూడా అర్థం చెప్పవచ్చును కాని సంస్కృతమూలంలో శ్లో॥ సురాస్త్ర విసిస్మియుః' (సం. ద్రోణ. 175/99) అని ఉండుటను బట్టి దేవతలు యుద్ధ ప్రేక్షకులై వచ్చారనటం స్పష్టమగుటచేత 'భూత' శబ్దానికి దేవయోని విశేషమనే అర్థమే సరి అయినది.)

**తాత్పర్యం:** తప్పించుకొని పారిపోవాలని అనుకోగా చూపు ఉన్న నిండైన మృత్యువుయొక్క తోబుట్టువు అని అనదగిన ఆ దివ్యాయుధాన్ని, ఆకాశంలో దేవతాసమూహాలు హర్షధ్వానాలు చేస్తూ ఉండగా ప్రయోగించాడు.

**విశేషం:** 'శక్తి'ని 'దృష్టితోడఁ గూడికొను ముష్టి' అనే అభేదారోపం చేసి చెప్పటంచేత రూపకాలంకారం. 'మృత్యువు తోడఁ బుట్టు వనఁగఁజాలు' అని చెప్పటం మృత్యువు వంటిది అని చెప్పటం కొరకే - సోదరి శబ్దం సదృశార్థముననే పరిణమిస్తుంది. కాబట్టి ఇది 'ఆర్థీ - ఉపమాలంకారం - ఈ రెండు అలంకారములచేత 'ఇక ఈ ఆయుధానికి తిరుగు లేదు. ఘటోత్కచుడి వధ తప్పదు' అనే వస్తువు ధ్వనిస్తూ ఉన్నది. దీనిని అలంకారకృత వస్తుధ్వని అంటారు.

**వ.** **ఇ వ్విధంబున రాధేయుండు మహోగ్రంబుగా వైచిన.** **231**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; రాధేయుండు= కర్ణుడు; మహా+ఉగ్రంబుగాన్= మిక్కిలి భయంకరంగా; వైచినన్= (ఘటోత్కచుడిపై) వేయగా.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడు మహాభయంకరంగా ప్రయోగించగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మును మాయ మ్రింగి దనుజేం । ద్రుని యురము పగిల్చి కొనుచు దుర్ధరగతి వీఁ**
**పున వెడలి శక్తి యెగసెను । వినువీథికి నుడుగణంబు వెలుకం బాఱన్. 232**

**ప్రతిపదార్థం:** శక్తి= ఆ ఇంద్రదత్తశక్తి; మును= మొదట; మాయన్= రాక్షసమాయను; మ్రింగి= మ్రింగివేసి అనగా నశింపజేసి; దనుజ+ఇంద్రుని+ఉరము= ఆ రాక్షసశ్రేష్ఠుడైన ఘటోత్కచుడి వక్షాన్ని; పగిల్చి కొనుచున్= చీల్చుకుంటూ; దుర్భరగతిన్= భరింపరాని పోకడతో; వీఁపునన్= వీపునుండి; వెడలి= వెలుపలికి వచ్చి; ఉడుగణంబు= నక్షత్రపుంజం; వెలుకన్+పాఱన్= వెలవెలపోయే విధంగా (అంత అధికమైన కాంతిలో అని భావం); వినువీథికిన్= ఆకాశానికి; ఎగసెను= ఎగసిపోయింది.

**తాత్పర్యం:** ఆ శక్తి ముందుగా ఘటోత్కచుడి మాయను మ్రింగి, అతడి వక్షస్స్థలాన్ని భేదించి, వెన్నుభాగంనుండి వెలువడి, నక్షత్రాలు వెలవెలపోయేటట్లు ఆకాశంలోకి ఎగసిపోయింది.

**వ. అప్పుడు. 233**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. సోలుచు బోరగిలంబడి । నాలుక వెడలంగఁ బెట్టి నడుము గఱచుచున్**
**లాలలు గ్రమ్మఁగ రక్షః । పాలుఁడు వికృతాస్యుఁ డగుచుఁ బ్రాణము విడిచెన్. 234**

**ప్రతిపదార్థం:** రక్షఃపాలుఁడు= ఆ ఘటోత్కచుడు; సోలుచున్= సొమ్మసిల్లుతూ; బోరగిలన్+పడి= వెనుకభాగం మీదికి ఉండే విధంగా పడిపోయి (బోర్లపడి); నాలుక; వెడలంగన్= నోటి లోపలిభాగం నుండి వెడలి వచ్చి ఉన్న విధంగా (నోరు చాచుకొని); పెట్టి= పెట్టుకొని; లాలలు= చొల్లులు; నడుము= (ఆ ఘటోత్కచుడి) నడుమును; కఱచుచున్= అంటుకొంటూ; క్రమ్మంగన్= వ్యాపించగా; వికృత+ఆస్యుఁడు+అగుచున్= వికారంతో కూడిన ముఖం కలవాడై ఉంటూ; ప్రాణము= ప్రాణాన్ని; విడిచెన్= విడిచాడు.

**తాత్పర్యం:** ఆ ఘటోత్కచుడు తెలివితప్పి, సోలుతూ భూమిపై బోర్లపడి, నోటినుండి నాలుక బయటికి సాగి, నడుము అంటుకొనేటట్లు చొల్లుకారుస్తూ, ఉండగా వికృతమైన ముఖంతో మరణించాడు.

**వ. ఇట్లు ఘటోత్కచుండు వడిన మన సైన్యంబున శంఖభేరీ స్వన సహితంబులగు సింహనాదంబులు సెలంగె; నీ పుత్త్రుండు బంధుమిత్ర సమేతంబుగాఁ బ్రమోదంబు నొంది సూతనందనుం గౌఁగిలించి తనయరదం బెక్కించికొని యుల్లసిల్లె; ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 235**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఘటోత్కచుండు; పడినన్= పడిపోగా (మరణించగా); మనసైన్యంబునన్= ఓ ధృతరాష్ట్ర మహారాజా! మన సేనలో; శంఖభేరీ స్వన సహితంబులు+అగు= శంఖాల ధ్వనులతో భేరీల ధ్వనులతో కూడి ఉన్న; సింహనాదంబులు= వీరుల సింహనాదాలు; చెలంగెన్= వ్యాపించినవి; నీ పుత్త్రుండు= నీ కుమారుడు దుర్యోధనుడు; బంధుమిత్ర సమేతంబుగాన్= బంధుమిత్రుల సహితంగా; ప్రమోదంబున్= సంతోషాన్ని; ఒంది= పొంది; సూతనందనున్= కర్ణుడిని;

కౌఁగిలించి= ఆలింగనం చేసికొని; అరదంబు= తన రథాన్ని; ఎక్కించికొని; ఉల్లసిల్లెన్= ఉల్లాసాన్ని పొందాడు; అనినన్= అనగా; విని= వినినవాడై; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా ఘటోత్కచుడు మరణించగా మనసైన్యంలో శంఖభేరీ ధ్వనులు, సింహనాదాలు చెలరేగాయి. నీ కుమారుడు దుర్యోధనుడు బంధుమిత్రులతో కలిసి ఎంతో ఆనందించి కర్ణుని కౌగిలించుకొని తన రథంపై అతడిని ఎక్కించుకొని ఉల్లాసాన్ని పొందాడు అని చెప్పగా, ధృతరాష్ట్రుడు. వెంటనే సంజయుడితో మళ్ళీ ఇట్లా అన్నాడు:

**క. బలు మాయా బల బాహా । బలములు గలవాఁడు భీముపట్టి పడిన న**
**గ్గలమగు శోకముఁ గోపము ।నలఁచుం బాండవుల నెట్టు లైరొకొ వారల్? 236**

**ప్రతిపదార్థం:** బలు మాయాబల బాహాబలములు కలవాఁడు= గొప్ప రాక్షస మాయాబలం మరియు బాహుబలం కలిగి ఉన్న వాడైన; భీముపట్టి= భీముడి కుమారుడు ఘటోత్కచుడు; పడినన్= పడిపోగా అనగా మరణించగా; అగ్గలము+అగు= అధికమైన; శోకమున్= దుఃఖం; కోపమున్= మరియు కోపం; పాండవులన్= పాండుపుత్రులైన ధర్మరాజాదులను; అలఁచున్= బాధిస్తూ ఉండవచ్చును; (కావున) వారల్= ఆ పాండవులు; ఎట్టులు= ఏ విధంగా; ఐరి+ఒకొ?= అయినారో? (ఒకొ - ప్రశ్నార్థకం)

**తాత్పర్యం:** ఓ సంజయా! గొప్ప మాయాబల, బాహుబలాలు గల ఘటోత్కచుడు మరణించగానే పాండవులకు మిక్కుటమైన దుఃఖంతో పాటు కోపం కూడా కలిగి ఉండాలి - మరి వా రే విధంగా ఏ స్థితి కలిగి ఉన్నారో? వివరంగా చెప్పుము.

**వ. అని యడిగిన నమ్మహీపతికి నతం డిట్లను నట్లు మృతుం డైన హిడింబాసుతుం జూచి కౌంతేయు లత్యంత దీనమానసులై కన్నీరు గడలుకొన నడలునఁ గుందిరి; గోవిందుండు ప్రమోదంబు నొంది సింహనాదంబు సేసి శంఖంబు పూరించి పగ్గంబులు నొగల ముడిచి మందమారుతాందోళితంబగు మందారంబు చందంబు దోఁప నర్తించుచు నరదంబు నడిమి కరిగి కిరీటిం గౌఁగిలించికొని వీఁ పప్పళించి వెండియు నార్చిన నాతం డ య్యుపేంద్రు నుపలక్షించి. 237**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; అడిగినన్= అడగగానే; ఆ+మహీపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుతో; అతండు= ఆ సంజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; అట్లు= ఆ విధంగా- అనగా కర్ణుడు ప్రయోగించిన ఆ ఇంద్రదత్త శక్తితో; మృతుండు+ఐన= మరణించిన; హిడింబాసుతున్= హిడింబ అనే రాక్షస స్త్రీయందు భీముడి వలన కలిగిన ఘటోత్కచుడిని; చూచి= చూచి (తమ కన్నుల యెదుటనే జరిగిన ఆ భయంకర దృశ్యాన్ని చూచి); కౌంతేయులు= ధర్మరాజాదులు, అత్యంత దీనమానసులు+ఐ= మిక్కిలి దైన్యంతో నిండిన మనస్సు గలవారై; కన్నీరు= కంటి నుండి వచ్చే నీరు; కడలుకొనన్= అతిశయించగా; అడలునన్= దుఃఖంతో; కుందిరి= క్రుంగిపోయారు; గోవిందుండు= కృష్ణుడు; ప్రమోదంబున్= సంతోషాన్ని; ఒంది= పొంది; సింహనాదంబు= సింహనాదాన్ని; చేసి; శంఖంబు= తన పాంచజన్యమనే శంఖాన్ని; పూరించి= ఊది (శంఖనాదం చేసి); పగ్గంబులున్= తాను సారథ్యం చేస్తున్న అర్జునుడి రథానికున్న గుర్రాల పగ్గాలను; నొగలన్= నొగలయందు; ముడిచి= కట్టివేసి (అశ్వాలు రథాన్ని గుంజుకొనిపోకుండా తాను బిగించి పట్టుకొనిన ఆ పగ్గాలను నొగలకు బంధించి); మందమారుత+

ఆందోళితంబు+అగు= పిల్లగాలిచేత కదిలించబడిన; మందారంబు చందంబు= మందారమనే వృక్షవిశేషం తీరు (విధం); తోఁపన్= తోచేవిధంగా; నర్తించుచున్= నృత్యం చేస్తూ (కృష్ణుడు నృత్యం చేస్తూ ఉంటే నందనవనంలోని మందార వృక్షం మందమారుతానికి మెల్లగా ఊగినప్పుడెట్లా ఉంటుందో అట్లా చూపరులకు కనిపించిందని భావం); అరదంబు నడిమికిన్= రథం మధ్యభాగానికి; అరిగి= వెళ్ళి (అర్జునుడిని సమీపించి); కిరీటిన్= అర్జునుడిని (నివాత కవచ కాలకేయాది భయంకర రాక్షసవర్గాన్ని జయించి తనకు సహాయం చేయటానికి వెళ్ళుతున్న సమయంలో ఇంద్రుడిచ్చిన కిరీటం చాలా ప్రశస్తమైనది. ఆ కిరీటం కలిగి ఉండటంచేత అర్జునుడికి కిరీటి అనే పేరు రూఢమైంది. ఈ కథ వనపర్వంలో వస్తుంది - 168వ అధ్యాయం శ్లో. 74 సంస్కృతమూలం); కౌఁగిలించికొని= ఆలింగనం చేసికొని; వీఁపు= వీపును; అప్పళించి= చరచి; వెండియున్= మళ్ళీ; ఆర్చినన్= సింహనాదం చేయగా; అతండు= ఆ అర్జునుడు; ఆ+ఉపేంద్రున్= ఆ కృష్ణుడిని; ఉపలక్షించి= చూచి.

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్రుడు అడుగగానే సంజయు డతడితో ఇట్లా అన్నాడు: 'ఓ రాజా! ఆ విధంగా కర్ణుడిచేత హతుడైన ఘటోత్కచునిచూచి, పాండవులు మిక్కిలి దైన్యంతో కన్నీరు మున్నీరుగా దుఃఖించారు. కాని, కృష్ణుడు సంతోషంతో సింహనాదం చేసి, పాంచజన్యాన్ని పూరించి తన చేతిలోని పగ్గాలను రథం నొగలుకు కట్టివేసి మందమారుతానికి అల్లిన ఊగే మందారవృక్షంవలె నృత్యంచేస్తూ రథం నడిమి భాగంలో ఉన్న అర్జునుడిని చేరి, ఆలింగనం చేసికొన్నాడు. వెన్ను చరిచాడు. మళ్ళీ సింహనాదం చేశాడు. అప్పుడు అర్జునుడు కృష్ణుడిని చూచి.

**ఉ. 'చచ్చె ఘటోత్కచుండు మన సైన్యము లెల్లఁ గలంగి నల్గడన్**
**విచ్చుటఁ జూచి మేము వగ నెక్కొన వందెద మిప్పు డెమ్మెయిన్**
**వచ్చెఁ బ్రమోద? మెట్లు గరువంపుఁ జరిత్రము దక్కి లాఘవం**
**బచ్చువడం జెలంగెదు? మహాపురుషా! యిది యేమి సెప్పవే.' 238**

**ప్రతిపదార్థం:** ఓ మహాపురుషా!= ఓ పురుషోత్తమా! కృష్ణా!; ఘటోత్కచుండు= ఘటోత్కచుడు; చచ్చెన్= చనిపోయాడు; (దానికి) మన సైన్యములు+ఎల్లన్= మన సైన్యాలన్నీ; కలంగి= కలత చెంది; నల్గడన్= నాలుగువైపులకు; విచ్చుటన్= విచ్చిపోవటాన్ని (చెల్లాచెదరై పారిపోవటాన్ని); చూచి; మేము= మేము; వగ= చింత; అతిశయించగా; వందెదము= క్రుంగిపోతున్నాము; ఇప్పుడు= ఈ సమయంలో; ఏ+మెయిన్= ఏ విధంగా; ప్రమోదము= (నీకు) సంతోషం; వచ్చెన్?= వచ్చింది?; గరువము+చరిత్రము= గౌరవంతో కూడిన నడవడిని; తక్కి= విడిచి; లాఘవంబు= చులకనభావం; అచ్చుపడంగన్= స్పష్టమయ్యే విధంగా ఎందుకని; చెలంగెదు= ప్రవర్తిస్తూ ఉన్నావు; ఇది+ఏమి= ఇదేమిటి? - ఈ నీ ప్రవర్తనకు కారణ మేమి? అని భావం; చెప్పవే!= చెప్పుమా!

**తాత్పర్యం:** కృష్ణా! మన ఘటోత్కచుడు మరణించాడు. దానికి కలతచెంది మన సైన్యాలన్నీ నాలుగుదిక్కులకు చెల్లాచెదరైపోవటాన్ని చూచి, దిక్కుతోచక మేమందరం దుఃఖంలో కూరుకొనిపోతూ ఉంటే, నీవు సంతోషంతో గంతులు వేస్తున్నావు. ఇంత సంతోషం నీకు ఏ విధంగా కలిగింది? గౌరవాస్పదమైన ప్రవర్తన వదలి తక్కువతనం వ్యక్తమయ్యేవిధంగా ప్రవర్తిస్తున్నావు. మహాపురుషా! ఇదేమిటి?

కృష్ణుండు ఘటోత్కచుండు వడఁ దాను సంతసించుటకు నిమిత్తం బర్జునునితోఁ జెప్పుట (సం.7-155-11)

**వ. అనుటయు నయ్యచ్యుతుం డతని కిట్లను 'నింద్రుండు గుండలంబులు కొనుచుండి కర్ణుని కిచ్చిన శక్తి యతనికడ నున్నంత కాలంబును నిన్ను బ్రతికించుట దుష్కరం బని తలంచుచుండుదు; నేఁడు హిడింబానందనుమీఁద నది వోయినం బ్రమోదంబు నొందితి; నా సూతనందనుం డది సేత నుండెనేనిఁ జక్ర గాండీవ ధరులమై మన మిరువురముం గవిసితి మేనియు జయించు; నతండు దేవ సన్నిభుండు; దివిజపతి వేఁడినఁ గవచకుండలంబులు వికృత్తంబులు సేసి యిచ్చుట వైకర్తనుండనం బరఁగె; నీకై మీతండ్రి యిట్లు సేయఁడయ్యెనేని వాని కెదు రెవ్వరు? కవచకుండల విహీనుండై మానవ సామాన్యంబు నొందుటను శక్రదత్త సాధనంబు లేమిం జేసియు నింక నీకు గెలువవచ్చు; నిట్ల యేకలవ్య శిశుపాల జరాసంధాదుల నీక కా నొక్కొక్క తెఱంగునం బిలుకు మార్చితి; నిత్తఱి వార లున్నఁ గౌరవపతి వారలం దెచ్చుకొను; నమ్మువ్వురుఁ గూడిన నెవ్వరికి నోర్వరాకుండు; ఘటోత్కచుండును గిమ్మీర బక హిడింబులతోడి వాఁడ; ధర్మద్వేషంబును రోషంబును గలిమిం జేసి యొక్కప్పు డొప్పమి వచ్చుం గావున నద్దానవుల యట్ల వీని పొలిసి పోకయు నా కభిమతంబు; వీఁడు రావణునట్టి వాఁ డగుట నిపుడు సావకుండెనేనిఁ బదంపడి నాకుం జంప వలయు; నిది సంతోషకాలంబు గాని శోక సమయంబు గాదు; మన మొనలు గలంగెఁ గురుబలంబు పై కొనియెడు నీవుఁ దెలిసి యుత్సాహంబు వాటింపు, మనియెనని చెప్పిన విని ధృతరాష్ట్రుండు సంజయు దిక్కుమొగంబై.239**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; అర్జును డట్లా ప్రశ్నించగానే అని భావం; ఆ+అచ్యుతుండు= ఆ శ్రీకృష్ణుడు; అతనికిన్= ఆ అర్జునుడితో; ఇట్లు= ఇట్లా; అనున్= అన్నాడు; ఇంద్రుండు= ఇంద్రుడు; కుండలంబులు= (కర్ణుడి సహజ కవచ) కుండలాలను (కుండల పదం కవచానికి ఉపలక్షకం); కొనుచున్+ఉండి= (కపట బ్రాహ్మణుడై వచ్చి యాచించి) గ్రహిస్తూ ఉన్నవాడై (కర్ణుడి కోరిక ప్రకారం వాటికి బదులుగా); కర్ణునికిన్= కర్ణుడికి; ఇచ్చిన శక్తి= ఇచ్చిన 'శక్తి' అనే ఆయుధం; అతనికడన్= ఆ కర్ణుడి దగ్గర; ఉన్నంతకాలంబును= ఉన్నంతకాలమూ; నిన్నున్= ఓ అర్జునా! నిన్ను; బ్రదికించుట= (ఆ కర్ణుడి బారినుండి రక్షించుకొని) జీవితునిగా చేసికొనటం; దుష్కరంబు+అని= సాధ్యం కాదని; తలంచుచుండుదున్= (నేను) అనుకొంటూ ఉంటాను; నేఁడు= ఈ రోజు; హిడింబానందను మీఁదన్= హిడింబ అనే రాక్షసజాతి స్త్రీకి కుమారుడైన ఘటోత్కచుడి మీదకు; అది= ఆ శక్తి అనే ఆయుధం; పోయినన్= (కర్ణుడి నుండి) విడిపోగానే; ప్రమోదంబున్= సంతోషాన్ని; ఒందితిన్= పొందాను; ఆ సూతనందనుండు= ఆ కర్ణుడు; అది= ఆ శక్తి అనే ఆయుధం; చేతన్+ఉండెనేనిన్= (తన) చేతిలో ఉన్నట్లయితే; చక్రగాండీవధరులము+ఐ= సుదర్శన చక్రాన్ని, గాండీవ ధనువును ధరించినవారమై; మనము+ఇరువురమున్= మన మిద్దరం కూడా; కవిసితిమి+ఏనియున్= ఎదుర్కొన్నప్పటికీ; జయించున్= (ఏకకాలంలో) జయిస్తాడు (ఎందుకంటే); అతండు= ఆ కర్ణుడు; దేవసన్నిభుండు= ఇంద్రాది దేవతలతో సమానమైనవాడు; దివిజపతి= దేవేంద్రుడు; వేఁడినన్= యాచించగా; కవచ కుండలంబులు= (తనకు పుట్టుకతో వచ్చిన) కవచాన్ని, కుండలాలను; వికృత్తంబులు+చేసి= (శరీరంలో పాతుకుపోయిన వాటిని) కత్తితో కత్తిరించి వేసి; ఇచ్చుటన్= ఇవ్వటం వలన; వైకర్తనుండు+అనన్= వైకర్తనుడు అని అనే విధంగా (లోకులు వైకర్తనుడు అనే పేరుతో పిలిచే విధంగా); పరఁగెన్= ప్రసిద్ధి చెందాడు; నీకై= ఓ అర్జునా! నీ కొరకు; మీ తండ్రి= మీ జనకుడైన ఇంద్రుడు (అర్జునుడు కుంతికి ఇంద్ర వరప్రసాద జనితుడు కావున తండ్రి పదంచేత ఇంద్రుడికి అర్జునుడియెడ గల బాంధవ్యం సూచించబడింది); ఇట్లు= ఈ విధంగా చేయఁడు+అయ్యెను+ఏని= చేయకుండా ఉన్నట్లయితే; వానికిన్= ఆ కర్ణుడికి; ఎదురు= ఎదురుగా నిలిచి యుద్ధం చేసేవాడు;

ఎవ్వరు?= ఎవ్వడు? (అనగా ఎవ్వడైనా ఉన్నాడా? అని కాకుస్వరం - ఎవ్వడూ లేడని భావం); కవచకుండల విహీనుండు+ఐ= కవచ కుండలాలతో విరహితుడై, అనగా కవచం కుండలాలు లేనివాడై; మానవ సామాన్యంబు= మానవమాత్ర భావాన్ని; ఒందుటను= పొందటం వలన (దివ్యత్వాన్ని సూచించే సహజ కవచకుండలాలు పోవటం వలన, సాధారణ మానవుడై ఉన్నందువలన); శక్రదత్త సాధనంబు= ఇంద్రుడిచే ఇవ్వబడిన శక్తి అనే ఆయుధం; లేమిన్+చేసియున్= లేకపోవటం వలన కూడ; ఇంకన్= ఇక; నీకున్= ఓ అర్జునా! నీకు; గెలువవచ్చున్= జయించటానికి సాధ్యమవుతాడు; ఇట్లు+అ= ఈ విధంగానే; ఏకలవ్య, శిశుపాల, జరాసంధ+ఆదులన్= ఏకలవ్యుడు, శిశుపాలుడు, జరాసంధుడు మొదలైన వారలను; నీకున్+అ= నీకై; కాన్= అగు విధంగా (నీ కొరకే అని భావం); ఒక్క+ఒక్క+తెఱంగునన్= ఒక్కొక్క విధంగా - ఒక్కొక్కరిని ఒక్కొక్క విధంగా (ఇట్లా విభిన్న రీతులలో) అని భావం; పిలుకుమార్చితిన్= సంహరించివేశాను; ఈ+తఱిన్= ఈ సమయంలో; వారలు= ఆ ఏకలవ్యాదులు; ఉన్నన్= జీవించి ఉన్నట్లయితే; కౌరవపతి= దుర్యోధనుడు; వారలన్= ఆ ఏకలవ్య శిశుపాల జరాసంధాదులను; తెచ్చుకొనున్= సహాయంగా తెచ్చుకొంటాడు; ఆ+ముప్వురున్= ఆ ఏకలవ్యుడు, శిశుపాలుడు, జరాసంధుడు అనే ముగ్గురు కూడ; కూడినన్= కలసి ఏకమై ఉన్నప్పుడు; ఎవ్వరికిన్= ఏ వీరుడికి కూడ; ఓర్వరాక+ఉండున్= ఓడించరాకుండా ఉంటుంది (ఆ ముగ్గురేకమైనచో వారిని జయించటం ఎవ్వరికి కూడా సాధ్యం కాదు) (మరియు); ఘటోత్కచుండును= భీమనందనుండైన ఘటోత్కచుడు కూడ; కిమ్మీర బక హిడింబుల తోడివాఁడు+అ= కిమ్మీరుడు, బకుడు, హిడింబుడు అనే రాక్షసులకు సరివచ్చువాడే; ధర్మద్వేషంబును= వేదోక్తమయిన ధర్మకార్యాలయందు వైరం; రోషంబును= క్రోధం కూడా (ఘటోత్కచుడు రాక్షస జాతీయుడవటంచేత విష్ణువునందు రాక్షసజాతి వధ జన్యమగు క్రోధముండటం సహజమని భావం); కలిమిన్+చేసి= ఉండటం వలన; ఒక్కప్పుడు= ఏదో ఒక సందర్భంలో; ఒప్పమి= తగి ఉండకపోవటం; వచ్చున్= సంభవిస్తుంది; కావునన్= కాబట్టి; ఆ+దానవుల+అట్లు+అ= ఆ కిమ్మీరాది రాక్షసులవలెనే; వీని పొలిసి పోకయున్= ఈ ఘటోత్కచుడి మరణం కూడ; నాకున్= ఓ అర్జునా! నాకు (కృష్ణుడికి); అభిమతంబు= ఇష్టం; వీఁడు= ఈ ఘటోత్కచుడు; రావణు+అట్టివాఁడు+అగుటన్= రావణాసురుడితో సమానమైన వాడు కావటం చేత; ఇపుడు= ఇప్పుడు; చావకుండెనేనిన్= మరణించకుండా ఉన్నట్లయితే; పదంపడి= తరువాత; నాకున్= నాకు అనగా ధర్మవిరోధులను హతమార్చి ధర్మసంస్థాపన చేయవలసిన నాకు; చంపవలయున్= సంహరించవలసి ఉంటుంది (కాబట్టి); ఇది= ఈ ఘటోత్కచుడు మరణించిన సమయం; సంతోషకాలంబు+కాని= సంతోషానికి తగిన సమయమేకాని; శోకసమయంబుకాదు= దుఃఖానికి తగిన సమయం కాదు (కావున దుఃఖాన్ని మాని నీవు కర్తవ్యోన్ముఖుడవు కావాలి); మన మొనలు= మన సైన్యాలు; కలంగెన్= కలత చెందాయి; కురుబలంబు= కౌరవసైన్యం; పైకొనియెడున్= మీరిపోతూ ఉన్నది; నీవు= ఓ అర్జునా! నీవు; తెలిసి= యథార్థజ్ఞానం కలవాడవయి; దైన్యశోకాలకు దూరుడవై); ఉత్సాహంబు= యుద్ధోత్సాహాన్ని; పాటింపుము= అవలంబించుము; అనియెన్= అని అన్నాడు; అని= ఇట్లా; చెప్పినన్= చెప్పగా; విని= విన్నవాడయి; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు; సంజయు దిక్కుమొగంబు+ఐ= సంజయుడికి అభిముఖుడై.

**తాత్పర్యం:** అని అర్జునుడు అడుగగానే, కృష్ణుడిట్లా అన్నాడు: 'ఓ అర్జునా! ఇంద్రుడు కర్ణుడినుండి కవచ కుండలాలను తీసికొని వాటికి బదులుగా ఇచ్చిన ఆ శక్తి అనే ఆయుధం కర్ణుడి దగ్గర ఉన్నంతకాలం, నిన్ను బ్రతికించుకొనటం అసాధ్యం అని భావించేవాడిని. ఈ రోజు శక్తి ఘటోత్కచుడిపై ప్రయోగించటంతో కర్ణుడికి అది లేకుండా పోవటం నాకు చాలా సంతోషంగా ఉన్నది. ఒకవేళ ఆ శక్తి కర్ణుడి దగ్గరే ఉన్నట్లయితే నేను సుదర్శన చక్రాన్ని, నీవు గాండీవధనుస్సును ధరించి ఏకమై ఎదిరించినా ఆ కర్ణుడు మనయిద్దరిని కూడా జయిస్తాడు. కర్ణుడంటే సామాన్యుడా? దేవతలతో సమానమైనవాడు. ఇంద్రుడు బ్రాహ్మణుడై వచ్చి యాచించగా పుట్టుకతో వచ్చిన కవచకుండలాలను తన చర్మం నుండి కోసి ఇవ్వటం చేత, వైకర్తనుడనే పేరు వచ్చింది. మీ తండ్రి ఇంద్రుడు నీ కొరకు ఆ కర్ణుడినుండి సహజ కవచకుండలాలను వేరు చేయకపోయినట్లయితే ఆ కర్ణుడికి ఎదురుగా నిలువగల వారెవ్వరు? ఇక కవచకుండలాలు పోవటంతో సాధారణ మానవుడైనాడు. దివ్యమైన శక్తి అనే ఆయుధం

కూడా ఇప్పుడు లేదు కాబట్టి నీ కిక సులభంగా గెలువటానికి వీలవుతుంది. ఇట్లాగే ఓ అర్జునా! నీ కొరకే ఏకలవ్యుడు, శిశుపాలుడు, జరాసంధుడు మొదలైన వారిని ఒక్కొక్కడిని ఒక్కొక్క విధంగా హతమార్చాను. ఒకవేళ వారందరూ ఈ సమయంలో జీవించి ఉన్నట్లయితే దుర్యోధనుడు వారినందరిని సహాయంగా తెచ్చుకొనేవాడు. ఆ ఏకలవ్యాదులు ముగ్గురూ కూడి యుద్ధం చేస్తే వారిని ఎవ్వరూ ఎదిరించలేరు. ఈ ఘటోత్కచుడు కిమ్మీర బక హిడింబాసురుల వంటివాడే. ధర్మద్వేషం, క్రోధం కలిగిఉన్నవాడు. కాబట్టి ఎప్పుడో ఒకప్పుడు ఇతడి ప్రవర్తన నాకు సమ్మతం కాకపోవచ్చును. కాబట్టి ఆ కిమ్మీరాదులవలె ఈ ఘటోత్కచుడు కూడా మరణించటం నాకు ఇష్టమే. ఈ ఘటోత్కచుడు రావణాసురుడి వంటివాడు కావటంచేత, ఒకవేళ ఈ సమయంలో మరణించకుండా ఉంటే, తరువాత నేనే స్వయంగా సంహరించవలసి వస్తుంది. అందువల్ల నా కిది సంతోష సమయం కాని దుఃఖసమయం కాదు. మన సైన్యాలు కలతచెందాయి. కౌరవసైన్యం ఉత్సాహంతో అతిశయిస్తూ ఉన్నది. కావున నీవు యధార్థాన్ని తెలుసుకొని ఉత్సాహాన్ని పొందుము అని అర్జునుడికి సమాధానం చెప్పాడు. అని సంజయుడు చెప్పగానే ధృతరాష్ట్రుడు సంజయుడివైపు తిరిగి (ఇట్లా అన్నాడు).

**చ. 'ఒకనిని జంపి యిట్లు సను నుజ్జ్వల శక్తి నెఱింగి కర్ణుఁ డే**
**టికి నరుమీఁద దాని నిగిడింపక యిన్ని దినంబు లప్రయో**
**జకముగఁ జేసెఁ గయ్యము? భుజాబలశాలి నరుండు వడ్డఁ బో**
**రికి మఱి యుత్సహింపఁ గలరే పెఱవారలు; సూతనందనా! 240**

**ప్రతిపదార్థం:** సూతనందనా!= ఓ సంజయా!; ఒకనిని= ఒక వ్యక్తిని; ఇట్లు= ఈ విధంగా; చంపి= సంహరించి; చను= వెళ్ళునట్టి; ఉజ్జ్వలశక్తిన్= దేదీప్యమైన శక్తి అనే ఆయుధాన్ని; ఎఱింగి= తెలిసి; కర్ణుఁడు= కర్ణుడు; ఏటికిన్= ఏ కారణంచేత; నరుమీఁదన్= అర్జునుడిపై; దానిన్= ఆ శక్త్యాయుధాన్ని; నిగిడింపక= ప్రయోగించక; ఇన్ని దినంబులు= ఇన్ని రోజులు; కయ్యము= యుద్ధాన్ని; అప్రయోజకముగన్= ప్రయోజనరహితంగా; చేసెన్?= చేశాడు?; భుజాబలశాలి= బాహుబలశోభితుడైన; నరుండు= అర్జునుడు; పడ్డన్= పడిపోతే; పెఱవారలు= ఇతరులు అనగా శత్రుపక్షీయులు; మఱి= మళ్ళీ; పోరికిన్= యుద్ధానికి; ఉత్సహింపన్+కలరే?= ఉత్సాహం చూప జాలుతారా? (అర్జునుడే పడిపోతే ఇక శత్రువులు యుద్ధానికే పూనుకొనక ఉండేవారని భావం).

**తాత్పర్యం:** 'ఓ సంజయా! కర్ణ డిన్ని దినాలు నిష్ప్రయోజనంగా యుద్ధం చేశా డేమి? ఒక మహాయోధుడిని మాత్రమే సంహరించి ఇంద్రుడి వద్దకు వెళ్ళిపోతుంది - ఆ అమోఘమైన తన శక్త్యాయుధం అనే విషయం తనకు తెలుసుకదా! అటువంటప్పుడు ఆ ఆయుధాన్ని అర్జునుడిపై ప్రయోగించక ఆలస్యం చేయటానికి కారణ మేమి? ఈ శక్త్యాయుధంతో అర్జునుడినే సంహరించినట్లయితే ఇక పాండవులు యుద్ధానికి మళ్ళీ పూనుకొనేవారా? వారిలో యుద్ధోత్సాహమే లేకుండా పోయి మనకు జయం సులభంగా అబ్బేది కదా!

**క. పిలిచికొని యైనఁ బార్థుం । బొలియింపఁడ శక్తి; నతఁడు పోరికి నెవ్వా**
**రలు రమ్మన్నను వ్రతమయి । తలకొని చనుఁ; గర్ణుఁ డేల తప్పం జేసెన్?' 241**

**ప్రతిపదార్థం:** పిలిచికొని+ఐనన్= (యుద్ధానికి) ఆహ్వానించి అయినా కూడా; పార్థున్= అర్జునుడిని; శక్తిన్= శక్త్యాయుధంతో; పొలియంపఁడు+అ?= సంహరింపలేడా? (సంహరింపవచ్చుగదా అని భావం) - (ఎందుకనగా?); అతఁడు= ఆ అర్జునుడు; పోరికిన్= యుద్ధానికి; ఏ+వారలు= ఎవరయినా; రమ్ము+అన్నను= రమ్మన్నప్పటికీ, యుద్ధానికి ఆహ్వానించినట్లయితే; వ్రతము+అయి= నిష్ఠతో; తలకొని= ప్రయత్నపూర్వకంగా; చనున్= వెళ్ళుతాడు; కర్ణుఁడు= కర్ణుడు; ఏల= ఎందుకు; తప్పన్ (ఈ అవకాశం) తప్పిపోయేటట్లు; చేసెన్= చేశాడు?

**తాత్పర్యం:** యుద్ధానికి ఎవరు ఆహ్వానించినా వెళ్ళటం వ్రతంగా తలచివెళ్ళేవాడు కదా అర్జునుడు. కాబట్టి అతడిని యుద్ధానికి ఆహ్వానించిఅయినా శక్తిచేత చంపకూడదా? కర్ణుడు ఎందుచేత ఇందుకు భిన్నంగా చేశాడు?

**వ. అని వెండియు.** **242**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని మరల (ఇట్లా అన్నాడు).

**తే. 'నా తనూజులు దుర్బుద్ధు లీ తెఱంగు । నీవుఁ దలఁపవ; యాశక్తి నీరజాక్షుఁ**
**డొడిచికొనియెనె మొఱకుచే నున్న తియ్య । పండు వెస నాఁచికొనిన నేర్పరియుఁ బోలె'** **243**

**ప్రతిపదార్థం:** నా తనూజులు= (ఓ సంజయా!) నా కుమారులు దుర్యోధనాదులు; దుర్బుద్ధులు= దుష్టమైన బుద్ధి గలవారలు; (దుష్టచింతనే తప్ప కార్యానుకూలమైన ఆలోచన లేనివారని భావం); ఈ తెఱంగు= ఈ విధం (కర్ణుడిద్వారా ఆ శక్త్యాయుధాన్ని అర్జునుడిపై ప్రయోగింపజేయటం అనే విషయాన్ని); నీవున్= ఓ సంజయా! నీవైనా; తలపవు+అ= జ్ఞాపకం చేయలేకపోయావా; ఆ శక్తి= ఆ శక్త్యాయుధాన్ని; నీరజాక్షుఁడు= కృష్ణుడు; మొఱకుచేన్+ఉన్న= మూర్ఖుడి చేతిలో ఉన్న; తియ్యపండు= మధురమైన ఫలాన్ని; వెసన్= తొందరగా; ఆఁచికొనిన= అపహరించుకొని పోయినట్టి; నేర్పరియున్+పోలెన్= తెలివిగల వాడివలె; ఒడిచికొనియెను+ఎ!= అపహరించుకొనిపోయాడు కదా!

**తాత్పర్యం:** 'ఓ సంజయా! నా కుమారులు దుర్యోధనాదులకు దుష్టచింతనే తప్ప దూరాలోచన లేదు. పోనీ నీవైనా ఈ శక్త్యాయుధాన్ని గూర్చి జ్ఞాపకం చేయలేకపోయావా? ఆ శ్రీకృష్ణుడు ఆ మహాశక్త్యాయుధాన్ని మూర్ఖుడిచేతిలో ఉన్న తీయని పండును తెలివిగలవాడు అపహరించుకొనిపోయినట్లు అపహరించుకొని పోయాడు. దీని కంతటికి కారణ మేమి?'

**వ. అనిన న మ్మహీపతికి సంజయుం డి ట్లనియె.** **244**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇట్లా ప్రశ్నించగానే; ఆ+మహీపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుతో; సంజయుండు= సంజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడిట్లా అనగా, సంజయుడతడితో ఇట్లా సమాధానం చెప్పాడు.

**తే. రాత్రు లీపని కర్ణుతో రాజు ననుజ । సమితియును నేనుఁ దగఁ జెప్పుదుము నరేంద్ర!**
**యతఁడు లెస్సగ విని 'యెల్లి య క్కిరీటి । సచ్చుఁ బటుశక్తి' నని బాస యిచ్చు మాకు.** **245**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; రాజున్= దుర్యోధనరాజు; అనుజసమితియును= దుశ్శాసనాది సోదరవర్గమూ; నేనున్= నేను కూడా; కర్ణునితోన్= కర్ణుడితో; ఈ పని= ఈ కార్యాన్ని గూర్చి; రాత్రులు= రాత్రి సమయాలలో; తగన్= తగిన విధంగా; చెప్పుదుము= చెప్పుతూ ఉంటాము; అతఁడు= ఆ కర్ణుడు; లెస్సగన్= బాగుగా; విని= వినినవాడై; ఎల్లి= రేపు; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; పటు శక్తిన్= సమర్థమైన శక్త్యాయుధంచేత; చచ్చున్= మరణిస్తాడు; అని= అని చెప్పి; మాకున్= మా అందరికీ; బాస= మాట (ప్రతిజ్ఞ); ఇచ్చున్= ఇస్తాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ కుమారుడు దుర్యోధనరాజు, దుశ్శాసనాదులు, నేను ప్రతిరోజూ రాత్రి సమయంలో కర్ణుడితో ఈ విషయం చెపుతూనే ఉన్నాము. ఆ కర్ణుడు కూడా 'ఇదుగో - రేపు తప్పక ఈ శక్త్యాయుధంతో అర్జునుడు వధింపబడుతాడు ఇది నిజం' - అని మాకు మాట కూడా ఇస్తూ ఉంటాడు.

**వ. ఏము వెండియు నా కర్ణునితో నిట్లందుము- 'వివ్వచ్చుండు సచ్చినం దక్కటి పాండవులం దొక్కనిఁ బద్మనాభుండు పట్టంబు గట్టుం; గావున ననర్థ మూలం బగు నమ్మాధవుండు దెగిన జగతీ రాజ్యంబు మనకుఁ దక్కు; నింద్ర దత్తం బయిన శక్తి నతని సమయించుట గార్యంబు.' 246**

**ప్రతిపదార్థం:** ఏము= మేము; వెండియున్= మళ్ళీ కూడ; ఆ కర్ణుతోన్= ఆ రాధేయుడితో; ఇట్లు= ఈ విధంగా; అందుము= అంటూ ఉంటాము; వివ్వచ్చుండు= అర్జునుడు; చచ్చినన్= మరణిస్తే; తక్కటి పాండవులందున్= మిగిలిన పాండవులలో; ఒక్కనిన్= ఏ ఒక్కడినైనా; పద్మనాభుండు= కృష్ణుడు; పట్టంబు కట్టున్= రాజ్య పట్టాభిషిక్తుడిని చేస్తాడు; కావునన్= కాబట్టి; అనర్థమూలంబు+అగు= అనర్థానికి కారణభూతుడైన; ఆ+మాధవుండు= ఆ కృష్ణుడు; తెగినన్= హతుడైతే; జగతీరాజ్యంబు= ఈ సార్వభౌమాధికారము; మనకున్= మనకే; దక్కున్= దక్కుతుంది; ఇంద్రదత్తంబు+అయిన శక్తిన్= ఇంద్రుడిచే ఇవ్వబడిన శక్త్యాయుధంతో; అతనిన్= ఆ కృష్ణుడిని, సమయించుట= సంహరించటం; కార్యంబు= చేయదగిన పని.

**తాత్పర్యం:** మేమందరం కూడా కర్ణుడితో మరల ఇట్లా అంటూ ఉంటాము. 'ఓ కర్ణా! ఒకవేళ అర్జునుడు చస్తే ఆ కృష్ణుడు ఈ భూమండలాధిపత్యాన్ని మరొక పాండుసుతుడికి పట్టం కట్టుతాడు. అన్ని అనర్థాలకూ మూలం ఆ కృష్ణుడే కాబట్టి ఆ కృష్ణుడిపైననే ఈ శక్త్యాయుధాన్ని ప్రయోగించుము. అతడు పోతే మన కిక ఏ ఆటంకం లేకుండా ఈ భూమండలమంతా దక్కుతుంది. కాబట్టి ఇంద్రుడిచ్చిన శక్త్యాయుధంతో కృష్ణుడినే సంహరించటం తగినపని.

**క. అని చెప్పిన య మ్మాటలు । విని 'యెల్ల విధముల కృష్ణవిజయులలో నొ**
**క్కనిఁ బొరిపుచ్చెదఁ జూడుం' । డనుచుఁ జనున్ సూతసుతుఁ డహంకారముతోన్. 247**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; చెప్పిన= చెప్పినటువంటి; ఆ+మాటలు= ఆ మాటలను; సూతసుతుఁడు= సూతపుత్రుడైన కర్ణుడు; విని= విన్నవాడై; ఎల్లవిధములన్= సర్వవిధాలుగా - అనగా నిశ్చయంగా; కృష్ణ విజయులలోన్= కృష్ణార్జునులలో; ఒక్కనిన్= ఒక్కడిని; పొరిపుచ్చెదన్= సంహరిస్తాను; చూడుఁడు= చూడండి; అనుచున్= అంటూ; అహంకారముతోన్= గర్వంతో; చనున్= వెళ్తాడు.

**తాత్పర్యం:** అని చెప్పిన మా మాటలు విని, 'నిశ్చయంగా కృష్ణార్జునులలో నొక్కడిని నేను శక్త్యాయుధంతో సంహరించివేస్తాను. చూడండి' అంటూ అహంకారం కనబరుస్తూ వెళ్ళిపోతాడు.

**తే. వినుము వేగిన సంగ్రామమునకుఁ బోయి । నప్పు డ క్కర్ణునకు మాకు నందఱకును**
**దోఁప దా బుద్ధి వెండియుఁ దోఁచు మగిడి । వచ్చి శిబిరంబు సొరఁగ దైవంబు కతన. 248**

**ప్రతిపదార్థం:** వినుము= (ఓ ధృతరాష్ట్ర మహారాజా!) వినండి; వేగినన్= తెల్లవారగానే; సంగ్రామమునకున్= యుద్ధానికి; పోయినప్పుడు= వెళ్ళిన సమయంలో; ఆ కర్ణునకున్= ఆ కర్ణుడికి; మాకున్+అందఱకును= మా అందరికీ కూడ; ఆ బుద్ధి= శక్త్యాయుధ ప్రయోగ విషయక బుద్ధి; తోఁపదు= స్ఫురించదు; వెండియున్= మళ్ళీ; మగిడి= తిరిగి; వచ్చి= యుద్ధం నుండి వచ్చి; శిబిరంబు= గుడారాన్ని; చొరఁగన్= ప్రవేశించిన వెంటనే; దైవంబుకతనన్= దైవయోగం వలన; తోఁచున్= స్ఫురణకు వచ్చును.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! దైవయోగం వలన, తెల్లవారగానే యుద్ధానికి వెళ్ళేటప్పుడు ఆ కర్ణుడికి గాని, మాకు గాని శక్త్యాయుధం ప్రయోగించి కృష్ణార్జునులలో ఎవరినైనా తుదముట్టించాలి అనే విషయం జ్ఞాపకముండేది కాదు. మళ్ళీ యుద్ధం ముగిసి మన గుడారాలకు రాగానే ఆ విషయం జ్ఞాపకం వచ్చేది -

**వ.** **దైవం బన వేఱొకండు గలదె? కృష్ణుండ; యది యెట్లనిన - నట్లర్జును బోధించునప్పుడు సాత్యకి శౌరితో 'నా సూతసుతుం డీ శక్తి యిన్ని దినంబులు ధనంజయుమీఁదఁ బ్రయోగింపమికిఁ గారణం బేమి? యని యడిగిన నతండు.** **249**

**ప్రతిపదార్థం:** దైవంబు+అనన్= దైవం అంటే; వేఱు+ఒకండు= మరొకటి; కలదె?= ఉన్నదా?; అది= ఆ దైవం; కృష్ణుండు+అ= కృష్ణుడే; ఎట్లు+అనినన్= ఎట్లా అంటే; అట్లు= ఆ విధంగా; అర్జునున్= అర్జునుడికి; బోధించునప్పుడు= ఘటోత్కచవధ జన్యహర్ష నిమిత్తాదులను చెప్పే సందర్భంలో; సాత్యకి; శౌరితోన్= కృష్ణుడితో; ఆ సూతసుతుండు= ఆ సూతపుత్రుడు కర్ణుడు; ఈ శక్తి= ఈ ఇంద్రదత్తమైన శక్త్యాయుధాన్ని; ఇన్ని దినంబులు= ఇన్ని రోజులు; ధనంజయు మీఁదన్= అర్జునుడిపై; ప్రయోగింపమికిన్= ప్రయోగించకపోవటానికి; కారణంబు= హేతువు; ఏమి+అని= ఏమిటని; అడిగినన్= అడుగగానే; అతండు= ఆ కృష్ణుడు.

**తాత్పర్యం:** దైవమంటే వేరొకటి లేదు - కృష్ణుడే ఆ దైవం. ఇది స్పష్టం. ఎట్లా అంటే ఘటోత్కచుడు శక్త్యాయుధంచేత హతుడైనప్పుడు కృష్ణుడు నాట్యం చేస్తూ హర్షించాడు. దానికి కారణం ఏమిటని ప్రశ్నించాడు పార్థుడు. ఆ కారణాన్ని అర్జునుడికి వివరించే సందర్భంలో సాత్యకి కృష్ణుడితో 'ఈ శక్త్యాయుధాన్ని ఇన్ని రోజుల నుండి అర్జునుడిపై కర్ణుడు ప్రయోగించకుండా ఉండటానికి కారణమేమి?' అని అడుగగా కృష్ణుడు (ఇట్లా బదులు పలికాడు).

**తే.** **'వాని వా రెల్ల నీపని వాని కెపుడుఁ । గఱపుదురు; వాఁడుఁ బూన్కిమైఁ గడఁగి వచ్చుఁ;**
**దాఁకుదల నేను వారలందఱును మఱచు । నట్లు సేయుదు నరునకునై కుమార!'** **250**

**ప్రతిపదార్థం:** కుమార!= ఓ సాత్యకీ!; వానివారు+ఎల్లన్= ఆ కర్ణ పక్షీయులందరు; ఈ పని= ఈ శక్త్యాయుధాన్ని ప్రయోగించే పనిని; వానికిన్= ఆ కర్ణుడికి; ఎపుడున్= ఎల్లప్పుడు; కఱపుదురు= మాటిమాటికి చెప్పుతూ ఉంటారు; వాఁడున్= ఆ కర్ణుడు కూడ; పూన్కిమైన్= పూనికతో - పట్టుదలతో; కడఁగి= సంసిద్ధుడై; వచ్చున్= వస్తాడు (కాని); నేను= (కృష్ణుడు); నరునకున్+ఐ= అర్జునుడి నిమిత్తం; వారలు+అందఱును= వారందరు కూడ; తాఁకుదలన్= యుద్ధం ప్రారంభించే సమయంలో; మఱచునట్లు= (ఆ విషయం) మరచిపోయేటట్లు; చేయుదున్= చేస్తాను.

**తాత్పర్యం:** 'ఓ సాత్యకీ! ఆ కర్ణుడికి శక్త్యాయుధంతో అర్జునుడిని హతమార్చాలనే విషయం ఆ కర్ణుడివైపు వారందరు (దుర్యోధనాదులందరూ) ఎప్పుడూ బోధిస్తూనే ఉంటారు. ఆ కర్ణుడు కూడా గట్టి పట్టుదలతో సిద్ధమయ్యే యుద్ధానికి

వస్తాడు. కాని, యుద్ధం సమయంలో నేనే అర్జునుడి క్షేమం కోరి వాడు, అతడి వారందరూ కూడా ఆ విషయం మరచే విధంగా చేస్తూ ఉంటాను.'

**వ. అని పలికి ధృష్టద్యుమ్నాదులం బేర్కొని యాతనిం గలిపికొని సాత్యకి నుద్దేశించి. 251**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికి= చెప్పి; ధృష్టద్యుమ్న+ఆదులన్= ధృష్టద్యుమ్నుడు మొదలైన వారిని; పేర్కొని= పేర్లుపెట్టి చూపించి; ఆతనిన్= ఆ సాత్యకిని; కలిపికొని= కూడగట్టుకొని; సాత్యకిన్= సాత్యకిని; ఉద్దేశించి= సంబోధించి.

**తాత్పర్యం:** అని చెప్పి ధృష్టద్యుమ్నుడు మొదలగువారిని పేరుపేరున పేర్కొని, సాత్యకిని కూడా చేర్చి, సాత్యకితో (ఇట్లా అన్నాడు).

**క. 'మీరును బ్రాణములు ద్రిలో । కీ రాజ్యము నాదు బుద్ధికిం బార్థుక్రియం**
**గూరిమికిం బాత్రంబులె । యీ రేయి గదా! సుఖించి యే నిద్రింతున్. 252**

**ప్రతిపదార్థం:** (ఓ సాత్యకీ!) మీరును= ధృష్టద్యుమ్నుడు మొదలైన మీరందరు; ప్రాణములు= నా ప్రాణాలు; త్రిలోకీ రాజ్యము= ఈ ముల్లోకాల రాజ్యమైనా; నాదు బుద్ధికిన్= నా బుద్ధికి (నా అభిప్రాయం ప్రకారం); పార్థుక్రియన్= అర్జునుడివలె; కూరిమికిన్= ప్రేమకు; పాత్రంబులు+ఎ?= అర్హములు ఔతాయా? (కావని భావం. ఈ లోకంలో నాకు మరేది పార్థుడి కంటె ప్రేమపాత్రం కాదని భావం) మహాభారతం సంస్కృతమూలంలో ఇట్లా ఉన్నది.

శ్లో॥ న పితా న చ మే మాతా న యూయం భ్రాతరస్తథా! న చ ప్రాణా స్తథా రక్ష్యా యథా బీభత్సురాహవే॥ త్రైలోక్య రాజ్యాద్ యత్ కించిద్ భవే దన్యత్ సుదుర్లభమ్ । నేచ్ఛేయం సాత్వతాహం తద్ వినా పార్థం ధనంజయమ్ ॥ (సం. భార. ద్రోణ. 182 అధ్యా 43, 44 శ్లో.) కాబట్టి; ఈ రేయి+కదా= ఈ రాత్రే కాదా; సుఖించి= సుఖంగా; ఏన్= నేను; నిద్రింతున్!= నిద్రిస్తాను!

**తాత్పర్యం:** 'ఓ సాత్యకీ! మీరేకాని నా ప్రాణాలేకాని ఈ మూడు లోకాల రాజ్యమే కాని పార్థునివలె నా ప్రేమకు పాత్రుడా? ఈనాడు అర్జునుడిని రక్షించుకొన్నాను. ఈ రాత్రే గదా సుఖంగా నిద్రిస్తాను.'

**వ. అని చెప్పె నట్లు గావున మనకుఁ బశ్చాత్తాపంబు వలవ దనుటయు ధృతరాష్ట్రుండు 'మీరు దైవోపహతుల; రమ్మహాశక్తి దృణీభూతుం డగు ఘటోత్కచునకుఁగా వమ్మయ్యెఁ; నింక మీవా రెవ్వరు నెవ్వరుసున బ్రదికెదరు? చేయునది లేఁ; దటమీఁది వృత్తాంతంబు సెప్పు' మనవుడు నజ్జనపతికి సంజయుం డిట్లనియె. 253**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; చెప్పెన్= చెప్పాడు; అట్లు+కావునన్= అట్లా కాబట్టి; మనకున్= ఓ ధృతరాష్ట్ర మహారాజా! మనకందరికి; పశ్చాత్తాపంబు= పశ్చాత్తాపం; వలవదు= కూడదు; అనుటయున్= ఇట్లా పలుకగానే; ధృతరాష్ట్రుండు; మీరు= మీరందరు; దైవ+ఉపహతులరు= దైవంచేత కొట్టబడినవారలు (దురదృష్టవంతులని భావం); ఆ+మహాశక్తి= అట్టి గొప్ప ఇంద్రదత్తమైన శక్త్యాయుధం; తృణీభూతుండు+అగు= గడ్డిపోచ అయిన ఘటోత్కచునకుఁగాన్= ఘటోత్కచుడికయి; వమ్ము+అయ్యెన్= వ్యర్థమయింది; ఇంకన్= మరియు; మీవారు+ఎవ్వరున్= ఓ సంజయా! మీవా రెవ్వరైనా (తనవారైన దుర్యోధనాదులని భావం), సంజయుడు దుర్యోధనాదులను తన వారినిగా అభిమానిస్తున్నాడనే భావంతో 'మీవారు' అనే ధృతరాష్ట్రుడి ప్రయోగంలోని స్వారస్యం; ఏ+పరుసునన్= ఏ విధంగా; బ్రదికెదరు?= బ్రదుకుతారు?; చేయునది= చేయవలసింది (ఏదికూడ); లేదు= లేనేలేదు (చేయవలసిన ప్రతీకారం ఏది కూడా లేదు); అటమీఁది వృత్తాంతంబు= అటు పిమ్మట జరిగిన వృత్తాంతం; చెప్పుము= వినిపించుము; అనవుడున్= అనగానే; ఆ+జనపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుతో; సంజయుండు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు. (చెప్పసాగాడు).

**తాత్పర్యం:** అని చెప్పాడు. కాబట్టి మనం పశ్చాత్తాపపడవలసిన పని లేదు - అనగానే ధృతరాష్ట్ర మహారాజు 'సంజయా! మీరు దురదృష్టవంతులు; అంత గొప్ప శక్త్యాయుధం - ఓ గడ్డిపోచలాంటి ఆ ఘటోత్కచుడి కొరకు - అతడిపై ప్రయోగించటంతో వ్యర్థమయిపోయింది. ఇంక మీ (మన) వా రెట్లు బ్రతుకుతారో? అయినా చేయగలిగిందిలేదు. తరువాత జరిగిన వృత్తాంతం ఏమిటో చెప్పుము' అని అడుగగానే సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పసాగాడు.

**తే.** **భీమనందను చావునఁ బ్రేముడించి । ధర్మతనయుండు బాష్పాంబుధార లడర**
**మేను డిల్లంబుగాఁ దేరిమీఁద వివశుఁ । డగుచుఁ జదికిలఁ బడుటయు నచ్యుతుండు.** 254

**ప్రతిపదార్థం:** ధర్మతనయుండు= ధర్మరాజు; భీమనందను చావునన్= భీమసేనుని కుమారుడైన ఘటోత్కచుని మృతివలన; ప్రేముడించి= శోకించి; బాష్పాంబుధారలు= కన్నీటి ధారలు; అడరన్= అతిశయించగా; మేను= శరీరం; డిల్లంబుగాన్= సత్త్వహీనము కాగా (క్రుంగిపోగా); తేరిమీఁదన్= రథంపై; వివశుఁడు+అగుచున్= పరాధీనుడవుతూ; చతికిలన్+పడుటయున్= కూలబడగా; అచ్యుతుండు= కృష్ణుడు.

**తాత్పర్యం:** ధర్మరాజు, ఘటోత్కచుడి మరణంతో మిక్కిలి దుఃఖాక్రాంతుడై కన్నీటి ధారలు పొరలిపోగా, శరీరంలో సత్త్వం నశించి, వివశత్వంతో రథంమీదనే కూలబడి పోగా - అప్పుడు కృష్ణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**వ.** **రయంబునం జని కరంబులం బొదివి యాతని నాలోకించి.** 255

**ప్రతిపదార్థం:** రయంబునన్= వేగంగా; చని= వెళ్ళి; కరంబులన్= చేతులతో; పొదివి= పట్టుకొని; అతనిన్= ఆ ధర్మరాజును; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** త్వరత్వరగావెళ్ళి అతడిని చేతులతో పట్టుకొని అతడితో (ఇట్లా అన్నాడు).

**క.** **'ప్రకృతిజనునట్టు లిమ్మెయి । వికృతిం బొందంగఁ దగునె? విను! మిట్లయినం**
**జకితం బగు నీ సైన్యము । సకలము; లె, మ్ముత్సహింపు సమరంబునకున్.** 256

**ప్రతిపదార్థం:** (ఓ ధర్మరాజా!) ప్రకృతి జనునట్టులు= ప్రాకృత జనుడు అనగా మూర్ఖుడు - అతడి వలె; ఈ+మెయిన్= ఈ విధంగా; వికృతిన్= వికారాన్ని అనగా దుఃఖాన్ని; (హర్షశోకాదులను వికారాలంటారు); పొందంగన్+తగునె?= పొందటం తగుతుందా?; వినుము= సావధానంగా వినండి; ఇట్లు+అయినన్= ఈ విధంగా అయితే (నీవే ఇట్లా దుఃఖిస్తే); నీ సైన్యము సకలము= నీ సైన్యమంతా; చకితంబు+అగు= భయభ్రాంతం అవుతుంది (కావున); లెమ్ము= ధైర్యంతో లే; సమరంబునకున్= యుద్ధానికి; ఉత్సహింపు(ము)= ఉత్సాహం చూపుము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! నీవే ఇట్లా అజ్ఞానివలె దుఃఖానికి లోనయితే, ఇక నీ సైన్యమంతా భయభ్రాంతమయిపోతుంది. కాబట్టి ధైర్యంతో యుద్ధానికి ఉత్సాహం చూపుము.'

**వ.** **నీవు వహించు గురుభారంబు దలంపక యింత యలంత నొందిన జయంబు సేకుఱునే?' యనిన నతండు కన్నీరు కరతలంబున నొత్తికొని మెత్తని మాటల ఘటోత్కచుని గుణముల గణుతించి కామ్యకవనంబునను గంధమాదన యాత్రను దమకుఁ జేసిన సాహాయ్యం బుగ్గడించె; 'వాఁడు నాకు భక్తుం; డేనును సహదేవుకంటెను వానికిం గూర్తు; నట్టి; పట్టి లేకున్న నాకు శోకంబు గాకుండునే?'యని, తత్ప్రతివీరునిదెసకు నెలసిన**

**యంతరంగంబు రోషాక్రాంతం బగుటయు 'నిక్కుమారు నిట్లు సేసిన యీ దుర్జాతుండ కాఁడె? మున్ను నభిమన్యువిల్లు నఱికి చిక్కుపఱిచి యబ్బాలునిం బలువురచేతఁ జంపించె; నప్పుడు దవ్వుల నున్న సైంధవుని సవ్యసాచి సమయించె; నది దానికి మాఱుగా; దీరెండు క్రూరకర్మంబులకుఁ గర్ణునిఁ గడికండలు సేయక శాంతింబొంద నేర్తునే?' యని బిగువుటెలుంగునం బలికి దిగ్గన లేచి 'యా ద్రోహికి నిన్నయు నేఁడును దోడ్పడిన ద్రోణుం దెగటార్చవలయు; నప్పనికిఁ బావని వోవు; నే సూతసూనుం డున్నెడకుం బోయెద' నని శంఖం బొత్తి చాపంబు పుచ్చికొని రథంబు నడప సూతు నియమించి చనుచుండె; నప్పు డచ్యుతుండు దమతేరిపైకి వచ్చి వివ్వచ్చు వీక్షించి. 257**

**ప్రతిపదార్థం:** నీవు= (ఓ ధర్మరాజా!); నీవు; వహించు= మోయునట్టి; గురుభారంబు= గొప్పభారాన్ని గూర్చి; తలంపక= విచారించక; ఇంత+అలంతన్= ఇంతటి శోకాన్ని, ఒందినన్= పొందినట్లయితే; జయము= యుద్ధంలో జయం; చేకుఱునె?= లభిస్తుందా?; అనినన్= అనగా; అతండు= ఆ ధర్మరాజు; కన్నీరు= కన్నీళ్ళను; కరతలంబునన్= అరచేతితో; ఒత్తికొని= తుడుచుకొని; మెత్తని మాటలన్= తియ్యని పలుకులతో; ఘటోత్కచు గుణంబులు= ఘటోత్కచుడి గుణాలను; గణుతించి= కొనియాడి; కామ్యకవనంబునన్= కామ్యకం అనే పేరుగల వనంలో; గంధమాదన యాత్రను= గంధమాదన పర్వతానికి వెళ్ళేటప్పుడు కూడ; తమకున్= పాండవులమైన తమకు; చేసిన= చేసినట్టి; సాహాయ్యంబు= ఉపకారాన్ని; ఉగ్గడించెన్= పేర్కొన్నాడు; వాఁడు= ఆ ఘటోత్కచుడు; నాకున్ భక్తుండు= నాయందు గౌరవపూర్వకమైన ప్రేమ కలవాడు; ఏనును= నేను కూడ; సహదేవుకంటెను= నా చిన్న తమ్ముడు సహదేవుడి కంటె కూడ (అధికంగా); వానికిన్= ఆ ఘటోత్కచుడి విషయంలో; కూర్తున్= పాటుపడతాను; అట్టి పట్టి= అటువంటి కుమారుడు; లేకున్నన్= లేకుండా పోగా; నాకు; శోకంబు= దుఃఖం; కాక+ఉండునే?= కలుగకపోతుందా?; అని= ఇట్లా పలికి; తత్ప్రతివీరుని దెసకున్= ఆ ఘటోత్కచుడిని సంహరించిన ప్రతివీరుడు కర్ణుడు - అతడివైపు; ఎలసిన= మళ్ళినటువంటి; అంతరంగంబు= మనస్సు; రోష+ఆక్రాంతంబు+అగుటయున్= కోపంతో ఆక్రమించినది కాగానే; ఈ+కుమారున్= ఈ ఘటోత్కచుడిని; ఇట్లు= ఈ విధంగా; చేసిన= చేసినటువంటి (అనగా సంహరించిన); ఈ దుర్జాతుండు+అ కాదె= ఈ దుష్టుడు కర్ణుడే కదా!; మున్ను= పూర్వం; అభిమన్యుని విల్లు= అభిమన్యుడి ధనువును; నఱికి= ఖండించి; చిక్కుపఱిచి= కష్టాల పాలు చేసి; ఆ+బాలునిన్= ఆ అభిమన్యుడిని; పలువురచేతన్= అనేకులచేత; చంపించెన్= సంహరింపజేశాడు; అప్పుడు= ఆ సమయంలో; దవ్వులన్+ఉన్న= దూరంలో ఉన్నటువంటి; సైంధవునిన్= సైంధవుడిని; సవ్యసాచి= అర్జునుడు; సమయించెన్= సంహరించాడు (సైంధవుడు అభిమన్యువధ సమయంలో దూరంగానే ఉండిపోవటంచేత ప్రత్యక్షంగా కారణంకాదు - ముఖ్యకారణం మాత్రం కర్ణుడే. ద్రోణాచార్యుడు కూడా.) చూడండి. సంస్కృతమూలము - శ్లో॥ యత్ర వధ్యో భవేద్ ద్రోణః సూతపుత్రశ్చ సానుగః । తత్రా వధీ న్మహా బాహుః సైంధవం దూరవాసినమ్ ॥ (ద్రోణ. 183 / 49); అది= ఆ సైంధవ వధ; దానికిన్= ఆ అభిమన్యుడి వధకు; మాఱు= ప్రతీకారం; కాదు= కాదు; ఈ రెండు క్రూరకర్మంబులకున్= అభిమన్యు వధ, ఘటోత్కచ వధ - అనే ఈ రెండు నిర్దయ కృత్యాలకు; కర్ణునిన్= కర్ణుడిని; కడికండలు= తునుకలుతునుకలుగా; చేయక= చేయకుండా; శాంతిని= కోపోపశాంతిని; పొందనేర్తునే?= పొందజాలుతానా?; అని= ఇట్లా; బిగువు+ఎలుంగునన్= పెద్ద కంఠంతో- బిగ్గరగా; పలికి; దిగ్గనన్= తటాలున; లేచి= నిలిచి; ఆ ద్రోహికిన్= ద్రోహం చేసిన ఆ కర్ణుడికి; నిన్నయున్= వెనుకటి రోజు; నేఁడును= ఈ రోజు కూడ; తోడ్పడిన ద్రోణున్= సహాయం చేసిన, ద్రోణాచార్యుడిని; తెగటార్ప వలయున్= సంహరించవలె; ఆ+పనికిన్= ఆ కార్యానికి; పావని= పవననందనుడు - భీముడు; పోవున్= పోతాడు; నేన్= నేను; సూతసూనుండు= కర్ణుడు; ఉన్న+ఎడకున్= ఉన్నటువంటి దిక్కునకు; పోయెదన్= పోతాను; అని= అని చెప్పి; శంఖంబు= శంఖాన్ని; ఒత్తి= పూరించి; చాపంబు= ధనుస్సును; పుచ్చికొని= తీసికొని; రథంబు= రథాన్ని; నడపన్= తోలటానికి; సూతున్= సారథిని; నియమించి= ఆజ్ఞాపించి; చనుచుండెన్= వెళ్ళుతూ ఉన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; అచ్యుతుండు= కృష్ణుడు; తమ తేరిపైకిన్= తమ రథంపైకి; వచ్చి= వచ్చినవాడై; వివ్వచ్చున్= అర్జునుడిని వీక్షించి= చూచి.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! నీవు ఎంతపెద్ద భారం వహిస్తున్నావో ఆలోచించుకోకుండా, ఇంత దుఃఖానికి విజయ మెట్లా చేకూరుతుంది?' అనే కృష్ణుడి పలుకులను విని, ధర్మరాజు కన్నీళ్ళను చేతితో తుడుచుకొని, మెల్లగా ఘటోత్కచుడి గుణగణాలను ప్రశంసించి, కామ్యకవనంలో, గంధమాదన పర్వతానికి వెళ్ళే సందర్భంలోను - అతడు చేసిన సాయాన్ని చెప్పాడు. వాడు నాకు భక్తుడు. నేను కూడా అతడిని సహదేవుడి కంటె ఎక్కువగా ప్రేమిస్తాను. అట్టి కుమారుడు లేకుంటే నాకు శోకం లేకుండా ఉంటుందా?' అని అంటూ ఉండగా ఆ ధర్మరాజు మనస్సు ఆ ఘటోత్కచుడిని సంహారం చేసిన కర్ణుడివైపు మరలి కోపంతో ఈ దుర్మార్గుడే కదా - 'ఇంతకుముందు కూడా అభిమన్యుడి విల్లు ఖండించి, పలువురి చేత సంహరింపజేశాడు. దానికి ప్రతీకారంగా మన అర్జునుడు దూరంగా ఉన్న సైంధవుడిని సంహరించాడు. అది దానికి తగిన ప్రతీకారంకాదు. ఈనాడు ఘటోత్కచుడిని, ఆనాడు అభిమన్యుడిని సంహరించి రెండు క్రూరకర్మలకు కారకుడైన ఈ కర్ణుడిని ముక్కలుముక్కలు చేయకపోతే నాకు మనశ్శాంతి ఎట్లా చేకూరుతుంది?' అని బిగ్గరగా అరిచి, తటాలున లేచి, 'ఈ ద్రోహి కర్ణుడికి నిన్న నేడు సహాయం చేసినవాడు ద్రోణుడు. అతడిని సంహరించటానికి భీముడు వెళ్తాడు. నేను కర్ణుడివైపు వెళ్తాను' అని చెప్పి, శంఖనాదం చేసి, విల్లును తీసికొని రథాన్ని నడుపుమని సారథిని ఆదేశించి కర్ణుడివైపు యుద్ధానికి వెళ్ళుతూఉండగా, అప్పుడు కృష్ణుడు తన రథంపైకి వచ్చి అర్జునుడిని చూచి (ఇట్లా అన్నాడు).

**విశేషం:** ధర్మరాజు స్మరించిన, ఘటోత్కచుడు చేసిన మహోపకారాలు సంస్కృతమూలంలో ఇట్లా పేర్కొనబడినవి.

శ్లో॥ **అస్మాకం హి వనస్థానాం హైడింబేన మహాత్మనా ।**
**బాలేనాపి సతా తేన కృతం సాహ్యం జనార్దన ।**
**అస్త్రహేతోర్గతం జ్ఞాత్వా పాండవం శ్వేతవాహనమ్।**
**అసౌ కృష్ణ! మహేష్వాసః కామ్యకే మాముపస్థితః ।**
**ఉషితశ్చ సహాస్మాభిర్యావన్నాసీద్ ధనంజయః ॥**
**గంధమాదన యాత్రాయాం దుర్గేభ్యశ్చ స్మ తారితాః ।**
**పాంచలీ చ పరిశ్రాంతా పృష్ఠేనోఢా మహాత్మనా ॥**
**ఆరంభా చ్చైవ యుద్ధానాం యదేష కృతవాన్ ప్రభో!**
**మదర్థే దుష్కరం కర్మ కృతం తేన మహాహవే ॥**

(ద్రోణ - 183/28-32) అంటే కామ్యకవనంలో ఉండేటప్పుడు అర్జునుడు అస్త్రప్రాప్తికై వెళ్ళిన సమయాన ఈ ఘటోత్కచుడు వచ్చి వారికి తోడుగా ఉండటం, గంధమాదన పర్వతానికి వెళ్ళేటప్పుడు ద్రౌపదిని తన పృష్ఠంపై ఎక్కించుకొని తీసికొని వెళ్ళటం - కేవలం ద్రౌపదినేకాదు తన అనుచర వర్గంతో వారినందరిని కూడా దుర్గమ ప్రాంతాలకు మోసికొని వెళ్ళటం - వారికై ఆరంభం నుండి యుద్ధం చేయటం - ఇవన్నీ తిక్కన రచనలో సంక్షేపించబడ్డాయి.

క. **'తనచేతన సూతసుతుం । దునుముదుఁ గా కనుచు నలుకతోడ రయమునం**
**జనియెడు ధర్మసుతుం డీ । తని నూరక చూచుచునికి దగునే మనకున్?'** 258

**ప్రతిపదార్థం:** ధర్మసుతుండు= ధర్మరాజు; తన చేతన్+అ= తన చేతనే - స్వయంగానే; సూతసుతున్= కర్ణుడిని; తునుముదు+కాక= సంహరిస్తాను సుమా!; అనుచున్= అంటూ; అలుక తోడన్= కోపంతో; రయమునన్= వేగంతో; చనియెడున్= వెళ్ళుతూ ఉన్నాడు (కావున); మనకున్= (ఓ అర్జునా!) మనకు; ఈతనిన్= ఈ ధర్మరాజును; ఊరక= ఉదాసీనంగా; చూచుచునికిన్= చూస్తూ ఉండటం; తగునే?= తగుతుందా?

**తాత్పర్యం:** ధర్మరాజు స్వయంగా కర్ణుడిని సంహరిస్తానని కోపంతో వేగంగా వెళ్ళుతూ ఉన్నాడు. ఈతడిని అనుసరించక ఊరకే చూస్తూ ఉండటం మనకు తగిన పనేనా?'

**ఆ. అని రథంబు పెలుచఁ జన నిచ్చె; నట్లు క్రో । ధాంధవృత్తి నరుగు నవ్విభునకు**
**సమ్ముఖంబు గాఁగ సత్యవతీసుతుఁ । డరుగుదెంచి కరుణ నాదరించి. 259**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; రథంబు= రథాన్ని; పెలుచన్= వేగంగా; చనన్+ఇచ్చెన్= పోనిచ్చాడు; అట్లు= ఆ విధంగా; క్రోధ+అంధ వృత్తిన్= క్రోధంతో ముందుచూపులేని ప్రవృత్తితో; అరుగు+ఆ+విభునకున్= వెళ్ళుతూ ఉన్న ఆ ధర్మరాజునకు; సమ్ముఖంబు+కాఁగన్= ఎదురుగా; సత్యవతీ సుతుఁడు= వ్యాసమహర్షి; కరుణన్= దయతో; అరుగుదెంచి= వచ్చి; ఆదరించి= సంభావించి.

**తాత్పర్యం:** అని రథాన్ని వేగంగా ధర్మరాజురథాన్ని అనుసరిస్తూ పోనిచ్చాడు. ఆ విధంగా క్రోధంచేత ముందుచూపులేక ఆవేశంతో వెళ్ళుతున్న ఆ ధర్మరాజునకు ఎదురుగా వ్యాసమహర్షి వచ్చి, అతడిని ఆదరించి. (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. అతండు ప్రణతుం డైన దీవించి యి ట్లనియె. 260**

**ప్రతిపదార్థం:** అతండు= ఆ ధర్మరాజు; ప్రణతుండు+ఐనన్= నమస్కరించగా; దీవించి= ఆశీర్వదించి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు నమస్కారం చేయగా ఆశీర్వదించి, వ్యాసమహర్షి అతడితో ఇట్లా అన్నాడు:

**సీ. 'అనిమిషనాథుఁ డిచ్చిన శక్తి యర్జును । సమయింపఁ గర్ణుండు సంగ్రహించె;**
**నది యున్న దాన నయ్యాపద వాటిల్లె । నేని నయ్యలఁత సహింప వశమె?**
**యీ ఘటోత్కచునకు నింతియ కాలమై । యా నెపంబునఁ దెగటాఱెఁ జూవె!**
**యిట్లు మే లిది దైవ మిచ్చిన దురిత ని । స్తారంబు నీ; కింత దలఁచి నీవు**

**ఆ. సంభ్రమంబు దక్కి సైన్యంబు దోడ్పడ । మనుజపతులఁ దమ్ములను సుహృజ్జ**
**నములఁ గూర్చికొని రణంబు సేయుము కురు । ప్రతతి తోడ నీదు బలము మెఱయ. 261**

**ప్రతిపదార్థం:** (ఓ ధర్మరాజా!) అనిమిషనాథుఁడు= దేవేంద్రుడు; ఇచ్చిన శక్తి= ఇచ్చినట్టి శక్తి అనే ఆయుధాన్ని; అర్జునున్= అర్జునుడిని; సమయింపన్= సంహరించటానికయి; కర్ణుండు; సంగ్రహించెన్= సంపాదించి పెట్టుకొన్నాడు; అది= ఆ శక్త్యాయుధం; ఉన్నన్= ఆ కర్ణుడి దగ్గరనే ఉన్నట్లయితే; దానన్= ఆ శక్త్యాయుధంతో; ఆ+ఆపద= ఆ కర్ణుడు తలపెట్టిన అర్జున సంహార రూపమైన ఆపద; పాటిల్లెన్+ఏనిన్= సంభవించినట్లయితే; ఆ+అలఁత= ఆ శోకం; సహింప వశమే?= (నీకు) ఓర్చుకొన వీలవుతుందా? (కాబట్టి ఈ ఘటోత్కచుడి మృతికి నీవు అంతగా చింతించవలసిన పనిలేదని భావం) - ఎందుకనగా?; ఈ

ఘటోత్కచునకున్= ఘటోత్కచుడికి; ఇంతియ= ఈ మాత్రమే; కాలము+ఐ= జీవితావధియై; ఆ నెపంబునన్= ఆ శక్త్యాయుధం అనే కారణంతో; తెగటాఱెన్+చూవె!= మరణించాడు సుమా!; ఇట్లు= ఈ విధంగా; ఇది= ఈ ఘటోత్కచ మృతి; మేలు= హితమైనది (మరియు); నీకున్= (ఓ ధర్మరాజా!) నీకు; దైవము= అదృష్టం; ఇచ్చిన= ఇచ్చినటువంటి; దురితనిస్తారంబు= పాపమూలక కష్టాలను నివర్తింపజేసినట్టిది (కాబట్టి); నీవు= నీవు; ఇంత= ఇదంతా; తలఁచి= మనస్సులో భావించి; సంభ్రమంబు= ఆవేగాన్ని; తక్కి= విడిచి; సైన్యంబు= సేన; తోడ్పడన్= తోడుకాగా; మనుజపతులన్= రాజులను; తమ్ములను= భీమాది సోదరులను; సుహృద్+జనములన్= మిత్రవర్గాన్ని; కూర్చుకొని= సమాయత్తం చేసికొని; కురుప్రతతితోడన్= కురు (సైన్య) సమూహంతో; నీదు బలము= నీ బలం; మెఱయన్= ప్రకాశించే విధంగా; రణంబు= యుద్ధాన్ని; చేయుము.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! ఆ కర్ణుడు అర్జున వధార్థమే ఆ దేవేంద్రు డిచ్చిన శక్త్యాయుధాన్ని సంగ్రహించి ఉంచాడు. (అనగా దాచి ఉంచాడు). ఆ శక్తి అట్లాగే కర్ణుడి చెంత ఉండి, ఒకవేళ అది అర్జునుడిపై ప్రయోగించబడితే ఆ సంభవించే ఆపదకు నీవు తట్టుకొని ఉండేవాడివా? ఈ ఘటోత్కచుడికి కాలం చెల్లి ఆ శక్త్యాయుధం కారణంగా మృతి చెందాడు. ఒక విధంగా ఇది మేలే. దైవం నీకు పెద్ద దుఃఖం రాకుండా కాపాడింది. ఈ విషయాన్ని గమనించి, నీ వింక కోపావేశం వదలుకొమ్ము. సైన్యం సహాయపడగా, ఈ రాజులను, నీ సోదరులను, మిత్రవర్గాన్ని, కలుపుకొని ఉత్సాహం, ధైర్యం అతిశయించే విధంగా ఈ కౌరవసైన్యంతో యుద్ధం కొనసాగించుము.

**క. కలఁక యుడిపి చిత్తము ని । ర్మల ధర్మోదాత్తముగ నమర్చి నెగడు; మె**
**వ్వలనఁ గలుగు ధర్మం బ । వ్వలనికి జయ మంగళము లవశ్యముఁ గలుగున్.' 262**

**ప్రతిపదార్థం:** కలఁక= శోకాన్ని; ఉడిపి= విడిచి; చిత్తము= మనస్సును; నిర్మల= పవిత్రమైన; ధర్మ= ధర్మంచేత; ఉదాత్తముగన్= గొప్పదానినిగా; అమర్చి= చేసి; నెగడుము= అభివృద్ధిని పొందుము; ఏ+వలనన్= ఏ పక్షాన; ధర్మంబు= ధర్మం; కలుగున్= ఉంటుందో; ఆ+వలనికిన్= ఆ వైపునకు; జయమంగళములు= జయం, శుభం అనేవి; అవశ్యమున్= తప్పక; కలుగున్= కలుగుతాయి.

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఇక శోకాన్ని త్యజించి, నీ మనస్సును గొప్పగా ధర్మంవైపు స్థిరంగా నిలుపుము; అభివృద్ధిని పొందుము. ధర్మం ఏ వైపున ఉంటే ఆ వైపుననే జయం, శుభం తప్పక కలుగుతాయి.

**వ. అని హితోపదేశంబు సేసి. 263**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; హిత+ఉపదేశంబు+చేసి= మేలైన మంచి మాటల నుపదేశించి.

**తాత్పర్యం:** అని, హితాన్ని ఉపదేశించి.

**క. 'విను మేనగు దివసంబున । నినుఁ బొందు ననూనమేదినీ రాజ్యశ్రీ**
**యనుమాన మేమియును లే' । దని గ్రక్కున నమ్మునీంద్రుఁ డరిగె నరేంద్రా!' 264**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; వినుము= (ఓ ధర్మరాజా!) వినుము; ఏను+అగు దివసంబునన్= (నేటికి) అయిదవ రోజున; అనూన మేదినీ రాజ్యశ్రీ= (ఈ) పరిపూర్ణమైన పృథ్వీరాజ్యసంపద; నినున్= నిన్ను; పొందున్= పొందుతుంది; అనుమానము+ఏమియును= ఏ విధమైన సంశయం; లేదు= లేదు; అని= అని చెప్పి; ఆ+ముని+ఇంద్రుఁడు= వ్యాసముని శ్రేష్ఠుడు; గ్రక్కునన్= తొందరగా; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'ఓ ధర్మరాజా! సావధానంగా వినుము. నేటికి అయిదవ రోజున ఈ అఖండ భూమండల రాజ్యలక్ష్మి నిన్ను పొందుతుంది. దీనిలో ఏ మాత్రం సంశయం లేదు'. అని చెప్పి - ఓ ధృతరాష్ట్ర మహారాజా! వ్యాసమునీంద్రుడు వెంటనే వెళ్ళిపోయాడు.

**వ. ఇ ట్లమ్మహాముని సనుటయు, సావధానుండై పాండవాగ్రజుండు ధృష్టద్యుమ్నుం గనుంగొని 'గురుని పురోభాగంబునఁ గౌరవసేన భీమసేనుండు దాఁకి తెరల్చుచున్నవాఁడు; నీ వక్కుంభసంభవు సంరంభంబు మాన్పుము; తద్వినాశం బాచరించుటకయి యనలంబున జనియించిన వాఁడవు; శిఖండి ప్రముఖ పాంచాల కుమారులం గొని యరవాయి గొనక యడరు' మని పలికి కెలంకుల నున్న నకుల సహదేవ ద్రుపద విరాట ద్రౌపదేయ శైనేయ కేకయుల నాలోకించి 'మీరును ఫల్గున పురస్సరంబుగా ద్రోణవధంబునకుం గడంగుఁ' డనుటయు. 265**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఆ+మహాముని= ఆ వ్యాసమహాముని; చనుటయున్= వెళ్ళిపోగానే; సావధానుండు+ఐ= మనోధైర్యం కలవాడై; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; కనుంగొని= చూచి; గురుని పురోభాగంబునన్= ద్రోణాచార్యుడి ముందట; కౌరవసేన= కౌరవుల సైన్యాన్ని; భీమసేనుండు= భీముడు; తాఁకి= ఎదుర్కొని; తెరల్చుచున్న వాఁడు= తొలగజేస్తూ ఉన్నాడు; నీవు= ఓ ధృష్టద్యుమ్నా! నీవు; ఆ+కుంభసంభవు సంరంభంబు= ఆ ద్రోణుడి వేగాన్ని; మాన్పుము= నశింపజేయుము; తద్వినాశంబు= ఆ ద్రోణుడి నాశాన్ని; ఆచరించుటకయి= చేయటం కొరకే; అనలంబు నన్= అగ్నిహోత్రమునందుండి; జనియించినవాఁడవు= పుట్టావు (కదా!) (కాబట్టి); శిఖండి ప్రముఖ పాంచాల కుమారులన్= శిఖండి మొదలైన పాంచాల రాజకుమారులను; కొని= వెంట తీసికొని; అరవాయి+కొనక= సంశయించక - జయిస్తాననే గట్టి ధైర్యంతో; అడరుము= విజృంభించుము; అని= అని; పలికి= చెప్పి; కెలంకులన్= పార్శ్వభాగాలయందు; ఉన్న= ఉన్నట్టి; నకుల సహదేవ ద్రుపద విరాట ద్రౌపదేయ శైనేయ కేకయులన్= నకుల సహదేవులను; విరాట ద్రుపద రాజులను, ద్రౌపది కుమారులైన ఉపపాండవులను, శిని మనుమడైన సాత్యకిని, కేకయ దేశపు రాజులను; ఆలోకించి= చూచి; మీరు= ఓ నకుల సహదేవాది వీరులారా! మీరందరు కూడ; ఫల్గున పురస్సరంబుగాన్= అర్జునుడిని ముందుంచుకొని; ద్రోణవధంబునకున్= ద్రోణాచార్య వధకు; కడంగుఁడు= ఉద్యమించండి; అనుటయున్= అనగానే.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ వ్యాసమహాముని వెళ్ళిన పిమ్మట ధర్మరాజు మనస్సు ఏకాగ్రం చేసికొని ధృష్టద్యుమ్నుడిని చూచి, ద్రోణుడికి ముందుభాగంలో భీముడు కౌరవసైన్యాన్ని ఎదుర్కొని పారద్రోలుతున్నాడు. ఇక నీవు ఆ ద్రోణుడిని ఎదిరించి. అతడి ధాటిని మాన్పుము. ద్రోణుని చంపటానికే అగ్నికుండంనుండి పుట్టావు. కాబట్టి మీ పాంచాలరాజు కుమారులను శిఖండి మొదలైన వారిని వెంట తీసికొని, సంశయించక విజృంభించుము అని చెప్పి తన ప్రక్కలలో ఉన్న నకుల సహదేవ ద్రుపద విరాట ఉపపాండవ సాత్యకీ కేకయులను చూచి, మీరు అర్జునుని ముందుంచుకొని ద్రోణవధకై ప్రయత్నించండి-అని అనగానే

**విశేషం:** ద్రోణద్రుపదులు బాల్యమిత్రులు. సహాధ్యాయులు, ద్రోణుడు తన పుత్రుడు అశ్వత్థామ శైశవ దశలో ఉండగా అతడి పాలకై పాడి ఆవును యాచించటానికి ద్రుపదుడి ఆస్థానానికి వెళ్ళి, అతడిచేత అవమానితుడయ్యాడు. అది మనస్సులో పెట్టుకొని

పాండవులను గురుదక్షిణగా ద్రుపదుడిని బంధించి తెమ్మన్నాడు ద్రోణుడు. పాండవులు - ముఖ్యంగా అర్జునుడు - ద్రుపదుడిని జయించి బంధించి తెచ్చి ద్రోణుడికి అర్పించారు. ఆ అవమానాన్ని ద్రుపదుడు సహించలేక ద్రోణ వధార్థమై పుత్రప్రాప్తికి ప్రయత్నించి సఫలుడయ్యాడు - చూడండి. ఈ ధృష్టద్యుమ్నుని పుట్టుకను గూర్చి మహాభారతం సంస్కృతమూలంలో.

**శ్లో॥ ఉత్తస్థౌ పావకాత్ తస్మాత్ కుమారో దేవ సన్నిభః**
**జ్వాలావర్ణో ఘోరరూపః కిరీటీ వర్మచోత్తమమ్**
**బిభ్రత్ సఖడ్గః సశరో ధనుష్మాన్ వినదన్ ముహుః**
**భయావహో రాజపుత్రః పాంచాలానాం యశస్కరః**
**రాజ్ఞః శోకాపహోజాత ఏష ద్రోణవధాయ వై**
**ఇ త్యువాచ మహాద్భుత మదృశ్యం ఖేచరం తదా । (ఆది- 166/39-43)**

కవచ కిరీటాదులతో భూషితుడై ఖడ్గాన్ని, ధనుర్బాణాదులను ధరించిన కుమారుడు ద్రోణ వధార్థం హోమకుండం నుండి పుట్టినట్లుగా ఈ వర్ణన చెపుతున్నది. గొప్ప తేజశ్శాలి కాబట్టి ఇతడికి ధృష్టద్యుమ్నుడనే నామకరణం సార్థకమైనది చూడండి.

**శ్లో॥ ధృష్టత్వా దత్యమర్షిత్వాద్ ద్యుమ్నాద్యుత్సం భవాదపి**
**ధృష్టద్యుమ్నః కుమారోZ యం ద్రుపదస్య భవత్వితి (ఆది-166/53)**

అందుకే ధర్మరాజు ద్రోణవధార్థం ధృష్టద్యుమ్నుడిని ప్రేరేపించాడు.

**క. వారలు దమ తమ బలములుఁ । దారును గవియుటయు నత్యుదగ్రత గురుఁ డ**
**వ్వీరానీకము మార్కొని । పోరికిఁ దన సైన్య సమితిఁ బురికొల్పి తగన్. 266**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ నకుల సహదేవ ద్రుపద విరాటాదులు; తమ తమ బలములున్= తమ తమ సైన్యాలు; తారును= తాము కూడ; కవియుటయున్= (కౌరవ సైన్యాలను) ఎదుర్కొనగానే; గురుఁడు= ద్రోణుడు; ఆ+వీర+అనీకమున్= ఆ వీరుల సైన్యాన్ని; మార్కొని= ఎదిరించి; పోరికిన్= యుద్ధం చేయటానికి; తన సైన్య సమితిన్= తన సేనాసమూహాన్ని; తగన్= తగిన విధంగా; పురికొల్పి= ప్రేరేపించి.

**తాత్పర్యం:** ఆ నకుల సహదేవ విరాట ద్రుపదాదులు అందరూ వారి వారి సైన్యాలతో కలిసి కౌరవసైన్యాన్ని ఎదుర్కొన్నారు. ద్రోణు డది చూచి ఆ పాండవ వీరసైన్యాన్ని ఎదిరించి యుద్ధం చేయటానికి తన సైన్యాన్ని పురికొల్పి (తరువాతి వచనంతో అన్వయం).

**వ. బరవసంబు వాటించెఁ; గురువిభుండును గోల్తల సేసె; నప్పు డిరుదెఱంగుల వాహినులును దగ యెత్తి తూలం జొచ్చె; నీ సైనికులు డప్పియు నిదురయుం గదిరి మేను లలయం గొందలంపడి రెల్లవారికి నా త్రియామ సహస్రయామ యయితోఁచె; నట్లైనను నిజధర్మంబు ప్రతిపాలింప నడరి పెనంగుచుండిరి; నిద్రా పరవశత్వంబున దివియల వారును హీనప్రయత్నులైనం దమంబు గవియం దొడంగె; నట్టియెడం గునికి కునికి యాయుధంబులు వడ విడుచు వారును వాహనంబులు వోయినట్ల పోవం దెరలువారును జొక్కునం దమవారిం దామ యెదిరి పొడుచువారును, మఱియు ననేక ప్రకారంబులగు వికల సంచారంబుల గాసి యగువారును నగుటయుం గని గాండీవి యిరువాఁగు నుద్దేశించి యెలుంగెత్తి. 267**

**ప్రతిపదార్థం:** బరవసంబు= ధైర్యాన్ని; పాటించెన్= పొందాడు; కురువిభుండును= కురురాజు దుర్యోధనుడు కూడ; కోల్తల= యుద్ధసన్నాహాన్ని; చేసెన్= చేశాడు; అప్పుడు= ఆ సమయంలో; ఇరు తెఱంగుల వాహినులును= రెండువైపుల సైన్యాలుకూడ; దీగ+ఎత్తి= దప్పి కలిగి; తూలన్+చొచ్చెన్= తూలిపోజొచ్చినవి; నీ సైనికులు= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నీ సైనికులు; డప్పియున్= దప్పి; నిదురయున్= నిద్ర; కదిరి= అతిశయించి; మేనులు= శరీరాలు; అలయన్= అలసిపోగా; కొందలం పడిరి= కలత చెందారు; ఎల్లవారికిన్= అందరికి; ఆ త్రియామ= ఆ రాత్రి (ఆ మూడు జాముల రాతిరి); సహస్రయామ+అయి= వేయి జాముల రాత్రిఅయి; తోఁచెన్= తోచింది; అట్లు+ఐనను= అట్లా అయినప్పటికిని; నిజధర్మంబు= తమ ధర్మాన్ని; ప్రతిపాలింపన్= నిర్వహించటానికి; అడరి= పూనుకొని; పెనంగుచుండిరి= యుద్ధం చేస్తూ ఉన్నారు-కాని; నిద్రాపరవశత్వంబునన్= నిద్రాపారవశ్యంచేత; దివియలవారును= దివిటీలు పట్టుకొన్నవారు; హీనప్రయత్నులు+ఐనన్= క్షీణించిన ప్రయత్నం కలవారు కాగా (చమురుతో దీపాన్ని శ్రద్ధగా వెల్గించే ప్రయత్నం మందం కాగా); తమంబు= చీకటి; కవియన్= ఆవరించటానికి; తొడంగెన్= ఆరంభించింది; అట్టి+ఎడన్= ఆ సందర్భంలో; కునికి కునికి= కునికిపాటు అధికం కాగా; ఆయుధంబులు= తమ తమ చేతిలోని ఖడ్గాద్యాయుధాలను; విడుచు వారును= జారవిడిచేవారు (కొందరు); వాహనంబులు= తాము కూర్చున్న గజాశ్వాది వాహనాలు; పోయినట్లు పోవన్= (చోదకుని ప్రేరణ లేకపోవుటచేత) తమంతట తామే స్వేచ్ఛగా ముందుకు సాగగా; తెరలు వారును= (యుద్ధం నుండి) తొలగిపోయేవారు (కొందరు); చొక్కునన్= మోహంతో; తమవారిన్= స్వపక్షీయులనే; తాము+అ= తామే; ఎదిరి= ఎదిరించి; పొడుచువారును= సంహరించేవారు (మరికొందరు); మఱియున్= ఇంకా; అనేక ప్రకారంబులు+అగు= పలు విధాలైన; వికల సంచారంబులన్= వ్యర్థములైన నడవడులతో; గాసి అగువారును= బాధపడేవారు; అగుటయున్= కావటాన్ని; కని= చూచి; గాండీవి= అర్జునుడు; ఇరువాగున్= రెండు సైన్యాలను; ఉద్దేశించి= కూర్చి (సంబోధించి); ఎలుంగు+ఎత్తి= కంఠస్వరాన్ని పెంచి.

**తాత్పర్యం:** పూనికవహించాడు. (ద్రోణుడు); దుర్యోధనుడు కూడా సమర సన్నాహాన్ని చేశాడు. ఆ సమయంలో రెండు పక్షాల సైన్యాలు కూడా అలసటతో తూలిపోవ నారంభించాయి. ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ సైనికులందరు దప్పితోను నిదురతోను శరీరాలు పట్టుకోల్పోయి, మిక్కిలి తాపానికి గురిఅయ్యారు. ఇంక ఈ రాత్రి ఎట్లా గడుస్తుందా అనే భావం ఏర్పడింది. అందరికి ఆ మూడుజాములరాత్రి వెయ్యిజాములరాత్రిగా తోచింది. (అంటే క్షణమొక యుగంగా భాసించింది,) అయినా వారు తమ కర్తవ్యంగా భావించి యుద్ధం చేయసాగారు. కాని, నిద్రాపరవశత్వం వల్ల దివిటీలు పట్టుకొన్నవారు తమ ప్రయత్నం సరిగా చేయలేకపోవటంచేత చీకటి వ్యాపించసాగింది. కొందరు నిద్రకు తట్టుకోలేక కునికిపాట్లతో తమ తమ ఆయుధాలనే జారవిడుచుకొన్నారు. కొందరు తమ ప్రమేయం లేకుండా తమ వాహనాలు ఎటువైపు తీసికొని వెళ్ళుతుంటే అట్లాగే పోయి రణరంగాన్నుండి వైదొలగిపోయారు. మరి కొందరేమో నిద్రాపారవశ్యంతో తమ వారెవరో శత్రువులెవరో గుర్తించక, తమ వారినే పొడిచి సంహరిస్తున్నారు. ఇట్లా రెండు సైన్యాలలో కూడా వికృతపు పోకడలతో సైనికులు బాధపడుతూఉండటం అర్జునుడు చూచి, వెంటనే రెండు సైన్యాల వారి నుద్దేశించి గొంతెత్తి ఇట్లా అన్నాడు:

**క. 'అడరెడు నిద్రాభరమునఁ । గడు డస్సితి రెల్లవారుఁ; గలనను జాడ్యం**
**బెడలఁగఁ జొక్కు మడుఁపుఁ; డి । ప్పుడ చంద్రుఁడు వొడుచు; వెండి పోరుట యొప్పున్.' 268**

**ప్రతిపదార్థం:** అడరెడు= చెలరేగుతున్న; నిద్రాభరమునన్= నిద్రాతిశయంతో; ఎల్లవారును= ఇరుపక్షాల సైనికులందరు కూడా; కలనను= యుద్ధమందు; కడున్= మిక్కిలి; డస్సితిరి= అలసిపోయారు; కలనను= యుద్ధంలో; జాడ్యంబు= మాంద్యం (కలననుఅనే పదం దేహళీదత్తదీపన్యాయంగా అన్వయిస్తుంది); ఎడలఁగన్= తొలగిపోయే విధంగా; చొక్కు= నిద్రాపారవశ్యాన్ని; మడుఁపుఁడు=

తీర్చుకొనండి; ఇప్పుడు+ఆ= ఇంక కొద్దిసేపటికే; చంద్రుఁడు= చందమామ; పొడుచున్= ఉదయిస్తాడు; వెండి= మళ్ళీ (ఆ వెన్నెలలో); పోరుట= యుద్ధం చేయటం; ఒప్పున్= తగుతుంది.

**తాత్పర్యం:** 'ఓ సైనికులారా! మీరు (అంటే రెండువైపులనున్న సైనికులందరు కూడా) నిద్రముంపును తట్టుకోలేక మిక్కిలి అలసిపోయి ఉన్నారు. యుద్ధంలో మాంద్యం సంభవించింది. ఈ మాంద్యం పోయి చురుకుగా యుద్ధం సాగాలంటే మీరందరు కొంచెం సేపు నిద్రించి నిద్రాపారవశ్యాన్ని తొలగ చేసికొనండి. ఇక కొద్దిసేపట్లో చంద్రోదయం ఔతుంది. అప్పుడు మళ్ళీ ఆ వెన్నెలలో యుద్ధం చేయటం బాగుంటుంది.'

**వ. అనిన విని మన వారలందఱు నట్ల మే లని కర్ణ దుశ్శాసనుల యనుమతి వడసి విశ్రమించిరి; పాండవ సైన్యంబును విశ్రామంబు నొందె; గగనంబున దేవగణంబు ధనంజయు ధర్మజ్ఞత్వంబు ప్రస్తుతించె; నయ్యవసరంబున. 269**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; విని= విన్నవారై; మనవారలందఱున్= మన సైనికులందరు కూడ; అట్లు+అ= ఆ విధంగానే; మేలు+అని= మంచిది అని; కర్ణదుశ్శాసనుల అనుమతిన్= కర్ణుడు, దుశ్శాసనుడు - వీరిద్దరి అనుమతిని; పడసి= పొంది; విశ్రమించిరి= విశ్రాంతి తీసికొన్నారు; పాండవ సైన్యంబును= పాండవుల సేన కూడా; విశ్రామంబున్= విశ్రాంతిని; ఒందెన్= పొందింది; గగనంబునన్= ఆకాశంలో; దేవగణంబు= దేవతల సమూహం; ధనంజయ ధర్మజ్ఞత్వంబు= అర్జునుడి ధర్మజ్ఞానాన్ని; ప్రస్తుతించెన్= పొగడింది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అట్లా అర్జునుడు పలుకగానే మన సైనికులందరూ 'అట్లా చేయటమే బాగుంటుంది' అని చెప్పి, కర్ణ దుశ్శాసనుల అనుమతిని కూడా తీసికొని, విశ్రమించారు. పాండవసైన్యం కూడా విశ్రమించింది. ఆకాశంలో దేవతలందరూ అర్జునుడి ధర్మజ్ఞత్వాన్ని ప్రశంసించారు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'కరుణ గలవు; మమ్ము గారవంబున సుఖా । న్వితులఁ జేసి తనఘ! నీకు సురలు**
**వరము లెపుడు నిచ్చువారు గావుత; మనో । రథముఁ బొందు మమరరాజతనయ!' 270**

**ప్రతిపదార్థం:** ఓ అమరరాజతనయ!= ఓ ఇంద్రతనయా అర్జునా!; కరుణ గలవు= దయగలవాడవు (కావుననే); మమ్మున్= ఈ సైనికులమైన మమ్ము; గారవంబునన్= ప్రేమతో; సుఖ+అన్వితులన్= సుఖంతో కూడినవారినిగా; చేసితి(వి)= చేశావు; అనఘ!= పుణ్యాత్మా! (అఘము= పాపము, అది లేనివాడు అనఘుడు); నీకున్= (అర్జునుడికి); సురలు= దేవతలు; వరములు= అభీష్టవరాలను; ఎపుడున్= ఎల్లప్పుడు; ఇచ్చువారు కావుతన్= ఇస్తారుగాక; మనోరథము= కోరిక; పొందుము= పొందుతావు.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యపురుషా! ఇంద్రతనయా! అర్జునా! నీవు నిజంగా దయామయుడవు. మాపట్ల దయ దలచి ప్రేమతో మాకు సుఖం కలుగజేశావు. కాబట్టి నీకు దేవతలు వరాలు ఇత్తురుగాక! నీ కోరిక ఈడేరుగాక!

**క. అని యక్కౌరవ సైన్యము । జనములు సంప్రీతి సవ్యసాచికిఁ బలు దీ**
**వన లిచ్చుచు నాతనిఁ గీ । ర్తన సేయుచు నిద్ర వొందె ధరణీనాథా! 271**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; అని= అని పలికి; ఆ+కౌరవసైన్యము జనములు= ఆ కౌరవసైన్యంలోని జనులు; సంప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; సవ్యసాచికిన్= అర్జునుడికి; పలుదీవెనలు= అనేకములైన ఆశీస్సులు; ఇచ్చుచున్= ఇస్తూ; ఆతనిన్= ఆ అర్జునుడిని; కీర్తన+చేయుచున్= కీర్తిస్తూ అనగా పొగడుతూ; నిద్ర= నిద్రను; పొందెన్= పొందింది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! మీ కౌరవసైన్యంలోని వారందరు ఇట్లా అర్జునుడికి మిక్కిలి ప్రేమపూర్వకంగా ఎన్నో ఆశీస్సు లిచ్చి, అతడిని పొగడుతూ నిద్రించారు.

**వ. ఆ సమయంబున నుభయ బలంబులయందును. 272**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ సమయంలో; ఉభయ బలంబుల అందును= ఇరువైపులవారి సైన్యాలలో కూడ.

**తాత్పర్యం:** ఆ నిద్రించే సమయంలో రెండు సైన్యాలలో కూడా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తరుణుల కుచములపై రతి । పరవశులై యొఱగు పతుల పగిది సమర సం**
**భరిత శ్రమమున నిద్రిం । చిరి కరికుంభములఁ జెంది చెన్నుగ జోదుల్. 273**

**ప్రతిపదార్థం:** జోదుల్= యోధులు; సమర సంభరిత శ్రమమునన్= యుద్ధంతో నిండిన అలసటతో; కరికుంభములన్= ఏనుగుల కుంభస్థలాలను; చెంది= పొంది; తరుణుల కుచములపైన్= వయసులో ఉన్న భార్యల వక్షోజాలపై; రతిపరవశులు+ఐ= సురతశ్రాంతులై; ఒఱగు పతుల పగిదిన్= విశ్రమించిన భర్తలవలె; చెన్నుగన్= అందంగా; (శృంగార భావనచే ఆ దృశ్యం అందంగా ఉందని భావం); నిద్రించిరి= నిద్రపోయారు.

**తాత్పర్యం:** యుద్ధంలో ఎంతో అలసట చెందిన యోధులు గజకుంభాలపై రతిశ్రాంతులైన భర్తలు వయసులో ఉన్న తమ భార్యల వక్షోజాలపై ఒరిగి విశ్రాంతి తీసికొంటున్నట్లు ఎంతో అందంగా నిద్రించారు.

**విశేషం:** అలం: ఇది బింబ ప్రతిబింబ భావంతో కూడిన ఉపమాలంకారం - తరుణుల కుచాలతో కరి కుంభాలకు గల సాదృశ్యం, మరియు రతిశ్రాంతి సమరశ్రాంతుల సాదృశ్యం యోధులకు భర్తలతో చెప్పిన పోలికలో ఉపకరించే సాధర్మ్యంగా ఏర్పడుతుంది. బింబ ప్రతిబింబ భావలక్షణం కువలయానందంలో - వస్తుతః భిన్నయోరపి పరస్పర సాదృశ్యా దభిన్నయోః ఉపమానోపమేయ ధర్మయోః పృథగుపాదానంబింబప్రతిబింబభావః' అని.

**క. తురగంబులపై నాశ్వికు, । లరదంబులమీఁద రథికు లప్పుడు నిద్రం**
**బొరసిరి; కొందఱు భూస్థలి । నిరవుగ సుఖనిద్ర సేసి; రి ట్లున్నంతన్. 274**

**ప్రతిపదార్థం:** ఆశ్వికులు= గుర్రాలపైనెక్కి యుద్ధం చేసే సైనికులు; తురగంబులపైన్= గుర్రాలపై (మరియు); రథికులు= రథాలమీద నిలిచి యుద్ధం చేసేవారు; అరదంబుల మీఁదన్= రథాలపైన; అప్పుడు= ఆ సమయంలో; నిద్రన్= నిద్రను; పొరసిరి= పొందారు; కొందఱు= మరికొందరు అనగా పదాతులు; భూస్థలిన్= భూతలంపై; ఇరవుగన్= పొందికగా; సుఖనిద్ర= సుఖాన్ని కలిగించే నిద్రను; చేసిరి= చేశారు; ఇట్లు= ఈ విధంగా; ఉన్నంతన్= ఉండే సమయంలో.

**తాత్పర్యం:** ఇంకా ఆ సమయంలో ఆశ్వారోహకులు అశ్వాలపై, రథికులు రథాలపై, పదాతి దళాలు నేలపై - సుఖంగా నిద్రించారు. అట్లు వారు సుఖనిద్రలో ఉండే సమయంలో.

**సీ. నలువ చెందొవల తేకులకు నన్నువు వెట్టఁ । గోరి కావించిన గుళిక యనఁగ;**
**నఖిల ద్విజ శ్రేష్ఠమగు చకోర చయంబు । తపము సముల్లసత్ఫల మనంగఁ ;**
**జిగురుజొంపము నునుజిగి యొప్ప నుదయాద్రిఁ । బొలుపారు నవకల్ప భూజ మనఁగఁ;**
**బూర్వ పయోరాశి పొంతఁ గెంజాయ చె । న్నొదవిన పవడంపుఁ బొద యనంగ**

**తే.** **నరుణ రుచి తన మండల మతిశయిల్లఁ । బొడిచి, దివిఁ బ్రాఁకి, దీధితు లడరఁ జేసి,**
**యంతకంతకు నెక్కుచు సంతమసముఁ । గాలుకొననీక చంద్రుఁడు గ్రాలె నధిప!** 275

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నలువ= బ్రహ్మదేవుడు; చెందొవల జేకులకున్= ఎఱ్ఱకలువల రేకులకు; అన్నువు= మెరుగు; పెట్టన్+కోరి= పెట్టదలచి; కావించిన= సిద్ధం చేసిన; గుళిక+అనఁగన్= గోళి (మందు గోళి) యా అనే విధంగా; అఖిల ద్విజశ్రేష్ఠము+అగు= పక్షులన్నింటిలో ప్రశస్తిని పొందిన, (బ్రాహ్మణులందరిలో ప్రశస్తిని గాంచిన అనే అర్థం కూడా ధ్వనిస్తూ ఉన్నది); చకోర చయంబు తపము= చకోర పక్షుల తపస్సుయొక్క; సముల్లసత్+ఫలము= ప్రకాశిస్తున్న ఫలమా; అనంగన్= అనే విధంగా; చిగురు జొంపము నునుజిగి= చిగురుటాకుల గుంపుల అందమైన కాంతి; ఒప్పన్= ప్రకాశించగా; ఉదయ+అద్రిన్= ఉదయాచలంపై (తూర్పుకొండపై); పొలుపారు= ప్రకాశించు; నవకల్పభూజము+అనఁగన్= అభినవ కల్పవృక్షమా అనే విధంగా; పూర్వ పయోరాశి పొంతన్= తూర్పు సముద్రం సమీపంలో; కెంజాయ చెన్ను= ఎఱ్ఱని కాంతుల సౌందర్యం; ఒదవిన= కలిగిన; పవడము+పొద= పగడాల పొదరిల్లా; అనంగన్= అనేవిధంగా; తన మండలము= తన బింబం; అరుణరుచిన్= ఎరుపు కాంతితో; అతిశయిల్లన్= అతిశయించగా; పొడిచి= ఉదయించి; దివిన్= ఆకాశంపైకి; ప్రాఁకి= పాకి; దీధితులు= కిరణాలు; అడరన్+చేసి= వ్యాపింపజేసి; అంతకున్+అంతకున్= క్రమక్రమంగా; ఎక్కుచున్= ఎగబ్రాకుతూ; సంతమసమున్= దట్టపు చీకటిని; కాలుకొననీక= కాలుపెట్టనీయక (వ్యాపించకుండా చేస్తూ); చంద్రుఁడు= చంద్రుడు; క్రాలెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! బ్రహ్మదేవుడు ఎఱ్ఱకలువరేకులకు మెరుగుపెట్టాలని సిద్ధంచేసిన గుళికా అని అనిపించేవిధంగా, పక్షులన్నింటిలో శ్రేష్ఠాలైన చకోరపక్షుల తపస్సుయొక్క ప్రకాశిస్తున్న ఫలమా అన్నట్లుగ, చిగురుటాకుల గుంపు యొక్క నునుపైన కాంతి ప్రకాశించగా ఉదయాద్రి మీద వెలిగే, కాంతి కల్పవృక్షమా అన్నట్లుగ, తూర్పు సముద్రం చెంత ఎఱ్ఱని కాంతి సౌందర్యం కలిగిన పగడాల పొదరిల్లా అన్నట్లుగ-తన బింబం అరుణకాంతితో అతిశయిల్లగా ఉదయించి, ఆకాశంపైకి ప్రాకి, కాంతులు వ్యాపింపచేసి, క్రమక్రమంగా ఎగప్రాకుతూ, చీకటిని కాలుమోపనీయక చంద్రుడు ప్రకాశించాడు. పగడాల పొదయా? - అన్నట్లు ప్రకాశించింది.

**విశేషం:** ఈ చంద్రోదయ వర్ణనం తిక్కన సోమయాజి కవితా శిల్పానికి గీటురాయి - ఈ వర్ణన ఇట్లా సంస్కృత మూలంలో కానరాదు. 'నలువ - కావించిన గుళిక యనఁగ' అన్నది కవియూహ కాబట్టి ఇది ఉత్ప్రేక్షాలంకారం, బ్రహ్మదేవుడు ఎఱ్ఱకలువల రేకులకు మెరుగులు దిద్దటానికి సృజించిన రసాయనపు గుళికగా చంద్రుడిని (చంద్రబింబాన్ని) కవి ఊహించాడు. ఎందుకు? చంద్రుడుదయించగానే ఎఱ్ఱకలువల కాంతి మరింత ఎక్కువగా ప్రకాశించింది. కాబట్టి ఇక్కడ - 'అనఁగ' అనేది ఉత్ప్రేక్షావాచకం- విశేషమేమంటే, ఉత్ప్రేక్షా వాచకమున్నంత మాత్రాన ఉత్ప్రేక్షాలంకారం కాదు. దానికి తోడుగా ఆ ఉపమానం కూడా కవి కల్పితమై ఉండాలి. అప్పుడే ఉత్ప్రేక్షాలంకార మవుతుంది. ఈ సీస పాదాలు మొదటి మూడింటిలో ఉత్ప్రేక్షాలంకారం, నాల్గవపాదంలో మాత్రం ఉత్ప్రేక్షాలంకారం కాదు - అది ఉపమాలంకారమే. పూర్వ సముద్రతీరాన పవడాల పొద ఉండటం లోక ప్రసిద్ధమే కాని కవి కల్పితం కాదు కదా! కాబట్టి ఇచ్చట మూడు ఉత్ప్రేక్షలు, ఒక ఉపమాలంకారం - ఆలంకారికులు ఈ విషయాన్ని ఇట్లా చెప్పారు.

**శ్లో॥ 'యదాऽయ ముపమానాంశః, అసిద్ధః కవి కల్పితః ।**
**తదోత్ప్రేక్షైవ యేనేవశబ్దః సంభావనాపరః ॥'** (వివరాలకు 'చిత్రమీమాంస' ఉపకరిస్తుంది).

**వ.** **ఇట్లుప్రౌఢుండైకామినీ గండపాండు చ్ఛవిం దొట్టి కుముదంబులకు జగన్నేత్రంబులకు నానందం బాపాదించుచుఁ జంద్రుండు మహేంద్రప్రముఖ దిఙ్ముఖంబు లలంకరింపఁ గౌరవ పాండవ బలంబులు మేలుకని యాలంబునకుఁ దొడఁగె; నప్పుడు కురురాజు గురుని కడకుం జని యతని యస్త్రవీర్య శౌర్యంబు లగ్గించి 'యిట్టివాడవు నీకు**

**సరిగాని వారిం బాండవులఁ బెద్దసేసికొని శిష్యత్వంబు పాటించి పోటునకుం జొరక తిరుగుట నా భాగ్యంబు చందంబు గాక! నే నేమి సేయవచ్చు?' ననవుడు నతండు గనలి 'యర్జునుండు శిష్యుం డని మన్నించియ కాదె ఖాండవం బాఖండలుండు గోలుపోయె; ఘోషయాత్రఁ జిత్రసేనాది గంధర్వులు నిన్ను విడిచి వలియం బాఱిరి నివాత కవచ కాలకేయాదులు పొలిసి? రివి యేల? వలవని దురుక్తు లనుటయు నమ్మనుజపతి గోపించి సంరంభంబుగా నక్కుంభసంభవుతో 'నీవు సవ్యసాచికిఁ జాలవేనిం జాలవ కాక! నిలువుము కొంత సైన్యంబు గొని నీయొపినవారితోడం బెనంగు; మేనును దుశ్శాసన శకుని కర్ణులు నా కవ్వడిఁ గూల్చెద' మనిన నవ్వి యవ్వీరుం 'డట్ల చేయుం; డిది గర్జం; బత్తెఱంగునన గెలుతురు గాని పొం' డని పలికి, వెండియు. 276**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ప్రౌఢుండు+ఐ= వృద్ధిని పొందినవాడై; కామినీ గండపాండుచ్ఛవిన్= యువతుల చెక్కిళ్ళ తెల్లని కాంతిని; తొట్టి= వహించి; కుముదంబులకున్= కలువలకు; జగత్+నేత్రంబులకున్= లోకం కన్నులకు; ఆనందంబు= సంతోషాన్ని; ఆపాదించుచున్= కలిగిస్తూ; చంద్రుండు; మహేంద్ర ప్రముఖ దిక్+ముఖంబులన్= ఇంద్రాది దేవతల దిక్కుల - అనగా తూర్పు మొదలగు ఎనిమిది దిశల, వాటి అగ్రభాగాలను; అలంకరింపన్= అలంకరింపజేస్తూ (తన వెన్నెలలతో దిక్కులన్నీ ప్రకాశింపజేస్తూ); కౌరవ పాండవ బలంబులు= కౌరవ పాండవ సైన్యాలు; మేలుకని= నిద్రనుండి మేల్కొని; ఆలంబునకున్= యుద్ధానికి; తొడఁగెన్= పూనుకొన్నాయి; అప్పుడు= ఆ సమయంలో; కురురాజు= దుర్యోధనుడు; గురునికడకున్= ద్రోణాచార్యుడి సమీపానికి; చని= వెళ్ళి; అతని+అస్త్రవీర్యశౌర్యంబులు= ఆ ద్రోణాచార్యుడి దివ్యాస్త్రముల శక్తిని, మరియు అతడి పరాక్రమాన్ని; అగ్గించి= పొగడి; అట్టివాఁడవు= అంతటి గొప్పవాడవు; నీకు సరిగాని వారిన్= నీకు సాటిరాని వారైన; పాండవులన్= ధర్మరాజాదులను; పెద్ద+చేసికొని= గొప్పగా చేసికొని (నిజానికి నీకంటె వారు గొప్పవారు కారని భావం); శిష్యత్వంబు= శిష్యభావాన్ని; పాటించి= పురస్కరించుకొని; పోటునకున్= యుద్ధానికి; చొరక= చొచ్చుకొని పోకుండా; తిరుగుట= తిరగటం (పైపైకి యుద్ధం చేస్తున్నట్లు ఆడంబరం కనపరచటమే తప్ప నిజానికి ఇది యుద్ధం కాదని భావం); నా భాగ్యంబు చందంబు+కాక= నా అదృష్టం తీరు తప్ప (మరేదీ కాదు. కాబట్టి దైవాన్ని ఎదిరించి); నేను+ఏమి+చేయవచ్చును?= నేనేమి చేయజాలుతాను? (ఏమీ చేయలేనని భావం); అనవుడున్= (ఇట్లా) అనగానే; అతండు= ఆ ద్రోణాచార్యుడు; కనలి= మండిపడి (ఇట్లా అన్నాడు); అర్జునుండు= అర్జునుడు; శిష్యుండు+అని= నా శిష్యుడని; మన్నించి+అ+కాదె= తలపోసియే కాదా; ఖాండవంబు= ఖాండవవనాన్ని; ఆఖండలుండు= ఇంద్రుడు; కోలుపోయెన్?= పోగొట్టుకొన్నాడు?; ఘోషయాత్రన్= ఘోషయాత్రలో; చిత్రసేన+ఆది గంధర్వులు= చిత్రసేనుడు మొదలైన గంధర్వులు; నిన్నున్= ఓ దుర్యోధనా! నిన్ను; విడిచి= బంధవిముక్తుడిని చేసి విడిచిపెట్టి; వలియన్= అలసట కలిగే విధంగా (వేగంగా అని భావం); పాఱిరి= పారిపోయారు; నివాత కవచ కాలకేయ+ఆదులు= నివాతకవచులు, కాలకేయులు మొదలైన రాక్షసులు; పొలిసిరి= నశించారు; ఇవి= ఈ; వలవని దురుక్తులు= తగని దుర్భాషలు; ఏల?= ఎందుకు?; అనుటయున్= అనగానే; ఆ+మనుజపతి= ఆ దుర్యోధనుడు; కోపించి= కోపపడి; సంరంభంబుగాన్= ఉద్రేకంగా; ఆ+కుంభసంభవుతోన్= ఆ ద్రోణాచార్యుడితో (ఇట్లా అన్నాడు); నీవు= ఓ ద్రోణాచార్యా! నీవు; సవ్యసాచికిన్= ఆ అర్జునుడికి; చాలవేనిన్+చాలవ కాక!= దీటయిన వాడవు కాకపోతే కాకపోదువు గాక; నిలువుము= నిలిచిపొమ్మొ (అర్జునుడిని ఎదిరించకుండా ఉండిపో) (మరేం చేయాలంటే); కొంత సైన్యంబు= (నీకు అవసరమైన) కొంత సైన్యాన్ని; కొని= తీసికొని; నీ+ఓపిన వారితోడన్= నీ శక్తికి తగినవారితో; పెనంగుము= యుద్ధం చేయుము; ఏనును= నేనూ; దుశ్శాసన శకుని కర్ణులును= దుశ్శాసనుడు, శకుని, కర్ణుడు (మేమందరం కలిసి); ఆ కవ్వడిన్= ఆ అర్జునుడిని; కూల్చెదము= సంహరిస్తాము; అనినన్= అని అనగా; నవ్వి; ఆ+వీరుండు= వీరుడైన ఆ ద్రోణాచార్యుడు; అట్లు= ఆ విధంగా; చేయుండు= చేయండి; ఇది= ఈ మీ ప్రయత్నం; కర్జంబు= ప్రకృతంలో చేయటానికి తగింది; ఆ+తెఱంగునన్+అ= ఆ విధంగానే; గెలుతురు గాని= గెలుస్తారు కావచ్చు; పొండు= వెళ్ళండి; అని పలికి= అని చెప్పి; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** ఈ విధంగా క్రమక్రమంగా వృద్ధిని పొందుతూ చంద్రుడు విరహిణీ స్త్రీల చెక్కిళ్ళ తెల్లని కాంతుల సోయగాన్ని పొందాడు. కలువలను వికసింపజేస్తూ వాటి కానందం చేకూర్చాడు. అంతవరకు చీకటిలో మ్రగ్గిన

లోకుల కన్నులకు ఆహ్లాదాన్ని కలిగిస్తూ దిక్కులన్నింటిలో వెన్నెలలు విరజిమ్మాడు. అప్పుడు కౌరవ పాండవ సైన్యాలు నిద్రనుండి మేల్కొన్నాయి. యుద్ధానికి దిగాయి. అప్పుడు దుర్యోధనుడు ద్రోణాచార్యుడిని సమీపించాడు. అతడి అస్త్రవిద్యా కౌశలాన్ని, పరాక్రమాన్ని ప్రస్తుతించి ఇట్లా అన్నాడు: 'ఓ ఆచార్యా! ఇంతటి గొప్పవాడవు నీవు. నీకు ఈ పాండవులు దేనిలోను సరిరారు. అయినా వారిని శిష్యులుగా భావించి గొప్పగా చిత్రిస్తూ వారితో యుద్ధానికి తగిన విధంగా తలపడకపోతున్నావంటే అది నా దురదృష్టం. దైవాన్ని నిందించటమే తప్ప ఇంతకంటే నే నేమి చేయగలను?' దుర్యోధను డిట్లా పలికిన వెంటనే ద్రోణాచార్యుడు కోపంతో ఇట్లా అన్నాడు: 'ఆనాడు ఇంద్రుడు తన ఖాండవవనాన్ని అగ్నిహోత్రుడి బారినుండి రక్షించుకోలేక వదులుకొన్నాడంటే - అగ్నిహోత్రుడికి రక్షణగా నిలిచిన అర్జునుడు నా శిష్యుడని మన్నించేనా? ఘోషయాత్రలో చిత్రసేనాది గంధర్వులు నిన్ను బందీగా పట్టుకొని కూడా విడిచి పారిపోయారంటే అదికూడా అర్జునుడు నా శిష్యుడని భావించేనా? ఇంద్రాదులకే దుర్జయులైన నివాత కవచ కాలకేయాది రాక్షసులను జయించింది అర్జునుడు నా శిష్యుడనేనా? ఇదంతా తెలిసి ఉండీ కూడా నీవు లేనిపోని దుర్భాషలాడటం ఎందుకు?' అని ద్రోణాచార్యుడు గద్దించగానే ఆ దుర్యోధనుడు కోపావేశంతో అతడితో ఇట్లా అన్నాడు: 'ఓ ద్రోణాచార్యా! ఇట్లా అర్జునుడి గొప్పలు చెప్పే నీవు ఆ అర్జునుడికి దీటుగా నిలిచి పోరాడ జాలకపోతే పోనీ, అతడితో యుద్ధానికి దిగక ఉండిపొమ్ము, నీకు ఇష్టమైన వారితోనే యుద్ధం చేయటానికి కొంత సైన్యం తీసుకొని వెళ్ళుము. ఆ అర్జునుడితో యుద్ధం చేసి, ఓడించి, సంహరించటానికి నేను, దుశ్శాసనుడు, శకుని, కర్ణుడు ఉండనే ఉన్నాము' ఇట్లా దుర్యోధనుడు పలుకగా విని ద్రోణాచార్యుడు నవ్వి దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు: 'ఓ దుర్యోధనా! మీరందరూ అట్లా చేయండి. ప్రస్తుతం ఇదే మీ కర్తవ్యం. ఒకవేళ అట్లా చేస్తే అర్జునుడిని గెలువవచ్చునేమో? పొండి' అని పలికి మళ్ళీ - (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 1. ఈ చంద్రోదయ వర్ణనం సంస్కృత మూలానుసారియై ఉన్నది. సంస్కృత మూలంలో ఈ చంద్రవర్ణనాపరమైన శ్లోకం ఎన్నో అలంకారశాస్త్ర గ్రంథాలలో ఉదాహృతమై ప్రసిద్ధి చెందింది. ఆ శ్లోకం ఇది -

**శ్లో॥ "తతః కుముదనాథేన కామినీగండ పాండునా**
**నేత్రానందేన చంద్రేణ మాహేంద్రీ దిగలంకృతా" (ద్రోణ. 185 - 46)**

కువలయానందకర్త అప్పయ్య దీక్షితులు ఈ శ్లోకాన్ని రూపకాలంకారోదాహరణంగా ఉదాహరించాడు.

2. ఇంకో విశేషం - అర్జునుడి పరాక్రమ ప్రశస్తిని చాటి చెప్పే మూడు సంఘటన లిక్కడ ఉదాహరించబడ్డాయి. ఒకటి ఖాండవదహన వృత్తాంతం. ఇది శ్రీ మదాంధ్ర మహాభారతం ఆదిపర్వంలోని అష్టమాశ్వాసంలో ఉన్నది. ఇక రెండవది ఘోషయాత్రా వృత్తాంతం - ఇది శ్రీమదాంధ్ర మహాభారతం అరణ్యపర్వంలోని పంచమాశ్వాసంలో ఉన్నది. మూడవది నివాతకవచులనే మూడు కోట్ల రాక్షసులను జయించిన కథ ఆంధ్రమహాభారతం అరణ్యపర్వం చతుర్థాశ్వాసంలోనిది. ఆయా ఆశ్వాసాల నుండే ఈ కథల వివరాలు తెలుసుకొనవచ్చు.

**క. 'కుడిచితి, కట్టితి, పెట్టితి, । పుడమి సమస్తంబు నఖిల భోగంబుల నె**
**క్కుడు పేర్మి ననుభవించితి; । తొడరుము వెఱ పుడిగి పార్థుతోడఁ గుమారా! 277**

**ప్రతిపదార్థం:** ఓ కుమారా!= ఓ దుర్యోధనా!; కుడిచితి= వివిధరుచ్యభోజ్య పదార్థాలను భుజించావు; కట్టితి= సువర్ణవస్త్రాలను ధరించావు; పెట్టితి= నీవు మాత్రమేకాక నీవారందరికీ కుడువ కట్టబెట్టావు; పుడమి సమస్తంబు= ఈ భూమినంతా; అఖిల భోగంబులన్= సమస్త రాజభోగాలతో; ఎక్కుడు పేర్మిన్= మిక్కిలి గొప్పతనంతో; అనుభవించితి= అనుభవించావు. (ఇక నీకు ఇది అనుభవించకపోయితినే అనే ఏ చింతా లేదు కాబట్టి); వెఱపు= మరణభయాన్ని; ఉడిగి= విడిచి; పార్థుతోడన్= అర్జునుడితో; తొడరుము= యుద్ధానికి పూనుకొమ్ము.

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! నీవీ భూమండలాన్ని సమస్త రాజభోగాలతో గొప్పగా అనుభవించావు. వివిధ రుచ్య భోజ్య పదార్థాలను, సువర్ణ వస్త్రాదులను నీవు మాత్రమే కాక నీవారందరిని అనుభవింపజేశావు. ఇంతకంటె కావలసిందేముంది? - ఇక నీవు నిశ్చింతగా అర్జునుడితో యుద్ధానికి వెళ్ళుము. అర్జునుడి చేతిలో మరణిస్తానేమో అనే భయం నీ కక్కరలేదు. వెళ్ళుము'.

**విశేషం:** శ్లో॥ దత్తం భుక్తమధీతం చ ప్రాప్తమైశ్వర్య మీప్సితం
కృతకృత్యోऽసి నృణశ్చాసి మాభై ర్యుధ్యస్వ పాండవమ్॥ (ద్రోణ - 185/36)

ఈ సంస్కృత మూలశ్లోకానికి తెలుగు సేత ఇది - 'అధీతం' అనే పదానికి తెలుగు సేత లేదు. అధ్యయనమంటే వేదశాస్త్రాద్యధ్యయనమే అవుతుంది కాని ధనుర్వేదాదుల అభ్యాసం అధ్యయనమనిపించుకోదు. ఆ పదం ఆ అర్థమందే రూఢమైంది. దుర్యోధనుడు వేదాదుల నభ్యసించినా అది అతనియందు చరితార్థం కాలేదు. సద్ధర్మాచరణమే అధ్యయన ఫలం. అది పరద్రోహచింతన శీలుడైన దుర్యోధనుని యందు మృగ్యమే. కాబట్టి ఆ పదాన్ని పరిహరించటంలో తిక్కన ఎంతో ఔచిత్యం పాటించాడనిపిస్తుంది.

**వ.** **అని యప్పాంచాలు బలంబు దిక్కు పేరుక్కున నడచెఁ; గౌరవపతియును బాండవుల వలనికి నురవడించె; నిట్లు వేకువ జామున సంగ్రామంబు సెల్లఁ బదంపడి తూ ర్పెఱ్ఱ నగుచు వచ్చె; నప్పు డచ్యుతుం డర్జును నాలోకించి 'రెండు మైల గండు మిగిలి వచ్చి పోరెడు నిమ్మూఁకల నన్నిటిని డాపట నిడి తఱుమవలయు' నని యతం డొడంబడ నమ్మెయి నరదంబు నడపె; భీముండును బరవసంపు మాటల బీభత్సునిం బురికొలిపె; నివ్విధంబునఁ గడంగిన గాండీవిం బొదివి దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు పెల్లేసిన 'నయ్యోధవరుం డందఱ కన్నిరూపులై యేట్లాడ నిరువాఁగును బెరసి తలలు వట్టికొని పోట్లాడెఁ; దదనంతరంబ. 278**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; ఆ+పాంచాలు బలంబు దిక్కు= పాంచాల రాజుల సైన్యంవైపు; పేరు+ఉక్కునన్= గొప్ప వేగంతో; నడచెన్= వెళ్ళాడు; కౌరవపతియును= దుర్యోధనుడు కూడ; పాండవుల వలనికిన్= పాండవుల వైపునకు; ఉరవడించెన్= వెళ్ళటానికి వేగిరపడ్డాడు; ఇట్లు= ఈ విధంగా; వేకువజామున(న్)= తెల్లవారుజామున; సంగ్రామంబు= యుద్ధం; చెల్లన్= నడుస్తూ ఉండగా; పదంపడి= క్రమక్రమంగా; తూర్పు= తూర్పుదిక్కు; ఎఱ్ఱనగుచు వచ్చెన్= ఎఱ్ఱబారజొచ్చింది; అప్పుడు= ఆ సమయంలో; అర్జునున్= అర్జునుడిని; ఆలోకించి= చూచి; అచ్యుతుండు= శ్రీకృష్ణుడు (ఇట్లా అన్నాడు); రెండు మైలన్= రెండు వైపుల; గండు= పౌరుషం; మిగిలి= అతిశయించి (పరాక్రమాతిశయంతో); వచ్చి; పోరెడు= యుద్ధం చేస్తున్న; ఈ+మూఁకలన్+అన్నింటిని= ఈ సైన్యాలనన్నింటిని; డాపటన్= ఎడమవైపు; ఇడి= ఉంచి; తఱుమవలయున్= పరుగులు తీయించాలి; అని= ఇట్లా పలికి; అతండు=ఆ అర్జునుడు; ఒడంబడన్= సమ్మతించగా; ఆ+మెయిన్= ఆ విధంగా; అరదంబు= రథాన్ని; నడపెన్= తోలించాడు; భీముండును= భీమసేనుడును; బరవసంపు మాటలన్= అభినివేశాన్ని కలిగించే మాటలతో; బీభత్సునిన్= అర్జునుడిని; పురికొలిపెన్= ఉత్సాహ పరిచాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా; కడంగిన గాండీవిన్= యుద్ధానికి ఉద్యమించిన అర్జునుడిని; పొదివి= చుట్టుముట్టి; దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణులు= దుర్యోధనుడు, దుశ్శాసనుడు, శకుని, కర్ణుడు అనే నల్వురు యోధులు; పెల్లు=మిక్కిలి;ఏసినన్=

బాణాలు వేయగా - యుద్ధం చేయగా అని భావం; ఆ+యోధవరుండు= యోధులలో శ్రేష్ఠుడైన ఆ అర్జునుడు; అందఱకున్= ఆ యోధులందరికీ; అన్నిరూపులై= (వారెందరో) అన్ని రూపాలు గలవాడై - అనగా అట్లా భాసిస్తూ (ఆయా యోధులు తమతోనే యుద్ధం చేస్తున్నట్లుగా తోస్తూ అని భావం); ఏట్లాడన్= యుద్ధం చేయగా; ఇరువాఁగును= రెండువైపుల సైన్యాలు; బెరసి= కలిసిపోయి; తలలు+పట్టికొని= ఒకరితలనొకరు పట్టుకొని; పోట్లాడెన్= యుద్ధం చేశాయి; తద్+అనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** అని పలికి పాంచాలవీరుల సైన్యాలవైపు యుద్ధం చేయటానికి వెళ్ళాడు (ద్రోణాచార్యుడు.) ఇక దుర్యోధనుడు పాండవులున్న వైపునకు యుద్ధానికి పరుగుతీశాడు. ఇట్లా తెల్లవారుజామున యుద్ధం సాగుతూ ఉన్నది. క్రమక్రమంగా తూర్పుదిక్కు ఎఱ్ఱబారసాగింది. అప్పుడు కృష్ణుడు అర్జునుడిని చూచి ఇట్లా అన్నాడు. 'ఈ కౌరవ సైన్యాలు రెండు వైపులనుండీ వస్తున్నాయి. పౌరుషంతో యుద్ధం కూడా బాగా చేస్తున్నాయి. ఈ సైన్యాలనన్నింటిని ఎడమవైపుగా ఉంచి తరిమివేయాలి.' అర్జునుడు అట్లే అన్నాడు. కృష్ణుడు రథం ఆ వైపునకు నడుపుతూ ఉన్నాడు. అప్పుడు భీముడు పౌరుషాన్ని రేకెత్తించే మాటలు పలుకుతూ అర్జునుడిని మరింత ఉత్తేజపరిచాడు. అంతలోనే దుర్యోధనాది దుష్టచతుష్టయం అర్జునుడిని ఎదుర్కొని బాణాలు కురిపించారు. వారిని చూడగా అర్జునుడికి కోపం రెండింతలై వారికందరికీ అన్ని రూపాలతో యుద్ధం చేస్తున్నట్లు భాసించాడు. రెండు వైపుల సైన్యాలు కలియబడి ఒకరితలనొకరు పట్టుకొని కేశాకేశి బాహాబాహి అన్నట్లుగా యుద్ధం చేశాయి. తరువాత

**విశేషం:** కేశాకేశి యుద్ధం సాగిందని చెప్పటంచేత అర్జునుడి ధాటికి తమ తమ రథగజాశ్వవాహనాలు భగ్నంకాగా, ధూళి రేగి సైన్యమంతా అంధకారం అలుముకొని తమవా రెవరో ఇతరు లెవరో తెలియక ఎదురైన వారితో కేశాకేశి యుద్ధానికి దిగారనే మూలార్థం ఇక్కడ సంగ్రహించబడింది. సంస్కృత మూలం ఇట్లా ఉన్నది.

**శ్లో॥ అథ దుర్యోధనః కర్ణః శకునిశ్చాపి సౌబలః ॥**
**అభ్యవర్షచ్ఛరవ్రాతైః కున్తీపుత్రం ధనంజయమ్ ॥**
**తేషా మస్త్రాణి సర్వేషా ముత్తమాస్త్రవిదాం వరః ॥**
**కదర్థీకృత్య రాజేంద్ర! శరవర్షైరవాకిరత్ ।**
**అస్త్రై రస్త్రాణి సంవార్య లఘుహస్తో జితేంద్రియః ॥**
**సర్వా నవిధ్యన్నిశితై ర్దశభిర్దశభిః శరైః ।**
**ఉద్ధూతా రజసో వృష్టిః శరవృష్టి స్తథైవ చ ॥**
**తమశ్చ ఘోరం శబ్దశ్చ తదా సమనుభవ న్మహాన్ ।**
**న ద్యౌ ర్న భూమి ర్న దిశః ప్రాజ్ఞాయంత తథా గతే ॥**
**సైన్యేన, రజసా మూఢం సర్వమంధ మివా భవత్ ।**
**నైవ తే న వయం రాజన్ ప్రాజ్ఞాసిష్మ పరస్పరమ్ ।**
**ఉద్దేశేనహి తేన స్మ సమయుధ్యన్త పార్థివాః ।**
**విరథా రథినో రాజన్ సమాసాద్య పరస్పరమ్ ॥**
**కేశేషు సమసజ్జన్త కవచేషు భుజేషు చ ।**
**హతాశ్వా హతసూతాశ్చ నిశ్చేష్టా రథినో హతాః ॥** (ద్రోణ. 186-14-21 శ్లో)

**క. మొనలో నిలువక యుత్తర । మునకై చని యేకతంబు మొనసిన గురునిం**
**గని పాండవ సైన్యము పులిఁ । గనిన హరిణకులము నట్లు కంపము నొందెన్. 279**

**ప్రతిపదార్థం:** మొనలోన్= సైన్యంలో; నిలువక= ఉండక; ఉత్తరమునకై= ఉత్తర దిక్కునకు; చని= వెళ్ళి; ఏకతంబు= ఒంటరిగా; మొనసిన గురునిన్= యుద్ధానికి పూనుకొన్న ద్రోణాచార్యుడిని; కని= చూచి; పాండవ సైన్యము= పాండవుల సైన్యం; పులిన్= పెద్దపులిని; కనిన హరిణ కులము అట్లు= చూచిన లేళ్ళ సమూహం వలె; కంపము= వణకును; ఒందెన్= పొందింది (భయంతో వణకిపోయింది.)

**తాత్పర్యం:** సైన్యం అగ్రభాగాన నిలువకుండా ద్రోణాచార్యుడు ఉత్తరభాగానికి వెళ్ళి, ఒంటరిగా పోరు సల్పటానికి పూనుకోగా పాండవసైన్యం పులిని చూచి లేళ్ళసమూహం భయపడినట్లు భయపడి వణకిపోయింది.

**విశేషం:** అలం: ఉపమ. ఈ ఉపమానం ద్రోణాచార్యులముందు నిలిచి పోరు సల్పే ధైర్యంకల వాడెవ్వడు కూడా లేడనే అర్థాన్ని సూచిస్తుంది.

**వ. ఇత్తెఱంగున నెఱి గలిగి యద్దెసవారిం బిలిచిన నా సైనికు లచ్చెరువడువారును, గోపించువారును, గడంకలు దెచ్చుకొను వారును, నివ్వెఱఁగందు వారునునయి; రందు విరాట ద్రుపదులును ద్రుపదు మనుమలలోన ముఘ్వరును గేకయపతులును సబలంబుగా బలువిడిం గవిసి యక్కుంభసంభవుం జుట్టుముట్టిన, నతండు. 280**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; నెఱి= పరాక్రమం; కలిగి= ఉండి; ఆ+దెసవారిన్= ఆ వైపున ఉన్నవారిని; పిలిచినన్= యుద్ధానికి ఆహ్వానించగా; ఆ సైనికులు= ఆ సైన్యంలోని వారు (కొందరు); అచ్చెరువడువారును (అయిరి)= ఆశ్చర్యపడేవారు; కోపించువారును (అయిరి)= కోపంగల వారయినారు (మరికొందరు); కడంకలు= ఉత్సాహాలు; తెచ్చుకొనువారును (అయిరి)= తెచ్చుకొన్నవారు (అనగా లేని ఉత్సాహాన్ని చూపుతూ తెగించారు); (మరికొందరు) నివ్వెఱఁగు= నిశ్చేష్టతను (కాళ్ళు, చేతులు ఆడని స్థితిని); అందువారును= పొందేవారు; అయిరి= అయ్యారు; (అయిరి అనే ఈ పదం అచ్చెరువడువారును మొదలగు పదాలన్నింటితో అన్వయిస్తుంది). (కాబట్టి అన్నింటితో ఈ పదాన్ని జోడించి అర్థం వ్రాయబడింది. ఇట్లా పదాన్ని ఆవృత్తి చేయటాన్ని అనుషంగం అంటారు); అందున్= ఆ సైన్యంలో విరాట ద్రుపదులును=విరాటరాజు, ద్రుపదమహారాజు; ద్రుపదు మనుమలలోనన్= ద్రుపదుడి మనుమలలో; ముఘ్వరును= ముగ్గురు మనుమలు మాత్రం; కేకయపతులును= కేకయ దేశపు రాజులు (వీరందరు); సబలంబుగాన్= తమ తమ సైన్యాలతో కూడా; బలువిడిన్= వేగంగా; కవిసి= ఎదుర్కొని; ఆ+కుంభసంభవున్= ఆ ద్రోణా చార్యుడిని; చుట్టుముట్టినన్= చుట్టుముట్టగా; అతండు= ఆ ద్రోణాచార్యుడు.

**తాత్పర్యం:** ఈ విధంగా పరాక్రమశాలి అయిన ద్రోణాచార్యుడు ఆ శత్రుపక్షీయులను యుద్ధానికి ఆహ్వానిస్తూ ఉంటే ఆ సైనికులు కొందరు ఆశ్చర్యపోయారు. మరి కొందరు యోధులు అతడిపై కోపంతో మండిపడ్డారు. మరికొందరు లేని ఉత్సాహాన్ని తెచ్చుకొని యుద్ధానికి సన్నద్ధమయ్యారు. మరికొందరు కాళ్ళూ చేతులు ఆడక, అట్లే చూస్తూ ఉండిపోయారు. ఇట్టి పరిస్థితిలో విరాట ద్రుపద రాజులు ఇద్దరు, ద్రుపదుడి మనుమలు ముగ్గురు మరియు కేకయరాజులు వీరందరూ సైన్యాలతో కలిసి వేగంగా వెళ్ళి ద్రోణాచార్యులను చుట్టుముట్టారు. అప్పుడు ఆ ద్రోణాచార్యుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**మ.** **ప్రజ నెల్లం దునుమాడి యుగ్రముఖుఁ డై పాంచాల పౌత్రత్రయం**
**బు జముం జేరఁగఁ బుచ్చి, కేకయుల కేపుం జేవయుం జూపి యం**
**బుజముల్ గోసినకైవడిం దలలు సంఫుల్లాస్య భల్లంబు ల**
**క్కజ మై యుండ నిగిడ్చి త్రుంచెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగన్.** **281**

**ప్రతిపదార్థం:** ప్రజన్+ఎల్లన్= సమస్త సైనిక జనాన్ని; తునుమాడి= సంహరించి; ఉగ్రముఖుఁడు+ఐ= భయంకరమైన ముఖం గలవాడై (క్రోధోద్దీప్తిచేత ఆ ద్రోణాచార్యుడి ముఖం శత్రువులకు భయం కొల్పుతూ ఉన్నదని భావం); పాంచాల పౌత్రత్రయంబు= పాంచాలరాజైన ద్రుపదుడి ముగ్గురు మనుమలను - త్రయ మనగా మూడింటి సముదాయం (పౌత్రాణాంత్రయం ష.త.స.); జమున్= మృత్యుస్వరూపుడైన యమధర్మరాజును; చేరఁగన్= చేరేవిధంగా; పుచ్చి= పంపి (సంహరించి); కేకయులకున్= కేకయ రాజులకు; ఏపున్= ఆధిక్యాన్ని; చేవయున్= సామర్థ్యాన్ని; చూపి= దర్శింపజేసి; సంఫుల్ల+ఆస్య భల్లంబులు= మిక్కిలి వికసించిన వెడల్పైన ముఖం అనగా అగ్రభాగం (ములికి) గలిగి ఉన్న భల్లము లనే బాణాలు; అక్కజము+ఐ+ఉండన్= ఆశ్చర్యాన్ని కలిగించేవై ఉండే విధంగా; నిగిడ్చి= చొప్పించి; తలలు= ఆ కేకయరాజుల తలలను; అంబుజముల్= కమలాలను; కోసిన కైవడిన్=కోసినవిధంగా; పటుదోర్గర్వంబు= సమర్థములైన బాహువులయొక్క గర్వం; అఖర్వంబుగన్= అనల్పమై ఉండే విధంగా; త్రుంచెన్= త్రెంచి వేశాడు; (తీక్ష్ణములైన భల్లాలనే పేరుగల బాణాలతో కేకయరాజుల తలలను ఖండించి తన బాహుబలాన్ని చాటుకొన్నాడనిభావం).

**తాత్పర్యం:** సైన్యంలోని వార లందరినీ సంహరించి, మరియు క్రోధావేశంతో భయంకరమైన ముఖం కలవాడై, ద్రుపదుడి మనుమలను ముగ్గురిని హతమార్చాడు. తరువాత కేకయరాజులకు తన శక్తి ఎట్టిదో చూపించాడు. ఆ కేకయరాజుల తలలను భల్లబాణాలతో కమలాలను కోసినంత సులువుగా తెగగొట్టివేశాడు. శత్రువులకు తన బాహుబలంయొక్క గొప్పతనమేమిటో తెలిసిపోయేటట్లు చేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **వెండియు.** **282**

**తాత్పర్యం:** ఇంకా.

విరాట ద్రుపదులు ద్రోణునిచేతఁ జచ్చుట (సం. 7-161-34)

**శా.** **చంచద్బాణ పరంపరా ప్రహతులన్ సైన్యంబుఁ గ్రూరోద్ధతిం**
**జించెం; జించిన నింక నెన్నఁటికి నిస్సీ భూరిబాహాబలం**
**బంచుం గూడి కడంగి నొంపఁ గుపితుండై మత్స్యభూవల్లభుం**
**బాంచాల క్షితినాథునిం దునిమె దర్పస్ఫూర్తి శోభిల్లఁగన్.** **283**

**ప్రతిపదార్థం:** చంచత్= కదలుతున్న; బాణ= బాణాలయొక్క; పరంపరా= వరుసలచేతనైన; ప్రహతులన్= దెబ్బలచేత; సైన్యంబు= (తమ తమ) సైన్యాన్ని; క్రూర+ఉద్ధతిన్= భయంకరమైన ఔద్ధత్యంతో; చించెన్= చీల్చివేశాడు; చించినన్= చీల్చి చెండాడగా (చూచి విరాటద్రుపదులు); భూరిబాహాబలంబు= ఈ మా గొప్ప బాహుబలం; ఇస్సీ= వ్యర్థం; ఇంకన్= మళ్ళీ; ఎన్నఁటికిన్= ఏనాటికి; అంచున్= అంటూ; కూడి= ఆ ఇద్దరు కలిసి; కడంగి= పూనుకొని; నొంపన్= బాణాల వర్షంతో నొప్పించగా; కుపితుండు+ఐ= కోపం గలవాడై (ఆ ద్రోణాచార్యుడు); మత్స్యభూవల్లభున్= మత్స్య దేశపురాజైన విరాటుడిని; పాంచాలక్షితినాథున్= పాంచాలదేశపురాజైన ద్రుపదుడిని (వీరిద్దరిని); దర్పస్ఫూర్తి= బాహుబలదర్పంయొక్క స్ఫురణం; శోభిల్లఁగన్= శోభిస్తూ ఉండే విధంగా; తునిమెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** (ఆ ద్రోణాచార్యుడు) శత్రులకు భయం కలిగించే ఔద్ధత్యంతో వాడి అయిన బాణాల పరంపరలు వర్షించి, ఆ సైన్యాన్ని చీల్చి చెండాడాడు. విరాట ద్రుపదులు 'ఇప్పుడు గాక మరెప్పుడు మా బాహుబలాల ఉపయోగం?' అని మనస్సులో భావించి, మిక్కిలి క్రోధోత్సాహాలతో ద్రోణుడిని ఎదుర్కొని అతడిపై బాణవర్షాన్ని కురిపించగా, దానితో ద్రోణాచార్యుడు మిక్కిలి కోపించి, వెంటనే తన బాహుబల గర్వం ప్రకాశించే విధంగా విక్రమించి విరాట ద్రుపదులను నేలగూల్చాడు.

**వ. ఇవ్విధంబున విరాటద్రుపదులు పడినం జూచి ధృష్టద్యుమ్నుండు 'ద్రోణుం జంప నయితినేనిం గులాచార ధర్మంబులకుఁ దప్పినవాఁడ నగుదు' నని పలువురు విన బాస యిచ్చి పాంచాల సేనా సమన్వితుండై యతని పయిం గవిసినం గురుపతి గర్ణాదులుం దానును నడ్డపడి పెనంగెఁ; బెనంగినం దవులం బడిన యా ద్రుపదనందనుం గనుంగొని యనిలతనయుం డదల్చి 'నన్నుఁ జూడు' మనుచు నడరిన నప్పార్షతుండును గూడికొనిన నక్కౌరవేశ్వరుండును బరవసంబు సేయుటయు, నుభయ బలంబులుం బురికొని తలపడిన సంకుల సమరం బయ్యెఁ; నంత. 284**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; విరాట ద్రుపదులు= విరాటరాజు, ద్రుపదరాజు (వీరిద్దరు); పడినన్= పడిపోగా (సంహరింపబడగా); చూచి= గమనించి; ధృష్టద్యుమ్నుండు= ద్రుపదుడి కుమారుడు ధృష్టద్యుమ్నుడు; ద్రోణున్= ద్రోణాచార్యుడిని; చంప నయితి నేనిన్= చంపక పోయినట్లయితే; కుల+ఆచార ధర్మంబులకున్= వంశపరంపరగా వచ్చిన కులాచారాలకు, ధర్మాలకు కూడ; తప్పినవాఁడను+అగుదును= అతిక్రమణ చేసిన వాడిని అవుతాను; అని= ఈ విధంగా; పలువురు= అనేకులు; వినన్= వింటూ ఉండగా; బాస+ఇచ్చి= మాట ఇచ్చి (ప్రతిజ్ఞచేసి); పాంచాలసేనా సమన్వితుండు+ఐ= పాంచాల సైన్యంతో కూడుకొన్నవాడై; అతని పయిన్= ఆ ద్రోణాచార్యుడిపైకి; కవిసినన్= ఉరుకగా; కురుపతి= దుర్యోధనుడు; కర్ణ+ఆదులున్= కర్ణుడు మొదలైన వారు; తానును= తాను (ఆ దుర్యోధనుడు స్వయంగా); అడ్డపడి= (అటువైపు వెళ్ళకుండా) అడ్డంవచ్చి; పెనంగెన్= పోరాడారు; పెనంగినన్= (వారు అడ్డగించి తనపై) పోరాటం సాగించగా; తవులన్+పడిన= వారినే తగుల్కొని ఉన్న (అనగా తదేక దీక్షతో వారితోనే యుద్ధానికి దిగుతున్న); ఆ ద్రుపదనందనున్= ఆ ధృష్టద్యుమ్నుడిని; కనుంగొని= చూచి; అనిల తనయుండు= వాయుపుత్రుడైన భీముడు; అదల్చి= గద్దించి; నన్నున్= నన్ను (భీముడిని); చూడుము+అనుచున్= చూడుము అంటూ; అడరినన్= ద్రోణాచార్యుల వైపు (భీముడు) విజృంభిస్తూ ఉండగా; ఆ+పార్షతుండును= ఆ ధృష్టద్యుమ్నుడు కూడ; కూడికొనినన్= (భీముడితో) కలియగా; ఆ+కౌరవ+ఈశ్వరుండును= ఆ దుర్యోధనుడు కూడ; బరవసంబు= (తన సైన్యానికి) ఉత్సాహం; చేయుటయున్= కలుగజేయగా; ఉభయ బలంబులున్= ఇరువైపులలోని సైన్యాలు; పురికొని= విజృంభించి; తలపడినన్= యుద్ధానికి తలపడగా; సంకుల సమరంబు= ఒకదానిలో నొకటి చొచ్చుకపోయి సాగిన అనగా భయంకరమైన యుద్ధం - సామూహిక యుద్ధం; అయ్యెన్= అయ్యింది; అంతన్= ఆ సమయాన.

**తాత్పర్యం:** ఈవిధంగా విరాటరాజూ, తన తండ్రి ద్రుపదరాజూ హతులై పడిపోవటాన్ని చూచి ధృష్టద్యుమ్నుడు, 'ఇదిగో నేను ద్రోణుడిని సంహరించకపోతే మా కులక్రమాగతములైన ఆచారాలను, ధర్మాలను అతిక్రమించినవాడనే ఔతాను' అని అక్కడి వారందరూ వినేటట్లు ప్రతిన బూని, పాంచాల సైన్యాన్ని వెంట తీసికొని, ద్రోణుడిపైకి యుద్ధానికి వెళ్ళాడు. అది గమనించి దుర్యోధనుడు - కర్ణుడు మొదలైన వారితో వెళ్ళి అడ్డగించి ధృష్టద్యుమ్నుడితో యుద్ధం సాగించాడు. ధృష్టద్యుమ్నుడు ముందుకు సాగక, వారితో యుద్ధం సాగిస్తూ ఉండగా, భీమసేనుడు చూచి ధృష్టద్యుమ్నుడిని గద్దించి, తనను అనుసరించు మని చెప్పి, ద్రోణుడి వైపు విజృంభిస్తూ ఉండగా, ఆ ధృష్టద్యుమ్నుడు

కూడా భీముడితో కలిసి విజృంభించాడు. ఇక దుర్యోధనుడు తన సైన్యాన్ని పురికొల్పాడు. అప్పుడు ఆ రెండు సైన్యాలు ఒకదానితో మరొకటి చొచ్చుకొని పోయి, యుద్ధం చేయసాగాయి. యుద్ధం భయంకరంగా నడిచింది. ఆ సమయంలో.

**విశేషం:** భీముడు ధృష్టద్యుమ్నుడిని గద్దించిన తీరు మూలంలో ఇట్లా ఉన్నది.

శ్లో॥ ద్రుపదస్య కులే జాతః సర్వాస్త్రే ష్వస్త్ర విత్తమ ।
కః క్షత్రియో మన్యమానః ప్రేక్షేతారిమవస్థితమ్ ॥
పితృపుత్ర వధం ప్రాప్య పుమాన్ కః పరిపాలయేత్ ।
విశేషతస్తు శపథం శపిత్వా రాజసంసది ॥
ఏష వైశ్వానర ఇవ సమిద్ధః స్వేన తేజసత్ ॥
శరచాపేంధనో ద్రోణః క్షత్రం దహతి తేజసా ॥
పురాకరోతి నిశ్శేషాం పాండవానా మనీకినీమ్ ।
స్థితాః పశ్యత మే కర్మ ద్రోణమేవ వ్రజామ్యహమ్ ॥ (ద్రోణ - 186/51-55)

(పురాకరోతి= సద్యః కరిష్యతీత్యర్థః -యావత్పురానిపాతయో ర్లట్ - ఇతి లట్ 'పురాకరోతి' అనగా తొందరగా చేయగలడు అని అర్థం - ఇది విశేషార్థ యోగం

(ధృష్టద్యుమ్నుడిని భీముడు గద్దించట మేమి? అనే సందేహ నివృత్తికై ఈ అంశ మిక్కడ ప్రస్తావించబడింది.)

**క. విరియించి తామరలలో । నరుణాంశులు సొచ్చి సుభగ మగు సౌందర్య**
**స్ఫురణము నొందఁగఁ దోఁచెం । దరణి యుదయ శిఖరిమీఁద ధరణీనాథా! 285**

**ప్రతిపదార్థం:** ఓ ధరణీనాథా! ఓ ధృతరాష్ట్ర మహారాజా!; తరణి= సూర్యుడు; విరియించి= వికసింపజేసి; తామరలలోన్= కమలాలలో; అరుణ+అంశులు= ఎర్రని కిరణాలు; చొచ్చి= ప్రవేశించి; సుభగమగు= భాగ్యవంతమైన; సౌందర్య స్ఫురణము= సౌందర్యశోభను; అందఁగన్= పొందేవిధంగా; ఉదయ శిఖరిమీఁదన్= తూర్పుకొండమీద; తోఁచెన్= ఉదయించాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! పద్మాలలో ఎర్రని కిరణాలు ప్రవేశించి అవి అందంగా ప్రకాశించేటట్లు వికసింపచేసి, సూర్యుడు తూర్పుకొండమిాద ఉదయించాడు.

**వ. అప్పుడు రెండు దెఱంగుల జనంబులుం గాలోచిత కృత్యంబులు సలిపి క్రమ్మఱఁ గయ్యంబు సేయం దొడంగిరి; ప్రొద్దెక్కిన నెండ తాఁకును రేయింటి యలజడియు నప్పటి యాఁకలియు నొడళ్ళు డిల్లపడం జేసినను మొగంబులు వెడంగు పఱపినను బొలివోని పౌరుషంబుల నయ్యిరువాఁగునుం గడంగి కలయన్ బెరసి పెనంగు నా రభసంబునం బెల్లెసఁగు ధూళికతంబునం బోయిన రాత్రి మగుడ వచ్చె నను బుద్ధి యెల్లవారికిం బుట్టె; నట్టియెడ ద్రోణ ధనంజయులు మిసిమింతులుగాక సేనలం జీకాకు పడనీక పొదివి పోరించిరి; బెట్టిదంబు లగు వివిధాస్త్ర శస్త్ర పాతంబులం గరి తురగ పదాతి వ్రాతంబుల శరీరంబులం దొరంగు రుధిరం బారేఁబువు నడంచిన కొలఁది నిలువక బహుల ప్రవాహంబుల నుత్పాదించె; నార్పులు బొబ్బలుం బోట్ల నొఱలు చప్పుళ్ళను జిందంబుల మ్రోఁతయు బెరసి పరఁగి నలుదిక్కులుం బిక్కటిల్లె; నా సమయంబున. 286**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో అనగా సూర్యోదయం కాగానే; రెండు తెఱంగుల జనంబులున్= రెండువైపులనున్న జనులు; కాల+ఉచిత కృత్యంబులు= ఆ కాలానికి తగిన దంతధావనాది క్రియలను; సలిపి= చేసి; క్రమ్మఱన్= మళ్ళీ; కయ్యంబు= యుద్ధం; చేయన్+తొడంగిరి= చేయబూనారు; ప్రొద్దు+ఎక్కినన్= పొద్దెక్కుతూ ఉంటే; ఎండతాఁకును= ఎండదెబ్బ; రేయింట+అలజడియును= రాత్రి (నిద్రలేకపోవటం చేత కలిగిన) అలసట; అప్పటి+ఆఁకలియున్= అప్పుడు కలిగిన ఆకలి (ఇవన్నీ కలిసి); ఒడళ్ళు= శరీరాలను; డిల్లపడన్+చేసినను= బలహీనపరచినప్పటికి; మొగంబులు= ముఖాలను; వెడంగు పఱిపినను= వికృతం చేసినప్పటికి కూడ; పొలివోని పౌరుషంబులన్= తరిగిపోని పరాక్రమాలతో; ఆ+ఇరువాఁగునున్= ఆ రెండు సైన్యాలు కూడ; కడంగి= యుద్ధానికి పూనుకొని; కలయన్= రెండు ఒకటిగా కలిసిపోయే విధంగా; బెరసి పెనంగు+ఆ రభసంబునన్= మిక్కిలి పోరాడే ఆ వేగంతో; పెల్లు+ఎసఁగు ధూళికతంబునన్= అధికంగా వ్యాపించిన దుమ్ము కారణాన; పోయినరాత్రి= గతించిన రాత్రి; మగుడన్= మళ్ళీ; వచ్చెను+అను బుద్ధి= వచ్చింది అనే తలంపు; ఎల్లవారికిన్= అందరికీ; పుట్టెన్= కలిగింది; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ద్రోణ ధనంజయులు= ద్రోణాచార్యులు, అర్జునుడు (వీరిద్దరు); మిసిమింతులు+కాక= అలసిపోయిన వారు కాకుండా (అలసిపోక ఉత్సాహాన్ని చూపిస్తూ); సేనలన్= తమ తమ సైన్యాలను; చీకాకు పడనీక= చెదరి పోనీయక; పొదివి= ఉంచి; పోరించిరి= యుద్ధం చేయించారు; బెట్టిదంబులు+అగు= భయంకరంగా ఉన్నట్టి; వివిధ+అస్త్ర శస్త్ర పాతంబులన్= పలు విధాలైన అస్త్రశస్త్రాల పైపాటులతో; కరి= ఏనుగులయొక్క; తురగ= గుర్రాలయొక్క; పదాతి= కాలుబలంయొక్క; వ్రాతంబుల= (ఈ మూడింటి) సమూహాలయొక్క; శరీరంబులన్= శరీరాలనుండి; తొరంగు రుధిరంబు= ప్రవహిస్తూ ఉన్న రక్తం; ఆ రేణువును= ఆ ధూళిని; అడంచిన కొలఁది= అణచి వేసేటంత మేరకు; నిలువక= ఆగిపోక (ఇంకా); బహుల ప్రవాహంబులన్= అనేక (రక్త) ప్రవాహాలను; ఉత్పాదించెన్= పుట్టించింది (ఏ ధూళి అయితే సర్వత్ర వ్యాపించి రాత్రి భ్రాంతిని కలుగజేసిందో అంతటి ధూళిని కూడా కరితురగ పదాతి దళాల క్షతగాత్రాల నుండి పడిన రక్తం మటుమాయం చేసి, అంతటితో ఆగిపోక ఇంకా ఎన్నో రక్తప్రవాహాలను పుట్టించిందని భావం); ఆర్పులు= సింహనాదాలు; బొబ్బలున్= పెద్ద పెద్ద కేకలు (ఆర్తనాదాలు); పోట్లన్= ముష్ట్యా ఘాతాల వలన; ఒఱలు= కలిగిన; చప్పుళ్ళును= ధ్వనులు; చిందంబుల మ్రోఁతయున్= శంఖనాదాలు; బెరసి= కలసిపోయి; పరఁగి= వ్యాపించి; నలుదిక్కులున్= నాల్గు దిక్కులు; పిక్కటిల్లెన్= నిండాయి; ఆ సమయంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ సూర్యోదయ కాలంలో రెండు వైపుల ఉన్న వారందరు కాలోచితకృత్యాలను నిర్వర్తించుకొని మళ్ళీ యుద్ధానికి పూనుకొన్నారు. పొద్దెక్కింది. ఎండ దెబ్బ, మరియు రాత్రి నిద్రలేకపోవటం. ఆకలి సమయం - ఇవన్నీ కలిసి వాళ్ళ శరీరాలను క్రుంగదీశాయి. మొగాలు వికృతంగా తోచాయి. అయినా యుద్ధం ఎడతెగకుండా, పౌరుషం కనపరుస్తూ చేస్తూనే ఉన్నారు. ఆ యుద్ధవేగం వలన పెద్ద ధూళి చెలరేగింది. పోయిన రాత్రి తిరిగి వచ్చిందా అనే భ్రాంతి కలిగింది ఆ సైనికులందరికీ. ఆ సమయంలో ద్రోణాచార్యులు, అర్జునుడు అలసిపోకుండ తమ తమ సైన్యాలు చెదరిపోకుండా కట్టుదిట్టం చేసి యుద్ధం సాగేటట్లు చేశారు. భయంకరాలైన వివిధశస్త్రాస్త్రాలు మీద పడడంవల్ల గజ అశ్వ పదాతిదళాల శరీరాలనుండి ప్రవహించే నెత్తురు ఆ ధూళిని అణగించేకొలది నిలువక' ఇంకా ఆ నెత్తురు ఎన్నో పాయలుగా ప్రవహిస్తూనే ఉన్నది. సింహనాదాలు, పెద్ద కేకలు (ఆర్తనాదాలు) పిడికిళ్ళు, గుద్దుల చప్పుళ్ళు, శంఖనాదాలు- వీటన్నింటితో దిక్కులన్నీ పిక్కటిల్లాయి. ఆ సమయంలో.

**తే.** **పతియు యువరాజుఁ గవలను బార్థుఁ గురుఁడు। భీముఁ గర్ణుఁడుఁ దాఁకి రుద్దామ లీల**
**వారి రథ బహుగతులు దుర్వార విశిఖ। విసరణంబులు నద్భుత విధము లయ్యె.** 287

**ప్రతిపదార్థం:** పతియున్= రాజైన దుర్యోధనుడు; యువరాజున్= యువరాజైన దుశ్శాసనుడు (వీరిద్దరు); కవలను= నకుల సహదేవులను; గురుఁడు= విద్యాగురువైన ద్రోణాచార్యుడు; పార్థున్= అర్జునుడిని; కర్ణుఁడు= కర్ణుడు; భీమున్= భీముడిని; ఉద్దామలీలన్= భయమును కలిగించే విధంగా; తాఁకిరి= ఎదుర్కొన్నారు; వారి రథ బహుగతులు= వారి రథాల పలు పోకడలు;

దుర్వార= నివారింపరాని; విశిఖ= బాణాలయొక్క; విసరణంబులు= ప్రయోగాలు; అద్భుత విధములు= అచ్చెరువు గొలిపే విధానాలు కలిగినవై; అయ్యెన్= అయినవి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు నకులుడిని ఎదిరించగా, దుశ్శాసనుడు సహదేవుడిని ఎదిరించి పోరాడాడు. ఇక ద్రోణాచార్యుడు అర్జునుడితో పోరు సలిపాడు. కర్ణుడు భీముడితో యుద్ధం చేశాడు. వీరందరి యుద్ధం భయంకరంగా సాగింది. వారిరథాల పోకడలు వారి బాణప్రయోగాలు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించాయి.

**క.** **నకులుఁడు నృపతియు నొక్కం । డొకనిం జుట్టుకొని వచ్చు నొప్పును బలుపుం**
**బ్రకటీకృత శౌర్యమ్మును । సకలజనముఁ బ్రస్తుతించె జగతీనాథా!** **288**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నకులుఁడు= మాద్రి కుమారుడు నకులుడు; నృపతియున్= రాజైన దుర్యోధనుడు; ఒక్కండు+ఒకనిన్= ఒకరు మరియొకరిని; చుట్టుకొని వచ్చు+ఒప్పును= చుట్టుముట్టి యుద్ధంచేసే తీరును; బలుపున్= బలాన్ని; ప్రకటీకృత శౌర్యమ్మును= ప్రదర్శించబడిన పరాక్రమాన్ని (యుద్ధంలో చూపిన పరాక్రమాన్ని); సకల జనము= సమస్త జనం; ప్రస్తుతించెన్= ప్రశంసించింది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! నకులుడు, దుర్యోధనుడు - వీరిద్దరూ యుద్ధంలో ఒకరికొకరు చుట్టుముట్టి వచ్చే తీరు, బలము, ప్రదర్శించబడిన పరాక్రమం-వీటిని సమస్త జనుల ప్రశంసించారు.

**క.** **విను సహదేవుఁడు దుశ్శా । సనుసూతునిఁ దునుమ, నతఁడు సారథికృత్యం**
**బును జలుపుచు నేయుచుఁ గవి । సిన నాతఁడు నొంపఁ బఱచెఁ జెడి తురగంబుల్.** **289**

**ప్రతిపదార్థం:** విను= ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇంకా వినుము; సహదేవుఁడు= మాద్రి రెండవ పుత్రుడు (యమళుడు) సహదేవుడు; దుశ్శాసను సూతునిన్= దుశ్శాసనుడి యొక్క సారథిని; తునుమన్= సంహరించగా; అతఁడు= ఆ దుశ్శాసనుడే; సారథి కృత్యంబును= సారథి చేయవలసిన పని రథాన్ని నడపటం - దానిని కూడ; చలుపుచున్= చేస్తూ; ఏయుచున్= యుద్ధాన్ని చేస్తూ; కవిసినన్= (సహదేవుడిని) ఎదిరించగా; ఆతఁడు= ఆ సహదేవుడు; నొంపన్= (బాణాలతో) బాధించగా; చెడి= ఆ బాధకు తాళలేక శక్తి కోల్పోయి; తురగంబుల్= గుర్రాలు; పఱచెన్= పరుగులు తీశాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! సహదేవుడు దుశ్శాసనుడి సారథిని సంహరించగా, వెంటనే దుశ్శాసనుడు తానే రథం నడుపుకొంటూ, బాణాలు ప్రయోగిస్తూ విజృంభించగా, సహదేవుడు గుర్రాలను నొప్పింపగా, అవి బాధకు తట్టుకోలేక పరుగులు తీశాయి.

**విశేషం:** సంస్కృత మూలంలో ఈ దుశ్శాసనుడు సారథి లేక యుద్ధం చేసేటప్పటి స్థితి మనోహరంగా చిత్రించబడింది. (సం. మహాద్రోణ. 188/7-8 గోరఖ్‌పూర్ ప్రతి).

**ఉ.** **భీముఁడుఁ గర్ణుఁడుం గదిసి భీమసముద్ధతి నేటులాడి రు**
**ద్దామ గదానిపాతన విధంబులు నప్పుడు గల్గె నయ్యెడన్**
**భీముని వాజులన్ రయము పెంపునఁ గర్ణుఁడు గూల్చె మార్గణ**
**స్తోమమునం గురుప్రతతి చూడ్కులకుం బ్రమదం బొనర్చుచున్.** **290**

**ప్రతిపదార్థం:** భీముఁడును= భీముడు; కర్ణుఁడును= కర్ణుడు; కదిసి= (ఒకరి నొకరు) ఢీకొని; భీమసముద్ధతిన్= భయంకరమైన దర్పంతో; ఏటులాడిరి= యుద్ధంచేశారు; అప్పుడు= ఆ సమయంలో; ఉద్దామ గదానిపాతన విధంబులు= భయంకర గదాయుద్ధంలోని దెబ్బల విధానాలు; కల్గెన్= కలిగినవి; (కర్ణభీములిద్దరు మొదట ధనుర్యుద్ధం చేసి, తరువాత కొంతసేపు గదాయుద్ధానికి పూనుకొన్నారని మూల సంస్కృతంలో ఉన్నది); ఆ+ఎడన్= ఆ సమయంలో; కర్ణుఁడు; భీముని వాజులన్= భీముడి అశ్వాలను; రయము పెంపునన్= వేగాధిక్యంతో; మార్గణస్తోమమునన్= (ప్రయోగించిన) బాణాల సమూహంతో; కురు ప్రతతి చూడ్కులకున్= కురువీరుల చూపులకు; ప్రమదంబు= సంతోషాన్ని; ఒనర్చుచున్= కలుగజేస్తూ; కూల్చెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** భీముడు, కర్ణుడు ఢీకొని భయంకరంగా యుద్ధం చేశారు. తరువాత వారిద్దరికి గదాయుద్ధం సాగింది. వారొకరిపై మరియొకరు గదలు ప్రయోగించే తీరు భయంకరమై తోచింది. అప్పుడు కర్ణుడు వేగంగా బాణాల వర్షం కురిపించి, కురువీరులందరికి హర్షాన్ని కలిగిస్తూ భీముడి రథాలను నేలగూల్చాడు.

### ద్రోణార్జునుల ద్వంద్వ యుద్ధము (సం. 7-163-20)

**వ. పవననందనుండు నకులస్యందనం బెక్కె; గురుండును గిరీటియు వివిధ బాణాసారంబుల నంబరంబు గప్పుచు సమరవిహారంబు సలిపి; రట్టియెడ.** 291

**ప్రతిపదార్థం:** పవన నందనుండు= వాయుపుత్రుడు భీముడు; నకుల స్యందనంబు= (కర్ణుడిచే, తన అశ్వాలు సంహరించబడి రథం లేకపోవటంచేత) నకులుడి రథాన్ని; ఎక్కెన్= ఆరోహించాడు; గురుండును= ద్రోణాచార్యుడు; కిరీటియున్= అర్జునుడు (వీరిద్దరు); వివిధ బాణ+ఆసారంబులన్= అనేక విధాలైన బాణాల ధారల వర్షాలతో; అంబరంబు= ఆకాశాన్ని; కప్పుచున్= కప్పివేస్తూ; సమర విహారంబు= యుద్ధవిహారాన్ని; సలిపిరి= చేశారు; అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** కర్ణుడు తన అశ్వాలను నేలగూల్చిన వెంటనే భీముడు తన రథాన్ని విడిచి, సహదేవుడి రథంపైకి వెళ్ళాడు. ద్రోణార్జునులు బాణవర్షాలతో ఆకాశాన్నే కప్పివేస్తూ యుద్ధం చేశారు. అప్పుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**క. గురుఁ డేయ నరుఁడు ద్రుంపఁగ । నరుఁ డేయఁగ గురుఁడు ద్రుంప నానావిశిఖ**
**స్ఫురణ పరిహరణముల క । చ్చెరు వందుచు నుండి రుభయసేనల జనముల్.** 292

**ప్రతిపదార్థం:** గురుఁడు= ఆచార్యుడు ద్రోణుడు; ఏయన్= బాణాలు వేయగా; నరుఁడు= అర్జునుడు (ఆ బాణాలను); త్రుంపఁగన్= ఖండించి వేయగా; నరుఁడు= అర్జునుడు; ఏయన్= బాణాలు వేయగా; గురుఁడు= ఆచార్యుడు (వాటిని); త్రుంపఁగన్= ఖండించగా; నానా విశిఖ స్ఫురణ పరిహరణములకున్= అనేకములైన బాణాల స్ఫురణ పరిహరించటానికి - ఒకరు ప్రయోగించగా మరియొకరు పరిహరించుట అని భావం; ఉభయసేనల జనముల్= రెండు సైన్యాలలోని జనులు; అచ్చెరువు= ఆశ్చర్యాన్ని; అందుచున్+ఉండిరి= పొందుతూ ఉన్నారు.

**తాత్పర్యం:** ద్రోణార్జునుల యుద్ధం ఉభయ సైన్యాలు ఆశ్చర్యపడే విధంగా సాగింది. ఆచార్యుడు ప్రయోగించిన బాణాలను శిష్యుడు అర్జునుడు ఖండించాడు. అర్జునుడు ప్రయోగించిన బాణాలను ద్రోణుడు ఖండించి వేశాడు. వివిధ బాణాలు మెరుస్తున్నట్లె మెరిసి, మరుక్షణంలో కనిపించకుండాపోవటానికి జనులందరు ఆశ్చర్యపోయారు.

**విశేషం:** 'నానా విశిఖ స్ఫురణ పరిహరణము' శబ్దప్రయోగం ఆశ్చర్యస్ఫోరకం.

**చ. దొరఁకొని దివ్యబాణములు ద్రోణుఁడు బల్విడి నైంద్ర మాదిగా**
**నరుపయి నేయ నాతఁడు మనంబునఁ గొంకక తత్తదస్త్రము**
**ల్వెరవున నేసి యేసి యఫలీకరణం బొనరించి పేర్చుఁ ద**
**ద్వర శరజాలమున్ గురునివారితమై యడఁగుం బొరిం బొరిన్. 293**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; ఐంద్రము+ఆదిగాన్= ఇంద్రదేవతాకమైన అస్త్రాన్ని 'ఐంద్రము' అని అంటారు- ఆ దివ్యాస్త్రం మొదలుగా గల; దివ్యబాణములు= దివ్యాస్త్రాలను; దొరఁకొని= యత్నించి - ప్రయత్నపూర్వకంగా; బల్విడిన్= వేగంగా; నరుపయిన్= అర్జునుడిపై; ఏయన్= ప్రయోగించగా; ఆతఁడు= ఆ అర్జునుడు; మనంబునన్= మనస్సులో; కొంకక= సంకోచపడక; తత్తద్+అస్త్రముల్= ఆయా దివ్యాస్త్రాలను; వెరవునన్= నేర్పుతో; ఏసి+ఏసి= శీఘ్రంగా ప్రయోగించి (ద్విరుక్తి శీఘ్రతా సూచనార్థం); అఫలీకరణంబు+ఒనరించి= వైఫల్యాన్ని కలుగజేసి (ఆ దివ్యాస్త్రాలను ప్రత్యస్త్రాలతో నివారించి); పేర్చున్= విజృంభిస్తాడు; తద్వర శరజాలమున్= ఆ అర్జునుడి దివ్యాస్త్ర సమూహం కూడ; గురు నివారితము+ఐ= ద్రోణాచార్యుడిచే నివారించబడినదై; పొరింబొరిన్= మాటిమాటికీ; అడఁగున్= అణగిపోతుంది.

**తాత్పర్యం:** ద్రోణుడు ఇంద్రదేవతాకమైన ఐంద్రాస్త్రం మొదలైన దివ్యాస్త్రాలను అర్జునుడిపై ప్రయోగించగా, అర్జునుడు జంకక, వెంటనే ఆ దివ్యాస్త్రాలకు ప్రత్యస్త్రాలను ప్రయోగించి వ్యర్థచేసి విజృంభించసాగాడు. అట్లాగే అర్జునుడు ప్రయోగించే దివ్యాస్త్రాలను ద్రోణుడు వెనువెంటనే ప్రత్యస్త్రాలతో నివారించాడు.

**విశేషం:** ఆయా దేవతా మంత్రసిద్ధితో సిద్ధించి ఎప్పు డవసరమై ఉంటే అప్పుడు ఆ దేవతామంత్రం జపించి ప్రయోగిస్తే చాలు తమ తమ సామర్థ్యం చూపేవి ఈ దివ్యాస్త్రాలు - వాయవ్యాస్త్రం, ఆగ్నేయాస్త్రం, వారుణాస్త్రం, బ్రహ్మాస్త్రం, పాశుపతాస్త్రం, ఐంద్రాస్త్రం మొదలైనవి - ప్రత్యస్త్రాలంటే? - ఆగ్నేయాస్త్రం అగ్నిని వర్షించేది, దానికి వారుణాస్త్రం - జలాన్ని వర్షించేది ప్రత్యస్త్రం. ఇట్లెన్నో దివ్యాస్త్రాలు రామాయణ భారతాలలో వర్ణించబడ్డాయి.

**వ. ఇట్లు సదృశంబులగు శస్త్ర బల బాహు వీర్యశౌర్యంబు లసదృశంబుగాఁ బోరు నగ్గురు శిష్యుల నుపలక్షించి సుర ఖచర విద్యాధరులు దమలోన. 294**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; సదృశంబులు+అగు= సమానమై ఉన్నట్టి; శస్త్రబల బాహువీర్య శౌర్యంబు= శస్త్రబలం అనగా దివ్యశస్త్రాస్త్ర బలం, బాహువీర్యమనగా బాహుబలం, శౌర్యమనగా పరాక్రమం - ఈ మూడు గుణాలును; అసదృశంబుగాన్= సాటిలేని విధంగా; పోరు+ఆ+గురుశిష్యులన్= యుద్ధం చేసే ఆ గురుశిష్యులైన ద్రోణార్జునులను; ఉపలక్షించి= చూచి; సుర ఖచర విద్యాధరులు= దేవతలు ఆకాశసంచారులైన ఋషులు, సిద్ధులు మొదలైనవారు మరియు విద్యాధరులు; తమలోనన్= తమ మనస్సులలో.

**తాత్పర్యం:** ఈ విధంగా గురుశిష్యులైన ద్రోణార్జునులు సమానదివ్యశస్త్రాస్త్రబలంతో, బాహుబలంతో, పరాక్రమంతో ప్రదర్శించారు. సాటిలేని విధంగా పోరే ఆ గురుశిష్యులను చూచి దేవతలు, ఆకాశ సంచారులైన విద్యాధరులు చూచి,

**విశేషం:** సుర ఖచర విద్యాధరులు అనే సమాస పదంలోని ఖచర పదం మహార్థం కలది. ఖచరులు అనగా ఆకాశాన సంచరించే స్వభావం గల ఋషులు సిద్ధులు, మొదలైనవారు. ఈ అర్థమే మూలానుగుణమయినది చూడండి.

శ్లో॥ తతోऽంతరిక్షే దేవాశ్చ గంధర్వాశ్చ సహస్రశ ।
ఋషయః సిద్ధ సంఘాశ్చ వ్యతిష్ఠంత దిదృక్షయా ॥
తదప్సరోభిరాకీర్ణం యక్షగంధర్వ సంకులమ్ ।
శ్రీమదాకాశ మభవద్ భూయో మేఘాకులం యథా ॥

(ద్రోణ. 188/34 మరియు విద్యాధర పదం గంధర్వాదుల కుపలక్షకం).

**క. 'హరుఁడు వినోదార్థముగా । నిరుమే నయి రణ మొనర్చె; నింతియ కా కి**
**ప్పరుసున నక్కజ మగు సం । గర మొనరింపంగ నొరులఁ గంటిమె యెందున్?' 295**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; వినోద+అర్థముగాన్= విలాసానికై; ఇరుమేను+అయి= ద్రోణార్జునులు అనే రెండు శరీరాలు కలవాడయి (ఈ ద్రోణార్జునులు అనే వీరిద్దరూ శివుని రెండు రూపాలే అని భావం); రణము= యుద్ధాన్ని; ఒనర్చెన్= చేశాడు; ఇంతియ= ఇంతే; కాక= కాకపోతే; ఈ+పరుసునన్= ఈ విధంగా; అక్కజము+అగు= ఆశ్చర్యకరమైన; సంగరము= యుద్ధాన్ని; ఒనరింపంగన్= చేస్తూ ఉండగా; ఒరులన్= ఇతరులను; ఎందున్= ఎక్కడనైనా; కంటిమే?= చూశామా? (చూడలేదని భావం, - ఇంతటి గొప్ప యుద్ధం ఆ శివుడు తప్ప మరెవ్వడు చేయలేడు - కావున ఆ శివుడే ఈ ద్రోణార్జునుల శరీరాలు ధరించి యుద్ధం చేస్తున్నాడని భావం.)

**తాత్పర్యం:** 'శివుడు వినోదార్థం రెండు శరీరాలు ధరించి యుద్ధం చేస్తున్నాడు. అంతేకాని, ఈ విధంగా ఆశ్చర్యకరమైన యుద్ధం ఇతరులు చేయగా ఎక్కడైన చూచామా?

**విశేషం:** ఇంత అద్భుతంగా యుద్ధం చేసే వీరిద్దరు ద్రోణార్జునులు కారు. రెండు వేరు వేరు శరీరాలతో ఉన్న శివుడే అనే అపహ్నవాలంకారం ఇక్కడ వ్యంగ్యంగా భాసిస్తుంది. దీనిచేత వారు చేసిన యుద్ధం గొప్పతనం వివరించినట్లయింది.

**వ. అనుచుండి రప్పుడు. 296**

**ప్రతిపదార్థం:** అనుచుండిరి= (సురఖచర విద్యాధరులు) తమలోన అనుకొన్నారు; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** (సుర ఖచరవిద్యాధరులు ఆ యుద్ధం చూచి తమలో) అని అనుకొన్నారు. ఆ సమయంలో.

**మ. క్షితియుం బర్వత కోటియున్ వడఁకె నగ్నిచ్ఛాయ లయ్యెన్ దిశ**
**ల్చతురంభోనిధులుం గలంగె భయలోలం బయ్యె దేవవ్రజం**
**బతి సంక్షోభము నొందె నొక్క మొగి సైన్యద్వంద్వమున్ ద్రోణుఁ డు**
**ద్ధతి బ్రహ్మాస్త్రము మౌర్వితో నియతమంత్రస్ఫూర్తి సంధించినన్. 297**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; నియత మంత్రస్ఫూర్తిన్= నియమబద్ధమైన మంత్రస్ఫురణంతో (ఆ బ్రహ్మ దేవతా మంత్రాన్ని మనస్సులో భావించి); బ్రహ్మాస్త్రము= బ్రహ్మాస్త్రాన్ని; మౌర్వితోన్= అల్లెత్రాటితో; ఉద్ధతిన్= ఔద్ధత్యంతో-దర్పంగా; సంధించినన్= సంధించగా; క్షితియున్= భూమి; పర్వతకోటియున్= పర్వతాల సమూహం; వడఁకెన్= కంపించిపోయాయి; దిశల్= దిక్కులు; అగ్నిచ్ఛాయలు+అయ్యెన్= అగ్గివంటి ఎర్రని కాంతి గలవి అయ్యాయి; చతురంభోనిధులున్= నాలుగు సముద్రాలు; కలంగెన్= సంక్షోభం చెందాయి; దేవవ్రజంబు= దేవతల సమూహం; భయలోలంబు= భయకంపితం; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** ద్రోణాచార్యులు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగింప దలచి - నియమపూర్వకంగా మంత్రాన్ని స్మరించి ఆ దివ్యాస్త్రాన్ని మౌర్వితో సంధించటానికి పూనుకొన్న వెంటనే - భూమి, పర్వతాలు వణకిపోయాయి, దిక్కులన్నీ మంటలు చెలరేగాయా అన్నట్లు ఎర్రబారాయి. నాలుగు సముద్రాలూ సంక్షోభించిపోయాయి. దేవతలందరు భయకంపితులయ్యారు. రెండుపక్షాల సైన్యంలోని వారందరు ఒక్క పెట్టున సంక్షోభాన్ని పొందారు.

**వ. ఇట్లు సువిహిత సంధానుండై యతం డమ్మహాస్త్రంబుఁ బ్రయోగించిన. 298**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సువిహిత సంధానుండు+ఐ= శాస్త్రోక్త ప్రకారంగా చేయబడిన అస్త్రమంత్రానుసంధానం కలవాడై; అతండు= ఆ ద్రోణాచార్యులు; ఆ+మహాస్త్రంబున్= ఆ గొప్ప దివ్యాస్త్రాన్ని; ప్రయోగించినన్= ప్రయోగించిన వెంటనే.

**తాత్పర్యం:** ఈ విధంగా శాస్త్రోక్త ప్రకారంగా మంత్రానుసంధానం చేసి, ఆ బ్రహ్మాస్త్రాన్ని ద్రోణాచార్యులు ప్రయోగించగా (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అంతరంగంబునం దొక యింత యేని। యలుకు లేక తనర్చి బ్రహ్మాస్త్రమునన**
**వేడుకకు మరలించిన విధము దోఁప। నద్భుతంబుగ వారించె నర్జునుండు. 299**

**ప్రతిపదార్థం:** అర్జునుండు= అర్జునుడు; అంతరంగంబునందున్= మనస్సులో; ఒకింత ఏని= ఒకింతైనా; అలుకు= భయం; లేక= లేకనే; తనర్చి= ఒప్పి; బ్రహ్మాస్త్రమునన= బ్రహ్మాస్త్రం చేతనే; వేడుకకున్= వినోదానికి; మరలించిన విధము= వెనుకకు పంపిన విధానం - వినోదం కలిగించటానికి నివారించినట్లు; తోఁపన్= స్ఫురించే విధంగా; అద్భుతంబుగన్= ఆశ్చర్యం కలిగే విధంగా; వారించెన్= (ఆ బ్రహ్మాస్త్రాన్ని) నివారించాడు - బ్రహ్మాస్త్రానికి బ్రహ్మాస్త్రమే ప్రత్యస్త్రం - కాబట్టి బ్రహ్మాస్త్రంతోనే దానిని నివారించా డని భావం.

**తాత్పర్యం:** అర్జునుడు మనస్సులో ఏ మాత్రము జంకూ లేకుండా ఆ బ్రహ్మాస్త్రాన్ని నివారించటానికి ప్రత్యస్త్రంగా బ్రహ్మాస్త్రాన్నే విలాసంగా ప్రయోగించి మరలిస్తున్నాడని అనిపించేటట్లు అద్భుతంగా నివారించాడు.

**వ. ఇత్తెఱంగున గెలుపోటమియు లేక యియ్యిరువురుఁ బోరుటయు, నత్తఱిం గెరలిన సందడి కయ్యంబు కతంబున మాని యగ్గురు పార్థులు పాంచాల కౌరవ బలంబులపైఁ దఱిమి; రా సంకుల సమరంబున దుశ్శాసనుండు ధృష్టద్యుమ్నుం దాఁకి యోర్వలేక తొలంగె; నతండు ద్రోణుమీఁదం గవిసినఁ గవలును దోడ్పడం గృతవర్మ యడ్డపడి పెనంగె; సుయోధనుండును సాత్యకియుఁ దార్కొని తమ శైశవ క్రీడలు దలంచి యుగ్గడించి 'రాజధర్మం బిట్టిద కాక' యని తలంచి పోరం జొచ్చి; రట్టి యెడ నా శినివరుండు భూవరువిల్లు ద్రుంచి మేను నొంచిన నోహటించి యొసరించి దప్పిదీర్చికొని మగుడ నమ్మాధవానుజుం దలపడి యెప్పటియట్లు కలంగం జొచ్చినం జూచి రాధేయుఁ డయ్యోధవరుదెసకు నడరినం గని వడముడి యతని మార్కొని తూపులు నిగిడించిన నవి నిలువరించి నవ్వుచు నాతం డవ్వీరు సారథి సొగయను శరాసనంబు దునియలై తొరఁగను జేసిన నా బల్లిదుండు బలుగద ద్రిప్పి బిట్టు వైచిన సూతుండును రథంబును బొడియైననుం దెరలక సూతసుతుండు శరవ్రాతంబు నిగిడించె; నప్పు డనేక చతురంగంబు లెడసొచ్చె; ధర్మతనయుండు మాత్స్యాది బలంబులం బురికొల్పుకొని కుంభసంభవు దిక్కున కురవడించె; నంత మధ్యాహ్నం బగుచు; వచ్చె నా సమయంబున నకుల సహదేవ సమీరనందను లర్జును నుద్దేశించి యెలుం గెత్తి. 300**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; గెలుపు= జయం; ఓటమియున్= పరాజయం; లేక= లేకుండ; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరు (ద్రోణార్జునులు); పోరుటయున్= యుద్ధం చేయటాన్ని; ఆ+తఱిన్= ఆ సమయంలో; కెరలిన= చెలరేగినటువంటి; సందడి కయ్యంబు కతంబునన్= సంకుల యుద్ధం కారణాన; మాని= విరమించుకొని; ఆ+గురుపార్థులు= ఆ ద్రోణాచార్యార్జునులు; పాంచాల కౌరవబలంబులపైన్= పాంచాల సైన్యంపై, కౌరవ సైన్యంపై; తఱిమిరి= విజృంభించారు (ద్రోణుడు పాంచాలసైన్యంపై; అర్జునుడు కౌరవసైన్యంపై, విజృంభించారని క్రమంగా అన్వయం; ఆ సంకుల సమరంబునన్= ఆ సంకుల యుద్ధంలో; దుశ్శాసనుడు; ధృష్టద్యుమ్నున్= ద్రుపద రాజకుమారుడైన ధృష్టద్యుమ్నుడిని; తాఁకి= ఎదిరించి; ఓర్వలేక= ఆ ధృష్టద్యుమ్నుడి ధాటి సహించలేక; తొలంగెన్= (ధృష్టద్యుమ్నుడితో యుద్ధం చేయలేక) వెనుదిరిగి పోయాడు (అప్పుడు); అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; ద్రోణుమీఁదన్= ద్రోణాచార్యుడిపైకి; కవిసినన్= కలియబడగా; కవలును= నకుల సహదేవులు (ఆ ధృష్టద్యుమ్నుడికి); తోడ్పడన్= పృష్ఠరక్షకులై సహాయంచేస్తూ ఉండగా; కృతవర్మ= దుర్యోధన పక్షీయుడైన కృతవర్మ అనే యదువీరుడు; అడ్డపడి= ద్రోణుడికి అడ్డంగా నిలిచి; పెనంగెన్= (ధృష్టద్యుమ్నుడితో) యుద్ధం చేశాడు; సుయోధనుండును= దుర్యోధనుడు; సాత్యకియున్= సాత్యకి (వీరిద్దరు పరస్పరంగా); మార్కొని= యుద్ధానికి తలపడి; తమ శైశవక్రీడలు= తమ బాల్యక్రీడలను; తలంచి= తలచుకొని; ఉగ్గడించి= (ఒకరితో నొకరు) చెప్పుకొని; రాజధర్మంబు= క్షత్రియుల ధర్మం; ఇట్టిది+అ+కాక= ఇటువంటిదే కదా (బంధుత్వాదులను విచారించదని); అని= ఇట్లా; తలంచి= అనుకొని; పోరన్+చొచ్చిరి= యుద్ధం చేయనారంభించారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ శినివరుండు= ఆ సాత్యకి (శిని అనే వాడు సాత్యకి తాత, శిని వంశశ్రేష్ఠుడు కాబట్టి సాత్యకికా పేరు); భూవరువిల్లు= భూపతి అయిన దుర్యోధనుడి ధనువును; త్రుంచి= విరగగొట్టి; మేను= శరీరాన్ని; నొంచినన్= (బాణాఘాతాలతో నొప్పి కలిగించగా); ఓహటించి= వెనుకకుతగ్గి; ఓసరించి= యుద్ధంనుండి తొలగిపోయి; డప్పి= అలసట; తీర్చికొని= పోగొట్టుకొని; కొంచెం విశ్రాంతి తీసికొని అని భావం; మగుడన్= మళ్ళీ; ఆ+మాధవ+అనుజున్= ఆ సాత్యకిని (మాధవు డనగా కృష్ణుడు. అతని సోదరుడు, కాన సాత్యకి మాధవానుజుడు); తలపడి= ఎదుర్కొని; ఎప్పటి అట్లు+అ= ఎప్పటి విధంగా (ఇంతకుముందు యుద్ధం చేసిన విధంగానే); పెనంగన్+చొచ్చినన్= యుద్ధం చేయబూనుతూ ఉండగా; చూచి= కనుగొని; రాధేయుఁడు= రాధాపుత్రుడు కర్ణుడు; ఆ+యోధవరుదెసకున్= యోధశ్రేష్ఠుడైన ఆ సాత్యకి వైపునకు; అడరినన్= విజృంభించగా; కని= చూచి; వడముడి= భీముడు (వడ అనగా తాపము, ముడి అనగా చోటు - శత్రుతాపస్థానము - స్థానభూతుడు అనునది వ్యుత్పత్త్యర్థం - భీముడనే అర్థంలో ప్రసిద్ధి); అతనిన్= ఆ కర్ణుడిని; మార్కొని= ఎదిరించి; తూపులు= బాణాలను; నిగిడించినన్= ప్రయోగించగా; అవి= ఆ బాణాలను; నిలువరించి= తొలగింపజేసికొని; నవ్వుచున్= మందహాసం చేస్తూ (ఇవి నాకొక లెక్కా- అని అనుటే ఆ మందహాసంలోని తాత్పర్యం); అతఁడు= ఆ కర్ణుడు; ఆ+వీరు సారథి= ఆ భీముడి సారథి; సొగయను= మూర్ఛపోయే విధంగా; (మరియు) శరాసనంబు= (ఆ భీముని) ధనుస్సు; తునియలు+ఐ= తునకలై; తొరఁగను= పడిపోయే విధంగా; చేసినన్= చేసిన వెంటనే; ఆ బల్లిదుండు= బలిష్ఠుడైన ఆ భీముడు; బలుగద= దృఢమైన గదను; త్రిప్పి= త్రిప్పి; దృఢంగా (గట్టిగా); వైచినన్= ప్రయోగించగా; సూతుండును= ఆ కర్ణుడి రథసారథి; రథంబును= రథం; పొడి ఐనను= చూర్ణం అయినా కూడా; తెరలక= యుద్ధం నుండి తొలగిపోక; సూతసుతుండు= సూతపుత్రుడు - కర్ణుడు; శరవ్రాతంబు= బాణాల సమూహాన్ని; నిగిడించెన్= వ్యాపింపజేశాడు; అపుడు= ఆ సమయంలో; అనేక చతురంగంబులు= పెక్కులు చతురంగ సైన్యాలు; ఎడసొచ్చెన్= అడ్డంవచ్చాయి; ధర్మతనయుండు= ధర్మరాజు; మాత్స్యాది బలంబులన్= మత్స్య పాంచాలాది సైన్యాలను; పురికొల్పుకొని= ప్రేరేపించుకొని; కుంభసంభవు దిక్కునకున్= ద్రోణాచార్యులవైపు; ఉరవడించెన్= విజృంభించాడు; అంతన్= ఆ సమయానికి; మధ్యాహ్నంబు+అగుచు వచ్చెన్= రెండు జాముల పొద్దు అవుతూ వచ్చింది; ఆ సమయంబునన్= అట్టి సమయాన; నకుల సహదేవ సమీరనందనులు= నకులుడు, సహదేవుడు, వాయుపుత్రుడు అనగా భీముడు - ఈ ముగ్గురు; అర్జునున్+ఉద్దేశించి= అర్జునుడిని గురించి (అర్జునుడితో); ఎలుంగు+ఎత్తి= కంఠస్వరం హెచ్చించి.

**తాత్పర్యం:** ఈ విధంగా జయాపజయాలు అనేవి లేకుండానే ఆ ఇద్దరూ యుద్ధం చేస్తుండగా, అంతలో చెలరేగిన సంకుల యుద్ధం కారణంగా ద్రోణార్జునులు తమ యుద్ధాన్ని మానివేసి, ద్రోణుడు పాంచాల సైన్యం వైపు, అర్జునుడు కౌరవ సైన్యంవైపు యుద్ధానికి దిగారు. ఆ సంకుల సమరంలో దుశ్శాసనుడు ధృష్టద్యుమ్నుడితో పోరాడి,

అతడి ధాటికి తట్టుకొనలేక దుశ్శాసనుడు ఆ యుద్ధంనుండి తొలగిపోయాడు. ఇక ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని ఎదిరించటానికి వెళ్ళగా, నకుల సహదేవులు అతడికి సాయపడగా కృతవర్మ అడ్డుపడి యుద్ధం చేశాడు. దుర్యోధనుడు, సాత్యకి - వీరిద్దరూ యుద్ధానికి తలపడి - తమ తమ శైశవ క్రీడా విశేషాలను జ్ఞప్తికి తెచ్చుకొని చెప్పుకొంటూ, ఇట్లా 'రాజధర్మం ఇట్టిది కదా? అని అనుకొంటూ యుద్ధం చేశారు. అప్పుడు సాత్యకి దుర్యోధనుడి విల్లును తెగగొట్టి శరీరాన్ని గాయపరచగా వెనుకకుతగ్గి తొలగిపోయి, అలసట తీర్చుకొని మళ్ళీ వచ్చి సాత్యకితో ఇంతకు ముందువలె యుద్ధం చేస్తూ ఉండగా, అది చూచి కర్ణుడు. దుర్యోధనుడికి సహాయంగా సాత్యకిపై యుద్ధానికి వెళ్ళాడు. అది చూచి భీముడు కర్ణుడిని ఎదుర్కొని, అతడిపై బాణాలు కురిపించగా, కర్ణుడూ వాటినన్నింటినీ అవలీలగా నిరోధించి, నవ్వుతూ భీముడి సారథిని మూర్ఛ నొందించాడు. విల్లు విరగగొట్టాడు. వెంటనే భీముడు గద గైకొని గిరగిర త్రిప్పివేయగా కర్ణుడి సారథి రథం ముక్కలు అయినా కర్ణుడు యుద్ధంనుండి తొలగక బాణాలు కురిపిస్తూనే ఉన్నాడు. ఇంతలో చతురంగ సైన్యాలు అడ్డువచ్చాయి. ధర్మరాజు మత్స్యదేశం పాంచాలదేశం సైన్యాలను సమాయత్తం చేసికొని ద్రోణుడి పైకి దండెత్తాడు. అంతలో మధ్యాహ్నమైనది. ఆ సమయంలో నకుల సహదేవులు, భీముడు దూరంగా ఉన్న అర్జునుడిని సంబోధిస్తూ గొంతెత్తిబిగ్గరగా (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'కోలు మసఁగి గురుండు పాంచాలసేన । నేలకును గోలకును దెచ్చె; నీవు గడఁగి**
**కౌరవులఁ బాయ పఱపు; మేకతమ యైన । నతనిఁ బరిమార్చుఁ బైకొని యబ్బలంబు.' 301**

**ప్రతిపదార్థం:** గురుండు= ద్రోణాచార్యుడు; కోలు= మిక్కిలి; మసఁగి= చెలరేగి; పాంచాలసేన= పాంచాల సైన్యాన్ని; నేలకును గోలకును తెచ్చెన్= నేల పాల్జేశాడు (సంహరించాడని భావం); గోలకును తెచ్చెన్= హాహాకారధ్వని పాలు చేశాడు (బాణాలతో మిక్కిలి బాధించి పారద్రోలాడు); (కాబట్టి) నీవు= ఓ అర్జునా! నీవు; కడఁగి= విజృంభించి; కౌరవులన్= ద్రోణ రక్షకులై ఉన్న ఆ కౌరవ వీరులను; పాయపఱపుము= తొలగిపోయే విధంగా ఆచరించుము (ఈ విధంగా అందరిని ఎడబాసి); ఏకతము+అ= ఒంటరిగా (క్రియావిశేషణమిది); ఐన+అతనిన్= ఉన్న ఆ ద్రోణాచార్యుడిని; ఆ+బలంబు= ఆ పాంచాలసైన్యం; పైకొని= ఆక్రమించి; పరిమార్చున్= సంహరిస్తుంది.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! ద్రోణాచార్యుడు పాంచాల సైన్యంపై చెలరేగిపోయాడు. సైన్యాన్ని నేల గూలుస్తూ హాహాకారం పుట్టించాడు. కాబట్టి ఆ ద్రోణుడికి రక్షకులైఉన్న కౌరవవీరులపై విజృంభించి పారద్రోలుము. అప్పుడు ఒంటరి అయి నిలిచిన ద్రోణాచార్యుడిని ఆ పాంచాల సైన్యమే ఆక్రమించి సంహరించివేస్తుంది.

**విశేషం:** దీనికి సంస్కృత మూలం ఇది.

**శ్లో॥ యమౌ చ భీమసేనశ్చ ప్రాక్రోశం స్తే ధనంజయమ్ ।**
**అభిద్రవార్జున! క్షిప్రం కురూన్ ద్రోణాదపానుద ।**
**తత ఏనం హనిష్యంతి పాంచాలా హతరక్షిణమ్ ॥** (ద్రోణ. 189/63-64)

2. నేలకున్ గోలకున్ తెచ్చె - అనేటప్పుడు తెచ్చె అనే పదం రెండింటితో అన్వయిస్తుంది. ఇట్లా పదాకృతి చేయటాన్ని అనుషంగం అంటారు.

**వ. అనుచు నయ్యాచార్యుపైఁ గవిసి; రిట్లు పెక్కు బలంబులు గ్రమ్మినఁ బటు ప్రదరజాలంబులు వఱపి పొడిసేయు నమ్మహాత్ము నాలోకించి ధర్మతనయ భీమసేన మాద్రీతనయులు గూడికొని తమలోన. 302**

**ప్రతిపదార్థం:** అనుచున్= ఇట్లా అంటూనే; ఆ+ఆచార్యుపైన్= ఆ ద్రోణాచార్యుడిపై; కవిసిరి= కలియబడ్డారు; ఇట్లు= ఈ విధంగా; పెక్కుబలంబులు= అనేక సైన్యాలు; క్రమ్మినన్= ఆవరించగా; పటు ప్రదర జాలంబులు= శక్తిమంతములైన బాణాల సమూహాలను; పఱపి= వ్యాపింపజేసి; పొడి+చేయు+ఆ+మహాత్మున్= నుగ్గునుగ్గ చేస్తూ ఉన్న - అనగా ఖండిస్తూ ఉన్న - ఆ మహాత్ముడిని అనగా ద్రోణాచార్యుడిని; ఆలోకించి= చూచి; ధర్మతనయ, భీమసేన, మాద్రీతనయులు= ధర్మరాజు, భీముడు, మాద్రి కుమారులు కవలు నకుల సహదేవులు; కూడికొని= కలిసి; తమలోనన్= తమలో.

**తాత్పర్యం:** ఇట్లా అర్జునుడితో ఉచ్చైస్స్వరంతో అంటూనే ద్రోణాచార్యుడిపైకి దూసుకుపోయారు. ఇట్లా ఎన్నో సైన్యాలు చుట్టుముట్టగా ద్రోణాచార్యుడు వాటినన్నింటిని వాడిఅయిన బాణజాలంతో నుగ్గునుగ్గ చేస్తూనే ఉన్నాడు. ఇది గమనించి, ధర్మరాజు, భీముడు, నకుల సహదేవులు తమలో ఇట్లా తలపోసారు.

**మ. 'కరులం గూల్చుచుఁ, దేరులన్ నఱకుచున్, గర్జిల్లి ఘోటమ్ములన్**
**నరులన్ నెత్తుటఁ దేల్చుచున్, దొరల నానారూపఖండంబు లై**
**తొరఁగం జేయుచుఁ గుంభజుండు విలసద్దోర్దండ చండాకృతిం**
**దెరలం బైఁజనుదెంచు నేపు మనలం దీర్పంగ నోపుం దుదిన్. 303**

**ప్రతిపదార్థం:** కరులన్= ఏనుగులను; కూల్చుచున్= కూలదోస్తూ; తేరులన్= రథాలను; నఱకుచున్= నరకివేస్తూ; గర్జిల్లి= సింహనాదం చేసి; ఘోటమ్ములన్= అశ్వాలను (మరియు); నరులన్= సైనికులను; నెత్తుటన్= నెత్తురులో; తేల్చుచున్= తేలుస్తూ; దొరలన్= ప్రభువులను; నానా రూప ఖండంబులు+ఐ= అనేక రూపాలుగల అనగా తల, మొండెము, కాళ్ళు చేతులు అనే రూపాలతోనున్న తునకలై; తొరఁగన్= పడిపోయే విధంగా; చేయుచున్= చేస్తూ; కుంభజుండు= ద్రోణాచార్యుడు; విలసత్+దోర్దండచండ+ఆకృతిన్= ప్రకాశిస్తూ ఉన్న బాహుదండములు గలిగినటువంటి భయంకరమైన ఆకారంతో; తెరలన్= కలగే విధంగా (ఇది క్రియావిశేషణం); పైన్= (మన) పైకి చనుదెంచు+ఏపు= వస్తూ ఉండే విజృంభణం; తుదిన్= చివరకు; మనలన్= మనలనందరిని; తీర్పంగన్+ఓపున్= సంహరించ సమర్థమవుతుంది.

**తాత్పర్యం:** 'ఆ ద్రోణాచార్యుడు గజాలను నేల గూలుస్తూ రథాలను భగ్నం చేస్తూ అశ్వాలను పదాతి దళాలను నెత్తురులో ముంచి తేలుస్తూ మన వీరుల నెందరినో ముక్కలుచేసి వారి తలలు, బాహువులు మొదలైన అవయవాలు అక్కడక్కడ చెదరి పడేటట్లు చేస్తూ. బాహుబలం మెరిసిపోగా భయంకరమైన ఆకారంతో మన పైకే వస్తూ ఉన్న విజృంభణం చూస్తూ ఉంటే తుదకు మనలను కూడా సంహరించే సామర్థ్యం గలదిగా ఉన్నది.

**వ. ఎవ్వరికేని నిలువరింప నలవి గాదు; నరుండును ధర్మపరుండై యూరకున్నవాఁడు; దెగువకుం జొరం' డనుచు దలంకిరి; వారి తెఱంగు గనుంగొని కమలనాభుండు దమతేరు వారల కడకుం గొనిపోయి కిరీటితో నిట్లనియె. 304**

**ప్రతిపదార్థం:** (ఆ, పైఁ జనుదెంచు నేపు) ఎవ్వరికిన్+ఏని= ఎవ్వరికి కూడ; నిలువరింపన్+అలవి+కాదు= ఆపటానికి శక్యంకాదు; నరుండును= అర్జునుడును; ధర్మపరుండు+ఐ= ధర్మాసక్తుడై (గురువధ ధర్మంకాదనిభావించి); ఊరక+ఉన్నవాఁడు= ఊరకున్నాడు- ద్రోణుడిని వధించే ప్రయత్నం చేయటం లేదని భావం; తెగువకున్= ఆ సాహసానికి; చొరండు= పూనుకొనడు;అనుచున్=

ఇట్లా (తమలో తాము) అనుకొంటూ; తలంకిరి= చింతించారు; వారి తెఱంగున్= ఆ ధర్మరాజాదుల తీరు; కనుంగొని= గమనించి; కమలనాభుండు= కృష్ణుడు; తమ తేరు= తమ రథాన్ని; వారల కడకున్= ఆ ధర్మరాజాదుల సమీపానికి; కొనిపోయి= తీసికొనిపోయి; కిరీటితోన్= అర్జునుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఎవ్వరికి కూడా ఆప వీలుకాదు. ఇక అర్జును డందామా? గురువధ ధర్మం కాదని ఆ సాహసానికి పూనుకోక ఊరుకొన్నాడు.' ఇట్లా ధర్మరాజాదులు చింతిస్తూ ఉంటే, అది గమనించిన కృష్ణుడు, వెంటనే తమ రథాన్ని వారున్న వైపునకు తోలుకొని వెళ్ళాడు. వారు వినేటట్లు అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**చ. 'అని మొన దేవ దానవుల కైనను గెల్వ నశక్య మిమ్మహా**
**త్ముని; నొకమందు సెప్పెద; సుతున్ హతుఁ డయ్యె ననంగ విన్న యం**
**తన యితఁ డాయుధంబు దిగఁ ద్రావి యచేష్టతఁ బొందు; నప్పు డీ**
**తనిఁ బరిమార్పవచ్చు; నిది తప్ప నుపాయము గల్గ దెమ్మెయిన్.' 305**

**ప్రతిపదార్థం:** అని మొనన్= రణాగ్రమందు (ఉన్న) - యుద్ధం చేస్తూ ఉన్న; ఈ+మహాత్మునిన్= మహానుభావుడైన ఈ ద్రోణాచార్యుడిని; దేవ దానవులకున్+ఐనను= దేవతలకైనా, రాక్షసులకైనా కూడా; గెల్వన్= జయించటానికి; అశక్యము= శక్యం కాదు (అయినా కూడ అతనిని గెలువటానికి); ఒక మందు= ఒక ఉపాయం; చెప్పెదన్= చెప్పుతాను (అదేమంటే?); సుతున్= తన కుమారుడైన అశ్వత్థామను గూర్చి; (సుతుండు అని పాఠాంతరంలో స్పష్టత ఉన్నది); హతుఁడు+అయ్యెన్= సంహరించబడ్డాడు; అనంగన్= అని అంటూ ఉండేటప్పుడు; విన్న+అంతన్+అ= వినిన వెంటనే; ఇతఁడు= ఈ ద్రోణాచార్యుడు; ఆయుధంబు= తన చేతిలో ఉన్న ఆయుధాన్ని; దిగఁద్రావి= విడిచిపెట్టి; అచేష్టతన్= నిశ్చేష్టత్వాన్ని; పొందున్= పొందుతాడు; అప్పుడు= ఆ సమయంలో; ఈతనిన్= ఈ ద్రోణాచార్యుడిని; పరిమార్పవచ్చున్= సంహరించ వీలవుతుంది; ఇది తప్పన్= ఇదిగాక; ఏ+మెయిన్= ఏ విధంగానూ; ఉపాయము= (వేరే) ఉపాయం; కల్గదు= లేదు.

**తాత్పర్యం:** ఈ ద్రోణాచార్యుడిని యుద్ధంలో గెలువటం దేవతలకు కాని దానవులకు కాని అసాధ్యం. అయినా ఇతడిని జయించటానికి ఒక ఉపాయం చెపుతాను. తన కుమారుడు అశ్వత్థామ సంహరించబడ్డాడని వింటే చాలు, ఆయుధాన్ని విడిచి యుద్ధాన్ని మానివేస్తాడు. ఆ సమయంలో ఇతడిని సంహరించవచ్చును. ఇదితప్ప ఇతడిని సంహరించటానికి మరో మార్గం లేదు.'

**వ. 'కావున నశ్వత్థామ సచ్చె నని యొక్కరుం డతనికిఁ జెప్పుటయ కర్జం' బనిన విని యచ్చటియందఱు 'నిదియ మే' లని; రర్జునుండు దాని కొడంబడక యుండెఁ; బాండవాగ్రజుండు విషాదంబుతో విచారించెఁ; దదనంతరంబ. 306**

**ప్రతిపదార్థం:** కావునన్= కాబట్టి; అశ్వత్థామ= ద్రోణాచార్యుడి కుమారుడు, అశ్వత్థామ; చచ్చెన్= మృతి చెందాడు; అని= ఈ విధంగా; ఒక్కరుండు= ఒక వ్యక్తి; అతనికిన్= ఆ ద్రోణాచార్యుడికి; చెప్పుట+అ= చెప్పటమే; కర్జంబు= కర్తవ్యం; అనినన్= అని చెప్పగా; విని= సావధానంగా విని; అచ్చటి+అందఱున్= అక్కడ ఉన్న వారందరుకూడ; ఇది+అ= ఇదే; మేలు+అనిరి= హితమైనదని అన్నారు (కాని); అర్జునుండు= అర్జునుడు (ద్రోణాచార్యులకు ప్రియశిష్యుడు కాబట్టి); దానికిన్= ఆ చెప్పిన దానికి; ఒడంబడక= ఒప్పుకొనకుండా; ఉండెన్= ఉన్నాడు; పాండవ+అగ్రజుండు= పాండవుల జ్యేష్ఠభ్రాత ధర్మరాజు; విషాదంబుతోన్= దుఃఖంతో; విచారించెన్= శస్త్ర త్యాగం చేసినవాడిని సంహరించటం ధర్మాతిక్రమణం కాదా అని ఆలోచించాడు; తద్+అనంతరంబు+అ= తరువాత.

**తాత్పర్యం:** 'కాబట్టి అశ్వత్థామ మృతి చెందా డని ఎవడో ఒక డతనికి చెప్పటమే ప్రస్తుత కర్తవ్యం' అని కృష్ణుడు చెప్పగానే విన్నవారందరు 'ఇట్లా చేయటమే మంచి' దన్నారు. కాని, అర్జునుడు మాత్రం దాని కొప్పుకొనలేదు. ధర్మరాజు దుఃఖంతో ఆలోచించసాగాడు. ఆ తరువాత.

**క. భీమునిచే నని నశ్వ। త్థామ యనం బరఁగు భద్రదంతి వడిన ను**
**ద్దామగతి నన్నెపమ్మున। నామారుత పుత్రుఁ డేగి యగ్గురుతోడన్......... 307**

**ప్రతిపదార్థం:** భీమునిచేన్= భీమసేనుడి చేత; అనిన్= యుద్ధంలో; అశ్వత్థామ+అనన్= అశ్వత్థామ అని పిలువబడి; పరఁగు= ప్రసిద్ధిని చెందిన అనగా అశ్వత్థామ అనే పేరుతో ప్రసిద్ధి చెందిన; భద్రదంతి= భద్రగజం; పడినన్= పడిపోగా - అనగా సంహరించబడగా; ఆ మారుత పుత్రుఁడు= ఆ వాయునందనుడు భీముడు; ఉద్దామ గతిన్= గొప్ప అనగా వేగవంతమైన; నడకతో; ఏగి= వెళ్ళి; ఆ+నెపమ్మునన్= అశ్వత్థామ గజసంహారం అనే మిషతో; ఆ+గురుతోడన్= ఆ ద్రోణాచార్యుడితో.

**తాత్పర్యం:** భీముడి చేతిలో అశ్వత్థామ అనే ఏనుగు మృతి చెందింది. ఆ నెపంతో భీముడు అతివేగంగా వెళ్ళి ద్రోణాచార్యుడితో (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. 'అశ్వత్థామ సచ్చె' నని చెప్పుటయుఁ' జిత్తంబు జల్లని చెదర బెదరియు నతండు దన కొడుకు నస్త్రవీర్యాది గుణంబులు గణుతించి యప్పలుకులు పెడచెవులం బెట్టి కలఁక లేక ధృష్టద్యుమ్నుపైఁ గవిసి పెల్లేసి, యతని కడ్డపడిన పాంచాల రథికుల నిరువది వేవుర వధియించి, మాత్స్యబలంబున కుఱికి యేనూఱు రథంబులఁ బదివేలు మాతంగంబుల నన్నియ తురంగంబులం బొరిగొని, తేజరిల్లి రాజుల గములకు నాదిగొనునప్పుడు విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ కశ్యప వశిష్ఠాత్రిప్రభృతి మునివర ప్రకరం బాతని పాలి కేతెంచి- 'భారద్వాజా! నీవు బ్రాహ్మణుండవు, వేదవేదాంగవిదుండవు; నీకు సంగ్రామంబు సేయ ధర్మంబగునే? యింతకు మున్ను చేసితేనియుం జేసితి గాని, కాలంబు పూర్ణం బయ్యెఁ గాన నింక సమరంబు నుడుగుట మేలు; మా మాటలు వట్టి యాయుధంబులు వెట్టి శాంతిఁ బొందు' మని చెప్పి యంతర్ధానంబు సేసిన న వ్విప్రవరుండు వారల పలుకు లూహించి భీమసేను వచనంబులం దలంచి యగ్రభాగంబునకు వచ్చి యున్న ధృష్టద్యుమ్నుం గనుంగొని వికల చిత్తుండును శోకాయత్తుండును నగుచు నిజపుత్త్రుండు సచ్చుట బ్రదుకుట, యజాత శత్రు వలన నున్నరూపు దెలియువాఁడై యతని నడిగె; నయ్యవసరంబున వాసుదేవుం డవ్వసుమతీపతి కిట్లనియె. 308**

**ప్రతిపదార్థం:** అశ్వత్థామ+చచ్చెను+అని= అశ్వత్థామ మృతిచెందాడని; చెప్పుటయున్= చెప్పగానే; చిత్తంబు= మనస్సు; జల్లు+అని= జల్లు అనే శబ్దం చేసి; చెదరన్= చలించి పోగా; బెదరియున్= భయపడిపోయి; అతండు= ఆ ద్రోణాచార్యులు; తన కొడుకు +అస్త్రవీర్య+ఆది గుణంబులు= తన కుమారుడైన అశ్వత్థామకు గల దివ్యాస్త్ర సామర్థ్యం మొదలైన గుణాలను; గణుతించి= భావించి; ఆ+పలుకులు= ఆ భీమసేనుడి మాటలు; పెడచెవులన్+పెట్టి= విన్నా లెక్కచేయక; కలఁక= అయ్యో! నా కొడుకుపోయాడే అనే బాధ; లేక= లేకుండా; ధృష్టద్యుమ్నుపైన్= ధృష్టద్యుమ్నుడిపైకి; కవిసి= లంఘించి; పెల్లు= మిక్కుటంగా; ఏసి= బాణాలు ప్రయోగించి; అతనికిన్= ఆ ధృష్టద్యుమ్నుడికి; అడ్డపడిన= అడ్డం వచ్చిన-ద్రోణాచార్యుడి బారినుండి కాపాడవచ్చిన; పాంచాలరథి కులన్+ఇరువది వేవురన్= ఇరువదివేల పాంచాలదేశపు రథికులను; వధియించి= వధించి; మాత్స్యబలంబునకున్=మత్స్య దేశపు సైన్యానికి; ఉఱికి= పరుగెత్తి; ఏనూఱు రథంబులన్= అయిదు వందల రథాలను; పదివేలు మాతంగంబులన్= పదివేలఏనుగులను; అన్ని+అ తురంగంబులన్=అన్నే గుర్రాలను-పదివేల గుర్రాలనని భావం; పొరిగొని= వధించి; తేజరిల్లి= పౌరుషదీప్తితోవెలిగిపోతూ;

రాజుల గములకున్= రాజుల సమూహాలకు; ఆదిగొను+అప్పుడు= కన్ను వేసే సమయంలో; విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ కశ్యప వసిష్ఠ+అత్రి ప్రభృతి మునివర ప్రకరంబు= విశ్వామిత్రుడు, జమదగ్ని, భరద్వాజుడు, గౌతముడు, కశ్యపుడు, వసిష్ఠుడు, అత్రి ఈ సప్తఋషులు మొదలుగా గల ఋషిశ్రేష్ఠుల సమూహం; ఆతని పాలికిన్= ఆ ద్రోణాచార్యుల సమీపానికి; ఏతెంచి= వచ్చి; భారద్వాజా!= భరద్వాజ కుమారుడైన ఓ ద్రోణా!; నీవు బ్రాహ్మణుండవు= నీవు బ్రాహ్మణుడివి; వేదవేదాంగ విదుండవు= ఋగ్వేదాది చతుర్వేదాలను మరియు శిక్షాది వేదాంగాలను ఆరింటిని తెలిసిన వాడివి; సంగ్రామంబు= యుద్ధం; చేయన్= చేస్తే; నీకు ధర్మంబు+అగునే?= నీకు ధర్మమవుతుందా? (కాదని భావం); ఇంతకున్ మున్ను= ఇంతకంటె పూర్వం; చేసితి(వి)+ఏని+యున్, చేసితి(వి)+కాని= చేస్తే చేశావుగాక-చేసినదాని గురించి మాకిప్పుడు పట్టింపు లేదు; కాలంబు= నీ జీవితకాలం; పూర్ణంబు+అయ్యెన్+కానన్= నిండింది కాబట్టి; ఇంకన్= ఇక; సమరంబున్+ఉడుగుట= యుద్ధం చాలించటం; మేలు= ఉచితం; మా మాటలు+పట్టి= మా యొక్క మాటలను గ్రహించి; ఆయుధంబులు+పెట్టి= శస్త్రాలు క్రిందపెట్టి - శస్త్రత్యాగంచేసి; శాంతిన్= శమాన్ని; పొందుము అని; చెప్పి= బోధించి; అంతర్ధానంబు+చేసినన్= మాయమయిన తరువాత; ఆ+విప్రవరుండు= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడు అనగా ద్రోణుడు; వారల పలుకులు= ఆ ఋషుల మాటలను; ఊహించి= ఆలోచించుకొని - ఆ మాటల తాత్పర్యం గ్రహించి; భీమసేను వచనంబులు= భీముడి మాటలను (అశ్వత్థామ హతుడయ్యాడనే మాటలను); తలంచి= తలచుకొని; అగ్రభాగంబునకున్= ముందు వైపునకు; వచ్చి ఉన్న= వచ్చినటువంటి; ధృష్టద్యుమ్నున్= ధృష్టద్యుమ్నుడిని; కనుంగొని= చూచి; వికల చిత్తుండును= వ్యాకులమైన మనస్సు కలవాడుగాను; శోక+ఆయత్తుండును+అగుచున్= దుఃఖానికి లోనైనవాడుగాను ఉంటూ; అజాతశత్రువలనన్= ధర్మరాజువలన; ఉన్నరూపు= ఉన్నటువంటి పరిస్థితిని - నిజాన్ని; తెలియువాఁడు+ఐ= తెలిసికొనేవాడై; నిజపుత్రుండు= తన కుమారుడు; చచ్చుట= చావటం; బ్రదుకుట= బ్రతికి ఉండటం; అతనిన్= ఆ ధర్మరాజును; అడిగెన్= అడిగాడు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; వాసుదేవుండు= కృష్ణుడు; ఆ+వసుమతీపతికిన్= ఆ ధర్మరాజుతో (వసుమతికి భూమికి పతి ప్రభువు= రాజు); ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** 'అశ్వత్థామ మృతుడైనాడు' అని చెప్పాడు. వెంటనే ద్రోణాచార్యుడు చిత్తం జల్లుమనగా భయపడినా, తన కొడుకు పరాక్రమాన్ని దివ్యాస్త్ర సామర్థ్యాన్ని తలపోసి, భీముడి మాటలు లెక్కపెట్టక మనస్సులో ఏ సంకోచం లేక ధృష్టద్యుమ్నుడిపై దాడి చేశాడు. బాణాల వర్షం కురిపించాడు. అడ్డం వచ్చిన పాంచాల రథిక వీరులను ఇరువది వేల మందిని వధించి. వెనువెంటనే మత్స్యదేశపు సైనికుల మీదికి వెళ్ళి, అయిదు వందల రథాలను, పదివేల ఏనుగులను, పదివేల గుర్రాలను సంహరించి. అమిత పరాక్రమంతో వెలుగుతూ రాజుల సమూహాల మీద కన్నువేసిన సమయంలో కశ్యపాది సప్తఋషులను ముందుంచుకొని ఎందరో ఋషిప్రవరులు ద్రోణాచార్యులకు ప్రత్యక్షమై 'ఓ ద్రోణా! నీవు భరద్వాజముని కుమారుడవైన బ్రాహ్మణుడివి. వేదవేదాంగాలు తెలిసినవాడివి. అటువంటి నీ విట్లా యుద్ధం చేయటం ధర్మమా? ఇక ఇంతవరకు యుద్ధం చేస్తే చేశావు నీ జీవితకాలం చెల్లిపోయింది. అందువల్ల నీవు యుద్ధం చాలించటం మంచిది. చేతనున్న ఆ శస్త్రాన్ని ఇక విడిచి పెట్టుము; శాంతించుము' అని చెప్పి, వారు మాయమయ్యారు. ద్రోణాచార్యుడు ఆ మునులు చెప్పిన మాటలు ఆలోచించుకొని, భీముడు చెప్పిన మాటలను గుర్తుచేసికొని, ఎదుట పొంచి ఉన్న ధృష్టద్యుమ్నుడిని చూచి మనస్సు వికలమై, దుఃఖంతో- తన కుమారుడు మరణించాడో లేక బ్రతికి ఉన్నాడో అజాతశత్రువు ధర్మరాజు వలన సత్యం తెలుసుకోవలెనని అతడిని అడిగాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు.

**విశేషం:** 1. కశ్యపాదులు సప్తఋషులు - అందుకే ఆ ఏడుగురి నామనిర్దేశం చేయబడింది. దానికి ప్రమాణం

**శ్లో॥ కశ్యపోఽత్రిర్భరద్వాజః విశ్వామిత్రోఽథ గౌతమః!**
**జమదగ్ని ర్వసిష్ఠశ్చ సాధ్వీ చైవాప్యరుంధతీ ॥**

ఈ సప్త ఋషులతోపాటు మహాపతివ్రత వసిష్ఠపత్ని అరుంధతి కూడ పూజనీయురాలని ఆమె కూడా ఇక్కడ స్మరించబడింది.

2. ద్రోణుడిని చూచి ఆ ఋషులు వేదవేదాంగవిదుడ వని అన్నారు. వేదాలు నాలుగు ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం అనేవి - ఈ వేదాలకు అంగాలు ఆరు.

**శ్లో॥ శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తి ర్జ్యోతిషం తథా ।**
**కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః ॥** ఇవి వేదాంగాలు.

3. ద్రోణాచార్యుడి మనస్సు వికలమై క్షోభించటానికి కారణాలు రెండు. ఒకటి కొడుకు మరణవార్త; రెండు ధృష్టద్యుమ్నుడు తన ఎదుట యుద్ధానికి నిలువటం. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి మరణానికే ఆవిర్భవించినవాడు. ద్రుపదుడు ద్రోణుడికి బాల్యమిత్రుడు. ద్రోణుడు పరశురాముడివలన అస్త్రవిద్య పొంది, బాల్యమిత్రుడని ద్రుపదుడి దగ్గరకి వెళ్ళాడు. ద్రుపదుడు బాల్య స్నేహాన్ని మరచి దరిద్రుడన్న భావంతో ద్రోణుడిని అవమానించాడు. దానికి ప్రతీకారంగా ద్రోణుడు పార్థుడి ద్వారా గురుదక్షిణ రూపంలో ద్రుపదుడిని జయించి బంధించి తెప్పించుకొన్నాడు. తగిన గుణపాఠం చెప్పి అర్ధరాజ్యం మాత్రం ఇచ్చి అతడిని విడిచివేశాడు. కాని, ద్రుపదుడు ఆ ద్రోణుడిపై ప్రతీకార జ్వాలతో యజ్ఞం చేసి, ద్రోణుడి మరణానికై ధృష్టద్యుమ్నుడిని పుత్రుడిగా పొందాడు. ధృష్టద్యుమ్నుడి పుట్టుకలోని విశేషం ఏమిటంటే - అతడు అగ్నికుండం నుండి కవచ కిరీటాదులు ధరించి, ఆయుధపాణి అయి సద్యోయౌవనం కలిగి ఆవిర్భావం చెందాడు. ద్రౌపది కూడా అప్పుడే సద్యోయౌవన అయి ఆవిర్భవించింది. (చూ. ఆంధ్ర మహాభారతం, ఆదిపర్వం, సప్తమాశ్వాసం 17-20 పద్యాలు).

**తే. 'అడరి యీ దివసము నపరాహ్ణమునను । ద్రోణుఁ డని సేసిన ట్లైనఁ ద్రుంగిపోక**
**యుండ నేర్తురే యిక్కడి యోధు లెవ్వ । రైన? విను నుతి గాదు సత్యమ్ము సుమ్ము! 309**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= ద్రోణాచార్యుడు; అడరి= చెలరేగి; ఈ దివసమున్+అపరాహ్ణమునను= ఈ దినం అపరాహ్ణసమయంలో (సూర్యుడుదయించినప్పటి నుండి అస్తమించే వరకు ఎంత సమయం ఔతుందో దానిలో అయిదింట నాలుగో భాగం అపరాహ్ణం, మధ్యాహ్నం తరువాతిది అపరాహ్ణం); అని= యుద్ధం; చేసినట్లు+ఐనన్= చేసినట్లయితే; ఇక్కడి యోధులు+ఎవరు+ఐనన్= ఈ మన సైన్యంలో ఉన్న ఎంతటి గొప్పయోధులైనా; త్రుంగిపోక= తెగిపోక; ఉండనేర్తురే!= ఉండజాలుతారా! (యుద్ధంలో ద్రోణుడి కంటబడి బ్రతికి బయటపడే వారెవరు కూడ ఉండరని భావం); విను= సావధానంగా వినుము ధర్మరాజా!; నుతి కాదు= (ఇది) ప్రశంస కాదు - ప్రశంసార్థం చెప్పే అతిశయోక్తి కాదని భావం; సత్యమ్ము సుమ్ము= సత్యం సుమా! ఉన్న యథార్థ విషయాన్నే చెప్పాను - మరేదో కాదని భావం.

**తాత్పర్యం:** ద్రోణుడు విజృంభించి ఈరోజు అపరాహ్ణం దాకా యుద్ధం చేస్తే ఈ పక్షంలోని యోధులెవరైనా మరణించకుండా మిగిలి ఉండగలరా? ఇది నిజం. ప్రశంస ఏమాత్రం కాదు. (ఇక ఆలోచించు)

**విశేషం:** 'అపరాహ్ణం అంటే, అహ్నః అపరః దివసం యొక్క అపరభాగ మని వ్యుత్పత్త్యర్థం.' ఈ పదం రూఢం కాబట్టి అపరాహ్ణ కాలం అనే అర్థంలోనే ప్రయోగించబడుతుంది. ఒక్కదినానికి అయిదు కాలాలు. అవి. 1. ప్రాతఃకాలం, 2. సంగమకాలం, 3. మధ్యాహ్నకాలం, 4. అపరాహ్ణకాలం, 5. సాయంకాలం అనేవి - దినం అంటే సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు గల కాలం. ఆ కాలంలోని అయిదు భాగాలలో నాలుగవ భాగం అపరాహ్ణం.

క. మము నీతని కొప్పింపక । సముచితముగఁ గాచికొను; మసత్యవచన దో
షము లేదు ప్రాణరక్షణ । సమయంబున; నతని కొడుకు సచ్చెన యనుమీ!' 310

**ప్రతిపదార్థం:** మమున్= మమ్ములను; ఈతనికిన్= ఈ ద్రోణుడికి; ఒప్పింపక= అప్పజెప్పక; సముచితముగన్= తగిన విధంగా; కాచికొనుము= రక్షించుకొమ్ము; ప్రాణరక్షణ సమయమునన్= ప్రాణాల రక్షణ సందర్భంలో (ప్రాణాలను రక్షించుకొనే నిమిత్తం అని భావం); అసత్యవచన దోషము= అసత్యం పలుకుట వలన కలిగే దోషం; లేదు= ఉండదు (కాబట్టి); అతని కొడుకు= ఆ ద్రోణుడి కుమారుడు అశ్వత్థామ; చచ్చెను+అ= చావనే చచ్చాడు ('అ' అవధారణార్థకం) (నిశ్చయంగా మృతి చెందాడు); అనుము+ఈ!= అని చెప్పుమా! ('ఈ' సంప్రార్థనార్థకం).

**తాత్పర్యం:** మమ్మందరిని ఈ ద్రోణుడికి అప్పజెప్పకుండా తగువిధంగా కాపాడుకొనుము. ప్రాణాలను కాపాడుకొనే సమయంలో అసత్యాన్ని పలుకుటలో ఏ దోషం లేదు. 'అశ్వత్థామ హతు డయినాడు' అని ద్రోణుడితో చెప్పవయ్యా!'

వ. అని పనిచె; నట్టియెడ నయ్యుధిష్ఠిరుతో భీమసేనుం 'డే నప్పుడు కృష్ణుండు సెప్ప నయ్యోధవరు వధియించుతు పాయంబు విని యదియ మనంబున నుండి మాళవేంద్రుండగు నింద్రవర్మ వారణం బశ్వత్థామ యనుపేరిటిది నాచేతఁ జచ్చె;నది నెపంబుగ నతనికి నశ్వత్థామ సచ్చె నని చెప్పితిఁ జెప్పిన నొక్కింత విచారించి యమ్మాట దెస ననాదరంబు సేసె; నీకు విజయంబు గోరి హితం బుపదేశించు నీ గోవిందుని వాక్యం బుల్లంఘింపక నీవు నట్ల చెప్పుము; నీ వచనమ్ము నమ్మి యతండు గయ్యంబు సేయఁ జేయాడక చెడు' నని యొత్తి చెప్పుటయు. 311

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా పలికి; పనిచెన్= ప్రేరేపించాడు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; ఆ+యుధిష్ఠిరుతోన్= ఆ ధర్మరాజుతో; భీమసేనుడు; ఏను= నేను; అప్పుడు= ఆ సమయంలో; కృష్ణుండు= కృష్ణుడు; చెప్పన్= చెప్పగా; ఆ+యోధవరున్= ఆ యోధులలో మేటి అయిన ద్రోణాచార్యుడిని; వధియించు+ఉపాయంబు= చంపే ఉపాయం; విని= విన్నవాడనై; అది+అ= అదే; మనంబునన్= మనస్సులో; ఉండన్= ఉండగా (మనస్సులో ఎప్పుడూ అదే మెదలుతూ ఉండగా) (అశ్వత్థామా హతః అని చెప్పటానికి నే నొక ఎత్తు వేశాను అదేమిటంటే); మాళవ+ఇంద్రుండు+అగు+ఇంద్రవర్మ వారణంబు= మాళవ దేశాధీశుడైన ఇంద్రవర్మగజం; అశ్వత్థామ పేరిటిది= అశ్వత్థామ అనే పేరు గలది; నాచేతన్= నాచేత; చచ్చెన్= చచ్చింది; అది= ఆ అశ్వత్థామ నామక గజసంహారం; నెపంబు+కన్= మిషగా; అతనికిన్= ఆ ద్రోణాచార్యుడికి; అశ్వత్థామ+చచ్చెన్= అశ్వత్థామ హతుడయ్యాడు; అని చెప్పితిన్= అని చెప్పాను; చెప్పినన్= చెప్పగానే; ఒక్కింత= కొంచెంసేపు; విచారించి= ఆలోచించి; ఆ+మాటదెసన్= ఆ పలుకువైపు; అనాదరంబు= నిర్లక్ష్యం; చేసెన్= చేశాడు; నీకున్= ఓ ధర్మరాజా! నీకు; విజయంబు+కోరి= విజయాన్ని ఆకాంక్షించి; హితంబు= మేలు; ఉపదేశించు+ఈ గోవిందుని వాక్యంబు= ఉపదేశించే ఈ కృష్ణుని మాట; ఉల్లంఘింపక= దాటక; నీవును= నీవు కూడ; అట్లు+అ= ఆ విధంగానే; చెప్పుము; నీ వచనమ్ము= నీ మాటను; నమ్మి= విశ్వసించి; అతండు= ఆ ద్రోణాచార్యుడు; కయ్యంబు= యుద్ధం; చేయన్= చేయటానికి; చేయి+ఆడక= చేయి కదలక; చెడున్= నశిస్తాడు; అని= అనే విధంగా; ఒత్తి= గట్టిగా; చెప్పుటయున్= చెప్పగానే.

**తాత్పర్యం:** అని పలికి, ఆ పనికి ప్రేరేపించాడు. ఆ సమయంలో ధర్మరాజుతో భీము డన్నాడు - 'కృష్ణుడు ద్రోణవధకై చెప్పిన ఉపాయం అప్పుడు విన్నాను; వినినప్పటి నుండి అది నా మనసులో మెదలుతూ ఉన్నది. నా చేతచచ్చిన అశ్వత్థామ అనే గజం మాళవరాజు ఇంద్రవర్మది జ్ఞాపకం వచ్చింది. అది నెపంగా ద్రోణుడితో అశ్వత్థామ మరణించాడని చెప్పాను. కాని, ఆ ద్రోణాచార్యుడు నా మాటపై కొంత విచారించి నిర్లక్ష్యం చేశాడు.

నీకు విజయంకోరి హితంచెప్పే ఈ కృష్ణుడి మాటను దాటకుండా ఆ విధంగా చెప్పుము. నీ మాట నమ్మి ద్రోణుడు యుద్ధం చేయటానికి చేయిఆడక నశిస్తాడు అని గట్టిగా చెప్పగా (తరువాతి పద్యంతో అన్వయం).

**ధర్మజుఁడు ద్రోణునితో నశ్వత్థామ సచ్చె నని యేనుఁగు నెపంబునఁ జెప్పుట (సం. 7-164-105)**

**క. మది నయ్యిరువుర మాటలు । బదిలంబుగఁ బట్టికొనుటఁ, బట్టియు నెట్లుం**
**దుది నది యట్టుల కాఁగల । యదియై యుండుటను, దాని కత డొడఁబడియెన్. 312**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరువురమాటలున్= ఆ ఇద్దరు అనగా కృష్ణభీములు చెప్పిన మాటలు కూడ; మదిన్= మనస్సును; పదిలంబుగన్= దృఢంగా; పట్టికొనుటన్+పట్టియున్= పట్టుకొనటం వలన; ఎట్లున్= ఎట్లాగైనా; తుదిన్= చివరకు; అట్లు= అదే విధంగా; కాఁగల అది+ఐ+ఉండుటను= అవుతుంది కాబట్టి; దానికిన్= వారు చెప్పినదానికి; అతఁడు= ఆ ధర్మరాజు; ఒడఁబడియెన్= అంగీకరించాడు.

**తాత్పర్యం:** ఆ కృష్ణుడు, భీముడు ఇద్దరు చెప్పిన మాటలు ధర్మరాజు మనస్సును గట్టిగా పట్టుకోవటంవల్ల, చివరకు అది అట్లా జరుగవలసి ఉన్నందువల్ల ఆ విధంగా చెప్పటానికి అంగీకరించాడు.

**వ. ఇట్లు సమ్మతించి. 313**

**తాత్పర్యం:** ఈ విధంగా అంగీకరించి.

**క. అనృత భయము నాజిజయము । గొనియెడు తమకంబు పెంపు గుదియింపఁగఁ బాం**
**డునరేంద్రు నగ్రతనయుం । డనుమానము వాయఁ బెట్టి యస్త్రగురునితోన్. 314**

**ప్రతిపదార్థం:** అనృత భయమున్= అసత్య భయమును; ఆజిజయమున్+కొనియెడు, తమకంబు పెంపు= యుద్ధ విజయాన్ని పొందే ఆసక్తియొక్క ఆధిక్యం - అనగా మిక్కుటమైన ఆసక్తి; కుదియింపఁగన్= క్రుంగింపగా; పాండు నరేంద్రుని+అగ్రతనయుండు= పాండురాజు జ్యేష్ఠపుత్రుడు ధర్మరాజు; అనుమానము= సందేహాన్ని; పాయన్+పెట్టి= తొలగించుకొని; అస్త్రగురునితోన్= అస్త్ర విద్యాగురువైన ద్రోణాచార్యుడితో.

**తాత్పర్యం:** అసత్యభయాన్ని యుద్ధంలో విజయం సాధించాలి అనే బలమైన ఆకాంక్ష అణగించగా, ఏ సందేహం లేక ధర్మరాజు ద్రోణాచార్యుడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. వలయు కొలఁది నెలుంగెత్తి వర్ణ సమితి । యచ్చుపడఁగ ' నశ్వత్థామ సచ్చె' ననియె**
**నని పదంపడి యల్లన యతని చెవికి । వినఁగ రాకుండఁ 'గుంజర' మనియె నధిప! 315**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; వలయు కొలఁదిన్= కావలసినంత - అనగా తానెంత బిగ్గరగా చెప్పవలయునో అంత బిగ్గరగా; ఎలుంగు= కంఠస్వరాన్ని; ఎత్తి= హెచ్చించి; వర్ణ సమితి= అక్షరాల సముదాయం; అచ్చు పడఁగన్= స్పష్టంగాతెలిసే విధంగా; అశ్వత్థామ+చచ్చెన్= అశ్వత్థామ మరణించాడు; అనియెన్= (అని) అన్నాడు; అని= ఇట్లా పలికి; పదంపడి= వెంటనే; అల్లన= మెల్లగా; అతని చెవికిన్= ఆ ద్రోణాచార్యుల చెవులకు; వినఁగన్+రాకుండన్= వినరాకుండా ఉండే విధంగా కుంజరము=

ఏనుగు; అనియెన్= (అని) అన్నాడు - హతమయింది; అశ్వత్థామ (కాని అది) గజం అని అన్నాడు (గజము అని మెల్లగా పలికి ద్రోణునకు వినరాకుండా చేశాడు)

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! బిగ్గరగా, కంఠస్వరాన్ని హెచ్చించి ఉచ్చారణ స్పష్టంగా ఉండే విధంగా 'అశ్వత్థామ చచ్చెను' అని వెంటనే ఏనుగు అనే మాట ద్రోణాచార్యుడికి వినబడకుండ మెల్లగా అన్నాడు.

**విశేషం:** అశ్వత్థామ అనే గజం హతమయింది నిజమే - కాని, ద్రోణుడి ప్రశ్నకు అది ఉత్తరం కాదు. హతమయింది అశ్వత్థామ అని బిగ్గరగా చెప్పి 'ఏనుగు' అనే మాట మెల్లగా అనటంచేత ద్రోణాచార్యులకు వినరాక నిజంగా అశ్వత్థామ తన కుమారుడే మరణించాడని భావించాడు. ఈ సత్యం కపటంతో కూడింది. కాబట్టి సత్య మనిపించుకోదు 'సత్యం నతత్ యచ్ఛల మభ్యుపేతమ్' అని ధర్మ సూక్ష్మత్వాన్ని వివరించారు పెద్దలు. కావున ధర్మరాజు పలికింది అనృతమే అయింది.

**వ. ఇ వ్విధంబునం బలుకుటయు. 316**

**తాత్పర్యం:** ఈ విధంగా పలుకగానే.

**క. నేలకు నల్లెఁడు పొడువునఁ । గ్రాలుచు మును మెఱయు గురుని రథచక్రము ల**
**క్కాలంబున సమరజయ । శ్రీ లోపము దెలియ నంటసిలఁబడియె నృపా! 317**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; నేలకున్= భూమికి; నల్లెఁడు పొడువునన్= నాలుగువేళ్ళ ఎత్తున; క్రాలుచున్= నడుస్తూ; మును= పూర్వం; మెఱయు= ప్రకాశించే; గురుని రథ చక్రములు= ద్రోణాచార్యుడి రథానికున్న చక్రాలు; ఆ+కాలంబునన్= ఆ సమయాన; సమరజయశ్రీ లోపము= యుద్ధంలో జయలక్ష్మి లోపం; తెలియన్= తెలిసే విధంగా; అంటసిలన్= (నేలకు) తాకే విధంగా; పడియెన్= పడింది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇంతకుముందు భూమికి నాలుగువేళ్ళ ఎత్తున నడుస్తూ తిరిగే ద్రోణుని రథచక్రాలు, ఆ సమయంలో ద్రోణుడికి యుద్ధవిజయం లోపిస్తుందని తెలియజేసే విధంగా నేలను తాకాయి.

**విశేషం:** భూభాగానికి నాలుగువేళ్ళపైన తిరిగే రథం ఎవరిది అనే సంశయం కలుగుతూ ఉన్నది. ఆ రథం ద్రోణాచార్యుడిదని తిక్కన ఈ పద్యంలో చెప్పాడు. ఇక సంస్కృత మూలం ఇట్లా ఉన్నది.

**శ్లో॥ అవ్యక్త మబ్రవీత్ రాజన్ హతః కుంజర ఇత్యుత ।**
**తస్యపూర్వం రథః పృథ్వ్యాః చతురంగుళ ముచ్ఛ్రితః ।**
**బభూవైవం చ తేనోక్తే తస్య వాహాః స్పృశన్ మహీమ్'**

అనగా అతడు పలుకగానే అతని అశ్వములు భూమిని అంటినవి. ఈ శ్లోకానికిగల పూర్వ సందర్భాన్ని బట్టి 'తస్య వాహాః' అనే పదాలకు ధర్మరాజు గుర్రాలు అనే అర్థమే ఔతున్నది. ఈ శ్లోకం తరువాతి శ్లోకం ఇది

**శ్లో॥ యుధిష్ఠిరాత్తు తద్వాక్యం శ్రుత్వా ద్రోణో మహారథః ।**
**పుత్రవ్యసన సంతప్తో నిరాశో జీవితేఽభవత్** (ద్రోణ - 190/56-57)

ఈ శ్లోకార్థం విచారించినా కూడా వెనుకటి శ్లోకంలోని తస్యవాహాః (అతడి అశ్వములు) అనే దానికి ద్రోణుడి అశ్వాలు అనే అర్థం కుదురటంలేదు. ఇంత వరకు ఎన్నడూ అసత్యమాడని వాడు ధర్మరాజు- అందుకే అతడి రథం భూమికి నాలుగువేళ్ళ

ఎత్తున నడుస్తూ ఉండేది. ఇప్పుడు అసత్యమాడాడు కదా! వెంటనే ఆ రథం నేలపై పడిపోయింది. పూర్వాపర సందర్భాలు ధర్మరాజు రథమనే భావాన్నే కలిగిస్తూ ఉన్నవి. తిక్కన మాత్రం ద్రోణుడి రథాన్నే అట్లా చిత్రీకరించాడు.

మూల శ్లోకాలనుబట్టి చూచినా ఆ గుర్రాలు ద్రోణుడి వనే భావించారు కొందరు. ఆ వార్తను వినటానికి పూర్వం ద్రోణుడి అశ్వాలను సారథి అతివేగంగా నడిపించాడు. అందుచేత అవి భూమికి నాలుగంగుళాలు ఎత్తున దుమికేవి. ఇప్పుడు దుర్వార్త చెవినిబడగానే ద్రోణుడు క్రుంగిపోవటంవలన, సారథి ఆ గుర్రాల పట్టు సడలించటం వలన, అవి నేలకు ఆని నిలిచాయి అని భావించాలి. అంతేకాని ధర్మరాజు అసత్యమాడటానికీ, గుర్రాలు క్రింద ఆనటానికి సంబంధం ఏమిటి? అందుచేత ఇక్కడ తిక్కన భావమే సమంజసమని తోస్తుంది. 320 పద్యం వల్ల ద్రోణుడి పరిస్థితి అర్థమవుతుంది.

**వ. అప్పుడు. 318**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. తనుఁ బాండుతనయులకు ద్రో । హునిగా నక్కుంభజన్ముఁ డూహించుచు న**
**మ్మునులట్లు సెప్పి: రటుగా । వునఁ గా కేమి యిది దగవవుం బొమ్మనుచున్. 319**

**ప్రతిపదార్థం:** తనున్= తనను; పాండు తనయులకున్= పాండు పుత్రులైన ధర్మరాజాదులకు; ద్రోహునిగాన్= ద్రోహం చేసిన వాడినిగా; ఆ+కుంభజన్ముఁడు= ఆ ద్రోణాచార్యుడు; ఊహించుచున్= ఊహిస్తూ; ఆ+మునులు= ఆ కశ్యపాది ఋషులు; అట్టు= ఆ విధంగా; చెప్పిరి= చెప్పారు; అటు= ఆ విధంగా; కావునన్= అగుతుంది కాబట్టి; కాక+ఏమి?= కానీ ఏమి? ('ఏమి' ప్రశ్నార్థకం); ఇది= ఈ చేసే యుద్ధం; తగవు= ధర్మమే (న్యాయమే); అవున్= అవుతుంది; పొమ్ము= నిశ్చయం; అనుచున్= అంటూ.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు తాను పాండవులకు ద్రోహం చేస్తున్న వాడినని అనుకొంటూ, ఆ మునులు ఆ విధంగా చెప్పారు. అట్లా జరిగితే జరుగనీ ఏం? అయినా నేను ఇట్లా యుద్ధం చేయటం న్యాయం, అని తలపోస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**శా. ధృష్టద్యుమ్నునిఁ జూచుచున్ రణసముద్రేకంబు బాహాబలా**
**వష్టంభంబును శౌర్యనిర్వహణ గర్వస్ఫూర్తియుం దొంటియు**
**త్కృష్టత్వంబును దక్కి స్రుక్కి వగ బుద్ధిం బీఁకువీఁకాడఁగాఁ**
**జేష్టాహీనతఁ బొంది యగ్గురుఁడు సంక్షిప్తాంగుఁ డై యున్నెడన్. 320**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నునిన్= ధృష్టద్యుమ్నుడిని; చూచుచున్= చూస్తూ; రణసముద్రేకంబు= యుద్ధ విజృంభణం; బాహాబల+అవష్టంభంబును= భుజ బలగర్వం; శౌర్య నిర్వహణ= శూరత్వం ప్రకటించటంలో; గర్వస్ఫూర్తియున్= దర్పస్ఫురణ; తొంటి ఉత్కృష్టత్వంబును= మొదటి గొప్పతనం; తక్కి= తగ్గిపోయి - అనగా క్షీణించి (ఆ కారణాన); స్రుక్కి= మూర్ఛచెంది; వగ= పుత్రమరణజన్యమైన దుఃఖం; బుద్ధిన్= మతిని; పీఁకువీఁకాడఁగాన్= మిక్కిలి వికలం జేయగా; చేష్టాహీనతన్+పొంది= చేష్టారహితత్వాన్ని పొంది - చేష్టలుడిగి; ఆ+గురుఁడు= ఆ ద్రోణుడు; సంక్షిప్త+అంగుఁడై= ముడుచుకోబడిన కర చరణా ద్యవయవాలు కలవాడై; ఉన్న+ఎడన్= ఉన్న సమయంలో.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడిని చూస్తూ, యుద్ధాద్రేకాన్ని, బాహుబలగర్వాన్ని , శౌర్యాన్ని ప్రకటించటంలో దర్పాన్ని, ఇదివరకటి అతిశయాన్ని కోల్పోయి, బలహీనపడి, దుఃఖం మనస్సును మిక్కిలి కలతనొందించగా చేష్టలుడిగి, ముడుచుకొనిపోయిన అవయవాలు కలవాడై ఉండగా.

వ. అతని వధంబునకై పాంచాలవిభుని వేలిమిం బుట్టినవాఁ డగుట నప్పార్షతుండు దత్సమయజనితోత్సాహ రోష విశేషాయత్తచిత్తుం డగుచు నమ్మహీసురుమీఁదం గవిసి యేసిన ననికి నొల్లని యుల్లంబునఁ బరుని యుల్లాసంబు సహింపలేని తేజంబును బురికొని యతండు వోరం దొడంగిన దివ్యాస్త్రంబులు ప్రతిభాసింపక యుండె; నట్లయినను మనసుబలిమి కలిమిం బ్రకృతి బాణంబుల నాతని బాణబాణాసన రథ రథ్య సూత కేతనంబులు వొడిసేసె; నాధృష్టద్యుమ్నుండు గద గొనినం దునియలు గావించెఁ; బలకయు వాలునుం గొని వచ్చి యవ్వీరుండు సారథి తురంగంబుల యంగంబుల వ్రయ్యనేయఁ దత్కరవాల ఖేటపాటనంబు సేసి తనువునం జండకాండంబులు నించె; నట్లు నించి నొంచినం గని శినివరుండు గృపకర్ణ కృతవర్మల తోడం బెనంగు చుండియుఁ గ్రూరనారాచ దశకం బయ్యాచార్యుమేన నిగిడించె; నంత నత్యంతరయంబునం జనుదెంచి యనిలనందనుండు ద్రుపదనందనుఁ గుంభసంభవు బారికిం దప్పించుకొని పోయినం బొమ్మని పలికి, డెందం బెప్పటి చందం బగుటయు నిశ్చలభావం బొందె; నివ్విధంబున నాలుగు దివసంబులు నొక్కరాత్రియు నేనగు దివసంబులో నిరువది గడియలు నిరువది యొక్కవే యట్టలాడ భండనంబు సేసి పాండవ బలంబులు నుఱుమాడి పేరడవి గొని కాల్చి పొనుంగుపడిన కార్చిచ్చుకైవడిం గుదిసి యమ్మహాత్ముండు. 321

**ప్రతిపదార్థం:** అతని వధంబునకై= ఆ ద్రోణాచార్యుల వధ కొరకు; పాంచాల విభుని వేలిమిన్= ద్రుపదరాజు (చేసిన)హోమకుండము నందుండి; పుట్టినవాఁడు+అగుటన్= పుట్టి ఉన్నవాడు అగుటచేత; ఆ+పార్షతుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; తత్సమయ జనిత+ ఉత్సాహ రోష విశేష+ఆయత్తచిత్తుండు+అగుచున్= ఆ సమయంలో పుట్టిన ఉత్సాహక్రోధాలకు మిక్కిలి అధీనమై మనస్సు కలవాడై; ఆ+మహీసురవరుమీఁదన్= ఆ ద్రోణాచార్యుడిపైకి; కవిసి= ఉరికి; ఏసినన్= బాణాలు వేయగా; అనికిన్= యుద్ధానికి; ఒల్లని+ ఉల్లంబునన్= ఇష్టపడని మనస్సుతో; పరుని+ఉల్లాసంబును= శత్రువు మిడిసిపాటును; సహింపలేని తేజంబును= ఓర్వజాలని ప్రతాపం; పురికొని+అతండు= చెలరేగి ఆ ద్రోణాచార్యుడు; పోరన్+తొడంగినన్= యుద్ధానికి పూనుకొనగా; దివ్య+అస్త్రంబులు= ఇంద్రాస్త్రం మొదలైన అస్త్రములు; ప్రతిభాసింపక+ఉండెన్= స్ఫురించకుండా అయినవి; అట్లు+ అయినను= అట్లా అయినప్పటికి; మనసు బలిమి కలిమిన్= మనోబలంతో - యుద్ధం చేయటానికే మనస్సు బలాత్కరించటంవలన; ప్రకృతి బాణంబులన్= సహజములైన బాణాలతో; అతని= ఆ ధృష్టద్యుమ్నుడి; బాణ= (ప్రయోగించిన) బాణాలను; బాణాసన= ధనుస్సును; రథ= రథాన్ని; రథ్య= అశ్వాలను; సూత= సారథిని; కేతనంబులు= ధ్వజాన్ని (ద్వంద్వ సమాసం కాబట్టి బహువచనం, ద్వితీయార్థమున ప్రథమావిభక్తి); పొడి+చేసెన్= నుగ్గునుగ్గు చేశాడు - ఖండించాడని భావం; ఆ ధృష్టద్యుమ్నుండు= అన్నీ కోల్పోయిన ఆ ధృష్ట ద్యుమ్నుడు; గద= గదను; కొనినన్= తీసికొన్న వెంటనే; తునియలు= తునకలుగా; కావించెన్= చేశాడు (రథం, సూతుడు, అశ్వాలు; ధనుర్బాణాలు నశించి ఏవీ కూడా) యుద్ధానికి లేకపోవటం వలన; పలకయున్= డాలు; వాలునున్= ఖడ్గాన్ని; కొని= తీసికొని; వచ్చి= వచ్చి; ఆ+వీరుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; సారథి తురంగంబుల+అంగంబులన్= సారథియొక్క మరియు అశ్వాలయొక్క శరీరాలను; వ్రయ్యన్+ఏయన్= తుత్తునుకలయ్యేటట్లు కొట్టగా; తద్= అతడియొక్క; కరవాల= ఖడ్గంయొక్క; ఖేట= డాలుయొక్క; పాటనంబు= ఖండనం; చేసి= చేసి; తనువునన్= శరీరంపై; చండకాండంబులు= భయంకరమైన బాణాలను; నించెన్= నింపాడు; అట్లు= ఆ విధంగా; నించి= నింపి; నొంచినన్= నొప్పింపగా; కని= చూచి; శినివరుండు= సాత్యకి; కృప, కర్ణ, కృతవర్మల తోడన్= కృపాచార్యుడు, కర్ణుడు, కృతవర్మ అనే వారితో; పోరుచుండియున్= యుద్ధం చేస్తూ ఉండి కూడా; క్రూర నారాచ దశకంబు= భయంకరమైన బాణాల దశకాన్ని అనగా - బాణాలను పదింటిని; ఆ+ఆచార్యుమేనన్= ఆ ద్రోణాచార్యుడి

శరీరంపై; నిగిడించెన్= వ్యాపింపజేశాడు (పది బాణాలతో కొట్టాడు); అంతన్= ఆ సమయాన; అత్యంత రయంబునన్= మిక్కిలి వేగంగా; చనుదెంచి= వచ్చి; అనిల నందనుండు= భీముడు; ద్రుపదనందనున్= ధృష్టద్యుమ్నుడిని; కుంభసంభవు బారికిన్= ద్రోణాచార్యుల గురికి, అనగా ద్రోణాచార్యుడికి లక్ష్యం కావటాన్ని; తప్పించుకొని= తప్పించివేసి; పోయి నన్= తీసికొని పోగా (ద్రోణాచార్యుడి ఎదుటనున్న ధృష్టద్యుమ్నుడిని ప్రక్కకు తొలగించుకొని పోతూ ఉండగా); పోయినన్+పొమ్ము+అని పలికి= (ద్రోణుడు) పోతేపో అని పలికి; డెందంబు= మనస్సు; ఎప్పటి చందంబు= ఎప్పటి విధంగా; అగుటయున్= కాగానే; నిశ్చలభావంబు= నిశ్చలత్వాన్ని; ఒందెన్= పొందాడు (యుద్ధానికై తనను పురికొల్పిన ధృష్టద్యుమ్నుడు యుద్ధం విడిచి భీముడి ద్వారా తొలగి పోయాడు. ఇక నా అంతట నాకు యుద్ధంతో పనిఏమి? అని తలంచి పూర్వ విధంగా తన మనస్సు ప్రశాంతమై ఉండగా యోగ నిష్ఠపూన తలచి కదలక మెదలక ఉన్నాడని భావం); ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; నాలుగు దివసంబులు= నాలుగు దినాలు; ఒక్క రాత్రియున్= ఒక రాత్రి; ఏను+అగు దివసంబులోన్= అయిదవరోజున; ఇరువది గడియలు= ఇరవై గడియలు (సూర్యోదయం నుండి 20 గడియలు దివసం గతించేటంత వరకు) (గడియ అనగా రెండున్నర గంటలు కాబట్టి సుమారు మధ్యాహ్నం రెండు గంటల సమయం వరకు అని భావం); ఇరువది యొక్కవేలు+అట్టలు= ఇరువయ్యొక్కవేల మొండాలు; ఆడన్= నృత్యం చేసేటట్లు; భండనంబు+చేసి= యుద్ధం చేసి (ఈ యుద్ధంలో ఇప్పుడు 21వేల మంది తలలు తెగగొట్టాడని భావం); పాండవ బలంబులన్= పాండవుల సైన్యాలను; నుఱుమాడి= సంహరించి; పేరడవిన్= మహారణ్యాన్ని; కొని= చేపట్టి; కాల్చి= దహించి; పొనుంగు పడిన కార్చిచ్చుకైవడిన్= చల్లారిన దావాగ్నివలె; కుదిసి= ఉపశమించి; ఆ+మహాత్ముండు= ఆ మహానుభావుడు ద్రోణాచార్యుడు.

**తాత్పర్యం:** అతని వధకై ద్రుపదుని హోమకుండం నుండి పుట్టినవాడు కావటం చేత ఆ సమయంలో కలిగిన ఉత్సాహరోషాలకు విశేషంగా స్వాధీనమైన మనస్సు కలవాడై, ఆ ద్రోణుడిమీదికి విజృంభించి బాణాలు వేయగా, యుద్ధం చేయటానికి ఇష్టంలేని ద్రోణుడి మనస్సులో, శత్రువుయొక్క ఉత్సాహాన్ని సహించలేని పరాక్రమం క్రమ్ముకొని యుద్ధానికి పూనుకోగా, ఆయనకు దివ్యాస్త్రాలు స్ఫురించలేదు. అయినా మనోబలంతో సహజ బాణాలతోనే ధృష్టద్యుమ్నుడి బాణాలను, ధనుస్సును, రథాన్ని, రథాశ్వాలను, సారథిని, రథకేతనాన్ని నుగునుగ్గు చేశాడు. ధృష్టద్యుమ్నుడు గదతీసుకోగా, దానిని ముక్కలు చేశాడు. తరువాత ధృష్టద్యుమ్నుడు డాలును ఖడ్గాన్ని తీసుకొని ద్రోణుని రథసారథి శరీరాన్ని, గుఱ్ఱాల శరీరాలను ముక్కలయ్యేటట్లు కొట్టగా గురుడు అతని ఖడ్గాన్ని, డాలును ఖడించి, అతని శరీరంనిండా భయంకరాలైన బాణాలు నింపాడు. ఆ విధంగా నింపి ధృష్టద్యుమ్నుడిని నొప్పింపగా, సాత్యకి చూచి, తాను కృప, కర్ణ, కృతవర్మలతో యుద్ధం చేస్తూ ఉన్నా, పది వాడిబాణాలు ద్రోణుడి శరీరంలో నాటాడు. అప్పుడు భీమసేనుడు మహావేగంగా వచ్చి; ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి బారిన పడకుండా తప్పించి తీసుకొనిపోగా, ద్రోణుడు పొమ్మని పలికి, మనస్సు పూర్వస్థితికి రాగా ప్రశాంతతను పొందాడు. ఈ విధంగా నాలుగురోజులు, ఒక రాత్రి, అయిదవరోజులో ఇరువది గడియలు - ఇరువదియొక్క వేల మొండెములు నేలపడి ఆడగా యుద్ధంచేసి, పాండవ బలాలను సంహరించి, మహారణ్యాన్ని దహించి కాంతివిహీనమైన కార్చిచ్చువలె తగ్గి ఆ మహానుభావుడు ద్రోణుడు(తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉపమ; 'కార్చిచ్చు కైవడిన్' అన్నచోట ఉపమాలంకారం.

**సీ.** **సంగరంబునఁ దన్వి సని శాంతిఁ బొందిన । చిత్తంబుతోఁ దమసేన దిక్కు**
**గనుఁగొని పెలుచ నోకర్ణ! యోకృప! యో సు । యోధన! పోర న న్నొత్తి యెపుడుఁ**
**జెప్పుదు; రేను నాచే నయినంతయుఁ । జేసితి; నింక నిశ్చింతవృత్తి**
**సుగతికిఁ జనఁ గోరి తగ నుజ్జగించెద । బాణాసనంబును బాణములను;**

**తే.** **దెలివి గలిగి మనుం' డని పలికి శరశ । రాసనము లూడ్చి తేరిపై ననఘమూర్తి**
**యొప్పఁ గూర్చుండి సంభృత యోగనిష్ఠ । నొంది తేజోమయాత్ముఁ డై యుండె నధిప!** 322

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; సంగరంబునన్= యుద్ధంలో; తన్వి= తృప్తిని; చని= పొంది; శాంతిన్= శమాన్ని; పొందిన చిత్తంబుతోన్= పొందిన మనస్సుతో; తమ సేన దిక్కు= తమ సైన్యంవైపు; కనుఁగొని= చూచి; పెలుచన్= బిగ్గరగా; ఓ కర్ణ!= ఓయి కర్ణా!; ఓ కృప!= ఓ కృపా!; ఓ సుయోధన!= ఓయి దుర్యోధనా! (వినండి); పోరన్= యుద్ధం చేయటానికి; నన్నున్= నన్ను; ఒత్తి= గట్టిగా; ఎపుడున్= ఎల్లప్పుడు; చెప్పుదురు= చెప్పుతారు (కదా!); ఏను= నేను; నాచేన్+అయిన+అంతయున్= నా చేతనయినంత; చేసితిన్= చేశాను; ఇంక= ఇక; నిశ్చింతవృత్తిన్= చింతలేని ఉనికితో అనగా ఏ చింతా లేక; సుగతికిన్=ఉత్తమ గతికి; చనన్= పోవటానికి; కోరి= కాంక్షించి; తగన్= తగిన విధంగా; బాణాసనంబును= ధనువును; బాణములను= బాణాలను; ఉజ్జగించెదన్= త్యజిస్తూ ఉన్నాను (ఇక మీరు); తెలివి+కలిగి= బుద్ధి గలిగి; మనుండు+అని= జీవించండి అని; పలికి= చెప్పి; శర శరాసనములు= బాణాలను ధనువును; ఊడ్చి= జారవిడిచి; తేరిపైన్= రథంమీద; అనఘమూర్తి= పాపరహితమైన (తన) స్వరూపం; ఒప్పన్= ప్రకాశింపగా; కూర్చుండి= కూర్చున్నవాడయి; సంభృత యోగనిష్ఠన్= సంపూర్ణమైన యోగనిష్ఠను- (సమాధిని); ఒంది= పొంది; తేజోమయ+ఆత్ముఁడు+ఐ= తేజస్సుతో నిండిన (తేజఃప్రచురమైన) స్వరూపం కలవాడై; ఉండెన్= ఉన్నాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! యుద్ధంలో తృప్తిని, చిత్తంలో ఏ విధమైన చింతలేక శాంతిని పొంది తమ సైన్యం వైపు చూస్తూ బిగ్గరగా కర్ణాదులను పిలుస్తూ ఇట్లా అన్నాడు: 'ఓ కర్ణ, కృప, దుర్యోధనులారా! మీ రెప్పుడూ నన్ను ఎత్తిపొడుస్తూ యుద్ధానికి పురికొల్పేవారు - ఇదిగో, నా చేతనయినంత యుద్ధం చేశాను. ఇక ఈ ధనుర్బాణాలు నా కక్కరలేదు. నేను ఇక నిశ్చింతగా ప్రాణాలు త్యజించి పుణ్యలోకాలకు వెళ్ళాలని ధనుస్సును, బాణాలను వదలి వేస్తున్నాను. ఇక మీరు బుద్ధి కలిగి, జీవితం సాగించండి' అని పలుకుతూనే తన ధనుర్బాణాలను రథంపై జారవిడిచాడు. ఇక తాను రథంపై కూర్చుండి యోగసమాధిలో మునిగిపోయాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! అప్పుడు ఆ ద్రోణాచార్యుల శరీరం తేజోరూపంతో వెలిగింది.

**వ.** **అట్టియెడ ధృష్టద్యుమ్నుండు గృపాణపాణియుఁ బాదచారియునై భారద్వాజు దెసకుం గవియుటయు, నుభయ సైన్యంబుల హాహాకారంబు లెసఁగె; నంతం దనువు విడిచి యప్పుణ్యపురుషుండు ప్రకట జ్యోతీరూపంబున నెగసి పరమస్థానంబునకుం జనియెఁ; దత్తేజోమూర్తి యేను గంటిఁ, గృష్ణార్జున ధర్మనందన కృపాచార్యులునుం గనిరి; దక్కటి మానవులు గానరు; సురలు సూచి సంతసంబునం బొదలి; ర ట్లడరిన యాద్రుపద నందనుండు.** 323

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడన్= ఆ సమయంలో; ధృష్టద్యుమ్నుండు; కృపాణపాణిఐ= ఖడ్గం చేతియందు కలవాడై; పాదచారి యును+ఐ= (ఏ వాహనంపై కాక కేవలం) పాదాలతోనే నడుస్తూ ఉన్నవాడై; భారద్వాజు దెసకున్= ద్రోణాచార్యుల వైపునకు;

కవియుటయున్= చేరగానే; ఉభయ సైన్యంబులన్= ఇరుపక్షాల సైన్యాలలో; హాహాకారంబులు= హాహాకారాలు (హాహా అనే ఆర్తనాదాలు); ఎసఁగెన్= వ్యాపించాయి; అంతన్= అంతలోనే; తనువు= శరీరం; విడిచి= విడిచివేసి; ఆ+పుణ్యపురుషుండు= పవిత్రుడైన ఆ వ్యక్తి (ద్రోణాచార్యుడు); ప్రకట జ్యోతిస్+రూపంబునన్= స్పష్టమైన - అనగా మిక్కిలి ప్రకాశిస్తూ ఉన్న జ్యోతిస్సు రూపంతో; ఎగసి= ఎగిరిపోయి; పరమస్థానంబునకున్= మిక్కిలి ఉత్కృష్టమైన స్థానానికి, అనగా బ్రహ్మలోకానికి; చనియెన్= వెళ్ళాడు; తద్+తేజోమూర్తిన్= ఆ తేజస్స్వరూపాన్ని; ఏను= ఓ ధృతరాష్ట్ర మహారాజా! నేను (సంజయుడు); కంటిన్= చూచాను; కృష్ణ+అర్జున ధర్మనందన, కృపాచార్యులునున్= కృష్ణుడు, అర్జునుడు, ధర్మరాజు, కృపాచార్యులు (వీరందరు); కనిరి= చూచారు; తక్కటి మానవులు= మిగిలిన వీరులు; కానరు= చూడలేదు; సురలు= దేవతలు; చూచి= (ఆ తేజోదృశ్యాన్ని)దర్శించి; సంతసంబునన్= సంతోషంతో; పొదలిరి= ఉబ్బిపోయారు; అట్లు= ఆ విధంగా; అడరిన+ఆ ద్రుపదనందనుండు= విజృంభించిన ఆ ధృష్టద్యుమ్నుడు (ఆ ద్రోణాచార్యుడు న్యస్తశస్త్రుండై ఉండటమే తన కనువైన సమయంగా భావించి సంహరించటానికి సిద్ధపడిన వాడు ఆ ధృష్టద్యుమ్నుడు అని భావం).

**తాత్పర్యం:** అప్పుడు ధృష్టద్యుమ్నుడు. ఖడ్గం చేబూని కాలినడకతో ద్రోణాచార్యుని సమీపించగానే, దానిని చూచి ఉభయ పక్షాల సైనికులందరూ హాహాకారాలు చేశారు. అంతలోనే ద్రోణాచార్యుడు యోగాన్ని ఆశ్రయించి శరీర త్యాగం చేసి జ్యోతిస్స్వరూపంతో ఆకాశానికి ఎగసి పరమస్థానానికి అనగా బ్రహ్మలోకానికి వెళ్ళిపోయాడు. అత డట్లా జ్యోతిస్సు రూపంలో వెలుగుతూ ఉత్తమ లోకానికి వెళ్ళటం - కేవలం నేను (సంజయుడు), కృష్ణుడు, అర్జునుడు, ధర్మరాజు, కృపాచార్యుడు - అనే అయిదుగురం మాత్రమే చూచాము. తక్కినవారు చూడలేదు. అని సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పాడు. దేవతలు అదిచూచి సంతోషంతో ఉబ్బిపోయారు. ఆ విధంగా విజృంభించిన ధృష్టద్యుమ్నుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ధృష్టద్యుమ్నుండు మృతుండైన ద్రోణుని కంఠంబు దునుముట (సం. 7-165-47)**

**చ. అరదముపైకి దాఁటి కుపితాత్మత ద్రోణుశవంబు కేశముల్**
**గరమున బె ట్టమర్చికొని ఖడ్గహతిన్ మెడ ద్రుంచివైచె స**
**త్వరముగ మాను మాను మను వాక్యముతో నరుఁడేగఁ, దప్పు సు**
**మ్మర యని ధర్మజుండు దివి ముట్టు నెలుంగున బి ట్టదల్పఁగన్. 324**

**ప్రతిపదార్థం:** అరదముపైకిన్= రథంపైకి; దాఁటి= లంఘించి; కుపిత+ఆత్మతన్= క్రోధంతో నిండిన ఆకారంతో; ద్రోణు శవంబు కేశముల్= ద్రోణాచార్యుడి కళేబరం యొక్క వెంట్రుకలను (ఆ ద్రోణుడి శరీరం నిర్జీవమై ఉన్న సంగతి ధృష్టద్యుమ్నుడికి తెలియదు - తెలియక ద్రోణుడిని వధిస్తున్నా ననే మోహంలో పడ్డాడు ధృష్టద్యుమ్నుడు - ఈ విషయం మూలంలో **శ్లో॥ బ్రహ్మ లోక గతే ద్రోణే ధృష్టద్యుమ్నే చ మోహితే!** అని చెప్పబడింది); కరమునన్= చేతిలో; బెట్టు+అమర్చికొని= గట్టిగా పట్టుకొని; ఖడ్గహతిన్= కత్తివ్రేటుతో; మెడన్= కంఠాన్ని (నరికి వేయటానికి ఉద్యుక్తుడవుతూ ఉండగా); మాను మానుము= (నాయనా ధృష్టద్యుమ్నా!); మానివేయుము; అనువాక్యముతోన్= అని పలుకుతూ; నరుఁడు= అర్జునుడు; ఏఁగన్= వెళ్ళగా; (మరియు); తప్పు సుమ్మర!+అని= అరే (ధృష్టద్యుమ్నా!) తప్పు సుమా! అని; ధర్మజుండు= ధర్మరాజు; దివిముట్టు+ఎలుంగునన్= ఆకాశాన్నంటే కంఠస్వరంతో; బిట్టు= గట్టిగా; అదల్పఁగన్= గద్దిస్తూ ఉండగా; (దీనిని కూడా పట్టించుకోక); సత్వరముగన్= తొందరగా; త్రుంచివైచెన్= తెగనరికి వేశాడు.

**తాత్పర్యం:** కోపాతిశయంతో రథంపైకి లంఘించి. ద్రోణుడి కళేబరంయొక్క తలవెంట్రుకలను చేతితో పట్టుకొని, (ఆ ద్రోణుడి శరీరం నిర్జీవం అనే విషయం అతడికి తెలియదు) తల నరికివేయటానికి కత్తి ఎత్తుతూ ఉండగా అర్జునుడు పరుగుతీస్తూ 'ఆ పని కూడదు - మానివేయుము' అని అంటూనే ఉన్నా, ధర్మరాజు 'అది తప్పు కూడదు అని ఆకాశాన్నంటే కంఠస్వరంతో గట్టిగా గద్దిస్తూఉన్నా ధృష్టద్యుమ్నుడు వెంటనే ఆ ద్రోణుడి తలను తెగనరికి వేశాడు.

**వ. ఇత్తెఱంగునం దునిమి యతం డయ్యట్టయుం దలయును ధరణీతల గతంబు సేసె; నిట్లు శతవృద్ధుం డగు నయ్యస్త్ర గురుండు నీ దుర్మంత్రంబునఁ ద్రుంగిపోయినం బొంగి పాండవానీకంబు పైకొని తఱిమిన మన మొనలు వెఱచఱచి కనుకనిం బఱచెం; బఱచిన మనంబు గలంగి యప్పుడు నీ కొడుకు లేట మొగంబులు వడు దొరలతోడం గూడఁ దిరుగ నట్టియెడ దుర్యోధన దుశ్శాసన కృప కర్ణ కృతవర్మ మద్రేశ్వరుల మాతంగంబులం దురంగంబుల ముందఱ పెట్టికొని 'కటకటా!' యనుచు 'నింత పుట్టునే?' యనుచు 'నింక నేమి గల;' దనుచు 'నెట్లు సేయంగల వార?' మనుచు 'నేది దుది?' యనుచు మరలి మరలి చూచుచుం జనుచుండఁ దక్కిన యలంతి మానుసు లెల్లను దలచీర వాటించు తలంపు లేక యొండొరుల నిలు నిలు మని పలుకుచుం గాలు నిలువక పలుదిక్కులకుం బాఱి రత్తఱి నశ్వత్థామ మున్నొక్కకెలనం గయ్యంబు సేయుచుండి నీసేన యట్లగుటఁ గనుంగొని యక్కురుపతి కడకుం జని యతని కి ట్లనియె. 325**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; తునిమి= ఖండించి; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; ఆ+అట్టయున్= మొండెం; తలయును= తలను; ధరణీతలగతంబు= భూతలాన్ని పొందినదిగా; చేసెన్= చేశాడు; తలను ఖండించి (మొండెం, తల ఈ రెండూ భూమిపై పడగొట్టాడు; ఇట్లు= ఈ విధంగా; శతవృద్ధుండు+అగు= నూరేండ్లు సమీపిస్తున్న ముదుసలిఅయిన (ద్రోణాచార్యుడు 85 సంవత్సరాల వాడని మూలంలో ఉన్నది. **శ్లో॥ ఆకర్ణ పలితః శ్యామో వయసాశీతి పంచకః త్వత్కృతే 'వ్యచరత్ సంఖ్యే స తు షోడశవర్షవత్ ॥ ద్రోణ 192/64)'** అతివృద్ధుండు అనే పాఠాంతరం మూలవిధేయంగా ఉన్నది); ఆ+అస్త్రగురుండు= అస్త్రవిద్యాగురువైన ఆ ద్రోణాచార్యుడు; నీ దుర్మంత్రంబునన్= ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ దుష్టమైన ఆలోచన వలన; త్రుంగిపోయినన్= రాలిపోగా; పొంగి= ఉప్పొంగి; పాండవ+అనీకంబు= పాండవుల సైన్యం; పైకొని= పైబడి; తఱిమినన్= తరుమగా; మన మొనలు= మన (కౌరవ) సైన్యాలు; వెఱచఱచి= భయపడి; కనుకనిన్= సంభ్రమంతో; పఱచెన్= పారిపోయారు; పఱచినన్= పారిపోగానే; మనంబు= మనస్సు; కలంగి= కలతచెంది; అప్పుడు= ఆ సమయాన; నీ కొడుకులు= నీ కుమారులు అనగా కౌరవులు; లేట మొగంబులు+పడు= పెడమొగం పెట్టుకొని, పరాఙ్ముఖులై పారిపోతున్న; దొరల తోడన్+కూడన్= రాజులతోపాటు; తిరుగన్= వెనుతిరుగుతూ ఉంటే (ద్రోణ మరణంతో కౌరవవీరులందరు నిరుత్సాహంతో పారిపోయారని (సంస్కృత మూలం ద్రోణ - 193వ అధ్యాయంలో విపులంగా ఉన్నది); అట్టి+ఎడన్= ఆ సమయంలో; దుర్యోధన, దుశ్శాసన, కృప, కర్ణ, కృతవర్మ, మద్రేశ్వరులు= దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కృపాచార్యులు, కర్ణుడు, శకుని - వీరందరు; మాతంగంబులన్= ఏనుగులను; తురంగంబులన్= అశ్వాలను; ముందఱ+పెట్టుకొని= ముందుంచుకొని; కటకటా!+అనుచున్= అకటా! అని అంటూ; ఇంత పుట్టునే+అనుచున్= ఇంత జరుగుతుందా? అని అనుకుంటూ; ఇంకన్+ఏమి+కలదు?+అనుచున్= (ఇంత జరిగినాక) ఇంక ఏమి ఉంటుంది? - అని అంటూ; ఎట్లు+చేయన్+కలవారము?+అనుచున్= ఎట్లా చేస్తాం? అని అంటూ; ఏది తుది?+అనుచున్= ఇక దీనికి చివర ఏది? అని అంటూ; మరలి+మరలి+మాటి మాటికి వెనుకకు తిరిగి; చూచుచున్= చూస్తూ; చనుచున్+ఉండన్= వెళ్ళుతూ ఉండగా;

తక్కిన+అలంతి మానుసులు+ఎల్లన్= మిగిలిన కొద్దిపాటి మనుష్యులందరు; తలచీర+పాటించు తలంపులేక= తలపాగ చుట్టుకొనటానికి ఇచ్చ లేక (తలపాగ విడిపోయినా సరిచేసుకొనటానికి తీరికలేక); ఒండొరులన్= పరస్పరం (ఒకరు మరొకరితో); నిలునిలుము+అని= ఆగుము ఆగుము అని; పలుకుచున్= అంటూ; కాలు నిలువక= పాదం ఆనక (నిలబడే ఓపిక లేక); పలు దిక్కులకున్= నానా దిశలకు; పాఱిరి= (భయంతో) పారిపోయారు; ఆ+తఱిన్= ఆ సమయంలో; అశ్వత్థామ= ద్రోణాచార్యుడి కుమారుడు అశ్వత్థామ; మున్ను= ముందు; ఒక్కకెలనన్= ఒకవైపు; కయ్యంబు= యుద్ధం; చేయుచున్+ఉండి= చేస్తూ ఉండి; నీ సేన= ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ సైన్యం; అట్లు+అగుటన్= ఆ విధంగా కావటాన్ని - అట్లా భయభ్రాంతమై పారిపోవటాన్ని; ఆ+కురుపతి కడకున్+చని= ఆ కురురాజు - అనగా దుర్యోధనుడి దగ్గరకు వెళ్ళి; అతనికిన్= అతడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా తలనరికి ఆ తల, ఆ మొండెం రెంటిని భూమిమీదికి విసరివేశాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ యొక్క చెడు ఆలోచన ఫలితంగా, అందరికీ అస్త్రవిద్యను నేర్పిన ఆ గురువు నూరేండ్ల పండుముసలి తెగిపడిపోగా, పాండవుల సైన్యాలు సంతోషంతో ఉప్పొంగిపోయాయి, మన సైన్యాలపై విజృంభించాయి. దానికి మన సైన్యాలు భయపడి, దిక్కుతోచక పరుగెత్తాయి. ఆ విధంగా పరుగెత్తగా. నీ కొడుకులు కలతచెందిన మనస్సుతో పెడమొగం పెట్టుకొని పారిపోతున్న రాజులతో పాటు వెనుదిరిగి వెళ్ళుతూ ఉండగా మన దుర్యోధన, దుశ్శాసన, కృప, కర్ణ, కృతవర్మ, శల్యుల గజాశ్వాది సైన్యాలను ముందర పెట్టుకొని, 'అయ్యో! మన కింకా ఏం మిగిలింది?' ఇట్లా జరుగుతుం దని అనుకొనలేదు' 'ఇక మనం ఏదైనా చేస్తామన్నా ఏం చేయజాలుతాము?' 'దీనికి ఏమైనా పరిష్కారముందా?' - అని అనుకొంటూ వెనుకకు తిరిగి తిరిగి చూస్తూ వెళ్ళుతూ ఉండగా, తక్కిన సామాన్య సైనికులందరూ 'ఒరేయి ఆగరా నేను వస్తున్నా'నని ముందర పోయే వారిని పిలుస్తూ, తలపాగా కూడ సవరించుకోకుండ పలుదిక్కులకు పరుగెత్తారు. ఆ సమయంలో అశ్వత్థామ ఒక వైపు యుద్ధం చేస్తూ ఉన్నాడు. ఇట్లా కురుసైన్యాలు పారిపోవటం గమనించాడు. కురురాజు దుర్యోధనుడి దగ్గరికి వెళ్ళి ఇట్లా అన్నాడు.

**తే. 'బలము లిది యేమి నలుగడఁ బాఱఁ జొచ్చె? । కర్ణ కృప ముఖ్యు లేటికిఁ గలఁగి లేట**
**మొగము వడి? రేల నీవును మున్నువోలె । నిలువరింపంగఁ దగియెడు నిలుపు లేవ?' 326**

**ప్రతిపదార్థం:** బలములు= సైన్యాలు; నలుగడన్= నాలుగువైపులకు; పాఱన్+చొచ్చెన్= పారిపోవటానికి ప్రయత్నించాయి; ఇది+ ఏమి?= ఇదేమి?-ఎందుకు?; కర్ణ కృప ముఖ్యులు= కర్ణుడు కృపాచార్యుడు మొదలైనవారు; ఏటికిన్= ఎందుకు?;కలఁగి= కలతజెంది; లేటమొగము+పడిరి?= పరాఙ్ముఖులైనారు?; నీవును= ఓ దుర్యోధనా! నీవుకూడ; మున్ను+పోలెన్= మునుపటివలె; నిలువరింపగన్+తగియెడు= ఆపజాలినట్టి; నిలుపు= స్థైర్యం; లేవు+అ= లేనివాడవా?; ఏల?= ఎందుకని? (ఎందుకు నిలుపటం లేదు?).

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! మన సైన్యాలు నాలుగు వైపులకు ఎందుకు పారిపోతున్నాయి. కర్ణుడు, కృపాచార్యుడు మొదలైన ప్రముఖులు ఎందుకు కలతచెంది బాధతో పరాఙ్ముఖులై వెనుదిరుగుతున్నారు. నీవు కూడా మునుపటివలె లే వేమి? వీరందరిని ఆపగలిగే ఆ మునుపటి శక్తి నీలో కొరవడిందా? ఎందుకు? చెప్పుము.'

**వ. అని యడిగిన నతం డతనిమొగంబు సూచి యాచార్యు తెగుట సెప్పంబోయి డగ్గుత్తికపడి యూరకుండె; శారద్వతుండు వెలువెలం బాఱుచు నెట్టకేలకు నెలుంగు దెచ్చికొని.** **327**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; అడిగినన్= అడుగుతూ ఉండగా; అతండు= ఆ దుర్యోధనుడు; అతని మొగంబు= ఆ అశ్వత్థామ ముఖం; చూచి; ఆచార్యు తెగుట+చెప్పన్+పోయి= ద్రోణాచార్యుడి వధను గూర్చి చెప్పటానికి పూనుకొని; డగ్గుత్తిక+పడి= చెప్పటానికి నోరురాక, కంఠం గద్గదస్వరాన్ని పొందగా; ఊరక+ఉండెన్= మౌనంగా ఉండిపోయాడు; శారద్వతుండు= కృపాచార్యులు; వెలువెలన్+పాఱుచున్= వెలవెలబోతూ - తన ముఖం కళావిహీనం అయిపోతూ ఉండగా; ఎట్టకున్+ఏలకున్= ఎంతో కష్టంగా, ఎలుంగు+తెచ్చికొని= కంఠధ్వనిని సవరించుకొని. (ఇట్లా అన్నాడు)

**తాత్పర్యం:** అని అడుగగా దుర్యోధనుడు, అశ్వత్థామ ముఖం చూస్తూ ద్రోణుడి వధ విషయం చెప్పబోయి తండ్రి కంఠం గాద్గదికమై నోటమాట రాక మౌనంగా ఉండిపోయాడు. కృపాచార్యుడు వెలవెలబారిన ముఖంతో ఎట్లాగో కంఠస్వరాన్ని కుదుటపరచుకొని

**సీ. 'పాంచాల పాండవ ప్రముఖ సైన్యంబుల । ద్రోణుండు బలువిడిఁ ద్రుంచుటయును,**
**నుక్కఱి పాండవు లొక్కచోటికి వచ్చి । నిలువరింపఁగ, లేక తలఁకుటయును,**
**వాయుతనూజుఁ 'డశ్వత్థామ సచ్చెఁ జు' । మ్మని కుంభజునితోడ నాడుటయును,**
**నమ్మాట గొనక ధర్మాత్మజు నవ్వార్త । యాచార్యుఁ డేర్పడ నడుగుటయును**
**తే. భీముచేత నశ్వత్థామనామ గజము । మున్ను చచ్చుట కతమున న న్నరాధి**
**పతియు నది నెపముగ నట్ల పలుకఁ, జాల । నడలి యతఁ డాయుధంబులు విడుచుటయును.** **328**

**ప్రతిపదార్థం:** ద్రోణుండు= ద్రోణాచార్యుడు; పాంచాల పాండవ ప్రముఖ సైన్యంబులన్= పాంచాలసైన్యాలు, పాండవసైన్యాలు- ఈ మొదలైన సైన్యాలను; బలువిడిన్= వేగంగా; త్రుంచుటయును= ఖండించివేయటం; పాండవులు= పాండవవీరులు; ఉక్కు+అఱి= పొగరు తగ్గి; ఒక్క చోటికిన్= (అందరు) ఒకే చోటికి అనగా ద్రోణాచార్యుడు యుద్ధం చేసే చోటికి; వచ్చి= ఏకమై వచ్చి కూడ; నిలువరింపఁగన్+లేక= అడ్డుకొనలేక; తలఁకుటయును= తొలగిపోవటం; వాయు తనూజుఁడు= వాయునందనుడైన భీముడు; అశ్వత్థామ+చచ్చెన్+చుమ్ము+అని= అశ్వత్థామ మరణించాడు సుమా అని; కుంభజుని తోడన్= ద్రోణాచార్యుడితో; ఆడుటయును= చెప్పటం; ఆ+మాట= ఆ భీముడి మాటను; కొనక= నమ్మక; ధర్మాత్మజున్= ధర్మరాజును; ఆ+వార్త= ఆ అశ్వత్థామ మరణవార్త; ఆచార్యుఁడు= ద్రోణాచార్యులు; ఏర్పడన్= తేటతెల్లం కావటానికి; అడుగుటయును= అడుగటం (అశ్వత్థామ మరణవార్త భీముడు చెప్పిన మాత్రాన నమ్మక దానిని గూర్చి నిజం తెలియటానికి ఆచార్యుడు ధర్మరాజును అడిగాడని భావం); భీము చేతన్= భీమసేనుడి చేత; అశ్వత్థామ నామగజము= అశ్వత్థామ అనే పేరుగల ఏనుగు; మున్ను= అంతకుముందే; చచ్చుట కతమునన్= మరణించటం కారణాన (భీముడు, అశ్వత్థామ అనే గజాన్ని అంతకుముందు సంహరించాడు కాబట్టి); ఆ+నరాధిపతియున్= ఆ ధర్మరాజుకూడ; అది నెపము+కన్= ఆ అశ్వత్థామ అనే గజం మరణించటం మిష కాగా; అట్లు+అ= ఆ విధంగానే అనగా ఔను అశ్వత్థామ మరణించెనని; పలుకన్= చెప్పగానే; చాలన్= మిక్కిలి; అడలి= (ఆ దుఃఖాన్ని తట్టుకొనలేక) చలించిపోయి; ఆయుధంబులు= శస్త్రాలను; విడుచుటయును= విసర్జన చేయటం.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు పాంచాల పాండవ ప్రముఖ సైన్యాలను త్రుటిలో పెద్ద మొత్తంలో అంతమొందించాడు. అది చూచి పాండవ వీరుల పొగరు అణిగిపోగా వారందరు విడివిడిగా కాక ఏకమై ద్రోణుడితో పోరుకు దిగికూడా ఆ ద్రోణుడి ధాటిని అడ్డుకొనలేక తొలగిపోయారు. అప్పుడు భీముడు 'అశ్వత్థామ చచ్చెన్' అని ద్రోణుడితో అన్నాడు. ఆ భీముడి మాటను నమ్మక ద్రోణాచార్యుడు ధర్మరాజుతో 'అశ్వత్థామ చచ్చెనా?' అని ప్రశ్నించాడు. భీముడు అంతకుముందు అశ్వత్థామ అనే పేరుగల ఏనుగును సంహరించాడు కాబట్టి ధర్మరాజు ఆ మిషతో అశ్వత్థామ చావటం యథార్థమని ద్రోణాచార్యుడికి తోచే విధంగా సమాధానం చెప్పాడు. దీనితో కొడుకు మరణవార్త నిజ మని నమ్మి ద్రోణాచార్యుడు ఆ దుఃఖానికి తట్టుకొనలేక ఆయుధాలు వదలివేశాడు.

**వ. అప్పుడు. 329**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క. గురుఁ డమలయోగనిష్ఠం । బిరమై యుండంగ వచ్చి, ధృష్టద్యుమ్నుం**
**డరదముమీఁది కెగసి త । చ్ఛిరోజములు పట్టికొని యసిం దునుముటయున్. 330**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ఆచార్యుడు - ద్రోణుడు; అమల యోగనిష్ఠన్= నిర్మలమైన యోగనిష్ఠలో; తిరము+ఇ= స్థిరుడై; ఉండంగన్= ఉంటూ ఉండగా; వచ్చి= సమీపానికి వచ్చి; ధృష్టద్యుమ్నుండు; అరదము మీఁదికిన్= ఆచార్యుల రథంపైకి; ఎగసి= కుప్పించి; తద్+శిరోజములు= ఆ ద్రోణాచార్యుడి వెంట్రుకలు; పట్టికొని= చేత తీసికొని; అసిన్= కత్తితో; తునుముటయున్= నరికివేయటం.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు నిర్మలమైన యోగనిష్ఠలో స్థిరంగా ఉండగా, ధృష్టద్యుమ్నుడు రథం మీదికి ఎగిరి వచ్చి, ద్రోణాచార్యుడి తల వెంట్రుకలను చేతితో పట్టుకొని, కత్తితో తలను నరికివేశాడు.

**వ. చెప్పి యప్పుడు ధర్మనందన ధనంజయులు వారింప నతం డుడుగక యట్లు సేసె ననియు నెఱింగించి, యట్లు భారద్వాజుండు పడిన బలంబులు విఱిగె; నేమును నిరుత్సాహుల మయితి; మేనుంగు పేరి నెపంబుగా నట్టి మాట పుట్టుట కృష్ణకృతం బయిన కపటోపాయంబుగానోపు; నని యంతయు నేర్పడం బలికె ననుటయు ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగంబై. 331**

**ప్రతిపదార్థం:** చెప్పి= (ద్రోణవధ జరిగిన తీరును) తెలియజేసి (మళ్ళీ ఇట్లా అన్నాడు); అప్పుడు= ఆ సమయంలో; ధర్మనందన ధనంజయులు= ధర్మరాజు అర్జునుడు; వారింపన్= కూడదని నివారిస్తూ ఉండగానే; అతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; ఉడుగక= ఆగక; అట్లు= ఆ విధంగా - అనగా ద్రోణ శిరఃఖండనం; చేసెన్= చేశాడు; అనియున్= అని కూడా; ఎఱింగించి= తెలిపి; ఇట్లు= ఈ విధంగా; భారద్వాజుండు= ద్రోణాచార్యులు; పడినన్= పడిపోగా - అనగా మరణించగా; బలంబులు= (మన) సైన్యాలు; విఱిగెన్= చెదరిపోయాయి; ఏమును= మేముకూడ; నిరుత్సాహులము= ఉత్సాహం లేనివారం; అయితిమి= అయ్యాము; ఏనుంగు పేరి నెపంబుగాన్= అశ్వత్థామ అనే గజం పేరు మిష కాగా; అట్టిమాట= ఆ మాట - అనగా 'అశ్వత్థామ సచ్చె' అనే మాట;పుట్టుట=

పుట్టటం; కృష్ణకృతంబు+అయిన= కృష్ణుడిచే చేయబడిన; కపట+ఉపాయంబు= కపటంతో కూడిన ఎత్తుగడ; కాన్+ఓపున్= కావచ్చు; అని= ఇట్లా; అంతయున్= సర్వం; ఏర్పడన్= విశదమయ్యేటట్లు; పలికెన్= పలికాడు; అనుటయున్= అనగానే, అనగా సంజయుడు చెప్పగానే; ధృతరాష్ట్రుండు; సంజయు దిక్కుమొగంబు+ఐ= సంజయుడి వైపు తిరిగి - సంజయుడికి అభిముఖుడై.

**తాత్పర్యం:** అప్పుడా ధర్మరాజు, అర్జునుడు వద్దనిచెప్పినా, అతడు వినక ఆ విధంగా చేశాడు. అట్లా ద్రోణాచార్యులు కూలిపోగానే సైన్యాలు భయభ్రాంతములై నలువైపుల చెదరిపోయాయి. మేము కూడా ఉత్సాహం లేక ఇట్లా అయిపోయాము. అశ్వత్థామ అనే ఏనుగు చావటం మిషగా 'అశ్వత్థామ చచ్చెను' అనే పుకారు పుట్టించటం కృష్ణుని కుతంత్రం కావచ్చును. అని అంతా స్పష్టంగా చెప్పాడు-అని సంజయుడు చెప్పగా ధృతరాష్ట్ర మహారాజు సంజయుడివైపు తిరిగి (ఇట్లా ప్రశ్నించాడు).

**మ. 'వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ శ్రీరాముతో**
**సరిసేయం దగువాఁడు దండ్రితల పాంచాలాత్మజుం డట్లు ని**
**ష్ఠురుఁ డై పట్టె ననంగఁ ద్రుంచె నన వించున్ వారితోఁ గూడ నా**
**తురుఁ డై పోయెనొ? పోక నిల్చియలుకన్ దోర్దర్పముం జూపెనో? 332**

**ప్రతిపదార్థం:** అశ్వత్థామ= అశ్వత్థామ; వరదివ్య+అస్త్రవిదుండు= శ్రేష్ఠములైన దివ్యాస్త్రాలు తెలిసినవాడు; బాహుఘనుఁడు= బాహుబలంలో గట్టివాడు (కాబట్టి); శ్రీరాముతో సరి+చేయన్+తగువాఁడు= ఆ శ్రీరామచంద్రుడితో పోల్చదగినవాడు (అట్టి అశ్వత్థామ); తండ్రి తల= (తన) తండ్రి ద్రోణాచార్యుడి తలను; పాంచాల+ఆత్మజుండు= ద్రుపదుడి కుమారుడు ధృష్టద్యుమ్నుడు; అట్లు= ఆ విధంగా; నిష్ఠురుఁడు+ఐ= కఠినుడై - అనగా కర్కశ స్వభావం కలవాడై; పట్టెన్+అనంగన్= (తల వెంట్రుకలను) పట్టాడు అనగా; (మరియు) త్రుంచెన్+అనన్= (తల) నరికివేశాడు అని అంటూ ఉంటే; వించున్= వింటూ; వారితోన్+కూడన్= ఆ దుర్యోధనాదులతో కూడా; ఆతురుఁడు+ఐ= సంతాపం కలవాడై; పోయెనొ?= పోయాడో?; పోక= దుఃఖపరవశుడై పోక; నిల్చి= స్థిరుడై ఉండి; అలుకన్= క్రోధంతో; దోర్దర్పమున్= భుజగర్వాన్ని; చూపెనో?= చూపాడా?

**తాత్పర్యం:** 'సంజయా! అశ్వత్థామ దివ్యాస్త్రాలన్నీ తెలిసినవాడు, గొప్పబాహుబలం కలవాడు. శ్రీరాముడితో సరిపోల్చదగినవాడు. అట్టి అశ్వత్థామ, ఆ ధృష్టద్యుమ్నుడు తన తండ్రి తలవెంట్రుకలు పట్టి అంత నిర్దయగా గుంజాడంటే, అంతేకాక ఆ తండ్రి తలను ఖడ్గంతో నరికివేశాడంటే వింటూ ఆ దుర్యోధనాదులతోపాటు దుఃఖిస్తూ ఊరకే ఉన్నాడా? లేదా క్రోధోద్రిక్తుడై విజృంభించి శత్రువులపై భుజబలదర్పాన్ని ఏమైనా చూపాడా? చెప్పుము.

**క. తను నాధృష్టద్యుమ్నుం । దునుముటకై కోరి కనియె ద్రోణుఁడు పరమా**
**స్త్ర నిరూఢి పరశురాముఁ డ । తని కిచ్చిన యంతవట్టు దన కతఁ డిచ్చెన్. 333**

**ప్రతిపదార్థం:** ద్రోణుఁడు= తండ్రి ద్రోణాచార్యుడు; తనున్= తనను అనగా అశ్వత్థామను; ఆ ధృష్టద్యుమ్నున్= తన తండ్రి మరణానికి అవతరించిన ఆ ద్రుపద పుత్రుడిని ధృష్టద్యుమ్నుడిని; తునుముటకై= సంహరించటానికి; కోరి= ఇష్టపడి - ప్రత్యేకించి; కనియెన్= కన్నాడు (మరియు); అతనికిన్= ఆ ద్రోణాచార్యుడికి; పరశురాముఁడు= అతడి గురువగు పరశురాముడు; ఇచ్చిన+అంత+పట్టు= ఇచ్చినదంతా - నేర్పినదంతా అని భావం; అస్త్రనిరూఢిన్= అస్త్రాలను (ప్రయోగోపసంహారాలతో) నిర్వహించే

సామర్థ్యాన్ని; అతఁడు= ఆ(తన తండ్రి) ద్రోణాచార్యుడు; తనకున్= తనకు అనగా అశ్వత్థామకు; ఇచ్చెన్= ఇచ్చాడు - నేర్పాడు అని భావం.

**తాత్పర్యం:** ద్రోణుడు అశ్వత్థామను ధృష్టద్యుమ్నుడి వధ నిమిత్తం కని, తాను తన గురువు పరశురాముడి దగ్గర నేర్చుకొనిన అస్త్రవిద్యనంతా అతడికి నూరిపోశాడు.

**వ. అట్టి జనకు నా ద్రుపదనందనుం డట్లు సేసిన నక్కొడు కెట్లు సేసెనో వినవలతుం జెప్పు మనవుడు నమ్మహీపతి కతఁ డి ట్లనియె. 334**

**ప్రతిపదార్థం:** అట్టి జనకున్= అటువంటి తండ్రిని; ఆ ద్రుపదనందనుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; అట్లు= ఆ విధంగా - అనగా కేశాకర్షణం చేసి తల నరకటం; చేసినన్= చేయగా; ఆ+కొడుకు= ఆ ద్రోణపుత్రుడు అశ్వత్థామ; ఎట్లు= ఏ విధంగా; చేసెనో= చేశాడో; వినన్= వినటానికి; వలతున్= కోరుతున్నాను; చెప్పుము; అనవుడున్= అనగానే; ఆ+మహీపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుతో; అతఁడు= ఆ సంజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అటువంటి తన తండ్రి ద్రోణాచార్యుడి తలను ధృష్టద్యుమ్నుడు ఆ విధంగా నరికి వేశాడని తెలిసిన ఆ ద్రోణాచార్యుల కుమారుడు అశ్వత్థామ ఏం చేశాడో వినవలెనని ఉన్నది చెప్పుము. అని అనగానే సంజయుడు ఆ ధృతరాష్ట్ర మహారాజుతో ఇట్లా అన్నాడు:

**తే. కృపుని పలుకులు విని దట్టకెంపు గదురు । గన్నుఁగవ నశ్రుజలములు గ్రమ్ముదేరఁ**
**బాణితలమున నొత్తి యా ద్రోణతనయుఁ । డిట్టు లనుఁ దగఁ గౌరవాధీశుతోడ. 335**

**ప్రతిపదార్థం:** కృపుని పలుకులు= కృపాచార్యుడి మాటలు; విని; దట్టకెంపు గదురు+కన్ను+కవన్= మిక్కిలి ఎరుపువన్నె అతిశయించిన కన్నుల జంటలో; అశ్రుజలములు= కన్నీళ్ళు; క్రమ్ముదేరన్= పైకి ఉబికి రాగా; పాణితలమునన్= అరచేతితో; ఒత్తి= ఒత్తుకొని; ఆ ద్రోణతనయుఁడు= ఆ ద్రోణాచార్యుడి కుమారుడు అశ్వత్థామ; కౌరవ+అధీశుతోడన్= కౌరవరాజు దుర్యోధనుడితో; తగన్= తగినవిధంగా; ఇట్టులు= ఇట్లా; అనున్= అన్నాడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడి మాటలు వినగానే ఎరుపెక్కిన అశ్వత్థామ రెండు కన్నులలో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి. అయినా దుఃఖాన్ని ఆపుకొని, కన్నీళ్ళను చేతితో తుడుచుకొని, దుర్యోధనుడితో సమయోచితంగా ఇట్లా అన్నాడు.

**ఉ. 'చావులు లేవె యెందు? ననిఁ జచ్చుట యొప్పదె? యిట్లు లోకసం**
**భావితు న మ్మహాత్ముఁ దల వట్టె నొకండను వాఁడి మాట య**
**మ్మై వడి దాఁకి చిత్తమున కార్తి యొనర్ప సహింపరాదు గా**
**కే విన నున్కి వాఁ డెఱుఁగఁడే? నను నిమ్మెయి భంగపెట్టునే? 336**

**ప్రతిపదార్థం:** (ఓ దుర్యోధనా!) చావులు= మరణాలు; ఎందున్= ఎక్కడైనా; లేవు+ఎ?= ఉండవా? (మరణాలు తప్పవని భావం); అనిన్= యుద్ధంలో; చచ్చుట= మరణించటం; ఒప్పదు+ఎ?= శోభించదా? (యుద్ధంలో మరణం కీర్తికరమే కాబట్టి వీరులకు తగి ఉండుటచేత ఒప్పుతుందని భావం). (కాని ఈ మా తండ్రి మరణం నాకు దుఃఖహేతువు కావటానికి కారణ మేమంటే?); అట్లు= ఆ విధంగా; లోకసంభావితున్= లోకులచేత పూజించబడినట్టి; ఆ+మహాత్మున్= ఆ మహానుభావుడైన మా తండ్రిని; ఒకండు= ఒకడు; (పేరు తలచుకొనటం కూడ పాపహేతువు కాబట్టి పేరు ఇక్కడ ఉదాహరింపబడలేదు 'కథాపి ఖలు పాపా

నామలమశ్రేయసే యతః' - ఆర్యోక్తి); తల పట్టెన్= తలవెంట్రుకలు పట్టుకొన్నాడు; అను వాఁడిమాట= అనే తీవ్రమైన పలుకు; అమ్ము+ఐ= బాణమై; వడిన్= వేగంగా; తాఁకి= తగిలి; చిత్తమునకున్= మనస్సునకు; ఆర్తి= బాధ; ఒనర్పన్= కలుగజేయగా; సహింపరాదు+కాక= ఓర్వరాకుండా ఉంటే ఉండుగాక; ఏన్= నేను; వినన్+ఉన్కి= వినగలుగుటను; వాఁడు= ఆ వ్యక్తి (ఆ ధృష్టద్యుమ్నుడు); ఎఱుఁగడే?= తెలియకుండా ఉన్నాడా?; ననున్= నన్ను; ఈ+మెయిన్= ఈ విధంగా; భంగపెట్టునే= భంగపరుస్తాడా? - అవమానిస్తాడా!

**తాత్పర్యం:** 'ఓ దుర్యోధనా! ఎక్కడా మరణాలులేవా? యుద్ధంలో మరణించటం తగదా? (ఇవి సహజాలే) ఈ విధంగా లోకపూజ్యుడైన ఆ మహాత్ముడిని తలపట్టి ఈడ్చాడనే క్రూరమైన మాట వాడిబాణమై వేగంగా మనస్సును తాకి బాధకలిగిస్తే సహించటం సాధ్యం కాదు సరే, నేను వింటానని వాడికి తెలియదా? నన్ను ఈ విధంగా అవమానిస్తాడా?

**క.** **నా దివ్యాస్త్రంబులు బా । హాదర్పము నింకఁ గాల్పనా? గురుఁ డాజిం**
**దా దిక్కుమాలి పగతుని । చే దైన్యముఁ బొందె నటె! యిసీ! యే మందున్? 337**

**ప్రతిపదార్థం:** నా దివ్య+అస్త్రంబులు= నా యొక్క దివ్యములైన బ్రాహ్మము మొదలైన అస్త్రాలు; బాహాదర్పము= భుజగర్వం; ఇంకన్= ఇక; కాల్పనా?= దహించి వేయటానికా? - నిష్ప్రయోజన మి దంతా (ఎందుకంటే); గురుఁడు= మా+తండ్రి; అజిన్= యుద్ధంలో; తాన్= తాను; దిక్కుమాలి= రక్షణ కోల్పోయి; పగతునిచేన్= శత్రువుచేత; దైన్యమున్= దీనదశను; పొందెన్+అట+ఎ?= పొందాడు కదా!; ఇసీ= ఎంత రోత?; ఏమి+అందున్?= (దీనిని గూర్చి) ఏమనాలి? (ఇది ఎంత అవమానకర విషయమో! అనటానికి మాటలులేవు.)

**తాత్పర్యం:** నా దివ్యాస్త్రాలు, భుజగర్వం ఇంకెందుకు? కాల్చి వేయటానికా? మా తండ్రి ఏ దిక్కులేక యుద్ధంలో శత్రువు చేతిలో దీనంగా మృతిచెందాడా! ఛీ! ఇంకేమి అనగలను?

**క.** **దీనికి మూలము ధర్మజుఁ । డా నిక్కము గల్గు రాజు నని దండితుఁగా**
**నే నెట్లు సేసి పుత్తునొ । కో! నా చిత్తము కలంకయును నెవ్వగయున్. 338**

**ప్రతిపదార్థం:** దీనికిన్= దీనికంతటికి; మూలము= కారణభూతుడు; ధర్మజుఁడు= ధర్మరాజు - ఇదంతా ధర్మరాజువలననే జరిగింది; ఆ నిక్కము= ఆ సత్యం - అనగా కపటపూర్వక సత్యం; కల్గు= కలిగిఉన్న; రాజున్= రాజును అనగా ఆ ధర్మరాజును; అనిన్= యుద్ధంలో; దండితున్ కాన్= దండించబడేవాడినిగా; ఎట్లు= ఏ విధంగా; చేసి= చేసి; ఏన్= నేను; నా చిత్తము కలంకయును= నా మనస్సులోని క్షోభాన్ని; నెఱ+వగయున్= గొప్ప బాధను; పుత్తును+ఒకో!= పోగొట్టుకుంటానో!. (నా మనస్సులోని సంక్షోభం ఈ దుఃఖం పోవాలంటే ధర్మరాజును దండించక తప్పదు - అ దెట్లా?).

**తాత్పర్యం:** ఓ దుర్యోధనా! దీని కంతటికీ కారణం ఆ ధర్మరాజే. ఆ కపట సత్యాన్ని కలిగి ఉన్న రాజును యుద్ధంలో ఏ విధంగా దండించి నా మానసిక సంక్షోభాన్ని, దుఃఖాన్ని తొలగించుకొంటానో!

**ఆ.** **పుత్త్రుఁ గనుట యెల్ల శత్రునిచేఁ దల । వట్టి తాను దునుమఁబడుట కయ్యె**
**నస్త్రగురున; కింక నన నేమి గలదు? నా । యిచ్చుబాస కౌరవేంద్ర! వినుము. 339**

**ప్రతిపదార్థం:** అస్త్రగురునకున్= అస్త్రవిద్యాగురువైన ద్రోణాచార్యుడికి; పుత్రున్+కనుట+ఎల్లన్= కొడుకును (నన్ను) కనటం అంతా; శత్రునిచేన్= శత్రువు చేత; తాను= తండ్రి అయిన తాను; తల+పట్టి తునుమఁబడుటకున్= తలను పట్టుకొని సంహరింపబడటానికి; అయ్యెన్= అయింది; అనన్= చెప్పటానికి; ఇంకన్= ఇంతకంటె ఎక్కువ; ఏమి+కలదు?= ఏమున్నది? (ఏమీలేదని భావం); ఓ కౌరవేంద్ర!= ఓ కురురాజా దుర్యోధనా!; నా+ఇచ్చు బాస= నేనిస్తూ ఉన్న మాట - నా ప్రతిజ్ఞ వినుము.

**తాత్పర్యం:** అస్త్రగురుడైన మా తండ్రి ద్రోణాచార్యులు పుత్రుడనైన నన్ను కన్నది శత్రువుచేత తలపట్టి ఈడ్వబడి తాను ఏ దిక్కూలేక నరికివేయబడి మరణించటానికే అన్నట్లయింది. ఇక చెప్పటానికి ఏమున్నది దుర్యోధనా!? నేను చేసే ప్రతిజ్ఞ వినుము.

**మ. హరియుం బాండవులున్ మదీయ పటు బాహాశక్తి దివ్యాస్త్ర ని**
**ర్భర సంతాప పరీతులై యొదుఁగ ఘోరస్ఫార సంక్రీడఁ ద**
**త్తురగస్యందన వారణప్రకరముల్ ద్రుంగన్ విజృంభించెద**
**న్సుర సంఘంబులు వచ్చి యడ్డుపడిన న్దుర్వారదర్పోద్ధతిన్. 340**

**ప్రతిపదార్థం:** హరియున్= కృష్ణుడును; పాండవులున్= ధర్మరాజు మొదలైన పాండవులును; మదీయ= నాదైన; పటు= సమర్థమైన; బాహాశక్తి= భుజబలంచేత (మరియు); దివ్య+అస్త్ర= దేవతాసంబంధులైన మంత్రబాణాలచేత; నిర్భరసంతాప= (కలిగిన) అధికమైన బాధతో; పరీతులు+ఐ= కూడిన వారలై; ఒదుఁగన్= తొలగిపోయే విధంగా(మరియు); తద్+తురగ స్యందన వారణ ప్రకరముల్= ఆ పాండవుల అశ్వరథగజాల సమూహాలు; ఘోరస్ఫార సంక్రీడన్= భయంకరము, అధికము అయిన యుద్ధక్రీడ చేత - అనగా విలాసంగా ఏ క్లేశం లేక చేసే యుద్ధం చేత; త్రుంగన్= ఖండించబడే విధంగా; (ఒకవేళ) సురసంఘంబులు= దేవతల సమూహాలు; వచ్చి= పాండవ పక్షం వచ్చి; అడ్డుపడినన్= అడ్డంగా నిలిచినా కూడా; దుర్వార దర్ప+ఉద్ధతిన్= నివారించ శక్యంకాని భుజ బలగర్వం చేతనైన; ఉద్ధతిన్= మిడిసిపాటుతో; విజృంభించెదన్= విజృంభిస్తాను.

**తాత్పర్యం:** నా ఈ బాహుబల పరాక్రమాలతో దివ్యాస్త్ర ప్రయోగంతో తల్లడిల్లి, మిక్కిలి బాధతో ఆ శ్రీకృష్ణుడు, పాండవులు రణరంగంలో తట్టుకోలేక తొలగిపోయేటట్లు చేస్తాను. అసంఖ్యాకములైన బాణజాలం వర్షిస్తూ అశ్వరథగజాల సమూహాలు నేలకొరిగేటట్లు చేస్తాను. దేవతల సంఘాలు పాండవ పక్షపాతులై అడ్డువచ్చినా నా దుర్వారమైన భుజబలం ఔద్ధత్యం ప్రదర్శిస్తూ విజృంభిస్తాను.

**క. తనుఁ దాన చెప్పికొను టొ । ప్పని పని యగు; నైనఁ దండ్రి పరిభవమునకుం**
**గనలు గదిరి యి ట్లంటిని; । విను మే నే మనిన నేమి వృథ వో దధిపా!' 341**

**ప్రతిపదార్థం:** అధిపా! వినుము= ఓ దుర్యోధనా వినుము; తనున్= తన గూర్చి; తాను+అ= తానే (స్వయంగా); చెప్పుకొనుట= ప్రశంసించుకొనటం; ఒప్పని పని= తగనిపని; అగును= అవుతుంది (ఆత్మస్తుతి పనికిరాదని భావం); ఐనన్= అయినప్పటికి; తండ్రి పరిభవమునకున్= తండ్రికి జరిగిన అవమానానికి; (నాలోని) కనలు= కోపం; కదిరి= అతిశయించి; ఇట్లు= ఈ విధంగా; అంటిని= అన్నాను (మా తండ్రి ద్రోణాచార్యులకు ఆ పాండవులు చేసిన అవమానంతో నాలో పెల్లుబికిన దుఃఖాతిశయం నాతో ఇట్లా పలికించింది కాని నేను స్వయంగా ఆత్మస్తుతికి పూనుకొనలేదు); ఏను= నేను; ఏమి+అనినన్= ఏమి అన్నప్పటికీ; ఏమి=

ఏమి కూడ; వృథ+పోదు= వ్యర్థంగాపోదు - అది అయ్యే తీరుతుందని భావం (దీనితో ఏమన్నానో అది చేసి చూపిస్తానని దుర్యోధనుడితో అశ్వత్థామ చెప్పినట్లయింది).

**తాత్పర్యం:** తన్ను గురించి తాను చెప్పుకోవటం తగని పని. తండ్రికి జరిగిన అవమానానికి కోపం అతిశయించి ఈ విధంగా అన్నాను. ఓ దుర్యోధనా! వినుము. నేనేమన్నా అది వృథాగా పోదు. (అయితీరుతుంది).'

**అశ్వత్థామ పూన్కివలనఁ గౌరవయోధులు మరల ననికిఁ గడంగుట (సం. 7-166-43)**

**వ. అని పలికి మఱియు నిట్లను 'మా తండ్రి నారాయణు నారాధించి యొక్క మహాస్త్రంబు వడసె; నది నాకు నిచ్చె; న ద్దివ్యసాధనంబు వధ్యు లవధ్యులను విభాగంబు లేక విరోధి విధ్వంసనంబు సేయుఁ; దత్ప్రయోగంబున జయంబు సేకొనియెదం జూడు!' మనుటయు నమ్మహీపతియు ననుజులు సేనాపతులును శంఖంబులు పూరించి సింహనాదంబులు సేసి మరలిన, భేరీమృదంగాది తూర్యధ్వనులు నింగి ముట్టఁ దురంగ రింఖా రథనేమి గజపద ఘట్టనంబుల నిల గ్రక్కదల మన సైన్యంబులు మరలి యురవడించె; ననిన విని ధృతరాష్ట్రుండు.**
**342**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికి= చెప్పి; మఱియున్= మళ్ళీ; ఇట్లు= ఇట్లా; అనున్= అన్నాడు; మా తండ్రి= మా తండ్రి అయిన ద్రోణాచార్యుడు; నారాయణున్= నారాయణ భగవానుడిని; ఆరాధించి= ఆరాధన చేసి; ఒక్క మహాస్త్రంబు= ఒకానొక దివ్యాస్త్రాన్ని; పడసెన్= పొందాడు; అది= ఆ దివ్యాస్త్రాన్ని; నాకున్+ఇచ్చెన్= నాకిచ్చాడు; ఆ+దివ్యసాధనంబు= ఆ దివ్యాస్త్రం; వధ్యులు+అవధ్యులు+అను విభాగంబు= (వీరు) వధించ తగినవారు (వీరు) వధించతగని వారు అనే భేదం; లేక= లేకుండానే; విరోధి విధ్వంసనంబు= శత్రునాశం; చేయున్= చేస్తుంది; తత్ప్రయోగంబునన్= ఆ దివ్యాస్త్ర ప్రయోగంతో; జయంబు= విజయాన్ని; చేకొనియెదన్= చేపట్టుతాను; చూడుము= ఓ దుర్యోధనా! చూడు; అనుటయున్= ఇట్లా అనగానే; ఆ+మహీపతియున్= ఆ రాజు- దుర్యోధనుడు; అనుజులున్= తమ్ములు దుశ్శాసనాదులు; సేనాపతులును= సైన్యాధిపతులు కూడా; శంఖంబులు= శంఖాలను; పూరించి= పూరణచేసి (శంఖధ్వనులు చేసి); సింహనాదంబులు+చేసి= సింహనాదాలను చేసి; మరలినన్= పాండవ సైన్యంవైపు మరలగానే - మళ్ళీ యుద్ధం చేయటానికి సమాయత్తం కాగానే; భేరీ మృదంగ+ఆది తూర్యధ్వనులు= భేరీలు మృదంగాలు మొదలైన వాద్యాల ధ్వనులు; నింగిముట్టన్= ఆకాశాన్ని అంటగా; తురంగ రింఖా రథనేమి గజ పద ఘట్టనంబులన్= అశ్వాల డెక్కలు, రథచక్రాల కమ్ములు, ఏనుగుల పాదాలు అనే వాటియొక్క తాకిడులచేత; ఇల= భూమి; గ్రక్కదలన్= మిక్కిలిగా కదలుతుండగా; మన సైన్యంబులు= ఓ ధృతరాష్ట్ర మహారాజా! మన (కురు) సైన్యాలు; మరలి= తిరిగి; ఉరవడించెన్= సమాయత్తమయినవి; అనినన్= అనగానే; విని= విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు.

**తాత్పర్యం:** అని పలికి, ఇంకా ఇట్లా అన్నాడు. 'మా తండ్రి నారాయణుడిని ఉపాసించి అతడి వలన ఒకానొక దివ్యాస్త్రాన్ని పొందాడు. అదే నారాయణాస్త్రం. దానిని అతడు నాకు ఇచ్చాడు. ఆ దివ్యాస్త్రం వీరు చంపదగినవారు, వీరు చంపదగనివారు అనే భేదం లేక శత్రునిర్మూలనం చేసివేస్తుంది. దానిని ప్రయోగించి విజయాన్ని సాధిస్తా చూడుము - చూస్తావు కదా!' అని అశ్వత్థామ తన దగ్గరనున్న దివ్యాస్త్ర ప్రభావాన్ని వర్ణించి చెప్పగానే దుర్యోధనుడు, దుశ్శాసనాదులు, సేనాధిపతులు అందరూ యుద్ధసన్నద్ధులై శంఖాలను పూరించారు. సింహనాదాలు చేశారు. భేరీ మృదంగాది వివిధ రణరంగ వాద్యాలు మ్రోగాయి. అన్నింటి ధ్వనులు ఆకాశాన్నంటాయి. చతురంగబలాలు ముందుకు నడిచాయి. అశ్వాల డెక్కలతో, రథచక్రాల కమ్ములతో, ఏనుగుల పాదాలతో ఒరపిడి పొంది, ఆ

భూమి అంతా కదలుచున్నట్లనిపించింది. ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లా మన సైన్యాలు శత్రుసైన్యాలపై మళ్ళీ విజృంభించాయి - అని చెప్పగానే విని ధృతరాష్ట్ర మహారాజు (సంజయుడితో ఇట్లా అన్నాడు).

**ఆ. 'అట్లు గడఁగు కౌరవానీకములఁ గని। పాండుపుత్రు లేమి భంగివార**
**లై? రెఱుంగఁ జెప్పు' మనవుడు నమ్మహీ। శ్వరున కిట్టు లనియె సంజయుండు. 343**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; కడఁగు= ఉద్యమిస్తున్న; కౌరవ+అనీకములన్= కౌరవ సైన్యాలను; కని= చూచి; పాండుపుత్రులు= పాండురాజు కుమారులు ధర్మరాజాదులు; ఏమి భంగివారలు= ఎటువంటి విధానం కలవారు; ఐరి?= అయినారు?; ఎఱుంగన్= తెలిసే విధంగా; చెప్పుము= చెప్పుము; అనవుడున్= అనగానే; సంజయుండు; ఆ+మహీపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుతో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** 'ఓ సంజయా! ఆ విధంగా మన సైన్యాలు యుద్ధానికి సమాయత్తమై వస్తూ ఉండగా పాండవులు ఏ విధానాన్ని అనుసరించారు? అంతా స్పష్టంగా చెప్పుము'- అని ధృతరాష్ట్ర మహారాజు ప్రశ్నించగానే సంజయుడు అతడితో ఇట్లా అన్నాడు:

**వ. ఇత్తెఱంగునం గురుబలంబులు పురికొనం గౌంతేయులుం గూడుకొని సైన్యంబు సుసంగతంబు సేసికొని సంగరక్రీడ కమరి; రప్పుడు గ్రీడి నాలోకించి ధర్మతనయుండు. 344**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; కురుబలంబులు= కురుసైన్యాలు; పురికొనన్= ఉద్యమిస్తూ ఉంటే; కౌంతేయులు= కుంతీపుత్రులు ధర్మరాజాదులు కూడ; కూడుకొని= ఒకచోట కలిసి; సైన్యంబు= తమ సైన్యాన్ని; సుసంగతంబు= సముచితంగా అనగా యుద్ధసన్నద్ధంగా; చేసికొని= ఏర్పరచుకొని; సంగరక్రీడకున్= పోరాటానికి అనగా యుద్ధానికి; అమరిరి= సన్నద్ధమయ్యారు; అప్పుడు= ఆ సమయాన; క్రీడిన్= అర్జునుడిని; ఆలోకించి= చూచి; ధర్మతనయుండు= ధర్మరాజు. (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ఈ విధంగా కురుసైన్యాలు పెల్లుబికిన ఉత్సాహంతో యుద్ధానికి కదలివస్తూ ఉండగా చూచి, ధర్మరాజాదులు కూడా అందరూ ఏకమై తమ సైన్యాన్ని కూడా యుద్ధానికి పురికొల్పారు. తాము కూడ యుద్ధానికి సిద్ధమయ్యారు. ఆ సమయంలో ధర్మరాజు అర్జునుడితో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'గురుఁడు పడిన నవ్విధమునఁ। బరమభయాకులతఁ బొంది పఱచియు నట వే**
**తిరిగి కురుబలము పోరికిఁ। గర ముద్ధతి నగ్గలింపఁ గత మెయ్యదియో? 345**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; పడినన్= పడిపోగా; ఆ+విధమునన్= ఆ విధంగా; పరమ భయ+ఆకులతన్= మిక్కిలి భయంచేత వ్యాకులత్వాన్ని; పొంది= చెంది; అట= ఆ వైపు; పఱచియున్= పరుగులు తీసికూడ; వే= వేగంగా; తిరిగి= మలగి; కురుబలము= కురుసైన్యం; పోరికిన్= యుద్ధానికి; కరము= మిక్కిలి; ఉద్ధతిన్= దర్పంతో; అగ్గలింపన్= ఉత్సహించటానికి; కతము= కారణం; ఎయ్యది+ఓ?= ఏమిటో?

**తాత్పర్యం:** 'ఆచార్యుడు ద్రోణుడు పడిపోగానే ఆ కురుసైన్యాలు మిక్కిలి భయంతో చెల్లాచెదరై పారిపోయాయి కదా! మరి ఇప్పుడు కొండంత ఉత్సాహంతో తిరిగి యుద్ధానికి పూనుకొని ఇటు వస్తున్నవి. కారణం ఏమిటో?

**క. ఇలయును నింగియు నద్రువం। జెలఁగె మహారవము వారి సేనలఁ గురుచా**
**వలుక నొనర్చిన నక్కడ। బలరిపుఁ డేతెంచి తోడు పడి నడచె నొకో!' 346**

**ప్రతిపదార్థం:** ఇలయును= భూమియు; నింగియున్= ఆకాశం; అద్రువన్= అదలిపోయే విధంగా; మహారవము= పెద్ద ధ్వని; వారిసేనలన్= ఆ కౌరవుల సైన్యంలో; చెలఁగెన్= పెల్లుబికింది; గురుచావు= ద్రోణాచార్యుడి మృతి; అలుకన్= కోపాన్ని; ఒనర్చినన్=కలుగజేయగా; బలరిపుఁడు= ఇంద్రుడు; అక్కడన్= ఆ వైపు; ఏతెంచి= వచ్చి; తోడుపడి= సహాయపడి; నడచెనొకో!= నడుస్తున్నాడా ఏమి?

**తాత్పర్యం:** ఆ కౌరవసైన్యంలో భూమి ఆకాశం బ్రద్దలయ్యేటట్లు గొప్ప ధ్వని పుట్టిం దేమి? ఒకవేళ ద్రోణాచార్యుల మృతివలన మనపై కోపం పుట్టి ఆ ఇంద్రుడు వీరి సహాయార్థం వచ్చి ఈ సైన్యాని కుత్సాహం కలుగటానికి వెంట నడుస్తున్నాడా? ఏమి ఇది?'

**వ. అనిన విని యమ్మనుజపతికి నతం డి ట్లనియె. 347**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; విని= విని; ఆ+మనుజ పతికిన్= ఆ ధర్మరాజుతో; అతండు= ఆ అర్జునుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అడుగగా, ధర్మరాజుతో అర్జునుడు ఇట్లా అన్నాడు:

**ఆ. 'న్యస్తశస్త్రుఁ డైన యాచార్యుఁ జంపిన । నెవ్వరొక్కొ? వారి కివ్విధంబు**
**బలిమి గలుగఁ జేసి రలుకమై ననుచు సం । దియము పడగ నేల? తెలియ వినుము. 348**

**ప్రతిపదార్థం:** న్యస్తశస్త్రుఁడు+ఐన= త్యజించబడిన శస్త్రంగల; ఆచార్యున్= ఆ ద్రోణాచార్యుడిని; చంపినన్= సంహరించగా; అలుకమైన్= కోపంతో; ఎవ్వరు= ఏ వ్యక్తులు; వారికిన్= ఆ కౌరవులకు; ఈ+విధంబు= ఇటువంటి; బలిమి= బలం; కలుగన్+చేసిరి ఒకో!= కలిగేటట్లు చేశారో!; అనుచున్= అంటూ; సందియము= అనుమానం; పడఁగన్+ఏల?= పడవలసిన పనిఏమి?; తెలియన్= తెలిసేటట్లు; వినుము= వినుము.

**తాత్పర్యం:** 'అస్త్రత్యాగం చేసిన ఆచార్యుడిని చంపారనే కోపంతో ఈ కౌరవసైన్యానికి ఇంత ధైర్యం నూరిపోసి మా పైకి పురికొల్పిన వా రెవ్వరో అని - ఓ ధర్మరాజా! సందేహపడవలదు. నేను చెప్పుతాను వినుము.

**చ. జనకు నధర్మవృత్తి మెయిఁ జంపుటకై తలవట్టె నొక్కరుం**
**డన విని రిత్తవోవునె మహాద్భుత శౌర్యము నస్త్రవీర్యమున్**
**మనము జగంబుఁ గన్న యతిమానుషవిక్రమశాలి; వీని నె**
**వ్వని కెదురంగ రా దనఁగ వ్రాలిన ద్రోణసుతుండు భూవరా! 349**

**ప్రతిపదార్థం:** భూవరా!= ఓ ధర్మరాజా!; జనకున్= తన తండ్రి అయిన ద్రోణాచార్యులను; అధర్మవృత్తిమెయిన్= అధర్మ ప్రవర్తనతో; చంపుటకై= సంహరించటానికి; తల= తలను; పట్టెన్= పట్టాడు; ఒక్కరుండు+అనన్= ఓ వ్యక్తి (ధృష్టద్యుమ్నుడు) అనగా; విని= విని; రిత్త+పోవునే?= క్రియాశూన్యుడై ఉంటాడా? (సుతుడు అశ్వత్థామ, ఊరకుంటాడా?); ఆ ద్రోణసుతుండు= అశ్వత్థామ (ఎటువంటి వాడంటే); మహా+అద్భుత శౌర్యము= గొప్ప ఆశ్చర్యాన్ని కలుగజేసే ప్రతాపం; అస్త్రవీర్యమున్= దివ్యాస్త్ర శక్తి; మనము= మనం (కేవలం మనమే కాదు); జగంబున్= ఈ లోకం కూడ; కన్న= చూచిన (వాడు) (ఆ అశ్వత్థామ ప్రతాపం దివ్యాస్త్రశక్తి ఎంతటి ఆశ్చర్యాన్ని కలుగజేసేదో మనమే కాదు లోకమంతా ప్రత్యక్షంగా చూచింది అనగా అందరికీ తెలుసు); అతి మానుష విక్రమశాలి= మనుష్యుల కెవ్వరికీ సాధ్యంకాని పరాక్రమంతో శోభించేవాడు; (మరియు ప్రస్తుతం అతడు) వీనిన్= ఈ అశ్వత్థామను; ఎవ్వనికిన్= ఏ వీరుడికి కూడ; ఎదురంగన్+రాదు= ఎదుర్కొనటానికి సాధ్యంకాదు; అనఁగన్= అనే విధంగా;

వ్రాలిన= విజృంభించిన (వాడు); అటువంటి ద్రోణసుతుడు (అశ్వత్థామ) రిత్త+పోవునే? అని అన్వయం - (దూరాన్వయ దోషంచేత ఇట్లా అర్థం వ్రాయవలసి వచ్చింది).

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఆ ద్రోణాచార్యుడి కుమారుడు అశ్వత్థామ తన తండ్రిని అధర్మంగా ఒకడు సంహరించటానికి అతడి తల పట్టుకున్నాడని విన్నాడు. అట్లా తన తండ్రికి జరిగిన అవమానానికి ఊరుకుంటాడా? అతడు సామాన్యవ్యక్తి కాడే! ఎంతో దివ్యాస్త్రసంపద, అద్భుతమైన బాహుబలం, అతిమానుషమైన పరాక్రమం అతడికున్నాయి. అది మనకుగాని ఈ లోకానికి గాని తెలియనిది కాదు. తననెవ్వరు ఎదిరించి నిలువలేరనే విధంగా విజృంభించాడు. అంతే. (దీనికంతటికి అతడే కారణం).

**తే.** **జన్మవేళన యాతఁ డుచ్చైశ్శ్రవంబు । భంగి హేషించెఁ బృథివి గంపంబు నొంద;**
**నప్పు డతని కశ్వత్థామ యని యొనర్చెఁ । బేరు జనములు విన నశరీరవాణి.** **350**

**ప్రతిపదార్థం:** జన్మవేళన్+అ= పుట్టుక సమయంలోనే; ఆతఁడు= ఆ ద్రోణాచార్యుడి కుమారుడు; పృథివి= భూమి; కంపంబున్= కంపాన్ని; ఒందన్= పొందే విధంగా; ఉచ్చైశ్శ్రవంబు భంగిన్= ఉచ్చైశ్శ్రవం అనే దేవేంద్రుడి గుర్రం మాదిరి; హేషించెన్= సకిలించాడు; అశ్వంవలె పెద్దగా అరిచాడని భావం; అప్పుడు= ఆ సమయంలో; అశరీరవాణి= ఆకాశవాణి; జనములు= జనులు; వినన్= వినేటట్లు; అతనికిన్= ఆ ద్రోణపుత్రుడికి; అశ్వత్థామ+అని= అశ్వత్థామ అనే; పేరు; ఒనర్చెన్= కలుగజేసింది.

**తాత్పర్యం:** అశ్వత్థామ తాను పుట్టగానే ఇంద్రుడి అశ్వం ఉచ్చైశ్శ్రవం వలె పెద్ద సకిలింత చేశాడట. దానితో భూమి కంపించిపోయింది - అది చూచి ఆకాశం నుండి అశరీరవాణి 'ఈ శిశువు అశ్వత్థామ అనే పేరుతో ప్రసిద్ధి చెందు తాడు' అని చెప్పింది. ఆ అద్భుతం అక్కడ ఉన్న జనులందరూ విన్నారు.

**వ.** **అతఁడు సూవె కౌరవసైన్యంబు నిప్పటి సంరంభంబునకుం గారణం' బని చెప్పి వెండియు.** **351**

**ప్రతిపదార్థం:** అతఁడు+చూవె= ఆ అశ్వత్థామయే ('చూవె' నిశ్చయార్థకము); కౌరవ సైన్యంబు+ఇప్పటి సంరంభంబునకున్= కౌరవసైన్యంలో ఇప్పుడు కలిగిన ఆటోపానికి; కారణంబు= కారణం; అని చెప్పి= ఇట్లా చెప్పి; వెండియున్= ఇంకా (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ఈ కౌరవసైన్యం ఇట్లా ఆటోపంతో యుద్ధానికి ఉద్యమిస్తున్నదంటే దానికి కారణం ఈ అశ్వత్థామయే' అని అర్జునుడు ధర్మరాజుతో చెప్పి, మరల (ఇట్లా అన్నాడు).

**ఆ.** **'అనఘ! నిన్ను శిష్యుఁడును ధార్మికుండు స । త్యవ్రతుండు నని మహాదరమున**
**నడిగె; నీవు ధర్మహానికి నోర్చిన । గురుఁడు నిశ్చయించెఁ గొడుకు చావు.** **352**

**ప్రతిపదార్థం:** అనఘ!= ఓ పుణ్యాత్మా!; నిన్నున్= నిన్ను; శిష్యుఁడును= శిష్యుడవు; ధార్మికుండున్= ధర్మం తప్పనివాడవు; సత్యవ్రతుండును= సత్యనిష్ఠగల వాడవు; ('ను' అంతాగమము ప్రాయికం); అని మహా+ఆదరమునన్= అనే గొప్ప ఆదరభావంతో; అడిగెన్= అడిగాడు; అశ్వత్థామ మరణాన్ని గూర్చి ప్రశ్నించాడని భావం; నీవు= ఓ ధర్మరాజా! నీవు; ధర్మహానికిన్= ధర్మపరిత్యాగానికి; ఓర్చినన్= సిద్ధపడిన వెంటనే; గురుఁడు= మన అస్త్రవిద్య గురువు ద్రోణాచార్యుడు; కొడుకు చావు= తన కొడుకు అశ్వత్థామ మరణాన్ని; నిశ్చయించెన్= ధ్రువపరచుకొన్నాడు.

**తాత్పర్యం:** 'ఇంతవరకు పాపమంటే తెలియని ఓ ధర్మరాజా! ('ఇప్పుడే పాపానికి ఒడిగట్టా'వని ధ్వని) ద్రోణాచార్యుడు-నీవు సత్యవంతుడవు. ధర్మాత్ముడవు. మీదు మిక్కిలి తనకు శిష్యుడవు అని ఎంతో ఆదరభావంతో కొడుకు మరణాన్ని గూర్చి నిన్ను అడిగాను. నీవు ధర్మహానికి పూనుకోగా గురుడు తన పుత్రుడు అశ్వత్థామ మరణించినట్లుగా ధ్రువీకరించుకొన్నాడు.

**క. ఛలము గొని యిట్లు వడయఁగ । వలయునె రాజ్యంబు? దీన వచ్చిన కలిమిం**
**గలుగునె పెంపుం బేరును? వెలి యైతిమి లోకమునకు వేయును నేలా? 353**

**ప్రతిపదార్థం:** ఛలము+కొని= కపటాన్ని ఆశ్రయించి; ఇట్లు= ఈ విధంగా; రాజ్యంబు= రాజ్యాన్ని; పడయఁగన్+వలయునె?= పొందవలెనా? (రాజ్యప్రాప్తికి వేరే మార్గం లేదా? అని భావం); దీనన్= దీనివలన; వచ్చిన కలిమిన్= పొందిన (రాజ్య) సంపదతో; పెంపున్= అభివృద్ధి; పేరును= కీర్తి; కలుగునె?= కలుగుతాయా? (కలుగదని భావం); చేయునున్+ఏలా?= వేయి (మాటలు) ఎందుకు? (ఎన్ని చెప్పినా ఏమి ప్రయోజనం?) (మనకు చేకూరిన లాభం ఏమంటే?); లోకమునకున్= లోకానికి; వెలి+ఐతిమి= వెలి అయినాము అనగా దూరమయినాము' (గౌరవం కోల్పోయాము).

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఇట్లా కపట వృత్తితో రాజ్యం పొందటం తగునా? అట్లా పొందిన రాజ్యం పేరు తెస్తుందా? ఆ సంపద అభివృద్ధిని సాధిస్తుందా? ఇంకా ఏం చెప్పి ఏమి ప్రయోజనం? లోకం దృష్టిలో మనం వెలియై గౌరవాన్ని కోల్పోయామన్న మాట నిజం.

**వ. అదియునుం గాక. 354**

**తాత్పర్యం:** అంతేకాక. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. వల దిట్లే లని యేను బేరెలుఁగునన్ వారించుచున్ బాఱఁగాఁ**
**దల యిట్లేటికిఁ బట్టి త్రెవ్వ నడిచెన్? ధర్మప్రణాశం బెదం**
**దలఁపం డాగ్రహవృత్తిఁ బార్షతుఁడు; దద్దైన్యంబునం గ్రోధవి**
**హ్వాలుఁ డై యీతనిపై వడిం బడక యశ్వత్థామ సైరించునే? 355**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఏల?= ఎందుకు?; వలదు= వద్దు; అని= అని; ఏను= (అర్జునుడు); పేరు+ఎలుఁగునన్= పెద్ద కంఠధ్వనితో; వారించుచున్= నివారిస్తూ; పాఱఁగాన్= పరుగుతీస్తూ ఉండగానే; పార్షతుఁడు= ధృష్టద్యుమ్నుడు; ఇట్లు=ఈ విధంగా; తలపట్టి త్రెవ్వన్= తల పట్టుకొని నరకటానికి; ఏటికిన్= ఎందుకు; నడిచెన్?= నడిచాడు?; కేశగ్రహణం చేసి సంహరించటంలో అతడి ఉద్దేశం ఏమిటో తెలియటం లేదని భావం; (ఇట్లా చేయటం వలన)? - ధర్మప్రణాశంబు= (కలిగే) ధర్మహానిని; పార్షతుఁడు= ధృష్టద్యుమ్నుడు; అగ్రహవృత్తిన్= కోపస్వభావంతో; ఎదన్= మనస్సులో; తలంపఁడు= భావించకుండా ఉన్నాడు; తద్+దైన్యంబునన్= ఆ చింతచేతనైన దైన్యంచేత; క్రోధవిహ్వాలుఁడు+ఐ= కోపానికి వివశుడై; అశ్వత్థామ= గురుపుత్రుండు-అశ్వత్థామ; వడిన్= వేగంగా; ఈతనిపైన్= ఈ ధృష్టద్యుమ్నుడిపై; పడక= విజృంభించకుండా; సైరించునే?= సహిస్తాడా?

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఇట్లా పనికిరాదు, చేయటం వద్దు అని పెద్ద కంఠస్వరంతో నేను అడ్డుకొంటూ అతడివైపు పరుగెత్తుతూనే ఉన్నాను. అయినా లెక్కచేయక ధృష్టద్యుమ్నుడు ద్రోణాచార్యుడి కేశగ్రహణం చేసి, శిరస్సును ఖండించటానికి ఎందుకు పూనుకొన్నాడు? ఆ కోపంలో ధర్మహాని జరుగుతుందని కూడా విచారించలేదు. అట్లా అధర్మంగా తన తండ్రి తల నరకివేయటం వల్ల కలిగిన దీనత్వంతో క్రోధం పెల్లుబికి ప్రతీకారంగా ధృష్టద్యుమ్నుడిపై దాడి చేయకుండా ఊరుకొంటాడా?

**క. మన సేవల నొక్కెత్తునఁ। గొనఁ దలఁచి కడంగి వచ్చు గురుపుత్రుని మా**
**ర్కొన ధృష్టద్యుమ్నునిఁ గా। వను శక్యమె నీకు? నిచటివారికి? నధిపా!' 356**

**ప్రతిపదార్థం:** అధిపా!= ఓ రాజా!; మన సేవలన్= మన సైన్యాలను; ఒక్క+ఎత్తునన్= ఒకేసారిగా; కొనన్+తలఁచి= పట్టుకొనటానికి సంకల్పించి; కడంగి= విజృంభించి; నన్ను గురు పుత్రునిన్= వస్తూ ఉన్న గురుపుత్రుడిని - అశ్వత్థామను; మార్కొనన్= ఎదుర్కొనటానికి మరియు; ధృష్టద్యుమ్నుని; కావను= రక్షించటానికి; నీకున్; ఇచ్చటివారికిన్= ఇక్కడివారికి!; శక్యమె?= సాధ్యమవుతుందా? (ఎవరికి కూడా సాధ్యం కాదని భావం).

**తాత్పర్యం:** ఓ ధర్మరాజా! ఒక్కపెట్టుగా మన సైన్యాన్ని వమ్ము చేయతలపెట్టి విజృంభించి వస్తున్నాడు. అశ్వత్థామను ఎదుర్కొనటం, ధృష్టద్యుమ్నుడిని అతడి' బారినుండి కాపాడటం నీకుగాని, ఇక్కడున్నవారికిగాని సాధ్యమవుతుందా?'

**వ. అనినం గోపించి యనిలనందనుం డా సంక్రందననందనున కి ట్లనియె. 357**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇట్లా అనగానే; కోపించి= కోపపడి; అనిల నందనుండు= వాయుసుతుడు - భీముడు; ఆ సంక్రందన నందనునకున్= ఇంద్రుడి కుమారుడు - అర్జునుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఇట్లా ధర్మరాజుతో అనగా భీముడికి కోపంవచ్చి, ఆ అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**చ. 'అడవుల నుండు తాపసుల యట్టులు పల్కెదు రాజనీతి యి**
**ట్టొడఁబడి చేయ వచ్చి వధ కొల్లమి యొప్పునె? ధర్మనిష్ఠ యె**
**క్కడఁ గల దాసభన్ ద్రుపదకన్యక పాటున కిట్టి వెన్నియుం**
**గడుకొని చేసినన్ మనలఁ గల్మష మొందఁగ నేర దర్జునా! 358**

**ప్రతిపదార్థం:** అర్జునా!= ఓ పార్థా!; అడవులన్= అరణ్యాలలో; ఉండు తాపసుల+అట్టులు= నివసించే మునులవలె; పల్కెదు= పలుకుతావు; రాజనీతి; ఇట్లు+ఒడఁబడి= ఈ విధంగా అనుమతించి; చేయవచ్చి= చేయతగిన; వధకున్= గురువధకు, రాజనీతి (యుద్ధంలో బంధుత్వాదుల విచారించక వధ చేయటాన్ని అనుమతించింది కావున గురువధ చేయటం సముచితమే); ఒల్లమి= సమ్మతించకపోవటం; ఒప్పునె?= తగునా? (తగదని భావం) - ఇక కపటంగా వధించటమంటావా?; ధర్మనిష్ఠ= ధర్మరతి; ఎక్కడన్+కలదు?= ఎక్కడ ఉంది? (మనయందు మాత్రమే ధర్మనిష్ఠ ఉండవలెనా? ఆ కౌరవులయందు ఉండనక్కరలేదా? అని భావం); ఆ సభన్= కపటద్యూతాన్ని నిర్వహించిన ఆ కౌరవసభలో; ద్రుపద కన్యక పాటునకున్= ద్రౌపది పడిన కష్టానికి (వస్త్రాపహరణాది క్లేశానికి); ఇట్టి= ఇటువంటివి; ఎన్నియున్= ఎన్నైనా; కడుకొని= పూనుకొని; చేసినన్= చేసినా కూడా; మనలన్= మనకు; కల్మషము= పాపం; ఒందఁగ నేరదు= పొందజాలదు.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! నీవు అరణ్యాలలో ఉండి తపస్సు చేసికొనే మునులు పల్కినట్లు పల్కుతున్నావు. ద్రోణవధ గురువధ అని భావించి నీవు ఒప్పుకొనటం లేదు. గురువు, శిష్యుడు, పుత్రుడు అనే సంబంధ పరిగణన యుద్ధంలో లేదని రాజనీతి చెప్తుతున్నది. ఇక కపటంగా వధించటం అధర్మమనియా నీ భావన? ధర్మంగానే ఉన్నదా కౌరవుల ప్రవర్తన? ఆనాడు సభలో ద్రౌపది పడినభంగపాటుకు ఇటువంటివి ఎన్ని చేసినా మనకు పాపమంటదు.

**తే. అరులు మనమీఁద నురవడి నరుగుదేర। నేము సిడిముడిపడుచుండ నిట్టు లనుట**
**యొప్ప 'దురిసినపుండుల నుప్పు' వెట్టె। దరయ; దీనికి నిన్ను నే మందు పార్థ! 359**

**ప్రతిపదార్థం:** పార్థ!= ఓ అర్జునా!; అరులు= శత్రువులు; మనమీఁదన్= మనపైకి; ఉరవడిన్= మిక్కిలి వేగంగా; అరుగుదేరన్= వస్తూ ఉండగా; ఏము= మేము; చిడిముడి పడుచున్+ఉండన్= వేగిరపడుతూ ఉండే సమయంలో; ఇట్టులు+అనుట= ఈ విధంగా- అనగా నిరుత్సాహం కలిగే విధంగా మాటలాడటం; ఒప్పదు= తగదు (నీవు ఏం చేస్తున్నావంటే); ఉరిసిన పుండులన్= పక్వమైపగిలిన పుండ్లమీద; ఉప్పు= ఉప్పు; పెట్టెదు= ఉంచుతూ ఉన్నావు (పుండుపగిలి బాధపడుతూ ఉంటే దాని మీద ఉప్పు చల్లి మరీ బాధపెట్టినట్లుగా నీ పలుకులు - ఓ అర్జునా! మాకెంతో బాధాకరంగా ఉన్నాయి); అరయన్= చూడగా; దీనికిన్= ఈ నీ మాటల తీరునకు; నిన్నున్= నిన్ను; ఏమి+అందున్= ఏమనేది?

**తాత్పర్యం:** ఓ అర్జునా! శత్రువులు మనమీదికి మిక్కిలి వేగంతో వచ్చిపడుతూఉంటే, వాళ్ళను తిప్పికొట్టటానికి మేము సంభ్రమంతో సమాయత్తమౌతూఉంటే, ఈ సమయంలో నిరుత్సాహపరచే నీ మాటల ధోరణి చూస్తూ ఉంటే పక్వమై పగిలిన పుండ్లమీద ఉప్పు చల్లినట్లున్నది. ఇట్లా మాట్లాడటం నీకు తగదు. ఇంతకంటె నిన్ను నేనేమనగలను?

**క. కురువీరు లెఱుఁగుదురు ననుఁ; । గురువీరుల తెఱఁగు నేనుఁ గొంత యెఱుఁగుదున్;**
**శరపరిఘప్రహరణములఁ । బొరిగొనియెదఁ గాక వారిఁ బో నిచ్చెదనే? 360**

**ప్రతిపదార్థం:** కురువీరులు= కౌరవవీరులు; ననున్= నన్ను; ఎఱుఁగుదురు= తెలిసి ఉన్నారు; కురువీరుల తెఱఁగు= కౌరవవీరుల పద్ధతిని; నేనున్= నేనూ (భీముడు); కొంత= కొంతభాగం; ఎఱుఁగుదున్= తెలిసికొని ఉన్నాను (కాబట్టి) శరపరిఘప్రహరణములన్= బాణాలు, పరిఘలు (ముండ్ల రోకళ్ళు) అనే వాటియొక్క దెబ్బలచేత; వారిన్= ఆ దుర్యోధనాదులను; పొరిగొనియెదన్+కాక= సంహరించివేస్తానే తప్ప; పోనిచ్చెదనే?= (ఊరకే) పోనిస్తానా?

**తాత్పర్యం:** ఓ అర్జునా! నే నంటే ఏమో కురువీరులకు తెలుసు. నాకు కూడా ఆ కురువీరుల బలపరాక్రమాలు కొంతతెలుసు. ఇక చూడు - వారినందరినీ నా బాణాలు, పరిఘలు ప్రయోగించి, దృఢప్రహరణాలతో సంహరిస్తానుగాని, ఊరకే పోనిస్తానా?'

**వ. అని పలికె; నప్పుడు ధృష్టద్యుమ్నుండు బీభత్సున కిట్లనియె. 361**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికెన్= పలికాడు; అప్పుడు= ఆ సమయంలో; ధృష్టద్యుమ్నుఁడు; బీభత్సునకున్= అర్జునుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా భీముడు అర్జునుడితో పలికిన వెంటనే ధృష్టద్యుమ్నుడు కూడా అర్జునుడిని చూచి ఇట్లా అన్నాడు:

**చ. 'వెరవును లావు లేని ప్రజ వేయు విధంబుల దివ్యబాణ వి**
**స్ఫురణము సూపి చూపి పొరిపుచ్చె మహోగ్రత ధార్మికుండె య**
**గ్గురుఁ? డది గాక యే నతనిఁ గూల్పన పుట్టినవాఁడ; నింతవ**
**ట్టరయక నన్ను నిట్లు సెడనాడుట పాడియె నీకు వాసవీ! 362**

**ప్రతిపదార్థం:** వాసవీ!= ఓ అర్జునా!; వెరవును= ఉపాయం; లావు= అస్త్రబలం; లేని ప్రజన్= లేనటువంటి సైనికజనాన్ని; వేయువిధంబులన్= కొట్టేపద్ధతులలో; దివ్యబాణ విస్ఫురణము= దివ్యాస్త్రాల మెరపును; చూపి చూపి= అనేకసార్లు ప్రయోగించి; మహా+ఉగ్రతన్= మిక్కిలి నిర్దయభావంతో; పొరిపుచ్చెన్= నశింపజేశాడు; ఆ+గురుఁడు= అట్టి మీ విద్యాగురుడు ద్రోణుడు; ధార్మికుండె?= ధర్మనిష్ఠగలవాడేనా?; అది+కాక= అంతేకాక; ఏను= నేను; అతనిన్= ఆ ద్రోణుడిని; కూల్పన్+అ= కూల్చి

వేయటానికే; పుట్టిన వాఁడన్= పుట్టాను; ఇంత వట్టు= ఈ మాత్రం సందర్భం; అరయక= తెలుసుకోక; నన్నున్= నన్ను; ఇట్లు= ఈ విధంగా; చెడన్+ఆడుట= నిందించటం; నీకున్= నీకు; పాడియె?= న్యాయమా? నీకు ధర్మంకాదని భావం.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! ఉపాయము, బలములేని సామాన్యసైనిక జనాన్ని తన దివ్యాస్త్ర ప్రకాశాన్నంతా చూపి చూపి దారుణంగా చంపాడు. ఆ గురుడు ధార్మికుడా? అంతేకాదు నేను ఆ ద్రోణుడి వధకై పుట్టాను. ఇదంతా తెలిసికొనకుండా నీ విట్లా నన్ను నిందిస్తున్నావు. ఇది నీకు ధర్మమేనా? చెప్పు(ము).

**క. పితృసఖుఁ డగు భగదత్తునిఁ । బితామహుం డైన వృద్ధు భీష్ముని నీ వు**
**ద్ధతిఁ జంపుట పుణ్యంబే? । ప్రతివీరునిఁ జంపు టేల, పాపం బయ్యెన్? 363**

**ప్రతిపదార్థం:** పితృసఖుఁడు+అగు= తండ్రికి మిత్రుడైన; భగదత్తునిన్= భగదత్తుడిని; పితామహుండు+ఐన= తాత అయిన; వృద్ధున్= (మరియు) ముదుసలి అయిన; భీష్మున్= భీష్ముడిని; నీవు= ఓ అర్జునా! నీవు; ఉద్ధతిన్= మిడిసిపాటుతో (వినయంలేక); చంపుట= సంహరించటం; పుణ్యంబే?= పుణ్యమేనా?; ప్రతివీరునిన్= ఎదిరించి పోరాడే వీరుడిని; చంపుట= సంహరించటం ఏల= ఏ విధంగా; పాపంబు= పాపం; అయ్యెన్?= అయింది?

**తాత్పర్యం:** ఓ అర్జునా! నీవు నీ తండ్రికి మిత్రుడైన భగదత్తుడిని సంహరించావు. వృద్ధుడైన పితామహుడు భీష్మడిని పడగొట్టావు. వీరిద్దరిని నీవు ఉద్ధతితో చంపటం పుణ్యమా? ఎదిరించిన శత్రువీరుడిని నేను చంపటం పాపం ఎట్లా అయింది?

**క. భూనాథుఁడు బొంకఁడు; విను । మేనును ధర్మంబు దప్ప; నిది యేటికి మి**
**థ్యానింద? శిష్యవంచకుఁ । డైన గురుఁడు సచ్చె; గెలువు మరిసైన్యంబున్.' 364**

**ప్రతిపదార్థం:** వినుము= ఓ అర్జునా! నేను చెప్పేది వినుము; భూనాథుఁడు= ధర్మరాజు; బొంకఁడు= అసత్యం పలుకలేదు; ఏనును= నేను కూడ; ధర్మంబు= ధర్మాన్ని; తప్పను= తప్పలేదు; ఇది= ఈ; మిథ్యానింద= అబద్ధమైన నింద; ఏటికి?= ఎందుకు?; శిష్యవంచకుఁడు+ఐన= శిష్యులను మోసపుచ్చేవాడైన; గురుఁడు= ద్రోణాచార్యుడు; చచ్చెన్= మరణించాడు. (ఇక శత్రు విజయానికి బాట సులభమయింది. కావున); అరిసైన్యంబున్= శత్రుసైన్యాన్ని; గెలువుము= జయించుము.

**తాత్పర్యం:** ఓ అర్జునా! ధర్మరాజు అబద్ధమాడలేదు. నేను కూడా ధర్మం తప్పలేదు. ఇంక ఎందుకు నన్ను నీవు వ్యర్థంగా నిందిస్తావు? శిష్యులను మోసం చేసిన ఆ గురువు ద్రోణుడు చచ్చాడు. ఇక ఈ శత్రుసైన్యాలను జయించుము.

**ఆ. అనియె ననుడు సంజయున కాంబికేయుఁ డి । ట్లను మునీంద్ర జాతుఁ డైన ద్రోణు**
**నట్లు చేసి యద్దురాత్ముఁ డమ్మెయిఁ బల్క । వినుచు నచటివారు గనల రెట్లు? 365**

**ప్రతిపదార్థం:** అనియెన్= (అని ధృష్టద్యుమ్నుడు అర్జునుడితో) అన్నాడు; అనుడున్= అని (ఈ విధంగా సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పగానే); ఆంబికేయుఁడు= (అంబిక కుమారుడు) ధృతరాష్ట్ర మహారాజు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు= ఇట్లా; అనున్= అంటాడు (అదిగాదని భావం); ఆ+దురాత్ముఁడు= ఆ దుష్టుడు - ధృష్టద్యుమ్నుడు; మునీంద్ర జాతుఁడైనన్= మునిశ్రేష్ఠుడైన భరద్వాజుడి వలన జన్మనెత్తిన; ద్రోణున్= ద్రోణాచార్యుడిని; అట్లు+చేసి= ఆ విధంగా చేసి, అనగా వధించి;

ఆ+మెయిన్= ఆ విధంగా; అనగా తాను చేసిన ద్రోణవధ ధర్మమే అని; పల్కన్= పలుకగా; వినుచున్= వింటూ; అచటివారు= అక్కడున్నవారు; ఎట్లు= ఏ విధంగా; కనలరు?= మండిపడకుండా ఉంటారు?

**తాత్పర్యం:** అని ధృష్టద్యుమ్నుడు అర్జునుడితో అన్నాడు అని అనగా ధృతరాష్ట్ర మహారాజు సంజయుడితో ఇట్లా అన్నాడు. భరద్వాజ మహామునికి జన్మించిన ద్రోణుని ఆ విధంగా చంపి, ఆ దుర్మార్గుడు ధృష్టద్యుమ్నుడు ఆ విధంగా మాట్లాడగా; విన్నవారు దానికి మండిపడకుండా ఉండగలరా? తరువాత ఏం జరిగిందో చెప్పుము.

**ద్రోణు పరిభవంబునకుఁ గోపించి సాత్యకి ధృష్టద్యుమ్ను నాక్షేపించుట (సం.7-169-8)**

**సీ. అనుటయు నా సూత తనయుఁ డవ్విభునకు । నిట్లను నతని రూక్షేక్షణముల**
**నరుఁ డుపలక్షించి తొరఁగు కన్నీరితో । నిట్టూర్పు నిగిడించి ' యట్టిరోఁత**
**మాట లేటికి?' నన మాఱు పల్కక హరి । ధర్మపుత్రాదులు దలలు వంప**
**నలిగి సాత్యకి ద్రుపదాత్మజుఁ గనుఁగొని । 'నీ జిహ్వ దునియదు నీ శిరంబు**
**తే. వగులు; దమ్మెయి గురునకుఁ బరిభవంబు । సేసి యిమ్మెయిఁ బలుకంగఁ జేయునదియుఁ**
**గలదె? యీరాజు సన్నిధిఁ గాన బ్రదికి; । తింకఁ బలికిన నోరు ప్రేయింతుఁ జుమ్ము! 366**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ధృతరాష్ట్రుడిట్లా అనగా; ఆ సూతతనయుఁడు= ఆ సంజయుడు; ఆ+విభునకున్= ఆ రాజుతో; (ధృతరాష్ట్రుడితో); ఇట్లు= ఈ విధంగా; అనున్= అన్నాడు; నరుఁడు= అర్జునుడు; రూక్ష+ఈక్షణములన్= తీక్ష్ణములైన చూపులతో; అతనిన్= ఆ ధృష్టద్యుమ్నుడిని; ఉపలక్షించి= చూచి; తొరఁగు కన్నీరితోన్= స్రవిస్తూ ఉన్న కన్నీటితో; నిట్టూర్పు= నిశ్వాసం; నిగిడించి= పెద్ద పెట్టున తీసి; ఇట్టి రోఁత మాటలు= ఈ విధములైన ఏహ్యాభావం కలిగించే పలుకులు; ఏటికిన్?= ఎందుకు?; అనన్= అనగా (ధృష్టద్యుమ్నుడితో అంటూ ఉంటే); హరి ధర్మపుత్ర+ఆదులు= కృష్ణుడు, ధర్మరాజు మొదలైనవారు; మాఱు+పల్కక= మారుమాటాడక; తలలు= శిరములు; వంపన్= వంచుకోగా (అప్పుడు); సాత్యకి; అలిగి= కోపించి; ద్రుపద+ఆత్మజున్= ధృష్టద్యుమ్నుడిని; కనుఁగొని= చూచి (ఇట్లా అన్నాడు); నీ జిహ్వ= ఓ ధృష్టద్యుమ్నా! నీ నాలుక; తునియదు= చీలిపోకుండా ఉన్నది; నీ శిరంబు= నీ తల; పగులదు= బద్దలు కాకుండా ఉన్నది (నీవు చేసిన పనికి, ఈ మాటలకు నీ నాలుక తెగగొట్టటం, తలబద్దలు కొట్టటం చేయవలసిందే, కాని అట్లు చేయలేదు); ఆ+మెయిన్= ఆ విధంగా; గురునకున్= ద్రోణాచార్యుడికి; పరిభవంబు= అవమానం; చేసి; ఈ+మెయిన్= ఈ విధంగా; పలుకంగన్= పలుకగా; చేయునది= చేసేది; కలదె?= ఉన్నదా? (చేయగలిగింది ఏమీ లేదు); ఈ రాజు సన్నిధిన్= ఈ ధర్మరాజుయొక్క సమక్షమునందు; కానన్= కాబట్టి; బ్రదికితి= బ్రతికిపోయావు; ఇంకన్= ఇంకా కూడ; పలికినన్= పలికావంటే; నోరు= నోరును; ప్రేయింతు సుమ్ము= చీల్చివేస్తాను సుమా!

**తాత్పర్యం:** అని ధృతరాష్ట్ర మహారాజు అడుగగానే సంజయుడు చెప్ప నారంభించాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా!, అట్లా అంటూ ఉన్న ఆ ధృష్టద్యుమ్నుడిని కొర కొర చూస్తూ అర్జునుడు పెల్లుబికిన కన్నీటితో నిట్టూర్పు విడిచి ఇట్టి రోత పుట్టించే మాటలు ఇక చాలు.' అని అనగానే కృష్ణుడు, ధర్మరాజు మొదలైనవారు మారు పలుకలేదు. సిగ్గుతో తలలు కూడా వంచుకున్నారు. అప్పుడు సాత్యకి కోపంతో ధృష్టద్యుమ్నుడిని చూచి ఇట్లా అన్నాడు: 'ధృష్టద్యుమ్నా! ఆ విధంగా ద్రోణాచార్యుడిని అవమానించావు. దానిని సమర్థించుకొంటూ ఇట్లా పలుకుతున్నావు. అయినా నీ నాలుక చీలిపోకుండా, నీ తల పగిలిపోకుండా ఉన్నది అంటే ఇది ధర్మరాజు సన్నిధి కాబట్టి చేసేది లేక దక్కిపోయావు - లేకుంటేనా? నీ నాలుక ఎప్పుడో చీల్చివేసి, నీ తల బ్రద్దలు కొట్టి ఉండేవాడిని జాగ్రత్త. నీ వింకేమైనా హద్దుదాటి మాట్లాడావంటే నాలుక చీలుస్తాను.

**క. తన మాటే యని గంగా । తనయు శిఖండియు వధించెఁ; దత్కార్యం బా**
**తనికిఁ బ్రియ మైనఁ బనిచెం । దన మనుమనిఁ బనుపుసేఁత దగదె నరునకున్? 367**

**ప్రతిపదార్థం:** తన మాటు+ఏ+అని= తన వంతే అని; గంగా తనయున్= గంగాపుత్రుడిని భీష్ముడిని; శిఖండియున్= శిఖండి కూడా (నీ సోదరుడే); వధించెన్= సంహరించాడు; తత్కార్యంబు= ఆ పని (అనగా శిఖండికి తన మనుమడు అర్జునుడు తోడు ఉండి వధించటం); ఆతనికిన్= ఆ భీష్ముడికి; ప్రియము+ఐనన్= ఇష్టమైనందువలన; తన మనుమనిన్= తన తమ్ముడు విచిత్రవీర్యుడికి మనుమడు (అనగా తనకు కూడ వరసకు మనుమడైన అర్జునుడిని); పనిచెన్= (ధర్మరాజు శిఖండికి తోడుగా) పంపాడు; పనుపు+చేఁత= ఆ ధర్మరాజు ఆదేశాన్ని నిర్వహించటం; నరునకున్= అర్జునుడికి; తగదు+ఎ?= తగింది కాదా? (రాజాజ్ఞ పరిపాలనం అందరికి కూడ అవశ్యకర్తవ్యమే కదా!).

**తాత్పర్యం:** తాను భీష్ముడి వధార్థమే జన్మించానని చెప్తుతూ భీష్మవధకై ఉద్యమించి సంహరించాడు భీష్ముడిని శిఖండి. అర్జునుడు అతడికి తోడుగా వెళ్ళాడు. అది కూడా తనకు తానుగా కాదు. అది ధర్మరాజు ఆజ్ఞ. ధర్మరాజు ఆజ్ఞాపించింది కూడా భీష్ముడి అనుమతి ప్రకారంగానే. తన మరణానికి నిమిత్తం కేవలం శిఖండియే అయినా, అర్జునుడు కూడా తోడు ఉండాలి అని భీష్ముడి ఆకాంక్ష. అందుకే అర్జునుడిని ధర్మరాజు పంపాడు. కాబట్టి ధర్మరాజు ఆజ్ఞ నెరవేర్చాడు అర్జునుడు. ఏం కూడదా?

**విశేషం:** సంస్కృత మూలంలో సాత్యకి ఇట్లా అన్నట్లు లేదు. తిక్కన స్వయంగా ఈ విషయం సాత్యకిచే పలికించాడు. భీష్ముడు శిఖండికి తోడుగా అర్జునుడిని పంపుమన్నట్లు భీష్మపర్వంలో ఉన్నది. ధర్మరాజు భీష్ముడిని తన నెట్లు జయించాలో ఉపాయం చెప్పుమన్నాడు. ఆ సందర్భంలో భీష్ముడు పలికిన పలుకులు. (మూల సంస్కృతంలో శ్లోకాలు) ఇవి:

శ్లో॥ అర్జునః సమరే శూరః పురస్కృత్య శిఖండినమ్ ।
మా మేవ విశిఖై స్తై క్ష్ణైరభిద్రవతు దంశితః ॥
అమంగల్యధ్వజే తస్మిన్ స్త్రీ పూర్వే చ విశేషతః ।
న ప్రహర్తు మభీప్సామి గృహీతేషుః కథంచన ॥
తదంతరం సమాసాద్య పాండవో మాం ధనంజయః ।
శరైర్ఘాతయతు క్షిప్రం సమంతాద్ భరతర్షభ! **(భీష్మ - 107/82-84)**

**వ. ఆ శిఖండియు నీవు నుద్భవించి పాంచాల కులంబుఁ గీర్తికిం బుణ్యలోకంబునకుం బాపితి' రనిన ధృష్టద్యుమ్నుండు నవ్వుచు నతని నవలోకించి. 368**

**ప్రతిపదార్థం:** ఆ శిఖండియున్= ఆ నీ సోదరుడు శిఖండి; నీవును= ఓ ధృష్టద్యుమ్నా! నీవు (మీరిద్దరు); ఉద్భవించి= పుట్టి; పాంచాలకులంబు= పాంచాల వంశాన్ని; కీర్తికిన్= ప్రతిష్ఠకు; పుణ్యలోకంబునకున్= ఉత్తమ లోకానికి; పాపితిరి= దూరం చేశారు; అనినన్= ఇట్లా సాత్యకి అనగానే; ధృష్టద్యుమ్నుండు; నవ్వుచున్= నవ్వుతూ; అతనిన్= ఆ సాత్యకిని; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** నీవు, శిఖండి పుట్టి పాంచాలవంశాన్ని, కీర్తిని, పుణ్యలోకాలకు దూరం చేశారు.' ఇట్లా సాత్యకి పలికిన మాటలు విని ధృష్టద్యుమ్నుడు నవ్వుతూ సాత్యకిని చూచి (ఇట్లా అన్నాడు).

**క. సైరించిన నెఱుఁగవు నీ । చారిత్రము దలఁప నన్య శరకృత్తకరున్**
**భూరిశ్రవుఁ జంపి తదియు । వీర వ్యవహారమే వివేక విహీనా! 369**

**ప్రతిపదార్థం:** వివేకవిహీనా!= వివేకం లేనివాడా ఓ సాత్యకీ!; నీ చారిత్రము= నీ నడవడి; సైరించినన్= సహిస్తూ ఉంటే; ఎఱుఁగవు= తెలిసికొనకుండా ఉన్నావు; తలఁపన్= ఆలోచించగా; అన్యశరకృత్తకరున్= ఇతరుల (అర్జునుడి) బాణాలచేత తెగగొట్టబడిన చేతులుగల వాడై ఉన్నటువంటి; భూరిశ్రవున్= భూరిశ్రవుడిని; చంపితి= చంపావు; అదియు= అది కూడ; వీరవ్యవహారము+ఏ?= వీరుల వ్యవహారమేనా? అనగా వీరులు నడిచే పద్ధతేనా? (ఇదే నీ అవివేకానికి గుర్తు అని తెలుపటానికి వివేకహీనా! అని సంబోధనం సార్థకం - తన తప్పులు తెలుసుకొనలేక ఇతరులను దూషించటం వ్యర్థమని తాత్పర్యం).

**తాత్పర్యం:** ఓ తెలివిలేని మూర్ఖుడా సాత్యకీ! సహిస్తూఉన్నాంకదా అని నీ చరిత్ర నీవు తెలుసుకొనకుండా ఉన్నావు. భూరిశ్రవుడి చేతులను ఎవరో ఇతరులు ఖండించిన తరువాత, ఆ చేతులు లేనివాడిని నీవు సంహరించావు. ఇది వీరధర్మమేనా?

**తే.** **అతఁడు నీ ఱొమ్ముద్రొక్కిన యపు డొకండు । జేయఁ జాలవ యగ్గురు సాయకములఁ**
**బాండవానీకములు విచ్చి పాఱ నెన్ని । యెడల మార్కొంటి వాతని నెఱుఁగ వెట్లు?** 370

**ప్రతిపదార్థం:** అతఁడు= ఆ భూరిశ్రవుడు; నీ ఱొమ్ము= నీ వక్షస్స్థలాన్ని; త్రొక్కిన+అపుడు= క్రింద పడవేసి కాలితో తన్నినప్పుడు; ఒకండున్= ఒకటి కూడా; చేయన్+చాలవు+అ= చేయలేకపోయావు (ఏమీకూడా); ఔనా? - భూరిశ్రవుడు నిన్ను క్రింద పడవేసి కాలితో తొక్కి ఖడ్గంతో నీ శిరస్సును నరకిపోతూ ఉంటే నీవేం చేశావు? అప్పుడు అతడి ఖడ్గసహితమైన బాహువును నరకివేసి నిన్ను రక్షించింది అర్జునుడే కదా!; ఆ+గురుసాయకములన్= ఆ ద్రోణాచార్యుల బాణాలతో; పాండవ+అనీకములు= పాండవ సేనలు; విచ్చి= వీడిపోయి; పాఱన్= పారిపోతూ ఉండగా; ఎన్ని+ఎడలన్= ఎన్ని సందర్భాలలో అనగా ఎన్నిసార్లు; ఆతనిన్= ఆ ద్రోణాచార్యుడిని; మార్కొంటివి?= ఎదిరించావు?; ఎట్లు= ఏ విధంగా; ఆతనిన్+ఎఱుఁగవు?= ఆ ద్రోణాచార్యుడిని గూర్చి తెలియకుండా ఉన్నావు? (ద్రోణుడి ధాటికి ఆగలేక మన పాండవుల సైన్యాలు పారిపోతూ ఉంటే ఎప్పుడైనా ద్రోణుడిని ఎదిరించి పాండవ సైన్యాలను కాపాడావా? ఆ ద్రోణుడు ఎంతటి అజేయుడో నీకు తెలియదా?); 'ఆతని' అనే పదానికి దేహళీదత్తదీపన్యాయంగా అన్వయం.

**తాత్పర్యం:** ఆ భూరిశ్రవుడు నిన్ను క్రిందపడవేసి, ఛాతిలో తన్ని, తన ఖడ్గంతో నీ తల ఖండించ పూనుకొనేటప్పుడు నీ వేం చేయగలిగావో చెప్పుము. నీవప్పుడు విక్రమించలేదు. నిన్నెవరో ఆ సమయంలో రక్షించవలసి వచ్చింది. మరి ఆ భూరిశ్రవుడు తన చేయి తెగి మరణోన్ముఖుడై ప్రాయోపవేశం చేసిన తరువాతనే అతడిని సంహరించావు. అదీగాక ఆ ద్రోణాచార్యుడు ఎన్నిసార్లు మన సైన్యాలను పారద్రోలలేదు? అప్పు డేమైనా ఆ ద్రోణుడిని అడ్డుకొన్నావా? కాబట్టి ఆ ద్రోణుడిని గూర్చి నీకు తెలియదా? నీవు భూరిశ్రవుడిని అట్టి స్థితిలోనే సంహరించినప్పుడు లేని దోషం నేను అట్టి స్థితిలోనే ఉన్న ద్రోణుడిని వధించేటప్పుడు ఉన్నదా? అంత గొప్ప అజేయుడైన ద్రోణాచార్యుడిని వధిస్తే సంతోషించవలసింది పోయి నన్ను తప్పుపడుతావా? ఇదేమి న్యాయం?

**విశేషం:** భూరిశ్రవుడు సాత్యకిని విరథుడిగా, విశస్త్రుడిగా చేసి - ఛాతిలో తన్ని ఖడ్గంతో నరకపోతూ ఉంటే అర్జునుడు ఆ భూరిశ్రవుడి బాహువును ఖండించి, సాత్యకిని కాపాడాడు. ఆ భూరిశ్రవుడు తన బాహువు ఖండితం కాగా ప్రాయోపవేశం చేశాడు. అట్టి స్థితిలో ఉన్న భూరిశ్రవుడిని సాత్యకి తల తెగగొట్టి సంహరించివేశాడు. సంస్కృతమూలం.

**శ్లో॥ ఉత్థితః స తు శైనేయో విముక్తః సౌమదత్తినా।**
**ఖడ్గమాదాయ చిచ్ఛిత్సుః శిరస్తస్య మహాత్మనః ॥**
**ప్రాయోపవిష్టాయ రణే పార్థేన ఛిన్నబాహవే ।**
**సాత్యకిః కౌరవేయాయ ఖడ్గే నాపాహర చ్ఛిరః ॥** (ద్రోణ 143 / 49; 54).

**క. వలవని ప్రేలరి మాటల । నలిగింపకు నన్ను నేమి యాడిన నింకం**
**దల ద్రెవ్వ నేయుదుం గురు । బల మదె పురణించె బడలు పఱుతము రమ్మా!' 371**

**ప్రతిపదార్థం:** నన్నున్= ఓ సాత్యకీ! నన్ను; వలవని ప్రేలరి మాటలన్= కూడని వ్యర్థ ప్రలాపాలతో; అలిగింపకు= కోపింప చేయవద్దు; ఇంకన్= మరీ; ఏమి+ఆడినన్= ఏమైనా మాట్లాడావంటే; తల+త్రెవ్వన్= తల తెగిపోయేటట్లు; ఏయుదున్= కొడ్తాను (ఖడ్గంతో తల నరికివేస్తానని భావం) (ఇక ఈ విషయం ఇంతటితో చాలు ప్రస్తుత విషయానికి వస్తే); అది+ఎ= అదుగో; కురుబలము= కౌరవసైన్యం; పురణించెన్= విజృంభిస్తూ ఉన్నది (మనమిద్దరం ఏకమై); బడలు పఱుతము= అలయిద్దాం అనగా అలసిపోయి యుద్ధం చేయలేక పారిపోయేటట్లు చేద్దాం; రమ్ము+ఆ= రా; సాత్యకీ! నీవు నేను కలసి యుద్ధం చేద్దాం రా (ఏక కార్యార్థులమైన మనకు వైరం కూడదని భావం).

**తాత్పర్యం:** ఓ సాత్యకీ! కూడని వ్యర్థప్రలాపాలతో నాకు కోపం తెప్పించవద్దు. ఇంకా ఏమైనా ప్రేలావంటే నీ తల తెగవేస్తాను అదుగో కౌరవసైన్యం విజృంభిస్తూ ఉన్నది. కలిసి పోరాడి, ఆ సైన్యాన్ని పారద్రోలుదాం రా!

**వ. అని పలికిన శినివరుండు రోషారుణితలోచనుండై కోదండంబు రథంబున నిడి గద పుచ్చికొని 'మాటల నలిగెదేని వ్రేటున శిక్షించెద' ననుచు ధరణికి లంఘించి కవిసినం గని, కేశవుండు పనుపం బవనతనయుండు రథంబు డిగ్గి రయంబునం జని పట్టి యాఱడుగుల కొలఁది నిలువరించె; నట్టియెడ సహదేవుం డా శైనేయు నుద్దేశించి 'మిమ్మును బాంచాలురం గడచిన బంధువులు మాకును మిమ్మును మిగిలిన బాంధవు లా పాంచాలురకును వారల కంటె మాకంటె - నెక్కుడు సుహృజ్జనులు మీకును లేకునికి దెల్లం; బిట్టి మీలో మీ రెరవు పడం దగునే? యలుక దక్కు' మనునెడ నాధృష్టద్యుమ్నుండు వడముడితో 'నతనిం బట్టక విడువుము; నాచేతంగాని నీచేత నిలువండు; నేనొక్కచేతి భూరిశ్రవుండనే? యేల? యడిచిపడియెడు?' ననవుడు నాభీమసేను బాహువుల లోనం దిరుగుడు పడుచు నురగంబు చందంబున సాత్యకి రోఁజుచున్నం గృష్ణ యుధిష్ఠిరు లయ్యిరువురం బ్రయత్నంబున వారించిరి; తదనంతరంబ. 372**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికినన్= ధృష్టద్యుమ్నుడు పలుకగానే; శినివరుండు= సాత్యకి; రోష+అరుణిత లోచనుండు +ఐ= కోపంతో ఎర్రబారిన కన్నులు గలవాడై; కోదండంబు= ధనుస్సును; రథంబునన్= రథంపై; ఇడి= ఉంచి;గద= గదను; పుచ్చికొని= తీసికొని; మాటలన్= మాటలతో; అలిగెదు+ఏనిన్= కోపించినట్లయితే; వ్రేటునన్= ఈ గద దెబ్బతో; శిక్షించెదన్= శిక్షిస్తాను; అనుచున్= అంటూ; ధరణికిన్= భూమికి; లంఘించి= దూకి; కవిసినన్= మీదికి రాగా; కని= చూచి; కేశవుండు= కృష్ణుడు; పనుపన్= పంపించగా; పవనతనయుండు= భీముడు; రథంబు= రథం; డిగ్గి= దిగి; రయంబునన్= వేగంతో (వేగంగా); చని= వెళ్ళి; ఆఱు+అడుగుల కొలఁది= ఆరు అడుగుల వ్యవధిలో-ఆరు అడుగులు వేయగానే అని భావం (నిగ్రహీత పదే షష్ఠే అని సంస్కృత మూలం); నిలువరించెన్= పోకుండా నిలిపాడు; అట్టిఎడన్= ఆ సమయంలో; సహదేవుండు; ఆ శైనేయున్+ ఉద్దేశించి= ఆ సాత్యకితో (ఇట్లా అన్నాడు); మిమ్మును= మిమ్ములను అనగా యాదవులను; పాంచాలురన్= ధృష్టద్యుమ్నుడి వంశీయులైన పాంచాల రాజులను; కడచిన బంధువులు= అతిశయించిన బంధువులు; మాకున్= అనగా పాండవులకు; మిమ్మును= మిమ్ములను; (యాదవులను) మిగిలిన= మించిన; బాంధవులు+ఆ పాంచాలురకును; వారలకంటె= ఆ పాంచాలురకంటె; మాకం టెన్= పాండవులకంటె; ఎక్కుడు= ఎక్కువైన; సుహృత్+జనంబులు= స్నేహితులు; మీకును= మీ యాదవులకును లేక+ ఉనికి+ తెల్లంబు= లేకుండా ఉండటం స్పష్టం; ఇట్టి మీలో మీరు= ఇటువంటి మీలోమీరు; ఎరవు పడన్+ తగునే?= కలహించవచ్చునా?; అలుక= కోపం; తక్కుము= మానివేయుము; అను+ఎడన్= అని అంటూ ఉన్నప్పుడు; ఆ ధృష్ట ద్యుమ్నుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; వడముడితోన్= భీముడితో (ఇట్లా అన్నాడు); అతనిన్= ఆ సాత్యకిని; పట్టక= పట్టుకొనక

అనగా ఆపక; విడువుము= విడిచిపెట్టుము; నాచేతన్+కాని= నా చేతనే తప్ప; నీచేతన్= ఓ భీమసేనా! నీచేత; నిలువండు=ఆగిపోడు -ఎందుకంటే? నేను= నేను; ఒక్కచేతి; భూరిశ్రవుండనే?=ఒకే ఒక చెయ్యిగల భూరిశ్రవుడనా?; ఏల= ఎందుకని; అడిచి పడియెడున్= మిడిసిపడుతున్నాడు (ఆ సాత్యకి మిడిసిపాటు చెల్లేందుకు నేనేమి భూరిశ్రవుడను కాదు - ఎందుకు ఆ మిడిసిపాటు? భూరిశ్రవుడేమో ఓ చేయి ఖండితము కాగా ఒంటిచేతితో యుద్ధం చేయలేక మాని ప్రాయోపవేశం చేసి కూర్చున్నాడు - అప్పుడతడి శిరస్సు ఈతడు ఖండించాడు. అది కూడా పౌరుషమేనా?); అనవుడున్= అనగానే; ఆ భీమసేను బాహువులలోనన్= ఆ భీముడి బాహువులలోపల అనగా భీముడి బాహుబంధంలో; తిరుగుడు పడుచున్= పరిభ్రమణం చేస్తూ; ఉరగంబు చందంబునన్= సర్పంవలె; సాత్యకి= ఆ సాత్యకి; రోఁజుచున్నన్= బుసకొట్టుతూ ఉంటే; కృష్ణయుధిష్ఠిరులు= కృష్ణుడు, ధర్మరాజు; ఆ+ఇరువురన్= ఆ ఇద్దరిని అనగా సాత్యకి ధృష్టద్యుమ్నులను; ప్రయత్నంబునన్= మిక్కిలి యత్నంతో - అతికష్టంగా; వారించిరి= నివారించారు; తదనంతరంబు+అ= ఆ తరువాత.

**తాత్పర్యం:** అని ధృష్టద్యుమ్నుడు అనగా, సాత్యకి కన్నులెర్రబారాయి, ధనుస్సు రథంమీద పడవేసి గద గైకొన్నాడు. 'ఓ ధృష్టద్యుమ్నా! మాట్లాడితే నీకు కోపం వస్తుంది కదా! మాట లెందుకు? చేతలతోనే నిన్ను శిక్షిస్తాను. కాచుకొమ్ము.' అని భూమిపైకి రథం నుండి దూకి ధృష్టద్యుమ్నుడి పైకి పరుగుతీస్తూ ఉన్నాడు. అది చూచి కృష్ణుడు, అతడిని ఆపటానికి భీముడిని పంపాడు. భీముడు రథంనుండి దిగి పరుగెత్తి ఆరు అడుగుల దూరంలో అతడిని ఆపాడు. ఆ సమయంలో సహదేవుడు వచ్చి సాత్యకితో మిమ్ములను, పాంచాలురను మించిన బంధువులు మాకు, మమ్ములను మించిన బంధువులు ఆ పాంచాలురకు, వారలకంటె, మాకంటె ఎక్కువైన మిత్రులు మీకు లేరు. అటువంటప్పుడు మీలోమీరు కలహించుకోవచ్చునా? కోపం మానుము. అని అంటూ ఉంటే భీముడితో ధృష్టద్యుమ్నుడు నీవు అతడిని ఆపవద్దు - అతడు నా చేతగాని, నీ చేతగాని ఆగడు. నేనేమీ ఒంటిచేతి భూరిశ్రవుడినా? కాదు. మిడిసిపడుతున్నాడు. అని అంటూ ఉంటే సాత్యకి భీముడి బాహుబంధంలో పడి తప్పించుకొనలేక పామువలె బుసకొడుతూ ఉంటే, అది చూచి కృష్ణుడూ, ధర్మరాజూ వెళ్ళి అతి ప్రయత్నం మీద ఆ సాత్యకి, ధృష్టద్యుమ్నులను యుద్ధంనుండి ఆపారు. ఆ తరువాత.

**క. భేరీ మృదంగ శంఖ మ । హారవములు సెలఁగఁ బాండవానీకంబుం**
**గౌరవ సైన్యముఁ దాఁకెను । వారిధు లొండొంటిఁ దాఁకు వడు వమరంగన్. 373**

**ప్రతిపదార్థం:** భేరీ మృదంగ శంఖ మహారవములు= నగారాలు, మద్దెలలు, శంఖాలు అనే వాటియొక్క పెద్దధ్వనులు; చెలఁగన్= (దశదిశలు) ధ్వనించగా; పాండవ+అనీకంబున్= పాండవుల సైన్యం; కౌరవ సైన్యమున్= కౌరవుల సైన్యం; ఒండొంటిన్= ఒకటి మరొకదానిని; వారిధులు= (రెండు) సముద్రాలు; ఒండొంటిన్= ఒకటి మరియొకదానిని; తాఁకు వడువు= తాకే విధం (ఢీకొన్న విధం); అమరంగన్= ఒప్పుతూ ఉండేటట్లు; తాఁకెన్= ఢీకొన్నాయి.

**తాత్పర్యం:** భేరీమృదంగ శంఖ ధ్వనులు చెలరేగగా, పాండవకౌరవసైన్యాలు రెండు సముద్రాలు ఒకదానితో నొకటి ఢీకొంటున్నాయా? అన్నట్లు ఎదుర్కొన్నాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. రెండు సముద్రాలు పరస్పరంగా ఢీకొనటం కవి యూహ. కాబట్టి ఇది ఉత్ప్రేక్షాలంకారం. దీనివలన ఆ సైన్యాలు రెండూ కనుచూపు మేరలో అంతు తెలియనంత విస్తరించి ఉన్నాయనటం వ్యంగ్యం.

**క. మును ద్రోణునిఁ బొలియించితి। మని పాండవబలము బలియు నశ్వత్థామం**
**గొని కురుసేనయు నత్తఱి। ననూనగర్వమున నుద్భటాటోపమునన్. 374**

**ప్రతిపదార్థం:** పాండవబలము= పాండవుల సైన్యం; మును= ఇంతకు ముందు; ద్రోణునిన్= ద్రోణాచార్యుడిని; పొలియించితిమి+అని= వధించాము అనే; అనూన గర్వమునన్= మిక్కిలి గర్వంతో; (పెనంగన్+తొడంగెన్ - అనే ముందరి వచనంలోని పదాలతో అన్వయం); ఆ+తఱిన్= ఆ సమయంలోనే; కురుసేనయున్= కౌరవుల సైన్యం కూడా; బలియున్= బలిష్ఠుడైన; అశ్వత్థామన్= ద్రోణాచార్యుడి కుమారుడు అశ్వత్థామను; కొని= నాయకుడిగా తీసికొని; ఉద్భట+ఆటోపమునన్= మిక్కిలి ఆడంబరంతో (గొప్పగా దర్పాన్ని ప్రదర్శిస్తూ).

**తాత్పర్యం:** ఇంతకుముందు ద్రోణాచార్యుడిని వధించామనే గర్వంతో పాండవసైన్యమూ, అజేయుడైన అశ్వత్థామ మాకు అండగా దొరికాడనే ఉత్సాహంతో కౌరవసైన్యమూ సాటిలేని గర్వంతో, అత్యధిక విజృంభణంతో (తరువాతి గద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: పరిసంఖ్య. 'పాండవ బలము అనూన గర్వమున' 'కురుసేనయు ఉద్భటాటోపమున' అని క్రమంగా అన్వయం. కాబట్టి ఇది పరిసంఖ్యాలంకారం (క్రమాలంకారం). రెండు పదాల తాత్పర్యం ఒక్కటే కాబట్టి పునరుక్తి దోషం కలుగకుండా ఇట్లా క్రమాన్వయంతో వ్యాఖ్యానించటం రమణీయంగా ఉంటుంది.

**వ. పెనంగందొడంగె; నప్పుడు ద్రౌణి దుర్యోధనుం గనుంగొని. 375**

**ప్రతిపదార్థం:** పెనంగన్= యుద్ధం చేయటానికి; తొడంగెన్= ఆరంభించాయి; అప్పుడు= ఆ సమయంలో; ద్రౌణి= ద్రోణపుత్రుడు అశ్వత్థామ; దుర్యోధనున్= దుర్యోధనుడిని; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** యుద్ధం చేయటానికి ఉపక్రమించాయి. ఆ సమయంలో అశ్వత్థామ దుర్యోధనుడిని చూచి.

**క. 'అనృతంబు పలికి బ్రదికెద। మని చూచిన రాజు మూఁక లన్నియు నెట్లై**
**యనిఁ బడియెడునో యెమ్మెయిఁ। గనుకనిఁ బఱచెడునో చూడు కన్నారంగన్.' 376**

**ప్రతిపదార్థం:** అనృతంబు= అసత్యం; పలికి= చెప్పి; బ్రదికెదము+అని= బ్రతికిపోతాము అని; చూచిన రాజు మూఁకలు+అన్నియున్= చూస్తూ ఉన్న ఆ ధర్మరాజు సైన్యాలన్నీ కూడా; ఎట్లు+ఐ= ఏ విధంగా అయిపోయి; అనిన్= యుద్ధంలో; పడియెడున్+ఓ= పడిపోతాయో?(మరియు); ఏ+మెయిన్= ఏ విధంగా; కనుకనిన్= సంభ్రమంతో; పఱచెడున్+ఓ= పారిపోతాయో!; కన్ను+ఆరంగన్= కన్నులనిండా; చూడు= చూడుము.

**తాత్పర్యం:** అబద్ధమాడి బ్రతికిపోదామనుకొన్న ధర్మరాజు సైన్యాలన్నీ బ్రతికిపోతాయని అనుకొన్నాడు. కాని, యుద్ధంలో ఏ విధంగా పడిపోతాయో, ఏ విధంగా భయపడి పరుగెత్తిపోతాయో కన్నార చూడుము.

**వ. అని పలికి నియతుం డయి నారాయణాస్త్రంబు ప్రయోగించిన. 377**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికి= చెప్పి; నియతుండు+అయి= నియమం కలవాడై (ఆ నారాయణాస్త్ర మంత్రాన్ని జపించటానికి మనస్సును ఏకాగ్రం); నారాయణ+అస్త్రంబు= నారాయణం అనే దివ్యాస్త్రాన్ని; ప్రయోగించినన్= శత్రుసైన్యంమీద ప్రయోగించిన వెంటనే.

**తాత్పర్యం:** అని మనస్సును ఏకాగ్రం చేసి, నారాయణాస్త్రాన్ని స్మరించి, శత్రుసైన్యంమీద ప్రయోగించగా (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు గుంఠీభవ**
**త్కిరణుం డయ్యె, దిశావితానము వడంకెన్, మి న్నదిర్చెన్, మహీ**
**ధర సంతానము లోలి గ్రక్కదలె, నుద్భ్రాంతంబులై యంబుధు**
**ల్వొరలెం గట్టులమీఁదఁ బిట్ట పిడుగు ల్మ్రోసెన్ మహోదగ్రతన్. 378**

**ప్రతిపదార్థం:** ధరణీ చక్రము= భూమండలం; దిర్దిరం= దిర్‌దిర్ అనే మోతతో; తిరిగెన్= తిరిగింది; మార్తాండుండు= సూర్యుడు; కుంఠీభవత్+కిరణుండు= మొక్కబోయిన అనగా కళావిహీనమయిన కిరణాలు గలవాడు; అయ్యెన్= అయ్యాడు; దిశావితానము= దిక్కుల సమూహం; వడంకెన్= కంపించింది; మిన్ను= ఆకాశం; అదిర్చెన్= చలించింది; మహీధర సంతానములు= పర్వత సమూహాలు; ఓలిన్= వరుసగా; గ్రక్క+అదలెన్= చలించిపోయాయి; ఉద్భ్రాంతంబులై= మిక్కిలి పరిభ్రమిస్తూ ఉన్నవై; అంబుధుల్= సముద్రాలు; గట్టులమీఁదన్= చెలియలికట్టలపై; పొరలెన్= పొంగి పొరలిపోయాయి; పిడుగుల్+పిడుగుల్ - పిట్ట పిడుగుల్= మిక్కిలి పిడుగులు; మహా+ఉదగ్రతన్= మిక్కిలి భయంకరంగా; మ్రోసెన్= మ్రోగాయి,

**తాత్పర్యం:** భూమండలమంతా గిరగిర తిరిగింది. సూర్యకిరణాలలో కాంతి తరిగిపోయింది. దిక్కులు వణకాయి, ఆకాశం అదిరింది, పర్వత సమూహాలు వరుసగా కంపించాయి. సముద్రాలు చెలియలికట్టలపై పొర్లిపారాయి, భయంకరంగా పెక్కుపిడుగులు ధ్వనించాయి.

**వ. ఇట్లు భీకర ప్రాదుర్భావంబైన యద్దివ్యసాధనంబు మండలార్ధ చంద్ర భల్లనారాచక్షుర ప్రముఖంబులు ననల మయంబులు నగు ననేక దేదీప్యమాన మార్గణమూర్తులు గైకొని కౌంతేయ సైన్య సంతానం బంతయు నొకపాయగాఁ గవిసినం గని తెంపుపెంపునం దత్సైనిక నికరంబులు వివిధ విశిఖంబులఁ బరపుచు, నయ్యయి ముఖంబుల మగిడించుచు, బలువునం గడంగినం బొంగుచు నింగిని నేలను నడుమను నాభీలజ్వాలాచ్ఛటా జటిలంబుగాఁ బైపయి నడరి యమ్మహాస్త్రంబు చతురంగంబులం ద్రుంగించుచు నెదు రెంతెంత పెనంగె నంతంతియు పేర్చి యేర్చుచుం బఱవం దొడంగిన, నమ్మొనలు పఱవం దొడంగె; నప్పుడు నరుం డూరకునికి సూచి నారాయణుండు నతండును వినుచుండ ధర్మసూనుండు సాత్యకి ధృష్టద్యుమ్నుల నాలోకించి యి ట్లనియె. 379**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; భీకర ప్రాదుర్భావంబు+అయిన= భయంకరంగా ఆవిర్భవించిన; ఆ+దివ్యసాధనంబు= ఆ దివ్యమైన నారాయణాస్త్రం; మండల+అర్ధచంద్ర భల్ల నారాచ క్షుర ప్రముఖంబులును= మండలాగ్రం అనగా ఖడ్గం మరియు అర్ధచంద్రం, భల్లం, నారాచం, క్షురము అనునవి బాణాలలోని విశేషాలు; అవి మొదలైనట్టి; అనలమయంబులును+అగు= అగ్నిమయాలు అనగా అగ్నిజ్వాలలను కుమ్మరించుచున్న; అనేక దేదీప్యమాన మార్గణ మూర్తులు= పలు విధాలైనట్టి, మిక్కిలి ప్రకాశిస్తూ ఉన్న బాణాల స్వరూపాలను; కైకొని= గ్రహించి; కౌంతేయ సైన్యసంతానంబు+అంతయున్= పాండవుల సైన్యాన్నంతా

ఒక్కపాయగన్= ఒకే వరుసగా; కవిసినన్= ఎదుర్కొనగా; కని= చూచి; తెంపు పెంపునన్= సాహసాధిక్యంతో - మిక్కిలి తెగింపుతో; తద్+సైనిక నికరంబులు= ఆ పాండవుల సైనికుల సమూహాలు; వివిధ విశిఖంబులన్= అనేక విధాలైన బాణాలను; పరపుచున్= ప్రయోగిస్తూ; ఆ+ఆ+ముఖంబులన్= ఆయా ఉపాయాలతో; మగిడించుచున్= మరలిస్తూ; బలువునన్= బలంగా; కడంగినన్= ఎదుర్కొంటూ ఉండగా; పొంగుచున్= వృద్ధి పొందుతూ; ఆ+మహాస్త్రంబు= ఆ నారాయణాస్త్రం; నింగిని= ఆకాశంపై; నేలను= భూమిపై; నడుమనున్= నడిమి ప్రదేశంలో; ఆభీల జ్వాలాచ్ఛటా జటిలంబుగాన్= భయంకరములైన జ్వాలల సెగలతో దట్టమయ్యే విధంగా; పైపయిన్= పైపైకి; అడరి= వ్యాపించి; చతురంగబలంబులన్= చతురంగ సైన్యాలను; త్రుంగించుచున్= నశింపజేస్తూ; ఎదురు= (తనకు) అభిముఖంగా; ఎంత+ఎంత= ఏ మేరకు; పెనంగెన్= యుద్ధం చేసిందో; అంత+అంతియ= అంతంతమాత్రమే; పేర్చి= విజృంభించి; ఏర్చుచున్= దహిస్తూ; పఱపన్+తొడంగినన్= పరుగెత్తుతూ ఉండగా; ఆ+మొనలు= ఆ సైన్యాలు; పఱపన్+తొడంగెన్= పరుగు తీశాయి; అప్పుడు= ఆ సమయంలో; నరుండు= అర్జునుడు; ఊరక+ఉనికి= ఊరకే ఉండటం (ఏ విధమైన ప్రతీకారచర్య లేక చూస్తూ ఉండిపోవటం); నారాయణుండును= కృష్ణుడూ; అతండును= ఆ అర్జునుడూ; వినుచున్+ఉండన్= వింటూ ఉండగా; ధర్మసూనుండు= ధర్మరాజు; సాత్యకి ధృష్టద్యుమ్నులన్= సాత్యకిని, ధృష్టద్యుమ్నుడిని; ఆలోకించి= చూచి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అతి భయంకరంగా ఆవిర్భవించిన ఆ నారాయణాస్త్రం - ప్రముఖాలు, అగ్నిమయాలు అయిన అర్ధచంద్రాలు, భల్లాలు, నారాచాలు, క్షురాలు అనే దేదీప్యమానమైన బాణరూపాలు దాల్చి ఆ పాండవుల సైన్యాన్నంతా ఒక్క పెట్టుగా చుట్టుముట్టాయి. ఇక చేసేది లేక పాండవుల సైనికులు తెగించి, ఎన్నో బాణాలు కురిపించి, ఆ దివ్యాస్త్రం నుండి వెలువడిన బాణాలను మరలించారు. ఇంకా వివిధోపాయాలతో గట్టిగా పోరాడుతూ ఉండగా, ఆ దివ్యాస్త్రం పొంగిపోతూ భయంకరమైన అగ్నిజ్వాలలను భూమి, ఆకాశం, భూమ్యాకాశాల నడిమి ప్రదేశం, అంతటా ఆవరింపజేసి, ఆ చతురంగబలాలను నశింపజేసింది. ఆ పాండవుల సైన్యం ఎంతెంతగ ఆ దివ్యాస్త్రంపై విజృంభించిందో అంతంతగ విజృంభించి సైన్యాన్ని దహిస్తూ పరుగెత్తి వస్తూఉంటే, ఆ సేనలు పరుగెత్త సాగాయి. అప్పుడు అర్జునుడు ఊరకుండటం చూచి, అతడు, శ్రీకృష్ణుడు వినేటట్లుగా ధర్మరాజు సాత్యకిని, ధృష్టద్యుమ్నుని చూచి ఇట్లా అన్నాడు.

**సీ. 'ఆ సభఁ బాంచాలి గాసి సేయఁగ నుపే । క్షకుఁ డయి చూచెఁ; బెక్కండ్రఁ గూర్చి**
**కొని బాలు నభిమన్యుఁ గూల్చె; నించుక వడి । యాఁగిన నర్జునుఁ డగ్నిఁ జొచ్చు**
**నను వగ మనల నాతనికిఁ దోడ్పడఁ బోవ । నీ కాఁగె నమ్మెయి; నిట్టి ధర్మ**
**పరుఁ డైన కలశసంభవుతోడ సరివచ్చు । టుచితంబె? యీవచ్చు నుజ్జ్వలాగ్ని**
**తె. వలని కరిగెద; మీరు మీ వాహినులును । బాఱి పొం డెక్కడేని; నప్పార్థుకోర్కి**
**యంత సఫలత బొందెడు; నచ్యుతుండు । నెట్లు దనకు రుచించెఁ దా నట్లు సేయు.' 380**

**ప్రతిపదార్థం:** (ఆ ద్రోణు డెట్టి ధర్మాత్ముడంటే) ఆ సభన్= ఆ కురుసభలో; పాంచాలిన్= ద్రౌపదిని; గాసి+చేయఁగన్= బాధపెట్టుతూ ఉండగా; ఉపేక్షకుఁడు+అయి= ఉపేక్షించినవాడయి అనగా పట్టించుకొనకుండా ఉండి; చూచెన్= చూచాడు -

అధర్మంగా పాంచాల రాజపుత్రిని అవమానపరుస్తూ ఉంటే కౌరవులను ఒక్కమాట అయినా అనక ఊరకే చూస్తూ ఉన్నాడు ఈ ద్రోణాచార్యుడు; పెక్కంద్రన్= పలువురు వీరులను; కూర్చికొని= వెంట తీసికొని; బాలున్+అభిమన్యున్= చిన్నవాడయిన అభిమన్యుడిని; కూల్చెన్= సంహరించాడు (మరియు); ఇంచుకవడి= కొద్దిసేపు; ఆఁగినన్= ఆగిపోతే - కొంచెంసేపు ఆలస్యంగా వెళ్ళినట్టయితే; అర్జునుఁడు= అర్జునుడు; అగ్నిన్= అగ్నిలో; చొచ్చున్= ప్రవేశిస్తాడు; అను= అనే; వగన్= చింతతో (ఉన్నటువంటి); మనలన్= మనలను; ఆతనికిన్= ఆ అర్జునుడికి; తోడ్పడన్= సహాయం చేయటానికి; పోవనీక= పోనివ్వకుండా; ఆ+మెయిన్= ఆ విధంగా; ఆఁగెన్= ఆపాడు; ఇట్టి ధర్మపరుఁడు+ఐన= ఇంతటి ధర్మాసక్తుడైన (కాకువు) అనగా ద్రోణులవారు కౌరవుల సభలో ద్రౌపదిని అవమానపరుస్తూ ఉంటే పల్లెత్తుమాట అయినా అనకపోవటం ధర్మమేనా? ఒక చిన్న వయసువాడిని, అసహాయుడిని - అభిమన్యుడిని పదుగురు వీరులను కలుపుకొని సంహరించటం ధర్మమేనా? అంతేగాక సూర్యాస్తమయం లోపల జయద్రథుడిని వధిస్తాను లేకుంటే అగ్నిప్రవేశం చేస్తానని కదా అర్జునుడి ప్రతిజ్ఞ - అప్పుడు మనం ఎట్లాగైనా, అర్జునుడు అగ్నిప్రవేశం చేయకుండా కాపాడుకొనవలెనుఅని అతడికి సహాయంగా వెళుతుంటే వెళ్ళనీయక సేనాముఖంలో ఆపింది ఎవరు? ఈ ద్రోణులవారు కాదా? ఇదేనా ద్రోణులవారి ధర్మనిష్ఠ? ఇదేనా పాండవ పక్షపాతం? అని భావం; కలశసంభవుతోడన్= ఆ ద్రోణులవారితో; సరివచ్చుట= సాటివచ్చుట; ఉచితంబు+ఎ?= తగుతుందా?; ఈ వచ్చు+ఉజ్జ్వల+అగ్ని వలనికిన్= ఈ అస్త్రంనుండి వచ్చే మండుతున్న అగ్ని దగ్గరికి; అరిగెదన్= వెళ్ళుతాను; మీరు= ఓ సాత్యకి ధృష్టద్యుమ్నులారా! మీరు; మీ వాహినులును= మీ సైన్యాలు; ఎక్కడేని= ఎక్కడికైనా; పాఱిపొండు= పారిపొండి (దీనితో); ఆ+పార్థుకోర్కి+అంతన్= ఆ అర్జునుడి కోరిక పూర్తిగా; సఫలతన్= సాఫల్యాన్ని; పొందెడున్= పొందుతుంది; అచ్యుతుండును= కృష్ణుడు కూడా; ఎట్లు= ఏ విధంగా; తనకున్= (అతడికి); రుచించెన్= ఇష్టమవుతుందో; తాను= అతడు; అట్లు= ఆ విధంగా; చేయున్= చేస్తాడు.

**తాత్పర్యం:** ఆ ద్రోణులవారు ఎంతటి ధర్మాత్ముడంటే కౌరవులు ఆ సభలో ద్రౌపదిని అవమానపరుస్తూ ఉంటే ఉపేక్ష చేశాడే కాని ఎంతమాత్రం పట్టించుకొనలేదు. పలువురు వీరులను కూడగట్టుకొని చిన్నవాడైన అభిమన్యుడిని సంహరింపజేశాడు. ఇంక కొంచెంసేపు ఆగితే అర్జునుడు ఎక్కడ ప్రతిజ్ఞాభంగం అయి అగ్నిప్రవేశం చేస్తాడో అనే దుఃఖంతో అతడికి సహాయానికి వెళ్ళుతూ ఉంటే మనలను ఆ విధంగా అడ్డుకొన్నాడు. ఈయన ధర్మనిష్ఠ అట్టిది. ఆ ధర్మనిష్ఠ మనకు అక్కరలేదు. మనం అట్టి ధర్మాత్ముడితో సాటి రావటం చెల్లుతుందా? అది సరే - నేనిప్పుడు ఆ అస్త్రాగ్ని జ్వాలలవైపు వెళ్ళుతున్నాను. ఓ సాత్యకీ! ఓ ధృష్టద్యుమ్నా! ఇక మీరు మీ మీ సైన్యాలతో పారిపొండి. ఆ అర్జునుడి కోరిక సఫలమౌతుంది! ఆ కృష్ణుడు ఏం చేస్తాడో ఇక అతడి ఇష్టం.

**వ. అనిన విని జనార్దనుండు సత్వరుండై పెద్ద యెలుంగున నెల్లవారును విన 'సైనికులారా! సామజ హయ రథంబులు డిగ్గి యాయుధంబులు వెట్టి నిలువుండు; భూమిగతులగు నిరాయుధుల నిమ్మహాస్త్రం బేమియుం జేయ; దది యెట్లనిన నిట్లగుట దీనికిఁ బ్రతివిధానంబుగా దీని నొసంగిన మహాత్ముండు విధియించె' ననుటయు సకల జనంబులు నమ్మాట కియ్యకొని యట్లు సేయం జూచిన సమయంబున సమీరనందనుండు.**

**381**

**ప్రతిపదార్థం:** అనినన్= (అని ధర్మరాజు) అనగా; విని; జనార్దనుండు= కృష్ణుడు; సత్వరుండు+ఐ= తొందరతో కూడినవాడై; పెద్ద+ఎలుంగునన్= బిగ్గరగా; ఎల్లవారును= అందరుకూడా; వినన్= వినే విధంగా; సైనికులారా!= ఓ సైనిక వీరులారా!; సామజ హయ రథంబులు= మీమీ వాహనాలయిన ఏనుగులు, గుర్రాలు, రథాలు; డిగ్గి= దిగి; ఆయుధంబులు= మీమీ ఆయుధాలను; పెట్టి= క్రిందపెట్టి; నిలువుండు= ఊరకే ఉండండి; భూమిగతులు+అగు+నిరాయుధులన్= ఏ ఆయుధం లేక భూమిపై (ఊరకే) ఉన్నవారిని; ఈ+మహాస్త్రంబు= ఈ గొప్ప దివ్యాస్త్రం; ఏమియున్= ఏమీ; చేయదు= చేయదు; అది+ఎట్లు+అనినన్= అదెట్లా

అంటే; దీనిన్= ఈ దివ్యాస్త్రాన్ని; ఒసంగిన= ఇచ్చినటువంటి; మహాత్ముండు= మహానుభావుడు; దీనికిన్= ఈ అస్త్రానికి; ప్రతివిధానంబుగాన్= ప్రతిక్రియగా - అనగా ఈ అస్త్రానికి ఉపసంహారం చేయటానికి వేరే అస్త్రమనేది లేదు, ఆ అస్త్రాన్ని శరణైనా వేడాలి లేదా పారిపోవాలి ఇదే ఆ అస్త్రానికి ప్రతిక్రియ; ఇట్లు+అగుట= ఇట్లు జరగటం అనే దానిని; విధియించెన్= ఏర్పరచాడు; అనుటయున్= అని అనగానే, సకల జనంబులు= సైనిక జనులందరు; ఆ+మాటకున్= ఆ కృష్ణుడు పలికిన పలుకునకు; ఇయ్యకొని= ఒప్పుకొని; అట్లు= ఆ విధంగానే, అనగా ఆయుధాలు విడిచి ఊరకే ఉండటం; చేయన్+చూచిన సమయంబునన్= చేయటానికి పూనుకొనే సమయాన; సమీరనందనుండు= వాయునందనుడు భీముడు.

**తాత్పర్యం:** అట్లా ధర్మరాజు అనగా విని, కృష్ణుడు వెంటనే బిగ్గరగా సైనికులందరితో ఇట్లా అన్నాడు: 'ఓ సైనికులారా! మీరందరు తొందరగా మీమీ వాహనాలైన గజాశ్వ రథాల నుండి దిగి, మీ ఆయుధాలను క్రిందపెట్టి ఊరకే నేలపై నిలవండి. ఆ దివ్యాస్త్రం నేలమీద ఉన్నవారిని, ఆయుధాలు ధరించని వారిని ఏమీ చేయదు. ఎందుకంటే - ఈ అస్త్రాన్ని అనుగ్రహించిన మహానుభావుడు ఈ అస్త్రానికి విరుగుడుగా దీనిని చెప్పాడు. అని శ్రీకృష్ణుడు చెప్పిన మాటకు సైనికులందరు ఒప్పుకొని, అట్లాగే చేయటానికి పూనుకొనే సమయంలో భీముడు (అడ్డువచ్చి ఇట్లా అన్నాడు).

**చ. ' డిగకుఁడు వాహనంబులు గడింది మగంటిమి గోలుపోవ మీ**
**రు గడఁక దక్కి పెట్టకుఁడు రూపఱ నాయధముల్ మహాస్త్ర శ**
**క్తి గెలుతు గోత్రభిత్కులిశ తీవ్రశరంబుల వైభవంబు భూ**
**రి గద విహార భంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్.' 382**

**ప్రతిపదార్థం:** (ఓ సైనిక వీరులారా!) వాహనంబులు= మీమీ వాహనాలను; డిగకుఁడు= దిగకండి (మరియు); మీరు; కడింది మగంటిమి= అధికమైన పౌరుషాన్ని; కోలుపోవన్= పోగొట్టుకొనే విధంగా; కడఁక= యుద్ధప్రయత్నం; తక్కి= మాని; రూపఱన్= ఉన్నరూపు నశించే విధంగా, అనగా వీర ధర్మం మంటగలియగా; ఆయుధముల్= మీమీ ఆయుధాలను; పెట్టకుఁడు= కింద పెట్టకండి; గోత్రభిత్ వైభవంబు= ఇంద్రుడియొక్కవైభవము; కులిశ= వజ్రాయుధంవలె; తీవ్ర= వాడిఅయిన; శరంబుల= బాణాలయొక్క; వైభవంబు= సామర్థ్యాన్ని (మరియు); భూరిగద విహార భంగియున్= నా బలిష్ఠమైన గద (యొక్క) విహార విధానాన్ని అనగా విహరించే పద్ధతిని (షష్ఠీ తత్పురుషం సాధ్యసమాసం); అరిప్రకరంబులు= శత్రువుల సమూహాలు కూడా; పిచ్చలింపఁగన్= ప్రశంసించే విధంగా; మహాస్త్రశక్తిన్= ఆ దివ్యాస్త్ర సామర్థ్యాన్ని; గెలుతున్= జయిస్తాను.

**తాత్పర్యం:** 'ఓ సైనికవీరులారా! మీరు మీ పౌరుషాధిక్యాన్ని కోల్పోయేటట్లుగా మీమీ వాహనాలను దిగకండి; మీరు యుద్ధం మాని ఆయుధాలు క్రింద పెట్టకండి; ఇంద్రుడి వజ్రాయుధం వంటి నా వాడిబాణాల వైభవాన్ని, నా బలిష్టమైన గదా విహార విధాన్ని శత్రు సమూహాలు ప్రశంసించేటట్లుగ ఆ దివ్యాస్త్ర సామర్థ్యాన్ని అణచివేస్తాను.

**వ. అని బరవసంబు సేసి, శంఖం బొత్తి, మల్లచఱచి, సింహనాదంబు సెలంగ నశ్వత్థామకు మార్కొనుటయు; నవ్వీరుం డదల్పుతో నన్నారాయణాస్త్రంబు నిగుడం జేసిన. 383**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా చెప్పి; బరవసంబు+చేసి= ధైర్యంచేసి, సాహసించి; శంఖంబు= శంఖాన్ని; ఒత్తి= పూరించి; మల్లచఱచి= భుజాస్ఫాలనం చేసి; సింహనాదంబు+చెలంగన్= సింహనాదం చెలరేగగా; అశ్వత్థామకున్= ఆ దివ్యాస్త్రాన్ని ప్రయోగించిన అశ్వత్థామను; మార్కొనుటయున్= ఎదిరించగానే; ఆ+వీరుండు= ఆ వీరుడు అశ్వత్థామ; అదల్పుతోన్= అదలించటంతో (అదలించి); ఆ+నారాయణ+అస్త్రంబు= ఆ నారాయణాస్త్రాన్ని; నిగుడన్+చేసినన్= ఆ భీముడిపై ప్రసరింపజేయగా.

**తాత్పర్యం:** అని సాహసించి శంఖాన్ని పూరించి, భుజం చరచి, సింహనాదంచేసి అశ్వత్థామను ఎదుర్కోగా, అప్పుడు అశ్వత్థామ తన దివ్యాస్త్రాన్ని భీముడివైపు మళ్ళించాడు.

**క. అనలశిఖాసదృశము లగు । నసేక బాణములు భీమునరదము వొదువం**
**గని యమ్మొన యోధులు వా । హనములు డిగ్గి వెట్టి రాయుధము లిలన్. 384**

**ప్రతిపదార్థం:** అనల శిఖా సదృశములు+అగు= అగ్ని జ్వాలలతో సమానములైన; అనేక బాణములు= వివిధ బాణాలు; భీము+అరదము= భీముడి రథాన్ని; పొదువన్= చుట్టుముట్టగా; కని= చూచి; ఆ+మొన యోధులు= ఆ పాండవ సైన్యంలోని వీరులు; వెసన్= వేగంగా(తొందరగా); వాహనములు= తమ తమ వాహనాలు - గజాశ్వ రథాదులను; డిగ్గి= దిగి; ఇలన్= భూమిపై; ఆయుధములు= ఆయుధాలను; పెట్టిరి= పెట్టారు.

**తాత్పర్యం:** అగ్నిజ్వాలలవలె మండుతున్న అనేక బాణాలు భీముడి రథాన్ని చుట్టుముట్టగా అది చూచి, తొందరగా సైనిక వీరులందరు తమ తమ వాహనాలు దిగి ఆయుధాలను కింద పడవేశారు.

**విశేషం:** అలం: ఉపమ. 'అనలశిఖా సదృశములు' అనేచోట ఉపమాలంకారం. ఆ వచ్చేవి బాణాలుగా కాక మండుచున్న అగ్నిజ్వాలలై కాల్చి వేస్తాయని ధ్వని.

**వ. పదాతి దళంబులుం గైదువులు వెట్టి; రప్పు డద్దివ్యసాధనం బెవ్వరికి బాధకంబు గాక యా భీమసేను దెసకు మొగం బగుటయు. 385**

**ప్రతిపదార్థం:** పదాతి దళంబులున్= కాలినడకన యుద్ధం చేసే సైనికులు కూడ; కైదువులు= ఆయుధాలను; పెట్టిరి= క్రింద పెట్టారు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+దివ్యసాధనంబు= ఆ దివ్యాస్త్రం; ఎవ్వరికిన్= ఎవ్వరికి కూడ; బాధకంబు= బాధ కలిగించేది; కాక= కాకుండా (ఉండి); ఆ భీమసేను దెసకున్= ఆ భీముడివైపునకు; మొగంబు+అగుటయున్= అభిముఖం కావటాన్ని - భీముడి వైపు తిరిగి వెళ్ళటాన్ని.

**తాత్పర్యం:** కాలినడకన యుద్ధం చేసే సైనికులందరు కూడా ఆయుధాలను క్రింద పెట్టారు. ఆ సమయాన ఇక ఆ దివ్యాస్త్రం ఎవ్వరిని బాధించక భీముడివైపు వెళ్ళుతూ ఉండగా.

**క. నరుఁడు గని సత్వరంబుగ । వరుణాస్త్రం బేయుటయును వావిరి నది త**
**త్పరుషత మానెడునట్లుగఁ । బరఁగిన గురుసుతుఁడు పెద్ద ప్రబలం జేసెన్. 386**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; కని= చూచి; సత్వరంబుగన్= వెంటనే; వరుణాస్త్రంబు= వర్షాన్ని కురిపించే స్వభావంగల వరుణ దేవతాకమైన అస్త్రాన్ని - వారుణాస్త్రాన్ని (పర్జన్యాస్త్రం అనికూడ దీనినే అంటారు); ఏయుటయును= ప్రయోగించగానే; అది= ఆ దివ్యాస్త్రం; వావిరిన్= క్రమంగా; తత్పరుషతన్= ఆ నారాయణాస్త్రం వలన కలిగిన అగ్నిజ్వాలల కాఠిన్యాన్ని; మానెడునట్లుగన్= తగ్గిపోయే విధంగా; పరఁగినన్= ప్రవర్తించగా; (అప్పుడు) గురుసుతుండు= ద్రోణపుత్రుడు - అశ్వత్థామ; పెద్దప్రబలన్= (తన దివ్యాస్త్రాన్ని) మిక్కిలి ప్రబలిపోయేటట్లు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు చూచి, వెంటనే వారుణాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం ప్రయోగించగానే ఆ నారాయణాస్త్రం వలన కలిగిన మంటలు కొద్ది కొద్దిగా తగ్గ నారంభించాయి. దానిని కనిపెట్టాడు అశ్వత్థామ - వెంటనే ఆ నారాయణాస్త్ర బలాన్ని మరింత ఎక్కువ శక్తిమంతంగా చేశాడు.

నారాయణాస్త్రపీడితుం డగు భీముఁ గృష్ణార్జునులు రథంబు డిగ్గఁ జేయుట (సం. 7-171-12)

**వ. ఇవ్విధంబున నశ్వత్థామ యమ్మహాస్త్రంబు దీపింపం జేసిన నది పేర్చి కార్చిచ్చు పొదువు చందంబున సమీరనందనుం జుట్టుముట్టె; నట్లు సమర విముఖులై యేమియుం గాకున్న ధర్మనందనాదులను బలిమి వదలని చలంబున ననలంబు చేతం బొదువంబడిన వృకోదరునిం గని కృష్ణార్జునులు దేరు డిగ్గి రిత్తచేతులం బాఱి వారుణాస్త్రంబు కతంబునం బెద్ద గాలక యున్న యాభీముని రథంబు డిగ్గఁ ద్రోవ, డిగక బిగిసిన నచ్యుతుం డతని కిట్లనియె. 387**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; అశ్వత్థామ= ద్రోణుడి కుమారుడు అశ్వత్థామ; ఆ+మహాస్త్రంబు= ఆ దివ్యాస్త్రాన్ని; దీపింపన్= ఉద్దీప్తి కలిగేటట్లు; చేసినన్= చేయగా; అది= ఆ నారాయణాస్త్రం; పేర్చి= పెరిగిపోయి; కార్చిచ్చు= దావాగ్ని; పొదువు చందంబునన్= క్రమ్మే విధంగా; సమీరనందనున్= భీముడిని (సమీరమనగా వాయువు - వాయుదేవుడి కుమారుడు కాన సమీరనందనుడు భీముడు); చుట్టుముట్టెన్= చుట్టూ ఆవరించింది; అట్లు= ఆ విధంగా; సమర విముఖులు+ఐ= యుద్ధానికి పెడమొగం పెట్టినవారై - యుద్ధం చేయక ఊరకే ఉన్నవారై (ఉండుటచేత); ఏమియున్= ఏమీ కూడ; కాక+ఉన్న= కాకుండా ఉన్నటువంటి; ధర్మనందనాదులను= ధర్మరాజు మొదలైనవారిని; కని= చూచి అని అన్వయం - మరియు; బలిమి= పరాక్రమాన్ని; వదలని చలంబునన్= విడువని పట్టుదలవలన; అనలంబు చేతన్= అగ్నిచేత పొదువబడిన; వృకోదరునిన్= ఆవరింపబడినటువంటి భీముడిని; కని= చూచి (యుద్ధం మానివేసి ఊరకే ఉన్న ధర్మరాజాదులను ఈ నారాయణాస్త్రం ఏమీ చేయలేదు. యుద్ధం చేయటానికి మొండిపట్టుపడుతున్న ఈ భీముడిని ఆవరించింది కదా అనే విషయాన్ని గమనించి; కృష్ణ+అర్జునులు= కృష్ణుడు, అర్జునుడు; తేరు= రథాన్ని; డిగ్గి= దిగి; రిత్తచేతులన్= వట్టి చేతులతో అనగా ఆయుధాలు లేని చేతులతో; పాఱి= పరుగెత్తి; వారుణ+అస్త్రంబు కతంబునన్= అర్జునుడు ప్రయోగించిన ఆ పర్జన్యాస్త్రం కారణాన; పెద్ద= ఎక్కువగా; కాలక+ఉన్న+ఆ భీమునిన్= కాలకుండా ఉన్నట్టి ఆ భీమసేనుడిని; రథంబు= రథంనుండి; డిగ్గన్= దిగిపోయే విధంగా; త్రోవన్= త్రోసివేయగా; డిగక= దిగిపోక; బిగిసినన్= పట్టుపట్టి ఉండగా; అతనికిన్= ఆ భీముడితో; అచ్యుతుండు= కృష్ణుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా అశ్వత్థామ ఆ దివ్యాస్త్రాన్ని మరీ ఉద్ధృతం చేసిన వెంటనే అది విజృంభించి దావాగ్నివలె భీముడి చుట్టూ వ్యాపించింది. యుద్ధం మాని తమకు ఏమీ కాక నిలిచి ఉన్న ధర్మరాజాదులను, ఎంత చెప్పినా పట్టుదలతో యుద్ధం మానక ఆ దివ్యాస్త్ర జ్వాలలచే చుట్టబడియున్న భీమసేనుని కృష్ణార్జునులు గమనించి, రథం దిగి, చేతిలోని ఆయుధాలు పడవేసి, వట్టిచేతులతోనే పరుగెత్తి, వారుణాస్త్ర కారణంగా అంతవరకు ఎక్కువ కాలకుండా ఉన్న భీమసేనుని రథంపై నుండి క్రిందపడేటట్లు త్రోయగా, భీముడు పట్టువదలక రథాన్ని దిగకపోగా, కృష్ణుడు భీముడితో ఇట్లా అన్నాడు:

**తే. 'ఇమ్మహాస్త్రంబుఁ గడిమి మైఁ గ్రమ్మఱింప । నెవ్వరికి రామిఁ జేసి కా కేము శక్య**
**మైన నూరక యుండుదు మయ్య? వలవ । దుడుగు నాబుద్ధి విని డిగ నుఱుకు తేరు.' 388**

**ప్రతిపదార్థం:** ఈ+మహాస్త్రంబున్= ఈ దివ్యాస్త్రాన్ని; కడిమిమైన్= పరాక్రమంతో; ఎవ్వరికిన్= ఎవరికి కూడా; క్రమ్మఱింపన్= మరలించటానికి - అనగా ఉపశమింపజేయటానికి; రామిన్+చేసి= సాధ్యం కాకపోవటం వలన ('చేసి' హేత్వర్థకం); కాక= తప్ప; ఏము= మేము; శక్యమైనన్= మరలింప సాధ్యమే అయితే; ఊరక= వట్టిగా అనగా ఏ ప్రయత్నం లేక; ఉండుదుము+అయ్య?= ఉంటామా నాయనా?; వలవదు= వద్దు; ఉడుగు= మానివేయి; నా బుద్ధిన్= నా బోధను - నేను చెప్పినమాటను; విని= పెడచెవిని పెట్టక విని; తేరు= రథాన్ని; డిగన్= దిగిపోయే విధంగా; ఉఱుకు= పరుగెత్తుము.

**తాత్పర్యం:** 'ఓ భీమసేనా! ఈ దివ్యాస్త్రాన్ని ఉపసంహరింపజేయటం ఎవ్వరికీ సాధ్యం కాదు కాబట్టి మే మిట్లా ఊరకే ఉన్నాము. ఒకవేళ సాధ్యమే అయితే ఇట్లా చేస్తూ ఊరకుంటామా నాయనా! ఇక్కడికి చాలు, ఇక వద్దు. యుద్ధం చేయటం మానివేయుము. నే చెప్పే మాట వినుము. రథం నుండి త్వరగా దిగనురుకుము'.

**వ. అనుచు నతని నిరాయుధుం జేసి యర్జునుండు తోడ్పడ నరదంబు డిగ్గఁ ద్రోచె; నిత్తెఱంగునఁ బాండవ సైన్యంబంతయు దైన్యంబు నొందుటయు, నారాయణాస్త్రంబు ప్రశాంతిం బొందెఁ దదనంతరంబ. 389**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని కృష్ణుడు అంటూనే; అతనిన్= ఆ భీముడిని; నిరాయుధున్= ఏ ఆయుధాలు (చేతుల్లో) లేనివాడినిగా; చేసి; అర్జునుండు; తోడ్పడన్= తోడుకాగా; అరదంబు= రథంనుండి; డిగ్గన్= దిగిపోయే విధంగా; త్రోచెన్= త్రోసివేశాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; పాండవ సైన్యంబు+అంతయున్= పాండవుల సైన్యం అంతా కూడా; దైన్యంబున్= దీనదశను- అభిమానాన్ని చంపుకొనే స్థితిని; ఒందుటయున్= పొందగానే; నారాయణ+అస్త్రంబు= ఆ నారాయణాస్త్రం; ప్రశాంతిన్= శాంతిని; పొందెన్= పొందింది - శాంతించింది; తదనంతరంబు+అ= అటు తరువాత.

**తాత్పర్యం:** అని అంటూ కృష్ణుడు, భీముడి చేతిలోని ఆయుధాలను లాగివేసి, అర్జునుడూ, తానూ ఇద్దరూ కలిసి ఆ భీముడిని రథం నుండి క్రిందికి తోశారు. ఈ విధంగా పాండవసైన్యం దీనత్వాన్ని పొందగానే నారాయణాస్త్ర ప్రశాంతతను పొందింది. ఆ తరువాత - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. హరి పనుప వారి బలములు । పురికొని వాహన వితానములు శస్త్రాస్త్రో**
**ద్ధుర భంగి నొప్ప నడరెం । గురుసేనలమీఁదఁ దూర్యఘోషము సెలఁగన్. 390**

**ప్రతిపదార్థం:** హరి= కృష్ణుడు; పనుపన్= ఆదేశించగా; వారి బలములు= ఆ పాండవుల సైన్యాలు; పురికొని= ఉత్సాహాన్ని పొంది; వాహన వితానములు= గజాశ్వాది వాహనాల సమూహాలు; శస్త్ర+అస్త్ర+ఉద్ధుర భంగిన్= శస్త్రాస్త్రములతో నిండుగాఉన్న రీతితో; ఒప్పన్= ఒప్పుతూ ఉండగా మరియు; తూర్యఘోషము= వాద్యముల ధ్వని; చెలఁగన్= ధ్వనిస్తూ ఉండగా; కురుసేనలమీఁదన్= కౌరవసైన్యాలపైకి; అడరెన్= విజృంభించింది.

**తాత్పర్యం:** (ఆ దివ్యాస్త్రం శాంతించగానే) కృష్ణుడు సైన్యాలను సమాయత్తం కమ్మని ఆదేశించగా పాండవసైన్యాలు వాహన సమూహాలతో శస్త్రాస్త్రాలతో వాద్యధ్వనులు చెలరేగగా కౌరవసైన్యాలపైకి విజృంభించాయి.

**వ. ఆ సంరంభంబు సూచి సుయోధనుం డశ్వత్థామతో 'నింకను నమ్మహాస్త్రంబు ప్రయోగింపు' మనుటయు, నతం డది పునఃప్రయోగంబున కర్హంబు గా; దట్లయినం బ్రయోగించిన వారిని వధియించు; నిట్లగుట గురునకు వరదాన కాలంబునం గేశవుం డానతిచ్చెఁ; జావోటములు రెండును నొక్కరూపు కావున నమ్మహనీయాస్త్రంబు పగతుర నోడించి యంతటి తోడఁ దెగియెఁ; గృష్ణుఁ డీ యుపాయంబున నప్పరమ సాధనంబు గడపి పుచ్చె; మన మేమి సేయుద?' మనుచు నిట్టూర్పు నిగిడించె; నవవుడు నాంబికేయుండు సంజయున కి ట్లనియె. 391**

**ప్రతిపదార్థం:** ఆ సంరంభంబు= ఆ పాండవసేనల యుద్ధాటోపాన్ని; చూచి= కనిపెట్టి; సుయోధనుండు; అశ్వత్థామతోన్= అశ్వత్థామతో (ఇంకా ఇట్లా అన్నాడు); ఇంకను= మళ్ళీకూడ; ఆ+మహాస్త్రంబు= ఆ దివ్యాస్త్రాన్ని; ప్రయోగింపుము+అనుటయున్= ప్రయోగించుము అని అనగానే; అతండు= ఆ అశ్వత్థామ (ఇట్లా అన్నాడు); అది= ఆ దివ్యాస్త్రం; పునఃప్రయోగంబునకున్=

మళ్ళీ ప్రయోగించటానికి; అర్హంబు= తగింది; కాదు; అట్లు+అయినన్= అట్లా అయినప్పటికి కూడా - ఆ నియమాన్ని కాదంటే; ప్రయోగించిన వారిని= ఆ ప్రయోగించిన వ్యక్తిని (వారిని అనే బహువచనం అనిర్దిష్ట పురుష వ్యావహారమునందు వచ్చినది - ప్రౌఢ- శబ్ద 57); వధియించున్= సంహరిస్తుంది; ఇట్లు+అగుటన్= ఇట్లా కావటంచేత; గురునకున్= మా తండ్రి ద్రోణాచార్యులకు; కేశవుండు= ఆ నారాయణ భగవానుడు; వరదానకాలంబునన్= వరం ఇచ్చే సమయంలోనే - ఈ దివ్యాస్త్రాన్ని ప్రదానం చేసినప్పుడే; ఆనతి+ఇచ్చెన్= సెలవిచ్చాడు; చావు+ఓటములు= మరణం, పరాజయం; రెండునున్= ఈ రెండు కూడా; ఒక్కరూపు+అ= ఒకే విధమైనవి; కావునన్= కాబట్టి; ఆ+మహనీయ+అస్త్రంబు= ఆ పూజనీయమైన నారాయణాస్త్రం; పగతురన్= శత్రువులను; ఓడించి= పరాజితులను చేసి (జయించి); అంతటి తోడన్= ఆ శత్రుపరాజయం మాత్రంతోనే; తెగియెన్= విభిన్నమయింది - ఆగిపోయిందని భావం; కృష్ణుండు; ఈ+ఉపాయంబునన్= ఈ ఆయుధత్యాగం అనే ఉపాయం చేత; ఆ+పరమసాధనంబు= ఆ శ్రేష్ఠమైన అస్త్రాన్ని; కడపి పుచ్చెన్= పంపించి వేశాడు; మనము= మనం; ఏమి; చేయుదము?= చేయగలం?; అనుచున్= అని అంటూ; నిట్టూర్పు= నిశ్వాసాన్ని; నిగిడించెన్= వెలువరించాడు అనగా నిట్టూర్చాడు. (తన నారాయణాస్త్రం దుర్యోధనుడికి విజయం సాధించలేకపోయిందని తన దుఃఖాతిశయాన్ని వ్యక్తం చేశాడని భావం); అనవుడున్= అనగానే; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుండు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అట్లా పాండవుల సైన్యాలు తమపైకి సమరోత్సాహంతో ఆడంబరంగా రావటం చూచి దుర్యోధనుడు, 'అశ్వత్థామా! మళ్ళీ ఒకసారి ఆ దివ్యాస్త్రాన్ని ప్రయోగించు' మని అర్థించాడు. అందుకు అశ్వత్థామ 'దుర్యోధనా! అది మళ్ళీ ప్రయోగించటానికి వీలులేనిది. ఒకవేళ మళ్ళీ ప్రయోగించామంటే ప్రయోగించినవారినే ఆ దివ్యాస్త్రం వధిస్తుంది. ఈ విధంగా జరుగుతుంది అని - ఈ అస్త్రాన్ని ప్రదానం చేసే సమయంలోనే ఆ నారాయణ భగవానుడు మా తండ్రి ద్రోణులవారికి చెప్పాడు. ఓడిపోవటం అంటే మరణంతో సమానమే కదా! అందుకే ఆ దివ్యాస్త్రం శత్రువుల ఓటమితోనే విరమించింది. ఇదంతా జరగటానికి కారణం ఆ కృష్ణుడు. ఆ కృష్ణుడికి, ఈ దివ్యాస్త్రానికి బలికాకుండా ఎట్లా తప్పించుకొనాలో తెలుసు. అందుకే తమ వారందరూ ఆయుధాలు క్రింద పెట్టే ఉపాయం పన్నాడు. దానితో ఈ దివ్యాస్త్రం వారిని దహించివేయక అదృశ్యమయింది. ఇంక మనం ఏమి చేయగలము? అని పెద్దగా నిట్టూర్చాడు- అని అనగా ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**క. 'నారాయణాస్త్ర మిమ్మెయి । వైరి చమూసంచయంబు వధియింపక పో**
**రారాజును ద్రౌణియుఁ దా । రే రూపున సంచరించి? రెఱిఁగింపు తగన్.' 392**

**ప్రతిపదార్థం:** (ఓ సంజయా!) నారాయణ+అస్త్రము= నారాయణాస్త్రం; ఈ+మెయిన్= ఈ విధంగా; వైరిచమూ సంచయంబు= శత్రువుల సైన్య సమూహాన్ని; వధియింపకపో= వధించకుండా ఉండుగాక (సరే అదిపోనీ); రారాజును= దుర్యోధనుడు; ద్రౌణియున్= అశ్వత్థామ; తారు= తాము - ఆ ఇద్దరు తమలో తాము; ఏరూపునన్= ఏ విధంగా; సంచరించిరి?= నడుచుకొన్నారు?; తగన్= తగినట్లు; ఎఱిఁగింపు= తెలియజెప్పుము.

**తాత్పర్యం:** 'ఆ నారాయణాస్త్రం శత్రుసైన్యాలను వధించకుండానే పోయింది. సరే పోతే పోనీ. ఇక దుర్యోధనుడు, అశ్వత్థామ ఆపైన ఏం చేశారో చెప్పుము సంజయా!'

**వ. అని యడిగిన నమ్మనుజపతికి సూతసూనుం డి ట్లనియె. 393**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; అడిగినన్= అడుగగా; ఆ+మనుజపతికిన్= ఆ ధృతరాష్ట్ర మహారాజుతో; సూతసూనుండు= సంజయుడు; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** అని అడుగగా ధృతరాష్ట్రునకు సంజయుడు ఇట్లా చెప్ప నారంభించాడు.

**క. ఆ మనుజపతికి నశ్వ । త్థామ యటులు సెప్పుటయు, నతం 'డన్యాస్త్ర**
**స్తోమంబునఁ బాండవసే । నామర్దన మాచరింపు' నావుడు గడిమిన్. 394**

**ప్రతిపదార్థం:** ఆ మనుజపతికిన్= ఆ రాజుతో అనగా ఆ దుర్యోధనుడితో; అశ్వత్థామ; అటులు= ఆ విధంగా; చెప్పుటయున్= చెప్పగానే; అతండు= ఆ దుర్యోధనుడు; అన్య+అస్త్రస్తోమంబునన్= ఇతరములైన దివ్యాస్త్రసమూహాలతో; పాండవ సైన్యాల వధను; ఆచరింపుము= చేయుము; నావుడు= అనగా; కడిమిన్= పౌరుషంతో.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అశ్వత్థామ అట్లా అనగానే దుర్యోధనుడు, ఇతర దివ్యాస్త్ర సమూహంతో పాండవసైన్యాన్ని మట్టుపెట్టుము' అని అనగానే మహా పౌరుషంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ద్రౌణి గౌంతేయసేనపై బాణవితతిఁ । బరఁగఁ జేయుచు నాచార్యమరణ మంత**
**రంగ సంతాప మొనరింప నక్కజముగఁ । దఱిమి పాంచాలతనయునిఁ దాఁకె నధిప! 395**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ద్రౌణి= అశ్వత్థామ; కౌంతేయు సేనపైన్= పాండవుల సైన్యం మీద; బాణవితతిన్= బాణాల సమూహాన్ని; పరఁగన్+చేయుచున్= వ్యాపింపజేస్తూ; ఆచార్యు మరణము= ద్రోణాచార్యుడి మృతి; అంతరంగ సంతాపము= మానసిక సంక్షోభాన్ని; ఒనరింపన్= కలుగజేయగా; (కడిమిన్= పౌరుషంతో; ద్రోణాచార్యుడి వధవృత్తాంతం మనసులో మెదలుతూ ఉంటే దుఃఖంతోపాటు పౌరుషం పెరిగిందని భావం); 'కడిమిన్' - వెనుకటి పద్యంలోనిదీ పదం ఇక్కడ అన్వయిస్తుంది); అక్కజముగన్= ఆశ్చర్యం కలిగే విధంగా; తఱిమి= (పాండవసైన్యాన్ని); పారద్రోలి; పాంచాల తనయునిన్= ద్రుపదరాజు కుమారుడైన ధృష్టద్యుమ్నుడిని; తాఁకెన్= ఎదిరించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! అశ్వత్థామ పాండవసేనపై బాణసమూహాన్ని విపరీతంగా వేస్తూ, మనస్సులో తండ్రి ద్రోణాచార్యుడి మరణం దుఃఖం కలిగిస్తూ ఉండగా, ఆశ్చర్యకరంగా పాండవ సైన్యాలను తరిమి వెంటనే ధృష్టద్యుమ్నుడిని ఎదుర్కొన్నాడు.

**తే. తాఁకి యిరువదే నమ్ము లుదగ్రవృత్తి । నతని తనువునఁ బఱపి రయంబు మెఱయ**
**మఱియు నిరువదిమూఁ డుగ్ర మార్గణముల । నిగుడఁ జేసిన నాతండు వెగడు పడక. 396**

**ప్రతిపదార్థం:** తాఁకి= ఎదుర్కొని; ఇరువదేను+అమ్ములు= ఇరువది అయిదు బాణాలు; ఉదగ్రవృత్తిన్= ఉద్ధతమైన ప్రవృత్తితో- మిక్కిలి గర్వంతో; అతని తనువునన్= ఆ ధృష్టద్యుమ్నుడి శరీరాన; పఱపి= వ్యాపింపజేసి; రయంబు= వేగం; మెఱయన్= మెరిసిపోగా; మఱియున్= మళ్ళీ; ఇరువది మూఁడు+ఉగ్రమార్గణములు= ఇరువది మూడు భయంకర బాణాలు; నిగుడన్+చేసినన్= నాటుకొనేటట్లు చేయగా; ఆతండు= ఆ ధృష్టద్యుమ్నుడు; వెగడు పడక= తల్లడిల్లక.

**తాత్పర్యం:** ఎదుర్కొనిన వెంటనే ఇరువది అయిదు బాణాలు అతడి శరీరంలో క్రుచ్చుకొనేటట్లు కొట్టి, ఆగక, ఎంతో వేగంగా మళ్ళీ ఇరువది మూడు భయంకరములైన బాణాలు వేసి నొప్పించాడు. అట్లా అశ్వత్థామ బాణాలతో కొట్టినా కూడా తడబడక ఆ ధృష్టద్యుమ్నుడు.

**వ. నిశిత నారాచంబుల నొప్పించినం గోపించి. 397**

**ప్రతిపదార్థం:** నిశిత నారాచంబులన్= వాడి అయిన బాణాలతో; నొప్పించినన్= బాధ కలుగజేయగా; కోపించి= క్రోధం కలిగి.

**తాత్పర్యం:** అశ్వత్థామను తీక్ష్ణములైన బాణాలతో నొప్పించగా, అశ్వత్థామ క్రోధావిష్టుడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. గురుపుత్రుండు గడంగి సూతు హరులం గోదండముం గేతువున్**
**ధరణిం గూల్చినఁ జూచి సాత్యకి మదౌద్ధత్యంబునం దాఁకుడున్**
**శర మొక్కంటన మూర్ఛ వుచ్చి వెస ధృష్టద్యుమ్ను ఫాలంబు ని**
**ష్ఠుర నారాచహతంబు సేయుటయు వాఁడుం దేరిపై సోలినన్. 398**

**ప్రతిపదార్థం:** గురుపుత్రుండు= అశ్వత్థామ; కడంగి= విజృంభించి; సూతున్= సారథిని; హరులన్= అశ్వాలను; కోదండమున్= ధనుస్సును; కేతువున్= ధ్వజాన్ని; ధరణిన్= భూమిపై; కూల్చినన్= కూల్చివేయగా; చూచి= కనిపెట్టి; సాత్యకి; మద+ఔద్ధత్యంబునన్= మదముయొక్క ఆధిక్యంతో; తాఁకుడున్= ఎదుర్కొంటూ ఉండగా; శరము+ఒక్కంటన= ఒకే ఒక బాణంతో; మూర్ఛ పుచ్చి= మూర్ఛ పొందించి - తెలివి తప్పునట్లు కొట్టి; వెసన్= వేగంగా; ధృష్టద్యుమ్ను ఫాలంబు= ధృష్టద్యుమ్నుడి నుదుటి భాగాన్ని; నిష్ఠుర నారాచహతంబు+చేయుటయున్= క్రూరములయిన బాణాలతో నిహతం చేయగానే అనగా కొట్టగానే; వాఁడున్= ఆ ధృష్టద్యుమ్నుడు కూడా; తేరిపైన్= రథంపై; సోలినన్= మూర్ఛపోగా.

**తాత్పర్యం:** అశ్వత్థామ విజృంభించి, ధృష్టద్యుమ్నుడి సారథిని, గుర్రాలను, విల్లును, ధ్వజాన్ని భూమిపై కూల్చగా సాత్యకి చూచి, మదాతిరేకంతో ఎదిరించగా అశ్వత్థామ ఒకే ఒక బాణంతో సాత్యకిని మూర్ఛపడగొట్టాడు. వెంటనే ధృష్టద్యుమ్నుడి ఫాలభాగాన తీక్ష్ణమైన బాణంతో కొట్టాడు. ఆ బాణాఘాతంతో ధృష్టద్యుమ్నుడుకూడ రథంమీద మూర్ఛిల్లాడు. అప్పుడు.

**వ. కనుంగొని రోషవిషాదంబులు మనంబునం బెనంగొనఁ గిరీటియు భీమసేనుండునుం గవిసినన్ బాసటయై శిశుపాలపౌత్రుం డగు యువరాజును మాళవుండగు సుదర్శనుండును బౌరవుం డగు వృద్ధక్షత్రుండును గూడుకొని యయ్యేవురు నయిదయిదు సాయకంబు లేయ నక్కుంభసంభవ సంభవుండు వానిం బంచవింశతి కాండంబుల ఖండించె; నిట్లు దొడంగి యందఱకు నన్నిరూపులై యేపునం బోరుచుండి ప్రచండ భల్లత్రయంబున భుజంబులు శిరంబునుం దునిమి సుదర్శనుఁ గృతాంత దర్శనంబున కనిచి, పౌరవు తేరునుం దలయును నఱికి విశిఖశిఖలం జేదికుమారు వ్రందించి, మదంబున సింహనాదంబు సేసి, శంఖం బొత్తినం జిత్తంబులు గలంగి పాంచాలురుం బాండవ బలంబులు జలం బెడలి పాఱినం బోక నిలిచి భీమార్జును లమ్మొన మరల్చి; రప్పుడు పాకశాసనతనయుం డతని నిలునిలు మని యదల్చి సంరంభవిజృంభితుండై. 399**

**ప్రతిపదార్థం:** కనుంగొని= చూచి; రోషవిషాదంబులు= కోపం, దుఃఖం ఈ రెండు; మనంబునన్= మనస్సులో; పెనంగొనన్= ఒండొంటితో కలియగా; కిరీటియున్= అర్జునుడును; భీమసేనుండును= భీముడును; కవిసినన్=(అశ్వత్థామను)ఎదుర్కొనగా; బాసట ఐ= సహాయమై; శిశుపాల పౌత్రుండు+అగు= శిశుపాలుడి మనుమ డైన; యువరాజును= యువరాజు; మాళవుండు+అగు= మాళవదేశీయుడైన; సుదర్శనుండును= సుదర్శనుడు; పౌరవుండు+అగు= పురువంశీయుడైన; వృద్ధక్షత్రుండును= వృద్ధక్షత్రుడు (వీరందరు); కూడుకొని= కలిసి; ఆ+ఏవురును= ఆ అయిదుగురు; అయిదు+అయిదు+సాయకంబులు= అయిదేసి బాణాలను; ఏయన్=వేయగా; ఆ+కుంభసంభవ సంభవుండు= ఆ ద్రోణపుత్రుడు అశ్వత్థామ; వానిన్= ఆ బాణాలను; పంచవింశతికాండంబులన్= ఇరువది అయిదు బాణాలతో; ఖండించెన్= తునకలు చేశాడు; ఇట్లు= ఈ విధంగా; తొడంగి= పూనుకొని; అందఱకున్=వారందరికి; అన్ని రూపులు+ఐ= అన్ని విధాలై; ఏపునన్= ఆధిక్యంతో అనగా మిక్కుటంగా; పోరుచుండి= యుద్ధం చేస్తూ ఉన్నవాడయి;

సుదర్శనున్= మాళవుడైన సుదర్శనుడిని; ప్రచండ భల్లత్రయంబునన్= భయంకరములైన భల్లములనే బాణాలతో; భుజంబులు= చేతులను; శిరంబును= తలను; తునిమి= తెగగొట్టి; కృతాంత దర్శనంబునకున్= యమధర్మరాజును చూడటానికి; అనిచి= పంపి (సంహరించి); పౌరవు తేరునున్= పురువంశీయుడైన వృద్ధక్షత్రుని రథాన్ని; తలయును= శిరాన్ని; నఱికి= ఖండించివేసి; విశిఖ= బాణములయొక్క; శిఖలన్= కొసలతో; చేది కుమారు= చేది దేశీయుడైన యువరాజును; ప్రమందించి= సంహరించి; మదంబునన్= గర్వంతో; సింహనాదంబు= సింహనాదాన్ని; చేసి; శంఖంబు= శంఖాన్ని; ఒత్తినన్= పూరించగా - శంఖనాదం కూడా చేస్తూ ఉండగా; చిత్తంబులు= (పాండవ వీరుల) మనస్సులు; కలంగి= కలత చెంది; పాంచాలురున్= పాంచాల దేశీయులైన సైనికులు; పాండవ బలంబులున్= పాండవుల సైన్యాలు (ఈ రెండూ కూడా); చలంబు= పట్టుదల; ఎడలి= సడలిపోయి; పాఱినన్= పారిపోతూ ఉండగా పోక= పోకుండా; నిలిచి= ఉండి; భీమ+అర్జునులు= భీముడు, అర్జునుడు ఈ ఇద్దరూ; ఆ+మొనన్= ఆ సైన్యాన్ని; మరల్చిరి= మరలించారు; అప్పుడు= ఆ సమయంలో; పాకశాసన తనయుండు= (పాకుడనే రాక్షసుడిని శాసించినవాడు పాకశాసనుడు అనగా ఇంద్రుడు, అతని తనయుడు అర్జునుడు); ఆతనిన్= ఆ అశ్వత్థామను; నిలుము+నిలుము+అని= ఆగుము ఆగుము అని; అదల్చి= గద్దించి; సంరంభ విజృంభితుండు+ఐ= వేగిరపాటుతో విజృంభించినవాడై.

**తాత్పర్యం:** అట్లా ధృష్టద్యుమ్నుడు మూర్ఛపోవటాన్ని చూచి భీమార్జునులు. అశ్వత్థామను ఎదుర్కొనగా వారికి తోడుగా శిశుపాలుడి మనుమడు చేదిదేశం యువరాజు, మాళవదేశీయుడు సుదర్శనుడు, పురువంశీయుడు వృద్ధక్షత్రుడు - వీరు ముప్వురూ వారిని అనుసరించి వెళ్ళారు. ఈ అయిదుగురు వీరులు అశ్వత్థామ పైకి అయిదేసి బాణాలు ప్రయోగించారు. ఆ బాణాలను అశ్వత్థామ తాను ఇరవై అయిదు బాణాలతో నడుమనే నరికివేశాడు. నరికివేయటమే కాదు, ఆ అశ్వత్థామ వారందరిలో ప్రతి వ్యక్తికీ తనతోనే అశ్వత్థామ యుద్ధం చేస్తున్నాడని భ్రాంతి కలిగే విధంగా అంతటి వేగిరపాటుతో, అన్ని రూపులు కలవాడా - అన్నట్లు కనిపించాడు. భయంకరాలైన మూడు భల్లాలతో మొదట సుదర్శనుడి చేతులు, తల నరికి సంహరించాడు. వెంటనే వృద్ధక్షత్రుడి రథాన్ని తలను ఖండించి తరువాత చేది యువరాజును బాణాలతో వధించి, గర్వంతో సింహనాదం చేసి శంఖాన్ని పూరించాడు. దానితో పాంచాల సైన్యాలు, పాండవుల సైన్యాలు పౌరుషతేజం నశించి పారిపోవటం ప్రారంభించాయి. అప్పుడు భీమార్జునులు అడ్డుకొని పారిపోకుండా ఆ సైన్యాలను మరలించారు. వెంటనే అర్జునుడు - అశ్వత్థామను నిలుము నిలుము' అని గద్దించి, విజృంభించి (ఇట్లా అన్నాడు).

**క. 'గురుసుత! నీదుభుజావి। స్ఫురణము దివ్యాస్త్ర వీర్యమును గురుధరణీ**
**వరుదెస కూర్మియుఁ జూపితి। దెరలకుమీ' యనుడు నతఁడు దీప్తాకృతి యై. 400**

**ప్రతిపదార్థం:** గురుసుత!= ఓ గురుపుత్రా! అశ్వత్థామా!; నీదు భుజా విస్ఫురణము= నీ భుజబల విస్ఫూర్తిని; దివ్య+అస్త్ర వీర్యమున్= దివ్యాస్త్రాల శక్తిని; కురుధరణీవరుదెస కూర్మియున్= కురురాజు దుర్యోధనుడిపై గల భక్తిని (ప్రేమను) రాజభక్తిని అని భావం; చూపితి(వి)= చూపావు (సరే కాని ఇంకెటు పోతున్నావు చూడు); తెరలకుమీ= తొలగిపోవద్దు; అనుడున్= ఇట్లా అర్జునుడు అనగానే; అతఁడు= ఆ అశ్వత్థామ; దీప్తాకృతి ఐ= క్రోధంతో ఎర్రబడిన ఆకారం కలవాడై.

**తాత్పర్యం:** 'ఓ గురుపుత్రా! అశ్వత్థామా! నీ బాహుబలమెంతటిదో, నీ దివ్యాస్త్రశక్తి ఎట్టిదో, నీ రాజభక్తి ఎట్లాంటిదో చూపావు. తొలగిపోవద్దు' అనగానే అశ్వత్థామ క్రోధాగ్నితో మండిపోతూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. నియతిం బావక బాణ మేయుడు మహాగ్నిజ్వాలికా మాలిక**
**ల్హయ సందోహ రథవ్రజ ద్విరద మాలా సద్భట శ్రేణికా**
**క్షయముం జేయుచు సర్వభూత భయదాకారంబునం బేర్చి య**
**త్యయకాల జ్వలనోద్ధతిం గవిసి యేకాక్షౌహిణిం ద్రుంపఁగన్. 401**

**ప్రతిపదార్థం:** నియతిన్= నియమంతో; పావక బాణము= ఆగ్నేయాస్త్రాన్ని; ఏయుడున్= వేసిన వెంటనే; మహా+అగ్ని జ్వాలికా మాలికల్= పెద్ద అగ్నిజ్వాలల సమూహాలు; హయసందోహ= అశ్వాల సమూహాలు; రథవ్రజ= రథాల సమూహాలు; ద్విరదమాలా= ఏనుగుల గుంపులు; సత్+భటశ్రేణికా= సమర్థులైన పదాతుల పటాలాలు - అనే ఈ అన్నింటియొక్క; క్షయమున్= నాశాన్ని; చేయుచున్= చేస్తూ; సర్వభూత భయద+ఆకారంబునన్= సర్వప్రాణులకు భయాన్ని కలిగించే ఆకారంతో; పేర్చి= పెరిగి; అత్యయకాల జ్వలన+ఉద్ధతిన్= ప్రళయకాలమందలి అగ్నివంటి దర్పంతో; కదిసి= ఎదిరించి; ఏక+అక్షౌహిణిన్= ఒక అక్షౌహిణి సైన్యాన్ని; త్రుంపఁగన్= నశింపచేయగా.

**తాత్పర్యం:** వెంటనే మంత్రించి, ఆగ్నేయాస్త్రాన్ని సంధించి, పాండవుల సైన్యంమీద ప్రయోగించగా, ఆ దివ్యాస్త్రం నుండి పెద్దగా అగ్నిజ్వాలలు వరుసలుగా బయలుదేరి అశ్వ, రథ, గజ, పదాతి సమూహాలను నాశనం చేస్తూ, సర్వప్రాణులకు భయాన్ని కలిగించే రూపంగా పెరిగి, ఇది ప్రళయకాలాగ్నివలె విజృంభించి పాండవుల సైన్యంలో ఒక అక్షౌహిణీ సైన్యాన్ని నశింపజేయగా - (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 1. సందోహ - వ్రజ - మాలా - శ్రేణికా అనే ఈ నాలుగు పదాలు ఒకే అర్థంలో వరుసగా ప్రయోగింపబడ్డాయి. అర్థం ఒకటే అయినప్పుడు శబ్ద భేదం ఉంటేనే చమత్కారం ఉంటుంది. అదే అర్థాన్ని ఒకే పద్యంలో మాటిమాటికి చెప్పవలసి వచ్చినప్పుడు వాడిన ఆ పదాన్నే వాడటం కవికి గల శబ్దదారిద్ర్యాన్ని సూచిస్తుంది. కాబట్టి అర్థభేదం లేకపోతే శబ్దభేదమన్నా ఉండి తీరాలి. కవిత్వంలోని ఈ మెలకువను తిక్కన ఇక్కడ ప్రతిబింబింపజేశాడు.

2. అత్యయకాల జ్వలనోద్ధతిన్ అనేచోట ఉపమాలంకారం - ఈ అలంకారంచేత ఆ దివ్యాస్త్రాగ్ని జ్వాలలు ఈ ఒక్క అక్షౌహిణినే కాదు క్షణంలో పాండవసైన్యమంతా క్రమంగా చుట్టుముట్టి దహించి వేయగలవు అనే అర్థం. ఇచ్చట వ్యంగ్యం. ఇదీ తిక్కన కవితా శిల్పం.

**క. కురుసేన యుబ్బి యార్చుచు । హరియు నరుఁడు మడియుదురు శరానల శిఖలన్**
**సరి గలరే త్రిభువనముల । గురుసుతునకు ననఁగఁ దూర్యఘోషము లెసఁగెన్. 402**

**ప్రతిపదార్థం:** కురుసేన= కౌరవసైన్యం; ఉబ్బి= పొంగిపోయి; ఆర్చుచున్= సింహనాదం చేస్తూ; హరియున్= కృష్ణుడు; నరుఁడున్= అర్జునుడు; శర+అనల శిఖలన్= బాణాగ్ని జ్వాలలతో అనగా ఆ ఆగ్నేయాస్త్రంయొక్క అగ్గిమంటలలో; మడియుదురు= నశిస్తారు; త్రిభువనములన్= మూడు లోకాలలో; గురుసుతునకున్= గురుపుత్రుడైన అశ్వత్థామకు; సరి+కలరే?= సాటివచ్చువారు ఉన్నారా?- లేరు; అనఁగన్= అంటూ ఉందా అనునట్లు; తూర్య ఘోషములు= వాద్యధ్వనులు; ఎసఁగెన్= అతిశయించాయి.

**తాత్పర్యం:** కౌరవసైన్యం పొంగిపోయి సింహనాదం చేస్తూ, 'శ్రీకృష్ణుడూ, అర్జునుడూ ఆగ్నేయాస్త్రపు మంటలలో చనిపోతారు. మూడు లోకాలలో అశ్వత్థామకు దీటైనవారు ఉన్నారా?' అని అన్నట్లుగా వాద్యధ్వనులు మిక్కుటంగా మ్రోగాయి.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**తే.** **ఎల్ల దివ్య బాణంబులుఁ బొల్ల వోవఁ। జేయునట్లుగ బ్రహ్మ సృజించినట్టి**
**కీర్తనీయమహాస్త్రంబు గ్రీడి మంత్ర। నిష్ఠ యొప్పఁ బ్రయోగించె నృపవరేణ్య!** **403**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= ఓ ధృతరాష్ట్ర మహారాజా!; ఎల్ల దివ్యబాణంబులున్= దివ్యాస్త్రాలన్నీ; పొల్లవోవన్= వ్యర్థమయ్యేటట్లుగా; చేయునట్లుగన్= చేసే విధంగా; బ్రహ్మ= బ్రహ్మదేవుడు; సృజించినట్టి= నిర్మించినట్టి; కీర్తనీయ మహా+అస్త్రంబు= పొగడదగిన దివ్యాస్త్రాన్ని; క్రీడి= అర్జునుడు; మంత్ర= మంత్ర జపముయొక్క ఏకాగ్రత; ఒప్పన్= ఒప్పేటట్లు; ప్రయోగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! దివ్యాస్త్రాలన్నీ వమ్మయిపోయేటట్లుగా బ్రహ్మ సృష్టించిన ప్రశస్తమయిన బ్రహ్మాస్త్రాన్ని అర్జునుడు మంత్రనిష్ఠతో ప్రయోగించాడు.

**వ.** **ఆ బ్రహ్మాస్త్రంబుచేత నద్భుతంబగు నశ్వత్థామ యాగ్నేయాస్త్రంబు సంక్షీణంబగుటయుఁ, గైటభాంతకుండును గిరీటియుం బాంచజన్య దేవదత్తంబులు పూరించినఁ, బాండవసైన్యంబున సింహనాద శంఖ భేరీ మహారావంబులు సెలంగెఁ; గౌరవసేన లేటమొగంబు వడియె; నప్పు డగ్గురునందనుండు.** **404**

**ప్రతిపదార్థం:** ఆ బ్రహ్మ+అస్త్రంబుచేతన్= అర్జునుడు ప్రయోగించిన ఆ బ్రహ్మాస్త్రంచేత; అద్భుతంబు+అగు= ఆశ్చర్యం కలిగించే; అశ్వత్థామ+ఆగ్నేయాస్త్రంబు= అశ్వత్థామ ప్రయోగించిన ఆగ్నేయాస్త్రం; సంక్షీణంబు+అగుటయున్= క్షీణించిపోగానే; కైటభ+అంతకుండును= కైటభుడనే రాక్షసుడిని సంహరించినవాడు - అనగా కృష్ణుడు; కిరిటియున్= అర్జునుడు కూడా; పాంచజన్య దేవదత్తంబులు= పాంచజన్యం దేవదత్తం అనే రెండు శంఖాలను; పూరించినన్= పూరించగా (ఊదగా) (కృష్ణుడు పాంచజన్య శంఖాన్ని అర్జునుడు దేవదత్త శంఖాన్ని పూరించగా, అని క్రమంగా అన్వయం - శంఖనాదం చేయగా అని భావం); పాండవసైన్యంబునన్= పాండవుల సైన్యంలో; సింహనాద శంఖ భేరీ మహారావంబలు= సింహనాదాలు అనగా సింహంవలె (వీరులు) గర్జించటం మరియు శంఖాల భేరీల గొప్ప ధ్వనులు; చెలంగెన్= మ్రోగాయి; కౌరవసేన= కౌరవుల సైన్యం; లేట మొగంబు వడియెన్= పెడమొగం పట్టింది - పారిపోయింది; అప్పుడు= ఆ సమయంలో; ఆ+గురునందనుండు= ఆ అశ్వత్థామ.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మాస్త్రం చేత అశ్వత్థామ ప్రయోగించిన ఆగ్నేయాస్త్రం క్షీణించిపోగా, విజయోత్సాహంతో కృష్ణుడు పాంచజన్య శంఖాన్ని, అర్జునుడు దేవదత్త శంఖాన్ని పూరించారు. పాండవసైన్యంలో సింహనాద శంఖ భేరీనినాదాలు చెలరేగాయి. కౌరవసైన్యం తిరుగుముఖం పట్టింది. అప్పుడు అశ్వత్థామ. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ.** **'తెల్లమయ్యె నాకు దివ్యాస్త్రబలము లే। కునికి సిగ్గుమాలి యనికి నింకఁ**
**గడఁగ నేల? దీని నుడిగెదఁ గా' కని। యుల్లమునఁ దలంచి విల్లు వైచి.** **405**

**ప్రతిపదార్థం:** దివ్య+అస్త్రబలము= దివ్యాస్త్రముల బలం; నాకున్= నాకు; లేక+ఉనికి= లేకపోవటం; తెల్లము+అయ్యెన్= స్పష్టమయింది; ఇంకన్= మరియు; కడఁగన్= పరాక్రమించగ; ఏల?= ఎందుకు? (ఇంకా యుద్ధం చేసి ఏం ప్రయోజనం); దీనిన్= ఈ పరాక్రమించటాన్ని; ఉడిగెదన్+కాక= విడిచివేస్తాను; అని= ఈ విధంగా; ఉల్లమునన్= మనస్సులో; తలంచి= అనుకొని; విల్లు= ధనుస్సును; వైచి= పడవేసి.

**తాత్పర్యం:** 'దివ్యాస్త్రాల బలం ఇక నాకు లేదనే విషయం స్పష్టమయింది. సిగ్గులేక ఇంకెందుకు యుద్ధం చేయటం? మానివేస్తాను' అని మనస్సులో భావించి తన చేతిలోని ధనుస్సును క్రింద పడవేసి. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. అరదంబు డిగ్గి తొలంగి పోవం బోవ. 406**

**ప్రతిపదార్థం:** అరదంబు= రథాన్ని; డిగ్గి= దిగి; తొలంగిపోవన్+పోవన్= రణరంగంనుండి తొలగిపోతూ పోతూ ఉండగా -

**తాత్పర్యం:** రథం నుండి దుమికి, రణరంగం విడిచి వెళ్ళిపోతూ ఉండగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. జిగి దొలఁకాడఁగ నేలకు । మొగి లేలొకొ డిగ్గె ననఁగ ముందటఁ దోఁచెన్**
**విగత దురితత్త్వభాసుం । డగు వేదవ్యాసుఁ డ మ్మహాపురుషునకున్. 407**

**ప్రతిపదార్థం:** జిగి= కాంతి; తొలఁకాడఁగన్= అతిశయించగా; మొగిలు= మేఘం; ఏల+ఒకో= ఎందుకో; నేలకున్= భూమిపైకి; డిగ్గెన్= దిగింది; అనఁగన్= అనే విధంగా; విగత దురితత్త్వభాసుండు+అగు= పాపరహితమైన స్వభావంతో ప్రకాశిస్తూ ఉన్న; వేదవ్యాసుఁడు= వేదాలను విభజించిన కృష్ణద్వైపాయన మహాముని; ఆ+మహాపురుషునకున్= ఆ మహావ్యక్తియైన అశ్వత్థామకు; ముందటన్= ముందరి భాగంలో (ఎదుట); తోఁచెన్= ప్రత్యక్షమయ్యాడు.

**తాత్పర్యం:** వెళ్ళుతూ ఉన్న ఆ అశ్వత్థామ ఎదుట నల్లని కాంతిని దశదిశలకు విరజిమ్ముతూ ఆకాశంనుండి ఏ కారణం చేతనో భూమికి దిగివచ్చిన మేఘమా? - అన్నట్లున్న పుణ్యమూర్తి వ్యాసమహర్షి ఎదురుగా సాక్షాత్కరించాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. ఉపమానం కవి కల్పితం కాబట్టి ఉపమాలంకారం కాదు. మేఘం ప్రసిద్ధమే అయినా ఆకాశం నుండి భూమికి దిగివచ్చిన మేఘం కవి కల్పనమే. తాపోపశమనం చేసి సేదతీర్చటమే మేఘలక్షణం కాబట్టి అశ్వత్థామలోని పరితాపాన్ని పోగొట్టటానికి వ్యాసుడు వచ్చా డనటం ఈ ఉత్ప్రేక్షాలంకార తాత్పర్యం.

### అశ్వత్థామకు వ్యాసుఁడు గృష్ణార్జునుల మహిమ సెప్పుట (సం. 7-172-43)

**వ. తోఁచిన వినయసంభ్రమంబులతోడ వినతుండై గద్గదకంఠుం డగుచు 'మునీంద్రా! మదీయం బగు నాగ్నేయాస్త్రంబు వృథ యయ్యె; నిది యేమి మాయయొ యెఱుంగ; సురాసుర గంధర్వాది జాతులకును దుస్సహంబయిన యద్దివ్య సాధనంబు మనుష్యు లగు కృష్ణార్జునుల దహింపఁ జాల దయ్యె' ననవుడు నా తపోధనవర్యుండు 'వినుము! నీ సంశయంబు వాపెద' నని యతని కి ట్లనియె. 408**

**ప్రతిపదార్థం:** తోఁచినన్= సాక్షాత్కరించగానే; వినయ సంభ్రమములతోడన్= వినయంతోనూ, వేగిరపాటుతోనూ; వినతుండు+ఐ= నమస్కరించినవాడై; గద్గదకంఠుండు+అగుచున్= గద్గదస్వరంతో కూడిన కంఠం కలవాడవుతూ - డగ్గుత్తికతో అని భావం (ఇట్లా అన్నాడు); మునీంద్రా!= ఓ వ్యాస మహామునీ; మదీయంబు+అగు= నాది - అనగా నేను ప్రయోగించిన; ఆగ్నేయ+అస్త్రంబు= ఆగ్నేయం అనే దివ్యాస్త్రం; వృథ+అయ్యెన్= వ్యర్థం అయిపోయింది; ఇది= ఈ దివ్యాస్త్రం ఇట్లా వ్యర్థం కావటం; ఏమి మాయయొ?= ఏ అదృశ్య శక్తియో; ఎఱుంగన్= తెలియను; సుర+అసుర గంధర్వ+ఆది జాతులకును= దేవతలు, రాక్షసులు, గంధర్వులు మొదలైన జాతివారలకు కూడా; దుస్సహంబు+అయిన= సహింపశక్యం కాని; ఈ+దివ్యసాధనంబు= ఈ దివ్యాస్త్రం; మనుష్యులు+అగు= మనుష్యజాతిలో పుట్టినటువంటి; కృష్ణ+అర్జునులన్= కృష్ణుడిని, అర్జునుడిని; దహింపన్+చాలదు+అయ్యెన్= కాల్చలేకుండా పోయింది; అనవుడున్= అనగానే; ఆ తపోధనవర్యుండు= తపోధనులు అనగా తపస్సు ధనంగా గల మునులు - వారిలో శ్రేష్ఠుడైన వ్యాసుడు; వినుము= ఓ అశ్వత్థామా! విను; నీ సంశయంబు= నీ అనుమానాన్ని; పాపెదన్= పోగొట్టుతాను; అని= అని పలికి;

అతనికిన్= ఆ అశ్వత్థామతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అట్లా వ్యాసభగవానుడు ప్రత్యక్షంకాగానే నమస్కరించి, గద్గద స్వరంతో ఇట్లా అన్నాడు: 'ఓ మునీంద్రా! నా ఆగ్నేయాస్త్రం వ్యర్థం అయింది. ఇదేమి మాయ? ఈ దివ్యాస్త్రం దేవదానవ గంధర్వాది దివ్యజాతుల వారికి కూడా సహింపరాని ఈ దివ్యాస్త్ర మానవమాత్రులైన కృష్ణార్జునులను దహించలేకపోయింది. అని అనగా, ఆ వ్యాసమహర్షి 'అశ్వత్థామా! నీకు కలిగిన సంశయాన్ని పోగొట్టుతాను. వినుము.' అని

**ఆ.** **'ఆదిదేవుఁ డైన య వ్విష్ణుఁ డఖిలలో । కాభిరక్షణార్థమై జనించి**
**మహిత తపము సేసె మైనాకశైలంబు । నందుఁ బెద్దకాల మభవుగుఱిచి.** **409**

**ప్రతిపదార్థం:** ఆదిదేవుఁడు+ఐన= దేవాదిదేవుడైన; ఆ+విష్ణుఁడు= ఆ విష్ణు భగవానుడు; అఖిలలోక+అభిరక్షణ+అర్థము+ఐ= లోకాలన్నింటి (యొక్క) రక్షణకై; జనించి= ఆవిర్భవించి; పెద్దకాలము= చాలాకాలం వరకు; మైనాకశైలంబునందున్= మైనాకం అనే పర్వతమందు; అభవున్= శివుడిని; గుఱించి= గురించి; మహిత తపము= పూజితమైన తపస్సును అనగా గొప్ప తపస్సును; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** ఆదిదేవుడైన ఆ విష్ణు భగవానుడు ఈ లోకాలన్నింటినీ రక్షించటానికి (నారాయణ ఋషిగా) జన్మించి, మైనాకపర్వతం మీద మహాదేవుడిని గూర్చి చాలకాలం గొప్పగా తపమాచరించాడు.

**సీ.** **పవనాశనుఁడు నూర్ధ్వబాహుండు నగుచు న । న్నారాయణుం డతిఘోరనిష్ఠఁ**
**జలుపు నాతపమున సంతుష్టుఁ డై బాల । శశిరేఖ నొప్పారు జడముడియును**
**శూలపినాకాది సుమహితాయుధముల । వెలిఁగెడు చేతులు విలసదురగ**
**యజ్ఞోపవీత సమంచిత వక్షంబు । శోభిల్లఁగాఁ బొడసూపె శంభుఁ**
**తే.** **డపుడు పద్మాక్షుఁ డవ్విరూపాక్షునకు ధ । రాతలము జానుపాణి శిరంబు లొంద**
**మ్రొక్కి నిలుచుండి నుదుటిపై మోడ్పుఁ గేలు । భక్తిఁ గదియించి యిట్లని ప్రస్తుతించె.** **410**

**ప్రతిపదార్థం:** పవన+అశనుండు= వాయువును మాత్రమే ఆహారంగా స్వీకరిస్తూ ఉన్నవాడై; ఊర్ధ్వబాహుండును= పైకెత్తిన చేతులు గలవాడూ; అగుచున్= ఔతూ; ఆ+నారాయణుండు= ఆ నారాయణ ఋషి; అతిఘోరనిష్ఠన్= మిక్కిలి భయంకరమైన నిష్ఠతో; చలుపు+ఆ తపమునన్= చేసేటటువంటి ఆ తపస్సుతో; సంతుష్టుఁడు+ఐ= సంతోషించిన వాడై; బాలశశిరేఖన్= బాలచంద్రుడి రేఖతో (రేఖామాత్రంగా ఉన్న బాలచంద్రుడితో); ఒప్పారు= ప్రకాశిస్తూ ఉన్న; జడముడియును= జటాబంధం; శూలపినాక+ఆది సుమహిత+ఆయుధములన్= శూలం (త్రిశూలం), పినాకం అనే ధనువు మొదలైన; మిక్కిలి పూజించబడే ఆయుధాలతో; వెలిఁగెడు చేతులు= ప్రకాశించే హస్తాలు; విలసత్= ప్రకాశించే; ఉరగ= సర్పాలు అనే; యజ్ఞోపవీత= యజ్ఞోపవీతాలచేత; సమంచిత= పూజితమైన అనగా ఒప్పుచూ ఉన్నట్టి; వక్షంబు= వక్షస్స్థలం; శోభిల్లఁగాన్= శోభిస్తూ ఉండగా; శంభుండు= పరమశివుడు; పొడసూపెన్= సాక్షాత్కరించాడు; అపుడు= ఆ సమయంలో; పద్మాక్షుఁడు= ఆ నారాయణుడు; ఆ+విరూపాక్షునకున్= ఆ శివుడికి; జానుపాణి శిరంబులు= మోకాళ్ళు, చేతులు, శిరం అనేవి అన్నీ కూడా; ధరాతలము= భూతలాన్ని; ఒందన్= పొందేటట్లు; మ్రొక్కి= నమస్కరించి (సాష్టాంగదండ ప్రణామం చేసి); నిలుచుండి= లేచి నిలువబడి; నుదుటిపైన్; మోడ్పుగేలు= అంజలిని; కదియించి= ఘటించి; భక్తిన్= భక్తితో; ఇట్లు+అని= ఈ విధంగా; ప్రస్తుతించెన్= స్తోత్రం చేశాడు.

**తాత్పర్యం:** వాయుభక్షణం మాత్రం చేసి ఊర్ధ్వబాహువై నిలుచుండి ఆ నారాయణుడు అతి భయంకరమైన నిష్ఠతో చేసిన ఆ తపస్సుకు సంతోషించి శివుడు జటాజూటాన చంద్రరేఖ, చేతులలో త్రిశూలం పినాక ధనువు మొదలైన ఆయుధాలు, వక్షస్స్థలాన పాములనే యజ్ఞోపవీతాలు ప్రకాశిస్తూ ఉండగా ఆ నారాయణునికి ప్రత్యక్షమైనాడు. అప్పుడు ఆ నారాయణ ఋషి విరూపాక్షునికి దండవత్ప్రణామం (సాష్టాంగప్రణామం) చేసి, లేచి నిలబడి, ఫాలభాగాన అంజలి ఘటించి ఇట్లా స్తోత్రం చేశాడు.

**విశేషం:** ఈ సీసంలోని మూడవ చరణంలో 'మహదాయుధము' అనే పాదం యూనివర్శిటీ ప్రతి ఆదరించిన పాఠం. పాఠాంతరంగా చూపిన పాఠం 'మహితాయుధముల' అనేది. ఈ పాఠమే నిర్దుష్టంగా ఉంది. కాబట్టి 'మహితాయుధము' అనే పాఠాన్నే ఇచ్చి వ్యాఖ్యానించటమైనది. మహచ్ఛబ్దంతో కర్మధారయం కాబట్టి 'మహాయుధము' అని ఉంటుంది. కాని 'మహదాయుధముల' అని ఉండకూడదు. తిక్కన చేసిన ప్రయోగం 'మహితాయుధముల' అనే సాధుపద ప్రయోగమే అనటం స్పష్టం. (చూ. ఆన్మహతః సమానాధికరణ జాతీయయోః' (పా.సూ.6.3.46 సిద్ధాంత కౌముది - సమాస ప్రకరణం) శ్రీమాన్ ఉత్పల వేంకట రంగాచార్యులవారి లఘుటీకతో సహా ముద్రించిన బాలసరస్వతీ బుక్‌డిపో వారి ప్రతిలో కూడా 'మహదాయుధముల' అనే పాఠం ఆదరించటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

**క. 'స్థావరములు జంగమములు । నీవలనం గలిగెఁ; దద్వినిర్మలరక్షా**
**ప్రావీణ్యము దగఁ బ్రభువుల । కేవారలకైన నీవ యిత్తు మహేశా! 411**

**ప్రతిపదార్థం:** మహేశా!= ఓ పరమేశ్వరా!; స్థావరములు= స్థిరంగా కదలకమెదలక అక్కడనే ఉండే పర్వతాలు, చెట్లు మొదలైనవి; జంగమములు= నడిచే స్వభావం గల పశుపక్ష్యాది జీవరాశి అంతయు; నీవలనన్= నీ నుండే; కలిగెన్= పుట్టింది; తత్+వినిర్మల రక్షా ప్రావీణ్యము= ఆ సృష్టియొక్క మిక్కిలి స్వచ్ఛమైన రక్షణ సామర్థ్యాన్ని; ప్రభువులకు+ఏవారలకు+ఐనన్= సమర్థులైన పరిపాలకులకు ఎవరికైనా కూడా; తగన్= తగినట్లు; నీవు+అ= నీవే; ఇత్తు(వు)= ఇస్తావు.

**తాత్పర్యం:** 'ఓ పరమేశ్వరా! చరాచరాత్మకమైన ఈ జగత్తంతా నీ వలననే పుట్టింది. ఈ జగత్తును రక్షించే నిర్మలమైన రక్షణ సామర్థ్యాన్ని ప్రభువులకు ఎవరికైనా నీవే ఇస్తావు.

**విశేషం:** అలం: పరికరాంకురం. ఈశుడు అనగా నియామకుడు - జగత్తు యొక్క సృష్టి స్థితి వ్యవహారాలను సక్రమంగా నడిపేవాడు కాబట్టి శివుడికి; మహా+ఈశుఁడు= మహేశుడు (నియామకులందరికి పెద్ద) అనే పేరు సార్థకం. సాభిప్రాయంగా ఇక్కడ వాడబడింది కాబట్టి ఇది పరికరాంకురాలంకారం. 'సాభిప్రాయే విశేష్యేతు భవేత్ పరికరాంకురః' అని కువలయానందంలో ఈ అలంకార లక్షణం.

**క. సురలాదిగఁ గల జీవులు । పురుషార్థ చతుష్టయంబుఁ బొంది సుఖిత్వ**
**స్ఫురణము నొందుట నీదగు । కరుణాతిశయంబు వడసి కాదె కపర్దీ! 412**

**ప్రతిపదార్థం:** కపర్దీ!= ఓ శివా! (శివ జటాజూటానికి కపర్ద మని పేరు. అది గలవాడు కపర్ది - శివుడు - సంబుద్ధి); సురలు= దేవతలు; ఆదిగన్+కల జీవులు= మొదలుగాగల ప్రాణులు; పురుషార్థ చతుష్టయంబు= ధర్మార్థ కామమోక్షములు - అనే పురుషార్థాల చతుష్టయం (నాలుగింటి సముదాయం) అనగా నాలుగు పురుషార్థాలను; పొంది= సంపాదించి; సుఖిత్వస్ఫురణన్=

సుఖస్ఫూర్తిని (సుఖినః భావః సుఖిత్వం, సుఖిత్వం చ సుఖమేవ) సుఖానుభవాన్ని; ఒందుట= పొందటం; నీదగు= నీదైన (నీయొక్క); కరుణాతిశయంబు= దయాతిశయం (మిక్కిలి దయఅని భావం); పడసి= పొంది; కాదె!= కాదా? (ఔనని భావం); (నీ దయవలననే సకల ప్రాణులు పురుషార్థాల వలన కలిగే సుఖాన్ని అనుభవిస్తున్నారని భావం).

**తాత్పర్యం:** ఓ కపర్దధారీ - పరమశివా! దేవతలు మొదలు సకలజీవులు పురుషార్థాలను సాధించి సుఖంగా జీవిస్తున్నారంటే అదంతా నీ దయవలననే కదా.

**విశేషం:** 'ధర్మం, అర్థం, కామం, మోక్షం' అనేవి నాలుగు పురుషార్థాలు. ధర్మాన్ని ధర్మబద్ధాలైన అర్థకామాలను ప్రతి వ్యక్తి సాధించాలి అదే జీవిత ప్రయోజనం - ఇట్లా ధర్మబద్ధ జీవనంతో మోక్షానికి పాటుపడాలి. మోక్షంతోనే జన్మరాహిత్యం, శాశ్వతానందం కల్గుతుంది. ఇదంతా ఆ భగవంతుడి దయ ఉంటేనే సాధ్యం. ఇందుకు ఈ కఠోపనిషద్వాక్యం ప్రమాణం 'యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా నిపుణలతే తనూంస్వాం॥' (కఠ 2/23).

**క. వేదములు ధర్మవాచక । వాదంబులు దద్విలాసవంతం బగు ధా**
**త్రీదేవోత్కరము భవ । త్ప్రాదుర్భావములు గావె? బాలేందుధరా! 413**

**ప్రతిపదార్థం:** బాల+ఇందుధరా!= ఓ పరమశివా!; (బాలుడు అనగా కళామాత్రావశిష్టుడైన; ఇందు అనగా చంద్రుడిని తలపై ధరించినవాడు అని వ్యు.); ధర్మవాచకవాదంబులు= ధర్మప్రబోధక వాక్యాలై ఉన్న; వేదములు= ఋగ్వేదం మొదలైన నాలుగు వేదాలు; తద్విలాస వంతంబు+అగు= ఆ వేదాల స్ఫురణం కలిగిఉన్న - అనగా వేదాధ్యయన సంపన్నమైన; ధాత్రీదేవ+ఉత్కరము= బ్రాహ్మణుల సమూహం; భవత్+ప్రాదుర్భావములు= మీనుండి పుట్టుక కలవి; కావె?= కావా? (ఔనని భావం - ఈ విషయంలో ఎట్టి సంశయానికి అవకాశం లేదని కాక్వర్థం. లోకకల్యాణార్థం అనంతవిజ్ఞానరాశిని వేదాన్ని ఇచ్చి తత్ప్రచుర ప్రచారాన్ని కలుగజేసినవాడవు నీవే నని భావం).

**తాత్పర్యం:** ధర్మప్రబోధకాలైనవి వేదాలు. వాటిని నిరంతరం ధారణ చేసి, పఠన ప్రవచనాదుల ద్వారా వ్యాప్తి చేస్తున్న వేదమూర్తులైన బ్రాహ్మణుల సమూహాలు - హే భగవన్! మీనుండే ఆవిర్భవించాయి కదా!

**విశేషం:** 'యస్య నిశ్వసితం వేదాః' అనే శ్రుతి వాక్యం వేదాలు ఆ భగవంతుడి నుండే ఆవిర్భవించాయనుటకు ప్రమాణం. వేదాలలో ముఖ్యములైన రెండు అంశాలున్నవి. ఒకటి విధి. రెండు అర్థవాదం. 'నీ విలా చేయుము' అని శాసించే భాగం విధి. ఇట్లా చేస్తే నీ కిన్ని లాభా లున్నాయి లేకుంటే అనర్థం - అని ప్రరోచనార్థం చెప్పే అంశం అర్థవాదం. అర్థవాదానికి విధిలో తాత్పర్యం. కావున విధి వాక్యమే ప్రధానం. 'ధర్మవాచకవాదంబులు అనే సమాసంలోని వాద పదానికి వాక్యం అనే అర్థం' 'వేదవాదరతాః' అని గీతా శ్లోకపదాన్ని వ్యాఖ్యానిస్తూ 'వాద' పదానికి 'వాక్యం' అనే అర్థాన్నే చెప్పారు. 'ఉచ్యంత ఇతి వాదాః వాక్యాని' (శంకరనాందీ గీతావ్యాఖ్య 2142) - వాదపదాన్ని అర్థవాదపరంగా వ్యాఖ్యానిస్తే 'అప్రధానాలైన అర్థవాద రూపాలు వేదాలు' - అనే అర్థభ్రాంతి ఏర్పడుతుంది. అందుకే విధివాక్యపరంగా భావించాలి.

**క. నినుఁ దనుఁగా నతినిర్మల । మనస్సమాధిప్రకర్షమగ్నత వలనం**
**గనుఁగొని తద్రూప భజన । మొనరించు మహాత్ముఁ డమృత మొందుఁ బశుపతీ!' 414**

**ప్రతిపదార్థం:** పశుపతీ!= సర్వజగత్తునకు అధీశుడ వైన ఓ శివా!; నినున్= నిన్ను; తనున్+కాన్= తననుగా; అతినిర్మల= మిక్కిలి పవిత్రమైన; మనస్= చిత్తంయొక్క; సమాధి ప్రకర్ష= ఏకాగ్రతాతిశయం లోని; మగ్నత వలనన్= లీనత్వం వలన - అనగా చిత్తాన్ని ఇతర విషయాలవైపు పోనీయక ఏకాగ్రం చేయుటం వలన; కనుఁగొని= తెలిసికొని; తద్+రూపభజనము= తత్పదార్థమై అపరబ్రహ్మ స్వరూపాన్ని సేవించటం; ఒనరించు= చేయునట్టి; మహాత్ముండు= మహానుభావుడు; అమృతము= మోక్షాన్ని; ఒందున్=పొందుతాడు (ఏ బ్రహ్మ పదార్థాన్ని తనయందు అనుసంధానం చేసి పుణ్యపురుషులు ముక్తులగుతున్నారో అట్టి పరబ్రహ్మం నీవే).

**తాత్పర్యం:** ఓ పశుపతీ! అతి నిర్మలమైన ప్రగాఢ మనస్సమాధిలో, నిన్ను తననుగ దర్శించి, ఆ రూపాన్ని భజించేమహాత్ముడు, మోక్షాన్ని పొందుతాడు.

**విశేషం:** పశుపతీ!= పశువులనగా ద్విపాత్తులు చతుష్పాత్తులు మొదలగు ప్రాణిజాతం. దానికి పతి కాబట్టి పశుపతి శివుడు లేదా బ్రహ్మాది స్థావరాంతము అందరూ కూడా పశువులే వారి పతి అని కూడా అర్థం. రుద్రాధ్యాయి భాష్యంలో 'పశూనాం స్వభూతానాం ద్విపదాం చతుష్పదాం చ పతయే । ... బ్రహ్మాద్యాః స్థావరాంతాశ్చ పశవః పరికీర్తితాః । తేషాం పతిత్వా ద్విశ్వేశో భవః పశుపతిః స్మృతః ॥ ఇతి చ పురాణే' ఇది 'పశూనాం పతయే నమః' అనే రుద్రాధ్యాయ మంత్రానికి భట్టభాస్కర భాష్యం. ఈ జగత్తునకు సృష్టి స్థితి లయలు దేనియొక్క విలాసాలో, ఏదైతే ఈ జగత్తునంతా అంతర్లీనమై వ్యాపించి ఉన్నదో (తత్సృష్ట్వాతరేవాను ప్రావిశత్)- అట్టి పరతత్వం తప్ప మరేదీ రెండవది లేదనే అద్వైత భావన. ఈ పద్యంలో వ్యక్తీకరించబడింది. (నేహ నా నాస్తి కించన) - ఇది తిక్కన వేదాంత నిష్ఠకు పరాకాష్ఠ.

**వ. అని మఱియు ననేక భంగులం బ్రస్తుతించి 'దేవా! నిన్ను భక్తి భజియించు నాకు ననన్య సులభ ప్రభావం బొసంగు' మని యభ్యర్థించుటయు, దేవముఖ్యుం డగు విష్ణుదేవుం బ్రసన్నదృష్టి నాలోకించి యప్పరమేశ్వరుండు 'నీవు నరసుర గంధర్వ కిన్నర గరుడోరగాది భూతంబుల నవలీల గెలిచి పరమ తేజో విరాజమానుండవై వర్తింపుము; నీకు నస్త్రంబుల శస్త్రంబుల నగ్ని - జలంబుల నశనినార్ద్రంబునను శుష్కంబునను స్థావరంబునను జంగమంబునను జావు నొప్పులు లేకుండం గలయవి దొడరిన నన్నైన జయింపు' మని వరం బిచ్చెం గావున నన్నారాయణుం డవిజయ్యుండై నెగడె; నతనియంద జనియించిన నరుండును నట్టివాఁడై కూడి సంచరించు నరసఖుం డగు నద్దేవుండు నిజమాయా విశేషంబులం జగన్మోహనుండై విహరించు నమ్మహాత్ము లిరువురును దానవుల వధియించుటకును ధర్మసంస్థాపనంబు సేయుటకు నై వలసిన యప్పుడెల్లను జననాది కృత్యంబులు గైకొని వినోదింతురు; వారలు గదా యీ కృష్ణార్జును లని చెప్పి కృష్ణద్వైపాయనుండు వెండియు నిట్లనియె. 415**

**ప్రతిపదార్థం:** అని= అని (నుతించి); మరియున్= ఇంకను; అనేక భంగులన్= పలువిధాలుగా; ప్రస్తుతించి= స్తోత్రం చేసి;దేవా!= ఓ మహాదేవా!; నిన్నున్= నిన్ను; భక్తిన్= భక్తితో; భజియించు నాకున్= సేవించే నాకు; అనన్య సులభ ప్రభావంబు= ఇతరులచేత పొంద వీలులేని సామర్థ్యాన్ని; ఒసంగుము= ఇమ్ము; అని+అభ్యర్థించుటయున్= అని ప్రార్థించగానే; దేవముఖ్యుండు+అగు= దేవతలలో ప్రముఖుడైన; విష్ణుదేవున్= ఆ నారాయణ భగవానుడిని; ప్రసన్న దృష్టిన్= ప్రసన్నమైన చూపుతో; ఆలోకించి= చూచి-చూపులో సంతోషాన్ని వ్యక్తపరుస్తూ; ఆ+పరమేశ్వరుండు= ఆ మహాదేవుడు - శివుడు; నీవు= ఓ విష్ణూ! నీవు; నర సుర గంధర్వ కిన్నర గరుడ+ఉరగ+ఆది భూతంబులన్= మనుష్యులు, దేవతలు, గంధర్వులు, కిన్నరులు, గరుడులు, సర్పములు మొదలైన ప్రాణులను; అవలీలన్= అనాయాసంగా; గెలిచి= జయించి; పరమ తేజో విరాజమానుండవు+ఐ= మిక్కిలి తేజంతో ప్రకాశిస్తూ ఉన్నవాడవై; వర్తింపుము= ప్రవర్తించుము; నీకున్= (మరియు) నీకు; అస్త్రంబులన్= ఆగ్నేయాది దివ్యాస్త్రాల వలన; శస్త్రంబులన్= ఖడ్గాద్యాయుధాల వలన; అగ్నిజలంబులన్= అగ్నివలన, నీరువలన; అశనిన్= వజ్రాయుధం వలన లేదా పిడుగు వలన; ఆర్ద్రంబునను= తడియున్న వస్తువు వలన అనగా నురుగు మొదలగు వాటివలనను; శుష్కంబునను= ఎండి ఉన్న వస్తువువలన; స్థావరంబునను= నడక లేకుండా స్థిరంగా ఉండే స్వభావంగల చెట్లు, గుట్టలు మొదలైన వాటివలన; జంగమంబునను= నడిచే స్వభావంగల పశుపక్ష్యాదుల వలనను; చావు నొప్పులు= మరణం కాని శారీరక బాధ కాని; లేకుండన్+కలయవి= లేకుండా ఉంటవి; తొడరినన్= ఎదిరిస్తే; నన్నున్+ఐనన్= నన్నయినను; జయింపుము= జయిస్తావు; అని= ఇట్లా; వరంబు= వరాన్ని; ఇచ్చెన్= ఇచ్చాడు; కావునన్=

కాబట్టి; ఆ+నారాయణుండు= ఆ నారాయణ భగవానుడు; అవిజయ్యుండు+ఐ= జయింపశక్యం కానివాడై; నెగడెన్= అతిశయించాడు; అతని+అందున్+అ= ఆ నారాయణుడి యందే; జనియించిన నరుండును= పుట్టిన నరుడుకూడా; అట్టివాఁడు+ఐ=ఆ నారాయణుడియంతటి వాడై; కూడి= కలిసి; సంచరించున్= తిరుగుతాడు; నరసఖుండు+అగు= నరుడికి మిత్రుడైన;ఆ+దేవుండు=ఆ నారాయణుడు; నిజమాయా విశేషంబులన్= స్వీయములైన మాయావిశేషాలచేత - అనగా తనయొక్క పలు విధాలైన మాయలచేత; జగత్+మోహనుండు+ఐ= జగత్తును మోహింపజేస్తున్నవాడై; విహరించును= విహరిస్తాడు; ఆ+మహాత్ములు+ ఇరువురును= ఆ మహానుభావులిద్దరు కూడా; దానవులన్= రాక్షసులను; వధియించుటకును= సంహరించటానికి; ధర్మసంస్థాపనంబు+చేయుటకును+ఐ= ధర్మస్థాపనం చేయటానికే ఉండి; వలసిన+అప్పుడు+ఎల్లను= అవసరమైన సమయా లన్నింటిలో; జనన+ఆది కృత్యంబులు= పుట్టుట మొదలైన విధులను; కైకొని= చేపట్టి; వినోదింతురు= క్రీడిస్తూ ఉంటారు; వారలు= ఆ నారాయణుడు, నరుడు అనే వారే; కృష్ణ+అర్జునులు= ఈ కృష్ణుడు అర్జునుడు అనే వారే; కదా= కాదా! - ఔను (వారే వీరు ఇది నిశ్చయం); అని= ఇట్లా; చెప్పి= అశ్వత్థామతో చెప్పి; కృష్ణద్వైపాయనుండు= వ్యాసమహాముని; వెండియున్= మళ్ళీ; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా స్తోత్రం చేయటమేకాక మరెన్నో విధాలుగా స్తోత్రం చేసి 'ఓ మహాదేవా! ని న్నిట్లా భక్తితో భజించే, నాకు ఇతరులకు పొంద సాధ్యంకాని ప్రభావాన్ని దయచేయండి' అని కోరగానే, ఆ మహాదేవుడు శివుడు, దేవతలలో ముఖ్యుడైన ఆ విష్ణుదేవుని అనుగ్రహదృష్టితో చూచి, 'నీవు నరులను, సురలను, గంధర్వులను, కిన్నరులను, గరుడులను, నాగులను - వారు వీరు అనే భేదం లేక అందరినీ అనాయాసంగా గెలిచి అమితమైన, తేజస్సుతో ప్రకాశింపుము దానితో నీకు ఏ భయం ఉండదు. నీకు దేనివలన కూడా మరణం కాని శారీరక బాధ కాని కలుగదు. స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచంలో ఏ వస్తువూ నిన్ను నొప్పించజాలదు. శస్త్రాలు, అస్త్రాలు నిన్నేం చేయజాలవు. పంచ మహాభూతాల వలననైనా నీకు ఎట్టి భయం కలుగదు. ఏవీ కూడా నిన్ను ఏమీ చేయజాలవు. తడి వస్తువులు, ఎండిన పొడి వస్తువులు- ఏవైనా కానీ నిన్నేమీ చేయజాలవు. ఎదిరిస్తే నన్ను కూడా జయించివేస్తావు.' అని ఆ శివుడు వరాన్నిఇచ్చాడు. కాబట్టి ఎవ్వరికీ జయింపశక్యం కానివాడై సర్వోత్కృష్టుడై నారాయణుడు విలసిల్లాడు. ఆ నారాయణుడి నుండి పుట్టినవాడు కావటం చేత కూడ అట్టివాడై ఆయనతో కూడి ఈ నరుడు సంచరిస్తూ ఉంటాడు. నరసఖుడైన ఆ నారాయణుడు తన లీలలచేత లోకులను మైమరపిస్తూ ఉంటాడు. మహానుభావులిద్దరు దానవ సంహారంచేసి, ధర్మసంస్థాపనం చేయటానికి అవసరం కలిగినప్పుడు ఆ యా అవతారాలను ఎత్తుతుంటారు. ఓ అశ్వత్థామా! ఈ కృష్ణార్జునులు ఎవరో కాదు. ఆ నారాయణనరులే వీరు.' అని వివరించి వ్యాసమహర్షి అశ్వత్థామతో ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** నరనారాయణులు అనే వీరిద్దరు భగవదంశతో పుట్టిన గొప్ప తపస్సంపన్నులైన ఋషులు. నారాయణుడు ధర్ముడి కుమారుడు అనే విషయం మూలంలో ఇట్లా ఉన్నది.

**శ్లో॥యోసౌ నారాయణో నామ పూర్వేషా మపి పూర్వజః ।**
**అజాయత చ కార్యార్థం పుత్రో ధర్మస్య విశ్వకృత్ ॥'**

ఆ నారాయణుడే తన తపోబలంచేత పుట్టించినవాడు నరుడు. ఈ విషయం మూల సంస్కృతంలో ఉన్నది.

**శ్లో॥ తస్యైవ తపసాజాతం నరం నామ మహామునిమ్ ॥** (ద్రోణ 201/57,86)

శ్రీ మద్భాగవతంలో కూడా ఈ నరనారాయణులు ఇద్దరూ భగవదంశతో ధర్ముడికి దక్షప్రజాపతి కూతురు 'మూర్తి' అనే భార్యయందు అవతరించిట్లు చెప్పబడింది.

శ్లో॥ధర్మస్య దక్షదుహిత ర్యజనిష్ట మూర్త్యాం నారాయణో నర ఇతి స్వతపః ప్రభావః (శ్రీమద్భా. 2/716)

ఈ విషయం విష్ణ్వవతారాల పరిగణనా సందర్భంలో చెప్పబడింది. నారాయణ మహాముని విష్ణువు అవతారంగా పేర్కొనబడినవాడు కావుననే తిక్కన ఆ నారాయణ ఋషి పర్యాయంగా విష్ణువాచక పదాలు 'పద్మాక్షుడు' మొదలైనవి వాడటం జరిగిందని తెలియాలి.

**క.** ' **నీవుఁ దపస్తేజో వి । ద్యావిభవ సమగ్రమూర్తి వగు దైవమ; నీ**
**కే వినిపించెదఁ దెలియం । గా విను వారలకు నీకుఁ గలయంతరముల్.416**

**ప్రతిపదార్థం:** నీవున్= నీవు కూడ; తపస్తేజోవిద్యావిభవసమగ్ర మూర్తివి+అగు= తపస్సు, తేజస్సు, విద్యలు - అనునట్టి ఈ అన్నింటి యొక్క వైభవంతో సంపూర్ణమైన స్వరూపం గలిగిన; దైవము+అ= దైవ స్వరూపుడవే (అయినా ఓ అశ్వత్థామా!) వారలకున్= ఆ నరనారాయణులకు; నీకున్= నీకు; కల+అంతరముల్= ఉన్నట్టి తారతమ్యాలు; తెలియంగాన్= తెలిసే విధంగా; ఏన్= నేను; నీకున్= నీకు; వినిపించెదన్= వినిపిస్తాను; విను= వినుము.

**తాత్పర్యం:** 'ఓ అశ్వత్థామా! నీవు కూడా దైవస్వరూపుడవే అనగా దైవాంశ సంభూతుడవే. ఎందుకంటే నీలో తపస్సు, తేజస్సు విద్యలు - ఇవన్నీ సమగ్రంగా ఉన్నవి. అయినప్పటికీ ఆ నరనారాయణులకు నీకు ఉన్న తేడాను వివరిస్తాను వినుము.

**తే.** **శుభ్ర మగు నుర్విమృత్తిక సురుచిరంపుఁ । బ్రతిమఁ గావించికొని యందుఁ బరము నావ**
**హించి పూజావిశేషంబు లెల్లఁ జేసి । నీవు దొలుమేనఁ గొలిచితి నిష్ఠతోడ. 417**

**ప్రతిపదార్థం:** ఓ అశ్వత్థామా! నీవు= నీవు; తొలుమేనన్= పూర్వజన్మలో; శుభ్రము+అగు= పవిత్రమైన; ఉర్విన్= భూమిలో; మృత్తికన్= మట్టితో; సురుచిరంపు ప్రతిమన్= అందమైన మూర్తిని; కావించికొని= చేసికొని; అందున్= ఆ ప్రతిమయందు; పరమున్= పరతత్త్వమైన ఆ భగవత్స్వరూపాన్ని; ఆవహించి= ఆవాహనం చేసికొని (ప్రాణప్రతిష్ఠ చేసి); పూజావిశేషంబులు+ఎల్లన్= పూజా ప్రకారాలను అన్నింటిని- అనేక విధాలైన పూజలను (లఘున్యాసమహాన్యాస రుద్రాభిషేకములు, లఘురుద్ర మహారుద్ర అతిరుద్రాదులు శివపూజలోని విశేషములు అనేకాలు); అనుష్ఠించి= చేసి; నిష్ఠతోన్= ఏకాగ్రతతో; కొలిచితి(వి)= సేవించావు.

**తాత్పర్యం:** ఓ అశ్వత్థామా! పూర్వజన్మలో నీవు శుభ్రమైన మన్నుతో అందమైన శివుని ప్రతిమను చేసి, ఆ ప్రతిమకు ప్రాణప్రతిష్ఠ చేసి, భగవంతుని ఆవాహించి అన్ని పూజలు నిష్ఠతో చేశావు.

**క.** **వారలు లింగాధిష్ఠా । నా రూఢుంగా నొనర్చి యర్చించిరి భ**
**వ్యారాధన పరులై మును । గౌరీపతి నతులనియమ కల్పన వెలయన్. 418**

**ప్రతిపదార్థం:** వారలు= ఆ కృష్ణార్జునులు; మును= పూర్వం అనగా నారాయణ నరులుగా ఉన్నప్పుడు; గౌరీపతిన్= శివుడిని; లింగ+అధిష్ఠాన+ఆరూఢున్+కాన్= లింగం అనే ఆధారస్థానాన్ని అధిష్ఠించినవాడినిగా; ఒనర్చి= చేసి - లింగరూపంలో ప్రతిష్ఠించి; భవ్య+ఆరాధనపరులు+ఐ= శుభమైన ఆరాధనయందు ఆసక్తులై; అతుల నియమ కల్పన= నిరుపమాన నియమాచరణం; వెలయన్= ప్రకాశించగా; అర్చించిరి= పూజించారు.

**తాత్పర్యం:** ఆ కృష్ణార్జునులు పూర్వం నారాయణనరరూపులై ఉన్నప్పుడు కఠోర నియమాలు పాటించి, ఆ పరమేశ్వరుడిని లింగంగా ప్రతిష్ఠించి భవ్యంగా ఆరాధించారు.

**వ.** **ఎత్తెఱంగునం జేసినను పరమేశ్వరారాధనంబు సర్వార్థసాధనం బగు; నందును లింగంబునందుఁ బూజించుట**

**యర్చయందారాధించుటకంటె ననేకగుణంబు లెక్కుడు గావున లింగార్చన పరులగు వారల నర్చారాధకుండవగు నీకు నెట్లు జయింప వచ్చు? మీమీ పూర్వజన్మంబుల యర్చనంబుల ఫలంబులు దారతమ్యంబులతో ననుభవింప వలవదే?' యని తెలియం బలుకుటయు, నశ్వత్థామ పులకితాంగుండును సమాహితాంతరంగుండునునై రుద్రునిం దలంచి నమస్కరించి గేశవుం గొనియాడి పరాశర నందనున కభివందనంబు సేసిన, నమ్మహాముని యంతర్ధానంబు సేయఁ దానును మరలివచ్చి నిజ రథారూఢుండై యరుణగభస్తి యస్తగిరి సమీపంబున కరుగుటఁ గనుంగొనుచుఁ గురుపతి పాలికిం జని యతనికిం గాలోచితం బెఱింగించినవాడై బలంబులఁ దివియ నియమించె; నట్లు తిరిగి దీనంబు లగు నాననంబులతోడం గౌరవులు విడిదలకుం బోయిరి; పాండవులు బహుతూర్య నినదంబులు సింహనాదంబులుం జెలంగం బొంగారిన సముద్రంబు చందంబున నుల్లసిల్లు సైన్యంబు మగిడించుకొని నిశ్చింతంబు లగు నంతఃకరణంబులతోఁ గృష్ణోపలాలితు లగుచు నిజశిబిరంబులకుం జనిరి; తదనంతరంబ ధనంజయుండు.** **419**

**ప్రతిపదార్థం:** ఏ+తెఱంగునన్= ఏ విధంగా; చేసినను= చేసినప్పటికీ; పరమేశ్వర+ఆరాధనంబు= శివారాధన; సర్వ+అర్థసాధనంబు = సకల ప్రయోజనాలను సాధించేది; అగున్= ఔతుంది; అందును= దానిలో కూడా; లింగంబునందున్= లింగాధిష్ఠానమందు; పూజించుట= ఆరాధించటం; అర్చయందున్= ప్రతిమారూప అధిష్ఠానమందు; ఆరాధించుట కంటెన్= అర్చించటం కంటె కూడ; అనేక గుణంబు= పలురెట్లు (ఎన్నో రెట్లు గుణములు); ఎక్కుడు= ఎక్కువ; కావునన్= కాబట్టి; లింగ+అర్చనపరులు+అగువారలన్= లింగాధిష్ఠానంలో పూజించటంచేత శ్రేష్ఠులైన ఆ కృష్ణార్జునులను; అర్చా+ఆరాధకుండవు+అగు= ప్రతిమాధిష్ఠానంలో ఆరాధించిన వాడవైన; నీకున్= నీకు; ఎట్లు= ఏ విధంగా; జయింపవచ్చున్= జయించటం సాధ్యమవుతుంది?; మీమీ పూర్వజన్మంబుల+అర్చనంబుల ఫలంబులు= మీమీ పూర్వజన్మలలోని పూజల ఫలాలను; తారతమ్యంబులతోన్= తర తమ భావాలతో (హెచ్చుతగ్గులతో యథోచితంగా); అనుభవింప వలవదే?= అనుభవించవద్దా? (అనుభవించవలసిందే; అని= ఇట్లు; తెలియన్= తెలిసే విధంగా; పలుకుటయున్= చెప్పగానే; అశ్వత్థామ; పులకిత+అంగుండును= పులకాంకురములు ఉదయించిన శరీరంగల వాడయి(మరియు); సమాహిత+అంతరంగుండును= నిశ్చలమైన మనస్సుగలవాడు; ఐ= అయి; రుద్రునిన్= శివుడిని; తలంచి= స్మరించి; నమస్కరించి= మ్రొక్కి; కేశవున్= ఆ నారాయణాంశతో జనించిన కృష్ణుడిని; కొనియాడి= ప్రశంసించి; పరాశర నందనునకున్=పరాశర మహాముని కుమారుడైన వ్యాసభగవానుడికి; అభివందనంబు= నమస్కారం; చేసినన్= చేయగా; ఆ+మహాముని= ఆ వ్యాసమహర్షి; అంతర్ధానంబు+చేయన్= తిరోధానం చేయగా, కనుమరుగు కాగా, మాయమైపోగా; తానును= ఆ అశ్వత్థామ తానుకూడ; మరలి వచ్చి= తిరిగి వచ్చి; నిజరథ+ఆరూఢుండు+ఐ= తన రథాన్ని ఎక్కినవాడై; అరుణగభస్తి= సూర్యుడు (అరుణ= ఎఱ్ఱని, గభస్తులు= కిరణాలు కలవాడు; అరుణగభస్తి= సూర్యుడు); అస్తగిరి సమీపంబునకున్= అస్తాద్రి సమీపానికి; అరుగుటన్= వెళ్ళుటను (సూర్యాస్తమయాన్ని); కనుంగొనుచున్= గమనిస్తూ; కురుపతి పాలికిన్= దుర్యోధనుడి సమీపానికి; చని= వెళ్ళి; అతనికిన్= ఆ దుర్యోధనుడికి; కాల+ఉచితంబు= సమయానికి తగిన విషయాన్ని; ఎఱింగించినవాఁడై= తెలియజేసినవాడై; బలంబులన్= సైన్యాలను; తివియన్= ఉపసంహరించటానికి (యుద్ధం ఆపటానికి); నియమించెన్= నియోగించాడు; అట్లు= ఆ విధంగా; తిరిగి= మగిడి; దీనంబులు+అగు+ఆననంబుల తోడన్= దైన్యంతో నిండిన ముఖాలతో; కౌరవులు= కౌరవవీరులు; విడిదలకున్= విడిది చేసిన నివాసాలకు; పోయిరి= వెళ్ళారు; పాండవులు= పాండవ యోధులు; బహుతూర్య నినదంబులు= అనేక వాద్యాల ధ్వనులు; సింహనాదంబులు= వీరుల సింహనాదాలు; చెలంగన్= చెలరేగగా; పొంగారిన సముద్రంబు చందంబునన్= ఉప్పొంగిన సముద్రం వలె; ఉల్లసిల్లు సైన్యంబు= ప్రకాశించే సైన్యాన్ని; మగిడించికొని= మరల్చుకొని; నిశ్చింతంబులు+అగు+అంతఃకరణంబులతోన్= చింతలేని మనస్సులతో; కృష్ణ+ఉపలాలితులు+అగుచున్= కృష్ణుడిచేత అభినందించబడుతూ; నిజశిబిరంబులకున్= తమ శిబిరాలకు; చనిరి= వెళ్ళారు; తద్+అనంతరంబు+ఆ= అటు తరువాతనే; ధనంజయుండు= అర్జునుడు.

**తాత్పర్యం:** ఏ విధంగా శివారాధన చేసినా మనోరథాలు అన్నీ నెరవేరుతాయి. అయినా అందులో లింగాకారంలో ఉన్న

శివుడిని పూజించటం, ప్రతిమాకారంలో ఉన్న శివుడిని పూజించటం కంటె ఎన్నో రెట్లు అధికం. ఆ కృష్ణార్జునులు లింగాకారంలో ఉన్న శివుడిని ఆరాధించారు. నీవేమో ప్రతిమలో శివుడిని పూజించావు. అందుకే వారిని జయించటం నీ కెట్లా సాధ్యమవుతుంది? మీరు మీరు పూర్వజన్మలో చేసిన పూజా ఫలాలను తారతమ్యాలతో అనుభవించక తప్పదు.' కదా-అని తెలియజెప్పగా, అశ్వత్థామ పులకించి, ప్రశాంతతపొందిన మనస్సుతో ఆ పరమేశ్వర రూపాన్ని మనస్సులో ధ్యానించి, నమస్కరించాడు. కృష్ణుడిని ప్రస్తుతించాడు. వ్యాసుడికి పాదాభివందనం చేశాడు. అప్పుడు వ్యాసుడు అంతర్ధానం చెందగా. అశ్వత్థామ వెంటనే మళ్ళీ వచ్చి, రథాన్ని అధిరోహించాడు. అప్పుడే సూర్యాస్తమయం అవుతూ ఉండటం గమనించి దుర్యోధనుడి సమీపానికి వెళ్ళాడు. 'సూర్యాస్తమయం కావస్తూ ఉన్నది. ఇక యుద్ధం విరమింపజేసి సైన్యాన్ని మరలిస్తాను' అని తత్కాలోచితంగా చెప్పాడు. సైన్యం యుద్ధరంగంనుండి మరలింది. ఆ కౌరవవీరులు ముఖాలు దీనంగా పెట్టి తమ తమ విడిదులకు తరలి వెళ్ళారు. పాండవులు, విజయభేరులు మ్రోగిస్తూ సింహనాదాలు చేస్తూ ఉప్పొంగుతున్న సముద్రంవలె ఉన్న సైన్యాన్ని మరలించుకొని, ఏ చింతా లేక సంతోషంతో నిండిన మనస్సులతో శ్రీకృష్ణుని అభినందనలు అందుకొంటూ తమ శిబిరాలకు వెళ్ళారు. (తరువాతి పద్యంతో అన్వయం).

**వేదవ్యాసమునీంద్రుఁ డర్జునునకుఁ బరమేశ్వరు మహిమ సెప్పుట (సం. 7-173-2)**

**మ.** **మహనీయాకృతి సంయమిప్రవరు ధర్మస్ఫూర్తి సంకీర్తనీ**
**యు హుతాగ్ని ప్రతిమానతేజుఁ గరుణాయుక్తుం బ్రతీపాన్వయో**
**ద్వహు నాశ్చర్యకర ప్రబోధనిధి వేదవ్యాసుఁ బుణ్యున్ జయా**
**వహుఁ డై వచ్చినవాని నాగమసుఖావాసాననాంభోరుహున్.** **420**

**ప్రతిపదార్థం:** మహనీయ+ఆకృతిన్= గొప్పతేజస్సుతో కూడిన ఆకారంకలిగిన; వానిని, సంయమి, ప్రవరున్= మునులలో శ్రేష్ఠుడైన టువంటి వానిని, ధర్మస్ఫూర్తి సంకీర్తనీయున్= ధర్మదేవతయొక్క సాక్షాత్కారమని కీర్తించదగినవానిని - ధర్మదేవతయే మూర్తీభవించి సాక్షాత్కరించిందా అనే విధంగా ఉన్నట్టివానిని; హుత+అగ్ని ప్రతిమానతేజున్= హోమాగ్నితో (హోమకుండంలోని అగ్నితో) సమానమైన తేజస్సు కలిగి ఉన్నవానిని; కరుణాయుక్తున్= దయతో కూడుకొని ఉన్నట్టివానిని; ప్రతీప+అన్వయ+ఉద్వహున్= ప్రతీపుడనే మహారాజు వంశాన్ని, ఉద్ధరించినవానిని; ఆశ్చర్యకర ప్రబోధనిధిన్= ఆశ్చర్యాన్ని గొలిపే విజ్ఞానానికి నిధి అయినటువంటివానిని; పుణ్యున్= పవిత్రుడైనట్టివానిని; జయ+ఆవహుఁడు+ఐ వచ్చినవానిన్= విజయాన్ని చేకూర్చువాడై వచ్చినవాడు; ఆగమ+సుఖావాస+ఆనన+అంభోరుహున్= వేదాలకు సుఖనివాసమైన ముఖ కమలం కలవాడై యున్నట్టివానిని; వేదవ్యాసున్= వేదవ్యాసుని.

**తాత్పర్యం:** (అర్జునుడు) మహనీయమైన ఆకారం కలవాడు, మునులలోశ్రేష్టుడు, ధర్మతేజస్సు చేత కీర్తించదగినవాడు, హెూమాగ్నితో సమానమైన కాంతికలవాడు, దయాగుణంతో కూడుకొన్నవాడు, ప్రతీప మహారాజు వంశాన్నిఉద్ధరించిన వాడు, ఆశ్చర్యాన్ని గొలిపే విజ్ఞానానికి నిధి అయినటువంటివాడు, వేదాలకు సుఖ నివాసమైన ముఖ పద్మం కలవాడు, విజయాన్ని కలిగించటానికై వచ్చినవాడు అయిన వేదవ్యాస మహర్షిని (తరువాతి వచనంతో అన్వయం)

**విశేషం:** కురువంశీయుడైన ప్రతీపుడనే రాజు మిక్కిలి ధర్మాత్ముడు, తపశ్శాలి. అతడు గంగాతీరమందు తపస్సు చేస్తూ ఉండగా

అతడి గుణగణాలకు మురిసిపోతూ గంగాదేవి వచ్చి అతడి కుడితొడపై కూర్చుండి తనను వివాహమాడుమని కోరింది. ప్రతీపుడు ధర్మాతిక్రమణం చేయలేక అందులకంగీకరించలేదు. కాని, 'తనయులకు, కూతుళ్ళకు కూర్చొనటానికి తగిన నా కుడితొడపై అధిష్ఠించావు కాబట్టి నిన్ను కోడలుగా చేసుకుంటా'నని మాట ఇచ్చాడు. ఆ ప్రతీపకుమారుడు శంతనుడు గంగను పెండ్లాడి, తండ్రి మాట నిలబెట్టాడు. ఆ గంగాపుత్రుడే భీష్ముడు. భీష్ముడు ఆజన్మబ్రహ్మచారి - శంతనుడి రెండవ భార్య సత్యవతి. ఆమె పుత్రులు విచిత్రవీర్య చిత్రాంగద క్షేత్రముల యందు దేవరన్యాయంతో వ్యాసుడు సంతానోత్పత్తి చేసి ప్రతీపుని(కురు) వంశాన్ని నిలబెట్టాడు. ఇట్లా ఉన్నది కాబట్టే ప్రతీపాన్వయోద్వహుడైనాడు వ్యాసుడు. 'ప్రతీప్తాన్వయోద్వహున్' అనే పాఠం ఉస్మానియా ప్రతి ఆదరించింది. ఇది అంత అర్థవంతంగా లేదు. పాఠాంతరంగా చూపిన 'ప్రతీపాన్వయోద్వహున్' అనే పాఠమే సముచితంగా ఉన్నది. కాబట్టి దానినే స్వీకరించి వ్యాఖ్యానించటం జరిగింది. (ప్రతీపుని కథ సం. భార. ఆదిపర్వం - 97, 98 అధ్యాయాలు మరియు తెలుగు భారతంలో- ఆది - చతుర్థాశ్వాసం 135వ పద్యం నుండి)

**వ. అంతంతం గనుంగొని యత్యంతవినయ సంభ్రమంబులతో దండప్రణామంబు సేసి యాసనార్ఘ్యపాద్యాది పూజనంబుల నారాధించి సమీపభూమిం గూర్చుండి కృతాంజలి యై సుప్రసన్నంబగు నమ్మహాముని వదనంబు వీక్షించి. 421**

**ప్రతిపదార్థం:** అంతంతన్= కొంచెం దూరంలో; కనుంగొని= చూచి; అత్యంత వినయ సంభ్రమంబులతోన్= మిక్కిలి వినయంతో, వేగిరపాటుతో; దండప్రణామంబు+చేసి= దండవత్ ప్రణామం అనగా సాష్టాంగ నమస్కారం చేసి; ఆసన+అర్ఘ్యపాద్య+ఆది పూజనంబులన్= ఆసనం, అర్ఘ్యం, పాద్యం మొదలైన పూజా విధులతో; ఆరాధించి= పూజించి; సమీపభూమిన్= దగ్గరి ప్రదేశంలో; కూర్చుండి= కూర్చొని; కృత+అంజలి ఐ= చేయబడిన అంజలి బంధం కలవాడై (చేతులు జోడించి); సుప్రసన్నంబు+అగు= మిక్కిలి ప్రసన్నంగా ఉన్న చిరునవ్వుతో కూడిన; ఆ+మునివదనంబు= ఆ కృష్ణద్వైపాయనముని ముఖాన్ని; వీక్షించి= చూచి.

**తాత్పర్యం:** కొంతదూరంలో చూచి వేగిరపాటుతో లేచి ఎదురేగి వినయంతో సాష్టాంగనమస్కారం చేసి తోడ్కొని వచ్చి సమీపస్థలంలో కూర్చుండబెట్టి, అర్ఘ్య పాద్యాది పూజలతో ఆరాధించి, దగ్గరగా వచ్చి నేలమీదకూర్చొని, మందహాసం చిందే అతడి వదనారవిందాన్ని చూస్తూ, చేతులు జోడించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. ' అవధరింపు మహాత్మ! కయ్యమున నేను । శాత్రవుల నేయఁ బూనుచో సరభసముగ**
**నడరి ముందట నొకరుఁడు పుడమి నడుగు । లిడక పావకనిభమూర్తి యెసక మెసఁగ. 422**

**ప్రతిపదార్థం:** మహాత్మ!= ఓ మహానుభావా! వ్యాసమహామునీ!; అవధరింపు= సావధానంగా వినండి; కయ్యమునన్= యుద్ధంలో; నేను= నేను; శాత్రవులన్= శత్రువులను; ఏయన్+పూనుచోన్= కొట్టటానికి పూనుకొంటూ ఉండగా; సరభసముగన్= త్వరితంగా; అడరి= విజృంభించి; ముందటన్= నా ముందర; ఒకరుఁడు= ఒకడు (ఒక మహాపురుషుడు అని భావం); పుడమిన్+అడుగులు+ఇడక= భూమిపై పాదాలు మోపక; పావక నిభమూర్తి= అగ్నితో సమానమైన ఆకృతి; ఎసక మెసఁగన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** మహాత్మా! నేను చెప్పే విషయం సావధానంగా వినండి. నేను యుద్ధంలో శత్రువులను కొట్టటానికి పూనుకొంటూ ఉండగా, నా ముందర భూమిపై కాళ్ళుంటకుండా త్వరత్వరగా విజృంభించి నడుస్తూ, అగ్నివలె జ్వలిస్తూ ఉన్న ఆకారంతో ఒక మహాపురుషుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. కిరణము లుల్లసిల్లఁ దన కేల నుదగ్రపుశూల ముండఁగాఁ**
**బొరిఁబొరి నందు ఘోరముగఁ బుట్టినశూల పరంపరల్ గరం**
**బరుదుగ వారి నెల్లఁ దెగటార్పఁగ నే వెనుకన్ శరంబులం**
**గురియుచుఁ జంపినాఁడ నని కొందు జయంబు సముద్భటంబుగన్. 423**

**ప్రతిపదార్థం:** కిరణములు= తళుకులు; ఉల్లసిల్లన్= ప్రకాశిస్తూ ఉండగా; తనకేలన్= తన చేతిలో; ఉదగ్రపు శూలము= భయంకరమైన శూలం; ఉండఁగాన్= ఉండగా; అందున్= ఆ శూలమందుండి; ఘోరముగన్= భయంకరంగా; పొరిన్+పొరిన్= మాటిమాటికీ; పుట్టిన శూలపరంపరల్= పుట్టుతూ ఉన్న శూలాల వరుసలు; కరంబు= మిక్కిలి; అరుదుగన్= ఆశ్చర్యం కలిగించే విధంగా; వారిన్+ఎల్లన్= ఆ శత్రువులందరిని; తెగటార్పఁగన్= సంహరించగా; ఏన్= నేను; వెనుకన్= అటు తరువాత; శరంబులన్= బాణాలను; కురియుచున్= కురిపిస్తూ; చంపినాఁడన్+అని= సంహరించినవాడిని (నేనే) అని; జయంబు= విజయాన్ని; సముద్భటంబుగన్= గొప్పగా; కొందున్= గైకొంటూ ఉన్నాను (నిజానికి సంహరించిందతడే, కీర్తి మాత్రం నాకు అని భావం).

**తాత్పర్యం:** తన చేతులలో తళుకులీనే భయంకరమైన శూలం పట్టుకొన్నాడు. ఆ శూలం నుండి మరెన్నో భయంకరాలైన శూలాలు మాటిమాటికీ పుట్టుతూ, శత్రువులందరినీ సంహరిస్తూ ఉంటే నా కెంతో ఆశ్చర్యం కలిగింది. అతడు నా ముందు సంహరిస్తూ పోతూ ఉంటే నేను వెనుకనుండి శత్రువులపై బాణాలు కుమ్మరిస్తూ పోతూ సంహరించింది నేనే అని అనుకొంటూ ఉన్నానే తప్ప, నిజానికి సంహరించింది నేను కాదు - అతడే. కాని సంహరించాననే కీర్తి, శత్రువిజయం గొప్పగా నాకు దక్కింది.

**క. అప్పురుషుఁ డెవ్వఁడో యని । యెప్పుడు మదిఁ దలఁతు; నతని నేర్పడ నాకుం**
**జెప్పవలయు' నని యడిగిన । నప్పార్థున కిట్టులనియె నమ్ముని ప్రీతిన్. 424**

**ప్రతిపదార్థం:** ఆ+పురుషుఁడు= ఆ మహాపురుషుడు; ఎవ్వఁడో?= ఎవడు కావచ్చు?; అని= ఇట్లు; ఎప్పుడున్= ఎల్లప్పుడు; మదిన్= మనస్సులో; తలఁతున్= అనుకొంటూ ఉన్నాను; అతనిన్= ఆ మహాపురుషుడిని గూర్చి; ఏర్పడన్= స్పష్టంగా తెలిసే విధంగా; నాకున్= ఓ వ్యాసమహామునీ! నాకు; చెప్పవలయున్= చెప్పాలి; అని= అని ఈ విధంగా; అడిగినన్= ప్రశ్నించగా; ఆ+పార్థునకున్= ఆ అర్జునుడితో; ఆ+ముని= ఆ వ్యాసముని; ప్రీతిన్= సంతోషంతో; ఇట్టులు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఆ దివ్యపురుషుడు ఎవరా? అని ఎప్పుడు మనస్సులో అనుకొంటూ ఉంటాను. అత డెవడో నాకు మీరు స్పష్టంగా చెప్పాలి' అని అర్జునుడు అడుగగా, ఆ వ్యాసమహర్షి సంతోషంతో ఇట్లా అన్నాడు.

**వ. నీయడిగిన యతండు. 425**

**తాత్పర్యం:** నీవు అడిగిన ఆ మహాపురుషుడు.

**ఉ. ఆదికి నాది, లోకముల కన్నిటికిం బ్రభుఁ డవ్యయుండు, వే**
**దాది పవిత్ర వాచక సహస్ర పరిస్ఫుట వాచ్యరూపుఁ, డం**
**హోదళన ప్రకారక శుభోదయ కారక దివ్యనాముఁ, డం**
**బాదయితుండు దృఙ్మహిత ఫాలుఁడు లోలుఁడు భక్తి యుక్తికిన్. 426**

**ప్రతిపదార్థం:** (ఓ అర్జునా! అతడు) ఆదికిన్= ఈ సృష్ట్యాదికి; ఆది= మూలం - తానే సృష్ట్యాదిఅయి తన కాది అంటూ లేని వాడు; లోకములకు+అన్నిటికిన్= సమస్త లోకాలకు; ప్రభుఁడు= అధిపతి; అవ్యయుండు= అంతరించటం అనేది లేనివాడు; వేద+ ఆది= వేదాలు మొదలుగా గల; పవిత్రవాచక సహస్ర= పవిత్రములైన శబ్దసహస్రాలకు, అనగా వేదాలు ఉపనిషత్తులు మొదలైన వేలకొలది శబ్దరాశులకు; పరిస్ఫుట వాచ్యరూపుఁడు= స్పష్టమైన వాచ్యార్థస్వరూపుడైనవాడు (వేదాలు ఉపనిషత్తులు మొదలైనవి ఈతడి తత్త్వాన్నే ప్రస్ఫుటంగా బోధిస్తూ ఉన్నవని భావం); అంహోదళన ప్రకారక= పాపఖండన రూపమైన; శుభోదయ= మంగళకరమైన అభివృద్ధిని; కారకన్= చేయునట్టి; దివ్యనాముఁడు= దివ్యమైన నామధేయం కలవాడు - అనగా ఇతడి దివ్యనామం స్మరణం చేసినంత మాత్రాన పాపాలు నశించి శుభాలు చేకూరుతవి; అంబాదయితుండు= పార్వతీదేవికి భర్త; దృక్+మహితఫాలుఁడు= తృతీయ నేత్రంచేత పూజితమైన (ఒప్పుతున్న) లలాటభాగం కలవాడు; భక్తియుక్తికిన్= భక్తియోగానికి; లోలుఁడు= ఆసక్తి చూపేవాడు (నిష్కపట భక్తిచే వశుడవుతాడు).

**తాత్పర్యం:** అతడు ఈ సృష్టి కంతటికి మూలమైనవాడే కాని తనకు ఆది అనేది లేనివాడు (అనాది). ఈ లోకాలనన్నింటిని పరిపాలించే ప్రభువు. తనకు అంతం అనేది లేనివాడు, వేదాలు ఉపనిషత్తులు మొదలైన అనంత శబ్దరాశి ప్రబోధించే తత్త్వస్వరూపుడు. పాపాలు హరించి, శుభాలు కూర్చే దివ్యమైన నామం కలవాడు, పార్వతీపతి. మూడవకంటితో ప్రకాశించే లలాటం కలవాడు. భక్తికి వశమయ్యేవాడు.

**విశేషం:** లోకముల కన్నిటికిన్ - లోకాలు పధ్నాలుగు. ఊర్ధ్వలోకాలు ఏడు. అవి 1.భూర్లోకం, 2.భువర్లోకం, 3.సువర్లోకం (స్వర్గం) 4.తపోలోకం, 5.మహర్లోకం, 6.జనలోకం, 7.సత్యలోకం ఇవి. ఇక అధోలోకాలు: అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళలోకాలు ఏడు. మొత్తం పదునాలుగు. ఇవే చతుర్దశ భువనాలు అని తెలియాలి. పురాణాలలో ఈ లోకాల వర్ణన కానవస్తుంది.

**క. యోగీంద్రచిత్తకమలా । భోగ మధుప విభుఁడు, ప్రకృతిపురుషాత్ముఁడు, ని**
**ర్భోగ స్వరూపుఁ డవ్య । క్తా గోచరుఁ డధికసులభుఁ డమలాత్ములకున్.** 427

**ప్రతిపదార్థం:** యోగి+ఇంద్రు= యోగీశ్వరుల యొక్క; చిత్త కమల=మనస్సుఅనే కమలంయొక్క; ఆభోగ= పరిపూర్ణ-అనగా విశాలమైన చిత్తకమలానికి; మధుప విభుఁడు= మేటి తుమ్మెదఅయినవాడు (ఎట్లాగయితే తుమ్మెద కమలంలో మకరంద లోలుపమై స్థిరంగా ఉంటుందో అట్లే ఈతడు యోగీశ్వరుల మనస్సులలో భక్తికి వివశుడై స్థిరంగా ఉంటాడని భావం. ఇది రూపకాలంకారం); ప్రకృతి పురుష+ఆత్ముఁడు= ప్రకృతి పురుషులే స్వరూపంగా కలవాడు ("శ్లో॥ ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి"అనేగీతా శ్లోకభాష్యంలో శంకర భగవత్పాదులు 'ప్రకృతిం పురుషం చైవ ఈశ్వరస్య ప్రకృతీ తౌ ప్రకృతి పురుషౌ' - అని ప్రకృతి పురుషులు అనాదులై భగవత్స్వరూపంగా ఉన్నారని చెప్పి ఉన్నారు); నిర్భోగ స్వరూపుడు= విషయోపభోగరహితమైన స్వరూపం కలవాడు- అనగా ఆత్మారాముడు; అవ్యక్త+అగోచరుండు= అవ్యక్తం అనగా సత్యజ్ఞానానంద స్వరూపమైన నిరాకార పరబ్రహ్మం - తద్రూపుడై ఉండటంచేత అగోచరుడు అనగా చక్షురాది ఇంద్రియాలకు మనస్సునకు కూడా అందనివాడు. ఇందుకు -"యతో వాచో నివర్తంతే అప్రాప్యమనసా సహ" అనే శ్రుతివాక్యం ప్రమాణం. అంతటి దుర్బోధమైన స్వరూపం కలవాడైనా భక్తానుగ్రహార్థం వివిధ రూపాలతో అవతరించి); అమల+ఆత్ములకున్= నిర్మలమైన మనస్సుగల భక్తులకు; అధిక సులభుఁడు= మిక్కిలి అనాయాసంగా లభించేవాడు.

**తాత్పర్యం:** బాహ్యదృష్టికి అగుపించనివాడు. నిర్మలమైన చిత్తం కలవారికి చాల సులువుగా లభించేవాడు.

**ఉ. నీలగళుండు, శంకరుఁడు, నిత్యుఁడు, సత్యసురూపుఁ, డుజ్జ్వల**
**త్కాల మహానల ప్రశమక ప్రచురామృతవృష్టి విస్ఫుర**
**ద్బాలమృగాంక శేఖరుఁడు, దైత్యకుల ప్రవిదారణ క్రియా**
**లోల పరశ్వధుండు, సకలుం డమలుండు, ప్రియుండు శాంతికిన్.' 428**

**ప్రతిపదార్థం:** నీలగళుండు= నల్లనైన అనగా నల్లగా మారిన కంఠం గలవాడు - దేవాసురుల అమృతమథన సమయంలో పుట్టిన కాలకూట విషాన్ని దేవాసురులు వేడగా లోకకల్యాణార్థమై మింగటంచేత కంఠం నల్లగా మారి నీలకంఠుడని ప్రసిద్ధి చెందినవాడు. దీనిచే భక్తపారవశ్యం వ్యక్తమవుతూ ఉన్నది; శంకరుఁడు= శుభాన్ని కలుగజేసేవాడు - అరిష్టాలను నివారించి మంగళాన్ని చేసేవాడు- దీనిచేత మృత్యువునే దూరీకరించి దీర్ఘాయుష్యాన్ని మార్కండేయుడికి అనుగ్రహించిన వృత్తాంతం వ్యక్తీకరించబడింది; నిత్యుఁడు= నిత్యస్వరూపుడు - మూడు లోకాలలోనూ చెక్కుచెదరక ఒకే విధంగా ఉండే స్వరూపం కలవాడు; సత్యసురూపుఁడు= సత్యమైన స్వరూపం కలవాడు - అనగా మూడు లోకాలలో అబాధితమైన తన అస్తిత్వం కలవాడు. 'సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అనే శ్రుతి వాక్యం ప్రకారం సత్యమే తన రూపైన వాడని భావం; ఉజ్జ్వలత్= మండుతున్న; కాలమహానల= గొప్ప ప్రళయ కాలాగ్నిని; ప్రశమక= చల్లార్చేటటువంటి; ప్రచుర+అమృతవృష్టి= గొప్ప అమృతవర్షం కలిగి; విస్ఫురత్= ప్రకాశించే; బాలమృగ+అంక= బాలచంద్రుడు; శేఖరుఁడు= శిరోభూషణంగా కలిగినవాడు (భీకరంగా ప్రళయాగ్ని చెలరేగి జగత్తును కాల్చివేస్తూ ఉంటే తాను శిరోభూషణంగా ధరించిన బాలచంద్రుడిద్వారా అమృతవృష్టి కురిపించి ఆ ప్రళయాగ్నిని చల్లార్చి జగత్కల్యాణం చేసినవాడని భావం); దైత్యకుల= రాక్షసుల సమూహాన్ని; ప్రవిదారణ క్రియా= చీల్చి ఖండించివేయటంలో; లోల= ఆసక్తమైన; పరశ్వధుండు= గండ్రగొడ్డలి కలవాడు; సకలుండు= ఏ విధమైన పాపం అంటనివాడు - నిర్మలుడు; శాంతికిన్= శాంతిభావానికి; ప్రియుండు= మిక్కిలి ఇష్టమైనవాడు; (ఓ అర్జునా! నీ ముందు శూలధారి అయి వెళ్ళుతూ శత్రుసంహారం చేసినవాడు ఇట్టివాడు - అనగా అతడు ఆ పరమేశ్వరుడు పార్వతీపతి శివుడు).

**తాత్పర్యం:** నల్లని కంఠం కలవాడు, శుభాన్ని కలిగించేవాడు, శాశ్వతంగా ఉండేవాడు, సత్యమైన స్వరూపం కలవాడు, మండుతున్న ప్రళయకాల మహాగ్నిని చల్లార్చే అమృతవర్షమైనవాడు, ప్రకాశించే బాలచంద్రుని శిరోభూషణంగా కలవాడు, రాక్షససమూహాన్ని ఖండించే పనిలో ఆసక్తిగల గండ్రగొడ్డలి కలవాడు, అంతా తానైనవాడు, పవిత్రమైన వాడు, శాంతి అంటే ఎంతో ఇష్టపడేవాడు.

**వ. అని ప్రశంసించి కవ్వడి గనినవాఁడు రుద్రుం డగుటఁ దేటపఱిచి దక్షమఖ మథన త్రిపుర మర్దనాదులగు నద్దేవుని దివ్యలీల లుపన్యసించి మహాదేవ పశుపతి శివప్రముఖంబు లగు తదీయ భవ్యనామంబులకుం బ్రవృత్తి నిమిత్తంబులగు నర్థంబులు దెలియ నిర్వచనంబు సేసి; 'యట్టి పరమేశ్వరుండు నీకు వరదుండయి సన్నిధిసేసె నతనిం గని పెన్నిధిఁ గన్న పేదవోలెం గృతార్థుండ వై; తయ్యంధకాసురభంజను కతంబున గడింది పగ రడంగుదు; రయ్యాదిమ ధనుర్ధరుం డివ్విధంబున; వైరివధం బాపాదింప నీకు గెలుపు గొనుట సుకరం**

**బయ్యెఁ; నీ తపంబు పెంపునం దొల్లి సన్నిహితుండై నీకుం బ్రియంబుగా దివ్యాస్త్రంబు లొసంగెఁ; నంతటం దనివి సనక యత్తెఱంగున భక్తపరాధీనత్వంబు ప్రకటించెఁ; నీవు పుణ్యాత్ముండ వప్పరమాత్ము నాత్మ నిలిపి నమస్కరింపు; మాసర్వలోక శరణ్యు శరణంబు సొరు మక్కరుణాకరుండు శరణాగతులకు నాయు రారోగ్యైశ్వర్యాది సకలాభిమతంబులు నిత్యంబులుగాఁ బ్రసాదించు' నని నిర్దేశించిన నయ్యర్జునుండు దండ ప్రణామ పూర్వకంబుగా భక్తి రసాయత్తంబగు చిత్తంబునం జంద్రధరు నెలకొలిపి సాంద్రానందం బనుభవించి సాత్యవతేయు చరణంబుల కెఱంగిన, నమ్మునీంద్రుం డయ్యింద్ర నందను నభినందించి 'సుఖివి గ' మ్మని దీవించి విజయం చేసె నని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు.** 429

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; ప్రశంసించి= వర్ణించి చెప్పి; కవ్వడి+కనినవాఁడు= అర్జునుడు చూసినవాడు; రుద్రుండు+ అగుటన్+ తేటపఱిచి= సాక్షాత్తూ పరమేశ్వరుడే అయి ఉండటాన్ని స్పష్టంగా తెలియజెప్పి; దక్షమఖమథన త్రిపుర మర్దనాదులు +అగు+ఆ+దేవుని దివ్యలీలలు= దక్షప్రజాపతి యజ్ఞాన్ని, తన భార్య సతీదేవి అవమానాన్ని పురస్కరించుకొని ధ్వంసం చేయటం, త్రిపురాసుర సంహారం మొదలైన ఆ మహాదేవుడి దివ్యలీలను; ఉపన్యసించి= వివరంగా చెప్పి; మహాదేవ పశుపతి శివ ప్రముఖంబులు +అగు= మహాదేవుడు, పశుపతి, శివుడు మొదలైన; తదీయ దివ్యనామంబులకున్= ఆ పరమేశ్వరుడి దివ్యములైన పేర్లకు; ప్రవృత్తి నిమిత్తంబులు+అగు+అర్థంబులు= ప్రవృత్తికి నిమిత్త భూతములైన అర్థాలను (ఆ పేర్లతో పిలవటానికిగల హేతువేమిటో, దానికి గల కథలెట్టివో వాటిని-అని భావం); తెలియన్= తెలిసే విధంగా; నిర్వచనంబు+చేసి= వివరించి చెప్పి; అట్టి పరమేశ్వరుండు= అటువంటి పరమశివుడు; నీకున్= ఓ అర్జునా! నీకు; వరదుండు+అయి= కోరిన వరాన్ని ఇచ్చినవాడై; సన్నిధి+చేసెన్= సమీపానికి వచ్చాడు; అతనిన్= ఆ పరమేశ్వరుడిని; కని= చూచి; పెన్నిధిన్= పెద్ద ధనరాశిని; కన్న= పొందిన; పేద+పోలెన్= దరిద్రుడివలె; కృత+అర్థుండవు= చేయబడిన అనగా నెరవేరిన ప్రయోజనం కలవాడవు; ఐతి(వి)= అయినావు; ఆ+అంధకాసురభంజను కతంబు నన్= (అంధకుడనే రాక్షసుడిని సంహరించటం వలన శివునకు అంధకాసుర భంజనుడనే పేరు కలిగినది) అట్టి శివుడి కారణాన; కడింది పగఱు= ప్రబల శత్రువులు; అడంగుదురు= నశిస్తారు; ఆ+ఆదిమ ధనుర్ధరుండు= ఆ ప్రప్రథమ ధనుర్ధారి అయిన శివుడు; ఈ+విధంబునన్= ఈ విధంగా; వైరివధంబు= శత్రువధను; ఆపాదింపన్= చేయగా; నీకున్= ఓ అర్జునా నీకు; గెలుపు+ కొనుట= విజయం పొందుట; సుకరంబు+అయ్యెన్= సులభమయింది; నీ తపంబు పెంపునన్= నీవు (ఇంతకు ముందు) చేసిన తపస్సు పెరుగుదలచే; తొల్లి= ముందు (పూర్వం); నీకున్= నీకు; సన్నిహితుండు+ఐ= ప్రత్యక్షమై; ప్రియంబుగాన్= ఇష్టమయ్యే విధంగా; దివ్య+అస్త్రంబులు= దివ్యములైన అస్త్రాలను - ఆగ్నేయ వారుణాదులను; ఒసంగెన్= ఇచ్చాడు; అంతటన్= అంతటితో; తనివి+చనక= తృప్తి తీరక; ఈ+తెఱంగున్= ఈ విధంగా; భక్తపరాధీనత్వంబు= (తనయొక్క) భక్తవివశత్వాన్ని; ప్రకటించెన్= ప్రకటించాడు; నీవు పుణ్యాత్ముండవు= ఓ అర్జునా! నీవు పుణ్యమూర్తివి; ఆ+పరమాత్మున్= ఆ పరమేశ్వరుడిని; ఆత్మన్= మనస్సు లో; నిలిపి= నిలుపుకొని; నమస్కరింపుము; ఆ సర్వలోక శరణ్యున్= సమస్త లోకాలకు రక్షణ నిచ్చే సామర్థ్యంగల ఆ పరమశివుడిని; శరణంబు+చొరుము= శరణాగతి పొందుము; ఆ+కరుణాకరుండు= ఆ దయానిధి; శరణాగతులకున్= శరణు కోరి వచ్చిన వారికి; ఆయుః+ఆరోగ్య+ఐశ్వర్య+ఆది సకల+అభిమతంబులు= ఆయుష్యం, ఆరోగ్యం, ఐశ్వర్యం - ఈ మొదలగు సమస్తములైన కోరికలు; నిత్యంబులుగాన్= నిత్యములై ఉండేటట్లు; ప్రసాదించున్+ అని= అనుగ్రహిస్తాడు అని; నిర్దేశించినన్= చెప్పగా; ఆ+ అర్జునుండు; దండప్రణామ పూర్వకంబుగాన్= సాష్టాంగ నమస్కార పుంస్సరంగా; భక్తి రస+ఆయత్తంబు+అగు= భక్తి రసానికి అధీనమైన; చిత్తంబునన్= మనస్సులో; చంద్రధరున్= శివుడిని; నెలకొల్పి= నిలుపుకొని; సాంద్ర+ఆనందంబు= గొప్ప ఆనందాన్ని; అనుభవించి= పొంది; సాత్యవతేయు చరణంబులకున్= వ్యాస మహాముని పాదాలకు; ఎఱంగినన్= మ్రొక్కగా; ఆ+ముని+ఇంద్రుండు= ఆ మహాముని; ఆ+ఇంద్రనందనున్= ఆ అర్జునుడిని; అభినందించి= మెచ్చుకొని; సుఖివి కమ్ము+అని= సుఖం కలవాడవుఅగుమని;

దీవించి= ఆశీర్వదించి; విజయం చేసెన్+అని= వెళ్ళిపోయాడు అని ఈ విధంగా; సంజయుండు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్ర మహారాజునకు; ఎఱింగించెన్= తెలిపాడు; అని= అని ఈ విధంగా; జనమేజయునకున్= జనమేజయ మహారాజుకు; వైశంపాయనుండు= వైశంపాయన మహాముని; చెప్పుటయున్= చెప్పగానే.

**తాత్పర్యం:** వ్యాసు డిట్లా అతడి గుణగణాలను ప్రస్తుతించి, అర్జునుడు చూచినవాడు సాక్షాత్తు రుద్రుడని తెలియ చెప్పి, దక్షయజ్ఞ ధ్వంసం, త్రిపురాసురమర్దనం మొదలైన ఆయన దివ్యలీలలను వివరించి, మహాదేవుడు, పశుపతి, శివుడు మొదలైన ఆయన శుభనామాలు కలగటానికిగల కారణాలను వివరించి. 'అర్జునా! ఆ పరమేశ్వరుడే నీ అభీష్టాన్ని నెరవేర్చటానికి నీ ముందుకు విచ్చేశాడు. పెన్నిధిని కన్న పేదవలె నీవు ధన్యుడవయ్యావు. ఆ అంధకాసుర భంజనుని కారణంగా ప్రబల శత్రువులు నశిస్తారు. ఆ ప్రప్రథమ ధనుర్ధారి అయిన శివుడు ఈ విధంగా శత్రువధచేయగా నీవు గెలుపు పొందుట సులభం అయింది. నీవు చేసిన గొప్ప తపస్సు వల్ల ఇదివరలో నీకు ప్రత్యక్షమై దివ్యాస్త్రాలను నీకు సంతోషం కలిగేటట్లుగా ఇచ్చారు. అంతటితో తృప్తినొందక ఇప్పుడు ఈ విధంగా శత్రువుల ప్రాణాలు హరించి తన భక్త పరాధీనతను ప్రకటించాడు. నీవు పుణ్యాత్ముడవు. ఆ పరమాత్ముని మనస్సులో నిలుపుకొని నమస్కరింపుము. ఆ సర్వలోకరక్షకుని శరణువేడుము. ఆ కరుణామయుడు తన్ను శరణు కోరి వచ్చినవారికి ఆయురారోగ్య ఐశ్వర్యాది అభీష్టాలనన్నింటిని శాశ్వతంగా ఉండేటట్లు అనుగ్రహిస్తాడు- అనిచెప్పగా, ఆ అర్జునుడు దండప్రణామ పూర్వకంబుగా భక్తిరసంతో నిండిన తన మనస్సులో ఆ చంద్రశేఖరుని నిలుపుకొని గొప్ప ఆనందాన్ని అనుభవించి, వ్యాసుని పాదాలకు ప్రణమిల్లగా, ఆ మునీంద్రుడు అర్జునుని అభినందించి, సుఖివి కమ్మని దీవించి, వెళ్ళిపోయాడు. అని సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పాడని వైశంపాయన మహర్షి జనమేజయ మహారాజుతో చెప్పాడు. చెప్పగానే.

**విశేషం:** 1. దక్షయజ్ఞ ధ్వంసకథ సంగ్రహంగా: దక్షుడనే ప్రజాపతి కూతురు సతీదేవి - శివుడిభార్య, ఒకానొక సభలో శివుడు లేచి నమస్కరించలే దని దక్షుడు శివుడిపై ద్వేషం పెంచుకొన్నాడు. అది కారణంగా దక్షుడు తాను యజ్ఞం తలపెట్టి, అందులో శివుడికి భాగం కల్పించలేదు. ఆహ్వానం కూడా పంపలేదు. సతీదేవి తన తండ్రి యజ్ఞం చేస్తున్నాడని తెలిసి, శివుడు ఎంత చెప్పినా వినక తానొకతే యజ్ఞాని కని వెళ్ళింది. అక్కడ తనను ఎవరు కూడా తుదకు దక్షుడి భయంచేత తల్లి కూడా పలుకరించలేదు. యజ్ఞంలో కూడా తన భర్త శివుడికి భాగం లేకపోవటం చూచి ఈ అవమానాన్ని భరించలేక యోగాగ్నిచేత సతీదేవి తన దేహాన్ని ఆహుతి చేసికొన్నది. ఇది తెలిసిన శివుడు వీరభద్రుడిని ఉత్పాదించి, అతడి ద్వారా దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేశాడు. తుదకు దేవతల ప్రార్థనచేత దక్షుడిని అనుగ్రహించాడు. అతడి తెగిన తలకు బదులుగా మేక తలను అతడి మొండానికి తగిలించి దక్షుడిని పునరుజ్జీవింపజేసి యజ్ఞాన్ని పూర్తి చేయించాడు. ఈ కథ శ్రీమద్భాగవతం చతుర్థ స్కంధంలో రెండు నుండి ఆరవ అధ్యాయం వరకు ఉన్నది.

2. రెండవది త్రిపురాసుర సంహార కథ. లోక కంటకుడైన త్రిపురాసురులను సంహరించటానికి ఎంతో ఆడంబరాన్ని ప్రదర్శించాడు మహాదేవుడు. పృథివిని రథంగా, బ్రహ్మను సారథిగా, మేరుపర్వతాన్ని ధనువుగా, చంద్రసూర్యులను రథచక్రాలుగా, విష్ణువును బాణంగా చేసికొని ఆ త్రిపురాసురులను సంహరించి తన మహాదేవత్వాన్ని నిరూపించుకొన్నాడు.

**క. మునివర! ద్రోణుని వృత్తము। విని సంతుష్టుండ నైతి వినువేడుక నా**
**మనమునఁ దోడ్తో నొదవెడు;। వినిపింపు దగంగ మీఁదివృత్తాంతంబున్.** **430**

**ప్రతిపదార్థం:** మునివర!= ఓ వైశంపాయన మునీంద్రా!; ద్రోణుని వృత్తము= ద్రోణాచార్యులకు సంబంధించిన కథ; విని= మీరు చెప్పగా విని; సంతుష్టుండను+ఐతిన్= సంతోషించాను; మీఁది వృత్తాంతంబున్= అటుపై జరిగిన కథను; విను వేడుక= వినాలనే కుతూహలం; మనమునన్= మనస్సులో; తొడ్తోన్= వెనువెంటనే; ఒదవెడున్= కలుగుతూ ఉన్నది; తగంగన్= తగిన విధంగా; వినిపింపు(ము)= వినిపించుము.

**తాత్పర్యం:** ఓ వైశంపాయన మహామునీ! ద్రోణాచార్యుడి వృత్తాంతం విని చాల సంతోషించాను. ఇంకా అటుపైన ఏం జరిగిందో వినాలని కుతూహలం కలుగుతూ ఉన్నది. కాబట్టి మీది కథ వినిపించండి.

**వ. అని యడుగుటయు.** **431**

**తాత్పర్యం:** ఇట్లా అడుగగానే. (తరువాతి కర్ణపర్వంలోని గద్యంతో అన్వయం).

**ఆశ్వాసాంతము**

**చ. అమర కిరీట కోటి కలితారుణ రత్నమరీచి వీచికా**
**సముదయ ఖేలనోల్లసన చారు పదాంబుజ కాంతిపూర! దు**
**ర్దమ దను సూను సంచయ విదారణచిత్త విహార! బోధనా**
**గమ హితనాద నిర్వహణ కౌతుక విశ్రుత! రక్షితాశ్రితా!** **432**

**ప్రతిపదార్థం:** అమరకిరీట కోటి= దేవతల కిరీటాల అంచులయందు; కలిత= పొదుగబడిన; అరుణరత్న= ఎర్రని రత్నాలయొక్క; మరీచివీచికా సముదయ= కాంతులు అనెడి తరంగాల సమూహం యొక్క; ఖేలన+ఉల్లసన= క్రీడావిలాసంచేత; చారు= అందమైన; పదాంబుజ కాంతిపూర!= పాదపద్మాల యొక్క కాంతి అనెడి ప్రవాహం కలవాడా! (ఆ హరిహరనాథ భగవానుడి పాదాలపై పడి దేవతలు నమస్కారం చేస్తూ ఉండగా ఆ దేవతల తలలపై ఉన్న కిరీటాల ఎర్రని రత్నాల కాంతులు స్వామివారి పాదాల నఖాల తెల్లని కాంతుల ప్రవాహంలో కలసి అందమైన దృశ్యాన్ని కలిగించాయని భావం); దుర్దమ=(ఇతరులకు) అణగద్రొక్క శక్యంగాని; దనుసూను= దానవులయొక్క; సంచయ= సమూహం యొక్క; విదారణ= సంహరించుటయందు; చిత్తవిహార!= మనస్సు యొక్క విహారం అనగా తలంపు కలవాడా! (ధర్మవిధ్వంసకులైన రాక్షసుల ఆగడాలు రూపుమాపి ధర్మసముద్ధరణ చేయటానికై ఆ దుష్టరాక్షసులను సంహరించే తలంపు కలవాడు హరిహరనాథుడు). ఇందుకు భగవానుడి గీతావాక్యం ప్రమాణం-

శ్లో॥ "యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ "

బోధన+ఆగమ హితనాద= ధర్మప్రబోధకములైన వేదాల హితకరములైన ధ్వనులయొక్క; నిర్వహణ= నిర్వహించుట అనగా కొనసాగించటం లోని; కౌతుక= కుతూహలంచేత; విశ్రుత!= ప్రసిద్ధి గలవాడా! (వేదవిహిత ధర్మమే మానవులందరికి శ్రేయోమార్గం చూపి మేలు కలుగ చేసేది కాబట్టి వేద ధర్మ ప్రతిష్ఠాపనయందు ఆసక్తికలవాడై ధర్మసంస్థాపకుడనే కీర్తి గడించిన వాడని భావం); రక్షిత+ఆశ్రితా!= రక్షించబడిన ఆశ్రితులు అనగా శరణాగతులు కలవాడా! తనను శరణుజొచ్చిన వారిని వారు, వీరు అనక ఎట్టివారినైనా రక్షించే తీరుతాడు భగవంతుడు. శ్రీమద్భగవద్గీతలో ఇట్లా ఉన్నది.

శ్లో॥ మాం హి పార్థ! వ్యపాశ్రిత్య య్యేపి స్యుః పాపయోనయః ।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రా స్తేపి -యాంతి పరాం గతిమ్ ॥ (9/32) శ్రీ మద్రామాయణంలోకూడా
శ్లో॥ సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిస్మీస్థితి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ ॥ (వాల్మీకిరామాయణం 6/18/33) అని భావం.

**తాత్పర్యం:** తిక్కన తన కృతిపతి అయిన హరిహరనాథ భగవానుడిని సంబోధిస్తూ ఇట్లా వర్ణించాడు. (దేవతలు నీ పాదాల మీదపడి మొక్కుతూఉంటే) ఆ దేవతల కిరీటాల చివర పొదుగబడిన రత్నకాంతుల సమూహం యొక్క కదలికల విలాసంతో అందమైన పాదపద్మ కాంతి ప్రవాహం కలవాడా! అణచసాధ్యంకాని రాక్షస సమూహాన్ని అంతం చేయటంలో విహరించే మనస్సుకలవాడా! ధర్మప్రబోధకాలైన వేదాల లోకహిత నాదాన్ని కాపాడటంలో గొప్ప ఆసక్తి కలవాడా! ఆశ్రితులను రక్షించేవాడా!

**విశేషం:** అలం: రూపకం. 'అమరకిరీట . . . కాంతి పూర' అనే సంబుద్ధి, విశేషణంలో 'మరీచి వీచికా' 'కాంతిపూర' అనే రెండు పదాంశలలోను రూపకముండటంచేత ఇది సావయవ రూపకాలంకారం. దీనితో దేవతలందరు కిరీటాలతో శోభిల్లే తమ శిరస్సులు పాదాలపై పెట్టి నమస్కారం చేశారని చెప్పినట్లయింది.

**క. జనవినుత! బాదరాయణ । మునీంద్ర వాగమృతనిధి సముద్భూతాహ్లా**
**దన కీర్తి సుధాకిరణా! । వినతాఖిలభద్రకరణ! విశ్రుత చరణా!** **433**

**ప్రతిపదార్థం:** జనవినుత= భక్తజనులచే స్తోత్రం చేయబడినవాడా!; బాదరాయణ= బదరీవనమే నివాసంగా కలవాడు బాదరాయణుడు అనగా కృష్ణద్వైపాయన వ్యాసమునీంద్రుడు - అతడియొక్క; వాక్+అమృతనిధి= వాక్కులు అనెడి సముద్రం నుండి- అనగా క్షీరసాగరం నుండి (అమృత పదానికి పర్యాయం); దేవాసురులు మథించింది క్షీరసాగరమే కాని సుధాసముద్రం కాదు. శ్రీమద్భాగవతంలోని ఈ శ్లోకం చూడండి. **శ్లో॥ యథా భగవతా జహ్మన్ మథితః క్షీరసాగరః** ॥ (శ్రీమద్భాగవతం 8/5/11) సముద్భూత= పుట్టిన; ఆహ్లాదన= (లోకులను) ఆనందపరచినట్టి; కీర్తిసుధాకిరణా!= కీర్తి అనెడి చంద్రుడు గలవాడా! (అమృతమయమైన కిరణాలుగల వాడు కావటంచేత సుధాకిరణుడు అనగా చంద్రుడు. చంద్రుడు క్షీర సముద్రం నుండి పుట్టి లోకాల నెట్లా ఆనందింపజేస్తాడో- అట్లే భగవంతుడి కీర్తి, వ్యాస విరచితములైన పురాణాదుల వలన అవగతమై లోకాల నానందపరుస్తుందని భావం); వినత= నమస్కరించిన వారలకు - అనగా వినమ్రులై శరణు వేడిన వారలకు; అఖిల భద్రకరణ విశ్రుత= సమస్త శుభాలను చేకూర్చటంలో ఖ్యాతిగన్న; చరణా!= పాదాలు గలవాడా!

**తాత్పర్యం:** జనులచేత స్తుతింపబడేవాడా! వ్యాసమహాముని వాక్కుఅనే అమృతసాగరం నుండి పుట్టి ఆహ్లాదాన్ని కలిగించే కీర్తిచంద్రా! ప్రణమిల్లిన వారికి సర్వశుభాలు చేకూర్చటంలో ఖ్యాతిగన్న పాదాలు కలవాడా!

**విశేషం:** అలం: రూపకం. 'వ్యాసవాగమృతనిధి' అనేటప్పుడు 'కీర్తి సుధాకిరణా' అనేప్పుడు కూడా రూపకమనే అలంకారం. ఈ రూపకాలు పరస్పర సాపేక్షములై ఉండుటచే ఇది పరంపరిత రూపకం అని అనరాదు. కీర్తికి చంద్రుడితో అభేదం చెప్పటంలో కవిసమయ ప్రసిద్ధ సాదృశ్యం ఉండనే ఉన్నది. కాబట్టి కీర్తికి చంద్రాభేదసిద్ధిలో మొదటి రూపకం అంతగా అపేక్షితం కాదు. కాబట్టి సావయవ రూపకమే ఇది. రసగంగాధరంలో ఈ విషయం ఇట్లా వివరించబడింది. 'యద్యపి సావయవేప్యారోప ఆ రూపాంతరస్యోపాయః, తథాపి తత్రారూపాతిరిక్తేన కవిసమయ సిద్ధ సాదృశ్యే నాప్యారోపాంతరసిద్ధిః సంభవతి' (రస. ద్వితీయ రూపకాలంకారం). దీనితో వ్యాసముని

ప్రణీత వాఙ్మయాన్ని అమృత సముద్రంగా రూపించటంచేత ఆ వాఙ్మయం అనంతం అగాధం అనీ, క్షీరసాగరాన్ని మథిస్తే అమృతకిరణాదులు వెలువడి దేవతలను అజరామరులను చేసి ఆనందింపజేసినట్లు ఈ వాఙ్మయాన్ని మథిస్తే వెలువడిన భగవద్యోగమనెడి అమృత కిరణుడి వలన అమృతాన్ని అనగా శాశ్వతానంద రూప మోక్షాన్ని పొందుతారనే అర్థం స్ఫురిస్తూ ఏకాంత భక్తి సాధనం అనే పరమార్థం ధ్వనింపజేస్తూ ఉన్నది.

**మాలిని.**

**అమృతమయ విలాసా! యాగభాస్వద్విలాసా!**
**విమల హృదయరమ్యా! వీతరాగాది గమ్యా!**
**కమలభవ నమస్యా! గౌరవాధిక్య శస్యా!**
**శమదమ పరివర్తీ! శాశ్వతానందమూర్తీ!** **434**

**ప్రతిపదార్థం:** అమృతమయ విలాసా!= అమృతమయాలైన విలాసాలు కలవాడా! (భక్తజనోద్ధరణాది భగవద్విలాసాలు అమృతత్వాన్ని ప్రసాదించే వని భావం); యాగభాస్వద్విలాసా!= యాగాలతో ప్రకాశిస్తున్న వినోదం కలవాడా! (యజ్ఞయాగాది యాగశబ్దం ఉపలక్షకం. వివిధ యజ్ఞయాగాది ధర్మ్యసత్క్రియలచేత వినోదించేవాడని భావం); విమలహృదయ రమ్యా!= నిర్మలాంతఃకరణంలో రమించటానికి అనగా విలసిల్లటానికి యోగ్యుడా! (హృదయం సత్యాహింసా దయాది సద్గుణాలచేత పవిత్రమైనప్పుడే భగవత్సాక్షాత్కారం కలుగుతుందని భావం); వీతరాగాదిగమ్యా!= వీతరాగులు అనగా ముముక్షువులు (సాంసార వాసనలేని సర్వసంగపరిత్యాగులు) వారికి పొందదగినవాడా! (పరబ్రహ్మ స్వరూపుడని భావం); కమలభవ నమస్యా!= (కమలభవుడనగా విష్ణునాభికమలంనుండి జన్మించిన చతుర్ముఖబ్రహ్మ) ఆ బ్రహ్మదేవుడిచేత నమస్కరించదగినవాడా! (బ్రహ్మదేవుడు సృష్ట్యాదిలో మధుకైటభులు అనే రాక్షసులచేత పీడించబడి విష్ణుభగవానుడిని తలంచి స్తుతించాడు. విష్ణువు వారిని సంహరించాడు. ఈ మధుకైటభసంహార కథ ఇక్కడ అనుసంధించుకొనాలి); గౌరవ+ఆధిక్యశస్యా!= పూజ్యభావమందలి ఆధిక్యంచేత ప్రశంసించదగినవాడా! (పూజార్హులైన దేవతలందరిలో సర్వోత్తముడని భావం); శమదమ పరివర్తీ!= సహనం, ఇంద్రియ నిగ్రహం - ఈ రెంటిని శమదమాలని అంటారు. ఈ పదాన్ని ఉపలక్షకంగా గ్రహించటంచేత 'శమదమ' అనగా శమదమాది షడ్గుణ సంపత్తి అని అర్థం; ఆ షడ్గుణ సంపదయందే అనగా ఆ షడ్గుణసంపద లున్న చోటనే ఉండేవాడా! (శమాది షడ్గుణాలుగల వారికి అధీనుడా!); శాశ్వత+ఆనందమూర్తీ!= నిత్యానంద స్వరూపుడా!

**తాత్పర్యం:** అమృతమయాలైన విలాసం కలవాడా! యాగాలచేత ప్రకాశించే విలాసం కలవాడా! నిర్మలహృదయం చేత రమ్యమైనవాడా! సర్వసంగపరిత్యాగులు చివరకు పొందదగినవాడా! బ్రహ్మదేవుడు నమస్కరింపదగినవాడా! గౌరవాధిక్యంచేత స్తుతించదగినవాడా! శమదమాదులందు సంచరించేవాడా! నిత్యానందస్వరూపా!

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీమదాంధ్ర మహాభారతంబున ద్రోణపర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది మంగళకరమైన 'ఉభయ కవిమిత్ర' బిరుదాన్ని పొందినవాడు, కొమ్మనామాత్యుడి పుత్రుడు, పండితులను ఆరాధించుటచేత (లేదా పండితులచేత ఆరాధించబడటం చేత) ప్రకాశించేవాడు - అయిన తిక్కన సోమయాజి రచించిన శుభప్రదమైన ఆంధ్రమహాభారతంలోని ద్రోణపర్వం ముగిసే అయిదవ అశ్వాసం.

**ద్రోణపర్వంలోని అయిదవ అశ్వాసం సమాప్తం.**

**శ్రీమదాంధ్రమహాభారతంలోని ద్రోణపర్వం ముగిసింది.**

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణ పర్వము

## గద్య పద్య ప్రథమ పాద సూచి



ఇ

ద

ప

బ

## కవచధారణంబున దుర్యోధనుం డర్జునుతోఁ దలపడుట (సం. 7-76-37)

**వ. కడంగి రంతఁ గురుపతి గూడవచ్చి కుంభసంభవకృతంబగు కవచంబు కతంబున భయంబు దక్కి బలంబునకుం దలకడచి తన రథంబు జయద్రథుం డున్న దిక్కున కడ్డంబుగాఁ జొచ్చిన నతని సూరెల నున్న వీర లోకంబు ముదంబున సింహనాదంబులు సేయ శంఖ భేరీస్వనంబులు సెలంగం దమ తేరికిం గట్టెదురై నిలిచినం గని కృష్ణుండు గ్రీడి కి ట్లనియె. 179**

**ప్రతిపదార్థం:** కడంగిరి= ప్రయత్నించారు; అంతన్= ఆ మీద; కురుపతి= దుర్యోధనుడు; కూడవచ్చి= దగ్గరగా వచ్చి; కుంభసంభవ కృతంబు+అగు= ద్రోణాచార్యుడిచేత చేయబడిన; కవచంబు కతంబునన్= కవచం కారణంగా; భయంబు తక్కి= భయంవదలి; బలంబునకున్ తలకడచి= సేనను దాటి; తన రథంబు= తా నెక్కిన తేరు; జయద్రథుండు ఉన్నదిక్కునకున్= సైంధవుడు ఉన్న దిక్కుకు; అడ్డంబుగాన్+చొచ్చినన్= అడ్డంగా దూరగా; సూరెలన్= ప్రక్కలో; ఉన్న వీరలోకంబు= ఉండే వీర సమూహం; ముదంబున్= సంతోషంతో; సింహనాదంబులు చేయన్= సింహనాదాలు చేయగా; శంఖ భేరీ స్వనంబులు= శంఖాల, నగారాల శబ్దాలు; చెలంగన్= ధ్వనింపగా; తమ తేరికిన్= తామున్న తేరుకు; కడు+ఎదురు+ఐ నిలిచినన్= కంటికి ఎదురుగా ఉండగా; కని= చూచి; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; క్రీడికిన్+ఇట్లు+అనియెన్= అర్జునుడితో ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** (కృష్ణార్జునులు) విజృంభించగా, అటుపిమ్మట దుర్యోధనుడు ద్రోణు డిచ్చిన కవచం కారణంగా భయంవదలి తన సైన్యాన్ని దాటి ముందుకు వచ్చి, సైంధవు డున్న దెసకు అడ్డంగా తన రథాన్ని పోనిచ్చాడు. అప్పుడు అతడికి ఇరువైపులా ఉన్న వీరులు సంతోషంతో సింహనాదాలు చేశారు. శంఖ భేరీ ధ్వనులు చెలరేగాయి. ఆ విధంగా తమ రథానికి ఎట్టఎదుటగా నిలిచిన సుయోధనుడిని చూచి, నారాయణుడు నరుడితో ఇట్లా అన్నాడు.

**క. 'ఆపద ముట్టిన యెడ ని। ట్లేపారఁగ వలదె! రథికుఁ డీతఁడు శశ్వ**
**త్కోపోద్దీప్తుఁడు మాదెసఁ। జాప కళావేది దర్పసంపన్నుండున్. 180**

**ప్రతిపదార్థం:** ఆపద ముట్టిన ఎడన్= కష్టాలు వచ్చినప్పుడు; రథికుఁడు= సైనికుడు; ఇట్లు+ఏపారఁగన్+వలదె!= ఈ విధంగా అతిశయించ వద్దా!; ఈతఁడు= ఈ దుర్యోధనుడు; మాదెసన్= మా మీద; శశ్వత్కోప= నిలుకడ గల కోపంతో; ఉద్దీప్తుఁడు= మండుతూ ఉన్నాడు (ఇతడు); చాప కళావేది= ధనుర్విద్యా రహస్యాలు తెలిసినవాడు; దర్ప సంపన్నుండున్= గర్వితుడు కూడా.

**తాత్పర్యం:** 'కష్టాలు వచ్చినప్పుడే సైనికుడు ఇట్లా ధైర్యాన్ని చాటాలి; ధనుర్విద్యా విశారదుడు అయిన దుర్యోధనుడు నిరంతర కోపంతో మా మీద మండిపడుతూ ఉన్నాడు.

**క. గోమునఁ బెరిఁగిన వాఁడు మ। హా మానోదగ్రచిత్తుఁ డ ట్లగుటను సం**
**గ్రామంబున కలుకం డు। ద్దామ భుజావీర్య దుర్మద స్ఫురితుండున్. 181**

**ప్రతిపదార్థం:** గోమునన్+పెరిఁగిన వాఁడు= సుకుమారంగా పెరిగినవాడు; మహామాన= ఎక్కువ అభిమానంతో; ఉదగ్రచిత్తుఁడు= భయంకరమయిన మనస్సున్నవాడు; అట్లు+అగుటను= అందుచేత; సంగ్రామంబునకున్= యుద్ధానికి; అలుకండు= జంకడు; ఉద్దామ= అధికమైన; భుజావీర్య= భుజబలంతో; దుర్మద స్ఫురితుండున్= దురహంకారంతో ఉన్నవాడు కూడా.

**తాత్పర్యం:** దుర్యోధనుడు సుకుమారంగా పెరిగాడు. మిక్కిలి అభిమానంతో భయంకరమయిన మనస్సుకలవాడు అయినందున యుద్ధానికి వెరవడు. తన భుజబలంతో దురహంకారంతో ఉండేవాడు.

క. మనకును నితనికి సైంధవుఁ । డను నొడ్డున నయ్యె జూద మధికౌద్ధత్యం
బున గెలువుము చిరకాలము । మనమున రారాజు నలుక మ్రందింపు తగన్. 182

**ప్రతిపదార్థం:** మనకునున్= మనకు (కృష్ణార్జునులకు); ఇతనికిన్= ఈ దుర్యోధనుడికి; సైంధవుఁడు+అను ఒడ్డునన్= సైంధవుడనే పందెంతో (సైంధవుడు పణంగా); జూదము+అయ్యెన్= జూదం సిద్ధమైనది; అధిక+ఔద్ధత్యమునన్= మిక్కిలి దర్పంతో; గెలువుము= జయించుము; చిరకాలము= చాలాకాలంగా; మనమునన్= మనస్సులో ఉండే; రారాజు+అలుకన్= దుర్యోధనుడి దురాగ్రహాన్ని; తగన్= తగినట్లుగా; మ్రందింపుము= నశింపజేయుము.

**తాత్పర్యం:** ఈ దుర్యోధనునకూ మనకూ సైంధవుడనే పందెంతో (యుద్ధమనే) జూదం సిద్ధమైనది. ఉద్ధతితో ఈ జూదాన్ని గెలువుము. బహుకాలంగా దుర్యోధనుడికి మనమీద ఉన్న క్రోధాన్ని ఈనాడు నిర్మూలించుము.

**విశేషం:** అలం: రూపకం.

క. ఈతఁడు మీకు నాపదల కెల్లను మూలము; ధర్మపుత్త్రు దు
ర్ద్యూతమునం బరాభవము నొందఁగ జేసిన పాపనిశ్చయుం
డా తరుణీలలామమున కమ్మెయి భంగ మొనర్చె వీఁడు నీ
చేతులలా వెఱుంగఁడు విశిష్టశుభం బిది నీకు ఫల్గునా! 183

**ప్రతిపదార్థం:** ఫల్గునా!= అర్జునా!; ఈతఁడు= ఈ దుర్యోధనుడు; మీకు నాపదలకున్+ఎల్లను మూలము= మీ కష్టాలకు అంతా కారణం; ధర్మపుత్రున్= ధర్మరాజును; దుర్ద్యూతమునన్= చెడ్డ జూదంలో (మోసపు జూదంలో); పరాభవమున్= అవమానాన్ని; ఒందఁగన్+చేసిన= కలిగించిన; పాప నిశ్చయుండు= చెడు తలపు కలవాడు; ఆ తరుణీలలామమునకున్= ఆడవారిలో ఉత్తమురాలైన ఆమెకు (ద్రౌపదికి); ఆ+మెయిన్= ఆ విధంగా (కట్టుగుడ్డను ఒలుచునట్లుగా); భంగము+ఒనర్చెన్= అవమానమును కలిగించాడు; వీఁడు= ఈ దుర్యోధనుడు; నీ చేతులలావు+ఎఱుంగఁడు= నీ భుజబలం తెలిసినవాడు కాడు; ఇది= ఈ యుద్ధం; నీకున్ విశిష్ట శుభంబు+అగున్= విశేషమైన మంచిని కలిగిస్తుంది.

**తాత్పర్యం:** అర్జునా! మీ కష్టాలకు మూలకారణం ఈ దుర్యోధనుడే. మోసపు జూదంలో ధర్మరాజును అవమానించిన పాడుబుద్ధికలవాడు. ద్రౌపదిని కట్టుగుడ్డలు ఒలిపించి అవమానించాడు. నీ చేతి బలాన్ని తెలిసినవాడు కాడు. ఈ యుద్ధంలో నీకు శుభం కలుగుతుంది.

క. ఎఱిఁగినఁ జేరఁడు; చేరుట । యెఱుకువమై మనకు దైవ మిచ్చిన సిరి యి
ట్లుఱిమిన యాలో గ్రక్కున । నఱకు; మితఁడు దెగిన మన మనఃపీడ దెగున్. 184

**ప్రతిపదార్థం:** ఎఱిఁగినన్= తెలిస్తే (నీచేతి బలం తెలిస్తే); చేరఁడు= దగ్గరకు రాడు; చేరుట= సమీపించటం; ఎఱుకువమైన్= తెలిసి; మనకున్= మనకు; దైవమిచ్చిన సిరి= దేవుడు ఇచ్చిన సంపద (అదృష్టం); ఇట్లు+అఱిమినన్= ఈ విధంగా ఆక్రమిస్తే; ఆలోన్= అంతలోనే; గ్రక్కునన్= శీఘ్రంగా; నఱకుము= నరికివేయుము; ఇతఁడు తెగినన్= ఈతడు చనిపోతే; మన= మనయొక్క; మనఃపీడ= మనసులోని చింత; తెగున్= తెగిపోతుంది (తొలగిపోతుంది).

**తాత్పర్యం:** నీచేతిబలం తెలిసి ఉంటే (మన) దగ్గరకు రాడు. దగ్గరకు రావటం మనకు దైవ మిచ్చిన అదృష్టం. దానితో అతడిని ఆక్రమించుము; వెంటనే అతడిని నరికివేయుము. వీడు పోతే మనకు గుండెలోని దిగులు తీరుతుంది.

**మ.** **వెరవే! సంపదఁ గోరి గాండివ గుణావిర్భూత బాణాలి కి**
**ట్లెరయై వచ్చుట యి మ్మహీపతి కితం డేలొక్కొ యత్యంత ని**
**ష్ఠుర శౌర్యోన్నతి నిన్నుఁ దాఁకఁ దలఁపం జోద్యంబుఁ వీఁ డగ్గ మై**
**దొరకో లర్జున! నీకుఁ దొంటి సుకృతస్తోమంబు కల్మిం జుమీ!** **185**

**ప్రతిపదార్థం:** అర్జున!= అర్జునా!; సంపదన్+కోరి= ఐశ్వర్యాన్ని ఆశించి; గాండివ గుణ+ఆవిర్భూత= గాండీవమనే వింటి అల్లెత్రాటి నుండి పుట్టిన; బాణ+ఆలికిన్= బాణాల సమూహానికి; ఇట్లు= ఈ విధంగా; ఎర ఐ= ఆహారమై; వచ్చుట= రావటం; ఈ+మహీపతికిన్= ఈ రాజునకు; వెరవే!= తగునా!; ఇతండు= ఈ దుర్యోధనుడు; ఏల+ఒక్కొ!= ఎందుకనో; అత్యంత నిష్ఠుర= మిక్కిలి కఠినమైన; శౌర్య+ఉన్నతిన్= వీర్యాధిక్యంతో; నిన్నున్= నిన్ను; తాఁకన్+తలఁపన్= ఎదుర్కొనటానికి ప్రయత్నించటం; చోద్యంబు= ఆశ్చర్యం; వీఁడు= ఇతడు; అగ్గము+ఐ= వశమై; దొరకోలు= చిక్కటం; నీకున్ తొంటి సుకృతస్తోమంబు= నీ పూర్వజన్మ పుణ్య సముదాయం సుమా.

**తాత్పర్యం:** ఓ అర్జునా! సంపదను ఆశించి గాండీవపు అల్లెత్రాటి నుండి వెడలిన బాణాలకు ఆహారంగా ఈ రాజుకు తగునా? ఇంత శౌర్యంతో ఇతడు నిన్ను ఎదుర్కొనాలని అనుకోవటం ఆశ్చర్యంగా ఉన్నది. ఇతడు మిక్కిలి ప్రయత్నంతో ఇట్లా చేయటం నీ పూర్వజన్మ పుణ్యాల ఫలమే సుమా!

**క.** **ఇతఁడు వడినఁ బ్రజ విచ్చును; । ధృతి సైంధవుఁ డటిమెనేనిఁ దెగు నాతం డు**
**ద్ధతి విడిచి పాఱిపోయినఁ । బ్రతిన కదియ చాలుఁ; గడఁగు పటుశౌర్య నిధీ!'** **186**

**ప్రతిపదార్థం:** పటుశౌర్యనిధీ!= తీవ్ర పరాక్రమానికి నిధి అయినవాడా!; ఇతఁడు= ఈ దుర్యోధనుడు; వడినన్= చనిపోతే; ప్రజ= సైన్యం; విచ్చును= విరిసిపోతుంది; ధృతిన్= ధైర్యంతో; సైంధవుఁడు= సైంధవుడు; అటిమెన్+ఏనిన్= ఆక్రమణం చేయటానికి ప్రయత్నిస్తే; తెగున్= చస్తాడు; ఆతండు= ఆ సైంధవుడు; ఉద్ధతి విడిచి= గర్వాన్ని వదలి; పాఱిపోయినన్= పరుగెత్తిపోతే; ప్రతినకున్= శపథానికి; అది+అ చాలున్= అంతేచాలును; కడఁగు= పూనుకొనుము.

**తాత్పర్యం:** ఈ దుర్యోధనుడు పడిపోతే సైన్యం వికావికలౌతుంది. సైంధవుడు ధైర్యంతో పరాక్రమించటానికి వచ్చాడా- చస్తాడు. వాడు గర్వాన్ని వదలి పారిపోతే (మన) శపథానికి అదే చాలును. మిక్కిలి శౌర్యం కలవాడా! పూనుకొనుము.'

**వ.** **అని పెక్కుభంగులం జెప్పిన విని వివ్వచ్చుం డచ్యుతు నాలోకించి.** **187**

**ప్రతిపదార్థం:** అని; పెక్కు, భంగులన్= అనేక విధాలుగా; చెప్పినన్= చెప్పగా; విని; వివ్వచ్చుండు= అర్జునుడు; అచ్యుతున్= శ్రీకృష్ణుని; ఆలోకించి= చూచి

**తాత్పర్యం:** అని అనేక విధాలుగా (కృష్ణుడు) చెప్పగా విన్న అర్జునుడు, కృష్ణుడి వంక చూచి.

**ఉ.** **'ద్రౌపది పడ్డ బన్నము లుదగ్రత మేదినిఁ బెద్దకాల మి**
**చ్ఛా పరతంత్రుఁడై తన వశంబుగఁ జేసిన వీని గర్వముం**
**గోపము వెంపదే? మనము గుందఁగఁ జేయదె? యింత సెప్ప నే**
**లా? పొలిగొందు నీతనిఁ జలంబు బలంబును నీవు మెచ్చఁగన్.** **188**

**ప్రతిపదార్థం:** ద్రౌపది; పడ్డ బన్నములు= పడిన కష్టాలు; ఉదగ్రతన్= భయంకరంగా; మేదినిన్= లోకంలో; పెద్దకాలము= చాలా కాలం; ఇచ్ఛాపరతంత్రుఁడై= తన ఇష్టానికి వచ్చినట్లు; తన వశంబుగన్+చేసిన= తను చెప్పిన విధంగా ఉండేటట్లు చేసినటువంటి; వీని గర్వమున్= ఈతడి అహంకారం; కోపము పెంపదే?= నా కోపాన్ని పెంచదా?; మనము కుందఁగన్+చేయదె?= మనస్సును బాధపెట్టదా?; ఇంత చెప్పన్+ఏలా?= ఇంతగా చెప్పటం ఎందుకు?; చలంబున్= (వీడిపై నాకున్న) మాత్సర్యాన్ని; బలంబును=

(నా) బలాన్ని; నీవు మెచ్చఁగన్= నీవు మెచ్చుకొనే విధంగా; పొరిగొందున్= చంపుతాను.

**తాత్పర్యం:** 'ద్రౌపది పడిన కష్టాలూ, భయంకరంగా లోకంలో చాలా కాలం ఇష్టారాజ్యంగా వ్యవహరించిన వీడి గర్వం ఇతడి మీద నాకు కోపాన్ని పెంచదా? మనస్సును బాధపెట్టదా? ఇంతెందుకు - నీవు మెచ్చుకొనే విధంగా నా మచ్చరము, బలము ప్రకాశింప వీడిని చంపుతాను.

**ఆ. ఒరుల దిక్కు సనక యరదంబు నీతని । యున్న యెడకు నడపు' మన్న నతఁడు**
**నట్ల చేయఁ, దనకు నభిముఖులై వచ్చు । వారిఁ జూచి మనుజవల్లభుండు. 189**

**ప్రతిపదార్థం:** ఒరుల దిక్కు చనక= ఇతరుల వంకకు పోకుండా; అరదంబున్= తేరును; ఈతని ఉన్న ఎడకున్= వీడున్న దిక్కునకు; నడపుము+అన్నన్= తోలుమనగా; అతఁడు= కృష్ణుడు; అట్లు+అ+చేయన్= ఆ విధంగా చేయగా (తేరును దుర్యోధనుడి వైపు తోలగా); తనకున్+అభిముఖులై వచ్చు= తనకు ఎదురుగా వస్తున్న; వారిన్+చూచి= వాళ్ళను చూచి; మనుజవల్లభుండు= రాజు (దుర్యోధనుడు).

**తాత్పర్యం:** 'తేరును ఇతరుల వైపునకు తోలక, ఇతడు ఉన్న దిక్కునకు తోలుము' అనగా, కృష్ణుడు అట్లాగే చేయగా, తనకు ఎదురుగా వచ్చే వారిని చూచి దుర్యోధనుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మనమునఁ గొంకక యెదురుగఁ । జనియె నిజోద్ధతికి మెచ్చి జనపాలకు లె**
**ల్లనుఁ బిచ్చలింప సేనా । నినదం బెసఁగంగ ఘోర నిష్ఠుర వృత్తిన్. 190**

**ప్రతిపదార్థం:** నిజ+ఉద్ధతికిన్= తన దర్పానికి; మెచ్చి= మెచ్చుకొని; జనపాలకులు+ఎల్లనున్= రాజులందరు; పిచ్చలింపన్= భయపడగా; సేనా నినదంబు= సైనికుల శబ్దం; ఎసఁగంగన్= ఎక్కువ కాగా; ఘోర నిష్ఠుర వృత్తిన్= భయంకరంగాను, కఠినంగాను; మనమునన్= మనస్సులో; కొంకక= సందేహించక; ఎదురుగన్ చనియెన్= ఎదురుగా వెళ్ళాడు.

**తాత్పర్యం:** తన దర్పాన్ని మెచ్చుకొని రాజులందరూ భయపడగా, సేనలు చేసే శబ్దం ఎక్కువ కాగా, భయంకరం, కఠినం అయిన నడవడితో మనస్సులో సందేహించకుండా ఎదురుగా వెళ్ళాడు.

**క. తముఁ బిలుచుచు నివ్విధమున । సమదాటోపగతి నడరు జనపతిఁ గని చి**
**త్తము లలర నార్చి నిజ శం । ఖము లొత్తిరి శార్ఙ్గధరుఁడు గాండివధరుఁడున్. 191**

**ప్రతిపదార్థం:** తమున్+పిలుచుచున్= తమను పిలుస్తూ; ఈ+విధమునన్= ఈ ప్రకారంగా; సమదాటోపగతిన్= గర్వంతో కూడిన ఆటోపంతో; అడరు= విజృంభించే; జనపతిన్+కని= దుర్యోధనుడిని చూచి; చిత్తములు= మనస్సులు; అలరన్= సంతోషించగా; ఆర్చి= బొబ్బరించి; శార్ఙ్గధరుఁడున్= శ్రీకృష్ణుడూ; గాండివధరుఁడున్= అర్జునుడును; శంఖములు+ఒత్తిరి= తమ శంఖాలను ఊదారు.

**తాత్పర్యం:** గర్వంతో అదిరిపడుతూ తమను పిలుస్తున్న దుర్యోధనుడిని చూచి, మనస్సులు వికసించగా కృష్ణార్జునులు బొబ్బరించి తమ శంఖాలను పూరించారు.

**చ. ఎలమిఁ జెలంగు కృష్ణుల యహీనసముద్ధతిఁ జూచి శోక వి**
**హ్వలు లయి మానవేంద్రు దెస నాసలు మాని మృగంబు భ్రాంతి ను**
**జ్జ్వలదనలంబులో నుఱుకు చందముగాఁ గొని నీదు యోధ వీ**
**రు లకట! చచ్చెఁజచ్చె నని మ్రోయఁగ నాతఁడు వారి కి ట్లనున్. 192**

**ప్రతిపదార్థం:** ఎలమిన్= వికాసంతో; చెలంగు= శంఖములు పూరించి ధ్వని చేసిన; కృష్ణుల= కృష్ణార్జునుల; అహీనసముద్ధతిన్= తగ్గిపోని ఆవేశాన్ని; చూచి= చూచినవారై; శోక విహ్వలులు+అయి= దుఃఖంతోను, భయంతోను స్వాధీనం తప్పినవారై; నీదు యోధవీరులు= నీ సైన్యంలోని వీరులు; మానవ+ఇంద్రుదెసన్= రాజుమీది (దుర్యోధనుడిమీది); ఆసలు మాని= ఆశలు వదులుకొని (అనగా వాని ప్రాణాలమీది ఆశలు మానుకొని); మృగంబు= లేడి; భ్రాంతిన్= భ్రమతో; ఉజ్జ్వలత్= బాగా మండుతూ ఉన్న; అనలంబులోన్= అగ్గిలో; ఉఱుకు చందము కాన్= దూకే విధం; కొని= భావించి; అకట!= అయ్యో!; చచ్చెన్+చచ్చెన్= చచ్చాడు చచ్చాడు; అని= అంటూ; మ్రోయఁగన్= అరవగా; ఆతఁడు= ఆ రాజు (దుర్యోధనుడు); వారికిన్= ఆ సైనికులకు; ఇట్లు+అనున్= ఈ విధంగా అంటున్నాడు.

**తాత్పర్యం:** ఉత్సాహ వికాసాలతో తగ్గిపోని కృష్ణార్జునుల ఆవేశాన్ని మన సైనిక వీరులు చూచారు. దుఃఖంతోనూ భయాకులతతోనూ వారు రాజు మీద ఆశ వదలుకొన్నారు. దుర్యోధనుడిని మండే మంటలో దూకే జింక మాదిరిగా భావించి, 'అయ్యో చచ్చాడు. చచ్చాడు' అని దుఃఖాక్రాంతులయ్యారు. అప్పుడు ఆ రాజు ఆ వీరులతో ఈ విధంగా అన్నాడు.

**క. 'భయ మేటికి వినుఁడు ధనం । జయునిం గేశవుని నాదు శరకీలాసం**
**చయమున నేర్చెదఁ బేర్చెద । నయనానందంబు మీ కొనర్చెదఁ గడిమిన్'. 193**

**ప్రతిపదార్థం:** భయము+ఏటికిన్?= భయము ఎందుకు?; వినుఁడు= నా మాట వినండి; ధనంజయునిన్ కేశవునిన్= అర్జునుడినీ, కృష్ణుడినీ; నాదు= నా యొక్క; శర కీలా సంచయమునన్= బాణాగ్ని జ్వాలలతో; ఏర్చెదన్= కాల్చివేస్తాను; పేర్చెదన్= విజృంభిస్తాను; మీకున్= మీకు; నయన+ఆనందంబున్= కనువిందును, తృప్తిని; కడిమిన్+ఒనర్చెదన్= ఎక్కువగా కలిగిస్తాను.

**తాత్పర్యం:** మీ కందరికీ భయం ఎందుకు? కృష్ణార్జునులను నా బాణాగ్ని జ్వాలలతో కాల్చివేస్తాను. పరాక్రమంతో విజృంభిస్తాను. మీ అందరికీ కనువిందు చేస్తాను'.

**వ. అని పలికి పార్థుం గనుంగొని యవష్టంభంబున. 194**

**ప్రతిపదార్థం:** అని, పలికి; పార్థున్= అర్జునుని; కనుంగొని= చూచి; అవష్టంభంబునన్= అహంకారంతో

**తాత్పర్యం:** అని పలికి, దుర్యోధనుడు అర్జునుడిని చూచి అహంకారంతో.

**దుర్యోధనుఁ డర్జునుం దలపడి యధిక్షేపించుట (సం. 7-77-35)**

**చ. 'వినుము కిరీటి! దివ్యశరవేదివి! నాఁ జను; దేను లేనిచో**
**టను మును సెల్లె నీకు; నిచటం జన నిత్తునె? యిప్డు నీ బలం**
**బును హరినేర్పుఁ జూచుటకుఁ బోరికి వచ్చితి; నీవు పాండురా**
**జునకు జనించితేనిఁ దెగి చూపుము శౌర్యము నస్త్రవీర్యమున్'. 195**

**ప్రతిపదార్థం:** కిరీటి! వినుము= అర్జునా! విను; దివ్యశరవేదివి నాన్= దైవశక్తిగల అస్త్రరహస్యాలు తెలిసినవాడవు అని; చనుదు= చెల్లుబడి ఔతున్నావు; ఏను లేనిచోటను= నేను లేని చోట; నీకున్ మునుచెల్లె= ఇదివరకు నీకు ఆ పేరు చెల్లిపోయింది; ఇప్డు= ఈ సమయంలో; ఇచటన్ చననిత్తునె?= ఇక్కడ చెల్లనిస్తానా?; ఇప్డు= ఈ సమయంలో; నీ బలంబును= నీ శక్తిని; హరినేర్పును= కృష్ణుడి నేర్పరితనాన్ని; చూచుటకున్= చూడటానికై; పోరికిన్ వచ్చితిన్= యుద్ధానికి వచ్చాను; నీవు; పాండురాజునకున్ జనించితి(వి)+ఏనిన్= పాండురాజునకు పుట్టి ఉన్నట్లయితే (పాండురాజునకు కొడుకువైతే); తెగి= సాహసంతో; శౌర్యమున్+అస్త్రవీర్యమున్= వీరత్వాన్నీ, బాణాల శక్తినీ; చూపుము= ప్రదర్శించుము.

**తాత్పర్యం:** 'ఓ అర్జునా! నీవు దైవశక్తిగల బాణ రహస్యాలను తెలిసినవాడవనే పేరుతో లోకంలో చెల్లుబడి

అయినావు. నేను లేనిచోట నీకు ఆ పేరు చెల్లింది. ఇక్కడ నిన్ను కదలనీయను. నీ బలాన్ని, కృష్ణుని నేర్పరితనాన్ని చూడటానికై యుద్ధానికి వచ్చాను. నీవు పాండురాజు కొడుకువైతే సాహసంతో నీ శక్తిని, బాణప్రయోగ బలాన్ని చూపించుము.

**వ. అనుచుఁ గ్రూరంబులగు మూఁడు నారాచంబుల నన్నరు నేసి, శర చతుష్టయంబున హయంబులు నొప్పించి, పది బాణంబులు పద్మనాభునురంబునం గ్రుచ్చి, మునిగోల యొక్కకోలం దునిమినం గినిసి క్రీడి యాతనిపైఁ జతుర్దశ నిశిత ప్రదరంబులు వరగించిన, నవి యమ్మహీపతి మైమఱువు దాఁకి మిట్టి పడుటయుం జూచి తొమ్మిది తూపులతోడం బంచాశుగంబులు నిగిడించిన, నవియు నిష్ఫలంబు లగుటయు, నిరువదెనిమిది బాణంబు లడరించె; నవ్వాలమ్ములు నమ్మెయిన వమ్మైన విషాదంబున వాసుదేవుండు వాసవి కి ట్లనియె. 196**

**ప్రతిపదార్థం:** అనుచున్= అని చెపుతూ; క్రూరంబులు+అగు= కఠినమైన; మూఁడు నారాచంబులన్= మూడు వాడి అయిన బాణాలతో; ఆ+నరున్=ఏసి= ఆ అర్జునుడిని కొట్టి; శరచతుష్టయంబునన్= నాలుగు బాణాలతో; హయంబులు నొప్పించి= గుఱ్రాలను బాధించి; పది బాణంబులు= పది బాణాలు; పద్మనాభు ఉరంబునన్ గ్రుచ్చి= శ్రీకృష్ణుడి ఎదలో గ్రుచ్చి; మునిగోలన్= గుఱ్రాలను అదలించే మునిగోలను; ఒక్క కోలన్+తునిమినన్= ఒక్క బాణంతో త్రుంచగా; కినిసి= కోపించి; క్రీడి= అర్జునుడు; ఆతనిపైన్= ఆ దుర్యోధనుడి మీద; చతుర్దశ నిశిత ప్రదరంబులు= పదునాలుగు వాడి బాణాలను; పరఁగించినన్= వేయగా; అవి= ఆ బాణాలు; ఆ+మహీపతి= ఆ దుర్యోధనుడి; మైమఱువు= కవచాన్ని; తాఁకి= తగిలి; మిట్టిపడుటయు= ఎగిరి పడుట; చూచి; తొమ్మిది తూపుల తోడన్= తొమ్మిది బాణాలతో; పంచ+ఆశుగంబులు= ఐదు బాణాలను; నిగిడించినన్= వేయగా; అవియున్= ఆ బాణాలు కూడా; నిష్ఫలంబులు+అగుటయున్= వ్యర్థంకాగా; ఇరువది+ఎనిమిది బాణములు= ఇరవై ఎనిమిది బాణాలను; అడరించెన్= ప్రయోగించాడు; ఆ+వాలమ్ములు= ఆ బాణాలు; ఆ+మెయినన్= అట్లాగే; వమ్ము+ఐనన్= పనికి రాకపోగా; విషాదంబునన్= దుఃఖంతో; వాసుదేవుండు= శ్రీకృష్ణుడు; వాసవికిన్+ఇట్లు+అనియెన్= అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా మాట్లాడుతూ దుర్యోధనుడు మూడు బాణాలతో అర్జునుడిని, నాలుగు బాణాలతో గుఱ్రాలను, పది బాణాలతో శ్రీకృష్ణుడి గుండెను నొప్పించి, మునిగోలను ఒక బాణంతో త్రుంచాడు. అర్జునుడు కోపంతో అతడి మీద వాడి అయిన పదునాలుగు బాణాలు వేశాడు. అవి అతని కవచాన్ని తాకి ఎగిరి పడ్డాయి. అది చూచి తరువాత తొమ్మిది బాణాలు, అయిదు బాణాలు ప్రయోగించాడు అవి కూడ వ్యర్థమయ్యాయి. తరువాత ఎనిమిది బాణాలతో కొట్టాడు. అవీ వ్యర్థమయ్యాయి. అపుడు శ్రీకృష్ణుడు దుఃఖంతో అర్జునుడితో ఇట్లా అన్నాడు.

**క. 'మున్నెన్నఁడు నివ్విధ మేఁ । గన్నది గా; దమ్ము లెడలె గాండీవములా**
**వు నీ్న భుజముల శక్తియు । మిన్నక పోఁ జిత్ర మిది యమిత్రధ్వంసీ! 197**

**ప్రతిపదార్థం:** అమిత్రధ్వంసీ!= శత్రువులను నాశనము చేసేవాడా!; మున్ను+ఎన్నఁడున్= ఇదివరకు ఎప్పుడూ; ఈ+విధము= ఈ పద్ధతి; ఏన్ కన్నది కాదు= నేను చూచినది కాదు; గాండీవము లావున్= గాండీవము యొక్క శక్తి; నీ భుజముల శక్తియున్= నీ చేతి లావును; మిన్నకపోన్= ఊరకపోయేటట్లు; అమ్ములు= బాణాలు; ఎడలెన్= విచ్ఛిన్నమైన; చిత్రం= ఆశ్చర్యం; ఇది= ఇటువంటిది.

**తాత్పర్యం:** శత్రువులను హతమార్చేవాడా! ఇదివరకు ఎప్పుడూ నేను ఇట్టి స్థితిని చూడలేదు. గాండీవబలం, నీ భుజబలం వ్యర్థమయ్యేటట్లు నీ బాణాలు విచ్ఛిన్నమయ్యాయి. ఆశ్చర్యంగా ఉన్నది.

**ఆ. నీకుఁ జూడ ముష్టి నెలవు నాకర్షణ । గాఢతయును బాణగతియుఁ దొంటి**
**యట్లొ? యొండుభంగియై తోఁచెనో? నాకు । నున్నరూపు సెప్పవన్న పార్థ! 198**

**ప్రతిపదార్థం:** పార్థ!= అర్జునా!; నీకున్ చూడన్= నిన్ను చూడగా; ముష్టినెలవున్= పిడికిలిపట్టు (వింటిని); ఆకర్షణ గాఢతయును=అల్లె త్రాటిని లాగు శక్తీ; బాణగతియున్= బాణపు పోకడా; తొంటి అట్లొ?= వెనుకటి వలెనే ఉన్నదా?; ఒండు భంగి ఐ తోచెనో?= వేరే విధంగా కనిపిస్తున్నదా?; నాకున్ ఉన్న రూపుల్= నాతో ఉన్న విషయాన్ని; చెప్పవన్న!= చెప్పుమా!

**తాత్పర్యం:** అర్జునా! నీ పిడికిటిపట్టు, వింటిని లాగే శక్తి, బాణాలు వేసే పద్ధతి వెనుకటి వలెనే ఉన్నవా? లేక వేరే విధంగా ఉన్నవా? యథార్థాన్ని నాకు చెప్పుము.

**చ. పిడుగుల యట్లు తాఁకి రిపుబృందములం దెగటార్చు నాజి నె**
**ప్పుడు భవదీయ దివ్యశరపుంజము లొక్కట నిప్డు పొల్లు వో**
**యెడు నిది; నీవు నిమ్మతివిహీనపు జంతువు నేమి సేట్లకుం**
**జెడుటకు నొక్కొ విస్మయము సెందెడు డెంద మలంతఁ బొందెడున్' 199**

**ప్రతిపదార్థం:** ఆజిన్= యుద్ధంలో; ఎప్పుడున్= ఎల్లప్పుడును; భవదీయ దివ్యశర పుంజములు= నీయొక్క దేవతాశక్తిగల బాణసమూహాలు; పిడుగుల అట్లు తాఁకి= పిడుగుల మాదిరిగా తాకి; రిపుబృందములన్= శత్రు సమూహాలను; తెగటార్చున్= నాశం చేస్తాయి; ఒక్కటన్= ఒక్కసారిగా; ఇప్డు= ఈ సమయంలో; పొల్లుపోయెడున్= వ్యర్థమైపోతూ ఉన్నవి; ఇది= ఈ విధానం; నీవున్= నీవును; ఈ+మతివిహీనపు జంతువున్= ఈ బుద్ధిలేని జంతువునగు నేను (శ్రీకృష్ణుడును); ఏమి; చేట్లకున్ చెడుటకున్+ఒక్కొ= ఆపదలకు గురియై నశించటానికో!; డెందము= నా మనస్సు; విస్మయము చెందెడున్= ఆశ్చర్యపడుతూ ఉన్నది; అలంత పొందెడున్= కష్టపడుతూ ఉన్నది.

**తాత్పర్యం:** నీ బాణాల గుంపులు యుద్ధరంగంలో పిడుగుల దెబ్బలవలె తాకి శత్రుసైన్యాన్ని ఎప్పుడూ హతమార్చేవి. ఒక్కసారిగా ఇప్పుడు అవి పొల్లుపోవటానికి కారణం ఏమి? నీవూ, ఈ మతిలేని జంతువునైన నేనూ ఏ యాపదలు పొంది చెడటానికో! నాకు ఆశ్చర్యం, బాధ కలుగుతున్నవి.'

**వ. అని యిట్లు దన్ను నిందించుకొనుచు గోవిందుం డడిగినఁ బురందర నందనుం డతని కిట్లనియె 'నిది యొక్క కవచ ధారణంబు; మున్ను ద్రోణుఁ డొక్కరుండ యెఱుంగు; బదంపడి నాకు నెఱింగించె; నిప్పుడు సుయోధనుండును నెఱుంగు తెఱంగు గావించెం గావలయు; నిమ్మెయి మైమఱువు త్రిలోకంబుల కభేద్యం బగుటయు, నీవు నెఱుంగుదు; వెఱింగియు న న్నడుగ నేల? భువనత్రయంబునందును వస్తుప్రకారంబులు నీయెఱుంగనియవియుం గలవే? యది యట్లుండె; నితండు దీని నగ్గురుకరుణం బడసినవాఁడై. 200**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ విధంగా; తన్ను నిందించుకొనుచున్= తనను దూషించుకొంటూ; గోవిందుండు= శ్రీకృష్ణుడు; అడిగినన్= అడుగగా; పురందరనందనుండు= అర్జునుడు (ఇంద్రుడి వరాన పుట్టినవాడు); అతనికిన్= కృష్ణుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా (ముందు చెప్పే విధంగా) అన్నాడు; ఇది ఒక్క కవచధారణంబు= ఇది యొక కవచాన్ని ధరించటం; మున్ను= ఇదివరకు; ద్రోణుండు+ఒక్కరుండు+అ= ద్రోణుడొక్కడే; ఎఱుంగున్= తెలిసినవాడు; పదంపడి= ఆ మీద; నాకున్+ఎఱింగించెన్= నాకు తెలిపాడు; ఇపుడు= ఈ సమయంలో; సుయోధనుండును= దుర్యోధనుడు కూడా; ఎఱుంగు తెఱంగు= తెలిసిన విధం; కావించెన్+కావలయున్= చేసియుండవలెను; ఈ+మెయిన్= ఈ విధమైన; మైమఱువు= కవచం; త్రిలోకంబులకున్= ముల్లోకాలకు; అభేద్యంబు+అగుటయున్= చీల్చుటకు సాధ్యంకాకపోవటం; నీవున్+ఎఱుంగుదు(వు)= నీకును తెలియును; ఎఱింగియున్= తెలిసికూడ; నన్నున్+అడుగన్+ఏల?= నన్ను అడిగేదెందుకు?; భువనత్రయంబునందును= ముల్లోకాలలోనూ; వస్తుప్రకారంబులు= వస్తు స్థితులు; నీ ఎఱుంగనియవియున్+కలవే?= నీకు తెలియనివి ఉన్నవా?; అది అట్లు+ఉండెన్= దాన్ని

అట్లా ఉండనీ; ఇతండు= ఈ దుర్యోధనుడు; దీనిన్= ఈ కవచాన్ని; ఆ+గురు కరుణన్= ఆ గురుడి దయతో; పడసిన వాఁడై= పొందిన వాడయి (ఉన్నాడు).

**తాత్పర్యం:** తనను కించపరచుకొంటూ గోవిందుడు అడుగగా అర్జునుడు అతడితో ఇట్లా అన్నాడు: 'ఇది ఒక కవచాన్ని తొడుగుకొనటంవలన ఇట్లా జరిగి ఉంటుంది. ఈ కవచధారణ ఇది వరలో ద్రోణుడికే తెలుసు. ఆ మీద నాకు తెలిపాడు. ఇపుడు సుయోధనుడికీ తెలిపినట్లున్నాడు. ఈ కవచం ముల్లోకాలకూ అభేద్యమని నీకూ తెలుసును. తెలిసికూడా న న్నడగటమెందుకు? ముల్లోకాలలోని వస్తుగుణాలన్నీ నీకు తెలియవా? అది అట్లా ఉండనిమ్ము. గురుడి దయచేత ఈ కవచాన్ని పొంది.

**క. విను మాఁటది వోలెం దన । తనువున కడ్డంబు గాఁగఁ దగిలిచికొన్నాఁ**
**డనఘ! యిటు లైన నెట్లగు । నని యెఱుఁగఁడు; దీనివిధము లన్నియుఁ దెలియన్. 201**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా! (కృష్ణా!); వినుము= నా మాట వినండి; ఆఁటదిపోలెన్= నాట్యం చేసే స్త్రీ మాదిరి; తన తనువునకున్= తన శరీరానికి; అడ్డంబు కాఁగన్= అడ్డంగా (రక్షణగా); తగిలిచికొన్నాఁడు= తగిలించుకొన్నాడు; ఇటులు+ఐనన్= ఈ విధంగా అయితే; దీని విధము లన్నియున్ తెలియన్= ఈ కవచానికి ఉన్న రహస్యాలన్నిటిని తెలిసికొనటం; ఎట్లు+అగున్+అని= ఏ విధంగానని; ఎఱుఁగఁడు= తెలియడు.

**తాత్పర్యం:** ఓ మహాత్మా! ఆటకత్తె అడ్డం తగిలించుకొన్నట్లుగా అతడు తన శరీరానికి కవచాన్ని వేసికొన్నాడు. అంతే కాని, దాని రహస్యాలు, ఏవీ ఆతడికి తెలియవు.

**క. నా వింటి బలువుఁ జేతుల । లావును జూడు మిదె నీ తలం కుడుగఁగ నే**
**నీ విభునిఁ గవచరక్షితుఁ । డై విలసిల్లంగనీ క యలఁచెదఁ గృష్ణా! 202**

**ప్రతిపదార్థం:** కృష్ణా!= శ్రీకృష్ణా!; నా వింటి బలువున్= నా విల్లుకు వున్న బలాన్ని; చేతుల లావును= భుజ బలాన్ని; చూడుము= గుర్తించుము; ఇదె= ఇదిగో; నీ తలంకు= నీ భయం; ఉడుగఁగన్= పోయేటట్లు; ఏన్= నేను; ఈ విభునిన్= ఈ రాజును; కవచ రక్షితుఁడు+ఐ= కవచంచేత కాపాడబడిన వాడై; విలసిల్లంగన్+ఈక= ఒప్పనీయక; అలఁచెదన్= బాధపెట్టుతాను.

**తాత్పర్యం:** కృష్ణా! నా వింటి శక్తిని, చేతుల బలాన్ని చూడుము. నీ భయాన్ని పోగొట్టుతాను; కవచం ఉన్నా కాపాడుకొనలేకుండా చేసి అతడిని బాధిస్తాను.

**వ. అంగిరసుం డమరపతికి నొక్క మహాస్త్రం బిచ్చె; దాని నతండు నా కొసంగె నది నిఖిల కవచ నిర్భేదన శీలంబై యుండు; దాన నిమ్మెయిమఱు వఱువుళ్ళు సేసెద.' 203**

**ప్రతిపదార్థం:** అంగిరసుండు; అమరపతికిన్= దేవేంద్రుడికి; ఒక్క= ఒక; మహా+అస్త్రంబు= గొప్పదైన మంత్రసహిత బాణాన్ని; ఇచ్చెన్= ఇచ్చాడు; అతండు= దేవేంద్రుడు; దానిన్= ఆ మహాస్త్రాన్ని; నాకున్= నాకు (అర్జునుడికి); ఒసంగెన్= ఇచ్చాడు; అది= ఆ మహాస్త్రం; నిఖిల, కవచ, నిర్భేదన, శీలంబు+ఐ= అన్ని కవచాలను పగులగొట్టగల స్వభావం కలది అయి; ఉండున్= ఉంటుంది; దానన్= దానిచేత; ఈ+మెయిమఱువు= ఈ (దుర్యోధనుడి) కవచం; అఱువుళ్ళు+చేసెదన్= ముక్కలు చేస్తాను.

**తాత్పర్యం:** అంగిరసుడు ఇంద్రుడికి ఒక మహాస్త్రాన్నిచ్చాడు. ఆయన దానిని నా కిచ్చాడు. ఆ అస్త్రం అన్ని కవచాలను చీల్చేశక్తి కలది. దానితో ఈ కవచాన్ని చీల్చివేస్తాను.'

**క. అని వెస నాదివ్యశరం। బనూన మంత్ర ప్రకాశ మగునట్టులుగా**
**గొనయమునఁ జేర్చి తిగిచినఁ। గని యశ్వత్థామ బాహుగర్వం బలరన్. 204**

**ప్రతిపదార్థం:** అని= అని చెపుతూ; వెసన్= శీఘ్రంగా; ఆ దివ్యశరంబున్= ఆ దైవశక్తిగల బాణాన్ని; అనూన= తక్కువకాని; మంత్ర ప్రకాశము+అగునట్టులుగాన్= మంత్రంతో వెలిగేటట్లుగా; గొనయమునన్= వింటిలో; చేర్చి= (కలిపి) జోడించి; తిగిచినన్= లాగగా; కని= చూచి; అశ్వత్థామ= ద్రోణాచార్యుడి కుమారుడైన అశ్వత్థామ; బాహుగర్వంబు+అలరన్= భుజబలం అతిశయించగా.

**తాత్పర్యం:** అంటూ శీఘ్రంగా గొప్ప మంత్రంతో ఆ దివ్యబాణాన్ని వెలిగేటట్లుగా వింటిలో అమర్చి, అల్లెత్రాడు లాగి ప్రయోగించగా అశ్వత్థామ చూచి, తన భుజబలం ప్రకాశించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. అధిప! సర్వాస్త్రఘాతి యై యతిశయిల్లు। నస్త్రమునఁ జిత్రముగఁ దెగయంద తునిమె**
**నమ్మహాస్త్రంబు న ట్లది వమ్ముగాఁగ। నెఱిఁగి వెఱఁగంది హరి కతఁ డిట్టు లనియె. 205**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!(ధృతరాష్ట్రా!); సర్వ+అస్త్రఘాతి+ఐ= అన్ని బాణాలను పడగొట్టినదై; అతిశయిల్లు= విజృంభించే (పెరిగే); అస్త్రమునన్= బాణంతో; చిత్రముగన్= ఆశ్చర్యంగా; తెగ+అంద= ఎక్కు పెట్టుటయందే; ఆ+మహా+అస్త్రంబున్= ఆ పెద్దబాణాన్ని; తునిమెన్= త్రుంచివేశాడు; అట్లు= ఆ విధంగా; అది= ఆ అస్త్రం; వమ్ము కాఁగన్= పనికిరాకపోగా; ఎఱిఁగి= తెలిసికొని; వెఱఁగంది= ఆశ్చర్యపడి; అతఁడు= అర్జునుడు; హరికిన్= కృష్ణుడితో; ఇట్టులు+అనియెన్= ఈ ప్రకారంగా అన్నాడు.

**తాత్పర్యం:** అన్ని అస్త్రాలను నాశనం చేసి అతియించే ఒక మహాస్త్రాన్ని ప్రయోగించగా, ఆశ్చర్యకరంగా అది అర్జునుని మహాస్త్రాన్ని త్రుంచింది. ఆ విధంగా తన అస్త్రం వ్యర్థం కాగా, అర్జునుడు ఆశ్చర్యపడి కృష్ణునితో ఈ విధంగా అన్నాడు.

**వ. 'ఆచార్య పుత్రు నస్త్ర ప్రభావంబున నవ్విశిఖంబు వినిహతంబయ్యెఁ బునఃప్రయోగంబు సేసిన నది యొప్పమి సేయు నని వింటి; నా వింటి బలిమిన సాధించెదం జూడు' మను నవసరంబున నయ్యిరువురను దుర్యోధనుండు. 206**

**ప్రతిపదార్థం:** ఆచార్యపుత్రు+అస్త్రప్రభావంబునన్= అశ్వత్థామయొక్క అస్త్రమహిమచేత; ఆ+విశిఖంబు= ఆబాణం; వినిహతంబు +అయ్యెన్= మొక్కపోయింది; పునఃప్రయోగంబు+చేసినన్= మరల ప్రయోగిస్తే; అది= ఆ మహాస్త్రం; ఒప్పమి= కీడు; చేయున్+ అని= చేస్తుందని; వింటిన్= విన్నాను (కాబట్టి); నా వింటి బలిమిన= నా వింటి బలంతోనే; సాధించెదన్= సాధిస్తాను; చూడుము= చూస్తూ ఉండుము; అను+అవసరంబునన్= అనే సమయంలో; దుర్యోధనుడు; ఆ+ఇరువురను= ఆ ఇద్దరినీ (కృష్ణార్జునులను).

**తాత్పర్యం:** 'ద్రోణాచార్యుడి కుమారుడైన అశ్వత్థామ ప్రయోగించిన బాణశక్తివలన నా బాణం మొక్కవోయింది. మరల దాన్ని ప్రయోగిస్తే అది కీడు కలిగిస్తుందని విన్నాను. నా వింటి బలంతోనే సాధిస్తాను చూడుము.' అనే సమయంలో ఆ ఇరువురుని దుర్యోధనుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తొమ్మిది తొమ్మిది వాలిక। యమ్ముల మున్నేసి పటుశరాసారము పైఁ**
**గ్రమ్మించిన మనదెసఁ దూ। ర్యమ్ములునుం గీర్తనములు నార్పులుఁ జెలఁగెన్. 207**

**ప్రతిపదార్థం:** తొమ్మిది తొమ్మిది= తొమ్మిదేసి తొమ్మిదేసి; వాలిక అమ్ములన్= వాలమ్ములతో; మున్ను+ఏసి= ముందుగా కొట్టి; పటుశరాసారము= దట్టమైన బాణవర్షం; పైన్+క్రమ్మించినన్= మీద కురిపించగా; మనదెసన్= మన వైపున; తూర్యమ్ములునున్= తూర్యనాదాలు (తుత్తురుమను శబ్దం వచ్చే విధంగా చేయటం); కీర్తనములు= పాటలు (ఉత్సాహంతో పాడేపాటలు); ఆర్పులు= సింహనాదాలు; చెలఁగెన్= ధ్వనించాయి.

**తాత్పర్యం:** తొమ్మిదేసి తొమ్మిదేసి వాలమ్ములను ముందుగా కొట్టి, ఆపైన దట్టమైన బాణవర్షం కురిపించగా మన దిక్కున తూర్యశబ్దాలూ, పాటలూ, సింహనాదాలూ చెలరేగాయి.

**ఆ. అలిగి యవుడు గఱచి యన్నరుఁ డా నృపు। తురగములను సూతుఁ దునిమి వైచి**
**రథము నతికి యధిక రయమునఁ దఱచుగ। నాటెఁ గరతలముల నారసములు. 208**

**ప్రతిపదార్థం:** అలిగి= కోపించి; ఆ నరుఁడు= ఆ అర్జునుడు; అవుడు గఱచి= క్రింది పెదవిని పంటితో నొక్కి (కోపాన్ని చూపి); ఆ నృపు తురగములను= ఆ దుర్యోధనుడి గుర్రాలను; సూతున్= సారథిని; తునిమివైచి= చంపి; రథము నతికి= తేరును ముక్కలు చేసి; అధిక రయమునన్= చాలా వేగంగా; కరతలమునన్= చేతులతో; నారసములు= వాడియైన బాణములను; తఱచుగన్= దట్టముగా; నాటెన్= గ్రుచ్చాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో అర్జునుడు కోపంతో పెదవి నొక్కుకుంటూ ఆ దుర్యోధనుడి గుర్రాలను, సారథిని చంపి, తేరును ముక్కలు చేసి చాలా తొందరగా అతని అరచేతులలో వాడి బాణాలను నాటాడు.

**వ. ఇట్లు విరథుండును వికల హస్తుండును నై విషణ్ణుం డగు నన్నరనాథుండు వెడం గగుటం గటకటంబడి యాకంకటంబు నిష్ఫలం బను బుద్ధిం బుచ్చి వైచి యొండొక కవచంబు దొడిగె; నయ్యెడరు గనుంగొని శీఘ్రంబునం దత్సైనికోత్తములు చతురంగ బహు బలంబులతోఁ గవిసి, కవ్వడిం జుట్టి ముట్టి యలుఁగుల సోనలు గురిసిన నతండు సంరంభ విజృంభితుం డగుటయు. 209**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; విరథుండును= తేరు లేనివాడూ; వికల హస్తుండును+ఐ= గాయపడిన చేతులు కలవాడూ అయి; విషణ్ణుండు+అగు= దుఃఖానికి గురి అయిన; ఆ నరనాథుండు= ఆ రాజు (దుర్యోధనుడు); వెడంగు+అగుటన్= వివేకాన్ని కోల్పోయిన వాడై; కటకటన్+పడి= కష్టపడి; ఆ కంకటంబు= ఆ కవచం; నిష్ఫలంబు= పనికిరానిది; అను బుద్ధిన్= అనే తలపుతో; పుచ్చివైచి= తొలగించి; ఒండు+ఒక కవచంబున్= ఇంకొక కవచాన్ని; తొడిగెను= తొడుగుకొన్నాడు; ఆ+ఎడరు= ఆ భంగపాటును; కనుంగొని= చూచి; శీఘ్రంబునన్= వేగంగా; తద్+సైనిక+ఉత్తములు= వాని సేనానులు; చతురంగ బహు బలంబులతోన్= అధిక సంఖ్యలోగల రథ గజ తురగ పదాతి సైన్యాలతో; కవిసి= కమ్ముకొని; కవ్వడిన్= అర్జునుడిని; చుట్టిముట్టి= చుట్టుకొని తాకి; అలుఁగుల సోనలు కురిసినన్= బాణాల వానను కురిపించగా; అతండు= ఆ అర్జునుడు; సంరంభ విజృంభితుండు+అగుచున్= ఆటోపంతో చెలరేగినవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా తేరు లేక, చేతులు గాయపడి, దుఃఖంతో ఆ దుర్యోధనుడు వివేకాన్ని కోల్పోయి చింతించి ఆ కవచం పనికిరాదనే బుద్ధితో తీసివేసి, ఇంకో కవచాన్ని తొడుగుకొన్నాడు. అతడి సైనికోత్తములు దుర్యోధనుడికి కలిగిన ఆపదను చూచి అనేక చతురంగ బలాలతో దూకి అర్జునుడిని క్రమ్ముకొని బాణాలవాన కురిపించగా అతడు పేట్రేగిపోయాడు.

**చ. అఱిముఱిఁ ద్రెళ్ళెఁ దేరులు, గజావళి గూలెఁ, దురంగమాంగము**
**ల్గిఱికొనియెన్ మహిన్ భటులు లెక్కకు మిక్కిలి సేన పాడుగా**
**నఱు మయి రప్ప కృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునం**
**దఱచుగ నొత్తె నిర్మథిత దానవ సైన్యముఁ బాంచజన్యమున్. 210**

**ప్రతిపదార్థం:** అఱిముఱిన్= సంభ్రమంతో; తేరులు త్రెళ్ళెన్= రథాలు పడిపోయాయి; గజ+ఆవళి= ఏనుగుల గుంపు; కూలెన్= కూలిపోయింది; తురంగమ= గుర్రాల; అంగముల్+గిఱికొనియెన్= శరీరంలోని భాగాలు చుట్టుకొన్నవి; మహిన్= భూమిమీద;

భటులు= సైనికులు; లెక్కకు మిక్కిలి సేన= లెక్క పెట్టడానికి ఎక్కువైన సేన; పాడుగాన్= నాశంకాగా; అఱుము+అయిరి= ఆక్రమించుకొన్నారు; అప్డు= ఆ సమయంలో; కృష్ణుడు= శ్రీకృష్ణుడు; భూగగన+అంతరంబునన్= భూమ్యాకాశాల మధ్యలో; తఱచుగన్= దట్టంగా; నిర్మథిత దానవ సైన్యమున్= నాశం చేయబడిన దానవ సైన్యం కల; పాంచజన్యమున్= పాంచ జన్యమనే (తన) శంఖాన్ని; ఒత్తెన్= ఊదాడు.

**తాత్పర్యం:** కలతబడి తేరులు పడిపోయాయి; ఏనుగుల గుంపులు కూలిపోయాయి; గుఱ్ఱాల శరీరాంగాలు వికలమయ్యాయి; భూమిమీద సైనికులు లెక్కపెట్టలేనంతగా కూలిపోయారు. ఆ సమయంలో కృష్ణుడు - రాక్షసైన్యాన్ని నాశం చేసిన పాంచజన్యాన్ని భూమ్యాకాశాల మధ్య ప్రతిధ్వనించేటట్లుగా ఊదాడు.

**తే. అట్లు భీషణమగు నర్జునాక్రమంబు । ఘోరమైన మురారి శంఖారవంబు**
**నధిక భయసంభ్రమంబుల నావహింప । నధిప! నలుగడఁ బఱచె సైన్యంబు గలఁగి. 211**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; అట్లు= ఆ విధంగా; భీషణము+అగు= భయంకరమైన; అర్జున+ఆక్రమంబు= అర్జునుడి కమ్ముకోటం; ఘోరము+ఐ= భయాన్ని కలిగించే; మురారి= శ్రీకృష్ణుడి; శంఖారవంబు= శంఖం చేసిన శబ్దం; అధిక= ఎక్కువైన; భయసంభ్రమంబులన్= భయాన్ని, తొట్రుపాటును; ఆవహింపన్= కలిగించగా; సైన్యంబు= (మన) సైన్యం; కలఁగి= చీకాకుపడి; నలుగడన్= నాలుగు దిక్కులకు; పఱచెన్= పరుగెత్తింది.

**తాత్పర్యం:** ఓ రాజా! అర్జునుడు ఆ విధంగా భయంకరంగా ఆక్రమించుకొనటమూ, మహాభయంకరమైన శ్రీకృష్ణుడి శంఖనాదమూ-భయమునూ, తొట్రుపాటునూ కలిగించగా మన సైన్యం కకావికలై నాలుగు దిక్కులకూ పరుగెత్తింది.

**వ. ఇ త్తెఱంగున. 212**

**తాత్పర్యం:** ఈ విధంగా.

**క. మును సంకటపడి మూఁకలు । గనుకని విచ్చుటయుఁ బిదప గాండివి మెఱసెం**
**బొనుఁగుపడి యుండి తగుగా । డ్పున మండు మహానలంబు పోల్కి మహీశా! 213**

**ప్రతిపదార్థం:** మహీశా!= ఓ రాజా! (ధృతరాష్ట్రా!); మును= ముందు (అనగా ఇదివరలో); మూఁకలు= సైన్యాలు; సంకటపడి= బాధపడి; కనుకనిన్= సంభ్రమంతో; విచ్చుటయున్= విరిసిపోగా; పిదపన్= వెనుకనే; గాండివి= అర్జునుడు; పొనుఁగుపడి ఉండి= వెలుగు తగ్గి ఉండి (నిస్తేజంగా ఉండి); తగుగాడ్పునన్= తగిన గాలితో (వాలుగాలితో); మండు= మండే; మహా+అనలంబుపోల్కి= దావాగ్ని మాదిరిగా; మెఱసెన్= వెలిగాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! మన సైన్యాలు బాధతోనూ తొట్రుపాటుతోనూ చెల్లాచెదరైపోగా, వెంటనే నిస్తేజంగా ఉండి అనుకూలమైన గాలి తగులగానే మండే దావాగ్ని మాదిరి అర్జునుడు కాంతితో ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అయ్యవసరంబున సింధురాజ రక్షకంబైన బలంబు సంక్షోభ సహితంబగు నుత్సాహంబునం బొదలి శంఖభేరీ పణవాది క్వణన మేదుర సింహనాదభరిత రోదసీ కుహరంబయ్యెః నచ్చిడిముడి పడుట యవలోకించి. 214**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; సింధురాజ రక్షకంబు+ఐన= సైంధవుడిని కాపాడుతూ ఉన్న; బలంబు= సైన్యం; సంక్షోభ సహితంబు+అగు= కలతతో కూడిన; ఉత్సాహంబునన్= సంతోషంతో; పొదలి= ఒప్పి; శంఖ, భేరీ, పణవ+ఆది= శంఖం, నగారా, పణవం మొదలైనవి కావించే; క్వణన= మ్రోతతో; మేదుర= దట్టమైన; సింహనాదభరిత= సింహనాదాలతో నిండిన; రోదసీకుహరంబు+అయ్యెన్= గుహవంటి ఆకసము అయినది; ఆ చిడిముడిపడుటన్= ఆ తొట్రుపాటును; అవలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఆ సమయంలో సైంధవుడిని రక్షిస్తున్న సైన్యం తొట్రుపాటుతో కూడుకొన్న ఉత్సాహంతో పొంగి శంఖాలు, భేరులూ, పణవాలు వంటి వాద్యాల నాదాలతో, సింహనాదాలతో ఆకాశ గుహ నిండిపోగా అర్జునుడు వారి ఆర్భాటాన్ని గమనించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మందస్మిత సుందర వద। నేందు లగుచు హరియు నరుఁడు నేడ్తెఱఁ బ్రియముల్**
**డెందములం బొంద భవ। న్నందనుపై నురవడించినం గని కడఁకన్. 215**

**ప్రతిపదార్థం:** మందస్మిత= చిరునవ్వుతో; సుందర వదన+ఇందులు+అగుచున్= అందమైన చంద్రుడి వంటి ముఖాలు కలవారయి; హరియున్ నరుఁడున్= కృష్ణార్జునులు; ఏడ్తెఱన్= ఎక్కువగా; ప్రియముల్= సంతోషాలు; డెందములన్= మనస్సులలో; పొందన్= పొందగా; భవత్+నందనుపైన్= నీ కుమారుని మీద (అనగా దుర్యోధనుడిమీద); ఉరవడించినన్= దూకగా; కని= చూచి; కడఁకన్= పట్టుదలతో.

**తాత్పర్యం:** చిరునవ్వులతో అందమైన చంద్రుడివంటి మొగాలతో కృష్ణార్జునులు మిక్కిలి సంతోషించే మనస్సులతో నీ కుమారుడి మీద దూకగా, అది చూచి పట్టుదలతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**వృషసేనుండు లోనగు నెనమండ్రు రథికు లొక్కపెట్ట యర్జునుపైఁ గవియుట (సం. 7-79-1)**

**క. వారలఁ బొదువ నడరు బలు। తేరుల మొత్తముల మిగిలి దీప్తపటు రథో**
**దారు లగుచు నెనమండ్రురు। వీరులు దటిమిరి నితాంతవేగోజ్జ్వలు లై. 216**

**ప్రతిపదార్థం:** వారలన్+పొదువన్= ఆ వీరులను ఆక్రమించటానికి; అడరు= విజృంభించే; బలుతేరుల మొత్తములన్= దృఢమైన తేరుల సమూహాలతో; మిగిలి= అతిశయించి; దీప్త= వెలిగే; పటురథ+ఉదారులు= దృఢమైన తేరులచే గొప్పవారు; అగుచున్; ఎనమండ్రురు వీరులు= ఎనిమిదిమంది బలయుతులైన వీరులు; నితాంత= తుదిలేని; వేగ+ఉజ్జ్వలులు+ఐ= వేగంతో ప్రకాశిస్తూ; తటిమిరి= తరిమారు.

**తాత్పర్యం:** ఆ వీరులను ఆక్రమించటానికి బలమైన తేరులతో ప్రకాశిస్తూ ఎనిమిది మంది వీరులు అంతులేని వేగంతో వెలుగుతూ కృష్ణార్జునులను తరిమారు.

**వ. వా రెవ్వ రెవ్వ రంటేని. 217**

**తాత్పర్యం:** వారందరూ ఎవ్వరని అడుగుతావేమో వినుము. (అని సంజయుడు ధృతరాష్ట్రుడితో అన్నాడు).

**క. దండిమగ లైన వృషసే। నుండు శలుండు సైంధవుఁడునుం గృపుఁడును గ**
**ర్ణుండును గురునందనుఁడు శ। ల్యుండును భూరిశ్రవుండు నుర్వీనాథా! 218**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= ఓ రాజా! (ఓ ధృతరాష్ట్రా!); దండిమగలు+ఐన= మేటి వీరులైన; వృషసేనుండు, శలుడు, సైంధవుఁడును, కృపుడును, కర్ణుండును, గురునందనుడును, శల్యుండును భూరిశ్రవుఁడును= వృషసేనుడు, శలుడు, సైంధవుడు, కృపాచార్యుడు, కర్ణుడు, అశ్వత్థామ, శల్యుడు, భూరిశ్రవుడు మొదలగువారు.

**తాత్పర్యం:** వృషసేనుడు, శలుడు, సైంధవుడు, కృపుడు, కర్ణుడు, అశ్వత్థామ, శల్యుడు, భూరిశ్రవుడు మొదలైన మేటివిలుకాండ్రు వారు. (అనగా అర్జునుడిని క్రమ్ముకొన్న వీరులు వీరని సంజయుడు వివరిస్తున్నాడు.)

**వ. అందఱు నొక్క మొగంబై. 219**

**తాత్పర్యం:** అందరు ఒక్కటిగా కూడి.

**క. తనదైన ప్రతిన నెఱపుట । కును ముఖ్యోపాయ మది యగుట నట్లు సుయో**
**ధనుఁ బరిమార్పఁ గడఁగు ఫ । ల్గునుఁ దలపడి రాత్మశంఖ ఘోషంబులతోన్. 220**

**ప్రతిపదార్థం:** తనది+ఐన ప్రతినన్= తన శపథాన్ని (అర్జునుడు సైంధవుడిని హతమారుస్తానని ప్రతిజ్ఞ చేశాడు); నెఱపుటకును= సాధించటానికి; ముఖ్య+ఉపాయము= ముఖ్యమయిన ఉపాయం (మార్గం); అది అగుటన్= అదే కావటం (సైంధవవధకు అది ప్రధానమైన బాట (ఉపాయం); అట్లు= ఆ విధంగా; సుయోధనున్= దుర్యోధనుడిని; పరిమార్పన్+కడఁగు= చంపటానికి పూనుకొన్న; ఫల్గునున్= అర్జునుడిని; ఆత్మశంఖ ఘోషంబులతోన్= తమ తమ శంఖనాదాలతో; తలపడిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** (అర్జునుడు తన శపథం నెరవేర్చుకొనటానికి ప్రధానమైన ఉపాయం - దుర్యోధనుడిని పరిమార్చటం. అందుకు ప్రయత్నించే అర్జునుడిని తమ తమ శంఖనాదాలతో వృషసేనాదులు ఆతడిని ఎదుర్కొన్నారు.

**క. అట్టియెడ దేవదత్తము । బిట్టొత్తె నరుండు పెక్కు పిడుగుల మ్రోఁతన్**
**బెట్టు వఱచు తన్నినదము । పుట్టించెను దిగులు నీదు పుత్రకు మేనన్. 221**

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= అటువంటి సమయంలో; నరుండు= అర్జునుడు; దేవదత్తమున్= దేవదత్తమనే తన శంఖాన్ని; బిట్టు+ఒత్తెన్= గట్టిగా ఊదాడు; (మ్రోత) పెక్కుపిడుగుల మ్రోఁతన్= అనేకమయిన పిడుగుల శబ్దంతో; బెట్టు+పఱచు= అతిశయించే; తద్+నినదము= ఆ శంఖ శబ్దం; నీదు పుత్రకు మేనన్= నీ కుమారుడి శరీరంలో; దిగులు= భయాన్ని; పుట్టించెన్= కలిగించింది.

**తాత్పర్యం:** ఆ సమయాన అర్జునుడు దేవదత్తాన్ని గట్టిగా ఊదాడు. ఆ శబ్దం పెక్కు పిడుగులు రాలే శబ్దంతో నీ కుమారుడికి దిగులు పుట్టించింది. (అని సంజయుడు ధృతరాష్ట్రుడితో అర్జునుడి శక్తిని వివరిస్తున్నాడు.)

**తే. చెవులు బీఁటలు వాఱంగఁ జెలఁగు నమ్మ । హారవమ్మున కులుకక యతనిమీఁద**
**విభుఁడుఁ గర్ణాదులును శరవృష్టి గురిసి । రడరి సైంధవు దిక్కున కడ్డపడుచు. 222**

**ప్రతిపదార్థం:** చెవులు బీఁటలు పాఱంగన్= చెవులు చిల్లులు పడగా; చెలఁగు= ధ్వనిస్తూ ఉన్న; ఆ+మహారవమ్మునకున్= ఆ పెను చప్పుడుకు; ఉలుకక= భయపడక; అతని మీఁదన్= ఆ అర్జునుడిమీద; విభుఁడున్= దుర్యోధనుడును; కర్ణ+ఆదులును= కర్ణుడు మొదలైనవారును; సైంధవుని దిక్కునకున్= సైంధవుడు ఉండే దిక్కునకు; అడ్డపడుచున్= అడ్డమౌతూ; అడరి= పూని; శరవృష్టిన్= అంపవానను; కురిసిరి= కురిపించారు.

**తాత్పర్యం:** (అర్జునుడి శంఖనాదం) తమ చెవులు చిల్లులు పడగా ఆ పెను శబ్దానికి భయపడకుండా దుర్యోధనుడు, కర్ణుడు మొదలైనవారు సైంధవుడున్న వైపు వెళ్ళుతున్న అర్జునుడిపై బాణవర్షం కురిపించారు.

**వ. ఆ సమయంబున నశ్వత్థామ యుబ్బి డెబ్బదిమూఁడు మార్గణంబుల మురవైరిని భల్లత్రయంబునఁ బార్థునినైదు శరంబులఁ దురంగమంబులం గేతువు నేసిన నవ్వాసవి యతని నూటయాఱింటను గర్ణునిఁ బదింటను వృషసేనుని మూఁటను నొప్పించి యొక్క కత్తివాతియమ్మున శల్యు చాపంబు ముష్టికిం ద్రుంచిన. 223**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= ఆ వేళలో; అశ్వత్థామ; ఉబ్బి= రేగి; డెబ్బది మూఁడు మార్గణంబులన్= డెబ్బైమూడు బాణాలతో; మురవైరిని= శ్రీకృష్ణుడిని; భల్లత్రయంబునన్= మూడు బల్లేలతో; పార్థునిన్= అర్జునుడిని; ఐదు శరంబులన్= అయిదు బాణాలతో; తురంగమంబులన్ కేతువును= గుర్రాలను, పతాకాన్ని; ఏసినన్= పడగొట్టగా; ఆ+వాసవి= ఆ అర్జునుడు; అతనిన్= అశ్వత్థామను; నూట ఆఱింటను= నూట ఆరు బాణాలతోను; కర్ణునిన్= కర్ణుడిని; పదింటను= పదింటితోను; వృషసేనునిన్= వృషసేనుడనే వాడిని; మూఁటను= మూడింటితోను; నొప్పించి= బాధపెట్టి; ఒక్క కత్తివాతి అమ్మునన్= ఒక కత్తివంటి వాడికల బాణంతో; శల్యుచాపంబున్= శల్యుడి విల్లును; ముష్టికిన్+త్రుంచినన్= పిడికిలి వద్దకు త్రుంచివేయగా.

**తాత్పర్యం:** ఆ సమయంలో అశ్వత్థామ చెల రేగి, డెబ్బైమూడు బాణాలతో శ్రీకృష్ణుడినీ, మూడింటితో అర్జునుడినీ అయిదింటితో గుర్రాలనూ కేతువునూ పడగొట్టగా - ఆ అర్జునుడు అశ్వత్థామను నూట ఆరు బాణాలతోనూ, కర్ణుడిని పదింటితోనూ, వృషసేనుడిని మూడింటితోనూ బాధించాడు. ఒక కత్తి వంటి వాడిగల బాణంతో, శల్యుడి ధనుస్సును పిడికిలి వద్దకు విరువగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. వేగంబ వేఱొక్క విలు గొని మద్రేశుఁ । డతనిపైఁ దొమ్మిది యమ్ము లేయ**
**ముప్పది రెంటను మూఁట నేనింటను । బదియింట నఱువది బాణములను**
**గర్ణ భూరిశ్రవః కర్ణనందన కృప । గురుపుత్రు లేసి రన్నరుని మఱియు**
**నాతనిమీఁద దివ్యాస్త్రంబు లైదు గో । విందు మై సప్తతి విశిఖములును**

**తే. ద్రౌణి నిగిడించె నట్టిసందడి జయద్ర । థుండు వారల మఱువున నుండి పఱపె**
**సరభసముగఁ ద్రిసప్తతి సాయకంబు । లమ్మహాబాహు దెసఁ గౌరవాధినాథ! 224**

**ప్రతిపదార్థం:** కౌరవ+అధినాథ!= కౌరవులకు ప్రభువైన ధృతరాష్ట్రా!; మద్రేశుఁడు= శల్యుడు; వేగంబు+అ= తొందరగా; వేఱొక్కవిలుగొని= ఇంకో వింటిని తీసికొని; అతనిపైన్= ఆ అర్జునుడిమీద; తొమ్మిది అమ్ములు+ఏయన్= తొమ్మిది బాణాలతో కొట్టగా; ముప్పదిరెంటను= ముప్పైరెంటితోను; మూఁటన్= మూటితోనూ; ఏనింటన్= ఐదింటితోను; అఱువది బాణములను= అరవై బాణాలతోను; కర్ణభూరిశ్రవః కర్ణనందన కృప గురుపుత్రులు= కర్ణుడు, భూరిశ్రవుడు, వృషసేనుడు, కృపాచార్యులు, అశ్వత్థామా; ఆ+నరునిన్+ఏసిరి= ఆ అర్జునుడిని కొట్టారు; మఱియున్= ఇంకను; ఆతని మీఁదన్= అర్జునుడిమీద; దివ్య+అస్త్రంబులు+ఐదు= దివ్యమైన బాణాలనైదింటిని; గోవిందుమైన్= శ్రీకృష్ణుడి శరీరంమీద; సప్తతి= డెబ్బై; విశిఖములను= వాడి బాణాలను; ద్రౌణి= అశ్వత్థామ; నిగిడించెన్= వేశాడు; అట్టి సందడిన్= ఆ సంకుల సమరంలో; జయద్రథుండు= సైంధవుడు; వారల మఱువునన్= పై చెప్పిన కర్ణాదుల చాటున; ఉండి= నిలచి; సరభసముగాన్= వేగంగా; త్రిసప్తతి సాయకంబులు= డెబ్బదిమూడు బాణాలు; ఆ+మహాబాహుదెసన్= ఆ గొప్ప భుజబలం కలవాడి దిక్కుగా; పఱపెన్= వేశాడు.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర చక్రవర్తీ! శల్యుడు శీఘ్రంగా ఇంకొక విల్లు తీసికొని తొమ్మిది బాణాలతో కొట్టాడు. కర్ణుడు ముప్పయి రెండుతో, భూరిశ్రవుడు మూటితోను, వృషసేనుడు ఐదింటితో, కృపాచార్యులు పదింటితో, అశ్వత్థామ అరువది బాణాలతో అర్జునుని కొట్టారు. అశ్వత్థామ, ఇంకా ఆతడి మీద దివ్యాస్త్రాలైదు, గోవిందుడి మీద డెబ్బై వాడి బాణాలను ప్రయోగించాడు. అటువంటి సందట్లో సైంధవుడు వారిచాటున నిలచి మిక్కిలి తొందరగా ఆ మహావీరుడిపైన డెబ్బదిమూడు బాణాలను వేశాడు.

**వ. ఇట్లు పెక్కం డ్రొక్కపెట్ట పె ల్లేసినం గినుక నూనిన నవ్వు రౌద్రరసంబు నలంకరింప. 225**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పెక్కండ్రు= పెక్కురు; ఒక్కపెట్టన్= ఒక్కసారిగా; పెల్లు+ఏసినన్= మిక్కిలిగా బాణాలు ప్రయోగించగా; కినుకన్+ఊనిన నవ్వు= కోపం తెచ్చుకొని నవ్విన నవ్వు; రౌద్రరసంబున్= కోపతీవ్రతను తెలిపే భావాన్ని; అలంకరింపన్= అందగించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా అందరు ఒక్క పెట్టున బాణాలు ప్రయోగించగా కోపంతో కూడిన నవ్వు (అర్జునుడి ముఖంలో) రౌద్రరసాన్ని అందగించేటట్లు చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వడి రాధేయుని నాతని । కొడుకునుఁ బండ్రెంట మూఁటఁ గుదియించుచుఁ గ**
**వ్వడి యొక బలుతూపున నె । క్కుడు రయమునఁ దునిమె శల్యు కోదండంబున్. 226**

**ప్రతిపదార్థం:** వడిన్= శీఘ్రంగా; రాధేయునిన్= కర్ణుడిని; ఆతని కొడుకును= ఆతడి కుమారుడైన వృషసేనుడిని; పండ్రెంటన్ మూఁటన్= పండ్రెండుతోను, మూడింటితోను; కుదియించుచున్= అణగిస్తూ; కవ్వడి= అర్జునుడు; ఒక బలుతూపునన్= ఒక తీవ్రమైన బాణంతో; ఎక్కుడు రయమునన్= మిక్కిలి వేగంతో; శల్యుకోదండంబున్= శల్యుడి వింటిని; తునిమెన్= త్రుంచివేశాడు.

**తాత్పర్యం:** (అర్జునుడు) శీఘ్రంగా కర్ణుడిని, అతడి కొడుకును వరుసగా పండ్రెండు, మూడు బాణాలతో అణగిస్తూ, ఒక్క వాడి బాణంతో శల్యుడి వింటిని శీఘ్రంగా త్రుంచివేశాడు.

**ఆ. తునిమి తోన యతనిఁ దొమ్మిది యమ్ముల । స్రుక్కఁ జేసి మూఁట సోమదత్త**
**తనయు నెనిమిదింట ద్రౌణిని నిరువదే । నింటఁ గృపుని నొంచి నిలువరించె. 227**

**ప్రతిపదార్థం:** (శల్యుకోదండంబున్= శల్యుడి వింటిని); తునిమి= త్రుంచివేసి; తోన= వెంటనే; అతనిన్= ఆ శల్యుడిని; తొమ్మిది అమ్ములన్= తొమ్మిది బాణాలతో; స్రుక్కన్+చేసి= అణగించి; మూఁటన్= మూడు బాణాలతో; సోమదత్త తనయున్= సోమదత్తుడి కుమారుడిని; ఎనిమిదింటన్= ఎనిమిది బాణాలతో; ద్రౌణినిన్= అశ్వత్థామను; ఇరువది+ఏనింటన్= ఇరవై ఐదుబాణాలతో; కృపునిన్= కృపాచార్యుడిని; నొంచి= బాధపెట్టి; నిలువరించెన్= ఆపాడు.

**తాత్పర్యం:** శల్యుడి వింటిని త్రుంచి, వెంటనే తొమ్మిది బాణాలతో అతనిని అణగించి, మూటితో సోమదత్తుడి కుమారుడిని, ఎనిమిదింటితో అశ్వత్థామను, ఇరవై ఐదింటితో కృపాచార్యుడిని, బాధించి అడ్డుకొన్నాడు.

**వ. మఱియు నిరువది మెఱుంగు వాలమ్ము లశ్వత్థామ యంగంబునం గ్రుచ్చె; నిట్లందఱతోడను గ్రందు కయ్యంబు సేయు సమయంబున నొక్కొక్కమఱి వారి పిఱుంద నోరవాఱం దోఁచు జయద్రథు నేయం దీఱకున్నం దమకంబున నెడనెడ నఱిముఱిం దద్రథంబు దెసకు నతఁడు వాఱ విడిచిన విశిఖంబులు నూఱు గల వప్పుడు భూరిశ్రవుండు వాసుదేవుని చేతిమునికోల నొకకోలం దునిమి కదిసి క్రీడి మేనం ద్రిసప్తతి శరంబులు వరఁగించెం దక్కటివారును నొక్క మొగిం గ్రూరనారాచంబులు గుప్పించి నొప్పించిన. 228**

**ప్రతిపదార్థం:** మఱియును= ఇంకను; ఇరువది మెఱుంగువాలమ్ములు= వెలుగుతూ ఉండే ఇరవై వాడి బాణాలు; అశ్వత్థామ అంగంబునన్ గ్రుచ్చెన్= అశ్వత్థామ శరీరంలో గ్రుచ్చాడు; ఇట్లు= ఈ విధంగా; అందఱతోడను= అందరితోను; క్రందుకయ్యంబు= దట్టమైన యుద్ధం; చేయు సమయంబునన్= చేసే వేళలో; ఒక్కొక్కమఱి= ఒక్కొక్కమారు; వారి పిఱుందన్= వారి వెనుకను; ఓరవాఱన్= ప్రక్కగా; తోఁచు= కన్పించే; జయద్రథున్= సైంధవుడిని; ఏయన్+తీఱకున్నన్= కొట్టటం వీలుచిక్కకపోగా; తమకంబునన్= త్వరతో; ఎడనెడన్= మధ్యమధ్యలో; అఱిముఱిన్= సంభ్రమంతో; తద్రథంబుదెసకున్= అతడి తేరు దిక్కుకు;

అతఁడు= అర్జునుడు; పాఱవిడిచిన= పడునట్లుగా వదలిన; విశిఖంబులు= వాణిబాణాలు; నూఱు కలవు= ఒక వంద ఉన్నాయి; అప్పుడు= ఆ సమయంలో; భూరిశ్రవుండు= భూరిశ్రవుడు; వాసుదేవుని= శ్రీకృష్ణుడి; చేతిమునికోలన్= చేతిలో ఉన్న ములుకర్రతో; ఒక కోలన్= ఒక బాణంతో; తునిమి= త్రుంచివేసి; కదిసి= దగ్గరకు చేరి; క్రీడిమేనన్= అర్జునుడి శరీరం మీద; త్రిసప్తతి= డెబ్బది మూడు బాణాలను; పరఁగించెన్= ప్రయోగించాడు; తక్కటివారును= మిగిలినవారు కూడా; ఒక్క మొగిన్= ఒక వరుసగా; క్రూర= భయంకరమైన; నారాచంబులన్= వాడి బాణాలను; గుప్పించి= కురిపించి; నొప్పించినన్= బాధించగా.

**తాత్పర్యం:** ఇంకా ఇరువది మెరుగు బాణాలతో అశ్వత్థామ శరీరాన్ని గుచ్చి, అందరితోనూ దట్టమైన యుద్ధం చేసేటప్పుడు, ఒక్కొక్కసారి వారికి వెనుక ప్రక్క ఓరగా కనబడే సైంధవుడిని దెబ్బకొట్టడానికి వీలు చిక్కకున్నా, తొందరగా అప్పుడప్పుడు సైంధవుడి మీద నూరు బాణాలను వేశాడు. అప్పుడు భూరిశ్రవుడు శ్రీకృష్ణుడిచేతి మునికోలను ఒక్క బాణంతో త్రుంచి, సమీపించి అర్జునుడి శరీరంమీద డెబ్బదిమూడు బాణాలను వేశాడు. తక్కినవారు కూడా ఒక్కసారిగా తీవ్రమైన బాణాలను గుప్పించి బాధించారు.

**శా. కోపాటోపమహోగ్రమూర్తి యగుచుం గోదండ టంకార లీ**
**లా పూర్ణంబుగ భూనభోంతర మతం డయ్యోధులన్ బాణ జా**
**లా పాతంబునఁ దూలనేసి చటుల వ్యాపార ఘోరానిలా**
**క్షేపక్షోభిత వారివాహచయభంగిం జూపె నేపారఁగన్. 229**

**ప్రతిపదార్థం:** కోప+ఆటోప మహా+ఉగ్రమూర్తి అగుచున్= కోపం యొక్క అతిశయంతో భయంకరాకారం కలవాడౌతూ; కోదండ టంకార= వింటి అల్లెత్రాటి శబ్దం; లీలాపూర్ణంబుగన్= క్రీడవోలె నిండుగా; భూనభోంతరము= భూమ్యాకాశాల మధ్యలో; అతండు= ఆ అర్జునుడు; ఆ+యోధులన్= ఆ కౌరవసేనానులను; బాణజాల+ఆపాతంబునన్= బాణాల గుంపుతో కొట్టటం వలన; తూలన్+ఏసి= ఎగిరిపోయేటట్లుగా కొట్టి; చటుల= తీవ్రమైన; వ్యాపార= వీచుటగల; ఘోర= భయంకరమైన; అనిల= గాలియొక్క; ఆక్షేప= త్రోపుతో; క్షోభిత= చీకాకుపెట్టబడిన; వారివాహచయభంగిన్= మేఘాల గుంపు మాదిరి; ఏపారఁగన్= విజృంభించగా; చూపెన్= చూపాడు.

**తాత్పర్యం:** అర్జునుడు కోపాటోపంతో భయంకరమైన ఆకారం కలవాడుకాగా అల్లెత్రాటి టంకారశబ్దం భూమ్యాకాశాలు నిండగా, ఆ కౌరవవీరులను బాణాల తాకిడితో ఎగురగొట్టి, దట్టమైన పెనుగాలికి సంక్షోభంతో విచ్చిపోయే మేఘాల మాదిరి అయ్యేటట్లుగా తన శక్తిని చూపాడు.

**వ. అట్లు విచ్చియుం గూడికొని మూఁకలం గూర్చికొని యొండొరులం బురికొల్పికొని. 230**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; విచ్చియున్= విడివడిపోయికూడా; కూడికొని= ఒక్కటై; మూఁకలన్= సేనలను; కూర్చికొని= కలిపికొని; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; పురికొల్పికొని= ప్రోత్సహించుకొని.

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా విచ్చిపోయి మరల సైన్యాలను కలుపుకొని ఒకరినొకరు ప్రేరేపించుకొంటూ.

**క. ఆ రథికు లొక్క మొగి న । వ్వీరునిపైఁ గవియుటయును విస్ఫురితశరా**
**సార మతఁడు నిగిడించిన । వారి బలము లెల్ల రక్తవారిం దేలెన్. 231**

**ప్రతిపదార్థం:** ఆ రథికులు= ఆ సైనికులు; ఒక్కమొగిన్= ఒక్క మొత్తంగా; ఆ+వీరునిపైన్= ఆ సేనానిపైన; కవియుటయును= కమ్ముకొనగా; అతఁడు= ఆ అర్జునుడు; విస్ఫురిత= మిక్కిలి; ప్రకాశించే; శరాసారము= బాణవర్షాన్ని; నిగిడించినన్= వ్యాపింపజేయగా; వారి బలము లెల్లన్= కౌరవ సైన్యాలన్నీ; రక్తవారిన్= నెత్తుటిలో; తేలెన్= తేలాయి.

**తాత్పర్యం:** ఆ సైనికులంతా ఒక్క మొత్తంగా అర్జునుడిపై బడి కమ్ముకొనగా ఆతడు బాణవర్షాన్ని కురిపించి, వారి సైన్యాలను నెత్తుటేటిలో తేలించాడు.

**వ. ఇత్తెఱంగునం దెరలుచుం బొదువుచు భవదీయ సైనికలోకంబు వోక పెనంగె' ననిన విని 'యప్పు డేమేమి యడియాలంబులతో నెవ్వ రెవ్వరి సిడంబులు మెఱసి యుండె?' నని యాంబికేయుం డడిగిన సంజయుం డి ట్లనియె. 232**

**ప్రతిపదార్థం:** ఇత్తెఱంగునన్= ఈ విధంగా; తెరలుచున్= తొలగుచూ; పొదువుచున్= కమ్ముకొంటూ; భవదీయ సైనికలోకంబు= నీ సైన్య సమూహం; పోక పెనంగెన్= వెన్నీయకుండా పోట్లాడింది; అనినన్= అని చెప్పగా; విని= విన్నవాడై; అప్పుడు= ఆ సమయంలో; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; ఏమేమి అడియాలంబులతోన్= ఏఏ గుర్తులతో; ఎవ్వరి+ఎవ్వరి సిడంబులు= ఎవరెవరి కేతనాలు; మెఱసి ఉండెన్?= ప్రకాశిస్తూ ఉండినవి?; అని అడిగినన్= అని అడుగగా; సంజయుడు ఇట్లు+అనియెన్= సంజయుడు ఈ ప్రకారంగా చెప్పాడు.

**తాత్పర్యం:** పై విధంగా తొలగుతూ, కమ్ముకొంటూ నీ సైన్యాలు వెన్నీయక పోట్లాడాయి.' అనగా విని ధృతరాష్ట్రుడు 'ఆ సమయంలో ఏఏ గుర్తులతో ఎవరెవరి కేతనాలు ప్రకాశిస్తూ ఉన్నాయి?' అని అడుగగా సంజయుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

**సీ. ప్రస్ఫురద్వానరపతియును సింహలాం । గూలంబు నుజ్జ్వల గోవృషంబు**
**వారణ కక్ష్యయు భూరి మయూరంబు । సీతయుఁ గాంచన సింధురంబు**
**రత్నయూపంబును రజతవరాహంబు । నుద్దీప్యమాన మహోరగంబుఁ**
**గేతనంబుల నొప్పుఁ గ్రీడికి నాచార్య । సుతునకుఁ గృపునకు సూతజునకు**

**తే. నతని నందనునకును మద్రావనీశ్వ । రునకు శలునకు భూరిశ్రవునకు సైంధ**
**వునకు రారాజునకు నిట్లు దనరి మెఱయుఁ । బది సిడంబులు నభమునఁ బ్రభలు నిగుడ. 233**

**ప్రతిపదార్థం:** నభమునన్= ఆకాశంలో; ప్రభలు నిగుడన్= వెలుగులు ఎక్కువ కాగా; క్రీడికిన్= అర్జునుడికి; ప్రస్ఫురత్= ప్రకాశించుచున్న; వానరపతియును= కపిరాజును (హనుమంతుడును); ఆచార్య సుతునకున్= అశ్వత్థామకు; సింహలాంగూలంబున్= సింహము తోకయు; కృపునకున్= కృపాచార్యునకు; ఉజ్జ్వల= బాగా తేజస్సుతో ఉన్న; గోవృషంబును= ఎద్దును; సూతజునకున్= కర్ణుడికి; వారణకక్ష్యయున్= ఏనుగు నడుమున కట్టు పట్టెయును; అతని నందనునకున్= అతని కొడుకైన వృషసేనుడికి; భూరి మయూరంబున్= పెద్ద నెమలియు; మద్ర+అవనీశ్వరునకున్= శల్యుడికి; సీతయున్= నాగేటిచాలు; శలునకున్= శలుడికి; కాంచన= బంగారు; సింధురంబున్= ఏనుగును; భూరిశ్రవునకున్= భూరిశ్రవుడికి; రత్నయూపంబును= రత్నపు పాలకొయ్యయును; సైంధవునకున్= సైంధవుడికి; రజత వరాహంబు= వెండిరంగు పంది; రారాజునకున్= దుర్యోధనునికి; ఉద్దీప్యమాన మహా+ఉరగంబున్= వెలుగుతున్న పెనుబామును; కేతనంబులన్= కేతనాలలో; ఒప్పన్= ఒప్పగా; పదిసిడంబులు= పది కేతనాలు; మెఱయున్= మెరుస్తున్నవి.

**తాత్పర్యం:** (ఈ పద్యంలో నానారకాలైన పది కేతనాలు ఆయా వీరుల చిహ్నాలుగా వర్ణించబడ్డాయి.) అర్జునుడికి కపికేతనం, అశ్వత్థామకు సింహపు తోక, కృపుడికి వృషభం, కర్ణుడికి మొలనూలు కల ఏనుగు నడుము కట్టె, వృషసేనుడికి పెద్ద నెమలి, శల్యుడికి నాగేటిచాలు, శలుడికి బంగారు రంగు గల ఏనుగు, భూరిశ్రవుడికి రత్నాలు పొదిగిన యూపస్తంభం, సైంధవుడికి రజత వరాహం, దుర్యోధనుడికి భయంకరమైన పెనుబాము, రథకేతనాలుగా ప్రకాశిస్తూ ఉంటే ఆకసమంతా మెరిసింది.

**క. మన తొమ్మిది సిడముల కం । టెను నుజ్జ్వల మగుచు నొక్కటియ పెక్కె యెం**
**దును దాన తోచు నయ్యు । ర్జును సిడము మహోగ్రతం గురుక్షితినాథా!' 234**

**ప్రతిపదార్థం:** కురుక్షితినాథా!= కురుదేశానికి చక్రవర్తి అయిన ఓ ధృతరాష్ట్రా!; మన తొమ్మిది సిడముల కంటెను= మనవారి తొమ్మిది కేతనాల కంటె; ఉజ్జ్వలము+అగుచున్= కాంతిమంతమై; ఒక్కటియ పెక్కె= ఒకటే అనేకంగా; ఎందునున్= ఏ దిక్కున చూచినా; ఆ+అర్జున సిడము= ఆ అర్జునుడి ధ్వజము; తాన= తానే; మహోగ్రతన్ తోఁచున్= మిక్కిలి భయంకరంగా కానవస్తుంది.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర చక్రవర్తీ! మన తొమ్మిది మంది కేతనాల కంటెను అర్జునుడి కేతనం ప్రకాశవంతమై భయంకరంగా అది ఒక్కటే అనేకాలుగా అంతటా కానవస్తూ ఉన్నది'.

**తే. అనుడు నమ్మేదినీశుఁ డి ట్లనియె 'నట్లు । క్రీడి విస్మయావహ రణక్రీడ సలుప**
**గురుని దర్పంబుచే నాఁక గొనిన ధర్మ । సూను సైన్యంబు లెట్లయ్యె? సూతతనయ!' 235**

**ప్రతిపదార్థం:** అనుడున్= అనగా; ఆ+మేదినీ+ఈశుఁడు= ఆ చక్రవర్తి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు; సూతతనయ!= ఓ సంజయా!; అట్లు= ఆ ప్రకారంగా; క్రీడి= అర్జునుడు; విస్మయ+ఆవహ= ఆశ్చర్యాన్ని కలిగించే; రణక్రీడన్= యుద్ధాన్ని; సలుపన్= చేయగా; గురుని= ద్రోణుడి; దర్పంబుచేన్= గర్వంవలన; ఆఁకగొనిన= అడ్డుకొనబడిన; ధర్మసూను సైన్యంబులు= ధర్మరాజు సేనలు; ఎట్లు+అయ్యెన్= ఏమైనవి?

**తాత్పర్యం:** సంజయుడు అట్లా చెప్పగా ధృతరాష్ట్రుడు ఇట్లా అడిగాడు: 'సంజయా! ఆశ్చర్యాన్ని కలిగించే విధంగా అర్జునుడు యుద్ధాన్ని చేసినప్పుడు, ద్రోణుడు దర్పంతో అడ్డుకొన్న ధర్మరాజు సైన్యాలు ఏమయ్యాయి?'

**వ. అనుటయు సంజయుం డతని కి ట్లనియె. 236**

**తాత్పర్యం:** అనగా సంజయుడు ఈ విధంగా అన్నాడు.

**క. అయ్యెడ ఖేచరులకు వెఱ । గయ్యెడు చందమున నట్టియవసరమున బ**
**ల్కయ్యము గురుని బలముతో । నయ్యె యుధిష్ఠిర బలోచ్చయంబున కధిపా! 237**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా! (ధృతరాష్ట్రా!); ఆ+ఎడన్= ఆ సమయంలో; ఖేచరులకున్= ఆకాశంలో తిరిగే వారికి (దేవతలు మొదలైనవారికి); వెఱఁగు+అయ్యెడు చందమునన్= భయం కలిగే విధంగా; అట్టి అవసరమునన్= అటువంటి వేళలో; గురుని బలముతోన్= ద్రోణుడి సైన్యంతో; ఆ+యుధిష్ఠిర బల+ఉచ్చయంబునకున్= ఆ ధర్మజుడి సైనిక సమూహానికి; బల్+కయ్యము+అయ్యెన్= పెనుయుద్ధమైనది.

**తాత్పర్యం:** ఆ సమయంలో దేవతలకు భయం కలిగించే విధంగా ద్రోణుడి సైన్యాలకూ ధర్మరాజు సైన్యాలకూ మహా యుద్ధ మయింది.

**వ. ఆ సంకుల సమరంబున బృహత్క్షత్త్రుని క్షేమధూర్తియు ధృష్టకేతుని వీరధన్వుండును నకులుని వికర్ణుండును సహదేవుని దుర్ముఖుండును సాత్యకిని వ్యాఘ్రదత్తుండును దలపడిరి; శల్యుఁడు సేనాముఖంబునకు వచ్చుచుం బోవుచున్న వాఁడగుట నుచితంబు మెయి నచ్చటి యనికిఁ జొచ్చి ద్రౌపదేయులం దాఁకె; భీమసేనుని యలంబుసుండును ధర్మనందను నాచార్యుండును మార్కొని; రప్పు డయ్యుధిష్ఠిరుండు. 238**

**ప్రతిపదార్థం:** ఆ సంకుల సమరంబునన్= ఆ దట్టమయిన యుద్ధంలో; బృహత్క్షత్రున్= బృహత్ క్షత్రుడు అనే వాడిని; క్షేమధూర్తియున్= క్షేమధూర్తి అనే వాడును; ధృష్టకేతునిన్= ధృష్టకేతుడు అనేవాడిని; వీరధన్వుండును= వీరధన్వుడనేవాడును; నకులునిన్= నకులుడిని; వికర్ణుండును= వికర్ణుడును; సహదేవుని; దుర్ముఖుండును= దుర్ముఖుడనేవాడును; సాత్యకిని; వ్యాఘ్ర దత్తుండును= వ్యాఘ్రదత్తుడనే వాడును; తలపడిరి= ఎదుర్కొన్నారు; శల్యుండు= శల్యుడు; సేనాముఖంబునకున్= మొగ్గరం ముందుకు; వచ్చుచున్ పోవుచున్న వాఁడు+అగుటన్= వస్తూ పోతూ ఉన్నవాడయినందున; ఉచితంబు మెయిన్= తగిన విధంగా; అచ్చటి+అనికిన్= అక్కడ జరిగే యుద్ధానికి; చొచ్చి= ప్రవేశించి; ద్రౌపదేయులన్= ఉపపాండవులను (ద్రౌపది కుమారులను); తాఁకెన్= ఎదుర్కొన్నాడు; భీమసేనుని= భీముడిని; అలంబుసుండును= అలంబుసుడనేవాడును; ధర్మనందనునిన్= ధర్మరాజును; ఆచార్యుండును= ద్రోణుడును; మార్కొనిరి= ఎదుర్కొన్నారు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు.

**తాత్పర్యం:** ఆ దట్టమయిన యుద్ధంలోబృహత్క్షత్రుడిని క్షేమధూర్తీ, ధృష్టకేతుడిని వీరధన్వుడూ, నకులుడిని వికర్ణుడూ, సహదేవుడిని దుర్ముఖుడూ; సాత్యకిని వ్యాఘ్రదత్తుడూ ఎదుర్కొన్నారు. శల్యుడు సేన తలకడకు వస్తూ పోతూ ఉండటం మూలాన తగు విధంగా ఆ యుద్ధానికి పూనుకొని, ఉపపాండవులను తాకాడు. అలంబుసుడనే వాడు భీమసేనుడినీ, ద్రోణాచార్యుడు ధర్మరాజునూ ఎదుర్కొన్న సమయంలో ధర్మరాజు. (తరువాతి పద్యంతో అన్వయం).

### ధర్మరాజు ద్రోణునితో యుద్ధము సేసి యోడిపోవుట (సం. 7-81-18)

**క. గురుమెయిఁ దొంబది సునిశిత । శరముల నినుచుటయు, నతఁడు సక్రోధుం డై**
**యిరువదియేనిట నాతని । యురస్థలము నొంచి పొదివె నుగ్రాస్త్రములన్. 239**

**ప్రతిపదార్థం:** గురుమెయిన్= ద్రోణుడి శరీరంపైన; తొంబది సునిశిత శరములన్= తొంభై వాడి బాణాలను; నినుచుటయున్= నింపగా; అతఁడు= గురుడు (ద్రోణాచార్యుడు); సక్రోధుండు+ఐ= కోపంతో; ఇరువది ఏనిటన్= ఇరువది అయిదింటితో; ఆతని= ఆ ధర్మజుడి; ఉరఃస్థలము= గుండెను; ఉగ్ర+అస్త్రములన్= భయంకరమైన బాణాలతో; నొంచి= బాధించి; పొదివెన్= కమ్ముకొన్నాడు.

**తాత్పర్యం:** (ధర్మజుడు) గురుడి శరీరం మీద తొంభై వాడి బాణాలను గ్రుచ్చగా, ద్రోణుడు కోపంతో అతడి గుండెను ఇరవై ఐదు బాణాలతో నొప్పించి, భయంకరమైన అస్త్రాలతో కమ్ముకొన్నాడు.

**క. రథమును నశ్వమ్ముల సా । రథిఁ దన్నునుఁ గప్పుశరపరంపర లెల్లన్**
**వృథ సేసెం గరలఘుతా । ప్రథితుం డగు ధర్మసుతుఁడు బాణౌఘములన్. 240**

**ప్రతిపదార్థం:** ధర్మసుతుఁడు= ధర్మరాజు; రథమును= తన తేరును; అశ్వమ్ములన్= గుర్రాలను; సారథిన్= సూతుడిని; తన్నును; కప్పు= కమ్ముకొన్న; శరపరంపరలు+ఎల్లన్= బాణాల గుంపునంతటినీ; కరలఘుతా ప్రథితుండు+అగు= చేతి లాఘవంతో ప్రఖ్యాతుడైన; ధర్మసుతుఁడు= ధర్మరాజు; బాణ+ఓఘములన్= బాణాల సమూహాలతో; వృథ చేసెన్= వ్యర్థము చేశాడు.

**తాత్పర్యం:** ద్రోణుడి బాణాలు ధర్మజుడి తేరును, సారథిని, గుర్రాలను క్రమ్ముకొన్నాయి. అప్పుడు ధర్మరాజు తన చేతి మెలకువతో ఆ ప్రయత్నాన్ని వమ్ముచేశాడు.

**చ.** **అలిగి గురుండు ధర్మజుశరాసన మేడ్తెఱఁ ద్రుంచి పెక్కు ల**
**మ్ముల సతురంగ సూతముగ ముంచె రథం బది యెల్లఁ జూచి సే**
**న లతఁడు పేర్చె నిమ్మనుజనాథుఁడు సచ్చునొ? యోడి పాఱునో?**
**బలిమిఁ దొఱంగి పట్టువడి పాడఱిపోవునొ? యంచు నున్నెడన్.** **241**

**ప్రతిపదార్థం:** గురుండు= ద్రోణాచార్యుడు; అలిగి= కోపించి; ధర్మజు శరాసనము= ధర్మరాజు వింటిని; ఏడ్తెఱన్= పరాక్రమంతో; త్రుంచి= తుంచి (ముక్కలు చేసి); పెక్కులు+అమ్ములన్= చాలా బాణాలతో; సతురంగ సూతముగన్= గుర్రాలతోను, సారథితోను; రథంబున్= తేరును; ముంచెన్= ముంచి వేశాడు; అది ఎల్లన్= ఆ విధానమంతా (ద్రోణుడి బాణ ప్రయోగ విశేషాలను చూచి చూచి); సేనలు= సైనికులు; అతఁడు పేర్చెన్= ఆ ద్రోణాచార్యుడు అతిశయించాడు; ఈ+మనుజనాథుఁడు= ఈ ధర్మరాజు; చచ్చునొ?= చనిపోవునో?; ఓడి= ఓటమి జెంది; పాఱునో?= పరుగెత్తిపోవునో?; బలిమిన్= బలవంతంగా; తొఱంగి= ఆపదతో; పట్టువడి= చిక్కిపోయి; పాడఱి= పాడుబడిపోయి (అనగా నశించి); పోవునొ?= పోవునేమో?; అంచున్+ఉన్న+ఎడన్= అని అనుకొంటూ ఉండగా.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు కోపించి, ధర్మరాజు వింటిని త్రుంచి, పరాక్రమంతో చాలా బాణాలను వేసి గుర్రాలతోను, సూతుడితోను తేరును ముంచాడు. దానినంతా చూచి సేనలు 'ఆచార్యుడు పేట్రేగిపోయాడు. ఈ రాజు (ధర్మరాజు) చస్తాడో, ఓడిపోయి పరుగెత్తుతాడో, బలవంతంగా ఆపదలో చిక్కిపోయి పాడైపోతాడో (అనగా నశించిపోతాడో)' అంటూ ఉన్న సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **ఒండొక విలు గొని ధర్మ సు । తుం డా నిబిడాస్త్ర సంతతులు రయము మెయిన్**
**ఖండించి తీవ్ర రశ్ముల । మండెడు ఘనశక్తి వైచె మార్తురు దలఁకన్.** **242**

**ప్రతిపదార్థం:** ధర్మసుతుఁడు= ధర్మరాజు; ఒండొక విలు కొని= ఇంకొక వింటిని తీసికొని; ఆ నిబిడ+అస్త్ర సంతతులు= ఆ దట్టమయిన బాణాల గుంపును; రయము మెయిన్= వేగంగా; ఖండించి= త్రుంచివేసి; తీవ్ర రశ్ములన్= భయంకరమైన వెలుగులతో; మండెడు= మండుతూ ఉన్న; ఘనశక్తిన్= గొప్పశక్తి అనే అస్త్రాన్ని; మార్తురు= విరోధులు; తలఁకన్= భయపడే విధంగా; వైచెన్= వేశాడు.

**తాత్పర్యం:** ఇంకొక వింటితో ధర్మరాజు ఆచార్యుడు వేసిన తీవ్రబాణాల గుంపును శీఘ్రంగా త్రుంచివేసి, వాడి అయిన జ్వాలలతో మండే పెనుశక్తిని, శత్రువులు భయపడేటట్లు ఆయన మీద ప్రయోగించాడు.

**సీ.** **శక్తి యాచార్యు శక్తిని మాయించుఁ బొ । మ్మని చూపఱెల్లను నఱ్ఱు లెత్తి;**
**రక్కుంభసంభవుఁ డపుడు బ్రహ్మాస్త్ర ప్ర । యోగంబు సేసిన నుగ్రభంగి**
**నయ్యస్త్ర మాశక్తి నద్భుతంబుగ నేలఁ । గలిపి యుధిష్ఠిరు వలను నిగుడ**
**నమ్మహీవిభుఁడు బ్రహ్మాస్త్రంబునన యది । యడఁగునట్లుగఁ జేసి, యతని మేన**

**తే.** **నైదు దూపులు నాఁటి శరాసనంబుఁ । దునుమ గద గొని వైచె నుద్ధురత నతఁడు**
**పతియు గదవైవ దత్సన్నిపాత జాత । చటులపావక జ్వాలలు చదల నిగుడ.** **243**

**ప్రతిపదార్థం:** శక్తి= ధర్మరాజు వేసిన శక్త్యాయుధం; ఆచార్యుని శక్తినిన్= ద్రోణాచార్యుడు ప్రయోగించిన శక్త్యాయుధాన్ని; మాయించున్ పొమ్ము+అని= తప్పక నాశం చేస్తుంది అని; చూపఱు+ఎల్లను= చూచేవారంతా; అఱ్ఱులు+ఎత్తిరి= మెడలు పైకెత్తారు; బ్రహ్మాస్త్ర

ప్రయోగంబు చేసినన్= బ్రహ్మాస్త్రాన్ని వేయగా; ఉగ్రభంగిన్= భయంకరమైన విధంగా; ఆ+అస్త్రము= ఆ బ్రహ్మాస్త్రం; ఆ శక్తిన్= ధర్మరాజు ప్రయోగించిన శక్తిని; అద్భుతంబుగన్= అబ్బురంగా; నేల కలిపి= నేలపై పడవేసి; యుధిష్ఠిరు వలను= ధర్మరాజు దిక్కునకు; నిగుడన్= పోగా; ఆ+మహీవిభుఁడు= ఆ ధర్మరాజు; బ్రహ్మాస్త్రంబునన్= బ్రహ్మాస్త్రంతోనే; అది అడఁగునట్లుగన్+చేసి= ద్రోణుడి బాణం నశించేటట్లుగా చేసినవాడై; అతని మేనన్= ఆ ద్రోణుని శరీరముపైన; ఐదు తూపులు= ఐదు బాణాలు; నాటి= గ్రుచ్చి; శరాసనంబున్= విల్లును; తునుమన్= త్రుంచి వేయగా; అతఁడు= ఆచార్యుడు; ఉద్ధురతన్= దర్పంతో; గద కొనివైచెన్= గదను తీసికొని కొట్టాడు; పతియున్= ధర్మరాజు కూడా; గద వైవన్= గదతో కొట్టగా; తద్= ఆ గదల యొక్క; సన్నిపాత= కలసుకోవటం (వలన); జాత= పుట్టిన; చటుల= తీవ్రమైన; పావకజ్వాలలు= అగ్నిజ్వాలలు; చదలన్= ఆకాశంలో; నిగుడన్= వ్యాపించగా.

**తాత్పర్యం:** ధర్మజుడి శక్తి ద్రోణుడి శక్తిని తప్పక నాశం చేస్తుంది అని మెడలు పైకెత్తి అందరూ చూడగా, ఆ ద్రోణుడు బ్రహ్మాస్త్రాన్ని వేసేసరికి అది భయంకరమైన పద్ధతిలో ఆ శక్తిని నేల కూల్చి, యుధిష్ఠిరుడి దిక్కుకు పోతుండగా, ఆ యుధిష్ఠిరుడు బ్రహ్మాస్త్రంతోనే అది నశించి పోయేటట్లు చేసి, ఆచార్యుడి ఒడలిపై ఐదు వాడి తూపులను నాటించి, ఆయన విల్లును త్రుంచి వేశాడు. ఆచార్యుడు గదతో కొట్టాడు. ధర్మరాజు కూడా తన గదను వేయగా ఆ రెండు గదల తాకిడి వలన కలిగిన తీవ్రమైన అగ్నిజ్వాలలు ఆకాశం దాకా వ్యాపించాయి.

**వ. ద్రోణుండు కోపించి. 244**

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు కోపపడి.

**తే. ధర్మతనయు రథ్యంబుల ధరణిఁ గూల్చి। ధనువుఁ గేతువుఁ దునుమాడి తనువు నొంప**
**నాతఁ డరదంబు డిగ్గి నిరాయుధుండు। నూర్ధ్వబాహుండు నై యూరకుండె నధిప! 245**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా!; ధర్మతనయు రథ్యంబులన్= ధర్మరాజు తేరు గుఱ్ఱాలను; ధరణిన్+కూల్చి= భూమి మీదికి పడగొట్టి; ధనువున్= వింటిని; కేతువున్= పతాకాన్ని; తునుమాడి= త్రుంచివేసి; తనువున్= ఒడలిని; నొంపన్= బాధించగా; ఆతఁడు= ధర్మరాజు; అరదంబు డిగ్గి= తేరు దిగి; నిరాయుధుండు= ఆయుధాలు లేనివాడు; ఊర్ధ్వబాహుండును+ఐ= చేతులు పైకెత్తినవాడై (అనగా అసహాయతను ప్రకటించి); ఊరకుండెన్= ఊరకున్నాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! ద్రోణుడు ధర్మరాజు తేరు గుఱ్ఱాలను పడగొట్టి - వింటిని, పతాకాన్ని త్రుంచివేసి, అతడి శరీరాన్ని బాధించాడు. ధర్మజుడు తేరు దిగి నిరాయుధుడుగా చేతులు పెకెత్తి ఊరకున్నాడు.

**క. కనుఁగొని గురుఁ డవ్విభు నే। యను బొడువను చేతులాడ కట పార్శ్వములం**
**దనచూడ్కిఁ బడిన హయరథ। మనుజ ద్విప సముదయముల మడియించె వెసన్. 246**

**ప్రతిపదార్థం:** గురుఁడు= ద్రోణాచార్యుడు; కనుఁగొని= చూచి (ధర్మరాజు అవస్థను చూచి); ఆ+విభున్= ఆ రాజును(ధర్మజుని); ఏయను= కొట్టటానికి; పొడువను= పోటుదెబ్బ వేయటానికి; చేతులు+ఆడక= చేతులు రాక; అట= అక్కడ; పార్శ్వములన్= ప్రక్కలలో; తన చూడ్కిపడిన= తన చూపునకు తగిలిన; హయరథ మనుజ ద్విపసముదయములన్= గుఱ్ఱాల, తేరుల, మనుష్యుల, ఏనుగుల గుంపులను (చతురంగ బలాలను); వెసన్= శీఘ్రంగా; మడియించెన్= నాశనం చేశాడు.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు చూచి ధర్మరాజును కొట్టటానికి, పొడవటానికి చేతులు రాక, ప్రక్కలో తన కంటబడిన చతురంగ బలాలను శీఘ్రంగా చంపాడు.

**క. పోనీఁడు పాదువుఁ గుంతీ। సూనుని గురుఁ డనుచు నుండ జూపఱగము ల**
**మ్మానవపతి యతిరయమున। దా నెక్కెం బాఱి పిన్నతమ్ముని రథమున్. 247**

**ప్రతిపదార్థం:** కుంతీసూనునిన్= ధర్మరాజును; గురుఁడు= ద్రోణుడు; పోనీఁడు= తప్పించుకొని పోనీయడు; పాదువున్= క్రమ్ముకొనును; అనుచున్= అని అంటూ; చూపఱగములు అనుచున్+ఉండన్= చూచేవారు అంటూ ఉండగా; ఆ+మానవపతి= ఆ ధర్మరాజు; అతిరయమునన్= చాల తొందరగా; పాఱి= పరుగెత్తుకొనిపోయి; పిన్న తమ్ముని రథమున్= చిన్న తమ్ముడైన సహదేవుడి తేరుపైకి; తాన్+ఎక్కెన్= తాను ఎక్కాడు.

**తాత్పర్యం:** అక్కడ చూస్తున్న వారంతా గురుడు ధర్మరాజును పోనీయక పట్టుకొంటాడు - అంటూ ఉండగా ఆ ధర్మరాజు చాలా తొందరగా పరుగెత్తుకొని పోయి చిన తమ్ముడైన సహదేవుడి తేరుపైకి ఎక్కాడు.

**వ. ఇట్లు పాండవాగ్రజుండు సహదేవుని రథం బెక్కి తొలంగం దోలుకొని పోయె; నట్టియెడ. 248**

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు సహదేవుని తేరుమీదికి ఎక్కి ప్రక్కకు పోగా (తేరును తోలుకొని పోయాడు) అప్పుడు.

**తే. క్షేమధూర్తి బృహత్ క్షత్త్రు శిత శిరముల। నొంచి విలు ద్రుంప నొండు ధనువు రయంబు**
**వఱలఁ గొని హయసారథి ధ్వజయుతముగ। నతని మస్తక మిలఁ గూల్చి యార్చె నతఁడు. 249**

**ప్రతిపదార్థం:** క్షేమధూర్తి= క్షేమధూర్తి అనేవాడు; బృహత్ క్షత్త్రున్= బృహత్ క్షత్త్రుడిని; శితశరములన్= వాడి బాణాలతో; నొంచి= నొప్పించి; విలు త్రుంపన్= వింటిని త్రుంచివేయగా; అతఁడు= బృహత్క్షత్త్రుడు; ఒండు ధనువున్= ఇంకొక వింటిని; రయంబు వఱలన్= వేగం ఒప్పగా; కొని= తీసికొని; హయసారథి ధ్వజయుతముగన్= గుర్రాలు, సూతుడు, కేతనములతో; అతని మస్తకము= ఆ క్షేమధూర్తి యొక్క తల; ఇలన్ కూల్చి= భూమిపై పడవేసి అనగా చంపి; ఆర్చెన్= బొబ్బపెట్టాడు (అనగా సింహనాదం చేశాడు).

**తాత్పర్యం:** క్షేమధూర్తి అనేవాడు బృహత్క్షత్రుడిని వాడి బాణాలతో నొప్పించి వింటిని త్రుంచివేశాడు. ఆతడు వేగంగా ఇంకొక వింటిని తీసికొని, క్షేమధూర్తియొక్క గుర్రాలను, సారథిని, కేతనంతో కూడా అతడి తలను భూమిమీద పడగొట్టి సింహనాదం చేశాడు.

**చ. కడువడి వీరధన్వుఁడు త్రిగర్తులు పొంగఁగ ధృష్టకేతు విల్**
**నడిమికిఁ ద్రుంచినన్ మొగమునం దళుకొత్తెడు కెంపు సొంపుతోఁ**
**జిడిముడిపాటు లేక యతి శీఘ్రమునన్ ఘనశక్తి నాతఁ డె**
**క్కుడు మద మొప్ప నాన్నృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపఁగన్. 250**

**ప్రతిపదార్థం:** వీరధన్వుఁడు= కౌరవపక్షపాతి అయిన వీరధన్వుడు అనేవాడు - త్రిగర్త దేశాధీశుడు; త్రిగర్తులు పొంగఁగన్= త్రిగర్తులు సంతోషించగా; ధృష్టకేతువిల్= ధృష్టకేతుడి వింటిని (పాండవ పక్షం వాడిని); నడిమికిన్+త్రుంచినన్= మధ్యకు విరవగా; మొగమునన్= వాడి ముఖంలో; తళుకొత్తెడు= ప్రకాశించే; కెంపుసొంపుతోన్= ఎర్రని అందంతో; చిడిముడిపాటు= తొట్రుపాటు; లేక= కానరాక; అతిశీఘ్రమునన్= మిక్కిలి వేగంగా; ఘనశక్తిన్= గొప్ప శక్త్యాయుధంతో; ఆతఁడు= ధృష్టకేతుడు; ఎక్కుడు మదము+ఒప్పన్= మిక్కిలి గర్వం ప్రకాశించగా; ఆ నృపతిన్= వీరధన్వుడిని; సురలు నుతింపన్= దేవతలు కీర్తించగా; కూలఁగవైచెన్= పడగొట్టాడు (చంపివేశాడు).

**తాత్పర్యం:** త్రిగర్త దేశాలవారు ఉప్పొంగగా వీరధన్వుడు శీఘ్రంగా ధృష్టకేతుడి వింటిని నడిమికి రెండుగా త్రుంచాడు. అది అతడి మొగానికి కెంపుసొంపుల తళుకులను కూర్చింది. తొట్రుపాటు లేక శీఘ్రంగా పెద్దశక్త్యాయుధంతో వాడి గర్వ మణగేటట్లుగా పడగొట్టాడు. అందుకు దేవతలు కీర్తించారు.

**వ. సహదేవుండును మగిడివచ్చి దుర్ముఖునిం దలపడి దోర్విలాసంబు మెఱయం బోరి పోరి. 251**

**ప్రతిపదార్థం:** సహదేవుండును; మగిడివచ్చి= మరల వచ్చి; దుర్ముఖునిన్; తలపడి= ఎదుర్కొని; దోస్+విలాసంబు= భుజముల విలాసము - భుజ పరాక్రమమం; మెఱయన్= ప్రకాశించగా; పోరిపోరి= యుద్ధం చేసి చేసి;

**తాత్పర్యం:** సహదేవుడును తిరిగి వచ్చి (ద్రోణుడి దెబ్బలకు అలసిన ధర్మజుడిని దూరంగా తీసికొనిపోయి తిరిగివచ్చి) దుర్ముఖుడిని ఎదుర్కొని భుజబలం ప్రకాశించగా యుద్ధం చేసి చేసి.

**ఉ. కేతువుఁ గూల్చి, రథ్యములఁ గీటడఁగించి, శరాసనంబుతో**
**సూతుని కంఠముం దునిమి, స్రుక్కఁగ నంగము బాణపంచక**
**స్యూతము నేయ నీదు తనయుం డరిగెన్ నిరమిత్రుతేరిపై**
**కాతత సంభ్రముం డయి రయంబున బాండవ సైన్య ముబ్బఁగన్. 252**

**ప్రతిపదార్థం:** కేతువున్ కూల్చి= పతాకాన్ని పడగొట్టి; రథ్యముల= గుర్రాలను; కీటు+అడఁగించి= చంపి; శరాసనంబుతోన్= వింటితో; సూతున్= సారథియొక్క; కంఠమున్+తునిమి= గొంతు కత్తిరించి; అంగము స్రుక్కఁగన్= ఒడలు బాధపడగా; బాణపంచక స్యూతమున్= ఐదు బాణాలతో కుట్టబడినట్లుగా; ఏయన్= కొట్టగా; నీదు తనయుండు= నీ కుమారుడు; నిరమిత్రు తేరిపైన్= త్రిగర్త రాజకుమారుడైన నిరమిత్రుడనే వాడి తేరిమీదికి; ఆతత సంభ్రముండు+అయి= ఎక్కువైన తొందరతో కూడినవాడై; రయంబునన్= వేగంగా; పాండవసైన్యము+ఉబ్బఁగన్= పాండురాజు సైన్యం సంతోషించగా; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** నీ కుమారుడైన దుర్ముఖి కేతువును పడగొట్టి, రథపు గుర్రాలను చంపి, వింటిబద్దతో సారథి గొంతును త్రుంచి, శరీరం బాధపడగా ఐదు బాణాలను గుదికూర్చి కుట్టినట్లు వేశాడు. అప్పుడు దుర్ముఖి త్రిగర్తరాజు కుమారుడైన నిరమిత్రుడి తేరిమీదికి వెళ్ళాడు. అది పాండవ సైన్యానికి సంతోషం కలిగించింది.

**వ. అంత నిలువక. 253**

**తాత్పర్యం:** అంతటితో ఆగకుండా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. తఱిమి సహదేవుఁ డా త్రిగర్త క్షితీశ । తనయుఁ డగు నిరమిత్రునిఁ దునిమి యొప్పె**
**ఖరుని తలఁ ద్రెవ్వనేసి రాఘవుఁడు మెఱయు । తెఱఁగు దోఁప నీసేనకు వెఱపు గదుర. 254**

**ప్రతిపదార్థం:** ఖరుని తలన్= ఖరాసురుడి తలను; త్రెవ్వన్+ఏసి= తెగి కిందపడేటట్లుగా కొట్టి; రాఘవుఁడు= శ్రీరామచంద్రుడు; మెఱయు తెఱఁగు= ప్రకాశించే విధానం; తోఁపన్= తెలిసేటట్లుగా; నీ సేనకున్= నీ సైన్యానికి; వెఱపు కదురన్= భయం కలుగగా; సహదేవుఁడు; ఆ త్రిగర్త క్షితీశ తనయుఁడు= ఆ త్రిగర్త దేశపు రాజకుమారుడు; అగు= అయినటువంటి; నిరమిత్రునిన్= నిరమిత్రుడనే వాడిని; తఱిమి= తరుముకొని పోయి; తునిమి= చంపి; ఒప్పెన్= రాణించాడు.

**తాత్పర్యం:** సహదేవుడు నిరమిత్రుడిని తరిమి చంపటం, శ్రీరామచంద్రుడు ఖరాసురుడి తల త్రుంచి ప్రకాశించినట్లుగా ఉన్నది. ఆ దృశ్యం నీ సైన్యానికి భయాన్ని కలిగించింది.

క. నకులునిఁ దాఁకి వికర్ణుం । డొకపరి యైనను బెనంగ నోపక తిరిగెన్
సకల బలముఁ జూడఁగ ఱా । తికిఁ బైకొని యడరి తగరు దెరలిన మాడ్కిన్. 255

**ప్రతిపదార్థం:** వికర్ణుండు= కౌరవులలో చిన్నవాడు; నకులునిన్ తాఁకి= నకులుడిని ఎదుర్కొని; ఒకపరి ఐనను= ఒక్కమారైనను; పెనంగన్+ఓపక= యుద్ధం చేయలేక; సకల బలమున్ చూడఁగన్= సైన్యమంతా చూస్తుండగా; ఱాతికిన్= పెద్దరాయిపైకి; పైకొని= ఎదుర్కొని పోయి; అడరి= విజృంభించి; తగరు= పొట్టేలు; తెరలిన మాడ్కిన్= తిరిగి పోయినట్లు; తిరిగెన్= వెన్నిచ్చిపోయాడు.

**తాత్పర్యం:** వికర్ణుడు నకులుని ఎదుర్కొని ఒక్కసారి కూడ యుద్ధం చేయలేక, పెద్ద రాతిని ఎదుర్కొని వెను తిరిగిన పొట్టేలువలె తన సైన్యమంతా చూస్తుండగా తిరిగిపోయాడు.

**విశేషం:** అలం: ఉపమ.

తే. వ్యాఘ్రదత్తుండు సాత్యకి నస్త్రవృష్టి । ముంచె ముంచిన నతఁడు కోపించి సూతుఁ
జదిపి హయములఁ బొరి గొని చటులవృత్తి । జంపె నమ్మగధ క్షితీశ్వరుకుమారు. 256

**ప్రతిపదార్థం:** వ్యాఘ్రదత్తుండు= వ్యాఘ్రదత్తుడనేవాడు; సాత్యకిన్= సాత్యకిని; అస్త్రవృష్టిన్= అంపవానలో; ముంచెన్= ముంచాడు; ముంచినన్= ముంచగా; అతఁడు= ఆ సాత్యకి; కోపించి; సూతున్= సారథిని; చదిపి= చంపి; హయములన్= గుఱ్ఱాలను; పొరిగొని= చంపి; చటులవృత్తిన్= తీవ్రంగా; ఆ+మగధ క్షితీశ్వరు కుమారున్= ఆ మగధరాజు కుమారుడిని; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** వ్యాఘ్రదత్తుడు సాత్యకిని అంపవానలో ముంచాడు. అట్లా ముంచగా ఆతడు కోపించి, అతడి సారథిని, గుఱ్ఱాలను సంకుల సమరంలో సంహరించి అతడినీ చంపాడు.

వ. శలుండును ద్రౌపదీపుత్రుల నేవుర నైదైదు బాణంబుల నేసి; మఱియును మార్గణ నికరంబులు నిగిడింపం జలింపక వా రా సౌమదత్తి నొక్కుమ్మడిం జుట్టుముట్టిన నతం డందఱ కన్నిరూపులై యేపునం బెనంగుచుండ 257

**ప్రతిపదార్థం:** శలుండును, ద్రౌపదీ పుత్రులన్= ఉపపాండవులను; ఏవురన్= ఐదుగురిని; ఐదైదు బాణంబులన్= అయిదేసి బాణాలతో; ఏసి= కొట్టి; మఱియును= ఇంకను; మార్గణ నికరంబులు= బాణాల గుంపును; నిగిడింపన్= వేయగా; వారు= ఆ ఉపపాండవులు; చలింపక= జంకకుండా; ఆ సౌమదత్తిన్= సోమదత్తుడి కుమారుడైన ఆ శల్యుడిని; ఒక్క+ఉమ్మడిన్= ఒక్కసారిగా; చుట్టుముట్టినన్= చుట్టుముట్టగా; అతండు= ఆ సౌమదత్తి; అందఱకున్= ఉపపాండవులందరికి; అన్ని రూపులై= అన్ని ఆకారాలతో; ఏపునన్= దట్టంగా; పెనంగుచుండన్= పోట్లాడుతుండగా.

**తాత్పర్యం:** శల్యుడు ఉపపాండవులు ఐదుగురిని ఒక్కొక్కరిని అయిదేసి బాణాలతో కొట్టి, ఇంకా బాణాల సమూహాన్ని సంధించగా ఆ ఉపపాండవులు చలించకుండా సౌమదత్తిని ఒక్కసారిగా కమ్ముకొనగా, అతడువారి కందరికీ అన్ని ఆకారాలతో కనబడుతూ గొప్పగా యుద్ధం చేశాడు.

చ. హరిసుతసూతి మావుల, బకాంతక సూనుఁడు చాపమున్, యుధి
ష్ఠిర తనయుండు గేతువు గడింది మగంటిమిఁ ద్రుంప సూతునిం
బొరిగొనియెన్ వెసన్ నకులపుత్రకుఁ; డిమ్మెయి జిక్కువడ్డఁ జె
చ్చెర సహదేవ నందనుఁడు సేసె శిరంబును మేను వేఱుగన్. 258

**ప్రతిపదార్థం:** హరిసుతసూతి= ఉపపాండవులలో అర్జునుడి కుమారుడు; మావులన్= గుర్రాలను; బకాంతక సూనుఁడు= భీముడి కుమారుడు; చాపమున్= విల్లును; యుధిష్ఠిర తనయుండు= ధర్మరాజు కుమారుడు; కేతువున్= ధ్వజమును; కడింది మగంటిమిన్= గొప్ప శౌర్యంతో; త్రుంపన్= త్రుంచివేయగా; వెసన్= వెంటనే; నకుల పుత్రకుఁడు= నకులుడి కుమారుడు; సూతునిన్= సారథిని; పొరిగొనియెన్= చంపాడు; ఈ+మెయిన్= ఈ విధంగా; చిక్కువడ్డన్= చిక్కులో పడగా; సహదేవనందనుఁడు= సహదేవుడి కుమారుడు; చెచ్చెరన్= శీఘ్రంగా; శిరంబును మేనున్= తలనూ, శరీరాన్ని; వేఱుగన్ చేసెన్= వేరయ్యేటట్లుగా చేశాడు.

**తాత్పర్యం:** ఉపపాండవులు శలుడిని చట్టుముట్టారు. వారిలో అర్జునుడి కుమారుడు గుర్రాలను, భీముడి కుమారుడు వింటిని, ధర్మరాజు కుమారుడు ధ్వజాన్ని - గొప్ప దర్పంతో త్రుంచగా, నకులుడి కుమారుడు చాలా వేగంగా సూతుడిని చంపివేశాడు. వాడు (సౌమదత్తి) చిక్కుపడగా సహదేవుడి కుమారుడు శీఘ్రంగా అతడి తలనూ శరీరాన్ని వేరు చేశాడు.

**సీ.** **వెస మారుతియు నలంబుసుఁడును బోరుచో । నద్దానవేంద్రుని యంప బలువు**
**చేత నతండు మూర్ఛిల్లి యాలోనన । తెలిసి కాటుకకొండ పోలుపు గెలుచు**
**నాతని మేను పెల్లలరిన మోదువు । తెఱఁగుగాఁ జేసిన నుఱక వాఁడు**
**మాయా విలాసోగ్ర కాయంబు గైకొని । యఖిల దిక్కులఁ దోఁచి నిఖిలబలము**

**తే.** **నుఱిపి నెత్తురు టేఱులు వఱపి 'భీమ । సేన! మా యన్న బకుని నా లేనిచోట**
**నట్లు సేసితి గాక, నీ యలవుఁ జలము । నింక మెఱయంగ వచ్చునె యేను గలుగ?'.** 259

**ప్రతిపదార్థం:** వెసన్= శీఘ్రంగా; మారుతియున్= భీముడును; అలంబుసుఁడున్= అలంబుసుడున్నూ; పోరుచోన్= యుద్ధం చేసేటప్పుడు; ఆ+దానవ+ఇంద్రుని= ఆ రాక్షసరాజు యొక్క; అంపబలువుచేతన్= బాణాల బలానికి; అతఁడు= భీముడు; మూర్ఛిల్లి= మూర్ఛపోయి; ఆలోనన= అంతలోనే; తెలిసి= తెలివి దెచ్చుకొని; కాటుక కొండ= నల్లని కాటుక వంటి కొండయొక్క; పొలుపున్= సొగసును; గెలుపు= జయించే; ఆతని మేనున్= ఆ అలంబుసుడి శరీరాన్ని; పెల్లు= గొప్పగా; అలరిన= చిగిర్చిన; మోదువు తెఱఁగుగాన్ చేసినన్= మోదుగు చెట్టు మాదిరిగా చేయగా (అనగా ఒంటినిండా గాట్లు అయ్యేటట్లుగా చేసి నెత్తురు చిందుతూ ఉంటే నల్లని శరీరంమీద ఆ నెత్తుటి గుర్తు పూచిన మోదుగు చెట్టు మాదిరిగా ఉన్నది); ఉఱక= లెక్కబెట్టక; వాఁడు= ఆ అలంబుసుడు; మాయావిలాస= మోసపు ఆటతో; ఉగ్రకాయంబు గైకొని= భయంకరమైన శరీరాన్ని పొంది; అఖిల దిక్కులన్+తోఁచి= అన్ని దిక్కులలోను కానబడి; నిఖిల బలము= సైన్యాన్నంతటినీ; ఉఱిపి= నాశనం చేసి; నెత్తురు ఏఱులు వఱపి= నెత్తురు నదులు ప్రవహింపజేసి; భీమసేనా!= ఓ భీమా!; నా లేని చోటన్= నేను లేని చోట; మా అన్న= నా కన్నగారు అయిన బకాసురుని; అట్లు+చేసితి గాక= ఆ విధంగా చేశావు గాక (అట్లా చంపావు గాక); నీ అలవున్ చలమున్= నీ బలం, పట్టుదల; ఏను+కలుగన్= నే నుండగా; ఇంకన్ మెఱయంగ వచ్చునె?= ఇంకా ప్రకాశింపగలదా?

**తాత్పర్యం:** ఆ సమయంలో భీముడు అలంబుసుడు యుద్ధం చేస్తుండగా ఆ రాక్షసరాజు బాణాలబలంవలన భీముడు మూర్ఛపోయి, అంతలోనే ఒడలు తెలిసి, కాటుకకొండ అందాన్ని జయించే నల్లని ఒడలు ఉండే ఆ రాక్షసుడి శరీరంమీద బాణాలు ప్రయోగించి, అది బాగా పూచిన మోదుగుచెట్టు మాదిరి కానవచ్చేటట్లు చేశాడు (నెత్తురు చిందేటట్లుగా దెబ్బలు కొట్టాడు). వాడు కూడా అది లెక్కపెట్టకుండా మోసపు క్రీడగా భయంకరమైన శరీరాన్ని పొంది, అన్ని దిక్కులలోను కనబడి సమస్త సైన్యాన్ని నులిపివేసి నెత్తురు ఏరులు ప్రవహింపచేసి, పరవుతూ 'ఓ భీమసేనా! మా అన్న బకాసురుడిని నేను లేనప్పుడు అట్లా చంపావు. ఇప్పుడు నే నున్నాను. నీ బలం, పట్టుదల ఇంక ప్రకాశించలేవు'.

**తే.** **అనిన విని కెంపు గనుఁగవ నడరఁ గినిసి । యుజ్జ్వల త్వష్ట్ర బాణప్రయోగమునఁ బ్ర**
**భంజనాత్మజుఁ డమ్మాయ వాయఁజేసి । తఱిమి యేసి యారక్కసుఁ బఱపె నధిప!** **260**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! - ధృతరాష్ట్రా!; అనినన్ విని= అలంబుసుడు అనగా విని; కనుఁగవన్= కనుదోయిలో; కెంపు= కోపం వలన కలిగే ఎర్రదనం; అడరన్= అతిశయించగా; కినిసి= కోపించి; ఉజ్జ్వల= బాగా మండే; త్వష్ట్ర బాణప్రయోగమునన్= బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించటంతో; ప్రభంజన+ఆత్మజుఁడు= వాయుదేవుడి కుమారుడైన భీముడు; ఆ+మాయన్= ఆ మోసాన్ని; పాయన్+చేసి= తొలగించి; ఆ రక్కసున్= ఆ రాక్షసుడిని; తఱిమి ఏసి= తరిమికొట్టి; పఱపెన్= పడవేశాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! అలంబుసుడి మాటలు విని, కోపంతో ఎర్రబడ్డ కళ్ళతో భీమసేనుడు మండే బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి ఆ రాక్షసుడిని తరిమికొట్టాడు.

**వ.** **ఇవ్విధంబున మనదిక్కునఁ జేయంగల దొరల చావును, నోటమియుం జూచి మూఁకలు గలంగినం గుంభసంభవుండు రోషసంరక్త లోచనుం డై తలకడచి సాత్యకి ప్రముఖ పాండవపక్షవీరులఁ గ్రూరనారాచ నిచయంబుల నిలువరించి నెఱయం బొలిచి నిలిచి మెఱయుటయును.** **261**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; మన దిక్కునన్= మన పక్షాన; చేయన్+కల దొరల= చేయనున్న వీరుల; చావును ఓటమియు= చనిపోవటం, ఓడిపోవటం; చూచి; మూఁకలు= సైన్యాలు; కలంగినన్= కలత చెందగా; కుంభసంభవుండు= ద్రోణుడు; రోషసంరక్త లోచనుండు+ఐ= కోపం వలన ఎర్రబారిన కనులతో; తలకడచి= ముందుకు సాగి; సాత్యకి ప్రముఖ పాండవ పక్షవీరులన్= సాత్యకి మొదలైన పాండవుల దిక్కులోనున్న మొనగాండ్రయిన వీరులను; క్రూరనారాచనిచయంబులన్= క్రూరమైన వాడి బాణాల సమూహంతో; నిలువరించి= ఆపి; నెఱయన్= వ్యాపింపజేస్తూ; పొలిచి నిలిచి= ప్రకాశించి నిలబడి; మెఱయుటయును= విజృంభించటమున్నూ.

**తాత్పర్యం:** (ఓరాజా!) ఈ విధంగా మన పక్షాన ఉన్న చేవగల రాజుల చావును, ఓటమినీ చూచి సైన్యాలు చెదరిపోగా ద్రోణుడు గమనించి, కోపంతో ఎర్రబడ్డ కనులు కలవాడై ముందుకుసాగి, సాత్యకి మొదలైన వీరులపై దాడిచేసి, వాడి బాణాల సమూహంతో వారిని నిలిపి విజృంభించాడు.

**చ.** **తఱిమి ఘటోత్కచుండు బలదర్పము లేర్పడ ద్రోణుమీఁద నే**
**డ్తెఱ నడతేరఁ గాంచి చనుదెంచి యలంబుసుఁ డమ్మహాసురుం**
**గుఱియుఁగఁ జేసి శాతశరకోటికి నడ్డము సొచ్చు సాత్యకిం**
**బిఱిఁదికిఁ ద్రోఁచి యద్దనుజు భీమతనూజుఁడు నొంచె నమ్ములన్.** **262**

**ప్రతిపదార్థం:** ఘటోత్కచుండు= భీముడి కొడుకైన ఘటోత్కచుడు; తఱిమి= తరుముకొని వచ్చి; బలదర్పములు+ఏర్పడన్= బలం, అహంకారం స్పష్టం కాగా; ద్రోణుమీఁదన్= ద్రోణాచార్యుడి మీద; ఏడ్తెఱన్= పరాక్రమంతో; నడతేరన్= నడచి రాగా; కాంచి= చూచి; అలంబుసుఁడు= అలంబుసుడు అనే రాక్షసుడు; చనుదెంచి= వచ్చి; ఆ+మహా+అసురున్= ఆ గొప్పరాక్షసుడిని; గుఱియుఁగన్ చేసెన్= బాణాలకు లక్ష్యమయ్యేటట్లుగా చేశాడు (అనగా కొట్టాడు); అడ్డము చొచ్చు= అడ్డంగా వచ్చే (ఘటోత్కచుడికి దెబ్బ తగలకుండా అడ్డంగా వచ్చే); సాత్యకిన్= సాత్యకిని; భీమ తనూజుఁడు= భీముడి కుమారుడైన ఘటోత్కచుడు; పిఱిఁదికిన్+త్రోఁచి= వెనక్కు త్రోసి; ఆ+దనుజున్= ఆ అలంబుసుడిని; అమ్ములన్= బాణాలతో; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** తన బలదర్పాలు స్పష్టం కాగా ఘటోత్కచుడు ద్రోణుని మీదికి రావటం చూచి అలంబుసుడు ఘటోత్కచుడిని వాడి బాణాలకు గురి అయ్యేటట్లుగా చేశాడు. దానిని అడ్డుకోవటానికి వచ్చే సాత్యకిని వెనుకకు త్రోసి, ఘటోత్కచుడు ఆ రాక్షసుడిని బాణాలతో నొప్పించాడు.

**అలంబుసుండు ఘటోత్కచునితో యుద్ధము సేసి చచ్చుట (సం. 7-84-1)**

**తే. భూరి చక్రంబు వెస నలంబుసుఁడు వైవఁ। బెలుచ గద వైచి పొడి సేసె భీమసుతుఁడు**
**కడుఁదురులు గవిసి కఱచు కరణి యయ్యె। మూఁక నత్తునియలు వెసఁ దాఁకు నపుడు. 263**

**ప్రతిపదార్థం:** అలంబుసుఁడు= అలంబుసుడు; వెసన్= శీఘ్రంగా; భూరి= పెద్దదయిన; చక్రంబు వైవన్= పెద్ద చక్రంవంటి ఆయుధాన్ని వేయగా; భీమసుతుఁడు= భీముడి సుతుడైన ఘటోత్కచుడు; పెలుచన్= అనాయాసంగా; గద వైచి= గదను వేసి; పొడిచేసెన్= ఆ చక్రాయుధాన్ని చూర్ణం చేశాడు; ఆ+తునియలు= ఆ చక్రాయుధపు ముక్కలు; మూఁకన్= సైన్యాన్ని; వెసన్= శీఘ్రంగా; తాఁకునపుడు= తగిలేటప్పుడు; కడుఁదురులు= కందిరీగలు; కవిసి= క్రమ్ముకొని; కఱచు కరణి= కరిచేవిధం; అయ్యెన్= అయింది.

**తాత్పర్యం:** అలంబుసుడు ఒక పెద్ద చక్రాయుధాన్ని వేయగా, ఘటోత్కచుడు దానిని పెద్ద గదతో పొడి చేశాడు. ఆ తునిగిన చక్రాయుధపు పొడి సైన్యాన్ని శీఘ్రంగా తాకేటప్పుడు కందిరీగలు క్రమ్ముకొని కుట్టినట్లు అయింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఆ చక్రం బ ట్లయిన ని। శాచరపతి వివిధ శక్తిజాలము వఱపం**
**జూచి ఘటోత్కచుఁ డది వ। మ్మై చెడ నర్ధేందుశరచయం బడరించెన్. 264**

**ప్రతిపదార్థం:** ఆ చక్రంబు+అట్లయినన్= ఆ చక్రం ఆ విధంగా కాగా (పొడి కాగా); నిశాచరపతి= రాక్షసరాజైన అలంబుసుడు; వివిధ శక్తిజాలమున్= అనేక రకాలయిన బలం కల మాయలను; వఱపన్= వేయగా; చూచి; ఘటోత్కచుఁడు= ఘటోత్కచుడు; అది= ఆ మాయాజలం; వమ్ము+ఐ చెడన్= వృథా అయిపోగా; అర్ధ+ఇందు శరచయంబు= అర్ధచంద్రాకారంగల బాణాల గుంపును; అడరించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ప్రయోగించిన చక్రం వ్యర్థమై పోగా అలంబుసుడు పలురకాలయిన మాయలను ప్రయోగించాడు. ఆ మాయలు వృథా అయిపోయేటట్లు ఘటోత్కచుడు అర్ధచంద్రబాణాల సమూహాన్ని ప్రయోగించాడు.

**వ. ఇట్లు దొడంగి యయ్యిరువురు దానవేశ్వరులును. 265**

**తాత్పర్యం:** ఆ ఇద్దరు రాక్షసరాజులు ఆ విధంగా పూనుకొని.

**మ. బహుహేతి ప్రకరంబులన్ బహువిధోపాయంబులన్ విస్ఫుర**
**ద్బహు మాయాకృత రూపజాలముల శుంభద్వీర సంరూఢిమై**
**మహి యల్లాడఁగఁ బోరఁ బాండుతనయుల్ మాత్సర్యధుర్యాత్ము లై**
**సహితోద్యోగత నయ్యలంబుసు శరచ్ఛన్నాంగునిం జేసినన్. 266**

**ప్రతిపదార్థం:** బహుహేతి ప్రకరంబులన్= అనేక రకాలైన ఆయుధాలతో; బహువిధ+ఉపాయంబులన్= ఎన్నో మాయలతో; విస్ఫురత్= స్పష్టమైన; బహు మాయాకృత రూప జాలములన్= పెను మాయలతో కూడిన మాయ వేషాలతో; శుంభత్+వీర సంరూఢిమైన్= భయంకరమైన వీర లక్షణంతో; మహి+అల్లాడఁగన్= భూమి వణకగా; పోరన్= యుద్ధంలో; పాండు తనయులు=

ఉపపాండవులు; మాత్సర్య ధుర్యాత్ములై= అసూయతో నిండుకొన్న మనస్సు కలవారై; సహిత ఉద్యోగతన్= కూడిన ప్రయత్నంతో; ఆ+అలంబుసున్= ఆ అలంబుసుడిని; శరచ్ఛన్న+అంగునిన్+చేసినన్= బాణాలతో కప్పబడిన శరీరం కలవాడినిగా చేయగా.

**తాత్పర్యం:** పెక్కురకాలయిన ఆయుధాలతో, నానావిధ ఉపాయాలతో, ఎన్నో మాయాజాలాలతో భూమి అల్లాడగా అమిత దర్పంతో ఆ యిద్దరు యుద్ధం చేయగా, ఉపపాండవులు ప్రతీకారం నిండుకొన్న మనసులతో, అలంబుసుడి, శరీరాన్ని బాణాలతో కప్పివేయగా.

**సీ. అతఁడు మాయాబలోద్ధతి నా శరావలి । మొఱఁగి దావానల ముక్త మైన**
**కరి విధంబున మ్రోఁగి యిరువదేనమ్ముల । ననిలజు, ధర్మనందను మూఁట,**
**సహదేవు ద్రౌపదీ సంభవులను హిడిం । బాసుతు నైదైదు బాణములను,**
**నకులు డెబ్బది మూఁటఁ, బ్రకట విక్రమ మొప్ప । నేసి యార్చిన, నల్గి యింతవట్టు**

**తే. రథికవరులును గిట్టి మార్గణ చయంబు । లొక్కమొగిఁ దొరఁగింప వాఁ డుఱక యేటు**
**లాడఁ గదిసి ఘటోత్కచుఁ డతని సూతుఁ । ద్రుంచి యరదంబు రూ పడఁగించె నధిప! 267**

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! - (ధృతరాష్ట్రా!); అతఁడు= ఆ అలంబుసుడు; మాయాబల+ఉద్ధతిన్= మాయాబలం యొక్క దర్పంతో; ఆ శర+ఆవలిన్= ఆ బాణాల వరుసను; మొఱఁగి= మోసంచేసి; దావానల= కార్చిచ్చు నుండి; ముక్తము+ఐన= వదలబడిన కరివిధంబునన్= ఏనుగు మాదిరి; మ్రోఁగి= శబ్దం చేసి (ఘీంకారం చేసి); ఇరువది+ఏనమ్ములన్= ఇరవై అయిదు బాణాలతో; అనిలజున్= భీముడిని; ధర్మనందనునిన్= ధర్మరాజును; మూఁటన్= మూడింటితోను; సహదేవున్= సహదేవుడిని; ద్రౌపదీ సంభవులను= ఉపపాండవులను; హిడింబాసుతున్= ఘటోత్కచుడిని; ఐదైదుబాణములను= అయిదైదు బాణాలతోను; నకులున్= నకులుడిని; డెబ్బదిమూఁటన్= డెబ్బయిమూడు బాణాలతో; ప్రకటవిక్రమము+ఒప్పన్= శౌర్యం తెలియగా; ఏసి= కొట్టి; ఆర్చినన్= అరువగా (సింహనాదం చేయగా); అల్గి= కోపించి; ఇంతవట్టు= ఇంతమాత్రం; రథికవరులును= సేనానులును; కిట్టి= సమీపించి; మార్గణ చయంబులు= అంపసమూహాన్ని; ఒక్క మొగిన్= ఒకే వరుసగా (మొత్తంగా); తొరఁగింపన్= ఏయగా; వాఁడు= ఆ అలంబుసుడు; ఉఱక= లక్ష్యపెట్టక; ఏటులు+ఆడన్= కొట్టగా; కదిసి= దగ్గరగా చేరి; ఘటోత్కచుఁడు= ఘటోత్కచుడు; అతని సూతున్+త్రుంచి= ఆ అలంబసుడి సారథిని చంపి; అరదంబున్= తేరును; రూపు+అడఁగించెన్= నాశనం చేశాడు.

**తాత్పర్యం:** అలంబుసుడు తన మాయాజాలంతో ఆ బాణాలను తప్పించుకొని, కార్చిచ్చు నుండి వెలువడిన ఏనుగు మాదిరిగా, ఘీంకరిస్తూ, భీముడిని ఇరవై అయిదు బాణాలతోను, ధర్మరాజును మూడు బాణాలతోను, ఉపపాండవులనూ, సహదేవుడినీ, ఘటోత్కచుడినీ ఇరువది అయిదు బాణాలతోను, నకులుని డెబ్బది మూడు బాణాలతోను తన దర్పం తెలిసేటట్లుగా కొట్టి సింహనాదం చేశాడు. దీనికి కోపించి సేనానులు వాడిని ఎదుర్కొని ఒక్క వరుసన బాణాలు వేయగా, వాడు వారిని లక్ష్యపెట్టక కొట్టుతుండగా, ఘటోత్కచుడు అతడికి దగ్గరగా చేరి సారథినీ, గుర్రాలనూ, తేరునూ నాశనం చేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు విరథుం డయి యలంబుసుం డిలకు లంఘించి మాయ గైకొని సాయకాసారంబు ఘోరంబుగాఁ గురిసిన నమ్మారుతి సుతుండును దేరు డిగ్గి యగ్గలం బగు మాయాకృతమార్గణ జాలంబున నది దూలించి గదవైచిన, నక్కిమ్మీరానుజుండు పీడితుండై ఖడ్గంబు గొని గగనతలంబున కెగయుటయు, హిడింబ కొడుకును గృపాణపాణి యై తోడన యెగసె; నయ్యిరువురును సుడిగాడ్పునం దొడరి తిరుగుడు మొగిళ్ళ చాడ్పున నొప్పి యెరకుఁ బెనంగు డేగల చందంబునఁ జిత్రగతులం బోరి పోరి భూతలగతులై యుబ్బునం**

**దలపడిన బెబ్బులుల కరణి నొండొరుల మేనులు నెత్తుట జొత్తిల్లం జేసి పాసి యొకళ్ళొకళ్ళ కంఠంబులు లక్ష్యంబుగాఁ గరవాలంబులు వైవ, నవి యొండొకటం దాఁకి మండుచు మహిం బడిన, మల్లయుద్ధ సన్నద్ధు లై కిట్టుచుంబట్టుచు, బాయుచు వ్రేయుచు నొడుచుచుం బొడుచుచు మఱియు ననేక ప్రకారంబుల వీరత్వంబును విశారదత్వంబును సేనలకు వెఱఁగు పుట్టింపం బోరాడి; రట్టియెడ బకావరజుండు డస్సినం బవమాన పౌత్రుండు పడవైచి, తాను మీఁదై జానుకూర్పర ముష్టి ఘాతంబులు నిర్ఘాత పాతంబులుం బోలెఁ బ్రయోగించి నొప్పించి యతని తొడలు నెమ్ములు నొక్కుమ్మడిం బొడి పొడి సేసి నుఱిపిడికిం జొచ్చిన ప్రబల హాలికుని లీల నేలం బెట్టి కాలం జమరి చంపి పొంపిరివోవు మగంటిమిం బేర్చి యార్చినం బాండవ బలంబుల సింహనాదంబులుఁ దూర్యనినదంబులున్ జెలంగె నప్పు డా ఘటోత్కచుండు ధర్మనందనున కభివందనంబు సేసిన, నతండు సంతుష్టాంతరంగుండై యాలింగనంబును మూర్ధాఘ్రాణంబును జేసి యగ్గించె' ననిన విని యాంబికేయుండుసంజయున కిట్లనియె.** **268**

**ప్రతిపదార్థం:** ఇట్లు విరథుండు+అయి= ఈ విధంగా తేరు లేని వాడై; అలంబుసుఁడు= అలంబుసుడనే వాడు; ఇలకున్ లంఘించి= భూమిమీదకు దూకి; మాయగైకొని= మోసమైన వేషాన్ని పొంది (ఇంద్రజాలికుడి మాదిరి); సాయకా సారంబున్= బాణాల జడివానను; కురిసినన్= కురిపించగా; ఆ+మారుతి సుతుండును= ఆ భీమసేనుడి కుమారుడైన ఘటోత్కచుడును; తేరు డిగ్గి= తన తేరు నుండి దిగి; అగ్గలంబు+అగు= ఎక్కువైన; మాయాకృత= మోసంచేత చేయబడిన; మార్గణజాలంబునన్= బాణ సమూహంతో; అది= ఆ అలంబుసుడి మాయను; దూలించి= ఎగురగొట్టి; గదవైచినన్= గదతో కొట్టగా; ఆ+కిమ్మీర+అనుజుండు= ఆ కిమ్మీరుడి తమ్ముడు; పీడితుండు+ఐ= బాధపెట్టబడి; ఖడ్గంబు కొని= కత్తి తీసికొని; గగనతలంబునకున్= ఆకాశానికి; ఎగయుటయున్= ఎగురుటయు; హిడింబకొడుకును= హిడింబ కుమారుడైన ఘటోత్కచుడును; కృపాణపాణి ఐ= కత్తి చేతగలవాడై; తోడన= వెంటనే; ఎగసెన్= పైకి ఎగిరాడు; ఆ+ఇరువురును= ఆ ఇద్దరును; సుడిగాడ్పునన్= సుడిగాలిలో; తొడరి= ఎదుర్కొని; తిరుగుడు పడు= సుళ్ళు తిరిగే; మొగిళ్ళ చాడ్పునన్= మేఘాల మాదిరిగా; ఒప్పి= తగి; ఎరకున్= ఆహారానికై; పెనంగు= పోట్లాడే; డేగల చందంబునన్= డేగల మాదిరి; చిత్రగతులన్= అనేక విధాలైన కదలికలతో; పోరిపోరి= పోట్లాడి, పోట్లాడి; భూతలగతులు+ఐ= భూమి మీదకు దూకి; ఉబ్బునన్= ఉత్సాహంతో; తలపడిన= ఎదుర్కొన్న; బెబ్బులుల కరణిన్= పెద్ద పులుల మాదిరి; ఒండొరుల మేనులు= ఒక్కొక్కరి శరీరాలు; నెత్తుటన్= నెత్తురులో; జొత్తిల్లన్= ఎర్రబడగా; చేసి= చేసి; పాసి= తప్పుకొని; ఒకళ్ళొకళ్ళ కంఠంబులు= ఒకడు మరియొకడి కుత్తుకను; లక్ష్యంబుగాన్= లక్ష్యంగా; కరవాలంబులు వైవన్= కత్తులు విసరగా; అవి= ఆ కత్తులు; ఒండొకటిన్+తాఁకి= ఒకదానిని ఇంకొకటి తాకి; మండుచున్= మంటమండుతూ; మహిన్+పడినన్= భూమిమీద పడగా; మల్లయుద్ధ సన్నద్ధులు+ఐ= మల్లయుద్ధానికి సిద్ధపడి; కిట్టుచున్= దగ్గరకు చేరుతూ; పట్టుచున్= ఒకరినొకరు పట్టుకొనుచు; పాయుచున్= దూరంగా పోతూ; వ్రేయుచున్= కొట్టుతూ; ఒడుచుచున్= ఓడిస్తూ; పొడుచుచున్= పోటు పొడుస్తూ; మఱియు అనేక ప్రకారంబులన్= ఇంకా అనేక విధాలుగా; వీరత్వంబును= శౌర్యాన్ని; విశారదత్వంబును= నేర్పరితనాన్ని; సేనలకున్= ఇరువాగు సైన్యానికి; వెఱఁగు= ఆశ్చర్యం; పుట్టింపన్= కలిగించగా; పోరాడిరి= యుద్ధం చేశారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో; బక+అవరజుండు= బకుడి కంటె చిన్నవాడు (బకుడి తమ్ముడు); డస్సినన్= అలసిపోగా; పవమాన పౌత్రుండు= వాయుదేవుడి మనుమడు (అనగా ఘటోత్కచుడు); పడవైచి= క్రిందకు త్రోసి; తాను మీఁదై= తాను పైన కూర్చుండి; జాను= మోకాలి; కూర్పర= మోచేతి; ముష్టి= పిడికిలి యొక్క; ఘాతంబులు= పోట్లు; నిర్ఘాతపాతంబులున్ పోలెన్= పిడుగుపాట్లవలె; ప్రయోగించి= చేసి; నొప్పించి= బాధపెట్టి; అతని= ఆ అలంబసుడి; తొడలు= తొడలును; ఎమ్ములున్= ఎముకలును; ఒక్క+ఉమ్మడిన్= ఒక్కసారిగా; పొడి పొడిచేసి= నుగ్గు నుగ్గుగా చేసి; ఉఱిపిడికిన్= పంట ఊర్పిడికి; చొచ్చినన్= చొరబడిన; ప్రబల హాలికుని లీలన్= పెద్దరైతు వలె; నేలన్+పెట్టి= నేలమీదపెట్టి; కాలన్ చమరి= కాలితో రాచి; చంపి= చంపివేసి; పొంపిరిపోవు= అతిశయించిన; మగంటిమిన్= మగతనంతో (శౌర్యంతో); పేర్చి ఆర్చినన్= విజృంభించి సింహనాదం చేయగా; పాండవ బలంబుల= పాండవసైన్యం యొక్క; సింహనాదంబులున్= సింహనాదాలును (పెనుబొబ్బలు); తూర్యనినదంబులున్= వాద్యాల ఘోషలు; చెలంగెన్= ధ్వనించినవి; అప్పుడు+ఆ ఘటోత్కచుండు= అప్పుడు

ఆ ఘటోత్కచుడు; ధర్మనందనునకున్= ధర్మరాజుకు; అభివందనంబు చేసినన్= నమస్కారం చేయగా; అతండు= ఆ ధర్మరాజు; సంతుష్ట+అంతరంగుండు+ఐ= సంతోషంతో నిండిన మనస్సు కలవాడై; ఆలింగనంబును= కౌగిలింతయు; మూర్ధ+ఆఘ్రాణంబును= శిరస్సును ముద్దుగొనుటయు (పిల్లలను దగ్గరికి చేరదీసి తల్లిదండ్రులు వారి శిరస్సులను ముద్దు పెట్టుకొనటం ఒక అలవాటు); చేసి; అగ్గించెను= కీర్తించాడు; అనినన్= అని చెప్పగా; విని= విన్నవాడై; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఈ విధంగా రథం లేని అలంబుసుడు నేలమీదకు దూకి బాణాల జడివాన కురిపించగా ఘటోత్కచుడు కూడ తేరు దిగి పెనుమాయతో అధిక బాణ సమూహంతో అలంబుసుడి మాయను ఎగురగొట్టి గదతో కొట్టాడు. అందు కా కిమ్మీరుడి తమ్ముడు బాధపడి, కత్తి చేతబట్టి ఆకాశాని కెగిరాడు. ఘటోత్కచుడు కూడా వెంటనే కత్తితో పైకెగశాడు. ఆ ఇద్దరూ సుడిగాలి తాకిడికి తిరుగుడు పడే మేఘాల మాదిరి, ఆహారానికై పోట్లాడే డేగల మాదిరి, అనేక విధాలుగా పోట్లాడి, పోట్లాడి భూమి మీదకు దిగి, దర్పంతో ఎదుర్కొన్న పెద్ద పులుల మాదిరి ఒకళ్ళొకళ్ళ శరీరాలు నెత్తుటిలో ఎఱ్ఱబడగా కలియబడి, తప్పుకొని, ఒకరి కుత్తుక మరియొకరు లక్ష్యంగా చేసుకొని, కత్తులు విసరుకోగా, అవి ఒకదానినొకటి తాకి మండుతూ భూమిమీద పడ్డాయి. అప్పుడు వారు మల్లయుద్ధానికి సిద్ధమై దగ్గరకు చేరుతూ ఒకరినొకరు పట్టుకొంటూ, తప్పుకొంటూ, పొడుస్తూ - తమ శౌర్యం, నేర్పరితనం ఇరువైపుల సేనకు ఆశ్చర్యం కలిగించగా పోట్లాడారు. ఆ సమయంలో బకాసురుడి తమ్ముడు (అలంబుసుడు) అలసిపోగా, వాయుదేవుడి మనుమడు (ఘటోత్కచుడు) అలంబుసుడిని కిందకుత్రోసి తాను మీద కూర్చుని పిడుగు పాట్లవలె మోకాలితోను, మోచేతితోను, పిడికిలితోను పోట్లు పొడిచి, బాధపెట్టి, వాడి తొడలు ఎముకలు ఒక్కసారిగా చూర్ణం చేసి పంట నూర్పిడికి ప్రయత్నించిన పెద్ద వ్యావసాయకుడి మాదిరి నేలపై బెట్టి, కాలితో రాచి చంపి ఎక్కువైన మగతనంతో సింహనాదం చేశాడు. దానితో పాండవ సైన్యంలో సింహనాదాలు, వాద్యశబ్దాలు చెలరేగాయి. ఆ సమయంలో ఘటోత్కచుడు ధర్మరాజునకు నమస్కారం చేయగా, ఆయన సంతుష్టమనస్కుడై కౌగిలించుకొని, నెన్నుదురును ముద్దుపెట్టుకొన్నాడు, పొగిడాడు.' అని చెప్పిన మాటలకు ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలం: ఉపములు.

**ఉ. 'అంతకు మున్ ఘటోత్కచున కడ్డము సాత్యకి సొచ్చె నంటి వాఁ**
**డంతకసన్నిభుండు గురుఁ డద్భుత విక్రముఁ డద్దెసన్ సము**
**ద్దాంతతఁ బేర్చి వార లటు దార్కొని మిన్నక పోవ నేర్తురే?**
**కొంతయినన్ రణంబు గలుగుం; గలభంగి యెఱుంగఁ జెప్పుమా!' 269**

**ప్రతిపదార్థం:** అంతకు మున్= అంతకు ముందే; ఘటోత్కచునకున్= ఘటోత్కచుడికి; అడ్డము= అడ్డంగా (సహాయంగా); సాత్యకి చొచ్చెన్+అంటివి= సాత్యకి చొరబడ్డా డన్నావు; వాఁడు= ఆ సాత్యకి; అంతక సన్నిభుండు= యముడితో సమానమైనవాడు; గురుఁడు= ద్రోణాచార్యుడు; అద్భుత విక్రముఁడు= ఆశ్చర్యాన్ని గొలిపే శౌర్యం కలవాడు; ఆ+దెసన్= ఆ దిక్కులో; సముద్దాంతతన్= సాటిలేని గొప్పతనంతో; పేర్చి= విజృంభించి; వారలు= ఆ ఇద్దరు; అటు= ఆ విధంగా; తార్కొని= ఎదుర్కొని; మిన్నక పోవ నేర్తురే?= ఊరకే పోతారా?; కొంతయినన్= కొంచెమైనా; రణంబు= యుద్ధం; కలుగున్= జరిగి ఉంటుంది; కలభంగిన్= ఉన్న విధాన్ని; ఎఱుంగన్ చెప్పుమా!= తెలియజెప్పుమా!

**తాత్పర్యం:** 'అంతకు ముందుగానే ఘటోత్కచుడిని ఆదుకోటానికి సాత్యకి అడ్డం వచ్చా డన్నావు. సాత్యకియముడితో సమానుడు. గురువైన ద్రోణాచార్యుడు మహావిక్రముడు. అటువంటప్పుడు వారిద్దరు ఎదుర్కొంటే ఊరకే ఉండరు కదా!

కొంతయినా యుద్ధం సాగి ఉంటుంది. అది ఎట్లా జరిగిందో ఉన్న దున్నట్లుగా తెలియజేయుము' అని ధృతరాష్ట్రుడు సంజయుడిని అడిగాడు.

**వ. అనవుడు నా సూతనందనుం డతని కిట్లను 'సాత్యకి దఱిమి మన మొన నుఱుము సేయం దొడంగిన ద్రోణుండు మార్కొని యిరువదేను కుప్పెకోలల నతని చేత నేటులు వడి మూఁడు నారసంబుల నతని నొప్పించె; నయ్యాదవ వీరుండు పంచాశద్బాణంబుల నొంచిన ధనుర్గురుండు దొమ్మిది యమ్ములెమ్ములం గీలించి. 270**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; ఆ సూతనందనుండు= ఆ సంజయుడు; అతనికిన్= ఆ ధృతరాష్ట్రునితో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; సాత్యకి; తఱిమి= తరిమి వేస్తూ; మన మొనన్= మన సైన్యాన్ని; నుఱుముచేయన్+తొడంగినన్= పొడి చేయటానికి మొదలు పెట్టగా; ద్రోణుండు; మార్కొని= ఎదుర్కొని; ఇరువది+ఏను= ఇరవై అయిదు; కుప్పెకోలలన్= విశేషపు బాణాలతో; అతని చేతన్= ఆ సాత్యకివలన; ఏటులుపడి= దెబ్బలు తిని; మూఁడు నారసంబులన్= మూడు వాడి బాణాలతో; అతనిన్= ఆ సాత్యకిని; నొప్పించెన్= బాధపెట్టాడు; ఆ+యాదవ వీరుండు= ఆ యాదవ సేనాని; పంచాశద్బాణంబులన్= ఏబది బాణాలతో; నొంచినన్= నొప్పించగా; ధనుర్గురుండు= ధనురాచార్యుడు (ద్రోణుడు); తొమ్మిది అమ్ములన్= తొమ్మిది బాణాలను; ఎమ్ములన్= ఎముకలకు; కీలించి= తగిలించి (అనగా కొట్టి).

**తాత్పర్యం:** సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు: 'సాత్యకి మనసేనను తరిమి చూర్ణం చేయటం మొదలుపెట్టగా, ద్రోణాచార్యుడు అతడిని ఎదుర్కొని, అతనిచేత ఇరువది అయిదు ప్రత్యేక బాణాల దెబ్బలు తిని, ఆ బాణాలకు ప్రతిగా మూడు వాడి బాణాలతో అతడిని తిరిగి కొట్టాడు. అందుకు సాత్యకి యాభై బాణాలతో ద్రోణుని నొప్పించాడు. అప్పుడు ద్రోణుడు తొమ్మిది బాణాలతో కొట్టి.

**క. మఱియును శరశతకము మెయిఁ । గిఱికొలిపిన వృష్ణి వరుఁడు గినియఁగ లే కే**
**పఱి యున్నఁ జూచి యార్చుచు । మెఱసిరి నీ తనయు లుబ్బు మిగిలి నరేంద్రా! 271**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= ఓ రాజా!; మఱియును= ఇంకను; శరశతకము= నూరుబాణాలను; మెయిన్= ఒడలిమీద; గిఱికొలిపినన్= చుట్టూ చుట్టుకొనేటట్లు చేయగా; వృష్ణివరుఁడు= సాత్యకి; కినియఁగన్ లేక= కోపించ లేక; ఏపు+అఱి+ఉన్నన్= విజృంభించలేక ఉండగా; చూచి ఆర్చుచున్= చూచి సింహనాదం చేస్తూ; నీ తనయులు= నీ కుమారులు; ఉబ్బు మిగిలి= గర్వం ఎక్కువై; మెఱసిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** ఓ రాజా! ఇంకా సాత్యకి శరీరంమీద నూరు బాణాలను ప్రయోగించాడు. ఏమీ చేయలేక, కోపాన్ని చూపలేక, శక్తిలేక ఉన్న సాత్యకిని చూచిన నీ కుమారులు పెనుబొబ్బలు పెట్టుతూ ఉత్సాహంతో ప్రకాశించారు.

**వ. అప్పుడు వినియును గనియును ధర్మతనయుండు ధృష్టద్యుమ్నాది యోధవరుల నాలోకించి. 272**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; ధర్మతనయుండు= ధర్మరాజు; వినియును= సాత్యకి స్థితిని గురించి విని; కనియును= కళ్ళారాచూచి; ధృష్టద్యుమ్న+ఆది= ధృష్టద్యుమ్నుడు మొదలైన; యోధవరులన్= వీరశ్రేష్ఠులను; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఆ సమయంలో విని, చూచి ధర్మరాజు ధృష్టద్యుమ్నుడు మొదలైన సైనిక శ్రేష్ఠులను చూచి.

**ఆ. 'పులుఁగు ద్రాటఁ గట్టి యలయించి యాడెడు । బాలునట్ల పోలె బాణగురుఁడు**
**గడఁగి కృష్ణననుజుఁ గాఱించుచున్న వాఁ । డతనిఁ బొదువుఁ; డితని కడ్డపడుఁడు. 273**

**ప్రతిపదార్థం:** పులుఁగున్= పిట్టను; త్రాటన్+కట్టి= త్రాటితో కట్టి; అలయించి= బాధించి; ఆడెడు= ఆటలాడు; బాలున్ అట్లపోలెన్= పసివాడి మాదిరి; బాణగురుఁడు= ధనురాచార్యుడు (ద్రోణుడు); కడఁగి= పూనుకొని; కృష్ణు+అనుజునిన్= సాత్యకిని (కృష్ణుడి తమ్ముడిని); కారించుచున్+ఉన్నవాఁడు= కష్టపెడుతున్నాడు; అతనిన్ పొదువుఁడు= ఆ ద్రోణాచార్యుడిని క్రమ్ముకొనుడు; ఇతనికిన్= సాత్యకికి; అడ్డపడుఁడు= అడ్డంపడండి.

**తాత్పర్యం:** 'ఒక పసిబాలుడు పిట్టకు త్రాడుకట్టి బాధించి ఆట్లాడేటట్లుగా ద్రోణుడు సాత్యకిని కష్టపెడుతూ ఆడుతూ ఉన్నాడు. అతడిని క్రమ్ముకొనండి; ఇతడికి అడ్డుపడండి.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **భీమసేన పురస్సరులై కవియుం' డనుచుం దానును దఱుముటయు, నా సైనికోత్తములు సాత్యకిం గడచి యాచార్యుం గదిసిన.** **274**

**ప్రతిపదార్థం:** భీమసేన పురఃసరులు+ఐ= భీముడిని ముందుంచుకొన్నవారై; కవియుండు= క్రమ్ముకొనండి; అనుచున్= అంటూ; తానును= తానుకూడా; తఱుముటయున్= ముందుకు పొండని ప్రోత్సహించగా; ఆ సైనిక+ఉత్తములు= ఆ సైనికవీరులు; సాత్యకిన్+కడచి= సాత్యకిని దాటి; ఆచార్యున్= ద్రోణుడిని; కదిసినన్= సమీపించగా.

**తాత్పర్యం:** భీమసేనుడిని ముందుంచుకొని క్రమ్ముకొనండి' అంటూ తానుకూడా తరుముటచేత ఆ సైనికశ్రేష్ఠులు సాత్యకిని దాటి ఆచార్యుడిని ఎదుర్కొనగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **విందులఁ గనిన ట్లాతఁడు । మందస్మితుఁడై యెదిర్చి మార్గణజాల**
**స్పందితులఁ జేసె వారల । నందఱ; కవ్విధము రోమహర్షణ మయ్యెన్.** **275**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= ద్రోణాచార్యుడు; విందులన్= అతిథులను; కనినట్లు= చూచినట్లుగా; మందస్మితుఁడు+ఐ= చిరునగవుతో; ఎదిర్చి= ఎదిరించి; మార్గణజాల= బాణాలగుంపుతో; స్పందితులన్= కదలునట్లుగా; వారలన్ చేసెన్= వారందరినీ చేశాడు; ఆ+విధము= ఆ పద్ధతి; అందఱకున్= అక్కడున్న వారందరికీ; రోమహర్షణము అయ్యెన్= శరీరం పులకరించి నట్లయింది.

**తాత్పర్యం:** భీమసేనాదులు తనపైకి ఎత్తి రాగా, ద్రోణుడు చిరునవ్వుతో ఎదుర్కొని అతిథులను చూచినట్లుగా సంతోషించి, వారందరు స్పందించునట్లు బాణాలను ప్రయోగించాడు. ఆ పద్ధతి వారందరికి పులకరింతను కలిగించింది.

**వ.** **అట్టి యెడ.** **276**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**క.** **ఇరువది యేవురు పాంచా । లురు, నూర్వురు కేకయులును లూనాంగకు లై**
**ధరఁ దొరఁగిరి పెఱమొత్తము । కరినికరము రొంపిఁ బడిన గతి నుండె నృపా!** **277**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; ఇరువది ఏవురు పాంచాలురు= పాంచాల దేశస్థులు ఇరవై ఐదుమంది; కేకయులు నూర్వురును= కేకయ దేశం వారు నూరుమంది; లూన+అంగకులై= తునిసిన శరీరాలు కలవారుగా (ముక్కలైన శరీరాలతో); ధరన్= భూమిమీద; తొరఁగిరి= పడ్డారు; పెఱ మొత్తము= శత్రువులు అందరు; కరినికరము= ఏనుగుల గుంపు; రొంపిన్= బురదలో; పడిన గతిన్ ఉండెన్= పడినట్లుగా ఉన్నారు.

**తాత్పర్యం:** ఓ రాజా! (ధృతరాష్ట్రా!) పాంచాలురు ఇరువది ఐదుమంది, కేకయులు నూర్గురు, శరీరాలు తునిగి భూమిమీద పడ్డారు. మిగిలిన వారు ఏనుగుల గుంపు బురదలో పడినట్లుగా అయినారు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు ద్రోణుండు బరవసంబు సేసినం బాండవయోధులు పైఁ బెట్టంజాలక సొలసియున్న సమయంబునం బాంచజన్య ధ్వని విని యుధిష్ఠిరుం డక్కడ నాలించి గాండీవ ఘోషణంబు గర్ణగోచరంబు గామికి మనంబు గలంగ నెలుంగు గుత్తుకం దగుల సాత్యకితో ని ట్లనియె. 278**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; బరవసంబు చేసినన్= పూనికతో యుద్ధం చేయగా; పాండవయోధులు= పాండవ వీరులు; పైన్+పెట్టన్+చాలక= ముందుకు పోలేక; సొలసి ఉన్న= మూర్ఛపోయి ఉన్న; సమయంబునన్= వేళలో; పాంచజన్య ధ్వని విని= పాంచజన్యం అనే శంఖం యొక్క మ్రోత విని (కృష్ణుడి శంఖధ్వని); యుధిష్ఠిరుండు= ధర్మరాజు; అక్కడ= ఆ సమయంలో; ఆలించి= విన్నవాడై; గాండీవ గుణ ఘోషణంబు= గాండీవ మనే వింటియొక్క అల్లెత్రాటి శబ్దం; కర్ణగోచరంబు కామికిన్= చెవికి వినరాకపోగా; మనంబు కలంగన్= మనసు చీకాకుపడగా; ఎలుంగు= గొంతు; కుత్తుకన్ తగులన్= బొంగురు పోగా; సాత్యకితోన్+ఇట్లు+అనియెన్= సాత్యకితో ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** ఈ విధంగా ద్రోణాచార్యుడు పూనికతో యుద్ధం చేయగా పాండవ వీరులు ముందడుగు పెట్టలేక మూర్ఛపోయి ఉన్న సమయంలో పాంచజన్యంయొక్క మ్రోత వినిపించింది. ధర్మరాజు ఆ శంఖరావం విన్నప్పటికినీ, గాండీవటంకారం అతడి చెవిని పడకపోయేసరికి మనస్సు కలతచెంది దుఃఖంతో గొంతు బొంగురుపోగా సాత్యకితో ఇట్లా అన్నాడు:

**ధర్మరాజు సాత్యకి నర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట (సం.7-85-41)**

**ఉ. 'ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కు డయ్యె న**
**ద్దిక్కునఁ బాంచజన్యము యుదీర్ణత మ్రోయఁ దొడంగె నక్కటా!**
**చిక్కెనొ కౌరవాధములచే నతఁ డయ్యెడ నీవ యొక్కఁడుం**
**దక్క నొరుండు దీర్పఁగ నుదగ్రుఁడు బంధుఁడు లేమి వేఁడెదన్. 279**

**ప్రతిపదార్థం:** ఒక్కఁడు+అ చన్నవాఁడు విజయుండు= అర్జునుడు ఒక్కడే వెళ్ళాడు; మహీరజము+ఎక్కుడు+అయ్యెన్= భూమి మీద దుమ్ము ఎక్కువగా కానవస్తున్నది (యుద్ధం ముమ్మరంగా సాగుతున్న దనే దానికి నిదర్శనం); ఆ+దిక్కునన్= ఆ ప్రక్క; పాంచజన్యము+అ= కృష్ణుడి పాంచజన్యమే; ఉదీర్ణతన్= ఎక్కువగా; మ్రోయన్+తొడంగెన్= మ్రోగుతూ ఉన్నది; అతఁడు= ఆ అర్జునుడు; అక్కటా!= అయ్యో!; కౌరవ+అధములచేన్ చిక్కెనొ!= నీచులైన కౌరవుల చేతికి దొరికాడో ఏమో!; ఆ ఎడన్= అట్టి సమయంలో; నీవు+అ ఒక్కండున్ తక్కన్= నీవు ఒక్కడవే తప్ప; ఒరుండు= వేరొకడు; తీర్పఁగన్= ఈ కష్టాన్ని తొలగించటానికి; ఉదగ్రుఁడు= భయంకరుడు, గొప్పవాడు; బంధుఁడు= బంధువు; లేమిన్= లేకపోవుటచేత; వేఁడెదన్= వేడుకొంటున్నాను.

**తాత్పర్యం:** 'అర్జునుడు ఒక్కడే వెళ్ళాడు. ఆ దిక్కులో దుమ్ము ఎక్కువగా రేగుతూ ఉన్నది. పాంచజన్య శబ్దమే ఎక్కువగా వినవస్తూ ఉన్నది. ఈ సందర్భంలో - అయ్యో! వాడు నీచులైన కౌరవుల చేతిలో చిక్కుకున్నాడో ఏమో! ఇప్పుడు నీ వొక్కడివే ధైర్యశాలివి, బంధువురి, నీవు తప్ప ఈ ప్రమాదాన్ని తప్పించగలవాడు వేరొకడు లేకుండుట వలన నిన్ను వేడుకొంటూ ఉన్నాను'

క. **త్వరితముగఁ జనుము సఖుఁడు । న్గురుఁడుఁ గదా! నీకు నర్జునుం; డుపకృతి త**
**త్పరులై నెగడెడు నుత్తమ । పురుషులు వేచు తఱి వచ్చె భుజవీర్యనిధీ!** 280

**ప్రతిపదార్థం:** భుజవీర్యనిధీ!= భుజబలానికి గనివంటివాడా! - భుజబలం గలవాడా!; త్వరితముగన్ చనుము= శీఘ్రంగా వెళ్ళుము; అర్జునుండు; నీకున్; సఖుఁడున్= స్నేహితుడును; గురుఁడున్= గురువును; కదా!; ఉపకృతి తత్పరులు+ఐ= సహాయం చేసే మనస్సుతో; నెగడెడున్= నడచుకొనే; ఉత్తమ పురుషులు= ఉత్తములైన పురుషులు; వేచు తఱి= ఎదురుచూచే కాలం; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** భుజబలవీరుడా! అర్జునుడు నీకు స్నేహితుడు, గురువు కదా! ఉపకారపరులైన ఉత్తమ పురుషులు ఎదురు చూచే సమయం వచ్చింది. తొందరగా వెళ్ళుము. (త్వరగా వెళ్ళి అర్జునుడికి సహాయం చేయుము).

చ. **దురమున బంధుమిత్రులకుఁ దోడ్పడు తెంపును ధాత్రి యెల్ల భూ**
**సురులకు నర్థి నిచ్చుటయు సూరిజనుల్ సుకృతంబు లెన్నుచో**
**సరియుఁగఁ జేసి చెప్పుదురు శాశ్వతకీర్తియు నిన్ను నొందు నా**
**హరి నను నా సుహృజ్జనుల నందఱఁ గాంచుటఁ గ్రీడిఁ గావవే!** 281

**ప్రతిపదార్థం:** దురమునన్= యుద్ధంలో; బంధుమిత్రులకున్= బంధువులకు, స్నేహితులకు; తోడ్పడు= సహాయం చేసే; తెంపును= సాహసం; ధాత్రిఎల్లన్= భూమినంతటిని; భూసురులకున్= బ్రాహ్మణులకు; అర్థిన్= ప్రీతితో; ఇచ్చుటయున్= దానం చేయటం; సూరిజనుల్= పండితులు; సుకృతంబుల్= పుణ్యాలను; ఎన్నుచోన్= లెక్కపెట్టేటప్పుడు; సరియుఁగన్+చేసి= సమానంగా చేసి; చెప్పుదురు= చెప్పుతారు; ఆ హరి= ఆ శ్రీకృష్ణుడు; ననున్= నన్ను; నా సుహృద్+జనులన్= నా స్నేహితులను; అందఱన్= అందరిని; కాంచుటన్= కాపాడటంచేత; క్రీడిన్= అర్జునుడిని; కావవే!= కాపాడుమా!; నిన్నున్= నిన్ను; శాశ్వతకీర్తియున్= స్థిరమైన కీర్తి; ఒందున్= పొందుతుంది.

**తాత్పర్యం:** ఓ సాత్యకీ! యుద్ధంలో బంధువులకు, మిత్రులకు సహాయం చేసే సాహసం, భూమి నంతటిని బ్రాహ్మణుల కివ్వటంతో సమానమని పుణ్యాలను లెక్కపెట్టేటప్పుడు పండితులు చెపుతూ ఉంటారు. శ్రీకృష్ణుడు నన్ను, నా స్నేహితులను అందరిని కాపాడేటట్లుగా నీవు అర్జునుడిని కాపాడుము. నీకు శాశ్వత కీర్తి కలుగుతుంది.

క. **గురుపుత్ర కర్ణ మద్రే । శ్వర కృప భూరిశ్రవసులు శత్రుజన భయం**
**కరులు జయద్రథునకు నై । నరుఁ బొదివిన నతఁడు నొచ్చె నాకుం జూడన్.** 282

**ప్రతిపదార్థం:** గురుపుత్ర= అశ్వత్థామ; కర్ణ= కర్ణుడు; మద్రేశ్వర= శల్యుడు; కృప= కృపుడు; భూరిశ్రవసులు= భూరిశ్రవుడు మొదలుగా గల; శత్రుజన భయంకరులు= విరోధులకు భయాన్ని కలిగించేవారు; జయద్రథునకునై= సైంధవుని కొరకు; నరున్ పొదివినన్= అర్జునుడిని క్రమ్ముకొనగా; నాకున్+చూడన్= నాకు చూడగా; అతఁడు నొచ్చెన్= అర్జునుడు బాధపడ్డాడు (అని తోస్తూ ఉన్నది.)

**తాత్పర్యం:** అశ్వత్థామ, కర్ణుడు, శల్యుడు, కృపుడు, భూరిశ్రవుడు మొదలైనవారు అరిజన భయంకరులు. సైంధవుడి కొరకు అర్జునుడిని కమ్ముకొన్నట్లుగా తోస్తూ ఉన్నది. అందువలన, అర్జునుడు బాధపడ్డాడని నా కనిపిస్తూ ఉన్నది.

క. **ఆ మోము నా భుజంబులు । నా మేనుం గలదె? కేశవానుజ! యెచ్చో**
**నే మగలకు నమ్మూర్తికి । నేమి దలంచు నొకొ! దైవ మెయ్యది దుదియో!** 283

**ప్రతిపదార్థం:** కేశవ+అనుజ!= ఓ సాత్యకీ!; ఆ మోము= ఆ మొగం; ఆ భుజంబులు= ఆ చేతులు; ఆ మేనున్= ఆ శరీరం; ఎచ్చోన్= ఎక్కడనైనా; ఏ మగలకున్= ఏ వీరులకైనా; కలదె?= ఉన్నదా? (అనగా అర్జునుడి శరీరాకృతి ఎక్కడైనా ఎవరికైనా లేదని భావం); ఆ+మూర్తికిన్= ఆ మనిషికి (అటువంటి లోకోత్తరమైన వాడికి); దైవము= విధి; ఏమి తలంచున్+ఒకొ!= ఏమి చేయబోతున్నదో; ఏ+అది= ఏది; తుదియో?= అంతమో?

**తాత్పర్యం:** ఆ మొగమూ, భుజాలూ, శరీర సౌందర్యమూ - ఎక్కడనైనా, ఏ మానవుడికైనా ఉన్నాయా? ఓ సాత్యకీ! ఆ వీరమూర్తికి విధి వ్రాత ఎట్లుందో? దీనికి తుది ఏమో!

**విశేషం:** ధర్మరాజు అర్జునుడిని తలచుకొని పొందే పరిదేవనమూ, ఆత్మీయానుబంధమూ ఈ పద్యంలో వర్ణితమైనది.

**ఉ.** **ద్వైతవనంబునందు గుణధన్యుఁడు గాండివి నాకుఁజెప్పె 'ని**
**ర్ధూత విరోధి సత్యకసుతుండు సహాయుఁడుగా జయింతుఁ బ్ర**
**ఖ్యాతిగ ధార్తరాష్ట్రబలమంతయు నే' నని దానికిం దగం**
**బ్రీతి యొనర్పవే నరవరేణ్య! రయంబునఁ బోయి వానికిన్.** 284

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు(ధర్మరాజునకు); గుణధన్యుఁడు= సుగుణాలరాశి; గాండివి= అర్జునుడు; ద్వైతవనంబు అందున్= ద్వైతవనంలో; నిర్ధూతవిరోధి= ఎగురగొట్టబడిన శత్రువులుకల; సత్యకసుతుండు= సాత్యకి; సహాయుఁడుగాన్= తోడుగా; ప్రఖ్యాతిగన్= ప్రసిద్ధంగా; ధార్తరాష్ట్ర బలము+అంతయున్= కౌరవసేన అంతటినీ; అనిన్= యుద్ధంలో; ఏను= నేను; జయింతున్= జయిస్తాను (అని); నాకున్ చెప్పెన్= నాకు చెప్పాడు; దానికిన్= ఆ మాటకు; తగన్= తగునట్లుగా; రయంబుగన్= శీఘ్రంగా; పోయి= వెళ్ళి; నరవరేణ్య!= మానవశ్రేష్ఠా!; వానికిన్= ఆ అర్జునుడికి; ప్రీతి ఒనర్పవే!= సంతోషాన్ని కల్గించుమా!

**తాత్పర్యం:** ద్వైతవనంలో మేమున్నప్పుడు 'శత్రువులను అదలించి కొట్టే సాత్యకి తోడుగా కౌరవ బలాన్ని నేను యుద్ధంలో జయిస్తాను' అని అర్జునుడు నాకు చెప్పాడు. కనుక - ఓ నరవరేణ్యా! త్వరగా వెళ్ళి, అర్జునుడి మాటకు తగినట్లుగా అతడికి సంతోషమును కలిగించుము.

**క.** **హరి యొకఁడు నీ వొకండవు। పరమాప్తులు కలిమి నరుఁడు భారపుఁ బనికిం**
**జొర నలుకఁడు నీ కూరిమి। పొరపొచ్చెము గాక యుండఁ బోవఁగవలదే !** 285

**ప్రతిపదార్థం:** హరి ఒకఁడు= శ్రీకృష్ణు డొకడును; నీవు+ఒకండవున్= నీ వొక్కడవును; పరమాప్తులు= నిజమైన ఆప్తులు; కలిమిన్= ఉండటంచేత; నరుఁడు= అర్జునుడు; భారపు+పనికిన్= కష్టమైన పనికి కూడ; చొరన్= దూరటానికి (చొచ్చుటకు); అలుకఁడు= జంకడు; నీ కూరిమి= నీ స్నేహం; పొరపొచ్చెముకాక ఉండన్= వృథా కాకుండా; పోవఁగ వలదే?= పోవద్దా (అనగా సహాయంగా పోవలె కదా!).

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడొకడూ, నీ వొకడవూ అర్జునుడికి చాల కావలసినవారు; మీ అండ ఉండటం చేతనే ఎటువంటి కష్టపు పనికైనా అర్జునుడు పూనుకొంటాడు. కనుక మీ స్నేహం వృథా కాకుండా నీ విపుడు పోవద్దా?

**ఆ.** **పరమకరుణ నైన బంధుభావంబున। నైన భుజబలంబు నతిశయమున**
**నైన నెల్లభంగి నర్జును రక్షింపఁ। బోవఁ దగు మహానుభావ! నీకు.** 286

**ప్రతిపదార్థం:** మహానుభావ!= ఓ గొప్పవాడా!; పరమ కరుణన్+ఐనన్= మిక్కిలి దయతోనైనా; బంధుభావంబునన్+ఐనన్= బాంధవ్యం కారణంగా నైనా; భుజబలంబు= భుజశక్తి; అతిశయమునన్+ఐనన్= ఎక్కువైనందువలననైనా; ఎల్లభంగిన్= అన్ని విధాలుగా; అర్జునున్= అర్జునుడిని; రక్షింపన్+పోవన్= కాపాడటానికి పోవటం; నీకున్+తగున్= నీకు తగి ఉన్నది.

**తాత్పర్యం:** ఓ మహానుభావా! (అని సాత్యకిని ధర్మజుడు సంబోధిస్తున్నాడు). మిక్కిలి దయతోనైనా, బాంధవ్యం కారణంగా నైనా, భుజబలం గొప్పతనం తోనైనా - అన్ని విధాలుగా అర్జునుడిని కాపాడటానికి నీవు పోవటం న్యాయం.

**క. అతఁ డొకటి యైన నే నే । గతిఁ బోదుం జెపుమ! యెల్లకార్యంబులలో**
**నతనికిఁ దోడ్పడఁ బోవుట । యతి ముఖ్యము దానిఁ జేయు మనఘ విచారా! 287**

**ప్రతిపదార్థం:** అతఁడు+ఒకటి ఐనన్= ఆ అర్జునుడు ఏమైనా అయినట్లయితే (అర్జునుడికి ప్రమాదం జరిగినట్లయితే); ఏను= నేను; ఏ గతిన్+పోదున్?= ఏ దిక్కునకు పోగలను?; (నా గతి ఏమౌతుంది?); చెపుమా!= చెప్పవలసింది!; ఎల్ల కార్యంబులలోన్= అన్ని పనులలో; అతనికిన్= ఆ అర్జునుడికి; తోడ్పడన్+పోవుట= సహాయానికి పోవటం; అతిముఖ్యము= చాలా అవసరం; అనఘ విచారా!= పాపరహితమైన ఆలోచన చేసేవాడా!; దానిన్+చేయుము= ఆ పనిని చేయుము; (అనగా అర్జునుడిని కాపాడటానికి పొమ్ము);

**తాత్పర్యం:** అర్జునుడికి ఏదేని ప్రమాదం జరిగినట్లయితే నా గతి ఏమౌతుంది? నే నెక్కడికి పోగలను? అన్ని పనులలో అతడికి సహాయంగా వెళ్లటం చాల ముఖ్యం నీవు మంచినే ఆలోచించేవాడవు. కనుక ఆ పని చేయుము.

**క. అలఘుబలుఁడు శైనేయుఁడు । గలుగఁగఁ బాండవుల గెలువఁగా వచ్చునె? వా**
**రల కతఁడు గోట యంద్రు; రి । పులు దానికిఁ దగఁగ నెఱపు భుజగర్వంబున్. 288**

**ప్రతిపదార్థం:** అలఘు బలుఁడు= తక్కువకాని బలం కలవాడు; శైనేయుఁడు= సాత్యకి; కలుగఁగన్= ఉండగా (తోడుండగా); పాండవులన్= పాండవులను; గెలువఁగాన్ వచ్చునె?= జయింపసాధ్యమా?; వారలకున్= ఆ పాండవులకు; అతఁడు= ఆ సాత్యకి; కోట= కోట అని; రిపులు= శత్రువులు; అంద్రు= అంటారు; దానికిన్= ఆ మాటకు; తగఁగన్= తగినట్లుగా; భుజగర్వంబున్= భుజదర్పాన్ని; నెఱపుము= ప్రదర్శించుము.

**తాత్పర్యం:** సాటిలేని బలంకల సాత్యకి కోటవలె పాండవులకు ఉండగా వారిని జయించటం సాధ్యమా? - అని శత్రువులంటూ ఉంటారు. దానికి తగినట్లుగా భుజదర్పాన్ని చూపించుము.

**క. హరి గురుఁడు నీకుఁ గ్రీడియు । గురుఁ డిరువుర యెడరు దీర్పఁ గోరి గురులకున్**
**గురుఁడ నగు నేనె చేసెదఁ । బరమ ప్రార్థనము; దీనిఁ బాటింపు తగన్. 289**

**ప్రతిపదార్థం:** నీకున్ హరి గురుఁడు= నీకు కృష్ణుడు గురువు; నీకు క్రీడియున్ గురుఁడు= అర్జునుడు కూడా గురువే; ఇరువుర ఎడరు= ఆ ఇద్దరి ఇబ్బందిని; తీర్పన్+కోరి= తీర్చుమని కోరి; గురులకున్= గురువులకు; గురుఁడన్+అగు= గురువు నైన; ఏన్= నేనే; పరమ ప్రార్థనము చేసెదన్= ఎక్కువగా ప్రార్థిస్తున్నాను; దీనిన్= ఈ ప్రార్థనను; తగన్ పాటింపుము= తప్పక చేయుము.

**తాత్పర్యం:** కృష్ణార్జునులు ఇరువురూ నీకు గురువులే. వారి ఇబ్బందిని తొలగించుమని ఆ గురువులకు గురువునైన నేను నిన్ను అర్థిస్తూ ఉన్నాను. నా ప్రార్థనను తప్పక పాటింపుము.

**క. కురుబలము సొచ్చి, నీదగు । శరముల దర్పంబు సూపి, చయ్యనఁ జని య**
**న్నరుఁ గైకొని నా యుల్లము । పరితాపముఁ దీర్పవే! నృపాలురు మెచ్చన్. 290**

**ప్రతిపదార్థం:** కురుబలము చొచ్చి= కురుసైన్యంలోకి చొచ్చుకొనిపోయి; నీది+అగు= నీయొక్క; శరముల దర్పంబు= బాణాల శక్తిని; చూపి= చూపించి; చయ్యనన్= శీఘ్రంగా; చని= వెళ్ళి; ఆ+నరున్+కైకొని= ఆ అర్జునుడిని కాపాడి; నా ఉల్లము= నా మనస్సులోని; పరితాపమున్= బాధను; నృపాలురు= రాజులు; మెచ్చన్= మెచ్చుకోగా; తీర్పవే!= తీర్చుమా!

**తాత్పర్యం:** కౌరవ సైన్యంలోకి చొచ్చుకొనిపోయి నీ బాణాలశక్తిని చూపి, రాజులు మెచ్చుకోగా శీఘ్రంగా వెళ్ళి అర్జునుడిని ఆదుకొని నా మనస్సులోని బాధను తొలగించుము.'

**వ. అనిన విని సాత్యకి ధర్మనందనున కిట్లను 'నీ వచనంబు లుచితంబు; లేను నప్పార్థునకును రణంబునం బ్రాణంబులు దాఁప; విశేషించి నీ వింత ప్రార్థించి పనుప నూరకుండుదునే? యతండు సైంధవ వధార్థంబుగా నట సనుచుండి కృష్ణుఁడు వినుచుండ నాతోఁ జెప్పిన తెఱంగు విన్నవించెద నవధరింపుము. 291**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= ధర్మరాజు చెప్పగా విని; సాత్యకి; ధర్మనందనునకున్= ధర్మరాజుతో; ఇట్లు+అనున్= ఈ విధంగా అన్నాడు; నీ వచనంబులు= నీ మాటలు; ఉచితంబులు= న్యాయంగా ఉన్నవి; ఏను= నేను; ఆ+పార్థునకున్= ఆ అర్జునుడికి; రణంబునన్= యుద్ధంలో; ప్రాణంబులు= నా ప్రాణాలను; దాఁపన్= దాచుకొనను; విశేషించి= మీదు మిక్కిలి; నీవు+ఇంత+ప్రార్థించి పనుపన్= నీ వింతగా వేడుకొని పంపినపుడు; ఊరక+ఉండుదునే?= ఊరకుంటానా?; అతండు= ఆ అర్జునుడు; సైంధవ వధ+అర్థంబుగాన్= సైంధవుడిని చంపుటకై; అట చనుచున్+ఉండి= ఆ దిక్కుకు పోతూ ఉండి; కృష్ణుఁడు వినుచుండన్= శ్రీకృష్ణుడు వింటూ ఉండగా; నాతోన్ చెప్పిన తెఱంగు= నాతో చెప్పిన పద్ధతి; విన్నవించెదన్= మనవి చేస్తాను; అవధరింపుము= వినుము.

**తాత్పర్యం:** ఆ విధంగా ధర్మరాజు చెప్పగా, సాత్యకి ఆతడితో ఇట్లా అన్నాడు: 'నీ పలుకులు న్యాయంగా ఉన్నాయి. అర్జునుడి కొరకై చేసే యుద్ధంలో నా ప్రాణాలను దాచుకోను. మీదు మిక్కిలి నీ వింతగా ప్రార్థించి పంపినప్పుడు ఊరకుంటానా? సైంధవుడిని చంపుటకై వెళ్ళుతూ, కృష్ణుడు వింటూ ఉండగా, అర్జునుడు నాతో చెప్పిన విషయం మనవి చేస్తాను వినుము.

**క. 'మనకు నిమిత్తము లెంతయు । ననుకూలము లయ్యెఁ; గెలుతు మాహవమున నేఁ**
**జనియెదఁ బ్రతిజ్ఞఁ దీర్పఁగ; । ననఘా! ధర్మసుతు రక్ష కరుగుము నీవున్. 292**

**ప్రతిపదార్థం:** అనఘా!= ఓ పాపరహితుడా!; మనకున్ నిమిత్తములు= మనకు శకునాలు; ఎంతయున్+అనుకూలములు+అయ్యెన్= ఎంతో అనుకూలంగా ఉన్నాయి; ఆహవమునన్= యుద్ధంలో; గెలుతుము= జయిస్తాము; ప్రతిజ్ఞన్+తీర్పఁగన్= మాట నిలుపుకోగా; ఏన్+చనియెదన్= నేను వెళ్ళుతాను; ఈవున్= నీవు కూడ; ధర్మసుతు రక్షకున్= ధర్మరాజును కాపాడటానికి; అరుగుము= వెళ్ళుము.

**తాత్పర్యం:** ' ఓ పుణ్యాత్మా! శకునాలు మన కనుకూలంగా ఉన్నాయి. యుద్ధంలో గెలుస్తాము. ప్రతిజ్ఞ తీర్చటానికి నేను వెళ్ళుతాను (సైంధవ వధ ప్రతిజ్ఞ). నీవు ధర్మరాజును కాపాడటానికి వెళ్ళుము. (అంటూ సాత్యకికి చెప్పాడు.)

**క. విను! సింధురాజు వధ మును । మనుజాధిప రక్షణంబు మనకు సరియ కా**
**వున నే నొక పని నీ వొక । పని మేకొని చేయు టరయఁ బాడియ గాదే? 293**

**ప్రతిపదార్థం:** విను= ఓ సాత్యకీ! వినుము; సింధురాజు వధమును= సైంధవుడిని చంపటం; మనకున్= మనకు; మనుజాధిప రక్షణంబు= రాజును కాపాడుకొనటం (అనగా ధర్మరాజును కాపాడుకొనటం); సరియ= సమానం; కావునన్+ఏను+ఒకపని నీవు+ఒకపని= నేనొకపనిని; నీవొక పనిని (సైంధవవధ, ధర్మరాజు రక్షణం అనే పనులను); మేకొని చేయుట= పూనుకొని చేయటం; పాడియ కాదే?= ధర్మం కాదా?

**తాత్పర్యం:** ఓ సాత్యకీ! వినుము, సైంధవుడిని చంపటం, ధర్మరాజును కాపాడటం మనకు సమానమే. కాబట్టి నే నొక పనిని, నీ వొక పనిని పూనుకొని చేయటం ధర్మం కదా!

**ఆ. ఏను నిలిచినట్ల కా నూఱడిల్లు నీ । వున్న నన్నరేశ్వరోత్తముండు;**
**నిర్భరుండ వగుము నీవు నా దెస; నాకు । హరి గలండు; గలఁడె యచట నితఁడు. 294**

**ప్రతిపదార్థం:** ఈవు+ఉన్నన్= నీవున్నట్లయితే; అన్నర+ఈశ్వర+ఉత్తముండు= ఆ రాజశ్రేష్ఠుడు (ధర్మరాజు); ఏను నిలిచినట్లుకాన్= నేను తన ప్రక్క ఉన్నట్లు; ఊఱడిల్లున్= ఓదార్పు పొందుతాడు; నీవు నిర్భరుండవు+అగుము= నీవు భయం లేక ఉండుము; నా దెసన్= నావైపున; హరి కలండు= కృష్ణు డున్నాడు; అచటన్= ధర్మరాజు ఉన్నచోట; ఇతఁడున్= కృష్ణుడు కలఁడే= ఉన్నాడా? (లేడని భావం).

**తాత్పర్యం:** నీవు ప్రక్కన ఉంటే ధర్మరాజు ప్రక్కలో నేనున్నట్లుగానే ధైర్యాన్ని పొందుతాడు. నా ప్రక్కన శ్రీకృష్ణుడున్నాడు. ధర్మజుడి ప్రక్క అత డిపుడు లేడు. కనుక నీ వచటికి వెళ్ళుట న్యాయం. నిర్భయంగా నీవు ఉండుము.

**వ. ఎల్లభంగుల రాజ రక్షణార్థంబుగా నీకుం బోవవలయుఁ బరాక్రమ ధుర్యుండగు నాచార్యు ప్రతిన యెఱుంగవె?' యని చెప్పిన నట్ల కాక యని ని న్నతనిచే నిక్షేపంబుగా గైకొని యేను నీకడకుం జనుదెంచితి; గురుండు ప్రతిన నెఱపునేని విజయుండు జయద్రథుం జంపుట యప్రయోజనంబు కాదే? యది యట్లుండ నిమ్ము; నీ చిత్తమ్మున వలవని వెఱపు గట్టుకొని యెదవు; కృష్ణసారథికం బగు జిష్ణురథం బప్రతిహత మనోరథం బగుట యెఱుంగవలవదే?' యనుటయు నమ్మహీపతి యతని కి ట్లనియె. 295**

**ప్రతిపదార్థం:** ఎల్లభంగులన్= అన్ని విధాలుగా; రాజరక్షణ+అర్థంబుగాన్= రాజును కాపాడటానికై; నీకున్+పోవలయున్= నీవు పోయి తీరాలి; పరాక్రమధుర్యుండు+అగు= శత్రువులను ఆక్రమించుకొనే శక్తికలవాడైన (ఆ నేర్పరితనం కలవాడు); ఆచార్యు ప్రతిన= ద్రోణుడి శపథం; ఎఱుంగవె?= తెలియవా?; అని చెప్పినన్= అని చెప్పగా; అట్లకాక అని= సరేనని, నిన్నున్= నిన్ను; అతనిచేన్= అతడి నుండి; నిక్షేపంబుగాన్= నిధిగా; కైకొని= తీసికొని; ఏను= నేను; నీ కడకున్ చనుదెంచితిన్= నీ దగ్గరకు వచ్చాను; గురుండు= ద్రోణాచార్యుడు; ప్రతిన నెఱపున్+ఏనిన్= ప్రతిజ్ఞను నిలిపినట్లయితే (అనగా ధర్మరాజును బంధించినట్లయితే); విజయుండు= అర్జునుడు; జయద్రథున్+చంపుట= సైంధవుడిని చంపటం; అప్రయోజనంబు కాదె?= వ్యర్థం కాదా!; అది అట్లుండన్+ఇమ్ము= దానినట్లా ఉండనీ; నీ చిత్తమ్మునన్= నీ మనస్సులో; వలవని వెఱపు= అనవసరమైన భయం; కట్టుకొనియెదవు= పెట్టుకుంటూ ఉన్నావు; కృష్ణ సారథికంబు+అగు= శ్రీకృష్ణుడిని సారథిగా గల; జిష్ణురథము= అర్జునుడి తేరు; అప్రతిహత మనోరథంబు= ఎదురులేని కోరిక తీర్చేది (అనగా దానిని ఎవ్వరూ కొట్టలేరు); అగుటన్= కావటంచేత; ఎఱుంగవలవదే?= తెలియవద్దా?; అనుటయున్= అని చెప్పగా; ఆ+మహీపతి= ఆ ధర్మజుడు; అతనికిన్= సాత్యకితో; ఇట్లనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'అన్ని విధాలుగా రాజును కాపాడటానికి నీవు తప్పక పోవలయును. శత్రువులను ఆక్రమించుకొనటంలో నేర్పరి అయిన గురువుగారి శపథం నీకు తెలియదా?' అని చెప్పినందువల్ల, సరే అని, నిన్ను అతడు నా చేతికిచ్చిన నిధిగా భావించి నీ దగ్గరకు వచ్చాను. ఆచార్యుడు గనుక తన ప్రతిజ్ఞను నిలుపుకొంటే, అర్జునుడు సైంధవుడిని చంపటం వ్యర్థం. కనుక, అనవసరంగా భయం మనసులో పెట్టుకోవద్దు. కృష్ణుడు సారథిగా ఉండే అర్జునుని రథం, ఎదురులేని మనోరథం అని తెలియదా?' అని అనగా ఆ ధర్మరాజు అతనితో ఇట్లా అన్నాడు:

**క. 'అది యగు నైనను ననుఁ బెం । పొదవఁగఁ గాచికొని యిచట నుండుట కంటెన్**
**మది నధికం బై తోఁచిన । యది నీ వర్జునుని పాలి కరుగుట నాకున్. 296**

**ప్రతిపదార్థం:** అది+అగున్= నీవు చెప్పింది నిజమే; ఐనను= అయినప్పటికీ; పెంపు+ఒదవఁగన్= గొప్పతనం కలుగగా; కాచికొని= కావలి కాచుకొని; ఇచటన్ ఉండుట కంటెన్= ఇక్కడ ఉండటం కంటె; నీవు= ఓ సాత్యకీ!; అర్జునుని పాలికిన్= అర్జునుడి దగ్గరకు; అరుగుట= వెళ్ళటం; మదిన్= మనస్సులో; నాకున్= నాకు; అధికంబై తోఁచిన అది= ఎక్కువగా తోచింది.

**తాత్పర్యం:** అది అట్లే అయినప్పటికిని, గొప్పగా ఇక్కడ కాచుకొని ఉండటం కంటె అర్జునుడి వద్దకు నీవు వెళ్ళటం ఎక్కువ అవసరం అని తోచింది.

**తే.** **కడువడి నీ వరుగఁగ వడ । ముడియును నీ వెనుక శీఘ్రముగ నెయిదుం గ**
**వ్వడి కుశలి యైన విజయం । బొడఁగూడును మనకు; దీని కొడఁబడు మనఘా!** 297

**ప్రతిపదార్థం:** నీవు కడువడిన్ అరుగన్= నీవు చాల త్వరగా వెళ్ళగా; వడముడియును= భీమసేనుడు కూడా; నీ వెనుకన్= నీ వెంటనే; శీఘ్రమునన్= త్వరగా; ఎయిదున్= వెంబడించి వస్తాడు; కవ్వడి= అర్జునుడు; కుశలి+ఐనన్= క్షేమంతో ఉంటే; మనకున్= మనకు; విజయంబు= జయం; ఒడఁగూడును= కలుగుతుంది; అనఘా!= ఓ పుణ్యాత్మా!; దీనికిన్= ఇప్పటి నా మనవికి; ఒడఁబడుము= అంగీకరించుము.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్మా! త్వరగా నీవు వెళ్ళితే, వెంటనే భీమసేనుడు కూడా నిన్ను అనుసరిస్తాడు. అర్జునుడు క్షేమంగా ఉంటే మనకు విజయం కలుగుతుంది - కనుక నేను చెప్పినట్లు చేయటానికి ఒప్పుకొనుము.

**చ.** **ద్రుపద విరాట కేకయులు దోర్బలధుర్యులు, ద్రౌపదేయు లు**
**గ్రపు బిరుదుల్, ఘటోత్కచుఁ డరాతి విదారిఁ శిఖండి ధైర్యసా**
**ర పరుషమూర్తి, సంగర ధురంధరు లిద్దెసఁ దక్కుఁ గల్గు వా**
**రపరిమితుల్; గొనండు ద్రుపదాత్మజుఁ డగ్గురుఁ బోరఁ జీరికిన్.** 298

**ప్రతిపదార్థం:** ద్రుపద, విరాట, కేకయులు= ద్రుపద విరాట కేకయ దేశాల వారు; దోర్బలధుర్యులు= భుజబల శక్తి కలవారు; ద్రౌపదేయులు= ఉపపాండవులు; ఉగ్రపుబిరుదుల్= భయంకరమైన పేరుగలవారు (గొప్ప పేరు గలవారు); ఘటోత్కచుఁడు; అరాతి విదారి= శత్రువులను తునాతునుకలు చేసేవాడు; శిఖండి; ధైర్యసార పరుషమూర్తి= ధైర్యసారమే నిష్ఠురమూర్తిగా ఉన్నవాడు; సంగర ధురంధరుల్= యుద్ధభారాన్ని వహించినవారు; ఈ+దెసన్= ఈ దిక్కున; తక్కున్ గల్గువారు= మిగిలినవారు; అపరిమితుల్= సాటిలేనివారు; ద్రుపదాత్మజుఁడు= ధృష్టద్యుమ్నుడు; ఆ+గురున్= ఆ ద్రోణాచార్యుడిని; పోరన్= యుద్ధంలో; చీరికిన్= లెక్కకు; కొనండు= తీసికొనడు (లెక్కించడు కనుక నీవు వెళ్ళవచ్చునని ధర్మజుడి భావం).

**తాత్పర్యం:** ద్రుపద విరాట కేకయ రాజులు, ఉపపాండవులు, ఘటోత్కచుడు, శిఖండి తక్కిన పాండవ పక్షములోని వారు భుజబలంతో, గొప్పపేరుతో, శత్రువులను అణగార్చుతూ ధైర్యసాహసాలతో ఒప్పినవారు - సాటిలేని బలం కలవారు ఈ వైపున్నారు. ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని లెక్కచేయడు.

**క.** **విను మా ధృష్టద్యుమ్నుం । డనలంబునఁ గుంభభవ వధార్థముగాఁ బు**
**ట్టినవాఁడు గాఁడె? నా దెస । ననుమానం బేల? యోర్చు నాతం డతనిన్.'** 299

**ప్రతిపదార్థం:** వినుము= నామాట వినుము; ఆ ధృష్టద్యుమ్నుండు= ద్రుపదుడి కుమారుడైన ఆ ధృష్టద్యుమ్నుడు; కుంభసంభవ వధ+అర్థముగాన్= ద్రోణుడిని చంపుట కొరకై; అనలంబునన్= అగ్నిలో; పుట్టినవాఁడు కాఁడె?= పుట్టినవాడు కదా?; నా దెసన్=నా విషయమై; అనుమానంబు+ఏల?= సందేహమెందుకు?; ఆతండు= ధృష్టద్యుమ్నుడు; అతనిని= ద్రోణాచార్యుడిని; ఓర్చున్=ఓడిస్తాడు.

**తాత్పర్యం:** 'ఓ సాత్యకీ! వినుము. ద్రోణుడిని చంపటానికై ధృష్టద్యుమ్నుడు అగ్నిగుండంలో పుట్టాడు కదా! నా విషయమై (అనగా నా క్షేమాన్ని గూర్చి) నీకు సందేహ మెందుకు? ధృష్టద్యుమ్నుడు ద్రోణుడిని ఓడిస్తాడు.'

**వ. అనవుడు శినిపుంగవుం డొక్కింత చింతించి, పార్థుపజ్జం బోవుట బంటుతనంబున కూనంబుగా; దితండునుం బెద్దయుం దఱిమి పలికెడుఁ; బోదున కాక! యని మనంబున నిశ్చయించి, యధిపతి యాననం బాలోకించి. 300**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; శినిపుంగవుండు= శినివంశంలో ఉత్తము డయిన సాత్యకి; ఒక్కింత= కొంతసేపు; చింతించి= ఆలోచించి; పార్థుపజ్జన్+పోవుట= అర్జునుడి వైపు వెళ్ళటం; బంటుతనంబునకున్= వీరత్వానికి; ఊనంబు కాదు= తక్కువ కాదు; ఇతండును= ఈ ధర్మరాజుకూడ; పెద్దయున్= మిక్కిలి; తఱిమి= తొందరపెట్టి; పలికెడున్= మాటలాడుతున్నాడు; పోదున కాక= వెళ్ళెదనుగాక!; అని మనంబునన్ నిశ్చయించి= అని మనస్సులో నిశ్చయించుకొని; అధిపతి ఆననంబు= ధర్మరాజు ముఖాన్ని; ఆలకించి= చూచి.

**తాత్పర్యం:** అనగా సాత్యకి కొంతసేపు యోచించి, అర్జునుడి దగ్గరకు పోవటం తన వీరత్వానికి తక్కువ కాదనీ, ఈ ధర్మరాజు మిక్కిలి తొందరపెట్టుతున్నాడు కనుక వెళ్ళుతాననీ మనస్సులో నిశ్చయించుకొని ఆ ధర్మరాజు ముఖం చూచి.

**సాత్యకి ధర్మరాజు వేఁడిన చొప్పున నర్జును కడకుఁ బోవ సమ్మతించుట (సం. 7-86-1)**

**క. భవదీయ రక్ష యిమ్మెయి । సువిహిత మగునేని మేలు; సొచ్చెద భేరీ**
**రవ బృంహిత హేషాభై । రవ కౌరవ సేన గలఁగి క్రందుకొనంగన్. 301**

**ప్రతిపదార్థం:** భవదీయ రక్ష= నీయొక్క అండ (ధర్మరాజునకున్న సహాయం); ఈ+మెయిన్= ఈ విధంగా; సువిహితము+అగునేని= బాగా ఉన్నట్లయితే; మేలు= మంచిది; భేరీరవ= నగారా చప్పుళ్ళతోడి; బృంహిత= ఏనుగుల యొక్క ఘీంకారమును; హేషా= గుఱ్ఱాల సకిలింతలు; భైరవ= భయంకరమైన శబ్దాలతోను; కౌరవసేన= కురుసేన; కలఁగి= చీకాకుపడి; క్రందుకొనంగన్= అతిశయించగా; చొచ్చెదన్= ప్రవేశిస్తాను.

**తాత్పర్యం:** నీ కున్న అండ ఈ విధంగా చక్కగా ఉన్నట్లయితే మంచిది. నగారాల మ్రోతతో, ఏనుగుల ఘీంకారంతో, గుఱ్ఱాల సకిలింతలతో భయంకరమైన కౌరవ సేన చీకాకు పడటం అధికమయ్యేటట్లుగా నేను వెళ్ళుతాను.

**శా. వైరం బాత్మల నిండి యుండ భుజగర్వంబుల్ దలిర్పంగ దు**
**ర్వారోత్సాహులు వీరె కొందఱు నృపుల్ రారాజు కార్యంబు వి**
**స్తారోదగ్రము సేయఁ బూని విలసత్సంరంభు లై పన్నియు**
**న్నా రీదట్టపుమూఁక లెట్టు లగునో నాకోల్తలం జూడుమీ! 302**

**ప్రతిపదార్థం:** వైరంబు= శత్రుత్వం; ఆత్మలన్+నిండి ఉండన్= మనస్సులో నిండుకొని ఉండగా; భుజగర్వంబుల్= భుజదర్పం; తలిర్పంగన్= చిగురించగా; దుర్వార= అడ్డుకొనటానికి సాధ్యంకాని; ఉత్సాహులు= ఆసక్తి ఉన్నవారు; వీరె= వీరే; కొందఱు నృపుల్= కొందరు రాజులు; రారాజు కార్యంబున్= దుర్యోధనుడి పనిని; విస్తార= ఎక్కువగా; ఉదగ్రము= భయంకరంగా; చేయన్+పూని= చేయుటకు పూనుకొని; విలసత్+సంరంభులు+ఐ= ప్రకాశంతోడి తొందరలో; పన్ని ఉన్నారు= యుద్ధానికి

సిద్ధమై ఉన్నారు; ఈ దట్టపు మూఁకలు= ఈ ముమ్మరమైన సైన్యం; నా కోల్తలన్= నేను ఎదుట నిలిచి యుద్ధం చేయటంతో; ఎట్టులు+అగునో చూడుమీ!= ఏమౌతుందో చూడుమా!

**తాత్పర్యం:** మనస్సు నిండా శత్రుత్వంతో, భుజగర్వం ఒప్పి ఉండగా, అడ్డులేని ఉత్సాహంతో ఈ కొందరు రాజులు దుర్యోధనుడికొరకు విస్తారంగా, భయంకరంగా యుద్ధ ప్రయత్నంలో ఉన్నారు. దట్టమైన ఈ సైన్యం నేను ఎదుట నిలిచి యుద్ధం చేస్తే ఏమౌతుందో చూడుము.

**క. ఈ సేనల భేదించి భు । జా సంపద వెలయఁ బార్థసాహాయ్యం బేఁ**
**జేసెద నీపం పనియెడు । భాసుర దీపమున కన్యబలతమ మెదురే? 303**

**ప్రతిపదార్థం:** ఈ సేనల భేదించి= ఈ సైన్యాన్ని చీల్చి; భుజాసంపద= భుజబల విభవం; వెలయన్= ప్రకాశించగా; పార్థసాహాయ్యంబు= అర్జునుడికి సహాయం; ఏన్+చేసెదన్= నేను చేసెదను; నీ పంపు= నీ ఉత్తరువు; అనియెడు= అనేటువంటి; భాసుర దీపమునకున్= వెలిగే దీపానికి; అన్యబలతమము= ఇతరుల బలమనే చీకటి; ఎదురే?= ఎదురా?

**తాత్పర్యం:** ఈ సేనలను చీల్చి, భుజబలం ప్రకాశించగా అర్జునుడికి సహాయం చేస్తాను. నీ ఆజ్ఞ అనే దీపం ముందు శత్రు బలమనే చీకటి ఎదురు నిలుస్తుందా?

**విశేషం:** అలం: రూపకం.

**క. దవ్వని చూడకు; మార్తుర । క్రొ వ్వడఁచెద; సింధువిభునిఁ గూల్పఁగడఁగు నా**
**వివ్వచ్చు మెచ్చు తెఱఁగున । నవ్వుచుఁ గవిసెద మరుద్గణంబులు వొగడన్. 304**

**ప్రతిపదార్థం:** దవ్వు+అని చూడకు= దూరమని చూడవద్దు; మార్తుర= శత్రువులయొక్క; క్రొవ్వు= క్రొవ్వును; అడఁచెదన్= అడగారిస్తాను; సింధువిభుని= సైంధవుడిని; కూల్పన్= చంపటానికి కడఁగు= ప్రయత్నించే; ఆ వివ్వచ్చు= అర్జునుడు; మెచ్చుతెఱఁగునన్= మెచ్చుకొనే విధంగా; మరుత్+గణంబులు= దేవతా సమూహాలు; పొగడన్= కీర్తించగా; నవ్వుచున్= నవ్వుకొంటూ; కవిసెదన్= క్రమ్ముకొంటాను.

**తాత్పర్యం:** (ఇక్కడకు) దూరమని చూడవద్దు. విరోధుల పొగరు అణుస్తాను. సైంధవుడిని చంపటానికి ప్రయత్నించే అర్జునుడు మెచ్చుకొనే విధంగా, దేవతలందరు పొగడగా నవ్వుతూ శత్రువులను క్రమ్ముకొంటాను.

**వ. రథ్యంబుల దగ యుడుపను సారథి దప్పియుం దీర్పను రథంబు సవిశేష సన్నాహంబు సేయను వలయు' ననినం బ్రీతి నొంది యప్పాండవాగ్రజుండు పనుపం దద్ జ్ఞులైన పరిచారకు లత్తురంగంబుల నీరికిం దిగిచి ఖాణం బెత్తి తడవి దారుకానుజుం డగు నా సూతు నుపయుక్తాహారుం జేయుటయు, వాఁడును విశిష్టాయుధ సమేతంబుగా నయ్యరదంబు సుకల్పితంబు సేసి సింహధ్వజంబు గ్రాలం దెచ్చె; నంతకు మున్న సాత్యకియుఁ గృతస్నానుండై యాప్యాయన మధుపానంబున నెలమిం బొంది యమ్మహీపతి పాదంబులకుం బ్రణతుం డైనం గౌఁగిలించుకొని యతండు దీవించినం బెండ్లికి పోవులీలం దేరెక్కి యెక్కిడిన విల్లును మెచ్చువచ్చునమ్ములును దొడలపైఁ బెట్టికొని కదలి చను సమయంబున భీమసేనుండును నగ్రజునకుం బ్రణామంబు సేసి తన తోడన రాఁ గదలినం గని యా శినిపుంగవుం డతని కి ట్లనియె. 305**

**ప్రతిపదార్థం:** రథ్యంబుల= గుర్రాల; దగ= దాహం; ఉడుపను= పోగొట్టటానికిని; సారథి= సూతుడి; దప్పియున్= దాహంకూడా; తీర్పను= పోగొట్టటానికిని; రథంబున్= తేరును; సన్నాహంబు చేయను= సిద్ధం చేయటానికి; వలయున్= అవశ్యం; అనినన్=

అనగా; ప్రీతిన్+ఒంది= సంతోషపడి; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ ధర్మరాజు; పనుపన్= ఉత్తరువు చేయగా; తద్‌జ్ఞులు+ఐన= ఆయా పనులు తెలిసినవారైన; పరిచారకులు= సేవకులు; ఆ+తురంగంబులన్= ఆ గుర్రాలను; నీరికిన్+తిగిచి= నీళ్ళకు తీసికొనిపోయి; ఖాణంబు= ఆహారాన్ని (గుర్రాలకు ఉలవలు మొదలయిన తిండి వస్తువులను); ఎత్తి= ఎత్తి; తడవి= నిమిరి (గుర్రాల శరీరాన్ని నిమిరి, అందుచేత వాటికి ఉత్సాహం కలుగుతుంది); దారుక+అనుజుండు= దారుకుడి తమ్ముడు; అగు= అయిన; ఆ సూతున్= ఆ సారథిని; ఉపయుక్త= ఉపయోగించబడిన; ఆహారం చేయుటయున్= ఆహారం కలవానిని చేయటమూ; వాఁడును= ఆ సూతుడును; విశిష్ట= విశేషమైన; ఆయుధసమేతంబుగాన్= యుద్ధానికి కావలసిన అస్త్రశస్త్రాలతో; ఆ+ఆరదంబున్= ఆ తేరును; సుకల్పితంబు+చేసి= బాగా ఏర్పాటుచేసి; సింహధ్వజంబు= సింహపతాకం; క్రాలన్= వెలుగగా; తెచ్చెన్= తీసికొని వచ్చాడు; అంతకు మున్ను= అంతకంటే ముందుగా; సాత్యకియున్= సాత్యకి కూడ; కృతస్నానుండు+ఐ= స్నానం చేసినవాడై; ఆప్యాయన= తృప్తిని కలిగించే; మధుపానంబునన్= మధుపానంతో (మత్తును కలిగించే సురాపానంతో); ఎలమిన్+పొంది= సంతోషాన్ని పొంది (తృప్తిని పొంది); ఆ+మహీపతి= ఆ ధర్మరాజు; పాదంబులకున్+ప్రణతుండు+ఐనన్= పాదాలకు దండం పెట్టగా; కౌఁగిలించుకొని= కౌగిలిలోకి తీసికొని; అతండు= ఆ ధర్మరాజు; దీవించినన్= దీవనలు ఇవ్వగా; పెండ్లికిన్+పోవు లీలన్= పెండ్లికి వెళ్ళే విధంగా; తేరు+ఎక్కి= తన తేరుమీదకు ఎక్కి; ఎక్కిడిన= ఎక్కుపెట్టిన; విల్లును= ధనుస్సును; మెచ్చువచ్చు అమ్ములును= కీర్తిని తెచ్చే బాణాలను; తొడలపైన్= తన తొడలపై; పెట్టికొని= ఉంచుకొని; కదలి చను= బయలుదేరు; సమయంబునన్= వేళలో; భీమసేనుండును= భీముడును; అగ్రజునకున్= అన్నకు; ప్రణామంబు చేసి= నమస్కారం చేసి; తనతోడన= తనతోనే; రాన్+కదలినన్= రావటానికి బయలుదేరగా; కని= చూచి; ఆ శినిపుంగవుండు= ఆ శిని వంశంలో ఉత్తముడు (సాత్యకి); అతనికిన్= ఆ భీముడికి; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** సాత్యకి ధర్మరాజుతో తన గుర్రాల దప్పికను, సారథి దాహాన్ని తీర్చి తేరును సిద్ధం చేయవలసి ఉందన్నాడు. ధర్మరాజు సంతోషంతో ఉత్తర్వు చేశాడు. ఆయా పనులు తెలిసిన సేవకులు గుర్రాలకు నీళ్ళు తాగించి దాణా తినిపించి, వాటి ఒంటిని నిమిరారు. దారుకుని తమ్ముడయిన సారథికి ఆహారం తగినంతగా ఇచ్చారు. (శ్రీకృష్ణుడి సారథి దారుకుడు. అతడి తమ్ముడి సారథి దారుకుడి తమ్ముడు); ఆ సారథి సర్వసన్నద్ధంగా తేరును అలంకరించాడు. విశేషాయుధాలను సిద్ధం చేశాడు. శుచిగా యుద్ధానికి పోవటానికి సాత్యకి స్నానం చేసి, ఉత్సాహానికై మధువును ఆస్వాదించాడు. ఆశీర్వచనానికై ధర్మరాజుకు నమస్కరించాడు. ఆతడి దీవెనలతో పెండ్లికి వెళ్ళే విధంగా బయలుదేరి తేరెక్కాడు. తన వింటినీ, బాణాలను ఒడిలో పెట్టుకొన్నాడు. ఆతడి వెంట వెళ్ళటానికై భీమసేనుడు అన్నగారి ఉత్తర్వును తీసికొనటానికి ఆయనకు నమస్కరించాడు. తనతో బయలుదేరే భీముడితో శినివంశంలో శ్రేష్ఠుడయిన సాత్యకి ఈ విధంగా అన్నాడు:

**క. 'అక్కట! రావలవదు నా । కెక్కటి యీ సేన దటిసి యేఁగుట భరమే?**
**యిక్కడన నిలువు; ద్రోణుని । యుక్కునఁ బతి కెడరు వుట్టకుండఁగ వలయున్.' 306**

**ప్రతిపదార్థం:** అక్కట! రావలవదు= అయ్యో! (నీవు) రావద్దు; నాకున్= నాకు; ఎక్కటి= ఒక్కడుగా; ఈ సేనన్= ఈ సైన్యమును; దటిసి= చేరి; ఏఁగుట= పోవటం; భరమే?= కష్టమా? (కష్టంకాదు); ఈ+కడన= ఈ చోటనే; నిలువు= నిలిచిపొమ్ము (ఉండుము); పతికిన్= రాజునకు (ధర్మరాజుకు); ద్రోణుని= ద్రోణాచార్యుడి; ఉక్కునన్= బలంతో; ఎడరు= ఆపద; పుట్టకుండఁగన్ వలయున్= కలుగకుండా ఉండాలి.

**తాత్పర్యం:** 'నీవు నాతో రావద్దు. ఇక్కడనే ఉండుము. నేను ఒక్కడుగానే ఈ సేనవద్దకు చేరటం కష్టం కాదు. ద్రోణుడి వలన కలిగే ఆపద రాకుండా ధర్మరాజునకు అండగా ఉండుము.'

**వ. అనవుడు నతం 'డట్ల కాక యేను రాజ రక్షణంబునకు నిలిచెద; నీ వప్రమత్తుండవయి యరుగు' మనిన వదనంబు వికసింప' నీ యట్టి పెనుబ్రాపు గలుగ నా కెదు రెవ్వరు? సవ్యసాచి సైంధవుం దెగటార్చినం బేర్చిన కౌతుకంబున వచ్చి నిన్నును నీయన్ననుం గౌఁగిలించుకొనియెద' నని పలికి యవ్వీరుని నిలిపి లేళ్ళ గమిం గనుంగొను బెబ్బులియుంబోలె నీ సేనం జూచుచు నడచె నని యిట్లు సంజయుండు సాత్యకి సంరంభంబు ధృతరాష్ట్రునకుం జెప్పె నని చెప్పిన వేడ్క యుల్లంబున నివ్వటిల్లఁ 'బదంపడి చెల్లిన భండనంబు వినిపింపు' మనుటయు. 307**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; అతండు= ఆ భీమసేనుడు; అట్లు+అ+కాక= అట్లేకానిమ్ము; ఏను= నేను; రాజరక్షణంబునకున్= రాజును కాపాడటానికై; నిలిచెదన్= ఆగుతాను; ఈవు= నీవు; అప్రమత్తుండవు+అయి= జాగరూకుడవయి; అరుగుము= వెళ్ళుము; అనినన్= అనగా; వదనంబు వికసింపన్= ముఖం వికసించగా; నీ అట్టి= నీవంటి; పెను= పెద్ద; ప్రాపు=అండ; కలుగన్= ఉండగా; నాకున్+ఎదురు+ఎవ్వరు?= నన్నెవరెదుర్కోగలరు?; సవ్యసాచి= అర్జునుడు; సైంధవున్= సైంధవుడిని; తెగటార్చినన్= చంపినట్లయితే; పేర్చిన= ఎక్కువ అయిన; కౌతుకంబునన్= సంతోషంతో; వచ్చి= తిరిగివచ్చి; నిన్నును మీ అన్ననున్= నిన్నూ మీ అన్నగారినీ; కౌఁగిలించుకొనియెదన్= కౌగిలించుకొంటాను; అని పలికి= అని చెప్పి; ఆ+వీరుని నిలిపి= ఆ వీరుడైన భీముడిని ఆపి; లేళ్ళగమిన్= జింకల గుంపును; కనుంగొను= గుర్తించే; బెబ్బులియున్+పోలెన్= పెద్దపులి మాదిరిగా; నీసేనన్+చూచుచున్= నీ సైన్యాన్ని చూస్తూ (కౌరవ సైన్యాన్ని); నడచెన్+అని= ముందు కురికాడని; ఇట్లు= ఈ విధంగా; సంజయుండు= సంజయుడు; సాత్యకి= సాత్యకియొక్క; సంరంభమున్= తొందరను; ధృతరాష్ట్రునకున్ చెప్పెన్= ధృతరాష్ట్రుడికి చెప్పాడు; అని చెప్పినన్= అని చెప్పగా; వేడ్క= ఉత్సాహం; ఉల్లంబునన్= మనసులో; నివ్వటిల్లన్= కలుగగా; పదంపడి= ఆ మీద; చెల్లిన= సాగిన; భండనంబు= యుద్ధపు; విధంబు= పద్ధతిని; వినిపింపుము= వినజేయుము; అనుటయున్= అని అనగా. (ధృతరాష్ట్రుడు సంజయుడిని ప్రశ్నించాడు).

**తాత్పర్యం:** దాని కాతడు అట్లే అన్నాడు. రాజునకు తాను అండగా ఉంటాననీ, సాత్యకిని జాగ్రత్తగా వెళ్ళుమనీ భీముడు కోరాడు. అపుడు సాత్యకి మొగం సంతోషంతో వికసించింది. 'అర్జునుడు సైంధవుడిని చంపిన తరువాత అతిశయించి ఉత్సాహంతో వచ్చి నిన్నూ, మీ అన్ననూ కౌగిలించుకొంటాను' అని చెప్పుతూ జింకల గుంపును చూచిన పెద్దపులి మాదిరిగా కౌరవసైన్యం మీదకు ఆతడు దూకాడు - అని సాత్యకి సంరంభాన్ని సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పగా ఆ మీదట. (తరువాతి ఆశ్వాసంలోని వచనంతో అన్వయం).

**ఆశ్వాసాంతము**

**ఉ. నిర్మల చిత్తభృంగ రమణీయ వికస్వర పుండరీకతా**
**ధర్మ నిరూఢ! సంసరణ తాప నిరాకరణ ప్రగాఢ స**
**త్కర్మ ఫలాకృతీ! భువన తాపి భవప్రకృతీ! తపఃక్రియా**
**కర్మఠ సంయమీశ్వర సఖా! సమతా సమవేత! చిత్సుఖా! 308**

**ప్రతిపదార్థం:** నిర్మల= స్వచ్ఛమైన; చిత్తభృంగ= మనస్సనే తుమ్మెదకు; రమణీయ= అందమైన; వికస్వర= వికసించిన; పుండరీకతా= తెల్లతామరయొక్క; ధర్మ= గుణ విశేషంతో; నిరూఢ!= ప్రసిద్ధి పొందినవాడా!; సంసరణ= సంసారం వలని; తాప= బాధలను;

నిరాకరణ= తిరస్కరించే; ప్రగాఢ= దట్టమైన; సత్కర్మ= మంచిపనియొక్క; ఫల= పంటయొక్క; ఆకృతీ!= ఆకారమైనవాడా!; భువన= ప్రపంచం యొక్క; తాపి= తపింపజేయు; భవప్రకృతీ!= సంసారమునకు మూలభూతమైనవాడా!; తపఃక్రియా= తపస్సు చేయటంలో; కర్మఠ= ఆసాంతము పనిని చేయునట్టి; సంయమీశ్వరసఖా!= ఋషీశ్వరుల పుత్రుడైనవాడా!; సమతా= సమానత్వంతో; సమవేత!= సంబంధం కలవాడా!; చిత్సుఖా!= జ్ఞానసౌఖ్యం కలవాడా!

**తాత్పర్యం:** తుమ్మెదలు పద్మములందు విహరించుట్లు కామక్రోధాదులులేని నిర్మల చిత్తములు నీయందు విహరించును. సర్వజనులను తపింపజేయు సంసార దుఃఖమునకు మాయయే హేతువగుటచే ఆ దుఃఖమును పోగొట్టు వాడవు నీవు మాత్రమే. సత్కర్మాచరణమునకు ఆనందరూపుడవగు నిన్ను పొందుటయే ఫలము. దృఢదీక్షతో కర్మముల నాచరించువారికి మిత్రుడవై వారి దుఃఖమును పోగొట్టుదువు. సర్వభూతములయందును నీవు సమభావముతో నుందువు. ఆనంద చైతన్యములే నీ వాస్తవ స్వరూపము.

**క. పరిధాన ప్రావరణీ । కరణాదృత పీతవసన గజచర్మ! సము**
**ద్ధుర వాహనీకృతోజ్జ్వల । గరుడ వృషభ! పరమ మోక్షకర! దురితహరా! 309**

**ప్రతిపదార్థం:** పరిధాన= కట్టు వస్త్రముగాను; ప్రావరణీ= ఉత్తరీయంగాను; కరణ= చేయుటచే; ఆదృత= ఆదరింపబడిన; పీతవసన= పసుపుపచ్చని వస్త్రమూ; గజచర్మ!= ఏనుగుతోలు గలవాడా! - హరికి పట్టు వస్త్రము కట్టుబట్ట, హరునకు గజచర్మము ఉత్తరీయము; సముద్ధుర= మిక్కిలి గొప్పవైన; వాహనీకృత= వాహనములుగా చేయబడిన; ఉజ్జ్వల= ప్రకాశించెడి; గరుడ= గరుత్మంతుడు; వృషభ!= ఎద్దు గలవాడా! - హరికి గరుడుడు వాహనము, హరునకు ఎద్దు వాహనము; పరమ మోక్షకర!= మిక్కిలి ఉత్కృష్టమైన మోక్షమును ఇచ్చువాడా!; దురితహరా!= పాపములను పోగొట్టువాడా! హరిహరనాథా!.

**తాత్పర్యం:** పీతాంబరం కట్టుబట్టగాను, గజచర్మం ఉత్తరీయంగాను ఆదరించిన వాడా! గరుత్మంతుని, ఎద్దును వాహనముగా చేసికొన్నవాడా! ఉత్కృష్టమైన ముక్తిని ప్రసాదించువాడా! పాపహరా! హరిహరనాథా!

**విశేషం:** అలంకారం: యథాసంఖ్యం.

**మాలిని.**

**నిరుపమ గుణరాశీ! నిర్గుణిత్వ ప్రకాశీ!**
**భరిత భువన కార్యా! భవ్యనైష్కర్మ్యధుర్యా!**
**విరతి నిరత భావ్యా! విశ్వలోకైక సేవ్యా!**
**స్ఫురిత బహు శరీరా! శుద్ధ వైరూప్యసారా! 310**

**ప్రతిపదార్థం:** నిరుపమగుణరాశీ!= సాటిలేని గుణముల ప్రోవు కలవాడా!; నిర్గుణిత్వప్రకాశీ!= గుణరాహిత్యం చేత ప్రకాశించేవాడా!; భరిత+భువనకార్యా!= భరింపబడిన ప్రపంచపు పనులు కలవాడా!; భవ్యనైష్కర్మ్యధుర్యా!= యోగ్యమగు నిష్కర్మ ధుర్యుడా!; విరతి నిరత భావ్యా!= సర్వకర్మ సన్న్యాసమందు ఆసక్తిగలవానిచే భావింపదగినవాడా!; విశ్వలోకైక సేవ్యా!= ప్రపంచమంతటిలోనూ సేవింపదగినవాడా!; స్ఫురితబహుశరీరా!= అనేక శరీరాలతో వెలిగేవాడా! (అవతారా లెత్తేవాడా!); శుద్ధ= స్వచ్ఛమైన; వైరూప్య= శుద్ధ విరూపత్వముయొక్క సారము గలవాడా!; సారా!= సారమైన వాడా!

**తాత్పర్యం:** సాటిలేని గుణములకు నిధియైనవాడా! గుణరహితుడవై వెలిగేవాడా! ప్రపంచంలోని భారమైన పనులు కలవాడా! యోగ్యమైన నిష్కర్మ సిద్ధాంతాన్ని వివరించటంలో దిట్ట అయినవాడా! ప్రపంచానికంతటికినీ

సేవ్యమానుడా! అనేకావతారాలతో స్వచ్ఛమగు విశేష రూపం కలవాడా! వైరూప్య సారమా! (అని హరిహరనాథులను ప్రార్థించాడు).

**విశేషం:** అలం: అంత్యాను ప్రాసం.

**ఇది శ్రీమదుభయ కవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర బుధారాధన విరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఇది ఉభయ కవిమిత్రుడనే బిరుదం కలవాడు, కొమ్మనామాత్యుడి పుత్రుడు, పండితులను ఆరాధించటం చేత ప్రకాశించేవాడు (పండితులచేత ఆరాధించబడటం చేత ప్రకాశించేవాడు) అయిన తిక్కన సోమయాజి రచించిన శ్రీ మహాభారతంలోని ద్రోణపర్వంలోని మూడవ ఆశ్వాసం.

**ద్రోణపర్వంలోని తృతీయాశ్వాసం సమాప్తం.**

కవిత్రయ విరచిత

# శ్రీమదాంధ్ర మహాభారతము

( సరళ వ్యాఖ్యాన సహితం )

**సంపుటము - 10**

## కర్ణపర్వము

కృతికర్త

**తిక్కన సోమయాజి**


వ్యాఖ్యాతలు

శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య

డా॥ యస్.వి.రామారావు

డా॥ మరుపూరి కోదండరామిరెడ్డి

ప్రధాన సంపాదకుడు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం






ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి**

**2013**

**KAVITRAYA VIRACHITA**
**SRIMADANDHRA MAHABHARATAM**

With Commentary
Karna parvamu of Tikkana Somayaji
Vol.X .

Commentary by
**Sri Eluripati Annanta Ramaiah -** 1st Canto
**Dr. S.V.Ramarao -** 2nd Canto
**Dr. Marupuri Kodanda Rami Reddy** 3rd Canto

Edited by
**Dr.G.V.Subrahmanyam**

T.T.D.Religious Publications Series No.609
First Edition : 2004
First Re-print : 2006

Second Edition: 2013
Copies : 5,000



Published by
**Sri. M.G. Gopal, I.A.S.**
Executive Officer,
T.T.Devasthanams,
Tirupati - 517 507

D.T.P. Type Setting
**Editor-In-Chief Office**
T.T.D., Tirupati.

Cover Design:

Printed at:

# ఒక మాట

తిరుమల తిరుపతి దేవస్థానం సనాతనధర్మప్రచారరంగంలో పూర్వంనుంచి ప్రముఖమైన సేవ లందిస్తున్నది. అందుకు అధికంగా దోహదపడే వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, పురాణాలు, రామాయణ భారత భాగవతాది ధార్మిక గ్రంథాలు విరివిగా ప్రచురిస్తూ ప్రజాబాహుళ్యానికి అందజేస్తూనే ఉంది.

ఈ ధార్మిక ప్రచార మహోద్యమంలో భాగంగా తి.తి.దేవస్థానం కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతాన్ని విస్తృత వ్యాఖ్యాన సహితంగా తెలుగు ప్రజల కందజేయాలనే ఉద్దేశంతో ఒక బృహత్ సాహిత్య యజ్ఞాన్ని చేపట్టింది. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యంగారి ప్రధాన సంపాదకత్వపర్యవేక్షణలో దేశంలో సుప్రసిద్ధులైన ముప్ఫైమంది పండితులచేత 18 పర్వాలను వ్యాఖ్యానింపజేసి 15 సంపుటాలుగా వెలువరించింది. ఆంధ్రమహాభారతానికి సమగ్రంగా వెలువడిన ఏకైక వ్యాఖ్యానం ఇది. ఈ మహాభారత మహేతిహాస సంపుటాలు పదిహేనింటినీ 2005 సంవత్సరపు శ్రీవారి బ్రహ్మోత్సవాలలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥శ్రీ వైయస్.రాజశేఖరరెడ్డి గారు ఆవిష్కరించి తెలుగు జాతికి కానుకగా సమర్పించారు.

పాఠకులందరికీ అందుబాటులో ఉండేటట్లు చాల తగ్గింపు ధరకే, కేవలం వెయ్యి రూపాయలకే తి.తి.దేవస్థానం అందించింది. పాఠకుల విశేషాదరణకు పాత్రమైన ఆంధ్రమహాభారత ప్రతులన్నీ అనతికాలంలోనే పూర్తిగా చెల్లిపోయాయి.

పాఠకుల అక్కర తీర్చేందుకు మళ్ళీ భారతసంపుటాల పునర్ముద్రణ ఆవశ్యకతను దేవస్థానం గుర్తించింది. తొలిముద్రణలో దొరలిన లోటుపాట్లను పరిశీలించి సవరించుటకుగాను ఈ సందర్భంగా దేవస్థానం, ఈ దిగువ పేర్కొన్న ప్రముఖ సాహితీవేత్తలతో కూడిన ఒక పండితపరిషత్తును ఏర్పాటుచేసింది.

**1) శ్రీ పొత్తూరి వేంకటేశ్వరరావు**

**2) ఆచార్య రవ్వా శ్రీహరి**

**3) శ్రీ జొన్నలగడ్డ మృత్యుంజయరావు**

**4) డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య**

**5) డా॥ సముద్రాల లక్ష్మణయ్య**

**6) ఆచార్య కె. సర్వోత్తమరావు**

**7) విద్వాన్ ముదివర్తి కొండమాచార్యులు**

ఈ పండితపరిషత్తు సభ్యులందరు ఆమూలాగ్రంగా పరిశీలించినతర్వాత పునర్ముద్రించబడిన మహాభారతం 18 పర్వాలను 15 సంపుటాలుగా రసజ్ఞులైన చదువరులకు అందజేస్తున్నాం.

పాఠకమహాశయులు యథాపూర్వం మా యీ ప్రయత్నాన్ని ఆదరించగలరని, చదువరు లందరికి ఆ దేవదేవుని ఆశీస్సులు అందగలవని ఆశిస్తున్నాం.

సదా శ్రీవారిసేవలో...

**(లంక వేంకట సుబ్రహ్మణ్యం)**

కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

నాయకుడితో పోటీపడి, ఓడి శరణు వేడటమో, ప్రాణా లర్పించి పరువు కాపాడుకొనటమో కావాలి. కర్ణుడు శత్రువులకు సింహస్వప్నమై బ్రతికాడు. చివరకు రణనిహతుడయ్యాడు. ఆ రణమరణం కరుణారసపూరితం. ఎంతటివాడు ఎట్లా మరణించాడని సహృదయులు కన్నీరు కారుస్తారు.

ధర్మరాజుకు దుర్యోధను డంటే భయం లేదు కాని, కర్ణు డంటే కలవరపాటు. అరణ్యాజ్ఞాతవాస కాలంలో-

సీ. 'పదుమూఁడు వర్షముల్ పగలును రేలును । గర్ణుదర్పం బెట్లు గడతు నొక్కొ!
యనుచింతఁ జేసి యాహారనిద్రలు లేక । పరితాప మందితిఁ; బశువుఁ జేయ
విప్రులు పట్టరా వెఱ సొచ్చి యొదిఁగెడు । గవయంబు చాడ్పునఁ గర్ణ భీతి
నుల్లల నుడుకుచు నుండుదుఁ గర్ణుండు । విడువక మోమున వ్రేలునాకు'. **(కర్ణ. 3.33)**

అని చెప్పుకొన్నాడు. కర్ణుడి శరపాండిత్యమే పార్థుడిచేత తపస్సు చేయించింది. పాండవ వీరులందరూ అంతో ఇంతో యుద్ధాలలో ఓడించబడినవారే. అందరికంటె అవమానం పొందినవాడు ధర్మరాజు. అందరికంటె భయపడ్డవాడు అర్జునుడు. యుద్ధంలో కర్ణుడికి ఓడి, బాణాఘాతాలకు గురి అయి శిబిరానికి తిరిగివచ్చిన ధర్మరాజు, అతడిని చంపివస్తానని శపథంచేసి వెళ్ళిన పార్థుడు తనను పలకరించటానికి మధ్యలోనే తిరిగిరాగా అర్జునుడితో కోపంతో అన్నమాటలు కర్ణ ప్రతాపానికి ఆతడు పడిన భయాన్ని తెలిపాయి.

క. 'విను! కర్ణున కే నోడితి । నన నేటికి? నీవు నోడి; తనిలజ మాద్రీ
తనయులు మున్నే యోడిరి; । మనతోఁ గూడంగఁ గంసమర్దనుఁ డోడెన్.'

క. 'కావున మన మిఁక ననికిం । బోవం బని లేదు; విపినభూమికిఁ జని య
చ్చో వెఱపు దక్కి తపసుల । మై విచ్చలవిడిఁ జరింత మందఱముఁదగన్'.

క. 'కాదేని బిరుదు లాడక । సాదులమై వినయ మొప్పఁ జని కురునాథుం
డేది పనిచినను జేసి ద । యాదృష్టి నతండు చూచున ట్లుండఁదగున్.' **(కర్ణ. 3. 53-55)**

నాయకుడు ఓడితే అనునాయకులూ, ఉపనాయకులూ కూడా ఓడినట్లే పరిగణించుమన్నాడు ధర్మరాజు. దానికి ప్రతిగా అనునాయకుడు కాని, ఉపనాయకుడు కానీ శత్రువు నోడించి నాయకుడికి ఫలం దక్కించాలి. ఆ స్థితిలో అర్జునుడు అన్నమాటలు గమనించదగినవి.

తే. 'పట్టపగలింటి సూర్యుని పగిదిఁ గర్ణుఁ । డుగ్రమూర్తియై వెలుఁగుచునున్నవాఁడు;
మన రథం బిప్డు మాధవ! మరలనిమ్ము; । బ్రతికియుండిన శుభములు వడయ వచ్చు'. **(కర్ణ. 3.18)**

అట్లని కర్ణుడిని అర్జునుడోడించలేడని కాదు. ఈ మాట లన్నది కర్ణుడి చివరినాటి యుద్ధంలోనే. అంతకు ముందు కర్ణుడిని చూచి పార్థుడు భయపడిన ఘట్టం అరుదు! కర్ణుడు అర్జునుడిచేత ఓడించబడని ఘట్టం కూడా అరుదు! కాని. ఆనాడు కర్ణుడితో యుద్ధమనగానే పార్థుడికి నఖశిఖాపర్యంతం ముచ్చెమటలు పట్టాయి. కర్ణుడికి దీటైన వీరుడు శ్రీకృష్ణు డొక్కడే అనీ అంటూ, 'నీ (ధర్మరాజుయొక్క) నేర్పు, భీము లావు. నరుని విలుబల్మి యతనికి (కర్ణుడికి) హరికిఁ గల్గు'నని నారదుడు లెక్కవేసి చెప్పాడు.

ఇటువంటి మేటివీరుడు, పురుషకారం వెలార్చి, కురుక్షేత్రంలో అర్జునుడితో తలపడి ఘోరయుద్ధం చేశాడు. విక్రమం ప్రదర్శించినా విధిచాలక అతడు నేలకూలాడు. నాయకపక్షంవారి తీవ్రయత్నానికి ఏకైక హేతువు కావటం కంటె వీరుడికి కావలసిన గుర్తింపు మరే ముంటుంది? అట్టివాడు ప్రతినాయకోపనాయకుడైతే బ్రతుకవలసిన దానికంటె ఘనంగా బ్రతికినట్లే. అట్టి కర్ణుడికి - పరశురాముడి వద్ద భార్గవాస్త్రాంతం బాణవిద్య నభ్యసించిన జోదుకు - కృష్ణుడి మాయచేత ఇంద్ర దత్తమైన శక్తి, సర్పముఖాస్త్రం, రౌద్రమంత్రపూరితమైన బాణం వమ్మైపోవటంతో కన్నీరు నిండింది. రథచక్రం నేలలో క్రుంగటంతో మనసులో ధైర్యం కుంటువడింది. భార్గవాస్త్రం స్ఫురించకపోవటంతో సర్వం ముగిసింది. కఠినమైన విధి కసితీర్చుకొన్నప్పుడే కరుణమాలిన శత్రువు కుత్తుక త్రెంచటంతో కర్ణుడి కన్నుమూత కరుణారసభరితమై పోయింది. కన్నీరు కార్చే కొడుకులు కూడా కదనరంగంలో కన్నులు మూశారు. మిత్రుడైన రారాజు 'హే కర్ణా!' అంటూ అందరిబదులు తానొక్కడే ఎలుగెత్తి శోకించాడు.

మహాభారతకథలో కర్ణుడు చివరకు మరణించటం కంటె మరొక ప్రత్యామ్నాయం లేదు. కర్ణుడుండగా దుర్యోధనుడికి చావు లేదు. ధర్మరాజుకు విజయం లేదు. కథకు ప్రగతి లేదు. ఒకవేళ కర్ణుడికంటె ముందే దుర్యోధనుడు చనిపోతే కర్ణుడు బ్రతికి ఫలం లేదు. పైపెచ్చు ధర్మరాజుకు రాజ్యసిద్ధి లేదు. అంటే నాయకుడికి ఫలభుక్తి లేదు. ఇన్ని లేములకు కలిమి కలిగించింది కర్ణుడి విషాదాంతం. ఉపనాయకుడుగా ఇతిహాసంలో ఉపజీవించి, ప్రతినాయక ప్రతిష్ఠను పెంచి, శత్రుపక్షంనుండి ప్రశంసలు పొంది, ప్రతినాయక సహాయకుడిగా మాత్రమే కాక, స్వతంత్ర ప్రతిపత్తి గల వీరుడుగా రాణించిన కర్ణుడు భారత పాత్రలలో విశిష్టుడు. ఉపప్రతినాయకుడుగా ఉజ్జ్వలవృత్తాన్ని నిర్వహించి అపార ప్రతిష్ఠను గడించిన విషాదవీరుడు కర్ణుడు. అందుకే 'కర్ణుడు లేని భారతం' భారతమే కాదని విజ్ఞుల వివేచన! కర్ణుడి తల భారతమనే నానుడి ఏర్పడింది.

### 3. కర్ణపర్వం ఒక ప్రబంధం:

మహాభారతేతిహాస నాయకులైన పాండవుల చరిత్రను పుట్టిందిమొదలు గిట్టేంతవరకు పురుషార్థ సాధనరూపమైన జీవితవివరాలతో వర్ణించటం ఇతిహాస లక్షణం. అట్లాగే భారతవీరుల చరిత్రలుకూడా పుట్టిందిమొదలు గిట్టేంతవరకూ ప్రధానకథకు పరిపోషకంగా సాగటం కూడ ఇతిహాస కథావిశేష స్వభావం. అందులో యుద్ధపర్వాలకు ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నది. నాయక ప్రతినాయక పక్షాలవారు విజయం కొరకు ప్రతిదినం చేసే యుద్ధ ప్రయత్నం ఒక రసవత్తర ఘట్టం కావచ్చును. కౌరవపక్షంలోని సర్వసైన్యాధ్యక్షుడు చేసే యుద్ధవ్యూహాలూ, విజయఘట్టాలూ, విఫలయత్నాలూ, ఫలితాంశాలూ కలిసి ఒక స్వయంసమగ్రమైన ప్రబంధంగా రాణిస్తుంది. ఆ దృష్టితో చూస్తే భీష్మద్రోణ పర్వాల వలెనే కర్ణపర్వం కూడా ఒక ప్రబంధం!

**ఇతిహాసంలో భాగమైన ప్రబంధంలో కానవచ్చే ప్రధానాంశాలు:-**

(1). ఇతిహాస స్వభావాన్ని వ్యక్తీకరించే కథకశ్రోతృసంబంధ నిర్వహణం.

(2). ఆఖ్యాన కథాకథన చాతుర్యం.

(3). ఆఖ్యానానికి అనుకూలమైన ఉపాఖ్యానాల కథనం.

(4). నాటకీయతను పోషించే సంభాషణ సంవిధానం.

(5). వర్ణనా వైదగ్ధ్యం: రచనాశిల్పం.

(6). రసరామణీయకం.

ఇవన్నీ కర్ణపర్వం కర్ణపర్వం (చెవులపండుగ - వినటానికి ఇంపు కలిగించేది) కావటానికి తోడ్పడ్డాయి.

**(1). ఇతిహాస స్వభావం:**

ఇది ఇట్లా జరిగింది అని చూచి చెప్పిన కథనం ఇతిహాస స్వభావం. భారతయుద్ధ పర్వాలలో కథకుడు సంజయుడు. ప్రథమశ్రోత ధృతరాష్ట్రుడు. కథకుడు చూచినదానిని కాలక్రమ పద్ధతిలో చెప్తుతుంటాడు. శ్రోత ఆసక్తితో కొన్ని వివరాలు అడుగవచ్చును. లేదా, ఒక ఘట్టాన్ని ముందుగా చెప్పమని అడుగవచ్చును; లేదా, ఎక్కడైనా ధర్మసందేహంగాని, అనుమానంగాని కలిగితే దానిని తీర్చికొనటానికి కొన్ని ప్రశ్నలు వేయవచ్చును; లేదా; వింటున్న సన్నివేశాలకు స్పందించవచ్చును. లేదా, కొన్ని విషయాలు చర్చించవచ్చును. ఇంత వైవిధ్యంతో కూడుకొన్న శ్రోతృ ప్రవృత్తిని సర్వాంగసుందరంగా ధృతరాష్ట్రుడు ప్రదర్శించటం కర్ణపర్వంలో విశేషం. మచ్చుకు కొన్ని ఉదాహరణలు:

(అ) శోకోపహతుఁడైన ధృతరాష్ట్రుడు తన సంశయం తీరేటట్లు కర్ణుడి మరణానికి ముందు చనిపోయిన వారిని స్పష్టంగా పేర్కొనుమని అడిగాడు. దీనివలన ఈ పర్వపూర్వరంగ సంస్మరణానికి వీలయింది.

(ఆ) కర్ణుడి మరణవార్త విని ధృతరాష్ట్రుడు హాహాకారాలు చేస్తూ దుఃఖించాడు. కర్ణుడిని ప్రశంసిస్తూ విలపించాడు. మరణోద్యుక్తు డయ్యాడు. ద్రోణుడు గతించినప్పుడు కూడ ఇంతగా బాధపడలేదు. సంజయుడు ఓదార్చగా తేరుకొని, పెక్కు భంగుల నెవ్వగలు బయలుపడేటట్లు పలికి కర్ణుడు చనిపోయిన విధాన్ని వివరంగా వినిపించుమని కోరాడు.

ఉ. 'పాండవకోటి సూతసుతుపై నడతెంచిన చంద మెట్టు? లా
ఖండలసూతి సర్పముఖ కాండము తాఁకున రూపుమాసి పో
కుండుట యెట్లు కల్గె? సమరోద్ధతి దక్కటి నల్వురందు నె
ట్లుండె బలద్వయంబు? నెటు లోపి పెనంగె దినద్వయంబునన్?' **(కర్ణ. 1.46)**

ధృతరాష్ట్రుడు వేసిన ఈ ప్రశ్న కర్ణపర్వంలోని కథాంశాల ప్రాధాన్యాన్ని నిర్దేశిస్తూ, కీలకాంశ విస్తరణకు మార్గం చూపింది.

(ఇ) దుర్యోధనుడివైపున్న వీరులు పడిపోతున్నా, కౌరవులవైపు మహావీరులు పోరాడుతున్నా పాండవులలో ఒక్కడుకూడా కీడుపొందకుండా ఉండటాన్ని సహించలేక 'దైవం బలవంత' మయింది అని నిట్టూర్చాడు. విదురుడు ఆ పరిస్థితుల కన్నింటికీ ధృతరాష్ట్రుడే మూలకారణమని పలికాడు. ధృతరాష్ట్రుడు మరేమీ మాట్లాడలేక రెండవనాటి యుద్ధం ప్రారంభించే సందర్భంలో కర్ణుడు ఆలస్యంగా రణరంగానికి రావటానికి వెనుకనున్న కారణాన్ని తెలుపుమని కోరాడు. ఈ ప్రశ్న కర్ణుడికి శల్యుడిని సారథిగా ఉండటానికి దుర్యోధనుడు చేసిన ప్రయత్నాన్నీ, శల్యుడు పెట్టిన నియమాలను గురించి వివరంగా చెప్పటానికి కథనంలో అవకాశం కలిగించింది.

(ఈ) భీముడు కర్ణుడిని యుద్ధంలో మూర్ఛితుడిని చేసి నాలుక కోయబోగా శల్యుడి హితబోధను విని అతడు ఆ ప్రయత్నం నుండి విరమించాడన్న వార్తను విని ధృతరాష్ట్రుడు పొందిన స్పందన విశిష్టమైనది.

క. 'పాండవుల నాజి నోర్చు ని । తం డని మీ రాజు సూతతనయునిఁ బొగడున్;
గం డడఁచె భీముఁ; డిట్టి మ । గండు గలఁడె? పిదప నెట్లు గయ్యము సెల్లెన్?' **(కర్ణ. 2.215)**

'ఇట్టి మగండు గలఁడె?' అనే వాక్యం కర్ణుడి కెంతగా వర్తిస్తుందో, భీముడికి కూడా అంతగా వర్తిస్తుంది. అయితే ఒకరి అర్థంలో అధిక్షేప వాక్యం! రెండవవారి అర్థంలో ప్రశంసావాక్యం ఔతుంది! స్పందనను మెరుపువలె ఒకపద్యంలో నిబంధించి పఠితలలో దాని కాంతి ననుభవించే స్ఫూర్తిని ప్రసాదించటం ఈ రచనా ప్రయోజనం.

(ఉ) ధర్మరాజు కర్ణుడితో పోరి ఓడిపోయి పలాయనం చిత్తగించగా ధృతరాష్ట్రుడు సహజశ్రోత వలె ఆసక్తితో ఇట్లా అన్నాడు:

ఆ. 'మొదలిరాజు సభయముగ నిట్లు సమరంబు । దొఱఁగి చనియె నట్టె పెఱబలంబు
దొరలు నిలిచిపోరు టరిది; యనంతర । వర్తనంబు విప్రవర్య చెపుమ!' **(కర్ణ. 2.397)**

ద్వితీయాశ్వాసాంతాన ఈ ప్రశ్న నడిగించి, సమాధానం తృతీయాశ్వాసంలో మొదలుపెట్టటం భావికథలో ఆసక్తిని పెంచటం కొరకే. ఇది ఆశ్వాసవిభాగంలో పాటించే కథనశిల్పం.

(ఊ)క. 'అనిలజునకుఁ జాలఁడె నా । తనయుఁడు? మోసంబు గాక ధర్మజుఁ డ ట్ల
బ్బినఁ బోనిచ్చుట రాధా । తనయునకున్ బుద్ధి యగునె? తప్పెం దప్పెన్'. **(కర్ణ. 3.3)**

కర్ణుడు ధర్మరాజును చంపకుండా వదలిపెట్టినందుకు మూలకారణం తెలియక ధృతరాష్ట్రుడు వ్యక్తం చేసిన అనుమానం ఇది. ఇది కథలో ఎంత ప్రాముఖ్యాన్ని కలిగి ఉంటుందో కర్ణుడి శీలచిత్రణంలో కూడా అంత వైశిష్ట్యాన్ని పొంది ఉంటుంది.

**2. ఆఖ్యాన కథాకథన చాతుర్యం:**

మహాభారతంలో కర్ణుడికథ ఆరు ఘట్టాలలో అద్భుతంగా ప్రకాశిస్తుంది. 1. సూర్యుడివరంతో కన్య అయిన కుంతికి పుట్టి ఆమెచేత పరిత్యక్తుడై రాధేయుడై పెరగటం; జన్మరహస్యం దేవరహస్యంగా మిగలటం. 2. గురువుల వద్ద వివిధాస్త్ర శస్త్ర పాండిత్యాన్ని సాధించటం. 3. బ్రాహ్మణ భార్గవాదుల వలన కలిగిన శాపాల వృత్తాంతాలు. 4.దుర్యోధనుడితో స్నేహం చేసి, ఆతడికొరకు చేసిన యుద్ధాలలో కలిగిన విజయ పరాజయాలు. 5. కురుక్షేత్ర యుద్ధంలో క్రమంగా శాపాల ప్రభావాలకు గురికావటం. 6. కర్ణమరణానంతరం అతడిని గురించిన ప్రశంసలు, స్మృతులు, జన్మరహస్య ప్రకాశనం. లోకప్రకాశకుడైన సూర్యుడికి జన్మించినా కన్న తల్లిదండ్రుల పేర్లు బయటపడకుండా చీకటిలోనే కర్ణుడు జీవించాడు. ఎడనెడ కొందరికి ఆతడి జన్మరహస్యం తెలిసినా అది ప్రకటితం కాకుండా దేవరహస్యంగానే మిగిలిపోయింది. అతడికి అస్త్రా లెన్ని ఉన్నాయో శాపాలు కూడా అన్ని తగిలాయి. అతడిని మిత్రుడిగా మన్నించి అంగరాజ్యాభిషేకం చేసిన దుర్యోధనుడి హృదయాన్ని మెప్పించటానికి ఎన్నో వ్యూహాలు పన్నాడు, యుద్ధాలు చేశాడు. జయాపజయాలను పొందాడు. అయితే అతడు సేవాధర్మానికే అంకితమయ్యాడు. అతడు మహాదాత. పుట్టుకతో వచ్చిన కవచకుండలాలను సైతం ఇంద్రుడికి దానం చేసి

దానకర్ణు డనిపించుకొన్నాడు. కురుక్షేత్ర యుద్ధం సంభవించటానికి దుర్యోధనుడి దురాలోచనం ఎంత కారణమో, కర్ణుడి దుర్నీతి అంత కారణమైంది. సంధియత్నం చేయటానికి వచ్చిన కృష్ణుడిని బంధించే యత్నానికి మూలకారణం కర్ణుడే. దుర్యోధనుడికి అంతటి ఆప్త మిత్రుడు మరొకడు లేడు. అయినా, ప్రభుసేవాధర్మం కంటె స్వీయధర్మాన్ని కలుషితం కాకుండా రక్షించుకొన్న ఆత్మాభిమాని. అతడి తపస్సులు, అస్త్రబలాలు, శాపాలు ఎన్ని ఉన్నా కుంతి కర్ణజన్మరహస్యాన్ని ఎంత భద్రంగా దాచిందో అట్లాగే తన శాపరహస్యాలను కడుపులో దాచుకొని తల్లిపోలికలను ప్రకటించాడు. రహస్యంగా తల్లికి పార్థుడిని తప్ప మిగిలిన పాండవులను చంపనని మాట ఇచ్చాడు. ఇవన్నీ దుర్యోధనుడికి తెలియవు. అందువలన కర్ణుడు ద్విపాత్రాభినయం చేసిన నాయకుడయ్యాడు. అయితే ఎన్ని శాపాలున్నా, అన్ని వరాల్లాగా ఆయుధ సంపత్తిని సంపాదించుకొన్నాడు. అస్త్రాలలో ముఖ్యమైనవి ఇంద్రదత్తమైన శక్తి, నాగాస్త్రం. ఈ రెండింటినుండి తప్పించుకొని అర్జునుడు ప్రాణాలతో బయటపడటం అసాధ్యమని భావించాడు. కాని, శ్రీకృష్ణుడు తన దివ్యమాయతో ఆ రెండింటిని విఫలం చేశాడు. కర్ణుడి జీవితాన్ని అర్జునుడితో ముగింపజేశాడు. కర్ణుడి పరాక్రమాన్ని తలచి ధర్మరాజు నిద్రపోలేదు; కర్ణుడు కన్నుమూసేంతవరకు కృష్ణుడు కనురెప్ప వేయలేదు. కర్ణుడిని చంపి శపథం నెగ్గించుకొనేంతవరకు అర్జునుడు శాంతితో ఉండలేదు. వెలుగునీడల కర్ణజీవితం విధి నిర్వహించిన వింతనాటకం; మంత్ర ప్రభావంతో పుట్టిన మహావీరుడు అంతం కావటానికి విధి నిర్వహించిన వింతతంత్రం ఎంత నడిచిందో తెలిపే కర్ణవృత్తాంతం ఆద్యంతం అద్భుతం. శాంతిపర్వంలో నారదమహర్షి ధృతరాష్ట్రుడితో కర్ణసంహారం ఎంతమంది ఎన్నివిధాలుగా చేశారో పేర్కొన్నాడు.

చ. 'వినుము నరేంద్ర! విప్రు డలివెన్; జమదగ్ని సుతుండు శాప మి
చ్చె; నమరభర్త వంచనము సేసె; వరం బని కోరి కుంతి మా
న్చె నలుక; భీష్ముఁ డర్ధరథుఁ జేసి యడంచెఁ; గలంచె మద్ర రా
జనుచిత మాడి, శౌరి విధి యయ్యె, నరుం డనిఁ జంపెఁ గర్ణునిన్'. **(శాంతి. 1.35)**

శ్రీకృష్ణుడు అర్జునుడితో అన్నట్లుగా లోకంలో బహుళ ప్రచారంలో ఒక చాటువు కూడా ఉన్నది.

క. 'నరుచేతను, నా చేతను । వర మడిగిన కుంతిచేత, వాసవుచేతన్
ధరచేత, శల్యుచేతను । అరయంగా కర్ణుఁ డీల్గె నార్వుర చేతన్''

ఈ పద్యానికి అంత ప్రజాదరణం రావటానికి కారణం ఆ మాటలు కృష్ణుడు చెప్పినందుకే. కృష్ణుడు పాండవ సహాయకుడుగా కాక, 'శౌరి విధియయ్యె' నని చెప్పిన నారదోక్తులలోని సత్యాన్ని ప్రజలు నమ్మారు కాబట్టి. అంటే కర్ణుడి మరణానికి తెరవెనుక వ్యూహాన్ని విరచించిన విధి కృష్ణ డనేమాట సత్యం కాబట్టి. విధి మాటకు తిరుగులేదు కాబట్టి. విధి-అదృష్టానికీ, భగవంతుడికీ మారుపేరు.

మానవుడు చేసే శుభాశుభ కర్మలలో విధి జోక్యం చేసికొనడు. కాని, వాటి ఫలాలను అతడు అనుభవించే విధానానికి సాక్షిగా నిలిచి అది వర్తిల్లేటట్లు చూస్తాడు. అందులో విధి తన కర్తృత్వాన్ని ప్రదర్శించడు. కాని, కర్మకు తగిన ఫలం అనుభవింపచేసే శక్తిగా గోచరిస్తాడు. మహాభారతయుద్ధం ప్రారంభ మయ్యేవరకు కర్ణుడు నిర్వహించిన పాత్ర ధర్మాధర్మ కర్మనిర్వహణ రూపమైనది. వాటి మిశ్రమ ఫలం అనుభవించే భాగం యుద్ధపర్వాలలో సాగుతుంది. మొదట్లోనే భీష్ముడు అతడిని అర్ధరథుడిగా నిర్ణయించాడు. దానికి ఆత్మాభిమాని అయిన కర్ణుడు కోపించి భీష్మమరణానంతరంగాని

యుద్ధంలో పాల్గొనని శపథం చేశాడు. అందుచేత అతడి యుద్ధప్రవేశం ద్రోణపర్వంలో జరిగింది. ద్రోణపర్వంలో కర్ణుడు ఇంద్రదత్తమైన శక్తిని ఘటోత్కచుడిపై ప్రయోగించి ఆత్మరక్షణం చేసికొన్నాడు. దానితో అర్జునుడికి ఒక ప్రాణగండం తప్పిందని శ్రీకృష్ణుడు సంతోషించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు మరొక రహస్యాన్ని కూడా బయటపెట్టాడు. ప్రతిరోజూ యుద్ధానికి బయలుదేరేముందు శక్తి ప్రయోగంతో ఆనాడు అర్జునుడిని చంపుతానని మిత్రుల ముందు కర్ణుడు ప్రతిజ్ఞచేసేవాడట! కాని, శ్రీకృష్ణుడి మాయాప్రభావం వలన యుద్ధంలో కర్ణు డాసంగతే మరచిపోయేవాడట! అది విధి ప్రదర్శించిన వైష్ణవమాయ!

ద్రోణపర్వంలో శక్తి విరహితు డయ్యాడు కర్ణుడు. కర్ణపర్వంలో ఇక శాపాలు తమప్రభావాలను ప్రదర్శించటం ప్రారంభించాయి. నాగాస్త్రం శ్రీకృష్ణుడి చాకచక్యంతో అర్జునుడి మెడ త్రుంచకుండా కిరీటాన్ని నేలపై పడవేసింది. కిరీటం పడటం తల నేలమీద పడటం వంటిదని ధర్మసూక్ష్మం చెప్పుకొంటే విధి అయిన శ్రీకృష్ణుడు అటు కర్ణుడి కోరికనూ, సర్పాస్త్ర ప్రతీకారాన్నీ కూడా లాంఛనప్రాయంగా తీర్చినవాడయ్యాడు. పార్థుడు బ్రతికాడు. ఇక మిగిలిన శాపాలు వర్తిల్లాలంటే కర్ణుడు జగదేకవీరుడుగా ప్రకాశించాలి; అతడికి దీటుగా అర్జునుడు మహావీరుడుగా రాణించాలి. కర్ణవిజృంభణంతో అతడికి విజయం సిద్ధించే స్పృహ రణరంగంలో ఏర్పడాలి. అర్ధరథుడికి అర్జునుడు సరి అయిన ప్రత్యర్థి కాడు. అయినా, ఆనాడు కర్ణుడు మహారథుడుగా వెలుగొందాలి. అర్జునుడిని ఓడించి చంపివేసే ప్రతాపాన్ని ప్రదర్శించాలి. శాపాల ప్రకారం అప్పుడే రథచక్రం క్రుంగిపోవాలి, భార్గవాస్త్రం స్ఫురించకుండా పోవాలి, మహాస్త్రాలు వమ్ముకావాలి, విధి బలీయమై వక్రించి కర్ణుడు పార్థుడిచేత మృతిచెందాలి. ఈ కార్యక్రమాన్ని పార్థసారథి విధిపాత్రగా నిర్వహించాడు. కాబట్టి కర్ణపర్వం విధి నిర్వహించే కథాసంవిధానం.

విధిపాత్ర నిర్వహించే భగవంతుడు ఎంతటి గడుసరివాడంటే - తాను కారకుడైనట్లుగా గాని, కర్త అయినట్లుగా గాని, ఫలప్రదాత అయినట్లుగా గానీ బయటపడడు. అంటే కర్తృత్వస్పృహను ప్రకటించడు. కాని, జరిగిన కార్యాన్ని, తాను జరిపించిన క్రమాన్ని కల్లాకపటం లేకుండా ప్రకటిస్తాడు. అది లోకులకు విధిలీలగా గాని, విధివంచనగా గానీ తోచవచ్చును. కాని, ఆ రెండింటికీ అతడు అతీతుడుగా ఉండటం విధిపాత్ర నిర్వహించే శ్రీకృష్ణుడి విశిష్టవ్యక్తిత్వం! ఆ వ్యక్తిత్వం వస్తుధ్వని నాశ్రయించి ప్రతీయమానం కావటం కథన చాతుర్యం.

### 3. ఆఖ్యానానికి అనుకూలమైన ఉపాఖ్యానాల కథనం:

కర్ణపర్వంలో కర్ణార్జునుల బలతారతమ్య నిరూపణ ఘట్టాలు కథానిర్మాణంలో కీలకపాత్ర నిర్వహిస్తాయి. ఈ అంశాన్ని ఉపాఖ్యానాల ద్వారా కూడా పోషించటం ఒక కథాకథన శిల్పం. దుర్యోధనుడు చెప్పిన త్రిపురాసుర సంహారం, శల్యుడు చెప్పిన హంసకాకీయోపాఖ్యానం కర్ణపర్వంలో ఆసక్తికరమైన కథా ప్రయోజనాలను సాధించాయి.

కర్ణుడి మొదటినాటి యుద్ధంలో ద్వంద్వయుద్ధాలు బాగా జరిగాయి. తులనాత్మక పరిశీలనంలో కృష్ణసారథ్యంవలన అర్జునుడు అసాధ్యుడు కావటంచేత కర్ణుడికంటె అతడికి ఎక్కువ విజయావకాశాలు కనబడ్డాయి. అందువలన రెండవనాటి ఉదయం కర్ణుడు శల్యుడిని తన రథసారథిగా ఉండేటట్లు ఒప్పించుమని దుర్యోధనుడిని కోరాడు. శల్యుడు ప్రశంసాప్రియుడనీ, అభిమానధనుడనీ, ఇచ్చినమాటకు కట్టుబడతాడనీ తెలిసిన దుర్యోధనుడు అతడిని సముచిత సంభాషణతో ఒప్పించాడు. ఆ ఒప్పించటానికి అతడు మూడంచెల పథకాన్ని ముందుకు తెచ్చాడు.

1. శల్యుడి వ్యక్తిత్వాన్ని ప్రశంసించి, కర్ణసారథ్యం నిర్వహించవలసిన ఆవశ్యకతను ప్రస్తావించి శల్యుడిని ప్రార్థించి అతడిని సుముఖుడిగా చేసికొనటానికి ప్రయత్నించటం.

సీ. 'సత్యవ్రతంబును, శాత్రవ దుర్దశా । పాదనంబును, మహాభాగతయును
నీకు నైజంబులు; నాకుఁ బెద్దయుఁ గూర్తు । గావున ని న్నేను గారవించి
వినతుండ నై వేఁడికొనియెద, రాజుల । నడుమ నీ దగు సౌమనస్య మెఱిఁగి
యర్జును ననిఁ దెగటార్పఁగ వలయుట । యూహించి, సంభృతోత్సాహలీలఁ

ఆ. గావు మితని' ననుచుఁ, గర్ణునిఁ జూపి యీ । తని రథంబు గడపు మనఘ! యిట్టు
లైన నితఁడు పగఱఁ బోనీక పొదివి య । స్ఖలిత గతుల నొంపఁ జంపఁ జాలు'. **(కర్ణ. 1.245)**

భీష్మద్రోణులు పోయిన తరువాత పలుచబడిన కౌరవసైన్యంతో జయాన్ని కోరే దుర్యోధనుడు కర్ణుడినే నమ్ముకొన్నట్లే పేర్కొని, ఆ విజయాన్ని సాధించిపెట్టే కర్ణసారథిగా అంగీకరించుమని శల్యుడిని ప్రార్థించాడు.

2. శల్యుడు సూతకులజుడికి సారథ్యం చేయటం అవమానకరమనీ, పరాక్రమంలో కర్ణుడి కంటె తానే మిన్న అనీ, అవసరం వస్తే సర్వసైన్యాధ్యక్ష పదవి నిర్వహించగలిగినవాడ ననీ, కర్ణుడు తనలో పదునారవ అంశానికికూడా సరిపోడనీ పలికి కర్ణపక్షపాతంతో తనను అవమానించటం తగదని తన అసమ్మతిని తెలిపాడు. అతడి అసమ్మతిని మాన్పే నిపుణమైన సమాధానాన్ని సహేతుకంగా చెప్పి అతడిని ఒప్పించటం రెండవ అంచె.

'శల్యుడా! నిన్ను మించిన రథికు లెవరున్నారు? కర్ణుడు మాత్రం అంతేకాదా? బలవంతులైన శత్రువులకు హృదయశల్యంగా ఉండేవాడివి కాబట్టి నీకు శల్యు డనేపేరు సార్థకమయింది. నా అభిప్రాయం వినుము. అర్జునుడి కంటె రథికగుణాలలో కర్ణుడు గొప్పవాడు. అశ్వహృదయ పరిజ్ఞానంలో కృష్ణుడికంటె నీవు అధికుడవు. అర్జునుడికి ప్రతివీరుడిగా కర్ణుడిని నిలిపాము కాబట్టి కృష్ణుడి ఎత్తులకు ఎదురు ఎత్తులు వేసి, విజయం సాధించటానికి నిన్ను కోరాను. ఆ పని నీవు తప్ప మరొకరు చేయలేరు' - అని ప్రశంసించాడు. దుర్యోధనుడి మాటలలో అర్జునుడికంటె కర్ణుడు గొప్పవాడనే అంశాన్ని వదలి, తనను కృష్ణుడికంటె అధికుడని గుర్తించినందుకు కృతజ్ఞుడై కర్ణసారథ్యానికి ఒప్పుకొన్నాడు. తన ఒప్పుకోలుకు ప్రతిఫలంగా మరొక కోర్కె కోరాడు.

క. 'జనవల్లభ! యొకసమయము విను । మీతనితోడ నేను విచ్చలవిడిఁ దోఁ
చినమాట లెల్ల నాడుదు; । నను నెగ్గులు వట్టకుండినం బొం దొనరున్'. **(కర్ణ. 1. 255)**

దీనిని దుర్యోధనుడు అంగీకరించాడు. ఇందులో శల్యుడు దుర్యోధనుడికంటె విజ్ఞు డనిపించుకొన్నాడు. బెట్టు చేసి రాజుపై పట్టు సాధించాడు. కర్ణుడు అర్జునుడికంటె ఘనుడని శల్యుడు వాచ్యంగా ఒప్పుకొనలేదు. పైపెచ్చు ధర్మరాజుకు తా నిచ్చిన వాగ్దానానికి అనుగుణంగా దుర్యోధనుడినుండి స్వేచ్ఛాప్రసంగవరం పొందాడు. ఇందులో మరొక అంశం కూడా ఉన్నది. శల్యు డానాడు కర్ణుడితో మాటలాడే పలుకులు బహిర్గతమై దుర్యోధనుడి దాకా చేరే అవకాశం ఉండదు. ధర్మజుడి అంచనా ప్రకారం శల్యుడు సారథిగా నొగలెక్కిన నాడే కర్ణుడి మృత్యువు తప్పదు. ఈ రహస్యం దుర్యోధనుడికి తెలియదు.

కర్ణ డెంత గూఢవర్తనుడో, శల్యుడు కూడా అంత గూఢవర్తను డయ్యాడు. ఇద్దరూ రథిక సారథులుగా కుదరటం విధినిర్ణయం.

(3) శల్యుడికి వరమిచ్చినా రారాజుకు అనుమానశల్యం మనసులో మిగిలింది. కర్ణుడిని తూలనాడుతా డేమో అని లోలోన భయపడ్డాడు. ప్రశంసాప్రియు డైన శల్యుడు కర్ణుడికంటె కూడ ఘనుడని చెప్పటానికీ, రథికుడి కంటె సారథి గుణాధికుడై ఉంటాడని నిరూపించటానికీ ఒక దివ్య ఇతిహాసాన్ని పేర్కొన్నాడు.

**i). త్రిపురాసుర సంహారం:**

దేవతలు త్రిపురాసుర సంహారం చేయుమని పరమేశ్వరుడిని ప్రార్థించారు. మయుడు భూమండలాన్ని రథంగా చేశాడు. సూర్యచంద్రులను రథచక్రాలుగా అమర్చాడు. సముద్రాన్ని అక్షంగా ఉంచాడు. హిమగిరినీ, వింధ్యపర్వతాన్నీ, సప్తగిరులనూ రథాంగాలుగా తీర్చాడు. టెక్కాన్ని త్రేతాగ్నులతో చేశాడు. గొడుగును మేరుపర్వతంతో నిర్మించాడు. గుర్రాలుగా వేదాలనూ, సంవత్సరాన్ని విల్లుగానూ, బాణంగా వాసుదేవుడినీ చేశాడు. శివుడు తనకు సారథి ఎవరు? అని ప్రశ్నించాడు. 'మీకు నచ్చినవాడిని సారథిగా చేసికొను' మని దేవత లన్నారు. అప్పుడు శివుడు ఇట్లా అన్నాడు:

తే. 'అరయ నెవ్వాఁడు నాకంటె నధికుఁ డతని । మీరు యెఱిఁగి యొనర్పుఁడు సారథిత్వ
మునకు' నని చెప్పటయు, మహామునులఁ గూర్చి । కొని యమర్త్యులు సంభృతవినయు లగుచు'.
**(కర్ణ. 1.287)**

బ్రహ్మదేవుడి వద్దకుపోయి రుద్రరథసారథికి కావలసిన గుణాలన్నీ ఆయనకు ఉన్నట్లు కీర్తించి, అంగీకరించుమని ప్రార్థించి తమను రక్షించుమని కోరారు. అప్పుడు బ్రహ్మ కరుణించి ఇట్లా అన్నాడు.

ఉ. 'మీరు నిజంబు చెప్పితిరి; మిక్కిలి నేర్పును లావు గల్గినన్
సారథి పోరులన్ రథికసత్తముఁ దా గెలిపించు బుద్ధిదో
స్సార విలాస భంగులకు శర్వుఁడు మెచ్చఁగ, నాగమాత్మకో
దార హయంబులన్ నడపెదన్ దనుజుల్ వెఱఁగందునట్లుగన్'. **(కర్ణ. 1.289)**

బ్రహ్మసారథ్యంతో శివుడు త్రిపురాసుర సంహారం చేశాడు. దేవతలు కృతకృత్యులయ్యారు. ఆ కథను దుర్యోధనుడు చెప్పి 'ఇవ్విధంబున లోకహితార్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బనుష్ఠించె; నీవు నటపోలె గౌరవ రక్షణార్థంబుగా రాధేయు రథంబు గడపు; మిక్కర్ణునకు నక్కిరీటికిఁ గృష్ణునకున్ బలశౌర్యంబుల నెక్కుడయిన వాఁడవు; మదీయ జీవితంబును రాజ్యంబును భవదధీనంబులు; వానిం గలిగింపను, జయంబును, సుఖంబును గావింపను నీవ యొడయుండ; విక్కార్యం బాచరించి నన్ను రక్షింపు' మని ప్రార్థించాడు.

ఈ ఉపాఖ్యానం చెప్పి దుర్యోధనుడు - శల్యుడు కర్ణుడికంటె గొప్పవాడే కాక కృష్ణార్జునుల కంటె కూడ గొప్పవాడని పేర్కొని, అట్టి గొప్పవాడే రథసారథిగా ఉండదగినవాడని ఇతిహాస సాక్ష్యంగా నిరూపించి, అతడిని ఒప్పించాడు. శల్యుడు

అంగీకరించటం ఉభయతారకంగా ఉండటం చేత భావికథకు సర్వార్థసాధకంగా అమరింది. వ్యక్తుల బలాబలాలను ఇతిహాస సుందరంగా ధ్వనింపచేయటం ఈ ఉపాఖ్యానం ప్రదర్శించటంలోని విశేషం.

### ii). హంస కాకీయోపాఖ్యానం:

రథికులలో అర్జునుడికంటె కర్ణుడు గొప్పవాడని దుర్యోధను డన్నాడు. దానిని శల్యుడు అంగీకరించలేదు కాని, కృష్ణుడికంటె తాను గొప్పవాడన్నందుకు సంతోషించాడు. అయితే, రథమెక్కగానే కర్ణుడికంటె అర్జునుడే మిన్న అని శల్యుడు ఉపన్యసించటం ప్రారంభించాడు. కర్ణుడి బలహీనతలు, ఓటములు మొదలైన వాటిని పేర్కొంటూ అధిక్షేపించటం ఆరంభించాడు. మచ్చుకు శల్యుడి మాటలు కొన్ని.

సీ. 'రోషమహాటోప భీషణ హరితోడ । సమరంబునకు హరిణము గడంగి,
దానధారాభీల దంతావళముతోడ । సంగ్రామమునకు శశంబు గడఁగి,
చండస్వభావోగ్ర పుండరీకముతోడ । నాజికి సారమేయంబు గడఁగి,
దారుణ తుండాతిఘోర గృధ్రముతోడఁ । గలహంబునకు నురగంబు గడఁగి'

ఆ. యడరునట్లు గాదె యస్త్ర కళాసము । జ్జ్వలుఁడు పార్థుతోడ సంగరమున
కీవు గడఁగి యడరు టెల్ల రాధేయ! నీ । కెట్టి బలము నమ్మ నెందుఁ గలదు?' **(కర్ణ. 2.42)**

శల్యుడి వాక్యాలకు కర్ణుడు స్వాభిమానంతో సమాధానం చెప్పాడు. మచ్చుకు -

సీ. 'అర్జును నస్త్రవిద్యా ప్రమాణంబు నా । యెఱిఁగినయంత నీ వెఱుఁగ; వతని
కొలఁదియు వనమాలికొలఁదియుఁ గాంచి నా । కొలఁదియు నెఱిఁగి వారల మదీయ
దివ్యాస్త్ర బలమునఁ దెగటార్ప నగు నని । యే నిశ్చయించితి; నెట్టు లనినఁ
గడుఁ బెద్దకాలంబు గంధపుష్పాదుల । నర్చించుచున్నాఁడ ననుదినంబు

ఆ. దొనఁ గరంబు భక్తి నునిచిన నున్నది । యహిమయంబు దారుణాస్త్ర; మింత
యంత యనక యెదిరి నాహుతి గొను దాన । జిష్ణు నోర్తు నొండెఁ గృష్ణు నోర్తు'. **(కర్ణ. 2.45)**

కర్ణుడు స్వీయపరాక్రమాన్ని ప్రతిపాదించుకొంటున్నాడు. అతడి ప్రతాపం ముందు పాండవులను సైతం తేలికగా తీసివేయలేదు. శల్యుడు కూడ కర్ణుడి బలపరాక్రమాలు తెలియని వాడు కాడు, అయినా ధర్మజుడి కిచ్చిన మాటకు బద్ధుడై, కర్ణుడికి హితవు చెప్పటానికి దుర్యోధనుడి అనుమతి పొందినవాడై, రథికుడికంటె సారథి దక్షుడని దుర్యోధనుడు చెప్పిన ఇతిహాస తాత్పర్యాన్ని మరువనివాడై శల్యుడు మూడు మొనల త్రిశూలంవలె మాట్లాడాడు. తనను నిందిస్తూ పలికితే గదతో తల పగులకొడతానని కర్ణుడు బెదిరించినా, మాటలు మానక తాను చెప్పేవి నీతులనీ, వాటిని చెప్పటం సూతధర్మమనీ ఇట్లా అన్నాడు:

ఉ. 'సారథి దక్షుఁడై రథికసారము రథ్యబలంబు నాయుధో
దారత మౌనమున్ రణవిధంబు నిమిత్త శుభాశుభత్వ ని
ర్ధారణమున్ మదిం గని హితం బెఱిఁగించుట నీతి గాన, నీ
వీరసమెత్త నోఁ బలికితేనియుఁ జెప్పుదు సూతనందనా!' **(కర్ణ. 2.52)**

సారథి స్వభావానికి లక్షణవాక్యం వలె సాగిన ఈ పద్యం పైకి ధర్మసూత్రంగా, లోన భేదమంత్రంగా భాసించే ద్విముఖ వాక్యవిన్యాసం. దీనికితోడు అర్జునుడిని హంసగా, కర్ణుడిని కాకిగా స్ఫురింపజేసి వారిరువురి నడుమగల బలతారతమ్యాన్ని ధ్వనింపజేసే దృష్టాంత రూపమైన కథ (Parable)ను హంసకాకీయోపాఖ్యానంగా చెప్పాడు.

సముద్రంలో ఒక గొప్ప ద్వీపం ఉన్నది. దానిని ధర్మవర్తి అనేరాజు పాలిస్తున్నాడు. ఆ నగరంలో ఒక వైశ్యశ్రేష్ఠుడున్నాడు. అతడు యజ్ఞయాగాలు చేశాడు, శాంతిదాంతులు, కరుణాది ఉత్తమగుణాలు కలవాడు, ధనధాన్యాలతోపాటు దానశీలంకూడా కలవాడు. బహుపుత్రలాభం కలవాడు. అతడి ఇంటిలో ఒక కాకి చేరింది. అతడిపుత్రులు దానిమీద దయతో ఎంగిళ్ళు పెట్టి పొగిడారు. దానితో అది పెరిగి పెద్దదై కడు బలిసి, లోకంలో తనకు సాటివచ్చే పక్షులు లేవని అహంకరించి, ఎవరినీ లెక్కచేయకుండా అనేకవిధాలుగా ఆటలాడుతున్నది.

అట్లా ఉండగా ఒకనాడు గరుత్మంతుడి రెక్కలవంటి రెక్కలబలం గల హంసలు కొన్ని సముద్ర సమీపంలో వాలాయి. వాటిని వైశ్యపుత్రులు చూచి కాకితో ఇట్లా అన్నారు -

క. 'పులుఁగులలో నీ వెక్కుడు । విలసద్గతి నంచ లిట్లు వినువీథిఁ గరం
బెలమిం జనియెడు వీనిం । గలసి పఱచి గెలువవలదె గతుల బహులతన్'. **(కర్ణ. 2.56)**

తారతమ్యజ్ఞాన రహితులైన వారిమాటలు విని ఎంగిళ్ళు తిని బలిసిన అవివేకబుద్ధితో ఆ కాకి ఒక మేటి హంసను చూచి 'పరుగెత్తుదాం రా' అని పిలిచింది. హంసలన్నీ పెద్దగా నవ్వి ఇట్లా అన్నాయి. 'మేము మానససరోవరంలో ఉంటాం. పక్షులన్నీ మెచ్చేటట్లు తరుగనిబలంతో దూరదూరతీరాలకు ఎగిరిపోతాం. హంసలం కావటంచేత ఎంతదూరమైనా కష్టంలేకుండా ప్రయాణిస్తాం. మాలో ఉత్తమహంసను పిలిచావు. ఇంతకుముందు ఎక్కడైనా ఎన్నడైనా హంసలను ఓడించిన కాకిని చూచావా?' అని బింకంగా పలికాయి.

అహంకారి అయిన కాకి హంసలతో ఇట్లా అన్నది. 'నాకు నూటొక్క గతులు తెలుసు. ఒక్కొక్కరకమైన గతితో నూరుయోజనాలు ఎగరగలను. నిలువుగా నింగికి ఎగరటం, అక్కడినుండి సూటిగా నేలకు దిగటం, దూరప్రాంతానికి సూటిగా పోవటం, అందంగా వక్రయానాలు చేయటం, గుండ్రంగా తిరగటం మొదలైన వెన్నోగతులు నాకు తెలుసు. మీరు కోరినట్లుగా నే నన్నిరీతులను ప్రదర్శించగలను.' ఆ బడాయి మాటలు విన్న హంస పోటీపడి ఆకాశానికి ఎగిరింది. 'నీకు నూరు రకాల గతులు వచ్చినా పక్షులన్నీ ప్రసరించే సామాన్యగతిలో సముద్రం మీద ఆకాశంలో పరుగు పందెంలో పాల్గొందాం రమ్మ' అని హంస కాకిని పిలిచింది. 'నాతో పోటీపడి నీవు ఓడిపోవటం నిజం' అని కాకి ఎగతాళి చేసింది.

హంస యానం ప్రారంభించింది. కాకి గర్వంగా పరుగులు పెట్టింది. రెండూ సముద్రంమీద సాగుతున్నాయి. కాకి వేగంగా ముందుకు సాగింది. హంస నిదానంగా ఎగురుతున్నది. హంసను చూచి కాకి త్వరగా రమ్మని పిలిచేది, వెనుకకు వచ్చి ముక్కుతో ముక్కును పొడిచేది. చుట్టూ తిరిగి ఈకలతో ఒరసి చిత్రగతులు ప్రదర్శిస్తూ నవ్వేది. త్రుళ్ళి త్రుళ్ళి పడుతూ హంస ఓడిపోతుందని పెద్దగా అరిచేది.

కాకి ప్రదర్శించే ఆ పటాటోపం చూచి హంస ఉత్సహించింది. ఎత్తుగా వేగంగా ఎగురుతూ పడమటి దిశగా పయనించింది. హంస వేగాన్ని అందుకొనటానికీ, అధిగమించటానికీ కాకి ప్రయత్నించి బడలిపోయింది. హంస వేగం

తగ్గలేదు. కాకికి విశ్రాంతి స్థలాలైన చెట్లుగాని, కొండలుగాని కనబడలేదు. లోతైన సముద్రం మాత్రమే కనబడింది. పడితే జలజంతువులు బ్రతకనివ్వవు. పరిస్థితిని గమనించి కాకి భయపడింది. దప్పికతో డీలాపడింది, ఒడలు వశంతప్పి తూలుతూ క్రమంగా ఎత్తునుండి క్రిందకు జారటం మొదలైంది. అప్పుడు హంస ఇట్లా అధిక్షేపించింది.

ఆ. ‘ నీ వనేక గతులు నే, ర్తిది యేగతిఁ । జనుట చెపుమ వాయసంబ! యేను
గడవ నరిగి పిలువఁగా నేల తడసెద? । వెఱక లేటి కిట్టు లెడల విడువ?’ **(కర్ణ. 2.72)**

కాకి నీరసపడి ఎగురలేక నీటిలో పడి విలవిలలాడుతూ ఉండగా హంస ‘మాట లెన్నైనా అనవచ్చును, కాని అన్నమాటను నిలబెట్టుకొనటం ఎంతమందికి సాధ్యమౌతుంది?’ అని అవహేళన చేసింది. కాకి ‘ఎంగిళ్ళు తిని బలిసి, గర్వించి నాకెదురు ఎవ్వరు లేరని ఇంతవరకూ అనుకొనేవాడిని; కాని, నా బల మేమిటో ఇప్పుడు తెలిసివచ్చింది. కరుణామయుడవైన హంసరాజమా! నన్ను దయతో చూచి, రక్షించి, మా కాకులలో నన్ను కలిపి పుణ్యం కట్టుకొమ్ము!’ అని ప్రార్థించింది. హంస కరుణించి కాకిని కాకుల గుంపులో దింపింది. ‘నేనింక ఇటువంటి అవినయపు పనులు చేయ’ నని కాకి పరితాపం వ్యక్తం చేసింది.

అన్యాపదేశంగా ఒకరిని అధిక్షేపించే రీతిలో చెప్పబడిన కథ ఇది. దీనిని శల్యుడే సూచించాడు. ‘నీవు కోమటికొడుకుల యెంగిలికూటం బెరిఁగిన యక్కాకంబు చందంబునఁ గురుకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడువారల ధిక్కరించెదవు. నీకొలఁది యెఱుంగవు. దానం జేటు వాటిల్లు’ నని విశదపరిచాడు.

మొత్తంమీద శల్య సారథ్యానికి సాకు కల్పించింది త్రిపురాసుర సంహారకథ. శల్యశపథానికి దారి చూపించింది హంసకాకీయోపాఖ్యానం.

**4. నాటకీయతను పోషించే సంభాషణ సంవిధానం:**

ప్రబంధంలో కథనాత్మక శైలికి, వర్ణనాత్మకశైలికి, నాటకీయశైలికి సమయోచిత ప్రాధాన్యం ఏర్పడుతూ ఉంటుంది. కర్ణపర్వంలో ఈ మూడింటిలో నాటకీయ సంభాషణ శైలికి అధికప్రాధాన్యం ఉన్నది. సంభాషణలలో వైవిధ్యంతో కూడుకొన్న రీతులు గోచరించటం వలన ఈ పర్వం రసవత్తరంగా, నాటకీయంగా సాగి ఆమూలాగ్రం ఆస్వాదయోగ్యంగా అమరింది. కథాకథనం కంటె సంభాషణలు పాత్రల శీలాలనూ, సన్నివేశ బలాలనూ, నాటకీయ ప్రయోజనాలనూ, అధిక్షేపాది రచనా రీతులనూ వ్యక్తం చేయటానికి బలమైన ప్రక్రియలుగా తోడ్పడతాయి. మచ్చుకు కొన్ని ఉదాహరించటం సముచితం.

కర్ణు డంటే పాండవు లందరికీ పగతో కూడిన ప్రతీకారవాంఛ పడగలెత్తి బుసలు కొడుతూ ఉంటుంది. కర్ణపర్వంలో అది తారాస్థాయిలో కనబడుతుంది.

(అ) నకుల కర్ణుల రణరంగ సంభాషణ:

నకులుడు -

క. ‘కౌరవపాండవులకు నీ । వైరము నీవలనఁ గాదె వచ్చెను! విను మ
ద్ఘోర శరనిహతిఁ బడఁ గ । న్నారఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్?’

చ. 'అనవుడు 'రాజసూతివి మహాస్త్రవిదుండవు నైన నీకు ని
ట్లనుట దలంప నర్హమగు; నైనను జెన్నఁటి పల్కు లేల? నె
ట్టన భుజశక్తి మార్తుర కడంక యడంచినఁ బల్కు టొప్పుఁగా
క! నిలిచి చూపు నీచలముకల్మియుఁ జేతులబల్మియుం దగన్' **(కర్ణ. 1.124-125)**

అని అన్నాడు కర్ణుడు. ఇరువురూ అభిమాన ధనులు, పౌరుషోపేతులు, మాటపడని మహితాత్ములు. యుద్ధంలో నకులుడిని ఓడించి అతడు పారిపోతుంటే వెన్నడించి ధనువును అతడి కంఠానికి తగిలించి లాగి జుట్టుపట్టుకొని చిరునవ్వు నవ్వుతూ కసిగా కర్ణుడు ఇట్లా అన్నాడు:

క. 'పలుకులు వృథగా నన్నుం । బలికితి; ము న్నింక నెన్ని పలుకవలసినం
బలుకుము నీకేఁ దగ; నా । యలవుఁ జలము నీ వెఱింగి తంతియ చాలున్.'

క. 'అలవెఱిఁగి పెనఁగు పెనఁగం । దలఁచిన నది గాక సిగ్గు దలకొని యనికిం
దొలఁగుట యిం కిటఁ దగు, వి । చ్చలవిడి నర్జునునికడకుఁ జనుము కుమారా!'**(కర్ణ. 1.136, 137)**

కర్ణుడి పాత్రలో అభిమానంనుండి ఆగ్రహంవరకు పరిణమించిన మానసికావస్థలకు ప్రతిబింబాలుగా పలికిన పలుకులు ప్రతిధ్వనించాయి.

(ఆ) కృపాచార్యుల చేతిలో ధృష్టద్యుమ్నుడు డీలాపడిపోయి ఎదుర్కొనలేకపోయాడు. అప్పుడు సారథి అన్నమాట లివి-

చ. 'వినుము కుమార! విప్రుభుజవీర్య మవార్యతఁ దేజరిల్లెడుం;
జనవు భవత్సమగ్ర శరజాలము లీతనిమీఁద; దైవసం
జనితము సువ్వె! యియ్యెడరు; సంగర మిట్టిది తొల్లి యెందు నా
కనినది లేదు; తేరు దొలఁగం గొనిపోవుట కార్య మిత్తఱిన్.'

వ. 'నీయట్టివాని విక్రమంబునుం దిట్టినయట్లు సమయుటం జేసి యిమ్మహాత్ముం డవధ్యుం డని
నిశ్చయించితి; నామాట కియ్యకొనుము'... **(కర్ణ. 1. 156-157)**

సారథి మాటలకు ధృష్టద్యుమ్నుడు సుముఖంగా ఇట్లా అన్నాడు:

చ. 'చరణములుం గరంబులును సంచలభావము నొందఁ జొచ్చె, మేన్
విరవిరఁ బోవుచున్నయది, విహ్వల మయ్యె మనంబు, నీతలం
పరయఁగ మేలు; మారుత సురాధిపసూనులలోన నల్ల నొ
క్కరు దెసకై రథంబు దొలఁగం గొని పొ; మ్మడిబీర మేటికిన్?' **(కర్ణ. 1.158)**

రథికుడికీ, సారథికీ నడుమ ఉండవలసిన ఆదర్శసంబంధం ఈ సంభాషణలో అచ్చంగా ప్రతిబింబించింది. ఓడిన వీరుడు మనస్సు వికలమైనప్పుడు ప్రదర్శించే సాత్త్వికాభినయం వర్ణనాతీతం.

(ఇ) శల్యుడు కర్ణుడిని అధిక్షేపించే వ్యంగ్యోక్తులు.

సీ. ‘రాత్రిమైఁ దాఁకి క్రూరతఁ బోరి మగఁటిమి । వాపిన యంగారపర్ణుకంటె,
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱపట్టి । మానమేదిన చిత్రసేనుకంటెఁ,
ఖాండవోద్యానంబుఁ గావనేఱక సిగ్గు । వడి చన్న నిర్జరప్రభునికంటెఁ,
గ్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁ గాఁగఁ । బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె

ఆ. నెక్కుడైన వీరుఁడే నర్జునునితోడఁ । బొడుతు నొడుతు ననినఁ బోలుఁ గాక
వినుము సూతతనయ! మనబోఁటు లాతనిఁ । జెఱుతు మనుట నోరిచేటు గాదె!’ **(కర్ణ. 2.24)**

అంగారపర్ణుడు, చిత్రసేనుడు, ఇంద్రుడు, పరమేశ్వరుడు మొదలైన వీరులను, దివ్యులను ఓడించిన అర్జునుడికంటె మేటివీరుడు మాత్రమే ‘అతడిని పొడుస్తాను, చంపుతాను’ అని ప్రతిజ్ఞలు చేయటానికి అర్హుడు గాని కర్ణుడివంటి వారు కాదని శల్యుడి అధిక్షేపం. కర్ణుడు జయించిన వీరులు ఆ స్థాయివారు కాకపోగా అర్జునుడిని ఒక్కసారైనా ఓడించి బిరుదం సాధించిన సాహసం కర్ణు డంతవరకు చేయలేదు. పౌరుషోక్తులు మాత్రం పెల్లుగా పలకటం ఆయన నైజం. ఈ మాటలు అందుకు సాక్ష్యాలు.

సీ. ‘వలను శోభిల్ల నెవ్వాఁడైన - ‘వీఁడె య । ర్జునుఁ’ డని నా కిప్డు సూపె నేనిఁ
బసదనం బే నిచ్చుభంగి యందఱకును । వివరించి చెప్పెద వినుఁడు; ‘మీరు
వొగడంగఁ దగు రథ్యములతోడి సౌవర్ణ । రథములు వలసిన రయము లావు
బొలుపును గలుగు కాంభోజ హయంబుల । వలసినఁ బేర్చు సత్త్వంబునందుఁ

తే. బరిణతము లగు సుందరకరివరముల । వలసినను, జారులావణ్యవతుల వలసి
నను, మహాగ్రామములు వలసినను గోర్కి । నెక్కు డమ్మేటిమగని కే నిచ్చువాఁడ.’ **(కర్ణ. 2.30)**

ఈ మాటలు ప్రగల్భాలకు పరాకాష్ఠ. ఈ పద్యంలోని వ్యంగ్య మేమంటే - కర్ణుడి పేరు వినగానే అర్జునుడు రణరంగంనుండి పారిపోయి ఎక్కడో రహస్యస్థలంలో తలదాచుకొంటాడనీ, అతడి ఆచూకీ తెలిసి కర్ణుడికి చూపెట్టినవాడికి భూరి సత్కారాలూ, కానుకలూ ఇస్తానని కర్ణుడు ప్రకటించటం ఇందులోని భావం. ఎదురుగా తలెత్తితే కనబడే కపిధ్వజం, కృష్ణార్జునుల రథం మొదలైన సంకేతాలు అర్జునుడి అస్తిత్వాన్ని బట్టబయలు చేస్తుండగా ఈ పౌరుషవాక్యం అతడి డాంబికత్వాన్ని ధ్వనింపజేస్తున్నది.

(ఈ) పరస్పర దూషణలు:

కర్ణుడు మద్రజాతి దురాచారాలను ఏకరువు పెట్టి ఆ దేశానికి అధిపతి అయిన శల్యుడిని దూషించటం :

సీ. ‘విను, పాపదేశ సంజనితుండ వగు నీకు । దుర్బుద్ధి గాక సద్బుద్ధి గలదె?
క్షత్త్రియాధమ! నీచ! కలదు లోకంబున । నాబాలగోపాలమైన వాక్య;
మతికుటిలుండు, సంగతుఁడుగాఁ డేమిటఁ । జెలికిఁ గీడొనరించుఁ జెట్ట పలుకు,
దుష్టాత్మకుఁడు, గడుఁ గష్టుఁడు మద్రకుం । డను నంతవట్టుఁ బ్రత్యక్ష మయ్యె!

ఆ. వావి లేక యెల్ల వనితలుఁ బురుషులుఁ । గలయ మీకు నెగ్గు గాకయుండు;
మున్ను గల్లు పిదపఁ జన్నుఁబాలై పెరుఁ । గుదురు; సెప్ప నేల గుణము లింక?' **(కర్ణ. 2.47)**

ఎదుటివారిని తిట్ట తలచుకొంటే వారిని సూటిగా అనకుండా లోకులు ఇట్లా అంటున్నారని చెప్పటం నాగరకలక్షణం. కర్ణుడు అనదలచుకొన్న నాలుగు మాటలూ పరోక్షంగా నోటిదురద తీరేటట్లు పలకటం పై సంభాషణ శిల్పం. దీనికి బదులుగా శల్యుడు అంగ దేశీయులస్వభావాన్ని మిషగా పెట్టుకొని కర్ణుడిని నిందించాడు.

తే. 'విడుతు రాప్తుల బంధుల, వెలలు గన్న । నమ్ముదురు కులకాంతల నంగదేశ
జనితులగువారు; విభుఁడ సజ్జనుల; కిట్టు । లేవకో నొడ్ల చరితంబు లెన్న నీకు?' **(కర్ణ. 2.111)**

కోపం అంచులు దాటితే దూషణం నోటికి భూషణంగా మారుతుంది. పెద్దలైనా, పిన్నలైనా, ప్రభువులైనా, పేదలైనా ఇది మానవస్వభావం. మనోనిగ్రహం లేనివారూ, మానాభిమానులూ, ఉద్రేకస్వభావులూ ఈ రీతిలో నూతన ప్రమాణాలు సృష్టించగలరు. కర్ణశల్యులు ఆ ప్రమాణాలకు ప్రతినిధులు.

(ఉ) పరస్పర పరుషవాక్యాలు:

పగ సాధించగోరే వీరులు శత్రువులను పరుషమైన మాటలతో ఎదుర్కొంటారు. చర్యలను సూచించే మాటలు ముందుగా వెలువడటం ఇటువంటి సంభాషణలలో సర్వసామాన్యం. ఉదాహరణకు అశ్వత్థామా, ధృష్టద్యుమ్నుడూ సమరాంగణంలో ఎదురు పడ్డప్పుడు సాగిన పరుషభాషణంలో ఒక మచ్చుతునక. అశ్వత్థామ -

క. 'మా తండ్రియెడం జేసిన । పాతకము కతంబు గాఁగ బాంచాల నికృ
ష్టా! తునిమెద నిను నరుఁ డిట । కేతేరక యున్నఁ, బాఱ కీవు నిలిచినన్'. **(కర్ణ. 2.327)**

ధృష్టద్యుమ్నుడు -

క. 'మీతండ్రి కుఱికి నఱికిన । హేతియ నీకొఱకు నునిచి; తిపుడ నఱుకుదున్
నీ తులువ పలుకులకు నీ । డై తోఁచిన యుత్తరంబు నిదియ దురాత్మా!' **(కర్ణ. 2.329)**

'మాతండ్రి' అని అశ్వత్థామ మొదలెట్టితే 'మీతండ్రి' అని ధృష్టద్యుమ్నుడు ఎత్తుకొనటం, ఇద్దరూ కందపద్యాలే చెప్పటం, పాంచాలనికృష్టా! అని ఒకరు 'దురాత్మా' - అని మరొకరు నోరారా తిట్టుకొనటం - తునిమెద నని ఒకడంటే నరికెద నని మరొకరనటం పరుష భాషణలకు శాబ్దిక, ఆర్థిక సమతౌల్యాన్ని కలిగించాయి.

(ఊ) ఆత్మీయుల పరస్పర నిందలు:

శిబిరంలో విశ్రాంతి తీసికొంటున్న ధర్మరాజు యోగక్షేమాన్ని తెలిసికొని తిరిగి యుద్ధానికి పోవాలని వచ్చిన అర్జునుడిని ధర్మరాజు పలికిన నిష్ఠురవాక్యాలు:

చ. 'హరి గలుగంగ నేటికి భయంబున వచ్చితి; నీదు గాండివం
బెరవుగ నిచ్చి, నీవు నొగ లెక్కి, హరిన్ రథిఁ జేయఁ గన్న ని
ష్ఠురభుజ విక్రమోగ్రుఁ డగు సూతతనూభవుఁ దత్సహాయులం
బొరిగొనఁడే సుయోధనుని పోఁడిమి దూలఁగ నొక్కమాత్రలోన్'. (కర్ణ. 3.65)

అర్జునుడు గురుసంహారదోషం పోగొట్టుకొనటానికై ధర్మజుడిని అధిక్షేపించటం.

సీ. 'నీవు జూదం బాడగా వైరబంధంబు । కౌరవకోటితోఁ గలిగె మనకు;
రాజ్యనాశంబు నరణ్యవాసంబును । దాస్యదైన్యంబు నత్యంతదుఃఖ
ములుఁ దెచ్చికొంటి; సి గ్గొలయదు నీమనం । బున నించుకేనియు; ననికిఁ జాల
కున్న వానికిఁ దాల్మి యొప్పగుఁ గాక ప్ర । ల్లదములు వలికిన లాఘవంబు

తే. సెందు; ము న్నేమి సేసినఁ జేసి; తింక । నైన దుర్బుద్ధితనములు మాని, తగిన
పౌరుషము లేముసేయఁగ నూరకుండు; । మిడుమపడువారు సైతురే యివ్విధంబు?' (కర్ణ. 3.89)

ఈ మాటలలో ఆత్మీయులు తమతమ అంతరంగాలలో దాచుకొని ఉన్న భావాలను మొదటిసారి బయటపెట్టుకొన్నప్పుడు కలిగే గగుర్పాటు, పాపభీతి లేనితనం, నిర్మొగమాటంగా వెలువడే నిజాలనైజం మనకు గోచరిస్తుంది. కాని, అవి సందర్భోచితాలుగా తోచనందున చివరకు ఆ పాత్రలే పరితాపాన్ని వ్యక్తం చేసి ఆ రోషాన్ని పోగొట్టుకొనటంతోపాటు మనకు కూడ మనశ్శాంతిని కలిగిస్తారు. ఈ సన్నివేశాంతంలో శ్రీకృష్ణుడి ఉపశమనవాక్యాలు మనకు పరితోషకవాక్యాలు!

ఉ. 'ఈతని నొవ్వఁ బల్కుటన యీదురవస్థకు వచ్చి తక్కటా!
శాతమహాసి నీ నృపతిఁ జంపిన నె ట్లగునో; విపత్తికిం
బాతకఘోరవృత్తికిని బాసితి దైవ మనుగ్రహించుటన్;
నీతెలి వాప్తబంధుజన నిర్మిత పుణ్యవిపాక మర్జునా!' (కర్ణ. 3.108)

**5. వర్ణనావైదగ్ధ్యం: రచనా శిల్పం:**

కర్ణపర్వం రెండు రోజుల యుద్ధం వర్ణించే కథాభాగం. యుద్ధవర్ణనలలో మూడురకాలు ప్రసిద్ధం. 1.యుద్ధక్రియా వర్ణనం. 2.యుద్ధభూమి వర్ణనం. 3.యుద్ధవీరుల వర్ణనం. కర్ణపర్వంలో ఈ మూడూ ముచ్చటగా పోషించబడ్డాయి. యుద్ధాలలో దొమ్మియుద్ధం కంటె ద్వంద్వయుద్ధాలు ఎక్కువగా ఉన్న ఈ పర్వంలో యుద్ధవీరుల ప్రవృత్తులను బట్టి, శస్త్రాస్త్ర ప్రయోగ ప్రజ్ఞలనుబట్టి ఎంతో వైవిధ్యం కనబడుతుంది. కౌరవపాండవులు క్రమంగా మకర అర్ధచంద్రవ్యూహాలను పన్నుకొన్నా, కర్ణుడు హుటాహుటిగా ధర్మరాజుమీదికి దాడివెడలటంతో వ్యూహరచన దెబ్బతిన్నది. దానితో వ్యక్తులు సాగించిన పోరులకే ఈ పర్వంలో ప్రాధాన్యం ఏర్పడింది. అందులో ఎన్నో అబ్బురాలు, అనుకొనని సంఘటనలు జరగటంవలన జయాపజయాలు దైవాధీనాలన్న నానుడి సత్యమైనట్లు తోస్తుంది. కురుకుమారులలో శ్రుతవర్మ, ఉలూకుడు, శతానీకుడు, శ్రుతకీర్తి, సత్యసేనుడు మొదలైన కురుకుమారులు సైతం యుద్ధంలో తమ అస్తిత్వాన్ని నిరూపించుకొని మెరుపులవలె

ప్రకాశించి కొందరు ఆరిపోవటం సహజంగా ఉన్నా యువకుల సాహసప్రవృత్తిని పోషించినట్లయింది. అట్లాగే పాంచాలకుమారుల పరాక్రమ వర్ణనం కూడా పఠితల దృష్టిని ఆక్రమిస్తుంది. భీముడు శ్రుతవర్మాదులను చంపాడు. కర్ణుడు పాంచాలురను చంపాడు. ఇవన్నీ ఒక యెత్తు.

ప్రసిద్ధవీరుల నడుమ జరిగిన యుద్ధాలలో అద్భుతా లెన్నో జరిగాయి. సాత్యకి విందానువిందులను సంహరించటం, ప్రతివింధ్యుడు చిత్రుడిని వధించటం, దుశ్శాసనుడు సహదేవుడితో యుద్ధంచేసి మూర్ఛపోవటం, కర్ణుడితో నకులుడు పోరి పరాభూతుడు కావటం, ధృష్టద్యుమ్నుడు కృపాచార్యుడితో పోరి పారిపోవటం, కృతవర్మ శిఖండితో పోరుసల్పటం, సత్యసేనుడు శ్రీకృష్ణుడి మేనికి గాయాలు చేయటం, దుర్యోధనుడు ధర్మరాజుతో యుద్ధంచేసి మూర్ఛిల్లటం, భీముడు కర్ణుడిని మూర్ఛితుడిని చేసి నాలుక కోయబోయి శల్యుడి హితవు విని మానటం, ధర్మజుడిపై కర్ణుడు దాడిచేసి అతడి వెంటపడి తరమటం, భీముడు అడ్డుకొనటం, సుశర్మ వ్రేటుకు కిరీటి మూర్ఛితుడు కావటం, కృపుడికి శిఖండి ఓడి పారిపోవటం, ధృష్టద్యుమ్నుడిచేత కృపుడు పరాభూతుడు కావటం, దుర్యోధనుడు విరథుడు కావటం; కర్ణుడు ధర్మరాజును ఓడించి బాధించటం అతడి పలాయనం, భీముడు దుశ్శాసనుడిని భయంకరంగా చంపటం - మొదలైన వర్ణనలు యుద్ధవీరాన్ని అద్భుతంగా పోషించాయి.

కర్ణపర్వంలో నాయక పక్షంలో భీమార్జునుల యుద్ధం, ప్రతినాయక పక్షంలో కర్ణాశ్వత్థామల యుద్ధం విస్తృతినీ, ప్రశస్తినీ సంపాదించుకొన్నాయి. కర్ణార్జున ద్వంద్వయుద్ధాలలో శస్త్రాస్త్ర ప్రయోగవర్ణనం విస్తృతంగా వర్ణించబడింది. వారి రౌద్రకర్మలకు ఫలంగా రణరంగ భూమి బీభత్సంగా భాసించే ఘట్టాలను తిక్కన ఎక్కువగా దీర్ఘవచనాలతో, అలంకార సుందరంగా, భీషణరమణీయంగా వర్ణించి తనప్రత్యేకతను చాటుకొన్నాడు. ఉదాహరణకు ఒకటిరెండు, క్రియాప్రాధాన్యంగల యుద్ధచర్యలను కథాకథనంలోనూ, అలంకారవర్ణనంలోనూ రక్తికట్టించే నేర్పు ఉభయకవిమిత్రుడి కవితాసామర్థ్యం. శ్రుతకీర్తి శల్యుడితో పోరు సల్పే ఘట్టంలో సీసపద్యాన్ని రెండు ప్రయోజనాలకు తిక్కన ప్రక్కప్రక్కన వాడి చూపించాడు. కథాకథన రూపవర్ణనం:

సీ. 'వేఱొక్క విల్లెత్తి వివ్వచ్చుకొడు కఱు । పదినాలుగమ్ములు వఱపె మద్ర
పతిమేన, నతఁడు దొంబది తూపు లడరించి । యేసె నవ్వీరుశరాసనంబు
ఖండంబులుగ, వాఁడు గండడంగక గద । వైచినఁ బొడిసేసి యేచి, శక్తి
నిగిడింపఁ దునుమాడె, నిశితభల్లంబునఁ । ద్రుంచెఁ దదీయసూతుని శిరంబు

ఆ. వాయుజవము లైన వాహంబు లప్పుడు । గలఁగి యరద మనికిఁ దొలఁగ నీడ్చెఁ;
దెఱపి గాంచి శల్యుఁ డతిముఱిఁ జొచ్చి క । లంచెఁ బాండుసుతుబలంబు నధిప!' **(కర్ణ. 1.114)**

అలంకృత యుద్ధవర్ణనం:

సీ. 'కమలాకరము లీలఁ గలఁచి యాడెడు గంధ । దంతావళము సముద్దండతయును,
దరమిడి మృగసముత్కరము ఘోరంబుగా । వధియించు కంఠీరవంబు నేపు,
నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ । గాల్చు దావాగ్ని యుగ్రక్రమంబుఁ,
బ్రకట విక్రాంతిఁ బురత్రయంబును సమ । యించు ఫాలాక్షుని యేడ్తెఱయును,

ఆ. బోల్పఁ బట్టు నయ్యెఁ; భుజగర్వశౌర్య ప్ర । తాపదుర్దమ ప్రకోపములకు
మద్రవిభుఁడు గోలుమసఁగి శాత్రవసైన్య । హననకేలి సల్పు నవసరమున.' **(కర్ణ. 1.115)**

యుద్ధక్రియా ప్రభావం యుద్ధభూమిమీద ప్రకటితమౌతుంది. యుద్ధభూమి రుద్రభూమిగా మారిన ఘట్టాలను తిక్కన సందర్భోచితంగా వర్ణించి ప్రతిభను ప్రదర్శించాడు. సామాన్యంగా యుద్ధభూమి వీరులు ప్రదర్శించే వీరకర్మకుగాని, రౌద్రకర్మకుగాని ప్రతిఫలాలుగా నిలవటం గోచరిస్తుంది. చూపరులకు అద్భుత, భయానక, బీభత్సరసాలను కలిగించే విభావంగా రణభూమిని వర్ణించటం కావ్యస్వభావం. కర్ణపర్వంలో రసోదంచిత రణస్థల వర్ణనం ప్రబంధోచితంగా నిర్వహించబడింది. మచ్చుకు ఒకటి రెండు ఉదాహరణలు:

బీభత్సుడు సంశప్తకులను శస్త్రాస్త్రాలతో రణనిహతులయ్యేట్లు విజృంభించగా రణరంగం భయంకరంగా తోచింది. చూచే వియచ్చరులకు అద్భుతాన్నీ, బీభత్సాన్నీ ఆవహింపచేసింది. తిక్కన ఆ దృశ్యాన్ని సీసపద్యంతో చిత్రించాడు.

సీ. తేరుల చెక్కలు, వారణంబుల ఖండ । ములు, భూషణంబుల పొడియు, ఘోట
కంబుల తునియలుఁ, గరవాల తోమర । శరపరిఘాదుల శకలములును
రథికజనంబుల వ్రయ్యలుఁ, జామరచ్ఛత్ర । కేతువుల యంశములు, భటుల
తుమురును, రౌతుల తుండంబులును, గంక । టముల భాగములుఁ, జిందముల నుఱుము

తే. గలిసి నెత్తుట మునిఁగి ప్రేవులఁ బెనంగి । మెదడ బ్రుంగి, వియచ్చర హృదయములకు
నద్భుతంబు బీభత్సంబు నావహింప । సంగరాంగణ మతిఘోరభంగి యయ్యె'. **(కర్ణ. 1.177)**

ఈ వర్ణనంలో యుద్ధభూమి పీనుగుపెంటగా మారటమే కాకుండా, చతుర్విధాంగాల శకలాలు కుప్పలుపడి, రక్తంలో మునిగిపోవటం చిత్రించబడింది. ఆ దృశ్యం చూచినప్పుడు మొదట ఘోరంగా (భయంకరంగా) స్ఫురిస్తుంది. ఆ ఘోరదృశ్యానికి కారణమైన అర్జునుడి వీరకర్మను భావించినప్పుడు అద్భుతంలో ముంచెత్తుతుంది. నెత్తుటిలో మునిగి, ప్రేగులలో చిక్కువడి ఉన్న శరీరశకలాలను చూచినప్పుడు బీభత్సం కళ్ళకు కట్టినట్లనిపిస్తుంది. స్థిరవిభావదర్శనంవలన సహృదయులచిత్తాలలో కలిగే రసభావస్ఫూర్తిని చిత్రిస్తూ పఠితలకు ఆస్వాదన సౌలభ్యాన్ని కలిగించే శిల్ప మిది.

రౌద్రరసాన్ని వీరుల హావ భావాలలోగాని, చర్యలలోగాని చిత్రించే విధంగా ఒక విధమైతే, రణరంగంలో సంకులసమరంలో గోచరించే చతురంగవిన్యాసంలో చిత్రించే విధం మరొక విధం. క్రోధోద్రేకంలో కాల్బలాలు చేసే అరుపులు, వాద్యనాదాలూ, ఆయుధాల చప్పుళ్ళూ, రథాశ్వాదులను విరిచేటప్పుడు నరికేటప్పుడు వెలువడే శబ్దాలూ మొదలైనవి రౌద్రరసవ్యంజకాలుగా భాసిస్తాయి. గజాశ్వాదులు రణరంగంలో పడి ఉన్న తీరు కూడా రౌద్ర క్రియాసూచకంగా గోచరిస్తుంది. ఉదాహరణకు ఏనుగులు దంతాలతో గుర్రాలను కుమ్మి చంపినప్పుడు, ఆ ఏనుగులను వీరులు చంపినప్పుడు, ఆశ్వికులు కాల్బలాలను చెండాడినప్పుడు, రథికులు పోరి నేలబడి నీల్గినప్పుడు ఆయా భంగిమలలో చచ్చిపడి ఉన్న, తునాతునకలై చెదరిపడి ఉన్న వైఖరి ఆయా సందర్భాలలో ప్రకటితమై రణరంగ రౌద్రవిస్ఫూర్తి వ్యక్తమౌతుంది. చచ్చిన శవాల భంగిమలు కూడా యుద్ధక్రీడలోని రౌద్రరసభంగిమలకు నిశ్చల నిదర్శనాలుగా నిలిచినట్లు వచనంలో తిక్కన వర్ణించిన తీరు పఠిత కళ్ళతో చూస్తున్న సజీవ చిత్రంగా భాసిస్తుంది. ఉదాహరణకు దుర్యోధన ధర్మరాజుల ద్వంద్వయుద్ధ ఘట్టంలోని సంకులసమర వర్ణన.

వ. 'ఇత్తెఱంగున నపరాహ్ణంబున దొరల మొత్తంబు లొక్కదెసకుం దార్కొనిన, నుభయబలంబులు నురవడించి కలయం బెరసినం, గ్రందుకయ్యం బయ్యె; నందుఁ జిందంబుల మ్రోఁతయు, నార్పుల యులివును, బాణకృపాణాది హేతి సంఘట్టనంబునం బుట్టు రణనంబును, రథావయవాస్థికపాల భంజనంబున నెసంగు నినదంబునుం గూడి పరఁగిన దిక్కులు పిక్కటిల్లెఁ; గరుల కొమ్ములం జిక్కి వ్రేలు తురంగంబులును, సందుకొని చొచ్చిన సుభటులు సెరివిన నొఱగి కూలు శుండాలంబులును, నాశ్వికుల మొగంబునం బడి ులాయంబులు సొచ్చిన సరోవరంబుల చందంబగు కాల్బలంబులును, రథికులు వోక పెనంగిన నఱవఱలయిన యరదంబులును, నెత్తురు కాలువలును, గండల తిట్టలును, బ్రేవుల ప్రోవులును, నెమ్ముల రాసులును, నత్యంత రౌద్రంబు నావహించె....' **(కర్ణ. 1.186)**

రణరంగంలో కర్ణుడి వీరవిహారాన్ని వర్ణిస్తూ కొంత అలంకృతంగా, మరికొంత కథాకథనరూపంగా సాగిన సీసపద్యం హృద్యం.

సీ. 'సింహంబు బారిఁజొచ్చిన గజంబుల భంగిఁ, । బులి కగ్గమైన జింకల విధమున,
జ్వలనంబుఁ గిట్టిన శలభంబులట్లుఁ, బాం । చాల యోధులుఁ జేది సైనికులును
దనుఁ దాఁకి పొలియ, రాధాతనూభవుఁ డనిఁ । దనివోక ధర్మనందనుని యున్న
చక్కటి కడర, ధృష్టద్యుమ్నుఁడును, ద్రౌప । దీ పుత్రులును సహదేవుడును శి

తే. ఖండియును సాత్యకియు నకులుండుఁ జేయఁ । గల మహీశులుఁ బొదివి రక్కర్ణు; నతఁడు
పెక్కుపాములు వొదివినఁ బెనఁగు గరుడు । ననువు దోఁపఁగఁ బోరాడె మనుజనాథ!' **(కర్ణ. 2.273)**

అర్జునుడు బాణాలను ప్రయోగిస్తూ క్షణాలలో శత్రుసైన్యాన్ని మట్టు పెట్టేటప్పుడు చతురంగబలం ఆయా క్షణాలలో ఉన్న శరీరభంగిమలతో నేలగూలిన సహజస్థితిని స్వభావోక్తిలో తిక్కన వర్ణించిన తీరు రమణీయం.

సీ. 'నవ్వెడు తలలను, గ్రొవ్వారు చేతుల, । బిరుదులు వెట్టిన చరణములను,
వాతులు దెఱచిన వాజి మస్తకముల, । గిరిశృంగములఁ బోని కరిశిరముల,
నవయవభేదంబు లడఁగెడు నట్లుగఁ । దుమురైన బహుగాత్ర సముదయముల,
భయదంబులై మహిఁ బడు విమానములట్ల । యఱవఱలైనట్టి యరదములను

తే. నేలఁ గప్పుచుఁ; దన బాణజాల మడర । నెవ్వ రడ్డము సొచ్చిన నించుకయును
దవులఁబడక, సముద్ధతిఁ దివిరి మనలఁ । దేఱి చూచుచుఁ బార్థుఁ డీ దిక్కు గవిసె'. **(కర్ణ. 3.176)**

రణరంగంలో యుద్ధవీరులు ఆయా సందర్భాలలో ప్రకటించే వీర రౌద్ర రసమూర్తులను రూపుకట్టేటట్లు చేసే వాఙ్మయశిల్పం తిక్కనది. ఉదాహరణకు కొన్ని:

1. రౌద్రరసమూర్తి భీముడు.

మ. 'నరసింహుం డసురేంద్రు వ్రచ్చు కరణిన్ రౌద్రం బుదగ్రంబుగా
నుర మత్యుగ్రతఁ జీరి, క్రమ్ము రుధిర మ్ముల్లాసియై దోయిట
న్వెరవారం గొని త్రావు, మెచ్చుఁ జవికి, న్మేనున్ మొగంబున్ భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను, నక్కొరవ్యుఁ జూచున్ బొరిన్'. **(కర్ణ. 3.214)**

2. కృష్ణార్జునుల వీరశృంగార మూర్తులు:

చ. 'తనువులఁ గర్ణబాణము లుదాత్త గతిం జెలువొందఁ గౌరవుల్
కనుకనిఁ బాఱ, శౌరియును గవ్వడియున్ వెలుఁగొంది రొక్కెడన్
వినుత మరీచులై పొడిచి నిర్భర సంతమసంబు నల్గడం
జన నభిరామమూర్తు లగు చంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టుగన్'. **(కర్ణ. 3.381)**

3. కర్ణుడి సర్వసైన్యాధ్యక్ష వైభవం:

సీ. 'తళతళ మనియెడు దంత ప్రభలతోడ । ఘనకేతువున హస్తికక్ష్య మెఱయ,
హంసవర్ణములైన హయముల పటుగతి । నర్కప్రభం బగు నరద మొప్ప,
దీప్తకాంచన రసలిప్తమై చెలువొందు । సజ్యకార్ముకము హస్తమున వెలుఁగ,
వీటికి సమర సమాటోప మొదవ నా । భీల శంఖము దనమ్రోల మ్రోయ

తే. రణసముత్సాహలక్ష్మి వక్త్రమున వింత । చెన్ను వెలయింప, నాప్తులు సేరి రెండు
పక్కియలయందు బవరంపుఁ బలుకు లెసఁగ । నడవ సొంపాఱి, కర్ణుండు వెడలె నధిప!'**(కర్ణ. 1.60)**

4. పార్థుడి పరాక్రమస్ఫూర్తి:

మ. 'భ్రుకుటి స్ఫూర్జిత ఫాలభాగుఁ డగుచుఁ బొంగారి, యా సూత పౌ
త్రకు కోదండము బాహుదండములుఁ జిత్రస్ఫూర్తి దున్మాడి, మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్ల విలస ద్ధారాహతిం ద్రుంచె, బా
ణకళాదుర్దముఁ డ న్నరుండు పతియు న్రాధేయుఁడుం జూడఁగన్'. **(కర్ణ. 3.246)**

5. కర్ణుడి చివరి పోరాటంలో రుధిర ప్రభామూర్తి:

ఉ. 'నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార, బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయ, భాస్వరుఁడై యరదంబుమీఁద భూ
పోత్తమ! కర్ణుఁ డొప్పె నరుణోజ్జ్వల మండల కాంతిపూరము
న్మొత్తపు దీప్తులుం దగ నినుం డపరాద్రి వెలుంగు చాడ్పునన్'. **(కర్ణ. 3.339)**

ఈ విధంగా కర్ణపర్వం వీరచిత్రాల పరాక్రమ ప్రదర్శనశాల. అందులో చల చిత్రాలు బహుళం; స్థిర చిత్రాలు పరిమితం. ఇది విరామంలేని చైతన్యస్రవంతి. అది కర్ణపర్వ ప్రబంధకాంతి'

తిక్కనది 'రసాభ్యుచిత బంధ'మని శ్రీనాథుడి తీర్పు. దానిని 'ఆంధ్రావళి మోదముం బారయు' నట్లుగా దిద్ది తీర్చాలని తిక్కన అభిమతం. రసశబ్దాన్ని తిక్కన ప్రబంధనాటక ప్రక్రియలకు చెందిన పారిభాషిక పదంగా వాడాడు కాబట్టి నాటక ప్రక్రియలో పాత్రోచిత రచనాబంధాన్నీ, ప్రబంధ ప్రక్రియలో కావ్య రసోచిత రచనా బంధాన్నీ 'తిక్కన ప్రయోగించాడు. దీనికి తోడు ఆయన అర్థగుణాలకు ప్రాధాన్యమిచ్చే రచనను సర్వత్రా పాటించాడు. దానివలన శబ్దసంయోజనం గాని, సమాససంఘటనంగాని, తెలుగునుడికారంగాని అర్థదీప్తికి పోషకంగా ఉండే రచన తిక్కన కావ్యశైలిగా రూపొందింది. అది తెలుగునాట జనరంజకంగా ఉండటానికి రచనలో వ్యావహారికతను విరివిగా ప్రవేశపెట్టాడు. పూర్వకవుల అపూర్వ ప్రయోగాలను తాను పుక్కిటపట్టిన దానికంటె తన కాలంలోని జీవద్భాషలోని పలుకుబడితో రచనకు ప్రాణం పోశాడు. కర్ణపర్వాన్ని తెలుగు తియ్యందనంతో కర్ణపర్వంగా చేశాడు. కొన్ని ఉదాహరణలు:

1. తెలుగు పలుకుబడికి దగ్గరగా ఉండే కావ్య రచన:

* పగలింటి దివియ చందమయ్యె దినకరుండు (1.62)
* కయ్యంపు వేడుక మొగంబునం దళుకొత్త (1.69)
* నిప్పుల్ రాలు కన్దోయితోన్ (1.91)
* పొలివోని కలికి తనము (1.101)
* సిగ్గుఁ జలము డిగ్గఁద్రావి (1.133)
* చేతుల తీఁటవోవ (1.197)
* చేతుల కసివోవంగ (2.300)
* చూచియుం దిరమయి నీవు నాలుకకుఁ దెచ్చిన మాటగదా వినందగున్ (2.11)
* పొడుతు నొడుతుఁ.... జెఱుతు మనుట నోరిచేటుగాదె! (2.24)
* అర్జును నమ్ములు దుప్పువట్టెనే? (2.25)
* గద వండువు (2.222)
* మనములు మెచ్చునఁ గరఁగె (3.284)
* ఏపారి మండునె యాఱంగల దీపము (3.49)
* మొగంబు బిగు వుడిపికొని (3.92)
* నాలుక యడంచియుండు (2.109)
* పగ రాజఁబెట్టును (3.124)
* నీవిక డప్పి యార్చికొమ్మని పలికి (3.179)
* పొగలేని మంట పగిది (3.15)
* కాల్ నిలువక తెరలంగ (3.230)

2. అర్థప్రసన్నతకు తోడ్పడే అలంకార విన్యాసం:

తెలుగువారి జీవితానికి సన్నిహితమైన ప్రకృతినుండి ఉపమానాలు ఎన్నుకొని కావ్యసన్నివేశాలను చిత్రించి పఠితలకు ఆస్వాదమాధుర్యాన్ని కలిగించటం తిక్కన రచనకు సహజాలంకారం. మచ్చుకు -

* మెఱుపుతోడి లలితమేఘంబు మీఁదికిఁ బోయి వెలుఁగు భానుపొలుపు దోఁప (1.318)
* మేఘ పిహితుఁడైన మిహిరుని చాడ్పున వాఁడి లేక యున్నవాఁడు (2.121)
* పెను దుంగమడువులో గజపతి యున్మదవృత్తి గేలిసలుపు పగిది (2.340)
* నాళమునకు వికసితాంభోరుహము బావువెరవు దోఁపఁ దునిమె వెస.... శిరంబు (2.168)
* విచ్చె నబ్బలము సింగంబు గనిన లేడిగమియుఁ బోలె (2.278)
* అవిసిన కలంబు జనంబులు దీవి సేరిన యట్ల కర్ణుం జేరి, కాలుదన్ని భూమిపై నిలిచి (3.165)
* బెబ్బులి లేడికొదమం బొదువు పోలికం బొదివి (3.205)
* పెక్కుపాములు బొదివినఁ బెనంగు గరుడు ననువు దోఁపంగ' (2.273)
* అంతక కోపవహ్ని విపులాకృతి గైకొని వచ్చినట్లు (3.288)
* ఆకలిమై వచ్చు కృతాంత వక్త్ర మన (3.358)
* పెఱమూఁకలు వెఱఁగునం జెయ్యేది కరళ్ళడంగిన మున్నీటి యట్లుండె (2.274)
* మహిఁబడు విమానములట్ల యఱవఱలైనట్టి యరదములు (3.176)

## 6. రసరామణీయకం

'బీభత్స ప్రధానమగు రణరంగవర్ణనను గావించుచో రమణీయములగు సదృశవస్తువుల వర్ణనా సాహాయ్యమున జుగుప్సను మరుగుపరుచుట తిక్కన యనుసరించిన మఱియొక రచనా విశేషము.

సీ. 'నెత్తుటఁ దోఁగియు నిగిడి పొరెడు వీరు । లలరిన నడమోదుగుల విధంబు
గ్రక్కునఁ దెగిపడి కదలెడు బాహుదం । డములు మహాభుజంగముల భంగి
యవని రక్తాక్తంబులై యున్నయట్టి బల్ । దలలు కెందామరకొలని పగిది
దఱచుగా నెఱిఁ దప్ప నొఱఁగిన గజములు । కులిశ భగ్నాచల కులమునట్లు

తే. దునిసి తొఱఁగిన జోదుల తొడలు సామ । జముల కరములు నొండొంటి చందములుఁ గ
నుంగొనఁగ వింత లగుటను సంగరాంగ । ణంబు రమణీయమును భీషణంబు నయ్యె'. **(శల్య.1.129)**

సంగరాంగణమును, రమణీయమును, భీషణమును నగువిధమునఁ జిత్రించుటయే తిక్కన యుద్ధవర్ణనయందలి ముఖ్యమగు విశిష్టత. సంపూర్ణ సామ్యముగల సహజోపమానముల, నుచిత సన్నివేశముల యందుఁ బ్రయోగించు విశిష్టతలోఁ, గాళిదాసున కెనవచ్చు తెలుగుకవి తిక్కన యొక్కడే. ఉదాహరణము లతని భారతభాగమున ననేకములు సర్వత్ర కానవచ్చును." (భూపతి లక్ష్మీనారాయణరావు; భారతము - తిక్కన రచన : పు. 95, 96)

ఉదాహరణకు -

* చారు భీషణంబులుగా నొకళ్ళొకళ్ళం జుట్టుకొని (1.77)
* రథ చిత్ర చారులఘు భీషణ సంచరణంబు లొప్పఁగన్. (1.106)
* తన రథంబు రయంబున దర్శనీయంబుగా (1.139)
* విద్విషద్భయద గదారుచి స్ఫురిత బాహువిలాసవి విభాసమానమై (2.221)
* తునిసిపడి భీమాభిరామంబులు (2.227)
* శిరము ధరడొల్లె కుండల స్ఫురణ మెఱయ (2.246)
* మత్తగజకేళీ సుందరోల్లాస మాభీలత్వం బలరింపఁ ద్రిప్పుచు (3.210)
* ఏరము వ్రచ్చి నెత్తురు దేనియ యిదె ద్రావెదన్ (3.212)
* తను వుగ్రసుందరముగా నవ్వీరుఁ డేతెంచెన్ (3.219)
* నెత్తుటఁ దోఁగి, మేను కమనీయ రుచిం గొమరార (3.339)
* అభిరామ భీషణంబగు రణాంగణంబు (3.380)

పరుష రసపోషణంలో ఆస్వాదయోగ్యతను కలిగించే గుణం రామణీయకం. కిరీటికి కిరీటం అందం. అది సర్పముఖాస్త్రంచేత భగ్నమై పడిపోయినప్పుడు కిరీటం లేని అర్జునుడు కాంతివిహీనుడయ్యాడు. కాని, అప్పుడు కూడా అతడి పాత్రను సౌందర్యరంజితంగా చిత్రించి తిక్కన రక్తికట్టించాడు.

ఉ. 'శృంగము లేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁ డ
య్యుం గనుపట్టె వెల్ల తలయొల్లియ మౌళి దృఢంబుగా నమ
ర్చెం గురునాథ! పూర్ణశశి చెన్నునఁ బూర్వమహీధరంబు కాం
తిం గడచన్న యందము ప్రతీతము గాఁగ నటించు చాడ్పునన్'. **(కర్ణ. 3.327)**

కర్ణవధ ఘట్టం శిల్పసుందరం. అర్జునుడు ప్రయోగించిన ఘోరశస్త్రం భూనభోంతరాలను దద్దరిల్లజేస్తూ వచ్చి, కర్ణుడి శిరస్సును నేల గూల్చింది. ఆ సన్నివేశం వజ్రాయుధాఘాతానికి కూలిపోయే గైరికధాతుమయమైన కొండను తలపింపజేసిందట. ఈ ఘటన భయంకరం. భయానకం.

చ. 'నినద సముద్భట స్ఫురణ నింగి వగుల్పఁగ సర్వభూతకం
పనమగు చమ్మొయిన్ నిగిడి పార్థివసత్తమ! యేమి సెప్పుదుం
దునిమె శిరంబు రక్తమునఁ దోఁగుచుఁ గర్ణుని యట్ట వజ్రఘో
రనిహతిఁ గూలు గైరిక ధరాధరముం దలఁపింపఁ బట్టుగన్'. **(కర్ణ. 3.361)**

భయానకరసం పరుషరసం. దానికితోడు ఆశ్చర్యం కూడా మిళితమయింది. ఈ దృశ్యం రసమయమే కాని రమణీయం కాకపోవచ్చును. ఆస్వాదయోగ్యత తరుగవచ్చును. అందుకని మరొక పద్యం తిక్కన వ్రాశాడు.

క. 'చరమగిరినుండి పడియెడు । తరణి కరణి సూతపుత్రుతల వడఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతి సుం । దరమును నగు కాయ మట్లు ధరణిం బడియెన్'. **(కర్ణ. 3.362)**

తలను సూర్యాస్తమయంతోనూ, శరీరాన్ని ఉజ్జ్వలసుందరమైన దానిని గానూ వర్ణించి పర్వతం కూలిన భయంకర దృశ్యం నుండి పఠిత భావనను లలితసుందరమైన సూర్యాస్తమయ సౌందర్యదృశ్యంవైపు మళ్ళించి రమణీయతను ఆపాదించాడు, ఆస్వాదమధురం చేశాడు.

ఆ తరువాత మృతుడైన కర్ణుడి పార్థివ శరీరానికి దివ్యత్వం ఆపాదించే వర్ణనను అనుసంధించాడు.

తే. 'అధిప యంతన గను విచ్చి యఖిల జనులు । గనుఁగొనంగ నయ్యుజ్జ్వల తనువు విడిచి
చని సముద్దీప్తమైన తేజంబు వారి । జాప్త బింబంబు సొచ్చె నత్యద్భుతముగ'. **(కర్ణ. 3.363)**

కర్ణుడి భౌతికమైన మృతి భయానకం. దాని కళాభివ్యక్తి రామణీయకం. కర్ణుడి తేజస్సు సూర్యుడిలో లీనంకావటం అద్భుతం. కథ ఆస్వాదమధురంగా అద్భుతంగా ముగిసింది.

**4. కర్ణుడి జన్మవృత్తాంతం ఒక అద్భుతం:**

కర్ణుడి చావు ఎంత అద్భుతమో! అతడి జన్మవృత్తాంతం కూడా అంతే అద్భుతం. 'మహాభారతేతిహాసము: కర్ణుడి పాత్ర - వ్యక్తిత్వము' అనే గ్రంథంలో రచయిత శ్రీ అల్లాడ నారాయణరావుగారు కర్ణుడి జన్మవృత్తాంతాన్ని గురించి చెప్పిన విశేషాలు గమనించదగినవి.

"పరస్పర విరుద్ధమైన గుణాల కాశ్రయమై వివాదాస్పదమైన కర్ణుని వ్యక్తిత్వము వలెనే అతని జీవితచరిత్ర కూడా పరస్పర విరుద్ధమైన అంశాలకు నిలయమగుట విచిత్రమైన విషయము!

కుంతీదేవికి వివాహానికి పూర్వమే జన్మించిన ఈ కర్ణుని గూర్చిన ప్రస్తావన మహాభారతము ఆదిపర్వ పంచమాశ్వాసమున-పాండురాజు వివాహమును గూర్చి భీష్ముడు విదురునితో విచారించుచుండెనని-17వ పద్యమునుండి 33వ వచనము వరకు గల 17 గద్యపద్యాలలో చెప్పబడినది. మరల ఇతని జన్మవృత్తాంతము అరణ్యపర్వ సప్తమాశ్వాసమున

వ. 'జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

మధురాక్కర.

కలదు దేవగుహ్యంబని కమలబాంధవుఁడు గర్ణుఁ
బలికె నని చెప్పి; తది యెద్ది? బలియుఁ డా సూతజుండు
లలితకవచంబు మణికుండలములు నెమ్మైయిఁ బడసె?
వెలయు నివ్విధ మంతయు వివరింపవలయు నాకు.' **(అరణ్య. 7.3. 308, 309)**

అప్పుడు వైశంపాయనుడు అతని జన్మవృత్తాంతమును 310వ వచనము నుండి 356వ వచనము వరకు గల 47 గద్యపద్యములందు చెప్పెను. కాని, ఈ విధముగా రెండు పర్వములందు చెప్పిన కథలోనే విభిన్నాంశములు చోటు చేసికొనినవి.

జననము:

| ఆదిపర్వము | అరణ్యపర్వము |
|---|---|
| 1. కుంతీకుమారి తండ్రిచే నియుక్తయై తమ ఇంట అతిథిగా ఉన్న దుర్వాసునకు సేవలొనర్చి ఆయన అనుగ్రహమునకు పాత్రురాలయినది. (సం. భార. 110అ. 4, 5 శ్లోకాలు) భోజనవాంఛతో అతిథిగా వచ్చిన దుర్వాసునకు కోరిన ఆహారమిచ్చి సంతుష్టుని చేసి ఆ ముని అనుగ్రహమునకు పాత్రురాలయినది. (ఆంధ్ర. భార. ఆది. పంచమా. 17, 18 పద్యాలు) | ఒక సంవత్సరము పాటు కుంతి భోజునింట అతిథిగా ఉన్న దుర్వాసునికి ఆమె పలు ప్రయాసల కోర్చి శుశ్రూషలొనర్చి, ఆయన అనుగ్రహమునకు పాత్రురాలయినది. |
| 2. సూర్యుని అనుగ్రహమున కుంతికి కర్ణుడు సద్యోగర్భమున జన్మించాడు. | ఆమె పది నెలలు గర్భము మోసినది. కాని సూర్యుని మహిమచే ఆ విషయము రహస్యముగానే ఉండెను. (అరణ్య.339వ.) (బహుశః దీని నాధారముగా చేసికొనియే కాబోలు తిరుపతి వేంకటకవులు కృష్ణుని నోట 'పది నెలలు మోసి నిన్నుగన్న పడఁతి కుంతి' - అని అనిపించి ఉందురు) |
| 3. కుంతీదేవి కర్ణుడు పుట్టిన వెంటనే పెట్టెలో ఉంచి గంగలో విడిచినది. (30వ) | పసిబిడ్డను ఒకనాటి రాత్రి పెట్టెలో ఉంచి అశ్వనదియందు విడచినది. ఆ నది చర్మణ్వతిలో గలసి, అటు పిమ్మట భాగీరథిలోపడి చంపాపుర' ప్రాంతము చేరినది. (తెలుగున 'పంపానగరము') భార్యతోపాటు గంగాస్నానమునకు వచ్చిన అతిరథు డా పెట్టెను తీసికొనెను. |
| 4. కుంతి తనకు గల్గిన తొలి చూలును పుట్టిన వెంటనే విడిచినది. కావున ఆ విషయమామెకు తప్ప వేరెవరికిని తెలియదు. అంతేకాక అటు తరువాత ఆ పసివా డేమయింది ఆమెకు కూడా తెలియదు. | కుంతి బిడ్డను గన్న విషయము దాదికూతు రొక దానికే తెలియును. ఆమె సాయముననే ఆ పసివానిని ఆ రాత్రి వేళ పెట్టెలో ఉంచి 'అశ్వనది' యందు విడిచినది. ఆ పసివాడు అతిరథునింట పెరుగుచున్నట్లు చారులవలన తెలిసికొని శిథిలీకృత సంతాప యయ్యెను. (వచ. 356) |
| 5. గంగానది ఒడ్డున కుంతీకుమారి సూర్యునిచే పుత్రుని గన్నట్లు చెప్పబడెను. | అరణ్య, ఆశ్రమవాస పర్వములందు (95 నుండి 107 ప.) తన బాల్యమున మేడపై నుండియే సూర్యునాహ్వానించి గర్భవతియై గూఢమందిరాంతరమున కొడుకును గని, ఏటియందు విడిచినది. |

ఉద్యోగపర్వమున కర్ణుని కలసికొనుటకు వెళ్ళుచు ఆమె తనలో తాను 'దుర్వాసుని మంత్ర ప్రభావము తెలియగోరి తండ్రి ఇంటియం దుండియే సూర్యభగవానుని ధ్యానించినట్లును, ఆయన తనకిచ్చిన గర్భమును కాపాడుకొంటి'నని అనుకొనినది. మరియు తన ఇంటనే తా నతనిని కంటినని కుమారునితో చెప్పెను.

ఈ విధముగా ఈ జన్మవృత్తాంతము పలు సన్నివేశములందు పలు విధములుగా ఉన్నది.

ఈ కర్ణ జన్మవృత్తాంతము దేవీ భాగవతమునందును కలదు. అందు దుర్వాసమహర్షి కుంతిభోజుని యింట చాతుర్మాస్య వ్రతదీక్షను జరిపెను. ఆ కాలమున కుంతీకుమారి ఆయనకు పరిచర్యలు సలిపెను.

ఆ మహర్షి తన కనుగ్రహించిన మంత్రమహిమను పరీక్షించు ఉద్దేశముతో ఆమె తన యింటినుండియే సూర్యునాహ్వానించి గర్భవతియైనది. ఈ విషయము దాదికి తప్ప వేరెవరికిని తెలియదు. అంతఃపురమునందే పసివానిని గన్నది. ఆ పసివానిని విడిచిపెట్టుటకు బాధపడుచున్న సమయమున దాది యామెకు ధైర్యము చెప్పి, పెట్టెలో నుంచి తీసికొనిపోవుచుండెను. ఆమె కెదురు వచ్చిన రాధ విషయము తెలిసికొని, గొడ్రాలినైన తన కా పిల్లవాని నిచ్చినచో పెంచుకొందునని అడిగెను. ఆ విధముగా దాదిద్వారా ఆ పసివాడు రాధ పెంపకము అనతిరథుని యింట పెరిగి పెద్దవాడయ్యెను. (ద్వితీయస్కంధము పుటలు 107, 108)

ఇతని జన్మనక్షత్రము భారతమునం దీయకపోయినను శ్రీ మహాభారత సారోద్ధారము-1వ సం. పుట 150 యందు 'అజీ జనత్సుతం....' అని వివరింపబడినది. (కాని సంవత్సరము మాత్రము వివరింపబడలేదు)

చైత్రము మొదలుకొని 11వదియగు మాఘమాసమున శుక్లపక్షమునందు పాడ్యమినాడు చంద్రునివలె కర్ణుడుద్భవించెను. అనగా మాఘ ప్రతిపత్తు నందు కర్ణుని నిషేక జన్మ - కుంతీ సూర్యుల సమాగమము గర్భోత్పత్తియు, అని యర్థము నీలకంఠీయ వ్యాఖ్య.

ఆమె సద్యోగర్భమున కుమారుని ప్రసవించినది. ('సద్యోగర్భధరా కుంతీ కర్ణం ప్రాసూత తం సుతం' పే.152)'' (పు. 1-3)

ఈ అల్లాడ నారాయణరావుగారు కర్ణచరిత్రను సంగ్రహంగా సమీక్షించి సహృదయుల మన్ననల నందుకొన్నారు. వారి మాటలలో-

''దేవగణమునందు సూర్యుడు క్షత్రియుడుగా పరిగణింపబడెను. శూరసేనుని కుమార్తెయు, కుంతిభోజుని దత్తపుత్రికయునైన కుంతీదేవి క్షత్రియ కాంత. కాని వీరిరువురి సంతానమయిన కర్ణుడు సూతపుత్రుడుగా పరిగణింపబడుట విపరీతమైన అంశము!

కుంతీదేవికి దుర్వాసుండుపదేశించిన మంత్రము కర్ణునిపాలిటి శాపముగా పరిణమించగా, అదియే పాండురాజుకు వరమయి ఐదుగురు కుమారులను ప్రసాదించెను. కుంతీకుమారి పసివాడైన కర్ణుని నదిలో విడుచుచు, 'నీ ముద్దు మురిపాలను చూచి సంతసించు భాగ్యమున కే యిల్లాలు నోచుకొనెనో గద!' అని వాపోయెను. అతనిని చల్లగా చూచి కాపాడుమని సమస్త దేవతలకు మ్రొక్కుకొనెను. కాని వివాహానంతర మామె తన ప్రేమను పాండవులవరకే పరిమితము గావించుకొనెను. అంతేకాక వారిని సంహరించనని కూడా అతనినుండియే వరము పొందుట మరింత విడ్డూరము! మరణానంతరము ధర్మజునిచే రాధేయునకు తిలోదకము లిప్పించుటయే ఆమె అతనికి చేసిన మహోపకారము!

బాల్య చాపల్యముచే దుర్వాసమంత్రమును పరీక్షించబోయిన కుంతీకుమారిని నిర్బంధించి, భాస్కరు డామెకు గర్భమును ప్రసాదించెను. ఆ పసివాని మంచిచెడ్డలను తానే చూచుకొందునని ఆమెకు మాటయిచ్చెను. కాని ఆ శిశువును సూతగృహమునకు చేర్చుటతోనే ఆయన తన బాధ్యత తీరిపోయినట్లు పిదప ప్రవర్తించెను!

పాండుపుత్రుడయిన పార్థుడు ద్రోణుని ప్రియశిష్యుడయ్యెను. '...అన్న! ధనుర్ధరు లన్యులు నీ కంటె నధికులు గాకుండునట్లుగా గఱపుదు విలువిద్య ఘనముగా' (ఆది. 5ఆ. 230)నని మాట యిచ్చుటయే గాక, ఆ మాటకు కట్టువడి ఏకలవ్యుని విద్యను మట్టిగలిపి, 'గురువ'ను మాటయొక్క గౌరవము కూడ మంటగలిపెను! ద్రుపదుని బంధించి తెచ్చి గురుదక్షిణ సమర్పించుకొన్నందుకు సంతోషముతో బ్రహ్మశిరోనామకాస్త్రమును కూడా ఉపదేశించెను!

కాని, సూతపుత్రు డయిన కారణముగా కర్ణుడు బ్రహ్మాస్త్రోపదేశమున కనర్హు డయ్యెను! అంతేగాక తన ఆభిజాత్యము మరుగుపరచి విద్యలు నేర్చుకొనెనని భార్గవరామునిచే శపింపబడెను! అతడు రాధేయుడయి హస్తినాపుర సింహాసనార్హతను కోల్పోవుటయేగాక, దుర్యోధనుని అనుగ్రహముచే అంగరాజ్యాభిషిక్తుడగుటయు, 'పవిత్రమైన పురోడాశమునకు కుక్క అనర్హమైనట్లు'గా భీమునిచే అభివర్ణింపబడి హేళనగావింపబడెను!

ఇతడు పుట్టుకనుబట్టి క్షత్రియుడైనను, సూతులకు విహితములైన సంస్కారములను పొంది యుండెను. అందుచే క్షత్రియత్వమును బట్టి ప్రహరింపగల్గియుండియును, సూతత్వముచే శత్రు ప్రహారములకు తట్టుకొనలేక పలాయితుడగుచుండెను. (నీలకంఠాచార్యోక్తి - మహాభారత తత్త్వకథనము - 6వ భా. పే.1308)

ఇంద్రు డర్జుననకు తోడునీడయై అతని మంచిచెడ్డలను విచారించెను. స్వయముగా అతనికి గురుత్వము వహించి ఐదు సంవత్సరములపా టస్త్రశిక్షణనిచ్చెను. (ఏకశ్చ పంచవర్షాణి శస్త్రా దస్త్రాణ్యశిక్షత (విరాట.అ.49.శ్లో.8) తాను పలు శస్త్రాస్త్రముల నతని కిచ్చుటయేగాక, వరుణాది దిక్పాలకులచే గూడ ఇప్పించెను. కాని, భాస్కరు డందులకు విరుద్ధముగా, తాను కర్ణునకు తండ్రినను విషయమును కూడా మరుగుపరచెను. కనీస మాతనిని భార్గవరామ, బ్రాహ్మణ శాపములనుండి తప్పించుట కయినను ప్రయత్నించలేదు! సురనాథుడు పార్థుని విజయము నాశించి రాధేయుని కవచ కుండలముల నర్థించ దలచెనను విషయము తెలిసి, వానిని దానమియ్యవలదని వారింప జూచుటయు, మరణానంతర మతనిని త్రయోదశాదిత్యునిగా పరిణమింపజేయుటయు ఆయన అతనికి చేసిన ఉపకారములు!

కన్యాగర్భమున జన్మించుటయే మహాపరాధమయినచో అందుకు కారణమయిన వారికి లేని శిక్ష యిత డనుభవింపవలెనా!

అతిరథుడు ధృతరాష్ట్రునికి మిత్రుడు. ఆ పలుకుబడితోనే అతడు కృప ద్రోణుల వద్ద తన కుమారుని శిష్యునిగా జేర్చెను. కాని, వారును సూతకులము వారి కర్హమయినంతవరకే అతనికి విద్యనేర్పిరి! విద్యావిషయమున పార్థునితో నితనికి గల స్పర్ధయు, రాజ్యకాంక్షచే దుర్యోధనునకు పాండుపుత్రులతోడి వైరము వారిరువురను ప్రాణస్నేహితులను గావించినది!

ఈ విధముగా కౌంతేయులయిన కర్ణార్జునులు కౌరవ పాండవ పక్షములలోని వారయి, పరస్పరము బద్ధశత్రువు లగుటయే గాక, ఒకరినొకరు పరిమార్చుటకు కూడా ఆద్యంతము ప్రయత్నించిరి!

పాండవులకు కృష్ణుని సహాయము లభించుటయే ఆ పక్షమువా రన్ని విధములైన గండముల నుండి గట్టెక్కి, చివరకు భరతవర్షమునకు సమ్రాట్టులగుటకు కూడా కారణమయ్యెను.

భీష్ముని సేనానాయకత్వమున తమ సేనలకు పట్టిన దుస్థితిని గూర్చి ధర్మజుడు వాసుదేవుని కడ తన గోడును వెళ్ళబోసికొనెను. ఆ సమయమున ఆయన ధర్మజు నూరార్చుచు, 'ఎవడు పాండవవైరియో వాడు నాకును వైరియనుటలో సందియ మేటికి' నీ ప్రయోజనములు మదర్థములే యగుటను నా ప్రయోజనములు త్వదర్థము లగుటలో సందియమేటి?' కనెను. (భీష్మ. 296)

ఆ సందర్భముననే ఆయన పార్థునితో తనకు గల సంబంధమును గూర్చి

తే. 'సఖుఁడు సంబంధి బంధుండు సవ్యసాచి । నాకు నతనికినై యేను నరవరేణ్య!
కూర్మిమై నిత్తు కండలు గోసియైన । నరయ నాయెడ నాతండు నట్టివాఁడ!' **(ఆం. భార. తృతీయ 283)**

అని కూడా వివరించెను. దీనికితోడు భీష్మ ద్రోణులు కౌరవపక్షమున యుద్ధమొనర్చినను వారు తమ మరణ రహస్యములను తెలుపుట ద్వారా పాండవులకు సహాయపడిరి!

ధర్మజుడు భగవంతుడైన కృష్ణుని నమ్ముకొనగా, దుర్యోధనుడు కేవలము తన బలములను నమ్ముకొనెను. దీనినిబట్టి యీ యుద్ధము దైవమానుషములకు జరిగిన సంఘర్షణగా తెలియవచ్చును!

ఒక పక్షమునకు దేవతలు సహాయముండుటయు, వేరొక పక్షమునకు దానవులు తోడుండుటయు గమనించినచో ఇది దేవదానవ సంగ్రామముగా కూడా కాన్పించును!

కర్ణార్జునుల ద్వంద్వయుద్ధ సమయమున మునులు ధనంజయుని పక్షమున నుండిరి. వైశ్యులు, సూతులు, మరియు సంకరజాతులవారును రాధేయుని పక్షమున నిలిచిరి. దీనిని బట్టి యితని నభిమానించువా రధికసంఖ్యాకులని తెలియవచ్చును!

ఇతనివలన లోకమున కొనగూడిన ఉపకారము కంటె అపకారమే అధికము కావున, నితనిని దుష్టునిగా పరిగణించిన వా రధికులు. 'ధర్మలోపముచే జనించుటచే నీ కిట్టి బుద్ధి పుట్టినది. సహవాసదోషముచే కురుసభలో పలుమార్లు పరుషముగా సంభాషించితి' వని గాంగేయు డితనితో పల్కెను. (భీష్మ. పే. 343).

క్షత్రియవర్గము యుద్ధమరణము నొందుటకై కన్యాగర్భమున నితడు సృష్టించబడినట్లు (క్షత్రం స్వర్గం కథంగచ్ఛేచ్ఛస్త్ర పూతమితిప్రభో! సంఘర్ష జనన స్తస్మాత్ కన్యా గర్భేవినిర్మితః॥ (శాంతి.అ.2. 4 శ్లో.) నారదుని వాక్యములను బట్టి తెలియుచున్నది. అందు నిమిత్తమే కౌరవులును సృష్టించబడిరి. అట్టివారు దుష్టులు గాక మంచివా రెట్లగుదురు? భూభారము తగ్గించుటకై అవతరించిన వాసుదేవుని ఆశయము నెరవేరుటకు వీరి తోడ్పాటు తప్పదు గద!

ఇతడు పాండవులపై ద్వేషము నూరిపోసెనేగాని, వారితో సయోధ్యగా మెలగుటకు ప్రోత్సహించలేదని నింద యున్నది. దుర్యోధను డితనిని పాండవులవలన భయముతో చేరదీసెనేగాని, అంతకన్న వేరే సదుద్దేశముతో ఎంతమాత్రము కాదు. హస్తినాపుర సింహాసన మధిష్ఠించుటయే అతని ప్రధానాశయము. అందు కడ్డు తగిలిన కురువృద్ధుడును, పితామహుడునయిన భీష్మునియొక్కయు, విద్యాగురువు, బ్రాహ్మణుడునయిన ద్రోణునియొక్కయు మాటలనే అతడు లక్ష్యపెట్టలేదు. అట్టివాడు కేవలము సూతపుత్రుడును, తన కాశ్రితుడునైన కర్ణుని మాటలను మాత్రము శిరసావహించునా? ఆ కారణముననను, తనను వృద్ధిలోనికి తెచ్చెనను విశ్వాసముతోను రాధేయుడు సుయోధనుని అభిప్రాయములనే సమర్థించెను.

ఇంద్రున కితడు చేసిన దానము కూడా ప్రశస్తమయినది కాదని విమర్శయున్నది. ప్రత్యామ్నాయ దానమొనర్పుమని యితనికి సూచించినది భాస్కరుడు. అంతవర కితని కా ఉద్దేశము లేదు. అంతకుమునుపే అతడు ప్రతిదినము అసంఖ్యాకులయిన యాచకులకు పలువిధములైన దానము లిచ్చెను. కాని వారెవరినుండియు, ఏమియు నాశించలేదు. అట్టి దాతృత్వనిష్ఠను పురస్కరించుకొనియే పురందరు డీతని యాచింపనెంచెను. 'కీర్తిశరీరము మాసిపోకుండుటకై కవచకుండలములు దానమిచ్చినను, తన స్వామికార్యమునకై శక్తి నడిగి పుచ్చుకొనుటచే కీర్తిశరీరమునకు మచ్చ వచ్చె'నని వజ్ఝల వారి సమర్థన! (కర్ణచరిత్రము - పే.66)

ఇతడు తనయుడుగా కుంతీదేవి కోర్కెను తీర్చెను!

తండ్రి ఆదిత్యునకు భక్తుడై మెలగెను!

సూతదంపతుల విషయమున సుతుని బాధ్యతలను విస్మరించలేదు!

దానవీరుడుగా ఆచంద్రతారార్కమైన కీర్తిని సంపాదించెను!

నమ్మినబంటుగా తన స్వామికై ప్రాణత్యాగమొనర్చెను!

దుష్టచతుష్టయమునందు దుశ్శాసనునిలో ప్రశంసించదగిన అంశమేమియు లేదు. అందుచే అతనిపై గ్రంథములు వ్రాసినవారు కానరారు. కౌరవాధీశులు తన పూర్వులకొనర్చిన ద్రోహమునకు ప్రతీకారముగా శకుని, ధార్తరాష్ట్రులకు పాండవులతో వైరము కల్పించి, వారిని మట్టుపెట్టి తనకక్ష తీర్చుకొన్నట్లు కొన్ని రచనలున్నవి. అదే విధముగా దుర్యోధనుని రాజ్యార్హతను సమర్థించుచు, మయసభలో అతడు భంగపడిన ఘట్టములను విశ్లేషించుచు గ్రంథములు రచించిన వారును ఉన్నారు. కాని, వారందరికంటె అత్యధికమైన సానుభూతిని సంపాదించుకొని, పలువురు కవిపండితులచే పెక్కు గ్రంథములు వ్రాయించుకొనగల్గిన ఘనత మాత్రము కర్ణునకే దక్కినది!

విద్యా విషయమునగాని, సాంఘికముగా గాని ఆనా డాత డెదుర్కొనిన పరిస్థితులీనాడు లేవు. కాని, కుంతీపుత్రుల సంఖ్య మాత్రము దినదినాభివృద్ధి చెందుచుండుట చింతింపదగిన అంశము!" (పుట 111-114).

కర్ణుడు మహావీరుడుగానే కాక దానవీరుడుగా, మానవీరుడుగా ప్రజల హృదయాలలో ప్రతిష్ఠితుడై ఉన్నాడు. సహజకవచకుండలాలను కీర్తించి ఇంద్రుడికి దానం చేసే ఘట్టంలో అతడు పలికిన మాటలు కర్ణకీర్తిపతాకలు!

దానవీరుడుగా

సీ. 'విప్రులు గడునర్థి వేఁడినఁ గడిమితోఁ । బొచ్చెంబు సేయక యిచ్చు టొకటి;
బలితంపుఁ బగతురఁ బరిమార్చు టొక్కటి, । దండియై యనిఁజచ్చు టొండె నొకటి;
శరణాగతుని నెట్టి శత్రువునైనను । గరుణించి చంపక గాచు టొకటి;
భామినీ ద్విజవృద్ధ బాలాతురులకైన । యాపదఁ జెచ్చెరఁ బాపుటొకటి

ఆ. యనఘ! యివి వ్రతంబులై చెల్లు నాకు; నిం । దొకటి తప్పెనేని వికలకీర్తి
నగుదుఁ, గాన యిత్తు నఖిల భావముల నా । ఖండలునకుఁ గవచకుండలములు'. **(అరణ్య.7.295)**

యశోవీరుడుగా, మానవీరుడుగా -

ఆ. 'కీర్తి విడువఁజాలఁ, గీర్తితో మెలఁగంగఁ । జావు వచ్చె నేనిఁ జత్తుఁ గాని:
జగములోన నెల్ల సడికంటెఁ జావు మే । లనఁగఁ బరఁగు మాట యనఘ! వినవె!' **(అరణ్య.7.293)**

ఈ మాటలు ఇప్పటికీ ఆంధ్రుల నాల్కలమీద కర్ణకీర్తి గీతాలవలె లాస్యం చేస్తూనే ఉన్నాయి! కర్ణుడు స్వయంగా ప్రకాశించే ఉజ్జ్వల వీరనక్షత్రం.

**5. కర్ణపర్వం: అంతరార్థం:**

అధ్యాత్మవిదులు మహాభారతాన్ని అధ్యాత్మశాస్త్రంగా భావిస్తారు. భారతేతిహాస పురాణాలు స్వభావతః అధ్యాత్మికపరమైన ప్రతీకాత్మక ప్రవృత్తులతో ప్రకాశిస్తూ ఉంటాయి. ప్రసిద్ధ కావ్యాలూ, ప్రబంధాలూ ఈ మార్గంలో పయనించి ప్రామాణికత్వాన్ని సాధిస్తాయి. అందువలన మహాభారతం ఆధ్యాత్మిక ప్రతీకార్థ ప్రవృత్తి కలిగిన ఇతిహాసం!

కర్ణపర్వంలో అసమగ్రయోగాన్ని ఋజుమనోవృత్తితో ఎదిరించే సాధన అంతరార్థంగా నిక్షిప్తం చేయబడింది. కర్ణుడు యోగమార్గాన్నీ, దుర్యోధనుడు ముక్తిమార్గాన్నీ నాశనం చేసే తామసవృత్తికీ ప్రతీకలు. ద్రోణుడి తరువాత కర్ణుడిని సేనాపతిగా అభిషేకించాడు. ద్రోణుడంటే అసమగ్రజ్ఞానమార్గం. అది ఋజువృత్తితో సాత్త్వికవృత్తులు (ధర్మరాజాదులు) సాగించే సాధనను భ్రష్టం చేయలేకపోయింది. అప్పుడు ఆ సాధనను అసమగ్ర యోగమార్గం (కర్ణుడి) ద్వారా సాధించాలని తామసికవృత్తి పూనుకొన్నది.

దుర్యోధనుడు కర్ణుడి కోరిక మేరకు మద్రపతిని అతడి రథసారథిగా ఒప్పించాడు. 'మద్ర' అంటే అహంకార మమకారాలను అగ్నివలె నాశనంచేసే జ్ఞానమని అంతరార్థం. శల్యుడి సారథ్యం కుదిరితే కర్ణుడు కృష్ణసారథ్యం పొందిన అర్జునుడితో దీటు కాగలుగుతానని భావించాడు. అంటే యోగమార్గానికి కుంభకస్థితిలో కలిగిన సగం జ్ఞానానికి మరికొంత నిరహంకార ప్రవృత్తిగల జ్ఞానసహాయం కూడా లభిస్తే, కృష్ణసారథ్యంలో ఉన్న (నిర్వృతితత్త్వం యొక్క తోడ్పాటుతో ఉన్న ఋజుమనోవృత్తితో (అర్జునుడితో) సరితూకం పొందవచ్చునని భావించాడని అంతరార్థం. శల్యుడు ధర్మరాజుకు సహాయం చేయాలనిపోతే మార్గమధ్యంలో దుర్యోధనుడి యుక్తిలోపడి అతడికి సాయంచేస్తానని మాట ఇచ్చాడు. అటు ధర్మరాజుకూ తన సారథ్యంలో సహాయం చేస్తానని మాట ఇచ్చాడు. అంటే శల్యుడు సాధకుడిలోని ద్వైతవృత్తికి ప్రతినిధి. సాధకుడు తనకు తెలియకుండానే చంచలత్వంతో ద్వైధీభూతమైన ప్రవృత్తిని ప్రకటిస్తాడని గ్రహించాలి.

శల్యుడు కర్ణుడికంటె తాను గొప్పవాడినన్నాడు. అంటే యోగమార్గంకంటె నిరహంకార జ్ఞానమార్గం గొప్పదని అర్థం. దుర్యోధనుడు శల్యసారథ్యాన్ని కుదిరించాడు. దానివలన అర్జునుడిపై విజయం సాధించదలచాడు. అంటే- నివృత్తితత్త్వం (కృష్ణ) సహాయంతో ఋజుమనోవృత్తి (అర్జునుడు) బలం పొందినట్లుగా అహంకార మమకారరహితవృత్తియొక్క (మద్రరాజు యొక్క) సహాయంతో యోగమార్గం (కర్ణుడు) బలపడాలని తామసవృత్తి (దుర్యోధనుడు) ప్రయత్నించటం జరిగింది. యోగమార్గంలోని లోపాలను చెప్పటమే శల్యుడు కర్ణుడిని నిరుత్సాహపరచటంలోని అంతరార్థం. కర్ణుడు శల్యుడిని నిందించాడు. జ్ఞానమార్గ యోగమార్గాలలోని లోపాలను గుణాలను సవిమర్శకంగా అంతరార్థపరంగా సాధకులకు అందించటానికే శల్యకర్ణుల సాంకర్యసంవాదాన్ని వ్యాసమహర్షి కల్పించాడని అధ్యాత్మవిదులు భావిస్తారు.

కర్ణపర్వంలో ప్రవర్తిల్లిన ద్వంద్వయుద్ధాలలో మొదట పేర్కొనదగింది భీమ దుశ్శాసనుల యుద్ధం. భీముడు దుశ్శాసనుడిని ఘోరంగా సంహరించాడు. దుశ్శాసనుడంటే సాధకుడిలోని తామసిక వృత్తులలో ప్రబలవృత్తి అయిన దుష్టవిషయికమైన శాసనవృత్తి. భీముడంటే సాధకుడిలోని అభయవృత్తి. దీనిని బట్టి అభయవృత్తి దుష్టవిషయక శాసనవృత్తిని నాశనం చేసేసాధనను ఆ ఘట్టం ప్రబోధిస్తున్నదని భావం.

ఈ పర్వంలో శ్రేష్ఠమయింది కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం. దీనిని సాధకులు ఈ విధంగా భావన చేయాలి. తామసికవృత్తికి వశపడిన యోగమార్గమూ (దుర్యోధనుడి పోషణలో ఉన్న కర్ణుడూ) సాత్త్వికవృత్తితో కూడిన ఋజుమనోవృత్తీ (ధర్మజానుజుడైన అర్జునుడూ) తీవ్ర సంఘర్షణలు సాగించాయని గ్రహించాలి.

ఆ యుద్ధంలో కర్ణుడి రథచక్రం భూమిలో దిగబడింది. కర్ణుడు రథచక్రాన్ని పై కెత్తుతూ ఉన్న సమయంలో కృష్ణుడి ప్రోత్సాహంతో అర్జునుడు ఘోరమైన బాణంతో (అంగీరసీ కృత్యను ప్రయోగించి) చంపాడు. దీని అంతరార్థాన్ని ఇట్లా భావించాలి. యోగసాధకుడు జ్ఞానమార్గాన్ని ప్రతిఘటించి అంటే - కుంభకాన్ని విడిచినపుడు భూతత్త్వ ప్రకృతి నుండి పైకి లేవలేక ఆ భూతత్త్వ ప్రకృతిలోనే దిగబడి కూరుకొనిపోయి ఉండటాన్ని కర్ణుడి రథచక్రం క్రుంగిపోవటంలోని తాత్పర్యం. అప్పుడు సాధకుడు జ్ఞానమార్గంలోకి మారి నిర్వృతితత్త్వంయొక్క సహాయసహకారాలతో ఒక్కసారిగా ఋజువృత్తివలన దేహంలోని వాసనారాహిత్యంతో అమనస్కుడై ముక్తిని పొందవచ్చుననే తత్త్వాన్ని చెప్పేదే శ్రీకృష్ణుడి ప్రేరణతో అర్జునుడు బాణప్రయోగం చేసే ఘట్టం. కర్ణదేహంనుండి జ్యోతి వెడలి సూర్యుడిలో కలిసిపోవటంలో అంతరార్థ మదే. అర్జునుడు కర్ణుడిని చంపాడంటే - యోగమార్గాన్ని జ్ఞానమార్గం తనలో విలీనం చేసికొనటమే. జ్ఞానమార్గంలోని నిర్వృతితత్త్వంతో కూడిన ఋజువృత్తిద్వారానే తమ సాధన సిద్ధిస్తుందనీ, అట్లాకాక కేవలయోగమార్గంలో ముక్తి లభించదనీ తెలిసికొని, యోగమార్గాన్ని జ్ఞానమార్గంతో ముడిపెట్టుకొనాలనీ యోగమార్గసాధకులు గ్రహించే తత్త్వమే కర్ణపర్వ పరమార్థం! (వివరాలకు చూడు: డా॥ వేదుల సూర్యనారాయణశర్మ గారి 'అంతరార్థ భారతము'.)

## 6. కవిత్రయ మహాభారతం: వ్యాఖ్యానం

తెలుగులో ఆదికావ్యమైన ఆంధ్రమహాభారతం అవతరించి వెయ్యేళ్ళుకావస్తున్నా, ఇంతవరకు దానికి సమగ్రవ్యాఖ్య వెలువడలేదు. ఆంధ్రుల అభిమాన దైవమైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి అనుగ్రహంతో కవిత్రయ మహాభారతానికి తెలుగులో శిష్టవ్యావహారిక భాషలో సరళవ్యాఖ్య వెలువడటం ఆంధ్రావళి ఆనందించే అపూర్వ సాహిత్యోత్సవం. శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారు భారతీయ వైదిక ధర్మప్రచార మహోద్యమాన్ని చేపట్టి మహనీయంగా సాగిస్తున్నారు. అందులో ఈ పంచమవేద వ్యాఖ్యాన ప్రణాళిక ఒక మహత్తర సారస్వత యజ్ఞం. ఏడుకొండలరాయడు మాత్రమే చేపట్టి ధర్మరక్షణ కళాప్రావీణ్యంతో ఈ బృహత్తర ధర్మకార్యాన్ని ప్రజలకు ప్రసన్నంగా ప్రసాదించగలిగిన పరమదయాళువు. ఆ దేవదేవుడి కృపాకటాక్షంతో పండితులు పదునెనిమిది పర్వాల ఈ దివ్యప్రబంధమండలిని పరిష్కరించి సర్వాంగసుందరంగా ప్రచురించి, సామాన్య జనులకు అందుబాటులో ఉండేటట్లు చేయటం తెలుగువారు చేసికొన్న వెలుగుల పుణ్యం. ఈ పవిత్ర మహత్తర ప్రయత్నానికి శ్రీ తిరుమలేశుడి పక్షాన బాధ్యతవహించి, అభ్యుదయ పరంపరను విజయవంతంగా సమకూరుస్తున్న మాన్యులు, మహనీయులు టి.టి.డి. బోర్డు ఛైర్మన్, సభ్యులు, కార్యనిర్వహణాధికారి మొదలైన అధికారులూ, వారి

సహకారులూ, సంపాదక సలహామండలుల సభ్యులూ, వ్యాఖ్యాతలుగా పాల్గొన్న విద్వన్మణులూ, ఎడిటోరియల్‌సెల్ సభ్యులూ, పలురకాలుగా ఈ కార్యక్రమంలో తోడ్పడుతున్న అధికారులూ, అనధికారులూ ధన్యులు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పదునెనిమిది పర్వాలలో ఆదిపర్వం మొదటి సంపుటి. అది రెండు భాగాలుగా వెలువడింది. సభాపర్వం రెండవ సంపుటిగా రూపుదిద్దుకొన్నది. విస్తృతమైన ఆరణ్యపర్వం మూడవసంపుటిగా రెండుభాగాలలో ప్రచురించబడింది. మొదటి భాగం నన్నయ రచించిన ఆరణ్యపర్వభాగం. రెండవభాగం ఎర్రాప్రెగడ పూరించిన అరణ్యపర్వ శేషం. ఈ విధంగా ఆరణ్యపర్వం విభజించబడి ప్రచురించబడటం తెలుగులో ప్రథమం. నాల్గవ, అయిదవ, ఆరవ, ఏడవ సంపుటులుగా విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ పర్వాలు వెలువడ్డాయి. ఇప్పటి ఈ ఎనిమిదవ సంపుటి కర్ణపర్వం.

కర్ణపర్వ వ్యాఖ్యానంలో ముగ్గురు మహాపండితులు పాల్గొన్నారు. ప్రథమాశ్వాసానికి కీ.శే.శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్యగారు, ద్వితీయాశ్వాసానికి డాక్టర్ యస్వీరామారావుగారు, తృతీయాశ్వాసానికి కీ.శే. డాక్టర్ మరుపూరి కోదండరామిరెడ్డిగారు వ్యాఖ్యానం వ్రాశారు. విద్వద్విమర్శకులైన వీరు సరసమైన రచన చేశారు. ఈ పర్వానికి తగిన పీఠికను నేను సంతరించాను. ఇవి ఆంధ్రుల ఆమోదాన్ని పొందుతాయని ఆశిస్తున్నాను.

ఈ సంపుటి ఈ విధంగా రూపొందటానికి తోడ్పడిన మిత్రులు, విద్వన్మణులు డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారికీ, శ్రీ కె. సత్యరామప్రసాదుగారికీ, శ్రీ ఎన్.ఎస్. హరనాథ్‌గారికీ, శ్రీ జి.రాధాకృష్ణగారికీ, శ్రీమతులు సుశీలా లక్ష్మీ విద్యానాథులకు, డాక్టర్ వి.యస్.లక్ష్మిగారికీ నా హార్దిక కృతజ్ఞతలు.

పరమ కల్యాణ భద్రమూర్తి అయిన శ్రీ పద్మావతీ సహిత శ్రీ వేంకటేశ్వరస్వామివారు వేదవేద్యులు, వేదాంత గమ్యులు, పరతత్త్వరూపులు అయినా భక్తసులభులు, సాహిత్య సంగీత కళాప్రియులు, రసానందమూర్తులు. ఆ స్వామికి ఈ పంచమవేదం అక్షరమైన తోమాలసేవ; వ్యాఖ్యానం సుగంధపరిమళ సేవ; విశేషాంశాలు ఉజ్జ్వలాలంకార సేవ. పీఠిక విరాణ్మూర్తికి మంగళనీరాజన సేవ. ఈ సర్వం స్వామివారికి సారస్వతమైన అక్షరార్చన!

సత్య శివసుందర రూపులైన స్వామివారి దివ్యసన్నిధిలో ఈ వ్యాఖ్యాసంపుటిని వాఙ్మయారాధనలోని భాగంగా పుణ్యపూజకు సుమమంజరిగా సమర్పించుకొంటున్నాడు. విశ్వశ్రేయస్సును ప్రసాదించుమని స్వామివారిని వేడుకొంటున్నాను.

**జి.వి.సుబ్రహ్మణ్యం**

ప్రధాన సంపాదకుడు

హైదరాబాదు

15-7-2004

కవిత్రయ మహాభారతం ప్రాజెక్టు

తిరుమల తిరుపతి దేవస్థానం

# కర్ణపర్వ కథాసారం

రణరంగంనుండి తిరిగి వచ్చిన సంజయుడు కర్ణుడి మరణవృత్తాంతాన్ని ధృతరాష్ట్రుడికి చెప్పాడు. ఆ రాజు శోకోపహతుడై కర్ణుడితోపాటు దుర్యోధనుడు కూడా మరణించినట్లుగా భావించి మూర్ఛపోయాడు. ఆ తరువాత శైత్యోపచారాలతో సేదదీరి నిట్టూర్పులు సారిస్తూ మనస్సులో చింతిస్తూ, దురదృష్టాన్ని నిందిస్తూ, పాండవులను ప్రశంసిస్తూ, తన బుద్ధినీ శకుని కుటిలస్వభావాన్నీ నిందించుకొంటూ, దుర్యోధనుడు చావలేదని తెలిసి ఊరడిల్లి, కర్ణుడూ, తనయులు, దుర్యోధనుడి తమ్ములు చచ్చారని విని, దుశ్శాసనుడి వక్షాన్ని చీల్చి భీముడు పచ్చినెత్తురు త్రాగినసంగతి తెలిసికొని కొంతసేపు నిశ్చేష్టుడయ్యాడు. ఆ తరువాత కర్ణాదుల మరణానికి బోరున విలపించాడు. జలాగ్ని విషప్రాయోపవేశాదులలో దేనితోనైనా మరణించాలని సంకల్పించాడు. కాని, సంజయుడి అనునయోక్తులతో తేరికొని జరిగిన కథనంతా వివరంగా చెప్పమని అడిగాడు. సంజయుడు చెప్పనారంభించాడు.

కర్ణుడిని సర్వసైన్యాధ్యక్షుడిగా అభిషేకించుమని దుర్యోధనుడికి అశ్వత్థామ సలహా చెప్పాడు. దుర్యోధనుడు సంతోషించి కర్ణుడు పాండవులను జయించగలడనే ఆశతో సర్వసైన్యాధ్యక్షుడిని చేశాడు. పాండవుల మదమణచి విజయాన్ని సాధిస్తానని కర్ణుడు శపథం చేశాడు. బంధుమిత్రులతో అర్జునుడిని రణంలో చంపి సామ్రాజ్యాభిషేకం చేస్తానని బాస ఇచ్చాడు. కౌరవు లాతడి వీరోక్తులకు ఉప్పొంగిపోయారు. కర్ణుడు రణోత్సాహంతో యుద్ధరంగంలో ప్రవేశించాడు.

**మొదటినాటి యుద్ధం:**

మొదటినాటి యుద్ధంలో కర్ణుడు మకరవ్యూహాన్ని పన్నాడు. అందులో తుండంలో కర్ణుడూ, కళ్ళలో శకునీ ఉలూకుడూ, శిరంలో అశ్వత్థామా, కంఠంలో దుశ్శాసనాదులూ, ఉదరంలో దుర్యోధనుడూ, అతడి ముందు ఎడమ పాదంలో నారాయణ గోపాలసేనతో కృతవర్మా, కుడిపాదంలో త్రిగర్త దాక్షిణాత్యులతో కూడిన కృపాచార్యుడూ, వెనుకభాగంలో ఎడమకుడి పాదాలలో శల్య సుషేణాదులూ, తోకలో చిత్రుడనే రాజూ, అతడి తమ్ముడు చిత్రసేనుడూ నిలిచేటట్లుగా సుస్థిరమైన వ్యూహాన్ని ఆయత్తం చేశాడు.

ధర్మరాజు చతురంగ బలోల్లాసంతో వచ్చి కౌరవసైన్యాన్ని చూచాడు. కర్ణుడిని చూపుతూ అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'విజయా! చూచావా! కౌరవసైన్యం పలచబారింది. కర్ణుడు యుద్ధభారాన్నంతా తన భుజాలమీద వేసికొని మొగ్గరంలో మొదట నిలబడ్డాడు; బలగర్వాలను ప్రదర్శిస్తున్నాడు. వనవాసంలో మనలను దుఃఖవార్ధిలో ముంచిన దుర్మార్గు డీతడే. ఇతడిని బాణాలతో వధించుము. ఇప్పుడున్న కౌరవవీరులలో పరాక్రమంతో పోరగల్గినవాడూ, దుర్యోధనుడికి హితుడూ అయిన కర్ణుడిని నిర్దాక్షిణ్యంగా చంపి విజయాన్ని సాధించుము' - అని ప్రోత్సహించాడు.

అర్జునుడు కౌరవుల మకరవ్యూహానికి ప్రతిగా అర్ధచంద్రవ్యూహాన్ని పన్నాడు. తాను మధ్యప్రదేశంలో ఉన్నాడు. ఇరువైపుల శృంగాలుగా భీమ ధృష్టద్యుమ్నులను నిలిపాడు. యుధిష్ఠిర నకుల సహదేవులను పింగలిగా ఉండేటట్లు నిలిపాడు. యుధామన్యు ఉత్తమౌజులను అంగరక్షకులుగా చేశాడు.

కర్ణుడి చేతిలో కృష్ణార్జునులూ, పాండవులూ చనిపోతారని దుర్యోధనుడు మనసులో ఉప్పొంగిపోయాడు. కర్ణుడితో సహా దుర్యోధనుడు దుర్మరణం పాలౌతాడని ధర్మరాజు మనసులో తలంచాడు. పోరు ఘోరంగా ప్రారంభమయింది. రణరంగం రక్తసిక్తమైపోయింది. భీమసేనుడితో తలపడి క్షేమధూర్తి ప్రాణాలు కోల్పోయాడు. క్రమంగా ద్వంద్వయుద్ధాలు ప్రవర్తిల్లాయి. కర్ణుడిని నకులుడు, అశ్వత్థామను భీముడు, విందానువిందులను సాత్యకి, శ్రుతకర్మను చిత్రసేనుడూ,

చిత్రుడిని ప్రతివింధ్యుడూ, దుర్యోధనుడిని ధర్మరాజూ, సంశప్తకులను అర్జునుడూ, కృపాచార్యుడిని ధృష్టద్యుమ్నుడూ, కృతవర్మను శిఖండీ, శల్యుడిని శ్రుతకీర్తీ, దుశ్శాసనుడిని సహదేవుడూ ఎదుర్కొన్నారు. అందులో ప్రతివింధ్యుడు చిత్రుడిని చంపాడు. సహదేవుడితో యుద్ధంచేస్తూ మూర్ఛిల్లాడు. కర్ణుడు నకులుడిని విరథుడిని చేసి అవమానించాడు. కృపాచార్యుడి చేతిలో ధృష్టద్యుమ్నుడు ఓడిపోయాడు. ధర్మరాజుతో యుద్ధంచేసి దుర్యోధనుడు విరథుడయ్యాడు, మూర్ఛిల్లాడు. ఈ విధంగా ద్వంద్వయుద్ధాలతో ఆనాటి యుద్ధం ముగిసింది.

## కర్ణుడి రెండవనాటి యుద్ధం :

రెండవనాడు ధర్మరాజు బృహస్పతి మతాన్ని అనుసరించి దుర్జయవ్యూహం పన్నాడు. కర్ణుడు దుర్యోధనుడిని సమీపించాడు. 'అర్జునుడికి గాండీవమున్నా, అక్షయ తూణీరాలున్నా, అగ్నిదేవు డిచ్చిన అభేద్య రథమున్నా, ఆవధ్యరథ్యాలున్నా నాకు దిగులు లేదు. కాని, భువనప్రవర్తకుడైన శ్రీకృష్ణుడు రథసారథ్యం చేస్తూ ఉండగా పార్థుడి పరాక్రమం అసాధ్యమై ఉంటుంది. కాబట్టి సారథ్యంలో శ్రీకృష్ణుడికంటె ఎక్కువ నేర్పుగల మద్రదేశాధిపతి అయిన శల్యుడిని నాకు రథసారథిగా సమకూర్చాలి. అట్లా చేస్తే అవశ్యం అర్జునుడిని హతమారుస్తాను' - అని కోరుకొన్నాడు. దుర్యోధనుడు సంతోషించి శల్యుడి వద్దకు పోయి కర్ణుడికి రథసారథ్యం చేయుమని వినయంతో ప్రార్థించాడు. శల్యుడు ముందు కొన్ని పేచీలు పెట్టినా, చెవులకు చేదైన మాటలైనా అతడు చెప్పినవి రథికుడు వినే నియమంతో సారథ్యానికి అంగీకరించాడు. దుర్యోధనుడు శల్యుడికి త్రిపురాసుర వృత్తాంతం చెప్పాడు.

సారథి రథికుడి యోగక్షేమాలనూ, విజయాన్నీ కోరాలి. అతడిలో ఉత్సాహాన్ని రేకెత్తించే మాటలు మాట్లాడాలి. కాని, శల్యుడు ధర్మజుడి కిచ్చిన వరంప్రకారం కర్ణుడి హృదయాన్ని బాధపరిచే మాటలను, పాండవుల పరాక్రమాన్ని ప్రశంసించే వాక్యాలను, కర్ణుడి లోపాలను ఎత్తి చెప్పే ఎత్తిపొడుపు మాటలను, వద్దన్నకొద్దీ పలుకుతూ కర్ణుడి ఉత్సాహాన్ని నీరుగార్చే యత్నం చేశాడు. అందు కాతడు చెప్పిన హంసకాకీయోపాఖ్యానం చక్కని ఉదాహరణం. అందువలననే నమ్మించి మార్గదర్శకులై మనసు నొవ్వబలికే మాయావుల వర్తనాన్ని 'శల్య సారథ్యం' అని లోకంలో వ్యవహారంలోకి వచ్చింది. అడుగడుగునా శల్యుడి మాటలు శల్యాలవలె మనసును బాధించినా, అభిమానధనుడైన కర్ణుడు యుద్ధోత్సాహాన్ని పోషించుకొంటూ ముందుకు సాగాడు. మనసువిప్పి తనకుగల శాపవృత్తాంతాల నన్నింటినీ అతడితో చెప్పుకొన్నాడు.

పరశురాముడిని మెప్పించి కర్ణుడు బ్రహ్మాస్త్రాన్ని పొందాడు. కర్ణుడు బ్రాహ్మణుడనని అబద్ధమాడి అస్త్రరహస్యాలను పొందాడు. అతడి క్షత్రియోచిత వర్తనాన్ని గమనించి పరశురాముడు కోపించి 'అవసరం వచ్చినప్పుడు బ్రహ్మాస్త్రం స్ఫురించకుండా పోతుం' దని శపించాడు. ఒక బ్రాహ్మణుడి యజ్ఞధేనువును పొరపాటున తన బాణంతో చంపినందుకు ఆ విప్రుడు కోపించి, వచనశల్యాలతో నిహతుడయ్యేటట్లూ, యుద్ధంలో అత్యంతోత్సాహాన్ని ప్రకటిస్తున్నప్పుడు రథచక్రం నేలలో క్రుంగేటట్లూ, ఎవరిని ఎదుర్కొని గెలవాలని శ్రమిస్తూ ఉంటాడో అతడి చేతిలోనే కర్ణుడు చనిపోయేటట్లూ శపించాడు. ప్రపంచంలో ఏ మహావీరుడిని గురించీ తనకు భయం లేదు కాని, జామదగ్న్య బ్రాహ్మణ శాపాలు మాత్రం తనకు భయాన్ని కలిగిస్తాయని కర్ణుడు శల్యుడితో ఆత్మీయంగా చెప్పుకొన్నాడు. అతడు దానిని సాకుగా తీసికొని కర్ణుడి మనస్సు వికలమయ్యేటట్లు పలు మాటలు మాట్లాడాడు. కర్ణు డతడిని మందలించి రథాన్ని ముందుకు సాగించుమన్నాడు. శల్యుడు ఆ సమయంలో కనబడుతున్న ఉత్పాతాలను పేర్కొన్నాడు. కర్ణుడు వాటిని లెక్కచేయకుండా తన వ్యూహాన్ని ముందుకు కదలించాడు.

త్రిగర్తులు అర్జునుడిని చుట్టుముట్టారు. మేఘాలు క్రమ్ముకొన్న సూర్యుడివలె కాంతిహీనుడై ఉన్నాడని పార్థుడిని కర్ణుడు వ్యాఖ్యానించాడు. శల్యుడు మేఘాలు సూర్యుడి కాంతిని తగ్గించలేవనీ, అవి తాత్కాలికాలనీ పార్థుడి పరాక్రమాన్ని ప్రశంసించి పాండవుల బలశౌర్యాలను కీర్తించాడు. ధర్మపరులైన పాండవులకు జయం కలుగుతుందని సూచించాడు. దుర్యోధనుడు కర్ణపరాక్రమాన్ని కీర్తించి యుద్ధోత్సాహాన్ని కలిగించాడు. అశ్వత్థామ ధృష్టద్యుమ్నుడిని చంపితే తప్ప పాండవులను

ఓడించలేమని భావించి విజృంభించారు. దుర్యోధనుడు భీముడిని డీకొన్నాడు. కర్ణుడు ధర్మజుడిపై దాడి చేశాడు. కౌరవసైన్యం క్రమ్ముకొని పాండవసైన్యాన్ని చుట్టుముట్ట నారంభించింది. ధర్మరాజు కర్ణ విజృంభణాన్ని అర్జునుడికి చూపించి అతడిని ఓడించటానికి పురికొల్పాడు. అర్జునుడు కర్ణుడిని వధించితీరుతానని మాట ఇచ్చాడు.

రెండువైపుల నున్న వీరులు ద్వంద్వయుద్ధానికి సిద్ధమయ్యారు. భీముడు దుర్యోధనుడిని, నకులుడు వృషసేనుడిని, సహదేవుడు సౌబలుడిని, శతానీకుడు దుశ్శాసనుడిని, సాత్యకి కృతవర్మను, ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామను, ఉపపాండవులు శిఖండిని, ధర్మరాజు కృపాచార్యుడిని ఎదుర్కొని యుద్ధం చేయనారంభించారు. వ్యూహ మధ్యభాగంలో ఉన్నా కర్ణుడు లెక్కచేయక ధర్మరాజు మీదికి దూసికొని పోవసాగాడు. దానితో వ్యూహంలో నియమం తప్పి వీరులు యథేచ్ఛగా యుద్ధం చేయనారంభించారు. సంశప్తకులు పొంగినసముద్రంవలె అర్జునుడిపై పడ్డారు. ఆతడు చెలియలికట్టవలె అడ్డపడి వారిని నిలువరిస్తున్నాడు. శల్యుడు పార్థపరాక్రమాన్ని ప్రశంసించి కర్ణుడికి కన్నెర్ర కలిగించాడు. అతడు పాండవసేనపై దారుణంగా దాడి చేశాడు. పాంచాలకుమారులను అనేకమందిని బాణాలకు బలి చేశాడు. దానికి ప్రతిగా భీముడు కర్ణుడి కొడుకైన సత్యసేనుడిని చంపి విజృంభించాడు. కర్ణుడు శోకావృతుడైకూడా క్రోధావేశంతో పాండవ సైన్యాన్ని నురుమాడుతూ ధర్మజుడిని బాధించాలని పూనుకొన్నాడు. పాండవవీరులు ధర్మరాజుకు అండగా నిలిచి పోరాడారు. కౌరవవీరులు కర్ణుడికి దండగా నిలిచి పోరాడారు. సంకుల సమరం భయంకరంగా సాగింది. ధర్మరాజు కర్ణుడిపై విజృంభించాడు. కర్ణుడు క్రోధోద్రేకంతో ధర్మజుడి సూతుడిని చంపాడు. కేతువును కూల్చాడు. వాడిబాణాలతో అతడి శరీరాన్ని నొప్పించాడు. సాత్యకీ శిఖండులు ధర్మరాజుకు తోడుగా పోరాడారు. కర్ణుడు వారిని విరథులను చేశాడు. కర్ణుడి ధాటికి ఎదురు నిలువలేక ధర్మరాజు సారథిలేని తన రథాన్ని తానే నడుపుకొంటూ తొలగిపోవ నారంభించాడు. కర్ణుడు ఆయనను వెన్నంటుతూ పోయి, చుట్టుముట్టి, ఆపి, అవహేళన చేస్తూ మాట్లాడాడు. 'ధర్మరాజా! నీవు క్షత్రియకులంలో పుట్టావు. ధర్మాధర్మాలన్నీ తెలిసికొన్నావు. అట్టినీవు మహాసంగ్రామంలో ప్రాణాలు కాపాడుకొనటానికని శత్రువులకు భయపడి ఇట్లా తొలగిపోవటం న్యాయమేనా? నీ తెలివితేటలు బయటపడ్డాయి. నీకు క్షత్రియనీతి తెలియదు. బ్రాహ్మణాచారాలు తెలుసు. యజ్ఞయాగాదులు చేసికొమ్ము. యుద్ధంచేయటం మానివేయుము. నావంటి వీరులతో సాహసించి పోరాటానికి యత్నించావో ఇంతకంటె కీడు నీకు కలుగుతుంది. ఇంటికి తొందరగా పొమ్ము. లేదా కృష్ణార్జును లున్నచోటుకు పొమ్ము- అప్పుడు నీవు చావవు. ప్రాణాలు రక్షించుకొమ్ము. నామాట నమ్ముము' అని అధిక్షేపిస్తూ, తాను కుంతికిచ్చిన వరాన్ని స్మరించి ధర్మారాజును వదలిపెట్టి, పాండవసైన్యాన్ని తురుమాడాడు. ధర్మరాజు తనవైపు వీరులను ప్రోత్సహించి కర్ణుడిపై తిరిగి యుద్ధం ప్రారంభించాడు. భీముడు పాండవసైన్యాన్ని ముందుకు నడుపుతూ తుములయుద్ధాన్ని సాగించాడు. 'కర్ణుడైనా చావాలి నేనైనా చావాలి' అంటూ భీముడు కర్ణుడి మీదకు దూసుకొనిపోయాడు. భీమపరాక్రమాన్ని శల్యుడు ప్రశంసించాడు. కర్ణుడు నిరసించి భీముడిపై పోరు సాగించాడు. ద్వంద్వయుద్ధం భీకరంగా సాగింది. భీముడు భయంకరమైన భల్లంతో కర్ణుడి వక్షఃస్థలంమీద కొట్టాడు. అతడు మూర్ఛపోయాడు. భీముడు ఆగ్రహంతో అతడి రథంమీదకు దూకి 'ఈ నీచుడి నాలుకను కోస్తా' నని విజృంభించాడు. శల్యుడు మధ్యలో కల్పించుకొని 'కర్ణుడు మూర్ఛపోయాడు. ఇప్పుడు అతడి నాలుకను కోస్తే చచ్చిపోతాడు. ఇతడిని చంపుతా'నని అర్జునుడు ప్రతిజ్ఞపట్టాడు. నీవు చంపితే అతడు విచారిస్తాడు' అని చెప్పి అతడిని వారించాడు. భీముడు వెనుకకు తగ్గి 'మామా! కర్ణు డిప్పుడు ధర్మరాజును బాధించినందుకు క్రోధావేశాన్ని పొంది ఆ సంగతి మరచాను. ఈ దురాత్ముడు ఆనాటి సభలో ద్రౌపదిని అసభ్యమైన మాటలతో అవమానపరిచిన సంగతి జ్ఞాపకం వచ్చి, ఆ మాటలన్న ఇతడి నాలుకను కోస్తే ధర్మరాజు సంతోషిస్తాడని ఈ పని చేయాలని అనుకొన్నాను. నీవు సరి అయిన సమయంలో ఈ సంగతి జ్ఞాపకం చేశావు. అభిమానధనుడైన అర్జునుడు కర్ణుడు నాచేత చచ్చాడని విని తానూ నిరుత్సాహంతో చనిపోవచ్చును. అతడితోపాటు కృష్ణధర్మజులు, వారితోడి వారలు కూడా ప్రాణాలను పరిత్యజించవచ్చును. ఆ కీడునుండి కాపాడావు. కాబట్టి నీ ఆజ్ఞను దాటను' అని భీముడు ఆగాడు. శల్యుడు సంతోషించి కర్ణుడి రథాన్ని తొలగించుకొనిపోయాడు. భీము డంతటితో ఆగక రోషావేశంతో శ్రుతవర్మాది కురుకుమారులను అనేకమందిని యుద్ధంలో భీకరంగా చంపాడు.

సంశప్తకులు అర్జునుడిని చుట్టుముట్టి శస్త్రాస్త్రాలతో పొడిచారు. సుశర్మ వేసిన తీవ్రబాణానికి అర్జునుడు రథంమీద మూర్ఛపోయాడు. వెంటనే తేరికొని వారిపై ప్రళయకాలరుద్రుడివలె విజృంభించి వారిని దైన్యపరిచాడు. ఉభయసైన్యంలోని మహావీరుల నడుమ ద్వంద్వయుద్ధాలు సాగాయి. కృపాచార్యుడు సుకేతు డనే పాంచాలకుమారుడిని చంపాడు. ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుడిని ఎదిరించి అతడి రథాన్ని విరుగగొట్టాడు. అశ్వత్థామ అర్జునుడిని ఎదుర్కొని భీకరయుద్ధం చేశాడు. మంచు తెరలను చించే సూర్యుడివలె అర్జునుడు అతడి విజృంభణాన్ని మాన్పాడు. దండధారుడనే రాజును చంపాడు. అశ్వత్థామ మలయధ్వజుడనే పాండ్యభూపాలుడిని వధించాడు. కర్ణ డంతలో తేరుకొని పాండవసైన్యంపై దాడిచేసి, వీరవిహారం సలిపి, అనేకులను చంపాడు, చతురంగబలాలను దైన్యపరిచాడు. దుర్యోధనుడు భీమసేనుడితో ద్వంద్వయుద్ధానికి పూనుకొన్నాడు. అశ్వత్థామ అర్జునుడిపై పోరు సాగించాడు. కర్ణుడు ధర్మరాజుపై విజృంభించి పలు బాణాలతో బాధించాడు. అతడు భీముడివద్దకుపోయి ఒదిగాడు. కర్ణుడు అతడిని వెంటాడి వేధించాడు. ధర్మజుడు ఎదుర్కొనలేక విచారంతో నిజశిబిరానికి తిరిగివెళ్ళాడు. అంతలో భీముడు దుర్యోధనుడిని చుట్టుముట్టి తుదముట్టించబోయాడు. శల్యుడి ప్రబోధంతో కర్ణుడు ధర్మరాజును వదలి దుర్యోధనుడికి సాయం వెళ్ళాడు.

ధర్మరాజు శిబిరంచేరి తన శరీరంలో నాటి ఉన్న బాణాలను పెరికించుకొని అవమానభారంతో హృదయం క్రుంగగా, విషాదంలో మునిగాడు. తనకు తోడుగా వచ్చిన నకుల సహదేవులను భీముడికి సాయంగా పంపాడు. ధర్మరాజు దైన్యం పొందిన సంగతి తెలియక అర్జునుడు అశ్వత్థామతో యుద్ధంచేస్తూ అతడి రథపు పగ్గాలను తెంచాడు. గుర్రాలు భయంతో రథాన్ని దూరంగా లాగికొని పోయాయి. శల్యుడి ప్రేరణతో కర్ణుడు పాండవ సైన్యం మీద భార్గవాస్త్రాన్ని ప్రయోగించి, వాటిని చీకాకుపెట్టి, సింహనాదం చేసి, పొగలేని మంటవలె మహోత్సాహంతో ప్రకాశించాడు.

అతడి విక్రమాతిశయాన్ని చూచి అతడిని ఎదిరించటానికి అర్జునుడు వెనుకాడాడు. అతడి నెదిరించి చచ్చి సాధించేది ఏమీ ఉండదని పేర్కొని కృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**'పట్టపగలింటి సూర్యుని పగిదిఁ గర్ణుఁ । డుగ్రమూర్తి యై వెలుఁగుచు నున్నవాఁడు**
**మనరథం బిప్డు మాధవ! మరలనిమ్ము । బ్రదికియుండిన శుభములు వడయవచ్చు'.** (కర్ణ. 3.18)

ఆ మాటలు విన్న కృష్ణుడు రణరంగంలో కర్ణుడిని ఎదిరించి పోరుతున్న భీమసేనుడిని చూపించాడు. ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి ద్రౌపదేయాది రథికులు సాయపడుతూ ఉండగా పాండవ సేనను ముందుకు నడుపుతున్న భీముడు అప్పటికి శత్రువులను ఆపటానికి సమర్థుడని చెప్పి, కర్ణుడు ఇతరులతో యుద్ధం చేసి అలసిపోవటం, అర్జునుడు దప్పిక తీర్చికొనటం అప్పటికి అవసరమని కృష్ణుడు భావించాడు. కర్ణుడి వైపు రథంపోనీయక ధర్మరాజున్న శిబిరంవైపు మళ్ళించాడు. భీముడికి ఆ సంగతి తెలియజేసి అర్జునుడు ధర్మరాజున్న శిబిరానికి చేరాడు.

## ధర్మజార్జునకృష్ణుల సంవాదం:

అర్జును డానాడు రణం ప్రారంభించే ముందు 'కర్ణుడిని వధించిగాని తిరిగి రా' నని ప్రతిజ్ఞ చేశాడు. ధర్మరాజుకు గలిగిన బడలికలను గురించి పరామర్శించటానికై అర్జునుడూ కృష్ణుడూ మధ్యాహ్నమే తిరిగిరావటం ఆయనకు ఆశ్చర్యానందాలు కలిగించాయి. కృష్ణార్జును లిరువురూ ధర్మరాజును కుశలప్రశ్నలతో పలకరించారు. అర్జునుడు యుద్ధంలో కర్ణుడిని చంపి వచ్చాడనే అభిప్రాయంతో అతడిని ధర్మరాజు అభినందించాడు. పరశురాముడి శిష్యుడైన కర్ణుడు మహావీరుడనీ, తలపూవు వాడకుండా అతడిని సంహరించగలగటం సంతోషకరమనీ అర్జునుడిని మెచ్చుకొన్నాడు. తనకు అంతకుముందే కర్ణుడివలన కలిగిన భంగపాటును తెలియచెప్పి, కర్ణుడు పాండవులకు చేసిన ఎగ్గులను పేర్కొని, కర్ణుడిని చంపిన విధానాన్ని వివరించుమని అర్జునుడిని ఆసక్తిగా అడిగాడు.

అర్జునుడు ఇట్లా చెప్పాడు. 'అగ్రజా! నేను సంశప్తకులతో సంకులసమరం సాగిస్తున్నప్పుడు అశ్వత్థామ నన్నెదుర్కొని బాణవర్షం కురిపించాడు. శ్రీకృష్ణుడిని బాణాలతో కప్పాడు. చాకచక్యంగా అతడి దాడిని తిప్పికొట్టి ముందుకు సాగాను. అంతలో మీరు కర్ణుడిచేత బాధితులయి రణరంగం వదలి వచ్చారని, శిబిరంలో ఉన్నారనీ భీమసేనుడివలన విన్నాను. మీ కుశలం తెలిసికొని తిరిగిపోయి కర్ణుడిని సంహరిద్దామని వచ్చాను.'

అర్జునుడి మాటలు విని ధర్మరాజు మండిపడ్డాడు. కర్ణు డింకా బ్రతికి ఉన్నాడన్న వార్త అతడికి ఉడుకెక్కించింది. కిరీటిని కినుకతో ఇట్లా అన్నాడు. 'యుద్ధంలో మరణించటం, మరలిపోవటం అనేవి రెండూ జరుగుతూనే ఉంటాయి. నే నిట్లా రణరంగాన్ని వదలి రావటంవలన మీ అందరికీ చులకనయ్యాను. అర్జునా! నేను కర్ణుడికి ఓడానన్నావు. నేనేకాదు, నీవూ ఓడావు, నకుల సహదేవులూ ఓడారు. మనతోకూడి ఉండటం వలన వాసుదేవుడూ ఓడాడు. కాబట్టి మన మింక యుద్ధానికి పోవలసిన పనిలేదు. వనాలకు పోయి తపస్వులమై ఉందాం; లేదా, వినయంతో కురురాజును సేవిద్దాం. కర్ణుడిని జయించలేనని ఆనాడే ద్వైతవనంలో చెప్పిఉంటే నే నీ యుద్ధప్రయత్నం చేసేవాడినే కాను. అశక్తుడు రాజ్యాన్ని కోరటం దోషం. కర్ణుడిని వధిస్తానని ప్రతిజ్ఞచేసి నన్ను ఇక్కడికి తెచ్చావు. నేను శత్రువుల నడుమ అవమానాలకు ఓర్చాను. నీ ప్రతిజ్ఞను ఈ వాసుదేవుడుకూడా విన్నాడు. అది వమ్మయింది. నీవు పుట్టిననాడు ఆకాశవాణీ, మహర్షులూ నిన్ను యుద్ధానికి వెనుదీయని వీరుడిగా, కురుసేనను గెలిచే యోధుడిగా కీర్తించారు. వాళ్ళమాటలు ఇప్పుడు అనుమానంలో పడ్డాయి. నీవు కర్ణుడికి భయపడతావని తెలిస్తే దుర్యోధనుడితో పగ పెట్టుకొనేవాడినే కాను. దుర్యోధనాదులు చూస్తూ ఉండగా కర్ణుడు నన్ను యుద్ధంలో అవమానాల పాలు చేశాడు. నన్ను ఆపదనుండి కాపాడినవాడు భీముడు. అత డొక్కడే ప్రాణాలను లెక్కచేయకుడా పరబలాలు బడలుపడేటట్లు పోరుతున్నాడు. ఈ రోజున అభిమన్యుడుగాని, ఘటోత్కచుడుగాని ఉన్నట్లయితే నా స్థితి ఇట్లా ఉండేదేనా?

**"హరి గలుగంగ నేటికి భయంబున వచ్చితి? నీదు గాండివం**
**బెరవుగ నిచ్చి నీవు నొగలెక్కి హరిన్ రథిఁ జేయఁ గన్న ని**
**ష్ఠుర భుజవిక్రమోగ్రుఁ డగు సూతతనూభవుఁ, దత్సహాయులం**
**బొరిగొనఁడే సుయోధనుని పోఁడిమి దూలఁగ నొక్కమాత్రలోన్'** (కర్ణ. 3.65)

కుంతీమహాదేవి కడుపున కొడుకువై పుట్టకుండా, పిండంగానే ఏదో గండానికి గురి అయి ఉండవలసింది. ఇప్పుడు ఇంత పుట్టేది కాదు.'

ధర్మరాజు మాటలకు ధనంజయుడు మండిపడ్డాడు. కత్తి పైకెత్తి ధర్మజుడిపై లంఘించాడు. కృష్ణుడు అడ్డుపడి, 'పార్థా! మనం కౌరవులమీద దాడిచేయటం లేదు. ధర్మరాజును పరామర్శిస్తున్నాం. ఇది సంతోషకాలం గాని క్రోధసమయం కాదు. అన్నగారిని వధించరాదు' - అని హెచ్చరించాడు. 'కృష్ణా! నా గాండీవాన్ని ఇతరులచేతి కిమ్మని అన్నవాడి తల పగులగొడుతా నని నేను ప్రతిజ్ఞ చేశాను. మా అన్న ధర్మాత్ముడైనా నా మాటను నేను నిలువబెట్టుకొంటాను. దీనికి నీ వేమి చెప్పుతావో చెప్పుము. సకల ధర్మసాకల్యవేదివి. నీవు చెప్పినట్లు నేను చేస్తాను' అని అర్జునుడు అన్నాడు.

'లోకంలో సత్యాహింసలు ఉత్తమధర్మయుగళం. అందులో సత్యాన్ని అహింసతో రక్షించటం ధర్మం. అహింసను అసత్యంతోనైనా రక్షించటం న్యాయమని పండితు లంటారు. సత్యరక్షణం కొరకు సోదరుడూ, ధర్మపరుడూ అయిన ధర్మరాజును చంపటం ధర్మపథం కాదు. ప్రాణహాని ఏర్పడినప్పుడు గాని, సర్వధనాపహరణ సమయంలో గాని చెప్పే సత్యం అసత్యంగా, అసత్యం సత్యంగా ఆర్యులు గ్రహిస్తారు. ఇప్పుడు ధర్మసూక్ష్మాన్ని పాటించాలి. పెద్దలను దూషించటం వారిని చంపటం వంటిదే. అందువలన నీ ప్రతిన తీరేటట్లుగా ధర్మరాజును వధించకుండా, నోరార నిందించుము. ఆ మీద

గురునిందాపాపం పోయేటట్లు మీ అన్నకు నమస్కరించి కీర్తించుము' - అని సూచించాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు గోవిందుడి హితవును పాటించాడు.

అన్నను దూషించి అర్జునుడు తనను తాను చంపుకొనటానికి కత్తి ఎత్తుకొన్నాడు. 'అదేమి?' టని శ్రీకృష్ణు డడిగాడు. 'అంతటి పుణ్యాత్ముడిని, అగ్రజుడిని అనరాని మాటలని ప్రాణాలతో బ్రతికి ఉన్నదానికంటె ఆత్మహత్య ఉత్తమమని భావించా' నని అర్జునుడు బదులు చెప్పాడు. శ్రీకృష్ణుడు దానికీ ఒక ఉపాయాంతరం సూచించాడు. ఆత్మస్తుతి చేసికొంటే ఆత్మహత్యాఫలం అబ్బుతుందని చెప్పాడు. శ్రీకృష్ణుడు చూపిన ధర్మసూక్ష్మాన్ని పాటించి ఆపద్బాంధవుడిగా అతడిని అన్నదమ్ములు అర్చించారు.

ధర్మజుడి దీవెనల నందుకొని శ్రీకృష్ణుడు నొగలెక్కాడు, అర్జునుడు రథమెక్కాడు. కర్ణుడివధప్రకారాన్ని భావించే గాండీవికి చెమటలు పట్టాయి. శ్రీకృష్ణు డది గమనించి అర్జునుడితో ఆత్మస్థైర్యాన్నీ, కర్ణుడిపై క్రోధాన్నీ, యుద్ధోత్సాహాన్నీ కలిగించే మాటలు పలికాడు. 'దేవతలకే జయింపరాని మహావీరులను నీవు అవలీలగా రణంలో ఓడించగలిగావు. నీ ధనుర్వేదకౌశలం భూతలంమీద ప్రకాశించేటట్లుగా గాండీవాన్ని పట్టి నీ గర్వాన్ని ప్రకటించుము. అలనాడు నిండుసభలో ద్రౌపదిని చూచి 'లేరిచట నీకు మగలును' అని కారుకూత లరచిన కర్ణుడికి బాణాలతో బదులు చెప్పే సమయం వచ్చింది. నేను సంధికి పోయినప్పుడు నన్ను పట్టటానికి పురికొల్పింది కర్ణుడే. నీ ముద్దులకొడుకు అభిమన్యుడు అసామాన్య వీరుడుగా పోరుతున్నప్పుడు వంచనతో వెనుకనుండి విల్లును విరుగగొట్టి అతడి వధకు అంకురారోపణం చేసిన నిర్దయుడు, కపటి ఈ కర్ణుడే. అతడు మీపట్ల చేసిన అన్యాయాలకు అతడిని చంపి గ్రద్దలకు వేసినా పాపం లేదు. విజృంభించుము. కర్ణుడిని నిర్దాక్షిణ్యంగా వధించుము' అని ప్రోత్సహించాడు శ్రీకృష్ణుడు. అర్జునుడు ఉత్సాహంతో -

**' నీ తోడ్పాటున నేఁ, ద్రివిష్టపములన్ గెల్వంగ నూఁకింతు; నా**
**చేతం గర్ణుఁడు రూపుమాలి చను; మెచ్చింతున్ నినుం; జూడుమీ**
**దైతేయాంతక!' యంచు శేషనిభ హస్తం బుద్ధతిం జూచి ని**
**ర్ధూతారాతిబలుండు పుచ్చికొనియెన్ దుర్దాంత కోదండమున్'** (కర్ణ. 3.130)

కృష్ణార్జునులు యుద్ధభూమికి తిరిగి వచ్చే సమయాన పోరు ఘోరంగా సాగుతున్నది. భీముడు కౌరవసైన్యాన్ని నిలువరించి బలప్రదర్శనం చేస్తున్నాడు. శ్రీకృష్ణార్జునులు యుద్ధరంగ పునఃప్రవేశం చేయటం అతడికి అమితోత్సాహం కలిగించింది. శకుని భీముడిపై దాడి చేయగా తలపడి అతడిని రథంమీద మూర్ఛపడేటట్లు చేశాడు. అప్పుడు కర్ణుడు విజృంభించి అనేకమంది వీరులను ఒక్కడే ఎదుర్కొని చిక్కుపడ చేశాడు. అందరికీ ఆశ్చర్యం కలిగించాడు. అర్జునుడు కర్ణుడి రథాన్ని చూచి క్రోధావేశంతో సైన్యాన్ని ఒక వైపునుండి సంహరించటం ప్రారంభించాడు. రణరంగంలో రక్తం ఏరులుగా పారింది. ఆ తరుణంలో పదిమంది కురుకుమారులు అర్జునుడిని అడ్డుకొన్నారు. వారిని పార్థుడు అవలీలగా చంపివేశాడు.

**దుశ్శాసన వధ:**

ఆ సందర్భంలోనే మరొక భీషణసుందరఘట్టం సంభవించింది. అది దుశ్శాసన భీమసేనుల ద్వంద్వయుద్ధం. మదించిన ఏనుగులవలె ఇద్దరూ తలపడ్డారు. భీముడు రౌద్రావేశంతో ఇట్లా పలికాడు.

**' ఆ సభలోనఁ గొన్న ఋణమంతము నీఁగఁగఁగంటి వడ్డితో;**
**బాస కొకింతయుం దొలఁగఁబాఱకు తీర్చెద నిప్డు; నేఁడు నా**

**చేసిన పుణ్య మెవ్వరును జేయరు ని న్నిటు సేరఁ దెచ్చుటం**
**జేసి విధాత నాకుఁ గృపసేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా!'** (కర్ణ. 3.195)

ఈ భీషణవాక్యాలు విని దుశ్శాసనుడు కూడ పాండవ పరాక్రమాన్ని పరిహసిస్తూ పలికాడు. 'భీమా! లక్కయింట చిచ్చుపెట్టి మీకు కల్పించిన కష్టాలను నేను మరచిపోలేదు. ధర్మరాజు శకునితో జూదమాడినప్పుడు రాజ్యలక్ష్మిని గ్రహించి మిమ్ములను కానకు పంపాము. అరణ్యవాసంలో మిమ్ములను అగచాట్లపాలు చేశాము. అజ్ఞాతవాసంలో మీరు సేవకవృత్తిలో పొందిన దైన్యాన్ని ఇంకా మరవలేదు. యుద్ధానికి వచ్చి ఎందు కీ బీరాలు?' అని నవ్వాడు. భీము డాతడి మాటలకు మండిపడ్డాడు. ఇద్దరూ బాణాలతో ఆయుధాలతో పోరు తీవ్రంగా చేసికొని విరథులయ్యారు. భీముడు దుశ్శాసనుడిని నేలమీద పడవేశాడు. పదమూడేళ్ళు తాము పొందిన పాట్లను స్మరించాడు. తాను చేసిన ప్రతిజ్ఞను జ్ఞాపకం తెచ్చుకొన్నాడు. పగనంతా మనసులో మండనిచ్చాడు. పెనుగదను పైకెత్తి దుశ్శాసనుడిని చావమోదాడు. నెత్తురు ధారలు కారగా దుశ్శాసనుడు నేలపై కూలాడు. లేడిపిల్లమీదకు పెద్దపులి ఉరికి పొదివి చంపే విధంగా పైబడి మెడ చిక్కబట్టి, నొక్కికసితో ఇట్లా అన్నాడు: 'మునుపు ఆ సభలో నీవన్న మాటలకు తృప్తిలేక ఇక్కడికి నిన్ను వెదకుకొంటూ వచ్చాను. ఇప్పు డేమంటావో అనరా! నీ మాటలు వినాలని నాకోపం ఉవ్విళ్ళూరుతున్నది' - అంటూ వెక్కసమాడాడు. మదేభం తుండంతో ఎత్తినట్లుగా భీముడు దుశ్శాసనుడిని చేతితో నింగికి ఎత్తాడు. గిరగిర త్రిప్పాడు. నేలమీద పడవేశాడు. ముంగాలితో త్రోశాడు. మొగంమీద మొత్తాడు. భయంకరంగా చూచాడు. మీదపడి మోకాళ్ళతో కూర్చున్నాడు. మెడను చిక్కత్రొక్కి నిల్చాడు. నవ్వాడు. ఈ విధంగా రౌద్రక్రీడలు చేసి దుశ్శాసనుడి మొగం చూచి 'నేను నీ వక్షఃస్థలాన్ని పగులగొట్టి నెత్తురును తేనెవలె త్రాగుతాను. నన్ను సమీపించి మాన్పగలిగిన మొనగాడు ఈ రణరంగంలో ఎవడైనా నీకు దిక్కుంటే వాడిని ఎలుగెత్తి పిలుచుకొనుము' - అని వెటకారంగా పలికి, కత్తి తీసి అతడి మొగంమీద జళిపించి, నృసింహస్వామి హిరణ్యకశిపుడి వక్షాన్ని చీల్చినట్లు భీముడు దుశ్శాసనుడి కడుపును చీల్చి, ప్రేగులను పైకి లాగి, నెత్తురు త్రావి బీభత్సంగా బాధించాడు. కసితో అతడి కుత్తుకను నొక్కిపట్టి, కాలిని చేతితో పట్టి

**'ఏమిర! పసులని యార్వవు? । నీ మాటలు నిలువఁబడియెనే? పసరమ! మి**
**మ్మేము మగుడ నిదె యార్చెద; । మీ మాటకు మాఱు పల్క రెవ్వరుఁ గంటే!'** (కర్ణ. 3.221)

'నన్ను తాళ్ళతో కట్టి నీళ్ళలో త్రోయటం, అన్నంలో విషం కలిపి పెట్టటం, పెనుబాముల కోరలతో కరిపించటం, పెద్దలు చూస్తూ ఉండగా నిండుసభలో ద్రౌపదిని అనరానివిధంగా నిందించటం - ఇవన్నీ సహించి ఊరుకొనేవేనా? జూదంలో ఓడటం లోకంలో లేదా? ఇంత అన్యాయమా?' అని పలికి చేతిలో గద మెరయగా సైనికుల వైపు చూపి బెదిరించాడు. ఉభయపక్షాల సైనికులు దూరంగా పరుగెత్తి భయంతో నిశ్చేష్టులై నిలిచారు. అప్పుడు భీముడు దుశ్శాసనుడిని చూచి ఇట్లా అన్నాడు:

**'ప్రై వడి పోయెఁ గాన ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి? యా సభం**
**దా వలదన్నఁ గీ డుడుగదా? పతిలేఁ డనఁ బడ్డకాంత నేఁ**
**డీవు గనుంగొనంగఁ బతి యేడ్తెఱ నొప్పెఁ? బతుల్ విజృంభిత**
**శ్రీ విలసిల్లు కామినులు సేడ్పడి రి ట్లపతిత్వదీనతన్'.** (కర్ణ. 3.224)

'వినుము! నేను చేసిన ప్రతిజ్ఞలలో ఒకటి తీరింది: పాపాత్ముడైన దుర్యోధనుడిని చంపి వాడి తలను కాలితో తన్నుతాను. ఆ రెండవ ప్రతిజ్ఞ తీర్చటానికి ఇక ముందుకు సాగుతాను' అని ఎలుగెత్తి ప్రకటించి, దుశ్శాసనుడిని తుదముట్టించి అరిభయంకరుడై నిలిచాడు. అతడిపై దాడివెడలిన పదిమంది కురుకుమారులను అర్జునుడు మట్టుపెట్టాడు.

శల్యు డా సన్నివేశాన్ని చూపి కర్ణుడిని హెచ్చరించాడు. కర్ణుడి కొడుకైన వృషసేనుడు భీముడిపై విజృంభించగా అర్జునుడు ఆతడిని చంపాడు. కర్ణార్జునులు ఎదురయ్యే తరుణం ఆసన్నమయింది. ఆకసంలో దేవగణం వారి ద్వంద్వయుద్ధాన్ని చూడాలని కుతూహలంతో వేచి ఉన్నది. బ్రహ్మరుద్రేంద్రుల నడుమ వారి విజయావకాశాలను గురించి చర్చకూడా నడిచింది. వారందరు విజయుడి విజయాన్నే నిశ్చయించారు.

అప్పుడు కర్ణశల్యులూ, కృష్ణార్జునులూ ఇట్లా సంభాషించుకొన్నారు -

కర్ణుడు : 'అర్జునుడు నన్ను గెలిస్తే ఏమి చేస్తావు? చెప్పుము.

శల్యుడు : 'నేను కృష్ణార్జునులను తీవ్రబాణాలతో ఓడించి ఒంటరి గెలుపు గెలుస్తాను.'

అర్జునుడు : 'కర్ణుడు నన్ను గెలిస్తే ఏమవుతుంది?'

కృష్ణుడు : (నవ్వుతూ) సూర్యుడు నేలరాలినా, నేల ముక్కలైనా, మేరుపర్వతం ఒరిగినా, కర్ణుడి చేతిలో నీవు ఓడిపోవటం జరుగదు. ఒకవేళ అట్టి దురవస్థే కలిగితే ప్రళయమే వస్తుంది. నేను విజృంభించి కర్ణశల్యులనే కీటకాలను చేతితో నలిపివేస్తాను. కౌరవులనందరిని మట్టికరిపిస్తాను. ధర్మరాజుకు పట్టం కట్టిస్తాను!

అర్జునుడు : నేను నవ్వుల కన్నాను గాని వారిని చంపటం నాకు శక్తికి మించిన పనికాదు. నిండుకొలువులో ద్రౌపది పడ్డ పాట్లను సహించి అరణ్యాజ్ఞాతవాసవ్రతనిష్ఠతో ఇట్లా ఓర్చి ఉన్నాను. ఇక త్రిమూర్తులు కలిసి ఎదుర్కొన్నా కర్ణుడిని చంపితీరుతాను.' దుర్యోధనుడు దుఃఖంతో చూస్తూ ఉండగా కర్ణుడి తలను త్రుంచుతాను. కర్ణశల్యుల భార్యలను విధవలను చేస్తాను. నీవు సంతోషంతో ఈ వార్తను వినిపించి ద్రౌపదికీ, ధర్మరాజుకూ శ్రవణానందం కలిగించుము. ఏనుగు చెట్టును కూల్చినట్లు నేను కర్ణుడిని చంపిన ఉదంతాన్ని కన్నులకు కట్టేటట్లు చెప్పి కుంతికి వార్త పంపుము.'

ఇక కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం ప్రవర్తిల్లబోతున్నది. దివ్యసమూహాలు ఆకసంలో నిలిచి గీతనృత్యవాద్యాలను మ్రోగిస్తూ ఉంటే ఉభయసైనికులు కూడా అనిమిషులైనట్లు కన్నార్పకుండా చూడటం ప్రారంభించారు. కర్ణార్జునులు కల్పాంతసూర్యుల విధంగా వెలుగొందుతూ పరస్పర విజయార్థులై పరాక్రమించనున్నారు. అప్పుడు అశ్వత్థామ దుర్యోధనుడి వద్దకుపోయి హితవు చెప్పాడు. భీష్మద్రోణులవలెనే అర్జునుడిచేత కర్ణుడు వధించబడకపూర్వమే ధర్మరాజుతో సంధి చేసికొని శాంతిని పొందుమని బోధించాడు. ధర్మరాజు ప్రసన్నుడైతే శ్రీకృష్ణభీమార్జునాదులందరూ అతడి అభిప్రాయాన్ని సమర్థిస్తారనీ, పగలు వగలు ఉపశమించి అందరు సుఖిస్తారనీ అనునయించి చెప్పాడు. కాని, కర్ణవిజయం మీద నమ్మకమున్న దుర్యోధనుడు ఆతడి మాటలను మన్నించలేదు. దుశ్శాసనుడిని చంపి భీముడు చేసిన ప్రతిజ్ఞ వినిన తరువాత కూడా సంధి చేయటానికి మనసొప్పుతుందా? అని తిరిగి ప్రశ్నించాడు. యుద్ధోత్సాహాన్ని ప్రకటించి సేనలను పురికొల్పాడు.

## కర్ణ సంహారం:

కర్ణార్జునులు కరి కరి తాకినట్లు, గిరి గిరి ఢీకొన్నట్లు, మేఘం మేఘం ఒరిపిడి పొందినట్లు, ఢీకొని భూనభోంతరాళాలు దద్దరిల్లేటట్లు యుద్ధం ప్రారంభించారు. ఒకరిమీద ఒకరు దివ్యాస్త్రాలను ప్రయోగించుకొని తమ ధనుర్విద్యాపాండిత్యాన్ని చాటుకొన్నారు. దుర్యోధనుడు తన యోధులను అర్జునుడిమీద దొమ్మియుద్ధం చేయటానికి పురికొల్పాడు. బీభత్సుడు పిడుగులు పడ్డట్లు యుద్ధం చేస్తున్నాడు. అతడిమీద ప్రయోగించాలని పూజలో పోషించుకొన్న సర్పముఖాస్త్రాన్ని అర్జునుడి కంఠానికి గురిచూచి కర్ణుడు ప్రయోగించి 'ఫల్గునా! చచ్చా వీ దెబ్బతో' అని అరిచాడు. శ్రీకృష్ణుడు ప్రమాదాన్ని గుర్తించి అర్జునుడి రథాన్ని అయిదంగుళాలు క్రుంగేటట్లు బొటనవ్రేలుతో అదిమాడు. సర్పముఖాస్త్రం అర్జునుడి కంఠానికి బదులు కిరీటాన్ని తన్నుకొనిపోయింది. పార్థుడి ప్రాణాలు రక్షించబడ్డాయి. ఖాండవదహనంలో అర్జునుడివలన మంటలకు గురి

అయిన పాము కసిపట్టి తపస్సు చేసి సర్పముఖాస్త్రంగా కర్ణుడివద్దకు చేరి అర్జునవధ కొరకు అదను చూస్తున్నది. కాని, ఆనాడు లక్ష్యం సాధించలేకపోయింది. తిరిగి కర్ణుడి వద్దకు పోయి మరలా తనను ప్రయోగించుమని కోరింది. వీరుడు అస్త్రాన్ని ఒకసారే ప్రయోగిస్తాడని చెప్పి కర్ణుడు పునఃప్రయోగాన్ని తిరస్కరించాడు. ఆ తరువాత కర్ణార్జునుల శస్త్రాస్త్రప్రయోగం అపూర్వంగా సాగింది. యుద్ధంలో కర్ణుడిశరీరానికి బాగా గాయాలు అయ్యాయి. కృష్ణార్జునులకు బాగా దెబ్బలు తగిలాయి. గైరికా ధాతువులు కలిసిన ఎర్రనినీళ్ళతో నిండిన సెలయేళ్ళతో చెలువొందే పర్వతంవలె కారే రక్తధారలతో కర్ణుడు కనబడ్డాడు.

అంతలో కాలుడు అదృశ్యాకారంతో, అందరూ వినేటట్లు ఇట్లా ప్రకటించాడు. 'బ్రాహ్మణశాపంవలన కర్ణుడి రథచక్రం నేలలో క్రుంగుతుంది. అతడు అసువులను కోల్పోతాడు.' ఆ సమయంలో పరశురామదత్తమైన భార్గవాస్త్రం కర్ణుడికి స్ఫురించలేదు. అతడు క్రుద్ధుడై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. అర్జునుడు ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించినా అది చాలలేదు. కవ్వడికూడా బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించి కర్ణుడి బ్రహ్మాస్త్రాన్ని ఉపశమింపజేశాడు.

కర్ణుడి రథచక్రం నేలలో క్రుంగింది. కర్ణుడు కలత చెందాడు కాని, సాహసించాడు. ఒక చేతితో చక్రాన్ని ఎత్తుతూనే మరొకచేతితో యుద్ధం సాగించాడు. అర్జునుడు అతడిపై వాడి వాడి బాణాలు వేశాడు. 'రథచక్రం క్రుంగింది. దానిని ఎత్తేంతవరకు బాణాలు వేయకుము. నేను భూమిమీద ఉన్నాను. నీవు రథంమీద ఉన్నావు. నామీద బాణాలు వేయటం వీరధర్మం కాదు' అని కర్ణుడు అర్జునుడితో ధర్మపన్నాలు పలికాడు. దానికి శ్రీకృష్ణుడు స్పందించి ఇట్లా అన్నాడు. 'కర్ణా! ధర్మాలూ, నీతులూ నీకు ఈనాడు జ్ఞాపకం వచ్చాయా? కుంతీదేవీ, పాండవులూ నిద్రపోతూ ఉన్నప్పుడు అర్ధరాత్రి లక్కయింటిని కాల్పించినప్పుడూ, కపటద్యూతం కల్పించి ధర్మాత్ముడైన ధర్మరాజు సంపదను మాయోపాయంతో అపహరించినప్పుడూ, అంతటితో ఆగక ద్రౌపదిని నిండుసభకు రప్పించి అనరానిమాట లని అవమానపరచినప్పుడూ, పాండవులను చంపటానికి వ్యూహం పన్ని ఘోషయాత్ర నెపంతో దాడి చేసినప్పుడూ, బాలుడైన అభిమన్యుడిని ఒంటరివాడిని చేసి అనేకరథికులను ఒక్కసారిగా అతడిపై ఉసికొలిపి మీ దుర్యోధనుడు అన్యాయంగా చంపించినప్పుడూ-ఆ పాపాలకన్నిటికీ ఆదికర్తవు నీవే. అప్పుడంతా ఈ నీతి ఎక్కడికిపోయింది?' అని కృష్ణుడు నిలదీసి అడుగుతూ ఉంటే కర్ణుడిలోని రోషాగ్ని రోమకూపాల్లో నుండి జ్వాలాతోరణంవలె వెలువడి అందరినీ ఆశ్చర్యచకితులను చేసింది. కర్ణుడు కోపంతో తీవ్రబాణాలను అర్జునుడిపై సంధించాడు. పోరు ఘోరంగా సాగింది. అప్పుడు శ్రీకృష్ణప్రేరితుడైన అర్జునుడు కర్ణుడిని సంహరించే సంకల్పంతో క్రూరమైన ఒక మహాస్త్రాన్ని గాండీవానికి సంధించాడు. 'నేను తపస్సులో, దానంలో, గురుజనసేవలో నిత్యవ్రతశీలుడనైతే ఈ బాణం కర్ణుడి శిరస్సును త్రెంచుగాక!' అని అంటూ వదిలాడు. ఆ బాణం ఆకాశంలో కాంతులు నింపుతూ ఉభయసేనలు మూర్ఛలో మునిగేటట్లు ప్రకాశించి మహానాదం చేస్తూ కర్ణుడి శిరస్సును ఖండించింది. తూడును వీడిన కమలంవలె కర్ణుడి శిరస్సు తెగిపడినా శరీరం తేజస్సుతో వెలుగొందింది. క్రుంగిన రథచక్రం మరల నేలమీద మామూలుగా నిలిచింది. కర్ణుడి శరీరంలోనుండి ఒక వెలుగు వెలువడి సూర్యబింబంలో కలిసింది. కర్ణుడిశరీరం నేలమీద వాలింది. బలిసిన ఆబోతును పులి చంపినట్లు కర్ణుడిని అర్జునుడు చంపగా కౌరవసేనలు భయపడి పారిపోయాయి. ప్రాణం కోల్పోయి పడి ఉన్న కొడుకును కిరణాలనే చేతులతో తాకటం వలన ఏర్పడిన మైలను పోగొట్టుకొనటానికి పావనస్నానం చేయటానికి పోతున్నాడా అన్నట్లు సూర్యుడు పశ్చిమసముద్రంలో మునిగాడు. టెక్కెం విరిగి బోసిపోయిన రథాన్ని తోలుకొని శల్యుడు తిరిగి వెళ్ళాడు. ఈ సన్నివేశాలను గమనించిన భీమసేనుడు ఆకాశం బ్రద్దలయ్యేటట్లు విజయోత్సాహంతో పెద్దగా అరిచాడు. ఆ విజయధ్వనికి పాండవసేనలు ఉప్పొంగాయి, కౌరవసేనలు దుఃఖించాయి.

శల్యుడు దుర్యోధనుడి వద్దకు వెళ్ళాడు. అతడు కంటతడి పెట్టుతున్నాడు. బిక్కమొగంతో నిట్టూర్పులు నిగుడిస్తున్నాడు. అతడితో శల్యుడిట్లా అన్నాడు: 'ప్రభూ! మనం ఎన్నో యుద్ధాలు చూచాము. కాని, క్రౌర్యంలో కర్ణార్జునుల యుద్ధంవంటి దానిని మనం ఎన్నడూ చూడలేదు. దేవతలు కూడా ఆ యుద్ధాన్ని చూచి ఆశ్చర్యపోయారు. కర్ణుడి విక్రమానికి కృష్ణార్జునులే భయపడ్డారు. నీవు రాజ్యాన్ని చిరకాలం పాలించాలని కర్ణుడితోపాటు ఎందరో మహావీరులు దేహప్రాణాలను త్యాగం చేసి రణరంగంలో పడిపోయారు. వారందరూ ఇంద్ర యమ వరుణ కుబేరులవంటి వారు. కాని వారందరి శౌర్యబాహువీర్యాలు

విఫలాలైపోయాయి. ఇది విధివిలాసం. దీనికి దుఃఖించి ప్రయోజనం లేదు' - అంటూ రక్తసిక్తమైన రణరంగాన్ని దుర్యోధనుడికి చూపించాడు.

అంతలో కృష్ణార్జునులు పాంచజన్యదేవదత్తాలను పూరించారు. ఆ భయంకర నాదానికి భయపడి కౌరవసేనలు దుర్యోధను డున్నచోటును విడిచి పరుగులు తీశాయి. శల్యుడు సంధ్యాసమయం అయింది కాబట్టి యుద్ధవిరమణ చేయుమనీ, భావికర్తవ్యాన్ని తెల్లవారిన తరువాత నిర్ణయించుకొనవచ్చుననీ సూచించాడు. అప్పుడు కృపాశ్వత్థామ కృతవర్మ శకుని సుశర్మ ప్రభృతులు రారాజు వద్దకు వచ్చి విషణ్ణులై నిలిచారు. దుర్యోధనుడు పారిపోతున్న సేనలను ప్రోత్సహించలేక, వీరులు ఉత్సాహాన్ని కోల్పోవటంచేత, శల్యుడి మాటలు సముచితంగా ఉండటంచేత, కర్ణుడిపేరు చెప్పుతూ ఎలుగెత్తి 'ఓ కర్ణా! ఓ కర్ణా!' అని విలపిస్తూ ఆనాటి యుద్ధం చాలించండని పలికాడు. కౌరవవీరులు తన వెంటరాగా శిబిరానికి తిరిగివెళ్ళాడు. ఆ వెళ్ళటం ఎట్లా ఉన్నదంటే - అలనాడు కపటద్యూతంలో ఓడి పాండవులు హస్తినాపురం వెడలి అడవికి పోయే సన్నివేశాన్ని తలపునకు తెప్పించింది.

కృష్ణార్జునులు మెరుగుటమ్ములు శరీరాలలో ప్రకాశించగా కిరణాలతో వెలుగొందే చంద్రసూర్యులవలె ప్రకాశించారు. ఆ అమ్ములను పెరికివైచికొని యుద్ధవిరామాన్ని ప్రకటించారు. భీమాదు లుప్పొంగిపోయారు. దేవతలు నరనారాయణులను ప్రశంసించారు. కృష్ణార్జునులు రథాన్ని ధర్మరాజు శిబిరం వద్దకు నడిపించి, దానిని దిగి అతడికి నమస్కరించారు. భీమాదులు వారి ననుసరించారు. ధర్మరాజు వారిని మనసారా అభినందించాడు. అప్పుడు కృష్ణ డిట్లా అన్నాడు:

కృష్ణుడు : ధర్మరాజా! లోకాలన్నీ కలిసి ఏకమై వచ్చినా కర్ణుడిని సంహరించటం సాధ్యంకాదు. అటువంటివాడు నీ కోపాగ్ని ప్రభావంతోనే దహించబడ్డాడు. ఈ మాట నిజం. కర్ణుడు కూలటంతో కౌరవబలమంతా కుప్పగూలినట్లే అని భావించుము. కౌరవులతో ఇక వైరం లేనట్లే. నీకింక ఎదురులేదు. సంతోషించుము.

ధర్మరాజు : శ్రీకృష్ణా! నీ కటాక్షం ఉంటే మాకందరికీ శుభం కలుగుతుంది. నీ ప్రేమకు పాత్రుడనైన నాకు శత్రువులపై విజయం సాధించటం కష్టమా? నీ ప్రసాదంతో జీవనం గడిపేవారం మేము. మాకు సంపదలు నీవే ప్రసాదిస్తావు. ఇది మా గట్టి నమ్మకం. అఖిలలోకరక్షకుడవైన నీవు భక్తులమైన మమ్ములను రక్షించటం మా అదృష్టం. నీ దయవలన భయాన్నీ, దుఃఖాన్నీ మాని ఈనాడు కంటినిండా నిద్రపోతాను.

కృష్ణుడు : ధర్మజా! నన్ను అభిమానించేవాడివి కాబట్టి ఈ ప్రియోక్తులు పలికావు. కాని, నేను ఈ విజయానికి నిమిత్తమాత్రుడనే. నీ తమ్ములూ, మరదులూ మహాపరాక్రమవంతులు. ఇందరి సహాయం ఉన్న నిన్ను ఎదుర్కొని ఎవడైనా చావకుండా బ్రతుకగలడా?

వారిరువురి మధ్య ఇటువంటి మధుర సల్లాపాలు సాగాయి. ఆ తరువాత ధర్మరాజు యుద్ధభూమిని చూచే కోర్కెను వెలిబుచ్చి కృష్ణుడి అనుమతి పొందాడు. రథారూఢుడై కరదీపికాసహస్రంతో బంధుమిత్ర సోదరులతో కూడి బయలుదేరాడు. కృష్ణుడిని చూచి 'ఈనాడు సమస్త ధరణీ సామ్రాజ్యానికి ప్రభువు నయ్యాను. నీ దయతో ప్రబల శత్రువులు నశించారు, ఈ అభ్యుదయం నాకు లభించింది' అని కృతజ్ఞతలు తెలిపాడు. అర్జునుడిని అభినందించాడు. సంతోషంతో పొలికలనికి పోయాడు. కర్ణుడి శిరస్సును, అతడి కొడుకుల శవాలను చూచాడు. తాను పునర్జన్మ ఎత్తినంతగా భావించాడు. ఆపదలు తొలగాయని, సంపదలు కూడాయని సంతసించి శిబిరానికి తిరిగి వచ్చాడు. ఈ విధంగా పాండవులు కర్ణసాగరాన్ని తుదముట్ట నీది పరమానందాన్ని పొందారు.

**జి.వి. సుబ్రహ్మణ్యం**
ప్రధాన సంపాదకుడు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము

# విషయసూచిక



## ప్రథమాశ్వాసము

# ద్వితీయాశ్వాసము

# తృతీయాశ్వాసము





శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము - ప్రథమాశ్వాసము

**శ్రీ పరిణామస్థితి వి । ద్యాపారీణత్వ కారితా నిరతా పాం**
**గా, పరమనైష్ఠికత్వ । వ్యాపారపరానుషక్త, హరిహరనాథా !** 1

**ప్రతిపదార్థం:** శ్రీ= ఐశ్వర్యం యొక్క; పరిణామ స్థితి= ఆనంద స్థితిని; విద్యా= జ్ఞానమునందు; పారీణత్వ= పరిపూర్ణత్వాన్ని; కారితా= కలుగ చేయటంలో; నిరత= మిక్కిలి ఆసక్తి కల; అపాంగా= కడగంటి చూపుకలవాడా!; పరమ= పరమాత్మయందు; నైష్ఠికత్వ= స్థిరమైన శ్రద్ధ కలిగి ఉండటం అనే; వ్యాపారపర= పనిలో మునిగి ఉన్నవారియందు; అనుషక్త= అనురాగము కలవాడా!; హరి, హర, నాథా= విష్ణుమూర్తివి, శివుడవు అయిన స్వామీ!

**తాత్పర్యం:** ఐశ్వర్యం ఇచ్చే ఆనందస్థితిని, పరిపూర్ణ జ్ఞానస్థితిని ప్రసాదించటంలో ఆసక్తి కల కడగంటి చూపుకలవాడా! పరమాత్మయందు స్థిరంగా చిత్తాన్ని నిలుపటం అనే పనిలో నిమగ్నులైన వారియందు అనురాగం కలవాడా!; హరిహరనాథా!

**విశేషం:** శ్రుతి స్మృతి పురాణ విజ్ఞానవేత్త తిక్కన సోమయాజి ఈ పద్యంలో తన స్మృతి విజ్ఞానం ప్రదర్శిస్తున్నాడు. భగవద్గీతలో: **"ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీస్సమాః । శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥ అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్." -6 - 40; 41** యోగభ్రష్టుడు అశ్వమేధాదియాగాలు చేసినవారి లోకాలకు వెళ్ళి, అక్కడ చాలా సంవత్సరాలున్న తరువాత విహిత ధర్మానుష్ఠాన పరులయిన సంపన్నుల ఇళ్ళలో జన్మిస్తాడు. లేదా, బుద్ధిమంతులయిన అనగా జ్ఞానులయిన యోగుల ఇళ్ళలోనే జన్మిస్తాడు అని ఉన్నది. జ్ఞానదాయకుడు దక్షిణామూర్తి మొదలయిన రూపాలలో శివు డన్నది ప్రసిద్ధం. ధర్మాచరణం కలవాడు శ్రీమంతుడయితే దానాది ధర్మమూ, యజ్ఞాదులూ అశ్రమంగా ఆచరింపగలుగుతాడు. కనుక శ్రీమంతుల ఇళ్ళలో పుట్టించి సంపదకు ఫలమయిన ధర్మాదులు ఆచరింపజేసి రక్షిస్తాడు హరి. ఈయన స్థితికారకుడు. కనుకనే 'స్థితి' పదప్రయోగం. జ్ఞానవంతులయిన యోగుల ఇళ్ళలో పుట్టిన అతడు పూర్వజన్మలో వదలిన చోట యోగసాధన ప్రారంభించి సులభంగా సిద్ధి అందుకుంటాడు. అదీ యిదీ కరుణాకటాక్ష ప్రసాద మాత్రంచేతనే కలిగిస్తాడు స్వామి అన్న దొక విశేషం. బ్రతికి ఉన్నంతకాలమూ గురుకులంలోనే బ్రహ్మచర్యవ్రతంలోనే ఉండేవాడు నైష్ఠిక బ్రహ్మచారి, వివాహం చేసుకొనటానికని స్నాతుడు కాగోరేవాడు ఉపకుర్వాణుడు. ఎల్లప్పుడు బ్రహ్మనిష్ఠుడైన, రెండర్థాలలోనూ నైష్ఠికుడైన వాని యోగక్షేమాలను పరమాత్మ వహిస్తాడనటానికి 'తేషాం సతతయుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్' నిరంతరం పరమాత్మ స్మరణాదియుక్తులైనవారి యోగక్షేమాలను నేను వహిస్తానన్న గీతావాక్యమే ప్రమాణం. (9.22)

## సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్ణుని తెగుటం జెప్పుట (సం. 8-1-25)

**వ. దేవా, వైశంపాయనుండు జనమేజయునకిట్లనియె; 'నట్లు మహాప్రాజ్ఞుండగు సంజయుండు దండుననుండి హస్తిపురంబున కరుగుదెంచి, ధృతరాష్ట్రు మందిరంబు ప్రవేశించి, యంతఃపురంబున నున్న యన్నరనాథుం గనుంగొని, కృతప్రణాముం డగుటయు నతం డాదరించిన నాసీనుండై. 2**

**ప్రతిపదార్థం:** దేవా= ప్రకాశమానుడవైన ఓ స్వామీ; వైశంపాయనుండు= వ్యాసుని శిష్యుడైన వైశంపాయన మహర్షి; జనమేజయునకున్= ఆ పేరుకల మహారాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు; అట్లు= ఆ విధంగా; మహా= గొప్ప; ప్రాజ్ఞుండు+అగు= జ్ఞాని అయిన; సంజయుండు= ఆ పేరు గలిగి ధృతరాష్ట్రునికి యుద్ధవార్తలు చెప్పటానికి నియుక్తుడైన అతడు; దండుననుండి= సైన్యంలో నుండి; హస్తి పురంబునకున్= హస్తినానగరం అనే పేరుగల కౌరవుల రాజధానీ పట్టణానికి; అరుగు+తెంచి= వచ్చి; ధృతరాష్ట్ర= ఆ పేరుగల దుర్యోధనాదుల తండ్రి అయిన రాజుయొక్క; మందిరంబు= ఇంటిలోనికి; ప్రవేశించి= వెళ్ళి; అంతఃపురంబునన్+ ఉన్న= రాజస్త్రీలు నివసించే లోపలినగరి (ఇంటి)లో ఉన్న; ఆ+నరనాథున్= ప్రజలకు ప్రభువైన ఆ ధృతరాష్ట్రుని; కనుంగొని= చూచి; కృతప్రణాముండు= చేయబడిన నమస్కారం కలవాడు, నమస్కరించినవాడు; అగుటయున్= కాగా; అతండు= ఆ ధృతరాష్ట్ర మహారాజు; ఆదరించినన్= మన్నన చేయగా; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై. (క్రింది పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** స్వామీ! వైశంపాయన మహర్షి, జనమేజయ మహారాజుతో ఇట్లా చెప్పాడు. రాజా! నీ కిదివరకే నేను చెప్పినట్లు గొప్ప జ్ఞాని అయిన సంజయుడు కురుక్షేత్రంలో ఉన్న సైన్యంనుండి బయలుదేరి రాజధాని హస్తినానగరానికి వచ్చాడు. ధృతరాష్ట్రమహారాజు నివసించే భవనానికి వెళ్ళి ఆ మహారాజును దర్శించి నమస్కరించాడు. ఆయన అతడిని మన్నన చేసి కూర్చోమంటే కూర్చొని (చెప్పబోతున్నాడు).

**విశేషం:** అంతఃపురంలో ఉన్న ధృతరాష్ట్ర మహారాజుగారిని సంజయుడు దర్శించాడంటే, అత డాయనకు ఎంత ఆప్తుడో తెలుస్తుంది. అంతేకాక, అతడు తెచ్చిన వార్త, చెప్పవలసిన విశేషం ఎంత తీవ్రమైనదో, ఎంత ముఖ్యమైనదో, ఎంత తొందరగా అందించవలసినదో కూడా తెలుస్తుంది.

**క. బలవిక్రమములు వినుతం । బులుగా మనమొనలుఁ బాండుపుత్రానీకం**
**బులు రెండునాళ్ళు వోరుట । దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా! 3**

**ప్రతిపదార్థం:** కురునాథా!= కురుమహారాజు వంశానికి చెందిన ధృతరాష్ట్ర మహారాజా! (నేను); మనమొనలున్= కౌరవసైన్యాలూ; పాండుపుత్ర= పాండవులయొక్క; అనీకంబులున్= సేనలూ; బల= శరీర శక్తులూ; విక్రమములు= మానసికాలయిన పరాక్రమాలూ; వినుతంబులుగాన్= పొగడబడునవిగా; రెండునాళ్ళు= రెండురోజులు; పోరుట= యుద్ధం చేయటం; తెలియన్+ కాన్= స్పష్టంగా అర్థం అయ్యేటట్లు; చూచి= ప్రత్యక్షంగా చూచి; వచ్చితిన్= నీ వద్దకు వచ్చాను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! తమ శక్తీ, శౌర్యమూ అందరూ మెచ్చుకొనేటట్లు మనసైన్యమూ పాండవులసేనా చేస్తున్న యుద్ధం రెండు రోజులు స్పష్టంగా చూచివచ్చాను.

**విశేషం:** ఒక్కొక్క ప్రముఖుడూ పడిపోయిన తరువాత రావటమూ, ముందు అతని మరణం గురించి తెలియజేయటమూ, అనంతరం అత డెట్లా యుద్ధంచేసి పడిపోయాడో ఆ క్రమం చెప్పటమూ యుద్ధవార్తలు చెప్పటంలో సంజయుడు అనుసరిస్తున్న

పద్ధతి. చావు కబురు చల్లగా చెప్పుమన్నారు. సంజయుడు మంచి మాటకారి. ధృతరాష్ట్రుడితో సహా కౌరవులందరూ విజయాశ ఎవడిపై పెట్టుకొన్నారో ఆ కర్ణుడి మరణవార్త చెప్పబోతున్నాడు. కనుక, ఇరువాగులవారూ ప్రశంసనీయంగా పోరాడుతున్నారని ప్రారంభించటంద్వారా ఒకరు ఓడక తప్పకపోవటం సూచిస్తున్నాడు. మన మొనలని కౌరవసేనలను గురించి ముందు ప్రస్తావించటంద్వారా ఆశ కల్పిస్తున్నాడు. చెప్పబోయే కర్ణుని మరణవార్త వారికి నమ్మశక్యం కానిది. నమ్మతగిందని సూచించటానికే 'తెలియంగాఁ జూచివచ్చితి' అన్నాడు.

**వ. అని పలికి కర్ణునిం బ్రశంసించి. 4**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికి= చెప్పి; కర్ణునిన్= రాధేయుడిని; ప్రశంసించి= మెచ్చుకొని. (అనియె అనే 8వ సంఖ్య కల వచనంలోని క్రియతో అన్వయం.)

**తాత్పర్యం:** ఆవిధంగా పలికి కర్ణుడిని మెచ్చుకొని.

**చ. సరకుగొనండు పాండుసుత సైన్యనికాయము నించుకేనియుం**
**గరులు రథంబులున్ హరులుఁ గాల్బలముల్ దనవీఁక విచ్చియున్**
**మరలియుఁ దూలియుం బిలుకుమాఱియు నల్గడఁ బాఱియున్ వియ**
**చ్చరులకు వేడ్కసేయ భుజసారము శౌర్యముఁ జూపె నేపునన్. 5**

**ప్రతిపదార్థం:** (కర్ణుడు) పాండుసుత= పాండవులయొక్క; సైన్య= సేనయొక్క; నికాయమున్= సమూహాన్ని; ఇంచుక+ఏనియున్= కొంచెమైనా; సరకు+కొనండు= లెక్కపెట్టడు; తన వీఁకన్= తన పరాక్రమంతో; కరులున్= ఏనుగులూ; రథంబులున్= తేరులూ; హరులున్= గుర్రాలూ; కాల్బలముల్= పదాతి సేనలూ; విచ్చియున్= చెల్లా చెదరైపోయీ; మరలియున్= (పాండవ సేనా నాయకుల ప్రోద్బలంతో కర్ణుని వైపు) తిరిగీ; తూలియున్= చలించి పడీ; పిలుకుమాఱియున్= మరణించీ; నలు+కడన్= నాలుగు దిక్కులకూ (అన్నివైపులకూ); పాఱియున్= పరుగులు తీసీ; వియత్+చరులకున్= ఆకాశంలో సంచరించే దేవతలు మొదలయిన వారికి; వేడ్క+చేయన్= వినోదం కలిగించేటట్లు; ఏపునన్= విజృంభణంతో; భుజ= తన భుజములయొక్క; సారమున్= బలాన్నీ; శౌర్యమున్= పరాక్రమాన్నీ; చూపెన్= ప్రదర్శించాడు.

**తాత్పర్యం:** కర్ణుడు పాండవుల సైన్యాన్ని పిసరంతైనా లక్ష్యపెట్టలేదు. అతని పరాక్రమానికి రథగజతురగ పదాతి సేన ఒకప్పుడు చెల్లాచెదరైపోయింది. ఇంకొకప్పుడు మళ్ళీ వెనక్కు వచ్చింది. మరొకప్పుడు పడిపోయింది. వేరొకప్పుడు ప్రాణాలు కోల్పోయింది. కొంత అన్నివైపులకూ పారిపోయింది. అది చూచే ఆకాశసంచారులయిన దేవతలు మొదలయిన వారికి వినోదం కలిగించింది. అట్లా అతడు విజృంభించి తనబాహుబలమూ, పరాక్రమమూ ప్రదర్శించాడు.

**వ. చూపి, యక్కౌంతేయులం గలంచి యాడి, పదంపడి. 6**

**ప్రతిపదార్థం:** చూపి= ప్రదర్శించి; ఆ+కౌంతేయులన్= ఆ పాండవులను; కలంచి= కలతపరచి; ఆడి= క్రీడించి, ఆటఅంత అవలీలగా యుద్ధంచేసి; పదంపడి= తరువాత (తెగియె అనే 7వ పద్యంలోని క్రియతో అన్వయం.)

**తాత్పర్యం:** ప్రదర్శించి, ఆ పాండవులను కలతపెట్టి, అవలీలగా యుద్ధంచేసి, ఆ తరువాత.

**విశేషం:** కౌంతేయులంటే కుంతీపుత్రులని అర్థం. ఇక్కడ తిక్కనగారు పాండుపుత్రులనే అర్థంలో ప్రయోగించారు. 'పచ్చెం గుంతీసుత మధ్యముండు' అని విరాటపర్వంలో కూడా పాండవ మధ్యముడనే అర్థంలో ప్రయోగించారు. పెంచినది కుంతియే కనుకనూ సంతానం కలిగిన తరువాత మాద్రిని ప్రజలెవరూ చూడలేదు కనుకనూ అందరూ పాండవులైదుగురిని కౌంతేయులని పిలిచే వారని ఆయన అభిప్రాయంగా గ్రహించాలి.

**తే. తనకుఁ బిమ్మిటియైన యర్జునునిబాహు । లీల నెమ్మెయిఁ ద్రోవంగలేక తెగియె**
**నధిప! యాఁబోతు బెబ్బులి కగ్గమైన । పగిదియై పాండవులకును బగ యడంగె. 7**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; ఆఁబోతు= వృషభం; బెబ్బులికిన్= పెద్దపులికి; అగ్గము+ఐన= వశపడినది అయిన; పగిది+ఐ= విధమయి; తనకున్= తనకంటె; పిమ్మిటి+ఐన= అధికుడైన; అర్జునునియొక్క; బాహులీలన్= బాహువుల విలాసాన్ని (అనగా భుజబలాన్ని); ఏ+మెయిన్= ఏ విధంగానూ; త్రోవఁగన్= త్రోసివేయటానికి, మించటానికి; లేక= శక్యంకాక; తెగియెన్= మరణించాడు; పాండవులకున్= ధర్మరాజాదులకూ; పగ= విరోధం; అడంగెన్= అణగిపోయింది, తీరింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! తన కంటె అధికుడైన అర్జునుడి బాహుబలాన్ని ఏ విధంగానూ అతిశయించలేక, పెద్దపులి వశమైన ఆబోతు వలె కర్ణుడు మరణించాడు. దానితో పాండవుల పగకూడ చల్లారింది.

**విశేషం:** అలం: ఉపమ. ఇందులో తిక్కనగారు అర్జునుడిని పులితోనూ, కర్ణుడిని ఆబోతుతోనూ పోల్చటమూ, పులి కంటపడిన ఆబోతువలె కర్ణుడు ఎంత ప్రయత్నించినా అర్జునుడి బాహులీలను మించలేక మరణించా డనటమూ అద్భుతం. 5వ పద్యంలో సైనికులపై కర్ణుడి విజృంభణం వర్ణించాడు. 6వ వచనంలో అది ఆటవలె సాగిందన్నాడు. ఇందులో అర్జునుడి బాహువిలాసాన్ని ఏమీ చేయలేక మరణించాడన్నాడు. ఆబోతు సామాన్య మృగాలను ఏమైనా చేయగలదు. కాని అది ఎంత బలం కలదైనా పులికి చిక్కిందో దాని పని ముగిసినట్లే. కర్ణుడు సామాన్య భటులతో అవలీలగా ఆటవలె యుద్ధంచేశాడు. అర్జునుడి చేతికి చిక్కి మరణించాడు. ఇక, పాండవులకును 'పగ అడంగె' అన్న వాక్యం. కర్ణుడు పోతే పాండవుల పగ తీరటమేమిటి? కౌరవుల జయాశకు మూలం కర్ణుడు. అతడు పోతే వారోడిపోయినట్లే. ఈ సంగతి కౌరవ పాండవుల కిద్దరికీ తెలుసు. కర్ణుడు పడగానే వాళ్ళను గెలిచామనిపించింది కనుక, పగతీరింది పాండవులకు. అదీగాక, కర్ణుడి మీద ప్రత్యేకమైన పగ పాండవులకు. ద్రౌపదిని వస్త్రహీనను చేయుమని సూచన ఇచ్చినవాడు కర్ణుడు. అయిదుగురిని కాక ఒక్కడిని భర్తగా పొందటం మంచిది. జూదంలో భార్యను ఓడిపోవని వాడిని ఇంకెవడినైన పడయుమని ఆమెను నిండుకొలువులో అన్నవాడు కర్ణుడు. పాండవులనందరినీ అవమానించినవాడు కర్ణుడు. ఘోషయాత్రకు పురికొల్పినవాడు కర్ణుడు. అభిమన్యుడి అన్యాయపు చావుకు మూలమైనవాడు కర్ణుడు. ఇలాంటి కారణాలవలన పాండవులకు అతడిపై ప్రత్యేకమైన పగ. అతడి మరణంతో ఈ రెండు పగలూ తీరాయి. పైగా, 'మరణాంతాని వైరాణి' కదా. అందువల్ల కూడా వారి పగ తీరింది.

**వ. అనుచు శోకోపహతుండై సూతసూనుండు నిట్టూర్పు నిగిడించి, డగ్గుత్తిక వెట్టి యిట్లనియె. 8**

**ప్రతిపదార్థం:** అనుచున్= అట్లా పలుకుతూ; సూతసూనుండు= రథసారథి పుత్రుడైన సంజయుడు; శోక= ఏడుపుచేత; ఉపహతుండు+ఐ= కొట్టబడినవాడై; అంటే ఏడుపు ఆపుకొనలేక; నిడు+ఊర్పు= దీర్ఘనిశ్వాసం; నిగిడించి= సాగించి, అంటే చాలాసేపు విచారసూచకంగా నిశ్వాసం విడిచి; డగ్గుత్తిక+పెట్టి= గద్గదస్వరం వచ్చేటట్లు మాటతీరు మార్చి; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** అని చెపుతూ, సంజయుడు దుఃఖాతిశయంతో నిట్టూర్చి, గద్గద స్వరంతో ఈ విధంగా అన్నాడు.

**చ. అది యొకఁ డేల? కౌరవ చయంబు జయాశ యడంగి పోవ బె**
**ట్టిదుఁ డగు భీమసేనుఁడు గడింది మగంటిమి దుస్ససేను దు**
**ర్మద మడఁగించి పేరురము వ్రచ్చి మహోగ్రతఁ ద్రావె నెత్తు ర**
**య్యది దుది నింత వుట్టు నని యాప్తజనంబులు మున్న చెప్పరే? 9**

**ప్రతిపదార్థం:** అది= కర్ణుని మరణం; ఒకఁడు= ఒకటి(మాత్రమే అనుకొనటం); ఏల?= ఎందుకు?; బెట్టిదుఁడు+అగు= గర్వి, క్రూరుడు, కఠినుడు అయిన; భీమసేనుఁడు= భీముడు; కౌరవ= కౌరవుల; చయంబు= సమూహంయొక్క; జయ+ఆశ= గెలుపుమీది ఆశ; అడంగిపోవన్= నాశనమైపోయేటట్లుగా; కడింది= అధికమైన; మగంటిమిన్= పౌరుషంతో; దుస్ససేను= దుశ్శాసనునియొక్క; దుర్మదము= దుష్టమైన పొగరు; అడఁగించి= నాశనంచేసి; పేరురము= విశాలమైన వక్షఃస్థలం; వ్రచ్చి= చీల్చి; నెత్తురు= రక్తం; మహోగ్రతన్= మిక్కిలి భయంకరత్వంతో; త్రావెన్= త్రాగాడు; ఆప్తజనంబులు= దగ్గరివారయిన మనుష్యులు; తుదిన్= చివరకు; ఇంత= ఇంతటి మహాపద; పుట్టును+అని= సంభవిస్తుంది అని; ఆ+అది= ఆ పరిణామం గురించి; మున్న= ఇదివరకే; చెప్పరే?= చెప్పలేదా?

**తాత్పర్యం:** కౌరవుల జయాశ నశించటానికి కర్ణుడి మరణం ఒకటే సంభవించిందనుకొనటం దేనికి? ఇంకా విచారం కలిగించే సంఘటనలు జరిగాయి. వాటిలో ఒకటి దుశ్శాసనుడి మరణం. కఠినాత్ముడైన భీమసేనుడు విపరీత పౌరుషంతో దుశ్శాసనుడి పొగరణగించి, అతడి విశాల వక్షఃస్థలాన్ని చీల్చి మహాభయంకరంగా నెత్తురు త్రాగాడు. చివరకు ఇటువంటి మహాపద ఏదో సంభవిస్తుందని ఆప్తులు ముందే చెప్పారు కదా.

**విశేషం:** దేహళీ దత్తదీపన్యాయంగా (రెండు గదుల మధ్య గడపమీద పెట్టిన దీపం రెండు గదులలోనికీ వెలుతురు ప్రసరింపజేసినట్లు) ముందు వెనుక వాక్యాలకన్వయించేటట్లు వాక్యాలూ వాక్యాంశాలూ ప్రయోగించి రచనకు వన్నెతేవటంలో తిక్కనగారు ప్రసిద్ధులు. ఈ పద్యంలో అట్లాంటి విన్యాసాలు రెండున్నాయి. వాటిలో 'కౌరవచయంబు జయాశ యడంగిపోవ' అన్నవాక్యం ఒకటి. కౌరవుల జయాశ నశించటానికి సంభవించినవాటిలో కర్ణుడి మరణ మొకటే అనుకొనటమెందుకు - అనీ అన్వయించవచ్చు. కౌరవుల జయాశ నశించేటట్లు భీముడు దుశ్శాసనుడి నెత్తురు త్రాగాడనే వాక్యంతోనూ అన్వయించవచ్చును.

అట్లాగే 'అయ్యది' అన్నదాని ప్రయోగం. 'నెత్తురయ్యది' అని అన్వయిస్తే ద్రౌపదిని పరాభవించే మదం కలిగించిన నెత్తురు అని అన్వయించవచ్చును. ఆ పరాభవించటానికి ఫలంగా అనీ చెప్పవచ్చును. అయ్య+ది అని విడదీసి యువరాజువంటి వారిని తెలుగులో ప్రభువుల పరివారంలోనివారు చిన్నయ్య పెద్దయ్య అని వ్యవహరించటం కద్దు కనుక, అయ్యదైన నెత్తురు అనీ అన్వయించవచ్చును. "సోమరిపోతులు కొందరయ్యలు" అని శ్రీనాథుడు ప్రయోగించినట్టు, మదంతో ద్రౌపదిని పరాభవించిన అయ్యది, ఆప్తుల హితోపదేశం పెడచెవినిబెట్టిన అయ్యది (మూర్ఖునిది) అనీ అన్వయించవచ్చును.

భీమసేనుడికి బెట్టిదుఁడు అనే విశేషణం వేశారు. దానికి ఉద్ధతుడు (గర్వి), కఠినుడు, క్రూరుడు అని అర్థాలున్నాయి. అందరూ చూస్తుండగా దుశ్శాసనుని సంహరించటంలో భీముని ఔద్ధత్యమూ, వక్షఃస్థలం చీల్చటంలో కాఠిన్యమూ, నెత్తురు త్రాగటంలో క్రౌర్యమూ కనిపిస్తున్నాయి. ఒక్క విశేషణంలో ఇది సాధించారు తిక్కనగారు.

**తే. కొడుకులంత రాజ్యంబును గొనఁగ శక్తు । లను దురాశను వారల యవినయములు**
**నీ వుపేక్షింతు; మానునే? యా విరుద్ధ । కర్మమున ఫలమొందక కౌరవేంద్ర! 10**

**ప్రతిపదార్థం:** కౌరవేంద్ర!= కురువంశీయుడవైన రాజా!; నీవు= నీవు; కొడుకులు= నీ కుమారులు; అంత= (నీవంతుగా దక్కిన, వారివంతని నీవిచ్చిన) సమస్తమైన; రాజ్యంబును= రాజ్యాన్నీ; కొనఁగన్= తీసికొనటానికి; శక్తులు= శక్తికలవారు; అను= అనే; దురాశను= చెడు ఆశతో; వారల= నీ కొడుకులయొక్క; అవినయములు= వినయం లేనందువల్ల చేసే చెడుపనులు; ఉపేక్షింతు= చూచీ చూడనట్లు ఊరుకున్నావు; ఆ విరుద్ధ కర్మమున= ఆ ధర్మ విరుద్ధమయిన పనియొక్క; ఫలము= ఫలితం; ఒందక= చెందక, అనుభవించక; మానునే?= పోతుందా? పోదు.

**తాత్పర్యం:** కౌరవరాజా! నీ కొడుకులు నీ వంతురాజ్యమే కాక, పాండవులకు నీ విచ్చిన రాజ్యం కూడా కలుపుకొని, మొత్తం రాజ్యమూ కాజేసి, నిలుపుకొనగలిగినంత సమర్థులు అనే దురాశతో వాళ్ళు చేసిన చెడ్డపనులు చూచీ, చూడనట్టు ఊరుకున్నావు. ఇది ధర్మానికీ వ్యతిరేకమైన పని. దాని ఫలం అనుభవించక తప్పుతుందా?

**విశేషం:** ఈ పద్యంలో ప్రాణం 'కౌరవేంద్ర' అన్న సంబోధనలో ఉన్నది. కురుమహారాజు ఇంద్రాదుల ఆక్షేపణలు కూడా కాదని లోకహితం కోసం, ధర్మక్షేత్రం కురుక్షేత్రం ఏర్పరచిన ఉత్తముడు. ఆ వంశంలో పుట్టిన ధృతరాష్ట్రమహారాజు ధర్మవిరుద్ధ కృత్యాలను పుత్రవ్యామోహంతో ఉపేక్షించటం తప్పు. చేసినకర్మ అనుభవించక తప్పదు. తెలిసి చేసినదానికి అసలు తప్పదు - అని సంజయుడి అభిప్రాయం.

**వ. అనిన విని, యాంబికేయుండు, దుర్యోధనుండును దెగియెన కాఁదలంచి, విహ్వాలించి, మూర్ఛిల్లినం; దల్లడిల్లి, యార్తనాదంబులతో వివశంబులయి, వనితాజనంబులు గన్నీరుగ్రమ్మ, వసుంధర నొఱగిన; నంతకుమున్న వచ్చియున్న విదురుండును, నా సూతనందనుండును జేరి, చేసేత, శీతల జలసేచన మృదువ్యజనవీజనంబుల నన్నరనాథుని, నారీ సముదయంబును సేదదేర్చిన; నాసీనుండై యతండు దీర్ఘ నిశ్వాసంబు లడరం జింతిల్లి. యంతర్గతంబున దైవంబు గర్హించి, పాండవుల నగ్గించి, తన బుద్ధియు, శకుని వెరవును నిందించి; తన్నుందాన యుపశమించుకొని, ధైర్యంబు సిక్కంబట్టి. 11**

**ప్రతిపదార్థం:** అనినన్= ఈ విధంగా సంజయుడు చెప్పగా; విని; ఆంబికేయుండు= అంబిక కుమారుడైన ధృతరాష్ట్రుడు; దుర్యోధనుండును= ఆపేరిటి తన జ్యేష్ఠ పుత్రుడు కూడా; తెగియెన్+అ+కాన్= మరణించియే ఉంటాడని; తలంచి= భావించి; విహ్వాలించి= అవయవాలు స్వాధీనం తప్పి; మూర్ఛిల్లినన్= సొమ్మసిల్లగా; వనితాజనంబులు= స్త్రీజనాలు, స్త్రీలు; తల్లడిల్లి= బాధపడి, జడిసి; ఆర్తనాదంబులతోన్= దుఃఖపడినవారు చేసే ధ్వనులతో, 'అయ్యో!' మొదలైన వాటితో; వివశంబులు+అయి= వశము తప్పినవి అయి; కన్నీరు+క్రమ్మన్= కన్నీరు కారగా; వసుంధరన్= భూమిపై; ఒఱగినన్= వ్రాలగా; అంతకున్= ధృతరాష్ట్రుడు సొమ్మసిల్లటానికి; మున్ను+అ= ముందుగానే; పూర్వమే; వచ్చి+ఉన్న= అక్కడికి వచ్చి ఉన్న; విదురుండును = ఆ పేరిటి ధృతరాష్ట్రుని తమ్ముడూ; సూతనందనుండును= సంజయుడూ; చేరి= వారిని సమీపించి; చేసేతన్= స్వయంగా; శీతల= చల్లని; జల= నీటితో; సేచన= తడపటంతోనూ; మృదు= సుకుమారమైన; వ్యజన= వీవనలతో; వీజనంబులతోను= విసరటములతోనూ; ఆ+నరనాథునిన్= ఆరాజు ధృతరాష్ట్రునీ; నారీ= స్త్రీలయొక్క; సముదయంబును= సమూహామునూ; సేదదేర్చినన్= మూర్ఛనుంచి తెప్పిరిల్లజేయగా; ఆసీనుండు+ఐ= కూర్చున్నవాడై; అతండు= ఆ ధృతరాష్ట్రుడు; దీర్ఘనిశ్వాసంబులు= నిట్టూర్పులు; అడరన్= అధికం కాగా (అయ్యేటట్లుగా); చింతిల్లి= విచారించి; అంతర్గతంబునన్= మనస్సులో; దైవంబున్= విధిని; గర్హించి= నిందించి; పాండవులన్= పాండురాజు కుమారులను; అగ్గించి= ప్రశంసించి; తన= కొడుకులమాటకు అడ్డుచెప్పని తనయొక్క; బుద్ధియున్= జ్ఞానాన్నీ, తెలివినీ, వివేకాన్నీ; శకుని= శకునియొక్క; వెరవును= ఉపాయాన్నీ; నిందించి= దూషించి; తన్నున్+తాను+అ= తనను తానే; ఉపశమించుకొని= శాంతింపజేసికొని, ఓదార్చుకొని, కుదుట

పరచుకొని; ధైర్యంబు= మనస్సు కలత చెందకుండా ఉండే స్థితిని; చిక్కన్= దొరికేటట్లు; పట్టి= పట్టుకొని (తరువాతి వచనంతో అన్వయం).

**తాత్పర్యం:** సంజయుడు ఆ విధంగా కర్ణ దుశ్శాసనుల మరణవార్త చెప్పి, 'ఈ అనర్థాని కంతటికీ నీవు నీ కుమారుల నీతిమాలిన పనులను చూచీ చూడనట్లు ఊరుకోవటమే కారణం' అని చెప్పేసరికి, ధృతరాష్ట్రుడికి దుర్యోధనుడు కూడా చనిపోయుంటా డనిపించింది. దానితో శరీరం పట్టు తప్పింది. మూర్ఛవచ్చింది. అది చూచి అంతఃపురకాంతలందరూ బాధపడి హాహాకారాలు చేస్తూ, కన్నీళ్ళు పెట్టుకొంటూ మూర్ఛిల్లి నేలపై పడిపోయారు. ధృతరాష్ట్రుడు మూర్ఛిల్లటానికి పూర్వమే అక్కడికి చేరి ఉన్నాడు విదురుడు. అతడూ సంజయుడూ వెంటనే ధృతరాష్ట్రుని ముఖంమీదనూ అంతఃపురకాంతల ముఖాలమీదనూ చల్లని నీళ్ళు చిలకరించారు. సుకుమారమైన వీవనలతో మెల్లగా విసిరారు. ఈ ఉపచారాలవలన ధృతరాష్ట్రమహారాజు మూర్ఛనుండి తేరుకొని కూర్చున్నాడు. పెద్ద పెద్ద నిట్టూర్పులు వచ్చేటట్లు విచారించాడు. ఇట్టి స్థితి కల్పించినందుకు మనస్సులో విధిని తిట్టిపోశాడు. పాండవులను వారి మంచినడతకు మెచ్చుకొన్నాడు. తన కొడుకులను దారిలో పెట్టుకొనలేక వా రాడించినట్లు ఆడిన తన తెలివిని తానే తిట్టుకొన్నాడు. శకుని చెప్పిన - అంతంలో నాశనం కలిగించే ఉపాయాన్ని (జూదమాడి పాండవులను గెలుద్దామనే ఉపాయాన్ని) దూషించాడు. వీటివలన ఎట్లాగో తనకుతానే దిటవు తెచ్చుకొన్నాడు. సంజయుడితో ఇట్లా అంటున్నాడు:

**క.** **'తెలియ విన నీవు సెప్పిన । పలుకులు దుర్యోధనుండు వడఁడు గదా? వై**
**రుల విక్రమమున సంజయ! । కల రూపెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ నాకున్'.** **12**

**ప్రతిపదార్థం:** సంజయ!= సంజయా!; నీవు; చెప్పిన= ఇంతకుముందు వినిపించిన; పలుకులు= మాటలు; తెలియన్= మనస్సునకు స్పష్టమయ్యేటట్లు; వినన్= నేను వినలేదు; వైరుల= పగవారైన పాండవులయొక్క; విక్రమమునన్= పరాక్రమంవల్ల; దుర్యోధనుండు= నా జ్యేష్ఠకుమారుడయిన దుర్యోధనుడు; పడఁడుగదా!= పడిపోలేదు కదా!, మరణించలేదు కదా!; కలరూపు= ఉన్న స్వరూపం, యథార్థ విషయం; ఎఱుఁగంగన్= స్పష్టంగా తెలిసికొనేటట్లు; క్రమ్మఱన్= మరల; నాకున్= నాకు; చెప్పు= తెలియచేయుము.

**తాత్పర్యం:** 'సంజయా! నీ విదివరకు చెప్పినమాటలు దుఃఖం వలన స్పష్టంగా తెలిసేటట్లు వినలేదు. దుర్యోధనుడు శత్రువుల పరాక్రమంవలన నేల కొరగలేదు కదా! ఉన్నదున్నట్లు మళ్ళీ చెప్పుము'.

**చ.** **అనుటయు నాతఁ డిట్లనియె 'నమ్మనుజేంద్రున కాజిఁ గర్ణుఁడుం**
**దనయులుఁ దమ్ములుం బడిరి దారుణ విక్రమకేలి సల్పి నె**
**ట్టన బలుపారఁ బట్టి వికటంబుగ వక్షము వ్రచ్చి దుస్ససే**
**నుని రుధిరంబు మారుత తనూజుఁడు ద్రావె మదం బెలర్పఁగన్'.** **13**

**ప్రతిపదార్థం:** అనుటయున్= ధృతరాష్ట్రుడట్లు పలుకగా; ఆతఁడు= సంజయుడు; ఆ మనుజ+ఇంద్రునకున్= ధృతరాష్ట్ర మహారాజుకు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; ఆజిన్= యుద్ధంలో; కర్ణుఁడున్= అంగరాజు; తనయులున్= కర్ణుని కుమారులూ; తమ్ములున్= కర్ణుని తమ్ములూ; పడిరి= నేల కొరగినారు; మారుతతనూజుఁడు= వాయుపుత్రుడు, భీమసేనుడు;

దారుణ= భయంకరమైన; విక్రమ= పరాక్రమం అనే; కేలి= క్రీడ; సల్పి= ఆచరించి; నెట్టన= సాహసించి; బలుపారన్= బలం ఒప్పగా; పట్టి= దుశ్శాసనుని పట్టుకొని; వికటంబుగన్= వికృతంగా, చూడటానికి అసహ్యంగా, భయంకరంగా; వక్షము= రొమ్ము; వ్రచ్చి= బ్రద్దలుచేసి; దుస్ససేనుని రుధిరంబున్= దుశ్శాసనుని రక్తాన్ని; మదంబు= గర్వం; ఎలర్పఁగన్= అతిశయింపగా; త్రావెన్= త్రాగినాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రమహారాజు అట్లా ప్రశ్నించేసరికి సంజయుడు ఆయనతో ఇట్లా చెప్పాడు: 'యుద్ధంలో పరాక్రమాన్ని ఒక క్రీడవలె ప్రదర్శించి కర్ణుడూ, అతడి కుమారులూ, తమ్ముళ్ళూ మరణించారు. మహాబలశాలి అయిన వాయుపుత్రుడు భీముడు ఒక పరాక్రమక్రీడ అన్నట్లుగా యుద్ధంచేసి, తనబలం అంతా ఉపయోగించి దుశ్శాసనుని పట్టుకొని, అతడి వక్షఃస్థలం బ్రద్దలు చేసి, తన బలగర్వం ప్రకటమయ్యేటట్లు అతడి రక్తం త్రాగాడు.

**విశేషం:** ఈ పద్యంలో దేహళీదత్తదీపన్యాయంగా తిక్కనగారు 'దారుణవిక్రమకేలి సల్పి' అన్నది ప్రయోగించటం విశేషం. ఇది సల్పినవారు కర్ణుడూ అతని తనయులూ తమ్ములూ అని చెప్పవచ్చును, భీమసేనుడనీ అన్వయించవచ్చు. ఇందులో మారుతాత్మజుడు అని భీముడిని పేర్కొనటం కూడా సార్థకం. బలశాలులలో బలిష్ఠుడు వాయువు. అతడి ఆత్మజుడు కనుక భీముడు దుశ్శాసనుడిని అట్లా చంపగలిగాడు అన్నది సాభిప్రాయం.

**క. అనిన విని 'యంత కేమియు । నన కూరకయుండు సంజయా! నీ మాటల్**
**విననేరదు విభ్రాంతిని । మునిఁగినయది చిత్త' మని విమూఢాత్మకుఁడై. 14**

**ప్రతిపదార్థం:** అనినన్= అని సంజయుడు చెప్పగా; విని= ధృతరాష్ట్రమహారాజు ఆలించి; సంజయా!= ఓ సంజయా!; అంతకున్= ఆ చెప్పిన దానికంటె అధికంగా; ఏమియున్= ఇతరమైన అశుభవార్త ఏదీ; అనక= చెప్పకుండా; ఊరక= మాటాడక; ఉండు= ఉండుము; చిత్తము= నా మనస్సు; విభ్రాంతిని= కలవరపాటులో; మునిగిన+అది= మునిగిపోయింది; నీ మాటల్= నీవికపైని చెప్పబోయే పలుకులు; వినన్= వినటానికి; నేరదు= శక్తి కలదికాదు; అని= అని పలికి; విమూఢ= కలవరపడిన; ఆత్మకుఁడు+ఐ= మనస్సు కలవాడై. (అనియెన్= అని - 15వ వచనంలోని క్రియతో అన్వయం)

**తాత్పర్యం:** సంజయుడు కర్ణదుశ్శాసనాదుల మరణ విషయం మళ్ళీ చెప్పేసరికి ధృతరాష్ట్రుడి మనస్సు పనిచేయటం మానేసింది. అందువలన ఆయన 'సంజయా! ఇంకేమీ చెప్పకుము. 'నా మనస్సు చాలా కలత చెందింది. అందువలన దానికి ఇక వినేశక్తి లేదు. కనుక మాటాడకుండా ఊరుకొమ్ము' అన్నాడు. అట్లా పలికి, కలత చెందిన మనస్సుతో.

**వ. ధృతరాష్ట్రుండు మ్రానుపడి యుండి కొండొకసేపునకు సేదదేఱి యాసూతనందనున కిట్లనియె. 15**

**ప్రతిపదార్థం:** ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రమహారాజు; మ్రానుపడి= కొయ్యబారి; ఉండి= ఉండిపోయి; కొండొకసేపునకున్= ఒక కొంత సమయానికి, సేదదేఱి= మ్రానుపాటునుంచి తెప్పరిల్లి; ఆ సూతనందనునకున్= ఆ సంజయునితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా పలికాడు.

**తాత్పర్యం:** ఆ విధంగా పలికి ధృతరాష్ట్రమహారాజు కొయ్యబారిపోయాడు. అట్లా కొంతసేపు ఉండి, ఆ స్థితినుంచి తెప్పరిల్లి సంజయుడితో ఈ విధంగా పలికాడు.

**క. 'నా దుర్ణయమునఁ జేసియు । నా దుర్యోధనుని బుద్ధిహాని వలననుం**
**గాదె? యిటులగుట మర్మ వి । భేదన మగు శోకమింత పెల్లయి యున్నే! 16**

**ప్రతిపదార్థం:** ఇటులు= ఈ విధంగా; అగుట= పరిణమించటం; నా= నాయొక్క; దుర్ణయమునన్+చేసియున్= దుష్టమైన నీతివల్లనూ; ఆ దుర్యోధనుని= ఆ దుర్యోధనునియొక్క; బుద్ధిహానివలననున్= బుద్ధి క్షీణించటం వల్లనూ; కాదె?= కదా?; మర్మ= ఆయువు పట్టులను; విభేదనము+అగు= బ్రద్దలుచేసే; శోకము= వగపు; ఇంత= ఈ పరిమాణంలో; పెల్లు+అయి= అధికమై; ఉన్నే?= ఉండునా!.

**తాత్పర్యం:** 'నా దుర్నీతి వలననూ దుర్యోధనుడికి బుద్ధిలేనందువలనను కదా ఈ పరిణామం సంభవించింది! నా ఆయువు పట్టులను చీల్చే ఈ శోకం ఇంత అధికంగా ఉంటుందా!

**వ. దుఃఖంబు నిస్తరింపనోపుదునొకో యని తలంచుచున్న నాదు సంశయంబు వాయ నింతకు మున్ను కయ్యంబునం గడచనిన మనవారిని వారి వారిని నేర్పడం జెప్పు' మనిన నతనికి సంజయుం డిట్లను; 'మనయందు భీష్మ ద్రోణ కర్ణ వికర్ణ వృషసేన దుశ్శాసన లక్ష్మణాదులును వారలలోన విరాట శతానీక ద్రుపద ఘటోత్కచాభిమన్యు పాండ్యప్రముఖులును బేరువేర నిట్టిట్టి వారిచేత నిట్టిట్టి వారు దెగి' రని యేర్పడ నెఱింగించిన, నమ్మహీపతి 'గురుసేన నింక నెవ్వరు గల'రని యడుగుటయు నతండశ్వత్థామ కృతవర్మ శల్య శకుని కృపాచార్యులం బేర్కొని బ్రదికియున్న కురుకుమారులను గర్ణు కొడుకులలో నున్న వారలను మఱియుంగల యోధులను జెప్పి వీరలంగొని యనికి నుత్సహించి పొనుఁగువడ్డ యగ్గి వేఁడిమి వోని వాఁడిమితో దుర్యోధనుండు ధైర్యంబవలంబించి జయార్థియై యున్నవాఁడనిన విని కొడుకుకడిమికి వెడవెడ యూఱడిల్లిన యుల్లంబునం దనవారు పెక్కండ్రు వొలిసిన యలమట మునింగి యొక్కింత ప్రొద్దూరకుండి రాధేయుదెగుట దలపోసి యమ్మనుజనాథుండు.** **17**

**ప్రతిపదార్థం:** దుఃఖంబు= బాధను; నిస్తరింపన్= దాటటానికి; ఓపుదున్+ఒకో?= సమర్థుణ్ణి కాగలనా?; అని= ఈవిధంగా; తలంచుచున్+ఉన్న= భావిస్తున్న; నాదు= నాయొక్క; సంశయంబు= సందేహం; పాయన్= తొలగిపోవటానికి; ఇంతకున్= ఇప్పటికి; మున్ను= పూర్వము; కయ్యంబునన్= యుద్ధంలో; కడచనిన= చనిపోయిన; మనవారినిన్= మన పక్షంలోనివారినీ; వారివారినిన్= పాండవుల పక్షంలోని వారినీ; ఏర్పడన్= స్పష్టం అయ్యేటట్లుగా; చెప్పుము; అనినన్= అని అడుగగా; అతనికిన్= ధృతరాష్ట్రునకు; సంజయుండు= సంజయుడు; ఇట్లు+అనున్= ఈ విధంగా చెపుతున్నాడు; మన+అందున్= మనపక్షంవారిలో; భీష్మ ద్రోణ కర్ణ వికర్ణ వృషసేన దుశ్శాసన లక్ష్మణ+ఆదులును= భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, వికర్ణుడు, వృషసేనుడు, దుశ్శాసనుడు, లక్ష్మణుడు మొదలయిన వారూ; వారలలోనన్= పాండవుల పక్షంలో; విరాట శతానీక ద్రుపద ఘటోత్కచ+ అభిమన్యు పాండ్య ప్రముఖులును= విరాటుడూ, శతానీకుడు, ద్రుపదుడు, ఘటోత్కచుడు, అభిమన్యుడు, పాండ్యుడు మొదలయినవారూ; పేరు+పేరన్= పేరుపేరునా; ఇట్టి+ఇట్టి వారిచేతన్= ఇటువంటి ఇటువంటి వారివల్ల; ఇట్టి+ఇట్టివారు= ఇటువంటి ఇటువంటివారు; తెగిరి= మరణించారు; అని= ఈ విధంగా; ఏర్పడన్= స్పష్టం అయ్యేటట్లుగా; ఎఱింగించినన్= తెలియజేయగా; ఆ+మహీపతి= ఆ భూభర్త, ఆ రాజు ధృతరాష్ట్రుడు; కురుసేనన్= కౌరవసేనలో; ఇంకన్= మిగిలి; ఎవ్వరు= ఏ వీరులు; కలరు+అని= జీవించి ఉన్నారు అని; అడుగుటయున్= అడుగగా; అతండు= సంజయుడు; అశ్వత్థామ= ఆ పేరుగల ద్రోణపుత్రుడిని; కృతవర్మ= ఆ పేరుగల యాదవవీరుణ్ణి; శల్య= మద్రరాజునీ; శకుని= దుర్యోధనుని మేనమామనూ; కృపాచార్యులన్= ద్రోణుని బావమరది అయిన కృపాచార్యుణ్ణీ; పేర్కొని= చెప్పి; బ్రదికియున్న= జీవించి ఉండిన; కురుకుమారులను= కౌరవులను; కర్ణుకొడుకులన్= కర్ణుని కుమారులలో; ఉన్నవారలన్= జీవించి ఉన్నవారినీ; మఱియున్+ కల= వీరుకాక ఇంకా ఉన్న; యోధులను= యుద్ధవీరులనూ; చెప్పి= పేర్కొని; వీరలన్= ఈ మిగిలిన వీరుల్ని; కొని= వెంటబెట్టుకొని; దుర్యోధనుండు= దుర్యోధనుడు; అనికిన్= యుద్ధానికి; ఉత్సహించి= పూనుకొని; పొనుఁగు+పడ్డ= నివురుగప్పిన;

అగ్గి= నిప్పుయొక్క; వేఁడిమి+పోని= వెచ్చదనంవంటి; వాఁడిమితోన్= పరాక్రమంతో; ధైర్యంబు= కలతచెందని మనఃస్థితిని; అవలంబించి= ఆధారం చేసుకొని, పట్టుకొని; జయ+అర్థి+ఐ= జయంకోరువాడయి; ఉన్నవాఁడు= ఉన్నాడు; అనినన్= అని ఈ ప్రకారంగా చెప్పగా; ఆ+మనుజ నాథుండు= ఆ నరేశ్వరుడు (ఆ ధృతరాష్ట్రమహారాజు); విని= ఆలించి; కొడుకు= తన కుమారుడైన దుర్యోధనునియొక్క; కడిమికిన్= పూనికకు; వెడవెడ= కొంచెము కొంచెముగా; ఊఅడిల్లిన= కుదుటపడిన; ఉల్లంబునన్= మనస్సుతో; తనవారు= తన పక్షంవారు; పెక్కంద్రు+పొలిసిన= చాలామంది మరణించారన్న; అలమటన్= దుఃఖంలో; మునింగి= నిమగ్నుడై; ఒక్క+ఇంత= కొంచెము; ప్రొద్దు= సమయము; ఊరకుండి= మాటాడకుండా ఉండి; రాధేయు+తెగుట= కర్ణునియొక్క మరణం; తలపోసి= తలచుకొని.

**తాత్పర్యం:** ఈ దుఃఖం నేను వదలించుకొనగలనా? అని అనుకొంటున్నాను. ఉభయ పక్షాలలోనూ బ్రతికి ఉన్న వారెవరా పోయినవారెవరా అని సందేహంగా ఉన్నది. అది తొలగిపోయే విధంగా యుద్ధంలో ఇంతవరకు మనపక్షంలో ఎవరు పోయారో, పాండవుల పక్షంలో ఎవరు చనిపోయారో వివరంగా చెప్పుము' అని అడిగిన ధృతరాష్ట్రమహారాజుతో సంజయుడు ఇట్లా చెపుతున్నాడు. 'మన పక్షంలో భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, వికర్ణుడు, వృషసేనుడు, దుశ్శాసనుడు, లక్ష్మణుడు మొదలయిన వారు చనిపోయారు. పాండవపక్షంలో విరాటుడు, శతానీకుడు, ద్రుపదుడు, ఘటోత్కచుడు, అభిమన్యుడు, పాండ్యరాజు మొదలయినవారు నేలకొరిగారు. ఇట్లా ఇటువంటివారు ఇటువంటివారివలన ప్రాణాలు కోల్పోయారు' అని చెప్పాడు. అది విని ధృతరాష్ట్ర మహారాజు 'మనసైన్యంలో ఇంకా ఎవరు మిగిలి ఉన్నారు?' అని అడిగాడు. దానికి సంజయుడు ఇట్లా సమాధానం చెప్పాడు. అశ్వత్థామ, కృతవర్మ, శల్యుడు, శకుని, కృపాచార్యుడు బ్రదికి ఉన్నారని చెప్పాడు. ఇంకా జీవించి ఉన్న ధృతరాష్ట్రుని కుమారులపేర్లూ, కర్ణుని కొడుకులలో మిగిలినవారి పేర్లూ ఇంకా ఉన్న పోటరుల పేర్లూ చెప్పాడు. ఈ మిగిలినవారిని వెంటబెట్టుకొని యుద్ధం చేసి విజయం సాధించదలచుకొన్నాడు దుర్యోధనుడు అని చెప్పాడు. అయితే నివురుగప్పిన నిప్పు వేడి ఎలా ఉంటుందో దుర్యోధనుడి శౌర్యం ఇపుడలా ఉన్నదన్నాడు. అయినా అతడు ధైర్యంతో ఉన్నాడన్నాడు. అది వినేసరికి తన కుమారుడి ప్రయత్నంవల్ల ధృతరాష్ట్రుడికి అల్పాల్పంగా మనస్సులో ఊరట కలిగింది. అయినా తన పక్షం వాళ్ళు చాలామంది చనిపోయారే అని మళ్ళీ దుఃఖం ముంచుకొనివచ్చింది. అందువలన కొంచెంసేపు మాటాడలేదు. ఇంతలో అంతటి కర్ణుడు చనిపోవట మేమిటి అనిపించి ఇట్లా అన్నాడు:

**తే. 'ఆలలోని యాఁబోతును బోలె నొప్పు। గురు బలంబులో నున్మదద్విరదమూర్తి**
**సింహసంహననుండు నిస్సీమ విక్ర। మాభిరాముండు వోయెనే? యక్కటకట!' 18**

**ప్రతిపదార్థం:** ఆలలోని= ఆవుల మధ్యఉన్న; ఆఁబోతును+పోలెన్= వృషభంవలె; కురు, బలంబులోన్= కౌరవుల సైన్యంలో; ఒప్పు= అందగించే; ఉన్మద= మదించిన; ద్విరదమూర్తి= ఏనుగురూపంవంటి రూపం కలవాడు; సింహసంహననుండు= సింహంయొక్క మేను కలవాడు; నిస్సీమ= హద్దులేని; విక్రమ= పరాక్రమంచేత; అభిరాముఁడు= ప్రకాశించేవాడు (అయిన కర్ణుడు); పోయెన్+ఏ?= మరణించినాడా?; అక్కట+అకట!= అయ్యయ్యో!.

**తాత్పర్యం:** 'కర్ణుడి ఆకారం మదించిన ఏనుగువలె ఉండేది. అతడు సింహం లాంటి శరీరం కలవాడు. అతడి పరాక్రమానికి అంతులేదు. ఆలాంటి పరాక్రమంతో ప్రకాశిస్తూ అతడు కౌరవసైన్యంలో ఉంటే ఆవులమధ్య ఆబోతున్నట్లుండేది. అంతటివాడు పడిపోయాడా? అయ్యయ్యో!'

**వ. అని తొడంగి హాహాకారంబు లెసంగ రోదనంబు సేయుచు. 19**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; తొడంగి= పూనుకొని; హాహాకారంబులు= అయ్యో అయ్యో అనే ధ్వనులు; ఎసంగన్= ఎక్కువ అయ్యేటట్లుగా; రోదనంబు+చేయుచున్= శోకిస్తూ. ("ఉగ్గడించినన్" అనే 24వ వచనంలోని దానితో అన్వయం)

**తాత్పర్యం:** ఈవిధంగా ధృతరాష్ట్ర మహారాజు అయ్యో అయ్యో అని శోకిస్తూ (సంజయుడితో ఇట్లా అన్నాడు.)

**క. 'సంజయ! మురభంజనుని ధ । నంజయునిం జీరికింగొనఁడు కర్ణుం డిం**
**ద్రుం జెనకియైన గెలుతు న । నుం జచ్చెనె? యట్టివాఁడునుం గయ్యమునన్. 20**

**ప్రతిపదార్థం:** సంజయ!= ఓ సంజయా!; కర్ణుఁడు= అంగరాజు; మురభంజనునిన్= శ్రీకృష్ణుడినీ; ధనంజయునిన్= అర్జునునీ; చీరికిన్+కొనఁడు= లేశమైన లక్ష్యపెట్టడు; ఇంద్రున్= దేవేంద్రుని; చెనకి+ఐనన్= ఎదిరించి కూడా; గెలుతున్= జయింతును; అనున్= అని పలికేవాడు; అట్టివాఁడునున్= అటువంటివాడు కూడా; కయ్యమునన్= యుద్ధంలో; చచ్చెన్+ఎ?= మరణించినాడా?

**తాత్పర్యం:** 'సంజయా! కర్ణుడు కృష్ణుడినీ, అర్జునుడినీ కొంచెమైనా లెక్కజేసేవాడు కాడు. దేవేంద్రుడిని కూడా ఎదిరించి గెలుస్తాననేవాడు. అటువంటివాడు కూడా యుద్ధంలో మరణించాడా?

**విశేషం:** ఇందులో తిక్కనగారు కృష్ణుడికి పర్యాయంగా 'మురభంజనుని' అని ప్రయోగించారు. మురాసురుడు నరకాసురుడి సేనానాయకుడు. నరకుడు వరుసగా గిరి-శస్త్ర-జల-అగ్ని-అనిల దుర్గాల నడుమ ఉన్నాడు. వీటినన్నిటినీ దాటినా మురాసురుడు పదివేల పాశాలతో ఏర్పరచిన జాలములున్నాయి. ఈ చివరి దుర్గం దాటడం కష్టం. దీనిని ఖడ్గంతో ఛేదించాడు కృష్ణుడు. ఈ అసురుడికి ఐదు తలలు. నీళ్ళలో నిద్రిస్తున్నాడు. కృష్ణుడు శంఖధ్వనికి లేచాడు. యుద్ధంలో అతడిని సంహరించి మురభంజనుడైనాడు కృష్ణుడు. అట్టివాడిని సంహరించిన వాడి నీతి లెక్కపెట్టడని సారస్యం. అట్టిదే అర్జున పర్యాయం 'ధనంజయుని' అన్నది. 'ధరణి యెల్ల గెల్చి తగ ధనంబులు గొనియున్కి నే ధనంజయుండ నైతి' నని అర్జునుడే ఉత్తరగోగ్రహణంలో చెప్పాడు ఉత్తరుడితో. అట్టి విశ్వవిజేతను గూడా లెక్కచేయడు అని సారస్యం. ఇంద్రుడిని ఎదిరించి గెలుస్తాననటంలో విశేషం ఉన్నది. ఊరకున్నవాడిని రెచ్చగొడితే సహజపరాక్రమానికి, ఈ రెచ్చగొట్టటం దోహదమై మరీ విజృంభిస్తాడు. అందులోనూ మహైశ్వర్యశాలి త్రిలోకాధిపతి ఇంద్రుడు. యమాదులు అతడి సహాయకులు. అతడిని ఎదిరించి అయినా గెలుస్తాననటం మరీ పగ్గె. 'కయ్యమునన్' అన్నది కూడా సవిశేషమే. ఎంతటివాడైనా ఏ దొంగచాటు దెబ్బవలననో అయితే మరణించటం సంభవం కాని, సరాసరి ముఖాముఖి జరిగిన యుద్ధంలో మరణించాడా అని వింత. 'చచ్చెనె అట్టివాఁడునున్' అనటంకూడా ధృతరాష్ట్రుడి మనఃస్థితికి సూచకమే. ఇతరుల ఆలోచనవలన ఎవరికైనా కలిసివచ్చినంతకాలం వాళ్ళు మెప్పులందుకొంటారు. ఒకడిమీద ఆశపెట్టుకొని, అదీ అతడు చెప్పిన మాటలమీద ఆశపెట్టుకొని, అది అడియాస అయితే, అందువలన సర్వనాశమయితే కలిగే ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. అట్టి వాడూ చచ్చాడా? అనటం ధృతరాష్ట్రుడి మనఃస్థితిని తెలియజేస్తుంది.

## ధృతరాష్ట్రుఁడు గర్ణు మరణంబు విని పలవించుట (సం. 8-5-10)

**సీ. పాండుసూనులతోడి పగకోర్చె నెవ్వని । యుత్సాహమూఁది సుయోధనుండు**
**వైదేహపాండ్రాదివసుధేశు లెవ్వని । కడిమి సొంపున నరిగాఁపులైరి**
**మనమూఁక లెవ్వని పెనుఁ బ్రాపుగాంచి గ । ర్వితములై సంగరక్రీడ సలుపు**
**నద్భుతం బొనరించు నమరుల కెవ్వని । యసమాన వివిధ దివ్యాస్త్ర మహిమ**

**ఆ. యట్టి కర్ణుఁ డీల్గెనట్టె! యింకెక్కడి । బ్రదుకు మనకు నేటి భండనంబు?**
**దీని వినియు నాదు మానసం బేమియుఁ । గాదు వజ్రమయము గాఁగనోపు. 21**

**ప్రతిపదార్థం:** సుయోధనుండు= దుర్యోధనుడు; ఏ+వాని= ఎవనియొక్క; ఉత్సాహము= పూనిక; ఊఁది= అవలంబముగా చేసికొని; పాండుసూనులతోడి= పాండవులతో; పగకున్= విరోధానికి; ఓర్చెన్= సమకట్టినాడో, సిద్ధపడినాడో; వైదేహ= విదేహ దేశపురాజు; పౌండ్ర= పుండ్రదేశాధిపతి; ఆది= మొదలయిన; వసుధా+ఈశులు= భూపతులు; ఎవ్వని= ఎవ్వనియొక్క; కడిమి= పూనికయొక్క; సొంపునన్= అందముచే; అరి+కాఁపులు+ఐరి= కప్పంకట్టేవారైనారో; మన= కౌరవులయొక్క; మూఁకలు= సైన్యాలు; ఎవ్వని= ఎవ్వనియొక్క; పెను= పెద్ద, గొప్ప; ప్రాపు= అండ; కాంచి= చూచుకొని; గర్వితములై= గర్వపడినవై; సంగరక్రీడ= యుద్ధమనే ఆట; సలుపున్= చేయునో, ఆడునో; ఎవ్వని= ఎవ్వనియొక్క; అసమాన= సాటిలేని; వివిధ= రకరకాలైన; దివ్య= స్వర్గలోకంలో పుట్టిన; అస్త్ర= మంత్రప్రయుక్తాలైన ఆయుధాలయొక్క; మహిమ= ప్రభావం; అమరులకున్= దేవతలకు కూడా; అద్భుతంబు= ఆశ్చర్యం; ఒనరించున్= కలిగించునో; అట్టి= అటువంటి (ఇదివరకు చెప్పిన గుణవిశేషాలు కలిగిన); కర్ణుడు; ఈల్గెన్+అట్టె!= మరణించినాడట, ఎంత ఆశ్చర్యం!; ఇంకన్= ఇట్టి కర్ణుని మరణం తరువాత కూడా; మనకు; ఎక్కడి బ్రతుకు= బ్రతుకెక్కడ?; ఏటి= ఎక్కడి; భండనంబు?= యుద్ధం?; దీనిన్= ఈ కర్ణుని మరణాన్ని; వినియున్= వినిన తరువాతకూడా; నాదు= నాయొక్క; మానసంబు= హృదయం; ఏమియున్= ముక్కలూ, చెక్కలూ, చీలికలూ, చంచలమూ కూడా; కాదు= కాకుండా ఉన్నది; (ఇది) వజ్రమయము= (దేనిచేతనూ బ్రద్దలుకాని) వజ్రాలతో నిర్మించినది; కాఁగన్+ఓపున్= అయి ఉంటుంది.

**తాత్పర్యం:** కర్ణుడు సామాన్యుడు కాడు. సుయోధనుడిని సంతోషపెట్టాలనే అతడి పూనికమీదా, పాండవులను జయించాలనే అతడి అభిలాషమీదా ఆధారపడి దుర్యోధనుడు పాండవులంతటివారితో పగపెట్టుకొనటానికి సిద్ధపడ్డాడు. కర్ణుడి ప్రయత్నంవలన విదేహ దేశాధిపతి, పుండ్రదేశ ప్రభువు మొదలయిన రాజులు దుర్యోధనుడికి కప్పం కట్టుతున్నారు. కర్ణుడి అండచూచికొని కౌరవసేనలు ఆటాడినట్లు యుద్ధం చేస్తున్నాయి. కర్ణుడివద్ద ఉన్న దివ్యాస్త్రాలకు సాటి లేదు. అవి చాలా రకాలుగా ఉన్నాయి. వాటి ప్రభావం దేవతలకు కూడా ఆశ్చర్యం కొలుపుతుంది. అటువంటి కర్ణుడే మరణించాడంటే ఇంక మనకు బ్రతుకెక్కడ? మన మీ యుద్ధంలో జయించము. ఇంత నిరాశ, ఇంత దుఃఖమూ కలిగించే ఈ వార్త విన్న తరువాత కూడా నా మనస్సు అట్లాగే ఉన్నది, బ్రద్దలు కాలేదు, చీలి పోలేదు, స్తిమితం తప్పలేదు. దీనినిబట్టి ఇది రక్తమాంసాలతోకాక, దేనితోనూ బ్రద్దలుకాని వజ్రాలతో నిర్మించబడినదేమో అనిపిస్తున్నది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. 'పాండుసూనులు' అనటంలో పాండురాజే దిగ్విజయం చేసినవాడు. అతడి కుమారులు దేవాంశసంభూతులు కూడాను. అట్టివారితో పగ సామాన్యం కాదు అని చెప్పటం. 'మన మూఁకలు' అనటంలో కర్ణుడు లేని కౌరవసైన్యాలు వట్టి గుంపులు, వ్యర్థులు అనే నిరాశవలన కలిగిన తేలికబుద్ధి తెలుస్తున్నది. కర్ణుడి అస్త్రాలు స్వర్గంలో పుట్టాయి. దేవతలు స్వర్గంలో ఉంటారు. వారు అమరులు. మరణంలేనివారు. వీటి ప్రభావం వారికే ఆశ్చర్యం కలిగించేదంటే అవి సాటిలేనివి. అదీకాక, దేవతలవద్ద ఒకొక్కరి వద్ద ఒక్కొక్క దివ్యాస్త్రం ఉంటుంది. కర్ణుడివద్ద అనేకాలున్నాయి. కనుక అద్భుతం.

**వ. అని విలాపించి మఱియును. 22**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; విలాపించి= శోకించి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** ఈ రీతిగా శోకించి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పొరి బంధు పుత్త్ర మిత్త్రుల । పరిభవములు వించునిట్లు ప్రాణముతో నె**
**వ్వరు నుండుదురే? యే నొ । క్కరుఁడును దక్కంగ నింత కష్టం బగునే?' 23**

**ప్రతిపదార్థం:** పొరిన్= క్రమంగా; బంధు= చుట్టాలయొక్క; పుత్త్ర= కుమారులయొక్క; మిత్త్రుల= స్నేహితులయొక్క; పరిభవములు= పరాభవాలు, నాశనాలు; వించున్= వింటూ; ఏను= నేను; ఒక్కరుండును= ఒక్కణ్ణీ; తక్కంగన్= తప్ప; ఎవ్వరున్= ఎవరైనా; ఇట్లు= ఈ విధంగా; ప్రాణముతోన్= ప్రాణాలతో; ఉండుదురే?= ఉంటారా?; ఇంత= ఇంత ఎక్కువ పరిమాణంకల; కష్టంబు= బాధ; అగునే?= (ఎవరికైనా) కలుగుతుందా?

**తాత్పర్యం:** వరుసగా చుట్టాలూ, కొడుకులూ, మిత్రులూ చనిపోయారనీ, ఓడిపోయి అవమానం పాలయ్యారనీ వింటూ, నేను తప్ప మరొకరెవరైనా ఇట్లా ప్రాణాలతో ఉండగలరా? ఇంతకష్టం అసలు ఎవరికయినా సంభవిస్తుందా?'

**వ. అని పలికి మరణోద్యుక్తుండై జలాగ్ని విషప్రాయోపవేశాదు లుగ్గడించిన విని సంజయుం డతని కిట్లనియె. 24**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా; పలికి= మాటాడి; మరణ= మరణించటానికి; ఉద్యుక్తుండై= సంసిద్ధుడై; జల= నీటిలో దూకటం; అగ్ని= నిప్పంటించుకొనటం; విష= విషం మ్రింగటం; ప్రాయోపవేశ= మరణంకోసం ఉపవసిస్తూ కూర్చోవటం; ఆదులు= మొదలయినవి; ఉగ్గడించినన్= పలుకగా; విని= ఆలకించి; సంజయుండు= సంజయుడు; అతనికిన్= ధృతరాష్ట్ర మహారాజుతో; ఇట్లు= ఈ(చెప్పబోయే) విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** ఇట్లా పలికి ధృతరాష్ట్ర మహారాజు ప్రాణాలు విడిచిపెట్టటానికి సిద్ధపడ్డాడు. 'నీళ్ళలో దూకుతాను లేదా నిప్పంటించుకొంటాను, లేదా విషం మింగుతాను, లేదా ప్రాణాలు పోయేవరకూ తిండి మాని కూర్చుంటాను' మొదలయిన మాటలన్నాడు. సంజయుడు ఆ మాటలన్నీ విని ఆ మహారాజుతో ఇట్లా అన్నాడు:

**చ. 'కులమును శ్రీయుఁ దేజము నకుంఠితకీర్తియుఁ జూడఁ దొంటి రా**
**జులకెనవత్తు నీ విటులు శోక సమాకుల చిత్తవృత్తిమైఁ**
**గలఁగుట యొప్పునే? శ్రుతము గౌరవముం బొగ డొందునట్లుగా**
**నిలువుము ధీరతాతిశయ నిష్ఠఁ జలింపక యుండు భూవరా!' 25**

**ప్రతిపదార్థం:** భూవరా!= భూమిపతీ, రాజా!; (నీకున్న) కులమును= కులమును; శ్రీయున్= ధనమూ; సంపదా, రాజ్యసంపదా, ఉన్నతస్థితీ, గొప్పదనమూ; తేజమున్= తేజస్సూ; అకుంఠిత= మొక్కవోని; కీర్తియున్= బలాదుల వల్ల వచ్చిన పేరూ; చూడన్= చూడగా; నీవు= నీవు; తొంటి= పూర్వపు; రాజులకున్= భూపతులకు; ఎనవత్తు(వు)= సాటిరాగలవు; నీవు= ఇట్టి నీవు; ఇటులున్= ఈ విధంగా; శోక= వగపు వల్ల; సమాకుల= పూర్తిగా కలతచెందిన; చిత్త= మనస్సుయొక్క; వృత్తిమైన్= చేష్టచేత; కలఁగుట= కలతపాలు కావటం; ఒప్పున్+ఏ?= తగునా?; శ్రుతము= విద్యా; గౌరవమున్= గొప్పదనమూ, మన్ననా; పొగడు+ ఒందు+అట్లుగాన్= ప్రశంసపొందే విధంగా; నిలువుము= నిలబడుము; ధీరతా= ధైర్యంయొక్క; అతిశయ= ఎక్కువయొక్క; నిష్ఠన్= ఉనికితో; చలింపక= నిలకడతో; ఉండు= ప్రవర్తించు.

**తాత్పర్యం:** 'రాజా! నీకున్న వంశమూ, సిరిసంపదలూ, తేజస్సూ, ఎదురులేని పేరుప్రతిష్ఠలూ చూస్తే నీవు పూర్వరాజులతో సరితూగగలవు. ఇటువంటి నీవు ఇట్లా దుఃఖపడి మనస్సు కలవరపరచుకొనటం తగదు. నీ చదువూ నీ గొప్పదనమూ నీకు గల మన్ననా నలుగురు మెచ్చుకొనేటట్లు నిలబడుము. నీ మహాధైర్యం చలించకుండా ఉండుము.'

**వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె. 26**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (సంజయుడు అట్లా) పలికిన తరువాత; ఆంబికేయుండు= అంబికా కుమారుడయిన ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయునితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= పలికాడు.

**తాత్పర్యం:** సంజయు డా విధంగా పలికిన తరువాత ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు:

**తే. 'శోకవారిధిపారంబు నాకుఁ బొంద, । నేల వచ్చుఁ? జిత్తంబునఁ గీలుకొని య**
**సహ్యమై కర్ణ మరణోపజనితమైన । పరిభవం బను శల్య మాతురతఁ జేయ. 27**

**ప్రతిపదార్థం:** కర్ణ= కర్ణునియొక్క; మరణ= మరణించటంచేత; ఉపజనితము+ఐన= సంభవించిన; పరిభవంబు= పరాభవం, నాశనం, ఓటమి; అను= అనే; శల్యము= బాణం; చిత్తంబునన్= మనస్సులో; కీలుకొని= నాటుకొని; అసహ్యము+ఐ= భరింపరానిదై; ఆతురతన్+చేయన్= పీడ కలిగిస్తుండగా; నాకున్= నాకు; శోక= వగపు అనే; వారిధి= సముద్రంయొక్క; పారంబు= అవతలిగట్టు; పొందన్= పొందుట; ఏలవచ్చున్= ఎట్లా సాధ్యమౌతుంది.

**తాత్పర్యం:** కర్ణుడి మరణం వలన సర్వనాశనమైపోయింది. ఓడిపోయాము అనే భావం ఒక బాణంవలె నా గుండెలో దిగి ఉండి భరించరాని బాధ కలిగిస్తున్నది. దీనివలన వస్తున్న శోకం ఒక సముద్రంవలె ఉన్నది. ఇట్టి పరిస్థితిలో ఈ శోకం అనే సముద్రాన్ని దాటటం నాకు ఎట్లా సాధ్యమౌతుంది?

**క. పౌరుష మేటికి దైవం । బేరూపునఁ జూడ ఫలద మే మందము దో**
**స్సార నితాంతోజ్జ్వలుఁ డగు । నారాధేయుండు సచ్చె నర్జునుచేతన్. 28**

**ప్రతిపదార్థం:** పౌరుషము= మానవ (జీవుడి) ప్రయత్నం; ఏటికి?= ఎందుకు?; దైవంబు= విధి; ఏరూపునన్= ఏ విధంగా; చూడన్= చూచినా; ఫలదము= ఫలం ఇచ్చేది; దోస్సార= బాహువులయొక్క బలంచేత; నితాంత= ఎల్లప్పుడు; ఉజ్జ్వలుఁడు+అగు= ప్రకాశించేవాడైన; ఆ రాధేయుండు= అంతటి కర్ణుడు; అర్జునుచేతన్= (అంతటివాడుకాని) అర్జునుని చేతిలో; చచ్చెన్= మరణించాడు; ఏమి+అందము= ఏమి చెప్పగలము?

**తాత్పర్యం:** జీవుడు చేసే ప్రయత్నం నిష్ప్రయోజనం. ఎట్లా ఆలోచించినప్పటికి చేసిన కర్మకు ఫలం ఇచ్చేది విధియే. నిరంతరం బాహుబలంతో ప్రకాశిస్తూ ఉండే అంతటి కర్ణుడు అర్జునుడి చేతిలో చనిపోయాడు. విధియే ఫలాన్నిస్తుందని అనక ఇంక ఏమి అనగలము?

**విశేషం:** అలం: అర్థాంతరన్యాసం.

**క. అలఘుతరాయువు నాకుం । గల దది యెట్లనినఁ బోరఁ గర్ణుని పా టేఁ**
**దెలియవినఁగ నా డెందము । పలువఱియలు గాక యున్న భంగి నెఱిఁగితిన్. 29**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకు; అలఘుతర+ఆయువు= మిక్కిలి పెద్దదైన ఆయుస్సు; కలదు= ఉన్నది; అది= ఆ విషయం; ఎట్లు= ఏ విధంగా తెలిసినది; అనినన్= అనగా, అంటే; పోరన్= యుద్ధంలో; కర్ణునిపాటు= కర్ణునియొక్క పడిపోవటం; ఏన్= నేను; తెలియన్= స్పష్టంగా తెలిసేటట్లు; వినఁగన్= వినియుండినప్పటికీ; నా డెందము= నా హృదయం; పలు= అనేకమయిన; పఱియలు= ముక్కలు; కాక= అయిపోవక; ఉన్న= ఉండిన; భంగిన్= పద్ధతిచేత; ఎఱిఁగితిన్= తెలిసికొన్నాను.

**తాత్పర్యం:** నాకు చాలా దీర్ఘాయువున్నది. అది ఎట్లా చెప్పగలనంటే, కర్ణుడు యుద్ధంలో మరణించాడు అనే మాట స్పష్టంగా విన్న తరువాత కూడా నా హృదయం ఎన్నో ముక్కలై పోకుండా ఉన్నందువల్ల నాకు చాలా ఆయువున్నదని తెలిసికొన్నాను.

**క. మును లోకముచే సత్కృతి । గని నెగడెడు వాఁడ నాకుఁ గలవారెల్లం**
**జన శోచ్యుఁడ నై దుర్దశ । నునికి మనికి యగునె? దీని కోర్వఁగ వశమే? 30**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం, ఇదివరకు; లోకముచేన్= జనంచేత; సత్కృతి= సత్కారం; కని= పొంది; నెగడెడువాఁడన్= ఒప్పి ఉండేవాణ్ణి; నాకున్= అట్టినాకు; కలవారెల్లన్= ఉన్నవారందరు; చనన్= మరణించగా; శోచ్యుడను+ఐ= శోకింపదగినవాడనై; జాలిపడదగినవాడనై; దుర్దశన్= కష్టదశయందు; ఉనికి= ఉండటం; మనికి= జీవించటం; అగున్+ఎ= తగునా?; దీనికిన్= ఇట్టి స్థితిని; ఓర్వఁగన్= సహించటం; వశమే?= శక్యమా?

**తాత్పర్యం:** ఒకప్పుడు నన్ను లోకం గౌరవించేది. ఇప్పుడు నా బంధుమిత్రాదులందరూ మరణించారు. అందరూ నన్ను చూచి అయ్యో అని జాలిపడదగిన స్థితికి వచ్చాను. ఇట్టి స్థితిలో బ్రతకటమూ ఒక బ్రతుకా? ఇట్టి స్థితిని భరించగలనా?

**సీ. దుఃఖ పరంపర ద్రొక్కునఁ బెట్టె నా । చిత్తంబు ననిమిషసింధు తనయు**
**పడుటయు ద్రోణుండు పరలోకమున కేఁగు । టయు సూతజుని తెగుటయును వినియు**
**నందుఁ గర్ణుఁడు లేమి యత్యంత దుఃఖంబు । సేసె దుర్యోధను నాస మానె**
**నతఁ డేడుగడయును నైయుండు నతనికి । నెవ్వరు గలరు దిక్కింకఁ జెపుమ**

**ఆ. మన బలంబుచేవయును వైరిసైన్యంబు । భయముఁ జెడఁగ రాధపట్టి గొంతి**
**పట్టిచేత సమసి పడియున్న వాఁడె? వా । సవుని కడిమిఁ బడిన జంభునట్లు. 31**

**ప్రతిపదార్థం:** దుఃఖపరంపర= దుఃఖాల వరుస; నా చిత్తంబున్= నా మనస్సును; త్రొక్కునన్= ఒత్తిడిలో, బాధలో; పెట్టెన్= ఉంచినది; అనిమిషసింధు= దేవనది అయిన గంగానదియొక్క; తనయు= కుమారుడైన భీష్మునియొక్క; పడుటయున్= పడిపోవటమూ, మరణించనుండటమూ; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; పరలోకమునకున్+ఏఁగుటయున్= పై లోకానికి పోవటము(మరణించటమూ); సూతజుని= సూతపుత్రుడైన కర్ణునియొక్క; తెగుటయును= మరణించటమూ; వినియున్= వినికూడా; అందున్= ఆ ముగ్గురి పడిపోవటాలలోనూ, లేదా దుఃఖపరంపరలోనూ; కర్ణుడులేమి= అంగరాజు లేకపోవటం; అత్యంత= మిక్కిలి; దుఃఖంబు+చేసెన్= దుఃఖాన్ని కలిగించింది; దుర్యోధను+ఆస= దుర్యోధనునియొక్క విజయాశ, లేదా

దుర్యోధనుడు బ్రతికి ఉంటాడనే ఆశ; మానెన్= విడిచిపోయింది; అతఁడు= కర్ణుడు; అతనికిన్= దుర్యోధనునికి; ఏడుగడయునున్+ ఐ= రక్షకుడై; ఉండున్= ఉండేవాడు; ఇంకన్= ఇకముందు; దిక్కు= రక్షకులు; ఎవ్వరు= ఎవరు; కలరు?= ఉన్నారు?; చెపుము+అ= తెలియజేయి; వాసవుని కడిమిన్= ఇంద్రుని పూనికవల్ల; పడిన= మరణించిన; జంభుని+అట్లు= జంభాసురునివలె; రాధపట్టి= రాధకుమారుడు, కర్ణుడు; గొంతిపట్టి చేతన్= కుంతీపుత్రుడయిన అర్జునుని చేత; మనబలంబు= మనసైన్యంయొక్క; చేవయును= బలమూ; వైరిసైన్యంబు= శత్రుసైన్యంయొక్క; భయమున్= జడుపూ; చెడఁగన్= నశించిపోయేటట్లు; సమసి= మరణించి; పడి+ఉన్నవాడు+ఎ= పడిపోయి ఉన్నాడా?

**తాత్పర్యం:** ఒక దుఃఖం తరువాత మరొక దుఃఖం వచ్చిపడుతున్నందువలన నా మనస్సు ఒత్తిడికి గురి అయింది. భీష్ముడు పడిపోవటమూ, ద్రోణుడు చనిపోవటమూ, కర్ణుడు కూలిపోవటమూ దుఃఖం కలిగించాయి. ఈ మూడింటిలో కూడా కర్ణుడు లేకుండాపోవటం మరీ దుఃఖం కలిగించింది. దీనివలన దుర్యోధనుడికి తాను గెలుస్తాననే ఆశ పోయింది. నాకు దుర్యోధనుడు బ్రతికి ఉంటాడనే ఆశ పోయింది. ఎందుకంటే దుర్యోధనుడికి రక్షణ సమస్తమూ కర్ణుడేకదా. ఇంక కాపాడే వా రెవరున్నారు చెప్పుము? ఎవ్వరూ లేరు. జంభాసురుడు ఇంద్రుడిచేతిలో మరణించినట్లు అర్జునుడి చేతిలో కర్ణుడు మరణించాడా? మనసైన్యానికి ధైర్యమూ, శత్రుసైన్యానికి భయమూ పోయేటట్లు చచ్చిపడి ఉన్నడా?

**విశేషం:** అలం: ఉపమ. 'అనిమిషసింధుతనయుడు' అని భీష్ముడిని అనటంలో గంగాపుత్రునంతటి వాడని భీష్ముడి అజేయత్వం సూచితం. ద్రోణుఁడు అనటం కూడా అట్టిదే, ద్రోణంలో పుట్టటం అంటే అద్భుతమైన పుట్టుక కలవాడు పోవటమేమిటి అని. అందుకు 'కర్ణుడిలేమి అత్యంత దుఃఖంబుసేసె' అనటంలో భీష్మద్రోణులు చేయలేని పని కర్ణుడు చేస్తాడని ధృతరాష్ట్రుడు కూడా ఎంత ఆశపెట్టుకొన్నాడో, అది ఎంత అజ్ఞానజన్యమో తెలియజేస్తుంది.

**క. 'విను పిచ్చుకకుం టతిరయ । మునఁ బోకకుఁ బడుట, పేదముదుకఁడు వేశ్యా**
**జనముం గోరుట దుర్యో । ధనుఁడింక జయంబు గొనఁగఁ దలఁచుట యరయన్. 32**

**ప్రతిపదార్థం:** విను= ఆలించు; ఇంకన్= కర్ణుడు పడిపోయిన తరువాత కూడా; దుర్యోధనుఁడు; జయంబు= గెలుపు; కొనఁగన్= పొందటానికి; తలఁచుట= భావించటం; అరయన్= ఆలోచింపగా; పిచ్చుకకుంటు= కాళ్ళులేనివాడు; అతిరయమునన్= మిక్కిలివేగంతో; పోకకున్+పడుట= నడవటానికి ప్రయత్నించటం వంటిది; పేదముదుకఁడు= బీదవాడయిన వృద్ధుడు; వేశ్యాజనమున్+కోరుట= వెలకాంతలను వాంఛించటం వంటిది.

**తాత్పర్యం:** దుర్యోధనుడు కర్ణుడు చనిపోయిన తరువాత, ఇంకా యుద్ధంలో గెలుస్తాననుకోవటం, కుంటివాడు వడి వడిగా నడవటానికి ప్రయత్నించటం వంటిది. దరిద్రుడూ వృద్ధుడూ అయినవాడు వేశ్యలు కావాలనుకొనటం వంటిది. (నిష్ప్రయోజన మన్నమాట.)

**విశేషం:** అలం: నిదర్శన. పేదముదుకఁడు అనటం చాలా అర్థవంతం. వేశ్యాజనం సొమ్మిస్తేనే కాని లభించరు. వీడు పేదవాడు. పోనీ ఎంత డబ్బుమనిషికైనా వలపు ఉండవచ్చుగదా అంటే ఇతడు వృద్ధుడు కూడా. పడుచుకు వృద్ధుడిమీద వలపు అరుదు. అదీకాక, వృద్ధుడికి మాత్రం వనితవలన ప్రయోజనమేమిటి? ఎటుచూచినా ఇది వ్యర్థమైన ఆశ. మరొక విశేషం. ఈ దరిద్రవృద్ధుడు కోరుకొనేది ఒక వేశ్యను కాదు వేశ్యాజనాన్ని. ఒక్కతె కూడా అలభ్యా, అనవసరమూ అయితే జనం కావాలనుకొనటం ఇంకా వెర్రి.

**క. మనలోఁ గయ్యం బేటికి । నని ధర్మసుతుండు సెప్పె నది మీ పతి గై**
**కొనఁ డయ్యె రోగి పథ్యా । శనమునకుం జొరని భంగి సంజయ! యెట్లున్. 33**

**ప్రతిపదార్థం:** సంజయ!= ఓ సంజయా!; మనలోన్= అన్నదమ్ములమై కౌరవ పాండవుల మధ్య; కయ్యంబు+ఏటికిన్= యుద్ధం ఎందుకు?; అని; ధర్మసుతుండు= యుధిష్ఠిరుడు; చెప్పెన్= తెలిపినాడు; రోగి= తెగులుగొంటు; పథ్య+అశనమునకున్= మేలుకలిగించే అన్నానికి; చొరని భంగిన్= అంగీకరింపని రీతిగా; అది= ఆ యుధిష్ఠిరుని మాటలను; మీ పతి= మీ రాజయిన దుర్యోధనుడు; ఎట్లున్= ఏ విధముగానూ; కైకొనఁడు+అయ్యెన్= అంగీకరించాడు కాడు.

**తాత్పర్యం:** 'మీరూ మేమూ అన్నదమ్ముల బిడ్డలము, అన్నాదమ్ములము. మనలో మనకు కలహం ఎందుకు?' అని యుధిష్ఠిరుడు చెప్పాడు. జబ్బు చేసినవాడికి పథ్యం సయించదు. అట్లాగే ఆ మంచిమాట దుర్యోధనుడికి సమ్మతం కాలేదు.

**విశేషం:** అలం: ఉపమ. ధర్మసుతుడు అనగా ధర్మదేవత అయిన యముడి అంశవలన పుట్టిన యుధిష్ఠిరుడు. అతడు ధర్మమే చెపుతాడు. అతడు చెప్పినది మేలుచేస్తుంది అని సాభిప్రాయం. 'మీ పతి కైకొనఁడు'- ఇది తెలుగు వారి మాటతీరు పుణికి పుచ్చుకొన్న ప్రయోగం. ఒకడు ఇద్దరికీ సంబంధించిన వాడైనపుడు, మంచి చేస్తే మనవాడు, చెడుచేస్తే మీ వాడు అని పలకటం సహజం. దుర్యోధనుడు సంజయుడి కంటె ధృతరాష్ట్రుడికే కొడుకుగా దగ్గరవాడు. కాని, యుధిష్ఠిరుడి మాట వినక చెడిపోతున్నాడు. కనుక, మీ రాజుకు అంగీకారం కాలేదు అనటం. రోగితో అతనిని పోల్చటం చాలా మనోహరం. తినగూడనిది తినటమూ, తినవలసినది తినకపోవటమూ రోగానికి కారణం. ఆ రోగం పోవాలంటే మళ్ళీ మేలుచేసే ఆహారమే తినాలి. కాని, రోగికి అది సయించదు. రోగాన్ని పెంచే అపథ్యాహారమే అప్పుడూ తింటాడు. చివరికి ఆ రోగంవలన మరణిస్తాడు. దుర్యోధనుడు వినగూడని మాటలు విని పాడైపోయాడు. మేలుచేసే మాట వినలేదు.

**సీ. శరతల్పమున నుండి శాంతనవుండు బీ । భత్సు దివ్యాస్త్ర వైభవము దెలుపఁ**
**దివిరి జలంబట్లు దెప్పించుకొని యప్డు । పాండుసూనులతోడి బాంధవంబు**
**నడపుము సిరి పంచి కుడుచుట మే లింత । తోఁ గయ్యముడిగి శాంతుఁడవు గమ్ము**
**బ్రదుకుము నీవన్న పనుపుసేయఁడు సుయో । ధనుఁ డిప్డు శోకాబ్ధి మునుఁగకున్నె?**

**ఆ. పడుచు లీఁక లూడ్చి పట్టి యాడెడు నట్టి । పులుఁగు చందమయ్యెఁ దలఁప నాయ**
**వస్థ యెందుఁ జొచ్చువాఁడ? నీ యలమట । దీర్ప నెవ్వరింక దిక్కు గలరు?' 34**

**ప్రతిపదార్థం:** సుయోధనుఁడు= దుర్యోధనుడు (కర్త); శాంతనవుండు= శంతను మహారాజు కుమారుడైన భీష్ముడు (గర్భవాక్యంలోని కర్త); బీభత్సు= అర్జునునియొక్క; దివ్య= దేవలోకంలో పుట్టిన; అస్త్ర= మంత్రప్రయుక్తాలయిన ఆయుధాల యొక్క; వైభవము= ఐశ్వర్యాన్ని; తెలుపన్+తివిరి= తెలియజేయటానికి ప్రయత్నించి; జలంబు= పాతాళజలం; అట్లు= ఆ విధంగా; తెప్పించుకొని= అర్జునునిద్వారా వచ్చేటట్లుచేసి; అప్డు= ఆ సమయంలో; పాండుసూనులతోడి= పాండవులతో; బాంధవంబు= చుట్టరికం; నడపుము= కొనసాగించుము; సిరి= రాజ్యసంపద; పంచి= విభాగించి, (తగిన భాగం పాండవులకు విడదీసి యిచ్చి); కుడుచుట= (నీ వంతు నీవు) అనుభవించటం; మేలు= మంచిది; ఇంతతోన్= ఇంతటితో; కయ్యము+ ఉడిగి= యుద్ధము మాని; శాంతుఁడవు= శాంతించినవాడవు; కమ్ము= అగుము; నీవు; బ్రదుకుము= సుఖంగా జీవించుము; అన్న= అని చెప్పిన; పనుపు= ఆజ్ఞ; చేయఁడు= ఆచరించడు; ఇప్డు= ఇప్పుడు; శోక+అబ్ధిన్= దుఃఖం అనే సముద్రంలో;

మునుఁగక+ఉండున్+ఎ?= మునిగిపోవక జీవించి ఉంటాడా?; తలఁపన్= ఆలోచించగా; నా+అవస్థ= నాస్థితి; పడుచులు= పిల్లలు; ఈఁకలు= రెక్కలలోని భాగాలు; ఊడ్చి= పీకి; పట్టి= పట్టుకొని; ఆడెడు+అట్టి= ఆడుకొనే; పులుఁగు= పక్షియొక్క; చందము= రీతి; అయ్యెన్= అయినది; ఎందున్= ఎక్కడికి; చొచ్చువాఁడన్?= వెళ్ళేది; ఈ+అలమట= ఈ బాధ, ఈ దుఃఖం; తీర్పన్= పోగొట్టటానికి; దిక్కు= గతి; ఇంకన్= మిగిలి; ఎవ్వరు కలరు?= ఎవరు ఉన్నారు?.

**తాత్పర్యం:** అంపశయ్యమీద ఉన్న భీష్ముడు అర్జునుడి దివ్యాస్త్రాల గొప్పతనం ఏమిటో దుర్యోధనాదులకు తెలియజేయదలచుకొని పాతాళజలం కావాలన్నాడు. అర్జునుడు అస్త్రం ప్రయోగించి ఆ నీరు బయటికి రప్పించి ఎకాయెకి భీష్ముడి నోటిలో పడేటట్లు చేశాడు. అట్లా తెలియజేసిన తరువాత దుర్యోధనుడితో 'పాండవులతో స్నేహంతో ప్రవర్తించుము. రాజ్యం విభజించి వారివంతు వారి కిచ్చి నీ వంతు నీవు అనుభవించటం మంచిది. ఇప్పటికే చాలా నష్టపోయావు. యుద్ధం మాని శాంతి వహించి సుఖంగా జీవించుము' అని చెప్పాడు. దుర్యోధనుడు ఆయన ఆదేశం మన్నించాడు కాడు. ఇపుడు సముద్రంవంటి శోకం వచ్చిపడింది. ఇందులో మునిగిపోవక బ్రదుకగలడా? పిల్లలు పిట్టను పట్టుకొని, దాని ఈకలు లాగివేసి ఎగురలేకుండా చేసి, ఎట్లా ఆడిస్తే అది అట్లా ఆడుతూపడి ఉంటుంది. ఆలోచిస్తే నేను చేసికొన్న కర్మలు నావాళ్ళనందరినీ నాకు దూరంచేసి, నన్ను నిస్సహాయుడిని చేసి, నన్ను అలా ఆడిస్తున్నాయి. ఈ బాధ తప్పించుకొనటానికి ఎక్కడికి వెళ్ళేది? ఈ బాధ తొలగించే వారు నా కెవరు మిగిలి ఉన్నారు?'

**విశేషం:** అలం: ఉపమ. తిక్కనగారి మహాకవిత్వం ప్రతి పదంలోనూ కనిపిస్తున్నది. 'శరతల్పమున నుండి' అనటంలో భీష్ముడు మరణోన్ముఖుడై ఉన్నాడు, ఆయన ఇదివరకటి వలె పక్షపాత బుద్ధికలవాడు కాడు. ఇట్టి పరిస్థితిలో ఏమి చేసినా ఎల్లరిమేలుకే తప్ప స్వార్థంతో కాని, పక్షపాతబుద్ధితోకాని, ఏ పనీ చేయడని సూచితం. 'శాంతనవుండు' అనటంలో ఆయన జన్మపవిత్రత సూచితం. భీష్ముడి తండ్రి రోగగ్రస్తుడిని తన చేతులతో స్పృశిస్తే అతని రోగం తొలగి శరీరం (తనువు) శాంతి వహించేది. కనుక అతడు శాంతతనుడు - శంతనుడు అని అనిపించుకొన్నాడు. అట్టివాని పుత్రుడు అహితం చెప్పడని సూచితం.

అట్టిదే 'బీభత్స' శబ్దం. అర్జునుడి గొప్పతనం దీని ద్వారా చెప్పదలచుకొన్నాడు భీష్ముడు. అర్జునుడు యుద్ధం చేస్తుంటే యుద్ధభూమిని చూస్తే జుగుప్స కలిగేటట్లు చంపుతాడట. అందువలన అతడి కాపేరు. అట్టివాడికి దివ్యాస్త్రాలు తోడు. కనుక అతడితో స్నేహమే కార్యం అని స్ఫురిస్తుంది.

**వ. అని పెక్కు భంగుల నివ్వటిలు నెవ్వగలు బయలుపడం బలు మాట లాడి రాధేయు తెగిన తెఱంగు తెలియ వినం దలంచి యిట్లనియె. 35**

**ప్రతిపదార్థం:** అని= ఈ రీతిగా; పెక్కు= అనేకమయిన; భంగులన్= విధాలుగా; నివ్వటిలు= అధికమయే; నెఱ+వగలు= నిండు దుఃఖాలు; బయలు పడన్= వెలికి వచ్చేటట్లు; పలు= అనేకమయిన; మాటలు+ఆడి= పలుకులు పలికి; రాధేయు= కర్ణునియొక్క; తెగిన= మరణించిన; తెఱంగు= పద్ధతి; తెలియన్= స్పష్టమయ్యేటట్లు; వినన్= వినటానికి; తలంచి= ఊహించి; ఇట్లు+అనియెన్= ఈ రీతిగ పలికెను.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి మనస్సులో రకరకాలుగా దుఃఖం పెల్లుబుకుతున్నది. అదంతా బయటపడే విధంగా ఆయన ఇంతకుముందు చెప్పినట్లు చాలా పలుకులు పలికాడు. ఆ తరువాత ఆయనకు కర్ణుడు ఎట్లా నేల కొరిగాడో తెలిసికొనాలనిపించింది. కనుక సంజయుడితో ఇట్లా అన్నాడు:

**మ. 'విజయుం దాఁకి పెనంగుచో నతని దోర్వీర్యంబు సైరించెనో**
**భుజ దర్పోద్ధతిఁ జూప నోపెనొ చలంబుం జేవయున్ సైన్య యు**
**గ్మజనంబుల్ వినుతింపఁ బేర్చెనొ తొలంగం బాఱెనో తెంపు న**
**క్కజపుంబెంపును దీఱ డింపఁడు గదా! కర్ణుండు దీనాకృతిన్. 36**

**ప్రతిపదార్థం:** కర్ణుండు= అంగరాజు; విజయున్= అర్జునుని; తాఁకి= ఎదుర్కొని; పెనంగుచోన్= పోరాడే సమయంలో; అతని= అర్జునునియొక్క; దోః+వీర్యంబు= బాహువులయొక్క బలం; సైరించెన్+ఓ= సహించినాడో; భుజ= భుజములయొక్క; దర్ప= గర్వంయొక్క; ఉద్ధతిన్= విజృంభణాన్ని; చూపన్+ఓపెన్+ఒ= ప్రదర్శింపగలిగినాడో; చలంబున్= పట్టుదలనూ; చేవయున్= సామర్థ్యమునూ; సైన్య= సేనలయొక్క; యుగ్మ= జంటలోని; జనంబుల్= జనులు; వినుతింపన్= మిక్కిలి పొగడునట్లుగా; పేర్చెన్+ఒ= విజృంభించినాడో; తొలంగన్= తప్పికొనగా; పాఱెన్+ఓ= పారిపోయినాడో; దీన+ఆకృతిన్= జాలికలిగించే రూపంతో; తెంపున్= సాహసమూ; అక్కజపున్= ఆశ్చర్యమును కలిగించే; పెంపును= అతిశయాన్ని; తీఱన్= నశించేటట్లుగా; డింపఁడు+కదా!= విడువడు కదా!

**తాత్పర్యం:** 'కర్ణుడు అర్జునుడిని ఎదుర్కొని యుద్ధం చేసేటప్పుడు అతడి బాహుబలం సహించాడా? తన భుజబల గర్వవిజృంభణం చూపించగలిగాడా? పట్టుదలా, పౌరుషమూ ఉభయసేనలలోని వారూ ప్రశంసించే విధంగా విజృంభించాడా? లేక పారిపోయాడా? సాహసాన్ని, అతిశయాన్ని దైన్యంతో విడిచిపెట్టలేదు గదా!

**విశేషం:** కర్ణుడి గురించి అట్లా చేశాడా, ఇట్లా చేశాడా అని అడుగుతూ ధృతరాష్ట్రుడు చివర వేసిన ప్రశ్న ఆశ్చర్యం కలిగిస్తుంది. కర్ణుడి బలశౌర్యాల మీద ధృతరాష్ట్రుడి కెంత ఆశ ఉన్నదో, అతడి దౌర్బల్యాన్ని గురించిన స్పష్టజ్ఞానం కూడా ఉన్నదని ఇందువలన తెలుస్తుంది. ఘోషయాత్రలో గంధర్వులతో యుద్ధంలో తెంపూ పెంపూ విడిచి, దుర్యోధనుడిని అతడి కర్మానికి వదలి పారిపోయాడు. పట్టిన పట్టు విడిచిపోవటం అన్నది అతడి దౌర్బల్యం. అది ధృతరాష్ట్రుడికీ తెలుసు. అయినా, అతడికీ దుర్యోధనుడికి వలెనే ఇతడిపై ఆశ. ఆశకు అంతే కాదు, అర్థం కూడా ఉండదు.

**క. తక్కటి సైనికు లని న । య్యొక్కని దిగవిడిచి పాఱిరో? లావుం బే**
**రుక్కును మెఱయఁగఁ దోడ్పడి । పెక్కండ్రురు పడిరొ? బెరసుఁ బీనుంగులుగాన్. 37**

**ప్రతిపదార్థం:** తక్కటి= మిగిలిన; సైనికులు= యుద్ధభటులు; అనిన్= యుద్ధములో; ఆ+ఒక్కనిన్= ఆ కర్ణుని ఒక్కడినీ; దిగన్+విడిచి= విడిచిపెట్టి; పాఱిరి+ఓ?= పారిపోయారా?; లావున్= బలమూ; పేరుక్కున్= అధికమైన ప్రతాపమూ; మెఱయంగన్= ప్రకాశింపగా; తోడ్పడి= సాయపడి; పెక్కండ్రురు= అనేకమంది సైనికులు; పెరసున్= మాంసమూ; పీనుంగులుగాన్= శవాలూ అయ్యేటట్లుగా; పడిరి+ఒ?= కూలిపోయి మరణించారా?

**తాత్పర్యం:** మిగిలిన యుద్ధభటులు యుద్ధంలో కర్ణుడిని ఒక్కడినీ విడిచిపెట్టి పారిపోయారా? బలమూ, అధికమైన ప్రతాపమూ ప్రకాశింపగా అనేకమంది సైనికులు సహాయపడి మాంసమూ, శవాలూ అయ్యేటట్లుగా మరణించారా?

**వ. అని మఱియును. 38**

**ప్రతిపదార్థం:** అని= అట్లా పలికి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** ఇట్లా అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ముందర శిఖండి నిడి సం । క్రందననందనుఁడు సేరి గంగా తనయున్**
**వ్రుందించెఁ గపటమున నా । చంద మొకటి కర్ణునందుఁ జర్చించిరొకో? 39**

**ప్రతిపదార్థం:** సంక్రందన నందనుఁడు= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; ముందరన్= అగ్రభాగంలో; శిఖండిన్= ఆ పేరిటి ద్రుపదమహారాజు కుమారుని; ఇడి= ఉంచి; గంగా తనయున్= గంగా కుమారుడైన భీష్ముని; చేరి= సమీపించి; కపటమునన్= మోసముతో; వ్రుందించెన్= సంహరించాడు; ఆ చందము+ఒకటి= ఆ రీతి ఉపాయం ఒకటి; కర్ణు+అందున్= కర్ణుని విషయంలో కూడా; చర్చించిరి+ఒకో?= ఆలోచన చేశారా?

**తాత్పర్యం:** అర్జునుడు తన అగ్రభాగంలో శిఖండిని ఉంచుకొని అతడి వెనుక తా నుంటూ భీష్ముడిని సమీపించి, మోసంతో ఆయనను సంహరించాడు కదా!, ఆ ప్రకారం కర్ణుడి విషయంలో కూడా కపటోపాయం ఒకటి పాండవులు ఆలోచించారా?

**క. సామజము వడిన నశ్వ । త్థామవడియె ననఁడె? ధర్మతనయుఁడు గురునిం**
**దా మడియించుటకై య । ట్టే మేని యొనర్చి రొక్కొ? యితఁడు వడుటకున్. 40**

**ప్రతిపదార్థం:** ధర్మతనయుఁడు= యుధిష్ఠిరుడు; సామజము= ఏనుగు; పడినన్= కూలిపోగా; గురునిన్= గురువైన ద్రోణుని; తాన్= తాను; మడియించుటకున్+ఐ= సంహరించటం కోసం; అశ్వత్థామ= అశ్వత్థామ; పడియెన్= కూలిపోయాడు; అనఁడు+ఎ?= అని పలుకలేదా?; ఇతఁడు= కర్ణుడు; పడుటకున్= కూలిపోవటానికి; అట్టు= ఆ తీరుగా; ఏమి+ఏని= ఏదైనా; ఒనర్చిరి+ ఒక్కొ?= చేశారా?

**తాత్పర్యం:** అశ్వత్థామ అను పేరుగల ఏనుగు చచ్చిపోతే, ద్రోణుడిని సంహరించాలనే అభిప్రాయంతో, యుధిష్ఠిరుడే ఆయన కొడుకు అశ్వత్థామ అన్న భ్రాంతి కలిగేటట్లు 'అశ్వత్థామ పడియె' అన్నాడు కదా! అట్లా కర్ణుడిని సంహరించటానికి కూడా ఏమైనా చేశారా?

**క. మాయోపాయంబుల గాం । గేయుండును గురుఁడు ననిఁ దెగిర కాక రణ**
**న్యాయంబు దప్పకుండఁగ । నా యిరువుర నోర్వ నెవరికైనను వశమే? 41**

**ప్రతిపదార్థం:** గాంగేయుండును= గంగాపుత్రుడైన భీష్ముడూ; గురుఁడును= అఖిలాస్త్రవిద్యాగురువైన ద్రోణుడూ; మాయా+ఉపాయంబులన్= వంచనకుద్దేశించిన పన్నుగడలవలన; అనిన్= యుద్ధంలో; తెగిరి+అ+కాక= ఖండింపబడినారే కాని; రణన్యాయంబు= యుద్ధధర్మం; తప్పక+ఉండఁగన్= విడిచి పెట్టకుండా; ఆ యిరువురన్= ఆ భీష్మద్రోణుల నిద్దరినీ; ఓర్వన్= ఓడించటానికి; ఎవరికిన్+ఐనను= ఎంతటివారికైనప్పటికీ; వశము+ఏ?= శక్యమా? (కాదు).

**తాత్పర్యం:** వంచన చేయాలని పాండవుల పన్నుగడలు పన్నినందువలన భీష్మద్రోణులు యుద్ధంలో నరకబడ్డారు కాని, యుద్ధధర్మం విడువకుండా పోరాడిన వా రెవరైనా వారినిద్దరినీ ఓడించగలరా?

**సీ.** **పరశురాముని చేతఁ బడసిన వాఁడు బ్ర । హ్మాస్త్రంబు సర్పముఖాస్త్ర మలఁతిఁ**
**బోవునె? దివ్యాస్త్రములు పెక్కు మఱియును । గలవు రాధేయున కలవుమెఱసి**
**యభిమన్యు విల్ దునుమాడఁడె నాగాయు । తత్రాణు ననిలనందనుని బాడు**
**దలఁబట్టె సహదేవుఁ జులుకన మర్దించి । మందల విడువఁడే మాయలాని**

**తే.** **మేటిమగని ఘటోత్కచు గీ టడఁపఁడె । యట్టి జెట్టికిఁ బోరఁ జావెట్టి భంగి**
**నయ్యెఁ? దేరికి సూతున కంచితాస్త్ర । ములకు దైవోపహతిఁ జేటు మూఁడెనొక్కొ?** **42**

**ప్రతిపదార్థం:** (కర్ణుఁడు) పరశురాముని చేతన్= భార్గవరాముని నుండి; బ్రహ్మ+అస్త్రంబు= బ్రహ్మ అధిదైవతంగా గల అస్త్రాన్ని; పడసిన వాఁడు= పొందినవాడు; సర్పముఖ+అస్త్రము= సర్పం అగ్రభాగంలో గల అస్త్రం; అలఁతిన్= స్వల్పమైన కారణంవల్ల; పోవున్+ఎ?= పోతుందా?; రాధేయునకున్= కర్ణునికి; మఱియును= ఇవికాక; పెక్కు= అనేకమైన; దివ్య+అస్త్రములు= దివ్యములైన అస్త్రములు; కలవు= ఉన్నాయి; (కర్ణుడు) అలవు= ఉపాయం; మెఱసి= ప్రకాశించి; అభిమన్యు= అభిమన్యుని యొక్క; విల్= ధనుస్సు; తునుము+ఆడఁడు+ఎ= ఖండించలేదా? (అతడు); నాగ= ఏనుగులయొక్క; అయుత= పదివేలయొక్క; త్రాణున్= బలంవంటి బలంకలవాడిని; అనిలనందనుని= వాయుపుత్రుడైన భీమసేనుని; బాడుదలన్+పట్టెన్= అవమానించాడు; సహదేవున్= (పాండవులలో చిన్నవాడైన) సహదేవుని; చులుకనన్= తేలికగా; మర్దించి= కొట్టి; మందల= ప్రాణాలతో; విడువఁడు+ఏ= విడిచిపెట్టలేదా; మాయలాని= మాయలు కలవాడు; మేటిమగని= మహావీరుడు అయిన; ఘటోత్కచున్= ఆ పేరిటి హిడింబానందనుని; గీటు+అడఁపఁడు+ఎ= చంపలేదా; అట్టి= అటువంటి; జెట్టికిన్= యోధునకు; చావు= మరణము; ఎట్టి= ఎటువంటి; భంగిన్= పద్ధతిని; అయ్యెన్?= కలిగింది?; దైవ+ఉపహతిన్= విధియొక్క వంచనచేత; తేరికిన్= రథానికీ; సూతునకున్= సారథికీ; అంచిత+అస్త్రములకున్= ఒప్పుచున్న మంత్ర ప్రయుక్తాలయిన ఆయుధాలకూ; చేటు= చెడటం, నాశం; మూఁడెన్+ఒక్కొ?= సంభవించిందా?

**తాత్పర్యం:** కర్ణుడు పరశురామునంతటివాడివలన బ్రహ్మాస్త్రం గ్రహించాడు. అతడి వద్ద నాగముఖాస్త్రం ఉన్నది. అది స్వల్పకారణంవలన పోయేది కాదు. ఈ అస్త్రాలు రెండూ కాక అతడి వద్ద దివ్యాస్త్రాలు చాలా ఉన్నాయి. అతడు గొప్ప ఉపాయశాలి. అందరినీ గడగడలాడించిన అభిమన్యుడి ధనుస్సు అట్టి ఉపాయంతోనే ఖండించాడు. భీమసేనుడికి పదివేల ఏనుగులకున్నంత బలం ఉన్నది. అట్టివాడిని అవమానించగలిగాడు. మహావీరుడైన సహదేవుడిని అవలీలగా కొట్టి, దయదలచి ప్రాణాలతో విడిచిపెట్టాడు. మహామాయావీ, మహావీరుడు కదా ఘటోత్కచుడు! అట్టి వాడిని సంహరించాడు. ఇటువంటి యోధుడికి మరణం ఎట్లా సంభవించింది? విధి వంచనచేత రథమూ, సారథీ దివ్యాస్త్రాలూ నశించాయా?.

**విశేషం:** ధృతరాష్ట్రుడు కర్ణుడు గెలవటానికే కల సాధనసంపత్తిని పేర్కొన్నాడు. అతడి శూర కృత్యాలు ఉగ్గడించాడు. అట్టివాడు మరణించాడంటే రథమూ సారథీ అస్త్రాలూ పోయి ఉండాలి. అవి పోవటానికి విధివంచనే కారణమై ఉండాలి. ఊహ సరిగానే చేశాడు. కాని, ఇంతకుముందే (41వ పద్యంలో) యుద్ధధర్మం విడువకపోతే భీష్మ ద్రోణులు పడరని వారిని మాయోపాయాలతో పడగొట్టిన ధర్మరాజార్జునులను తప్పుపట్టాడు. అదే గుక్కతో అభిమన్యుడి విల్లు నరకటం కర్ణుడి ఉపాయశాలిత్వంగా ప్రశంసిస్తున్నాడు. అంటే యేమిటి? మన ప్రయోజనంకొరకు, మనకు కిట్టనివారి నష్టంకొరకు, మనవాళ్ళు చేసిన అన్యాయం న్యాయం. అట్టిపని మనకు కిట్టని వాళ్ళు మనకు చేస్తే అది అన్యాయమా?

**క. రథ మవితథమైనను సా । రథిపని నెఱపిన మహాస్త్ర రాజి విధికృతిన్**
**వృథగాకున్నను గర్ణునిఁ । బ్రధనంబున గెల్వ దేవపతికిన్ వశమే? 43**

**ప్రతిపదార్థం:** రథము= తేరు; అవితథము+ఐనను= వ్యర్థముకానిది అయి ఉన్న పక్షంలోనూ; సారథి= సూతుడు; పని= తనపని; నెఱపినన్= చేసిన పక్షంలోనూ; మహా+అస్త్రరాజి= గొప్పవైన మంత్రప్రయుక్తాలైన ఆయుధాల వరుస; విధికృతిన్= దైవచేష్టవల్ల; వృథ+కాక+ఉన్నను= వ్యర్థంకాకుండా ఉన్న పక్షంలోనూ; ప్రధనంబునన్= యుద్ధంలో; కర్ణునిన్= అంగరాజును; గెల్వన్= జయింపగా; దేవపతికిన్= దేవేంద్రునికైనా; వశమే?= శక్యమా?

**తాత్పర్యం:** రథం విరగకుండా నడుస్తుంటే, సూతుడు చెప్పిన ప్రకారం రథంతోలుతూ, అవసరమైన సలహాలిస్తూ, ఉత్సాహపరుస్తూ తన విధి నిర్వహిస్తూ ఉంటే, ఉన్న గొప్ప దివ్యాస్త్రాలు విధివశాత్తూ నిష్ప్రయోజనాలు కాకుండా ఉంటే యుద్ధంలో కర్ణుడిని జయించటం దేవేంద్రుడికైనా శక్యమవుతుందా?

**విశేషం:** ధృతరాష్ట్రుడి ఊహ సరైనదే. రథం క్రుంగింది. శల్య సారథ్యం దివ్యాస్త్రాలు ఉపయోగపడలేదు. కనుక, కర్ణుడు మరణించాడు.

**ఉ. సారథి యెవ్వఁడాతనికి శల్యుఁడు ద్రోణ తనూభవుండు గాం**
**ధార విభుండునుం గృపుఁడుఁ దత్సమయంబున నేమిభంగిఁ దో**
**డైరి? సుయోధనుండు హృదయంబునఁ దాఁ గృతవర్మదర్పము**
**న్బీరము నచ్చియుండుఁ దగ నెయ్యము సూపెనె? యాతఁ డత్తఱిన్. 44**

**ప్రతిపదార్థం:** సారథి= సూతుడు; ఆతనికిన్= కర్ణునికి; ఎవ్వఁడు= ఎవరు; శల్యుడు= మద్రరాజు; ద్రోణతనూభవుండున్= అశ్వత్థామ; గాంధారవిభుండునున్= గాంధారదేశపు రాజైన శకునీ; కృపుఁడున్= కృపాచార్యుడు; తత్సమయంబునన్= కర్ణుడు యుద్ధంచేసే సమయంలో; ఏమి= ఎట్టి; భంగిన్= పద్ధతిని; తోడు+ఐరి?= సాయపడ్డారు?; సుయోధనుండు= దుర్యోధనుడు; హృదయంబునన్= మనస్సులో; తాన్= తాను; కృతవర్మ= కృతవర్మయొక్క; దర్పమున్= గర్వమును; బీరమున్= పరాక్రమమును; నచ్చి+ఉండున్= నమ్మి ఉంటాడు; ఆతఁడు= కృతవర్మ; ఆ+తఱిన్= ఆ సమయంలో; తగన్= తగువిధంగా; నెయ్యము= స్నేహం; చూపెన్+ఎ?= చూపాడా?.

**తాత్పర్యం:** కర్ణుడికి సారథిగా ఉన్నవాడెవడు? సామాన్యుడా! శల్యుడు. అశ్వత్థామ, శకుని, కృపుడు ఆ సమయంలో కర్ణుడికి ఏ విధంగా తోడ్పడ్డారు? దుర్యోధనుడు తన హృదయంలో కృతవర్మ గర్వాన్ని, పరాక్రమాన్ని నమ్మి ఉన్నాడు కదా. ఆ సమయంలో ఆ కృతవర్మ తగువిధంగా స్నేహాన్ని ప్రదర్శించాడా?

**క. వారలు గెలఁకుల నడవఁగ । రారాజు పిఱుందఁ గదిసి రా నెబ్భంగిం**
**గారణము లేదు చావఁగ । నా రాధేయునకుఁ జోద్య మయ్యెడుఁ దలఁపన్. 45**

**ప్రతిపదార్థం:** వారలు= అశ్వత్థామ శకుని కృప కృతవర్మలు; కెలఁకులన్= ఇరుపార్శ్వాల్లా; నడవఁగన్= నడచిరాగా; రారాజు= రాజులకు రాజైన దుర్యోధనుడు; పిఱుందన్= వెనుక; కదిసి= దగ్గరగా ఉంటూ; రాన్= రాగా; ఆ రాధేయునకున్= (స్వయంగా అంతటివాడైన) ఆ కర్ణునికి; చావఁగన్= మరణించటానికి; ఏ+భంగిన్= ఏ విధంగానూ; కారణము= తగిన హేతువు; లేదు; తలఁపన్= ఆలోచింపగా (అతడు మరణించటం); చోద్యము+అయ్యెడున్= ఆశ్చర్యం కలుగుతున్నది.

**తాత్పర్యం:** అశ్వత్థామ, శకుని, కృపాచార్య, కృతవర్మలవంటి వీరులు ఆ వైపునా ఈ వైపునా నడిచి రాగా, మహావీరుడు రాజరాజు అయిన దుర్యోధనుడు వెనుక కాపుగా సమీపంలో ఉంటూ వస్తుండగా, స్వయంగా అంతటివాడైనా కర్ణుడు చనిపోవటానికి అసలు అవకాశమే లేదు. అతడు చనిపోవటం గురించి తలచుకొంటేనే ఆశ్చర్యమవుతున్నది.

**ఉ. పాండవకోటి సూతసుతుపై నడతెంచిన చందమెట్టు? లా**
**ఖండలసూతి సర్పముఖ కాండము తాఁకున రూపుమాసి పో**
**కుండుట యెట్లు కల్గె? సమరోద్ధతి దక్కటి నల్వురందు నె**
**ట్లుండె? బలద్వయంబు నెటులోపి పెనంగె? దినద్వయంబునన్'. 46**

**ప్రతిపదార్థం:** పాండవకోటి= పాండురాజు కొడుకుల మూక; సూతసుతుపైన్= సూతుడైన అతిరథుని కుమారుడైన కర్ణుని మీదికి; నడతెంచిన= వచ్చిన; చందము= పద్ధతి; ఎట్టులు? = ఎట్లా ఉన్నది? ఆఖండలసూతి= ఇంద్రుని కుమారుడైన అర్జునుడు; సర్పముఖ కాండము= సర్పము అగ్రభాగాన గల బాణంయొక్క; తాఁకునన్= దెబ్బచేత; రూపుమాసిపోక= రూపం నశించిపోవక, మరణింపక; ఉండుట= బ్రతికి ఉండటం; ఎట్లు= ఏ రీతిగా; కల్గెన్?= సంభవించింది?; తక్కటి= (అర్జునుడు కాక) మిగిలిన; నల్వురందున్= పాండవులు నలుగురిలోనూ; సమర+ఉద్ధతి= యుద్ధంలోని విజృంభణం; ఎట్లు+ఉండెన్?= ఏ రీతిగా ఉన్నది?; దినద్వయంబునన్= రెండు రోజులలో (కర్ణుడు సేనానాయకత్వం వహించిన రెండు రోజులలో); బలద్వయంబు= సేనలజంట(కౌరవపాండవసేనలు రెండూ); ఎటులు= ఏ రీతిగా; ఓపి= సమర్థత కలిగి; పెనంగెన్?= పోరాడినాయి?

**తాత్పర్యం:** పాండవ సైన్యం కర్ణుడిమీద ఎట్లా దాడిచేసింది? కర్ణుడి సర్పముఖ బాణపుదెబ్బకు మరణించకుండా అర్జునుడు ఎట్లా బ్రతికి ఉండగలిగాడు? ధర్మజ భీమ నకుల సహదేవు లెట్లా యుద్ధంచేశారు? కౌరవ పాండవసైన్యాలు రెండూ ఈ రెండు రోజులలోనూ ఎట్లా యుద్ధంచేశాయి?'

**విశేషం:** ఇందులోని నాలుగు ప్రశ్నలలోనూ రెండవ ప్రశ్నతీరువలన ఆ బాణపు దెబ్బకు అర్జునుడు మరణించి తీరుతాడని ధృతరాష్ట్రుడు కూడా ఎంత ఆశ పెట్టుకొన్నాడో తెలుస్తుంది.

**వ. అనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియెఁ'గయ్యంబు తెఱంగు మొదలుకొని చెప్పెద నాకర్ణింపుము. ద్రోణుండు దెగిన నశ్వత్థామ దనయోపినంత సమరంబు సేసి చాలించి సేనలఁ దివియించి మరలి వచ్చిన దుర్యోధనుం డప్పుడు గొలువిచ్చియుండి యశ్వత్థామ లోనగు దొరలం గలయం గనుంగొని మనకు నిటమీఁదఁ జేయంగల పని యెయ్యది? యని యడుగుటయు న గ్గురుసుతుండు. 47**

**ప్రతిపదార్థం:** అనినన్= అని పలుకగా; సంజయుండు= సంజయుడు; విని= ఆలకించి; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రమహారాజుతో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= చెప్పాడు; కయ్యంబు తెఱంగు= యుద్ధంయొక్క పద్ధతి; మొదలుకొని= ఆదినుంచీ; చెప్పెదన్= చెపుతాను; ఆకర్ణింపుము= వినుము; ద్రోణుండు= ద్రోణాచార్యుడు; తెగినన్= మరణింపగా; అశ్వత్థామ= అతని కుమారుడైన అశ్వత్థామ; తన+ఓపిన+అంత= తనకు శక్తి కలిగినంత వరకూ; సమరంబు+చేసి= యుద్ధం కావించి; చాలించి= విరమించి; సేనలన్+తివియించి= సైన్యాలను వెనుకకు తగ్గించి; మరలి= శిబిరాలకు తిరిగి; వచ్చినన్= రాగా; అప్పుడు= ఆ సమయంలో; దుర్యోధనుండు= దుర్యోధనుడు; కొలువు+ఇచ్చి+ఉండి= సభచేసి కూర్చున్నవాడై; అశ్వత్థామ=

గురుపుత్రుడు; లోనగు= మొదలైన; దొరలన్= ప్రభువులను; కలయన్= కలియునట్లుగా, కలిపి అందరినీ ఒక్కసారి; కనుఁగొని= చూచి; మనకున్= మిగిలిన కౌరవపక్షీయులమైన మనకందరికీ; ఇటమీఁదన్= ఇక ముందు; చేయన్+కలపని= చేయగలపని; ఏ+అది?= ఏది?; అని; అడుగుటయున్= అడుగగా; ఆ+గురుసుతుండు= ద్రోణచార్యుని పుత్రుడైన ఆ అశ్వత్థామ. (చూపిన అనే 52వ వచనంలోని క్రియతో అన్వయం)

**తాత్పర్యం:** ఈ విధంగా ధృతరాష్ట్ర మహారాజు ప్రశ్నించేసరికి సంజయు డిట్లా ఆయనకు చెప్పాడు. 'యుద్ధం ఎట్లా జరిగిందో మొదటినుండి చెప్పుతాను వినుము. ద్రోణాచార్యుడు పడిపోయేసరికి అశ్వత్థామ తనశక్తి మేరకు యుద్ధంచేసి, విరమించి, సేనలను వెనుకకు మళ్ళించి తిరిగి వచ్చాడు. అప్పుడు దుర్యోధనుడు కర్తవ్యాలోచనకు సభ చేశాడు. ఆ సభలో ఉన్న అశ్వత్థామ మొదలైన వీరులందరివైపూ చూచి, ఇకపైని మనకర్తవ్యం ఏమిటి? అని ప్రశ్నించాడు. అపుడు అశ్వత్థామ. (ఇట్లా చెప్పాడు)

**విశేషం:** 'అశ్వత్థామ లోనగు దొరలన్' అనటంలో విశేషాలున్నాయి. దుర్యోధనుడు గొప్ప తంత్రజ్ఞుడు. తాను తలచిన రీతిగా కార్యక్రమం నడపగలిగిన చతురుడు. ద్రోణుడు పడిపోయినందువల్ల తనకు కలిగిన నష్టం అట్లా ఉండగా అశ్వత్థామకు కలిగిన నష్టం అతనికి ఆవేశకారణమని తెలుసు. వంచనతో చంపినందున అశ్వత్థామ మరీ మండిపడుతున్నాడనీ తెలుసు. ఆ క్రోధంతో పాండవసైన్యాన్ని ఎంతో వినాశం చేసి వచ్చాడనీ తెలుసు. అతడు సేనానాయకత్వానికి పోటీ పడదగినవాడనీ తెలుసు. కాని, అతడికంటె సేనానాయకత్వం కర్ణుడి కివ్వటం తనకు ఇష్టం. అశ్వత్థామ చిన్నబుచ్చుకోకూడదు, అతడి క్రోధ బలశౌర్యాలు తన కుపయోగపడాలి. తా ననుకొన్నట్లు అతడు కాక కర్ణుడు సేనాపతి కావాలి. ఏం చేద్దామని అడిగినపుడు తనమీద తన కెంత నమ్మకమూ, శత్రువులమీద ఎంతక్రోధమూ ఉన్నవాడయినా, అశ్వత్థామ వంటివాడు తనకు సేనాపతిత్వం ఇమ్మని నోరుతెరచి అడగలేడు. అట్లా తాను విరమించుకొన్నపుడు విధిగా కర్ణుడి పేరు చెపుతాడు. అందువలన ముందు అశ్వత్థామను చూచి అడిగాడు. అతడనుకొన్నట్లే అశ్వత్థామ చెప్పబోతున్నాడు.

'అశ్వత్థామ లోనగు దొరలన్' అని దొరలలో అశ్వత్థామను మొదట పేర్కొనటంవలన ద్రుపదుడి రాజ్యంలో అర్ధరాజ్యానికి ఏలిక అయిన ద్రోణాచార్యుడి ఏకైక పుత్రుడయిన అశ్వత్థామ కేవల గురుపుత్రుడు కాక దొర అనీ సూచితమవుతుంది. కాని ద్రుపదుడి అర్ధరాజ్యాన్ని అతడిని అవమానించిన సందర్భంలో ద్రోణుడు తీసుకున్నట్లు సంస్కృత భారతంలో (ఆది.అధ్యా.138, శ్లో 66-72) ఉన్నదిగాని, తెలుగు భారతంలో లేదు.

**క. 'విను మాదర ముత్సాహం । బనూన ధార్ష్ట్యంబు నీతి యను సద్గుణముల్**
**పని సఫలం బగునట్టుగ । జననాథ! యొనర్చు దైవ సాహాయ్యమునన్. 48**

**ప్రతిపదార్థం:** జననాథ!= ప్రజారక్షకుడవయిన రాజా!; విను= ఆలించు; (ఎవని కోసం పోరాడుతున్నారో వానిపై) ఆదరము= గౌరవం; ఉత్సాహంబు= ప్రయత్నం, అభిలాష; అనూన= వెలితిలేని అంటే నిండైన; ధార్ష్ట్యంబు= దిట్టతనం, శక్తి, సామర్థ్యం, చాతుర్యం, నేర్పు; నీతి= కార్యసాధకమైన ధర్మసహితమైన విధానం; అను= అనే; సత్+గుణముల్= ఉత్తమములైన, ఉత్తములవైన గుణాలు; దైవ= విధి, లేక అదృష్టము యొక్క; సాహాయ్యమునన్= తోడ్పాటుతో; పని= తలపెట్టిన కార్యం; సఫలంబు+అగు+అట్టుగన్= ఫలవంతం అయ్యేరీతిగా; ఒనర్చున్= చేస్తాయి. (రాగాః యోగస్తథా దాక్ష్యం నయశ్చేత్యర్థ సాధకాః' అని 8-6-12 మూలం.)

**తాత్పర్యం:** 'రాజా! ఆదరం, ఉత్సాహం, గొప్ప శక్తి, నీతి- ఈ సద్గుణాలకు దైవం తోడైతే ఏ కార్యమైనా నెరవేరుతుంది.

చ. తలఁపఁగ సద్గుణంబులకుఁ దావలమై పెనుపొందు నుజ్జ్వలా
త్ములు సనిరైన చేభరము దోఁపఁగ నీదగుదొంటి శౌర్యముం
దలకొని నిర్వహింపు ముచితంబుగ దైవము తోడుపాటునుం
గలిగెడుఁ గాక యున్న రథికప్రవరుల్ దలపోయ నల్పులే? 49

**ప్రతిపదార్థం:** తలఁపఁగన్= ఆలోచింపగా; సత్+గుణంబులకున్= ఉత్తమ గుణాలకు; తావలము+ఐ= ఉనికిపట్టై; పెనుపు+ఒందు= అతిశయించే; ఉత్+జ్వల+ఆత్ములు= ప్రకాశించే మనస్సులు కలవారు; చనిరి= వెళ్ళిపోయారు; ఐన= ఐనప్పటికీ; చేభరము= చేతి అతిశయం, బాహుబలాధిక్యం; తోఁపఁగన్= కాన్పింపగా; నీది+అగు= నీది అయిన; తొంటి= ఇదివరకటి; శౌర్యమున్= ప్రతాపాన్ని; తలకొని= వహించి; ఉచితంబుగన్= తగు విధంగా; నిర్వహింపుము= నడుపుము; దైవముతోడుపాటునున్= దైవ సాహాయ్యం కూడా; కలిగెడున్+కాక= కలుగుగాక; తలపోయన్= ఆలోచింపగా; ఉన్న రథిక ప్రవరుల్= మిగిలి ఉన్న శ్రేష్ఠులయిన రథికులు; అల్పులు+ఏ?= తక్కువవారా?

**తాత్పర్యం:** ఆలోచించి చూస్తే, సద్గుణ నిలయులైన మహానుభావులు భీష్మద్రోణాదులు వెళ్ళిపోయారు. అయినప్పటికీ, నీ బాహుబలమూ, ఆదినుండి నీకు కల ప్రతాపమూ ఆధారంగా యుద్ధం తగువిధంగా నడిపించుము. దైవ సాహాయ్యం కూడ నీకు లభించుగాక! పరిశీలించి చూస్తే మిగిలి ఉన్న రథికశ్రేష్ఠులు మాత్రం తక్కువవారా?

క. మనము బలశౌర్య ఘనుఁ గ । ర్ణుని సేనాముఖము సేసి నూల్కొని యరిమ
ర్దన మొనరింత మితని యం । దనూనతం బొల్చు సద్గుణావలియు నృపా! 50

**ప్రతిపదార్థం:** నృపా!= నరులను పాలించే రాజా!; మనము= మనపక్షం వాళ్ళమందరమూ; బల= బలంచేతనూ; శౌర్య= శౌర్యంచేతనూ; ఘనున్= గొప్పవాడయిన; కర్ణుని= అంగరాజును; సేనా= సైన్యముయొక్క; ముఖము= ముఖభాగంగా; అగ్రభాగంగా ముందుండే వానినిగా, సేనానాయకునిగా; చేసి= కావించుకొని; నూలు+కొని= పురికొని; అరిమర్దనము= శత్రువులను కొట్టటం; ఒనరింతము= చేద్దాము; సత్+గుణ+ఆవలియున్+ఉత్తమ గుణ సమూహంకూడా; ఇతనియందున్= ఈ కర్ణునిలో; అనూనతన్= తక్కువకాకుండా, అధికంగా; పొల్చున్= ఒప్పుతున్నది.

**తాత్పర్యం:** రాజా! బలశౌర్యాలలో గొప్పవాడైన కర్ణుడిని మనం సేనానాయకుడిగా చేసుకొని, పూనికతో శత్రువులను చావగొట్టుదాము. కర్ణుడిలో సద్గుణాలు కూడా మిక్కిలిగా ఉన్నాయి.

క. వైవస్వతు చందంబున । నీ వీరుఁడు రిపుబలంబునెల్ల నడంపం
గా వలఁతి దివ్యశర శి । క్షావైభవ పరమనిష్ఠ కలిమి నరేంద్రా!' 51

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= నరులకు ఇంద్రునివంటి వాడవైన రాజా!; ఈ వీరుఁడు= వీరుడయిన ఈ కర్ణుడు; దివ్య= స్వర్గంలో పుట్టిన; శర= బాణములయొక్క; శిక్షా= విద్యయొక్క; వైభవ= ఐశ్వర్యంయొక్క; పరమ= గొప్పదయిన; నిష్ఠ= నిలుకడ; కలిమిన్= ఉండటంచేత; వైవస్వతు చందంబునన్= యముని వలె; రిపు= శత్రువులయొక్క; బలంబున్= సైన్యాన్ని; ఎల్లన్= సమస్తాన్నీ; అడంపఁగాన్= సంహరించటానికి; వలఁతి= సమర్థుడు.

**తాత్పర్యం:** రాజా! ఈ కర్ణుడివద్ద దివ్యాస్త్ర విద్యాసంపద చాలా నిలుకడగా ఉన్నది. అందుచేత ఇతడు యముడివలె శత్రుసైన్యాన్ని మట్టుపెట్టటంలో సమర్థుడు.'

**వ. అని సూత పుత్రుం జూపిన భవత్పుత్రుండు ప్రీతుండయి యతండు పాండవుల జయించు నను నాస యగ్గలంబైన యంతరంగంబుతో న య్యంగపతి కిట్లనియె. 52**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లాపలికి; సూతపుత్రున్= కర్ణుని; చూపినన్= చూపించగా; భవత్+పుత్రుండు= నీ కొడుకు; ప్రీతుండు+ అయి= సంతోషించినవాడై; అతండు= ఆ కర్ణుడు; పాండవులన్= పాండురాజు కుమారులను; జయించున్= గెలుస్తాడు; అను+ఆస= అనే ఆశ; అగ్గలంబు+ఐన= అధికమయిన; అంతరంగంబుతోన్= మనస్సుతో; ఆ+అంగపతికిన్= ఆ అంగరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పలికాడు.

**తాత్పర్యం:** అని పలికి కర్ణుడిని చూపించాడు. ఆ మాటలకు నీ కుమారుడైన దుర్యోధనుడికి సంతోషం కలిగింది. కర్ణుడు పాండవులను గెలుస్తాడనే ఆశ మనస్సులో చాలా పెరిగింది. అట్టి స్థితిలో కర్ణుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అశ్వత్థామ మాటలకు సంతృప్తి కలిగింది దుర్యోధనుడికి. ఇందుకు కారణా లనేకం. ఒకటి: తానూహించినట్టే అశ్వత్థామ సేనాపతిత్వం తనకు కావాలనకపోవటం; రెండు: కర్ణుడి కిమ్మనటం; మూడు: ఆ అనటానికి తగిన కారణాలు చెప్పటం. ఆ చెప్పటమూ అశ్వత్థామ మోమోటమి లేని మాటలలో చెప్పాడు. భీష్మ ద్రోణులు సద్గుణ నిలయులయితే కర్ణుడిలో అవి అనూనంగా, తక్కువకాకుండా, ఎక్కువగా అనగా అధికభాగం ఉన్నాయి. ఇతడు యముడివలె నిర్దయుడు. ఉన్నవారిలో అందరికంటె దివ్యాస్త్రవిద్యలో అధికుడు. అశ్వత్థామ మెప్పు సామాన్యం కాదు. ఇతడికీ కర్ణుడికీ సామాన్యంగా పడదు. అట్టివాడు తూకంవేసి మరీ మెచ్చటం మరీ సంతోషకారణం. ధృతరాష్ట్రుడివలెనే దుర్యోధనుడికీ జయాశ కర్ణుడిమీదనే ఉన్నది. (అది 53వ పద్యంలో వ్యక్తమవుతుంది) అది ఈ మాటలతో ఎక్కువ అయింది.

**శా. 'నీవిక్రాంతియు నా పయింగల యతి స్నేహంబుఁ బ్రఖ్యాతముల్**
**గావే? భీష్ముఁడు ద్రోణుఁడుం దెగుట నీ కౌరవ్య సైన్యంబులం**
**గావంగాఁ దగు నీకు వారల యుపేక్షం గాక యిన్నాళ్ళు లే**
**లా? వైరం బడఁగింప నీ వయిన లీలన్ గెల్తు కౌంతేయులన్. 53**

**ప్రతిపదార్థం:** నీ విక్రాంతియున్= నీ పరాక్రమమూ; (నీకు) నా పయిన్+కల= నా మీద ఉన్న; అతిస్నేహంబున్= అధికమైన మైత్రీ; ప్రఖ్యాతముల్+కావు+ఏ?= ప్రసిద్ధములు కావా?; భీష్ముఁడున్= (తొలి సేనానాయకుడు) భీష్ముడూ; ద్రోణుఁడున్= (మలిసేనానాయకుడు) ద్రోణాచార్యుడూ; తెగుటన్= నరకబడినందున; ఈ కౌరవ్యసైన్యంబులన్= ఈ కౌరవపక్షసేనలను; కావంగాన్= రక్షించటం; నీకున్= (అధిక పరాక్రమమూ నా మీద అధికప్రేమా కల) నీకు; తగున్= యుక్తం; వారల= (తొలి మలి సేనానాయకులూ సమర్థులూ అయిన) భీష్మ, ద్రోణులయొక్క; ఉపేక్షన్+కాక= చూచీచూడనట్లు వదలినందున కాకపోతే; వైరంబు= శత్రుత్వం; అడఁగింపన్= నశింపజేయటానికి, పాండవులను సంహరించటానికి; ఇన్ని+నాళ్ళులు+ఏల+ఆ?= ఇన్ని రోజులెందుకూ?; నీవు+అయినన్= నీవు సేనానాయకుడవయి ఉంటే, ఇప్పుడయినా అయితే; కౌంతేయులన్= కుంతీపుత్రులను, పాండవులను; లీలన్= అవలీలగా; గెల్తు(వు)= గెలిచి ఉండేవాడవు, గెలుస్తావు.

**తాత్పర్యం:** 'నీ పరాక్రమమూ నామీద నీకున్న మైత్రీ జగత్ప్రసిద్ధమైనవే కదా! భీష్మద్రోణులు ఇద్దరూ పడిపోయినందున ఈ కౌరవసేనలను రక్షించ దగినవాడవు నీవే. భీష్మద్రోణు లిద్దరూ కావాలని పాండవులను చూచీ చూడనట్లు ఊరకున్నారు. లేకుంటే వారిని సంహరించి నా పగ తీర్చటానికిన్నాళ్ళు కావాలా? నీవే సేనానాయకుడవయి ఉన్న పక్షంలో అవలీలగా గెలిచి ఉండేవాడవు. ఇప్పుడైనా సేనాపతివైతే అవలీలగా గెలుస్తావు.

**వ. నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుండవు విశేషించి నాకేడుగడయు నీవ కావున నీకు మదీయ హితంబవశ్య కర్తవ్యం బట్లుంగాక మన మా భీష్మద్రోణుల నవమానింతుము. వారలు భండనంబునం బడిన నొదిఁగియుండ నేర్తుమే? కడంగుము పగఱకు నీకడంక చీఁకటికి సూర్యునుదయంబెట్టిదట్టి దయ్యెడుంగాక బృందారక సేన సేనాని నడపిన కైవడిం గౌరవ సైన్యంబు నడపి నన్ను గెలిపింపుము నిన్ను నీవ సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబుగట్టి కొ'మ్ము నినం బ్రీతుండయి రాధేయుండు గాంధారేయునకుం బ్రహర్షంబుగా భూవల్లభు లెల్ల నాకర్ణింప ని ట్లనియె. 54**

**ప్రతిపదార్థం:** నీవు= నీవు; ప్రాజ్ఞుండవు= అన్నీ తెలిసినవాడవు- సమర్థుడవు; ప్రబలుండవు= మిక్కిలి బలము కలవాడవు; విశేషించి= ప్రత్యేకించి; నాకున్= నీ మిత్రుడనైన నాకు; ఏడుగడయున్= రక్షకుడవూ; నీవు+అ= నీవే; కావునన్= కాబట్టి; నీకున్= (నా కిట్టివాడవయిన) నీకు; మదీయ హితంబు= నాదైన మేలు; అవశ్యకర్తవ్యంబు= తప్పక చేయదగినది; అట్లున్+కాక= ఆ విధంగానూ కాకుండా; మనము= నీవూ, నేనూ; ఆ= చంప సమర్థులయినా పాండవులను ఉపేక్షించే; భీష్మద్రోణులన్= భీష్మునీ ద్రోణునీ (పాండవులతో స్నేహం అవసరమని చెప్పినపుడు); అవమానింతుము= తిరస్కరించి భంగపరుస్తూ ఉండేవాళ్ళము; వారలు= వారిద్దరూ; భండనంబునన్= యుద్ధంలో; పడినన్= పడిపోగా; ఒదిఁగి= ముడుచుకొని, యుద్ధోత్సాహం విడిచి; ఉండన్= ఉండిపోవటానికి; నేర్తుము+ఏ?= ఇష్టపడతామా?; కడంగుము= పూనుకో; పగఱకున్= శత్రువులకు; నీ కడంక= నీ ప్రయత్నం, నీ పూనిక; చీఁకటికిన్= అంధకారానికి; సూర్య+ఉదయంబు= ప్రొద్దుపొడుపు; ఎట్టిది+అట్టిది= ఎటువంటిదో అటువంటిది; అయ్యెడున్+కాక= అగుగాక; బృందారక= దేవతల; సేనన్= దండును; సేనాని= కుమారస్వామి; నడపిన= నడిపించిన; కైవడిన్= విధముగా; కౌరవ సైన్యంబున్= కౌరవుల సైన్యాన్ని; నడపి= నడిపించి; నన్ను= (నీమీద ఆశపెట్టుకొన్న) నన్ను; గెలిపింపుము= విజయంపొందేటట్లు చెయ్యి; నీవు+అ= నీవే స్వయంగా; సర్వసేనాధిపత్యంబునకున్= సమస్త సైన్యనాయకత్వానికీ; పట్టంబు+కట్టికొమ్ము= ఆధిపత్యము చేపట్టుము; అనినన్= ఈ విధముగా పలుకగా; ప్రీతుండు= సంతృప్తిచెందినవాడు; అయి; రాధేయుండు= రాధాపుత్రుడయిన కర్ణుడు; గాంధారేయునకున్= గాంధారికొడుకైన దుర్యోధనునికి; ప్రహర్షంబు+కాన్= మిక్కిలి సంతోషం కలిగేటట్లుగా; భూవల్లభులు+ఎల్లన్= భూపతులందరూ; ఆకర్ణింపన్= వినేటట్లుగా; ఇట్లు= ఈ చెప్పబోయే రీతిగా; అనియెన్= పలికినాడు.

**తాత్పర్యం:** నీవు మేధావివి, సమర్థుడవు, గొప్ప బలవంతుడవు. ప్రత్యేకించి నాకు రక్షకుడవు. కనుక నీవు నాకు హితమైనది తప్పక చేయాలి. అదీకాక మనము భీష్ముడినీ, ద్రోణుడినీ అవమానించేవాళ్ళము. వారిద్దరూ యుద్ధంలో పడిపోయారు. ఇపుడు ఏమీ చేయలేనివాళ్ళవలె మనం నిరుత్సాహంగా ఎట్లా ఉండగలము? కనుక నీవు పూనుకొమ్ము. సూర్యోదయం చీకటిని నశింపజేసినట్లు నీ పూనిక శత్రువులను నశింపజేసేది కావాలి. దేవసేనను కుమారస్వామి నడిపించినట్లు కౌరవసైన్యాన్ని నీవు నడిపించి నన్ను గెలిపించుము. నిన్ను నీవే సర్వసేనానాయకత్వానికి పట్టాభిషేకం చేసికొమ్ము' అనేసరికి కర్ణుడికి చాలా సంతోషమయింది. అందువలన మిగతారాజులందరూ వింటూ ఉండగా దుర్యోధనుడికి పరమానందం కలిగేటట్లుగా అతడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** ఇందులో దుర్యోధనుడి మాటకారితనమూ, అతడు కర్ణుడిపై పెట్టుకొన్న ఆశా బాగా వ్యక్తమవుతున్నాయి. 'మనమా భీష్మద్రోణుల నవమానింతుము' అనటంలో ఆ మహాత్ములకు అవమానం కావాలని చేస్తూ వచ్చారని స్పష్టమవుతున్నది. వారిద్దరినీ రెచ్చగొట్టటానికి వారి చిత్తశుద్ధిని అనుమానించి, అవమానకరంగా దుర్యోధనుడు ఎన్నిసారులో, ఎన్నిమాటలో యుద్ధరంగంలో అన్నాడు. అందుకు వారిద్దరూ నిర్వేదం చెందారు. ఇంతకంటె చావటం మేలనుకొన్నారు. ఇందుకు దుర్యోధనుడి ఇప్పటి మాటలు దర్పణాలు.

మ. 'విను నీ కిచ్చిన బాస యే మఱతునే? 'వీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీ భూలోక సంచారు లె
ల్లను గీర్తింపఁగఁ బాండుపుత్రుల మదోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయంబైన సంగ్రామమున్. 55

**ప్రతిపదార్థం:** విను= ఆలకించు; నీకున్= (నన్ను అంగరాజును చేసిన మిత్రుడవైన) నీకు; ఇచ్చిన; బాస= మాట; ఏన్= (నీ వల్ల గౌరవాధికారకీర్తులు పొందిన) నేను; మఱతును+ఏ?= మరచిపోతానా? వీరంబున్= (నా) పరాక్రమమూ; బాహా= బాహువుల యొక్క; బలంబును= శక్తీ; ధైర్యంబునున్= కలతచెందని నిలుకడనూ; అస్త్ర వీర్యమునున్= మంత్ర ప్రయుక్తాలయిన ఆయుధాల సామర్థ్యాన్నీ; ఈ= మనం ఉన్న; భూలోక= భూలోకంలో; సంచారులు= తిరిగేవారు; ఎల్లన్= అందరూ; కీర్తింపఁగన్= ప్రశంసింపగా; పాండు= పాండురాజుయొక్క; పుత్రుల= కుమారులయిన యుధిష్ఠిరాదులయొక్క; మద+ఉల్లాసంబు= మదంయొక్క హెచ్చుపాటును; మర్దింతున్= నూరివేస్తాను, పోగొడతాను; నీవు= నా మిత్రుడవయిన నీవు; అనుమానింపక= (నేను అనినంతా చేస్తానా, చేయగలనా) అని సందేహించక; నిల్చి= ఒకచోట నిలిచి, మదీయంబు+ఐన= నాదైన; సంగ్రామమున్= యుద్ధాన్ని; చూడుము= చూడుము.

**తాత్పర్యం:** 'పాండవులను జయిస్తాను అని నీకు మాట ఇచ్చాను కదా. అది నేను మరచిపోతానా? ఈ భూలోకంలో తిరిగేవారంతా నా శౌర్యమూ, బాహుబలమూ, అస్త్రశక్తీ ప్రశంసించే విధంగా ఈ పాండురాజు కొడుకుల పొగరణుస్తాను. నీవు మనస్సులో సందేహం పెట్టుకొనక నా యుద్ధం ఒక చోట నిలబడి చూడుము.

## దుర్యోధనుఁడు గర్ణునకు సర్వసేనాధిపత్యంబు గట్టుట

వ. నన్ను సర్వసైన్యాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టు' మనవుడుఁ బొంగి రారాజు దగు రాజులుం దానును శాతకుంభకుంభంబులం బవిత్రజలంబులు దెప్పించి మహనీయమణి కుసుమౌషధిగంధాక్షత మంత్రకలనం బాచరించి సమున్నతౌదుంబరపీఠంబునం బరమాస్తరణం బొనర్చి యంగపతి నందు నిలిపి పుణ్యాహ ఘోషంబులుఁ దూర్యనినదంబులు వందిజనస్తుతులును జెలంగ నభిషేకించి యలంకరించి పట్టంబు గట్టిన నతండు భూసురోత్తములకు నర్థిజనంబులకును వివిధార్థంబులు దానత్యాగరూపంబున నొసంగుచు వెలింగె నప్పు డుబ్బిన శూరయోధుల జయ జయ శబ్దంబులును భూపతుల యభినందన వాక్యంబులును గృష్ణ సమేతు లగు పాండవుల గెలువుమని దీవన లిచ్చు మాగధుల యెలుంగులును నింగిముట్ట నవోదితుండైన భానుండునుం బోలె శోభిల్లు నా కర్ణుండు సముదీర్ణుండై య క్కురుపతి యాననం బాలోకించి. 56

**ప్రతిపదార్థం:** నన్నున్= (నీ కిష్టుడనైన) నన్ను; సర్వ= సమస్తమైన; సైన్య+ఆధిపత్యంబునకున్= సేనానాయకత్వానికీ; పట్టంబు గట్టుము= అధికారిగా చేయుము; అనవుడున్= అని పలికిన తరువాత; రారాజు= రాజులకు రాజైన దుర్యోధనుడు; పొంగి= సంతోషించి; తగు= అర్హులయిన; రాజులున్= ప్రభువులూ; తానును= స్వయంగానూ; శాతకుంభ= బంగారంతో చేసిన; కుంభంబులన్= కలశాలతో; పవిత్ర= పవిత్రములయిన; జలంబులు= నీళ్ళు; తెప్పించి= తెచ్చునట్లుచేసి; మహనీయ= గొప్పవైన; మణి= రత్నాలు; కుసుమ= పుష్పాలు; ఓషధి= మందుమొక్కలు; గంధ= చందనాది పరిమళ ద్రవ్యాలు; అక్షత= అక్షింతలు; మంత్ర= మంత్రాలు-వీటితో; కలనంబు= కూడియుండటం; ఆచరించి= చేసి (మంత్రపఠనపూర్వకంగా ఈ వస్తువులు ఆ జలకలశాలలో వేసి); సమ్+ఉన్నత= మిక్కిలి ఎత్తైన; ఔదుంబర= ఉదుంబర సంబంధమైన దాని

(మేడిచెట్టుకొయ్య)తో చేసిన; పీఠంబునన్= ఆసనంపై; పరమ+ఆస్తరణంబు= ఉత్తమమైన సువర్ణ రత్న వస్త్రమువంటిది పరచటం; ఒనర్చి= చేసి; అంగపతిన్= కర్ణుని; అందున్= ఆ ఆసనంపై; నిలిపి= కూర్చోబెట్టి; పుణ్యాహ ఘోషంబులున్= పట్టంకట్టే ముందు చేసే వైదికకర్మలోని మాటలధ్వనులూ; తూర్య= ఢక్క మొదలయిన వాద్యాల; నినదంబులున్= చప్పుళ్ళూ; వందిజన= స్తోత్రాలు చదివేవారి; స్తుతులును= స్తోత్రాలూ; చెలంగన్= రేగగా; అభిషేకించి= అభిషేకంచేసి; అలంకరించి= అలంకారాలు ధరింపజేసి; పట్టంబు గట్టినన్= అధికారిగా చేయగా; అతండు= కర్ణుడు; భూసుర+ఉత్తములకున్= ఉత్తములైన బ్రాహ్మణులకూ; అర్థిజనంబులకును= యాచకులకూ; వివిధ= రకరకములయిన; అర్థంబులు= వస్తువులూ, ధనములూ; దాన, త్యాగ రూపంబునన్= దానాలిచ్చే రూపంలో; ఒసంగుచున్= ఇస్తూ; వెలింగెన్= ప్రకాశించాడు; అప్పుడు= ఆ సమయంలో; ఉబ్బిన= పయికెగసిన; శూరయోధుల= యుద్ధభటులయొక్క; జయజయ శబ్దంబులును= జయమగుగాక, జయమగుగాక అనే ధ్వనులూ; భూపతుల= రాజులయొక్క; అభినందన= ప్రశంసించే; వాక్యంబులును= మాటలూ; కృష్ణ= కృష్ణునితో; సమేతులు+అగు= కూడియున్న; పాండవులన్= పాండురాజకుమారులను; గెలువుము+అని= జయింపుము అంటూ; దీవనలు+ఇచ్చు= ఆశీర్వాదాలిచ్చే; మాగధుల= స్తోత్రాలు చదివేవారియొక్క; ఎలుంగులును= ధ్వనులూ; నింగిన్= ఆకాశాన్ని; ముట్టన్= తాకగా; నవ+ఉదితుండు+ఐన= అప్పుడే క్రొత్తగా ఉదయించిన; భానుండునున్+పోలెన్= సూర్యునివలె; శోభిల్లు= ప్రకాశించే; ఆ కర్ణుండు= సేనానాయకుడైన కర్ణుడు; సమ్+ఉదీర్ణుండు+ఐ= అధికుడై; ఆ+కురుపతి= ఆ దుర్యోధనునియొక్క; ఆననంబు= ముఖం; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** 'నన్ను సర్వసైన్యాధిపత్యానికి అధికారిని చేయుము' అన్నాడు. ఆ మాటకు దుర్యోధనుడు పొంగిపోయాడు. తానూ ముఖ్యులైన రాజులూ కలిసి బంగారు కలశాలతో పవిత్రజలాలు తెప్పించారు. వాటిలో మంచిమణులూ, పుష్పాలూ, మందుమొక్కలూ, దీపాలవలె వెలిగే తృణజ్యోతిస్సులూ, చందనాది సుగంధద్రవ్యాలూ, అక్షింతలూ, మంత్రాలు చదువుతుండగా చేర్చారు. మేడికర్రతో చేసిన అత్యున్నతాసనం మీద సువర్ణ రత్నవస్త్రం వంటిది పరిపించారు. దానిమీద కర్ణుడిని కూర్చుండబెట్టారు. అతడిని సేనాపతిగా అభిషేకించారు. అపుడు పుణ్యాహ ఘోషలూ, మంగళవాద్యధ్వనులూ, స్తుతిపాఠకుల స్తోత్రాలూ అతిశయిల్లాయి. అపుడు కర్ణుడు బ్రాహ్మణోత్తములకూ, యాచకులకూ రకరకాల వస్తువులూ, ధనాదులూ దానాలుగా ఇచ్చాడు. ఆ సమయంలో శూరులూ యోధులూ బాగా సంతోషించి, జయజయధ్వానాలు చేశారు. రాజులు ప్రశంసించారు. స్తోత్రాలు చదివేవారు కృష్ణుడితో సహా పాండవులను జయించుమని దీవించారు. ఈ ధ్వనులన్నీ కలిసి ఆకాశందాకా వ్యాపించాయి. అపుడు కర్ణుడు అప్పుడే ఉదయించిన సూర్యుడివలె ప్రకాశిస్తూ అదివరకటికంటె అధికుడైనాడు. అతడు దుర్యోధనుడి ముఖంచూస్తూ (అన్నాడు).

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **'బంధు మిత్ర యుతంబుగఁ బార్థు రూపు। మాపి యే నిత్తు నీకు సామ్రాజ్యలక్ష్మి**
**ధాత్రిఁ బాలింపు సుస్థితిఁ బుత్త్ర పౌత్త్ర। గాఢభోగార్హమగునట్లు గాఁగ నధిప!** **57**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఏన్= నేను; పార్థున్= నేను; పృథ(కుంతి) కుమారుడయిన అర్జునుడిని; బంధు= చుట్టాలతో; మిత్ర= స్నేహితులతో; యుతంబుగన్= సహితంగా; రూపుమాపి= సంహరించి; నీకున్= (నన్ను అంగరాజునే కాక సమస్త సేనా నాయకుని కూడా చేసిన) నీకు; సామ్రాజ్యలక్ష్మిన్= ఏకచ్ఛత్రాధిపత్య రాజ్యసంపదను; ఇత్తున్= ఇస్తాను; (నీవు) పుత్త్ర= పుత్త్రులకూ; పౌత్త్ర= మనుమలకూ(వంశపరంపరగా) కూడా; గాఢ= అధికమైన; భోగ= అనుభవించటానికి; అర్హము+ అగునట్లుకాఁగన్= తగునట్లుగా; సుస్థితిన్= మంచి సంపదతోనూ, నిలకడతోనూ; ధాత్రిన్= భూమిని; పాలింపు= ఏలుకో.

**తాత్పర్యం:** 'రాజా! (నన్ను అంగదేశపు రాజును చేయటమేకాక అఖిలసైన్యానికీ అధినాథుడిని కూడా చేశావు. కనుక, ఈ సంతోషసమయంలో చెపుతున్నాను) చుట్టాలతో మిత్రులతో సహా అర్జునుడిని నేను సంహరించి సామ్రాజ్యసంపద నీ కిస్తాను. నీవు పుత్రపౌత్ర పరంపరగానూ, పుత్రపౌత్ర సహితంగానూ మహాభోగాలకు తగినట్లుగా భూమి నేలుకొమ్ము.

**విశేషం:** తమకు సైన్యాధిపత్యమిచ్చినపుడు సంతోషించి భీష్మద్రోణులూ దుర్యోధనునికి వరాలిచ్చారు. కాని, పాండవులను చంపుతామని కాని, చంపగలమని కాని చెప్పలేదు. పైగా సమయం దొరికినపుడెల్లా వా రవధ్యులు కనుక సంధిచేసుకొమ్మంటూనే చెప్తుతూ వచ్చారు. అసాధ్యవాగ్దానాలతో దుర్యోధనునికి ఆశ కల్పించాలని వా రనుకొనలేదు. అతడు తమ నపార్థంచేసికొన్నా పథ్యమూ, హితమే చెప్పారు. కాని, కర్ణుడు ఏమి పలికితే దుర్యోధనుడి కానందమో అది పలుకుతూ వచ్చాడు - ముఖ్యంగా అర్జునుడిని చంపుతాననటం. కారణం ఏదైతేనేం, అది నేరవేరింది కాదు.

**క. విను సత్య ధర్మ రతుఁ డగు । మనుజునకుం గార్యసిద్ధి మసలక యగు చా**
**డ్పున శౌర్య బాహువిక్రమ । ఘనుఁడగు నా కాజి జయము గలుగుం జులుకన్' 58**

**ప్రతిపదార్థం:** విను= ఆలకించు; సత్య= యథార్థం పలకటంపట్లనూ; ధర్మ= ధర్మం ఆచరించటంపట్లనూ; రతుఁడు+అగు= ఆసక్తి కలవాడైన; మనుజునకున్= మానవునకు; కార్యసిద్ధి= పని నెరవేరటం; మసలక= ఆలస్యంకాకుండా, తప్పకుండా; అగు= అయ్యే; చాడ్పునన్= విధముగా; శౌర్య= ప్రతాపంచేతనూ; బాహు విక్రమ= భుజపరాక్రమం చేతనూ; ఘనుఁడు+అగు= గొప్పవాడనైన; నాకున్= నాకు; ఆజిన్= యుద్ధంలో; జయము= గెలుపు; చులుకన్= తేలికగా; కలుగున్= సంభవిస్తుంది.

**తాత్పర్యం:** (ఇంత అసాధ్యమైన పని ఎట్లా చేయగలవంటావేమో) వినుము, సత్య ధర్మపరాయణుడైనవాడు చేయదలచిన పని వెంటనే నెరవేరుతుంది. అట్లాగే భుజబల ప్రతాపాలున్న నేను యుద్ధంలో తేలికగా జయిస్తాను.'

**విశేషం:** కర్ణుడిలోని గొప్ప సుగుణం తన భుజబలపరాక్రమాల మీద ఆధారపడటం. సందర్భం వచ్చినపుడెల్లా అతడు పోరాడి గెలుద్దామంటాడు. వంచించి గెలుద్దామంటాడు శకుని. పాండవులు నలుగురూ నాలుగు దిక్కులూ గెలిస్తే, కర్ణుడొక్కడూ పాండురాజువలె దిగ్విజయం చేశాడు. కనుక తన బలప్రతాపాల మీద అతడికి నమ్మకం. కాని, అందరినీ గెలవటం వేరు, కృష్ణ రక్షితులైన పాండవులను గెలవటం వేరు.

**వ. అని పలికె నిత్తెఱంగున రాధేయు సర్వ సైన్యముఖ్యుం జేసి యతని మందిరంబునకు మహావిభవ సమేతంబుగాఁ బుచ్చి సమస్త పరిజనంబులను నిజనివాసంబులకుఁ బోవం బనిచి సంతోషం బంతరంగంబు నిండి వదనంబున వెల్లిగొన నీ కొడు కభ్యంతరావాసంబున కరిగె. రాత్రి యే నిట వచ్చి ద్రోణు వృత్తాంతం బంతయు నీకుం జెప్పి నీ వనుప మగిడి చని సూర్యోదయ సమయంబున మన శిబిరంబు ప్రవేశించితి న య్యవసరంబున. 59**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగా; పలికెన్= అన్నాడు; ఈ+తెఱంగునన్= ఈ విధముగా; నీ కొడుకు= నీ కుమారుడైన దుర్యోధనుడు; రాధేయున్= కర్ణుని; సర్వసైన్య= సమస్తమైన సేనకూ; ముఖ్యున్= నాయకుని; చేసి= కావించి; అతనిన్= కర్ణుని; మందిరంబునకున్= అతని నివాసమునకు; మహా= గొప్ప; విభవ= వైభవ; సమేతంబుగాన్= సహితముగా; పుచ్చి= పంపించి; సమస్త పరిజనంబులను= సకల సేవకులనూ; నిజ నివాసంబులకున్= వారి వారి నివాసంబులకు; పోవన్= వెళ్ళటానికి; పనిచి=

పంపి; సంతోషంబు; అంతరంగంబు= మనస్సున; నిండి; వదనంబునన్= ముఖంపై; వెల్లి+కొనన్= ప్రవహింపగా; అభ్యంతర= లోపలి; ఆవాసంబునకున్= గృహానికి; అరిగెన్= వెళ్ళాడు; రాత్రి= ఆ రాత్రివేళ; ఏను= నేను; ఇట= ఇక్కడికి; వచ్చి= వచ్చినవాడనై; ద్రోణు= ద్రోణాచార్యునియొక్క; వృత్తాంతంబు= ఉదంతం; అంతయున్= సమస్తమూ; నీకున్= నీకు; చెప్పి= వినిపించి; సూర్య+ఉదయ= సూర్యునియొక్క ఉదయమయే; సమయంబునన్= వేళలో; నీవు; అనుపన్= పంపగా; మగిడి= తిరిగి; చని= వెళ్ళి; మనశిబిరంబు= మనయొక్క సేనలు విడిసినచోటున; ప్రవేశించితిన్= ప్రవేశించాను; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అని అన్నాడు. ఇట్లా దుర్యోధనుడు కర్ణుడిని సకల సేనానాయకుడిని చేసిన తరువాత అతడిని అతడి నివాసానికి మహావైభవంతో పంపించాడు. తన సేవకులనందరినీ కూడా వారి వారి నివాసాలకు పంపించాడు. అతడి మనస్సంతా ఆనందంతో నిండిపోయి మొగంమీదికి ప్రవహించిందా అన్నట్లు అతడి ముఖం కళకళలాడుతుండగా లోపలి మందిరానికి వెళ్ళాడు. ఆ రాత్రి నే నిక్కడికి వచ్చి నీకు ద్రోణుడి యుద్ధవార్తలన్నీ చెప్పాను. నీవు సెలవిచ్చిన తరువాత వెళ్ళి ప్రొద్దుపొడిచేసరికి మళ్ళీ మన దండు విడిసిన చోటు చేరుకొన్నాను. ఆ సమయంలో.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**సీ.** **తళతళ మనియెడు దంతప్రభలతోడ । ఘనకేతువున హస్తి కక్ష్య మెఱయ**
**హంసవర్ణములైన హయముల పటుగతి । నర్కప్రభం బగు నరదమొప్ప**
**దీప్తకాంచనరసలిప్తమై చెలువొందు । సజ్యకార్ముకము హస్తమున వెలుఁగ**
**వీటికి సమర సమాటోపమొదవ నా । భీలశంఖము దనమ్రోల మ్రోయ**

**తే.** **రణసముత్సాహలక్ష్మి వక్త్రమున వింత । చెన్ను వెలయింప నాప్తులు సేరి రెండు**
**పక్కియల యందు బవరంపుఁ బలుకు లెసఁగ । నడవ సొంపారి కర్ణుండు వెడలె నధిప!** **60**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; కర్ణుండు= సకల సేనానాయకుడైన కర్ణుడు; తళతళమనియెడు= కన్నులు మిరుమిట్లు గొలిపే; దంతప్రభలతోడన్= దంతాల కాంతులతో; ఘనకేతువునన్= పెద్ద జెండామీద; హస్తికక్ష్య= ఏనుగు మొలత్రాడు; మెఱయన్= ప్రకాశింపగా; హంస+వర్ణములు+ఐన= హంసయొక్క రంగువంటి రంగుకలవి; అయినటువంటి; హయముల= గుర్రాలయొక్క; పటుగతిన్= వేగమైన నడకతో; అర్క= సూర్యుడియొక్క; ప్రభంబు= కాంతివంటి కాంతిగలది; అగు= ఐనట్టి; అరదము= రథం; ఒప్పన్= ప్రకాశింపగా; దీప్త= కాలిన; కాంచన= బంగారంయొక్క; రస= ద్రవంచేత; లిప్తము+ ఐ= పూయబడినదై; చెలువు+ఒందు= అందగించునట్టి; సజ్యకార్ముకము= ఎక్కుపెట్టిన ధనుస్సు; హస్తమునన్= చేతిలో; వెలుఁగన్= ప్రకాశింపగా; వీటికిన్= దండువిడిసిన చోటికి; సమర= యుద్ధంయొక్క; సమ్+ఆటోపము= సంరంభం; ఒదవన్= కలుగగా; ఆభీలశంఖము= భయంకరమైన శంఖం; తన మ్రోలన్= తనయెదుట; మ్రోయన్= మ్రోగగా; రణ= యుద్ధనిమిత్తమైన; సముత్సాహ= సంపూర్ణమైన పూనికయొక్క; లక్ష్మి= కాంతి; వక్త్రమునన్= తనముఖం మీద; వింత= క్రొత్త, ఆశ్చర్యకరమైన; చెన్ను= అందం; వెలయింపన్= ప్రసరించేటట్లు చేయగా; రెండు పక్కియల+అందున్= ఉభయ పార్శ్వాలలోనూ; ఆప్తులు= నమ్మదగిన ముఖ్యులైన స్నేహితులు; చేరి= సమీపించి; బవరంపు= యుద్ధసంబంధములయిన; పలుకులు+ఎసఁగన్= మాటలు ఒప్పగా; నడవన్= నడచిరాగా; సొంపు+ఆరి= అందమొప్పి; వెడలెన్= బయలుదేరాడు.

**తాత్పర్యం:** రాజా! కర్ణుడు బయలుదేరాడు. అపుడు అతడి రథంమీది పెద్ద జెండామీద కన్నులు మిరుమిట్లు గొలిపే దంతకాంతులతో ఏనుగు మొలత్రాడు ప్రకాశిస్తున్నది. అతడి రథం తెల్లని హంసల రంగూ మంచి

వేగమూగల గుర్రాలతో సూర్యకాంతితో మెరుస్తున్నది. అతడి చేతిలో నారి ఎక్కించిన విల్లు ప్రకాశిస్తున్నది. దానికి బంగారపు ద్రవం పూసినందున చాలా అందంగా ఉన్నది. సేనా స్కంధావారంలో యుద్ధ సంరంభం కలిగేటట్లుగా అతడి ముందు భయంకరమైన శంఖం మ్రోగుతున్నది. ముఖంమీద యుద్ధోత్సాహశోభ క్రొత్త అందాన్ని సమకూరుస్తున్నది. అతడి రెండు ప్రక్కలా దగ్గరగా ముఖ్యులయిన నమ్మదగిన స్నేహితులు యుద్ధానికి సంబంధించిన మాటలు పలుకుతూ నడచి వస్తున్నారు. అట్లా అందంగా అతడు బయలుదేరాడు.

**వ. అతండు పడవాళ్ళం బనిచి వెడల నియమించిన నెల్ల దొరలును దురంబునకు వెడలి రట్లు సకల బలంబులు కలనికి నడవం దొడంగిన. 61**

**ప్రతిపదార్థం:** అతండు= కర్ణుడు; పడవాళ్ళన్= చారులను; పనిచి= పంపి; వెడలన్= యుద్ధానికి బయలుదేరటానికి; నియమించినన్= ఆజ్ఞాపింపగా; ఎల్ల= సమస్తమైన; దొరలును= సేనాధిపతులు; దురంబునకున్= యుద్ధానికి; వెడలిరి= బయలుదేరారు; అట్లు= ఆ రీతిగా; సకలబలంబులు= సమస్తమైన సైన్యాలూ; కలనికిన్= యుద్ధభూమికి; నడవన్= నడవటానికి; తొడంగినన్= పూనుకొనగా. (తరువాతి పద్యంతో అన్వయం)

**తాత్పర్యం:** కర్ణుడు చారులను పంపి బయలుదేరండని ఆజ్ఞాపించగానే సేనాధిపతులందరు యుద్ధానికి బయలుదేరారు. అట్లా సైన్యాలన్నీ యుద్ధానికి నడవటం ప్రారంభించేసరికి.

**సీ. తురగ రింఖా ముఖోద్ధూత ధూళీపట । లములు నల్దిక్కు లలంకరించె**
**మాతంగ కటిగళన్మదజల బహుల ప్ర । వాహ విలాసంబు వాని నడఁచె**
**బహువిధవాదిత్ర భైరవారావంబు । పె ల్లంబరము పిక్కటిల్లఁ జేసె**
**శింజినీటంకార సింహనాదంబుల । పెక్కువ యామ్రోఁతఁ బిలుచుకొనియె**

**ఆ. రథిక భూషణముల రశ్ములఁ గేతన । చ్ఛత్ర చామరోపసక్త మణుల**
**రుచుల సుభటహేతి రోచులఁ బవలింటి । దివియచందమయ్యె దినకరుండు. 62**

**ప్రతిపదార్థం:** తురగ= గుర్రాలయొక్క; రింఖా= డెక్కలయొక్క; ముఖ= అగ్రభాగాలచేత; ఉద్ధూత= ఎగురగొట్టబడిన; ధూళీపటలములు= ధూరేణువుల సమూహాలు; నల్+దిక్కులు= నాలుగు దిశలనూ; అలంకరించెన్= ముస్తాబు చేశాయి; మాతంగ= ఏనుగులయొక్క; కటి= చెక్కిళ్ళనుండి; గళత్= స్రవిస్తున్న; మదజల= మదపునీటి; బహుల= అధికమైన; ప్రవాహంబు= వెల్లువయొక్క; విలాసంబు= చక్కదనం; వానిన్= ధూరేణు సమూహాలను; అడఁచెన్= అణగగొట్టింది; బహువిధ= పలురకాలైన; వాదిత్ర= వాద్యాలయొక్క; భైరవ= భయంకరమైన; ఆరావంబు= ధ్వనియొక్క; పెల్లు= ఆధిక్యం; అంబరము= ఆకాశాన్ని; పిక్కటిల్లన్+చేసెన్= బ్రద్దలుచేసింది; శింజినీ= అల్లెత్రాళ్ళయొక్క; టంకార= టం అనే ధ్వనుల యొక్క; పెక్కువ= ఆధిక్యం; ఆ మ్రోఁతన్= ఆ వాద్యధ్వనిని; పిలుచుకొనియెన్= ఆహ్వానించింది; దినకరుండు= సూర్యుడు; రథిక= రథికులయొక్క; భూషణముల= నగలయొక్క; రశ్మలన్= కాంతులచేత; కేతన= జెండాలయందు; ఛత్ర= గొడుగులయందూ; చామర వింజామరలందూ; ఉపసక్త= అంటిఉన్న; మణుల= రత్నాలయొక్క; రుచులన్= కాంతులతోనూ; సుభట= మంచి బంటుల, వీరులయొక్క; హేతి= ఖడ్గాల, ఆయుధాలయొక్క; రోచులన్= కాంతులతోనూ; పవలింటి= పగటివేళలోని; దివియ= దీపంయొక్క; చందము+అయ్యెన్= పోలికతో ఉన్నాడు.

**తాత్పర్యం:** గుర్రాల డెక్కల చివళ్ళెగరగొట్టిన భూరేణువులు అన్నివైపులా వ్యాపించాయి. ఏనుగుల చెక్కిళ్ళ నుండి కారే మదపునీటి ప్రవాహం ఆ రేణువులను అణగగొట్టింది. రకరకాలయిన వాద్యాల భయంకర ధ్వనులు ఆకాశాన్ని బ్రద్దలు చేశాయి. విండ్ల అల్లెత్రాళ్ళు లాగుతుంటే వచ్చే టంటం అనే ధ్వనులూ, వీరుల సింహనాదాలూ ఆ వాద్య ధ్వనులను తమవైపు ఆకర్షించుకొన్నాయి. (అంటే పెద్దవాళ్ళు తమకంటె చిన్నవాళ్ళను తామున్నచోటికి రమ్మని పిలుస్తారు కనుక, వాద్యధ్వనులను ఈ ధ్వనులు పిలిచాయంటే మించాయన్నమాట.) రథికులు పెట్టుకొన్న నగల కాంతులూ, జెండాలకూ గొడుగులకూ వింజామరలకూ ఉన్న మణుల కాంతులూ వ్యాపించేసరికి సూర్యుడు పగటి దీపంవలె వెలవెలబోయాడు.

**విశేషం:** కటి శబ్దానికి-మొల, ఏనుగుచెక్కిలి అని అర్థాలని శబ్దార్థ చంద్రిక. కట అనే పాఠం కూడ ఉండే అవకాశం ఉంది.

**వ. అట్టియెడ. 63**

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

**క. జనములు భీష్మద్రోణులు । సనిన వగలు డిగ్గఁ ద్రావి సంతోషము నె**
**క్కొనియెడు మనములతోఁ గ । ర్ణునిఁ గనుఁగొని రతివికాసరుచిరనయనులై. 64**

**ప్రతిపదార్థం:** జనములు= జనులు; భీష్మద్రోణులు= భీష్ముడూ, ద్రోణుడూ; చనిన= పోయిన; వగలు= దుఃఖాలు; డిగ్గన్+త్రావి= దిగమ్రింగుకొని; సంతోషము= ఆనందం; నెక్కొనియెడు= అధికమయే; మనములతోన్= మనస్సులతో; అతి వికాస= మిక్కిలిగా విచ్చుకొన్నందున; రుచిర= ప్రకాశించే; నయనులు+ఐ= కన్నులు కలవారై; కర్ణునిన్= అంగరాజును; కనుఁగొనిరి= చూచారు.

**తాత్పర్యం:** జనులు, భీష్మద్రోణులు లేకుండా పోయారన్న దుఃఖాన్ని దిగమ్రింగుకొని, సంతోషం నిండిన మనస్సులతో, వికసించి ప్రకాశించే కన్నులతో కౌరవసైన్యాధ్యక్షుడైన కర్ణుణ్ణి చూచారు.

### కర్ణుని మొదటి నాఁటి యుద్ధము (సం. 8-7-14)

**వ. ఇవ్విధంబున బలంబులకుఁ బ్రమోదం బెసంగ నడచి రాధేయుండు దుస్సహంబుగా మకర వ్యూహంబు సమకట్టునెడ నందుఁ దుండంబునఁ దాను నిలిచి నయనంబుల శకునియు నులూకుండును శిరంబున నశ్వత్థామయుఁ గంఠంబున దుర్యోధనానుజులును నుదరంబున దుర్యోధనుండును ముందట వామపాదంబున నారాయణ గోపాలయుతుండై కృతవర్మయు దక్షిణపాదంబునఁ ద్రిగర్త దాక్షిణాత్య సంవృతుండై కృపాచార్యుండును వెనుక డాకాల నానాదేశ సేనతో శల్యుండును వలకాల ననేక రథకరితురగసమేతుండై సుషేణ జననాథుండును బుచ్ఛంబున మహాసైన్య సమగ్రుండయి చిత్రుండను ధాత్రీపతియు నతని తమ్ముండగు చిత్రసేనుండును నిలుచున ట్లొనర్చి తక్కిన వారల నెడ నెడం బన్నించె నటమున్న యుధిష్ఠిరుం డుద్దామ సామజాది చతురంగోల్లాసభాసితుండయి నడతెంచె నట్లు నడతెంచి యమ్మనుజవిభుండు మనమొనం జూచి సవ్యసాచి కిట్లనియె. 65**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ రీతిగా; రాధేయుండు= కర్ణుడు; బలంబులకున్= కౌరవసేనలకు; ప్రమోదంబు= సంతోషం; ఎసంగన్= వృద్ధికాగా; నడచి= యుద్ధానికి బయలుదేరి; దుస్సహంబుగాన్= (శత్రువులకు) సహించ సాధ్యముకానిదిగా; మకర వ్యూహంబు= మొసలి ఆకారపు మొగ్గరం; సమకట్టు+ఎడన్= పన్నే సమయంలో; అందున్= ఆ వ్యూహంలో; తుండంబునన్= నోటి స్థానంలో; తాను= స్వయంగా కర్ణుడే; నిలిచి= ఉండి; నయనంబులన్= రెండుకన్నుల చోట్ల; శకునియున్= దుర్యోధనుని మేనమామ అయిన శకునీ; ఉలూకుండును= అతని కొడుకైన ఉలూకుడనే అతడూ; శిరంబునన్= తలవద్ద; అశ్వత్థామయున్= ద్రోణపుత్రుడయిన అశ్వత్థామా; కంఠంబునన్= మెడవద్ద; దుర్యోధన+అనుజులును= దుర్యోధనుడి తమ్ములూ; ఉదరంబునన్= పొట్టవద్ద; దుర్యోధనుండును= దుర్యోధనుడూ; ముందట వామపాదంబునన్= (నాలుగు కాళ్ళలోనూ) ముందరి ఎడమ అడుగువద్ద; నారాయణ= నారాయణులనే పేరుగల; గోపాల= యాదవులతో; యుతుండు+ఐ= కూడిన వాడై; కృతవర్మయున్= కృతవర్మా; దక్షిణపాదంబునన్= ముందరి కుడిఅడుగు దగ్గర; త్రిగర్త= త్రిగర్త దేశీయులచేతనూ; దాక్షిణాత్య= దక్షిణదేశపు వారిచేతనూ; సంవృతుండై= కప్పబడినవాడై; కృపాచార్యుండును= కృపాచార్యుడూ; వెనుకడాకాలన్= వెనుకవైపుగల ఎడమకాలివద్ద; నానాదేశసేనతోన్= అనేక దేశాల సేనలతో; శల్యుండును= మద్రరాజూ; వలకాలన్= కుడి వెనుకకాలి వద్ద; అనేక= అధిక సంఖ్యకల; రథ= తేరులతోనూ; కరి= ఏనుగులతోనూ; తురగ= గుఱ్ఱాలతోనూ; సమేతుండు+ఐ= కూడినవాడై; సుషేణ జననాథుండును= సుషేణుడనే రాజూ; పుచ్ఛంబునన్= తోకస్థానంలో; మహాసైన్య= పెద్ద సైన్యంతో; సమగ్రుండు+అయి= పరిపూర్ణుడై; చిత్రుండు+అను= చిత్రుడు అనే పేరుగల; ధాత్రీపతియున్= రాజూ; అతని= ఆ చిత్రుని; తమ్ముండు+అగు= తమ్ముడైన; చిత్రసేనుండును= చిత్రసేనుడనే పేరుగల రాజు; నిలుచు+అట్లు+ఒనర్చి= నిలిచే విధముగా చేసి; తక్కినవారలన్= మిగిలినవారిని; ఎడనెడన్= ఆయాప్రదేశాలలో; పన్నించెన్= ఉండేటట్లు తీర్చినాడు; అట= అక్కడ, పాండవపక్షంలో; మున్ను+అ= వీరు వ్యూహం పన్నటానికి ముందుగానే; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; ఉద్దామ= భయంకరమైన; సామజ= ఏనుగులు; ఆది= మొదలయిన; చతురంగ= (గజ రథ తురగ పదాతులనే) నాలుగు అంగాల సైన్యంయొక్క; ఉల్లాస= ఉత్సాహంతో; భాసితుండు+అయి= ప్రకాశించినవాడై; నడతెంచెన్= (యుద్ధభూమికి) కదలి వచ్చాడు; అట్లు= ఆ రీతిగా; ఆ+మనుజ విభుండు= ఆ నరపతి - ధర్మరాజు; మన= కౌరవులయొక్క; మొనన్= వ్యూహాన్ని; చూచి= పరిశీలించి చూచి; సవ్యసాచికిన్= అర్జునునితో; ఇట్లు= ఈ రీతిగా; అనియెన్= పలికినాడు.

**తాత్పర్యం:** ఇట్లా కర్ణుడు సైన్యాలకు సంతోషం కలిగేటట్లు యుద్ధానికి వెళ్ళాడు. శత్రువులు భరించటానికి అశక్యమయ్యేటట్లు మకరవ్యూహం పన్నాడు. ఆ పన్నేటప్పుడు మొసలి నోటిస్థానంలో తానే నిలిచాడు. రెండు కన్నుల వద్దనూ శకునినీ, అతడి కుమారుడు ఉలూకుడినీ ఉండుమన్నాడు. తలదగ్గర అశ్వత్థామ నుంచాడు. మెడవద్ద దుర్యోధనుడి తమ్ములను నిలిపాడు. కడుపు దగ్గర దుర్యోధనుడిని ఉంచాడు. ముందరి ఎడమకాలివద్ద నారాయణ గోపాలురతోపాటు కృతవర్మ నుండుమన్నాడు. కుడిముందరి పాదం దగ్గర త్రిగర్తులతో, దక్షిణదేశాలవారితో కృపాచార్యుడిని నియమించాడు. వెనుక ఎడమకాలి సమీపంలో సకల దేశ సేనలతో శల్యుడిని నిలిపాడు. కుడివెనుక పాదం దగ్గర బహు రథ గజ తురగ సమేతంగా సుషేణుడిని ఉండుమన్నాడు. తోక వద్ద మహాసైన్యంతో చిత్రుడు, అతడి తమ్ముడు చిత్రసేనుడు అనే రాజులను నిలిపాడు. ఇంకా ఉన్నవారిని ఆయా స్థానాలలో ఉండుమన్నాడు.

అటు పాండవపక్షంలో ఇందుకు ముందుగానే యుధిష్ఠిరుడు భయంకరమైన గజ రథ తురగ పదాతి చతురంగ సైన్యోల్లాసంతో వెలిగిపోతూ యుద్ధభూమికి వచ్చాడు. వచ్చి మన వ్యూహాన్ని చూచి, సవ్యసాచితో ఇట్లా అన్నాడు:

**చ. 'కనుఁగొనఁ జుల్కనైన యది కౌరవసైన్యము గంటె? సూత నం**
**దనుఁ డొక యొడ్డుగా నిలిపి తాను ముఖంబున నిల్చి కయ్య మె**
**ల్లను దనమీఁదఁ బెట్టికొని లావును బీరముఁ జూపఁ బూని యే**
**పున నటిమెన్ భవద్విశిఖ పుంజములం దెగటార్పు మీతనిన్. 66**

**ప్రతిపదార్థం:** కౌరవసైన్యము= కౌరవులసేన; కనుఁగొనన్= చూడటానికి, లేదా పరిశీలించిన పక్షంలో; చుల్క+ఐన+అది= తేలిక అయింది; కంటి(వి)+ఎ?= చూశావా, ఈ సంగతి కనిపెట్టావా?; (కాని) సూతనందనుఁడు= సూతుని కొడుకైన కర్ణుడు; (దీనిని) ఒక+ఒడ్డుగాన్= ఒక వ్యూహంగా; నిలిపి= నిలబెట్టి; తాను= స్వయంగా (మొసలి); ముఖంబునన్= ముందుభాగంలో; నిలిచి= నిలబడి; కయ్యము= యుద్ధం; ఎల్లను= అంతా; తనమీఁదన్= తనపై; పెట్టికొని= ఉంచికొని; లావున్= బలమూ; బీరమున్= శౌర్యమూ; చూపన్+పూని= ప్రదర్శింపదలచుకొని; ఏపునన్= గర్వంతో; అటిమెన్= ఎదుర్కొన్నాడు; (నీవు) ఈతనిన్= ఈ కర్ణుని; భవత్= నీయొక్క; విశిఖ= బాణములయొక్క; పుంజములన్= సమూహములతో; తెగటార్పుము= చంపుము.

**తాత్పర్యం:** పరిశీలించి చూస్తే కౌరవ సైన్యం తేలిక అయిపోయింది. కాని, సూతపుత్రుడు దీనినొక వ్యూహంగా పన్ని, ముందుభాగంలో తాను నిల్చొని, యుద్ధభారమంతా తనమీద వేసికొని, ఈ సమయంలో తన బలప్రతాపాలు చూపిద్దామనుకొని, పొగరుతో చెలరేగుతున్నాడు. ఇతడిని నీ శరజాలంతో సంహరించుము.

**విశేషం:** కర్ణుడిని తలుచుకొంటే ధర్మరాజుకు నిజానికి నిద్రరాదు. కాని, ఈ పద్యంలోని మాటలలో అతడి మీద తనకు కలిగిన చులకన అంతా తెలుపుతున్నాడు. భీష్మద్రోణులే పడిపోయారు. మహావీరులు చాలామంది పోయారు. సైన్యమా కౌరవులది పలచబడిపోయింది. ఇతడు చేయగలిగింది స్వల్పమనే ధైర్యం ఒక ప్రక్కా, అర్జునుడిని పురికొల్పే నేర్పొక ప్రక్కా కనిపిస్తున్నాయి. సూతనందన శబ్దం కూడా సాభిప్రాయమే.

**క. వనమునఁ బండ్రెండేఁడులు । మన ముత్కటదుఃఖవార్ధి మగ్నులమై యి**
**ట్లునికికిఁ దగ నితని భవ । త్సునిశిత బాణాబ్ధి ముంపు దుర్దమలీలన్. 67**

**ప్రతిపదార్థం:** మనము= దిగ్విజయం చేసిన పాండురాజు పుత్రులము, స్వయంగా దిగ్విజయం చేసి రాజసూయం చేసిన వాళ్ళము; వనమునన్= అరణ్యంలో; పండ్రెండు= పన్నెండు; ఏఁడులు= సంవత్సరాలు; ఉత్కట= పెద్ద; దుఃఖ= దుఃఖమనే, వార్ధిన్= సముద్రంలో; మగ్నులము+ఐ= మునిగినవారమై; ఇట్లు= ఈ విధముగా; ఉనికికిన్= ఉండటానికి; తగన్= తగినట్లుగా; ఇతనిన్= ఈ కర్ణుని; భవత్= నీయొక్క; సునిశిత= మిక్కిలి వాడిఅయిన; బాణ+అబ్ధిన్= అమ్ములనే సముద్రంలో; దుర్దమలీలన్= అణపరాని విధముగా; ముంపు(ము)= ముంచివెయ్యి.

**తాత్పర్యం:** మనం పన్నెండు సంవత్సరాలు దుఃఖసముద్రంలో మునిగిపోయి ఉన్నందుకు తగిన విధంగా ఇతడిని ఇపుడు నీ బాణసముద్రంలో తిరుగులేని విధంగా ముంచివేయుము.

**విశేషం:** అపకారం చేసినవారికి ప్రత్యపకారం చేయాలనిపించటం సహజం. కర్ణుడు దుష్టచతుష్టయంలోని వాడు కావటమూ, ద్రౌపదీ పరాభవాదులకు మూలం కావటమూ, ఇతడి అండ జూచుకొనే కౌరవులు పాండవుల కెగ్గులుచేయ సాహసించటమూ ఇట్లా అనటానికి కారణాలు.

**ఉ. వీఁ డొకరుండె యింక బలవిక్రమ సంపద గల్గి పోరిలో**
**వాఁడిమి సొంపు సూపఁ గలవాఁడు సుయోధనుపాలఁబేర్చు నీ**
**వేఁడిమి సూపి రూ పడఁపు వీనిఁ బురందర పుత్త్ర! యంతతోఁ**
**బోఁడిమి మాలు నాతఁడు ప్రభూత జయోన్నతి నిల్చు నీకడన్. 68**

**ప్రతిపదార్థం:** పురందర పుత్త్ర!= ఇంద్ర పుత్రుడైన అర్జునా!; సుయోధనుపాలన్= దుర్యోధనుని పక్షంలో; ఇంకన్= ఈ పైని; బల= బలముయొక్క; విక్రమ= పరాక్రమంయొక్క; సంపద= సమృద్ధి; కల్గి= ఉండి; పోరిలోన్= యుద్ధంలో; వాఁడిమి సొంపు= తీక్ష్ణత అందం; చూపన్+కలవాఁడు= చూపించే సామర్థ్యం కలవాడు; వీఁడు= ఇతడు; ఒకరుండ= ఒక్కడే; పేర్చున్= చెలరేగుతున్నాడు; నీ వేఁడిమి= నీయొక్క ప్రతాపం; చూపి= ప్రదర్శించి; వీనిన్= ఇతనిని; రూపు+అడఁపు= సంహరించు; అంతతోన్= వీని మరణంతో; అతఁడు= దుర్యోధనుడు; పోఁడిమి మాలున్= శోభను కోల్పోతాడు-క్రుంగిపోతాడు; ప్రభూత= అధికమైన; జయ+ఉన్నతి= గెలుపుయొక్క ఔన్నత్యం; నీకడన్= నీ దగ్గర; నిల్చున్= నిలబడుతుంది.

**తాత్పర్యం:** ఇంద్రకుమారా, అర్జునా! దుర్యోధనుడి పక్షంలో ఇంకా మిగిలి, బలపరాక్రమాలుండి యుద్ధంలో ప్రతాపం చూపించగలిగిన వా డితడొక్కడే చెలరేగుతున్నాడు. నీ ప్రతాపం చూపించి ఇతడిని సంహరించుము. ఆ దెబ్బతో ఆ దుర్యోధనుడు క్రుంగిపోతాడు. మహోన్నతమైన విజయం వచ్చి నీ దగ్గర నిలబడుతుంది.

**వ. నీకుం బోలిన మొగ్గరంబు గావింపు' మనవుడు నర్జునుం డర్ధ చంద్ర వ్యూహ విధానంబున మోహరించి తాను మధ్యప్రదేశస్థుండై వామదక్షిణ శృంగంబుల భీమ ధృష్టద్యుమ్నుల నిలిపి యుధిష్ఠిర నకుల సహదేవులం బింగలిగా నొనర్చె నతని చక్రరక్షకులగు యుధామన్యుండును నుత్తమౌజుండునుం గయ్యంపువేడుక మొగంబులం జిగురొత్తఁ బొలిచిరి. తక్కిన యోధులుం దగినచోట్ల నిలిచి రిట్లిరువాఁగును బన్నియున్న సమయంబున. 69**

**ప్రతిపదార్థం:** నీకున్+పోలిన= నీకు తగిన; మొగ్గరంబు= వ్యూహం; కావింపుము= పన్నవలసినది; అనవుడున్= అని పలుకగా; అర్జునుండు= అర్జునుడు; అర్ధచంద్ర= సగమైన చంద్రునియొక్క; విధానంబునన్= పద్ధతితో; మోహరించి= పన్ని; తాను= అర్జునుడు; మధ్యప్రదేశస్థుండు+ఐ= నడిమిప్రాంతంలో ఉన్నవాడు అయి; వామ= ఎడమది; దక్షిణ= కుడిది అయిన; శృంగంబులన్= కొమ్ములలో; అగ్రభాగాలలో; భీమధృష్టద్యుమ్నులన్= భీమునీ, ధృష్టద్యుమ్నునీ; నిలిపి= ఉంచి; యుధిష్ఠిర= ధర్మరాజునీ; నకుల= నకులునీ; సహదేవులన్= సహదేవునీ; పింగలిగాన్= వెనుకభాగంగా; ఒనర్చెన్= చేశాడు; అతని= అర్జునునియొక్క; చక్రరక్షకులు+అగు= రథచక్రాలను కాపాడేవారైన; యుధామన్యుండును= యుద్ధంలో క్రోధం కలవాడనే అర్థం కల, యుధామన్యుడనే పేరుకల, అర్జునుని ఎడమ రథచక్రానికి రక్షకుడైన పాంచాలరాజకుమారుడు; ఉత్తమ+ఓజుండును= శ్రేష్ఠమైన ఓజస్సు కలవాడనే అర్థంకల పేరున్న, పాంచాల దేశీయుడై, అర్జునుని కుడి రథచక్రానికి రక్షకుడైన యోధుడు; కయ్యము+వేడుక= యుద్ధంచేయాలనే ఉబలాటం; మొగంబులన్= ముఖాలయందు; చిగురొత్తన్= కలుగగా; పొలిచిరి= ఉన్నారు; తక్కిన= మిగిలిన; యోధులున్= యుద్ధవీరులూ; తగిన చోట్లన్= తాము ఉండదగిన ప్రదేశాలలో; నిలిచిరి= ఉన్నారు; ఇట్లు= ఈ విధంగా; ఇరువాఁగును= రెండు పక్షాలు; పన్ని= వ్యూహాలుగా తీర్చి; ఉన్న= ఉండిన; సమయంబునన్= వేళలో; (పరితోషముఁ బొందె' అనే తరువాతి పద్యంలోని క్రియతో అన్వయం)

**తాత్పర్యం:** నీకు తగిన వ్యూహం నీవు పన్నుము' అని చెప్పాడు. అర్జునుడు అర్ధచంద్ర వ్యూహం పన్నాడు. అందులో మధ్యభాగంలో తానే ఉన్నాడు. ఎడమ చివర భీమసేనుడినీ, కుడిచివర ధృష్టద్యుమ్నుడినీ ఉండుమన్నాడు. యుధిష్ఠిరుడినీ

నకుల సహదేవులనూ వెనుకభాగంలో ఉంచాడు. అతడి చక్రరక్షకులైన యుధామన్యూత్తమౌజుల యుద్ధ కుతూహలం వ్యక్తమౌతున్న ముఖాలతో నిలిచారు. మిగిలిన యోధులు తమకు తగిన తావులలో ఉన్నారు. ఇట్లా ఉభయపక్షాల వారూ వ్యూహాలు తీర్చి ఉన్న సమయంలో.

**చ. హరియును బాండునందనులు నాజి నవశ్యము నేఁడు సూడఁ బో**
**దురు జమునంచు నాత్మఁ బరితోషముఁ బొందె భవత్తనూజుఁడున్**
**దురమునఁ గర్ణయుక్తముగఁ ద్రుంగు సుయోధనుఁ డన్ తలంపుతోఁ**
**బరమసముద్యమస్ఫురణఁ బాండవముఖ్యుఁ డెలర్చె భూవరా! 70**

**ప్రతిపదార్థం:** భూవరా!= భూపతీ, ధృతరాష్ట్ర మహారాజా!; భవత్= నీయొక్క; తనూజుఁడున్= కుమారుడైన దుర్యోధనుడు కూడా; హరియును+పాండునందనులున్= కృష్ణుడు, పాండవులూ; నేఁడు= ఈరోజు; ఆజిన్= యుద్ధంలో; అవశ్యము= తప్పక; జమున్= యముని; చూడన్+పోదురు= చూడటానికి వెడతారు, మరణిస్తారు; అంచున్= అనుకొంటూ; ఆత్మన్= మనస్సులో; పరితోషమున్= సంతోషాన్ని; పొందెన్= పొందినాడు; పాండవముఖ్యుడు= పాండురాజు కుమారులలో మొదటివాడైన యుధిష్ఠిరుడు; దురమునన్= యుద్ధంలో; సుయోధనుఁడు= దుర్యోధనుడు; కర్ణయుక్తముగన్= కర్ణునితోపాటు; త్రుంగున్= మరణిస్తాడు; అన్= అనే; తలంపుతోన్= ఆలోచనతో; పరమ= అత్యధికమైన; ఉద్యమ= పూనికయొక్క; స్ఫురణన్= ప్రకాశముతో; ఎలర్చెన్= సంతోషించాడు.

**తాత్పర్యం:** రాజా! 'ఈ వేళ కృష్ణుడూ పాండవులూ యుద్ధంలో తప్పక పడిపోతా'రని నీ కొడుకు సంతోషించాడు. దుర్యోధనుడు యుద్ధంలో కర్ణుడితో సహా కడతేరుతాడని గట్టి పూనికతో అతిశయించాడు యుధిష్ఠిరుడు.

**విశేషం:** ధృతరాష్ట్రుడివి అసంభావ్యములైన ఆశలు. ఆ విషయంలో అతడి పోలిక వచ్చిన అతని కొడుకువి వాటికి మించిన ఆశలు. ఈ సన్నాయి నొక్కు 'భవత్తనూజుడు' అనటంలో వినిపిస్తున్నది. పాండురాజు దిగ్విజయం చేశాడు. అతడికి తగిన అతని పెద్దకొడుకు గట్టి పూనికతో అతిశయిస్తున్నాడనటంలో యుద్ధఫలితం అపుడే కనిపించిందని సూచితం.

**ఆ. ఒకటి కొకటి కంటె నుబ్బుచు వర్తించు । చాడ్పు దోఁప రెండు సైన్యములను**
**బొలిచెనపుడు సెలఁగె భూరి భేరీముఖ । తూర్యములు నభంబు దూఁటుకట్ట. 71**

**ప్రతిపదార్థం:** రెండు సైన్యములను= ఉభయసేనలలోనూ; ఒకటికంటెన్= ఒకదానికన్న; ఒకటి= మరొకసేన; ఉబ్బుచున్= బాగా సంతోషిస్తూ; వర్తించు= ప్రవర్తించే; చాడ్పు= పద్ధతి; తోఁపన్= కనిపించేటట్లుగా; పొలిచెన్= ఒప్పినవి; అపుడు= ఆ సమయంలో; భూరి= అధికమైన; భేరీముఖ= భేరులు మొదలయిన; తూర్యములు= వాద్యాలు; నభంబు= ఆకాశం; తూఁటుకట్టన్= చిల్లిపడేటట్లు; చెలంగెన్= మ్రోగాయి.

**తాత్పర్యం:** రెండు సైన్యాలలోనూ ఒకదానిని మించి మరొకటి ఆనందపడుతున్న రీతిగ ప్రవర్తించటం కనిపించింది. అనంతరం భేరులు మొదలయిన వాద్యాలధ్వనులు ఆకాశం చిల్లులు పడేటట్లు మ్రోగాయి.

**వ. చిందంబుల మ్రోఁతకు నిందు నందునం దమకించి భటులు గెలంకులం దాఁకఁ దోడ్తో నెఱపినయగ్గలిక నొండొంటి బెరయ మొగ్గరంబు లురవడించి. 72**

**ప్రతిపదార్థం:** భటులు= సైనికులు; ఇందున్+అందునున్= ఇక్కడా అక్కడా, కౌరవపక్షంలోనూ పాండవపక్షంలోనూ; చిందంబుల= శంఖాలయొక్క; మ్రోఁతకున్= ధ్వనికి; తమకించి= ఉత్సహించి; కెలంకులన్= పార్శ్వాలను; తాఁకన్= ఢీకొనగా; తోడు+తోన్= వెంటనే; నెఱపిన= ప్రకటించిన; అగ్గలికన్= విజృంభణంతో; ఒండు+ఒంటిన్= పరస్పరం; బెరయన్= కవియగా; మొగ్గరంబులు= వ్యూహాలు; ఉరవడించి= రేగి.

**తాత్పర్యం:** శంఖాల మ్రోతవలన రెండువైపుల సైనికులలోనూ ఉత్సాహం పెరిగింది. అందువలన ఉభయ పార్శ్వాలలోనూ ఢీకొనటానికి విజృంభించి రెండు వ్యూహాలు కలిసి చెలరేగాయి.

**సీ. నిబిడ ఘంటావళి నిక్వణంబులతోడ । భీషణ బృంహిత ఘోషములును**
**ఘననేమి నిష్ఠుర ధ్వనుల పొందులఁ గేతు । నిర్భర కింకిణీ నినదములును**
**జటుల ఖురవ్రాత పటురవంబులతోడ । నాభీలహేషా మహాస్వనములు**
**భూరిభుజాస్ఫాలనారావములతోడ । మేదురతర సింహనాదములును**

**ఆ. బరఁగి దిక్తటములఁ బగిలింప ననిమిష । ఖచర సిద్ధ యక్ష గరుడ గణము**
**లంతరంగములు నితాంత కౌతుకభరి । తములు గాఁగఁ జూడ్కి గములు వఱపె.** 73

**ప్రతిపదార్థం:** నిబిడ= దట్టమైన; ఘంటా= ఏనుగుల గంటలయొక్క; ఆవళి= సముదాయంయొక్క; నిక్వణంబుల తోడన్= ధ్వనులతోపాటు; భీషణ= భయంకరమైన; బృంహిత= గజ ఘీంకారములయొక్క; ఘోషములును= ధ్వనులూ; ఘన= గొప్పవైన; నేమి= (రథచక్రాల) పట్టాలయొక్క; నిష్ఠుర= కఠినమైన; ధ్వనుల= శబ్దాలయొక్క; పొందులన్= చెలుములతో; కేతు= జెండాలయందు; నిర్భర= నిండిన; కింకిణీ= చిరుమువ్వల; నినదములును= ధ్వనులూ; చటుల= కఠినమైన; ఖుర= గుఱ్ఱాల డెక్కలయొక్క; వ్రాత= సముహాల; పటు= గట్టి; రవంబులతోడన్= ధ్వనులతో; ఆభీల= మిక్కిలి భయంకరాలైన; హేషా= గుర్రాల సకిలింపులయొక్క; మహాస్వనములును= పెద్ద ధ్వనులూ; భూరి= పెద్దవి అయిన; భుజా= బాహువులయొక్క; ఆస్ఫాలన= చరపులయొక్క; ఆరావములతోడన్= ధ్వనులతో; మేదురతర= మిక్కిలి దట్టమైన; సింహనాదములును= వీరుల సింహగర్జనలవంటి ధ్వనులూ; పరఁగి= వ్యాపించి; దిక్+తటములన్= దిక్ప్రదేశాలను; పగిలింపన్= బ్రద్దలుచేయగా; ఖచర= ఆకాశ సంచారులైన; సిద్ధ= సిద్ధులయొక్క; యక్ష= యక్షులయొక్క; గరుడ= గరుడులయొక్క; గణములు= సమూహాలు; అంతరంగములు= (తమ) మనస్సులు; నితాంత= మిక్కిలి వ్యాపించిన; కౌతుక= కుతూహలంచేత; భరితములు+కాఁగన్= నిండినవికాగా; చూడ్కి= చూపులయొక్క; గములు= సమూహాలను; వఱపెన్= ప్రసరింపజేశాయి.

**తాత్పర్యం:** ఏనుగుల గంటల ధ్వనులతో వాటి భయంకర ఘీంకార ధ్వనులు కలిశాయి. రథాల పట్టాల కఠిన ధ్వనులతో జెండాల నిండా ఉన్న చిరుమువ్వల సవ్వడులు కలిశాయి. గుర్రాల గట్టి డెక్కల చివళ్ళ చప్పుళ్ళతో భయాన్ని కలిగించే వాటి సకిలింపులు కలిశాయి. సైనికుల మల్ల చరుపుల ధ్వనులతో, సింహగర్జనలవంటి వారి హుంకార ధ్వనులు కలిశాయి. ఈ ధ్వనులన్నీ వ్యాపించి దిగ్భాగాలు పగిలిపోయాయి. అపుడు ఆకాశంలో సంచరించే దేవయోని విశేషాదులయిన సిద్ధ యక్ష గరుడుల మనస్సులు కుతూహలంతో నిండిపోయాయి. అపుడు వారు చూడసాగారు.

**వ. ఇట్లు దలపడి యిరువాఁగును బేరువాఁడిఁ బోరునెడ గరుడ ప్రహారంబుల నొచ్చిన పంచాస్య పన్నగంబులం బోని బాహువులను గాంతత్వరుచి సౌరభంబుల పెంపున సంపూర్ణ చంద్రార్క కమలంబులం గ్రేణిసేయు**

**నాననంబులను సంగ్రామరంగం బలంకృతంబయ్యె వాహనంబులమీఁదనుండి భూషణకిరణంబులు మెఱయ సైనికులు నేలంగూలు నప్పుడు పుణ్యావసాన కాలంబున నాకలోక పరిభ్రష్టంబగు మహాత్మలోకంబు చందంబు దోఁచెఁ జతురంగంబులునుం దమతమ జాతిచేతంబడుటయు నేనుంగు లడరిన నరదంబులు సదియుటయు నాశ్వికులు వొదివినం గరులు ధరం దొరంగుటయు భటు లురవడించినం దురంగంబులు గడికండంబు లగుటయు రథంబులు గవిసినం గాల్పురు దుమురగుటయుఁ గ్రందున నెల్ల తెఱంగులు నన్ని దెఱంగులం గలయ బడలువఱుచుటయు రౌద్రరసంబుఁ బెనిచె నాసమయంబున సాత్యకి ధృష్టద్యుమ్న చేకితాన ద్రౌపదేయులు ప్రభద్రక చేది పాండ్య చోళ మగధ వంగాది దేశంబుల బలంబుల తోడ బరవసంబుసేసి తఱిమి రట్టియెడ.** **74**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; తలపడి= డీకొని; ఇరువాఁగును= ఉభయపక్షాలూ; పేరు, వాఁడిన్= మిక్కిలి ప్రతాపంతో; పోరు+ఎడన్= యుద్ధంచేసే సమయంలో; గరుడ ప్రహారంబులన్= గ్రద్దల దెబ్బలచేత; నొచ్చిన= చనిపోయిన; పంచాస్య= ఐదుముఖాల; పన్నగంబులంబోని= పాములవంటి; బాహువులను= చేతులతోను; కాంతత్వ= మనోహరంగా ఉండటంయొక్క; రుచి= కాంతియొక్కా; సౌరభంబుల= సువాసనయొక్కా; పెంపునన్= అతిశయంచేత; సంపూర్ణ= పూర్తిగా, నిండైన; చంద్ర= చంద్రునీ; అర్క= సూర్యునీ; కమలంబులన్= పద్మాలనీ; క్రేణిసేయు= తిరస్కరించే; ఆననంబులన్= ముఖాలతోనూ; సంగ్రామ రంగంబు= యుద్ధప్రదేశం; అలంకృతంబు= అలంకరింపబడినది; అయ్యెన్= అయింది; వాహనంబులమీఁదనుండి= వాహనాలపైనుండి; భూషణ= నగలయొక్క; కిరణంబులు= వెలుగులు; మెఱయన్= ప్రకాశించగా; నేలన్= భూమిపై; కూలునపుడు= పడిపోయే సమయంలో; పుణ్య= సుకృతంయొక్క; అవసాన= చివరి; కాలంబునన్= సమయంలో; నాకలోక= స్వర్గలోకం నుంచి; పరిభ్రష్టంబు+అగు= జారిపోయే; మహాత్మ= మహాత్ములయొక్క; లోకంబు= సమూహంయొక్క; చందంబు= పోలిక; తోఁచెన్= ఊహకు వచ్చింది; చతురంగంబులున్= సైన్యంలోని రథాలు; గజాలు, గుర్రాలు, కాలిబంట్లు అనే నాలుగు భాగాలు; తమ తమ; జాతిచేతన్= తెగచేత; పడుటయు= పడిపోవటమూ; ఏనుంగులు= గజాలు; అడరినన్= డీకొనగా; అరదంబులు= రథాలు; చదియుటయున్= విరిగిపోవటమూ; అశ్వికులు= రౌతులు; పొదివినన్= క్రమ్మగా; కరులు= ఏనుగులు; ధరన్= భూమిపై; తొరంగుటయున్= పడిపోవటమూ; భటులు= సైనికులు-కాలిబంట్లు; ఉరవడించినన్= విజృంభించగా; తురంగంబులు= గుర్రాలు; కడి+కండంబులు= ముక్కలు ముక్కలు; అగుటయున్= కావటము; రథంబులు= తేరులు; కవిసినన్= మీదికిరాగా; కాల్బురు= కాలిబంట్లు; తుమురు+అగుటయున్= తుక్కుకావటమూ; క్రందునన్= సందడిలో; ఎల్లతెఱంగులున్= అన్నివిధాలవారు; అన్ని తెఱంగులన్= అన్ని విధాలవారితోనూ; కలయన్= కలియగా; బడలు+ పఱుచుటయున్= అలసిపోయేటట్లు చేయటమూ; రౌద్రరసంబున్= క్రోధమనే నిలుకడగా ఉండే భావాన్ని; పెనిచెన్= పెంచాయి; ఆ సమయంబునన్= అప్పుడు; సాత్యకి= కృష్ణుని తమ్మునివరుసవాడైన సాత్యకి; ధృష్టద్యుమ్నుఁడు= పాండవ సేనానాయకుడు, ద్రౌపది అన్న అయిన ధృష్టద్యుమ్నుడు; చేకితానుఁడు= యాదవవీరుడైన చేకితానుఁడు; ద్రౌపదేయులు= ద్రౌపదికుమారులైన ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతకర్మ అనేవారూ; ప్రభద్రక+చేది+పాండ్య+చోళ+మగధ+వంగ+ ఆదిదేశంబుల బలంబుతోడన్= ప్రభద్రకం, చేది, పాండ్యం, చోళం, మగధం, వంగం మొదలయిన దేశాల సైన్యాలతో; బరవసంబు+చేసి= ఉత్సాహంతో యుద్ధంచేసి; తఱిమిరి= పారిపోయేటట్లు చేశారు; అట్టి+ఎడన్= అట్లాంటి సమయంలో (భీముడు కవిసె అని తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఇట్లా ఉభయసేనలూ డీకొని మహాప్రతాపంతో పోరాడే సమయంలో గ్రద్దల దెబ్బలకు ప్రాణాలు విడిచిన ఐదు తలల పాములవలె తెగిపడిన బాహువులతో, మనోహరకాంతి అధికంగా ఉన్నందువల్ల పూర్ణచంద్ర సూర్యులను, మనోహర పరిమళం అధికంగా ఉన్నందువల్ల పద్మాలను వెలవెలపోయేటట్లు చేసే ముఖాలతో యుద్ధభూమి

అలంకరించబడింది. వీరులు తాము పెట్టుకొన్న ఆభరణాల వెలుగులతో వాహనాలనుండి నేలపై రాలిపడుతుంటే పుణ్యం క్షీణించిన తరువాత స్వర్గభ్రష్టులై ఈ లోకానికి వచ్చి పడుతున్న మహాత్ములవలె ఉన్నారు. చతురంగ సైన్యాలలో ఏనుగులవలన ఏనుగులూ, రథాలవలన రథాలూ, గుఱ్ఱాలవలన గుఱ్ఱాలూ, కాలిబంట్లవలన కాలిబంట్లూ పడిపోతున్నారు. అదీకాక, ఏనుగులు ఢీకొంటే రథాలు తుక్కయిపోతున్నాయి. కాలిబంట్లు చెలరేగితే గుఱ్ఱాలు ముక్కలు ముక్కలయిపోతున్నాయి. రథాలు మీదికి వస్తే కాలిబంట్లు నుగ్గయిపోతున్నారు. ఇట్లా ఎన్నిరకాల వీలయితే అన్ని రకాలా కలియబడి ఎదుటివారిని అలసిపోయేటట్లు చేస్తుంటే రౌద్రం పెరిగిపోయింది. అపుడు సాత్యకీ, ధృష్టద్యుమ్నుడూ, చేకితానుడూ, ఉపపాండవులూ, ప్రభద్రక-చేది-పాండ్య-చోళ-మగధ-వంగ-ప్రభృతి దేశాల సైన్యాలతో ఉత్సాహంతో యుద్ధంచేసి తరిమారు. అపుడు.

**ఉ. దంతి ఘటల్ మహోగ్ర సముదగ్రతతో నడతేర దర్ప దు**
**ర్దాంత గజాధిరోహణ నితాంత సముజ్జ్వల భంగిఁ బ్రౌఢ వి**
**క్రాంతి విలాస మొప్పఁగ నఖండిత పౌరుషుఁడైన భీముఁ డ**
**త్యంతసముద్ధతిం గవిసె నస్మదనీకము సంచలింపఁగన్. 75**

**ప్రతిపదార్థం:** అఖండిత= గొప్పదైన; పౌరుషుఁడు= పౌరుషం కలవాడు; ఐన= అయినట్టి; భీముఁడు; అస్మద్+అనీకము= మనసైన్యము; సంచలింపఁగన్= మిక్కిలి కలతనొందగా; దంతి= ఏనుగులయొక్క; ఘటల్= గుంపులు; మహోగ్ర= అతి తీక్ష్ణమైన; సం+ఉత్+అగ్రతతోన్= భయంకరత్వంతో; నడతేరన్= నడచిరాగా; దర్ప= గర్వంతో; దుర్+దాంత= అణపరాని; గజ= ఏనుగు; అధిరోహణ= ఎక్కుటచేత; నితాంత= అత్యంతమైన; సమ్+ఉత్+జ్వల= మిక్కిలి ప్రకాశించే; భంగిన్= పద్ధతితో; ప్రౌఢ= అధికమైన; విక్రాంతి= విక్రమంయొక్క విలాసము, హొయలు; ఒప్పఁగన్= తగి ఉండగా; అత్యంత= మిక్కుటమైన; సముద్ధతిన్= గర్వంతో; కవిసెన్= ఢీకొన్నాడు.

**తాత్పర్యం:** ఏనుగుల సమూహాలు మహాభయంకరంగా నడిచిరాగా, మహాపౌరుషశాలి అయిన భీమసేనుడు - అత్యంతకాంతితో, పరిపక్వవిక్రమ విలాసంతో, అత్యధికగర్వంతో - అణచశక్యంకాని ఒక మదపుటేనుగు నెక్కి, మన సేన మిక్కిలి కలతపడేటట్లుగా ఎదుర్కొన్నాడు.

**క. ఉదయాచలమున రుచి సం । పదఁ బొలుచు పతంగు పగిదిఁ బ్రసరత్తీవ్ర**
**ప్రదరములు నెఱయమెఱయఁగ । మదావళము మీద వెలిఁగె మారుతి యధిపా! 76**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధృతరాష్ట్ర మహారాజా!; మారుతి= వాయునందనుడైన భీమసేనుడు; మదావళముమీదన్= మదపుటేనుగు మీద; ప్రసరత్= వ్యాపిస్తున్న; తీవ్ర= వాడికల; ప్రదరములు= బాగా చీల్చే బాణాలు; నెఱయన్= నిండుగా; మెఱయన్= ప్రకాశింపగా; ఉదయ+అచలమునన్= పొడుపు కొండమీద; రుచి= కిరణాల; సంపదన్= ఆధిక్యంతో; పొలుచు= ప్రకాశించే; పతంగు పగిదిన్= సూర్యునివలె; వెలిఁగెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** వేస్తున్న వాడి బాణాలు వ్యాపిస్తూ నిండుగా ప్రకాశిస్తుండగా ఏనుగుమీద ఉన్న వాయుపుత్రుడు భీముడు, ఉదయపర్వతంమీద వ్యాపిస్తున్న కిరణాల ఆధిక్యంతో ఉన్న సూర్యుడివలె ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ. భీముడిని ఉదయిస్తున్న సూర్యుడితో పోల్చినందున సూర్యుడెట్లా అంధకారాన్ని తరిమి వెలుతురు ప్రసరింపజేస్తాడో, అట్లాగే కర్ణుడు సేనాధిపతి అయినందున పాండవసైన్యంలో ఏమైనా నిరుత్సాహం వ్యాపించిఉన్న పక్షంలో దానిని తొలగించాడని గమ్యమానం అవుతున్నది.

### క్షేమధూర్తి యను రాజు భీమునితో యుద్ధము సేసి చచ్చుట (సం. 8-8-25)

**వ. అమ్మహావీరు నాలోకించి కులూతదేశాధీశుండయిన క్షేమధూర్తి నిజబలంబులం బురికొల్పికొని యేచిత్రోచి యాహ్వానంబు సేసి తన కరటిం గొలిపిన నది గిరి గిరం దాఁకు తెఱంగున నతని మాతంగంబునకు మార్కొనియె నయ్యిరువురు నొండొరులపైఁ దోమరస్తోమంబు లడరించి యార్చుచు నుద్దండ పరాక్రమంబులగు వేదండంబుల పటు ప్రచారంబులు చారు భీషణంబులుగా నొకళ్ళొకళ్ళం జుట్టుకొని వచ్చుచుం బెనంగి. 77**

**ప్రతిపదార్థం:** కులూత= కులూతం అనే పేరుగల; దేశ= దేశంయొక్క; అధీశుండు= ప్రభువు; అయిన= ఐనట్టి; క్షేమధూర్తి= క్షేమధూర్తి అనే పేరుగలవాడు; అమ్మహావీరున్= ఆ గొప్పవీరుని; ఆలోకించి= చూచి; నిజబలంబులన్= తన సైన్యాలను; పురికొల్పికొని= ప్రోత్సాహపరచుకొని; ఏచి= చెలరేగి; త్రోచి= (తన సైన్యాలను) ముందుకు నడిపించి; ఆహ్వానంబు+చేసి= (భీమసేనుని తన పైకి రమ్మని) పిలిచి; తనకరటిన్= తన ఏనుగును; కొలిపినన్= ఉసికొలుపగా; అది= క్షేమధూర్తి ఏనుగు; గిరి= కొండ; గిరిన్= పర్వతాన్ని; తాఁకు= ఢీకొనే; తెఱంగునన్= విధంగా; అతని= భీమునియొక్క; మాతంగంబునన్= ఏనుగుతో; మార్కొనియెన్= ఢీకొన్నది; ఆ+ఇరువురున్= ఆ యిద్దరూ, (భీమసేన క్షేమధూర్తులిద్దరూ); ఒండు+ఒరులపైన్= పరస్పరం (ఒకరిపై మరొకరు); తోమర= తోమర (చిన్న యీటెలు, చిన్న గుదియలు) అనే ఆయుధాలయొక్క; స్తోమంబులు= సముదాయాలను; అడరించి= ప్రయోగించి; ఆర్చుచున్= అరుస్తూ; ఉద్దండ= భయంకరమైన; పరాక్రమంబుల= పరాక్రమం కలవి; అగు= అయిన; వేదండంబుల= ఏనుగులయొక్క; పటు= వేగంకల; ప్రచారంబులు= నడకలు; చారు= అందమైనవీ; భీషణంబులు= భయంకరములూ; కాన్= అయ్యేటట్లుగా; ఒకళ్ళు= ఒకరు; ఒకళ్ళన్= మరొకరిని; చుట్టుకొని= చుట్టూ తిరిగి; వచ్చుచున్= వస్తూ; పెనంగి= పోరాడి. (తరువాతి పద్యంలోని 'ఆపాదించిరి' అనే క్రియతో అన్వయం.)

**తాత్పర్యం:** కులూత దేశపురాజు క్షేమధూర్తి భీముడిని చూచాడు. తన సైన్యాలను ప్రోత్సాహపరిచి నడిపించుకొంటూ విజృంభించి, భీముడిని రమ్మని పిలిచి తన ఏనుగును అతడిమీదికి ఉసికొలిపాడు. అది కొండ కొండను ఢీకొన్నట్టుగా భీముడి ఏనుగును ఢీకొన్నది. ఆ వీరులిద్దరూ ఒకరిమీద మరొకరు చిన్న ఈటెలు ప్రయోగించుకొన్నారు. మహాపరాక్రమంకల వారి ఏనుగులు ఒక దానిచుట్టూ మరొకటి తిరుగుతూ ఉంటే అందంగానూ భయంకరంగానూ కూడా ఉన్నది. ఇట్లా వారిద్దరూ యుద్ధంచేశారు.

**క. కోదండంబులు గొని బా । హాదర్పము లెసఁగఁ బోరి యన్యోన్యధను**
**శ్ఛేదంబులఁ బోరిఁబోరి నా । పాదించిరి రయము జనులు ప్రస్తుతి సేయన్. 78**

**ప్రతిపదార్థం:** కోదండంబులు= ధనుస్సులు; కొని= తీసికొని; బాహా= చేతులయొక్క; దర్పములు= గర్వాలు; ఎసఁగన్= వృద్ధిచెందగా; పోరి= యుద్ధంచేసి; పొరిన్+పొరిన్= మళ్ళీమళ్ళీ; రయము= వేగాన్ని; జనులు= ప్రజలు; ప్రస్తుతి+చేయన్= పొగడగా; అన్యోన్య= ఒకరొకరి; ధనుః= విండ్లయొక్క; ఛేదంబులన్= నరకటాలను; ఆపాదించిరి= కలిగించారు.

**తాత్పర్యం:** ఇద్దరూ ధనుస్సులు తీసికొన్నారు. బాహుబలగర్వాలు పెరుగుతుండగా యుద్ధంచేశారు. వారి వేగాన్ని జనం మెచ్చుకొనే విధంగా ఒకరి ధనుస్సు లొకరు అనేక పర్యాయాలు నరుక్కొన్నారు.

**వ. దానం గోపం బగ్గలించి. 79**

**ప్రతిపదార్థం:** దానన్= అందువలన; కోపంబు= అలుక; అగ్గలించి= అధికమై.

**తాత్పర్యం:** అందువలన వారికి కోపం పెరిగి

**తే. శక్తులను దోమరంబుల సరభసముగఁ । బోరుచో భీమసేనుని పేరురమున**
**క్షేమధూర్తి సముజ్జ్వలతోమరంబు । లేడు నాటించె దర్పంబు రూఢికెక్క. 80**

**ప్రతిపదార్థం:** శక్తులను= ఈటెలతోనూ; తోమరంబులన్= చిన్న యీటెలతోనూ; సరభసముగన్= వేగంగా; పోరుచోన్= పోరేటప్పుడు; క్షేమధూర్తి= క్షేమధూర్తి; భీమసేనుని= భీమునియొక్క; పేరు+ఉరమునన్= విశాలమైన వక్షఃస్థలంమీద; సముజ్జ్వల= బాగా ప్రకాశిస్తున్న; తోమరంబులు= చిన్నయీటెలు; ఏడు= ఏడింటిని; దర్పంబు= తన గర్వం; రూఢికిన్+ఎక్కన్= ప్రసిద్ధిచెందగా; నాటెన్= దిగిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** శక్తులతోనూ, తోమరాలతోనూ వేగంగా పోరాడే సమయంలో క్షేమధూర్తి, భీమసేనుడి విశాలమైన వక్షఃస్థలంపై చిన్న ఈటెలేడింటిని గ్రుచ్చుకొనేటట్లు వేశాడు. అందువలన అతడి గర్వం ప్రసిద్ధికెక్కింది.

**చ. అనిల తనూభవుండు దపనాంశు నిభంబగు తోమరంబు వై**
**చిన నడుమం గరూశపతి చిత్రముగాఁ దునుమాడి వీఁక నా**
**తనిఁ బటు షష్టికాండ పరితాడిత దేహునిఁ జేయ మేటివిల్**
**గొని యతఁ డక్కులూతపతికుంజరమున్ వెసఁగప్పె నమ్ములన్. 81**

**ప్రతిపదార్థం:** అనిల తనూభవుండు= వాయుపుత్రుడైన భీముడు; తపన= సూర్యునియొక్క; అంశునిభంబగు= కిరణంవంటి; తోమరంబు= చిన్న యీటెను; వైచినన్= ప్రయోగింపగా; కరూశపతి= కరూశదేశపురాజు; చిత్రముగా= వింతగా; నడుమన్= మధ్య; తునుమాడి= నరికి; వీఁకన్= పూనికతో; ఆతనిన్= భీముని; పటు= గట్టివైన; షష్టి= అరవై; కాండ= బాణాలతో; పరితాడిత= కొట్టబడిన; దేహునిన్= దేహం కలవానిని; చేయన్= చేయగా; అతఁడు= భీముడు; మేటివిల్= పెద్ద ధనుస్సును; కొని= తీసుకొని; వెసన్= వేగముతో; ఆ+కులూతపతి= ఆ కులూతదేశపురాజుయొక్క; కుంజరమున్= ఏనుగును; అమ్ములన్= బాణాలతో; కప్పెన్= కనపడకుండా చేశాడు.

**తాత్పర్యం:** భీముడు సూర్యకిరణంవలె మెరుస్తున్న చిన్నఈటె నొకదానిని ప్రయోగించాడు. దానిని కరూశ దేశపురాజు మధ్యలో ఆశ్చర్యకరంగా ముక్కలు చేశాడు. అంతటితో ఆగకుండ వేగంగా అరవై బాణాలు భీముడి శరీరానికి తగిలేటట్లు ప్రయోగించాడు. భీముడు ఒక పెద్దవిల్లు తీసికొని క్షేమధూర్తి ఏనుగుకు అన్నివైపులా బాణాలు దట్టంగా ప్రయోగించాడు.

**వ. అట్లు భీమసేనుండు గరూశపతి విక్రమంబు సరకు సేయక యతని దిక్కునుం జూడక క్షేమధూర్తి సామజంబును సాయకమయంబు జేసిన నది మొగ తిరిగి పఱచినం బోవనీక యప్పావని వెనుకొనుటయు నక్కులూతపతి**

**ప్రయత్నంబున నమ్మాతంగంబు మరల్చి యతని యంగంబునను దద్గజంబు శరీరంబునను నిశాత శరపరం పరలు వఱపిన. 82**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; భీమసేనుండు= భీముడు; కరూశపతి= కరూశదేశపురాజుయొక్క; విక్రమంబు= పరాక్రమాన్ని; సరకు+చేయక= లక్ష్యపెట్టక; అతని= ఆ రాజుయొక్క; దిక్కునున్= వైపుగూడా; చూడక= చూడకుండా; సామజంబును= ఏనుగును; సాయకమయంబున్= బాణాలతో నిండినదానినిగా; చేసినన్= చేయగా; అది= ఆ ఏనుగు; మొగము+తిరిగి= పెడమొగంపెట్టి; పఱచినన్= పరుగుపెట్టినా; ఆ+పావని= ఆ వాయుపుత్రుడైన భీముడు; పోవనీక= పోవనీయక; వెనుకొనుటయున్= వెంబడించేసరికి; ఆ+కులూతపతి= ఆ క్షేమధూర్తి; ప్రయత్నంబునన్= పూనికతో; ఆ+మాతంగంబున్= ఆ ఏనుగును; మరల్చి= వెనుకకు త్రిప్పి; అతని= భీమునియొక్క; అంగంబునను= శరీరంలో; తద్+గజంబు= ఆ ఏనుగుయొక్క; శరీరంబునను= దేహంలోనూ; నిశిత= వాడి అయిన; శర= బాణాలయొక్క; పరంపరలు= వరుసలు; పఱపినన్= ప్రయోగింపగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఆ విధంగా భీముడు కరూశదేశాధిపతి పరాక్రమాన్ని లెక్కచేయక, అతనివైపు కూడ చూడకుండ, అతని ఏనుగు శరీరం నిండా బాణాలు వేసేసరికి, అది వెనుదిరిగి పరుగెత్తింది. అయినా భీముడు దాన్ని వదలకుండా వెంబడించగా, ఆ క్షేమధూర్తి ప్రయత్నించి, తన ఏనుగును మళ్ళీ భీముడివైపు మళ్ళించి, భీముడి శరీరంమీద, అతడి ఏనుగు శరీరంమీద వాడిబాణాల పరంపరలు ప్రయోగించాడు.

**విశేషం:** భీముడు వజ్రకాయుడు. అతడు పసితనంలోనే కుంతి చేతిలోనుండి జారి క్రిందపడితే కొండరాళ్ళు పిండి అయిపోయాయి. ఒకపాటి బాణపుదెబ్బలు అతడిమీద పనిచేయవు. ద్రోణుడి బాణాలవర్షానికే, కర్ణుడి బాణాలవర్షానికే లెక్కలేకుండా పోయింది. అందువల్ల భీముడు కరూశరాజు బాణాలు లెక్కపెట్టకపోవటం వింతకాదు.

**చ. ఉఱక సమీరసూనుఁడు దదుగ్ర ధనుర్దళనం బొనర్చి యే**
**డ్తెఱఁ గరి నొంప నాతఁడు గడిందిమగంటిమి నొండువింట ను**
**న్మెఱుఁగులు గ్రమ్ముకోల నతనిం గడునొంచి తదీయహస్తి పా**
**ల్పఱి మహిమ్రొగ్గనేసిన ధరాధిప! నీ బల మార్చె నుబ్బునన్. 83**

**ప్రతిపదార్థం:** ధరాధిప!= భూపతీ!; సమీరసూనుఁడు= వాయుపుత్రుడైన భీముడు; ఉఱక= లక్ష్యపెట్టక; తద్= అతని; ఉగ్ర= భీకరమైన; ధనుః= వింటియొక్క; దళనంబు= విరవటం; ఒనర్చి= చేసి; ఏడ్తెఱన్= పూనికతో; కరిన్= క్షేమధూర్తియొక్క ఏనుగును; నొంపన్= నొప్పింపగా; ఆతడు= క్షేమధూర్తి; కడింది= మిక్కిలి; మగంటిమిన్= పౌరుషంతో; ఒండువింటనున్= వేరే ధనుస్సుతో; మెఱుఁగులు+క్రమ్ము= కాంతులను వ్యాపింపజేసే; కోలన్= అమ్ముతో; అతనిన్= భీముని; కడున్= మిక్కిలి; నొంచి= నొప్పించి; తదీయ= ఆ భీమునిదైన; హస్తి= ఏనుగు; పాల్పు+అఱి= మరణించి; మహిన్= భూమిపై; మ్రొగ్గన్= వ్రాలునట్లుగా; ఏసినన్= బాణాలు ప్రయోగింపగా; నీ బలము= నీ బలము, నీ సైన్యం; ఉబ్బునన్= సంతోషంతో; ఆర్చెన్= అరచినది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కులూతరాజు ప్రయోగించిన శరపరంపరను భీముడు లక్ష్యపెట్టకుండా, అతడి విల్లు విరుగగొట్టాడు. అతడి ఏనుగునూ నొప్పించాడు. అపుడు ఆ రాజు మహాపౌరుషంతో మరొక విల్లు తీసికొని, వెలుగులు చిమ్మే బాణంతో భీముడిని బాగా నొప్పించి, అతడి ఏనుగు ప్రాణాలు విడిచి నేలపై పడిపోయేటట్లు చేశాడు. దానికి సంతోషించి నీ సైన్యం అరచింది.

**మ. గదసేతంగొని దంతి డిగ్గి చని యా కౌంతేయుఁ డవ్వీరు ను**
**న్మద మాతంగముఁ గూలనేసినఁ గృపాణస్ఫారదోర్దండుఁడై**
**కదియన్ వచ్చె నతండు నిష్ఠురగదాఘాతంబునం గూల్చె నే**
**పు దలిర్పన్ వెసనామరుత్తనయుఁ డా భూమీశు భూమీశ్వరా! 84**

**ప్రతిపదార్థం:** భూమీశ్వరా!= భూపతీ, రాజా!; ఆ కౌంతేయుఁడు= ఆ కుంతీపుత్రుడైన భీముడు; గద; చేతన్= చేతితో; కొని= పట్టుకొని; దంతిన్= ఏనుగును; డిగ్గి= దిగి; చని= వెళ్ళి; ఆ వీరున్= ఆ వీరుడైన క్షేమధూర్తి యొక్క; ఉన్మద= మిక్కిలి మదించిన; మాతంగమున్= ఏనుగును; కూలన్+ఏసినన్= పడిపోయేటట్లు కొట్టగా; అతండు= క్షేమధూర్తి; కృపాణ= ఖడ్గంతో; స్ఫార= కదులుతున్న; దోర్దండుఁడై= దండంవంటి చేయికలవాడై; కదియన్= సమీపింపగా, మార్కొనగా; వచ్చెన్= వచ్చాడు; ఆ మరుత్+తనయుడు= ఆ వాయుపుత్రుడైన భీముడు; ఆ భూమి+ఈశున్= ఆ భూపతిని; ఏపు= ఆధిక్యం; తలిర్పన్= ఒప్పగా; నిష్ఠుర= కఠినమైన; గదా= గదయొక్క; ఆఘాతంబునన్= దెబ్బతో; వెసన్= వెంటనే; కూల్చెన్= పడిపోయేటట్లు చేశాడు, సంహరించాడు.

**తాత్పర్యం:** భీముడు గద చేతితో పట్టుకొని పడిపోయిన ఏనుగు మీది నుండి దిగి, క్షేమధూర్తి ఏనుగును పడగొట్టాడు. క్షేమధూర్తి కత్తిపట్టుకొని భీముడి మీదికి వచ్చాడు. మహారాజా! భీముడు వెంటనే కఠిన గదా ప్రహారంతో అతడిని సంహరించాడు.

**వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగు కడన పడిన క్షేమధూర్తి వజ్రప్రహారంబునం గూలిన కులశైలంబు సమీపంబున నిర్ఘాతపాతపతితంబయిన కంఠీరవంబు కరణి నొప్పె నతనిం గనుంగొని మన మొన వెఱచఱచి పఱచినఁ బాండవ బలంబులు వెనుకొనుటయు. 85**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఇలా; ఏనుగు= గజముయొక్క; పీనుంగు కడన= కళేబరం వద్దనే; పడిన= పడిపోయిన; క్షేమధూర్తి= కులూతదేశపు రాజు; వజ్ర= ఇంద్రుని వజ్రాయుధంయొక్క; ప్రహారంబునన్= దెబ్బవల్ల; కూలిన= పడిపోయిన; కులశైలంబు= కులపర్వతంయొక్క; సమీపంబునన్= దగ్గర; నిర్ఘాత= పిడుగుయొక్క; పాత= పడటంవల్ల; పతితంబు+అయిన= పడిపోయిన; కంఠీరవంబు= సింహం; కరణిన్= వలె; ఒప్పెన్= అందగించాడు; మనమొన= మనసేన; అతనిన్= క్షేమధూర్తిని; కనుంగొని= చూచి; వెఱచఱచి= భయపడి; పఱచినన్= పారిపోగా; పాండవ బలంబులు= పాండవుల సేనలు; వెనుకొనుటయున్= వెంబడించేసరికి (తరువాతి పద్యంతో అన్వయం).

**తాత్పర్యం:** ఇట్లా తన ఏనుగు కళేబరం వద్దనే పడిపోయిన క్షేమధూర్తి, ఇంద్రుడి వజ్రాయుధపు దెబ్బకు కూలిన కులపర్వతం దగ్గరనే, పిడుగుపాటుకు పడిపోయిన సింహంవలె శోభించాడు. అట్లా పోయిన అతడిని చూచేసరికి మన సేనకు భయంపుట్టి పారిపోసాగింది. దానిని పాండవసేనలు తరుముతున్నాయి. అపుడు.

**విశేషం:** అలం: ఉపమ. మన పురాణేతిహాసాలనుబట్టి భూమి ఏడుదీవులుగా ఉన్నది. వాటిలో ఒకటి జంబూద్వీపం. ప్రతి ద్వీపంలోనూ ఏడేసి ప్రధాన పర్వతాలున్నాయి. వాటిలో జంబూద్వీపంలోని ఏడు ఇవి: మహేంద్రం, మలయం, సహ్యం, శుక్తిమంతం, గంధమాదనం, వింధ్యం, పారియాత్రం- వీటిని కులపర్వతాలంటారు.

**మ. పటు బాణప్రకరంబు లంబరముఁ గప్పం గర్ణుఁ డాసేనఁ దాఁ**
**కుటయున్ సైన్యము దైన్యముం దొఱఁగి మార్కొన్నన్ భుజాసంపదు**
**త్కట గర్వోద్ధురభంగిఁ బాండుసుతులున్ దర్పంబు సొం పేర్పరిం**
**చుటకుం జొచ్చినఁ బేర్చెఁ బోరనిమిషస్తోమాద్భుతాపాదియై. 86**

**ప్రతిపదార్థం:** కర్ణుఁడు= అంగరాజు; పటు= గట్టివైన; బాణ= అమ్ములయొక్క; ప్రకరంబులు= సముదాయాలు; అంబరమున్= ఆకాశాన్ని; కప్పన్= కనబడకుండా చేయగా; ఆ సేనన్= ఆ తరుముతున్న పాండవసైన్యాన్ని; తాఁకుటయున్= ఢీకొనేసరికి; సైన్యము= మనసేన; దైన్యమున్= దీనత్వాన్ని; తొఱఁగి= విడిచిపెట్టి; మార్కొన్నన్= ఢీకొనేసరికి; పాండుసుతులున్= పాండవులు; భుజాసంపద్= బాహుబలంయొక్క; ఉత్కట= అత్యధికమైన; గర్వ= పొగరువల్ల; ఉద్ధురభంగిన్= భయంకరమైన రీతిలో; దర్పంబుసొంపు= గర్వంయొక్క అందం; ఏర్పరించుటకున్= ప్రకటించటానికి; చొచ్చినన్= ప్రారంభింపగా; పోరు= యుద్ధం; అనిమిష= రెప్పపాటులేని వారైన దేవతలయొక్క; స్తోమ= సమూహానికి; అద్భుత= ఆశ్చర్యాన్ని; ఆపాది+ఐ= కలిగించేది అయి; పేర్చెన్= ప్రవర్తిల్లింది.

**తాత్పర్యం:** ఆకాశాన్ని కప్పివేసేటట్లు బలమైన బాణాలు ప్రయోగిస్తూ కర్ణుడు పాండవసేనను ఢీకొన్నాడు. దానితో మన సైన్యం దైన్యాన్ని విడిచి మళ్ళీ పాండవసైన్యాన్ని ఎదుర్కొన్నది. పాండవులు భయంకరంగా తమ భుజబల గర్వాన్ని ప్రకటిస్తూ తమ దర్పవిలాసం చూపించసాగారు. దానితో దేవతలకు కూడా ఆశ్చర్యం కలిగించేటట్లు యుద్ధం నడిచింది.

**విశేషం:** అనిమిష స్తోమ - అన్నపుడు అనిమిష శబ్దం దేవ పర్యాయంగా వాడటం సప్రయోజనం. అసలే రెప్పపాటులేని దేవతలు ఆశ్చర్యపోయేటట్లు యుద్ధం జరిగిందనటం బాగుంది. ఆశ్చర్యంతో చూచాడనటానికి కళ్ళప్పగించి చూశాడంటారు.

**వ. అందు. 87**

**తాత్పర్యం:** ఆ యుద్ధంలో.

**క. సూతతనయ నారాచ । స్యూతములై వారణంబు లొఱలును సొగయున్**
**భూతలమునఁ బొరలు దెరలు । వే తూలును జిట్టఁ దిరుగు విచ్చుం జచ్చున్. 88**

**ప్రతిపదార్థం:** వారణంబులు= ఏనుగులు; సూత తనయ= సూత పుత్రుడైన కర్ణునియొక్క; నారాచ= బాణాలచేత; స్యూతములు+ఐ= గ్రుచ్చబడినవై; ఒఱలున్= అరిచాయి; సొగయున్= మూర్ఛిల్లాయి; భూతలమునన్= నేలమీదపడి; పొరలున్= దొర్లాయి; తెరలున్= క్షోభపడ్డాయి; వే= వెంటనే; తూలును= కూలబడ్డాయి; చిట్టన్= కోపంతో; తిరుగున్= అటూ ఇటూ గిరగిరా గమ్యంలేకుండా తిరిగాయి; విచ్చున్= చెదరిపోయాయి; చచ్చున్= మరణించాయి.

**తాత్పర్యం:** కర్ణుడి బాణాలు గ్రుచ్చుకొనేసరికి పాండవుల ఏనుగులు బాధతో అరిచాయి. మూర్ఛిల్లాయి, నేలమీదపడి దొర్లాయి, కలత చెందాయి, వెంటనే కూలబడ్డాయి. చిర్రెత్తుక వచ్చి తిరిగాయి, పారిపోయాయి. మరణించాయి.

**వ. అప్పుడు నకులుం డతని మార్కొనియె; భీమసేనుం డశ్వత్థామను, సాత్యకి గైకేయులగు విందానువిందులను జిత్ర సేనుండనురాజు శ్రుతకర్మను, బ్రతివింధ్యుండు చిత్రుండను మనుజనాథుని, ధర్మపుత్రుండు దుర్యోధనుని,**

**ధనంజయుండు సంశప్తకులను, ధృష్టద్యుమ్నుండు గృపాచార్యుని, శిఖండి గృతవర్మను, శ్రుతకీర్తి శల్యుని, సహదేవుండు దుశ్శాసనునిం దలపడి రట్టియెడ. 89**

**ప్రతిపదార్థం:** అప్పుడు= కర్ణుని చేతిలో గజసైన్యం కూలిపోతున్న సమయంలో; నకులుండు; అతనిన్= కర్ణుని; మార్కొనియెన్= ఎదుర్కొన్నాడు; భీమసేనుండు= భీముడు; అశ్వత్థామను= ద్రోణుని కుమారునీ; సాత్యకి= యుయుధానుడు, వృష్ణి వంశీయుడు, శిని మనుమడు, సత్యకుని కొడుకు - కృష్ణుడికి తమ్ముని వరుసవాడు; కైకేయులు+అగు= కేకయ వంశీయులయిన; విందానువిందులను= విందుడు అనువిందుడు అనే సోదరులనూ; చిత్రసేనుండు+అను= చిత్రసేనుడనే పేరుగల; రాజు= అభిసారదేశపు ప్రభువు; శ్రుతకర్మను= ద్రౌపదీ సహదేవుల పుత్రునీ; ప్రతివింధ్యుండు= ద్రౌపదీ యుధిష్ఠిరుల కుమారుడు; చిత్రుండు+అను= చిత్రుడనే పేరుగల; మనుజనాథుని= నరపతినీ; ధర్మపుత్రుండు= యుధిష్ఠిరుడు; దుర్యోధనుని= దుర్యోధనునీ; ధనంజయుండు= అర్జునుడు; సంశప్తకులను= అర్జునుని చంపుతామని ప్రతిజ్ఞచేసిన యోధులనూ; ధృష్టద్యుమ్నుండు= ద్రౌపది అన్న; కృపాచార్యుని= ద్రోణుని బావమరదినీ; శిఖండి= ద్రౌపది మరొక అన్న; కృతవర్మను= యదువంశంలోని భోజశాఖీయుడైన హృదికుని పుత్రునీ; శ్రుతకీర్తి= ద్రౌపదీ పార్థుల తనయుడు; శల్యుని= మద్రరాజునీ; సహదేవుండు= చివరి పాండవుడు; దుశ్శాసనునిన్= దుర్యోధనుని మొదటి తమ్మునీ; తలపడిరి= ఢీకొన్నారు; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** ఆ సమయంలో నకులుడు కర్ణుడిని ఎదుర్కొన్నాడు. భీమసేనుడు అశ్వత్థామనూ, సాత్యకి కేకయ వంశీయులయిన విందానువిందులనూ, చిత్రసేనుడు శ్రుతకర్మనూ, ప్రతివింధ్యుడు చిత్రుడిని, ధర్మరాజు దుర్యోధనుడిని, అర్జునుడు సంశప్తకులను, ధృష్టద్యుమ్నుడు కృపాచార్యుడినీ, శిఖండి కృతవర్మనూ, శ్రుతకీర్తి శల్యుడినీ, సహదేవుడు దుశ్శాసనుడినీ ఎదుర్కొన్నారు.

**సీ. శైనేయుతోడ విందానువిందులు మహా । హవము సేయంగ నయ్యాదవోత్త**
**ముఁడు పేర్చి వారి కార్ముకములు రెంటిని । దునిమి యంగంబుల నినిచెఁ దూపు**
**లవ్వీరు లన్య శరాసనోద్ధారులై । యతనిపైఁ బఱపిరి శితశరంబు**
**లతఁడును వారు నన్యోన్యచాపచ్ఛిదా । వైచిత్రి నొప్పారి రేచి దొడ్డ**

**విల్లుగొని యతి రయమున భల్లనిహతి । నాతఁ డనువిందు తలఁద్రుంప నది ప్రదీప్త**
**రత్నకుండలశోభాభిరామపతన । భంగిఁ దదనీక శోకసంపాదియయ్యె. 90**

**ప్రతిపదార్థం:** వింద+అనువిందులు= విందుడు అనువిందుడు అను కైకేయులు; శైనేయు తోడన్= శిని మనుమడైన సాత్యకితో; మహత్+ఆహవము= గొప్పయుద్ధం; చేయంగన్= చేయగా; ఆ+యాదవ+ఉత్తముఁడు= ఆ యాదవశ్రేష్ఠుడైన సాత్యకి; పేర్చి= విజృంభించి; వారి= విందానువిందులిద్దరియొక్క; కార్ముకములు= ధనుస్సులు; రెంటిని= రెండింటినీ; తునిమి= నరికి; అంగంబులన్= వారి శరీరాలలో; తూపులు= బాణాలను; నినిచెన్= నింపాడు; ఆ+వీరులు= ఆ వీరులయిన విందానువిందులు; అన్యశరాసన+ఉత్+ధారులు+ఐ= వేరే ధనుస్సులు తీసికొన్నవారై; అతనిపైన్= సాత్యకిమీద; శితశరంబులు= వాడి బాణాలను; పఱపిరి= ప్రయోగించారు; అతడును= సాత్యకీ; వారున్= విందానువిందులూ; అన్యోన్య= పరస్పరం, ఒకళొకళ్ళ; చాపచ్ఛిదా= ధనుస్సులను నరుకుకొనటంలోని; వైచిత్రిన్= వింతతో; ఒప్పారిరి= శోభించారు; ఆతఁడు= సాత్యకి; ఏచి= విజృంభించి; దొడ్డవిల్లు= పెద్ద ధనుస్సును; కొని= తీసికొని; అతిరయమునన్= మిక్కిలి వేగంతో; భల్లనిహతిన్= బాణపు దెబ్బతో; అనువిందు= అనువిందునియొక్క; తలన్= శిరస్సును; త్రుంపన్= నరకగా; అది= ఆ తల; ప్రదీప్త= మిక్కిలిగా

వెలుగుతున్న; రత్న= రత్నాలు కల; కుండల= కర్ణభూషణాలయొక్క; శోభా= కాంతితో; అభిరామ= మనోహరమైన; పతనభంగిన్= పడే పద్ధతితో; తద్+అనీక= అతడి సైన్యానికి, లేదా కౌరవ సైన్యానికి; శోక= వగపును; సంపాది= సంపాదించేది; అయ్యెన్= అయినది.

**తాత్పర్యం:** విందానువిందులు సాత్యకితో గొప్పయుద్ధం చేశారు. అందులో సాత్యకి విజృంభించి వారి రెండు ధనుస్సులూ నరికాడు. వారి శరీరాల నిండా బాణాలు నింపాడు. వారిద్దరూ వేరే ధనుస్సులు తీసికొని అతడిమీద వాడి అమ్ములు ప్రయోగించారు. తరువాత సాత్యకి, విందానువిందులూ ఒకరి ధనుస్సులు మరొకరు వింత వింతగా ఖండించుకొన్నారు. సాత్యకి ఒక పెద్ద ధనుస్సు తీసికొని మిక్కిలి వేగంతో బాణం ప్రయోగించి అనువిందుడి తల నరికాడు. అది బాగా మెరుస్తున్న రత్నకుండలశోభతో మనోహరంగా ఉండి పడుతూ, అతడి సైన్యానికీ మనసైన్యానికీ కూడా శోకం కలిగించింది.

**మ.** **కని విందుండు ప్రదీప్తచాప ధరుఁడై కాండప్రసారంబులన్**
**శినివీరుం గుసుమాఢ్య కింశుకసముం జేయంగ నయ్యోధుఁ డా**
**తని యంగంబులఁ బంచవింశతి శితాస్త్రంబుల్ వడిం గ్రుచ్చె నే**
**పున వారొండొరుసూతులం దునిమి నిప్పుల్రాలు కన్దోయితోన్.** 91

**ప్రతిపదార్థం:** విందుండు= విందుడు; కని= (తమ్ముని పాటు) చూచి; ప్రదీప్త= ఎక్కువగా మెరుస్తున్న; చాప= ధనుస్సును; ధరుండు+ఐ= ధరించినవాడై; కాండ= బాణాలయొక్క; ప్రసారంబులన్= వ్యాప్తులతో; శినివీరున్= శినిమనుమడైన వీరుడు సాత్యకిని; కుసుమాఢ్య= పువ్వులుగల; కింశుక= మోదుగుచెట్టుతో; సమున్= సమానమైన వానినిగా; చేయంగన్= చేయగా; ఆ+యోధుఁడు= సాత్యకి; ఆతని= విందుయొక్క; అంగంబులన్= అవయవాలమీద; పంచవింశతి= ఇరవై ఐదు; శిత+అస్త్రంబుల్= వాడిబాణాలు; వడిన్= వేగంతో; క్రుచ్చెన్= నాటినాడు; వారు= సాత్యకీవిందుడూ; ఏపునన్= విజృంభణంతో; ఒండు+ఒరు= ఒకరు మరొకరియొక్క; సూతులన్= సారథులను; నిప్పుల్= అగ్నికణాలు; రాలు= క్రిందపడవేసే; కన్దోయితోన్= కన్నుల జంటతో; తునిమి= ఖండించి.

**తాత్పర్యం:** విందుడు తన తమ్ముడి పాటు చూచాడు. బాగా మెరుస్తున్న ధనుస్సు పట్టుకొన్నాడు. అమ్ములు ప్రయోగించి సాత్యకిని పువ్వులతో ఉన్న మోదుగుచెట్టువలె చేశాడు. (అనగా పలుగాయాలు కలుగజేసి ఆ గాయాల నుంచి నెత్తురు వచ్చేటట్లు చేశాడు. అందువలన ఆ గాయాలు మోదుగు పువ్వులవలె ఎర్రగా ఉన్నందున సాత్యకి పూలతో ఉన్న మోదుగుచెట్టువలె ఉన్నాడని భావం.) అపుడు సాత్యకి విందుని అవయవాలపై ఇరవై ఐదు బాణాలు నాటాడు. అట్లా వారిద్దరూ విజృంభించి కోపంతో కన్నులు నిప్పులు రాల్చుతున్నవా అన్నట్లు ఎర్రబడిన కన్నుల జంటతో ఒకరి సూతుని మరొకరు చంపుకొని.

**విశేషం:** అలం: ఉపమ.

**తే.** **ఒకళు లొకళుల హయముల నుర్విఁగూల్చి । యొండొరుల కార్ముకమ్ములు ఖండితములు**
**సేసి తేరులు డిగ్గి రుద్భాసి తాసి । చర్మశోభిత హస్తులై సరభసముగ.** 92

**ప్రతిపదార్థం:** ఒకళులు= ఒకరు; ఒకళుల= మరియొకరియొక్క; హయములన్= గుర్రాలను; ఉర్విన్= నేలపై; కూల్చి= పడిపోయేటట్లుచేసి, సంహరించి; ఒండు+ఒరుల= ఒకరు మరియొకరి యొక్క; కార్ముకములు= ధనుస్సులను; ఖండితములు+ చేసి= నరకబడినవిగా చేసుకొని; ఉద్భాసిత= మిక్కలిగా మెరసే; అసి= ఖడ్గాలతో; చర్మ= డాలులతో; శోభిత= విలసిల్లే; హస్తులు+ఐ= చేతులు కలవారై; సరభసముగన్= త్వరతో; తేరులు= రథాలు; డిగ్గిరి= దిగినారు.

**తాత్పర్యం:** ఒకరి గుర్రాలను మరొకరు చంపుకొన్నారు. ఒకరి ధనుస్సులను మరొకరు నరుకుకొన్నారు. ఇరువురూ కత్తులతో డాలులతో తమ చేతులు ప్రకాశిస్తుండగా గబగబా రథాలనుండి నేలకు దిగారు.

**వ. ఇట్లు పాదచారులై మండల ప్రచారంబుల మెఱయుచు. 93**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ ప్రకారంగా; పాదచారులు+ఐ= (వాహనాలపై ఉండక) కాళ్ళతో నడుస్తున్నవారై; మండల ప్రచారంబులన్= వలయాలుగా తిరగటములతో; మెఱయుచున్= ప్రకాశిస్తూ. (పై పద్యంలోని పొలిసెన్ అన్న క్రియతో అన్వయం.)

**తాత్పర్యం:** ఇట్లా కాలినడకతో వలయాలుగా తిరుగుతూ.

**క. చేరి బహు చిత్ర గతులం । బోరంగా నొడ్డనములఁ బొలిసెం బలకల్**
**నేరిమిమైఁ గెళవున శిని । వీరుం డిరువఱియగాఁగ విందుని వ్రేసెన్. 94**

**ప్రతిపదార్థం:** చేరి= సమీపించి; బహు= అనేకమైన; చిత్ర= వింతలైన; గతులన్= నడకలతో; పోరంగాన్= యుద్ధంచేయగా; పలకలు= డాళ్ళు; ఒడ్డనములన్= కత్తి దెబ్బలకు కాపుగా పెట్టటమువల్ల; పొలిసెన్= బ్రద్దలైపోయాయి; శినివీరుండు= సాత్యకి; విందునిన్= విందుని; ఇరు= రెండు; పఱియగాఁగన్= ముక్కలయ్యేటట్లు; నేరిమిమైన్= నేర్పుతో; కెళవునన్= పార్శ్వంలో; వ్రేసెన్= నరికాడు.

**తాత్పర్యం:** సమీపించి చిత్ర విచిత్ర గమనాలతో పోరాడే సమయంలో, వారి డాళ్ళు రెండూ కత్తి దెబ్బలకు మాటుగా పెట్టటంవలన పగిలిపోయాయి. సాత్యకి ప్రక్కనుంచి నేర్పుతో రెండు ముక్కలయ్యేటట్లు విందుడిని ఖండించాడు.

**వ. ఇత్తెఱంగున నయ్యిరువురం జంపి సాత్యకి యుధామన్యు తేరెక్కి యుక్కున వేఱొక్క రథంబు సన్నద్ధంబు గావించుకొని కైకేయబలంబులం బఱపెఁ జిత్రసేనుండును నీ మనుమండగు శ్రుతకర్మయుం బెనంగునెడ నాశ్రుతకర్ముండు. 95**

**ప్రతిపదార్థం:** సాత్యకి= యుయుధానుడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; ఆ+ఇరువురన్= ఆ విందానువిందులనిద్దరినీ; చంపి= సంహరించి; యుధామన్యు= అర్జునుని చక్రరక్షకుడైన యుధామన్యునియొక్క; తేరు+ఎక్కి= రథం ఎక్కి; ఉక్కునన్= ప్రతాపంతో; వేఱు+ఒక్క= వేఱే ఒక; రథంబు= తేరు; సన్నద్ధంబు= సంసిద్ధం; కావించుకొని= చేయించుకొని; కైకేయ బలంబులన్= కేకయదేశ సేనలను; పఱపెన్= తరిమాడు; చిత్రసేనుండును= చిత్రసేనుడనే అభిసారదేశపు రాజు; నీ మనుమండు+అగు= నీ తమ్ముని మనుమడు కనుక నీకు మనుమడే అయిన; శ్రుతకర్మయున్= ద్రౌపదీ సహదేవుల పుత్రుడయిన శ్రుతకర్మా; పెనంగు= పోరాడే; ఎడన్= సమయంలో; ఆ= ప్రసిద్ధుడైన; శ్రుతకర్ముండు= శ్రుతకర్మ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తాత్పర్యం:** సాత్యకి ఇట్లా విందానువిందులిద్దరినీ సంహరించాడు. యుధామన్యుడి రథమధిరోహించాడు. ప్రతాపంతో మరొక్కతేరు సిద్ధం చేయించుకొన్నాడు. అభిసారదేశపు రాజు చిత్రసేనుడూ, ద్రౌపదీసహదేవుల కుమారుడు శ్రుతకర్మా పోరాడుతుండగా శ్రుతకర్మ.

**క. ఆ రాజు నైదు వాలిక । నారసముల నొంప నతఁడు నవశరముల న**
**క్కౌరవుని నేసి నొంచెను । సారథి నై దింట నధిక సంరంభమునన్. 96**

**ప్రతిపదార్థం:** ఆ రాజున్= చిత్రసేనుని; ఐదు= అయిదు; వాలిక= వాడియయిన; నారసములన్= కేవలం ఇనుముతో చేసిన బాణాలతో; నొంపన్= నొప్పింపగా; అతఁడు= చిత్రసేనుడు; అధికసంరంభమునన్= అధికమైన త్వరతో; ఆ+కౌరవునిన్= ఆ కురువంశీయుడైన శ్రుతకర్మను; నవశరములన్= తొమ్మిది అమ్ములతో; ఏసి= కొట్టి; అతని సారథిన్= అతని సూతుని; ఐదింటన్= ఐదు బాణాలతో; నొంచెను= నొప్పించాడు.

**తాత్పర్యం:** ఆ అభిసార దేశపు రాజును వాడికల ఐదు ఇనుపబాణాలతో నొప్పించగా, అతడు తొమ్మిది బాణాలతో మిక్కిలి త్వరతో శ్రుతకర్మను కొట్టి, ఐదు బాణాలతో అతడి సారథిని నొప్పించాడు.

**సీ. శ్రుతకర్మ కోపించి క్రూరనారాచ మ । జ్జన నాథుజత్రుదేశమున నాటఁ**
**బడి మూర్ఛవోయినఁ బైపయి వెండియు । నేయఁ దెప్పిఱి యతం డెసకమెసఁగ**
**నుక్కునఁ దునుమాడె నక్కుమారుని శరా । సన మతఁడొండొక చాపమెత్తి**
**తఱచుటమ్ముల నేదు వెఱిఁగిన చందంబు । సేసె రయంబునఁ జిత్రసేను**

**తే. నాతఁ డాతనియురమున శాతశరము । దూఱనేయ నబ్బాలుండు తోన వివిధ**
**బాణముల నాన్నృపుని ముంచి శోణితమున । భల్లమొక్కటఁ దల నేల డొల్లనేసె. 97**

**ప్రతిపదార్థం:** శ్రుతకర్మ= ద్రౌపదీ సహదేవుల కుమారుడు; కోపించి= అలిగి; క్రూర నారాచము= కఠినమైన బాణం; ఆ+జననాథు= ఆ రాజుయొక్క; జత్రుదేశమునన్= భుజము శిరస్సూ రొమ్మూ కలిసే ప్రదేశంలో; నాటన్= దిగేటట్లు వేయగా; పడి= క్రిందపడి; మూర్ఛ+పోయినన్= మూర్ఛిల్లగా; పై+పయి= ఆ పైని; వెండియున్= మళ్ళీ; ఏయన్= బాణం ప్రయోగింపగా; అతండు= చిత్రసేనుడు; తెప్పిఱి= మూర్ఛనుండి తేరుకొని; ఎసకము= విజృంభణం; ఎసఁగన్= ఒప్పగా; ఉక్కునన్= ప్రతాపంతో; ఆ+కుమారుని= ఆ బాలునియొక్క; శరాసనము= ధనుస్సును; తునుము+ఆడెన్= నరికాడు; అతడు= శ్రుతకర్మ; ఒండు+ఒక= మరొక; చాపము= ధనుస్సును; ఎత్తి= తీసికొని; రయమునన్= వేగంతో; తఱచు= దట్టముగా, ఎడములేకుండా పడిన; అమ్ములతోన్= బాణాలతో; చిత్రసేనున్= చిత్రసేనుని; ఏదు= ఏదుపంది, ముండ్లపంది; వెఱిఁగిన= విజృంభించిన, అనగా ముడుచుకొని ఉన్న ముళ్ళువిప్పిన; చందంబు= విధముగా; చేసెన్= చేశాడు; ఆతఁడు= ఆ చిత్రసేనుడు; శాతశరము= వాడియైన బాణం; ఆతని= ఆ శ్రుతకర్మయొక్క; ఉరమునన్= రొమ్ములో; దూఱన్= చొచ్చిపోయేటట్లుగా; ఏయన్= ప్రయోగింపగా; ఆ+బాలుండు= శ్రుతకర్మ; తోన్+అ= వెంటనే; వివిధ= పలురకములయిన; బాణములన్= అమ్ములతో; ఆ నృపుని= ఆ రాజును; శోణితమునన్= రక్తంలో; ముంచి= మునిగేటట్లుచేసి; భల్లము= బాణము; ఒక్కటన్= ఒకదానితో; తల= ఆ రాజు శిరస్సు; నేలన్= భూమిపై; డొల్లన్= దొర్లేటట్లుగా; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** శ్రుతకర్మకు కోపం వచ్చి, ఒక గట్టి బాణంతో ఆ రాజును భుజముశిరస్సూ రొమ్మూ కలిసేచోట కొట్టాడు. దానితో ఆ రాజు మూర్ఛిల్లాడు. శ్రుతకర్మ అట్లా ఉన్నవాడిని మళ్ళీ కొట్టాడు. అపు డారాజుకు తెలివి

వచ్చింది. అపుడు అతడు విజృంభించి ప్రతాపంతో శ్రుతకర్మ ధనుస్సును విరగ్గొటాడు. శ్రుతకర్మ మరొక విల్లు తీసుకొని ఆరాజు శరీరం నిండా బాణాలు నాటితే ఆయన ఏదుపంది ఒళ్ళు పెంచినట్టు (ముళ్ళు నిక్కబొడుచుకొనేటట్లు చేసినట్టు) కనిపించాడు. చిత్రసేనుడు వెంటనే శ్రుతకర్మ వక్షఃస్థలంలో దిగేటట్లొక వాడి బాణం ప్రయోగించాడు. శ్రుతకర్మ వెంటనే ఆ రాజును రక్తంలో మునిగేటట్లుచేసి, ఒక బాణంతో అతడి తల నేలపై పడి దొర్లేటట్లు కొట్టాడు.

### ప్రతివింధ్యుఁడు చిత్రుఁడను రాజుం జంపుట (సం. 8-10-15)

**ఉ. ఏలినవాని పాటుఁ గని యేడ్తెఱఁ దద్బల మొక్క పెట్ట యా**
**భీలతఁ జుట్టు ముట్టుటయుఁ బేర్చినయుద్ధతిఁ దీవ్ర సాయక**
**జ్వాలల నేర్చి యుద్భటభుజావిభవం బలరంగ నల్గడం**
**దోలె నుదాత్తవిక్రమకుతూహలి నా మనుమండు భూవరా! 98**

**ప్రతిపదార్థం:** భూవరా!= భూపతీ!; తద్+బలము= ఆ చిత్రసేనుని సైన్యం; ఏలినవాని= తమ్మేలిన రాజుయొక్క; పాటు= పడిపోవటం; కని= చూచి; ఏడ్తెఱన్= వేగంతో; ఒక్కపెట్టు+అ= ఒక్కమాఱుగా; ఆభీలతన్= భయంకరంగా; చుట్టు= అన్నివైపులా; ముట్టుటయున్= దాడి చేయగా; ఉదాత్త= గొప్పదైన; విక్రమ= పరాక్రమంయొక్క; కుతూహలి= తమకం కలవాడైన; నీ మనుమండు= శ్రుతకర్మ; పేర్చిన= పెరిగిన; ఉద్ధతిన్= గర్వంతో; తీవ్ర= తీక్ష్ణమైన; సాయక= బాణాలయొక్క; జ్వాలలన్= మంటలతో; ఏర్చి= కాల్చి; ఉద్భట= భయంకరమైన; భుజా= బాహువులయొక్క; విభవంబు= ఐశ్వర్యం, బలం; అలరంగన్= ఒప్పగా; నలు+కడన్= నాలుగు దిక్కులకు; తోలెన్= తరిమినాడు.

**తాత్పర్యం:** రాజా! తమ రాజు పడిపోవటం చూచిన చిత్రసేనుని సైన్యం విజృంభించింది. ఒక్కసారిగా, భయంకరంగా శ్రుతకర్మను చుట్టూ ముట్టడించింది. అతడు మహాపరాక్రమం ప్రదర్శించటానికి తమకపడుతున్నాడేమో, భయంకరమైన తన బాహుబలం విలసిల్లుతుండగా పెరిగిన గర్వంతో వాడి బాణాల మంటలతో మనసైన్యాన్ని కాల్చేసరికి అది నలుదిక్కులకూ పారిపోయింది.

**సీ. అప్పుడు ప్రతి వింధ్యుఁడైదు బాణములఁ జి । త్రుని మేనునొంచి తత్సూతు వక్ష**
**మునఁ గ్రూర శరములు మూఁడు నాటించి యొ । క్కమ్మునఁ గేతు వల్లార్చి పేర్చి**
**యతఁడు దన్నుగ్రనవాస్త్ర పీడితుఁజేయ । విలుద్రుంచి వెసఁబంచ విశిఖ నిహతుఁ**
**గావించి శక్తి యుగ్రమ్ముగ వైచినఁ । బెలుచ నాలుగు దునియలుగఁ జేసె**

**తే. నలిగి యాతండు గదవైచి యక్కుమారు । ఘోటకంబుల సూతునిఁ గూల్చె నదియ**
**పట్టుకొని వైచె మగుడ నప్పాండు పౌత్రు । చేయి వడి నుచ్చిపోవ నచ్చిత్రుఁ డధిప! 99**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; అప్పుడు= ఆ సమయంలో; ప్రతివింధ్యుడు= ద్రౌపదీ యుధిష్ఠిరుల పుత్రుడు; ఐదు; బాణములన్= అమ్ములతో; చిత్రుని= చిత్రుడియొక్క; మేను= శరీరం; నొంచి= నొప్పించి; తద్= అతని; సూతు= సారథియొక్క; వక్షమునన్= రొమ్ముపై; క్రూరశరములు= కఠినములైన బాణములు; మూఁడు= మూడింటిని; నాటించి= గ్రుచ్చి; ఒక్క+అమ్మునన్= ఒక్క బాణంతో; కేతువు= జెండా; అల్లార్చి= పడగొట్టి; పేర్చి= విజృంభించి; అతఁడు= చిత్రుడు; తన్నున్= (ప్రతివింధ్యుడనే) తనను; ఉగ్ర= తీక్ష్ణమైన; నవ+అస్త్ర= తొమ్మిది అస్త్రములతో; పీడితున్= బాధింపబడినవానిని; చేయన్= చేయగా; విలు=

(చిత్రుని) ధనుస్సును; త్రుంచి= విరిచి; వెసన్= వెంటనే; పంచ= ఐదైన; విశిఖ= బాణాలతో; నిహతున్= మిక్కిలి కొట్టబడిన వానిని; కావించి= చేసి, ఐదు బాణాలతో కొట్టి; శక్తి= (చిత్రుడు) ఈటె వంటి ఆయుధాన్ని; ఉగ్రమ్ముగన్= వేగంగా; వైచినన్= విసరగా; (ప్రతివింధ్యుడు) పెలుచన్= పరాక్రమంతో; నాలుగు= నాలుగైన; తునియలుగన్= ముక్కలుగా; చేసెన్= చేశాడు; ఆతఁడు= చిత్రుడు; అలిగి= కోపించి; గద= గుదియను; వైచి= విసరి; ఆ+కుమారు= ఆ బాలుడి; ఘోటకంబులన్= గుర్రాలను; సూతునిన్= సారథినీ; కూల్చెన్= సంహరించాడు; ఆ+చిత్రుఁడు= ఆ చిత్రుడనే రాజు; అది+అ= గదనే; పట్టుకొని= తీసికొని; ఆ+పాండు= ఆ పాండురాజుయొక్క; పౌత్రు= మనుమనియొక్క; చేయి= హస్తం; వడిన్= వేగంవల్ల; ఉచ్చిపోవన్= చీలిపోయేటట్లు; మగుడన్= తిరిగి; వైచెన్= విసిరాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో ప్రతివింధ్యుడు ఐదుబాణాలు ప్రయోగించి, చిత్రుడి శరీరానికి నొప్పి కలిగించాడు. అతడి సారథి రొమ్ములో మూడు బాణాలు దిగవేశాడు. ఒక బాణంతో జెండా పడగొట్టాడు. చిత్రుడు తొమ్మిది బాణాలు వేసి ప్రతివింధ్యుడికి బాధ కలిగించాడు. ప్రతివింధ్యుడు చిత్రుని విల్లు విరిచాడు. అతడిని ఐదుబాణాలతో బాగా కొట్టాడు. చిత్రుడు ఈటె విసిరాడు. ప్రతివింధ్యుడు దానిని నాలుగు ముక్కలు చేశాడు. చిత్రుడు కోపించి గద విసిరాడు. దానివలన ప్రతివింధ్యుడి గుర్రాలూ, సూతుడూ మరణించారు. చిత్రుడు మళ్ళీ గదనే ప్రయోగించి ప్రతివింధ్యుడి చేయి చీలిపోయేటట్లు చేశాడు.

**ఉ. బాహువు నొచ్చినం గినిసి భాసురతోమరమెత్తి కౌరవ**
**వ్యూహము సంచలింప నతఁ డుగ్రత వైచినఁ గంకటంబుఁ ద**
**ద్దేహము నుచ్చిపోవుటయుఁ ద్రెళ్ళె నరేశ్వర! యవ్విభుండు వ**
**జ్రాహతిఁగూలు పర్వతమునాకృతి నుత్కట వైకృతంబుగన్. 100**

**ప్రతిపదార్థం:** నర+ఈశ్వర!= నరనాథా, రాజా!; అతఁడు= ప్రతివింధ్యుడు; బాహువు= చెయ్యి; నొచ్చినన్= నొప్పిచెందినందువల్ల; కినిసి= కోపించి; కౌరవ= కౌరవులయొక్క; వ్యూహము= సమూహము, సైన్యము; సంచలింపన్= కదలిపోవగా; ఉగ్రతన్= రౌద్రముతో; భాసుర= ప్రకాశిస్తున్న; తోమరము= చిన్నయీటె; ఎత్తి= తీసికొని; వైచినన్= విసరగా; (అది) కంకటంబున్= కవచమూ; తద్+దేహమున్= అతని శరీరాన్ని; ఉచ్చిపోవుటయున్= చీల్చుకొనిపోవటంవల్ల; ఆ+విభుండు= ఆ రాజు; వజ్ర= వజ్రాయుధం యొక్క; ఆహతిన్= గట్టిదెబ్బవల్ల; కూలు= పడిపోయే; పర్వతము+ఆకృతిన్= పర్వతం విధంగా; ఉత్కట= అధికమైన; వైకృతంబుగన్= వికారాకారంతో; త్రెళ్ళెన్= మరణించాడు.

**తాత్పర్యం:** చేతికి బాధ కలిగేసరికి ప్రతివింధ్యుడికి కోపం వచ్చింది. అందువలన ఒక వెలిగే తోమరం తీసికొని రౌద్రంతో విసిరాడు. అది చూచి కౌరవసైన్యం భయపడిపోయింది. ఆ తోమరం చిత్రుడి కవచాన్నీ, అతడి దేహాన్నీ చీల్చుకొనిపోయేసరికి, అతడు వజ్రపుదెబ్బకు కూలిపోయే కొండవలె వికారాకారంతో పడిపోయాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు చిత్రుండు దెగటాఱినం గనుంగొని మన యోధులు ప్రతివింధ్యుపై నడరి యనేకాస్త్ర శస్త్రంబులం బొదివినం బొలివోని కలితనంబున నేలకుఱికి యక్కుమారుండు గోదండటంకారంబున నంబరంబు పూరించుచు బాణాసారంబు వరగింపఁ బాండవసైనికులు బెట్టిదంపుటురవడిం గదిసి యతనికిం**

**దోడ్పడుటయు మనవారలు విచ్చి వెన్నిచ్చి పఱచి రప్పుడశ్వత్థామభీమసేనుల సంగ్రామంబు భీమంబయి చెల్లె నందు.** **101**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ రీతిగా; చిత్రుండు= చిత్రుడు; తెగటారినన్= చనిపోగా; మనయోధులు= మన యుద్ధభటులు; కనుంగొని= చూచి; ప్రతివింధ్యుపైన్= ప్రతివింధ్యుని మీద; అడరి= చెలరేగి; అనేక+అస్త్ర= చాలా అస్త్రాలతోనూ; శస్త్రంబులన్= ఆయుధాలతోనూ; పొదివినన్= కప్పగా; ఆ+కుమారుండు= ఆ బాలుడు; పొలి+పోని= తగ్గని; కలితనంబునన్= సామర్థ్యంతో, నేర్పుతో; నేలకున్+ఉఱికి= భూమిమీదికి దూకి; కోదండ టంకారంబునన్= ధనుష్టంకారంతో; అంబరంబు= ఆకాశం; పూరించుచున్= నిండిస్తూ; బాణసారంబు= బాణముల వర్షం; పరఁగింపన్= కురిపింపగా; పాండవ సైనికులు= పాండవుల సైనికులు; బెట్టిదంపు= అతి తీవ్రమైన; ఉరవడిన్= విజృంభణంతో; కదిసి= సమీపించి; అతనికిన్= ప్రతివింధ్యునికి; తోడ్పడుటయున్= సాయపడగా; మనవారలు= మన సైనికులు; విచ్చి= చెల్లాచెదరై; వెన్ను+ఇచ్చి= వెనుకకు మరలి; పఱచిరి= పారిపోయారు; అప్పుడు= ఆ సమయంలో; అశ్వత్థామ భీమసేనుల= అశ్వత్థామయొక్క భీమునియొక్క; సంగ్రామంబు= యుద్ధం; భీమంబు+ అయి= భయంకరమై; చెల్లెన్= నడచింది; అందున్= ఆ యుద్ధంలో.

**తాత్పర్యం:** ఇట్లా చిత్రుడి సంహారం చూశారు మన సైనికులు. వెంటనే ప్రతివింధ్యుడి మీద దాడిచేసి ఎన్నో శస్త్రాస్త్రాలు ప్రయోగించారు. అతడు చిన్నవాడయినా సామర్థ్యం తక్కువలేదు కనుక, రథంమీద నుండి నేలకు దూకి, ధనుష్టంకారంతో ఆకాశాన్ని నింపివేస్తూ బాణవర్షం కురిపించాడు. అంతలో పాండవసైనికులు అతివేగంతో అతడివద్దకు వచ్చి సాయపడ్డారు. మనవారు వెనుదిరిగి చెల్లాచెదరై పారిపోయారు. ఇక అశ్వత్థామ భీమసేనుల యుద్ధం చూడ భయంకరంగా నడిచింది. ఆ యుద్ధంలో - (తరువాతి పద్యంతో అన్వయం).

**క. గురుపుత్త్రుఁడు దొంబది శిత । శరములఁ బావని రథంబు సంవృతముగఁ జే**
**సె రయం బారఁగ సాయక । పరంపరలు వఱపె నతనిపై నతఁ డలుకన్.** **102**

**ప్రతిపదార్థం:** గురుపుత్రుఁడు= అశ్వత్థామ; తొంబది= తొంభై; శితశరములన్= వాడిబాణాలతో; పావని రథంబు= వాయుపుత్రుడైన భీముని తేరు; సంవృతముగన్+చేసెన్= కప్పబడినదిగా చేశాడు; అతఁడు= భీమసేనుడు; అలుకన్= కోపంతో; రయంబు+ఆరఁగన్= వేగం ఒప్పగా; అతనిపైన్= అశ్వత్థామపై; సాయక పరంపరలు= అమ్ముల వరుసలు; పఱపెన్= ప్రసరింపజేశాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ తొంభై పదునైన బాణాలు ప్రయోగించి భీముడి తేరు కప్పివేశాడు. భీముడు కోపంతో, వేగంతో అశ్వత్థామ మీద శర పరంపర ప్రసరింపజేశాడు.

**వ. వాని మగిడించి.** **103**

**తాత్పర్యం:** ఆ బాణాలను తిరుగగొట్టి.

**క. అనిలజుఫాలము గురునం । దనుఁడు పటు ప్రదరకీలితము సేయుడు నా**
**తని నిటలంబున నతఁ డే । పున బాణత్రయము నాటె భూవరముఖ్యా!** **104**

**ప్రతిపదార్థం:** భూవరముఖ్యా!= భూపతులలో శ్రేష్ఠుడవయిన ధృతరాష్ట్ర మహారాజా! గురునందనుఁడు= కౌరవపాండవ గురువైన ద్రోణాచార్యుని పుత్రుడయిన అశ్వత్థామ; అనిలజు= వాయుపుత్రుడయిన భీమునియొక్క; ఫాలము= నొసటిని;

పటు= గట్టిదైన; ప్రదర= చీల్చేబాణంచేత; కీలితము= దిగబడినదిగా; చేయుడున్= చేసిన తరువాత; అతఁడు= భీమసేనుడు; ఏపునన్= పౌరుషంతో; ఆతని= అశ్వత్థామయొక్క; నిటలంబునన్= నొసట; బాణత్రయము= మూడుబాణాలు; నాటెన్= దిగగొట్టాడు.

**తాత్పర్యం:** రాజోత్తమా! అశ్వత్థామ భీముడి నొసట గట్టి బాణం దిగేటట్లు కొట్టాడు. వెంటనే భీముడు పౌరుషంతో అశ్వత్థామ నొసట మూడు బాణాలు దిగగొట్టాడు.

**వ. మఱియును. 105**

**తాత్పర్యం:** మళ్ళీ.

**చ. గురుసుతభీమసేను లతి ఘోరవిధంబులఁ బోరి యొండొరుం**
**దెరలుపలేని సామ్యమున దీపితులై లయకాల విస్ఫుర**
**త్తరణియుగంబుఁబోలె శరధామ సమగ్రతఁ బ్రజ్వరిల్లి యొ**
**ప్పిరి రథ చిత్రచారులఘు భీషణసంచరణంబు లొప్పఁగన్. 106**

**ప్రతిపదార్థం:** గురుసుత, భీమసేనులు= అశ్వత్థామ, భీముడు; అతి= మిక్కిలి; ఘోర= భయంకరమైన; విధంబులన్= పద్ధతులతో; పోరి= యుద్ధంచేసి; ఒండు+ఒరున్= ఒకరు మరొకరిని; తెరలుపలేని= అతిశయింపలేని; సామ్యమునన్= సమానతతో; దీపితులు+ఐ= ప్రకాశించినవారై; శరధామ= బాణముల తేజస్సుయొక్క; సమగ్రతన్= సంపూర్ణతచేత; ప్రజ్వరిల్లి= ప్రకాశించి; రథ= రథాలయొక్క; చిత్ర= వింతలైన; చారు= అందమైన; భీషణ= భయంకరమైన; సంచరణంబులు= సంచారములు; ఒప్పఁగన్= అందగింపగా; లయకాల= ప్రళయకాలంలో; విస్ఫురత్= మిక్కిలి ప్రకాశిస్తున్న; తరణి= సూర్యులయొక్క; యుగంబున్+పోలెన్= జంటలా; ఒప్పిరి= వెలిగారు.

**తాత్పర్యం:** అశ్వత్థామా భీముడూ మహాభయంకరంగా పోరాడారు. ఒకరినొకరు మించలేని సమానత్వంతో ప్రకాశించారు. ఇద్దరూ ప్రయోగించే బాణాలు పరిపూర్ణ కాంతులు ప్రసరింపజేస్తున్నాయి. ఇద్దరి రథాలూ అందంగా, భయంకరంగా చిత్రవిచిత్రంగా నడుస్తున్నాయి. అందువలన వారు ప్రళయకాలంలోని ఇద్దరు సూర్యులవలె ప్రకాశించారు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**తే. వారి వీక్షించి ఖచరులు పోరు లెందుఁ। జూడమే? దీని కెన యని యడఁగలదె?**
**కలుగ వింకను వీరలబలముఁ జలము । నలవు వెరవు నిట్లుండునే? యనుచునుండ. 107**

**ప్రతిపదార్థం:** ఖచరులు= ఆకాశసంచారులు; వారిన్= అశ్వత్థామ భీములను; వీక్షించి= చూచి; పోరులు= యుద్ధాలు; ఎందున్= ఎక్కడా; చూడము+ఏ?= మనము చూడలేదా?; దీనికిన్= ఈ యుద్ధానికి; ఎన= సాటి అయిన; అని= యుద్ధం; ఆడన్= చెప్పటానికి; కలదు+ఎ?= ఉన్నదా?; ఇంకను= రానున్న కాలంలో; కలుగవు= (ఇట్టి యుద్ధాలు) సంభవింపబోవు; వీరల= ఈ యిద్దరియొక్క; బలమున్= శరీరశక్తీ; చలమున్= పట్టుదలా; అలవు= నేర్పూ; వెరవు= ఉపాయమూ; ఇట్లు+ఉండును+ఏ?= ఈ రీతిగా ఉంటాయా?; అనుచున్= అని పలుకుతూ; ఉండన్= ఉండగా.

**తాత్పర్యం:** భీమాశ్వత్థామలను చూచి ఆకాశసంచారులు ఇట్లా అనుకొన్నారు. 'మనం యుద్ధాలను ఎన్నిచోట్ల చూడలేదు? వాటిలో ఏదైనా ఒకటి దీనితో పోలునని చెప్పటానికి ఉన్నదా? ఇకముందు కూడా వీరి బలగర్వాలూ, నేర్పులూ, పట్టుదలలూ ఈ విధమైనవి ఉంటాయా?' అని పలుకుతూ ఉండగా.

**ఉ. ఒండొరు కేతువుల్ దునిమి యొండొరుసూతుల నొంచి యేపుమై**
**నొండొరు తేరివాహముల యు బ్బడఁగించి నిశాతవిస్ఫుర**
**త్కాండచయంబు లొండొరులకాయములన్ వడిఁ గ్రుచ్చి వ్రాలి ర**
**ప్పాండుసుతుండుఁ గుంభజునిపట్టియు మూర్ఛలు దమ్ముఁ గ్రమ్మినన్. 108**

**ప్రతిపదార్థం:** ఆ+పాండు సుతుండున్= ఆ పాండురాజు కుమారుడైన భీముడు; కుంభజుని పట్టియున్= కలశ సంభవుడైన ద్రోణుని కుమారుడైన అశ్వత్థామ; ఒండు+ఒరు= ఒకరు మరొకరి; కేతువుల్= జెండాలు; తునిమి= నరికి; ఒండు+ఒరు= ఒకరు మరొకరి; సూతులన్= సారథులను; నొంచి= నొప్పించి; ఏపుమైన్= విజృంభణంతో; ఒండు+ఒరు= ఒకరు మరొకరి; తేరి వాహముల= రథపు గుర్రాలయొక్క; ఉబ్బు+అడఁగించి= పొంగు అణచి, బాధకలిగించి; నిశాత= వాడియైన; విస్ఫురత్= బాగా మెరుస్తున్న; కాండ= బాణాలయొక్క; చయంబులు= సముదాయాలను; ఒండొరుల= ఒకరు మరొకరియొక్క; కాయములన్= శరీరాలలో; వడిన్= వేగంతో; క్రుచ్చి= నాటి; మూర్ఛలు= సొమ్ములు; తమ్మున్= తమను; క్రమ్మినన్= ఆవరింపగా; వ్రాలిరి= ఒరిగినారు.

**తాత్పర్యం:** భీముడూ అశ్వత్థామా ఒకరి జెండా ఒకరు పడగొట్టారు. ఒకరి సూతుడి నొకరు బాధించారు. ఒకరి రథాశ్వాల ఊపును మరొకరు అణగగొట్టారు. ఒకరి దేహంలో మరొకరు పదునైన మెరుస్తున్న బాణాలు నాటి సొమ్మసిల్లి ప్రక్కకు ఒరిగారు.

**వ. ఇట్లు రథంబులపై నొఱగి మూర్ఛిల్లిన. 109**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; రథంబులపైన్= తేరులపై; ఒఱగి= వ్రాలి; మూర్ఛిల్లినన్= సొమ్మసిల్లగా.

**తాత్పర్యం:** ఈవిధంగా రథాలమీద ఒరిగి సొమ్మసిల్లగా.

**క. అనిలజు సారథియును గురు। తనయుని రథచోదకుఁడు నతని నాతనినిం**
**గొని యుల్లంబుల బలితపు। దునుకు సొరఁగ ననికిఁ దొలఁగఁ దోలిరి రథముల్. 110**

**ప్రతిపదార్థం:** అనిలజు= వాయుపుత్రుడైన భీమునియొక్క; సారథియును= సూతుడు; గురుతనయుని= గురువైన ద్రోణుని కుమారుడైన అశ్వత్థామయొక్క; రథచోదకుఁడున్= రథం తోలేవాడు; ఉల్లంబులన్= తమ మనస్సులలో; బలితము= బలమైన; దునుకు= బాధ; చొరఁగన్= ప్రవేశింపగా; అతనిన్= భీమునీ; ఆతనిన్= అశ్వత్థామను; కొని= తీసికొని; అనికిన్= యుద్ధంనుంచి; తొలఁగన్= తప్పిపోయేటట్లు; రథముల్= తేరులు; తోలిరి= నడిపించుకుపోయారు.

**తాత్పర్యం:** భీముడియొక్క సూతుడు, అశ్వత్థామ యొక్క సారథీ తమ మనస్సులలో బలమైన బాధ ప్రవేశించగా - భీముడిని, అశ్వత్థామను తీసికొని యుద్ధంనుండి తప్పించి రథాలను నడిపించుకొనిపోయారు.

**విశేషం:** ఇక్కడ ఉస్మానియా సంశోధిత భారతం 'బలితపుఁదునుకు' అన్న పాఠం గ్రహించింది. అపుడు అది 'తునుకు' కావాలి. కాని శ.ర; సూ.ని.లు 'తునుకు' ఈ సందర్భానికి తగిన అర్థం ఇవ్వలేదు. శ.ర. దునుకు అనే పదానికి బాధ అనే అర్థం ఇచ్చింది. సూ.ని. దునుకు అనే పదానికి భయం అనే అర్థం ఇచ్చి దానికి నిర్వాహకంగా ఈ పద్యాన్నే ఉదాహరించింది. శ.ర. మరొక పద్యాన్నీ ఉదాహరించింది కాని, దానికి బాధ అన్న అర్థాన్ని కుండలీకరించి చెప్పింది. ఈ దునుకుకు తమిళ పర్యాయం తునుక్కు అనీ పేర్కొన్నది.

**ఉ. క్రీడితనూజుఁడైన శ్రుతకీర్తియు శల్యుఁడు నేచి దిక్కుల**
**ల్లాడఁగఁ బోరుచో శరము లాఱయిదుల్ శ్రుతకీర్తి శల్యుమై**
**గాఁడఁగ నేయ మూఁడు పటుకాండము లాతని మేనఁ గ్రుచ్చి సం**
**తాడితుఁ జేసె సూతు నిశితప్రదరంబున నాతఁ డుద్ధతిన్. 111**

**ప్రతిపదార్థం:** క్రీడి= కిరీటి, అర్జునుని; తనూజుఁడు= కుమారుడు; ఐన= అయినట్టి; శ్రుతకీర్తియున్= శ్రుతకీర్తి అనే పేరుగల ద్రౌపదీ పుత్రుడూ; శల్యుఁడున్= మద్రరాజూ; ఏచి= విజృంభించి; దిక్కులు= దిశలు; అల్లాడఁగన్= వణకగా; పోరుచోన్= యుద్ధంచేసే సమయంలో; శ్రుతకీర్తి= అర్జున పుత్రుడు; ఆఱు+అయిదుల్= ముప్పై; శరములు= బాణాలు; శల్యుమై= మద్రరాజు దేహం; గాఁడఁగన్= గాయపడేటట్లుగా; ఏయన్= ప్రయోగింపగా; ఆతడు= శల్యుడు; మూఁడు= త్రిసంఖ్యగల; పటు= గట్టి; కాండములు= బాణాలు; అతనిమేనన్= శ్రుతకీర్తి శరీరంలో; క్రుచ్చి= దింపి; ఉద్ధతిన్= గర్వంతో; సూతున్= సారథిని; నిశిత= వాడియైన; ప్రదరంబునన్= చీల్చే బాణంతో; సంతాడితున్+చేసెన్= గట్టిగా కొట్టబడిన వానినిగా చేశాడు.

**తాత్పర్యం:** ద్రౌపదికీ అర్జునుడికీ జన్మించిన కుమారుడు శ్రుతకీర్తి, శల్యుడు విజృంభించి యుద్ధం చేస్తుంటే దిక్కులు కంపించిపోయాయి. అపుడు శ్రుతకీర్తి శల్యుడి శరీరం చీలిపోయేటట్లు ముప్పై బాణాలు ప్రయోగించాడు. శల్యుడు గర్వంతో మూడు బాణాలు శ్రుతకీర్తి శరీరంలో నాటి, ఒకదానితో సూతుడిని గట్టిగా కొట్టాడు.

**చ. నరతనయుండు దత్తనువు నాటఁగఁ దొమ్మిదియమ్ములేసి స**
**త్వరముగ సూతునంగమున వాలికతూపులు మూఁడు నాటి ని**
**ష్ఠురశరపంచకస్ఫురణ చూపినఁ గోప మెలర్ప నమ్మహీ**
**శ్వరుఁడు గడంగి విల్ దునిమి సప్తశరంబుల నొంచె నాతనిన్. 112**

**ప్రతిపదార్థం:** నర= అర్జునుని; తనయుండు= కుమారుడైన శ్రుతకీర్తి; తద్= ఆ శల్యునియొక్క; తనువున్= శరీరాన్ని; నాటఁగన్= గ్రుచ్చుకొనేటట్లుగా; అమ్ములు= బాణాలు; ఏసి= ప్రయోగించి; సత్వరముగన్= వేగంతో; సూతు+అంగమునన్= సారథి శరీరంలో; వాలిక= పదునైన; తూపులు= బాణాలు; మూఁడు= మూడింటిని; నాటి= గ్రుచ్చి; నిష్ఠుర= కఠినమైన; శర= అమ్ములయొక్క; పంచక= ఐదింటియొక్క; స్ఫురణ= మెరవటం; చూపినన్= ప్రదర్శింపగా; ఆ+మహీ+ఈశ్వరుడు= ఆ భూపతి; కోపము= అలుక; ఎలర్పన్= అధికంకాగా; కడంగి= ప్రయత్నించి; విల్= ధనుస్సు; తునిమి= ఖండించి; ఆతనిన్= శ్రుతకీర్తిని; సప్తశరంబులన్= ఏడు బాణాలతో; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** శ్రుతకీర్తి శల్యుడి శరీరంలో తొమ్మిది అమ్ములు గ్రుచ్చాడు. వేగంతో సారథి శరీరంలో మూడు బాణాలు గ్రుచ్చి మళ్ళీ ఐదు గట్టి బాణాలు ప్రయోగించాడు. దానితో మద్రరాజుకు కోపం వచ్చి అతడి విల్లు విరుగగొట్టి ఏడు బాణాలతో అతడిని నొప్పించాడు.

**వ. అట్టియెడ.** 113

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; ఎడన్= సమయంలో.

**తాత్పర్యం:** అటువంటి సమయంలో.

**సీ. వేఱొక్క విల్లెత్తి వివ్వచ్చుకొడు కఱు । వదినాలుగమ్ములు వఱపె మద్ర**
**పతిమేన నతఁడు దొంబదితూపు లడరించి । యేసె నవ్వీరు శరాసనంబు**
**ఖండంబులుగ వాఁడు గం డడంగక గద । వైచినఁ బొడిసేసి యేచి శక్తి**
**నిగిడింపఁ దునుమాడె నిశితభల్లంబునఁ । ద్రుంచెఁ దదీయ సూతుని శిరంబు**

**ఆ. వాయుజవములైన వాహంబు లప్పుడు । గలఁగి యరద మనికిఁ దొలఁగ నీడ్చెఁ**
**దెఱపిగాంచి శల్యుఁ డఱిముఱిఁ జొచ్చిక । లంచెఁ బాండు సుతుబలంబు నధిప!** 114

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; వివ్వచ్చు= బీభత్సునియొక్క, అర్జునునియొక్క; కొడుకు= కుమారుడు శ్రుతకీర్తి; మద్రపతిమేనన్= మద్రరాజైన శల్యుని దేహంలో; అఱువదినాలుగు; అమ్ములు= బాణాలు; పఱపెన్= ప్రయోగించాడు; అతఁడు= శల్యుడు; తొంబది= తొంభై; తూపులు= బాణాలు; అడరించి= ప్రయోగించి; ఆ+వీరు= ఆ శూరుడైన శ్రుతకీర్తియొక్క; శరాసనంబు= ధనుస్సు; ఖండంబులుగన్= ముక్కలయ్యేటట్లుగా; ఏసెన్= కొట్టాడు; వాఁడు= శ్రుతకీర్తి; గండు+అడంగక= బలాన్ని కోల్పోక; గద= గుదియ; వైచినన్= విసరగా; పొడి+చేసి= (శల్యుడు) దానిని చూర్ణంచేసి; ఏచి= (శ్రుతకీర్తి) విజృంభించి; శక్తిన్= ఈటెను; నిగిడింపన్= ప్రయోగించగా; తునుము+ఆడెన్= (శల్యుడు) దానిని ముక్కలు చేశాడు; (ఇంకా) నిశిత= వాడియైన; భల్లంబునన్= బాణంతో; తదీయ= శ్రుతకీర్తియొక్క; సూతుని= సారథియొక్క; శిరంబున్= శిరస్సును; త్రుంచెన్= నరికాడు; అప్పుడు= ఆ సమయంలో; వాయుజవములు+ఐన= వాయువేగంకల; వాహంబులు= (శ్రుతకీర్తియొక్క) గుర్రాలు; కలఁగి= కలతచెంది; అరదము= రథాన్ని; అనికిన్= యుద్ధానికి; తొలఁగన్= తొలగునట్లుగా; ఈడ్చెన్= లాక్కొనిపోయాయి; శల్యుఁడు= మద్రరాజు; తెఱపి= ఎడము; కాంచి= చూచి; అఱిముఱిన్= వెంటనే; చొచ్చి= ప్రవేశించి; పాండు= పాండురాజుయొక్క; సుతు= కుమారుడైన యుధిష్ఠిరుని యొక్క; బలంబున్= సైన్యాన్ని; కలంచెన్= సంక్షోభపరచినాడు.

**తాత్పర్యం:** శ్రుతకీర్తి మరొక ధనుస్సు తీసికొన్నాడు. శల్యుడి శరీరంలో అరవైనాలుగు బాణాలు గ్రుచ్చాడు. శల్యుడు తొంభై బాణాలు ప్రయోగించి ఆ వీరుడి ధనుస్సు విరుగగొట్టాడు. శ్రుతకీర్తి బలహీనపడకుండా, గద ప్రయోగించాడు. శల్యుడు దానిని చూర్ణం చేశాడు. శ్రుతకీర్తి శక్తిని ప్రయోగించాడు. శల్యుడు దానిని ముక్కలు చేసి అతడి సారథి శిరస్సు నరికాడు. శ్రుతకీర్తి గుర్రాలు అసలే వాయువేగం కలవి. అందులో బెదిరాయి. కనుక రథాన్ని యుద్ధానికి దూరంగా లాగుకొనిపోయాయి. శల్యుడు సందు చూచుకొని వేగంగా ధర్మరాజు సైన్యంలోనికి ప్రవేశించి దానిని సంక్షోభపెట్టాడు.

**సీ. కమలాకరము లీలఁ గలఁచి యాడెడు గంధ । దంతావళము సముద్దండతయును**
**దరమిడి మృగసముత్కరము ఘోరంబుగా । వధియించు కంఠీరవంబు నేపు**
**నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ । గాల్చు దావాగ్ని యుగ్రక్రమంబుఁ**
**బ్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమ । యించు ఫాలాక్షుని యేడ్తెఱయును**

**ఆ. బోల్పఁ బట్టునయ్యె భుజగర్వ శౌర్య। ప్రతాపదుర్దమప్రకోపములకు**
**మద్రవిభుఁడు గోలుమసఁగి శాత్రవసైన్య। హననకేలి సలుపునవసరమున. 115**

**ప్రతిపదార్థం:** మద్రవిభుఁడు= మద్రరాజు శల్యుడు; కోలుమసఁగి= మిక్కిలి విజృంభించి; శాత్రవ= శత్రువులదైన; సైన్య= సైన్యంయొక్క; హననకేలి= చంపటమనే క్రీడ; సలుపు= చేసే; అవసరమునన్= సమయంలో; భుజగర్వ= బాహువుల దర్పానికీ; శౌర్య= పరాక్రమానికీ; ప్రతాప= ఇతరులను కాల్చినట్లు బాధింపగల శక్తికీ; దుర్దమ= అణపరాని; ప్రకోపములకున్= మహాక్రోధానికీ; పోల్పన్= పోల్చేటందుకు (వరుసగా); కమలాకరమున్= పద్మాలకు పుట్టిల్లయిన సరస్సును; లీలన్= విలాసంతో; కలఁచి= సంక్షోభపరచి; ఆడెడు= క్రీడించే; గంధ= మదించిన; దంతావళము= ఏనుగుయొక్క; సముద్దండతయును= మిక్కిలి భయంకరత్వమూ; తరము+ఇడి= వరుసగా; మృగ= లేళ్ళయొక్క; సముత్కరమున్= మందను; ఘోరంబుగాన్= భయంకరంగా; వధించు= సంహరించే; కంఠీరవంబు= సింహంయొక్క; ఏపున్= విజృంభణమూ; నిర్+రస+అరణ్యంబునన్= ఎండుటడవిని; నిర్భర= నిండైన; ఆటోపతన్= సంరంభంతో; కాల్చు= తగులబెట్టే; దావ+అగ్ని= కార్చిచ్చుయొక్క; ఉగ్రక్రమంబున్= తీక్ష్ణమైన, వేగమైన గమనమూ; ప్రకట విక్రాంతిన్= అధికమైన విక్రమంతో; పురత్రయంబును= మూడు పట్టణాలనూ; సమయించు= నశింపజేసే; ఫాలాక్షు= నిటాలాక్షుడైన ఈశ్వరునియొక్క; ఏడ్తెఱయును= విజృంభణమూ; పట్టున్+అయ్యె= స్థానమయ్యాయి.

**తాత్పర్యం:** శల్యుడు బాగా విజృంభించి శత్రుసైన్యసంహారం ఒక ఆటవలె చేస్తున్నాడు. అప్పటి అతడి బాహుగర్వానికి పద్మాలున్న సరస్సును విలాసంతో సంక్షోభపరుస్తున్న మదపుటేనుగు భయంకరత్వం సాటివస్తుంది. పరాక్రమానికి వరసపెట్టి లేళ్ళమందను భీకరంగా సంహరిస్తున్న సింహంయొక్క విజృంభణం పోలికకు వస్తుంది. ప్రతాపానికి ఎండిపోయిన అడవిని సంపూర్ణ సంరంభంతో తగులబెట్టుతున్న దావానల శీఘ్రగమనం సరి అవుతుంది. అణపరాని క్రోధానికి అధిక పరాక్రమంతో త్రిపురనాశనం చేస్తున్న నిటలాక్షుడి విజృంభణం సమానమవుతుంది.

**విశేషం:** అలం: ఉపమ. యథాసంఖ్యం.

### దుశ్శాసనుఁడు సహదేవునితో యుద్ధంబు సేసి మూర్ఛిల్లుట (సం. 8-17-30)

**ఉ. ధీరజనోత్తముండు సహదేవుఁడు మైగలి దుస్ససేనుఁడున్**
**వీరులు పిచ్చలింపఁ బ్రజ వి న్నద్రువం బొరినార్వఁ బోరుచో**
**వారక సాయకత్రయము వాఁడిమి నయ్యువరాజు నొంచె వి**
**స్తార మనోజ్ఞహారలసితంబగు నా ఘనబాహువక్షముల్. 116**

**ప్రతిపదార్థం:** ధీర= ఎట్టిపరిస్థితులలోనూ కలతచెందని; జన= జనులలో; ఉత్తముండు= శ్రేష్ఠుడైన; సహదేవుఁడు= మాద్రి చిన్నకొడుకు; మైగలి= శూరుడైన; దుస్ససేనుఁడున్= దుశ్శాసనుడును; వీరులు= ధైర్యము కలవారు; పిచ్చలింపన్= ప్రశంసింపగా; ప్రజ= జనం; విన్ను+అద్రువన్= ఆకాశం బ్రద్దలయ్యేటట్లు; పొరిన్= అధికముగా; ఆర్వన్= అరవగా; పోరుచోన్= యుద్ధంచేసేటప్పుడు; ఆ+యువరాజున్= ఆ కౌరవ యువరాజైన దుశ్శాసనుడు; వారక= అడ్డులేకుండా; సాయకత్రయము= మూడు బాణాలయొక్క; వాఁడిమిన్= తీక్ష్ణతచేత; విస్తార= విశాలమైన; మనోజ్ఞ= మనోహరమైన; హార= ముత్యాలపేరులచేత; లసితంబు+అగు= విలసితమైన; ఆ ఘనబాహు= ఆతని గొప్పవైన బాహువులను; వక్షమున్= వక్షఃస్థలాన్నీ; నొంచెన్= నొప్పించాయి.

**తాత్పర్యం:** ధీరులలో ఉత్తముడు సహదేవుడు. శూరుడు దుశ్శాసనుడు. వీరిద్దరూ యుద్ధంచేస్తుంటే ధీరులు ప్రశంసిస్తున్నారు. జనం ఆకాశం బ్రద్దలయ్యేటట్లు అరుస్తున్నారు. అపుడు దుశ్శాసనుడు మూడు బాణాల నైశిత్యంతో విశాలమైన, హారాలంకృతమైన సహదేవుడి బాహువులనూ వక్షఃస్థలాన్నీ నొప్పించాడు.

**చ.** **ధృతి వొగడొందనేచి సహదేవుఁడు నీసుతు శాతదీప్త స**
**ప్తతి శరవిద్ధుఁ జేసి వడిఁ దద్రథచోదకు మార్గణత్రయా**
**హతుఁడుగఁ జేయ నల్గి వెస నాతని చాపము ద్రుంచి యాతఁ డు**
**ద్ధతి యలరంగ డెబ్బది శితప్రదరంబుల మేను నొంచినన్.** 117

**ప్రతిపదార్థం:** సహదేవుఁడు= మాద్రి చిన్నకొడుకు; ధృతి= ధైర్యం; పొగడు+ఒందన్= ప్రశంసనందగా; ఏచి= విజృంభించి; నీ సుతున్= నీ కుమారుడైన దుశ్శాసనుని; శాత= పదునైన; దీప్త= మెరుస్తున్న; సప్తతి= డెబ్బై; శర= అమ్ములచేత; విద్ధున్= కొట్టబడినవానిని; చేసి= ఒనరించి; వడిన్= వేగంతో; తద్+రథ= అతని రథంయొక్క; చోదకున్= త్రోలేవానిని, సారథిని; మార్గణత్రయ= బాణాలయొక్క మూటిచేత; మూడుబాణాలచేత; ఆహతు(డు+కన్)= అన్నివైపులగొట్టబడిన వానినిగా; చేయన్= చేయగా; ఆతఁడు= దుశ్శాసనుడు; అల్గి= కోపించి; వెసన్= వడిగా; ఆతని= సహదేవునియొక్క; చాపము= ధనుస్సు; త్రుంచి= విరిచి; ఉద్ధతి+అలరంగన్= గర్వం ఒప్పగా; డెబ్బది= డెబ్బై; నిశిత= వాడియైన; ప్రదరంబులన్= బాణాలచేత; మేను= శరీరం; నొంచినన్= నొప్పింపగా.

**తాత్పర్యం:** సహదేవుడు తన ధైర్యాన్ని అందరూ ప్రశంసించే విధంగా విజృంభించాడు. పదునెక్కి మెరుస్తున్న డెబ్బై బాణాలతో దుశ్శాసనుడిని కొట్టాడు. మరి మూడు బాణాలతో అతడి సారథిని ముందూ అటూ ఇటూ కొట్టాడు. అందుకు దుశ్శాసనుడికి కోపం వచ్చి అతడి ధనుస్సు విరుగగొట్టాడు. సహదేవుడు కూడ గర్వంతో తానూ డెబ్బై బాణాలు ప్రయోగించి అతడి దేహం నొప్పించాడు. అప్పుడు.

**సీ.** **నకులానుజుఁడు గృపాణంబున వైచిన । దుస్సేనుని విల్లు దునియలయ్యె**
**నెడ గని యవ్వీరుఁడేచి బల్వింట మం । టలు గ్రమ్మున మ్మేయుటయు నతండు**
**గడువెస నెత్తిన కరవాలమునఁ ద్రుంచి । యతనిమై లక్షించి యదియ వైవ**
**నడుమన యాతండు నఱికినఁ బ్రస్ఫీత । చాపంబుగొని చతుష్షష్టి నిశిత**

**ఆ.** **కంకపత్త్రములను గడఁక నయ్యువరాజు । పరఁగఁ జేయుటయును బాండుతనయుఁ**
**డడఁచె నొక్కటొకటి నైదైదు తీవ్ర శి । లీముఖముల బాహులీల మెఱయ.** 118

**ప్రతిపదార్థం:** నకుల+అనుజుఁడు= నకులుని తమ్ముడు సహదేవుడు; కృపాణంబునన్= ఖడ్గముతో; వైచినన్= కొట్టగా; దుస్సేనుని= దుశ్శాసనునియొక్క; విల్లు= ధనుస్సు; తునియలు+అయ్యెన్= ముక్కలయ్యెను; ఆ+వీరుడు= ఆ ధైర్యం కలవాడు, సహదేవుడు; ఏచి= రేగి; ఎడ= సందు; కని= చూచి; బలు+వింటన్= పెద్ద ధనుస్సునుండి; మంటలు= జ్వాలలు; క్రమ్మ= వ్యాపింపజేసే; అమ్మ= బాణం; ఏయుటయున్= ప్రయోగింపగా; అతండు= దుశ్శాసనుడు; కడున్= మిక్కిలి; వెసన్= వేగంతో; ఎత్తిన= పైకెత్తిన; కరవాలమునన్= ఖడ్గముతో; త్రుంచి= (ఆ బాణాన్ని) నరికి; అదియ= ఆ ఖడ్గానే; అతని= సహదేవునియొక్క; మై= శరీరం; లక్షించి= గురిగా చేసికొని; వైవన్= విసరగా; ఆతండు= సహదేవుడు; నడుమన్+అ= మధ్యనే; నఱికినన్= ఖండింపగా; ఆ+యువరాజు= ఆ దుశ్శాసనుడు; ప్రస్ఫీత చాపంబు= మిక్కిలి బలమైన ధనుస్సు; కొని= తీసుకొని;

చతుః+షష్టి= అరవైనాలుగు; నిశిత= పదునైన; కంకపత్త్రములను= రాపులుగు రెక్కలు కట్టిన బాణాలను; కడఁకన్= పూనికతో; పరఁగన్+చేయుటయున్= ప్రసరింపజేసేసరికి; పాండుతనయుఁడు= పాండురాజు కొడుకైన సహదేవుడు; ఒక్కటిన్+ ఒక్కటిన్= ఒక్కొక్కదానినీ; ఐదు+ఐదు= ఐదేసి; తీవ్ర= వడిగల; శిలీముఖములన్= బాణాలతో; బాహులీల= చేతుల విలాసము; మెఱయన్= ప్రకాశించేటట్లుగా; అడఁచెన్= అణగగొట్టాడు.

**తాత్పర్యం:** సహదేవుడు ఖడ్గంతో కొట్టేసరికి దుశ్శాసనుడి ధనుస్సు ముక్కలయింది. ఆ సందు చూచుకొని సహదేవుడు విజృంభించి మంటలు క్రక్కే బాణం ప్రయోగించాడు. దుశ్శాసనుడు దానిని విచ్చిన కత్తితో నరికి సహదేవుడి శరీరం గురిచేసి ఆ ఖడ్గాన్నే విసిరాడు. సహదేవుడు దానిని నడుమనే ముక్కలు చేశాడు. అపుడు దుశ్శాసను డొక పెద్దవిల్లు తీసికొని అరవైనాలుగు రాపులుగు రెక్కలు కట్టిన బాణాలు సహదేవుడిమీద ప్రయోగించాడు. సహదేవుడా బాణాలలో ఒక బాణానికి ఐదేసి బాణాలు, అంటే మూడువందల ఇరవై బాణాలు ప్రయోగించి తన బాహువుల విలాసం ప్రకాశించేటట్లు వాటిని అణగగొట్టాడు.

**వ. ఇట్లు విక్రమవిజృంభితుండై సహదేవుండు శతశాత శిలీముఖంబు లడరించిన. 119**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈవిధంగా; సహదేవుండు= సహదేవుడు; విక్రమ= పరాక్రమంచేత; విజృంభితుండై= విజృంభించినవాడై; శతశాత= నూరు పదునైన; శిలీముఖంబులు= బాణాలు; అడరించినన్= ప్రయోగింపగా.

**తాత్పర్యం:** సహదేవు డిట్లా పరాక్రమంతో విజృంభించి పదునైన నూరు బాణాలు ప్రయోగించేసరికి.

**చ. రయమున వాని నన్నిటి శరత్రితయంబునఁ ద్రుంచి సాయక**
**ద్వయమున నాతనిం బటునవప్రదరంబుల సారథిన్ భవ**
**త్ప్రియతనయుండు నొంచి దివి దీటుకొనంగఁ జెలంగి యార్వ న**
**త్యయసమవర్తిచాడ్పున నతం డుదితభ్రుకుటావిలాసుఁడై. 120**

**ప్రతిపదార్థం:** భవత్= నీ యొక్క; ప్రియతనయుండు= ముద్దులకొడుకు దుశ్శాసనుడు; రయమునన్= వేగముతో; వానిన్= ఆ బాణాలను; అన్నిటిన్; శరత్రితయంబునన్= బాణాలు మూటితో; మూడు బాణాలతో; త్రుంచి= నరికి; సాయక ద్వయమునన్= బాణాల జంటతో; ఆతనిన్= సహదేవుని; పటు= గట్టివైన; నవ= తొమ్మిదైన; ప్రదరంబులన్= బాణాలతో; సారథిన్= అతని సూతునీ; నొంచి= నొప్పించి; దివిన్= ఆకాశంలో; దీటుకొనంగన్= నిండేటట్లు; చెలంగి= విజృంభించి; ఆర్వన్= అరవగా; అతండు= సహదేవుడు; అత్యయ= ప్రళయకాలంలోని; సమవర్తి= యముని; చాడ్పునన్= విధంగా; ఉదిత= పుట్టిన; భ్రుకుటీ= బొమముడియొక్క; విలాసుఁడు+ఐ= అందం కలవాడై.

**తాత్పర్యం:** నీ ముద్దుల కొడుకు దుశ్శాసనుడు వేగంతో వాటినన్నింటనీ మూడు బాణాలతో విరుగగొట్టాడు. రెండు బాణాలతో సహదేవుడినీ, తొమ్మిది బాణాలతో అతడి సారథినీ నొప్పించి విజృంభించి ఆకాశమంతా నిండేటట్లు పెద్దగా అరిచాడు. అపుడు సహదేవుడు కనుబొమలు ముడిచి ప్రళయకాల యముడివలె. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. పటునారాచము దీప్తిజాలము నభోభాగంబునం బర్వ ను**
**త్కట వేగంబున నేయఁ గంకటము వక్షఃపీఠముం దూఁటి నె**
**త్తుటి పొం దేమియు లేక యుచ్చి చనినం దూగాడి యాతండు వ్రా**
**లుటయుం దేరు దొలంగ సూతుఁడు భయాలోలాకృతిం దోలినన్. 121**

**ప్రతిపదార్థం:** పటు= బలమైన; నారాచము= బాణం; దీప్తిజాలము= (దాని) కాంతిపుంజం; నభః= ఆకాశంయొక్క; భాగంబునన్= ప్రదేశంలో; పర్వన్= వ్యాపించేటట్లు; ఉత్కట= అధికమైన; వేగంబునన్= వడితో; ఏయన్= ప్రయోగింపగా; (అది) కంకటమున్= కవచాన్నీ; వక్షః పీఠమున్= పీటలా విశాలమూ, కఠినమూ అయిన రొమ్ములో; తూఁటి= ప్రవేశించి; నెత్తుటి= రక్తంయొక్క; పొందు= చెలిమి; ఏమియున్= ఏమీ, బొత్తిగా; లేక= లేకుండా; ఉచ్చి= చీల్చుకొని; చనినన్= పోగా; ఆతండు= దుశ్శాసనుడు; తూగు+ఆడి= తూలి; వ్రాలుటయున్= ఒరగినందువల్ల; సూతుఁడు= అతని సారథి; భయ= జడుపుచేత; ఆలోల= సంపూర్ణంగా వణకుతున్న; ఆకృతిన్= రూపంతో; తేరు= రథాన్ని; తొలంగన్= యుద్ధభూమినుంచి తప్పుకొనేట్లు; తోలినన్= నడిపించుకొని పోగా.

**తాత్పర్యం:** కాంతిపుంజం ఆకాశప్రదేశంలో వ్యాపించేటట్లుగా ఒక గట్టిబాణం మహావేగంతో ప్రయోగించాడు. అది దుశ్శాసనుడి కవచాన్నీ, పీటవలె గట్టిగా విశాలంగా ఉన్న రొమ్మునూ చీల్చుకొని నెత్తురు కొంచెమైనా అంటకుండా వెళ్ళిపోయింది. ఆ దెబ్బకు దుశ్శాసనుడు ఊగిపోయి సొమ్మసిల్లి ఒరిగిపోయాడు. వెంటనే సారథి భయంతో నిలువెల్లా వణికిపోతూ యుద్ధభూమికి దూరంగా రథం తోలుకొని పోగా.

**విశేషం:** 'నెత్తుటి పొందేమియు లేక' అనటం విశేషం. బాణం చీల్చిన తరువాత రక్తం రావటానికి కొంచెంసేపు పడుతుంది. బాణం ఎంత వేగంతో ప్రవేశించి చీల్చుకొని వెళ్ళిందంటే శరీరభాగం తెగిన తరువాత రక్తం వచ్చి దీనికి తాకే వ్యవధి కూడా లేదన్నమాట. ఇది ఈ సందర్భంలో మూలంలో లేదు కూడా.

**క. అమ్మాద్రీపుత్త్రుఁడు వా । లమ్ముల దుశ్శాసనుని మహాసైన్యము రౌ**
**ద్రమ్ముగఁ గలంచె దివిజ గ । ణమ్ము వినుతిసేయఁ దమమొనలు నలి నార్వన్. 122**

**ప్రతిపదార్థం:** ఆ+మాద్రీపుత్రుఁడు= ఆ మాద్రి కొడుకైన సహదేవుడు; దివిజ= దేవతలయొక్క; గణమ్ము= సమూహం; వినుతి+చేయన్= ప్రశంసింపగా; తమ= పాండవులయొక్క; మొనలు= సేనలు; నలిన్= ఉత్సాహంతో; ఆర్వన్= కేకలు పెట్టగా; దుశ్శాసనుని= దుశ్శాసనునియొక్క; మహాసైన్యమున్= పెద్దసైన్యాన్ని; వాలు+అమ్ములన్= పొడవైన పదునైన బాణాలతో; రౌద్రమ్ముగన్= భయంకరంగా; కలంచెన్= సంక్షోభిల్ల చేశాడు.

**తాత్పర్యం:** సహదేవుడు పొడవైన పదునైన బాణాలతో దుశ్శాసనుడి పెద్దసైన్యాన్ని కలచివేశాడు. ఆ తీరు చాలా భయంకరంగా ఉన్నది. ఆ పనికి దేవతలు ప్రశంసించారు. పాండవుల సేనలు ఉత్సాహంతో కేకలు పెట్టాయి.

**చ. నకులుఁడు సూతపుత్త్రుఁడుఁ బెనంగునెడన్ నకులుండు సూత పు**
**త్త్రకునకు నిట్లనుం దలఁచి దైవము నేఁడు నిజప్రసన్న దృ**
**ష్టికి ననుఁ బాత్రభూతుఁడుగఁ జేయుట గానఁగ వచ్చె నాదుచూ**
**డ్కికి నిను గోచరంబుగ ఘటించిన యా చతురత్వసంపదన్. 123**

**ప్రతిపదార్థం:** నకులుఁడున్= మాద్రి పెద్దకుమారుడైన నకులుడు; సూతపుత్రుఁడున్= సూతనందనుడైన కర్ణుడు; పెనంగు= పోరాడే; ఎడన్= సమయంలో; నకులుండు= నకులుడు; సూతపుత్రకునకున్= కర్ణునితో; ఇట్లు= ఇలా; అనున్= అన్నాడు; నాదు చూడ్కికిన్= నా దృష్టికి; నినున్= నిన్ను; గోచరంబుగన్= కనిపించేటట్లుగా; ఘటించిన= కూర్చిన; ఆ చతురత్వ= ఆ నేర్పరితనంయొక్క; సంపదన్= సమృద్ధిచేత; నేఁడు= ఈ దినం; దైవము= విధి; నిజ= తనయొక్క; ప్రసన్న= సంతోషించిన, దయకల; దృష్టికిన్= చూపునకు; ననున్= నన్ను; పాత్రభూతుఁడుగన్= అర్హుడైనవానిగా; చేయుట= చేయటం; కానఁగన్= కనిపింపగా; వచ్చెన్= వచ్చింది, కనిపించింది.

**తాత్పర్యం:** నకులుడూ కర్ణుడూ యుద్ధంచేస్తున్న సమయంలో నకులుడు కర్ణుడితో ఇట్లా అన్నాడు: 'నా కన్నులకు నీవు కనబడేటట్లుగా తాను చేసిన గొప్పనేర్పువల్ల నేడు దైవం నన్ను తన దయాదృష్టి ప్రసరించటానికి అర్హుడిగా చేయటం కనిపిస్తున్నది.

**క. కౌరవ పాండవులకు నీ । వైరము నీ వలనఁ గాదె వచ్చెను నిను మ**
**ద్ఘోరశరనిహతిఁ బడఁ గ । న్నారఁ గనుంగొనక కోపమాఱునె? యొంటన్? 124**

**ప్రతిపదార్థం:** కౌరవ పాండవులకున్= కౌరవులకూ, పాండవులకూ; ఈ వైరము= ఈ శత్రుత్వం; నీ వలనన్= నీ మూలాన; వచ్చెను కాదు+ఎ= వచ్చింది కదా; మత్= నాదైన; ఘోర= భయంకరమైన; శర= బాణంయొక్క; నిహతిన్= గట్టి దెబ్బతో; పడన్= పడగా; నినున్= నిన్ను; కన్ను+ఆరన్= కన్ను తృప్తిచెందేటట్లుగా; కనుంగొనక= చూడక; కోపము= క్రోధం; ఒంటన్= వేరొకదానితో; ఆఱునె?= తీరుతుందా?

**తాత్పర్యం:** కౌరవులకూ పాండవులకూ ఈ శత్రుత్వం నీ మూలాననే కదా వచ్చింది. అందువలన నా భయంకరమైన బాణపుదెబ్బకు పడిపోయిన నిన్ను నా కనులారా చూడనిదే, నా కోపం ఇంకొకదానివలన తీరుతుందా?

**చ. అనవుడు రాజసూతివి మహాస్త్రవిదుండవు నైన నీకు ని**
**ట్లనుట దలంప నర్హమగు నైనను జెన్నఁటి పల్కులేల? నె**
**ట్టన భుజశక్తి మార్తురకడంక యడంచినఁ బల్కు టొప్పుఁగా**
**క నిలిచి చూపు నీ చలముకల్మియుఁ జేతులబల్మియుం దగన్'. 125**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పలుకగా (కర్ణుడిలా అన్నాడు:); (నీవు) రాజసూతివి= రాజకుమారుడవు; మహా= గొప్పవైన; అస్త్ర= మంత్ర ప్రయుక్తాలయిన ఆయుధాలను; విదుండవు= ఎరిగినవాడవు; నీకున్= ఇట్టి నీకు; ఇట్లు= ఇలా; అనుట= పలకటం; తలంపన్= ఆలోచింపగా; అర్హము+అగున్= తగును; ఐనను= అయినప్పటికీ; చెన్నఁటి= వ్యర్థమైన; పల్కులు= మాటలు; ఏల?= ఎందుకు?; నెట్టన= యథార్థంగా; భుజశక్తిన్= బాహుబలంతో; మార్తుర= శత్రువులయొక్క; కడంక= ప్రయత్నాన్ని; అడంచినన్= అణచినట్లైతే; పల్కుట+ఒప్పున్+కాన్= అనదగును గాని; నిలిచి= నిలబడి; నీ చలము కల్మియున్= నీకు పట్టుదల ఉండటాన్నీ; చేతుల= బాహువులయొక్క; బల్మియున్= బలాన్నీ; తగన్= నీ మాటలకు తగునట్లుగా; చూపు= చూపించు.

**తాత్పర్యం:** నకులుడట్లా అనేసరికి కర్ణుడిట్లా చెప్పాడు: 'నీవు క్షత్రియవంశంలో పుట్టావు. నీకు మహాస్త్రాలు తెలుసు. అందువల్ల నీవిలా అనదగును కాని, పనికిమాలిన మాటలెందుకు? నిజంగా భుజబలంతో నీవు శత్రువుల ప్రయత్నం అణచివేసి అంటే బాగుంటుంది. నిలబడి నీ మాటలకు తగినట్లుగా నీ పట్టుదలా, బాహుబలమూ చూపించుము.'

**వ. అని పలికి కర్ణుండు.** 126

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికి= చెప్పి; కర్ణుండు= అంగరాజు కర్ణుడు.

**తాత్పర్యం:** ఇట్లా పలికి అంగరాజు.

**సీ. ఉబ్బి మాద్రీసుతు డెబ్బది మూఁడు దూ । పులఁ గప్పుటయు నతఁ డలిగి యతని**
**పై డెబ్బది నిశితబాణంబు లేసిన । నా సూతనందనుఁ డక్కుమారు**
**ధనువు నుగ్గుగఁ జేసి తనువున ముప్పది । కాండముల్ సొనిపిన నొండు విల్లు**
**గొని డెబ్బదింట నాతని నొంచి మూఁడు మా । ర్గణములు సూతునంగమునఁ బఱపి**

**తే. భల్లమున విల్లుదునుమాడి యెల్ల జనులు । నద్భుతంబందఁ ద్రిశతసాయకపరీతుఁ**
**జేసి నకులుండు నిష్ఠురహాస భాసి । తాననాంభోజుఁడై పొలుపారె నధిప!** 127

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా! ఉబ్బి= గర్వించి; మాద్రీసుతున్= మాద్రి కొడుకైన నకులుని; డెబ్బది మూఁడు= డెబ్బైమూడు; తూపులన్= బాణాలతో; కప్పుటయున్= కప్పివేయగా; అతఁడు= నకులుడు; అలిగి= కోపించి; అతనిపైన్= కర్ణునిపై; డెబ్బది= డెబ్బై; నిశిత= పదునుగల; బాణంబులు= అమ్ములు; ఏసినన్= ప్రయోగింపగా; ఆ సూతనందనుఁడు= ఆ కర్ణుడు; ఆ+ కుమారు= ఆ బాలునియొక్క; ధనువు= విల్లు; నుగ్గుగన్+చేసి= చూర్ణమయ్యేటట్లు చేసి; తనువునన్= నకులుని శరీరంలో; ముప్పది= ముప్పై; కాండముల్= బాణాలు; చొనిపినన్= ప్రవేశపెట్టగా; నకులుండు; ఒండు= మరొక; విల్లు= ధనుస్సు; కొని= తీసికొని; డెబ్బదింటన్= డెబ్బై బాణాలతో; ఆతనిన్= కర్ణుని; నొంచి= నొప్పించి; మూఁడు= మూడైన; మార్గణములు= బాణాలు; సూతు= సారథియొక్క; అంగమునన్= శరీరంలో; పఱపి= చొనిపి; భల్లమునన్= బాణంతో; విల్లు= ధనుస్సును; తునుమాడి= నరికి; ఎల్లజనులు= అందరు ప్రజలు; అద్భుతంబు= ఆశ్చర్యం; అందన్= పొందేటట్లుగా; త్రిశత= మూడువందల; సాయక= బాణాలచే; పరీతున్= కప్పబడినవానినిగా; చేసి= చేసి; నిష్ఠుర= కఠినమైన; హాస= నవ్వుచేత; భాసిత= మెరుస్తున్న; ఆనన+అంభోజుఁడు= పద్మంవంటి ముఖం కలవాడు; ఐ= అయి; పొలుపు+ఆరెన్= ఒప్పినాడు.

**తాత్పర్యం:** రాజా! (కర్ణుడు) గర్వించి నకులుడిని డెబ్బై మూడు బాణాలతో కప్పివేశాడు. నకులుడు కోపించి కర్ణుడిమీద డెబ్బై వాడిబాణాలు ప్రయోగించాడు. కర్ణుడు నకులుడి ధనుస్సును పొడిపొడిగా చేసి, అతడి దేహంలో ముప్పై బాణాలు నాటాడు. నకులుడు మరొక విల్లు తీసికొని డెబ్బై బాణాలతో కర్ణుడిని నొప్పించి, మూడు బాణాలు అతడి రథసారథి శరీరంపై వేశాడు. ఇంకా ఒక బాణంతో కర్ణుడి ధనుస్సు విరుగగొట్టాడు. అందరూ ఆశ్చర్యపోయేటట్లు మూడువందల బాణాలతో అతడిని కప్పివేశాడు. కోపంతో కూడిన చిరునవ్వుతో పద్మంవంటి ముఖం మెరుస్తుండగా విలసిల్లాడు.

**క. సూతసుతుఁడు బలు విలుగొని । యాతని వక్షమున నాటె నైదమ్ములు ని**
**ర్ఘాత సమసప్తశరముల । నాతఁ డతని నొంచి విల్లు నఱిముఱిఁ ద్రుంచెన్.** 128

**ప్రతిపదార్థం:** సూతసుతుఁడు= కర్ణుడు; బలు= పెద్ద; విలు= వింటిని; కొని= తీసికొని; ఆతని వక్షమునన్= ఆ నకులుని వక్షఃస్థలం మీద; ఐదు+అమ్ములు= అయిదు బాణాలు; నాటెన్= గ్రుచ్చాడు; ఆతఁడు= నకులుడు; నిర్ఘాతసమ= పిడుగుల వంటి; సప్తశరములన్= ఏడు బాణాలతో; అతనిన్= కర్ణుని; నొంచి= నొప్పించి; విల్లు= ధనుస్సును; అఱిముఱిన్= వేగంగా; త్రుంచెన్= నరికాడు.

**తాత్పర్యం:** కర్ణుడు పెద్ద ధనుస్సు తీసికొన్నాడు. నకులుడి వక్షఃస్థలంపై ఐదు బాణాలు దింపాడు. నకులుడు పిడుగులవంటి ఏడు బాణాలతో కర్ణుడిని నొప్పించి, అతడి ధనుస్సును వెంటనే విరుగగొట్టాడు.

**వ. మఱియు నొక్క మహనీయకార్ముకంబుఁ గొని కర్ణుండు గడంగె నప్పు డయ్యిరువురు నొండొరులతూపులు ద్రుంచుచు నిజమార్గణంబుల నొకళ్ళొకళ్ల నెత్తుట ముంచుచుం బేర్చి వివిధవిశిఖ జాలంబు లడరించిన నంబరంబు శలభపటల సంవృతంబునుంబోలె నుండె నా సమయంబున నకులునగ్రభాగంబునకు వచ్చిన సోమకబలంబులు గర్ణక్రూర నారాచాది బహుళబాణపాతంబులఁబలాయితంబులయ్యెఁ గర్ణునకు బాసటయై తఱిమిన కౌరవ సైనికులు మాద్రేయు రౌద్ర విజృంభణంబున దూరవిఘటితులై ర ట్లిరువాఁగును నెడగలిగి చూచుచుండ నారథికోత్తము లుదాత్త ఘోరాకారంబుల నుల్లసిల్లిభల్లప్రముఖ ప్రదరంబులఁ బరస్పరాంగంబులం బొదివి యంబుద పిహిత మూర్తులగు మార్తాండ శశాంకుల చందంబు నొంది యన్యోన్య దివ్యాస్త్ర తేజోవిలాసంబుల నయ్యైయస్త్రంబుల వారించుచుం బోరి రట్టి యెడ. 129**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకను; కర్ణుండు= అంగరాజు; ఒక్క= ఒక్క; మహనీయ= పెద్ద; కార్ముకంబు= ధనుస్సును; కొని= తీసికొని; కడంగెన్= తలపడినాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+ఇరువురున్= ఆ యిద్దరూ; ఒండు+ఒరుల= ఒకరు మరొకరి; తూపులన్= బాణాలను; త్రుంచుచున్= విరగగొడుతూ; నిజ= తమ; మార్గణంబులన్= బాణాలతో; ఒకళ్ళు+ఒకళ్ళన్= ఒకరు మరొకరిని; నెత్తుటన్= రక్తంలో; ముంచుచున్= నిమగ్నులను చేస్తూ; పేర్చి= చెలరేగి; వివిధ= రకరకములయిన; విశిఖ జాలంబులు= వాడిబాణసమూహాలు; అడరించినన్= ప్రయోగింపగా; అంబరంబు= ఆకాశము; శలభ= మిడుతలయొక్క; పటల= సమూహంచేత; సంవృతంబునున్+పోలెన్= కప్పబడినదానిలా; ఉండెన్= ఉన్నది; ఆ సమయంబునన్= అప్పుడు; నకులు= నకులునియొక్క; అగ్రభాగంబునకున్= ముందరి ప్రదేశానికి; వచ్చిన= వచ్చినట్టి; సోమక బలంబులు= పాంచాల సైన్యాలు; కర్ణ= కర్ణునియొక్క; క్రూర= నిర్దయమైన; నారాచ= ఇనుపబాణములు; ఆది= మొదలయిన; బహుళ= అనేకములైన; బాణ= బాణములయొక్క; పాతంబులన్= పడటముచేత; పలాయితంబులు= పారిపోయినవి; అయ్యెన్= అయినాయి; కర్ణునకున్= అంగరాజుకు; బాసట+ఐ= సహాయమై; తఱిమిన= త్రోలిన; కౌరవ సైనికులు= కౌరవులయొక్క యుద్ధభటులు; మాద్రేయు= మాద్రి కొడుకైన నకులునియొక్క; రౌద్ర= క్రోధంయొక్క; విజృంభణంబునన్= రేగటంవల్ల; దూర= దూరంగా; విఘటితులు+ఐరి= చెదరినవారైనారు; అట్లు= ఆవిధంగా; ఇరువాఁగునున్= ఉభయపక్షాలవారూ; ఎడ+కలిగి= వ్యవధానం ఏర్పడి; చూచుచున్+ఉండన్= చూస్తూ ఉండగా; ఆ రథిక+ఉత్తములు= రథికులలో శ్రేష్ఠులైనవారు; ఉదాత్త= గొప్పవీ; ఘోర= భయంకరములైనవీ అయిన; ఆకారంబులన్= రూపాలతో; ఉల్లసిల్లి= విలసిల్లి; భల్ల= భల్లములు; ప్రముఖ= మొదలయిన; ప్రదరంబులన్= బాణాలతో; పరస్పరాంగంబులన్= ఒకళ్ళొకళ్ళ అవయవాలను; పొదివి= కప్పి; అంబుద= మేఘాలచే; పిహిత= కప్పబడిన; మూర్తులు+అగు= రూపములు కలవారైన; మార్తాండ శశాంకుల= సూర్యచంద్రుల; చందంబున్= విధాన్ని; ఒంది= పొంది; అన్య+అన్య= ఒకళ్ళొకళ్ళ; దివ్య+అస్త్ర= స్వర్గంలో జన్మించిన మంత్రప్రయుక్తములయిన ఆయుధాలయొక్క; తేజః= ప్రకాశములయొక్క; విలాసంబులన్= మెరుపులచేత; ఆ+ఆ+అస్త్రంబులన్= ఆయా మంత్రప్రయుక్తాయుధాలను; వారించుచున్= నివారిస్తూ; పోరిరి= యుద్ధం చేశారు; అట్టి= అటువంటి; ఎడన్= సమయంలో.

**తాత్పర్యం:** ఇంకా, కర్ణుడు ఒక పెద్ద విల్లు తీసికొని పోరాడాడు. ఆ సమయంలో కర్ణుడూ నకులుడూ ఒకరి బాణాలొకరు నరుక్కొంటూ, తమ తమ బాణాలతో ఒకరినొకరు నెత్తుటిలో ముంచుకొంటూ చెలరేగి రకరకాల బాణాలు ప్రయోగించారు. వాటితో ఆకాశం మిడుతల దండు కప్పినట్లున్నది. అపుడు ద్రుపదుడి సేనలు సాయంగా నకులుడి ముందుకు వచ్చాయి. వాటిపై కర్ణుడు కఠినాలయిన ఇనుపబాణాలు మొదలయిన రకరకాల బాణాలు ప్రయోగించి

తరిమాడు. కర్ణుడికి సాయంగా వచ్చిన కౌరవభటులు వారిని తరుముతుంటే నకులుడు రౌద్రంతో విజృంభించాడు. అపుడవి దూరంగా చెదరిపోయాయి. అట్లా ఎడమేర్పడి ఉభయపక్షాలూ చూస్తూండగా ఆ ఉత్తమరథికుల నకుల కర్ణులిద్దరూ మహా భయంకరాకారాలతో భాసించారు. భల్లములు మొదలయిన బాణాలతో ఒకరి దేహాలను మరొకరు కప్పివేశారు. అందువలన మబ్బులు కప్పిన సూర్యచంద్రులవలె ఉన్నారు. ఒకళ్ళొకళ్ళ దివ్యాస్త్రాల తేజస్సులను ఆయా దివ్యాస్త్రాలతో నివారిస్తూ పోరాడారు. అటువంటి సమయంలో.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అలుక వొడమి కర్ణుండు న । కులు చాపము ద్రుంచి సూతుఁ గూల్చి తురంగం**
**బులఁ జంపి చక్రరక్షుల । తలలు నఱికి సిడిముద్రుంచి దరహాసముతోన్. 130**

**ప్రతిపదార్థం:** కర్ణుండు= అంగరాజు; అలుక= కోపం; పొడమి= కలిగి; నకులు= నకులునియొక్క; చాపము= ధనుస్సును; త్రుంచి= నరికి; సూతున్= సారథిని; కూల్చి= పడగొట్టి; తురంగంబులన్= గుర్రాలను; చంపి= సంహరించి; చక్రరక్షుల= చక్రరక్షకుల; తలలు= శిరస్సులు; నఱికి= ఖండించి; సిడము= జెండా; త్రుంచి= నరికి; దరహాసముతోన్= చిరునవ్వుతో.

**తాత్పర్యం:** కర్ణుడికి కోపం వచ్చింది. అందువలన నకులుడి ధనుస్సు విరుగగొట్టాడు. సారథిని పడగొట్టాడు. గుర్రాలను చంపాడు, చక్రరక్షకుల శిరస్సులు ఖండించాడు, జెండా నరికాడు, చిరునవ్వుతో.

**వ. మెఱసినం గుపిత చిత్తుండై. 131**

**ప్రతిపదార్థం:** మెఱసినన్= ప్రకాశింపగా; కుపితచిత్తుండు+ఐ= కోపించిన మనస్సు కలవాడై.

**తాత్పర్యం:** ప్రకాశించగా కోపించి.

**చ. పలకయు వాలునుం గొనియెఁ బాండుకుమారుఁడు రెండు చెక్కలై**
**యిలఁ దొరఁగంగ నేసె గదయెత్తినఁ ద్రుంచె రథంబు డిగ్గి యు**
**జ్జ్వలపరిఘాభిరాముఁడయి వచ్చిన నప్పరిఘంబు రూపుమా**
**పి లసిత లాఘవ స్ఫురణ పెంపునఁ గర్ణుఁడు నొంచె నాతనిన్. 132**

**ప్రతిపదార్థం:** పాండుకుమారుఁడు= పాండురాజు కొడుకైన నకులుడు; పలకయున్= డాలునూ; వాలునున్= ఖడ్గమును, కత్తినీ; కొనియెన్= తీసుకొన్నాడు; కర్ణుఁడు= అంగరాజు; రెండు చెక్కలు+ఐ= రెండు బ్రద్దలు అయి; ఇలన్= భూమిపై తొరఁగంగన్= పడగా; ఏసెన్= బాణంతో కొట్టాడు; గద= గుదియ; ఎత్తినన్= పై కెత్తగా; త్రుంచెన్= (కర్ణుడు) నరికాడు; రథంబు; డిగ్గి= (నకులుడు) దిగి; ఉజ్జ్వల= మిక్కిలి మెరిసే; పరిఘా= ఇనుపకట్ల గుదియచేత; అభిరాముఁడయి= మనోహరుడై, (ఇనుపకట్ల గుదియ తీసుకొని); వచ్చినన్= రాగా; ఆ+పరిఘంబు= ఆ ఇనుపకట్ల గుదియను; రూపు మాపి= (కర్ణుడు) ముక్కలు చేసి; లసిత= ప్రకాశిస్తున్న; లాఘవ= నేర్పుయొక్క; స్ఫురణ= మెరుపుయొక్క; పెంపుతోన్= సమృద్ధితో; ఆతనిన్= నకులుని; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** నకులుడు డాలూ వాలూ తీసికొన్నాడు. కర్ణుడు ఆ డాలు రెండు బ్రద్దలై నేలమీద పడేటట్లు కొట్టాడు. నకులుడు విసరటానికి గద పైకెత్తాడు. కర్ణుడు దానినీ ముక్కలు చేశాడు. నకులుడు రథం దిగి మెరుస్తున్న పరిఘ తీసికొని వచ్చాడు. కర్ణుడు దానినీ ముక్కలు చేసి, తననేర్పు ప్రకటమయ్యేటట్లు నకులుడిని నొప్పించాడు.

**ఆ. మర్మభేదులైన మార్గణంబుల కోహ । టించి సిగ్గుఁ జలము డిగ్గఁ ద్రావి**
**యెల్లజనులుఁ జూడఁ బొల్లఁదనంబున । కోర్చి యక్కుమారుఁ డోడిపాఱె. 133**

**ప్రతిపదార్థం:** ఆ+కుమారుఁడు= ఆ బాలుడు నకులుడు; మర్మభేదులు+ఐన= ఆయువుపట్టులను బ్రద్దలుగొట్టే; మార్గణంబులకున్= బాణాలకు; ఓహటించి= జంకి; సిగ్గున్= లజ్జనూ; చలమున్= పట్టుదలనూ; డిగ్గఁద్రావి= విడిచి; ఎల్లజనులున్= సమస్తజనులూ; చూడన్= చూడగా, చూస్తుండగా; పొల్లఁదనంబునకున్= తేలికతనానికి; ఓర్చి= సహించి; ఓడి= ఓడిపోయి; పాఱెన్= పారిపోయాడు.

**తాత్పర్యం:** కర్ణుడి బాణాలు ఆయువుపట్టులను బ్రద్దలు చేస్తుంటే నకులుడు వాటికి భయపడి, సిగ్గువిడిచి పట్టుదల వదలి, తనను అందరూ చూస్తూ ఉండగా తేలికతనానికీ సహించి, ఓడిపోయి పారిపోయాడు.

### కర్ణుఁడు నకులుని విరథుంజేసి యవమానించుట (సం. 8-17-91)

**క. వెనుకొని రాధేయుఁడు నిజ । ధను వాతని కంధరమునఁ దగిలిచి నలిఁ బ**
**ట్టిన నింద్రచాప పరిగత । ఘనాకృతిని బొలిచె నతఁడు కౌరవనాథా! 134**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= కురువంశీయుడైన ధృతరాష్ట్ర మహారాజా!; రాధేయుడు= రాధాపుత్రుడు కర్ణుడు; వెనుకొని= నకులుడిని వెంబడించి; నిజధనువు= తన విల్లు; ఆతని కంధరమునన్= నకులుని కంఠానికి; తగిలిచి= తగిలించి; నలిన్= ఉత్సాహంతో; పట్టినన్= పట్టుకొనగా; అతఁడు= నకులుడు; ఇంద్రచాప= ఇంద్రచాపంచేత; పరిగత= చుట్టబడిన; ఘన+ఆకృతిని= మేఘం రూపంతో; పొలిచెన్= అందగించాడు.

**తాత్పర్యం:** కౌరవవంశీయుడవయిన ధృతరాష్ట్రమహారాజా! రాధేయుడు నకులుడిని వెంబడించి, తన విల్లతడి కంఠానికి తగిలించి పట్టుకొన్నాడు. అపుడు నకులుడు చుట్టూ హరివిల్లున్న మేఘంవలె శోభించాడు.

**విశేషం:** అలం: ఉపమ. మేఘం వర్షించిన తరువాత ఇంద్రధనుస్సు ఏర్పడుతుంది. నకులుడు శరవర్షం కురిపించి ఆగాడు. ఇట్లా ఈ ఉపమానం ఆలోచనామృతం.

**వ. ఇట్లు పాండుతనయుబాడుదలఁబట్టి మందస్మిత సుందరాననుండై. 135**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇలా; పాండు తనయున్= (కర్ణుడు) పాండురాజకుమారుడైన నకులుని; బాడుదలన్+పట్టి= అవమానించి; మందస్మిత= చిరునవ్వుచేత; సుందర= అందమైన; ఆననుండు+ఐ= ముఖం కలవాడై.

**తాత్పర్యం:** ఈ విధంగా నకులుడిని అవమానించి, చిరునవ్వుతో అందగించే ముఖం కలవాడై.

**క. పలుకులు వృథగా నన్నుం । బలికితి ము న్నింక నెన్ని పలుక వలసినం**
**బలుకుము నీకేఁ దగ నా । యలవుఁ జలము నీ వెఱింగి తంతియ చాలున్. 136**

**ప్రతిపదార్థం:** మున్ను= ఇంతకుముందు; నన్నున్; పలుకులు= మాటలు; వృథగా= వ్యర్థంగా; పలికితి= మాట్లాడావు; ఇంకన్= ఇకమీదట; ఎన్ని పలుక వలసినన్= ఎన్ని మాటలు మాట్లాడదలచుకొన్నా; నీకు+ఏన్= నీకే (నీ శక్తికి మాత్రమే); తగన్=

తగినట్లుగ; పలుకుము= మాట్లాడుము; నా= నాయొక్క; అలవున్= బలాన్ని; చలము= గట్టిపట్టును; నీవు; ఎఱింగితి(వి)= (ఇప్పుడు) తెలుసుకొన్నావు; అంతియ= అంతమాత్రమే; చాలున్= చాలును.

**తాత్పర్యం:** ఇంతకుముందు నన్ను గూర్చి వ్యర్థంగా పెక్కు మాటలు మాట్లాడావు. ఇక ముందు ఎన్ని మాటలు మాట్లాడదలచుకొన్నా నీ శక్తికి తగినట్లు మాట్లాడు. నా బలాన్ని, పట్టును ఇప్పుడు తెలుసుకొన్నావు కదా. అదేచాలు.

**క. అలవెఱిఁగి పెనఁగు పెనఁగం। దలఁచిన నదిగాక సిగ్గుదలకొని యనికిం**
**దొలఁగుట యింకిట దగు వి। చ్చలవిడి నర్జునుని కడకుఁ జనుము కుమారా!'** **137**

**ప్రతిపదార్థం:** పెనఁగన్= పోరాడటానికి; తలఁచినన్= తలచుకొంటే; అలవు= (ఎదిరిదీ, నీదీ) శక్తి; ఎఱిఁగి= తెలిసికొని; పెనఁగు= పోరాడు; అది+కాక= పోరాటం కాకుండా; ఇంకన్= ఈ పైని; ఇట= ఇక్కడ; సిగ్గు= లజ్జ; తలకొని= వహించి; అనికిన్= యుద్ధానికి; తొలగుట; తగున్= యుక్తమవుతుంది; కుమారా!= కుర్రవాడా!; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; అర్జునుని= అర్జునునియొక్క; కడకున్= దగ్గరకు; చనుము= వెళ్ళు.

**తాత్పర్యం:** యుద్ధం చేద్దామనుకొంటే నీ శక్తి ఏమిటో నీ ఎదిరి శక్తి ఏమిటో తెలిసికొని మరీ చేయుము. అట్లా యుద్ధంచేయటం కాక సిగ్గుతెచ్చుకొని యుద్ధానికి దూరంగా పోవటం ఇకమీద నీకు తగిన పని. (విడిచిపెడుతున్నాను, చిన్నవాడవని) కుర్రవాడా! స్వేచ్ఛగా అర్జునుడి దగ్గరకు పొమ్ము'.

**విశేషం:** 136, 137 పద్యాలు వాటికవే సాటి. మాటలు చిన్నవే కాని తేలుకొండెల్లా విషపూరితాలు. 'నీ దిక్కున్నచోటికి పో' అన్నట్టు అర్జునుని దగ్గరకు పొమ్మనటం, 'కుమారా' అనటం మరీ చురుకైనవి.

**క. అని విడిచె నకులుఁ గుంతి వ। చనములు దృఢవృత్తి చిత్త సంకలితములై**
**యునికిం గర్ణుం డతఁడు ను। జని ధర్మజునరదమెక్కె సవ్రీడముగన్.** **138**

**ప్రతిపదార్థం:** అని= ఈ విధంగా పలికి; కర్ణుండు= అంగరాజు; కుంతి వచనములు= కుంతీదేవి మాటలు; దృఢవృత్తి= గట్టిగా; చిత్త= మనస్సులో; సంకలితములు+ఐ= లగ్నములై; ఉనికిన్= ఉండటంచేత; నకులున్= నకులుని; విడిచెన్= విడిచిపెట్టాడు; అతఁడున్= ఆ నకులుడూ; సవ్రీడముగన్= సిగ్గుతో; చని= వెళ్ళి; ధర్మజు= యుధిష్ఠిరునియొక్క; అరదము= తేరు (రథము); ఎక్కెన్= ఆరోహించాడు.

**తాత్పర్యం:** కర్ణు డిట్లా పలికి, తన కుమారులను చంపవద్దని కోరిన కుంతీదేవి మాటలు గట్టిగా మనస్సులో ఉన్నందున నకులుడిని విడిచిపెట్టాడు. నకులుడు కూడా సిగ్గుతో వెళ్ళి యుధిష్ఠిరుడి తేరెక్కాడు.

**వ. ఎక్కి నిట్టూర్పు నిగుడం గుంభనిక్షిప్త భుజంగంబుచందంబున నుండె నవ్విధంబున మాద్రీపుత్ర మాన మథనవిజృంభితుం డగునవ్వీరుం డప్పుడు మధ్యందినగతంబైన మార్తాండబింబంబునకుం బ్రతిబింబంబునుం బోలెఁ బ్రదీప్త మూర్తియై వెలిమావులును దెలిపడగయు నుల్లసిల్ల శోభిల్లు తన రథంబు రయంబున దర్శనీయంబుగాఁ బాంచాలబలంబు దఱిసి పెక్కు తెఱంగుల మెఱుంగుటమ్ములగములు గదియించి.**

**139**

**ప్రతిపదార్థం:** ఎక్కి= అధిరోహించి; నిడు+ఊర్పు= నిట్టూర్పు; నిగుడన్= సాగగా; కుంభ= కుండలో; నిక్షిప్త= ఉంచబడిన; భుజంగంబు= పాము; చందంబునన్= విధంగా; ఉండెన్= ఉన్నాడు; ఆ+విధంబునన్= ఆ ప్రకారంబుగా; మాద్రీపుత్ర= మాద్రికొడుకైన నకులునియొక్క; మాన= అభిమానంయొక్క; మథన= తరచటంచేత; విజృంభితుండు+అగు= చెలరేగిన వాడైన; ఆ+వీరుండు= ఆ కర్ణుడు; అప్పుడు= ఆ సమయంలో; మధ్యందిన= మిట్టమధ్యాహ్నానికి; గతంబు+ఐ= చేరినదైన; మార్తాండ= సూర్యునియొక్క; బింబంబునకున్= మండలానికి; ప్రతిబింబంబునున్+పోలెన్= ప్రతిఫలనంలా; ప్రదీప్త= మిక్కిలి వెలుగుతున్న; మూర్తి+ఐ= రూపంకలవాడై; వెలిమావులును= తెల్లని గుర్రాలూ; తెలిపడగయున్= తెల్లని జెండాయూ; ఉల్లసిల్లన్= ప్రకాశింపగా; శోభిల్లు= అందగించే; తన రథంబు= తన తేరు; రయంబునన్= వేగంతో; దర్శనీయంబుగాన్= చూడదగినదిగా, కనబడేటట్లుగా; పాంచాల బలంబు= పాంచాల సేనను; దఱిసి= సమీపించి; పెక్కుతెఱంగుల= అనేక విధాలైన; మెఱుంగు= మెరసే; అమ్ముల= బాణాలయొక్క; గమి+లు= సముదాయాలను; కదియించి= ప్రయోగించి.

**తాత్పర్యం:** నకులుడట్లా యుధిష్ఠిరుడి రథమెక్కి కుండలో పెట్టిన పాము బుసకొట్టుతూ ఉన్నట్లు విచారంతో నిట్టూర్పులు విడుస్తూ కూర్చున్నాడు. అట్లా నకులుడి పరువు తీయటంతో కర్ణుడికి విజృంభణం వచ్చింది. అపుడు కర్ణుడు మిట్టమధ్యాహ్నపు సూర్యబింబానికి ప్రతిబింబంలా వెలిగాడు. తెల్లగుర్రాలతో, తెల్లని జెండాతో మెరుస్తున్న తన రథాన్ని పాంచాలసైన్యం వద్దకు పోనిచ్చి, రకరకాల మెరిసే అమ్ముల గుంపులు ప్రయోగించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలంకారం: ఉపమ.

**సీ.** **సూతులఁ దెగటార్చి కేతనంబుల వీట । తాటంబుసేసి రథ్యములఁ గూల్చి**
**చామరచ్ఛత్రభూషణములు పొడిసేసి । రథికజనముల శిరములు ద్రుంచి**
**కొమ్ములునఱికి యంకుశములుదునిమి తొం । డములు ఖండించి కుంభములు వ్రచ్చి**
**జోదులతనువులు భేదించి మోరలు । గళ్యాల తోడఁ జెక్కలుగఁ జేసి**

**ఆ.** **కంధరములుడుల్చి కాళ్ళులు ద్రెంచి యా । శ్వికులఁ జంపి చర్మవిశిఖకుంత**
**ముసలముద్గరప్రముఖసాధనములు భ । గ్నములు సేసి భటుల సమయఁ జూచి.** **140**

**ప్రతిపదార్థం:** సూతులన్= సారథులను; తెగటార్చి= సంహరించి; కేతనంబులన్= జెండాలను; వీటతాటంబు+చేసి= తారుమారు చేసి; రథ్యములన్= గుర్రాలను; కూల్చి= పడగొట్టి; చామర= వింజామరలు; ఛత్ర= గొడుగులూ; భూషణములు= నగలూ; పొడి+చేసి= నుగ్గుచేసి; రథికజనముల= రథికులయొక్క; శిరములు= తలలు; త్రుంచి= నరికి; కొమ్ములు= (ఏనుగులయొక్క) దంతములు; నఱికి= ఖండించి; అంకుశములు= ఏనుగు కుంభస్థలాన్ని పొడిచే ఆయుధాలు; తునిమి= విరగగొట్టి; తొండములు= తుండాలు; ఖండించి= నరికి; కుంభములు= కుంభస్థలాలు; వ్రచ్చి= చీల్చి; జోదుల= కాలిబంటులయిన యోధులయొక్క; తనువులు= దేహాలను; భేదించి= బ్రద్దలుచేసి; మోరలు= (గుర్రాల) ముఖాలు; కళ్యాలతోడన్= కళ్ళేలతోసహా; చెక్కలుగన్+చేసి= బ్రద్దలుచేసి; కంధరములు= మెడలు; డుల్చి= నరికి; కాళ్ళులు= కాళ్ళు; త్రెంచి= తెగవేసి; ఆశ్వికులన్= రౌతులను; చంపి= ప్రాణాలు తీసి; చర్మ= డాలు; విశిఖ= బాణాలు; కుంత= ఈటెలు; ముసల= రోకళ్ళు; ముద్గర= సమ్మెటలు; ప్రముఖ= మొదలయిన; సాధనములు= ఉపకరణాలు; భగ్నములు+చేసి= విరుగగొట్టి; భటులన్= సైనికులను; సమయన్+చూచి= మరణించునట్లుచేసి, చంపి.

**తాత్పర్యం:** సారథులను చంపాడు. జెండాలు తార్మారు చేశాడు. గుర్రాలను పడగొట్టాడు. వింజామరలూ గొడుగులూ నగలూ నుగ్గు చేశాడు. రథికుల తలలు నరికాడు. ఏనుగుల దంతాలు విరిచాడు. వాటి కుంభస్థలాలమీద పొడిచే అంకుశాలను ముక్కలు చేశాడు. వాటి తుండాలు ఖండించాడు. వాటి కుంభస్థలాలు బ్రద్దలు చేశాడు. వాటిమీది యోధుల శరీరాలు చీల్చాడు. గుర్రాల ముఖాలు కళ్ళేలతో సహా బ్రద్దలు చేశాడు. కంఠాలు ఖండించాడు. కాళ్ళు నరికాడు, రౌతులను సంహరించాడు. డాళ్ళు, బాణాలు, ఈటెలు, రోకళ్ళు, సమ్మెటలు మొదలయిన సాధనాలను విరుగగొట్టాడు. అనేకులయిన సైనికులను సంహరించాడు.

**వ. బాహువిలాసంబు మెఱయ నెఱయంబొలిచె భవత్సుతుండగు యుయుత్సుండు పర్వతప్రతిముండగు నులూకుపయిం గవిసి కులిశనిభంబగు విశిఖంబున నొంచినఁ గోపించి యా బల్లిదుండు విల్లు విఱుగ నేయుటయు నక్కుమారుండు.** **141**

**ప్రతిపదార్థం:** బాహు= చేతులయొక్క; విలాసంబు= క్రీడ; మెఱయన్= ప్రకాశింపగా; నెఱయన్= నిండుగా; పొలిచెన్= ఉండెను; భవత్= నీయొక్క; సుతుఁడు= కుమారుడు; అగు= అయిన; యుయుత్సుండు= ఆ పేరుగలిగి పాండవపక్షంలో యుద్ధారంభంలో చేరినవాడు; పర్వత ప్రతిముండు+అగు= పర్వతముతో సాటిరాదగిన వాడైన; ఉలూకుపయిన్= ఆ పేరుకలిగిన శకుని కుమారునిమీద; కవిసి= దాడిచేసి; కులిశ= వజ్రాయుధానికి; నిభంబు+అగు= సాటి అయిన; విశిఖంబునన్= బాణంతో; నొంచినన్= నొప్పించగా; కోపించి= అలిగి; ఆ బల్లిదుండు= ఆ బలశాలి; విల్లు= ధనుస్సు; విఱుగన్= విరిగేటట్లు; ఏయుటయున్= బాణం ప్రయోగింపగా; ఆ+కుమారుండు= ఆ నీ కుమారుడు యుయుత్సుడు.

**తాత్పర్యం:** ఇట్లా తన చేతి యుద్ధక్రీడ ప్రకాశించగా కర్ణుడు నిండుగా యుద్ధం చేస్తున్నాడు. అపుడు నీ కుమారుడు యుయుత్సుడు పర్వతంవంటి ఉలూకుడి మీదికి వెళ్ళాడు. వెళ్ళి వజ్రాయుధంవంటి బాణంతో అతడిని నొప్పించాడు. ఉలూకుడు కోపపడి అతడి ధనుస్సు విరుగగొట్టాడు. అపుడు యుయుత్సుడు.

**తే. మేలు విలుగొని యఱువది నాలుగమ్ము । లతనిమెయిఁ గ్రుచ్చి సాయక త్రితయ నిహతి**
**సూతు నొప్పించి మఱియు నిశాత శరచ । యమ్ము వరఁగించె నధిక రయమ్ము మెఱయ.** **142**

**ప్రతిపదార్థం:** మేలు= శ్రేష్ఠమైన; విలు= ధనుస్సును; కొని= తీసికొని; అఱువది నాలుగు= అరవైనాలుగు; అమ్ములు= బాణాలు; అతని= ఉలూకునియొక్క; మెయిన్= దేహంలో; క్రుచ్చి= నాటి; సాయక= బాణాలయొక్క; త్రితయ= మూడింటియొక్క; నిహతిన్= గట్టిదెబ్బతో; సూతున్= సారథిని; నొప్పించి= బాధించి; మఱియున్; అధికరయమ్ము= మిక్కిలివేగం; మెఱయన్= ప్రకాశింపగా; నిశాత= పదునుగల; శర= బాణాలయొక్క; చయమ్మున్= సముదాయాన్ని; పరఁగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** మంచి ధనుస్సు తీసికొన్నాడు. అరవైనాలుగు బాణాలు ఉలూకుడి శరీరంలో నాటాడు. మూడు బాణాలతో గట్టిగా కొట్టి, సారథికి బాధ కలిగించాడు. ఇంకా వాడి బాణాల సమూహాలు మిక్కిలి వేగంతో ప్రయోగించాడు.

**వ. దానం గనలి.** **143**

**ప్రతిపదార్థం:** దానన్= అందువలన; కనలి= కోపించి.

**తాత్పర్యం:** అందువలన కోపించి.

**క. బలువిడి నులూకుఁ డిరువది । శిలీముఖము లొడలఁ జొనిపి సిడము రయముమై**
**నిలఁ గూల్చిన నీ సుతుఁ డు । జ్జ్వల విశిఖములయిదు నాటె వాని యురమునన్. 144**

**ప్రతిపదార్థం:** ఉలూకుడు= శకుని కొడుకు; బలువిడిన్= ఉద్రేకంతో; ఇరువది= ఇరవై; శిలీముఖములు= బాణాలు; ఒడలన్= యుయుత్సుడి దేహంలో; చొనిపి= ప్రవేశపెట్టి; రయముమైన్= వేగంతో; సిడమున్= జెండాను; ఇలన్= భూమిపై; కూల్చినన్= పడగొట్టగా; నీ సుతుఁడు= నీ కుమారుడైన యుయుత్సుడు; వాని= ఉలూకుడియొక్క; ఉరమునన్= రొమ్ముపై; ఉజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; విశిఖములు= బాణాలు; అయిదు= ఐదు; నాటెన్= గ్రుచ్చాడు.

**తాత్పర్యం:** ఉలూకుడు ఉద్రేకంతో ఇరవై బాణాలు యుయుత్సుడి దేహానికి గ్రుచ్చి, అతడి జెండాను వేగంగా పడగొట్టాడు. యుయుత్సుడు అతడి రొమ్ముమీద మెరుస్తున్న అయిదు బాణాలు దింపాడు.

**వ. ఇట్లు నాటించిన నొచ్చి యా సౌబలనందనుండు రౌద్రంబు రూపంబు దాల్చిన రుద్రువిధంబున విజృంభించి. 145**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; నాటించినన్= గ్రుచ్చగా; ఆ సౌబల= ఆ శకునియొక్క; నందనుండు= కొడుకైన ఉలూకుడు; రౌద్రంబు= స్థిరమైన క్రోధం; రూపంబు+తాల్చిన= ఆకారం ధరించిన; రుద్రు= శివునియొక్క; విధంబునన్= పోలికతో; విజృంభించి= చెలరేగి.

**తాత్పర్యం:** ఇట్లా బాణాలు దింపేసరికి, ఉలూకుడు స్థిరమైన క్రోధం ఆకారం ధరించిన మహేశ్వరుడివలె చెలరేగాడు.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**శా. భల్లం బొక్కటఁ జంపె సూతునిఁ జతుర్బాణాహతిన్ వాజులన్**
**డొల్లం జేసె నిశాతపంచవి శిఖాటోపంబునంజించె వీ**
**రోల్లాసంబు వికాసముం బొరయ మే నుక్కేది నీ నందనుం**
**డెల్లం జూడఁగఁ బాఱి యొండొక రథం బెక్కెం గురుగ్రామణీ! 146**

**ప్రతిపదార్థం:** కురుగ్రామణీ!= కురువంశ శ్రేష్ఠుడా!, ధృతరాష్ట్ర మహారాజా!; ఉలూకుడు; భల్లంబు+ఒక్కటన్= ఒక్కబాణంతో; సూతునిన్= యుయుత్సుని సారథిని; చంపెన్= సంహరించాడు; వాజులన్= అతని తేరిగుర్రాలను; చతుర్+బాణ+ఆహతిన్= నాలుగు బాణాలయొక్క దెబ్బలతో; డొల్లన్+చేసెన్= పడిపోయేటట్లు చేశాడు; నిశాత= వాడియైన; పంచ= ఐదు; విశిఖ= బాణాలయొక్క; ఆటోపంబునన్= విజృంభణంతో; వీర+ఉల్లాసంబు= వీరులయొక్క ఉత్సాహం; వికాసమున్= వృద్ధిని; పొరయన్= పొందగా; మేను= యుయుత్సుడి శరీరాన్ని; చించెన్= చీలికలయ్యేటట్లు చేశాడు; నీ నందనుండు= నీ కొడుకైన యుయుత్సుడు; ఉక్కు+ఏది= బలం క్షీణించి; ఎల్లన్= అందరూ; చూడన్= చూడగా, చూస్తుండగా; పాఱి= పాఱిపోయి; ఒండు+ఒక= మరొక; రథంబు= తేరు; ఎక్కెన్= అధిరోహించాడు.

**తాత్పర్యం:** కురువంశశ్రేష్ఠా, ధృతరాష్ట్ర మహారాజా! ఒక బాణంతో యుయుత్సుడి సారథిని చంపాడు, నాలుగు బాణాలతో కొట్టి, అతడి రథాశ్వాలను పడగొట్టాడు. ఐదు వాడిబాణాలు ప్రయోగించి వీరుల సంతోషం పెరిగేటట్లు,

అతడి శరీరాన్ని చీల్చాడు. యుయుత్సుడి బలం క్షీణించింది. అందువలన అందరూ చూస్తుండగా పరుగుపెట్టి, మరొక తేరెక్కాడు.

**విశేషం:** పారిపోయేవాడిని పేర్కొనటానికి అనేక మార్గాలుండగా పనిగట్టుకొని నీ నందనుడనటం ధృతరాష్ట్రుడిని సంతోషపెట్టటానికి మాత్రం కాదు.

**క. గెలుపున మెయి వొదలఁగ సౌ । బలసూనుఁడు రథమువఱపి పాంచాలబలం**
**బలుగులపడఁ బలు దెఱఁగుల । యలవుల విహరించె నుద్భటాటోపమునన్. 147**

**ప్రతిపదార్థం:** సౌబల సూనుఁడు= సుబలుని కుమారుడైన శకుని కొడుకైన ఉలూకుడు; గెలుపునన్= యుయుత్సుని గెలవటంతో; మెయి= ఒళ్ళు; పొదలఁగన్= పొంగగా; రథము; పఱపి= తోలించి; పాంచాల బలంబు= పాంచాలసైన్యం; అలుగులపడన్= కలత చెందేటట్లు; పలు+తెఱఁగుల= అనేకమైన విధాల; అలవులన్= నేర్పులతో; ఉద్భట= భయంకరమైన; ఆటోపమునన్= విజృంభణంతో; విహరించెన్= విహారంచేశాడు.

**తాత్పర్యం:** యుయుత్సుడిని గెలిచేసరికి ఉలూకుడికి ఉత్సాహం వచ్చింది. దానితో అతడు రథం తిన్నగా పాంచాల సైన్యంమీదికి పోనిచ్చాడు. అది కలత చెందేటట్లు రకరకాల నేర్పులతో భయంకరంగా విజృంభించి, వీరవిహారం చేశాడు.

**సీ. శ్రుతకర్మ నకులునిసుతుని శతానీకుఁ । దాఁకి యశ్వంబుల ధరణిఁ గూల్చి**
**సూతునిఁ బరిమార్చె నాతఁడు గదవైచి । రథవాహనముల సారథిని గేత**
**నముఁ బొలియించె భూరమణ! యిమ్మెయి నీదు । తనయుండు నకులనందనుఁడు విరథు**
**లై యొండు దేరుల కరిగిరి శ్రుతసోముఁ । దలపడి కడిమి గాంధార నాథుఁ**

**తే. డతని నడరించి వివిధ సాయకము లెల్లఁ । దునిమి బాణత్రయంబునఁ దనువు నొంచి**
**తురగముల నరదమ్ముఁ గేతువుఁ దిల ప్ర । మాణ శకలంబులుగఁ జేసె మద మెలర్ప. 148**

**ప్రతిపదార్థం:** శ్రుతకర్మ= నీ కుమారుడైన శ్రుతకర్మ; నకులుని= నకులునియొక్క; సుతుని= కుమారుని; తాఁకి= ఢీకొని; అశ్వంబులన్= గుర్రాలను; ధరణిన్= భూమిపై; కూల్చి= పడగొట్టి; సూతునిన్= సారథిని; పరిమార్చెన్= సంహరించాడు; ఆతండు= శతానీకుడు; గదన్; వైచి= విసరి; రథ= రథాన్నీ; వాహనములన్= గుర్రాలనూ; సారథిని= సూతునీ; కేతనమున్= జెండానూ; పొలియించెన్= పడగొట్టాడు; భూరమణ!= భూపతీ, ధృతరాష్ట్ర మహారాజా!; ఈ+మెయిన్= ఈ విధంగా; నీదు తనయుండున్= నీ కుమారుడూ; నకులనందనుండున్= నకులుడి కుమారుడయిన శతానీకుడూ; విరథులై= రథములు పోయినవారై; ఒండు= వేరే; తేరులకు= రథాలకు; అరిగిరి= వెళ్ళారు; గాంధారనాథుఁడు= గాంధారదేశపు రాజైన శకుని; శ్రుతసోమున్= ద్రౌపదీ భీమసేనుల పుత్రుని; తలపడి= ఢీకొని; అతని= ఆ శ్రుతసోముడిని; అడరించి= బాణప్రయోగంచేసి; వివిధ= పలురీతులయిన; సాయకములు= శ్రుతసోముడు ప్రయోగించిన బాణాలు; ఎల్లన్= అన్నింటినీ; తునిమి= ముక్కలుచేసి; బాణ= బాణాలయొక్క; త్రయంబునన్= మూడింటిచేత; తనువున్= శ్రుతసోముని శరీరాన్ని; నొంచి= నొప్పించి; మదము= తన గర్వం; ఎలర్ప(న్)= విలసిల్లగా; తురగములన్= గుర్రాలనూ; అరదమ్మున్= తేరునూ; కేతువున్= జెండానూ; తిలప్రమాణ= నువ్వుగింజలంతలైన; శకలమ్ములుగన్= ముక్కలుగా; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** శ్రుతకర్మ, ద్రౌపదీ నకులుల కుమారుడైన శతానీకుడిని డీకొన్నాడు. అతడి గుర్రాలను పడగొట్టాడు. సారథిని చంపాడు. శతానీకుడు గద విసరి, శ్రుతకర్మ రథాన్ని విరుగగొట్టాడు. గుర్రాలనూ సూతుడినీ చంపాడు. జెండా పడగొట్టాడు. ధృతరాష్ట్ర మహారాజా! ఇట్లా నీ కొడుకూ, నకులుడి కొడుకూ రథాలు పోగొట్టుకొని వేరే రథాలకొరకు వెళ్ళారు. ద్రౌపదీ భీమసేనుల కుమారుడైన శ్రుతసోముడిని శకుని డీకొన్నాడు. అపుడు శ్రుతసోముడు బాగా విజృంభించి రకరకాల బాణాలు శకునిమీద ప్రయోగించాడు. శకుని వాటినన్నింటినీ ముక్కలుగా చేశాడు. ఇంకా గర్వం పెరుగుతుండగా, మూడు బాణాలు వేసి, అతడి శరీరం నొప్పించాడు. గుర్రాలనూ, రథాన్నీ, జెండానూ నువ్వుగింజలంతలుగా ముక్కలు చేశాడు.

**మ. విరథుండై పొలివోని బీరమునఁ బృథ్వీభాగసంచారియై**
**శరజాలంబుల భీమసేనసుతుఁ డాశ్చర్యంబుగా నీ మఱఁ**
**ది రథం బేడ్తెఱఁ గప్పినం దునిమె నుత్సేకోగ్రుండై యమ్మహీ**
**వరుఁ డబ్బాలుని చాపదండము భుజావష్టంభ మేపారఁగన్. 149**

**ప్రతిపదార్థం:** భీమసేన సుతుఁడు= ద్రౌపదీ భీముల కుమారుడైన శ్రుతసోముడు; ఆశ్చర్యంబుగాన్= వింతగొలిపేటట్లు; పొలి+పోని= తగ్గని; బీరమునన్= పరాక్రమంతో; పృథ్వీభాగ= భూభాగంమీద; సంచారియై= తిరుగుతున్నవాడై; శర= బాణాలయొక్క; జాలంబులన్= సమూహాలతో; నీ మఱంది= నీ బావమరిది అయిన శకునియొక్క; రథము= తేరు; ఏడ్తెరన్= సామర్థ్యంతో; కప్పినన్= మరుగుపడేటట్లు చేయగా; ఆ+మహీవరుఁడు= ఆ భూపతి అయిన శకుని; ఉత్సేక= అతిశయించిన; ఉగ్రుఁడై= కోపముకలవాడై; ఆ+బాలుని= ఆ చిన్నవానియొక్క; చాపదండము= వింటికట్టెను; భుజావష్టంభము= భుజగర్వం; ఏపారఁగన్= అతిశయించగా; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** రథంపోయినా, శ్రుతసోముడి పరాక్రమం తగ్గలేదు. అతడు నేలమీద నడుస్తూనే నీ బావమరది శకుని రథాన్ని బాణ పరంపరతో కనబడకుండా చేశాడు. అది చాలా ఆశ్చర్యం కలిగించింది. శకుని అతిశయించిన కోపంతో తన భుజబలగర్వం అధికమయ్యేటట్లు ఆ కుర్రవాడి విల్లు నరికాడు.

**చ. అతఁడు ప్రదీప్తఖడ్గము రయంబుమెయిం గొని యా నృపాలుఁ డు**
**ద్ధతిఁ బరఁగించు సాయకశతంబులు ద్రుంచుచు నుల్లసిల్ల న**
**ప్పతి పటుభల్లఖండిత కృపాణునిఁ జేసిన నీడఁబోక చే**
**తితునియ బెట్టువైచె జగతీవర! యాతని విల్లు రెండుగన్. 150**

**ప్రతిపదార్థం:** జగతీవర!= భూపతీ!; అతఁడు= శ్రుతసోముడు; ప్రదీప్త= మిక్కిలిగా మెరిసే; ఖడ్గము= కత్తి; రయంబుమెయిన్= వేగంతో; కొని= తీసికొని; ఆ నృపాలుఁడు= ఆ రాజు శకుని; ఉద్ధతిన్= గర్వంతో; పరఁగించు= ప్రయోగించే; సాయక= బాణాలయొక్క; శతంబులు= వందలు; త్రుంచుచున్= నరుకుతూ; ఉల్లసిల్లన్= విజృంభించగా; ఆ+పతి= ఆ భూపతి, ఆ రాజు శకుని; పటు= దృఢమైన; భల్ల= బాణంచేత; ఖండిత= నరకబడిన; కృపాణునిన్+చేసినన్= ఖడ్గం కలవాడినిగా చేయగా; ఈడన్+పోక= వెనుదీయక; చేతితునియ= చేతిలోని కత్తిముక్కను; ఆతని విల్లు= శకుని ధనుస్సు; రెండుగన్= రెండు ముక్కలయ్యేటట్లు; బెట్టువైచెన్= వడిగా విసిరాడు.

**తాత్పర్యం:** శ్రుతసోముడు తళతళమెరిసే కత్తి తీసికొని, శకుని వేగంతో, పొగరుతో ప్రయోగిస్తున్న వందలకొలది బాణాలను ముక్కలు చేయసాగాడు. అపుడు శకుని ఒకగట్టి బాణం వేసి, ఆ కత్తిని విరుగగొట్టాడు. అయినా, శ్రుతసోముడు వెనుదీయకుండా ఆ చేతిలో మిగిలిన కత్తిముక్కను గట్టిగా విసరి, శకుని ధనుస్సును రెండు ముక్కలు చేశాడు.

**వ. ఇట్లు కోదండంబు దుండంబులుసేసి తొలంగి యక్కుమారుండు శ్రుతకీర్తి స్యందనంబెక్కె సౌబలుండు వేఱొక్క విల్లెత్తియత్తెఱపి నురవణించి పాండవరథికులం గలంచెఁ గృపాచార్య ధృష్టద్యుమ్నులు పెనంగునెడ గౌతముండు పాంచాలవరుం బొదువునాటోపం బాలోకించి యక్కౌంతేయసైనికులు దమలోన. 151**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; ఆ+కుమారుండు= ఆ బాలుడు; కోదండంబు= విల్లు; తుండంబులు+చేసి= ముక్కలుచేసి; తొలంగి= ఆ ప్రదేశంనుంచి తప్పుకొని; శ్రుతకీర్తి= శ్రుతకీర్తియొక్క; స్యందనంబు+ఎక్కెన్= రథం అధిరోహించాడు; సౌబలుండు= సుబలుని పుత్రుడైన శకుని; వేఱు+ఒక్క= మరొక; విల్లు+ఎత్తి= ధనుస్సు తీసికొని; ఆ+తెఱపిన్= ఆ ఎడంలో; ఉరవణించి= విజృంభించి; పాండవ= పాండవ పక్షీయులైన; రథికులన్= రథంమీద ఉండి యుద్ధం చేసేవారిని; కలంచెన్= సంక్షోభపెట్టాడు; కృపాచార్య ధృష్టద్యుమ్నులు= కృపాచార్యుడూ, ధృష్టద్యుమ్నుడూ; పెనంగు= యుద్ధంచేసే; ఎడన్= చోట, సమయంలో; గౌతముండు= గౌతమసగోత్రుడయిన కృపాచార్యుడు; పాంచాలవరున్= పాంచాలదేశీయ శ్రేష్ఠుడయిన ధృష్టద్యుమ్నుని; పొదువు= ఆక్రమించే; ఆటోపంబు= ప్రయత్నాన్ని; ఆలోకించి= చూచి; ఆ+కౌంతేయ= ఆ కుంతీపుత్రులయిన పాండవుల పక్షంవారైన; సైనికులు= యుద్ధభటులు; తమలోనన్= తమలో తాము.

**తాత్పర్యం:** శ్రుతసోము డిట్లా శకుని విల్లు రెండు ముక్కలుగా చేసి, అక్కడి నుండి తప్పుకొని, శ్రుతకీర్తి రథమెక్కాడు. శకుని మరొక విల్లు తీసికొని ఆ సందులో విజృంభించి పాండవుల రథికులలో సంక్షోభం కలిగించాడు. కృపాచార్యుడూ ధృష్టద్యుమ్నుడూ యుద్ధంచేసే సమయంలో కృపాచార్యుడు ధృష్టద్యుమ్నుడిని పడగొట్టాలని గట్టిగా దాడి చేస్తున్నాడు. అది చూచి పాండవుల సైనికులు వారిలో వారు (ఇట్లా అనుకొన్నారు).

### ధృష్టద్యుమ్నుఁడు గృపాచార్యునితోఁ దలపడి యోడిపోవుట (సం. 8-18-41)

**ఉ. 'ద్రోణు పరాభవం బధికరోషము సేయఁగ నున్న యీతఁ డ**
**క్షీణ పరాక్రమంబు విలసిల్లఁగ నీ ద్రుపదాత్మజున్ గత**
**ప్రాణునిఁ జేయ కే లుడుగుఁ బైకొను నంతటఁ బోక విస్ఫుర**
**ద్బాణవిలాసముల్ నెఱపుఁ దా మనసైన్యము దల్లడిల్లఁగన్'. 152**

**ప్రతిపదార్థం:** ద్రోణు= ద్రోణునియొక్క; పరాభవంబు= అవమానం; అధికరోషము= ఎక్కువ క్రోధాన్ని; చేయఁగన్= కలిగింపగా; ఉన్న= అవకాశంకోసం ఎదురుచూస్తున్న; ఈతఁడు= ఆయన బావమరది అయిన కృపాచార్యుడు; అక్షీణ= తరగని, గొప్ప; పరాక్రమంబు= విక్రమం; విలసిల్లఁగన్= ప్రకాశింపగా; ఈ ద్రుపద+ఆత్మజున్= ఈ ద్రుపదుడి కొడుకైన ధృష్టద్యుమ్నుడిని; గత= పోయిన; ప్రాణునిన్= ప్రాణాలు కలవానిని; చేయక= చేయకుండా (చంపకుండా); ఏల+ఉడుగున్= ఎందుకు ఊరకుంటాడు?; పైకొను+అంతటన్+పోక= ఎదురుకొనేటంత మాత్రంతో వదలకుండా; తాన్= కృపాచార్యుడు; మనసైన్యము= పాండవసేన; తల్లడిల్లఁగన్= కలతపడగా; విస్ఫురత్= మెరుస్తున్న; బాణ= బాణాలయొక్క; విలాసముల్= ఆటలు; నెఱపున్= ప్రదర్శిస్తాడు.

**తాత్పర్యం:** ద్రోణుడి తల నరికి ఆయనను అవమానించిన ధృష్టద్యుమ్నుని, కృపాచార్యుడు తన గొప్ప పరాక్రమం విలసిల్లగా చంపకుండా ఊరుకుంటాడా? అతడిని ఎదుర్కోవటం మాత్రమే కాదు - మనసేన తల్లడిల్లేటట్లు అతడి విస్తృత బాణప్రయోగ విలాసాలన్నీ ప్రదర్శిస్తాడు.

**వ. అని వెండియు. 153**

**ప్రతిపదార్థం:** అని= ఇలా పలికి; వెండియు= ఇంకా.

**తాత్పర్యం:** అని మళ్ళీ.

**మ. 'వరదివ్యాస్త్రవిదుండు బాహుబల గర్వస్థేమ నిర్వాహకుం**
**డరులం జీరికిఁ జేకొనం డితఁడు క్రోధాత్తాత్ముఁడై నేఁడు ని**
**ర్భర శౌర్యంబు నుదాత్త ధైర్యము నుదగ్రస్ఫూర్తి శోభిల్ల దు**
**స్తర దర్పోద్ధతిఁ దేకయున్నె? మనలం దా నేలకుంగోలకున్. 154**

**ప్రతిపదార్థం:** వర= శ్రేష్ఠమయిన; దివ్య= స్వర్గంలో పుట్టిన; అస్త్ర= మంత్రప్రయుక్తాలయిన ఆయుధాలను; విదుండు= ఎరిగినవాడు; బాహు= చేతులయొక్క; బల= శక్తియొక్క; గర్వ= గర్వంయొక్క; స్థేమ= బలాన్ని; నిర్వాహకుండు= నెరవేర్చేవాడు అయిన; ఇతఁడు= ఈ కృపాచార్యుడు; అరులన్= శత్రువులను; చీరికిన్= లేశమునకైనా; చేకొనండు= కైకొనడు, లెక్కచేయడు; నేఁడు= ఈ దినం; క్రోధ= కోపంచేత; ఆత్త= పొందబడిన - కోపంగల - అని భావం; ఆత్ముఁడై= మనస్సు కలవాడై; నిర్భరశౌర్యంబున్= నిండు పరాక్రమమూ; ఉదాత్త ధైర్యమున్= అధికమైన ధైర్యమూ; ఉదగ్ర స్ఫూర్తి= భయంకరమైన ఆవేశమూ; శోభిల్లన్= ప్రకాశింపగా; దుస్తర= దాటరాని; దర్ప+ఉద్ధతిన్= గర్వంయొక్క విజృంభణంతో; మనలన్= మనలనందరినీ; తాన్= తాను; నేలకున్= భూమికీ; కోలకున్= ఆయుధానికీ; తేక= తీసికొనిరాకుండా; (నేలకుం గోలకున్ దెచ్చు= క్రింద మీఁదు చేయు (శ.ర.) ఉన్నె?= ఉంటాడా?

**తాత్పర్యం:** ఈ కృపాచార్యుడు గొప్ప దివ్యాస్త్రవేత్త, భుజబలగర్వం అధికంగా ఉన్నవాడు. శత్రువులను కొంచెం కూడా లెక్కపెట్టడు. ఈ వేళ మహాక్రోధంతో ఉన్నాడు. నిండు శౌర్యమూ, మహాధైర్యమూ, భీకరావేశమూ మెరుస్తుండగా మనలను తలక్రిందు చేయకుండా ఉంటాడా?

**వ. ధృష్టద్యుమ్నుండును బెండుపడియున్నవాఁ డనుచు నుండి రట్టియెడ బెట్టిదంబులగు గృపాచార్యులతూపుల యేపు రథ్యంబుల నొంచి సారథి క్రొవ్వడంచి యా ద్రుపదనందనుతనువు నెత్తుటం దోఁచి యుల్లంబు గలంచె నప్పుడాతని సూతుం డతనితో నిట్లనియె. 155**

**ప్రతిపదార్థం:** ధృష్టద్యుమ్నుండును= ద్రౌపది అన్నగారు కూడా; బెండుపడి= నీరసించి; ఉన్నవాఁడు= ఉన్నాడు; అనుచున్= అంటూ; ఉండిరి= ఉన్నారు; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో; బెట్టిదంబులు+అగు= కఠినములైన; కృపాచార్యుల= కృపాచార్యునియొక్క; తూపుల= బాణాలయొక్క; ఏపు= ఆధిక్యం; రథ్యంబులన్= (ధృష్టద్యుమ్నుని) గుర్రాలను; నొంచి= నొప్పించి; సారథి= సూతునియొక్క; క్రొవ్వు= మదం; అడంచి= పోగొట్టి; ఆ= గురుద్రోహి అయిన; ద్రుపదనందను= ద్రుపదుని కుమారుడయిన ధృష్టద్యుమ్నునియొక్క; తనువు= శరీరాన్ని; నెత్తుటన్= రక్తంలో; తోఁచి= తడిపి; ఉల్లంబు= మనస్సును; కలంచెన్= కలతపెట్టింది; అప్పుడు= ఆ సమయంలో; ఆతని సూతుండు= ధృష్టద్యుమ్నుని సారథి; అతనితోన్= ధృష్టద్యుమ్నునితో; ఇట్లు+అనియెన్= ఇలా అన్నాడు:

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు కూడా నీరసించి ఉన్నాడు' అని అనుకొంటున్నారు. అటువంటి సమయంలో కృపాచార్యుడు కఠినబాణాలు చాలా ప్రయోగించాడు. కృపాచార్యుని బాణాల తీవ్రత ధృష్టద్యుమ్నుడి రథాశ్వాలను బాధించింది. సారథి మదాన్ని అణగించింది. ఆ ద్రుపదనందనుని శరీరాన్ని నెత్తుటిలో ముంచింది. అతని మనస్సును కలత పెట్టింది. అప్పుడాతని సారథి ధృష్టద్యుమ్నుడితో ఇట్లా అన్నాడు:

**చ. 'వినుము కుమార! విప్రుభుజవీర్య మవార్యతఁ దేజరిల్లెడుం**
**జనవు భవత్సమగ్రశరజాలము లీతని మీఁద దైవ సం**
**జనితము సువ్వె! యియ్యెడరు సంగరమిట్టిది తొల్లియెందు నా**
**కనినది లేదు తేరు దొలఁగం గొనిపోవుట కార్య మిత్తఱిన్. 156**

**ప్రతిపదార్థం:** కుమార!= చిన్నవాడా!; వినుము; విప్రు= బ్రాహ్మణుడైన కృపాచార్యుని; భుజవీర్యము= భుజముల బలము; అవార్యతన్= నివారించకపోవటంచేత; తేజరిల్లెడున్= ప్రకాశిస్తున్నది; భవత్= నీయొక్క; సమగ్ర= సంపూర్ణములైన; శర= బాణాలయొక్క; జాలములు= గుంపులు; ఈతని మీఁదన్= ఈ కృపాచార్యుడిపైకి; చనవు= వెళ్ళటంలేదు; ఈ+ఎడరు= ఈ ఆపద; దైవసంజనితము+చువ్వె!= దైవంవలన కలిగినది సుమా!; సంగరము= యుద్ధము; ఇట్టిది= ఇటువంటిది; తొల్లి= ఇదివరకు; ఎందున్= ఎక్కడా; నా కనినది= నేను చూచినది; లేదు; ఈ+తఱిన్= ఈ సమయంలో; తేరు= రథం; తొలఁగన్+కొనిపోవుట= తీసికొనిపోవటం; కార్యం= చేయదగినది.

**తాత్పర్యం:** 'నాయనా! వినుము. ఈ బ్రాహ్మణుడి భుజబలం ఆపరానిదిగా ప్రకాశిస్తున్నది. నీ బాణా లీతడిపైకి వెళ్ళటం లేదు. ఈ ఆపద దైవం చేసినది సుమా! ఇటువంటి యుద్ధం నేనిదివరకెన్నడూ చూడలేదు. ఈ సమయంలో మనరథాన్ని దూరంగా తీసికొనిపోవటం కర్తవ్యం.

**వ. నీ యట్టి వాని విక్రమంబునుం దిట్టిన యట్లు సమయుటంజేసి యిమ్మహాత్ముం డవధ్యుండని నిశ్చయించితి నా మాటకియ్యకొను' మనవుడు నా పృషత పౌత్రుం డిది యట్టిద యని నిశ్చయించి పలికి మఱియు హీనస్వరంబున నిట్లనియె. 157**

**ప్రతిపదార్థం:** నీ+అట్టివాని= నీవంటివానియొక్క; విక్రమంబునున్= పరాక్రమం కూడా; తిట్టినయట్లు= శపించినవిధంగా; సమయుటన్+చేసి= నశించినందువల్ల; ఈ+మహాత్ముండు= ఈ ఘనత వహించినవాడు; అవధ్యుండని= వధింపబడేవాడు కాడని; నిశ్చయించితిన్= నిర్ణయించాను; నా మాటకున్= నా పలుకునకు; ఇయ్యకొనుము= అంగీకరింపుము; అనవుడున్= అని పలుకగా; ఆ పృషత= ఆ పృషతునియొక్క; పౌత్రుండు= కొడుకుయొక్క కొడుకు - ధృష్టద్యుమ్నుడు; ఇది= ఈ కార్యం; అట్టిది+అ= అటువంటిదే; అని; నిశ్చయించి= నిర్ణయించి; పలికి= చెప్పి; మఱియున్= ఇంకా; హీనస్వరంబునన్= స్వల్పమయిన కంఠధ్వనితో; ఇట్లు+అనియెన్= ఈ రీతిగా పలికాడు.

**తాత్పర్యం:** నీ వంటి వీరుడి పరాక్రమం కూడా శాపంవలన అన్నట్లుగా నశించిపోయింది. అందువలన ఈ ఘనత వహించిన కృపాచార్యుడు వధించబడడని నిశ్చయించాను. కనుక నా మాటకు ఒప్పుకొమ్ము' అని అన్నాడు. అపుడు ధృష్టద్యుమ్నుడు 'ఈ పని ఇటువంటిదే' అని నిర్ణయించి పలికాడు. మళ్ళీ తగ్గిపోయిన కంఠధ్వనితో ఇట్లా అన్నాడు:

**చ. 'చరణములుం గరంబులును సంచల భావము నొందఁ జొచ్చె మేన్**
**విరవరఁ బోవుచున్నయది విహ్వలమయ్యె మనంబు నీతలం**
**పరయఁగ మేలు మారుతసురాధిపసూనులలోన నల్ల నొ**
**క్కరుదెసకై రథంబు దొలఁగం గొని పొ మ్మడిబీర మేటికిన్.' 158**

**ప్రతిపదార్థం:** చరణములున్+కరంబులును= కాళ్ళూ, చేతులూ; సంచలభావమున్= వణకుటను; ఒందన్+చొచ్చెన్= పొందటానికి మొదలుపెట్టాయి; మేన్= శరీరం; విరవిరన్+పోవుచున్+ఉన్న+అది= విహ్వలత్వాన్ని (పట్టు ఊడిన స్థితిని) పొందుతూ; ఉన్నది; మనంబున్= మనస్సుకూడా; విహ్వలము+అయ్యెన్= సడలినది ఐనది; అరయఁగన్= ఆలోచింపగా; నీ తలంపు= నీ ఆలోచన; మేలు= శ్రేష్ఠమైనది; మారుత= వాయువుయొక్క; సురాధిప= దేవేంద్రునియొక్క; సూనులలోనన్= కుమారులలో; అల్లన్= మెల్లగా; ఒక్కరు= ఒకడియొక్క; దెసకున్+ఐ= దిక్కునకై; రథంబు+తేరు; తొలఁగన్= తప్పించి; కొనిపొమ్ము= తీసుకొనిపొమ్ము; అడిబీరము= వ్యర్థమైన పరాక్రమం; ఏటికిన్= ఎందుకు?

**తాత్పర్యం:** కాళ్ళూ చేతులూ అల్లాడిపోతున్నాయి. ఒళ్ళు పట్టు సడలిపోతున్నది, (లేదా తడి ఆరిపోతున్నది) మనస్సూ పట్టూడిపోతున్నది. ఆలోచించి చూస్తే, నీ ఆలోచన శ్రేష్ఠంగా ఉన్నది. కనుక రథాన్ని తప్పించి వాయుపుత్రుడు భీముడి వద్దకుగాని, ఇంద్రపుత్రుడు అర్జునుడి వద్దకుగాని తీసికొనిపొమ్ము. వ్యర్థమైపోయిన పరాక్రమం ఎందుకు?'

**చ. అనవుడు సూతుఁ డెంతయు రయంబునఁదేరు వృకోదరాంతికం**
**బున కెగవంగ శంఖరవమున్ గుణనిస్వనమున్ నిగిడ్చి యే**
**పునఁ గృపుఁ డుజ్జ్వలప్రదరపుంజములం బరఁగంగఁ జేయుచున్**
**వెనుకొనిపొల్చి నిల్చె గిరి వెన్కొని నిల్చిన వజ్రికైవడిన్. 159**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పలుకగా; సూతుండు= సారథి; ఎంతయున్= మిక్కిలిగా; రయంబునన్= వేగముతో; తేరు= రథం; వృకోదర= భీమునియొక్క; అంతికంబునకున్= సమీపానికి; ఎగవంగన్= త్రోలగా; కృపుఁడు; శంఖరవమున్= శంఖంయొక్క; ధ్వనీ; గుణనిస్వనమున్= వింటి అల్లెత్రాటి చప్పుడూ; నిగిడ్చి= పొడిగించి, వ్యాపింపజేసి; ఏపునన్= ఉత్సాహంతో; ఉజ్జ్వల= మిక్కిలి ప్రకాశించే; ప్రదర పుంజములన్= బాణసముదాయాలను; పరఁగింపన్= వ్యాపింప; చేయుచున్= కావిస్తూ; వెనుకొని= ధృష్టద్యుమ్నుడిని వెంబడించినవాడై; గిరిన్= పర్వతాన్ని; వెన్కొని= వెంబడించి; నిల్చిన= ఉన్న; వజ్రికైవడిన్= వజ్రాయుధం కలవాడైన ఇంద్రునివలె; పొల్చి= ఒప్పి; నిల్చెన్= ఆగెను.

**తాత్పర్యం:** అని ధృష్టద్యుమ్నుడు పలికేసరికి, అతడి సారథి మహావేగంగా రథం భీమసేనుడివద్దకు తోలుకొనిపోయాడు. కృపాచార్యుడు ఉత్సాహంతో శంఖం ఒత్తి, ధనుష్టంకారం చేస్తూ, బాగా మెరిసే బాణాల గుంపులు ప్రయోగిస్తూ, తరిమి ఆగాడు. అది పర్వతాన్ని తరిమి వజ్రాయుధధారి ఇంద్రుడు ఆగినట్లున్నది.

**విశేషం:** 'పర్వతాన్ని వెంబడించి, 'తరిమి ఆగినట్టి' - వజ్రితో కృపాచార్యుణ్ణి పోల్చటం జరిగింది. వజ్రి దెబ్బ తప్పించుకొన్న పర్వతం ఒక్కటే - మైనాకుడు. అందువల్ల ధృష్టద్యుమ్నుణ్ణి ఇక్కడ మైనాకుడితో పోల్చి స్పష్టంగా చెప్పకున్నా ఆ పోలిక ధ్వనిస్తున్నది.

**తే. కడఁగి కృతవర్మతోడ శిఖండి పెనఁగు । చుండి శరపంచకంబున నురము నొంప**
**నతని నయ్యాదవోత్తముఁ డలఘు షష్టి । విశిఖవిద్ధునిఁ జేసి విల్ విఱుగ నేసె. 160**

**ప్రతిపదార్థం:** శిఖండి; కడఁగి= పూనుకొని; కృతవర్మతోడన్= కృతవర్మతో; పెనఁగుచున్+ఉండి= యుద్ధంచేస్తూ ఉండి; శరపంచకంబునన్= ఐదు బాణాలతో; ఉరమున్= వక్షఃస్థలాన్ని; నొంపన్= నొప్పించగా; ఆ= ప్రసిద్ధుడయిన; యాదవ+ఉత్తముఁడు= యాదవులలో మేటి అయిన కృతవర్మ; అలఘు= గొప్పవైన; షష్టి= అరవై; విశిఖ= బాణాలచేత; విద్ధునిన్= కొట్టబడినవాడినిగా; చేసి; విల్= ధనుస్సు; విఱుగన్= విరిగిపోయేటట్లుగా; ఏసెన్= బాణం ప్రయోగించాడు.

**తాత్పర్యం:** శిఖండి ఎదిరించి కృతవర్మతో యుద్ధంచేస్తూ, ఐదు బాణాలు ప్రయోగించి అతడి వక్షఃస్థలాన్ని నొప్పించగా, కృతవర్మ శిఖండిని అరవై బాణాలతో కొట్టి, అతడి వింటిని విరుగగొట్టాడు.

**క. ఒండు శరాసన మెత్తి శి । ఖండి గురియు నవతి సాయకమ్ములు పెలుచన్**
**ఖండించె నతఁడు తత్కో । దండం బాద్రుపదనృపతితనయుఁడు నఱకెన్. 161**

**ప్రతిపదార్థం:** ఒండు= మరొక; శరాసనము= ధనుస్సు; ఎత్తి= తీసికొని; శిఖండి; కురియు= వానకురిసినట్లు ప్రయోగించే; నవతి= తొంభై; సాయకమ్ములు= బాణాలు; అతఁడు= కృతవర్మ; పెలుచన్= ఆగ్రహంతో; ఖండించెన్= నరికాడు; ఆ ద్రుపద తనయుడు శిఖండి; తద్= ఆ కృతవర్మయొక్క; కోదండంబు= వింటిని; నఱకెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** శిఖండి మరొక ధనుస్సు తీసికొన్నాడు. వాన కురిసినట్లు తొంభై బాణాలు ప్రయోగించాడు. వాటిని కృతవర్మ ఆగ్రహంతో నరికాడు. శిఖండి అతడి ధనుస్సును ఖండించాడు.

**క. 'ధనువు దునిమి కొమ్ములు ముఱి । సిన వృషభము చందమగుడు శీఘ్రుస్ఫురణం**
**దనువున శితశరములు వడిఁ । జొనిపి యతం డతని గళితశోణితుఁ జేసెన్. 162**

**ప్రతిపదార్థం:** అతఁడు= శిఖండి; ధనువు= వింటిని; తునిమి= నరికి (కృతవర్మ); కొమ్ములు; ముఱిసిన= విరిగిన; వృషభము చందము= ఎద్దులా; అగుడున్= కాగా; శీఘ్రుస్ఫురణన్= వేగం తోచగా; శితశరములు= వాడిబాణాలు; తనువునన్= శరీరంలో; వడిన్= బలంతో; చొనిపి= దూర్చి; అతనిన్= కృతవర్మను; గళిత= స్రవించిన; శోణితున్= రక్తం కలవాడినిగా; చేసెన్= కావించాడు.

**తాత్పర్యం:** అట్లా శిఖండి కృతవర్మయొక్క విల్లు విరుగగొట్టినందువలన అతడు కొమ్ములు విరిగిన ఎద్దువలె అయిపోయేసరికి, శిఖండి వేగం స్ఫురించే వాడియైన బాణాలు అతడి శరీరంలో గ్రుచ్చి, నెత్తురు స్రవించేటట్లు చేశాడు.

**చ. అలుక మనంబునం గదిరి యాదవసత్తముఁ డొండువింట దో**
**ర్బల మెసఁగంగ డెబ్బది శరంబుల నాతని మేన రక్త ధా**
**రలు దొరఁగించి పెక్కు ప్రదరంబులు పైపయి నేయుచుండ న**
**గ్గలికఁ బెనంగె వెండియు శిఖండి విచిత్రరథప్రచారుఁడై. 163**

**ప్రతిపదార్థం:** యాదవసత్తముఁడు= యాదవులలో శ్రేష్ఠుడైన కృతవర్మ; అలుక= కోపం; మనంబునన్= మనస్సులో; కదిరి= హెచ్చి; ఒండు వింటన్= మరొక ధనుస్సుతో; దోస్+బలము= బాహువులశక్తి; ఎసఁగంగన్= ఒప్పగా; డెబ్బది శరంబులన్= డెబ్బై బాణాలతో; ఆతని మేనన్= శిఖండి దేహంమీద; రక్తధారలు= నెత్తుటి ధారలు; తొరఁగించి= ప్రవహింపజేసి; పెక్కు= చాలా; ప్రదరంబులు= బాణాలను; పై+పయిన్= ఒక దానిపై ఒకటి; ఏయుచున్+ఉండన్= ప్రయోగిస్తూ+ఉండగా; శిఖండి; వెండియున్= ఇంకా; విచిత్ర= వింత అయిన; రథ= రథంయొక్క; ప్రచారుఁడు+ఐ= గమనములు కలవాడై; అగ్గలికన్= అతిశయంతో; పెనంగెన్= యుద్ధంచేశాడు.

**తాత్పర్యం:** కృతవర్మ మనస్సులో కోపం పెరిగింది. మరొక వింటితో భుజబలం ఒప్పగా డెబ్బై బాణాలు ప్రయోగించి, శిఖండి శరీరంమీద రక్తం ప్రవహింపజేశాడు. అనేక బాణాలు ఒకదానిమీద ఒకటి ప్రయోగిస్తుండగా, శిఖండి తన రథాన్ని విచిత్ర గమనాలతో త్రిప్పుతూ, ఇంకా ఎక్కువగా యుద్ధంచేశాడు.

**వ. ఆ ద్రుపదనందనుండు జత్రుదేశంబున నంబకత్రయంబు నాటించిన. 164**

**ప్రతిపదార్థం:** ఆ ద్రుపదనందనుండు= ఆ ద్రుపదుని కొడుకు; జత్రుదేశంబునన్= కృతవర్మయొక్క భుజశిరస్సునూ రొమ్ము ఎముకను కలిపే ప్రదేశంలో; అంబకత్రయంబు= మూడు బాణాలు; నాటించినన్= గ్రుచ్చగా.

**తాత్పర్యం:** ఆ శిఖండి కృతవర్మయొక్క భుజ శిరస్సూ రొమ్ము ఎముకా కలిసేచోట మూడు బాణాలు గ్రుచ్చుకొనేటట్లు కొట్టేసరికి.

**శా. క్రూరోల్లాసము పల్లవింపఁ గృతవర్ముం డుగ్రదీప్తి స్ఫుర**
**న్నారాచంబులు పెక్కు లొక్క మొగి మేనంగ్రువ్వ మూర్ఛిల్లె న**
**వ్వీరాగ్రేసరుఁ డప్డు సారథి భయావిర్భావదీనాత్ముఁడై**
**తే రచ్చోటు దొలంగఁ దోలుటయు భీతింబాఱెఁ దత్సేనయున్. 165**

**ప్రతిపదార్థం:** కృతవర్ముండు; క్రూర= క్రూరమైన, కనికరంలేని; ఉల్లాసము= సంతోషం; పల్లవింపన్= చిగురించగా; ఉగ్రదీప్తి= అధికమైన కాంతితో; స్ఫురత్= ప్రకాశిస్తున్న; నారాచంబులు= ఇనుప బాణాలు; పెక్కులు= చాలా; ఒక్కమొగిన్= ఒక్కసారి; మేనన్= శరీరంలో; క్రువ్వన్= గ్రుచ్చగా; ఆ+వీర+అగ్రేసరుఁడు= ఆ వీరులలో శ్రేష్ఠుడైన శిఖండి; మూర్ఛిల్లెను= మూర్ఛనందినాడు; అప్డు= ఆ సమయంలో; సారథి= శిఖండి సూతుడు; భయ= జడుపుయొక్క; ఆవిర్భావ= కలగటంచేత; దీన+ఆత్ముఁడు+ఐ= దుఃఖితమగు మనస్సు కలవాడై; తేరు= రథం; ఆ+చోటు= ఆ ప్రదేశంనుంచి; తొలంగన్= దూరంగా; తప్పించుకొనటానికి; తోలుటయున్= నడిపించుకొని పోగా; తద్= ఆ శిఖండియొక్క; సేనయున్= సైన్యంకూడా; భీతిన్= భయంతో; పాఱెన్= పారిపోయింది.

**తాత్పర్యం:** కృతవర్మ కనికరం లేని సంతోషం పెరుగుతుండగా, అధికమైన కాంతితో మెరసే చాలా ఇనుపబాణాలు ఒక్కసారిగా శరీరంలో నాటుకొనేటట్లు కొట్టేసరికి, అంతటి మహావీరుడైన శిఖండి కూడా మూర్ఛలో మునిగిపోయాడు. వెంటనే అతడి రథసారథి భయపడి, మనసులో దుఃఖపడుతూ రథాన్ని అక్కడి నుంచి తప్పించి, తోలుకొనిపోయాడు. అందువలన శిఖండి సేనకూడా భయపడి పారిపోయింది.

**వ. వివ్వచ్చు విక్రమవిహారంబున కోర్చి శిబిత్రిగర్తసాల్వసంశప్తకసైన్య నారాయణ గోపాలోపేతుండై సత్యసేన చంద్రదేవ మిత్త్రదేవ మిత్త్రవర్మ సౌశ్రుతి సువర్మ సుశర్మాదు లగు సోదరసుతులు బాసటగాఁ ద్రిగర్తపతి పెనంగు నప్పుడు. 166**

**ప్రతిపదార్థం:** త్రిగర్తపతి= త్రిగర్తదేశపురాజు; వివ్వచ్చు= బీభత్సుని, అర్జునునియొక్క; విక్రమ= పరాక్రమంతోచేసే; విహారంబునకున్= (వీర) విహారానికి; ఓర్చి= సహించి; శిబి త్రిగర్త సాల్వ సంశప్తక= శిబి, త్రిగర్తం, సాల్వం అనే దేశాలకు చెందిన; సంశప్తక= అర్జునుని చంపుతామని ప్రతిజ్ఞచేసినది అయిన; సైన్య= సేనలతోను; నారాయణ= నారాయణులనే పేరుకల; గోపాల+ఉప+ఇతుండు+ఐ= గోపాలురతోనూ కూడినవాడై, సత్యసేన చంద్రదేవ మిత్త్రదేవ మిత్త్రవర్మ సౌశ్రుతి సువర్మ సుశర్మాదులగు= సత్యసేనుడు; చంద్రదేవుడు, మిత్త్రదేవుడు, మిత్త్రవర్ముడు, సౌశ్రుతి, సువర్మ, సుశర్మ; ఆదులు+అగు= మొదలగువారైన; సోదర సుతులు= (తన) అన్నదమ్ములూ, కుమారులు; బాసట+కాన్= సహాయంగా; పెనంగు+అప్పుడు= యుద్ధంచేసే సమయంలో.

**తాత్పర్యం:** అర్జునుడు పరాక్రమంతో చేసే వీరవిహారాన్ని ఓర్చుకొని త్రిగర్తరాజు యుద్ధంచేస్తున్నాడు. అతడికి సహాయంగా శిబిత్రిగర్తసాల్వదేశ సేనలున్నాయి. అర్జునుడిని చంపుతామని ప్రతిజ్ఞ చేసిన సంశప్తకసేన ఉన్నది. నారాయణులనే గోపాలురసైన్యం ఉన్నది. సత్యసేనుడు, చంద్రదేవుడు, మిత్త్రదేవుడు, మిత్త్రవర్మ, సౌశ్రుతి, సువర్మ, సుశర్మ మొదలయిన అతడి సోదరులూ కుమారులూ ఉన్నారు. ఆ సమయంలో.

**సీ. సత్యసేనుఁడు మూఁడు సాయకంబుల, మిత్త్ర । దేవుండు షష్టి సందీప్త మార్గ**
**ణంబులఁ గ్రూరబాణంబులు మూఁటను, । జంద్రదేవుఁడు శరసప్తకమున,**
**మిత్త్రవర్ముఁడు గంకపత్త్రత్రిసప్తతి, । సౌశ్రుతి యేడు నిశాతవిశిఖ**
**ములను, శత్రుంజయుఁ డలఘు వింశతి కాండ । ములను, సుశర్ముఁ డుజ్జ్వల నవాస్త్ర**

**తే. ములను గప్పి రప్పార్థు నాబలియుఁ డంబు । దముల ధారలు వొదువ నుదాత్తరేఖ**
**గరము పొలుపారు మేదినీధరము భంగిఁ । దలఁపఁ బట్టగుధీరతఁ బొలిచె నధిప! 167**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా! సత్యసేనుఁడు; మూఁడు= మూడైన; సాయకంబులన్= బాణాలతోనూ; మిత్త్రదేవుండు; షష్టి= అరవై; సందీప్త= మిక్కిలిగ వెలిగే; మార్గణంబులన్= బాణాలతోనూ; క్రూరబాణంబులు= కఠినములైన అమ్ములు; మూఁటను= మూడింటితోనూ; చంద్రదేవుఁడు; శరసప్తకమునన్= బాణాలయొక్క ఏడింటితోనూ, ఏడు బాణాలతోనూ; మిత్త్రవర్ముఁడు; కంకపత్త్రత్రిసప్తతిన్= రాపులుగు రెక్కలు కట్టిన డెబ్బైమూడు బాణాలతోనూ; సౌశ్రుతి; ఏడు; నిశాత విశిఖములను= వాడి అయిన శరములతోనూ; శత్రుంజయుఁడు; అలఘు= పెద్దవయిన; వింశతి= ఇరవై; కాండములను= బాణాలతోనూ; సుశర్ముఁడు; ఉజ్జ్వల= మిక్కిలి ప్రకాశిస్తున్న; నవ+అస్త్రములను= తొమ్మిది బాణాలతోనూ; ఆ+పార్థున్= ఆ పృథా (కుంతి) కుమారుడైన అర్జునుడిని; కప్పిరి= మరుగు చేశారు; ఆ బలియుఁడు= ఆ బలశాలి అయిన అర్జునుడు; అంబుదముల= మేఘాలయొక్క; ధారలు+పొదువన్= ధార క్రమ్మగా; ఉదాత్త= ఉన్నతమైన; రేఖ= తీరు; కరము= మిక్కిలి; పొలుపు+ఆరు= అందగించే; మేదినీధరము భంగిన్= కొండలా; తలఁపన్= భావించటానికి; పట్టు+అగు= స్థానమైన; ధీరతన్= ధైర్యంతో; పొలిచెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! సత్యసేనుడు మూడూ, మిత్రదేవుడు అరవైమూడూ, చంద్రదేవుడు ఏడూ, మిత్రవర్మ డెబ్బైమూడూ, సౌశ్రుతి ఏడూ, శత్రుంజయుడు ఇరవై, సుశర్మ తొమ్మిది బాణాలతో అర్జునుని కప్పివేశారు.

అయినా అర్జునుడు మేఘాలు వానధారలు కురిపిస్తుంటే మహోదాత్త రమణీయంగా కొండ ఎట్లా ఉంటుందో అట్లా ధైర్యంతో నిలిచాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు సుస్థిరుండై మిత్త్రదేవు నంగంబునఁ గంకపత్త్రశతంబును, సత్యసేను తనువున మార్గణత్రయంబును, సుశర్మమిత్త్రవర్మల శరీరంబుల శిలీముఖాష్టకనవకంబులను బఱపి, శత్రుంజయు శిలాశితశరంబులం బడవైచి, సౌశ్రుతిం బంచవింశతి కాండంబుల గీటడంగించియుఁ జంద్రదేవుని నెనిమిది యమ్ములం దునిమి యుల్లసిల్లిన. 168**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; సుస్థిరుండు+ఐ= మిక్కిలి నిలుకడ కలవాడు అయి; మిత్త్రదేవు= మిత్రదేవుడియొక్క; అంగంబునన్= శరీరంపై; కంకపత్ర= రాపులుగు రెక్కలు గల బాణాలయొక్క; శతంబును= వంద; సత్యసేను= సత్యసేనునియొక్క; తనువునన్= దేహంలో; మార్గణ= బాణాలయొక్క; త్రయంబును= మూడు; సుశర్మ మిత్త్రవర్మల= సుశర్మయొక్క, మిత్త్రవర్మయొక్క; శరీరంబులన్= దేహాలలో వరుసగా; శిలీముఖ= బాణాలయొక్క; అష్టక= ఎనిమిదినీ; నవకంబులను= తొమ్మిదినీ; పఱపి= ప్రయోగించి; శత్రుంజయు= శత్రుంజయుడు అనేవాడిని; శిలాశిత= రాతిమీద నూరి పదునుపెట్టిన; శరంబులన్= బాణాలతో; పడవైచి= పడగొట్టి; సౌశ్రుతిన్; పంచవింశతి= ఇరవై అయిదు; కాండంబులన్= బాణాలతో; గీటు+ అడంగించియున్= సంహరించీ; చంద్రదేవునిన్; ఎనిమిది; అమ్ములన్= బాణాలతో; తునిమి= నరికి; ఉల్లసిల్లినన్= ప్రకాశించగా.

**తాత్పర్యం:** ఇట్లా స్థిరంగా నిలబడి, మిత్త్రదేవుడి దేహంలో రాపులుగు రెక్కలు కట్టిన బాణాలు వంద దించాడు. సత్యసేనుడి శరీరంలో మూడు బాణాలు గ్రుచ్చాడు. సుశర్మమేనిలో ఎనిమిది బాణాలు నాటాడు. మిత్త్రవర్మ ఒడలిలో తొమ్మిది బాణాలు దిగగొట్టాడు. రాతిపై నూరిన బాణాలతో శత్రుంజయుడిని సంహరించాడు. సౌశ్రుతిని ఇరవై ఐదు బాణాలతో చంపాడు. చంద్రదేవుడిని ఎనిమిది బాణాలతో ఖండించాడు. ఇట్లా అర్జునుడు ప్రకాశిస్తుండగా.

**చ. కనకపుఁగామతోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మ నా**
**భుని భుజశాఖ యుచ్చిచన భూరిబలుం డగు సత్యసేనుఁ డు**
**క్కున నిగిడింపఁ జేతి మునికోలయుఁ బగ్గములున్ మహీతలం**
**బున నొగలందునుం బడిన భూవర! పార్థుఁడు గ్రోధదీప్తుఁడై! 169**

**ప్రతిపదార్థం:** భూవర!= భూపతీ!; భూరి= అధికమైన; బలుండగు= శక్తి కలవాడైన; సత్యసేనుఁడు; కనకపున్= బంగారంతో చేసిన; కామ= దండంకల; తోమరమున్= ఈటెను; గర్వము= మదం; ఎలర్పఁగన్= ఒప్పగా; ఎత్తి= పైకెత్తి; పద్మనాభుని= శ్రీకృష్ణునియొక్క; భుజశాఖ= కొమ్మవంటి భుజాన్ని; ఉచ్చి= చీల్చి; చనన్= పోయేలా; నిగిడింపన్= ప్రయోగించగా; చేతి= శ్రీకృష్ణునియొక్క చేతిలో ఉన్న; మునికోలయున్= (గుఱ్ఱాలను త్రోలే) ములుకోల; పగ్గములున్= గుఱ్రాల పగ్గాలు, క్రమంగా; మహీతలంబునన్= భూప్రదేశంమీద; నొగలందునున్= రథం తొట్టెలోనూ; పడినన్= పడిపోగా; పార్థుఁడు= అర్జునుడు; క్రోధదీప్తుఁడు+ఐ= కోపంతో మండినవాడై.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! మహాబలశాలి సత్యసేనుడు బంగారపు దండం కల ఈటెను గర్వంతో విసిరాడు. అది శ్రీకృష్ణుడి కొమ్మవంటి భుజాన్ని చీల్చుకొంటూ పోయింది. అందువలన ఆయన చేతిలోని ములుకోల నేలమీద పడిపోయింది. పగ్గాలు తేరితొట్టెలో పడిపోయాయి. అట్లా కొట్టినందుకు అర్జునుడు కోపంతో మండిపడి,

క. హరి దెసఁ గన్గొని యాతని । యరదముఁ గదియంగ నడపు మరద మనుడుఁ జె
చ్చెర నొండొక మునికోలం । గరముద్ధతి నడపె ఘోటకంబుల నతఁడున్. 170

**ప్రతిపదార్థం:** హరిదెసన్= కృష్ణునివైపు; కన్గొని= చూచి; ఆతని= ఆ సత్యసేనుడియొక్క; అరదమున్= రథాన్ని; కదియంగన్= సమీపించేటట్లు; అరదమున్= రథాన్ని; నడపుము= నడిపింపుము; అనవుడున్= అని పలుకగా; అతఁడున్= శ్రీకృష్ణుడు; చెర+ చెరన్= త్వరత్వరగా; ఒండు+ఒక= మరియొక; మునికోలన్= ములుకోలతో; కరము= మిక్కిలి; ఉద్ధతిన్= వడితో; ఘోటకంబులన్= గుఱ్ఱాలను; నడపెన్= తోలాడు.

**తాత్పర్యం:** (అర్జునుడు) కృష్ణుడివైపు చూచి, 'మన రథం సత్యసేనుడి రథానికి దగ్గరగా నడిపించు' అన్నాడు. కృష్ణుడు త్వరత్వరగా మరొక ములుకోల తీసికొని, దానితో గుఱ్ఱాలను మిక్కిలి వడిగా నడిపించాడు.

క. తే రతని యరదమునకుం । జేరువ యగుటయును గ్రీడి శితబహుభల్ల
స్ఫారగతుల గాత్ర శిరో । దారణ మొనరించి యొప్పె దరహాసముతోన్. 171

**ప్రతిపదార్థం:** తేరు= రథం; అతని= సత్యసేనుడి; అరదమునకున్= రథానికి; చేరువ= దగ్గర; అగుటయును= కాగా, ఐన తరువాత; క్రీడి= అర్జునుడు; శిత= పదునైన; బహు= అనేకమైన; భల్ల= బాణాలయొక్క; స్ఫార= విస్తార; గతులన్= గమనాలతో; గాత్ర= శరీరంయొక్క; శిరః= శిరస్సుయొక్క; దారణము= బ్రద్దలుచేయటం; ఒనరించి= కావించి; దరహాసముతోన్= చిరునవ్వుతో; ఒప్పెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** వారి రథం సత్యసేనుడి రథాన్ని సమీపించింది. అపుడు అర్జునుడు చాలా వాడి అయిన బాణాలు విస్తారంగా ప్రయోగించి అతడి ఒళ్ళూ తలా నరకి, చిరునవ్వు నవ్వాడు.

వ. ఇట్లు సత్యసేనుని చిత్రవధంబు చేసి. 172

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సత్యసేనుని= సత్యసేనుడు అనే వాని యొక్క; చిత్రవధంబు= చిత్రవధ; చేసి= కావించి,

**తాత్పర్యం:** ఇట్లా సత్యసేనుడిని చిత్రవధ చేసి.

చ. ఘనతర వత్సదంతశరఘాతమునం బడవైచి మిత్త్రవ
ర్మని రథసూతు నట్టిదొక క్రూరపుఁ దూపున నుర్విఁగూల్చె నా
తని సముదీర్ణమై పెలుచఁ దాఁకి త్రిగర్తబలంబు సుట్టు ము
ట్టిన వివిధోగ్రసాయకపటిష్ఠత నొప్పి కలంచె నేపునన్. 173

**ప్రతిపదార్థం:** ఘనతర= మిక్కిలి పెద్దదైన; వత్సదంత= వత్సదంతం అనే లేగపంటివంటి మొనగల; శర= బాణంయొక్క; ఘాతమునన్= దెబ్బచేత; మిత్త్రవర్మనిన్= మిత్రవర్మను; పడన్వైచి= పడగొట్టి; రథసూతున్= అతని రథసారథిని; అట్టిది= అటువంటిదే ఐన, వత్సదంతం అనే; ఒక= ఒక్క; క్రూరపున్= భయంకరమైన; తూపునన్= బాణంతో; ఉర్విన్= నేలపై; కూల్చెన్= పడగొట్టాడు, సంహరించాడు; త్రిగర్త బలంబు= త్రిగర్త సైన్యం; ఆతనిన్= అర్జునుని; సమ్+ఉదీర్ణము+ఐ= బాగుగా గర్వించినదై; పెలుచన్= పట్టుదలతో; తాఁకి= ఎదుర్కొని; చుట్టు ముట్టినన్= నలువైపులా ముట్టడింపగా; వివిధ=

రకరకములయిన; ఉగ్ర= తీక్ష్ణమైన; సాయక= బాణములయొక్క; పటిష్ఠతన్= అత్యధికమైన పటుత్వంతో; ఒప్పి= తగి; ఏపునన్= విజృంభణంతో; కలంచెన్= కలతపెట్టాడు.

**తాత్పర్యం:** అర్జునుడు లేగదూడ పంటివంటి మొన గల మిక్కిలి పెద్దదైన బాణంతో మిత్రవర్మను పడగొట్టాడు. అటువంటి బాణమే (వత్సదంతమే) మరొకటి ప్రయోగించి అతడి రథసారథిని చంపాడు. అపుడు త్రిగర్త సైన్యం మించిన గర్వంతో అర్జునుడిని ఎదిరించి చుట్టుముట్టింది. అతడు ఆ సైన్యాన్ని రకరకాల వాడి బాణాలతో విజృంభించి కలతపెట్టాడు.

**వ. వెండియు సుశర్ముని జ్ఞాతులు వోక పెనంగిన. 174**

**ప్రతిపదార్థం:** వెండియున్= ఇంకా; సుశర్ముని= సుశర్మయొక్క; జ్ఞాతులు= దాయాదులు; పోక= తొలగిపోకుండా; పెనంగినన్= యుద్ధంచేయగా.

**తాత్పర్యం:** అప్పటికి సుశర్మ దాయాదులు తొలగిపోకుండా యుద్ధం చేయగా.

**ఆ. వెండిపింజఁ బొలుచు వెడఁద యమ్మున మిత్త్ర । సేనధరణినాథుశిరముఁ ద్రుంచి**
**వాఁడినారసము సువర్మవక్షంబున । నాటె నయ్యమర్త్యనాథసుతుఁడు. 175**

**ప్రతిపదార్థం:** ఆ= ప్రసిద్ధుడైన; అమర్త్యనాథ= దేవేంద్రునియొక్క; సుతుఁడు= కొడుకైన అర్జునుడు; వెండి= వెండితో చేసిన; పింజన్= అల్లెత్రాటికి తగిలించే బాణంయొక్క మొదటిభాగం (పుంఖం)తో; పొలుచు= మెరిసే; వెడఁద= విశాలమైన, వెడల్పయిన; అమ్మునన్= బాణంతో; మిత్త్రసేన= మిత్త్రసేనుడనే; ధరణినాథు= భూపతియొక్క; శిరమున్= తలను; త్రుంచి= నరికి; వాఁడినారసము= పదునైన నారాచమనే ఇనుపబాణం; సువర్మ= సువర్మయొక్క; వక్షంబునన్= రొమ్ముపై; నాటెన్= గ్రుచ్చాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వెండితో చేసిన పుంఖం ఉన్న వెడల్పైన ఒక బాణంతో మిత్రసేనరాజు శిరస్సు నరికాడు. పదునైన ఇనుప బాణం సువర్మ రొమ్ముపై గ్రుచ్చాడు.

**వ. అట్టియెడ సంశప్తక గణంబులన్నియు నార్పులునింగిముట్ట నలుదిక్కులం గిట్టి బెట్టిదంబులగు నస్త్ర శస్త్ర పరంపరలు గురిసిన నమ్మేటివిలుకాఁ డలుక మానిన యలంతి నవ్వు చెలువంబు మొగంబునకు వింత చెన్నొసంగ విజృంభించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది ప్రదీప్త భల్లాంజలిక ప్రముఖ విశిఖరూపంబులం బరఁగుటయు. 176**

**ప్రతిపదార్థం:** అట్టి= అటువంటి; ఎడన్= సమయంలో; సంశప్తక= అర్జునుని చంపుతామని ప్రతిజ్ఞచేసిన; గణంబులు= సేనా సమూహాలు; అన్నియున్= అన్నీ; ఆర్పులు= అరుపులు; నింగిన్= ఆకాశాన్ని; ముట్టన్= తాకగా; నలు= నాలుగు; దిక్కులన్= వైపులనూ; కిట్టి= చేరుకొని, చుట్టుముట్టి; బెట్టిదంబులు+అగు= కఠినములయిన; అస్త్ర= మంత్రప్రయుక్తాలయిన ఆయుధాలయొక్క; శస్త్రంబులన్= బాణాలు మొదలయిన ఆయుధాలయొక్క; పరంపరలు= వరుసలు; కురిసినన్= వానలా ప్రయోగింపగా; ఆ+మేటి= ఆ శ్రేష్ఠుడైన; విలుకాడు= ధనుర్ధారి అయిన అర్జునుడు; అలుక= కోపం; మానిన= విరమించిన; అలంతినవ్వు= చిరునవ్వుయొక్క; చెలువంబు= అందం; మొగంబునకున్= ముఖానికి; వింత= క్రొత్తదైన, ఆశ్చర్యకరమైన;

చెన్ను= చక్కదనాన్ని; ఒనంగన్= ఈయగా; విజృంభించి= చెలరేగి; ఐంద్ర= ఇంద్రుడు అదిదైవంగా గల; అస్త్రంబు= ఆయుధాన్ని; ప్రయోగించినన్= వదలగా; అది= ఆ ఐంద్రాస్త్రం; ప్రదీప్త= మిక్కిలి వెలిగే; భల్ల+అంజలిక= భల్లం, అంజలిక మొదలయిన; విశిఖ= బాణాలయొక్క; రూపంబులన్= రూపాలతో; పరఁగుటయున్= ప్రసరించగా.

**తాత్పర్యం:** అపుడు సంశప్తకులు అందరూ శబ్దం ఆకాశాన్ని తాకేటట్లు అరుస్తూ అర్జునుడిని నలువైపులా చుట్టుముట్టి, కఠిన శస్త్రాస్త్రాలు ఎడతెగకుండా వానకురిసినట్లు అతడిమీద ప్రయోగించారు. ఆ మహాధానుష్కుడైన అర్జునుడికి కోపం పోయి, వారి సాహసానికి చిరునవ్వు వస్తే దాని సొగసు అతడి ముఖానికే క్రొత్త సోయగం తెచ్చిపెట్టింది. అప్పుడతడు విజృంభించి, ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. అది భల్లం, అంజలిక మొదలయిన బాణాల రూపం ధరించి ప్రసరించింది.

**విశేషం:** భల్లం అంటే బల్లెం అని కూడా అర్థం. బల్లెం అగ్రభాగంవంటి అగ్రభాగంగల బాణం భల్లం. అంజలిక అంటే చిట్టెలుక. దాని మూతివంటి అగ్రభాగంగల బాణం అంజలిక.

**సీ.** **తేరుల చెక్కలు వారణంబుల ఖండ । ములు భూషణంబుల పొడియు ఘోట**
**కంబుల తునియలుఁ గరవాలతోమర । శరపరిఘాదుల శకలములును**
**రథికజనంబుల వ్రయ్యలుఁ జామర । ఛత్రకేతువుల యంశములు భటుల**
**తుమురును రౌతుల తుండంబులును గంక । టముల భాగములుఁ జిందముల నుఱుముఁ**

**తే.** **గలిసి నెత్తుటమునిఁగి ప్రేవులఁ బెనంగి । మెదట బ్రుంగి వియచ్చర హృదయములకు**
**నద్భుతంబు బీభత్సంబు నావహింప । సంగరాంగణ మతిఘోరభంగియయ్యె.** 177

**ప్రతిపదార్థం:** తేరుల= రథాలయొక్క; చెక్కలున్= బ్రద్దలూ; వారణంబుల= ఏనుగులయొక్క; ఖండములు= ముక్కలు, భూషణంబుల= నగలయొక్క; పొడియున్= చూర్ణము; ఘోటకంబుల= గుర్రాలయొక్క; తునియలున్= తునుకలూ; కరవాల= కత్తుల; తోమర= ఈటెలు; శర= అమ్ములు; పరిఘ= ఇనుపకట్ల గుదియలు; ఆదుల= మొదలయిన వాటియొక్క; శకలములును= ముక్కలూ; రథిక జనంబుల= రథికులయిన జనులయొక్క; వ్రయ్యలున్= చీలికలూ; చామర= వింజామరలయొక్క; ఛత్ర= గొడుగులయొక్క; కేతువుల= జెండాలయొక్క; అంశములున్= భాగాలూ; భటుల= కాలిబంట్లయొక్క; తుమురును= సన్నసన్నముక్కలూ; రౌతుల= అశ్వికులయొక్క; తుండంబులును= ముక్కలూ; కంకటముల= కవచాలయొక్క; భాగములున్= అంశాలూ; చిందముల= శంఖాలయొక్క; నుఱుమున్= పొడియు; కలిసి= మిళితమై; నెత్తుటన్= రక్తంలో; మునిఁగి= నిమగ్నమై; ప్రేవులన్= ప్రేగులతో; పెనంగి= మెలిగొని; మెదటన్= మెదడులో; బ్రుంగి= దిగబడి; వియత్+చర= ఆకాశ సంచారుల; హృదయములకున్= మనస్సులకు; అద్భుతంబున్= ఆశ్చర్యాన్నీ; బీభత్సంబున్= జుగుప్సను; ఆవహింపన్= కలిగింపగా; సమరాంగణము= యుద్ధప్రదేశము; అతిఘోర= మిక్కిలి భయంకరమైన; భంగి= విధము కలది; అయ్యెన్= అయినది.

**తాత్పర్యం:** రథాలు, ఏనుగులు, నగలు, గుర్రాలు, కత్తులు, ఈటెలు, బాణాలు, ఇనుపకట్ల గుదియలు, రథికులు, చామరాలు, గొడుగులు, జెండాలు, కాలిబంట్లు, ఆశ్వికులు, కవచాలు, శంఖాలు-వీటి ముక్కలూ పొడులూ నెత్తుటిలో మునిగిపోయి, ప్రేగులతో మెలివడిపోయి, మెదడులో దిగబడిపోయి, ఆకాశచారులకు ఆశ్చర్యమూ ఏవగింపూ పుట్టిస్తున్నాయి. యుద్ధప్రదేశం మహాభయంకరంగా అయిపోయింది.

**వ. అప్పుడు. 178**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో

**తాత్పర్యం:** ఆ సమయంలో

**క. కరిహయశవముల విఱిగిన । యరదంబుల విషమమైన యాజి క్షితి నె**
**త్తురు రొంపిలోన రథ్య । స్ఫురణ కతనఁ దవులఁబడక శోభితగతియై. 179**

**ప్రతిపదార్థం:** కరి= ఏనుగులయొక్క; హయ= గుఱ్ఱాలయొక్క; శవములన్= కళేబరాలతోనూ; విఱిగిన= విరిగినటువంటి; అరదంబులన్= తేరులతోనూ; విషమమైన= ఎగుడు దిగుడైన; ఆజి క్షితిన్= యుద్ధభూమిమీద; నెత్తురు రొంపిలోనన్= నెత్తుటి బురదలో; రథ్య= గుఱ్ఱాలయొక్క; స్ఫురణ= కదలిక; కతనన్= కారణంచేత; తవులన్+పడక= చిక్కుపడక; శోభిత= ప్రకాశించే; గతి+ఐ= గమనంకలవాడై.

**తాత్పర్యం:** యుద్ధభూమినిండా ఏనుగుల కళేబరాలూ, గుఱ్ఱాల కళేబరాలూ, విరిగిపోయిన రథాలూ పడి ఉన్నందున అది ఎగుడు దిగుడు అయిపోయింది. దానికి తోడు నెత్తురు బురద ఏర్పడింది. గుఱ్ఱాల కదలిక వలన ఆ బురదలో చిక్కుపడకుండా సంచరిస్తూ.

### దుర్యోధనుఁడు ధర్మజునితో యుద్ధంబు సేసి విరథుఁ డగుట (సం. 8-19-35)

**తే. నరుఁడు దీవ్రశరార్చులు వరఁగఁ జేయఁ । గలఁగి హతశేషసంశప్తకవ్రజంబు**
**పలుగడల విచ్చుటయుఁ బొగ వాసి మెఱయు । నగ్నియునుబోలె వెలుఁగొందె నాతఁ డధిప! 180**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; నరుఁడు= అర్జునుడు; తీవ్ర= వాడిగల; శర= బాణాలయొక్క; అర్చులు= జ్వాలలు; పరఁగఁజేయన్= వ్యాపింపజేయగా; హత= చావగా; శేష= మిగిలిన; సంశప్తక వ్రజంబు= అర్జునుని చంపుతామని ప్రతిజ్ఞచేసినవారి సముదాయం; కలఁగి= కలతచెంది; పలు+కడలన్= చాలా దిక్కులకు, అన్నివైపులకు; విచ్చుటయున్= చెదరిపోగా; ఆతఁడు= అర్జునుడు; పొగ+పాసి= ధూమం తొలగిపోయినందువల్ల; మెఱయు= ప్రకాశించే; అగ్నియున్ బోలెన్= నిప్పులా; వెలుఁగు+ఒందెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వాడి బాణాల జ్వాలలు (కాంతులు) వ్యాపింపజేసేసరికి హతశేషులయిన సంశప్తకులు క్షోభపడి, అన్నివైపులకూ పారిపోయారు. అపుడు అర్జునుడు పొగ తొలగిపోయిన తరువాత మెరిసే అగ్నివలె ప్రకాశించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. కౌరవరాజు ధర్మజుఁడు గయ్యము సేయునెడం గడంకమైఁ**
**గౌరవరాజు ధర్మజుని కాయమునన్ నవసాయకంబులన్**
**సారథిమేన నొక్క పటుసాయకమున్ నిగిడింప నాతఁడు**
**న్ఘోరతరాక్షుఁడై యతని నొంచెఁ ద్రయోదశసాయకాహతిన్. 181**

**ప్రతిపదార్థం:** కౌరవరాజు= దుర్యోధనుడు; ధర్మజుఁడు= యుధిష్ఠిరుడు; కయ్యము= యుద్ధం; చేయు= చేసే; ఎడన్= సమయంలో; కడంకమైన్= పూనికతో; కౌరవరాజు= దుర్యోధనుడు; ధర్మజుని= యుధిష్ఠిరునియొక్క; కాయమునన్= శరీరంపై; నవ= తొమ్మిది; సాయకంబులన్= బాణాలను; సారథి= సూతునియొక్క; మేనన్= శరీరంపై; ఒక్క; పటు= గట్టి; సాయకమున్= బాణాన్నీ; నిగిడింపన్= ప్రయోగింపగా; ఆతఁడున్= యుధిష్ఠిరుడు; ఘోరతర= మిక్కిలి భయంకరాలైన; అక్షుఁడు+ఐ= కన్నులు గలవాడై; త్రయోదశ= పదమూడు; సాయక= బాణాలయొక్క; ఆహతిన్= దెబ్బతో; అతనిన్= దుర్యోధనుని; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు, ధర్మరాజు యుద్ధం చేస్తున్నారు. అపుడు దుర్యోధనుడు పూనికతో ధర్మరాజు మీద తొమ్మిది బాణాలు, అతడి సూతుడిమీద ఒక గట్టి బాణం ప్రయోగించాడు. ధర్మరాజు మహాభయంకరంగా చూస్తూ పదమూడు బాణాలు ప్రయోగించి దుర్యోధనుడిని నొప్పించాడు.

**వ. నొంచి తోడన.** **182**

**ప్రతిపదార్థం:** నొంచి= నొప్పించి; తోడన్+అ= వెంటనే.

**తాత్పర్యం:** నొప్పించి; వెంటనే.

**తే. తునియలుగఁ జేసె హరులఁ జతుశ్శరముల । సూతుఁ బంచమమున ఘనకేతుయష్టి**
**షష్ఠమునఁ జాపదండంబు సప్తమమున । నలిగి యెత్తిన కరవాల మష్టమమున.** **183**

**ప్రతిపదార్థం:** హరులన్= గుర్రాలను; చతుః+శరములన్= నాలుగు బాణాలతోనూ; సూతున్= సారథిని; పంచమమునన్= ఐదవదానిచేతను; ఘన= పెద్దదైన; కేతు= జెండాయొక్క; యష్టిన్= కట్టెను; షష్ఠమునన్= ఆరవదానిచేతనూ; చాపదండంబున్= వింటికర్రను; సప్తమమునన్= ఏడవదానిచేతనూ; అలిగి= కోపించి; ఎత్తిన= తీసిన; కరవాలము= ఖడ్గాన్ని; అష్టమమునన్= ఎనిమిదవదానిచేతను; తునియలుగన్= ముక్కలుగా; చేసెన్= కావించాడు.

**తాత్పర్యం:** గుర్రాలను నాలుగు బాణాలతోనూ, సారథిని ఐదవదానితోనూ, పెద్దజెండా కర్రను ఆరవదానితోనూ, ధనుస్సును ఏడవదానితోనూ, కోపంతో తీసికొన్న ఖడ్గాన్ని ఎనిమిదవ దానితోనూ ముక్కలు చేశాడు.

**క. ఆలోనన యజ్జనపతి । వాలికనారసములైదు వక్షమున వడిం**
**గీలించి ధైర్యసారముఁ । దూలించినఁ దొలఁగి నీ సుతుం డిల కుఱికెన్.** **184**

**ప్రతిపదార్థం:** ఆలోనన్+అ= అంతలోపలనే; ఆ+జనపతి= ఆ యుధిష్ఠిర నరపతి; వాలిక= పొడవైన; నారసములు= నారాచములు (ఇనుప బాణాలు); ఐదు= ఐదింటిని; వక్షమునన్= దుర్యోధనుని రొమ్ముపై; వడిన్= వేగంతో; కీలించి= నాటి; ధైర్యసారమున్= ధీరత్వంయొక్క బలాన్ని; తూలించినన్= నశింపజేయగా; నీ సుతుండు= నీ కొడుకు; తొలఁగి= తప్పుకొని; ఇలకున్= నేలకు; ఉఱికెన్= దుమికాడు.

**తాత్పర్యం:** యుధిష్ఠిరుడు అంతలోనే పొడవైన ఐదు ఇనుపబాణాలను దుర్యోధనుడి రొమ్ముమీద గ్రుచ్చుకొనేటట్లు ప్రయోగించాడు. దానితో ధైర్యాన్ని కోల్పోయి నీ కొడుకు దుర్యోధనుడు యుద్ధంనుండి తప్పించుకొని, రథమునుండి నేలకు దూకాడు.

చ. **వికలరథ ప్రయత్నుఁ బృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్ర క**
**ర్ణ కృపులుఁ దక్కునుం గలుగు నాయకులున్ రయమార వచ్చి కూ**
**డికొనుట సూచి యెంతయు వడిం జనుదెంచిరి ధర్మసూను పొం**
**తకు సముదగ్రులై యతనితమ్ములు సంగరకౌతుకమ్మునన్.** **185**

**ప్రతిపదార్థం:** ద్రోణపుత్ర= అశ్వత్థామ; కర్ణ; కృపులు; తక్కునున్= ఇంకా; కలుగు= ఉన్న; నాయకులున్= సేనానాయకులు; వికల= పాడైపోయిన; రథ= తేరు; ప్రయత్నున్= పూనికగల; పృథివీపతిన్= దుర్యోధనుని; కన్గొని= చూచి; రయము= వేగం; ఆరన్= ఒప్పగా; వచ్చి; కూడికొనుట= చేరుట; చూచి; ధర్మసూను పొంతకున్= ధర్మరాజువద్దకు; అతని తమ్ములు= ధర్మరాజు తమ్ముళ్ళు భీమార్జున నకుల సహదేవులు; సంగర= యుద్ధంలోని; కౌతుకమ్మునన్= కుతూహలంతో; సమ్+ ఉదగ్రులు+ఐ= భయంకరులై; ఎంతయు= ఎంతైనా, చాలా; వడిన్= వేగంతో; చనుదెంచిరి= వచ్చారు.

**తాత్పర్యం:** దుర్యోధనుడి రథం విరిగిపోవటం, అయినా పోరాడటానికి అతడు చేసిన ప్రయత్నం అక్కరకు రాకపోవటం చూచి అశ్వత్థామ, కర్ణుడూ, కృపాచార్యుడు ఇంకా ఉన్న రాజులు, సేనానాయకులు అతడి వద్దకు వేగంగా వచ్చి కలిసికొనటం చూచిన భీమార్జున నకుల సహదేవులు - వారూ వారితో యుద్ధంచేయాలనే కుతూహలంతో చాలా వేగంగా భయంకరులై ధర్మరాజు దగ్గరికి వచ్చారు.

వ. **ఇ త్తెఱంగున నపరాహ్ణంబున దొరలమొత్తంబు లొక్క దెసకుం దార్కొనిన నుభయబలంబులు నురవడించి కలయన్ బెరసినం గ్రందుకయ్యంబయ్యె నందుఁ జిందంబుల మ్రోఁతయు నార్పుల యులివును బాణ కృపాణాదిహేతి సంఘట్టనంబునం బుట్టు రణనంబును రథావయవాస్థికపాలభంజనంబున నెసంగు నినదంబునుం గూడి పరఁగిన దిక్కులు పిక్కటిల్లెఁ గరులకొమ్ములం జిక్కివ్రేలు తురంగంబులును సందుకొని సొచ్చిన సుభటులు సెరివిన నొఱగి కూలు శుండాలంబులును నాశ్వికుల మొగంబునంబడి లులాయంబులు సొచ్చిన సరోవరంబుల చందం బగు కాల్బలంబులును రథికులు వోక పెనంగిన నఱవఱలయిన యరదంబులును నెత్తురు కాలువలును గండల తిట్టలును బ్రేవుల ప్రోవులును నెమ్ముల రాసులును నత్యంత రౌద్రంబు నావహించె' ననుటయు నాంబికేయుండు.** **186**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ రీతిగా; అపర+అహ్నంబునన్= మధ్యాహ్నం తరువాత; దొరల= రాజులయొక్క; మొత్తంబులు= సమూహాలు; ఒక్క= ఒక; దెసకున్= దిక్కుకు; తారు+కొనినన్= చేరుకొనగా; ఉభయ= ఇరు; బలంబులున్= సేనలు; ఉరవడించి= విజృంభించి; కలయన్= కూడునట్లుగా; బెరసినన్= ఢీకొనగా; క్రందు కయ్యంబు= దొమ్మికయ్యం; అయ్యెన్= సంభవించింది; అందున్= ఆ యుద్ధంలో; చిందంబుల= శంఖాలయొక్క; మ్రోఁతయున్= ధ్వనీ; ఆర్పుల= కేకల; ఉలివును= ధ్వనీ; బాణ= అమ్ములు; కృపాణ= ఖడ్గాలు; ఆది= మొదలైన; హేతి= ఆయుధాలయొక్క; సంఘట్టనంబునన్= తాకిడిచేత; పుట్టు= కలిగే; రణనంబును= ధ్వనీ; రథ= తేరులయొక్క; అవయవ= అంగాలయొక్క; అస్థి= ఎముకలయొక్క; కపాల= తలలయొక్క; భంజనంబునన్= విరగటంచేత పగలటంచేత; ఎసంగు= కలిగే; నినదంబునన్= ధ్వనీ; కూడి= కలిసి; పరఁగినన్= వ్యాపించగా; దిక్కులు= దిశలు; పిక్కటిల్లెన్= పగిలిపోయాయి. కరుల= ఏనుగులయొక్క; కొమ్ములన్= దంతాలలో; చిక్కి= చిక్కుకొని; వ్రేలు= వ్రేలాడే; తురంగంబులును= గుర్రాలూ; సందుకొని= అవకాశం చూచికొని; చొచ్చిన= ప్రవేశించిన; సుభటులు= మంచి, గొప్పయోధులు - యుద్ధభటులు; చెరివినన్= ఖండించగా; ఒఱిగి= వాలిపోయి; కూలు= పడిపోయే, మరణించే; శుండాలంబులును= ఏనుగులు; ఆశ్వికుల= రౌతుల; మొగంబునన్+పడి= ఎదుటపడి; లులాయంబులు=

కారెనుపోతులు; చొచ్చిన= ప్రవేశించిన; సరోవరంబుల= చెరువులయొక్క; చందంబు+అగు= విధం అయ్యే; కాల్బలంబులును= పదాతి సేనలు; రథికులు= రథాలపై నుండి యుద్ధంచేసే వీరులు; పోక= వెళ్ళిపోకుండా; పెనంగినన్= పోరాడగా; అఱవఱలు= చిన్నముక్కలు; అయిన; అరదంబులును= తేరులు; నెత్తురు= రక్తపు; కాలువలును= కాలువలు, కుల్యలూ; కండల= మాంసపుముక్కల; తిట్టలును= గుట్టలూ; ప్రేవుల= ప్రేగులయొక్క; ప్రోవులును= కుప్పలూ; ఎమ్ముల= ఎముకలయొక్క; రాసులును= కుప్పలూ; అత్యంత= మిక్కిలి అధికమైన; రౌద్రంబున్= భయంకరత్వాన్ని; ఆవహించెన్= కలిగించాయి; అనుటయున్= అని చెప్పగా; ఆంబికేయుండు= అంబికపుత్రు డయిన ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** ఇట్లా మధ్యాహ్నం దాటిన తరువాత రాజులు ఒక్కచోటికి చేరేసరికి, ఇరుపక్షాల సైనికులు విజృంభించారు. ఒకరితో ఒకరు కలబడేసరికి దొమ్మికయ్యం సంభవించింది. శంఖధ్వని, అరుపుల ధ్వని, బాణాలు ఖడ్గాలు మొదలయిన ఆయుధాల తాకిడికి పుట్టేధ్వని, రథాలు, ఎముకలు విరుగుతూ ఉంటే బుర్రలు పగులుతూ ఉంటే కలిగేధ్వనీ కలిసి వ్యాపించేసరికి దిక్కులు పగిలిపోయాయి. ఏనుగుల దంతాలమధ్య ఇరుక్కొని వ్రేలాడుతున్నాయి గుర్రాలు. ఎడం చూచికొని ప్రవేశించి మహావీరులు నరుకుతుంటే పడిపోతున్నాయి ఏనుగులు. పదాతిసైన్యం రౌతుల ముందుకు వచ్చి దున్నపోతులు దిగిన చెరువులవలె సంక్షోభం చెందుతున్నాయి. వదలకుండా రథికులు పోరాడినందున ముక్కలయిపోతున్నాయి రథాలు. నెత్తురు కాలువలు కట్టింది. మాంసం గుట్టలుగా పడింది. ప్రేగులు ప్రోగులుగా ఏర్పడ్డాయి. ఎముకలు రాసులుగా పడ్డాయి. వీటితో యుద్ధభూమి భయంకరంగా పరిణమించింది.' అని సంజయుడు చెప్పాడు. అది విని ధృతరాష్ట్రుడు

**విశేషం:** అలం: ఉపమ.

**చ.** **'సమరము పెంపు సెప్పెదవు సంజయ! చెప్పవు నీవు మీమహీ**
**రమణుని భంగి ధర్మజుశరంబులచే విరథత్వ మొంది మా**
**నముఁ జలముం దెగం దొలఁగెనా? మగుడం బురికొంట లేదే? ని**
**క్కము సెపుమా! తనూజు భుజగర్వవిహీనత నొంచెఁ జిత్తమున్.'** **187**

**ప్రతిపదార్థం:** సమరము= యుద్ధంయొక్క; పెంపు+చెప్పెదవు= పెంపు చెపుతున్నావు; సంజయ!= ఓ సంజయా!; నీవు; మీ మహీరమణుని భంగి= మీ రాజు విధం గురించి చెప్పవు, చెప్పటంలేదు; ధర్మజు= ధర్మపుత్రునియొక్క; శరంబులచేన్= బాణాలచేత; విరథత్వము= రథంలేనివాడు కావటం; ఒంది= పొంది; మానమున్= అభిమానము; చలము= పట్టుదల; తెగన్= పోగా; తొలఁగెనా= దూరంగా వెళ్ళాడా?; మగుడన్= తిరిగి; పురికొంట= ఉత్సాహవంతుడు కావటం; లేదు+ఎ= లేదా?; నిక్కము= సత్యం; చెపుమా!= తెలియజేయి సుమా!; తనూజ= కుమారుడైన దుర్యోధనునియొక్క; భుజ= బాహువులయొక్క; గర్వ= దర్పంయొక్క; విహీనత= లేకపోవటం; చిత్తమున్= మనస్సును; నొంచెన్= బాధించింది.

**తాత్పర్యం:** 'సంజయా! యుద్ధవిస్తారం గురించి చెప్పుతావు కాని, దుర్యోధనుడి తీరు చెప్పటం లేదు. యుధిష్ఠిరుడి బాణాలకు విరథుడై మానమూ, పట్టుదలా విడిచి అతడు దూరంగా వెళ్ళిపోయాడా? తిరిగి అతనికి ఉత్సాహం రాలేదా? నిజం చెప్పుము. కొడుకు భుజబలదర్పం పోవటం మనస్సును నొప్పించింది.

**వ.** **అనిన నాసూతనందనుం డమ్మానవపతి కిట్లనియె.** **188**

**ప్రతిపదార్థం:** అనినన్= ఈ రీతిగా అడుగగా; ఆ సూతనందనుండు= ఆ సూతుని కుమారుడయిన సంజయుడు; ఆ+మానవపతికిన్= ఆ నరనాథునికి; ఇట్లు= ఇట్లా; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అట్లా అడుగగా, సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు.

**తే.** **'విరథుఁ డయ్యెన కాని యవ్వీరుఁ డాహ । వంబు దక్కక యొండురథంబు పన్ని**
**కొని సముద్ధతివచ్చి సక్రోధమైన । మనముతో సూతునకు నిట్టు లనియె నధిప!** 189

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; ఆ+వీరుడు= ఆ శూరుడైన దుర్యోధనుడు; విరథుఁడు= రథంలేనివాడు; అయ్యెన్= అయినాడు; కాని= అయినా; ఆహవంబు= యుద్ధం; తక్కక= విడవక; ఒండు= మరొక; రథంబు; పన్నికొని= సంసిద్ధం చేసికొని; సమ్+ఉద్ధతిన్= మిక్కిలి గర్వంతో వచ్చి, పోరాడటానికి వచ్చి; సు(క్రోధము+ఐన= కోపంతో కూడినది అయిన; మనముతోన్= మనస్సుతో; సూతునకున్= తన సారథితో; ఇట్టులు= ఇలా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్ర మహారాజా! ఆ వీరుడు రథం కోల్పోయాడే కాని, యుద్ధం విడిచిపెట్టలేదు. మరొక రథం సిద్ధం చేసికొని, మళ్ళీ దర్పంతో సంగ్రామం చేయటానికి వచ్చాడు. కోపంతో కూడిన మనస్సుతో అపుడు తన సారథితో ఇట్లా అన్నాడు.

**ఆ.** **'తెల్ల సీవిరులును వెల్లనిగొడుగు నై । యల్లవాఁడె పాండవాగ్రజుండు**
**మెఱసియున్నవాఁడు పఱపు మచ్చోటికి । రథము ఘోటకములరయము మెఱయ.'** 190

**ప్రతిపదార్థం:** తెల్ల= తెల్లనివైన; సీవిరులును= వింజామరలు; వెల్లని= తెల్లని; గొడుగున్+ఐ= ఛత్రము కలవాడై; అల్లవాఁడు+ఎ= అడుగో అతడే; పాండవ+అగ్రజుండు= యుధిష్ఠిరుడు; మెఱసి= ప్రకాశించి, ప్రకాశిస్తూ; ఉన్నవాఁడు= ఉన్నాడు; ఘోటకముల= గుర్రాలయొక్క; రయము= వేగం; మెఱయన్= ప్రకాశింపగా; రథము= తేరు; ఆ+చోటికిన్= అతడున్న ప్రదేశానికి; పఱపుము= త్రోలుము.

**తాత్పర్యం:** 'అడుగో తెల్లనిచామరాలతో తెల్లని గొడుగులతో వెలుగుతున్నాడే, అతడే యుధిష్ఠిరుడు. గుర్రాలవేగం ప్రకటమయ్యేటట్లు రథాన్ని అతడున్న చోటికి పోనిమ్ము.'

**వ.** **అనుటయు నతండు నట్లచేయ నయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి యహికేతుమహితంబై వచ్చుచున్న ధృతరాష్ట్రనందన స్యందనంబునకు సమ్ముఖంబుగా మనరథంబు నడపుమనుటయు నాతం డవ్విధం బాచరింప నయ్యిరువు రతిరథికులకుఁ బ్రకట ప్రధనంబయ్యె నట్టియెడ.** 191

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని పలుకగా; అతండును= అతడి సారథి కూడా; అట్లు+అ= అట్లాగే; చేయన్= చేయగా; ఆ+యుధిష్ఠిరుండు= ఆ ధర్మరాజు; నిజసారథిన్= తన సూతుడిని; ఆలోకించి= చూచి; అహి= సర్పచిహ్నంకల; కేతు= జెండాతో; మహితంబు+ఐ= గొప్పది అయి; వచ్చుచున్+ఉన్న= వస్తూ ఉన్న; ధృతరాష్ట్రనందన= ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనుడియొక్క; స్యందనంబునకున్= రథానికి; సమ్ముఖంబుగాన్= ఎదురుగా; మన రథంబు= మన తేరు; నడపుము= నడిపించుము; అనుటయున్= అనినందువల్ల; ఆతండు= ఆ సూతుడు; ఆ+విధంబు= ఆ ప్రకారం; ఆచరింపన్= చేయగా; ఆ+ఇరువురు= ఆ ఇద్దరు; అతిరథులకున్= అనేకులైన విలుకాండ్రతో యుద్ధం చేయగలవారు అతిరథులు, అట్టివారైన

యుధిష్ఠిర దుర్యోధనులకు; ప్రకట= అధికమైన; ప్రధనంబు= యుద్ధం; అయ్యెన్= సంభవించింది; అట్టి= అటువంటి; ఎడన్= సమయంలో.

**తాత్పర్యం:** అట్లా చెప్పేసరికి, ఆ సూతుడు రథాన్ని ధర్మపుత్రుడి దగ్గరకు తోలుకొని వెళ్ళుతుండగా, యుధిష్ఠిరుడు తన సారథిని చూచి, సర్పధ్వజంతో గొప్పగా వస్తున్న ఆ దుర్యోధనుడి రథానికి ఎదురుగా మన రథాన్ని తోలుము' అని చెప్పాడు. అత డట్లాగే తోలాడు. అపుడు ఆ అతిరథులు యుధిష్ఠిర దుర్యోధను లిద్దరికీ మహాయుద్ధం జరిగింది. ఆ సమయంలో.

**సీ.** **పాండవు చాపంబు ఖండించె నీ కొడు । కొండొక ధనువెత్తి యుఱక యాతఁ**
**డక్కురునాథువిల్ గ్రక్కునఁ దునుమాడె । నతఁడు వేఱొక వింటనతని నేయ**
**నయ్యుధిష్ఠిరుఁడు నానాస్త్రంబు లేసిన । నాచ్ఛాదితంబయ్యె నంబరంబు**
**వారొండొరుల రక్తధారాప్లుతులఁ జేసి । పుల్లకింశుక భంగిఁ బొలిచి రేచి**

**ఆ.** **ఘోరశక్తి వైచెఁ గౌరవపతి యది । నడుమఁ దునిమి ధర్మనందనుండు**
**నొంచె నిశితవిశిఖపంచకమ్మున నమ్మ । హీశు నురము దర్పమెసకమెసఁగ.** **192**

**ప్రతిపదార్థం:** నీ కొడుకు= నీ కుమారుడైన దుర్యోధనుడు; పాండవు= పాండురాజు కుమారుడైన యుధిష్ఠిరునియొక్క; చాపంబు= ధనుస్సును; ఖండించెన్= నరికాడు; అతఁడు= యుధిష్ఠిరుడు; ఉఱక= (ఆ నరకటం) లక్ష్యపెట్టక; ఒండు+ఒక= మరొక; ధనువు= విల్లు; ఎత్తి= తీసికొని; ఆ+కురునాథు= ఆ కురురాజైన దుర్యోధనునియొక్క; విల్= ధనుస్సును; గ్రక్కునన్= వెంటనే; తునుమాడెన్= ఖండించాడు; అతఁడు= ఆ దుర్యోధనుడు; వేఱు+ఒక= మఱొక; వింటన్= ధనుస్సుతో; అతనిన్= ఆ యుధిష్ఠిరుని; ఏయన్= బాణంతో కొట్టగా; ఆ+యుధిష్ఠిరుఁడు= ఆ ధర్మపుత్రుడు; నానా= అన్ని రకాలయిన; అస్త్రంబులు= ఆయుధాలు; ఏసినన్= ప్రయోగింపగా; అంబరంబు= ఆకాశం; ఆచ్ఛాదితంబు= అంతటా కప్పబడినది; అయ్యెన్= అయింది; వారు= యుధిష్ఠిర దుర్యోధనులు; ఒండొరులన్= ఒకరు మరొకరిని; రక్త= రక్తములయొక్క; ధారా= ధారలచేత; ఆప్లుతులన్= మునిగినవారిని; చేసి= కావించి; పుల్ల= వికసించిన; కింశుక= మోదుగుచెట్టుయొక్క; భంగిన్= విధముగ; పొలిచిరి= ఒప్పినారు; కౌరవపతి= కౌరవరాజైన దుర్యోధనుడు; ఏచి= విజృంభించి; ఘోరశక్తి= భయంకరమైన ఈటెను; వైచెన్= ప్రయోగించాడు; ధర్మనందనుండు= యుధిష్ఠిరుడు; అది= ఆ శక్తిని; నడుమన్= మధ్యనే; తునిమి= నరికి; అమ్మహీశు= ఆ భూపతియొక్క; ఉరమున్= వక్షఃస్థలాన్ని; నిశిత= వాడియయిన; విశిఖ= బాణాలయొక్క; పంచకమునన్= ఐదింటితో; దర్పము= గర్వము; ఎసకమెసఁగన్= వృద్ధిచెందగా; నొంచెన్= నొప్పించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు యుధిష్ఠిరుడి విల్లు విరుగఁజేశాడు. యుధిష్ఠిరుడు అది లక్ష్యపెట్టక, మరొక ధనుస్సు తీసికొని దుర్యోధనుడి ధనుస్సు ఖండించాడు. అతడు వేరొక ధనుస్సుతో యుధిష్ఠిరుడి మీద బాణాలు ప్రయోగించాడు. యుధిష్ఠిరుడు సకలవిధ బాణాలు ప్రయోగించేసరికి ఆకాశమంతా కప్పువడిపోయింది. యుధిష్ఠిరదుర్యోధను లిద్దరూ ఒకరినొకరు నెత్తుటి ధారలతో ముంచికొని, పూచిన మోదుగుచెట్లవలె ఉన్నారు. దుర్యోధనుడు చెలరేగి ఒక ఈటెను విసిరాడు. యుధిష్ఠిరుడు దానిని మధ్యనే విరుగగొట్టి, ఐదు వాడి బాణాలు దుర్యోధనుడి రొమ్ముపై ప్రయోగించి, గర్వాతిశయంతో దుర్యోధనుడికి బాధ కలిగించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇట్లు కౌంతేయముఖ్యుచేత నొచ్చియు గాంధారీ నందనుండు. 193**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; గాంధారీనందనుండు= గాంధారి కొడుకయిన దుర్యోధనుడు; కౌంతేయముఖ్యుచేతన్= కుంతి కొడుకులలో మొదటివాడైన యుధిష్ఠిరుని చేత; నొచ్చియున్= బాధపడినప్పటికీ.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజుచేత బాధపడినప్పటికీ.

**చ. బరవసమొప్పఁ గ్రూరనవభల్లవిదారితుఁ జేసె నమ్మహీ**
**శ్వరు నతఁ డల్గి బల్పిడుగుచాడ్పు శిలీముఖ ముచ్చిపోవ న**
**క్కురుపతి నేయఁ గయ్యమునకుం దుది యప్పుడ చేయువాఁడుగా**
**నరదము డిగ్గె నాతఁడు గదాకలనోద్ధట బాహుదండుఁ డై. 194**

**ప్రతిపదార్థం:** బరవసము= ధైర్యం; ఒప్పన్= తగగా; క్రూర= కఠినమైన; నవ= క్రొత్తదైన; భల్ల= బాణంచేత; ఆ+మహీశున్= ఆ భూపతిని; విదారితున్= చీల్చబడినవానిని; చేసెన్= కావించాడు; అతఁడు= యుధిష్ఠిరుడు; అల్గి= కోపించి; బల్= పెద్ద; పిడుగు చాడ్పు= పిడుగువంటి; శిలీముఖము= బాణం; ఆ+కురుపతిన్= ఆ కౌరవరాజైన దుర్యోధనుని; ఉచ్చిపోవన్= చీల్చుకొని పోయేటట్లుగా; ఏయన్= ప్రయోగింపగా; ఆతఁడు= ఆ దుర్యోధనుడు; గదాకలన= గదతో కూడినది; ఉద్యత= పైకెత్తబడినది అయిన; బాహు= చేయి అనే; దండుఁడు+ఐ= దండంకలవాడై; కయ్యమునకున్= యుద్ధానికి; తుది= అంతం; అప్పుడు+అ= అప్పుడే; చేయువాఁడుగాన్= చేసేవాడిలా; అరదము= రథం నుంచి; డిగ్గెన్= దిగాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ధైర్యంతో ఒక గట్టి క్రొత్త బాణంతో యుధిష్ఠిరుడిని చీల్చాడు. యుధిష్ఠిరుడు కోపపడి, పెద్ద పిడుగువంటి బాణమొకటి చీరుకొని పోయేటట్లుగా దుర్యోధనుడిపై ప్రయోగించాడు. దుర్యోధనుడు గదతో చేయిపైకెత్తి, యుద్ధం అప్పుడే పూర్తిచేసేవాడివలె రథం నుండి దిగాడు.

**క. డిగి రయమునఁ గదిసిన నా। జగతీపతి యేచి యుగ్రశక్తి నురము బె**
**ట్టుగ వైచిన నీతనయుఁడు। మగుడఁగ రథ మెక్కె వింటమార్కొనువాఁడై. 195**

**ప్రతిపదార్థం:** డిగి= దిగి; రయమునన్= వేగంగ; కదిసినన్= సమీపించగా; ఆ జగతీపతి= ఆ భూపతి యుధిష్ఠిరుడు; ఏచి= విజృంభించి; ఉగ్ర= భయంకరమైన; శక్తిన్= ఈటెతో; ఉరము= వక్షఃస్థలంపై; బెట్టుగన్= గట్టిగా; వైచినన్= కొట్టగా; నీ తనయుఁడు= నీ కొడుకైన దుర్యోధనుడు; వింటన్= ధనుస్సుతో; మార్కొనువాఁడు+ఐ= ఎదిరించేవాడై; మగుడఁగన్= తిరిగి; రథము+ఎక్కెన్= తేరు ఆరోహించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు రథం దిగి, వేగంగ యుధిష్ఠిరుడిని సమీపించాడు. యుధిష్ఠిరుడు చెలరేగి, భయంకరమైన ఒక ఈటెతో గట్టిగా దుర్యోధనుడి రొమ్ముపై పొడిచాడు. అపుడు దుర్యోధనుడు ధనుస్సును ధరించి, పోరాడాలని మళ్ళీ రథమెక్కాడు.

### దుర్యోధనుఁడు ధర్మజునితో యుద్ధముచేసి మూర్ఛిల్లుట (సం. 8-20-30)

**క. అత్తఱిఁ గడుఁ బెల్లుగఁ గ్రొ। న్నెత్తురు వడియుటయు నతఁడు నిర్భరమూర్ఛా**
**యత్తుఁడగుడుఁ గృతవర్మఁ డు। దాత్తత నెడసొచ్చె బాహుదర్పము నెఱయన్. 196**

**ప్రతిపదార్థం:** అత్తఱిన్= ఆ సమయంలో; కడున్= మిక్కిలి; పెల్లుగన్= అధికంగా; క్రొత్త+నెత్తురు= క్రొత్తరక్తం; వడియుటయున్= స్రవించినందువల్ల; అతఁడు= దుర్యోధనుడు; నిర్భర= నిండు; మూర్ఛాయత్తుఁడు= చొక్కుకు లొంగినవాడు; అగుడున్= కాగా; కృతవర్ముఁడు= కృతవర్మ; ఉదాత్తతన్= గొప్పదనంతో; బాహు దర్పము= చేతుల గర్వం; నెఱయన్= నిండగా; ఎడ= వారిద్దరి నడుమను; చొచ్చెన్= ప్రవేశించాడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో క్రొత్త నెత్తురు జాలువారింది. అందువలన దుర్యోధనుడు మూర్ఛిల్లాడు. అపుడు కృతవర్మ నిండు భుజగర్వంతో ఉదాత్తంగా యుధిష్ఠిరదుర్యోధనుల మధ్య ప్రవేశించాడు.

**ఉ. ఆతనిఁ దాఁకె వీఁక ననిలాత్మజుఁ డప్డు బలంబు మారుతో**
**ద్ధూతపయోధివోలె వడిఁ దోడ్పడియెం గృతవర్మ కంత ను**
**ద్ద్యోతితభంగి వచ్చి విజయుండు వెసం దునుమాడె లీలమైఁ**
**జేతులతీఁటవోవ రథసింధురవాజి భటోత్కరంబులన్. 197**

**ప్రతిపదార్థం:** అనిల+ఆత్మజుఁడు= వాయుపుత్రుడైన భీముడు; వీఁకన్= శౌర్యంతో; ఆతనిన్= కృతవర్మను; తాఁకెన్= ఎదిరించాడు; అప్డు= అపుడు; బలంబు= కౌరవసైన్యం; మారుత= వాయువుచేత; ఉద్ధూత= లెస్సగా కదలిన; పయోధివోలెన్= సముద్రంలా; వడిన్= వేగంతో; కృతవర్మకున్= హృదికుని కుమారుడైన యాదవవీరునికి; తోడ్పడియెన్= సాయపడింది; అంతన్= అంతలో; విజయుండు= అర్జునుడు; ఉత్+ద్యోతిత భంగిన్= ప్రకాశించే విధానంతో; వెసన్= వేగంతో; వచ్చి= అక్కడకు చేరి; లీలమైన్= విలాసంతో; చేతుల= బాహువులయొక్క; తీఁట= దురద; పోవన్= పోయేటట్లుగా; రథ= రథాలు; సింధుర= ఏనుగులయొక్క; వాజి= గుర్రాలయొక్క; భట= కాలిబంటులయొక్క; ఉత్కరంబులన్= సమూహాలను; తునుము+ ఆడెన్= నరికాడు.

**తాత్పర్యం:** భీమసేనుడు శౌర్యంతో కృతవర్మను ఢీకొన్నాడు. అపుడు కౌరవసైన్యం ప్రచండ వాయువుకు కదిలిన సముద్రంవలె వేగంతో కదిలి కృతవర్మకు సాయపడింది. అంతలో అక్కడికి వేగంతో వెలిగిపోతూ వచ్చాడు అర్జునుడు. వచ్చి, విలాసంగా చేతుల దురదపోయేటట్లు రథ గజ తురగ పదాతి చతుర్విధ సైన్యాలనూ సంహరించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అంత. 198**

**ప్రతిపదార్థం:** అంతన్= తరువాత.

**తాత్పర్యం:** తరువాత.

**క. కురుపతి దెప్పిఱి బాహు । స్ఫురణంబు దలిర్ప నింద్రజుని మార్కొని ని**
**ష్ఠురవివిధవిశిఖవినిహత । శరీరుఁ జేయుటయు నతఁడు సక్రోధుండై. 199**

**ప్రతిపదార్థం:** కురుపతి= కురువంశపు రాజైన దుర్యోధనుడు; తెప్పిఱి= తేరుకొని; బాహుస్ఫురణంబు= చేతుల తేజస్సు; తలిర్పన్= ఒప్పగా; ఇంద్రజునిన్= ఇంద్ర పుత్రుడైన అర్జునుని; మార్కొని= ఢీకొని; నిష్ఠుర= కఠినమైన; వివిధ= రకరకాలైన;

విశిఖ= బాణాలచేత; వినిహత= ఎక్కువగా కొట్టబడిన; శరీరున్= దేహంకలవాడిని; చేయుటయున్= చేసినందువల్ల; అతఁడు= అర్జునుడు; సక్రోధుండు+ఐ= క్రోధంతో కూడి ఉన్నవాడయి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు మూర్ఛనుండి తేరుకొన్నాడు. చేతులబలం ప్రకటమయ్యేరీతిగా అర్జునుడిని, ఎదుర్కొని అతడిని కఠినమైన రకరకాల బాణాలతో గాయపరచాడు. దానితో అర్జునుడికి బాగా కోపం వచ్చింది.

**తే. కార్ముకముఁ గేతువును ఘోటకముల సూతు । వెడఁదబలుతూపులేడింటఁ బుడమిఁ గూల్చి**
**భల్ల మొక్కట నతని పెన్విల్లు దునిమి । ప్రాణముల్ గొనఁ జాలెడు బాణమేసె. 200**

**ప్రతిపదార్థం:** కార్ముకమున్= ధనుస్సును; కేతువును= జెండాను; ఘోటకములన్= గుఱ్ఱాలనూ; సూతున్= సారథినీ; వెడఁద= వెడల్పైన; బలు= పెద్దవైన; తూపులు= బాణాలు; ఏడింటన్= ఏడింటితో; పుడమిన్= భూమిపై; కూల్చి= పడగొట్టి; భల్లము= బాణం; ఒక్కటన్= ఒకదానితో; అతని= దుర్యోధనునియొక్క; పెన్విల్లు= పెద్ద ధనుస్సు; తునిమి= ఖండించి; ప్రాణముల్= ప్రాణాలు; కొనఁజాలెడు= తీసికొనటానికి సమర్థమైన; బాణము+ఏసెన్= బాణము ప్రయోగించాడు.

**తాత్పర్యం:** విల్లును, జెండాను, నాలుగు గుఱ్ఱాలను, సారథిని- ఏడు బాణాలతో అర్జునుడు పడగొట్టాడు. ఒక బాణంతో అతడి మహాధనుస్సు విరగగొట్టాడు. తరువాత అతడి ప్రాణాలు తీయగలిగిన బాణం ఒకటి ప్రయోగించాడు.

**క. కని యాఱమ్ముల నెడ నది । దునియలు గావించె గురుసుతుం డాతని వి**
**ల్లును హరులఁ దునిమి పార్థుఁడు । దను మార్కొను కృపుని చాపదండము ద్రుంచెన్. 201**

**ప్రతిపదార్థం:** గురుసుతుండు= గురువైన ద్రోణుని పుత్రుడైన అశ్వత్థామ; అది= ఆ బాణాన్ని; కని= చూచి; ఆఱు+అమ్ములన్= ఆరుబాణాలతో; ఎడన్= కొంతదూరంలో ఉండగానే; తునియలు= ముక్కలు; కావించెన్= చేశాడు; పార్థుఁడు= అర్జునుడు; అతని= అశ్వత్థామయొక్క; విల్లును= ధనుస్సును; హరులన్= గుఱ్ఱాలను; తునిమి= ఖండించి; తనున్= అర్జునుడైన తనని; మార్కొని= ఎదిరించే; కృపుని= కృపాచార్యునియొక్క; చాపదండము= వింటిబద్దను; త్రుంచెన్= నరికాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ దానిని చూచి, ఇంకా దుర్యోధనుడిని అది తాకే ఎడముండగానే ఆరు బాణాలు ప్రయోగించి, దానిని ముక్కలు చేశాడు. అర్జునుడు అశ్వత్థామ ధనుస్సును ఖండించి, గుఱ్ఱాలను సంహరించాడు. తన మీదికి కృపాచార్యుడు వస్తే అతడి ధనుస్సును కూడ ఖండించాడు.

**చ. వడిఁ గృతవర్మ దాఁకిన నవారణఁ దద్ధనువున్ హయంబులున్**
**సిడమును రూపుమాపి విలసిల్లి యెదిర్చిన దుస్ససేనువిల్**
**నడిమికిఁ ద్రుంచి గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల నె**
**క్కుడు మదమొప్పఁ గర్ణుదెసకుం జన నా రథికుం డుదగ్రుఁడై. 202**

**ప్రతిపదార్థం:** వడిన్= వేగంతో; కృతవర్మ; తాఁకినన్= ఢీకొనగా; అవారణన్= ఆపులేకుండా; తద్+ధనువున్= అతడి విల్లునూ; హయంబులున్= గుఱ్ఱాలనూ; సిడమును= జెండానూ; రూపుమాపి= నాశనంచేసి; విలసిల్లి= ఒప్పి; ఎదిర్చిన= తనను మార్కొనిన; దుస్ససేను= దుశ్శాసనుని; విల్= ధనుస్సును; నడిమికిన్= సగానికి; త్రుంచి= ఖండించి; గాండివ= (తన ధనుస్సు అయిన) గాండీవం యొక్క; గుణ= అల్లెత్రాటియొక్క; ధ్వనిన్= చప్పుడువల్ల; దిక్కులు= దిశలు; పిక్కటిల్లన్=

పగులగా; ఎక్కుడు= అధికమైన; మదము= గర్వం; ఒప్పన్= ఒప్పి ఉండగా; కర్ణుదెసకున్= కర్ణుడివైపు; చనన్= వెళ్ళగా; ఆ రథికుండు= ఆ రథికుడైన కర్ణుడు; ఉదగ్రుఁడు+ఐ= భయంకరుడై.

**తాత్పర్యం:** వేగంతో కృతవర్మ అర్జునుడిని ఎదిరించాడు. అర్జునుడు అతడి ధనుస్సునూ, జెండానూ త్రుంచాడు. గుర్రాలను చంపాడు. దుశ్శాసనుడు ఎదిరిస్తే అతడి ధనుస్సును సగానికి ఖండించాడు. దిక్కులు పిక్కటిల్లేటట్లుగ గాండీవ ధనుష్టంకారం చేసి, గర్వాతిశయంతో కర్ణుడివైపు వెళ్ళగా, ఆ కర్ణుడు కోపోద్రిక్తుడై.

**క. అన్నరుని మూఁడు శరముల । వెన్నుని నిరువదినిశాతవిశిఖముల వెసన్**
**భిన్నాంగులఁ జేసి విజయు । మున్నేసినయన్ని బాణముల బిట్టేసెన్. 203**

**ప్రతిపదార్థం:** ఆ+నరునిన్= ఆ అర్జునుని; మూడు శరములన్= మూడు బాణాలతోనూ; వెన్నునిన్= శ్రీకృష్ణుని; ఇరువది= ఇరవై; నిశాత= పదునైన; విశిఖములన్= బాణాలతోనూ; వెసన్= వేగంగా; భిన్న= చీరిన; అంగులన్= అవయవములు కలవారినిగా; చేసి; విజయున్= అర్జునుని; మున్ను= ఇదివరకు; ఏసిన= ప్రయోగించిన; అన్ని బాణములన్= అన్ని అమ్ములతో; బిట్టు+ఏసెన్= గట్టిగా కొట్టాడు.

**తాత్పర్యం:** అర్జునుడిని మూడు బాణాలతోనూ, కృష్ణుడిని ఇరవై పదునైన బాణాలతోనూ, వేగంగా వారి అవయవాలు చీలిపోయేటట్లుగ కర్ణుడు కొట్టాడు. అర్జునుడిని ఇదివరకు కొట్టినన్ని బాణాలతో గట్టిగా కొట్టాడు.

**వ. అంతకు మున్ను సాత్యకితోడం బోరిపోరి యారాధేయుండు దనదెస కడరిన కవ్వడిం గని యక్కడ మొగం బయి యిటుపరాక్రమించినం జూచి యేచి యా సవ్యసాచి కడ్డపడి యక్కేశవానుజుండు. 204**

**ప్రతిపదార్థం:** అంతకున్= అది జరగటానికి; మున్ను= ముందు; ఆ రాధేయుండు= ఆ కర్ణుడు; సాత్యకి తోడన్; పోరిపోరి= మిక్కిలి పోరాడి; తన దెసకున్= తనవైపు; అడరిన= విజృంభించిన; కవ్వడిన్= రెండు చేతులతోనూ బాణప్రయోగం చేసే వేగంగల అర్జునుని; కని= చూచి; అక్కడన్= ఆ అర్జునుడి వైపు; మొగంబు+అయి= ముఖంపెట్టి; ఇటు= తన (సాత్యకి) వైపు; పరాక్రమించినన్= విక్రమం చూపుతుండగా; చూచి= కనుగొని; ఆ+కేశవ+అనుజుండు= ఆ కృష్ణుడికి తమ్ముడి వరుసవాడైన సాత్యకి; ఏచి= విజృంభించి; ఆ సవ్యసాచికిన్= కర్ణుడితో పోరాడుతున్న ఆ అర్జునుడికి; అడ్డుపడి= అడ్డంవచ్చి.

**తాత్పర్యం:** అంతకు ముందు చాలసేపు సాత్యకితో పోరాడుతున్న కర్ణుడు, తన మీదికి అర్జునుడు విజృంభించి రావటం చూచాడు. అర్జునుడివైపు ముఖంపెట్టి, ఇటు తన మీద పరాక్రమాన్ని చూపటం సాత్యకి గమనించి, అర్జునుడి మీదికి కర్ణుడు పూర్తిగా విజృంభించకుండా తాను అడ్డుపడ్డాడు.

**తే. నవతిశరముల నవమార్గణముల శత శి । లీ ముఖంబుల నేసి దోర్లీల మెఱయ**
**సారథి ధ్వజహయరథసహితముగ ను । దీర్ణదర్పుఁడై కప్పె నక్కర్ణుఁ డధిప! 205**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; నవతి= తొంభై; శరములన్= బాణాలతోనూ; నవమార్గణములన్= తొమ్మిది; అమ్ములతోనూ; శత శిలీ ముఖంబులన్= వంద బాణాలతోనూ; ఏసి= కొట్టి; దోర్లీలన్= బాహువిలాసంతో; మెఱయన్= ప్రకాశింపగా; ఆ+కర్ణుఁడు= ఆ అంగరాజు; ఉదీర్ణ= గొప్పదైన; దర్పుఁడై= గర్వంకలవాడై; సారథి= సూతుడితో; ధ్వజ= జెండాతో; హయ= గుర్రాలతో; రథ= తేరితో; సహితముగన్= సమేతముగా; కప్పెన్= సాత్యకిని మరుగుపరిచాడు.

**తాత్పర్యం:** రాజా! కర్ణుడు విజృంభించిన గర్వంతో, తన బాహుబల విలాసం ప్రకాశించేటట్లుగా, నూటతొంబది తొమ్మిది బాణాలతో సాత్యకిని, సూతుని, జెండాను, గుర్రాలను, రథాన్ని కప్పివేశాడు.

**వ. అప్పుడు యుధామన్యుండును శిఖండియు ద్రౌపదేయులు నుత్తమౌజుండును యుయుత్సుండును గవలును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును బ్రభద్రకచేది కరూశ మాత్స్య కేకయవత్సబలసమేతంబుగా ధర్మనందన నోత్సాహదీపితాటోపశోభితులయి కవిసి వివిధాస్త్రశస్త్ర వ్రాతము లూసూత సూనుపయి నడరించిన నవ్వీరుండు. 206**

**ప్రతిపదార్థం:** అప్పుడు; యుధామన్యుండును= అర్జునుని ఎడమచక్రాన్ని కాపాడే పాంచాల రాజకుమారుడు; శిఖండియున్= శిఖండి అనే ద్రౌపది అన్నగారు; ద్రౌపదేయులున్= ద్రౌపది కుమారులయిన ఉపపాండవులూ; ఉత్తమౌజుండును= అర్జునుని కుడిచక్రాన్ని కాపాడే పాంచాలయోధుడు; యుయుత్సుండును= ధృతరాష్ట్రుని వైశ్యపత్నీ పుత్రుడు; కవలును= నకుల సహదేవులూ; ధృష్టద్యుమ్నుండును; చేకితానుండును; ప్రభద్రక చేది కరూశ, మాత్స్య కేకయ వత్స బల సమేతంబుగాన్= ప్రభద్రకం, చేది, కరూశం, మాత్స్యం కేకయం వత్సం- అనే దేశాల; బల= సైన్యాలతో; సమేతంబుగాన్= సహితంగా; ధర్మనందన= ధర్మపుత్రునియొక్క; ఉత్సాహ= ప్రయత్నంచేత; దీపిత= వెలిగిన, పెరిగిన; ఆటోప= విజృంభణంచేత; శోభితులు+ అయి= విలసిల్లుతున్నవారై; కవిసి= ఎదుర్కొని; వివిధ= రకరకములైన; అస్త్ర= మంత్రప్రయుక్తాలైన ఆయుధాలయొక్క; శస్త్ర= బలంతో ప్రయోగించే ఆయుధాలయొక్క; వ్రాతములు= గుంపులు; ఆ సూత సూనుపయిన్= ఆ కర్ణుడి మీద; అడరించినన్= ప్రయోగించగా; ఆ+వీరుండు= ఆ శూరుడైన కర్ణుడు.

**తాత్పర్యం:** ఆ సమయంలో యుధామన్యుడు, శిఖండి, ద్రౌపది కుమారులూ, ఉత్తమౌజుడూ, యుయుత్సుడూ, నకుల సహదేవులూ, ధృష్టద్యుమ్నుడూ, చేకితానుడూ, ప్రభద్రక, చేది, కరూశ, మాత్స్య కేకయ వత్స - దేశాల సైన్యాలతో కలిసి, యుధిష్ఠిరుడి ప్రోత్సాహంతో విపరీతంగా విజృంభించి కర్ణుడిని ఎదిరించి, పలురకాల అస్త్రాలనూ, ఆయుధాలనూ అతడిమీద ప్రయోగించారు. అపుడు ఆ కర్ణుడు.

**మ. అవి వేగంబ మరల్చి భూరిపవనవ్యాపారనిర్మర్దితా**
**టవులం బోలఁగఁ జేసి దంతిభటఘోటస్యందనశ్రేణులన్**
**దివిజవ్రాతము పిచ్చలింప రభసోద్రేకంబు రౌద్రంబుఁ బెం**
**ప విజృంభించె ధనుర్గుణధ్వని నభోభాగంబు భేదింపఁగన్. 207**

**ప్రతిపదార్థం:** అవి= ఆ శస్త్రాలను; వేగంబు+అ= వెంటనే; మరల్చి= మరలించి; దంతి= ఏనుగులయొక్క; భట= కాలిబంటులయొక్క; ఘోట= గుర్రాలయొక్క; స్యందన= రథాలయొక్క; శ్రేణులన్= వరుసలను; భూరి= పెద్ద; పవన= గాలియొక్క; వ్యాపార= వీచటంచేత; నిర్మర్దిత= నలగగొట్టబడిన; అటవులన్= అడవులకు; పోలఁగన్= సాటిఅయ్యేటట్లు; చేసి= కావించి; దివిజ= స్వర్గంలో జన్మించినవారైన దేవతలయొక్క; వ్రాతము= సమూహం; పిచ్చలింపన్= భయపడగా; రభస+ఉద్రేకంబు= త్వరయొక్క విజృంభణం; రౌద్రంబున్= (పగవారితో) కోపాన్ని; పెంపన్= వృద్ధిచేయగా; ధనుః= వింటియొక్క; గుణ= అల్లెత్రాటియొక్క; ధ్వని= మ్రోత; నభః= ఆకాశపు; భాగంబున్= ప్రదేశాన్ని; భేదింపన్= బ్రద్దలుచేయగా; విజృంభించెన్= చెలరేగాడు.

**తాత్పర్యం:** ఆ ఆయుధాలనన్నిటినీ కర్ణుడు వెంటనే త్రిప్పికొట్టాడు. రథ గజ తురగ పదాతి చతురంగ సైన్యాన్ని పెనుగాలి తాకిడికి కూలిపోయిన అడవులకు సాటిగా చేశాడు. అది చూచి (తమకు శత్రుపక్షంవాడైన కర్ణుడెక్కడ

గెలుస్తాడో అని) దేవతలు భయపడిపోయారు. అతడు ధనుష్టంకారం చేస్తూ ఉంటే దాని ధ్వనికి ఆకాశం బ్రద్దలై పోయింది. అట్లా అతడు విజృంభించాడు.

**మ. కని గాండీవధరుండు దర్ప మెసఁగం గర్ణాస్త్రజాలంబు నీ**
**సున వారించి శిలీముఖార్చులు పరిస్ఫూర్జత్ప్రభం బర్వఁ బే**
**ర్చినఁ గార్చి చ్చడరన్ మృగంబులు భయోద్రేకంబునం బాఱు చా**
**డ్పున నీమూఁకలు నల్గడం బఱచె నుద్భూతభ్రమార్తంబులై. 208**

**ప్రతిపదార్థం:** గాండీవ ధరుండు= గాండీవమనే ధనుస్సును ధరించిన అర్జునుడు; కని= కర్ణ విజృంభణంచూచి; దర్పము= గర్వం; ఎసఁగన్= వృద్ధికాగా; కర్ణ= కర్ణునియొక్క; అస్త్ర= ఆయుధాలయొక్క; జాలంబున్= సముదాయాన్ని; ఈసునన్= కోపంతో; వారించి= ఆపి; శిలీముఖ= బాణాలయొక్క; అర్చులు= కాంతులు; పరిస్ఫూర్జత్= భగభగలాడే; ప్రభన్= కాంతితో; పర్వన్= వ్యాపించగా; పేర్చినన్= విజృంభించగా; కార్చిచ్చు= దావానలం; అడరన్= చెలరేగగా; మృగంబులు= లేళ్ళు మొదలయిన అడవి జంతువులు; భయ= జడుపుయొక్క; ఉద్రేకంబునన్= ఆధిక్యంతో; పాఱు= పరిగెత్తే; చాడ్పునన్= పోలికతో; నీ మూఁకలు= నీ గుంపులు - కౌరవసైన్యాలు; ఉద్భూత= కలిగిన; భ్రమ= తిరుగుడువడుటచేత; ఆర్తంబులై= దుఃఖంతో పీడించబడినవై; నల్గడన్= నాలుగు దిక్కులకూ; పఱచెన్= పరుగుపెట్టాయి.

**తాత్పర్యం:** అర్జునుడు అది చూచి, కోపించి గర్వంతో విజృంభించి, కర్ణుడు ప్రయోగించిన ఆయుధాలు ఆపు చేశాడు. బాణప్రభలు భగభగలాడుతూ వ్యాపిస్తుండగా, అతిశయించిన దావానలం అలముకొనేసరికి మహాభయంతో పారిపోయే అడవిమృగాలవలె, కౌరవసేనలు తిరుగుడువడి బాధపడుతూ అన్ని వైపులకూ పరుగులు పెట్టాయి.

**వ. అంత నంశుమంతుం డపరగిరియవులకుం జనుటయు ధరాధూళికిఁ దోడు సంధ్యారాగ మిళితంబైన తిమిరంబు గవిసిన నెద్దియుం గానరామిం జిత్తంబులు గలంగ రాత్రి యుద్ధంబునకు నోహటించుటంజేసి మన దొరలఁ బాండవసైనికులు దఱిమినం దాల్మి వాటింపక తిరిగిపోయిరి. జయంబుసేకొని వీరి నవ్వుచు వారు గవ్వడిం గమలనాభునిం బ్రశంసించుచుం జని రవ్విధంబున నుభయసైన్యంబులు నిజశిబిరంబుల కరిగి విశ్రామంబు నొందె' నని చెప్పుటయు సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె. 209**

**ప్రతిపదార్థం:** అంతన్= అంతలో; అంశుమంతుండు= సూర్యుడు; అపరగిరి= పడమటికొండయొక్క; అవులకున్= అవతలివైపు; చనుటయున్= వెళ్ళినందువల్ల; ధరాధూళికిన్= నేల దుమ్ముకు; తోడు= సాయం; సంధ్యా= పగటికీ రాత్రికీ నడిమివేళలోని; రాగ= ఎరుపుతో; మిళితంబు+ఐన= కలిసినట్టి; తిమిరంబు= చీకటి; కవిసినన్= అలముకోగా; ఎద్దియున్= ఏ వస్తువూ ప్రాణీ దిక్కూ ఎత్తు పల్లము మొదలైనవి; కానరామిన్= చూడశక్యం కాకపోవటంవల్ల; చిత్తంబులు= మనస్సులు; కలంగన్= కలతచెందగా; రాత్రి యుద్ధంబునకున్= రాత్రివేళచేసే పోరాటానికి; ఓహటించుటన్+చేసి= వెనుదీసినందువల్ల; మన దొరలన్= మనరాజులను, పాండవసైనికులు; తఱిమినన్= పారిపోయేవారిని వెంబడించి తరుమగా; తాల్మి= ధైర్యము; పాటింపక= (మనదొరలు) వహింపక; తిరిగి= వెనుదిరిగి; పోయిరి= పారిపోయారు; జయంబు= గెలుపు; చేకొని= తీసికొని; వారు= పాండవసైనికులు; వీరిన్= మన దొరలను గురించి; నవ్వుచున్= పరిహాసం చేస్తూ; కవ్వడిన్= అర్జునుడినీ; కమలనాభునిన్= కృష్ణుడినీ; ప్రశంసించుచున్= పొగడుతూ; చనిరి= వెళ్ళారు; ఆ+విధంబునన్= అట్లా; ఉభయసైన్యంబులు= కౌరవ పాండవుల రెండు

సేనలు; నిజ= తమ తమ; శిబిరంబులకున్= దండువిడిసిన చోటులకు; అరిగి= వెళ్ళి; విశ్రామంబున్= విశ్రాంతిని; ఒందెన్= పొందాయి; అని= ఈ ప్రకారం; చెప్పుటయున్= చెప్పగా; సంజయునకున్= సంజయునితో; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్ర మహారాజు; ఇట్లు= ఇలా; అనియెన్= పలికినాడు.

**తాత్పర్యం:** అంతలో ప్రొద్దు క్రుంకింది. నేలమీది నుంచి లేచిన దుమ్ముకు సాయంకాలపు సంధ్యాసమయంలోని ఎరుపుతో కలిసిన చీకటి తోడై అలముకొన్నది. అందువలన కనులు కనిపించటం మానేశాయి. కనుక మన దొరల మనస్సులు కలతచెందాయి. అందుచేత వారు రాత్రి యుద్ధానికి వెనుదీశారు. దాని కారణంగా పాండవసైనికులు వారిని తరిమికొట్టారు. అపుడైనా వారు ధైర్యంతో నిలబడక, పారిపోయారు. అట్లా కర్ణుడి మొదటినాటి యుద్ధంలో గెలుపు పాండవసైనికుల దయింది. అందువలన వారు మన దొరలను వేళాకోళంచేస్తూ, అర్జునుడినీ, కృష్ణుడినీ పొగడుతూ, వెళ్ళిపోయారు. అట్లా రెండు సైన్యాలూ తమ విడిదిపట్లకు వెళ్ళి విశ్రాంతి తీసికొన్నాయి - అని చెప్పేసరికి ధృతరాష్ట్రుడు అతడితో ఇట్లా అన్నాడు:

**ఉ. 'తెల్లము మిమ్ము నందఱ వధింపఁగ నయ్యమరేంద్రనందనుం**
**డొల్లక పోక వాఁడు దన యుగ్రత సూపెద నన్న మీమహీ**
**వల్లభు వారి కేల? యమవహ్నుల కైనను రూపుతోడఁ బోఁ**
**జెల్లదు గాన తద్భుజవిశేషము రూఢము గాదె సంజయా! 210**

**ప్రతిపదార్థం:** సంజయా!= ఓ సంజయా! ఆ= ప్రసిద్ధుడైన; అమరేంద్ర నందనుండు= దేవేంద్ర పుత్రుడైన అర్జునుడు; మిమ్మున్= దుర్యోధనుని పక్షంవారిని; అందఱన్= ఎల్లరినీ; వధింపఁగన్= చంపటానికి; ఒల్లక= ఇష్టపడక; పోక= వెళ్ళిపోవటం; తెల్లము= స్పష్టమవుతున్నది; వాఁడు= ఆ అర్జునుడు; తన+ఉగ్రతన్= తన తీక్ష్ణత్వాన్ని; చూపెదన్= చూపిస్తాను; అన్నన్= అనుకొనిన పక్షంలో; మీ మహీవల్లభువారికిన్+ఏల?= మీ భూపతి, దుర్యోధనుడి పక్షంవారికే అనటం ఎందుకు?; యమవహ్నులకున్+ఐనను= యముడికీ, అగ్నికీ ఐనప్పటికీ; రూపుతోడన్= దేహంతో; పోన్= తిరిగి ఇంటికి వెళ్ళటానికి; చెల్లదు= శక్యంకాదు; కాన= అందువల్ల; తద్+భుజవిశేషము= అతని బాహువులయొక్క ప్రత్యేకత; రూఢము+కాదు+ఎ!= ప్రసిద్ధం కాదా!.

**తాత్పర్యం:** 'ఓ సంజయా! ఇప్పుడు నీవు చెప్పిన దానినిబట్టి అర్జునుడు దుర్యోధనుడివైపువారినందరినీ నాడే చంపటం ఇష్టంలేక తిరిగివెళ్ళిపోయాడు కాని, వాడు ఆనాడే తన శక్తిని పూర్తిగా చూపించదలచుకొంటే, దుర్యోధనుడే కాదు - యముడూ, అగ్నీకూడా తిరిగి తమ శరీరాలతో ఇళ్ళకు వెళ్ళలేరు. అతడి బాహుబలంయొక్క విశిష్టత సందేహం లేకుండా రూఢి అయింది కదా.

**విశేషం:** అర్జునుడు అమరేంద్ర నందనుడు, దుర్యోధనుడు భూపతి మాత్రుడు అనటం చేతనే అర్జునుడి విశిష్టత స్పష్టం అవుతున్నది. యమవహ్నులకైనా అని పేర్కొనటం సాభిప్రాయం. అందరి ప్రాణాలు తీసేవాడు యముడు. ఎవరినైనా దేనినైనా కాల్చగలవాడు వహ్ని. వారికి కూడా స్వశరీరాలతో తిరిగి వెళ్ళటం అశక్యం అనటం అర్జునుని పరాక్రమానికీ ధృతరాష్ట్రుడి నైరాశ్యానికీ నిదర్శనం.

**సీ. యాదవ వీరచయంబు నాటోప స। ముద్రేక ముడిపి సుభద్రఁ దెచ్చె**
**ఖాండవం బాహుతిగా లీల నొనరించి। సప్తార్చి నత్యంత తృప్తుఁ జేసె**
**శబరవేషముఁ దాల్చి చనుదెంచి తొడరిన। శివునితోఁ బెనఁగి మెచ్చించె నతని**
**గంధర్వుచేఁ బడ్డ కౌరవసత్తము। విడిపించె లావును వెరవు మెఱయఁ**

**ఆ. గాలకేయకులముఁ గాలునిప్రోలికి। ననిచె నఖిల నృపుల ననికి నియ్యు**
**కొలిపెఁ గ్రీడి జగము గొనియాడ నేక కో। దండ చండ విలసితమునఁ గాదె!** 211

**ప్రతిపదార్థం:** క్రీడి= కిరీటి, అర్జునుడు; జగము= లోకం; కొనియాడన్= పొగడగా; ఏక= ఒక్క; కోదండ= ధనుస్సుయొక్క; చండ= తీక్ష్ణమైన; విలసితమునన్+కాదె!= విలాసంచేతగదా!; యాదవ= యదువంశీయులైన; వీర= వీరులయొక్క; చయంబు= సమూహంయొక్క; ఆటోప= వేగిరంతోకూడిన; సముద్రేకము= పూర్తి క్రోధాన్ని; ఉడిపి= పోగొట్టి; సుభద్రన్= కృష్ణుడి చెల్లెలిని; తెచ్చెన్= (బలరామాదుల సమ్మతిలేకుండా) తీసుకొని వచ్చాడు; ఖాండవంబు= ఖాండవవనాన్ని; లీలన్= విలాసంతో; ఆహుతి+కాన్= హోమద్రవ్యం అయ్యేటట్లు; ఒనరించి= చేసి; సప్త+అర్చిన్= ఏడు జిహ్వలుగల అగ్నిని; అతి+అంత= మిక్కిలి; తృప్తున్= తనివి చెందినవాడిని; చేసెన్= కావించాడు; శబర= కిరాతునియొక్క; వేషమున్= రూపాన్ని; తాల్చి= ధరించి; చను+తెంచి= వచ్చి; తొడరిన= ఎదిరించిన; శివునితోన్= శంకరుడితో; పెనఁగి= పోరాడి; అతనిన్= శంకరుని; మెచ్చించెన్= మెచ్చుకొనజేశాడు; గంధర్వు= గంధర్వుడైన చిత్రసేనునియొక్క; చేపడ్డ= చేతిలో పడిన, కౌరవసత్తమున్= కౌరవశ్రేష్ఠుడైన దుర్యోధనుడిని; లావును= బలము; వెరవున్= ఉపాయము; మెఱయన్= ప్రకాశించేటట్లు; విడిపించెన్= విముక్తుడిని చేశాడు; కాలకేయకులమున్= కాలకేయులనే రాక్షసవంశాన్ని; కాలుని ప్రోలికిన్= యముని పట్టణానికి; అనిచెన్= పంపించాడు, సంహరించాడు; అఖిల నృపులన్= సమస్తమైన రాజులను; అనికిన్= యుద్ధానికి; ఇయ్యకొలిపెన్= అంగీకరింపజేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ప్రపంచమంతా మెచ్చుకొనేటట్లు తన ఒక్క ధనుస్సు ఆధారంగానే కదా! - యాదవవీరుల విజృంభణం తగ్గించి సుభద్రను తీసికొని వచ్చాడు, ఖాండవవనాన్ని అవలీలగా హవిస్సువలె దహింపజేసి అగ్నిని పూర్తిగా సంతృప్తిపరచాడు, ఈశ్వరుడు కిరాతరూపంలో వచ్చి డీకొంటే అతడితో యుద్ధంచేసి అతడి మెప్పు పొందాడు, చిత్రసేనుడనే గంధర్వుడికి బందీ అయిన దుర్యోధనుడిని తన బలంతో, ఉపాయంతో విడిపించాడు, కాలకేయరాక్షసవంశాన్ని సంహరించాడు, రాజులనందరినీ యుద్ధాని కంగీకరింపజేశాడు!

**విశేషం:** నిజానికి పాండవులమీద అసూయ కల ధృతరాష్ట్రుడు అర్జునుడిని ప్రశంసించిన తీరు సత్యమై అతడి పరాక్రమానికి పెద్ద నిష్పాక్షికమైన సాక్ష్యంగా ఉన్నది, కర్ణార్జునుల తారతమ్యాన్ని తెలుపుతున్నది. కర్ణుడు యాదవులను గెలువలేదు - అర్జునుడు గెలిచాడు. యాదవుల సుభద్రను వారి అభిప్రాయానికి వ్యతిరేకంగా అర్జునుడు తీసికొనిరాగలిగితే, కర్ణుడు దుర్యోధనుడి కూతురిని సాంబుడితో సహా బలరాముడికి జడిసి వారికి అప్పగించవలసి వచ్చింది. శివుడిని మెప్పించటం కర్ణుడిపట్ల కాని, మరే కౌరవులలోకాని లేదు. కర్ణుడితో సహా కౌరవవీరులను ఓడించిన గంధర్వుడు చిత్రసేనుడిని, అర్జునుడు శక్తియుక్తు లుపయోగించి, గెలిచి, దుర్యోధనుడిని విడిపించాడు. కాలకేయుల వంశాన్ని నశింపజేయటం దేవతలకు కూడా అలవికానిది - అర్జునుడు సాధించాడు. ఇట్టిపని కౌరవుల పక్షంలో చేసినవాడు లేడు. కనుక అర్జునుడి చేతిలో ఓటమి లజ్జావహం కాదని తరువాతి వచనంలో ధృతరాష్ట్రుడనటం ఎట్లా చూచినా సమంజసమే.

**వ. కావున మనవారికి నోటమి యక్కిరీటి వలనం గలిగె నను కలుచ వారి గర్వింపం దగ దట్టి జెట్టితోడం బెనంగుటఁ బ్రశంసకుందగుదురు పదంపడి వారేమిసేసి' రనిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.** 212

**ప్రతిపదార్థం:** కావునన్= అందువల్ల; మనవారికిన్= మనపక్షంవారికి; ఓటమి= అపజయం; ఆ+కిరీటివలనన్= అటువంటి అర్జునుడివలన; కలిగెన్= సంభవించింది; అను= అనే; కలుచన్= కలతవల్ల; వారిన్; గర్హింపన్= నిందించటం; తగదు= యుక్తంకాదు; అట్టి= అటువంటి, అంతటి; జెట్టితోడన్= శూరుడితో; పెనంగుటన్= యుద్ధంచేసినందువల్ల; ప్రశంసకున్= పొగడ్డకు; తగుదురు= అర్హులు; పదంపడి= తరువాత; వారు= కౌరవులు; ఏమి; చేసిరి; అనినన్= అని అడుగగా; ధృతరాష్ట్రునకు(న్)= ధృతరాష్ట్ర మహారాజుతో; సంజయుడు; ఇట్లు; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** అందువలన అంతటి అర్జునుడివలన మనవారు ఓడిపోయారన్న కలతతో వారిని నిందించటం యుక్తం కాదు. అంతటి శూరుడితో యుద్ధంచేశారంటేనే ప్రశంసించదగిన విషయం. ఆ తరువాత మనవారేమి చేశారో చెప్పుము'. అని అడిగేసరికి, సంజయుడు ధృతరాష్ట్రమహారాజుతో క్రిందివిధంగా చెప్పుతున్నాడు.

**ఆ. అట్లు దివిసిపోయి యాటుఁ బోటు నొడళ్ళఁ । గలయఁ గలిగి డప్పి గదిరి సొలయు**
**దొరలుఁ దాను నపుడు దుర్యోధనుఁడు విచారాభి యుక్తినున్న యవసరమున. 213**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆవిధంగా; తివిసి= మరలి, వెనుదీసి; పోయి= వెళ్ళి; ఆటున్+పోటున్= (బాధయొక్క) తగ్గ హెచ్చులు; కలయన్+కలిగి= మిశ్రమంగా కలిగినందున; డప్పి= దాహం; కదిరి= హెచ్చి; సొలయు= ఒడళ్ళు పట్లు తప్పుతూ బాధపడుతున్న; దొరలున్= రాజులు; తానున్= తానూ, దుర్యోధనుఁడు= దుర్యోధనుడు; అపుడు; విచార+అభియుక్తిన్= ఆలోచనలోని ఆసక్తితో; ఉన్న; అవసరమునన్= సమయంలో.

**తాత్పర్యం:** అట్లా వెనుదీసివెళ్ళిన తరువాత శరీరాలలో బాధలు తగ్గుతూ హెచ్చుతూ ఉండగా, దప్పిక ఎక్కువై ఒడళ్ళు పట్లు తప్పుతున్న రాజులు దుర్యోధనుడు ఆలోచనచేస్తున్న సమయంలో.

**వ. పార్థుదెసఁ బలుకుపుట్టినం గ్రోధంబున నూర్పులు సందడింపఁ గర్ణుఁడు భగ్నదంష్ట్రంబయి విషంబులేని భుజంగంబునుం బోల్పం దగి పరాజయంబు నొంది దీనదశకు వచ్చియున్న యారథిక వరులం గలయం గనుంగొని కౌరవేశ్వరున కిట్లనియె. 214**

**ప్రతిపదార్థం:** పార్థుదెసకున్= అర్జునుని దిక్కున, అర్జునుని గురించి; పలుకు= మాట; పుట్టినన్= కలుగగా, రాగా; కర్ణుఁడు= అంగరాజు; క్రోధంబునన్= కోపంతో; ఊర్పులు= నిట్టూర్పులు; సందడింపన్= అధికంకాగా; భగ్న= విరిగిన; దంష్ట్రంబు= కోరలు కలది; అయి; విషంబులేని= గరళంలేని; భుజంగంబును= పామును; పోల్పన్= సాటితేవటానికి; తగి= అర్హుడై; పరాజయంబున్= ఓటమిని; ఒంది= పొంది; దీనదశకున్= శోచనీయస్థితికి; వచ్చి+ఉన్న= వచ్చి ఉండిన; ఆ రథికవరులన్= రథికులలో శ్రేష్ఠులైనవారిని; కలయన్= అందరినీ కలియునట్లు, ఒక్కసారి; కనుంగొని= చూచి; కౌరవేశ్వరునకున్= కురువంశీయుడైన రాజు దుర్యోధనుడితో; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** అర్జునుని గురించిన మాట రాగానే, కర్ణుడికి అర్జునుడిమీద కోపంవలన నిట్టూర్పులు ఎక్కువై, కోరలు విరిగి విషములేని పామువంటివాడై - ఓడిపోయి దీనంగా ఉన్న రథికోత్తముల నందరిని ఒక్కసారి కలయచూచి, దుర్యోధనుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

ఆ. 'అలవు వెరవుఁ దలఁపఁ గలఁ డితం డన వాసి । కెక్కి నట్టి రథికుఁ డక్కిరీటి
వలయు నెడల నతని వాసుదేవుండు బో । ధించు నెల్ల తెఱఁగుఁ దేటపడఁగ. 215

**ప్రతిపదార్థం:** ఆ+కిరీటి= ఆ అర్జునుడు; తలఁపన్= ఆలోచింపగా; "ఇతఁడు= ఈ అర్జునుడు; అలవున్= శక్తీ; వెరవున్= యుక్తీ; కలఁడు= కలవాడు"; అనన్= అని అందరూ పలుకగా; వాసికెక్కినట్టి= పేరుపొందినటువంటి; రథికవరుఁడు= రథికులలో శ్రేష్ఠుడు, వాసుదేవుడు= కృష్ణుడు; వలయు= అవసరమైన, కావలసిన; ఎడలన్= సమయాలలో; ఎల్ల= సమస్తమైన; తెఱఁగున్= పద్ధతినీ; తేటపడఁగన్= విశదమయ్యేటట్లు; అతనిన్= అర్జునునికి; బోధించున్= తెలియజేస్తాడు.

**తాత్పర్యం:** 'ఇతడు శక్తియుక్తులు కలవాడు' అని పేరు పొందిన రథికశ్రేష్ఠుడు అర్జునుడు. దానికి తోడు శ్రీకృష్ణుడు అవసరమైనప్పుడు అతడికి అన్ని పద్ధతులు స్పష్టమయ్యేటట్లు వివరిస్తూ ఉంటాడు.

**విశేషం:** కర్ణుడు వట్టి సమయాలలో 'వాయపురజ్జులాఁడు' అనిపించుకొన్నా సమయం వచ్చినపుడు, అందులోనూ, సేనానాయకుడుగా ఉన్నపుడు తన శక్తినీ, ఎదిరిశక్తినీ సరిగానే తూకం వేస్తాడు. తన వైఫల్యానికి కృష్ణుడితో సమానుడయిన సారథి తనకు లేకపోవటం కారణమనటానికి ఇది నాంది.

క. అనిమిషనాథుం డిచ్చిన । ఘనశక్తికి నసుర నొడ్డి గాండివిఁ దొలఁ గిం
చిన హరి వంచన పదపడి । మన మెల్లను దెలియ వినమె? మనుజాధీశా! 216

**ప్రతిపదార్థం:** మనుజ+అధి+ఈశా!= నరేశ్వరా?, రాజా!, దుర్యోధనా!; అనిమిషనాథుండు= దేవేంద్రుడు; ఇచ్చిన= నాకు (కవచకుండలాలిచ్చిన సమయంలో అందుకు ప్రతిగా) ఇచ్చినటువంటి; ఘనశక్తికిన్= (ఎవరిమీద ప్రయోగిస్తే వారెంతటివారైనా వారినొకరిని మాత్రం తప్పక సంహరించగల; అర్జునుడికోసం అట్టేపెట్టిన) గొప్ప శక్తికి; అసురుడైన ఘటోత్కచుని; ఒడ్డి= అడ్డముగా పెట్టి; గాండివిన్= అర్జునుని; తొలఁగించిన= ఆ శక్తినుంచి తప్పించిన; హరి= కృష్ణునియొక్క; వంచన= మోసం; పదపడి= అది జరిగిన తరువాత; తెలియన్= తెలియగా; మనము+ఎల్లను= మనమందరము; వినము+ఎ?= విన్నాము కాదా?

**తాత్పర్యం:** రాజా! దేవేంద్రుడు నాకు గొప్పశక్తి నిస్తే నేను దానిని అర్జునుడికొరకు అట్టేపెడితే, దానికి ఘటోత్కచుడిని అడ్డంపెట్టి, అర్జునుడిని తప్పించి, కృష్ణుడు చేసిన మోసం ఆ తరువాత మనమంతా విన్నాము కదా!

**విశేషం:** కర్ణుడి మాటనేర్పూ, లోకస్వభావమూ ఈ పద్యంలో తెలుస్తున్నాయి. ఘటోత్కచుడు సర్వనాశనం చేస్తూ ఉంటే కౌరవ పక్షీయులందరూ ప్రయోగించుమని కోరితే కర్ణుడు ప్రయోగించాడు. 'దానితో అర్జునుడిని చంపి ఉండేవాడిని. కృష్ణుడు మోసంచేశాడు. అర్జునుడిని చంపనిచ్చాడు కాదు' అంటున్నాడు.

క. అగుఁగాక యతని నాతని । మగఁటిమియును నేర్పునెల్లి మాన్చెద నీ కుం
బగ యనియెడు మాటయు ని । జ్జగమునఁ గలుగంగనీను జగతీనాథా!' 217

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= భూపతీ దుర్యోధనా!; అగుఁగాక= అట్లాగేకానీ; అతనిన్= ఆ అర్జునుడినీ; ఆతని= ఆ అర్జునుడియొక్క; మగటిమియును= పౌరుషమూ; నేర్పున్= చాతుర్యమూ; ఎల్లి= రేపు; మాన్చెదన్= పోగొట్టుతాను; నీకున్= (నా వంటివాని మిత్రుడవయిన) నీకు; పగ= విరోధం; అనియెడు= అనే; మాటయున్= మాటకూడా; ఈ+జగమునన్= ఈ లోకంలో; కలుగఁగన్+ఈను= ఉండనివ్వను, ఇకపై పుట్టనివ్వను.

**తాత్పర్యం:** అట్లాగే కానిమ్ము, రాజా!, ఆ అర్జునుడినీ, అతడి పౌరుషాన్నీ, నేర్పునీ రేపు లేకుండా చేస్తాను. ఈ లోకంలో నీకు (పగవాడినే కాదు) పగ అనే మాటే ఉండనివ్వను, పుట్టనివ్వను.'

## కర్ణుని రెండవ నాఁటి యుద్ధము (సం. 8-22-10)

**వ. అనినం బ్రియం బంది నీనందనుం డతనిం దగువారలను నిజనివాసంబులకుం బోవం బనిచి తానును నభ్యంతర మందిరంబున కరిగె నారాత్రి సుఖనిద్ర సేసి రేపకడ సమస్త జనంబులు సంగ్రామంబునకు నడచి రంత నక్కడ నుక్కుమిగిలి పాండవబలంబులుం దోతెంచె ధర్మనందనుండు బృహస్పతి మతంబున దుర్జయ వ్యూహంబు పన్నించినం జూచి మనవారును దానికిం బ్రతిగా మోహరించుటకై రాధేయు రాకకు నెదురు చూచుచు నొకభంగిం బన్ని' రనిన విని యాంబికేయుండు. 218**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇట్లా చెప్పగా; ప్రియంబు+అంది= ప్రీతి పొంది; నీ నందనుండు= నీ కుమారుడైన దుర్యోధనుడు; అతనిన్= కర్ణుడినీ; తగువారలను= తగినవారినీ; నిజ= తమతమ; నివాసంబులకున్= విడిది పట్టులకు; పోవన్= వెళ్ళటానికి; పనిచి= సెలవిచ్చి; తానును= స్వయంగా తానూ; అభ్యంతర= లోపలి; మందిరమునకున్= నివాసానికి; అరిగెన్= వెళ్ళాడు; సమస్త జనంబులు= ఎల్ల జనులూ; ఆ రాత్రి= నాటి రాత్రి; సుఖ= సుఖకరమైన; నిద్ర+చేసి= నిద్రపోయి; రేపకడ= ఉదయమే; సంగ్రామంబునకున్= యుద్ధానికి; నడిచిరి= వెళ్ళారు; అంతన్= అంతలో; ఆ+కడన్= పాండవ పక్షంలో; ఉక్కుమిగిలి= బలం అతిశయించి; పాండవ బలంబులున్= పాండవుల సైన్యాలూ; తోతెంచెన్= కనిపించాయి; ధర్మనందనుండు= ధర్ముని పుత్రుడైన యుధిష్ఠిరుడు; బృహస్పతి= దేవమంత్రి అయిన బృహస్పతియొక్క; మతంబునన్= అభిప్రాయం ప్రకారం; దుర్జయ వ్యూహంబు= దుర్జయమనే మొగ్గరం; పన్నించినన్= ఏర్పాటు చేయించగా; చూచి; మనవారును= మన పక్షంలోనివారు; దానికిన్= ఆ దుర్జయ వ్యూహానికి; ప్రతిగాన్= ఎదిరిగా, సాటిగా; మోహరించుటకై= పన్నటంకోసం; రాధేయు= కర్ణునియొక్క; రాకకున్= రావటానికి; ఎదురుచూచుచున్= నిరీక్షణచేస్తూ; ఒక భంగిన్= ఒక రీతిగా; పన్నిరి= మోహరించారు; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; ఆంబికేయుండు= అంబిక కుమారుడయిన ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** ఆవిధంగా కర్ణుడు చెప్పేసరికి నీ కొడుకు దుర్యోధనుడు చాలా సంతోషించాడు. కర్ణుడినీ, తాను చెప్పదగిన వారినీ 'మీ నివాసాలకు వెళ్ళం' డని పంపించాడు. తానూ లోపలినివాసానికి వెళ్ళాడు. అందరూ ఆ రాత్రి సుఖంగా నిద్రపోయారు. మర్నాడు ప్రొద్దున్నే యుద్ధానికి అందరు బయలుదేరారు. ఇక ఆ పాండవపక్షంలో సైన్యాలు బలం అతిశయించినట్లు అగుపించగా ధర్మపుత్రుడు బృహస్పతి అభిప్రాయానుగుణంగా దుర్జయవ్యూహం మోహరింపజేశాడు. దానిని చూచి, మనవారు దానికి దీటుగా వ్యూహం పన్నటంకొరకు కర్ణుడు ఎప్పుడు వస్తాడా- అని ఎదురు చూస్తూ అందాకా ఒక మాదిరి మొగ్గరంగా ఏర్పడ్డారు' అని చెప్పాడు. అది విని ధృతరాష్ట్రుడు.

**క. శీతార్తజనంబులు ప్ర । ద్యోతను నుదయంబు గోరుచున్న కరణిఁ దా**
**నేతేరఁ గోరు జనులకు । నాతఁడు నిజ తేజమునఁ బ్రియం బొసఁగెనొకో? 219**

**ప్రతిపదార్థం:** శీత= చలిచేత; ఆర్త= పీడితులైన; జనంబులు= జనులు; ప్రద్యోతను= సూర్యునియొక్క; ఉదయంబు; కోరుచున్= కావాలనుకొంటూ; ఉన్న= ఉండిన; కరణిన్= రీతిగా; తాను= కర్ణుడు; ఏగు+తేరన్= రావటానికి, రావటం; కోరు= కాంక్షించే; జనులకున్; ఆతఁడు= కర్ణుడు; నిజతేజమునన్= తన పరాక్రమంతో; ప్రియంబు= ప్రీతిని; ఒసఁగెనొకో?= ఇచ్చాడా, కలిగించాడా?

**తాత్పర్యం:** 'చలితో బాధపడుతున్న వాళ్ళు ప్రొద్దు పొడుపుకోసం ఎదురుచూస్తున్నట్లుగా తన రాకకొరకు ఎదురుచూస్తున్న వారికి కర్ణుడు తన పరాక్రమంతో సంతోషం కలిగించాడా?

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. సూర్యుడు తన తేజస్సుతో చలిని పోగొట్టి వెచ్చదనాన్నిస్తాడు. ఓటమితో బాధపడుతున్న జనానికి ఆ బాధను పోగొట్టి కర్ణుడు తన తేజస్సుతో (పరాక్రమంతో) సంతోషం కలిగించాడా? కాంతీ, పరాక్రమమూ అన్న అర్థాలు కల తేజశ్శబ్దప్రయోగం ఇక్కడ రమణీయం.

**ఉ. అమ్మెయి ధర్మనందనుని యగ్గలికం దొలునాఁడు రాజు బ**
**న్నమ్ములపాటు సూచుచు రణంబుకడంక దొఱంగి చన్న బం**
**టెమ్మెయి నద్దినంబున నహీనపరాక్రమలీల సూపెనో**
**తమ్ము నెఱుంగరేమియు నతండును నాతఁడు నేమి సేయుదున్? 220**

**ప్రతిపదార్థం:** ఆ+మెయిన్= ఆ విధంగా; ధర్మనందనుని= ధర్మపుత్రుడైన యుధిష్ఠిరునియొక్క; అగ్గలికన్= విజృంభణంతో; తొలునాఁడు= తాను సేనా నాయకత్వం వహించిన మొదటి రోజు; రాజు= తన ఏలిక అయిన దుర్యోధనునియొక్క; బన్నమ్ములపాటు= కష్టాలు పడటం; చూచుచున్= చూస్తూ; రణంబు= యుద్ధంయొక్క; కడంక= పూనిక; తొఱంగి= విడిచి; చన్న= వెళ్ళిన; బంటు= వీరుడు; ఏ+మెయిన్= ఏ రీతిగా; ఆ+దినంబునన్= రెండవనాడు; అహీన= గొప్ప; పరాక్రమ= విక్రమంయొక్క; లీల= విలాసం; చూపెనో= చూపించాడో; అతండును= కర్ణుడు; ఆతఁడున్= దుర్యోధనుడు; తమ్మున్= తమగురించి కూడా; ఎఱుంగరు= తెలిసినవారు కారు; ఏమి+చేయుదున్= నేను ఏమిచేయాలి?

**తాత్పర్యం:** కర్ణుడు తాను సేనా నాయకుడుగా ఉండి యుద్ధం నడిపిస్తున్న మొదటినాడే యుధిష్ఠిరుడు విజృంభించి, ఎవరినో కాదు రాజు దుర్యోధనుడిని అన్ని బాధలు పెట్టితే, కళ్ళారా చూచి కూడా అడ్డలేక తప్పించుకొన్న వీరుడు, ఆ రాజుకు నమ్మిన బంటు, రెండవనాడు మహాపరాక్రమం చూపించాడా? ఈ కర్ణదుర్యోధనులకు తమశక్తి ఏమిటో తమకు తెలియదు. ఇక వీళ్ళను కాపాడటానికి నేను చేయగలిగింది ఏమున్నది?

**విశేషం:** ధృతరాష్ట్రుడికి ఈ దశలో కలిగిన నిరాశా, తన కుమారుడి మూర్ఖత్వం మీదా, అతడిని ఎగసన ద్రోసినవారి నిష్ప్రయోజకత్వం మీదా కలిగిన ఏవమూ మరెన్నడూ కలుగలేదు. 'తమ్మున్ ఎఱుంగరు' అనటంలో 'న్' తో తిక్కన్నగారు మహార్థాన్ని సాధించారు. ఎవరికైనా ఎదుటివారి శక్తి ఎంతటిదో తెలియదంటే అర్థం చేసికొనవచ్చును; వీళ్ళకు ధర్మజాదుల శక్తి సరిగా తెలియలేదు. పోనీ, తమ శక్తి ఏ పాటిదో అది అయినా తప్పక తెలిసి ఉండాలి కదా! 'వీళ్ళ కది కూడా తెలియక చెడిపోతున్నారు' అని బాధ. అట్లాగే రాజు బంటు పదాల ప్రయోగం. ఎంతమైత్రీ అభేదభావమూ చూపినా, దుర్యోధనుడు రాజు, కర్ణుడు బంటు. బంటుపని ప్రాణాలిచ్చి అయినా తన రాజు మానప్రాణాలు కాపాడటం. ఈ కర్ణుడు దుర్యోధనుడి అవమానమూ, ప్రాణాలు పోయే పరిస్థితి చూచి కూడ తప్పించుకొని పోయాడు కాని, చేసిందేమీ లేదు. ఇతడి మీద నమ్మకం దుర్యోధనుడికి. ఈ కర్ణుడు ఘోషయాత్రలోనూ ఇంతే చేశాడు. అవతలి వాడు గంధర్వుడు కదా అని సరిపెట్టుకొని ఉండాలి. అలా చేయలేదు. ఈ కర్ణుడు అప్పుడూ అంతే - ఇప్పుడూ అంతే. 'ఏమి చేయుదున్' అని బాధపడటం కంటే నేను చేయదగింది ఏముంది అన్నది ధృతరాష్ట్రుని అభిప్రాయం, అసహాయత.

**తే. కర్ణుఁ డట్టె? కలనఁ గౌంతేయ వర్గంబుఁ । గృష్ణయుతముగాఁగ గెలవఁ జాలు**
**నేమి సెప్పఁ గలదు? మీ మానవేంద్రుని చిత్తమాంధ్య మతనిఁ జెఱుపకున్నె? 221**

**ప్రతిపదార్థం:** కర్ణుఁడు+అట్టె?= కర్ణుడటే= కర్ణుడా?; కలనన్= యుద్ధంలో; కౌంతేయ వర్గంబున్= కుంతీపుత్రుల పక్షాన్ని; కృష్ణయుతము+కాఁగన్= కృష్ణుడితోపాటుగా; గెలువన్+చాలున్= జయించటానికి సమర్థుడవుతాడు; చెప్పన్= చెప్పటానికి; ఏమికలదు?= ఇంకేమున్నది; మీ మనుజపతి= మీ రాజు దుర్యోధనుడియొక్క; చిత్త= మనస్సుయొక్క; మాంద్యము= జడత్వము; అతనిన్= దుర్యోధనుని; చెఱుపకున్నె?= సంహరించకుండా ఉంటుందా?

**తాత్పర్యం:** కర్ణుడు పాండవపక్షాన్ని కృష్ణునితో కూడ యుద్ధంలో జయించగలుగుతాడా? దుర్యోధనుడి మనస్సు మందగించింది. అది అతడిని నాశనం చేయకుండా ఉంటుందా?

**క. సౌబలు నీతియుఁ గర్ణు భు । జాబలమును గూడి తనకు సామ్రాజ్యం బీఁ**
**గా బలసి వెలయు వాఁడై । యా బే లూఱడు మనంబునం దేప్రొద్దున్. 222**

**ప్రతిపదార్థం:** సౌబలు= సుబలుని కొడుకైన శకునియొక్క; నీతియున్= కపటనీతి; కర్ణు= అంగరాజుయొక్క; భుజాబలమును= భుజబలము; కూడి= కలిసి; తనకున్= దుర్యోధనుడికి; సామ్రాజ్యంబు= చక్రవర్తిత్వాన్ని, విశాలమైనరాజ్యాన్ని; ఈఁగాన్= ఈయగా; బలసి= అతిశయించి; వెలయువాఁడు+ఐ= విలసిల్లేవాడై; ఆ బేల= ఆ అవివేకి దుర్యోధనుడు; మనంబునందున్= మనస్సులో; ఏ ప్రొద్దున్= ఎల్లప్పుడూ; ఊఱడున్= ఊరడిల్లుతూ ఉంటాడు.

**తాత్పర్యం:** ఆ అవివేకి దుర్యోధనుడు, శకుని కపటనీతీ, కర్ణుని బాహుబలమూ తనకు విశాల సామ్రాజ్యాన్ని తెచ్చిపెట్టుతాయని మనస్సులో ఎల్లప్పుడూ ఊరడిల్లుతూ ఉంటాడు.

**క. జూదంబునాఁడు మొలచిన । యాదుర్దశ పెరిఁగి సంజయా! నిర్భర దుః**
**ఖోదయపరంపరా సం । పాదినియై మనసునిట్లు పఱిగొనియెడినే? 223**

**ప్రతిపదార్థం:** సంజయా!; జూదంబునాఁడు= జూదమాడిననాడు; మొలచిన= పుట్టిన; ఆ దుః+దశ= ఆ చెడుదశ; పెరిఁగి= పెద్దదై; నిర్భర= నిండైన; దుఃఖ+ఉదయ= దుఃఖాల పుట్టుకలయొక్క; పరంపరా= వరుసలను; సంపాదిని+ఐ= సమకూర్చేది అయి; మనసున్= మనస్సును; ఇట్లు= ఈ విధంగా; పఱిగొనియెడినే= బ్రద్దలు చేస్తుందా?

**తాత్పర్యం:** సంజయా! జూదమాడిననాడు పుట్టింది దుర్దశ. అది క్రమంగా పెరుగుతూ దుఃఖం తరువాత దుఃఖాన్ని తెచ్చిపెడుతూ మనస్సును బ్రద్దలు చేస్తున్నది. ఇది ఇంత బాధపెడుతుందా?

**విశేషం:** అంతవరకూ జీవితం ఒక రాతిభవనంవలె సుఖంగా ఉన్నది. రాతిభవనం మీద రావిమొక్క మొలచినట్టు ఈ జీవితంలో దుర్దశ జూదంనాడు ప్రారంభమయినది. మొక్క పెరుగుతూ ఉంటే భవనం బీటలు వారుతూ ఉంటుంది. ఈ పరిస్థితిని గమనించే ధృతరాష్ట్రుడు బాధపడుతున్నాడు.

**క. దుర్యోధనుచేసిన యవ । కార్యంబున వచ్చినట్టి కష్టంబులు దా**
**త్పర్యంబున వినియెదఁ బ్రతి । కార్యంబులు గామి మనసు గందుచునుండన్. 224**

**ప్రతిపదార్థం:** దుర్యోధను చేసిన= దుర్యోధనుడు కావించిన; అవకార్యంబునన్= చెడు పనిచేత; వచ్చినట్టి కష్టంబులు= కలిగిన కష్టాలు; తాత్పర్యంబునన్= తత్పరత్వం, ఆసక్తితో; ప్రతికార్యంబులు= మారుచేయదగినవి; కామిన్= కాకపోవటంచేత; మనసు= హృదయం; కందుచున్= తాపం పొందుతూ; ఉండన్= ఉండగా; వినియెదన్= వింటున్నాను.

**తాత్పర్యం:** దుర్యోధనుడు చెడుపని చేశాడు. దానివలన కష్టాలు వచ్చి పడ్డాయి. అయితే వాటికిపుడు చేయదగిన ప్రతిక్రియ లేదు. అందువలన మనస్సుకు బాధకలుగుతుండగా, ఆ కష్టాలను గురించి వింటున్నాను.

**క. పాండునృపుసుతులలో నొ । క్కండైనను నొవ్వఁ డింతకును మును వనితా**
**మండలి చేరువ మెలఁగెడు । గండున మెఱసెదరు కురునికాయము నడుమన్. 225**

**ప్రతిపదార్థం:** పాండు నృపు= పాండురాజుయొక్క; సుతులలోన్= కుమారులలో; ఒక్కండు+అయినను= ఒక్కడు కూడా; ఇంతకున్+మును= ఇప్పటికి పూర్వం; నొవ్వఁడు= బాధపొందడు; (వారు= పాండవులు); కురునికాయము= కురు వీర సమూహంయొక్క; నడుమన్= మధ్య; వనితా= స్త్రీల; మండలి= సమూహంయొక్క; చేరువన్= సమీపంలో; మెలఁగెడు= తిరిగే; గండునన్= పౌరుషంతో; మెఱసెదరు= ప్రకాశిస్తున్నారు.

**తాత్పర్యం:** పాండురాజు కొడుకులలో ఇంతవరకూ దెబ్బతిన్న వా డొక్కడూ లేడు. మన వీరుల మధ్య స్త్రీలలో తిరిగినంత పౌరుషంతో పాండవులు తిరుగుతున్నారు.

**వ. దైవంబు బలవంతం' బనిన విని సంజయుం డజ్జననాథునితో 'దేవా! వినుము. వగచినం గృతపడిన కార్యంబు గ్రమ్మఱం బొడమునే? డెందము గుందునంతియకాక యట్లుంగాక నీవుసేసిన యదియ చూవె ఫలించె భండనంబు వలదని యెన్ని భంగులం జెప్పినం బాండవులకుం గీడు దలంచి యప్పలుకులు గైకొనవైతివి వారలవలన ము న్ననేక పాపంబు లాచరించితి నీవలన జనక్షయంబు వాటిల్లెం గావునఁ గడవంబడిన దానికి వగవం బనిలేదు దారుణంబైన రణప్రకారంబు విను' మనుటయు నతండు 'కర్ణుండట్లు దడసిన కారణంబుఁ దొడంగి యెఱిఁగింపు' మనుటయు నమ్మానవేశ్వరునకు నా సూతనందనుం డిట్లనియె. 226**

**ప్రతిపదార్థం:** దైవంబు= విధి; బలవంతంబు= బలం కలది; అనినన్= అని పలుకగా; విని= ఆలకించి; సంజయుండు= సంజయుడు; ఆ+జననాథునితోన్= ఆ రాజుతో; దేవా= రాజా!; వినుము= విను; వగచినన్= దుఃఖించినందువల్ల; డెందము= హృదయం; కుందున్= బాధపడును; అంతియకాక= అంతేగానీ; కృతము+పడిన= కడచిన; కార్యంబు= పని; క్రమ్మఱన్= మరల; పొడమున్+ఏ?= కలుగునా, జరుగునా?; అట్లున్+కాక= అట్లా మాత్రమేకాక; (కడచిన పనితిరిగి రాకపోవటమే, మనసు బాధపడటమూ మాత్రమే కాక); నీవు; చేసిన+అదియ+చూవె= నీవుచేసినదే సుమా!; ఫలించెన్= పండినది, ఇలా పరిణమించినది; భండనంబు= యుద్ధం వలదు+అని= వద్దని; ఎన్ని= ఎంత సంఖ్యకల; భంగులన్= విధాలుగా; చెప్పినన్= వినిపించినా; పాండవులకున్= నీ తమ్ముడే అయిన పాండురాజు కుమారులకు; కీడు= హాని; తలంచి= తలపెట్టి, కావాలని; ఆ+పలుకులు= ఆ మాటలు; కైకొనవు+ఐతివి= స్వీకరించావు కావు; వారల వలనన్= వారి విషయంలో; మున్ను= ఇదివరకు; అనేక= చాలా; పాపంబులు= పాపపు పనులు; ఆచరించితి(వి)= చేశావు; నీవలనన్= నీ వల్ల; జనక్షయంబు= జనుల నాశం; పాటిల్లెను= కలిగింది; కావునన్= కనుక; కడవం బడిన దానికిన్= కడచిన దానికి; వగవన్= విచారించవలసిన; పని= కార్యం; లేదు; దారుణంబు+ఐన= భయంకరమైన; రణప్రకారంబు= యుద్ధంయొక్క రీతి; వినుము; అనుటయున్= అని పలుకగా; అతండు= ధృతరాష్ట్రుడు; కర్ణుండు; అట్లు; తడసిన= ఆలస్యం చేసిన; కారణంబున్; తొడంగి= ప్రారంభించి మొదటినుంచీ; ఎఱింగింపుము= తెలియజేయుము; అనుటయున్= అని పలుకగా; ఆ+మానవేశ్వరునకున్= ఆ ప్రజానాథునికి, ఆ రాజుకు; ఆ= ప్రసిద్ధుడైన; సూతనందనుండు= సూతుడి పుత్రుడైన సంజయుడు; ఇట్లు; అనియెన్= చెప్పాడు.

**తాత్పర్యం:** ఇంతకూ విధి బలం కలది' అనేసరికి, సంజయు డా మాటలు విని ధృతరాష్ట్రుడితో 'రాజా! వినుము; కడచిన పనికి విచారించినందువలన అది (సరిచేయటానికి) తిరిగిరాదు; పైగా మనస్సు బాధపడుతుంది. అంతకంటె

ప్రయోజనం లేదు. అదీకాక, (ఇది దుర్యోధనుడు చేసిన దాని ఫలం కాదు) నీవు చేసిన దానికే ఫలం ఇట్లా కలిగింది. యుద్ధం వద్దు అని ఎన్ని విధాల చెప్పినా యుద్ధం తప్పించటానికి ఒప్పుకొన్నావు కావు. పాండవులకు హాని చెయ్యాలన్న ఆలోచన నీకుండటమే అందుకు కారణం. ఇదివరకు నీవు పాండవులకు ఎన్నో పాపకార్యాలు చేశావు. నీవలననే ఈ జననాశం సంభవించింది. అందువలన గతించిన దానికి విచారించవలసిన పని లేదు. భయంకరమైన యుద్ధం జరిగి తీరుతుంది వినుము.' అన్నాడు. అప్పుడు ధృతరాష్ట్రుడు 'కర్ణుడు యుద్ధానికి రావటానికి ఎందుకు ఆలస్యం చేశాడో అక్కడనుండి మొదలుపెట్టి చెప్పుము.' అన్నాడు. ఆ తరువాత సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పాడు:

**క. రేపకడ సకల బలములు । భూపాలురు వెడలి నడువఁ బోరికి బిదపన్**
**నీపుత్త్రుఁడు వెడలెను సా । టోపతఁ దమ్ములును గర్ణుఁడును దో నడవన్. 227**

**ప్రతిపదార్థం:** రేపకడ= ఉదయమే; పోరికన్= యుద్ధానికి; సకలబలములు= సమస్త సైన్యాలూ; భూపాలురున్= రాజులు; వెడలి= బయలుదేరి; నడువన్= వెళ్ళగా; పిదపన్= తరువాత; నీ పుత్రుఁడు= నీ కుమారుడు దుర్యోధనుడు; సాటోపతన్= ఆడంబర భావంతో; తమ్ములున్= తన తమ్ముళ్ళూ; కర్ణుఁడును= సేనా నాయకుడైన కర్ణుడూ; తోన్= తనతోపాటు; నడవన్= రాగా; వెడలెను= బయలుదేరాడు.

**తాత్పర్యం:** తెల్లవారగానే, యుద్ధానికి సమస్త సైన్యాలూ, రాజులూ బయలుదేరి వెళ్ళారు. ఆ తరువాత దుర్యోధనుడు ఆడంబరంగా తన తమ్ముళ్ళూ, కర్ణుడూ తనతోకూడా రాగా బయలుదేరాడు.

**వ. అయ్యవసరంబున. 228**

**ప్రతిపదార్థం:** ఆ= దుర్యోధనాదులు బయలుదేరిన; అవసరంబునన్= సమయంలో.

**తాత్పర్యం:** ఆ దుర్యోధనాదులు బయలుదేరిన సమయంలో.

**సీ. రథము రథమ్ముఁ జేరఁగఁదెచ్చి యమ్మేది । నీశ్వరుతోఁ గర్ణుఁ డిట్టు లనియె**
**'నాకుఁ గృత్యంబు లనేకముల్ గలిగె ము । న్నా ధనంజయునకు నట్ల కాన**
**యీరసంబున మాకు నిద్దఱ కొండొరు । విడువక పెనఁగఁ జొప్పడద యింకఁ**
**గలహ మొక్క మొగంబు గావున నేఁ డేము । దలపడి పోరుదు మలవుఁ జలము**

**ఆ. నుల్లసిల్ల నొక్క రొకరుని నొంపను । జంపఁ జూతు మా నిలింపనాథు**
**వలనఁగన్నశక్తి వొలియుట నా మీఁద । నలుకు లేక తఱుము నాతఁ డధిప! 229**

**ప్రతిపదార్థం:** కర్ణుఁడు= అంగరాజు; రథము= తన తేరు; రథమ్మున్= దుర్యోధనుని రథాన్ని; చేరఁగన్= సమీపించేటట్లు; తెచ్చి= తోలించి తీసికొనివచ్చి; ఆ+మేదినీ+ఈశ్వరునితోన్= ఆ భూపతితో, దుర్యోధనుడితో; ఇట్టులు= ఇట్లా; అనియెన్= అన్నాడు; అధిప!= ప్రభూ!; మున్ను= ఇదివరకు; నాకున్= నాకు; కృత్యముల్= పనులు; కలిగెన్= సంభవించాయి; ఆ= నా ప్రతివీరుడైన; ధనంజయునకున్= అర్జునునికీ; అట్ల= అట్లాగే (కృత్యాలు కలిగాయి); కాన= కనుక; ఈరసంబునన్= కోపంతో; మాకున్= నాకూ అర్జునుడికీ; ఇద్దఱకున్= ఇద్దరికీ; ఒండొరున్= ఒకరు ఒకరిని; విడువక= విడిచిపెట్టకుండా;

పెనఁగన్= యుద్ధంచేయటానికి; చొప్పడదు+అ= కలుగనేలేదు; ఇంకన్= ఈపైని; కలహము= యుద్ధం; ఒక్క= ఒక; మొగంబు= ముఖంకలది, ఏకముఖంగా అవుతుంది; కావున; నేఁడు; ఏము= నేనూ, అర్జునుడూ; తలపడి= ఎదిరించి; అలవున్= సామర్థ్యమూ; చలమున్= పట్టుదలా; ఉల్లసిల్లన్= ప్రకాశింపగా; పోరుదుము= యుద్ధంచేస్తాము; ఒక్కరు= ఒకరు; ఒకరునిన్= మరొకరిని; నొంపను= నొప్పించటానికి; చంపన్= సంహరించటానికీ; చూతుము= ప్రయత్నిస్తాము; ఆ= ప్రసిద్ధుడైన; నిలింపనాథులవలనన్= దేవేంద్రునివల్ల; కన్న= పొందిన; శక్తి= శక్తి అనే ఆయుధం; పొలియుటన్= (ఘటోత్కచుడిపై ప్రయోగించినందున) పోవటంవల్ల; అతడు= అర్జునుడు; అలుకులేక= భయంలేకుండా; నా మీఁదన్= నాపైని; తఱుమున్= పడతాడు.

**తాత్పర్యం:** కర్ణుడు తన రథం దుర్యోధనుడి రథానికి దగ్గరగా పోనిచ్చాడు. అతడితో ఇట్లా అన్నాడు. 'ప్రభూ, ఇదివరకు నేను చేయవలసిన పనులు అనేకమున్నాయి. అర్జునుడికీ అట్లాగే ఉన్నాయి. అందువలన మేమిద్దరమూ ఒకరినొకరు ఎదిరించి విడిచిపెట్టకుండా పట్టుదలతో పోరాడే అవకాశం దొరకనే లేదు. ఇకమీద యుద్ధం ఏకముఖంగా నడుస్తుంది. అందువలన ఈవేళ మేము డీకొని మా సామర్థ్యమూ, పట్టుదలా ఉపయోగించి పోరాడుతాము. ఒకరినొకరం బాధించటానికీ, చంపటానికీ ప్రయత్నిస్తాము. ఇంద్రుడు నా కిచ్చిన శక్తి లేకుండా పోయినందువలన అర్జునుడు భయంలేకుండా నా మీద పడగలడు.

**వ. అప్పుడు చే నెత్తురు గాకుండ నక్కిరీటి గీటడంగించు విధం బూహింపుము. 230**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; చే= చేతికి; నెత్తురు+కాక+ఉండన్= రక్తం అంటకుండా, శ్రమలేకుండా, సులభంగా; ఆ+కిరీటిన్= ఆ అర్జునుని; గీటు+అడంగించు= బలం అణగగొట్టే, సంహరించే; విధంబు= ప్రకారం; ఊహింపుము= ఆలోచించుము.

**తాత్పర్యం:** అటువంటి సమయంలో శ్రమలేకుండా అర్జునుడిని సంహరించే ఉపాయం గురించి ఆలోచించుము.

**చ. సరి యగు నాకు దివ్యశరజాలములం దలపోసి చూడ న**
**న్నరుఁడు దృఢత్వ లాఘవగుణంబులఁ దక్కువ దూరపాత వి**
**స్ఫురణఁ గరంబు వట్రపడు భూవర! సౌష్ఠవరేఖ నేమియున్**
**దొరయఁడు ధైర్యశౌర్య పటు దోర్విభవంబుల హీనుఁడెంతయున్. 231**

**ప్రతిపదార్థం:** భూవర!= భూపతీ, దుర్యోధన మహారాజా!; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; తలపోసి= ఆలోచించి; చూడన్= పరిశీలించగా; దివ్య= స్వర్గంలో జన్మించిన, గొప్పవైన; శర= అమ్ములయొక్క ఆయుధాలయొక్క; జాలములన్= సముదాయాలలో; నాకున్= నాతో; సరి= సమానుడు; అగున్= ఔతాడు; దృఢత్వ= గట్టిదనం; లాఘవ= చురుకుదనం-అనే ఈ; గుణంబులన్= లక్షణాలలో; తక్కువ= నాకంటే తక్కువవాడు; దూరపాత= దూరంలో ఉన్న లక్ష్యంపై ఆయుధాన్ని ప్రయోగించడంలోని; విస్ఫురణన్= ప్రకాశంతో; కరంబు= చాలా; వట్రము+పడున్= తక్కువ అవుతాడు; సౌష్ఠవరేఖన్= నేర్పు తీరులో; ఏమియున్= ఏ కొంచెమూ; దొరయఁడు= సాటికాడు; ధైర్య= ధీరత, నిలకడలోనూ; శౌర్య= శూరత్వంలోనూ; పటు= గట్టి; దోః= చేతులయొక్క; విభవంబులన్= శక్తిలోనూ; ఎంతయున్= చాలా; హీనుఁడు= తక్కువవాడు.

**తాత్పర్యం:** దుర్యోధన మహారాజా! అర్జునుడి వద్ద దివ్యాయుధాలున్నాయి. ఈ ఒక్క విషయంలో మాత్రం అతడు నాతో సమానుడవుతాడు. కాని, గట్టిదనంలోనేమి, చురుకుదనంలోనేమి, నాకంటె తక్కువ. దూరంలో ఉన్న లక్ష్యాన్ని కొట్టటంలో చాలా తక్కువ. నేర్పులో పోలికే లేదు. ధైర్యంలోనూ, శౌర్యంలోనూ, బాహుబలంలోనూ ఎంతో తక్కువ.

**క. మును విశ్వకర్మ దేవేం। ద్రునకై నిర్మించె మహిత రూపము విజయం**
**బను చాపము దానను బహు। దనుజుల మర్దించె నతఁ డుదగ్రస్ఫూర్తిన్. 232**

**ప్రతిపదార్థం:** మును= పూర్వం; విశ్వకర్మ= దేవతల శిల్పి, మహితరూపము= గొప్ప ఆకారం కల; విజయంబు+అను= విజయం అనే పేరుకల; చాపము= ధనుస్సును; దేవ+ఇంద్రునకై= దేవేంద్రుడి కొరకు; నిర్మించెన్= చేశాడు; అతఁడు= దేవేంద్రుడు; దానను= ఆ ధనుస్సుతో; ఉదగ్ర స్ఫూర్తిన్= గొప్ప భయంకరమైన ప్రకాశంతో; బహుదనుజులన్= పెక్కుమంది రాక్షసులను; మర్దించెన్= సంహరించాడు.

**తాత్పర్యం:** పూర్వం విశ్వకర్మ దేవేంద్రుడి కోసం ఒక పెద్ద విల్లు తయారుచేశాడు. దానిపేరు విజయం. దానితో దేవేంద్రుడు భయంకరంగా ప్రకాశిస్తూ, ఎందరినో దానవులను సంహరించాడు.

**చ. పరిచయసక్తచిత్తుఁడయి భార్గవరాముని కాతఁ డిచ్చినం**
**బరుష పరాక్రమమ్మున నృపాలుర నెల్లను నమ్మహాభుజుం**
**డిరువదియొక్కమాఱు సమయించెఁ దదీయ నితాంతశక్తి న**
**ప్పరమదయాపరుం డొసఁగెఁ బార్థివ! నాకది గూర్మి పెంపునన్. 233**

**ప్రతిపదార్థం:** పార్థివ!= రాజా!; ఆతఁడు= దేవేంద్రుడు; పరిచయ= స్నేహంచేత; సక్త= తగుల్కొనిన; చిత్తుఁడు+అయి= మనస్సు కలవాడై; భార్గవ రామునకున్= భృగువంశీయుడైన పరశురాముడికి; ఇచ్చినన్= ఈయగా; ఆ+మహాభుజుండు= ఆ గొప్ప బాహువులుగల పరశురాముడు; ఇరువది యొక్క మాఱు= ఇరవై ఒక్కసారులు; పరుష= కఠినమైన; పరాక్రమమ్మునన్= విక్రమంతో; నృపాలురన్+ఎల్లను= రాజులనందరనూ; తదీయ= ఆ ధనుస్సుయొక్క; నితాంత= అతి విస్తారమైన; శక్తిన్= బలంతో; సమయించెన్= సంహరించాడు; అప్పరమ దయాపరుండు= ఆ గొప్పదయకు వశుడైన పరశురాముడు; కూర్మి= వాత్సల్యంయొక్క; పెంపునన్= అతిశయంతో; నాకున్= శిష్యుడనైన నాకు; ఒసఁగెన్= ఇచ్చాడు.

**తాత్పర్యం:** దేవేంద్రుడు తనకు పరశురాముడితో కల స్నేహంవలన దానిని ఆయనకిచ్చాడు. ఆ మహావీరుడు పరుషమైన పరాక్రమంతో దాని మహాశక్తితో రాజులనందరినీ ఇరవై ఒక్కసారులు సంహరించాడు. అనంతరం ఆ పరమదయాశాలి నా మీద వాత్సల్యం కొలదీ నాకు దాని నిచ్చాడు.

**ఉ. ఆ మహనీయ చాపమున నర్జును దర్పమడంచి నేఁడు సం**
**గ్రామము నుజ్జగించెద నకంటక సుస్థితి గల్గ మేటినై**
**భూమి యమర్చెదం గొనుము భూవర! నీదగు పుత్త్ర పౌత్త్రులన్**
**శ్రీమహిమన్ సమస్తజన సేవ్య మహోన్నతిఁ బొందు' నట్లుగన్.' 234**

**ప్రతిపదార్థం:** భూవర!= భూపతీ, దుర్యోధనా!; ఆ మహనీయ చాపమునన్= ఆ గొప్ప ధనుస్సుతో; నేఁడు= ఈవేళ; అర్జును= అర్జునునియొక్క; దర్పము= గర్వం; అడంచి= అణగగొట్టి, అతనిని సంహరించి; సంగ్రామమున్= యుద్ధాన్ని; ఉజ్జగించెదన్= (పూర్తిచేసి) విడిచి పెడతాను; మేటినై= పరాక్రమంలో శ్రేష్ఠుడనై; అకంటక= శత్రువులులేని; సుస్థితి= మంచి నిలుకడ; కల్గన్= కలుగునట్లుగా; భూమి= నేల, సమస్త రాజ్యం; అమర్చెదన్= ఏర్పరచి ఇస్తాను; నీదు+అగు= నీ యొక్క; పుత్త్ర= కుమారులను; పౌత్త్రులన్= మనుమలను, వంశపారంపర్యంగా; శ్రీమహిమన్= సంపదయొక్క, గొప్పదనంతో; సమస్త జన= అఖిల జనులచేతనూ; సేవ్య= సేవింపబడే; మహా+ఉన్నతిన్= గొప్ప ఔన్నత్యంతో; పొందున్+అట్లుగన్= సంక్రమించే రీతిని; కొనుము= స్వీకరించుము.

**తాత్పర్యం:** భూపతీ, దుర్యోధనా! ఈ వేళ ఆ మహాధనుస్సుతో అర్జునుడిని సంహరించి, యుద్ధం విడిచిపెట్టుతాను. పరాక్రమశాలులలో శ్రేష్ఠుడనై ఈ భూలోక సామ్రాజ్యమంతా శత్రువులు లేకుండా స్థిరంగా ఉండేటట్లు చేసి, నీకు సమర్పిస్తాను. నీవు గొప్ప సంపదతో, సమస్త జనులూ సేవించే మహౌన్నత్యంతో, నీ పుత్ర పౌత్రులకు సంక్రమించేటట్లు దానిని స్వీకరించుము.

**వ. అని పలికి వెండియు నిట్లను 'నా విజయంబును విజయు గాండీవంబును నొక్కరూప యతనికి నక్షయ తూణీరంబులు నగ్నిదేవుం డిచ్చిన యభేద్యరథంబును నవధ్య రథ్యంబులును గల వవి యెక్కుడయినను దాని కంతఁ జింతింప. 235**

**ప్రతిపదార్థం:** అని= ఇట్లా; పలికి= చెప్పి; వెండియున్= మళ్ళీ; ఇట్లు; అనున్= అన్నాడు; నా విజయంబును= నా యొక్క విజయం అనే ధనుస్సు; విజయు= అర్జునునియొక్క; గాండీవంబునున్= గాండీవం అనే పేరుగల విల్లు; ఒక్క; రూపు+అ= సమానమైనవే; అతనికిన్= అర్జునుడికి; అక్షయ= క్షయంకాని, ఎన్ని బాణాలు తీసినా బాణాలు తరగని; తూణీరంబులున్= అమ్ముల పొదులు; అగ్నిదేవుండు+ఇచ్చిన= అగ్నిదేవుడు ఒసగిన; అభేద్య= భేదింపబడని, విరుగగొట్టబడని; రథంబును; అవధ్య= వధింపబడని; రథ్యంబులున్= గుర్రాలు; కలవు= ఉన్నాయి; అవి= అట్టి అమ్ముల పొదులూ, అట్టి రథమూ, అట్టి గుర్రాలూ; ఎక్కుడు= నా కంటె అతడికి విశేషంగా ఉన్నవి; అయినను= అయినప్పటికినీ; దానికిన్= ఆ ఎక్కువకు; అంతన్= అంతగా; చింతింప(న్)= విచారించను.

**తాత్పర్యం:** అని చెప్పి, మళ్ళీ ఇట్లా అన్నాడు: 'నా విజయమూ అర్జునుడి గాండీవమూ రెండూ సమానమైనవే. ఇక అర్జునుడివద్ద ఎన్ని తీసినా తరగని అమ్ములపొదులున్నాయి. అగ్నిదేవుడు ఇచ్చిన విరుగగొట్ట సాధ్యంకాని రథమున్నది, చంపశక్యంగాని గుర్రాలున్నాయి. ఈ మూడూ అతడికి నా కంటే ఎక్కువే. అయినా వీటిని గురించి నే నంతగా విచారించను.

**క. నారాచము లాదిగఁ గల । ఘోరప్రదరములు బండ్లఁ గొని వచ్చెద బల్**
**తేరులు దృఢవాజులు నా । తేరి వెనుకఁ బె క్కమర్చి తెచ్చెద నధిపా! 236**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా దుర్యోధనా!; నారాచములు= ఇనుప బాణాలు; ఆదిగన్+కల= మొదలయినవి ఉన్న; ఘోర= భయంకరాలయిన; ప్రదరములు= బాణాలు; బండ్లన్= బళ్ళపై; కొని= తీసికొని; వచ్చెదన్= వస్తాను; బల్ తేరులున్= పెద్ద రథాలూ; దృఢ= గట్టివైన; వాజి+లున్= గుర్రాలూ; నా తేరి= నా రథంయొక్క; వెనుకన్= వెనుకవైపున; పెక్కు= అనేకమైనవి; అమర్చి= ఉండేటట్లు చేసి; తెచ్చెదన్= తీసుకొని వస్తాను.

**తాత్పర్యం:** (ఆ లోపాలు మూడింటి గురించీ ఎందుకంతగా విచారించనంటే - వాటి నిట్లా పూడ్చుకొనవచ్చును గనుక) ఇనుప బాణాలూ మొదలయిన భయంకరా లయిన బాణాలను బండ్లమీద వచ్చే ఏర్పాటు చేస్తాను. (అట్లా అక్షయ తూణీరాలు లేని లోటు తీరుతుంది.) పెద్ద రథాలూ, గట్టి గుర్రాలూ నా రథం వెనుకనే వచ్చేటట్లు చేస్తాను. (అలా విరగని రథమూ, చావని గుర్రాలూ లేనిలోటు తీరుతుంది.)

**విశేషం:** అయినా, అమ్ముల కట్టలయిపోతే బండ్లమీదనుండి తెచ్చి రథంమీద పెట్టాలి. విరిగిన రథం దిగి కొత్త రథమెక్కాలి. పడిపోయిన గుర్రాలను వదలి కొత్త గుర్రాలను రథానికి కట్టాలి. ఇట్లా ఇది సహజసిద్ధమైన వాటికి సంపూర్ణమైన సాటిరాగల

ప్రతిక్రియ కాదు. అందుకే అంతగా విచారించననటం, కొంత విచారించవలసింది ఉన్నదని ఆ 'అంత' వలననే తెలుస్తున్నది. అర్జునుడి ఆధిక్యం ఎరిగి ఎరిగీ దుర్యోధనుడి సంతుష్టికి అతడిని ఎదిరించవలసి రావటం కర్ణుడికి వచ్చిన దుర్దశ.

**వ. మఱియు నొక్కం డాకర్ణింపుము; భువన ప్రవర్తకుండయిన కృష్ణుండు సారథ్యంబు సేయుట నప్పార్థు పరాక్రమం బసాధ్యంబై యుండు నట్లగుటం జేసి. 237**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఒక్కండు= ఒకటి; ఆకర్ణింపుము= వినుము; ఆ+పార్థు= ఆ పృథా కుమారుడయిన అర్జునునియొక్క; పరాక్రమంబు= విక్రమం; భువన= లోకాలకు; ప్రవర్తకుండు+అయిన= నడిపేవాడయిన; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; సారథ్యంబు= సూతునిపని; చేయుటన్= కావించే కారణంచేత; అసాధ్యంబు+ఐ= సాధింపరానిది అయి, ఓడింపరానిదయి; ఉండున్= ఉంటుంది; అట్లు+అగుటన్+చేసి= అట్లా అయినందువల్ల, (కనుక).

**తాత్పర్యం:** ఇంకొక మాట వినుము. అన్ని లోకాలనూ నడిపే కృష్ణుడు అర్జునుడి రథం నడుపుతున్నాడు. కనుక, అర్జునుడి పరాక్రమాన్ని ఏమీ చేయలేకపోతున్నాము. అందువల్ల

**విశేషం:** దుర్యోధనుడిని మెప్పించటానికి ఇంత వరకూ ఏమనినా, ఏమిచేసినా, శ్రీకృష్ణ డంటే ఏమిటో కర్ణుడికి బాగా తెలియు ననటానికి 'భువన ప్రవర్తకుడు' అన్న ఒకమాట చాలు. తెలిసి తెలిసి అర్జునుని ఎదిరించవలసి వచ్చినందుకు కర్ణుడిపై మరీ జాలి కలుగుతుంది.

**తే. భండనము నేర్పుమెయిఁ గృష్ణుపాటియనఁగ । మహిఁ బొగడ్తకు నెక్కిన మద్రనాథు**
**నాకు సారథిగాఁగ నొనర్ప వలయు । గెలుతు నట్లైన నన్నరు నలవు మెఱయ. 238**

**ప్రతిపదార్థం:** భండనము నేర్పు మెయిన్= యుద్ధంలోని చాతుర్యంచేత; కృష్ణుపాటి= కృష్ణునంతడివాడు; అనఁగన్= అని పలుకగా; మహిన్= భూమిలో; పొగడ్తకున్+ఎక్కిన= ప్రశంస చెందిన; మద్రనాథున్= శల్యుని; నాకున్= (ఈ లోటు తీరితే అర్జునుడిని గెలువగల) నాకు; సారథి+కాఁగన్= సూతుడు అయ్యేటట్లు; ఒనర్పన్+వలయున్= చెయ్యాలి; అట్లు+ఐనన్= అట్లా అయితే; ఆ+నరున్= ఆ అర్జునుడిని; అలవు= బలం; మెఱయన్= ప్రకాశింపగా; గెలుతున్= గెలుస్తాను.

**తాత్పర్యం:** యుద్ధచాతుర్యంతో కృష్ణుడంతటివాడు అని పృథ్విలో ప్రశంస పొందిన శల్యుడిని నాకు సూతుడు అయ్యేటట్లు చెయ్యాలి. అట్లా అయితే బలం ప్రకాశించేటట్లు ఆ అర్జునుడిని గెలుస్తాను.

**క. హరి కెక్కుడరయ మద్రే । శ్వరుఁ డశ్వజ్ఞానమున నసంశయ మే న**
**న్నరునకు మిక్కిలి బలవి । స్ఫురణంబునఁ గర్మకుశలబుద్ధిఁ దలంపన్. 239**

**ప్రతిపదార్థం:** మద్ర+ఈశ్వరుఁడు= మద్రదేశపు రాజైన శల్యుడు; అశ్వజ్ఞానమునన్= గుర్రాలను గురించిన తెలివిలో; అరయన్= పరిశీలింపగా; హరికిన్= కృష్ణునికంటె; ఎక్కుడు= అధికుడు; అసంశయము= సందేహంలేదు; ఏన్= నేను; బలవిస్ఫురణంబునన్= శరీర బలం ప్రదర్శించటంలోనూ; కర్మకుశల= పనిలో నేర్పుగల; బుద్ధిన్= తెలివిలోనూ; తలంపన్= ఆలోచింపగా; ఆ+నరునకున్= ఆ అర్జునుడికంటె; మిక్కిలి= ఎక్కువవాడను.

**తాత్పర్యం:** గుర్రాలను గురించిన తెలివిలో పరిశీలిస్తే కృష్ణుడికంటె గొప్పవాడు శల్యుడు. బలప్రదర్శనంలోనూ, కార్యసాధన కవసరమైన నేర్పరితనంలోనూ, ఆలోచిస్తే - అర్జునుడికంటె గొప్పవాడను నేను. సందేహం లేదు.

**క. కావున నవ్వర మి మ్మటు । గావించుట యెల్లహితముఁ గావించిన య**
**ట్టై వెలయు! నింత సేసి మ । హీవర! ననుఁ జూడు పోర నె ట్లేచెదనో. 240**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; మహీవర!= భూపతీ!; ఆ+వరము= ఆ కోరినది, శల్యుడి సారథ్యం; ఇమ్ము= ఈయవలసినది; అటు= అలా; కావించుట= చేయటం; ఎల్ల= సమస్తమైన; హితము= మేలు; కావించిన+అట్టు+ఐ= చేసినట్లు అయి; వెలయున్= ఒప్పును; ఇంత= ఈ చిన్నపని; చేసి= కావించి; పోరన్= యుద్ధంలో; ఎట్లు+ఏచెదను+ఓ= (అర్జునుని) ఎలా విజృంభిస్తానో; చూడు= పరిశీలించు.

**తాత్పర్యం:** కనుక, రాజా! నాకు ఆ వరం ఇమ్ము. అట్లా చేయటం అంటే నాకు అన్ని మేళ్ళూ చేయటమే. ఈ చిన్నిపని చేసి, నేను యుద్ధంలో ఎలా విజృంభిస్తానో చూడు.

**క. విను మి త్తెఱఁగున నే న । య్య ని మిషవర్గంబునైన నాజి జయింతున్**
**మనుజులు పాండుతనూజులు । జననాయక! నాకు నొక్క సరకే? తలఁపన్.' 241**

**ప్రతిపదార్థం:** జననాయక!= ప్రజానాథా! దుర్యోధనా!; వినుము= విను; ఈ+తెఱఁగునన్= ఈ విధంగా; శల్యుడి సారథ్యంతో; నేను; ఆ+అనిమిష= ఆ దేవతలయొక్క; వర్గంబున్= సమూహాన్ని; ఐనన్= ఐనప్పటికీ; ఆజిన్= యుద్ధంలో; జయింతున్= గెలుస్తాను; పాండు తనూజులు= పాండురాజు కొడుకులు; మనుజులు= మనుష్య మాత్రులు; తలఁపన్= ఆలోచింపగా; నాకున్= ఇంత శక్తిమంతుడనైన నాకు; ఒక్క= ఒక; సరకు+ఏ?= లెక్కా?

**తాత్పర్యం:** రాజా! ఇట్లా శల్యుడు సారథి అయిన పక్షంలో నేను యుద్ధంలో ఆ దేవతలనైనా జయించగలుగుతాను. ఈ పాండవులు వట్టి మనుష్యులు. ఆలోచిస్తే వీళ్ళు నాకొక లెక్కా?'

**వ. అనిన విని నీ పుత్త్రుండు ప్రీతుం డయి రాధేయు నగ్గించి నీకెల్ల భంగిని శల్యు సారథిం గావించెదనని పలికి యుత్సాహదీప్తుం డై. 242**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇలా పలుకగా; విని; నీ పుత్త్రుండు= నీ కుమారుడైన దుర్యోధనుడు; ప్రీతుండు+అయి= సంతోషించి; రాధేయున్= కర్ణుని; అగ్గించి= ప్రశంసించి; నీకున్= నీకు (కర్ణుడికి); ఎల్లన్= సమస్తమైన; భంగిన్= విధాలా; శల్యున్= మద్రరాజును; సారథిన్= సూతుని; కావించెదన్= చేస్తాను; అని; పలికి= చెప్పి; ఉత్సాహ= (శల్యుని ఒప్పించాలి అనే) పూనికచేత; దీప్తుండు+ఐ= ప్రకాశిస్తున్న వాడై.

**తాత్పర్యం:** అని కర్ణుడు చెప్పగా విని నీ కుమారుడు సంతోషించి, కర్ణుడిని ప్రశంసించాడు. అన్నివిధాలా ప్రయత్నించి నీకు శల్యుడిని సారథిగా చేస్తానని చెప్పాడు. ఎట్లాగైనా శల్యుడిని ఒప్పించాలి అనే పూనికవలన అతడు మెరిసిపోతూ. (ఇంకా కర్ణుడితో ఇట్లా అన్నాడు:)

**క. అమ్ముల బండ్లును రథ ర । థ్యమ్ములునుం బెక్కుదెత్తు నవనీశులు నా**
**తమ్ములు నేనును నీ పా । ర్శ్వమ్మున నడచెదము బరవసం బుగ్రముగన్. 243**

**ప్రతిపదార్థం:** అమ్ముల బండ్లును= బాణాల శకటాలు; రథ= రథాలూ; రథ్యమ్ములునున్= గుర్రాలూ; పెక్కు= చాలా; తెత్తున్= నీ వెనుకనే తీసికొని వస్తాను; అవనీ+ఈశులున్= రాజులూ; నా తమ్ములున్; నేను= స్వయంగా నేనూ; నీ

పార్శ్వమ్మునన్= నీ ప్రక్క; బరవసంబు= ఉత్సాహం, ధైర్యం, పట్టుదల; ఉగ్రముగన్= తీక్షం అయ్యేటట్లుగా; నడచెదము= వస్తూ ఉంటాము.

**తాత్పర్యం:** (నీవు చెప్పినట్లే నీ వెనుకనే) బాణాల బళ్ళూ, రథాలూ, గుర్రాలూ అధిక సంఖ్యలో రప్పిస్తాను. నీకూ మాకూ కూడా ఉత్సాహమూ, ధైర్యమూ పట్టుదలా పెరుగుతూ ఉండే విధంగా, యుద్ధం చేస్తున్న రాజులూ, నా తమ్ముళ్ళూ, నేనూ కూడా నీ ప్రక్కనే వస్తూ ఉంటాము.

**క. అని చెప్పి ప్రీతుఁ డగు నా। తనిఁ దోడ్కొని నడచి సముచితంబుగ శల్యుం**
**గని భక్తిఁ బ్రణతుఁడై యి। ట్లను దుర్యోధనుఁడు సవినయముగ నతనితోన్. 244**

**ప్రతిపదార్థం:** అని= ఈ రీతిగా; దుర్యోధనుఁడు; చెప్పి= పలికి; ప్రీతుఁడు+అగు= (తన మాటలకు) సంతోషించినవాడైన; ఆతనిన్= ఆ కర్ణుని; తోడ్కొని= తీసుకొని; నడచి= వెళ్ళి; సముచితంబుగన్= తగిన రీతిని; శల్యున్= మద్రరాజును; కని= దర్శించి; భక్తిన్= గౌరవంతో కూడిన ప్రేమతో; ప్రణతుఁడై= నమస్కరించినవాడై; సవినయముగన్= వినయంతో; అతనితోన్= శల్యునితో; ఇట్లు= ఈ విధంగా; అనున్= పలికాడు.

**తాత్పర్యం:** ఈ రీతిగా చెప్పి దుర్యోధనుడు, తన మాటలకు సంతోషించిన కర్ణుడిని వెంట తీసికొని వెళ్ళి, శల్యుడిని సముచితంగా దర్శించి, భక్తితో నమస్కరించి, సవినయంగా అతడితో ఇట్లా అన్నాడు:

**దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథ్యంబు సేయు మని ప్రార్థించుట (సం. 8-23-1)**

**సీ. 'సత్యవ్రతంబును శాత్రవదుర్దశా। పాదనంబును మహాభాగతయును**
**నీకు నైజంబులు నాకుఁ బెద్దయుఁ గూర్తు। గావున ని న్నేను గారవించి**
**వినతుండనై వేఁడికొనియెద రాజుల। నడుమ నీ దగు సౌమనస్య మెఱిఁగి**
**యర్జును ననిఁ దెగటార్పఁగ వలయుట। యూహించి సంభృతోత్సాహలీలఁ**

**ఆ. గావు మితని ననుచుఁ గర్ణునిఁ జూపి యీ। తనిరథంబు గడపు మనఘ! యిట్టు**
**లైన నితఁడు వగఱఁ బో నీక పొదివి య। స్థలితగతుల నొంపఁ జంపఁ జాలు. 245**

**ప్రతిపదార్థం:** సత్యవ్రతంబును= సత్యంపై దీక్షా; శాత్రవ= పగవారికి; దుర్దశా= దుఃఖస్థితిని; ఆపాదనంబును= కలిగించటము; మహాభాగతయును= మిక్కిలి ప్రసిద్ధీ, భాగ్యము, పవిత్రతా కలిగి ఉండటము; నీకున్= నీకు; నైజంబులు= సహజమైనవి, స్వతస్సిద్ధాలు; నాకున్= నీపై ఆధారపడిన నాకు; పెద్దయున్= మిక్కిలిగా; కూర్తు= కూర్తువు, ఇష్టపడతావు; కావునన్= కనుక; నిన్నున్= ఇట్టివాడవైన నిన్ను; ఏను= (నీవు కావాలని ప్రయత్నించి కష్టపడి తెచ్చుకొన్న) నేను; గారవించి= గౌరవించి, మన్ననచేసి; వినతుండను+ఐ= నమస్కరించిన వాడనై; నీది+అగు= నీది అయిన; సౌమనస్యము= మంచి మనస్సు కలిగి యుండుట; ఎఱిఁగి= తెలిసి; రాజుల నడుమన్= ప్రభువుల మధ్య; వేఁడికొనియెదన్= అడుగుకొంటున్నాను; అర్జునున్; అనిన్= యుద్ధంలో; తెగటార్పఁగన్= సంహరింపగా; వలయుట= అవసరంకావటం; ఊహించి= ఆలోచించి; సంభృత= చక్కగా పూనిన; ఉత్సాహ= ధైర్యంయొక్క; లీలన్= విలాసంతో; ఇతనిన్= ఈ కర్ణుని; కావుము= కాపాడుము; అనుచున్= అని చెపుతూ; కర్ణునిన్= అంగరాజును; చూపి; ఈతని రథంబు= ఇతని తేరు; కడపుము= తోలుము; అనఘ!= ఓ పాపరహితుడా!; ఇట్టులు= ఇట్లా; ఐనన్= సంభవించినపక్షంలో; ఇతఁడు= కర్ణుడు, అంగరాజు; పగఱన్= శత్రువులను; పోన్+ఈక= తప్పించుకొని

పోనివ్వకుండా; పొదివి= క్రమ్మి; అస్ఖలిత= జారుపాటులేని; గతులన్= పద్ధతులతో; నొంపన్= నొప్పించటానికీ; చంపన్= సంహరించటానికీ; చాలు(న్)= సమర్థుడవుతాడు.

**తాత్పర్యం:** 'ఓ పాపరహితుడా!, సత్యదీక్షా, శత్రువులకు కష్టాలు కలిగించటమూ, గొప్పతనమూ నీ సహజ లక్షణాలు. నేనంటే నీకు చాలా ఇష్టం. అందువలన నీ మంచి మనస్సు తెలిసికొని, ఇందరు రాజుల మధ్య నేను నిన్ను చాలా గౌరవించి, నమస్కరించి, ప్రార్థిస్తున్నాను. అర్జునుడిని సంహరించటం అవసరం. కనుక ఇతడిని పూర్తి ప్రయత్నంతో రక్షించుము.' అని కర్ణుడిని చూపించి, నీ వితడి రథము నడుపుము అని, అట్లా అయితే ఇతడు శత్రువులను తప్పించుకొని పోనివ్వక ఆక్రమించి, ఏ జారుపాటూ లేకుండా బాధించగలుగుతాడు, చంపగలుగుతాడు అని అన్నాడు.

**చ. గురుఁడును భీష్ముఁడుం జనినఁ గొంచెపు మూఁకలతోడ నేను సం**
**గరవిజయంబు గోరి భుజగర్వమునన్ సడిసన్న పాండుభూ**
**వరసుతవర్గముం దొడరువాఁడనకా మది నిశ్చయించు టె**
**వ్వరిఁగొని యింత నీ వెఱుఁగవా? నినుఁ గర్ణునిఁ గాదె? నమ్మితిన్. 246**

**ప్రతిపదార్థం:** గురుఁడును= గురువైన ద్రోణాచార్యుడూ; భీష్ముఁడున్= భీష్మపితామహుడూ; చనినన్= వెళ్ళిపోయినప్పటికీ; కొంచెపు మూఁకలతోడన్= కొద్ది సైన్యముతో; నేను= (పెద్ద ఆధారం పోయిన) నేను; సంగర= యుద్ధంలో; విజయంబు= గెలుపు; కోరి= కావాలని; భుజ= బాహువులయొక్క; (బల) గర్వమునన్= (బలంమీది) పొగరుతో; సడి+చన్న= పేరుకెక్కిన; పాండు భూవర= పాండురాజుయొక్క; సుత= కుమారులయొక్క; వర్గమున్= సమూహాన్ని; తొడరు= ఢీకొనే; వాఁడనకాన్= అట్టివాడినే అయ్యేటట్లు; మదిన్= మనస్సులో; నిశ్చయించుట= నిర్ణయించటం; ఎవ్వరిన్= ఎవరిని; కొని= ఆధారంచేసికొని; ఇంత= ఇదంతా; నీవు; ఎఱుఁగవా?= నీకు తెలియదా?; నినున్= నిన్నూ; కర్ణునిన్= అంగరాజునూ; నమ్మితిన్= నమ్మాను; కాదె?= కాదా?

**తాత్పర్యం:** భీష్మద్రోణు లిద్దరూ వెళ్ళిపోయిన తరువాత పలుచబడిపోయిన సామాన్య సైనికుల సాయంతో నేను యుద్ధంలో గెలవాలని భుజబల గర్వానికి పేరుకెక్కిన పాండవులను ఢీకొనటానికే మనస్సులో నిర్ణయించుకొన్నానంటే ఎవరిని చూచుకొని? నిన్నూ, కర్ణుడినే కదా నేను నమ్మినది! ఇదంతా నీకు తెలిసినదే కదా!

**విశేషం:** సత్యానికి కొంత మాటలనేర్పు జోడించి, స్వకార్యసాధనకు తెలివయిన వారు ఎట్లా ప్రయత్నిస్తారో దుర్యోధనుడి మాటలవలన తెలుస్తుంది. నిన్నూ, కర్ణుడినీ నేను నమ్ముకొని యుద్ధం కొనసాగిస్తున్నానంటాడు. ఇది సత్యమే, శల్యు డట్లా ఆధారపడదగిన వాడే. కనుకనే కర్ణుడి తరువాత ఆయననే సేనానాయకుడిని చేశాడు. కాని నమ్మటంలోని ప్రాధాన్యక్రమం మాత్రం దుర్యోధనుడు చెప్పినది కాదు. నిన్నూ, కర్ణుడినీ అన్నది నిజానికి కర్ణుడినీ, నిన్నూ అనాలి. అందుకే శల్యుడినికాక, కర్ణుడిని సేనానాయకుడిని చేశాడు. కానీ మొగం ముందు మాట్లాడేటప్పుడు శల్యుడికి ద్వితీయస్థానం ఇవ్వటం కార్యకారికాదు. అందుకని 'నిన్నూ కర్ణుడినీ' అంటున్నాడు.

**క. ఇ మ్మివ్వరమ్ము సార । థ్య మ్మితనికిఁ జేయు మినున కరుణుఁడు సాహా**
**య్య మ్మొనరిచినట్లుగఁ దిమి । రమ్ము క్రియన్ రూపుసెడి యరాతు లడంగన్. 247**

**ప్రతిపదార్థం:** ఈ+వరమ్ము= ఈ వరం; ఇమ్ము; ఇనునకున్= సూర్యునికి; అరుణుఁడు= ఆ పేరుగల సూర్యుడి సారథి; సాహాయ్యమ్ము= సాయం; ఒనరిచినట్లుగన్= చేసినట్లుగా; తిమిరమ్ము క్రియన్= చీకటిలా; అరాతులు= శత్రువులు; రూపు+ చెడి= ఆకారంపోయి, యుద్ధంలోకూలి, అడంగన్= అణగిపోగా; నశించగా; ఇతనికిన్= ఈ కర్ణునికి; సారథ్యమ్ము= సూతునిపని, రథం తోలటం; చేయుము.

**తాత్పర్యం:** నా కీ వరం ఇమ్ము. ఇతడికి సూతుడిపని చేసిపెట్టుము. అదెంతటిదంటే సూర్యుడికి అరుణుడు సాయంచెయ్యటం వంటిది. అరుణుడి సాయంవలన చీకట్లణగిపోతున్నాయి. నీవు కర్ణుడి రథం తోలటంవలన శత్రువులంతా ఆకారాలు పోయి అణగారిపోతారు.

**విశేషం:** చేయవలసిన పని నీచపు పని అయి, చేయవలసినవాడు గొప్పవాడయినప్పుడు పనిని గొప్పచేసి పేర్కొనటం, అదీ మంచి మాటలతో చెప్పటం ఎల్లకాలాలలోనూ ఉన్నదే. ఈ పోలికా అట్టి ప్రయత్నమే. సూర్యుడూ, అరుణుడూ ఒకే తండ్రి కశ్యపుడి వలన ఇద్దరు తల్లులకు వరుసగా అదితికీ వినతకూ కలిగినవారు. అరుణుడు తక్కువపని అనుకొనక తిమిరనాశనంలో అన్నకు సాయపడుతున్నాడు. సారథ్యం చెయ్యటమంటే వట్టి తేరి గుర్రాలను తోలటం కాదు కదా, తగిన సలహాలు రథికుని కివ్వటమూ అవసరమైనపుడు అతడిని రక్షించటమూ మొదలైన ముఖ్యమైన పనులు చాలా ఉన్నాయి చేయవలసినవి. అన్ని మాటలకూ కిరీటం వంటిది పద్యం మొదట ఉన్న 'ఇమ్మివ్వరమ్ము' అన్నది ఈ సారథ్యం చేయటం భగవంతుడు భక్తుడికి వరం ఇవ్వటం వంటిది.

ఈ పద్యం మూడవ పాదం 'య్యమ్మొనరించినట్లుగఁదిమి' అని ఉన్నది. ఇందులో రెండవ గణం రగణం అవుతున్నది. ఇది కందపద్యంలో ఉండదగినదిగా లాక్షణికులు పేర్కొన్న గణాలలోనిది కాదు. ఉస్మానియా ప్రతిలోనే కాక వావిళ్ళవారి 1963 ప్రతిలోనూ అట్లాగే ఉన్నది. దీన్ని సవరించటానికన్నట్లు ఏర్పడిన పాఠాంతరాలను రెండు ప్రతులూ గమనించాయి గాని వాటిని పాఠాంతరాలుగానే ఇచ్చాయి. ఉస్మానియా ప్రతిలో 'య్యమొనరించినట్లుగఁ' అని కూడా ఉన్నది కాని అచ్చులో ఈ మావత్తు రాలిపోయినదిగా భావించాము. 'రించి'లో సున్న లేకపోయినా సరిపోయేది. లక్షణవిరుద్ధం కనుక సున్న లేని పాఠం మేము ఇచ్చాము. ఆం.ప్ర.సా.అ. వారి (తె.వి) ప్రతిలో మాత్రం సున్నలేదు. ప్రకాశకుల విజ్ఞప్తి, చివరలది శుక్ల ఉగాదివాడు వ్రాసినట్లున్నది. అని ఇటీవల 22-6-2000న మేము గుర్తించాము. కాని ఆ ప్రతి ఎప్పుడు అచ్చువేశారో- అందులో లేదు.

**క. అనిన విని కెంపుసొంపునఁ । గనుఁగవ యుగ్రముగ బొమలు గదియఁగ ఫాల**
**మ్మునఁ జెమటవొడమ నీ సుతుఁ । గనుఁగొని యిట్లనియె నతఁడు కటము లదరఁగన్. 248**

**ప్రతిపదార్థం:** అనినన్= ఇలా చెప్పగా; అతఁడు= శల్యుడు; విని= ఆలకించి; కెంపుసొంపునన్= పద్మరాగమణియొక్క అందంవంటి అందంతో, పద్మరాగమణిలా; కనుఁగవ= కన్నుల జంట; ఉగ్రముగన్= భయంకరం కాగా; బొమలు= కనుబొమలు; కదియఁగన్= ఒకదానినొకటి సమీపింపగా; ఫాలమ్మునన్= నొసట; చెమట; పొడమన్= కలుగగా; కటములు= చెక్కిళ్ళు; అదరఁగన్= కదలగా; నీ సుతున్= నీ కుమారుడైన దుర్యోధనుని; కనుఁగొని= చూచి; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పలికిన మాటలు వినేసరికి కోపంతో శల్యుడి కన్నులు ఎర్రబడ్డాయి. కనుబొమలు ఒకదానికొకటి దగ్గరగా వచ్చాయి. నొసట చెమట పట్టింది. చెక్కిళ్ళు కదిలాయి. ఇవి జరుగుతుండగా, అతడు దుర్యోధనుడిని చూచి, ఇట్లా అన్నాడు:

సీ. 'ననునింత నీచపుఁ బనికిఁ బంపఁగ నీకుఁ । దగునె? భూవర! వర్ణధర్మవిధము
లెఱుఁగవే? శూద్రుల కే నాఁటఁ బరిచర్య । సేసిరి? మూర్ధాభిషిక్తులైన
రాజులు సూతజు రాధేయు దొరఁజేసి । కొని యేను సారథ్యమునకుఁ జొరఁగఁ
జాల నీతని బలశాలిగాఁ దలచెదు । నాకంటె నిట్టిబన్నంబుఁ గలదె?

ఆ. పగఱలోన నొకనిఁ బాల్పెట్టు మెట్టి వాఁ । డైన సమయఁజూచి యరుగువాఁడ
నట్టిభంగి సాలదంటేనిఁ దరవాయి । గొని వధింతు శత్రుకోటి నెల్ల. 249

**ప్రతిపదార్థం:** భూవర!= భూపతీ!, దుర్యోధనా!; ననున్= (మద్రదేశాధీశ్వరుని, మాటకు కట్టుబడి మేనల్లుళ్ళకు వ్యతిరేకంగా నీకు సాయం వచ్చిన వాడిని, భీష్మద్రోణులు పోయినా జయాశ కల్పించిన వాడనని నీవే ఇపుడే పేర్కొన్నవాడిని, వర్ణక్రమంలో రెండవదైన క్షత్రియ వర్ణం వానిని) నన్ను; ఇంత= (ఊహించటానికి కూడా వీలులేని మరీ) ఇంత; నీచపు+పనికిన్= నికృష్టమైన కార్యానికి; పంపఁగన్= ఆజ్ఞాపింపగా, పంపించగా; నీకున్= (యుక్తాయుక్తజ్ఞానంతో పరిపాలన చేసి తగినవారికి తగినపని చెప్పదగిన క్షత్రియ పరిపాలకుడవైన) నీకు; తగునె= తగునా? తగదు; వర్ణ= నాలుగు వర్ణములయొక్క; ధర్మ= ధర్మాలయొక్క; విధములు= విధానాలు; ఎఱుఁగవే?= తెలిసినవాడవు కావా?; మూర్ధ= శిరస్సున; అభిషిక్తులు= రాజ్యంలో అభిషేకింపబడిన; రాజులు= రెండవ వర్ణంవారైన క్షత్రియులు; ఏ నాఁటన్= ఏ దినాన, ఏ సమయంలో; శూద్రులకున్= నాల్గవ జాతి వారికి; పరిచర్య= సేవ; చేసిరి= చేశారు?, (ఎన్నడూ ఎక్కడా చేయలేదు); ఏను= మూర్ధాభిషిక్త క్షత్రియుడనైన నేను; సూతజున్= సూతకులంలో పుట్టిన; రాధేయున్= రాధాపుత్రుడయిన కర్ణుని; దొరన్= ప్రభువును, రథికుని; చేసికొని= కావించుకొని; సారథ్యమునకున్= సూతుని పనికి; చొరఁగన్= పూనుకొనగా; చాలను= (సమర్థుడనుకాను), ఇష్టపడజాలను; ఈతనిన్= ఈ సూతపుత్రుని; నాకంటెన్= బలశాలినైన నాకంటె; బలశాలిన్+కాన్= బలం కలవానినిగా; తలఁచెదు= భావిస్తున్నావు; ఇట్టి= ఇటువంటి; బన్నంబు= భంగపాటుకూడా, అవమానంకూడా; కలదు+ఎ= ఉన్నదా?; పగఱలోనన్= శత్రువులలో; ఒకనిన్= ఒకడిని; పాల్పెట్టుము= (అతనిని చంపటం) నా వంతని ఇమ్ము; ఎట్టివాఁడు= అతడు ఎంతటి, ఎటువంటి వాడైనప్పటికీ; సమయన్= మరణించేటట్లు; చూచి; అరుగువాఁడన్= వెళ్ళిపోతాను; అట్టి భంగి= అట్టి పద్ధతి; చాలదు= సరిపోదు; అంటి(వి)+ ఏనిన్= అనిన పక్షంలో; తరవాయిన్+కొని= మునుముపెట్టి (మునుము పెట్టటం అంటే వరి మొదలయినవి కోసేటప్పుడు లేదా కలుపు తీసేటప్పుడు, ఒక వరుసగా ఉండి పనిచేసుకొంటూ ముందుకు పోయే పనివారు ఒక్కడి నుంచి ఒక్కడి వరకూ కోసుకొంటూ లేదా కలుపు తీసుకొంటూ పోవాలి అని కొంత భాగాన్ని తమవంతు భాగంగా పెట్టుకొనటం. అట్లా సైన్యంలో ఇంతమేర ఉన్న భాగాన్ని నరుక్కొంటూ ముందుకు పోతానని ఇక్కడ అర్థం); శత్రుకోటిన్= శత్రువుల సమూహాన్ని; ఎల్లన్= అంతనూ, సమస్తాన్నీ; వధింతున్= సంహరిస్తాను.

**తాత్పర్యం:** రాజా! దుర్యోధనా! మూర్ధాభిషిక్తుడనైన, క్షత్రియుడనైన, నన్ను ఇంత నికృష్టపు పని చేయుమనటం నీకు తగదు. వర్ణధర్మాలెటువంటివో నీకు తెలియదా? మూర్ధాభిషిక్తులై రెండవ వర్ణంవారైన క్షత్రియులు నాలుగవ వర్ణం వారికి ఎన్నడైనా ఎక్కడైనా సేవ చేశారా? అందుచేత సూతపుత్రుడు రాధకు పుట్టినవాడు అయిన కర్ణుడు రథికుడుగా నే నతడికి రథంతోలేపని చేయలేను. ఈ కర్ణుడు నాకంటె బలమయినవా డనుకొంటున్నావు నీవు. ఇటువంటి పరాభవం కూడా ఉంటుందా? నా బలం ఏమిటో తెలియాలంటే, నే నితనికంటె తక్కువ బలం కలవాడినో, ఎక్కువ బలం కలవాడినో తెలియాలంటే నీ శత్రుపక్షంలో ఉన్నవారిలో నీ ఇష్టం వచ్చిన వాడిని ఒక్కడిని పేర్కొని, అతడిని చంపటం నా వంతు అని చెప్పుము. ఆ పని చేసి నా దారిని నేను పోతాను. అట్లా చేస్తే చాలదంటావా, మొత్తం శత్రువులనందరినీ మునుము పెట్టి సంహరిస్తాను.

**విశేషం:** ఇందులోని వర్ణాల ఎక్కువ తక్కువల ప్రసక్తిని నేటి దృష్టితో కాక నాటి దృష్టితోనే చూడాలి. నేడైనా ప్రభుత్వంలోని నాలుగవతరగతి ఉద్యోగిక్రింద రెండవతరగతి ఉద్యోగిని పనిచేయుమంటే ఒప్పుకోడు.

**క. వినుమేను విక్రమింపఁగఁ । గనుఁగొనియెడునంతవాఁడుఁ గలఁడే? కులశై**
**ల నికాయంబు వగల్తును । వననిధులు గలంతు ధరణి వ్రత్తుం గలయన్. 250**

**ప్రతిపదార్థం:** వినుము= విను; ఏను= నేను; విక్రమింపఁగన్= పరాక్రమం ప్రదర్శిస్తే; కనుఁగొనియెడు= చూడగలిగిన; అంతవాఁడున్= అంతటి సామర్థ్యం కలవాడు కూడా; కలఁడే?= ఉన్నాడా?; కులశైల నికాయంబు= కులపర్వతాల సముదాయాన్ని; వగల్తును= బ్రద్దలు చేస్తాను; వన నిధులు= సముద్రాలను; కలంతున్= సంక్షోభింపజేస్తాను; ధరణి= భూమిని; కలయన్= అంతటా; వ్రత్తున్= చీల్చివేస్తాను.

**తాత్పర్యం:** వినుము, నేను పరాక్రమం ప్రదర్శిస్తే (ఎదిరించటమూ, మించటమూ మాట అట్లా ఉంచి) చూడగల సామర్థ్యం కలవాడు కూడా లేడు. నేను కులపర్వతాలను పగులగొట్టగలను. సముద్రాలను కలచి వెయ్యగలను. భూమినంతటినీ చీల్చి వెయ్యగలను.

**విశేషం:** 'నికాయంబులు వగలుతు' అని ఉస్మానియా, వావిళ్ళ ప్రతులు రెంటిలోనూ ఉన్నది. నికాయంబులన్ అని ద్వితీయాంతమైతే 'ఁబగలుతు' అని ఉండాలి ప్రథమాంతమైతే 'నికాయంబులు వగలుతు' అని ఉండాలి. సూ.ని.లో.పగులుచు ఉన్నది కాని వగలుచు లేదు.

**చ. నరవర! చూడవే తెలియ నాదగు బాహులు మద్బలంబు నీ**
**వరయక పల్కితే నొకని కక్కట! సారథినై రథిత్వ వి**
**స్ఫురణము దక్క నోపుదునె? సూతతనూజుఁడు షోడశాంశమున్**
**దొరయఁడు నాకు వాసవసుతున్ మురమర్దనుఁ జీరికిం గొనన్. 251**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; మత్+బలంబున్= నా శక్తిని; నీవు; అరయక= పరిశీలింపక; పల్కితి(వి)+ఏన్= పలికిన పక్షంలో; తెలియన్= (నా బలం) తెలియటానికి; నాదగు= నావి అయిన; బాహువులు= చేతులు; చూడవు+ఏ= చూడు; అకట!= అయ్యో!; ఒకనికిన్= అల్పునికి, ఎవడో ఒకడికి; సారథిన్+ఐ= సూతుడనై; రథిత్వ= రథికునితనంయొక్క; విస్ఫురణము= మెరవటం, రథికుడుగా పేరుకెక్కటం; తక్కన్= తప్పిపోవటానికి; ఓపుదునె?= సహింపగలనా?; సూత తనూజుఁడు= సూత పుత్రుడైన కర్ణుడు; నాకున్= నాకు; షోడశ= పదహారవ; అంశమున్= పాలుగూడా; దొరయఁడు= సరికాడు; (నేను) వాసవ సుతున్= ఇంద్రుని కుమారుడైన అర్జునుడినీ; మురమర్దనున్= నరకుని సేనాని అయిన మురాసురుని సంహరించిన కృష్ణుడినీ; చీరికిన్+కొనన్= లక్ష్యపెట్టను.

**తాత్పర్యం:** రాజా! నీవు నా బలం తెలియనందువలన కర్ణుడికి సారథివి కమ్మని పలికిన పక్షంలో నా బలం తెలియాలంటే నా చేతు లెట్లా ఉన్నాయో చూడుము. అబ్బా, నేను ఒక అల్పుడికి, ఎవడో ఒకడికి సారథినయి, రథికుడిగా నా పరాక్రమం ప్రదర్శించే అవకాశం కోల్పోవటాన్ని సహించగలనా? ఈ సూతపుత్రుడు శక్తిలో నా పదహారవ పాలుకు కూడా సాటి రాలేడు. దేవేంద్రుడి కొడుకైన అర్జునుడినీ, మురాంతకుడైన కృష్ణుడినీ కూడా నేను లేశమైనా లెక్కపెట్టను.

**వ. ఇట్లగుటెఱుంగక చెప్పితి వెఱింగియుం గర్ణపక్షపాతంబున నన్నవమానించెదేని మా భూమికింబోయి వచ్చెద' నని పలికి రాజమధ్యంబున నుండి వెడలిపోవం జూచినం గురుపతి సప్రణయబహుమానంబునం జని నిలువరించి సాంత్వన స్వరంబున 'మధురాక్షర విన్యాసంబుగా నతనితోఁ 'గర్ణుండ యేల తక్కునీకెక్కుడయిన రథికులుం గలరే? కడిందిపగఱకు హృదయశల్యం బగుటఁగాదె! నీకు శల్యుండను నభిధానంబయ్యె నాయభిప్రాయంబు వినుము ధనంజయునకు రథికగుణంబులం గర్ణుండు మిక్కిలి కృష్ణునకు నశ్వహృదయజ్ఞానంబున నీ వధికుండవు ధనంజయునకుఁ బ్రతివీరుంగా మనము కర్ణుం జాలించితి మది కృష్ణుండు సెల్లనీ కునికిం జేసి కృష్ణవర్తనంబునకుఁ బ్రతివిధానం బాచరింప నిన్నుం గోరితి నింతపని నీకుందక్క నొరులకు శక్యం బగునే' యనిన విని ముదిత హృదయుండయి మద్రేశ్వరుండు. 252**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; అగుట= ఉండుట; ఎఱుంగక= తెలియక; చెప్పితివి= (సారథివి కమ్మని) చెప్పావు; ఎఱింగియున్= తెలిసికూడా; కర్ణ= కర్ణుడియొక్క; పక్ష= వైపు; పాతంబునన్= ఒరగటంచేత; నన్నున్= ఇటువంటి నన్ను; అవమానించెదు+ ఏనిన్= ఇలా పరాభవిస్తున్న పక్షంలో; మా భూమికిన్= మా దేశానికి; పోయివచ్చెదన్= వెళ్ళివస్తాను; అని; పలికి= చెప్పి; రాజమధ్యంబుననుండి= రాజుల నడుమనుంచి; వెడలిపోవన్= వెళ్ళిపోవటానికి; చూచినన్= ప్రయత్నించగా; కురుపతి= కురువంశీయుడయిన రాజు దుర్యోధనుడు; సప్రణయ= ప్రేమతో కూడిన; బహుమానంబునన్= గౌరవంతో; చని= వెళ్ళి; నిలువరించి= ఆపి; సాంత్వన= ఊరడింపుతో కూడిన; స్వరంబునన్= కంఠస్వరంతో; మధుర= తీయని; అక్షర= అక్షరాల యొక్క; విన్యాసంబుగాన్= ఉంచుట కలిగేటట్లు (తీయని) మాటలతో; అతనితోన్= శల్యుడితో; కర్ణుండఏల= కర్ణుడే ఏమి; తక్కు= మిగిలినవారిలో; నీకున్= నీకంటే; ఎక్కుడు= అధికులు; అయిన= ఐన; రథికులున్= రథం ఎక్కి యుద్ధం చేసేవారు కూడా; కలరే= ఉన్నారా? కడింది= గొప్పవారైన; పగఱకున్= శత్రువులకు; హృదయ శల్యంబు= గుండెలో దిగినబాణం; అగుటన్+కాదె!= ఐనందువలన కదా!; నీకున్= నీకు; శల్యుండు+అను= శల్యుడు అనే; అభిధానంబు= పేరు; అయ్యెన్= కలిగింది; నా+అభిప్రాయంబు= నాయొక్క ఉద్దేశం; వినుము; కర్ణుండు= అంగరాజు; రథిక గుణంబులన్= రథికులకు ఉండే గుణాలలో; ధనంజయునకున్= అర్జునుడికంటె; మిక్కిలి= అధికుడు; నీవు= మద్రదేశాధీశ్వరుడవైన నీవు; అశ్వ= గుర్రాలయొక్క; హృదయ= మనస్సులయొక్క; జ్ఞానంబునన్= తెలివిలో; కృష్ణునకున్= శ్రీకృష్ణుడికంటె కూడా; అధికుండవు= ఎక్కువవాడవు; మనము= నీవూ తదితరులమూ; ధనంజయునకున్= అర్జునుడికి; ప్రతివీరున్+కాన్= ఎదిరియోధుడిగా; కర్ణున్= అంగరాజును; చాలించితిమి= సమర్థుడిగా చేశాము; అది= కర్ణుడి ప్రతివీరత్వాన్ని; కృష్ణుండు= శ్రీకృష్ణుడు; చెల్లనీక= సాగనివ్వక; ఉనికిన్+ చేసి= ఉండినందువలన; కృష్ణ= కృష్ణుడియొక్క; వర్తనంబునకున్= నడవడికి; ప్రతివిధానంబు= మారుపద్ధతి; ఆచరింపన్= చేయటానికి; నిన్నున్= సమర్థుడవైన నిన్ను; కోరితిని= ప్రార్థించాను; ఇంతపని= కృష్ణుడి ఎత్తుకు పై ఎత్తుగా నడపటమంత గొప్పకార్యం; నీకున్= సమర్థుడవైన నీకు; తక్కన్= తప్ప; ఒరులకున్= ఇతరులకు; శక్యంబు= చేయదగినది; అగునే= కాగలదా?; (కాదని అర్థం); అనినన్= అని చెప్పగా; విని; ముదిత= సంతోషించిన, హృదయుండు= మనస్సు కలవాడు; అయి; మద్రేశ్వరుండు= మద్రదేశపు రాజైన శల్యుడు.

**తాత్పర్యం:** విషయం ఇటువంటి దని నీకు తెలియనందున కర్ణుడి రథం తోలుమన్నావు; తెలిసికూడా కర్ణుడిమీద ఎక్కువ ప్రేమ ఉన్నందున నన్ను పరాభవిద్దామనుకుంటున్నావో, నేను మా దేశానికి వెళ్ళిపోతాను.' అని చెప్పి, శల్యుడు రాజుల మధ్యనుండి వెళ్ళిపోబోతుంటే దుర్యోధనుడు వెళ్ళి, ప్రేమతో, గౌరవంతో ఆపాడు. ఊరడిస్తున్న గొంతుతో తియ్యని పలుకులు ఉచ్చరిస్తూ శల్యుడితో ఇట్లా అన్నాడు. 'కర్ణుడే కాదు నిన్ను మించిన రథికులు మరెవరూ కూడా లేరు. (కనుక, రథికులలో కర్ణుడు నీకంటె ఎక్కువవాడని కాని, అతడికంటె నీవు తక్కువవాడవని కాని ని న్నతడికి

సారథివి కమ్మనలేదు.) నీవు గొప్ప శత్రువుల గుండెలో శల్యం(బాణం) వంటి వాడవైనందువలన కదా, నీకు శల్యుడనే పేరు వచ్చింది! (అయితే నన్నీ నీచకార్యానికెందుకు నియమించావంటే అట్లా నిన్ను సారథ్యం వహించమనటంలో) నా ఉద్దేశమేమిటో కొంచెం వినుము. (ఇక్కడ రథికులలో నీవెక్కువా కర్ణుడెక్కువా అన్నది కాదు ఆలోచించవలసినది) రథికుడి కుండవలసిన లక్షణాలలో అర్జునుడికంటె గొప్పవాడు కర్ణుడు, గుర్రాల మనస్సు తెలిసికొనటంలో కృష్ణుడికంటె గొప్పవాడవు నీవు. అర్జునుడికి ప్రతివీరుడిగా మనం కర్ణుడిని తగినవాడిని చేశాము (ఇదీ అశ్వత్థామ ఇట్లా చేయుమని చెప్పినందున మీ అందరూ ఆమోదించినందువలన అతడు సేనానాయకు డైనాడు. కాని, నా పక్షపాతంవలన కాదు.) మన ఈ నిర్ణయాన్ని కృష్ణుడు అర్జునుడికి సారథిగా ఉండి నిరుపయోగం చేస్తున్నాడు. దానికి తగిన ప్రతిక్రియ చేయాలంటే, కృష్ణుడి ఎత్తులకు పైఎత్తులు వెయ్యాలంటే సమర్థుడవు నీ వొక్కడవే కనుక ని న్నిలా ప్రార్థించాను. (కనుక ఎక్కువ తక్కువలు ఆలోచించవలసినది నీకూ కృష్ణుడికీ మధ్య మాత్రమే. కృష్ణుడికంటె నీవధికుడవనుకోబట్టే నిన్ను ప్రార్థించినది. ఇది నిన్నెక్కువ గౌరవించటం కాని పరాభవించటం కాదు.) ఇంత మహాకార్యం నీ వలన కావాలి. కాని, ఇతరులవలన కాదు' అని చెప్పేసరికి శల్యుడికి మనస్సులో చాలా సంతోషం కలిగింది. అందువలన ఇట్లా అన్నాడు:

**క. 'ననుఁ గృష్ణుకంటె నధికుం । డని యిమ్మనుజేంద్రకోటి యాకర్ణింపం**
**గొనియాడితి విమల యశో । ఘనుఁ డగు కర్ణునకు రథము గడపెద నధిపా!' 253**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా దుర్యోధనా!; ననున్= నన్ను; కృష్ణుకంటెన్= సర్వాధికుడని అందరిచేతా కీర్తింపబడుతున్న కృష్ణుడికంటె; అధికుండని= గొప్పవాడనని; ఈ+మనుజేంద్ర= ఈ రాజులయొక్క; కోటి= సమూహం; ఆకర్ణింపన్= వినగా; కొనియాడితి(వి)= ప్రశంసించావు; విమల= స్వచ్ఛమైన; యశః= (దానాదుల వలన కలిగిన) కీర్తి చేత; ఘనుఁడు= గొప్పవాడు; అగు= అయిన; కర్ణునకున్= అంగరాజుకు; రథము= తేరు; కడపెదన్= తోలుతాను.

**తాత్పర్యం:** 'రాజా! ఇంతమంది రాజులు వింటూ ఉండగా, నీవు నన్ను కృష్ణుడికంటె గొప్పవాడివి అని ప్రశంసించావు. కనుకనూ, స్వచ్ఛమైన కీర్తి చేత గొప్పవాడైన కర్ణుడికి నేను రథం నడుపుతాను.

**విశేషం:** ఎవరి నెట్లా పడగొట్టాలో దుర్యోధనుడికి బాగా తెలుసు. ఇప్పుడు శల్యుడిని పడగొట్టటం అతని ఉద్దేశం. అందుకతడు వేసిన ఎత్తు రెండోసారి ఫలించింది. ఒకడి రథం నేను తోలటమేమిటి అని అనుకొన్నప్పుడు కర్ణుడు సూతజుడుగా, రాధేయుడుగా (249వ పద్యం) అతడికి కనిపించాడు. నీవు కృష్ణుడికంటె గొప్పవాడవనేసరికి అదే కర్ణుడు విమల యశోఘనుడుగా కనిపించాడు. పొగడ్తలకు లొంగిపోయే వారి స్వభావాలు ఈలాగే ఉంటాయి.

**వ. అని యా సూతనందను నుద్దేశించి వెండియు నిట్లనియె. 254**

**ప్రతిపదార్థం:** అని= ఇలా పలికి; ఆ సూతనందనున్= ఆ సూతపుత్రుడయిన కర్ణుడిని; ఉద్దేశించి= మనస్సులో పెట్టుకొని; వెండియున్= మళ్ళీ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని కర్ణుడి విషయమై మళ్ళీ ఇట్లా అన్నాడు:

**విశేషం:** పుట్టుకతో పుట్టిన బుద్ధి పోయేదికాదు. దుర్యోధనుడి మాటల నేర్పువలన ఒప్పుకొన్నా తన ఆధిక్యం వదులుకొనటం శల్యుడికి సమ్మతం కాలేదు. కనుక మళ్ళీ విమలయశోఘనుడు సూతనందనుడై పోయాడు. ఈ మాట అంటున్నది

సంజయుడే అయినా శల్యుడి మనసు ననుసరించి అంటున్నాడు. అంతేకాదు, శల్యుడు తన సారథ్యానికి ఒక 'షరత్తు' విధిస్తున్నాడు.

**క. 'జనవల్లభ! యొకసమయము । విను మీతనితోడ నేను విచ్చలవిడిఁ దోఁ**
**చిన మాట లెల్ల నాడుదు । నను నెగ్గులు వట్ట కుండినం బొం దొనరున్.' 255**

**ప్రతిపదార్థం:** జనవల్లభ!= ప్రజానాథా! రాజా! దుర్యోధనా!; ఒక; సమయము= నియమం; వినుము= విను; ఈతనితోడన్= ఈ కర్ణుడితో; నేను= కృష్ణుడికంటె అధికుడనైన నేను; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; తోఁచిన= మనస్సుకు స్ఫురించిన; మాటలెల్లన్= పలుకులన్నీ; ఆడుదున్= పలుకుతాను; ననున్= అలా పలికిన నన్ను; ఎగ్గులు+పట్టక= తప్పులు పట్టక; ఉండినన్= ఉండినట్లయితే; పొందు= స్నేహం; ఒనరున్= కలుగుతుంది.

**తాత్పర్యం:** 'రాజా! ఒక నియమం విను. నేను ఇతడితో నా ఇష్టం వచ్చినట్లు నాకు తోచిన మాటలన్నీ మాట్లాడుతాను. అందుకు నన్ను తప్పుపట్టకుండా ఉంటే స్నేహం కుదురుతుంది.'

**క. అనుటయు గారవమున నీ । తనయుఁడు రాధేయుఁ జూచి తగు ని ట్లగుఁగా**
**కని పలికి శల్యునిం గనుఁ । గొని యిది గడులెస్స యనియెఁ గురువంశనిధీ! 256**

**ప్రతిపదార్థం:** కురువంశనిధీ!= కురుకులానికి నిధివంటి ధృతరాష్ట్ర మహారాజా!; అనుటయున్= అని చెప్పగా; నీ తనయుఁడు= నీ కుమారుడైన దుర్యోధనుడు; గారవమునన్= గౌరవంతో; రాధేయున్= రాధాపుత్రుడైన కర్ణుడిని; చూచి= పరికించి; తగున్= శల్యుడు అలా మాటాడటం యుక్తం; ఇట్లు+అగున్+కాక= ఇట్లాగే అగుగాక!; అని= అలా; పలికి; శల్యునిన్= శల్యుడిని; కనుఁగొని= చూచి; ఇది= ఈ నియమం; కడున్= మిక్కిలి; లెస్స= మంచిది; అనియెన్.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అట్లా శల్యుడు పలుకగానే దుర్యోధనుడు గౌరవంతో కర్ణుడిని చూచి, శల్యుడట్లా మాట్లాడటం యుక్తమే. అట్లాగే కానీ అని చెప్పి శల్యుడితో 'ఇది చాలా మంచిది' అన్నాడు.

**వ. ఇట్లభినందించి యన్నరేంద్రుం డమ్మద్రపతి మనం బురియాడునో యని శంకించి యతనితో మఱియు నిట్లను 'నివ్విధం బాచరించుటకు విచారంబు వలవదు తొల్లింటి పెద్దల వృత్తాంతంబు వినుము మార్కండేయ మహాముని మాతండ్రి కేను వినుచుండఁ జెప్పినయది నీకుం జెప్పెద సురలతోడి దురంబున నసురవరుండగు తారకుండు దెగిన పిదపఁ దదీయ తనయులు విద్యున్మాలియుఁ దారకాక్షుండును గమలాక్షుండును నను వారలు వారిజాసను నుద్దేశించి. 257**

**ప్రతిపదార్థం:** ఇట్లు; అభినందించి= సంతోషకరంగా పలికి; ఆ+వర+ఇంద్రుండు= ఆ రాజు దుర్యోధనుడు; ఆ+మద్రపతి= ఆ మద్రదేశపురాజైన శల్యుడియొక్క; మనంబు= మనస్సు; ఉరియాడునో= బాధపడుతుందేమో; ఊగిసలాడుతుందేమో; అని; శంకించి= సందేహించి; అతనితోన్= ఆ శల్యుడితో; మఱియున్= ఇంకా; ఇట్లు; అనున్= అన్నాడు; ఈ+విధంబు= ఈ ప్రకారం; ఆచరించుటకున్= చేయటానికి; విచారంబు= చింత; వలవదు= వద్దు; తొల్లింటి= పూర్వపు; పెద్దల= పెద్దవారియొక్క; వృత్తాంతంబు= ఉదంతం; వినుము; మార్కండేయ మహాముని= మార్కండేయుడు అనే ఒక గొప్ప ఋషి; మాతండ్రికిన్= మా తండ్రి అయిన ధృతరాష్ట్రుడితో; ఏను= నేను; వినుచుండన్= వింటూ ఉండగా; చెప్పిన+అది= చెప్పిన వృత్తాంతం;

నీకున్= నీకు; చెప్పెదన్= చెపుతాను; సురలతోడి= దేవతలలోనైన; దురంబునన్= యుద్ధంలో; అసురవరుండు+అగు= అసురులలో శ్రేష్ఠుడైన; తారకుండు= తారకుడనే రాక్షసుడు; తెగిన పిదపన్= మరణించిన తరువాత; తదీయ= అతడి వారైన; తనయులు= కుమారులు; విద్యుత్+మాలియున్+తారక+అక్షుండును; కమల+అక్షుండును= విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు; అనువారలు= అనే పేరులు గలవారు; వారిజాసనున్= పద్మం ఆసనంగా గల బ్రహ్మను; ఉద్దేశించి= గురించి.

**తాత్పర్యం:** దుర్యోధనుడు అట్లా సంతోషపెట్టేమాట పలికాడు. తరువాత శల్యుడి మనస్సు బాధపడుతుందేమో అనీ, ఊగిసలాడుతుందేమో అనీ సందేహించి అతడితో ఇంకా ఇట్లా అన్నాడు: 'ఈ విధంగా చేయవలసి వచ్చిందే అని విచారించవద్దు. పూర్వకాలానికి చెందిన పెద్దవారి ఉదంతం ఒకటి చెప్పుతాను వినుము. ఒకప్పుడు మార్కండేయ మహర్షి మా తండ్రి ధృతరాష్ట్రుడితో దీనిని చెప్పాడు. అప్పుడు నేను కూడా వింటూ అక్కడ ఉన్నాను. దేవతలతో జరిగిన యుద్ధంలో తారకాసురుడు మరణించాడు. ఆ తరువాత అతడి ముగ్గురు కుమారులు - విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు అనేవారు బ్రహ్మను గురించి. (తరువాతి పద్యంతో అన్వయం).

### దుర్యోధనుఁడు శల్యునకుఁ ద్రిపురాసురుల వృత్తాంతంబు సెప్పుట (సం. 8-24-1)

**క. 'దమమున నియమంబున ను । త్తమమును ఘోరంబు నైన తప మతినిష్ఠం**
**బ్రముదితులై చేయఁగ న । క్కమలభవుఁడు దోఁచి పరమకారుణ్యమునన్. 258**

**ప్రతిపదార్థం:** దమమునన్= బాహ్యేంద్రియ నిగ్రహంతోనూ; నియమంబునన్= నియమంతోనూ (నియమం అన్నది ఎనిమిది అంగాలలో ఒకటి. ఇది ఐదు విధాలు: 1. బాహ్యాభ్యంతర శౌచం, 2. సంతోషం, 3. తపస్సు, 4. స్వాధ్యాయం, 5. ఈశ్వర ప్రణిధానం) ఉత్తమమును= శ్రేష్ఠమైనదీ; ఘోరంబును= భయంకరమైనదీ; ఐన= అయిన; తపము= తపస్సు; అతినిష్ఠన్= మిక్కిలి నిష్ఠతో; ప్రముదితులు= మిక్కిలి సంతుష్టులు; ఐ= అయి; చేయఁగన్= కావించగా; ఆ+కమలభవుఁడు= పద్మంనుండి జన్మించిన బ్రహ్మ; పరమ కారుణ్యమునన్= మిక్కిలి దయతో; తోఁచి= ప్రత్యక్షమై.

**తాత్పర్యం:** (వాళ్ళు) ఇంద్రియ నిగ్రహరూపమైన దమంతోనూ, శౌచ, సంతోష, తపస్స్వాధ్యాయ, ఈశ్వరప్రణిధాన రూపమైన అష్టాంగాలలో ఒకటైన నియమంతోనూ, ఉత్తమమై భయంకరమైన తపస్సు మిక్కిలి నిష్ఠతో బహు సంతుష్టితో చేశారు. దానికి గొప్ప దయ కలిగి, బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై. (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. 'వరంబులు గోరికొం' డనవుడు వారందఱు 'నొక్కమాటయకా సకలభూతంబులవలనను సర్వకాలంబుల యందును నవధ్యత్వంబు మాకు నీయవలయు' నని యడుగుటయు నయ్యజుండు. 259**

**ప్రతిపదార్థం:** వరంబులు= కోరికలు; కోరికొండు= కోరుకోండి; అనవుడున్= అని పలుకగా; వారు= ఆ అసురకుమారులు; అందఱున్= ముగ్గురూ; ఒక్కమాట+అ+కాన్= ఒకేమాట అయ్యేటట్లు; సకల= సమస్తమైన; భూతంబులవలనను= ప్రాణులవలన; సర్వకాలంబుల యందును= అన్ని కాలాలలోనూ; అవధ్యత్వంబు= చంపబడకుండటం; మాకున్= మా ముగ్గురికీ; ఈయవలయున్= ఇవ్వాలి; అని; అడుగుటయున్= అడుగగా; ఆ+అజుండు= ఆ బ్రహ్మ.

**తాత్పర్యం:** 'కోరికలు కోరుకొనండి' అన్నాడు. అపుడు వారు ముగ్గురూ ఒకేమాటగా 'మాకు ఎన్నడూ ఏ ప్రాణివలనా మరణం రాకూడదు. ఈ వరమి'మ్మని అడిగారు. అపు డా బ్రహ్మ; (ఇట్లా అన్నాడు).

**క. 'ఆ చంద మెందుఁ గల దది । గోచరమే? యిచ్చుటకును గొనుటకుఁ దగుమై**
**సూచి యడుగుండు శుభదం । బై చెల్లెడునట్లుగాఁ బ్రియంబున నిత్తున్.' 260**

**ప్రతిపదార్థం:** ఆ చందము= ఆ పద్ధతి; ఎందున్= ఎక్కడ; కలదు?= ఉన్నది?; అది= మరణం లేకుండా ఉండటం; గోచరమే= ఎక్కడైనా అగుపిస్తుందా? - అంటే ఉంటుందా; ఇచ్చుటకును= ఇవ్వటానికీ; కొనుటకున్= పుచ్చుకొనటానికీ; శుభదంబై= శుభాన్నిచ్చేదై; చెల్లెడునట్లుగాన్= చెల్లుబడి అయ్యేటట్లుగా; తగు= తగిన; మై= పద్ధతి; చూచి= ఆలోచించి; అడుగుండు= కోరండి; ప్రియంబునన్= ఇష్టంతో; ఇత్తున్= ఇస్తాను.

**తాత్పర్యం:** 'అట్లాంటి పద్ధతి ఎక్కడైనా ఉన్నదా? మరణం లేకుండా ఉండటం ఎక్కడైనా అగుపిస్తుందా? అందువల్ల తగినది, శుభప్రదమైనదీ, ఇవ్వటానికి వీలైనదీ, ఆలోచించి అడగండి. ప్రీతితో ఇస్తాను.

**వ. అనవుడు నయ్యసుర 'లట్లేని మాకు ముయ్వురకు మూఁడు పురంబు లెల్ల సుఖంబులుం గలిసి కామగమనంబులై దేవదానవ యక్షోరగాది జాతులకుం జెఱుపరాక విలసిల్లునట్లుగా నొసంగు మేము భవత్ప్రసాదంబు సొంపున నిర్భయులమై పెంపొంది సంచరించెద' మనుటయుఁ బద్మభవుం 'డిది లెస్స దీనికిఁ దుది యిట్టిద' యని నుడివి 'యట్టిది గాకుండ నప్రమత్తులరై వర్తిలుం డనిన నద్దనుజేంద్రు 'లప్పురంబు లప్పు డొక్కెడం గూడెనప్పడు బలియుండగువాఁడు సెఱుపం దలంచినం జెడునదిగా నొడంబడితిమి త్రిపురంబులు సంగతంబులు గాకున్న నసాధ్యంబులై వెలయువలయు' నని పల్కిన న ద్దేవుండు 'మీరు పురత్రయంబును సంపాదించుకొనుం డే నమ్మహానుభావంబులం బొందునట్లుగా నిచ్చితి నని నిజస్థానంబునకుం జనియె నిత్తెఱంగున.' 261**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; ఆ+అసురులు= ఆ రాక్షసులు; అట్లేనిన్= అలా అయితే; మాకున్= మాకు; ముయ్వురకున్= ముగ్గురకూ; మూడు పురంబులు= మూడు నగరాలు; ఎల్లన్= సమస్తమైన; సుఖంబులున్+కలిగి= సుఖాలూ ఉండి; కామ గమనంబులై= సంకల్పాన్నిబట్టి పోయేవి అయి; దేవ= దేవతలు; దానవ= రాక్షసులు; యక్ష= యక్షులు; ఉరగ= నాగులు; ఆది= మొదలైన; జాతులకున్= తెగలవారికీ; చెఱుపన్ రాక= నాశనం చేయటానికి శక్యం కాక; విలసిల్లునట్లుగాన్= ఒప్పేవిధంగా; ఒసంగుము= ఇవ్వు; ఏము= మేము; భవత్= నీయొక్క; ప్రసాదంబు= అనుగ్రహంయొక్క; సొంపునన్= అందంతో; నిర్భయులము+ఐ= భయంలేనివారమై; పెంపు+ఒంది= వృద్ధిచెంది; సంచరించెదము= తిరుగుతుంటాము; అనుటయున్= అని చెప్పగా; పద్మభవుండు= పద్మమందు జన్మించిన బ్రహ్మ; ఇది= ఈ పద్ధతి; లెస్స= మంచిది; దీనికిన్; తుది= అంతం; ఇట్టిది+అ= ఈ ప్రకారమైనదే; అని; నుడివి= చెప్పి; అట్టిది= ఆ ప్రకారం; కాకుండన్= సంభవించకుండా; అప్రమత్తులరు+ఐ= ఏమరుపాటు కలవారు కాకుండా; వర్తిలుండు= ప్రవర్తించండి; అనినన్= అని చెప్పగా; ఆ+దనుజేంద్రులు= ఆ రాక్షసరాజులు; ఆ+పురంబులు= ఆ నగరాలు; ఎప్పుడు= ఏ సమయంలో; ఒక్కెడన్= ఒక్కచోట; కూడెన్= కలుస్తాయో; అప్పుడు= ఆ సమయంలో; బలియుండు= బలవంతుడు; అగువాఁడు= ఐనవాడు; చెఱుపన్= నాశనం చేయటానికి; తలంచినన్= సంకల్పిస్తే; చెడునదిగాన్= నశించే పద్ధతిగా; ఒడంబడితిమి= ఒప్పుకొన్నాము; త్రిపురంబులు= మూడు నగరాలు; సంగతంబులు= కూడినవి; కాక= కాకుండా; ఉన్నన్= ఉన్న పక్షంలో; అసాధ్యంబులై= సాధింపరానివై, చెరుపరానివై; వెలయన్‌వలయున్= విలసిల్లాలి; అని; పల్కినన్= పలుకగా; ఆ+దేవుండు= ఆ బ్రహ్మదేవుడు; మీరు= మీరు ముగ్గురూ; పురత్రయంబును= మూడు నగరాలను; సంపాదించుకొనుండు= గడించుకోండి; ఏను= నేను; ఆ+మహానుభావంబులన్= (అవి) ఆ ప్రభావాలను; పొందునట్లుగాన్= పొందే విధంగా; ఇచ్చితిన్= వరం ఇచ్చాను; అని; నిజస్థానంబునకున్= తన నివాసస్థానానికి; చనియెన్= వెళ్ళాడు; ఈ+తెఱంగునన్= ఈ విధంగా.

**తాత్పర్యం:** అట్లా అనేసరికి, ఆ అసురులు 'అట్లా అయితే మాకు ముగ్గురికీ మూడు నగరాలిమ్ము. వాటిలో అన్ని సౌఖ్యాలూ ఉండాలి. మేము మనస్సులో అనుకొంటే చాలు అని ఎక్కడికైనా ప్రయాణం చెయ్యగలగాలి. వాటిని దేవతలు, దానవులు, యక్షులు, నాగులు మొదలయిన జాతులవారికి కూడా నాశనం చేయటం శక్యం కాకూడదు. ఇట్లా వరమిమ్ము. నీ అనుగ్రహం వలన మేము ఏ భయమూ లేకుండా తిరుగుతాము' అన్నారు. అపుడు బ్రహ్మ 'ఇది మంచిది మరి దీనికి అంతం ఇట్లా ఉంటుంది' అని కూడా చెప్పి, అట్టి పరిస్థితి రాకుండా ప్రవర్తించుకొనండి. అన్నాడు. దాని కా రాక్షసరాజులు 'ఆ నగరాలు ఎప్పుడు ఒకచోట కలుస్తాయో, అప్పుడు బలం ఉన్నవాడు వాటిని పడగొట్టదలచుకొంటే పడిపోవచ్చు. ఇందుకు ఒప్పుకొన్నాము. ఈ మూడూ ఒక్కచోటికి చేరకపోతే మాత్రం వీటిని ఎవరూ ఏమీ చేయలేకపోవాలి' అన్నారు. అప్పుడు బ్రహ్మదేవుడు 'సరే! మీరు మూడు నగరాలూ గడించుకోండి, నేనూ వాటికా ప్రభావం కలిగేటట్లు వరమిచ్చాను' అని చెప్పి తన లోకానికి వెళ్ళిపోయాడు. ఈ ప్రకారంగా- (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **వరము వడసిన యాదైత్యవరులు దమకుఁ । బురము లొనరింప దానవపూజ్యు మయుని**
**వేఁడికొనుటయు నాతఁడు విపులతపము । కలిమి నొప్పారు పురవర్మములు ఘటించె.** **262**

**ప్రతిపదార్థం:** వరము= బ్రహ్మనుండి వరం; పడసిన= పొందిన; ఆ దైత్యవరులు= ఆ రాక్షసశ్రేష్ఠులు; తమకున్= తమ ముగ్గురికోసమూ; పురములు= నగరాలు; ఒనరింపన్= నిర్మించటానికి; దానవపూజ్యున్= దానవులకు పూజింపదగిన; మయుని= మయుడు అనేవానిని; వేఁడికొనుటయున్= కోరుకొనగా; ఆతడు= ఆ మయుడు; విపుల= విశాలమైన; అధికమైన; తపముకలిమిన్= తపస్సుచేసి ఉన్నందువలన; ఒప్పారు= అన్నివిధాలా తగిన; పురవర్మములు= నగరకవచాలు; ఘటించెన్= సమకూర్చాడు.

**తాత్పర్యం:** ఇట్లా బ్రహ్మనుండి వరంపొందిన రాక్షసులు ముగ్గురూ తమకోసం నగరాలు నిర్మించి పెట్టుమని మయుడిని ప్రార్థించారు. అతడు దానవులకు పూజనీయుడు, మహాతపశ్శాలి. కనుక వారి అభిప్రాయానికి అన్నివిధాలా తగిన నగరాలనే కవచాలు నిర్మించాడు.

**వ.** **అవియుం బ్రాకార గోపురప్రాసాదప్రముఖ వివిధావయవంబులు పసిండియు వెండియు నినుమును నై నాలుగు దిక్కులు నూఱేసి యోజనంబులు గలిగియుండు నందుఁ బసిండిం జేసినయది దివంబునను వెండి నొనరించినయది యంతరిక్షంబునను నినుమునం గావించినయది భూమిని సంచరింపను వరుసన వానికిం దారకాక్షుండును గమలాక్షుండును విద్యున్మాలియు రాజులయి దివ్యంబులగు నంబరంబులను నాభరణంబులను మాల్యానులేపనంబులను మఱియు ననేక విధంబుల నుజ్జ్వలులై నెగడుదు రిట్లు పురత్రయ విహారంబున జగత్త్రయంబును నాక్రమించి యసురత్రయం బప్రతిహత విభూతిమై వర్తించు నమ్మువ్వురుం దన్ను నాశ్రయించుటం జేసి వారల యోగక్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యదియెల్లం దన మాయా బలంబున మయుం డొదవించుచుండు నవ్విధంబునఁ బరమసౌఖ్యంబు లనుభవించుచుండ బహుకోటి సంవత్సరంబులు సనియె నట్టియెడ.** **263**

**ప్రతిపదార్థం:** అవియున్= ఆ పురాలూ; ప్రాకార= చుట్టుగోడలు; గోపుర= పురద్వారాలు; ప్రాసాద= రాజభవనాలు; ప్రముఖ= మొదలయిన; వివిధ= అనేకప్రకారాల; అవయవంబులు= భాగాలు; పసిండియున్= బంగారమూ; వెండియున్= రజతమూ;

ఇనుమునునై= ఇనుమూ అయి; నాలుగు దిక్కులు= నలువైపుల (ఎటు చూసినా); నూఱు+ఏసి= వందేసి; యోజనంబులు కలిగి= యోజనాల మేర కలిగి; (యోజనమంటే నాలుగుక్రోసులు, క్రోసుకు వేయి దండాలు, దండానికి నాలుగు హస్తాలు. హస్తమంటే ఒకమూర, రెండువేల దండాలు ఒక క్రోసని మరొకమతం) ఉండున్= ఉంటుంది; అందున్= ఆ పురాలలో; పసిండిన్= బంగారంతో; చేసిన+అది= నిర్మించినది; దివంబునను= స్వర్గంలోనూ; వెండిన్= రజతంతోనూ; కావించిన+అది= చేసినది; అంతరిక్షంబుననున్= ఆకాశంలోనూ; ఇనుమునన్= ఇనుముతో; కావించిన+అది= చేసింది; భూమిని= భూలోకంలోనూ; సంచరింపను= తిరుగుతుండగా; వరుసన= వరుసగా; వానికిన్= ఆ పురాలకు; తారకాక్షుండు= తారకాక్షుడు అనే పేరుగలవాడూ; కమలాక్షుండును= కమలాక్షుడనే పేరుకలవాడూ; విద్యున్మాలియున్= విద్యున్మాలి అనే పేరుకలవాడూ; రాజులయి= అధిపతులై; దివ్యంబులు= స్వర్గంలో పుట్టినవి; అగు= అయిన; అంబరంబులను= వస్త్రాలచేతనూ; ఆభరణంబులను= నగలచేతనూ; మాల్యానులేపనంబులను= మాల్య= దండలచేతనూ; అనులేపనంబులను= పూతలచేతనూ; మఱియున్= ఇంకా; అనేక= చాలా; విభవంబులన్= ఐశ్వర్యాలచేతనూ; ఉజ్జ్వలులై= మిక్కిలి ప్రకాశమానులై; నెగడుదురు= ఒప్పుదురు; ఇట్లు= ఈ ప్రకారం; పురత్రయ= మూడు పట్టణాలతో; విహారంబునన్= విహరించటంచేత; జగత్+త్రయంబును= మూడులోకాలనూ; ఆక్రమించి= అధీనం చేసికొని; అసురత్రయంబు= ముగ్గురు రాక్షసులు; అప్రతిహత= అడ్డులేని; విభూతిమైన్= ఐశ్వర్యంతో; వర్తించు= ప్రవర్తించేవారు; ఆ+మువ్వురున్= ఆ ముగ్గురు అసురులూ; తన్నున్= తనను; ఆశ్రయించుటన్+చేసి= అండగొనినందువలన; వారల= వారి ముగ్గురియొక్క; యోగ= లేనిది వచ్చి కలియటం; క్షేమంబులు= ఉన్నది బాగా ఉండటం -ఈ రెంటినీ; అరసికొని= చూచుకొంటూ; ఎవ్వరికిన్= ఎవరికి; ఏ+అది= ఏది; ఇష్టంబు= ప్రియమైనదేదో; ఆ+అది= అది; ఎల్లన్= సమస్తమూ; తన= తనయొక్క; మాయాబలంబునన్= మాయయొక్క శక్తితో; మయుండు= మయాసురుడు; ఒదవించుచున్= కలిగిస్తూ; ఉండున్= ఉండేవాడు; ఆ+విధంబునన్= ఆ ప్రకారంగా; పరమ= గొప్పవైన; సౌఖ్యంబులు= సుఖాలు; అనుభవించుచుండన్= అనుభవిస్తుండగా; బహు= చాలా; కోటి= కోట్ల సంఖ్యలుకల; సంవత్సరంబులు= ఏళ్ళు; చనియెన్= వెళ్ళిపోయాయి; అట్టి+ఎడన్= అటువంటి సమయంలో.

**తాత్పర్యం:** ఆ పురాలు కూడా - చుట్టుగోడలు, పురద్వారాలు, రాజభవనాలు మొదలయిన పలురకాల ప్రధాన భాగాలు ఒకదానిలో బంగారపువీ, మరొకదానిలో వెండివీ, ఇంకొకదానిలో ఇనుపవీ ఉండి, ప్రతిపురమూ ఎటు చూచినా, నూరేసి యోజనాలమేర ఉండేవి. వాటిలో సువర్ణపురం స్వర్గంలోనూ, రజతపురం ఆకాశంలోనూ, లోహపురం భూలోకంలోనూ తిరుగుతూ ఉండేవి. వాటిలో స్వర్ణపురానికి తారకాక్షుడూ, రజతపురానికి కమలాక్షుడూ, లోహపురానికి విద్యున్మాలీ రాజులుగా ఉండేవారు. దివ్యవస్త్రాలు ధరించి, దివ్యభూషణాలు పెట్టుకొని, దివ్యమాల్యాలు వేసికొని, దివ్యములైన మైపూతలు పూసికొంటూ, ఇంకా రకరకాల ఐశ్వర్యాలతో ఒప్పి ఉండేవారు. ఇట్లా ముగ్గురు అసురులూ మూడు పురాలలోనూ తిరుగుతూ మూడు లోకాలనూ ఆక్రమించికొని, ఎదురు లేని ఐశ్వర్యంతో ఉండేవారు. ఇట్టి వాళ్ళు తన నాశ్రయించుకొని ఉంటున్నందున మయాసురుడు వారి యోగక్షేమాలు చూస్తూ ఉండేవాడు. ఎవరి కేది ఇష్టముంటే అది అంతా వారికి తన మాయాబలంతో సృష్టించి ఇస్తూ ఉండేవాడు. ఇట్లా వారు మహాసౌఖ్యాల ననుభవిస్తూ ఉండగా, ఎన్నికోట్ల సంవత్సరాలో గడచిపోయాయి.

**సీ.** **తారకాక్షున కొక్క తనయుండు హరియన । జనియించి వారిజాసను గుఱించి**
**తపము సేయంగఁ బ్రత్యక్షమై యద్దేవుఁ । డడుగుము వరమన్న నతఁడు త్రిపుర**
**ములవార లాయుధంబులు దాఁకి చచ్చినఁ । బీనుఁగుల్ నీరలోఁ బెట్టి తడుప**
**నొక్కఁడు వదుగురై యెక్కుడు లావును । బీరంబు మెఱయ సంప్రీతి నుల్ల**

ఆ. సిల్లునట్టి బావి చిరతరతోయమై । మా పురములఁ జిత్ర మహిమ వెలయ
నావహిల్ల వలయు ననిన నిచ్చితి నని । యమ్మహాత్ముఁ డరిగె నదియుఁ గలిగె. 264

**ప్రతిపదార్థం:** తారకాక్షునకున్= తారకాక్షుడనే సువర్ణపురాధిపతికి; ఒక్క= ఒక; తనయుండు= కుమారుడు; హరియనన్= హరి అనే పేరుతో; జనియించి= పుట్టి; వారిజ+ఆసను గుఱించి= పద్మాసనుడైన బ్రహ్మదేవునుద్దేశించి; తపము+చేయంగన్= తపస్సు చేయగా; ప్రత్యక్షమై= సాక్షాత్కరించి; వరము= కోరిక; అడుగుము= కోరుకొమ్ము; అన్నన్= అనగా; అతఁడు= ఆ హరి అనే అసురుఁడు; త్రిపురముల వారలు= మూడు నగరాలలోని వారూ; ఆయుధంబులు; తాఁకి= తగిలి; చచ్చినన్= చనిపోయిన పక్షంలో; పీనుఁగుల్= వారి శవాలు; నీరిలోన్= నీటిలో; పెట్టి= ఉంచి; తడుపన్= తడిపితే; ఒక్కఁడు= చనిపోయిన ఒక పౌరుడు; పదుగురు+ఐ= పదిమంది పౌరులయి; ఎక్కుడు= (అంతకు పూర్వం చనిపోయిన ఆ ఒక్కడికి ఉన్నదానికంటె) అధికమైన; లావును= బలమూ; బీరంబున్= వీరత్వమూ; మెఱయన్= ప్రకాశింపగా; సంప్రీతిన్= మిక్కిలి సంతోషంతో; ఉల్లసిల్లునట్టి= ప్రకాశింపజేసేటటువంటి; బావి= దిగుడుబావి; చిరతోయమై= చాలాకాలం నీరు ఉండేది అయి; మా పురములన్= మా నగరాలలో; చిత్రమహిమన్= వింతగొలిపే ప్రభావం; వెలయన్= ఒప్పగా; ఆవహిల్ల వలయున్= ఉండాలి; అనినన్= ఇట్లా పలుకగా; ఇచ్చితిన్= ఇచ్చాను; అని= ఇలా పలికి; ఆ+మహాత్ముఁడు= ఆ మహాత్ముడైన బ్రహ్మదేవుడు; అరిగెన్= వెళ్ళాడు; అదియున్= అట్టి బావికూడా; కలిగెన్= ప్రతిపట్టణంలోనూ ఏర్పడింది.

**తాత్పర్యం:** తారకాక్షాసురుడికి ఒక కొడుకున్నాడు. అతడి పేరు హరి. అతడు బ్రహ్మను గురించి తపస్సు చేశాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై వరం కోరుకొమ్మన్నాడు. అతడు ఈ మూడు పురాలలోని జనమూ ఏవైనా ఆయుధాలవలన చనిపోయిన పక్షంలో వారి శవాలను నీటిలో ఉంచి తడిపితే ఒక శవం పదిమంది జనం కావాలి, ఆ పదిమందికీ ఆ చనిపోయినవాడు బ్రతికి ఉన్నపుడు అతడికి ఎంత బలమూ, ఎంత శౌర్యమూ ఉండేవో అవి అంతకంటె ఎక్కువ ఉండాలి, వారు సంతుష్టితో ఉండాలి, వీరిని-ఇటువంటివారిని-చేయటానికి అవసరమైన నీరు చాలాకాలం ఉండే విచిత్రప్రభావం కల దిగుడుబావి ఒకటి ఈ త్రిపురాలలోని ప్రతిపురంలోనూ ఉండాలి - అనేసరికి ఆ మహానుభావుడు ఇచ్చానని చెప్పి వెళ్ళిపోయాడు. నగరాని కొక బావి అట్లాంటిది ఏర్పడింది.

వ. ఇట్లు మహా ప్రభావంబైన యబ్బావి వడసి యప్పురంబులవారు పోరికి శంకింపక నిర్జర భయంకరులగుచు భువనంబులన్నియు బాధించుచుం బెఱిగి లోభమోహావశతం బొంది విచ్చలవిడిం దిరుగం దొడంగిన దేవ పితృమునిజనస్థానంబులకు హానిపుట్టినం బురందరుం డఖిల బృందారకులుఁ బరివేష్టింప నప్పురంబులపై నెత్తిచని పెనంగి భేదింపంజాలక విషణ్ణుండయ్యె నంత నతండు దివిజులుం దాను సంయమి సహితుండై చతురాననుపాలికిం బోయి ప్రణామపూర్వకంబుగా నద్దానవుల తెఱంగెఱింగించి తద్వధోపాయం బడిగిన నతండు వారల కిట్లనియె. 265

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మహాప్రభావంబు= గొప్ప ప్రభావంబు కలది; ఐన= అయిన; ఆ+బావి= ఆ దిగుడుబావి; పడసి= పొంది; ఆ+పురంబులవారు= ఆ పురాల జనం; పోరికిన్= యుద్ధానికి; శంకింపక= జంకక; నిర్జర= దేవతలకు; భయంకరులు= జడుపు కలిగించేవారు; అగుచున్= అవుతూ; భువనంబులు+అన్నియున్= లోకాలన్నింటినీ; బాధించుచున్= బాధపెడుతూ; పెఱిగి= విజృంభించి; లోభ= పిసినిగొట్టుతనానికీ; మోహ= అజ్ఞానానికీ; కామానుబంధానికీ; వశతన్= లొంగటాన్ని; పొంది= లభింపజేసుకొని, లోభమోహాలకి లొంగిపోయి; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; తిరుగన్= సంచరించటానికి; తొడంగినన్= పూనుకోగా; దేవ= దేవతలయొక్క; పితృ= పితృదేవతలయొక్క; మునిజన= మునులయొక్క; స్థానంబులకున్= పదవులకూ,

వారి నివాసాది ప్రదేశాలకూ; హాని= కీడు; పుట్టినన్= కలుగగా; పురందరుండు= ఇంద్రుడు; అఖిల= సమస్తమైన; బృందారకులున్= దేవతలూ; పరివేష్టింపన్= తన చుట్టూ చేరిరాగా; ఆ+పురంబులపైన్= ఆ పట్టణాలపై; ఎత్తి= దండెత్తి; చని= వెళ్ళి; పెనంగి= పోరాడి; భేదింపన్= (పురాలను) బ్రద్దలు కొట్టటానికి; చాలక= సమర్థుడుకాక; విషణ్ణుండు= విషాదపడినవాడు; అయ్యెన్= అయినాడు; అంతన్= ఆ తరువాత; అతండు= ఇంద్రుడు; దివిజులున్+తానున్= దేవతలూ, తానూ; సంయమి= మునీశ్వరులతో; సహితుండు+ఐ= కూడినవాడై; చతురానను పాలికిన్+పోయి= నాలుగు ముఖాలు కల బ్రహ్మదేవుడి వద్దకువెళ్ళి; ప్రణామ= నమస్కారం; పూర్వకంబుగాన్= ముందు కలదిగా, ముందు నమస్కారం పెట్టి; ఆ+దానవుల= ఆ రాక్షసులయొక్క; తెఱంగు= విధం; ఎఱింగించి= తెలిపి; తద్+వధ= వారిని వధించటానికి; ఉపాయంబు; అడిగినన్= ప్రశ్నించగా; అతండు= ఆ బ్రహ్మదేవుడు; వారలకున్= వారితో; ఇట్లు= ఈ విధంగా; అనియెన్= అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా మహాప్రభావం కలిగిన బావి దొరికేసరికి, ఆ నగరాలవారికి యుద్ధమంటే జంకుగొంకులు పోయాయి. వారంటే దేవతలూ భయపడేవారు. అట్లా వారు లోకాలనన్నింటినీ బాధిస్తూ పెరిగారు. లోభమోహాలకు లొంగారు. ఇష్టం వచ్చినట్లు తిరుగసాగారు. అందువలన దేవస్థానాలకూ, పితృస్థానాలకూ, మున్యాశ్రమాలకూ హాని పుట్టింది. కనుక ఇంద్రుడు దేవతలందరూ తన చుట్టూ రాగా, ఆ నగరాలపై దండెత్తి వెళ్ళాడు. కాని, వాటిని బ్రద్దలు చేయలేక విచారగ్రస్తుడయ్యాడు. ఆ తరువాత అతడూ, దేవతలూ, మునులూ కలిసి బ్రహ్మదగ్గరకు వెళ్ళారు. ఇంద్రుడు ఆయనకు నమస్కారం చేసి ఆ రాక్షసుల సంగతి తెలియజేశాడు. వారిని సంహరించటానికి ఉపాయం చెప్పుమన్నాడు. అపుడాయన వారితో ఇట్లా అన్నాడు:

**ఉ. 'ఏచిన యా పురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ**
**జూచినఁ బోవుఁగాని పెఱచొప్పనఁ బోవదు సంగరోన్ముఖుం**
**డై చనుదెంచె నేని మదనాంతకుచే నదిసెల్లు నొండ్లకు**
**న్గోచర మెట్లగుం? జనుఁడు గొబ్బున నమ్మహితాత్ము పాలికిన్.'** 266

**ప్రతిపదార్థం:** ఏచిన= అతిశయించిన; ఆ= ప్రసిద్ధమైన; పురత్రయమున్= మూడు నగరాలనూ; ఏకశరంబునన్= ఒక బాణంతో; రూపుమాపఁగాన్= నాశనం చేయటానికి; చూచినన్= ఆలోచిస్తే; పోవున్= నశిస్తాయి; కాని= అంతేకాని; పెఱచొప్పనన్= మరొకపద్ధతితో; పోవదు= నశించదు; సంగర= యుద్ధానికి; ఉన్ముఖుండు= అనుకూలుడు; ఐ= అయి; చనుదెంచెన్+ఏని= వచ్చినట్లయితే; మదనాంతకుచేన్= మన్మథుడి సంహారకుడయిన రుద్రునిచేత; అది= పురత్రయం; చెల్లున్= నశిస్తుంది; ఒండ్లకున్= ఇతరులకు; గోచరము= కనిపించేది; ఎట్లు= ఎలా; అగునె?= అవుతుంది?; ఆ+మహాత్ము= ఆ గొప్ప మనస్సుకల రుద్రుడియొక్క; పాలికిన్= చేరువకు; గొబ్బునన్= తొందరగా; చనుఁడు= వెళ్ళండి.

**తాత్పర్యం:** 'ఆ మూడు పురాలూ ఇపుడు చాలా బలపడ్డాయి. వాటిని ఒకే బాణంలో నశింపజేయటానికి ఆలోచిస్తే తప్ప, మరేవిధంగానూ అవి నశించవు. యుద్ధం చేయటానికి సిద్ధపడి రుద్రుడు వస్తే అట్లా కొట్టటమూ, అవి నశించటమూ సంభవిస్తుంది కాని, ఇతరులకు ఆ ఉపాయమూ, సామర్థ్యమూ తెలియదు కనుక ఆ మహాత్ముని దగ్గరకు వెంటనే వెళ్ళండి.'

**ఆ. అనిన నట్లకాక యని దివ్యవర్ష స । హస్రకంబు వారలధిక నిష్ఠ**
**నతుల తపముసేసి యత్యంత శుద్ధాత్ము । లై మహేశుకడకు నరుగునపుడు.** 267

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; వారలు= దేవతలూ, మునులూ, ఇంద్రుడూ; అట్ల= అట్లాగే; కాక= ఔగాక; అని= అని పలికి; దివ్యసహస్రకంబు= సంవత్సరాలయొక్క వెయ్యి, దేవమానం ప్రకారం వెయ్యి సంవత్సరాలు; అధిక నిష్ఠన్= అధికమైన నిష్ఠతో; అతుల= సాటిలేని; తపము+చేసి= తపస్సు చేసి; అత్యంత= మిక్కిలి; శుద్ధ= పరిశుద్ధమైన; ఆత్ములు+ఐ= మనస్సుకలవారై; మహేశు= మహేశ్వరుడియొక్క; కడకున్= చేరువకు; అరుగునపుడు= వెళ్ళే సమయంలో.

**తాత్పర్యం:** అట్లా బ్రహ్మ చెప్పేసరికి, సరే అని ఆ దేవతలూ, మునులూ, దేవేంద్రుడూ వెయ్యి దివ్య సంవత్సరాలు మహానిష్ఠతో అసమానమైన తపస్సు చేశారు. అందువలన వారి మనస్సులు పరిశుద్ధములయ్యాయి. తరువాత వారు మహేశ్వరుడి దగ్గరకు వెళ్ళే సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** మన శుక్లపక్షం దేవతలకు పగలు, కృష్ణపక్షం రాత్రి. అంటే మన నెల వారికి అహోరాత్రం. ఇలాంటి ముప్పై అహోరాత్రాలు వారికి నెల. అట్టి పన్నెండు నెలలు ఒక వర్షం అంటే సంవత్సరం. ఇది దివ్యవర్షం. ఇట్లాంటి వెయ్యి దివ్యసంవత్సరాలు వారు తపస్సు చేశారన్నమాట.

**వ. అ వ్విరించి బ్రార్థించి పురస్సరుం జేసికొని యరిగి. 268**

**ప్రతిపదార్థం:** ఆ+విరించిన్= ఆ బ్రహ్మను; ప్రార్థించి= కోరి; పురస్సరున్= ముందు నడిచేవానిని, నాయకుని; చేసికొని= కావించుకొని; అరిగి= వెళ్ళి.

**తాత్పర్యం:** ఆ బ్రహ్మదేవుడిని ప్రార్థించి, ఆయనను తమకు నాయకుడిగా చేసికొని వెళ్ళి.

**క. వరదు శరణ్యు శశాంక । స్ఫురితశిరోభాగు సర్వభూతేశ్వరు శం**
**కరు సాంఖ్యయోగ నిష్ఠా । పర సులభు ననంగదమనుఁ బరమాత్ము శివున్. 269**

**ప్రతిపదార్థం:** వరదున్= వరాలు ఇచ్చేవానిని; శరణ్యున్= శరణుకోరదగినవానిని; శశాంక= చంద్రుడిచేత; స్ఫురిత= ప్రకాశించే; శిరోభాగున్= శిరస్సుయొక్క ప్రదేశం కలవాడిని; సర్వభూత+ఈశ్వరున్= సమస్తమైన ప్రాణులకు శాసకుడైన వాడిని; శంకరున్= శుభం కలిగించేవానిని; సాంఖ్యయోగ నిష్ఠాపర= సాంఖ్య నిష్ఠాపరులు, యోగనిష్ఠాపరులు అయినవారికి; సులభున్= తేలికగా లభించేవాడిని; అనంగదమనున్= మన్మథుడిని జయించినవానిని; పరమాత్మున్= పరమాత్ముడు అయినవానిని; శివున్= శివుని, మంగళస్వరూపుడిని.

**తాత్పర్యం:** శివుడు వరాలిస్తాడు. ఎవరైనా శరణు కోరదగినవాడు. చంద్రుడు ఆయన శిరస్సున ప్రకాశిస్తూ ఉంటాడు. ఆయన సకల ప్రాణులకూ ప్రభువు. ఆయన అందరికీ మంగళకరుడు. ఆయన జ్ఞానయోగాన్నీ, యోగాన్నీ అవలంబించేవారికి సులభుడు. ఆయన కాముడిని జయించాడు. ఆయన పరమాత్ముడు. అట్టి శివుడిని (తరువాతి వచనంతో అన్వయం).

### త్రిపుర సంహారముకొఱకు బ్రహ్మాదులు రుద్రునిం బ్రార్థించుట (సం. 8-24-37)

**వ. కని ఫాలంబులు భూమిసోఁకం బ్రణమిల్లిన నద్దేవుండు 'లెండు మీ రాకకుం గారణంబేమి?' యనవుడు లేచి నిలిచి వారు కరకమలంబులు భక్తి మొగిడ్చి. 270**

**ప్రతిపదార్థం:** కని= దర్శించి; ఫాలంబులు= నొసళ్ళు; భూమిన్= నేలను; సోఁకన్= తాకేటట్లుగా; ప్రణమిల్లినన్= నమస్కారం చేయగా; ఆ+దేవుండు= ఆ శివుడు; లెండు= లేచి నిలవండి; మీ రాకకున్= మీరు రావటానికి; కారణంబు= హేతువు; ఏమి= ఏమిటి?; అనవుడు= అని పలుకగా; లేచి= పైకిలేచి; నిలిచి= నిలబడి; వారు= బ్రహ్మ; ఇంద్రుడు, దేవతలు, మునులూ; కరకమలంబులు= పద్మాలవంటి చేతులు; భక్తిన్= భక్తితో; మొగిడ్చి= మోడ్చి.

**తాత్పర్యం:** (మహాదేవుడిని దర్శించారు.) నొసళ్ళు నేలకు ఆనుకొనేటట్లు సాగిలబడి నమస్కరించారు. అపుడు ఆ దేవుడు 'లేచి నిలబడండి. ఏమి పనిమీద వచ్చారు?' అన్నాడు. ఆపైన వారు లేచి, నిలిచి, భక్తితో పద్మాలవంటి చేతులు మోడ్చి.

**క. 'స్తుత్యానుభావ నిర్మల । నిత్యానందస్వరూప! నిగమవిరోధి**
**స్థిత్యపనయనోన్ముఖ! చి । త్సత్యాత్మక! భక్తలోక దౌర్గత్యహరా! 271**

**ప్రతిపదార్థం:** స్తుత్యానుభావ!= పొగడదగిన ప్రభావం కలవాడా!; నిర్మల= స్వచ్ఛమైన; నిత్య= శాశ్వతమైన; ఆనంద= ఆనందమయమైన; స్వరూప!= రూపం కలవాడా; నిగమ= వేదాలయొక్క; విరోధి= శత్రువులైనవారి; స్థితి= ఉనికిని; అపనయన= తొలగించటానికి; ఉన్ముఖ!= అనుకూలమైనవాడా!; చిత్= జ్ఞానమయమైన; సత్యాత్మక!= సత్యమైన రూపం కలవాడా!; భక్తలోక= భక్తులైన జనులయొక్క; దౌర్గత్య= దుర్గతిభావాన్ని; హరా!= హరించేవాడా!

**తాత్పర్యం:** 'నీ ప్రభావం స్తుతించదగినది. నీది నిత్యమైన, నిర్మలమైన ఆనందస్వరూపం. నీవు వేదశత్రువుల ఉనికిని తొలగించటానికి సదా అనుకూలుడవై ఉంటావు. నీవు జ్ఞానస్వరూపుడవూ, సత్యస్వరూపుడవూను.'

**వ. అని మఱియు ననేక ప్రకారంబుల బ్రస్తుతించినం బ్రసన్నుండై భవుండాదరించి 'మీకు భయంబు వలవదు మీ చెప్పిన యట్ల చేసెద వలయు కార్యంబెయ్యది?' యనిన దేవమునిసంఘంబులు ప్రహర్షంబు నొందె నరవింద భవుం డప్పరమేశ్వరున కిట్లనియె. 272**

**ప్రతిపదార్థం:** అని= ఈ ప్రకారంగాను; మఱియున్= ఇంకా; అనేక ప్రకారంబులన్= బహువిధాలుగాను; ప్రస్తుతించినన్= మిక్కిలిగా స్తుతించగా; ప్రసన్నుండు+ఐ= సంతోషించినవాడై; భవుండు= శివుడు; ఆదరించి= మన్నించి; మీకు= దేవాదులయిన మీకు; భయంబు= జడుపు; వలవదు= వద్దు; మీ= మీరు; చెప్పిన; అట్ల= ఆ విధంగానే; చేసెదన్= చేస్తాను; వలయు= కావలసిన; కార్యంబు= పని; ఏ+అది?= ఏది?; అనినన్= అని అడుగగా; దేవముని సంఘంబులు= దేవతల సంఘములు, మునుల సంఘములు, ప్రహర్షంబున్= ప్రకృష్టమైన సంతోషాన్ని; ఒందెన్= పొందాయి; అరవింద= పద్మమందు; భవుండు= జన్మించిన బ్రహ్మ; ఆ+పరమేశ్వరునకున్= ఆ మహేశ్వరుడితో; ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లా, ఇంకా చాలా విధాలుగానూ, బాగా స్తోత్రం చేశారు. అపుడు శివుడు సంతోషించి వారిని గౌరవించాడు. 'మీకు భయం లేదు మీరు కోరిన విధంగానే చేస్తాను. కావలసిన పని ఏమిటో చెప్పండి' అన్నాడు. ఆ మాటలకు దేవతలూ, మునులూ చాలా సంతోషించారు. అపుడు పరమేశ్వరుడితో బ్రహ్మదేవు డిట్లా అన్నాడు:

**సీ. 'ప్రజలకుఁ బతిగాఁగఁ బనిచితి నీవు న । న్నట్లు పదస్థుండ నగుటఁజేసి**
**విచ్చలవిడి వరంబిచ్చితి నసురత్ర । యమునకు దుర్గత్రయంబు గలిగి**
**యమ్మువ్వురును దారుణాక్రమమున భువ । నత్రయ సంబాధనం బొనర్చు**
**చున్నారు వారల నొరులకు నుడుప శ । క్యముగాదు నీవు శీఘ్రంబు చెఱుప**

**ఆ. వలయు మునులు దేవతలు నేను శరణు చొ । చ్చితిమి నిన్నుఁ గరుణ జేకొనంగ**
**వలదె? మమ్ము నొరులు గలరె జగంబులు । గావ భూతనాథ! నీవు దక్క' 273**

**ప్రతిపదార్థం:** నీవు= సకల నియామకుడవైన నీవు; నన్నున్= నీ అనుగ్రహపాత్రుడనైన నన్ను; ప్రజలకున్+పతి+కాఁగన్+ పనిచితివి= ప్రజలకు నేను సృష్టించిన ప్రాణుల కన్నింటికిని; పతిగాఁగన్= పోషణ పాలనాదులు చూచే ఏలికగా; పనిచితి(వి)= ఆజ్ఞాపించావు; అట్లు= ఆ విధంగా; పదస్థుండను= (చేసికొన్న కర్మలకు తగిన ఫలం ఈయవలసిన స్థానంలో) అధికారంలో ఉన్నవాడను; అగుటఁజేసి= అయిన కారణంచేత; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; అసురత్రయమునకున్= ముగ్గురు అసురులకూ; వరంబు= ఇతరులకు అభేద్యాలయిన నగరాలుండే వరం; ఇచ్చితిన్= ఇచ్చాను; ఆ+మువ్వురును= ఆ ముగ్గురు అసురులూ; దుర్గత్రయంబు+కలిగి= ఇతరులు చొరరాని మూడు పురాలు కలిగినందున; దారుణ= భయంకరమైన; ఆక్రమమునన్= ఆక్రమణంతో; భువనత్రయ= మూడులోకాలకూ; సంబాధనంబు= మిక్కిలిపీడ; ఒనర్చుచున్నారు= కలిగిస్తున్నారు; ఒరులకున్= ఇతరులకు; వారలన్= ఆ అసురులను; ఉడుపన్= పీడ విరమింపజేయటం; శక్యంబుగాదు= సాధ్యంకాదు; నీవు= సర్వశక్తి మంతుడవైన నీవు; శీఘ్రంబు+అ= వెంటనే; చెఱుపవలయున్= వారిని నశింపజెయ్యాలి; మునులు= ఋషులూ; దేవతలున్= అసురులూ; నేనున్= (నీవు చెప్పిన పనిచేస్తూ చిక్కులలో పడిన) నేనూ; నిన్నున్= (దుష్టశిక్షకుడవూ; శిష్టరక్షకుడవూ అయిన) నిన్ను, శరణు చొచ్చితిమి= శరణు వేడుకొంటిమి; మమ్మున్; కరుణన్= దయతో; చేకొనంగన్= స్వీకరింపఁగా; వలదె?= వద్దా?, స్వీకరించాలి; భూతనాథ!= సకల ప్రాణులకూ స్వామివి, రక్షకుడవు అయినవాడా!; జగంబులు= లోకాలను; కావన్= రక్షించటానికి; నీవు+తక్కన్= నీవు తప్ప; ఒరులు= ఇతరులు; కలరె?= ఉన్నారా? (లేరని భావం.)

**తాత్పర్యం:** 'నీవు నన్ను ప్రజాపతి పదవిలో నియమించావు. అందువలన, ఆ పదవిలో ఉన్న కారణంచేత, తగిన తపస్సు చేశారు కనుక, నాకు గల స్వాతంత్ర్యం వినియోగించి, ముగ్గురు అసురులకూ మూడు అభేద్యనగరాలుండే వరమిచ్చాను. వాటి చాటున వారుముగ్గురూ ముల్లోకాలనూ భయంకరంగా ఆక్రమిస్తూ, ఆయా లోకాలకు పీడ కలిగిస్తున్నారు. అది మానిపించే శక్తి ఇతరులకు లేదు. వారిని నీవు వెంటనే నాశనం చేయాలి. ఈ మునులూ దేవతలూ, నేనూ నిన్నాశ్రయించాము. నీ రక్షణ కోరుతున్నాము. నీవు దయతో మమ్ములను ఆదుకొనాలి. నీవు సకల ప్రాణులకూ రక్షకుడవూ, పోషకుడవూ కూడాను. కనుక లోకాలను రక్షించగలవారు కాని, రక్షించవలసినవారు కాని నీవు తప్పితే ఇతరులు లేరు.

**విశేషం:** ఈ సీసపద్యం మూడవపాదం మొదట ఉస్మానియా ప్రతిలో 'యిమ్మువ్వురును' అని ఉన్నది. యతిభంగం. 1963 వావిళ్ళ ప్రతిలోనూ అంతే. అదే దీనికి తల్లి. అక్కడి అచ్చు తప్పు ఇక్కడ యథాతథంగా దిగింది. కనుక 'యి' 'య' చేశాము. ఇటీవలి తె.వి. ప్రతిలో మేము దిద్దినట్లే ఉన్నది.

**వ. అనవుడు నద్దేవుం డయ్యసురులు సెఱుపవలయువారగుదురు వారలు బలవంతు లేనొంటిమై నా పనికి నుత్సహింపనేర మదీయంబు లయిన తేజోబలంబులం దర్ధంబు పుచ్చికొని మీరందఱుం గూడి యా దుష్ట**

**దైత్యుల మర్దించుట కార్యం' బనిన నద్దివిజులు 'మాకందఱకు గల తేజోబలంబులకు నద్దనుజుల తేజోబలంబులు రెట్టియయి యుండు నట్లగుటం జేసి మా చేతం జెడ రదియునుంగాక భవదీయ తేజోబలంబులు భరియింప మేము శక్తులము గాము మా యందఱ తేజో బలంబులలో సగంబు పుచ్చికొని నీవ యాశత్రుల సమయింపు మెల్ల భంగిని నీకు రక్షణీయుల మగు మమ్ము రక్షింపు' మనుటయు నజ్జగన్నాథుండు. 274**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; ఆ+దేవుండు= ఆ దేవుడైన రుద్రుడు (ఇలా అన్నాడు:); అయ్యసురులు= ఆ రాక్షసులు; చెఱుపవలయువారు= సంహరింపవలసినవారు; అగుదురు= అయినవారు; (కాని); వారలు= ఆ అసురులు; బలవంతులు= శక్తికలవారు; ఏను= నేను; ఒంటిమైన్= ఒంటరిగా; ఆ+పనికిన్= ఆ కార్యానికి; ఉత్సహింపన్= పూనుకొనటానికి; నేరన్= శక్తి కలవాడనుకాను; మదీయంబులు= నావి; అయిన; తేజః+బలంబులు+అందున్= పరాక్రమములో, శక్తిలో; అర్ధంబు= సగముభాగం; పుచ్చికొని= తీసికొని; మీరందఱున్= మీరంతా; కూడి= కలిసి; ఆ= ఆ ముగ్గురు; దుష్టదైత్యులన్= దుర్మార్గులయిన అసురులను; మర్దించుట= సంహరించుట; కార్యంబు= కర్తవ్యం; అనినన్= అనిచెప్పగా; ఆ+దివిజులు= ఆ దేవతలు; మాకున్= మా దేవతలకు; అందఱకున్= ఎల్లరికీ; కల= ఉన్న; తేజోబలంబులకున్= పరాక్రమానికీ, బలానికీ; ఆ+దనుజుల= ఆ అసురలయొక్క; తేజోబలంబులు= పరాక్రమమూ, శక్తీ; రెట్టి+అయి= రెండింతలై; ఉండున్= ఉంటాయి; అట్లు; అగుటన్+జేసి= అయినందువలన; మా చేతన్= మా వల్ల; చెడరు= నశింపరు; అదియున్+కాక= అదీకాక, అంతేకాక; భవదీయ= నీవి అయిన; తేజోబలంబులు= పరాక్రమమూ, శక్తీ; భరియింపన్= సహించటానికి; మేము= అల్పశక్తిమంతులమైన మేము; శక్తులము+కాము= శక్తికలవారము కాము; మా+అందఱ= మా అందరియొక్క; తేజోబలంబులలోన్= పరాక్రమంలో శక్తిలో; సగంబు పుచ్చికొని= అర్ధభాగం తీసికొని; నీవ= నీవే; ఆ శత్రులన్= ఆ పగవారిని; సమయింపుము= సంహరింపుము; ఎల్ల= సమస్తమైన; భంగిని= విధాలనూ; నీకున్= సర్వశక్తిమంతుడవైన నీకు; రక్షణీయులమగు= రక్షింపదగినవారమైన; మమ్మున్= మమ్ము; రక్షింపుము= కాపాడుము; అనుటయున్; ఆ+జగత్+నాథుండు= ఆ లోకాలకు రక్షకుడైన శివుడు.

**తాత్పర్యం:** అట్లా బ్రహ్మదేవుడు చెప్పేసరికి ఆ పరమేశ్వరుడు ఇట్లా అన్నాడు: 'ఆ రాక్షసులు వధింపదగినవారే, అయితే, వారు బలం కలవాళ్ళు, వారిని నే నొంటరిగా సంహరించటానికి పూనుకోలేను, నా పరాక్రమంలోనూ, శక్తిలోనూ సగం మీకిస్తాను. వాటితో మీరందరూ ఏకమై, ఆ రాక్షసులను సంహరించటం కర్తవ్యం' అన్నాడు. అపుడా దేవతలు 'మా పరాక్రమానికీ, శక్తికీ రెండింతలుంటాయి ఆ రాక్షసుల పరాక్రమమూ, శక్తీను. కనుక, వాళ్ళు మా చేతిలో చావరు. అదీకాక, నీ పరాక్రమాన్నీ, శక్తినీ మేము భరించగలమా? మా కంత శక్తిలేదు. కనుక మా అందరి పరాక్రమంలోనూ, శక్తిలోనూ సగం నీవే తీసికొని, నీవే ఆ పగవారిని సంహరించుము. మమ్ములను అన్నివిధాలా రక్షించవలసినవాడవు నీవు. అన్నివిధాలా రక్షింపబడవలసిన వాళ్ళం మేము. కనుక రక్షించుము' అనేసరికి ఆ జగన్నాథుడు.

**క. 'అమరులకు నసురులకు నే। సముఁడ శివం బఖిల భూతజాలంబులకున్**
**సమత నొనరింప శివ నా। మము నాకుం జెల్లు లోకమాన్యం బగుచున్. 275**

**ప్రతిపదార్థం:** అమరులకున్+అసురులకున్= దేవతలకూ, రాక్షసులకూ; నేన్= నేను; సముఁడన్= ఏకరీతివాడను; అఖిల= సమస్తమైన; భూత= ప్రాణులయొక్క; జాలంబులకున్= సమూహాలకూ; శివంబు= శుభం; సమతన్= సమభావంతో; ఒనరింపన్= కావించటంవలన; శివ నామము= శివుడనే పేరు; లోకమాన్యంబు= లోకాలచేత మన్నింపబడేది; అగుచున్= అవుతూ; నాకున్= నాకు; చెల్లున్= ఒప్పుతున్నది.

**తాత్పర్యం:** 'నేను దేవతలపట్లనూ రాక్షసులపట్లనూ సమానభావంతో ప్రవర్తిస్తూ ఉంటాను. మీ ఇద్దరి విషయంలోనే కాదు. సమస్త ప్రాణులపట్లనూ సమభావంతో శుభాన్ని కలిగిస్తూ ఉన్నందువలననే నాకు శివుడనే పేరు - అఖిల లోకాలవారూ మన్నించేటట్లు ఉంటున్నది.

**వ. అయినను.** **276**

**ప్రతిపదార్థం:** అయినను= అయినప్పటికీ.

**చ. అనయముఁ గ్రూరకర్ములగునట్టి విమూఢులఁ బిల్కుమార్పఁ బూ**
**నన తగు ధర్మవర్తను లనంజను మీయెడ ద్రోహులైన య**
**ద్దనుజులఁ ద్రుంచి మీకుఁ బ్రమదం బొనరించెదఁ దేజమున్ బలం**
**బును సగపాలు వెట్టి ననుఁ బొందఁగఁ జేయుఁడు మీరలందఱున్.'** **277**

**ప్రతిపదార్థం:** అనయమున్= ఎల్లప్పుడూ; క్రూరకర్ములు= ఇతరులకు బాధాకరములైన పనులు చేసే; విమూఢులన్= మిక్కిలి మందబుద్ధులైనవారిని; పిల్కుమార్పన్= నశింపజేయటానికి; పూనన= పూనుకొనటమే; తగున్= యుక్తం; ధర్మ= ధర్మసహితమైన; వర్తనులు= నడవడి కలవారు; అనన్= అని పలుకటానికి; చను= తగిన; మీ+ఎడన్= మీ విషయంలో; ద్రోహులు= అపకారులు; ఐన= అయినట్టి; ఆ= త్రిపురాలకు చెందిన; దనుజులన్= రాక్షసులను; త్రుంచి= సంహరించి; మీకున్= దేవతలకూ, మునులకూ; ప్రమదంబు= సంతోషం; ఒనరించెదన్= కలిగిస్తాను; మీరలు+అందఱున్= మీరంతా; తేజమున్= పరాక్రమమూ; బలంబును= శక్తీ; సగపాలు= సగభాగం; పెట్టి= ఇచ్చి; ననున్= నన్ను; పొందఁగన్= చేరేటట్లు; చేయుఁడు= కావించండి.

**తాత్పర్యం:** నిరంతరమూ పరులను పీడించే పనులు చేసే మరీ బుద్ధిహీనులైన వారిని సంహరించటానికి ప్రయత్నించటమే యుక్తం. మీరు ధర్మప్రకారం నడుచుకొనే వారని పేరు పొందినవారు. ఇటువంటి మీకు అపకారం చేస్తున్న ఆ రాక్షసులను సంహరించి, మీకు సంతోషం కలిగిస్తాను. కనుక మీ రంతా మీమీ పరాక్రమంలోని సగభాగమూ, శరీరబలంలోని సగం భాగమూ నన్ను చేరుకొనేటట్లు చేయండి.'

**వ. అని 'మఱియు నొక్కటి సెప్పెద లోకంబులకెల్లను బశుత్వంబును నాకుం బశుపతిత్వంబును గావలయు నట్లయినఁ బశుహననంబునం బాపంబు లేకుండు.** **278**

**ప్రతిపదార్థం:** అని= ఆ ప్రకారం చెప్పి; మఱియున్= ఇంకా; ఒక్కటి= ఒకటి; చెప్పెదన్= చెపుతాను; లోకంబులకున్= లోకాలకు; ఎల్లన్= అన్నింటికీ; పశుత్వంబును= పశుభావమూ; నాకున్= నాకు; పశుపతిత్వంబునున్= పశువులకు పతిభావమూ; కావలయున్= కలగాలి; అట్లైనన్= అట్లా అయితే; పశుహననంబునన్= పశువులను చంపటంవలన; పాపంబు= పాపం; లేక+ఉండున్= లేకుండా ఉంటుంది, ఉండకుండా పోతుంది.

**తాత్పర్యం:** అని చెప్పి (ఇట్లా అన్నాడు:) 'ఇంకా ఒక సంగతి చెప్పుతున్నాను. అదీకాక ఈ లోకాలకన్నింటికీ పశుభావం కలగాలి, నాకు పశుపతిభావం కలగాలి. ఇట్లా ఇవి కలిగినందువలన పశువులను చంపటంమూలంగా వచ్చే పాపం నాకు రాకుండా ఉంటుంది.

**విశేషం:** ఈ పద్యంలో 'ఒక్కటి సెప్పెద' అన్న 'ఒక్కటి' లో ఒక అంశం ఇక్కడ చెప్పి, తరువాతిపద్యంలో రెండవ అంశం చెపుతున్నాడు.

**క. ఒనరింపుఁడు దివ్యరథం । బును దచ్చోదకుని నశ్వముల విల్లును న**
**మ్మును నాకు నట్టులైనను । దనుజుల దుర్గములు వినిహతములగు నాచేన్.' 279**

**ప్రతిపదార్థం:** నాకున్= నాకోసం; దివ్య= దివిలోపుట్టిన, గొప్పదైన; రథంబును= తేరిని; తద్= ఆ రథంయొక్క; చోదకునిన్= సారథినీ; అశ్వములన్= గుర్రాలనూ; విల్లునూ= ధనుస్సునూ; అమ్మునున్= బాణాన్నీ; ఒనరింపుఁడు= నిర్మించండి; అట్టులు= అలా; ఐనను= సమకూడితే; నాచేన్= నాచేత; దనుజుల= దానవులయొక్క; దుర్గములు= (రాక్షసుల త్రిపురాలనే) కోటలు; వినిహతములు+అగున్= పూర్తిగా ధ్వంసం చేయబడతాయి.

**తాత్పర్యం:** నాకొరకు దివ్యమైన రథమూ, సారథీ, అశ్వాలూ, ధనుస్సూ, బాణమూ నిర్మించి ఇవ్వండి. అట్లా అయితే త్రిపురాసురుల పురదుర్గాలు నా చేత ధ్వంసమవుతాయి.'

**ఆ. అనిన విని పశుత్వమునకు శంకించి । విషణ్ణులైన సురల చందమెఱిఁగి**
**భయము గొనఁగవలదు పశుభావమోక్షణ । విధియుఁ గలదు దాని వినుఁడు మీరు.' 280**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; పశుత్వమునకున్= అందరికీ పశుభావం కలగాలన్నదానికి; శంకించి= జంకి, సందేహించి, విషణ్ణులైన= ఖిన్నులైన; సురల= దేవతలయొక్క; చందమెఱిఁగి= విధము తెలిసికొని; మీరు= దేవతలూ, మునులూ; భయము= జడుపు; కొనఁగన్= తీసికొనగా (అనగాభయపడటం); వలదు= వద్దు; పశుభావ= పశుత్వం నుంచి; మోక్షణ విధియున్= విడుదల కలిగే పద్ధతీ; కలదు= ఉన్నది; వినుఁడు= ఆ పద్ధతి గురించి వినండి.

**తాత్పర్యం:** అట్లా చెప్పేసరికి విని, దేవతలు పశుత్వం కలగటం గురించి జంకుగొంకులతో విషాదగ్రస్తులుకాగా, వారి వైఖరి తెలిసికొని, 'మీ రేమీ భయపడవద్దు. పశుత్వం నుంచి విముక్తి లభించే విధానమూ ఉన్నది. వినండి.'

**వ. అని పలికి హరుండు వారలతోఁ బాశుపత వ్రతానుష్ఠానంబునం బశుత్వ మోక్షణంబగు నదియును ద్వాదశాబ్దంబులు నడపవలయు నిష్ఠానురూపంబుగా సంవత్సరంబునఁ దదర్ధంబున ఋతువున మాసంబునఁ బండ్రెండు దినంబుల మాత్రను ఫలించు' ననుటయు నట్లకాక యని వారలందఱును లోకంబులకు లోకేశ్వరునకుఁ బశుత్వంబుఁ బశుపతిత్వంబు గలుగుటకు నొడంబడి యమ్మహాత్మునిఁ బశుపతి వని పేర్కొని నిజతేజోబలార్ధంబులు సమర్పించినం గైకొని యత్యధిక బలుండై తొల్లింటికంటె వెలింగె నప్పడద్దేవునకు దేవతలు విభవంబెసఁగఁ బురహననంబునకయి యభిషేకంబు సేసి త్వష్టనాలోకించి 'మహాదేవునకు దివ్య రథంబును దగియెడు సాధనంబులను గల్పింపు' మనవుడుఁ దపఃప్రభావ మహనీయుండగు విశ్వకర్మ యవహితుండై. 281**

**ప్రతిపదార్థం:** అని; పలికి= చెప్పి; హరుండు= శివుడు; వారలతోన్= ఆ దేవతలతో; పాశుపతవ్రత= పాశుపతవ్రతమనే వ్రతంయొక్క; అనుష్ఠానంబునన్= ఆచరణంవలన; పశుత్వమోక్షణంబు= పశుభావం నుంచి విడుదల; అగున్= కలుగుతుంది; అదియును= ఆ వ్రతానుష్ఠానంకూడా; ద్వాదశ= పన్నెండు; అబ్దంబులు= సంవత్సరాలు; నడపవలయున్= నడిపించాలి; నిష్ఠా= శ్రద్ధకు; అనురూపంబుగాన్= తగినట్లుగా; సంవత్సరంబునన్= ఒక ఏడాదిలోనూ; తద్+అర్ధంబునన్= అందులో సగభాగం

ఆరునెలలలోనూ; ఋతువునన్= రెండునెలలలోనూ; మాసంబునన్= ఒక నెలలోనూ; పంద్రెండు= పన్నెండు; దినంబుల మాత్రను= దినంబుల పరిమితిలోనూ; ఫలించున్= ఫలాన్నిస్తుంది; అనుటయున్= అని చెప్పేసరికి; అట్లకాక= అట్లే అగుగాక; అని; వారలు+అందఱును= ఆ సమస్త దేవతలూ, మునులూ; లోకంబులకున్= లోకాలకు; పశుత్వంబును= పశుభావమూ; లోక+ఈశ్వరునకున్= లోకాలకు స్వామి అయిన శివుడికి; పశుపతిత్వంబున్= పశుపతిభావమూ; కలుగుటకున్= సంభవించటానికి; ఒడంబడి= అంగీకరించి; ఆ+మహాత్మునిన్= ఆ గొప్ప మనస్సు కలవాడిని; పశుపతివి+అని= పశువులకు స్వామివి అని; పేర్కొని= పిలిచి; నిజ= తమయొక్క; తేజః+బల+అర్ధంబులు= పరాక్రమం యొక్క సగంభాగమూ, శక్తియొక్క సగంభాగమూ; సమర్పించినన్= ఈయగా; కైకొని= స్వీకరించి; అతి+అధిక= మిక్కిలి ఎక్కువ అయిన; బలుండై= బలం కలవాడై; తొల్లింటికంటెన్= పూర్వంకంటే; వెలింగెన్= ప్రకాశించాడు; అప్పుడు= ఆ సమయంలో; ఆ+దేవునకున్= ఆ శివదేవునికి; దేవతలు= అమరులు; విభవంబు= ఐశ్వర్యం; ఎసఁగన్= అతిశయింపగా; పురహననంబునకయి= త్రిపురసంహారంకోసం; అభిషేకంబు+చేసి= పలురకాల మణులతో, మంత్రాలతో, ఓషధులతో, అక్షతలతో, సుగంధద్రవ్యాలతో కలిసిన వివిధ నదుల పవిత్రోదకంతో మంత్రపూర్వకంగా పట్టాభిషిక్తుని చేసి; త్వష్టన్= త్వష్టతో; ప్రజాపతిని= విశ్వకర్మను; ఆలోకించి= చూచి; మహాదేవునకున్= పరమేశ్వరునికి; దివ్యరథంబును= దివ్యమైన రథం; తగియెడు= (ఆయనకూ, ఆ రథానికీ తలపెట్టిన మహాకార్యానికీ) తగిన; సాధనంబులను= ఉపకరణాలనూ, పనిముట్లను; కల్పింపుము= కావించుము; అనవుడున్= అని చెప్పగా; తపః= తపస్సుయొక్క; ప్రభావ= మహిమచేత; మహనీయుండగు= గొప్పవాడైన; విశ్వకర్మ; అవహితుండై= శ్రద్ధకలవాడై.

**తాత్పర్యం:** ఇట్లా పలికి, శివుడు వారితో (ఇట్లా అన్నాడు): 'పాశుపత వ్రతం ఆచరించినందువలన పశుత్వం నుంచి విడుదల కలుగుతుంది. ఆ వ్రతం పన్నెండు సంవత్సరాలు ఆచరించాలి. చేసేవారికిగల శ్రద్ధకు తగినట్లు ఒక సంవత్సరం అయినా ఆరునెలలయినా, రెండు నెలలయినా, ఒక నెల అయినా పన్నెండు దినములయినా ఫలాన్నిస్తుంది.' అని చెప్పేసరికి, వారు అట్లాగే అని లోకాలకు పశుత్వమూ, లోకేశ్వరుడయిన పరమేశ్వరుడికి పశుపతిత్వమూ కలగటానికి ఒప్పుకొన్నారు. ఆ మహామనస్విని 'పశుపతివి' అన్నారు. తమ తమ పరాక్రమం నుండి శరీరబలం నుండి సగం భాగం ఆయనకు సమర్పించారు. వాటిని ఆయన స్వీకరించి, మిక్కిలిగ ఎక్కువైన బలంతో ఇదివరకటికంటె గొప్పగా ప్రకాశించాడు. ఆ మహాదేవుడిని దేవతలు తగిన వైభవంతో త్రిపుర సంహారానికి అభిషిక్తుడిని చేశారు. త్వష్టతో 'మహాదేవుడి కొక రథమూ, దానికీ ఆయనకూ ఈ మహాకార్యానికీ తగిన పనిముట్లూ నిర్మించుము' అన్నారు. తపఃశక్తి మాహాత్మ్యంతో గొప్పవాడైన ఆ విశ్వకర్మ మిక్కిలి శ్రద్ధతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. సామర్థ్యమొప్ప విశ్వంభరా చక్రంబు । రథముగఁజేసి చంద్రముని నుష్ణ**
**కరునిఁ జక్రంబులుగాఁ బెట్టి వారిధి । నక్ష మొనర్చి హిమావనీధ**
**రంబున వింధ్యనగంబున నస్తా చ । లంబున నుదయశైలమున బలుపు**
**టవయవంబులు దీర్చి యగ్నుల మూఁటఁ బ్రి । వేణుకరచనఁ గావించి మేరు**

**ఆ. పర్వతమున నాతపత్రంబుఁ గల్పించి । హరులు వేదములు శరాసనంబు**
**వత్సరంబు శరము వాసుదేవుండును । గాఁగ సంఘటించె గౌరవమున. 282**

**ప్రతిపదార్థం:** సామర్థ్యము+ఒప్పన్= శక్తీ, నేర్పూ ఒప్పేటట్లుగా, విశ్వంభరా చక్రంబున్= భూమండలాన్ని; రథముగన్= తేరుగా; చేసి= కావించి; చంద్రమునిన్= చంద్రుడినీ; ఉష్ణకరునిన్= వేడి కిరణాలుగల సూర్యుడినీ; చక్రంబులుగాన్= చక్రాలుగా; పెట్టి= ఉంచి; వారిధిన్= సముద్రాన్ని; అక్షము= ఇరుసుగా; ఒనర్చి= కావించి; హిమ+అవనీధరంబునన్= హిమాలయపర్వతంతోనూ;

వింధ్యనగంబునన్= వింధ్యాచలంతోనూ; అస్త+అచలంబునన్= అస్తమయగిరితోనూ; ఉదయశైలంబునన్= ఉదయాద్రితోనూ; బలువు+అవయవంబులు= బలమైన భాగాలు; తీర్చి= ఏర్పరచి; అగ్నులన్ మూఁటన్= మూడగ్నులతోను; త్రివేణుక రచనన్= త్రివేణుకములనే రథభాగాలయొక్క; రచనన్= నిర్మాణాన్ని; కావించి= చేసి; మేరుపర్వతమునన్= మేరుగిరితో; ఆతపత్రంబున్= గొడుగును; కల్పించి= చేసి; హరులు= గుర్రాలు; వేదములున్= నాలుగువేదాలూ; శరాసనంబు= ధనుస్సు; వత్సరంబున్= సంవత్సరమూ; శరము= బాణం; వాసుదేవుండును= విష్ణువూ; కాఁగన్+అయ్యేటట్లు; గౌరవమునన్= మన్ననతో; సంఘటించెన్= కూర్చాడు.

**తాత్పర్యం:** నేర్పుతో భూమిని రథం చేశాడు. చంద్రసూర్యులను దాని చక్రాలుగా ఉంచాడు. సముద్రాన్ని ఇరుసు చేశాడు. హిమాచల, వింధ్యాచల, అస్తాచల, ఉదయాచలాలను బలమైన భాగాలుగా పెట్టాడు. త్రేతాగ్నులను త్రివేణుకములనే భాగాలుగా ఉంచాడు. మేరుపర్వతాన్ని గొడుగుగా ఉంచాడు. వేదాలు గుర్రాలుగా, సంవత్సరం ధనుస్సుగా, బాణం విష్ణువుగా మన్ననతో సమకూర్చాడు.

**విశేషం:** ఈ రథ నిర్మాణంలో ఆయా భాగాలుగా ఏర్పడిన వాటి గురించి వివిధ పురాణాలలో రకరకాలుగా ఉన్నది. ఒక్కొక్క దానిలోని వర్ణన ఒక్కొక్క కల్పంలోనిదిగా భావించాలి. ఇట్లాంటి భిన్న వృత్తాంతాలలో ఏది ఏ కల్పంలోనిది అని చెప్పటం సాధ్యమవుతుందేమో పరిశోధన జరగాలి.

**వ.** **ఇట్లు చరాచరాత్మకంబై తేజరిల్లు నత్తేరు వీక్షించి ఫాలాక్షుండు గ్రహమండిత వ్యోమమండలం బుపాదానకారణంబుగా విశ్వకర్మ గావించిన కవచంబు దొడిగి శరాసనంబు ధరియించి శరంబు పుచ్చికొని దానవ సంత్రాసనోత్సాహుం డగుచు రథారోహణంబు సేసి వృషభధ్వజంబునం బొలుపొంది.** **283**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇలా; చరాచరాత్మకంబు+ఐ= కదిలే, కదలని ప్రాణులు గల విశ్వంతో ఏర్పడిన రూపమై; తేజరిల్లు= ప్రకాశించే; ఆ+తేరు= ఆ రథాన్ని; వీక్షించి= బాగా చూచి; ఫాల+అక్షుండు= నొసట కన్నుగల శివుడు; గ్రహమండిత= గ్రహాలచేత అలంకరింపబడిన, వ్యోమ మండలంబు= ఆకాశచక్రం; ఉపాదానకారణంబుగాన్= అవినాభావ సంబంధ కారణంగా, ముఖ్యపదార్థంగా; విశ్వకర్మ= త్వష్ట; కావించిన= చేసిన; కవచంబు; తొడిగి= ధరించి; శర+ఆసనంబు= ధనుస్సు; ధరియించి= పట్టుకొని; శరంబు= బాణం; పుచ్చికొని= తీసికొని; దానవ= రాక్షసులను; సంత్రాసన= భయపెట్టే; ఉత్సాహుండు= పూనికకలవాడు; అగుచున్= అవుతూ; రథ+ఆరోహణంబు+చేసి= తేరెక్కి; వృషభధ్వజంబునన్= ఎద్దుగుర్తు గల పతాకంతో; పొలుపొంది= అందగించి.

**తాత్పర్యం:** ఇట్లా చరాచర ప్రాణిమయమైన విశ్వరూపంతో ప్రకాశిస్తున్న ఆ రథాన్ని బాగా చూచాడు నిటలాక్షుడు. కవచం తొడుగుకొన్నాడు. (ఆ కవచాన్ని విశ్వకర్మ గ్రహాలతో అలంకృతమైన ఆకాశంతో చేశాడు.) విల్లు పట్టుకొన్నాడు. అమ్ము తీసికొన్నాడు. రాక్షసులను గడగడలాడించే పూనికతో రథం ఎక్కాడు. దానిమీద వృషభచిహ్నం కల జెండా అందగిస్తున్నది.

**ఆ.** **'అప్సరోగణంబు లాడుచుఁ బాడుచు । సంతసమునఁ జెలఁగ సకల మునులు**
**బహువిధములఁ దన్నుఁ బ్రస్తుతిసేయంగ । నమరవరులఁ జూచి యల్లనగుచు.** **284**

**ప్రతిపదార్థం:** అప్సరస్+గణంబులు= దేవవేశ్యలగుంపులు; ఆడుచున్= నృత్యంచేస్తూ; పాడుచున్= గానంచేస్తూ; సంతసమునన్= సంతోషంతో; చెలఁగన్= ఉత్సహించగా; సకలమునులు= సమస్త ఋషులు; బహువిధములన్= అనేకవిధాల; తన్నున్= తనను;

ప్రస్తుతి= మిక్కిలిస్తోత్రం; చేయఁగన్= కావించగా; అమరవరులన్= దేవతలలో శ్రేష్ఠులైనవారిని; చూచి= వీక్షించి; అల్లన్= మెల్లగా, కొంచెముగా; నగుచున్= నవ్వుతూ.

**తాత్పర్యం:** అప్సరసలు నృత్యం చేస్తూ పాటలు పాడుతూ, సంతోషంతో ఉత్సాహం ప్రదర్శిస్తున్నారు. మునీశ్వరులందరూ తనను అనేక విధాలుగా బాగా స్తోత్రాలు చేస్తున్నారు. అపుడు దేవనాయకులను చూచి చిరునవ్వు నవ్వుతూ.

**క. 'సారథి యెవ్వం? డనుటయు । వారలు 'నీ చిత్తమునకు వచ్చిన వానిం**
**గారుణ్యంబునఁ గైకొని । తేరునడపఁ బనుపుమనిరి ధీరవిచారా! 285**

**ప్రతిపదార్థం:** ధీరవిచారా!= స్థిరమైన ఆలోచనకలవాడా! శల్యా!; (శివుడు); సారథి= సూతుడు; ఎవ్వండు= ఎవడు; అనుటయున్= అని అడుగగా; వారలు= దేవనాయకులు; నీ చిత్తమునకున్= నీ మనస్సుకు; వచ్చిన= నచ్చిన; వానిన్= అతడిని; కారుణ్యంబునన్= దయతో; కైకొని= స్వీకరించి; తేరు= రథాన్ని; నడపన్= త్రోలటానికి; పనుపుము= ఆజ్ఞాపించు; అనిరి= అన్నారు.

**తాత్పర్యం:** 'స్థిరమైన ఆలోచన కల శల్యా!, శివుడు 'సారథి ఎవడు?' అని అడిగాడు. దేవతలు 'నీకు నచ్చినవాడిని నీవే దయతో తీసికొని రథం నడుపు మనుము' అన్నారు.

**వ. అనవుడు నద్దేవుండు. 286**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అట్లా అనగా; ఆ+దేవుండు= ఆ దేవుడైన శివుడు.

**తాత్పర్యం:** అట్లా అనగా ఆ దేవుడైన శివుడు.

**తే. 'అరయ నెవ్వాఁడు నాకంటె నధికుఁ డతని । మీర యెఱిఁగి యొనర్పుఁడు సారథిత్వ**
**మునకు' ననిచెప్పటయు మహామునులఁ గూర్చి । కొని యమర్త్యులు సంభృతవినయు లగుచు 287**

**ప్రతిపదార్థం:** అరయన్= ఆలోచింపగా; ఏ+వాఁడు= ఎవడు; నాకంటెన్= నాకన్నా; అధికుఁడు= గొప్పవాడో; అతనిన్= అతడిని; మీరు+అ+ఎఱిఁగి= మీరే తెలిసికొని; సారథిత్వమునకున్= సూతభావానికి, రథంత్రోలేపనికి; ఒనర్పుఁడు= నియమించండి; అని; చెప్పుటయున్= చెప్పినందువలన; అమర్త్యులు= దేవతలు; మహామునులన్+కూర్చి= మహర్షులను సమావేశపరిచి; సంభృత= బాగా నిండిన; వినయులు= అణకువ కలవారు; అగుచున్= అవుతూ.

**తాత్పర్యం:** 'నాకంటె గొప్పవాడెవడో ఆలోచించి మీరే తెలిసికొని, అతడిని నాకు సారథిగా నియమించండి' అని చెప్పాడు. అపుడు దేవతలు మహామునులనందరినీ ఒకచోట సమావేశపరిచి, మిక్కిలి వినయంతో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. కమలాసను కట్టెదిరికిం జని భక్తిం బ్రణమిల్లి 'దేవా! నీ వలన నీలగ్రీవుండు ప్రసన్నుం డయ్యె భవదాజ్ఞ 'నే మితనికి రథంబుం దగు సాధనంబులు సమకట్టితిమి సారథి దొరకకున్నవాఁ డది యెట్లనిన సారథ్యం బాచరించు పురుషుండు బలసత్త్వంబుల రథికునకధికుండు గావలసియుండు రథంబు పృథ్వి, రథ్యంబులు వేదంబులు, రథికుండు రుద్రుండు, రథచోదకుండు సులభుం డగునే? గుణాధికుండ వగు నీ విప్పనికిం**

**బూనవలయు దానవ భయభ్రాంతులమైన మమ్ము రక్షింపుము మా కేడుగడయు నీవ భవదీయ ప్రసాదంబున బ్రదికెద' మని చాఁగిలి మ్రొక్కినం బరమాదరంబున నెత్తి యప్పరమేష్ఠి వారలం గారుణ్యంబునం గనుంగొని.** **288**

**ప్రతిపదార్థం:** కమలాసను= పద్మాసనుడైన బ్రహ్మయొక్క; కడు+ఎదిరికిన్= మిక్కిలిముందరికి; చని= వెళ్ళి; భక్తిన్= భక్తితో; ప్రణమిల్లి= నమస్కరించి, దేవా!= దేవుడా!; నీ వలనన్= నీపట్ల; నీలగ్రీవుండు= నీలకంఠుడైన శివుడు; ప్రసన్నుండు= సంతోషించినవాఁడు; అయ్యెన్= ఐనాడు; భవత్= నీయొక్క; ఆజ్ఞన్= ఆజ్ఞచేత; ఏము= మేము; ఇతనికిన్= ఈ రుద్రుడికి; రథంబున్= తేరునూ; తగు= తగిన; సాధనంబులు= పనిముట్లూ; సమకట్టితిమి= సిద్ధంచేశాము; సారథి= సూతుడు; దొరకకున్నవాఁడు= దొరకటంలేదు; అది= ఆ ప్రకారం; ఎట్లు+అనినన్= ఎలాగంటే; సారథ్యంబు= రథంత్రోలేపని; ఆచరించు= చేసే; పురుషుండు= మగవాడు; బల= శరీరబలంచేతనూ; సత్త్వంబులన్= మనశ్శక్తి చేతనూ; రథికునకున్= రథంపై ఉండి యుద్ధంచేసేవాడికంటె; అధికుండు= గొప్పవాడు; కావలసి= అయియుండవలసి; ఉండున్= ఉంటాడు; రథంబు= తేరు; పృథ్వి= భూమి; రథ్యంబులు= గుర్రాలు; వేదంబులు= వేదాలు; రథికుండు= తేరిపై ఉండి యుద్ధంచేసేవాడు; రుద్రుండు= మహేశ్వరుడు; రథచోదకుండు= రథం త్రోలేవాడు; సులభుండు= తేలికగా లభించేవాడు; అగునే?= అవుతాడా?; గుణ= సుగుణాలచేత రుద్రునిదైన తమోగుణంకంటె గొప్పదైన రజోగుణంచేత; అధికుండవు= గొప్పవాడవు; అగు= అయిన; నీవు= సృష్టికర్తవయిన నీవు; ఈ+పనికిన్= ఈ రథం త్రోలేపనికి; పూనవలయున్= పూనుకొనాలి; దానవ= రాక్షసులవలన వచ్చిన; భయ= భయంచేత; భ్రాంతులము+ఐన= తిరుగుచున్నవారమైన, భ్రమకలవారమైన; మమ్మున్= మమ్ములను; రక్షింపుము= కాపాడుము; మాకున్= శరణాగతులమైన మాకు; ఏడుగడయున్= రక్షకుడవూ; నీవు+అ= నీవే; భవదీయ= నీదైన; ప్రసాదంబునన్= అనుగ్రహంచేత; బ్రదికెదమని= జీవిస్తాము అని; చాఁగిలి= సాష్టాంగముగా నేలపైపడి; మ్రొక్కినన్= నమస్కరింపగా; పరమాదరంబునన్= మిక్కిలి గౌరవంతో; ఎత్తి= లేవనెత్తి; ఆ+పరమేష్ఠి= ఆ బ్రహ్మ; వారలన్= ఆ దేవతలను; కారుణ్యంబునన్= దయతో; కనుంగొని= చూచి.

**తాత్పర్యం:** (వా రందరూ) బ్రహ్మదేవుడి సమక్షానికి వెళ్ళారు. భక్తితో నమస్కారం చేశారు. 'దేవా! నీలకంఠుడు నీ పట్లనూ, నీవు కారణంగా మాపట్లనూ సంతుష్టుడయ్యాడు. నీ ఆజ్ఞతో మే మీయనకు ఒక రథమూ, తగిన పనిముట్లూ సమకూర్చిపెట్టాము. సారథి ఒకడే దొరకలేదు. అదెట్లా అంటే సారథి అయినవాడు బలంలోకాని, మానసికబలంలోకాని రథికుడికంటె గొప్పవాడు కావాలి. రథం భూమి, గుర్రాలు వేదాలు, రథికుడు రుద్రుడు అయినప్పుడు తగిన సారథి అంత తేలికగా ఎట్లా దొరుకుతాడు? నీవు గుణాధికుడవు. కనుక నీవే సారథివి కావాలి. మేము రాక్షసుల భయంతో భ్రాంతులమైపోయాము. మమ్మలను రక్షించుము. మాకు రక్షకుడవు నీవే. నీ అనుగ్రహంతో బ్రతుకుతాము' అని నమస్కరించేసరికి, మిక్కిలి ఆదరంతో వారిని పైకి లేవదీసి, బ్రహ్మదేవుడు కరుణతో చూచి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఉ. 'మీరు నిజంబ చెప్పితిరి మిక్కిలి నేర్పును లావుగల్గినన్**
**సారథి పోరులన్ రథికసత్తముఁ దా గెలిపించు బుద్ధి దో**
**స్సార విలాస భంగులకు శర్వుఁడు మెచ్చఁగ నాగమాత్మ కో**
**దార హయంబులన్ నడపెదన్ దనుజుల్ వెఱఁగందు నట్లుగన్.'** **289**

**ప్రతిపదార్థం:** మీరు= మీరందరునూ; నిజంబు+అ= సత్యమే; చెప్పితిరి= పలికితిరి; మిక్కిలి= రథికుడికంటె అధికమైన; నేర్పును= చాతుర్యమూ; లావు= బలమూ; కల్గినన్= ఉన్నట్లయితే; సారథి= సూతుడు; తాన్= స్వయంగా; రథికసత్తమున్=

రథికులలో శ్రేష్ఠుడైనవాడిని; పోరులన్= యుద్ధాలలో; గెలిపించున్= విజయం పొందేటట్లు చేస్తాడు; బుద్ధి= తెలివియొక్క; దోస్సార= భుజబలంయొక్క; విలాస భంగులకున్= మెరసే రీతులకు; శర్వుడు= రుద్రుడు; మెచ్చన్= మెచ్చుకొనేటట్లూ; దనుజుల్= రాక్షసులు; వెఱగందునట్లుగన్= ఆశ్చర్యపోయేటట్లూ, భయపడేటట్లూ; ఆగమ+ఆత్మక= వేదరూపాలయిన; ఉదార= గొప్పవైన; హయంబులన్= గుఱ్ఱాలను; నడపెదన్= నడుపుతాను.

**తాత్పర్యం:** మీరు నిజమే చెప్పారు. రథికుడికంటె అధికమైన నేర్పూ, బలమూ తనకుంటేనే సారథి యుద్ధాలలో రథికుడిని గెలిపిస్తాడు. కనుక, నా తెలివినీ, భుజబలాన్నీ రుద్రుడు మెచ్చుకొనేరీతిగ, దానవులు భయపడేటట్లుగ, ఆశ్చర్యపోయేటట్లుగ వేదాశ్వాలను నడుపుతాను.'

**వ. అని పలికి సురగణంబు ముదంబునం బొదలఁ దనచేతి కమండలు వొక్కెడనిడి జడముడి బిగియించి యజిన పరిధానంబు దృఢంబుగా బంధించి ప్రణవంబునం ద్వష్టయొనర్చిన మునికోల వుచ్చికొని నొగ లెక్కె నిట్లు లోకపితామహుని సురలు శంకరునకు సారథ్యంబు సేయించి' రని చెప్పి దుర్యోధనుండు వెండియు నిట్లనియె. 290**

**ప్రతిపదార్థం:** అని; పలికి= చెప్పి; సురగణంబు= దేవతల సమూహం; ముదంబునన్= సంతోషంతో; పొదలన్= ఒప్పగా; తనచేతి= తన హస్తంలోని; కమండలువు= జలపాత్ర; ఒక్క+ఎడన్= ఒకచోట; ఇడి= ఉంచి; జడముడిన్= తలమీది జడలబంధాన్ని; బిగియించి= గట్టిగాకట్టి; అజిన= జింకతోలు అనే; పరిధానంబు= మొలనున్న వస్త్రం; దృఢంబు+కాన్= గట్టిగా; బంధించి= కట్టి; ప్రణవంబునన్= ఓంకారంతో; త్వష్ట= విశ్వకర్మ; ఒనర్చిన= చేసిన; మునికోల= కమ్చీకర్ర; పుచ్చికొని= తీసికొని; నొగలు= తొట్టిలోనికి; ఎక్కెన్= ఆరోహించాడు; ఇట్లు; సురలు= దేవతలు; లోకపితామహునిన్= లోకాలకు తాత అయిన బ్రహ్మను, బ్రహ్మచేత; శంకరునకున్= శివుడికి; సారథ్యంబు= సూతుడిపని; రథంతోలటం; చేయించిరి= కావించేటట్లు చేశారు; అని; చెప్పి; దుర్యోధనుడు; వెండియున్= మళ్ళీ, ఇట్లు; అనియెన్.

**తాత్పర్యం:** ఇట్లా చెప్పి, దేవతలందరూ సంతోషించేటట్లు తన చేతిలో ఉన్న కమండలువు ఒకచోట పెట్టాడు. తలమీది జడలముడి బిగించాడు. మొలన వలువగా ఉన్న జింకతోలు గట్టిగా కట్టాడు. విశ్వకర్మ ఓంకారంతో రూపొందించిన ములుకోల తీసుకొన్నాడు. తొట్టిలోని కెక్కాడు. ఇట్లా దేవతలు బ్రహ్మదేవుడిచేత శంకరుడి రథం తోలించారు.' అని చెప్పి, దుర్యోధను డింకా ఇట్లా అన్నాడు:

**క. 'హరు లమ్మహాత్ము లిరువుర । భరియించుట కోర్వలేక పడుటయు నెత్తెన్**
**వెరవున లావున వాగెలు । ధరియించుచుఁ బద్మభవుఁడు ధరణీనాథా! 291**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= భూపతీ! శల్యా!; హరులు= గుర్రాలు; ఆ+మహాత్ములు= ఆ మహనీయులను; ఇరువురన్= ఇద్దరినీ; భరియించుటకున్= మోయటానికి; ఓర్వలేక= తాళలేక; పడుటయున్= పడిపోయినందువలన; పద్మభవుఁడు= పద్మంలో పుట్టిన బ్రహ్మ; వెరవునన్= ఉపాయంతోనూ; లావునన్= బలంతోనూ; వాగెలు= పగ్గాలు; ధరియించుచున్= పట్టుకొంటూ; ఎత్తెన్= లేవదీశాడు.

**తాత్పర్యం:** 'మద్రరాజా! శల్యా! ఆ గుర్రాలు ఆ మహానుభావులనిద్దరినీ మోయలేక పడిపోయాయి. అపుడు బ్రహ్మ శక్తియుక్తులతో గుర్రాల పగ్గాలు పట్టుకొంటూ వాటిని పైకి లేవదీశాడు.

**వ. ఎత్తి యత్తురంగంబులకు వెండియు వీర్యశౌర్యంబులు గలుగ ననుగ్రహించి రథంబు గడపం దత్కౌశలంబు గొనియాడి కామదమనుం 'డా దనుజుల దుర్గంబుల దెసకు నరదంబు వఱపుము నేఁడు జగంబుల యలజడి మాన్చెద నాచేతి బలువుసూడు' మని పలికిన నప్పరమ సారథి మనోమారుత జవసత్త్వంబులు గలుగు నవ్వేదాశ్వంబులం బఱప నథర్వాంగిరసులు చక్రరక్షకులయి చనుదేర నత్తే రా పురంబుల కడరిన నయ్యాదిమ రథికుండు. 292**

**ప్రతిపదార్థం:** ఎత్తి= లేవదీసి; ఆ+తురంగంబులకున్= ఆ గుర్రాలకు; వెండియున్= ఇంకా; వీర్యశౌర్యంబులు= వీరత్వమూ, శూరత్వమూ; కలుగన్= కలిగేటట్లుగా; అనుగ్రహించి= దయచూపి; రథంబు= తేరు; కడపన్= నడపగా; తద్+కౌశలంబు= అతడినేర్పును; కొనియాడి= ప్రశంసించి; కామదమనుండు= మన్మథుడిని జయించిన పరమేశ్వరుడు; ఆ దనుజుల= ఆ దానవులయొక్క; దుర్గంబుల= పురాలయొక్క; దెసకున్= దిక్కునకు; అరదంబు= తేరు; పఱపుము= త్రోలుము; నేఁడు= ఈ దినం; జగంబులు= లోకాలయొక్క; అలజడి= ఆపదను; మాన్చెదన్= పోగొడతాను; నాచేతి= నా హస్తంయొక్క; బలుపు= బలం; చూడుము+అని; పలికినన్= పలుకగా; ఆ+పరమసారథి= ఆ గొప్పసూతుడు; మనః= మనస్సుయొక్క; మారుత= వాయువుయొక్క; (వరుసగా) జవ= వేగమూ; సత్త్వంబులు= బలమూ; కలుగు= ఉండిన; ఆ+వేద= ఆ వేదాలనే; అశ్వంబులన్= గుర్రాలను; పఱపన్= త్రోలగా; అథర్వ+అంగిరసులు= అథర్వుడు, అంగిరసుడు అనే మునులు; చక్రరక్షకులయి= రెండు చక్రాలకూ రక్షణ చేసేవారై; చనుదేరన్= రాగా; ఆ+తేరు= ఆ రథం; ఆ పురంబులకున్= ఆ త్రిపురాలవైపునకు; అడరినన్= త్వరపడగా; ఆ+ఆదిమ రథికుండు= ఆ ప్రథమ రథికుడైన పరమేశ్వరుడు.

**తాత్పర్యం:** అట్లా లేవనెత్తి. ఆ గుర్రాలకు ఇంకా వీరత్వమూ, శౌర్యమూ కలిగేటట్లు దయ చూపించాడు. రథం నడిపించాడు. అపుడు కామాంతకుడైన హరుడు బ్రహ్మయొక్కనేర్పును ప్రశంసించాడు. 'ఆ రాక్షసుల పట్టణాలవైపు రథం తోలుము. ఈవేళ లోకాల ఆపద, బాధ తొలగిస్తాను. నాచేతి బలం చూడుము' అన్నాడు. ఆ మహాసారథి బ్రహ్మదేవుడు మనోవేగమూ, మారుతబలమూ కల ఆ వేదాలనే గుర్రాలను త్రోలాడు. అథర్వుడూ, అంగిరసుడూ అనే మునులు చక్రరక్షకులుగా వచ్చారు. అట్లా ఆ రథం త్రిపురాలమీదికి వెళ్ళేసరికి ఆ ప్రథమరథికుడు హరుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఉస్మా. వావి. ప్రతులు అథర్వకు బదులు అధర్వ అనటం ముద్రాప్రామాదికం.

రుద్రుఁడు త్రిపురంబుల సంహరించి సురల సంతోషపఱుచుట (సం. 8-24-117)

**సీ. కోప సందీప్తుఁడై చాపంబు సజ్యంబు । గావించి మౌర్వి మార్గణముఁ గూర్చి**
**పాశుపతాస్త్ర సంబద్ధంబుగాఁ జేసి । పురములు మూఁటిని బుద్ధినిలుప**
**నవి యొక్కచోటికి నప్పడ కూడిన । మునులును సురలును ముదముఁ బొంది**
**గెలుగెలుమంచు నగ్గింప నయ్యుగ్రుండు । దెగ వాపి యేసిన దితిజయుతము**

**ఆ. గాఁ బురత్రయంబు కాలి నీఱై పశ్చి । మాబ్ధిఁ దొరఁగ నమ్మహాగ్ని లోక**
**ములు దహింపఁజొచ్చెఁ బురహరుఁ డది మాన్చె । సంతసిల్లె సకల జంతువులును. 293**

**ప్రతిపదార్థం:** కోప= అలుకచేత; సందీప్తుఁడు+ఐ= మిక్కిలి వెలిగినవాడై; చాపంబు= ధనుస్సు; సజ్యంబు+కావించి= ఎక్కుపెట్టి; మౌర్విన్= అల్లెత్రాటిపై; మార్గణమున్= అమ్మును; కూర్చి= సంధించి; పాశుపత+అస్త్ర= పాశుపతమనే అస్త్రంతో; సంబద్ధంబు= కూడినది; కాన్+చేసి= అయ్యేటట్లు కావించి; పురములు= నగరాలు; మూఁటిని= మూడింటిని; బుద్ధిన్= మతిలో; నిలుపన్= ఉంచగా, స్మరించగా; అవి= ఆ త్రిపురాలు; ఒక్కచోటికిన్= ఒక్క ప్రదేశానికి; అప్పుడు+అ= ఆ సమయంలోనే; కూడినన్= చేరగా; మునులును= ఋషులూ; సురలును= దేవతలూ, ముదమున్+పొంది= సంతోషం చెంది; గెలు= జయించు; గెలుము= జయించుము; అంచున్= అని పలుకుతూ; అగ్గింపన్= ప్రశంసించగా; ఆ+ఉగ్రుండు= ఆ రుద్రుడు; తెగ= ఎక్కుపెట్టిన అల్లెత్రాడు; పాపి= తొలగించి లాగి; ఏసినన్= ప్రయోగించగా; దితిజయుతముగాన్= దైత్యులతోసహా; పురత్రయంబు= త్రిపురాలు; కాలి= తగులబడి; నీఱు+ఐ= భస్మమై; పశ్చిమ+అబ్ధిన్= పడమటి సముద్రంలో; తొరఁగన్= పడగా; ఆ+మహా+అగ్ని= ఆ గొప్ప నిప్పు; లోకములు= లోకాలను; దహింపన్= తగులబెట్టడానికి; చొచ్చెన్= ప్రారంభించింది; పురహరుఁడు= త్రిపురాలను హరించిన హరుడు - శివుడు; అది= ఆ అగ్నిని; మాన్చెన్= ఆర్పినాడు; సకల జంతువులును= సమస్త ప్రాణులూ; సంతసిల్లెన్= సంతోషించాయి.

**తాత్పర్యం:** (శివుడు) కోపంతో వెలిగిపోతూ, ధనుస్సు ఎక్కుపెట్టాడు. అల్లెత్రాటికి అమ్ము సంధించాడు. దానికి పాశుపతాస్త్రం జోడించాడు. మనస్సులో త్రిపురాలను తలచుకొన్నాడు. వెంటనే అవి ఒకచోటికి చేరాయి. ఋషులూ, దేవతలూ జయజయ! అంటూ ప్రశంసించారు. అప్పుడు రుద్రుడు నారిలాగి, ప్రయోగించాడు. దానితో దానవులతో సహా త్రిపురాలు తగులబడి బూడిద అయిపోయి, పడమటి సముద్రంలో పడ్డాయి. ఆ మహాగ్ని లోకాలను దహింపసాగింది. త్రిపురహరుడు హరుడు దానిని ఆర్పివేశాడు. సమస్త ప్రాణులూ సంతోషించాయి.

**వ. అప్పు డనిమిష మునిజనంబులు గృతకృత్యులయి భూతనాథుం బ్రణుతించి యతం డనుమతిసేయ నంబుజాసనుండు లోనుగా నందఱు నిజస్థానంబులకుం జని రివ్విధంబున లోకహితార్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బనుష్ఠించె నీవు నట్ల పోలెఁ గౌరవ రక్షణార్థంబుగా రాధేయు రథంబు గడపు మిక్కర్ణునకు నక్కిరీటికిఁ గృష్ణునకున్ బలశౌర్యంబుల నెక్కుడయినవాఁడవు మదీయ జీవితంబును రాజ్యంబును భవదధీనంబులు వానిం గలిగింపను జయంబును సుఖంబును గావింపను నీవ యొడయండ విక్కార్యం బాచరించి నన్ను రక్షింపు' మని ప్రార్థించి నీ పుత్త్రుండు మద్రపతికి మఱియు నిట్లనియె. 294**

**ప్రతిపదార్థం:** అప్పుడు; అనిమిషమునిజనంబులు= దేవతలూ, మునులూ, లేదా దేవమునులు, కృత= చేయబడిన; కృత్యులు= (తమ) పనికలవారు; అయి= ఐ; భూత= సమస్తప్రాణులకూ; నాథున్= స్వామిని; ప్రణుతించి= మిక్కిలి స్తుతించి; అతండు= శివుడు; అనుమతి+చేయన్= అనుజ్ఞ ఈయగా, అంబుజాసనుండు= పద్మం ఆసనంగా గల బ్రహ్మదేవుడు; లోనుగాన్= మొదలుగా; అందఱున్= ఎల్లరూ; నిజస్థానంబులకున్= తమ ప్రదేశాలకు, తమ నివాసాలకు; చనిరి= వెళ్ళారు; ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; లోక= లోకాలయొక్క; హిత+అర్థంబుగాన్= మేలుకోసమై; ఆ+పరమేష్ఠి= ఆ బ్రహ్మదేవుడు; శివునకున్= శివుడికి; సారథ్యంబు= సూతుడిపని; అనుష్ఠించెన్= చేశాడు; నీవున్= నీవుకూడా; అట్లు+అ+పోలెన్= ఆ విధముగానే; కౌరవరక్షణ+అర్థంబుగాన్= కౌరవులను కాపాడేనిమిత్తంగా; రాధేయురథంబు= కర్ణుడితేరును; కడపుము= నడుపుము; ఈ+కర్ణునకున్= ఈ అంగరాజుకీ; ఈ+కిరీటికిన్= ఈ అర్జునుడికీ; కృష్ణునకున్= కృష్ణుడికీ; బలశౌర్యంబులన్= బలంలోనూ, శూరత్వంలోనూ; ఎక్కుడు+అయినవాఁడవు= అధికుడవైనవాడవు; మదీయ= నాదైన; జీవితంబును= ప్రాణమూ; రాజ్యంబును= రాజ్యమూ; భవత్= నీయొక్క; అధీనంబులు= వశంలోనివి; వానిన్= ప్రాణాన్నీ, రాజ్యాన్నీ; కలిగింపను= కలుగజేయటానికీ; జయంబును= గెలుపునూ; సుఖంబును= సౌఖ్యాన్నీ; కావింపను= కలిగించటానికీ; నీవు+అ= నీవే; ఒడయండవు= భర్తవు,

ప్రభువవు; ఈ+కార్యంబు= ఈ పని; ఆచరించి= చేసి; నన్నున్= నిన్నాశ్రయించిన నన్ను; రక్షింపుము+ అని= కాపాడుమని; ప్రార్థించి= వేడికొని; నీ పుత్రుండు= నీ కుమారుడు; మద్రపతికిన్= మద్రరాజుతో; మఱియున్+ఇట్లు+ అనియెన్= ఇంకా ఇట్లు చెప్పాడు:

**తాత్పర్యం:** అపుడు దేవతలూ, మునులూ కావాలనుకొన్న పని అయిపోయింది కనుక, భూతపతి ఉమాపతిని బాగా స్తుతించారు. ఆయన అనుజ్ఞ ఇచ్చినందున బ్రహ్మాదులందరూ తమ తమ నివాసాలకు వెళ్ళారు. ఇట్లా బ్రహ్మ అంతటివాడు లోకం మేలుకోసం శివుడి రథం నడిపాడు. కనుక నీవు కూడా కౌరవరక్షణకొరకు కర్ణుడి రథం నడిపించుము. నీవే కర్ణుడికంటె, ఆ అర్జునుడికంటె, కృష్ణుడికంటె బలంలోనూ, శౌర్యంలోనూ గొప్పవాడవు. నా ప్రాణమూ, రాజ్యమూ నీ అధీనంలో ఉన్నాయి. నాకు ప్రాణం పోయాలన్నా, రాజ్యమివ్వాలన్నా, నన్ను గెలిపించాలన్నా, సుఖపెట్టాలన్నా - నీవే అధికారివి కాబట్టి, ఈ పని చేసిపెట్టి నన్ను రక్షించుము' అని నీ కుమారుడు దుర్యోధనుడు ప్రార్థించి, శల్యుడితో ఇంకా ఇట్లా అన్నాడు:

**సీ. 'ఇది యొక్క యితిహాస మే నొద్దనుండ ధ । ర్మ ప్రవీణుండగు బ్రాహ్మణుండు**
**ధృతరాష్ట్ర వసుమతీపతికిఁ జెప్పిన యది । వినుము భార్గవ వంశమునఁ బ్రసిద్ధుఁ**
**డగు జమదగ్నికి నత్యంతనిర్మల । మతి రాముఁ డుదయించె నతనిచేయు**
**తపమున హరుఁడు ప్రత్యక్షమై నిలిచిన । నతఁడు దివ్యాస్త్రంబు లడుగుటయును**

**ఆ. నమ్మహాత్ముఁ డశుచు లైనవారల నవి । నిర్దహించుఁగాన నీవు పరమ**
**శుచివిగమ్ము నీకుఁ జొప్పడు నఖిల మ । హాస్త్ర వీర్య' మనియె నాదరమున. 295**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ చెప్పబోయేది; ఒక్క= ఒక; ఇతిహాసము= మునుపు జరిగినకథ; ఏను= నేను; ఒద్దన్= సమీపంలో; ఉండన్= ఉండగా; ధర్మప్రవీణుండు= ధర్మమునందు నిపుణుడు; అగు= అయిన; బ్రాహ్మణుండు= ఒక విప్రుడు; ధృతరాష్ట్ర వసుమతీపతికిన్= ధృతరాష్ట్ర భూపతికి; చెప్పిన+అది= చెప్పినది; వినుము; భార్గవవంశమునన్= భృగువంశంలో; ప్రసిద్ధుఁడు= పేరుకెక్కినవాడు; అగు= అయిన; జమదగ్నికిన్= జమదగ్ని అనే మునికి; అత్యంత= మిక్కిలి; నిర్మలమతి= స్వచ్ఛమైన బుద్ధిగల; రాముఁడు= పరశురాముడు; ఉదయించెన్= జన్మించాడు; అతనిచేయు= అతడుచేసే; తపమునన్= తపస్సువలన; హరుఁడు= శివుడు; ప్రత్యక్షమై= సాక్షాత్కరించి; నిలిచినన్= నిలబడితే; అతఁడు= పరశురాముడు; దివ్యాస్త్రంబులు= దివ్యములైన మంత్రప్రయుక్తాలయిన ఆయుధాలు; అడుగుటయునున్= ఇమ్మని కోరగా; ఆ+మహాత్ముఁడు= ఆ ఉదారస్వభావం గల శివుడు; ఆదరమునన్= వాత్సల్యంతో; అశుచులైన వారలను= శుచిగా ఉండనివారిని; అవి= ఆ దివ్యాస్త్రాలు; నిర్దహించున్= పూర్తిగా తగలబెడతాయి; కాన= కనుక; నీవు; పరమశుచివి+కమ్ము= మిక్కిలి పరిశుద్ధుడవు కమ్ము; నీకున్= శుచివైన నీకు; అఖిల= సమస్తమైన; మహా+అస్త్ర= గొప్ప అస్త్రములయొక్క; వీర్యము= శక్తి; చొప్పడున్= లభిస్తుంది; అనియెన్= అనిచెప్పాడు.

**తాత్పర్యం:** 'ఇది మునుపు జరిగిన ఒక వృత్తాంతం. ధర్మనిపుణుడైన బ్రాహ్మణుడొకడు నేను ధృతరాష్ట్ర మహారాజు దగ్గర ఉన్న సమయంలో ఆయనతో చెప్పాడు. అది వినుము. భృగువంశంలో ప్రసిద్ధుడు జమదగ్ని. ఆయనకు జన్మించాడు అత్యంత నిర్మల బుద్ధిశాలి పరశురాముడు. ఆయన తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు. పరశురాముడు దివ్యాస్త్రాలు కావాలన్నాడు. అపుడు ఉదారస్వభావం కల శివుడు వాత్సల్యంతో ఆయనతో 'అవి శుచులు కాని వారిని తగులబెట్టుతాయి. కనుక నీవు పరమ పరిశుద్ధుడవు కమ్ము, నీకు ఆ మహాస్త్రాలన్నింటి శక్తి వస్తుంది' అని చెప్పాడు.

**వ. అనిన విని జామదగ్న్యుండు వినతుండై 'నాకెప్పుడు పాత్రత్వంబు గలిగె నప్పడ నీవుతలంచి దయసేతువు గాక నీకు శుశ్రూష సేయుచుండునట్లుగాఁ బ్రసాదింపవలయు' నని విన్నవించిన విని కరుణాయత్తచిత్తుండగు భవుం డవ్వరం బిచ్చిన నమ్మహాత్ముండు నియమ నిష్ఠాపరుండై పూజోపహార ప్రముఖ విధానంబుల నద్దేవు నారాధించు చుండ ననేక సంవత్సరంబులు సన నొక్కనాఁడు పరమేశ్వరుండు ప్రసాదలసితాననుండై గౌరీదేవికి నతనిం జూపుచు. 296**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; విని= విని; జామదగ్న్యుండు= జమదగ్ని పుత్రుడైన పరశురాముడు; వినతుండు+ఐ= నమస్కరించినవాడై; నాకున్= నిన్ను మెప్పించిననాకు; ఎప్పుడు= ఏ సమయానికి; పాత్రత్వంబు= అర్హత; కలిగెన్= కలుగుతుందో; అప్పుడు= ఆ సమయంలోనే; నీవు; తలంచి= సంకల్పించి; దయ+చేతువుగాక= ఇత్తువుగాక; నీకున్= ఈయటానికి అంగీకరించిన నీకు; శుశ్రూష= సేవ; చేయుచున్= చేస్తూ; ఉండునట్లుగాన్= ఉండేటట్లుగా; ప్రసాదింపుము= అనుగ్రహించుము; అని; విన్నవించినన్= విజ్ఞప్తిచేయగా; విని= ఆలకించి; కరుణా= జాలికి; ఆయత్త= వశమైన; చిత్తుండు= మనస్సుకలవాడు; అగు= అయిన; భవుండు= శివుడు; ఆ+వరంబు= ఆ వరం; ఇచ్చినన్= ఇవ్వగా; ఆ+మహాత్ముండు= ఆ ఘనత వహించిన పరశురాముడు; నియమనిష్ఠాపరుండు+ఐ= తపః సంతోష స్వాధ్యాయ ఈశ్వర ప్రణిధాన రూప నియమమందు స్థిరమైన ఆసక్తి కలవాడై; పూజా+ఉపహార= అర్చనచేయటం, నైవేద్యం పెట్టటం; ప్రముఖ= మొదలయిన; విధానంబులన్= పద్ధతులతో; ఆ+దేవున్= ఆ పరమేశ్వరుడిని; ఆరాధించుచుండన్= సేవిస్తుండగా; అనేక= బహు; వత్సరంబులు= సంవత్సరాలు; చనన్= గడవగా; ఒక్కనాఁడు= ఒకరోజున; పరమ+ఈశ్వరుండు= మిక్కిలి గొప్ప ప్రభువైన శివుడు; ప్రసాద= సంతోషంచేత, దయచేత; లసిత= ప్రకాశిస్తున్న; ఆననుండై= ముఖం కలవాడై; గౌరీదేవికిన్+ఆతనిన్= గౌరీదేవికి పరశురాముడిని; చూపుచున్= చూపిస్తూ.

**తాత్పర్యం:** అట్లా చెప్పేసరికి, వినిన పరశురాముడు పరమేశ్వరుడికి ప్రణామంచేశాడు. 'నా కెప్పుడు అర్హత కలిగితే అపుడే నీవు సంకల్పించి ఇద్దువుగాని. అంతవరకూ నీ సేవచేస్తూ ఉండేటట్లు అనుగ్రహించుము' అని విజ్ఞప్తి చేశాడు. శివుడు మనస్సులో కరుణ కలిగి, ఆయన దాని కంగీకరించాడు. పరశురాముడు నియమనిష్ఠలతో అర్చన నైవేద్య సమర్పణ ప్రకారాలతో ఆ మహాదేవుడిని ఆరాధిస్తుండగా, చాలా సంవత్సరాలు గడచిపోయాయి. ఒకనాడు సంతోషానుగ్రహాలతో ముఖం కళకళలాడుతుండగా పరమేశ్వరుడు గౌరీదేవికి అతడిని చూపిస్తూ. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** దయసేతువు - దయసేయుదువు అని ఉండాలి. తిక్కన 'చేతువు' అని ప్రయోగించి ఉండడు. ఎక్కడో పొరపాటు జరిగి ఉండాలి. ఛందోనిర్బంధం లేదు కదా. గద్యమే కదా!

**క. 'రాముఁడు విమలవ్రత చ । ర్యామహితుఁడు నాకు భక్తుఁ' డని పలుమాఱుం**
**దా ముద్దు సేసి మృదువచ । నామృత సంసిక్తుఁ జేయు నా సమయమునన్.' 297**

**ప్రతిపదార్థం:** రాముఁడు= భార్గవరాముడు; విమల= స్వచ్ఛమైన; వ్రతచర్యా= వ్రతాన్ని ఆచరించటంచేత; మహితుఁడు= గొప్పవాడు; నాకున్= నాపై; భక్తుఁడు= భక్తి కలవాడు; అని; పలుమాఱున్+తాన్= అనేక పర్యాయాలు తాను; ముద్దుచేసి= వాత్సల్యం చూపిస్తూ; మృదు= సుకుమారమైన; వచన+అమృత= మాటలనే అమృతంచేత; సంసిక్తున్= బాగా తడిసిన వానినిగా; చేయు= చేసే; ఆ సమయమునన్= ఆవేళలోనే.

**తాత్పర్యం:** 'రాముడు నిష్కళంకంగా వ్రతాన్ని ఆచరిస్తాడు. అందువలన గొప్పవాడు. నా భక్తుడు' అని చాలాసార్లు వాత్సల్యం చూపిస్తూ పలుకులనే అమృతంతో అతడిని పూర్తిగా తడిపివేస్తున్న ఆ సమయంలోనే.

**వ. బలవంతులగు దనుజులచేత బాధితులయి బృందారకు లయ్యిందుధరు పాలికి భయ సంభ్రమములతో నరుగుదెంచి తమ యలజడి యెఱింగించిన. 298**

**ప్రతిపదార్థం:** బలవంతులగు= బలంకలవారైన; దనుజులచేతన్= రాక్షసులచేత; బాధితులు+అయి= పీడింపబడినవారై; బృందారకులు= దేవతలు; ఆ+ఇందుధరు= ఆ చంద్రుడిని ధరించే శివుడియొక్క; పాలికిన్= వద్దకు; భయ సంభ్రమములతోన్= జడుపుతోనూ, తొట్రుపాటుతోనూ; అరుగుదెంచి= వచ్చి; తమ= తమయొక్క; అలజడి= కలత; ఎఱింగించిన(న్)= తెలియజేయగా.

**తాత్పర్యం:** బలవంతులైన రాక్షసులు బాధలు పెట్టుతుంటే, దేవతలు ఆ శివుడి దగ్గరకు భయంతోనూ, త్రొటుపాటుతోనూ వచ్చి, తమకు కలిగిన కలత గురించి తెలియజేశారు. అందువలన. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. జామదగ్న్యుఁ జూచి చయ్యనఁ జని దాన । వుల వధించి దేవతలకుఁ బ్రీతి**
**యాచరింపు మనియె హరుఁడు దానికి మది । ముదముఁ బొంది కేలుమొగిచి యతఁడు. 299**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; జామదగ్న్యున్= జమదగ్ని పుత్రుడైన రాముడిని; చూచి; చయ్యనన్= వేగంగా; చని= వెళ్ళి; దానవులన్= రాక్షసులను; వధించి= సంహరించి; దేవతలకున్= అమరులకు; ప్రీతి= సంతోషం; ఆచరింపుము= చేయుము; అనియెన్= అన్నాడు; దానికిన్= ఆ మాటకు; అతఁడు= భార్గవరాముడు; మదిన్= మనస్సులో; ముదమున్= సంతోషమును; పొంది= పొందినవాడై; కేలు= చేతులు; మొగిచి= మోడ్చి, నమస్కరించి.

**తాత్పర్యం:** హరుడు భార్గవరాముడిని చూచి 'వెంటనే వెళ్ళి రాక్షసులను సంహరించి, దేవతలకు సంతోషం కలిగించుము' అన్నాడు. రాముడు ఆ మాటకు మనస్సులో సంతోషించాడు. ఆయనకు నమస్కరించి.

**క. 'అకృతాస్త్రుఁడ నగు నాకుం । బ్రకటభుజాబలులు నస్త్రపారీణులునై**
**సకల సురనికర సంబా । ధకులగు దానవుల గెలువఁదరమే?' యనుడున్. 300**

**ప్రతిపదార్థం:** అకృత+అస్త్రుఁడన్+అగు= అభ్యసించని అస్త్రాలు కలవాడను; అగు= ఐన; నాకున్= నాకు; ప్రకట= ప్రచురమైన, ప్రసిద్ధమైన; భుజాబలులున్= బాహువులయొక్క బలంకలవారూ; అస్త్రపారీణులును+ఐ= మంత్రప్రయుక్తములయిన ఆయుధాల (ప్రయోగం)లో నిపుణులూ అయి; సకల= సమస్తమైన; సుర= దేవతలయొక్క; నికర= సమూహానికీ; సంబాధకులగు= మిక్కిలి బాధించేవారైన; దానవులన్= రాక్షసులను; గెలువన్+తరమే?= జయించటానికి శక్యమా?; అనుడున్= అని పలుకగా.

**తాత్పర్యం:** 'నే నే అస్త్రాలనూ అభ్యసించలేదు. దానవులా - సకలదేవతలనూ బాగా బాధించగలిగినంత భుజబలమూ, అస్త్రప్రావీణ్యమూ ఉన్నవారు. వారిని గెలవటం నాకు శక్యమౌతుందా?' అనేసరికి.

**తే. అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ । 'దలఁపు నీదెస నిలిపెద దానఁజేసి**
**పగఱ నిర్జింపనగుఁ బదంపడి మనోర । థంబు సిద్ధించు నరుగుము దడయ కనఘ!' 301**

**ప్రతిపదార్థం:** అంబికానాథుఁడు= పార్వతీపతి; అతనితోడన్= భార్గవరాముడితో; ఇట్లు; అనున్= పలికాడు; తలఁపు= ఆలోచన; నీ దెసన్= నీ దిక్కున, నీవైపు; నిలిపెదన్= ఉంచుతాను; దానన్+చేసి= దానిచేత; పగఱన్= శత్రువులను; నిర్జింపన్= గెలవటానికి; అగున్= శక్యమవుతుంది; పదంపడి= తరువాత; మనోరథంబు= కోరిక; సిద్ధించున్= నెరవేరుతుంది; అనఘ!= పాపరహితుడా!; తడయక= ఆలస్యం చేయక; అరుగుము= వెళ్ళు.

**తాత్పర్యం:** పార్వతీపతి రాముడితో ఇట్లా అన్నాడు: 'నా ఆలోచన నీవైపే ఉంచుతాను. దానివలన శత్రువులను గెలవటం శక్యమవుతుంది. తరువాత కోరిక నెరవేరుతుంది. కనుక, పాపరహితుడా! ఆలస్యం చేయకుండా వెళ్ళుము'.

**విశేషం:** శివుడు అస్త్ర సంపన్నుల మీదికి యుద్ధానికి వెళ్ళుమన్నపుడే పరశురాముడి కార్యసిద్ధి అయింది. అతడు శివుని అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. సందేహం అనవసరం. అయినా వచ్చింది కనుక, 'అనఘ!= పాపరహితుడా!' అనిన సంబోధనతోనే తీర్చివేశాడు శివుడు. విష్ణుచిత్తీయంలో పాండ్యుని సభకు వెళ్ళి విష్ణు పారమ్యం స్థాపించుమన్న విష్ణువుకు విష్ణుచిత్తుడు తన అశక్తత వెల్లడించటం కూడా ఇట్టిదే.

**చ.	అనవుడు నట్లకాకయని యా జమదగ్నిసుతుండు ధీరతం**
**జని సముదగ్రులైన సురశత్రులఁ దీవ్రతరాయుధోత్కరం**
**బున వధియించి వారి బలుపోటుల నొచ్చినమేనితోడ వ**
**చ్చినఁ బురవైరి నిర్వ్రణునిఁ జేసెఁ గరంబున నంటి యాతనిన్.	302**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని పలుకగా; అట్లకాక= అట్లే అగుగాక; అని; ఆ జమదగ్నిసుతుండు= ఆ జమదగ్ని కుమారుడైన పరశురాముడు; ధీరతన్+చని= ధైర్యంతో వెళ్ళి; సముదగ్రులు+ఐన= భయంకరులైన; సురశత్రులన్= దేవతల శత్రువులయిన రాక్షసులను; తీవ్రతర= వారి ఆయుధాలకంటె తీవ్రమయిన; ఆయుధ= ఆయుధాలయొక్క; ఉత్కరంబునన్= సముదాయంతో; వధియించి= సంహరించి; వారి= ఆ దానవులయొక్క; బలు= బలమైన, పెద్దవైన; పోటులన్= ఆయుధాలతో పొడిచిన గాయాలతో; నొచ్చిన= బాధపడిన; మేనితోడన్= శరీరంతో; వచ్చినన్= రాగా; పురవైరి= త్రిపురశత్రువు - రుద్రుడు; కరంబునన్= తన చేతితో; అంటి= తాకి; ఆతనిన్= భార్గవరాముడిని; నిర్వ్రణునిన్= గాయాలు లేనివాడినిగా; చేసెన్= కావించాడు.

**తాత్పర్యం:** అని శివుడు చెప్పేసరికి భార్గవరాముడు 'అట్లాగే కాని' మ్మని ధైర్యంతో వెళ్ళాడు. రాక్షసులు భయంకరులు. వారివి తీవ్రమయిన ఆయుధాలు. అయినా వాటికంటె తీవ్రమైన ఆయుధాలతో వారిని సంహరించి వచ్చాడు. వారి ఆయుధాల పోటులతో అతడి శరీరమంతా గాయాలై ఉన్నది. అతడిని తన చేతితో స్పృశించి పురాంతకుడు అతడి ఒడలిమీద గాయం లేకుండా చేశాడు.

**వ.	ఇవ్విధంబునం బ్రదీప్త శరీరున్ గావించి భర్గుం డాభార్గవు పయిం బ్రీతిశీతలంబగు నాలోకం బొలయ నాతని కిట్లనియె.	303**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ ప్రకారంగా; ప్రదీప్త= మిక్కిలి వెలుగుతున్న; శరీరున్= శరీరంకలవాడినిగా; కావించి= చేసి; భర్గుండు= శివుడు; ఆ భార్గవుపయిన్= ఆ భార్గవరాముడిపై; ప్రీతి= ప్రేమచేత; శీతలంబు+అగు= చల్లనిదైన; ఆలోకంబు= చూపు; ఒలయన్= ఒప్పగా; అతనికిన్+ఇట్లు+అనియెన్= భార్గవరాముడితో ఇట్లు అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా మిక్కిలి ప్రకాశిస్తున్న స్థితిలో అతడి శరీరం ఉండేటట్లు రుద్రుడు ఆ రాముడిని ప్రేమతో చల్లగా చూస్తూ, ఇట్లా అన్నాడు:

**క. 'అనివర్తనమతిఁ గవయఁగ । నని నీదగు తనువు సునిశితాయుధములు దాఁ**
**కిన నొవ్వదు శత్రులు వ న్నిన నుడుపుము గర్వ మడఁచి నిర్మల చరితా! 304**

**ప్రతిపదార్థం:** నిర్మల చరితా!= స్వచ్ఛమైన చరిత్రకలవాడా!; అనివర్తన= తిరుగులేని; మతిన్= బుద్ధితో; కవయఁగన్= మార్కొనగా; అనిన్= యుద్ధంలో; నీదు+అగు= నీదైన; తనువు= శరీరం; సునిశిత= మిక్కిలి పదునైన; ఆయుధములు= ఆయుధాలు; తాఁకినన్= తగిలినప్పటికీ; నొవ్వదు= నొప్పిచెందదు; శత్రులు= పగవారు; పన్నినన్= తలపడితే; అడఁచి= కొట్టి; గర్వము= పొగరు; ఉడుపుము= పోగొట్టుము.

**తాత్పర్యం:** వెనుకకు తిరిగిరాని బుద్ధితో, శత్రువులను నీవు ఢీకొంటే. యుద్ధంలో నీ శరీరానికి మిక్కిలి పదునైన ఆయుధాలు తగిలినా బాధ కలుగదు. స్వచ్ఛమైన చరిత్ర కలవాడా! శత్రువులే నీపై తలపడితే కొట్టి వారి గర్వం అణగగొట్టుము.

**వ. కావున వరప్రతిగ్రహంబున కిదియ సమయంబు. 305**

**ప్రతిపదార్థం:** కావునన్= కనుక; వర= వరంయొక్క; ప్రతిగ్రహంబునకున్= స్వీకరణానికి, వరం తీసికొనటానికి; ఇది+అ= ఇదే; సమయంబు= తగిన సమయం.

**తాత్పర్యం:** కనుక వరం తీసికొనటానికి ఇదే తగిన సమయం.

**క. కొను' మని దివ్యంబగు న । స్త్రనికాయము శస్త్రచయము దద్దయు దయ ని**
**చ్చిన నవి యాతఁడు సాష్టాం । గనమస్కారంబు సేసి కైకొనియె నృపా! 306**

**ప్రతిపదార్థం:** నృపా= శల్యరాజా!; కొనుము+అని= తీసుకొమ్ము అని పలికి; దివ్యంబగు= దివిలో పుట్టిన లేదా గొప్పదైన; అస్త్రనికాయము= మంత్రప్రయుక్తమైన ఆయుధ సముదాయమూ; శస్త్ర చయము= శరీరబలంతో ప్రయోగించే ఆయుధ సముదాయమూ; తద్దయున్= మిక్కిలి; దయన్= కృపతో; ఇచ్చినన్= ఈయగా; అవి= వాటిని; ఆతఁడు= భార్గవరాముడు; సాష్టాంగ నమస్కారంబు+చేసి= ఎనిమిది అంగాలూ నేలకు తగిలే రీతిగా ప్రణామం కావించి; కైకొనియెన్= తీసికొన్నాడు.

**తాత్పర్యం:** తీసికొమ్ము' అని దివ్యమైన అస్త్ర సముదాయమూ, ఆయుధ సముదాయమూ మిక్కిలి దయతో ఇవ్వగా, పరశురాముడు సాష్టాంగ నమస్కారం చేసి వాటిని తీసికొన్నాడు.

**వ. తదనంతరంబ లోకగురుండగు నా హరునిచేత ననుజ్ఞాతుండై యతండు నిజస్థానంబునకుం జనియె నయ్యితిహాసప్రకారం బిట్టిది యివ్విధంబున వివిధ దుష్కరసత్కర్మానుష్ఠానఫలంబులై వచ్చిన సర్వదివ్యాస్త్రంబులు నా రాముండు రాధేయునకుఁ బ్రీతచేతస్కుండై యొసంగె నట్టి మహాత్ములు హీనకుల జాతుల నాదరింతురే? యప్పుణ్యపురుషుండు గయికొనుటఁ గర్ణుం డుత్కృష్ట యోనిజాతుండని తలంచెద వదన వక్షోబాహు ప్రముఖాంగంబులు సూడ దేవకుమారుండుంబోలె నున్నవాఁడు ప్రకృతి కాంత కాంచన**

**కుండలవజ్ర కవచంబులతోడ నాదిత్యసన్నిభుండగు కొడుకుం గాంచునే? సింగంబులేడి కెట్లు వుట్టు? నితనికి సూత సంవర్ధితుండైన కీడుదొడరె నింతియ కానోపు రుద్రశిష్యత్వంబున విశ్రుతుండగు భార్గవరామునకుఁ బ్రియశిష్యుండగు నంగరాజు ననంగ దమనుం బరిగ్రహించిన విరించి భంగిఁ బరిగ్రహించి నీవు సారథ్యం బాచరింపు మఖిల గుణంబులను సారథి రథికున కధికుండు గావలయునను నీతి కలదు నీవు ప్రసన్నుండవగుటం జేసి నాకోర్కె సిద్ధించె ననుటయు. 307**

**ప్రతిపదార్థం:** తద్+అనంతరంబు+అ= ఆ శస్త్రాస్త్ర గ్రహణం చేసిన తరువాత; లోక= లోకాలకూ; గురుండగు= గురువైన; ఆ హరునిచేతన్= ఆ రుద్రుడిచేత; అనుజ్ఞాతుండై= అనుమతింపబడినవాడై; అతండు= భార్గవరాముడు; నిజ= తనయొక్క; స్థానంబునకున్= నివాసస్థానానికి; చనియెన్= వెళ్ళాడు; అయ్యితిహాస= ఆ పూర్వం జరిగిన వృత్తాంతం యొక్క; ప్రకారంబు= విధం; ఇట్టిది= ఇటువంటిది; ఈ+విధంబునన్; వివిధ= పలురకాలయిన; దుష్కర్మ= చేయకష్టమైన; సత్కర్మ= మంచి కర్మలయొక్క; అనుష్ఠాన= ఆచరణంయొక్క; ఫలంబులై= ఫలాలై; వచ్చిన= లభించిన; సర్వ= సమస్తమైన; దివ్య+అస్త్రంబులున్= దివ్యములైన అస్త్రాలూ; ఆ రాముండు= ఆ భార్గవరాముడు; రాధేయునకున్= కర్ణునకు; ప్రీతచేతస్కుండై= సంతోషించిన మనస్సుకలవాడై; ఒసంగెన్= ఇచ్చాడు; అట్టి= అటువంటి; మహాత్ములు= ఘనతవహించినవారు; హీనకుల= తక్కువకులంలో; జాతులన్= పుట్టినవారిని; ఆదరింతురే?= మన్నిస్తారా?; ఆ+పుణ్య పురుషుండు= ఆ పవిత్రుడైన పురుషుడు; కయికొనుటన్= స్వీకరించటంచేత; కర్ణుండు= అంగరాజు; ఉత్కృష్ట= గొప్పదైన; యోని= జాతిలో; జాతుండు= పుట్టినవాడు; అని; తలంచెదన్= భావిస్తాను; వదన= ముఖం; వక్షః= వక్షఃస్థలం; బాహు= చేతులు; ప్రముఖ= మొదలయిన; అంగంబులు= అవయవాలు; చూడన్= చూస్తే; దేవకుమారుండున్= అమరునిపుత్రుడిలా; ఉన్నవాఁడు= ఉన్నాడు; ప్రకృతికాంత= సామాన్యస్త్రీ; కాంచనకుండల= బంగారు కుండలాలతో; వజ్రకవచంబులతోడన్= వజ్రాల కవచంతో; ఆదిత్య సన్నిభుండగు= సూర్యుడితో సమానుడైన; కొడుకున్= కుమారుడిని; కాంచునే?= కంటుందా?, సింగంబు= సింహం; లేడికిన్= హరిణానికి; ఎట్లు; పుట్టున్?= జన్మిస్తుంది?; ఇతనికిన్= ఈ కర్ణుడికి; సూతసంవర్ధితుండైన= సూతుడిచేత పెంచబడిన; కీడు= దోషం; తొడరెన్= కలిగింది; ఇంతియ= ఇంతే; కాన్+ఓపు= అయి ఉంటుంది; రుద్ర= శివుడియొక్క; శిష్యత్వంబునన్= శిష్యుడై ఉండటంచేత; విశ్రుతుండగు= ప్రసిద్ధుడగు; రామునకున్= భార్గవరాముడికి; ప్రియశిష్యుండగు= ఇష్టుడైన శిష్యుడైన; అంగరాజున్= అంగదేశ ప్రభువైన కర్ణుడి; అనంగ= మన్మథుడి; దమనున్= నిగ్రహించిన శివుడిని; పరిగ్రహించిన= తనకు రథికుడిగా స్వీకరించిన; విరించిభంగిన్= బ్రహ్మదేవుడిలా; పరిగ్రహించి= రథికునిగా స్వీకరించి; నీవు; సారథ్యంబు= సూతుడిపని; ఆచరింపుము= కావించుము; అఖిలగుణంబులను= అన్నిగుణాలలోనూ; సారథి= సూతుడు; రథికునకున్= రథంపై ఉండి యుద్ధం చేసేవాడికంటె; అధికుండు= గొప్పవాడు; కావలయున్= కావాలి; అను; నీతి= యుద్ధనీతి; కలదు= ఉన్నది; నీవు= గొప్పవాడవైన నీవు; ప్రసన్నుండవగుటన్+చేసి= సంతోషించినవాడవు; దయాశాలివి అయినందువలన; నా కోర్కె= నా కోరిక; సిద్ధించెన్= నెరవేరినది; అనుటయున్= అని పలుకగా.

**తాత్పర్యం:** ఆ తరువాత అఖిల లోకాలకూ గురువయిన హరుడి వద్ద సెలవు తీసికొని రాముడు తన నివాసానికి వెళ్ళాడు. పూర్వం జరిగిన ఆ కథ ఇట్లా ఉన్నది. ఇట్లా చేయ శక్యం కాని ఎన్నో ఉత్తమ కర్మలు ఆచరించినందుకు ఫలాలుగా రాముడికి అనేక దివ్యాస్త్రాలు లభించాయి. ఆయన వాటినన్నిటినీ సంతోషంతో కర్ణుడికిచ్చాడు. భార్గవరాముడివంటి మహానుభావులు తక్కువ కులంలో పుట్టినవారిని ఆదరించరు. ఆ పుణ్యాత్ముడు కర్ణుడిని శిష్యుడిగా స్వీకరించినందువలన కర్ణుడు ఎక్కువకులంలో పుట్టినవాడనే భావిస్తాను. అదీకాక, కర్ణుడి ముఖమూ, వక్షఃస్థలమూ, చేతులూ మొదలయిన అవయవాలు చూస్తే, ఇతడే దేవపుత్రుడో అనిపిస్తుంది. సామాన్యస్త్రీ ఇటువంటి

బంగారు కుండలాలూ, వజ్రాల కవచమూ కల భాస్కరుడి వంటి బాలుడిని కనగలుగుతుందా? లేడికి సింహ మెట్లా పుట్టుతుంది? అయితే, ఇతడిని సూతుడు పెంచాడన్న దొకటే దోషం. కనుక రుద్రుడి శిష్యుడిగా ప్రఖ్యాతుడైన భార్గవరాముడికి ప్రియశిష్యుడయిన కర్ణుడిని, మదనాంతకుడిని బ్రహ్మదేవుడు స్వీకరించినట్లు, రథికుడిగా స్వీకరించి అతడికి సారథికృత్యం చేసిపెట్టుము. అన్ని విషయాలలో కూడా సారథి రథికుడి కంటె గొప్పవాడయి ఉండాలని యుద్ధనీతి ఉన్నది. నీవు సంతోషించి, దయ చూపించావు. అందువలన నా కోరిక నెరవేరినది.' అనేసరికి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: నిదర్శన: ఉపమ.

**తే.** **'క్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి । లించి ప్రియ మాననమునఁ దలిర్ప నృపకు**
**మార! నీవు నాకొలఁది యిట్లరయ నెఱుఁగు । దేని యిది లెస్స నీకోర్కి యేను దీర్తు.'** **308**

**ప్రతిపదార్థం:** మద్ర విభుండు= మద్రరాజు శల్యుడు; నీ కొడుకున్= నీ కుమారుడైన దుర్యోధనుడిని; క్రుచ్చి= గుచ్చుకొనేటట్లు గట్టిగా; కౌఁగిలించి= ఆలింగనం చేసికొని; ఆననమునన్= ముఖంమీద; ప్రియము= ప్రీతి; తలిర్పన్= శోభిల్లగా; నృపకుమార!= రాజకుమారా!; నీవు= ఇంతటివాడవైన నీవు; నాకొలఁది= నామేర; ఇట్లు; అరయన్= పరిశీలింపగా, పరిశీలించటం; ఎఱుఁగుదు+ఏని= తెలిసినవాడవైతే; ఇది= ఈ పని; లెస్స= యుక్తం; ఏను= నేను; నీకోర్కి= నీ కోరిక; తీర్తున్= తీరుస్తాను.

**తాత్పర్యం:** శల్యుడు దుర్యోధనుడిని గుచ్చి కౌగిలించుకొని, సంతోషంతో కళకళలాడే ముఖంతో రాజకుమారా! నే నెంతటివాడనో ఇట్లా పరిశీలించటం నీకు తెలిసిన పక్షంలో ఈ సారథ్యం యుక్తమే. నేను నీ కోరిక తీర్చుతాను.'

**వ.** **అని మఱియును.** **309**

**తాత్పర్యం:** అని పలికి ఇంకా.

### శల్యుఁడు కర్ణునకు సారథ్యంబు సేయ నొడంబడుట (సం. 8-25-6)

**క.** **'వీనులకుం బలుకులు సేఁ । దైనను జెప్పదు హితంబులగు కార్యంబుల్**
**దానికి నోర్వఁగవలయుం । గాని యలుక వలదు నీకుఁ గర్ణున కధిపా!'** **310**

**ప్రతిపదార్థం:** వీనులకున్= చెవులకు; పలుకులు= మాటలు; చేఁదు+ఐనను= అప్రియాలుగా ఉన్నప్పటికీ; హితంబులు అగు= మేలుకూర్చునట్టి; కార్యంబుల్= చేయదగిన పనులను; చెప్పుదున్= చెపుతాను; దానికిన్= అలా చెప్పినందుకు; ఓర్వఁగన్= సహింపగా; వలయున్= ఇష్టపడాలి; కాని= అంతేకాని; అధిపా= రాజా!; నీకున్= నీకూ; కర్ణునకున్= కర్ణుడికీ; అలుక= కోపం; వలదు= వద్దు.

**తాత్పర్యం:** 'రాజా! నా మాటలు వినటానికి కటువుగా అనిపించినప్పటికీ, మేలుకలిగించే పనులు ఏవి చేయటం అవసరమో చెప్పుతూ ఉంటాను. వాటిని ఓపికపట్టి వినాలి కాని, నీవూ, కర్ణుడూ కోపపడకూడదు.'

**ఆ.** **అనినఁ గర్ణుఁ డిట్టులను మద్రపతితోడ । హరున కజుఁడు నరున కచ్యుతుండుఁ**
**బోలె హితుఁడ వగుము బుద్ధి పరాక్రమ । శాలి నాకు నీవు సంగరమున.** **311**

**ప్రతిపదార్థం:** అనినన్= అని చెప్పగా; కర్ణుఁడు= అంగరాజు; మద్రపతితోడన్= మద్రదేశపురాజైన శల్యుడితో; ఇట్టులు= ఇలా; అనున్= అన్నాడు; హరునకున్= రుద్రుడికి; అజుఁడు= బ్రహ్మ; పోలెన్= వలె; నరునకున్= అర్జునుడికి; అచ్యుతుండున్ పోలెన్= కృష్ణుడి వలె; బుద్ధిపరాక్రమశాలి= బుద్ధిశాలివీ, పరాక్రమశాలివీ అయిన; నీవు; నాకున్= నాకు; సంగరమునన్= యుద్ధంలో; హితుఁడవు+అగుము= ఇష్టమైనవాడవు, చెలికాడవు, హితవరివి కమ్ము.

**తాత్పర్యం:** అని శల్యుడు చెప్పేటప్పటికి, కర్ణుడు శల్యుడితో ఇట్లా అన్నాడు: 'బుద్ధి పరాక్రమశాలీ! రుద్రుడికి బ్రహ్మవలె, అర్జునుడికి కృష్ణుడివలె, నీవు యుద్ధంలో నాకు హితుడవు కమ్ము.

**విశేషం:** దుర్యోధనుడిది గొప్ప దౌర్భాగ్యం - ఎవడికి వాడే విడివిడిగా లోకాన్ని లొంగదీయగలవాళ్ళు అతడికి తోడుగా నిలిచారు. కాని అది అంతా అతడిమీద అనురాగంతో కాదు - వివిధ కారణాలవలన, ఇష్టానిష్ట మనస్సులతో! ఈ మహావీరులలో చాలామందికి ఒకరంటే మరొకరికి పడదు. తప్పనిసరై పరస్పరం తోడ్పడవలసి వచ్చినా ఎవడి దర్పం వాడు వదలడు. ఇట్లా మునిగిపోయింది దుర్యోధనుడి పుట్టి. దుర్యోధను డెన్ని తిప్పలు పడినా, శల్యుడి మనస్సు పూర్తిగా మారదు. శల్యుడి సాయం తానే కోరినా కర్ణుడి దర్పం కర్ణుడిది. అందులోనూ శల్యుడి మాటలలో ఆ వగరు కనిపిస్తే అది పైకి రాకమానదు. అదంతా ఈ ఇద్దరి మాటలలోనూ కనిపిస్తుంది. దుర్యోధనుడు కార్యసాధనకొరకు ఎంతో తగ్గి మాట్లాడుతున్నాడు. శల్యుడు కావాలని ఆదినుండి అతడి వెనుక గొయ్యి త్రవ్వుతూనే ఉన్నాడు.

**వ. అనవుడు నట్లకాక యని శల్యుండు వెండియు** 312

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని చెప్పగా; అట్లకాక= ఆలాగే అవుగాక; అని= అని పలికి; శల్యుండు= శల్యుడు; వెండియున్= మళ్ళీ.

**తాత్పర్యం:** అని చెప్పగా అట్లాగే అని శల్యుడు పలికి మళ్ళీ.

**క. 'తగువార లొరులఁ దెగడుట । పొగడుట యగు పలుకు పొంతఁ బోవరు హితకా**
**ర్యగతులు సెప్పఁగఁ దెగ డగుఁ । బొగ డగు నెదురోర్వవలయు బుద్ధిగలిగినన్.** 313

**ప్రతిపదార్థం:** తగువారలు= తగినవారు; ఒరులన్= ఇతరులను; తెగడుట= నిందించటం; పొగడుట= ప్రశంసించటం; అగున్= అవుతుంది; పలుకుపొంతన్= మాట వద్దకు; పోవరు= వెళ్ళరు; హిత= మేలైన; కార్యగతులు= కార్యవిధానాలను; చెప్పఁగన్= చెప్పేటప్పుడు; తెగడు+అగున్= నిందించటమూ అవుతుంది; పొగడు+అగున్= ప్రశంసించటమూ ఉంటుంది; బుద్ధి+కలిగినన్= వివేకం ఉన్నట్లయితే; ఎదురు= తమ తలపోతకు ఎదురుచెప్పటం; ఓర్వవలయున్= సహించాలి.

**తాత్పర్యం:** 'చెప్పదగినవారు ఇతరులను నిందించటం - ప్రశంసించటం జరుగుతుంది. వారు మాటలకు ప్రాధాన్యం ఇవ్వరు. మేలు కూర్చే పనులతీరు చెప్పేటప్పుడు నిందా ఉంటుంది. ప్రశంసా ఉంటుంది. వివేకం ఉన్న పక్షంలో తమ ఆలోచనకు ఎదురు చెప్పినా సహించాలి.

**తే. శక్రుతేరైన నడపంగఁ జాలువాఁడ । నుఱవు సెప్పుదు రథికునేమఱఁగ నీను**
**గృష్ణసారథ్యఘనుఁడగు క్రీడి గెలువఁ । దలఁచు నీ కేను గడపుటదగు రథంబు.'** 314

**ప్రతిపదార్థం:** శక్రుతేరైనన్= దేవేంద్రుడి రథమైనా; నడపంగన్= తోలటానికి; చాలువాఁడన్= సమర్థుఁడను; ఉఱవు= యుక్తమైనది; చెప్పుదున్= చెపుతాను; రథికున్= రథంపై నుండి యుద్ధం చేసేవాడికి; ఏమఱఁగన్= పరాకు పడటానికి; ఈను= అవకాశం

ఇవ్వను; కృష్ణు= శ్రీకృష్ణుడియొక్క; సారథ్యఘనుఁడు+అగు= సారథ్యంచేత ఘనుఁడైన; క్రీడిన్= అర్జునుడిని; గెలువన్+ తలఁచు= జయింపగోరే; నీకున్= నీకు; ఏను= నేను; రథంబు= తేరు; కడపుట= నడపటం; తగున్= యుక్తం.

**తాత్పర్యం:** నేను దేవేంద్రుడి రథాన్ని అయినా నడుపగలను. యుక్తమైనది, ఉచితమైనది చెప్పుతూ ఉంటాను. రథికుడికి ఏమరుపాటు రానివ్వను. అర్జునుడు శ్రీకృష్ణుడి సారథ్యం వలన ఘనుడైనాడు. అతడిని గెలువదలస్తున్నావు నీవు. నీ రథం నేను తోలటం ఉచితమే.'

**చ. అన విని భూవిభుండు ప్రియమారఁగఁ గర్ణునిఁ జూచి 'దేవకీ**
**తనయుఁడు మద్రనాథునకుఁ దక్కువ మాతలియుం దలంప నీ**
**తని కెనరాఁడు భాగ్యము కతంబున సారథియయ్యె నీకు నీ**
**యనఁ గొని నీవు పార్థునియహంకృతి మాన్పుము ధీరమానసా!' 315**

**ప్రతిపదార్థం:** అనన్= అని చెప్పగా; విని= ఆలకించి; భూవిభుండు= భూపతి(రాజు దుర్యోధనుడు); ప్రియము+ఆరఁగన్= ప్రియమొప్పగా; కర్ణునిన్= అంగరాజును; చూచి= వీక్షించి; దేవకీతనయుఁడు= దేవకీపుత్రుడైన శ్రీకృష్ణుడు; మద్రనాథునకున్= మద్రదేశాధిపతి అయిన శల్యుడికంటె; తక్కువ= తక్కువవాడు; తలంపన్= ఆలోచించగా; మాతలియున్= ఇంద్రుడి సారథి అయిన మాతలి కూడా; ఈతనికిన్= ఈ శల్యుడికి; ఎన= సాటి; రాఁడు= కాడు, (ఇట్టి ఇతడు); భాగ్యము కతంబునన్= అదృష్టంకొద్దీ; నీకున్= సేనా నాయకుడవైన నీకు; సారథి+అయ్యెన్= సూతుడైనాడు; ఈయనన్= ఈ శల్యుడిని; కొని= సారథిగా స్వీకరించి; ధీరమానసా!= స్థిరమైన మనస్సు కల కర్ణా!; పార్థుని= అర్జునుడియొక్క; అహంకృతి= అహంకారం; మాన్పుము= పోగొట్టు.

**తాత్పర్యం:** అని చెప్పగా, ఆలకించాడు దుర్యోధనుడు. అతడు ప్రేమతో కర్ణుడిని చూచి 'కృష్ణుడు శల్యుడికంటె సారథ్యంలో తక్కువవాడు. ఆలోచించి చూస్తే మాతలికూడా ఈయనకు సాటిరాడు. ఇటువంటి శల్యుడు దైవవశాత్తు నీకు సారథిగా లభించాడు. ఓ స్థిరబుద్ధి గల కర్ణా! ఇతడిని సారథిగా చేసికొని, అర్జునుడి అహంకారం పోగొట్టుము' అన్నాడు.

**క. అని యతఁడు శల్యుఁగనుఁగొని । వినతుండై 'నీవు లావు వెరవును మెఱయం**
**దనుఁగాన నంగపతి య । ర్జునుఁ గలన జయించువాఁడు రూఢిగ' ననుడున్. 316**

**ప్రతిపదార్థం:** అని= అలా పలికి; అతఁడు= దుర్యోధనుడు; శల్యున్= మద్రరాజును; కనుఁగొని= చూచి; వినతుండు+ఐ= నమస్కరించినవాడై; నీవు= (కృష్ణుడికంటె మాతలికంటె అధికుడవైన) నీవు; లావు= బలమూ; వెరవును= ఉపాయమూ; మెఱయన్= ప్రకాశింపగా; తనున్= తనను; కావన్= కాపాడగా; అంగపతి= అంగరాజు; అర్జునున్= పాండవ మధ్యముడిని; కలనన్= యుద్ధంలో; రూఢిగన్= తప్పక; జయించువాఁడు= జయిస్తాడు; అనుడున్= అని పలుకగా.

**తాత్పర్యం:** అట్లా చెప్పి దుర్యోధనుడు శల్యుడిని చూచి నమస్కరించి, 'నీవు బలమూ, ఉపాయమూ ఒప్పేటట్లుగా తనను రక్షిస్తుండగా కర్ణుడు యుద్ధంలో తప్పక జయిస్తాడు' అనేసరికి.

**వ. అట్లయ్యెడుం గాక యని పలికి మద్రేశ్వరుండు సారథ్యంబున కనురూపంబగు సన్నాహంబున నుత్సాహంబు వాటించినం బ్రీతుం డగుచు సూతనందనుండు దన సూతు నాలోకించి తగు రథంబునకుం గల్పన**

**యొనర్పుమని సత్వరంబుగాఁ బనిచిన వాఁడును రయంబున దృఢసుందరంబగు స్యందనంబు సుకల్పితంబుసేసి తెచ్చి దీవించి యిచ్చిన నయ్యరదంబుఁ బూజింపఁ బురోహితు నియమించి తదీయ మంగళవిధానానంతరంబ తాను నర్చించి కృతప్రదక్షిణుండై ప్రణమిల్లి భాస్కరోపస్థానం బాచరించి సవినయంబున శల్యు నారోహణంబుసేయు మనుటయు నతం డచలతటంబునకు లంఘించు సింగంబు చందంబున నొగలెక్కిన. 317**

**ప్రతిపదార్థం:** అట్లు+అయ్యెడున్+కాక= అట్లాగే అవుగాక; అని; పలికి= చెప్పి; మద్రేశ్వరుండు= శల్యుడు; సారథ్యంబునకున్= రథం తోలటానికి; అనురూపంబు= తగినది; అగు= అయిన; సన్నాహంబునన్= ప్రయత్నమునందు; ఉత్సాహంబు+పాటించినన్= ఉత్సాహాన్ని చూపగా; ప్రీతుండు= సంతోషించినవాడు; అగుచున్= అవుతూ; సూతనందనుండు= కర్ణుడు; తన; సూతున్= సారథిని; ఆలోకించి= చూచి; తగు= తగిన; రథంబునకున్= తేరికి; కల్పన= ఏర్పాటు; ఒనర్పుము= కావించుము; అని; సత్వరంబుగాన్= త్వరతో; పనిచినన్= ఆజ్ఞాపించగా; వాఁడును= ఆ సూతుడును; రయంబునన్= వేగంతో; దృఢ= గట్టిదైన; సుందరంబు+అగు= అందమైన; స్యందనంబు= తేరు; సుకల్పితంబు+చేసి= చక్కగా సిద్ధము చేసి; తెచ్చి= తీసికొనివచ్చి; దీవించి= ఆశీర్వదించి; ఇచ్చినన్= సమర్పించగా; ఆ+అరదంబున్= ఆ తేరిని; పూజింపన్= అర్చించటానికి; పురోహితున్= పురోహితుని; నియమించి= నియోగించి; తదీయ= ఆ పురోహితునిదైన; మంగళ= శుభంకోసమయిన; విధాన= పద్ధతి ఆచరించిన; అనంతరంబ= తరువాతనే; తానును+అర్చించి= తాను-కర్ణుడు కూడా పూజించి; కృత= (రథానికి) చేయబడిన; ప్రదక్షిణుండు= (మూడుసారులు) చుట్టి తిరిగివచ్చుట కలవాడై; ప్రణమిల్లి= నమస్కరించి; భాస్కర= సూర్యుడియొక్క; ఉపస్థానంబు= ఉపాసన; ఆచరించి= చేసి; సవినయంబునన్= వినయంతో; శల్యున్= మద్రరాజును; ఆరోహణంబు+చేయుము= తేరెక్కుము; అనుటయున్= అని అనగానే; అతండు= ఆ శల్యుడు; అచల= పర్వతంయొక్క; తటంబునకున్= చరియమీదికి; లంఘించు= దూకే; సింగంబు= సింహంయొక్క; చందంబునన్= విధముగ; నొగలు= రథంయొక్క తొట్టి (సారథి కూర్చొనేచోటు) ఎక్కినన్= ఆరోహించగా.

**తాత్పర్యం:** అట్లాగే అగుగాక!' అని పలికి, శల్యుడు రథం తోలటానికి అవసరమైన ఏర్పాట్లమీద పూనిక చూపించే సరికి, కర్ణుడు సంతోషించి, అప్పటివరకు తన సారథిగా పనిచేస్తున్న వానిని చూచి, శల్యుడి సారథ్యానికి తగిన రథం ఏర్పాటు చేయుమని ఆజ్ఞాపించగా, అతడు వెంటనే దృఢంగా, అందంగా ఉన్న ఒక రథాన్ని సిద్ధం చేసి, తీసికొని వచ్చాడు. అట్లా తెచ్చి, కర్ణుడిని దీవించి దానిని అతడికి అప్పగించాడు. అపుడు కర్ణుడు ఆ రథాన్ని పూజించవలసినదిగా పురోహితుడికి చెప్పాడు. అతడు ఆ మంగళకృత్యం నెరవేర్చిన తరువాత, తానూ పూజించాడు. ఆ రథం చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేసి నమస్కరించాడు. సూర్యుడిని ఉపాసించాడు. వినయంతో శల్యుడిని తేరెక్కవలసినదని చెప్పాడు. వెంటనే అతడు కొండచరియమీదికి దూకే సింహంవలె తేరి తొట్టెలోనికి ఎక్కాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఆ. మెఱుఁగు తోడి లలిత మేఘంబు మీఁదికిఁ। బోయి వెలుఁగుభాను పొలుపు దోఁప**
**మద్రరాజసహితమహితమై యొప్పు న। త్తేరు కర్ణుఁ డెక్కి తేజరిల్లె. 318**

**ప్రతిపదార్థం:** మెఱుఁగు తోడి= విద్యుత్తుతో కూడిఉన్న; లలిత= అందమైన; మేఘంబు= మబ్బుయొక్క; మీఁదికిన్+పోయి= పైకివెళ్ళి; వెలుఁగు= ప్రకాశించే; భాను= సూర్యుడియొక్క; పొలుపు తోఁపన్= అందం స్ఫురించగా; మద్రరాజసహిత=

శల్యుడితో కూడినందున; మహితము+ఐ= గొప్పదై; ఒప్పు= శోభిస్తున్న; ఆ+తేరు= ఆ రథం; కర్ణుఁడు+ఎక్కి= అంగరాజు ఆరోహించి; తేజరిల్లెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** మెరుపుతో కూడి మనోహరంగా ఉన్న మేఘం మీదికిపోయి ప్రకాశించే సూర్యుడి శోభ స్ఫురించేటట్లుగ, మద్రరాజుతో కూడి గొప్పగా ఒప్పుతున్న ఆ రథాన్ని కర్ణుడధిరోహించి వెలిగాడు.

**విశేషం:** అలం. ఉపమ.

**వ. అని యిట్లు కర్ణసారథిత్వంబు శల్యుండు, మెయికొనుట సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె ననిన విని యటమీఁది వృత్తాంతం బెఱింగింపు మనుటయు. 319**

**ప్రతిపదార్థం:** అని+యిట్లు= ఈ ప్రకారం; కర్ణసారథిత్వంబు= కర్ణుడికి సూతుడు కావటం; శల్యుండు= మద్రరాజు; మెయికొనుట= అంగీకరించటం; సంజయుండు= సంజయుడు; ధృతరాష్ట్రునకున్= ధృతరాష్ట్రమహారాజుకు; చెప్పెన్= చెప్పాడు; అనినన్= అని చెప్పగా; విని= ఆలకించి; అటమీఁది= ఆ తరువాతి; వృత్తాంతంబు= ఉదంతం; ఎఱింగింపుము= తెలియజెయ్యి; అనుటయున్= అని అడిగేసరికి - 'వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె' అనిన రెండవ ఆశ్వాసంలోని 2వ వచనంలోని క్రియతో అన్వయం.

**తాత్పర్యం:** ఇట్లా శల్యుడు కర్ణుడి రథసారథి కావటానికి అంగీకరించటం సంజయుడు ధృతరాష్ట్ర మహారాజుకు చెప్పాడు అని వైశంపాయనుడు జనమేజయ మహారాజుకు చెప్పేసరికి. ఆ మహారాజు తరువాతి వృత్తాంతం తెలియచేయుమనగా

## ఆశ్వాసాంతము

**చ. అవిరళ దర్శనస్థిర మహాముని మానసవాస ఖేలనో**
**త్సవరసికా! రసాత్మక! నితాంతకృపాకర దివ్యచిత్త! స**
**త్త్వవిభవ సంభృతైక్య సుఖతామయదేహ! నిరామయా! పున**
**ర్భవ పరిహార హారిపద పద్మయుగస్తవ! హృద్యసంస్తవా! 320**

**ప్రతిపదార్థం:** అవిరళ= ఎడతెగకుండా; దర్శన= చూడటంలో; స్థిర= కుదురైన; మహాముని= మహర్షులయొక్క; మానస= మనస్సు అనే; వాస= నివాసంలో; ఖేలనోత్సవ= క్రీడించటం అనే ఉత్సవంలో; రసికా!= ప్రీతి కలవాడా!; రసాత్మక!= రసస్వరూపుడవైనవాడా!; నితాంత= అతి విస్తారమైన; కృపాకర= దయకు జన్మస్థానమైన; దివ్యచిత్త!= దివ్యమైన మనస్సు కలవాడా!; సత్త్వ= సత్త్వగుణంయొక్క; విభవ= ఐశ్వర్యంచేత; సంభృత+ఐక్య= నిండిన ఏకత్వంతో; సుఖతామయదేహ!= సుఖమయమయిన శరీరంకలవాడా!; నిరామయా!= దోషరహితుడా!; పునర్భవ= పునర్జన్మను; పరిహార= తొలగించే; హారి= మనోహరమైన; పదపద్మ= పద్మాలవంటి పాదాలయొక్క; యుగ= జంటయొక్క; స్తవ= స్తోత్రం కలవాడా; హృద్యసంస్తవా= మనోహరమైన చక్కని స్తుతులు కలవాడా!

**తాత్పర్యం:** ఎల్లప్పుడు నిన్ను దర్శించటంచేత స్థిరంగా ఉన్న మహర్షుల మనస్సులనే నివాసాల్లో క్రీడించటం అనే వేడుకలో ప్రీతి కలవాడా! రసస్వరూపా! అంతులేని దయకు ఉనికి పట్టయిన దివ్యచిత్తం కలవాడా! సత్త్వగుణ

సంపద చేత నిండిన ఏకత్వంతో సుఖమయమైన దేహం కలవాడా! దోషరహితుడవైనవాడా! పునర్జన్మను లేకుండా చేసే మనోహరాలైన పాదపద్మాల జంటను గూర్చిన స్తోత్రం కలవాడా! మనస్సుకు ఇంపైన చక్కని స్తుతులు కలవాడా!

**క. కమలవన సదృశదృగ్రుచి । సముదయశమితార్తి భక్త సంఘా! లక్ష్మీ**
**రమణత్వ శివాప్రియతా । సమవా యాలంబ్యమాన సౌందర్యనిధీ!** 321

**ప్రతిపదార్థం:** కమలవన= పద్మవనంతో; సదృశ= సమానమయిన; దృక్= నేత్రములయొక్క; రుచిసముదయ= కాంతి సమూహంచేత; శమిత= శాంతింపజేయబడిన; ఆర్తి= పీడకల; భక్తసంఘా!= భక్తుల సమూహంకలవాడా!; లక్ష్మీరమణత్వ= లక్ష్మీపతిభావం (హరిత్వం) యొక్క; శివాప్రియతా= పార్వతీప్రియభావం (హరత్వం) యొక్క; సమవాయ= అవినాభావంచేత; ఆలంబ్యమాన= ఆధారపడుతున్న; సౌందర్య= అందానికి; నిధీ= నిధివంటివాడా.

**తాత్పర్యం:** కమలవనం వంటి కన్నులకాంతి పుంజంతో భక్తజనుల ఆర్తిని పోగొట్టే లక్ష్మీపతి, పార్వతీపతి భావాలకు అవినాభావాధారమైన సౌందర్యానికి నిధివంటి, వాడా, హరిహరనాథా!

**మాలిని.**

**అనుభవశమరమ్యా! హంసభావైక గమ్యా!**
**వినమదఘవిదారీ! విశ్వలోకోపకారీ!**
**దినకరశశినేత్రా! ధీపరిస్పందచిత్రా!**
**దనుజమథనలీలా! ధర్మతత్త్వానుకూలా!** 322

**ప్రతిపదార్థం:** అనుభవ= అనుభవపూర్వకమైన; శమ= శాంతిచే; రమ్యా!= సుందరుడవైనవాడా!; హంసభావైక గమ్యా!= హంసభావానికి ఏకైక గమ్యమైనవాడా; హంసభావమంటే అహం+సః అనేభావం. అనగా అహం= నేను; సః= ఆ బ్రహ్మస్వరూపాన్ని అనే భావం; ఇది అవిరామంగా పలుకుతుంటే; సః+అహమ్= సోఽహమ్ సోఽహమ్ సోఽహంసః= ఇలా హంసగా పరిణమిస్తుంది. ఈ అద్వైతభావానికి ఒకే ఒక గమ్యమైన రూపం హరిహరనాథాద్వైత రూపం. దీనిని మరొకవిధంగా కూడా చెపుతారు. సర్వప్రపంచమూ లయమైనా పరమేశ్వరుడొకడు మాత్రం కేవలుడై నిలిచిఉంటాడు; శరీరంలోని ఇంద్రియాలన్నీ నిద్రావస్థలో విశ్రాంతినందినా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు మాత్రం నిలిచి ఉంటాయి. దీనిని హంసస్థితి లేక భావం అంటారు. ఇదే పరమేశ్వరభావం. దీనిని ఉపాసకులు హంసగాయత్రీ రూపంతో ఉపాసిస్తారు. ఈ రకమైన ఉపాసనచే పొందదగినవాడు అని; వినమత్= నమస్కరిస్తున్నవారియొక్క; అఘ= పాపాలను; విదారీ!= బ్రద్దలు కొట్టేవాడా!; చీల్చేవాడా!; విశ్వ= సమస్తమైన; లోక+ఉపకారీ!= లోకాలకు మేలుచేసేవాడా!; దినకర= సూర్యుడు; శశి= చంద్రుడూ; నేత్రా!= నయనములు(కన్నులు)గా కలవాడా!; ధీ పరిస్పందచిత్రా!= బుద్ధియొక్క కదలిక, చాంచల్యం చేత చిత్రంగా కనిపించేవాడా; దనుజ= రాక్షసులను; మథన= సంహరించటం; లీలా!= విలాసంగా కలవాడా!; ధర్మతత్త్వానుకూలా!= ధర్మతత్త్వానికి అనుకూలమైనవాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! నీ రూపం అనుభవపూర్వకమైన శాంతిచే రమ్యమైనది. నీవు హంసభావంచేత పొందదగినవాడవు. నీకు నమస్కరిస్తూ ఉండేవారి పాపాలను పోగొట్టుతావు. సకలలోకాలకూ నీవు ఉపకారివి. సూర్యచంద్రులు నీ నేత్రాలు. కేవలుడవైన నీవు బుద్ధి చాంచల్యంచేత చిత్రంగా అనేకంగా కనిపిస్తావు. ధర్మవిరోధు లయిన రాక్షసులను సంహరించటం నీకొకక్రీడ. నీవు ధర్మతత్త్వానికి, ధర్మసంస్థాపనకు సదా అనుకూలుడవు.

**విశేషం:** అలం: అంత్యానుప్రాసం.

**గద్యము.**

**ఇది శ్రీమ దుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబయిన శ్రీ మహాభారతంబున కర్ణపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము.**

**ప్రతిపదార్థం:** ఇది= ఈ గ్రంథభాగం; శ్రీమత్= శోభాశాలులు అయిన; ఉభయకవి= సంస్కృతాంధ్రములు రెంటిలోను కవులయిన వారియొక్క; మిత్త్ర= స్నేహితుడయిన అనగా రెండు భాషలలోను కవి అయినవాడునూ; కొమ్మనామాత్యపుత్త్ర= కొమ్మన అనే పేరుగల మంత్రియొక్క కుమారుడునూ; బుధ= పండితులను; ఆరాధన= పూజించటంచేత; విరాజి= ప్రకాశించేవాడునూ; తిక్కనసోమయాజి= సోమయాగం చేసిన, తిక్కన అనే పేరుగల కవిచేత; ప్రణీతంబు+అయిన= రచించబడినది అయిన; శ్రీమహాభారతంబునన్= శ్రీకరమయిన మహాభారతమనే గ్రంథంలో; కర్ణపర్వమునందున్= కర్ణపర్వంలో; ప్రథమ+ఆశ్వాసము= మొదటి ఆశ్వాసం; సమాప్తం= పూర్తి అయినది.

**తాత్పర్యం:** ఇది ఉభయ కవిమిత్త్ర బిరుదాంచితుడూ, కొమ్మనామాత్యుడి కుమారుడూ, పండితులను పూజించటం చేత ప్రకాశించేవాడూ అయిన తిక్కన సోమయాజిచేత రచించబడిన శ్రీ మహాభారతంలోని కర్ణపర్వం మొదటి ఆశ్వాసం సమాప్తం.

**కర్ణపర్వంలోని ప్రథమాశ్వాసం సమాప్తం.**

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము -ద్వితీయాశ్వాసము

**క. శ్రీ నిష్పాదన నిపుణ! కృ । పా నిరతి శయార్ద్రభావ! భావాతీతా!**
**భాను సహస్ర ప్రభ! ర । మ్యానంత వపుః ప్రకాశ! హరిహరనాథా! 1**

**ప్రతిపదార్థం:** శ్రీ, నిష్పాదన నిపుణ!= ఐశ్వర్యమును కలిగించుటలో నైపుణ్యం కలవాడా!; కృపానిరతిశయ+ఆర్ద్రభావ!= అపార కరుణచేత మెత్తనైన చిత్తంకలవాడా!; భావ+అతీతా!= ఊహలకు అందనివాడా!; భాను సహస్ర ప్రభ!= వేయి సూర్యులకాంతి గలవాడా!; రమ్య+అనంత= మనోహరము-అనంతము అయిన; వపుఃప్రకాశ!= దేహకాంతి గలవాడా!; హరిహరనాథా!

**తాత్పర్యం:** హరిహరనాథా! నీవు భక్తులకు ఐశ్వర్యం కలిగించేవాడవు. వారిపై అపారమైన కరుణను కురిపించే ఆర్ద్రహృదయుడవు. నీవు ఊహాతీతుడవు. సహస్ర సూర్యదీప్తితో ప్రకాశించేవాడవు. అంతులేని మనోహర దేహకాంతి కలవాడవు.

**విశేషం:** ప్రతి అశ్వాస ప్రారంభంలో వలెనే కృతిపతి అయిన హరిహరనాథుడిని స్తుతించాడు తిక్కన. సూర్యసుతుడైన కర్ణుడి యుద్ధవర్ణనగల పర్వం ఆరంభంలో హరిహరనాథుని భానుసహస్రప్రభను నుతించటం సముచితంగా ఉన్నది.

శల్యుఁడు గర్ణునుత్సాహంబునకు విఘ్నకరంబు లగు వాక్యంబులు సెప్పుట (సం.8-26-16)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు దన సుతుండు సూతసుతు కోర్కి దీర్పంబూని యతి ప్రయత్నంబు సేయుట యాకర్ణించి యాంబికేయుండు. 2**

**ప్రతిపదార్థం:** దేవా!= హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్+ఇట్లు+అనియెన్= జనమేజయుడితో ఇట్లా అన్నాడు; అట్లు= ఆ విధంగా; తన సుతుండు= తన పుత్రుడు (దుర్యోధనుడు); సూతసుతుకోర్కి= కర్ణుని కోరికను; తీర్పన్+పూని= తీర్చదలచి; అతిప్రయత్నంబు చేయుట= మిక్కిలియత్నం చేయటం; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; ఆకర్ణించి= విని.

**తాత్పర్యం:** శల్యుడిని తనకు సారథిగా నియమించుమని కర్ణుడు కోరగా దుర్యోధనుడు ఎంతో ప్రయత్నంతో శల్యుడిని అందుకు ఒప్పించాడు. ఈ విషయం సంజయుడి ద్వారా విన్న ధృతరాష్ట్రుడు.

**ఆ. 'ఎట్లు ప్రియ మొనర్చె? నట్లు సంప్రార్థితుం । డైన మద్రనాథుఁ డంతఁ గోరి**
**తేరు గడప నతని తెచ్చికొన్నట్టి య । వ్వీరుఁ డేమి భంగి విక్రమించె?' 3**

**ప్రతిపదార్థం:** అట్లు సంప్రార్థితుండు+ఐన= ఆ విధంగా ప్రార్థించబడిన; మద్రనాథుఁడు= శల్యుడు; ఎట్లు ప్రియము+ఒనర్చెన్?= ఏ విధంగా (కర్ణ దుర్యోధనుల) ఇష్టాన్ని నెరవేర్చాడు?; అంతన్+కోరి= అంతగా ఇష్టపడి; తేరు కడపన్= రథం తోలటానికి; అతని తెచ్చికొన్నట్టి= శల్యుడిని సారథిగా నియమించుకొన్నట్టి; ఆ+వీరుఁడు= కర్ణుడు; ఏమి భంగిన్= ఏ రీతిగా; విక్రమించెన్?= పరాక్రమించాడు?

**తాత్పర్యం:** కర్ణదుర్యోధనులు అంతగా వేడుకొని తెచ్చుకొన్న శల్యుడు ఏ విధంగా వారి ఇష్టాన్ని నెరవేర్చాడు. తన తేరు నడపటానికి అంతగా కోరి ఆ శల్యుణ్ణి తెచ్చుకొన్న కర్ణుడు ఏ విధంగా పరాక్రమించాడు.

**వ.** **అని యడిగిన సంజయుం డిట్లనియె, నట్లు రథికసారథులు విలసిల్లి వందిమాగధ ప్రస్తూయమాను లగుచుఁ దనవలను గౌరవంబునం గనుంగొనుటయుఁ, గురురా జయ్యంగరాజు నుద్దేశించి.** 4

**ప్రతిపదార్థం:** అని అడిగినన్= (ధృతరాష్ట్రుడు) అడుగగా; సంజయుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా చెప్పాడు; అట్లు= ఆ విధంగా; రథిక సారథులు= కర్ణుడు, శల్యుడు, వందిమాగధ ప్రస్తూయమానులు+అగుచున్= వందిమాగధులచేత పొగడబడిన వారై; విలసిల్లి= ఒప్పుచు; తనవలను= తనవైపు; గౌరవంబునన్= గౌరవంతో; కనుంగొనుటయున్= చూడగా; కురురాజు= దుర్యోధనుడు; ఆ+అంగరాజున్= కర్ణుడిని; ఉద్దేశించి= చూచి.

**తాత్పర్యం:** అని ప్రశ్నించిన ధృతరాష్ట్రుడితో సంజయుడు చెప్పసాగాడు. ఆ సేనాధిపతిని, సారథిని చూచి వందిమాగధులు ప్రశంసలు చేస్తూ, దుర్యోధనుడివైపు గౌరవభావంతో చూచారు. అప్పుడు అతడు కర్ణుడితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**విశేషం:** వంది= స్తుతిచేసి జీవించేవాడు; మాగధుడు= వంశావళిని కీర్తించేవాడు. వీరు ఆనాడు యుద్ధభూమికి కూడా వచ్చేవారని ద్యోతకమవుతున్నది.

**చ.** **గురుఁడును భీష్ముఁడున్ నరునకున్ బకవైరికి నగ్గలంబు, వీ**
**రిరువురు వారి నిద్దఱ నహీన పరాక్రమ లీల గీటడం**
**తురు ధ్రువమంచు నాత్మఁ బరితోషముఁ బొందుదు; నట్లు గాక ని**
**ర్భర బల శౌర్యముల్ మెఱయ గ్రక్కున నాపని నిర్వహింపుమీ!** 5

**ప్రతిపదార్థం:** గురుఁడును భీష్ముఁడున్= ద్రోణుడు, భీష్ముడు; నరునకున్, బకవైరికిన్= అర్జునుడికి, భీముడికి; అగ్గలంబు= మించిన శౌర్యం కలవారు; వీరు+ఇరువురు= భీష్మద్రోణులు; వారిన్+ఇద్దఱన్= భీమార్జునులను; అహీన పరాక్రమలీలన్= గొప్ప పరాక్రమంతో; గీటు+అడంతురు= గర్వం అణచుతారు (సంహరిస్తారు); ధ్రువము+అంచున్= ఇది తథ్యమని; ఆత్మన్= మనసులో; పరితోషమున్= సంతోషమును; పొందుదున్= పొందేవాడిని; అట్లుకాక= ఆ విధంగా కాక; నిర్భర బలశౌర్యముల్= అధికబల పరాక్రమాలు; మెఱయన్= ప్రకాశించగా; గ్రక్కునన్= శీఘ్రంగా; ఆ పని నిర్వహింపుమీ!= భీమార్జునులను సంహరించే కార్యాన్ని నెరవేర్చుము.

**తాత్పర్యం:** అధిక పరాక్రమశాలులైన భీష్ముడు, ద్రోణాచార్యుడు భీమార్జునులను తప్పక సంహరించగలవారని ఎంతో సంతోషించేవాడిని. కాని నా కోరిక తీరలేదు. నీవైనా నీ బలశౌర్యాలు ప్రదర్శించి నా అభీష్టాన్ని నెరవేర్చుము.

**విశేషం:** బలవంతులైన పాండవులను భీష్మద్రోణులు సంహరించలేకపోయినా కర్ణుడు అందుకు సమర్థుడని దుర్యోధనుడి నమ్మకం. అతడి అండ చూచికొనే దుర్యోధనుడు మహాభారత సంగ్రామానికి సిద్ధపడ్డాడు.

**తే.** **బాడుదల నొండెఁ బట్టుము పాండు తనయ । ముఖ్యు; వీరు వా రన నేల? మునుము వట్టి**
**వైరివర్గంబు నెల్లను బారిసమరి । సైన్యయుతముగ నద్భుత జయము గొనుము.'** 6

**ప్రతిపదార్థం:** బాడు+తలన్+ఒండెన్= అవమానించియో-మరొక విధంగానో; పాండు తనయ ముఖ్యున్= ధర్మరాజును; పట్టుము= బంధించుము; వీరువారు+అనన్+ఏల; మునుము పట్టి= వరుస(పెట్టి); వైరివర్గంబున్+ఎల్లను= శత్రుసమూహమునంతటిని; బారిసమరి= హింసించి; సైన్యయుతముగన్= సేనతోకూడ; అద్భుత జయము కొనుము= ఆశ్చర్యకరమైన విజయం పొందుము.

**తాత్పర్యం:** ఏ విధంగానైనా పాండవాగ్రజుడయిన ధర్మరాజును బంధించుము. వారూ వీరని చూడక శత్రువర్గము నంతటినీ సైన్యంతో సహా రూపుమాపి విజయాన్ని సాధించుము'.

**వ.** **నడపు మనుటయు, నమ్మాటఁ గైకొని కర్ణుండు శల్యునిం దేరు నడపు మనిన నతం డట్ల చేసె; నప్పుడు శంఖ భేరీ ప్రముఖ తూర్యనాదంబులు రోదసీ గహ్వరంబు విహ్వలంబు గావించె; నవ్విధంబునం జనిచని గర్వాగ్రహ విధేయుం డగు రాధేయుం డమ్మద్రపతి కిట్లనియె.** 7

**ప్రతిపదార్థం:** నడపుము+అనుటయున్= సేనను నడిపించుమని అనగా; ఆ+మాటన్+కైకొని= దుర్యోధనుని మాటలు విని; కర్ణుండు, శల్యునిన్= శల్యుడితో; తేరు నడపుము+అనినన్= రథాన్ని నడిపించుమనగా; అతండు+అట్లు+అ చేసెన్= శల్యుడు ఆ ప్రకారమే చేశాడు; అప్పుడు; శంఖభేరీ ప్రముఖ= శంఖం, భేరి మొదలగు, తూర్యనాదంబులు= వాద్యధ్వనులు; రోదసీగహ్వరంబు= ఆకాశ ప్రాంతమును; విహ్వలంబు గావించెన్= భయభ్రాంతం చేశాయి; (ప్రతిధ్వనింపజేశాయి); ఆ విధంబునన్; చనిచని= ముందుకువెళ్ళి; గర్వ+ఆగ్రహ విధేయుండు+అగు= గర్వానికి కోపానికి వశుడైన; రాధేయుండు= కర్ణుడు; ఆ+మద్రపతికిన్= శల్యుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడి మాట ప్రకారం రథాన్ని ముందుకు నడిపించుమని కర్ణుడు శల్యుడిని కోరాడు. వెనువెంటనే శంఖాలు, భేరి మొదలైన యుద్ధవాద్యాల ధ్వనులు ఆకాశమంతటా మారుమ్రోగాయి. ఆ విధంగా ముందుకు సాగుతున్న కర్ణుడు గర్వంతో పాండవుల మీది కోపంతో శల్యుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఆ రోజుల్లో సైన్యాలు వాద్యఘోషల మధ్య యుద్ధానికి బయల్దేరుతుండేవి.

**శా.** **'నారాచాది మహోగ్ర బాణ పటలీ నానావిధోల్లాసముల్**
**సైరింపన్ ధృతిలేక పాండుతనయుల్ సంభ్రాంతి నొందంగ, వి**
**స్మేరంబై ఖచర వ్రజంబు వొగడన్, మెచ్చంగ నీ చూడ్కి దు**
**ర్వారో దగ్రత నేఁడు సూపెద భుజావష్టంభ సంరంభినై'.** 8

**ప్రతిపదార్థం:** నారాచ+ఆది= ఇనుప బాణాలు మొదలైన; మహా+ఉగ్రబాణ, పటలీ= మహాభయంకరాలైన బాణాల సమూహముయొక్క; నానావిధ+ఉల్లాసముల్= పెక్కు ప్రకాశములను; సైరింపన్, ధృతిలేక= సహించే ధైర్యంలేక; పాండు

తనయుల్= పాండవులు; సంభ్రాంతిన్+ఒందంగన్= నిశ్చేష్టులు కాగా; ఖచర, వ్రజంబు= దేవతలసమూహం; విస్మేరంబు+ఐ= నవ్వుతో కూడినదై; పొగడన్= ప్రశంసించగా; నీ, చూడ్కి, మెచ్చంగన్= నీ చూపు మెచ్చుకోగా; భుజ+అవష్టంభ సంరంభిన్+ఐ= బాహు గర్వంయొక్క ఆటోపం కలవాడినై; నేఁడు= ఈనాడు; దుర్వార+ఉదగ్రతన్= అడ్డుకొన సాధ్యంకాని భీకరత్వాన్ని; చూపెదన్= చూపిస్తాను.

**తాత్పర్యం:** పాండవులు (నేను ప్రయోగించే) మహాభయంకరాలైన నానావిధ బాణాల నానావిధ కాంతుల తాకిడిని తట్టుకోగల ధైర్యంలేక తల్లడిల్లగా, ఆశ్చర్యంతో ఆకాశ సంచారులంతా ప్రశంసించగా, నీవు కూడ చూచి మెచ్చుకోగా, బాహుబల గర్వాతిశయంతో ఎవ్వరూ అడ్డుకోలేని భీకరత్వాన్ని ఈ రోజు (యుద్ధరంగంలో) ప్రదర్శిస్తాను.

**సీ. అన విని మద్రరా జాతని కిట్లను, । 'సత్య పరాక్రముల్ శౌర్యఘనులు**
**భుజ వీర్య మహితులు భూరి తేజోధను । లఖిలాస్త్ర విత్తము లార్యు లమర**
**పతికైన రణమున భయము పుట్టింపంగ । నోపుదు రప్పాండుభూపతనయు,**
**లేల వారల నింత దూలవోఁ బలికెద, । విప్పుడు వల్క రాదెట్లు నీకు**

**తే. గాండివ జ్యా నినాదమ్ము గ్రమ్మి కర్ణ । విదళనము సేసినను భీము గద మెఱుంగు**
**లొలసి చూడ్కులు మిఱుమిట్లు గొలిపినను భ । యంబు పెల్లున నపుడు వా యడఁగుఁ గాక!' 9**

**ప్రతిపదార్థం:** అనన్+విని= (కర్ణుడు) అనగా విని; మద్రరాజు= శల్యుడు; అతనికిన్+ఇట్లు+అనున్= కర్ణునితో ఇట్లా అంటున్నాడు; ఆ+పాండు భూప తనయులు= ఆ పాండురాజు కుమారులు; సత్య పరాక్రముల్= సత్యశీలురు; శౌర్యఘనులు= శౌర్యంలో గొప్పవారు; భుజవీర్య మహితులు= గొప్ప భుజ బలశాలులు; భూరితేజోధనులు= గొప్ప తేజోధనం కలవారు; అఖిల+అస్త్రవిత్తముల్= సకలాస్త్రవిదులలో శ్రేష్ఠులు; ఆర్యులు= సజ్జనులు; అమరపతికైనన్= ఇంద్రుడికైనా; రణమునన్= యుద్ధమున; భయమున్ పుట్టింపంగన్+ఓపుదురు= భీతి కలిగించగలవారు; ఇప్పుడు, ఏల, వారలన్+ఇంత+తూలవోన్+పలికెదవు= ఇప్పుడు ఎందుకీవిధంగా వారిని తూలనాడుతున్నావు; గాండివజ్యానినాదమ్ము= అర్జునుడి వింటిత్రాటి ధ్వని; క్రమ్మి= ఆక్రమించి; కర్ణవిదళనము చేసినను= చెవులు బద్దలు చేసినపుడును; భీము గద మెఱుంగుల్+ఒలసి= భీముడి గదకాంతులు వ్యాపించి; చూడ్కులు మిఱుమిట్లు గొల్పినను= కనులకు మిరుమిట్లు గొలిపినపుడును; భయంబు పెల్లునన్= భయాతిశయంతో; అపుడు; వాయి అడఁగున్+కాక= నోరు పడిపోతుంది; ఎట్లు= ఏ విధంగా కూడా; నీకు; పల్కరాదు= మాట్లాడటం సాధ్యంకాదు;

**తాత్పర్యం:** కర్ణుడి అహంకారం చూచి శల్యుడు అతడితో ఇట్లా అంటున్నాడు. పాండవులు సత్యపరాక్రమం కలవారు, బలపరాక్రమ సంపన్నులు, తేజోధనులు, అస్త్ర విద్యా విశారదులు. దేవేంద్రుడైనా రణరంగంలో వారిని ఎదుర్కొనలేడు. వాళ్ళను ఇంత తక్కువ చేసి ఇప్పుడు మాట్లాడుతున్నావు. అర్జునుడి వింటి ధ్వనికి నీ చెవులు బద్దలైనపుడు, భీముడి గద మెరుపులు నీ కళ్ళకు మిరుమిట్లు గొల్పినపుడు నీ నోట మాటరాక నిశ్చేష్టుడవై ఏమీ అనలేవు.

**విశేషం:** 'కర్ణవిదళనము' అన్న పదంలో చెవులతోపాటు కర్ణుడు అన్న అర్థంకూడా స్ఫురిస్తుంది. వీనులు, కనులు నిశ్చేష్టమైనపుడు వాక్కు కూడా మూగబోతుంది.

**వ. అని వెండియు. 10**

**తాత్పర్యం:** అని మళ్ళీ.

**చ. 'నరుని శరంబులన్ రథ గణంబులు గూలఁగ, భీము నుల్లస**
**త్పరిఘమునన్ గజ వ్రజము భగ్నముగాఁ బెఱ తమ్ములున్ యుధి**
**ష్ఠిరుఁడును దాఁకినం జలము డించి దొరల్ గలఁగంగఁ జూచియుం**
**దిరమయి నీవు నాలుకకుఁ దెచ్చిన మాటగదా వినందగున్.' 11**

**ప్రతిపదార్థం:** నరుని శరంబులన్= అర్జునుడి బాణాలచేత; రథగణంబులు= రథ సమూహాలు, కూలఁగన్= పడిపోగా; భీము+ఉల్లసత్+పరిఘమునన్= భీముడి మెరిసే ఇనుపగట్ల గుదియతో; గజవ్రజము= ఏనుగుల గుంపు; భగ్నముకాన్= చెదరిపోగా; పెఱతమ్ములున్= మిగతా సోదరులు(నకుల సహదేవులు); యుధిష్ఠిరుఁడును= ధర్మరాజు; తాఁకినన్= మీదపడగా; చలముడించి= పట్టుదల వీడి; దొరల్= యోధులు; కలఁగంగన్= క్షోభచెందగా; చూచియున్= చూచికూడా; నీవు; తిరము+అయి= స్థిరంగా నిలబడి; నాలుకకున్+తెచ్చిన మాటకదా= మాట్లాడిన మాట గదా; వినన్+తగున్= వినతగును.

**తాత్పర్యం:** 'అర్జునుడి బాణాలకు నీ రథసైన్యం, భీముడి పరిఘాయుధం మెరుపులకు గజసైన్యం, ధర్మజ నకుల సహదేవుల తాకిడికి యోధసమూహం చెల్లాచెదరైపోవటాన్ని చూచికూడ, నీవు కలతపడకుండా స్థిరంగా నిలబడి మాట్లాడినమాటలు కదా వినదగును.'

**విశేషం:** ఉపప్లావ్యంలో ఉన్నప్పుడే ధర్మరాజు శల్యుడితో కర్ణుడికి సారథిగా ఉండి అతడిని నిరుత్సాహపరచి తమకు సహకరించవలసిందిగా కోరి ఒప్పించాడు. ఆ ప్రకారమే శల్యుడు కర్ణుడిముందు మాటిమాటికీ పాండవుల పరాక్రమాన్ని పొగడుతున్నాడు. శల్యుడిని సారథిగా కోరుకొని కర్ణుడు తన దురదృష్టాన్ని తానే కోరి తెచ్చుకొన్నాడు.

**క. అను పలుకులు వినియుం దా । వినని చెవులు సేసి, మద్రవిభుతో రాధా**
**తనయుఁడు 'నా చేతి బరువు । గనుఁగొనియెద విపుడ' యనియె గండ మరంగన్.' 12**

**ప్రతిపదార్థం:** అను, పలుకులు, వినియున్= అనే శల్యుడి మాటలు వినికూడా; రాధాతనయుఁడు= కర్ణుడు; తాన్= తాను; వినని చెవులు చేసి= విననట్లుగా నటిస్తూ; గండు+అమరంగన్= పౌరుషం ఒప్పగా; నా చేతి బరువు= నా చేతి బలుపు; ఇపుడ= ఇప్పుడే; కనుగొనియెదవు= చూస్తావు గదా; అనియె(న్)= అన్నాడు.

**తాత్పర్యం:** శల్యుడి మాటలు విన్నా విననట్లుగా నటిస్తూ కర్ణుడు, నా చేతి బలాన్ని ఇప్పుడే చూస్తా'వని పౌరుషంతో అన్నాడు.

**వ. ఇట్లు సంగరోత్సాహ దీప్తుండై నడతెంచు నతని నుపలక్షించి. 13**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; సంగర+ఉత్సాహదీప్తుండు+ఐ= రణోత్సాహంతో ప్రకాశిస్తున్నవాడై; నడతెంచు+అతనిన్= వస్తున్న కర్ణుడిని; ఉపలక్షించి= చూచి.

**తాత్పర్యం:** యుద్ధోత్సాహం చేత ప్రకాశిస్తూ వస్తున్న కర్ణుడిని చూచి.

**చ. కురుబల ముబ్బి యార్చెఁ, బటు ఘోటక హేషిత నిస్వనంబులుం**
**గరివర బృంహిత ధ్వనులు గాఢములై విలసిల్లె, నెత్తురుల్**
**గురిసె, నభంబు మ్రోయఁ బిడుగుల్ మొరసెం, బొరి నుల్క లెల్లెడం**
**దొరఁగెఁ బ్రదీప్త మారుతము ధూళిఁ గడున్ వడిఁ జల్లె భూవరా! 14**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; కురుబలము= కౌరవసైన్యం; ఉబ్బి+ఆర్చెన్= పెద్దగా సంతోషించి అరచింది; పటుఘోటక= బలిష్ఠమైన అశ్వాల; హేషిత నిస్వనంబులున్= సకిలింపుల ధ్వనులు; కరివర బృంహిత ధ్వనులు= శ్రేష్ఠాలైన ఏనుగుల ఘీంకార ధ్వనులు; గాఢములు+ఐ విలసిల్లెన్= దట్టములైనవై వ్యాపించాయి; నెత్తురుల్+కురిసె(న్)= రక్తధారలు కురిశాయి; నభంబు మ్రోయన్= ఆకాశం ధ్వనించగా; పిడుగుల్ మొరసెన్= పిడుగులు శబ్దం చేశాయి; పొరిన్= వెనువెంట; ఉల్కలు+ఎల్లెడన్+ తొరఁగెన్= అన్నివైపులా ఉల్కలు పడసాగాయి; ప్రదీప్త, మారుతము= తీవ్రమైన గాలి; కడున్ వడిన్= ఎంతో వేగంతో; ధూళిన్ చల్లె(న్)= దుమ్మును వెదజల్లింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కౌరవ సైన్యంలోని వారు సంతోషాతిశయంతో బిగ్గరగా అరిచారు. గుర్రాల సకిలింతలు, ఏనుగుల ఘీంకారాలు పెద్దగా వినిపించాయి. నెత్తురు కురిసింది. పిడుగుల మ్రోతలు ఆకాశం ధ్వనించేటట్లుగా మ్రోగాయి. అన్నివైపులా ఉల్కలు పడసాగాయి. తీవ్రమైన గాలి దుమ్మును వెదజల్లింది.

**వ. మఱియు బహువిధోత్పాతంబులు గౌరవులకు నాశం బగుటం దెలుపుచుం దోఁచెఁ; దోఁచిన నవి యెల్ల సరకు గొనక వారు దైవమోహితులు గావున శల్య సహితుండైన కర్ణుం గనుంగొని కుంతీనందను లతనిచే నిర్జింపఁ బడుదురకాఁ దలంచి సంతోషించి; రతండు భీష్మద్రోణుల దోర్వీర్యంబులు పాండుతనయులచేతఁ గోలుపోయె నని మనంబున వారల మెచ్చక ముంగలియై మెఱసి నడచుచుండి పార్థపరాక్రమ స్మరణంబునం గ్రోధంబు జనియించి యూర్పులు సందడింప మాన దర్పోన్మాదంబున మద్రపతి కిట్లనియె. 15**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; బహువిధ+ఉత్పాతంబులు= అనేకవిధాలైన అపశకునాలు; కౌరవులకున్; నాశంబు+అగుటన్= నష్టం కలగటాన్ని; తెలుపుచున్= సూచిస్తూ; తోఁచెన్= అగుపడ్డాయి; తోఁచినన్= అట్లా కనపడినప్పటికీ; వారు= ఆ కౌరవులు; దైవమోహితులు కావున(న్)= విధివంచితులవటంవలన; అవి+ఎల్లన్+సరకుగొనక= వాటిని అన్నిటినీ లెక్కపెట్టక; శల్యసహితుండైన కర్ణున్= శల్యుడితో ఉన్న కర్ణుడిని; కనుంగొని= చూచి; కుంతీ నందనులు= పాండవులు; అతనిచేతన్= కర్ణుడిచేత; నిర్జింపఁ బడుదురు+అ, కాన్= సంహరించబడగలరని; తలంచి= భావించి; సంతోషించిరి= ఆనందించారు; అతండు= కర్ణుడు; భీష్మద్రోణుల దోస్+వీర్యంబులు= భీష్మద్రోణుల బాహుబలములు; పాండుతనయులచేతన్= పాండవులచేత; కోలుపోయెన్+అని= వ్యర్థములైనాయని; మనంబునన్= మనసులో; వారలన్+మెచ్చక= వారిని లక్ష్యపెట్టక; ముంగలి+ఐ మెరసి= సేనకు ముందుగా ఒప్పుతూ; నడచుచుండి= నడుస్తూ; పార్థ పరాక్రమ స్మరణంబునన్= అర్జునుడి శౌర్యం తలపునకు రాగా; క్రోధంబు జనియించి= కోపం తలెత్తి; ఊర్పులు సందడింపన్= నిట్టూర్పులు అతిశయించగా; మానదర్ప+ఉన్మాదంబునన్= పౌరుష గర్వోన్మాదంతో; మద్రపతికిన్= శల్యుడితో; ఇట్లు+అనియె(న్)= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఇంకా కౌరవ వినాశ సూచకాలయిన అపశకునాలు పెక్కు గోచరించాయి. అయినా విధివశులైన కౌరవులు వాటిని లెక్కచేయక కర్ణుడు శల్యసారథ్యంతో పాండవులను తప్పక సంహరిస్తాడని సంతోషించసాగారు. సేనకు అగ్రభాగంలో ఉన్న కర్ణుడు, పాండవుల ముందు ఓడిపోయారని భీష్మద్రోణులను మెచ్చుకోక, అర్జునుడు తలపునకు రాగానే క్రోధంతో నిట్టూర్పులు విడుస్తూ పౌరుషగర్వం నిండినవాడై శల్యుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** ఉత్పాతాలు (అపశకునాలు) మూడు విధాలు-దివ్యం, ఆంతరిక్షం, భౌమం అని, 'ఉల్కలు, పిడుగులు పడటం' మొదలైనవి అంతరిక్ష సంబంధమైనవి. ఇవి దుఃఖకారకాలు అని పూర్వుల అభిప్రాయం.

**మ. 'అరదం బెక్కి శరాసనంబు గొని తెంపారంగ నేనేచి సం**
**గర సంక్రీడకుఁ జొచ్చినం దృణ సముంగాఁ గొందు, న ద్దేవతా**
**వరునైనన్ గురు నాపగాతనయుఁ జావం జూచుటన్ వైరు లే**
**తురు చెండాడెద నుగ్రతం దలలు, నా దోర్దర్పముం జూడుమీ!' 16**

**ప్రతిపదార్థం:** అరదంబు+ఎక్కి= రథం ఎక్కి; శర+అసనంబు(న్)+కొని= ధనుస్సు చేబట్టి; తెంపు+ఆరంగన్= ధైర్యంతో; ఏన్+ఏచి= నేను విజృంభించి; సంగర సంక్రీడకున్= యుద్ధక్రీడకు; చొచ్చినన్= పూనుకొంటే; ఆ+దేవతావరున్+ఐనన్= ఆ దేవేంద్రుని సైతం; తృణసముంగాన్+కొందున్= గడ్డిపరకతో సమంగా చూస్తాను; గురున్+ఆపగా తనయున్= ద్రోణ భీష్ములను; చావన్+చూచుటన్= పతనమొందించినందువల్ల; వైరులు= శత్రువులు; ఏతురు= విజృంభిస్తారు; తలలు= వారి తలలు; ఉగ్రతన్= భయంకరంగా; చెండాడెదన్= నరుకుతాను; నా దోః+దర్పమున్+చూడుమీ!= నా భుజపరాక్రమాన్ని చూడుము.

**తాత్పర్యం:** రథ మెక్కి విల్లు చేబట్టి రణరంగంలో నేను విజృంభిస్తే దేవేంద్రుడిని కూడా తృణీకరిస్తాను. ద్రోణాచార్య భీష్మపితామహులను పడగొట్టామన్న గర్వంతో ఉన్న వైరుల తలలు ఖండించే నా భుజపరాక్రమాన్ని చూడుము.

**వ. అని పలికి, యనంతరంబ 'గాంగేయ కుంభసంభవులంతటిమానుసులు నిట్లు రిత్తసావు సత్తురే!' యని యుగ్గడించి మఱియు నిట్లనియె. 17**

**ప్రతిపదార్థం:** అని పలికి; అనంతరంబు= తర్వాతనే; గాంగేయ కుంభ సంభవుల+అంతటి మానుసులన్= భీష్మ ద్రోణులంతటి వారు కూడా; ఇట్లు; రిత్తచావు చత్తురే?= వ్యర్థమరణం పొందుతారా?; అని+ఉగ్గడించి= అని వచించి; మఱియున్+ఇట్లు+ అనియెన్= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'భీష్మద్రోణులంతటివారు ఈ విధంగా వ్యర్థమైన చావు చస్తారా! అని, కర్ణుడు శల్యుడితో ఇంకా ఇట్లా అన్నాడు:

**ఉ. వారల లోకవీరుల నవధ్యుల గీటడఁగించి, పల్వురన్**
**వారల యట్ల యెందు ననివార్యు లనం జను మేదినీశులం**
**బోర వధించి, రౌద్రమునఁ బొంగి క్రమాగత మృత్యు వొక్కొ నాఁ**
**గా రణకేళికిం గడఁగు గాండివి నేన యెదిర్చి యోర్చెదన్. 18**

**ప్రతిపదార్థం:** లోకవీరులన్= గొప్పవీరులు; అవధ్యులన్= వధింప సాధ్యంకాని వారు అయిన; వారలన్= ఆ భీష్మద్రోణులను; గీటు+అడఁగించి= గర్వం అణచి; వారల+అట్ల= వారివలెనే; ఎందున్+అనివార్యులు+అనన్+చను= ఎవరిచేతకూడా వారించబడనివారు అనదగినట్టి; పల్వురన్, మేదినీశులన్= పెక్కుమంది రాజులను; పోరన్+వధించి= యుద్ధములో చంపి; రౌద్రమున(న్)+పొంగి= రౌద్రావేశంతో చెలరేగి; క్రమ+ఆగత, మృత్యువు+ఒక్కొ, నాన్+కా= వరుసగా వచ్చిన మృత్యువేమో అన్నట్లుగా; రణకేళికిన్+కడఁగు= యుద్ధక్రీడకు పూనుకొనే; గాండివిన్= అర్జునుడిని; ఏన= నేనే; ఎదిర్చి+ఓర్చెదన్= ఎదిరించి ఓడిస్తాను.

**తాత్పర్యం:** లోకైక వీరులైన భీష్మద్రోణులను, వారివలెనే అనివార్యులైన ఎందరో రాజులను వధించి రౌద్రంతో విజృంభించి వరుసగా వచ్చే మృత్యువా అన్నట్లు యుద్ధక్రీడకు పూనుకొనే అర్జునుడిని నేనే ఎదిరించి సంహరిస్తాను.

**విశేషం:** 'క్రమాగత మృత్యువొక్కొ' అని కర్ణుడు పేర్కొన్న అర్జునుడు తర్వాతి కథలో కర్ణుని పాలిటి మృత్యువుగా పరిణమించటం గమనించదగింది. అలం: ఉత్ప్రేక్ష.

**ఉ.** **పాండు నృపాగ్రనందనుఁడుఁ బావనియుం గవలుం జలంబుమై**
**నొండొరు మూదలించుకొని యొక్కటఁ దాఁకినఁ దీవ్ర విస్ఫుర**
**త్కాండ విదారితాంగకులఁ గా నొనరించి యలంచి లీలమై**
**గం డడఁగింతుఁ బోక పెనఁగం గల చంద మెఱింగి చెండుదున్.** **19**

**ప్రతిపదార్థం:** పాండునృప+అగ్రనందనుఁడున్= పాండు కుమారులలో పెద్దవాడైన ధర్మరాజు; పావనియున్= భీముడు; కవలున్= నకులసహదేవులు; చలంబుమైన్= పూనికతో; ఒండొరు మూదలించుకొని= ఒకరినొకరు హెచ్చరించుకొని; ఒక్కటన్+ తాఁకినన్= ఒక్కటై మీదబడినా; తీవ్ర విస్ఫురత్+కాండతీక్ష్ణమైన ప్రకాశంతో కూడిన బాణాలచేత; విదారిత+అంగకులన్+కాన్= చీల్చబడిన అవయవములు కలవారినిగా; ఒనరించి= చేసి; అలంచి= శ్రమపెట్టి; లీలమైన్= అవలీలగా; గండు+అడఁగింతున్= గర్వం అణచుతాను; పోక పెనఁగన్= యుద్ధ విముఖులు గాక నన్నెదురుకొన్నట్లయితే; కలచందము= ఉన్న విధాన్ని; ఎఱింగి= గ్రహించి; చెండుదున్= నరుకుతాను.

**తాత్పర్యం:** ధర్మరాజు, భీముడు, నకుల సహదేవులు ఒక్కటై మీదపడినా, వాడి బాణాలతో అవలీలగా వారి అంగాలను ఖండించి వారి గర్వం అణుస్తాను. వాళ్ళు వెనుదిరుగక ఇంకా నాతో యుద్ధం చేస్తే నరుకుతాను.

**విశేషం:** క్రిందటి పద్యంలోనే అర్జునుడిని ప్రస్తావించటం వలన, ఇక్కడ నలుగురు సోదరులనే పేర్కొనటం జరిగింది.

**క.** **అని పలికి వెండియును ని । ట్లను, భీష్ముఁడు దెగిన ద్రోణుఁ డతులిత దివ్యా**
**స్త్రనిచయము దోర్విలాసం । బును జాలం గలిగియుండె భూనుత మగుచున్.** **20**

**ప్రతిపదార్థం:** అని పలికి; వెండియున్= ఇంకా; ఇట్లు+అను(న్)= కర్ణుడు శల్యుడితో ఇట్లా అంటున్నాడు; భీష్ముడు+తెగిన= భీష్ముడు మరణించగా; ద్రోణుడు, అతులిత= సాటిలేని; దివ్య+అస్త్ర నిచయము= దివ్యాస్త్ర సమూహం; దోః+విలాసంబును= భుజబల శోభను; భూనుతము+అగుచున్= లోకంచే పొగడబడేది అవుతూ; చాలన్+కలిగి ఉండె(న్)= అధికంగా కలిగిఉన్నాడు.

**తాత్పర్యం:** అని పలికి కర్ణుడు శల్యుడితో ఇంకా ఇట్లా అన్నాడు: 'వీరుడైన భీష్మ పితామహుడు అస్తమించినా, ద్రోణాచార్యుడివద్ద లోకం పొగడే దివ్యాస్త్రాలూ, బాహుబలమూ ఉన్నాయి.

**సీ.** **ద్రోణుండు బహుదివ్య బాణదీప్తుఁడు భుజా । బలశాలి శౌర్య సంపన్న హృదయుఁ**
**డక్షీణ విక్రముఁ డతిరథ శ్రేష్ఠుఁ; డ । వ్వీరుండు పార్థుచేఁ బోరఁ బడిన**
**ధార్తరాష్ట్రుల యేపు దఱిఁగెఁ; దదాప్త సై । నికులు గం డడఁగిరి; నీ వెఱుంగ**
**నైనను రాము కృపాతిశయంబునఁ । గనిన యీ రథమును గార్ముకాది**

ఆ. దారుణాస్త్ర శస్త్ర తతులును గలిమి నే। నతనిఁ దొడరి దివిజు లడ్డపడినఁ
గూల్తు, నెల్లభంగిఁ గురురాజు మన్నన। యప్పు దీర్తుఁ బ్రాణ మాసపడక.' 21

**ప్రతిపదార్థం:** ద్రోణుండు= ద్రోణుడు; బహుదివ్య బాణ దీప్తుఁడు= అనేక దివ్యబాణాలచేత ప్రకాశించేవాడు; భుజాబలశాలి= గొప్ప భుజబలం గలవాడు; శౌర్యసంపన్న హృదయుఁడు= పరాక్రమధనుడు; అక్షీణ విక్రముఁడు= అధిక బలవంతుడు; అతిరథశ్రేష్ఠుఁడు= అతిరథులలో శ్రేష్ఠుడు - అతిరథశ్రేష్ఠుడన్న స్థాయి కలవాడు; ఆ+వీరుండు= అట్టి ద్రోణాచార్యుడు; పార్థుచేన్= అర్జునుడి చేత; పోరన్+పడినన్= యుద్ధములో మరణించగా; ధార్తరాష్ట్రుల= కౌరవుల; ఏపు+తరిగెన్= విజృంభణం తగ్గింది; నీవు+ఎఱుంగన్= నీవు చూచినట్లుగానే; తద్+ఆప్తసైనికులు= వారి ఆప్తులైన సైనికులు; గండు+అడఁగిరి= నశించారు; అయినను= అయినప్పటికీ; రాము= పరశురాముని; కృపా+అతిశయంబునన్= అనుగ్రహ విశేషంతో; కనిన= పొందిన; ఈ రథమును= ఈ రథాన్ని; కార్ముక+ఆది= ధనుస్సు మొదలైన; దారుణ+అస్త్రశస్త్ర తతులును= శత్రుభయంకరములైన అస్త్ర శస్త్రాల సముదాయాలను; కలిమిన్= కలిగి ఉండటంచేత; నేను= నేను; అతనిన్+తొడరి= అర్జునుడిని తాకి; దివిజులు+అడ్డపడినన్= దేవతలు అడ్డువచ్చినా; ఎల్లభంగిన్= ఏ విధంగానైనా; కూల్తున్= సంహరిస్తాను; ప్రాణము+ఆసపడక= ప్రాణంకూడా లెక్కచేయక; కురురాజు= దుర్యోధనుడి; మన్నన+అప్పు+తీర్తున్= సమ్మానము అనే ఋణాన్ని తీర్చుకొంటాను.

**తాత్పర్యం:** ద్రోణాచార్యుడు దివ్యబాణసంపన్నుడు. గొప్ప పరాక్రమవంతుడు. అతిరథశ్రేష్ఠుడు. అంతటి మహావీరుడు అర్జునుడితో యుద్ధంలో మరణించగా కౌరవుల ధైర్యం సన్నగిల్లింది. సైనికుల గర్వం అంతరించింది. అయినా పరశురాముడిని సేవించి పొందిన రథం, అస్త్రశస్త్రాల బలంతో ఏ విధంగానైనా అర్జునుడిని సంహరించి తీరుతాను. నా ప్రాణం కూడా లెక్కచేయక, దుర్యోధనుడు నన్ను సమ్మానించినందుకు ఋణం తీర్చుకొంటాను.'

**విశేషం:** అనేకమందితో యుద్ధం చేసేవాడు అతిరథుడు. భీష్ముడి దృష్టిలో దుర్యోధనుడు, శల్యుడు, ద్రోణుడు మొ॥ వారు అతిరథులు, కర్ణుడు తాను బ్రాహ్మణుడనని చెప్పి పరశురాముడి వద్ద శిక్షణ పొంది బ్రహ్మాస్త్ర భార్గవాస్త్రాలను సంపాదించాడు.

### శల్యుఁ డర్జును పరాక్రమం బుగ్గడించి కర్ణునిఁ దూలం బలుకుట (సం. 8-26-61)

వ. అనిన విని శల్యుండు గర్ణున కి ట్లనియె. 22

**తాత్పర్యం:** అని కర్ణుడనగా, శల్యుడు ఇట్లా అన్నాడు:

చ. 'వినిన జనంబు లీతఁ డవివేకి యనన్ వల దింత రజ్జు ల
ర్జును బలశౌర్య సంపదలు సూచి యెఱుంగమె మున్ను? నిన్ను నా
తనిఁ గలనన్ జగం బెఱుఁగదా యతఁ డద్భుత విక్రమోజ్జ్వలుం
డెనయుదె నీవు పౌరుషవిహీనుఁడ వద్దివిజేంద్రనందనున్. 23

**ప్రతిపదార్థం:** వినిన జనంబుల్= (నీమాటలు) విన్న ప్రజలు; ఈతడు+అవివేకి+అనన్= కర్ణుడు మూర్ఖుడని అనగా; ఇంతరజ్జులు వలదు= ఇంతటి వ్యర్థమైన మాటలు పలుకకుము; అర్జును, బల, శౌర్య, సంపదలు= అర్జునుడి బలపరాక్రమ సంపదలు; మున్ను= ఇంతకుముందు; చూచి+ఎఱుంగమె= చూసినవారం కాదా; నిన్నున్+ఆతనిన్= నిన్ను, అతడినీ; కలనన్= రణములో; జగంబు+ఎఱుఁగదా= లోకం చూచి ఎరుగదా; అతడు+అద్భుత+విక్రమ+ఉజ్జ్వలుండు= అర్జునుడు

అద్భుత పరాక్రమంచేత లెస్సగా ప్రకాశించేవాడు; నీవు, పౌరుషవిహీనుఁడవు= మగటిమి లేనివాడవు; ఆ+దివిజ+ఇంద్రనందనున్= దేవేంద్ర తనయుడైన ఆ విజయుడికి; ఎనయుదె!= సాటి కాగలవా!

**తాత్పర్యం:** విన్న జనం కర్ణుడింత అవివేకియా! అనేటట్లు ఇంత వ్యర్థమైన మాటలు మాట్లాడవద్దు. అర్జునుని బలపరాక్రమ సంపదలు ఇంతకుముందు చూచాముకదా! మీ ఇద్దరిని లోకం కూడ యుద్ధంలో చూచింది కదా! అర్జునుడు అద్భుత పరాక్రమంచేత ప్రకాశించేవాడు. పౌరుషహీనుడవైన నీవు ఆ దేవేంద్రనందనునకు సాటికాగలవా?

**సీ. రాత్రిమైఁ దాఁకి క్రూరతఁ బోర మగఁటిమి । వాసిన అంగారపర్ణుకంటె,**
**ఘోషయాత్రా విధిఁ గురురాజుఁ జెఱ పట్టి । మాన మేదిన చిత్రసేనుకంటె,**
**ఖాండవోద్యానంబుఁ గావ నేరక సిగ్గు । వడి చన్న నిర్జరప్రభునికంటెఁ,**
**గ్రీడాకిరాతుఁ డై క్రోడంబునకుఁ గాఁగఁ । బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె**

**ఆ. నెక్కు డైన వీరుఁ; డే నర్జునునితోడఁ । బొడుతు నొడుతు ననినఁ బోలుఁ గాక;**
**వినుము సూతతనయ! మనబోఁటు లాతనిఁ । జెఱుతు మనుట నోరిచేటు గాదె?** **24**

**ప్రతిపదార్థం:** సూత తనయ!= కర్ణా!; రాత్రిమైన్+తాకి= రాత్రి సమయంలో ఎదుర్కొని; క్రూరతన్+పోరి= ఘోరంగా యుద్ధంచేసి; మగఁటిమి పాసిన= పౌరుషం కోల్పోయిన; అంగారపర్ణుకంటెన్= అంగారపర్ణుడి కన్న; ఘోషయాత్రావిధిన్= ఘోషయాత్రా సంఘటనలో; కురురాజున్+చెఱపట్టి= దుర్యోధనుడిని బంధించి; మానము+ఏదిన చిత్రసేనునికంటెన్= గర్వాన్ని కోల్పోయిన చిత్రసేనుడి కన్న; ఖాండవ+ఉద్యానంబున్= ఖాండవవనాన్ని; కావ నేరక= రక్షించలేక; సిగ్గుపడిచన్న= సిగ్గుతో మరలిన; నిర్జర ప్రభునికంటెన్= దేవేంద్రుడికన్న; క్రీడాకిరాతుడై= వేటగాని వేషం ధరించి; క్రోడంబునకున్+కాఁగన్= పందికొరకు; పెనఁగి,చిక్కిన= పోరి ప్రక్కకు తొలగిన; త్రిలోచనునికంటెన్= శివుడికన్న; ఎక్కుడు+ఐన వీరుడేన్= మించిన వీరుడైతే; అర్జుననితోడన్= పార్థుడితో; పొడుతున్= పోరుతాను; ఒడుతున్= ఓడిస్తాను; అనినన్+పోలున్+కాక= అంటే చెల్లుతుంది కాని; మనబోటులు= మనవంటి సామాన్యులు; ఆతనిన్+చెఱుతుము+అనుట= అర్జునుడిని రూపుమాపుతామనటం; నోరిచేటు కాదె?= మననోటికే నష్టం కదా!;

**తాత్పర్యం:** రాత్రి సమయంలో పోరు సలిపి ఓడిపోయిన అంగారపర్ణుడి కన్నా, ఘోషయాత్రలో దుర్యోధనుడిని బంధించి భంగపడిన చిత్రసేనుడి కన్నా, ఖాండవవనాన్ని రక్షించలేక పారిపోయిన ఇంద్రుడికన్నా, వరాహం కోసం పోరాడి తప్పుకొన్న శివుడికన్నా మించిన వీరుడైతే అర్జునుడితో పోరుతాను, అతడిని ఓడిస్తాను అంటే సరిపోతుందిగాని, సూతనందనా! మనలాంటివారు అతడిని సంహరిస్తాననటం నోటి చేటే కదా.

**విశేషం:** అంగారపర్ణుడు కుబేరుడి మిత్రుడైన గంధర్వుడు, పాండవులు ద్రుపదుడి నగరం ప్రవేశిస్తున్న సందర్భంలో రాత్రిపూట తన అడవిలో చొరబడ్డారని ఆటంకపరచి అర్జునుడి చేతిలో ఓడిపోయాడు. ద్వైతవనంలో ఉన్న పాండవులను అవమానిద్దామన్న దురుద్దేశంతో ఘోషయాత్రకు వచ్చిన దుర్యోధనుడిని బంధించిన చిత్రసేనుడిని, భీమార్జునులు ఓడించి, అతడిని విడిపించారు. అగ్నిదేవుడి ఆహుతికి గురి అయిన ఖాండవవనాన్ని రక్షించాలని వచ్చిన ఇంద్రుడు అర్జునుడి ధాటికి తట్టుకొనలేక వెనుతిరిగాడు. పాశుపతాస్త్రం కొరకు తపస్సు చేస్తున్న అర్జునుడిని పరీక్షించాలని కిరాతరూపంలో వచ్చిన పరమశివుడు అతడి భుజబలాన్ని చూచి యుద్ధంనుండి తప్పుకొన్నాడు. 'నోరిచేటు' చక్కని జాతీయం. సూతనందనా! అనటం శల్యుడు కర్ణుడిని కించపరచటమే?

**చ. నృపుఁడును భీష్మఁడుం గృపుఁడు నీవు గురుండును దత్సుతుండు ను**
**గ్రపు బలమేచి తో నడవఁగా బెనుదాడిగఁ బోయి మత్స్య నా**
**థుపసులఁ బట్టి యద్దొరలతోఁ జెడి పాఱితి కర్ణ! యప్డు క**
**య్యపు బలుపాడె, డిప్డు మన యర్జును నమ్ములు ద్రుప్పు వట్టెనే? 25**

**ప్రతిపదార్థం:** కర్ణ!= ఓ రాధేయా!; అప్డు= అప్పుడు; నృపుఁడును= దుర్యోధనుడును; భీష్ముఁడున్, కృపుఁడు, నీవున్; గురుండును= ద్రోణాచార్యుడును; తద్+సుతుండున్= అతడిపుత్రుడు అశ్వత్థామయు; ఉగ్రపుబలము+ఏచి= భయంకరమైన సైన్యము విజృంభించి, తోఁ(న్) నడవఁగాన్= వెంబడి+రాగా; పెనుదాడిగన్+పోయి= పెద్ద దండయాత్రగా వెళ్ళి; మత్స్యనాథు పసులన్+ పట్టి= మత్స్యదేశపు రాజు విరాటుడి పశువులను బంధించి; ఆ+దొరలతోన్= ఆ వీరులతో; చెడిపాఱితి(వి)= ఓడి పారిపోయావు; ఇప్డు= ఈనాడు; కయ్యపు బలుపు+ఆడెదు= యుద్ధోత్సాహపు మాటలు పలుకుతున్నావు; మన అర్జును+అమ్ములు= మన అర్జునుడి బాణాలు; త్రుప్పు పట్టెనే?= చిలుం పట్టాయా?

**తాత్పర్యం:** దుర్యోధనుడు, భీష్ముడు, కృపుడు, నీవు, ద్రోణాచార్యుడు, అశ్వత్థామ-విజృంభించిన భయంకర సైన్యం వెంటరాగా, పెద్ద దండయాత్రగా వెళ్ళి, విరాటరాజు పశువులను పట్టి, అర్జుననిచేత ఆ ప్రముఖ వీరులతో సహా ఓడి పారిపోయావు కదా కర్ణా! ఇప్పుడు ఇలా యుద్ధోత్సాహపు మాటలు మాట్లాడుతున్నావు. అర్జునుడి బాణాలు త్రుప్పుపట్టాయా? (లేదు కదా).

**ఉ. ముందరియట్లు గాదు, జనముల్ దెగడన్ వెఱఁ బాఱ నేఁడు సం**
**క్రందనసూతి మార్కొని తిరంబయి పోరెద, దాఁపఁ బ్రాణముల్,**
**నిందకుఁ జాల నింక నను నిక్కపుఁబల్కులు పల్కు టొప్పు; దా**
**నం దుదిఁ జచ్చినం జను; మొనన్ నరుఁ దాఁకుట రిత్త వోవునే?' 26**

**ప్రతిపదార్థం:** జనముల్ తెగడన్= లోకులు నిందించగా; వెఱన్+పాఱన్= భయంతో పారిపోవటానికి; ముందరి అట్లు కాదు= మునుపటి వలె కాదు; నేఁడు= ఈ రోజు; సంక్రందన సూతిన్= ఇంద్రతనయుడైన అర్జునుడిని; మార్కొని= ఎదిరించి; తిరంబు+అయి పోరెద= స్థిరంగా యుద్ధం చేస్తాను; ప్రాణముల్, దాఁపన్= ప్రాణాలు దాచకుండా పోరాడుతాను; నిందకున్, చాలన్+ఇంకన్= ఇక నిందలు భరించలేను; అను, నిక్కపున్, పల్కులు= అన్న నిజమైన మాటలు; పల్కుట+ఒప్పున్= పలకటం తగును; దానన్+తుదిన్= అపుడు చివరకు; చచ్చినన్+చనున్= చనిపోయినా తగును; మొనన్, నరున్+తాఁకుట= యుద్ధరంగంలో అర్జునుడిని ఎదిరించటం; రిత్తపోవునే?= వ్యర్థమగునా?

**తాత్పర్యం:** ఇంతకుముందువలె లోకులనిందకు గురి అయి పారిపోవటం కుదరదు. ప్రాణాలకు తెగించి అయినా అర్జునుడితో పోరాడతానని వచించావు. ఈ అపనిందలకన్నా రణరంగంలో మరణమైనా మేలన్నావు. అవి నిజాలే కావచ్చును. దానివలన చివరకు పోరులో చచ్చినా నీవన్నమాటే నిలుపుకొన్నట్లు ఔతుంది. కాకపోతే అర్జునుడితో తలపడటం అంటే ఊరికే పోతుందా?'

**వ. అనవుడు నలుక వొడమిన నడంచికొని రాధేయుండు మద్రపతి కి ట్లనియె. 27**

**ప్రతిపదార్థం:** అనవుడున్= (శల్యుడు) ఆ విధంగా పలుకగా; అలుక పొడమినన్= ఆగ్రహం కలిగినా; అడంచికొని= అణచిపెట్టికొని; రాధేయుండు= కర్ణుడు; మద్రపతికిన్+ఇట్లు+అనియెన్= శల్యుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** శల్యుడి మాటలవల్ల కలిగిన కోపాన్ని అణచుకొని కర్ణుడు, అతడితో ఇట్లా అంటున్నాడు:

**చ.** **'నరునకుఁ బూని పల్కితి వినం జవిమాలిన దొడ్డ పల్కు లే**
**నరగలి లేక బెట్టడరినప్పుడు సూడుము నన్ను నాతనిం**
**దిరమయి బాహు శక్తియును ధీరతయున్ వెరవుం జలంబు నె**
**వ్వరిదెసఁ గాంచి తెక్కుడుగ వారి నుతింపుము మాను మంతకున్.'** **28**

**ప్రతిపదార్థం:** వినన్+చవిమాలిన= చెవులకు రుచించని; దొడ్డపల్కులు= పెద్దమాటలు; నరునకున్+పూనిపల్కితి(వి)= అర్జునుడి పక్షం వహించి పలికావు; ఏన్+అరగలి లేక= నేను ఎట్టి సందేహమూ లేక; బెట్టు+అడరిన+అప్పుడు= మిక్కిలి విజృంభించినప్పుడు; నన్నున్+ఆతనిన్= నన్ను, పార్థుడిని; చూడుము= చూడు; బాహు శక్తియును= భుజబలం; ధీరతయున్= ధైర్యం; వెరవున్= ఉపాయం; చలంబున్= పూనిక; తిరము+అయి= స్థిరమై; ఎవ్వరిదెసన్= ఎవరియందు; ఎక్కుడుగ కాంచితి(వి)= అధికంగా చూస్తావో; వారి నుతింపుము= అతడిని ప్రశంసించుము; మానుము+అంతకున్= అంతవరకు ఊరుకొమ్ము.

**తాత్పర్యం:** అర్జునుడి పక్షం వహించి వినటానికి రుచించని పెద్ద పెద్ద మాటలు మాట్లాడావు. సందేహానికి తావులేకుండ లెస్సగ విజృంభించినప్పుడు నన్ను, అర్జునుని చూడు. బాహుబలం, ధైర్యం, ఉపాయం, పట్టుదల ఎవరిలో స్థిరంగా, ఎక్కువగా అగుపిస్తాయో వారిని పొగడు. అంతదాకా మాట్లాడకు.

**విశేషం:** 'నిన్ను నాతని గలనన్ జగంబెఱుఁగదా' అన్న శల్యుడి మాటలకు (23వపద్యం) 'చూడుము నన్ను నాతనిన్' అన్న వాక్కులు సమాధానంగా ఉన్నాయి.

**వ.** **అనుటయు 'నట్ల చేసెద నని పలికి శల్యుం డూరకుండెఁ, 'దేరుపో ని' మ్మని రాధేయుండు దఱిమి పలికిన నమ్మద్రేశ్వరుండును దురంగంబుల సత్వరంబుగా నడపె, నివ్విధంబునం జని మనమొన సొచ్చి సైనికులు సంతసిల్ల వారలం గలయం గనుంగొని కర్ణుం డిట్లనియె.** **29**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; శల్యుండు; అట్ల, చేసెదన్, అని= అట్లాగే చేస్తానని; ఊరకుండెన్= మాట్లాడకుండెను; రాధేయుండు= కర్ణుడు; తేరుపోనిమ్ము అని; తఱిమి, పలికినన్= తొందరపెట్టగా; ఆ మద్రేశ్వరుండును= శల్యుడు; తురంగంబులన్= అశ్వాలను; సత్వరంబుగాన్ నడపెన్= త్వరగా నడిపాడు; కర్ణుండు; ఈ, విధంబునన్, చని= ఈ విధంగా ముందుకువెళ్ళి; మన మొన చొచ్చి= మన సైన్యం చేరి; సైనికులు, సంతసిల్లన్= సంతోషించగా; వారలన్ కలయన్ కనుంగొని= వారందరిని చూచి; ఇట్లు, అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అని కర్ణుడనగా శల్యుడు అట్లాగే చేస్తానని ఊరకున్నాడు. కర్ణుడు తేరుపోనిమ్మని త్వరపెట్టగా, శల్యుడు గుర్రాలను వేగంగా నడిపాడు. కర్ణుడు మన సైన్యాన్ని చేరుకొని, కలయచూచి సైనికులు సంతోషించేటట్లుగా ఇట్లా అన్నాడు.

**సీ.** **వలను శోభిల్ల నెవ్వాఁ డైన వీఁడె య । ర్జునుఁ డని నా కిప్డు సూపెనేనిఁ**
**బసదనం బేనిచ్చు భంగి యందఱకును । వివరించి చెప్పెద వినుఁడు మీరు**
**వొగడంగఁ దగు రథ్యముల తోడి సౌవర్ణ । రథములు వలసిన, రయము లావుఁ**
**బొలుపును గలుగు కాంభోజ హయంబుల । వలసినఁ, బేర్చు సత్త్వంబునందుఁ**

**తే. బరిణతములగు సుందర కరివరముల । వలసినను, జారులావణ్యవతుల వలసి**
**నను, మహాగ్రామములు వలసినను, గోర్కి । కెక్కు డమ్మేటి మగని కే నిచ్చువాఁడ. 30**

**ప్రతిపదార్థం:** వలను శోభిల్లన్= నేర్పు మెరయగా; ఎవ్వాఁడు+ఐనన్= ఎవరైనా; వీడె అర్జునుఁడు అని= ఇతడే అర్జునుడని; నాకు ఇప్డు చూపెనేనిన్= నాకు ఇప్పుడు చూపితే; ఏను= నేను; పసదనంబు, ఇచ్చు, భంగి= కానుక ఇచ్చే విధం; అందరకును; వివరించి చెప్పెదన్; మీరు వినుఁడు; పొగడంగన్+తగు, రథ్యములతోడి= కొనియాడదగిన గుఱ్ఱాలతో కూడిన; సౌవర్ణ, రథములు, వలసినన్= బంగారు రథాలు కావాలన్నా; రయము, లావు, పొలుపును గలుగు= వేగం; బలం, అందం కలిగిన; కాంభోజహయంబుల వలసినన్= కాంభోజదేశపు అశ్వాలను కోరినా; పేర్చు, సత్త్వంబునందు, పరిణతములు+అగు= అధికశక్తితో ఒప్పు; సుందర, కరివరముల, వలసినను= అందమైన ఏనుగుల కోరినను; చారు, లావణ్య వతుల, వలసినను= అందమైన సుందరీమణులను కోరినా; మహాగ్రామములు, వలసినను= పెద్దఊళ్ళు కావాలన్నా; కోర్కికిన్ ఎక్కుడు= కోరిన వాటికంటే ఎక్కువగా; ఆ మేటిమగనికిన్= ఆ గొప్ప వీరునికి; ఏన్, ఇచ్చువాఁడన్= నేను ఇస్తాను.

**తాత్పర్యం:** ఎవరైనా నాకు అర్జునుడిని చూపించగలిగితే వారు కోరిన కానుకలు ఇవ్వగలను. అశ్వశ్రేష్ఠములతో కట్టబడిన బంగారు రథాలైనా, బలం, వేగం, అందం కలిగిన గుఱ్ఱాలైనా, శక్తిమంతములైన గజశ్రేష్ఠములైనా, అందగత్తెలైన స్త్రీలైనా, పెద్ద గ్రామాలైనా, కోరిన వాటికంటే ఎక్కువగా వారికి ఇస్తాను.

**క. మఱి యొక్కటి సెప్పెద, ని । ద్దఱు కృష్ణులఁ జంపి వారి ధనములు నా కి**
**త్తఱిఁ దద్రథ మిదియే యని । యెఱిఁగించిన యతని కిత్తు నేను ముదమునన్.' 31**

**ప్రతిపదార్థం:** మరి, ఒక్కటి, చెప్పెదన్= ఇంకొక సంగతి చెప్తున్నాను; నాకు+ఈ+తఱిన్= నాకు ఈ సమయంలో; తద్+ రథము+ఇదియే అని= ఆ(అర్జునుని) రథము ఇదేనని; ఎఱిఁగించిన అతనికిన్= తెలిపినవానికి; నేను, ఇద్దరు కృష్ణులన్= కృష్ణార్జునులను; చంపి; వారి ధనములు= వారి సంపద; ముదమునన్, ఇచ్చుదున్= సంతోషంతో ఇస్తాను.

**తాత్పర్యం:** అంతేకాదు- అర్జునుని రథాన్ని గుర్తించి నాకు తెలిపిన వారికి కృష్ణార్జునులను చంపి వారి ధనం అంతా సంతోషంతో ఇస్తాను.

**విశేషం:** భారతంలో కృష్ణుడు, అర్జునుడు, వ్యాసుడు, ద్రౌపది (కృష్ణ) నల్లనివారుగా చెప్పబడ్డారు. విరాటపర్వంలో అర్జున నామానికి తెల్లనివాడని అర్థం ఉన్నా మిగిలిన చోట్ల నీలోత్పలవర్ణుడుగానే పేర్కొనబడ్డాడు. పై పద్యంలో అర్జునుడిని తెలిపినవారికి, ప్రస్తుత పద్యంలో అతడి రథాన్ని చూపినవారికి కానుకలు చెప్పబడ్డాయి.

**వ. అని పలికి శంఖం బొత్తిన దుర్యోధనుం డనుజ సహితంబుగాఁ బ్రమోదంబు నొందె; నప్పుడు నిస్సాణాది తూర్య నిస్వనంబులు దిక్కులం బిక్కటిల్లె; మన యోధవరులును వరూథినియు నుబ్బునఁ బేర్చి యార్చిన నినదంబులు నింగిముట్టె; నయ్యెడఁ బ్రహాసభాసుర ముఖుండై మద్రవిభుండు రాధేయున కి ట్లనియె. 32**

**ప్రతిపదార్థం:** అని పలికి శంఖంబు ఒత్తినన్= అని కర్ణుడు శంఖం పూదగా; దుర్యోధనుండు, అనుజసహితంబుగాన్= సోదరులతో సహా; ప్రమోదంబును+ఒందెన్= ఆనందించాడు; అప్పుడు; నిస్సాణ+ఆది, తూర్య, నిస్వనంబులు= చర్మవాద్యం మున్నగు వాద్యాల ధ్వనులు; దిక్కులన్+పిక్కటిల్లెన్= అన్ని దిశలలో మారుమ్రోగాయి; మన యోధవరులును, వరూథినియును=

మనవీరశ్రేష్ఠులు, సైన్యం; ఉబ్బునన్, పేర్చి, ఆర్చినన్= గర్వంతో పెద్దగా అరువగా; నినదంబులు= ఆ ధ్వనులు; నింగిముట్టెన్= ఆకాశాన్ని అంటాయి; ఆ+ఎడన్= అప్పుడు; మద్రవిభుండు= శల్యుడు; ప్రహాస, భాసుర, ముఖుండు+ఐ= నగుమోము కలవాడు+ఐ; రాధేయునకున్, ఇట్లు, అనియెన్= కర్ణుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** కర్ణుడు ఆ విధంగా పలికి శంఖం ఊదగా సోదర సహితుడైన దుర్యోధనుడు ఆనందించాడు, యుద్ధవాద్యాలు దిక్కులు బ్రద్దలయ్యేటట్లుగ మారుమ్రోగాయి, మన సైనికులు ఉత్సాహంతో బిగ్గరగా అరిచిన అరుపులు ఆకాశాన్ని అంటాయి. అప్పుడు శల్యుడు నవ్వుమొగంతో కర్ణుడితో ఇట్లా అంటున్నాడు:

**ఉ. 'ఎవ్వరు సూప నేల?, నరు నిప్పుడ కాంచెదు; రిత్త వారికిం**
**గ్రొవ్వున నుజ్జ్వలార్థములు గొండని యీ వల; దిట్టు లిచ్చినన్**
**నవ్వు జనంబు, మిక్కిలి ధనంబులు గల్గినఁ జేయరాదె నీ**
**కెవ్విధి నైన సద్వ్యయము, లెందు నపాత్రపు టీవి యొప్పునే?' 33**

**ప్రతిపదార్థం:** నరున్ ఎవ్వరు చూపన్ ఏల?= అర్జునుడిని ఎవ్వరో చూపటం ఎందుకు?; ఇప్పుడ కాంచెదు= ఇప్పుడే చూస్తావు; రిత్తవారికిన్= పనికిమాలినవారికి; క్రొవ్వునన్= గర్వంతో; ఉజ్జ్వల+అర్థములు= గొప్పసంపదలు; కొండు+అని= తీసికొనండని చెప్పి; ఈవలదు= ఇవ్వవద్దు; ఇట్టులు+ఇచ్చినన్= ఇట్లు ఇస్తే; జనంబు నవ్వు(న్)= చూసేవారు నవ్వుతారు; నీకున్= నీ దగ్గర; మిక్కిలి ధనంబులు కల్గినన్= ఎక్కువ సంపదలు ఉంటే; ఏ విధిన్+ఐనన్= ఏ విధంగానైనా; సత్+వ్యయముల్= సద్వినియోగము చేయరాదె!= చేయవచ్చుగదా!; ఎందున్= ఎక్కడైనా; అపాత్రపు+ఈవి= అపాత్రదానం; ఒప్పునే?= తగునా?

**తాత్పర్యం:** ఎవరో చూపటం ఎందుకు? అర్జునుణ్ణి ఇప్పుడే చూస్తావు. తీసుకోండని పనికిమాలిన వాళ్ళకు అధిక సంపదలు గర్వించి ఇవ్వవద్దు. ఇట్లా ఇస్తే జనం నవ్వుతారు. అంత ఎక్కువగా సంపదలు ఉంటే సద్వినియోగం చేయవచ్చుగదా: అయోగ్యులకు దానం ఇవ్వటం తగునా?

**వ. అని యంత నిలువక. 34**

**తాత్పర్యం:** అని అంతటితో ఆగకుండా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కొలఁది యెఱుంగక కృష్ణులఁ। గలన గెలుతు ననియె దీవు, గంటిమె సింగం**
**బుల నెత్తఱి నైనను నే। పొలమున నేనియును నక్క పోరి గెలువఁగన్. 35**

**ప్రతిపదార్థం:** కొలఁది ఎఱుంగక= నీ శక్తి తెలిసికొనకుండా; ఈవు= నీవు; కలనన్= యుద్ధంలో; కృష్ణులన్= కృష్ణార్జునులను; గెలుతున్+అనియెదు= గెలుస్తానంటున్నావు; ఏతఱిన్+ఐనను= ఎప్పుడైనా; ఏ పొలమునన్+ఏనియును= ఏ ప్రదేశంలోనైనా; ఎక్కడైనా; నక్క; పోరి= పోరాడి; సింగంబులన్= సింహాలను; గెలువఁగన్ కంటిమె?= గెలువటం చూచామా?

**తాత్పర్యం:** నీశక్తి ఏమిటో తెలుసుకోకుండా కృష్ణార్జునులను జయిస్తానని పలుకుతున్నావు. నక్క ఎప్పుడైనా, ఎక్కడైనా సింహాలతో పోరి గెలవటం చూచామా?

**ఉ. అగ్గి సొరం దలంచునటు లర్జును నెక్కటి దాఁకఁ గోర్కి నీ**
**కెగ్గిది మాను; మీ పలుకు లెవ్వరుఁ జెప్పఁగ లేరు; రూపఱ**
**న్ర్రగ్గఁగఁ గాలమయ్యె నొకొ! నా వచనంబు లొకింత కర్ణము**
**ల్దగ్గర నిచ్చి యోధులు బలంబులుఁ దోడుగఁ బోరు టొప్పగున్. 36**

**ప్రతిపదార్థం:** అగ్గి= నిప్పులో; చొరన్+తలంచునటులు= దూకాలని అనుకొన్నట్లుగ; అర్జునున్= అర్జునుడిని; ఎక్కటితాఁకన్= ఒంటరిగా (ద్వంద్వయుద్ధంలో) ఎదిరించే; కోర్కి= కోరిక; నీకున్, ఎగ్గు= నీకు హానికరం; ఇది, మానుము= ఈ ఆలోచన వదలిపెట్టుము; ఈ పలుకులు= ఈ మాటలు; ఎవ్వరున్+చెప్పఁగలేరు= ఎవరుకూడా చెప్పలేరు; రూపఱన్+ మ్రగ్గగన్= రూపు చెడి నశించునట్లు; కాలము+అయ్యెన్+ఒకొ!= సమయం దాపురించిందా; నా వచనంబులు+ఒక+ఇంత= నా మాటలు కొద్దిగా; కర్ణముల్+దగ్గరన్+ఇచ్చి= చెవులను సమీపింపజేసి; యోధులు, బలంబులున్, తోడుగన్= వీరులు సైనికులు తోడురాగా; పోరుట ఒప్పు+అగున్= పోరాడటం తగును.

**తాత్పర్యం:** అర్జునుడితో ఒంటరిగా పోరాడాలనే కోరిక అగ్నిలో దూకాలనుకోవటం వంటిది. నీకు హానికరం. అది మానుకో. ఈ మాటలు ఎవరుకూడ చెప్పలేరు. రూపు చెడి నశించే కాలం నీకు సమీపించిందా ఏమి? నా మాటలు కొంచెం విని, వీరులు, సైనికులు తోడురాగా పోరాడటం తగును.

**ఆ. ఏను ధార్తరాష్ట్ర హిత మాచరించుట । కై పెనంగి చెవుల కప్రియంబు**
**లైన నిన్ని మాటలాడితి; నా బుద్ధి । విని దురాగ్రహంబు విడువవలయు.' 37**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ధార్తరాష్ట్ర హితము= కౌరవులకు మేలు; ఆచరించుటకై, పెనంగి= పోరాడి - అనగా పట్టుపట్టి; చెవులకున్+అప్రియంబులు+ఐనన్= నీవు వినటానికి అనిష్టములైనా; ఇన్నిమాటలు+ఆడితిన్= ఇన్నిమాటలు పలికాను; నా బుద్ధి విని= (నీ మేలు కొరకు, చెప్పిన) నా మాటలు విని; దురాగ్రహంబు విడువవలయున్= నాపై ఆగ్రహం చెందకుము.

**తాత్పర్యం:** కౌరవుల హితాన్ని దృష్టిలో పెట్టుకొని నీకు అప్రియమైనా ఇన్ని మాటలు ఆడవలసి వచ్చింది. నాపై కినుక వహించక నా హితవును వినుము.'

**విశేషం:** శల్యుడి వాక్కులు పై పై మాటలే కాని మనసులోని మాటలు కావు. పాండవుల కిచ్చిన మాట ప్రకారం కర్ణుడిని నిరుత్సాహపరచటమే అతడి ఉద్దేశం.

**చ. అనవుడు నల్గి సూతసుతుఁ డాతని కిట్లను 'మద్బలంబు న**
**మ్మిన నను నిత్తెఱంగునకు మేకొన కుండఁగ మాన్ప వజ్రహ**
**స్తునకు వశంబుగా ద నినఁ జొప్పడునే నిను బోఁటి కాప్తిఁజె**
**ప్పిన క్రియఁ జెప్పి నీవు వెఱపించిన నే వెఱ పెక్కు వాఁడనే?' 38**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; సూతసుతుఁడు= కర్ణుడు; అల్గి= కోపించి; ఆతనికిన్+ఇట్లు+అను(న్)= శల్యుడితో ఇట్లా అన్నాడు; మత్+బలంబు, నమ్మిన, ననున్= నా బలాన్ని నమ్ముకొన్న నన్ను; ఈ తెఱంగునకున్= ఈ పద్ధతికి (అర్జునుడితో ఎక్కటి పోరుకు); మే కొనకుండఁగన్= పూనుకొనకుండా; మాన్పఁగన్= మాన్పించటానికి; వజ్రహస్తునకున్=

వజ్రాయుధము చేత ధరించిన ఇంద్రుడికి సైతం వశంబు కాదు; అనినన్= సాధ్యం కాదు అంటే; నినుబోఁటికిన్= నీవంటివాడికి; చొప్పడునే?= వీలవునా?; ఆప్తిన్+చెప్పిన, క్రియన్, చెప్పి= హితం చెప్పినట్లుగా పలికి; నీవు, వెరపించినన్= నీవు భయపెట్టగా; నే వెఱపు+ ఎక్కువాఁడనే?= నేను భయపడతానా?

**తాత్పర్యం:** శల్యుడి మాటలకు కోపించిన కర్ణుడు అతడితో ఇట్లా అన్నాడు. నా బలాన్ని నమ్ముకొన్న నన్ను, అర్జునుడితో ఒంటరిపోరుకు పూనుకోకుండా ఆపటానికి ఆ దేవేంద్రుడికే సాధ్యం కాదంటే - నీ వంటివాడికి సాధ్యమౌతుందా? హితం చెప్పినట్లేచెప్పి నన్ను భయపెట్టితే నేను భయపడేవాడినా?

**వ. అనుటయు నతని నగ్గలంబు కోపింపం జేయుటకై శల్యుండు మఱియు ని ట్లనియె. 39**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; అతనిన్= కర్ణుడిని; అగ్గలంబు, కోపింపన్, చేయుటకు+ఐ= ఇంకా అధికమైన ఆగ్రహం చెందేటట్లు చేయటానికి; శల్యుండు; మఱియున్+ఇట్లు+అనియెన్= మళ్ళీ ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** కర్ణుడికి ఇంకా ఎక్కువ కోపం తెప్పించటానికి శల్యుడు మళ్ళీ అతడితో ఇట్లా అన్నాడు:

**తే. 'ఇప్పుడే నీకు బుద్ధులు సెప్ప నేల? ౹ నరుఁడు గాండీవ గుణ నిక్వణంబు సెలఁగఁ**
**గదిసి నీ మెయి బలుతూపుగములు నిగుడఁ ౹ జేసి నిను బుద్ధిమంతుని జేయుఁగాక!' 40**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు+ఏ; నీకు, బుద్ధులు+చెప్పన్+ఏల?= ఇప్పుడే నేను నీకు బుద్ధులు చెప్పటం ఎందుకు?; నరుఁడు= అర్జునుడు; గాండీవగుణ నిక్వణంబు= (తన ధనుస్సు అయిన) గాండీవం యొక్క వింటినారి ధ్వని; సెలఁగన్= మ్రోగగా; కదిసి= నిన్నుతాకి; నీ మెయి(న్)= నీ మేనిపై; బలు, తూపు, గములు= బలమైన బాణాల సమూహాలు; నిగుడన్+చేసి= నాటేటట్లుగా చేసి; నినున్= నిన్ను; బుద్ధిమంతునిన్= బుద్ధిమంతుడిగా; చేయు(న్)+కాక= చేయుగాక.

**తాత్పర్యం:** నేనిప్పుడు నీకు బుద్ధులు చెప్పటం ఎందుకు? అర్జునుడు తన గాండీవం అనే వింటియొక్క నారి మ్రోగించి, నీ శరీరంమీద బలమైన బాణసమూహాలు నాటి నిన్ను బుద్ధిమంతుడిగా చేస్తాడులే.

**వ. అని యంతం దనివోక యతండు. 41**

**ప్రతిపదార్థం:** అని= అని పలికి; అంతన్+తని+పోక= అంతటితో - అంటే ఆ మాటలతో తృప్తి చెందక; అతండు= శల్యుడు.

**తాత్పర్యం:** శల్యుడు పై మాటలతో తృప్తిపడక.

**సీ. 'రోష మహాటోప భీషణ హరితోడ ౹ సమరంబునకు హరిణము గడంగి,**
**దాన ధారాభీల దంతావళము తోడ ౹ సంగ్రామమునకు శశంబు గడఁగి,**
**చండ స్వభావోగ్ర పుండరీకము తోడ ౹ నాజికి సారమేయంబు గడఁగి,**
**దారుణ తుండాతి ఘోర గృధ్రము తోడఁ ౹ గలహంబునకు నురగంబు గడఁగి,**

**ఆ. యడరునట్లు గాదె యస్త్రకళా సము ౹ జ్జ్వలుఁడు పార్థుతోడ సంగరమున**
**కీవు గడఁగి యడరు టెల్ల రాధేయ! నీ ౹ కెట్టి బలము నమ్మ నెందుఁ గలదు?' 42**

**ప్రతిపదార్థం:** రాధేయ!= ఓ కర్ణా!; అస్త్ర కళా సముజ్జ్వలుఁడు= వివిధ అస్త్రాలతో ప్రకాశించేవాడైన; పార్థుతోడన్= అర్జునుడితో; ఈవు= నీవు; సంగరమునకున్= యుద్ధానికి; కడఁగి, అడరుట+ఎల్లన్= సిద్ధపడటమంతా; రోష, మహా+ఆటోప, భీషణ, హరితోడ(న్)= కోపంయొక్క విజృంభణంతో భయం గొలిపే సింహంతో; హరిణము= జింక; సమరంబునకున్+కడంగి= యుద్ధానికి పూనుకొని; దాన, ధారా+ఆభీల, దంతావళముతోడ(న్)= మదజలంతో అతిశయించే ఏనుగుతో; శశంబు= కుందేలు; సంగ్రామమునకున్+కడఁగి= యుద్ధానికి పూనుకొని; చండస్వభావ+ఉగ్ర పుండరీకముతోడన్= తీవ్రకోపంతో భయంకరమైన బెబ్బులితో; సారమేయంబు= కుక్క; ఆజికిన్ కడఁగి= రణమునకు పూనుకొని; దారుణ, తుండ+అతిఘోర, గృధ్రముతోడన్= వాడిఅయిన ముక్కుతో భయం గొలిపే గద్దతో; ఉరగంబు= పాము; కలహంబునకున్+కడఁగి= పోరుకు పూనుకొని; అడరునట్లు కాదె!= సిద్ధపడటం వంటిది కదా!; నీకున్+ఎట్టి బలము= నీకు ఎటువంటి బలం; నమ్మన్+ఎందున్+ కలదు?= నమ్ముకొనుటకు ఎక్కడ ఉన్నది?

**తాత్పర్యం:** 'కర్ణా! వివిధాస్త్ర సంపన్నుడైన అర్జునుడితో నీవు యుద్ధానికి సిద్ధం కావటం భయంకరమైన సింహంతో హరిణం, మదించిన ఏనుగుతో కుందేలు, క్రోధావేశం నిండిన పులితో కుక్క, తీక్ష్ణమైన ముక్కు కలిగి భయం గొల్పే గద్దతో పాము సంగ్రామానికి సిద్ధపడటం వలె ఉన్నది. ఏ విధంగా చూచినా అర్జునుడితో పోరు సల్పగల బలం నీ కెక్కడిది?

**విశేషం:** కర్ణుడిలో పిరికిమందు పోయటానికి వరుసగా పై నాలుగు ఉపమానాలు (పోలికలు) పేర్కొంటేగాని శల్యుడికి తనివి తీరలేదు. పర్యాయపదాలతో, క్రమమైన తూగుతో నడచిన ఈ సీసపద్యం తిక్కన రచనాశైలికి ఒక మచ్చుతునక. అలంకారం నిదర్శన.

**వ. అనియె, ని వ్విధంబున నధిక్షేపింపంబడి కర్ణుండు గోపించి కెంపారు కన్నుల నాశల్యు నాలోకించి. 43**

**ప్రతిపదార్థం:** అనియెన్= (శల్యుడు) అన్నాడు; ఈ+విధంబునన్= ఈ విధంగా; కర్ణుండు; అధిక్షేపింపన్+పడి= నిందించబడి; కోపించి, కెంపు+ఆరుకన్నులన్= ఎఱ్ఱబడిన కనులతో; ఆ శల్యున్+ఆలోకించి= శల్యుడిని చూచి.

**తాత్పర్యం:** నిందాపూర్వకమైన శల్యుడి మాటలకు కోపించి కర్ణుడు ఎఱ్ఱనైన కన్నులతో అతడిని చూచి (ఇట్లా అన్నాడు).

**క. 'గుణవంతుల గుణములు ని । ర్గుణుఁ డెఱుఁగమి దెల్ల; మీవు గుణహీనుఁడ వీ**
**గుణ మితనియందుఁ గల దని । గణుతింపఁగ నైపుణంబు గలదే నీకున్? 44**

**ప్రతిపదార్థం:** గుణవంతుల, గుణములు; నిర్గుణుఁడు+ఎఱుఁగమి= గుణహీనుడు తెలుసుకోలేక పోవటం; తెల్లము= స్పష్టం; ఈవు= నీవు; గుణహీనుఁడవు; ఈ, గుణము+ఇతని, అందున్+కలదని= ఈ గుణము ఇతనిలో ఉన్నదని; గణుతింపఁగ= గుర్తించుటకు; నైపుణంబు= నేర్పు; నీకున్ కలదే?= నీకు ఉందా?

**తాత్పర్యం:** గుణవంతుల గుణాలు, గుణవంతుడే గ్రహించగలడు గాని, గుణహీనుడు గ్రహించలేడు. గుణ హీనుడవైన నీకు ఈ వ్యక్తిలో ఈ గుణం కలదని గుర్తించగల నేర్పు ఉన్నదా?

**సీ. అర్జును నస్త్రవిద్యా ప్రమాణంబు నా । యెఱిఁగిన యంత నీ వెఱుఁగ వతని**
**కొలఁదియు వనమాలి కొలఁదియు గాంచి నా । కొలఁదియు నెఱిఁగి వారల మదీయ**
**దివ్యాస్త్ర బలమునఁ దెగటార్ప నగునని । యే నిశ్చయించితి; నెట్టు లనినఁ**
**గడుఁ బెద్దకాలంబు గంధ పుష్పాదులు । నర్చించుచున్నాఁడ ననుదినంబు**

**ఆ. దొనఁ గరంబు భక్తి నునిచిన యున్న ది । యహిమయంబు దారుణాస్త్ర; మింత**
**యంత యనక యెదిరి నాహుతి గొను దాన । జిష్ణు నోర్తు నొండెఁ గృష్ణు నోర్తు. 45**

**ప్రతిపదార్థం:** అర్జును+అస్త్రవిద్యా ప్రమాణంబు= అర్జునుడి అస్త్రవిద్యాపరిమితి; నా, ఎఱిఁగిన, అంత= నాకు తెలిసినంతగా; నీవు ఎఱుఁగవు= నీకు తెలియదు; అతని కొలఁదియున్= ఆ అర్జునుడి బల పరిమాణం; వనమాలి కొలఁదియున్= శ్రీకృష్ణుడి బల పరిమాణం; కాంచి= తెలిసి; నా కొలఁదియును+ఎఱిఁగి= నా బల పరిమాణమును తెలిసి; వారలన్= కృష్ణార్జునులను; మదీయ, దివ్య, అస్త్ర, బలమునన్= నా దివ్యాస్త్రాల బలంతో; తెగటార్పన్+అగును+అని= సంహరింపగలనని; ఏ(న్)= నేను; నిశ్చయించితిన్= నిర్ణయించాను; ఎట్టులు+అనినన్= అది ఎట్లా సాధ్యమంటే; అహిమయంబు= సర్పమయమైన; దారుణ+అస్త్రము= భయంకరమైన అస్త్రం; దొనన్= పొదిలో; కరంబుభక్తిన్= కడు భక్తితో; ఉనిచినన్+ఉన్నది= ఉంచగా ఉంది; కడున్+పెద్దకాలంబు= చాలాకాలం నుండి; అనుదినంబు= ప్రతిరోజు; గంధపుష్ప+ఆదులన్= గంధం; పూలు మొ॥వాటితో; అర్చించుచున్, ఉన్నాఁడను= పూజిస్తున్నాను; ఇంత అంత అనక= ఇంతవాడు అంతవాడు అనక ఎంతటివాడినైనా; ఎదిరిన్= ఎదుటివాడిని; ఆహుతికొనుదాన(న్)= బలిగొనునట్టి దానిచేత; జిష్ణున్+ఓర్తున్= విజయుడిని ఓడిస్తాను; ఒండెన్+కృష్ణున్+ఓర్తు(న్)= అట్లుకాని పక్షంలో కృష్ణుడినైనా ఓడిస్తాను.

**తాత్పర్యం:** అర్జునుడి అస్త్రవిద్యాబల పరిమాణం గురించి నాకు తెలిసినంతగా నీకు తెలియునా? కృష్ణార్జునుల బలం, నా శక్తీ తెలిసినవాడిని కాబట్టే వాళ్ళను సంహరించగలననే నమ్మకంతో ఉన్నాను. నా దగ్గర ఉన్న సర్పాస్త్రాన్ని నిత్యం భక్తితో గంధపుష్పాలతో పూజిస్తున్నాను. ఎంత బలవంతుడినైనా రూపుమాపగలిగిన ఆ దారుణాస్త్రంతో విజయుడినైనా సరే, లేకుంటే కృష్ణుడినైనా సరే ఓడించగలను.

**విశేషం:** ఖాండవదహన సమయంలో అర్జునుడివలన తన తల్లి మరణించగా, అతడిపై పగబట్టిన అశ్వసేనుడనే నాగకుమారుడు శరం ఆకారాన్ని ధరించి కర్ణుడివద్ద ఉంటున్నాడు. కర్ణుడు దాన్ని బంగారుజరలో ఉంచి నిత్యం అర్చన చేస్తున్నాడు.

**వ. భార్గవాస్త్రంబున నొక్కనిం బొరిపుత్తు నట్లుఁ గాక యాదవ పాండవ నివహంబులోనం గృష్ణార్జునులయందు లక్ష్మీ విజయంబులు సుప్రతిష్ఠితంబులై యుండు; నయ్యిరువురం బొదివి పెనంగం గనుటకంటె మేలునుం గలదే? వారల గరుడ కపి ధ్వజంబులుఁ జక్ర గాండీవంబులు బెండు మానుసులకు భీషణంబులు గాని నాకుఁ బరితోషణంబులు వేవురు గోవిందులుఁ బదివేవురు పార్థులుఁ బన్నినం బోరెద; నీవు మహాయుద్ధ కోవిదుండవు గామింజేసి వెఱచఱచి కాఱు లఱచెద; వక్కడి పక్షపాతంబునఁ బ్రేలెదవో యెఱుంగ నింకనిట్టి మాటలాడితేని ప్రాణంబుల కొఱ యొల్ల వని పలికి వెండియు.' 46**

**ప్రతిపదార్థం:** భార్గవ+అస్త్రంబునన్= భార్గవాస్త్రంతో; ఒక్కనిన్+పొరిపుత్తున్= ఒకరిని చంపుతాను; అట్లున్+కాక= అంతేకాక; యాదవ, పాండవ, నివహంబులోనన్= యాదవుల పాండవుల సమూహంలో; కృష్ణ+అర్జునులఅందున్= కృష్ణార్జునులలో; లక్ష్మీ

విజయంబులు= ఐశ్వర్యం, జయం; సుప్రతిష్ఠితంబులు+ఐ= చక్కగా నెలకొల్పబడినవై; ఉండున్= ఉంటాయి; ఆ ఇరువురన్= వారిద్దరిని; పొదిలి, పెనంగన్+కనుటకంటెన్= తాకి పోరటం కంటె; మేలునున్+కలదే?= మేలైన పని ఉన్నదా; వారల, గరుడ, కపిధ్వజంబులున్= శ్రీకృష్ణుడి గరుడధ్వజం, అర్జునుడి కపిధ్వజం; చక్రగాండీవంబులు= ఆయుధాలైన సుదర్శనచక్రం గాండీవం; బెండుమానుసులకున్= బలహీనులకు; భీషణంబులు కాని= భయం గొల్పేవికాని; నాకున్, పరితోషణంబులు= నాకు సంతోషకరములు; వేవురు, గోవిందులున్= వేయిమంది కృష్ణులు; పదివేవురు, పార్థులున్= పదివేలమంది అర్జునులు; పన్నినన్= ఎదురైనా సరే; పోరెద(న్)= పోరాడగలను; నీవు; మహాయుద్ధ, కోవిదుడవు, కామిన్+చేసి= గొప్ప రణకౌశలం లేనివాడవు కాబట్టి; వెరచరచి= భయపడి; కాఱులు+అఱచెదవు= కారుకూతలు పలుకుతున్నావు; అక్కడి పక్షపాతంబునన్= ఆ పాండవులపై పక్షపాతంతో; ప్రేలెదవో, ఎఱుంగన్= ఈ కారులు ప్రేలుతున్నావేమో తెలియకున్నాను; ఇంకన్, ఇట్టిమాటలు, ఆడితి(వి)+ఏని= ఇకముందు ఇట్లా మాట్లాడితే; ప్రాణంబుల కొఱ ఒల్లవు= నీ ప్రాణాలు దక్కవు; అని పలికి వెండియున్= అని ఇంకా (కర్ణుడు అనబోతున్నాడు)

**తాత్పర్యం:** భార్గవాస్త్రంతో మరొకరిని సంహరించగలను. అంతేగాక ఐశ్వర్య, విజయాలకు నెలవులైన కృష్ణార్జునులతో పోరు సల్పటం కంటె అదృష్టం ఏముంది! వారి ధ్వజాలను, ఆయుధాలను చూచి బెదరిపోయేవాడిని కాను నేను. వేయిమంది కృష్ణులు, పదివేలమంది పార్థులు ఎదురువచ్చినా పోరాడగల సామర్థ్యం నాకు ఉన్నది. రణవిద్యా కౌశలం ఎరుగని వాడవు కాబట్టి భయంతో నీవు నోటికి వచ్చినట్లు మాట్లాడుతున్నావు. పాండవ పక్షపాతంతో ఇట్లా పలుకుతున్నావేమో తెలియదు. నీ మాటలు ఇట్లాగే కొనసాగితే నీ ప్రాణాలు నీకు దక్కవు సుమా!

### కర్ణుఁడు శల్యునిపైఁ గోపించి యతని దురాచారంబు లుగ్గడించుట (సం. 8-27-68)

**సీ.** **'విను పాపదేశ సంజనితుండ వగు నీకు । దుర్బుద్ధి గాక సద్బుద్ధి కలదె?**
**క్షత్రియాధమ! నీచ! కలదు లోకంబున । నా బాల గోపాలమైన వాక్య**
**మతి కుటిలుండు సంగతుఁడు గాఁ డేమిటఁ । జెలికిఁ గీడొనరించుఁ జెట్ట వలుకు**
**దుష్టాత్మకుఁడు గడుఁ గష్టుఁడు మద్రకుం । డనునంత వట్టుఁ బ్రత్యక్షమయ్యెఁ;**

**ఆ.** **వావి లేక యెల్ల వనితలుఁ బురుషులుఁ । గలయమీకు నెగ్గుగాక యుండు**
**మున్నుగల్లు పిదపఁ జన్నుబాలై పెరుఁ । గుదురు సెప్ప నేల గుణము లింక?** **47**

**ప్రతిపదార్థం:** క్షత్రియ+అధమ!= క్షత్రియులలో అధముడా!; నీచ!= నీచుడా; విను; పాప, దేశ, సంజనితుండవు+అగు, నీకున్= పాపం నిండిన దేశంలో పుట్టిన నీకు; దుర్బుద్ధికాక, సద్బుద్ధికలదె?= చెడుబుద్ధి కాక మంచిబుద్ధి ఉంటుందా; లోకంబునను= లోకంలో, ఆ బాలగోపాలమైన వాక్యము= చిన్న పెద్ద అందరూ పలికే మాట; కలదు= ఉంది; మద్రకుండు= మద్రదేశీయుడు; దుష్ట+ఆత్మకుఁడు= దుష్టబుద్ధి; కడున్+కష్టుఁడు= మిక్కిలి నీచుడు; అతి, కుటిలుఁడు= ఎంతో కపటం కలవాడు; ఏమిటన్, సంగతుఁడు కాడు= ఎందులోను చేరదగినవాడు కాదు; చెలికిన్= మిత్రుడికి; కీడు+ఒనరించున్= హాని చేస్తాడు; చెట్ట, పలుకున్= చెడుమాటలు మాట్లాడుతాడు; అనునంతవట్టున్= అనుకొనే మాటలన్నీ; ప్రత్యక్షము+అయ్యెన్= నిజమైనాయి; వావి, లేక= వరుసలేక; ఎల్లవనితలున్+పురుషులున్= స్త్రీ పురుషులందరు; కలయన్= కలియగా; మీకున్+ఎగ్గుకాక ఉండున్= మీకు దోషం కాదు; మున్ను, కల్లు, పిదపన్, చన్నుపాలు+ఐ= ముందు కల్లును ఆ తరువాత చనుబాలను త్రాగి; పెరుఁగుదురు= పెరుగుతారు; గుణములు+ఇంక చెప్పన్+ఏల?= మీ గుణాలు ఇంక ఏమని చెప్పాలి?

**తాత్పర్యం:** శల్యా! నీవు 'క్షత్రియాధముడవు, నీచుడవు, పాపదేశంలో జన్మించినవాడవు అయిన నీకు దుర్బుద్ధేకాని సద్బుద్ధి ఎక్కడిది? మద్రదేశంవారు చాలా దుష్టులు, దుర్మార్గవర్తనులు, మిత్రులకు కూడా కీడు తలపెట్టేవారు, ఎప్పుడూ చేరదీయతగనివారు అని అందరూ అనుకొనే మాటలు ఇప్పుడు నీలో ప్రత్యక్షంగా కనిపిస్తున్నాయి. మీ జాతిలో ఆడ మగ వావి వరుసలు లేక సంచరిస్తారు. మీకది తప్పు కాదు. చనుబాలకు ముందే మద్యాన్ని సేవిస్తారు మీరు. మీ గుణగణాలు ఇంకా ఏమని చెప్పాలి?

**విశేషం:** మద్రదేశంలోని దురాచారాల గురించి (మద్యపానం, వ్యభిచారం మొ॥) మూలభారతంలో విపులంగా ప్రస్తావించబడింది. 'మున్ను కల్లు పిదప చన్నుబాలు' చక్కని జాతీయం.

**క. పలువురకుఁ బుట్టి నిచ్చలుఁ। గలు ద్రావుచుఁ బెరిఁగి యెట్లు గఱతురు శీలం**
**బులు నుచితము లగు భాషణ। ములు, నీ విమ్మాట లుడిగి పొదపొద మనికిన్.** 48

**ప్రతిపదార్థం:** పలువురకున్ పుట్టి= ఎందరికో జన్మించి; నిచ్చలున్= నిత్యమూ; కలు త్రావుచున్= మద్యం సేవిస్తూ; పెరిఁగి= పెరుగుతూ; శీలంబులును= సత్ప్రవర్తనలు; ఉచితములు+అగు భాషణములు= మంచిమాటలు; ఎట్లు కఱతురు?= ఎట్లా నేర్వగలరు?; నీవు+ఈ+మాటలు+ఉడిగి= నీవు ఈ మాటలు కట్టిపెట్టి; అనికిన్= యుద్ధానికి; పొదపొదము= పదపద.

**తాత్పర్యం:** ఎందరికో జన్మించి మద్యపానంతో పెరిగేవారికి మంచి నడవడి, మంచిమాటలు ఎట్లా అబ్బుతాయి? ఈ నీ మాటలు కట్టిపెట్టి రథాన్ని ముందుకు నడుపుము.

**చ. మఱియొకఁ డేను జెప్పెద, నమానుష విక్రమలీల నల్గడం**
**బఱపియుఁ జంపియున్ రిపునృపాలక సైన్యము రూ పడంచి మై**
**దొఱఁగుట యొప్పదే? తనువు దూఁటులుగాఁ బెఱవారి గెల్పుకో**
**లుఱ దొకొ! నాదు పెం పుడుప నోపుదురే నిను బోఁటు లెమ్మెయిన్?** 49

**ప్రతిపదార్థం:** మఱి, ఒకఁడు+ఏను, చెప్పెదన్= మరొక్కమాట నేను చెప్తుతాను(విను); అమానుష, విక్రమలీల= మానవాతీత పరాక్రమంతో; రిపు, నృపాలక, సైన్యము= శత్రురాజు సైన్యాన్ని; నలు+కడన్+పఱపియున్= నాలుగు వైపులా పారద్రోలి; చంపియున్= సంహరించి; రూపు+అడంచి= రూపుమాపి; తనువు, తూఁటులు కాన్= శరీరం చిల్లులుపడగా; మై, తొఱఁగుట= దేహాన్నివదలుట-అంటే మరణించుట; ఒప్పదే?= ఒప్పుకాదా!; పెఱవారి గెల్పుకోలు= శత్రుపక్షం విజయం; ఉఱదొకొ!= ఉచితమా!; నినుబోఁటులు= నీవంటి వారు; ఏ+మెయిన్= ఏ విధంగానైనా; నాదు పెంపు+ఉడుపన్+ఓపుదురే?= నా విజృంభణాన్ని ఆపగలుగుతారా?

**తాత్పర్యం:** ఇంకొక మాట చెపుతా వినుము. గొప్ప పరాక్రమంతో శత్రుసైన్యాన్ని నాశనం చేసి వీరమరణం పొందటం మేలుకదా! నీవు శత్రుపక్షం గెలుపును కోరటం న్యాయమా? నీ బోటివారు ఏ విధంగానూ నా యుద్ధోత్సాహాన్ని ఆపలేరు.

**వ. కినియించి గదం దలవగుల వ్రేటువడక యూరక తేరువోని మ్మనవుడు మద్రపతి యతని నవలోకించి.** 50

**ప్రతిపదార్థం:** కినియించి= నన్ను కోపింపజేసి; గదన్+తలపగుల= గదచే తలబ్రద్దలయ్యేటట్లు; వ్రేటుపడక= దెబ్బతినక; ఊరక, తేరుపోనిమ్ము= అడ్డుచెప్పక రథంనడపు; అనవుడున్= అని అనగా; మద్రపతి= శల్యుడు; అతనిన్ అవలోకించి= కర్ణుడిని చూచి.

**తాత్పర్యం:** నాకు కోపం తెప్పించి నా గదతో నీ తల బద్దలు కాకముందే మారుమాటాడక రథాన్ని ముందుకు తోలుము' అని కర్ణుడనగా శల్యుడు అతడిని చూచి.

**ఆ. 'హితము సెప్పఁదగనె యే నీకు? నదియును । గాక నీ రథంబు గడపుచుండి**
**కౌరవాధినాథ కార్యార్థి నగు నాకు । నున్నరూపు సెప్పకుండ నగునె? 51**

**ప్రతిపదార్థం:** ఏన్+నీకున్= నేను నీకు; హితము= మేలు; చెప్పన్+తగనె?= చెప్పటానికి తగనా?; అదియును కాక= అంతేకాక; నీ, రథంబు, కడపుచు+ఉండి= నీ రథాన్ని తోలుతూ ఉండి; కౌరవ+అధినాథ= కురురాజైన దుర్యోధనుడి; కార్య+ఆర్థిన్+అగు, నాకున్= కార్యము చేయగోరిన నాకు; ఉన్నరూపు= వాస్తవం; చెప్పకుండన్+అగునె?= చెప్పకుండటం తగునా?

**తాత్పర్యం:** దుర్యోధనుడికి సహాయం చేయగోరి నీకు సారథిగా ఉన్న నేను నీకు హితం చెప్ప తగునా? యథార్థం చెప్పకపోవటం న్యాయమా?

**ఉ. సారథి దక్షుఁడై రథికసారము రథ్యబలంబు నాయుధో**
**దారత మానమున్ రణవిధంబు నిమిత్త శుభాశుభత్వ ని**
**ర్ధారణమున్ మదిం గని హితం బెఱిఁగించుట నీతి; గాన నీ**
**వీరసమెత్త నోఁబలికితేనియుఁజెప్పుదు సూతనందనా! 52**

**ప్రతిపదార్థం:** సూతనందనా!= కర్ణా!; సారథి= రథసారథి అయినవాడు; దక్షుఁడు+ఐ= సమర్థుడై; రథికసారము= రథికుడి శక్తి; రథ్య, బలంబు= గుర్రాల బలం; ఆయుధ+ఉదారత= ఆయుధాల మేలిమి; మానమున్= పౌరుషమును; రణవిధంబు= యుద్ధంతీరు; నిమిత్తశుభ+అశుభత్వ, నిర్ధారణమున్= శకునాల శుభాశుభాల నిర్ణయాన్ని; మదిన్+కని= ఎరిగి; హితంబు+ఎఱిఁగించుట= హితవు చెప్పటం; నీతి, కానన్= ధర్మం కాబట్టి; ~~ఈవు+ఈరసము+ఎత్తన్~~= కోపగించి; నోన్+పలికితేనియున్= నొచ్చుకొనేటట్టు నీవు పలికినప్పటికీ; చెప్పుదున్= చెప్పుతాను.

**తాత్పర్యం:** సూతనందనా! కర్ణా! రథసారథి అయిన వాడికి రథికుడి బలం, పౌరుషం, ఆయుధాల మేలిమి, యుద్ధవిధానం, అశ్వాల శక్తి, శకునాల ఫలం మొదలైన విషయాలు బాగా తెలిసి ఉండాలి. ఆ తెలివితోనే నీకు హితం చెప్పుతున్నాను అట్లా చెప్పటం నీతి. కాబట్టి నీకు కోపం వచ్చి నన్ను నొవ్వ పలికినా నేను చెపుతాను.

**విశేషం:** సారథి లక్షణాలు ఇందులో పేర్కొనబడ్డాయి. సూతనందనా! అనేది కర్ణుడిని కించపరిచే సంబోధన.

**వ. ఏ నేమి తప్పు సేసిన గదం దలవగుల వ్రేసెదవు? నీ విట్లంటివి గదా యని హితోపదేశంబు సేయ మాన నేర్తునే? యిది యొక దృష్టాంతంబు వివరించెద వినుము; విని నీవు నా చెప్పినట్ల చేసితేనియు మేలు, సేయకుండినం గడు మే లని యి ట్లనియె. 53**

**ప్రతిపదార్థం:** ఏను+ఏమి, తప్పు, చేసిన= నేను ఏం తప్పు చేశానని; గదన్+తలపగుల, వ్రేసెదవు= గదతో నా తల బద్దలు చేస్తావు; నీవు+ఇట్లు+అంటివికదా, అని= నీవు ఇట్లా అన్నావని; హిత+ఉపదేశంబు= హితబోధ; చేయన్= చేయటం; మాననేర్తునే?= మానుతానా?; ఇది ఒక దృష్టాంతంబు= ఒక నిదర్శనం; వివరించెదన్+వినుము= వివరిస్తాను వినుము; విని, నీవు, నా చెప్పిన+ అట్ల చేసితి+ఏనియున్= నేను చెప్పినట్లుగా చేస్తే(చాలు); మేలు=శుభం; చేయకుండినన్= చేయకపోయినా; కడుమేలు= ఎంతోమంచిది; అని; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** నేను ఏం తప్పు చేశానని గదతో నా తల బద్దలు చేస్తానంటున్నావు? నీవు ఇట్లా అంటున్నా వని నీకు హితబోధ చేయటం మానుకొంటానా! ఒక వృత్తాంతం చెబుతాను వినుము. విని నేను చెప్పినట్లు చేస్తే మేలు. చేయకుంటే అంతకంటె మేలు' అని శల్యుడు కర్ణుడికి చెప్పసాగాడు.

**సీ.** **'అంబుధిలో నొక్క యలఘుతర ద్వీప । మున ధర్మవర్తినాఁ జను నరేంద్రు**
**పురమున నొక వైశ్యవరుఁ డధ్వరాది స । త్కర్మరుఁడును శాంతిదాంతియుతుఁడుఁ**
**గరుణాపరుఁడు దాననిరతుండు ధన ధాన్య । శోభియు బహుపుత్ర లాభ విలసి**
**తుండు నై వర్తించుచుండఁగ నిలు సేరె । నొక కాకి; యతని పుత్రకులు దాని**

**తే.** **కెంగిళులు పెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి । క్రొవ్వి కడుమీఱి యెట్టి పక్షులును దన్నుఁ**
**బోల వనియెడు దుర్మానమునఁ దృణీక । రించి యది పెక్కు భంగులఁ గ్రీడ సలుపు.** **54**

**ప్రతిపదార్థం:** అంబుధిలోన్= సముద్రంలోని; ఒక్క, అలఘుతర, ద్వీపమునన్= ఒక విశాల ద్వీపంలో; ధర్మవర్తినాన్+చను= ధర్మమూర్తివలె ఒప్పుతున్న; నర+ఇంద్రుపురమునన్= రాజనగరంలో; ఒక, వైశ్యవరుఁడు= ఒక వైశ్యశ్రేష్ఠుడు; అధ్వర+ఆది సత్+కర్మరుఁడును= యజ్ఞాలు మున్నగు సత్కర్మలు చేసేవాడును; శాంతి, దాంతియుతుండున్= శాంతుడు, ఇంద్రియనిగ్రహం కలవాడును; కరుణాపరుఁడు= దయాబుద్ధియు; దాననిరతుండు= దానాలు చేసేవాడును; ధనధాన్యశోభియున్= భాగ్యవంతుండును; బహుపుత్రులాభ విలసితుండును+ఐ= పెక్కుమంది పుత్రులుండటం అనే లాభంచేత ఒప్పుతున్నవాడును అయి; వర్తించుచుండఁగన్= నివసిస్తూ ఉండగా; ఒక కాకి; ఇలు, చేరెన్= (అతడి) ఇంటికి వచ్చింది; అతని, పుత్రకులు= ఆ వైశ్యుడి కుమారులు; దానికిన్= ఆ కాకికి; ఎంగిళులు, పెట్టి= ఎంగిళ్ళుపెట్టి; కొనియాడన్= పొగడగా; అది= ఆ కాకి; ఎలమిన్+ పెరిఁగి= సంతోషంతో పెరుగుతూ; క్రొవ్వి= గర్వించి; కడున్+మీఱి= మిక్కిలి అతిశయించి; ఎట్టి, పక్షులును= ఎటువంటి పక్షులుకూడా; తన్నున్+పోలవు+అనియెడు= తనకు సాటిరావనే; దుః+మానమునన్= దురహంకారంతో; తృణీకరించి= లక్ష్యపెట్టక; పెక్కుభంగులన్= పలువిధాలుగా; క్రీడ, సలుపున్= విహరించసాగింది.

**తాత్పర్యం:** సముద్రంలో-ఒక విశాల ద్వీపంలో ధర్మాత్ముడైన రాజుగారి నగరంలో ఒక వైశ్యుడుండేవాడు. అతడు యజ్ఞాలు చేస్తూ శాంతం, కరుణ, సంయమనం మొదలైన గుణాలతో ఒప్పుతుండేవాడు. పెక్కుమంది పుత్రులతో, భోగభాగ్యాలతో విలసిల్లుతూ దానాలు చేస్తుండేవాడు. ఒక కాకి అతడి ఇంటికి రాగా అతడి కుమారులు దానికి ఎంగిళ్ళు పెట్టి పెంచసాగారు. అది ఆ ఎంగిళ్ళతో పెరుగుతూ గర్వించి ఇతర పక్షులేవీ తనకు సాటిరావన్న దురహంకారంతో ఎన్నో విధాల క్రీడిస్తూ తిరుగుతూ ఉండేది.

**వ.** **ఇట్లు విహరించుచుండ నొక్కనాఁడు గొన్ని హంసంబులు పక్షబలంబున సుపర్ణుతో సరిసేయం దగునట్టివి సముద్రంబు చేరువఁ జనం గని యా కోమటికొడుకు లక్కాకంబునకు వానిం జూపి యి ట్లనిరి.** **55**

**ప్రతిపదార్థం:** ఇట్లు, విహరించుచుండన్= ఆ కాకి ఇట్లా విహరిస్తూ ఉండగా; ఒక్కనాఁడు= ఒకరోజు; పక్షబలంబునన్= రెక్కల బలంలో; సుపర్ణుతోన్= గరుడుడితో; సరిచేయన్+తగునట్టివి= సమానమైనట్టివి అయిన; కొన్ని, హంసంబులు= కొన్ని హంసలు; సముద్రంబు చేరువన్= సముద్రం దగ్గరగా; చనన్+కని= రాగా చూచి; ఆ కోమటి కొడుకులు= వైశ్యపుత్రులు; ఆ+కాకంబునకున్= ఆ కాకికి; వానిన్+చూపి= హంసలను చూపి; ఇట్లు+అనిరి= ఇట్లా అన్నారు:

**తాత్పర్యం:** ఆ విధంగా కాకి విహరిస్తూ ఉండగా గరుడుడితో సమానమైన రెక్కల శక్తి గలిగిన కొన్ని హంసలు సముద్రాన్ని చేరవచ్చాయి. వైశ్యకుమారులు ఆ హంసలను చూపిస్తూ కాకితో ఇట్లా అన్నారు:

**క. 'పులుఁగులలో నీ వెక్కుడు; । విలసద్గతి నంచ లిట్లు వినువీథిఁ గరం**
**బెలమిం జనియెడు వీనిం । గలసి పఱచి గెలువవలదె గతుల బహులతన్?' 56**

**ప్రతిపదార్థం:** నీవు; పులుగులలోన్= పక్షులన్నింటిలో; ఎక్కుడు= గొప్పదానివి; అంచలు= హంసలు; విలసత్+గతిన్= ఒప్పయిన గమనంతో; ఇట్లు= ఈ విధంగా; వినువీథిన్= ఆకాశమార్గంలో; కరంబు+ఎలమిన్= కడువేడ్కతో; చనియెడున్= తిరుగుతున్నాయి; గతుల బహులతన్= వివిధగతులలో; వీనిన్+కలసి= హంసలతో కలిసి; పఱచి= పరుగెత్తి; గెలువవలదె!= గెలువరాదా!

**తాత్పర్యం:** 'హంసలు ఆకాశవీథిలో కడు వేడుకతో ప్రకాశిస్తూ విహరిస్తున్నాయి. పక్షులన్నింటిలో గొప్పదానివైన నీవు పలురీతుల గమనాలతో హంసలతో కలిసి పరుగెత్తి వాటిని ఓడించాలి.'

**వ. అని తారతమ్య జ్ఞానహీను లగు నయ్యల్పబుద్ధులు సెప్పిన, నుచ్ఛిష్ట దర్పితం బగు నదియును మౌర్ఖ్యంబునం దానంతటి దాన నని తలంచి వానిదెసకుం జని మనంబున వీనిలో మేటి యెయ్యదియో యనుచుం జేరి, తన చూడ్కికి వచ్చిన యంచం బురుడించి, పఱతము రమ్మని పిలిచిన, నయ్యంచలన్నియు నిలిచి పెలుచ నవ్వి యవ్వాయసంబున కి ట్లనియె. 57**

**ప్రతిపదార్థం:** అని, తారతమ్యజ్ఞానహీనులు+అగు= ఎక్కువ తక్కువలను గూర్చిన జ్ఞానం లేనట్టి; ఆ+అల్పబుద్ధులు= ఆ తక్కువ తెలివిగలవారు; చెప్పినన్= చెప్పగా; ఉచ్ఛిష్ట దర్పితంబు+అగు+అదియును= ఎంగిళ్ళు తిని గర్వంతో ఉన్న ఆ కాకి; మౌర్ఖ్యంబునన్= మూర్ఖత్వంతో; తాను+అంతటిదానను+అని, తలంచి= తాను అంత గొప్పదాననే అని భావించుకొని; వాని దెసకున్+చని= ఆ హంసలున్న దిశకు వెళ్ళి; మనంబునన్= తన మనసులో; వీనిలో మేటి ఏ+అదియో= వీనిలో గొప్ప హంస ఏదో; అనుచున్+చేరి= అనుకొంటూ వాటిని సమీపించి; తన, చూడ్కికి, వచ్చిన, అంచన్= తన దృష్టిని ఆకర్షించిన ఒక హంసను; పురుడించి= తనకు సాటిగా తలంచి; పఱతము= పరుగెత్తుదము; రమ్ము+అని, పిలిచినన్= రమ్మని పిలువగా; ఆ+అంచలు+అన్నియున్= ఆ హంసలన్నీ; నిలిచి= వచ్చిచేరి; పెలుచన్ నవ్వి= బిగ్గరగా నవ్వి; ఆ+వాయసంబునకున్= ఆ కాకితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాయి;

**తాత్పర్యం:** అని తారతమ్య భేదం ఎరుగని ఆ అజ్ఞానులు కోరగానే ఎంగిళ్ళు తిని గర్వించిఉన్న మూర్ఖమైన ఆ కాకి, తాను అంతటిదాననే అని తలంచి, ఆ హంసలను దగ్గరకు వెళ్ళి, వాటిలో మేటిగా గోచరించిన దానిని పిలిచి, తనతో సమానంగా పరుగెత్తుమని అడుగగా, ఆ హంసలు నవ్వుతూ కాకితో ఇట్లా అన్నాయి:

**క. 'మానససరసి వసింతు మ । హీనబలము జవముఁ బక్షు లెల్లను బొగడం**
**గా నెందుఁ దిరుగుదుము; ద । వ్వైనను ఖేదంబు లేదు హంసల మగుటన్.** 58

**ప్రతిపదార్థం:** మానస సరసిన్ వసింతుము= మానస సరోవరంలో నివసిస్తాము; అహీనబలమున్, జవమున్= అమితమైన మా బలమును వేగమును; పక్షులు+ఎల్లను= పక్షులన్నీ; పొగడంగాన్= ప్రశంసించగా; ఎందున్+తిరుగుదుము= ఎక్కడైనా తిరగగలవారము; హంసలము+అగుటన్= హంసలం కాబట్టి; దవ్వు+ఐనను= దూరమైనా; ఖేదంబు లేదు= బాధ లేదు.

**తాత్పర్యం:** మానససరోవరం మా నివాసం. మా బలాన్నీ, వేగాన్నీ చూచి పక్షులన్నీ పొగడే విధంగా ఎంత దూరమైనా ఎటువంటి కష్టం లేకుండా ఎగిరిపోగలము.

**విశేషం:** హిమవత్పర్వత ప్రాంతంలోని మానస సరస్సులో హంసలు నివసిస్తుంటాయనీ, ఇతర ఋతువులలో వేరు ప్రాంతాలకు వెళ్ళినా శరదృతువు రాగానే తిరిగి మానససరోవరం చేరుకుంటాయనీ ప్రసిద్ధి.

**వ. ఇట్టి మాయందును.** 59

**తాత్పర్యం:** ఇటువంటి మాలో కూడా.

**క. బలశాలి యైన హంసముఁ । బిలిచితి పురుడించి పాఱ బేలతనమునన్;**
**గలవే యింతకు మును హం । సలతో బురుడించు వాయసంబులు జగతిన్.** 60

**ప్రతిపదార్థం:** బలశాలి అయిన హంసమున్= ఎంతో బలవంతురాలయిన హంసను; పురుడించి పాఱన్= నీతో పోటీగా పరుగెత్తుటకు; బేలతనమునన్= అమాయకత్వంతో; పిలిచితి(వి)= పిలిచినావు; జగతిన్= లోకంలో; హంసలతో(న్) పురుడించు= హంసలతో సాటి రాగల; వాయసంబులు= కాకులు; ఇంతకున్+మును, కలవే?= ఇంతకుముందు ఉన్నాయా?

**తాత్పర్యం:** మాలో బలశాలి అయిన హంసనే అవివేకంతో పోటీకి రమ్మని పిలుస్తున్నావు. అసలు హంసలతో సాటిరాగల కాకులు ఇంతవరకు ఎక్కడైనా ఉన్నాయా?

**సీ. అనుటయుఁ గాక మిట్లను హంసములతోడ, । 'గతులు నూటొక్కటి గలవు వాన**
**నొక్కటొక్కట శతయోజన వ్యాప్తి నే । మెఱయుదుఁ బొడవుగా మీఁది కెగసి**
**చనుట యచ్చటినుండి చక్క నేలకుఁ జోడు । వట్టి డిగ్గుట దూరపాత భంగి**
**సంగతి పరువడి చారులీలా గతి । వక్రయానము వలయక్రమంబు**

**ఆ. లోనుగాఁగ నెట్టు లైనను మీకోరి । నట్ల పఱచి మేటి యంచ యైన**
**దాని నిపుడ గెలుతుఁ; దక్కటి యంచలు । భయము వొందఁ గాకి పదుపు వొంగ.'** 61

**ప్రతిపదార్థం:** అనుటయున్= అని హంసలు పలుకగా; కాకము= కాకి; హంసములతోడన్ ఇట్లు+అనున్= హంసలతో ఇట్లా అన్నది; గతులు నూట+ఒక్కటి కలవు= నూట ఒక్క విధములైన గమనము ఉన్నాయి; వానన్+ఒక్కట+ఒక్కటన్= ఒక్కొక్క గమనంలో; నేన్= నేను; శతయోజనవ్యాప్తి= నూరు ఆమడల దూరం; మెఱయుదున్= ప్రకాశిస్తాను (పరుగెత్తగలను); పొడవుగాన్ మీఁదికిన్+ఎగసి చనుట= పొడవుగా పైకి ఎగిరి వెళ్ళటం; అచ్చటినుండి= పై నుండి; చక్కన్= చక్కగా; నేలకున్+

జోడు+పట్టి డిగ్గుట= (అదే విధంగా) భూమిమీదికి సమానంగా దిగటం; దూరపాతభంగి సంగతి= దూరంగా పడుతూ వెళ్ళే పద్ధతి; పరువడిన్= క్రమంగా; చారు, లీలాగతిన్= మనోహరమైన నడకతో; వక్రయానము= వంకరగా వెళ్ళటం; వలయక్రమంబు= గుండ్రంగా తిరగటం; లోనుగాఁగన్= మున్నగునవి; ఎట్టులు+ఐనను= ఏ విధములైనా; మీ కోరిన+అట్ల, పఱచి= మీరు కోరిన విధంగా ఎగిరి; మేటి అంచ+ఐన= ఎంత గొప్ప హంస అయినా; తక్కటి, అంచలు= మిగతా హంసలు; భయము+పొందన్= భయపడేటట్లుగా; కాకి, పదుపు+పొంగన్= కాకుల సమూహం ఆనందంతో పొంగిపోగా; దానిన్+ఇపుడు+అ గెలుతున్= ఆ హంసను ఇపుడే గెలుస్తాను.

**తాత్పర్యం:** అని హంసలు అనగానే కాకి వాటికి సమాధానంగా ఇట్లా అన్నది: 'నూట ఒక్క గతులు వేటిలోనైనా నేను నూరు ఆమడల దూరం వెళ్ళగలను. పొడవుగా మీదికి ఎగిరి అదే విధంగా నేలకు దిగి రాగలను. మనోహర గతులతో వంకరగా, వలయాకారంగా మీరు కోరిన విధంగా పరుగెత్తి ఎటువంటి హంసనైనా ఓడించగలను. మిగిలిన హంసలన్నీ భయపడేటట్లుగ, కాకులు నన్ను చూచి పొంగిపోయేటట్లుగ దానిని గెలుస్తాను.

**విశేషం:** పక్షుల నడకలను పేర్కొనటంలో తిక్కన సూక్ష్మపరిశీలన, లోకజ్ఞత సువ్యక్తమౌతున్నాయి. యోజనము= నాలుగు కోసుల దూరం (ఆమడ).

### కాకము హంసముతో సముద్రముమీఁదఁ బఱచి భంగపడుట (సం. 8-28-27)

**వ. అనుటయు విని ము న్నాహూతం బైన హంసం బక్కాకంబు నాలోకించి. 62**

**ప్రతిపదార్థం:** అనుటయున్+విని= అనగా విని; మున్ను+ఆహూతంబు+ఐన= ముందు పిలువబడిన; హంసంబు= హంస; ఆ+కాకంబున్+ఆలోకించి= ఆ కాకిని చూచి.

**తాత్పర్యం:** కాకి మాటలు విని ముందు పందెపు పోటీకి పిలువబడిన హంస దానిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. 'నూఱుగతుల నీవు వాఱుదే నన్నియు । నెఱుఁగఁ బులుఁగు లెల్ల నెట్లు వాఱు**
**నడరి యాకసమున నిడుబాట నట్ల పా । ఱుదము రమ్ము జలధి చదల' ననిన. 63**

**ప్రతిపదార్థం:** నూఱుగతులన్= నూరు నడకలలో; నీవు పాఱుదు+ఏన్= నీవు ఎగురగలిగితే; అన్నియున్+ఎఱుఁగన్= అవి అన్నీ నాకు తెలియవు. పులుఁగులు+ఎల్లన్= అన్నిపక్షులు; ఆకసమునన్= ఆకాశమార్గమునందు; అడరి= అతిశయించి; నిడుబాటన్= చక్కగా; ఎట్లుపాఱున్= ఎట్లా పరుగెత్తుతాయో; జలధి, చదలన్= సముద్రంమీది ఆకాశంలో; అట్ల పాఱుదము రమ్ము= అట్లా ఎగురుదాము రమ్ము; అనినన్= అనగా;

**తాత్పర్యం:** నూరుగతులలో పరుగెత్తగలనన్నావు గదా. అవన్నీ నాకు తెలియవు. ఆకాశమార్గంలో పక్షులన్నీ నిడువుగా ఎట్లా ఎగురుతాయో అట్లా సముద్రంపై ఆకాశమార్గంలో చక్కగా పరుగెత్తుదాము రమ్ము' అని హంస పలుకగా.

**విశేషం:** హంస మాటలలో వినయంతో కూడిన ఆధిక్యం, హుందాతనం గోచరిస్తున్నాయి.

**వ. అయ్యెడం గూడిన కాకంబు లపహసించి 'శతప్రకారగతి యగు దీనితో నేకయాన పర్యవసానహీన సముత్సాహ దోహలి వగు నీ వెట్లు మచ్చరించెదవు; పఱచి భంగపడియెదవు గాక' యనుటయు, నమ్మరాళం బా గమిం బాసి పఱవఁ దొడంగినం దోన యవ్వాయసంబునుం బఱచె; నిట్లు రెండును మున్నీటిపై మిన్ను దటిసి పాఱునట్టియెడ. 64**

**ప్రతిపదార్థం:** ఆ+ఎడన్+కూడిన, కాకంబులు= అక్కడ గుమిగూడిన కాకులు; అపహసించి= ఎగతాళిచేసి; శతప్రకారగతి అగు దీనితోన్= నూరుగతులలో సంచరించగల ఈ కాకితో; ఏకయాన పర్యవసాన= ఒక్క నడకలో మాత్రమే; హీనసముత్సాహ దోహలివి+అగు నీవు= అల్పోత్సాహ సంరంభం గల నీవు; ఎట్లు మచ్చరించెదవు?= ఎట్లు పోటీపడతావు?; పఱచి= పరుగెత్తి; భంగపడియెదవు గాక= అవమానం పొలగుదువు కాని; అనుటయున్= అనగానే; ఆ+మరాళంబు= ఆ హంస; ఆ గమిన్+పాసి= ఆ గుంపును విడిచి; పఱవన్ తొడంగినన్= పరుగెత్తసాగగా; తోన్+అ= వెంబడి; ఆ+వాయసంబునున్+పఱచెన్= ఆ కాకి కూడా ఎగిరింది; ఇట్లు, రెండును= హంస, కాకి; మున్నీటిపైన్= సముద్రంపై గల; మిన్ను దటిసి= ఆకాశాన్ని సమీపించి; పాఱునట్టి ఎడన్= పరుగెత్తుతున్న సమయంలో.

**తాత్పర్యం:** అక్కడ చేరిన కాకులు 'శతగతులు నేర్చిన ఈ కాకితో ఏకైక గమనవగు నీవు పోటీపడి అవమానం పాలు కావలసిందే కాని, ఏ విధంగా సాటి కాగలవు?' అని హంసను పరిహసించగా, ఆ హంస మారుమాటాడక వాటిని వదలి సముద్రం పైమార్గంలో పరుగెత్తసాగింది. కాకికూడా దానిని వెంబడించింది. ఈ విధంగా రెండూ పోటీపడి ఎగురుతూ ఉండగా.

**క. రాయంచ మందగతిఁ జను । వాయస మతితీవ్రభంగి వలను మెఱసి లీ**
**లాయితము లొప్ప బహుగమ । నాయాసము నొంది పఱచు నగ్గలిక మెయిన్. 65**

**ప్రతిపదార్థం:** రాయంచ= రాజహంస; మందగతిన్+చను= మందగమనంతో వెళ్ళుతున్నది; వాయసము= కాకి; అతి తీవ్రభంగిన్= మిక్కిలి వేగంగా; వలను మెఱసి= నేర్పు చూపుతూ; లీలా+ఆయితములు+ఒప్పన్= విలాసక్రీడలతో; అగ్గలిక మెయిన్= ఉత్సాహంతో; బహుగమన+ఆయాసమున్= వివిధ గతులవలన కలిగిన అలసటను; ఒంది= పొంది; పఱచున్= పరుగెత్తుతున్నది.

**తాత్పర్యం:** రాజహంస అలసట లేకుండా మందగమనంతో వెళ్ళుతుంటే, వాయసం ఉత్సాహంతో క్రీడావిలాసంతో తన నేర్పులు చూపుతూ వివిధగతులలో వేగంగా వెళ్ళటం వలన అలసట చెందుతూ పరుగెత్తుతున్నది.

**ఆ. ఎలమిఁ గడచి పోవుఁ బిలుచుఁ గ్రమ్మఱి వచ్చి । ముక్కు ముక్కు మీఁద మోపుఁ జుట్టు**
**నేచి తిరుగు నీఁక లీఁకలతో రాయు । నోరయుఁ జిత్రగతుల మురియు నవ్వు. 66**

**ప్రతిపదార్థం:** ఎలమిన్+కడచిపోవున్= ఆనందంతో (హంసను) దాటిపోతుంది; క్రమ్మఱి వచ్చి పిలుచున్= తిరిగివచ్చి పిలుస్తుంది; ముక్కుమీఁద ముక్కు మోపున్= ముక్కుమీద ముక్కు ఉంచుతుంది; చుట్టున్+ఏచి తిరుగున్= చుట్టూ విజృంభించి తిరుగుతుంది; ఈఁకలు+ఈఁకలతోన్, రాయున్= (తన) ఈకలతో (హంస) ఈకలను రాసేది; చిత్రగతుల ఒరయున్= చిత్రమైన గతులతో తాకుతుంది; మురియున్= మురిసిపోతుంది; నవ్వున్= నవ్వుతుంది.

**తాత్పర్యం:** ఆ కాకి హంసను దాటిపోయి తిరిగివచ్చి పిలిచేది. దాని ముక్కుమీద ముక్కు మోపేది. ఈకలను ఈకలతో రాసేది. దానిచుట్టూ విజృంభించి తిరిగేది. చిత్రమైన నడకలతో వచ్చి తాకేది. తనలో తాను మురిసిపోతూ నవ్వేది.

**విశేషం:** మిడిసిపాటు నిండిన కాకి చేష్టలు పొడిమాటల్లో స్వాభావికంగా చిత్రితమైనాయి.

**వ. ఇ వ్విధంబునం గాకం బనేక ప్రకార ప్రసరణ చతురంబై సంచరించుటం జూచి ముదితంబు లైన వాయసంబు లధిక స్వరంబుల మెఱయుచు హంసంబుల గేలికొని నవ్వుచుఁ దరువులపయిం ద్రుళ్లి త్రుళ్లి యాడుచు 'మరాళంబు పరాభవంబుఁ బొందెడుఁ జూడుం' డని పెద్ద యెలుంగునం బలుకుచుండఁ దదీయ కలకలం బాలించి హంసంబు భరితోత్సాహం బై. 67**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; కాకంబు= కాకి; అనేక ప్రకార= వివిధములైన; ప్రసరణ చతురంబు+ఐ= గతుల నేర్పు కలిగినదై; సంచరించుటన్+చూచి= పరుగెత్తటం చూచి; ముదితంబులు+ఐన వాయసంబులు= సంతోషించిన కాకులు; అధికస్వరంబులన్, మెఱయుచున్= పెద్దగా అరిచి ప్రకాశిస్తూ; హంసంబులన్= హంసలను; గేలికొని నవ్వుచున్= గేలిచేస్తూ నవ్వుతూ; తరువుల పయిన్= చెట్లపై; త్రుళ్ళి త్రుళ్ళి ఆడుచున్= గంతులు వేస్తూ; మరాళంబు= హంస; పరాభవంబున్+పొందెడున్= అవమానం పాలవుతుంది; చూడుండు+అని= చూడండి అని; పెద్ద ఎలుంగునన్ పలుకుచుండున్= పెద్ద గొంతుతో అంటూ ఉండగా, హంసంబు= హంస; తదీయ కలకలంబు= వాటి అరపులు; ఆలించి= విని; భరిత+ ఉత్సాహంబు+ఐ= నిండు ఉత్సాహం కలదై.

**తాత్పర్యం:** కాకి ఈ విధంగా వివిధ గతుల నేర్పులు ప్రదర్శిస్తూ పరుగెత్తటం చూచిన తోటి కాకులు, సంతోషంతో అరుస్తూ, హంసలను గేలిచేస్తూ చెట్లపై గంతులు వేయసాగాయి. 'హంస ఓడిపోతుంది' అని పెద్ద గొంతులతో అరవసాగాయి. వాటి అరపులు విన్న హంస నిండు ఉత్సాహంతో-

**క. పొడవునకు నెగసి యెప్పటి । పడమటి దెస నిగిడి పెలుచఁ బఱచినఁ గూడం**
**గడు రయమునఁ జని యంచం । గడవంగా కీలకఱచి కాకము పాఱున్. 68**

**ప్రతిపదార్థం:** పొడవునకున్+ఎగసి= నిలువుగా పైకి ఎగిరి; ఎప్పటి పడమటి దెస నిగిడి= మునుపటివలె పడమరదిక్కున వెళ్ళి; పెలుచన్+పఱచినన్= అధికవేగంతో పారగా; కాకము= కాకి; కూడన్= వెంబడి; కడురయమునన్+చని= మిక్కిలి వేగంగా వెళ్ళి; అంచన్+కడవన్+కాక= హంసను దాటశక్యంగాక; ఈలకఱచి= ఊపిరి బిగబట్టి; పాఱున్= పరుగెత్తింది.

**తాత్పర్యం:** పొడవుగా పైకి ఎగిరి పడమటివైపు పారగా, కాకి కూడ దానివెంట వేగంగా వెళ్ళి ఆ హంసను దాటటానికి శక్యం కాక ఊపిరి బిగబట్టి పరుగెత్తసాగింది.

**వ. పాటిపాటి డయ్యుటయు నయ్యంచ యుదంచిత త్వరితగమన కళా వైదగ్ధ్యంబు మెఱయం బఱచిన బీఱువడి కాకం బాకులాంతరంగంబును వికలాంగంబును నై యిట్లని వితర్కించు. 69**

**ప్రతిపదార్థం:** పాటి, పాటి, డయ్యుటయున్= పరుగెత్తి పరుగెత్తి అలసిపోగా; ఆ+అంచ= ఆ హంస; ఉదంచిత= ఒప్పయిన; త్వరితగమన కళావైదగ్ధ్యంబు= శీఘ్రగమన చాతుర్యం; మెఱయన్+పఱచినన్= చూపుతూ పారగా; కాకంబు= కాకి; బీఱువడి=

దిటవు కోల్పోయి; ఆకుల+అంతరంగంబును= చెదరిన మనసు; వికల+అంగంబునున్+ఐ= శక్తి కోల్పోయిన శరీరం కలదై; ఇట్లు+అని= ఈ విధంగా; వితర్కించున్= ఆలోచించసాగింది.

**తాత్పర్యం:** హంస, శీఘ్రగమన చాతుర్యాన్ని ప్రదర్శిస్తూ పారగా, దానితోపాటు పరుగెత్తుతూ అలసిపోయిన కాకి శక్తికోల్పోయి బలహీనమయి మనసు కలతనొందగా ఇట్లా చింతించసాగింది.

**క. 'నేరక తొడరితిఁ గాల్మోన । భూరుహములు లతలు గిరులుఁ బొద లేమియు లేఁ;**
**వారయ బహుసత్త్వ మయము । వారిధి డిగి సోఁకినపుడ వలయుం బొలియన్.' 70**

**ప్రతిపదార్థం:** నేరక, తొడరితిన్= తెలియక పందానికి పూనుకొన్నాను; కాల్మోనన్= కాలుపెట్టటానికి; భూరుహములు= చెట్లు; లతలు= తీగలు; గిరులున్= కొండలు; పొదలు+ఏమియున్, లేవు= పొదలు ఏవీ లేవు; వారిధి= సముద్రం; ఆరయన్= చూడగా; బహుసత్త్వమయము= పెక్కు జంతువులతో నిండినది; డిగి సోకినపుడు+అ= దిగగా అవి ముట్టుకుంటేనే; పొలియన్ వలయున్= చనిపోవాలి.

**తాత్పర్యం:** 'ఎరుగక హంసతో పోటీకి సిద్ధపడ్డాను. కాలు నిలపటానికి మార్గంలో చెట్లు, తీగలు, పొదలు, గట్లు ఏవీ లేవు. నీటిపై దిగుదామా అంటే సముద్రంలోని జంతువుల బారిన పడక తప్పదు.'

**వ. అనుచు దీన మానసం బయి భయంబునం గలంగి డప్పి సొగసి యవశత నంతకంతకు డిగుచున్న యక్కాకిం గనుంగొని కలహంసం బి ట్లనియె. 71**

**ప్రతిపదార్థం:** అనుచున్= అనుకొంటూ; దీనమానసంబు+అయి= దిగులు చెందిన మనసు కలదై; భయంబునన్+కలంగి= భయంతో కలతచెంది; డప్పిన్+సొగసి= దాహంతో అలసి; అవశతన్= వశంతప్పి; అంతకున్+అంతకున్, డిగుచున్న= మెల్లమెల్లగా దిగుతున్న; ఆ+కాకిన్= ఆ కాకిని; కనుంగొని= చూచి; కలహంసంబు+ఇట్లు+అనియెన్= రాజహంస ఇట్లా అన్నది.

**తాత్పర్యం:** అని అనుకొంటూ దిగులుతో, భయంతో కలతచెందిన మనసు గలదై కాకి, దప్పితో వశంతప్పి క్రమంగా క్రిందికి దిగసాగింది. దాన్ని చూచిన హంస ఇట్లా అంటున్నది.

**ఆ. 'నీ వనేకగతులు నే ర్తిది యే గతిఁ । జనుట చెపుమ వాయసంబ! యేను**
**గడవ నరిగి పిలువఁగా నేల తడసెద? । వెఱక లేటి కిట్టు లెడల విడువ?' 72**

**ప్రతిపదార్థం:** వాయసంబ!= ఓ కాకమా!; ఏను= నేను; కడవన్+అరిగి= (నిన్ను) దాటిపోయి; పిలువన్‌కాన్= పిలువగా; ఏల తడసెదవు?= ఎందుకు ఆలస్యం చేస్తున్నావు?; ఎఱకలు= రెక్కలు; ఇట్టులు= ఈ విధంగా; ఎడలన్+విడువన్= (నీకు) దూరమైపోయినట్లు విడవటం; ఏటికిన్?= ఎందుకు?; నీవు, అనేకగతులు= ఎన్నో నడకలు; నేర్తు(వు)= నేర్చినదానవు; ఇది, ఏ గతిన్ చనుట= ఏ నడకతో వెళ్ళుటో; చెపుమ= చెప్పుము.

**తాత్పర్యం:** 'ఓ వాయసమా! నేను నిన్ను దాటి పిలిచినా నీవు బదులు పలుకక జాప్యం చేస్తున్నావు. నీ రెక్కలు నీకు దూరమైపోయినట్లు చాస్తున్నావు. నీవు నేర్చిన పెక్కు గతులలో ఇది ఏ రకమైన గమనమో చెప్పుతావా?'

**విశేషం:** నూటొక్క గతులలో ఆరితేరినదానను(63ప.) అన్న కాకి మాటలకు బదులుగా ఇది ఎత్తిపొడుపు.

**వ. అనియె నట్టియెడ. 73**

**ప్రతిపదార్థం:** అనియెను; అట్టిఎడన్= అప్పుడు.

**తాత్పర్యం:** అని హంస కాకితో హేళనగా పలుకగా, అప్పుడు.

**క. తలకొని జలములు పక్షం । బులు దుండము దోఁక సోఁక బొరిఁబొరి నెగయన్**
**బలమఱి మెయి దిగఁబడఁగా । సొలసి యెగయలేక వాయసుఁడు వెగడొందెన్. 74**

**ప్రతిపదార్థం:** తలకొని= పూని; జలములు= సముద్ర జలాలు; పక్షంబులు= రెక్కలు; తుండము= ముక్కు; తోఁక= తోకను; సోఁకన్= తాకగా; పొరిన్ పొరిన్+ఎగయన్= మాటిమాటికి ఎగిసిపడగా; బలము+అఱి= బలము నశించి; మెయి దిగఁబడఁగాన్= శరీరం క్రిందికి వ్రాలగా; వాయసుఁడు= కాకి; సొలసి= అలసి; ఎగయ లేక= ఎగర లేక; వెగడు+ఒందెన్= భయపడెను.

**తాత్పర్యం:** సముద్ర జలాలు రెక్కలను, ముక్కును, తోకను తాకుతూ ఉండగా, మాటిమాటికి మీదికి ఎగురుతూ, బలహీనపడి క్రిందికి వ్రాలుతూ ఉండగా - అలసిపోయి ఎగురలేక భయపడింది.

**విశేషం:** 'వాయసుఁడు' అన్న మాటలో గర్వంతో కన్నూమిన్నూ కానని 'మానవుడు' స్ఫురిస్తాడు.

**వ. ఇట్లు మున్నీటి నీటి పయింబడి యగ్గలం బగు దురవస్థకు బెగ్గలంబు నొందు కాకంబు నాలోకించి 'పలుకనగుం గాక; పలికినట్ల యెవ్వరికిఁ జేయఁ దీరుఁ? బని తీరెంగదా' యనిన రాయంచకు న క్కాకం బి ట్లనియె. 75**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; మున్నీటి నీటి పయిన్+పడి= సముద్రజలంమీద పడి; అగ్గలంబు+అగు దురవస్థకున్= మిక్కిలి హీనస్థితికి; బెగ్గలంబున్+ఒందు= భయపడుతున్న; కాకంబున్+ఆలోకించి= కాకిని చూచి; పలుకన్+అగున్+కాక= (మాటలు) పలుకవచ్చునుకాని; పలికిన+అట్లు+అ= పలికినట్లుగానే; ఎవ్వరికిన్+చేయన్+తీరున్?= చేయటానికి ఎవరికి వీలవుతుంది?; పని తీరెన్+కదా అనినన్= నీ పని ముగిసింది కదా అనగా; రాయంచకున్= రాజహంసతో; ఆ+కాకంబు+ ఇట్లు+అనియెన్= ఆ కాకి ఇట్లా అన్నది:

**తాత్పర్యం:** ఈ విధంగా పైకి ఎగురలేక సముద్రపు నీటిమీదపడి, తన బలహీనస్థితికి భయపడుతున్న కాకిని చూచి రాజహంస ఇట్లా అన్నది: 'మాటలు ఎన్నయినా చెప్పవచ్చు. కాని చెప్పినదంతా చెయ్యటం ఎవరికి సాధ్యమౌతుంది. గొప్పలు పలికిన నీ పని అయిపోయింది కదా!' అన్న హంస మాటలు విని కాకి ఇట్లా అంటున్నది:

**క. 'ఎంగిళులు గుడిచి క్రొవ్వునఁ । బొంగిన మెయితోడ గర్వమునఁ దిరుగుచు నా**
**కుం గలదె యెందు నెదురు? వి । హంగమ పతి నైన గెలుతు' నని మును దలఁతున్. 76**

**ప్రతిపదార్థం:** ఎంగిళులు, కుడిచి= ఎంగిళ్ళు తిని; క్రొవ్వునన్+పొంగిన మెయితోడన్= కొవ్వుతో బలసిన దేహంతో; గర్వమునన్ తిరుగుచున్= గర్వంగా తిరుగుతూ; నాకున్= నాకు; ఎందున్= ఎక్కడైనా; ఎదురు కలదె?= ఎదురు ఉన్నదా?; విహంగమపతిన్+ ఐనన్= పక్షిరాజైన గరుడుని కూడా; గెలుతును+అని= గెలువగలనని; తలఁచుదున్= ఇంతకుముందు భావించాను.

**తాత్పర్యం:** ఎంగిళ్ళు తిని, బలిసిన దేహంతో గర్వించి, నాకు ఎదురు ఎవరూ లేరని భావిస్తూ గరుత్మంతుడిని సైతం ఓడించగలనని తలచేదానిని.

**క. నా కొలఁది యిప్పుడెఱిఁగితి । నీ కరుణాలోకనంబు నిగిడించి శర**
**ణ్యా! కావు నన్నుఁ మగుడం । గాకులలోఁ గలుపఁ దగవు గాదే నీకున్?' 77**

**ప్రతిపదార్థం:** నా కొలఁది ఇప్పుడు+ఎరిగితిన్= నా పరిమితి ఇప్పుడు తెలిసికొన్నాను; శరణ్యా!= శరణు పొందదగినవాడా!; నీ కరుణా+ఆలోకనంబు= నీ దయాదృష్టిని; నిగిడించి= ప్రసరించి; కావు= రక్షించు; నన్నున్; మగుడన్= మళ్ళీ; కాకులలోన్= కాకుల్లో; కలుపన్= చేర్చగా; నీకున్= నీకు; తగవు కాదే?= న్యాయం కదా!

**తాత్పర్యం:** నా అల్పత్వం ఎంతో ఇప్పుడు తెలుసుకొన్నాను. నిన్ను శరణు కోరుతున్నాను. నాపై దయ చూపి నన్ను రక్షించు. నా తోటి కాకులలో మళ్ళీ నన్ను చేర్చుము. ఇది నీకు న్యాయం కదా.

**వ. అని యిత్తెఱంగున. 78**

**తాత్పర్యం:** అని ఈ విధంగా.

**క. ఆకులతఁ బొంది పలుకుచుఁ । గా కా యని చంచుఁ దెఱచి కడు నఱచుచు నీ**
**రాకరమున మునిఁగెడు న । క్కాకిం గని హంస పరమకారుణ్యమునన్. 79**

**ప్రతిపదార్థం:** ఆకులతన్+పొంది= కలతచెంది; కా కా అని= కావు కావు అని; పలుకుచున్= పలుకుతూ; చంచున్ తెఱచి= ముక్కు(నోరు) తెరచి; కడున్+అఱచుచున్= ఎంతగానో అరుస్తూ; నీరాకరమునన్= సముద్రంలో; మునిఁగెడు= మునుగుతున్న; ఆ+కాకిన్+కని= ఆ కాకిని చూచి; హంస; పరమ కారుణ్యమునన్= మిక్కిలి దయతో.

**తాత్పర్యం:** వ్యాకులమైన మనసుతో కావు కావు మని ఎంతగానో అరుస్తూ నీటిలో మునిగిపోతున్న కాకిని చూచి హంస దయతో-

**క. వెరవునఁ దత్తనువుం దన । చరణంబుల నిఱికి యెత్తి చా వుడిపి బల**
**స్ఫురణంబు మెఱయ వీఁపున । ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్. 80**

**ప్రతిపదార్థం:** వెరవునన్= ఉపాయంతో; తద్+తనువున్= ఆ కాకి దేహాన్ని; తన చరణంబులన్= తన కాళ్ళలో; ఇఱికి ఎత్తి= ఇరికించుకొని పైకెత్తి; చావు+ఉడిపి= చావునుంచి కాపాడి; బల స్ఫురణంబు మెఱయన్= బలస్ఫూర్తి ప్రకాశించగా; వీఁపున ధరియించుచున్= వీపుపై మోసికొని; పక్షితతులు, నుతింపన్= పక్షులన్నీ కొనియాడగా; వచ్చెన్= వచ్చింది.

**తాత్పర్యం:** కాకిని తన కాళ్ళతో పట్టి పైకెత్తి, దాని ప్రాణాలు కాపాడి, బలమొప్పగా వీపున మోసికొని వస్తున్న హంసను చూచి పక్షులన్నీ పొగడసాగాయి.

**వ. ఇవ్విధంబునం దెచ్చి యెప్పటి నెలవున డించి, రాయంచ యక్కాకి దెప్పిఱిన, దానితో నచ్చటి కాకులు విన 'నింక నిట్టి యవినయంబు లెన్నండును జేయకు' మని పలికి నిజ సహచరంబు లగు మరాళంబులుం**

**దానును వలయు చోటికిం జనియె; నీవు నా కోమటి కొడుకుల యెంగిలి కూటం బెరిఁగిన యక్కాకంబు చందంబునఁ గురుకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి, యెక్కుడువారల ధిక్కరించెదవు; నీ కొలఁది యెఱుంగవు; దీనం జేటు వాటిల్లుఁ గాన తేటపడ నెఱింగించెద నాకర్ణింపుము. 81**

**ప్రతిపదార్థం:** రాయంచ= రాజహంస; ఈ విధంబునన్+తెచ్చి= కాకిని ఈ విధంగా మోసికొనివచ్చి; ఎప్పటి నెలవునన్ డించి= దాని నివాసంలో దించి; ఆ+కాకి తెప్పిఱినన్= కాకి తెప్పరిల్లగా; అచ్చటి కాకులు వినన్= అక్కడ ఉన్న కాకులు వినేటట్లుగా; దానితోన్= ఆ కాకితో; ఇంకన్= ఇకముందు; ఇట్టి అవినయంబులు= అహంభావంతో కూడిన పనులు; ఎన్నండును చేయకుము= ఎప్పుడూ చేయవద్దు; అని పలికి= అని వచించి; నిజ సహచరంబులు+అగు, మరాళంబులున్= తనతోటి హంసలూ; తానును= తానూ; వలయుచోటికిన్+చనియెన్= తమ కోరిన ప్రదేశానికి వెళ్ళాయి; నీవును= నీవు కూడా(కర్ణుడు); ఆ కోమటి కొడుకులు= ఆ వైశ్య పుత్రుల ఎంగిలి కూటన్+పెరిఁగిన= ఎంగిలికూడుతో పెరిగిన; ఆ+కాకంబు చందంబునన్= ఆ కాకివలెనే; కురు కుమారుల= దుర్యోధనాదుల; ఎంగిళులు కుడిచి= ఎంగిళ్ళు తిని; క్రొవ్వి= గర్వించి; ఎక్కుడు వారల= నీ కంటె అధికులైన వారిని (కృష్ణార్జునులను); ధిక్కరించెదవు= తిరస్కరిస్తున్నావు; నీ కొలఁది ఎఱుంగవు= నీ పరిమితి తెలిసికొనలేకుండా ఉన్నావు; దీనన్+చేటు+పాటిల్లున్+కానన్= ఇందువలన నీకు హాని కలుగుతుంది కాబట్టి; తేటపడన్+ఎఱింగించెదన్= తెలిసేటట్లుగా చెబుతాను; ఆకర్ణింపుము= వినుము.

**తాత్పర్యం:** హంస ఈ విధంగా కాకిని మోసికొని వచ్చి దాని స్థానంలో దింపింది. కాకి స్తిమితపడిన తర్వాత తోటి కాకులు వినేటట్లుగా ఇక ముందెప్పుడూ గర్వంతో ఈ విధమైన పనులకు పూనుకొనవద్దని బుద్ధి చెప్పి తోడి హంసలతో కలిసి వెళ్ళిపోయింది. కాకి హంసల కథను కర్ణుడికి వినిపించి శల్యుడు అతడితో 'వైశ్యకుమారులు పెట్టిన ఎంగిళ్ళు తిని గర్వించిన కాకివలెనే నీవు కూడా కౌరవుల ఎంగిళ్ళు తిని, నీ శక్తిని మరచి, నిన్ను మించినవారితో తలపడుతున్నావు. దీనివలన నీకే హాని జరుగుతుంది కాబట్టి నా మాటలు వినుము.' అంటూ.

**విశేషం:** 28 పద్యగద్యాలలో కొనసాగిన హంస వాయసముల కథ ద్వారా కర్ణుడిని అవమానపర్చాలన్న శల్యుడి ఉద్దేశం ప్రస్ఫుటమవుతున్నది. ఈ ఉపాఖ్యానానికి ముందు 'హితోపదేశంబు సేయ మాననేర్తునే' అంటూ చివర 'చేటు వాటిల్లుఁగాన తేటపడ నెఱింగించెద' అనటంలో ప్రధానకథకు భంగం కలగకుండా పొందికను కూర్చటంలో తిక్కన రచనా నైపుణ్యం వెల్లడి అవుతున్నది.

**చ. 'విరటుని గోవులన్ మరల వెల్చి మదంబున నీదు తమ్ముని౦**
**బొరిగొనఁ బార్థుఁ దాక కెటుపోయితి నాఁ డల ఘోషయాత్రలోఁ**
**గురుపతి డించి క్రీడి కృపకుం దగు పాత్రము సేసి యెక్కడన్**
**సురిఁగితి చెప్పుమా నిజము సూతతనూభవ! నాకు నేర్పడన్.' 82**

**ప్రతిపదార్థం:** సూత తనూభవ!= సూతుని కుమారుడవైన ఓ కర్ణా!; విరటుని గోవులన్= విరాటరాజు గోవులను; మరల వెల్చి= వెనుకకు మరలించి; మదంబునన్= గర్వంతో; నీదు తమ్మునిన్= నీ సోదరుడిని; పొరి+కొనన్= చంపగా; పార్థున్+తాఁకక= అర్జునుడిని ఎదుర్కొనకుండా; నాఁడు= ఆనాడు; ఎటుపోయితి?= ఎటువెళ్ళావు?; అల, ఘోషయాత్రలోన్= ఆ ఘోషయాత్రలో; కురుపతి డించి= దుర్యోధనుడిని దింపి; క్రీడి కృపకున్= అర్జునుడి దయకు; తగు పాత్రము+చేసి= తగినవాడినిగా చేసి; ఎక్కడన్ సురిఁగితి?= ఎక్కడ దాగుకొన్నావు?; నాకున్+ఏర్పడన్= నాకు తెలిసేటట్లుగా; నిజము చెప్పుమా!= నిజం వచించుము.

**తాత్పర్యం:** 'కర్ణా! ఆనాడు ఉత్తరగోగ్రహణ సందర్భంలో అర్జునుడు నీ తమ్ముడిని సంహరించి విరాటుడి గోవులను మరల్చినపుడు నీవు ఎటు వెళ్ళావు? ఆ ఘోషయాత్రలో దుర్యోధనుడిని దించి, అతడిని అర్జునుడి దయకు వదలి ఎక్కడ దాగుకొన్నావు? నిజం చెప్పుము.'

**వ. అని వెండియు.** **83**

**తాత్పర్యం:** శల్యుడు ఈ విధంగా అని ఇంకా.

**చ. 'పనివడి జామదగ్న్యుఁడు సభన్ వినిపింపఁడె మీకు నెల్ల న**
**ర్జును భుజవైభవంబు మధుసూదను పెంపును నాఁడ ద్రోణ శాం**
**తనవులుఁ జెప్పరే బహువిధంబుల? వారల గెల్వరామి మున్**
**వినమె? యెఱింగియున్ మఱియు వీఱిఁడి మాటలు వేయు నేటికిన్?** **84**

**ప్రతిపదార్థం:** అర్జును భుజ వైభవంబు= అర్జునుడి భుజబల పరాక్రమాన్ని; మధుసూదను పెంపును= కృష్ణుడి గొప్పతనాన్ని; జామదగ్న్యుఁడు= పరశురాముడు; పనివడి= పనికట్టుకొని; సభన్= సభలో; మీకున్+ఎల్లన్= మీ అందరికీ; వినిపింపఁడె?= చెప్పలేదా?; నాఁడ= ఆనాడే; ద్రోణ, శాంతనవులున్= ద్రోణభీష్ములు; వారలన్+గెల్వ, రామి= వారిని జయించలేమన్న విషయాన్ని; బహువిధంబులన్= ఎన్నో విధాలుగా; చెప్పరే?= చెప్పలేదా?; మున్ వినమె?= ఇంతకుముందు వినలేదా?; ఎఱింగియున్= తెలిసికూడా; మఱియున్= ఇంకా; వీఱిఁడి మాటలు= వెఱ్ఱివాడి మాటలవంటిమాటలు; వేయున్+ఏటికిన్= ఇన్ని ఎందుకు?

**తాత్పర్యం:** 'పరశురాముడు, భీష్మద్రోణులు అర్జునుడి భుజబలాన్ని, శ్రీకృష్ణుడి ఆధిక్యాన్ని గురించి సభలో ఎన్నో విధాలుగా మీకు వివరించారు కదా! అవన్నీ తెలిసికూడా ఇంకా ఎందుకు ఈ మూర్ఖమైన మాటలు?

**విశేషం:** వీఱిఁడి - వేఱిఁడి యొక్క రూపం - వీఱిఁడియైన మానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే? (ఉద్యో. 3 ఆ)

**క. ఒంటి మెయిఁ దాఁక నా ము । క్కంటికి వశమగునె కృష్ణ గాండీవుల ని**
**ట్లంట యుడిగి తగు రథికుల । జంటగొని రణమ్ము సలుపు శత్రులు దలఁకన్.** **85**

**ప్రతిపదార్థం:** కృష్ణ గాండీవులన్= కృష్ణార్జునులను; ఒంటిమెయిన్+తాఁకన్= ఒంటరిగా ఎదుర్కొనటానికి; ఆ ముక్కంటికిన్= ఆ శివుడికి; వశము+అగునె?= సాధ్యం అవుతుందా?; ఇట్లు+అనుట+ఉడిగి= ఈ విధంగా మాట్లాడటం మాని; తగు రథికుల= సమర్థులైన వీరులను; జంట+కొని= జతచేసికొని; శత్రులు+తలఁకన్= శత్రువులు కలత చెందగా; రణమ్ము సలుపు(ము)= యుద్ధం చేయుము.

**తాత్పర్యం:** కృష్ణార్జునులతో ఒంటరిగా తలపడటానికి ఆ పరమశివుడికైనా శక్తి చాలదు, కాబట్టి ఈ ఆలోచన విడిచిపెట్టి తగిన వీరులను జతచేసికొని వారితో యుద్ధం చేయుము.

**తే. గొంతికొడుకును దేవకికొడుకు మనము । గనియెదము దినకర నిశాకరులుఁ బోలె**
**వెలుఁగ; నయ్యెడ ఖద్యోత విలసితంబు । తోడి దగుఁ గాక నీ పెంపు దోఁపఁగలదె?** **86**

**ప్రతిపదార్థం:** గొంతి కొడుకును= అర్జునుడు; దేవకి కొడుకు= కృష్ణుడు; దినకర నిశాకరులున్+పోలెన్ వెలుఁగన్= సూర్య చంద్రులవలె ప్రకాశించగా; మనము+కనియెదము= మనం చూస్తాము; ఆ+ఎడన్= ఆ కాంతిముందు; నీ పెంపు= నీ అతిశయం; ఖద్యోత విలసితంబు తోడిది+అగున్+కాక= మిణుగురు పురుగు వెలుగుతో సమానం అవుతుంది కాని; తోఁ పన్+కలదె?= ప్రకాశిస్తుందా?

**తాత్పర్యం:** అర్జున శ్రీకృష్ణులు సూర్యచంద్రులవలె ప్రకాశించటం మనం చూస్తాము. ఆ సమయాన నీ పరాక్రమం మిణుగురు పురుగు కాంతివంటిది అవుతుందిగాని, నీ ఆధిక్యం అగుపిస్తుందా?

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **అనిన విని కర్ణుండు 'గమలనాభుని పెంపును బార్థు బలిమియు నెఱుంగక యే నేల వారిఁ దొడరెద? నీ వెట్లు చెప్పినను దొడరుదుఁ, దొడరి వారొండె నేనొండె నగుదు నింతియ నీవు వెడమాట లాడక యుడుగు' మని పలికి యచ్చటి మహీపతులు విన నమ్మద్రపతి కి ట్లనియె.** **87**

**ప్రతిపదార్థం:** అనిన విని= (శల్యుడు) అనగా విని; కర్ణుండు= కర్ణుడు; కమలనాభుని పెంపును= శ్రీకృష్ణుడి ఆధిక్యాన్ని; పార్థు బలిమియున్= అర్జునుడి పరాక్రమాన్ని; ఎఱుంగక= తెలియకుండా; ఏను+ఏల= నేను ఎందుకు; వారిన్+తొడరెదన్?= వారితో తలపడతాను?; నీవు+ఎట్లు చెప్పినను= నీవు ఎంత చెప్పినా; తొడరుదున్= ఎదిరిస్తాను; తొడరి= ఎదిరించి; వారు+ ఒండె= వారో; నేను+ఒండె= నేనో; అగుదున్= అవుతాను; ఇంతియ= ఇంతేకాని; నీవు, వెడమాటలు+ఆడక= వ్యర్థవాక్కులు పలుకక; ఉడుగుము= ఊరుకో; అని పలికి= అని(కర్ణుడు); అచ్చటి మహీపతులు వినన్= అక్కడ ఉన్న(సేనలోని) రాజులు వినేటట్లుగా; ఆ+మద్రపతికిన్+ఇట్లు+అనియెన్= శల్యుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** శల్యుడి మాటలు విన్న కర్ణుడు 'కృష్ణార్జునుల పరాక్రమం గురించి తెలియకుండానే నేను వారితో తలపడతానా? నీవు ఎన్ని చెప్పినా నేను వారిని ఎదుర్కొనకుండా మానను. వారో - నేనో మిగిలేది. అంతేకాని నీ వ్యర్థమైన మాటలు మానుకో. 'అంటూ సేనలోని రాజులు వినేటట్లుగా ఇంకా శల్యుడితో ఇట్లా అన్నాడు:

### కర్ణుఁడు శల్యునితోఁ దనకుఁ గలిగిన శాపంబుల తెఱంగు సెప్పుట (సం. 8-29-3)

**సీ.** **'తలఁచిన నెదకు సంతాపంబు సేయంగఁ। జాలెడునట్టివి జామదగ్న్య**
**కోపంబు బ్రాహ్మణ శాపంబు గాక యే। సరకు గొందునె మురహరుఁ గిరీటిఁ**
**జెప్పెద విను మస్త్రశిక్షార్థినై మహేం। ద్ర నగంబునకు జమదగ్ని సుతునిఁ**
**గోరి పోయినఁ గృపాంభోరాశి యగు నమ్మ। హాముని కులము నన్నడుగుటయును**

**తే.** **బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాఁగ। బ్రాహ్మణుఁడనని చెప్పి తత్పాదభక్తి**
**గలిగి మెలఁగంగ శిక్షించె నలఘు బహువి। ధాస్త్ర శస్త్ర సంవేదిఁగా నతఁడు నన్ను.** **88**

**ప్రతిపదార్థం:** జామదగ్న్య కోపంబు= పరశురాముడి ఆగ్రహం; బ్రాహ్మణ శాపంబు= బ్రాహ్మణుడు పెట్టినశాపాన్ని; తలఁచినన్= తలచుకుంటేనే; ఎదకున్= మనసుకు; సంతాపంబు= బాధ; సేయంగ చాలెడున్+అట్టివి= కలిగించేవి; కాక=

అట్లుకానిచో; మురహరున్= కృష్ణుడిని; కిరీటిన్= అర్జునుడిని; ఏన్= నేను; సరకుకొందునె?= లెక్కపెడతానా?; అస్త్రశిక్షా+అర్థినై= అస్త్రవిద్యనభ్యసించాలని; జమదగ్ని సుతునిన్+కోరి= పరశురాముడిని కోరి; మహేంద్రనగంబునకున్= మహేంద్రపర్వతానికి; పోయినన్= వెళ్ళగా; కృపా+అంభః+రాశి+అగు= దయాసముద్రుడైనట్టి; ఆ+మహాముని= పరశురాముడు; నన్ను కులము+అడుగుటయును= నా కులం అడుగగా; బ్రహ్మాస్త్రమునకున్+కాఁగన్= బ్రహ్మాస్త్రము కొరకు; బొంకునకున్+ఓర్చి= అబద్ధానికి సిద్ధమై; బ్రాహ్మణుఁడను+అని, చెప్పి= బ్రాహ్మణుడిని అని వచించి; తద్+పాదభక్తి+కలిగి= అతనిపై భక్తితో; మెలఁగంగన్= వర్తించగా; అతఁడు= పరశురాముడు; నన్నున్; ఆలఘు, బహువిధ+అస్త్రశస్త్ర సంవేదిగాన్= మహాస్త్రశస్త్ర జ్ఞానం కలవానిగా; శిక్షించెన్= విద్య బోధించాడు.

**తాత్పర్యం:** పరశురాముడి కోపం, బ్రాహ్మణశాపం నా మనసుకు సంతాపాన్ని కలిగిస్తున్నాయి. లేకుంటే నేను కృష్ణార్జునులను లెక్కపెట్టేవాడిని కాను. మహేంద్రపర్వతంపై ఉన్న పరశురాముడివద్ద అస్త్రవిద్య నేర్చుకొందామని వెళ్ళగా ఆయన నా కులం తెలుపుమని అడిగాడు. బ్రహ్మాస్త్రం కొరకు అసత్యానికి కూడా వెనుదీయక నేను బ్రాహ్మణుడిని అని చెప్పాను. భక్తిశ్రద్ధలతో మెలగిన నాకు ఆయన మహాస్త్రశస్త్రవిద్యలను బోధించాడు.

**వ. భార్గవాభిదానంబగు మహాస్త్రంబు లోనుగా ననేక దివ్యాస్త్రంబు లిచ్చెఁ; బదంపడి బ్రాహ్మంబగు నస్త్రంబు నొసంగె నొసంగి సమరంబున నాపత్సమయంబున దీనిం బ్రయోగింపుమని యానతిచ్చె; మఱునాఁ డత్త పోధన సత్తముండు మదీయాంక తలంబున నొఱగి నిద్రించుచుండ నొక్క జంతువు నా క్రింది తొడం దొలిచిన నమ్మహాత్మునకు నిద్రాభంగం బయ్యెడు నని కదలకుండితిఁ దదనంతరంబ మేలుకని యతండు నెత్తుటి వెల్లువఁ గని తత్ప్రకారం బడిగి ఏను జెప్ప విని మద్ధైర్యంబున కచ్చెరువడి నీవు బ్రాహ్మణుండవు గా వెవ్వఁడవని యొత్తి యడుగుటయు వెఱచి సూతసుతుండ నని చెప్పితిఁ జెప్పునప్పు డక్కీటకంబు నాలోకించిన నది యదృష్టపూర్వ వికృతాకారంబై యుండె నర్జున హితంబు గోరి యింద్రుం డమ్మునీంద్రునకు నన్నుఁ దేటపఱిచి యతనిం గోపింపంజేయువాఁడై కీట తనువు దాల్చి యట్లు సేసెంగా నోపు నా సంయమి కోపించి కపటంబున బ్రహ్మాస్త్రంబుఁ బరిగ్రహించి తది నీకు వలయు కాలంబున దోఁపమియు మృత్యువాసన్నంబైనం దోఁచుటయు నాపద ముట్టినయెడ భార్గవాస్త్రంబు దోఁపకుండుట యుం గలిగెడుమని శపించె; నిది జామదగ్న్య కోపంబు తెఱంగు బ్రాహ్మణ శాపంబు తెఱంగెఱింగించెద నాకర్ణింపుము.** **89**

**ప్రతిపదార్థం:** భార్గవ+అభిదానంబు+అగు మహా+అస్త్రంబు లోనుగాను= భార్గవ నామకమైన మహాస్త్రం మొదలుగా; అనేక దివ్య+అస్త్రంబులు+ఇచ్చెన్= పెక్కు దివ్యాస్త్రాలు ఇచ్చాడు; పదంపడి= పిదప; బ్రాహ్మంబు+అగు+అస్త్రంబున్= బ్రహ్మాస్త్రమును; ఒసంగెన్= ఇచ్చాడు; ఒసంగి= ఇచ్చి; సమరంబునన్= యుద్ధంలో; ఆపద్+సమయంబునన్= ఆపద సమయంలో; దీనిన్+ప్రయోగింపుము+అని= దీనిని ఉపయోగించుము అని; ఆనతి+ఇచ్చెన్= ఆజ్ఞాపించాడు; మఱునాడు, ఆ+తపోధన సత్తముండు= పరశురాముడు; మదీయ+అంక తలంబునన్= నా ఒడిలో; ఒరిగి; నిద్రించుచున్+ఉండన్= నిద్రిస్తుండగా; ఒక్క జంతువు= ఒక కీటకం; నా క్రిందితొడన్+తొలిచినన్= నా తొడ క్రిందిభాగాన్ని తొలువగా; ఆ+మహాత్మునకున్= ఆ మహానుభావుడికి; నిద్రాభంగంబు+అయ్యెడున్+అని= నిద్రాభంగం అవుతుందని; కదలక+ఉండితిన్= కదలకుండా ఉన్నాను; తద్+అనంతరంబు+అ మేలుకొని= ఆ తర్వాత మేలుకొని; అతండు= పరశురాముడు; నెత్తుటి వెల్లువన్+కని= రక్తప్రవాహాన్ని చూచి; తద్+ప్రకారంబు+అడిగి= దాన్ని గురించి అడిగి; ఏను చెప్పవిని= నేను(జరిగిన సంగతి) చెప్పగా విని; మత్+ధైర్యంబునకున్+అచ్చెరువడి= నా

ధైర్యానికి ఆశ్చర్యం చెంది; నీవు, బ్రాహ్మణుండవు కావు= నీవు బ్రాహ్మణుడవు కావు; ఎవ్వఁడవు+అని= ఎవరు అని; ఒత్తి+ అడుగుటయున్= గుచ్చి అడుగగా; వెరచి= భయపడి; సూతసుతుండను+అని చెప్పితిన్= సూత పుత్రుడను అని చెప్పాను; చెప్పునప్పుడు= అట్లా చెబుతున్నపుడు; ఆ కీటకంబును+ఆలోకించినన్= ఆ పురుగును వెదకగా; అది= ఆ పురుగు; అదృష్టపూర్వ= మునుపుచూడనట్టి; వికృత+ఆకారంబు+ఐ+ఉండెన్= వికారరూపంతో కనిపించింది; అర్జున హితంబు కోరి= అర్జునుడి మేలుకోరి; ఇంద్రుండు= ఇంద్రుడు; ఆ+మునీంద్రునకున్= ఆ పరశురాముడికి; నన్నున్+తేటపఱిచి= నన్ను తెలిపి; అతనిన్+కోపింపన్+చేయువాఁడై= అతడికి కోపం తెప్పించాలని; కీటతనువు+తాల్చి= కీటకరూపం ధరించి; అట్లు+ చేసెన్+కానోపును= అట్లా చేసి ఉంటాడు; ఆ సంయమి= పరశురాముడు కోపించి; కపటంబునన్= మోసంతో; బ్రహ్మ+ అస్త్రంబున్= బ్రహ్మాస్త్రమును; పరిగ్రహించితి(వి)= గ్రహించావు; అది నీకున్; వలయుకాలంబునన్= అవసరమైనప్పుడు; తోఁపమియున్= గుర్తుకు రాకపోవటం; మృత్యువు+ఆసన్నంబు+ఐనన్= మరణం సమీపించినప్పుడు; తోఁచుటయున్= తలపునకు రావటం; ఆపద, ముట్టిన, ఎడన్= ఆపద సమీపించినప్పుడు; భార్గవ+అస్త్రంబు+తోఁపకుండుటయును= భార్గవాస్త్రం గుర్తుకురాకపోవటం; కలిగెడున్+అని= జరుగుగాక అని; శపించెన్= శాపం పెట్టాడు; ఇది; జామదగ్న్య కోపంబు తెఱంగు= పరశురాముడు కోపించిన విధము; బ్రాహ్మణ శాపంబు తెఱంగు= బ్రాహ్మణుడి శాపవృత్తాంతం; ఎఱింగించెదన్+ఆకర్ణింపుము= తెలుపుతాను వినుము.

**తాత్పర్యం:** భార్గవాస్త్రం మొదలైన అనేక దివ్యాస్త్రాలను ఇచ్చాడు. బ్రహ్మాస్త్రం బోధించి యుద్ధంలో ఆపద సమయంలో మాత్రమే దాన్ని ప్రయోగించుమని చెప్పాడు. ఒకరోజు పరశురాముడు నా ఒడిలో నిద్రిస్తూ ఉండగా ఒక కీటకం నా తొడ క్రిందిభాగాన్ని తొలువసాగింది. గురువుకు నిద్రాభంగం కాకూడదని నేను చలించకుండా అట్లాగే ఉన్నాను. ఆయన నిద్రలేచి ఎదురుగా కారుతున్న రక్తాన్ని చూచి నన్ను ప్రశ్నించాడు. నేను జరిగిన సంగతి చెప్పగానే నా ధైర్యానికి ఆశ్చర్యపడి నీవు బ్రాహ్మణుడవు కావు, ఎవరివని గుచ్చి గుచ్చి అడుగగా, నేను భయపడి సూతపుత్రుడ నన్న నిజాన్ని చెప్పాను. ముందెప్పుడూ చూడని వికారరూపంతో ఉన్న కీటకాన్ని చూచి బహుశా అర్జునుడి మేలుకోరి ఇంద్రుడు ఆ విధంగా చేసి ఉంటాడని నేను ఊహించాను. పరశురాముడు నాపై ఆగ్రహించి మోసంచేసి బ్రహ్మాస్త్రాన్ని గ్రహించావు. అవసరమైనప్పుడు అది గుర్తుకు రాకుండా మరణసమయంలో మాత్రమే స్ఫురిస్తుందని, భార్గవాస్త్రం ఆపదసమయంలో గుర్తుకు రాకుండా పోతుందని శాపం ఇచ్చాడు. ఇక బ్రాహ్మణశాపం గురించి చెబుతాను వినండి.

**విశేషం:** శాంతిపర్వం (1ఆ. 20-24)లో ఈ కీటక ప్రసక్తి మరొకవిధంగా ఉన్నది. తాను గ్రస్తుడనే పేరుగల రాక్షసుడననీ, భృగుపత్నిని అపహరించినందుకు శాపంపొంది కీటక రూపమైనానని, కర్ణుడి కృపావిలోకనంతో నిజరూపం ధరించానని వచించాడు.

**సీ.** **శ్రమమునకై యేను సకలాంబకములు నె । క్కుడు వెస నేయ నయ్యెడకు నొక్క**
**యాఁబెయ్య యుఱికి నా యజ్ఞానమున నంప । తాఁకునఁ గూలుడు దానిఁ గలుగు**
**బ్రాహ్మణుం డధికకోపంబున నిది హోమ । ధేనువత్సం బిట్లు దీని శల్య**
**నిహతంబుఁ జేసితి నీవు నా వచన శ ।ల్యంబున నిహతుండ వగుము నీకు**

**తే.** **సమర మేకాగ్ర నిర్భరోత్సాహవృత్తి । నడవ నరదంబు చక్రంబు పుడమిఁ గ్రుంగ**
**వలయు నెవ్వరు మార్కొని గెలువఁ గోరి । శ్రమము సేసెద వతనిచేఁ జావు మీవు.'** **90**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; శ్రమమునకై= అభ్యాసం కొరకు; సకల+అంబకములున్= అన్ని అమ్ములు; ఎక్కుడు వెసన్+ఏయన్= మిక్కిలివేగంతో వేయగా; ఆ+ఎడకున్= ఆ దిశకు; ఒక్క ఆవు+పెయ్య+ఉఱికి= ఒక ఆవుదూడ పరుగెత్తి; నా అజ్ఞానమునన్= అది ఉన్నట్లు నాకు తెలియనందువల్ల; అంపతాఁకునన్= బాణం వేటుకు; కూలుడున్= చనిపోగా; దానిన్+కలుగు బ్రాహ్మణుండు= దాని యజమానుడు అయిన బ్రాహ్మణుడు; అధికకోపంబునన్= ఎంతో కోపంతో; ఇది; హోమధేనువత్సంబు= యజ్ఞపు ఆవుదూడ; ఇట్లు= ఈ విధంగా; దీనిన్= దీనిని; శల్య నిహతంబున్+చేసితి(వి)= బాణంతో చంపావు; నా వచన శల్యంబునన్= నా వాగ్బాణంతో; నీవు; నిహతుండవు+అగుము= మరణించుము; నీకున్, ఏకాగ్ర నిర్భర+ఉత్సాహవృత్తిన్= శ్రద్ధతో కూడిన ఉత్సాహవర్తనతో; సమరము నడవన్= యుద్ధం సాగగా; అరదంబు చక్రంబు= రథచక్రం; పుడమిన్= నేలలో; క్రుంగవలయున్= దిగబడాలి; ఎవ్వరు మార్కొని= ఎవరిని ఎదుర్కొని; గెలువన్+కోరి= గెలువదలచి; శ్రమము చేసెదవు= శ్రమిస్తున్నావో; అతనిచేన్= అతనిచేత; ఈవు, చావుము= నీవు చనిపొమ్ము.

**తాత్పర్యం:** నేను శిక్షణకొరకై ఎంతో వేగంగా బాణాలు వేస్తుండగా నాకు తెలియకుండానే ఒక ఆవుదూడ నా బాణానికి గురై ప్రాణాలు కోల్పోయింది. దాని యజమాని నాపై కోపగించి, 'హోమధేనువు దూడను బాణంతో చంపావు. అందుకు ప్రతిఫలంగా నా వాగ్బాణంతో నీవు చావు' అని ఉత్సాహంగా యుద్ధం చేస్తున్నపుడు నీ రథచక్రం నేలలో దిగబడుతుందని, ఎవరిని జయించాలని నీవు విలువిద్యను అభ్యసిస్తున్నావో అతడిచేతనే నీవు చస్తావని నన్ను శపించాడు.'

**చ. అనుటయు భీతి వేఁడికొని 'యావులు వేయును నెడ్ల నాఱునూ**
**ఱును రథముల్ శతంబును మెఱుంగుల మొత్తముఁ బోని యంగనా**
**జన శతకంబు దంతి శత సప్తకముం గొని శాంతిఁ బొందవే!'**
**యనినను మానదయ్యెఁ వసుధామరు కోపము తీవ్రరూపమై. 91**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగానే; భీతి, వేఁడికొని= భయంతో అతడిని ప్రార్థించి; ఆవులు వేయునున్= వేయి ఆవులను; ఎడ్లను+ఆఱునూఱును= ఆరునూర్ల ఎద్దులను; రథముల్, శతంబును= నూరు రథాలను; మెరుంగుల మొత్తమున్+పోని= విద్యుల్లతల సమూహాన్ని పోలిన; అంగనాజన శతకంబు= నూరుమంది స్త్రీలను; దంతి, శత, సప్తకమున్= ఏడునూర్ల ఏనుగులను; కొని= గ్రహించి; శాంతిన్+పొందవే= శాంతి చెందుము; అనినన్= అని కోరినా; వసుధా+అమర కోపము= ఆ బ్రాహ్మణుడి కోపం; తీవ్రరూపము+ఐ= ఎంతో అధికమై; మానదు+అయ్యెన్= తగ్గలేదు.

**తాత్పర్యం:** ఆ శాపానికి భయపడి నేను ఆ బ్రాహ్మణుడిని ప్రార్థిస్తూ వేయి ఆవులు, ఆరువందల ఎద్దులు, నూరురథాలు, ఏడువందల ఏనుగులు, వందమంది అందమైన స్త్రీలను స్వీకరించి నన్ను అనుగ్రహించుమని కోరినా అతడి ఆగ్రహం తీవ్రమైనదై ఏమాత్రం తగ్గలేదు.

**వ. మానక యున్న మఱియును. 92**

**ప్రతిపదార్థం:** మానక+ఉన్నన్= తగ్గకుండ ఉండగా; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** అతడి కోపం తగ్గకపోగా, ఇంకా.

క. 'నాకుఁ గల సొమ్ములెల్లను । నీ కిచ్చెద ననుఁ బ్రసాద నిరత కటాక్షా
లోకితుఁ జేయు' మనుడు నతఁ ।'డీ కాఱులు మాను' మనుచు నేఁగెం బెలుచన్. 93

**ప్రతిపదార్థం:** నాకున్+కల సొమ్ములు+ఎల్లను= నావద్ద ఉన్న సొమ్ములన్నీ; నీకున్+ఇచ్చెదన్= నీకు ఇస్తాను; ననున్= నన్ను; ప్రసాద నిరత= అనుగ్రహంతో నిండిన; కటాక్ష+ఆలోకితున్+చేయుము= చూపులు ప్రసరించబడినవాడినిగా చేయుము; అనుడున్= అనినంతనే; అతఁడు= ఆ బ్రాహ్మణుడు; ఈ కాఱులు= ఈ వ్యర్థ వచనాలు; మానుము+అనుచున్= పలుకకుమని; పెలుచన్= కోపంతో; ఏఁగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** 'నా దగ్గరున్న సొమ్ములన్నీ నీకు ఇస్తాను. నీ కరుణాకటాక్షంతో నన్ను అనుగ్రహించుము' అని ఎంత వేడినా 'ఈ వెడ మాటలు వ' ద్దంటూ ఆ బ్రాహ్మణుడు కోపంతో వెళ్ళిపోయాడు.

వ. ఇ ట్లరుగుచు నలుక పెంపునం గన్నుల నిప్పులు రాల మరలి కనుంగొని 'నా పలుకులకు బొంకునుం గలదే? నీకీ దుష్కర్మంబు పరలోకంబున బాధకంబు గాకుండ నిదియ ప్రాయశ్చిత్తం బయ్యెడుం గాక పొమ్ము సూతనందనా! యే నెట్లంటి నట్లగుట దప్ప దరుగు' మనియెం గావున నా జామదగ్న్య; బ్రాహ్మణుల శాపంబులకు వెఱతు సత్యంబ పలికితి నీ యున్న రాజులను నాతోడి సుఖ దుఃఖంబులకుం గలవా రగుటం జేసి కృష్ణార్జునులకు నే వెఱవ నింద్ర యమ వరుణ కుబేరులు వజ్ర దండ పాశ గదా హస్తులై బెట్టుముట్టి నను బెదర నని యాడుదుఁ; దక్కిన వారిం జెప్పనేల? యిప్పుడు బ్రహ్మాస్త్రంబునుం దోఁచుచున్నది; యన్నరుని యున్నెడకు మనరథంబు నడపుము పుడమి జనంబులు మదీయ కోదండ పాండిత్యం బొండొరులకుం జెప్పికొని యచ్చెరువందు చుండునట్లు సేసెద; నమ్మేటి మగని మృత్యు నివాసంబు నొందించెద. 94

**ప్రతిపదార్థం:** ఇట్లు+అరుగుచున్= ఈ విధంగా వెళ్ళిపోతూ; అలుక, పెంపునన్= కోపాధిక్యంతో; కన్నుల నిప్పులు రాల= కన్నులు ఎర్రబడగా; మరలి కనుంగొని= వెనుకకు తిరిగి చూచి; నా పలుకులకున్= నా మాటలకు; బొంకునున్+కలదే?= అబద్ధంకావటం ఉన్నదా?; ఈ దుష్కర్మంబు= ఈ చెడ్డపని; నీకున్, పరలోకంబునకున్ బాధకంబు కాకుండన్= స్వర్గప్రాప్తికి ఆటంకం కాకుండ; ఇదియ ప్రాయశ్చితంబు+అయ్యెడున్+కాక= ఇదే ప్రాయశ్చిత్తం కాగలదు; పొమ్ము= వెళ్ళుము; సూతనందనా!= కర్ణా!; ఏను+ఎట్లు+అంటిన్+అట్లు+అగుట, తప్పదు= నేను అన్న ప్రకారంగా జరుగుట తప్పదు. అరుగుము+అనియెన్= వెళ్ళుము అన్నాడు; కావునన్= అందువలన; ఆ జామదగ్న్య, బ్రాహ్మణుల, శాపంబులకున్= ఆ పరశురామ, బ్రాహ్మణుల శాపాలకు; వెఱతున్= భయపడుతాను; సత్యంబు+అ, పలికితిన్= నిజమే వచించాను; ఈ+ఉన్న రాజులును= ఇక్కడున్న రాజులందరు; నా తోడి, సుఖ, దుఃఖంబులకున్+కలవారు+అగుటన్+చేసి= నాతో సమంగా సుఖదుఃఖాలు పంచుకొనేవారు కావటంవలన; కృష్ణ+అర్జునులకున్= కృష్ణార్జునులకు; ఏన్+వెఱవన్= నేను భయపడను; ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు= దిక్పాలకులు నలుగురూ; వజ్ర, దండ, పాశ, గదా హస్తులు+ఐ= వరుసగా వజ్రాయుధం; యమదండం, పాశం గదలతో కూడినవారై; బెట్టు ముట్టినను= గట్టిగా తాకినా; బెదరను+అని+ఆడుదున్= భయపడను అని అంటున్నాను; తక్కినవారిన్+చెప్పన్+ఏల?= మిగతా వీరుల సంగతి చెప్పటం ఎందుకు?; ఇప్పుడు బ్రహ్మాస్త్రంబునున్+తోఁచుచున్నది= ఇప్పుడు బ్రహ్మాస్త్రం స్ఫురిస్తున్నది; ఆ+నరుని+ఉన్న+ఎడకున్= అర్జును డున్న చోటికి; మన, రథంబు, నడపుము= మన రథాన్ని పోనిమ్ము; పుడమి జనులు= భూమిపై గల సకల జనులు; మదీయ కోదండ, పాండిత్యంబు= నా ధనుర్విద్యా కౌశలం; ఒండు+ఒరులకున్+చెప్పికొని= ఒకరికొకరు చెప్పికొని; అచ్చెరువున్+అందుచుండ+అట్లు చేసెదన్= ఆశ్చర్యపడేటట్లుగా చేస్తాను; ఆ మేటి మగని= ఆ వీరుడైన అర్జునుడిని; మృత్యు నివాసంబున్+ఒందించెదన్= మృత్యువు నివసించే చోటు పొందేటట్లు చేస్తాను - సంహరిస్తాను.

**తాత్పర్యం:** ఆ బ్రాహ్మణుడు వెళ్ళిపోతూ నా వైపు కోపంగా తిరిగి చూచి 'నా మాటలకు తిరుగు లేదు. నీవు చేసిన పని నీ పరలోక ప్రాప్తికి మాత్రం అడ్డురాదు. ఇదే నీకు ప్రాయశ్చిత్తం. కర్ణా! నేను అన్న ప్రకారం జరిగి తీరుతుంది.' అని అన్నాడు. ఆ పరశురామ, బ్రాహ్మణుల శాపాలకు భయపడుతున్నాను కాని, కృష్ణార్జునులకు కాదు. ఈ యోధులందరూ నాతోపాటు సుఖదుఃఖాలు పొందేవారు కాబట్టి నిజం చెప్పుతున్నాను. ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు తమ తమ ఆయుధాలతో వచ్చి తాకినా నాకు భయం లేదు. ఇప్పుడు బ్రహ్మాస్త్రం గుర్తుకు వస్తున్నది. రథాన్ని అర్జునుడున్న వైపు మళ్ళించుము. నా విలువిద్యాకౌశలాన్ని ప్రదర్శించి అతడిని సంహరిస్తాను.

**సీ. కాండ మహా తరంగముల వైరుల ముంచు । విజయాంబురాశికి వేల నగుదు;**
**బాణరశ్ములఁ బరిపంథులఁ బొదివెడు । నర్జునాదిత్యున కభ్ర మగుదు;**
**విశిఖోగ్ర శిఖల విద్విషుల నేర్చు కిరీటి । ఘోర దావాగ్ని కాసార మగుదుఁ;**
**బ్రదర వేగమున నరాతులఁ గూల్చు పా । ర్థాతి వాయువునకు నచల మగుదు;**

**తే. విల్లు వట్టెడు వారికి నెల్ల నెక్కు । డనఁగ నెగడిన గాండీవి నాహవమునఁ**
**దొడరఁ బ్రాణంబులకు నాసపడు లఘు ప్ర । కారులకు వచ్చునే నాకుఁ గాక శల్య!'** **95**

**ప్రతిపదార్థం:** కాండ మహాతరంగముల= బాణాలనే పెద్ద అలలతో; వైరులన్+ముంచు= శత్రువులను ముంచివేసే; విజయ+అంబురాశికిన్= అర్జును డనే సముద్రానికి; వేలన్+అగుదున్= చెలియలికట్ట నవుతాను; బాణ, రశ్ములన్= బాణాలనే కాంతులతో; పరిపంథులన్= శత్రువులను; పొదిలెడు= చుట్టుముట్టే; అర్జున+ఆదిత్యునకున్= అర్జునుడనే సూర్యుడికి; అభ్రము+అగుదున్= మేఘం అవుతాను; విశిఖ+ఉగ్ర, శిఖలన్= బాణాలనే భయంకర జ్వాలలతో; విద్విషులన్+ఏర్చు= శత్రువులను దహించే; కిరీటి ఘోరదావ+అగ్నికిన్= అర్జునుడనే కార్చిచ్చుకు; ఆసారము+అగుదున్= జడివాన కాగలను; ప్రదర వేగమునన్= బాణ వేగంతో; అరాతులన్+కూల్చు= శత్రువులను కూలగొట్టే; పార్థ+అతి, వాయువునకున్= అర్జునుడనే పెనుగాలికి; అచలము+అగుదున్= పర్వతమై నిలుస్తాను; శల్య!= శల్యుడా!; విల్లు పట్టెడువారికిన్+ఎల్లన్= విలుకాండ్రందరిలో; ఎక్కుడు+అనఁగన్, నెగడిన= శ్రేష్ఠుడని పేరు పొందిన; గాండీవిన్= అర్జునుడిని; ఆహవమునన్+తొడరన్= యుద్ధంలో ఎదుర్కొనటానికి; నాకున్+కాక= నాకు తప్ప; ప్రాణంబులకున్+ఆసపడు= ప్రాణాలపై తీపిగల; లఘు ప్రకారులకున్= శక్తిహీనులకు; వచ్చునే?= శక్యమగునా?

**తాత్పర్యం:** తన బాణాలనే పెద్ద అలలతో శత్రువులను ముంచే అర్జునుడనే సముద్రానికి చెలియలికట్టనవుతాను. బాణాలనే కిరణాలతో శత్రువులను ఆక్రమించే విజయుడనే సూర్యుడిని మేఘంలా కప్పివేస్తాను. బాణాలనే మహాభయంకర జ్వాలలతో శత్రువులకాల్చే అర్జునుడనే దావాగ్నిని జడివాననై చల్లార్చుతాను. బాణాల వేగంతో శత్రువుల కూల్చే పార్థుడనే పెనుగాలికి పర్వతాన్నై అడ్డు తగులుతాను. శల్యా! ధనుర్ధారులలో ప్రసిద్ధికెక్కిన అర్జునుడిని యుద్ధంలో ఎదుర్కొనటానికి ప్రాణాలకు సైతం వెనుదీయని నాకు తప్ప ప్రాణాలకు ఆశపడే శక్తిహీనులకు సాధ్యమౌతుందా?

**విశేషం:** అలంకారం - రూపకం.

**వ. అని పలికిన విని యమ్మద్రపతి 'వీని యంతరంగంబు గలంగెఁ; దా నర్జును చేతం జచ్చుట నిర్ణయించె; నెట్లనిన నిట్టి యప్పుడు జనులు దన మీఁదం జాలమి వెట్ట కుండుటకుం గాదె జామదగ్న్య బ్రాహ్మణుల**

**శాపంబులు భూపాలురు విన నుగ్గడించె; నిక్కలంక యే నీ రజ్జులానికి నర్జును గుణ విశేషంబు లెఱింగించి మదం బడంచిన కతంబునం గలిగెఁ; గౌంతేయాగ్రజునకు నా యిచ్చిన వరంబు సఫలం బయ్యె' నని మనంబునం దలంచి సంతోషించె మనుజేశ్వర వినుమా శల్యుండు సెప్పిన యాఖ్యానంబునం జిత్తం బెరియుచునికిం జేసి యా సూతనందనుం డతనితోఁ గనలుచు మఱియు నిట్లనియె. 96**

**ప్రతిపదార్థం:** అని పలికిన విని= (కర్ణుడు) అనగా విని; ఆ+మద్రపతి= శల్యుడు; వీని, అంతరంగంబు, కలంగెన్= ఇతడి మనసు కలత చెందింది; తాను; అర్జునుచేతన్+చచ్చుట= అర్జునుని చేత చనిపోవుటను; నిర్ణయించెన్= నిశ్చయించాడు; ఎట్లు+అనినన్= అది ఎట్లా అంటే; ఇట్టి+అప్పుడు= ఇటువంటి సమయంలో; జనులు= ప్రజలు; తనమీఁదన్= తనపై; చాలమిపెట్టక+ఉండుటకున్+కాదె= అసమర్థతాదోషాన్ని ఆరోపించకూడదనే కదా!; జామదగ్న్య బ్రాహ్మణుల శాపాలు; భూపాలురు= రాజులు; వినన్= వినునట్లుగ; ఉగ్గడించెన్= చెప్పాడు; ఏను= నేను; అర్జునగుణ విశేషంబులు= అర్జునుడి పరాక్రమ విశేషాలు; ఎఱింగించి= తెలిపి; మదంబు+అడంచిన, కతంబునన్= గర్వం అణచటం వలన; ఈ రజ్జులానికిన్= ఈ ఆత్మస్తుతి పరుడైన కర్ణుడికి; ఈ+కలంక= ఈ కలత; కలిగెన్= కలిగింది; కౌంతేయ+అగ్రజునకున్= ధర్మరాజునకు; నా ఇచ్చిన వరంబు= నేను ఇచ్చినమాట; సఫలంబు+అయ్యెన్+అని= నెరవేరింది అని; మనంబునన్+తలంచి= మనసులో అనుకొని; సంతోషించెన్= ఆనందించాడు; మనుజేశ్వర!= ధృతరాష్ట్రమహారాజా!; వినుము; ఆ శల్యుండు చెప్పిన ఆఖ్యానంబునన్= శల్యుడు వినిపించిన హంసకాకీయోపాఖ్యానం వలన; ఆ సూతనందనుఁడు= కర్ణుడు; చిత్తంబు+ఎరియుచున్+ఉనికిన్+చేసి= మనసు బాధపడటంతో; కనలుచున్= కోపిస్తూ; అతనితోన్= శల్యుడితో; మఱియున్+ఇట్లు+అనియెన్= ఇంకా ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడి మాటలు విని శల్యుడు తనలో ఇట్లా అనుకొన్నాడు: ఇతడి మనసు కలతచెంది అర్జునుడి చేత చావు తప్పదన్న నిశ్చయానికి వచ్చాడు. అందుకే తనకు అసమర్థతా దోషం అంటకుండా సైన్యంలోని రాజులముందు పరశురాముడి, బ్రాహ్మణుడి శాపాలు ఏకరువు పెట్టాడు. నేను అర్జునుడి బలవిశేషాలు వెల్లడించి తన గర్వం అణచటంవలననే అతడి మనసు ఇట్లా దుర్బలమైనది. నేను ధర్మజుడికి ఇచ్చిన మాట ఈ విధంగా సఫలమైనది' అనుకొంటూ శల్యుడు ఎంతో సంతోషించాడు. ధృతరాష్ట్ర మహారాజా! వినుము. శల్యుడు వినిపించిన కాకి-హంసల కథతో మనసులో బాధపడుతున్న కర్ణుడు శల్యుడిపై మండిపడుతూ ఇట్లా అనసాగాడు:

### కర్ణుఁడు హంసకాకీయోపాఖ్యానము విని కోపించి శల్యుని దూఱుట (సం. 8-30-3)

**క. 'దృష్టాంతము సెప్పెద నని । కష్టాత్మా! నీవు నన్నుఁ గాకము నరు ను**
**త్కృష్ట మరాళము గాఁగ ని । కృష్టంపుఁ గథఁ జెప్పి; తిది సఖిత్వము తెఱఁగే? 97**

**ప్రతిపదార్థం:** కష్ట+ఆత్మా!= దుర్బుద్ధివైన శల్యుడా!; దృష్టాంతము చెప్పెదను+అని= ఉదాహరణం చెప్పుతానని; నీవు; నన్నున్= నన్ను; కాకము= కాకిగానూ; నరున్= అర్జునుడిని; ఉత్కృష్టమరాళముకాఁగన్= గొప్ప హంసగానూ; నికృష్టంపు+కథన్= హీనమైన కథను; చెప్పితి(వి)= చెప్పావు; ఇది= ఇట్లా చేయటం; సఖిత్వము తెఱఁగే?= స్నేహధర్మమేనా?

**తాత్పర్యం:** 'దుష్టుడవైన ఓ శల్యుడా! ఉదాహరణ చెబుతానని నీవు నన్ను నీచమైన కాకిగా, అర్జునుడిని శ్రేష్ఠమైన హంసనుగా భావించి హీనమైన కథను వచించావు. స్నేహితుడవైన నీకు ఇది న్యాయమా?

**ఆ. నీచులకు బలంబు నెట్టన పరుసని । కాఱు లఱచు చున్కి గాన యిట్లు**
**పలికి తింతఁ జేసి భయ మయ్యెనే నాకు? । నట్టిమాట లింక నాడ కుడుగు. 98**

**ప్రతిపదార్థం:** నీచులకున్= దుర్జనులకు; పరుసని కాఱులు= కఠినమైన వ్యర్థ వాక్కులు; అఱచుచున్+ఉన్కి= పలుకుతుండటం; నెట్టనబలంబు= అడ్డులేని బలం; కానన్= అందుచేతనే; ఇట్లు పలికితి(వి)= ఈ విధంగా మాట్లాడినావు; ఇంతన్+చేసి= ఇంత చేసినా; నాకున్= నాకు; భయము+అయ్యెనే?= భయం కలిగిందా?; అట్టిమాటలు= అటువంటి (వ్యర్థమైన) మాటలు; ఇంకన్+ఆడక+ఉడుగు(ము)= ఇంక పలుకవద్దు.

**తాత్పర్యం:** నీచులకు వ్యర్థమైన నిష్ఠురవాక్కులు పలుకుతుండటమే బలం. అందువల్లనే నీవు ఈ విధంగా పలికావు. అయినా నీ మాటలవల్ల నాకు భయం కలిగిందా? లేదే. వాటిని కట్టిపెట్టుము.

**క. అడిగితినే నిను నా క । వ్వడి భుజబల మెట్టిదని? యవారణ నీ వి**
**ప్పుడు నృపు లెల్లను విన వా । విడిచి పొగడె దిట్లు వంది విధమున నతనిన్. 99**

**ప్రతిపదార్థం:** ఆ కవ్వడి, భుజబలము+ఎట్టిది+అని= అర్జునుడి పరాక్రమం ఎంతటి దని; నినున్= నిన్ను; అడిగితినే?= అడిగానా?; నీవు+ఇప్పుడు= నీవు ఇప్పుడు; నృపులు+ఎల్లను, వినన్= రాజులందరు వినేటట్లుగా; వా విడిచి= నోరు విప్పి; అవారణన్= అడ్డులేక; వంది విధమునన్= భట్టువలె; అతనిన్= అర్జునుడిని; ఇట్లు పొగడెదు= ఈ విధంగా పొగడుతున్నావు.

**తాత్పర్యం:** అర్జునుడి పరాక్రమం గురించి నేను నిన్ను అడిగానా? వంది వలె అడ్డులేకుండా రాజులందరిముందు అతడిని పొగడుతున్నావు.

**చ. అని మొన శత్రులం బొగడు టారయ మూర్ఖతగాదె? యిట్టి దు**
**ర్జనుల సహింతురే? పెలుచఁ జంపక; సైరణసేయుకాల మై**
**నినుఁ దెగఁ జూడనైతి ధరణీపతి కయ్యముపై భరంబునన్**
**గొనకొని సూతకృత్యమునకుం దగఁ బంచినవాఁడు గావునన్?' 100**

**ప్రతిపదార్థం:** అనిమొనన్= యుద్ధరంగంలో; శత్రులన్+పొగడుట= వైరులను స్తుతించటం; అరయన్= చూడగా; మూర్ఖతకాదె?= అవివేకం కాదా?; ఇట్టి దుర్జనుల= ఇటువంటి దుష్టులను; పెలుచన్+చంపక= ఆగ్రహంతో చంపకుండా; సహింతురే?= ఊరుకొంటారా?; ధరణీపతి= దుర్యోధనుడు; కయ్యముపై భరంబునన్= యుద్ధభారంతో; గొనకొని= పూనుకొని; సూతకృత్యమునకున్+తగన్= సారథిగా ఉండటానికి; పంచినవాడు, కావునన్= పంపించాడు కాబట్టి; సైరణ, చేయుకాలము+ఐ= సహింపవలసిన సమయం కావటంతో; నినున్+తెగన్+చూడన్+ఐతిన్= నిన్ను చంపలేకపోతున్నాను.

**తాత్పర్యం:** ఆలోచించి చూస్తే యుద్ధానికి ముందు శత్రువులను పొగడుట మూర్ఖత కదా! ఇలాంటి దుష్టులను సంహరించకుండా ఎవరైనా సహిస్తారా? కాని, దుర్యోధనుడు యుద్ధభారాన్ని వహించి, సూతకృత్యానికి నిన్ను పంపినాడు కనుక, ఇది నిన్ను సహించవలసిన సమయం కనుక, నిన్ను చంపకుండా ఉన్నాను.

**వ. అని వెండియు. 101**

**తాత్పర్యం:** అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'అకుటిలుం డగు నాకు నత్యంత కుటిల । వృత్తి సహితంబు సేసెద విత్తెఱంగు**
**మిత్త్ర వంచన మారయ మైత్రి సప్త । పద కృతోద్భూతి యనియెడు పలుకు వినవె? 102**

**ప్రతిపదార్థం:** అకుటిలుండు+అగు నాకున్= నిర్మలుడైన నాకు; అత్యంత కుటిలవృత్తి సహితంబు= ఎంతయో మోసంతోకూడినదానిని; చేసెదవు= చేస్తున్నావు; ఈ+తెఱంగు= ఈ పద్ధతి; ఆరయన్= విచారించి చూడగా; మిత్రవంచనము= మిత్రద్రోహం; మైత్రి= స్నేహం; సప్తపదకృత+ఉద్భూతి= ఏడు మాటలవలననే ఏర్పడుతుంది; అనియెడు పలుకు= అన్న మాట; వినవె?= వినలేదా?

**తాత్పర్యం:** ఏడు మాటలతోనే స్నేహం ఏర్పడుతుందని వినలేదా? విచారించిచూస్తే మంచివాడినైన నన్ను ఎంతో మోసగించి మిత్రద్రోహానికి పాల్పడుతున్నావు.

**విశేషం:** 'సఖ్యం సాప్తపదీనం' అని ప్రసిద్ధి. కలిసి ఏడు అడుగులు నడిచినా, ఏడు మాటలు మాట్లాడినా అపరిచితుల మధ్య స్నేహభావం ఏర్పడుతుంది.

**క. జను లెట్టిది మిత్త్రవిధం । బని చెప్పుదు రట్టి చంద మఖిలము దుర్యో**
**ధనునందుఁ గలదు నా యెడ । మన మూఱడియుండు నా కమంద ప్రీతిన్. 103**

**ప్రతిపదార్థం:** మిత్రవిధంబు= స్నేహపద్ధతి; ఎట్టిది అని= ఎటువంటిదని; జనులు చెప్పుదురు= లోకులు చెపుతుంటారో; అట్టి చందము+అఖిలము= ఆ విధం (స్నేహభావం) అంతా; నా+ఎడన్= నాపై; దుర్యోధనునందున్ కలదు= దుర్యోధనుడిలో ఉన్నది; అమందప్రీతిన్= అట్టి అధికానందంతో; నాకు; మనము+ఊఱడి, ఉండున్= మనసు ఊరటగా ఉంటుంది.

**తాత్పర్యం:** లోకుల దృష్టిలో స్నేహం అనేది ఎటువంటిదో, అటువంటి స్నేహభావం అంతా దుర్యోనుడికి నాపై ఉన్నది. ఆ మైత్రిని తలచుకొని నేను ఎంతో ఆనందిస్తుంటాను.

**క. జను లెట్టిది శత్రు విధం । బని చెప్పుదు రట్టి చంద మారయఁగా దు**
**ర్జనుఁడ వగు నీకు నాయెడ । వినుము కలిగె; దీన మనసు విచ్చెం గుటిలా! 104**

**ప్రతిపదార్థం:** కుటిలా!= దుర్జనుడా!; ఎట్టిది, శత్రువిధంబు+అని= ఎటువంటిది శత్రుత్వం అని; జనులు చెప్పుదురు= లోకులు చెపుతుంటారో; అట్టిచందము= ఆ శత్రుభావం; ఆరయఁగాన్= చూడగా; దుర్జనుఁడవు+అగు నీకున్= చెడ్డవాడివైన నీకు; నా ఎడన్ కలిగెన్= నా పై కలిగింది; వినుము; దీనన్ మనసు విచ్చెను= ఈ ప్రవర్తన వలన నా మనసు కలత చెందింది.

**తాత్పర్యం:** వైరం అన్నది ఎట్లా వుంటుందని లోకులు చెపుతుంటారో అటువంటి శత్రుభావం దుష్టుడివైన నీకు నాపై ఉన్నది. దీనివలన నా మనసు ఎంతో బాధపడుతున్నది.

**ఉ. కావున నీకు నప్రియముఁ గౌరవ రాజునకుం బ్రియంబునుం**
**గా విధి మెచ్చ బాహుబల గర్వ మఖర్వముగాఁగ లక్ష్మికిం**
**జేవయుఁ గీర్తి కున్నత విజృంభణముం గలుగన్ ముకుంద గాం**
**డీవులఁ దాఁకి గెల్చెదఁ గడింది మగంటిమి యుల్లసిల్లఁగన్. 105**

**ప్రతిపదార్థం:** కావునన్= అందుచేత; బాహుబల గర్వము= భుజబలదర్పం; అఖర్వముకాఁగన్= అతిశయించగా; లక్ష్మికిన్+ చేవయున్= లక్ష్మికి బలం; కీర్తికిన్+ఉన్నత విజృంభణమున్= యశస్సుకు మిక్కిలి వ్యాప్తి; కలుగన్= కలిగేటట్లుగా; విధి మెచ్చన్= విధి మెచ్చేటట్లుగా; నీకున్+అప్రియమున్= నీకు అప్రీతిని; కౌరవరాజునకున్+ప్రియంబునన్= దుర్యోధనుడికి సంతోషం; కా(న్)= అయ్యేటట్లుగా; ముకుంద, గాండీవులన్= కృష్ణార్జునులను; తాఁకి= ఎదుర్కొని; కడింది మగంటిమి+ ఉల్లసిల్లఁగన్= గొప్ప పౌరుషం ఉప్పొంగగా; గెల్చెదన్= జయిస్తాను.

**తాత్పర్యం:** కాబట్టి మిత్రుడైన దుర్యోధనుడికి ప్రియం, శత్రువైన నీకు అప్రియం కలిగేటట్లుగా నా బాహుబలగర్వం అతిశయించగా, విధి మెచ్చేటట్లుగా, లక్ష్మికి బలం, కీర్తికి ఉన్నతి కలిగేటట్లుగ కృష్ణార్జునులను ఎదుర్కొని ఓడిస్తాను. నా పౌరుషం ఉప్పొంగగా గెలుస్తాను.

**వ. అని పలికి మఱియును. 106**

**తాత్పర్యం:** కర్ణుడు ఈ విధంగా పలికి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'భండనంబునఁ బార్థుచేఁ బడక నేఁడు । మేలుచేయైతి నేనియు మృత్యువునకు**
**నెన్నఁడును నగపడ నాకు; నివ్విధంబు । సందియము లేక చిత్తంబునందుఁ దోఁచె. 107**

**ప్రతిపదార్థం:** నేఁడు= ఈరోజు; భండనంబునన్= యుద్ధంలో; పార్థుచేన్+పడక= అర్జునుడిచే ఓడిపోక; మేలుచేయి+ఐతిన్+ ఏనియున్= పై చేయి కలవాడిని అయితే(గెలిస్తే); మృత్యువునకున్= మరణానికి; ఎన్నఁడునున్+అగపడన్= ఎప్పుడూ అగుపించను; ఈ విధంబు= ఈ విషయం; సందియము లేక= నిస్సందేహంగా; నాకున్; చిత్తంబునందున్+తోఁచెన్= మనసులో అనిపిస్తున్నది.

**తాత్పర్యం:** ఇప్పుడు అర్జునుడిని యుద్ధంలో గెలవగలిగితే ఇంక ఎప్పుడూ మృత్యువు నా దరి చేరదని నా మనసుకు దృఢంగా తోస్తున్నది.

**విశేషం:** మేలు చేయైతినేనియు జాతీయం.

**చ. వినుత మహాస్త్రముల్ వఱపి విక్రమ సంపద నాకుఁ జూపు న**
**ర్జున భుజలీల కోర్చెద; వసుంధరఁ జక్రము గ్రుంగి నా రథం**
**బునకు నవార్యమై యెడరు పుట్టక తక్కిన శల్య! చూడుమీ!**
**నను విశిఖావళీ విలసనంబున నాతని యేపు మాపెదన్. 108**

**ప్రతిపదార్థం:** శల్య!= ఓ శల్యుడా!; వినుత, మహా+అస్త్రముల్+వఱపి= ప్రసిద్ధమైన మహాస్త్రములను ప్రయోగించి; నాకున్= నాకు; విక్రమ సంపద చూపు= పరాక్రమాన్ని చూపునట్టి; అర్జునుడి, భుజలీలకున్+ఓర్చెదన్= అర్జునుడి భుజబల విలాసాన్ని ఎదుర్కొని నిలుస్తాను; వసుంధరన్+చక్రము క్రుంగి= చక్రం భూమిలో దిగబడి; నా రథంబునకున్+అవార్యమై= నా రథానికి తప్పనిదై; ఎడరు పుట్టక తక్కినన్= ఆపద కలుగకుండా ఉంటే; విశిఖ+ఆవలీ విలసనంబునన్= బాణప్రయోగ చాతుర్యంతో; ఆతని= అర్జునుడి యొక్క; ఏపు, మాపెదన్= గర్వం అణచుతాను; ననున్ చూడుమీ!= (అప్పుడు) నా బలం చూడుము.

**తాత్పర్యం:** శల్యా! ప్రసిద్ధ మహాస్త్రాలను ప్రయోగించే అర్జునుడి పరాక్రమాన్ని అడ్డుకొని నిలుస్తాను. నా రథచక్రం భూమిలో క్రుంగే ఆపద సంభవించకపోతే నా బాణప్రయోగచాతుర్యంతో అర్జునుడి గర్వం అణచి తీరుతాను.

**విశేషం:** యుద్ధం చేస్తుంటే రథచక్రం భూమిలో క్రుంగిపోతుందన్న బ్రాహ్మణ శాపభయం కర్ణుడిని వెన్నాడుతున్నది.

**వ. నీకు వెఱపింప నయ్యెడు కొలంది వారిని వెఱపింపుము; కర్ణుండు విక్రమంబునకుం గీర్తికి నా స్పదంబగుటకు జనియించిన వాఁడు గాని భయంబు గొనుటకుం గాదు కురుపతి సన్నిధి నీవు సారథ్యంబునకుం బూనుచుండి పలికికొన్న బాసకతంబున బ్రదికిపోయి' తనిన విని శల్యుం డీ 'యనర్థ ప్రలాపంబులం బ్రయోజనం బేమి? వినుము; కర్ణ కర్ణులు వేవురైనం గిరీటిని గెలువం జాలుదురే?' యనుటయు నతండు గినుక నెఱ్ఱనైన కన్నుంగవతోడి నవ్వు నవ్వుచు నిట్లను 'ధృతరాష్ట్ర మహీపతి సన్నిధి నుత్తమ ద్విజుల గోష్ఠి నఖిల దేశాచార విదుండైన వృద్ధ బ్రాహ్మణుండు సెప్పవింటి బాహ్లిక దేశంబునవారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు సేసి నగ్నులై యసంగత దురాలాపంబు లాడుచుఁ దిరుగుదు రని తొడంగి యనేక ప్రకారంబుల బాహ్లిక దేశ నిందోపన్యాసంబు సేసె; నట్టి బాహ్లికుల కొడయుండవు తత్కృతంబులగు పుణ్యపాపంబుల నాఱవపాలు నిన్నుం జేరు; నట్లుంగాక వారి యనాచారంబులు వారింపమిం జేసి యా కల్మషంబు లెల్లను నిన్నుం బొందు; బాహ్లికుల కంటెను మద్రదేశ జాతు లవినీతులని యార్యులు సెప్పుదురు; ని న్నేమి సెప్పంగల? దింతవట్టు నెఱింగి నాలుక యడంచి యుండు' మనవుడు నమ్మద్రేశ్వరుండు. 109**

**ప్రతిపదార్థం:** నీకు వెరపింపన్+అయ్యెడు, కొలంది వారిని= నీవు భయపెట్ట శక్యమైన వారిని; వెఱపింపుము= భయపెట్టుము; కర్ణుండు= కర్ణుడు(తాను); విక్రమంబునకున్= పరాక్రమానికి; కీర్తికిన్+ఆస్పదంబు+అగుటకున్= కీర్తికి నెలవైనవాడు అగుటకు; జనియించినవాఁడు= జన్మఎత్తినవాడు; కాని; భయంబు+కొనుటకున్+కాదు= భయపడటానికి కాదు; కురుపతి సన్నిధిన్= దుర్యోధనుని సమక్షంలో; నీవు సారథ్యంబునకున్+పూనుచుండి= నీవు సూతకృత్యానికి అంగీకరిస్తూ; పలికికొన్న బాస కతంబునన్= ఆడిన మాట కారణంగా; బ్రదికిపోయితి(వి)= రక్షింపబడ్డావు; అనినన్= అనగా; శల్యుండు విని= శల్యుడు ఆ మాటలు విని; కర్ణ!= ఓ కర్ణా!; ఈ అనర్థప్రలాపంబులన్= ఈ వ్యర్థవాక్కులచేత; ప్రయోజనంబు+ఏమి?= ఏమిలాభం?; వినుము= విను; కర్ణులు వేవురు+ఐనన్= వేయిమంది కర్ణులైనా; కిరీటిని గెలువన్+చాలుదురే?= అర్జునుడిని గెలువగలరా!; అనుటయున్= అనగానే; అతండు= కర్ణుడు; కినుకన్+ఎఱ్ఱనైన= కోపంతో ఎర్రబడిన; కన్ను+కవతోడి; రెండు కనులతో; నవ్వు నవ్వుచున్; ఇట్లు+అనున్= ఇట్లా అంటున్నాడు; ధృతరాష్ట్ర మహీపతి సన్నిధిన్= ధృతరాష్ట్ర మహారాజు ఎదుట; ఉత్తమ ద్విజుల గోష్ఠిన్= బ్రాహ్మణోత్తముల సభలో; అఖిలదేశ+ఆచార విదుండు+ఐన= అన్ని దేశాచారాలు ఎరిగిన; వృద్ధబ్రాహ్మణుండు= ముసలి బ్రాహ్మణుడు; చెప్పన్ వింటిన్= చెప్పగా విన్నాను; బాహ్లిక దేశంబునవారు= బాహ్లికదేశ ప్రజలు; గోమాంసంబు నంజికొని= ఆవుమాంసం నంజుకొంటూ; మద్యపానంబు+చేసి= మద్యం సేవించి; నగ్నులు+ఐ= వస్త్రహీనులై; అసంగత దుస్+ఆలాపంబులు+ఆడుచున్= అనవసరమైన చెడుమాటలు పలుకుతూ; తిరుగుదురు+అని= తిరుగుతుంటారు అని; తొడంగి= ప్రారంభించి; అనేక ప్రకారంబులన్= అనేక విధాలుగా; బాహ్లికదేశ నింద+ఉపన్యాసంబు+చేసెన్= బాహ్లిక దేశీయులను నిందిస్తూ మాట్లాడాడు; అట్టి బాహ్లికులకున్+ఒడయుండవు= అటువంటి బాహ్లిక దేశస్థులకు రాజవు; తద్+కృతంబులు+అగు పుణ్యాపాపంబులన్= వారు చేసే పుణ్యాపాపాలలో; ఆఱవపాలు= ఆరవభాగం; నిన్నున్+చేరున్= నీకు చెందుతాయి; అట్లున్+కాక= అంతేకాకుండా; వారి అనాచారంబులు వారింపమిన్+చేసి= వారి చెడుపనులు ఆపనందువలన; ఆ కల్మషంబులు+ఎల్లను= ఆ పాపాలన్నీ; నిన్నున్+పొందున్= నీకు చెందుతాయి; బాహ్లికుల కంటెను= బాహ్లిక దేశస్థులకన్నా; మద్రదేశజాతులు= మద్రదేశ ప్రజలు; అవినీతులు+అని= నీతి మాలిన వారని; ఆర్యులు+చెప్పుదురు= విజ్ఞులు చెబుతారు; నిన్నున్+ఏమి+చెప్పన్+ కలదు?= నీ గురించి ఇంక ఏం చెప్పాలి?; ఇంతవట్టున్+ఎఱింగి= ఇదంతా గ్రహించి; నాలుక+అడంచి+ఉండుము= మాట్లాడక ఊరుకో; అనవుడున్= అని అనగా; ఆ+మద్ర+ఈశ్వరుండు= ఆ మద్రరాజగు శల్యుడు.

**తాత్పర్యం:** నీవు భయపెట్టగలిగిన వారిని భయపెట్టు. పరాక్రమానికి, కీర్తికి పాత్రుడు కావటానికే కర్ణుడు పుట్టాడుకాని, భయపడటానికి కాదు. కురుపతి యెదుట నీవు నా సారథ్యానికి అంగీకరిస్తూ చెప్పిన మాటకారణంగా బ్రతికి పోయావు' అని, కర్ణుడు అనేసరికి, శల్యుడు 'కర్ణా! ఈ వ్యర్థప్రలాపాలవల్ల ప్రయోజనం ఏముంది? విను. వెయ్యిమంది కర్ణులైనా అర్జునుని గెలువగలరా?' అన్నాడు. అందుకు కర్ణుడు కోపంతో ఎరుపెక్కిన కళ్ళతో నవ్వుతూ 'ధృతరాష్ట్రుని సమక్షంలో జరిగిన బ్రాహ్మణోత్తముల సభలో - అన్ని దేశాల ఆచారాలను తెలిసిన ఒక వృద్ధ బ్రాహ్మణుడు, బాహ్లిక దేశప్రజలు ఆవుమాంసాన్ని నంజుకుంటూ, మద్యపానంచేసి, అసభ్యంగా మాట్లాడుతూ, అంగమొలతో తిరుగుతుంటారని బాహ్లికులను అనేక విధాల నిందిస్తూ మాట్లాడాడు. అది నేను విన్నాను. ఆలాంటి బాహ్లికులకు రాజువైన నీకు, వాళ్ళ పాపపుణ్యాలలో ఆరవభాగం చెందుతుంది. అంతేకాదు. వాళ్ళు చేసే చెడుపనులను ఆపనందువల్ల, వాళ్ళ పాపాలు కూడ నీకు అంటుకుంటాయి. బాహ్లికుల కంటె మద్రదేశప్రజలు మరీ అవినీతిపరులు అని విజ్ఞులంటారు. ఇంతకంటె నిన్ను గూర్చి చెప్పటానికి ఇంకేముంది? ఇది గుర్తుంచుకొని నోరుమూసుకో. ఊరుకో' అనగానే ఆ మద్రపతి----

**విశేషం:** కోపంతో ఎర్రబడిన కనులతో నవ్వుతూ అన్నాడు అనటంలో శల్యుడిపై వెకిలింత గోచరమవుతున్నది. తిక్కన వివిధ రకాలైన నవ్వులను పేర్కొనటం మనస్తత్వ వివేచనకు నిదర్శనం. నాలుక యడంచి యుండుము (నోరుమూసుకో) - చక్కని నుడికారం

(1) తిక్కనగారు ఆయాపాత్రల మనోభావాల ప్రకటనకు, ఆ యా సందర్భాల్లో అనేక విధాలైన నవ్వులను వర్ణించాడు. నవ్వును నవరసాలఖనిగా చేశాడు. ఇక్కడ కర్ణుడు తన కోపాన్ని వ్యక్తం చేస్తూ, శల్యుని నీతి నియమాలు లేని స్థితిని వెక్కిరిస్తూ ఎరుపెక్కిన కన్నుగవతో నవ్వాడని అనటం విశేషం.

(2) నోరుమూసుకో అనటానికి - నాలుక యడంచి యుండుము అన్నది నాజూకైన వాక్యవిన్యాసం.

**క. 'లావులు రథాతిరథ సం। ఖ్యావేళం దెలియఁ జెప్పెఁగాదే భీష్ముం**
**డా వచనమ్ములు మనమున। భావింపుము క్రోధ మేల బలియుఁడ! నీకున్? 110**

**ప్రతిపదార్థం:** బలియుఁడ!= బలవంతుడవైన కర్ణా!; రథ+అతిరథ సంఖ్యావేళన్= రథికులను; అతిరథులను నిర్ణయించే సమయంలో; భీష్ముండు; లావులు= అందరి బలములు; తెలియన్+చెప్పెన్+కాదే!= వివరించినాడు కదా!; ఆ వచనమ్ములు= ఆ మాటలు; మనమునన్ భావింపుము= తలపునకు తెచ్చుకొమ్ము; నీకున్ క్రోధము+ఏల?= నీకు కోప మెందుకు?

**తాత్పర్యం:** బలవంతుడవైన కర్ణా! భీష్ముడు కౌరవసేనలోని వీరులను రథాతిరథులుగా నిర్ణయించే సమయంలో, ఎవరెవరి కొలది ఏమిటో తెలియచెప్పాడు గదా. ఆ మాటలు గుర్తుతెచ్చుకో. నీకు కోపం ఎందుకు?

**విశేషం:** భీష్ముడు కర్ణుని అర్ధరథుడుగా లెక్కించిన విషయాన్ని పరోక్షంగా గుర్తుచేస్తున్నాడు శల్యుడు.

**తే. విడుతు రాప్తుల బంధుల వెలలుగన్న। నమ్ముదురు కులకాంతల నంగదేశ**
**జనితులగువారు విభుఁడ వజ్జనుల కిట్టు। లేలొకో నొద్ద చరితంబు లెన్న నీకు? 111**

**ప్రతిపదార్థం:** అంగదేశ జనితులు+అగువారు= అంగదేశంలో జన్మించినవారు; ఆప్తులన్+బంధులన్= స్వజనులను; విడుతురు= విడిచిపెడతారు; వెలలు కన్నన్= ధర(బేరం) కుదిరితే; కులకాంతలన్= కులస్త్రీలను; అమ్ముదురు= అమ్మితారు; ఆ+జనులకున్=

అట్టి అంగదేశీయులకు; విభుడవు= రాజవు; ఇట్టులు= ఈ విధంగా; నీకు; ఒడ్ల చరితంబులు+ఎన్నన్= ఇతరుల నడవడి గురించి మాట్లాడటం; ఏల+ఒకో?= ఎందులకు?

**తాత్పర్యం:** అంగదేశస్థులు ఆత్మబంధువులను విడనాడుతారు. కులస్త్రీలను అమ్మటానికి కూడా వెనుదీయరు. ఆలాంటి అంగదేశానికి రాజువైన నీకు ఇతరుల దోషాలను ఎన్నటం భావ్యమేనా?

**క. పరదోషము సెప్పఁగ నే । ర్తురు గా, కాత్మీయమైన దోషంబు మదిం**
**బరికింపఁగ నధములు నే । ర్తురె? తలఁపక యంటి వలుకతో నుండకుమీ!' 112**

**ప్రతిపదార్థం:** అధములు= నీచులు; పరదోషము, చెప్పగ నేర్తురు కాక= ఇతరుల దోషాలనే ఎత్తిచూపుతారు కాని; ఆత్మీయము+ఐన దోషంబు= తమ తప్పును; మదిన్+పరికింపఁగన్, నేర్తురె?= మదిలో గుర్తించగలరా; తలఁపక+అంటి(వి)= ఆలోచించకుండా మాట్లాడుతున్నావు; అలుకతోన్+ఉండకుమీ= కోపం తెచ్చుకొనవద్దు.

**తాత్పర్యం:** అధములు ఇతరుల దోషాలను ఏకరువు పెడుతుంటారు కాని స్వీయదోషాలను గుర్తించరు. కోపం తెచ్చుకొని అనాలోచితంగా మాట్లాడకుము'.

**వ. అని యుల్లసంబాడి మఱియును. 113**

**ప్రతిపదార్థం:** అని+ఉల్లసంబు+ఆడి= అని పరిహసించి; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** అని శల్యుడు కర్ణుని పరిహసించి ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'సకల దేశములను సన్మార్గ వర్తులు । గలరు దుష్టతతియుఁ గలిగియుండు;**
**మది నెఱుంగ నేర్చు మధ్యస్థు లదియును । నదియు నుగ్గడింతు రెదురు మెచ్చ. 114**

**ప్రతిపదార్థం:** సకల దేశములను= అన్ని దేశాలలోను; సన్మార్గ వర్తులున్= మంచిమార్గంలో నడిచేవారు; కలరు= ఉన్నారు; దుష్టతతియున్= దుర్మార్గుల సమూహాలను; కలిగిఉండు= కలిగిఉంటారు; మదిన్= మనస్సులో; ఎఱుంగనేర్చు= తెలుసుకొన గలిగిన; మధ్యస్థులు= పక్షపాతం లేనివారు; ఎదురు మెచ్చన్= ఎదుటివారు మెచ్చునట్లుగా; అదియునున్+అదియును= ఆ రెండు విధముల (సజ్జన దుర్జనుల) గురించి; ఉగ్గడింతురు= చెపుతారు.

**తాత్పర్యం:** మంచిమార్గంలో నడుచుకొనేవారు, దుర్మార్గులు అన్నిదేశాల్లోనూ ఉన్నారు. దీన్ని తెలుసుకోగలిగిన పక్షపాతరహితులు, ఎదుటివారు మెచ్చుకొనే విధంగా ఉభయులను గూర్చి చెపుతారు. (నీ వలె ఒకరిని గురించి మాత్రమే మాట్లాడరు)

**వ. ఒకదేశంబు దాఁ గీడ యగుట కలుగునే? యట్లుం గాక సదాచార దురాచారంబులు దైవం బెఱింగెడు; నీ వనాత్మజ్ఞుండ వూరకుండు మనియె; నట్లయ్యిరువురు వివాదంబు సేయుట యాలించి చేరి కౌరవపతి సఖీభావం బుపన్యసించి రాధేయు రాజత్వ గౌరవంబు గొనియాడి మద్రవిభుని వారించిన నా సూత నందనుండు నగుచు శల్యునుద్దేశించి పొద పొద రథమ్ము పోనిమ్ము పోనిమ్మని పలికె; నట్లలిగి శల్యుండు**

**సస్మితుం డగుచు వెండియు నర్జును నుగ్గడించి కృష్ణుండు సారథియును గాండీవంబు సాధనంబునునై యప్రతిహత మనోరథుం డగు నా రథికు తోడం బెనంగ నోపితేని నీవు మాకెల్లను రాజ వమ్మేటి మగని యరదంబు మన మొగ్గరంబు సొచ్చి చిక్కు వఱుచుట గలుగు నని ఎఱుంగ నయ్యెడు మన మేమఱక యుండవలయు; నీ తోఁచు దుర్నిమిత్తంబు లనుసంధింపుము. 115**

**ప్రతిపదార్థం:** ఒక దేశంబు= ఏ దేశమైనా; తాన్= అది; కీడు+అగుట కలుగునే?= చెడ్డదే అయి ఉండునా?; అట్లున్+కాక= అంతేకాక; సదాచార దురాచారంబులు= మంచి చెడులు; దైవంబు+ఎఱింగెడున్= దైవానికి తెలుసు; నీవు+అనాత్మజ్ఞుండవు= నీవు ఆత్మజ్ఞానం లేనివాడివి; ఊరకుండుము+అనియెన్= మాట్లాడవద్దు అన్నాడు; అట్లు+ఆ+ఇరువురు= ఆ విధంగా కర్ణ శల్యులు ఇద్దరూ; వివాదంబు చేయుట= వాదిస్తూ ఉండటం; కౌరవపతి= దుర్యోధనుడు; ఆలించి= విని; చేరి= వారిని సమీపించి; సఖాభావంబు+ఉపన్యసించి= స్నేహభావాన్ని బోధించి; రాధేయు రాజత్వగౌరవంబు= కర్ణుడి రాజత్వముయొక్క గొప్పతనాన్ని; కొనియాడి= ప్రశంసించి; మద్రవిభుని, వారించినన్= శల్యుడిని అడ్డుకొనగా; ఆ సూతనందనుండు= ఆ కర్ణుడు; నగుచున్= నవ్వుతూ; శల్యున్+ఉద్దేశించి= శల్యుడిని చూచి; పొద పొద= పద పద; రథమ్ము పోనిమ్ము పోనిమ్ము= రథాన్ని పోనీ పోనీ; అని పలికెన్= అని అన్నాడు; శల్యుండు; అట్లు+అరిగి= ఆ విధంగా బయల్దేరి; సస్మితుండు+అగుచున్= నవ్వుతున్నవాడై; వెండియున్+అర్జునున్+ఉగ్గడించి= మళ్ళీ అర్జునుడిని పొగడి; కృష్ణుండు సారథియును= కృష్ణుడు రథసారథిగా; గాండీవంబు సాధనంబునున్+ఐ= గాండీవం ధనుస్సుగా కలిగి; అప్రతిహతమనోరథుండు+అగు= అడ్డులేని కోరికగలవాడైన; ఆ రథికు తోడన్= అర్జునుడితో; పెనంగన్+ఓపితి(వి)+ఏని= పోరాడగలిగితే; నీవు, మాకున్+ఎల్లను రాజవు= నీవే మా అందరి విభుడవు; ఆ+మేటి మగని+అరదంబు= ఆ మహావీరుడి రథం; మన మొగ్గరంబు చొచ్చి= మన వ్యూహం ప్రవేశించి; చిక్కు పఱుచుట కలుగును+అని= చిక్కులు కలిగిస్తుందని; ఎఱుంగన్+అయ్యెడున్= గోచరిస్తున్నది; మనము+ఏమరక+ ఉండవలయున్= మనం జాగ్రత్తగా ఉండాలి; ఈ తోఁచు దుర్నిమిత్తంబులు= ఈ కనబడుతున్న అపశకునాలు; అనుసంధింపుము= పరిశీలించుము.

**తాత్పర్యం:** 'ఒక దేశం పూర్తిగ చెడునే కలిగి ఉంటుందా? అంతేకాదు. ఏవి సదాచారాలో ఏవి దురాచారాలో ఒక్క దేవుడికే తెలుసు. నీవు ఆత్మజ్ఞానశూన్యుడివి. ఊరుకో' అన్నాడు. దుర్యోధనుడు ఆ యిద్దరి వాదులాట విని, చేరువగా వచ్చి, స్నేహభావం ఎలా ఉండాలో తెలియచెప్పి, కర్ణుడి రాజత్వగౌరవాన్ని కొనియాడి, శల్యుడు తన అధిక ప్రసంగాన్ని పొడిగించకుండా ఆపాడు. అప్పుడు కర్ణుడు నవ్వుతూ 'పద పద', 'రథాన్ని పోనీ పోనీ' అని శల్యుణ్ణి త్వరపెట్టాడు. శల్యుడు రథాన్ని నడుపుతూ, చిరునవ్వు నవ్వుతూ మళ్ళీ అర్జునుని ప్రశంసించటం ప్రారంభించి 'శ్రీకృష్ణుడు సారథిగా, గాండీవం సాధనంగా, కోరుకొన్నదానిని నిరాటంకంగా సాధించుకోగల ఆ కిరీటితో నీవు పోరాడగలిగితే, నీవే మా అందరికి అధిపతివి. ఆ మహావీరుడి రథం మనసేనలోకి చొచ్చుకువచ్చి చిక్కుపరుస్తున్నట్లు తెలుస్తున్నది. మనం జాగ్రత్తగా ఉండాలి. అగుపిస్తున్న ఈ అపశకునాలను సమన్వయించుకో.

శల్యుఁడు గర్ణునితో నప్పుడు దోఁచు నుత్పాతంబులు సెప్పుట (సం. 8-31-38)

**క. వఱఁకులు మన చేరువఁ బె । ల్లఱచుట బెట్టెదురు గాలి యడరుట గ్రద్దల్**
**తఱచయి యాడుట వికృతపు । టఱపులతో రేఁగి కాకు లఱచుట గంటే? 116**

**ప్రతిపదార్థం:** వఱఁలు= నక్కలు; మన చేరువన్= మన సమీపంలో; పెల్లు+అఱచుట= పెద్దగా అరవటం; బెట్టు+ఎదురుగాలి= పెద్దగా ఎదురుగాలి; అడరుట= విజృంభించటం; గ్రద్దల్= గ్రద్దలు; తఱచయి ఆడుట= ఎక్కువగా తిరగటం; కాకులు; రేఁగి= చెలరేగి; వికృతపు+అఱపులతోన్= వికారధ్వనులతో; అఱచుట= అరవటం; కంటే= చూచావా?

**తాత్పర్యం:** నక్కలు సమీపించి పెద్దగా అరుస్తున్నాయి. పెద్దగా ఎదురుగాలి వీస్తున్నది. గ్రద్దలు ఎక్కువగా తిరుగుతున్నాయి. కాకులు వికారధ్వనులతో అరుస్తున్నాయి. ఈ అపశకునాలు చూశావా?

**వ. అని వెండియు.** 117

**తాత్పర్యం:** అని మళ్ళీ.

**ఆ. సిడము కామ సూడు వడఁకెడు మన తేరి । చుట్టు మెఱయఁ గట్టినట్టి చిఱుత**
**పడగలందుఁ గంటె వెడలెడు మంట లు । గ్రంబు గాఁగ నోపు రణము నేఁడు.'** 118

**ప్రతిపదార్థం:** సిడము+కామ= ధ్వజం (జెండాకర్ర); వడఁకెడున్+చూడు= వణకుతున్నది చూడుము; మన తేరిచుట్టు= మన రథం చుట్టూ; మెఱయన్+కట్టినట్టి= మెరిసేటట్టు కట్టిన; చిరుత, పడగలందున్= చిన్న టెక్కెములందు; మంటలు వెడలెడున్= మంటలు వస్తున్నాయి; కంటె?= చూశావా?; నేఁడు= ఇవాళ; రణము= యుద్ధం; ఉగ్రంబు, కాఁగన్+ఓపు!= తీవ్రంగా సాగవచ్చును.

**తాత్పర్యం:** మన జెండాకర్ర వణకుతున్నది, రథంచుట్టూ మెరిసే టెక్కెములలో మంటలు వస్తున్నాయి. ఈ నాటి యుద్ధం భయంకరమౌతుందేమో!

**వ. అనియె నప్పుడు రాధేయుండు ధృష్టద్యుమ్నాభిరక్షితంబైన ధర్మతనయ వ్యూహంబు గనుంగొని రథికవరులం దగినయెడల నమర్చి తన మోహరం బాయితంబు సేసికొని యురవడింప నమ్మద్రపతి యట్టెత్తి యాలోకించి.** 119

**ప్రతిపదార్థం:** అనియెన్= (శల్యుడు) అన్నాడు; అప్పుడు= ఆ సమయంలో; రాధేయుండు= కర్ణుడు; ధృష్టద్యుమ్న+అభిరక్షితంబు+ఐన= ధృష్టద్యుమ్నుడు రక్షకుడుగా ఉన్న; ధర్మతనయ, వ్యూహంబు= ధర్మరాజు వ్యూహాన్ని; కనుంగొని= చూచి; రథికవరులన్= వీరులను; తగిన ఎడలన్+అమర్చి= తగినచోట్ల ఉంచి; తన, మోహరంబు= తన వ్యూహాన్ని; ఆయితంబు చేసికొని= సిద్ధం చేసికొని; ఉరవడింపన్= వేగిరింపగ; ఆ+మద్రపతి= శల్యుడు; అఱ్ఱు+ఎత్తి= మెడ ఎత్తి; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** శల్యుడి మాటలు విన్న కర్ణుడు ధర్మరాజు వ్యూహాన్ని పరికించి, వీరులతో తన వ్యూహాన్ని సిద్ధం చేయగానే శల్యుడు మెడ ఎత్తి చూచి.

**ఉ. అల్లదె! యర్జున ధ్వజ విహారము గానఁగ నయ్యెడుం గపీం**
**ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటు లైన త్రిగర్తు లేపు శో**
**భిల్లఁగ వారె! యన్నరుని బెట్టుగఁ దాఁకి రతండు నంప పె**
**న్వెల్లి నిగిడ్చి ముంచె నదె! నింగి గుణధ్వని వొంగ వారలన్.'** 120

**ప్రతిపదార్థం:** అల్లదె!= అదిగో; కపి+ఇంద్ర+ఉల్లసనంబునన్ మెరసి= హనుమంతుడి కాంతితో ప్రకాశిస్తూ; అర్జున ధ్వజవిహారము= అర్జునుడి కేతనం కదలటం; కానఁగన్+అయ్యెడున్= కనిపిస్తున్నది; ఉద్భటులు+ఐన త్రిగర్తులు= బలశాలులైన త్రిగర్తదేశపు వీరులు; వారె!= అదిగో!; ఏపు శోభిల్లఁగన్= గర్వం ఒప్పగా; ఆ+నరునిన్= అర్జునుడిని; బెట్టుగన్+తాఁకిరి= గట్టిగా ఎదుర్కొన్నారు; అతండున్= అర్జునుడు; అదె!= అదిగో!; నింగిన్= ఆకసంలో; గుణధ్వని పొంగన్= వింటివారి ధ్వని వ్యాపించగా; వారలన్= త్రిగర్త వీరులను; అంప పెను+వెల్లి= అమ్ముల ప్రవాహం; నిగిడ్చి= వ్యాపింపచేసి; ముంచెన్= ముంచాడు.

**తాత్పర్యం:** అదిగో! రణరంగంలో కపీంద్రుడైన హనుమంతుని చిహ్నము ప్రకాశించగా అర్జునుడి ధ్వజవిహారం (రథవిహారం) అగుపిస్తున్నది. ఆ అగుపించేవారే! బలవంతులైన త్రిగర్తులు. శోభిల్లే గర్వంతో అర్జునుని గట్టిగా ఎదుర్కొన్నారు. అదిగో! అర్జునుడు తన అల్లెత్రాటి ధ్వని ఆకాశం అంతా వ్యాపించగా, వాళ్ళను బాణాల వెల్లువలో ముంచాడు.

**ఆ.** **అనినఁ గర్ణుఁ డిట్టు లనియె 'సంశప్తక । బలముచేతఁ బొదువఁబడి కిరీటి**
**మేఘ పిహితుఁడైన మిహిరుని చాడ్పున । వాఁడి లేక యున్నవాఁడు గంటె!॥** **121**

**ప్రతిపదార్థం:** అనినన్+కర్ణుడు+ఇట్టులు+అనియెన్= అనగా విని కర్ణుడు ఇట్లా అంటున్నాడు; కిరీటి= అర్జునుడు, సంశప్తక బలముచేతన్= సంశప్తకులచేత (త్రిగర్తరాజు, సుశర్మ, అతని సోదరులు), పొదువన్‌పడి= ఆక్రమింపబడి; మేఘపిహితుఁడు+ ఐన= మబ్బుచేత కప్పబడిన; మిహిరుని చాడ్పునన్= సూర్యుడివలె; వాఁడిలేక ఉన్నవాఁడు+కంటె= కాంతిహీనుడై ఉన్నాడు చూచావా?

**తాత్పర్యం:** అని (శల్యుడు) అనగా అర్జునుడు త్రిగర్తీయులైన సంశప్తకులచేత ఆక్రమింపబడి, మేఘం కప్పిన సూర్యుడివలె కాంతివిహీనుడై ఉన్నాడు చూచావా! అని కర్ణుడు బదులు పలికాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ.** **అనుటయు శల్యుఁడు.** **122**

**తాత్పర్యం:** (కర్ణుడు) అనగానే శల్యుడు.

**చ.** **'వరుణుఁడు నీళ్ళ చేఁ జెడునె? వాయుసఖుండు మహేంధనోత్కర**
**స్ఫురణ నడంగునే? నరుఁడు పోరుల నేపఱు టేల కల్గు? నె**
**వ్వరికిని వానిఁ గీడ్పఱుప వచ్చునె? గాలిఁ బరాభవింపఁగా**
**దొరకొనినం జలంబు మెయిఁ దోయధి యంతముఁ ద్రావ వచ్చినన్.** **123**

**ప్రతిపదార్థం:** వరుణుఁడు= వరుణదేవుడు; నీళ్ళచేన్+చెడునె?= నీటిచే నశిస్తాడా?; వాయుసఖుండు= అగ్నిదేవుడు; మహా+ ఇంధన+ఉత్కర - స్ఫురణన్= గొప్ప కట్టెల సమూహపు కాంతిచేత; అడంగునే?= కప్పబడునా?; నరుఁడు= అర్జునుడు; పోరులన్+ఏపు+అఱుట= యుద్ధాలలో విజృంభణను వీడుట; ఏల కల్గున్?= ఎందుకు జరుగుతుంది?; గాలిన్+పరాభవింపఁగాన్, దొరకొనినన్= వాయువును అడ్డగించ పూనినా; చలంబుమెయిన్= పట్టుదలతో; తోయధి+అంతయున్= సముద్రమునంతా; త్రావవచ్చినన్= త్రా వగలిగినా; ఎవ్వరికిని= ఎవరికైనా; వానిన్= ఆ అర్జునుడికి; కీడు+పఱుపవచ్చునె?= కీడు కలిగించటం సాధ్యమౌతుందా?

**తాత్పర్యం:** నీళ్ళ చేత వరుణుడు నశిస్తాడా? కట్టెల మోపుచేత అగ్ని కప్పువడుతాడా? అర్జునుడు యుద్ధాల్లో ఆధిక్యాన్ని కోల్పోతాడా? గాలిని అడ్డుకొని అవమానించటానికి పూనుకొన్నా, పట్టుపట్టి సముద్రాన్నంతా త్రావ గలిగినా, అర్జునుడిని పడగొట్టటం ఎవరికి సాధ్యమౌతుంది.

**విశేషం:** అలం: నిదర్శన.

**ఆ. దేవతలకునైన దేవేంద్రపుత్రుని । నాహవమున గెలువ నలవి గాదు;**
**మనము గెలుతు మిట్టి మాట లాతనిఁ జేరఁ । జనక యాడి దీన సంతసింపు.** 124

**ప్రతిపదార్థం:** దేవతలకున్+ఐనన్= దేవతలకైనా సరే; దేవ+ఇంద్రపుత్రునిన్= దేవేంద్రుని కొడుకైన అర్జునుడిని; ఆహవమునన్= యుద్ధంలో; గెలువన్+అలవి కాదు= గెలువ సాధ్యం కాదు; మనము, గెలుచుదుము= మనం జయిస్తాం; ఇట్టి మాటలు= ఇటువంటి మాటలు; ఆతనిన్+చేరన్+చనక= అతడిని సమీపించకుండా; ఆడి= పలికి; దీనన్= దీనితోనే (ఈ మాటలతోనే); సంతసింపు(ము)= సంతోషించుము.

**తాత్పర్యం:** దేవతలకైనా సరే అర్జునుడిని యుద్ధంలో గెలువటం సాధ్యం కాదు. అతడిని మనం గెలుస్తాం అనే మాటలు ఆతడి చెవిన బడకుండా అనుకొని సంతోషించు. (వినబడితే పరువు దక్కదని భావం).

**ఉ. మేరువు వోలె నొప్పిన సమీరణపుత్రుని పేర్మియున్ మహో**
**దారుఁడు ధర్మనందను నుదాత్తతయున్ విజయానుజన్ము లే**
**పారఁగ నున్న సొంపును నహంకృతి యేర్పడ ద్రౌపదీసుతు**
**ల్వీరల మీఱి పొల్పెసఁగు లీలయుఁ జూడుము సూతనందనా!** 125

**ప్రతిపదార్థం:** మేరువువోలెన్+ఒప్పిన= మేరుపర్వతం వంటి; సమీరణపుత్రుని పేర్మియున్= భీముడి గౌరవము; మహా+ఉదారుఁడు, ధర్మనందను= గొప్ప ఉదారుడైన ధర్మరాజుయొక్క; ఉదాత్తతయున్= గొప్పదనం; విజయ+అనుజన్ములు= అర్జునుని తమ్ములైన నకులసహదేవులు; ఏపారఁగన్+ఉన్న, సొంపును= అతిశయంతోఉన్న విలాసం; ద్రౌపదీసుతుల్= ద్రౌపదీపుత్రులు; అహంకృతి+ఏర్పడన్= గర్వం ఒప్పగా; వీరలన్+మీఱి= వీరిని మించి; పొల్పు+ఎసఁగు లీలయున్= ప్రకాశించేవిధం; సూతనందనా!= కర్ణా!; చూడుము.

**తాత్పర్యం:** మేరుపర్వతంవలె ప్రకాశిస్తున్న భీమసేనుని ఆధిక్యం, మహోదారుడైన ధర్మపుత్రుని గొప్పతనం, నకుల సహదేవుల విజృంభణ విలాసం, వాళ్ళందరినిమించి అహంకారంతో వెలుగుతున్న ఉపపాండవుల విధం - సూతపుత్రా! చూడు.

**విశేషం:** ద్రౌపదికి ఐదుగురు భర్తలవలన వరుసగా జన్మించిన ఉపపాండవులు - ప్రతివింధ్యుడు, శ్రుతసోముడు, శ్రుతకీర్తి, శతానీకుడు, శ్రుతసేనుడు అనేవారు.

**వ. పాండవులు ధర్మపరు లెవ్వలన ధర్మంబు గలుగు నవ్వలనికి జయంబు గలుగుట దప్ప' దను సమయంబున సంశప్తక కులంబుం గనుంగొని మన సైన్యంబును సవ్యసాచిం జూచి వారి సేనయును గడంగి**

**యొండొంటితోఁ దాఁకిన గంగా యమునల సంపాతంబు చందంబు దోఁచె; నట్టి యెడం గురురాజు రాధేయుని మద్రరాజుం దగు రాజులను సాదరావలోకనంబున సంభావించి యి ట్లనియె. 126**

**ప్రతిపదార్థం:** పాండవులు, ధర్మపరులు= పాండవులు ధర్మప్రవర్తనగలవారు; ఏ వలన ధర్మంబు, గలుగున్= ఏవైపు ధర్మం ఉంటుందో; ఆ+వలనికిన్= ఆ వైపు; జయంబు కలుగుట తప్పదు= జయం కలగటం తప్పదు; అను సమయంబునన్= అని శల్యుడు అంటున్న సమయంలో; సంశప్తక కులంబున్+కనుంగొని= త్రిగర్తవీరులను చూచి; మనసైన్యంబును= మన సైన్యం; సవ్యసాచిన్+చూచి= అర్జునుడిని చూచి; వారి సేనయును= పాండవసైన్యం; కడంగి= పూనుకొని; ఒండు+ఒంటితోన్+ తాఁకినన్= ఒకదానితో నొకటి తలపడగా; గంగా యమునల= గంగా యమునానదుల; సంపాతనంబు, చందంబు+తోచెన్= తాకిడివలె గోచరించింది; అట్టి+ఎడన్= అప్పుడు; కురురాజు= దుర్యోధనుడు; రాధేయునిన్= కర్ణుడిని; మద్రరాజున్= శల్యుడిని; తగురాజులను= ఇతరరాజులను; స+ఆదర+అవలోకంబునన్= ఆదరపూర్వకమైన చూపుతో; సంభావించి= గౌరవించి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** పాండవులు ధర్మపరులు. ధర్మం ఎవరిపక్షాన ఉంటుందో వారికే జయం లభిస్తుంది' అని శల్యుడు అంటుండగా, సంశప్తకుల సమూహాన్ని చూచి కౌరవసైన్యం, అర్జునుడిని చూచి పాండవసైన్యం ఉత్సాహంతో ఒకదానితో మరొకటి తలపడగా, ఆ సన్నివేశం గంగా యమునలు ఒకదాని మీద మరొకటి పడినట్లనిపించింది. దుర్యోధనుడు కర్ణశల్యులను, ఇతర రాజులను గౌరవపూర్వకంగా చూచి ఇట్లా అన్నాడు:

**ఆ. 'ఎద్ది ప్రియము సేయు నేపారు శూరుల । చిత్తములకు నది యుదాత్తభంగి**
**నొదవె మీకు బాహుమదమునఁ గొనియాడుఁ । డుగ్ర శౌర్యమహిమ యుల్లసిల్ల. 127**

**ప్రతిపదార్థం:** ఏపారు, శూరుల, చిత్తములకున్= గర్వించే వీరుల మనస్సులకు; ఎద్దిప్రియము, చేయున్= ఏది సంతోషము కలిగించునో; అది ఉదాత్తభంగిన్= అది గొప్పదైన విధంగా; మీకున్ ఒదవెన్= మీకు లభించింది; ఉగ్రశౌర్యమహిమ= భయంకరమైన వీరత్వంయొక్క ప్రభావం; ఉల్లసిల్లన్= ఒప్పగా; బాహుమదమునన్= భుజబలదర్పంతో; కొనియాడుండు= ప్రశంసలు పొందండి.

**తాత్పర్యం:** 'పరాక్రమవంతులకు ఇష్టమైన (యుద్ధంచేసే) అవకాశం నేడు గొప్పగా మీకు లభించింది. మీరు విజృంభించి మీ భుజబల దర్పాన్ని చూపి ప్రశంసలు పొందండి.

**క. బలుపెసఁగఁ బాండుపుత్రులఁ । బొలియించిన నతుల రాజ్యభోగంబును వా**
**రలచేతం బొలిసిన ను । జ్జ్వల నాకసుఖంబు గలుగు వ్రాలుఁడు పోరన్.' 128**

**ప్రతిపదార్థం:** బలుపు+ఎసఁగన్= బలము ఒప్పగా; పాండుపుత్రులన్= పాండవులను; పొలియించినన్= సంహరిస్తే; అతుల రాజ్యభోగంబును= సాటిలేని రాజ్యవైభవం; వారలచేతన్+పొలిసినన్= పాండవులచేత మీరు చనిపోతే; ఉజ్జ్వల, నాకసుఖంబు= గొప్ప స్వర్గసుఖం; కలుగున్= లభిస్తాయి; పోరన్ వ్రాలుఁడు= రణరంగంలోకి దూకండి.

**తాత్పర్యం:** మీరు పాండవులను సంహరిస్తే అంతులేని రాజ్యవైభవం లభిస్తుంది. వారిచేత మీరే గనుక మరణిస్తే గొప్ప స్వర్గభోగం అనుభవిస్తారు. కాబట్టి సందేహించకుండా యుద్ధానికి ముందుకు దూకండి.

**వ. అనిన వారలందఱు నుబ్బి సింహనాదంబులు సేయఁ దూర్య నినదంబులు సెలంగ సైన్యంబులు సంతసంబునం బొదలె; నప్పు డశ్వత్థామ రథిక జనంబుల మనంబులం బ్రమదం బెసంగ ని ట్లనియె. 129**

**ప్రతిపదార్థం:** అనినన్= (దుర్యోధనుడు) అనగా; వారలు+అందఱున్+ఉబ్బి= కౌరవవీరులందరు ఉప్పొంగి; సింహనాదంబులు చేయన్= పెద్ద ధ్వనులు చేయగా, తూర్య, నినదంబులు, చెలంగన్= వాద్యధ్వనులు చెలరేగగా; సైన్యంబులు= సేనలు; సంతసంబునన్+పొదలెన్= సంతోషంతో ఒప్పాయి; అప్పుడు; అశ్వత్థామ; రథికజనంబుల, మనంబులన్= వీరుల మనసులలో; ప్రమదంబు+ఎసంగన్= ఆనందం నిండగా; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** దుర్యోధనుడి మాటలకు కౌరవసైన్యంలోని వారంతా ఉబ్బిపోయి బిగ్గరగా కేకలు వేశారు. వాద్యధ్వనులు చెలరేగాయి. వారికి సంతోషం కలిగిస్తూ అశ్వత్థామ ఇట్లా అన్నాడు:

**క. 'ఆయుధము విడిచి యుండఁగ । సాయకగురు మీరు సూడఁ జంపిన కష్టో**
**పాయుని ధృష్టద్యుమ్నుని । మాయించియ కాని తొడినమఱు వే నూడ్పన్. 130**

**ప్రతిపదార్థం:** సాయక, గురున్= విలువిద్యా గురువైన ద్రోణాచార్యుడిని; ఆయుధము, విడిచిఉండఁగన్= ఆయుధం వదలి ఉండగా; మీరు, చూడన్= మీరు చూస్తూఉండగా; చంపినన్= సంహరించిన; కష్ట+ఉపాయునిన్ ధృష్టద్యుమ్నునిన్= దుర్మార్గుడైన ధృష్టద్యుమ్నుడిని; మాయించియ కాని= చంపిన పిదప కాని; ఏను= నేను; తొడిన, మరుపు= ధరించిన కవచం; ఊడ్పన్= విడువను.

**తాత్పర్యం:** అస్త్ర విద్యాగురువైన ద్రోణాచార్యుడు ఆయుధం విడిచిఉండగా, దుష్టబుద్ధితో ఆతడిని చంపిన ఆ ధృష్టద్యుమ్నుడిని మట్టుబెట్టి కాని నేను కవచాన్ని విడువను.

**విశేషం:** ధర్మరాజు మాటలు వినబడి తన సుతుడైన అశ్వత్థామ మరణించాడని భావించి ద్రోణుడు అస్త్రసన్న్యాసం చేశాడు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు ద్రోణుడి తల నరికాడు.

**క. కడువడి వడముడియును గ । వ్వడియు నతనిఁ గావఁ బూని వచ్చిరయేనిం**
**జెడుదురు మచ్చాపంబున । వెడలు వివిధ విశిఖ శిఖల వేఁడిమిచేతన్.' 131**

**ప్రతిపదార్థం:** వడిముడియును= భీముడు; కవ్వడియున్= అర్జునుడు; కడువడిన్= వేగంగా; అతనిన్= ధృష్టద్యుమ్నుడిని; కావన్+పూని వచ్చిరి+అ+ఏనియున్= రక్షించటానికి వచ్చినప్పటికీ; మత్+చాపంబునన్ వెడలు= నా ధనుస్సునుంచి వెలువడే; వివిధ విశిఖ శిఖల= పలువిధాలైన బాణాల జ్వాలలయొక్క; వేఁడిమి చేతన్= వేడివలన; చెడుదురు= మాడిపోతారు.

**తాత్పర్యం:** భీమార్జునులు గనుక ధృష్టద్యుమ్నుడిని కాపాడటానికి వెంటనే వచ్చినా నా బాణాల జ్వాలలవేడిమికి అంతమైపోతారు'.

**విశేషం:** వడముడి= (శత్రువులకు) తాపం కలిగించేవాడు. (భీముడు).

**చ. అన విని యవ్వరిష్ఠ రథికావలి పెల్లుగఁ బాండుపుత్ర యో**
**ధనులపయిన్ వెసంగవియు దర్పము వార లుదగ్ర వృత్తి మా**
**ర్కొనిన మహోగ్రభంగియును ఘోరపులీలల విస్మయం బొన**
**ర్చె ననిమిషాంతరంగములఁ జెల్లె రణంబు నుదీర్ణ రౌద్రమై. 132**

**ప్రతిపదార్థం:** అనన్‌విని= అనగా విని; ఆ+వరిష్ఠరథిక+ఆవలి= ఆ శ్రేష్ఠులైన వీరుల సమూహం; పాండుపుత్ర, యోధనుల, పయిన్= పాండవవీరులపై; పెల్లుగన్= తీవ్రంగా; వెసన్+కవియు, దర్పము= వేగంగా ఆక్రమించిన భుజబలం; వారలు= పాండవులు; ఉదగ్ర, వృత్తిన్= భీతిగొల్పునట్లుగా; మార్కొనినన్= ఎదుర్కొనిన; మహా+ఉగ్రభంగియును= గొప్ప పరాక్రమం తీరు; ఘోరపు లీలలన్= భయంకరమైన విన్యాసాలతో; అనిమిష+అంతరంగములన్= దేవతల మనసులలో; విస్మయంబు+ ఒనర్చెన్= ఆశ్చర్యం కలిగించాయి; రణంబున్= యుద్ధం; ఉదీర్ణ రౌద్రము+ఐ= అతిశయించిన రౌద్రం కలదై; చెల్లెన్= కొనసాగింది.

**తాత్పర్యం:** అశ్వత్థామ మాటలకు పొంగి కౌరవ రథికశ్రేష్ఠులు విజృంభించి భుజబలాలు ప్రదర్శిస్తూ పాండవుల పైబడగా, వారు కూడా మహాపరాక్రమంతో భయంకరంగా శత్రువులను ఎదుర్కొన్నారు. ఇరుపక్షాల విజృంభణలు దేవతలకు కూడా విస్మయాన్ని కలిగిస్తూ, యుద్ధం ఘోరంగా కొనసాగింది.

**క. జనసంక్షయంబు పె ల్లే। మనవచ్చుం బ్రళయకాల మయ్యెనో కా కెం**
**దును నిట్టివి గలవే? యని। మనమునఁ దలపోయవలసె మముబోఁటులకున్. 133**

**ప్రతిపదార్థం:** జనసంక్షయంబు, పెల్లు= జననష్టంయొక్క ఆధిక్యం; ఏమి+అనవచ్చున్= ఏమని చెప్పాలి; ప్రళయకాలము+ అయ్యెనో= ప్రళయకాలం అయిందా; కాక+ఎందునున్+ఇట్టివి కలవే+అని= లేకపోతే ఎక్కడైనా ఇటువంటివి జరిగాయా అని; మముబోఁటులకున్= మా బోటివారికి; మనమునన్, తలపోయన్, వలసె= మనసులో అనుకొనవలసి వచ్చింది.

**తాత్పర్యం:** యుద్ధంలో జరిగే అధిక జననాశనాన్ని గురించి ఏమని చెప్పాలి! ప్రళయకాలం సమీపించిందా ఏమి? అని మేమంతా (సంజయాదులు) లేకుంటే ఇంత జననాశం ఎక్కడైనా జరిగిందా - అని అనుకోవలసివచ్చింది.

**వ. అట్టి యెడ. 134**

**ప్రతిపదార్థం:** అట్టి+ఎడ= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అప్పుడు.

**ఉ. ప్రీతి యెలర్ప వీరుల వరించుటకుం జనుదెంచి యప్సరో**
**వ్రాతము గంధపుష్ప పరివర్షణకేళి యొనర్ప సౌరభం**
**బాతతి సంచరించు లలితానిలుఁ డెక్కుడు సేసి వీచె సం**
**జాత నవీన ఘర్మజల జాలక సైనిక లాలనీయుఁ డై. 135**

**ప్రతిపదార్థం:** అప్సరః+వ్రాతము= అప్సరసల సమూహం; ప్రీతి+ఎలర్పన్= ఆనందం అతిశయింపగా; వీరులవరించుటకున్+ చనుదెంచి= వీరులను వరించటానికి వచ్చి; గంధపుష్ప పరివర్షణకేళి+ఒనర్పన్= పరిమళభరితమైన పుష్పవర్షం కురిపించగా;

ఆతతిన్= అప్పుడు; సంచరించు= ప్రసరిస్తున్న; లలిత+అనిలుఁడు= మృదువైన వాయువు; సంజాత, నవీన, ఘర్మజలజాలక= (పోరుచే) కలిగిన చెమట బిందువులతో ఒప్పుతున్న; సైనిక లాలనీయుఁడు+ఐ= సైనికులచేత బుజ్జగింపబడినవాడై; సౌరభంబు= పరిమళం; ఎక్కుడు+చేసి వీచెన్= ఎక్కువచేసి వీచాడు.

**తాత్పర్యం:** రణరంగంలో మరణించే వీరులను వరించటానికి అప్సరసలు వచ్చి ఆనందంతో పూలవర్షం కురిపించగా, మృదువుగా వీస్తున్న వాయువు ఆ పూల పరిమళాన్ని హెచ్చుగా ప్రసరింపజేస్తూండగా, చెమటతో తడిసిన సైనికులు ఆ వాయువును బుజ్జగించారు - మెచ్చుకొన్నారు.

**విశేషం:** యుద్ధంలో అసువులు బాసిన వీరులకు స్వర్గసుఖాలతోపాటు అప్సరసల పొందు లభిస్తుందని నాటి విశ్వాసం.

**ఉ. ఆ సమయంబునం గురుకులాగ్రణి భీమునిఁ దాఁకె సం**
**త్రాసన మత్త వారణ కదంబ సముద్భటుఁడై యతండునుం**
**జేసె రణంబు దత్ప్రబలసేన దలంకెడునట్లుగా సము**
**ద్భాసిత దుర్నివార్య బహుబాణ విసారణ దారుణోద్ధతిన్. 136**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; కురుకుల+అగ్రణి= దుర్యోధనుడు; వైరి, సంత్రాసన= శత్రుభయంకరమైన; మత్తవారణ కదంబ= మదపుటేనుగుల సమూహంతో; సముద్భటుఁడు+ఐ= మిక్కిలి అధికుడై; భీమునిన్+తాఁకెన్= భీముడిని ఎదుర్కొన్నాడు; అతండునున్= భీముడుకూడా; సమ్+ఉద్భాసిత= లెస్సగా ప్రకాశితమైన; దుః+నివార్య= అడ్డులేని; బహుబాణ విసారణ= అనేక బాణప్రయోగాల; దారుణ+ఉద్ధతిన్= భయంకర విజృంభణంతో; తద్+ప్రబలసేన= ఆ (దుర్యోధనుడి) గొప్పసైన్యం; తలంకెడు+అట్లుగాన్= చలించేటట్లుగా; రణంబు చేసెన్= పోరు సల్పాడు.

**తాత్పర్యం:** అప్పుడు దుర్యోధనుడు శత్రు భయంకరమైన మద గజ సైన్యంతో కూడినవాడై విజృంభించి భీముడిని ఎదుర్కొనగా, అతడు కూడా కౌరవసేన కలత చెందే విధంగా అడ్డుకొన సాధ్యంకాని అనేక బాణ ప్రయోగాలతో భయంకరంగా విజృంభించాడు.

**క. పదపడి రాధేయుం డు । న్మద వృత్తిం గవిసె గుణ నినాదంబును బె**
**ట్టిద మగు రథనిస్వనముం । జదల నిగుడఁ బాండవాగ్రజన్ముని దెసకున్. 137**

**ప్రతిపదార్థం:** పదపడి= తరువాత; రాధేయుండు= కర్ణుడు; గుణనినాదంబును= వింటినారి ధ్వని; బెట్టిదము+అగు రథనిస్వనమున్= కఠోరమైన రథధ్వని; చదల నిగుడన్= గగనభాగంలో మారుమ్రోగగా; పాండవ+అగ్రజన్ముని, దెసకున్= ధర్మరాజువైపునకు; ఉన్మదవృత్తిన్+కవిసెన్= గర్వంతో తలపడ్డాడు.

**తాత్పర్యం:** తరువాత కర్ణుడు తన అల్లెత్రాటిధ్వని, రథధ్వని ఆకాశంలో మారుమ్రోగగా ధర్మరాజుపై విజృంభించాడు.

**వ. ఇట్లు గవిసిన మన సైనికు లిట్లని రివ్విధంబున ధర్మనందనుం గదియ నడరిన నరుండు వచ్చి యడ్డంబు సొచ్చునపుడు. 138**

**ప్రతిపదార్థం:** ఇట్లు కవిసినన్= ఇట్లు కర్ణుడు ఎదుర్కొనగా; మన సైనికులు+ఇట్లు+అనిరి= మన సైనికులు ఇట్లా అన్నారు; ఈ+విధంబునన్= ఈ విధంగా; ధర్మనందనున్= ధర్మరాజును; కదియన్+అడరిన= తాకుటకు పూనుకోగా; నరుండు వచ్చి= అర్జునుడు వచ్చి; అడ్డంబు+చొచ్చు+అపుడు= అడ్డుకొనే సమయంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడు ధర్మరాజుపై తలపడగా మన సైనికులు ఇట్లా అన్నారు: 'ఈ విధంగా కర్ణుడు ధర్మరాజుపై తలపడగా అర్జునుడు వచ్చి అడ్డుకొనే సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. నరునకు సూతసూతికి రణం బగు నేఁ డతిఘోరభంగి నం**
**దరయ నితండు గీ టడఁచు నాతని నన్నటులున్నవాఁడు దు**
**ర్భర రిపుబాధ దక్కి కురురాజు సుఖిత్వముఁ బొందునిప్డు రం**
**డరదము సేరి యీతని మహాస్త్ర విలాసము సూత మేర్పడన్. 139**

**ప్రతిపదార్థం:** నేఁడు= ఈ రోజు; నరునకున్, సూతసూతికిన్= అర్జునునకు కర్ణునికి; అతిఘోరభంగిన్= మిక్కిలి భయంకరంగా; రణంబు+అగున్= యుద్ధం జరుగుతుంది; అరయన్= చూడగా; అందున్= యుద్ధంలో; ఇతండు= కర్ణుడు; ఆతనిన్= అర్జునుడిని; కీటు+అడఁచున్= చంపును; అన్నటులు+ఉన్నవాఁడు= అన్నట్లు గోచరిస్తున్నాడు; కురురాజు= దుర్యోధనుడు; దుర్భర, రిపు, బాధ, దక్కి= భరించలేని శత్రుబాధ తొలగి; సుఖిత్వమున్+పొందున్= సుఖాన్ని పొందుతాడు; రండు= కదలిరండి; అరదము చేరి= రథాన్ని సమీపించి; ఈతని= కర్ణుడి; మహా+అస్త్రవిలాసము= మహాస్త్రముల పెంపు; ఏర్పడన్= తెలిసేటట్లుగా; చూచుదము= చూద్దాం.

**తాత్పర్యం:** ఈ రోజు కర్ణార్జునులకు మహాభయంకరమైన యుద్ధం జరుగుతుంది. చూస్తుంటే కర్ణుడు అతడిని సంహరించేటట్లుగా గోచరిస్తున్నాడు. ఇక వైరి బాధ తొలగి దుర్యోధనుడు సుఖంగా ఉంటాడు. కర్ణుడి రథాన్ని చేరి అతడి మహాస్త్రప్రయోగాన్ని తిలకిద్దాం రండి.

**క. గెలు పెల్ల భంగి నితనికిఁ । గలుగు నను తలంపు వుట్టఁగా నిపుడు మనం**
**బుల జనియించు మనోరథ । మలవడుటయుఁ బోర నెఱుఁగనయ్యెడు నదియున్.' 140**

**ప్రతిపదార్థం:** ఇతనికిన్= ఈ కర్ణుడికి; ఎల్లభంగిన్= అన్ని విధాలుగా; గెలుపు= జయము; కలుగున్+అను తలంపు= కలుగుతుందన్న భావం; పుట్టఁగాన్= తలెత్తగా; ఇప్పుడు, మనంబులన్, జనియించు, మనోరథము= మన మనసులలో కలిగే కోరిక; అలవడుటయున్= నెరవేరటం; అదియున్= అది; పోరన్+ఎఱుఁగన్+అయ్యెడున్= యుద్ధంలోనే వెల్లడి అవుతుంది.

**తాత్పర్యం:** అన్ని విధాల కర్ణుడికి జయం కలుగుతుందని మన మనస్సులో ఇప్పుడు కలుగుతున్న కోరిక తీరుతుందా అన్నది యుద్ధంలోనే వెల్లడి అవుతుంది.

**వ. అనుచుఁ గూడుకొని రథ కరి తురగ సమ్మర్ద నిర్దళిత భూభాగంబుగా నురవడింప రాధేయుం డరిభీషణం బగు రథంబున. 141**

**ప్రతిపదార్థం:** అనుచున్+కూడుకొని= (సైనికులు) ఇట్లా అంటూ కలిసి; రథ, కరి, తురగ, సమ్మర్ద= రథ, గజ, అశ్వసైన్యముల సందడిచే; నిర్దళిత భూభాగంబుగాన్= భేదింపబడిన భూభాగం కలిగేటట్లు; ఉరవడింపన్= త్వరపెట్టగా; రాధేయుండు= కర్ణుడు; అరిభీషణంబు+అగు రథంబునన్= శత్రుభయంకరమైన రథంమీద.

**తాత్పర్యం:** సైనికులు ఈ విధంగా అంటూ రథ గజ అశ్వ సైన్యాలతో భూభాగాన్ని భేదించుకొని ముందుకు సాగగా కర్ణుడు శత్రుభయంకరమైన రథంమీద (ఆసీనుడై).

**తే.** **మిగిలి యప్పాండవాగ్రజు మగఁటిమియును । జలముఁ గోల్పుచ్చి తూలఁబోఁ బలికి మెఱసె**
**నధిప! యతినికి వీఁకమై నడ్డపడఁగఁ । గడఁగు నద్దెస యోధుల గర్వ మడఁచి.** **142**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; వీఁకమైన్= పరాక్రమంతో; అతనికిన్= కర్ణుడికి; అడ్డపడఁగన్= అడ్డుపడుటకు; ఆ+దెస= ఆవైపు; కడఁగు= పూనుకొనెడి; యోధుల, గర్వము+అడఁచి= వీరుల గర్వాన్ని అణచి; మిగిలి= అతిశయించి; ఆ+పాండవు+అగ్రజు= ధర్మరాజు; మగఁటిమియును= పౌరుషమును; చలమున్= పట్టుదలను; కోలు+పుచ్చి= నశింపజేసి; తూలన్+పోన్+పలికి= (అతడు) తక్కువచేసి పలికి; మెఱసెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కర్ణుడు - పాండవ పక్షాన తన కడ్డువచ్చిన యోధుల గర్వమడచి, అతిశయించి ధర్మరాజు పౌరుషాన్ని, పట్టుదలను అణగించి, తక్కువచేసి మాట్లాడి గొప్పగా ప్రకాశించాడు.

## కర్ణుఁడు ధర్మజుపైఁ గవిసి విజృంభించుట (సం. 8-31-5)

**వ.** **అనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియెఁ 'గర్ణుండు దన మొన యె ట్లాయితంబు సేసెఁ? గౌంతేయ ముఖ్యసైన్య సన్నాహం బెట్టి? దతం డతనిం బొదివిన యప్పుడు గవ్వడి యెవ్వలన నుండె? నవ్వీరుం డన్న కడ నున్న నా సూతనందనున కట్లు సేయ వశంబగునే? వాసవుండు సకల సురగణంబులతోఁ బన్ని యన్నరునిపై వచ్చి ఖాండవంబు గాల్పకుండఁ గావం జాలెనే? బ్రదుకున కాసపడు మగల కతని మార్కొనవచ్చునే? రాధేయునకు వచ్చుంగాక? యనుటయు.** **143**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= (సంజయుడు) చెప్పగా విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; కర్ణుండు= కర్ణుడు; తనమొన= తనవ్యూహం; ఎట్లు+ఆయితంబు+చేసెన్= ఏ విధంగా సిద్ధపరచాడు; కౌంతేయముఖ్య= ధర్మరాజు మున్నగువారి; సైన్యసన్నాహంబు+ఎట్టిది?= సైన్యవ్యూహాలు ఎలాంటివి?; అతండు+అతనిన్= కర్ణుడు ధర్మజుని; పొదివిన+అప్పుడు= తాకినప్పుడు; కవ్వడి= అర్జునుడు; ఏ+వలనన్+ఉండెను?= ఎక్కడ ఉన్నాడు?; ఆ+వీరుండు= అర్జునుడు; అన్నకడన్+ఉన్నను= అన్నదగ్గరఉంటే; ఆ సూతనందనునకున్= కర్ణుడికి; అట్లు+చేయవశంబు+అగునే?= (ధర్మజుని తాకటానికి) అట్లా చేయటానికి సాధ్యమవుతుందా?; వాసవుండు= ఇంద్రుడు; సకల సురగణంబులతోన్+పన్ని= సకల దేవసమూహాలతో కూడి; ఆ+నరునిపైన్ వచ్చి= అర్జునుడిపై తలపడి; ఖాండవంబు+కాల్పకుండన్= ఖాండవవనాన్ని దహించేయకుండా; కావన్+చాలెనే?= కాపాడగలిగినాడా?; బ్రదుకునకున్+ఆసపడు మగలకున్= ప్రాణంమీద ఆశగల వీరులకు; ఆతనిన్+మార్కొనవచ్చునే?= అర్జునుడిని ఎదుర్కొనటం సాధ్యమా?; రాధేయునకున్ వచ్చున్+కాక= కర్ణుడికి సాధ్యమవుతుందేమో కాని; అనుటయున్= అని అడుగగా.

**తాత్పర్యం:** సంజయుడి మాటలు విని ధృతరాష్ట్రుడు ఇట్లా ప్రశ్నలు వేయసాగాడు. 'కర్ణుడు, ధర్మరాజు తమ వ్యూహాలను ఏ విధంగా ఏర్పరచుకొన్నారు? కర్ణుడు అతడిపైకి వెళ్ళినపుడు అర్జునుడు ఎక్కడున్నాడు? అతడే ఉంటే కర్ణుడు అట్లా చేయగలిగేవాడా? ఖాండవవనదహనం సందర్భంలో దేవేంద్రుడు సకల దేవగణంబులతో అర్జునుడి మీదికి దండెత్తి ఖాండవాన్ని కాల్పకుండ రక్షించగలిగాడా? బ్రతుకుమీద ఆశగల వీరులతని నెదుర్కొనగలరా? అది ఒక్క కర్ణుడికే సాధ్యం కాగలదేమో!

**విశేషం:** ఈ ప్రశ్న పరంపరవలన ధృతరాష్ట్రుడి ఆతురత వ్యక్తమవుతున్నది.

**తే.** **ఇట్టు లను సంజయుం డమ్మహీశ్వరునకు। 'నంగపతి మోహరంబు తెఱంగు, ధర్మ**
**సుతుని యొడ్డు విధంబు, నర్జునుఁడు వారి। పోరునెడ లేమియును మీఁది పోరు వినుము. 144**

**ప్రతిపదార్థం:** సంజయుండు= సంజయుడు; ఆ+మహీశ్వరునకున్= ధృతరాష్ట్రుడితో; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; అంగపతి, మోహరంబు, తెఱంగు= కర్ణుడి వ్యూహవిధానం; ధర్మసుతుని, ఒడ్డు, విధంబు= ధర్మరాజు పన్నిన వ్యూహరచన; అర్జునుఁడు; వారిపోరు+ఎడన్= వారి యుద్ధసమీపంలో; లేమి= లేకపోవటం; మీఁదిపోరు= తర్వాత కొనసాగిన యుద్ధం; వినుము= వినుము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి ప్రశ్నలకు సంజయుడు ఇట్లా సమాధానం చెప్పాడు. 'కర్ణుడి వ్యూహరచన, ధర్మరాజు ప్రతివ్యూహరచన, అర్జునుడు అక్కడ లేకపోవటం, అప్పటి యుద్ధవిశేషాలు వివరంగా చెప్పుతాను వినుము.'

**వ.** **కృపాచార్యుండును గృతవర్మయు మాగధులు వలపట, శకునియు నులూకుండును గుఱ్ఱపు దడంబులతో వారికెలనను, సంశప్తక గణం బిరువది నాలుగు వేలు రథిక ముఖ్యు లగ్గలిక నుల్లసిల్లి దాపటను, నీ కొడుకులందుఁ గొందఱు కాంభోజ శక యవన సైన్య సమేతంబుగా వారియవులను, బాహుబల భాసితుండై దుశ్శాసనుండు వెనుకనుం, గతిపయసోదర పరివృతుండై, కురురాజు పిఱుందను, నశ్వత్థామ ప్రముఖ యోధులు గరినికరకృత సన్నాహులై యన్నరపతి నియోగింప నతనిపజ్జ నిలువ నిజపుత్రులుఁ దన చుట్టునుఁ, గదిసి యెసకమెసఁగు పరవశంబున మెఱయ సూతసూనుండు సేనాముఖంబునకుం దిలకంబై నిలిచి వొలిచె నట్లు మోహరించి మదకల మాతంగంబుల తఱచు కతంబున మొయిళ్ళ మొత్తంబుల కైవడిం గాఱుకొను నమ్మొన నురవడి నడిపించు నా కర్ణునిం గనుంగొని కౌంతేయాగ్రజుండు గాండీవి రావించి యిట్లనియె. 145**

**ప్రతిపదార్థం:** కృపాచార్యుండును, కృతవర్మయున్= కృపాచార్యుడు, కృతవర్మ; మాగధులు= మగధదేశ వీరులు; వలపటన్= కుడివైపు; శకునియున్+ఉలూకుండును= శకుని, ఉలూకుడు; గుఱ్ఱపు దడంబులతోన్= అశ్వసైన్యంతో; వారికెలనను= వారి ప్రక్క; సంశప్తక గణంబు= త్రిగర్త దేశీయులు; ఇరువది నాలుగువేలు రథికముఖ్యులు= ఇరవైనాలుగువేలమంది రథికవీరులు; అగ్గలికన్+ఉల్లసిల్లి= శౌర్యంతో ఒప్పి; దాపటను= ఎడమవైపున; నీ కొడుకులందున్+కొందఱు= నీ కొడుకులలో కొందరు; కాంభోజ, శక, యవన, సైన్య, సమేతంబుగాన్= కాంభోజ, శక, యవన రాజుల సైనికులతో కూడి; వారి+అవులను= వారిఅవతల; దుశ్శాసనుండు= దుశ్శాసనుడు; బాహుబలభాసితుండు+అయి= భుజబలంతో ప్రకాశిస్తూ; వెనుకనున్= వెనుకవైపు; కురురాజు= దుర్యోధనుడు; కతిపయ, సోదర, పరివృతుండు+అయి= కొందరు తమ్ములతో కలిసి; పిఱుందనున్= ఆ వెనుకనూ; అశ్వత్థామ ప్రముఖయోధులు= అశ్వత్థామ మొదలగు వీరులు; కరినికర కృత, సన్నాహులు+అయి= గజసైన్యంతో కూడినవారై; ఆ+నరపతి నియోగింపన్= దుర్యోధనుడు నియమించగా; అతని పజ్జన్ నిలువన్= కర్ణుడిప్రక్క నిలబడి ఉండగా; సూతసూనుండు= కర్ణుడు; నిజపుత్రులున్= తన కుమారులు; తన చుట్టునున్+కదిసి= తన చుట్టుచేరి; ఎసకము+ ఎసఁగు+పరవశంబునన్+మెఱయన్= అతిశయ దర్పంతో ఒప్పగా; సేనాముఖంబునకున్+తిలకంబు+అయి= సేన అగ్రభాగానికి బొట్టుగా; నిలిచిపొలిచెను= నిలిచి ఒప్పారాడు; అట్లు మోహరించి= ఆ విధంగా వ్యూహం పన్ని; మదకల మాతంగంబుల= మదపుటేనుగుల; తఱచు కతంబును= ఆధిక్యంచేత; మొయిళ్ళ మొత్తంబుల కైవడిన్= మబ్బుల గుంపువలె; కాఱుకొను= సందడి చేయుచున్న; ఆ+మొనను= ఆ వ్యూహాన్ని; ఉరవడిన్+నడిపించు= వేగంగా నడిపిస్తున్న; ఆ కర్ణునిన్+కనుంగొని=

ఆ కర్ణుడిని చూచి; కౌంతేయ+అగ్రజుండు= ధర్మరాజు; గాండీవిన్ రావించి= అర్జునుడిని పిలిచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** కర్ణుడి వ్యూహానికి కుడివైపు కృపాచార్యుడు, కృతవర్మ, మగధవీరులు; వారి ప్రక్కన శకుని, ఉలూకుడు; ఎడమవైపు త్రిగర్తవీరులు; వారిప్రక్కన కాంభోజ శకయవనులతో కూడిన కౌరవులు; వెనుకవైపు దుశ్శాసనుడు; అతడి వెనుక సోదర సమేతుడైన దుర్యోధనుడు నిలిచి ఉండగా, కర్ణుడు తన ప్రక్కన అశ్వత్థామ మున్నగు వీరులు, తన చుట్టు తన కుమారులతో కూడినవాడై కౌరవసేన అగ్రభాగంలో తిలకంగా ప్రకాశించాడు. మదగజాలు అధికంగా ఉండి మేఘసమూహాల వలె శబ్దం చేస్తున్న ఆ సేనను ముందుకు నడిపిస్తున్న కర్ణుడిని చూచి, ధర్మరాజు అర్జునుడిని పిలిచి అతడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** కర్ణుడు పన్నినవ్యూహం మకరవ్యూహం. తుండం కర్ణుడు. శకుని, ఉలూకుడు రెండు కన్నులు. కంఠస్థానంలో రారాజు తమ్ములు, ఉదరస్థానంలో దుర్యోధనుడు ఉన్నారు. కృతవర్మ, కృపాచార్యుడు రెండు పాదాలు. ఇది పదహారవరోజు సంగ్రామం.

**ఉ.** **'సూతతనూజు మోహరము సూచితె? యెంతయు గట్టియై సము**
**ద్ద్యోతిత భంగిఁ దోఁచె నది యుక్కునఁ బైఁబడి యిబ్బలంబు ని**
**ర్ఘాతము సేయకుండఁగ నెదుర్కొని యెమ్మెయి నిల్వరింత మ**
**న్నీతి విధింపుమా? బలుపు నేర్పును దద్జ్ఞులు పిచ్చలింపఁగన్.'** **146**

**ప్రతిపదార్థం:** సూత, తనూజు, మోహరము= సూతసుతుడైన కర్ణుడి వ్యూహం; చూచితె?= చూచావా?; ఎంతయున్ గట్టి ఐ= ఎంతో దృఢమై; సముద్ద్యోతిత భంగిన్+తోఁచెను= ఉజ్జ్వలంగా కనిపిస్తున్నది; అది= ఆ సేన; ఉక్కునన్+పైన్+పడి= శౌర్యంతో మనపై విజృంభించి; ఈ+బలంబు= (మన) సేనను; నిర్ఘాతము చేయక+ఉండఁగన్= చెదరగొట్టకుండా; ఎదుర్కొని= ఎదిరించి; ఏ+మెయిన్= ఏ విధంగా; నిల్వరింతము= అడ్డుకొనగలమో; తద్జ్ఞులు= విజ్ఞులు; బలుపు, నేర్పును= మన బలము, నేర్పు; పిచ్చలింపఁగన్= ప్రశంసించగా; ఆ+నీతి= ఆ వ్యూహ పద్ధతిని; విధింపుమా!= రూపొందించుము.

**తాత్పర్యం:** సూతపుత్రుడైన కర్ణుడి వ్యూహం చూచావా? ఎంతో దృఢంగా, దేదీప్యమానంగా అగుపిస్తూ ఉంది. ఆ సేన బలంతో మన సేనమీద పడి చెదరగొట్టకుండా, ఏ విధంగా దానిని ఎదుర్కొని అడ్డుకోగలమో, ఆ విధంగా - మన బలాన్ని, నేర్పును విజ్ఞులు ప్రశంసించేటట్లుగా వ్యూహరచన చేయుము.

**వ.** **అనుటయు సంక్రందన నందనుండు.** **147**

**ప్రతిపదార్థం:** అనుటయున్= (ధర్మరాజు) అనగా; సంక్రందన నందనుండు= అర్జునుడు.

**తాత్పర్యం:** అని అనగా, ధర్మరాజు మాటలకు అర్జునుడు.

**తే.** **సారవంత మై కర్ణుని సైన్య మురవ । ణించుఁ గా కేమి దీనికి నృపవరేణ్య!**
**పూని చేయంవగలయుఁ బ్రధానకార్య । మతని సమయించుటయ; నాకు నది భరంబె?'** **148**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= రాజా!; కర్ణుని సైన్యము; సారవంతము+అయి= శ్రేష్ఠమై; ఉరవణించున్+కాక+ఏమి?= విజృంభిస్తే ఏమి?; దీనికిన్= దీనికి; ప్రధాన కార్యము= ముఖ్యమైన పని; నాకున్= నాకు; పూని= పూనుకొని; చేయంగవలయున్= చేయవలసి ఉన్నది; అతనిన్+సమయించుటయ= కర్ణుని సంహరించటమే; అది= ఆ పని; భరంబె?= కష్టమా?

**తాత్పర్యం:** పటిష్ఠమైన కర్ణుడి సేన విజృంభించి మనపైకి వస్తే రానిమ్ము. కాని, దానికి ప్రతిగా మనం చేయదగిన ముఖ్యమైన పని అతడిని సంహరించటం. అది నాకు కష్టమైన పని కాదు.'

**వ. అనిన విని యమ్మనుజపతి యతని కిట్లను 'నట్లేని నీవు రాధేయుని గెలుపుము; భీమసేనుండు సుయోధనుని, నకులుండు వృషసేనుని, సహదేవుండు సౌబలుని, శతానీకుండు దుశ్శాసనుని, సాత్యకి కృతవర్మను, ధృష్టద్యుమ్నుండు ద్రోణపుత్రుని, ద్రౌపదేయులు శిఖండియుం దారును దక్కటి ధార్తరాష్ట్రులం దలపడువా; రేను గృపాచార్యుని తోడం బెనంగెద' ననుటయు 'నట్లకాక' యని యతండు మున్ను దను నిలిచిన నెలవునకుం జనునెడ నయ్యుధిష్ఠిరు పనుపు తెఱంగు వారలందఱకు నెఱింగించె; నతండు వలపటి వలన సైన్యాగ్రవర్తి యయ్యును, వృకోదరుండు వామపార్శ్వవర్తి యయ్యును. శైనేయ ద్రౌపదేయ సమేతంబుగా నప్పాండవాగ్రజుండు మధ్యభాగస్థుండయ్యు నున్న యమ్మోహరం బా సూతనందను మొన యురవడి సరకు గొనక మార్కొనియె' ననవుడు నాంబికేయుండు. 149**

**ప్రతిపదార్థం:** అనినన్ విని= (అర్జునుడు) అనగా విని; ఆ+మనుజపతి= ఆ ధర్మరాజు; అతనికిన్+ఇట్లు+అనున్= అతడితో ఇట్లా అన్నాడు; అట్లు+ఏనిన్= అట్లా అయితే; నీవు, రాధేయునిన్, గెలువుము= నీవు కర్ణుడిని జయింపుము; భీమసేనుండు సుయోధనునిన్= భీముడు దుర్యోధనుడిని; నకులుండు వృషసేనునిన్= నకులుడు వృషసేనుడిని; సహదేవుండు సౌబలునిన్= సహదేవుడు శకునిని; శతానీకుండు దుశ్శాసనునిన్= శతానీకుడు దుశ్శాసనుడిని; సాత్యకి కృతవర్మను= సాత్యకి, కృతవర్మను; ధృష్టద్యుమ్నుండు ద్రోణపుత్రునిన్= ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామను; ద్రౌపదేయులు= ఉపపాండవులు; శిఖండియున్+తారును= శిఖండి తాము కలిసి; తక్కటి ధార్తరాష్ట్రులన్= మిగతా కౌరవులను; తలపడువారు= ఎదుర్కొంటారు; ఏను+కృపాచార్యుతోడన్= నేను కృపాచార్యుడితో; పెనంగెదను+అనుటయును= తలపడతాను అని అనగా; అతండు= అర్జునుడు; అట్లకాక+అని= సరే అని; మున్ను+తలన నిలిచిన నెలవునకున్= ముందు తానున్న స్థలానికి; చను+ఎడన్= వెళ్ళేటప్పుడు; ఆ+యుధిష్ఠిరు= ధర్మరాజుయొక్క; పనుపుతెఱంగు= ఆజ్ఞావిషయం; వారలందఱకును+ఎఱింగించెను= వారందరికీ తెలిపాడు; అతండు= అర్జునుడు; వలపటివలనన్= కుడివైపు; సైన్య+అగ్రవర్తి+అయ్యును= సైన్యానికి ముందుండగా; వృకోదరుండు= భీముడు; వామపార్శ్వవర్తి+అయ్యును= ఎడమవైపు నిలువగా; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ ధర్మరాజు; మధ్యభాగస్థుండు+అయ్యును= నడమనుండగా; ఉన్న= నిలిచిన; ఆ+మోహరంబు= ఆ వ్యూహం; ఆ సూతనందను మొన+ఉరవడిన్= కర్ణుడి వ్యూహ వేగాన్ని; సరకుగొనక= లెక్కచేయక; మార్కొనియెన్= ఎదుర్కొన్నది; అనవుడున్+ఆంబికేయుండు= (సంజయుడు) అని చెప్పగా ధృతరాష్ట్రుడు.

**తాత్పర్యం:** కర్ణుడి సైన్యంలోని వారితో పాండవసేనలోని వీరులు ఎవరెవరు ఎట్లా తలపడాలో ధర్మరాజు అర్జునుడితో చెప్పాడు. అర్జునుడు తన సేనలోని వారికి ఆ విధానాన్ని వివరించి తన వ్యూహంతో కౌరవసేనను ఎదుర్కొన్నాడు. అప్పుడు సంజయుడితో ధృతరాష్ట్ర డిట్లా అన్నాడు:

**విశేషం:** కర్ణుడి మకరవ్యూహానికి ప్రతిగా అర్జునుడు అర్ధచంద్ర వ్యూహాన్ని ఏర్పరచాడు. తాను అగ్రస్థానంలో ఉండి భీమధృష్టద్యుమ్నులను రెండు పార్శ్వాలలో నిలిపాడు. మిగిలిన ముగ్గురు పాండవులు వారి వెనుక ఉన్నారు.

మ. 'నరుఁ డమ్మై విని వచ్చె నన్నరునకు న్సంశప్తకశ్రేణికి
న్దుర మత్యుద్భట భంగిఁ జెల్లుటయు మున్సూచించితీ వయ్యుధి
ష్ఠిరునిం గర్ణుఁడు దాఁకి యోర్చె ననియుం జెప్పంగ వింటిన్ రణం
బరయం జిత్రము; సెప్పు మత్తెఱఁగు సువ్యక్తంబుగా సంజయా!' 150

**ప్రతిపదార్థం:** సంజయా!; నరుఁడు= అర్జునుడు; ఆ+మై, వినివచ్చెన్= ఆ విధం (ధర్మరాజుమాటలు) విని వచ్చాడు; ఆ+ నరునకున్= అర్జునుడికి; సంశప్తక, శ్రేణికిన్= త్రిగర్తవీరుల సమూహానికి; అతి+ఉద్భటభంగిన్= ఎంతో భయంకరంగా; దురము= యుద్ధం; చెల్లుటయున్= జరగటం; ఈవు= నీవు; మున్+సూచించితి(వి)= ఇంతకుముందు చెప్పావు; ఆ+ యుధిష్ఠిరునిన్= ఆ ధర్మరాజును; కర్ణుఁడు తాకి; ఓర్చెను+అనియున్= ఓడించాడని కూడా; చెప్పంగ వింటిన్= చెప్పగా విన్నాను; అరయన్= చూడగా; రణంబు చిత్రము= యుద్ధం విచిత్రమైనది; ఆ+తెఱఁగు= ఆ విధము; సువ్యక్తంబుగాన్= విశదంగా; చెప్పుము= వివరించుము.

**తాత్పర్యం:** 'అర్జునుడికీ త్రిగర్త వీరులకు ఘోరయుద్ధం జరిగిందనీ, కర్ణుడు ధర్మరాజు పైబడి ఓడించాడనీ నీవు చెప్పగా నేను విన్నాను. సంజయా! చిత్రమైన ఆ యుద్ధవిశేషాలు వివరంగా చెప్పుము.'

వ. అని యడిగిన సంజయుం డమ్మానవపతి కిట్లను 'నట్లు ధర్మజుండు సెప్పెఁ; గాని యయ్యిరువాఁగుం గదిసినప్పు డన్నియమంబు నడవక కయ్యంపు టౌచిత్యంబున నొండు దెఱంగు సెల్లె నది యెఱింగించెద నవధరింపు; మవ్విధంబున మొనలు రెండును నొండొంటిం దార్కొను సమయంబున సవ్యసాచి కర్ణు నడచు చక్కటికి నడరం గడంగినఁ గ్రాలు కపికేతనంబు గనుంగొని తెంపు పెంపునఁ బొంపిరివోవుచుఁద్రిగర్తాది సంశప్తకులు సరభసంబుగా నడ్డపడి పైకొని తఱిమి పొంగిన పయోనిధిం బోలిన నబ్బలియుండు సెలియలికట్టం బోలి నిలువరించి మాతంగ ప్రముఖ సేనాంగ సకలాంగ శకలంబుల నిలాతలంబు గప్పుచుండ నొండొండ పేర్చి యా బలం బా బలమర్దన నందను నరదంబు ముంచికొనిన నవ్వీరుండు విజృంభిత విక్రముండై బడబాగ్ని కీలాకలాపంబు చందం బగు సాయక నికాయంబు నిగిడించుచు నెక్కుడుమదంబున నమ్మూఁకలం ద్రెక్కొనుచుండఁ దత్ప్రకారం బాలోకించి రాధేయునకు శల్యుం డి ట్లనియె. 151

**ప్రతిపదార్థం:** అని+అడిగినన్= అని అడుగగా; సంజయుండు= సంజయుడు; ఆ+మానవపతికిన్= ధృతరాష్ట్రుడితో; ఇట్లు+ అనున్= ఇట్లా అన్నాడు; అట్లు ధర్మజుండు+చెప్పెన్+కాని= ఆ విధంగా ధర్మరాజు చెప్పాడు (నియమించాడు) కాని; ఆ+ఇరువాఁగున్+ కదిసినప్పుడు= ఆ రెండు పక్షాలూ తలపడినప్పుడు; ఆ+నియమంబు నడవక= ఆ నియమం కుదరక; కయ్యంపు+ ఔచిత్యంబునన్= యుద్ధపు ఔచిత్యంతో; ఒండు తెఱంగు చెల్లెను= వేరేవిధంగా జరిగింది; అది+ఎఱింగించెదను+అవధరింపుము= దానిని వివరిస్తాను వినుము; ఆ+విధంబునన్= ఆ విధంగా; మొనలు రెండునున్= సైన్యాలు రెండూ; ఒండు+ఒంటిన్+తార్కొను, సమయంబునన్= ఒకదానిని మరొకటి ఢీ కొన్న సమయంలో; సవ్యసాచి= అర్జునుడు; కర్ణు+నడచు చక్కటికిన్= కర్ణుడు నడుచు చోటికి; అడరన్+కడంగినన్= పూని విజృంభించగా; క్రాలు, కపికేతనంబు+కనుంగొని= ప్రకాశిస్తున్న కపిధ్వజాన్ని చూచి; త్రిగర్త+ఆది సంశప్తకులు= త్రిగర్తీయులు మున్నగు సంశప్తకులు; తెంపుపెంపునన్= పొంపిరిపోవుచున్= ధైర్యంతో విజృంభిస్తూ; సరభసంబుగాన్+అడ్డపడి= వేగిరంగా అడ్డుకొని; పైకొని తఱిమి= పైబడి తరిమి; పొంగిన పయోనిధిన్+పోలినన్= ఉప్పొంగిన సముద్రాన్ని పోలగా; ఆ+బలియుండు= ఆ వీరుడు (అర్జునుడు); చెలియలికట్టన్+పోలి= చెలియలికట్టవలె; నిలువరించి= అడ్డుకొని; మాతంగ ప్రముఖ, సేనా+అంగ= మదగజాలు మొదలైన

సేనాంగాలయొక్క; సకల+అంగశకలంబులన్= అన్ని అవయవాల ముక్కలు; ఇలా తలంబు+కప్పుచుండన్= భూమండలాన్ని కప్పుతుండగా; ఒండు+ఒండ పేర్చి= ఒకదానిపై ఒకదాన్ని పేర్చి; ఆ బలంబు= సంశప్తకసేన; ఆ బలమర్దన నందను= అర్జునుడి; అరదంబు ముంచికొనినన్= రథంపై క్రమ్ముకొనగా; ఆ+వీరుండు= అర్జునుడు; విజృంభిత, విక్రముండు+ఐ= విజృంభించిన పరాక్రమం కలవాడై; బడబా+అగ్నికీలా కలాపంబు చందంబు+అగు= బడబాగ్ని జ్వాలల సమూహము వంటి; సాయకనికాయంబు= బాణసమూహం; నిగిడించుచున్= కురిపిస్తూ; ఎక్కుడు మదంబునన్= అతిశయించిన గర్వంతో; ఆ+మూఁకలన్+త్రెక్కొనుచుండన్= శత్రుసేనలను సంహరిస్తుండగా; తద్+ప్రకారంబు+ఆలోకించు= ఆ పరిస్థితిని చూచి; శల్యుండు= శల్యుడు; రాధేయునకున్= కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అని అడుగగా, సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. ఆ విధంగా ధర్మరాజు చెప్పాడుగాని, ఇరుపక్షాల సైన్యాలు ఢీ కొన్నప్పుడు ఆయన చెప్పినట్లు జరుగలేదు. మరో విధంగా జరిగింది. అది చెపుతాను విను. రెండు సైన్యాలు ఢీ కొన్నప్పుడు అర్జునుడు కర్ణుడున్న చోటికి వచ్చి, అతడి మీద విజృంభించాడు. మెరుస్తున్న అతని కపికేతనాన్ని చూచి, త్రిగర్తకులు మొదలైన సంశప్తకులు అతిశయించిన సాహసంతో అతివేగంగా వచ్చి అడ్డుపడి, పొంగిన సముద్రంలా అగుపించారు. అయినా ఆ బలశాలి అర్జునుడు చెలియలి కట్టవలె ఆ సైన్యసాగరాన్ని నిలువరించాడు. గజసైన్యం మొదలుగా చతుర్విధసైన్యాల సకలావయవాల ముక్కలు నేలను కప్పుతుండగా, ఒక్కొక్కటిగా వాటిని పేర్చి, ఆ త్రిగర్తాది సంశప్తకుల సైన్యం అర్జునుని రథాన్ని ముంచింది. అప్పుడు అర్జునుడు, విజృంభించిన పరాక్రమంతో బడబాగ్ని జ్వాలలవంటి బాణ సమూహాలు ప్రయోగిస్తూ, అతిశయించిన గర్వంతో ఆ శత్రు సమూహాలను సంహరించసాగాడు. అది చూచి కర్ణుడు శల్యుడితో ఇట్లా అన్నాడు.

**ఉ. 'అల్లదె యర్జున ధ్వజ విహారము గానఁగనయ్యెడుం గపీం**
**ద్రోల్లసనంబునన్ మెఱపి యుద్భటులైన త్రిగర్తు లేపు శో**
**భిల్లఁగ వారె! యన్నరుని బెట్టుగఁ దాఁకి; రతండు నంప సె**
**న్వెల్లి నిగిడ్చి ముంచె నదె నింగి గుణధ్వని వొంగ వారలన్.'** **152**

**ప్రతిపదార్థం:** అల్లదె= అదిగో; అర్జున ధ్వజవిహారము= అర్జునుడి కేతనం విహరించటం; కపి+ఇంద్ర+ఉల్లసనంబునన్, మెఱపి= హనుమంతుడి కాంతితో ప్రకాశిస్తూ; కానఁగన్+అయ్యెడున్= కనిపస్తున్నది; ఉద్భటులు+అయిన త్రిగర్తులు= బలశాలులైన త్రిగర్తదేశపు వీరులు; వారె= అదిగో; ఏపు, శోభిల్లఁగన్= గర్వం ప్రకాశిస్తూ ఉండగా; ఆ+నరుని= ఆ అర్జునుడిని; బెట్టుగన్+తాఁకిరి= గట్టిగా ఎదుర్కొన్నారు; అతండును= అర్జునుడు; అదె= అదుగో; నింగిన్= ఆకాశంలో; గుణధ్వని పొంగన్= వింటినారి ధ్వని వ్యాపించగా; వారలన్= త్రిగర్తీయులను; అంప సెను+వెల్లి= అమ్ముల ప్రవాహం; నిగిడ్చి= వ్యాపింపచేసి; ముంచెన్= ముంచాడు.

**తాత్పర్యం:** అదిగో! రణభూమిలో కపీంద్రుడైన హనుమంతుని చిహ్నం ప్రకాశించగా, అర్జునుడి ధ్వజవిహారం (రథవిహారం) అగుపిస్తున్నది. ఆ అగుపించే వారే త్రిగర్తులు. ప్రకాశించే గర్వంతో అర్జునుని గట్టిగా ఎదుర్కొన్నారు. అడుగో! అర్జునుడు తన వింటి అల్లె త్రాటి ధ్వని ఆకాశం అంతా వ్యాపించగా, వాళ్ళను బాణాలవెల్లువలో ముంచాడు.

**వ. అని చెప్పి చూపెఁ బదంపడి భారద్వాజ పుత్రుని బరవసంపు మాటల నాటోపంబు మిగిలి మన రథికులు గవిసిన దారుణ రణం బయ్యె నని యాకర్ణించి తది యేర్పడ వినుము వివరించెద. 153**

**ప్రతిపదార్థం:** అని, చెప్పి, చూపెన్= అంటూ చూపించాడు; భారద్వాజ పుత్రుని= అశ్వత్థామయొక్క; బరవసంపు మాటలన్= ధైర్యవచనాలకు; ఆటోపంబు మిగిలి= గర్వం అతిశయించి; మన రథికులు కవిసినన్= మన వీరులు పైబడగా; దారుణ రణంబు+అయ్యెనని= ఘోరయుద్ధం జరిగిందని; ఆకర్ణించితి(ని)= విన్నాను; అది= ఆ విషయం; ఏర్పడన్= స్పష్టమగునట్లు; వివరించెదన్ వినుము= వివరిస్తాను వినుము.

**తాత్పర్యం:** అని శల్యుడు చూపించాడు. ఆపై అశ్వత్థామ ధైర్యపూరిత వాక్కులు విని మన వీరులు శత్రువులపై బడగా, రణం తీవ్రమైంది. దాన్ని వివరిస్తాను వినుము.

**సీ. కృపుఁడు సౌబలుఁడును గృతవర్మయును నలిఁ జెలఁగు మూఁకలతోడఁ బెలుచఁ గవిసి**
**కాశ కైకయ మాత్స్య కోసల పాండ్యాది । బలములఁ దాఁకి రగ్గలిక మెఱయ**
**నా రెండు వాఁగుల నాయుధంబుల యెఱ । మంటలుఁ బొళ్ళును మింటఁ బుడమిఁ**
**జూడ నక్కజముగ శోణిత ధారలు । ప్రచుర ధూళీ తిమిరముల నడఁప**

**తే. భగ్న రథములు నిపతితేభములు నిహత । హయములును మృతభటులును రయమునకు వి**
**ఘాత మొనరింప నున్మద గమనభంగు । లందు వెరవులు మెఱయ బోరాడి రధిప! 154**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; కృపుడు సౌబలుఁడును కృతవర్మయును= కృప, శకుని, కృతవర్మలు; నలిన్+చెలఁగు, మూఁకలతోడన్= మిక్కిలి చెలరేగిన సైనికులతో; పెలుచన్+కవిసి= తీవ్రంగా తాకి; అగ్గలిక, మెఱయన్= అతిశయమొప్పగా, కాశ, కైకయ, మాత్స్య, కోసల, పాండ్య+ఆదిబలములన్+తాఁకిరి= కాశ కైకయ మత్స్య కోసల పాండ్య దేశ సైన్యాలను ఎదుర్కొన్నారు; ఆ రెండు వాఁగులన్= ఇరుపక్షాలవారి; ఆయుధముల+ఎఱమంటలున్+పొళ్ళును= ఆయుధాల రాపిడితో కలిగిన ఎర్రని మంటలు, ధూళియు; మింటన్+పుడమిన్= నింగి నేలలందు; చూడన్+అక్కజముగన్= చూడ అచ్చెరువు కలిగించగా; శోణితధారలు= రక్తధారలు; ప్రచురధూళీ, తిమిరములన్+అడఁపన్= దట్టమైన్ ధూళి అనెడి చీకట్లను అణచగా; భగ్నరథములు= విరిగిన రథాలు; నిపతిత+ఇభములు= కూలిన ఏనుగులు; నిహత హయములును= హతమైన అశ్వాలు; మృత భటులును= మరణించిన సైనికులు; రయమునకున్ విఘాతము+ఒనరింపన్= సైన్యవేగానికి అడ్డుకలిగించగా; ఉన్మద గమన భంగులందున్= తీవ్రమైన నడక విధములందు; వెరవులు, మెఱయన్= ఉపాయాలు ఒప్పగా; పోరాడిరి= పోరు సలిపారు.

**తాత్పర్యం:** కృపుడు, శకుని, కృతవర్మ చెలరేగిన శత్రుసేనలతో పోరుతూ, అతిశయంతో వివిధ దేశ సైన్యాలను ఎదుర్కొన్నారు. వారి ఆయుధాల తాకిడికి మంటలు, పొడలు ఏర్పడ్డాయి. రక్తధారలు దట్టమైన ధూళి అనే చీకట్లను అణచాయి. నేలపై కూలిన రథ గజ తురగ పదాతులు తమ గమనానికి ఆటంకంగా ఉన్నా, వివిధ గతులతో ముందుకు సాగి వారు పోరు సలిపారు.

**వ. ఆ లోన. 155**

**తాత్పర్యం:** అంతలో.

కర్ణుఁడు పాంచాల కుమారుల ననేకులం జంపుట (సం. 8-43 (కుంభ))

**ఉ. మేలి మదావళంబులును మేటి హయంబులుఁ దమ్ము పిండు నా**
**భీలతఁ జుట్టిరాఁగ రథబృందముతోఁ గురురాజు కర్ణుదో**
**ర్లీలకుఁ దోడ్పడం గడఁగె రేణు వుదీర్ణముగా నతండు పాం**
**చాల బలంబుపై నడరె శౌర్య సముద్భటబాహువీర్యుఁ డై. 156**

**ప్రతిపదార్థం:** మేలి, మదావళంబులును= ఉత్తమ మదగజాలు; మేటి హయంబులున్= శ్రేష్ఠమైన అశ్వాలు; తమ్ముపిండున్= సోదరసమూహం; ఆభీలతన్+చుట్టిరాఁగన్= భీతిగొల్పుతూ వెంటరాగా; కురురాజు= దుర్యోధనుడు; రథబృందముతోన్= రథ సముదాయంతో; రేణువు+ఉదీర్ణముగాన్= దుమ్ము చెలరేగగా; కర్ణు, దోః+లీలకున్= కర్ణుడి భుజదర్పానికి; తోడ్పడన్+ కడఁగెన్= సహాయపడటానికి పూనుకొన్నాడు; అతండు= కర్ణుడు; శౌర్య, సముద్భట, బాహువీర్యుఁడు+ఐ= పరాక్రమాతిశయంతో కూడిన బాహుబలంకలవాడై; పాంచాల బలంబుపైన్+అడరెన్= పాంచాల సేన మీదికి విజృంభించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు శ్రేష్ఠ గజ తురగ సమూహంతో, రథ సమూహంతో సోదరులతో కూడి దుమ్ము చెలరేగగా కర్ణుడికి సహాయంగా వెళ్ళాడు. కర్ణుడు పరాక్రమాతిశయంతో పాంచాల సైన్యంమీద విజృంభించాడు.

**వ. అబ్బలంబునకు బాసటయై చేది సైన్యంబును బెనుఁబ్రాపై పాండవానీకంబునుం దఱిమినఁ బెఱిగిన దర్పంబునం బ్రదీప్తుండయి యక్కర్ణుం డా గట్టి మూఁకలం దఱిసి మెఱుంగు వాలమ్ములు వఱప. నవి పీనుంగు పెంటలగుచుండ నుఱక యుక్కునం బొదివిన బలు మగలకుం గీర్తియు స్వర్గంబును నొసంగి, తమ వారికంటెఁ బ్రమోద భరితులం జేయుచు సాయకాసారంబులు వరఁగించుచు బహువిధ రథ ప్రచారంబు లుల్లసిల్ల నా సేనలును గృప కృతవర్మాది యోధ బృందంబులతోఁ బెనంగు మొనలును నొక్కటిగాఁ గలంచి యందు శోణిత జలంబునను మాంసమజ్జా మస్తిష్క కర్దమంబులను బతితాతపత్ర హంసంబులనుం బొలుచునట్టి నదీ ప్రవాహంబులు వఱపె ననుటయు ధృతరాష్ట్రుండు ధర్మనందనుం గర్ణుండు గదియు నప్పు డతని కక్కడ నడ్డపడుట కెవ్వరు గడంగి? రిక్కడ నితనికిఁ దోడ్పడ నెవ్వారు గలిగి రనుటయు సంజయుం డవ్విభున కి ట్లనియె. 157**

**ప్రతిపదార్థం:** ఆ+బలంబునకున్= పాంచాలసేనకు; బాసట+ఐ= అండగా; చేది సైన్యంబును= చేది దేశ సైన్యాన్ని; పెను+ ప్రాపు+అయి= పెద్ద రక్షణగా; పాండవ+అనీకంబునున్= పాండవసైన్యాన్ని; తఱిమినన్= పంపగా; ఆ+కర్ణుండు= ఆ కర్ణుడు; పెఱిగిన దర్పంబునన్+ప్రదీప్తుండు+అయి= హెచ్చిన గర్వంతో ప్రకాశిస్తూ; ఆ గట్టిమూఁకలన్+దరిసి= ఆ బలమైన సేనలను తాకి; మెఱుంగు వాలమ్ములు+వఱపన్= మెరిసే బాణాలను వేయగా; అవి= శత్రుసేనలు; పీనుంగు పెంటలు+అగుచుండన్= శవాల ప్రోవులు అగుచుండగా; ఉఱక= లక్ష్యపెట్టక; ఉక్కునన్= గర్వంతో; పొదివిన= తాకిన; బలుమగలకున్= బలవంతులగు వీరులకు; కీర్తియున్, స్వర్గంబునున్+ఒసంగి= యశస్సు స్వర్గప్రాప్తి కలిగించి; తమవారికంటెన్= తమ పక్షంలోని వీరులకంటె; ప్రమోదభరితులన్+చేయుచున్= ఆనందభరితులుగా చేస్తూ; సాయక+ఆసారంబులు, పరఁగించుచున్= బాణవర్షం కురిపిస్తూ; బహువిధరథ ప్రచారంబులు+ఉల్లసిల్లన్= వివిధ రథ గతులతో ఒప్పగా; ఆ సేనలును= పాంచాల సైన్యాలూ; కృప, కృతవర్మ+ఆది యోధ బృందంబులతోన్= కృప, కృతవర్మ మొదలైన వీరులతో; పెనంగు మొనలును= పోరుతున్న వివిధ దేశవీరులు; ఒక్కటిగాన్+కలంచి= మొత్తం అందరినీ కలతపెట్టి; అందున్= ఆ యుద్ధంలో; శోణితజలంబునను= రక్తమనెడి నీటితోనూ;

మాంస మజ్జామస్తిష్కకర్దమంబులనున్= మాంసం, ఎముకల్లోని కొవ్వు మెదడు అనెడి బురదతో; పతిత+ఆతపత్ర హంసంబులనున్= పడిపోయిన శ్రేష్ఠమయిన గొడుగులనే హంసలతో; పొలుచునట్టి= నిండిన; నదీ ప్రవాహంబులు పరపెను= నదీ ప్రవాహాలు కలిగించాడు; అనుటయున్= అని(సంజయుడు) అనగా; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; ధర్మనందనున్= ధర్మరాజును; కర్ణుండు+కదియు+అప్పుడు= కర్ణుడు తాకినప్పుడు; అతనికిన్= ఆ కర్ణునికి; అక్కడన్+అడ్డపడుటకున్= అక్కడ అడ్డుకొనటానికి; ఎవ్వరు+కడంగిరి?= ఎవరు పూనుకొన్నారు; ఇక్కడన్= ఇక్కడ; ఇతనికిన్+తోడ్పడన్= కర్ణుడికి తోడ్పడటానికి; ఎవ్వారు+కలిగిరి+అనుటయున్= ఎవ్వరు ముందుకు వచ్చారు అని అడుగగా; సంజయుండు; ఆ+విభునకున్+ ఇట్లు+అనియెన్= ఆ ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** ఆ పాంచాల సైన్యానికి బాసటగా చేది, పాండవసైన్యాలు రాగా, కర్ణుడు, అతిశయించిన గర్వంతో వెలుగుతూ బలమైన ఆ సైన్యాలను సమీపించాడు. మెరిసే బాణాలు ప్రయోగించాడు. ఆ సైన్యాలు పీనుగుల కుప్పలు కాసాగాయి. అయినా అది లెక్కపెట్టక గర్వంతో తన్నెదుర్కొన్న మేటివీరులకు కర్ణుడు కీర్తిని, స్వర్గప్రాప్తిని కలుగచేశాడు. అవి కలుగచేసి తమ వైపు వీరులకంటె వారిసే ఎక్కువ సంతోషపరిచాడు. శరవర్షాన్ని కురిపిస్తూ, వివిధ రథ గతులతో ఆ సేనలను, కృప కృతవర్మాది యోధులతో పెనగుతున్న శత్రుసేనలను ఒకే విధంగా కలతపెట్టాడు. రక్తం నీరుగా, మాంసం, ఎముకల్లోని కొవ్వు, మెదడు బురదగా, పడిపోయిన గొడుగులు హంసలుగా నదీ ప్రవాహాలు ఏర్పడేటట్లు చేశాడు' అని, సంజయుడు చెప్పగా ధృతరాష్ట్రుడు విని - కర్ణుడు, ధర్మరాజును ఎదుర్కొన్నప్పుడు ఇతడిని అడ్డుకోవటానికి ఆ వైపు (పాండవులవైపు) ఎవరు ప్రయత్నించారు? ఈ వైపు ఇతడికి (కర్ణుడికి) సాయంగా ఎవరు నిలబడ్డారు? అని, అడుగగా సంజయుడు ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలంకారం: రూపకం.

**తే. ఇవ్విధంబున సేనల క్రొ వ్వడంచి । సూతసూనుండు ధర్మజు కేతనంబు**
**దెసకు నడర ధృష్టద్యుమ్నుఁ డెసకమెసఁగ । బంధులును దాను వడి నడ్డపడియె నధిప! 158**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; ఈ+విధంబునన్= ఈ విధంగా; సేనల, క్రొవ్వు+అడంచి= శత్రుసేనల మదం అణచి; సూతసూనుండు= కర్ణుడు; ధర్మజు, కేతనంబుదెసకున్= ధర్మరాజు ధ్వజం ఉన్న దిశకు; అడరన్= వెళ్ళగా; ధృష్టద్యుమ్నుఁడు; ఎసకము+ఎసఁగన్= విజృంభణంతో; బంధులును+తానున్= బంధువులతోకూడి తాను, వడిన్+అడ్డపడియెను= వేగంగా అడ్డుకొన్నాడు.

**తాత్పర్యం:** రాజా! కర్ణుడు ఈ విధంగా శత్రుసేనల మదం అణచి ధర్మరాజు ఉన్నవైపు వెళ్ళాడు. అది చూచిన ధృష్టద్యుమ్నుడు ఎంతో విజృంభించి బంధువర్గంతో కలిసి కర్ణుడిని అడ్డుకొన్నాడు.

**క. వారలఁ గడచి ప్రభద్రకు । లా రాధేయు పయిఁ గవియ నాతండు మహో**
**దారుల నేడ్వుర భద్రా । కారుల నారాచ సప్తకంబునఁ గూల్చెన్. 159**

**ప్రతిపదార్థం:** వారలన్+కడచి= వారిని దాటి; ప్రభద్రకులు; ఆ రాధేయుపయిన్+కవియన్= కర్ణుడిపై బడగా; ఆతండు= ఆతడు; మహా+ఉదారులన్= గొప్ప ఉదారులు; భద్రాకారులన్= రూపవంతులు అయిన; ఏడ్వురన్= ఏడుగురిని; నారాచసప్తకంబునన్+కూల్చెన్= ఏడు బాణాలతో వధించాడు.

**తాత్పర్యం:** ప్రభద్రకులు త్రోసికొని వచ్చి కర్ణుడిపై బడగా, అతడు గుణవంతులు, రూపవంతులు అయిన ఆ ఏడుగురిని ఏడు బాణాలతో చంపాడు.

**క. కని పాంచాలురు గోపం । బును దర్పము నెఱయ మెఱయఁ బొదివిన రాధా**
**తనయుం డిరువదియేవురఁ । దునిమె నిరువదేను వెడఁద తూపులఁ బెలుచన్. 160**

**ప్రతిపదార్థం:** పాంచాలురు= పాంచాలదేశ వీరులు; కని= అది చూచి; కోపంబును, దర్పమున్= కోపం, గర్వం; నెఱయన్ మెఱయన్= అధికమై ఒప్పగా; పొదివినన్= తాకగా; రాధాతనయుండు= కర్ణుడు; పెలుచన్= ఆగ్రహంతో; ఇరువది+ఏను వెడఁద తూపులన్= ఇరవై అయిదు వెడల్పయిన బాణాలతో; ఇరువది+ఏవురన్= ఇరవై అయిదుగురు పాంచాలురను; తునిమెన్= చంపాడు.

**తాత్పర్యం:** ప్రభద్రకుల మరణాన్ని చూచి, పాంచాలురు కోపగర్వాలతో కర్ణుడిని తాకగా, అతడు ఆగ్రహించి ఇరవై అయిదు బాణాలతో ఇరవై అయిదుగురిని వధించాడు.

**క. వెండియు నేపునఁ బైకొని । చండ శర ప్రకరములు వెసం గురియఁగ ను**
**ద్దండతఁ బాంచాలురఁ గ । ర్ణుం డేవురఁ జంపె నైదు క్రూరాస్త్రములన్. 161**

**ప్రతిపదార్థం:** వెండియున్= ఇంకా; ఏపునన్+పైకొని= గర్వంతో విజృంభించి; కర్ణుండు= కర్ణుడు; ఉద్దండతన్= అతిశయించి; చండశరప్రకరములు= వాడియైన బాణసముదాయాలను; వెసన్+కురియంగన్= వేగంగా కురిపించగా; ఐదుక్రూర+అస్త్రములన్= ఐదు భయంకరఅస్త్రాలతో; పాంచాలురన్, ఏవురన్= ఐదుగురు పాంచాలురను; చంపెన్= చంపాడు.

**తాత్పర్యం:** ఇంకా పాంచాలురు పైకొని వాడి అయిన బాణాలను కురిపించగా, కర్ణుడు ఐదు భయంకరాలైన అస్త్రాలతో ఐదుగురు పాంచాలురను వధించాడు.

**వ. ఇట్లు భానుదేవ చిత్రసేన సేనాబిందు తపన శూరసేనులం గీటడంచి యాటోప దీపితుండయి చక్రరక్షకులగు సుషేణ సత్యసేనులు వెనుక బలసివచ్చు వృషసేనుండు నిమ్ముమ్వురు గొడుకులుఁ గడిమి రూఢి కెక్కం దనకు రణక్రీడకుం దోడుపడియెడు నుల్లాసంబున నుల్లంబు పల్లవింపం బాండవ బలంబులం గలంచు నయ్యంగ పతి మీఁద ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రముఖ పాంచాల కుమారులును సాత్యకి నకుల సహదేవ ద్రౌపదేయులును గేకయ మాత్స్య యోధవీర వ్రాతంబును భీమసేన పురస్సరంబుగాఁ దోతెంచిన బహుళ జలధరంబులు ధరణీధరంబు పయిం గురియు పెనుసోన చందంబు దోఁప వివిధాస్త్ర శస్త్రంబు లతనిపయిం దొరంగింపం గనుంగొని కౌరవేశ్వరుండు దుశ్శాసన శకుని తదీయ తనయులు దనకెలంకులం దఱుమం గరిఘటలతోడం గడంగి యవ్వడముడిని మార్కొని. 162**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; భానుదేవ, చిత్రసేన, సేనాబిందు, తపన, శూరసేనులన్= ఈ ఐదుగురు పాంచాల కుమారులను; గీటు+అడంచి= సంహరించి; ఆటోప, దీపితుండు+అయి= దర్పంతో ప్రకాశించినవాడై; చక్రరక్షకులు+అగు= వ్యూహ రక్షకులైన; సుషేణ సత్యసేనులు; వెనుకబలసివచ్చు; వృషసేనుండున్= వెనుకవైపు బలంగా వస్తున్న వృషసేనుడు; ఈ+ముమ్వురు కొడుకులున్= అను తన కుమారులు ముగ్గురు; కడిమి రూఢికిన్+ఎక్కన్= పరాక్రమం ప్రసిద్ధికెక్కగా; తనకు

రణక్రీడకున్+తోడుపడియెడు+ఉల్లాసంబునన్= తనకు యుద్ధంలో సహాయంగా ఉన్నారన్న సంతోషంతో; ఉల్లంబు పల్లవింపన్= మనసు పొంగగా; పాండవబలంబులన్+కలంచు= పాండవ సైన్యాన్ని కలవరపెడుతున్న; ఆ+అంగపతిమీఁదన్= ఆ కర్ణుడిపై; ధృష్టద్యుమ్న, శిఖండి, జనమేజయ, ప్రముఖ పాంచాల కుమారులును= ధృష్టద్యుమ్నుడు, శిఖండి, జనమేజయుడు మున్నగు పాంచాలురు; సాత్యకి, నకుల, సహదేవ, ద్రౌపదేయులును= సాత్యకి, నకులుడు, సహదేవుడు, ఉపపాండవులు; కేకయ, మాత్స్య, యోధవీర, వ్రాతంబును= కేకయ మత్స్యదేశవీరుల సమూహము; భీమసేన పురస్సరంబుగాన్= భీమసేనుడు ముందుండగా; తోతెంచినన్= రాగా; బహుళజలధరంబులు= ఎన్నో మేఘాలు; ధరణీధరంబుపయిన్+కురియు= పర్వతంపై కురిసే; పెనుసోన చందంబు తోఁపన్= పెద్దవర్షం వలె గోచరించగా; వివిధ+అస్త్రశస్త్రంబులు= వివిధ అస్త్రశస్త్రాలు; అతనిపయిన్+తొరఁగింపన్= కర్ణుడిపై కురియగా; కౌరవ+ఈశ్వరుండు= దుర్యోధనుడు; కనుంగొని= చూచి; దుశ్శాసన, శకుని, తదీయతనయులు= దుశ్శాసనుడు శకుని వారి కుమారులు; తనకెలంకులన్+తఱుమన్= తనకు రెండువైపుల వెంబడిరాగా; కరిఘటలతోడన్+కడంగి= ఏనుగుల సమూహంతో కూడి; ఆ+వడముడిని= ఆ భీముడిని; మార్కొని= ఎదుర్కొని.

**తాత్పర్యం:** కర్ణుడు ఈ విధంగా ఐదుగురు పాంచాల కుమారులను చంపి గర్వంతో తన ముగ్గురు కుమారులు తనకు తోడుగా ఉన్నారన్న ఆనందంతో పాండవ సేనను కలవరపెట్టసాగాడు. అప్పుడు భీముడు, ముందుండగా ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రభృతులు, సాత్యకి నకుల సహదేవులు, ఉపపాండవులు తదితర వీరులు వచ్చి, పర్వతం మీద మేఘ సమూహం పెద్దగా వర్షించినట్లు కర్ణుడిపై వివిధ అస్త్రశస్త్రాలు ప్రయోగించారు. అది చూచిన దుర్యోధనుడు, శకుని దుశ్శాసనులు, వారి కుమారులు తోడుగా గజసమూహంతో తరలి భీముడిని ఎదుర్కొని.

**క. తానును వారును దూపుల । వాన పయిం గురియ నతఁడు వారించి గళ**
**ద్దానాంబులోల మధుకర । మైన గజ వ్రజముఁ బటు శరార్చులఁ బొదివెన్. 163**

**ప్రతిపదార్థం:** తానును, వారును= దుర్యోధనుడు - అతడివెంట ఉన్నవారు; తూపులవాన, పయిన్+కురియన్= అమ్ములవర్షం కురిపించగా; అతఁడు= భీముడు; వారించి= అడ్డగించి; గళత్+దాన+అంబులోల మధుకరము+అయిన= కారుతున్న మదజలము నాస్వాదిస్తున్న తుమ్మెదలతో కూడిన; గజవ్రజమున్= గజసమూహాన్ని; పటుశర+అర్చులన్= వాడిఅయిన బాణాగ్నులతో; పొదివెన్= తాకెను.

**తాత్పర్యం:** దుర్యోధనుడు తనవారితో కలిసి భీముడిపై బాణవర్షం కురిపించగా, అతడు వాటిని అడ్డుకొని స్రవిస్తున్న మదజలాన్ని త్రావుతున్న తుమ్మెదలతో కూడిన గజసమూహంపై తీవ్ర బాణాగ్నులను ప్రయోగించాడు.

**క. పొదివెడునప్పుడు శౌర్యో । న్మదుఁ డగు నయ్యనిలతనయు మార్గణములు బె**
**ట్టిదముగఁ గవియుడు నోటఱి । యెదురుపలేరైరి కురునరేంద్రుఁడు వారున్. 164**

**ప్రతిపదార్థం:** పొదివెడు+అప్పుడు= వేయునప్పుడు; శౌర్య+ఉన్మదుఁడు+అగు= పరాక్రమ గర్వితుడైన; ఆ+అనిలతనయు మార్గణములు= ఆ భీముడి బాణాలు; బెట్టిదముగన్+కవియుడున్= గట్టిగా తాకగా; కురు, నర+ఇంద్రుఁడు, వారున్= దుర్యోధనుడు, అతడి వెంబడి ఉన్నవారు; ఓటఱి= శక్తిహీనులై; ఎదురుపలేరు+ఐరి= ఎదిరించలేకపోయారు.

**తాత్పర్యం:** భీముడు వేసేబాణాలు గట్టిగా తాకగా, దుర్యోధనుడు అతని సహాయులు శక్తిహీనులై వాటిని ఎదుర్కొనలేకపోయారు.

**మ. బలుగాలిన్ నలుదిక్కులం జెదరు నభ్రశ్రేణిచాడ్పు న్సము**
**జ్జ్వల సూర్యాంశులచేత విచ్చు నిబిడధ్వాంతంబు నందంబుఁ జూ**
**డ్కులకుం దోఁచెఁ బ్రచండ సంగర పటిష్ఠుండైన యా భీము తూ**
**పుల మొత్తం బడరం గరిప్రకర ముద్ధూతార్తియై తూలినన్. 165**

**ప్రతిపదార్థం:** ప్రచండ, సంగర, పటిష్ఠుండు+అయిన= తీవ్ర యుద్ధమునందు ఆరితేరిన; ఆ భీము తూపుల మొత్తంబు+అడరన్= భీముని బాణసమూహం విజృంభించగా; కరిప్రకరము= ఏనుగుల గుంపు; ఉద్ధూత+ఆర్తి ఐ తూలినన్= దుఃఖపూరితమై పడిపోగా; బలుగాలిన్= బలమైన గాలికి; నలుదిక్కులన్+చెదరు= నాలుగువైపులా చెదరిపోయే; అభ్రశ్రేణి చాడ్పున్= మబ్బుల చందమూ; సముజ్జ్వల సూర్య+అంశులచేతన్= ప్రకాశించే సూర్యకిరణాలకు; విచ్చు నిబిడ ధ్వాంతంబున్+అందంబున్= నశించే చీకట్ల అందమూ; చూడ్కులకున్+తోఁచెన్= కనులకు గోచరించింది.

**తాత్పర్యం:** పెనుగాలికి చెదిరిపోయే మబ్బులవలె, సూర్యరశ్మికి తొలగిపోయే చీకట్లవలె, భయంకరయుద్ధంలో బలవంతుడై ఉన్న ఆ భీముడి బాణాల దెబ్బలకు ఏనుగులు నేలపై కూలిపోయాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టియెడం గృప ప్రముఖ రథికులు రాధానందన భవన్నందనులకుం దలకడచి పవన నందను పార్శ్వంబులం దఱుము ధృష్టద్యుమ్నాది యోధులం దలపడిరి దుశ్శాసన ప్రభృతులును వారిం గూడికొనిరి కర్ణ నందను లక్కిమ్మీరమర్దనుం దాఁకి; రందు సుషేణుండు. 166**

**ప్రతిపదార్థం:** అట్టిఎడన్= ఆ సమయంలో; కృప, ప్రముఖ, రథికులు= కృపుడు మొదలగు ముఖ్యవీరులు; రాధానందన, భవత్+నందనులకున్= కర్ణుడికి, నీ కుమారులకు; తలకడచి= దాటి; పవననందను= భీముడి; పార్శ్వంబులన్+తఱుము= ప్రక్కలపోరుతున్న; ధృష్టద్యుమ్న+ఆది యోధులన్= ధృష్టద్యుమ్నుడు మున్నగు వీరులను; తలపడిరి= ఎదుర్కొన్నారు; దుశ్శాసన, ప్రభృతులును= దుశ్శాసనుడు మొదలైనవారు కూడా; వారిన్+కూడికొనిరి= వారితో కలిశారు; కర్ణనందనులు= కర్ణుడి కొడుకులు; ఆ+కిమ్మీరమర్దనున్= కిమ్మీరుడనే రాక్షసుని సంహరించిన ఆ భీముడిని; తాఁకిరి= ఎదుర్కొన్నారు; అందున్= వారిలో; సుషేణుండు= సుషేణుడు.

**తాత్పర్యం:** అప్పుడు కృపాచార్యుడు మొదలైన ప్రముఖ వీరులు కర్ణుడిని, కౌరవ సోదరులను దాటి భీముడితో కూడిఉన్న ధృష్టద్యుమ్నాదులను ఎదుర్కొన్నారు. దుశ్శాసనుడు మున్నగువారు కూడా వారిని కలిశారు. కర్ణుడి కుమారులు భీముడిపైకి వెళ్ళారు. సుషేణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఖర భల్లంబున నాతని । శరాసనము ద్రుంచి నారసములు రయముమై**
**నురమున నేడు సొనిపి ని । ష్ఠుర నినదం బెసఁగ నార్చె సురలు నుతింపన్. 167**

**ప్రతిపదార్థం:** ఖర, భల్లంబునన్= వాడి అయిన బల్లెంతో; ఆతని, శరాసనము, త్రుంచి= భీముడి విల్లును విరిచి; రయముమైన్= వేగంగా; ఉరమునన్= వక్షమునందు; ఏడు నారసములు= ఏడుబాణాలు; చొనిపి= నాటి; నిష్ఠుర నినదంబు+ఎసఁగన్= పెద్దధ్వని ఒప్పగా; సురలు నుతింపన్= దేవతలు ప్రశంసించగా; ఆర్చెన్= అరిచాడు.

**తాత్పర్యం:** కర్ణ తనయుడైన సుషేణుడు భీముడి ధనుస్సును బల్లెంతో విరిచి, అతడి వక్షఃస్థలంలో ఏడుబాణాలు వేసి పెద్దగా అరిచాడు. అది చూచి దేవతలు ప్రశంసించారు.

భీమసేనుఁడు కర్ణనందనుఁ డగు సత్యసేనునిం జంపి విజృంభించుట (సం. 8-43-24 (కుంభ))

**సీ.** **కనలి యొండొక విల్లు గొని కీచకాంతకుఁ । డక్కుమారుని చాపయష్టి విఱుగ**
**నేసి మై బల్తూపు లీరేడు నాటించి । తన్నప్డు దొడరు రాధా తనూజు**
**నుబ్బు వాలమ్ములు డెబ్బదిమూఁట వా । రించి తత్సుతుఁడు దోర్లీల మెఱయఁ**
**జేరిన నా సత్యసేను రథ్యంబుల । సూతుఁ గార్ముకమును గేతనంబు**

**తే.** **నేడు తూపులఁ దునుమాడి యేచి మూఁడు । నారసము లంగమునఁ గ్రుచ్చి నాళమునకు**
**వికసితాంభోరుహముఁ బాపు వెరవు దోఁపఁ । దునిమె వెసఁ గత్తివాతి యమ్మున శిరంబు.** 168

**ప్రతిపదార్థం:** కీచక+అంతకుఁడు= కీచకుని అంతం చేసిన భీముడు; కనలి= కోపించి; ఒండు+ఒక విల్లు, కొని= వేరొకవిల్లు తీసుకొని; ఆ+కుమారునిన్= సుషేణుడిని; చాపయష్టి విఱుగన్+ఏసి= ధనుస్సు దండము విరిగేటట్లుగ కొట్టి; మైన్= శరీరమునందు; ఈరు+ఏడు= పద్నాలుగు; బల్+తూపులు= బలమైన బాణాలు; నాటించి= వేసి; తన్నున్+అపుడు+తొడరు= తనను అప్పుడు ఎదుర్కొన్న; రాధాతనూజు= రాధా తనయుడైన కర్ణుడి; ఉబ్బున్= గర్వాన్ని; వాలు+అమ్ములు, డెబ్బదిమూఁటన్= వాడిబాణాలు డెబ్బది మూడింటితో; వారించి= అడ్డుకొని; తద్+సుతుఁడు= అతడి కుమారుడు; దోః+లీల మెరయన్+ చేరినన్= భుజబలదర్పం ప్రకాశించునట్లు రాగా; ఆ సత్యసేను= ఆ సత్యసేనుడి; రథ్యంబులన్= అశ్వాలను; సూతున్= సారథిని; కార్ముకమును= ధనువును; కేతనంబున్= ధ్వజమును; ఏడుతూపులన్+తునుమాడి= ఏడుబాణాలతో ఖండించి; ఏచి= విజృంభించి; మూఁడు, నారసములు= మూడుబాణాలు; అంగమునన్+క్రుచ్చి= దేహమునందు నాటి; నాళమునకున్= తామరకాడకు; వికసిత అంభోరుహమున్= వికసించిన పద్మమును; పాపు, వెరవు+తోపన్= తొలగించే విధం తోచగా; వెసన్= వెంటనే; కత్తివాతి, అమ్మునన్= కత్తి అంచువంటి అమ్ముతో; శిరంబున్= తలను; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** దానితో భీముడు కోపించి వేరొక విల్లును గ్రహించి సుషేణుడి ధనువు విరిచి, అతడిపై పద్నాలుగు బాణాలు గుప్పించాడు. అప్పుడు కర్ణుడు తనపైకి రాగా డెబ్భయిమూడు బాణాలతో అడ్డగించాడు. అతడి కుమారుడు, సత్యసేనుడు రాగా అతడి గుఱ్ఱాలను, సారథిని, ధనువును, కేతనమును ఏడుబాణాలతో ఖండించి, మేనుపై మూడు బాణాలను వేసి, కత్తి అంచువంటి వాడిఅమ్ముతో శిరస్సును ఖండించాడు. ఆ దృశ్యం తామరకాడనుంచి వికసించిన పద్మాన్ని తునిమినట్లుగా ఉన్నది.

**విశేషం:** అలం: ఉపమ. సత్యసేనుడి శరీరం తామరకాడవలె, తెగిపడిన అతనితల పద్మంవలె ఒప్పినాయి.

**వ.** **తునిమి దోస్సారంబు దుర్వారంబుగా నుక్కునం దక్కటి రథిక జనంబుల పయి నడరి కృప కృతవర్మాది రథికవరుల కోదండంబులు దుండంబులు సేసి వారిం గ్రూరమార్గణంబుల మర్దించి దుశ్శాసనుని సాయక త్రయంబునను సౌబలునిఁ దద్ద్విగుణ బాణంబులను స్రుక్కించి యులూకుని నతని తమ్ముని నొక్కుమ్మడి విరథులం గావించి కర్ణుకొడుకుం గనుంగొని 'యోరి సుషేణా! పొలిసితి పో' మ్మనుచు బలు నారసంబు**

**నిగిడించిన నది నడుమన కర్ణుండు నఱికి మెఱుంగుటమ్ములు మూఁడు మేనం బఱప నుఱక మఱియు నట్టి మార్గణం బక్కుమారు నుపలక్షించి ఏసిన నా సూతనందనుం డదియునుం ద్రుంచి యవ్వడముడిమీఁదఁ ద్రిసప్తతి తీవ్ర ప్రదరంబులు పరఁగించె నప్పుడు; నకులుండు గవిసిన. 169**

**ప్రతిపదార్థం:** తునిమి= ఖండించి; దోః+సారంబు దుర్వారంబుగాన్= భుజబలము అడ్డులేనిదై; ఉక్కునన్= గర్వంతో; తక్కటి రథిక జనంబుల పయిన్= మిగిలిన రథికులమీద; అడరి= మార్కొని; కృప, కృతవర్మ+ఆది రథికవరుల= కృప కృతవర్మ మున్నగు రథికశ్రేష్ఠుల; కోదండంబులు, తుండంబులు సేసి= ధనుస్సులు తునుకలు చేసి; వారిన్+క్రూరమార్గణంబులన్, మర్దించి= వారిని వాడిబాణాలతో కొట్టి; దుశ్శాసనునిన్; సాయక త్రయంబునను= మూడుబాణాలతోనూ; సౌబలునిన్= శకునిని; తద్+ద్విగుణ బాణంబులను= దానికి రెట్టింపు(ఆరు) బాణాలతోనూ; స్రుక్కించి= గాయపరిచి; ఉలూకునిన్+అతని తమ్మునిన్= ఉలూకుడిని, అతడి తమ్ముడిని; ఒక్కుమ్మడి విరథులన్+కావించి= ఒకేసారి రథహీనులను చేసి; కర్ణుకొడుకున్+కనుంగొని= కర్ణుడి కొడుకును చూచి; ఓరి సుషేణా!= ఓ సుషేణుడా!; పొలిసితి(వి) పొమ్ము+అనుచున్= చచ్చావుపో అంటూ; బలునారసంబు నిగిడించినన్= వాణిబాణం వేయగా; కర్ణుండు= కర్ణుడు; అది నడుమన= దానిని మధ్యలోనే; నఱికి= తునిమి; మెఱుంగు+అమ్ములు మూఁడు= మెరిసేబాణాలు మూడు; మేనన్+పఱపన్= దేహమునందు నాటగా; ఉఱక, మరియును+అట్టి మార్గణంబు= లెక్కపెట్టక ఇంకా అటువంటి బాణం; ఆ+కుమారునిన్= సుషేణుడిని; ఉపలక్షించి+ఏసినన్= గురిపెట్టి వేయగా; ఆ సూతనందనుండు= కర్ణుడు; అదియునున్+త్రుంచి= దాన్నికూడా నరికి; ఆ+వడముడిమీఁదన్= ఆ భీముడిమీద; త్రిసప్తతి= డెబ్భయిమూడు; తీవ్ర ప్రదరంబులు= వాడిబాణాలు; పరఁగించెను= ప్రయోగించాడు; అప్పుడు నకులుండు, కవిసినన్= అప్పుడు నకులుడు తాకగా.

**తాత్పర్యం:** భీముడు ఆ విధంగా సత్యసేనుడిని చంపి, భుజబలగర్వంతో కృపాచార్య కృతవర్మ ప్రభృతుల ధనుస్సులు విరిచి, వారిపై వాడిబాణాలు వేశాడు. దుశ్శాసనుడిని మూడుబాణాలతో, శకునిని ఆరుబాణాలతో నొప్పించి, ఉలూకుడిని, అతడి తమ్ముడిని రథహీనులుగా చేసి, కర్ణుడి కొడుకునుచూచి 'సుషేణా చచ్చావు పోరా' అంటూ సుషేణుడిపై వాణిబాణాన్ని వేశాడు. కర్ణుడు మధ్యలోనే దానిని నరికి, భీముడిపై మూడు మెరిసేబాణాలు వేశాడు. భీముడు మళ్ళీ సుషేనుడిపై బాణం వేయగా దానిని కూడా ఖండించి, డెబ్భయిమూడు తీవ్రశరాలు అతడిపై కురిపించాడు. అప్పుడు నకులుడు వచ్చి తాకగా.

**ఆ. చిత్ర చాపముక్త శితశర పంచకా। హత శరీరుఁ జేసె నా సుషేణుఁ**
**డేచి నకులుఁ డతని నిరువది యమ్ముల। నొంచి కర్ణు మనము నొవ్వ నార్చె. 170**

**ప్రతిపదార్థం:** ఆ సుషేణుఁడు; చిత్రచాపముక్త= చిత్రమైన ధనుస్సునుండి వదలబడిన; శిత, శరపంచక= వాడియైన అయిదుబాణాలతో; హతశరీరున్+చేసెన్= (నకులుడి) దేహాన్ని గాయపరచాడు; నకులుఁడు ఏచి= నకులుడు విజృంభించి; అతనిన్= సుషేణుడిని; ఇరువది అమ్ములన్+నొంచి= ఇరవై బాణాలతో నొప్పించి; కర్ణు మనము నొవ్వన్+ఆర్చెన్= కర్ణుడి మనసుకు బాధ కలిగేటట్లుగా అరచాడు.

**తాత్పర్యం:** సుషేణుడు చిత్రమైన తన ధనుస్సునుండి వాడిఅయిన బాణాలు నకులుడిపై వేయగా, అతడు విజృంభించి ఇరవైబాణాలు సుషేణుడిపై ప్రయోగించి కర్ణుడికి బాధ కలిగేటట్లు పెద్దగా అరిచాడు.

**చ. అలిగి సుషేణుఁ డెంతయు రయంబునఁ దొమ్మిది దొడ్డవాఁడి తూ**
**పులు మెయిఁ జొన్పి విల్ దునిమి పొంగిన నొండొక దీప్త చాప మ**
**గ్గలిక దలిర్ప నెత్తి వెసఁ గార్ముక దండము ద్రుంచి నొంచె దో**
**ర్బల విభవం బుదాత్తముగఁ బార్థునితమ్ముఁడు సూతు నాతనిన్. 171**

**ప్రతిపదార్థం:** సుషేణుఁడు అలిగి= సుషేణుడు కోపించి; ఎంతయున్, రయంబునన్= ఎంతో వేగంగా; తొమ్మిది దొడ్డ వాడి తూపులు= తొమ్మిది పెద్ద వాడిబాణాలు; మెయిన్+చొన్పి= దేహంపై వేసి; విల్+తునిమి= విల్లును నరికి; పొంగినన్= గర్వించగా; పార్థుని, తమ్ముడు= నకులుడు; ఒండు+ఒక, దీప్త, చాపము= మరొక కాంతిమంతమైన ధనుస్సు; అగ్గలిక+తలిర్పన్+ఎత్తి= అతిశయమొప్పగా గ్రహించి; వెసన్= శీఘ్రంగా; కార్ముకదండము+త్రుంచి= (సుషేణుడి) ధనుస్సును విరిచి; దోః+బలవిభవంబు+ఉదాత్తముగన్= గొప్ప భుజబలదర్పంతో; సూతున్+ఆతనిన్= రథసారథిని, సుషేణుడిని; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** సుషేణుడు కోపంతో నకులుడిపై తొమ్మిది బాణాలు వేసి విల్లును విరువగా, అతడు మరొకవిల్లును ధరించి సుషేణుడి ధనువును తునిమి, బాహుబలప్రకాశంతో అతడిని, అతడి రథసారథిని నొప్పించాడు.

**ఆ. అన్యచాపలసిత హస్తుఁడై కడఁగి సు । షేణుఁ డతని షష్టి బాణగాఢ**
**నిహత దేహుఁ జేసె సహదేవుఁ డడరిన । మేటి తూపు లేడు మేనఁ గ్రుచ్చె. 172**

**ప్రతిపదార్థం:** సుషేణుఁడు; అన్య, చాప, లసిత, హస్తుఁడు+ఐ= మరొక చాపంచేత ప్రకాశించిన చేయి గలవాడై; కడఁగి= పూని; అతనిన్= నకులుడిని; షష్టి బాణ గాఢ నిహత దేహున్+చేసెన్= అరవై బాణాలతో తీవ్రంగా గాయపడిన శరీరం కలవాడిగాచేసి; సహదేవుడు; అడరినన్= పైబడగా; మేటి తూపులు+ఏడు= ఏడు మేటిబాణాలు; మేనన్+క్రుచ్చెన్= శరీరంపై నాటాడు.

**తాత్పర్యం:** సుషేణుడు మరొకవిల్లును ధరించి నకులుడిపై అరవైబాణాలు గుప్పించి నొప్పించాడు. సహదేవుడు అడ్డురాగా అతడిపై ఏడుబాణాలు వేశాడు.

**క. అయ్యిరువుర యబ్బాలుని । కయ్య మమర దైత్యరణము కరణి మహోగ్రం**
**బయ్యెఁ; వృషసేనుఁ డత్తఱి । నియ్యని సాత్యకి నెదిర్చె నిషుచయ మడరన్. 173**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరువుర= ఆ నకుల సహదేవుల; ఆ+బాలుని= ఆ సుషేణుడి; కయ్యము= యుద్ధం; అమర, దైత్యరణము కరణిన్= దేవతలు రాక్షసుల సంగ్రామంవలె; మహా+ఉగ్రంబు+అయ్యెన్= మహాభయంకరంగా సాగింది; వృషసేనుఁడు; ఇషుచయము+అడరన్= బాణసమూహం క్రమ్మగా; ఆ తఱిన్= ఆ సమయంలో; ఈ+అని= ఈ యుద్ధంలో; సాత్యకిన్+ఎదిర్చెన్= సాత్యకిని ఎదిరించాడు.

**తాత్పర్యం:** నకుల సహదేవులకు సుషేణుడితో జరిగినయుద్ధం దేవదానవ సంగ్రామం వలె భయంకరంగా సాగింది. సుషేణుడి సోదరుడైన వృషసేనుడు ఈ యుద్ధంలో సాత్యకిని బాణాలతో ఎదుర్కొన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ.** **సాత్యకి వృషసేను సప్త సప్తతి మార్గ । ణంబులఁ బొదివి బాణత్రయంబు**
**సూతుమైఁ బఱపిన నాతఁ డాతని పెనుఁ । గడఁత వాలికయమ్ము గాఁడ నేయఁ**
**గోపించి మూఁడు బల్తూపుల సారథి । నొక భల్లమున విల్లు నుజ్జ్వలాస్త్ర**
**సప్తక నిహతి నశ్వంబుల నేకకాం । డ స్ఫూర్తిఁ గేతుదండంబుఁ దునిమి**

**ఆ.** **శినివరుండు వక్షమున మూఁడు శరములు । నాట సొగసి కర్ణ నందనుండు**
**దెలిసి కనలి వాలుఁబలకయుఁ గొని తేరు । డిగ్గి కవియ నవియు నుగ్గు సేసె.** 174

**ప్రతిపదార్థం:** సాత్యకి= సాత్యకి; వృషసేనున్= వృషసేనుడిని; సప్త సప్తతి మార్గణంబులన్+పొదివి= డెబ్బయిఏడు బాణాలతో తాకి; సూతుమైన్= సారథిదేహంపై; బాణత్రయంబు= మూడుబాణాలు; పఱపినన్= వేయగా; ఆతఁడు= వృషసేనుడు; ఆతని పెను+కడఁతన్= సాత్యకి విశాలమైన కణతపై; వాలిక+అమ్మున్= వాడిబాణాన్ని; కాడన్+ఏయన్= నాటేటట్లు వేయగా; శినివరుండు= సాత్యకి; కోపించి; మూఁడు బల్+తూపులన్ సారథిన్= మూడు బాణాలతో సారథిని; ఒక భల్లమునన్ విల్లున్= ఒక బల్లెంతో విల్లును; ఉజ్జ్వల+అస్త్రసప్తక నిహతిన్= ప్రకాశించే ఏడుఅస్త్రాలతో; అశ్వంబులన్= గుఱ్ఱాలను; ఏకకాండ స్ఫూర్తిన్= ఒకే బాణప్రయోగంతో; కేతుదండంబున్= ధ్వజపు కఱ్ఱను; తునిమి= ఖండించి; వక్షమునన్= వృషసేనుడి వక్షఃస్థలమునందు; మూడుశరములు నాటన్= మూడుబాణాలు వేయగా; సొగసి= మూర్ఛిల్లి; కర్ణనందనుండు= వృషసేనుడు; తెలిసి= తెప్పరిల్లి; కనలి= కోపించి; వాలున్+పలకయున్+కొని= కత్తి, డాలువాలు(కేడెము) తీసికొని; తేరు డిగ్గి= రథం దిగి; కవియన్= ఎదుర్కొనగా; అవియున్ నుగ్గు చేసెన్= వాటినికూడా ఖండించాడు.

**తాత్పర్యం:** సాత్యకి వృషసేనుడిపై డెబ్బయిఏడు బాణాలు, సూతుడిపై మూడుబాణాలు వేయగా, అతడు సాత్యకి నొసటిపై వాడిబాణం వేసి నొప్పించాడు. దానికి కోపించిన సాత్యకి మూడుబాణాలతో అతడి సారథిని, బల్లెంతో విల్లును, ప్రకాశించే ఏడు అస్త్రాలతో అశ్వాలను, ఒకే బాణంతో ధ్వజాన్ని ఖండించి, వృషసేనుడి వక్షంపై మూడుబాణాలు నాటగా, అతడు మూర్ఛిల్లి కొంతసేపటికి తేరుకొని కత్తి, డాలు గైకొని రథం దిగి ఎదుర్కొనగా అతడు వాటిని కూడా ఖండించాడు.

**వ.** **ఇ వ్విధంబున విరథుండును నిరాయుధుండును నగు నక్కుమారుం గనుంగొని దుశ్శాసనుండు రయంబున నెయిది చెయిచాచి నిజరథంబు మీఁదికిం దిగిచికొని తొలంగం గొనిపోయిన, నతండు వేఱొక్క యరదం బెక్కి యెప్పటియట్ల కర్ణుతేరి వెనుక వర్తించె; నయ్యంగపతి తొమ్మిది యమ్ము లడరించి శైనేయు సూతాశ్వ చాపంబులు రూపడంచి యతని ఫాలమ్మున మూఁడు వాలిక యమ్ములు నాటించె; నా సత్యక నందనుం డన్యస్యందనారూఢుం డయి కవిసి కర్ణునకుఁ దోడుపడు బలంబులం గలంచి యతని తనువున నేడు నారసంబులు నిగిడించెఁ; గూడికొని శతానీకుం డన్నియ శరంబు లేసె నప్పు డురువడించి తక్కటి ద్రౌపదేయులు డెబ్బది మూఁడును ధృష్టద్యుమ్నుండును శిఖండియుం బదిపదియు భీమసేనుం డఱువది నాల్గును సహదేవుం దేడును నకులుండు ముప్పదియును యుయుధానుం డేడును బాండవాగ్రజుండు నూఱును బాణంబు లా సూతపుత్రుపయిం గుప్పించి నొప్పించిన.** 175

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; విరథుండును= రథహీనుడూ; నిరాయుధుండునున్+అగు= ఆయుధాలు లేనివాడూ అయిన; ఆ+కుమారున్= వృషసేనుడిని; దుశ్శాసనుడు; కనుంగొని= చూచి; రయంబునన్+ఎయిది= వేగంగా వెంబడించి; చెయి చాచి= చెయ్యిసాచి; నిజరథంబు మీఁదికిన్+తిగిచికొని= తన రథంపైకి లాగికొని; తొలంగన్+కొనిపోయినన్= అక్కడినుండి తొలగించి తీసికొనిపోవగా; అతండు= వృషసేనుడు; వేఱు+ఒక్కఅరదంబు+ఎక్కి= మరొక రథం ఎక్కి; ఎప్పటి+అట్ల= మునుపటివలె; కర్ణుతేరి వెనుకన్, వర్తించన్= కర్ణుడి రథం వెనుకకు చేరాడు; ఆ+అంగపతి= ఆ కర్ణుడు; తొమ్మిది+అమ్ములు+అడరించి= తొమ్మిదిబాణాలు వేసి; శైనేయు, సూత+అశ్వ+చాపంబులు= సాత్యకి సారథిని గుఱ్రాలను, విల్లును; రూపు+అడంచి= నశింపజేసి; అతని ఫాలమ్మునన్= అతని నొసటిపై; మూఁడు వాలిక+అమ్ములు నాటించెన్= మూడు వాడిబాణాలు వేశాడు; ఆ సత్యకనందనుండు= సత్యకుని కొడుకైన ఆ సాత్యకి; అన్యస్యందన+ఆరూఢుండయి= వేరొక రథం అధిరోహించినవాడై; కవిసి= ఆక్రమించి; కర్ణునకున్+తోడుపడు, బలంబులన్= కర్ణుడికి సహాయంగా ఉన్న సైన్యాలను; కలంచి= చెదరగొట్టి; అతని తనువునన్= అతని శరీరంపై; ఏడు నారసంబులు= ఏడుబాణాలు; నిగిడించెన్= గురిపెట్టి వేశాడు; శతానీకుండు= (నకులుడి కుమారుడైన) శతానీకుడు; కూడికొని= చేరి; అన్నియ శరంబులు+ఏసెన్= అన్నే బాణాలు (ఏడు) వేశాడు; అప్పుడు+ఉరువడించి= అప్పుడు విజృంభించి; తక్కటి ద్రౌపదేయులు= మిగిలిన ఉపపాండవులు; డెబ్బదిమూఁడును= డెబ్బదిమూడు బాణాలు; ధృష్టద్యుమ్నుండును శిఖండియున్+పది పదియున్= ధృష్టద్యుమ్నుడు శిఖండి చెరి పదిబాణాలు; భీమసేనుండు+అఱువది నాల్గను= భీముడు అరవైనాలుగు బాణాలు; సహదేవుండు+ఏడును= సహదేవుడు ఏడుబాణాలు; నకులుండు ముప్పదియును= నకులుడు ముప్పయి బాణాలు; యుయుధానుండు+ఏడును= యుయుధానుడు ఏడు; పాండవ+అగ్రజుండు= ధర్మరాజు; నూఱును బాణంబులు= నూరుబాణాలు; ఆ సూతపుత్రుపయిన్= కర్ణుడిపై; గుప్పించి, నొప్పించినన్= వేసి నొప్పించగా.

**తాత్పర్యం:** ఈ విధంగా రథవిహీనుడు, ఆయుధాలు లేనివాడు అయిన వృషసేనుణ్ణి, దుశ్శాసనుడు చూచి, వేగంగా వచ్చి, చెయ్యిచాచి తన రథంమీదికి ఎక్కించుకొని, రణరంగంనుండి తప్పించి తీసుకొని వెళ్ళాడు. తరువాత వృషసేనుడు వేరొక రథం ఎక్కి ఎప్పటిలాగే తండ్రి (కర్ణుడి) రథం వెనుకకు చేరాడు. కర్ణుడు తొమ్మిదిబాణాలు వేసి సాత్యకి సారథిని, గుఱ్రాలను, విల్లును త్రుంచాడు. మూడు వాడిబాణాలను అతడి నుదుట నాటాడు. అప్పుడా సాత్యకి ఇంకొక రథం ఎక్కి విజృంభించి, కర్ణుడికి సహాయంగా ఉన్న సైన్యాలను చెల్లాచెదురు చేసి, అతడి శరీరం మీద ఏడుబాణాలు వేశాడు. నకులుడి కొడుకు శతానీకుడు కూడ అక్కడికి చేరుకొని, తాను కూడ ఏడుబాణాలు వేశాడు. అప్పుడు తక్కిన ఉపపాండవులు డెబ్బదిమూడు బాణాలు, ధృష్టద్యుమ్న శిఖండులు చెరి పదిబాణాలు, భీమసేనుడు అరువదినాలుగు బాణాలు, సహదేవుడు ఏడుబాణాలు, నకులుడు ముప్పదిబాణాలు, యుయుధానుడు ఏడుబాణాలు, ధర్మరాజు నూరుబాణాలు కర్ణుడిమీద గుప్పించి, నొప్పించగా----

**క. ముదమున నతఁ డందఱఁ బది । పది తూపుల నే పడంచి బహువిధగతులన్**
**దదనీకంబునఁ దే రొ । ప్పిదముగ వడి సంచరింపఁ బెద్దయు మెఱసెన్. 176**

**ప్రతిపదార్థం:** అతఁడు= కర్ణుడు; ముదమునన్= ఉత్సాహంగా; అందరన్= ఆ శత్రువీరులనందరినీ; పది పది తూపులన్= పది పది బాణాలతో; ఏపు+అడంచి= గర్వం అణచి; తద్+అనీకంబునన్= ఆ సైన్యంలో; తేరు= రథం; బహువిధగతులన్= పెక్కు నడకలతో; ఒప్పిదముగన్, వడి, సంచరింపన్= ఒప్పుగా వేగంగా తిరుగగా; పెద్దయున్ మెఱసెన్= ఎంతో ప్రకాశించాడు.

**తాత్పర్యం:** కర్ణుడు పది పది బాణాలతో శత్రువీరుల గర్వాన్ని అణచి, తన రథం వివిధ గతులతో సంచరింపగా యుద్ధరంగంలో ప్రకాశించాడు.

**శా. శైనేయుండును భీమసేనుఁడును ధృష్టద్యుమ్నుఁడున్ ద్రౌపదీ**
**సూనుల్ ము న్నడరంగఁ గిట్టి విశిఖ స్తోమంబు లొక్కుమ్మడిన్**
**మేనం గ్రువ్వ శిఖండియున్ భుజబలోన్మేషంబు సూపన్ వెసం**
**దా నయ్యోధుల సూతసూతి విరథత్వస్తబ్ధులం జేసినన్. 177**

**ప్రతిపదార్థం:** శైనేయుండును= సాత్యకియూ; భీమసేనుఁడును= భీముడూ; ధృష్టద్యుమ్నుఁడున్= ధృష్టద్యుమ్నుడు; ద్రౌపదీసుతుల్= ఉపపాండవులు; మున్ను+అడరంగన్+కిట్టి= ముందుండగా గర్వంతో సమీపించి; విశిఖస్తోమంబులు= బాణపరంపర; ఒక్కుమ్మడిన్= ఒక్కసారిగా; మేనన్+క్రువ్వన్= శరీరంపై గుప్పించగా; శిఖండియున్= శిఖండి కూడా; భుజబల+ఉన్మేషంబు+చూపన్= భుజబలగర్వం చూపగా; సూతసూతి= కర్ణుడు; వెసన్= వెంటనే; తాన్+అ+యోధులన్= తాను ఆ వీరులను; విరథత్వ స్తబ్ధులన్+చేసినన్= రథహీనతచే నిశ్చేష్టులను చేయగా.

**తాత్పర్యం:** సాత్యకి ధృష్టద్యుమ్నుడు భీముడు ఉపపాండవులు కవిసి కర్ణుడిపై బాణపరంపర కురిపించారు. శిఖండి కూడా తన భుజబలాన్ని ప్రదర్శించాడు. దానికి ప్రతిగా కర్ణుడు వారందరినీ విరథులను చేసి నిశ్చేష్టులను కావించాడు. అట్లా చేయగా.

**వ. వియచ్చరులు వెఱఁగందిరి; వెండియు నవ్వీరుండు వారలనందఱ నస్త్రధారలం బొదువుచు నేడ్తెఱం బెఱవారిని బాణాంధకారంబునఁ గప్పినం ద్రిప్పికొనియును దొలంగియు దెరలియు మరలియు నా రథికసంఘంబు దైన్యంబు నొందె; నంత ధర్మనందనుని బాధింపఁ దలంపెయ్యిన. 178**

**ప్రతిపదార్థం:** వియత్+చరులు= ఆకాశమునందు చరించేవారు(దేవతలు); వెఱఁగు+అందిరి= ఆశ్చర్యపోయారు; ఆ+వీరుండు= కర్ణుడు; వెండియును= ఇంకా; వారలన్+అందఱన్= శత్రువీరులందరినీ; అస్త్రధారలన్+పొదువుచున్= అస్త్రపరంపరలతో కప్పుచు; ఏడ్తెఱన్= పరాక్రమంతో; పెఱవారిని= మిగతావీరులను; బాణ+అంధకారంబునన్+కప్పినన్= బాణాలనే చీకట్లతో దట్టంగా కప్పగా; ఆ రథిక సంఘంబు= ఆ రథవీరుల సమూహం; త్రిప్పికొనియును తొలంగియున్= తిరుగుడువడి, తొలగివెళ్ళి; తెరలియున్= కలతపొంది; మరలియున్= వెనుకకుమరలి; దైన్యంబున్+ఒందెన్= దీనస్థితిని పొందారు; అంతన్= అప్పుడు; ధర్మనందనుని= ధర్మరాజును; బాధింపన్+తలంపు+ఎయ్యిన= బాధపెట్టాలన్న ఆలోచన తలెత్తగా.

**తాత్పర్యం:** కర్ణుడి పరాక్రమానికి దేవతలు ఆశ్చర్యపడ్డారు. ఇంకా కర్ణుడు వారందరిని అస్త్రపరంపరలతో కప్పుతూ, తక్కినవారిని బాణాలనే చీకటిలో ముంచగా, కొందరు తిరుగుడువడ్డారు. కొందరు తొలగివెళ్ళారు. కొందరు కలతపొందారు. కొందరు వెనుకకు మరలారు. మొత్తంమీద ఆ రథికవీరులంతా దైన్యం పొందారు. అప్పుడు ధర్మరాజును నొప్పించాలనే ఆలోచన కర్ణుడిలో తలయెత్తగా -

**క. ఆ రాధేయుం డాతని । పై రయమునఁ గవియు ఘోరభంగిఁ గని మహో**
**దారంబుగఁ జేది బలము । బోరన నెడసొచ్చెఁ దూర్యములు మొరయంగన్. 179**

**ప్రతిపదార్థం:** ఆ రాధేయుండు= కర్ణుడు; అతనిపైన్= ధర్మరాజుపై; రయమునన్+కవియు= వేగంగా తాకునట్టి; ఘోరభంగిన్+కని= భయంకరస్థితిని చూచి; చేది బలము= చేదిసైన్యం; మహా+ఉదారంబుగన్= చాలగొప్పగా; తూర్యములు, మొరయంగన్= వాద్యధ్వనులు మ్రోగగా; బోరనన్= శీఘ్రంగా; ఎడసొచ్చెన్= ప్రవేశించింది.

**తాత్పర్యం:** కర్ణుడు ధర్మరాజును తాకునట్టి భయంకరస్థితిని చూచి, చేదిసైన్యం ఆతడికి సహాయంగా శీఘ్రంగా అరుదెంచింది.

**ఉ. సూతతనూజుఁ డబ్బలము సొచ్చి శతత్రయ యోధవీరులం**
**జేతుల తీఁట వో నుఱుము సేసి విశృంఖల దర్ప దుర్దముం**
**డై తఱుమంగఁ గల్పిత రథాక్రమ మొప్పఁగ వచ్చి ధర్మజుం**
**బ్రీతునిఁ జేయుచుం గడిమిఁ బేర్చిరి సాత్యకియున్ శిఖండియున్. 180**

**ప్రతిపదార్థం:** సూత తనూజుఁడు= కర్ణుడు; ఆ+బలముచొచ్చి= ఆ సైన్యమునందు ప్రవేశించి; శతత్రయ యోధవీరులన్= మూడువందలమంది వీరులను; చేతుల తీఁటపోన్= చేతుల దురద తీరగా (తృప్తి తీరగా); నుఱుము చేసి= చంపి; విశృంఖల, దర్ప, దుర్దముండు+ఐ= అదుపులేని భుజబలంతో విజృంభించినవాడై; తఱుమంగన్= వెంటబడగా; సాత్యకియున్, శిఖండియున్= సాత్యకీ శిఖండీ; కల్పిత రథాక్రమము+ఒప్పఁగన్= కల్పించుకొన్న రథాలతో చుట్టుముట్టి; వచ్చి= చేరి; ధర్మజున్+ప్రీతుని, చేయుచున్= ధర్మరాజుకు ఆనందం కలిగిస్తూ; కడిమిన్+పేర్చిరి= పరాక్రమంతో విజృంభించారు.

**తాత్పర్యం:** కర్ణుడు శత్రుసైన్యంలోకి చొచ్చుకొని వెళ్ళి, తన చేతుల దురద తీరేటట్లుగ మూడువందలమంది యోధవీరులను చంపి, అదుపులేని భుజగర్వంతో విజృంభించి తక్కినవారిని తరుమగా, మళ్ళీ రథాలను ఏర్పరచుకొని సాత్యకీ, శిఖండీ ధర్మరాజుకు సంతోషం కలిగేటట్లుగా లెస్సగ విజృంభించారు.

**క. వారికిఁ దోడ్పడి యక్కడి । వీరులు గొందఱు గడంగి వివిధోగ్ర శరా**
**సారము లంగాధీశ్వరు । పై రయమునఁ గురిసి రుగ్రభంగిఁ జెలఁగుచున్. 181**

**ప్రతిపదార్థం:** వారికిన్= సాత్యకి శిఖండులకు; తోడ్పడి= సహాయపడి; అక్కడి వీరులు, కొందఱు= అక్కడ ఉన్న కొందరు వీరులు; కడంగి= పూనుకొని; ఉగ్రభంగిన్+చెలగుచున్= భయంకరంగా ధ్వనిచేస్తూ; అంగ+అధీశ్వరుపైన్= అంగరాజైన కర్ణుడిపై; వివిధ+ఉగ్ర శర+ఆసారములు= వాడియైన వివిధ బాణవర్షాలు; రయమునన్+కురిసిరి= శీఘ్రంగా కురిపించారు.

**తాత్పర్యం:** సాత్యకి, శిఖండులకు సహాయంగా మరికొందరు వీరులు పూనుకొని కర్ణుడిపై వివిధ బాణవర్షాలు కురిపించారు.

**క. కురుపక్ష యోధులును స । త్వరులై యా రథికవరులఁ దాఁకి భుజావి**
**స్ఫురణము సూపిన నద్భుత । కర మయ్యెఁ దదవసరమునఁ గయ్యం బధిపా! 182**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; కురుపక్ష, యోధులును= కౌరవవీరులు; సత్వరులు+ఐ= వేగిరపాటుకలవారై; ఆ రథిక వీరులన్+తాఁకి= ఆ రథవీరులను ఎదుర్కొని; భుజా, విస్ఫురణము, చూపినన్= భుజ పరాక్రమం ప్రదర్శించగా; తద్+ అవసరమునన్= ఆ సమయంలో; కయ్యంబు= యుద్ధం; అద్భుతకరము+అయ్యెన్= ఆశ్చర్యకరం అయ్యింది.

**తాత్పర్యం:** కౌరవవీరులు వెంటనే శత్రువులను తాకి తమ భుజబలాన్ని చూపగా యుద్ధం ఆశ్చర్యకరంగా కొనసాగింది.

**వ. ఆ సంకుల సమరంబునందు.** **183**

**తాత్పర్యం:** తీవ్రమైన ఆ యుద్ధంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**శా. బాణజ్వాలలు బెట్టు పర్వ గగన ప్రక్షోభణ జ్యాలతా**
**క్వాణస్ఫూర్తి ఛటచ్ఛటారవముగాఁ గర్ణోగ్ర దావాగ్ని య**
**క్షీణోదగ్రత వైరి సైన్యవన భస్మీభావ నిర్వాహ పా**
**రీణంబై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ నే ముబ్బఁగన్.** **184**

**ప్రతిపదార్థం:** బాణజ్వాలలు, బెట్టు, పర్వన్= బాణములు అనే మంటలు తీవ్రంగా వ్యాపించగా; గగన ప్రక్షోభణ= ఆకాశం మిక్కిలి కలతనొందేటట్లు చేసే; జ్యాలతా క్వాణస్ఫూర్తి= తీగవంటి వింటినారి ధ్వనుల స్ఫురణ; ఛట+ఛట+ఆరవముగాన్= ఛటఛట అనే శబ్దం కాగా; కర్ణ+ఉగ్రదావ+అగ్ని= కర్ణుడు అనే భయంకరమైన కార్చిచ్చు; అక్షీణ+ఉదగ్రతన్= మిక్కిలి విజృంభణంతో; వైరి సైన్య, వన= శత్రుసైన్యం అనే అడవిని; భస్మీభావ నిర్వాహపారీణంబు+ఐ= భస్మం చేయటంలో ఆరితేరినదై; నిర్జరులు వర్ణింపంగన్= దేవతలు కొనియాడగా; ఏము+ఉబ్బఁగన్= మేము హర్షించగా; వెలుఁగొందెన్= ప్రకాశించింది.

**తాత్పర్యం:** బాణాలనే మంటలు తీవ్రంగా వ్యాపించి ఆకాశాన్ని మిక్కిలి కలతపెట్టగా, వింటినారి ధ్వనులు ఛటఛట అనే శబ్దం చేయగా, కర్ణుడనే భయంకరమైన కార్చిచ్చు - అతి భయంకరంగా విజృంభించి శత్రుసైన్యం అనే అడవిని బూడిద చెయ్యటంలో ఆరితేరినదై, దేవతలు ప్రశంసించగా, మేము సంతోషించగా ప్రకాశించింది.

**విశేషం:** అలం: రూపకం.

**వ. అమ్మహోగ్ర విజృంభణంబున.** **185**

**ప్రతిపదార్థం:** ఆ+మహా+ఉగ్ర విజృంభణంబున= ఎంతో భయంకరమైన ఆ పరాక్రమం ధాటికి.

**తాత్పర్యం:** ఆ మహా భయంకరమైన కర్ణుడి ధాటికి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆటోప మడఁగి యచ్చటి । మేటి మగలు ఙిచ్చవడిరి మెయిగలి గర్ణుం**
**డేటలవికిఁ గవిసె ధను । ర్జ్యాటంకృతి సెలఁగఁ బాండవాగ్రజుమీఁదన్.** **186**

**ప్రతిపదార్థం:** అచ్చటి మేటిమగలు= అక్కడున్న గొప్పవీరులు; ఆటోపము+అడఁగి= అతిశయం తగ్గి; ఙిచ్చపడిరి= చేష్టలుడిగారు; మెయిగలి= శూరుడైన; కర్ణుండు= కర్ణుడు; ధనుః+జ్యాటంకృతి చెలఁగన్= వింటినారి ధ్వని వ్యాపించగా; పాండవ+అగ్రజుమీఁదన్= ధర్మరాజుమీద; ఏటు+అలవికిన్= బాణప్రయోగాతిశయానికి; కవిసెన్= పూనుకొన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడి ధాటికి అక్కడున్న వీరులంతా వెరగు చెందారు. శూరుడైన అతడు ధనుష్టంకారం చేస్తూ ధర్మరాజుపై అధికంగా బాణాలు వేయసాగాడు.

**వ. ఇత్తెఱంగునం గవిసిన నతనిమీఁద నమ్మేదినీనాయకుండు సాయకజాలంబులు పరఁగించిన నతం డుఱక యతి రయంబున నవి వారించి.** **187**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్+కవిసినన్= ఈ విధంగా బాణాలతో తాకగా; ఆ+మేదినీ నాయకుండు= ఆ ధర్మరాజు; అతనిమీఁదన్= కర్ణుడిమీద; సాయకజాలంబులు= బాణసమూహాలు; పరఁగించినన్= వేయగా; అతండు= కర్ణుడు; ఉఱక= లక్ష్యపెట్టక; అతిరయంబునన్= మిగుల వేగంతో; అవి వారించి= ఆ బాణాలను అడ్డుకొని.

**తాత్పర్యం:** కర్ణుడు ఈ విధంగా ధర్మరాజుపై బాణాలు వేయగా, అతడుకూడా కర్ణుడిపై బాణసమూహాలు గుప్పించాడు. కర్ణుడు వేగంగా వాటిని వారించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. నవ్వుచుఁ జాపంబు నడిమికిఁ ద్రుంచి మై । మఱువుఁ దొంబది శితమార్గణముల**
**భేదింప రత్న ప్రభాదీప్త మగునది । సౌదామనీ చారు జలద మంబు**
**జాప్తుని తనువున కడ్డమై యుండి వా । తాహతంబై పాయునట్లు వోలెఁ**
**బడుటయు, మణిమయాభరణ సుందరమైన । యతని గాత్రము సతారాంబరంబుఁ**

**తే. బోలి యప్పుడ యా సూతపుత్రుచేత । రక్తమయమయి పల్లవోద్రిక్త కల్ప**
**తరువు చందంబు నొందె; నతండు రాజ । ధర్మమూఁది చలింప కదల్చె నధిప! 188**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; నవ్వుచున్= నవ్వుతూ; చాపంబు= ధనుస్సు; నడిమికిన్+త్రుంచి= మధ్యకు విరిచి; తొంబది శితమార్గణములన్= తొంబయి వాడిబాణాలతో; మైమఱువున్= కవచాన్ని; భేదింపన్= ఖండించగా; రత్నప్రభాదీప్తము+అగు+అది= రత్నకాంతులతో ప్రకాశించే ఆ కవచం; సౌదామనీ చారు జలదము= విద్యుల్లతతో మెరిసే మేఘం; అంబుజ+ఆప్తుని= సూర్యుడి; తనువునకున్+అడ్డము+అయి+ఉండి= దేహానికి అడ్డంగా ఉండి; వాతాహతంబు+ఐ= గాలిచే కొట్టబడి; పాయున్+అట్లు పోలెన్= పడేటట్లుగా; పడుటయున్= పడిపోగా; మణిమయ+ఆభరణ సుందరము+అయిన= మణిమయ భూషణాలతో అందంగా ఉన్న; అతని గాత్రము= అతడి దేహం; సతార+అంబరంబున్ పోలి= నక్షత్రాలతో కూడిన ఆకాశం వలె ఒప్పి; అప్పుడు+అ= అప్పుడే; ఆ సూత పుత్రుచేతన్= కర్ణుడిచేత; రక్తమయము+అయి= రక్తంతో నిండినదయి; పల్లవ+ఉద్రిక్త, కల్పతరువు చందంబున్+ఒందెన్= చిగుళ్ళతో నిండిన కల్పవృక్షం వలె ఒప్పింది; అతండు= ధర్మరాజు; రాజధర్మము+ఊఁది= క్షత్రియధర్మాన్ని పాటించి; చలింపక= కదలక; అదల్చెన్= కోపంతో గద్దించాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కర్ణుడు ధర్మరాజు ధనువును ఖండించి, తొంభైబాణాలతో అతడి కవచాన్ని భేదించగా, రత్నకాంతిమయమైన ఆ కవచం విద్యుల్లతతో కూడిన మేఘం గాలికి సూర్యుడి దేహానికి అడ్డుతొలగినట్లు పడిపోయింది. మణిమయ ఆభరణాలతో కూడి ఉన్న అతడి శరీరం నక్షత్రాలతో కూడిన ఆకాశంవలె అందంగా ఒప్పింది. కర్ణుడు గాయపరచగా రక్తం కారుతున్న అతడి శరీరం చిగుళ్ళతో నిండిన కల్పవృక్షంవలె ఒప్పారింది. అయినా ధర్మరాజు చలించకుండా నిలిచి అతడిని ఎదిరించాడు.

**విశేషం:** అలం: ఉపమ. సూర్యపుత్రుడైన కర్ణుడు భేదించిన కవచం సూర్యుడికి అడ్డుగా నిలిచిన మేఘం తొలగినట్లు పడిపోయిందనటంలో స్వారస్యం ఉంది.

**వ. ఇ ట్లదల్చుచు. 189**

**తాత్పర్యం:** ఈ విధంగా ఎదిరిస్తూ.

**క. చదల మెఱుంగులు పర్వం। గొదమ పిడుగునట్ల నిగుడఁ గుంతీసుతుఁ డు**
**బ్బుదలిర్ప శక్తి వైచిన। నది కర్ణుఁడు సప్త భల్లహతి నెడఁ దునిమెన్. 190**

**ప్రతిపదార్థం:** కుంతీసుతుఁడు= ధర్మరాజు; ఉబ్బు తలిర్పన్= గర్వమొప్పగా; చదలన్= గగనభాగంలో; మెఱుంగులు పర్వన్= కాంతులు చిమ్మగా; కొదమపిడుగు+అట్ల= పిల్ల పిడుగువలె; నిగుడన్= వ్యాపించగా; శక్తి వైచినన్= శక్తి అనే ఆయుధం వేయగా; కర్ణుడు; సప్తభల్లహతిన్= ఏడుబల్లెముల దెబ్బతో; అది= దానిని; ఎడన్= నడుమనే; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు అతిశయంతో పిడుగువంటి శక్తిని విసరగా, కర్ణుడు దానిని ఏడు బల్లెములతో మధ్యలోనే ఖండించాడు.

**విశేషం:** శక్తి అంటే బల్లెం, ఈటె. ఇది ఇనుముతో చేయబడింది. దీనికి బంగారుపూతవేసి గజ్జెలతో అలంకరించేవారు.

**సీ. పాండవాగ్రజుఁడు దర్పంబును వేగంబు। నొప్ప నవ్వీరుని యురమునందుఁ**
**గరముల ఫాలభాగంబున నాల్గు తో। మరములు సొనిపి నెత్తురులు వఱపి**
**యార్చినఁ, బేర్చిన యగ్గలికంబున। నా సూతనందనుఁ డతని సూతుఁ**
**జంపి కేతువుఁ ద్రుంచి శాతశరంబుల। నంగంబు నొప్పించె; నపుడు సాత్య**

**తే. కియు శిఖండియు నెడసొచ్చి రయము బలువు। మెఱయ రాధాతనూజుని మేన నమ్ము**
**లొక్క మొగి నింప, నయ్యోధుఁ డుఱక వారి। విరథులుగఁ జేసి విండులు విఱుగనేసె. 191**

**ప్రతిపదార్థం:** పాండవ+అగ్రజుఁడు= ధర్మరాజు; దర్పంబును వేగంబును+ఒప్పన్= గర్వము, వేగమూ ఒప్పగా; ఆ+వీరుని= కర్ణుడి; ఉరమునందున్= వక్షమునందు; కరములన్= చేతులందు; ఫాలభాగంబునన్= నొసటిపై; నాల్గు తోమరములు= నాల్గు చిల్లకోలలు; చొనిపి= నాటి; నెత్తురులు పఱపి= రక్తం కారజేసి; ఆర్చినన్= అరువగా; ఆ సూతనందనుఁడు= ఆ కర్ణుడు; పేర్చిన అగ్గలికంబునన్= హెచ్చిన శౌర్యంతో; అతని సూతున్+చంపి= ధర్మరాజు సారథిని చంపి; కేతువున్+త్రుంచి= ధ్వజమును ఖండించి; శాత శరంబులన్= వాడిఅయిన బాణాలతో; అంగంబు నొప్పించెన్= దేహాన్ని గాయపరిచాడు; అప్పుడు; సాత్యకియున్, శిఖండియున్= సాత్యకీ, శిఖండీ; ఎడచొచ్చి= నడుమ ప్రవేశించి; రయము బలువు మెరయన్= వేగం, బలం ఒప్పగా; రాధా తనూజుని మేనన్= కర్ణుడి శరీరమునందు; అమ్ములు+ఒక్కమొగిన్ నింపన్= బాణాలు ఒక్కుమ్మడి కురిపించగా; ఆ+యోధుఁడు= కర్ణుడు; ఉఱక= లక్ష్యపెట్టక; వారిన్ విరథులుగన్+చేసి= వారిని రథహీనులుగా చేసి; విండులు విఱుగన్+ఏసెన్= ధనువులు విరిగేటట్లుగా బాణాలు వేశాడు.

**తాత్పర్యం:** ధర్మరాజు గర్వం, వేగం ఒప్పగా కర్ణుడి వక్షంమీద, చేతులమీద, నొసటిమీద నాలుగు తోమరాలు దిగబడేటట్లు వేసి, నెత్తురు కారేటట్లుగా చేసి సింహనాదం చేశాడు. అప్పుడు కర్ణుడు హెచ్చిన శౌర్యంతో ధర్మరాజు సారథిని, ధ్వజాన్ని ఖండించి, వాడిబాణాలతో అతడి దేహాన్ని గాయపరిచాడు. ఆ సమయంలో సాత్యకి, శిఖండి మధ్యలో ప్రవేశించి వేగం, బలం ఒప్పగా కర్ణుడి శరీరంమీద ఒక్కుమ్మడిగా బాణాలు నింపారు. అయినా కర్ణుడు లెక్కపెట్టక వారిని విరథులుగా చేసి, వారి విండ్లు విరుగకొట్టాడు.

**విశేషం:** తోమరం కొయ్యపిడితో కూడి వంపు కలిగిన బాణం. దీనికి విషం పూస్తారు. అందువలన దీనిని విషతోమరమని అంటారు.

**క. తనువులఁ బటు బాణంబులు । నినిచి వెగడు పఱిచి కడచి నిరతిశయ రయం**
**బునఁ గదిసి ధర్మనందను । ననేక సాయక పరిక్షతాంగుం జేసెన్. 192**

**ప్రతిపదార్థం:** తనువులన్= వారి శరీరాలపై; పటు బాణంబులు నినిచి= వాడి బాణాలు నింపి; వెగడు పఱిచి= తల్లడిల్లజేసి; కడచి= దాటి; నిరతిశయ రయంబునన్+కదిసి= ఎంతో వేగంతో సమీపించి; ధర్మనందనున్= ధర్మరాజును; అనేక సాయక= పెక్కుబాణాలతో; పరిక్షత+అంగున్+చేసెన్= గాయపడిన దేహం కలవాడిగా చేశాడు.

**తాత్పర్యం:** కర్ణుడు వారి దేహాలపై బాణాలు వేసి కలతపరచి, వేగంగా ధర్మరాజును చేరి పెక్కు బాణాలతో అతడి శరీరాన్ని గాయపరిచాడు.

**వ. ఇ వ్విధంబున రాధేయుండు నొప్పించినం దదీయ సంరంభంబు సైరింపంజాలక యమ్మహీపతి హతసారథికం బగు నిజరథంబు దొలంగం దోలుకొని పోయినం దోడన తవిలి పొదివి నిలువరించి హసభాసితుం డగుచు నయ్యంగపతి యతనితో ని ట్లనియె: 193**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; రాధేయుండు= కర్ణుడు; నొప్పించినన్= గాయపరచగా; తదీయ సంరంభంబు= అతని ఆటోపం; సైరింపన్+చాలక= సహించలేక; ఆ+మహీపతి= ధర్మరాజు; హతసారథికంబు+అగు= సారథిహతుడైనట్టి; నిజరథంబు= తనరథం; తొలంగన్+తోలుకొని పోయినన్= తప్పించి (తానే) తోలుకొనిపోగా; తోడన తవిలి= వెంబడించి; నిలువరించి= అడ్డగించి; ఆ+అంగపతి= కర్ణుడు; హసభాసితుండు+అగుచున్= నవ్వుతున్నవాడై; అతనితోన్+ఇట్లు+అనియెన్= ధర్మరాజుతో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడు ధర్మజుడిని నొప్పించగా, అతడి విజృంభణాన్ని తట్టుకోలేక ధర్మజుడు, సారథిలేని తన రథాన్ని తానే తోలుకొని తొలగివెళ్ళాడు. అయినా కర్ణుడు అతడిని వెంబడించి అడ్డగించి పరిహాసం చేస్తూ ఇట్లా అన్నాడు:

కర్ణుండు ధర్మరాజు నొప్పించి యవమానించుట (సం. 8-44-72 (కుంభ) 8-33-36 (భం))

**సీ. 'క్షత్రియ కులమున జన్మించి యిది ధర్మ । మిది యధర్మం బని యెల్ల నెఱిఁగి**
**నట్టి నీ కిట్టి మహాహవమునఁ బ్రాణ । ములు దాఁచికొన శాత్రవులకుఁ దొలఁగి**
**పోవుట దగునె? నీ బుద్ధి గానఁగనయ్యెఁ । నృపనీతి యెఱుఁగవు; నీవు బ్రాహ్మ**
**ణాచార వేదివి; యాగాధ్యయనముల । వర్తింపు, కయ్యంబు వలవ; దుడుగు**

**తే. మింక ననుబోఁటిఁ దొడరిన నింతకంటె । నెడరు వాటిల్లు వేగపొ మ్మింటికడకు**
**హరియుఁ బార్థుడు నున్నెడకైన నరుగు; । మేను దెగ నీదు ప్రాణాన కింత నిజము.' 194**

**ప్రతిపదార్థం:** క్షత్రియకులమునన్ జన్మించి= క్షత్రియవంశంలో జన్మించి; ఇది ధర్మము+ఇది అధర్మంబు+అని= ధర్మాధర్మాలను; ఎల్లన్+ఎఱిఁగినట్టి నీకున్= అన్నీ తెలిసిన నీకు; ఇట్టి మహా+ఆహవమునన్= ఇటువంటి మహారణంలో; ప్రాణములు, దాఁచికొనన్= ప్రాణాలు దాచుకొనటానికి; శాత్రవులన్+తొలఁగిపోవుట తగునె?= శత్రువుల నుండి పారిపోవటం తగునా?; నీ బుద్ధి కానఁగన్+అయ్యెన్= నీ బుద్ధి బయటపడింది; నృపనీతి ఎఱుఁగవు= రాజధర్మం నీకు తెలియదు; నీవు; బ్రాహ్మణ+

ఆచారవేదివి= బ్రాహ్మణధర్మాలు తెలిసినవాడివి; యాగ+అధ్యయనములన్ వర్తింపు(ము)= యజ్ఞాలు వేదాధ్యయనాలతో గడపుము; కయ్యంబు వలవదు= యుద్ధం తగదు; ఉడుగుము+ఇంకన్= ఇక దాన్ని విడిచిపెట్టుము; ననుబోఁటిన్+తొడరినన్= నావంటివాడితో తలపడితే; ఇంతకంటెన్+ఎడరు+పాటిల్లున్= ఇంతకంటే ఆపద కలుగుతుంది; ఇంటికడకున్ వేగ పొమ్ము= వెంటనే ఇంటికి వెళ్ళుము; హరియున్+పార్థుఁడున్= కృష్ణార్జునులు; ఉన్న+ఎడకైనన్+అరుగు(ము)= ఉన్న వైపుకైనా వెళ్ళుము; నీదు ప్రాణానకున్= నీ ప్రాణానికి; ఏను= నేను; తెగన్= ముప్పుతెచ్చే సాహసం చేయను; ఇంత నిజము= ఇది నిజం.

**తాత్పర్యం:** క్షత్రియకులంలో జన్మించావు. ఇది ధర్మము, ఇది అధర్మము అని అన్నీ తెలిసినవాడివి. ఇంతటి మహాయుద్ధంలో ప్రాణాలు కాపాడుకోవటానికి శత్రువులనుండి పారిపోవటం నీకు తగునా? నీ బుద్ధి బయటపడింది. నీకు రాజధర్మం తెలియదు. నీవు బ్రాహ్మణాచారాలు తెలిసినవాడివి. యాగాలతో, వేదాధ్యయనాలతో కాలం గడుపు. నీకు యుద్ధం తగదు. మానుకో. ఇక నాలాంటివారితో యుద్ధానికి పూనుకొంటే ఇంతకంటె ఆపద కలుగుతుంది. వెంటనే ఇంటికి పొమ్ము, లేదా కృష్ణార్జునులున్న చోటికైనా వెళ్ళు. నీ ప్రాణాలు తీయటానికి నేను తెగించను. ఇది నిజం.

**వ. అని పలికి గొంతి వచనంబులు మనంబున నునికిం జేసి వధియింప నొల్లనివాఁడై యప్పాండవాగ్రజు విడిచి యా పురుషసత్తముండు తదీయ సేనాసముదయంబు నానాస్త్ర నిహతంబు సేసె; లజ్జాకుల మానసుం డగు నమ్మానవపతియును దత్ప్రదేశంబున నిలువక తొలంగిపోయెం; బోవుటయు. 195**

**ప్రతిపదార్థం:** అని పలికి= అని వచించి; గొంతి వచనంబులు= కుంతికి ఇచ్చిన మాటలు; మనంబునన్+ఉనికిన్+చేసి= మనసులో మెదలటం వలన; వధియింపన్+ఒల్లనివాఁడు+అయి= అతడిని చంపటం ఇష్టం లేనివాడై; ఆ+పాండవ+అగ్రజున్ విడిచి= ఆ ధర్మరాజును వదలి; ఆ పురుషసత్తముండు= ఆ పురుషశ్రేష్ఠుడు - కర్ణుడు; తదీయ సేనాసముదయంబు= అతని సైన్యసమూహాన్ని; నానా+అస్త్రనిహతంబు చేసెన్= వివిధ అస్త్రాలతో బాధించాడు; లజ్జా+ఆకుల మానసుండు+అగు= సిగ్గుతో నిండినవాడైన; ఆ+మానవపతియును= ధర్మరాజుకూడ; తద్+ప్రదేశంబున నిలువక= అక్కడ ఉండక; తొలంగిపోయెన్= మరలివెళ్ళాడు; పోవుటయున్= పోవగా.

**తాత్పర్యం:** కర్ణుడు ఈ విధంగా పరిహసించి, కుంతికి ఇచ్చిన మాట గుర్తుకు వచ్చి, ధర్మరాజును వధించకుండా విడిచి, అతడి సైన్యంపై వివిధాస్త్రాలు ప్రయోగించాడు. ధర్మరాజు సిగ్గుతో అక్కడ నిలువలేక వెనుదిరిగి వెళ్ళాడు. అప్పుడు.

**క. విను మతని యోధజనములు । మొనయుఁ దిరిగె; నట్లు సమరమున విముఖంబై**
**చను నబ్బలముం గని వెను । కొనియెం గర్ణుండు నీదు కొడుకులుఁ దానున్. 196**

**ప్రతిపదార్థం:** అతని యోధజనములు= ధర్మరాజు పక్షంలోని సైనికజనం; మొనయున్= సైన్యం; అట్లు= ఆ విధంగా; సమరమునన్ విముఖంబు+అయి= యుద్ధవిముఖమై; తిరిగెన్= వెనక్కు తిరిగాయి; చను+ఆ+బలమున్+కని= మరలుతున్న ఆ సైన్యాన్ని చూచి; కర్ణుండు= కర్ణుడు; నీదు, కొడుకులున్+తానున్= నీ కుమారులతో కలిసి తానూ; వెనుకొనియెన్= వెంబడించాడు; విను= వినుము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! వినుము. ధర్మరాజు సైన్యం యుద్ధం విడిచి వెనుకకు తిరిగివెళ్ళగా కర్ణుడు నీ కుమారులతో కలిసి దాన్ని వెంబడించాడు.

**క. పటు సింహనాద తూర్యో । త్కట రవగుణ నిస్వనములు గలసి యఖిల ది**
**క్తట దారణ కేలి సము । ద్భటము లగుచుఁ గురుబలమునఁ బరఁగె నరేంద్రా! 197**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= రాజా!; కురుబలమునన్= కౌరవసైన్యంలో; పటు, సింహనాదతూర్య= సింహనాదంవంటి వాద్యాల; ఉత్కటరవ= పెద్దధ్వనులు; గుణ నిస్వనములు= వింటినారిధ్వనులు; కలసి= కలిసి; అఖిల దిక్+తట, దారణకేలి సముద్భటములు+అగుచున్= దిక్కులన్నీ బద్దలు చేసేటంత భయంకరములై; పరఁగెన్= వ్యాపించాయి.

**తాత్పర్యం:** ఓ ధృతరాష్ట్ర మహారాజా! కౌరవసైన్యంలో యుద్ధ వాద్యాల ధ్వనులు, ధనుష్టంకారాలు కలిసి దిక్కులను బద్దలు చేస్తూ మారుమ్రోగాయి.

**ఉ. ఇమ్మెయి సూతనందనుని యేడ్తెఱ కోడిన యోధవీర సం**
**ఘమ్ములఁ బాండవాగ్రజుఁడు గన్గొని పేర్కొని పేరెలుంగునం**
**గ్రమ్మఱి పేర్చి కౌరవ నికాయము గర్వమడంపుఁ డన్న ధై**
**ర్య మ్మిగురొత్త వే తిరిగి రా రథికుల్ మరలెన్ బలంబులున్. 198**

**ప్రతిపదార్థం:** ఈ+మెయిన్= ఈ విధంగా; సూతనందనుని= కర్ణుడి; ఏడ్తెరకున్+ఓడిన= పరాక్రమానికి ఓడిపోయిన; యోధవీర సంఘమ్ములన్= వీరుల సమూహాలను; కన్గొని= చూచి; పాండవ+అగ్రజుఁడు= ధర్మరాజు; పేరు+ఎలుంగునన్= పెద్దగొంతుతో; పేర్కొని= పిల్చి; క్రమ్మఱి పేర్చి= మళ్ళీ విజృంభించి; కౌరవ నికాయము గర్వము+అడంపుఁడు+అన్నన్= కౌరవసైన్యం గర్వాన్ని అణచివేయండి అనగా; ఆ రథికులు= ఆ రథవీరులు; ధైర్యమ్ము+ఇగురు+ఒత్తన్= ధైర్యం చిగురించగా; వే తిరిగిరి= వెంటనే మరలారు; బలంబులున్ మరలెన్= సైన్యాలు కూడా మరలాయి.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడి పరాక్రమానికి నిలువలేక వెనుదిరుగుతున్న వీరులను, సైనికులను చూచి ధర్మరాజు వారిని బిగ్గరగా పిలిచి, మళ్ళీ విజృంభించి కౌరవసైన్యాన్ని అణచండి అనగా వారు ధైర్యం తెచ్చుకొని ముందుకు సాగారు.

**వ. ఇ వ్విధంబున వృకోదర పురస్సరంబుగాఁ బాండవ బలంబులు మార్కొనిన మన మూఁకలుం గూడికొని తిరంబై త్రోచి తలపడుటయు నయ్యిరువాఁగునందు. 199**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; పాండవ బలంబులు= పాండవసైన్యాలు; వృకోదరపురః+సరంబుగాన్= భీముడిని ముందుంచుకొని; మార్కొనినన్= ఎదుర్కొనగా; మనమూఁకలున్+కూడికొని; మన సైనికులు కూడా చేరి; తిరంబు+అయి= స్థిరంగా నిలిచి; త్రోచి, తలపడుటయున్= తాకి తలపడగా; ఆ+ఇరువాఁగు+అందున్= ఆ రెండు పక్షాలలో.

**తాత్పర్యం:** పాండవసైన్యం భీముడిని ముందుంచుకొని కౌరవులతో తలపడగా, వారుకూడా స్థిరంగా నిలిచి వారిని ఎదిరించారు. ఆ రెండు పక్షాలలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. కరిబృందంబులు ద్రెళ్ళెఁ బెల్లుగఁ దురంగ స్తోమముల్ పెక్కు గూ**
**లె రథానీకము లగ్గలంబు గెడసెన్ లెక్కింపఁ బెక్కైన కా**
**ల్బుర మొత్తంబులు రూపడంగె సిడము ల్నుగ్గయ్యె నన్నేల నె**
**త్తురు వెల్లిన్ మునిఁగెన్ మరుత్ఖచర పంక్తుల్ వెక్కసంబందఁగన్. 200**

**ప్రతిపదార్థం:** మరుత్+ఖచర, పంక్తుల్= యక్ష గంధర్వాది గగన సంచారుల సమూహాలు; వెక్కసంబు+అందఁగన్= సహించలేకపోగా; పెల్లుగన్= హెచ్చుగా; కరిబృందంబులు త్రెళ్ళెన్= ఏనుగుల సమూహాలు కూలాయి; తురంగస్తోమముల్= అశ్వాల గుంపులు; పెక్కుకూలెన్= చాలా నేలకూలాయి; రథ+అనీకములు= రథ సమూహాలు; అగ్గలంబు, కెడసెన్= అధికంగా కూలాయి; లెక్కింపన్+పెక్కు+అయిన= అధిక సంఖ్యాకమైన; కాల్బుర, మొత్తంబులు= సైనికుల గుంపులు; రూపు+అడంగెన్= నశించాయి; సిడముల్+నుగ్గు+అయ్యెన్= జెండాలు చూర్ణం అయ్యాయి; ఆ+నేల= ఆ భూమి; నెత్తురు వెల్లిన్; మునిగెన్= నెత్తుటి వరదలో మునిగింది.

**తాత్పర్యం:** దేవతలు, ఆకాశసంచారులు సహించలేనంత ఎక్కువగా ఏనుగులసమూహాలు, గుర్రాలసమూహాలు, రథసమూహాలు, సైనికులసమూహాలు కూలటం జరిగింది. ధ్వజాలు పొడి అయ్యాయి. నేల నెత్తుటి వరదలో మునిగింది.

**వ. అట్టి సందడి కయ్యంబున భీమసేనుండును శైనేయుండును బెట్టిదంపు టురవడిం గవిసిన ధృష్టద్యుమ్నాది రథిక ప్రకరంబును బరవసంబు సేయం గురుబలంబు వెఱచఱచి పఱచినఁ, గర్ణుం డదల్చి కరతలంబెత్తి నిలునిలు మని పలికి నమ్మోహరంబు నిలువదయ్యెఁ నవష్టంభ విజృంభితుండైన యా సూతసూనుండు వెండియుం గౌరవుల వేఱు వేఱ పురికొల్పి మరల్చిన నమ్మొనయును మొగకట్టి నిలిచెఁ నంతం బవమానసూనుం దాను మార్కొన నగ్గలించెఁ నతం డతని నాలోకించి యంతకుమున్న శ్రుతకీర్తి స్యందనం బెక్కియున్న తమయన్న వలను సాత్యకి ధృష్టద్యుమ్నులకుం జూపి వారలతో ని ట్లనియె. 201**

**ప్రతిపదార్థం:** అట్టి సందడి కయ్యంబునన్= ఆ సంకుల సమరంలో; భీమసేనుండును= భీముడును; శైనేయుండును= సాత్యకియు; బెట్టిదంపు+ఉరవడిన్= తీవ్రవేగంతో; కవిసినన్= పైబడగా; ధృష్టద్యుమ్న+ఆది= ధృష్టద్యుమ్నుడు మున్నగు; రథిక ప్రకరంబును= వీరుల సమూహం; బరవసంబు చేయన్= ధైర్యం చూపగా; కురుబలంబు= కౌరవసైన్యం; వెఱచఱచి, పఱచినన్= భయపడి పరుగిడగా; కర్ణుండు+అదల్చి= కర్ణుడు గద్దించి; కరతలంబు+ఎత్తి= చేయెత్తి; నిలునిలుము+అని పలికినన్= ఆగండి ఆగండి అని అనగా; ఆ+మోహరంబు= ఆ సైన్యం; నిలువదు+అయ్యెన్= నిలువలేదు; ఆవష్టంభ విజృంభితుండు+అయిన ఆ సూతసూనుండు= గర్వంతో విజృంభించిన ఆ కర్ణుడు; వెండియున్= మళ్ళీ; కౌరవులన్= కౌరవులను; వేఱు వేఱ పురికొల్పి= వేర్వేరుగా ప్రేరేపించి; మరల్చినన్= మరలించగా; ఆ+మొనయును= ఆ సైన్యం; మొగకట్టి నిలిచెన్= శబ్దంచేస్తూ నిలిచింది; అంతన్= అపుడు; పవమానసూనున్= భీముడిని; తాను మార్కొనన్+అగ్గలించెన్= తాను ఎదుర్కొనాలని పూనుకొన్నాడు; అతండు= భీముడు; ఆతనిన్+ఆలోకించి= కర్ణుడిని చూచి; అంతకున్మున్న= అంతకుముందే; శ్రుతకీర్తిస్యందనంబు+ఎక్కిఉన్న= శ్రుతకీర్తి రథంపై ఎక్కిఉన్న; తమ+అన్న వలను= ధర్మరాజు ఉన్నవైపు; సాత్యకి ధృష్టద్యుమ్నులకున్+చూపి= సాత్యకి ధృష్టద్యుమ్నులకు చూపి; వారలతోన్+ఇట్లు+అనియెన్= వాళ్ళతో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అటువంటి సంకులసమరంలో భీమసేనుడు, సాత్యకి తీవ్రవేగంతో మీదికి రాగా, ధృష్టద్యుమ్నుడు మొదలైన వీరులు ధైర్యం చూపగా - కౌరవసైన్యం భయపడి పరుగెత్తింది. అప్పుడు కర్ణుడు గద్దించి, చెయ్యెత్తి

ఆగండి ఆగండని అన్నా ఆ సైన్యం ఆగలేదు. గర్వంతో విజృంభించిన కర్ణుడు, మళ్ళీ కౌరవులను వేరువేరుగా పురికొల్పి మరలించగా, ఆ సైన్యం శబ్దం చేస్తూ నిలిచింది. అప్పుడు కర్ణుడు భీమసేనుణ్ణి ఎదుర్కోటానికి పూనుకొన్నాడు. భీముడు, కర్ణుణ్ణి చూచి, అంతకుముందే శ్రుతకీర్తి రథాన్ని అధిరోహించియున్న అన్న ధర్మరాజును సాత్యకీ ధృష్టద్యుమ్నులకు చూపి, ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఈతఁడు దుర్దశం బొరసె నేను గనుంగొనఁ గర్ణుఁ డేచి దు**
**ర్నీతి పరున్ సుయోధనునిఁ బ్రీతునిఁ జేయుటకై కడంగె; మీ**
**చేతికి నిచ్చి యిట్లరువు సేసెద నిన్నరనాథు నాకు నా**
**సూతతనూభవున్ సమయఁ జూడక పోదు విషాద మెమ్మెయిన్. 202**

**ప్రతిపదార్థం:** నేను కనుంగొనన్= నేను చూడగా; ఈతడు దుర్దశన్+పొరసెన్= ఈ ధర్మజుడు దుస్స్థితి పొందాడు; కర్ణుఁడు+ఏచి= కర్ణుడు విజృంభించి; దుర్నీతి పరున్ సుయోధనునిన్= అవినీతిపరుడైన దుర్యోధనుడిని; ప్రీతునిన్+చేయుటకై కడంగెన్= సంతోషపరచటానికి పూనుకొన్నాడు; ఈ+నరనాథున్= ధర్మరాజును; మీ చేతికిన్+ఇచ్చి= మీ చేతిలో బెట్టి; ఇట్లు+ అరువు సేసెదన్= ఋణం ఇస్తున్నాను; నాకున్+ఆ సూత తనూభవున్= నాకు ఆ కర్ణుడిని; సమయన్+చూడక= చచ్చేటట్లు చేయకుండా; ఏ+మెయిన్= ఏ విధంగానూ; విషాదము పోదు= దుఃఖం తొలగదు.

**తాత్పర్యం:** దుర్యోధనుడికి ప్రీతి కలిగించటానికి పూనుకొని కర్ణుడు ఇట్లా చేస్తున్నాడు. నా కళ్ళముందు అగ్రజుడైన ధర్మరాజుకు దుర్దశ కలగటం బాధగా ఉన్నది. ఆయనను మీకు అప్పుగా ఇస్తున్నాను. (అంటే మళ్ళీ ఆయనను నాకు క్షేమంగా అప్పగించాలి అని) కర్ణుడిని సంహరించకుండా నా దుఃఖం తీరదు.

**క. ఏ నొండె నతనిచే నా । చేనొండె నతండు దెగుట సిద్ధముగ మదిం**
**బూని కడంగెద; మీ రీ । భూ నాథునిఁ గాచికొనియ పోరు నడపుఁడీ!' 203**

**ప్రతిపదార్థం:** అతనిచేన్= కర్ణుడిచేత; ఏను+ఒండెన్= నేనో; అతండు= కర్ణుడు; నాచేన్+ఒండెన్= నా చేతనో; తెగుట సిద్ధముగన్= చావటం నిశ్చయంగా; మదిన్+పూని కడంగెదన్= మనసులో భావించి పూనుకొంటాను; మీరు= మీరు; ఈ భూనాథునిన్+కాచికొనియ= ధర్మజునికి రక్షగా ఉండియే; పోరు నడపుఁడీ!= యుద్ధం చేయండి.

**తాత్పర్యం:** కర్ణుడి చేత నేనో, నా చేత కర్ణుడో చావటాన్ని నిశ్చయించి యుద్ధానికి పూనుకొంటాను. మీరు ఈ ధర్మరాజును కాపాడుకొంటూ యుద్ధం చేయండి.'

**చ. అని పటుసింహనాదమున నంబరముం బగిలించి తేరు క**
**ర్ణుని దెసఁ బోవనిచ్చినఁ గనుంగొని శల్యుఁడు కర్ణుతోడ ని**
**ట్లను 'మనమీఁద వచ్చు ననిలాత్మజుఁ జూచితె! యంతరంగ మే**
**ర్చు నలుక కామిషం బిడఁగఁ జూచిన చందము గాననయ్యెడున్. 204**

**ప్రతిపదార్థం:** అని, పటు, సింహనాదమునన్= అని తీవ్ర సింహగర్జనతో; అంబరమున్+పగిలించి= ఆకాశాన్ని బద్దలుచేసి; తేరు, కర్ణుని దెసన్+పోవనిచ్చినన్= రథం కర్ణుడివైపు మరల్చగా; శల్యుఁడు; కనుంగొని= చూచి; కర్ణుతోడన్+ఇట్లు+అనున్=

కర్ణుడితో ఇట్లా అన్నాడు; మనమీఁదన్, వచ్చు= మనపైకి వస్తున్న; అనిల+ఆత్మజున్+చూచితె?= భీముడిని చూచావా?; అంతరంగము+ఏర్చు+అలుకకున్= మనసును దహించే ఆగ్రహానికి; ఆమిషంబు+ఇడఁగన్+చూచిన చందము= ఆహారం ఇవ్వదలచిన విధం; కానన్+అయ్యెడున్= గోచరిస్తున్నది.

**తాత్పర్యం:** అని, భీముడు ఆకాశం బ్రద్దలయ్యేటట్లు సింహగర్జనచేసి, రథాన్ని కర్ణుడివైపు పోనిచ్చాడు. అతడిని చూచి కర్ణుడు శల్యుడితో ఇట్లా అన్నాడు. మనమీదికి వస్తున్న భీముణ్ణి చూచావా? (ధర్మరాజును మనం అవమానించినందుకు) తన మనస్సును దహించే కోపానికి (మనల్ని) ఆహారంగా ఇవ్వదలచినట్లు అగుపిస్తున్నాడు.

**చ. 'అలిగిన మూఁడు లోకముల నైనను జీరికిఁ జేకొనం డితం**
**డలఘు పరాక్రమ స్ఫురణుఁ డర్జున సూనుఁడు నాత్మపుత్త్రుఁడుం**
**బొలిసిర కాని కోపమునఁ బొంగఁడు నాఁడును నాఁడు నింత దో**
**ర్బలమును శౌర్యసారముఁ దిరంబయి చూపఱు మెచ్చఁ జూపుమీ!'** **205**

**ప్రతిపదార్థం:** ఇతండు= భీముడు; అలఘు పరాక్రమ స్ఫురణుఁడు= గొప్ప పరాక్రమశాలి; అలిగినన్= కోపిస్తే; మూఁడు లోకములన్+అయినను= మూడు లోకాలనైనా; చీరికిన్+చేకొనండు= లెక్కపెట్టడు; అర్జునసూనుఁడున్= అభిమన్యుడూ; ఆత్మపుత్త్రుఁడున్= ఘటోత్కచుడూ; పొలిసిరకాని= మరణించినా కాని; నాఁడును నాఁడున్= అభిమన్యుడు చచ్చిపోయిన నాడూ, ఘటోత్కచుడు చచ్చిపోయిననాడూ-ఆనాడు; కోపమునన్+పొంగఁడు= ఆవేశం చూపలేదు; ఇంత దోః+బలమును శౌర్యసారమున్= ఇంతటి భుజబలం; పరాక్రమం; తిరంబు+అయి= స్థిరమై; చూపరు మెచ్చన్+చూపుమీ!= అందరు మెచ్చగా చూపించుము.

**తాత్పర్యం:** 'గొప్ప పరాక్రమశాలి అయిన భీముడు అలిగితే మూడు లోకాలను కూడా లెక్కచేయడు. అభిమన్యు ఘటోత్కచుల మరణ సందర్భాలలో కూడా అతడిలో ఇంత ఆవేశాన్ని చూడలేదు. నీవు కూడా అంతటి బలాన్ని ప్రదర్శించి చూపరులను మెప్పించుము.'

**విశేషం:** ధర్మజుడికి కలిగిన అవమానానికి భీముడు అంత ఆగ్రహం చెందాడంటే అన్నగారిపై అతడికి గల గౌరవం వ్యక్తమవుతున్నది.

**చ. అనవుడు భీముఁ జూచి యతఁ డాతని కిట్లను 'నట్టివాఁడ కా**
**కనిలజుఁ డల్పుఁ డెట్లు? సమరాగ్రమునన్ భవదుక్తి యట్ల యిం**
**తనువగునే కిరీటిఁ దెగటార్పఁగ నీతని నొంపఁ జంపఁ దాఁ**
**గని వెసవచ్చు నాతఁ డధికం బగు మద్బల మిప్డు సూడుమీ!** **206**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; భీమున్+చూచి= భీముడిని చూచి; అతడు+అతనికిన్+ఇట్లు అనున్= కర్ణుడు శల్యుడితో ఇట్లా అన్నాడు; అనిలజుఁడు= భీముడు; అట్టివాఁడకాక= అట్టివీరుడుకాక; అల్పుఁడు+ఎట్లు?= తక్కువవాడెట్లా అవుతాడు; భవత్+ఉక్తి+అట్ల= నీమాట ప్రకారం; సమర+అగ్రమునన్= యుద్ధంలో ముందుగ; కిరీటిన్+తెగటార్పఁగన్= నేను అర్జునుడిని సంహరించటానికి; ఇంత+అనువు+అగునే= ఇంత సులభంగా వీలు అవుతుందా? ఈతనిన్= భీముడిని;

నొంపన్+చంపన్= నొప్పింపగా లేదా చంపగా; ఆతఁడు= అర్జునుడు; తాన్+కని= తాను చూచి; వెసన్+వచ్చున్= శీఘ్రంగా వస్తాడు; అధికంబు+అగు మత్+బలము= అధికమైన నా శౌర్యం; ఇపుడు చూడుమీ!= ఇప్పుడు చూడుము.

**తాత్పర్యం:** అని అనగా భీముణ్ణి చూచి కర్ణుడు శల్యుడితో ఇట్లా అన్నాడు. భీముడు గొప్పవీరుడు కాక, తక్కువవాడు ఎట్లా అవుతాడు? నీ వన్నట్లు అర్జునుణ్ణి యుద్ధంలో ముందుగ సంహరించటం ఇంత సులభంగా వీలౌతుందా? భీముణ్ణి నొప్పించినా, చంపినా - అది చూచి అర్జునుడు వెంటనే వస్తాడు. నా బలాధిక్యాన్ని ఇప్పుడు చూడు.

**చ. తరమిడి చంపెఁ గీచక శతంబు నితం; డది యేల? యెల్లెడన్**
**బిరు దనఁగా బలాఢ్యుఁ డనఁ బెద్దయుఁ బేర్చినవాఁ డగున్ వృకో**
**దరుఁ డటు లైన నీతని మదం బడఁగించుట లీల నాకు నీ**
**వరదము సమ్ముఖంబుగ రయంబునఁ బోవఁగ నిమ్ము భూవరా! 207**

**ప్రతిపదార్థం:** ఇతండు= భీముడు; తరము+ఇడి= వరుసబెట్టి; కీచకశతంబున్= నూరుమంది కీచకులను; చంపెన్= చంపాడు; అది ఏల?= అదంతా ఎందుకు?; వృకోదరుఁడు= భీముడు; ఎల్ల+యెడన్ బిరుదు+అనఁగాన్= అన్నిచోట్ల వీరుడుగా; బల+ఆఢ్యుఁడు+అనన్= బలవంతుడని; పెద్దయున్+పేర్చినవాఁడు+అగున్= చాలా విజృంభించేవాడవును; నాకున్; ఈతని మదంబు= ఇతడి గర్వం; అడఁగించుట లీల= అణచటం విలాసం; భూవరా!= శల్యా!; నీవు+అరదము= నీవు రథం; సమ్ముఖంబుగన్= అతడి ఎదురుగా; రయంబునన్+పోవఁగన్+ఇమ్ము= వేగంగా తీసికొని వెళ్ళుము.

**తాత్పర్యం:** మద్రభూపతీ! భీముడు నూరుమంది కీచకులను వధించాడు. తాను ఎంతో వీరుడినని, బలవంతుడినని గర్వంతో అన్నిచోట్ల విజృంభిస్తాడు. అతడి గర్వాన్ని అణచటం నాకు లీల. రథాన్ని అతడికి ఎదురుగా త్వరగా తీసికొని వెళ్ళు.

**విశేషం:** భీముడి పరాక్రమ విశేషాల గురించి కర్ణశల్యులు చేసిన సంభాషణ వరుసగా నాలుగు చంపకమాలా పద్యాలలో ఉండటం విశేషం.

**ఉ. నావుడుఁ దేరు మద్రనరనాథుఁడు భీముని ది క్కుదగ్రతం**
**బోవఁగ నిచ్చెఁ దూర్య రవముల్ సెలఁగెన్ దివి పిక్కటిల్ల న**
**ప్పావని నవ్వుచున్ బలము పాయపడం గడు బెట్టు గిట్టినం**
**జేవ దలిర్ప నా రథికసింహునిఁ గర్ణుఁడు గప్పెఁ దూపులన్. 208**

**ప్రతిపదార్థం:** నావుడున్= అనగా; మద్రనరనాథుఁడు= శల్యుడు; తేరు= రథాన్ని; భీముని, దిక్కు+ఉదగ్రతన్= భీముడివైపు భయంకరంగా; పోవఁగన్+ఇచ్చెన్= పోనిచ్చాడు; దివి, పిక్కటిల్లన్= ఆకాశం మారుమ్రోగగా; తూర్య, రవముల్, చెలఁగెన్= వాద్యధ్వనులు వినిపించాయి; ఆ+పావని= భీముడు; నవ్వుచున్= నవ్వుతూ; బలము= కౌరవసైన్యం; పాయవడన్= చెదరునట్లుగా; కడుబెట్టుగిట్టినన్= మిక్కిలి తీవ్రంగా తాకగా; కర్ణుఁడు; చేవ, తలిర్పన్= బలమొప్పగా; ఆ రథికసింహునిన్= రథికశ్రేష్ఠుడైన ఆ భీముడిని; తూపులన్ కప్పెన్= బాణాలతో కప్పివేశాడు.

**తాత్పర్యం:** శల్యుడు రథాన్ని భీముడివైపు భయంకరంగా పోనిచ్చాడు. యుద్ధవాద్యాలు దిక్కులు పిక్కటిల్లేటట్లు మారుమ్రోగాయి. భీముడు శత్రుసేనను మహాతీవ్రంగా తాకగా, కర్ణుడు అతడిని బాణాలతో ముంచెత్తాడు.

**వ. కప్పి యాలోన.** **209**

**తాత్పర్యం:** కప్పి, ఆ లోపల.

**క. వెస నతని యురము బలు నా । రసమున నొంచుటయు నతఁడు రాధేయ తను**
**ప్రసరన్నవ నారాచో । ల్లసితుండై మెఱసెఁ గురుబలంబు దలంకన్.** **210**

**ప్రతిపదార్థం:** వెసన్= వెంటనే; అతని ఉరము= భీముడివక్షాన్ని; బలునారసమునన్= వాడిబాణంతో; నొంచుటయున్= నొప్పించగా; అతఁడు= భీముడు; కురుబలంబు, తలంకన్= కౌరవసేన చలించగా; రాధేయ తను= కర్ణుడి దేహమునందు; ప్రసరత్+నవ, నారాచ+ఉల్లసితుండు+ఐ= వ్యాపిస్తున్న తొమ్మిది బాణాలచేత (తొమ్మిది బాణాలు నాటి) ప్రకాశించినవాడై; ఉల్లసించినవాడై; కురుబలంబు తలంకన్= కౌరవుల బలం చలించగా; మెఱసెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** భీముడి వక్షాన్ని బాణంతో నొప్పించగా, అతడు కర్ణుడి దేహంనందు తొమ్మిదిబాణాలు నాటి కురుబలం చలించేటట్లు ప్రకాశించాడు.

**ఉ. సూతతనూభవుం డనిలసూనుని చాపము ద్రుంచి యేచి యు**
**ద్ద్యోతిత మార్గణంబు మెయి నుచ్చి చనన్ నిగిడింప నొండు వి**
**ల్లాతఁడు ధైర్య సారము రయంబును జూపఱుమెచ్చ నెత్తి సం**
**స్ఫీత శరోత్కరం బతని పేరుర మాడఁగ నేసి యార్చినన్.** **211**

**ప్రతిపదార్థం:** సూత తనూభవుండు= కర్ణుడు; అనిలసూనుని= భీముడి; చాపము, త్రుంచి= విల్లు ఖండించి; ఏచి= విజృంభించి; ఉద్ద్యోతిత, మార్గణంబు= ప్రకాశించే బాణం; మెయిన్+ఉచ్చి, చనన్, నిగిడింపన్= దేహమునందు దూరిపోయేటట్లు వేయగా; ఆతఁడు= భీముడు; ధైర్యసారము, రయంబును= శౌర్యం, వేగం; చూపఱు మెచ్చన్= చూచువారు మెచ్చుకోగా; ఒండువిల్లు= మరొకవిల్లు; ఎత్తి= గైకొని; సంస్ఫీత శర+ఉత్కరంబు= పెక్కు బాణసమూహాన్ని; అతని పేరు+ఉరము+ ఆడఁగన్= అతని విశాలవక్షమునందు నాటగా; ఏసి ఆర్చినన్= వేసి అరవగా.

**తాత్పర్యం:** కర్ణుడు భీముడి విల్లు తునిమి విజృంభించి అతడి దేహమునందు దూరిపోయేటట్లుగా మెరిసే బాణం వేశాడు. చూపరులు మెచ్చుకొనగా భీముడు మరొక విల్లునందుకొని అతడి విశాల వక్షమునందు అనేక బాణాలు వేసి బిగ్గరగా అరిచాడు.

**తే. ఈడఁబోక రాధాసుతుఁ డేసె నిరువ । దేను నారాచములు పవమాన తనయు**
**కత్తళము తూఱి యంగంబు గాఁడి పాఱి । నిలువ కటచని మేదినీతలము సొరఁగ.** **212**

**ప్రతిపదార్థం:** పవమాన తనయు= భీముడి; కత్తళము తూఱి= కవచం చొచ్చుకొని; అంగంబు కాఁడిపాఱి= దేహం తొలిచికొని; నిలువక= ఆగక; అట చని= ముందుకు వెళ్ళి; మేదినీతలము చొరఁగన్= భూమిపై పడగా; రాధాసుతుఁడు= కర్ణుడు; ఈడన్+పోక= వెనుదీయక; ఇరువది+ఏను నారాచములు= ఇరవైఅయిదు బాణాలు; ఏసెన్= వేశాడు.

**తాత్పర్యం:** భీముడి కవచాన్ని తాకి దేహంలోనికి చొచ్చుకొని వెళ్ళి భూమిలోకి దూరిపోయేటట్లుగ కర్ణుడు వెనుదీయక ఇరవైఅయిదు బాణాలు వేశాడు.

**మ. అలుకం గెంపు గనుంగవం గదురఁగా నప్పాండవుం డేసినం**
**గులిశంబో యనఁ బ్రజ్వరిల్లి నిగిడెన్ ఘోరంపు భల్లం బుర**
**స్థ్సలి భేదిల్లఁగఁ దేరిమీఁదఁబడి మూర్ఛంబొంది కర్ణుండు ని**
**శ్చలతం జచ్చిన యట్టులుండె వెఱఁ దత్సైన్యంబుఁ దూలెం గడున్. 213**

**ప్రతిపదార్థం:** ఆ+పాండవుండు= ఆ భీముడు; అలుకన్= కోపంతో; కనుంగవన్= కనులజంటలో; కెంపు= ఎరుపు; కదురఁగా= నిండగా; ఘోరంపుభల్లంబు= క్రూరమైన బల్లెం; ఏసినన్= వేయగా; కులిశంబో అనన్= వజ్రాయుధమో అన్నట్లుగా; ప్రజ్వరిల్లి నిగిడెన్= కాంతితో ఒప్పింది; కర్ణుండు= కర్ణుడు; ఉరః+స్థలి భేదిల్లఁగన్= వక్షం చొచ్చుకొనిపోగా; తేరిమీఁదన్+పడి= రథంమీద పడి; నిశ్చలతన్= చలనం లేక; చచ్చిన అట్టులు+ఉండెన్= చచ్చినట్లుగా ఉన్నాడు; వెఱన్= భయంతో; తద్+సైన్యంబున్= అతడిసేనకూడా; కడున్+తూలెన్= మిక్కిలిగా చలించింది.

**తాత్పర్యం:** భీముడు క్రోధంతో కన్నులెర్రబడగా వ్రజాయుధమో అన్నట్లుగా ఉన్న బల్లెం కర్ణుడిపైకి విసిరాడు. అది అతడివక్షాన్ని భేదించగా రథంపై చలనం లేకుండా చచ్చినట్లు పడిపోయాడు. అదిచూచి అతడి సైన్యం భయంతో తల్లడిల్లింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

భీముండు గర్ణుని మూర్ఛితుంజేసి నాలుక గోయం బూనుట (సం. 8-45-48)

**వ. అప్పు డయ్యనిలతనయుండు దన యరదంబు గదియం దెచ్చి యా సూతనందనుం గనుంగొని 'యినీ్న చు నాలుకం గోసెద' ననుచుం గట్టిన యలుఁగు వెఱికి యతని యరదంబుమీఁది కరుగ నుత్సహించిన జూచి, మద్రవిభుండు వారించి 'యిది మూర్ఛగాని మరణంబు గా; దీ యవస్థ నాలుక గోసినం జచ్చు; నితనిం జంపుటకుఁ బార్థుండు ప్రతిన పట్టినవాఁడు నీవు సంపిన నతండు నెవ్వగం బొందు' ననిన విని యవ్వీరుండు వీఁ డిప్పుడు పాండవాగ్రజుని బాధించినం గ్రోధాంధుండనై యది మఱచితిం గాని చావుగామియు నిట్టియెడ నాలుక గోయం దడవఁ జచ్చుటయు నెఱుంగుదు; నిత్తెఱంగు నీవు దలంపించి లెస్సచేసి; తిద్దురాత్ముండు సభలోన నసభ్యంబు లగు మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దీపించిన కోపం బజాతశత్రునకుఁ బ్రియంబుగా నడంచికొని యుండితి; నేఁడు తద్వేదన వెలార్పం జూచితి; నట్ల చేసితినేని మానధనుం డైన ధనంజయుండు దన చేసిన పూనిక నెఱపం గానక మనంబునం గుంది మడియుఁ; గృష్ణ యుధిష్ఠిరులు నాతని తోడివార; యింత ప్రమాదంబు నీవు గలిమిం దెలిసితి; మేలయ్యె; మాతులా! నీ యాజ్ఞ యుల్లంఘింప నని పలికి నిలిచె; శల్యుండును సంతసిల్లి తేరు దొలంగించె; ననుటయు నాంబికేయుండు సంజయున కి ట్లనియె. 214**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ఆ+అనిలతనయుండు= భీముడు; తన అరదంబు= తన రథం; కదియన్+తెచ్చి= దగ్గరకు తెచ్చి; ఆ సూతనందనున్+కనుంగొని= కర్ణుడిని చూచి; ఈ+నీచు నాలుకన్+కోసెదన్ అనుచున్= ఈ నీచుడి నాలుకను కోస్తా నని; కట్టిన అలుఁగు వెఱికి= కట్టి ఉన్న ఖడ్గం లాగి; అతని అరదంబుమీఁదికిన్+అరుగన్+ఉత్సహించినన్= అతని రథంపైకి

వెళ్ళటానికి పూనుకొనగా; మద్రవిభుండు, చూచి, వారించి= శల్యుడు చూచి వద్దని; ఇది మూర్ఛకాని మరణంబు కాదు= ఇతడు మూర్ఛిల్లాడు కాని చావలేదు; ఈ అవస్థన్ నాలుక కోసినన్+చచ్చున్= ఈ స్థితిలో నాలుక కోస్తే చస్తాడు; ఇతనిన్+ చంపుటకున్= ఇతడిని చంపటానికి; పార్థుండు ప్రతిన పట్టినవాఁడు= అర్జునుడు ప్రతిజ్ఞ చేశాడు; నీవు చంపినన్+అతండు నెవ్వగన్+పొందును+అనినన్= నీవు చంపితే ఆతడు బాధపడతాడు అనగా; ఆ+వీరుండు= భీముడు; విని; వీడు+ఇప్పుడు పాండవ+అగ్రజుని బాధించినన్= ఈ కర్ణుడు ధర్మరాజును బాధపెట్టినందుకు; క్రోధ+అంధుండను+ఐ= కోపంచేత గ్రుడ్డివాడనయి; అది మఱచితిన్+కాని= ఆ సంగతి మరచాను కాని; చావు కామియున్= ఇది మరణం కాదని; ఇట్టి ఎడన్ నాలుక కోయన్= మూర్ఛలో ఉండగా నాలుకను కోస్తే; తడవన్+చచ్చుటయున్+ఎఱుంగుదున్= వెంటనే చనిపోతాడని తెలుసు; ఈ+తెఱంగు= ఈ విషయం; నీవు తలఁపించి= నీవు గుర్తుచేసి; లెస్స చేసితి(వి)= మంచిపని చేశావు; ఈ+ దురాత్ముండు= కర్ణుడు; ద్రౌపదిన్+ఉద్దేశించి= ద్రౌపదిగురించి; సభలోనన్+అసభ్యంబులు+అగు మాటలు= సభలో అసభ్యమైన మాటలు; ఆడినన్= మాట్లాడగా; ఉద్దీపించిన కోపంబు= అధికమైన కోపం; అజాతశత్రునకున్+ప్రియంబుగాన్= ధర్మరాజుకు సంతోషం కలిగించాలని; అడంచికొని ఉండితి= అణచిపెట్టుకొని ఉన్నాను; నేఁడు తద్+వేదన వెలార్పన్+చూచితిన్= ఇపుడు ఆ కోపం బయలు వెడలించాలని చూచాను; అట్ల చేసితిన్+ఏనిన్= కోపంతో అతడిని చంపితే; మానధనుండు+అయిన, ధనంజయుండు= అభిమానవంతుడైన అర్జునుడు; తన చేసిన పూనిక= తాను చేసిన ప్రతిజ్ఞ; నెఱపన్+కాక= పూర్తిచేయలేక; మనంబునన్+కుంది, మడియున్= మనసులో వెతజెంది మరణిస్తాడు; కృష్ణయుధిష్ఠిరులున్= శ్రీకృష్ణ ధర్మజులు కూడా; ఆతనితోడివార= అతనినే అనుసరిస్తారు; ఇంత ప్రమాదంబు= ఇంత ఆపద; నీవు కలిమిన్= నీవు ఉండటం చేత; తెలిసితిన్= తెలిసికొనగలిగాను; మేలు+అయ్యెన్= మేలు జరిగింది; మాతులా!= మామా!; నీ ఆజ్ఞ ఉల్లంఘింపను+అని పలికి, నిలిచెన్= నీ ఆజ్ఞ జవదాటను అని ఆగాడు; శల్యుండును, సంతసిల్లి= శల్యుడు కూడా సంతోషించి; తేరు తొలఁగించెన్+అనుటయున్= రథం తప్పించాడు అని చెప్పగా; ఆంబికేయుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్+ఇట్లు+అనియెన్= సంజయుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అప్పుడు భీముడు తన రథాన్ని కర్ణుడి రథానికి దగ్గరగా తెచ్చి, అతణ్ణి చూచి, 'ఈ నీచుడి నాలుక కోస్తా' అని అంటూ, కట్టి ఉన్న కత్తిని దూసి, అతడి రథం మీదికి వెళ్ళాలన్న ఉత్సాహంతో ఉండగా, శల్యుడు చూచి, భీముణ్ణి అడ్డుకొని 'ఇతడు (ఈ కర్ణుడు) మూర్ఛిల్లాడు గాని, మరణించలేదు. ఈ స్థితిలో ఇతడి నాలుకకోస్తే చస్తాడు. ఇతణ్ణి చంపటానికి పార్థుడు ప్రతిజ్ఞ చేశాడు. ఇప్పుడు నీవు చంపితే అతడు చాల బాధపడుతాడు' అనే సరికి, భీముడు 'వీడిప్పుడు ధర్మరాజును బాధించేసరికి ఆగ్రహావేశంతో అవివేకినై ఆ విషయం (అర్జునుని ప్రతిజ్ఞ విషయం) మరచాను. ఇది చావు కాదని, ఈ స్థితిలో నాలుక కోస్తే వెంటనే చస్తాడని తెలుసు. ఈ విషయాన్ని నీవు గుర్తుచేసి చాల మంచిపని చేశావు. ఈ దుర్మార్గుడు ఆనాటి కౌరవసభలో ద్రౌపదిని ఉద్దేశించి అసభ్యాలైన మాటలు మాట్లాడితే, ఆనాడు పెల్లుబికిన నా కోపాన్ని అన్నగారికి ప్రీతి కలిగించటానికై అణచుకొన్నాను. ఈ రోజు ఆ వేదన తీర్చుకోవాలని చూచాను. ఆ విధంగా చేస్తే అభిమానధనుడైన అర్జునుడు తన ప్రతిజ్ఞ నెరవేర్చుకోటానికి వీలుగాక, మనస్సులో దుఃఖించి మరణించి ఉండేవాడు. శ్రీకృష్ణ ధర్మజులు కూడ అతనితో పాటే మరణించేవారు. ఇంత ప్రమాదం నీవు ఉండటంవల్ల తెలుసుకొన్నాను. 'మామా! మేలైంది. నీ ఆజ్ఞ ఉల్లంఘించను' అని పలికి భీముడు ఆగాడు. శల్యుడు కూడ సంతోషించి తేరు ప్రక్కకు తప్పించాడు - అని చెప్పగా, ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**క. 'పాండవుల నాజి నోర్చు ని । తం డని మీ రాజు సూతతనయునిఁ బొగడున్;**
**గం డడఁచె భీముఁ డిట్టి మ । గండుఁ గలఁడె? పిదప నెట్లు గయ్యము సెల్లెన్?' 215**

**ప్రతిపదార్థం:** ఇతండు= కర్ణుడు; పాండవులన్+ఆజిన్+ఓర్చున్= పాండవులను యుద్ధంలో ఓడిస్తాడు; అని= అని; మీ రాజు= దుర్యోధనుడు; సూతతనయునిన్+పొగడున్= కర్ణుడిని పొగడుతుంటాడు; భీముఁడు; గండు+అడఁచెన్= గర్వం అణచాడు; ఇట్టి మగండున్+కలఁడె?= ఇటువంటి వీరుడు ఉన్నాడా?; పిదపన్+ఎట్లు కయ్యము చెల్లెన్?= తర్వాత యుద్ధం ఎట్లా కొనసాగింది?

**తాత్పర్యం:** 'పాండవులను యుద్ధంలో ఓడిస్తాడు అని దుర్యోధనుడు కర్ణుడిని గురించి గొప్పగా చెప్పుతుంటాడు. ఇపుడు భీముడు అతడి గర్వం అణచాడు. తర్వాత యుద్ధం ఎట్లా జరిగిందో చెప్పుము.

### భీముఁడు శ్రుతవర్మాది కురుకుమారులఁ బెక్కండ్ర జంపుట (సం. 8-35-4)

**వ. అనవుడు సంజయుం డాంబికేయున కిట్లను నట్లు బాధితుండయిన రాధేయుం గనుంగొని కురుపతి తమ్ములతో నిట్లను 'భీమసేనుచేత సూతసూనుండు గడు నొచ్చెం గావలయు వేగం బెయిదుఁ' డనుటయు శ్రుతవర్మాది కుమారులు గొందఱు పటుగతిం గవిసి యక్కౌంతేయుం జుట్టుముట్టిన నతండుఁ దదనుచరుల నేనూట యేఁబండ్రు వీర రథికులం బిలుకుమార్చి శ్రుతవర్మ శిరంబు భల్లంబునం ద్రుంచిన, నది ముఖకాంతి మెఱయం జంద్రమండలంబు మహికెఱఁగు తెఱంగు దోఁపం బడియెఁ; బటుబాణద్వయంబున వికటుని సముని బెట్టేసిన బెడిదంపు గాలిం దూలు తరువుల కరణి ధరణిం ద్రెళ్ళిరి; తదనంతరంబ తీవ్ర నారాచంబునఁ గ్రాథుం గూల్చి, నందోపనందుల నొక్కపెట్ట పెక్కమ్ములం బొరివుచ్చె నిట్లు నీ కొడుకు లార్వురుం దెగినఁ దక్కటి వారు వచ్చి దైన్యంబు నొందిన సైన్యంబు గలంగె; నంతకుఁ దెప్పిఱి యెప్పటి బరవసంబు శోభిల్లం గర్ణుండు గడంగి డగ్గఱి. 216**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అనగా; సంజయుండు+ఆంబికేయునకున్+ఇట్లు+అనున్= సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పసాగాడు; అట్లు= అట్లా; బాధితుండు+అయిన= బాధపెట్టబడిన; రాధేయున్+కనుంగొని= కర్ణుడిని జూచి; కురుపతి, తమ్ములతోన్+ఇట్లు+అనున్= దుర్యోధనుడు సోదరులతో ఇట్లా అన్నాడు; భీమసేనుచేతన్= భీముడిచే; సూతసూనుండు= కర్ణుడు; కడునొచ్చెన్+కావలయున్= ఎంతోబాధకు గురి అయ్యాడు కాబోలు; వేగంబు+ఎయిదుఁడు+అనుటయున్= వెంటనే అతడిని వెంబడించండి అనగా; శ్రుతవర్మ+ఆది కుమారులు= శ్రుతవర్మ మున్నగువారు; కొందఱు= కొంతమంది; పటుగతిన్+ కవిసి= బలంగా తాకి; ఆ+కౌంతేయున్+చుట్టుముట్టినన్= భీముడిని చుట్టుముట్టగా; అతండు= భీముడు; తద్+అనుచరులన్+ ఏనూట ఏఁబండ్రు వీరరథికులన్= అతని అనుచరులైన ఐదువందల యాభైమంది వీరులను; పిలుకుమార్చి= వధించి; శ్రుతవర్మ శిరంబు= శ్రుతవర్మ తలను; భల్లంబునన్+త్రుంచినన్= బల్లెంతో ఖండించగా; అది= ఆ శిరము; ముఖకాంతి మెఱయన్= ముఖకాంతి ప్రకాశించగా; చంద్రమండలంబు= చంద్రబింబం; మహికిన్ ఎఱఁగు, తెఱంగు= భూమికి నమస్కరించిన విధంగా; తోఁపన్+పడియెన్= అనిపించేటట్లు పడింది; పటుబాణద్వయంబునన్= రెండు వాడిబాణాలతో; వికటుని, సముని, బెట్టు+ఏసినన్= వికటుని సముడిని గట్టిగా కొట్టగా; బెడిదంపుగాలిన్+తూలు, తరువుల, కరణిన్= తీవ్రమైన గాలికి కూలిన చెట్లవలె; ధరణిన్+త్రెళ్ళిరి= భూమిమీద పడ్డారు; తదనంతరంబు+అ= తర్వాత; తీవ్ర నారాచంబునన్= వాడి బాణంతో; క్రాథున్+కూల్చి= క్రాథుడిని చంపి; నంద+ఉపనందులన్= నందుడిని ఉపనందుడిని; ఒక్కపెట్టన్= ఒక్కసారిగ; పెక్కు+ అమ్ములన్+పొరివుచ్చెన్= పెక్కుబాణాలు వేసి చంపాడు; ఇట్లు= ఈ విధంగా; నీ కొడుకులు+ఆర్వురున్+తెగినన్= నీ కొడుకులు ఆరుగురు చనిపోగా; తక్కటివారు వచ్చి దైన్యంబున్+ఒందినన్= మిగిలినవారు వచ్చి దీనస్థితి పొందగా; సైన్యంబు

కలంగెన్= కౌరవసైన్యం కలత చెందింది; కర్ణుండు= కర్ణుడు; అంతకున్+తెప్పిరి= అంతలోనే (మూర్ఛ) తేరుకొని; ఎప్పటి బరవసంబు శోభిల్లన్= మునుపటి ధైర్యం ఒప్పుగా; డగ్గఱి= సమీపించి; కడంగి= పూనుకొని.

**తాత్పర్యం:** అనగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా అన్నాడు. ఆ విధంగా బాధింపబడిన కర్ణుని చూచి దుర్యోధనుడు తమ్ముళ్ళతో ఇట్లా అన్నాడు. 'కర్ణుడు భీముడి చేత చాల దెబ్బ తిన్నట్లున్నాడు. వెంటనే అతడికి తోడ్పడండి అనగానే', శ్రుతవర్మ మొదలైన కురుకుమారులు కొందరు గట్టిగా భీమసేనుణ్ణి ఎదుర్కొన్నారు. భీముడు ఆ కురుకుమారుల అనుచరులను అయిదువందల యాభైమందిని చంపి, శ్రుతవర్మ శిరస్సును ఒక భల్లంతో త్రుంచగా, అది ప్రకాశిస్తున్న ముఖకాంతితో చంద్రమండలం భూమికి మ్రొక్కుతున్నదని అనిపించేటట్లుగ నేలమీద పడింది. వికటుడు, సముడు అనే వీరులను రెండు వాడిబాణాలతో కొట్టగా, వాళ్ళు పెనుగాలికి నేలకూలే చెట్లవలె పడిపోయారు. తరువాత ఒక తీవ్రమైన బాణంతో క్రాథుణ్ణి చంపాడు. పెక్కుబాణాలతో ఒక్కసారిగ నందోపనందుల్ని సంహరించాడు. ఈ విధంగా నీ కొడుకులు ఆరుగురు మరణించేసరికి, మిగిలినవారు వచ్చి దీనస్థితినొందగా, కౌరవసైన్యం కలత పొందింది. అంతలో కర్ణుడు మూర్ఛతేరుకొని, మునుపటి ధైర్యం మెరయగా, పూనిక వహించి దగ్గరికి వచ్చి ----

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష, ఉపమ.

**చ.** **అనిలజుమీఁద నేయ నతఁ డా శరముల్ దునుమాడి సప్తకాం**
**డ నిహతుఁజేసె నాతని దృఢప్రదరంబులఁ గప్పెఁ నాతఁడున్**
**వినుము సముజ్జ్వల ప్రదర విద్ధునిఁగా నొనరించి యమ్మరు**
**త్తనయుఁడు పేర్చి యార్వ వసుధావర! యా రథికుం డుదగ్రుఁడై.** **217**

**ప్రతిపదార్థం:** అనిలజు మీఁదన్+ఏయన్= భీముడిమీద (బాణాలు) వేయగా; అతఁడు+ఆ, శరముల్, తునుము+ఆడి= అతడు ఆ బాణాలను ఖండించి; సప్తకాండ నిహతున్+చేసెన్= ఏడుబాణాలతో గాయపరచాడు; ఆతఁడున్= కర్ణుడును; ఆతనిని= భీముడిని; దృఢప్రదరంబులన్+కప్పెన్= పటువైన బాణాలతో కొట్టాడు; వసుధావర!= రాజా!; వినుము; ఆ+మరుత్+తనయుఁడు= భీముడు; సముజ్జ్వల, ప్రదర, విద్ధునిన్+కాన్+ఒనరించి= కాంతిమయములైన బాణములచేత కొట్టబడిన వానినిగా చేసి; పేర్చి ఆర్వన్= విజృంభించి అరవగా; ఆ రథికుండు+ఉదగ్రుఁడు+అయి= కర్ణుడు కోపించినవాడై.

**తాత్పర్యం:** కర్ణుడు భీముడిపై బాణాలు వేయగా, అతడు వాటిని ఖండించి, ఏడు బాణాలు ప్రయోగించి కర్ణుని గాయపరిచాడు. కర్ణుడు మళ్ళీ అతడిని బలమైన బాణాలతో కప్పగా, భీముడు అతడిపై కాంతిమంతమైన బాణాలు ప్రయోగించి పెద్దగా అరిచాడు. ధృతరాష్ట్ర మహారాజా! వినుము. అప్పుడు కర్ణుడు ఆగ్రహించి.

**మ.** **పది బాణంబుల నొంచి విల్లు దునుమం బ్రస్ఫీత దీప్త్యుజ్జ్వల**
**ద్గద వైచెం బవనాత్మజుం డది యెడన్ ఖండించె; నవ్వీరుఁ డు**
**న్మదుఁడై పాండవుఁ డొండు విల్లు గొని నానాకంకపత్రంబులం**
**బొదువం గర్ణుఁడు నొంచెఁ దత్తను వతిస్ఫూర్జద్దశాస్త్రంబులన్.** **218**

**ప్రతిపదార్థం:** పదిబాణంబులన్ నొంచి= పదిబాణాలతో నొప్పించి; విల్లు తునుమన్= ధనువును త్రుంచగా; పవన+ఆత్మజుండు= భీముడు; ప్రస్ఫీతదీప్తి+ఉజ్జ్వలత్+గద వైచెన్= మిక్కిలి ఎక్కువ కాంతితో ప్రకాశించే గదను వేశాడు; ఆ+వీరుఁడు= కర్ణుడు; అది ఎడన్ ఖండించెన్= దానిని దూరంలోనే త్రుంచాడు; ఉన్మదుఁడు+ఐ పాండవుఁడు= గర్వితుడై భీముడు; ఒండు, విల్లు, కొని= వేరొక విల్లు గైకొని; నానా కంకపత్రంబులన్+పొదువన్= వివిధ బాణాలు వేయగా; కర్ణుఁడు, అతి స్ఫూర్జత్+దశ+ అస్త్రంబులన్= మిక్కిలి ప్రకాశించే పది అస్త్రాలతో; తద్+తనువున్ నొంచెన్= భీముడి దేహాన్ని నొప్పించాడు.

**తాత్పర్యం:** కర్ణుడు భీముడిపై పదిబాణాలు వేసి ధనుస్సు ఖండించగా, భీముడు అతడిపై మిక్కిలి కాంతితో ప్రకాశించే గదను వేశాడు. కర్ణుడు దానిని ఖండించగా, భీముడు వేరొక ధనువు తీసికొని వివిధ బాణాలు వేశాడు. అప్పుడు కర్ణుడు ప్రకాశమానమైన పది అస్త్రాలను అతడిపై ప్రయోగించాడు.

**వ. దానం గోపించి.** **219**

**తాత్పర్యం:** దానికి కోపించి.

**చ. పటుతరమైన నారసము పాండునృపాత్మజుఁ డుగ్రుఁడై యుర**
**స్తటమున బెట్టు గ్రువ్వ బెడిదం బయి వీఁపున నుచ్చి పోవ ను**
**త్కట ధరణీ ప్రకంప చలితం బగు శైలముఁ బోలి తాల్మి మి**
**క్కుటముగ రోష రంజిత ముఖుం డయి కర్ణుఁడు ఘూర్ణితాకృతిన్.** **220**

**ప్రతిపదార్థం:** పాండునృప+ఆత్మజుఁడు= భీముడు; ఉగ్రుడు+ఐ= కోపించి; పటుతరము+ఐన= వాడి అయిన; నారసము= బాణం; ఉరః+తటమునన్ బెట్టు క్రువ్వన్= వక్షఃస్థలాన గాఢంగా నాటగా; బెడిదంబు+అయి వీఁపునన్+ఉచ్చిపోవన్= కఠినంగా వీపులో గుచ్చుకొనిపోగా; కర్ణుఁడు; ఉత్కట, ధరణీ, ప్రకంప చలితంబు+అగు శైలమున్ పోలి= తీవ్ర భూకంపానికి కంపించిన పర్వతంవలె; ఘూర్ణిత+ఆకృతిన్= తిరుగుడు పడిన ఆకారంతో; తాల్మి మిక్కుటముగన్= హెచ్చిన ధైర్యంతో; రోషరంజిత ముఖుండు+అయి= క్రోధంతో ఎర్రబడిన ముఖం కలవాడై.

**తాత్పర్యం:** భీముడు క్రోధంతో కర్ణుడి వక్షంలో వాడిబాణం నాటగా అది వీపులో నుండి వెడలగా, అతడు తీవ్ర భూ కంపానికి చలించిన పర్వతంవలె గోచరిస్తూ క్రోధంతో ఎర్రబడిన ముఖం కలవాడై. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష.

**చ. రయమునఁ బంచవింశతి శరంబులు మేన నిగిడ్చి భల్ల సం**
**చయహతి విల్లు సక్కడిచి సస్మిత వక్త్ర సహస్ర పత్రల**
**క్ష్మియతిశయిల్ల రథ్యములఁ జెండిన మారుతి యేచి విద్విష**
**ద్భయద గదారుచి స్ఫురిత బాహువిలాస విభాసమానుఁడై.** **221**

**ప్రతిపదార్థం:** రయమునన్= వేగంగా; పంచవింశతి శరంబులు= ఇరవైఐదు బాణాలు; మేనన్, నిగిడ్చి= భీముడి దేహంపై వేసి; భల్లసంచయహతిన్= బల్లెముల సమూహాల దెబ్బతో; విల్లుచక్కడిచి= విల్లును విరిచి; సస్మిత= చిరునవ్వుతో కూడిన;

వక్త్ర సహస్ర పత్ర లక్ష్మి అతిశయిల్లన్= ముఖపద్మంయొక్క కాంతి అధికంకాగా; రథ్యములన్+చెండినన్= గుర్రాలను కూల్చగా; మారుతి= భీముడు; ఏచి= విజృంభించి; విద్విషత్+భయద= శత్రుభయంకరమైన; గదారుచి, స్ఫురిత= గదకాంతిచేత ప్రకాశిస్తున్న; బాహు విలాస విభాసమానుఁడు+ఐ= భుజవిలాసంయొక్క ప్రకాశం కలవాడై.

**తాత్పర్యం:** కర్ణుడు వేగంగా దేహంపై ఇరవైఅయిదు బాణాలు వేసి, బల్లెములతో విల్లును తునిమి, చిరునవ్వుతో ముఖపద్మకాంతి అతిశయిల్లగా గుర్రాలను చంపగా, భీముడు అరిభయంకరమైన గదతో కూడిన బాహువిలాస ప్రకాశం కలవాడై.

**వ. అరదంబు డిగ్గనుఱికి కర్ణుని దెసం గవియం గురుపతి సేనం గల యేనుంగులం బదియేడింటిం బురికొల్పిన నవి దివాకరుఁ బొదువు నంబుదంబుల చందంబున నా జెట్టిమగనిం గిట్టిన, నతండు జోదులతోడంగూడ నగ్గజంబులఁ జదుపుటయు, సౌబలుని ఘోటకంబు లాటోపంబున మూఁడువే లొక్కట నురవడించిన వాని ప్రాపున నరదంబులుం గాలు బలంబులుం గవిసి కూడికొని పొదివిన మదం బొదవి యమ్మహాబలనందనుండు దారుణ రణ విహారంబున నొండొండ పేర్చిన, యబ్బలం బుజ్జ్వలానలంబున వైచిన చర్మంబు చాడ్పున ముడింగి యొదిగె; నప్పు డా శకుని యోధులు పంచ శత రథికులు రభసంబున నడరిన వారల సూతాశ్వ కేతు స్యందన సమేతంబుగా నఱిముఱి నుఱుమాడి యగ్గలిక మెఱసినం గని యగ్గాంధారరాజు పనుపం గడంగిన యవన దేశీయులగు నాశ్వికులం ద్రిసహస్ర సంఖ్యుల నవ్వడముడి పొడిసేయు చప్పుళ్ళు గార్చిచ్చు వెదురుటడవి నేర్చు తెఱంగునం దోఁచె; నిట్లు గదపండువు సేసి యొండురథం బెక్కి యక్కౌంతేయుండు భండనంబు సేయ, రాధేయుండు పాండవేయాగ్రజుం దాకి తీవ్ర ప్రకాండంబుల గప్పి సారథి సమయించినఁ దేరు తురంగంబులు దొలంగ నీడ్చికొని పాఱిన, వెనుకొను నయ్యంగపతిం గనుంగొని. 222**

**ప్రతిపదార్థం:** అరదంబు, డిగ్గన్+ఉరికి= రథము దిగి పరుగెత్తి; కర్ణుని దెసన్+కవియన్= కర్ణుడివైపు విజృంభించగా; కురుపతి= దుర్యోధనుడు; సేనన్+కల= కౌరవసైన్యంలో ఉన్న; ఏనుంగులన్+పది ఏడింటిన్+పురికొల్పినన్= పదిహేడు ఏనుగులను పురికొల్పగా; అవి= ఆ ఏనుగులు; దివాకరున్+పొదువు= సూర్యుడిని కప్పే; అంబుదంబుల చందంబునన్= మబ్బులవలె; ఆ జెట్టి మగనిన్+కిట్టినన్= ఆ బలశాలిని చుట్టుముట్టగా; అతండు= భీముడు; జోదుల తోడన్+కూడన్= యోధులతో సహా; ఆ+గజంబులన్+చదుపుటయున్= ఆ గజాలను చంపగా; సౌబలుని, ఘోటకంబులు= శకుని గుర్రాలు; మూడువేలు= మూడువేలు; ఆటోపంబునన్= అతిశయంతో; ఒక్కటన్+ఉరవడించినన్= ఒక్కుమ్మడి విజృంభించగా; వాని ప్రాపునన్= వాటి అండలో; అరదంబులున్+ కాలుబలంబులున్= రథాలు, పదాతిసైన్యాలు; కవిసి కూడికొని పొదిలిన= కూడి చుట్టుముట్టగా; ఆ+మహాబలనందనుండు= భీముడు; మదంబు+ఒదవి= గర్వంతో; దారుణ, రణ, విహారంబునన్= భయంకరమైన యుద్ధవిహారం చేస్తూ; ఒండొండ పేర్చినన్= అంతకంతకు విజృంభించగా; ఉజ్జ్వల+అనలంబునన్= మీది కెగసి మండుతున్న అగ్నిలో; వైచిన చర్మంబు చాడ్పునన్= వేసిన చర్మంవలె; ఆ+బలంబు= ఆ సేన; ముడింగి+ఒదిగెన్= తగ్గి నశించింది; అప్పుడు; ఆ శకుని యోధులు= శకుని సైనికులు; పంచశత, రథికులు= ఐదువందలమంది వీరులు; రభసంబునన్+అడరినన్= వేగంగా వచ్చిపడగా; వారలన్= వారందరినీ; సూత+అశ్వ, కేతు, స్యందన సమేతంబుగాన్= సారథులతో, గుర్రాలతో, ధ్వజాలతో, రథాలతో కూడ; అఱిముఱి నుఱుము+ఆడి= సంభ్రమంతో చంపి; అగ్గలికన్, మెఱసినన్+కని= గర్వంతో ప్రకాశించగా చూచి; ఆ+గాంధారరాజు= శకుని; పనుపన్+కడంగిన= పంపగా యుద్ధానికి పూనుకొన్న; యవనదేశీయులు+అగు+ ఆశ్వికులన్+త్రిసహస్ర సంఖ్యులన్= యవన దేశ ఆశ్వికులు మూడువేలమందిని; ఆ+వడముడి= ఆ భీముడు; పొడిచేయు

చప్పుళ్ళు= నుగ్గు చేయగా కలిగిన ధ్వనులు; కారు+చిచ్చు= దావాగ్ని; వెదురు+అడవిన్= వెదురుచెట్లతో నిండిన అడవిని; ఏర్చు తెఱఁగునన్+తోఁచెన్= దహించే విధంగా గోచరించింది; ఇట్లు= ఈ విధంగా; ఆ+కౌంతేయుఁడు= భీముడు; గదపండువు చేసి= గదకు పండుగచేసి; ఒండు రథంబు+ఎక్కి= వేరొక రథం ఆరోహించి; భండనంబు చేయన్= యుద్ధం చేయగా; రాధేయుండు= కర్ణుడు; పాండవేయ+అగ్రజున్+తాఁకి= ధర్మరాజును తాకి; తీవ్ర ప్రకాండంబులన్+కప్పి= వాడి బాణాలతో కప్పి; సారథిన్+సమయించినన్= సారథిని చంపగా; తేరు= రథం; తురంగంబులు+తొలంగన్= గుర్రాలు తొలగిపోగా; ఈడ్చికొని పాటినన్= ఈడ్చుకొంటూ వెళ్ళగా; వెనుకొను= వెంబడించిన; ఆ+అంగపతిన్+కనుంగొని= ఆ కర్ణుడిని చూచి.

**తాత్పర్యం:** రథం దిగి పరుగెత్తి కర్ణుడివైపు విజృంభించగా, దుర్యోధనుడు కౌరవసైన్యంలో ఉన్న పదిహేడు ఏనుగులను పురికొల్పాడు. అవి సూర్యుణ్ణి కప్పే మబ్బులవలె ఆ బలశాలి భీముణ్ణి ఎదుర్కొన్నాయి. అప్పుడతడు వాటిమీద ఉన్న వీరులతో సహా ఆ యేనుగులను చంపివేశాడు. శకుని గుర్రాలు మూడువేలు ఒక్కుమ్మడి వేగంగా విజృంభించగా, వాటి అండలో రథాలు, పదాతిసైన్యాలు కూడుకొని చుట్టుముట్టగా, ఆ వాయుపుత్రుడైన భీముడు గర్వంతో మహాభయంకరంగా వీరవిహారం చేస్తూ, అంతకంతకు విజృంభించగా - మీదికెగసి మండుతున్న అగ్నిలో వేసిన చర్మంవలె ఆ సేన తగ్గి తగ్గి నశించింది. అప్పుడు శకుని సైనికులు, అయిదువందలమంది రథికులు వేగంగా వచ్చి మీద పడగా, వాళ్ళందరిని సారథులతో, గుర్రాలతో, ధ్వజాలతో, రథాలతో సహా త్వరత్వరగ చంపి గర్వంతో ప్రకాశించాడు. అది చూచి శకుని మళ్ళీ మూడువేలమంది యవనదేశీయులైన ఆశ్వికులను పంపగా, వాళ్ళను పొడిచేశాడు. ఆ చప్పుళ్ళు-వెదుళ్ళ అడవిని దావాగ్ని దహిస్తున్నట్లు అనిపించే విధంగా ఉన్నాయి. ఈ విధంగా భీముడు తన గదకు పండుగ చేసి వేరొక రథం ఎక్కి యుద్ధం చేయగా, కర్ణుడు ధర్మరాజును ఎదుర్కొని వాడి బాణాలతో కప్పి, అతడి సారథిని చంపగా, గుర్రాలు రథాన్ని ప్రక్కకు ఈడ్చుకొని వెళ్ళాయి. అయినా ధర్మరాజును వెంటాడుతున్న ఆ కర్ణుణ్ణి చూచి -

**విశేషం:** అలం: ఉపమ. 'గదపండువు సేసి' జాతీయం.

**ఉ. భీముఁ డదల్చుచున్ రథము భీమగతిం గవియింప నాతఁ డు**
**ద్దామత మాఱుకొన్న వివిధ స్ఫుర దస్త్ర పరంపరాద్వయ**
**శ్రీ మొన లప్పు డచ్చెరువుఁ జెంది నుతించె మురాంతకానుజుం**
**డా మరుదాత్మజుం గడచి యంగపతిన్ వెసఁ దాఁకెఁ; దాఁకినన్. 223**

**ప్రతిపదార్థం:** భీముఁడు; రథము+అదల్చుచున్= రథాన్ని తోలుకొంటూ; భీమగతిన్+కవియింపన్= భయం గొలిపే విధంగా రాగా; ఆతఁడు+ఉద్దామతన్ మాఱుకొన్నన్= కర్ణుడు తీవ్రంగా ఎదుర్కొనగా; వివిధ= అనేక; స్ఫురత్+అస్త్ర పరంపరా= కాంతిమంతములైన అస్త్ర సమూహాలతో కూడిన; ద్వయశ్రీ మొనలు= రెండు పక్షాల సేనలు; అచ్చెరువున్+చెంది నుతించెన్= ఆశ్చర్యపడి ప్రశంసించాయి; ముర+అంతక+అనుజుండు= శ్రీకృష్ణుడి సోదరుడు (సాత్యకి); ఆ మరుత్+ఆత్మజున్+కడచి= భీముడిని దాటి; అంగపతిన్ వెసన్+తాఁకెన్= కర్ణుడిని వెంటనే తాకాడు; తాఁకినన్= ఢీకొనగా.

**తాత్పర్యం:** భీముడు రథాన్ని అదల్చి భయంకరంగా పరాక్రమించి రాగా, కర్ణుడు అతడిని ఎదుర్కొన్నాడు. అది చూచి ఇరుపక్షాల సేనలూ కొనియాడాయి. అప్పుడు సాత్యకి భీముడిని దాటి కర్ణుడిని ఎదుర్కొన్నాడు. అప్పుడు.

**క. ఆ యిరువురు నిబిడ కన । త్సాయక పటలములు నిగుడ సరి మధ్యాహ్న**
**స్సాయత్త్వ భాద్యుఁ డయ్యుం । దోయజబాంధవుఁడు మింటఁ దోఁపక యుండెన్. 224**

**ప్రతిపదార్థం:** ఆ ఇరువురు= వారిద్దరియొక్క; నిబిడ, కనత్+సాయకపటలములు= దట్టమైన కాంతిమయ బాణసమూహాలు; నిగుడన్= వ్యాపించగా; సరి= సరిగా; మధ్యాహ్నస్సాయత్+ప్రభా+ఆఢ్యుఁడు అయ్యున్= మధ్యాహ్న కాలంలోవిస్తృతకాంతితో కూడుకొన్నవాడైనా; తోయజ బాంధవుఁడు= పద్మాలకు బంధువైన సూర్యుడు; మింటన్+తోఁపక+ఉండెన్= ఆకాశంలో కనిపించలేదు.

**తాత్పర్యం:** ఆ యిద్దరు దట్టంగా కురిపించిన బాణాల గుంపులు వ్యాపించేసరికి, విస్తృతకాంతితో వెలిగే మధ్యాహ్న సూర్యుడు కూడా ఆకాశంలో అగుపించలేదు.

**వ. వా రొండొరుల శరపరంపర లడఁగించి రా సమయంబున. 225**

**ప్రతిపదార్థం:** వారు+ఒండు+ఒరుల= వారు ఒకరు మరొకరి; శరపరంపరలు+అడఁగించిరి= బాణాల సమూహాలను నశింపజేశారు; ఆ సమయంబునన్= అప్పుడు

**తాత్పర్యం:** వారిద్దరూ ఒకరు మరొకరి బాణసమూహాలను అణచారు. అప్పుడు.

**చ. తన కరముల్ నిగిడ్చి యుచితంబుమెయిం గొనియాడి యంతటం**
**దనియక లీలఁ జేరి సముదంబుగఁ బద్మినిఁ బొందె భాస్కరుం**
**డనుటకుఁ దావలం బయి జనాధిప! చూడ శమంతపంచకం**
**బున విరిదమ్మి తేనియలఁ బొల్పెసఁగెం బ్రతిబింబ మెంతయున్. 226**

**ప్రతిపదార్థం:** జనాధిప!= రాజా!; భాస్కరుఁడు= సూర్యుడు; తన కరముల్ నిగిడ్చి= తన కిరణాలు ప్రసరింపజేసి; ఉచితంబు మెయిన్= తగినవిధంగా; కొనియాడి= పొగడి; అంతటన్+తనియక= దానితో తృప్తిచెందక; లీలన్+చేరి= విలాసంగా తాకి; సముదంబుగన్= ఆనందంతో; పద్మినిన్+పొందెన్= పద్మలతను పొందాడు; అనుటకున్+తావలంబు+అయి= అనటానికి నిదర్శనంగా; శమంత పంచకంబునన్= (కురుక్షేత్రంలోని)శమంతములనే ఐదు మడుగుల్లో; చూడన్= చూడగా; విరితమ్మి తేనియలన్= పద్మాల మకరందంలో; ప్రతిబింబము= ఆ సూర్యుడి ప్రతిబింబం; ఎంతయున్+పొల్పు+ఎసఁగెన్= ఎంతో అందంగా గోచరించింది.

**తాత్పర్యం:** సూర్యుడు తన కరాలు సాచి తగువిధంగా కొనియాడి, అంతటితో తృప్తిచెందక, విలాసంగా దగ్గరకు చేరి ఆనందంగా పద్మాలను పొందాడనటానికి నిదర్శనంగా - శమంతపంచకంలోని పద్మాల తేనియల్లో ఆయన ప్రతిబింబం అందంగా ప్రకాశించింది.

**విశేషం:** అలం: ఉత్ప్రేక్ష. రణరంగాన్ని భీమాభిరామంగా (బీభత్సంలో సౌందర్యం) వర్ణించటం తిక్కన విశిష్టత. పరశురాముడు క్షత్రియసంహారం చేసి వారి రక్తాన్ని ఐదు మడుగులుగా చేశాడు. ఆ ప్రాంతాన్ని శమంతపంచకం అంటారు. కురుపాండవులు యుద్ధం చేసిన ప్రదేశం కాబట్టి కురుక్షేత్రం అయింది. ఇక్కడ 'శమంతపంచకం' శబ్దం సాభిప్రాయంగా ఉన్నది.

**వ. అప్పుడు కృప సౌబల కృతవర్మాశ్వత్థామల యుద్దామ సాహాయ్యంబున సమధికోత్సాహుం డగు నా సూత నందనుని సంరంభంబునం గౌరవానీకంబు దర్పోద్రేకంబునం గడంగినం బాండవబలంబునుం బొంగె; నివ్విధంబున నిరువాఁగును గలయన్ బెరసిన నార్పుల నదల్పులం బొగడుటలం దెగడుటల నెసఁగు నులివు తూర్య రవంబుల గెలువ నమ్మేదిని నెత్తుటన్ జొత్తిల్లి కెంజాయ రంజిల్లు పుట్టంబు ముసుంగు వెట్టిన యంగన చందంబు నొందె; మస్తక ప్రముఖావయవంబులును గోదండాద్యాయుధంబులును మకుట ప్రభృతి భూషణంబులును నాతపత్ర ధ్వజ చామరంబులుం దునిసిపడి భీమాభిరామంబులుగాఁ గరిహయనర సమూహంబులు రక్తసిక్తంబు లైన నకాలబాలాతపలీల యావహిల్లం దక్కిన సేనాంగంబుల మిగిలిన మాతంగంబులు పెనంగిన కనకలిప్తకాండంబు లూఁదికొనం దాఁకిన నెరగళ్ళు పోవు కొండల కైవడిం బొలుచునవియును నస్త్రశస్త్ర పాతంబులం గ్రమ్ము రుధిరమ్ముల గైరిక నిర్ఘరంబులతోడి ధరాధరంబుల ననుకరించునవియును మెయిమఱువు లఱువు బళ్ళె నానానిశిత శరంబులు నోనాటినం జేష్టలు దక్కిటెక్కలు దెగియున్న శైలంబులం బోలునవియును నగుచుండఁ జెలంగి చతురంగంబులును బెరయఁ బెనంగు నుల్లాసంబున శోణితం బడంగ మట్టవిసి రేణువు లెగసినం జూడ్కులు నిగుడకున్ననుం దఱియ నుఱికి నిజాభిధానంబులను జననీ జనక నామంబుల బిరుదాంకంబులం దమ్మెఱింగించికొనుచు వీరుల పోరు చక్కటికిం జొచ్చి ప్రాపై పేరువాడు తదీయ బంధుమిత్రులం బొగడు నమరుల యెలుంగులు నింగినిండం బెల్లుదొరఁగు కీలాలం బా ధూళి నడంచిన కొలఁది నిలువక యేఱులయి పాఱ నుబ్బి భూత బేతాళ క్రవ్యాదంబు లోలలాడుచుం ద్రావుచు మదించి నృత్తంబులు సేయ నంబరంబున నట్టలాడ వెక్కసపాటొనర్పంజాలు నా సమయంబున మనంబు లెప్పటి తమకంబున ననిం దనివిసనమిం గవిసి కయ్యంబు సేయు సైనికోత్తముల సింహనాదంబులు దిక్కులం బిక్కటిల్ల నా కలని కెలన నటమున్న తన్నుఁ బొదివిన త్రిగర్త కోసల నారాయణ గోపాల బలంబుల నబ్బలసూదనసూనుండు గాండీవారావం బాకసంబు వగిలింప నొప్పించి. 227**

**ప్రతిపదార్థం:** అప్పుడు; కృపసౌబల కృతవర్మ+అశ్వత్థామల= కృపుడు, శకుని, కృతవర్మ, అశ్వత్థామల; ఉద్దామ సాహాయ్యంబునన్= గొప్ప సహాయంతో; సమధిక+ఉత్సాహుండు+అగు= అధికమైన ఉత్సాహం పొందినవాడైన; ఆ సూతనందనుడి సంరంభంబునన్= ఆ కర్ణుడి ఆటోపంవలన; కౌరవ+అనీకంబు= కౌరవసేన; దర్ప+ఉద్రేకంబునన్+కడంగినన్= గర్వంయొక్క ఆవేశంతో పూనుకోగా; పాండవ బలంబునున్+పొంగెన్= పాండవసేన కూడా ఉప్పొంగింది; ఈ విధంబునన్= ఈ విధంగా; ఇరువాఁగును= రెండుపక్షాలూ; కలయన్= కలయగా-కలియబడగా; బెరసిన= వ్యాపించిన; ఆర్పులన్= అరుపులతో; అదల్పులన్= అదలింపులతో; పొగడుటలన్+తెగడుటలన్= పొగడ్తలతో, నిందలతో; ఎసఁగు= ఒప్పు; ఉలివు= ధ్వని; తూర్య రవంబుల గెలువన్= మ్రోగుతున్న యుద్ధవాద్యధ్వనులను మించగా; ఆ+మేదిని= ఆ యుద్ధభూమి; నెత్తుటన్ జొత్తిల్లి= నెత్తుటితో ఎర్రపడి; కెంజాయ రంజిల్లు పుట్టంబు= ఎరుపురంగుతో ముచ్చటగొలిపే వస్త్రాన్ని; ముసుంగు+పెట్టిన= ముసుగు వేసుకొన్న; అంగన, చందంబున్+ఒందెన్= స్త్రీ రూపాన్ని పొందింది. మస్తక ప్రముఖ+అవయవంబులును= తలలు మొదలైన అవయవాలు; కోదండ+ఆది+ఆయుధంబులును= ధనుస్సులు మొదలైన ఆయుధాలు; మకుట, ప్రభృతి, భూషణంబులునున్= కిరీటం మొదలగు ఆభరణాలు; ఆతపత్ర, ధ్వజ, చామరంబులున్= గొడుగులు ధ్వజాలు వింజామరలు; తునిసిపడి= తెగిపడి; భీమ+అభిరామంబులుగాన్= భయంకర రమ్యంగా; కరి, హయ, నర, సమూహంబులు= గజ అశ్వ పదాతులు; రక్తసిక్తంబులు+

ఐనన్= రక్తమయములు కాగా; అకాలబాల+ఆతపలీల+ఆవహిల్లన్= అకాలంలో ప్రకాశించే లేయెండవలె ఒప్పగా; తక్కినసేనా+ అంగంబులన్= మిగతా సేనావిభాగాలలో; మిగిలిన మాతంగంబులు= మిగిలిన ఏనుగులు; పెనంగిన= పోరగా; కనక, లిప్త, కాండంబులు= బంగారుపూతగల బాణాలు; ఊఁదికొనన్+తాఁకినన్= గట్టిగా తాకగా; ఎరగళ్ళుపోవు= కార్చిచ్చు అంటుకొన్న; కొండల కైవడిన్+పొలుచునవియును= పర్వతాలవలె గోచరించునవి; అస్త్రశస్త్ర పాతంబులన్= అస్త్రశస్త్రాల పాటులచే; క్రమ్మ, రుధిరమ్ములు= పెల్లుబుకు రక్తాలతో; గైరిక, నిర్ఝరంబులతోడి= ఎర్రని గైరిక ధాతు ప్రవాహాలతో కూడిన; ధరాధరంబులను+ అనుకరించునవియును= పర్వతాలవలె కనిపించేవి; మెయిమఱువులు= కవచాలు; అఱువుళ్ళు+ఐ= శిథిలములై - ముక్కలై; నానా, నిశిత, శరంబులు, నోనాటినన్= వివిధములైన వాడిబాణాలు నాటగా; చేష్టలుదక్కి= నిశ్చేష్టములై; ఱెక్కలు తెగిఉన్న శైలంబులన్= రెక్కలు తెగిన పర్వతాలను; పోలునవియునున్+అగుచుండన్= పోలునట్టివి అగుచుండగా; చతుః+అంగంబులును= రథ గజ తురగ పదాతులు; చెలంగి= చెలరేగి; బెరయన్+పెనంగు+ఉల్లాసంబునన్= కలియబడి పోరుతున్న ఉత్సాహంలో; శోణితంబు+అడంగ= రక్తం అణిగేటట్లుగా; మట్టు+అవిసి= అతిక్రమించి; రేణువులు+ఎగసినన్= ధూళి వ్యాపించగా; చూడ్కులు నిగుడకున్ననున్= కళ్ళు కనిపించకపోయినా; దరియన్+ఉఱికి= దగ్గరగా వెళ్ళి; నిజ+అభిధానంబులను= తమ పేర్లను; జననీ జనకనామంబులన్= తల్లిదండ్రుల పేర్లను; బిరుద+అంకంబులన్= బిరుదుల చిహ్నాలను చెప్పి; తమ్ము+ఎఱింగించికొనుచున్= తమను తెలుపుకొంటూ; వీరులపోరు చక్కటికిన్= వీరులు యుద్ధంచేసే చోటికి; చొచ్చి= చొచ్చుకొనివెళ్ళి; ప్రాపు+అయి= అండగా ఉండి; పేరువాడు= పేరుకెక్కిన-ప్రసిద్ధిపొందిన; తదీయ బంధుమిత్రులన్+పొగడు= వారి బంధుమిత్రులను కొనియాడు; ఆమరుల ఎలుంగులు= దేవతల కంఠధ్వనులు; నింగి నిండన్= గగనభాగంలో వ్యాపించగా; పెల్లుతొరఁగు, కీలాలంబు= హెచ్చుగా కారుతున్న రక్తం; ఆ ధూళిన్+అడంచిన కొలఁది= ఆ దుమ్మును అణచినప్పటికీ; నిలువక, ఏరులై పాఱన్= ఆగక నదులై పారగా; ఉబ్బి= పొంగి; భూతబేతాళ క్రవ్యాదులు= భూత బేతాళ రాక్షసులు; ఓలలాడుచున్+త్రావుచున్= (ప్రవాహంలో) మునిగి త్రాగుతూ; మదించి నృత్తంబులు సేయన్= మత్తిల్లి నాట్యం చేయగా; అంబరంబునను+అట్టలాడన్= ఆకాశంలో మొండెములు ఆడగా; వెక్కసపాటు+ఒనర్పన్+చాలు= వెగటు కలిగించే; ఆ సమయంబున= ఆ సమయంలో; మనంబులు= మనసులు; ఎప్పటి, తమకంబునన్= ఎప్పటివలే ఉరకలేస్తూ; అనిన్+తనివిచనమిన్= యుద్ధంలో తృప్తి తీరకపోగా; కవిసి కయ్యంబు చేయు= తాకి యుద్ధం చేసే; సైనిక+ఉత్తములు= వీరశ్రేష్ఠుల; సింహనాదంబులు= అరపులు; దిక్కులన్+పిక్కటిల్లన్= దిశలందు వ్యాపించగా; ఆ కలనికెలనన్= ఆ యుద్ధభూమి సమీపంలో; అటమున్న= అంతకుముందే; తన్నున్+పొదివిన= తన్ను చుట్టిముట్టిన; త్రిగర్తకోసల నారాయణ గోపాలబలంబులను= త్రిగర్త కోసలదేశ నారాయణ గోపాల సేనలను; ఆ+ బలసూదన సూనుండు= అర్జునుడు; గాండీవ+ఆరావంబు= తన వింటినారి ధ్వని; ఆకసంబు పగిలింపన్= ఆకాశం బద్దలగునట్లుగా; నొప్పించి= వారికి బాధ కలిగించి.

**తాత్పర్యం:** అప్పుడు కృపశకుని కృతవర్మాశ్వత్థామల తోడ్పాటుతో, అధికోత్సాహం పొందిన ఆ కర్ణుడి విజృంభణం వల్ల కౌరవసేన గర్వావేశంతో యుద్ధానికి పూనుకొన్నది. అప్పుడు పాండవసేన కూడ గొప్పగ ఉప్పొంగింది. ఈ విధంగా ఇరుపక్షాలు ఎదుర్కోగా - అరుపులతో, అదలింపులతో, పొగడ్తలతో, తెగడ్తలతో చెలరేగిన శబ్దం, యుద్ధవాద్యాల శబ్దాన్ని మించింది. యుద్ధభూమి నెత్తుటితో ఎర్రబడి, ఎరుపురంగుతో శోభిల్లే వస్త్రాన్ని ముసుగుగా వేసుకొన్న స్త్రీవలె ఉంది. తలలు మొదలైన ముఖ్యావయవాలు, ధనుస్సులు మొదలైన ఆయుధాలు, కిరీటాలు మొదలైన ఆభరణాలు, గొడుగులు, ధ్వజాలు, వింజామరలు విరిగిపడి భయంకర రమ్యాలయ్యాయి. గజాశ్వపదాతి సమూహాలు రక్తమయాలయ్యేసరికి అకాలంలో లేయెండ ఉన్నట్లుంది. అప్పుడు తక్కిన సేనావిభాగాల్లో మిగిలిన ఏనుగులు పోరాడాయి. వాటికి బంగారుపూతగల బాణాలు గట్టిగా నాటుకొనేసరికి అవి కార్చిచ్చు అంటుకొన్న కొండల్లా-శస్త్రాస్త్రాల దెబ్బలకు పెల్లుబికిన రక్తధారలతో గైరికధాతు ప్రవాహాలతో కూడిన పర్వతాల్లా - కవచాలు ముక్కలై నానావిధాలైన వాడిబాణాలు నొప్పి కలిగేటట్లు నాటుకోవటం వల్ల చేష్టలుడిగి రెక్కలు తెగిన పర్వతాల్లా అయ్యాయి.

చెలరేగి చతురంగబలాలు కలియబడి పోరుతున్న ఉత్సాహంలో - రక్తాన్ని అణిగించి అతిశయిల్లిన ధూళి వ్యాపించే సరికి కళ్ళు కన్పించకపోగా, పరుగెత్తి దగ్గరకు చేరి, తమ పేర్లతో, తల్లిదండ్రుల పేర్లతో, తమ బిరుదులతో, చిహ్నాలతో తామెవరో తెలుపుతూ పోరుతున్న వీరులున్న చోటికి ప్రవేశించి, అండగా నిలిచి, పేరుకెక్కిన వారి బంధు మిత్రులను పొగడే దేవతల కంఠధ్వనులు ఆకాశం అంతా నిండాయి. అధికంగా కారుతున్న రక్తం ఆ ధూళిని అణచటంతో ఆగకుండా ఏరులై పారింది. భూతబేతాళ రాక్షసులు ఉప్పొంగి ఆ నెత్తుటి ప్రవాహాల్లో ఓలలాడుతూ, త్రాగుతూ మదించి నాట్యం చేశారు. ఆకాశంలో తలలు తెగి శరీరాలు ఆడాయి. మనస్సులు ఎప్పటివలె ఉరకలేస్తూ, యుద్ధంలో తృప్తి తీరక ఢీ కొని యుద్ధం చేస్తున్న వీరశ్రేష్ఠుల సింహనాదాలు దిక్కుల వ్యాపించాయి. ఆ యుద్ధభూమి సమీపంలో అంతకుముందే తన్ను చుట్టుముట్టిన త్రిగర్త కోసల నారాయణ గోపాల సైన్యాలను అర్జునుడు, తన గాండీవధ్వని ఆకాశాన్ని బ్రద్దలు చేయగా నొప్పించి---

**చ.** **తఱిమి సుశర్మ దాఁకిన నతండుఁ దదంగమునన్ దశాస్త్రముల్**
**పఱపి మురాసురాంతకుని బాహువునం బటు మార్గణ త్రయం**
**బఱిముఱి జొన్పి బల్వెడఁద యమ్మున నుజ్జ్వల కేతుదండ మే**
**డ్తెఱఁ జలియింప నేసిన నుదీర్ణతఁ దత్కపి యార్చె; నార్చినన్.** **228**

**ప్రతిపదార్థం:** తఱిమి= వెంబడించి; సుశర్మన్, తాఁకినన్= సుశర్మను ఎదుర్కొనగా; అతండున్= సుశర్మ; తద్+అంగమునన్= అర్జునుడి శరీరమునందు; దశ+అస్త్రముల్, పఱపి= పది అస్త్రాలు వేసి; ముర+అసుర+అంతకుని, బాహువునన్= మురుడనే రాక్షసుని సంహరించిన శ్రీకృష్ణుడి భుజమునందు; బటుమార్గణ త్రయంబు= వాడి అయిన మూడు బాణాలు; అఱిముఱిన్+చొన్పి= సంభ్రమంతో వేసి; బలు+వెడఁద+అమ్మునన్= బలమైన వెడల్పయిన బాణంతో; ఉజ్జ్వల, కేతు, దండము= ప్రకాశించే జెండా కర్రను; ఏడ్తెఱన్+చలియింపన్+ఏసినన్= పరాక్రమంతో కదిలిపోయేటట్లుగా కొట్టగా; తద్+కపి= ఆ ధ్వజమునందలి హనుమంతుడు; ఉదీర్ణతన్= పెద్దగా; ఆర్చెన్= అరిచాడు; ఆర్చినన్= అట్లు అరవగా.

**తాత్పర్యం:** (అర్జునుడు) వెంటబడి సుశర్మతో యుద్ధం చేయగా, ఆ సుశర్మ అర్జునుడి శరీరంమీద పదిఅస్త్రాలు వేశాడు. మూడు బలమైనబాణాలు కృష్ణుడి బాహువులోకి దూరేటట్లు ప్రయోగించాడు. ఒక బలమైన వెడల్పు బాణంతో ధ్వజదండం అమితంగా ఊగిపోయేటట్లు కొట్టేసరికి, అందున్న హనుమ పెద్దగా అరిచాడు. అట్లు అరవగా..... (తరువాతి పద్యంతో అన్వయం)

**సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జును రథంబుపైఁ బడి యాఁగుట (సం. 8-37-11)**

**సీ.** **వెగడునఁ జె య్యేది వేగంబ తేఱి । సంశప్తకు లర్జును సాయకముల**
**కోహటింపక సముత్సాహంబు వదల కం । దఱు నొక్కపెట్ట తద్రథము వొదివి**
**హరులతో గాడియు హరికేలు నొగలును । బలుగాఁడియును గండ్లు బట్టి మెలఁగ**
**మిడుకరాకుండ నమ్మేటివిల్కాని మే । నును నిగ్రహించుట గనుఁగొనంగ**

**తే.** **నద్భుతం బయ్యె నపుడు సేయార్చి శౌరి । లీలఁ గొందఱ మత్త శుండాల భంగి**
**మెఱయఁ దూలించెఁ గాలను గుఱుచ తూపు । గములఁ బార్థుండు పలువుర సమయఁ జేసె.** **229**

**ప్రతిపదార్థం:** సంశప్తకులు; వెగడునన్= భయంతో; చెయ్వు= చేష్ట; ఏది= ఉడిగి; వేగంబ= త్వరగా; తేటి= తేరుకొని; అర్జును= అర్జునునియొక్క; సాయకంబులకు= బాణాలకు; ఓహటింపక= వెనుదీయక; సమ్+ఉత్సాహంబు= నిండైన ఉత్సాహాన్ని; వదలక= విడువక; అందఱున్= (సంశప్తకులు) అందరు; ఒక్కపెట్ట= ఒక్కుమ్మడిగా; తద్= ఆ అర్జునుడియొక్క; రథము= రథాన్ని; పొదివి= చుట్టుముట్టి; హరులతో= గుర్రాలతో కూడ; కాడియు= కాడిని; హరి= శ్రీకృష్ణునియొక్క; కేలు= చేతిని; నొగలును= (రథం యొక్క) నొగలను; పలుగాడియును= పలుగాడిని; కండ్లు= (రథచక్రాల) కండ్లను; పట్టి= పట్టుకొని; మెలగ= పనిచేయుటకు; మిడుక= కదలుటకు; రాకుండ= వీలులేకుండ; ఆ+మేటి= ఆ శ్రేష్ఠుడైన; విలుకాని= విల్లునుపట్టిన వానియొక్క (అర్జునునియొక్క); మేనును= శరీరాన్ని; నిగ్రహించుట= పట్టుకొనుట; కనున్+కొనంగన్= చూచుటకు; అద్భుతంబు= ఆశ్చర్యము; అయ్యెన్= అయినది; అప్పుడు= ఆ సమయంలో; శౌరి= శ్రీకృష్ణుడు; చేయి; ఆర్చి= ఆడించి; మత్త= మదించిన; శుండాలంబు= ఏనుగు; భంగి= విధము; మెఱయన్= ప్రకాశించగ; లీలన్= విలాసంగా; కొందఱ= కొంతమందిని; తూలించెన్= తొలగ్రతోసెను; పార్థుడు= అర్జునుడు; కాలను= కాలితో; కుఱుచ= పొట్టివైన; తూపు= బాణాలయొక్క; గముల= సమూహాలతో; పలువుర= పెక్కుమందిని; సమయన్+చేసె= చచ్చేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** సంశప్తకులు భయంతో చేష్టలుడిగి, వెంటనే తేరుకొని, అర్జునుని బాణాలకు వెనుదీయక, ఉత్సాహాన్ని కోల్పోక, అందరు ఒక్కుమ్మడిగా అతడి రథాన్ని చుట్టుముట్టారు. గుర్రాలతో సహా అతడి రథం కాడిని, శ్రీకృష్ణుడి చేతిని, రథం నొగలను, పలుగాడిని, చక్రాల కండ్లను, ఆ మేటి విలుకాడైన అర్జునుడి శరీరాన్ని కదలటానికి వీలులేకుండ గట్టిగా పట్టుకొన్నారు. అది చూడటానికి అద్భుతంగా ఉంది. అప్పుడు శ్రీకృష్ణుడు చెయ్యి ఆడించి, మదగజంవలె ప్రకాశిస్తూ, విలాసంగా కొంతమంది సంశప్తకులను తొలగ్రతోశాడు. అర్జునుడు కాలితో, కురుచ బాణాలతో పెక్కుమందిని పరిమార్చాడు.

**వ. అంతఁ గొంత యూరుపువోయినం జిఱునవ్వు నవ్వి కవ్వడి కమలనాభున కి ట్లనియె. 230**

**ప్రతిపదార్థం:** అంతన్= అపుడు; కొంత ఊరుపుపోయినన్= కొంత ఊరట కలుగగా; కవ్వడి= అర్జనుడు; చిఱునవ్వు నవ్వి= చిన్నగా నవ్వి; కమలనాభునకున్+ఇట్లు+అనియెన్= కృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అపుడు కొంత ఊరటచెందిన అర్జునుడు చిరునవ్వుతో కృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**ఆ. 'తేరు గదలనీక వైరులు బలువిడిఁ । బొదివిపట్ట రాచ పొల్ల నైన**
**యేను దక్క నృపతిసూనుఁ డి ట్లొరుఁడు స । హించు నెట్లు విక్రమించుఁగాక!' 231**

**ప్రతిపదార్థం:** వైరులు= శత్రువులు; తేరు కదలనీక= రథం కదలనివ్వకుండా; బలువిడిన్+పొదివిపట్టన్= బలంగా చుట్టుముట్టి పట్టుకోగా; రాచపొల్లను+అయిన+ఏను+తక్కన్= క్షత్రియులలో వ్యర్థుడనైన నేను తప్ప; ఒరుఁడు, నృపతి సూనుఁడు= వేరొక రాజకుమారుడు; ఇట్లు= ఈ విధంగా; సహించున్+ఎట్లు?= ఎట్లా సహిస్తాడు?; విక్రమించున్ కాక= పరాక్రమిస్తాడు కాని.

**తాత్పర్యం:** 'శత్రువులు బలంగా క్రమ్ముకొని రథాన్ని కదలనివ్వకుండా పట్టుకొంటే, నా బోటి వ్యర్థుడు తప్ప వేరొక క్షత్రియుడు ఇట్లా సహిస్తాడా?'

**క. అని పలికి చూడు మా న । న్ననుచు భుజంగాస్త్ర మేయ నది యరులకు గ్ర**
**క్కునఁ బాదబంధ మొనరిం ।చిన ముంచె నతండు వారి శితవిశిఖములన్. 232**

**ప్రతిపదార్థం:** అతండు= అర్జునుడు; అని పలికి= ఆ విధంగా అని; చూడుమీ, నన్ను+అనుచున్= ఇప్పుడు నన్ను )నా పరాక్రమం) చూడుము అంటూ; భుజంగ+అస్త్రము+ఏయన్= సర్పాస్త్రం ప్రయోగించగా; అది+అరులకున్= అది శత్రువులకు; గ్రక్కునన్= వెంటనే; పాదబంధము+ఒనరించినన్= పాదాలను బంధించగా; వారిన్= వారిని; శిత, విశిఖములన్= వాడి బాణాలతో; ముంచెన్= ముంచివేశాడు.

**తాత్పర్యం:** అని 'ఇప్పుడు నా పరాక్రమం చూడు' అంటూ అర్జునుడు, సర్పాస్త్రాన్ని ప్రయోగించగా అది వైరుల పాదాలను బంధించింది. తరువాత అర్జునుడు వాడిబాణాలను వారిపై గుప్పించాడు.

**విశేషం:** శత్రువులు తన రథాన్ని కదలనివ్వకుండా చేసినందుకు ప్రతీకారంగా అర్జునుడు వారి పాదాలను బంధించి వారిని కదలనివ్వకుండా చేశాడు.

**వ. ఇవ్విధంబున. 233**

**తాత్పర్యం:** ఈ విధంగా.

**ఆ. నాగ పాశ బంధనంబుల గుదివడి । వారు వివిధ బాణ దారితాంగు**
**లై రథంబు విడిచి; రప్పు డా సంశప్త । క వ్రజంబుఁ గని త్రిగర్తవిభుఁడు. 234**

**ప్రతిపదార్థం:** నాగపాశ, బంధనంబులన్= నాగాస్త్రంయొక్క బంధాలతో; గుదివడి= చిక్కుకొని; వారు= సంశప్తకులు; వివిధ బాణ, దారిత+అంగులు+అయి= పెక్కు బాణాలతో చీల్చబడిన శరీరంకలవారై; రథంబు విడిచిరి= రథాన్ని వదలిపెట్టారు; అప్పుడు; త్రిగర్తవిభుఁడు= సుశర్మ; సంశప్తక వ్రజంబున్+కని= త్రిగర్త వీరులను చూచి.

**తాత్పర్యం:** అర్జునుడు వేసిన నాగాస్త్రబంధాలలో చిక్కుకొని, అతడి బాణాలకు గాయపడిన వారై సంశప్తకులు రథాన్ని వదలిపెట్టారు. అప్పుడు త్రిగర్తరాజు సుశర్మ వారిని చూచి.

**క. గరుడాస్త్రం బేసిన న । చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం జంచు**
**స్ఫురణము మెఱయఁ గ వెస న । య్యురగాత్మక బంధ మూడ నుర్వీనాథా! 235**

**ప్రతిపదార్థం:** ఉర్వీనాథా!= రాజా!; గరుడ అస్త్రంబు+ఏసినన్= గరుడాస్త్రం ప్రయోగించగా; గరుడములు+కవిసి= గరుడ పక్షులు క్రమ్ముకొని; అచ్చెరువుగన్= ఆశ్చర్యకరంగా; వెసన్= వెంటనే; ఆ+ఉరగ+ఆత్మక, బంధము+ఊడన్= నాగాస్త్రబంధం విడిపోగా; చంచుస్ఫురణము మెఱయఁగన్= తమ ముక్కుల వాడి గోచరించగా; చీరెన్= పొడిచాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రమహారాజా! సుశర్మ గరుడాస్త్రం ప్రయోగించగా గరుడపక్షులు క్రమ్ముకొని వాడి అయిన తమ ముక్కులతో పొడిచి నాగాస్త్ర బంధాలను విడిపించాయి.

**క. తన కడిమి బంధమోక్షము । గనిన రథికకోటి గడఁగి గాండివిపయి నే**
**పునఁ దూపులు దొరఁగింపఁగ । ఘనభుజుఁడు సుశర్మఁ డేసెఁ గన దస్త్రమునన్. 236**

**ప్రతిపదార్థం:** తన కడిమిన్= తన పరాక్రమంతో; బంధమోక్షము, కనిన, రథిక, కోటి= బంధాలు ఊడిన రథికుల సమూహం; కడఁగి= పూనుకొని; గాండివి, పయిన్= అర్జునుడిమీద; ఏపునన్+తూపులు, తొరఁగింపఁగన్= శౌర్యంతో బాణాలు వేయగా; ఘనభుజుఁడు, సుశర్ముఁడు= బాహుబలుడైన సుశర్మ; కనత్+అస్త్రమునన్= కాంతిమయ అస్త్రంతో; ఏసెన్= కొట్టాడు.

**తాత్పర్యం:** త్రిగర్తవీరులు నాగాస్త్రబంధాలు వీడగా అర్జునుడిపై బాణాలు కురిపించారు. సుశర్మకూడా ప్రకాశించే అస్త్రాన్ని ప్రయోగించాడు.

**చ.** **అది నరుడెంద మాడుటయు నాతఁడు మూర్ఛ మునింగి తేరిపైఁ**
**జదికిలఁబడ్డ నుబ్బి 'యద్దె చచ్చె సుశర్ముని యేటు దాఁకి బ**
**ల్లిదుఁ డగు పార్థుఁ డంచు మదలీలల నార్చిరి నీదు సైనికుల్;**
**సదలను దిక్కులం బరఁగె శంఖముఖోద్భట తూర్య నాదముల్.** 237

**ప్రతిపదార్థం:** అది, నరుడెందము+ఆడుటయున్= ఆ అస్త్రం అర్జునుడి గుండెను తాకగా; అతడు మూర్ఛ మునింగి= అతడు మూర్ఛపోయి; తేరిపైన్+చదికిలన్+పడ్డన్= రథంపై పడిపోగా; నీదు సైనికులు= నీ సైనికులు; ఉబ్బి= పొంగిపోయి; సుశర్ముని ఏటుతాఁకి= సుశర్మ బాణం దెబ్బ తగిలి; బల్లిదుఁడు+అగుపార్థుఁడు= బలశాలి అయిన అర్జునుడు; అదె చచ్చెన్= అదిగో చనిపోయాడు; అంచున్ మదలీలన్+ఆర్చిరి= అంటూ గర్వంగా అరిచారు; శంఖముఖ+ఉద్భట తూర్యనాదముల్= శంఖం మొదలైన యుద్ధవాద్యధ్వనులు; చదలను, దిక్కులన్+పరఁగన్= గగనంలోనూ అన్ని దిక్కులలోనూ వ్యాపించాయి.

**తాత్పర్యం:** సుశర్మ వేసిన అస్త్రం తాకిడికి అర్జునుడు మూర్ఛపోయి రథంపై చతికిలపడిపోగా, అతడు చనిపోయాడని భావించి కౌరవసేన గర్వంతో కేకలు వేసింది. యుద్ధవాద్యాల ధ్వనులు ఆనందసూచకంగా అంతట మారుమ్రోగాయి.

**సీ.** **అంతఁ దెప్పిఱి విలయాంతకు కైవడిఁ గవ్వడి యేచి మార్గణ చయంబు**
**పె ల్లడరించిన బీఱువోయె సుశర్మ । యా సేనమీఁద నైంద్రాస్త్ర మక్కి**
**రీటి నవ్వుచు నేయ నాటోపమున నది । వివిధ బాణాకృతిఁ గవిసి నుఱుము**
**గావింపఁగాఁ బదివేవురు సంశప్త । కాగ్రేసరులు దెగటాఱి రప్డు**

**ఆ.** **డుక్కు దక్కి తలరి తక్కటి యోధులు । చేష్టితంబు లెడలఁ జిత్రరూపు**
**లట్టులైరి ధూమ మడఁగిన వెలుఁగొందు । ననలు చందమయ్యె నన్నరుండు.** 238

**ప్రతిపదార్థం:** అంతన్+తెప్పిఱి= అంతలోనే తేరుకొని; కవ్వడి= అర్జునుడు; విలయ+అంతకు, కైవడిన్= ప్రళయకాల యముడివలె; ఏచి= విజృంభించి; మార్గణచయంబు= బాణసమూహం; పెల్లు+అడరించినన్= అధికంగా కురిపించగా; సుశర్మ; బీఱుపోయెన్= నిశ్చేష్టుడయ్యాడు; ఆ+కిరీటి= అర్జునుడు, ఆసేనమీఁదన్= త్రిగర్తసేనమీద; ఐంద్ర+అస్త్రము= ఇంద్రాస్త్రం; నవ్వుచున్+ఏయన్= పరిహసిస్తూ ప్రయోగించగా; ఆటోపమునన్+అది= అతిశయంతో ఆ అస్త్రం; వివిధబాణ+ ఆకృతిన్+కవిసి= వివిధబాణాల రూపంలో తాకి; నుఱుము కావింపఁగాన్= చంపివేయగా; పదివేవురు సంశప్తక+అగ్రేసరులు= పదివేలమంది త్రిగర్తవీరులు; తెగటాఱిరి= మరణించారు; అప్పుడు; తక్కటియోధులు= మిగిలిన వీరులు; ఉక్కు+తక్కి= ధైర్యం నశించి; తలరి= చలించి; చేష్టితంబులు+ఎడలన్= చేష్టలుడుగగా; చిత్రరూపులు+అట్టులు+ఐరి= చిత్రాలవలె అయ్యారు; ఆ+నరుండు= అర్జునుడు; ధూమము+అడఁగినన్= పొగ నశించగా; వెలుఁగొందు+అనలు చందము+అయ్యెన్= ప్రకాశించే అగ్నివలె ఒప్పాడు.

**తాత్పర్యం:** అర్జునుడు వెంటనే మూర్ఛనుండి తేరుకొని విజృంభించి బాణాలగుంపులు గుప్పించగా, సుశర్మ నిశ్చేష్టుడయ్యాడు. ఇంద్రాస్త్రం ప్రయోగించగా అది పెక్కుబాణాలుగా వెలువడి పదివేలమంది త్రిగర్తవీరులను బలిగొన్నది. ధైర్యం నశించిన మిగతా యోధులు చిత్రాలవలె చలనరహితులయ్యారు. పొగ తొలగిపోగా ప్రకాశించే అగ్నివలె అర్జునుడు ఒప్పారాడు.

**విశేషం:** సుశర్మ అస్త్రం తాకిడికి అర్జునుడు మూర్ఛపోయినా అది క్షణకాలం మాత్రమే. అతడు నివురుగప్పిన నిప్పువలె పరాక్రమధనుడు అని భావం. ఉపమాలంకారం. పొగఅంతా పోగా మంట వేడి ఎక్కువవుతుంది.

**వ. హతశేషులైన సంశప్తకులు చతుర్దశ సహస్రయోధముఖ్యు లవ్విజయు విజయంబు సహింపక యొండొరులం బురికొల్పి బలంబులతోడం గడంగిన నతం డతిదారుణంబగు రణంబుసేయఁ దక్కటి పాండవుల దెసఁబోరు కౌరవ బలంబు తద్బల శౌర్యంబు లోర్వక భీతిఁగలంగి పఱచినం గృతవర్మ కృపగురు పుత్ర కర్ణులు నులూక సౌబల సుయోధనులు దుశ్శాసనాది కుమారులును బరవసంబు సేసి యా సైన్యంబుఁ దైన్యంబు వాయ విక్రమించి; రట్టియెడఁ గృపుని యపరిమిత శరజాలంబు పాంచాల పుంజంబుం బొదివినం గనలి శిఖండి యమ్మహీసురవరుని మార్కొనియె; నయ్యిరువుర సమరంబు రామ రావణుల రణంబు కరణి నొప్పె; నట్లు పోరి పోరి శారద్వతుండు. 239**

**ప్రతిపదార్థం:** హత శేషులు+ఐన సంశప్తకులు= చావగా మిగిలిన త్రిగర్తవీరులు; చతుః+దశ సహస్రయోధ ముఖ్యులు= పద్నాలుగు వేలమంది; ఆ+విజయు, విజయంబు= ఆ అర్జునుడి గెలుపును; సహింపక= తట్టుకోలేక; ఒండు+ఒరులన్+ పురికొల్పుకొని= ఒకరినొకరు పురికొల్పికొని; బలంబులతోడన్+కడంగినన్= సేనలతో తరలిరాగా; అతండు= అర్జునుడు; అతిదారుణంబు+అగు= రణంబుచేయన్= మిక్కిలి భయంకరమైన యుద్ధం చేయగా; తక్కటి పాండవులదెసన్+పోరు= మిగతా పాండవ సోదరులతో యుద్ధం చేసే; కౌరవబలంబు= కౌరవసైన్యం; తద్+బలశౌర్యంబులు+ఓర్వక= ఆ పాండవుల బలపరాక్రమాలు సహించలేక; భీతిన్+కలంగి= భయానికి గురై; పఱచినన్= పారిపోగా; కృతవర్మ, కృప, గురుపుత్ర, కర్ణులున్= కృతవర్మ, కృపుడు, అశ్వత్థామ, కర్ణుడు; ఉలూక, సౌబల, సుయోధనులు= ఉలూకుడు శకుని దుర్యోధనుడు; దుశ్శాసన+ఆది కుమారులును= దుశ్శాసనుడు మున్నగు కౌరవులు; బరవసంబుసేసి= ధైర్యం వహించి; ఆ సైన్యంబు= ఆ కౌరవసేన; దైన్యంబుపాయన్= దీనస్థితి తొలగగా; విక్రమించిరి= పరాక్రమించారు; అట్టిఎడన్= ఆ సమయంలో; కృపుని= కృపాచార్యుని; అపరిమిత శరజాలంబు= అసంఖ్యాక బాణసముదాయం; పాంచాల పుంజంబున్+పొదివినన్= పాంచాలురసమూహాన్ని తాకగా; శిఖండి; కనలి= కోపించి; ఆ+మహీసురవరుని= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుని-కృపాచార్యుని; మార్కొనియెన్= ఎదుర్కొన్నాడు; ఆ ఇరువురు సమరంబు= శిఖండి కృపుల యుద్ధం; రామరావణుల రణంబు- కరణిన్+ఒప్పెన్= రామరావణ యుద్ధంవలె గోచరించింది; శారద్వతుండు= కృపాచార్యుడు; అట్లు పోరి పోరి= ఆ విధంగా యుద్ధం చేసి, చేసి.

**తాత్పర్యం:** చావగా మిగిలిన పదునాల్గువేలమంది సంశప్తకవీరులు అర్జునుని విజయాన్ని సహించక, ఒకరినొకరు పురికొల్పుకొంటూ తమసేనలతో తరలిరాగా, అర్జునుడు అతి భయంకరమైన యుద్ధం చేశాడు. తక్కిన పాండవులతో యుద్ధం చేస్తున్న కౌరవసైన్యం, వారి బలపరాక్రమాలు సహించలేక భీతిల్లి, కలతపడి పారిపోగా - కృతవర్మ, కృపుడు, అశ్వత్థామ, కర్ణుడు, ఉలూకుడు, శకుని, సుయోధనుడు, దుశ్శాసనాది కురుకుమారులు ధైర్యం వహించి, ఆ కౌరవసైన్యంయొక్క దైన్యం తొలగేటట్లు విజృంభించారు. అప్పుడు కృపాచార్యుని అపరిమిత బాణసమూహం

పాంచాలసైన్యాన్ని తాకగా, శిఖండి ఆగ్రహించి, ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడైన కృపాచార్యుణ్ణి ఎదుర్కొన్నాడు. ఆ యిద్దరి యుద్ధం రామరావణయుద్ధం వలె ఒప్పింది. ఆ విధంగా కృపాచార్యుడు పోరి పోరి ......

**విశేషం:** అలం: ఉపమ.

**చ. హరులను సూతుఁ జంపిన నుదగ్రత నా ద్రుపదాత్మజుండు వి**
**స్ఫురిత కృపాణ చర్మ పరిశోభితుఁడై యరదంబు డిగ్గి స**
**త్వరముగ నేఁగుదేర శరవాహిని పై నిగిడించె; నాతఁ డ**
**య్యరి వెఱఁగందుచున్ నిలుచునట్లుగ జోదులు పిచ్చలింపఁగన్. 240**

**ప్రతిపదార్థం:** హరులను, సూతున్+చంపినన్= అశ్వాలను సారథిని చంపగా; ఆ ద్రుపద+ఆత్మజుండు= శిఖండి; ఉదగ్రతన్= భయం గొల్పుతూ; విస్ఫురిత, కృపాణ, చర్మ, పరిశోభితుఁడు+ఐ= ప్రకాశించే కత్తి డాలుతో కూడినవాడై; అరదంబు డిగ్గి= రథం నుండి దిగి; సత్వరముగన్+ఏఁగుదేరన్= వేగంగా రాగా; ఆతఁడు= కృపుడు; ఆ+అరి= ఆ శత్రువైన శిఖండి; వెఱఁగు+అందుచున్+నిలుచునట్లుగన్= ఆశ్చర్యపోయేటట్లుగా; జోదులు= యోధులు; పిచ్చలింపఁగన్= ప్రశంసించేవిధంగా; శరవాహిని= బాణవర్షం; పైన్+నిగిడించెన్= అతడిపై కురిపించాడు.

**తాత్పర్యం:** కృపాచార్యుడు అతడి గుర్రాలను, సారథిని చంపగా శిఖండి రథం దిగి కత్తి, డాలు ధరించి అతడివైపు రాగా, కృపుడు శిఖండి ఆశ్చర్యపోయేటట్లుగ, యోధులు ప్రశంసించేటట్లుగ అతడిమీద బాణవర్షం కురిపించాడు.

**వ. అట్లేచిన కృపాచార్యుపై నురవడించిన ధృష్టద్యుమ్నుం గృతవర్మయు ధర్మతనయ ద్రౌపదేయుల నశ్వత్థామయుఁ గవలం గురుపతియును వృకోదరుం గర్ణుండునుం దలపడి నిలువరించి రగ్గౌతముండు శిఖండి పలక పఱియలు సేసిన నతండు దెరలక కేవల కరవాలంబున విక్రమింపం గడంగిన నయ్యతిరథుండు. 241**

**ప్రతిపదార్థం:** అట్లు+ఏచిన, కృపాచార్యుపైన్= ఆ విధంగా విజృంభించిన కృపుడిపై; ఉరవడించిన ధృష్టద్యుమ్నున్= వేగంతో తాకిన ధృష్టద్యుమ్నుడిని; కృతవర్మయున్= కృతవర్మ; ధర్మతనయ, ద్రౌపదేయులన్= ధర్మరాజును, ఉపపాండవులను; అశ్వత్థామయున్= అశ్వత్థామ; కవలన్+కురుపతియును= నకుల సహదేవులను దుర్యోధనుడు; వృకోదరున్+కర్ణుండును= భీముడిని కర్ణుడు; తలపడి, నిలువరించిరి= ఎదుర్కొని అడ్డగించారు; ఆ+గౌతముఁడు= కృపుడు; శిఖండిపలక= శిఖండి కేడెము(వారు)ను; పఱియలు చేసినన్= బద్దలు చేయగా; అతండు తెరలక= అతడు తొలగక; కేవల, కరవాలంబున, విక్రమింపన్+కడంగినన్= కేవలం కత్తితోనే పరాక్రమించగా; ఆ+అతిరథుండు= అతిరథుడైన ఆ కృపుడు.

**తాత్పర్యం:** ఆ విధంగా విజృంభించిన కృపుడిమీదికి వచ్చిన ధృష్టద్యుమ్నుడిని కృతవర్మ, ధర్మరాజును, ఉపపాండవులను, అశ్వత్థామ, నకుల సహదేవులను దుర్యోధనుడు, భీముడిని కర్ణుడు ఎదుర్కొని అడ్డగించారు. కృపాచార్యుడు శిఖండి కేడెము(వారు)ను బద్దలు చేయగా అతడు చలించకుండా కత్తితోనే పోరు సాగించాడు. అప్పుడు కృపుడు.

**క. వాలిక తూపులు మేనం। గీలుకొలిపి నొంపఁ గన సుకేతుఁడు బాణ**
**జ్వాలలు నిగుడ నడరి యా। భీలత నా కృపునితోడఁ బెనఁగె నరేంద్రా! 242**

**ప్రతిపదార్థం:** నరేంద్రా!= రాజా!; వాలిక తూపులు= వాడి అయిన బాణాలు; మేనన్+కీలు కొలిపి, నొంపన్= శరీరమునందు నాటి నొప్పించగా; సుకేతుడు కని= సుకేతుడు (ద్రౌపది కుమారుడు) చూచి; బాణజ్వాలలు నిగుడన్= బాణాలమంటలు చెలరేగేటట్లు; అడరి= విజృంభించి; ఆభీలతన్= భయంకరంగా; ఆ కృపునితోడన్+పెనఁగెన్= కృపాచార్యుడితో పోరు సల్పాడు;

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కృపుడు శిఖండిపై వాడిబాణాలు వేసి నొప్పించగా, చూచి సుకేతుడు అతడిపై బాణాలజ్వాలలు చెలరేగేటట్లుగ విజృంభించి భయంకరంగా పోరాడాడు.

**తే. తనకు నెడ సొచ్చి యిట్టు లతండు పెనఁగ । ద్రుపదనందనుఁ డల్లన తొలఁగిపోయె;**
**నా సుకేతుండు గృపునిమై నాఁట నిరువ । దాఱు శరములు పఱపి రయంబు మెఱయ. 243**

**ప్రతిపదార్థం:** తనకున్+ఎడ+చొచ్చి= తనకు మధ్యగా వచ్చి; ఇట్టులు+అతండు పెనఁగన్= ఇట్లా సుకేతుడు పోరుతుండగా; ద్రుపదనందనుఁడు= శిఖండి; అల్లన తొలఁగిపోయెన్= అక్కడినుండి వెళ్ళిపోయాడు; ఆ సుకేతుండు= సుకేతుడు; కృపుని, మైన్ నాఁటన్= కృపుడి దేహమునందు నాటేటట్లుగా; ఇరువది+ఆఱు శరములు పఱపి= ఇరవై ఆరుబాణాలు వేసి; రయంబు మెఱయన్= వేగం అతిశయించగా.

**తాత్పర్యం:** సుకేతుడు మధ్యలో వచ్చి కృపుడితో పోరగా, శిఖండి అటనుండి వెళ్ళిపోయాడు. కృపుడిపై సుకేతుడు ఇరవై ఆరుబాణాలు వేసి వెంటనే. (తరువాతి గద్యంతో అన్వయం).

**వ. ధనువు దునిమి యొండు కోదండం బెత్తిన నదియును ఖండించి. 244**

**ప్రతిపదార్థం:** ధనువు తునిమి= విల్లును విరిచి; ఒండు కోదండంబు+ఎత్తినన్= మరొకవిల్లును చేపట్టగా; అదియును ఖండించి= దానిని కూడా ఖండించి.

**తాత్పర్యం:** కృపుడి విల్లును విరిచి ఆయన మరొక ధనువు చేపట్టగా దానిని కూడా ఖండించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. తోడన హయసూతుల మెయిఁ । గాఁడఁగ నేయుటయు నతఁడు గనలుచు బలువిల్**
**క్రీడయ పోలెం గొని మే । న్గాఁడఁగ నిగిడించెఁ ద్రిదశనారాచంబుల్. 245**

**ప్రతిపదార్థం:** తోడన= వెంటనే; హయసూతుల మెయిన్+కాఁడఁగన్+ఏయుటయున్= అశ్వసారథుల మేనులందు గ్రుచ్చుకొనేటట్లు బాణాలు వేయగా; ఆతడు= కృపుడు; కనలుచున్= కోపపడుతూ; బలువిల్= బలమైన ధనువును; క్రీడ+ఆ పోలెన్+కొని= అవలీలగా గైకొని; త్రిదశ నారాచంబుల్= ముప్పదిబాణాలు; మేను+కాఁడఁగన్, నిగిడించెన్= సుకేతుడి శరీరంమీద నాటుకొనేటట్లు వేశాడు.

**తాత్పర్యం:** వెంటనే అశ్వసారథులపై బాణాలు వేసి నొప్పించగా, కృపుడు కోపించి విలాసంగా బలిష్ఠమైన ధనువును చేబూని సుకేతుడి శరీరంమీద గ్రుచ్చుకొనేటట్లు ముప్పదిబాణాలు వేశాడు.

కృపాచార్యుండు సుకేతుం డను పాంచాలకుమారునిం జంపుట (సం. 8-38-82)

**తే.** **అట్టు నొప్పింపఁ దూఁగాడు నా సుకేతు। కంధరము మెఱుఁగారెడు కత్తివాతి**
**దొడ్డ తూపున నేపునఁ ద్రుంచుటయును। శిరము ధర డొల్లెఁ గుండలస్ఫురణ మెఱయ.** **246**

**ప్రతిపదార్థం:** అట్టు నొప్పింపన్= ఆ విధంగా బాణాలతో నొప్పించగా; తూఁగాడు= ఊగుతున్న; ఆ సుకేతు కంధరము= సుకేతుడి మెడ; మెఱుఁగారెడు= కాంతిమంతమైన; కత్తివాతి= కత్తివాతి, దొడ్డతూపునన్= అర్ధచంద్రాకారంగా ఉన్న పెద్ద బాణంతో; ఏపునన్+త్రుంచుటయును= గర్వంతో ఖండించగా; శిరము= సుకేతుడి శిరస్సు; కుండల, స్ఫురణ, మెఱయన్= చెవిపోగులు ప్రకాశించగా; ధరన్+డొల్లెన్= నేలపై రాలింది.

**తాత్పర్యం:** కృపుడు తన బాణాల దెబ్బలకు తూలుతున్న సుకేతుడి శిరస్సును బలమైన అర్ధచంద్రాకార బాణంతో ఖండించగా, కర్ణకుండలాల కాంతితో ప్రకాశిస్తూ అతడి తల నేలపై పడి దొరిలింది.

**వ.** **ఇట్లు సుకేతుండు సచ్చిన నతని మూఁకలు విచ్చె; ధృష్టద్యుమ్నుండు గృతవర్మయుం బోరునెడ ధృష్టద్యుమ్నుండు గృతవర్మ వక్షస్థ్సలంబు విశిఖ నవకంబున నొప్పించుటయు' నప్పాంచాల వరునతండు సూతకేతు హయస్యందన సమేతంబుగా నిబిడ శరజాలంబునం బొదివిన నవ్వీరుండు బలాహకపిహితమూర్తి యగు మార్తాండు ననుకరించి తాను సైంధవ వధ దినంబునం బారావతవర్ణంబు లగు రథ్యంబు లగ్గురు నరుణాశ్వంబులన్ బెరయం బఱపిన తెఱంగున.** **247**

**ప్రతిపదార్థం:** ఇట్లు, సుకేతుండు చచ్చినన్= ఈ విధంగా సుకేతుడు మరణించగా; అతని మూఁకలు విచ్చెన్= అతడి సైన్యం చెల్లాచెదరయింది; ధృష్టద్యుమ్నుండున్+కృతవర్మయున్+పోరు+ఎడన్= ధృష్టద్యుమ్న కృతవర్మలు పోరాడేటప్పుడు; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; కృతవర్మ వక్షఃస్థలంబు= కృతవర్మ వక్షమును; విశిఖ నవకంబునన్+నొప్పించుటయున్= తొమ్మిది బాణాలతో బాధించగా; ఆ+పాంచాల, వరున్= ఆ పాంచాలశ్రేష్ఠుడైన ధృష్టద్యుమ్నుడిని; అతండు= కృతవర్మ; సూత, కేతు, హయ, స్యందన, సమేతంబుగాన్= సారథి ధ్వజం అశ్వాలు, రథములతో కూడ, నిబిడ శరజాలంబునన్+ పొదివినన్= దట్టమైన బాణాలగుంపుతో కప్పివేయగా; ఆ+వీరుండు= ధృష్టద్యుమ్నుడు; బలాహక పిహితమూర్తి+అగు= మేఘాలచేత కప్పబడినట్టి; మార్తాండున్+అనుకరించి= సూర్యుడిని పోలినవాడై; తాను; సైంధవ వధ దినంబునన్= సైంధవుడు చంపబడిన రోజు; పారావత వర్ణంబులు+అగు రథ్యంబులు= పావురం రంగు కలిగిన(తెల్లని) గుర్రాలు; ఆ+గురు+అరుణ+ అశ్వంబులన్= ద్రోణాచార్యుడి ఎరుపురంగు గుర్రాలను; బెరయన్+పఱపిన తెఱంగునన్= తాకునట్లు పోరినవిధంగా.

**తాత్పర్యం:** ఈ విధంగా సుకేతుడు మరణించగా అతడిసైన్యం చెదరిపోయింది. ధృష్టద్యుమ్న కృతవర్మల యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు కృతవర్మ వక్షంపై తొమ్మిదిబాణాలు వేయగా అతడు సారథి, అశ్వాలు, ధ్వజం, రథంతో సహా ధృష్టద్యుమ్నుడిని బాణాలతో కప్పివేయగా, మేఘాలతో కప్పబడిన సూర్యుడివలె ధృష్టద్యుమ్నుడు ఒప్పారాడు. సైంధవవధ సమయంలో తన తెల్లగుర్రాలు ద్రోణుడి ఎర్రనిగుర్రాలను తాకినవిధంగా.

**విశేషం:** పద్మవ్యూహంలో అభిమన్యుడు చిక్కుపడి మరణించటానికి కారకుడైన సైంధవుడిని అర్జునుడు సంహరించిననాటి యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు ద్రోణుడితో పైవిధంగానే తలపడ్డాడు. 'అప్పాంచాలకుల ప్రదీపకుండు గోపాద్దీపితుండయి పారావత వర్ణంబులగు రథ్యంబుల నగ్గురు నరుణాశ్వంబులన్ బెరయ నరదంబు వరపించి..... నతని తేరికడ నొగ ద్రొక్కి మెక్కి

కాడిపయిం జిత్రగతులు మెరసి' (ద్రోణ. తృ. 124) అవే పదాలు ఈ సందర్భంలోని వచనంలో కూడా పునరుక్తి కావటం గమనార్హం.

**తే. అలిగి నొగ నొగతోఁ దాఁక నతిరయమునఁ । దేరు వఱపి కృపాణ ప్రదీప్త పాణి**
**యగుడు, గద వుచ్చికొనియును నఱుమ లేక । చలము డిగఁ ద్రావి కృతవర్మ యిలకు దాఁటె. 248**

**ప్రతిపదార్థం:** అలిగి= కోపించి; నొగ నొగతోన్+తాఁకన్= (తన) రథం నొగలుతో కృతవర్మ నొగలును తాకగా; కృతవర్మ; అతిరయమునన్+తేరు+పఱపి= వేగంగా రథం నడిపి; కృపాణ ప్రదీప్త పాణి అగుడున్= ఖడ్గం చేత ప్రకాశించే చేయి కలవాడై; గద పుచ్చికొనియును= గద తీసికొని కూడా; అఱుమ లేక= పొడిచేయలేక; చలము, డిగన్+త్రావి= పట్టుదలను దిగమ్రింగుకొని; ఇలకు దాఁటెన్= క్రిందకు దిగి వెళ్ళాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ఆగ్రహించి తన రథం నొగ కృపాచార్యుని రథం నొగను తాకేటట్లుగా అతి వేగంగా రథాన్ని నడిపి, చేత ఖడ్గాన్ని ధరించగా, కృతవర్మ గదను చేత పుచ్చుకొని కూడ పోరాడలేక రథం మీది నుండి క్రిందికి దిగాడు.

**వ. అక్కుంభసంభవు చందంబుగాక వంచకుండై యప్పరుసున నబ్బలు మగండు దొలంగిన నయ్యరదంబు మీఁదికి లంఘించి యా ధృష్టద్యుమ్నుండు. 249**

**ప్రతిపదార్థం:** ఆ+బలుమగండు= ఆ మేటివీరుడు(కృతవర్మ); ఆ+కుంభసంభవు చందంబు కాక= ద్రోణుడివలె ఎదిరించలేక; వంచకుండు+ఐ= కపటి అయి; ఆ+పరుసునన్= ఆ విధంగా; తొలంగినన్= తప్పించుకొనగా; ఆ ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; ఆ+అరదంబు మీఁదికిన్ లంఘించి= ఆ కృతవర్మ రథంపైకి దూకి.

**తాత్పర్యం:** కృతవర్మ ద్రోణాచార్యుడివలె ధైర్యంగా ఎదిరించలేక మోసంతో తప్పించుకొనగా, ధృష్టద్యుమ్నుడు అతడి రథంమీదికి దూకి.

**క. ఆ రథికు నచటఁ గానక । సారథి తల దునుముటయును, సంతసమునఁ బొం**
**గారి తన శబ్ద మిచ్చి మ । హారవమున నిక్క డిక్క డనియె నతండున్. 250**

**ప్రతిపదార్థం:** ఆ రథికున్+అచటన్+కానక= ఆ వీరుని (కృతవర్మను) అక్కడ కనుగొనలేక; సారథి, తల, తునుముటయును= రథసారథి తలను ఖండించగా; సంతసమునన్+పొంగారి= ఆనందంతో ఉప్పొంగి; అతండున్= ఆ కృతవర్మ; తన శబ్దము+ఇచ్చి= తన గొంతువిచ్చి; మహారవమునన్= పెద్దశబ్దంతో; ఇక్కడ+ఇక్కడ+అనియెన్= ఇక్కడ ఇక్కడ (ఉన్నానని) అన్నాడు.

**తాత్పర్యం:** కృతవర్మ కనబడకపోగా, అతడి సారథి తలను ఖండించాడు ధృష్టద్యుమ్నుడు. అంతట కృతవర్మ తన గొంతెత్తి 'నేనిక్కడ ఉన్నా' నన్నాడు.

**చ. విని కృతవర్మఁ గాంచి పటువిక్రమకేలి యొనర్ప నాత్మ వా**
**హనమున కేఁగి యేచి ద్రుపదాత్మజుఁ డాతఁడు లోను గాఁగ న**
**మ్మెనఁ గల మేటి జోదుల సముద్ధతి యేడ్తెఱ నిల్వరింప వి**
**ల్గొనెఁ బటు శౌర్య శోభితబలుం డగు నయ్యదుముఖ్యుఁ డొక్కఁడున్. 251**

**ప్రతిపదార్థం:** విని= కృతవర్మ కంఠధ్వని విని; ద్రుపద+ఆత్మజుఁడు= ధృష్టద్యుమ్నుడు; కృతవర్మన్+కాంచి= కృతవర్మను చూచి; పటు విక్రమకేలి+ఒనర్పన్= గొప్ప పరాక్రమ క్రీడ ప్రదర్శించటానికి; ఆత్మవాహనమునకున్+ఏఁగి= తన రథం మీదికి వెళ్ళి; ఏచి= విజృంభించి; అతడు లోనుకాఁగన్= కృతవర్మ మొదలుకొని; ఆ+మొనన్+కలమేటి, జోదుల= ఆ సేనలో ఉన్న మహావీరులయొక్క; సముద్ధతి= ఆటోపం; ఏడ్తెఱ= విజృంభణం; నివ్వరింపన్= ఆపగా; పటు, శౌర్య, శోభిత, బలుండు+అగు= బలమైన పరాక్రమంతో ప్రకాశించే శక్తిశాలి అయిన; ఆ+యదుముఖ్యుఁడు= యాదవులలో శ్రేష్ఠుడైన ఆ కృతవర్మ; ఒక్కఁడున్= ఒక్కడే; విల్+కొనెన్= ధనుస్సును చేపట్టాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు కృతవర్మ కేకవిని, అతనిని చూచి బలమైన పరాక్రమక్రీడ ప్రదర్శించటానికి తన రథం మీదికి వెళ్ళి విజృంభించి, కృతవర్మ మొదలైన కౌరవవీరుల ఆటోపాన్ని పూనికతో అడ్డుకోగా, శౌర్యశోభితుడైన ఆ యాదవవీరుడు కృతవర్మ ఒక్కడు మాత్రమే పోరాడాలని విల్లందుకొన్నాడు.

**వ. అట్టియెడ నొక్క రథికుండు రయంబున నిజరథంబుమీఁదికిఁ గృతవర్మం దిగిచికొని యనికిం దొలంగం గొనిపోయెఁ; బాంచాలోత్తముండును దన మునుము బలంబు గలంగం బరాక్రమించుచుండె. 252**

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= ఆ సమయంలో; ఒక్క రథికుండు= ఒక రథవీరుడు; రయంబునన్= వేగంగా; నిజరథంబు మీఁదికిన్= తన రథంపైకి; కృతవర్మన్+తిగిచికొని= కృతవర్మను లాగికొని; అనికిన్+తొలంగన్+కొనిపోయెన్= యుద్ధంనుండి దూరంగా తీసికొనివెళ్ళాడు; పాంచాల+ఉత్తముండును= ధృష్టద్యుమ్నుడుకూడా; తన మునుము బలంబు కలంగన్= తన ఎదురుగా ఉన్న సేన కలత చెందగా; పరాక్రమించుచుండెన్= యుద్ధం చేయసాగాడు.

**తాత్పర్యం:** అప్పుడు ఒక వీరుడు వేగంగా కృతవర్మను తన రథం మీదికి లాగికొని, దూరంగా తరలించుకొని పోయాడు. ధృష్టద్యుమ్నుడు శత్రుసేన కలత పొందేటట్లు తన పరాక్రమాన్ని చూపసాగాడు.

**సీ. ధర్మపుత్త్రుఁడు గురుతనయుతోఁ బెనఁగుచో । బాసటయై శినిపౌత్త్రుఁ డడరె**
**నా యిద్దఱును ద్రౌపదేయులు వెఱఁగందు । నట్లు వారలను సైన్యంబుఁ బొదివి**
**బహుళాంధకార మాపాదించి యమ్మేటి । విలుకాని సాయక వితతి నింగి**
**ఘనమయంబుగఁ బర్వ జననాథ వా రల్గి । యొక్కొక్కరుం డనేకోగ్ర బాణ**

**ఆ. నిహతుఁ జేయ, నతఁడు ప్రహసిత వదనుఁడై । యొకని నొకని బహు సముజ్జ్వలాస్త్ర**
**విద్ధుఁ జేసి కడఁగి వివ్వచ్చుకొడుకు చా । పంబు దునిమెఁ గ్రూరభల్లనిహతి. 253**

**ప్రతిపదార్థం:** జననాథ= ధృతరాష్ట్ర మహారాజా! గురుతనయుతోన్+పెనఁగుచోన్= అశ్వత్థామతో రణం చేస్తుండగా; శినిపౌత్రుఁడు= సాత్యకి; బాసట ఐ= అండగా; అడరెన్= నిలిచాడు; ఆ ఇద్దఱును= ధర్మరాజు సాత్యకియు; ద్రౌపదేయులు= ఉపపాండవులును; వెఱఁగు+అందు+అట్లు= ఆశ్చర్యపడేటట్లుగా; ఆ+మేటి విలుకాని= ఆ అశ్వత్థామయొక్క; సాయక వితతి= బాణసమూహం; వారలను సైన్యంబున్+పొదివి= వారిని, (వారి)సేనను కప్పి; బహుళ+అంధకారము+ఆపాదించి= పెనుచీకటిని క్రమ్మజేసి; నింగి ఘనమయంబుగన్+పర్వన్= ఆకాశము మబ్బులతో నిండునట్లు వ్యాపించగా; వారు+అల్గి= ఉపపాండవులు కోపించి; ఒక్కొక్కరుండు= ఒక్కొక్కడు; అనేక+ఉగ్రబాణ నిహతున్+చేయన్= పెక్కు వాడిబాణాలతో కొట్టగా; అతఁడు ప్రహసిత వదనుఁడు+ఐ= అశ్వత్థామ నవ్వుమొగంకలవాడై; ఒకనిన్+ఒకనిన్= ఒక్కొక్కరిని; బహు సముజ్జ్వల+అస్త్రవిద్ధున్+చేసి= అస్త్రాలు

నాటుకొనేటట్లు చేసి; కడఁగి= పూని; క్రూరభల్లనిహతిన్= పదునైన బల్లెములతో; విష్వచ్చుకొడుకు చాపంబున్= అర్జునుడి కుమారుడి (శ్రుతకీర్తి) ధనుస్సు; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ధర్మరాజు అశ్వత్థామతో యుద్ధం చేస్తుండగా, సాత్యకి సాయంగా వచ్చాడు. ధర్మరాజు, సాత్యకి, ఉపపాండవులు ఆశ్చర్యపడేటట్లుగా ఆ మేటి విలుకాడైన అశ్వత్థామ ప్రయోగించిన బాణసమూహం వారిని, వారి సైన్యాన్ని కప్పి, పెనుచీకటి క్రమ్ముకొనేటట్లుగ చేసి, ఆకాశం మబ్బులతో నిండినట్లుగ వ్యాపించగా, వారు (ధర్మజుడు, సాత్యకి, ఉపపాండవులు) ఆగ్రహించి, ఒక్కొక్కరు పెక్కు వాడిబాణాలతో అశ్వత్థామను కొట్టారు. అప్పుడతడు నవ్వుమొగంతో లెస్సగా మెరిసే పెక్కుబాణాలు ఒక్కొక్కరిని నాటుకొనేటట్లు వేశాడు. అంతేకాదు, పూనిక వహించి పదునైన బల్లెంతో అర్జున సుతుని (శ్రుతకీర్తి) ధనుస్సు త్రుంచాడు.

**క. ధృతి నొండు విల్లు కొని యా । శ్రుతకీర్తి దదీయ తనువు సొనిపెం బ్రదర**
**త్రితయంబుఁ గనలి యాతం । డతనిం దత్పార్శ్వచరుల నమ్ముల ముంచెన్. 254**

**ప్రతిపదార్థం:** ఆ శ్రుతకీర్తి; ధృతిన్+ఒండు విల్లుకొని= ధైర్యంతో మరొకవిల్లు గైకొని; ప్రదర త్రితయంబున్= మూడు బాణాలను; తదీయ, తనువు, చొనిపెన్= అశ్వత్థామ దేహంలో నాటాడు; అతండు= అశ్వత్థామ; కనలి= కోపించి; అతనిన్+తద్+పార్శ్వచరులన్= శ్రుతకీర్తిని అతడి ప్రక్కనున్నవారిని; అమ్ములన్ ముంచెన్= బాణాలతో ముంచాడు.

**తాత్పర్యం:** శ్రుతకీర్తి మరొకవిల్లు తీసికొని అశ్వత్థామదేహంలో మూడుబాణాలు నాటగా, అతడు కోపించి శ్రుతకీర్తిని, అతడి సహాయులను బాణాలతో ముంచాడు.

**క. ముంచు మహోద్ధతి యాలో । కించి తనదు చూడ్కి దట్ట కెం పెసఁగం గో**
**పించి శరనికరములు గు । ప్పించుచు ధర్మజుఁడు గవిసె భీషణభంగిన్. 255**

**ప్రతిపదార్థం:** ముంచు, మహా+ఉద్ధతి= (ఆ విధంగా) ముంచుతున్న (బాణాలతో కొట్టుతున్న అతడి) మహావిజృంభణాన్ని; ఆలోకించి= చూచి; ధర్మజుఁడు= ధర్మరాజు; తనదుచూడ్కి= తనచూపు; దట్టకెంపు+ఎసఁగన్+కోపించి= బాగా ఎర్రబడేటట్లు కోపించి; శరనికరములు గుప్పించుచున్= బాణాలసమూహాలు కురిపిస్తూ; భీషణభంగిన్= భయం గొల్పేటట్లుగా; కవిసెన్= తాకాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ విజృంభణాన్ని చూచిన ధర్మరాజు ఆగ్రహంతో కళ్ళు ఎర్రజేసి అతడిపై బాణసమూహం గుప్పిస్తూ భయంకరంగా ఎదుర్కొన్నాడు.

**చ. కదిసిన నమ్మహాభుజుఁడు గార్ముకముం దనుమాడి మూఁడు బె**
**ట్టిదపు మెఱుంగు తూపులఁ బటిష్ఠత సూపిన నా నృపాలుఁ డు**
**న్మదుఁ డయి మేటివింట బలుమార్గణముల్ వెస నేసె మూఁడు న**
**ర్వదియును నద్ధరామరునిపై శినివంశవరుండు దోడ్పడన్. 256**

**ప్రతిపదార్థం:** కదిసినన్= ఎదుర్కొనగా; ఆ+మహాభుజుఁడు= ఆ గొప్పబాహువులు గల అశ్వత్థామ; కార్ముకమున్+తునుము ఆడి= విల్లును త్రుంచి; మూఁడు బెట్టిదపు మెఱుంగు తూపులన్= మూడు వాడి అయిన ప్రకాశించే బాణాలతో;

పటిష్ఠత+చూపినన్= బలం ప్రదర్శించగా; ఆ నృపాలుఁడు= ఆ ధర్మరాజు; ఉన్మదుఁడు+అయి= ఆవేశం పొంది; శినివంశ, వరుండు, తోడ్పడన్= సాత్యకి సహాయపడగా; మేటివింటన్= గొప్ప ధనువునుండి; మూఁడును+అర్వదియును= అరవైమూడు; బలుమార్గణముల్= వాడిబాణాలు; ఆ+ధరా+అమరునిపైన్= ఆ బ్రాహ్మణుడిపై (అశ్వత్థామ)పై; వెసన్+ఏసెన్= శీఘ్రంగా ప్రయోగించాడు.

**తాత్పర్యం:** (ఆ విధంగా ధర్మరాజు) ఎదుర్కోగా ఆ బలశాలి అయిన అశ్వత్థామ, అతడి విల్లు త్రుంచి, మూడు వాడి మెరుగుటమ్ములతో తన బలమేమిటో చూపాడు. ఆ బాణాల దెబ్బకు ధర్మరాజు ఆగ్రహావేశపరుడై, తనకు సాత్యకి తోడుపడగా, వేరొక పెద్దవిల్లు చేపట్టి, అరవైమూడు వాడిబాణాలు అశ్వత్థామమీద వేగంగా ప్రయోగించాడు.

**వ. ఇట్లు ప్రాపై కడంగి. 257**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఇట్లా; ప్రాపు+ఐ= అండగా ఉండి; కడంగి= పూనుకొని.

**తాత్పర్యం:** సాత్యకి ఈ విధంగా తోడ్పడి.

**ఆ. అర్ధచంద్రబాణహతి గురుపుత్రుని । ధనువు శినివరుండు దునుముటయును,**
**శక్తి వైచి యతఁడు సారథిఁ గూల్చి బల్ । వింటఁ గురిసె బహుళవిశిఖ వృష్టి. 258**

**ప్రతిపదార్థం:** శినివరుండు= సాత్యకి; అర్ధచంద్రబాణహతిన్= అర్ధచంద్రాకారంగల బాణందెబ్బతో; గురుపుత్రుని ధనువు= అశ్వత్థామ ధనుస్సును; తునుముటయును= ఖండించగా; అతఁడు= అశ్వత్థామ; శక్తిన్+వైచి= బల్లెం వేసి; సారథిన్+కూల్చి= సారథిని చంపి; బహుళ విశిఖవృష్టిన్= పెక్కు బాణాలవర్షాన్ని; బల్ వింటన్+కురిసెన్= బలిష్ఠమైన ధనుస్సుతో గుప్పించాడు.

**తాత్పర్యం:** సాత్యకి అర్ధచంద్రాకారబాణంతో అశ్వత్థామ విల్లును త్రుంచగా, అశ్వత్థామ బల్లెంతో సాత్యకి సారథిని చంపి, అతడిమీద బాణవర్షం కురిపించాడు.

**క. సారథి లేమిని సాత్యకి । తే రీడ్చెఁ దురంగమములు దే రటు వాఱన్**
**భూరమణ! ధర్మనందను । వారు వొదివి రంపగముల వడి గురుతనయున్. 259**

**ప్రతిపదార్థం:** భూరమణ!= రాజా!; సారథిలేమిని= సారథి లేకపోవటంతో; తురంగమములు= గుర్రాలు; సాత్యకి తేరు+ఈడ్చెన్= సాత్యకి రథాన్ని ఈడ్చుకువెళ్ళాయి; తేరు+అటు పాఱన్= రథం అటు తొలగిపోగా; ధర్మనందనువారు= ధర్మరాజు వెంటనున్నవారు; వడిన్= వేగంగా; అంపగములన్= బాణాలగుంపులతో; గురుతనయున్= అశ్వత్థామను; పొదివిరి= తాకారు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! సారథిలేని సాత్యకి తేరును గుర్రాలు ఈడ్చుకొనివెళ్ళాయి. ధర్మరాజు పక్షంలోని వీరులు అది చూచి బాణ సమూహాలు ప్రయోగిస్తూ వెంటనే అశ్వత్థామను ఎదుర్కొన్నారు.

**క. భీమాస్త్రశిఖల నశ్వ । త్థామాగ్ని దహించె ధర్మతనయానుచర**
**స్తోమాటవి నొక వ్రేల్మిడి । నామెయి జన్మవిస్మయావహం బయ్యె నృపా! 260**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; అశ్వత్థామ+అగ్ని= అశ్వత్థామ అనే దావాగ్ని; భీమ+అస్త్ర శిఖలన్= భయంకర అస్త్రములనే జ్వాలలతో; ధర్మతనయ+అనుచరస్తోమ+అటవిన్= ధర్మజుడి అనుచరుల సముదాయమనే అడవిని; ఒక వ్రేల్మిడిన్= క్షణంలో; దహించెన్= దహించింది; ఆమెయి= ఆ తీరు; జన విస్మయ+ఆవహంబు+అయ్యెన్= చూపరులకు ఆశ్చర్యం కలిగించింది.

**తాత్పర్యం:** ఓ రాజా! అశ్వత్థామ అనే దావాగ్ని, భయంకరాస్త్రాలనే మంటలతో, ధర్మరాజు అనుచరసమూహం అనే అడవిని ఒక్క క్షణంలో దహించివేయగా అది చూపరులకు ఆశ్చర్యం కలిగించింది.

**విశేషం:** అలం: రూపకం.

**వ. అప్పడు కురురాజు పాండవుల నాచార్య నందనుచేతం దెగినవారలంగాఁ దలంచె నంతఁ దఱిమి యుధిష్ఠిరుండు ప్రచండ కాండంబుల నవ్విప్రవరుం బీడితుం జేసి. 261**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; కురురాజు= దుర్యోధనుడు; పాండవులను= పాండవులను; ఆచార్య నందనుచేతన్= అశ్వత్థామచేత; తెగినవారలన్+కాన్+తలంచెన్= చంపబడ్డవారుగా భావించాడు; అంతన్= అప్పుడు; యుధిష్ఠిరుండు= ధర్మరాజు; తఱిమి= వెంబడించి; ఆ+విప్రవరున్= ఆ బ్రాహ్మణశ్రేష్ఠుడైన అశ్వత్థామను; ప్రచండ కాండంబులన్= తీక్ష్ణమైన బాణాలతో; పీడితున్+చేసి= నొప్పించి.

**తాత్పర్యం:** అప్పుడు పాండవులు అశ్వత్థామచేత సంహరించబడ్డారని దుర్యోధనుడు సంతోషించాడు. ఇంతలోనే ధర్మరాజు అశ్వత్థామను తరుముతూ వాడిబాణాలతో నొప్పించి.

**సీ. అలవును వెరవును గలవు కృతాస్త్రుండ । వని నిన్ను నెఱుఁగుదు; నైన నెల్ల**
**సొంపు పార్షతునకుఁ జూపనోపినఁ దెల్ల । మగు; నది యట్లుండె; నరయ నీకు**
**నెయ్యంబు వాటించునేర్పు కృతజ్ఞత । యనునివి లేవు; బ్రాహ్మణుఁడు దపము**
**దమమును గల్గు వర్తనమున నుండుఁగా । కని సేయునే? యెంత యడిచిపడినఁ**

**ఆ. బడితిగాని యడ్డపడలేవు కౌరవ । కులము నెల్లభంగి గెలుతు మేము**
**నీవ చూడ' ననుడు నా వీరుఁ డేమియు । ననక నగుచుఁ బఱపె నంపవెల్లి. 262**

**ప్రతిపదార్థం:** అలవును, వెరవును, గలవు= బలం ఉపాయం నీలో ఉన్నాయి; నిన్నున్= నిన్ను; కృత+అస్త్రుండవు+అని= అస్త్రాలలో ఆరితేరినవాడవని; ఎఱుఁగుదున్= నాకు తెలుసు; ఐనన్= అయినా; ఎల్లసొంపు= నీ గొప్పతనం; పార్షతునకున్= ధృష్టద్యుమ్నుడికి; చూపన్+ఓపినన్+తెల్లము+అగున్= చూపినప్పుడే తెలుస్తుంది; అది+అట్లు+ఉండెన్= ఆ సంగతి అట్లా ఉంచుము; అరయన్= చూడగా; నీకున్; నెయ్యంబు+పాటించునేర్పు= స్నేహాన్ని పాటించే తెలివి; కృతజ్ఞత+అను+ఇవిలేవు= కృతజ్ఞతాభావం అనేవి లేవు; బ్రాహ్మణుఁడు= ద్విజుడు; తపము దమమును గల్గు వర్తనమునన్ ఉండున్+కాక= తపస్సు, సంయమనంతో కూడిన ప్రవర్తన కల్గిఉంటాడు కాని; అనిచేయునే?= యుద్ధం చేస్తాడా?; ఎంత+అడిచి పడినన్+పడితి(వి)+కాని= ఎంత మిడిసిపడినా పడ్డావుగాని; అడ్డపడలేవు= మా విజృంభణాన్ని నిలువరింపలేవు. (కౌరవులను కాచుకొనలేవు); కౌరవకులమున్= కౌరవసమూహాన్ని; నీవు+అ చూడన్= నీవే చూడగా; ఏము, ఎల్లభంగి(న్) గెలుతుము= మేము ఏ విధంగానైనా జయిస్తాము; అనుడున్= అనగా; ఆ వీరుఁడు= అశ్వత్థామ; ఏమియున్+అనక= బదులు పలుకకుండా; నగుచున్= నవ్వుతూ; అంపవెల్లిన్= బాణవర్షాన్ని; పఱపెన్= గుప్పించాడు.

**తాత్పర్యం:** 'నీవు బలం, చాతుర్యం కలవాడవని అస్త్రవిశారదుడవని నాకు తెలుసు. కాని సేనాధిపతి అయిన ధృష్టద్యుమ్నుడి ముందు నీ పరాక్రమం చూపినప్పుడే నీ గొప్పతనమంతా అందరికీ గోచరం అవుతుంది. అయినా నీలో స్నేహభావం, కృతజ్ఞత అనేవే లేవు. బ్రాహ్మణుడైనవాడు తపస్సుతో కాలం గడుపుతూ నిగ్రహవంతుడై ఉండాలి కాని, గర్వంతో యుద్ధం చేయడు. నీవు యుద్ధం చేసినా మాకు అడ్డుగా నిలువలేవు. కౌరవులను మేము గెల్చి తీరుతాం' అని ధర్మరాజు అన్న మాటలకు బదులు చెప్పకుండా అశ్వత్థామ బాణవర్షం కురిపించాడు.

**వ. ఆ వెల్లికి నోర్వలేక యా భూవిభుండు దొలంగె; ని ట్లంతటి మానిసిం గెలిచినవాఁడై నిలిచి నిజపార్శ్వంబుల మూఁకలం గనుఁగొని గురుపుత్రుండు గ్రూర విహారంబునకు నమరి మెఱసె; మారుతితోడం బోరు కర్ణుండు దదనుచరంబులగు కరూశ చేది సృంజయ పుంజంబులుం దన్నుఁబొదివిన నబ్బలంబునకు బాహుబలంబు సూపుచుండ నతని విడిచి యా భీమసేనుండు గౌరవసేనపయిం గవిసి కనుపుగొట్టె; నా రాధేయ వృకోదరుల మునుములు ధనంజయ మునుము భంగిం బ్రజాక్షయం బగుచుండె; నీ దుర్మంత్రంబున ననేకులకుం బొలియవలసె; నయ్యవసరంబున. 263**

**ప్రతిపదార్థం:** ఆ వెల్లికిన్+ఓర్వలేక= ఆ బాణప్రవాహానికి తట్టుకొనలేక; ఆ భూవిభుండు తొలంగెన్= ధర్మరాజు వెనుదిరిగాడు; ఇట్లు= ఈ విధంగా; అంతటి మానిసిన్= వీరుడైన ధర్మజుడిని; గెలిచినవాఁడు+ఐ నిలిచి= జయించి నిలిచి; గురుపుత్రుండు= అశ్వత్థామ; నిజ పార్శ్వంబుల మూఁకలన్+కనుఁగొని= తన ప్రక్కనున్న సైనికులను చూచి; క్రూరవిహారంబునకున్= ఘోరయుద్ధానికి; అమరి మెఱసెన్= సిద్ధమై ఒప్పారాడు; మారుతితోడన్+పోరు, కర్ణుండు= భీముడితో యుద్ధం చేస్తున్న కర్ణుడు; తద్+అనుచరంబులు+అగు= అతడికి సహాయులైన; కరూశ, చేది, సృంజయ, పుంజంబులున్= కరూశచేది దేశీయుల సృంజయుడి సైన్యసమూహాలు; తన్నున్+పొదివినన్= తనను చుట్టుముట్టగా; ఆ బలంబునకున్= ఆ సైన్యాలకు; బాహుబలంబు, చూపుచుండన్= తన భుజబలాన్ని చవిచూపుతూ ఉండగా; ఆ భీమసేనుండు= భీముడు; అతనిన్ విడిచి= కర్ణుడిని వదలి; కౌరవసేనపయిన్+కవిసి= కౌరవసేనను తాకి; కనుపుకొట్టెన్= క్షోభపెట్టాడు; ఆ, రాధేయ, వృకోదరుల మునుములు= కర్ణ, భీముల ముందున్న సేనలు; ధనంజయు, మునుము భంగిన్= అర్జునుడి ముందున్న సేనవలె; ప్రజాక్షయంబు+అగుచుండె= జననాశం పొందసాగింది; నీ దుర్మంత్రంబునన్= నీ కుటిలనీతివల్ల; అనేకులకున్+పొలియన్ వలసెన్= ఎందరో చావవలసి వచ్చింది; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఆ బాణప్రవాహానికి తట్టుకోలేక ధర్మరాజు ప్రక్కకు తప్పుకొన్నాడు. ఈ విధంగా ధర్మరాజంతటి వానిని గెలిచిన అశ్వత్థామ, తన ప్రక్కల ఉన్న సైన్యాలను చూచి ఘోరయుద్ధానికి సిద్ధమై నిలిచాడు. భీముడితో పోరాడుతున్న కర్ణుడు, భీముడికి సహాయంగా ఉన్న కరూశ, చేదిదేశాల సైన్యాలు, సృంజయుడి సైన్యం తన్ను చుట్టుముట్టగా, ఆ బలగాలకు తనబాహుబలం చవిచూపుతుండగా, భీముడు కర్ణుని వదలి కౌరవసైన్యం మీదికి విజృంభించి క్షోభపెట్టాడు. ఆ కర్ణుడి ముందు భీముడి ముందు ఉన్న సైన్యాలు, అర్జునుడి ముందున్న సైన్యం వలె నశించసాగింది. ధృతరాష్ట్ర మహారాజా! నీ కుటిలనీతివల్లనే ఇంత జనక్షయం.

**విశేషం:** కరూశదేశానికి దంతవక్త్రుడు, చేదిదేశానికి శిశుపాలుడు రాజులు, సృంజయుడు సువర్ణష్ఠీవి తండ్రి.

**సీ.** **కవలతోఁ బెనఁగెడు కౌరవనాథుఁ డ । న్నకులు నంగంబున నవ శరములు**
**సొనిపి యా సహదేవు కనకపు సిడము ద్రుం । చిన, వార లిరువురు నెనిమిదింటఁ**
**బది తూపులను నొంపఁ; బతి రెండు విండులుఁ । దునుమాడుటయు నన్యధనువు లెత్తి**
**యన్నయుఁ దమ్ముండుఁ దన్నుఁ బెక్కమ్ములఁ । బొదివినఁ గనలి యా భూవిభుండు**

**తే.** **వారి దివ్యాస్త్రములఁ గప్పు ఘోరభంగి । గాంచి జను లక్కుమారులు గాలవశతఁ**
**బొందుదుర కాఁ దలంప నప్పుడు గడంగి । యడ్డపడియె ధృష్టద్యుమ్నుఁ డతి రయమున.** 264

**ప్రతిపదార్థం:** కవలతోన్= నకుల సహదేవులతో; పెనఁగెడు కౌరవనాథుఁడు= పోరుతున్న దుర్యోధనుడు; ఆ+నకులు+ అంగంబునన్= ఆ నకులుడి దేహంలో; నవ శరములు చొనిపి= తొమ్మిది బాణాలు నాటి; ఆ, సహదేవు, కనకపు, సిడము, త్రుంచినన్= ఆ సహదేవుడి బంగారుధ్వజం ఖండించగా; వారలు+ఇరువురున్= నకుల సహదేవులిద్దరు; ఎనిమిదింటన్ పదితూపులను నొంపన్= వరుసగా ఎనిమిది పది బాణాలతో నొప్పించగా; పతి= దుర్యోధనుడు; రెండువిండులున్ తునుము+ ఆడుటయున్= ఇద్దరి ధనుస్సులు రెండింటిని ఖండించగా; అన్నయున్+తమ్ముండున్= నకుల సహదేవులు; అన్యధనువులు+ ఎత్తి= వేరే విల్లులు చేపట్టి; తన్నున్+పెక్కు+అమ్ములన్+పొదివినన్= తనను పెక్కు బాణాలతో ఆక్రమించగా; ఆ భూవిభుండు= కౌరవరాజు; కనలి= కోపించి; వారిన్ దివ్య+అస్త్రములన్+కప్పు= వారిద్దరిని దివ్యాస్త్రాలతో ముంచుతున్న; ఘోరభంగి కాంచి= భయంగొల్పే విధం చూచి; జనులు= చూపరులు; ఆ+కుమారులు= నకుల సహదేవులు; కాలవశతన్+పొందుదుర కాన్+తలంపన్= మృత్యువు పాలగుదు రని భావించగా; అప్పుడు= ఆ సమయంలో; కడంగి= పూనుకొని; ధృష్టద్యుమ్నుఁడు; అతి రయమునన్= కడువేగంతో; అడ్డపడియెన్= అడ్డుకొన్నాడు.

**తాత్పర్యం:** నకుల సహదేవులతో యుద్ధం చేస్తున్న దుర్యోధనుడు, నకులుడి దేహాన తొమ్మిదిబాణాలు నాటి, సహదేవుడి బంగారుధ్వజాన్ని ఖండించగా, ఆ అన్నదమ్ములిద్దరు వరుసగా ఎనిమిది, పది బాణాలతో దుర్యోధనుని నొప్పించారు. దుర్యోధనుడు ఆ యిద్దరి ధనుస్సులను ఖండించాడు. అప్పుడు ఆ యిద్దరు వేరే విల్లులు చేపట్టి అనేక బాణాలతో దుర్యోధనుని నొప్పించారు. దుర్యోధనుడు ఆగ్రహించి ఆ యిద్దరిని దివ్యాస్త్రాలతో ముంచుతున్న భయంకరపద్ధతిని చూచి, జనులంతా నకుల సహదేవులు మృత్యువాత పడ్డారని భావించారు. అప్పుడు ధృష్టద్యుమ్నుడు పూనుకొని అమితవేగంగా అడ్డుపడ్డాడు.

**వ.** **ఇట్లు పాండవ సేనాపతి భూనాథుం దాఁకి యేసిన నతండు.** 265

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పాండవ సేనాపతి= ధృష్టద్యుమ్నుడు; భూనాథున్+తాఁకి+ఏసినన్= దుర్యోధనుడిని ఎదుర్కొని బాణాలు ప్రయోగించగా; అతండు= దుర్యోధనుడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుణ్ణి ఎదుర్కొని బాణాలు వేయగా అతడు.

ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుం దాఁకి విరథునిఁ జేయుట (సం. 8-40-21)

**ఆ.** **ఇరువదేను నిశిత శరముల నొప్పింప । నలిగి యాతఁ డతని యంగకముల**
**నఱువదేను తూపు లడరింప నఱకె న । క్కౌరవేశ్వరుండు గార్ముకంబు.** 266

**ప్రతిపదార్థం:** ఇరువది+ఏను నిశిత, శరములన్, నొప్పింపన్= ఇరవై అయిదు బాణాలతో బాధించగా; ఆతఁడు= ధృష్టద్యుమ్నుడు; అలిగి= కోపించి; అతని అంగకములన్= దుర్యోధనుడి అంగాలపై; అఱువది+ఏను తూపులు+అడరింపన్= అరవై అయిదు బాణాలు వేయగా; ఆ+కౌరవ+ఈశ్వరుండు= ఆ దుర్యోధనుడు; కార్ముకంబు= అతడి ధనుస్సును; నఱకెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడిపై ఇరవైఅయిదు బాణాలు వేయగా, అతడు కోపించి బదులుగా అరవై అయిదు బాణాలు గుప్పించాడు. దుర్యోధనుడు అతడి వింటిని ఖండించాడు.

**మ. బలువి ల్లుగ్రత నెత్తి యొక్క మొగి నప్పాంచాలవర్యుండు దీ**
**ప్తులు గ్రమ్మం బదియేను మార్గణము లా భూమీశుపై నేసినం**
**గలయం బూచిన కింశుకంబు చెలు వంగం బొందఁ దచ్చాపముం**
**బెలుచం ద్రుంచి యతండు ఫాలమున గుప్పించెన్ దశోగ్రాస్త్రముల్. 267**

**ప్రతిపదార్థం:** ఆ+పాంచాలవర్యుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; బలువిల్లు+ఉగ్రతన్+ఎత్తి= బలిష్ఠమైన విల్లును భయంకరంగా ఎత్తి; దీప్తులు క్రమ్మన్= కాంతులు ప్రసరించగా, ఒక్క మొగిన్= ఒక్కసారిగా; పది+ఏను, మార్గణములు= పదునైదు బాణాలు; ఆ భూమి+ఈశుపైన్+ఏసినన్= దుర్యోధనుడిపై వేయగా; అతండు= అతడు; అంగంబు= తన శరీరం; కలయన్+పూచిన, కింశుకంబు చెలువు= నిలువెల్లా పూచిన మోదుగు అందం; ఒందన్= పొందగా; తద్+చాపమున్= ధృష్టద్యుమ్నుడి విల్లును; పెలుచన్+త్రుంచి= కోపంతో విరిచి; ఫాలమునన్= నొసటిపై; దశ+ఉగ్ర+అస్త్రముల్= పది భయంకర అస్త్రాలను; గుప్పించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు బలమైన విల్లు చేబూని దుర్యోధనుడిపై ఒక్కసారిగా పదిహేను బాణాలు గుప్పించాడు. శరీరం పూచిన మోదుగు అందాన్ని పొందగా అతడు కోపించి ధృష్టద్యుమ్నుడి ధనుస్సును ఖండించి అతడి నొసటిపై పది అస్త్రాలను ప్రయోగించాడు.

**క. కాలాయసనారాచము । లోలి నుదుట నాటి యున్న నొప్పారెం బాం**
**చాలవరు ముఖము మధుకర । మాలికచేఁ బొలుచు తమ్మి మాడ్కిం జూడన్. 268**

**ప్రతిపదార్థం:** కాల+ఆయస నారాచములు= నల్లనైన ఇనుపబాణాలు; ఓలిన్ నుదుట నాటి ఉన్నన్= వరుసగా ఫాలభాగమునందు నాటుకొనగా; పాంచాలవరుముఖము= ధృష్టద్యుమ్నుడి ముఖం; చూడన్= చూడగా; మధుకర మాలికచేన్+పొలుచు, తమ్మి, మాడ్కిన్= తుమ్మెదల వరుసతో కూడిన పద్మంవలె; ఒప్పారెన్= అందంగా ఒప్పింది.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడి నొసటిపై నాటిన నల్లని ఇనుపబాణాలతో అతడి ముఖం, తుమ్మెదల గుంపు వాలిన పద్మంవలె ఒప్పారింది.

**విశేషం:** అలం: ఉపమ.

**సీ. కనలి యవ్వీరుండు గార్ముకాంతరమునఁ । గ్రూర భల్లంబుల ఘోటకముల**
**సారథిఁ జాపంబుఁ దేరును గొడుగును । దునుమాడఁగా భవత్పుత్రుఁ డేపు**
**గుందక శక్తి నిగుడ్పఁగఁ ద్రుంచె నే । డ్తెఱఁ గృపాణము గొన నుఱుము సేసె;**
**గద యెత్తఁ బఱియలు గావించె; నుబ్బి ర । త్నమయాహి కేతువు నఱికి వైచె;**

**తే. నిట్లు హయసూత కోదండహీను దళిత । రథుని విగతాతపత్రు నిర్భగ్న శక్తి**
**ఖడ్గ ముద్గర కేతు విఖండితాపి । ధానుఁ జేసె నప్పార్షతుం డా నరేంద్రు. 269**

**ప్రతిపదార్థం:** ఆ+వీరుండు= ధృష్టద్యుమ్నుడు; కనలి= కోపించి; కార్ముక+అంతరమునన్= మరొక ధనువుతో; క్రూరభల్లంబులన్= వాడియైన బాణాలతో; ఘోటకములన్= గుర్రాలను; సారథిన్, చాపంబున్= రథసారథిని ధనుస్సును; తేరును గొడుగును= రథాన్ని, గొడుగును; తునుమాడఁగాన్= ఖండించగా; భవత్+పుత్రుఁడు= నీ కుమారుడు (దుర్యోధనుడు); ఏపు, కుందక= అతిశయం తగ్గక; ఏడ్తెఱన్= పరాక్రమంతో; శక్తి నిగుడ్చఁగన్+త్రుంచెన్= బల్లెము నెత్తగా దానిని ఖండించాడు; కృపాణము+ కొనన్= కత్తి చేబూనగా; నుఱుముచేసెన్= పొడిచేశాడు; గద ఎత్తన్+పఱియలు కావించెన్= గద తీసుకోగా దాన్ని బద్దలు చేశాడు; ఉబ్బి= ఉప్పొంగి; రత్నమయ+అహికేతువు= రత్నమయమైన సర్పధ్వజాన్ని; నఱకివైచెన్= విరిచాడు; ఇట్లు= ఇట్లా; ఆ+పార్షతుండు= ధృష్టద్యుమ్నుడు; ఆ నరేంద్రున్= దుర్యోధనుడిని; హయ, సూత, కోదండ, హీనున్= అశ్వాలు సారథి విల్లు లేనివాడిగా; దళిత రథుని= రథహీనునిగా; నిర్భగ్న, శక్తి, ఖడ్గ, ముద్గర, కేతున్= భగ్నం చేయబడిన ఈటె కత్తి ఇనుపగుదియ ధ్వజం కలవాడిగా; విఖండిత+అపిధానున్+చేసెన్= ఖండించబడిన కవచం కలవాడిగా చేశాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు కోపించి వేరొక విల్లు తీసుకొని, వాడిబాణాలతో దుర్యోధనుడి గుర్రాలను, సారథిని, ధనుస్సును, రథాన్ని, ఛత్రాన్ని ఖండించగా, నీ కుమారుడు గర్వం తగ్గక బల్లెం ఎత్తగానే దాన్ని ఖండించాడు. పరాక్రమంతో ఖడ్గాన్ని చేపట్టగా, దాన్ని పొడి చేశాడు. గదను తీసుకోగా దాన్ని బ్రద్దలు చేశాడు. పెల్లుబికి రత్నమయమైన సర్పధ్వజాన్ని నరికివేశాడు. ఈ విధంగా ఆ ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుణ్ణి రథాశ్వసూత కోదండ విహీనునిగా చేసి, అతని ఈటెను, కత్తిని, ఖడ్గాన్ని, ముద్గరాన్ని, ధ్వజాన్ని, కవచాన్ని కూడా ఖండించాడు.

**తే. వికల సాధనుఁ డైన యవ్విభుని నతని । తమ్ముఁ డగు దండధారుండు దనదు తేరి**
**మీఁద నిడుకొని శత్రు సమీప భూమి । వాయఁ గొనిపోయెఁ జూచి రాధేయుఁ డపుడు. 270**

**ప్రతిపదార్థం:** వికల సాధనుఁడు+ఐన ఆ+విభునిన్= అన్ని సాధనాలు కోల్పోయిన ఆ దుర్యోధనుని; అతని తమ్ముఁడు+ అగు దండధారుండు= అతడి సోదరుడైన దండధారుడు; తనదు తేరిమీఁదన్+ఇడుకొని= తన రథంపై చేర్చుకొని; శత్రుసమీప భూమి+పాయన్+కొనిపోయెన్= శత్రుభూమికి దూరంగా తీసికొనివెళ్ళాడు; రాధేయుఁడు= కర్ణుడు; చూచి= అది చూచి; అపుడు.

**తాత్పర్యం:** అన్ని సాధనాలూ కోల్పోయిన దుర్యోధనుని అతడి సోదరుడు తన రథంమీదికి లాగికొని యుద్ధభూమి నుంచి దూరంగా తీసికొనివెళ్ళాడు. అది చూచిన కర్ణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. శినివంశవరునితోడం । బెనఁగి పెనఁగి యతని విడిచి పెలుచ ద్రుపదనం**
**దనుని రథమునకు నెదురుగఁ । దన యరదము సనఁగ నిచ్చె ధరణీనాథా! 271**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా= ధృతరాష్ట్ర మహారాజా!; శినివంశవరునితోడన్+పెనఁగి పెనఁగి= సాత్యకితో పోరాడి పోరాడి; అతనిన్ విడిచి= అతడిని వదలి; పెలుచన్= అతిశయంతో; ద్రుపదనందనుని రథమునకున్+ఎదురుగన్= ధృష్టద్యుమ్నుడి రథానికి ఎదురుగా; తన అరదము చనఁగన్+ఇచ్చెన్= తన రథాన్ని పోనిచ్చాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! సాత్యకితో పోరాడుతున్న కర్ణుడు అతడిని విడిచి ధృష్టద్యుమ్నుడి రథానికి ఎదురుగా తన రథాన్ని పోనిచ్చాడు.

**వ. సాత్యకియును శరంబులు గురియుచుఁ దోన తవిలె; నుభయసేనాపతులగు నా సూతనందన ధృష్టద్యుమ్ను లట్లు దార్కొనిన నయ్యిరువాఁగునందు నొక్కరుండైన నోలమాసగొనక కడంగినం బోరు ఘోరంబయ్యె నట్టియెడఁ బాంచాలకుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును, జయరోచమాన సింహసేనులును, బలుదేరుల మొత్తంబులతోఁ దన్నుం గవిసినం గర్ణుం డయ్యెనమండ్రు వీరుల నెనిమిది భల్లంబులం దునిమి, తత్సహచరుల బహుసహస్ర రథికుల సమయించినం జేది రథిక ప్రవరులు జిష్ణు జిష్ణు కర్మ దేవాపిభద్రులును దండ చిత్ర చిత్రాయుధులును హరిసింహ కేతు రోచమాన శలభులును సబలంబుగాఁ దలపడిన నా పదునొక్కొండ్ర నొక్కపెట్ట బెట్టిదంపు టంపఱ పాలుచేసి మఱియును బిరుదులయి పయింబడిన దొరలను వారి పరివారంబులను వసుధం గూల్చియు నలంచియుం గలంచియుం గడిమి మెఱయుచు నిట్టిచందంబు భీష్మద్రోణులయందుఁ జూడమని జనంబులు వెక్కసపడ వివిధ సమరవిహారంబు సలిపి, వెండియు. 272**

**ప్రతిపదార్థం:** సాత్యకియును= సాత్యకికూడా; శరంబులు కురియుచున్= బాణాలు కురిపిస్తూ; తోన తవిలెన్= వెంటపడ్డాడు; ఉభయ సేనాపతులు+అగు= ఉభయపక్షాలకు సేనాధిపతులైన; ఆ సూతనందన ధృష్టద్యుమ్నులు= కర్ణ ధృష్టద్యుమ్నులు; అట్లు తార్కొనినన్= ఆ విధంగా తలపడగా; ఆ+ఇరువాఁగునందున్= ఆ రెండు పక్షాలలో; ఒక్కరుండు+ఐనన్= ఒక్కరు కూడా; ఓలము+ఆసగొనక= దేహరక్షణకు ఆశపడకుండా; కడంగినన్+పోరు ఘోరంబు+అయ్యెన్= పూనుకోగా యుద్ధం తీవ్రమైంది; అట్టిఎడన్+పాంచాలకుమారులు= అప్పుడు పాంచాల కుమారులైన; వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్ర+ఉగ్రాయుధులును= వ్యాఘ్రకేతు సుశర్మ శుక్లుడు, చిత్రుడు, ఉగ్రాయుధుడు; జయరోచమాన సింహసేనులును= జయుడు రోచమానుడు సింహసేనుడు అనేవారు; పలుతేరుల మొత్తంబులతోన్= అనేక రథ సమూహాలతో; తన్నున్+కవిసినన్= తనతో తలపడగా; కర్ణుండు+ఆ+ఎనమండ్రు వీరులన్= కర్ణుడు ఆ ఎనిమిదిమంది వీరులను; ఎనిమిది భల్లంబులన్+తునిమి= ఎనిమిది బల్లెములతో చంపి; తద్+సహచరుల బహు సహస్ర రథికులన్= వారి అనుచరులైన వేలమంది వీరులను; సమయించినన్= సంహరించగా; చేది రథిక ప్రవరులు= చేది దేశవీరులైన; జిష్ణు జిష్ణుకర్మ దేవాపి భద్రులును; దండచిత్ర చిత్రాయుధులును; హరిసింహకేతు రోచమాన శలభులును; సబలంబుగాన్+తలపడినన్= తమ సైన్యాలతో ఎదుర్కొనగా; ఆ పదునొక్కండ్రన్+ఒక్కపెట్టన్= ఆ పదకొండుమంది వీరులను ఒకేసారి; బెట్టిదంపు+అంపరపాలు చేసి= క్రూరబాణాలకు గురిచేసి; మఱియును బిరుదులయి= ఇంకా వీరులై; పయిన్+పడిన దొరలను= తనపైకి వచ్చిన రాజులను; వారి పరివారంబులను= వారి సైన్యాలను; వసుధన్+కూల్చియున్= నేలపై కూల్చియు; నలంచియున్+కలంచియున్= అలయించి కలతపెట్టియు; కడిమి మెఱయుచున్= పరాక్రమంతో ప్రకాశిస్తూ; ఇట్టి చందంబు భీష్మద్రోణులయందున్+చూడము= ఇటువంటి పరాక్రమం భీష్మద్రోణాచార్యులయందుకూడా చూడము; అని జనంబులు వెక్కస పడన్= అని జనులంతా ఆశ్చర్యపడగా; వివిధ సమర విహారంబు సలిపి= పెక్కు తీరులుగా యుద్ధం చేసి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** సాత్యకికూడా బాణాలు కురిపిస్తూ, అతడి వెంటపడ్డాడు. పాండవ కౌరవ సేనాపతులైన ధృష్టద్యుమ్న కర్ణులు తలపడగా ఇరుపక్షాలవారూ ప్రాణాలను సైతం లెక్కచేయక యుద్ధానికి పూనుకోగా పోరు తీవ్రమైంది. పాంచాలకుమారులు ఎనిమిదిమంది రథసైన్యంతో వచ్చి తనను ఎదుర్కొనగా, కర్ణుడు వారిని సంహరించాడు. వారి సహచరులు వేలమంది వీరులను కూడా అంతం చేశాడు. చేది దేశవీరులు పదకొండుమంది ఎదుర్కోగా ఆ పదకొండుమందిని వారి అనుచరులను బాణాలతో కూల్చాడు. ఇంకా వీరులైన పెక్కుమంది రాజులు, వారి సేనలు

తనపైకిరాగా అందరిని సంహరించి పరాక్రమంతో ప్రకాశించాడు. ఇంతటి పరాక్రమం భీష్మ ద్రోణుల్లో కూడ చూడలేదని జనం ఆశ్చర్యపడగా కర్ణుడు అనేకవిధాల యుద్ధవిహారం చేసి, ఇంకా.....

**సీ. సింహంబుబారిఁ జొచ్చిన గజంబుల భంగిఁ, । బులి కగ్గమైన జింకల విధమున,**
**జ్వలనంబుఁ గిట్టిన శలభంబులట్లుఁ, బాం । చాల యోధులుఁ జేది సైనికులును**
**దనుఁ దాఁకి పొలియ రాధాతనూభవుఁ । డనిఁ దనివోక ధర్మనందనుని యున్న**
**చక్కటి కడర ధృష్టద్యుమ్నుఁడును ద్రౌప । దీపుత్రులును సహదేవుఁడును శి**

**తే. ఖండియును సాత్యకియు నకులుండు జేయఁ । గల మహీశులుఁ బొదివి రక్కర్ణు; నతఁడు**
**పెక్కు పాములు వొదివినఁ బెనఁగు గరుడు । ననువు దోఁపగఁ బోరాడె మనుజనాథ! 273**

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ధృతరాష్ట్ర మహారాజా!; పాంచాలయోధులున్+చేది సైనికులును= పాంచాల చేదివీరులు; సింహంబు బారిన్, చొచ్చిన, గజంబుల, భంగిన్= సింహం బారిన పడిన ఏనుగులవలె; పులికిన్+అగ్గము+ఐన, జింకల, విధమునన్= పులి బారిన పడిన జింకలవలె; జ్వలనంబున్+కిట్టిన, శలభంబులట్లున్= అగ్నిని తాకిన మిడుతలవలె; తనున్+తాఁకి పొలియన్= తనను ఎదుర్కొని చనిపోగా; రాధాతనూభవుఁడు= కర్ణుడు; అనిన్+తనివోక= ఆ రణంతో తృప్తిచెందక; ధర్మనందనుని, ఉన్న చక్కటికిన్+అడరన్= యుద్ధంలో ధర్మరాజు ఉన్న వైపునకు వెళ్ళగా; ధృష్టద్యుమ్నుఁడును, ద్రౌపదీపుత్రులును, సహదేవుడును, శిఖండియును, సాత్యకియు, నకులుండున్; చేయన్+కల మహీశులున్= సమర్థులైన రాజులును; ఆ+కర్ణున్; పొదివిరి= ఆ కర్ణుడిని చుట్టిరి; అతఁడు; పెక్కు, పాములు, పొదివినన్= పలుసర్పాలు చుట్టుముట్టగా; పెనఁగు గరుడు+అనువు తోఁపఁగన్= పోరాడు గరుడుడివలె; పోరాడెన్= పోరు సలిపాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! పాంచాలయోధులు, చేది సైనికులు కర్ణుని ఎదిరించి, సింహంబారిన పడిన ఏనుగులవలె, పులికి చిక్కిన జింకలవలె, నిప్పును తాకిన మిడుతలవలె నశించారు. అయినా కర్ణుడు యుద్ధంలో తృప్తినొందక, ధర్మరాజు ఉన్న చోటికి వెళ్ళగా - ధృష్టద్యుమ్నుడు, ఉపపాండవులు, సహదేవుడు, శిఖండి, సాత్యకి, నకులుడు, సమర్థులైన రాజులు అతడిని ఎదుర్కొన్నారు. పెక్కుపాములు చుట్టుముట్టగా పోరాడే గరుడునివలె వారితో కర్ణుడు పోరాడాడు.

**విశేషం:** అలం: మాలోపమ.

**వ. ఆ సమయంబున భీమసేను బారింబడిన కౌరవసైన్యంబునం బ్రబల చతురంగంబు లొక్కమొగిన్ బడలువడి రణాంగణంబు మూసికొనియెం; బెఱమూఁకలు వెఱఁగునం జెయ్వేది కర ళ్ళడంగిన మున్నీటియ ట్లుండె గాండీవి సంశప్తకుల ననేకుల మేటిమగల గీటడంచి హతశేషంబగు బలంబు విచ్చుటయు, వాసుదేవు నాలోకించి. 274**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; భీమసేనుబారిన్+పడిన= భీముడిబారిని పడిన; కౌరవసైన్యంబునన్= కౌరవసేనలో; ప్రబల చతురంగంబులు= బలమైన రథ గజ తురగ పదాతులు; ఒక్కమొగిన్ బడలువడి= ఒకేసారి అలసిపోయి; రణ+అంగణంబు మూసికొనియెన్= రణభూమినుండి తొలగారు; పెఱమూఁకలు= ఇతర సైన్యాలు; వెఱఁగునన్+చెయ్వు+ఏది= భయంతో చేష్టలుడిగి; కరళ్ళు+అడంగిన, మున్నీటిఅట్లు+ఉండెన్= అలలు అణగిన సముద్రంవలె గోచరించాయి; గాండీవి= అర్జునుడు;

సంశప్తకులను+అనేకుల మేటిమగలన్= త్రిగర్త వీరులను అనేక యోధులను; గీటడంచి= సంహరించి; హతశేషంబు+అగు బలంబు విచ్చుటయున్= చావగా మిగిలిన సేన చెల్లాచెదరు కాగా; వాసుదేవునిన్+ఆలోకించి= శ్రీకృష్ణుడిని చూచి.

**తాత్పర్యం:** అప్పుడు, భీముడు తలపడగా కౌరవసేనలోని రథ, గజ, తురగ, పదాతులు అలసి రణభూమినుండి ఒక్కసారిగ వైదొలగాయి. ఇతర సైన్యాలు భయంతో చేష్టలుడిగి, నిశ్చలమైన సముద్రంవలె ఒప్పాయి. అర్జునుడు వీరులైన త్రిగర్త యోధులననేకుల సంహరించి, మిగిలిన వీరులు చెల్లాచెదరు కాగా, కృష్ణుడిని చూచి.

**విశేషం:** అలం: ఉపమ. అలలు అణగిన సముద్రంవలె విస్తారమైన సైన్యం స్తంభించిపోయింది.

**ఆ. అమరులకు నజయ్యు లగునట్టి సంశప్త । కులు మదీయ బాణ ఘోర భంగి**
**కోహటించి పాఱుచున్నారు; భీముని । మునుము కౌరవులును మొనయ లేరు. 275**

**ప్రతిపదార్థం:** అమరులకును+అజయ్యులు+అగునట్టి సంశప్తకులు= దేవతలు కూడా జయించలేని త్రిగర్త దేశీయులు; మదీయ బాణ ఘోరభంగికిన్+ఓహటించి= నా బాణాల తాకిడికి భయపడి; పాఱుచున్నారు= పారిపోతున్నారు; భీముని మునుము= భీముడి సేనను; కౌరవులును మొనయలేరు= కౌరవులు ఎదుర్కొనజాలరు.

**తాత్పర్యం:** దేవతలకు కూడ జయింప సాధ్యంకాని సంశప్తకులు, నా బాణాల ధాటికి నిలువలేక పారిపోతున్నారు. కౌరవులు కూడా భీముడి సేనను ఎదుర్కొనలేరు.

**క. కర్ణుం డొక్కరుఁడును సము । దీర్ణుండై సిడము మెఱయఁ దిరిగి బలువిడిన్**
**ఘూర్ణితము సేసె మనసై । న్యార్ణవమున మంథనగము నను వమరంగన్. 276**

**ప్రతిపదార్థం:** కర్ణుండు+ఒక్కరుఁడును= కర్ణుడు ఒక్కడు; సముదీర్ణుండు+ఐ= మిక్కిలి అధికుడై; సిడము మెఱయన్= ధ్వజం ప్రకాశించగా; మన సైన్య+అర్ణవమునన్= మన సైన్య మనెడి సముద్రంలో; మంథనగము+అనువు+అమరంగన్= మంథర పర్వతంవలె ఒప్పగా; బలువిడిన్ తిరిగి= పరాక్రమంతో తిరిగి; ఘూర్ణితము చేసెన్= కలచివేశాడు.

**తాత్పర్యం:** కర్ణుడు ఒక్కడు మిక్కలి అధికుడై తన ధ్వజం ప్రకాశిస్తుండగా మన సైన్యసముద్రంలో మంథర పర్వతం వలె విహరించి కలతపెట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. 'అరదము పోవనిమ్ము రయ మారఁగ నాతని దిక్కు' నావుడున్**
**దరహసితంబుతో నలిననాభుఁడు భీమునిచేతఁ బోదు నీ**
**శరముల వేఁడిఁ గౌరవుల సంగరవాంఛ యడంపు మన్న న**
**న్నరుఁడును నియ్యకొన్నఁ గురునాథుని యోధులు బెగ్గడిల్లఁగన్. 277**

**ప్రతిపదార్థం:** అరదము= రథం; రయమారఁగన్= త్వరగా; ఆతని దిక్కు= కర్ణుడివైపు; పోవనిమ్ము= పోనిమ్ము; నావుడున్= అని అనగా; నలిననాభుఁడు= కృష్ణుడు; దరహసితంబుతోన్= చిరునవ్వుతో; కౌరవుల సంగరవాంఛ= కౌరవుల యుద్ధవాంఛ;

భీముని చేతన్+పోదు= భీముడిచేత పోదు; నీ శరములవేడిన్= నీబాణాల తాపంతో; అడంపుము+అన్నన్= అణచుము అని అనగా; ఆ+నరుఁడునున్= అర్జునుడుకూడా; ఇయ్యకొన్నన్= దానికి అంగీకరించగా; కురునాథుని, యోధులు, బెగ్గడిల్లఁగన్= దుర్యోధనుడి సైన్యంలోని వీరులు భయపడగా.

**తాత్పర్యం:** 'ఆ కర్ణుడివైపు రథాన్ని త్వరగా పోనిమ్ము' అని అర్జునుడనగా, 'కౌరవుల యుద్ధవాంఛ నీ బాణాల తాపం చేత తప్ప భీముడిచేత తీరేది కాదు' అని కృష్ణుడు చిరునవ్వుతో అన్నాడు. దానికి అర్జునుడు సరే అనగా కౌరవసైన్యం భయపడేటట్లుగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అమ్మురారి ధవళ హయములు మెఱయ న । ద్దిక్కు సత్వరముగఁ దేరు పోవ**
**నిచ్చుటయును జూచి విచ్చె నబ్బలము సిం । గంబుఁ గనిన లేడిగమియుఁ బోలె. 278**

**ప్రతిపదార్థం:** ఆ+మురారి= ఆ శ్రీకృష్ణుడు; ధవళ హయములు మెఱయన్= తెల్లగుర్రాలు ప్రకాశించగా; ఆ+దిక్కు= కౌరవసేనవైపు; సత్వరముగన్+తేరుపోవనిచ్చుటయును= తేరును వేగంగా పోనివ్వగా; చూచి; సింగంబున్+కనిన లేడిగమియున్+పోలెన్= సింహాన్ని చూచిన లేళ్ళగుంపువలె; ఆ+బలము= ఆ సైన్యం; విచ్చెన్= చెదరిపోయింది.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు రథాన్ని కౌరవసేనవైపు మళ్ళించగా, సింహాన్ని చూచి బెదరిన లేళ్ళగుంపువలె ఆ సైన్యం చెల్లాచెదరైంది.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అప్పుడు నీ కొడుకు సంశప్తకులం బురికొల్పిన రెండు వేల రథంబులును మున్నూ ఱేనుంగులును జతుర్దశ సహస్ర తురంగంబులును లక్ష ద్వయ పదాతులును నప్పార్థుపయిం గవిసిన, నతండు శింజినీ టంకారంబునం బటు శరాసారంబున నింగి నించి పదివేవు రుద్భటక్షత్రియులం బొలియించి, యక్కెలనం గాంభోజ బలంబు దోఁచిన నం దుఱికి తదీయ సైనికుల కరంబులు శిరంబులు నఱికిన, నది మహావాతనిహతవిటపంబైన యారామంబు చందం బయ్యె; నట్టియెడ. 279**

**ప్రతిపదార్థం:** అప్పుడు; నీ కొడుకు= దుర్యోధనుడు; సంశప్తకులన్+పురికొల్పినన్= త్రిగర్తదేశీయులను ప్రేరేపించగా; రెండువేల రథంబులును; మున్నూఱు+ఏనుంగులును= మూడువందల గజాలు; చతుర్దశ సహస్ర తురంగంబులును= పద్నాలుగువేల గుర్రాలు; లక్షద్వయ పదాతులును= రెండులక్షల కాల్బలం; ఆ+పార్థుపయిన్+కవిసినన్= ఆ అర్జునుడిపై బడగా; అతండు= అర్జునుడు; శింజినీటంకారంబునన్= అల్లెత్రాటి ధ్వనితో; పటుశర+ఆసారంబునన్= బలమైన బాణాల జడివానతో; నింగి నించి= గగనభాగాన్ని నింపి; పదివేవురు+ఉద్భట క్షత్రియులన్+పొలియించి= పదివేలమంది క్షత్రియవీరులను చంపి; ఆ+కెలనన్= ఆ ప్రక్కన; కాంభోజ బలంబు తోఁచినన్= కాంభోజసైన్యం కనబడగా; అందున్+ఉఱికి= అందులో ప్రవేశించి; తదీయ, సైనికుల, కరంబులు, శిరంబులు నఱికినన్= ఆ సైనికుల చేతులు, తలలు నరకగా; అది, మహావాత, నిహత= అది పెనుగాలికి కూలిన; విటపంబు+ఐన ఆరామంబు చందంబు+అయ్యెను= కొమ్మలుగల తోటవలె ఒప్పింది.

**తాత్పర్యం:** అప్పుడు దుర్యోధనుడు త్రిగర్తవీరులను పురికొల్పగా అసంఖ్యాకమైన రథ గజ తురగ పదాతులతో అర్జునుడిపై బడగా అతడు బాణవర్షంతో వేలమంది క్షత్రియులను సంహరించి కాంభోజసైన్యంలోనికి చొచ్చి ఆ

సైనికుల చేతులు, తలలు నరికాడు. గాలివానకు కూలిన కొమ్మలతో ఉద్యానవనంవలె ఆ ప్రదేశం ఒప్పారింది. ఆ సమయంలో.

**విశేషం:** అలం: ఉపమ.

**క. అడరి సుదక్షిణు తమ్ముఁడు । గడువడి నేయుటయు, నతని కరశాఖలు గ**
**వ్వడి యర్ధచంద్రశరముల । వెడంద తూపున శిరంబు వ్రేల్మిడిఁ ద్రుంచెన్. 280**

**ప్రతిపదార్థం:** సుదక్షిణుతమ్ముఁడు= (కాంభోజరాజు) సుదక్షిణుడి సోదరుడు; అడరి= విజృంభించి; కడువడిన్+ఏయుటయున్= తీవ్రవేగంతో బాణాలు వేయగా; కవ్వడి= అర్జునుడు; అర్ధచంద్రశరములన్= అర్ధచంద్రాకారంగల బాణాలతో; అతని కరశాఖలు= కొమ్మలవంటి అతడి చేతులు; వెడందతూపునన్= విశాలబాణంతో; వ్రేల్మిడిన్= క్షణంలో; శిరంబు త్రుంచెన్= శిరస్సును ఖండించాడు.

**తాత్పర్యం:** సుదక్షిణుడి సోదరుడు అర్జునుడిపై వడిగా బాణాలు వేయగా, అర్జునుడు అతడి చేతులను, అర్ధచంద్రాకార బాణాలతో, శిరస్సును విశాలమైన బాణంతో క్షణంలో ఖండించాడు.

**క. యవన శక సైన్యములు పైఁ గవిసినఁ దద్రుధిర జలము గాలువలై పా**
**ఱ వెసం బఱపెను వివిధా । స్త్ర వితానము ల క్కిరీటి ధరణీనాథా! 281**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా!; యవన శక సైన్యములు; పైన్+కవిసినన్= పైబడగా; ఆ+కిరీటి= ఆ అర్జునుడు; తద్+ రుధిరజలము కాలువలై పాఱన్= వారి రక్తం కాలువలై ప్రవహించగా; వివిధ+అస్త్రవితానములు= పెక్కు అస్త్రాల సమూహాలు; వెసన్+పఱపెను= వెంటనే ప్రయోగించాడు.

**తాత్పర్యం:** యవన శకసైన్యాలు అర్జునుడిపై వచ్చి పడగా, అతడు వివిధఅస్త్రాలు ప్రయోగించి, వారి రక్తం అనే నీటిని కాలువలై పారేటట్లు చేశాడు.

**మ. కని సంశప్తకు లేచి యొక్క మొగి నా కౌంతేయునిం జుట్టుము**
**ట్టిన సేనాంగ చతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసె నా**
**తని బాణోత్కర వేగ ముత్కట మరుత్సంక్రీడ జీమూత పా**
**టనముం జేసిన భంగిఁ జిత్రబల గాఢస్ఫూర్తి శోభిల్లఁగన్. 282**

**ప్రతిపదార్థం:** కని= అది చూచి; సంశప్తకులు+ఏచి= త్రిగర్తీయులు విజృంభించి; ఒక్కమొగిన్= ఒక్కసారిగా; ఆ కౌంతేయునిన్+ చుట్టుముట్టినన్= ఆ అర్జునుడిని చుట్టుముట్టగా; ఉత్కట మరుత్+సంక్రీడ= తీవ్రమారుత క్రీడ; జీమూత పాటనమున్+ చేసిన భంగిన్= మేఘాలను చెదరగొట్టినవిధంగా; చిత్రబలగాఢ స్ఫూర్తిశోభిల్లఁగన్= అచ్చెరువు గొల్పే బలపరాక్రమం ప్రకాశించగా; ఆతని బాణ+ఉత్కరవేగము= అర్జునుడి బాణాలవేగం; సేనా+అంగ చతుష్టయ+అంగములు= సేనాంగాలైన నాలుగు విభాగాలను (రథ, గజ, తురగ, పదాతి విభాగాలను); ఖండీభూతముల్ చేసెన్= ఖండాలుగా చేశాడు.

**తాత్పర్యం:** సంశప్తకులు ఒక్కుమ్మడిగా అర్జునుడిని చుట్టుముట్టగా, అతడు పెనుగాలి మేఘాలను చెదరగొట్టినట్లు బాణవేగంతో వారి చతురంగబలాలను ఖండఖండములు కావించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. హరి వెరవున ధవళాశ్వ । స్ఫురణమున రథంబు మెఱయఁ బొలుపారెడు న**
**న్నరు నత్యద్భుత విక్రమ । పరిణతి సూడఁ గనుదోయి పదివేల్ వలయున్. 283**

**ప్రతిపదార్థం:** హరి= కృష్ణుడు; వెరవునన్= నేర్పుతో; ధవళ+అశ్వ స్ఫురణమునన్= తెల్లనిగుర్రాల కాంతితో; రథంబు మెఱయన్= రథం ప్రకాశించగా; పొలుపారెడు= ఒప్పుతున్న; ఆ+నరు+అతి+అద్భుత విక్రమ పరిణతి= ఆ పార్థుడి అద్భుత పరాక్రమం; చూడన్= చూడటానికి; కనుదోయి= కన్నుల జంటలు; పదివేల్= పదివేలు; వలయున్= కావాలి.

**తాత్పర్యం:** కృష్ణుడు చాతుర్యంతో ధవళాశ్వాలు పూన్చిన రథం మెరయించగా, ప్రకాశించే పార్థుడి అద్భుత పరాక్రమాలు చూడటానికి పదివేల కనులజంటలు కావాలి.

**క. నను బోఁటుల మనములు మె । చ్చునఁ గరఁగె ననంగ నేల? సురతతి గృష్ణా**
**ర్జునులం గని దుందుభి ని । స్వనములతోఁ గురిసె విరుల వాన వొగడుచున్. 284**

**ప్రతిపదార్థం:** సురతతి= దేవతాసమూహం; కృష్ణ+అర్జునులన్+కని= కృష్ణార్జునులను చూచి; పొగడుచున్= పొగడుతూ; దుందుభి నిస్వనములతోన్= జయభేరి ధ్వనులతో; విరుల వాన కురిసెన్= పూలవాన కురిసింది; ననుబోఁటుల= నాబోటివారి; మనములు= మనసులు; మెచ్చునన్= ప్రశంసతో; కరఁగెన్+అనంగన్+ఏల?= కరిగిపోయాయి అని చెప్పటమెందుకు?

**తాత్పర్యం:** కృష్ణార్జునులను చూచి దేవతలు పొగడుతూ జయభేరి ధ్వనుల మధ్య పూలవాన కురిపించారంటే ఇక నాబోటి వారి మనసులు ప్రశంసలతో కరిగాయని వేరే చెప్పటం ఎందుకు?

**విశేషం:** అలం: కావ్యార్థాపత్తి.

**వ. అ య్యవసరంబున నాకసంబున నశరీరవాణి యయ్యిరువుర నుద్దేశించి యఖిల జనంబులు నాకర్ణింప వీరు చంద్రార్కులం గడచిన కాంతిదీప్తుల నుల్లసిల్లెదరు; తొల్లి యేక రథస్థు లైన బ్రహ్మేశానుల విధంబున వెలింగెదరు గంటిరే! వీరలు పరమ మునులగు నారాయణుండును నరుండునుజుండీ యనియె; నిట్లు మహనీయాశ్చర్యంబులు గనియును వినియును మాత్సర్యధుర్యుం డగునాచార్యనందనుం డరిగి యమ్మహాత్ముల మార్కొని మార్గణోజ్జ్వలం బగు దక్షిణ కరంబున నా ఫల్గునుఁ బిలిచి హాసభాసిత ముఖుండగుచుఁ గుపితుండగు నతని కిట్లనియె. 285**

**ప్రతిపదార్థం:** ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; ఆకసంబునన్+అశరీరవాణి= ఆకాశమునందు అశరీరవాణి; ఆ+ఇరువురన్+ఉద్దేశించి= కృష్ణార్జునుల గురించి; అఖిలజనంబులున్+ఆకర్ణింపన్= సకలజనులు వినేటట్లుగా; వీరు= ఈ ఇద్దరు; చంద్ర+అర్కులన్+కడచిన= చంద్రసూర్యులను మించిన; కాంతిదీప్తులన్+ఉల్లసిల్లెదరు= కాంతులతో ప్రకాశిస్తారు; తొల్లి ఏకరథస్థులు+ఐన= పూర్వం ఒకే రథంపై ఉన్న; బ్రహ్మ+ఈశానుల విధంబునన్, వెలింగెదరు= బ్రహ్మమహేశ్వరులవలె ప్రకాశిస్తారు; కంటిరే!= చూశారా!; వీరలు= వీరిద్దరు; పరమమునులు+అగు= పరమమునులైన; నారాయణుండును నరుండును చుండీ+అనియెన్= నరనారాయణులు సుమా అన్నది; ఇట్లు= ఇట్లా; మహనీయ+ఆశ్చర్యంబులు కనియును వినియును= గొప్ప వింతలు చూస్తూ వింటూ కూడా; మాత్సర్య ధుర్యుండు+అగు+ఆచార్యనందనుండు= మత్సర భావాన్ని వహిస్తున్న అశ్వత్థామ;

అరిగి+ఆ, మహాత్ములన్ మార్కొని= ముందుకు వెళ్ళి వారిని ఎదుర్కొని; మార్గణ+ఉజ్జ్వలంబు+అగు దక్షిణ కరంబునన్= శరాలతో ప్రకాశిస్తున్న కుడిచేతితో; ఆ ఫల్గునున్+పిలిచి= ఆ అర్జునుడిని పిలిచి; హాసభాసితముఖుండు+అగుచున్= చిరునవ్వుచేత వెలిగిన ముఖం కలవాడై; కుపితుండు+అగు+అతనికిన్+ఇట్లు+అనియెన్= క్రోధంతో ఉన్న అతడితో ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** అప్పుడు ఆకాశంలోని అశరీరవాణి కృష్ణార్జునులిద్దరు చంద్రసూర్యులను మించిన కాంతి గలవారని, పూర్వం ఏకరథస్థులైన బ్రహ్మ రుద్రులని, పరమమునులైన నర నారాయణులని అందరూ వినేటట్లుగా వచించింది. ఆ వింతలు చూచి, మాటలు విని కూడా మాత్సర్యగ్రస్తుడైన అశ్వత్థామ వారి ముందుకు వెళ్ళి, బాణంతో శోభించే కుడిచేయినెత్తి, అర్జునుడిని పిలిచి ఇట్లా అన్నాడు:

### అశ్వత్థామ యర్జునుం బేర్కొని మార్కొని సంగ్రామంబు సేయుట (సం. 8-40-110)

**క. ననుఁ దగియెడు నతిథింగా । మనంబునఁ దలంచి నీవు మన్నించెదవే**
**నిని వచ్చెద నీ పాలికి । ననఘా! సంగ్రామ మొసఁగు మాతిథ్యముగన్. 286**

**ప్రతిపదార్థం:** అనఘా!= పుణ్యాత్ముడా!; ననున్+తగియెడు+అతిథిన్+కాన్= నన్ను తగిన అతిథినిగా; నీవు; మనంబునన్ తలంచి= మనసులో భావించి; మన్నించెదవేనిని= గౌరవిస్తే కనుక; నీ పాలికిన్= నీవద్దకు; వచ్చెదన్= వస్తాను; ఆతిథ్యముగన్= నాకు అతిథ్యంగా; సంగ్రామము+ఒసఁగుము= యుద్ధాన్ని ఇమ్ము.

**తాత్పర్యం:** నన్ను అతిథినిగా భావించి గౌరవిస్తే నీ దగ్గరకు రాగలను. నాకు యుద్ధాన్ని ఆతిథ్యంగా ఇమ్ము.

**ఆ. అనినఁ గృష్ణుఁ జూచి యర్జునుఁ డాచార్య । తనయు గెలువ కునికి దైన్య మిపుడు**
**సమయఁ జూడవలయు సంశప్తకులను నీ । మనసు వచ్చు పనికిఁ బనుపు మనుడు. 287**

**ప్రతిపదార్థం:** అనినన్+కృష్ణున్+చూచి= (అశ్వత్థామ) అనగా కృష్ణుడిని చూచి; అర్జునుఁడు= పార్థుడు; ఆచార్య తనయు గెలువకునికి= అశ్వత్థామను జయించకపోవటం; దైన్యము= దీనత్వం; ఇపుడు; సంశప్తకులను సమయన్+చూడవలయున్= సంశప్తకులను సంహరించవలసిఉన్నది; నీ మనసువచ్చు పనికిన్+పనుపుము+అనుడున్= నీకు నచ్చినపనికి నన్ను ఆజ్ఞాపించుము అనగా.

**తాత్పర్యం:** అశ్వత్థామ మాటలకు అర్జునుడు కృష్ణుడిని చూచి ఇట్లా అన్నాడు: 'అశ్వత్థామతో పోరి యుద్ధం చేయకపోవటం అగౌరవం, కాని సంశప్తకులను కూడా అంతం చేయవలసి ఉన్నది, నీ ఇష్టమైన పనికి నన్ను ఆజ్ఞాపించుము.

**ఉ. తేరు మురారి ద్రోణసుతుదిక్కునకుం జననిచ్చి 'మేలు మేల్**
**పోరు ఋణంబు దీర్చు కురుభూపతికిన్; నరబాహులీలకు**
**స్సైరణ గల్గి నిల్వు' మనినన్ విని 'యట్టుల కాక' యంచు న**
**వ్వీరుఁడు షష్టిబాణముల వెన్నుని నేసె నుదగ్రుఁడై వెసన్. 288**

**ప్రతిపదార్థం:** మురారి= కృష్ణుడు; తేరు= రథాన్ని; ద్రోణుసుతు, దిక్కునకున్= అశ్వత్థామవైపునకు; చనన్+ఇచ్చి= వెళ్ళనిచ్చి; మేలు మేల్= సెబాసు; కురుభూపతికిన్= దుర్యోధనుడికి; పోరు= నీవు చేసే పోరాటం; ఋణంబు తీర్చు= రుణంతీరుస్తుంది; నరబాహులీలకున్= అర్జునుడి బాహుబలానికి; సైరణగల్గి నిల్వుము+అనినన్= సహించి నిలువుము అనగా; ఆ+వీరుఁడు= అశ్వత్థామ; అట్టులు కాక అంచున్= అల్లే అగునని అంటూ; ఉదగ్రుఁడు+ఐ= భయంకరరూపుడై; వెసన్= వెంటనే; షష్టిబాణములన్= అరవైబాణాలు; వెన్నునిన్+ఏసెన్= కృష్ణుడిపై ప్రయోగించాడు.

**తాత్పర్యం:** కృష్ణుడు అశ్వత్థామవైపు రథాన్ని మరలించి మేలు! మేలు! 'దుర్యోధనుడి రుణం తీరేటట్లుగా పోరు సలుపుము. అర్జునుడి తాకిడికి తట్టుకొని నిలబడుము' అనగా అతడు సరే అంటూ తత్క్షణమే కృష్ణుడిపై అరవై బాణాలు వేశాడు.

**ఉ.** **అమ్ములు మూఁడు పార్థుతను వాడఁగ నేసినఁ ద్రుంచివైచెఁ జా**
**ప మ్మతఁ డమ్మహాద్విజుఁడు భారవహమ్మగు నొండు విల్లు శీ**
**ఘ్రమ్మున నెత్తి చేతులను గాళ్ళను మోమున వింటి కొమ్మునం**
**గ్రమ్మిన భంగిగా శితశరప్రతతుల్ నిగిడించెఁ బైపయిన్.** **289**

**ప్రతిపదార్థం:** అమ్ములు మూఁడు= మూడుబాణాలు; పార్థుతనువు+అడఁగన్+ఏసినన్= అర్జునుడి శరీరం చలించేటట్లు నాటగా; అతఁడు= అర్జునుడు; చాపమ్ము= విల్లును; త్రుంచివైచెన్= ఖండించాడు; ఆ+మహాద్విజుఁడు= అశ్వత్థామ; భారవహమ్ము+అగు= బరువైన; ఒండువిల్లు= మరొకవిల్లు; శీఘ్రమ్మునన్+ఎత్తి= వెంటనే పైకి ఎత్తి; చేతులను కాళ్ళను= చేతులందు, కాళ్ళయందు; మోమునన్= ముఖంలో; వింటికొమ్మునన్+క్రమ్మిన భంగిగాన్= విల్లుకొనపై క్రమ్మేవిధంగా; శితశర ప్రతతుల్= వాడిఅయిన బాణసమూహాలను; పై పయిన్ నిగిడించెన్= వెంట వెంటనే వేశాడు.

**తాత్పర్యం:** మూడుబాణాలు అర్జునుడిపై వేయగా అతడు అశ్వత్థామ ధనుస్సును త్రుంచివేశాడు. అశ్వత్థామ మరొక బలమైన విల్లును వెంటనే గైకొని అర్జునుడి చేతులమీద, కాళ్ళమీద, ముఖంమీద, వింటికొన మీద వెంట వెంట వాడిబాణసమూహాలు వేశాడు.

**క.** **కడుఁ బెక్కు వేలు దూపుల । వడిఁ గృష్ణార్జునుల సరథవాహంబుగ నె**
**క్కుడు మదమునఁ బొదివినఁ జె । య్యెడలి వెఱఁగుపడిరి వార లిద్దఱు నధిపా!** **290**

**ప్రతిపదార్థం:** అధిపా!= ధృతరాష్ట్ర మహారాజా!; కడున్+పెక్కువేలుతూపులన్= పెక్కువేల బాణాలతో; వడిన్= వేగంగా; కృష్ణ+అర్జునులన్= కృష్ణార్జునులను; సరథవాహంబుగన్= రథ అశ్వములతో సహా; ఎక్కువ మదమునన్+పొదివినన్= అధిక అతిశయంతో క్రమ్మగా; వారలు+ఇద్దఱున్= ఆ కృష్ణార్జునులు ఇద్దరూ; చెయ్యు+ఎడలి= చేష్టలుడిగి; వెఱఁగుపడిరి= దిగ్భ్రాంతి చెందారు.

**తాత్పర్యం:** రాజా! అశ్వత్థామ కృష్ణార్జునులను వారి రథాశ్వాలను వేలబాణాలతో కప్పివేయగా వారు నిశ్చేష్టులయ్యారు.

**వ.** **ఇ వ్విధంబున వివిధ విశిఖ జాలంబులఁ గాలు సేయార్వరాకుండఁ గప్పి యార్చిన, నప్పార్థుం డతనిచేతఁ దనవిక్రమంబు ప్రతిహతంబయ్యె నని తలంపఁ దత్సైన్యంబున హాహాకారంబు లెసంగం జారణ సిద్ధగణంబు**

**లట్లు నిశ్చేష్టితు లైన యాలోకరక్షకుల నాలోకించి 'లోకంబులకు బ్రదుకు గలుగునో' యని పలుక నప్పద్మనాభుండు గనలి య క్కవ్వడి నుద్దేశించి. 291**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; వివిధ విశిఖ జాలంబులన్= పెక్కుబాణ సమూహాలతో; కాలుచేయి+ ఆర్పరాకుండన్= కాళ్ళుచేతులు కదలనివ్వకుండా; కప్పి+ఆర్చినన్= కప్పి అరువగా; ఆ+పార్థుండు= అర్జునుడు; అతనిచేతన్= అశ్వత్థామచేత; తన విక్రమంబు ప్రతిహతంబు+అయ్యెన్+అని= తన పరాక్రమం దెబ్బతిన్నదని; తలంపన్= భావించగా; తద్+సైన్యంబునన్= పాండవసైన్యంలో; హాహాకారంబులు+ఎసంగన్= హాహాకారాలు వ్యాపించగా; చారణ సిద్ధ గణంబులు= ఆకాశంలో చరించే చారణులు దేవతాజాతికి చెందిన సిద్ధులు; అట్లు నిశ్చేష్టితులు+ఐన= ఆ విధంగా చేష్టారహితులైన; ఆ లోకరక్షకులను+ఆలోకించి= ఆ లోకాలకు రక్షకుడవైన నర నారాయణులను చూచి; లోకంబులకు, బ్రదుకు, గలుగునో, అని, పలుకన్= లోకాలకు రక్షణ ఉన్నదా అని సందేహంతో అనగా; ఆ+పద్మనాభుండు కనలి= కృష్ణుడు కోపించి; ఆ+కవ్వడిన్+ఉద్దేశించి= అర్జునుడిని చూచి.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఆ విధంగా కృష్ణార్జునులను కదలనివ్వకుండా బాణాలతో కప్పి, ఆనందంతో అరువగా అర్జునుడు అతడిముందు తన పరాక్రమం మొక్కవోయిందని బాధపడగా, పాండవసైనికులు హాహాకారాలు చేశారు. ఆకాశంలోని సిద్ధచారణులు లోకరక్షకులైన ఆ కృష్ణార్జునులను చూచి, ఇక లోకాలకు రక్షణ లేదని తలచారు. అప్పుడు కృష్ణుడు కోపంతో అర్జునుడిని చూచి.

**క. 'గురుసుతుఁడు నిన్ను మిగులుట । గర మాశ్చర్యంబు! ముష్టి గాండీవము దాఁ**
**దిరమయి యుండదొ? బాహుల । వెరవు బలుపు గుందెనో? వివేకింపు మెడన్. 292**

**ప్రతిపదార్థం:** గురుసుతుఁడు, నిన్ను, మిగులుట= అశ్వత్థామ నిన్ను మించిపోవటం; కరము+ఆశ్చర్యంబు!= చాలా ఆశ్చర్యం; ముష్టిన్, గాండీవము, తాన్+తిరము+అయి ఉండదొ?= పిడికిలిలో; గాండీవం స్థిరంగా లేదా?; బాహుల వెరవు బలుపు కుందెనో?= నీ భుజాల ఉపాయమూ బలమూ తగ్గిపోయాయా?; ఎడన్= నీ హృదయంలో; వివేకింపుము= ఆలోచించుము.

**తాత్పర్యం:** 'అశ్వత్థామ నిన్ను మించిపోవటం ఆశ్చర్యకరమైన విషయం! నీ గాండీవం నీ గుప్పిటలో నిలకడగా లేదా? నీ నేర్పు భుజబలం అణగారిపోయిందా? ఆత్మ పరిశీలన చేసికొమ్ము.

**క. 'గురునికొడు కను తలంపునఁ । బరుసఁదనంబునకుఁ జొరక భంగపడితొ? యు**
**ద్ధురతఁ గడుఁ జెడియె? ననవుడు । సరోష సంరంభుఁ డై విజయుఁ డాతనితోన్. 293**

**ప్రతిపదార్థం:** గురుని కొడుకు+అను తలంపునన్= గురువైన ద్రోణుడి కుమారుడనే భావంతో; పరుసఁదనంబునకున్+చొరక= కాఠిన్యం వహించక; భంగపడితొ?= ఓడిపోయావా?; ఉద్ధురతన్+కడున్+చెడియెన్= గర్వం విషయంలో మిక్కిలి చెడింది; అనవుడున్= అనగా; విజయుఁడు= అర్జునుడు; సరోష సంరంభుఁడు+ఐ= రోషం పొందినవాడై; అతనితోన్= శ్రీకృష్ణుడితో.

**తాత్పర్యం:** అశ్వత్థామ గురుపుత్రుడని తలచి అతడితో గట్టిగా వ్యవహరించక భంగపడ్డావా? లేక నీవు గర్వం కోల్పోయావా?' అని కృష్ణుడనగా అర్జునుడు రోషం చెందినవాడై అతడితో. (తరువాతి పద్యంతో అన్వయం.)

క. 'వెసఁ బెక్కమ్ములు మనపై । ముసుఁగువడం బఱపి యతఁడు మురభంజన! సం
తస మందెడు; నింతన యేఁ । గసిమసఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్. 294

**ప్రతిపదార్థం:** మురభంజన!= మురారీ!; అతఁడు= అశ్వత్థామ; పెక్కు+అమ్ములు= అనేకబాణాలు; మనపైన్= మనమీద; వెసన్= వేగంగా; ముసుఁగుపడన్+పరపి= కప్పువడేటట్లు కురిపించి; సంతసము+అందెడున్= సంతోషిస్తున్నాడు; ఇంతన= ఇంతలోనే; ఏన్= నేను; కసిమసఁగెదన్= విజృంభిస్తాను; నన్నున్ గాండీవంబున్= నన్ను నా ధనుస్సును; చూడు.

**తాత్పర్యం:** 'కృష్ణా! అశ్వత్థామ మనలను దట్టంగా బాణాలతో కప్పివేసి అంతమాత్రంతోనే సంతోషిస్తున్నాడు. ఇక నేను విజృంభిస్తాను చూడుము.'

మ. అని భల్లప్రకరంబులన్ గురుతనూజాస్త్రప్రతానంబుఁ ద
ద్ధనువుం గేతువు నాతపత్రమును జిత్రస్ఫూర్తిఁ దున్మాడి గ్ర
క్కున నవ్విప్రుఁడు శక్తియున్ గదయు నుక్కుందాల్మియుం దోఁప నె
త్తినఁ దోడ్తో నవి ద్రుంచి వైచె సమరస్థేమాభిరామాకృతిన్. 295

**ప్రతిపదార్థం:** అని= అని వచించి; భల్లప్రకరంబులన్= బల్లెముల సమూహాలతో; గురుతనూజ+అస్త్ర ప్రతానంబున్= అశ్వత్థామ అస్త్రసమూహాన్ని; తద్+ధనువున్= అతడి ధనుస్సును; కేతువున్+ఆతపత్రమును= ధ్వజచ్ఛత్రములను; చిత్రస్ఫూర్తిన్+తునుమాడి= చిత్రంగా ఖండించి; ఆ+విప్రుఁడు= అశ్వత్థామ; గ్రక్కునన్= వెంటనే; ఉక్కున్+తాల్మియున్, తోఁపన్= గర్వం బలం గోచరించగా; శక్తియున్, గదయున్= బల్లెమును, గదను; ఎత్తినన్= పైకెత్తగా; సమరస్థేమ+అభిరామ+ఆకృతిన్= యుద్ధమునందలి శారీరకబలముచేత మనోహరమైన రూపం కలవాడై; తోడ్తోన్= వెంటనే; అవి త్రుంచివైచెన్= వాటిని ఖండించివేశాడు.

**తాత్పర్యం:** అంటూ అర్జునుడు, అశ్వత్థామ అస్త్రాలు, విల్లు, ధ్వజం, ఛత్రం మున్నగువాటిని బల్లెములతో ఖండించాడు. అశ్వత్థామ బలదర్పం విడనాడక బల్లెం, గదను ఎత్తగా అర్జునుడు యుద్ధము నందలి శారీరక బలముచేత మనోహరమైన రూపము కలవాడై వాటిని కూడా ఖండించివేశాడు.

ఆ. ఇట్లు ద్రోణసుతుని యేపు పార్థుఁడు దుహి । నంబుఁ జెఱుచు నినువిధంబు మెఱయఁ
జెఱిచె నంతఁ బొదివె నుఱక యా రథికు సం । శప్తక వ్రజంబు సరభసముగ. 296

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; పార్థుఁడు= అర్జునుడు; తుహినంబున్ చెఱుచు+ఇనువిధంబు= మంచును నశింపజేసే సూర్యుడివలె; మెఱయన్= ఒప్పునట్లుగా ద్రోణ సుతుని ఏపు= అశ్వత్థామ గర్వం; చెఱిచెన్= అణచివేశాడు; అంతన్= అప్పుడు; సంశప్తక వ్రజంబు= త్రిగర్తవీరుల సమూహం; సరభసముగన్= శీఘ్రంగా; ఆ రథికున్= అర్జునుడిని; ఉఱక= లక్ష్యపెట్టక; పొదివెన్= ఎదుర్కొనెను.

**తాత్పర్యం:** ఈ విధంగా అశ్వత్థామ గర్వాన్ని, అర్జునుడు మంచును కరిగించివేసే సూర్యుడివలె ప్రకాశిస్తూ అణచివేశాడు. అంతలోనే ఆ సంశప్తకసమూహం అర్జునుణ్ణి లక్ష్యపెట్టక శీఘ్రంగా తాకింది.

**విశేషం:** అలం: ఉపమ.

**క. ఎందఱు వొదివిరి వారల । కందఱకును దమక తమక యర్జున చటుల**
**స్యందన మెదురైనట్లు మ । దిం దోఁచెఁ దదీయ' బాణ తీవ్ర బహులతన్. 297**

**ప్రతిపదార్థం:** ఎందఱు పొదివిరి= ఎంతమంది తాకారో; వారలకున్+అందఱకును= వారందరికీ; తదీయ, బాణ తీవ్రబహులతన్= అర్జునుడి బాణాల బాహుళ్యంచేత; తమక తమక= ప్రతిఒక్కరికీ; అర్జున చటుల స్యందనము= అర్జునుడు తిరుగుతున్న రథం; ఎదురు+ఐనట్లు, మదిన్+తోఁచెన్= ఎదురైనట్లుగా మనస్సుకు గోచరించింది.

**తాత్పర్యం:** అర్జునుడి బాణవేగానికి సంశప్తకులలోని ప్రతివీరుడూ అతడి రథం ఎదురు వచ్చినట్లుగా భావించారు.

**విశేషం:** శ్రీకృష్ణుడి సారథ్యంలో అర్జునుడి రథం అంత వేగంగా తిరుగుతున్నది.

**క. అప్పుడు గురుతనయాద్రిం । గప్పఁగ వజ్రోపమాన కాండములు వెసం**
**గుప్పనఁగూర వఱప నరుఁ । డప్పరుసఁదనమున కోర్చి యతఁడుఁ బెనంగెన్. 298**

**ప్రతిపదార్థం:** అప్పుడు; నరుఁడు= అర్జునుడు; గురుతనయ+అద్రిన్+కప్పఁగన్= అశ్వత్థామ అనే పర్వతాన్ని కప్పేటట్లుగ; వజ్ర+ఉపమాన కాండములు= వజ్రాయుధంవంటి బాణాలు; వెసన్= శీఘ్రంగా; కుప్పనఁగూర+వఱపన్= కుప్పలుగా కురిపించగా; ఆ+పరుసదనమునకున్+ఓర్చి= ఆ తీవ్రమైన తాకిడికి సహించి; ఆతఁడున్+పెనంగెన్= అశ్వత్థామ కూడా యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు అశ్వత్థామ అనే కొండను కప్పివేసేటట్లుగ వజ్రాయుధం వంటి బాణాలు ప్రయోగించగా, అతడు వాటి తీవ్రమైన తాకిడికి తట్టుకొని పోరు సల్పాడు.

**విశేషం:** అలం: రూపకం. వృత్రాసుర సంహారం కొరకు దధీచి ఎముకలచేత చేయబడిన ఇంద్రుడి ఆయుధం వజ్రాయుధం. అతడు దానితో మేరుపర్వతం రెక్కలను ఖండించాడు. కుప్పనగూరవఱపు - జాతీయం.

**వ. అ ట్లశ్వత్థామ పెనంగుచుండ సంశప్తకవ్రజంబునందు. 299**

**ప్రతిపదార్థం:** అట్లు+అశ్వత్థామ పెనంగుచుండన్= ఆ విధంగా అశ్వత్థామ పోరు సల్పుతుండగా; సంశప్తక, వ్రజంబునందున్= సంశప్తకసమూహంలో.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఆ విధంగా రణం చేస్తుండగా సంశప్తకులలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. చేతులు దలలును బహువిధ । హేతులఁ దునియలుగఁ జేసి యిలఁ దొరఁగించెం**
**జేతుల కసి పోవంగ న । రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణన్. 300**

**ప్రతిపదార్థం:** క్రీడి= అర్జునుడు; ప్రకటస్ఫురణన్= పరాక్రమం ఒప్పగా; అరాతులు బెగ్గిలఁగన్= శత్రువులు భీతిచెందగా; చేతుల కసి పోవంగన్= చేతుల దురద తీరేటట్లుగా; బహువిధ హేతులన్= పలు ఆయుధాలతో; చేతులు, తలలును= చేతులు, తలలు; తునియలుగన్+చేసి= తునుకలుగా చేసి; ఇలన్+తొరఁగించెన్= నేలపై పడగొట్టాడు.

**తాత్పర్యం:** అర్జునుడు పరాక్రమాన్ని చూపి శత్రువులు భీతిచెందేటట్లుగ, చేతుల దురద తీరేటట్లుగ పెక్కు ఆయుధాలతో శత్రువుల తలలు, చేతులు ఖండించి వాటిని నేలపై పడగొట్టాడు.

**విశేషం:** కసిపోవు- కసితీరుట (జాతీయం), చేతుల తీటపోవ మనసుకే కాక చేతులకు కూడా కసి కల్పించబడింది. (క.1-197)

**క. తురగ ద్విప రథ తూర్యా । భరణ ధ్వజ చామరాతపత్ర శకలముల్**
**పొరిఁబొరి ధరఁ గప్పఁగ నె । త్తురు టేఱులు వానిఁ దొలఁగఁ ద్రోచుచు వచ్చెన్. 301**

**ప్రతిపదార్థం:** తురగ= గుఱ్ఱాల; ద్విప= ఏనుగుల; రథ= రథాల; తూర్య+ఆభరణ= వాద్యాలు ఆభరణాల; ధ్వజ= జెండాల; చామర+ఆతపత్ర= చామరములు గొడుగుల; శకలముల్= తునకలు; పొరిన్+పొరిన్= ఒకదానిపై ఒకటి; ధరన్+కప్పఁగన్= నేలను కప్పివేయగా; నెత్తురు+ఏఱులు= రక్తప్రవాహాలు; వానిన్=వాటినన్నింటిని; తొలఁగన్+త్రోచుచున్= త్రోసికొంటూ; వచ్చెన్= వచ్చాయి.

**తాత్పర్యం:** రథ, గజ, తురగాలు, ధ్వజ, చామర, ఛత్రాలు తునుకలై నేలపై పడగా సైనికుల రక్తపుకాల్వలు వాటిని త్రోసికొంటూ ప్రవహించాయి.

**విశేషం:** పొరి బొరి - మాటిమాటికి (ఆమ్రేడితం) అడ్డంగా ఉన్న చెత్తను త్రోసుకొంటూ నీటిప్రవాహం ప్రవహించేవిధాన్ని స్ఫురింపజేస్తుంది ఈ వర్ణన.

**వ. అట్టియెడ. 302**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**తే. అంగ వంగ నిషాద కళింగ బలము । లర్జునునిమీఁదఁ బెల్లుగ నడరుటయును**
**గురుతనూభవుఁ డతనిని మురవిరోధి । నంపపెనువెల్లి ముంచి బెట్టార్చి పేర్చి. 303**

**ప్రతిపదార్థం:** అంగ, వంగ, నిషాద, కళింగ, బలములు= అంగ, వంగ, కళింగ నిషాద సేనలు; అర్జునుని మీఁదన్+పెల్లుగన్+ అడరుటయును= అర్జునుడిపై అధికంగా విజృంభించగా; గురు తనూభవుఁడు= అశ్వత్థామ; అతనిని మురవిరోధిన్= పార్థ కృష్ణులను; అంప పెనువెల్లిన్+ముంచి= పెక్కుబాణాల ప్రవాహంలో ముంచి; బెట్టు+ఆర్చి పేర్చి= గట్టిగా అరచి విజృంభించగా.....

**తాత్పర్యం:** అంగ, వంగ, నిషాద, కళింగ దేశాల సేనలు అర్జునుడిపై విజృంభించగా, అశ్వత్థామ అది అదనుగా తీసికొని కృష్ణార్జునులను బాణాలప్రవాహంలో ముంచి గర్వంగా గర్జించి, విజృంభించగా

**వ. అ వ్విక్రమవిశేషంబునకు రోషంబు నొంది. 304**

**ప్రతిపదార్థం:** ఆ+విక్రమ విశేషంబునకున్= ఆ అశ్వత్థామ పరాక్రమ విశేషానికి; రోషంబున్+ఒంది= అర్జునుడు రోషం చెంది.

**తాత్పర్యం:** అశ్వత్థామ విజృంభణకు (అర్జునుడు) రోషం చెంది. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అ వ్వీరుం డవ్విప్రుని । క్రొవ్వును నా సైన్యసమితి క్రూరోద్ధతియున్**
**నివ్వటిలనీక ఖచరులు । నివ్వెఱపడ సమరకేళి నిపుణత మెఱసెన్. 305**

**ప్రతిపదార్థం:** ఆ+వీరుండు= అర్జునుడు; ఆ+విప్రుని క్రొవ్వునున్= అశ్వత్థామ గర్వాన్ని; ఆ, సైన్య, సమితి, క్రూర+ఉద్ధతియున్= ఆ సైన్యసమూహాల దారుణమైన అతిశయాన్ని; నివ్వటలనీక= విజృంభించనీయకుండా; ఖచరులు నివ్వెఱపడన్= ఆకసంలో విహరించే దేవతలు ఆశ్చర్యపడేటట్లుగా; సమరకేళి నిపుణతన్= యుద్ధక్రీడానైపుణ్యంతో; మెఱసెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు అశ్వత్థామ, సైన్య సమూహాల విజృంభణాన్ని అడ్డుకొని దేవతలు మెచ్చేటట్లుగా యుద్ధ కౌశలాన్ని ప్రదర్శించాడు.

**వ. మెఱసిన నెఱసినరోషంబున మఱియును.** **306**

**ప్రతిపదార్థం:** మెఱసిన= ప్రకాశించిన; నెఱసిన రోషంబునన్= నిండైన రోషంతో; మఱియును= ఇంకా.

**తాత్పర్యం:** (అర్జునుడు ఆ విధంగా యుద్ధవిద్యను ప్రదర్శించగా) అశ్వత్థామ అధికమైన రోషం ప్రకాశించగా

**మ. గురుపుత్రుం డసురాంతకున్ విజయునిం గ్రూరాస్త్ర సంతాన ని**
**ష్ఠుర పాతంబున నొంప నాహరి దదాటోపంబు సైరింప క**
**న్నరుతో 'నౌషధ మూఁది చేసి తెవులు న్మర్దింపకున్నం దుది**
**న్భరమై యుండదె యే పడంపుము రిపు న్సంరంభివై నావుడున్.** **307**

**ప్రతిపదార్థం:** గురుపుత్రుండు= అశ్వత్థామ; అసుర+అంతకున్= శ్రీకృష్ణుడిని; విజయునిన్= అర్జునుడిని; క్రూర+అస్త్రసంతాన= భయంకర అస్త్ర సమూహాలయొక్క; నిష్ఠుర పాతంబునన్+నొంపన్= తీవ్ర ధాటితో నొప్పించగా; ఆ హరి= శ్రీకృష్ణుడు; తద్+ ఆటోపంబు సైరింపక= అతడి పరాక్రమాన్ని సహించలేక; ఔషధము+ఊఁదిచేసి= మందును ఉపయోగించి; తెవులున్+ మర్దింపకున్నన్= రోగాన్ని రూపుమాపకపోతే; తుదిన్+భరము+ఐ+ఉండదె?= చివరకు భారంగా పరిణమించదా?; సంరంభివి+ఐ= ఉత్సాహం కలవాడవై; రిపున్= శత్రువును; ఏపు+అడంపుము= గర్వాన్ని అణచుము అని; ఆ+నరుతోన్= అర్జునుడితో; నావుడున్= అనగా.

**తాత్పర్యం:** అశ్వత్థామ కృష్ణార్జునులను క్రూర అస్త్రాలతో నొప్పించగా, కృష్ణుడు దానిని సహించలేక అర్జునుడితో 'మందును ప్రయోగించి రోగాన్ని నశింపజేయకపోతే అది చివరకు భారం కాదా? ఉత్సాహపూరితుడవై శత్రువుల గర్వాన్ని అణచివేయుము' అని అన్నాడు.

**క. అతండు విజృంభించి గుణంబు సారించి.** **308**

**ప్రతిపదార్థం:** అతండు= అర్జునుడు; విజృంభించి= అతిశయించి; గుణంబు సారించి= వింటినారిని లాగి.

**తాత్పర్యం:** ఆ మాటలకు అర్జునుడు విజృంభించి, విల్లు ఎక్కుపెట్టి, నారి లాగి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. శిరమునఁ గంఠదేశమునఁ జేతులయందు నురస్థ్సలంబునం**
**జరణములన్ శరంబులు వెసన్ నిబిడంబుగఁ గీలుకొల్పుచున్**
**వెరవునఁ బగ్గముల్ దునుమ వేగమ యూడ్చెఁ దురంగమంబు ల**
**గ్గురుసుతుతేరు గయ్యమునకుం గడు దవ్వు దొలంగ భూవరా!** **309**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; శిరమునన్= తలపై; కంఠ దేశమునన్= కంఠమునందు; చేతుల+అందున్= చేతులందు; ఉరః+స్థలంబునన్= వక్షమునందు; చరణములన్= పాదములందు; శరంబులు= బాణాలు; వెసన్= వేగంగా; నిబిడంబుగన్= దట్టంగా; కీలుకొల్పుచున్= ప్రయోగిస్తూ; వెరవునన్+పగ్గముల్ తునుమన్= చాతుర్యంతో రథం పగ్గాలు ఖండించగా; తురంగమంబులు= గుర్రాలు; ఆ+గురుసుతుతేరు= అశ్వత్థామ రథాన్ని; కయ్యమునకున్+కడుదవ్వు తొలంగన్= యుద్ధభూమికి చాల దూరంగా పోయేటట్టు; వేగమ ఈడ్చెన్= వెంటనే ఈడ్చుకువెళ్ళాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడు అశ్వత్థామ వివిధాంగాలపై దట్టంగా బాణాలు ప్రయోగించి పగ్గాలు కూడ ఉపాయంతో ఖండించగా, గుర్రాలు అతడి రథాన్ని యుద్ధానికి దూరంగా ఈడ్చుకొనివెళ్ళాయి.

**వ. ఆ భూదేవుండును భగ్నోత్సాహుండై యల్లన సూతనందను సమీపంబునకుం జనియె; నప్పుడు శౌరి సంశప్తక సైన్యంబు దెసకుం దేరు నడపుచుం దమ సేన దిక్కు కోలాహలం బాకర్ణించి చూడ్కియట నిగిడించి యర్జును నుద్దేశించి 'వేదండారూఢుండైన దండధారుండు మన బలంబులం గలంచుచున్నవాఁ డమ్మగధోత్తముండు భగదత్తు నంతవాఁడ; యతని మడియించి మఱి చేయంగలపని సూచికొంద' మని పలికిన న క్కవ్వడి యొడంబడ నక్కడ కరదంబు పోవనిచ్చె; నట్టియెడ. 310**

**ప్రతిపదార్థం:** ఆ భూదేవుండును= ఆ అశ్వత్థామయు; భగ్న+ఉత్సాహుండు+ఐ= చెదిరిపోయిన ఉత్సాహము కలవాడై; అల్లన= మెల్లగా; సూతనందను సమీపంబునకున్+చనియెన్= కర్ణుడి చెంతకు వెళ్ళాడు; అప్పుడు; శౌరి= శ్రీకృష్ణుడు; సంశప్తక సైన్యంబు దెసకున్= సంశప్తకులవైపు; తేరు నడపుచున్= రథం పోనిస్తూ; తమసేన దిక్కు= తమ సేనవైపు; కోలాహలంబు+ ఆకర్ణించి= సందడి విని; చూడ్కి అట నిగిడించి= దృష్టిని ఆ వైపు ప్రసరింపజేసి; అర్జునున్+ఉద్దేశించి= అర్జునుడితో; వేదండ+ ఆరూఢుండు+ఐన= ఏనుగుపై ఎక్కి ఉన్న; దండధారుండు; మన బలంబులన్+కలంచుచున్నవాఁడు= మన సైన్యాన్ని బాధపెడుతున్నాడు; ఆ+మగధ+ఉత్తముండు= ఆ మగధదేశపురాజు; భగదత్తు+అంతవాఁడ= భగదత్తునంతటివాడే; అతనిన్ మడియించి= అతడిని వధించి; మఱి చేయన్+కల, పని= తరువాత చేయవలసిన పనిని; చూచికొందము+అని పలికినన్= చూద్దాం అనగా; ఆ+కవ్వడి ఒడంబడన్= అర్జునుడు సరే అనగా; అక్కడకున్+అరదంబు పోవన్+ఇచ్చెన్= అటువైపు రథాన్ని పోనిచ్చాడు; అట్టిఎడన్= అప్పుడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ ఉత్సాహహీనుడై కర్ణుడివైపు వెళ్ళాడు. సంశప్తకులవైపు రథం మళ్ళించబోతూ కృష్ణుడు తమ సేనలో సందడి విని చూపునటు త్రిప్పి 'మగధరాజైన దండధారుడు గజారూఢుడై మన సైన్యాన్ని కలతపెడుతున్నాడు. అతడు భగదత్తుడి వంటివాడే. ముందు అతడిని సంహరించు, తరువాత తక్కినపని చూచుకొందాము? అని అర్జునుడితో అన్నాడు. అతడు సరే అనగా కృష్ణుడు రథాన్ని అటువైపు తోలాడు. ఆ సమయంలో.

**విశేషం:** భగదత్తుడు నరకాసురుడి కుమారుడు. కౌరవపక్షంలో యుద్ధం చేస్తూ తండ్రి ఇచ్చిన వైష్ణవాస్త్రమును అర్జునుడిపై ప్రయోగించగా కృష్ణుడు దానిని అడ్డగించాడు. సుప్రతీకం అనే ఏనుగుపై యుద్ధం చేస్తున్న అతడిని వాహనంతో సహా అర్జునుడు సంహరించాడు.

### దండధారుం డను రాజు వేదండంబుతోడ నర్జునుచేఁ జచ్చుట (సం. 8-54-1 (కుంభ))

**క. పాండవ సైన్యంబుల వే। దండంబుల ఘోటముల రథంబుల భటులం**
**జండగతి మగధపతి నిజ। శుండాలముఁ బఱపి యేపుఁ జూపి తెరల్చెన్. 311**

**ప్రతిపదార్థం:** పాండవ సైన్యంబుల= పాండవసేనలలోని; వేదండంబులన్= ఏనుగులను; ఘోటములన్= గుఱ్ఱాలను; రథంబులన్= రథాలను; భటులన్= సైనికులను; మగధపతి= దండధారుడు; చండగతిన్= తీవ్రంగా; నిజ శుండాలమున్+పఱపి= తన ఏనుగును పంపి; ఏపున్+చూపి తెరల్చెన్= పరాక్రమం చూపి కలత పొందించాడు.

**తాత్పర్యం:** దండధారుడు తన గజంతో విజృంభించి పాండవసేనలోని రథ, గజ, తురగ, పదాతులను కలచివేశాడు.

**వ. అ వ్విక్రమ విహారంబు వీక్షించి. 312**

**ప్రతిపదార్థం:** ఆ+విక్రమ విహారంబు= అతని పరాక్రమవిహారాన్ని; వీక్షించి= చూచి.

**తాత్పర్యం:** దండధారుని రణసంరంభాన్ని చూచి.

**తే. మాగధుని కోల్తలకుఁ గాక మనబలంబు । విఱిగెఁ బొద పొదమని తాను దఱిమెఁ దేరు**
**హరియుఁ బఱపంగ నర్జునుం డడ్డపడియెఁ । జండ చేష్టితోద్దండ వేదండమునకు. 313**

**ప్రతిపదార్థం:** మాగధుని కోల్తలకున్+కాక= దండధారుడి యుద్ధానికి తట్టుకొనలేక; మన బలంబు= మనసైన్యం; విఱిగెన్= చెదరిపోయింది; పొదపొదము+అని= పదపద అని; తాను= అతడు; తేరు= రథం; తఱిమెన్= త్వరపెట్టాడు; హరియున్+ పఱపంగన్= కృష్ణుడు రథం పరుగెత్తించగా; అర్జునుండు= అర్జునుడు; చండచేష్టిత= తీవ్రమైన చేష్టలతో కూడిన; ఉద్దండ వేదండమునకున్= భయంకర గజానికి; అడ్డపడియెన్= అడ్డుగా వెళ్ళాడు.

**తాత్పర్యం:** దండధారుడి ధాటికి తట్టుకోలేక మన సైన్యం చెల్లాచెదరయింది. 'రథాన్ని త్వరగా తోలుము' అని అర్జునుడు అనగా కృష్ణుడు రథం పరుగెత్తించాడు. అప్పుడు తీవ్రంగా విజృంభిస్తున్న దండధారుడి గజాన్ని అర్జునుడు అడ్డుకొన్నాడు.

**క. అగ్గలిక దండధారుఁడు । దిగ్గజనిభ నిజ గజంబుఁ దీవ్రత మెఱయన్**
**డగ్గఱఁగఁ బఱపి హయముల । నగ్గరుడధ్వజుని నరుని నమ్ములఁ గప్పెన్. 314**

**ప్రతిపదార్థం:** దండధారుడు; అగ్గలికన్= ఉత్సాహంతో; దిగ్గజనిభ, నిజ, గజంబున్= దిగ్గజం వంటి తన ఏనుగును; తీవ్రత మెఱయన్= వేగం అతిశయించగా; డగ్గఱగన్+పఱపి= దగ్గరగా తీసికొనివెళ్ళి; హయములన్= గుర్రాలను; ఆ+గరుడధ్వజునిన్= శ్రీకృష్ణుడిని; నరునిన్= అర్జునుడిని; అమ్ములన్+కప్పెన్= బాణాలతో కప్పాడు.

**తాత్పర్యం:** దండధారుడు దిగ్గజంవంటి తన ఏనుగును వేగంగా వారి దగ్గరకు తీసుకొని వెళ్ళి కృష్ణార్జునులను, గుర్రాలను బాణాలతో ముంచెత్తాడు.

**చ. అలిగి కిరీటి మాగధధరాధిపు బాహులు ద్రెంచి, గ్రక్కునం**
**దలయును ద్రుంచి, యేనుఁగు నుదగ్రతఁ బీనుఁగుఁ జేసె; నప్డు గొం**
**దల మొకయింత లే కతని తమ్ముఁడు దండుఁడు దాఁకి తోమరం**
**బులు వరఁగింప గేలు శిరముం గరటిం దునుమాడె నుగ్రతన్. 315**

**ప్రతిపదార్థం:** కిరీటి= అర్జునుడు; అలిగి= కోపించి; మాగధ ధర+అధిపు, బాహులు, త్రెంచి= దండధారుడి భుజాలు నరికి; గ్రక్కునన్+తలయును, ద్రుంచి= వెంటనే తలను కూడ ఖండించి; ఏనుఁగును; ఉదగ్రతన్+పీనుఁగున్+చేసెన్= భయంకరంగా శవముగా చేశాడు; అప్డు= అపుడు; అతడి తమ్ముడు దండుడు; కొందలము+ఒక ఇంతలేక= కలత ఏమాత్రము లేకుండా; తాఁకి, తోమరంబులు పరఁగింపన్= (అర్జునుడిని) ఎదుర్కొని బాణాలు ప్రయోగించగా; కేలు శిరమున్+కరటిన్= చెయ్యి, తల, ఏనుగును; ఉగ్రతన్= భయంకరంగా, తునుమాడెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** అర్జునుడు ఆగ్రహం చెంది, దండధారుని చేతులు, తలను నరికి అతడి ఏనుగును వధించాడు. అప్పుడు అతడి తమ్ముడు దండుడు ఏమాత్రం కలత చెందకుండా బాణాలు ప్రయోగించగా, అర్జునుడు అతని చేతిని, తలను, ఏనుగును ఖండించాడు.

**క. తదనీకంబు గజంబులు । పొదివిన బలుగాలి మేఘములఁ దీవ్రగతిన్**
**జెదరించు పగిది నరుఁ డు । న్మదుఁడై నలుదెసలఁ దోలె మనుజాధీశా! 316**

**ప్రతిపదార్థం:** మనుజ+అధీశా!= రాజా!; తద్+అనీకంబు= ఆ దండుని సైన్యం; గజంబులు పొదివిన= ఏనుగులు తాకగా; నరుఁడు+ఉన్మదుఁడు+ఐ= అర్జునుడు విజృంభించినవాడై; బలుగాలి= తీవ్రమైన గాలి; మేఘములన్= మబ్బులను; తీవ్రగతిన్= బలంతో; చెదరించుపగిదిన్= చెదరగొట్టే విధంగా; నలుదెసలన్+తోలెన్= అన్ని దిక్కులకూ చెదరగొట్టాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! దండుడి సైన్యం గజాలు వచ్చి తాకగా పెనుగాలి మేఘాలను చెదరగొట్టేటట్లుగ అర్జునుడు వాటిని నలుదెసలకూ చెదరగొట్టాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. ఇవ్విధంబున మగధ సైన్యంబు మర్దించి సంశప్తక సైన్యంబుపైఁ గవిసి కపికేతనంబు మెఱుంగులు మెఱయ మధుమథను వెరవున వెలిమావుల గతు లక్కజంబుగా నుక్కునఁ బార్థుండు భల్లనారాచ ప్రముఖ ప్రదర పరంపరల సొంపును బాహువీర్య ధైర్యంబుల పెంపును నిలింప నికరంబు వర్ణింప నందు మహార్ణవంబునం దిరుగు మందరనగంబు చందంబున నిజస్యందనం బొప్ప నప్పటప్పటి కెక్కు డొదవు మదంబునం ద్రిగర్తాదులగు నమ్మార్తురు పైపయిం గ్రమ్మికురియు నస్త్రశస్త్రంబులు విదళితచ్ఛిన్న చూర్ణితంబులు సేయుచుఁ దదీయ గాత్రంబులం గరటి ఘోటక తనువులుం దునియ లయ్యును నుగ్గు లయ్యును బఱియ లయ్యును గుదులయ్యును ధరం దొరఁగఁ దామరబావిం గేలి సల్పు సామజంబు చాడ్పున విహరించి యవిహతి ధృతి వ్రతమహితు లగు నహితుల నత్యుత్తమ లోకంబులకుం బుచ్చినం గొంచెపు మూఁక విచ్చినం బెద్ద వెనుకొనక యరదంబు మరల్చి వచ్చునెడ నచ్యుతుం డర్జును నుద్దేశించి 'భవద్విక్రమ విహార స్థలంబు సూచితే?' యని పలికి వివిధాయుధ ఖండంబులను వేదండాశ్వ రథ పదాతి శకలంబులను భూషణాతపత్రకేతు చామరాంశంబులను జక్షుశ్చమత్కరణపరిణతం బగు రణస్థలంబు సూపె; నప్పుడు గొఱ ప్రాణంబులతో నొఱలు నర తురగ ద్విరదంబులను గొందఱు దమవారిం గానక కన్నీళ్ళు నించుచు నాలింగన రోదన ప్రముఖంబు లైన కరుణా భాషణంబు లగు నవస్థా విశేషంబులం బొందువారలం గృపాళురై యాలోకించుచు**

**నయ్యిరువురుఁ దమ మోహరంబున నెసంగు కలకలంబు విని యుదీర్ణగమనంబునం జనుదెంచుచుండి; రటమున్న కౌరవ్యుల మొనయును గర్ణుని మొగ్గరంబును రెండు ముఖంబులం బెనంగుచుండి కయ్యపు టుచితత్వంబునం గలసె; నట్టియెడ రారాజు పురికొల్ప రాధేయునకుఁ బ్రాపయి పుళింద బాహ్లిక టేంకణాంధ్ర భోజానీకంబు గవిసినం గౌంతేయ బలంబునకు భరం బగుటయు. 317**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; మగధ సైన్యంబు మర్దించి= మగధ సైన్యాన్ని చంపి; సంశప్తక సైన్యంబుపైన్+కవిసి= సంశప్తకసైన్యాన్ని తాకి; కపికేతనంబు, మెఱుంగులు, మెఱయన్= కపిధ్వజం ప్రకాశించగా; మధుమథను వెరవునన్= కృష్ణుడి నేర్పుతో; వెలిమావుల, గతులు+అక్కజంబుగాన్= తెల్లగుర్రాల నడకలు ఆశ్చర్యం గొలుపగా; పార్థుండు= అర్జునుడు; ఉక్కున= శౌర్యంతో; భల్ల, నారాచ, ప్రముఖ, ప్రదర, పరంపరల సొంపును= బల్లెములు, బాణాలు మొదలైన ఆయుధాల వరుసల ప్రకాశమూ; బాహువీర్య, ధైర్యంబుల, పెంపును= భుజబల ధైర్యాల అతిశయమూ; నిలింపనికరంబు వర్ణింపన్= దేవతల సమూహం పొగడగా; అందున్= ఆ యుద్ధభూమిలో; మహా+అర్ణవంబునన్+తిరుగు మందర నగంబు చందంబునన్= మహా సముద్రంలో తిరిగే మందర పర్వతంవలె; నిజస్యందనంబు+ఒప్పన్= తన రథం ఒప్పగా; అప్పటప్పటికిన్+ఎక్కుడు+ఒదవుమదంబునన్= అంతకంతకు అధికమైన గర్వంతో; త్రిగర్త+ఆదులు+అగు+ఆ+మార్తురు= త్రిగర్తీయులు మొదలైన ఆ శత్రువులు; పైపయిన్+ క్రమ్మి= మీదిమీదికివచ్చి; కురియ+అస్త్ర శస్త్రంబులు= వేసే అస్త్రశస్త్రాలు; విదళిత+ఛిన్న, చూర్ణితంబులు, చేయుచున్= చీల్చబడిన ముక్కలుగా పొడిగా చేస్తూ; తదీయ గాత్రంబులున్= వారి దేహాలు; కరటి, ఘోటక, తనువులున్= ఏనుగులు, గుర్రాల శరీరాలు; తునియలు+అయ్యును= తునకలై; నుగ్గులు+అయ్యును= చూర్ణములై; పఱియలు+అయ్యును= బద్దలై; గుదులు+అయ్యును= గుత్తులై; ధరన్+తొరఁగన్= నేలపై పడగా; తామరబావిన్+కేలిసల్పు= తామరకొలనులో క్రీడించు; సామజంబు చాడ్పునన్ విహరించి= ఏనుగువలె విహరించి; అవిహత, ధృతి, వ్రత, మహితులగు+అహితులన్= కొట్టబడని ధైర్యంచే గొప్పవారైన శత్రువులను; అత్యుత్తమలోకంబులకున్+పుచ్చినన్= వీరస్వర్గానికి పంపగా; కొంచెపు, మూఁక విచ్చినన్= అల్పసైనికులు చెదరిపోగా; పెద్ద వెనుకొనక= మిక్కిలి వెంబడించకుండా; అరదంబు మరల్చివచ్చునెడన్= రథం మరలించి వస్తుండగా; అచ్యుతుండు+అర్జునున్+ఉద్దేశించి= కృష్ణుడు అర్జునుడితో; భవత్+విక్రమ విహారస్థలంబు+చూచితే!= నీవు పరాక్రమం చూపిన స్థలం చూచావా?; అని పలికి= అని వచించి; వివిధ+ఆయుధఖండంబులను= అనేక ఆయుధాల తునుకలతో; వేదండ+అశ్వరథ పదాతి శకలంబులను= గజ అశ్వరథ పదాతుల ఖండాలతో; భూషణ+ఆతపత్ర= ఆభరణాలు, ఛత్రాలు, కేతు చామర+అంశంబులను= ధ్వజ చామరాల ముక్కలతో; చక్షుః+చమత్కరణ పరిణతంబు+అగు= చూపులకు రమ్య మనోహరంగా ఉన్న; రణస్థలంబు చూపెన్= యుద్ధరంగం చూపించాడు; అప్పుడు; కొఱ ప్రాణంబులతోన్+ఒఱలు= కొనప్రాణములతో మ్రోగే; నరతురగ ద్విరదంబులను= సైనిక అశ్వగజాలను; తమవారిన్+కానక= తమ వాళ్ళు కనిపించక; కన్నీళ్ళు నించుచున్= ఏడుస్తూ; ఆలింగనరోదన ప్రముఖంబులు+ఐన= కౌగిలించుకొని ఏడ్చునట్టి; కరుణాభాషణంబులు+అగు= జాలిగొలిపే మాటలు పలికే; అవస్థా విశేషంబులన్= వివిధ అవస్థలను; పొందువారలన్= పొందినవారిని; కృపాళుర+ఐ ఆలోకించుచున్= జాలిగలవారై చూస్తూ; ఆ+ఇరువురున్= కృష్ణార్జునులు; తమ మోహరంబునన్= తమ సైన్యంలో; ఎసంగు కలకలంబు విని= కలిగిన సందడి విని; ఉదీర్ణగమనంబునన్= మిక్కిలివేగంగా; చనుదెంచుచుండిరి= వస్తున్నారు; అటమున్న= అంతకుముందే; కౌరవ్యుల మొనయును= కౌరవసేనయు; కర్ణుడి మొగ్గరంబును= కర్ణుడిసేనయు; రెండు ముఖంబులన్+పెనంగుచుండి= ఇరువైపులుగా పోరుతూ; కయ్యపు+ఉచితత్వంబునన్+కలసెన్= యుద్ధంలో తగునట్లుగా కలిశాయి; అట్టి ఎడన్= అప్పుడు; రారాజు పురికొల్పన్= దుర్యోధనుడు ప్రేరేపించగా; రాధేయునకున్+ప్రాపయి= కర్ణుడికి అండగా; పుళింద బాహ్లిక టేంకణ+ఆంధ్ర భోజ+అనీకంబు= పుళింద బాహ్లిక టేంకణ ఆంధ్ర భోజసైన్యాలు; కవిసినన్= తాకగా; కౌంతేయబలంబునకున్= పాండవసైన్యానికి; భరంబు+అగుటయున్= దుస్సహం కాగా.

**తాత్పర్యం:** ఈ విధంగా మగధసైన్యాన్ని చంపి, సంశప్తక సైన్యం మీద విజృంభించాడు. కపికేతనం ప్రకాశించగా, శ్రీకృష్ణుని చాకచక్యంతో తెల్లనిగుర్రాల నడకలు ఆశ్చర్యం గొలుపగా, పరాక్రమంతో పార్థుడు-బల్లెములు, ఇనుప బాణాలు మొదలైన బాణాల పరంపరల సొంపును, తన బాహుబల ధైర్యాల పెంపును దేవతలసమూహం శ్లాఘించగా, మహాసముద్రంలో తిరిగే మందరపర్వతం మాదిరిగ తన రథం ఒప్పారగా, అంతకంతకు అతిశయించే గర్వంతో ఆ త్రిగర్తులు మొదలైన శత్రువులు మీదిమీదికి వచ్చి కురిపించే శస్త్రాస్త్రాలు విరిగి ముక్కలై పొడి అయ్యేటట్లు చేస్తూ, వాళ్ళ శరీరాలు, గజాశ్వాల శరీరాలు తునకలై, చూర్ణాలై, గుత్తులై నేలమీద పడగా, తామరకొలనులో క్రీడించే ఏనుగువలె విహరించాడు. మొక్కవోని ధైర్యంతో గొప్పవారైన శత్రువులను స్వర్గానికి పంపాడు. మిగిలిన కొద్ది సైన్యం చెల్లాచెదరైపోగా, అట్టె దాన్ని వెంటాడక, రథాన్ని మరలించి తిరిగి వచ్చేటప్పుడు, శ్రీకృష్ణుడు అర్జునుడితో, 'నీవు పరాక్రమంతో విహరించిన స్థలాన్ని చూచావా?' అన్నాడు. వివిధాయుధాల ముక్కలతో, గజాశ్వరథ పదాతి సైన్యాల ఖండాలతో, ఆభరణాల, గొడుగుల, ధ్వజాల, వింజామరల తునుకలతో కన్నులకు ఆశ్చర్యాన్ని గొలిపే ఆ యుద్ధభూమిని చూపాడు. అప్పుడు కొన ఊపిరులతో మూల్గుతున్న సైనికులను, గజ తురగాలను - తమవారు కనపడక కన్నీళ్ళుకారుస్తూ, కౌగిలించుకోవటం, ఏడవటం, పెద్దగా జాలిగొలిపే మాటలు మాట్లాడటం వంటి నానావస్థలు పడుతున్నవారిని- దయతో చూస్తూ ఆ కృష్ణార్జునులు తమ సైన్యంలో చెలరేగిన సందడిని విని మిక్కిలి వేగంగా రాసాగారు. అంతకుముందే కౌరవసేన, కర్ణునిసేన వేర్వేరు వైపుల యుద్ధం చేస్తూ, ఒకటిగా కలియటం యుద్ధం దృష్ట్యా ఉచితమని కలిశాయి. అప్పుడు దుర్యోధనుడు పురికొల్పగా కర్ణుడికి సాయంగా పుళింద, బాహ్లిక, టేంకణ, ఆంధ్ర, భోజసైన్యాలు పాండవసైన్యాన్ని ఎదుర్కోగా, ఆ తాకిడి పాండవసైన్యానికి భరించటం కష్టమైంది.

### మలయధ్వజుం డను పాండ్యమహారా జశ్వత్థామచేతఁ జచ్చుట (సం. 8-56-1 (కుంభ))

**సీ.** **పాండ్యుఁ డా సేనలపై బెట్టిదంబుగ । నడరి బాహాబల మక్కజముగఁ**
**బేరిచి పీనుంగుపెంటగాఁ జతురంగ । ముల రూపుమాపె న య్యలఘుభుజుఁడు**
**ద్రోణ భీష్ములు దనతోఁబాటి యను పలు । కున కోర్వఁ డచ్యుతార్జునులు దనకు**
**నెక్కుడు నా విన్న నేవగించుచునుండు । నవ్వీరుఁ డమ్మెయి నాక్రమింపఁ**

**ఆ.** **గని కడంగి యెదురు చని గురుతనయుండు । నగుచుఁ 'బగఱ నీవు మృగకులంబు**
**గలఁచు హరియుఁ బోలెఁ గలఁచెదు నా దిక్కు । మొగము సేసి యనికి మొనయు' మనియె.** 318

**ప్రతిపదార్థం:** పాండ్యుఁడు= మలయధ్వజుడు; ఆ సేనలపైన్= కౌరవసేనలపై; బెట్టిదంబుగన్+అడరి= తీవ్రంగా విజృంభించి; బాహాబలము+అక్కజముగన్= భుజబలం అచ్చెరువు గొల్పగా; పేరిచి= విజృంభించి; చతురంగములు= రథ, గజ, తురగ, పదాతులను; పీనుంగు పెంటగాన్= శవాల కుప్పగా; రూపుమాపెన్= నాశనం చేశాడు; ఆ+అలఘుభుజుఁడు= గొప్ప భుజములు కలవాడైన మలయధ్వజుడు; ద్రోణభీష్ములు= ద్రోణాచార్యుడు, భీష్ముడు; తనకున్+పాటి అను పలుకునకున్+ఓర్వఁడు= తనతో సమానం అన్నమాట సహించలేడు; అచ్యుత+అర్జునులు= కృష్ణార్జునులు; తనకున్+ఎక్కుడునాన్ విన్నన్+ ఏవగించుచునుండున్= తనకంటె అధికులని వింటే అసహ్యపడుతాడు; ఆ+వీరుఁడు+ఆ+మెయిన్+ఆక్రమింపన్= ఆ వీరుడైన మలయధ్వజుడు ఆ విధంగా పైబడగా; గురుతనయుండు= అశ్వత్థామ; కని= చూచి; కడంగి= పూని; ఎదురు చని= ఎదురుగా వెళ్ళి; నగుచున్= నవ్వుతూ; మృగకులంబు కలఁచు హరియున్+పోలెన్= జింకల గుంపును కలతపెట్టే సింహంవలె;

నీవు; పగఱన్= శత్రువులను; కలఁచెదు= బాధపెడుతున్నావు; నా దిక్కుమొగము చేసి= నాకు ఎదురుగా వచ్చి; అనికిన్ మొనయుము+అనియెన్= యుద్ధానికి తలపడుము అన్నాడు.

**తాత్పర్యం:** పాండ్యరాజైన మలయధ్వజుడు భుజబలంతో విజృంభించి కౌరవసేనలోని చతురంగబలాలను పీనుగుపెంట కావించాడు. అతడు భీష్మద్రోణులు తనకు సాటికాగలరని అన్నా, కృష్ణార్జునులు తనకంటె మేటి వీరులని విన్నా సహించలేని శౌర్యధనుడు. అతడి విక్రమాన్ని చూచిన అశ్వత్థామ నవ్వుతూ అతడితో 'లేళ్ళగుంపును బెదరగొట్టే సింహంవలె కౌరవసైన్యాన్ని నీవు కలతపెడుతున్నావు. నాకు ఎదురుగా వచ్చి నాతో యుద్ధం చేయుము' అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**చ. అన విని మేను వొంగ మలయధ్వజుఁ డుగ్రపు నారసంబుఁ ద**
**త్తనువునఁ గ్రుచ్చి మౌర్వి నినదంబు నభంబునఁ బర్వ నంప వె**
**ల్లి నిగుడఁ జేయఁ దొమ్మిది శిలీముఖముల్ వెస నమ్మహీశుపై**
**ననిమిషవర్ణనీయగతి న గ్గురునందనుఁ డేసె నేసినన్. 319**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అనగా విని; మలయధ్వజుఁడు; మేను పొంగన్= దేహం ఉప్పొంగగా; ఉగ్రపునారసంబున్= భయంకరమైన బాణాన్ని; తద్+తనువునన్+క్రుచ్చి= అశ్వత్థామ దేహంలో నాటి; మౌర్వినినదంబు నభంబునన్ పర్వన్= వింటినారి ధ్వని ఆకాశంలో వ్యాపించగా; అంపవెల్లి నిగుడన్+చేయన్= బాణవర్షం కురిపించగా; వెసన్= వెంటనే; ఆ+ గురునందనుఁడు= అశ్వత్థామ; అనిమిష వర్ణనీయగతిన్= దేవతలు పొగడునట్లుగా; ఆ+మహీశుపైన్= ఆ పాండ్యుడిపై; తొమ్మిది శిలీముఖముల్= తొమ్మిది బాణాలు; ఏసెన్= ప్రయోగించాడు. ఏసినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** అశ్వత్థామ మాటలకు మలయధ్వజుడు మేను ఉప్పొంగగా అతడి శరీరంపై నిశితబాణం నాటి, అల్లె త్రాటి ధ్వని ఆకాశమంతా వ్యాపింపగా బాణవర్షం కురిపించాడు. అశ్వత్థామ కూడా దేవతలు మెచ్చేటట్లుగా అతడిపై తొమ్మిదిబాణాలు వేసి నొప్పించాడు.

**వ. అ త్తొమ్మిదింటిలోన. 320**

**తాత్పర్యం:** ఆ తొమ్మిది బాణాలలో.

**క. ప్రతిశరములు పాండ్య మహీ। పతియును బరఁగింప నైదు భగ్నము లయ్యెన్**
**గతి సెడక నిగిడి రథ్య। ప్రతతి ధరం గూల్చె నాల్గు బాణము లధిపా! 321**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; పాండ్య మహీపతియును= మలయధ్వజుడు; ప్రతిశరములు= ప్రతిగా బాణాలు; పరఁగింపన్= వేయగా; ఐదు, భగ్నములు+అయ్యెన్= ఐదు బాణాలు విరిగిపోయాయి; నాల్గుబాణములు= మిగిలిన నాల్గుబాణాలు; గతి+చెడక నిగిడి= గురి తప్పక వెళ్ళి; రథ్యప్రతతి= గుర్రాల సమూహాన్ని; ధరన్+కూల్చె= నేల కూల్చాయి.

**తాత్పర్యం:** మలయధ్వజుడు కూడా ప్రతిగా బాణాలు వేయగా, అశ్వత్థామ వేసిన తొమ్మిది బాణాలలో ఐదు మధ్యలో విరిగాయి. నాలుగు బాణాలు గురితప్పక గుర్రాలను నేలకూల్చాయి.

**తే. మఱియు గురుపుత్రుఁ డేయ నమ్మలయకేతుఁ । డా శరంబులు దద్ధనుర్జ్యాలతయును**
**దునిమెఁ; దునిమిన నతి రయంబున నతండు । నారి సంధించి యమ్ముల నభముఁ గప్పె. 322**

**ప్రతిపదార్థం:** మఱియున్= మరల; గురుపుత్రుఁడు+ఏయన్= అశ్వత్థామ బాణాలు ప్రయోగించగా; ఆ మలయకేతుఁడు= మలయధ్వజుడు; ఆ శరంబులు= ఆ బాణాలు; తద్+ధనుః+జ్యాలతయును= అతని వింటినారిని; తునిమెన్= ఖండించాడు; తునిమినన్= ఖండించగా; అతండు+అశ్వత్థామ; అతిరయంబునన్= కడువేగంతో; నారి సంధించి= మరొక నారిని ఎక్కించి; అమ్ములన్= బాణాలతో; నభమున్+కప్పెన్= ఆకాశాన్ని కప్పాడు.

**తాత్పర్యం:** మళ్ళీ అశ్వత్థామ బాణాలు వేయగా మలయధ్వజుడు వాటిని, అతడి వింటినారిని ఖండించాడు. అశ్వత్థామ వెంటనే మరొక నారిని సంధించి బాణాలతో ఆకాశాన్ని కప్పాడు.

**వ. అ ప్పాండ్యమహీపతి పరివార సామర్థ్యంబున రథ్యవంతుం డయి వాయవ్యాస్త్రంబున నయ్యంప పరంపరఁ బ్రతిహతంబు సేసి తదీయ చక్రరక్షకులం దెగటార్చి యార్చినం గెరలి యగ్గురునందనుం దత్సహచరుల నుఱుమాడి రత్నమయాగురు చందనసుందరంబైన మలయగిరి ప్రకారంబునం బొలుచు కేతనంబు గూల్చి గుఱ్ఱంబుల గీటడంగించి సూతు ప్రాణంబులు గొని చాపంబు ద్రుంచి తేరు దుమురు సేసి యతండు పొలివోని పౌరుషంబునం బ్రయోగించు నస్త్ర శస్త్రంబుల నుఱక నఱికి యగ్గమై యున్నను గయ్యంబువలని వేడుక నతని సమయింప నొల్లక యరవాయి గొనిన యాలోనఁ బతిత యోధం బైన సుకల్పిత మాతంగంబు నెక్కి గిరి శిఖరంబు నలంకరించు కేసరియ ట్లొప్పి యా ద్రవిడేశ్వరుండు సామజంబు నుద్దామగతిం దఱిమి భీమాభిరామం బైన తోమరంబు వైచిన మణిగణోజ్జ్వలంబైన యా ద్రౌణి శిరోభూషణంబు ధరణిం బడినఁ ద్రొక్కంబడిన భుజంగంబు పోలికం గనలి యబ్బలుమగండు తత్పార్శ్వవర్తుల నార్వుర రథికవరులఁ దద్వేదండంబుఁ తుండంబును చరణ చతుష్టయంబును నమ్మేదినీపతి పాదంబులుఁ గరంబులు శిరంబును నతి తీవ్ర భల్లంబులం దునుమాడిన నద్దిక్కు మూఁకలు విచ్చెం; గురుభూవరుం డమ్మహీసురవరుం జేరం జని యగ్గించె నప్పుడు. 323**

**ప్రతిపదార్థం:** ఆ+పాండ్య మహీపతి= మలయధ్వజుడు; పరివార సామర్థ్యంబునన్= అనుచరుల సామర్థ్యం వల్ల; రథ్యవంతుండు+ఐ= రథసమూహాలు కలవాడై; వాయవ్య+అస్త్రంబునన్= వాయవ్యాస్త్రంతో; ఆ+అంపపరంపరన్+ప్రతిహతంబుచేసి= ఆ బాణసమూహాన్ని మరలింపజేసి; తదీయ చక్రరక్షకులన్+తెగటార్చి= ఆతడి చక్రరక్షకులను వధించి; ఆర్చినన్+కెరలి= అరువగా విజృంభించి; ఆ+గురునందనున్+తద్+సహచరులన్= ఆ అశ్వత్థామను, అతనియొక్క సహచరులను; నుఱుమాడి= చూర్ణంచేసి; రత్నమయ+అగురు చందన సుందరంబు+అయిన= రత్నమయమైన అగురుగంధపుచెట్లతో అందగించే; మలయగిరి ప్రకారంబునన్+పొలుచు= మలయపర్వతంవలె ఒప్పుతున్న; కేతనంబు కూల్చి= ధ్వజాన్ని కూల్చి; గుఱ్ఱంబుల గీటు+అడంగించి= గుర్రాలగర్వాన్ని అణచి; సూతుప్రాణంబులుకొని= సారథిని చంపి; చాపంబు త్రుంచి= ధనువును విరిచి; తేరు తుఱుము చేసి= రథాన్ని ముక్కలు చేసి; అతండు= మలయకేతువు; పొలిపోని పౌరుషంబునన్= తగ్గని పౌరుషంతో; ప్రయోగించు+అస్త్రశస్త్రంబులన్= వేసే అస్త్రశస్త్రాలను; ఉఱక నఱికి= అవలీలగా నరికి; అగ్గము+ఐ ఉన్నను= అధికుడై ఉన్నను; కయ్యంబువలని వేడుకన్= యుద్ధమునందలి ఉత్సాహంతో; అతని సమయింపన్+ఒల్లక= అతడిని చంప పూనుకొనక; అరవాయి కొనిన ఆలోనన్= సంకోచపడినంతలో; పతితయోధంబు+అయిన= పడిన యోధులుగల- యోధులను పడగొట్టు;

సుకల్పితమాతంగంబున్+ఎక్కి= శ్రేష్ఠమైన ఏనుగు నధిరోహించి; ఆ ద్రవిడ+ఈశ్వరుండు= పాండ్యదేశపురాజు; గిరిశిఖరంబును+ అలంకరించు; కేసరి అట్లు+ఒప్పి= పర్వతశిఖరంమీద కూర్చున్న సింహంవలె ఒప్పుతూ; సామజంబును+ఉద్దామగతిన్+తఱిమి= ఏనుగును ఉద్దండంగా నడిపి; భీమ+అభిరామంబు+అయిన= భయంకరమూ రమ్యమూ ఐన; తోమరంబు వైచినన్= తోమరము అనే ఆయుధాన్ని వేయగా; మణిగణ+ఉజ్జ్వలంబు+అయిన= మణుల సమూహంతో గొప్పగా ప్రకాశించుచున్న; ఆ ద్రౌణి శిరోభూషణంబు= అశ్వత్థామ శిరస్సున ధరించిన ఆభరణం; ధరణిన్+పడినన్= నేలపై పడగా; ఆ+బలుమగండు= ఆ వీరుడు; త్రొక్కంబడిన భుజంగంబు పోలికన్+కనలి= తొక్కబడిన పామువలె కోపించి; తద్+పార్శ్వవర్తులన్+ఆర్వురు రథికవరులన్= మలయకేతువు ప్రక్కల ఉన్న ఆరుగురు వీరులను; తద్+వేదండంబు తుండంబును= ఆ ఏనుగు తొండమును; చరణచతుష్టయంబును= నాలుగుకాళ్ళను; ఆ+ మేదినీపతి= పాండ్యరాజు; పాదంబులున్+కరంబులు శిరంబునున్= పాదాలను, చేతులను, శిరస్సును; అతితీవ్ర భల్లంబులన్+ తునుమాడినన్= మిక్కిలి వాడి అయిన బల్లెములతో ఖండించగా; ఆ+దిక్కుమూఁకలు విచ్చెన్= ఆవైపున ఉన్న సైన్యాలు చెల్లాచెదరయినాయి; కురు భూవరుండు= దుర్యోధనుడు; ఆ+మహీసురవరున్+చేరన్+చని= అశ్వత్థామవద్దకు వెళ్ళి; అగ్గించెన్= ప్రశంసించాడు; అప్పుడు.

**తాత్పర్యం:** ఆ పాండ్యరాజు తన పరివార సామర్థ్యంవల్ల రథసమూహాలు కలిగినవాడై, వాయవ్యాస్త్రంతో ఆ బాణ సమూహాన్ని అడ్డుకొని, అశ్వత్థామ చక్రరక్షకులను సంహరించి, సింహనాదం చేశాడు. అప్పుడశ్వత్థామ అతడి సహచరులను నుగ్గుచేశాడు. రత్నాలతో నిండి, అగరు చందనవృక్షాలతో అందంగా ఉన్న మలయపర్వతం వలె శోభిల్లే అతడి రథకేతనాన్ని కూల్చాడు. రథాశ్వాలను చంపాడు. సారథి ప్రాణాలు తీశాడు. వింటిని త్రుంచాడు. రథాన్ని ముక్కలు ముక్కలు చేశాడు. ఆ పాండ్యరాజు తరుగని పౌరుషంతో ప్రయోగిస్తున్న శస్త్రాస్త్రాలను లెక్కపెట్టక, ముక్కలు చేసి తాను అతిశయించి ఉన్నా, ఇంకా అతడితో యుద్ధం చెయ్యాలన్న అభిలాషతో, అతడిని చంపటానికి ఇష్టపడక సంకోచిస్తుండగా - ఆ పాండ్యరాజు మలయధ్వజుడు, యోధులను పడగొట్టిన ఒక గొప్ప గజాన్ని అధిరోహించి, పర్వతశిఖరాన్ని అలంకరించిన సింహంవలె ప్రకాశించి, ఆ మదపుటేనుగును మహాతీవ్రవేగంతో అశ్వత్థామమీదికి తరిమాడు. భయంకరంగా, అందంగా ఉన్న తోమరాయుధాన్ని అతడిమీద ప్రయోగించాడు. ఆ దెబ్బకు మణులసమూహంతో ఎంతగానో ప్రకాశించే అశ్వత్థామ శిరోభూషణం నేలమీద పడేసరికి, ఆ మహావీరుడు తోక తొక్కబడిన సర్పంవలె ఆగ్రహించి, పాండ్యరాజు ప్రక్కనున్న ఆరుగురు రథికులను, ఆ ఏనుగుతొండాన్ని, దాని నాలుగుకాళ్ళను, ఆ పాండ్యరాజు పాదాలను, చేతులను, శిరస్సును తీవ్రాతితీవ్రాలైన బల్లేలతో త్రుంచాడు. అప్పుడు పాండవపక్షసైన్యాలు చెల్లాచెదరయ్యాయి. దుర్యోధనుడు అశ్వత్థామ దగ్గరకు వచ్చి అతడిని ప్రశంసించాడు. అప్పుడు......

**క. నిలు నిలు మని తమ మూఁకల । నిలిపి వృకోదరుఁడు గవిసె నీ బలములపైఁ**
**దలకొని ధృష్టద్యుమ్నా । దులు సంరంభోద్భటముగఁ దోడ్పడి రధిపా ! 324**

**ప్రతిపదార్థం:** వృకోదరుఁడు= భీముడు; నిలుమునిలుము+అని= ఆగుము ఆగుమని; తమ మూఁకలన్ నిలిపి= తమ సేనలను ఆపి; నీ బలములపైన్= నీ సైన్యాలపై; కవిసెన్= దూకాడు; ధృష్టద్యుమ్న+ఆదులు= ధృష్టద్యుమ్నుడు మొదలైనవారు; తలకొని= పూని; సంరంభ+ఉద్భటముగన్= ఉత్సాహం విజృంభించగా; తోడ్పడిరి+అధిపా!= సహాయపడ్డారు రాజా!

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! భీముడు తమ సేనలను ఆపి నీ సైన్యాన్ని ఎదుర్కొన్నాడు. ధృష్టద్యుమ్నాదులు విజృంభించిన ఉత్సాహంతో అతడికి అండగా నిలిచారు.

**క. వారల వడి కోర్వక య। క్కౌరవ సైన్యంబు దెరలఁ గర్ణుఁడు దర్ప**
**స్ఫారత నదల్చి నిలిపి యు। దారగతిన్ వైరిరథికతతి మార్కొనియెన్. 325**

**ప్రతిపదార్థం:** వారలవడికిన్+ఓర్వక= ఆ సేనలధాటికి నిలువలేక; ఆ+కౌరవసైన్యంబు తెరలన్= కౌరవసైన్యం చెదరగా; కర్ణుఁడు; దర్పస్ఫారతన్+అదల్చి నిలిపి= గర్వంయొక్క అతిశయంతో (వారిని) గద్దించి ఆపి; ఉదారగతిన్= గొప్పగా; వైరి రథికతతిన్ మార్కొనియెన్= శత్రువీరుల సమూహాన్ని ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** పాండవసైన్యం ధాటికి కౌరవసైన్యం నిలువలేకపోగా, కర్ణుడు గర్వాతిశయంతో గద్దించి వారిని ఆపి, గొప్పగ వైరి వీరులసమూహాన్ని ఎదుర్కొన్నాడు.

**వ. అతనికి బాసటయై యడరిన యశ్వత్థామచేతం బలువురు పాంచాలురు వొలిసిరి; కృష్ణుండు గ్రీడికిం బాండ్యమహీపతి సమయుట సూపి సమీరనందన కర్ణాదులగు నిరువాఁగు రథికుల పరాక్రమంబును వేఱువేఱ నిరూపించి చూపిన నతండును రథంబు మన సేనలోనికి బోవనిమ్మనిన నచ్యుతుం డట్ల చేయ నుబ్బిన పాండవానీకంబునకును రాధేయ గురుపుత్రుల రభసంబునం బేర్చిన మనమొనకును సంకుల సమరం బయ్యె; నం దాకర్ణునకు ధృష్టద్యుమ్నునకుం బరస్పర శరకర్తనంబును నితరేతర ఛ్ఛత్రకేతుఖండనంబును నన్యోన్య వర్మ విదారణంబును మిథశ్శరీర పాతనంబును నగు సంగ్రామంబు సెల్లె; నట్టియెడ నా సూతనందనునకుం దలకడచి గురునందనుండు ద్రుపదనందనుం గవిసి 'బ్రహ్మఘ్న! నిలు నిలు; మేను గలుగ నెట్లు బ్రదికెద'వని పలికి వెండియు. 326**

**ప్రతిపదార్థం:** అతనికిన్ బాసట ఐ అడరినన్= కర్ణుడికి అండగా నిలిచి విజృంభించిన; అశ్వత్థామ చేతన్= అశ్వత్థామచేత; పలువురు పాంచాలురు పొలిసిరి= చాలామంది పాంచాలవీరులు హతమైనారు; కృష్ణుండు= కృష్ణుడు; క్రీడికిన్= అర్జునుడికి; పాండ్యమహీపతి= పాండ్యరాజు; సమయుట చూపి= మరణించటం చూపి; సమీరనందన కర్ణాదులు+అగు= భీముడు, కర్ణుడు మున్నగు; ఇరువాగు రథికుల పరాక్రమంబును= రెండుపక్షాల వీరుల శౌర్యాన్ని; వేఱువేఱ నిరూపించి చూపినన్= విడమరిచి చెప్పగా; అతండును= అర్జునుడు; రథంబు మనసేనలోనికిన్ పోవన్+ఇమ్ము+అనినన్= రథాన్ని మన సైన్యం మధ్యకు తీసికొనివెళ్ళుము అనగా; అచ్యుతుండు+అట్లు చేయన్= కృష్ణుడు అట్లా చేయగా; ఉబ్బిన పాండవ+అనీకంబునకును= పొంగిపోయిన పాండవసైన్యానికీ; రాధేయ గురుపుత్రుల రభసంబునన్= కర్ణ అశ్వత్థామల ఉత్సాహంతో; పేర్చిన మన మొనకును= అతిశయించిన మన సైన్యానికీ; సంకుల సమరంబు+అయ్యెన్= తీవ్రయుద్ధం సాగింది; అందున్+ఆ కర్ణునకున్, ధృష్టద్యుమ్నునకున్= ఆ యుద్ధంలో కర్ణుడికీ, ధృష్టద్యుమ్నుడికీ; పరస్పర శరకర్తనంబునున్= ఒకరి బాణాలను ఇంకొకరు ఖండించటం; ఇతరేతర+ఛత్ర, కేతు; ఖండనంబునున్= ఒకరి ఛత్రధ్వజాలను మరొకరు ఖండించటం; అన్యోన్యవర్మ విదారణంబును= ఒకరి కవచాన్ని మరొకరు భేదించటం; మిథః శరీరపాతనంబునున్= పరస్పర దేహాలను పడవేయటం; అగు సంగ్రామంబు+చెల్లెన్= అయినట్టి యుద్ధం కొనసాగింది. అట్టి ఎడన్= ఆ సమయంలో; ఆ సూతనందనునకున్+తలకడచి= ఆ కర్ణుడిని దాటి; గురునందనుండు= అశ్వత్థామ; ద్రుపదనందనున్+కవిసి= ధృష్టద్యుమ్నుడిని తాకి; బ్రహ్మఘ్న!= బ్రాహ్మణహంతా!; నిలు నిలుము= ఆగుము; ఏను కలుగన్= నేనుండగా; ఎట్లు బ్రదికెదవు?= ప్రాణాలతో ఎట్లా జీవిస్తావు?; అని పలికి వెండియున్= అని ఇంకా.

**తాత్పర్యం:** అశ్వత్థామ కర్ణుడికి బాసటగా నిలిచి పలువురు పాంచాలవీరులను హతమార్చాడు. కృష్ణుడు అర్జునుడికి పాండ్యరాజు మరణాన్ని గురించి, భీముడు, కర్ణుడు మొదలైన ఇరుపక్షాల వీరుల బలాబలాలగురించి చెప్పగా,

అర్జునుడు రథాన్ని మనసైన్యం మధ్యకు (అంటే కౌరవసైన్యం మధ్యకు) తీసికొనివెళ్ళుమని కోరాడు. అర్జునుడిని చూచి పాండవసైన్యం, కర్ణ అశ్వత్థామలను చూచి కౌరవసైన్యం పొంగిపోయి తీవ్రంగా తలపడ్డాయి. కర్ణ ధృష్టద్యుమ్నుల మధ్య పరస్పరం బాణాలు వేసికొని ఛత్ర, ధ్వజాలను, కవచాలను ఖండించుకొని దేహాలను గాయపరచుకోవటం వంటి యుద్ధం జరిగింది. అంతలో అశ్వత్థామ కర్ణుని దాటి ధృష్టద్యుమ్నుడిని ఎదుర్కొని 'బ్రాహ్మణహంతా! నేనుండగా నీవు ప్రాణాలతో ఎట్లా బయటపడగలవు?' అని పలికి, ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. మాతండ్రియెడం జేసిన । పాతకముకతంబు గాఁగఁ బాంచాల నిక్రృ**
**ష్టా! తునిమెద నిను నరుఁ డిట । కేతేరకయున్నఁ బాఱ కీవు నిలిచినన్.' 327**

**ప్రతిపదార్థం:** పాంచాల నికృష్టా!= నీచుడవైన పాంచాలుడా!; మా తండ్రి ఎడన్+చేసిన పాతకము= నా తండ్రిఅయిన ద్రోణుడిపట్ల నీవుచేసిన పాపం; కతంబుకాఁగన్= కారణంగా; నరుఁఁడు+ఇటకున్+ఏతేరక+ఉన్నన్= అర్జునుడు ఇటకు రాకుంటే; ఈవు పాఱక నిలిచినన్= నీవు పారిపోకుండా ఉంటే; నినున్ తునిమెదన్= నిన్ను చంపుతాను.

**తాత్పర్యం:** నీచుడవైన ఓ ధృష్టద్యుమ్నా! అర్జునుడు ఇటకు రాకుండా, నీవు పారిపోకుండా ఉంటే నీవు మా తండ్రి పట్ల చేసిన పాపానికి నిన్ను చంపకుండా వదిలిపెట్టను.'

**వ. అన విని ధృష్టద్యుమ్నుం డతని కిట్లనియె. 328**

**ప్రతిపదార్థం:** అనన్+విని= అశ్వత్థామ మాటలు విని; ధృష్టద్యుమ్నుండు= ధృష్టద్యుమ్నుడు; అతనికిన్+ఇట్లు+అనియెన్= అతడితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ మాటలకు ధృష్టద్యుమ్నుడు అతడితో ఇట్లా అన్నాడు:

**క. 'మీ తండ్రి కుఱికి నఱికిన । హేతియ నీ కొఱకు నునిచితిపుడ నఱుకుదున్**
**నీ తులువపలుకులకు నీ । డై తోఁచిన యుత్తరంబు నదియ దురాత్మా!' 329**

**ప్రతిపదార్థం:** దురాత్మా!= నీచుడా!; మీ తండ్రి కుఱికి నఱికిన= మీ తండ్రి అయిన ద్రోణునిమీదికి ఉరికి నరికిన; హేతియ= ఖడ్గాన్నే; నీ కొఱకున్+ఉనిచితిన్= నీ కొరకు దాచిపెట్టాను; ఇపుడ నఱుకుదున్= ఇప్పుడే నిన్ను చంపుతాను; నీ తులువ పలుకులకును= నీ కుత్సితవాక్కులకు; ఈడై తోచిన ఉత్తరంబున్+అదియ= సరియైన సమాధానం అదే.

**తాత్పర్యం:** "ఓ దురాత్ముడా! నీ తండ్రి ద్రోణుడి తలను సరికిన ఖడ్గాన్నే నీ కొరకు కూడా దాచాను. ఇప్పుడే నిన్ను చంపుతాను. నీ కుత్సితపు మాటలకు సరి అయిన సమాధానం అదే".

**వ. అని యంత నిలువక. 330**

**తాత్పర్యం:** అని అంతటితో ఆగక.

**తే. 'వినుము బ్రహ్మఘ్నుఁ డన నీకు జనునె? బ్రాహ్మ । ణ బ్రువఘ్నుఁడ నై సమున్నతి వహించు**
**నన్నుఁ గిల్బిషపరుఁ డను నిన్ను జనకు । కడకుఁ బుచ్చెద వేగిరపడక నిలుము.' 331**

**ప్రతిపదార్థం:** వినుము; బ్రహ్మఘ్నుఁడు+అనన్ నీకున్+చనునె?= నన్ను బ్రాహ్మణ హంతవనటం నీకుతగునా?; బ్రాహ్మణ బ్రువఘ్నుఁడను+ఐ= బ్రాహ్మణుడు గాకపోయినా, బ్రాహ్మణుడనని చెప్పుకొంటున్న వాడిని సంహరించినవాడనై; సమున్నతి వహించునన్నున్= ఆధిక్యం పొందిన నన్ను; కిల్బిషపరుఁడు+అను నిన్నున్= పాపాత్ముడవని పలికే నిన్ను; జనకుకడకున్+ పుచ్చెదన్= నీ తండ్రివద్దకు పంపిస్తాను; వేగిరపడక నిలుము= తొందరపడక నిలబడుము.

**తాత్పర్యం:** నన్ను బ్రహ్మఘ్నుడనటం నీకు తగునా? బ్రాహ్మణుడు గాకపోయినా బ్రాహ్మణుడనని చెప్పుకొంటున్న వాడిని సంహరించిన గొప్పవాడినైన నన్ను పాపాత్ముడనంటున్నావు. నిన్ను చంపి నీ తండ్రివద్దకు పంపిస్తాను. తొందరపడకు.'

**విశేషం:** క్షాత్రధర్మం అవలంబించిన ద్రోణాచార్యుడు బ్రాహ్మణుడు కాడని, బ్రాహ్మణబ్రువుడు మాత్రమేనని, అతడిని సంహరించటం పాపం కాదని ధృష్టద్యుమ్నుడు తనను సమర్థించుకొన్నాడు.

**వ. అనియె నట్లయ్యిరువురు నొండొరులం బరుషంబులు పలికి తలపడి వియత్తలంబు విశిఖ శిఖా కలాపంబులం గప్పిరి రాధేయుండు యుధామన్యు నుత్త మౌజో ద్రౌపదేయ శైనేయులను మఱియుం జేయంగల పాండవ పాంచాల యోధులను బొదివి భండనంబు సేయుచుండె; నా ధృష్టద్యుమ్నుండు గురుపుత్రు కోదండంబు దుండంబులు సేసినం గుపితుండై యొండు విల్లుగొని యవ్వీరుండు. 332**

**ప్రతిపదార్థం:** అనియెను= అన్నాడు; అట్లు+ఆ+ఇరువురున్= ఆ విధంగా ఇద్దరూ; ఒండు+ఒరులన్= ఒకరినొకరు; పరుషంబులు పలికి= నిందించుకొని; తలపడి= పోరాడి; వియత్తలంబు= ఆకాశాన్ని; విశిఖ, శిఖా, కలాపంబులన్+కప్పిరి= బాణజ్వాలా సమూహంతో కప్పారు; యుధామన్యున్+ఉత్తమౌజున్+ద్రౌపదేయ, శైనేయులను= యుధామన్యుడు ఉత్తమౌజుడు ఉపపాండవ శిని వంశీయులను; మఱియున్= ఇంకనూ; చేయన్+కల పాండవ, పాంచాల యోధులను= ఇంకా బలశాలురైన పాండవ, పాంచాలవీరులను; రాధేయుండు= కర్ణుడు; పొదివి భండనంబు చేయుచుండెన్= తాకి యుద్ధం చేయసాగాడు; ఆ ధృష్టద్యుమ్నుండు= ఆ ధృష్టద్యుమ్నుడు; గురుపుత్రు కోదండంబు= అశ్వత్థామ విల్లును; తుండంబులు+చేసినన్= ముక్కలు చేయగా; ఆ+వీరుండు= అశ్వత్థామ; కుపితుండు+ఐ= కోపించి; ఒండు విల్లుకొని= మరొక విల్లు తీసికొని.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు ఆ విధంగా అనగా ఆ యిద్దరూ ఒకరినొకరు నిందించుకొంటూ బాణ పరంపరలతో ఆకాశాన్ని కప్పారు. యుధామన్యు ఉత్తమౌజులను, ఉపపాండవ శైనేయులను, పాంచాల పాండవ వీరులను కర్ణుడు ఎదుర్కొని యుద్ధం చేశాడు. ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామ విల్లును విరువగా అతడు కోపించి వేరొక విల్లును గైకొని. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. సూత తురంగ స్యందన । కేతన చాపములు నఱికి కేలిమెయిన్ ను**
**గ్గైతొరఁగ నేసెఁ దోడ్తో । నాతత శక్తియును గదయు నతఁ డెత్తంగన్. 333**

**ప్రతిపదార్థం:** సూత తురంగ స్యందన కేతన చాపములు నఱికి= సారథిని, గుర్రాలను, రథాన్ని, ధ్వజాన్ని, ధనువును నరికి; ఆతత శక్తియును గదయును= పొడవైన బల్లెమును, గదను; అతడు+ఎత్తంగన్= ధృష్టద్యుమ్నుడు చేబట్టగా; తోడ్తోన్= వెంటనే; కేలిమెయిన్= అవలీలగా; నుగ్గు+ఐ తొరఁగన్+ఏసెన్= అవి చూర్ణమయ్యేటట్లుగా బాణాలు వేశాడు.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడి సారథిని, రథాన్ని, అశ్వాలను, ధ్వజాన్ని, ధనువును ఖండించి, అతడు గద, బల్లెములు తీసికొనగా వాటిని కూడా అవలీలగా త్రుంచివేశాడు.

**వ. అప్పాంచాలోత్తముండు వాలునుం బలుకయుం గొని కవియం గడంగిన నవియును దుమురు సేసి పెల్లేసి పడకున్న నశ్వత్థామ వేగిరపడి వెఱఁగందుచుఁ జేతి బాణాసనంబు విడిచి కృపాణంబు గొని భుజంగంబు దెస కడరు విహంగపతి విధంబునఁ జనుట సూచి సవ్యసాచితో శౌరి ధృష్టద్యుమ్నుండు గురుపుత్రు బారింబడియెం గావవలయు ననుచు నద్దిక్కు సూపిన నతండు సత్వరుండై యవ్వీరుం డా ద్రుపదపుత్రుం గవిసిన కొలందిఁ గ్రూరంబు లగు నారాచంబులు గుప్పించి నొప్పించిన నమ్మహీసురవరుం డయ్యుత్సాహంబు వదలి మరలి యరదంబున కరుగ సహదేవుండు దన తేరిపైకి నప్పార్షతుం దిగిచికొని తొలంగం గొనిపోయె నక్కుంభసంభవ సంభవుం డగ్గాండీవి మార్కొని పెనంగి బెట్టిదంబుగాఁ గనుకనిం దాఁకి యతండు నాటిన సునిశిత శరంబున సోలె; సారథి రథం బొండు వలనికిం దోలె నర్జునుం డట్లు నిజసేనానాథు రక్షించి ద్రోణి మదం బడఁగించుట గనుంగొని కౌంతేయ సైనికులు సింహనాదంబులు సేయ నక్కడ నిస్సాణాదుల నాదం బెసంగి నింగి నిండిన. 334**

**ప్రతిపదార్థం:** ఆ+పాంచాల+ఉత్తముండు= ఆ ధృష్టద్యుమ్నుడు; వాలునున్+పలుకయున్+కొని= కత్తి డాలు గైకొని; కవియన్+కడంగినన్= యుద్ధానికి పూనుకొనగా; అశ్వత్థామ; అవియును తుమురుచేసి= వాటిని కూడా పొడిగాచేసి; పెల్లు+ఏసి పడకున్నన్= పెక్కుబాణాలు వేసినా చలించనందువలన; వేగిరపడి వెఱఁగు+అందుచున్= భయంతో త్వరపడి; చేతిబాణాసనంబు విడిచి= చేతిలోని విల్లును వదలి; కృపాణంబు కొని= ఖడ్గాన్ని పూని; భుజంగంబు దెసకున్+అడరు= పాము ఉన్న వైపునకు వెళ్ళు; విహంగపతి విధంబునన్= గరుత్మంతుడి వలె; చనుట చూచి= వెళ్ళగా చూచి; సవ్యసాచితోన్= అర్జునుడితో; శౌరి= కృష్ణుడు; ధృష్టద్యుమ్నుండు; గురుపుత్రు బారిన్+పడియెన్= అశ్వత్థామ చేతిలో చిక్కాడు; కావవలయును+అనుచున్= కాపాడాలి అంటూ; ఆ+దిక్కు చూపినన్= ఆ వైపు చూపగా; అతండు సత్వరుండు+ఐ= అర్జునుడు వేగిరంగా; ఆ+వీరుండు= ఆ అశ్వత్థామ; ఆ ద్రుపద పుత్రున్+కవిసిన కొలందిన్= ధృష్టద్యుమ్నుడిని తాకినకొద్దీ; క్రూరంబులు+అగు నారాచంబులు గుప్పించి= వాడి అయిన బాణాలు వేసి; నొప్పించినన్= బాధించగా; ఆ+మహీసురవరుండు= ఆ అశ్వత్థామ; ఆ+ఉత్సాహంబు వదలి= పూనిక మాని; మరలి అరదంబునకున్+అరుగన్= వెనుదిరిగి రథంమీదికి వెళ్ళగా; సహదేవుండు= సహదేవుడు; ఆ పార్షతున్= ఆ ధృష్టద్యుమ్నుని; తన తేరిపైకిన్= తన రథంమీదికి; తిగిచికొని= లాగికొని; తొలంగన్+కొనిపోయెన్= అక్కడినుండి తీసికొనివెళ్ళాడు; ఆ+కుంభసంభవ, సంభవుండు= అశ్వత్థామ; ఆ+గాండీవిన్ మార్కొని పెనంగి= అర్జునుడిని ఎదుర్కొని పోరి; బెట్టిదంబుగాన్+కనుకనిన్+తాకి= తీవ్రంగా సంభ్రమంతో తాకి; అతండు నాటిన= అర్జునుడు వేసిన; సునిశిత శరంబునన్= పదునైన బాణంతో; సోలెన్= పడిపోయాడు; సారథి= అశ్వత్థామ రథసారథి; రథంబు+ఒండు వలనికిన్+తోలెన్= రథాన్ని వేరొకవైపు తరలించాడు; అర్జునుండు+అట్లు, నిజసేనా నాథు రక్షించి= అర్జును డావిధంగా తమ సేనాపతిని కాపాడి; ద్రోణిమదంబు+అడంగించుట కనుంగొని= అశ్వత్థామ గర్వాన్ని అణచటం చూచి; కౌంతేయ సైనికులు= పాండవసైనికులు; సింహనాదంబులు+చేయన్= బిగ్గరగా అరవగా; అక్కడన్= ఆ ప్రదేశంలో; నిస్సాణ+ఆదుల నాదంబు+ఎసంగి= తప్పెటలు మొదలైన యుద్ధవాద్యాల ధ్వనులు వ్యాపించి; నింగి నిండినన్= గగనభాగం నిండగా.

**తాత్పర్యం:** ధృష్టద్యుమ్నుడు కత్తి, డాలు గైకొని రాగా అశ్వత్థామ వాటిని కూడ ఖండించాడు. అనేక బాణాలు వేసినా లొంగని అతడిపైకి ధనుస్సును వదలి పాములపైకి దూకి వచ్చే గరుడుడి వలె ఖడ్గంతో విజృంభించాడు. కృష్ణుడు,

ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామ బారినపడ్డాడు రక్షించుమని అర్జునుడికి చెప్పగా క్రూరబాణాలు వేసి అతడు అశ్వత్థామను నొప్పించాడు. దానికి తట్టుకొనలేక అశ్వత్థామ రథంపైకి వెళ్ళగా, సహదేవుడు ధృష్టద్యుమ్నుడిని తన రథంమీదికి లాగికొని ప్రక్కకు తీసికొని వెళ్ళాడు. అశ్వత్థామ అర్జునుడిని ఎదుర్కొని అతడి బాణానికి మూర్ఛపడిపోగా సారథి రథాన్ని మరలించాడు. అశ్వత్థామ గర్వాన్ని అణచి తమ సేనాధిపతిని కాపాడిన అర్జునుడిని చూచి పాండవ సైనికులు సింహనాదాలు చేశారు. యుద్ధవాద్యధ్వనులు గగనభాగం నిండాయి.

**విశేషం:** అలం: ఉపమ.

**తే. సూతసుతుఁడు ధనంజయుఁ జూచి రోష । కలుషితాక్షుఁ డై తలపడఁ దలఁచె నపుడు**
**తత్‌క్షణమున సంశప్తక తతియుఁ దోఁచె; । రెండుఁ గని యిట్టు లనియె నా క్రీడి హరికి. 335**

**ప్రతిపదార్థం:** సూతసుతుఁడు= కర్ణుడు; ధనంజయున్ చూచి= అర్జునుడిని చూచి; రోష కలుషిత+అక్షుఁడు+ఐ= క్రోధంచేత ఎర్రబడిన కనులు కలవాడై; తలపడన్ తలఁచెన్+అపుడు= అతడితో యుద్ధానికి, సిద్ధమైనాడు; తత్‌క్షణమునన్= అప్పుడే; సంశప్తక తతియున్+తోఁచెన్= త్రిగర్తవీరులు కూడా గోచరించారు; రెండున్+కని= వాళ్ళను ఇరువురిని చూచి; ఆ క్రీడి= అర్జునుడు; హరికిన్= కృష్ణుడితో; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** కర్ణుడు క్రోధపూరితుడై అర్జునుడితో యుద్ధానికి సిద్ధమైనాడు. అప్పుడే త్రిగర్తవీరులు కూడా ముందుకు వచ్చారు. వాళ్ళను ఇద్దరినీ చూచి అర్జునుడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు:

**వ. 'కర్ణుండు మనల మార్కొనం గడంగెడు సంశప్తకులు గ్రుమ్మఱం బొదివిరి; కర్ణుచేతం దగులుపడితిమేని సంశప్తకుల కోహటించిన వార మగుదుము వారల దిక్కు దేరు పోవనిమ్ము.' 336**

**ప్రతిపదార్థం:** కర్ణుండు= కర్ణుడు; మనల మార్కొనన్+కడంగెడున్= మనలను ఎదుర్కొనటానికి పూనుకొన్నాడు; సంశప్తకులు= త్రిగర్తీయులు; క్రుమ్మఱన్+పొదివిరి= తిరిగి చుట్టుముట్టారు; కర్ణుచేతన్+తగులుపడితిమి+ఏనిన్= కర్ణుడి చేతిలో పడితే; సంశప్తకులకున్; ఓహటించినవారము+అగుదుము= ఓడిపోయినవారం అవుతాం; వారల దిక్కు తేరుపోవన్+ఇమ్ము= రథం వాళ్ళవైపు పోనిమ్ము.

**తాత్పర్యం:** 'ఒకవైపు కర్ణుడు, మరొకవైపు సంశప్తకులు తలపడబోతున్నారు. కర్ణుడిని ఎదుర్కొంటే, సంశప్తకులకు ఓడినవారం అవుతాం కాబట్టి ముందు వారివైపు తేరు పోనిమ్ము'.

**చ. అన విని యట్ల చేసె నతఁ డర్జునుఁ డా రిపుకోటి ముట్టి యే**
**పున నుఱుమాడుచుండెఁ గురుభూవర! యప్పుడు ధర్మసూతనం**
**దనులు సముద్ధతిం గడఁగ దందడి క్రొత్తగ వారి సేనయున్**
**మన మొనయం బెనంగె నుపమా రహితంబగు విక్రమంబునన్. 337**

**ప్రతిపదార్థం:** కురుభూవర!= ధృతరాష్ట్ర మహారాజా!; అన విని= అర్జునుడి మాటలు విని, అతడు= ఆ కృష్ణుడు; అట్లచేసెన్= అట్లాగే చేశాడు. అర్జునుఁడు+ఆ, రిపుకోటిన్, ముట్టి= అర్జునుడు ఆ శత్రువులను తాకి; ఏపునన్, నుఱుమాడుచుండెన్= దర్పంతో నుగ్గుచేయసాగాడు; అప్పుడు; ధర్మసూతనందనులు= ధర్మరాజు, కర్ణుడు; సముద్ధతిన్+కడఁగన్= ఉత్సాహంతో

తలపడగా; వారిసేనయున్ మన మొనయున్= వారి సైన్యం, మనసైన్యం; ఉపమారహితంబు+అగు విక్రమంబునన్= సాటిలేని పరాక్రమంతో; దందడి క్రొత్తగన్= యుద్ధం అపూర్వంకాగా; పెనంగెన్= పోరు సలిపాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడి మాటలు విని, కృష్ణుడు సంశప్తకులవైపు రథం మరల్చాడు. అర్జునుడు శత్రువులను నుగ్గు చేయసాగాడు. అప్పుడు కర్ణుడు, ధర్మరాజు తలపడగా ఇరుసేనలూ పరాక్రమంతో అపూర్వరీతిలో విజృంభించాయి.

**ఉ. సంగర మేను బెక్కు దివసంబులు సూచితిఁ గాని యెప్డు నా**
**భంగి మునుంగ దచ్చెరువుపాటునఁ జిత్తము వోరు చున్కియో**
**త్రుంగుచు నున్కియో యెఱుఁగఁ దూలక పైపయిఁ గ్రమ్ముఁ గూలు సే**
**నాంగములందు నిందుఁ గలహంబు మహోగ్రత యేమి సెప్పుదున్! 338**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; సంగరము= యుద్ధం; పెక్కు దివసంబులు చూచితిన్+కాని= ఎన్నో రోజులు చూచాను కాని; ఎప్డున్= ఎప్పుడూ; ఆ భంగిన్= ఆ విధంగా; చిత్తము= మనసు; అచ్చెరువుపాటునన్= ఆశ్చర్యంతో; మునుంగదు= మునుగలేదు; అందున్+ఇందున్= రెండు పక్షాలలోనూ; సేనా+అంగములు= రథ, గజ, తురగ, పదాతులు; పోరుచున్+ఉన్కియో= పోరుతున్నాయో; త్రుంగుచున్+ఉన్కియో= నశిస్తున్నాయో; ఎఱుఁగన్= తెలియుటంలేదు; తూలక= తొలగకుండా; పైపయిన్+క్రమ్మన్= మీదిమీదికి శత్రుసైన్యాన్ని క్రమ్ముతాయి; కూలు= పడిపోయాయి; కలహంబు మహా+ ఉగ్రత= ఆ యుద్ధతీవ్రతను; ఏమి చెప్పుదున్!= ఏమని చెప్పాలి?

**తాత్పర్యం:** ఎన్నో రోజులు యుద్ధాన్ని చూచానుగాని, ఎప్పుడూ ఆ విధంగా నా మనస్సు ఆశ్చర్యంతో మునుగలేదు. చతుర్విధ సేనాంగాలు ఇరుపక్షాల్లో పోరాడుతున్నాయో, నశిస్తున్నాయో నా కర్థంకాలేదు. వెనుకాడకుండ ఒకదాని నొకటి క్రమ్ముకొంటున్నాయి. పడిపోతున్నాయి. ఆ యుద్ధతీవ్రతను ఏమని చెప్పేది?

### కర్ణుఁడు పాంచాల సైన్యంబు దైన్యంబు నొందించి విజృంభించుట (సం.8-57-1 (కుంభ))

**తే. అందుఁ బాంచాల వీరుల నశ్వసూత । రథ సమేతంబుగా నంగరాజు దర్ప**
**మెసఁగ నేవురఁ బదువుర నేడ్వురను మ । హాస్య మార్గణములఁ దునుమాడె నధిప! 339**

**ప్రతిపదార్థం:** అధిప!= ధృతరాష్ట్ర మహారాజా!; అంగరాజు= కర్ణుడు; దర్పము+ఎసఁగన్= గర్వమొప్పగా; అందున్= ఆ యుద్ధంలో; పాంచాలవీరులను= పాంచాలవీరుల్ని; ఏవురన్+పదువురన్+ఏడ్వురన్= ఐదుగురిని, పదుగురిని, ఏడుగురిని; అశ్వసూతరథ సమేతంబుగాన్= అశ్వాలు సారథి రథములతో కూడా; మహా+ఆస్యమార్గణములన్= గొప్పముఖాలు గల బాణాలతో; తునుమాడెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఆ యుద్ధంలో కర్ణుడు పరాక్రమాతిశయంతో పాంచాలవీరులు పలువురిని రథాశ్వ సారథులతో సహా విశాలముఖ బాణాలతో వధించాడు.

**క. పదపడి పాండవ యోధు । ల్వోదివినఁ బెనుఁదుంగ మడువులో గజపతి యు**
**న్మదవృత్తిఁ గేలిసలుపు ప । గిది నాతఁడు పోరె సురలు కీర్తన సేయన్. 340**

**ప్రతిపదార్థం:** పదపడి= తర్వాత; పాండవ యోధులు+పొదిలినన్= పాండవవీరులు చుట్టుముట్టగా; పెనుతుంగ మడువులో= పెద్ద పొడవైన కొలనులో; గజపతి= గజరాజు; ఉన్మదవృత్తిన్= ఉన్మాదంతో; కేలిసలుపు పగిదిన్= క్రీడించేవిధంగా; సురలు కీర్తన+చేయన్= దేవతలు పొగడునట్లుగా; ఆతఁడు పోరెన్= కర్ణుడు యుద్ధం చేశాడు.

**తాత్పర్యం:** పాండవయోధులు తనపైకి రాగా, కర్ణుడు మదగజం పెద్దకొలనులో క్రీడించేవిధంగా దేవతలు ప్రశంసించగా రణవిహారం చేశాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అట్టియెడ.** **341**

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**చ. ద్రుపద తనూజులుం గవలు ద్రోవది పుత్రులు శౌరితమ్ముఁడుం**
**గుపితమనస్కులై బలుపుఁ గోల్తలఁ దాకి; రతం డదల్చి యు**
**గ్రపు రభసంబునన్ శరపరంపరలం బరఁగించెఁ గౌరవా**
**ధిపు హృదయంబు మోదమునఁ దేలఁగ నందఱ యంగకంబులన్.** **342**

**ప్రతిపదార్థం:** ద్రుపద తనూజులున్= పాంచాలురు; కవలు= నకుల సహదేవులు; ద్రోవది పుత్రులు= ఉపపాండవులూ; శౌరి తమ్ముఁడున్= సాత్యకియూ; కుపితమనస్కులు+ఐ= కోపించిన మనస్సుకలవారై; బలుపు+కోల్తలన్+తాఁకిరి= బలంతో ఎదురుగా నిలచి తాకారు; అతండు= కర్ణుడు; అదల్చి= వారిని అడ్డగించి; కౌరవ+అధిపుహృదయంబు= దుర్యోధనుడి చిత్తం; మోదమునన్+తేలఁగన్= ఆనందంలో తేలగా; ఉగ్రపు రభసంబునన్= భయంకర సంభ్రమంతో; అందఱ అంగకంబులన్= అందరి అవయవాలలో; శరపరంపరలన్+పరఁగించెన్= బాణాలవరుసను కురిపించాడు.

**తాత్పర్యం:** పాంచాలవీరులు, నకుల సహదేవులు, ఉపపాండవులు, సాత్యకి ఆగ్రహించి తన ఎదురుగా నిల్చి, బలంతో తలపడగా కర్ణుడు వారి అంగాలలో బాణపరంపరలు నాటి దుర్యోధనుడికి ఆనందం కలిగించాడు.

**వ. వారలపై నక్కురుభూనాథుం డేనుఁగు కయ్యంబునకు వెరవు గల కళింగ వంగాంగ మగధ సుహ్మపౌండ్రాది దేశంబుల బలంబులం గవియించిన నవి తదీయ చతురంగ బలంబుల మట్టి మల్లాడి చిత్రవధ విహారంబు సలుప నగ్గజ ప్రధాన సేన లగ్గలికం జించి చెండాడుచు నా దండి మగలును జేకితాన ప్రభద్రకులును రౌద్రరసంబునం బెనఁచినఁ గనుంగొని మదంబునం బొదలి యొత్తరించి యురవడించిన.** **343**

**ప్రతిపదార్థం:** ఆ+కురు భూనాథుండు= దుర్యోధనుడు; ఏనుఁగు కయ్యంబునకున్+వెరవుకల= గజయుద్ధంలో ఆరితేరిన; కళింగ వంగ+అంగ మగధ సుహ్మపౌండ్ర+ఆది దేశంబుల బలంబులన్= కళింగ వంగ అంగ మగధ సుహ్మపౌండ్ర దేశాల సైన్యాలను; వారలపైన్= శత్రువులపై; కవియించినన్= పురికొల్పగా; అవి= ఆ సైన్యాలు; తదీయ చతురంగ బలంబులన్= వారి సేనాంగాలను; మట్టి మల్లాడి= తీవ్రంగా పెనుగులాడి; చిత్రవధ విహారంబు సలుపన్= చిత్రవధ చేయగా; ఆ+గజప్రధాన సేనలు= వారి గజసైన్యాలు; అగ్గలికన్+చించి చెండు+ఆడుచున్= అతిశయంతో చీల్చి చెండాడుతూ; ఆ దండిమగలును=

ఆ పాండవవీరులును; చేకితాన ప్రభద్రకులును= చేకితానుడు, ప్రభద్రకుడును; రౌద్రరసంబునన్+పెనఁచినన్= క్రోధావేశంతో పోరాడగా; కనుంగొని= చూచి; మదంబునన్+పొదలి= మదంతో ఉప్పొంగి; ఒత్తరించి ఉరవడించినన్= ఆక్రమించి వేగిరంపగా.

**తాత్పర్యం:** దుర్యోధనుడు గజసైన్యంతో కూడిన కళింగ, అంగ, వంగ, మగధ, పౌంద్రక, సుహ్మదేశ వీరులను పాండవులపైకి పురిగొల్పగా, వారు పాండవసేనలోని చతురంగాలను త్రొక్కి చిత్రవధ చేస్తూ చెండాడారు. పాండవ యోధులు చేకితాన ప్రభద్రకులు క్రోధంతో ఎదుర్కొనగా ఆ గజసైన్యాలు మదంతో ఉప్పొంగి వారిని ఆక్రమించి సంభ్రమం కలిగించాయి.

**శా. వంగాధీశుఁ గరీంద్రుతో నడఁగ గర్వస్ఫూర్తి శైనేయుఁ డే**
**యం గేలీగతి మాద్రి లేఁగొడుకు పౌండ్రాధీశ్వరుంగిట్టి యా**
**భంగిం గూల్పఁ దదగ్రజుం డటుల దర్పం బొప్ప సుహ్మాధి నా**
**థుం గోపంబునఁ ద్రుంప నేచెఁ గరటిస్తోమంబు లంతంతకున్. 344**

**ప్రతిపదార్థం:** శైనేయుఁడు= సాత్యకి; వంగాధీశున్= వంగరాజును; కరి+ఇంద్రుతోన్+అడఁగన్= గజశ్రేష్ఠంతోపాటు అణచుతూ; గర్వస్ఫూర్తిన్= గర్వం ఒప్పగా; ఏయన్= బాణాలు వేయగా; మాద్రి లేఁత+కొడుకు= సహదేవుడు; కేలీగతిన్= అవలీలగా; పౌండ్ర+అధీశ్వరున్+కిట్టి= పౌండ్రరాజును సమీపించి; ఆ భంగిన్+కూల్పన్= ఆ విధంగా చంపగా; తద్+అగ్రజుండు= నకులుడు; అటుల దర్పంబు+ఒప్పన్= అలా గర్వమొప్పగా; సుహ్మ+ఆధినాథున్= సుహ్మదేశరాజును; కోపంబునన్+త్రుంపన్= క్రోధంతో వధించగా; కరటి, స్తోమంబులు= ఏనుగుల సమూహాలు; అంత+అంతకున్= మరింతగా; ఏచెన్= విజృంభించాయి.

**తాత్పర్యం:** సాత్యకి బాణాలు వేసి వంగరాజును గజంతోపాటు అణచగా, సహదేవుడు పౌండ్రరాజును, నకులుడు, సుహ్మరాజును వధించగా ఏనుగుల సమూహాలు వారిపైకి విజృంభించాయి.

**క. విను మ ట్లేచి నకులుఁ బొది । వె నుదగ్రధ్వని ననేక వేదండములం**
**దెనిమిదిటిఁ గూల్చె బాణము । లెనిమిది యెనిమిదులఁ దమ్ముఁ డేడ్తెర నధిపా! 345**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; వినుము= విను; అనేక వేదండములు= పెక్కు ఏనుగులు; అట్లు+ఏచి= అట్లా చెలరేగి; ఉదగ్రధ్వనిన్= పెద్ద అరుపులతో; నకులున్+పొదివెన్= నకులుడిని చుట్టుముట్టాయి; తమ్ముఁడు+ఏడ్తెఱన్= సహదేవుడు పరాక్రమించి; బాణములు+ఎనిమిది ఎనిమిదులన్= ఎనిమిది ఎనిమిది బాణాలతో; అందున్= వాటిలో; ఎనిమిదిటిన్+కూల్చెన్= ఎనిమిది గజాలను చంపాడు.

**తాత్పర్యం:** రాజా! వినుము. పలు ఏనుగులు ఆ విధంగా చెలరేగి పెద్ద ధ్వనులతో నకులుడిని చుట్టుముట్టగా, సహదేవుడు ఎనిమిది బాణాలు వేసి వాటిలో ఎనిమిది ఏనుగులను వధించాడు.

**క. ఆ ధృష్టద్యుమ్నాదులు । గ్రోధాంధత నడరి యేనుఁగుల నస్త్రహతిన్**
**వ్యాధూతములుగఁ జేయుచు । రాధేయుం గదియ సంగరము పేర్చె నృపా! 346**

**ప్రతిపదార్థం:** నృపా= రాజా!; ఆ ధృష్టద్యుమ్న+ఆదులు= ధృష్టద్యుమ్నుడు మొదలైన వీరులు; క్రోధ+అంధతన్+అడరి= కోపమనే చీకటితో పూనుకొని; ఏనుఁగులన్= ఆ ఏనుగులను; అస్త్రహతిన్= అస్త్రముల తాకిడితో; వ్యాధూతములుగన్+

చేయుచున్= ఎగురకొట్టబడినవానినిగా చేయుచు; రాధేయున్+కదియన్= కర్ణుడిని తాకగా; సంగరము పేర్చెన్= యుద్ధం తీవ్రం అయింది.

**తాత్పర్యం:** రాజా! ధృష్టద్యుమ్నాదులు కోపించి అస్త్రాలతో ఏనుగులను కూల్చి కర్ణుడిని ఎదుర్కొనగా యుద్ధం తీవ్రమైనది.

**వ. ఆ సమయంబున శోణితంబు పెల్లున మున్నెగసిన రేణు వడంగిన నిరువాఁగు సైనికులును దమతమ యడియాలంబులతోడి గొడుగులును సిడంబులును బెద్దయు మెఱయఁ బెనంగుచుండ సంశప్తక సంచయంబు గించిదవశిష్టంబుగా నష్టంబుసేసిన సవ్యసాచికి శౌరి యక్కౌరవ పాండవ బలంబుల పోరు సూపి యప్పుడు దుర్యోధనుండు దనయందుఁ జేయంగలవారును దానును ధర్మనందనుం బట్టు తలంపున బెట్టు పొదువుటయు నమృతంబున కాసపడి యడరు నసురుల మరల్చు శక్రాగ్నుల చందంబున భీమసేనుండును సాత్యకియు వారలం బ్రతిహతులం జేయుటయు, నంత నిలువక యక్కురువిభుండును గర్ణ కృపాశ్వత్థామలును నుద్దామగతి నియ్యిరువుర శరజాలంబుల నమ్ముల జడియుచుం గదిసి యక్కొంతేయాగ్రజు కంకటంబు ద్రుంచివైచుటయుఁ గర్ణు నుత్సాహంబునం గడంగు ధార్తరాష్ట్రుల సింహనాదంబులకుం దెరలక మరుత్సుతుండు మండలప్రచారుం డగుటయు నా సూతనందనుండు మొదలగు నమ్మేటిమగల మార్గణమ్ము లమ్మనుజపతిపైఁ బరఁగుటయు నకుల సహదేవ సాత్యకి ధృష్టద్యుమ్న ద్రౌపదేయ ప్రభృతులైన పాండవేయ పాంచాలాది యోధులం గలంచి యక్కర్ణుండు కమలాకరంబునం గేలిసలుపు శుండాలంబు లీల నటించుటయు నవ్వీరుం డగ్గలిక నక్కవ్వడి రాక గోరి కపికేతనం బాలోకించుటయుం గలిగిన యప్పరిపాటి యంతయు నేర్పడం జెప్పి యా రాధేయు రభసం బుగ్గడించి మఱియు నిట్లనియె. 347**

**ప్రతిపదార్థం:** ఆ సమయంబునన్= అప్పుడు; శోణితంబు పెల్లునన్= రక్తం అధికం కావటంచేత; మున్ను+ఎగసిన రేణువు+ అడంగినన్= ముందు లేచిన ధూళి అణగగా; ఇరువాఁగు సైనికులును= రెండుపక్షాల సైనికులు; తమ తమ అడియాలంబులతోడి గొడుగులును= తమ తమ చిహ్నాలతో కూడిన ఛత్రాలు; సిడంబులును= ధ్వజాలు; పెద్దయున్ మెఱయన్= గొప్పగా ఒప్పగా; పెనంగుచుండన్= పోరుచుండగా; సంశప్తక సంచయంబు= సంశప్తకుల సమూహం; కించిత్+అవశిష్టంబుగాన్= కొద్దిగా మాత్రమే మిగిలేటట్లు; నష్టంబు+చేసినన్= వాటిని నశింపచేయగా; శౌరి= కృష్ణుడు; సవ్యసాచికిన్= అర్జునుడికి; ఆ+కౌరవ పాండవ బలంబుల పోరు చూపి= కౌరవపాండవ సైన్యాల యుద్ధం చూపించి; అప్పుడు= ఆ సమయంలో; దుర్యోధనుండు= దుర్యోధనుడు; తనయందున్+చేయంగలవారును తానును= తనకు సహాయపడుతున్నవారు, తాను; ధర్మనందనునున్+ పట్టు తలంపునన్= ధర్మరాజును బంధించాలనే ఆలోచనతో; బెట్టుపొదువుటయును= గట్టిగా చుట్టుముట్టగా; అమృతంబునకున్+ ఆసపడి= అమృతానికి ఆశపడి; అడరు+అసురుల మరల్చు= అతిశయించిన రాక్షసులను మరిలించే; శక్ర+అగ్నుల చందంబునన్= ఇంద్రాగ్నులవలె; భీమసేనుండును సాత్యకియున్= భీముడు సాత్యకి; వారలన్+ప్రతిహతులన్+చేయుటయున్= వారిని కొట్టబడిన వారినిగా చేయడాన్ని అనగా వారిని కొట్టటాన్ని; అంతన్ నిలువక= అంతటితో ఆగక; ఆ+కురువిభుండును= దుర్యోధనుడు; కర్ణ కృప+అశ్వత్థామలునున్= కర్ణుడు, కృపుడు, అశ్వత్థామలు; ఉద్దామగతిన్= తీవ్రమైనవిధంగా; ఆ+ఇరువుర= భీమ, సాత్యకుల; శరజాలంబులన్= బాణాలను; అమ్ములన్= బాణాలతో; జడియుచున్= నివారించుచూ; కదిసి= ఎదుర్కొని; ఆ+ కౌంతేయ+అగ్రజు కంకటంబున్= ఆ ధర్మరాజు కవచాన్ని; త్రుంచివైచుటయున్= ఖండించటాన్ని; కర్ణు+ఉత్సాహంబునన్+

కడంగు= కర్ణుడి ఉత్సాహంతో రెచ్చిన; ధార్తరాష్ట్రుల సింహనాదంబులకున్+తెరలక= కౌరవుల అరుపులకు చలించక; మరుత్+సుతుండు= భీముడు; మండల ప్రచారుండు+అగుటయున్= వలయాకారంగా తిరుగుటకలవాడు అగుటను; ఆ సూతనందనుండు మొదలగు= ఆ కర్ణుడు మున్నగు; ఆ+మేటిమగల మార్గణమ్ములు= మేటి వీరుల బాణాలు; ఆ+ మనుజపతిపైన్+పరఁగుటయున్= ధర్మరాజుపై పడుటను; నకుల సహదేవ సాత్యకి, ధృష్టద్యుమ్న ద్రౌపదేయ ప్రభృతులు+ఐన= నకుల సహదేవులు సాత్యకి, ధృష్టద్యుమ్నులు ఉపపాండవులు మొదలగు; పాండవేయ పాంచాల+ఆది యోధులన్+కలంచి= పాండవ పాంచాల వీరులను కలతపెట్టి; ఆ+కర్ణుండు= కర్ణుడు; కమలాకరంబునన్+కేలి సలుపు= తామరకొలనులో క్రీడించే; శుండాలంబు లీలన్ నటించుటయును= ఏనుగువలె విహరించుటను; ఆ+వీరుండు= కర్ణుడు; అగ్గలికన్= అతిశయంతో; ఆ+కవ్వడి రాక కోరి= అర్జునుడి రాకను కోరి; కపి కేతనంబు+ఆలోకించుటయున్= కపిధ్వజాన్ని చూచుటను; కలిగిన ఆ+ పరిపాటి అంతయున్= జరిగిన ఆ విధం అంతా ఏర్పడన్+చెప్పి= స్పష్టంగా వివరించి; ఆ రాధేయు రభసంబు+ఉగ్గడించి= కర్ణుడి ఆటోపాన్ని పేర్కొని; మరియును= ఇట్లు+అనియెన్= ఇంకా ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** ఆ సమయంలో రక్తం అధికంగా ప్రవహించినందున, ముందు లేచిన ధూళి అణగగా, ఉభయపక్షాల సైనికులు తమతమ గుర్తులతో కూడిన ఛత్రాలు, ధ్వజాలు, బాగా ప్రకాశించగా యుద్ధం చేయసాగారు. సంశప్తకుల సమూహాన్ని కొద్దిగా మాత్రమే మిగిలేటట్లు పరిమార్చిన పార్థుడికి శ్రీకృష్ణుడు - కురుపాండవ సైన్యాల పోరుచూపించి, ఆ సమయంలో దుర్యోధనుడు తన సహాయకులతో కలిసి ధర్మరాజును బంధించాలనే ఆలోచనతో ఆయనను చుట్టుముట్టగా, అమృతానికి ఆశపడి విజృంభించిన రాక్షసులను మరలించిన ఇంద్రాగ్నుల వలె, భీమసాత్యకులు వాళ్ళను (దుర్యోధనుని, అతని సహాయకులను) కొట్టటాన్ని - దుర్యోధన కర్ణ కృపాశ్వత్థామలు విజృంభించి, ఆ భీమసాత్యకుల బాణాలను తమ బాణాలతో నివారించి, ధర్మరాజు కవచాన్ని ఖండించటాన్ని - కర్ణుడి ప్రోత్సాహంతో చెలరేగిన కౌరవుల సింహనాదాలకు చలించక భీమసేనుడు వలయాకారంగా తిరగటాన్ని - కర్ణుడు మొదలైన మేటివీరుల బాణాలు ఆ ధర్మరాజుమీద పడటాన్ని - నకుల సహదేవ సాత్యకీ ధృష్టద్యుమ్న ద్రౌపదీ పుత్రాది పాండవ పాంచాల వీరులను కలతపెట్టి కర్ణుడు తామరకొలనులో క్రీడించే మదపుటేనుగువలె విహరించటాన్ని - ఆధిక్యంతో ఆ కర్ణుడు కిరీటి తన సమీపానికి రావాలని కోరుకొని, అతని కపికేతనంవైపు చూస్తూ ఉండటాన్ని- స్పష్టంగా వివరించి, కర్ణుడి ఆటోపాన్ని తెలియచెప్పి - ఇంకా ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**క. 'నినుఁ దలపడఁజూచిన యీ । తని యేడ్తెఱ మంట సొరఁగఁ దలఁచు మిడుత యు**
**బ్బున కెనయై నాకుం దోఁ । చినయది వ్రుందింపు మితని శితవిశిఖములన్.'** 348

**ప్రతిపదార్థం:** నినున్+తలపడన్+చూచిన= నీతో పోరు సలపాలని తలచిన; ఈతని ఏడ్తెఱ= ఈ కర్ణుడి తొందర; మంట చొరఁగన్+తలచు= మంటలో పడబోయే; మిడుత ఉబ్బునకున్+ఎన ఐ= మిడుత గర్వానికి సాటియై; నాకున్+తోఁచిన+అది= నాకు గోచరమవుతున్నది; శితవిశిఖములన్= వాడిబాణాలతో; ఇతనిన్+వ్రుందింపుము= ఇతడిని సంహరించుము.

**తాత్పర్యం:** నిన్నెదుర్కోవాలని చూచే ఈ కర్ణుడి తొందర, మంటలో దూకాలనుకొనే మిడుత ఉబలాటంవలె నాకు తోస్తున్నది. వాడి బాణాలతో ఇతడిని నేలగూల్చు.

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అని పలికి యతని కప్పుడు దోడ్పడ నుత్సహించు భవత్సుతు నుపలక్షించి బీభత్సునకుం జూపి. 349**

**ప్రతిపదార్థం:** అని పలికి; అతనికిన్+అప్పుడు తోడ్పడన్+ఉత్సహించు= కర్ణుడికి తోడ్పడాలని పూనుకొన్న; భవత్+సుతున్+ ఉపలక్షించి= నీ కుమారుడి(దుర్యోధనుడి)ని చూచి; బీభత్సునకున్+చూపి= అర్జునుడికి చూపి.

**తాత్పర్యం:** అని పలికిన కృష్ణుడు కర్ణుడికి తోడుగా ఉండాలని తలచిన దుర్యోధనుడిని అర్జునుడికి చూపి (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'ఇత్తఱిఁ ద్రుళ్ళు సూపి నిను నేపున మార్కొని గెల్తు నన్ తలం**
**పెత్తి సుయోధనుం డదె యహీనబలంబులఁ గూర్చెఁ గర్ణుతో**
**మత్తగజంబులీల నెలమామిడిఁ గూల్చినభంగిఁ బాండు పు**
**త్రోత్తమ! వీనిఁ గూల్పు; మతఁ డొంటిగ రాజ్యము నీకుఁ జేకుఱున్.' 350**

**ప్రతిపదార్థం:** ఈ+తఱిన్= ఇప్పుడు; సుయోధనుండు= దుర్యోధనుడు; త్రుళ్ళు చూపి= గర్వించి; నినున్+ఏపునన్ మార్కొని= అతిశయంతో నిన్ను ఎదుర్కొని; గెల్తును+అన్ తలంపు+ఎత్తి= గెలుస్తాననే ఆలోచన కలిగి; కర్ణుతోన్= కర్ణుడికి అండగా; అదె, అహీనబలంబులన్+కూర్చెన్= అదిగో గొప్ప సైన్యాలను సమకూర్చాడు; పాండుపుత్ర+ఉత్తమ!= అర్జునా!; మత్తగజంబు= మదపుటేనుగు; లీలన్= అవలీలగా; ఎలమామిడిన్+కూల్చినభంగిన్= లేత మామిడిచెట్టును కూల్చేవిధంగా; వీనిన్+కూల్పుము= ఈ బలాలను చంపుము; అతఁడు+ఒంటిగన్= అతడు ఒంటరివాడు కాగా; రాజ్యము నీకున్+చేకుఱున్= అపుడు రాజ్యం నీకు లభిస్తుంది.

**తాత్పర్యం:** 'అర్జునా! దుర్యోధనుడు నిన్ను గెలుస్తానన్న గర్వంతో కర్ణుడికి తోడుగా అధిక సేనలను సమకూర్చాడు. మదగజం లేమావిచెట్టును కూల్చినట్లుగా ఆ సేనలను కూల్చుము; అతడు ఒంటరి అవుతాడు. అప్పుడు రాజ్యం నీకే దక్కుతుంది.'

**విశేషం:** అలం: ఉపమ.

**వ. అను నవసరంబున. 351**

**తాత్పర్యం:** అంటున్న సమయంలో.

**మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్న శైనేయు లే**
**కమనోవృత్తిఁ గడంగి తో నడర దోర్గర్వంబు శోభిల్ల శౌ**
**ర్యము సొంపార నిలింపకోటి వొగడన్ రారాజు సైన్యంబు లో**
**క్కొ మొగిం బెల్లగిలంగ బెట్టడరె సక్రోధాంతరంగంబుతోన్. 352**

**ప్రతిపదార్థం:** వాయునందనుఁడు= భీముడు; ధృష్టద్యుమ్న శైనేయులు= ధృష్టద్యుమ్న, సాత్యకులు; ఏకమనస్+వృత్తిన్+కడంగి= ఒకే లక్ష్యంతో పూని; తోన్+అడరన్= తనవెంట రాగా; స మద+ఆటోపతన్= గర్వాతిశయంతో; దోస్+గర్వంబు శోభిల్లన్=

భుజబలం ప్రకాశించగా; శౌర్యము సొంపారన్= పరాక్రమం ఒప్పగా; నిలింపకోటి, పొగడన్= దేవతలు ప్రశంసించగా; సక్రోధ+ అంతరంగంబుతోన్= కోపం నిండిన మనసుతో; రారాజు సైన్యంబులు= దుర్యోధనుడి సేనలు; ఒక్కొమొగిన్+పెల్లగిలంగన్= ఒక్కుమ్మడిగా పారిపోగా; బెట్టు+అడరెన్= మిక్కిలి విజృంభించాడు.

**తాత్పర్యం:** క్రోధాంతరంగంతో, పరాక్రమాతిశయంతో భీముడు, ధృష్టద్యుమ్న సాత్యకులు తనకు తోడు రాగా, దుర్యోధనుడి సేనలు పారిపోయేటట్లుగా విజృంభించాడు. అది చూచి దేవతలు ప్రశంసించారు.

**క. అడరి పటు బాణజాలం । బడరింపఁగ వారిబలము లధికరయము నె**
**క్కుడు మదము నొలయఁ బైకొని । బడలువడఁగఁజేసె నీదు బలముల నధిపా! 353**

**ప్రతిపదార్థం:** అధిపా!= రాజా!; అడరి= విజృంభించి; పటు, బాణజాలంబు+అడరింపఁగన్= వాడి అయిన బాణసమూహాన్ని ప్రయోగించగా; వారి, బలములు= పాండవసేనలు; అధిక రయమున్= మిక్కిలివేగం; ఎక్కుడు మదమున్+ఒలయన్= అధికగర్వం ఒప్పగా; పైకొని= కవిసి; నీదు, బలములన్= నీ సైన్యాలను; బడలుపడఁగన్+చేసెన్= అలిసేటట్లుగా చేశాయి.

**తాత్పర్యం:** రాజా! భీముడు అట్లా విజృంభించి తీవ్రబాణాలను ప్రయోగించగా, పాండవసేన కూడా వేగంగా, గర్వాతిశయంతో కౌరవసేనపై బడి అలిసిపోయేటట్లు చేసింది.

**క. వడిఁ బొదివి భీముఁ డార్చినఁ । జెడ విఱిగిన సేన నేమి సెప్పుదుఁ దన దొం**
**దడిఁ దాన చదిసె వెనుకొను । కడిఁదిమగలచేత గాసి గాదె నరేంద్రా! 354**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!; వడిన్+పొదివి= వేగంగా తాకి; భీముఁడు+ఆర్చినన్= భీముడు అరవగా; చెడన్ విఱిగిన సేనన్= పతనమైన సైన్యాన్ని గూర్చి; ఏమి చెప్పుదున్?= ఏమని చెప్పగలను?; వెనుకొను కడిఁది మగలచేతన్= వెంటాడే గొప్ప శూరులచేత; గాసి కాదె!= బాధనొందదా!; తన దొందు+దడిన్+తాన చదిసెన్= తన సందడిలో తానే నలిగిపోయింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! భీముడు వేగంగా తాకి సింహనాదం చేయగా నాశనమైన మన సైన్యం గురించి ఏమని చెప్పగలను? తమను వెంబడించిన వీరులచేత బాధించబడి తన సమ్మర్దంలో తానే నలిగిపోయింది.

**ఉ. మ్రొగ్గెడు వాహనంబులును, మోములు వాడఁగ వాహనంబుల**
**న్డిగ్గి తలంగు సైనికులు, నేలకుఁ గష్టపుఁజొప్పు సొప్పడం**
**ద్రగ్గు సిడంబులుం, గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై**
**మ్రగ్గెడువారు నై కురు ధరావరు సైన్యము రూపుమాయఁగన్. 355**

**ప్రతిపదార్థం:** మ్రొగ్గెడు వాహనంబులును= కూలుతున్న అశ్వగజాది వాహనాలు; మోములు, వాడఁగన్= ముఖాలు వాడిపోగా; వాహనంబులన్+డిగ్గి, తలంగు, సైనికులు= వాహనాలనుండి దిగి తొలగిపోయే సైనికులు; కష్టపున్+చొప్పు, చొప్పడన్= కష్టమైన విధం ఏర్పడగా; నేలకున్= భూమిపై; త్రగ్గు, సిడంబులున్= తెగిపడిన ధ్వజాలు; కులమున్+తన్నున్+తలంచి= తన వంశాన్ని తనను తలచుకొని; ఎదిర్చి= ఎదుర్కొని; ఒంటిమై, మ్రగ్గెడు, వారున్+ఐ= ఒంటరిగా చచ్చేవారు అయి; కురుధరావరు సైన్యము= కౌరవరాజు సైన్యం; రూపుమాయఁగన్= నశించగా.

**తాత్పర్యం:** అశ్వగజాది వాహనాలు నేలపై పడిపోగా, వాడిన ముఖాలతో సైనికులు వాహనాలు దిగి తొలగిపోగా, ఘోరయుద్ధానికి ధ్వజాలు తెగిపడగా, తమ వంశపౌరుషాన్ని తలచుకొని ఒంటరిగా పోరాడిన వీరులు నేలపై కూలగా కురురాజుసైన్యం నశించింది.

**ఆ. పావనికి నిషాదపతి నందనుఁడు మాఱు। కొనిన నాతఁ డతని కుంజరంబు**
**కరముతోఁ దదీయ కరములు శిరమును। నఱకె శితశరములు నాలుగింట. 356**

**ప్రతిపదార్థం:** నిషాదపతి నందనుడు= నిషాదరాజు కుమారుడు; పావనికిన్= భీముడితో; మాఱుకొనినన్= తలపడగా; అతఁడు= భీముడు; అతని కుంజరంబు= అతడి ఏనుగును; కరముతోన్= తొండంతోకూడ; తదీయకరములు శిరమును= అతడి చేతులు, తలను; శితశరములు నాలుగింటన్= నాలుగు వాడిబాణాలతో; నఱకెన్= నరికాడు.

**తాత్పర్యం:** నిషాద రాజకుమారుడు భీముడితో తలపడగా, భీముడు అతడి చేతులను, తలను, ఏనుగును, దాని తొండాన్ని నాలుగు వాడిబాణాలతో ఖండించాడు.

**క. మూఁ డక్షౌహిణు లిమ్మెయిఁ। బోఁడిమి సెడి పాఱఁ బవనపుత్రుని యెదురన్**
**వేఁడిమి సూపఁగ నొకఁడు। న్వాఁడిమగఁడు లేఁడ; యేమనం గల దధిపా! 357**

**ప్రతిపదార్థం:** మూఁడు+అక్షౌహిణులు= మూడు అక్షౌహిణుల సైన్యం; ఈ+మెయిన్= ఈ విధంగా; పోఁడిమి చెడి పాఱన్= సొంపుచెడి పారిపోగా; పవనపుత్రుని ఎదురన్= భీముడి ఎదుట; వేఁడిమి చూపఁగన్= పరాక్రమం చూపటానికి; ఒకఁడున్+ వాఁడి మగఁడు లేఁడు+అ= ఒక్కవీరుడు కూడా లేడు; ఏమనన్+కలదు+అధిపా!= ఏమని చెప్పాలి రాజా!

**తాత్పర్యం:** ఈ విధంగా (అతడిముందు నిలువలేక) మూడు అక్షౌహిణుల సైన్యం సొంపుచెడి పారిపోగా, భీముడిని ఎదుర్కొనటానికి ఒక్క వీరుడు కూడా లేడంటే - ఇక చెప్పగలిగింది ఏమున్నది ధృతరాష్ట్ర మహారాజా!

**విశేషం:** అక్షౌహిణి: 218170 రథాలు, 218170 గజాలు, 65610 గుర్రాలు, 109350 కాల్బలం గల సైన్యం - అక్షౌహిణి.

**వ. ఇవ్విధంబున విక్రమించిన భీమసేను బరవసంబును దదీయసైనికుల సంరంభంబునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపి చెప్పె ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 358**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్ విక్రమించిన= ఈ విధంగా పరాక్రమం చూపిన; భీమసేను బరవసంబును= భీముడి ధైర్యం; తదీయ సైనికుల సంరంభంబునున్= అతడి సైనికులసందడిని; పద్మనాభుండు= కృష్ణుడు; ఫల్గునునకున్+చూపి చెప్పెన్= అర్జునుడికి చూపి వివరించాడు; అనినన్+విని= అనగా విని; ధృతరాష్ట్రుండు= ధృతరాష్ట్రుడు; సంజయునకున్= సంజయుడితో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** భీముడి సాహసాన్ని, అతడి సైనికులసందడిని శ్రీకృష్ణుడు అర్జునుడికి వివరించి చెప్పాడు అని చెప్పగా విన్న ధృతరాష్ట్రుడు, సంజయుడితో ఇట్లా అన్నాడు:

**క. 'నీ చెప్పెడుమెయి సూడఁగ। నీచత వాటిల్లె మన యనీకమునకుఁ దా**
**రే చేటు సెడిరొ కౌరవు। లా చరిత ముపన్యసింపు మంతయుఁ దెలియన్.' 359**

**ప్రతిపదార్థం:** నీ, చెప్పెడు, మేయి, చూడఁగన్= నీవు చెప్పే విధం చూస్తే; మన అనీకమునకున్= మన సైన్యానికి; నీచత పాటిల్లెన్= అగౌరవం ఏర్పడింది; కౌరవులు; ఏ చేటు+చెడిరొ= ఏవిధంగా నశించారో; ఆ చరితము= ఆ వృత్తాంతం; అంతయున్+తెలియన్= పూర్తిగా తెలిసేటట్లుగ; ఉపన్యసింపుము= చెప్పుము.

**తాత్పర్యం:** 'నీ మాటలవలన మన సైన్యం గౌరవం చెడిందని తెలుస్తున్నది. కౌరవులు ఏ విధంగా చెడ్డారో ఆ విషయమంతా వివరంగా చెప్పుము.'

**క.** **అనవుడు నతఁ డిట్లను న । మ్మనుజపతికి 'హితులు సెప్ప మానక నీచే**
**సిన దుర్ణయమునఁ జేటొం । దెను; వగవక రణము వినుము ధీరవిచారా!'** **360**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; ఆ+మనుజపతికిన్= ఆ ప్రభువుకు; అతఁడు+ఇట్లు+అనున్= సంజయుడు ఇట్లా బదులు పలికాడు; ధీర విచారా!= ధైర్యంతోడి ఆలోచన గలవాడా - ధృతరాష్ట్రరాజా!; హితులుచెప్పన్= హితులు ఎంత చెప్పినా; మానక= వినకుండా; నీ చేసిన దుర్ణయమునన్= నీవు చేసిన దుర్నీతివలన; చేటు+ఒందెను= ఈ నష్టం కలిగింది; వగవక రణము వినుము= విచారించక యుద్ధవిధం వినుము.

**తాత్పర్యం:** ధృతరాష్ట్రుడి మాటలకు సంజయుడు ఇట్లా బదులు పలికాడు: 'ఓ రాజా! నీ మేలు కోరిన వారి మాటలు వినకుండా నీవు చేసిన కుటిలనీతి వలననే ఇంతనష్టం వాటిల్లింది. జరిగిన దానికి విచారించక యుద్ధవృత్తాంతం వినుము.'

**వ.** **ఇట్లు భీము కడంక గని కవ్వడి దన మునుము కొంచెము మూఁకలం దోలి మగిడి మన సేనల మర్దించుటకుం దమవారిఁ జేరంజనఁ గౌరవపతి యమ్మారుతి మార్కొని.** **361**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; భీముకడంక కని= భీముడి పూనిక చూచి; కవ్వడి= అర్జునుడు; తనమునుము= తన ఎదురుగా ఉన్న; కొంచెము మూఁకలన్+తోలి= కొద్దిమంది సైనికులను పారదోలి; మగిడి= తిరిగి; మన సేనలన్ మర్దించుటకున్= మన సైన్యాలను అణచటానికి; తమవారికిన్+చేరన్+చనన్= తమవారిని కలిసికొనుటకు వెళ్ళగా; కౌరవపతి= దుర్యోధనుడు; ఆ+మారుతిన్+మార్కొని= ఆ భీముడిని ఎదుర్కొని.

**తాత్పర్యం:** అర్జునుడు తనముందున్న కొద్దిమంది సైనికులను పారద్రోలి తన పక్షంవారిని చేరబోగా, దుర్యోధనుడు భీముడిని ఎదుర్కొని. (తరువాతి పద్యంతో అన్వయం).

### దుర్యోధనుండు భీమసేనుం దలపడి పోరుట (సం. 8-44-3)

**తే.** **'ఎందు వచ్చెదు? నిలు నిలు; మేను గలుగఁ । గడిమి సెల్లునె నీకు; నీ క్షణమ నిన్ను**
**నంతకుని పాలి కనిచెద' ననుచు రోష । రక్తలోచన రుచుల శరములు వఱపె.** **362**

**ప్రతిపదార్థం:** ఎందున్ వచ్చెదు?= ఎక్కడికి వస్తున్నావు? నిలు నిలుము= ఆగుము ఆగుము; ఏను కలుగన్= నేను ఉండగా; నీకున్= నీకు; కడిమి చెల్లునె?= పరాక్రమం తగునా?; ఈ క్షణము+అ= ఇప్పుడే; నిన్నున్= నిన్ను; అంతకుని పాలికిన్+అనిచెదను= యముని వద్దకు పంపుతాను; అనుచున్= అంటూ; రోషరక్తలోచన రుచులన్= క్రోధంతో ఎఱ్రబడిన కనుల కాంతులతో; శరములు వఱపెన్= బాణాలు వేశాడు.

**తాత్పర్యం:** ఎక్కడికి వస్తున్నావు? ఆగుము. నా ముందు నీ సాహసం చెల్లదు. ఇప్పుడే నిన్ను యమలోకం పంపుతాను చూడుము?' అంటూ దుర్యోధనుడు క్రోధపూరిత నేత్రాలతో చూస్తూ బాణప్రయోగం చేశాడు.

**క. రాధేయుండు నుదీర్ణ । క్రోధుం డై గర్జతోడి గుణరవము నభో**
**బాధం బొనర్పఁగా నిజ । యోధులఁ బురికొల్పికొని సముద్ధతిఁ గడఁగెన్. 363**

**ప్రతిపదార్థం:** రాధేయుండున్= కర్ణుడుకూడా; ఉదీర్ణక్రోధుండు+ఐన= మహా ఆగ్రహం కలవాడై; గర్జతోడి, గుణరవము= అరుపుతో కూడిన వింటినారిధ్వని; నభస్+బాధంబు+ఒనర్ప+కాన్= గగనంలో ప్రతిధ్వనించగా; నిజయోధులన్+పురికొల్పికొని= తన యోధులను ప్రోత్సహించి; సముద్ధతిన్+కడఁగెన్= అతిశయంతో విజృంభించాడు.

**తాత్పర్యం:** కర్ణుడు కూడా క్రోధపూరితుడై పెద్దగా గర్జిస్తూ వింటినారి ధ్వనిని చేస్తూ తన సైనికులను ప్రోత్సహించి శత్రుసేనపైకి వెళ్ళాడు.

**వ. అ ట్లయ్యిరువురు నుత్సాహంబు వాటించి నిజానీకంబు నిలువరించిన నది పురికొని పోరికి నమరుటయుఁ బాండవబలంబును దిరంబయి పెనంగందొడంగె; నట్టియెడ నక్కడ నిక్కడఁ జేయంగల దొరలు దలపడి యుక్కున నక్కజం బగు సమరక్రీడ సలిపి; రందు. 364**

**ప్రతిపదార్థం:** అట్లు+ఆ+ఇరువురున్= ఆ విధంగా దుర్యోధన కర్ణులు ఇద్దరు; ఉత్సాహంబు పాటించి= ఉత్సాహం కలిగి; నిజ+అనీకంబు నిలువరించినన్= తమ సైన్యాన్ని నిలబెట్టగా; అది పురికొని పోరికిన్+అమరుటయున్= అది ప్రేరణ చెంది యుద్ధానికి సిద్ధపడగా; పాండవ బలంబును= పాండవసైన్యంకూడా; తిరంబు+ఐ= స్థిరంగా నిల్చి; పెనంగన్+తొడంగెన్= పోరు సల్పసాగింది; అట్టిఎడన్= అప్పుడు; అక్కడన్+ఇక్కడన్= రెండు పక్షాలలో; చేయంగల దొరలు= సమర్థులైన వీరులు; తలపడి= పోరి; ఉక్కునన్= గర్వంతో; అక్కజంబు+అగు= ఆశ్చర్యం గొలిపే విధంగా; సమరక్రీడన్ సలిపిరి= యుద్ధం చేశారు; అందున్= ఆ రణంలో.

**తాత్పర్యం:** దుర్యోధనుడు, కర్ణుడు ఆ విధంగా తమ సైన్యంలో ఉత్సాహాన్ని రేకెత్తించి, యుద్ధానికి సిద్ధం చేయగా, పాండవసేనకూడా చలించకుండా నిల్చి పోరు సలిపింది. రెండు పక్షాలలోని వీరులు తలపడి అచ్చెరువు గొల్పే విధంగా యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో.

**సీ. కర్ణుఁ డేపారి శిఖండి రథ్యముల సా । రథిఁ గేతువును గూల్చి రయము మెఱయ**
**విగతాయుధుఁడు బాణవిహతాంగుఁడును గా ను । దగ్రుఁ డై తఱుమ నతండు దొలఁగఁ**
**బాఱె; దుశ్శాసన పార్షతు లొండొరు । తనువులు నొంచుచు ననిమిషులకు**
**నచ్చెరు వగు నట్టి యని సేయ వారల । తనువులు లెడసొచ్చి పెనఁగి రంగ**

**తే. రాజు సూడఁ దత్పుత్రు సారథి శిరంబు । నకులుఁ డొక భల్లమునఁ ద్రుంప, జకిత మై క**
**లంగు నచ్చటి మూఁకఁ జలంబు మెఱయ । నిలిపె నా సూతసూనుండు నృపవరేణ్య! 365**

**ప్రతిపదార్థం:** నృపవరేణ్య!= ధృతరాష్ట్ర మహారాజా!; కర్ణుఁడు+ఏపారి= కర్ణుడు విజృంభించి; శిఖండి రథ్యములన్= శిఖండి గుఱ్ఱాలను; సారథిన్+కేతువును కూల్చి= సారథిని ధ్వజాన్ని నరికి; విగత+ఆయుధుఁడు= ఆయుధహీనుడు; బాణవిహత+

అంగుఁడునుగాన్= బాణాలతో గాయపరచబడిన శరీరుడు కాగా; రయముమెఱయన్= వేగంగా; ఉదగ్రుడై తఱుమన్= భయంకరంగా తరుమగా; అతండు తొలఁగన్+పాఱెన్= అతడు పారిపోయాడు; దుశ్శాసన పార్షతులు= దుశ్శాసనుడు, ధృష్టద్యుమ్నుడు; ఒండొరు తనువులు నొంచుచున్= ఒకరి దేహాన్ని ఒకరు నొప్పిస్తూ; అనిమిషులకున్+అచ్చెరువు+అగునట్టి= దేవతలకు కూడా ఆశ్చర్యం కలిగించే; అనిచేయన్= యుద్ధం చేయగా; వారల అనుచరులు= వారిభటులు; ఎడచొచ్చి పెనఁగిరి= దూరంనుండి పోరు సలిపారు; నకులుఁడు; అంగరాజుచూడన్= కర్ణుడు చూస్తుండగా; తద్+పుత్రు సారథిశిరంబు= వృషసేనుడి సారథి తలను; ఒక భల్లముననన్+త్రుంపన్= ఒక బల్లెంతో ఖండించగా; చకితము+ఐ కలంగు+అచ్చటిమూఁకన్= రిచ్చవడి చెదిరిపోయే సైన్యాన్ని; ఆ సూతసూనుండు= కర్ణుడు; చలంబు మెఱయన్ నిలిపెన్= పట్టుదల ప్రకాశింపగా నిలిపాడు.

**తాత్పర్యం:** ఓ రాజా! కర్ణుడు శౌర్యంతో శిఖండి గుర్రాలను, సారథిని, ధ్వజాన్ని ఖండించాడు. శిఖండిని బాణాలతో గాయపరచి తరుమగా అతడు పారిపోయాడు. దుశ్శాసన, ధృష్టద్యుమ్నులు ఒకరిని మరొకరు బాధిస్తూ తీవ్రయుద్ధం సల్పారు. నకులుడు వృషసేనుడి సారథి తలను బల్లెంతో ఖండించగా, సైనికులు చకితులై చెదరిపోసాగారు. కర్ణుడు పట్టుదలతో వారిని నిలువరించాడు.

**వ. అట్లు సారథిరహితుండైన వృషసేనుండు వేఱొక్కసూతు నమర్చికొని తండ్రికిం జక్రరక్షకుండై నిలిచె; నకులుండు నొండు దెస కడరె; సహదేవుం డులూకుని విరథునిం జేసి పఱపె; సాత్యకిసౌబలు లన్యోన్య కేతు పాతనంబును బరస్పర కంకట కర్తనంబునుం జేసి; రా సమయంబున శైనేయుండు దురంగంబులం జదిపిన నరదంబు డిగ్గనుఱికి యోసరించు న గ్గాంధారవిభుం గని యులూకుండు. 366**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; సారథి రహితుండు+ఐన వృషసేనుండు= సారథిని కోల్పోయిన వృషసేనుడు; వేఱొక్క సూతున్+అమర్చికొని= మరొకసారథిని కూర్చుకొని; తండ్రికిన్+చక్రరక్షకుండు+ఐ నిలిచెన్= కర్ణుడికి రథచక్ర రక్షకుడిగా నిలిచాడు; నకులుండును= నకులుడు; ఒండు దెసకున్+అడరెన్= వేరేవైపు వెళ్ళాడు; సహదేవుండు= సహదేవుడు; ఉలూకునిన్= ఉలూకుడిని; విరథునిన్+చేసి, పఱపెన్= రథహీనుడిగా చేసి పారద్రోలాడు; సాత్యకి, సౌబలులు= సాత్యకి శకునులు; అన్యోన్య కేతు పాతనంబును= ఒకరి ధ్వజాన్ని ఒకరు పడగొట్టటం; పరస్పర కంకట, కర్తనంబునున్+చేసిరి= ఒకరి కవచాన్ని ఒకరు ఛేదించటం చేశారు; ఆ సమయంబునన్= అప్పుడు; శైనేయుండు= సాత్యకి తురంగంబులన్+చదిపినన్= గుర్రాలను చంపగా; అరదంబు, డిగ్గన్+ఉఱికి= రథంనుండి దూకి; ఓసరించు= తొలగిపోతున్న; ఆ+గాంధారవిభున్= శకునిని; ఉలూకుండు= ఉలూకుడు; కని= చూచి.

**తాత్పర్యం:** సారథిరహితుడైన వృషసేనుడు మరొక సారథిని కూర్చుకొని తండ్రి రథచక్రరక్షకుడై నిలిచాడు. నకులుడు మరొకవైపు వెళ్ళాడు. సహదేవుడు ఉలూకుడిని రథహీనుడిని చేసి పారద్రోలాడు. సాత్యకి, శకునులు ఒకరి ధ్వజ కవచాలను మరొకరు ఛేదించారు. ఆ సమయంలో సాత్యకి అతడి గుర్రాలను కూల్చగా రథం దిగి పారిపోతున్న శకునిని చూచి ఉలూకుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. మును సహదేవుం డెగువం । జనినప్పడ యొండు దేరు సవరించుకొనం**
**గనుట నది పేర్చి యతనిం । గొనిపోయెను సంగరమునకుం దొలఁగంగన్. 367**

**ప్రతిపదార్థం:** మును= ఇంతకుముందు; సహదేవుండు= సహదేవుడు; ఎగువన్+చనినప్పుడు+అ= పైకి వెళ్ళినప్పుడే; ఒండు తేరు సవరించుకొనన్= మరొకరథం సమకూర్చుకొనగా; అది పేర్చి= అది విజృంభించి; సంగరమునకున్+తొలఁగంగన్= యుద్ధానికి దూరంగా; అతనిన్+కొనిపోయెను= అతడిని తీసికొనివెళ్ళింది.

**తాత్పర్యం:** ఇదివరకు సహదేవుడు (తన్ను విరథుని చేసి) ముందుకు వెళ్ళినప్పుడే వేరొక రథాన్ని సమకూర్చుకొని ఉండటంవల్ల, అది శకునిని యుద్ధభూమినుండి పక్కకు తీసికొని వెళ్ళింది.

**ఉ. అచ్చటిమూఁక నల్గడల నాతురతం జెడి పాఱె భీముచేఁ,**
**జచ్చెఁ గురుక్షితీశ్వరుని సారథి; కూలె హయాళి నుగ్గుగాఁ**
**జొచ్చె రథం; బతండు వెఱ సొచ్చి ధరిత్రికి దాఁటి పోయి వె**
**న్నిచ్చిన నీదు యోధవరు లేడ్తెఱ మార్కొని రమ్మరుత్సుతున్. 368**

**ప్రతిపదార్థం:** అచ్చటిమూఁక= అక్కడున్న సైన్యం; ఆతురతన్= వేగిరపాటుతో; నలు+కడలన్= నాలుగు దిశలకు; చెడి పాఱెన్= చెదిరి పారిపోయింది; కురుక్షితి+ఈశ్వరుని సారథి= దుర్యోధనుడి సారథి; భీముచేన్+చచ్చెన్= భీముడిచేత చచ్చాడు; హయ+ఆళి కూలెన్= గుర్రాల సమూహం కూలిపోయింది; రథంబు= రథం; నుగ్గుగాన్+చొచ్చెన్= పొడి కాపోయింది; అతండు వెఱచొచ్చి= దుర్యోధనుడు భయపడి; ధరిత్రికిన్ దాఁటిపోయి= రణభూమిని దాటి; వెన్ను+ఇచ్చినన్= వెన్నుచూపగా; నీదు యోధవరులు= మీ సేనలోని వీరులు; ఏడ్తెఱన్= పరాక్రమంతో; ఆ+మరుత్+సుతున్= ఆ భీముడిని; మార్కొనిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** అక్కడున్న సైన్యం నాలుగు వైపులా చెదిరిపోగా భీముడు దుర్యోధనుడి సారథిని వధించాడు. అతడి గుర్రాలు, రథం కూలిపోగా భయంతో వెనుదిరిగి రణభూమినుండి తొలగిపోయాడు. అయినా కౌరవవీరులు భీముడిని ధైర్యంతో ఎదుర్కొన్నారు.

**వ. యుధామన్యుండుఁ గృపాచార్యు ధనువు దునిమిన నమ్మహాత్ముండు వేఱొక్కవిల్లెత్తి. 369**

**ప్రతిపదార్థం:** యుధామన్యుండున్= యుధామన్యుడును; కృపాచార్యు ధనువు తునిమినన్= కృపాచార్యుడి ధనుస్సును ఖండించగా; ఆ+మహాత్ముండు= ఆయన; వేఱొక విల్లు+ఎత్తి= మరొక ధనువు చేబట్టి.

**తాత్పర్యం:** యుధామన్యుడు కృపాచార్యుడి ధనుస్సును ఖండించగా, అతడు మరొక విల్లు చేపట్టి.

**ఆ. కేతనంబు గూల్చి యాతపత్రము దును । మాడి సూతుఁ జంప నధికభయము**
**గదిరి తేరు దాన కయ్యంబునకుఁ దొలఁ । గంగఁ దోలె నతఁడు కౌరవేంద్ర! 370**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= ధృతరాష్ట్ర మహారాజా!; కేతనంబున్+కూల్చి= ధ్వజం పడగొట్టి; ఆతపత్రము తునుమాడి= ఛత్రం ముక్కలుచేసి; సూతున్+చంపన్= సారథిని చంపగా; అతఁడు= యుధామన్యుడు; అధికభయము కదిరి= మిక్కిలి భయపడి; తేరు= రథాన్ని; తాన్+అ= తానే; కయ్యంబునకున్+తొలఁగంగన్+తోలెన్= యుద్ధంనుండి తొలగేటట్లుగా తోలాడు.

**తాత్పర్యం:** రాజా! కృపుడు యుధామన్యుడి ధ్వజచ్ఛత్రాలను నరికి సారథిని చంపగా అతడు భయపడి తనరథాన్ని తానే యుద్ధంనుండి దూరంగా తోలుకొనిపోయాడు.

**క. శితశరము లుత్తమౌజుఁడు । గృతవర్మను మేన నింపఁ గినుక గదిరి మూ**
**ర్ఛితుఁ డుగఁ జేసె; నతఁడు వెస । నతనిం దత్సూతుఁ డెగచె నరదము దొలఁగన్. 371**

**ప్రతిపదార్థం:** ఉత్తమౌజుఁడు= ఉత్తమౌజుడు; కృతవర్మని మేనన్= కృతవర్మ దేహంపై; శితశరములు= వాడిబాణాలు; నింపన్= నాటగా; అతఁడు= కృతవర్మ; కినుక గదిరి= కోపం వహించి; వెసన్= వెంటనే; అతనిన్= ఉత్తమౌజుని; మూర్ఛితుఁడుగన్+చేసెన్= మూర్ఛిల్ల జేశాడు; తద్+సూతుఁడు= అతని (ఉత్తమౌజుని) సారథి; అరదమున్ తొలఁగన్= రథం తొలగగా; ఎగచెన్= తరిమాడు.

**తాత్పర్యం:** ఉత్తమౌజుడు కృతవర్మ దేహంలో వాడిబాణాలు నాటగా, కృతవర్మ కోపించి వెంటనే ఉత్తమౌజుడిని మూర్ఛిల్లజేశాడు. ఉత్తమౌజుడి సారథి రథం తొలగిపోయేటట్లు తరిమాడు.

### అశ్వత్థామ యర్జునుం దలపడి మహాహవంబు సేయుట (సం. 8-45-1)

**చ. గురుతనయుం డనేకరథికుల్ దన పార్శ్వములం దుదగ్రు లై**
**దురము కడంకమైఁ దఱుమ దోర్బల శౌర్యము లుల్లసిల్ల ని**
**ష్ఠుర శరవృష్టి ముంచె మధుసూదను మధ్యమపాండవున్ వియ**
**చ్చరులు ప్రశంస సేయఁగ నిజధ్వజినీనయనోత్సవంబుగన్. 372**

**ప్రతిపదార్థం:** గురు తనయుండు= అశ్వత్థామ; అనేక రథికుల్= పెక్కుమంది వీరులు; తన పార్శ్వములందున్= తన ప్రక్కలఉండి; ఉదగ్రులు+ఐ= భయంగొల్పుతూ; దురము= యుద్ధం; కడంకమైన్= పూనికతో; తఱుమన్= వేగవంతంచేయగా దోః+బలశౌర్యములు+ఉల్లసిల్లన్= భుజబలశౌర్యం ఒప్పగా; వియత్+చరులు ప్రశంససేయఁగన్= దేవతలు ప్రశంసించగా; నిజధ్వజినీ నయన+ఉత్సవంబుగన్= తన సైనికులకు నేత్రానందంగా; మధుసూదనున్ మధ్యమపాండవున్= కృష్ణార్జునులను; నిష్ఠుర శరవృష్టిన్ ముంచెన్= తీవ్ర బాణవర్షంతో ముంచాడు.

**తాత్పర్యం:** అశ్వత్థామ పలువురు వీరులు తనకు అండగా ఉండి యుద్ధం వేగం అందుకొనేటట్లు చేయగా, భుజబల పరాక్రమాలు ఒప్పగా దేవతలు మెచ్చుకొనగా, తన సైనికులకు కనుల పండువుకాగా కృష్ణార్జునులపై శరవర్షం కురిపించాడు.

**క. అలిగి నరుఁ డైంద్ర మాదిగఁ । గల దివ్యాస్త్రంబు లేయఁగా నయ్యై యు**
**జ్జ్వల మార్గణంబులను న । క్కలశభవసుతుండు మాన్చెఁ గౌరవముఖ్యా! 373**

**ప్రతిపదార్థం:** కౌరవముఖ్యా!= ధృతరాష్ట్ర రాజా!; నరుండు= అర్జునుడు; అలిగి= ఆగ్రహించి; ఐంద్రము+ఆదిగన్+కల= ఇంద్రాస్త్రం మొదలైన; దివ్య+అస్త్రంబులు+ఏయఁగాన్= దివ్యాస్త్రాలు ప్రయోగించగా; ఆ+కలశభవసుతుండు= అశ్వత్థామ; ఆ+ఆ+ఉజ్జ్వల మార్గణంబులనున్= ఆయా కాంతిమంతములైన బాణాలను; మాన్చెన్= ఆపాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడు ఆగ్రహంతో అశ్వత్థామపై ఐంద్రాస్త్రం మొదలుగ అనేక దివ్యాస్త్రాలు ప్రయోగించగా, అతడు వాటిని అడ్డుకొన్నాడు.

**వ. ఇ వ్విధంబున వివిధాస్త్రజాలంబులం బోరి పోరి. 374**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్= ఈ విధంగా; వివిధ+అస్త్రజాలంబులన్= వివిధ అస్త్రాల సమూహాలతో; పోరి పోరి= యుద్ధం చేసి చేసి.

**తాత్పర్యం:** ఈ విధంగా అశ్వత్థామ, అర్జునులు అస్త్రయుద్ధం చేసి చేసి.

**సీ. ఉఱక యశ్వత్థామ యుగ్రబాణంబులు । విజయుని దక్షిణభుజము దూఱ**
**మూఁడేయ నొచ్చియుఁ బోఁడిమి సెడక య । బ్బలియుం డదల్చెఁ దత్పార్శ్వవర్తు**
**లగు పెనుమూఁకల నమ్ములవెల్లిఁ బే । రల్క నక్కుంభజునాత్మజుండు**
**రథ్యచయంబు నారాయణు వానర । ధ్వజము నవ్వీరు గాత్రమును బొదివె**

**తే. మెఱుఁగు వాలంపగముల నమ్మెయి నరుండు । ద్రౌణితోడ భరంపడి రణ మొనర్చు**
**చుండ నట మున్న ధర్మజుఁ డురవడించి । చిత్రసేనుని నమ్ములఁ జిక్కువఱిచి. 375**

**ప్రతిపదార్థం:** అశ్వత్థామ= అశ్వత్థామ; ఉఱక= లక్ష్యపెట్టక; విజయుని, దక్షిణ, భుజము, దూఱన్= అర్జునుడి కుడిభుజంలో దూసుకొనిపోయేటట్లు, ఉగ్రబాణంబులు= వాడిబాణాలు; మూఁడు+ఏయన్= మూడింటిని వేయగా; నొచ్చియున్= బాధచెందినా; పోఁడిమి చెడక= ధైర్యం కోల్పోక; ఆ+బలియుండు= అర్జునుడు; తద్+పార్శ్వవర్తులు+అగు పెనుమూఁకలను= అశ్వత్థామకు సహాయులుగా ఉన్న పెక్కు సైనికులను; అమ్ములవెల్లిన్= బాణప్రవాహంతో; అదల్చెన్= నొప్పించాడు; ఆ+కుంభజు+ఆత్మజుండు= అశ్వత్థామ; పేరు+అల్కన్= పెనుకోపంతో; రథ్యచయంబు= గుర్రాల సమూహాన్ని; నారాయణున్= శ్రీకృష్ణుడిని; వానరధ్వజమున్= కపిధ్వజమును; ఆ+వీరుగాత్రమును= అర్జునుడి దేహాన్ని; మెఱుఁగువాలు+అంపగములన్= కాంతిగల వాడిబాణాల సమూహాలతో; పొదివెన్= తాకాడు; ఆ+మెయిన్= ఆ విధంగా; నరుండు= అర్జునుడు; ద్రౌణితోడన్= అశ్వత్థామచేత; భరంపడి= అణచబడి; రణము+ఒనర్చుచుండన్= యుద్ధం చేస్తుండగా; అటమున్న= అంతకుముందే; ధర్మజుఁడు= ధర్మరాజు; ఉరవడించి= వేగంగా; చిత్రసేనునిన్= చిత్రసేనుడిని; అమ్ములన్+చిక్కుపఱిచి= బాణాలతో ముంచి.

**తాత్పర్యం:** అశ్వత్థామ లక్ష్యపెట్టక అర్జునుడి కుడిభుజంలో మూడుబాణాలు నాటినా అతడు ధైర్యాన్ని కోల్పోక అశ్వత్థామ అనుచరులపై బాణవర్షం కురిపించాడు. అశ్వత్థామ అమితంగా ఆగ్రహించి అర్జునుడిని, సారథి అయిన కృష్ణుడిని, కపిధ్వజాన్ని, అశ్వాలను తేజోమయాలైన బాణాలతో కొట్టగా అర్జునుడు భంగపడి పోరు సలిపాడు. ధర్మరాజు ఒకవైపు చిత్రసేనుడిపై బాణాలు కురిపించి.

**క. తఱిమి తన మునుము సైన్యము । నురుమాఁడఁగఁ గని సుయోధనుఁడు మున్నుగ నే**
**డ్తెఱ నీ యోధులు మార్కొని । యఱిముఱి నొప్పించి పట్ట నమరి పొదివినన్. 376**

**ప్రతిపదార్థం:** తఱిమి= (చిత్రసేనుడిని)తరిమి; తన మునుము సైన్యము= తనముందు సైన్యాన్ని (ధర్మరాజు); నుఱుమాడఁగన్+కని= నుగ్గుచేయగా చూచి; సుయోధనుఁడు మున్నగు= దుర్యోధనుడు మొదలైన; నీ యోధులు= నీ సైనికులు; ఏడ్తెఱన్= పరాక్రమంతో; మార్కొని= ఎదుర్కొని; అఱిముఱి నొప్పించి= సంభ్రమంతో నొప్పించి; పట్టన్+అమరి పొదివినన్= పట్టుకొనుటకు సిద్ధమై చుట్టుముట్టగా.

**తాత్పర్యం:** ధర్మరాజు చిత్రసేనుడిని తరిమి తన ముందరిసైన్యాన్ని నుగ్గుచేయగా చూచిన దుర్యోధనుడు మున్నగు వీరులు పరాక్రమంతో అతడిని ఎదుర్కొని ససంభ్రమంగా నొప్పించి పట్టుకోవటానికి సిద్ధమై చుట్టుముట్టారు.

**ఉ. పావని మున్నుగాఁ గవలుఁ బార్షతుఁడున్ వెస వారిఁ దాఁకినం**
**జేవ దలిర్ప నచ్చటికిఁ జెచ్చెరఁ గర్ణుఁడు వచ్చి తీవ్ర బా**
**ణావృతమూర్తిఁ జేసె మనుజాధిప! యా రథికావలిన్ ధను**
**ర్జ్యా వితత స్వనంబున వియద్వివరంబు ప్రపూరితంబుగన్.** **377**

**ప్రతిపదార్థం:** మనుజ+అధిపా!= ధృతరాష్ట్ర మహారాజా!; పావని మున్నుగాన్+కవలున్= భీముడు ముందుండగా నకులసహదేవులు; పార్షతుఁడున్= ధృష్టద్యుమ్నుడు; వెసన్ వారిన్+తాఁకినన్= వెంటనే వారిని తాకగా; కర్ణుఁడు= కర్ణుడు; చేవ తలిర్పన్= ధైర్యం అతిశయిల్లగా; చెచ్చెరన్= శీఘ్రంగా; అచ్చటికిన్= అక్కడికి; వచ్చి; ధనుః+జ్యా వితత, స్వనంబునన్= వింటినారియొక్క పెద్ద ధ్వనిచేత; వియత్+వివరంబు= ఆకాశభాగం; ప్రపూరితంబుగన్= నిండిపోగా; ఆ రథిక+ఆవలిన్= ఆ వీరులసమూహాన్ని; తీవ్రబాణ+ఆవృతమూర్తిన్+చేసెన్= తీవ్రబాణాలతో ముంచివేశాడు.

**తాత్పర్యం:** భీముడు, నకుల సహదేవులు, ధృష్టద్యుమ్నుడు దుర్యోధనాదులను ఎదుర్కొనగా, ధైర్యం అతిశయిల్ల కర్ణుడు అతివేగంగా అటకు వచ్చి వింటినారిధ్వని ఆకాశమంతా నిండగా మ్రోయిస్తూ, తీవ్రబాణాలతో వారిని ముంచాడు.

**క. అట్టియెడ మాద్రి పిదపటి । పట్టి కురునృపాలు రెండుపదులమ్ములు దా**
**బెట్టుగ నేసిన వేదన । ముట్టుడుఁ జేడ్పడియె నతఁడు మొనయును దలఁకెన్.** **378**

**ప్రతిపదార్థం:** అట్టిఎడన్= అప్పుడు; మాద్రిపిదపటిపట్టి= సహదేవుడు; కురునృపాలున్= దుర్యోధనుడిని; రెండుపదులు+అమ్ములు= ఇరవైబాణాలు; తాన్ బెట్టుగన్+ఏసినన్= తానుగట్టిగా వేయగా; వేదన ముట్టుడున్= నొప్పి కలుగగా; అతఁడు= దుర్యోధనుడు; చేడ్పడియెన్= తొలగిపోయాడు; మొనయును తలఁకెన్= సేన కూడా బెదరిపోయింది.

**తాత్పర్యం:** అప్పుడు సహదేవుడు దుర్యోధనుడిపై ఇరవైబాణాలు గుప్పించగా అతడు ఎంతోబాధను పొందాడు. అతడి సైన్యం కూడా కలతపొందింది.

**మ. కని రాధేయుఁడు దివ్యబాణనిహతిం గౌంతేయ సైన్యంబు నె**
**ల్లను నొప్పించిన బీఱువోయె నది యుల్లాసోగ్రుఁ డై ధర్మ**
**నందను నమ్మేటిమగండు గిట్టుటయు నాతం డల్గి పె ల్లేసినన్**
**విను మందస్మితసుందరుం డగుచు నవ్వీరుండు ధీరోద్ధతిన్.** **379**

**ప్రతిపదార్థం:** రాధేయుఁడు= కర్ణుడు; కని= అది చూచి; దివ్యబాణనిహతిన్= దివ్యబాణాల దెబ్బచే; కౌంతేయ సైన్యంబును+ఎల్లను, నొప్పించినన్= పాండవసేననంతా బాధపెట్టగా; అది= ఆ సైన్యం; బీఱుపోయె= శక్తిహీనమైంది; ఉల్లాస+ఉగ్రుఁడు+అయి= ఉల్లాసంచే భయంకరుడయి; ఆ+మేటిమగండు= ఆ వీరుడు; ధర్మనందనున్= ధర్మరాజును; కిట్టుటయున్= సమీపించగా; అతండు= అతడు; అల్గి= కోపించి; పెల్లు+ఏసినన్= పెక్కుబాణాలు వేయగా; మందస్మిత సుందరుండు+అగుచున్= చిరునవ్వుతో అందగించినవాడై; ఆ+వీరుండు= కర్ణుడు; ధీర+ఉద్ధతిన్= ధైర్యాతిశయంతో; విను= (ఏం చేశాడో) వినుము.

**తాత్పర్యం:** రాధేయుడు అది చూచి దివ్యబాణాలు వేసి పాండవసైన్యాన్ని కలతపెట్టగా అది ధైర్యహీనమయింది. ఆ ఉత్సాహంతో ధర్మరాజును సమీపించగా అతడు పలుబాణాలు వేశాడు. దానికి కర్ణుడు చిరునవ్వుతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**వ. అనేక చండ కాండంబు లంగంబునం గీలించి. 380**

**ప్రతిపదార్థం:** అనేక చండ కాండంబులు= పటువైన పెక్కుబాణాలు; అంగంబునన్+కీలించి= అతడి దేహంలో నాటి.

**తాత్పర్యం:** తీవ్రబాణాలను ధర్మరాజుశరీరంలో నాటి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. వలుఁద నారసంబు వక్షంబుఁ దూఱంగ । నేయుటయును బాండవేయుఁ డార్తిఁ**
**గూరి నిలువలేక కూర్చుండఁబడి సూతు । నరద మెగవు తొలఁగ ననియె నధిప! 381**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వలుఁద నారసంబు= విశాలమైన బాణం; వక్షంబున్+తూఱంగన్+ఏయుటయున్= వక్షంలో నాటేటట్లు వేయగా; పాండవేయుఁడు+ఆర్తిన్+కూరి= ధర్మరాజు బాధనొంది; నిలువలేక కూర్చుండఁబడి= నిలబడలేక కూలబడి; సూతున్= సారథిని; అరదము= రథం; ఎగవుతొలఁగన్+అనియెన్= వేగంగా తోలుమని అన్నాడు.

**తాత్పర్యం:** కర్ణుడు ధర్మరాజు ఎదలో విశాలబాణాన్ని నాటగా అతడు బాధతో కూలబడిపోయి సారథిని రథం త్వరగా తొలగిపోనిమ్మని అన్నాడు.

**వ. అనుటయు వాఁ డట్ల చేయం గౌరవులు గడంగి పోనీక పొదువుం డను నెలుంగులతో నక్కొంతేయాగ్రజు వెన్నాడి కవిసినం గేకయ పాంచాల బలంబు లడ్డపడి పెనంగె; భీమసేనుండు సుయోధనుని 'నిలు నిలు' మని యదల్చి యమ్ములం గప్పె; నప్పుడు రాధేయుండు రభసంబున. 382**

**ప్రతిపదార్థం:** అనుటయున్ వాఁడు+అట్లచేయన్= అనగా సారథి అట్లాగే చేయగా; కౌరవులు కడంగి= కౌరవులు పూని; పోనీక పొదువుండు అను+ఎలుంగులతోన్= ధర్మరాజును; పోనివ్వకుండా ఆపండి అను అరుపులతో; ఆ+కౌంతేయ+అగ్రజున్ వెన్నాడి కవిసినన్= ఆ ధర్మరాజును వెంబడించి పోరగా; కేకయ పాంచాల బలంబులు+అడ్డపడి= కేకయ పాంచాల సైన్యాలు అడ్డుకొని; పెనంగెన్= పోరుసల్పాయి; భీమసేనుండు= భీముడు; సుయోధనునిన్= దుర్యోధనుడిని; నిలునిలుము+అని అదల్చి= ఆగుము ఆగుము అని బెదరించి; అమ్ములన్+కప్పెన్= బాణాలతో కప్పాడు; అప్పుడు రాధేయుండు= అప్పుడు కర్ణుడు; రభసంబునన్= వేగిరపాటుతో.

**తాత్పర్యం:** ధర్మరాజు అనగానే సారథి అట్లాగే చేశాడు. కౌరవులు ధర్మరాజును పోనీయకుండా వెంబడించి తాకారు. అప్పుడు కేకయ పాంచాల వీరులు అడ్డుకొని వారిని తాకారు. భీముడు దుర్యోధనుడిని ఆగుమాగుము అని ఆపి బాణాలతో కప్పాడు. అప్పుడు కర్ణుడు సంభ్రమంతో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. పాంచాలురఁ గేకయుల ను । దంచిత గర్వమున వాలురమ్ములవెల్లిన్**
**ముంచిన నోటఁటి యరికరి । పంచాననమూర్తి భీముపజ్జ కొదిఁగినన్. 383**

**ప్రతిపదార్థం:** పాంచాలురన్+కేకయులును= పాంచాల కేకయ వీరులను; ఉదంచిత గర్వమునన్= ఎక్కువైన గర్వంతో; వాలు+అమ్ముల వెల్లిన్= వాడియైన బాణాల ప్రవాహంతో; ముంచినన్= కప్పగా; ఓట+అటి= ఓడిపోయి; అరికరి పంచాననమూర్తి= శత్రుగజమునకు సింహరూపమైన; భీముపజ్జకున్+ఒదిఁగినన్= భీముని ప్రక్కలో చేరగా.

**తాత్పర్యం:** కర్ణుడు పాంచాల, కేకయ వీరులను బాణవర్షంతో ముంచెత్తగా వారు భయపడి శత్రుభయంకరుడైన భీముడి అండను చేరారు.

**వ. అక్కర్ణుండు నిజరథంబు మెఱయ ధర్మనందను వెనుకొనియె; నతండు విశిఖ వేదనం జేడ్పడిన చిత్తంబుతోడ నిజశిబిరంబున కల్లనల్లన పోవుచుండియుఁ దన్ను నా సూతనందనుండు మూఁడుదూపుల నేసిన మరలి యమ్మేటిమగని మేనం బలుమార్గణంబులు సొనిపి తత్సారథి సాయక త్రయంబునకు హయంబుల శరచతుష్టయంబునను స్రుక్కించె నట్టియెడ. 384**

**ప్రతిపదార్థం:** ఆ+కర్ణుండు= కర్ణుడు; నిజ రథంబు మెఱయన్= తన రథం ప్రకాశించగా; ధర్మనందనున్ వెనుకొనియెన్= ధర్మరాజును వెంబడించాడు; అతండు= ధర్మరాజు; విశిఖవేదనన్= బాణందెబ్బచే కలిగిన నొప్పితో; చేడ్పడిన చిత్తంబుతోడన్= బాధపడిన హృదయం తోడై; నిజ శిబిరంబునకున్= తన శిబిరానికి; అల్ల+అల్లన పోవుచుండియున్= మెల్లమెల్లగా పోతూ; తన్నున్+ఆ సూతనందనుండు= తనను ఆ కర్ణుడు; మూఁడుతూపులన్+ఏసినన్= మూడుబాణాలతో కొట్టగా; మరలి= అతడివైపు తిరిగి; ఆ+మేటిమగని మేనన్= ఆ కర్ణుడి శరీరంలో; పలు మార్గణంబులు చొనిపి= పెక్కుబాణాలు నాటి; తత్సారథిన్= అతడి సారథిని; సాయకత్రయంబునను= మూడు బాణాలతోనూ; హయంబులన్= గుర్రాలను; శర చతుష్టయంబునను= నాలుగు బాణాలతోనూ; స్రుక్కించెన్= పడగొట్టాడు; అట్టి ఎడన్= అప్పుడు.

**తాత్పర్యం:** కర్ణుడు తన రథంపై వెలుగొందుతూ ధర్మరాజును వెంబడించాడు. బాణాల దెబ్బలకు బాధపడుతూ మెల్లగా శిబిరానికి పోతున్న అతడిపై మూడుబాణాలు వేశాడు. ధర్మరాజు మరలి కర్ణుడిపై పలుబాణాలు కురిపించి, మూడుబాణాలతో అతడి సారథిని, నాలుగుబాణాలతో గుర్రాలను పడగొట్టాడు. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. ఇరుదెసల నున్న కవ ల । న్నరపతి దురవస్థ సూచి నారాచపరం**
**పరలు పరఁగించుచును జె । చ్చెరఁ గర్ణునిఁ దాఁకి రతఁడు చిఱున వ్వొలయన్. 385**

**ప్రతిపదార్థం:** ఇరుదెసల నున్న కవలు= రెండువైపుల ఉన్న నకుల సహదేవులు; ఆ+నరపతి దురవస్థ+చూచి= ధర్మరాజు కష్టాన్ని చూచి; చెచ్చెరన్= వెంటనే; కర్ణునిన్= కర్ణుడిని; అతఁడు చిఱునవ్వు+ఒలయన్= అతడు చిరునవ్వు నవ్వగా; నారాచ పరంపరలు పరఁగించుచును= బాణపరంపర కురిపిస్తూ; తాఁకిరి= ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** ప్రక్కలనున్న నకుల సహదేవులు ధర్మరాజు ఇబ్బందిని చూచి, అతడికి సహాయంగా నిలిచి కర్ణుడిపై బాణాలు కురిపించారు. కర్ణుడు చిరునవ్వు నవ్వుతూ.

**తే. వార లిరువుర నుగ్రంపు నారసములఁ । గప్పి దంత వర్ణములును గాలవాల**
**సుందరంబులు నగు ధర్మనందనుని తు । రంగమంబులఁ బడనేసి రయము మెఱయ. 386**

**ప్రతిపదార్థం:** వారలన్+ఇరువురన్= వారిద్దరినీ; ఉగ్రంపు నారసములన్+కప్పి= క్రూరబాణాలతో కప్పి; దంత వర్ణములును= తెలుపురంగులు; కాల, వాల, సుందరంబులు+అగు= నల్లని తోకలచే సుందరములైన; ధర్మనందనుని తురంగమంబులన్= ధర్మరాజు గుర్రాలను; పడన్+ఏసి= పడగొట్టి; రయము మెఱయన్= వేగం ప్రకాశం కాగా.

**తాత్పర్యం:** కర్ణుడు నకుల సహదేవులపై వాడిబాణాలు వేసి, తెల్లనిరంగు గల మేనులతో, నల్లని తోకలతో అందమైన ధర్మరాజు గుర్రాలను వేగంగా కూలవేసి. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అతని శిరస్త్రాణంబును । శితవిశిఖ నిపాతితంబు సేసి యుదారో**
**ద్ధతి నకలు కార్ముకము హయ । తతియుం దునుమాడుటయు నతండును నతఁడున్. 387**

**ప్రతిపదార్థం:** అతని శిరస్త్రాణంబును= ధర్మరాజు తలతొడుగు; శిత విశిఖ నిపాతితంబు చేసి= వాడిబాణాలచేత పడగొట్టి; ఉదార+ఉద్ధతిన్= గొప్ప పరాక్రమంతో; నకులు కార్ముకము హయతతియున్= నకులుడి విల్లు, గుర్రాలను; తునుమాడుటయును= ఖండించగా; అతండునున్+అతఁడున్= ధర్మజ, నకులులు.

**తాత్పర్యం:** వాడిబాణాలతో ధర్మరాజు తలకు రక్షగా ఉన్న తొడుగును పడగొట్టి పరాక్రమించి నకులుడి గుర్రాలను, విల్లును ఖండించగా ధర్మరాజు, నకులుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. సహదేవుని తే రెక్కిన । నహితాంతకుఁ డైన కర్ణుఁ డమ్ముప్వుర సం**
**పిహిత శరీరులఁ జేసెను । బహువిధ బాణములఁ జలము బలమును మెఱయన్. 388**

**ప్రతిపదార్థం:** సహదేవుని తేరు+ఎక్కినన్= సహదేవుడి రథంపైకి ఎక్కగా; అహిత+అంతకుఁడు+ఐన కర్ణుడు= శత్రుహంతమైన కర్ణుడు; చలము బలమును మెఱయన్= పట్టుదల పరాక్రమం ఒప్పగా; బహువిధ బాణములన్= అనేక బాణాలతో; ఆ+ మువ్వురన్= ధర్మజనకుల సహదేవులను; సంపిహిత శరీరులన్+చేసెన్= కప్పబడినవారిగా చేశాడు.

**తాత్పర్యం:** (ధర్మరాజు, నకులులు) సహదేవుడి రథంపైకి రాగా, కర్ణుడు వారి ముగ్గురినీ బలంతో చలంతో పలురకాల బాణాలతో నొప్పించి ముగ్గురి శరీరాలను కప్పేశాడు.

**చ. కనుఁగొని శల్యుఁ డి ట్లనియెఁ గర్ణునితో 'నిది యేల? ధర్మనం**
**దనుపయి నాగ్రహించెదు; హితం బగు కార్యమె యిమ్మహీశు నీ**
**వనిఁ దెగటార్చినట్లయిన నర్జునుఁ డుత్కట శోకరోషమున్**
**పెనఁగొన నిన్నుఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు సేయకుండునే? 389**

**ప్రతిపదార్థం:** శల్యుఁడు= శల్యుడు; కనుఁగొని= చూచి; కర్ణునితోన్= కర్ణుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; ఇది ఏల ధర్మనందనుపయిన్+ఆగ్రహించెదు= ఇట్లా ధర్మరాజుపై ఆగ్రహిస్తావెందుకు?; హితంబు+అగు కార్యమె?= మేలుకలిగించే పనియా?; ఈ+మహీశు= ఈ రాజును; నీవు+అనిన్= నీవు యుద్ధంలో; తెగటార్చినట్లు+అయినన్= చంపితే గనుక; అర్జునుడు; ఉత్కట శోకరోషముల్ పెనఁగొనన్= అధిక దుఃఖ ఆవేశాలు పెనగొనగా; నిన్నున్+కౌరవులన్= నిన్నూ, కౌరవులనూ; పీనుఁగు పెంటలు చేయకుండునే?= శవాలుగా చేయకుండా ఉంటాడా?

**తాత్పర్యం:** శల్యుడది చూచి కర్ణుడితో ఇట్లా అన్నాడు: 'ధర్మరాజుపై నీ ఆగ్రహం చూపిస్తున్నావెందుకు? ఇది మేలు చేసే పనియా? అతడిని నీవు యుద్ధంలో వధిస్తే, శోక కోపావేశాలు పెనగొన్న అర్జునుడు నిన్ను, కౌరవులను సంహరించకుండా ఉంటాడా?'

**విశేషం:** ఆదినుండీ కర్ణుడి ప్రయత్నాలకు ఆటంకం కలిగించటమే శల్యుడు పనిగా పెట్టుకొన్నాడు.

**తే. ఇతఁడు దెగటాఱెనేనియు నేమి ఫలము । గలదు? నరుఁ బొలియించుట యలఘుశౌర్య;**
**మది కురుక్షితిపాలున కఖిల రాజ్య । సిద్ధియును జేయు; నింక నా బుద్ధి వినుము.** **390**

**ప్రతిపదార్థం:** ఇతఁడు తెగటాఱెను+ఏనియున్= ఇతడు చనిపోయినా; ఏమి ఫలముకలదు?= లాభమేమున్నది?; నరున్+ పొలియించుట అలఘుశౌర్యము= అర్జునుడిని వధించటమే గొప్ప పరాక్రమం; అది; కురుక్షితిపాలునకున్= దుర్యోధనుడికి; అఖిల రాజ్య సిద్ధియును చేయున్= సమస్త రాజ్యాన్ని లభింపచేస్తుంది; ఇంక నా బుద్ధి వినుము= ఇక నా మాట వినుము.

**తాత్పర్యం:** ధర్మరాజు మరణం వలన నీకు ఏమి లాభం? అర్జునుడిని వధించటమే నీ ఘనతకు నిదర్శనం. దానివలన దుర్యోధనుడికి సమస్తరాజ్యం దక్కుతుంది. ఇక నా మాట వినుము.

**వ. అదియునుం గాక.** **391**

**తాత్పర్యం:** అంతే కాక.

**క. వాఁడె కురుక్షితిపాలుఁడు । పోఁడిమి సెడి భీముచేతఁ బొదువఁబడియె న**
**వ్వాఁడిమగని కడ్డము నీ । వేఁడిమి దక్కంగఁగలదె వేఱొకఁ డరయన్?** **392**

**ప్రతిపదార్థం:** వాఁడె కురుక్షితిపాలుఁడు= అదిగో అతడే కురురాజు దుర్యోధనుడు; పోఁడిమి చెడి= ఒప్పు కోల్పోయి; భీముచేతన్= భీముడిచేత; పొదువన్+పడియెన్= తాకబడినాడు; ఆ+వాఁడిమగనికిన్+అడ్డము= ఆ మేటివీరుడికి అడ్డు; నీ వేఁడిమి తక్కంగన్= నీ శౌర్యంతప్ప; వేఱొకఁడు+అరయన్= మరొకటి చూడగా; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** అదిగో! దుర్యోధనుడు ధైర్యహీనుడై భీముడిచేత చిక్కాడు. నీవు తప్ప వేరెవరు అతడిని ఎదుర్కొన గలరు?

**క. పవనసుతు చేత నా భూ ।ధవుఁ డీల్గినయేని నీవు ధర్మతనయునిం**
**గవలన్ సమయించుట దలఁ । ప వృథాస్ఫురణంబు గాదె పరబలభేదీ!'** **393**

**ప్రతిపదార్థం:** పరబలభేదీ!= శత్రుబలాన్ని ఖండించేవాడా (కర్ణా!); పవనసుతుచేతన్= భీముడిచేత; ఆ భూధవుఁడు+ఈల్గిన, ఏనిన్= దుర్యోధనుడు చచ్చినట్లయితే; నీవు; ధర్మతనయునిన్+కవలన్= ధర్మజ నకుల సహదేవులను; సమయించుట= వధించటం; తలఁపన్= చూడగా; వృథాస్ఫురణంబు కాదె?= వ్యర్థ పరాక్రమమే కాదా?

**తాత్పర్యం:** కర్ణా! దుర్యోధనుడు భీముడిచేత చనిపోయిన తరువాత, నీవు ధర్మజ, నకుల, సహదేవులను వధించినా వ్యర్థమే కదా!'

**క. అన విని యట్లెత్తి భవ । త్తనయుని దెసఁ జూచి వాయుతనయునిచే నా**
**తని పొదువఁబడుట యేర్పడఁ । గని రాధాతనయుఁ డతని గావఁగఁ జనియెన్. 394**

**ప్రతిపదార్థం:** అనన్+విని= శల్యుడనగా విని; అట్టు+ఎత్తి= తలఎత్తి; భవత్+తనయుని, దెసన్+చూచి= నీకుమారుడివైపు చూచి; వాయుతనయునిచేన్+ఆతని పొదువఁబడుట= భీముడు ఆక్రమింపబడటం; ఏర్పడన్+కని= స్పష్టంగా చూచి; రాధాతనయుఁడు= కర్ణుడు; అతనిన్+కావఁగన్+చనియెన్= అతడిని కాపాడటానికి వెళ్ళాడు.

**తాత్పర్యం:** శల్యుడి మాటలు విని, కర్ణుడు భీముడిచేత పొదువబడిన దుర్యోధనుడిని చూచి అతడిని కాపాడటానికి వెళ్ళాడు.

**క. చనుటయు నజాతశత్రుఁడు । దన శిబిరంబునకుఁ బిన్నతమ్ముని యరదం**
**బున నతని నతని యన్నను । గొని చనియెను సత్వరముగఁ గురుకులముఖ్యా! 395**

**ప్రతిపదార్థం:** కురుకుల ముఖ్యా!= ఓ ధృతరాష్ట్ర రాజా!; చనుటయున్= వెళ్ళగానే; అజాతశత్రుడు= ధర్మరాజు; పినతమ్ముని అరదంబునన్= సహదేవుడి రథంపై; అతనిన్+అతనిఅన్నను= అతడిని, అతని అన్నయైన నకులుడిని; తన శిబిరంబునకున్= తన శిబిరానికి; సత్వరంబుగన్= శీఘ్రంగా; కొని చనియెను= తీసికొని వెళ్ళాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కర్ణుడు అటు వెళ్ళగానే ధర్మరాజు వెంటనే నకుల సహదేవులతో తన శిబిరం చేరుకొన్నాడు.

**వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు ధర్మనందను పలాయనం బెఱింగించె ననుటయు. 396**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు= అని ఈ విధంగా; సంజయుండు= సంజయుడు; ధృతరాష్ట్రునకున్= కురురాజుకు; ధర్మనందను పలాయనంబు= ధర్మరాజు పారిపోవటం; ఎఱింగించెన్+అనుటయున్= వివరించాడు అనగానే.

**తాత్పర్యం:** ఈ విధంగా ధర్మరాజు పలాయనం గురించి సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పాడని వైశంపాయనుడు అనగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. మొదలిరాజు సభయముగ నిట్లు సమరంబు । దొలఁగి చనియె నట్టె; పెఱబలంబు**
**దొరలు నిలిచి పోరు టరిది; యనంతర । వర్తనంబు విప్రవర్య! చెపుము. 397**

**ప్రతిపదార్థం:** విప్రవర్య!= వైశంపాయనా!; మొదలిరాజు= ధర్మరాజు; సభయముగన్= భయంతో; ఇట్లు సమరంబు తొలఁగి చనియెన్+అట్టె= ఇట్లా యుద్ధం వదలి వెళ్ళాడా; పెఱబలంబు దొరలు= ఇతరసేనలోని వీరులు; నిలిచిపోరుట+అరిది= స్థిరంగా నిలచి పోరటం అరుదు; అనంతర వర్తనంబు= తర్వాత జరిగింది; చెపుము= చెప్పుము.

**తాత్పర్యం:** వైశంపాయనా! ధర్మరాజు భయంతో అట్లా యుద్ధభూమినుండి తొలగిపోయాడా? ఇతరసేనలోని వీరులు స్థిరంగా నిలిచి పోరాడటం కష్టం. జరిగినదంతా వివరించుము.

**వ. అని యడుగుటయు. 398**

**తాత్పర్యం:** అని జనమేజయుడు అడుగగా. (తరువాతి ఆశ్వాసంలోని రెండవవచనంతో అన్వయం.)

**విశేషం:** మహాభారతగాథను వైశంపాయనుడు జనమేజయుడికి వివరించి చెబుతున్నాడు.

**ఆశ్వాసాంతము**

**చ. అనిమిషవంద్యమాన! ఘనసాదరశీల సుధాయమాన! స**
**త్త్వనలిన గంధరూప! విబుధ ద్విషదంతకర ప్రతాప సం**
**జనిత నిరస్తకామ! మునిసంఘ మహార్ణవ పూర్ణసోమ! వే**
**దనికర సంవిధేయ నిజతత్త్వ పరిష్క్రియ నిత్యనిష్క్రియా** **399**

**ప్రతిపదార్థం:** అనిమిష వంద్యమాన!= దేవతలచే నమస్కరింపబడుతున్నవాడా!; ఘనసాదరశీల= గొప్ప ఆదర స్వభావంచేత; సుధాయమాన!= అమృతంవంటివాడా!; సత్త్వనలిన గంధరూప!= సత్త్వగుణమనెడి పద్మానికి పరిమళరూపమైనవాడా!; విబుధద్విషత్+అంతకర ప్రతాప!= దేవతల శత్రువులైన రాక్షసులను సంహరించే పరాక్రమవంతుడా!; సంజనిత నిరస్తకామ!= పుట్టిన నశించిన మన్మథుడు కలవాడా!; మునిసంఘ మహా+అర్ణవ= మునులసమూహం అనే గొప్ప సాగరానికి; పూర్ణసోమ!= నిండు చంద్రుడా!; వేదనికర సంవిధేయ= వేదసమూహములందు తెలియదగిన; నిజతత్త్వ పరిష్క్రియ!= స్వీయతత్త్వ పరిష్కారం కలవాడా; నిత్యనిష్క్రియా!= ఎట్టి వ్యాపారం లేనివాడా!

**తాత్పర్యం:** హరిహరనాథా! దేవతలందరికీ పూజనీయుడా!, భక్తులకు అమృతరూపుడా!, సత్త్వగుణ భరితుడా!, అయినా సమయం వచ్చినప్పుడు పరాక్రమించి రాక్షససంహారం కావించేవాడా!, కాముడి జనన నాశనకర్తా!, మునుల హృదయసాగరాన్ని ఉప్పొంగించే పూర్ణచంద్రుడా!, వేదాలలో నిరూపించబడిన నిజస్వరూపం కలవాడా! నిర్వ్యాపారుడా!

**విశేషం:** 'అనిమిష' శబ్దంచేత రెప్పపాటు విరామం కూడా లేకుండా - అనే ధ్వని ప్రతీయమానం అవుతుంది. 'సుధాయమాన' అనటంలో చల్లని చూపుతో కూడిన కరుణ, 'గంధరూప' అనటంలో ఎడబాయని సత్త్వగుణం వెల్లడవుతున్నాయి. హరిరూపంలో కాముని పుట్టుకకు కారకుడై, హరుని రూపంలో అతడిని నశింపజేశాడు కాబట్టి, హరిహరనాథుఁడు 'సంజనిత నిరస్తకాముడు.'

**క. ప్రమితి విదూరా! సుమన। స్సమితి సమారాధన ప్రసన్నాకారా!**
**గమనా గమన నిరసనా! శమన దమన సాధ్యపరమ సారోల్లసనా!** **400**

**ప్రతిపదార్థం:** ప్రమితి విదూరా!= ప్రమాణాలకు అందనివాడా; సుమనస్+సమితి సమారాధన= నిర్మలచిత్తులైన జ్ఞానుల దేవతలసమూహంయొక్క అర్చనలచేత; ప్రసన్న+ఆకారా!= సుప్రసన్నమగు ఆకారం గలవాడా!; గమన+ఆగమన నిరసనా!= వెళ్ళుట, వచ్చుట అనే క్రియలు లేనివాడా!; శమన దమన సాధ్య= శాంతిదాంతులచేత తెలియదగిన; పరమసార+ఉల్లసనా!= ఉత్తమజ్ఞాన వికాసం కలవాడా!.

**తాత్పర్యం:** హరిహరనాథా! లోకంలో, వివిధ ప్రమాణాలకు అతీతుడవైన వాడా! నిన్ను అర్చించే నిర్మలజ్ఞానులకు సుప్రసన్నుడవైనవాడా! గమనాగమనములు లేనివాడా! శాంతిదాంతులచేత తెలియదగిన తత్త్వం కలవాడా!

**విశేషం:** లోకంలోని వస్తువులను వివిధ ప్రమాణాలతో తూచినట్లు హరిహరనాథుడిని తూచలేము. ఆయన అన్నిటికీ అతీతుడు. సర్వవ్యాపకుడవటంచేత గమనాగమన వర్జితుడు.

**మాలిని.**

**ద్విజపతి వృషభాంకోదీర్ణ! కారుణ్య పూర్ణా!**
**భజన నిరతరక్షా ప్రౌఢ! నిర్భేదరూఢా!**
**గజదురిత సముత్సేకఘ్న! హృత్పద్మనిఘ్నా!**
**యజన విధి ఫలత్వవ్యాప్త! నిత్య ప్రదీప్తా!** **401**

**ప్రతిపదార్థం:** ద్విజపతి వృషభాంక+ఉదీర్ణ!= గరుడ వృషభవాహనాలతో కూడిన శ్రేష్ఠుడా!; కారుణ్యపూర్ణా!= కరుణాభావంతో నిండినవాడా!; భజన నిరతరక్షాప్రౌఢ!= భక్తులను ఎల్లప్పుడు కాపాడటంలో ప్రావీణ్యం కలవాడా!; నిర్భేదరూఢా= భేదంలేకపోవటంచేత ప్రసిద్ధుడా!; గజదురితసముత్సేకఘ్న!= ఏనుగుయొక్క దుఃఖాతిశయాన్ని నశింపజేసినవాడా!; హృద్+పద్మనిఘ్నా!= హృదయ కమలంలో ఇమిడేవాడా!; యజనవిధి ఫలత్వవ్యాప్త!= యజ్ఞకర్మమునకు ఫలంగా స్వరూపం పొందినవాడా!; నిత్యప్రదీప్తా!= నిత్య తేజోరూపుడా!

**తాత్పర్యం:** హరిగా గరుడ వాహనంచేత, హరుడిగా వృషభ వాహనంచేత ప్రసిద్ధమైనవాడా! హరిహరనాథా! ఆర్తులపట్ల కరుణామూర్తివి, నిరంతర భక్తరక్షకుడవు. భేదరహితుడవు. గజనాథుడి బాధను హరిరూపంలో, గజాసురుడి దురితాన్ని హరుడి రూపంలో నశింపజేసినవాడా! సర్వవ్యాపకుడవై హృదయకోశంలో నిలిచేవాడా! యజ్ఞఫలస్వరూపుడా! నిత్య తేజోరూపుడా!

**విశేషం:** పై మూడు పద్యాలూ తిక్కన కృతినాథుడైన హరిహరనాథుడి స్తుతులు. ఆశ్వాసాంతంలో కృతిపతిని స్తుతించే పద్యాలు రచించటం ప్రాచీనకవి సంప్రదాయం. మొదటి పద్యంలో వృత్త వైవిధ్యం పాటించి మిగిలిన రెండూ వరుసగా కందం, మాలిని చందస్సులలో వ్రాయటం తిక్కన అవలంబించిన పద్ధతి.

**గద్యము.**

**ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబున కర్ణపర్వంబునందు ద్వితీయాశ్వాసము.**

**తాత్పర్యం:** ఉభయ కవిమిత్రుడూ, కొమ్మనామాత్య పుత్రుడూ, పండితులను పూజించేవాడూ (పండితులచేత పూజించబడి ప్రకాశించేవాడూ) అయిన తిక్కన సోమయాజి రచించిన మహాభారతంలోని కర్ణపర్వ ద్వితీయాశ్వాసం ఇది.

మహాభారతంలో కర్ణపర్వంలోని ద్వితీయాశ్వాసం సమాప్తం.

శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము - తృతీయాశ్వాసము

**శ్రీమచ్చరణాంబుజ యుగ। ళీ మధుమూర్తి, ప్రభావిలీన విమల చే**
**తోమత్తభృంగ, భక్తజ। నామృత సరసీస్వరూప! హరిహరనాథా!** 1

**ప్రతిపదార్థం:** శ్రీమత్= (సర్వ)సంపదలు గల శుభాలకు మూలమైన; చరణ+అంబుజ= పాదములనెడి పద్మాల; యుగళీ= జతయందున్న; మధు= తేనెయొక్క (కృపారసముయొక్క); మూర్తి= రూపంగల; ప్రభా= కాంతియందు; విలీన= పూర్తిగ మునిగిన (బాహ్యస్ఫురణ లేక); విమలచేతః= మాలిన్యంచేత చిత్తముగల (బాహ్యస్ఫురణయే మాలిన్యం. అనగా వేరు చింత లేక భగవంతుడికి పూర్తిగ అర్పితమైన మనస్సులు గల); మత్తభృంగ= పారవశ్యం పొందిన తుమ్మెదలనెడు (మేలుజాతి తుమ్మెదలని చెప్పవలెను. మత్తగజముల వలె); భక్తజన= భక్తులకు; అమృత సరసీ స్వరూప!= మోక్షపు కొలను రూపం కలవాడా!; హరిహరనాథా!= ఓ హరిహరనాథా!

**తాత్పర్యం:** అన్ని సంపదలకు ఆకరములైన నీ పాద పంకజాలలోని (కృప అనెడు) తేనెరూపు మహిమలో (ఏకాగ్రంగా) పూర్తిగా మునిగిన నిర్మలచిత్తులైన మేలు తుమ్మెదలనెడి భక్తజనులకు మోక్షప్రద స్వరూపుడా! హరిహరనాథా!

**విశేషం:** అలం: రూపకం.

### కర్ణవిజృంభణము (సం. 8-66-33)

**వ. దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె; నట్లు కర్ణుండు గౌంతేయాగ్రజు విడిచి, దుర్యోధన సంరక్షణంబునకుం జనుటవిని, ధృతరాష్ట్రుండు దన మనంబున.** 2

**ప్రతిపదార్థం:** దేవా!= ఓ హరిహరనాథా!; వైశంపాయనుండు; జనమేజయునకున్; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు; అట్లు= ఆ విధంగా; కర్ణుండు; కౌంతేయ+అగ్రజున్= ధర్మరాజును; విడిచి= వదలి; దుర్యోధన= దుర్యోధనుడియొక్క; సంరక్షణంబునకున్= భద్రతకొరకై; చనుట= వెళ్ళటం; విని; ధృతరాష్ట్రుండు; తన మనంబునన్= తన మనసులో.

**తాత్పర్యం:** దేవా! వైశంపాయనుండు జనమేజయుడితో ఇట్లా అన్నాడు: కర్ణుడు కుంతీపుత్రులలో మొదటివాడిని (ధర్మరాజును) వదలి దుర్యోధనుడిని కాపాడటానికి వెళ్ళాడని విని, ధృతరాష్ట్రుడు తన మనస్సులో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'అనిలజునకుఁ జాలఁడె నా। తనయుఁడు? మోసంబుగాక ధర్మజుఁ డ ట్ల**
**బ్బినఁ బో నిచ్చుట రాధా। తనయునకున్ బుద్ధి యగునె? తప్పెం దప్పెన్!'** 3

**ప్రతిపదార్థం:** అనిలజునకున్= వాయువునకు పుట్టిన భీమునికి!; నాతనయుఁడు= నా కుమారుడు; చాలఁడె?= సమానుడు కాడా?; ధర్మజుఁడు= ధర్మరాజు; అట్లు+అబ్బినన్= ఆ విధంగా దొరికినపుడు; పోనిచ్చుట= వదలిపెట్టటం; రాధాతనయునకున్= రాధాపుత్రుడైన కర్ణుడికి; బుద్ధి యగునె?= వివేకమగునా?; మోసంబు గాక!= ఇది మోసంగాక (ఏమగును); తప్పెన్ తప్పెన్= ధర్మం తప్పాడు.

**తాత్పర్యం:** వాయుపుత్రుడికి నా కుమారుడు తీసిపోయాడా? ధర్మరాజు అట్లా దొరికినప్పుడు వదలిపెట్టటం రాధేయుడికి తగిఉన్నదా? చూస్తే ఇదంతా నమ్మకద్రోహంగాక ఏమౌతుంది? ఇంతకు అతడు ధర్మం ముమ్మాటికి తప్పాడు. చేతికి చిక్కిన అవకాశం తప్పిపోయింది.

**వ. అని వగచి, 'యుధిష్ఠిరుండు సనినపిదప నెత్తెఱంగున సంగరంబు సెల్లె?' నని యడిగిన, సంజయుం డతని కి ట్లనియె; నట్లు సని యా ధర్మతనయుండు రథావతరణంబు సేసి శిబిరంబు ప్రవేశించి, సెజ్జ నొడలు సేర్చి, నాటియున్న యమ్ములు పెఱికించుకొని, హృదయంబున నమ్మెయి నున్న పరిభవంబు పీడ యొనర్ప, విషాద వివర్ణవదనుం డగుచుఁ గవలం గనుంగొని- 'మీరు సమీరనందనుకడకుం జనుం' డని చెప్పె., నటమున్న నకులుం డొక్కయరదం బాయితంబు సేసికొనియుండుట, నయ్యిరువురుఁ ద్వరితగతిం జని, యంబుదంబు చందంబున గర్జిల్లుచుఁ గౌరవులతోడం గయ్యంబు సేయుచున్న భీమసేనుఁ జేరం జని, యవష్టంభ విజృంభణంబునం బొలిచి; రంత నప్పాండవాగ్రజు తెఱం గేమియు నెఱుంగక నరుండు ద్రౌణితోడ భరంపడి రణం బొనర్చుచుండి. 4**

**ప్రతిపదార్థం:** అని వగచి= అని దుఃఖించి; యుధిష్ఠిరుండు= ధర్మజుడు; చనిన పిదపన్= వెళ్ళిపోయిన తరువాత; ఏ+తెఱంగునన్= ఏ విధంగా; సంగరంబు= యుద్ధం; చెల్లెన్?= సాగింది?; అని, అడిగనన్= అని అడుగగా; సంజయుండు ఆతనికిన్ ఇట్లు+ అనియెన్; ఆ ధర్మతనయుండు= ఆ ధర్మజుడు; రథ+అవతరణంబు+చేసి= రథం దిగి; శిబిరంబు= దండు విడిది చేసే చోటు; ప్రవేశించి; సెజ్జన్= పడకయందు; ఒడలు+చేర్చి= దేహాన్ని ఆనించి; నాటి ఉన్న అమ్ములన్= శరీరంలో గుచ్చుకొని ఉన్న బాణాలను; పెఱికించుకొని= తీయించుకొని; హృదయంబునన్= మనస్సులో; ఆ+మెయిన్+ఉన్న= ఆ విధంగా నెలకొని ఉన్న; పరిభవంబు= అవమానము; పీడ ఒనర్పన్= బాధిస్తూ ఉండగా; విషాద= దుఃఖంవలన; వివర్ణ= రంగుమారిన- కాంతిహీనమైన; వదనుండు+అగుచున్= ముఖం కలవాడై; కవలన్= జోడుగ పుట్టిన నకుల సహదేవులను (అమడలు); కనుంగొని= చూచి; మీరు; సమీర నందనుకడకున్= వాయుపుత్రుడైన భీముడి దగ్గరకు; చనుండని చెప్పెన్= వెళ్ళండని చెప్పాడు; అటమున్న= అంతకుముందే; నకులుండు ఒక్క; అరదంబు= రథమును; ఆయితంబు= సిద్ధం చేసికొని; ఉండుటన్= ఉండటం వలన; ఆ ఇరువురున్= ఆ యిద్దరు; త్వరిత గతిన్= వేగంగా; చని= పోయినవారై; అంబుదంబు చందంబునన్= నీరిచ్చు మబ్బువలె; గర్జిల్లుచున్= ఉరుముచు; కౌరవులతోడన్ తలపడి; కయ్యంబు చేయుచున్న= యుద్ధం చేస్తున్న; భీమసేనున్= భీముడిని; చేరన్+చని= సమీపించి; అవష్టంభ= గర్వముయొక్క; విజృంభణంబునన్= అతిశయంతో (చెలరేగి); పొలిచిరి= ఒప్పారారు; అంతన్; ఆ+పాండవ+అగ్రజు= ఆ పాండవులలో మొదటివాడైన (ధర్మరాజు) యొక్క; తెఱంగు= పరిస్థితి; ఏమియున్ ఎఱుంగక; నరుండు= అర్జునుడు; ద్రౌణితోడన్= ద్రోణాచార్యుడి పుత్రుడైన అశ్వత్థామతో; భరంపడి= ప్రయాసతో; రణంబు+ఒనర్చుచుండి= యుద్ధం చేస్తూ ఉండగా.

**తాత్పర్యం:** ఇట్లా చింతించి, 'ధర్మరాజు వెళ్ళిన తర్వాత ఏ విధంగా యుద్ధం సాగింది?' అని, ధృతరాష్ట్రుడు అడుగగా, సంజయుడు ఆయనతో ఇట్లా అన్నాడు: 'ఆ ధర్మరాజు ఆ విధంగా బయలుదేరిపోయి, తేరు దిగి,

శిబిరం చేరి, పడకమీద దేహాన్ని వాల్చి, ఒంటికి గుచ్చుకొన్న బాణాలను బయటకు లాగివేయించికొన్నాడు. కాని, మనస్సున అనుభవించిన ఆ అవమానం పీడిస్తూనే ఉన్నది. ఆ పరితాపం ఆయన దేహకాంతిని వెలవెల బారించగా, నకుల సహదేవులను చూచి, 'మీరు వాయుపుత్రుడున్న చోటికి పొండి' అని చెప్పాడు. దానికి ముందే నకులుడు రథం సిద్ధం చేసి పెట్టుకొని ఉన్నాడు. వెంటనే ఆ ఇద్దరూ దానినెక్కి త్వరత్వరగా పోయారు. అప్పుడక్కడ, వర్షించే మేఘంవలె ఉరుముతూ కౌరవులతో యుద్ధం చేస్తున్న భీముడిని సమీపించారు. గర్వాతిశయంతో ఒప్పారారు. ఆ తరువాత, పాండవులలో పెద్దవాడి పరిస్థితి ఏమీ తెలియక నరుడు అశ్వత్థామతో ప్రయాసపడి యుద్ధం చేస్తున్నాడు.

**విశేషం:** అంబుదంబు చందంబున - అలంకారం. ఉపమ.

**క. నెఱి దగఁ దేజితమై, గమి । మెఱుఁగు లడరు నారసమున మిక్కిలివడి నే**
**డ్తెఱ మెఱయ నురము నొంచిన । నుఱ కవ్విప్రుండు వైచె నుగ్రంపు గదన్.** 5

**ప్రతిపదార్థం:** నెఱిన్= ఉత్సాహంతో; తగన్+తేజితమై= తగినవిధంగా పదును ఎక్కించబడి ఉన్న; గమి మెఱుఁగులు= కాంతుల సమూహం; అడరు= వ్యాపింపజేస్తున్న; నారసమునన్= ఇనుప బాణంతో; ఏడ్తెఱ మెఱయన్= పరాక్రమం అందగించగా; మిక్కిలి వడిన్= అత్యంత వేగంతో; ఉరము= రొమ్మును; నొంచినన్= (అర్జునుడు) బాధించగా; ఉఱక= లెక్కచేయక; ఆ+ విప్రుండు= ఆ బ్రాహ్మణుడు - అశ్వత్థామ; ఉగ్రంపు గదను= భయంకరమైన గదను; వైచెన్= విసిరివేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు తగినవిధంగా పదును చేయబడిన ఇనుపబాణాన్ని లాఘవం సొంపారగా అత్యంత వేగంగా మెరుగులు గ్రక్కేటట్లు ప్రయోగించి అశ్వత్థామ ఎదను బాధపెట్టగా, ఆ బ్రాహ్మణుడు గణింపక భయంకరమైన గదను అర్జునుడిపై విసిరాడు.

**వ. వైచిన నవ్వీరుండు.** 6

**తాత్పర్యం:** వేయగా ఆ వీరుడు (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. అది దునుమాడి, మేనఁ బదియమ్ములు గ్రమ్మఱఁ గ్రుచ్చి, సూతు బె**
**ట్టిద మగు కోలఁ గూల్చినఁ, గడింది మగంటిమి దాన రథ్య సం**
**పదయును నూలుకొల్పికొని పార్థునిఁ గృష్ణుని నొంచె విస్మయం**
**బొదవఁగ దేవకోటికి నృపోత్తమ! యగ్గురుపుత్త్రుఁ డుగ్రుఁ డై.** 7

**ప్రతిపదార్థం:** నృపోత్తమ!= రాజశ్రేష్ఠా!; అది= దానిని; తునుమాడి= ఖండించి; క్రమ్మఱన్= మరల; మేనన్= శరీరంలో; పది అమ్ములన్= పది బాణాలను; క్రుచ్చి= చొప్పించి; సూతున్= రథసారథిని; బెట్టిదము+అగు= క్రూరమైన (పదునైన); కోలన్= బాణంతో; కూల్చినన్= చంపగా; ఆ+గురు పుత్త్రుఁడు= కౌరవులకు శస్త్రగురువైన ద్రోణుడి కుమారుడు; ఉగ్రుఁడు+ఐ= కోపోద్దీపితుడై; కడింది= సహింపశక్యంగాని; మగంటిమిన్= మగతనంతో (శౌర్యముతో); తాను+అ= తానే స్వయంగా; రథ్యసంపదయును= అశ్వ బలమును; నూలుకొల్పికొని= సమకూర్చుకొని; దేవకోటికిన్= దేవతల సమూహానికి; విస్మయంబు+ ఒదవఁగన్= ఆశ్చర్యం కలుగగా; పార్థునిన్= అర్జునుడిని; కృష్ణునిన్; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** రాజశ్రేష్ఠా! అర్జునుడు దానిని వాడి అయిన బాణంతో ముక్కలుగా చేసి, ఇంకా పదిబాణాలు అశ్వత్థామ శరీరంలో గ్రుచ్చుకొనేటట్లు చేశాడు. సారథినొక బాణంతో హతమార్చాడు. అప్పుడు అశ్వత్థామ పట్టరాని కోపంతో, శత్రువు సహించరానంత పరాక్రమంతో తానే స్వయంగా అశ్వబలాన్ని సమకూర్చుకొని, చూస్తున్న దేవతలకు ఆశ్చర్యం కలిగేటట్లుగా అర్జునుని, శ్రీకృష్ణుని అలయింపజేశాడు.

**వ. అ ట్లద్భుతవిక్రమంబున నశ్వత్థామ విజృంభించిన సహింపక; 8**

**ప్రతిపదార్థం:** అట్లు= ఆ విధంగా; అద్భుత= ఆశ్చర్యకరమైన; విక్రమంబున= పరాక్రమంతో; అశ్వత్థామ; విజృంభించిన= చెలరేగగా; సహింపక= ఓర్చుకొనలేక.

**తాత్పర్యం:** గురుపుత్రుడు ఆ విధంగా ఆశ్చర్యకరమైన శౌర్యంతో చెలరేగగా, అది సహించలేక అర్జునుడు-(తరువాతి పద్యంతో అన్వయం).

**చ. హయములు పగ్గముల్ వెడఁదయమ్మున నుగ్గుగఁ గ్రీడి యేయుడున్**
**రయమున నీడ్చెఁ దే రటు దురంబునకుం దొలఁగంగ; నెంతయున్**
**భయమున నీమొనల్ గలఁగి పాఱె; నరేశ్వర! వారిసైన్యసం**
**చయ మెగవన్ మహీతలము సంభృతకంపము గాఁగ నల్గడన్. 9**

**ప్రతిపదార్థం:** క్రీడి= అర్జునుడు; వెడఁద అమ్మునన్= పెద్దదైన బాణంతో; పగ్గముల్ నుగ్గుగన్= పగ్గాలు తునాతునకలయ్యేటట్లుగా; ఏయుడున్= కొట్టగా; హయములు= గుర్రాలు; తేరు= రథమును; అటు= ఆ విధంగా; దురంబునకున్= యుద్ధమునకు; తొలఁగంగన్= దూరమైపోయేటట్లుగా; రయమునన్= త్వరగా; ఈడ్చెన్= లాగుకొనిపోయాయి; నీ మొనల్= నీ సైన్యాలు; ఎంతయున్, భయమునన్= ఎంతో భయంతో; కలఁగి పాఱెన్= కలవరమొంది పరుగెత్తిపోయాయి; (ఆ తరువాత) వారి; సైన్య, సంచయము= భటులగుంపులు; మహీతలము= భూప్రదేశం; నల్గడన్= నాలుగు దిక్కులా; సంభృత కంపము కాఁగన్= పొందిన కంపము గలది కాగా; ఎగవన్= చుట్టుపక్కలంతా అలముకొనగా (దీనివలననే ఆ భూకంపం).

**తాత్పర్యం:** అర్జునుడు వెడల్పు అయిన బాణంతో గుర్రాల పగ్గాలు తునాతునకలుగా చేయగా, వెంటనే అవి ఆ రథాన్ని యుద్ధానికి దూరంగా త్వరత్వరగా లాగుకొనిపోయాయి. కౌరవసైన్యం భీతిచెంది పారిపోయింది. ఇక వారి సైన్యాల జయోత్సాహం దిక్కులన్నీ ఆక్రమించుకొన్నది. ఈ భారంతో భూమి అంతా గడ గడ అదిరిపోయింది.

**ఉ. పాఱినఁ జూచి, కౌరవ నృపాలుఁడు సూతతనూజుతోడ 'నీ**
**కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్ర సంపదన్**
**మీఱిన నీవె సూడఁగ? నమేయపరాక్రమ,! నీకుఁ బాండవు**
**ల్మాఱె తలంప, నీదగు బలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్!' 10**

**ప్రతిపదార్థం:** పాఱినన్ చూచి= ఇట్లు కౌరవసేన పలాయనం కావడం చూచి; కౌరవ నృపాలుఁడు= కౌరవరాజు దుర్యోధనుడు; సూత తనూజుతోడన్= రథం నడిపేవాడి కుమారుడగు కర్ణుడితో (ఈ రథం నడిపేవాడి పేరు అధిరథుడు); ఈ కాఱియ= ఈ యాతన, కళంకము; మత్+బలంబునకున్= నా సైన్యానికి; వివిధ+అస్త్ర సంపదన్= అనేక విధాలైన అస్త్రాల సమృద్ధి

చేత; మీఱిన= అతిశయించిన; నీవె చూడఁగన్= నీవు చూస్తుండగనే (నీ కండ్ల ఎదుటనే); కాన్+తగునె?= సంభవించదగునా?; అమేయ= మితిమీరిన; పరాక్రమ!= శరీర బలసామర్థ్యం కలవాడా!; తలంపన్= యోచించి చూడగా; నీకున్ పాండవులు= నీకు పాండవులు; మాఱె?= ఎదుర్కొన సమర్థులా?; ఇత్తఱిన్= ఈ సమయంలో; నీదగు= నీ దైన; బలంబును= బలమును; చేవయున్= సమర్థతను; చూపుము= ప్రదర్శించుము.

**తాత్పర్యం:** కౌరవసేన ఆ విధంగా వెనుదిరిగి పరుగెత్తిపోతుండగా చూచి కౌరవరాజు కర్ణుడితో ఇట్లా అన్నాడు: అనేక విధాలైన అస్త్ర సంపదతో అతిశయించినవాడవై ఉన్న నీవు చూస్తుండగానే నా సైన్యానికి ఇట్టి కళంకం రావటం తగి ఉన్నదా? నీ శౌర్య సంపదకు ఎల్లలు లేవు. యోచించి చూస్తే పాండవులు నీ కొక లెక్కా? ఇక ఈ సమయంలో నీ బాహుబలాన్ని, ధైర్యాన్ని చూపవయ్యా!

**వ. అనిన విని, యబ్బలుమగండు మదోద్రేకంబున మద్రపతి నాలోకించి యిట్లనియె: 11**

**ప్రతిపదార్థం:** అనినన్+విని= అనగా విని; ఆ+బలుమగండు= ఆ గొప్పవీరుడు (కర్ణుడు); మద+ఉద్రేకంబునన్= గర్వాధిక్యంతో; మద్రపతిన్= మద్రదేశాధీశుడైన శల్యుడిని; ఆలోకించి= చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని కర్ణుడు మదాతిశయంతో శల్యుడిని చూచి ఇట్లా అన్నాడు:

**చ. 'కనుఁగొను! మిప్డు డేను మురఘస్మరుఁ బార్థుని భీమసేనునిం**
**దునిమెద; నస్త్రసంపదయు దోర్విభవంబును శౌర్యసారము**
**న్జనులకు నెల్లఁ దెల్లముగ నాదగు పూనిక పార మెయ్దు; మే**
**దినిఁ గురునాథుఁ డొక్కఁడె యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్.' 12**

**ప్రతిపదార్థం:** ఇప్పుడు ఏను= ఇప్పుడు నేను; ముర ఘస్మరున్= మురుడనే వాడిని నాశనం చేసిన కృష్ణుడిని; పార్థునిన్= పృథ(కుంతి) కొడుకైన అర్జునుడిని; భీమసేనునిన్; అస్త్ర సంపదయున్= ఆయుధాల సమృద్ధి; దోస్+విభవంబును= భుజబలం యొక్క గొప్పతనం; శౌర్యసారమున్= శూరత్వపు నిగ్గు అయిన బలం; జనులకున్+ఎల్లన్= ప్రజలందరికి; తెల్లముగన్= తెలిసేటట్లు; తునిమెదన్= ముక్కలు ముక్కలుగ చేస్తాను; కనుఁగొనుము= చూడుము; మేదినిన్= ఈ భూమిపై; కురునాథుఁడు+ఒక్కఁడే= కౌరవరాజొక్కడే; అతిస్థిర సౌఖ్యతన్= అత్యంత శాశ్వతమైన సుఖసంపదతో; ఏలునట్లుగన్= పరిపాలించేటట్లు; నాదగు పూనిక= నా ఈ ప్రయత్నం; పారమెయ్దన్= (ఒడ్డు చేరుట) సఫలీకృతంగా నెరవేర్చుటే అని ప్రకటితమయ్యేటట్లు (వారినందరిని సంహరిస్తాను).

**తాత్పర్యం:** ఇకచూడుము! ఇప్పుడు నేను నా శస్త్రాస్త్రసంపద, భుజబల ప్రకాశనం, నా ప్రతాపంయొక్క నిగ్గు లోకులకెల్ల తెలిసేటట్లుగా మురారి అయిన కృష్ణుడిని, అర్జునుడిని, భీముడిని ఖండిస్తాను! దీనితో ఈ భూమిపై శాశ్వతమైన సుఖసౌభాగ్యాలతో ఒక్క కౌరవనాథుడే పరిపాలించేటట్లుగా చేయటమే నా ప్రయత్న సఫలత అని లోకవిదితం కాగలదు. (ఇది కర్ణుడి ధర్మదీక్ష).

**వ. 'రథరథ్యగతులు నెఱయ మెఱయ వలయుం జుమ్మీ!' యని పలికి, విజయంబు వీక్షించి గుణంబు సారించి 'గాండీవంబు నీ కెదురే?' యని యగ్గించి, యప్పుడు పై పయి నురవడించు పరసైనికులం జే యెత్తి యదల్చి, భార్గవాస్త్రంబు ప్రయోగించిన నమ్మహనీయసాధనంబు. 13**

**ప్రతిపదార్థం:** రథ రథ్య= తేరుకు పూన్చిన గుఱ్ఱాలయొక్క; గతులు= కదలికలు; నెఱయన్= అత్యంతం; మెఱయ వలయున్ చుమ్మీ!= తళుకొత్తవలెను సుమా!; అని పలికి; విజయంబు = విజయమనే తన ధనుస్సును; వీక్షించి= బాగా తేరిపారచూచి; గుణంబు సారించి= నారి లాగి; గాండీవంబు= అర్జునుడి ధనుస్సు; నీ కెదురే?= నీకు ప్రతియా?; అని; అగ్గించి= కొనియాడి; అప్పుడు= అదే సమయంలో; ఉత్సాహభరితులు+ఐ= ఉత్సాహంతో నిండినవారై; పైపయినురవడించు= మీదిమీదికి దూకుతున్న; పరసైనికులన్= శత్రుసైనికులను; చేయెత్తి; అదల్చి= బెదరించి; భార్గవ+అస్త్రంబు= పరశురాము డిచ్చిన అత్యంత మంత్రపూతమైన ఆయుధం; ప్రయోగించినన్; ఆ+మహనీయ సాధనము= ఆ మహిమోపేతమైన ఆయుధం.

**తాత్పర్యం:** 'రథగతులు, గుఱ్ఱాలగతులు మిక్కిలి ప్రకాశించాలి సుమా!' అని పలికి, విజయమనే తన విల్లును చూచి, అల్లెత్రాడును సారించి, 'గాండీవం నీకు సాటి రాదు' అని దానిని పొగడి, అదే సమయంలో ఉత్సాహంతో పైపైకి దూకుతున్న శత్రు సైనికులను చేయెత్తి బెదిరించి, భార్గవాస్త్రాన్ని ప్రయోగించగా, ఆ మహిమోపేతమైన ఆయుధం.

**విశేషం:** యుద్ధవీరులు తాము ఊదే శంఖాలకు; ఉపయోగించే శరాసనాదులకు పేర్లుబెట్టి కొనియాడటం ఒక వీరోచిత సంప్రదాయం. దాని ప్రకారమే కర్ణుడు తన ధనుస్సు 'విజయము'ను కొనియాడుతున్నాడు. ఈ పొగడ్త సంస్కృత భారతం (వావిళ్ల ప్రతి)లో లేదు. ఇది రసాత్మకమైన, తిక్కన మనస్సులో పుట్టిన పరిమళ సుమం. ఇంకొక రసవత్తర ఖండిక. ప్రాణం లేనిదానిని, ప్రాణమున్నదానివలెనే పలుకరించి మాట్లాడటం ఒక అలంకారం. దీనిని ఇంగ్లీషులో Pathetic Fallacy అంటారు (మిథ్యానుభూతి- భావాభాస). సారవంతమైన సోమయాజి మనస్సు దీనిని స్వయంగా సృష్టించినట్లున్నది. కర్ణుడి విజయం, అర్జునుడి గాండీవం సమానమైనవి. రెండును విశ్వకర్మ నిర్మితాలు. పరశురాముడే విజయమును కర్ణుడికిచ్చాడు (కర్ణ 1-233). పేరులో కాస్త వ్యత్యాసం - అమరకోశము కర్ణుడి విల్లు పేరు "కాలపృష్ఠ" మంటున్నది. వేణీసంహార నాటకములో (4. అంక) ఇదే పేరున్నది.

**శా. ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావించుచుం,**
**దేరుల్ ద్రుంగఁగ, వారణంబులు ధరం ద్రెళ్ళంగ, నశ్వాళి ను**
**గ్గై రక్తంబునఁ దేలఁగా, భటచయం బత్యంత చూర్ణీకృతా**
**కారత్వంబు భజింపఁ, గేళి సలిపెం గౌంతేయ సైన్యంబునన్. 14**

**ప్రతిపదార్థం:** ఘోర+అనేక శరాకృతిన్= భయంకరమైన అనేక బాణాలరూపంలో; పరఁగి= ఒప్పి; సంక్షోభంబు= అల్లకల్లోలం; కావించుచున్= చేస్తూ; తేరుల్= రథాలు; త్రుంగఁగన్= తుత్తునియలు కాగా; వారణంబులు= ఏనుగులు; ధరన్ త్రెళ్ళంగన్= భూమిపై పడగా; అశ్వ+ఆళి= గుఱ్ఱాలసమూహం; నుగ్గై= ముక్కలై; రక్తంబునన్+తేలఁగా= నెత్తురులో పైకి తేలగా; భటచయంబు= సైనికసమూహం; అత్యంత చూర్ణీకృత= మిక్కిలి పిండైపోయిన; ఆకారత్వంబు= రూపం; భజింపన్= పొందగా; కౌంతేయ సైన్యంబునన్= కుంతీపుత్రుల సైన్యంలో; కేళి సలిపెన్= చెర్లాటమాడింది.

**తాత్పర్యం:** కర్ణుడు ప్రయోగించిన భార్గవాస్త్రం భయంకరాలైన పలురూపాలలో వ్యాపించి, అల్లకల్లోలం చేసింది. దానితో రథాలు నుగ్గునూచైనవి. ఏనుగులు నేలకొరిగిపోయాయి. గుఱ్ఱాలగుంపు ముక్కలై నెత్తుటిమడుగులో తేలియాడుతున్నాయి. సైన్యం పిండి అయిపోయిన రూపమును పొందింది. ఇట్లా భార్గవాస్త్రం కుంతీపుత్రుల సైన్యంతో క్రీడించింది.

**వ. ఇప్పరుసున భార్గవాస్త్ర బాధితంబై యప్పాండవ బలంబు వెఱచఱచి మరలి పఱచిన, మనమూఁకలు వెన్నడిం దఱుమ, నా సూతనందనుం డ ట్లేచి యార్చి యంటందాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ, బొగ లేనిమంట పగిదిఁ బ్రదీప్తుం డయినఁ; దదుత్సాహంబున కోటువడి యా సైన్యంబును జనంబులు హాహాకారంబు లెసఁగ దీనదశం బొంది, ముకుంద పురందరనందనులం బేర్కొని యాక్రందించి; రట్టియెడ.** **15**

**ప్రతిపదార్థం:** ఈ+పరుసునన్= ఈ విధంగా; భార్గవ+అస్త్ర= భార్గవాస్త్రంచేత; బాధితంబు+ఐ= బాధించబడి; ఆ+పాండవ బలంబు= ఆ పాండవులసేన; వెఱచఱచి= భయపడి; పఱచినన్= పారిపోగా; మనమూఁకలు= మన సేనలు; వెన్నడిన్= వెంటబడి; తఱుమగా= పరుగెత్తిపోయేటట్లు తరుమగా; ఆ సూతనందనుండు= ఆ కర్ణుడు; అట్లు+ఏచి= ఆ విధంగా విజృంభించి; ఆర్చి= ఉత్సాహంతో కేకలుపెట్టి; అంటన్ తాఁకి= కలియబడేటట్లు సమీపించి; విశిఖ= బాణాల; శిఖలు= మంటలను; నిగిడించుచున్= వ్యాపింపజేస్తూ; పొగలేని మంట పగిది= పొగలేని మంటవలె; ప్రదీప్తుండు+అయినన్= మిక్కిలి వేడిమితో ప్రకాశిస్తున్న వాడుకాగా; తద్+ఉత్సాహంబునకున్= ఆ ఉత్సాహానికి; ఓటువడి= జంకి; ఆ సైన్యంబును; జనంబులు= చూస్తున్న ప్రజలు; హాహాకారంబులు+ఎసఁగన్= (సంభ్రమాశ్చర్యాలతో) కేకలు అతిశయించగా; దీన దశన్+పొంది= కనికరించదగిన దశలోపడి (పాండవసైన్యం); ముకుంద= కృష్ణుని; పురందర నందనులన్= ఇంద్రుడి పుత్రుడైన అర్జునుడిని; పేర్కొని= పేరుబెట్టి పిలిచి; ఆక్రందించిరి= ఏడ్చిరి; అట్టి ఎడన్= ఆ సమయంలో. (పొగలేని మంట= మంటలో ఉన్న కార్బన్ పొగరూపంలో క్షయమై పోగా, మంటకు వేడిమి ఎక్కువగుతుంది. ఇది సైన్సు విషయం.)

**తాత్పర్యం:** పైన చెప్పినట్లుగా భార్గవాస్త్రం చేత కష్టపెట్టబడిన పాండవసైన్యం భయపడి వెన్నుచూపి పరుగెత్తి పోతున్నది. అది చూచి కర్ణుడు ఉత్సాహంతో చెలరేగి, కేకలు పెట్టుతూ దెబ్బతాకుడు మేరలోకి పోయి, బాణాగ్ని జ్వాలలు ప్రసరింపజేస్తూ పొగలేని మంట మాదిరి వెలిగాడు. ఆ కర్ణుడి ఉత్సాహన్ని చూచి భయపడి ఆ సైన్యము, జనం కేకలు పెట్టసాగారు. ఆ దీనస్థితిలో ఇరుక్కొన్న పాండవసైన్యం కృష్ణార్జునులను పేరుపెట్టి పిలుస్తూ ఏడ్వసాగింది. ఆ పరిస్థితిలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** ఈ ఘట్టమంతా ఒక నాటకీయ ఫక్కీలో సాగుతున్నది. కథనపాండితి దృశ్యాలకు ప్రాణం పోసి పాఠకుడి ఎదుట నిలబెట్టుతున్నది. యుద్ధభీతికి సౌందర్యరేఖల సంతనపరచి హాయిని కూరుస్తున్నది. వీరరసానికి ఇది కొత్త తొడుగు, హావభావ వర్ణ, పదప్రయోగ ఔచిత్యం ఇందలి మెరుగులు.

**ఉ. గాండివి శౌరి కిట్టులనుఁ: 'గర్ణునిఁ జూచితె? యేకవిక్రమో**
**ద్దండతఁ దెంపు సేసి పటుదర్పము సూపుచుఁ, దేఱి చూడ రా**
**కుండెడునట్లుగా నలుక నుగ్రత మండెడు; నిప్డు నేర్పుమై**
**నుండక యీసునం దొడరి, యోటమి దెచ్చికొనంగ నేటికిన్?'** **16**

**ప్రతిపదార్థం:** గాండివి= అర్జునుడు; శౌరికిన్= కృష్ణుడితో; ఇట్టులు+అనున్= ఇట్లా అన్నాడు; కర్ణునిన్+చూచితె?= కర్ణుడిని చూచావా?; ఏక విక్రమ+ఉద్దండతన్= ఒక్క పరాక్రమాతిశయం చేతనే; తెంపు చేసి= తెగించి; పటుదర్పము= అతిశయమైన గర్వాన్ని; చూపుచున్; తేఱిచూడరాకుండెడునట్లుగాన్= కన్నెత్తి చూచుటకు సాధ్యం కానట్లుగా; అలుకన్+ఉగ్రతన్= కోపతీవ్రతతో; మండెడున్= మండిపోతున్నాడు; ఇప్డు; నేర్పుమైన్+ఉండక= సమయోచితమైన చాకచక్యంతో ప్రవర్తించకుండా; ఈసునన్= కోపంతో; తొడరి= సాహసించి ఎదుర్కొని; ఓటమిన్= ఓటమిని; తెచ్చుకొనంగన్+ఏటికిన్= తెచ్చుకొనటం ఎందుకు?

**తాత్పర్యం:** అర్జునుడు కృష్ణుడితో ఇట్లా అన్నాడు: 'కర్ణుడిని చూస్తున్నావుగదా! ఉన్న సాహసాన్నంతా ఒకటిగా చేర్చి, భీతిగొల్పేటట్లుగా తెగించి ఎక్కువైన బలాన్ని చూపుతున్నాడు. కన్నెత్తి చూడటానికి వీలుగానట్లుగా కోపపు పొంగుతో మండిపోతున్నాడు. ఇప్పుడు సమయానికి తగినట్లు తెలివిని ఉపయోగించకుండా కోపంతో యుద్ధానికి దిగి, వృథాగా అపజయాన్ని నెత్తికి తెచ్చిపెట్టుకోవటం ఎందుకు?

**క. 'వచ్చిన మఱి గెల్పు గొనన్ । వచ్చునె? తనయొడలు గలుగ వైరుల గెలువన్**
**వచ్చుం దఱి వచ్చిన; నది । మెచ్చు జయార్థులకు మరుదమిత్రధ్వంసీ!' 17**

**ప్రతిపదార్థం:** మరుదమిత్ర ధ్వంసీ!= దేవతలకు శత్రువులైన రాక్షసులను నాశనం చేసినవాడా- కృష్ణా!; వచ్చినన్ మఱి= పైబడివచ్చినాడేపో; గెల్పుకొనన్= విజయాన్ని సాధించగా; వచ్చునె?= సాధ్యమగునా?; తఱి వచ్చినన్= అనుకూలసమయం వచ్చినప్పుడు; తన ఒడలు కలుగన్= తన శరీరం ఉంటే (అంటే బ్రతికి ఉంటే); వైరులన్ గెలువవచ్చున్= శత్రువులను జయింపవచ్చును; జయార్థులకున్= జయం కోరేవారికి; అది= ఆ పద్ధతి; మెచ్చు= మెచ్చుకోదగినది.

**తాత్పర్యం:** దేవతా విరోధులైన రాక్షసులను ధ్వంసం చేసిన ఓ కృష్ణా! (ఇప్పుడితడు) దండెత్తి వస్తే జయాన్ని సాధించటం సాధ్యమా? ప్రాణం ఉంటే సమయం ఆసన్నమైనపుడు వైరులను జయించవచ్చును. జయం కాంక్షించేవారికి అది తగి ఉన్నది. (అనుకూల సమయమైన చేష్ట ప్రశంసింపదగినది.)

**విశేషం:** యుద్ధాల్లో మూర్ఖ పరాక్రమం కంటె వివేక పరాక్రమమే విజయహేతువు.

**తే. 'పట్టపగలింటి సూర్యుని పగిదిఁ గర్ణుఁ । డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు!**
**మన రథం బిప్డు మాధవ, మరలనిమ్ము । బ్రదికియుండిన శుభములు వడయవచ్చు.' 18**

**ప్రతిపదార్థం:** మాధవ!= కృష్ణా!; పట్టపగలింటి= మిట్టమధ్యాహ్న సమయంలోని; సూర్యుని; పగిదిన్= వలె; ఉగ్రమూర్తి+ఐ= మహా భయంకరుడై; కర్ణుఁడు; వెలుఁగుచున్+ఉన్నవాఁడు= మిరుమిట్లు గొలుపుతున్నాడు; ఇప్డు= ఇక; మన రథంబు= మన తేరును; మరలనిమ్ము= వెనుకకు త్రిప్పుము; బ్రతికి ఉండినన్= ప్రాణాలతో ఉంటే; సుఖములు; పడయవచ్చున్= పొందవచ్చు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! అదిగో చూడుము. కర్ణుడు మధ్యందిన మార్తాండుడివలె తీక్ష్ణరూపుడై ప్రకాశిస్తున్నాడు. ఇక మన రథాన్ని వెనుకకు త్రిప్పుము. ప్రాణాలు మిగిలి ఉంటే సుఖాలు పొందవచ్చు.

**విశేషం:** అరివీర భయంకరుడైన సవ్యసాచి ఇట్లనటం పిరికితనం కాదు. సమయజ్ఞత. వీరానికి విచక్షణ ఉండటం అవసరమని గదా అనుభవజ్ఞుల మాట. ఈ పట్టున అర్జునుడు పరాభూతుడై ఉంటే భారతకథాదీపమే చల్లారిపోయిఉండేది.

**వ. అనిన విని, వాసుదేవుండు వడముడిదిక్కు విలోకించు నెడ, నతండు కర్ణునకు మార్కొని పరాక్రమించె. పాండవసైన్యంబు నిలువరించి, ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి ద్రౌపదేయాదిరథికు లా రథికునిం దలపడఁ, దానును గౌరవులపయిం గడంగె; న ట్లమ్మేటిమగని యాటోపం బప్పటికి వైరినివారణంబునకుఁ జాలి యునికి యనుసంధించి, రాధేయుం డొరులతో డయ్యం బోరుటయుఁ, బార్థుండు 'డప్పి దీర్చుకొనుటయు మేలకాక' యని యూహించి, యమ్మురారి దే రక్కురుసేనాధిపతి సంగ్రామంబు సేయుచక్కటి కెడ గలుగం గొని చని,**

**యన్నరునితో 'మన మశ్వత్థామతోడి పెనఁకువం జిక్కిన సమయంబున ధర్మనందనుండు సూతనందనున కగ్గమై యుండెఁ; నాతం డతనియమ్ముల నొచ్చెనో యని తలంచెద. నయ్యవనీశు నవస్థ యెఱింగి, మఱి నీ వయ్యంగరాజు సమయింపం గల వాఁడ' వనుటయు. 19**

**ప్రతిపదార్థం:** అనినన్ విని; వాసుదేవుండు= కృష్ణుడు; వడముడిదిక్కు= (శత్రువులకు తాపం కలిగించే) భీముడివైపు; విలోకించు ఎడన్= చూడగా; అతండు= భీముడు; కర్ణునకున్= కర్ణుడిని; మార్కొని= ఎదిరించి; పరాక్రమించెన్= విజృంభించాడు; పాండవ సైన్యంబును; నిలువరించి= పారిపోకుండా నిలిచి యుద్ధం చేసేటట్లు చేసి; ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి; ద్రౌపదేయ+ఆది= ద్రౌపది కుమారులైన ఉపపాండవులు; ఆది= మొదలైన; రథికులు= రథమునెక్కి యుద్ధం చేసే యోధులు; ఆ రథికుని= ఆ కర్ణుడిని; తలపడన్= ఎదుర్కొనగా; తానును= భీముడు; కౌరవులపయిన్; కడంగెన్= నిలిచి ఎదుర్కొన్నాడు; ఆ మేటి మగని= మొనగాడైన ఆ శూరుడి; ఆటోపంబు= విజృంభణం; అప్పటికిన్= ఆ సమయానికి; వైరి నివారణంబునకున్= శత్రువును అడ్డగించి నిలపటానికి; చాలి ఉనికిన్= తగినంత సమర్థంగా ఉండటం చేత; అనుసంధించి= మనస్సుకు నచ్చజెప్పుకొని; రాధేయుండు; ఒరులతోన్= ఇతరులతో; డయ్య పోరుటయు= అలయింప జేయునట్లుగా యుద్ధము చేయుటను చూచి; పార్థుండు; డప్పిదీర్చుకొనుట మేలు+అ కాక+అని= ఇక దప్పిక దీర్చుకొనుటే మంచిపని అవుతుందని; ఊహించి= తలచి; ఆ+మురారి= ఆ కృష్ణుడు; తేరు= రథం; ఆ+కురుసేనాధిపతి= ఆ కర్ణుడు; సంగ్రామంబు చేయు= యుద్ధం చేస్తున్న; చక్కటికిన్= ప్రదేశానికి; ఎడ కలుగన్= దూరమయ్యేటట్లు; కొని చని= కొనిపోయి; ఆ+నరునితోన్= ఆ అర్జునుడితో- (ఇట్లనును); మనము; అశ్వత్థామతోడి; పెనఁకువన్= పోరులో; చిక్కిన సమయంబునన్= చిక్కుకొని ఉన్నపుడు; ధర్మనందనుండు; సూతనందనునకున్= కర్ణుడికి; అగ్గము+ఐ+ఉండెన్= వశమై యుండినాడు; అతండు= ఆ ధర్మజుడు; అతని+అమ్ములన్= ఆ కర్ణుడి బాణాలచే; నొచ్చెనో= బాధపడెనేమో; అని తలంచెదన్= అని భావిస్తాను; ఆ+అవనీశు= ఆ రాజుయొక్క; అవస్థన్+ ఎఱింగి= స్థితిని తెలిసికొని; మఱి; నీవు; ఆ+అంగరాజు= ఆ అంగదేశాధిపతి అయిన కర్ణుడిని; సమయింపన్+కలవాఁడవు= తుదముట్టింతువుగాని; అనుటయున్= అనగా.

**తాత్పర్యం:** ఇట్లు చెప్పిన అర్జునుడి మాటలు విని, కృష్ణుడు, భీముడివైపు చూచేసరికి, అప్పుడాయన కర్ణుడితో తలపడి చెలరేగి, పాండవసైన్యాన్ని పారిపోకుండా యుద్ధానికి పూనుకొనేటట్లు చేయగా, అప్పుడు ధృష్టద్యుమ్న, శిఖండి, సాత్యకీ ద్రౌపదేయాది యోధులు కర్ణుడిపైబడి బీరం చూపుతున్నారు. భీముడు కూడ ప్రతాపించి కౌరవులపై విజృంభించాడు. ఆ సమయానికి ఆ భీముడి విజృంభణం, విరోధులను ప్రతిఘటించటానికి తగినంతగా ఉన్నదని మనస్సులో కృష్ణుడు వితర్కించుకొన్నాడు. కర్ణుడు ఇతరులపై బడి, వారు అలసిపోయేటట్లు చేస్తున్నాడని గమనించాడు. 'ఇక, అర్జునుడు అలసట తీర్చుకొనటమే మేలు' అని ఊహించాడు. తమ రథాన్ని కర్ణుడున్న యుద్ధభూమి నుండి దూరంగా తోలుకొనిపోయాడు. ఆ తర్వాత- మురారి; 'మన అశ్వత్థామతో పోరాడుతున్న సమయంలో ధర్మజుడు కర్ణుడి చేతిలో చిక్కిఉన్నాడు. అతడు ధర్మజుడిని బాణాలతో బాధించాడేమో అని అనుకుంటున్నాను. మనం మొదట ఆ మహీపతి స్థితిని తెలిసికొనవలసి ఉన్నది. ఆ తరువాత అంగదేశాధిపతిఅయిన కర్ణుడిని సంహరించుదువు గాని' అనిన తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అన్న నొచ్చె నన్న యమ్మాట చిత్తంబు । గలఁప, నిజబలంబుఁ గలయఁ జూచి,**
**యన్నరేంద్రుఁ గాన కనిలనందను కడ । కేఁగి యడిగె; నతఁడు నిట్టు లనియె. 20**

**ప్రతిపదార్థం:** అన్న నొచ్చెన్+అన్న= అన్న బాధపడినాడనిన; ఆ+మాట= ఆ మాట; చిత్తంబు కలఁపన్= మనస్సును కలతపెట్టగా; నిజబలంబున్= తన దండును; కలయన్+చూచి= ఎగాదిగా బాగా చూచి; ఆ+నరేంద్రున్+కానక= ఆ ధర్మరాజు కనబడకపోగా; అనిలనందను కడకున్+ఏఁగి= వాయుపుత్రుడైన భీముడివద్దకు వెళ్ళి; అడిగెన్= అడిగాడు; అతఁడు+ఇట్లు+అనియెన్= భీముడు ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అన్న బాధపడినాడనే మాట మనస్సును కలతపెట్టగా అర్జునుడు, తన సైన్యాన్ని బాగా పరికించి చూచాడు. వారిలో ధర్మరాజు కనిపించనందున భీముడి దగ్గరకు పోయి అడుగగా, అత డిట్లా బదులు పలికాడు.

**ఉ. 'కౌరవకోటి నేఁ బొదివి క్రందుగఁ గయ్యము సేయఁ, గర్ణుఁ డా**
**భూరమణున్ వడిం గదిసి భూరిశరంబులు మేన నింప, నొ**
**వ్వారుటయుం దొలంగె నతఁ, డాహవరంగమునందు లేఁడు; నీ**
**వారయు మింత కె ట్లగునొ? యచ్యుతుఁ డుండఁగ నట్టు లే లగున్?' 21**

**ప్రతిపదార్థం:** కౌరవకోటిన్= కౌరవ భట సమూహాన్ని; ఏన్= నేను; పొదివి= తలపడి; క్రందుగన్= అతిశయంతో; కయ్యము చేయన్= యుద్ధం చేయగా; కర్ణుఁడు; ఆ భూరమణున్= ఆ రాజైన ధర్మజుడిని; వడిన్+కదిసి= వేగంగా పైకొని; భూరిశరంబులు= పెద్ద బాణాలు; మేనన్+నింపన్= శరీరంలో నిండేటట్లు చేయగా; నొవ్వు+ఆరుటయున్= బాధపడడంవలన; తొలంగెన్= వైదొలగిపోయాడు; అతఁడు= ఆయన; ఆహవరంగమునందులేఁడు= యుద్ధభూమిలో లేడు; ఇంతకున్= ఇంతకు; ఎట్లు+అగునొ?= ఏమైనదో?; నీవు+ఆరయుము= నీవు విచారించి తెలిసికొమ్ము; అచ్యుతుఁడు+ఉండఁగన్= కృష్ణుడు మన అండనుండగా; అట్టులు+ఏల?+అగున్?= అట్లా ఎందుకు జరుగుతుంది?

**తాత్పర్యం:** కౌరవసేనా సమూహాన్ని నేను చుట్టుముట్టి విజృంభించి పోరాడుతుండగా, కర్ణుడు ఆ రాజును ఎదుర్కొని పెద్ద పెద్ద బాణాలతో ఆయన శరీరమంతా నింపివేశాడు. ఆ దెబ్బలకు బాధపడటంచేత ఆతడు వైదొలగిపోయాడు. ఆయన ఇప్పుడు పొలికలనులో లేడు. ఇంతకు ఏమైందో నీవు విచారించి తెలిసికొమ్ము. కృష్ణుడు మన ప్రక్క నుండగా అట్లా ఎందుకు జరుగుతుంది?

**వ. అనిన విన్వచ్చుండు వృకోదరున కిట్లనియె. 22**

**తాత్పర్యం:** అనగా విని అర్జునుడు భీముడితో ఇట్లా అన్నాడు:

**క. 'క్రూరము లగు సూతసుతుని । నారాచము లొడలఁ బెక్కు నాటినఁ జేత**
**స్సారము సెడి శిబిరమునకు । నా రా జేఁగెనొకొ? యకట! యటు గా నోపున్. 23**

**ప్రతిపదార్థం:** క్రూరములు+అగు= హింసించగలిగిన; సూత సుతుని= కర్ణుడి; నారాచములు= పూర్తిగా ఇనుముతో చేయబడిన అమ్ములు; పెక్కు= చాలా; ఒడలన్ నాటినన్= శరీరమునందు గ్రుచ్చుకొనగా; చేతస్+సారము చెడి= మనోధైర్యం పొడయి; ఆ రాజు; శిబిరమునకున్= దండు విడిదికి; ఏఁగెనొకొ!= చేరినాడా ఏమి?; అకట!= అయ్యో!; అటుగానోపున్!= అట్లే జరిగి ఉంటుందేమో?

**తాత్పర్యం:** బాధాకరమైన కర్ణుడి ఇనుపబాణాలు అనేకములు ఒంట నాటుకొనగా, రాజు మానసిక పటుత్వం చెడి శిబిరానికి పారిపోయాడేమో పాపం! అట్లే జరిగి ఉంటుంది.

**క. 'ద్రోణాచార్యుని యుగ్రపు । బాణంబులు కోర్చి యతఁడు పడునంతకు న**
**క్షీణధృతి నసమ సమర । క్షోణి నిలిచి, కర్ణుచేతఁ గోల్పోయెఁ గదే!' 24**

**ప్రతిపదార్థం:** ద్రోణాచార్యుని; ఉగ్రపు బాణంబులకున్= తీక్ష్ణమైన బాణాలకు; ఓర్చి= తట్టుకొని నిలబడి; అతఁడు= ద్రోణుడు; పడునంతకున్= చచ్చి నేలవడే వరకు; అక్షీణధృతిన్= తరుగని స్థిరత్వంతో; అసమ, సమర క్షోణిన్= సాటిలేని యుద్ధభూమిలో; నిలిచి= నిలబడి; (చివరకు) కర్ణుచేతన్= కర్ణుడిచేత; కోల్పోయెన్ కదే= ఓడిపోయాడు కదా!.

**తాత్పర్యం:** 'ద్రోణాచార్యుడు ప్రయోగించిన పదునైన బాణాలకు ఓర్చుకొని, ఆ ద్రోణుడు నేలకొరిగేవరకు యుద్ధభూమిలో స్థిరంగా నిలబడి ఎదిరించి, తుట్టతుదకు ధర్మరాజు కర్ణుడి చేతిలో ఓడిపోవలసి వచ్చిందే!

**వ. అని పలికి, యనిలనందను నాలోకించి యన్నరుం 'డా నృపాలుతెఱం గెఱుంగుటకు నీ వరుగు; మేను సేనమొగంబున నిలిచెద' ననిన విని, యవ్వీరుం 'డవ్విధంపు నడవడి నీకుఁ జనుం గాని, జనంబులు న న్నయినం బోరి కోహటించి పోయె నని యాడుదు'రని చెప్పిన, నప్పార్థుండు. 25**

**ప్రతిపదార్థం:** అని పలికి; అనిల నందనున్= భీముడిని; ఆలోకించి= చూచి; ఆ+నరుండు= ఆ అర్జునుడు (అన్నాడు); ఆ నృపాలు తెఱంగు= ఆ రాజు విధము; ఎఱుంగుటకున్= తెలుసుకోవడానికి; నీవు+అరుగుము; నేను; సేనమొగంబునన్= సైన్యానికి మొదట; నిలిచెదన్; అనిన విని; ఆ+వీరుండు= ఆ శూరుడైన భీముడు; ఆ+విధంపు నడవడి= ఆ రీతి ప్రవర్తన; నీకున్+చనున్+కాని= నీకు తగి ఉన్నదిగాని (నాకు సరిపోదనుట); జనంబులు= ప్రజలు; నన్నయినన్= నన్ను మాత్రం; పోరికిన్= యుద్ధంలో; ఓహటించి= ఓడిపోయి; పోయెను+అని= పారిపోయెనని; ఆడుదురు= మాట్లాడుతారు; అని; చెప్పినన్; ఆ+పార్థుండు= ఆ అర్జునుడు (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** అని పలికి అర్జునుడు భీముడితో 'ధర్మరాజు స్థితిని తెలిసికొనటానికి నీవు వెళ్ళుము. నేను సేన మొదట నిలిచి పోరాడుతాను' అని అన్నాడు. ఆ మాటలు విని భీముడు 'ఈ విధమైన నడవడి నీకు చెల్లుతుంది కాని నాకు చెల్లదు. నేనట్లా పోతే జనులు యుద్ధం చేయలేక పోయాడని అంటారు' అని అన్నాడు. అప్పుడు అర్జునుడు.

**విశేషం:** భీముడిది ఆటుపోటులేని బీరము, రొమ్ము చూపి ఎదిరిని మార్కొంటాడు. సమయానుకూలమైన విక్రమం కాదాయనది. కలిసివచ్చి అన్నిటా గెలుస్తున్నాడు. పగ సాధింపులో నీతులు వల్లె వేయడు. పాండవులను అన్ని క్లిష్టసమయాలలో ఈయన తెంపే కాపాడినది. మెత్తదనం చూపడం పిరికితనమనేది ఈయన అభిప్రాయం.

**ఆ. 'సరభసముగ నన్ను సంశప్తకులు వీరె! తొడరుచున్నవారు, దొలఁగి నాకు**
**నరుగ నెట్లు వచ్చు?' నని చూపె నతనికి; । నపుడు గడఁగి వచ్చు నబ్బలముల. 26**

**ప్రతిపదార్థం:** సరభసముగన్= ఉద్రేకంతో కూడిన ఆటోపంతో; సంశప్తకులు= (యుద్ధంలో పెడమొగం పెట్టమని ఒట్టుపెట్టుకొన్న శూరులు); నన్నున్; తొడరుచున్నవారు= మార్కొంటున్నారు; తొలఁగి= వీరికి దూరంగా; అరుగుట= పోవుట; నాకున్ ఎట్లువచ్చున్?= నాకు ఏ విధంగా సరిపోతుంది?; అని; అపుడు; కడఁగి= అతిశయించి; వచ్చు= పైకి వచ్చే; ఆ+బలములన్= నా సైన్యాన్ని; చూపెన్= చూపించాడు.

**తాత్పర్యం:** 'అదిగో చూడుము! సంశప్తకులు ఆటోపంతో నాపై పడుతున్నారు. ఈ పట్టున వైదొలగిపోవటం నాకెట్లా వీలుపడుతుంది?' అని పూనికతో తనపైబడవస్తున్న సైన్యాలను ఆయనకు చూపాడు.

**క. చూపుటయు, నగ్గలం బగు । నేపునఁ గిమ్మీరవైరి 'యేన కలఁచెదన్**
**రూపు సెడఁగ నిమ్మొనలను । భూపతి నరయంగ నీవ పొ' మ్మనియె నృపా! 27**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా! ధృతరాష్ట్రా!; చూపుటయున్= చూపిన తరువాత; అగ్గలంబు+అగు= అతిశయించిన; ఏపునన్= గర్వంతో; కిమ్మీరవైరి= కిమ్మీరుడిని చంపిన భీముడు; ఈ+మొనలను= ఈ సైన్యాలను; రూపు చెడఁగన్= రూపుమాపేటట్లు; ఏను+అ కలఁచెదన్= నేనే కల్లోలపరుస్తాను; భూపతిన్+అరయంగన్= ధర్మరాజును విచారించటానికి; నీవు+అ+పొమ్ము+అనియెన్= నీవే పొమ్మన్నాడు.

**తాత్పర్యం:** చెలరేగి పైబడవస్తున్న సంశప్తక దళాలను చూపగానే భీముడుప్పొంగిన ఉత్సాహంతో 'ఈ దండును నే నొక్కడనే తుదముట్టిస్తాను, మన రాజు పరిస్థితి తెలిసికొనటానికి నీవే పొ'మ్మన్నాడు.

### కృష్ణార్జునులు ధర్మరాజు సేమం బరయ నతని శిబిరంబునకుఁ బోవుట (సం. 8-45-64)

**వ. అనిన, నట్ల కాక యని, యర్జునుం డచ్యుతు నాలోకించి 'యా మహీపాలుం గనునంతకు నామనంబు గలంగెడు; రథంబు రయంబునం బోవ ని'మ్మని పలుకుటయు, నతండు భీముం జూచి 'యేము మీయన్న సేమం బరయుట వలయుపని గావునం జనియెదము; నీవు కురుసైన్యంబుల జయించుట యరుదె? గెలుపు గొను'మని యగ్గించు తెఱంగున దీవన లిచ్చి, తురంగమంబులం ద్వరితగతి నడపె; నివ్విధంబున మాధవ ధనంజయులు సమరంబునకు సమీరనందనుం జాలించి, శిబిరంబున కరిగి ధర్మనందను మందిరంబు ప్రవేశించి, యేకతంబ శయ్యాతలంబున నున్న యన్నరపతిం గని, యాతండు గుశలి యయి యునికికి ముదంబు నొందుచుం, దదీయచరణంబులకుఁ బ్రణతులయి; రా ధరణీనాథుండు వారలు రాధేయు వధించి వచ్చిరకాఁ దలంచి డెందం బలర, మందస్మితంబుతో నభినందించి, వారల వదనంబులు వీక్షించి యిట్లనియె: 28**

**ప్రతిపదార్థం:** అనినన్; అట్లు+అ+కాక అని= అట్లే కానిమ్మని; అచ్యుతున్+ఆలోకించి= కృష్ణుడిని చూచి; ఆ మహీపాలున్= ఆ రాజును; కనునంతకున్= చూచునంతవరకు; నా మనంబు= నా మనస్సు; కలంగెడున్= కలతజెందుతుంది; రథంబును; రయంబునన్= వేగంగా పోనిమ్మని; పలుకుటయున్= చెప్పగా; అతండు= ఆ కృష్ణుడు; భీమున్+చూచి; ఏము= మేము; మీ అన్న సేమంబు= మీ అన్న క్షేమమును; అరయుట= తెలుసుకొనటం; వలయుపని కావునన్= చేయవలసిన పని కనుక; చనియెదము= వెళ్ళుతాము; నీవు కురుసైన్యంబుల జయించుట; అరుదె!= ఒక ఆశ్చర్యకరమైన విషయమా!; గెలుపు+కొనుము= జయం సంపాదించుము; అని అగ్గించు తెఱంగునన్= అని కొనియాడేవిధంగా; దీవనలు+ఇచ్చి= ఆశీర్వదించి; తురంగమంబులన్= గుర్రాలను; త్వరితగతిన్= వేగంగా; నడపెన్= నడిపెను; ఈ+విధంబునన్= ఇట్లు; మాధవ ధనంజయులు= కృష్ణార్జునులు; సమరంబునకున్= యుద్ధానికి; సమీరనందనున్= వాయుపుత్రుడిని; చాలించి= చాలినవానిగజేసి (అప్పగించి); శిబిరంబునకున్+అరిగి; ధర్మనందను మందిరంబు ప్రవేశించి= ధర్మనందనుడి మందిరం ప్రవేశించి; ఏకతంబ+అ= ఒంటరిగా; శయ్యాతలంబునన్+ఉన్న= పడకలో ఉన్న; ఆ నరపతిన్+కని= ఆ రాజును చూచి; ఆతండు; కుశలియై= క్షేమవంతుడై;

ఉనికికిన్= ఉండుటకు; ముదంబు నొందుచున్= సంతోషిస్తూ; తదీయ చరణంబులకున్= ఆయన పాదాలకు; ప్రణతులు+ఐరి= నమస్కరించారు; ఆ ధరణీ నాథుండు= ఆ రాజు; వారలు= వారిద్దరు; రాధేయున్ వధించి= కర్ణుడిని చంపి; వచ్చిరి+అ+కాన్= వచ్చారని; తలంచి= భావించి; డెందంబు= మనస్సు; అలరన్= సంతోషించగా; మందస్మితముతోన్= చిరునవ్వుతో; అభినందించి= మెచ్చుకొని; వారల వదనంబులు= వారి ముఖాలను; వీక్షించి= చూచి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** ఆ మాట విని 'సరే' అని అర్జునుడు శ్రీకృష్ణుడిని చూచి, 'ఆ ధర్మరాజును చూచేందుకు నా మనసు కలవరపడుతున్నది. రథాన్ని త్వరగా పోనిమ్ము' అని అన్నాడు. కృష్ణుడు భీముడిని చూచి 'మేము మీ అన్నగారి యోగక్షేమం తెలిసికొనవలెను. కాబట్టి వెళ్ళుతాము. నీవు కౌరవసైన్యాన్ని జయించటం పెద్ద విషయమా? గెలుపును సాధించు' మని ప్రశంసించినట్లుగ దీవెనలుకూడా ఇచ్చి, రథాశ్వాలను వేగంగా నడిపాడు. ఈ విధంగా కృష్ణార్జునులు యుద్ధనిర్వహణను భీముడిపై నుంచి శిబిరానికి వెళ్ళారు. ధర్మరాజు మందిరంలో ప్రవేశించారు. ఒంటరిగా శయ్యపై పరుండి ఉన్న ధర్మరాజును చూచారు. క్షేమంగా ఉన్నాడని తెలిసి సంతోషించారు. అతడి పాదాలకు నమస్కరించారు. ధర్మరాజు వారిరువురు కర్ణుడిని సంహరించి వచ్చారని భావించి, సంతోషించి, అభినందించి, వారలను చూచి ఇట్లా అన్నాడు:

**మ. 'సుర లైనం జలమెత్తి కర్ణుని రణక్షోణిన్ జయింపంగ నే**
**ర్తురె? యవ్వీరుఁడు జామదగ్న్య కలితాస్త్రుం; డిద్ధతేజంబునన్**
**దొర సప్తార్చికి, లావునం బవనుతోఁ దుల్యుండు; కల్యుండు సం**
**గర సంక్రీడలయందుఁ బేర్కొనఁ దగున్ గాంభీర్య ధైర్యంబులన్. 29**

**ప్రతిపదార్థం:** సురలు+ఐనన్= దేవతలైనను; చలము+ఎత్తి= కోపగించి; కర్ణునిన్; రణక్షోణిన్= యుద్ధభూమిలో; జయింపంగన్ నేర్తురె?= ఓడింప జాలియున్నారా?; ఆ+వీరుఁడు= ఆ శూరుడు; జామదగ్న్య, కలిత అస్త్రుండు= పరశురాముడి వలన అస్త్రాలు పొందినవాడు; ఇద్ధ తేజంబునన్= ఉగ్రమైన ప్రకాశంలో; సప్తార్చికిన్= అగ్నికి; దొర= సాటి; లావునన్= బలమునన్; పవనుతోన్+తుల్యుండు= వాయువుతో సమానుడు; సంగర క్రీడల+అందున్= యుద్ధక్రీడలలో; కల్యుండు= సమర్థుడు; గాంభీర్య= చలించని గుణమునందును; ధైర్యంబులన్= ధీరగుణంలోను; పేర్కొనన్+తగున్= చెప్పుకోదగును.

**తాత్పర్యం:** 'దేవతలైనా పగబట్టి యుద్ధభూమిలో కర్ణుని జయింపజాలుదురా? ఆ పరాక్రమవంతుడు పరశురాము డిచ్చిన అస్త్రాలు కలిగినవాడు; ప్రతాప తీక్ష్ణతలో అగ్నికి సాటియైనవాడు. బలంలో వాయుసమానుడు. యుద్ధక్రీడలలో సమర్థుడు, గాంభీర్య ధైర్య గుణాల విషయంలో చెప్పుకోదగినవాడు.

**తే. అట్టి బల్లిదు ననిఁ దెగటార్చి, మీర । లేమియును గాక వచ్చితి' రింతసంత**
**సంబు దొరకొనునే నామనంబు? చింత । వంత యెల్లను జెడ నరవర్యులార! 30**

**ప్రతిపదార్థం:** నరవర్యులార!= మానవ శ్రేష్ఠులారా!; అట్టి బల్లిదున్= అటువంటి మొనగాడిని; అనిన్= యుద్ధంలో; తెగటార్చి= తుదముట్టించి; మీరలు; ఏమియును+కాక= ఎటువంటి విపత్తు కలగకుండా; వచ్చితిరి= తిరిగివచ్చారు; చింత వంత= దుఃఖబాధ; ఎల్లను+చెడన్= అంతా తుదముట్టేటట్లు; ఇంత; సంతసము= సంతోషం; దొరకొనునే?= లభ్యపడుతుందా?

**తాత్పర్యం:** మానవ శ్రేష్ఠులారా! అటువంటి శక్తిమంతుడిని యుద్ధంలో తుదముట్టించి, మీకు కించిత్తయినా హాని కలుగకుండా, విజయదీప్తితో వచ్చారు. నా మనస్సులోని చీకుచింతలన్నీ మాసిపోగా, నా మదికి ఇంత గొప్ప సంతోషం కలగటాన్ని నమ్మలేకపోతున్నాను.

**తే. అతనికి నాకునుం గలిగె నాహవ మింతకు ముంద; రందుఁ బా**
**ర్షతుఁడును సత్యకాత్మజుఁడు శాంతనవాంతకరుండు ద్రౌపదీ**
**సుతులును జూడఁగా, నతఁడు సూత హయ ధ్వజ పాతనంబు సే**
**సి, తనువు దీవ్రకాండములఁ జెండఁగ, నే వెగడందితిం గడున్. 31**

**ప్రతిపదార్థం:** ఇంతకున్ ముందు+అ= ఇంతకు ముందుగానే; అతనికిన్; నాకునున్; ఆహవము కలిగెన్= యుద్ధం జరిగింది; అందున్= ఆ యుద్ధంలో; పార్షతుఁడును= ద్రుపదపుత్రుడు ధృష్టద్యుమ్నుడు; సత్యకాత్మజుఁడు= సత్యకుడి కుమారుడు సాత్యకీ; శాంతనవ+అంతకరుండు= శిఖండీ; ద్రౌపదీసుతులునున్= ఉపపాండవులూ; చూడఁగాన్= చూస్తూ ఉండగానే; అతఁడు= ఆ కర్ణుడు; సూత= సారథిని; హయ= గుఱ్ఱాలను; ధ్వజ= టెక్కమును; పాతనంబు చేసి= విరిగిపడి పోయేటట్లు చేసి; తనువు= నా శరీరాన్ని; తీవ్ర= తీవ్రములయిన; కాండంబులన్= బాణాలచేత; చెండఁగన్= చెండివేయగా; నేను; కడున్= మిక్కిలి; వెగడు+అందితిన్= తబ్బిబ్బు అయ్యాను.

**తాత్పర్యం:** ఇంతకు ముందుగానే కర్ణుడికీ నాకూ పోరు జరిగింది. ఆ యుద్ధంలో ధృష్టద్యుమ్నుడు, సాత్యకీ, శిఖండీ, ఉపపాండవులూ మొదలైన వీరులందరి ఎదుటనే అతడు నా సారథిని, గుఱ్ఱాలను, పతాకాన్ని విరుగగొట్టాడు. నా శరీరం వాడి అయిన బాణాల దెబ్బలకు గురికాగా, నేను ఎంతో భయభ్రాంతుడనయ్యాను.

**వ. అప్పుడు దుర్యోధన ప్రభృతి ధార్తరాష్ట్రులకు భీమసేను ప్రభావంబున బ్రదుకరాని యంత పుట్టిన, నన్ను విడిచి యాతం డట వోవ, నే నిట వచ్చితి'నని చెప్పి వెండియు గాండీవి నుద్దేశించి: 32**

**ప్రతిపదార్థం:** అప్పుడు; దుర్యోధన; ప్రభృతి= మొదలగు; ధార్తరాష్ట్రులకున్= ధృతరాష్ట్రుడి కుమారులకు; భీమసేను= భీముడియొక్క; ప్రభావంబునన్= శక్తిసామర్థ్యాలచేత; బ్రతుకరాని+అంత= జీవించి ఉండను వీలుగానంత; పుట్టినన్= పరిస్థితి కలుగగా; నన్నున్ విడిచి; ఆతండు= ఆ కర్ణుడు; అటుపోవన్= ఆ వైపునకు పోగా; నే నిట వచ్చితిన్= నేను ఇక్కడికి వచ్చాను; అని చెప్పి; వెండియున్= మరల; గాండీవిన్+ఉద్దేశించి= అర్జునుడితో (అన్నాడు).

**తాత్పర్యం:** అప్పుడు దుర్యోధనాదులైన కౌరవులకు భీముడివలన బ్రతుకరాని పరిస్థితి ఏర్పడగా, నన్ను విడిచి కర్ణుడు అటుపోయాడు. నేను ఇటు వచ్చాను' అని చెప్పి ధర్మరాజు అర్జునుడితో ఇంకా ఇట్లా అన్నాడు:

**సీ. 'పదుమూఁడువర్షముల్ పగలును రేలును । గర్ణుదర్పం బెట్లు గడతు నొక్కొ?**
**యను చింతఁ జేసి, యాహారనిద్రలు లేక । పరితాప మందితిఁ; బశువుఁ జేయ**
**విప్రులు పట్ట రా వెఱ సొచ్చి యొదిఁగెడు । గవయంబుచాడ్పునఁ, గర్ణభీతి**
**నుల్లల నుడుకుచు నుండుదుఁ; గర్ణుండు । విడువక మోమున వ్రేలు నాకు!**

**తే. సురనదీసుతుచేతను గురునిచేతఁ । బడని పరిభవమున వాఁడు వఱిచె నన్ను**
**నంతయును నీఁగఁ గాంచి నీయట్టియనుజు । వలనఁ దేజంబు వడసితి నలఘుచరిత! 33**

**ప్రతిపదార్థం:** పదుమూఁడు వర్షముల్= పదమూడు సంవత్సరాలు; కర్ణు దర్పంబు= కర్ణుడి పొగరుబోతుదనాన్ని; ఎట్లు+కడతు నొక్కొ!= ఏ విధంగా అతిక్రమిస్తానో; అను= అనే; చింతన్‌చేసి= దిగులువలన; పగలు, రేలును= రేయింబవళ్ళు; ఆహార నిద్రలు లేక= తిండీ నిద్రా లేకుండా; పరితాపము+అందితిన్= దుఃఖించాను; పశువున్+చేయన్= బలిపశువుగా చేయటానికి; విప్రులు= ఋత్విక్కులు; పట్ట రాన్= పట్టుకొనిపోవటానికి రాగా; వెఱ చొచ్చి= భయభ్రాంతమై; ఒదిగెడు= దాగుకొనే; గవయంబు= బలసిన పశువు; చాడ్పునన్= వలె; కర్ణభీతిన్= కర్ణుడికి భయపడి; ఉల్లలన్= కుతకుతా; ఉడుకుచున్= పరితపిస్తూ; ఉండుదున్= ఉంటున్నాను; కర్ణుండు= కర్ణుడు; విడువక= వదలిపెట్టకుండా; నాకున్; మోమునన్= ముఖం ఎదుట; వ్రేలు= (చిత్రపటాన్ని ఎదుట తగిలించినట్లు) వ్రేలాడగట్టినట్లు కనబడుతుంటాడు; సురనదీసుతుచేతన్= భీష్ముడిచేత; గురుచేతన్= ద్రోణుడిచేత; పడని పరిభవమునన్= అనుభవించని అవమానాన్ని; వాఁడు; నన్నున్; పఱిచెన్= బాధించాడు; అంతయున్; నీయట్టి అనుజవలనన్= నీబోటి తమ్ముడివలన; ఈఁగన్+కాంచి= పోగొట్టుకొని; అలఘుచరిత!= గురుతరమైన చరిత్ర కలవాడా!; తేజంబు= ప్రభావమును; పడసితిన్= పొందాను.

**తాత్పర్యం:** కర్ణుడి బాహుబలాటోపాన్ని ఎట్లా ఓర్చుకొనగలనా?- అని పదమూడేండ్లు రేయింబవళ్లు తలపోసి తలపోసి, కూడు, నిద్ర లేకుండా బాధపడ్డాను. యజ్ఞపశువును పట్టుకొన సమీపించిన బ్రాహ్మణులను చూచి భయపడి దాగుకొనే పశువువలె కర్ణుడి భయంవలన మనసు నలిగి దిగులుపడుతూ కాలం గడుపుతున్నాను. ఆ కర్ణుడి ఆకారమే నా ఎదుట వ్రేలాడుతూ ఉంటుంది. భీష్మద్రోణాదులచేత అనుభవించని అవమానాన్ని వాడు నాకు కలిగించాడు. కీర్తిసాంద్రా! నీవంటి తమ్ముడివలన ఈ యాతనలన్నిటిని లేకుండా జేసికొని ఊరటతో ప్రాణాలను తిరిగి పొందాను.

**విశేషం:** వచనం మాదిరి నడిచే ఈ సీసపద్యంలో సహజోక్తులతోపాటు చిత్రీకరణం కళకళలాడుతున్నది. తిక్కన సీసపద్యాలన్నీ- కవికి, కంసాలికి సీసాలు తేలిక - అన్న రీతిలో ఉన్నవి. కొన్ని భావ చిత్రీకరణలో గంభీరంగా ఆబోతెద్దు మాదిరిగా నడుస్తున్నవి. శ్రీనాథుడూ యిట్టి పద్ధతినే అనుసరించాడు.

**చ. వెరవును లావు దివ్యశరవీర్యము శౌర్యముఁ గల్గు కర్ణు నె**
**ప్పరుసునఁ జంపి? తీ వతని బంధులు మిత్త్రులు బుత్త్రులున్ సము**
**ద్ధురబలు లాజికేలి నిరతుల్ ధృతరాష్ట్రునిపుత్త్రు లెల్లఁ ద**
**త్పరిజను లెట్టు లట్టు లనిఁ బ్రాణము లిత్తురు వాని కడ్డ మై. 34**

**ప్రతిపదార్థం:** (కర్ణుడిని చంపి వచ్చినారనుకొని కల్పిత సంతోషంతో పలికే మాటలివి. ఈ స్థితి రానున్న పరిణామానికి భిన్న స్థితి.) వెరవును= ఉపాయం (చాకచక్యం); లావున్= దేహ పటుత్వం; దివ్యశరవీర్యము= దేవదత్తమైన బాణాల పరాక్రమం; కల్గ= కలుగు; కర్ణున్; ఏ+పరుసునన్= ఏ విధంగా; ఈవు చంపితివి?= నీవు చంపితివి?; సముద్ధుర బలులు= బలమున్నదని దుడుకుపడేవారు; ఆజి కేళిన్= యుద్ధక్రీడయందు; నిరతుల్= మిక్కిలి ఆసక్తి పట్టుదలగలవారు (అయిన); అతని బంధులు మిత్త్రులు; పుత్త్రులున్= నలుగురు పుత్రులును (సుశేష, సత్యసేన, చిత్రసేన, వృషసేనులు అంగరక్షకులుగా నిలిచి హతులైరి); ధృతరాష్ట్రుడి పుత్త్రులు; ఎల్లన్= అందరూ; తద్+పరిజనులు= అతడి సహచరులు; ఎట్టులు ప్రాణములు+ఇత్తురు= ఏ విధంగా ప్రాణాలు ఇస్తారో; అట్టులు= ఆ విధంగానే; అనిన్= యుద్ధములో; వానికిన్+అడ్డమై= వాని చుట్టూ మూగి; ప్రాణములు+ఇత్తురు= ప్రాణాలిస్తారు.

**తాత్పర్యం:** చాకచక్యం, దేహబలం, దేవదత్తాలైన బాణాల బిగువు, తెగించి ముందు కురికే పట్టుదల గలిగిన ఆ కర్ణుడిని నీవు ఎట్లా తుదముట్టించగలిగావు? బలగర్వితులు, యుద్ధాన్ని ఒక ఆటగా సాగించే ఆసక్తిగలవారు అయిన అతడి చుట్టాలు, స్నేహితులు, కొడుకులు, ధృతరాష్ట్రుడి కొడుకులు, వీరందరూ కూడి, ఆ కర్ణుడి భటులవలెనే ప్రాణాలకు తెగించి ఎట్లా ఆయన చుట్టూ ఏ విధంగా మూగుతారో అట్లే చేయగల సాహసులు.

**చ.** **అరు దిది! నీవు నొవ్వక మహాబలుఁ గర్ణు వధించి, తాతఁ డ**
**క్కురుపతి సంతసింప నరుఁ గూల్చెద సంగరభూమి నేన యొ**
**క్కరుఁడను వీఁకఁ దాఁకి యను గర్వపుమాట సనంగ నీక, నేఁ**
**టి రణములోన నిట్లు ప్రకటింతె భవద్భుజ వీర్య శౌర్యముల్!** **35**

**ప్రతిపదార్థం:** నీవు నొవ్వక= నీవు బాధచెందక; మహాబలున్+కర్ణున్= అధిక బలసంపన్నుడైన కర్ణుడిని; వధించితి(వి)= చంపావు; అరుదు+ఇది= ఇది ఆశ్చర్యకరమైన విషయం; ఆతఁడు; ఆ+కురుపతి సంతసింపన్= ఆ దుర్యోధనుడు సంతోష పడేటట్లు; వీఁకన్+తాఁకి= గర్వోత్సాహంతో పైబడి; సంగర భూమిన్= సమరాంగణంలో; నేను+అ+ఒక్కరుఁడన్= నేనొక్కడినే; నరున్ కూల్చెదన్= అర్జునుడిని పడగొట్టుతాను; అను; గర్వపుమాట= అహంభావపు మాట; చనంగనీక= చెల్లేటట్లు కాకుండా; నేటి రణములోనన్= ఈనాటి యుద్ధములో; భవద్భుజవీర్య శౌర్యముల్= నీ బాహువుల పరాక్రమం; ఇట్లు ప్రకటింతె?= ఇట్లా ప్రదర్శింతువా?

**తాత్పర్యం:** నీవు కొంచెం కూడా గాయపడక, ఎక్కువైన చేవగలిగిన కర్ణుడిని చంపావు. నిజంగా ఇది చోద్యపుచేత; ఆ కౌరవనాథుడు సంతోషంతో ఉబ్బిపోయేటట్లుగా- 'నేను ఒంటరిగా ఎదిరించి అర్జునుడిని చంపుతాను' అనే కర్ణుడి గర్వోక్తిని చెల్లనీయకుండా, నీ బాహుబలసంపద, వీరగుణ పాండిత్యం ఈనాటి యుద్ధంలో లోకానికి వెల్లడి చేసికొనగలిగావు.

**చ.** **పలికిన నేమి? బీరములు పల్కుట సేవక నీతి! యాసభం**
**బలుకునె యట్లు జూదపు నెపంబున ద్రౌపది నింతకాల మ**
**ప్పలుకు లలంచుచుండె; మదిఁ బాయవు గీఁటినయమ్ము లట్ల; దో**
**ర్బల దృఢలీల నిప్పు డవి వాపితి; తీర్చి తలంత యంతయున్.** **36**

**ప్రతిపదార్థం:** పలికినన్+ఏమి?= పలికిన మాత్రాన ఏమి పోయింది?; బీరములు= బింకాలు; పల్కుట; సేవకనీతి= సేవకుల ధర్మం; ఆ సభన్= ఆ కొలువులో; జూదపు నెపంబునన్= జూదములో ఓడిపోయినారన్న సాకుతో; ద్రౌపదిన్+అట్లు= ద్రౌపదిని అట్లా; పలుకునె?= తూలనాడుతాడా?; ఇంతకాలము; ఆ+పలుకులు= ఆ మాటలు; అలంచుచుండెన్= బాధిస్తున్నాయి; గీఁటిన అమ్ములట్లు+అ, గోకి గాయపరచిన బాణాలమాదిరి; మదిన్ పాయవు= మనస్సును వదలిపోవు; దోర్బల దృఢలీలన్= పటుతర బాహుబలవిన్యాసంతో; ఇప్పుడు; అవి= వాటిని; పాపితి(వి)= నివారింపజేశావు; అలంత అంతయున్= బాధనంతా; తీర్చితి(వి)= నివారించితివి.

**తాత్పర్యం:** అట్లా మాట్లాడినంత మాత్రాన మునుకొనిపోయినదేమీ లేదు. డాంబికపుమాటలు పలకటం సేవలకు ధర్మం, లేకుంటే ఆ సభలో జూదంలో ఓడిపోయినారన్న మిషతో ద్రౌపదిని అట్లా కారుకూతలు కూస్తాడా?

ఇంతదాకా ఆ మాటలు నన్ను గీరి పుండు చేసిన బాణాలవలె మనస్సును బాధిస్తూనే ఉన్నాయి. ఎంత ప్రయత్నించినా అవి మనస్సును వదలిపెట్టిపోవు. కాని, ఇప్పుడు నీ బలప్రయోగ నైపుణ్యంతో వాటిని పోగొట్టావు; మదిలోని యాతననంతా తొలగించావు.

**క. అతిగర్వ సమున్నత మగు । నతని శిరము వానివార లందఱు బాష్పో**
**ద్గతితోఁ జూడఁగ సమర । క్షితి డొల్లెనె? విజయ! నీదు శిత భల్లమునన్. 37**

**ప్రతిపదార్థం:** విజయ!= అర్జునా!; నీదు శితభల్లమునన్= వాడియైన నీ బరిసెపోటుతో; అతిగర్వ= మిక్కిలి పొగరుబోతుతనంతో; సమున్నతము+అగు= ఎక్కువగా నిక్కినీల్గిన; అతడి శిరము= అతని తల; వానివారలు+అందఱున్= అతడికి చెందిన వారందరూ; బాష్ప+ఉద్గతితోన్= ఉబుకుతున్న కన్నీటితో; చూడఁగన్= చూస్తుండగా; సమరక్షితిన్= యుద్ధభూమిలో; డొల్లెనె?= ఊడిపడిపోయిందా?

**తాత్పర్యం:** మితిమీరిన అహంకారంతో పైకెత్తబడిన అతడి తల; అతడి వాళ్ళంతా, కన్నీటి వరదలో మునిగిన కండ్లతో చూస్తుండగా నీ బాణాలదెబ్బకు తెగి, పొలికలనులో పడిపోయిందా! విజయా!

**క. ఈరసమునఁ గదిసి శరా । సారము పైఁ గురియ నీవు సక్రోధుఁడ వై**
**పేరురమున వెస నాటిన । తోరం బగు నారసమునఁ ద్రుళ్ళి కెడసెనే?' 38**

**ప్రతిపదార్థం:** ఈరసమునన్= అసూయతో; కదిసి= పైబడి; శరాసారము= బాణాల జడివాన; నీపైన్+కురియన్= నీపై కురిపించగా; నీవు; సక్రోధుఁడవు+ఐ= అతి కోపంతో చెలరేగి; పేరురమునన్= పెద్ద వక్షస్థలాన; వెసన్, నాటిన= వేగంగా గుచ్చిన; తోరంబు+అగు= బలిష్ఠమైన; నారసమునన్= ఇనుపబాణపు తాకిడికి; త్రుళ్ళి= ఎగిరి; కెడసెనే?= చచ్చాడా?

**తాత్పర్యం:** అసూయతో కర్ణుడు నీపై తెరిపిలేని వానవలె బాణాలను వేయగా, నీవు కోపపుపొంగుతో విజృంభించి అతడి విశాలమైన ఎదలో గట్టి ఇనుపబాణాన్ని గ్రుచ్చగా, అతడు ఎగిరిపడి నేలకొరిగి చచ్చాడు కదా!'

**విశేషం:** అర్జునుడు కర్ణుడిని తప్పక చంపి ఉంటాడనే బలమైన ఊహతో ధర్మరాజుచేత ఇన్నిమాటలు పలికించటం అర్జునుడికి మరింత అవమానభారం కలిగించడానికే.

**వ. అనిన ధర్మనందనునకుఁ బురందరనందనుం డిట్లను; 'నేను సంశప్తకులతోడఁ బెనంగుచుండ, ననేక రథ సమూహ సమేతుం డయి యశ్వత్థామ వచ్చి, నన్నుం బొదివిన. 39**

**ప్రతిపదార్థం:** అనినన్= అని అనగా; ధర్మనందనునకున్; పురందరనందనుండు= ఇంద్రుడి కుమారుడైన అర్జునుడు; ఇట్లు+అనున్= ఇట్లా అన్నాడు; నేను; సంశప్తకులతోడన్; పెనంగుచుండన్= పోరాడుతూ ఉండగా; అనేక రథ సమూహ, సమేతుండు+అయి= పెక్కు తేరుల గుంపును కూడగట్టుకొనినవాడై; అశ్వత్థామ వచ్చి; నన్నున్; పొదివినన్= చుట్టుముట్టగా.

**తాత్పర్యం:** అనగా విని అర్జునుడు ధర్మరాజుతో ఇట్లా అన్నాడు: 'నేను సంశప్తకులతో యుద్ధం చేస్తూ ఉండగా అశ్వత్థామ అనేక రథసమూహాలతో వచ్చి నన్ను చుట్టుముట్టగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఏనూఱురథంబులు వెసఁ । బీనుఁగు పెంటలుగఁ జేసి పేర్చినఁ, గుపితుం**
**డై నిప్పు లురలు కన్నుల । తో నక్కోదండగురుసుతుఁడు నామీఁదన్. 40**

**ప్రతిపదార్థం:** ఏనూఱు రథంబులు= ఐదువందల రథాలు; వెసన్= వేగంతో; పీనుఁగు పెంటలన్+చేసి= శవాల కుప్పలయ్యేటట్లు చేసి; పేర్చినన్= (నేను) అతిశయించగా; కుపితుండు+ఐ= కోపపడినవాడై; నిప్పులు+ఉరలు= నిప్పులు గ్రక్కే; కన్నులతో; ఆ కోదండ గురుసుతుఁడు= ఆ బాణాచార్యుడి కొడుకు అశ్వత్థామ; నామీఁదన్= నా మీద.

**తాత్పర్యం:** ఐదువందల రథాలను తునాతునకలై జీవంలేని శవాలగుట్టలవలె చేసి, నేను ఆటోపం చూపగా కోపగించుకొని, అశ్వత్థామ నాపై నిప్పులు వెదజల్లే కన్నులతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఉఱక యడరి మెఱసిన యే । డ్తెఱ నెఱయఁగ గుడుసువడి, యతిస్ఫురిత రుచిన్**
**మెఱసి, ధను వనల వలయము । తెఱఁగునఁ జక్షుర్గతి ప్రతిహతిం జేసెన్. 41**

**ప్రతిపదార్థం:** ఉఱక= లెక్కపెట్టక; అడరి= కోపంతో పైకొని; మెఱసిన= మిరుమిట్లుగొలిపే; ఏడ్తెఱన్= పరాక్రమంతో; నెఱయఁగన్= చెలరేగగా; గుడుసుపడి= గుండ్రంగా చుట్టుకొని; అతి= మిక్కిలి; స్ఫురిత రుచిన్= వెలుగొందే కాంతితో; మెఱసి= దీపించి; ధనువు= ధనుస్సు; అనల వలయము తెఱఁగునన్= గుండ్రంగా చేయబడిన నిప్పువలె (ధనుస్సు రెండు కొనలు లాగి కలిపినపుడు గుండ్రంగా కనపడుతుంది. ఇది బాణప్రయోగ తీవ్రతను సూచిస్తుంది); చక్షుర్గతి ప్రతిహతిన్+ చేసెన్= నేత్ర గమనమును నిరోధించింది.

**తాత్పర్యం:** 'అశ్వత్థామ నన్ను లెక్కపెట్టక కోపోద్దీపితుడై మాపైబడి మిరుమిట్లు గొలిపే పరాక్రమంతో చెలరేగి మా సైన్యాలను చుట్టుకొని, ధనుస్సును మండే నిప్పు గుండ్రంగా చుట్టుకొన్నట్లు చేసి, మా చూపులను చెదరగొట్టి ఏమీ కనపడకుండా చేశాడు.

**క. స్వాతిగతుం డగు శుక్రుం । డేతెఱఁగునఁ బరఁగఁజేయు నెసకపు వర్షం,**
**బాతెఱఁగున సాయక । వర్షాతిశయం బావహించె నతఁడు నరేంద్రా! 42**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= ధర్మరాజా!; స్వాతిగతుండు+అగు శుక్రుండు= స్వాతినక్షత్రయుక్త తులారాశిలో చేరిన శుక్రుడు; ఏ+తెఱఁగునన్= ఏ విధంగా; ఎసకపు= ఎక్కువైన; వర్షంబు+పరఁగన్+చేయున్= వానను పెంపొందింపజేయునో; ఆ తెఱఁగునన్= అదే విధంగా; అతఁడు= అశ్వత్థామ; సాయక= బాణాలనే; వర్ష+అతిశయంబు= వానపెంపును; ఆవహించెన్= కలిగించాడు.

**తాత్పర్యం:** రాజా! స్వాతినక్షత్రంలో చేరిన శుక్రుడు వానలనెట్లా ఎక్కువ కురిపిస్తాడో, అదే విధంగా అశ్వత్థామ విపరీత బాణవర్షాన్ని కురిపించాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. తన యరదం బెద్దెసఁ జూ । చిన మొగమున వ్రేల, దీప్తశిత విశిఖములన్**
**ననుఁ గృష్ణుం గప్పిన, నే । ననఘా!, కెల వరయఁజాల నైతి వెగడునన్. 43**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; తన; అరదము= రథం; ఏ+దెసన్+చూచినన్= ఏ దిక్కున చూచినా; మొగమునన్ వ్రేలన్= ముఖం ముందు కనబడేటట్లుగ; దీప్తశిత= ప్రకాశిస్తూ వాడియైన; విశిఖములన్= బాణాలతో; ననున్ కృష్ణున్= నన్ను, కృష్ణుడిని; కప్పినన్= కప్పివేయగా; ఏన్= నేను; వెగడునన్= తత్తరపాటుతో; కెలవు= పరిస్థితిని; అరయన్ చాలనైతిన్= తెలిసికొనలేకపోయాను.

**తాత్పర్యం:** ఓ పుణ్యాత్మా! ఎటు చూచినా ముఖం ముందు తన రథమే కన్నులకు కట్టేటట్లు కనబడుతుండగా, మిరుమిట్లు గొలిపే పదునైన బాణాలతో నన్నూ, కృష్ణుడినీ కప్పివేయగా, నేను తడబాటుతో, ఉన్న పరిస్థితులను తెలిసికొనలేకపోయాను.

**క. పదపడి, యొకభంగి నతని । మద మడఁచినఁ దొలఁగఁ బాటె మానము దూలం;**
**దదనంతరంబ నిన్ను । న్వెదకితి నరనాథ!, మన యనీకములోనన్. 44**

**ప్రతిపదార్థం:** నరనాథ!= ధర్మరాజా!; పదపడి= తరువాత; ఒక భంగిన్= ఒక విధంగా; మదము+అడఁచినన్= పొగరణచగా; మానము= పరువు; తూలన్= పోగా; తొలఁగన్+పాఱెన్= తొలగిపోయాడు; తదనంతరంబు+అ= ఆ తరువాతనే; నిన్నున్= నిన్ను; మన; అనీకము లోనన్= సైన్యంలో; వెదకితిన్= వెదికాను.

**తాత్పర్యం:** ఆ తరువాత ఒక విధంగా అతడి పొగరును అణగగొట్టగా, అభిమానం చెడి అశ్వత్థామ యుద్ధంనుండి తొలగిపోయాడు. ధర్మరాజా! ఆపైన సైన్యాలలో నిన్ను వెదికాను.

**క. ఆలోఁ గర్ణునిచేతం । దూలని చతురంగములను దొరలను ధరణీ**
**పాల! మనమొనలఁ గానను । వ్రాలిన దర్పమున మెఱయు వడముడిఁ దక్కన్. 45**

**ప్రతిపదార్థం:** ధరణీపాల!= ధర్మరాజా!; వ్రాలిన దర్పమునన్= అతిశయించిన గర్వంతో; మెఱయు= ప్రకాశించే; వడముడిన్+ తక్కన్= భీముడిని తప్ప; ఆలోన్= ఆ లోపల; కర్ణుని చేతన్= కర్ణుడి వలన; తూలని= విరిగిపడని; చతురంగములను; దొరలను= వీరులను; మనమొనలన్= మన సైన్యాలలో; కానను= చూడనైతిని.

**తాత్పర్యం:** ఓ భూపాలా! అతిశయించిన దర్పంతో ప్రకాశించే ఒక్క భీముడు తప్ప, మన సైన్యాలలో కర్ణుడిచేత బాధపడని చతురంగబలాలుగాని, రణవీరులుగాని నాకు కనబడలేదు.

**క. ఆతనిచే నీ విక్కడ । కేతెంచుట వింటి; సేమ మెఱుఁగు తలఁపు మై**
**నేతెంచితి; నవ్వీరుని । చేతులలా వస్మదీయ సేన నిలుపుటన్. 46**

**ప్రతిపదార్థం:** ఆతనిచేన్= ఆ భీముడివలన; నీవు+ఇక్కడకున్; ఏతెంచుట= వచ్చుటను; వింటిన్= విన్నాను; ఆ+వీరుని= ఆ కర్ణుడి; చేతులలావు= భుజబల సామర్థ్యాన్ని; అస్మదీయ సైన్యము= మన సైన్యం; నిలుపుటన్= ఆపుటచేత; సేమము+ ఎఱుఁగు తలఁపుమైన్= నీ క్షేమం తెలిసికొనాలన్న యోచనతో; ఏతెంచితిన్= వచ్చాను.

**తాత్పర్యం:** భీముడివల్ల నీ విక్కడికి రావటాన్ని గూర్చి విన్నాను. ఆ వీరుడి భుజబలం మనసేనను నిలబడేటట్లు చేస్తూ ఉండగా, నీ క్షేమాన్ని తెలుసుకోవాలని వచ్చాను.

క. మనుజేంద్ర! కుశలి వగు నినుఁ । గని, నామన మూఱడిల్లెఁ గావున మగుడం
జనియెదఁ, గొనియెద రాధా । తనయుని తల చలము నెఱయ దర్పము మెఱయన్. 47

**ప్రతిపదార్థం:** మనుజేంద్ర!= ధర్మరాజా!; కుశలివి+అగు= క్షేమంగా ఉన్న; నినున్+కని= నిన్ను చూచి; నా మనము= నా మనసు; ఊఱడిల్లెన్= కుదుటపడింది; కావునన్= అందుచే; మగుడన్+చనియెదన్= తిరిగి వెళ్ళుతాను; చలము= నా పట్టుదల; నెఱయన్= నిండుకొనగా; దర్పము మెఱయన్= గర్వం ప్రకాశించగా; రాధాతనయుని తలన్= కర్ణుడి తలను; కొనియెదన్= తీసికొంటాను.

**తాత్పర్యం:** మనుజేంద్రా!, సురక్షితంగా ఉన్న నిన్ను చూచి నా మది నెమ్మదించింది. అందువలన మరల తిరిగి యుద్ధభూమికి పోతాను. నా పంతం ఫలప్రదమయ్యేటట్లు, నా గర్వానికి వన్నె చేకూరేటట్లు కర్ణుడి శిరస్సు ఖండిస్తాను.

క. ననుఁ జూడుము వేడుకకుం । జనుదెంచి భవద్బలంబు సంతస మందం
దునిమెదఁ గర్ణుని దుర్యో । ధను కోర్కియు నీమనంబు తాపముఁ దీఱన్. 48

**ప్రతిపదార్థం:** భవద్బలంబు= నీ సైన్యం; సంతసము+అందన్= సంతోషపడేటట్లు; దుర్యోధను కోర్కియున్= దుర్యోధనుడి ఆశయు; తీఱన్= నిష్ఫలమయ్యేటట్లు; నీ మనంబు= నీ మనస్సు; తాపమున్= ఆవేదన; తీఱన్= ఉపశమించేటట్లు; కర్ణునిన్= కర్ణుడిని; తునిమెదన్= ఖండించివేస్తాను; వేడుకకున్= వినోదార్థం; చనుదెంచి= నీ వక్కడకు వచ్చి; ననున్; చూడుము.

**తాత్పర్యం:** నీ సేనలు ఆనందించగా, దుర్యోధనుడు పెట్టుకొన్న ఆశలు వమ్ముకాగా, నీ చిత్తతాపం తీరిపోగా, కర్ణుడిని నరికివేస్తాను. నీవు అక్కడకు వచ్చి నన్ను, నా కార్యాన్ని వేడుకగా చూడుము.

మ. ధనురాచార్యుని చావు సూచి, తగ రాధానందనుం డా సుయో
ధనునిం దమ్ముల వారి సైన్యములనుం దాఁ గాచువాఁడై రణం
బునకుం బూనుట, నింత సేయ వలదే? భూపాల! యేపారి మం
డునె యాఱం గల దీప! మ ట్లతఁడు మండుం గాక! యే నార్చెదన్. 49

**ప్రతిపదార్థం:** భూపాల!= రాజా!; ధనురాచార్యుని= (అస్త్రవిద్యాగురువైన) ద్రోణునియొక్క; చావు చూచి= మరణాన్ని చూచి; రాధానందనుండు= కర్ణుడు; సుయోధనుని= దుర్యోధనుడిని; తమ్ములన్; వారి సైన్యములన్; తాన్+కాచువాఁడై= తానే రక్షించువాడైనట్లు; తగన్= దానికి తగినట్లు; రణంబునకున్+పూనుటన్= యుద్ధానికి దిగుటచేత; ఇంత చేయవలదే?= ఇంత గొప్పగా (యుద్ధం) చేయవలసిన అవసరం లేదా?; ఏపారి మండునె?= అతిశయించి మండుతున్నాడే?; ఆఱంగల దీపము+అట్లు= ఆరిపోబోతున్న దీపంవలె; అతఁడు= కర్ణుడు; మండున్ గాక= మండితే మండు గాక; ఏన్ ఆర్చెదన్= నే నార్పివేస్తాను.

**తాత్పర్యం:** బాణాచార్యుడైన ద్రోణుడి చావుతో, ఇక తానొక్కడే రారాజును, ఆయన తమ్ముళ్ళను, వారి సైన్యాన్నీ రక్షించగలవాడైనట్లు, యుద్ధానికి దిగాడు కనుక ఇంత గొప్పగ యుద్ధం చేయవలసిందే. ఆరిపోయే దీపం అతిశయించి వెలుగునట్లు అతడు మండిపడుతున్నాడు. మండనీ, నేను ఆర్పివేస్తాను.

**చ. నరవర! పంపు! మేను బ్రధనంబున కేఁగిన సూతసూనుఁ డు**
**ద్ధురత నెదిర్చెనేనిఁ దల ద్రుంపక తక్కిన, విప్రుతోడ ని**
**ప్పరుసున నిచ్చువాఁడ నని పల్కి పదంపడి యీక తక్కు దు**
**ష్పురుషునిఁ జూచుమాడ్కి ననుఁ జూడుఁడు నీవును వాసుదేవుఁడున్.** **50**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; పంపుము= యుద్ధం చేయపంపుము; నేను; ప్రధనంబునకున్= యుద్ధానికి; ఏఁగినన్= పోయినట్లయితే; సూతసూనుఁడు= కర్ణుడు; ఉద్ధురతన్= చెలరేగి; ఎదిర్చెనేని= నన్ను ఎదుర్కొన్నట్లయితే; తల+త్రుంపక= తలత్రుంచక; తక్కినన్= తప్పి వైదొలగిపోతే; విప్రుతోడన్= బ్రాహ్మణునితో; ఈ+పరుసునన్= ఈ విధముగా; ఇచ్చువాఁడను= ఇవ్వగలవాడ నని; పల్కి= చెప్పి; పదంపడి= తరువాత (వెంటనే); ఈక తక్కు= ఇవ్వకుండా మాట తప్పే; దుష్పురుషునిన్= చెడ్డవాడిని; చూచుమాడ్కిన్= చూచే విధంగా; నీవును= నీవునూ; వాసుదేవుడున్= కృష్ణుడూ; నన్నున్+ చూడుఁడు= నన్ను చూడండి.

**తాత్పర్యం:** ఓ రాజా! నన్ను యుద్ధానికి పంపుము. నేను యుద్ధానికి దిగితే కర్ణుడు విక్రమించి నన్నెదిరిస్తే అతడి తల నరికివేయకపోతే- ఈ విధంగా ఇస్తానని బ్రాహ్మణుడికి చెప్పి ఆ తర్వాత ఇవ్వకపోయిన దురాత్ముడిని చూచినట్లే మీరూ, శ్రీకృష్ణుడూ నన్ను చూడండి.

**విశేషం:** అలంకారం: ఉపమ. దీనివలన ఆ కాలంలో బ్రాహ్మణులకు చేసిన వాగ్దానం ఎంత పవిత్రమో, దానిని తీర్చటం ఎంత అవసరమో తెలుస్తుంది.

**వ. భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట భరం బయి యుండు; నేనునుం దడయుట గర్జంబు గాదు; పోయెద'ననిన విని, యమ్మనుజపతి గర్ణుండు కుశలియై యుండుట యెఱింగి, యతని బాణంబుల నొచ్చినవాఁ డగుట నలుక గదిరి యక్కిరీటితో నిట్లనియె:** **51**

**ప్రతిపదార్థం:** భీమసేనునకున్; సేనాముఖంబునన్= దండుముందు; తాన్+అ= తానొక్కడే; నిలుచుట; భరంబు+అయి ఉండున్= భారమై ఉంటుంది; ఏనునున్= నేనూ; తడయుట= ఇంక ఆలసించటం; కర్జంబు కాదు= ఉచితమైన పనికాదు; పోయెదన్; అనినన్= అని పలుకగా; విని; ఆ+మనుజపతి= ఆ ధర్మరాజు; కర్ణుండు; కుశలి+ఐ ఉండుట= క్షేమంగా ఉన్నాడని; ఎఱింగి= తెలిసికొని; అతని; బాణంబులన్= బాణాలవలన; నొచ్చినవాఁడు+అగుటన్= బాధపడినవాడవటంచేత; అలుక= కోపం; కదిరి= అతిశయించి; ఆ+కిరీటితోన్= ఆ అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** తానొక్కడే సేనాముఖంలో నిలిచి పోరాడటం భీమసేనుడికి భారం అయి ఉండవచ్చును. నేను కూడా ఆలస్యం చేయటం న్యాయం కాదు. నేను యుద్ధరంగానికి పోతాను' అని అర్జునుడు అనగా, కర్ణుడు క్షేమంగా ఉన్నాడని తెలిసికొని ధర్మరాజు అతడి బాణాలవలన బాధపడి ఉండటం వలన కోపించి' అర్జునుడితో ఇట్లా అన్నాడు:

ధర్మరాజు కర్ణుండు బ్రతికియున్నవాఁడని విని యర్జునుం గినిసి పలుకుట (సం. 8-48-1)

**క. 'అనిలోఁ దెరలుట దొలఁగుట । యనునివి సనుఁ గాక, నొచ్చియైనను గల నె**
**ల్లను వెడలఁ జనునె? యే న । ట్లును గా కిట వచ్చుటం జులుకనైతిఁ గడున్.'** **52**

**ప్రతిపదార్థం:** అనిలోన్= యుద్ధంలో; తెరలుట= మరణించుట; తొలఁగుట= వైదొలగిపోవుట; అను+ఇవి= అనేవి; చనున్+కాక= జరుగవచ్చుగాక; నొచ్చి ఐనను= దెబ్బతిని; కలను+ఎల్లను= యుద్ధమునంతా; వెడలచనునె?= వదలిపెట్టి పోవుట యుక్తమా?; ఏను= నేను; అట్లును+కాక= ఆ విధంగా కూడా కాక; ఇట వచ్చుటన్= ఇక్కడకు రావటం వల్ల; కడున్= మిక్కిలి; చులుకన+ ఐతిన్= తేలికవాడనైనాను.

**తాత్పర్యం:** యుద్ధంలో మరణించటం, తొలగిపోవటం జరుగవచ్చు. కాని, దెబ్బతిని పూర్తిగా యుద్ధాన్ని వదలి వెళ్ళటం తగునా? నేను అట్లా యుద్ధంలో నిలబడకుండా ఇక్కడకు రావటంతోనే కదా చులకనైపోయాను.

**విశేషం:** పుండుపై కారం చల్లినట్లు దెబ్బలతో బాధపడుతూ, చులకన చేయబడినందుకు కుములుతూ ధర్మజుడు అనిన మాటలు, ఆత్మగౌరవంలో ప్రతీకార దీక్షతో వక్రోక్తిమయంగా ఉన్నవి.

**క. 'విను! కర్ణున కే నోడితి । నన నేటికి? నీవు నోడి; తనిలజ మాద్రీ**
**తనయులు మున్నే యోడిరి; మనతోఁ గూడంగఁ గంసమర్దనుఁ డోడెన్!' 53**

**ప్రతిపదార్థం:** విను= వినుము; కర్ణునకున్= కర్ణుడికి; ఏను= నేను; ఓడితిన్+అనన్+ఏటికిన్?= ఓడిపోయినానని అనటం ఎందుకు?; నీవున్ ఓడితి(వి)= నీవు కూడ ఓడావు; అనిలజ= భీముడు; మాద్రీతనయులు= మాద్రిపుత్రులు నకుల సహదేవులు; మున్నే= ఇంతకుముందే; ఓడిరి= ఓడారు; మనతోన్+కూడంగన్= మనతో కలసినందున; కంసమర్దనుఁడు= కంసుడిని చంపిన ఆ కృష్ణుడు కూడా; ఓడెన్= ఓడాడు. (మంచి ఎత్తిపొడుపు)

**తాత్పర్యం:** 'బాగా వినుము. నేనొక్కడనే కర్ణుడిచేత ఓడించబడినానని అనటం ఎందుకు? నీవూ ఓడావు. భీమ నకుల సహదేవులు ముందుగనే ఓడారు. మనతో చేరి కృష్ణుడు కూడా పరాభూతుడయ్యాడు. (పరాభవానల దగ్ధుడైనందువలన ఆయన మాటలు వేడిగా ఉన్నవి.)

**విశేషం:** కృష్ణుడనక కంసమర్దనుడనటం - మహావీరుడైన కంసుడిని సంహరించిన కృష్ణుడే ఓడాడని చెప్పటానికి.

**క. 'కావున మన మిఁక ననికిం । బోవం బని లేదు; విపినభూమికిఁ జని య**
**చ్చో వెఱపు దక్కి తపసుల । మై, విచ్చలవిడిఁ జరింత మందఱముఁ దగన్!' 54**

**ప్రతిపదార్థం:** కావునన్= కావున; మనము; ఇఁకన్= ఇకపైన; అనికిన్= యుద్ధానికి; పోవన్ పని లేదు= పోవలసిన అవసరం లేదు; విపిన భూమికిన్= అరణ్యానికి; చని= పోయి; ఆ+చోటన్= అక్కడ; తపసులము+ఐ= మునివృత్తిలో ప్రవేశించి; వెఱపు దక్కి= భయం పోగొట్టుకొని; తగన్= ఆ చోటుకు తగినట్లు; అందరము; విచ్చలవిడిన్= స్వేచ్ఛగా; చరింతము= తిరుగుదాము.

**తాత్పర్యం:** 'కాబట్టి ఇకమీదట మనం యుద్ధానికి దిగవలసిన అవసరం లేదు. అడవికేగి తాపసులమై, జంకు లేకుండా స్వేచ్ఛగా మనమందరం తగువిధంగా సంచరిద్దాము.'

**క. 'కాదేని, బిరుదు లాడక । సాదుల మై వినయ మొప్పఁ జని, కురునాథుం**
**డేది పనిచినను జేసి, ద । యాదృష్టి నతండు సూచున ట్లుండఁదగున్.' 55**

**ప్రతిపదార్థం:** కాదు+ఏనిన్= కాకుంటే; బిరుదులు+ఆడక= ప్రగల్భాలు పలుకకుండా; సాదులము+ఐ= సాత్త్వికులమై; వినయము+ఒప్పన్= అందరిపట్ల అణకువ గలిగి; చని= కౌరవులవద్దకు చేరి; కురునాథుడు; ఏది పనిచినన్= ఏమి చేయుమని చెప్పినా; చేసి= ఆ పని చేసి; దయాదృష్టిన్= (ఆయన) కనికరపు చూపుతో; అతండు; చూచునట్లున్= చూచేటట్లుగా; ఉండన్+ తగున్= ప్రవర్తించటం ఉచితం.

**తాత్పర్యం:** అట్లాకాకపోతే ప్రగల్భాలు పలుకకుండా, సాధువులమై వినయ విధేయతలు చూపుతూ, కురునాథుడి దగ్గర చేరి, ఆయన అక్కడ ఏమి పనిచేయుమని చెప్పితే అది చేసి, ఆయన దయాదాక్షిణ్యాలకు పాత్రులమయ్యేటట్లు ఉండటమే చేయదగినపని.

**వ. అని కెంజాయ రంజిల్లు కన్నుల నన్నరు నాలోకించి. 56**

**ప్రతిపదార్థం:** అని= అని చెప్పి; కెంపు+చాయ= ఎర్రరంగు; రంజిల్లు= ప్రకాశించే; కన్నులన్= కన్నులతో; ఆ+నరున్= ఆ అర్జునుడిని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** అని పలికి, కన్నులు ఎర్రబారగా అర్జునుడిని చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'నీతెఱఁ గిట్టిదేని? రణనిష్ఠకుఁ బూనక కార్యవాది వై**
**ద్వైతవనంబునంద సముదగ్రభుజాబలదుర్జయుండు రా**
**ధాతనయుండు, వాని ననిఁ దాఁక నశక్యము నాకు నన్న, నే**
**నీతెరు వేల వత్తు? మహి యేల నశక్తుఁడు వాంఛ సేయునే?' 57**

**ప్రతిపదార్థం:** నీ తెఱఁగు= నీ కార్యాచరణ; ఇట్టిది+ఏనిన్= ఇటువంటిదే అయితే; రణనిష్ఠకున్= యుద్ధదీక్షకు; పూనక= ప్రయత్నించకుండా; కార్యవాదివై= తగిన కార్యాచరణవిధానం చెప్పునట్టివాడివై; ద్వైతవనంబునందున్+అ= ద్వైతవనమునందే (ఉండిపోయి); సమ్+ఉదగ్ర= అతిశయమైన; భుజాబల= భుజబలంచేత; దుర్జయుండు= జయించ వీలుగానివాడు; రాధాతనయుండు= కర్ణుడు; వానిన్= అట్టివాడిని; అనినన్+తాఁకన్= యుద్ధంలో ఎదుర్కొనటం; నాకున్; అశక్యము= సాధ్యంకాని పని; అన్నన్= అని చెప్పి ఉంటే; ఏను= నేను; ఈ తెరువు= (ఈ దారికి) ఈ జోలికి; ఏల వత్తున్= ఎందుకు వచ్చి ఉంటాను?; అశక్తుఁడు= బలహీనుడు; మహిన్+ఏలన్= భూమిని పాలించటానికి; వాంఛ+చేయునే?= కోరుకొంటాడా?

**తాత్పర్యం:** 'నీ తీరు ఇటువంటిదే అయి ఉండినట్లయితే, యుద్ధం చేస్తాననే పట్టుదలకు పోకుండా, సమయోచిత కార్యాచరణమే యోగ్యమనే వాడవైతే మనం ద్వైతవనంలో నున్నప్పుడే - భయంకర బాహుబలం కలవాడు, జయింప శక్యంగానివాడు కర్ణుడిని, యుద్ధంలో ఎదుర్కొనటం నాచేతగాని పని - అని నీవు ముందే అని ఉంటే - నేను ఈ యుద్ధమార్గానికి ఎందుకు వస్తాను? బలహీనుడు భూపాలన చేయాలని కోరుకొంటాడా?'

**విశేషం:** అలంకారం: అర్థాంతరన్యాసం.

**క. 'అని వధించెదఁ గర్ణు నే నని ప్రతిజ్ఞ । సేసి, యిటు దెచ్చిన న న్నిట్లు సేసి, తింత**
**కెట్లు నేర్చితి? పాడవుగా నెత్తి నేల । వైవ నోర్చితి ననుఁ బగవారి నడుమ.' 58**

**ప్రతిపదార్థం:** అనిన్= యుద్ధంలో; కర్ణున్= కర్ణుడిని; ఏను= నేను; వధించెదను+అని= చంపెదనని; ప్రతిజ్ఞ చేసి= బాస చేసి; నన్నున్; ఇటు తెచ్చి= ఇక్కడకు తీసికొనివచ్చి; ఇట్లు చేసితి(వి)= ఇట్టి దురవస్థలపాలు చేశావు; ఇంతకున్ ఎట్లు నేర్చితి(వి)?= ఇంతపని చేయటాన్ని ఎట్లా నేర్చుకొన్నావు?; ననున్= నన్ను; పగవారి నడుమన్= శత్రువులమధ్య; పొడవుగాన్+ఎత్తి= ఎక్కువగా పైకెత్తి; నేలన్+వైవన్= నేలపై విసిరికొట్ట; ఓర్చితి(వి)= కలిగావు.

**తాత్పర్యం:** 'యుద్ధంలో కర్ణుడిని తుదముట్టిస్తానని శపథం చేసి, నన్ను ఇక్కడకు తీసికొనివచ్చి, ఇట్లా అవమానం పాలు చేశావు. ఇంత పని చేయటానికి ఎట్లా నేర్చుకొన్నావు? కానివారి ఎదుట నన్ను పైకెత్తి క్రిందకు విసిరికొట్టగలిగావు.'

**ఉ. 'పంకజనాభుఁడున్ వినఁగఁ బల్కిన యప్పలు కిమ్మెయిం దుదిన్**
**బొంకగుటోర్చి తిట్టి నినుఁ బుట్టినయప్డు నుతించెఁ బోరికిన్**
**శంక గొనండు, గెల్చుఁ గురుసంఘము నీతఁడు పుణ్యుఁ డన్న యా**
**బొంకరి దివ్యవాణియుఁ దపోధనులున్ మము ని ట్లలంతురే!' 59**

**ప్రతిపదార్థం:** పంకజనాభుఁడున్= కృష్ణుడుకూడా; వినఁగన్= వినేటట్లు; పల్కిన ఆ+పలుకులు= పలికిన ఆ మాటలు; బొంకు+అగుట+ఓర్చితి(వి)= అబద్ధాలు కావటానికి ఓర్చావు; తుదిన్= చివరకు; ఈ+మెయిన్= ఈ విధంగా; ఇట్టి నినున్= ఇట్టి నిన్ను; పుట్టిన అప్డు= పుట్టిన సమయంలో; నుతించెన్= ఇట్లు కొనియాడినారు; పోరికిన్= యుద్ధం చేసేందుకు; శంకగొనండు= జంకడు; కురు సంఘమున్= కౌరవుల సమూహాన్ని; ఈతఁడు గెల్చున్= ఇతడు గెలుస్తాడు; పుణ్యుఁడు= పవిత్రుడు, అన్న= అని పలికిన; ఆ బొంకరి= ఆ కల్లలాడే; దివ్యవాణి= ఆకాశవాణియు; తపోధనులున్= తపస్సంపన్నులును; మమ్మున్; ఇట్లు అలంతురే?= ఇట్లా బాధపెడతారా?

**తాత్పర్యం:** కృష్ణుడి ఎదుట నీవు చెప్పిన మాటలు ఇట్లా అబద్ధమయ్యేటట్లు చేశావు. ఇటువంటి నీ జన్మ సమయంలో ఆకాశవాణి, తపస్సే సంపదగా గలిగిన మునులు 'ఇతడు యుద్ధమంటే వెనుకాడడు. కౌరవులను గెలుస్తాడు. ఇతడు పుణ్యాత్ముడు' అని పొగడారు. ఇట్లా అబద్ధమాడి మమ్ములను కష్టపెడతారా? (నొవ్వజేయడం ఉచితం కాదని భావం).

**క. 'విను! మప్పలుకులు పాటిగఁ । గొని దుర్యోధనునితోడఁ గొంటిని బగ ము**
**న్ను; నిజంబుగ నెఱుఁగను వీఁ । డని రాధేయునకు వెఱచునని యే నిన్నున్.' 60**

**ప్రతిపదార్థం:** వినుము; ఆ+పలుకులు= ఆ మాటలు; పాటిగన్+కొని= ఆధారంగా చేసికొని; దుర్యోధనుని తోడన్; మున్ను= ఇంతకుముందు; పగ కొంటిని= పగతెచ్చుకొన్నాను; వీఁడు= అర్జునుడు; అనిన్= యుద్ధంలో; రాధేయునకున్= కర్ణుడికి; వెఱచును+అని= భయపడతాడని; ఏ నిన్నున్= నేను నిన్ను; నిజంబుగన్+ఎఱుఁగను= నిజంగా తెలుసుకోలేదు.

**తాత్పర్యం:** వినుము. ఆ మాటలు నమ్మి, దుర్యోధనుడితో వైరం తెచ్చుకొన్నాను. అర్జునుడు కర్ణుడితో యుద్ధమంటే వెనుకాడుతాడని నిజంగా అప్పుడు నాకు తెలియదు.

**సీ. 'దేవత లిచ్చిన తేరు నశ్వంబులుఁ । గపికేతనంబును గలవు; దైవి**
**కంబు చే నున్నది; గాండీవ మనఁ దాటి । యంతవి ల్లది గాక, హరి రథంబు**
**గడపెడు నటె! పరికర మిట్టి దై యుండ । నెట్లు కర్ణున కోడి యిట్లు వలియఁ**
**బాఱుతెంచితి నీవు? భండనంబునఁ గర్ణుఁ । గని పాఱు దని సుయోధనుఁడు సెప్పె;**

**తే. నది నిజంబుగఁ గొనక బే లైతి; నాదు । బేలతనమునఁ గాదె పాంచాల మాత్స్య**
**పాండ్యులాదిగఁ గలిగిన బంధుమిత్ర । జనులు దెగటాఱి రప్రయోజనము గాఁగ.' 61**

**ప్రతిపదార్థం:** దేవతలు+ఇచ్చిన తేరు= దేవతలిచ్చిన రథం; అశ్వంబులు= గుర్రాలు; కపికేతనంబును= కపిధ్వజం; కలవు= ఉన్నాయి; దైవికంబు= దివ్యశక్తి సంపన్నమైన; గాండీవం; చేన్+ఉన్నది= చేతిలో ఉన్నది; గాండీవమనన్= ఆ గాండీవమనే; తాటియంత= తాటిచెట్టంత; విల్లు= ధనుస్సు; అదిగాక= అదికూడ గాక; హరి= కృష్ణుడు; రథంబు గడపెడునటె!= రథం తోలునట!; పరికరము= ఆయుధసామగ్రి; ఇట్టిదై ఉండగన్= ఇటువంటిదై ఉండగా; ఎట్లు కర్ణునకున్= ఎట్లా కర్ణుడిచేత; ఓడి= పరాజితుడవై; ఇట్టు= ఈ విధంగా; వలియన్= శక్తిహీనుడవై; నీవు; పాఱుతెంచితి(వి)?= పారిపోయి వచ్చినావు?; భండనమునన్= యుద్ధంలో; కర్ణునిన్= కర్ణుడిని; కని= చూచి; పాఱుదు(వు)+అని= పరుగెత్తిపోతావని; సుయోధనుఁడు; చెప్పెన్= ముందే చెప్పాడు; అది= దానిని; నిజంబుగన్= యుథార్థమని; కొనక= గ్రహించక; బేల+ఐతిన్= మోసపోయిన వాడనైతిని; నాదుబేలతనమునన్ కాదె!= నా అమాయకత్వంవలననే కదా!; పాంచాల మాత్స్యపాండ్యులు; ఆదిగాన్+కలిగిన= మొదలైన; బంధుమిత్రజనులు= చుట్టాలు, స్నేహితులు; అప్రయోజనము కాఁగన్= ఏ ప్రయోజనమూ లేకుండా; తెగటాఱిరి= చచ్చారు.

**తాత్పర్యం:** 'దేవత లిచ్చిన రథం, అశ్వాలు, కపిధ్వజం నీకున్నాయి. వీటికి తోడు దైవశక్తి శోభితమైన గాండీవం నీచేతనున్నది. ఈ గాండీవం తాటిచెట్టంత పొడవు, లావు, చేవగల్గింది. ఇవికాకుండా శ్రీహరియే సారథియై ఉన్నాడు. నీ యుద్ధసామగ్రి ఇంత గొప్పదై ఉండగా, నీవెట్లా కర్ణుడి దెబ్బకు ఆగలేక పిరికిపందవై పరుగెత్తి వచ్చావు? నీవు యుద్ధంలో కర్ణుడిని ఎదిరించలేవని దుర్యోధనుడు ముందుగానే చెప్పాడు. ఇది నిజమని నమ్మలేక మోసపోయి ఇంత తెచ్చుకొన్నాను. నా అమాయికత్వంవల్లనే కదా యుద్ధానికి దిగి, పాంచాలురు, మాత్స్యులు, పాండ్యులు మొదలైన బంధుమిత్రులంతా నిష్ప్రయోజనంగా ప్రాణాలు కోల్పోయారు!'

**వ. అని పలికి, కృష్ణునాననం బాలోకించి; 'కర్ణు నిగ్రహించుట యశక్యం బయ్యెఁ; సుయోధనాది కౌరవులు గనుంగొన వానిచేతం బరిభవింపఁబడి యేను జీవంబుతో నునికిం గడచిన కష్టంబునుం గలదే? యది యట్లుండెఁ; నేను జావు దప్పివచ్చుట వడముడి కతంబునం గలిగెఁ; నతం డొక్కరుండును బ్రాణంబులు డాఁపక పరబలంబులు బడలువడం బోరుచున్నవాఁడు.' 62**

**ప్రతిపదార్థం:** అని పలికి; కృష్ణ+ఆననము= కృష్ణుడి ముఖం; ఆలోకించి= చూచి; కర్ణున్= కర్ణుడిని; నిగ్రహించుట= ఎదిరించి ఆపుట; అశక్యంబు+అయ్యెన్= సాధ్యం కాకపోయింది; సుయోధనాది కౌరవులు= దుర్యోధనుడు మొదలైన కౌరవులు; కనుంగొనన్= చూస్తూ ఉండగా; వానిచేతన్= ఆ కర్ణుడిచేత; పరిభవింపఁబడి= అవమానించబడి; ఏను= నేను; జీవంబుతో ఉనికిన్= ప్రాణాలతో బ్రతికి ఉండుటకంటె; కడచిన కష్టంబునున్ కలదె?= అతిశయించిన కష్టం కలదా?; అది అట్లుండెన్= ఆ సంగతి అట్లుండనిమ్ము; నేను చావు తప్పివచ్చుట; వడముడి= భీముడి; కతంబునన్= వలన; కలిగెన్= జరిగినది; అతండు+ఒక్కరుండునున్= అతడొక్కడే; ప్రాణంబులు డాఁపక= ప్రాణాలు దాచిపెట్టుకొనకుండా; పరబలంబులు= శత్రుసైన్యాలు; బడలువడన్= అలసిపోయేటట్లు; పోరుచున్+ఉన్నవాఁడు= పోరుతున్నాడు.

**తాత్పర్యం:** అని పలికి ధర్మరాజు కృష్ణుడివైపు చూచి 'కర్ణుడిని జయించటం అసాధ్యమైన పని అయింది. దుర్యోధనాది కౌరవవీరులు చూస్తూ ఉండగా కర్ణుడిచేత నేను అవమానించబడి ప్రాణాలతో ఉండటంకంటె బాధాకరమైన విషయమేముంటుంది? అది అట్లా ఉండనిమ్ము. భీముడివలన నేను చావుతప్పి బయటపడ్డాను. అతడొక్కడే ప్రాణాలను లెక్కపెట్టక శత్రుసేనలు బడలిపోయేటట్లు యుద్ధం చేస్తున్నాడు?'

**క. అని, పార్థుఁ జూచి యతఁ డి । ట్లను; 'నేఁ డభిమన్యుఁ డొండె హైడింబుం డొం**
**డెను గలిగిన ని ట్లగునే? వినుము! మును చేసినది యనుభవింపఁగ వలదే?' 63**

**ప్రతిపదార్థం:** అని పార్థున్+చూచి= అని పలికి అర్జునుడిని చూచి; అతఁడు; ఇట్లు+అనున్; నేఁడు; అభిమన్యుఁడు; ఒండెన్= కాని; హైడింబుండు= ఘటోత్కచుడు; ఒండెను= కాని; కలిగినన్= ఉండి ఉంటే; ఇట్లు+అగునే?= ఈ విధంగా జరిగేదా?; విను; మును చేసినది= చేసినదాని ఫలితం; అనుభవింపఁగ వలదే?= అనుభవించక తప్పుతుందా?

**తాత్పర్యం:** అట్లా పలికి ధర్మరాజు అర్జునుడిని చూచి ఇట్లా అన్నాడు: 'ఈనాడు అభిమన్యుడు గాని, ఘటోత్కచుడు గాని ఉండి ఉంటే ఇట్లా జరిగేదా? వినుము. పూర్వకర్మఫలం అనుభవించక తప్పుతుందా?

**ఆ. 'నిన్నుఁ దృణముఁ జేసి, న న్నాదురాత్ముండు । బంధుహీనుఁ బోలెఁ బఱుప, నెడరు**
**దోఁచి నప్పు డొదవి తొలగించువానిఁ గా । కన్యు నేల బంధుఁ డండ్రు జనులు?' 64**

**ప్రతిపదార్థం:** నిన్ను, తృణమున్+చేసి= నిన్ను గడ్డిపోచ మాదిరిగా చేసి; నన్నున్+ఆ దురాత్ముండు= నన్నా దుర్మార్గుడు; బంధుహీనున్+పోలెన్= చుట్టపక్కాలు లేనివానినివలె; పఱుపన్= పాటుబడజేయగా; ఎడరు తోఁచినప్పుడు= ఆపద కలిగినప్పుడు; ఒదవి= ఆదుకొని; తొలఁగించు వానిన్+కాక= నివారించేవాడినిగాక; అన్యున్= ఇతరుని; ఏల= ఎట్లు; జనులు= ప్రజలు; బంధుఁడు+అండ్రు?= చుట్టమంటారు?

**తాత్పర్యం:** దుర్మార్గుడు నిన్ను గడ్డిపోచను చేశాడు. నన్ను బంధువుల ఆదరణ లేని దీనుడిగా జేసి కష్టపెట్టాడు. ఆపద కలిగినపుడు సహాయపడి ఆపదను వారించేవాడినిగాక, ఇతరుడిని ప్రజలు ఎందుకు చుట్టమంటారు?

**విశేషం:** అలంకారం: అర్థాంతరన్యాసం.

**చ. 'హరి గలుగంగ నేటికి? భయంబున వచ్చితి నీదు గాండివం**
**బెరవుగ నిచ్చి, నీవు నొగ లెక్కి, హరిన్ రథిఁ జేయఁగన్న ని**
**ష్ఠుర భుజవిక్రమోగ్రుఁ డగు సూతతనూభవుఁ దత్సహాయులం**
**బొరిగొనఁడే సుయోధనునిపోఁడిమి దూలఁగ నొక్కమాత్రలోన్?' 65**

**ప్రతిపదార్థం:** హరి, కలుగంగన్= కృష్ణుడు అండగా ఉండగా; ఏటికిన్?= ఏల?; భయంబునన్ వచ్చితి(వి)= భయపడి వచ్చావు; నీదు గాండివంబు= నీ గాండీవాన్ని; ఎరవుగన్+ఇచ్చి= తాత్కాలికంగా ఇచ్చి, నీవు నొగలు+ఎక్కి= నీవు తేరునొగలెక్కి, సారథివై; హరిన్, రథిన్= కృష్ణుడి రథంలో కూర్చున్నవాడినిగా; చేయన్ కన్నన్= చేయగలిగితే; నిష్ఠుర= తీవ్రమైన; భుజవిక్రమోగ్రుఁడు అగు= బాహుబల విజృంభణతో భయంకరుడైన; సూత తనూభవుడిన్= కర్ణుడిని; తత్సహాయులన్= అతనికి తోడ్పడేవారిని; పోడిమి= ఒప్పు; తూలఁగన్= తగ్గిపోయేటట్లు, ఒక్క మాత్రలోన్= ఒక్క క్షణంలో; పొరిగొనడే?= చంపివేయడా?

**తాత్పర్యం:** కృష్ణుడు అండగా ఉండగా భయపడి ఎందుకు వచ్చావు? నీవు గాండీవాన్ని ప్రస్తుతం కృష్ణుడికిమ్ము. నీవు నొగలెక్కి కూర్చుండి రథచోదకుడివగుము. ఆయనను రథికునిగా చేయుము, భుజబలంతో తీక్ష్ణరూపుడైన కర్ణుడిని, అతడికి అండగా నిలిచిఉన్న వారిని, క్షణంలో ఆయన పడగొట్టడా?

ఆ. 'గొంతి కడుపునందుఁ గొడుకుచూలై నీవు । దోఁపకుండ వైతి; తోఁచినట్టి
పిండ మెడలి యైనఁ బిదప దిగంబడ । దయ్యె; నింత పుట్ట దట్టు లైన.' 66

**ప్రతిపదార్థం:** నీవు= నీవు(అర్జునుడవు); గొంతి కడుపునందున్= కుంతీదేవి గర్భంలో; కొడుకుచూలు+ఐ= మగబిడ్డవై; తోఁపకుండవు= పుట్టకుండ; ఐతి(వి)= ఉండకపోయావు; తోఁచినట్టి= పుట్టటానికి ఏర్పడిన; పిండము= పిండం; ఎడలి+ఐనన్= స్రావమై పోయినట్లయి; పిదప= తరువాత; దిగన్+పడదు+అయ్యెన్= దూసి క్రిందపడకపోయింది; అట్టులు+ఐనన్= ఆ విధంగా గర్భస్రావమై ఉన్నట్లయితే; ఇంత పుట్టదు= ఇంత జరిగేది కాదు.

**తాత్పర్యం:** కుంతీగర్భంలో నీవు మగపిండంగా ఏర్పడకుండా ఉండవలసింది. ఒకవేళ ఏర్పడినా ఆ పిండం ఆ తరువాత దూసిపోయి క్రింద పడి ఉండవలసింది. అట్లా అయినట్లయితే ఇంత జరిగేది కాదు.

అర్జునుఁడు తన్ను ధర్మజుఁ డాడిన పలుకులకుఁ గోపించి
యతని తల నఱుక వాలు పెఱికికొనుట (సం. 8-49-1)

సీ. అనినఁ, గృపాణంబు గొని సవ్యసాచి య । వ్విభు వ్రేయఁ దలఁచిన, విష్ణుఁ డెఱిఁగి,
'వాలు గేల నమర్ప వలసిన పని యేమి? । కౌరవు లియ్యెడ లేరు; మనము
ధరణీశ్వరుని సేమ మరయంగ వచ్చితి; । మీతని కుశల మి ట్లేర్పడంగఁ
గంటిమి; సంతోషకాలంబు గా కిది । క్రోధ కాలమె? వధ్యకోటి యిచట

ఆ. నేది గాఁగ నలిగి తీ' వని పలికిన । రూక్షభంగి యగు కటాక్షదృష్టి
యా నరేంద్రుమీఁద నడరంగ నర్జునుఁ । డ మ్మురారి కిట్టు లనియె నధిప!' 67

**ప్రతిపదార్థం:** అధిప!= ఓ రాజా! ధృతరాష్ట్రా!; అనినన్= ధర్మరాజు ఆ విధంగా అనగా; సవ్యసాచి= అర్జునుడు; కృపాణంబు కొని= ఖడ్గం చేపట్టి; ఆ+విభున్= ఆ ధర్మజుడిని; వ్రేయన్+తలఁచినన్= కొట్టవలెనని అనుకోగా; విష్ణుఁడు, ఎఱిఁగి= కృష్ణుడు తెలుసుకొని; వాలు= పదునైన కత్తిని; కేలన్+అమర్పన్+వలసిన పని ఏమి?= చేతబట్టవలసిన అవసరమేమి వచ్చింది?; కౌరవులు; ఈ+ఎడన్ లేరు= ఇక్కడ లేరుగదా; మనము; ధరణి+ఈశ్వరుని= రాజుయొక్క; సేమము+అరయంగన్= క్షేమాన్ని తెలిసికొనుటకు; వచ్చితిమి; ఈతని; కుశలము= క్షేమస్థితి; ఇట్లు+ఏర్పడంగన్= ఈ విధంగా ఉండగా; కంటిమి= కనులారా చూచాము; ఇది సంతోష కాలంబుగాక; క్రోధకాలమె?= కోపంతో పగతీర్చుకొనే సమయమా?; వధ్యకోటి= చంపదగిన శత్రు సమూహం; ఇచటన్; ఏది గాఁగన్= ఎవరున్నారని; ఈవు= నీవు; అలిగితివి?= కోపపడ్డావు?; అని పలికినన్= అని అనగా; రూక్షభంగి అగు= కోపగించుకొనే విధం కలదియైన; కటాక్షదృష్టిని= క్రీగంటి చూపును; ఆ నరేంద్రుమీఁదన్; అడరంగాన్= వ్యాపింపచేయగా; అర్జునుఁడు; ఆ మురారికిన్= ఆ కృష్ణుడితో; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు:

**తాత్పర్యం:** ధర్మరాజు పైవిధంగా పలికిన తరువాత కవ్వడి కత్తిని లాగి ఆ రాజును నరకదలచుకొనగా, కృష్ణు డిది గమనించి 'కత్తిని చేతపట్టవలసినపని ఏమి వచ్చింది? మన విరోధులైన కౌరవులిక్కడ ఎవరూ లేరే? మనం రాజు క్షేమం తెలిసికొనవచ్చాము. ఆయన పరిస్థితి క్షేమంగా ఉండటం చూచాము. ఇది సంతోషించవలసిన సమయమే గాని కోపపడవలసిన సమయం కాదే! ఇక్కడ చంపవలసిన విరోధులెవరున్నారని క్రోధమూర్తివైనావు? అని అనగా,

కోపంవలన ఏర్పడిన కంటి ఎరుపు ఇంకా ఆరకుండగానే క్రీగంటి చూపులను ఆ రాజుపై ప్రసరింపజేసి, అర్జునుడు మురారితో ఇట్లా అంటున్నాడు.

**విశేషం:** కోపంతో చెలరేగిన వ్యక్తిని పరిహాసపు మాటలతో చల్లారజేసి నిష్ఠుర కార్యోన్ముఖతనుండి విరమింపజేయడం నాణ్యమైన పద్ధతి. ఇది ఇక్కడ చక్కగ వ్యక్తమైంది.

**క. 'విను! మొరులకు గాండివ మి। మ్మని, న న్నెవ్వండు పలికె నతనిశిరము గ్ర**
**క్కున బగులవ్రేయుటకుఁ జే। సినవాఁడఁ బ్రతిజ్ఞ నాదు చిత్తములోనన్.' 68**

**ప్రతిపదార్థం:** వినుము; ఒరులకున్= ఇతరులకు; గాండివము+ఇమ్మని; నన్ను+ఎవండు, పలికెన్= నాతో ఎవడు పలికాడో; అతడి శిరము= అతడి శిరస్సు; గ్రక్కునన్= వెంటనే; పగులవేయుటకున్= పగుల కొట్టుటకు; నాదుచిత్తము లోనన్= నా మనస్సులో; ప్రతిజ్ఞ చేసినవాఁడన్= ఒట్టుపెట్టుకొన్నవాడనై (ఉన్నాను).

**తాత్పర్యం:** 'ఇతరులకెవరికైనా నా గాండీవాన్ని ఇమ్మని ఎవరు అంటారో అట్టివాడి తలను వెంటనే పగులగొట్టాలని మనసులో ప్రతినబూని ఉన్నాను.'

**తే. 'ఇట్టికష్టపు గేలికై యిట్లు సేయఁ। బ్రతిన వట్టుట దగదె? యిప్పలుకు నీవు**
**వినఁగ నితఁ డాడ, నిమ్మహీవిభుఁడు ధర్మ। వంతుఁ డగుఁగాక చంపనవలయుఁ గృష్ణ!' 69**

**ప్రతిపదార్థం:** కృష్ణ!; ఇట్టి= ఇటువంటి; కష్టపు= కష్టం కలిగించే; గేలికై= పరిహాసానికి తగినట్లుగా; ఇట్లు చేయన్= ఇట్లా చేస్తానని; ప్రతిన పట్టుట= ప్రతిజ్ఞ చేయటం; తగదె?= ఉచితమై ఉండలేదా?; ఈ+పలుకులు= ఈ మాటలు; నీవు వినఁ గన్= నీవు వింటుండగానే; ఇతఁడు+ఆడన్= ఇతడు పలుకగా; ఈ+మహీవిభుఁడు= ఈ రాజు; ధర్మవంతుఁడు+అగున్+గాక= ధర్మశీలుడగుగాక; చంపన్+అ వలయున్= తప్పక తుదముట్టించాలి.

**తాత్పర్యం:** కృష్ణా! 'మనసు నొప్పించే ఇటువంటి ఎగతాళిమాటలకు తగినట్లుగా, తల తరుగుతానని బాస చేయటం తగి ఉండలేదా? ఇంతకూ ఈ మాటలు నీ ఎదుటనే పలికి ఉన్నాడు. ఈ చులకనమాటలు పలికిన భూపాలుడు సత్యధర్మపరాయణుడైనప్పటికి ఇతడిని వెంటనే చంపివేయాలి.'

**వ. 'చంపి పాలిత ప్రతిజ్ఞుండ నైన నాకు నసత్యంబు రాకుండఁ బరిహరించెద; దీనికి నీ వేమి సెప్పెదవు? సెప్పుము! నీవు జగత్కృత్యసాకల్యవేదివి; నీ చెప్పినట్ల చేయంగలవాఁడ' ననుటయు, నచ్యుతుండు 'పో పా మ్మెక్కడివాఁడ'వని యదల్చి వెండియు ని ట్లనియె: 70**

**ప్రతిపదార్థం:** చంపి= అటువంటివాడిని చంపి; పాలిత= ఆచరించబడిన; ప్రతిజ్ఞుండను+ఐ= శపథం కలవాడనై; నాకున్; అసత్యంబు= ఆడినమాట తప్పినాడన్న అపవాదం; రాకుండ; పరిహరించెదన్= నివారిస్తాను; దీనికిన్; నీవు+ఏమి చెప్పెదవు; చెప్పుము; నీవు; జగత్కృత్య= లోకం పాటించదగిన; సాకల్య= సమస్తాన్ని; వేదివి= తెలిసినవాడివి; నీ చెప్పినట్లు= నీవు చెప్పినట్లు; చేయన్+కలవాఁడన్= చేయగలవాడను; అనుటయున్; అచ్యుతుండు= కృష్ణుడు; పోపొమ్ము= పోవయ్యా చాలు; ఎక్కడివాఁడవు!= ఎక్కడినుండి వచ్చావయ్యా!; అని; అదల్చి= బెదిరించి; ఇట్లు+అనియెన్; (కృష్ణుడు కుంతి మేనల్లుడు, అర్జునుని బావమరిది, ఆ చనువు ఈ మాటలలో కనబడుతున్నది.)

**తాత్పర్యం:** 'చంపి, ప్రతిజ్ఞ పాలించినవాడనైతే, అసత్యదోషం రాకుండా నివారించుకొంటాను. దీనికి నీవేమి అంటావు? చెప్పుము. నీవు లోకవ్యవహారాలన్నీ తెలిసినవాడివి. నీవు చెప్పినట్లు చేస్తాను!' అన్నాడు అర్జునుడు. శ్రీకృష్ణుడు 'పోవయ్యా! ఎక్కడివాడవయ్యా నీవు?' అని గద్దించి మళ్ళీ ఇట్లా అన్నాడు:

**ఆ. 'నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగ । నయ్యెఁ; రిత్త యిట్టు లడిచిపడుటఁ**
**బట్టి; ధర్మవిధి విభాగజ్ఞు లైన వా । రేల చేయఁ జొత్తు రిట్టిదాని?' 71**

**ప్రతిపదార్థం:** రిత్త= ఊరకే; ఇట్టుల; అడిచి పడుటన్ పట్టి= కోపంతో త్రుళ్లిపడే కారణంగా; నీకున్; వృద్ధసేవ= పెద్దలను సేవించటం; లేక+ఉన్కి= అలవాటులేదన్న సంగతి; ఎఱుఁగంగన్+అయ్యెన్= తెలియవచ్చినది; ఇట్టులు= ఈ విధంగా (ఇట్టి తొందరపాటును); ధర్మవిధి= ధర్మశాస్త్ర ఆదేశాలయొక్క; విభాగజ్ఞులు+ఐనవారు= విషయాలను వేరుచేయగల విధానాన్ని తెలిసినవారు; ఇట్టి దానిన్= ఇటువంటి ఉల్లంఘనాన్ని; ఎందుకు; చేయన్+చొత్తురు?= చేయపూనుకొంటారు?

**తాత్పర్యం:** 'తగిన కారణం లేకుండానే నీవు ఇట్లు ఎగసిపడటాన్ని బట్టి చూస్తే పెద్దలను గౌరవించడం నీకు తెలియదన్న విషయం బయటపడినది. ధర్మశాస్త్రసూత్రాలను విభజించి అందున్న సూక్ష్మవిషయాలను తెలిసికొన్న వారు ఇట్టిపని చేయటాని కెందుకు పూనుకొంటారు?

**క. 'చేయంగ వలయువానిం । జేయుట, యిట్టివియె కొన్ని చేయకునికి, ధ**
**ర్మాయత్తచిత్తుఁడై నా । నా యోగ్యస్థలము లెఱిఁగి నడవఁగ వలదే!' 72**

**ప్రతిపదార్థం:** చేయంగ వలయువానిన్= చేయవలసినవాటిని; చేయుట; ఇట్టివియె= ఇటువంటివే; కొన్ని చేయక+ఉనికి= కొన్నిటిని చేయకుండా ఉండటం; ధర్మ+ఆయత్తచిత్తుఁడు+ఐ= ధర్మానికి అధీనమైన మనస్సు కలవాడై; నానా యోగ్య స్థలములు= అనేకములైన తగిన తావులను (విషయాలను) ఎఱిఁగి; నడవఁగ వలదే?= ప్రవర్తించవలసి ఉన్నది కదా!

**తాత్పర్యం:** చేయవలసిన వాటిని చేయటం, ఇటువంటివే కొన్ని చేయకుండా ఉండటం, ధర్మానికి అధీనమైన మనస్సు కలవాడై, చేయదగిన వివిధ విషయాలు తెలుసుకొని నడుచుకోవాలి కదా.

**క. 'సత్యంబు నహింసయు నను । నత్యుత్తమధర్మయుగళ మందు, నహింసన్**
**సత్యము గాచుట ధర్మ, మ । సత్యమున నహింసఁ గావఁ జను నండ్రు బుధుల్.' 73**

**ప్రతిపదార్థం:** సత్యంబు; అహింసయున్; అను; అతి+ఉత్తమ= మిక్కిలి శ్రేష్ఠములైన; ధర్మ= ఆచరణయోగ్యములైన; యుగళము+అందున్= జంటలో; అహింసన్= అహింసచే, సత్యము; కాచుట= రక్షించటం; ధర్మము= న్యాయసమ్మతమైన సూత్రం; అసత్యమునన్= అసత్యముతో; అహింసన్ కావన్= అహింసను కాపాడుట; చనున్= తగును; (అని) బుధులు= వివేకవంతులు; అండ్రు= అంటారు.

**తాత్పర్యం:** సత్యం, అహింస - అనే ఈ రెండు ఉత్తమధర్మాలలో, అహింసతో సత్యాన్ని కాపాడటం ధర్మం. అయినా అసత్యంతో అహింసను కూడ కాపాడతగునని జ్ఞానధనులంటారు.

ఆ. **'కర్మసూక్ష్మభంగి గానక యిమ్మెయి । సత్యరక్షణంబు సలుపుపొంటె**
**భ్రాత ధర్మపరుఁడు రా జిమ్మహాత్ముఁ జం । పఁగఁ దలఁచుట ధర్మపథము గాదు.'** 74

**ప్రతిపదార్థం:** కర్మసూక్ష్మభంగి= కార్యాచరణంలోని (ధర్మ) సూక్ష్మతను; కానక= కనుగొనక; ఈ+మెయిన్= ఈ ప్రకారంగా; సత్య రక్షణంబు= నిజాన్ని కాపాడటం; సలుపుపొంటెన్= చేయుటకు; భ్రాత ధర్మపరుఁడు= (నీ)అన్నగారు, ధర్మాచరణం తెలిసినవాడు; రాజు= మనలను పాలించేవాడు అయిన; ఈ+మహాత్మున్; చంపఁగన్ తలఁచుట= చంపాలనుకొనటం; ధర్మపథము కాదు= ధర్మమార్గం (న్యాయమైన విధానం) కాదు.

**తాత్పర్యం:** చేయవలసిన పనిలో ఉండే (ధర్మ) సూక్ష్మతను తెలుసుకోకుండా, సత్యాన్ని రక్షించటానికని, తోబుట్టువు, ధర్మాత్ముడు, ప్రభువు అయిన ఈ మహానుభావుడిని చంపాలనుకొనటం ధర్మమార్గంకాదు.

క. **'విను! పిన్ననాఁడు నీ వీ । యనుచిత మగువ్రతము వట్టి; తది గాకయు, బె**
**ట్టనృతము సూనృతమును నీ । కనియెడు చందంబు బుధులు గయికొన రెందున్.'** 75

**ప్రతిపదార్థం:** విను; పిన్ననాఁడు= పసితనంలో; నీవు; ఈ అనుచితము+అగు= ఈ తగని; వ్రతమును= దీక్షాచరణ విధానాన్ని; పట్టితి(వి)= కైకొన్నావు; అదిగాకయున్= అంతే కాకుండా; బెట్టు= దుర్లభమైన (అధికమైన); అనృతము= బొంకు;? సూనృతము= నిజం (వీటి విషయంలో); నీవు కనియెడు= నీవు చూచే; చందంబు= విధం (నీవు అనుకొనే విధంగా); బుధులు= పండితులు; ఎందున్= ఏ విధంగా గూడ; కయికొనరు= చేపట్టరు.

**తాత్పర్యం:** బాగా వినుము. నీవు చిన్నప్పుడు లోకపు తీరు తెలియని ప్రాయంలో ఈ యోగ్యం కాని వ్రతాన్ని చేపట్టావు. అంతే కాకుండా పాలించటం కష్టమైన సత్యాసత్యాల విషయంలో నీవు అనుకొనే విధాన్ని, విషయం తెలిసిన పెద్దలెవ్వరూ ఆమోదించరు.'

క. **అది యెట్లంటేని;** 76

**తాత్పర్యం:** అది ఎట్లా అంటావా? (తరువాతి పద్యంతో అన్వయం).

ఆ. **'ప్రాణహాని వచ్చుపట్టున, సర్వధ । నాపహార వేళయందు నడపు**
**సత్య మనృత మం; డ్రసత్యంబు సూనృత । మని పరిగ్రహింతు రార్యజనులు.'** 77

**ప్రతిపదార్థం:** ప్రాణహాని, వచ్చు, పట్టునన్= ప్రాణానికి కీడు కలుగనున్న సమయంలో; సర్వధన= ఉన్న ధనమంతా; అపహార వేళ అందున్= మోసంగా దొంగిలించబడే సమయంలో; నడపు= సాగించే; సత్యము; అనృతము+అంద్రు= కల్ల అంటారు; అసత్యంబు= అబద్ధాన్ని; సూనృతము+అని= సత్యమని; ఆర్యజనులు= పూజ్యులు; పరిగ్రహింతురు= చేపట్టుతారు.

**తాత్పర్యం:** 'ప్రాణానికి ముప్పు ఏర్పడినప్పుడు, ఉన్న ఆస్తినంతా దోచుకొని పోయేటప్పుడు చెప్పే నిజాన్ని కల్లగా, బొంకును సత్యంగా పెద్దలు స్వీకరిస్తారు.'

**విశేషం:** ప్రాణ రక్షణం చేసిన అబద్ధం యోగ్యమైనదవుతుంది గాని, కొంపలు కూల్చిన సత్యం ఎట్లా సుగుణం అవుతుంది? ప్రాణహితమైనదే సత్యమని గదా ప్రమాణవాక్యం! నిజం చెప్పేందుకు తెలివితో పనిలేదుగాని, అబద్ధం చెప్పేందుకే బుద్ధి వికాసం కావాలి.

**వ. 'విను: పెద్దయు వినికి లేనివాఁడు కౌశికుండను నొక్కవిప్రుం డొక్క విశిష్ట గ్రామంబున కనతిదూరంబున సరిత్సంగమ పుణ్యక్షేత్రంబున వసియించి, సత్యంబ పలుకువాఁడ నని వ్రతంబు వట్టి, సత్యవాది యనం బ్రసిద్ధుండయి తపంబు సేయుచుండ; నొక్కనాఁడు, మ్రుచ్చులం గని వెఱచఱచి పఱతెంచిన జనులు గొంద అయ్యాశ్రమంబు చేరువం బొదలఁ దూఱి; రంత వెను తగిలి వచ్చు మ్రుచ్చు లత్తపోధనునికడ కేతెంచి, 'యిప్పు డిట వచ్చినవార లెటవోయి?' రని యడిగిన, నతండు సత్య విభాగ విధిజ్ఞుండు గామింజేసి, తన కసత్యంబు వాటిల్లు ననుశంక 'నీ గుల్మలతా గహనంబు సొచ్చి' రని చూపి చెప్పిన, నత్తెక్కలికాఱు వారలం జంపి ధనమ్ముగొని; రమ్ముని తద్వచన దోషంబున నరకప్రాప్తుం డయ్యె నను నితిహాసంబు విందుము, హింసాకరం బగు సత్యంబు ధర్మంబు గాదు; తొలుత వినిన దానిన పట్టి మూఢుండు పెద్దల నడిగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు; నింతవట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుం డవుం, గాఁ డని నిశ్చయింపు' మనుటయు, నర్జునుం డిట్లనియె: 78**

**ప్రతిపదార్థం:** విను; పెద్దయున్= ఎక్కువగా; వినికి లేనివాడు= పెద్దలు చెప్పిన మాటలు విని ఉండనివాడు; కౌశికుండు; అను విప్రుండు; ఒక్క= ఒకానొక; విశిష్ట గ్రామంబునకున్= మట్టు మర్యాద లెరిగిన పల్లెటూరికి; అనతి దూరంబునన్= ఎక్కువగాని దూరంలో (దగ్గరగా) ఉన్న; సరిత్సంగమ= నదులు గలసిన (కూడలిలో); పుణ్యక్షేత్రంబునన్; వసియించి= స్థావరం ఏర్పరచుకొని ఉంటూ; సత్యంబు+అ పలుకువాఁడను+అని= నిజమే పలుకుతానని; వ్రతంబు పట్టి= దీక్ష బూని; సత్యవాది అనన్; ప్రసిద్ధుండు+ఐ= పేరుమోసినవాడై; తపంబు చేయుచుండన్; ఒక్కనాఁడు; మ్రుచ్చులన్+కని= దొంగలను చూచి; వెఱచఱచి= భయపడి; పఱతెంచిన= పరుగెత్తి వచ్చిన; జనులు; కొందఱు; ఆ+ఆశ్రమంబు చేరువన్= ఆ ఆశ్రమ సమీపంలో; పొదల దూఱిరి; అంతన్; వెనుతగిలివచ్చు= వెన్నంటి వచ్చే; మ్రుచ్చులు= దొంగలు; ఆ+తపోధనుని కడకున్= తపస్సే ధనంగా గలిగిన ఆయన దగ్గరకు; ఏతెంచి= వచ్చి; ఇప్పుడు ఇచట వచ్చిన వారలు; ఎటు పోయిరి?= ఎక్కడికి పోయారు?; అని అడిగినన్; అతండు= ఆ ముని; సత్య విభాగ= సత్యంలో ఉన్న వేరు వేరు అంశాలను; విధిజ్ఞుండు= ఎరిగినవాడు; కామిన్+చేసి= కానందువలన; తనకున్; అసత్యంబు; పాటిల్లును= అంటుకొంటుంది; అనుశంకన్= అనే సందేహంతో; ఈ, గుల్మలతా, గహనంబున్= ఈ పొదల తీగలతో కూడిన చొరరాని ప్రదేశమును; చొచ్చిరి; అని; చూపి చెప్పినన్= వేలుపెట్టి చూపుతూ చెప్పగా; అ+తెక్కలికాఱు= ఆ దొంగలు; వారలన్; చంపి; ధనమ్ము కొనిరి; ఆ+ముని= ఆ తపసి; తద్+వచన, దోషంబునన్= ఆ మాటలవలన ఏర్పడిన పాపంతో; నరకప్రాప్తుండు= నరకం పొందిన వాడుగా; అయ్యెన్; అను= అనే; ఇతిహాసంబు= పరంపరగా చెప్పుకొంటూ వస్తున్న గాథను; విందుము= వింటున్నాము; హింసాకరంబు+అగు= పీడను కలిగించే; సత్యము; ధర్మంబు కాదు= శాస్త్ర సమ్మతం కాదు; తొలుత వినినదానిన్+అ; పట్టి= ముందు వినినదానినే అనుసరించి; మూఢుండు= తెలివితక్కువవాడు; పెద్దలన్+అడిగి తెలిసికొనక; వర్తించి= నడచుకొని; దుర్గతిన్= నరకమును; పొందున్= పొందుతాడు; ఇంతవట్టు= ఇంతవరకు; విచారించి= యోచించి; అజాతశత్రుండు= శత్రువులు లేని ధర్మరాజు (పదసార్థక్యం); వధ్యుండు= చంపదగినవాడు; అవున్+కాఁడు+అని= అవునో కాదో అని; నిశ్చయింపుము= నిర్ణయం తీసికొనుము; అనుటయున్= అనిన తరువాత; అర్జునుండు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** వినుము. పెద్దలనుండి ఎక్కువగా తెలిసికొనని కౌశికుడనే బ్రాహ్మణుడు ఒక మంచి గ్రామంలో కొద్ది దూరంగా ఉన్న నదీసంగమ పుణ్యక్షేత్రంలో నివసిస్తూ, సత్యమే పలకాలని వ్రతం పట్టి, సత్యవాది అని ప్రసిద్ధుడై, తపస్సు చేసికొంటూ ఉన్నాడు. ఒకనాడు దొంగలు వెంబడించగా కొందరు జనులు భయంతో పారివచ్చి, అతడి ఆశ్రమప్రాంతంలో ఉన్న పొదలలో దూరి దాగికొని ఉన్నారు. దొంగలు వచ్చి ఆ జనులు ఎక్కడికి వెళ్ళారని ఆ

తపస్విని అడిగారు. అతడు సత్యాసత్య నిరూపణ వివేకం లేనివాడు కావటంచేత తనకు అసత్యదోషం కలుగుతుందని భావించి, ఆ పొదరిళ్ళలో దాగికొన్న జనులను చూపించి చెప్పాడు. ఆ దొంగలు వారిని చంపి, వారి ధనాన్ని దోచుకొన్నారు. ఆ ముని తాను చేసిన దోషంవలన నరకాన్ని పొందాడు. ఈ ఇతిహాసం లోకంలో ప్రసిద్ధికెక్కింది. హింసకు దారితీసే సత్యం ధర్మం కాదు. తనకు తెలిసిందే ధర్మమని భావించి పెద్దలనడిగి తెలిసికొనని మూఢుడు దుర్గతి పొందుతాడు. ఈ తాత్పర్యాన్ని భావించి ధర్మరాజు వధ్యుడా? కాదా? అనే అంశాన్ని నిశ్చయించుము' అనగా విని అర్జునుడు ఈ విధంగా అన్నాడు:

**తే.** **'తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి । నన్ను ననుచితకృత్యంబునకుఁ దొలంగఁ**
**ద్రోచితివి! లోకమున నీకు గోచరంబు । గాని ధర్మ నిబోధంబు గలదె కృష్ణ?'** 79

**ప్రతిపదార్థం:** కృష్ణ!= కృష్ణా!; తల్లిదండ్రుల మాడ్కి= తల్లిదండ్రులవలె; హితంబు= మేలు కలుగజేసే మాట; చెప్పి; నన్నున్; అనుచిత= యోగ్యంకాని; కృత్యంబునకున్= చేతకు; తొలంగన్ ద్రోచితివి= దూరం చేశావు; లోకమునన్; నీకు; గోచరముగాని= మనస్సుకు తట్టని; ధర్మ= అనుసరించదగిన సన్మార్గములయొక్క; నిబోధంబు= ఎరుక; కలదె?= ఉన్నదా?

**తాత్పర్యం:** 'కృష్ణా! తల్లిదండ్రులవలె కార్యాచరణవిధానాన్ని తెలియజేసి, నన్ను అయోగ్యమైన కార్యం చేయకుండా బయట పడవేశావు. ఈ లోకంలో నీ బుద్ధికి తోచని ధర్మస్వరూపం కలదా?'

**క.** **'జనములు వృథాప్రతిజ్ఞుం । డని నను నిందింపకుండ, నగ్రజుఁడు సుఖం**
**బునికియుఁ గలిగెడునట్లుగ । ననుగ్రహముఁ జేసి, చేయునది పనుపు దగన్.'** 80

**ప్రతిపదార్థం:** జనములు= లోకులు; వృథా ప్రతిజ్ఞుండు= పనికిమాలిన బాసలు చేసేవాడని; ననున్= నన్ను; నిందింపకుండఁగన్= నిందించకుండా; అగ్రజుండు= అన్న; సుఖంబు ఉనికియున్= హాయిగా ఉండుట; కలిగెడునట్లుగన్= ప్రాప్తించేవిధంగా; అనుగ్రహము చేసి= దయచూపి; చేయునది= అనుసరించవలసిన పద్ధతిని; తగన్= తగిన విధంగా పనుపుము= ఆజ్ఞాపించుము.

**తాత్పర్యం:** 'లోకులు నన్ను వ్యర్థ ప్రతిజ్ఞలు చేసేవాడని తిట్టకుండా, సోదరుడు సురక్షితంగా ఉండేటట్లు, ఏది చేయదగునో దయచేసి చెప్పుము.

**వ.** **అనిన నతం డతని కిట్లనియె.** 81

**తాత్పర్యం:** అనగా విని కృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు:

### కృష్ణుఁడర్జునుఁ బ్రతిజ్ఞా భంగంబు గాకుండ ధర్మజు దూఱుమని చెప్పుట (సం. 8-48-64)

**చ.** **'అతిశిత కర్ణ బాణహతి నంగము నొచ్చిన దాన నల్గి, యి**
**ప్పతి నిను నివ్వఁ బల్కు టిది ప్రాభవ; మింతియె కాక, నీయెడన్**
**మతిఁ బటుకోపముం గలదె? మారుతసూనుఁడు నీవుఁ దమ్ములుం**
**జతుర వినీతి నీతని వశంబునఁ గాదె చరింతు రెప్పుడున్?'** 82

**ప్రతిపదార్థం:** అతిశిత= మిక్కిలి వాడి అయిన; కర్ణ= కర్ణుడి; బాణహతిన్= బాణాల దెబ్బలచేత; అంగము= శరీరం; నొచ్చిన దానన్= బాధపడినందువలన; అల్గి= కోపించి; ఈ+పతి= ఈ రాజు; నినున్; నొవ్వన్, పలుకుట= నీకు వేదన కలిగేటట్లు మాట్లాడటం; ఇది; ప్రాభవము= ప్రభుత్వము; ఇంతియె కాక= ఇంతే కాకుండా; మతిన్= ఆయన మనస్సులో; నీ ఎడన్= నీ పట్ల; పటు కోపమున్ కలదె?= ఎక్కువ కోపమున్నదా? (లేదనుట); మారుత సూనుఁడు= వాయుపుత్రుడు- భీముడు; నీవున్= నీవు; తమ్ములున్; చతుర= చాకచక్యం గలిగిన; వినీతిన్= వినయవిధానంతో; ఈతని వశంబునన్+కాదె= ఈయన అధీనంలో ఉండేగదా; సదా= ఎప్పుడున్; చరింతురు?= నడచుకొంటున్నారు?

**తాత్పర్యం:** 'కర్ణుడు ప్రయోగించిన కరకుబాణాల దెబ్బచేత, శరీరం బాధపడినందువలన కోపంతో నీ మనస్సు బాధపడేటట్లు మాట్లాడటం ప్రభువైన ఇతనికి తగును. ఇంతేగాని ఆయన మనస్సులో కోపమనేది లేదు. భీముడు, నీవు, నీ తమ్ములు నేర్పుతోడి వినయవిధానంతో ఆయనకు వశవర్తులై ఎప్పుడూ నడచుకొంటున్నారు గదా!'

**క. 'కావునఁ బ్రభుత్వ సంపద । నీ విభుఁ డాడినది యెల్ల నెగ్గుగొనక, నా**
**చే వినుము; నీదు ప్రతినకు । నేవిధి సేయనగు దాని నేర్పడ ననఘా!' 83**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; కావునన్; ప్రభుత్వ సంపదన్= అధికారంతో; ఈ విభుఁడు ఆడినది+ఎల్లన్= ఈ ప్రభువు పలికిన పలుకులన్నీ; ఎగ్గు కొనక= తప్పుగా భావించక; నీదు ప్రతినకున్= నీ ప్రతిజ్ఞకు; ఏది చేయన్+అగున్= ఏమి చేయ తగునో; దానిని; ఏర్పడన్= ఆ వివరం బాగా తెలిసేటట్లు; నాచేన్ వినుము= నా వలన వినుము.

**తాత్పర్యం:** 'ఓ పుణ్యాత్ముడా! (మీ మీది) అధికారంతో, మీ అన్న పలికిన మాటలు తప్పుగా భావించక నీ ప్రతిజ్ఞ విషయం ఏమి చేయాలో నేను చెపుతా విను.

**క. 'నీ విట్టివాఁడ వని ధర । ణీవిభునిం బలుకు; మదియ నీచంపుట సం**
**భావించి, పిదపఁ బ్రణతుఁడ । వై వినయము సేయు చిత్తమలర నతనికిన్.' 84**

**ప్రతిపదార్థం:** నీవు; ఇట్టివాడవు అని; ధరణీ విభునిన్= రాజును; పలుకుము; అదియ= అదే; నీ చంపుట= నీవు అనుకొన్న వధ; పిదపన్= ఆ తరువాత; సంభావించి= గౌరవించి; అతనికిన్= ఆ ధర్మరాజుకు; చిత్తము+అలరన్= మానసం సంతోషించేటట్లు; ప్రణతుఁడవై= మ్రొక్కినవాడవై; వినయము చేయు(ము)= మర్యాద చూపుము.

**తాత్పర్యం:** నీవు చంపుతానన్న దానినే మనస్సులో పెట్టుకొని ఆ రాజును నీవిట్టివాడవని తిట్టుము. వెంటనే గౌరవంతో ఆయనకు సవినయంగా నమస్కరించుము. దానితో ఆయన మనస్సు సంతోషిస్తుంది.

**వ. అట్లయిన నసత్యదోషంబునకు గురువధపాతకంబునకుం దొలంగి, సమాహితుండ వగుదు; తదనంతరంబ కర్ణుని సమయింపఁ జనుటకు నమ్మనుజపతి యనుమతి వడయుద' మనుటయు, నప్పలుకుల కభినందించి, పురందరనందనుండు ధర్మనందను నుద్దేశించి. 85**

**ప్రతిపదార్థం:** అట్లయినన్; అసత్యదోషంబునకున్= అబద్ధమాడిన తప్పిదానికి; గురువధ పాతకంబునకున్= గురువును చంపిన పాపానికి; తొలంగి= పరిహరించబడినవాడవై; సమాహిత చిత్తుండవు+అగుదు(వు)= కుదుటపడిన మనస్సు కలవాడవు కాగలవు; తదనంతరంబు+అ= ఆ తరువాత; కర్ణుని; సమయింపన్= చంపడానికి; చనుటకున్; ఆ+మనుజపతి= ఆ

రాజుయొక్క; అనుమతి వడయుదము= అనుజ్ఞను సంపాదించుదాము; అనుటయున్= అనగా; ఆ+పలుకులకున్= కృష్ణుడు ఆడిన ఆ మాటలకు; అభినందించి= కొనియాడి; పురందర నందనుండు= అర్జునుడు; ధర్మనందనున్ ఉద్దేశించి= ధర్మరాజుతో.

**తాత్పర్యం:** 'ఆ విధంగా అయితే అసత్యదోషము, గురువధాపాతకము తొలగి, నీ మనస్సు కుదుటపడుతుంది. తరువాత కర్ణవధకు ఆయన అనుమతి పొందుదాము' అని కృష్ణుడనగా, అర్జునుడు శ్రీకృష్ణుని కొనియాడి, అన్నగారితో (తరువాతి పద్యంతో అన్వయం)

**మ.** **'కనదస్త్రంబుల నుజ్జ్వలోద్భట గదాఘాతంబులం గాలఁ గే**
**లను విద్విట్చతురంగ సంఘములు గూలం గేలి సల్పంగఁ జా**
**లిన యాభీముఁడు పల్కఁగాక నను; దోర్లీలాసమగ్రుండ వై**
**యనిలో నిల్వఁగ లేని నీ విటుల కీ డాడంగ నర్హుండవే?'** **86**

**ప్రతిపదార్థం:** కనత్= ప్రకాశమానాలైన; అస్త్రంబులన్= దివ్యశక్తియుతాలైన బాణాలచే; ఉజ్జ్వల= ప్రకాశమానమైన; ఉద్భట= ఎక్కువైన; గదాఘాతంబులన్= గదల దెబ్బలచే; విద్విట్= శత్రువుల; చతురంగ= చతుర్విధసైన్యాల; సంఘములు= గుంపులను; కాలన్+కేలను= కాళ్ళతోనూ చేతులతోనూ; కూలఁగన్= పతనమయ్యేటట్లు; కేలి సల్పంగన్= క్రీడ సల్పుటకు; చాలిన ఆ భీముఁడు= తగినవాడైన ఆ భీముడు; ననున్; పల్కన్+కాక= అనునుకాక (నన్ను విమర్శించ తగినవాడు); దోర్లీలా= భుజబల ప్రదర్శనంలో; అసమగ్రుండవై= పూర్తి సామర్థ్యం లేనివాడవై; అనిలోన్= యుద్ధంలో; నిల్వఁగన్ లేని= నిలబడి పోరాడలేని; నీవు+ఇటుల; కీడు ఆడంగన్= తప్పుబట్టటానికి; అర్హుండవే?= తగినవాడవా? (కావనుట).

**తాత్పర్యం:** తళుకొత్తే దివ్యశరాలచే, తీవ్రమై శోభించే గదల దెబ్బలచే విరోధుల చతురంగ బలాలను కాళ్ళతో చేతులతో నుగ్గునూచ చేయగల ఆ భీముడు నన్ను పరిహసించి మాట్లాడవచ్చును గాని, భుజబల ప్రదర్శనంలో సామర్థ్యం లేక, యుద్ధభూమిలో నిలిచి పోరాడలేని నీకు, ఇట్లా నన్ను నొప్పించే చెడ్డమాటలాడే యోగ్యత ఎక్కడున్నది?'

**క.** **'న న్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ । జన్నే? నీ జిహ్వ పెక్కు శకలములై పో**
**కున్నది యే లొకొ? రణమున । నెన్నఁడు నీ వేమి సేసి తింత యనుటకున్?'** **87**

**ప్రతిపదార్థం:** నన్నున్ ఎఱింగి ఎఱిఁగి= నా సంగతి బాగా తెలిసికూడ; ఇట్లు+అనన్= ఇట్లా మాట్లాడటం; చన్నే?= తగునా?; ఏలొకొ?= ఎందుకో?; నీ జిహ్వ= నీ నాలుక; పెక్కు శకలములు+ఐ= పలుముక్కలై; పోకున్నది?= పోకుండా ఉన్నది?; ఇంత అనుటకున్= ఇట్లా మాట్లాడటానికి; రణమునన్= యుద్ధంలో; ఎన్నఁడున్= ఎప్పుడైనా; నీవు ఏమి చేసితి(వి)?

**తాత్పర్యం:** 'నా సంగతి బాగా తెలిసి కూడా ఇట్లా మాట్లాడ తగునా? ఇట్లన్న నీ నాలుక పెక్కుముక్కలుగా ఎందుకు చీలిపోలేదో తెలియటం లేదు! ఇంతగా మాట్లాడేటందుకు, నీ వెప్పుడైనా యుద్ధంలో ఏమైనా చేసి ఉన్నావా చెప్పుము.

**క.** **'నకులుఁడు సహదేవుండును । బ్రకటభుజాస్ఫురణమున నరాతిబలము నే**
**లకుఁ గోలకుఁ దెత్తురు; నో । రికి వచ్చినయట్టు లాడిరే యిబ్భంగిన్?'** **88**

**ప్రతిపదార్థం:** నకులుఁడు; సహదేవుండును; ప్రకట= వెల్లడి చేయబడిన; భుజాస్ఫురణమునన్= బాహువిక్రమంతో; అరాతి బలమున్= శత్రుసేనలను; నేలకున్+కోలకున్+తెత్తురు= అతలాకుతలం చేస్తారు; ఈ+భంగిన్= ఈ విధంగా; నోరికిన్ వచ్చినట్లు= నోటికి వచ్చినట్లు; ఆడిరే?= పలికారా?

**తాత్పర్యం:** 'నకులుడు, సహదేవుడు తమ తమ బాహుబలంతో, విరోధి సైన్యాలను బాణాఘాతములతో అతలాకుతలం చేస్తారు. కాని, నీ మాదిరిగా ఇట్లా నోటికి వచ్చినట్లు మాట్లాడారా (వదరినారా)?'

**సీ.** **నీవు జూదం బాడఁగా వైరబంధంబు । కౌరవకోటితోఁ గలిగె; మనకు;**
**రాజ్యనాశంబు నరణ్యవాసంబును । దాస్యదైన్యంబు నత్యంతదుఃఖ**
**ములుఁ దెచ్చికొంటి; సిగ్గొలయదు నీ మనం । బున నించుకేనియు; ననికిఁ జాల**
**కున్న వానికిఁ దాల్మి యొప్పగుఁ గాక! ప్ర । ల్లదములు పలికిన లాఘవంబు**

**తే.** **సెందు మున్నేమి సేసినఁ జేసి; తింక । నైన దుర్బుద్ధితనములు మాని, తగిన**
**పౌరుషము లేము సేయఁగ నూరకుండు; । మిడుమ వడువారు సైఁతురే యివ్విధంబు?'** **89**

**ప్రతిపదార్థం:** నీవు జూదంబు; ఆడఁగాన్= ఆడినందువలననే; కౌరవ కోటితోన్= కౌరవ సమూహంతో; వైర బంధంబు= పగ లంకె; మనకున్; కలిగెన్; రాజ్యనాశంబున్= రాజ్యాన్ని పోగొట్టుకొనటం; అరణ్యవాసంబునున్= అరణ్యములో ఉండటం; దాస్య దైన్యంబున్= బానిస ఊడిగం చేయవలసిన హీనస్థితి; అత్యంతదుఃఖములున్= ఎడతెరిపిలేని కడగండ్లు; తెచ్చుకొంటివి(వి)= కలిగించుకొన్నావు; నీ మనంబునన్= నీ మనస్సులో; ఇంచుకేనియున్= కొంచెమైనా; సిగ్గు; ఒలయదు= కలుగదు; అనికిన్= యుద్ధానికి; చాలకున్నవానికిన్= శక్తిలేనివాడికి; తాల్మి= ఓర్పు; ఒప్పగున్+కాక!= తగి ఉంటుంది; ప్రల్లదములు= పొగరుమాటలు; పలికినన్= మాట్లాడితే; లాఘవంబు చెందున్= చులకనపాలు అవుతాడు; మున్ను+ఏమి చేసిన చేసితి(వి); ఇంకన్+ఐనన్= ఇకనైనా; దుర్బుద్ధితనము= దుష్టత్వం; మాని; తగిన= చాలినంత; పౌరుషములు= పురుషకారం; ఏము= మేము; చేయఁగన్= చేస్తూ ఉండగా (చూస్తూ); ఊరకుండుము; ఇడుమ= బాధ; పడువారు= అనుభవించేవారు; ఈ+విధంబున్= ఈ రీతిని; సైఁతురే?= ఓర్చుకొని ఊరకుంటారా?

**తాత్పర్యం:** నీవు జూదమాడినందువల్లనే కౌరవపక్షంతో మనకు పగ కలిగింది. దానితో మనకు రాజ్యం పోగొట్టుకొనటం, అడవులపాలుకావటం, సేవకవృత్తి నెరపటం మొదలైన భరించజాలని కష్టాలు తెచ్చిపెట్టావు. ఇంతైనప్పటికిన్నీ, ఇసుమంత సిగ్గు నీ మనస్సులో పుట్టటం లేదు. యుద్ధం చేయలేనివాడికి ఓర్పు రాణిస్తుంది. శక్తిలేనివాడు పొగరుబోతువాడివలె ఎగసి మాట్లాడితే చులకనైపోతాడు. ఇంతవరకు నీవు చేసినదేదో చేశావు. ఇంకనైనా వక్రబుద్ధిమాని, మేము పౌరుషం ప్రదర్శిస్తుంటే దుశ్చేష్టలు మాని ఊరకుండుము. కష్టాలు పడేవారు ఈ నీ పద్ధతిని సహిస్తారా?

**వ.** **అని యగ్రజు నప్రియంబులు పలికి, యంతరంగంబు సంతాపంబు వొంద నిట్టూర్పు నిగిడించి, యంతకుము న్నొఱఁ బెట్టిన వాలు వెఱికినం గనుంగొని, పద్మనాభుండు 'గ్రమ్మఱ నిది యేమి?' యని యడిగిన, నతం 'డే నిన్నరనాథు నొవ్వనాడిన పలుకులకుఁ బ్రాయశ్చిత్తంబు దలఁద్రెంచుకొనుటయకా నిశ్చయించితి' ననుటయు, నమ్మహాత్ముఁ 'డాత్మప్రశంస సేయు, మది మరణం బని పెద్దలు సెప్పుదు' రనుటయు. 'నీ చెప్పినట్ల చేయ కునికికిం గడచిన యధర్మంబును గలదె? యిట్లు సేయువాఁడన కాక' యని, యా ధనంజయుండు ధనుర్ధరుండై ధర్మనందనున కి ట్లనియె:** **90**

**ప్రతిపదార్థం:** అని; అగ్రజున్= అన్నను - ధర్మరాజును; అప్రియంబులు= మనస్సుకు గిట్టని నిష్ఠురోక్తులు; పలికి; అంతరంగంబు= మనస్సు; సంతాపంబు పొందన్= దుఃఖము పొందగా; నిట్టూర్పు= నిడుద అయిన శ్వాసను; నిగిడించి= పరపి; అంతకున్ మున్ను; ఒఱన్+పెట్టిన= ఒరలో పెట్టి ఉంచిన; వాలు= పెద్ద కత్తిని; పెఱికినన్= బయటకు లాగగా; కనుంగొని= చూచి; పద్మనాభుండు= కృష్ణుడు; క్రమ్మఱన్= మరలా; ఇది ఏమి?; అని అడిగినన్= అని అడుగగా; అతండు= ఆ అర్జునుడు; ఏన్= నేను; ఈ+నరనాథుని= ఈ ప్రభువును; నొవ్వన్+ఆడిన పలుకులకున్= మనస్సు బాధపడేటట్లు పలికిన పలుకులకు; ప్రాయశ్చిత్తంబు= పాప పరిహారంగా చేసేపనిగా; తల= నా తలను; త్రెంచుకొనుట+అ కాన్= నరుకుకొనుటే అని; నిశ్చయించితిన్= తీర్మానించుకొన్నాను; అనుటయున్= అని చెప్పగా; ఆ+మహాత్ముఁడు= ఆ కృష్ణుడు; ఆత్మప్రశంస చేయుము= నిన్ను నీవు పొగడుకొమ్ము; అది= అదే; మరణంబు+అని; పెద్దలు; చెప్పుదురు= అంటారు; అనుటయున్= అనగా; (తన్ను తాను పొగడుకొనటం తాను చావటంతో సమానమని జనవాక్యం); నీ చెప్పినట్లు= నీవు చెప్పిన ప్రకారం; చేయక ఉనికికిన్= చేయకుండా ఉండటంకన్నా; గడచిన= అతిశయించిన; అధర్మంబును; కలదె?= ఉన్నదా? ఇట్లు; చేయువాఁడను+అ కాక= చేసినవాడనే అగుదునుగాక; అని= పలికినవాడై; ఆ ధనంజయుండు= అర్జునుడు; ధనుర్ధరుండు+ఐ= ధనుస్సును చేబూనినవాడై; ధర్మనందనునకున్= ధర్మరాజుతో; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అని ధర్మరాజును నిష్ఠురోక్తులతో నిందించి, మనస్సులో బాధపడి, నిట్టూర్పులు వదలి, అంతకుముందు ఒరలో పెట్టి ఉంచిన కత్తిని పైకి తీయగా కృష్ణుడు గమనించి, 'మళ్ళీ ఇది ఏమిటి?' అని అడిగాడు. 'ధర్మరాజును తూలనాడినందుకు ప్రాయశ్చిత్తం తల నరకుకొనటమే సుమా!' అని అర్జునుడు సమాధానమిచ్చాడు. అప్పుడు శ్రీకృష్ణుడు 'నిన్ను నీవు పొగడుకొనుము. అది మరణంతో సమానమని పెద్దలంటారు.' అని సూచించాడు. అర్జునుడు ఆ సూచన నంగీకరించి, ధనుస్సును చేత దాల్చి ధర్మరాజుతో ఇట్లా పలికాడు.

**ఆ. 'హరుఁడు దక్కఁ జాపధరుఁ డొరుఁ డెన నాకుఁ । ద్రిభువనముల లేఁడు! దిశలు గెలిచి**
**తెచ్చి నీకుఁ బ్రీతి నిచ్చితిఁ, బెనుపారు । ధనము రాజసూయ దక్షిణలకు.' 91**

**ప్రతిపదార్థం:** హరుఁడు= శివుడు; తక్కన్= తప్ప; చాపధరుఁడు= విలుకాడు; ఒరుఁడు= ఇతరుడు; త్రిభువనములన్= ముల్లోకాలలో; నాకున్; ఎన= సమానుడు; లేఁడు; దిశలు గెలిచి= ఎనిమిది దిక్కులలో విజయయాత్రలు సాగించి; పెనుపారు= ఎక్కువైన; ధనము; తెచ్చి= తీసికొనివచ్చి; రాజసూయ= రాజులను జయించి చేసే యజ్ఞంలో; దక్షిణలకున్= పెద్దలకు చేసే దానాలకుగా; నీకు; ప్రీతిన్= సంతోషముతో; ఇచ్చితిన్= ఇచ్చాను.

**తాత్పర్యం:** ముల్లోకాలలో శివుడు తప్ప ఇంకొక ధనుస్సు పట్టినవాడు నాకు సాటి రాగలిగినవాడు లేడు. నీవు చేసిన రాజసూయయాగంలో దక్షిణలుగా ఇచ్చేందుకు దిగ్విజయాలు సాగించి, అపారమైన ధనరాసులను తెచ్చి చిత్తమలరగా నీకు ఇచ్చి ఉన్నాను.

**వ. 'దీప్త ప్రతాపంబగు సంశప్తక సంచయంబు నడఁగించి, కించిదవశిష్టంబుగా, నష్టంబు సేసితిఁ; గురుసేన నా చేతం గూలి యెట్లున్నదియో యటు సూడు;' మని పలికి, మొగంబుబిగు వుడిపికొని, సవినయంబుగా దండప్రణామంబు సేసి నిలిచి, చేతులు మొగిడ్చి, యజాతశత్రున కప్పురుహూతపుత్త్రుం డి ట్లనియె: 92**

**ప్రతిపదార్థం:** దీప్త ప్రతాపంబు+అగు= ప్రకాశమానమైన శౌర్యం కలిగిన; సంశప్తక సంచయంబున్= సంశప్తకవీరుల సమూహాన్ని; అడఁగించి= అణగద్రొక్కి; కించిత్= కాస్త; అవశిష్టంబు= మిగిలేటట్లు; నష్టము; చేసితిన్= కలిగించాను; కురుసేన= కౌరవ

సేన; నాచేతన్; కూలి= నా వలన చనిపోయి; ఎట్లు+ఉన్నదియో; అటు చూడుము; అని పలికి; మొగంబు బిగువు= మొగంలో కనపడుతున్న పట్టును (క్రౌర్యాన్ని); ఉడిపికొని= లేకుండా చేసికొని; సవినయంబుగాన్= అణకువగా; దండప్రణామంబు= సాష్టాంగనమస్కారం; చేసి; నిలిచి; చేతులు; మొగిడ్చి= జోడించి; అజాత శత్రునకున్= ధర్మరాజుకు; పురుహూత పుత్రుండు= ఇంద్రుడి కుమారుడైన అర్జునుడు; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** 'మహాపరాక్రమవంతులైన సంశప్తకులనే వీరులసమూహాన్ని అణచి, కొంతమంది మాత్రమే మిగిలేటట్లు చేయగలిగాను. కౌరవసేన నా చేత నశించి ఎట్లా దీనంగా ఉన్నదో నీవు కన్నారా చూడుము' అని పలికి, మొగంలో బిగువుతనం వదలుకొని, వినయంగా ధర్మరాజుకు దండప్రణామం చేసి, చేతులు కట్టుకొని ముందు నిలిచి అతడితో అర్జునుడు ఇట్లా అన్నాడు:

**క. 'నను సుప్రసాద దృష్టిం । గనుఁగొను; మే నిపుడు కొన్ని కాఱు లఱచితిన్;**
**మనుజేంద్ర! వానిఁ బెడచెవు । లను బెట్టుము వేఱుగాఁ దలంపక దయతోన్.' 93**

**ప్రతిపదార్థం:** మనుజేంద్ర!= రాజా!; ననున్; సుప్రసాద= మంచి అనుగ్రహం చూపే; దృష్టిన్= చూపుతో (కటాక్ష వీక్షణాలతో); కనుఁగొనుము= చూడుము; నేను; ఇప్పుడు; కొన్ని; కాఱులు= నీచపు కూతలు; అఱచితిన్= వాగినాను; దయతోన్; వేఱుగాన్ తలంపక= అన్యథా భావించకుండా; వానిన్= వాటిని; పెడచెవులను= విననివానిగా (వినబడకుండా చెవిని మళ్లించి); పెట్టుము= చేయుము.

**తాత్పర్యం:** 'రాజా! నేనిప్పుడు పెడసరపుమాటలు కొన్ని వాగాను! అయినా నన్ను ఇప్పుడు దయాపూర్ణమైన చూపులతో చూడుము (మనసున పెట్టక మన్నింపుము). దయచేసి వాటిని అన్యథా భావించకుండా చెవులలో దూరకుండా చేయుము.'

**తే. 'వినుము సత్యంబ పలికెదఁ; దనువుఁ బ్రాణ । ములును నీ సొమ్ముగా మదిఁ దలఁతు నేను;**
**నాదు వృత్తంబు భవదధీనం బనంగ । నేల పనుపవు నను భీముపాలి కధిప! 94**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వినుము= ఆలకింపుము; సత్యంబ, పలికెదన్= నిజమే చెపుతాను; నేను; తనువు= నా శరీరం; ప్రాణములును= ప్రాణాలును; నీ సొమ్ముగాన్= నీ ధనముగా; మదిన్= మనస్సులో; తలఁతున్= భావిస్తాను; నాదువృత్తంబు= నా జీవనం; భవదధీనము= నీ స్వాధీనం; అనంగన్= అని చెప్పుచుండగా; ఏల?= ఏ కారణం వలన?; ననున్ భీము పాలికిన్= నన్ను భీముడి దగ్గరకు (సహాయపడటానికి); పంపవు?= పంపకుండా ఉన్నావు?'

**తాత్పర్యం:** 'నేను నిజం చెప్పుతున్నాను. నా దేహం, ప్రాణం నీ ఆస్తిగానే నా మనసులో ఎల్లప్పుడూ భావిస్తాను. నా జీవితం నీ అధీనం అని ప్రకటిస్తున్నప్పటికీ పోరాడుతున్న భీముడికి సహాయంగా నన్ను ఎందుకు పంపవు?

**క. 'ఓపి యతని రణ భారము । వాపెదఁ; గౌరవ్యసేన బడలువఱిచి సా**
**టోపతఁ గర్ణునిఁ దునిమెద; । మాపెదఁ గురురాజు దురభిమానము బలమున్' 95**

**ప్రతిపదార్థం:** ఓపి= కార్యభారం వహించి పట్టుదలతో; అతని= భీముడి; రణ భారము= యుద్ధములోని ఒత్తిడిని; పాపెదన్= పోగొట్టుతాను; కౌరవ్యసేనన్; బడలు పఱిచి= అలయింపజేసి; సాటోపతన్= విజృంభణంతో; కర్ణునిన్; తునిమెదన్= సంహరిస్తాను; కురురాజు= దుర్యోధనుడి; దురభిమానమున్= పొగరును; బలమున్= చతురంగశక్తిని; మాపెదన్= అణగింపజేస్తాను.

**తాత్పర్యం:** నా శక్తినంతా ఉపయోగించి, ఒంటరిగా పోరాడుతున్న భీముడిపైనున్న యుద్ధభారాన్ని పోగొట్టుతాను. శత్రుసేనలు అలసిపోయి నిర్వీర్యులయ్యేటట్లు చేసి, కర్ణుడిని సంహరిస్తాను; దుర్యోధనుడి అనుచితగర్వాన్నీ, సైనికశక్తినీ అణచివేస్తాను.'

**వ. 'ఎల్లభంగుల నేఁడు రాధం బుత్త్రరహితం జేసెదఁ; గాదేని గొంతియైన నట్టిద యగుం గాక!' 96**

**ప్రతిపదార్థం:** ఎల్లభంగులన్= అన్ని విధాల; నేఁడు; రాధన్= రాధాదేవిని; పుత్త్రరహితన్= కొడుకు లేనిదానిగా; చేసెదన్; కాదు+ ఏనిన్= అట్లు నేను చేయకపోతే; గొంతి అయినన్= కుంతీదేవి అన్నా; అట్టిది+అ అగున్+కాక!= కొడుకు లేనిది అగుగాక!

**తాత్పర్యం:** అన్నివిధాల ఈ రోజు యుద్ధంలో కర్ణుడిని చంపి రాధను బిడ్డను కోల్పోయినదానిగా చేస్తాను. అట్లా నేను చేయలేకపోతే కుంతీదేవి పుత్రహీన అగుగాక! (కర్ణుడో అర్జునుడో ఆనాటి యుద్ధంలో చనిపోవటం తథ్యమని భావం.).

**చ. అన విని, యమ్మహీరమణుఁ డాతని కిట్లను; 'మీకు నాకతం**
**బున బహుదుఃఖముల్ గలిగె; భూరికులంబున కప్రియం బొన**
**ర్చిన యవినీతుఁ బాపపరు వ్రేయఁదగుం దల ద్రెవ్వ; నీ మనం**
**బునఁ గృప పుట్టి కాచినను, బోయెద నిప్పుడ యేను గానకున్.' 97**

**ప్రతిపదార్థం:** అనన్ విని= అని అర్జునుడు పలుకగా విని; ఆ+మహీరమణుఁడు= ఆ భూభర్త (ధర్మరాజు); ఆతనికిన్= అర్జునుడికి; ఇట్లు+అనున్; మీకు; నాకతంబునన్= నా కారణంవలన; బహు దుఃఖముల్= అనేక కష్టాలు; కలిగెన్; భూరికులంబునకున్= ప్రఖ్యాతమైన పెద్ద వంశానికి; అప్రియంబు= గిట్టని పని; ఒనర్చిన= చేసిన; అవినీతున్= న్యాయం తప్పినవాడిని (సత్ప్రవర్తన లేనివాడిని); పాపపరున్= పాపి అయిన నన్ను; తల; త్రెవ్వన్= తెగేటట్లు; వేయన్+తగున్= దెబ్బకొట్టటానికి తగినవాడిని; నీ మనంబునన్; కృప పుట్టి= దయకలిగి; కాచినను= కాపాడినప్పటికిని; ఇప్పుడు+అ; ఏను; కానకున్= అడవికి; పోయెదన్= పోతాను.

**తాత్పర్యం:** అర్జునుడాడిన ఆ మాటలు విని, ధర్మరాజు ఇట్లన్నాడు: 'మీకు నావలన అనేక కష్టాలు సంభవించాయి. ప్రఖ్యాతమైన పెద్ద కుటుంబానికి మనసుకు నచ్చని పనులు చేసి, న్యాయం తప్పిన పాపాత్ముడనైన నన్ను చంపదగి ఉన్నది. నీకు దయగలిగి రక్షించినా, నేను ఇప్పుడే అడవికి పోతాను.'

**క. 'ననుఁ దొఱఁగి నీవు సౌఖ్యం । బున నుండుము; సమరభీతు భుజబలహీనున్**
**జనపతిఁగాఁ జేయుట యొ । ప్పునె? కట్టుము పట్ట మనిలపుత్రునిఁ బ్రీతిన్.' 98**

**ప్రతిపదార్థం:** ననున్= నన్ను; తొఱఁగి= విడిచిపెట్టి; నీవు; సౌఖ్యంబునన్+ఉండుము= సుఖంగా జీవించుము; (నాబోటి) సమరభీతున్= యుద్ధమంటే పిరికివాడై పోయేవాడిని; భుజ బల హీనున్= బాహుబలంలేనివాడిని; జనపతిన్+కాన్= ప్రజలను పాలించే వాడినిగా; చేయుట; ఒప్పునె?= తగునా?; ప్రీతిన్= సంతోషంతో; అనిలపుత్రునికిన్= వాయుపుత్రుడైన భీముడికి; పట్టము కట్టుము= పట్టాభిషేకం చేయుము.

**తాత్పర్యం:** 'అర్జునా! నన్ను తొలగ ద్రోచి నీవు హాయిగా జీవించుము. నాబోటి పిరికిపందకు, ఆయుధాలు పట్టే శరీరదార్ఢ్యం లేనివాడికి, ప్రజారక్షణ బాధ్యత అప్పగించటం ఉచితమా? కాబట్టి భీముడికి సంతోషంగా రాజ్యాభిషేకం చేయుము.'

**వ. అని పలికి, సెజ్జ డిగ్గి వనవాస గమనోన్ముఖుం డయినం, గనుంగొని కమలనాభుం డాభూపతి చరణంబులకుం బ్రణతుండై యిట్లనియె: 99**

**ప్రతిపదార్థం:** అని పలికి; సెజ్జ డిగ్గి= పడకనుండి లేచి దిగి; వనవాస గమన+ఉన్ముఖుండు+అయినన్= అడవిలో నివసించటానికై పోవుటకు సిద్ధపడినవాడు కాగా; కనుంగొని= చూచి; కమలనాభుండు= కృష్ణుడు; ఆ భూపతి చరణంబులకున్= ఆ ధర్మరాజు పాదాలకు; ప్రణతుండు+ఐ= బాగా వంగి నమస్కరించినవాడై; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అని అంటూ పక్కదిగి, వనవాసానికి బయలుదేరటానికై సిద్ధంకాగా, శ్రీకృష్ణుడు చూచి, అతడి పాదాలకు నమస్కరించి ఇట్లా అన్నాడు.

**సీ. 'నరుని ప్రతిజ్ఞ భూవర! మున్నెఱుంగని । యింతియ కా దేను; నితఁడు నిప్పు**
**డాడిన మాటలు నంతరంగంబునఁ । బట్టవు; పేర్చు కోపమున నీకుఁ**
**దను నెవ్వఁ డుఱక యన్యునకు గాండీవ మి । మ్మని ధిక్కరించె, నాతని వధింప**
**బ్రతిన పట్టినవాఁడు; భావ్యంబు గానియ । ప్పలు కీవు పలికితి; పరమధర్మ**

**ఆ. మైన సత్యనిష్ఠ హానిఁ బొందుట కోర్వ । కునికిఁ జూచి, యేన యుల్లమునఁ ద**
**లంచి యట్లు పలుకఁ బంచితి; గురునిఁ గీ । డాడుటయు వధించు టగుటఁ జేసి.' 100**

**ప్రతిపదార్థం:** భూవర!= ఓ రాజా!; నరుని ప్రతిజ్ఞ= అర్జునుడి శపథం; ఏనున్= నేను; మున్ను+ఎఱుంగని= ఇంతకుముందు తెలిసికొననిది; ఇంతియ కాదు= ఇంతే కాదు; ఇతఁడు; ఇప్పుడు+ఆడిన మాటలు; పేర్చు కోపమునన్= రేగిన కోపంలో; నీకున్ అంతరంగంబునన్= మనస్సులో; పట్టవు= ఇమడలేదు; తను= తనను; ఎవ్వఁడు; ఉఱక= ఊరకే (కారణం లేకుండానే); అన్యునకున్= ఇతరుడికి; గాండీవము ఇమ్మని; ధిక్కరించెన్= ఎదిరించి నిందించుతాడో; ఆతనిన్; వధింపన్; ప్రతిన పట్టినవాఁడు= ప్రమాణం చేశాడు; భావ్యంబు కాని= అనవసరమైన; అ+పలుకులు= ఆ మాటలు; నీవు పలికితి(వి); పరమ ధర్మము+ఐన= ఆచరించవలసిన వాటిలో శ్రేష్ఠతమమైన; సత్యనిష్ఠ= సత్యమే పలుకుతానన్న దీక్ష; హానిన్+పొందుట= అపచారానికి గురికావటం; ఓర్వకునికిన్= సహించనందున; చూచి; ఏన= నేనే స్వయంగా; గురునిన్= పెద్దవాడిని; కీడు+ఆడుట+అ= దూషించటమే; వధించుట= చంపటం; అగుటన్+చేసి= కావటంచేత; ఉల్లమునన్= మనస్సులో; తలంచి= భావించి; అటు= ఆ విధంగా; పలుకన్+పంచితి(ని)= మాట్లాడుమని నియమించాను.

**తాత్పర్యం:** 'ధర్మరాజా! అర్జునుడి ప్రతిజ్ఞ ఇదివరకు నాకు తెలిసింది కాదు. ఇతడు ఇప్పుడు పలికిన మాటలు కోపావేశంవలన నీ మనసున ఇముడలేదు. ఎవడు తన గాండీవాన్ని ఇతరులకిమ్మని ధిక్కరిస్తాడో ఆతడిని వధిస్తానని శపథం పట్టాడు కాబట్టి కోపాతిశయంతో ఉన్నాడు. నీవు ఉచితంగాని ఆ మాట పలికావు. అతడి సత్యనిష్ఠ చెడకుండా ఉండాలని మనసులో తలచి, నేనే ఈ విధంగా మాట్లాడుమని చెప్పాను. పెద్దలను దూషించటం వారిని చంపటంతో సమానం కదా!'

**క. 'శరణము వేఁడెదను భవ । చ్చరణంబులు వట్టికొని, నిసర్గదయా ని**
**ర్భరబుద్ధిని గావుము మ । మ్మిరువుర; నీతప్పు సైఁపు మెల్ల విధములన్.' 101**

**ప్రతిపదార్థం:** భవత్+చరణంబులు= నీ పాదాలు; పట్టుకొని; శరణు వేడెదను= రక్షించుమని ప్రార్థిస్తాను; నిసర్గ= సహజమైన; దయా= దయారసపూర్ణమైన; నిర్భర= అధికమైన; బుద్ధిని= మనసుతో; మమ్మున్+ఇరువురన్= మా ఇద్దరిని (కృష్ణార్జునులను); కావుము= రక్షించుము; ఎల్లవిధములన్= అన్నివిధాల; ఈ తప్పు; సైఁపుము= ఓర్చుకొనుము.

**తాత్పర్యం:** 'నీ పాదాలు పట్టుకొని శరణాగతుడనవుతున్నాను. నీకు సహజమైన దయాగుణాతిశయంతో మా ఇద్దరిని రక్షించుము. అన్నివిధాల ఈ తప్పును త్రోసిపుచ్చి ఓర్చుకొనుము.'

**క. 'సూతసుతుని మెడనెత్తురు । భూతలమున నివుర నేఁడు భూనాయక! నీ**
**వాతనికి నలిగినప్పుడ । చూ తెగియెం బూని యేన చుమ్ము పలికెదన్.' 102**

**ప్రతిపదార్థం:** భూనాయక!= భూపాలా!; సూతసుతుని= కర్ణుడి; మెడ నెత్తురు= మెడ తెగటంవలన కారే నెత్తురు; భూతలమునన్= భూమిపైన; నేఁడు= ఈనాడు; ఇవురున్= పడి ఇంకుతుంది; నీవు+ఆతనికి; అలిగినప్పుడు+అ= కోపపడినప్పుడే; చూ= చూడగా; తెగియెన్= (వాడి మెడ)తెగిపోయింది; ఏన చుమ్ము= నేనే సుమా; పూని= పట్టుదలతో; పలికెదన్= చెపుతున్నా?

**తాత్పర్యం:** 'భూపాలా! ఆ కర్ణుడిమెడ నెత్తురు ఈ దినమే నేలమీద పారి ఇంకిపోగలదు. నీవు అతడిపై కోపగించుకొన్నప్పుడే వాడి మెడ తెగిపోయింది! ఈ మాట నేను పట్టుదలతో చెపుతున్నాను సుమా వినుము.

**క. 'విను సత్యం బాడెదఁ; బా । ర్థునిచే నేఁ డెల్లభంగిఁ దునుమంబడు క**
**ర్ణునిదెసఁ జింతయు వంతయు । మనుజేశ్వర! విడువు; పంపు మమ్ముఁ దెలివితోన్.' 103**

**ప్రతిపదార్థం:** మనుజేశ్వర!= ధర్మరాజా!; విను= వినుము; సత్యంబు+ఆడెదన్= యథార్థం పలుకుతాను; నేఁడు; ఎల్లభంగిన్= సర్వవిధాలా; పార్థునిచేన్= అర్జునుడిచేత; తునుమంబడు= ఖండింపబడనున్న; కర్ణుని దెసన్= కర్ణుడిపట్ల, చింతయున్= ఎప్పుడు అనుకొంటూ పడే బాధ; వంతయున్= దిగులు; విడువు= వదలుము; మమ్మున్; తెలివితోన్= మానసిక వికాసంతో; పంపు= సాగనంపుము.

**తాత్పర్యం:** రాజా! బాగా వినుము. ఉన్న సంగతి చెపుతున్నాను. ఈ దినం అన్ని విధాల అర్జునుడిచేత కర్ణుడు చంపబడుతాడు. అట్టి కర్ణుడిపట్ల ఊరకే, దిగులుపడటంగాని, బాధపడటంగాని మానుకొమ్ము. ఇక మమ్ము యుద్ధానికి ఉల్లాసంగా పంపుము.

### ధర్మరాజు కృష్ణుని వాక్యంబులం గలంకదేఱి ప్రసన్నుఁడగుట (సం. 8-49-113)

**వ. అనుటయు ధర్మసూనుండు ససంభ్రమంబుగాఁ గృష్ణు నెత్తి, యతండు ప్రాంజలి యై యుండ నతని కి ట్లనియె: 104**

**ప్రతిపదార్థం:** అనుటయున్= అనగా; ధర్మసూనుండు; ససంభ్రమంబుగాన్= త్వరత్వరగా; కృష్ణున్+ఎత్తి= (వంగి వందన మాచరిస్తున్న) కృష్ణుడిని లేవదీసి; అతండు= ఆ కృష్ణుడు; ప్రాంజలియై ఉండన్= చేతులు కలిపి నమస్కరిస్తుండగా; అతనికిన్+ఇట్లు+అనియెన్;

**తాత్పర్యం:** అనగా, ధర్మరాజు తొట్రుపాటుతో కృష్ణుడిని పైకెత్తి, అతడు చేతులు జోడించి ఎదుట నిలువబడగా అతడితో ఇట్లా అన్నాడు:

**క. 'ఇది యట్టిద మోసంబునఁ । బదిలుఁడఁ గా కేను మున్ను పదరినకతనన్**
**హృదయము గలఁగిన, నా కె । య్యదియును దోఁపమి, వికారి నైతి మహాత్మా!' 105**

**ప్రతిపదార్థం:** మహాత్మా!= మహాత్ముడవైన శ్రీకృష్ణా!; ఇది అట్టిది+అ= ఈ విషయం అటువంటిదే; మోసంబునన్= ప్రమాదంతో; పదిలుఁడన్= కుశలుడను (సమర్థుడను); కాక= కానందున; ఏను= నేను; మున్ను= ఇంతకుముందు; పదరిన కతనన్= తీరుమాలి వాగినందున; హృదయము; కలఁగిన= కలత చెందినందున; నాకున్; ఎయ్యదియును తోఁపమి= ఏమి చేయుటకు తోచకపోయినందున; వికారిని+ఐతిన్= తబ్బిబ్బు అయిన మనస్సు కలవాడినయ్యాను. (ఏమియు తోచలేదనుట).

**తాత్పర్యం:** మహాత్మా! ఆ పరిస్థితులు అటువంటివి. ప్రమాదవశాత్తు జాగరూకత లేనివాడను అయినందున ఇంతకుముందు నోటికి వచ్చినట్లు కారుకూతలాడినందున. నా మనస్సు కలతబారింది. అందువలన ఏమి చేయాలో మనస్సుకు రాక, పిచ్చివాడనై ఉన్నాను.'

**ఆ. 'ఇట్టి నన్ను ననునయించి బోధించితి; । కరుణ పేర్మిఁ జేసి గారవమున**
**నజ్ఞులైన మమ్ము నాపత్పయోనిధి । మునుఁగకుండఁ గాచి తనఘమూర్తి!' 106**

**ప్రతిపదార్థం:** అనఘమూర్తి!= పాపరహిత స్వరూపుడా! కృష్ణా!; ఇట్టి నన్నున్= ఇటువంటి స్థితిలో ఉన్న నన్ను; అనునయించి= మంచిమాటలతో తేర్చి; కరుణ పేర్మిన్+చేసి= అతిశయమైన దయకలిగినవాడవగుటచేత; బోధించితివి= మంచిబుద్ధి కలుగజేశావు; గారవమునన్= అభిమానం చూపుతూ; అజ్ఞులు+ఐన మమ్ముౕన్= తెలియనివారమైన మమ్ము; ఆపద్+పయోనిధిన్= కడగండ్ల మున్నీటిలో; మునుఁగకుండన్; కాచితి(వి)= రక్షించావు.

**తాత్పర్యం:** కలతచెంది ఉన్న నన్ను మంచి మాటలతో తేరుకొనేటట్లు చేసి, దయాపూర్ణమతితో హితాన్ని బోధించావు. అజ్ఞానులమైన మమ్మ ఆపదలనెడి సముద్రంలో మునిగిపోకుండా అభిమానంతో కాపాడావు. కృష్ణా! పుణ్యస్వరూపుడవు నీవు.'

**వ. అనియె, నప్పుడు వివర్ణంబగు వదనంబు వాంచియున్న వాసవిం జూచి, వాసుదేవుండు; 'నీ విట్లు విషణ్ణుండ వగుట గర్జంబుగా; దిమ్మేదినీపతి ముఖప్రసాదం బభినందించి యనుమతి వడసి చని, రాధేయ వధ విహారంబున నితనికిం బ్రియం బాపాదింతుగాక! యింకఁ దడయ నేల?' యని పలికి వెండియు. 107**

**ప్రతిపదార్థం:** అనియెన్= అని పలికాడు; అప్పుడు; వివర్ణంబు+అగు= కళాహీనమై ఉన్న; వదనంబు= ముఖమును; వాంచి ఉన్న= వంచికొని ఉన్న; వాసవిన్= ఇంద్రుడి కొడుకైన అర్జునుడిని; చూచి; వాసుదేవుండు= కృష్ణుడు (ఇట్లా అన్నాడు); నీవు ఇట్లు; విషణ్ణుండవు అగుట= దుఃఖితుడవగుట; కర్జంబుకాదు= తగినపని కాదు; ఈ+మేదినీ పతి= ఈ భూభర్త; ముఖ ప్రసాదంబు= ముఖవికాసాన్ని; అభినందించి= కొనియాడి; అనుమతి పడసి= అంగీకారాన్ని పొంది; చని= యుద్ధానికి పోయి; రాధేయవధ= కర్ణుడిని చంపటం అనే; విహారంబునన్= క్రీడోత్సవంతో; ఇతనికిన్= ధర్మరాజుకు; ప్రియంబు= ప్రీతి; ఆపాదింతు(వు)గాక!= కలుగచేయుదువు గాక!; ఇంకన్= ఇక; తడయన్+ఏల?= ఆలస్యం చేయటం ఎందుకు?; అని పలికి; వెండియున్= మరల.

**తాత్పర్యం:** ధర్మరాజు అట్లా అన్నప్పుడు అర్జునుడు వెలవెలబోయిన ముఖాన్ని వాల్చి ఉన్నాడు. కృష్ణుడు ఆతడిని చూచి 'నీ విట్లా విషాదంతో ఉండటం కార్యం కాదు. ధర్మరాజు ప్రసన్నుడైనాడు. అతడిని అభినందించి, అనుమతిని పొంది, యుద్ధానికి వెడలి, రాధేయుడిని చంపే యుద్ధవీరవిహారాన్ని ప్రదర్శించి అతడికి సంతోషాన్ని కలిగించాలి సుమా! ఇంక ఆలస్యం ఎందుకు?' అని పలికి, ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'ఈతని నొవ్వఁ బల్కుటన, యీ దురవస్థకు వచ్చి తక్కటా!**
**శాతమహాసి నీ నృపతిఁ జంపిన నెట్లగుదో? విపత్తికిం**
**బాతకఘోరవృత్తికిని బాసితి దైవ మనుగ్రహించుటన్;**
**నీ తెలి వాప్తబంధుజన నిర్మిత పుణ్యవిపాక మర్జునా!' 108**

**ప్రతిపదార్థం:** అర్జునా!; ఈతని= ఈయనను (ధర్మజుడిని); నొవ్వన్= బాధపడేటట్లు; పల్కుటను+అ= పలుకటం చేతనే; అక్కటా!= అయ్యో!; ఈ దురవస్థకున్= ఈ దుస్థితికి; వచ్చితి(వి); శాత= మిక్కిలి పదునైన; మహా+అసిన్= పెద్ద ఖడ్గంతో; ఈ నృపతిన్= ఈ రాజును; చంపినన్= చంపినట్లయితే; ఎట్లు+అగుదో?= ఏ గతికి వచ్చి ఉందువో గదా?; విపత్తికిన్= ఆపదలకు; పాతక ఘోర వృత్తికిన్= పాపభూయిష్ఠమైన దారుణమైన ప్రవర్తనకు; దైవము; అనుగ్రహించుటన్= ప్రసాదం చూపుట వలన; పాసితి(వి)= వైదొలగినావు; నీ తెలివి= నీవు చూపిన వివేకం; ఆప్తబంధుజన= నీకు కావలసిన దగ్గరి చుట్టాలచే; నిర్మిత= చేకూర్చబడిన; పుణ్యవిపాకము= సుకృతంయొక్క భాగ్యం.

**తాత్పర్యం:** అర్జునా! ఈ ధర్మరాజు మనస్సు బాధపడేటట్లు మాట్లాడిన మాత్రాననే - అయ్యో! ఇంత దుఃఖస్థితికి వచ్చావే, పదునైన ఖడ్గంతో ఈయనను నీవు చంపి ఉంటే ఏ గతికి వచ్చి ఉందువో గదా! ఆ దేవదేవుడి అనుగ్రహం వలన, రానున్న కడగండ్లు తప్పించుకొన్నావు. ఘోరమైన పాపప్రవర్తనకు దూరమైనావు. ఈ సమయంలో నీవు చూపిన తెలివి నీ మేలుకోరే బంధువులు చేకూర్చి పెట్టిన పుణ్యపరిపక్వతయే సుమా!'

**వ. అనిన, నతండు గన్నీ రొలుక, నన్న పాదంబులపైఁ బడిన; నప్పాండవాగ్రజుండును బాష్పప్లావితముఖుం డగుచు నతనిమీఁద నొఱగె; ని ట్లయ్యిరువురు నొండొరులం బట్టికొని యేడ్చి; రచ్యుతుం డుడుప నుడిగి, తత్కాలోపగత సముచిత పరిజనానీత జలంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి; తదనంతరంబ ధర్మనందనుండు దమ్మునిం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి, చిఱునవ్వుతో 'మనల నింత వఱచునే కర్ణుం?' డని పలికి, మఱియును. 109**

**ప్రతిపదార్థం:** అనినన్; అతండు= అర్జునుడు; కన్నీరు+ఒలుకన్= కన్నీరు జారగా; అన్న పాదంబులపైన్; పడినన్= పడగా; ఆ+పాండవ+అగ్రజుండు= ఆ ధర్మరాజు కూడా; బాష్ప= కన్నీటిచేత; ప్లావిత= తడుపబడిన; ముఖుండు+అగుచున్= ముఖము కలవాడగుచు; అతనిమీఁదన్= అర్జునుడిపై; ఒఱగెన్= వ్రాలినాడు; ఇట్లు; ఆ+ఇరువురున్= ఆ ఇద్దరూ; ఒండొరులన్= ఒకరినొకరు; పట్టుకొని; ఏడ్చిరి; అచ్యుతుండు= కృష్ణుడు; ఉడుపన్= నివారించగా; ఉడిగి= దుఃఖించటం మాని; తత్కాల= అప్పుడు; ఉపగత= దగ్గరకు వచ్చిన; సముచిత= యోగ్యమైన; పరిజన+ఆనీత= సేవకులు కొనితెచ్చిన; జలంబులన్= నీళ్ళతో; ముఖప్రక్షాళనంబు చేసికొనిరి= ముఖం కడుగుకొన్నారు; తదనంతరంబ= ఆ తర్వాత; ధర్మనందనుండు; తమ్మునిన్ కౌఁగిలించుకొని; మూర్ధ= నొసలు; ఆఘ్రాణంబు చేసి= మూచూచి; చిఱునవ్వుతో; కర్ణుండు; మనలన్; ఇంత పఱచునె?= ఇంతగా బాధిస్తాడా?; అని పలికి; మఱియునున్= ఇంకా (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** అనగా, అర్జునుడు కన్నీరు కారుస్తూ అన్న పాదాలమీద పడి నమస్కరించాడు. ఆ ధర్మరాజు కూడా కన్నీరునిండిన ముఖంతో అర్జునుడిమీద ఒరిగి, ఇరువురూ ఒకరినొకరు పట్టుకొని ఏడ్చారు. కృష్ణుడు వారిని ఓదార్చగా శాంతించారు. ఆ సమయానికి అనుగుణంగా పరిచారులు తెచ్చిన నీటితో వారిరువురూ ముఖాలు కడిగికొన్నారు. ఆ తరువాత ధర్మరాజు అర్జునుడిని కౌగిలించుకొని, నెన్నుదురును ఆని, చిరునవ్వుతో 'మనలను కర్ణుడు ఎంత గాసిపరచాడు?' అని పలికి మరల ఇట్లా అన్నాడు:

**విశేషం:** సహజరీతిలో తిక్కన సాగించిన ఈ హావభావాభివర్ణనం నాటకీయం; సహృదయం హృదయాహ్లాదకరం.

**ఆ. 'ఎల్లఁజూడ, సిడము విల్లు నశ్వంబుల । సూతుఁ దునిమి, నన్ను నాతఁ డలవు**
**నెఱయ గెలిచె; నతని నీ విప్డు సంపక । యున్న నాకు బ్రదికి యుండఁ దగునె?' 110**

**ప్రతిపదార్థం:** ఎల్లన్+చూడన్= అందరూ చూడగా; సిడము= ధ్వజం; విల్లు; అశ్వంబులన్; సూతున్= సారథిని; తునిమి= ముక్కలు ముక్కలుగా చేసి; నన్నున్; ఆతఁడు= కర్ణుడు; అలవు నెఱయన్= ఖడ్గయుద్ధ చాతుర్యం ప్రకాశించేటట్లుగా; గెలిచెన్; అతనిన్; నీవు+ఇప్డు; చంపక ఉన్నన్= చంపకుండా ఉంటే; నాకు బ్రతికి యుండన్; తగునె?= ఉచితంగా ఉంటుందా? (జీవించి ఉండటం గౌరవప్రదం కాదనుట).

**తాత్పర్యం:** 'అందరూ చూడగా నా రథధ్వజాన్నీ, విల్లునూ, గుర్రాలనూ, సారథినీ చంపి, కర్ణుడు తన నైపుణ్యం ప్రకాశించగా నన్ను గెలిచాడు; అతడిని నీ విప్పుడు చంపకపోతే నేను బ్రదికి ఉండటం ఉచితమా?'

**చ. అనవుడు, నమ్మహీపతికి నర్జునుఁ డిట్లను; 'నేఁడు కర్ణు నే**
**ననిఁ బడవైతు; నీయడుగు లాన! తదీయ సుహృద్గణంబుతో;**
**విను మటు సేయ కే మగిడి వెల్వెలఁ బాఱెడు మోముతోడు వ**
**త్తునె? యిట కృష్ణసారథియుఁ దూలునె మానవిహీనవృత్తియై?' 111**

**ప్రతిపదార్థం:** అనవుడున్= అని అనగా; ఆ+మహీపతికిన్= ఆ ధర్మరాజుతో; అర్జునుడు; ఇట్లు+అను= ఈ విధంగా అన్నాడు; నేఁడు= ఈ దినం; అనిన్= యుద్ధంలో; కర్ణున్; నేను; నీ అడుగులు+ఆన!= నీ పాదాల సాక్షిగా; తదీయ= అతడియొక్క; సుహృద్= మనసు కలసిన (ఆప్తుల); గణంబుతోన్= వర్గముతోసహా; పడవైతున్= పడగొడతాను; విను; అటు+చేయక; ఏన్= నేను; వెల్వెల+పాఱెడు= తెల్లబోయిన; మోముతోడన్; మగిడి= తిరిగి; వత్తునె?= వస్తానా?; ఇట= ఇక్కడ; కృష్ణ సారథియున్= కృష్ణుడిని సారథిగా గల్గిన ఈ అర్జునుడు; మానవిహీన వృత్తి ఐ= పరువు పోగొట్టుకొన్నవాడి చేష్టలతో, తూలునె?= దుఃఖిస్తూ వైదొలగి ఉంటాడా?

**తాత్పర్యం:** ధర్మజుడి మాటలు విని అర్జునుడు ఇట్లా అన్నాడు: 'ఈ దినం నేను యుద్ధంలో నీ పాదాలసాక్షిగా కర్ణుడిని అతడి మిత్రబృందంతోసహా పడగొట్టుతాను. నీవూ వినుము. అట్లా చేయక వెలవెలపోయే మొగంతో మరలి మీ దగ్గరకు రాను. కృష్ణుడిని సారథిగాగల ఈ పార్థుడు మానహీనుడై తొలగిపోతాడా?

**వ. అని గోపాలదేవు నాలోకించి: 'నీ మనంబునం గర్ణుండు దెగటాఱ వలయు నని యించుక దలంపుము దాన నే నతని వధియింతు' ననిన, నమ్మహాత్ముం 'డట్టి పనికిం జాలుదు!' వని యుత్సాహదీప్తుండై పలుకుటయుఁ,**

**బార్థుండు నిజరథంబు సవిశేషకల్పితంబు సేయించి, రథ్యంబుల జలపాన ఖాద్యఖాదనంబులం బ్రబలంబులఁ గావించి పూన్పించి, యగ్రజు వీడ్కొని గమనోన్ముఖుం డగుటయు, నచ్యుతుం డవ్విభు వీక్షించి 'నీ తమ్మునిం గారుణ్యార్ద్ర కటాక్షంబుల నిరీక్షింపుము; దీవనయిచ్చి పనుపు' మని చెప్పిన, నన్నరవరుండు గిరీటిం దిగిచి బిగియారు కౌఁగిటం జేర్చి, 'నీవు కృష్ణుపనుపునం దగుమాటలాడి; తత్తెఱంగు నేనునుం దెలిసితి; నా యెఱుంగమి నిన్నుం బలికిన పలుకులకు నుమ్మలింపకుమీ' యనుటయు, నతండు వికసితవదనుం డగుచుఁ దత్పాదద్వయంబు ఫాలంబు సోఁకం బ్రణతుం డయిన; నమ్మానవపతి యెత్తి పునఃపునరాలింగనంబు సేసి, 'కర్ణుని గెలువు విజయ! నీకు విజయంబు శాశ్వతం బయ్యెడు' మని దీవించిన నమ్మేటి మగండు నాటోపంబుగా 'దేవ! నిన్ను నొప్పించిన యప్పాపకర్ము మత్కార్ముకముక్త శిలీముఖంబులం బొలిపుచ్చి, యిదె వచ్చెద!' ననుచు నంజలి పుటంబు నిటలంబునఁ గదియించి వీడ్కొనియెఁ; దదనంతరంబ దామోదరుండును నన్నరుండును నరదం బెక్కి, యలరునుల్లంబులతో నరిగి శుభప్రదంబు లగు నిమిత్తంబులకుం బ్రమోదంబు నొందిరి; పదంపడి రాధేయ వధ ప్రకార చింతా క్రాంతుండైన గాండీవి తనువునం బ్రస్వేదకణమ్ములు గ్రమ్మినం గనుంగొని, కమలనాభుం డతని కిట్లనియె: 112**

**ప్రతిపదార్థం:** అని; గోపాలదేవున్= గోపాలునిరూపంలో ఉన్న ఆ దేవదేవుడిని; ఆలోకించి= సాభిప్రాయంగా చూచి; కర్ణుండు; తెగటాఱవలయును+అని= చచ్చిపోవాలని; నీ మనంబునన్; ఇంచుక= కాస్త; తలంపుము; దానన్= ఆ వాంఛా బలంతో; నేను+అతనిన్, వధింతున్, అనినన్; ఆ+మహాత్ముండు= ఆ మహామతి అయిన కృష్ణుడు; అట్టి పనికిన్; చాలుదువు= తగిన సామర్థ్యం కలవాడవౌతావు; అని; ఉత్సాహదీప్తుండు+ఐ= పట్టుదలతో తేజరిల్లినవాడై; పలుకుటయున్= పలికినందున; పార్థుండు; నిజ= తనయొక్క; రథంబు; సవిశేష కల్పితము= కావలసిన హంగులన్నిటితో పూర్తి అయిన దానిగా; చేయించి; రథ్యంబులన్= గుర్రాలను; జలపాన= నీరు త్రాపుటచే; ఖాద్య= తినే గడ్డి మొదలగు వాటియొక్క; ఖాదన= తినిపించుటచేత; ప్రబలంబులన్= చేకూడిన ఉత్సాహం కలవిగా; చేసి; పూన్పించి= రథానికి కట్టించి; అగ్రజున్= అన్నను; వీడ్కొని= సెలవు తీసికొని; గమన+ఉన్ముఖుండు= ప్రయాణానికి సిద్ధమైనవాడుగా; అగుటయున్= కాగా; (పనికి పూనించే ముందు గుర్రాలకు చేయవలసిన ఉపచారాల వర్ణన గ్రామీణవాసికి అలవియగు పనులు. ఇట్టి లోకపు తీరుతెన్నులు - తిక్కన రచనలకు సహజ శోభను కలిగిస్తాయి. కార్యాచరణ సరళిని పొలిపోకుండా చెప్పటం ఈయన ప్రత్యేకత); అచ్యుతుండు; ఆ+విభున్= ఆ రాజును ధర్మజుని; వీక్షించి= చూచి; నీ తమ్మునిన్; కారుణ్యా= దయతో, ఆర్ద్ర= నెమ్మయిన; కటాక్షంబులన్= క్రీగంటి చూపులతో; నిరీక్షింపుము= చూడుము; దీవన ఇచ్చి; పనుపుము= పంపుము; అని చెప్పినన్; ఆ+నరవరుండు= ఆ మానవ శ్రేష్ఠుడు - ధర్మరాజు; కిరీటిన్= అర్జునుడిని; తిగిచి= దగ్గరికి లాగికొని; బిగియారు= గట్టి; కౌఁగిటన్+చేర్చి; నీవు; కృష్ణుని; పనుపునన్= అనుమతితో; తగు మాటలు+ఆడితి(వి)= సమయోచితమైన పలుకులు పలికావు; ఆ+తెఱంగున్= ఆ విధానాన్ని; నేనును; తెలిసి(తిని)= తెలిసికొన్నాను; నా ఎఱుంగమి= నేను గ్రహించకపోవటంవలన; నిన్నున్; పలికిన పలుకులకున్= అన్న మాటలకు; ఉమ్మలింపకుమీ!= నొచ్చుకొనవద్దు; అనుటయున్; అతండు= అర్జునుడు; వికసిత వదనుండు+అగుచున్= సంతోషంతో విప్పారిన ముఖం కలవాడై; తద్+పాదద్వయంబు= ఆయన కాళ్ళు రెండు; ఫాలంబు సోఁకన్= నొసలు తాఁకునట్లు; ప్రణతుండు+అయినన్= బాగుగా వంగి నమస్కరించినవాడు కాగా; ఆ+మానవ పతి; ఎత్తి; పునః పునః= మరల మరలా; ఆలింగనంబు చేసి= కౌగిలించుకొని; కర్ణుని గెలువు(ము); విజయ!= అర్జునా!; (సార్థకనామం అయేటట్లుగా); నీకు; విజయము= గెలుపు; శాశ్వతంబు+అయ్యెడున్= విజయకీర్తి చిరస్థాయి కాగలదు అని; దీవించినన్; ఆ+మేటి మగండు= మొనగాడైన ఆ వీరుడు; ఆటోపంబుగాన్= సంభ్రమంగా; దేవా!; నిన్నున్; నొప్పించిన= కష్టపెట్టిన; ఆ+పాపకర్ము= పాపపు పనులు చేసిన అతడిని; మత్+కార్ముక ముక్త= నా ధనుస్సునుండి వదలిపెట్టబడిన; శిలీముఖంబులన్= బాణాలతో;

పొలివుచ్చి= చంపి; ఇదె వచ్చెదన్= ఇదిగో తిరిగి వస్తా; అనుచున్; అంజలి పుటంబులు= దొప్పగా చేయబడిన దోసిలిని; నిటలంబునన్= నొసట; కదియించి= చేర్చి; వీడ్కొనియెన్= సెలవుతీసికొన్నాడు; తదనంతరంబు+ఎక్కి= రథం ఎక్కి; అలరు= సంతోషంతో నిండిన; ఉల్లములతోన్= మనస్సులతో; అరిగి= పోయి; శుభప్రదంబులు+అగు= మంగళకరమైన, మంచిని సూచించే; నిమిత్తంబులకున్= శకునాలకు; ప్రమోదంబున్+ఒందిరి= సంతోషించారు; పదంపడి= తరువాత; రాధేయ= కర్ణుడి; వధప్రకార= చంపే విధానాన్ని గురించిన; చింతాక్రాంతుండు+ఐన= యోచనతో నిండిన మనస్సు కలవాడైన; గాండీవి= గాండీవమును చేతబట్టిన అర్జునుడియొక్క; తనువునన్= దేహమునందు; ప్రస్వేదకణంబులు= చెమటబొట్లు; క్రమ్మినన్= అలముకొనగా; కనుంగొని= చూచి; కమలనాభుండు= కృష్ణుడు; అతనికిన్= ఆయనతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అని కృష్ణుని చూచి అర్జునుడు 'నీ మనసులో కర్ణుడు చావాలి అని కొద్దిగా సంకల్పించుము. దాని బలంతో నేను అతడిని సంహరిస్తాను' - అన్నాడు. శ్రీకృష్ణుడు 'ఆ పనికి నీవు సమర్థుడవు' అని ఉత్సాహావేశంతో పలికాడు. అర్జునుడు తన రథాన్ని విశేషంగా సిద్ధంచేయించాడు. గుర్రాలకు నీరు త్రావించి, కావలసిన దాణాలు పెట్టించి బలోపేతం చేయించాడు. ధర్మరాజును వీడ్కొని యుద్ధానికి బయలుదేరాడు. అప్పుడు కృష్ణుడు ధర్మరాజును చూచి 'నీ తమ్ముడిని దయార్ద్రమైన చూపులతో చూచి దీవించి పంపు'మన్నాడు. అప్పుడు ధర్మరాజు అర్జునుడిని దగ్గరకు లాగికొని, గట్టిగా కౌగిలించుకొన్నాడు. 'నీవు కృష్ణుడి అనుమతితో సముచితమైన మాటలు పలికావు. దానిని నేను తెలిసికొన్నాను. ఆ సంగతి తెలియక పూర్వం నిన్నన్న మాటలకు మనసులో బాధపడకుము' అని బుజ్జగించాడు. అర్జునుడు ముఖం వికసించగా అన్నగారి పాద పద్మాలకు నెన్నుదురు తాకగా నమస్కరించాడు. అతడిని ఎత్తి ధర్మరాజు కౌగిలించుకొని 'విజయా! నీవు కర్ణుడిని గెలువుము; నీకు విజయనామం శాశ్వతమౌతుంది' అని దీవించాడు. 'ధర్మరాజా! నిన్ను బాధించిన ఆ దుష్టకర్ణుడిని నా బాణాలతో చంపి తిరిగి వస్తాను' అని అంటూ అంజలి ఘటించి సెలవుతీసికొని వెళ్ళాడు. ఆ తరువాత కృష్ణార్జునులు రథమెక్కి, శుభశకునాలను గమనిస్తూ, సంతోషంతో ముందుకు సాగారు. అప్పుడు అర్జునుడు కర్ణుడిని వధించే వ్యూహాన్ని ఆలోచిస్తూండగా అతడికి ముచ్చెమటలు పట్టాయి. దానిని చూచి కృష్ణుడు ఇట్లా అన్నాడు.

**ఆ. 'అమరులకు నజయ్యు లగువారిఁ బెక్కండ్ర । గెలిచి తీవు; నీకుఁ గల యుదాత్త**
**దివ్యబాణములు నుదీర్ణధనుర్వేద । కౌశలంబు బలముఁ గలదె యెందు?'** 113

**ప్రతిపదార్థం:** అమరులకున్= మరణంలేని దేవతలకు; అజయ్యులగు వారిన్= జయించ శక్యంగానివారిని; పెక్కండ్రన్= చాలామందిని; గెలిచితి+ఈవు= నీవు గెలిచావు; నీకున్+కల; ఉదాత్త= గొప్పవైన; దివ్యబాణములున్= దేవతలిచ్చిన అస్త్రములు; ఉదీర్ణ= గొప్ప; ధనుర్వేద కౌశలంబు= విలువిద్య అందలి నేర్పు; బలము= సత్తువ; ఎందున్= ఎక్కడనైనా; ఎవరికైనా, కలదె?= ఉన్నదా?.

**తాత్పర్యం:** దేవతలకే గెలువ నలవిగాని చాలామందిని నీవు ఓడించావు. దీనికి తోడు నీకు గల గొప్ప దివ్యబాణాలు, ధనుర్విద్యాపాటవం ఇంకెవరికైనా ఎక్కడైనా కలవా?

**చ. 'అమరనదీతనూభవుఁడు, నస్త్రగురుండు భవన్మహాస్త్ర ది**
**వ్యమహిమలో నడంగిరి జయద్రథు చా వధికాద్భుతంబు; మ**
**ర్త్యమునన కాదు లోకముల నన్నిట నీ కెదు రెవ్వ? రేల చి**
**త్తమునఁ గలంక? యూఅడుము దర్పము నెక్కెడు నంతకంతకున్.'** 114

**ప్రతిపదార్థం:** అమరనదీ తనూభవుఁడు= గంగాతనయుడైన భీష్ముడు; అస్త్ర గురుండు= అస్త్రవిద్యాగురువైన ద్రోణుడు; భవత్+మహాస్త్ర= నీ యొక్క గొప్ప అస్త్రముల; దివ్యమహిమలోన్= దైవబలోపేతమైన గొప్పదనంతో; అడంగిరి= అణగిపోయారు; జయద్రథుడి; చావు; అధిక+అద్భుతము= అత్యంత ఆశ్చర్యకరమైన విషయం; మర్త్యమునన కాదు= ఈ మానవలోకంలోనే కాదు- లోకములన్నిట; నీకు; ఎదురు+ఎవ్వరు?= ఎదుర్కొనే వారెవ్వరు?; చిత్తమునన్= మనస్సున; కలంక+ఏల?= వ్యాకులపాటు ఎందుకు?; ఊఱడుము= తెప్పరిల్లుము; అంతకంతకున్= పోను పోను; దర్పము= నీ గర్వం; ఎక్కెడున్= పెంపొందుతుంది.

**తాత్పర్యం:** 'భీష్మద్రోణులు నీ బలోపేతమైన ఆయుధప్రయోగ దక్షతలో రూపు లేకుండా పోయారు. ఆ జయద్రథుడి మరణం అత్యంత ఆశ్చర్యకరం. ఈ భూలోకంలోనే గాదు, అన్ని లోకాలలోను నిన్ను ఎదిరించేవారు ఎవ్వరున్నారు? ఇక దిగులుపాటెందుకు? మనస్సు చిక్కబట్టుకొని ఉత్సాహాన్ని పొందుము. పోను పోను నీ శౌర్యం ఎదిగిపోగలదు.'

**క.** **'బలమును శౌర్యముఁ దేజముఁ। గలఁ డని కౌరవులు నమ్మి కర్ణుని నీతోఁ**
**దలపెట్టిరి; నీ బాణం। బులఁ గూలెడు నతఁడు; కీర్తి వొందెదు నిన్నున్.** **115**

**ప్రతిపదార్థం:** బలమును= కండబలం; శౌర్యము= పరాక్రమం; తేజము= ఇవి కలిగించే కాంతిరేఖలు; కలఁడు+అని= కలిగి ఉన్నాడని; కౌరవులు; నమ్మి= ఆ విశ్వాసంతో; నీతోన్; కర్ణుని; తలపెట్టిరి= ఎదుర్కొనటానికి సిద్ధపరచారు; అతఁడు; నీ భాణంబులన్= నీ బాణాలచేత; కూలెడున్= చచ్చి నేలపై పడతాడు; నిన్నున్; కీర్తి; పొందెడున్= పొందుతుంది.

**తాత్పర్యం:** కర్ణుడి బలపరాక్రమాలను, అతడు గడించిన ఖ్యాతిని కౌరవులు బాగా నమ్మి, నీతో తలపడటానికి అతడిని సిద్ధం చేశారు. కాని, నీ బాణాహతికి అతడు కుప్పకూలిపోతాడు. నీకు కీర్తి కలుగుతుంది.

**క.** **కురుపతి యాశలు మాలఁగ। దురమున రాధాతనూజుఁ దునుమాడి, జయ**
**స్ఫురణంబునఁ గృతకృత్యతఁ। బొరయుము, నీవారు మోదమునఁ దేలంగన్.'** **116**

**ప్రతిపదార్థం:** కురుపతి ఆశలు; మాలఁగన్= తుదముట్టగా; దురమునన్= యుద్ధంలో; రాధాతనూజున్= కర్ణుడిని; తునుమాడి= చంపి; జయస్ఫురణంబునన్= జయం ప్రకటితమయ్యేటట్లు; (దీనితో) నీవారు; మోదమునన్= సంతోషంతో; తేలంగన్= తృప్తిపడేటట్లుగా; కృతకృత్యతన్= అనుకొన్నపనిని నెరవేర్చుటతో; పొరయుము= ప్రవర్తిల్లుము.

**తాత్పర్యం:** నీ వారు సంతోషంతో తేలిపోయేటట్లు, దుర్యోధనుని ఆశలు వమ్ము అయ్యేటట్లు యుద్ధంలో కర్ణుడిని తుదముట్టింపుము. విజయము అందరికి తెలిసేటట్లు, అనుకొన్న పనిని సాధించావన్న సంతోషంతో ప్రవర్తించుము.'

**వ.** **అని వెండియు.** **117**

**తాత్పర్యం:** అని ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ.** **'కౌరవసైన్య మగ్గలము గాదె కడున్? భవదీయ సేన క**
**వ్వారణకోటు లా తురగ వర్గము లా రథ సంచయంబు లా**
**వీర భటావళుల్ బహుళ విక్రమకౌతుకి వైన నీ శరా**
**సారములన్ బడల్పడఁ గృశం బగు టిప్పుడు నీకుఁ దోఁప దే?'** **118**

**ప్రతిపదార్థం:** కౌరవ సైన్యము; భవదీయ సేనకున్= నీ సైన్యానికి; కడున్= మిక్కిలి; అగ్గలము కాదె?= అధికమైనది కాదా?; ఆ వారణ, కోటులు= ఆ ఏనుగుల గుంపులు; ఆ, తురగ, వర్గములు= ఆ గుఱ్ఱాల సమూహాలు; ఆ రథ సంచయంబులు= ఆ తేరుల సమూహాలు; ఆ వీర భట+ఆవళుల్= ఆ శూర సైనిక దళాలు; బహుళ విక్రమ= భిన్న భిన్న రీతులైన శౌర్య ప్రదర్శనకు; కౌతుకివి+ఐన= ఉత్సాహం చూపుతున్న; నీ శర+ఆసారమునన్= నీ అమ్ముల జడివానలో; బడల్పడన్= అలసిపోగా; కృశంబు+అగుట= క్షీణించిపోవటం; ఇప్పుడు; నీకున్ తోఁపదే?= నీకు కనపడటం లేదా?

**తాత్పర్యం:** కౌరవుల సేన నీ సైన్యంతో పోలిస్తే చాలా ఎక్కువైనదే కదా! అయినప్పటికిని తెరిపిలేని వానవలె కురిపించే నీ బాణాలతో రథగజ తురగాదులగు ఆ వైరి బలాలను అలయింపజేసి హీనపరచిన ఆ దృశ్యం ఇప్పుడు నీకు గోచరించటం లేదా?'

క. **'కురుసేనలకుం బతియై । సరిత్సుతుఁడు పదిదినములు సమరము సేసెన్;**
**శరమహిమ నతఁడు నీచే । స్థిర శరతల్ప గతుఁ డయ్యె ధీరవిచారా!'** 119

**ప్రతిపదార్థం:** ధీరవిచారా!= ధైర్యం ఆలోచించేవాడా! అర్జునా!; కురుసేనలకున్; పతి ఐ= నాయకుడై; సరిత్+సుతుఁడు= నదీపుత్రుడైన భీష్ముడు; పది దినములు; సమరము చేసెన్= యుద్ధం చేశాడు; శరమహిమన్= నీ బాణశక్తి వలన; అతఁడు= భీష్ముడు; స్థిర= గట్టిదైన; శరతల్పగతుఁడు= బాణాలతో ఏర్పాటైన మంచంమీద ఉన్నవాడుగా; అయ్యెన్= అయినాడు.

**తాత్పర్యం:** భీష్ముడు కౌరవసేనకు అధ్యక్షుడై పదిరోజులు యుద్ధం చేశాడు. చివరకు నీ బాణప్రయోగ ప్రభావంచేత అంపశయ్యమీద పరుండిపోయాడు.

**విశేషం:** ఉ.వి. ప్రతిలోని 'పరిరక్షితుఁడైన సైన్యపాలు మిగిలినే?' అన్న పాఠం కంటె 'స్థిరశరతల్పగతుఁ డయ్యె ధీరవిచారా!' అనే పాఠాంతరమే యోగ్యమైనదని భావించి దానిని పాఠంగా స్వీకరించటమైనది.

చ. **'అతని శిఖండి బాణముల క ట్లెరసేసితి; ద్రోణునిం జమూ**
**పతియుఁగ జేసెఁ గౌరవ నృపాలకుఁ; డగ్గురుఁడున్ భవచ్చమూ**
**పతి నడఁగించెనే దివసపంచక, మమ్మెయిఁ బోరి తావకా**
**ప్రతిహత బాహురక్ష యిరువాఁగును జూడదె పాండవోత్తమా!'** 120

**ప్రతిపదార్థం:** పాండవ+ఉత్తమా!= పాండవులలో శ్రేష్ఠుడవైనవాడా! అర్జునా!; అతనిన్= ఆ భీష్ముడిని; శిఖండి బాణములకున్; అట్లు= ఆ విధంగా; ఎర+చేసితి(వి)= తిండి చేశావు (చంపినావు); కౌరవ నృపాలకుఁడు= కౌరవరాజు దుర్యోధనుడు; ద్రోణునిన్; చమూపతియుఁగన్= సైన్యాధిపతిగా; చేసెన్= చేసెను; ఆ+గురుఁడున్= ఆ గురువు కూడా; భవత్= నీ యొక్క; చమూపతిని= సేనానాయకుడిని; దివస పంచకము= ఐదు దినములు; ఆ+మెయిన్ పోరి= ఆ విధంగా పోరాడి; అడఁగించెనే?= అణచగలిగాడా?; తావక= నీ యొక్క; అప్రతిహత= ఎదుర్కొన సాధ్యంకాని; బాహురక్ష= నీ భుజబలంవలన కలిగిన రక్షణను; ఇరువాఁగును= ఉభయ పక్షాలును; చూడదె?= చూడటం లేదా?

**తాత్పర్యం:** 'పాండవశ్రేష్ఠా! ఆ విధంగా భీష్ముడిని శిఖండి బాణాలకు ఆహారం చేశావు; ఆ తరువాత దుర్యోధనుడు ద్రోణాచార్యుడిని సేనాధిపతిగా నియమించాడు. ఆ గురువు కూడా నీ సైన్యాధిపతి ధృష్టద్యుమ్నుడిని అణచగలిగాడా?

ఇట్లు ఐదుదినాలు యుద్ధం సాగింది. ఆ సమయంలో నీ భుజబలమువలన కలిగిన రక్షణను ఇరుపక్షాలూ గమనించలేదా?'

**క. 'భీముని రణవిహరణ ము। ద్దామం బగు టెల్ల నీదు దర్పంబునఁ గా**
**దే! మాఱు లేని భవద। స్త్రామేయబలంబు దెలియు నంతయు నాకున్.' 121**

**ప్రతిపదార్థం:** భీముని; రణవిహరణము= యుద్ధవిహారం; ఉద్దామంబు+అగుట, ఎల్లన్= భయంకరం కావటం అంతా; నీదు దర్పంబునన్ కాదే!= నీ పరాక్రమం వలననే కదా!; మాఱులేని= తిరుగులేని; భవత్= నీ యొక్క; అస్త్ర+అమేయ బలంబు= అస్త్రాల అపరిమితమైన శక్తి; అంతయున్; నాకున్ తెలియున్= నాకు బాగా తెలుసును.

**తాత్పర్యం:** భీముడు అట్లా వీరవిహారం చేసి భయంకరుడు కావటం అంతా నీపరాక్రమ ప్రభావమే కదా! సాటిలేని నీ అస్త్రశక్తి అంతా నాకు బాగా ఎరుక.

**వ. 'కృపాశ్వత్థామ కృతవర్మ కర్ణశల్యులు నీచేతం బోయెడువారు 'కృపాశ్వత్థామల దెసం గృప సేసితేనియుం జంపక గెలిచి విడువుము; చుట్టం బని యరవాయి గొనుట కర్జంబుగాదు, గృతవర్మను సమయింపుము; శల్యుండు మేనమామ యైనను బగవారిం గూడి పరాక్రమించు చున్నవాఁడు గావున నతని వధించుట పాపం బని తలంపవలదు; కర్ణుండు జతుగృహదాహంబును గపటద్యూతోత్సాహంబును లోనుగాఁ గల దుర్యోధను దుర్నయంబులకు మూలం; బట్లుగాక జూదంబునప్పుడా సభలోన ద్రౌపది నుద్దేశించి యప్పాపాత్ముండు. 122**

**ప్రతిపదార్థం:** కృప; అశ్వత్థామ; కృతవర్మ; కర్ణ; శల్యులు= నీచేతన్; పోయెడువారు= చనిపోతారు; కృప, అశ్వత్థామల; దెసన్= పట్ల; కృపచేసితి+ఏనియున్= దయదలచినట్లయితే; గెలిచి= ఓడించి; చంపక విడువుము= చంపకుండా వదలివేయుము; చుట్టంబు+అని; అరవాయి గొనుట= సంకోచపడుట; కర్జంబు కాదు= కార్యాచరణ విధానం కాదు; కృతవర్మను; సమయింపుము= చంపుము; శల్యుండు (నీకు) మేనమామ; ఐనను= అయినప్పటికి; పగవారిన్+కూడి= శత్రువులతో చేరి; పరాక్రమించుచున్నవాడు; కావునన్; అతనిన్; వధించుట= చంపటం; పాపంబు+అని= పాపమని; తలంపవలదు= అనుకొనవద్దు; కర్ణుండు; జతుగృహ దాహంబునన్= లక్కఇల్లు కాల్చివేయటాన్ని; కపటద్యూత= వంచనతో కూడిన జూదపు ఆట; ఉత్సాహంబును= ప్రోత్సాహపరచటం; లోనుగాన్+కల= మొదలైన; దుర్యోధను= దుర్యోధనుడి; దుర్నయములకున్= చెడ్డపనులకు; మూలంబు= ఆధారభూతుడు; అట్లున్+కాక= అంతేకాకుండా; జూదంబు+అప్పుడు= జూదమాడుతున్నప్పుడు; ఆ సభలోనన్; ద్రౌపదిన్; ఉద్దేశించి= గురించి; ఆ+పాపాత్ముండు= ఆ దుష్టుడు (కర్ణుడు).

**తాత్పర్యం:** 'అర్జునా! నీ చేత కృపాచార్యుడు, అశ్వత్థామా, కృతవర్మా, కర్ణుడూ, శల్యుడూ చావగలరు. నీవు కృపాశ్వత్థామల మీద జాలిచూపితే వారిని చంపకుండా ఓడించి వదలిపెట్టుము. చుట్టమని సందేహించటం కార్యం కాదు. కృతవర్మను చంపుము; శల్యుడు మీకు మేనమామ అయినా శత్రుపక్షాన పరాక్రమిస్తున్నాడు కాబట్టి అతడిని చంపటం పాపంకాదు. ఇక కర్ణుడా - లక్కయింటిని కాల్చటం, మాయాద్యూతానికి ప్రోత్సహించటం మొదలైన, దుర్యోధనుడి చెడ్డపనులన్నింటికి మూలకారకుడు. అంతేకాక జూదపుసభలో ద్రౌపదిని గురించి ఆ పాపాత్ముడైన కర్ణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'లే రిచట మగలు నీకును; । వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్;**
**వారిజలోచన! నీపైc । గూరిమి గలమగని వెదకికొను మొరు' ననcడే! 123**

**ప్రతిపదార్థం:** వారిజలోచన!= తామరలవంటి కన్నులు కలదానా!; నీకును= నీకు; ఇచట; మగలు= భర్తలు; లేరు; వీరు= నీ భర్తలైన పాండవులు; జూదమునన్; ఓడి; నిన్నున్; విడిచిరి= వదలిపెట్టారు; నీపైన్; కూరిమి= ప్రేమ; కలమగనిన్; ఉన్న మగడిని; ఒరున్= ఇంకొకరిని; వెదకికొనుము!= చూచుకొమ్ము; అనcడే= అని అనలేదా?

**తాత్పర్యం:** 'వీరు నిన్ను జూదంలో ఓడిపోయి వదలివేసినారు. ఇక ఇక్కడ నీకు భర్తలు లేరు. పద్మాలవంటి కన్నులు గలదానా, నీపై ప్రీతి, అనురాగం గలిగిన ఇంకొక మగడిని వెతకి చేపట్టుము అని ఆ కర్ణుడు అనలేదా?

**తే. 'ఏను సంధికిc బోయినc దాను ధార్త । రాష్ట్ర మానసములc బగ రాcజc బెట్టి**
**నన్నుc బట్టింపc జూడcడె? యెన్నc డైన । నాదికారణ మతcడ మీయాపదలకు. 124**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; సంధికిన్+పోయిన= రాజీ కుదర్చటానికి రాయబారం పోయినప్పుడు; తాను= రాధేయుడు; ధార్తరాష్ట్ర మానసములన్= ధృతరాష్ట్ర పుత్రుల మనస్సులలో; పగ= పగను; రాcజన్+పెట్టి= మండేటట్లు చేసి; నన్నున్; పట్టింపన్= బంధించేటట్లు; చూడcడె?= ప్రయత్నించలేదా?; ఎన్నcడైనన్= ఎప్పుడైనా గాని; మీ ఆపదలకున్; అతcడు= ఆ కర్ణుడే; ఆదికారణము= మూలకారణం.

**తాత్పర్యం:** నేను సంధికొరకు వారి ఆస్థానానికి పోయినప్పుడు, ధృతరాష్ట్రుడి పుత్రుల హృదయాలలో పగ రగుల్కొల్పి నన్ను బంధించటానికి కూడా అతడు ప్రయత్నించలేదా? ఏ కష్టం మీకు సంభవించినా దానికి మూలకారణం ఆ కర్ణుడే.

**చ. వినుము! సుభద్ర పట్టి బలు విల్ మును వంచన వాcడు డాసి త్రుం**
**చిన, మఱి కాదె యందఱును జేరి వధించుట? యా పరాభవం**
**బనలము పోలె నున్నది యహర్నిశముం బరితాపకారి యై**
**మనమున నస్త్రవృష్టి నది మాన్పుము, బంధులు మోద మందcగన్. 125**

**ప్రతిపదార్థం:** వినుము; మును= పూర్వం; వంచనన్= మోసంతో; వాcడు= ఆ కర్ణుడు; డాసి= సమీపించి; సుభద్ర పట్టి= అభిమన్యుడి; బలువిల్= శక్తిమంతమైన ధనువును; త్రుంచినన్= విరుగగొట్టినందున; మఱి కాదె= అందువలనే కదా; అందఱును చేరి= అందఱును చుట్టిముట్టి; వధించుట= చంపటం (జరిగింది?); ఆ పరాభవంబు= ఆ అవమానం; మనమునన్= మనస్సులో; అహర్నిశమున్= పగలు రాత్రులు; అనలము+అ పోలెన్= నిప్పు మాదిరిగా; పరితాపకారి ఐ= వ్యథను కలిగిస్తున్నదై; ఉన్నది= రేగుతున్నది; అస్త్ర వృష్టిన్= బాణాలనే వానతో; అది= దానిని; బంధులు= చుట్టాలు; మోదము+అందcగన్= సంతోషించేటట్లు; మాన్పుము= ఆర్పివేయుము.

**తాత్పర్యం:** 'ఇది బాగా వినుము. వంచనతో ఈ కర్ణుడు దొంగచాటుగా ఆ అభిమన్యుని పద్మవ్యూహారంభంలో సమీపించి ఆయన శక్తిమంతమైన ధనుస్సును విరగ్గొట్టినందువలననేకదా - అందరూ ఆయనచుట్టూ మూగి చంపగలిగారు! ఆ అవమానం మనస్సులో చేరి ఎడతెరిపి లేకుండా ఆరని నిప్పువలె నొప్పిస్తున్నది. ఇక చుట్టాలు సంతోషించేటట్లు ఆ అగ్నిని బాణాలనే వానతో ఆర్పివేయుము.

**విశేషం:** అలంకారం: ఉపమా, రూపకములు.

**క. 'ఆ సభ నా దుష్టాత్ముఁడు । సేసిన దుర్నయము సూచి, చిత్తమునఁ గడున్**
**నోసిన బంధులు వానిని । గాసిగ గ్రద్దగమి దొలువఁ గనుఁగొని వలదే!' 126**

**ప్రతిపదార్థం:** ఆ సభన్; ఆ దుష్టాత్ముఁడు= దుష్టబుద్ధిగల కర్ణుడు; చేసిన; దుర్నయము= అన్యాయాన్ని; చూచి= గమనించి; చిత్తమునన్= మనస్సులో; కడున్= మిక్కిలి; నోసినన్ బంధులు= నొచ్చిన చుట్టాలు; వానినిన్; గ్రద్దగమి= గ్రద్దల గుంపు; గాసిగన్= బాధపడేటట్లు; తొలువన్= చీల్చివేయటం; కనుఁగొన వలదే!= చూడాలిగదా!

**తాత్పర్యం:** ఆ సభలో ఆ పాపాత్ముడైన కర్ణుడు చేసిన దుశ్చేష్టలను చూచి ఆప్తబంధువులు మనస్సులో చాలా బాధపడ్డారు. వాళ్ళంతా వాడి దేహాన్ని గ్రద్దలగుంపు చుట్టుమూగి వాటి పదునైన ముక్కులతో చీల్చి ముక్కలు చేయటం చూడాలి గదా! (కసిదీరే మాటలు)

**వ. 'వాఁడు వడినం దక్కటి రాజులుం గౌరవులు నీకు మొనకట్ట' రని చెప్పి; నిట్లు సెప్పుచు, సమర స్థలంబున కనతి దూరంబుగాఁ జని యట్టెత్తి చూచి, కర్ణుండు సంగరంబు సేయు సంరంభం బుగ్గడించి, యగ్గాండీవికిం జూపి పుండరీకాక్షుండు వెండియు. 127**

**ప్రతిపదార్థం:** వాఁడు= ఆ కర్ణుడు; పడినన్= చనిపోగానే; తక్కటి రాజులు= మిగిలి ఉన్న ఇతర రాజులు; కౌరవులు; నీకున్; మొన కట్టరు= (సైన్యాలను సమకూర్చుకొని, వ్యూహాలుపన్ని నిన్ను ఎదుర్కొనేందుకు) ఉత్సహించరు; అని చెప్పెన్= అని కృష్ణుడు (అర్జునుడితో) చెప్పాడు; ఇట్లు చెప్పుచున్= ఈ విధంగా చెప్పుతూ; సమర స్థలంబునకున్= యుద్ధభూమికి; అనతి దూరంబుగాన్= కొంత దూరంగా; చని; అట్టు+ఎత్తి చూచి= మెడ (తల) ఎత్తి చూచి; కర్ణుండు; సంగరంబు చేయు= యుద్ధం చేస్తున్న; సంరంభంబు= ఆటోపాన్ని; ఉగ్గడించి= ఎరిగించి; ఆ+గాండీవికిన్ చూపి= ఆ అర్జునుడికి చూపి; పుండరీకాక్షుండు= తెల్లతామరలవంటి కన్నులుగల కృష్ణుడు; వెండియున్= ఇంకను (అన్నాడు).

**తాత్పర్యం:** కర్ణుడు మరణిస్తే మిగిలినరాజులూ, కౌరవులూ ఉత్సాహంతో నీ కెదురుగా వ్యూహం పన్ని నిలువలేరు'. అని ఇట్లా చెప్పుతూ యుద్ధస్థలానికి కొద్ది దూరంగా చేరి, మెడలు సాచి చూచి, కర్ణుడు యుద్ధంచేసే ఆటోపాన్ని గురించి చెప్పి, అర్జునుడికి చూపి, కృష్ణుడు ఇంకా ఇట్లా అన్నాడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'కేతనము రథముఁ దురగ । వ్రాతముఁ బొడిచేసి, నీ శరంబులఁ గర్ణున్**
**వే తునిమినఁ గని, శల్యుఁడు । వాతెఱ యెండంగఁ బాఱవలదె కిరీటీ! 128**

**ప్రతిపదార్థం:** కిరీటీ!= అర్జునా!; నీ శరంబులన్= నీ బాణాలచేత (కర్ణుని); కేతనము= టెక్కెం; రథము; తురగ వ్రాతమున్= గుఱ్ఱాలగుంపును; పొడి చేసి= నామరూపాలు లేకుండా దుమ్ము చేసి; కర్ణున్+వే= కర్ణుడిని త్వరగా; తునిమినన్= ముక్కలు ముక్కలుగా చేసి చంపివేయగా; కని= చూచి; శల్యుఁడు= కర్ణుడి సారథియైన శల్యుడు; వాతెఱ= పెదవులు; ఎండంగన్= ఎండిపోగా; పాఱవలదె!= పరుగెత్తిపోవాలిగదా!

**తాత్పర్యం:** నీ బాణాలతో ధ్వజాన్నీ, తేరునూ, గుఱ్ఱాలసమూహాన్ని నుగ్గునుగ్గు చేసి, వెంటనే ఆ కర్ణుడిని ముక్కలుగా చేయటం చూచి, సారథి శల్యుడు తన పెదవుల తడి ఆరిపోగా పరుగెత్తిపోవాలిగదా!

**వ. పూనిక నెఱపి, శోకం బుజ్జగించి, లోకంబు సంస్తుతింప సుఖివి గ'మ్మనినం బ్రముదిత హృదయుండై.' 129**

**ప్రతిపదార్థం:** పూనికన్= పట్టుదలను; నెఱపి= సాగించి; శోకంబు; ఉజ్జగించి= పోద్రోసి; లోకంబు= ప్రపంచం; సంస్తుతింపన్= కొనియాడగా; సుఖివి కమ్ము; అనినన్= అని కృష్ణుడనగా; ప్రముదిత= సంతోషించిన; హృదయుండు+ఐ= మనస్సు కలవాడై.

**తాత్పర్యం:** ప్రయత్నించి శోకంమాని, లోకం కీర్తించేటట్లు సుఖివి కమ్ము' అని కృష్ణుడు అనగా అర్జునుడు సంతసించిన మనస్సుతో (ఇట్లా అన్నాడు).

**శా. 'నీ తోడ్పాటున నేఁ ద్రివిష్టపముల న్గెల్వంగ నూఁకింతు; నా**
**చేతం గర్ణుఁడు రూపు మాలి చను; మెచ్చింతున్; ననుం జూడుమీ**
**దైతేయాంతక!' యంచు శేషనిభ హస్తం బుద్ధతిం జాఁచి, ని**
**ర్ధూతారాతిబలుండు పుచ్చికొనియెన్ దుర్దాంత కోదండమున్. 130**

**ప్రతిపదార్థం:** దైతేయ+అంతక!= రాక్షసులను సంహరించేవాడా - కృష్ణా!; నీ తోడ్పాటునన్= నీ సహాయంతో; ఏన్= నేను; త్రివిష్టపములన్= మూడులోకాలను; గెల్వంగన్; ఊఁకింతు= ప్రయత్నిస్తాను; నాచేతన్; కర్ణుఁడు; రూపుమాలి= ఆకారం చెడి; చనున్= పోవును; మెచ్చింతున్= మెప్పిస్తాను; ననున్= నన్ను; చూడుమీ; అంచున్= అంటూ; శేషనిభ= ఆదిశేషుడివంటి; హస్తంబు= చేతిని; ఉద్ధతిన్= గర్వంతో; చాచి; నిర్ధూత= అణచివేయబడిన; అరాతిబలుండు= శత్రువుల బలం కలవాడు; దుర్దాంత= అజేయమైన; కోదండమున్= ధనువును; పుచ్చికొనియెన్= చేపట్టాడు.

**తాత్పర్యం:** రాక్షససంహారా! నీ ఆదర సహకారాలతో మూడు లోకాలను జయించేందుకు ఉత్సాహపడుతున్నాను; మీ ప్రశంసలకు పాత్రమయ్యేటట్లు ఆ కర్ణుడు ఆకారమే లేకుండా పోతాడు. ఇదిగో! శౌర్యదీప్తంగా ఉండే నన్ను బాగా చూడుము' అంటూ తన బలంతో శత్రువులను రూపుమాపిన ఆ గాండీవి అపజయమెరుగని తన ధనుస్సును చేత పట్టుకొన్నాడు.

### అర్జునుఁడు కృష్ణుని వాక్యంబులచేఁ గర్ణుని వధ కుత్సహించుట (సం. 8-52-11)

**వ. ఇట్లు గాండీవం బెత్తి యెక్కువెట్టి, యన్నరుండు 'నేఁడు నా బాణంబులు బాణాసనంబును నరదంబునుం జూచి సుయోధనుండు శకునిచేతి యడ్డసాళ్ళును పలకయు నమ్మండపంబును దలంపవలయుఁ; దన నమ్మిన బంటైన కర్ణుండు నే నేయు తూపుల తాఁకున రూ పడంగినం గని, యవ్వెంగలి దాను విదురుబుద్ధి వినమికి వగం బొందవలయు; ధృతరాష్ట్రుండు దనకుం గార్యదర్శనంబు లేమి యుగ్గడించి తన్నుం దాన నిందించుకొనవలయు; నతండు గొడుకుల దెసను వారు రాజ్యంబుదెసను విగతాశులు గావలయు' నని పలికి, మఱియును. 131**

**ప్రతిపదార్థం:** ఇట్లు; గాండీవంబు; ఎత్తి= ఎత్తుకొని; ఎక్కుపెట్టి= నారి మొదలగువాటిని సిద్ధంచేసి; ఆ+నరుండు= ఆ అర్జునుడు (అన్నాడు); నేఁడు; నా బాణంబులు; నా బాణాసనంబును= విల్లును; అరదంబును= తేరును; సుయోధనుండు= దుర్యోధనుడు; చూచి; శకునిచేతి= శకుని చేతిలోని; అడ్డసాళ్ళను= పాచికలను; పలుకయున్= చదరంగపు చెక్కను; ఆ మండపంబును= జూదమాడిన వేదికను; తలంప వలయున్= తలచుకొనాలి; తన నమ్మిన బంటైన= తనకు విశ్వాసపాత్రుడైన

సేవకుడైన కర్ణుడు; నేన్= నేను; ఏయు తూపుల= వదలే బాణాలయొక్క; తాఁకునన్= తాకిడిచేత; రూపడంగినన్= రూపు మాసిపోగా; కని= చూచి; ఆ+వెంగలి= ఆ వెర్రివాడు; తాను; విదురుబుద్ధిన్= విదురుడు చెప్పిన హితమును; వినమికిన్= వినకపోయినందుకు; వగన్ పొందవలయున్= దుఃఖించాలి; ధృతరాష్ట్రుండు; తనకు; కార్యదర్శనంబు= జరిగే విషయాలను చూడగలగటం; లేమి= లేకపోవటం; ఉగ్గడించి= తెలియజేసి; తన్నున్, తాను= తనను తాను; నిందించుకొనవలయున్; అతండు= ధృతరాష్ట్రుడు; కొడుకుల దెసను= కొడుకుల పట్ల; వారు; రాజ్యంబు దెసను= రాజ్య విషయంలోను; విగత+ ఆశులు= కోల్పోయిన ఆశలు కలవారు కావలయున్; అని పలికి; మఱియును.

**తాత్పర్యం:** ఈ విధంగా గాండీవాన్ని ఎత్తి, ఎక్కుపెట్టి అర్జునుడు ఇట్లా అన్నాడు: 'ఈనాడు నా బాణాలను, విల్లును, రథాన్ని చూచి, దుర్యోధనుడు శకునిచేతిలోని పాచికలను, పలకను, ఆ జూదమాడిన మంటపాన్నీ గుర్తుచేసుకోవాలి. తనకు నమ్మినబంటైన కర్ణుడు నా బాణాలకు చనిపోగా చూచి, ఆ వెర్రివాడు విదురనీతి విననందుకు దుఃఖించాలి. ధృతరాష్ట్రుడు తనకు ముందుచూపు లేదని వాపోయి తనను తాను నిందించుకోనాలి. ధృతరాష్ట్రుడు కొడుకులమీద ఆశలను, కౌరవులు రాజ్యంమీది ఆశలను వదలుకొనాలి' అని, మరల (ఈ విధంగా పలికాడు).

**ఆ. 'రాజరాజుఁ బాసి రాజ్యసంపద ధర్మ । తనయుఁ జేరుపెంపు దారు దెలియఁ**
**గాంచి, సాత్యకియును గవలును భీముండు । గారవించువారు గాక నన్ను.' 132**

**ప్రతిపదార్థం:** రాజ్యసంపద= రాజ్యలక్ష్మి; రాజరాజున్= దుర్యోధనుడిని; పాసి= వదలి; ధర్మతనయున్; చేరుపెంపు= చేరగా కలిగిన అతిశయాన్ని; తారు= తాము; తెలియన్+కాంచి= తెలిసేటట్లు చూచి; సాత్యకియును; కవలును= నకుల సహదేవులు; భీముండు; నన్నున్; గారవించువారుగాక!= గౌరవించేవారు అగుదురుగాక!

**తాత్పర్యం:** రాజరాజును రాజ్యసౌభాగ్యం విడిచిపెట్టి ధర్మరాజును చేరి, ఆయన ఉన్నతిని అతిశయింపజేయగా చూచి, సాత్యకీ, నకుల సహదేవులూ, భీముడూ నన్ను ఇంకా ఎక్కువగా గౌరవిస్తారు.

**క. 'సుర గరుడోరగ విద్యా । ధరాది భూతములు సూతతనయుని నేఁ డేఁ**
**బొరి పుచ్చిన ననుఁ బొగడుచు । నరుగుంగా కునికిపట్ల కంబుజనాభా!' 133**

**ప్రతిపదార్థం:** అంబుజనాభా!= కృష్ణా!; సుర; గరుడ; ఉరగ; విద్యాధర; ఆది= మొదలగు; భూతములు= దైవాంశతో పుట్టినవారు; సూతతనయునిన్= కర్ణుడిని; నేఁడు; ఏన్= నేను; పొరిపుచ్చఁగన్= చంపగా; ననున్; పొగడుచున్= అభినందిస్తూ; ఉనికి పట్లకున్= తమ తమ నివాసాలకు; అరుగున్ గాక= పోదురుగాక.

**తాత్పర్యం:** పంకజనాభా! కర్ణుడిని ఈ దినం నేను చంపివేయగా చూచి, వివిధ దేవగణాలు నన్ను కొనియాడుతూ తమతమ స్థానాలకు మరలిపోవుదురు గాక!

**వ. అని యిట్లు సల్లాపంబు సేయుచుం, గృష్ణార్జునులు; నిజ సేనఁ జేరి; రంతకు మున్న యిరువాఁగునం జేయంగల దొరలు దలపడినం బోరు ఘోరం బయ్యెఁ; నందు. 134**

**ప్రతిపదార్థం:** అని; కృష్ణార్జునులు; ఇట్లు= ఈ రీతిగా; సల్లాపంబు= పరస్పర మధుర సంభాషణ; చేయుచున్; నిజసేనన్= తమ సైన్యాన్ని; చేరిరి; అంతకుమున్న= దానికి ముందే; ఇరువాఁగునన్= ఉభయ సైన్యాలలో; చేయంగల దొరలు= సమర్థులైన నాయకులు; తలపడినన్= ఎదుర్కొనగా; పోరు= యుద్ధం; ఘోరంబు+అయ్యెన్= దారుణరూపం తాల్చింది; అందున్= ఆ యుద్ధంలో.

**తాత్పర్యం:** ఈ విధంగా కృష్ణార్జునులు మాట్లాడుకొంటూ తమ సేనను సమీపించారు. అంతకు ముందే రెండువైపుల వారిలో వీరులైన దొరలు పరస్పరం యుద్ధానికి పూనుకొనగా పోరు భయంకరంగా సాగుతూ ఉన్నది. అందులో. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. కర్ణుసూనులలో నొకం డుత్తమౌజుని చేతఁ । జచ్చుటయు, శోకాతురుండుఁ**
**గ్రోధదీప్తుండు నగుచుఁ గర్ణుఁ డాతని । తురగ కేతనములఁ దునుము నాతఁ**
**డడిదంబు సేకొని యరదంబు డిగి కృపా । చార్యు రథ్యంబులఁ జంపి భీష్మ**
**వైరి తేరెక్కఁ నాశారద్వతుం డట్లు । విరథుఁ డయ్యును బలువిడిఁ గడంగ**

**ఆ. నతఁడు పాదచారి యని యా శిఖండి య । వ్విప్రు నేయఁ డయ్యె; వేగ మెయ్ది**
**ద్రౌణి యతనిఁ దన రథంబుపై నిడికొని । యనికిఁ దొలఁగి చనియె మనుజనాథ!** 135

**ప్రతిపదార్థం:** మనుజనాథ!= ప్రభూ!; కర్ణ సూనులలోన్= కర్ణుడి కుమారులలో; ఒకండు; ఉత్తమౌజుని చేతన్; చచ్చుటయును; కర్ణుఁడు; శోక+ఆతురుండు= దుఃఖంతో ఉద్విగ్నుడై; క్రోధ= పగసాధింపుబుద్ధితో; దీప్తుండు= వెలుగుతున్నవాడు; అగుచున్; ఆతని; తురగ కేతనములన్= గుర్రాలను, టెక్కెములను; తునుమన్= ఖండించగా; ఆతఁడు= ఆ ఉత్తమౌజుడు; అడిదంబు= ఖడ్గాన్ని; చేకొని= చేబూని; అరదంబు డిగి= తేరు దిగి; కృపాచార్యుడి; రథ్యంబులన్= గుర్రాలను; చంపి; భీష్మవైరి= శిఖండి; తేరు ఎక్కన్; ఆ శారద్వతుండు= ఆ కృపుడు; అట్లు; విరథుండు+అయ్యును= తేరు లేక పాదచారి అయి కూడ; బలువిడిన్= వేగంగా; కడంగన్= (యుద్ధానికి) పూనుకోగా; అతఁడు; పాదచారి అని= కాలినడక ఉన్నవాడని; ఆ శిఖండి; ఆవిప్రున్= ఆ బ్రాహ్మణుడిని, కృపుడిని; ఏయఁడు+అయ్యెన్= దెబ్బవేయడయ్యె; వేగము= త్వర; ఎయ్ది= పొంది; ద్రౌణి= ద్రోణుడి కుమారుడు - అశ్వత్థామ; అతనిన్= అతడిని; తన రథంబుపైన్= తన తేరుమీద; ఇడికొని= ఎక్కించుకొని; అనికిన్= యుద్ధంనుండి; తొలఁగి చనియెన్= వైదొలగిపోయాడు.

**తాత్పర్యం:** కర్ణుడి కుమారులలో ఒకడు ఉత్తమౌజుడి చేతిలో చచ్చాడు. అందుకు అతడు శోకం పొందినా, వెంటనే క్రోధాతిశయంతో అతడి గుర్రాలనూ, టెక్కాన్నీ నరికివేశాడు. ఉత్తమౌజుడు కత్తి చేపట్టి, రథం దిగి నడుస్తూ కృపాచార్యుడి రథపు గుర్రాలను చంపాడు. ఆ పైన శిఖండియొక్క రథాన్ని ఎక్కాడు. కృపాచార్యుడు విరథుడై కూడ, వేగంగా నడుస్తూ యుద్ధానికి పూనుకోగా, అతడు పాదచారి అని, శిఖండి అతడిని బాణాలతో కొట్టలేదు. అప్పుడు అశ్వత్థామ కృపాచార్యుడిని తన రథంమీద కెక్కించుకొని రణరంగంనుండి తొలగిపోయాడు.

**వ. అట్టియెడ.** 136

**తాత్పర్యం:** ఆ సయమంలో. (తరువాతి పద్యంతో అన్వయం.)

**చ. అనిలసుతుండు తీవ్రవిశిఖాంశులు పర్వఁగ నేచి, యంబరం**
**బు నడుమఁ దేజరిల్లు రవిఁ బోలెడు వేఁడిమి కోహటించి నీ**
**మొన దెరలంగ, నా రథికముఖ్యుఁడు పార్థుఁ దలంచి సారథిం**
**గనుఁగొని, మానసంబు దలఁకం బ్రధనోగ్రత దక్కి యిట్లనున్. 137**

**ప్రతిపదార్థం:** అనిల సుతుండు= వాయునందనుడు- భీముడు; తీవ్ర= పదునైన; విశిఖ+అంశులు= బాణకాంతులు; పర్వఁగన్= వ్యాపించేటట్లు; ఏచి= అతిశయించి; అంబరంబు, నడుమన్= ఆకాశమధ్యాన; తేజరిల్లు= ప్రకాశించే; రవిన్= సూర్యుడిని; పోలెడు= పోలునట్టి; వేఁడిమికిన్= తాపానికి; ఓహటించి= భయపడి వెనుదీసి; నీమొన= నీ సైన్యం; తెరలంగన్= తొలగిపోగా (ఇది సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పినట్లు); ఆ రథికముఖ్యుఁడు= ఆ రథమునెక్కి యుద్ధం చేసేవారిలో ప్రధానుడు- భీముడు; పార్థున్ తలంచి; సారథిన్= సారథిని; కనుఁగొని= చూచి; మానసంబు; తలఁకన్= చలించగా; ప్రధన+ ఉగ్రతన్= యుద్ధతీవ్రతను; తక్కి= విడనాడి; ఇట్లు+అనున్= సారథితో ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీముడు మట్టమధ్యాహ్నపు సూర్యుడి వేడిమివలె నిశితమైన బాణకాంతులు వ్యాపించేటట్లు చేయగా, ఆ వేడికి తట్టుకొనలేక నీ సైన్యం (కౌరవబలం) భయపడి రణరంగంనుండి తొలగిపోయింది. భీముడికి వెంటనే అర్జునుడి సంగతి గుర్తుకు వచ్చింది. దీనితో అతడి మనస్సు చలించింది. తోడనే యుద్ధతీవ్రతను తగ్గించి, తన రథసారథి అయిన విశోకుడితో ఇట్లా అన్నాడు:

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. 'నరుఁ డన్నవర్తనము తెఱఁ । గరయుటకై మది గలంగ నట చనినాఁ; డ**
**న్నరపతి దుర్దశ గని దు । స్తరశోకం బడరి, తానుఁ దదవస్థుఁ డగున్.' 138**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; అన్న వర్తనము= అన్న నడవడి; తెఱఁగు= విధం; అరయుటకై= తెలిసికొనుటకై; మది కలంగన్= మనస్సు కలవరపడగా; అట చనినాఁడు= అక్కడికి పోయాడు; ఆ+నరపతి= ఆ ధర్మరాజు; దుర్దశ కని= అభాగ్యస్థితిని చూచి; దుస్తర శోకంబు= భరింపరాని దుఃఖాన్ని; అడరి= పొంది; తాను= తానుగూడ; తదవస్థుఁడు= అదే స్థితి కలవాడు; అగున్= అగును.

**తాత్పర్యం:** అర్జునుడు అన్నప్రవర్తన మెట్లున్నదో తెలిసికొనాలన్న తలంపుతో మనస్సు బాధపడగా, ఆయన దగ్గరకు పోయాడు. అక్కడ ఆ రాజు దుస్థితిని చూచి, తాను కూడా అదే స్థితిలో పడినాడేమో!'

**తే. అయ్యిరువురకు నొకటి యైనట్టిదైన । మనము, కౌరవసంఘంబు మ్రగ్గఁ జేసి**
**గెలుపుగొంటిమి యేనియు, ఫలము దాన । నేమి గల దనువగఁ జిత్త మెరియఁ జొచ్చె.' 139**

**ప్రతిపదార్థం:** ఆ+ఇరువురకున్= ఆ ఇద్దరికి; ఒకటి ఐనట్టిదైన= ఏదైనా కీడు కలిగితే; మనము; కౌరవ సంఘంబు; మ్రగ్గన్+ చేసి= రూపులేకుండా చేసి; గెలుపు గొంటిమి= విజయము సాధించినాము; ఏనియున్= అయినప్పటికి; దానన్= దానివలన ఫలం; ఏమి కలదు+అను= ప్రయోజనం ఏమి ఉన్నదనే; వగ= పరితాపం; చిత్తమున్= మనస్సును; ఎరియన్+చొచ్చెన్= కాల్చివేస్తోంది.

**తాత్పర్యం:** ఆ ఇద్దరికీ ఏదైనా కీడు మూడితే మనం కౌరవ సైన్యసమూహాలను నాశనం చేయగలిగినప్పటికీ దానివలన మనకేమి ప్రయోజనం కలగబోతుంది? అన్న ఆవేదన నా మనస్సును దహించివేస్తున్నది!

**భీముఁ డర్జును రాక గోరి విశోకునితో విచారించుట (సం. 8-54-11)**

**క. 'ఐనను నిప్పటిదుఃఖము । మానింపఁగ మనకు నొండు మం దెయ్యది? యీ**
**సేనల దొరలను గౌరవ । భూనాథుని సమయఁ జూచి పోవుట దక్కన్?' 140**

**ప్రతిపదార్థం:** ఐనను= అయినప్పటికి; ఇప్పటి దుఃఖమును= ఇప్పటి మనోవ్యధను; మానింపంగన్= మాన్పటానికి; మనకున్; ఈ సేనల దొరలను= ఈ కౌరవసేనలను, వీరులను; కౌరవ భూనాథుని= దుర్యోధనుని; సమయన్+చూచి= చంపి చూచి; పోవుట; తక్కన్= తప్ప; ఒండు= వేరొక; మందు+ఎయ్యది?= మందేమున్నది?.

**తాత్పర్యం:** అయినప్పటికిని, ఇప్పుడు మన దుఃఖం పోవటానికి వేరే మందేమున్నది? ఉంటే ఒక్కటే. అది, మన విరోధి సేనలను, వీరులను, దుర్యోధనుని చంపిపోవటం.

**వ. అని పలికి, యవ్విశోకునకు మనదిక్కు సిడంబులు సూపి, 'యవి యెవ్వరెవ్వరి చిహ్నంబు లేర్పడం జూచికొనుము; మన శరంబుల కొలంది యెట్లున్న దరయు' మనవుడు, నతండు 'వీ రెవ్వరైననేమి? నీ వలిగినఁ బడక పాఱక నిలువం జాలు వాఁ డిం దెవ్వం? డస్త్ర శస్త్రంబుల సంపద యడుగవలదు; నేఁడు దెచ్చినవానిలోన నా ఱెడ్లు వ్రేఁగుపడి పూనివచ్చు బండియొక్కటి యించుకయు వెలితిగాక యున్నయది! గాకున్న నేమి? భవద్బాహుదండంబునకు మూలధనంబైన గదాదండం బెల్లపనులకుం జాలు' నని చెప్పిన బవమానసూతి యాసూతు చేసేత నప్పళించి. 141**

**ప్రతిపదార్థం:** అని పలికి; ఆ+విశోకునకున్= ఆ విశోకుడికి; మన దిక్కు= మనవైపు; సిడంబులు= కేతనములను; చూపి; అవి; ఎవ్వరెవ్వరి; చిహ్నంబులో= గుర్తులో; ఏర్పడన్= నిర్ణయమయ్యేటట్లు; చూచికొనుము; మన; శరంబుల= బాణాల; కొలంది= సామర్థ్యం; ఎట్లున్నది; అరయుము= తెలిసికొనుము; అనవుడు= అనగా; అతండు= ఆ సారథి; వీ రెవ్వరైన ఏమి?; నీవు; అలిగినన్= కోపగించుకొంటే; పడక= చచ్చిపడకుండా; పాఱక= పరుగెత్తిపోకుండా; నిలువన్+చాలు= నిలువగలిగిన వాడు; ఇందున్; ఎవ్వండు?; అస్త్రశస్త్రంబుల; సంపద= సమృద్ధి; అడుగ వలదు= అడుగవలసిన పనే లేదు; నేఁడు తెచ్చినవానిలోనన్; ఆ ఱెడ్లు= మూడు జతల ఎద్దులు; వ్రేఁగుపడి= కష్టపడి; పూనివచ్చు= కాడెలకు కట్టి లాగుకొని వచ్చిన; బండి ఒక్కటి; ఇంచుకయున్= రవ్వంతగూడ; వెలితిగాక ఉన్నది= కొరవడక ఉన్నది; కాకున్నన్ ఏమి?= అట్లా కాకపోయినంత మాత్రాన కొరత ఏమీ లేదు; భవత్= నీ; బాహుదండంబునకున్= కొయ్యగడలవంటి చేతులకు; మూలధనంబు+ఐన= పెట్టుబడి అయిన; గదాదండంబు= గద; ఎల్లపనులకున్; చాలును= సమర్థమై ఉన్నది; అని చెప్పినన్; పవనసూతి= భీముడు; ఆ సూతు= ఆ సారథి; చే చేతన్+అప్పళించి= చేయి చేయితో కలిపి చరచి (అన్నాడు).

**తాత్పర్యం:** భీము డా విధంగా పలికి సారథి అయిన విశోకుడికి కౌరవసైన్యంలోని టెక్కాలను చూపి 'అవి ఎవరెవరి గుర్తులో గుర్తించుము, మన బాణాల సంపద ఎంత ఉన్నదో గమనించుము' అన్నాడు. అప్పు డా సారథి, 'శత్రువీరులెవరైనా సరే, నీవు కోపగిస్తే వారు చావటమో, పారిపోవటమో చేయక తప్పదు. మన అస్త్రశస్త్ర సంపదను

గురించి దిగులుపడవద్దు. ఆరెద్దుల బండినిండా నింపిన ఆయుధాలు అట్లాగే ఉన్నాయి. ఏమయినా నీ బాహుదండానికి మూలధనమైన గదాదండం అన్ని పనులూ సాధించి పెట్టగలదు' అనగా భీముడు సంతోషించి సారథి చేతితో చేయి కలిపి చరచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. 'వేడుకఁజూడు మేను బటువిక్రమకౌతుకలీలఁ బేర్చి చెం**
**డాడెద వైరులన్; విదురుఁ డప్పుడు సెప్పఁడె? జూద మిట్లు గా**
**వాడెనె రాజరా జకట! యా ప్రతినల్ గడతేర్చుఁ గాక! బొం**
**కాడునె ధర్మజావరజుఁ డంచుఁ దదాప్తులు వంతఁ బొందఁగన్. 142**

**ప్రతిపదార్థం:** విదురుడు; అప్పుడు= జూదం ఆడేటప్పుడు; చెప్పఁడె= చెప్పాడు కదా; రాజరాజు= దుర్యోధనుడు; అక్కట= అయ్యో!; జూదము; ఇట్లు+కాన్+ఆడెనే= ఈ విధంగా అయ్యేటట్లు ఆడాడా?; ధర్మజ+అవరజుఁడు= ధర్మరాజు తరువాత పుట్టినవాడు - తమ్ముడు - భీముడు; ఆ, ప్రతినల్= ఆ ప్రతిజ్ఞలను (జూదం ఆడేటప్పుడు చేసిన ప్రతిజ్ఞలను); కడతేర్చున్+కాక= నెరవేరుస్తాడు గాని; బొంకు+ఆడునె= అబద్ధం ఆడుతాడా?; అనుచు= అంటూ; తద్+ఆప్తులు= అతని ఆత్మీయులు; వంతన్= దుఃఖాన్ని; పొందన్+కన్= పొందగా; ఏను= నేను; పటు= బలమైన; విక్రమ= పరాక్రమంయొక్క; కౌతుక= ఉత్సాహంయొక్క; లీలన్= విలాసంతో; వైరులన్= శత్రువులను; చెండాడెదన్= సంహరిస్తాను; వేడుకన్= (ఆ) సంబరాన్ని; చూడుము.

**తాత్పర్యం:** 'విదురుడు అప్పుడే చెప్పాడు కదా! అయ్యో! రారాజు జూదం ఈ విధంగా అయ్యేటట్లు ఆడాడా? ధర్మరాజు తమ్ముడు (భీముడు) తన ప్రతిజ్ఞలు నెరవేరుస్తాడు గాని, 'అబద్ధం ఆడుతాడా?' అని, దుర్యోధనుని ఆప్తులంతా దుఃఖపడేటట్లుగ, నేను మహాపరాక్రమోత్సాహంతో విజృంభించి వైరులను సంహరిస్తాను. ఆ వేడుక చూడుము.

**వ. అని వెండియు. 143**

**తాత్పర్యం:** అని ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. ఉత్తమకర్మ మిట్టి దని యొక్కరుఁడుం దగఁ జెప్పలేఁడ నా**
**కిత్తఱి; నేన పోలుతెఱఁ గెల్లను జేసెద నట్లుఁ గాక, నా**
**చిత్తము మార్గవర్తియుఁగ శిక్షక మయ్యెడు దైవ' మంచు, న**
**ట్టెత్తి భవద్బలంబుపయి నెల్లను జూ పడరించె నేపునన్.' 144**

(ఈ భాగమంతా సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పిన విధంగానే సాగుతున్నది)

**ప్రతిపదార్థం:** ఉత్తమ కర్మము= మంచిపని; ఇట్టిది అని; ఒక్కరుఁడున్= ఏ ఒక్కడుగూడ; నాకున్; ఈ+తఱిన్= ఈ సమయంలో; తగన్+చెప్పలేఁడు+అ= ఉచితరీతిలో చెప్పలేడు; నేన= నేనే; పోలుతెఱఁగు= ఉచితమైన విధాన్ని; ఎల్లన్= అంతటిని; చేసెదన్; అట్లున్+కాక= ఆ రీతిగాకపోయినట్లయితే; దైవము= దైవం నా చిత్తము; మార్గవర్తియుఁగన్= త్రోవచూపేవాడుగా; శిక్షకము+అయ్యెడున్= శిక్షణ పొందుతుంది; అంచున్= అనిచెప్పుతూ; అట్టు+ఎత్తి= తల ఎత్తి; భవత్+బలంబు పయిన్= (భీముడు) నీ సేనపై; ఎల్లను= పూర్తిగా; చూపు= దృష్టిని; ఏపునన్= గర్వంతో; అడరించెన్= వ్యాపింపచేశాడు.

**తాత్పర్యం:** ఈ సమయంలో ఇదీ ఉత్తమమైన కార్యాచరణవిధానమని ఎవ్వరూ నాకు చెప్పలేరు. అందుచేత నేనే ఉచితమైన విధానాలనన్నిటిని ఆచరిస్తాను. దేవుడే నా మనస్సుకు ఉచితమైన దారి చూపేవాడుగ నా మనస్సు ప్రవర్తిల్లుతుంది' అని భీముడు తలయెత్తి కౌరవసైన్యాలపై గర్వంతో చూపు ప్రసరింపచేశాడు.

**వ. ఇట్లు గలయం గనుంగొని, యద్దిక్కు గలగుండు గొనుట యెఱింగి, విశోకునితోఁ 'గౌరవసైన్యంబు మనము దఱుమకయ తాన కలంగెఁ; గెలనం గవ్వడి గదిసెనొ కాక!' యనుటయు; వాఁడు నిపుణంబుగా నిరూపించి ముదంబునం బొదలుచు. 145**

**ప్రతిపదార్థం:** ఇట్లు; కలయన్ కనుంగొని= తేరిపారజూచి; ఆ దిక్కు= ఆ దిశలో; కలగుండు గొనుట= కలకలం రేగటం; ఎఱింగి; విశోకునితోన్; మనము; తఱుమక+అ= తరుమకుండానే; కౌరవసైన్యంబు; తాను+అ= తనకు తానే; కలంగెన్= కలత చెందింది; కెలనన్= ఆ సమీపంలో; కవ్వడి= అర్జునుడు; కదిసెనొ,కాక!= తలపడినాడేమో!; అనుటయున్; వాఁడు; నిపుణంబుగాన్= నేర్పరితనంతో; నిరూపించి= చూచి; ముదంబునన్= సంతోషంతో; పొదలుచున్= ఉబ్బుతూ.

**తాత్పర్యం:** ఆ విధంగా తేరిపారచూచి, ఆ దిక్కున సేనలు కలతచెందటం చూచి మనం తరుమకుండానే కలత పడుతూ ఉంది. ఆ సమీపంలో అర్జునుడు దాడిచేసి ఉంటాడేమో! అని అనగా, సారథి దానిని నిపుణంగా తెలుసుకొని, మనస్సు ఉప్పొంగగా (ఇట్లా అన్నాడు).

**క. 'నరుఁ డదె కంటే! కౌరవ । కరిసేనం గవిసెఁ గేతుకపి రుచు లంభో**
**ధరబృందముపైఁ గలయం । బరఁగు తటిల్లతలఁ దలఁపఁ బట్టయి నిగుడన్.' 146**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; అదె= అదిగో; కంటే= చూచావా?; కేతు కపిరుచులు= పతాకమందలి హనుమంతుడి కాంతులు; అంభోధర= మబ్బుల; బృందముపైన్= సమూహంపై; కలయన్= అంతటా; పరఁగు= వ్యాపించే; తటిల్లతలన్= మెరుపు తీగలను; తలఁపన్= తలంచటానికి; పట్టు అయి= ఆకరమై; నిగుడన్= వ్యాపింపగా; కౌరవ= కౌరవులయొక్క; కరిసేనన్= ఏనుగుల సైన్యాన్ని; కవిసెన్= ఎదుర్కొన్నాడు.

**తాత్పర్యం:** అదిగో! నరుడు చూచినావా, కౌరవుల గజసేనతో ఢీకొని ఉన్నాడు. ఆయన పతాకమునందున్న హనుమంతుడి కాంతులు మేఘపంక్తులపై పడిన మెరుపు తీగలను తలపునకు తెస్తున్నవి.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. 'హరిమేనికాంతియును నరు । కిరీటరత్నాంశువులును గిఱిగొన, రథ ర**
**థ్యరుచులు బెరసి విచిత్ర । స్ఫురణంబునఁ దేజరిల్లెఁ జూడు కుమారా!' 147**

**ప్రతిపదార్థం:** కుమారా!= భీమా!; హరి= శ్రీకృష్ణునియొక్క; మేనికాంతియును= శరీర కాంతియును; నరు కిరీట= అర్జునుడి కిరీటమందలి; రత్నాంశువులును= రత్నకాంతికిరణాలు; గిఱికొనన్= చుట్టుముట్టగా; రథ; రథ్య= గుఱ్ఱాల; రుచులు= ప్రభలు; బెరసి= వ్యాపించి; విచిత్ర, స్ఫురణంబునన్= రంగు రంగుల ప్రకాశంతో గోచరిస్తూ; తేజరిల్లెన్= ప్రకాశిస్తున్నాయి; చూడు= అదె కనుగొనుము.

**తాత్పర్యం:** కుమారా! అదిగో చూడుము. కృష్ణుడి నల్లని శరీరశోభ, కిరీటి కిరీటమందలి రత్నాలకాంతులు, తేరుల గుఱ్ఱాల కాంతులు వ్యాపించి వివిధమైన రంగులతో గోచరిస్తూ ప్రకాశిస్తుండటం చూడుము.

**వ. అనిన విని, యంతరంగంబు సంతోషమయంబు గా నంగంబు వొంగ, నేర్పడ నాలోకించి, విశోకునకు వృకోదరుం డి ట్లనియె: 148**

**ప్రతిపదార్థం:** అనినన్+విని; అంతరంగంబు= మనస్సు; సంతోషమయంబుగాన్= ఆనందంతో నిండినది కాగా; అంగంబు= దేహం; పొంగన్= ఉప్పొంగగా; ఏర్పడన్= స్పష్టంగా; ఆలోకించి= చూచి; విశోకునకున్; వృకోదరుండు= భీముడు; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అనగా విని, హృదయం సంతోషంతో పొంగి, శరీరం ఉత్తేజం పొందగా చూచి, విశోకుడితో భీముడు ఇట్లా అన్నాడు.

**తే. 'వరవుడుల నూర్వురను, మేలివాజు లిరువ । దింటి, నూళులు పదునాల్గు నిత్తు నీకుఁ**
**బసదనము; నీవు నాకు బీభత్సురాక । సూపి ముద మొనరించితి సూతవర్య!' 149**

**ప్రతిపదార్థం:** సూతవర్య!= సారథి శ్రేష్ఠా!; నీకున్; వరవుడులన్= సేవకుల; నూర్వురన్; మేలి వాజులు= మేలు జాతి గుఱ్ఱాలు; ఇరువదింటిన్; ఊళులు= ఊళ్ళు; పదునాల్గున్; నీకున్; పసదనము= కానుకగా; ఇత్తున్= ఇస్తాను (ఎందుకంటే); నీవు; నాకున్; బీభత్సు= యుద్ధరంగాన జుగుప్సాకరమైన దృశ్యాలను సృష్టించే అర్జునుడి; రాకచూపి= రాకను తెలిపి; ముదము+ఒనరించితి(వి)= సంతోషము కలుగజేసినావు.

**తాత్పర్యం:** విశోకుడా! నీవు నాకు అర్జునుడి రాకను చూపి సంతోషాన్ని కలిగించినందుకు కానుకగా వందమంది సేవకులనూ, ఇరవై గుఱ్ఱాలను పద్నాలుగు గ్రామాలను ఇస్తాను.'

**వ. అనియె; నప్పుడు వారణ ఘటావిదారణంబు సేసి, వాసవి వాసుదేవుతో 'మన తేరు భీమసేనుఁ జేరం బోవ ని' మ్మనుటయు. 150**

**ప్రతిపదార్థం:** అనియెన్; అప్పుడు; వారణఘట= ఏనుగుల గుంపును; విదారణంబు= చీల్చి చంపటం; చేసి; వాసవి= ఇంద్రనందనుడు - అర్జునుడు; వాసుదేవుతోన్= కృష్ణుడితో; మనతేరు; భీమసేనున్; చేరన్ పోవనిమ్ము; అనుటయున్= అన్నంతనే.

**తాత్పర్యం:** అని అన్నాడు. అప్పుడు ఏనుగులను చీల్చి చెండాడి అర్జునుడు కృష్ణుడితో 'మన రథాన్ని భీమసేనుడి సమీపానికి పోనిమ్ము' అనగా. (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. అతఁడు హరులఁ దఱుమఁగ ను । ద్ధతిఁ జనునెడ, మనబలంబు దర్పమహోగ్రా**
**కృతిఁ బొదివినఁ జతురంగ । ప్రతతుల నన్నరుఁడు నేలపాలుగఁ జేసెన్. 151**

**ప్రతిపదార్థం:** అతఁడు= శ్రీకృష్ణుడు; హరులన్= గుఱ్ఱాలను; తఱుమఁగన్= త్రోలగ; ఉద్ధతిన్= గర్వంతో; చనునెడన్= వెళ్ళేటప్పుడు; మన బలంబు= మన కౌరవసేన; దర్పమహా+ఉగ్రాకృతిన్= గర్వంచేత మహా భయంకరమైన రూపంతో; పొదివినన్= చుట్టుముట్టగా; చతురంగ ప్రతతులన్= రథ గజ తురగ పదాతి సమూహాలను; ఆ+నరుఁడు= ఆ అర్జునుడు; నేలపాలుగన్+చేసెన్= దుమ్ములో కలిసిపోయేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** శ్రీకృష్ణుడు గుర్రాలను త్రోలగ అర్జునుడు విజృంభించి పోయేటప్పుడు మనసైన్యం భయంకరరూపాన్ని తాల్చిన పరాక్రమంతో ముట్టడించగా, ఆ నరుడు మన సైన్యపు నాలుగు విభాగాలనూ నేలకూలేటట్లు చేశాడు.

**ఆ. మందరంబుచేత మథితమై తిరుగు సా । గరము నులివు గెలిచె ధరణి నాథ!**
**పార్థుఁ డురవణింప బలువడిఁ గలఁగెడు । కౌరవేంద్రుసేన కలకలంబు. 152**

**ప్రతిపదార్థం:** ధరణినాథ!; పార్థుడు; ఉరవణింపన్= దండెత్తగా; బలువడిన్= మిక్కిలి వేగంగా; కలఁగెడు= కలకబారెడు; కౌరవేంద్రు సేన= దుర్యోధనుని సేనయొక్క; కలకలంబు= కోలాహలధ్వని; మందరంబుచేతన్= మందర పర్వతముచేత; మథితమై= చిలుకబడి; తిరుగు= అటు నిటు తిరుగుచు అల్లకల్లోలమైన; సాగరము= సముద్రము యొక్క; ఉలివున్= శబ్దాన్ని; గెలిచెన్= జయించింది.

**తాత్పర్యం:** భూపాలా! పార్థుడు దండెత్తగా, కౌరవేంద్రుడి సైన్యంలో కలిగిన కలకలపు తీవ్రత, పాలసముద్రంలో మందరపర్వతంతో చిలికినప్పుడు పుట్టిన శబ్దాన్ని గెలిచింది.

**వ. కేతు చామ రాతపత్ర భూషణ శకలంబుల నా శౌర్యభూషణుండు రణక్షోణికి విభూషణం బాచరించె; నట్లు కర్ణువధంబునకు వేగిరపడి తఱుమ నుఱుక, మన మొన వెండియు నొండొండ పయిం గ్రమ్మిన, నమ్మేటి మగండు. 153**

**ప్రతిపదార్థం:** కేతు= ధ్వజాలయొక్క; చామర= వింజామరలయొక్క; ఆతపత్ర= గొడుగులయొక్క; భూషణ= నగల యొక్క; శకలంబులన్= తునుకలతో; ఆ శౌర్య భూషణుండు= ప్రతాపమే అలంకారంగా కలిగిన ఆ అర్జునుడు; రణక్షోణికిన్= యుద్ధభూమికి; విభూషణంబు= విశేష అలంకారంగా; ఆచరించెన్= జరిపాడు; అట్లు; కర్ణు; వధంబునకున్= సంహారానికి; వేగిరపడి= తొందరపడి; తఱుమన్= తరిమికొట్టేందుకు; ఉఱుకన్= ముందుకు దూకగా; మనమొన= మన సైన్యం; వెండియున్= మరల; ఒండొండ= క్రమంగా; క్రమ్మినన్= క్రమ్ముకొనగా; ఆ+మేటి మగండు= ఆ గొప్ప శూరుడు.

**తాత్పర్యం:** ధ్వజాలను, వింజామరలను, గొడుగులను, సొమ్ముల ముక్కలను యుద్ధభూమికి నగలుగా అర్జునుడు అలంకరించాడు. ఆ విధంగా కర్ణుడి వధకు త్వరపడి తరిమికొట్టగా మన సేనలు మరల సమకూడి క్రమ్మగా అర్జునుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పేరు గల రథికముఖ్యుల । సారథి రథ రథ్య కేతుసహితంబుగ దు**
**ర్వార విశిఖ స్ఫురణ వి । హారంబున శతచతుష్టయము పొడి చేసెన్. 154**

**ప్రతిపదార్థం:** పేరుకల= ప్రసిద్ధులైన; రథిక ముఖ్యులన్= రథమెక్కి యుద్ధంచేసే వారిలో ముఖ్యులను; సారథి; రథ; రథ్య= గుర్రాలు; కేతుసహితంబుగన్= జెండాలతో గూడ; శతచతుష్టయంబు= నన్నూటిని; దుర్వార= అడ్డగించుటకు సాధ్యం కాని; విశిఖ= బాణాలయొక్క; స్ఫురణ= ప్రకాశం తోడి; విహారంబునన్= క్రీడావినోదంతో; పొడిచేసెన్= పిండిగా చేశాడు.

**తాత్పర్యం:** పార్థుడు రథంపై నుండి యుద్ధం చేసే పేరుగాంచిన వీరులను - సారథితో, రథంతో, గుర్రాలతో, జెండాలతో కూడ - నాలుగువందలకు పైగా బాణాలు విలాసంగా ప్రయోగించి పిండి చేశాడు.

**వ. అవ్వేఁడిమికి వెఱచఱచి యచ్చటిమూఁక విచ్చుటయుఁ, గర్ణుముందటి మోహరం బుత్సాహతీవ్రం బయి యురవణించినం గని, యన్నరుం డురగ నికరంబునకుఁ గవియు గరుడుని కైవడి నద్దెస కడరె; నట్లడరుట యాలోకించి తనకట్టెదుటి మొనబెట్టు దాఁకి. 155**

**ప్రతిపదార్థం:** ఆ+వేఁడిమికిన్= తీవ్ర బాణప్రయోగం పుట్టించిన ఉష్ణానికి; అచ్చటిమూఁక= అక్కడ ఉన్న సేన; వెఱచఱచి= భయపడి; విచ్చుటయున్= విడిపోవటం వలన; కర్ణుముందటి= కర్ణుడి ఎదురుగా సాగుతున్న; మోహరంబు= యుద్ధం; ఉత్సాహ తీవ్రంబు+అయి= ఉత్సాహంచేత తీవ్రమై; ఉరవణించినన్= పై బడగా; కని; ఆ+నరుండు; ఉరగ= పాముల; నికరంబునకున్= సమూహానికిగా; కవియు= పైబడు; గరుడునికైవడిన్= గరుత్మంతుడివలె;? ఆ+దెసకున్= ఆ దిక్కుకు; అడరెన్= విజృంభించాడు; అట్లు+అడరుట= ఆ విధంగా చెలరేగటం; ఆలోకించి= చూచి; తనకట్టెదుటన్= తన కళ్ళముందరే ఉన్న; మొనన్= సైన్యాన్ని; బెట్టు= దృఢముగా; తాఁకి= ఎదిరించి.

**తాత్పర్యం:** అర్జునుడు సాగించిన యుద్ధతీవ్రతకు పుట్టిన తీక్ష్ణతకు తట్టుకొనలేని కౌరవసైన్యం, పిరికితనంతో చెల్లాచెదరై పోసాగింది. కాని కర్ణుడి ఎదుట సాగుతున్న సమరం ఉత్సాహజనిత ప్రకోపంతో వేడి ఎక్కగా, కౌరవసేనలు పాండవ దళాలపై పడ్డాయి. ఇది గమనించిన కవ్వడి పాములగుంపుపై పడిన గరుడపక్షివలె, కర్ణుడున్న రంగానికి త్వరత్వరగా పోగా, ఇది చూచి భీముడు తన ఎదుట నున్న సైన్యాన్ని తాకి.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**తే. వాయుసత్త్వుండు వాయుజవ ప్రదీప్త। తనుఁడు వాయుతనూజుఁ డుదగ్రవృత్తి**
**నేచి, బాహాసముల్లాస మెసకమెసఁగఁ। గనుపు గొట్టె వాలమ్ములఁ గౌరవేంద్ర! 156**

**ప్రతిపదార్థం:** కౌరవ+ఇంద్ర!= ధృతరాష్ట్రా!; వాయుసత్త్వుండు= వాయుదేవుడి బలమంత బలం కలిగినవాడు; వాయుజవ= వాయువుతో సమానమైన వేగంతో; ప్రదీప్త= ప్రకాశమానమైన; తనుఁడు= దేహం కలవాడు అయిన; వాయు తనూజుఁడు= వాయుపుత్రుడు భీముడు; ఉదగ్రవృత్తిన్= భయంకరమైన ప్రవర్తనతో; ఏచి= విజృంభించి; బాహాసముల్లాసము= భుజబలం కలిగించిన ఆనందాతిశయము; ఎసకము+ఎసఁగన్= అతిశయింపగా; వాలమ్ములన్= పొడవైన నిశితమైన బాణాలతో; కనుపుగొట్టెన్= ఖండించెను.

**తాత్పర్యం:** భీముడు వాయుపుత్రుడు కాబట్టి తండ్రి గుణాలైన బలం, వేగం గల దేహంతో విజృంభించి భుజబలోల్లాసం వెల్లివిరియగ పొడవు, పదునుగల బాణాలతో విరోధులను ఖండించాడు.

**వ. అవ్వీరు నాటోపంబు సూచి, కురుభూపతి ప్రధాన సైనికులకుం జూపి 'యితండు సమసిన నక్కడ సకలంబు సమయు, మీ రొక్కుమ్మడిం బొదివి పొరివుచ్చుం'డనిన, వారును వారణాది చతురంగంబుల యగ్గలిక మెఱయ నతనిం జుట్టుముట్టి, యస్త్రశస్త్రంబులం బొదువుటయు, నతండు, 157**

**ప్రతిపదార్థం:** ఆ+వీరు= ఆ వీరుడియొక్క; ఆటోపంబు= ఉత్సాహపూర్ణమైన బలప్రదర్శనాన్ని; చూచి; కురుభూపతి= దుర్యోధనుడు; ప్రధానసైనికులకున్= సైనిక ముఖ్యులకు; చూపి; ఇతండు; సమసినన్= తుదముట్టినచో; అక్కడన్= పాండవ శిబిరంలో; సకలంబు= అంతా; సమయున్= ముగిసిపోతుంది; మీరు; ఒక్కుమ్మడిన్= ఒక్కపెట్టున; పొదివి= చుట్టుముట్టి;

పౌరి పుచ్చుండు= చంపండి; అనినన్; వారును= ఆ సైనికులు కూడా; వారణ+ఆది= ఏనుగులు మొదలైన; చతురంగ బలంబుల= నాలుగు సైనిక విభాగాలలో; అగ్గలిక= పూనిక; మెఱయన్= ప్రకాశించగా; అతనిన్; చుట్టుముట్టి; అస్త్ర శస్త్రంబులతోన్; పొదువుటయున్= క్రమ్ముకొనగా; అతండు= ఆ భీముడు.

**తాత్పర్యం:** ఆ భీముడి బలప్రదర్శనను చూచి, దుర్యోధనుడు తన సైనిక ముఖ్యులకు చూపి, 'ఈ భీముడు చనిపోతే పాండవపక్షంలో అంతా ముగిసిపోతుంది. కాబట్టి మీరందరు అతడిని చుట్టుముట్టి చంపివేయండి' అనగా వారు చతురంగబలాలతో, పూనికతో అతడిని చుట్టుముట్టి శస్త్రాస్త్రాలతో క్రమ్మగా భీముడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. వానినెల్లఁ ద్రుంచి, వల వ్రచ్చికొని లీల । నిగుడు చోఱవోలె వెగడు పడక**
**తఱిమి, రక్తనదులు వఱపె మస్తక కూర్మ । హస్తభుజగ తతుల నతిశయిల్ల! 158**

**ప్రతిపదార్థం:** వానిన్+ఎల్లన్= వాటినన్నింటిని; త్రుంచి= చంపి; వల= వలను; వ్రచ్చికొని= చీలుకొని; నిగుడు= నీల్గే; చోఱవోలెన్= సొరచేప వలె; వెగడుపడక= తబ్బిబ్బుకాక; తఱిమి; రక్తనదులు= నెత్తురు టేరులు; పఱపెన్= ప్రవహింపజేశాడు; మస్తకకూర్మములు= తలలనే తాబేళ్ళు; హస్తభుజగ= చేతులనే పాములు; తతులన్= (వీటి) సమూహాలతో; అతిశయిల్లన్= ఎక్కువ కాగా.

**తాత్పర్యం:** క్రూరమైన సొరచేప, వలను ముక్కలుచేసి బయటపడి విహరించే మాదిరి, భీముడు శత్రువులు ప్రయోగించిన ఆయుధాల అడ్డంకిని ఛేదించుకొని బయటపడ్డాడు. వెంటనే అతడు శత్రుసేనలను చంపగా, వాటినెత్తురు ఏరులై పారింది. అందులో సైనికుల తలలు తాబేళ్ళవలె, చేతులు పాములవలె తిరుగాడుతూ అతిశయిస్తున్నాయి.

**విశేషం:** సొరచేప, రంపపు పళ్ళవంటి కూచిపళ్ళు ఇరువైపుల కలిగి పొడవైన ముక్కు కలిగి ఉంటుంది. నీళ్ళను చెలగుతు పోతూ కనబడిన జంతువులను కోరతో ముక్కలు చేసి తింటూ క్రూరవిహారం చేస్తూంటుంది. అందుచేత జాలరులు దీని జోలికి పోరు. ఇంగ్లీషులో దీనిని **Shark** అంటారు. అలంకారం: ఉపమ. రూపకానుప్రాణితము.

**క. కురు విభుఁడు సూచి శకునిం । బురికొల్పిన, నాతఁ డుగ్రముగ మార్కొని, పే**
**రురమున నారాచంబులు । గురిసినఁ, బవనజుఁడు సరకుగొన, కారథికున్. 159**

**ప్రతిపదార్థం:** కురువిభుఁడు= దుర్యోధనుడు; చూచి; శకునిన్; పురికొల్పినన్= ప్రేరేపించగా; ఆతఁడు= శకుని; ఉగ్రముగన్= భయంకరంగా; మార్కొని= ఎదుర్కొని; పేరురమునన్= వెడదరొమ్మున; నారాచంబులు= ఇనుప బాణాలను; కురిసినన్= వానవలె తెరపిలేకుండా వదలగా; పవనజుఁడు= భీముడు; సరకుగొనక= లెక్కచేయక; ఆ రథికున్= ఆ రథయోధుడిని - శకునిని.

**తాత్పర్యం:** దుర్యోధనుడు చూచి శకునిని పురికొల్పగా, అతడు భయంకరంగా ఎదుర్కొన్నాడు. భీముడి రొమ్మున బాణాలు కురిపించాడు. అయినా భీముడు లెక్కచేయక శకునిమీద. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. బలునారసమున నేసిన, । నలఘు లఘుత మెఱయ నాతఁడది యిరు మూఁడ**
**మ్ములఁ దునియలు సేయుడు, నతఁ । డలిగి యతని ధనువు దునిమె నల్లన నగుచున్. 160**

**ప్రతిపదార్థం:** బలు నారసమునన్= శక్తిమంతమైన బాణంతో; ఏసినన్= కొట్టగా; అలఘు లఘుత= మిక్కిలి లాఘవంతో; మెఱయన్; ఆతఁడు= శకుని; అది= దానిని; ఇరుమూఁడు+అమ్ములన్= ఆరు బాణాలతో; తునియలు చేయుడున్= తునుకలు చేయగానే; అతఁడు= ఆ భీముడు; అలిగి= కోపగించుకొని; అతని= శకునియొక్క; ధనువున్; అల్లనన్= మెల్లగా; నగుచున్= చిరునవ్వు చిందుతూ; తునిమెన్= విరుగగొట్టాడు.

**తాత్పర్యం:** శక్తిమంతమైన బాణంతో కొట్టగా, శకుని మిక్కిలి లాఘవంతో దానిని ఆరు బాణాలతో ముక్కలు చేశాడు. భీముడు కోపించి నవ్వుతూ అతడి విల్లును విరిచాడు.

**ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని, యుజ్జ్వల షోడశ భల్లముల్ సము**
**ద్దండత నేసె నీమఱఁది తత్తను వాడఁగఁ, జాప కేతువుల్**
**ఖండములై పడంగఁ, దురగంబులు నొవ్వఁగ, సూతుమేనఁ బెన్**
**గండలు నెత్తురుల్ దొరఁగఁ, గౌరవ పుంగవుఁ డిచ్చ మెచ్చఁగన్. 161**

**ప్రతిపదార్థం:** ఒండొక విల్లు పుచ్చికొని= ఇంకొక ధనువు చేపట్టి; నీ మఱఁది= నీ బావమరిది శకుని; ఉజ్జ్వల= ప్రకాశమానమైన; షోడశ= పదహారు; బాణాలను; తద్+తనువు+ఆడఁగన్= ఆయన శరీరం కంపించగా; ఉద్దండతన్= ప్రకోపించి; ఏసెన్= ప్రయోగించాడు (దానితో); చాపకేతువుల్= ధనుస్సు టెక్కెము; ఖండములై పడంగన్= ముక్కలై పడేటట్లుగా; తురగంబుల్= గుర్రాలు; నొవ్వఁగన్= బాధపడేటట్లుగా; సూతుమేనన్= సారథి శరీరంలో; పెన్= పెద్ద; కండలు; నెత్తురుల్; తొరఁగన్= పారేటట్లు; కౌరవ పుంగవుఁడు= కౌరవ శ్రేష్ఠుడు; ఇచ్చన్= మనస్సులో; మెచ్చన్= కొనియాడగా; ఉద్దండతన్= బలంతో; ఏసెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** శకుని ఇంకొక విల్లు చేబూని, తళతళలాడే పదహారు బాణాలను భీముడి శరీరం కంపించగా ప్రయోగించాడు. ఆ దెబ్బలతో ధనుస్సు, టెక్కెము తునకలై నేలపాలైనవి. గుర్రాలు బాధతో మూల్గినవి. రథసారథి శరీరం నుండి నెత్తురు కాలువలు కట్టగా, కండరాలు చితికిపోగా దానిని చూచి దుర్యోధనుడు మనసారా మెచ్చుకొన్నాడు.

**తే. అలిగి జమునాలుకయుఁబోని యతులశక్తి । వాయుపుత్త్రుఁ డారథికుపై వైచె, నతఁడు**
**వెరవుమైఁ బట్టి, దాన నవ్వీరుబాహు । వుచ్చిపో వైవ, మనమొన యుబ్బి యార్చె. 162**

**ప్రతిపదార్థం:** అలిగి= కోపించి; వాయుపుత్రుఁడు; జమునాలుకయున్+పోని= యముని నాలుకవంటి; అతులశక్తిన్= సాటిలేని శక్తిని; ఆ రథికుపైన్= ఆ రథవీరుడిమీద; వైచెన్= వేశాడు; అతడు (దానిని); వెరవుమైన్= ఉపాయంతో; పట్టి= చేజిక్కించుకొని; దానన్= దానితోనే; ఆ+వీరునిన్= ఆ యోధుని; బాహువు= చేయి; ఉచ్చిపోవైవన్= చీల్చుకొని పోయేటట్లు విసరివేయగా; మన మొన= మన సేన; ఉబ్బి= సంతోషంతో పొంగిపోయి; ఆర్చెన్= కేకలు వేసింది.

**తాత్పర్యం:** శకుని చేసిన బాణప్రయోగానికి, భీముడు రేగిన కోపంతో యముడి నాలుకను పోలిన శక్తిని శకునిపై ప్రయోగించినాడు. అతడు మెలకువగా దానిని పట్టుకొని, తిరిగి భీముడిపై విసరివేసినాడు. ఆ దెబ్బకు అతనిచేయి బాగా గాయపడింది. అది చూచి కౌరవసేన సంతోషంతో కేకలు పెట్టింది.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**శకుని భీమసేనుం దలపడి మూర్ఛితుండై తన రథంబు మీఁదఁ గూలుట (సం. 8-55-65)**

**చ. అనిలజుఁ, డట్లు పెల్లెసఁగు నార్పులు సైఁపక మేటివిల్లు వే**
**కొని, కనుదోయి గెంపుగ నకుంఠిత విక్రమ మొప్పఁ ద్రుంచె నా**
**తని ఘనకార్ముకంబు, నిశితప్రదరంబులు మేన నించె; నిం**
**చిన నతఁ డుర్విఁ గూలెఁ గురుసేనకు బెగ్గల మగ్గలంబుగన్. 163**

**ప్రతిపదార్థం:** అనిలజుఁడు= వాయునందనుడు భీముడు; అట్లు= ఆ విధంగా; పెల్లు+ఎసఁగు= మిక్కిలి అతిశయించిన; ఆర్పులు= ఆ కేకలను; సైఁపక= ఓర్చుకొనలేక; వే= త్వరగా; మేటివిల్లు= గొప్ప ధనుస్సును; కొని= తీసికొని; కనుదోయి= రెండు కన్నులు; కెంపుగన్= ఎరుపెక్కగా; అకుంఠిత= మొక్కవోని; విక్రమము+ఒప్పన్= శౌర్యం రాణించగా; ఆతని= శకుని యొక్క; ఘనకార్ముకంబు= పెద్ద విల్లును; త్రుంచెన్= విరుగగొట్టాడు; నిశిత= వాడి అయిన; ప్రదరంబులు= బాణాలు; మేనన్= అతడి శరీరంలో; నించెన్= నిండించాడు; నించినన్= నాటగా; అతఁడు= శకుని; కురుసేనకున్= కౌరవసైన్యానికి; బెగ్గలము= భయము; అగ్గలంబుగన్= అధికము కాగా; ఉర్విన్ కూలెన్= భూమిపై కూలబడిపోయాడు.

**తాత్పర్యం:** కౌరవసేన సేసిన అల్లరికి భీముడు ఓర్చుకొనలేక, గొప్ప ధనుస్సును వడివడిగా తీసికొని ఎరుపెక్కిన కన్నులతో మొక్కవోని ప్రతాపం అందగించగా, శకుని ధనుస్సును విరగగొట్టి, అతడి దేహాన్ని పదునైన బాణాలతో నింపివేశాడు. కౌరవసేనకు భయం అధికంకాగా ఆ దెబ్బలతో శకుని నేలపై కూలిపోయాడు.

**తే. కూలి మూర్ఛ మునింగినఁ, గురువిభుండు । దన రథంబుపై నిడికొని యనికిఁ దొలఁగఁ**
**బోవుటయుఁ జూచి, తమ తమ పోరు మాని । దొరలు దెరలిన, మూఁకలు మరలి పఱచె. 164**

**ప్రతిపదార్థం:** కూలి= పడిపోయి; మూర్ఛన్ మునింగినన్= స్పృహదప్పి ఉండగా (శకునిని); కురువిభుండు= దుర్యోధనుడు; తన రథంబుపైన్; ఇడికొని= ఎత్తి పెట్టుకొని; అనికిన్= యుద్ధరంగానికి; తొలఁగన్= దూరమై; పోవుటయున్= పోయినందున; చూచి; తమతమ పోరు= పరస్పర యుద్ధాలను; మాని; దొరలు= సైన్యాధిపతులు; తెరలినన్= వైదొలగిపోయినందున; మూఁకలు= సైనికుల గుంపులు; మరలి= వెనుదిరిగి; పఱచెన్= పరుగెత్తిపోయాయి.

**తాత్పర్యం:** భీముడి దెబ్బలకు శకుని ఒళ్ళు తెలియకుండా పడిపోయినందున, దుర్యోధనుడు అతడిని తన తేరుమీద పెట్టుకొని యుద్ధరంగంనుండి వైదొలగిపోయాడు. అది చూచి సేనాధిపతులు యుద్ధాన్ని మాని తొలగిపోయారు. దీనితో భటులగుంపులు కూడా వెన్ను జూపి పారిపోయాయి.

**వ. ఇట్లు వెఱచఱచి, యవిసిన కలంబు జనంబులు దీవి సేరిన యట్లు కర్ణుం జేరి కాలుదన్ని నిలిచె నని విని, ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె. 165**

**ప్రతిపదార్థం:** ఇట్లు; వెఱచఱచి= భయపడి; అవిసిన= పగిలిపోయిన; కలంబు= పడవలో ఉన్న; జనంబులు; దీవి= లంకను (నీటి నడుమనున్న భూమిని); చేరి అట్లు; కర్ణున్+చేరి= కర్ణుని అండను చేరి; కాలు దన్ని= కాలుమోపి స్థిరంగా; నిలిచెన్; అనన్‌విని= అని చెప్పగా విని; ధృతరాష్ట్రుండు; సంజయునకున్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** ఇట్లా భయపడి, పగిలిపోయిన పడవలో ఉన్న జనులు ఒక ద్వీపాన్ని చేరినట్లుగా, కర్ణుడి వద్దకు చేరి నిలద్రొక్కుకొని ఉన్నారు. ఈ సంగతి విని ధృతరాష్ట్రుడు సంజయుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**తే.** **'అట్టియెడఁ గృతవర్మ ద్రోణాత్మజుండుఁ । గృపుఁడు నృపతియుఁ గర్ణుండుఁ గినియఁ జాల**
**రయిరె? కిమ్మీరవైరి కయ్యంబు కడఁక । యిట్టు లుండునె? పదపడి యెట్టు లయ్యె?' 166**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో; కృతవర్మ= కృతవర్మ; ద్రోణ+ఆత్మజుండు= ద్రోణుడి పుత్రుడైన అశ్వత్థామ; కృపుఁడు= కృపాచార్యుడు; నృపతియున్= రాజైన దుర్యోధనుడు; కర్ణుండున్= రాధేయుడు మొదలయినవారు; కినియన్+ చాలరయిరె?= కోపపడలేకపోయారా!; కిమ్మీరవైరి= కిమ్మీరుడనే రాక్షసుడిని చంపిన భీముడి; కయ్యంపు= యుద్ధంపట్ల; కడఁక= పూనిక; ఇట్టులు+ఉండునె?= ఇట్లా ఉంటుందని ఊహించలేదే?; పదపడి= ఆ తరువాత; ఎట్టులు+అయ్యెన్?= ఏ విధంగా సాగింది?

**తాత్పర్యం:** 'ఆ సమయంలో కృతవర్మ, అశ్వత్థామ, కృపుడు, దుర్యోధనుడు, కర్ణుడు - కోపగించలేదా? భీముడి యుద్ధోత్సాహం అట్లా ఉండేదా? ఆ తరువాత యుద్ధం ఎట్లా జరిగింది?'

**వ.** **అనిన, సంజయుం డమ్మహీపతి కిట్లనియె: నప్పుడు కరూశ పాంచాల చేది సైన్యంబులఁ దఱుముటయుం గని, కర్ణుండు గడంగిన మనమూఁకలుం బురికొని పవనతనయుతోడం బోరె. నప్పాండవసేనా సముదయంబు రభసంబున నా రాధేయుం బొదివిన. 167**

**ప్రతిపదార్థం:** అనినన్; సంజయుండు; ఆ+మహీపతికిన్= ఆ రాజుతో; ఇట్లు+అనియెన్; అప్పుడు; కరూశ పాంచాల చేది= ఈ దేశాల; సైన్యంబులన్= సైన్యాలను తఱుముటయున్= పారద్రోలగా; కని= చూచి; కర్ణుండు; కడంగినన్= పూనగా; మన మూఁకలున్= మన సైన్యాలు కూడ; పురికొని= ఉత్సాహంతో చెలరేగి, పవన తనయుతోడన్= భీముడితో; పోరెన్= పోరాడాయి; ఆ+పాండవ, సేనా, సముదయంబు= ఆ పాండవ సైనికసమూహం; రభసంబునన్= కోపాతిశయంతో; ఆ రాధేయునిన్; పొదివినన్= చుట్టుముట్టగా.

**తాత్పర్యం:** అని అనగా సంజయుడు ధృతరాష్ట్రుడితో ఇట్లా చెప్పాడు. అప్పుడు కరూశ, పాంచాల, చేది సైన్యాలను తరిమివేయటం చూచి కర్ణుడు పూనుకొనగా, మనసైన్యాలు కూడా అతడికి తోడ్పడి, భీముడితో యుద్ధంచేశాయి. పాండవ సైన్యసమూహాలు ఉద్రేకంతో కర్ణుడిని చుట్టుముట్టగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క.** **అతఁడు వివిధోగ్ర విశిఖ । ప్రతతులు నిగిడించి ఘోరభంగి నుదారో**
**ద్ధతి సూపినఁ, జేడ్పడి త । చ్చతురంగంబులును గలఁగె జగతీనాథా! 168**

**ప్రతిపదార్థం:** జగతీనాథా!= రాజా!; అతఁడు= కర్ణుడు; వివిధ+ఉగ్ర= అనేక విధాలైన తీవ్రమైన; విశిఖ ప్రతతులు= బాణ సమూహాలు; నిగిడించి= ప్రయోగించి; ఘోరభంగిన్= భయంకర రూపంతో; ఉదార= విరివి అయిన; ఉద్ధతిన్= విజృంభణాన్ని; చూపినన్= ప్రదర్శించగా; చేడ్పడి= బాధపడి; తద్= ఆ; చతురంగ బలంబులును; కలఁగెన్= కలత నొందాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కర్ణుడు నానావిధాలైన నిశిత బాణ పరంపరను ప్రయోగించి, తీవ్రంగా తన బలోన్నతిని, తన పరాక్రమాతిశయాన్ని ప్రదర్శించగా, పాండవసైన్యాలు బాధతో కలతచెందాయి.

**చ. కనుఁగొని, భీమసేనుఁడు శిఖండియు సైన్యవిభుండు ద్రౌపదీ**
**తనయులుఁ గేశవానుజుఁడు దాఁకిన, నందఱ కన్నిరూపులై**
**తనువులు సించుచున్ హయవితానము నొంచుచుఁ గేతుదండ ఖం**
**డన మొనరించుచుం బెనఁగె డయ్యక క్రుయ్య కతండు గండునన్.** 169

**ప్రతిపదార్థం:** కనుఁగొని= చూచి; భీమసేనుఁడు; శిఖండియున్; సైన్యవిభుండున్= ధృష్టద్యుమ్నుడు; ద్రౌపదీ తనయులున్= ఉపపాండవులు అయిదుగురు; కేశవ+అనుజుఁడున్= కేశియను రాక్షసుని చంపిన కృష్ణుని తమ్ముడు- సాత్యకియు; తాఁకినన్= పైబడగా; అతండు= ఆ కర్ణుడు; అందఱకున్; అన్ని రూపులు+ఐ= అన్ని రూపాలలో; తనువులు చించుచున్= శరీరాలను చీల్చివేస్తూ; హయవితానమున్= గుఱ్ఱాల సమూహాన్ని; నొంచుచున్= బాధపెట్టుతూ; కేతుదండ= పతాకాలు కట్టిన ధ్వజాలను; ఖండన మొనరించుచున్= నరికి ముక్కలు చేస్తూ; డయ్యక= అలయక; క్రుయ్యక= వెనుదీయక; గండునన్= పౌరుషంతో; పెనఁగెన్= పోరాడాడు.

**తాత్పర్యం:** కర్ణుడి వీరవిహారాన్ని చూచి భీముడు, శిఖండి, ధృష్టద్యుమ్నుడు, ఉపపాండవులు, సాత్యకి అతడిపై బడ్డారు. దీనితో కర్ణుడు రెచ్చిపోయి ఉగ్రుడై ఒక్కొక్కరికి ఒక్కొక్క ఆకృతిగా అగుపిస్తూ భటుల శరీరాలను చీల్చివేస్తూ, గుఱ్ఱాలను అణచివేస్తూ, కేతనాలను తునుకలు చేస్తూ అలయక, సొలయక వెనుకడుగు వేయక పౌరుషంతో పోరాడాడు.

**క. నకుల సహదేవులును వా । రికిఁ దోడ్పడి నిశితశర పరీతునిఁ జేయం,**
**బ్రకటిత బలశౌర్యుఁడు సూ । త కులోద్వహుఁ డేచి, వారిఁ దలఁకం జేసెన్.** 170

**ప్రతిపదార్థం:** నకుల సహదేవులును; వారికిన్= ఆ భీమశిఖండి ధృష్టద్యుమ్న ఉపపాండవ సాత్యకులకు; తోడ్పడి= సహాయం చేస్తూ; నిశిత శర= వాడి అయిన అమ్ములతో; పరీతునిన్= చుట్టుముట్టినవాడినిగా; చేయన్; ప్రకటిత= వెల్లడించిన; బలశౌర్యుఁడు= శక్తి సాహసాలు కలిగినవాడు; సూతకుల= సారథుల కులంలో; ఉద్వహుఁడు= శ్రేష్ఠుడు (రాధేయుడు); ఏచి= విజృంభించి; వారిన్; తలఁకన్= భయపడి వెనుదీసేటట్లు; చేసెన్= చేశాడు.

**తాత్పర్యం:** నకుల సహదేవులు వారితో చేరి, వాడి అయిన బాణాలతో కర్ణుడిని ముంచివేశారు. పేరుకెక్కిన బలపరాక్రమాలు కలవాడు సూతకుల పుత్రుడు అయిన రాధేయుడు వీరవిహారం చేసి వారిని భయపడి పరుగెత్తేటట్లు చేశాడు.

**క. పెక్కండ్రతోడఁ గర్ణుం । డొక్కఁడ పోరాడి, యెక్కు డుక్కున వారిం**
**జిక్కువడం జేయుట గడు । నక్కజ మై యుండెఁ గౌరవాధిప! చూడన్.** 171

**ప్రతిపదార్థం:** కౌరవాధిప!= ధృతరాష్ట్రా!; పెక్కండ్ర తోడన్= అనేకులతో; కర్ణుడు; ఒక్కఁడు+అ= ఒక్కడే; పోరాడి; ఎక్కుడు= అతిశయించే; ఉక్కునన్= బలంతో; వారిన్ చిక్కుపడన్+చేయుట= వారిని చిక్కులలో పెట్టటం; చూడన్= చూడగా; కడున్= మిక్కిలి; అక్కజము+ఐ ఉండెన్= ఆశ్చర్యకరంగా ఉండింది.

**తాత్పర్యం:** పెక్కుమందితో కర్ణుడు ఒక్కడే పోరాడి వారందరిని చిక్కులలో పెట్టటం చూస్తే ఆశ్చర్యకరంగా తోచింది.

**వ. ఇవ్విధంబున న ద్దెసఁ జేయంగల మేటిమగల వెగ డందించినం, బోక పొదువు పాంచాల చేది మాత్స్యాదివర్గంబులపై నతం డనర్గళ ప్రసారంబులగు శరాసారంబులు నిగిడించినం, గరి రథ ఘోటక భటావయవ ఖండంబులును వివిధాస్త్ర శస్త్రశకలంబులును జామర చ్ఛత్ర కేతు భూషణ భాగంబులును భూ భాగంబునం దొరఁగం బెరిఁగి, నెత్తురు టేఱులు వాఱ; మఱియుం బాండవ యోధవరులు వరుసం బోరి పోరి యంత కంతకు నివ్వటిల్లు నాకర్ణు క్రొవ్వున నివ్వెఱ పడిన, నవ్వీరుండు గోవులం దోలు కోల్పులికైవడిఁ గౌంతేయ బలంబులం బఱపఁ, బాంచాలురు వెండియు దండితనంబున నతనిం దలపడిన; నాతండు పంచవింశతి రథికులం దునిమి వైవస్వతు చందంబునం బేర్చినం, దూర్య రవంబులు సెలంగం దత్పుత్రులును దుర్యోధన కృప దుశ్శాసనులు నశ్వత్థామ శకుని కృతవర్మలుం బైకొని, యా ధర్మనందను సైన్యంబు సమయింప; నది విచ్చిన, నెలుం గిచ్చి పోనీక నిలిపి, భీమ నకుల సహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవ సైనికులం గనుపుగొట్టం దొడంగినం, బోరు ఘోరంబయ్యెఁ; నిత్తెఱంగున రెండు దెఱంగుల మూఁకలు దెగటాఱుచుండ, గాండీవి దమ మోహరంబున కుత్సాహం బెసంగ నొక్కవలన మనమొనల నెత్తుటం జొత్తిల్లం జేయుచుం గదిసి, దలయెత్తి చూచి శౌరి నుద్దేశించి.** **172**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; ఆ+దెసన్= ఆ పక్షంలో; చేయన్+కల= సమర్థులైన; మేటి మగల= అధికులైన వారి; వెగడు= భయం; అందించినన్= కలిగించినా; పోక= తృప్తిపడక; పొదువు= పైకొనే; పాంచాల-చేది-మత్స్య; ఆది= మొదలైన; వర్గంబులపైన్= విభాగాలపై; అతండు= ఆ కర్ణుడు; అనర్గళ= అడ్డులేని; ప్రసారంబులు+అగు= వ్యాపకములుగల; శర= బాణాలనే; ఆసారంబులు= జడివానలను; నిగిడించినన్= పెంపొంద చేయగా; కరి; రథ; ఘోటక= గుర్రాల; భట; అవయవ= (వీటి) శరీరభాగాల; ఖండంబులును= తునుకలను; వివిధ+అస్త్ర శస్త్ర; శకలంబులును= ముక్కలును; చామర= వింజామర; ఛత్ర= గొడుగుల; కేతు= పతాకాల; భూషణ= నగల; భాగంబులును= విరిగిన తునుకలున్నూ; భూభాగంబునన్; తొరఁగన్= రాలిపడగా; పెరిఁగి= అతిశయిల్లి; నెత్తురుటేరులు; పారున్= పారగా; మఱియున్; పాండవ; యోధవరులు= యుద్ధంచేసే ప్రముఖ వీరులు; వరుసన్= ఒకరి తర్వాత ఒకరు; పోరి పోరి; అంతకంతకున్= క్రమంగా; నివ్వటిల్లు= అతిశయించే; ఆ కర్ణు; క్రొవ్వునన్= మదమునకు; నివ్వెఱపడిన= చేష్టలు దక్కిన; ఆ+వీరుండు= ఆ శూరుడు కర్ణుడు; గోవులన్ తోలు= ఆవులను తరిమే; కోల్పులికైవడిన్= పెద్దపులివలె; కౌంతేయ బలంబులన్; పఱపన్= పరుగెత్తిపోయేటట్లు చేయగా; పాంచాలురు; వెండియున్= మరల; దండితనంబునన్= శౌర్యంతో; అతనిన్= ఆ కర్ణుడిని; తలపడినన్= ఎదుర్కొనగా; అతండు; పంచవింశతి= ఇరవైఐదుమంది; రథికులన్= రథవీరులను; తునిమి= ఖండించి; వైవస్వతు= యముని; చందంబునన్= విధంగా; పేర్చినన్= అతిశయించగా; తూర్య, రవంబుల్= వాద్యముల ఘోష; చెలంగన్= అతిశయించగా; తద్+పుత్రులును= ఆయన కుమారులును; దుర్యోధన-కృప-దుశ్శాసనులు - అశ్వత్థామ శకుని - కృతవర్మలున్; పైకొని= పైబడి; ఆ ధర్మనందను సైన్యంబు; సమయింపన్= చంపగా; అది= ఆ సైన్యం; విచ్చినన్= చెల్లాచెదరై పరుగెత్తగా; ఎలుంగు+ఇచ్చి= కేకవేసి; పోనీక నిలిపి; భీమ-నకుల- సహదేవ - ధృష్టద్యుమ్న - శిఖండి - ద్రౌపదేయులు= భీముడు, నకులుడు, సహదేవుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి ద్రౌపదిపుత్రులు; కడంగి= పూని; కౌరవసైనికులన్; కనుపుగొట్టన్= ఖండించుటకు; తొడంగినన్= పూనుకొనగా; పోరు= జగడం; ఘోరంబు+అయ్యెన్= భయంకరమయింది; ఈ+తెఱంగునన్= ఈ విధంగా; రెండు తెఱంగుల= ఉభయపక్షాల; మూఁకలు= గుంపులు; తెగటాఱుచుండన్= సంహరించబడుతుండగా; గాండీవి; తమ; మోహరంబునకున్= సేనావ్యూహానికి;

ఉత్సాహంబు; ఎసంగన్= పొంగగా; ఒక్క వలనన్= ఒక ప్రక్కన; మన మొనలన్; నెత్తుట; జొత్తిల్లన్+చేయుచున్= మునుగజేస్తూ; కదిసి= మార్కొని; తలయెత్తి చూచి; శౌరిన్ ఉద్దేశించి= కృష్ణుడితో (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ పక్షంలోని మేటి వీరులను కలతపెట్టి, అంతటితో తృప్తిపడక తనను చుట్టుముట్టిన పాంచాల, చేది, మత్స్యాది రాజవర్గాలపై ఎడతెరిపిలేని బాణవర్షాలు కురిపింపగా రథ గజాశ్వ కాల్బలాల మేని ముక్కలు వివిధాస్త్రాల, రథాంగాల ముక్కలు నేలపై కుప్పలుగా పడ్డాయి. నెత్తురుటేరులు పారాయి. ఆ పాండవవీరులు-వరుసగా పోరిపోరి అంతకంతకు అతిశయించే కర్ణుడి పౌరుషానికి అందరూ నివ్వెరపోయారు. అతడు బెబ్బులి గోవులమందలను తోలినట్లు పాండవసైన్యాలను పరుగెత్తేటట్లు చేశాడు. పాంచాలురు ఇంకా పౌరుషంతో ఎదుర్కోగా కర్ణుడు ఇరవైఅయిదుమంది రథవీరులను చంపి యముడివలె విజృంభించాడు. వాద్యాలు మ్రోగగా, దుర్యోధన కృప దుశ్శాసనాశ్వత్థామ శకుని కృతవర్మాదులు అందరూ కూడి పాండవసైన్యాన్ని చంపగా, అది కకావికలైపోతుండగా, భీమ నకుల సహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులందరు కలిసి గొంతెత్తి దానిని పోనీక నిలిపి కౌరవ సైనికులను చంపసాగారు. అంతట పోరు ఘోరంగా సాగింది. ఈ విధంగా రెండు వైపుల సైన్యాలు చనిపోతూ ఉండగా అర్జునుడు తన యుద్ధవ్యూహంలో ఉత్సాహం అతిశయించగా ఒక్కచోట మొదలుపెట్టి మన కౌరవసైన్యాన్ని రక్తంలో ముంచివేస్తూ సమీపించి, తలయెత్తి చూచి కృష్ణుడితో (ఇట్లా అన్నాడు).

**విశేషం:** అలంకారం: ఉపమ.

**సీ.** **'కర్ణునికేతువు గ్రాలెడుఁ జూచితే। భీమాదులైన యుద్దామ రథిక**
**జనులు పెక్కండ్రతో నని సేయుచున్నవాఁ। డితని ప్రాపున గురుసుతుఁడు గృపుఁడుఁ**
**గృతవర్మయును గురుపతి సురక్షితుఁ జేసి। కొని, వీఁకఁ బాంచాలకోటి బడలు**
**పఱిచెద రురవడిఁ దఱిమి; యా రాధేయు। గీటడఁగింతము, ఘోటకములఁ**

**తే.** **బటురయమునఁ బోని' మ్మని పలుకుటయును। శౌరి యట్టులు సేయంగ శల్యుఁ డమ్మ**
**హోగ్ర రథవేగమును, నరునుజ్జ్వలంపు। టేపుఁ గని, సూతపుత్రుతో నిట్టు లనియె:** 173

**ప్రతిపదార్థం:** చూచితే?= అదిగో చూచినావా?; కర్ణుని; కేతువు= టెక్కెము; క్రాలెడున్= రెపరెపలాడుతూ మెరుస్తూ ఉంది; భీమాదులు+ఐన= భీముడు మొదలైన; ఉద్దామ= భయంకరులైన; రథికజనులు= రథ సైనికులు; పెక్కండ్రతోన్= చాలామందితో; అని చేయుచున్నవాఁడు= యుద్ధం చేస్తున్నాడు; ఇతని ప్రాపునన్= ఇతడి (కర్ణుడి) అండతో; గురుసుతుఁడు= అశ్వత్థామ; కృపుఁడున్; కృతవర్మయున్; కురుపతిన్; సురక్షితున్ చేసికొని= కాపాడుకొని; వీఁకన్= పట్టుదలతో; పాంచాల; కోటిన్= సమూహాన్ని; ఉరవడిన్= విజృంభణంతో; తఱిమి; బడలు పఱిచెదరు= బాధతో డస్సిపోయేటట్లు చేస్తున్నారు; (కావున) ఆ రాధేయున్= ఆ కర్ణుడిని; గీటు+అడఁగింతము= చంపివేద్దాము; ఘోటకములన్= గుర్రాలను; పటురయమునన్= మహావేగంగా; పోనిమ్ము= తోలుము; అని పలుకుటయున్= అని చెప్పగా; శౌరి= కృష్ణుడు; అట్టులు+చేయంగన్; శల్యుఁడు= కర్ణుడి సారథి అయిన శల్యుడు; ఆ+మహా+ఉగ్ర= ఆ తీవ్రమైన; రథవేగమును; నరు= అర్జునుడి; ఉజ్జ్వలంపు; ఏపున్= మిరుమిట్లు గొలిపే ఉద్ధతిని; కని= చూచి; సూతపుత్రునితోన్; ఇట్టులు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** అదిగో - కర్ణుడి టెక్కెం ఎలా మిరుమిట్లు గొలుపుతూ మెరుస్తున్నదో చూడు! భీముడు మొదలైన ఉద్దండ రథయోధులు పెక్కండ్రతో యుద్ధం చేస్తున్నాడు. కర్ణుడి అండ చూచుకొని అశ్వత్థామాదులు దుర్యోధనుడికి

రక్షణ కల్పిస్తూ, పాంచాల సైనికసమూహాలను అలసిపోయేటట్లు చేస్తున్నారు. వేగంగా వెంటాడి ఆ కర్ణుని హతమారుద్దాము. గుర్రాలను వేగంగా తోలుము' అని చెప్పగా కృష్ణుడు అట్లాగే చేశాడు. కర్ణుడి తేరు తోలుతున్న శల్యుడు అర్జునుడి రథవేగ తీవ్రతను, అతని దేదీప్యమానమైన విజృంభణమును చూచి, కర్ణుడితో ఇట్లా అన్నాడు.

**క. 'కేతన కపి భయదంబై । తోఁతేరఁగఁ, జక్రధర చతుర సారథ్య**
**ద్యోతితవల్గన చారు । శ్వేతహరులు మెఱయ వచ్చు వీరునిఁ గంటే!' 174**

**ప్రతిపదార్థం:** కేతనకపి= పతాకంలో ఉన్న హనుమంతుడు; భయదంబు+ఐ= భయాన్ని పుట్టిస్తూ; తోఁతేరఁగన్= రాగా; చక్రధర= కృష్ణుడి; చతుర= చాకచక్యమైన; సారథ్య= సారథ్యం చేత; ద్యోతిత= ప్రకాశించిన; వల్గన= అశ్వగతుల వలన; చారు= అందగిస్తున్న; శ్వేతహరులు= తెల్లగుర్రాలు; మెఱయన్= దీపించగా; వచ్చు; వీరునిన్= అర్జునుడిని; కంటే?= చూచావా?

**తాత్పర్యం:** 'కపిధ్వజం భయంకలిగిస్తూ కనిపించగా, కృష్ణుడి నిపుణమైన రథసారథ్యంవలన చిత్రవిచిత్రంగా దూకుతున్న ఆ తెల్లని రథాశ్వాలూ వెలుగొందగా వస్తున్న అర్జునుడినీ చూచావా?'

**వ. అని మఱియును; 175**

**తాత్పర్యం:** అని ఇంకా. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. 'నవ్వెడు తలలను, గ్రొవ్వారు చేతుల । బిరుదులు వెట్టిన చరణములను,**
**వాతులు దెఱచిన వాజి మస్తకముల, । గిరిశృంగములఁ బోని కరిశిరముల,**
**నవయవ భేదంబు లడఁగెడునట్లుగఁ దుము । రైన బహుగాత్ర సముదయముల**
**భయదంబు లై మహిఁ బడు విమానములట్ల । యఱవఱ లైనట్టి యరదములను**

**తే. నేలఁ గప్పుచుఁ; దన బాణ జాల మదర, । నెవ్వ రడ్డము సొచ్చిన నించుకయును**
**దవులఁబడక, సముద్ధతిఁ దివిరి మనలఁ । దేఱి చూచుచుఁ బార్థుఁ డీ దిక్కు గవిసె. 176**

**ప్రతిపదార్థం:** నవ్వెడు తలలను= నవ్వుతున్న తలలను; క్రొవ్వారు= బలసిన; చేతులను; బిరుదులు పెట్టిన= విజయ చిహ్నాలుగా పెట్టబడిన కాలి కంకణాలు మొదలైన వాటితో ఉన్న; చరణములను= కాళ్ళను; వాతులు= నోళ్ళు; తెఱచిన; వాజి= గుర్రాల; మస్తకములన్= తలలను; గిరిశృంగములన్= కొండకొమ్ములను; పోని= పోలిన; కరిశిరములను= ఏనుగు తలలను; అవయవ భేదంబు= అంగముల భేదం; అడఁగెడునట్లుగన్= తెలియకుండా పోయేటట్లుగా; తుమురు+ఐన= చిదురైన; బహుగాత్ర= అనేక శరీరాల; సముదయములన్= సమూహాలను; భయదంబులు+ఐ= భీతి కొలుపునవై; మహిన్‌పడు= భూమిపై పడుతున్న; విమానములు+అట్ల= ఆకాశంలో ఎగిరే విమానాలవలె (ఇది కవి ఊహాశక్తికి తార్కాణం); అఱవఱలు+ ఐనట్టి= ముక్కలు ముక్కలు ముక్కలైనట్టి; అరదములన్= తేరులను; నేలన్ కప్పుచున్= భూమిమీద అంతా పరచిపెట్టుతూ; తన బాణజాలము+అదరన్= తన బాణసమూహం విజృంభిస్తూ ఉండగా; ఎవరు; అడ్డము; చొచ్చినన్= దూరినా; ఇంచుకయును= కొంచెమైనా; తవులఁబడక= నిరోధించబడక; సముద్ధతిన్= దుడుకుతనంతో; తివిరి= ప్రయత్నించి, పూని; మనలన్; తేఱి చూచుచున్= బాగా పరికిస్తూ; పార్థుఁడు= అర్జునుడు; ఈ దిక్కు; కవిసెన్= అలముకొన్నాడు.

**తాత్పర్యం:** (ముక్కలైపోయి, రణరంగాన్నంతా పరుచుకొనిపోయి, భయానికి అందాన్ని చేకూరుస్తున్న దృశ్యాన్నంతా బాగా పరిశీలించి శల్యుడు వర్ణిస్తున్నాడు.) 'నవ్వుతుండగా నరికివేయబడిన ఆ తలల్లో నవ్వు ఇంకా మాసిపోలేదు. కండలు తిరిగిన చేతులు తునుకలై ఉన్నవి. జయచిహ్నాలైన వీరుల ఉంగరాలతో ఉన్న కాళ్ళు, నోరులు తెరచికొని ఉన్న గుర్రాల తలలు, కొండకొమ్ముల పోలిన ఏనుగుల శిరస్సులు, తల, తోక తెలియని విధంగా నరుకబడి ఉన్న శరీర సముదాయాలు, భయంకరములై నేల గూలు విమానాలవలే ముక్కలు ముక్కలైన తేరులు రణభూమినంతా కప్పివేసి ఉన్నవి. తన శరపరంపర అతిశయిల్లుతుండగా, ఎవరు అడ్డం వచ్చినా లెక్కచేయక ఎదుర్కొంటూ చెలరేగి పార్థుడు చుట్టుపట్ల పరికించి చూస్తూ, మన దిక్కుకు తరలివచ్చాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ. (కాలి బొటనవ్రేలికి పెట్టిన ఉంగరాన్ని మద్దియ అంటారు. పూర్వం విజయి అయిన రాజు ఓడిన రాజులపేర్లు చెక్కిన మద్దియ ఉంగరాన్ని ధరించి అని, అర్థం. తమిళ మహాకవి- కంబరు దశరథుడికి ఈ మద్దియలను తొడిగి వర్ణిస్తాడు. తిక్కన కాకతివీరుల కాళ్ళలో వీటిని చూచినాడు కాబోలు)

**క. తోడై డాపట వలపటఁ । గూడి తఱుమువారు లేరు; కోపంబున నీ**
**తోడి బవరమున కడరెడుఁ । గ్రీడి; మనతలంపు గూడె, గెలుపుము గడఁకన్.** **177**

**ప్రతిపదార్థం:** (అట్లు రేగిన అర్జునుడికి) తోడై= తోడుగా; డాపటన్= ఎడమప్రక్క; వలపటన్= కుడిప్రక్క; కూడి= చేరి, తఱుమువారు లేరు; కోపంబునన్; నీతోడి= నీతో; బవరమునకున్= యుద్ధానికి; క్రీడి= అర్జునుడు; అడరెడున్= విజృంభించాడు; మన తలంపు= మన యోచన; కూడెన్= ఫలించింది; కడఁకన్= ప్రయత్నంతో; గెలువుము;

**తాత్పర్యం:** 'అర్జునుడి కుడి ఎడమల కూడి పోరాడేవారు లేరు. కోపంతో తా నొక్కడే నీతో యుద్ధానికి విజృంభించి వస్తున్నాడు. మన ఆలోచన కలిసి వచ్చింది. పూనికతో జయించుము.

**ఆ. పాయ వడియె సేన; బరవస మలరంగ । మార్కొనంగ మేటిమగఁ డొకండుఁ**
**గలుగ నోపఁ, డేపు దలకొన మనమ యి ।బ్బలియుఁ దలపడంగ వలయుఁ గర్ణ!** **178**

**ప్రతిపదార్థం:** కర్ణ!; సేన; పాయ పడియెన్= చీలింది; బరవసము= ధైర్యము; అలరంగన్= ఒప్పారగా; మార్కొనంగన్= ఎదుర్కొనటానికి; మేటిమగండు= సమర్థుడైన వీరుడు; ఒకండు= ఒక్కడూ; కలుగన్ ఓపఁడు= సిద్ధమవటానికి చాలడు; మనము+అ= మనమే; ఈ+బలియున్= ఈ బలశాలిని; ఏపు= పెంపు; తలకొనన్= కూడివచ్చేటట్లు; తలపడంగన్ వలయున్= ఎదుర్కొనాలి.

**తాత్పర్యం:** కర్ణా! సైన్యం పాయలుగా చీలిపోయింది. ఉత్సాహంతో శత్రువు నెదుర్కొనే సామర్థ్యం కలిగిన ప్రతాపశాలి ఒక్కడూ కనపడటంలేదు. కాబట్టి మనమే శక్తిని పెంచుకొని, ఈ బలవంతుడితో తలపడవలసి ఉన్నది.'

**వ. అనిన విని, కర్ణుండు గవ్వడి బాహాబలంబును శౌర్య సారంబును దపః ప్రభావంబును ముక్కంటితోడ నెక్కటి పోరుటయును బాశుపతాది దివ్యాస్త్రంబులు వడయుటయును, బురందర ప్రముఖ బృందారకులకు నజయ్యులగు కాలకేయుల నిర్జించుటయు విరాటు పసుల మరల్చుటయు లోనుగాఁ గల విశేషంబు లుగ్గడించి, కృష్ణుమాహాత్మ్యంబు వొగడి: 'యిట్టివారల నే నొక్కరుండన మార్కొని మదం బడఁగించెద**

**మద్రనాయక! మన తేరు వారి యరదంబునకు సమ్ముఖంబుగాఁ జననిమ్మనిన, నతం డట్ల చేయఁ గనుంగొని, కురుపతి పురికొలుపఁ గృపకృతవర్మ గురుపుత్ర గాంధార విభులును గొందఱు కుమారులును విక్రమాటోపంబు దీపింప నయ్యంగరాజుం గడచి యడరి యాఫల్గునుం బొదివిన, నమ్మహాభుజుండు హరిణ కులంబు గనిన సింగంబు విధమున విజృంభించి, యా రథికులపైఁ గలయ వివిధ విశిఖంబులు నిగిడించి, ధనువులు దునిమియు, ఘోటకంబులఁ గూల్చియు సారథుల సమయించియుఁ దత్సేనా చతురంగంబుల బడలుపఱిచియు నబ్బలు మగలం దెరల్చి యొత్తరించి, కెలనన దురంబు సేయు నమ్మరుత్తనయుం జేరం జని, బహువిరోధిజన పయోధిమగ్నుం డగుచున్న యతని నుద్ధరించి, సంప్రీతుం డగు నతనికి నగ్రజుకుశలం బెఱింగించి సంతోష సాగరంబునం దేల్చి, 'నీ విఁక డప్పి యార్చికొ'మ్మని పలికి, రాధేయ రభసోత్సాహ సహితం బగు నీ బలంబుమీఁదం గవిసిన. 179**

**ప్రతిపదార్థం:** అనిన విని; కర్ణుండు; కవ్వడి= సవ్యసాచియొక్క; బాహాబలంబును= భుజబలాన్ని; శౌర్య సారంబును= ప్రతాపపు నిగ్గును; తపః ప్రభావంబును= తపస్సు కలిగించిన శక్తిని; ముక్కంటితోడన్= శివుడితో; ఎక్కటిపోరును= ఒంటరిగా చేసిన పందెపు జగడాన్నీ; పాశుపత+ఆది= పాశుపతము మొదలైన; దివ్య= దైవ ప్రభావం కలిగిన; అస్త్రాలను; పడయుటయును= పొందటాన్ని; పురందర= ఇంద్రుడు; ప్రముఖ= మొదలైన; బృందారకులకున్= దేవతలకు; అజయ్యులు+అగు= జయింపవీలుకాని; కాలకేయుల; నిర్జించుటయున్= ఓడించటాన్ని; విరాటు; పసులన్= పశువులను; మరల్చుటయున్= వెనుకకు మరలించటాన్ని; లోనుగాన్ కల= మొదలైన; విశేషంబులు= అతిశయాలను; ఉగ్గడించి= పొగడి; కృష్ణుమాహాత్మ్యంబు; పొగడి= ప్రశంసించి; ఇట్టివారల; నేను+ఒక్కరుండను+అ= నేను ఒక్కడినే; మార్కొని= ఎదిరించి; మదంబు+అడఁగించెదన్= పొగరు అణగగొట్టుతాను; మద్రనాయక!= శల్యా!; మనతేరు; వారి; అరదంబునకున్= తేరునకు; సమ్ముఖంబుగాన్= ఎదురుగా; చననిమ్ము= పోనిమ్ము; అనినన్; అతండు; అట్లు+చేయన్= ఆ ప్రకారమే చేయగా; కనుంగొని; కురుపతి= దుర్యోధనుడు; పురికొలుపన్= ప్రేరేపింపగా; కృప-కృతవర్మ-గురుపుత్ర-గాంధార విభులును; కొందఱు కుమారులును; విక్రమ+ఆటోపంబు= శౌర్యవిలసనం; దీపింపన్; ఆ+అంగరాజున్= ఆ కర్ణుడిని; కడచి= దాటి; అడరి= విజృంభించి; ఆ ఫల్గునున్= అర్జునుడిని; పొదివినన్= చుట్టుముట్టగా; ఆ+మహాభుజుండు= ఆ బాహుబలదర్పితుడు; హరిణకులంబున్= జింక జాతిని; కనిన= చూచిన; సింగంబు విధమునన్= సింహంవలె; విజృంభించి; ఆ రథికులపైన్= ఆ యోధులపై; కలయన్= అంతటా; వివిధ= నానావిధాలైన; విశిఖంబుల= బాణాలను; నిగిడించి= ప్రయోగించి; ధనువులు తునిమియున్= ధనుస్సులను విరుగగొట్టి; ఘోటకంబులన్= గుర్రాలను; కూల్చియున్= పడగొట్టియు; సారథులన్; సమయించియున్= చంపియు; తద్=ఆ; సేనా= సేనలోని; చతురంగబలంబులన్; బడలు పఱిచియున్= అలయింపచేసియు; ఆ+బలుమగలన్= బలవంతులైన ఆ మొనగాండ్రను; తెరల్చి= తొలగించి; ఒత్తరించి= ఆక్రమించి; కెలనన= సమీపాన; దురంబు చేయు= యుద్ధం చేస్తున్న; ఆ+మరుత్+తనయున్= ఆ భీముడిని; చేరన్+చని సమీపించి; బహువిరోధిజన= పెక్కుమంది విరోధిజనమనే; పయోధిమగ్నుండు+అగుచున్న= సముద్రంలో మునిగిపోతున్న; అతనిని= భీముడిని; ఉద్ధరించి= పైకి తేల్చి; సంప్రీతుండు+అగు= మిక్కిలి సంతోషించినవాడగు; అతనికిన్; అగ్రజు= అన్న; కుశలంబు+ ఎఱింగించి= క్షేమం తెలిపి; సంతోషసాగరంబునన్= సంతోషము అనే సముద్రములో; తేల్చి= తేల చేసి; నీవు; ఇఁక; డప్పి= బడలిక; ఆర్చికొమ్ము+అని= తీర్చుకొమ్మని; పలికి; రాధేయ; రభస+ఉత్సాహ= సంతోషాతిశయంతో; సహితంబు+అగు= కలిసికొని ఉన్న; నీ బలంబుమీఁదన్= నీ సేనపై; కవిసినన్= పైబడగా;

**తాత్పర్యం:** అనగా విని, కర్ణుడు పార్థుడి బాహుబలాన్నీ, పరాక్రమాన్నీ, తపఃప్రభావాన్నీ, శివుడితో చేసిన ఒంటరిపోరునూ, పాశుపతాలవంటి దివ్యాస్త్రాలను పొందటాన్నీ, ఇంద్రాదులకు అసాధ్యులైన కాలకేయులను

జయించటాన్నీ, విరాటుడి గోవులను మళ్ళించటాన్నీ, ఇట్లా అనేక విశేషాలను పేర్కొని, కృష్ణమాహాత్మ్యాన్ని పొగడి, 'అటువంటి వీరులను నేనొక్కడినే ఎదుర్కొని వారి మదాన్ని అణగిస్తా'నని అన్నాడు. 'ఓ శల్యా! మన రథాన్ని వారి తేరుకు ఎదురుగా పోనిమ్మ' అన్నాడు. శల్యు డట్లాగే చేశాడు. అంతలో దుర్యోధనుడి ప్రేరణతో కృపుడు, కృతవర్మ, అశ్వత్థామ, శకుని, కొందరు కుమారులను కర్ణుడికంటె ముందుగానే సాగి, అర్జునుడిని చుట్టుముట్టారు. లేళ్ళగుంపును చూచిన సింహంవలె అర్జునుడు వారిమీద విజృంభించి, బాణాలతో వారి విండ్లను, గుర్రాలను, సారథులను నశింపజేసి వారి చతురంగ బలాలను బలహీనపరిచాడు. వారిని చంపి, సమీపంలో యుద్ధం చేస్తున్న భీముడివద్దకుపోయి, పెక్కుమంది విరోధులనే సముద్రంలో మునిగిఉన్న అతడిని ఉద్ధరించి, అతడిని సంతోషపెట్టి, ధర్మరాజుకుశలాన్ని తెలిపి, ఆనందపరచి, 'ఇక నీవు బడలిక తీర్చుకొనుము' అని చెప్పి, కర్ణుడి సైన్యంమీద దాడి చేశాడు.

### కురుకుమారులు పదుగు రర్జునుం దాఁకి మృతు లగుట (సం. 8-58-23)

**చ.** **తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భట సింహనాదు లై**
**వడిఁ దనుఁ జుట్టుముట్టుటయు, వారల సూత హయధ్వజంబులం**
**బొడి పొడి సేసి, యాతఁడు రిపుల్ వెగడంద వెడంద తూపులన్**
**మెడలు దెగంగ నేసి రణమేదినికిన్ బలి సేసె నత్తలల్.** **180**

**ప్రతిపదార్థం:** తొడరి= పూని కూడినవారై; భవత్తనూజులు= నీ కుమారులు; పదుండ్రు= పదిమంది; సముద్భట= గొప్పవైన; సింహనాదులై= సింహ గర్జనలతో; వడిన్; తనున్= తనను; చుట్టుముట్టుటయున్= చుట్టుముట్టగా; వారల= వారి; సూత= సారథి; హయ; ధ్వజంబులన్; పొడి పొడిచేసి; ఆతఁడు= ఆ అర్జునుడు; రిపుల్ వెగడందన్= శత్రువులు భయకంపితులు కాగా; వెడంద= వెడల్పు అయిన; తూపులన్= బాణాలతో; మెడలు తెగంగన్; ఏసి= ప్రయోగించి; రణ మేదినికిన్= యుద్ధభూమికి; ఆ+తలల్= వారి తలలను; బలి చేసెన్= బలిగా ఇచ్చాడు.

**తాత్పర్యం:** పూనుకొని నీ కొడుకులు పదిమంది, సింహాలవలె గర్జిస్తూ అర్జునుని చుట్టుముట్టగా, ఆయన వారి సారథులను, గుర్రాలను, జెండాలను పిండి పిండిగా చేశాడు. వెడల్పు అయిన బాణాలతో మెడలు తెగనరికి, ఆ తలలను యుద్ధభూమికి బలిగా సమర్పించాడు.

**వ.** **అట్టియెడ.** **181**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **నవతి కౌరవ రథికులు గవిసి కడిమిఁ। బొదువుటయు, నన్ని శరముల భూరి రయము**
**మెఱయ నందఱఁ దెగటార్చి తఱుము నతనిఁ। దాఁకె వేయుమున్నూఱు దంతావళములు.** **182**

**ప్రతిపదార్థం:** నవతి= తొంబదిమంది; కౌరవ రథికులు= కౌరవ రథసైనికులు; కవిసి= పైబడి; కడిమిన్= పట్టుదలతో; పొదువుటయున్= మార్కొనగా; అన్ని శరములన్= రథికుల సంఖ్యతో సమానమైన బాణాలతో; భూరి రయము= అత్యంత వేగం; మెఱయన్= తళుకొత్తగా; అందఱన్; తెగటార్చి= చంపి; తఱుము= (మిగిలినవారిని) తరిమికొట్టే; అతనిన్= ఆ అర్జునుడిని; వేయుమున్నూఱు= పదుమూడువందల; దంతావళములు= ఏనుగులు; తాఁకెన్= పైనపడ్డాయి.

**తాత్పర్యం:** ఇట్లా వీరవిహారం చేస్తున్న అర్జునుడిని, తొంబదిమంది కౌరవ రథికులు పైనబడి, పేర్చిన పట్టుదలతో చుట్టుముట్టినారు. ఒక్కొకరిని ఒక్కొక్క బాణంతో మహావేగంతో అర్జునుడు అందరినీ చంపివేశాడు. ఇంకా మిగిలి ఉన్నవారిని వెంటాడుతున్న ఆ అర్జునుడిపైకి పదమూడు వందల ఏనుగులు దూకాయి.

**వ.** **ఇట్లు దాఁకిన, యాభీరాది మ్లేచ్ఛనికరంబుల నతం డనేకవిధ విశిఖంబుల విరియింపం, బై పైఁ గరి తురగ సుభట రథ సమూహమ్ములు గ్రమ్మినం, గని కడంగిన వడముడి తోడ్పాటునం జేడ్పడియు నవి వోక పాదివి పెనంగిన, గద గొని యరదంబు డిగ్గి యగ్గలిక నప్పవనతనయుండు దారుణ రణ విహారంబుననెఱయ, మెఱయం; దఱుచుగా మెఱుంగు వాలంపగములు గాండీవి గుప్పింప నప్పు డమ్ముఖంబు చతురంగంబులయం దొక్కఁడేనియు రక్తంబునం దోఁగనియట్టిది లేక యుండె; నట్లు గార్చిచ్చు వొదివిన కాననంబు చందం బయి యా సైన్యంబు రూపఱ విఱిగి 'కర్ణ! కర్ణ! కావు కావు'మను నెలుంగులతో నతనివెనుక కొదిఁగిన నీ కొడుకు లబ్బలుమగని బలసి నిలువ, నా వీరుండు దీవికైవడి సమరార్ణవంబున మునుంగ నీక యమ్మోహరంబు నుద్ధరించి, మౌర్విఁ దాటించి కిరీటి దెసకు నడరె; నంతకు మున్న యరదం బెక్కి యనిలతనయుం డా ధనంజయునిం గూడుకొనిన నయ్యిరువురకుం దల కడచి పాంచాలు రా సూతనందనుం దలపడుటయు.** **183**

**ప్రతిపదార్థం:** ఇట్లు తాఁకినన్= ఇట్లా పైనబడగా; ఆభీర+ఆది= ఆ భీరదేశస్థులు మొదలైన; మ్లేచ్ఛ= హిందువులు కానివారి; నికరంబులన్= సమూహాలను; అతండు; అనేకవిధ= భిన్న స్వరూపాలైన; విశిఖంబులన్= బాణాలతో; విరియింపన్= చంపగా; కరి తురగ-సుభట రథ సమూహమ్ములు; పైన్; క్రమ్మినన్; కని= అది చూచి; కడంగిన= పూనుకొన్న; వడముడి= భీముడి; తోడ్పాటునన్= సహాయంతో; చేడ్పడియున్= బాధింపబడి కూడా; అవి పోక= అవి పోకుండా; పాదివి= పైబడి; పెనంగినన్= పోరాడగా; గద కొని= గద చేపట్టి; అరదంబు డిగ్గి= రథం దిగి; అగ్గలికన్= ఎక్కువైన పూనికతో; ఆ+పవన తనయుండు= ఆ భీముడు; దారుణ= కఠినమైన; రణవిహారంబునన్= యుద్ధ విహారంలో; నెఱయన్= విశేషంగా; మెఱయన్= ప్రకాశిస్తుండగా; తఱుచుగాన్= పదే పదే; గాండీవి; మెఱుంగు; వాలు= పదునైన; అంపగములు= బాణ సమూహాలను; గుప్పింపన్= ప్రయోగించగా; అప్పుడు; ఆ+ముఖంబు= ఆ సైన్యపు ముందుభాగంలో ఉన్న; చతురంగ బలంబులయందున్; ఒక్కఁడేనియున్; రక్తంబునన్= నెత్తుట; తోఁగని అట్టిది= తడియనిది; లేక ఉండెన్= లేకుండింది; అట్లు; కార్చిచ్చు= అడవిమంట; పొదివిన= చుట్టుకొన్న; కాననంబు చందంబు= అడవివలె; అయి= మారి; ఆ సైన్యంబు; రూపు+అఱన్= రూపు పోయేటట్లు; విఱిగి= నాశనమై; కర్ణ! కర్ణ!; కావుకావుమను= రక్షించు-రక్షించుమనే; ఎలుంగులతోన్= కేకలతో; అతని వెనుకకున్; ఒదిఁగిన= ముడుచుకొని దాగుకొన్న; నీ కొడుకులు (కౌరవులు) ఆ+బలుమగని= ఆ మహాబలుని; బలసి నిలువన్= చుట్టూ నిలబడగా; ఆ వీరుండు= కర్ణుడు; సమర+అర్ణవమునన్= యుద్ధమనే సముద్రంలో; దీవి కైవడిన్= దీవి మాదిరిగా; మునుంగనీక= మునిగిపోకుండా కాపాడి; ఆ మోహరంబును= ఆ సేనా వ్యూహమును; ఉద్ధరించి= రక్షించి; మౌర్విన్= అల్లెత్రాడును; తాటించి= బిగించి; కిరీటి దెసకున్; అడరెన్= విజృంభించినాడు; అంతకున్ మున్న= అంతకుముందే; అరదంబు+ఎక్కి; అనిలతనయుండు= భీముడు; ఆ ధనంజయునిన్= ఆ అర్జునుడిని; కూడుకొనినన్= కలుసుకొనగా; ఆ+ఇరువురకున్= ఆ యిద్దరికి; తల కడచి= అతిక్రమించి; పాంచాలురు; ఆ సూతనందనున్= ఆ కర్ణుడిని; తలపడుటయున్= ఎదుర్కొనుటయు.

**తాత్పర్యం:** ఇట్లా పై బడగా ఆభీరాది మ్లేచ్ఛుల సమూహాలపై అనేకవిధ బాణాలను ప్రయోగించి, మీదికి చతురంగ సైన్యం క్రమ్ముకొనగా చూచి, భీముడి సహాయంతో వాటిని క్షీణింపజేసినా, అవి పోక క్రమ్ముకొని యుద్ధం చేయగా,

గదను చేపట్టి, రథం దిగి, ప్రయత్నంతో భీముడు భయంకర రణవిహారం చేశాడు. అర్జునుడు వాడి బాణాలను గుప్పించగా, వాటివలన రక్తంకారని సైనికుడు రణరంగంలో ఒక్కడు కూడా లేడు. రక్తం కారని గజాదులు లేవు. ఆ విధంగా కార్చిచ్చు వ్యాపించిన అడవివలె సైన్యం రూపుమాయగా 'కర్ణా! కావుము, కావుము' అని కేకలు వేస్తూ ఆ సైన్యాలు అతడి వెనుకకు ఒదిగాయి. కౌరవులు కూడా అతడి చుట్టూ నిలిచారు. కర్ణుడు దీవివలె సైన్యాన్ని యుద్ధసముద్రంలో మునగకుండా రక్షించాడు. అల్లెత్రాడు బిగించి అర్జునుడివైపు సాగాడు. అంతకుముందే భీముడు రథమెక్కి అర్జునుడితో కలిశాడు. ఆ యిద్దరికంటె ముందుగా పాంచాలురు కర్ణుడిని ఎదుర్కొన్నారు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**తే.** **ద్రౌపదీనందనులును సాత్యకియు లోను । గాఁగఁ బాండవ సైనికోత్కరము గవిసి**
**కూడికొనియెఁ బాంచాలురఁ గురువరేణ్య! యందఱకు నన్నిరూపులై యతఁడు పెనఁగె.** 184

**ప్రతిపదార్థం:** కురువరేణ్య!= ధృతరాష్ట్రా!; ద్రౌపదీ నందనులును= ద్రౌపది కుమారులు; అయిదుగురు; సాత్యకియున్; లోనుగాఁగన్= మొదలగు; సైనిక ఉత్కరము= సైనికుల సమూహం; కవిసి= ఎదుర్కొని; పాంచాలురన్; కూడుకొనియెన్= కలుసుకొన్నాయి; అందఱకున్; అన్నిరూపులై= ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపుగ; అతఁడు= కర్ణుడు; పెనఁగెన్= పోరాడాడు.

**తాత్పర్యం:** కురువంశ శ్రేష్ఠా! ఉపపాండవులు మొదలగు పాండవ సైనికసమూహం ఏకమై పాంచాలబలాన్ని కలుసుకొన్నది. అప్పుడు కర్ణుడు ఒక్కొక్క విరోధికి ఒక్కొక్క రూపై యుద్ధం సాగించాడు.

**వ.** **అప్పుడు.** 185

**తాత్పర్యం:** ఆ సమయంలో.

**సీ.** **జనమేజయునిసూతుఁ దునిమి రథ్యంబుల । నో నేసి, భీమతనూజ నకుల**
**సుతుల చాపములు ఖండితములు సేసి, ధృ । ష్టద్యుమ్ను మావుల సమయఁ జూచి**
**మెయి వెంచి సాత్యకి హయములఁ గూల్చి, కే । కయుకుమారుని జముకడకు ననుపఁ;**
**దజ్జనకుం డల్గి తన్ను నొప్పించి ప్ర । సేనునిఁ దాఁ జూడఁ జెలఁగి చంపు**

**తే.** **టయును, బుత్రశోకంబు గిన్కయు మనంబు । నందుఁ బిరిగొన రాధేయుఁ డతని నఱకె;**
**శినివరుం డొండువాజులఁ దన రథమునఁ । బూన్చికొని వచ్చి, తత్సుతుఁ బొదివె నధిప!** 186

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; జనమేజయుని= జనమేజయునియొక్క; సూతు= తేరు నడుపువానిని; తునిమి= ఖండించి; రథ్యంబులన్= గుర్రాలను; నోనేసి= నొచ్చునట్లు బాణాలు ప్రయోగించి; భీమ తనూజ= భీముడి కొడుకుయొక్క; నకుల సుతుల= నకులుడి కొడుకుయొక్క (వీరి); చాపములు= విండ్లు; ఖండితములు చేసి= తెగగొట్టి; ధృష్టద్యుమ్ను; మావులన్= గుర్రాలను; సమయన్+చూచి= చంపి; మెయి పెంచి= దేహాన్ని ఉబ్బజేసి; సాత్యకి హయములన్ కూల్చి= సాత్యకి గుర్రాలను పడగొట్టి; కేకయ కుమారునిన్; జముకడకున్= యముడివద్దకు; అనుపన్= పంపగా; తద్+జనకుండు= ఆయన తండ్రి; అల్గి= కోపించి; తన్నున్= కర్ణుడిని; నొప్పించి= బాధపెట్టి; ప్రసేనుని; తాన్= తాను; చూడన్= చూస్తుండగనే; చెలఁగి= రేగి; చంపుటయును; పుత్రశోకంబు; కిన్కయున్= కోపమును; మనంబునందున్; పిరి కొనన్= మెలివడగా; రాధేయుడు; అతనిన్;

నఱకెన్; శినివరుండు= సాత్యకి; ఒండు వాజులన్= వేరే గుఱ్ఱాలను; తన రథమునన్= రథమునకు; పూన్చికొని= కట్టుకొని; వచ్చి; తత్సుతున్= అతని కొడుకును; పొదివెన్= చుట్టుముట్టాడు.

**తాత్పర్యం:** కర్ణుడు జనమేజయుడి సారథిని, గుఱ్ఱాలను చంపాడు, భీముడికొడుకు వింటిని, నకులపుత్రుడి వింటిని విరిచాడు. ధృష్టద్యుమ్నుడి గుఱ్ఱాలను చంపాడు. ఆవేశంతో సాత్యకి గుఱ్ఱాలను కూల్చివేశాడు. కేకయ పుత్రుడిని చంపాడు. కేకయరాజు కోపించి కర్ణుడిని నొప్పించి అతడు చూస్తూ ఉండగానే అతడి కొడుకైన ప్రసేనుడిని చంపాడు. కర్ణుడు ఇటు పుత్రశోకం, అటు కోపం మనసులో పెనగొనగా అతడిని చంపాడు. సాత్యకి తన రథానికి మరొకరి గుఱ్ఱాలను పూన్చికొని అతడి కొడుకును చుట్టుముట్టాడు.

**విశేషం:** ఈ జనమేజయుడు కర్ణుడితో పోరాడిన వీరుడు. (పాండవుల మునిమనుమడు కాదు) భారతంలో ప్రస్తావించబడ్డ జనమేజయులు 9 మంది ఉన్నారు. వారిలో ఈ జనమేజయుడు కూడా ఒకడుగా చెప్పబడింది.

**వ. ఇట్లు సూతపౌత్రుఁడగు సుషేణుం బొదివి శినిపౌత్రుండు. 187**

**ప్రతిపదార్థం:** ఇట్లు; సూతపౌత్రుఁడగు= కర్ణుడి మనుమడు అగు; సుషేణున్; పొదివి; శిని పౌత్రుండు= శినిమనుమడు-సాత్యకి.

**తాత్పర్యం:** ఈ విధంగా కర్ణుడి మనుమడైన సుషేణుడిని చుట్టుముట్టి సాత్యకి.

**చ. హయములఁ జంపి, ముప్పది శితాస్త్రములం దెగటార్పఁ జూచి, తం**
**డ్రి యముని చందమై 'తెగితిరే శినివీరుఁడ' యంచు నేయుడు,**
**స్భయద మహోగ్రతన్ నిగుడునారసమున్ నడుమన్ శిలీముఖ**
**త్రయమునఁ ద్రుంచి మేనఁ బ్రదర త్రితయంబు శిఖండి గ్రుచ్చినన్. 188**

**ప్రతిపదార్థం:** హయములన్ చంపి; ముప్పది; శిత+అస్త్రములన్= వాడి ఆయుధాలను; తెగటార్పన్= నాశనంచేయగా; చూచి; తండ్రి; యముని చందమై= యముడివంటివాడై; శినివీరుఁడ!; తెగితిరే= నరుకుడుబడ్డావురా?; అంచున్; ఏయుడున్= బాణాలను ప్రయోగించగా; శిఖండి; భయద= వెరపించే; మహా+ఉగ్రతన్= మహా భయంకరత్వంతో; నిగుడు= వ్యాపించు; నారసమున్= (పైకివచ్చే) బాణాన్ని; నడుమన్= మార్గమధ్యంలోనే; శిలీ ముఖత్రయమునన్= మూడు బాణాలచేత; త్రుంచి= విరుగగొట్టి; మేనన్= శరీరంలో; ప్రదర త్రితయంబు= మూడు బాణాలు; గ్రుచ్చినన్= నాటగా.

**తాత్పర్యం:** గుఱ్ఱాలను చంపి, ముప్పది వాడిబాణాలతో చంపటానికి చూడగా, కర్ణుడు యముడివలె 'శినివీరుడా! చచ్చావురా?' అని భయంకరమైన బాణం వేయగా, శిఖండి మూడుబాణాలతో దానిని విరుగగొట్టి, మూడు బాణాలను అతడి శరీరంలో గ్రుచ్చాడు.

**తే. కనలి యా సూతపుత్రుఁ డాతని సిడంబు । ధనువుఁ దునుమాడి, పార్షత తనయుఁ డగు సు**
**దేవుఁ దండ్రులు గనుఁగొనంగా వధించి, । యేసె సుతసోముఁ డడరిన నేపు దఱుఁగ. 189**

**ప్రతిపదార్థం:** ఆ సూతపుత్రుడు= ఆ కర్ణుడు; కనలి= కోపగించుకొని; ఆతని= శిఖండియొక్క; సిడంబు= ధ్వజాన్ని; ధనువున్; తునుమాడి= విరుగగొట్టి; పార్షత= ద్రుపదునియొక్క; తనయుఁడు+అగు, సుదేవున్; తండ్రులు= వాని జనకులు;

కనుగొనంగాన్= చూస్తూండగానే; వధించి; సుతసోముఁడు; అడరినన్= విజృంభించగా; ఏపు అతిశయం; తఱుఁగన్= తగ్గిపోయ్యేటట్లు; ఏసెన్= బాణాలు ప్రయోగించాడు.

**తాత్పర్యం:** రాధేయుడు కోపోద్రిక్తుడై శిఖండి టెక్కెమును వింటిని విరుగగొట్టి, ద్రుపదుని తనయుడైన సుదేవుడిని అతడి తండ్రులు చూస్తూ ఉండగానే చంపివేసి, సుతసోముడి పొగరు అణగేటట్లు బాణప్రయోగం చేశాడు.

**వ. వెండియుఁ బాంచాల రథిక సంఘంబులు రాధేయుమీఁద నురవణింప, సమీరణసుత సహాయుం డగు సవ్యసాచి వానిం గడచి యక్కర్ణు నరదంబున కడరె; నట్టియెడ నుత్తమౌజుండును జనమేజయుండును యుధామన్యుండును శిఖండియు ధృష్టద్యుమ్నుండును నతనిం దల మిగిలి, యబ్బలుమగనిం బొదివి, యింద్రియంబులు దృఢాత్మునిం గలంపం జాలనిచందంబున నా సూతనందనుఁ దెరల్పం జాలరైరి; వారల కేతు చ్ఛత్ర సూత తురగ ధను స్తూణీరంబులు రేణువులు సేసి బహుబాణంబులఁ దనువులు నోనేసి సింహనాదంబు సేసిన, యయ్యంగపతిపై సుసంగతులై ద్రౌపది కొడుకులు గవిసిరి; వారిం గూడికొని శినివరుం డా సేనాపతి వారి నేయు సాయకంబులు ద్రుంచి, యాతనికిం దోడ్పడుటకుం గడంగిన కౌరవపతి యంగంబున నెనిమిది సునిశిత విశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. 190**

**ప్రతిపదార్థం:** వెండియున్= మరల; పాంచాల; రథిక సంఘంబులు= తేరు భటుల గుంపులు; రాధేయు మీఁదన్; ఉరవణింపన్= ఎదుర్కొనగా; సమీరణ= వాయుదేవుడి; సుత= కొడుకునకు; సహాయుండు+అగు; సవ్యసాచి= అర్జునుడు; వానిన్+కడచి= వాటిని తప్పించుకొని; ఆ+కర్ణు; అరదంబునకున్; అడరెన్= ఆటోపంతో సమీపించినాడు; అట్టి ఎడన్; ఉత్తమౌజుండును - జనమేజయుండును-యుధామన్యుండును-శిఖండియున్-ధృష్టద్యుమ్నుండును; అతనిన్= రాధేయుడిని; తల మిగిలి= అతిశయించి; ఆ+బలుమగనిన్= ఆ మేటి వీరుడిని; పొదివి= చుట్టుముట్టి; ఇంద్రియంబులు; దృఢ+ఆత్మునిన్= ధీరచిత్తుడిని; కలంపన్+ చాలని= కలవరపెట్టజాలని; చందంబునన్= విధంగా; ఆ సూతనందనున్= కర్ణుడిని; తెరల్పన్+చాలరైరి= వెనుకకునెట్టి వేయ శక్తిమంతులు కాలేకపోయారు; వారల= వాళ్ళ; కేతు; ఛత్ర; సూత; తురగ; ధనుస్; తూణీరంబులు= అమ్ముల పొదులును; రేణువులు= దుమ్ము; చేసి; బహు బాణంబులన్; తనువులు= దేహాలు; నోనేసి= నొచ్చునట్లు చేసి; సింహనాదంబు చేసినన్= సింహగర్జన చేయగా; ఆ+అంగపతిపైన్= ఆ కర్ణుడిపై; ద్రౌపది కొడుకులు; సుసంగతులై= చక్కగ కూడినవారై; కవిసిరి= పైనపడ్డారు; శినివరుండు= సాత్యకి; వారిన్ కూడికొని; ఆ సేనాపతి; వారిన్+ఏయు= వారిపై ప్రయోగించే; సాయకంబులు= బాణాలను; త్రుంచి; ఆతనికిన్= అతడికి; తోడ్పడుటకున్; కడంగినన్= పూనుకోగా; కౌరవపతి= దుర్యోధనునియొక్క; అంగంబునన్= శరీరంలో; ఎనిమిది; సునిశిత= మిక్కిలి వాడియైన; విశిఖంబులన్; గ్రుచ్చి; పేర్చినన్= అతిశయించగా.

**తాత్పర్యం:** మరల కర్ణుడిమీద పాంచాల రథవీరులు దాడి ముమ్మరం చేశారు. భీమసహాయుడైన అర్జునుడు వాళ్ళను దాటి, కర్ణుడి రథాన్ని సమీపించాడు. అప్పుడు ఉత్తమౌజుడు, జనమేజయుడు, యుధామన్యుడు, శిఖండి, ధృష్టద్యుమ్నుడూ అతడిని దాటి కర్ణుడిని చుట్టుముట్టి, ఇంద్రియాలు స్థిరచిత్తుడిని ఎట్లా కలత చెందింపజేయలేవో అట్లాగే వారందరూ కలిసికూడా కర్ణుడిని ఓడించలేకపోయారు. కర్ణుడు వారందరి ధ్వజాలను, సారథులను, గొడుగులను, గుర్రాలను, విండ్లను, అమ్ముల పొదులను నుగ్గునుగ్గుచేసి సింహనాదం చేశాడు. అప్పుడు ద్రౌపది కొడుకులు కర్ణుడిని చుట్టుముట్టారు. వారితో కలిసి శినివరుడు కర్ణుడు వేసే బాణాలను త్రుంచాడు. కర్ణుడికి తోడ్పడాలని యత్నించిన దుర్యోధనుడి శరీరంలో వాడి అయిన ఎనిమిది బాణాలను గ్రుచ్చి అతిశయించాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. అలిగిన యన్నరనాథుని । కెలఁకుల వెసఁ దఱిమి, కర్ణ కృప కృతవర్మల్**
**బలుతూపుల నేయఁగ న । న్నలువుర స్రుక్కించె నతఁడు నారాచములన్. 191**

**ప్రతిపదార్థం:** అలిగిన= కోపపడిన; ఆ+నరనాథుని= ఆ దుర్యోధనుని; కెలఁకులన్= ప్రక్కలకు; వెసన్+తఱిమి= వెంటనే తరిమి; కర్ణ-కృప-కృతవర్మల్; బలుతూపులన్+ఏయఁగన్; ఆ+నలువురను= ఆ నలుగురిని; అతఁడు; నారాచములన్= బాణాలతో; స్రుక్కించెన్= అలయింపచేశాడు.

**తాత్పర్యం:** అర్జునుడు కోపపడిన దుర్యోధనుడి చుట్టుప్రక్కల వారిని తరమికొట్టగా, కర్ణాదులు బాణ పరంపరను విసరారు. ఆ నలుగురిని అతడు అమ్ములతో అదరగొట్టి అలసిపోయేటట్లు చేశాడు.

**తే. దొరలఁ గడఁచి బలంబు లుద్ధురత నిగుడ । వారి మొనలు నెదిర్చిన, ఘోర తుముల**
**సంగరంబయ్యెఁ; నయ్యవసరమునందుఁ । దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ. 192**

**ప్రతిపదార్థం:** దొరలన్= నాయకులను; కడఁచి= దాటి; బలంబులు; ఉద్ధురతన్= గర్వంతో; నిగుడన్= రేగగా; వారి= కౌరవులయొక్క; మొనలు= సైన్యాలు; ఎదిర్చినన్= ప్రతిఘటించగా; ఘోర; తుముల= దొమ్మిరూపంలో; సంగరంబు+అయ్యెన్= యుద్ధం జరిగింది; ఆ+అవసరమునందున్= ఆ సమయంలో; దుశ్శాసనుఁడు; వాయుతనయుతోడన్= భీముడితో; తాఁకెన్= తలపడ్డాడు.

**తాత్పర్యం:** చమూపతులు చాలామందిని దాటుకొని పాండవసేనలు గర్వంతో చెలరేగగా, కౌరవసేనలు కూడ గట్టిగా ఎదిరించాయి. దీనితో ఇరువాగుల మధ్య దొమ్మిపోరు రేగింది. ఇట్టి దశలో దుశ్శాసనుడు భీముడితో తలపడ్డాడు.

### దుశ్శాసనుఁడు భీమసేనునితోఁ బోరి చచ్చుట (సం. 8-60-29)

**తే. సారథుల యుబ్బు వాజుల చటులతయును । మెఱయ నొప్పారు తేరుల మీఁదఁ బొలిచి**
**రపుడు గయ్యంపు వేడుక, నాతఁడును న । తండుఁ జూపఱ కన్నులపండు వగుచు. 193**

**ప్రతిపదార్థం:** సారథుల= తేర్లు తోలేవారి; ఉబ్బు= సంతోషాతిశయం; వాజుల= గుఱ్ఱాల; చటులతయును= మిరుమిట్లు కొలిపే సంచారం; మెఱయన్= మెరుస్తుండగా; ఒప్పారు= సొంపుమీరే; తేరులమీఁదన్= రథాలమీద; అప్పుడు; కయ్యంపు వేడుకన్= యుద్ధంమీది అభిలాషతో; అతఁడును= దుశ్శాసనుడు; అతండున్= భీముడును; చూపఱ= ప్రేక్షకులకు; కన్నుల పండువు+అగుచున్= చూపులకు విందు ఔతూ ఉండగా; పొలిచిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** సారథుల సంతోషాతిశయం, గుఱ్ఱాల కదలిక మెరుస్తుండగా, యుద్ధాన్ని ఒక వినోదక్రీడగా చూచేవారి కండ్లకు విందుగా, భీమదుశ్శాసనులిద్దరు యుద్ధంమీది అభిలాషతో వారి రథాల్లో ప్రకాశించారు.

**క. ఒండొరులమీఁద నుజ్జ్వల । కాండము లడరించు చట్లు గదిసినయెడ, భీ**
**ముండు ప్రమోదభరిత చి । త్తుం డయి, తగ నిట్టు లనియె దుశ్శాసనుతోన్. 194**

**ప్రతిపదార్థం:** ఒండొరుల మీఁదన్= ఒకరిపై నొకరు; ఉజ్జ్వల= ప్రకాశమానమైన; కాండములు= బాణాలు; అడరించుచున్= ప్రయోగిస్తూ; అట్లు= ఆ విధంగా; కదిసిన, ఎడన్= కలియబడినప్పుడు; భీముండు; ప్రమోద భరిత= సంతోషంతో నిండిన; చిత్తుండు+ఐ= మనస్సు కలవాడై; దుశ్శాసనుతోన్; తగన్= ఒప్పిదంగా; ఇట్టులు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** భీమ దుశ్శాసనులు ఒకరిమీద ఒకరు బాణాలు ప్రయోగించుకొంటూ, కలియబడినప్పుడు భీముడు ఆనందంతో ఉప్పొంగి దుశ్శాసనుడితో సమయోచితంగా ఇట్లా అన్నాడు.

**ఉ. 'ఆ సభలోనఁ గొన్నఋణ మంతయు నీఁగఁగఁ గంటి వడ్డితోఁ;**
**బాస కొకింతయుం దొలఁగఁ బాఱక తీర్చెద నిప్డు; నేఁడు నా**
**చేసినపుణ్య మెవ్వరును జేయరు; ని న్నిటు సేరఁ దెచ్చుటం**
**జేసి విధాత నాకుఁ గృప సేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా!' 195**

**ప్రతిపదార్థం:** తమ్ముఁడా! ఆ సభలోనన్+కొన్న= ఆ (కౌరవ) సభలో తీసికొన్న; ఋణము+అంతయున్= అప్పంతయు; వడ్డితోన్= వడ్డీతో సహా; ఈఁగఁగన్= తీర్చటానికి; కంటిన్= నోచుకొన్నాను; బాసకున్= చేసిన ప్రతిజ్ఞకు; ఒకింతయున్= కాస్తకూడా; తొలఁగన్ పాఱక= తొలగిపోక; ఇప్డు= ఇప్పుడే; తీర్చెదన్= తీరుస్తాను; నేఁడు= ఈ దినము; నా చేసిన పుణ్యము= నేను కావించిన సుకృతం; ఎవ్వరును+చేయరు= ఎవరూ చేయలేదు; నిన్నున్+ఇట్లు; చేరన్+తెచ్చుటన్= తీసికొనివచ్చుటను; చేసి= సమకూర్చి; విధాత= బ్రహ్మదేవుడు; నాకున్; కృప+చేయుట= అనుగ్రహం చూపుట; కానఁగన్+వచ్చెన్= గోచరించినది; (ఈ పట్టున తమ్ముడా! అనే సంబోధన అవహేళనతో కూడినది).

**తాత్పర్యం:** 'తమ్ముడా! ఆనాడు సభలో (అవమానాలను) నీ దగ్గర అప్పుగా తీసికొన్నాను. తప్పక ఇప్పుడు ఆ ఋణాన్ని వడ్డీతో సహా తీరుస్తాను. అప్పుడు చేసిన శపథాన్ని రవ్వంతకూడా జవదాటను. నా అంతటి పుణ్యాత్ములు ఇంకెవరూ లేరు. ఆ విధాత నిన్ను నేడు ఇక్కడకు తీసికొనిరావటం నా పట్ల చూపిన అనుగ్రహంగానే కనబడుతున్నది.'

**వ. అనిన విని, యతఁ డతని కిట్లనియె. 196**

**ప్రతిపదార్థం:** అనినన్ విని; అతఁడు= ఆ దుశ్శాసనుడు; అతనికిన్= భీముడికి; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** అనగా విని దుశ్శాసనుడు భీముడితో ఇట్లా అన్నాడు.

**సీ. 'ఎఱుఁగుదు మఱచితినే లక్కయింటఁ జి । చ్చిడి మిమ్ముఁ బఱచినయిడుమ? లవియుఁ**
**గాకయు, నమ్మెయి గాంధారరాజు మీ । యన్నతో వెడజూద మాడి రాజ్య**
**లక్ష్మిఁ జేకొని కానలకుఁ బోవ నడిచితి; । మందుఁ బెక్కాపద లనుభవించి,**
**యజ్ఞాతవాసార్థ మవ్విరాటుని ప్రోలి । కరిగి యత్యంత దైన్యంబు నొంది.**

**ఆ. యట్ల మీర లునికి యప్రసిద్ధమె? యివి । యేల రిత్తమాట లేటు పోటు**
**దలకు వచ్చి?' యనుడు; దరహాసమునఁ గెంపు । గదురఁ బవనసుతుఁడు గడఁగి డాసి. 197**

**ప్రతిపదార్థం:** ఎఱుఁగుదున్= బాగా తెలుసు; మఱచితినే?= మరచిపోయాననుకొంటున్నావా?; లక్కయింటన్; చిచ్చు+ఇడి= నిప్పుపెట్టి; మిమ్మున్+పఱచిన= మీకు కలిగించిన; ఇడుమలు= ఇక్కట్లు; అవియున్+కాకయున్; ఆ+మెయిన్= ఆ విధంగా;

గాంధారరాజు= శకుని; మీ అన్నతోన్; వెడజూదము= కపటమైన జూదం; ఆడి; రాజ్యలక్ష్మిన్; చేకొని= స్వాధీనంచేసికొని; కానలకున్= అడవులకు; పోవన్= పోయేటట్లు; నడిచితిమి= ప్రవర్తించాము; అందున్; పెక్కు+ఆపదలు; అనుభవించి; అజ్ఞాతవాస+అర్థము= ఎవ్వరికి తెలియకుండా జీవించేందుకు; ఆ+విరాటుని; ప్రోలికిన్= పట్టణానికి; అరిగి= పోయి; అత్యంత= మిక్కిలి; దైన్యంబున్= హీనస్థితిని; ఒంది= పొంది; అట్లు+అ= ఆ విధంగానే; మీరలు; ఉనికి= ఉండటం; అప్రసిద్ధమె?= అందరికీ తెలియనిదా?; ఏటు పోటుదలకున్ వచ్చి= రణరంగానికి వచ్చి; ఇవి ఏల రిత్త మాటలు?= ఈ వట్టి మాటలు ఎందుకు?; అనుడున్= అనగా; పవన సుతుఁడు= భీముడు; దరహాసమునన్= చిరునవ్వుతో; కెంపు= ఎరుపు; కదురన్= వ్యాపించగా; కడఁగి= సాహసించి; డాసి= సమీపించి.

**తాత్పర్యం:** నాకు బాగా తెలుసు, మరచిపోయాననుకొన్నావా? లక్కయిల్లు కాల్చి మిమ్ము పెట్టిన బాధలు. శకుని మాయజూదంలో మీ రాజ్యలక్ష్మిని దోచుకొనటం; మిమ్ములను అడవులకు పంపి పెక్కు బాధ లనుభవింపజేయటం, అజ్ఞాతవాసంలో విరాటుడి నగరంలో దీనాతిదీనమైన జీవితం గడుపుతూ మీరు నివసించటం ఎవరికి తెలియవు? కత్తిగట్టి కదనానికి దూకి, ఇప్పుడు ఆ పనికిమాలిన మాటలతో పని యేమి? అనగానే వాయునందనుడు చిరునవ్వు నవ్వి, ఆ నవ్వులో ఎరుపురంగు వ్యాపించగా కోపావేశంతో దుశ్శాసనుడిని సమీపించాడు.

**క. భల్లములు మూఁట సిడమును । విల్లు నఱికి, సూతకంఠ విదళనమున శో**
**భిల్లి, నిటలమునఁ బటు ద । ర్పోల్లసితుం డగుచు నాటె నొక నారసమున్. 198**

**ప్రతిపదార్థం:** భల్లములు= బాణాలు; మూఁటన్= మూటితో; సిడమును= ధ్వజాన్ని; విల్లున్; నఱికి; సూతకంఠ= సారథి మెడను; విదళమునన్= చీల్చివేయటంతో; శోభిల్లి= అందగించి; పటుదర్ప= దట్టమైన గర్వంతో; ఉల్లసితుండు+అగుచున్= దీపించేవాడు అవుతూ; నిటలమునన్= అతని నుదుట; ఒక నారసమున్= ఒక బాణాన్ని; నాటెన్= గ్రుచ్చాడు.

**తాత్పర్యం:** భీముడు మూడుబాణాలతో దుశ్శాసనుడి టెక్కెమును, ధనువును ఖండించి, సారథి మెడను చీల్చాడు. ఆ విజయగర్వంతో పొంగి అతడి నొసట కూడ ఒకబాణాన్ని నాటాడు.

**వ. దాన బీఱువోవక దుశ్శాసనుండు. 199**

**ప్రతిపదార్థం:** దానన్= దానితో; బీఱుపోవక= అధైర్యపడక; దుశ్శాసనుండు.

**తాత్పర్యం:** దానితో అధైర్యపడక దుశ్శాసనుడు.

**క. తురగములఁ దాన నడపుచు । వెరవు రయము మెఱయ నొండువిలు గొని, గాఢ**
**స్ఫురణమున భీము తనువునఁ । బరఁగించె మెఱుంగు లడరఁ బండ్రెం డమ్ముల్. 200**

**ప్రతిపదార్థం:** తురగములన్= గుర్రాలను; తాను+అ నడపుచున్= తానే నడుపుకొంటూ; వెరవు= ఉపాయం; రయము= వేగము; మెఱయన్= దీపించేటట్లు; ఒండు విలుగొని= వేరొక ధనుస్సును చేపట్టి; గాఢస్ఫురణమునన్= గట్టి తాకుడుతో; భీము తనువునన్= భీముడి దేహంమీద; మెఱుంగులు+అడరన్= కాంతులు ఈనుతుండగా; పండ్రెండు; అమ్ముల్= బాణాలను; పరఁగించెన్= ప్రయోగించాడు.

**తాత్పర్యం:** గుర్రాలను స్వయంగా నడుపుకొంటూ శీఘ్రగతితో నిజసామర్థ్యం మెరయగా ఇంకొక విల్లు చేబూని, గట్టిగా తాకేటట్లు కాంతులీనే పన్నెండు అమ్ములను భీముడి శరీరంమీద ప్రయోగించాడు.

**క. తోడన కోదండము దును । మాడెను. సూతుమెయిఁ గ్రుచ్చె నాఱమ్ములు, సం**
**క్రీడయ పోలెను ముప్పది । యాడించెను మఱియుఁ దూపు లనిలజు మేనన్. 201**

**ప్రతిపదార్థం:** తోడన్+అ= వెంటనే; కోదండము= విల్లును; తునుమాడెను= విరుగగొట్టాడు; సూతుమెయిన్= సారథి శరీరంలో; ఆఱు+అమ్ములు; క్రుచ్చెన్= గ్రుచ్చాడు; మఱియున్; అనిలజు= వాయుపుత్రుడైన భీముడి; మేనన్= శరీరంలో; తూపులు= బాణాలు; ముప్పది; సంక్రీడయ పోలెన్= క్రీడవలె; ఆడించెను= నాటాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు భీముడి విల్లును విరుగగొట్టాడు. రథసారథి దేహంలో ఆరుబాణాలు గ్రుచ్చాడు. భీముడి శరీరంలో ముప్పది అమ్ములు నాటాడు. ఇదంతా అవలీలగా ఒక ఆట ఆడిన విధంగా కావించాడు.

**మ. ధను వొం డుగ్రత నెత్తి, యేఁబది శితాస్త్రంబుల్ మరుత్సూనుఁ డా**
**తనిగాత్రంబునఁ గ్రుచ్చినం, గినుకమై ధైర్యంబు శౌర్యంబు నొ**
**ప్ప నతం డుజ్జ్వల భల్లయుగ్మ యుగళ స్ఫారాహతిన్ వాజులం**
**దునిమెం, జూపఱు పిచ్చలింప విలసద్దోర్గర్వ దుర్వారుఁ డై. 202**

**ప్రతిపదార్థం:** మరుత్సూనుఁడు= వాయుపుత్రుడు - భీముడు; ధనువు, ఒండు= ధనుస్సును మరొక దానిని; ఉగ్రతన్= కోపంతో; ఎత్తి; ఏఁబది; శిత+అస్త్రంబుల్= వాడి బాణాలను; ఆతని= దుశ్శాసనుడి; గాత్రంబునన్= శరీరంలో; క్రుచ్చినన్= నాటుకొనేటట్లు వేయగా; కినుకమైన్= కోపంతో; ధైర్యంబు= ధీరత్వం (గాంభీర్యం); శౌర్యంబు= పరాక్రమం; ఒప్పన్= ప్రకాశించగా; అతండు= దుశ్శాసనుడు; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; భల్లయుగ్మ= బాణాల జంటయొక్క; యుగళ= జతయొక్క; స్ఫార= విస్పష్టమైన; ఆహతిన్= దెబ్బతో; విలసత్= దీప్తమైన; దోః+గర్వ= భుజగర్వంవలన; దుర్వారుఁడు+ఐ= నివారింప అలవిగానివాడై; చూపఱు= చూచేవారు; పిచ్చలింపన్= భయకంపితులై ఉండగా; వాజులన్= గుర్రాలను; తునిమెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** వాయునందనుడి చేతనుండిన ధనువు విరుగగొట్టబడగా అతడు కోపోద్దీపితుడై ఇంకొక ధనుస్సును చేపట్టి, ఆ దుశ్శాసనుడి దేహంలో యాభై పదునైన బాణాలను చొప్పించాడు; దీనితో అతడు ఆగ్రహించి ధీరత్వం శూరత ఒప్పిదమై ఉండగా, నాలుగు బాణాలను ప్రయోగించి, భీముడి రథాశ్వాలను చంపివేశాడు. అట్లా అతడు ప్రకాశమానమైన భుజబల గర్వంతో నిర్నిరోధంగా చెలరేగటం చూచినవారు సంభ్రమాశ్చర్యాలతో నిండిపోయారు.

**వ. ఇట్లు విరథుండై వృకోదరుండు మెయి వెంచి. 203**

**ప్రతిపదార్థం:** ఇట్లు= ఈ విధంగా; విరథుండు+ఐ= రథాన్ని కోల్పోయినవాడై; వృకోదరుండు= భీముడు; మెయి= దేహాన్ని; పెంచి.

**తాత్పర్యం:** వృకోదరు డిట్లా తేరులేనివాడై దేహాన్ని పెంచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. గద లీలం గొని తేరు డిగ్గి, మెఱుఁగుల్ గ్రమ్ముంగ సారించి యు**
**న్మద యానంబునఁ గిట్టి, ఘోటకములన్ ద్రుంచించి, బాహా బలం**
**బు దలిర్పన్ భవదీయ సూను నరదంబుం ద్రెళ్ళఁ ద్రోవంగ, బె**
**ట్టిదపుం దోమర మెత్తికొం చతఁడు దాఁటెన్ నేలకున్ గ్రక్కునన్. 204**

**ప్రతిపదార్థం:** గద= గదను; లీలన్= సవిలాసంగా; కొని= చేతికి తీసికొని; తేరు, డిగ్గి= రథము దిగి; మెఱుఁగుల్ క్రమ్మంగన్= కాంతులావరింపగా; సారించి= త్రిప్పి; ఉన్మద యానంబునన్= పొగరుబోతుతనం చాటే నడకతో; కిట్టి= సమీపించి; ఘోటకములన్= గుఱ్ఱాలను; ద్రుంచించి= చంపి; బాహాబలంబు; తలిర్పన్= అతిశయించగా; భవదీయ సూను= నీ కొడుకు దుశ్శాసనుడియొక్క; అరదంబున్= తేరును; త్రెళ్ళన్ త్రోవంగన్= విరిగిపోయేటట్లు నెట్టివేయగా; బెట్టిదపున్= బలమైన; తోమరము= ఇనుప గుదియను; ఎత్తికొంచున్; అతఁడు= దుశ్శాసనుడు; గ్రక్కునన్= త్వరగా; నేలకున్= నేలపైకి; దాఁటెన్= దూకాడు.

**తాత్పర్యం:** భీముడు గడుసైన విన్యాసంతో గదను చేబూని, తేరు దిగి, కాంతిప్రభలు చుట్టూ వ్యాపించేటట్లుగా గదను త్రిప్పుతూ, గర్వోన్మీలంగా నడచి దుశ్శాసనుడి రథాన్ని సమీపించాడు. వెంటనే గుఱ్ఱాలను చంపివేశాడు. తన బాహుబలం అతిశయిల్లగా దుశ్శాసనుడి రథాన్ని విరుగద్రోశాడు. అంతట దుశ్శాసనుడు కూడా బలమైన ఒక గుదియను ఎత్తుకొని తటాలున నేలమీదికి దూకాడు.

**విశేషం:** ఇది త్వరత్వరగా జరిగిన పనుల వరుస. దానిని తెల్పటానికి చాలా క్రియలను ఒకేపద్యంలో చొప్పిస్తాడు తిక్కన. ఆయన కవితారీతులలో ఇది ఒక అందమైన హేల.

**వ. అట్లు దాఁటి, బెట్టువైచిన యత్తోమరంబునం గాఁడ నేసి, యక్కీచకారాతి పదుమూఁడువత్సరంబులు దమపడినపాట్లును బ్రతినచందంబును డెందమున నావహిల్ల, నుద్దండ గదాదండంబున దుశ్శాసను వైవ నతండు తద్గదాఘాతంబున నెత్తురు దొరఁగ ధరణిం బడిన, బెబ్బులి లేడికొదమం బొదువు పోలికం బొదివి మెడ నిక్కం ద్రొక్కి యెక్కుడు మదంబున నక్కుమారునితో ని ట్లనియె. 205**

**ప్రతిపదార్థం:** అట్లు దాఁటి= ఆ విధంగా దూకి; బెట్టు వైచినన్= గట్టిగా విసరివేయగా; ఆ+తోమరంబునన్= ఆ తోమరాయుధాన్ని; కాఁడన్+ఏసి= విరుగగొట్టి; ఆ+కీచక+అరాతి= ఆ కీచకుడి శత్రువు - భీముడు (కీచకుడికి పట్టిన గతే పట్టనున్నదని సూచన); పదుమూఁడు వత్సరంబులు; తమపడినపాట్లను= తామనుభవించిన అగచాట్లను; ప్రతిన చందంబును= తాను చేసిన ప్రతిజ్ఞ తీరును; డెందంబునన్= మనస్సులో; ఆవహిల్లన్= కలుగగా; ఉద్దండ= భయంకరమైన; గదా దండంబునన్= గదతో; దుశ్శాసనున్; వైవన్= కొట్టగా; అతండు; తద్= ఆ; గదాఘాతంబునన్= గదదెబ్బతో; నెత్తురు; తొరఁగన్= కారగా; ధరణిన్= భూమిపై; పడినన్; బెబ్బులి= పెద్దపులి; లేడి కొదమన్= జింకపిల్లను; పొదువు= చుట్టుకొను; చందంబునన్= విధంగా; పొదివి= ఆక్రమించి; మెడనిక్కన్ త్రొక్కి= మెడను నిక్కేటట్లు కాలితో అణగజేసి; ఎక్కుడు మదంబునన్= అధికమైన పొగరుతో; ఆ+కుమారునితోన్= ఆ ధృతరాష్ట్ర పుత్రుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** దుశ్శాసనుడు అట్లా దూకి తోమరాన్ని బలంగా భీముడిపై ప్రయోగించగా, ఆతడు దానిని విరుగగొట్టి, తన మనసులో పదమూడేళ్ళు తాము పడిన పాట్లూ, తాను చేసిన ప్రతిజ్ఞా ఒక్కసారి మనస్సును ఆవేశించగా భయంకరమైన గదాదండంతో దుశ్శాసనుడిని బాదాడు. ఆ గదదెబ్బకు నెత్తురు కారగా నేలమీద పడ్డాడు దుశ్శాసనుడు.

పెద్దపులి లేడిపిల్ల మీదపడి క్రమ్ముకొనే విధంగా ఆతడిని భీముడు ఆక్రమించి మెడ నిక్కేటట్లు త్రొక్కి, మహోద్రేకంతో అతడితో ఇట్లా అన్నాడు.

**క. 'మును సభఁ బలికినదానం । దని వోవక యిచ్చటికి వెదకి వచ్చితి యే**
**మనియె దనుము; నీ మాటలు । వినుటకు నా కినుక సాల వేడ్కపడియెడున్.' 206**

**ప్రతిపదార్థం:** మును= ఇంతకుముందు; సభన్= సభలో; పలికిన దానన్= మాట్లాడినదానితో; తనివోవక= తృప్తిచెందక; ఇచ్చటికిన్; వెదకి= వెదకుకొంటూ; వచ్చితి(వి)= వచ్చావు; ఏమి+అనియెదు+అనుము= ఏమంటావో అనుము; నీ మాటలు వినుటకున్; నా కినుక= నా కోపం; చాలన్= ఎక్కువగా; వేడ్కపడియెడున్= కుతూహలపడుతుంది.

**తాత్పర్యం:** 'పూర్వం ఆ సభలో నీవు అనిన మాటలతో తృప్తి చెందక ఇక్కడకు వెదకుకొంటూ వచ్చావా? ఇంకా ఏమంటావో అను. నీ మాటలు వినాలని నా మండే కోపం తహతహపడుతున్నది.'

**వ. అని, యమ్మహాబలనందనుండు మహోగ్రలోచన ప్రభలు నిగుడ మన బలంబులం జూచిన. 207**

**ప్రతిపదార్థం:** అని; ఆ+మహాబలనందనుండు= ఆ వాయుపుత్రుడు భీముడు; మహా+ఉగ్ర= మహాభయంకరమైన; లోచన ప్రభలు= కన్నుల కాంతులు; నిగుడన్= వ్యాపించగా; మనబలంబులన్= మన సైన్యాలను; చూచినన్= చూడగా.

**తాత్పర్యం:** అని, ఆ మహాబలుడైన వాయుపుత్రుడు భీముడు కోపపు చూపుతో ఎర్రనికాంతులు వ్యాపించగా మన సేనలవైపు చూడగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. నిగుడు దవాగ్ని జ్వాలల । వెగడందిన మృగకులంబు విధమున, నతి భీ**
**తి గదిరి నలుగడ విచ్చిన, । జగతీశ్వర! యతఁడు మెఱసెఁ జక్కని బయలన్. 208**

**ప్రతిపదార్థం:** జగతీశ్వర!= రాజా!; నిగుడు= అలముకొంటున్న; దవాగ్ని= కార్చిచ్చు; జ్వాలల= మంటలకు; వెగడు+అందిన= భయపడిన; మృగకులంబు= జంతువుల సమూహం; విధమునన్= వలె; అతిభీతి= మిక్కిలి భయం; (మనసేనలు) కదిరి= చెంది; నలుగడన్= నాలుగు దిక్కులకు; విచ్చినన్= పరుగెత్తిపోగా; అతఁడు= భీముడు; చక్కని బయలన్= సైన్యం పరుగెత్తిపోయినందున ఏర్పడిన అడ్డం, ఆపులేని విశాలప్రదేశంలో; మెఱసెన్= ప్రకాశించాడు.

**తాత్పర్యం:** రేగి చుట్టుప్రక్కల అలముకొంటున్న కార్చిచ్చు మంటలకు భయపడి పారిపోయే జంతుసమూహం వలె, భయవిహ్వలమై మన సైన్యం చెదరి నాలుగు మూలలకు పరుగెత్తిపోగా, ఏర్పడిన ఆ పెద్ద ఆరుబయలులో భీముడు ప్రకాశించాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**వ. అప్పుడు నీయందుఁ జేయంగల సైనికులు సూచి, తత్తేజో విశేషంబునం జూడ్కులు మిఱుమిట్లు గొన వెఱచఱచి, యంతంత ఱిచ్చపడియుండ. 209**

**ప్రతిపదార్థం:** అప్పుడు= ఆ సమయంలో; నీయందున్= నీ పట్ల (నీ పక్షంలో); చేయంగల= కార్యం నెరవేర్చగలిగిన (నీ విశ్వాసపాత్రులు); సైనికులు; చూచి= ఆ భీముడి భీషణరూపాన్ని ఆరుబయలులో బాగా చూచి; తత్తేజోవిశేషంబునన్= అతడి

పరాక్రమం అతిశయించటంచేత; చూడ్కులు= చూపులు; మిఱుమిట్లు గొనన్= చెదరిపోగా; వెఱచఱచి= భయపడి; అంతంతన్= ఎక్కడివారక్కడ; ఱిచ్చ పడి ఉండన్= చేష్టలు దక్కి నిలబడి ఉండగా.

**తాత్పర్యం:** అప్పుడు నీ పక్షంలో యుద్ధంచేయగల సైనికులందరూ చూచి, అతడి పరాక్రమ తేజస్సును కళ్ళు మిరుమిట్లు గొలిపేటట్లు చూచి భయపడి ఎక్కడివారు అక్కడ చేష్టలు దక్కి నిలిచిపోయి ఉండగా.

**శా. లీలం గేల నమర్చి, మత్తగజ కేళీ సుందరోల్లాస మా**
**భీలత్వం బలరింపఁ ద్రిప్పుఁ, జదలం బృథ్వీస్థలిన్ వైచు, ముం**
**గాలం ద్రోయు, మొగంబు వ్రేయు, దెస లుగ్రస్ఫూర్తి వీక్షించు, మోఁ**
**కా లూఁదుం బయిఁ, గ్రమ్మఱంగ మెడ చిక్కం ద్రొక్కి నిల్చున్, నగున్. 210**

**ప్రతిపదార్థం:** లీలన్= విలాసంగా; కేలన్= చేతితో; అమర్చి= పట్టుకొని; మత్తగజ= మదపుటేనుగుయొక్క; కేళీ= ఆటవలె; సుందర ఉల్లాసము= అందగిస్తున్న విలాసం; ఆభీలత్వంబు= భయద స్వరూపాన్ని; అలరింపన్= సంతోషపెట్టుతుండగా; త్రిప్పున్= గిర గిర త్రిప్పాడు; చదలన్= ఆకాశంపైకి; పృథ్వీస్థలిన్= భూప్రదేశానికి; వైచున్= విసరివేయును (పైకెత్తి క్రిందికి కొట్టాడు); ముంగాలన్= పాదాగ్రముతో; త్రోయున్= నెట్టివేయును; మొగంబు= ముఖమును; వ్రేయున్= మోదును; దెసలు= చుట్టుప్రక్కల; ఉగ్రస్ఫూర్తిన్= కోపపు పొంగుతో; వీక్షించున్= చూచును; పయిన్= దేహంమీద; మోకాలు; ఊఁదున్= త్రొక్కిపట్టును; క్రమ్మఱంగన్= అతడు ప్రక్కకు తిరిగితే; మెడ; చిక్కన్= గట్టిగా; త్రొక్కి= అదిమి; నిల్చున్= మెడపై నిలబడును; నగున్= పకపకా నవ్వును.

**తాత్పర్యం:** అతడి శరీరాన్ని ఒక ఆటలో వలె విలాసంగా చేజిక్కించుకొని, ఒక మదపుటేనుగు చేసే చెర్లాటంవలె మనోజ్ఞమైన సంతోషం భయంకరస్వరూపానికి అందాన్ని చేకూరుస్తుండగా, ఆతడి దేహాన్ని భీముడు గిరగిర త్రిప్పాడు. పైకెత్తి నేలపై విసిరి కొట్టాడు. పాదాగ్రంతో దానిని నెట్టివేశాడు, ముఖాన్ని చరిచాడు. కోపోద్దీపితుడై చుట్టుప్రక్కలా ఉరిమి చూచాడు. ఆ శరీరాన్ని మోకాలితో అదిమాడు, మెడను మరల గట్టిగా త్రొక్కాడు, లేచి నిలబడ్డాడు. నవ్వాడు. ఇట్లా అక్కసునంతా వెడల గ్రక్కాడు.

**విశేషం:** అలంకారం: స్వభావోక్తి.

**వ. ఇవ్విధంబునం ఘోరవిహారంబు సలిపి, భీమవిక్రముం డగు నా భీమసేనుం డయ్యువరాజు నాననం బాలోకించి. 211**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; ఘోర, విహారంబు సలిపి= భయంకరంగా విహరిస్తూ; భీమవిక్రముండు+అగు= భయంకరమైన బాహుపరాక్రమం కలవాడైన; ఆ భీమసేనుండు; ఆ+యువరాజు= ఆ దుశ్శాసనుడి; ఆననంబు= ముఖాన్ని; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఆ విధంగా భయంకర వీర విలాసాన్ని ప్రదర్శించి, భీముడు ఆ దుశ్శాసనుడి మొగం చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** పిల్లికి చెర్లాటం, ఎలుకకు ప్రాణసంకటం - అన్నట్లు, భీముడు దుశ్శాసనుడిపై క్రూరమైన వినోదం ప్రదర్శిస్తున్నాడు.

**క. 'ఏ నురము వ్రచ్చి నెత్తురు । తేనియ యిది ద్రావెదం; । గదిసి ననుఁ గడిమిన్**
**మానుప దిక్కు గలిగిన । వ్రాని మ్మెలుఁగింపు మీ మొనం గలవారిన్.' 212**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; ఉరము= రొమ్మును; వ్రచ్చి= చీల్చి; నెత్తురు, తేనియ= నెత్తురు అనెడి తేనెను; ఇది త్రావెదన్; ననున్= నన్ను; కదిసి= సమీపించి; కడిమిన్= పట్టుదలతో; మానుపన్= నివారించేందుకు; దిక్కు కలిగినన్= ఆదరువు (సహాయం) ఉన్నట్లయితే; రానిమ్ము= వారిని రమ్మను; మీ మొనన్= మీ సైన్యంతో; కలవారికిన్= ఉన్నవారికి; ఎలుఁగింపు= ఎలుగెత్తి చాటుము.

**తాత్పర్యం:** 'ఇదిగో! నీ గుండె చీల్చి, నెత్తురు అనే తేనెను ఆత్రంతో త్రాగుతాను. మీ సైన్యంలో నన్ను ఆపగల దిక్కెవరైనా నీకు ఉంటే వారిని రమ్మను(రప్పింపుము) గొంతెత్తి వారిని పిలువుము'.

**వ. అని పెలుచం బలికి, కుఠారంబు వెఱికి యతని మొగంబుమీఁద జళిపించి. 213**

**ప్రతిపదార్థం:** అని; పెలుచన్+పలికి= పెద్దగా కఠినంగా చెప్పి; కుఠారంబు= గండ్రగొడ్డలిని; పెఱికి= లాగుకొని; అతని మొగంబుమీఁద; జళిపించి= ఆడించి.

**తాత్పర్యం:** అని బిగ్గరగా పలికి, గండ్రగొడ్డలిని పెరికి అతడి మొగంమీద ఆడించి. (తరువాతి పద్యంతో అన్వయం).

### భీమసేనుఁడు దుస్ససేనుని యురంబు వ్రచ్చి రక్తపానంబు సేయుట (సం. 8-61-1)

**మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణి, న్రౌద్రం బుదగ్రంబుగా**
**నుర మత్యుగ్రతఁ జీరి, క్రమ్ము రుధిర మ్ముల్లాసియై దోయిట**
**న్వెర వారం గొని త్రావు, మెచ్చుఁ జవికి, న్మేనున్ మొగంబున్ భయం**
**కర రేఖం బొరయంగఁ జల్లికొను, నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్. 214**

**ప్రతిపదార్థం:** నరసింహుండు= నరసింహస్వామి; అసుర+ఇంద్రున్= రాక్షసరాజు హిరణ్యకశిపుని; వ్రచ్చు కరణిన్= చీల్చిన విధంగా; రౌద్రంబు= రౌద్రం; ఉదగ్రంబు+కాన్= భయంకరం కాగా; ఉరము= రొమ్ము; అత్యుగ్రతన్= మిక్కిలి క్రూరంగా; చీరి= చీల్చి; క్రమ్ము= చిమ్మే; రుధిరమ్ము= నెత్తురు; ఉల్లాసి+ఐ= సంతోషించినవాడై; దోయిటన్= దోసిట; వెరవు, ఆరన్= నేర్పుమీరగా; కొని= తీసికొని; త్రావు; చవికిన్= ఆ రుచికి; మెచ్చున్= మెచ్చుకొనును; మేనున్= శరీరాన్ని; మొగంబున్; భయంకర రేఖన్= భీతిగొలిపే విధంగా; పొరయంగన్= పొందగా; చల్లుకొనున్= (ఒంటిపైన ముఖంపైన) చల్లుకొంటాడు; ఆ కౌరవ్యున్= కురువంశము వాడైన ఆ దుశ్శాసనుడిని; పొరిన్= మాటి మాటికి; చూచున్= చూస్తాడు.

**తాత్పర్యం:** నృసింహస్వామి హిరణ్యకశిపుడి పొట్ట చించినట్లు, భీముడు ప్రచండ రౌద్రమూర్తి అయి కసిదీరేటట్లు దుశ్శాసనుడి రొమ్మును చీల్చి, పైకి పొంగే నెత్తుటిని నేర్పుగ దోసిటినిండా తీసుకొని, ఉల్లాసంగా త్రాగుతూ దాని రుచికి మెచ్చుకొన్నాడు. (అందరికి) భయం గొలిపేటట్లుగ ముఖంమీద ఒంటిమీద చల్లుకొన్నాడు. మాటిమాటికి ఆ దుశ్శాసనుడిని చూచాడు. (ఈ చూపులే తన విజయోత్సాహాన్ని శత్రువుల దీనస్థితిని సూచిస్తున్నవి.)

**విశేషం:** అలం: ఉపమ. ఆనాడు ద్రౌపదిని అంతఘోరంగా అవమానించిన దుశ్శాసనుడి మీద భీముడి గుండెలో ఎంత కసి దాగి ఉందో - అది ఎంత భయానక బీభత్సంగా ఇప్పుడు పైకి పొంగిందో తిక్కన కంటికి కట్టినట్లు అద్భుతంగా వర్ణించాడు. భీముడి ప్రతిజ్ఞల్లో ఒకటి తృప్తిగా తీరింది. ఇంకొకటి- దుర్యోధనుడి విషయంలో చేసింది - మిగిలిఉంది.

**వ. ఇట్లు దారుణ భంగిం బ్రతిజ్ఞాకరణ పూరణం బాచరించి. 215**

**ప్రతిపదార్థం:** ఇట్లు దారుణభంగిన్= ఇట్లు క్రూరంగా; ప్రతిజ్ఞాకరణ పూరణంబు= చేసిన బాస పూర్తి అయ్యేటట్లు; ఆచరించి= చేసి

**తాత్పర్యం:** ఈ విధంగా భయంకరమైన పద్ధతిలో ప్రతిజ్ఞను పూర్తిచేసికొని. (తరువాతి పద్యంతో అన్వయం.)

**తే. 'తల్లి చన్నుల పా లేను ద్రావ నెట్టు । లాననే పలుతెఱఁగుల తేనియలును**
**ఖండశర్కరతోడి దుగ్ధంబు లనుభ । వింపఁబడవే! యవియు నింత యింపు గావు.' 216**

**ప్రతిపదార్థం:** ఏను; తల్లిచన్నులపాలు= తల్లి చనుబాలు; త్రావన్+ఎట్టులు?= నేను త్రాగలేదా?; పలుతెఱంగుల= అనే రకాలైన; తేనియలును; ఎట్టులు ఆననే!= ఏదో విధంగా తాగి ఉన్నాను గదా!; ఖండశర్కర= కలకండ; తోడి= కలిపిన; దుగ్ధంబులు= పాలు; అనుభవింపఁబడవే!= నేను త్రాగి అనుభవించినానుగదా!; అవియున్= అవి అన్నీకూడా; ఇంత ఇంపు గావు= ఇంతటి ఆనందాన్ని కలిగించలేదు.

**తాత్పర్యం:** 'తల్లి చనుబాలు త్రాగాను. రకరకాల తేనెలు చవిచూచాను. కలకండతో కలిపి పాలు త్రాగాను. కాని అవన్నీ కూడా ఇంతటి తృప్తినిగాని ఆనందాన్నిగాని కలిగించలేదు.'

**చ. అని యెలుఁ గెత్తి పల్కు నలి నాడు, మహోద్ధతిఁ ద్రుళ్ళు, నార్చుఁ, బె**
**ల్చన భుజ మప్పళించుఁ దమ సైనికులున్ మనవారు రక్కసుం**
**డని వెఱఁ గందువారు, గళితాయుధు లయ్యెడువారు, భీతి మూ**
**ర్ఛను బడువారునై రణ విరామముఁ బొంద మదోత్కటాకృతిన్. 217**

**ప్రతిపదార్థం:** మదోత్కట ఆకృతిన్= లోపొగరుపైకి ఉబుకగా పొందిన స్వరూపంతో; అని= (పై విధంగా) అని; ఎలుఁగెత్తి పల్కున్= గొంతెత్తి అరుస్తాడు; నలిన్= ఉత్సాహంతో; ఆడున్= ఎగిరి గంతులు వేస్తాడు; మహోద్ధతిన్= గొప్ప వేగంతో; త్రుళ్ళున్= మిడిసిపడతాడు; ఆర్చున్= కేకలు వేస్తాడు; పెల్చన= గట్టిగా; భుజము= భుజాలను; అప్పళించున్= చరచుకొంటాడు (ఇదంతా చూచి); తమ సైనికులున్= ఆయన సేన; మనవారు= కౌరవులు; రక్కసుండు+అని= రాక్షసుడని; వెఱఁగందువారు= ఆశ్చర్యపడేవారు; గళితాయుధులు+అయ్యెడువారు= ఆయుధములు జారిపోయినవారు; భీతిన్ మూర్ఛనుపడువారునై= భయంతో ఒళ్ళు తెలియకుండా నేల కొరిగేవారు కాగా; రణవిరామము పొందన్= దీనితో యుద్ధం నిలిచిపోగా.

**తాత్పర్యం:** అని బిగ్గరగా అంటాడు. ఉత్సాహంతో గంతులు వేస్తాడు, ఆ వేగంతో త్రుళ్ళుతాడు, అరుస్తాడు, గట్టిగా భుజాలను చరచుకొంటాడు, ఇరువైపు సైనికులూ అతడిని చూచి రాక్షసుడేమో అని నిశ్చేష్టులయ్యారు. ఆయుధాలను భయంతో వదలిపెట్టారు. మూర్ఛలు కూడా పోయారు. అతడి మదభయంకరమైన రూపాన్ని చూచి అందరూ యుద్ధం మాని నిలిచిపోయారు.

**వ. పదంపడి.** **218**

**తాత్పర్యం:** తరువాత. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. గద సేతం గొని, యంత్యకాల యమరేఖం బేర్చి, రక్తంబు చా**
**య దలిర్పం దను వుగ్రసుందరముగా నవ్వీరుఁ డేతెంచి, యు**
**న్మద మాతంగము లీల దోఁప; మన సేనం బొల్పఱం దోలి వే**
**పొదివెం గ్రమ్మఱ దుస్ససేను వికటస్ఫూర్తి స్ఫురన్మూర్తియై.** **219**

**ప్రతిపదార్థం:** గద చేతన్+కొని= గదను చేతితో పట్టుకొని; అంత్యకాల= ప్రళయవేళయందలి; యమరేఖన్= యముడివలె; పేర్చి= అతిశయించి; తనువు= శరీరం; రక్తంబు చాయ= నెత్తురు రంగుతో; తలిర్పన్= అతిశయిల్లగా; ఉగ్రసుందరముగాన్= రమణీయ భయానకము కాగా; ఆ+వీరుఁడు= ఆ వీరుడు-భీముడు; ఉన్మద= మత్తెక్కిన; మాతంగము= ఏనుగుయొక్క; లీల= విలాసం; తోఁపన్= మనస్సుకు తోచేటట్లు; ఏతెంచి= విచ్చేసి; మనసేనన్= మనసేనను; పొల్పు= స్థైర్యము; అఱన్= నశించేటట్లు; తోలి= పరుగెత్తేటట్లు చేసి; వే= వెంటనే; క్రమ్మఱన్= మరల; వికటస్ఫూర్తి స్ఫురత్+మూర్తి+ఐ= వెగటుదనం స్ఫురించే ఆకారంతో; దుస్ససేనున్; పొదివెన్= పైకొన్నాడు.

**తాత్పర్యం:** గదను చేత ధరించి ప్రళయకాల యముడివలె విజృంభించి, దేహం రక్తవర్ణంతో భయంకర సుందరం కాగా, మత్తెక్కిన ఏనుగువలె వచ్చి, మనసేనను పారద్రోలి, వెగటుగొలిపే రూపంతో మళ్ళీ దుశ్శాసనుడిమీద పడ్డాడు.

**విశేషం:** భీముడికి దుశ్శాసనుడిపై ఇంకా కసి తీరలేదు. అందుకే మళ్ళీ అతడిమీద పడ్డాడు. హిడింబ, కీచకులను చంపటంలో ఇంత క్రౌర్యం లేదు. ఇది అవమాన ప్రతీకార రూపం. కాబట్టి వేడి ఎక్కువ. చేష్టలు వికటంగా కనుపించినా, కవి దానిని సౌందర్యరేఖలతో దిద్ది, హాయిని కల్పిస్తున్నాడు. నెత్తురు త్రావటం రాక్షసకృత్యమైనా అది అతని ప్రతిజ్ఞలో భాగమే. అలంకారం: ఉపమ.

**వ. చలంబు నెఱయ నతని కాలు గేల నమర్చి మొగంబు గనుంగొనుచు నక్కిమ్మీరవైరి యి ట్లనియె.** **220**

**ప్రతిపదార్థం:** చలము= కోపం; నెఱయన్= రేగగా; అతని= దుశ్శాసనుడి; కాలు; కేలన్+అమర్చి= తనచేతపట్టుకొని; మొగంబు కనుగొనుచున్= అతడి మొగం చూస్తూ; ఆ+కిమ్మీరవైరి= కిమ్మీరుడనే రక్కసుడికి విరోధి భీముడు; ఇట్లు+అనియెన్. (భావిఫలం అట్టిదేనని సూచించటం ఇందులో కలదు).

**తాత్పర్యం:** పగ పెచ్చు పెరగగా అతడి కాలును చేతితో పట్టుకొని, మొగాన్ని చూస్తూ భీముడు ఇట్లా అన్నాడు.

**క. 'ఏమిర! పసు లని యార్వవు? నీ । మాటలు నిలువఁబడియెనే? పసరమ! మి**
**మ్మేము మగుడ నిదె యార్చెద; । మీ మాటకు మాఱు పల్క రెవ్వరుఁ గంటే?'** **221**

**ప్రతిపదార్థం:** ఏమిర!= (ఎంతటి తిరస్కారభావం. ఎంతటి చులకన!); పసులు అని= పశువులు అని; ఆర్వవు?= ఎందుకు అరవవు?; నీ మాటలు నిలవఁబడియెనే?= నీ మాటలు పడిపోయాయా?; పసరమా!= పశువా!; మిమ్ముమ్న్; ఏము; మగుడన్= మరలా; ఇదె= ఇదిగో ఇప్పుడే; ఆర్చెదము= పెద్దగా పశువులని అంటాము; ఈ మాటకున్= ఈ మాటకు; ఎవ్వరున్= ఎవ్వరు; మాఱు పల్కరు= ఎవ్వరు ఎదిరించి మాట్లాడరు; కంటే?= గమనించినావా?

**తాత్పర్యం:** 'ఏమిరా! పశువులని అరవవేమి? నీ నోరు పడిపోయిందా? పశువా! మిమ్ములను మరల మే మిప్పుడు పశువుల్లారా! అని పెద్దగా పిలుస్తాము. ఈ మాటకు మీ వారిలో ఎవ్వరు బదులు పలకటం లేదు చూచావా?.

**ఉ. 'నెట్టన యల్గినం దగునె? నీళ్ళను ద్రోచుటయున్ విషాన్నముం**
**బెట్టుటయున్ మహాభుజగ భీషణ దంష్ట్రలపాలు సేఁతయుం**
**జుట్టలుఁ బెద్దలుం జెలులుఁ జూడ సభన్ నెఱిమాలి యిమ్మెయిం**
**దిట్టున కోర్చు టెందుఁ గలదే? విను గెల్వరె జూద మెవ్వరున్?' 222**

**ప్రతిపదార్థం:** నెట్టన= అనాలోచితంగా; అల్గినన్= కోపపడితే; తగునె= సరిపోతుందా?; నీళ్ళను త్రోచుటయున్= నీళ్ళలో త్రోయటం; విష+అన్నము= విషం కలిపిన అన్నము; పెట్టుటయున్; మహాభుజగ= పెద్దపాములయొక్క; భీషణదంష్ట్రల= భయంకరమైన కోరల; పాలుచేఁతయున్= వశమయ్యేటట్లు చేయటం; చుట్టలున్= బంధువులును; పెద్దలున్; చెలులున్= స్నేహితులు; చూడన్= చూస్తుండగా; సభన్= ఆ సభలో; నెఱిమాలి= న్యాయం తప్పి; ఈ+మెయిన్= ఈ విధంగా; తిట్టునకున్= తిట్టుకు; ఓర్చుట= సహించి ఊరకుండటం; ఎందున్= ఎక్కడైనా; కలదే?= ఉన్నదా?; విను= (నేను చెప్పే దానిని) వినుము; ఎవ్వరున్= ఇంకెవ్వరు; జూదము= జూదం; గెల్వరు= గెలిచి ఉండలేదా? (గెలిచి ఇట్లా అత్యాచారం చేశారా?)

**తాత్పర్యం:** 'నీవు అనవసరంగా కోపపడటం తగునా? నన్ను నీళ్ళలో త్రోశారు. విషం కలిపిన అన్నం పెట్టారు. పెద్ద విషపుపాముల కోరలకాటుకు బలిచేశారు. ఆ సభలో బంధుమిత్రులు పెద్దలు చూస్తుండగా నీతి తప్పి ఇట్లా మీరు దూషించటం, దానికి మేము ఓర్చుకొని ఊరకుండటం, ఇంకెక్కడైనా ఇలా జరిగిందా? యోచించుము. ఇంతకుముందు జూదంలో గెలిచినవారు ఇంకెవ్వరు లేరా?' (జూదమాడినవారున్నారుగాని ఇట్టి దుశ్చేష్టలు చేసినవారు లేరని భావం).

**క. అని పలికి, క్రమ్మఱఁగ మన । మొన మీఁదన్ బ్రమరి వాఱి, ముద్గరి లలితం**
**బునఁ గేలు మెఱయఁ జని, తన । కన లడఁగక దుస్సేనుఁ గనుగొని పలుకున్. 223**

**ప్రతిపదార్థం:** అని పలికి; క్రమ్మఱఁగన్= వెనుదిరిగి పోగా; మన మొనమీఁదన్= మనసైన్యాల చుట్టూ; బ్రమరి వాఱి= చుట్టు తిరిగి; ముద్గర లలితంబునన్= సొంపైన గదావిన్యాసంతో; కేలు మెఱయన్= చేయి తళతళలాడుతుండగా; చని= పోయి; తన కనలు= తన కోపం; అడఁగక= ఉపశమించకపోగా; దుస్సేనున్; కనుగొని= చూచి; పలుకున్.

**తాత్పర్యం:** అని పలికి భీముడు మన సైన్యాలచుట్టూ తిరిగి చూచి, గద త్రిప్పటంతో మనోజ్ఞమై చూపట్టుతున్న బాహువిన్యాసంతో, తన కోపం ఇంకా శాంతించనందున దుస్సేనుడిని చూచి ఇట్లా అన్నాడు.

**ఉ. 'ప్రై వడి పోయెఁ గాన ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి? యా సభం**
**దా వల దన్నఁ గీ డుడుగదా! పతి లేఁ దనఁబడ్డ కాంత నేఁ**
**డీవు గనుంగొనంగఁ బతి యేడ్తెఱ నొప్పెఁ బతుల్ విజృంభిత**
**శ్రీ విలసిల్లు కామినులు సేడ్పడి రిట్లపతిత్వ దీనతన్.' 224**

**ప్రతిపదార్థం:** ప్రైవడి= నిందపాలై; పోయెన్; కానన్= కాబట్టి; ధృతరాష్ట్రుఁడు; కన్నది= చూచింది (అనుభవించింది); ఏమి?; ఆ సభన్; తాన్= తాను; వలదన్నన్= వద్దని వారించి ఉంటే; కీడు= ఆపద; ఉడుగదా?= నివారింపబడి ఉండదా?; పతి

లేఁడు అనన్+పడ్డ= మగడు లేడు అని చెప్పబడిన; కాంత= ద్రౌపది; నేఁడు; ఈవు కనుంగొనంగన్; పతి= భర్త; ఏడ్తెఱన్= పరాక్రమాతిశయంతో; ఒప్పెన్= అలరారుతున్నాడు; పతుల్= తమ భర్తలు; విజృంభిత శ్రీ విలసిల్లు= పెంపొందిన సంపదతో శోభిల్లు; కామినులు= స్త్రీలు; ఇట్లు= ఈ విధంగా; అపతిత్వ దీనతన్= మగలులేని దైన్యంతో; చేడ్పడిరి= చిక్కులపాలైరి.

**తాత్పర్యం:** 'ధృతరాష్ట్రుడు నిందపాలు కావటం తప్ప వేరేమి చూడగలిగాడు? ఆ సభలో తాను వద్దంటే కీడు తప్పి ఉండేది కదా! మగడు లేడు అన్న ఆ కాంతకే ఇప్పుడు నీవు చూస్తుండగానే భర్త పరాక్రమదీప్తితో ప్రకాశిస్తున్నాడు. పెంపొందిన సంపదతో విలసిల్లిన కౌరవకాంతలు కష్టాలపాలై ఇప్పుడు తమకు మగలులేరని కనికరించవలసిన స్థితిలో ఉన్నారు.

**క. విను! మేను జేయఁ బూనిన । పనులం దొకటి గడతేఱెఁ; బాపాత్ము సుయో**
**ధనుఁ బొరిగొని తల దన్నుదు । నను రెండవ పనియుఁ దీర్ప నరిగెద నెలమిన్'. 225**

**ప్రతిపదార్థం:** వినుము; ఏను; చేయన్+పూనిన; పనులందున్; ఒకటి; కడతేఱెన్= నెరవేరింది; పాపాత్మున్; సుయోధనున్; పొరిగొని= చంపి; తల తన్నుదున్; అను; రెండవ పనియున్; తీర్పన్= పూర్తి చేసేందుకు; ఎలమిన్= ఉల్లాసంతో; అరిగెదన్= ముందుకు సాగుతాను.

**తాత్పర్యం:** శ్రద్ధగా వినుము. నేను బాస చేసి చేయబూనిన వాటిలో ఒకటి పూర్తి అయింది. ఇక ఆ సుయోధనుడిని చంపి, అతడి తలను తన్నుతాను - అనేది మిగిలి ఉన్నది. ఆ కోరికను తీర్చుకొనేందుకు- ఇదిగో! అధికోత్సాహంతో ముందుకు సాగుతాను.

**చ. అని యెలుఁ గెత్తి చెప్పి, యతఁ డాతని గీ టడఁగించి యార్చెఁ గ**
**ర్ణునకును లోనుగా మన వరూథినియోధులకున్ మహాభయం**
**బున మనముల్ గలంగఁబడి పోరికి నూల్కొననీని ఱిచ్చపా**
**టున సకలాంగకంబులు గడున్ శిథిలంబులుగా మహోగ్రుఁడై. 226**

**ప్రతిపదార్థం:** అని; ఎలుఁగెత్తి చెప్పి= పెద్దగా అరచి చెప్పి; అతఁడు= భీముడు; ఆతనిన్= దుస్ససేనుడిని; గీటు+అడఁగించి= చంపి; కర్ణునకును లోనుగా= కర్ణుడు మొదలైన; మన; వరూథిని యోధులకున్= సైనికవీరులకు; మహాభయంబునన్= గొప్పభయంతో; మనముల్= హృదయాలు; కలంగఁబడి= కలతచెంది; పోరికిన్= యుద్ధం చేయటానికి; నూల్కొననీని= పూనుకొనేటట్లు చేయని; ఱిచ్చపాటునన్= కలవరపాటున; సకల+అంగకంబులు= శరీర అవయవాలన్నీ; కడున్= మిక్కిలి; శిథిలంబులుగాన్= వికలమయ్యేటట్లు; మహా+ఉగ్రుఁడై= అధికమైన కోపం కలవాడై; ఆర్చెన్= అరిచాడు.

**తాత్పర్యం:** అని గొంతెత్తి పెద్దగా చెప్పాడు. దుశ్శాసనుడిని తుదముట్టించాడు. కర్ణుడు మొదలుగా మన సైనిక వీరులకు భయంతో మనస్సులు కలతచెంది, యుద్ధానికి పూనుకోలేని నిశ్చేష్టతతో, అవయవాలన్నీ పని చేయని స్థితి ఏర్పడేటట్లుగా మహాభయంకరుడై అరిచాడు.

**క. జనపతియుఁ గృప ప్రముఖులుఁ । గనుఁగొన, ని ట్లనిలసుతుఁడు గ్రౌర్య మొదల్ గై**
**కొనినట్లు పేర్చి దుశ్శా । సనుఁ జంపుటఁ జూచి, రోష సంరంభమునన్. 227**

**ప్రతిపదార్థం:** జనపతియున్= రాజు దుర్యోధనుడు; కృప ప్రముఖులు= కృపాచార్యుడు మొదలైన ప్రఖ్యాతవీరులు; కనుఁగొనన్= చూస్తుండగా; క్రౌర్యము= క్రూరస్వభావం; ఇట్లు; ఒడల్ గైకొనినట్లు= మానవాకృతిని తాల్చినట్లు; అనిలసుతుఁడు= వాయునందనుడు, భీముడు; పేర్చి= ఉప్పొంగి; దుశ్శాసనున్; చంపుటన్+చూచి= చంపటాన్ని చూచి; రోష సంభ్రమమునన్= కోపాతిశయంతో.

**తాత్పర్యం:** ఈ విధంగా భీముడు-దుర్యోధనుడు, కృపుడు మొదలైన ప్రముఖులు చూస్తూ ఉండగా, క్రూరత్వమే రూపుదాల్చిందా అన్నట్లు విజృంభించి దుశ్శాసనుణ్ణి చంపటాన్ని చూచి, రోషాతిశయంతో.... (తరువాతి వచనంతో అన్వయం)

**వ. నీ కొడుకులు కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రహుండును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుండును గూడి కవిసి, వివిధ విశిఖంబుల నతనిం బొదివిన; నంతకుమున్న దుశ్శాసన రక్తపాన కౌతుకాధీన మానసుం డైన యా భీమసేనుపై నెవ్వరు గడంగుదురో యని కన్నిడి యుండి, యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన దీర్చుటకుఁ బ్రీతచిత్తుం డగు ఫల్గునుండు భల్లదశకంబున నక్కుమార దశకంబు శిరంబులు దునుమాడె; నట్టి భీమార్జునుల యాటోపంబున కోటఱి నీ సైన్యంబు సమర విముఖం బయ్యె, నా సూతనందనుండును భీతుండై వదనంబు వెలవెలఁ బాఱ నూరకుండె; నప్పుడు శల్యుం డతని నాలోకించి యి ట్లనియె. 228**

**ప్రతిపదార్థం:** నీ కొడుకులు- కవచియు, నిషంగియు, పాశియు, దండధారుండును, ధనుర్గ్రహుండును, ఆలోలుపుండును, సహుండును, షండుండును, వాతవేగుండును, సువర్చసుండును; కూడి= ఒక్కటై; కవిసి= విజృంభించి; వివిధ విశిఖంబులన్= అనేకవిధాలైన బాణాలతో; అతనిన్= భీముడిని; పొదివినన్= ఎదుర్కోగా; అంతకుమున్ను+అ= అంతకుముందే; దుశ్శాసన, రక్తపాన= దుశ్శాసనుడి నెత్తురు త్రాగుటచేత; కౌతుక+అధీన= సంతోషమునకు వశమైన; మానసుండు+ఐన= మనస్సు కలవాడైన; ఆ భీమసేను పైన్; ఎవ్వరు; కడంగుదురో= మార్కొంటారో; అని; కన్ను+ఇడి ఉండి= కనిపెట్టుకొని ఉండి; అతండు; అప్రతిహతంబుగాన్= అడ్డగించేవారు లేనివాడై; ప్రతిన తీర్చుటకున్= ప్రతిజ్ఞ పూర్తిచేయటంవలన; ప్రీత చిత్తుండు+ అగు= సంతోషించిన మనస్సు కలవాడగు; ఫల్గునుండు= అర్జునుడు; భల్ల+దశకంబునన్= పదిబాణాలతో; ఆ+కుమార దశకంబు= ఆ కురుకుమారులు పదిమందియొక్క; శిరంబులు; తునుమాడెన్= త్రుంచాడు; అట్టి భీమార్జునుల; ఆటోపంబునకున్= విజృంభణానికి; ఓటఱి= భయభ్రాంతమై; నీ సైన్యంబు; సమర విముఖంబు+అయ్యెన్= పోరుకు పెడమొగం పెట్టింది; ఆ సూతనందనుండును= ఆ కర్ణుడు కూడా; భీతుండు+ఐ= భయపడినవాడై; వదనంబు= మోము; వెలవెలన్+పాఱన్= కాంతిహీనంకాగా; ఊరకుండెన్; అప్పుడు; శల్యుండు; అతనిన్= కర్ణుడిని; ఆలోకించి= చూచి; ఇట్లు+ అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** నీ కొడుకులు కవచి, నిషంగి, పాశి, దండధారుడు, ధనుర్గ్రహుడు, అలోలుపుడు, సహుడు, షండుడు, వాతవేగుడు, సువర్చసుడు - అనేవారు ఒకటిగా చెలరేగి వివిధ బాణాలతో భీముడిని చుట్టుముట్టారు. అంతకుముందే దుశ్శాసనుడి రక్తం త్రాగి సంతోషిస్తూ ఉన్న భీముడిపై ఎవరు దాడి చేస్తారో అని గమనిస్తూ, అతడు నిరాఘాటంగా ప్రతిజ్ఞ తీర్చికొన్నందుకు సంతోషించిన అర్జునుడు, పది భల్లాలతో ఆ పదిమంది కుమారుల శిరస్సులను త్రుంచాడు. ఆ విధంగా భీమార్జునుల విజృంభణంతో భయభ్రాంతమైన నీ సైన్యం యుద్ధానికి విముఖమయింది. ఆ కర్ణుడు కూడా భయపడి, మొగం వెలవెలపోగా ఊరకున్నాడు. అప్పుడు శల్యుడు అతడిని చూచి ఇట్లా అన్నాడు.

**తే. 'ఉగ్రుఁడై దుస్ససేనుని యురము వ్రచ్చి । రుధిర ముగ్రతఁ ద్రావు మరుత్తనూజుఁ**
**జూచి చేడ్పడి చెయ్వేదెఁ జూచితే సు । యోధనుని? నీవు నట్లైన నొప్పు నెట్లు? 229**

**ప్రతిపదార్థం:** ఉగ్రుఁడు+ఐ= కోపోద్దీపితుడై; దుస్ససేనుని; ఉరము= ఎద; వ్రచ్చి= చీల్చి; రుధిరము= నెత్తురు; ఉగ్రతన్= క్రోధంతో; త్రావు= త్రాగే; మరుత్తనూజున్= భీముడిని; చూచి; చేడ్పడి= భయపడి; చెయ్వేదెన్= చేష్టలు ఉడిగాడు; సుయోధనునిన్; నీవుచూచితే?= నీవు చూచావా?; నీవున్= నీవు కూడా; అట్లు+అయినన్= అట్లే నిర్వీర్యుడవైతే; ఎట్లు; ఒప్పున్?= సరిపోతుంది?

**తాత్పర్యం:** తీవ్రకోపంతో దుస్ససేనుడి ఎద చీల్చి, ఆవేశంతో నెత్తురు త్రాగిన భీముడిని చూచి సుయోధనుడు భయకంపితుడై చేష్టలు దక్కి ఎట్లా నిలబడిపోయాడో చూచావా? నీవు కూడ అట్లే అయితే ఎట్లా?

**క. 'బలియు రగు రాజులును గాల్ । నిలువక తెరలంగ, వీరె నీ ప్రాపున శ**
**త్రులఁ దాఁక దలంచి కృపా । దులు నిలిచిరి కూర్చికొను మతులధైర్యమునన్.' 230**

**ప్రతిపదార్థం:** బలియురు+అగు= బలవంతులైన; రాజులును= రాజులుకూడా; కాల్ నిలువక= కాలూని నిలబడలేక; తెరలంగన్= వైదొలగిపోగా; వీరె= వీళ్ళే; నీ ప్రాపునన్= నీ రక్షణలో; కృపాదులు= కృపాచార్యుడు మొదలైనవారు; శత్రులన్+ తాఁకన్= విరోధులపై పడాలని; తలంచి= అనుకొని; నిలిచిరి= సిద్ధంగా నిలబడి ఉన్నారు; అతుల ధైర్యమునన్= సాటిలేని ధైర్యంతో; కూర్చికొనుము= వీరిని కూడగట్టుకొనుము.

**తాత్పర్యం:** 'బలవంతులైన రాజులు కాలూని నిలబడలేక పరుగెత్తిపోయారు. కృపుడు మొదలైనవారు నీ రక్షణలో శత్రువులపై దాడిచేయాలని నిలబడి ఉన్నారు. అకుంఠితమైన ధైర్యంతో వీరిని కూడగట్టుకొని యుద్ధానికి పూనుకొమ్ము.'

**చ. 'కడు వెగడంది యున్న నినుఁ గన్గొని వీఁడె యుదారధైర్య మే**
**ర్పడ వృషసేనుఁ డొక్కరుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో**
**యెడు; నరు నీవు దాఁక వలదే? రణభారము నీభుజంబునం**
**దిడియె సమస్తముం గురునరేంద్రుఁడు; దానిఁ దలంపు మిత్తఱిన్.' 231**

**ప్రతిపదార్థం:** కడున్= మిక్కిలి వెగడు= కలవరపాటు; అంది ఉన్న= పొంది ఉన్న; నినున్+కన్గొని; వీఁడె= వీడు; వృషసేనుఁడు; ఒక్కరుఁడున్= ఒక్కడే; ఉదార= గొప్పదగు; ధైర్యము; ఏర్పడన్= రూపొందగా; పాండు తనూజులన్= పాండురాజు పుత్రులను; మార్కొనంగన్= ఎదిరించేదానికి; పోయెడున్= పోతున్నాడు; నరున్= అర్జునుడిని; నీవు; తాఁకఁవలదే?= పైబడి యుద్ధం చేయాలిగదా?; కురునరేంద్రుఁడు= దుర్యోధనుడు; రణభారము= యుద్ధభారాన్ని; సమస్తమున్= పూర్తిగా; నీ భుజంబునందున్= నీ భుజాలమీద; ఇడియెన్= ఉంచాడు; దానిన్= ఆ విషయాన్ని; ఈ+తఱిన్= ఈ అదనున; తలంపుము= తలచుకొనుము.'

**తాత్పర్యం:** 'మిక్కిలి వికలమనస్కుడవై ఉన్న నిన్ను చూచి, (నీ కుమారుడు) వృషసేనుడు ఒంటరిగా నిరాఘాటమైన సాహసంతో పాండవులను ఎదిరించేందుకు బయలుదేరి పోతున్నాడు. నీవు అర్జునుడిని ఎదుర్కోవద్దా? కురురాజు యుద్ధభారాన్ని నీ భుజాలపై మోపి ఉన్నాడు. ఆ విషయాన్ని నీవు ఈ సమయంలో తలచుకొనుము.'

**వ. అనిన విని, యతండు సమరోన్ముఖుం డయ్యె; వృషసేనుండు భీమసేనుపై నురవణింప నకులుం డడ్డపడి, యక్కుమారుని సిడంబును గొడుగును గోదండంబును ఖండించిన. 232**

**ప్రతిపదార్థం:** అనినన్, విని= అని (శల్యుడు) అనగా; అతండు= కర్ణుడు; సమర+ఉన్ముఖుండు+అయ్యెన్= యుద్ధానికి సిద్ధమైనాడు; వృషసేనుండు; భీమసేనుపైన్; ఉరవణింపన్= ఎదుర్కొనపోగా; నకులుండు; అడ్డపడి; ఆ+కుమారుని= ఆ రాధేయుడి పుత్రుడియొక్క; సిడంబు= ధ్వజాన్ని; గొడుగును; కోదండంబును; ఖండించినన్= తునుకలు చేయగా.

**తాత్పర్యం:** అనగా విని, కర్ణుడు యుద్ధానికి సుముఖుడయ్యాడు. వృషసేనుడు భీముడిమీదికి లంఘించాడు. నకులుడు అడ్డుపడి, అతడి ధ్వజాన్నీ, గొడుగునూ, విల్లునూ త్రుంచివేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. అలిగి యతండు వేఱొక శరాసన మెత్తి, రథమ్ము ఘోటక**
**మ్ముల నిలఁ గూల నేయఁ, బొలివోవని ధైర్యము పేర్మి వాలునుం**
**బలకయుఁ గొంచు, మాద్రితొలుపట్టి ధరిత్రికి దాఁటి బెట్టు గో**
**ల్తలఁ జని తత్సహాయభట దారుణకేలి యొనర్చి పేర్చినన్. 233**

**ప్రతిపదార్థం:** అతండు= వృషసేనుడు; అలిగి= కోపగించుకొని; వేఱొక= ఇంకొక; శరాసనము= విల్లు; ఎత్తి= చేపట్టి; రథమ్ము= రథాన్ని; ఘోటకమ్ములన్= గుర్రాలను; ఇలన్+కూలన్= భూమిపై పడేటట్లు; ఏయన్= ప్రయోగించగా; పొలివోవని= వెలితిపడని; ధైర్యము పేర్మిన్= సాహసాతిశయంతో; వాలునున్= ఖడ్గాన్ని; పలకయున్= డాలు; కొంచున్= చేబూని; మాద్రి తొలుపట్టి= మాద్రి తొలికొడుకు-నకులుడు; ధరిత్రికిన్= భూమిపైకి; దాఁటి= ఎగిరి దూకి; బెట్టు= గట్టిగా; కోల్తలన్= ఎదుట నిలిచి యుద్ధం చేయటానికి; చని= వెళ్ళి; తత్సహాయభట= ఆయనకు సహాయంగా ఉన్న సైనికులతో; దారుణకేళి= క్రూరమైన యుద్ధవిహారం; ఒనర్చి= చేసి; పేర్చినన్= అతిశయించగా.

**తాత్పర్యం:** కర్ణపుత్రుడు వృషసేనుడు కోపోద్దీపితుడై వేరే ధనుస్సును తీసికొని, నకులుడి తేరును అశ్వాలను నేలపాలు చేశాడు. దీనితో నకులుడు శౌర్యం పెచ్చు పెరగగా, కత్తిని, డాలును తీసికొని నేలకు దూకి, గట్టిగా ఎదుట నిలిచి యుద్ధం చేయటానికి వెళ్ళి, వృషసేనుడికి సహాయంగా ఉన్న సైనికులను హింసించి ఉప్పొంగగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. కర్ణసుతుఁడు పలక ఖండించి, కృష్ణ స । ర్పంబుఁ బోని పటు కృపాణ ముఱక**
**నఱికి, నారసములు నాటించె నయ్యర్జు । నానుజన్ముమేన నల్ల నగుచు. 234**

**ప్రతిపదార్థం:** కర్ణసుతుఁడు= వృషసేనుడు; పలక= పలకను; ఖండించి; కృష్ణ సర్పంబున్+పోని= నల్లత్రాచువంటి; పటు= దిట్టమైన; కృపాణము= ఖడ్గమును; ఉఱక= అవలీలగా; నఱికి; నారసములు= బాణాలు; ఆ+అర్జున= ఆ అర్జునుడి; అనుజన్ము మేనన్= తోబుట్టినవాడి దేహమును; అల్ల నగుచున్= మెల్లగా నవ్వుతూ; నాటించెన్= గ్రుచ్చుకొనేటట్లు చేశాడు.

**తాత్పర్యం:** వృషసేనుడు నకులుని ఖేటకాన్ని తునకలుచేసి, నల్లత్రాచువంటి ఆయన ఖడ్గాన్ని సులభంగా ఖండించి, నవ్వుతూ, బాణాలను ఆయన శరీరమంతా నాటాడు.

**వ. అప్పుడు ధృష్టద్యుమ్నుండు యుధామన్యుండును నుత్తమౌజుండును శిఖండియు జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రుల కైవడి వృషసేనుపయిం గవిసినఁ గృతవర్మ కృప ద్రౌణి దుర్యోధనులును శకునియుఁ దత్సోదరులు గొందఱును గ్రందం దఱిమి, దుర్వార విశిఖ వర్షంబుల వారలం గప్పినం గని, గజ సాధను లగు కుళిందు లురవణించి. 235**

**ప్రతిపదార్థం:** అప్పుడు; ధృష్టద్యుమ్నుండు; యుధామన్యుండును; ఉత్తమౌజుండును; శిఖండియు; జనమేజయుండును; సాత్యకియును; ద్రౌపదేయులును; రౌద్రంబు శోభిల్లన్= రౌద్రం ప్రకాశించగా; రుద్రులకైవడిన్= భీకరాకారుడైన శివుడి రూపం వంటి రూపం దాల్చినవారై; వృషసేనుపయిన్; కవిసినన్= పైబడగా; కృతవర్మ; కృప; ద్రౌణి= అశ్వత్థామ; దుర్యోధనులును; శకునియున్; తద్ సోదరులు కొందఱును= ఆతనియొక్క తమ్ములలో కొందరు; క్రందన్= ఏడుస్తూ పోయేటట్లు; తఱిమి= తరిమికొట్టి; దుర్వార= అడ్డగింప వీలుకాని; విశిఖ వర్షంబులన్= బాణాల వానలతో; వారలన్; కప్పినన్= క్రమ్మివేయగా; కని= చూచి; గజ సాధనులు+అగు= గజసైన్యాన్ని ఉపయోగించుటలో ఆరితేరిన; కుళిందులు; ఉరవణించి= పరాక్రమించి.

**తాత్పర్యం:** అప్పుడు ధృష్టద్యుమ్నుడు, యుధామన్యుడు, ఉత్తమౌజుడు, శిఖండి, జనమేజయుడు, సాత్యకి, ఉపపాండవులు కోపోద్రేకంతో రుద్రులవలె వృషసేనుడితో డీకొన్నారు. కృతవర్మ, కృపుడు, అశ్వత్థామ, దుర్యోధనుడు, శకుని, అతడి సోదరులు కొందరు వాళ్ళను బాధపడేటట్లు తరిమికొట్టి, ఆపరాని బాణవర్షంతో వారిని కప్పారు. అది చూచి గజసేనా పతులైన కుళిందులు పరాక్రమించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కృతవర్మ సిక్కువడ, భూ । పతి సేడ్పడ, శకుని వెగడుపడఁ దదవరజ**
**ద్వితయము ధరఁ బడఁ, బ్రీవో । ద్ధతిఁ బోరిరి చాప టంకృతంబులు సెలఁగన్. 236**

**ప్రతిపదార్థం:** కృతవర్మ; చిక్కువడన్= కలతచెందగా; భూపతి= రాజు (దుర్యోధనుడు); చేడ్పడ= బాధపొందగా; శకుని; వెగడుపడన్= బెదరగా; తద్= ఆతనియొక్క; అవరజ= తమ్ముల; ద్వితయము= జంట; ధరన్+పడన్= నేలపై కూలగా; తీవ్ర ఉద్ధతిన్= తీంద్రించిన శౌర్యంతో; చాప టంకృతంబులు= అల్లెత్రాళ్ళ మ్రోతలు; చెలఁగన్= ధ్వనించగా; పోరిరి= యుద్ధం చేశారు.

**తాత్పర్యం:** కృతవర్మ చిక్కువడేటట్లు, దుర్యోధనుడు బాధపడేటట్లు, శకుని బెదిరిపోయేటట్లు, అతని తమ్ములిద్దరు నేల కూలేటట్లు మహాపరాక్రమంతో అల్లెత్రాళ్ళ ధ్వనులు చెలరేగగా యుద్ధం చేశారు.

**వ. ఇ తెఱంగునం బోరినం గనలి కడంగి, 237**

**ప్రతిపదార్థం:** ఈ+తెఱంగునన్= ఈ విధంగా; పోరినన్= యుద్ధం చేయగా; కనలి= కోపగించుకొని; కడంగి= పూనుకొని.

**తాత్పర్యం:** ఈ విధంగా యుద్ధం చేయగా కోపించి పూనుకొని.

**విశేషం:** ఉ.వి.సంశోధిత ప్రతిలో కర్ణుడు అనే పదం ఉంది. వావిళ్ల ప్రతిలో అది లేదు. కాబట్టి ఈ సందర్భంలో వావిళ్ల ప్రతిలోని పాఠం సముచితమనిపిస్తుంది.

**క. ఆ ముప్వురుఁ జలమున ను । ద్దామ ద్విప సహిత చిత్ర దళనంబున సం**
**గ్రామ తలము రక్తాక్తం । బై మెఱయ బలాధిపత్రయముఁ బొరిగొనినన్. 238**

**ప్రతిపదార్థం:** ఆ ముప్వురున్; చలమునన్= మచ్చరముతో; ఉద్దామ= భయంకరమైన; ద్విప= (తొండముతో, నోటితో రెంటితో త్రాగే) ఏనుగుల; సహిత= కూడిన; చిత్రదళనంబునన్= వింతగొలిపే విధంగా ఖండించటంచేత; సంగ్రామతలము= యుద్ధభూమి; రక్త+అక్తంబై= నెత్తురుచేత వ్యాప్తమై; మెఱయన్= తళుకొత్తగా; (మిగిలిన) బలాధిపత్రయమున్= (రథ తురగ పదాతుల నాయక త్రయం) మూడు విభాగాల అధిపతులను; పొరిగొనినన్= నశింపజేయగా.

**తాత్పర్యం:** ఆ ముగ్గురూ పగ సాధించుకొనాలన్న అక్కసుతో బలవత్తరమై భయంపుట్టించే ఏనుగుల గుంపును చిత్రహింసచేసి తుదముట్టించారు. చచ్చిన ఏనుగుల నెత్తుటితో యుద్ధభూమి అంతా మెరిసినది. మిగిలిన మూడు విభాగాలూ తీవ్రమైన పోరుసల్పి నశించాయి.

**క. తక్కటి రథిక జనులు పే । రుక్కున నయ్యిభచయంబు నొదిఁగించియునుం**
**జిక్కువఱిచియుం దునిమియు । నెక్కడు మద మొప్ప మెఱసి రిభపురనాథా! 239**

**ప్రతిపదార్థం:** ఇభపురనాథా!= ఓ హస్తినాపుర ప్రభూ!; తక్కటి= మిగిలిన, ఇతర; రథికజనులు= రథ సైనికులు; పేరు+ఉక్కునన్= అతిశయించిన బలంతో; ఆ+ఇభచయంబున్= ఆ ఏనుగుల సమూహమును; ఒదిఁగించియునున్= ప్రక్కకు తరిమికొట్టియు; చిక్కుపఱిచియున్= చిక్కులలో ఇరకబెట్టియు; తునిమియున్= నరికివేసియు; ఎక్కుడు; మదము+ఒప్పన్= కండకావరం రేగగా; మెఱిసిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** (పైబడిన మూడు దళాలవారు పోగా) మిగిలిన రథసైనికులు అతిశయించిన బలంతో ఆ గజ సమూహాన్ని ప్రక్కకు తరిమి, ఇక్కట్లలో ఇరికించి, చేజిక్కిన వాటినంతా నరికి మదాతిరేకంతో ప్రకాశించారు.

**వ. మెఱసినం జూచి. 240**

**తాత్పర్యం:** ఆ విధంగా ప్రకాశించగా చూచి. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఆ. అరద మెక్కి తఱిమె ననిల తనూజుఁ డ । వ్వీరుతోన పాండవేయ సేనఁ**
**జేయఁ గలుగు దొరలు శితశరాసారంబు । లడర వారిమీఁద నడరుటయును. 241**

**ప్రతిపదార్థం:** అనిల తనూజుఁడు= వాయుపుత్రుడు - భీముడు; అరదము+ఎక్కి= రథాన్ని ఎక్కి; తఱిమెన్= తరిమాడు; ఆ+వీరుతోన= ఆ వీరుడితో పాటే; పాండవేయసేనన్= పాండవసైన్యంలో; చేయన్+కలుగు దొరలు= కార్యనిర్వహణ దక్షులైన పాలకులు; శిత= పదునైన; శర+ఆసారంబులు= బాణవర్షములు; అడరన్= విజృంభించగా; వారిమీఁదన్; అడరుటయును= పైబడి విజృంభించగా.

**తాత్పర్యం:** భీముడు రథారూఢుడై వారందరిని తరిమికొట్టాడు. పాండవ సేనానాయకులు నేర్పుతో ఆయన వెంట నడిచారు. తోడ్తోడనే ఎదిరిపై అమ్ముల జడివాన కురిపించి పైకొన్నారు. ఆ తరువాత. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. రణంబు దారుణం బయ్యె; నందు. 242**

**తాత్పర్యం:** పోరు ఘోరరూపం తాల్చింది. అందులో.

**సీ. కర్ణుని యగ్రభాగంబునఁ గరిఘటల్ । దునుమాడు నకులనందనునిఁ గిట్టి,**
**వృషసేనుఁ డమ్ములవెల్లి పైఁ బరఁగించి । శితభల్లమున సూతుశిరము ద్రుంపఁ,**
**గనుఁగొని యక్కర్ణతనయుని మీఁదఁ బా । ర్థాదులు గవిసిన; నతఁడు పార్థు**
**ననిలజు మూఁడుమూఁ డమ్ముల నొప్పించి । యాశతానీకుని నట్ల చేసి,**

**తే. నకులు తనువున బాణసప్తకము సొనిపి. । శార్ఙ్గధరు మేనఁ బంద్రెండు సాయకములు**
**వఱపి పేర్చినఁ, గౌరవప్రతతి మెచ్చి, । పార్థువేఁడిమి యూహించి భయముఁ బొందె. 243**

**ప్రతిపదార్థం:** కర్ణుని; అగ్ర భాగంబునన్= ముందుభాగంలో; కరిఘటల్= ఏనుగుల గుంపులను; తునుమాడు= నరికివేస్తున్న; నకులనందనునిన్= నకులుని కుమారుడిని; కిట్టి= సమీపించి; వృషసేనుఁడు; అమ్ములవెల్లి= బాణవర్షాన్ని; పైన్+పరఁగించి= కురిపించి; శిత భల్లమునన్= వాడి అయిన ఈటెతో; సూతుశిరము= సారథి తలను; త్రుంపన్= నరికివేయగా; కనుఁగొని= చూచి; ఆ+కర్ణ తనయునిమీఁదన్= ఆ కర్ణుడి కొడుకుపై; పార్థ+ఆదులు= అర్జునుడు మొదలైనవారు; కవిసినన్= పైకొనగా; అతఁడు= వృషసేనుడు; పార్థున్= అర్జునుడిని; అనిలజున్= భీముడిని; మూఁడు అమ్ములన్= మూడేసి బాణాలతో; నొప్పించి= బాధపెట్టి; ఆ శతానీకునిన్= ఆ శతానీకుడిని కూడా; అట్లు చేసి; నకులు= నకులుడి; తనువునన్= దేహంలో; బాణ సప్తకము= బాణాలు ఏడింటిని; చొనిపి= చొప్పించి; శార్ఙ్గధరు= కృష్ణుడి; మేనన్= దేహమున; పంద్రెండు; సాయకములు= బాణాలు; పఱపి= ప్రయోగించి; పేర్చినన్= అతిశయించగా; కౌరవప్రతతి= కౌరవసమూహం; మెచ్చి= కొనియాడి; పార్థు వేడిమి= అర్జునుడి కోపతాపమును; ఊహించి; భయమున్ పొందెన్.

**తాత్పర్యం:** వృషసేనుడు కర్ణుడి ముందుభాగంలో ఏనుగుల సమూహాలను తునియలుగా నరికివేస్తున్న నకులపుత్రుడి మీద అమ్ములవాన కురిపించి, రథసారథి తలను ఒక పదునైన బల్లెంతో త్రుంచివేశాడు. ఇది చూచి అర్జునుడు మొదలైనవారు కర్ణుడి కుమారుడిపై క్రమ్ముకొనగా అతడు పార్థుడిని, భీముడిని మూడేసి అమ్ములతో బాధపెట్టాడు. శతానీకుడికి, ఇదే గతి పట్టించాడు. నకులుడి దేహంలో ఏడు బాణాలను, కృష్ణుడి దేహాన పంద్రెండు బాణాలను నాటి బాధించాడు. దీనితో కౌరవసమూహాలు వృషసేనుడిని పొగడ్తలతో ముంచెత్తాయి. తోడనే వారు పార్థుడి కోపతాపాన్ని తలచుకొని భయభ్రాంతులయ్యారు.

**చ. కెలఁకుల యోధులం గడచి, క్రీడి వడిన్ వృషసేనుమీఁద న**
**మ్ములు నిగిడింప; నా రథిక ముఖ్యుని మూఁపున నక్కుమారుఁ డే**
**పలరఁగ వాఁడి తూపులు రయంబు మెయిం బది బెట్టు గ్రుచ్చి, య**
**గ్గలిక ముకుందు నేసె నవకాండములన్ దివి ముట్ట నార్చుచున్. 244**

**ప్రతిపదార్థం:** కెలఁకుల= ప్రక్కల ఉండే; యోధులన్= యుద్ధవీరులను; కడచి= దాటి; క్రీడి= అర్జునుడు; వడిన్= వేగంగా; వృషసేనుమీఁదన్; అమ్ములు; నిగిడింపన్= వ్యాపింపజేయగా; ఆ+కుమారుఁడు= ఆ వృషసేనుడు; ఏపు అలరఁగన్= అతిశయం శోభించగా; ఆ రథిక ముఖ్యుని= ఆ రథవీర శ్రేష్ఠుడి; (అర్జునుని) మూఁపునన్= భుజం మీద; వాఁడి తూపులు= వాడి అయిన బాణాలు; పది; రయంబు మెయిన్= వేగంగా; బెట్టు= గట్టిగా; క్రుచ్చి= చొప్పించి; ముకుందున్= శ్రీకృష్ణుని; అగ్గలికన్= ఆధిక్యంతో; దివిముట్టన్= ఆకాశం అంటేటట్లు; ఆర్చుచున్= కేకలు+పెట్టుతూ; నవకాండములన్= తొమ్మిది బాణాలను; ఏసెన్= కొట్టెను.

**తాత్పర్యం:** అర్జునుడు చుట్టుప్రక్కల ఉండే సైనికులను తప్పించుకొనిపోయి, వృషసేనుడిపై బాణప్రయోగం చేశాడు. ఆ యువకవీరుడు కాకలుతీరిన ఆ యోధుడి భుజాన పది బాణాలను గ్రుచ్చుకొనేటట్లు వేసి, ఆకాశం దద్దరిల్లేటట్లు కేకలు వేస్తూ మరల ముకుందుడిని తొమ్మిది బాణాలతో కొట్టాడు.

**వ. ఇట్లు విజృంభించిన. 245**

**తాత్పర్యం:** ఈ విధంగా విజృంభించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

### అర్జునుఁడు వృషసేనుని మృతిఁ బొందించుట (సం. 8-62-59)

**మ.** **భ్రుకుటిస్ఫూర్జిత ఫాలభాగుఁ డగుచుం బొంగారి, యాసూతపౌ**
**త్రకు కోదండము బాహుదండములుఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి, మ**
**స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్ల విలస ద్ధారాహతిం ద్రుంచె, బా**
**ణకళాదుర్దముఁ డన్నరుండు పతియు న్రాధేయుఁడుం జూడఁగన్.** 246

**ప్రతిపదార్థం:** భ్రుకుటి స్ఫూర్జిత= కనుబొమలముడిచే వెలుగొందిన; ఫాలభాగుఁడు+అగుచున్= నొసలుగలవాడవుతూ; పొంగారి= పొంగి; బాణకళా= బాణప్రయోగ శిల్పమును; దుర్దముఁడు= చెనకరాని; ఆ+నరుండు= ఆ అర్జునుడు; ఆ సూత పౌత్రకు= సూతుని మనుమడైన వాని; కోదండము= ధనుస్సును; బాహుదండములున్= దుడ్డుకర్రవంటి చేతులను; చిత్రస్ఫూర్తిన్= వింత గొలిపే విన్యాసంతో; తున్మాడి= విరుగగొట్టి; క్రూరభల్ల= కరకుటమ్ముయొక్క; విలసత్= మెరిసే; ధారాహతిన్= పదునైన భాగపు దెబ్బతో; మస్తకము= తలను; ఉగ్రోద్ధతిన్= కోపపు పొంగుతో; పతియున్= రాజైన దుర్యోధనుడు; రాధేయుండున్= కర్ణుడు; చూడఁగన్= చూస్తుండగానే; త్రుంచెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** ఆశ్చర్యకరమైన విధంగా బాణప్రయోగ విద్యయందు ఎదురులేనివాడైన ఆ ఫల్గునుడు, కనుబొమల ముడితో వీరత్వాన్ని చాటుతున్న నుదురుతో ప్రదీప్తుడై, ఆ సూతుడి మనుమడియొక్క ధనుస్సును, బలసిన భుజములను ఆశ్చర్యకరమైన విలాస వైఖరితో ముక్కలు చేశాడు. వెంటనే తళతళలాడే బాణంయొక్క పదునైన ప్రక్కభాగపు దెబ్బతో అతడి తలను కసిదీరా నరికివేశాడు. ఇదంతా ఊరక చూస్తూనే ఆ దుర్యోధనుడు, కర్ణుడు నిలబడిపోయారు.

**వ.** **ఇ వ్విధంబున వృషసేను సమయించుటం జూచి, కర్ణుండు శోకవ్యాకులచిత్తుండై కన్నీ రొలుకం, గోపాటోపంబున నుద్భటుం డగుచు, నమ్మహారథుని తేరికి సమ్ముఖంబుగాఁ దనయరదంబు వఱపించి, 'యర్జున! యర్జున!' యని యాహ్వానంబు సేసిన; నతండును సవిశేషోత్సాహంబునం బొదలి యడరె; నట్టియెడ దురంబు దక్కి యిరువాఁగునుం బరమ కౌతుకంబునం గనుంగొనుచుండ నయ్యిరువురు రామసన్నిభంబులు నాదిత్య సంకాశంబులుఁ ద్రినయన ప్రతిమంబులు నగు నాకారంబుల నుల్లసిల్లిరి; వారల యెక్కటి కయ్యం బాలోకించు కుతూహలంబున సుర పితృ విద్యాధర సంయమి సంఘంబులును శచీపతి ప్రజాపతి పశుపతులును లోనుగా ననేక దివ్యు లేతెంచి నభోభాగంబున నిలిచి; రప్పుడు బ్రహ్మ రుద్రున కిట్లనియె.** 247

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; వృషసేనున్; సమయించుటన్= చంపుటను; చూచి; కర్ణుండు; శోకవ్యాకులచిత్తుండు+ఐ= దుఃఖంతో కలతచెందిన మనస్సుకలవాడై; కన్నీరు+ఒలుకన్= కన్నీరు కారుతుండగా; కోపాటోపంబునన్= కోపాధిక్యంతో; ఉద్భటుండు= శౌర్యోద్దీపితుడు; అగుచున్; ఆ+మహారథుని= ఆ రథికశ్రేష్ఠుడైన అర్జునుని; తేరికిన్; సమ్ముఖంబుగాన్= ఎదురుగా; తన అరదంబు; వఱపించి= తోలించి; 'అర్జున! అర్జున!' అని; ఆహ్వానంబు చేసినన్= పిలువగా; అతండును= ఆయనయు; సవిశేష= ప్రత్యేకమైన; ఉత్సాహంబునన్= కుతూహలంతో; పొదలి= ఒప్పారి; అడరెన్= శోభిల్లాడు; అట్టి ఎడన్=

అప్పుడు; దురంబు= యుద్ధం; తక్కి= మాని; ఇరువాఁగునున్= ఉభయపక్షాలవారును; పరమ కౌతుకమునన్= అత్యంతమైన అభిలాషతో; కనుంగొనుచుండన్= చూస్తూండగా; ఆ+ఇరువురు= ఆ కర్ణార్జునులు ఇద్దరు; రామసన్నిభులు= రామునితో సమానులుగా; ఆదిత్య సంకాశంబులు= సూర్యుడివంటివారుగా; త్రినయన= శివుడి; ప్రతిమంబులుగన్= పోలినవారుగా; అగు; ఆకారంబులన్= స్వరూపాలతో; ఉల్లసిల్లిరి= కనుపించారు; వారల; ఎక్కటికయ్యము= ద్వంద్వయుద్ధం; ఆలోకించు= చూచే; కుతూహలంబునన్= అపేక్షతో; సుర; పితృ; విద్యాధర; సంయమి= దేవతల, పితృదేవతల, విద్యాధరుల, మునుల; సంఘంబులును= సమూహాలున్నూ; శచీపతి= ఇంద్రుడును; ప్రజాపతి= బ్రహ్మ; పశుపతులున్నూ= శివుడును; లోనుగాన్= మొదలైన; అనేక దివ్యులు= చాలామంది దేవతలు; ఏతెంచి= విచ్చేసి; నభోభాగంబునన్= ఆకాశతలాన; నిలిచిరి; అప్పుడు; బ్రహ్మ; రుద్రునకున్= శివుడితో; ఇట్లు+అనియెన్. (ఈ యుద్ధానికి అలౌకిక శోభను చేకూర్చడానికి బ్రహ్మ రుద్రాదులచేత యుద్ధవర్ణన చేయిస్తాడు కవి.)

**తాత్పర్యం:** ఈ విధంగా వృషసేనుడిని చంపటం చూచి, కర్ణుడు దుఃఖంతో వ్యాకులత చెంది కన్నీరు కార్చాడు. కోపాటోపాన్ని చెందాడు. అర్జునుడి రథానికి ఎదురుగా తన రథాన్ని నడిపి 'అర్జునా! అర్జునా!' అని ఆహ్వానించాడు. అతడు కూడా అధికోత్సాహంతో కర్ణుడివైపు ఎదురు నడిచాడు. రెండు వైపుల సైన్యాలూ యుద్ధం మాని, వారిని చూస్తూ నిలబడ్డాయి. రాములవలె, సూర్యులవలె, రుద్రులవలె ఉన్న వారి ఆకారాలను చూచి ఉత్సాహపడ్డారు. వారి ద్వంద్వయుద్ధం చూద్దామని ఆకాశంలో దేవతలు, పితృదేవతలు, విద్యాధరులు, ఋషిసమూహాలు, ఇంద్రుడు, బ్రహ్మ, శివుడు మొదలైన పెక్కుమంది దివ్యులు నిలిచి ఉన్నారు. అప్పుడు బ్రహ్మ రుద్రుడితో ఇట్లా అన్నాడు.

### కర్ణార్జునుల ద్వంద్వ యుద్ధకాలమున బ్రహ్మరుద్రేంద్రుల ప్రశ్నోత్తరములు (సం. 8-63-46)

**క. 'ఇరువురు నతిరథులు సమ । స్ఫురణులు విక్రాంతిపరులు శూరులు వీ రొం**
**డొరువులతోఁ బెనఁగఁగ న । శ్వర మగు జగ; ముడుపరాదె సమరం బనఘా!' 248**

**ప్రతిపదార్థం:** అనఘా!= పాపరహితుడా!; ఇరువురున్= ఇద్దరూ; అతిరథులు= పెక్కుమంది రథికులతో పోరాడే యోధులు; సమస్ఫురణులు= సమఉజ్జీలు; విక్రాంతిపరులు= పరాక్రమం చూపటంలో దిట్టలు; శూరులు; వీరు; ఒండొరువులతోన్= ఒకరితో ఒకరు; పెనఁగఁగన్= పోరాడితే; జగము; నశ్వరము+అగున్= నశించిపోగలదు; సమరంబు= యుద్ధాన్ని; ఉడుపన్‌రాదె?= మాన్పించకూడదా?

**తాత్పర్యం:** పెక్కుమంది ధనుష్పాణులైన యోధులకు నాయకత్వం వహించగలిగిన నాయకులు, సమఉజ్జీలు, శౌర్యంతో విక్రమించగలిగినవారు, ధైర్యసాహసోపేతులు - ఇట్టి మొనగాండ్రు ఒకరినొకరు ఎదుర్కొని యుద్ధం చేయటంవలన జగత్తు నాశనమై పోగలదు. అందుచేత ఈ కయ్యాన్ని మాన్పించరాదా?' అని బ్రహ్మ శివుడితో అన్నాడు.

**క. అన విని యా దేవుం డ । వ్వనజభవున కిట్టు లను: 'నవార్యోద్ధతు లీ**
**ఘనభుజులు వీరి రణ మె । ట్లును జెల్లుం, దప్ప; దప్పలుకు విడు మింకన్.' 249**

**ప్రతిపదార్థం:** అనన్, విని= అని చెప్పగా ఆలకించి; ఆ దేవుండు= ఆ రుద్రుడు; ఆ+వనజభవునకున్= బ్రహ్మకు; ఇట్టులు+ అనున్; ఈ ఘనభుజులు= ఈ గొప్ప దోశ్శక్తిగలవారు; అవార్య= అడ్డగించటానికి అలవిగాని; ఉద్ధతులు= ప్రకోపించిన

పరాక్రమవంతులు; (కావున); వీరి; రణము; ఎట్లును= ఏవిధంగానైనా; చెల్లును= జరుగుతుంది; తప్పదు; ఆ+పలుకు; ఇంకన్= ఇక మీద; విడుము= వదలుము.

**తాత్పర్యం:** రుద్రుడు ఆయన చెప్పింది విని బ్రహ్మదేవుడితో ఇట్లంటున్నాడు - వీరిద్దరు వారింప శక్యంకాని గర్వం కలవారు, భుజబల సంపన్నులు. వీరి యుద్ధం తప్పదు. కాబట్టి నివారించటమనే మాట మానుకొమ్ము.

**వ. అని యి ట్లమ్మహాత్ములు సల్లాపంబులు సేయ, నాకర్ణించి పాకశాసనుండు సప్రణయంబుగా బ్రహ్మ కిట్లనియె. 250**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు; ఆ+మహాత్ములు; సల్లాపంబు= పరస్పర సంభాషణం; చేయన్= చేయగా; ఆకర్ణించి= విని; పాకశాసనుండు= ఇంద్రుడు; సప్రణయంబుగాన్= ప్రేమపూర్వకంగా; బ్రహ్మకు; ఇట్లనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా ఆ మహాత్ములు మాట్లాడుకొనగా విని, ఇంద్రుడు వినయంగా బ్రహ్మతో ఇట్లా అన్నాడు.

**చ. 'తపము నుదాత్తశౌర్యము నుదగ్రబలంబును గల్గు క్రీడి క**
**య్యపు వెర వెక్కుడై, గెలుచునట్లుగ నీవు దలంపవే? పురా**
**ణ పురుషు లైన కృష్ణుల రణంబున శాత్రవు లాక్రమించుటం**
**గుపిత మనస్కు లైన నిలకున్ బ్రదు కెమ్మెయిఁ గల్గ నేర్చునే?' 251**

**ప్రతిపదార్థం:** తపము= తపస్సుచేసి ఆర్జించుకొన్న బలం (ఆ తపము ఫలితమే పాశుపతాస్త్ర లాభం); ఉదాత్తశౌర్యము= గొప్ప పరాక్రమం; ఉదగ్రబలంబునున్= భయావహమైన శక్తీ; కల్గు= కలిగిన; క్రీడికిన్; కయ్యపు వెరవు= యుద్ధనైపుణ్యం; ఎక్కుడై= అతిశయమై; గెలుచునట్లుగన్= విజయంపొందేటట్లుగ; నీవు; తలంపవే= సంకల్పించుము; పురాణపురుషులు+ఐన= విష్ణువు అంశలో జన్మించినవారైన; కృష్ణులన్= నరనారాయణులైన కృష్ణులను (కృష్ణార్జునులను); రణంబునన్; శాత్రవులు= శత్రువులు; ఆక్రమించుటన్= లోబరుచుకొనటంచేత; కుపిత మనస్కులైనన్= కోపగించిన మనస్సు కలవారైతే; ఇలకున్= ఈ భూమికి; బ్రదుకు= మనగలగటం; ఏ+మెయిన్= ఏ విధంగా; కల్గన్ నేర్చునే?= సంభవించగలదు? (సాధ్యం కాదని భావం).

**తాత్పర్యం:** తపోబలం, కీర్తిప్రదమైన సాహసం, శత్రువులను భయకంపితులను జేసే శరీరశక్తి కలిగిన క్రీడికి యుద్ధనైపుణ్యం ఎక్కువై గెలుస్తాడని నీవు సంకల్పించు. నరనారాయణావతారులైన కృష్ణులను (కృష్ణార్జునులను) శత్రువులు కప్పివేస్తే వారు కోపోద్రిక్తులైతే ఈ లోకాలు మనగలుగుతాయా?

**వ. 'నరనారాయణులకు నెందును జయంబు ధ్రువం బని తొల్లియుం జెప్పితి; రిమ్మహాత్ములు జయించుట లోకహితంబు; గర్ణుండు ద్రోణ భీష్మ ప్రాప్తంబైన పుణ్యలోకంబు వడయుఁ; గిరీటి చిరకాల బిడుమలం బడినవాఁడు గావున రాజ్య సుఖంబు లనుభవించుం గాక' యనిన నప్పరమేష్ఠి 'వీరల జయాపజయంబులు నిశ్చయించి పలుకనేల?' యనుటయు, నీశానుం డతని నాలోకించి 'నిశ్చయించుట మేల కాక యెగ్గేమి? నిశ్చయింత' మని కలిపికొని యతండునుం దానును వాసవు వలను విలోకించి కృష్ణార్జునుల నుద్దేశించి. 252**

**ప్రతిపదార్థం:** నరనారాయణులకున్; ఎందును= ఎక్కడైనా; జయంబు; ధ్రువంబు+అని= నిశ్చయమని; తొల్లియున్= మునుపుకూడా; చెప్పితిరి; ఈ+మహాత్ములు; జయించుట; లోకహితంబు= ప్రపంచానికి క్షేమకరం; కర్ణుండు; ద్రోణభీష్మ=

ద్రోణ, భీష్ములకు; ప్రాప్తంబు+ఐన= లభించిన; పుణ్యలోకంబు; పడయున్= పొందుతాడు; కిరీటి; చిరకాలంబు; ఇడుమలన్= కష్టాలు; పడినవాఁడు= అనుభవించినవాడు; కావునన్; రాజ్యసుఖంబులు= రాజ్యాధికారసౌఖ్యాలు; అనుభవించున్ గాక; అనినన్; ఆ+పరమేష్ఠి= ఆ బ్రహ్మ; వీరల; జయాపజయంబులు= గెలుపు ఓటములను; నిశ్చయించి= ముందే నిర్ణయించి; పలుకన్+ఏల?= అనటం ఎందుకు?; అనుటయున్; ఈశానుండు= ఐశ్వర్యం కలవాడు - శివుడు; అతనిన్= బ్రహ్మను; ఆలోకించి; నిశ్చయించుట= స్థిరపరచుట; మేలు+అ కాక= మేలే కాని; ఎగ్గు+ఏమి= కీడు ఎట్లవుతుంది?; (కాబట్టి) నిశ్చయింతము+అని= తీర్మానించి చెపుదామని, కలిపికొని; అతండునున్= రుద్రుండును; తానును బ్రహ్మ; వాసవువలను= ఇంద్రుడివైపు; విలోకించి= చూచి; కృష్ణార్జునులను; ఉద్దేశించి. (పలుకుతున్నారు).

**తాత్పర్యం:** 'కృష్ణార్జునులకు విజయం తప్పదని పూర్వం కూడా మీరన్నారు. వీరు జయించటం లోకానికి మేలు. కర్ణుడు, ద్రోణ భీష్ములు పొందిన పుణ్యలోకాలు పొందుతాడు. అర్జునుడు చాలాకాలం కష్టాలు పడ్డాడు. కాబట్టి రాజ్యసుఖం అనుభవిస్తాడు గాక!' - అని అన్నాడు. అనగా, బ్రహ్మ వీరి జయాపజయాలను గురించి ముందే నిశ్చయించి పలకటమెందుకు?' - అన్నాడు. శివు డాతడిని చూచి 'ఇట్లా నిశ్చయించటం మేలే; ఇందులో ఎగ్గేముంది? నిశ్చయిద్దాం' అని వారిని కలుపుకొని, కృష్ణార్జునుల నుద్దేశించి ఇంద్రుడితో ఇట్లా అన్నాడు.

**తే.** **'మహితమును లగు వీ రెందు మాఱు లేక । మెలఁగువా రయి కాదె! జన్మించినారు?**
**వినుము! నీ చెప్పినట్టుల వీరి నొరు ల । ధఃకరించుట లోకహితంబు గాదు.'** **253**

**ప్రతిపదార్థం:** మహిత, మునులు+అగు= మహిమాతిశయులైన మునులైన; వీరు (మహిత-మునులు= ఋషులు); ఎందున్= ఏ విషయంలోగూడ; మాఱులేక= వీరికి బదులు వేరేవారులేక; మెలఁగువారు+అయి= అన్యోన్య మైత్రితో ప్రవర్తించేవారై; కాదె!= కదా!; జన్మించినారు?; వినుము; నీ చెప్పినట్టుల; వీరిన్; ఒరులు= ఇతరులు; అధఃకరించుట= క్రిందుచేయుట; లోకహితంబు కాదు= లోకానికి శ్రేయస్కరం కాదు.

**తాత్పర్యం:** మహామునులగు ఈ ఇద్దరూ ఎక్కడా సాటిలేని వారై కదా జన్మించారు. ఇక నీ వన్నట్లు ఇతరులు వీరిని జయించి తక్కువ చేయటం లోకానికి మేలు కాదు.

**వ.** **'వీరికి జయంబు ధ్రువం'బని పలికి, యంత నిలువక 'వీరి జయంబు ధ్రువంబయ్యెడు' మనవుడు, నయ్యమర విభుండు సుర ముని ప్రభృతులం గలయం గనుంగొని, 'దేవదేవు లిరువురు నేకమతంబుగా నిశ్చయించిన లోకహితం బగు నానతి యాకర్ణించితిరే! మీ చిత్తంబు లిత్తెఱంగున కనుకూలంబులు గావలయు' ననిన, నందఱు 'నది యిట్టిద కాక యొం డగునే?' యని; రనిమిషులు గుసుమ వర్షంబులు గురియించుచు దివ్య దుందుభి ధ్వానంబులు సెలంగించి; రయ్యవసరంబున నఖిల భూతంబులును విస్మయోత్ఫుల్ల నయనంబులగుచు నమ్మహా ద్వంద్వ యుద్ధంబు వీక్షించు వేడుక నొండు దలంపులు దక్కియుండె; నట్లు దార్కొనిన మహనీయ రథంబులు రెంటియందును సన్నాహసముజ్జ్వలులై యొప్పు వాసుదేవార్జునులును గర్ణశల్యులును దమ తమ శంఖంబు లొత్తి; రప్పుడు.** **254**

**ప్రతిపదార్థం:** వీరికిన్; జయంబు; ధ్రువంబు= నిశ్చయం; అని పలికి; అంతన్ నిలువక= అంతటితో ఆగక; వీరి జయంబు ధ్రువంబయ్యెడున్; అనవుడున్= అని అనగా; ఆ+అమర విభుండు= ఆ దేవతాప్రభువు-ఇంద్రుడు; సుర-ముని ప్రభృతులన్= దేవతలు, ఋషులు మున్నగువారిని; కలయన్+కనుంగొని= అందరిని బాగా చూచి; దేవదేవులు+ఇరువురు= దేవాధిదేవులైన

బ్రహ్మ శివు లిద్దరు; ఏకమతంబుగాన్= ఒకే అభిప్రాయంగా; నిశ్చయించిన= నిర్ణయించిన; లోకహితంబు+అగు= ప్రపంచానికి శ్రేయస్కరమైన; ఆనతి= ఆజ్ఞ; అకర్ణించితిరే!= విన్నారు కదా!; మీ చిత్తంబులు= మీ మనస్సులు; ఈ+తెఱంగునకున్= ఈ విధానికి; అనుకూలంబులు; కావలయున్; అనిన; అందఱున్; అది; ఇట్టిది+కాక= అదే విధమైనది కాకుండా; ఒండు+అగునే?= వేరొకవిధంగా జరుగుతుందా? (జరుగదనుట); అనిరి; అనిమిషులు= రెప్పపాటు లేనివారు- దేవతలు; పుష్పవర్షంబులు= పూలవాన; కురియించుచున్; దివ్య= దేవతలకు సంబంధించిన; దుందుభి= భేరి; ధ్వానంబులు= శబ్దాలను; చెలంగించిరి= రేగేటట్లు చేశారు; ఆ+అవసరంబునన్= ఆ సమయంలో; అఖిల; భూతంబులును= ప్రాణికోటి; విస్మయ= ఆశ్చర్యంవలన; ఉత్ఫుల్ల= బాగా వికసించిన; నయనంబులు+అగుచున్= కన్నులు కలవై; ఆ+మహాద్వంద్వయుద్ధంబును; వీక్షించు వేడుకన్= చూడాలన్న అభిలాషతో; ఒండు= ఇతర; తలంపులు= యోచనలు; తక్కి ఉండెన్= విడనాడి ఉన్నారు; అట్లు; తార్కొనిన= ఎదుర్కొనిన; మహనీయ= మహిమోపేతమైన; రథంబులు; రెంటియందును= రెండింటిలో; సన్నాహ సముజ్జ్వలులు+ఐ= ప్రయత్నంతో (పూనికతో) ప్రకాశమానులై; ఒప్పు= శోభిల్లు; వాసుదేవ-అర్జునులును= కృష్ణార్జునులును; కర్ణశల్యులును; తమ తమ; శంఖంబులు; ఒత్తిరి= పూరించారు; అప్పుడు.

**తాత్పర్యం:** 'వీరికి జయం తప్పదు' అని అంతతో ఆగక 'వీరి జయం నిశ్చితమౌతుంది' అన్నాడు శివుడు. అప్పుడు ఇంద్రుడు సురముని సమూహాలను చూచి, 'దేవదేవులిద్దరూ కలిసి ఏకవాక్యంగా నిశ్చయించిన లోకహితాన్ని మీరు విన్నారు కదా! మీ సంకల్పాలు కూడా దాని కనుకూలంగా సాగనివ్వండి' అనగా అందరూ' అది అట్లాగే ఔతుంది. మరొకవిధంగా ఎట్లా ఔతుంది?' అన్నారు. దేవతలు పూలవానలు కురిపించారు. దివ్యదుందుభులు మ్రోగించారు; అప్పుడు అన్ని భూతాలు ఆశ్చర్యంతో వికసించిన నేత్రాలతో వారి ద్వంద్వయుద్ధం చూడాలన్న కోరికతో ఏకాగ్రచిత్తంతో ఉన్నాయి. సర్వసన్నాహాలతో రథారూఢులై ఉన్న కృష్ణార్జునులు, శల్యకర్ణులు శంఖాలు పూరించారు.

**తే. రెండు సేనల శంఖభేరీ ముఖంబు । లైన బహుతూర్యముల పటుధ్వాన మడరి**
**నింగి పొంగారె; నత్యంత నిశ్చలంబు । లయ్యె సైనిక నికరంబు లద్భుతముగ. 255**

**ప్రతిపదార్థం:** రెండుసేనల; శంఖ+భేరి ముఖంబులైన= శంఖాలు, భేరులు మొదలైన; బహు= అనేకములైన; తూర్యముల= వాద్యముల; పటు= బెట్టిదమైన; ధ్వానము= శబ్దం; అడరి= రేగి; నింగి= ఆకాశం; పొంగారెన్= ఉబికింది; సైనిక నికరంబులు= సైనిక సమూహాలు; అద్భుతముగాన్= ఆశ్చర్యజనకంగా; అత్యంత= మిక్కిలి; నిశ్చలంబులు+అయ్యెన్= కదలక, మెదలక, నిలిచిపోయాయి.

**తాత్పర్యం:** ఉభయసేనలు చేసిన నిష్ఠురమైన నానావిధ వాద్య ఘోషలతో ఆకాశం నిండిపోయింది. సేనాసమూహాలు నిశ్చేష్టితాలై నిలిచి ఆశ్చర్యం కలిగించాయి.

**సీ. కపి కేతనము హస్తికక్ష్యయు నమ్మహా । బలు లిద్దఱును దపోబలము వలనఁ**
**గన్నవియై, బుద్ధిగల్గి శోభిల్లు ను । ర్వీశ! యప్పుడు కపి యెరఁగి హస్తి**
**కక్ష్యపై నడరినఁ గయ్య మారెంటికిఁ । గలిగె; నం దా హస్తికక్ష్య దెరలె**
**నంబుజాక్షుండు మద్రాధినాథుండును । దృక్కలహంబునఁ దేజరిల్లి;**

**తే. రర్జునుండును గర్ణుండుఁ దర్జనంబు । లైన చూడ్కు లొండొరువుల యాననములఁ**
**బఱపి రా కృష్ణపార్థుల బలుపు, శల్య । కర్ణ చిత్తదౌర్బల్యముల్ గానవచ్చె. 256**

**ప్రతిపదార్థం:** ఉర్వీశ!= భూపాలకా!; ధృతరాష్ట్ర మహారాజా! కపికేతనము= హనుమంతుడి చిహ్నంతో కూడిన జెండా; హస్తికక్ష్యయున్= ఏనుగు నడుముకు కట్టిన పట్ట (కర్ణుడి); ఆ+మహాబలులు= వాయుదేవునంత బలశాలులరగు ఇద్దరు; తపోబలమువలనన్= కఠిన తపస్సు ఫలితంగా; కన్నవి+ఐ= సంపాదించినవి అయినందున; బుద్ధికల్గి= మానసిక వికాసం కలిగి; శోభిల్లున్= ప్రకాశిస్తున్నవి; అప్పుడు; కపి ఎరఁగి= కోతి ఎగిరి పైకి దూకి; హస్తికక్ష్యపై; అడరినన్= ఆధిక్యం చూపగా; కయ్యము= యుద్ధము; ఆ రెంటికి; కలిగెన్= సంభవించింది. (రెండూ కూడా తపశ్శక్తి చేత సంపాదించుకొనినవి కాబట్టి ప్రాణంలేని యుద్ధ చిహ్నాలైనప్పటికీ సజీవశక్తులవలె పోరాడుకొంటున్నవి అని సరిపెట్టుకోవలసి ఉన్నది); అందున్= ఆ పోరాటంలో; హస్తికక్ష్యయు; తెరలెన్= కలతనొందింది. అంబుజాక్షుండు= కమలనేత్రుడు - కృష్ణుడు; మద్ర+అధినాథుండు= మద్రదేశ పాలకుడైన శల్యుడు; దృక్ కలహంబునన్= చూపుల కలహంతో; తేజరిల్లిరి= ప్రకాశించారు; అర్జునుండును; కర్ణుండును; తర్జనంబులు+ఐన= బెదిరించే; చూడ్కులు= చూపులు; ఒండొరువుల= పరస్పరం (ఒకరిముఖాన్ని ఇంకొకరు); ఆననములన్= ముఖాలపై; పఱపిరి= వ్యాపింపజేసికొనిరి; ఆ కృష్ణ పార్థుల= కృష్ణార్జునుల; బలుపు= బలం; శల్యకర్ణ= శల్యకర్ణులయొక్క; చిత్త దౌర్బల్యముల్= మానసిక బలహీనతలు; కానవచ్చెన్= కన్పించాయి.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడి కపిధ్వజం, కర్ణుడి ఏనుగు కక్ష్య మహా బలశాలులైన ఆ ఇద్దరు (అర్జునుడు, కర్ణుడు) తపోబలంతో పొందినవైనందువలన అచేతనాలైకూడ చేతనాలై బుద్ధిబలంతో ప్రకాశిస్తున్నవి. అప్పుడు కపి ఎగిరి కక్ష్యపై విజృంభించగానే ఆ రెండింటికి పోరాటం ప్రారంభమైనది. ఆ పోరాటంలో కక్ష్య కలత పొందింది. కృష్ణ శల్యులు చూపుల కలహంతో ప్రకాశించారు. కర్ణార్జునులు కోపపు చూడ్కులతో ఒకరినొకరు బెదిరించుకొంటూ చూచుకొన్నారు. అప్పుడు కృష్ణార్జునుల బలము, కర్ణ శల్యుల మానసిక బలహీనత అగుపించింది.

**వ. అట్టియెడ నా సూతనందనుండు మద్రపతి నాలోకించి. 257**

**ప్రతిపదార్థం:** అట్టి ఎడన్= ఆ సమయంలో; ఆ సూతనందనుండు= కర్ణుడు; మద్రపతి అగు శల్యుడిని తేరిపార చూచి.

**తాత్పర్యం:** ఆ సమయంలో కర్ణుడు మద్రపతిని చూచి (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. 'అర్జునుఁడు నన్ను నోర్చిన యట్టులైన । నెట్లు సెప్పుమ?' యనుడు మద్రేశుఁ 'డేను**
**గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి, తీవ్ర । బహుళ శరజాలముల పాలుపఱుతు' ననియె. 258**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు; నన్నున్= నన్ను; ఓర్చిన= జయించిన; అట్టులు+ఐన= అట్లయితే; ఎట్లు= ఎట్లా; చెప్పుము+అ; అనుడున్= అనగా; మద్రేశుఁడు; ఏను= నేను; కృష్ణులు+ఇద్దఱన్= కృష్ణార్జునులిద్దరిని; ఒక్కటన్= ఒకేమారు; కిట్టి= చుట్టుముట్టి; తీవ్ర; బహుళ= అనేకరకాలైన; శరజాలముల పాలుపఱుతున్= బాణపరంపరపాలు గావిస్తాను.

**తాత్పర్యం:** 'అర్జునుడు నన్నే కనుక జయించినట్లయితే అప్పుడు ఏమి జరుగుతుందో చెప్పు అని కర్ణుడు శల్యుడిని అడుగగా, మద్రేశుడు 'నేను ఆ ఇద్దరు కృష్ణులను చుట్టుముట్టి పైకొని వారిని పదునైన అనేక బాణపరంపర పాల్జేస్తా' నని ప్రత్యుత్తర మిచ్చాడు.

**ఆ. అట్ల సవ్యసాచి యడిగిన మురవైరి । నగుచు నినుఁడు గూలినను ధరిత్రి**
**పతియ లైన మేరు వొఱగినఁ గర్ణుచే । నీవు గోలుపోవు టేల కలుగు?' 259**

**ప్రతిపదార్థం:** అట్లు+అ= అదే విధంగా; సవ్యసాచి= అర్జునుడు; అడిగినన్= అడుగగా; మురవైరి= మురారి అయిన కృష్ణుడు; నగుచున్= నవ్వుతూ (ఇట్లన్నాడు); ఇనుఁడు= సూర్యుడు; కూలినను= తన స్థానమునుండి క్రిందకు జారిపడినా; ధరిత్రి= భూమి; పఱియలు+ఐనన్= బ్రద్దలుగా చీలిపోయినా; మేరువు; ఒఱగినన్= ఏటవాలుగ ప్రక్కకు వాలిపోయినా; కర్ణుచేన్; నీవు; కోలుపోవుట= ఓడిపోవటం; ఏల= ఎందుకు; కలుగున్?= సంభవిస్తుంది?

**తాత్పర్యం:** ఇదే విధమైన ప్రశ్నను అర్జునుడు అడుగగా కృష్ణుడు హాసదీప్త వదనారవిందుడై బదులు పలుకుతున్నాడు. 'సూర్యుడు గగనమునుండి క్రిందపడినా, భూమి బ్రద్దలైనా, మేరుపర్వతం ఒక ప్రక్కకు ఒరిగిపోయినా, కర్ణుడిచేతిలో నీవు ఓడిపోవటం మాత్రం జరుగదు.'

**వ. అని వెండియు.** **260**

**తాత్పర్యం:** అని మళ్ళీ. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. అట్టిద లోకపర్యవస మా దురవస్థకు స్రుక్క నేర్తునే?**
**కిట్టుదుఁ గర్ణశల్యు లను కీటములం గరతాడనంబులం**
**బెట్టుదు నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ, ధర్మజుం**
**గట్టుదుఁ బట్ట మన్న నగి, గాండివి యద్దనుజారి కిట్లనున్.** **261**

**ప్రతిపదార్థం:** లోక పర్యవసము= లోకంలో ముగింపు; అట్టిద= నీవు భావించినట్లే అయితే; ఆ దురవస్థకున్= ఆ సంకటస్థితిని; స్రుక్కన్ నేర్తునే?= క్రుంగిపోతానా?; కరతాడనంబులన్= చేతిదెబ్బలతోడనే; కర్ణశల్యులు అను; కీటములన్= పురుగులను; కిట్టుదున్= చంపివేస్తాను; కౌరవులన్; పీనుఁగు పెంటలు; కాఁగన్= అయ్యేటట్లు; నేలన్+పెట్టుదున్= భూస్థాపితం చేస్తాను; ధర్మజున్= ధర్మరాజుకు; పట్టము= రాజ్యాధికారపదవిని; కట్టుదున్= ధరియింపజేస్తాను; అన్నన్= అని కృష్ణుడు అనగా; నగి= నవ్వి; గాండివి; ఆ+దనుజారికిన్= ఆ రాక్షస శత్రువైన కృష్ణుడితో; ఇట్లనున్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** కృష్ణుడు కిరీటితో అన్నాడు: 'నీవు అనుకొంటున్నదే నిజమైతే అట్టి దురవస్థకు నేను క్రుంగిపోతానా? కర్ణుడు, శల్యుడు అనే పురుగులను చేతితో కొట్టి చంపివేస్తాను. కౌరవులను పీనుగు పెంటలుగా నేల కూలుస్తాను. ధర్మరాజుకు పట్టం కట్టుతాను,' అనగా గాండీవి నవ్వి కృష్ణుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** కర్ణశల్యులను కీటములన్ - అలంకారం: రూపకం.

**ఉ. 'నవ్వుల కంటిఁ గాక, యది నాకు నశక్యమె కర్ణశల్యులం**
**గ్రొవ్వడఁగించు టే ద్రుపదు కూఁతురు గొల్వునఁ బడ్డ పాటునన్**
**నెవ్వగఁ బొందుచున్ సమయనిష్ఠ నడంగితిఁ గాని, యింక నా**
**మువ్వురుఁ బూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్.** **262**

**ప్రతిపదార్థం:** నవ్వులకున్= ఎగతాళికి (నవ్వులాటకు); అంటిన్= అన్నాను; కాక= అంతేగాని; కర్ణశల్యులన్= కర్ణశల్యులను; క్రొవ్వు+అడఁగించుట+అది= పొగరణచుటయనునది; నాకున్= నాకు; అశక్యమె?= అలవిగాని పనియా? (కాదనుట); ద్రుపదుకూఁతురు= ద్రౌపది; కొల్వునన్= రాజసభలో; పడ్డపాటునన్= పాల్పడిన అవస్థవలన; నెవ్వగన్= అతిశయమైన

సంతాపం; పొందుచున్= అనుభవించుచు; సమయనిష్ఠన్= ప్రతిజ్ఞాపాలనదీక్షకు; అడంగితిన్= అణగి ఉన్నాను; కాని= అయినప్పటికిన్ని ఇంకన్; ఆ మువ్వురు= ఆ త్రిమూర్తులు; పూనివచ్చినను= గట్టి ప్రయత్నంతో పైకి వచ్చినప్పటికిన్ని; ముట్టెదన్= వారిపైబడుతాను; కర్ణునిన్; నేలన్+పెట్టెదన్= మట్టిలో కలుపుతాను.

**తాత్పర్యం:** 'ఆ మాటలు ఎగతాళికన్నవే. కర్ణశల్యులు క్రొవ్వణగించుట నాకు అసాధ్యమా? ఆ నిండుసభలో ద్రౌపది పడిన భంగపాట్లకు మనస్సు బాధపడగా, కట్టువడి నా ప్రతాపాన్ని లోలోన అణచుకొన్నాను. అంతేకాని, ఆ త్రిమూర్తులు ఏకమై గట్టి పూనికతో మనపైకి వచ్చినా ఎదుర్కొని అడ్డగిస్తాను; కర్ణుడిని నేలపాలు గావిస్తాను.

**మ. అరదంబున్ సిడమున్ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం**
**గరకాండంబులఁ బెక్కుభల్లముల నుగ్రస్ఫూర్తిఁ దున్మాడి, ని**
**ష్ఠురభల్లం బొకటన్ సుయోధనుని చూడ్కుల్ నీఱుగా నిప్డ యు**
**ద్ధుర గర్వోన్నతమైన కర్ణుతలఁ ద్రుంతుం జూడుమీ వేడుకన్. 263**

**ప్రతిపదార్థం:** అరదంబున్= తేరును; సిడమున్= ధ్వజాన్ని; హయవ్రజమున్= గుర్రాలసమూహాన్ని; శల్య+అంగంబులున్= సారథియైన శల్యుని అవయవాలను; చాపమున్= ధనుస్సును; కరకాండంబులన్= కాండములవంటి చేతులనూ; పెక్కు= అనేక; భల్లములన్= బాణాలతో (బరిసెలతో); ఉగ్రస్ఫూర్తిన్= కోపావేశంతో; తున్మాడి= తునుకలుచేసి; సుయోధనుని= దుర్యోధనుడి; చూడ్కుల్= చూపులు; నీఱుగాన్= బూడిదయ్యేటట్లుగా; నిష్ఠుర= గట్టిదైన; భల్లంబు= బాణం; ఒకటన్= ఒకదానితో; ఇప్డు+అ= ఇప్పుడే; ఉద్ధుర= బలమైన (అతిశయించిన); గర్వోన్నతమైన= గర్వంతో పైకెత్తబడిన; కర్ణుతల; త్రుంతున్= నరికివేస్తాను; (దానిని) వేడుకన్= ఉల్లాసంతో; చూడుమీ!= చూడవయ్యా!

**తాత్పర్యం:** రథాన్ని, ధ్వజాన్ని, గుర్రాలను, సారథి అయిన శల్యుడి అవయవాలను, ధనుస్సును, బాహువులను, కోపావేశంతో ముక్కలుచేసి, దుర్యోధనుడి చూపులు మాడి మసి అయిపోయేటట్లు, ఇప్పుడే అతిశయించిన గర్వంతో నిక్కి ఉన్న కర్ణుడి తలను నరికివేస్తాను. ఈ వేడుకను చూడు.

**ఆ. కర్ణ మద్రపతుల కాంతల విధవలఁ । జేయువాఁడ నీవు సెన్ను మిగిలి**
**నగుచు, నేఁడు ద్రుపదనందన వీనుల । ధర్మసుతుని చెవులఁ దనుపు నినుపు. 264**

**ప్రతిపదార్థం:** కర్ణ మద్రపతులు= కర్ణ శల్యుల; కాంతలన్= భార్యలను; విధవలన్= భర్తలేనివారినిగా; చేయువాఁడన్; నీవు; చెన్ను మిగిలి= సంతోషంతో అతిశయించి; నగుచున్= నవ్వుతూ; నేఁడు; ద్రుపదనందన= ద్రుపదుని కూతురు ద్రౌపదియొక్క; వీనులన్= చెవులలో; ధర్మసుతుని చెవులన్= ధర్మరాజు చెవులలో; తనుపు= తృప్తి; నినుపు= నిండింపుము.

**తాత్పర్యం:** కర్ణశల్యుల భార్యలను విధవలుగా జేస్తాను చూడుము. నీవు నవ్వుతో అందగించినవాడవై, ఈ రోజు ద్రౌపదీ ధర్మనందనులకు ఈ విషయం చెప్పి, వారి చెవుల్లో తృప్తి నింపుము. (సంతోషవార్త వారి చెవులలో వేయుము.)

**క. సంతసపువార్త వుచ్చుము । కుంతికి నే దంతి దరువుఁ గూల్చినక్రియ దు**
**ర్దాంతిగతిఁ గర్ణుఁ గూల్చుట । యంతయుఁ గన్నారఁ జూచి యచ్యుత! యెలమిన్.' 265**

**ప్రతిపదార్థం:** అచ్యుత!= ఓ కృష్ణా!; నే= నేను; దంతి= ఏనుగు; తరువున్= చెట్టును; కూల్చిన క్రియన్= పడగొట్టిన (విధంగా) పనివలెనే; దుర్దాంతగతిన్= అడ్డులేనివిధంగా; కర్ణున్; కూల్చుట= పడగొట్టుట; అంతయున్= పూర్తిగా; కన్నారన్= కన్నుల పండువుగా; చూచి; ఎలమిన్= సంతోషంతో; ఈ సంతసపు= ఈ సంతోషకరమైన; వార్త= సమాచారాన్ని; కుంతికిన్; పుచ్చుము= చెప్పిపంపుము.

**తాత్పర్యం:** శ్రీకృష్ణా! ఏనుగు చెట్టును కూలద్రోసిన విధంగా నేను అడ్డం ఆపు లేకుండా కర్ణుడిని పడగొట్టటాన్ని నీవు కనులారా చూచి, సంతోషంతో ఈ ఆనందకర వృత్తాంతాన్ని కుంతికి వినిపింపుము.'

**విశేషం:** అలంకారం: ఉపమ.

**వ. అని పలికె; నా సమయంబున నుభయ సైన్యంబుల జనంబులకు నంబరంబున నున్న దివ్యసమూహంబులు నందు గీతనృత్తంబుల నుల్లసిల్లు నప్సరోగణంబులుం గాననైన నద్భుతంబున వారు ననిమిషులైయుండి, రప్పు డేకనిశ్చయు లగు కర్ణుండును దుర్యోధనుండును నచ్చెరువాటునం బొరయక, దురంబుమీఁది భరంబునం బొలిచి, రిరువాఁగు సైనికులు గిరీటికిఁ గర్ణునకు నభిముఖంబుగాఁ దల మిగులం దగదను బుద్ధిని భయంబునను దద్రథంబులు రెంటిని బలసి నిలిచి; రమ్మహావీరులు ధనుర్ద్యుతులను బాణ ప్రభలను దీవ్రతేజంబులను బ్రదీప్తులై కల్పాంత సూర్యుల చందంబగుచు నొండొరుల నోర్చు కడంకలఁ బేర్చి; రయ్యవసరంబున నశ్వత్థామ గురుపతిఁ జేరం జని కరంబు సేతం దెమల్చి సాంత్వన స్వరంబున నిట్లనియె: 266**

**ప్రతిపదార్థం:** అని పలికెన్; ఆ సమయంబునన్; ఉభయ సైన్యంబుల; జనంబులకున్; అంబరంబునన్+ఉన్న= ఆకాశమందున్న, దివ్యసమూహంబులున్= దేవతాగణములు; అందున్= వారిమధ్య; గీతనృత్తంబులన్= పాటలతో, ఆటలతో; ఉల్లసిల్లు= ఆనందిస్తున్న; అప్సరోగణంబులును= దేవవేశ్యాసమూహములు; కాననైనన్= కనబడగా; అద్భుతంబునన్= ఆశ్చర్యంతో; వారు; అనిమిషులై ఉండిరి= రెప్పవాల్చక చూచుచున్నవారై ఉన్నారు; అప్పుడు; ఏకనిశ్చయులు+అగు= ఒకే నిర్ణయాన్ని కలిగిఉన్న; కర్ణుండును; దుర్యోధనుండును; అచ్చెరుపాటునన్= ఆశ్చర్యమును; పొరయక= పొందక; దురంబుమీఁది= యుద్ధముపై ఉంచిన; భరంబునన్= భారముతో (బాధ్యతతో) పొలిచిరి= ఒప్పారు; ఇరువాఁగు సైనికులు= ఉభయపక్షాల భటులు; కిరీటికిన్; కర్ణునకున్; అభిముఖంబుగాన్= ఎదురెదురుగా; తలమిగులన్= ముందుగా ఎదుర్కొనుట; తగదను; బుద్ధిని= తలంపుతోను; భయంబునను= భీతితోను; తద్+రథంబులు రెంటిని= ఆ రెండు తేరులకు; బలసి నిలిచిరి= పరివేష్టించి చేరి నిలిచారు; ఆ+మహావీరులు= ఆ యోధశ్రేష్ఠులు; ధనుః+ద్యుతులను= ధనుస్సుల కాంతులతోను; బాణప్రభలను= బాణాల కాంతులతోను; తీవ్రతేజంబులను= గొప్ప పరాక్రమదీప్తితోను; ప్రదీప్తులై= అత్యంత ప్రకాశంతో వెలుగువారై; కల్పాంత= ప్రళయకాలంలోని; సూర్యుల; చందంబులు+ అగుచున్= పోలినవారవుతూ; ఒండొరులన్= ఒకరినొకరు; ఓర్చు= ప్రతిఘటించి జయించే; కడంకలన్= ప్రయత్నాలతో; పేర్చిరి= విజృంభించారు; ఆ+ అవసరంబునన్= ఆ సమయంలో; అశ్వత్థామ; కురుపతిన్; చేరన్+చని= సమీపించి; కరంబు= తనచేతిని; చేతన్= ఆయన చేతితో; తెమల్చి= కలిపి; సాంత్వన= బ్రతిమాలే; స్వరంబునన్= మాటలతీరుతో; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** వారు అట్లా పలికే సమయంలో రెండువైపుల సైనికులకు ఆకాశంలో ఉన్న దేవతలలో గీతనృత్యాలు చేస్తున్న అప్సరోగణాలు కనబడ్డారు. ఆ అద్భుతాన్ని చూచి వారు కూడా అనిమిషులై (రెప్పపాటులేనివారై) పోయారు.

అప్పుడు కర్ణ దుర్యోధనులు కృతనిశ్చయులై ఆశ్చర్యపడక, యుద్ధభారంలో నిమగ్నులయ్యారు. ముందుగా కలియబడ కూడదని పాండవసైన్యం కర్ణుడికి అభిముఖంగా, కౌరవసైన్యం అర్జునునికి ఎదురుగా నిలిచాయి. అర్జున కర్ణులు బాణకాంతులతో కల్పాంత సూర్యులవలె ప్రకాశిస్తూ ఇరువురూ జయకాంక్షతో నిలిచారు. అప్పుడు అశ్వత్థామ దుర్యోధనుడి వద్దకు పోయి, ప్రీతితో తన చేతితో అతని చేయి పట్టుకొని బ్రతిమాలే గొంతుతో ఇట్లా అన్నాడు.

**అశ్వత్థామ దుర్యోధనునకు హితోపదేశంబు సేయుట (సం. 8-64-20)**

**చ. 'కలన గురుండు భీష్ముఁడును గాండివిచేఁ బడి, రంగరాజు వా**
**రల కధికుండె? యాతని దురంబున నోర్వఁ గలండె? పూని యే**
**వల దని బుద్ధి సెప్పిన నవశ్యము నాతఁడు నిల్చు, నీతనిన్**
**నిలుపుము, నీవు ధర్మసుతునిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్. 267**

**ప్రతిపదార్థం:** కలనన్= యుద్ధంలో; గురుండును= ద్రోణుడు; భీష్ముఁడును; గాండివిచేన్+పడిరి= అర్జునుడిచేతిలో కూలినారు; అంగరాజు= అంగదేశాధీశుడైన కర్ణుడు; వారలకున్+అధికుండె?= వారలను మించినవాడా?; ఆతనిన్= అర్జునుడిని; దురంబునన్= యుద్ధంలో; ఓర్వన్+కలండె?= గెలువగలడా?; పూని= ప్రయత్నించి; ఏన్= నేను; వలదని= వద్దని; బుద్ధిచెప్పినన్= హితం చెప్పితే; అవశ్యము= తప్పక; ఆతఁడు= అర్జునుడు; నిల్చున్= విరమించుకొని నిలిచిపోతాడు; నీవు; ఈతనిన్= ఈ కర్ణుడిని; నిలుపుము= మాన్పింపుము; ధర్మసుతునిన్; తగుమాటలన్= సమయోచితమైన మాటలతో; తేర్పన్= మనసు కుదుటపడి తేరుకొనేటట్లు చేయగా; చొప్పడున్= తగును.

**తాత్పర్యం:** 'యుద్ధంలో ద్రోణభీష్ములు గాండీవిచేత పతనమయ్యారు. ఈ కర్ణుడు వారికంటె మొనగాడా ఏమి? అర్జునుడిని యుద్ధంలో గెలువగలడా? నేను పట్టుదలతో అర్జునుడికి తగినమాటలు చెప్పితే తప్పక నామాటలకు కట్టుబడి యుద్ధం మానుతాడు. ఇక నీవు ఈ కర్ణుడిని యుద్ధ ప్రయత్నం నుండి మాన్పించుము. నీవు ధర్మరాజును సమయోచితమైన మాటలతో మనసు కుదుటపడేటట్లు చేయగలిగితే అంతా సర్దుకొనిపోతుంది.

**వ. తెలిసిన దామోదరుండు దెలివి నొందు. 268**

**ప్రతిపదార్థం:** తెలిసినన్= ఇది తెలిసికొన్న; దామోదరుండు= కృష్ణుడు; తెలివినొందున్= ప్రసన్నుడౌతాడు.

**తాత్పర్యం:** ఇది తెలిస్తే కృష్ణుడు కూడా సంతోషిస్తాడు.

**క. భీముఁడుఁ గవలును ధర్మజు। చే మరలెడువార, లేను జెప్పెడిపలుకుల్**
**భూమీశ! కురుకులమునకు। నీ మొనరాజులకుఁ బ్రజకు హిత మూహింపన్. 269**

**ప్రతిపదార్థం:** భూమీశ!;= రాజా; భీముఁడు; కవలును= నకుల సహదేవులు; ధర్మజుచేన్= ధర్మజుడు చెపితే; మరలెడువారు= యుద్ధవిరమణ చేస్తారు (మనసు మార్చుకొంటారు); నేను చెప్పెడి పలుకుల్= నేను చెప్పే మాటలు; కురుకులమునకున్; నీమొనరాజులకున్= నీ సైన్యమందలి ఏలికలకు; ప్రజకున్= ప్రజలకు; ఊహింపన్= యోచించి చూస్తే; హితము= మంచిది.

**తాత్పర్యం:** భూమీశా! భీముడూ నకుల సహదేవులూ ధర్మరాజు చెపితే యుద్ధం మానుకొనేవారే. నేను చెప్పేమాటలు కౌరవవంశానికీ, నీ సైన్యాధిపతులకూ, జనసామాన్యానికీ శ్రేయోదాయకాలు. బాగుగా యోచించుకొమ్ము.

**చ. వలవదు నన్నునుం గృపు నవధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ**
**క్తు లని తలంప; భీష్ముఁడును ద్రోణుఁడు లోక మెఱుంగఁగా నవ**
**ధ్యుల; హరికల్మి నారథికు దోర్బలలీల నడంగిపోరె! య**
**చ్ఛలమొ ఫలంబొ? యింకయిన సంధి యొనర్చుట మేలు వారితోన్. 270**

**ప్రతిపదార్థం:** నన్నునున్; కృపుని; అవధ్యులన్+కాన్= చంపశక్యం కానివారినిగా; కొని= పరిగణించి; క్రీడిన్= అర్జునుడిని; గెల్వన్; శక్తులని= శక్తికలవారని; తలంపన్= భావించుట; వలవదు= తగదు; లోకము+ఎఱుంగఁగాన్= ప్రజలకు తెలిసేటట్లు (అనుకొన్నట్లు) భీష్మడును; ద్రోణుడును; అవధ్యులు+అ= చంపసాధ్యంకాని వారే (అయినను); హరి కల్మి= కృష్ణుడి సంబంధ భాగ్యం వలన; ఆ రథికు= ఆ రథయోధుడు అర్జునుడి, దోర్బలలీలన్= భుజబల విన్యాసంవలన; అడంగిపోరె?= అణగిపోలేదా?; అచ్ఛలమొ ఫలంబొ?= ఆ అసూయాఫలితమో ఏమో?; ఇంకయినన్= ఇప్పటికైనా; వారితోన్= పాండవులతో; సంధి ఒనర్చుట= పొత్తు కుదుర్చుకొనటం, రాజీపడుట; మేలు= శ్రేయోదాయకం.

**తాత్పర్యం:** నేనుకృపాచార్యుడు - చంపుటకు అలవిగానివారమనీ, మేము విజయుని ఓడించగల శక్తి సంపన్నులమనీ అనుకొనటం పొరపాటు. భీష్మద్రోణులు ఓడించటానికి అలవిగాని వారని లోకమంతా అనుకొన్నప్పటికీ పాండవులు కృష్ణుడిని తమపక్షాన కలిగి ఉండటం చేత అర్జునుడి బాహుబలం చేత పడిపోయారు కదా! ఇది అసూయవలన కలిగిన ఫలితం ఔనో కాదో గాని ఆ పాండవులతో సఖ్యం చేయటం మంచిది.'

**చ. హరి సనుదెంచినప్డు మన మమ్మెయిఁ బల్కితి; మింక సంధికి**
**న్వెర వగు టేల గల్గు? నని నీవు దలంపకు; మాంబికేయు భూ**
**వరుఁడుఁగ జేయు ధర్మజుఁ డవశ్యముఁ బాండునృపాలుపాల యే**
**వురకు నమర్చుఁగాని చనవున్ వెలిమెచ్చును నొల్లఁ డేమియున్. 271**

**ప్రతిపదార్థం:** హరి= కృష్ణుడు; చనుదెంచినప్డు= రాయబారానికి వచ్చినప్పుడు; మనము; ఆ+మెయిన్= ఆ విధంగా; పల్కితిమి= మాట్లాడాము; ఇంకన్= ఇక; సంధికిన్; వెరవు= ఉపాయం; అగుట= కలగటం; ఏల= ఎందుకు; కల్గున్+అని= పొసగుతుందని; నీవు; తలంపకుము; ధర్మజుఁడు; ఆంబికేయున్= అంబిక కుమారుడు - ధృతరాష్ట్రుడిని; భూవరుఁడుఁగన్= రాజుగా; అవశ్యము= తప్పక; చేయున్= చేస్తాడు; పాండునృపాలు= పాండురాజు; పాలు+అ= భాగమే; ఏవురకున్= ఐదుగురకు; అమర్చున్= సరిపెట్టును; కాని= అంతేగాని; చనవున్= పరిచయం కలిగించే చులుకదనమును; వెలిమెచ్చును= పై పై పొగడ్తను; ఏమియున్= ఏ విధంగా కూడా; ఒల్లఁడు= ఒప్పుకొనడు.

**తాత్పర్యం:** కృష్ణుడు దూతగా మన ఆస్థానానికి వచ్చినపుడు ఏమేమో మాట్లాడినాము, అందువలన మనమధ్య సయోధ్య ఎట్లా కుదురుతుందని అనుకోవద్దు. ధర్మజుడు తప్పక ధృతరాష్ట్రుడిని రాజుగా చేస్తాడు. పాండురాజు రాజ్యం ఐదుగురికీ సమభాగంగా పంచుతాడు. అంతేగాని చులుకనచేసి పై మెచ్చుల కపటానికి ఏ విధంగా కూడా అంగీకరించడు.

**తే. పాండవుల యట్ల రాధాసుతుండు నాదు । పలుకులకు నియ్యకొను; నీవు బ్రదుకు తెరువు**
**పట్టు; బ్రదికిన నెల్లశుభములుఁ గలుగు; । నీసు మానుము చచ్చిన నేమి గలదు? 272**

**ప్రతిపదార్థం:** పాండవుల అట్ల= పాండవులవలె; రాధాసుతుండు= కర్ణుడు; నాదుపలుకులకున్= నా మాటలకు; ఇయ్యకొనున్= సమ్మతిస్తాడు; నీవు; బ్రతుకుతెరువు= జీవించే మార్గం; పట్టు= అనుసరించుకో!; బ్రదికినన్= జీవించి ఉంటే; ఎల్లశుభములున్= అన్ని మేళ్ళూ; కలుగున్= కలుగుతాయి; ఈసు= అసూయ; మానుము; చచ్చినన్ ఏమి కలదు?= చచ్చిన తరువాత ఇంకేముంది?

**తాత్పర్యం:** పాండవుల మాదిరిగానే కర్ణుడు కూడా నా మాటలు వింటాడు. నీవు బ్రతికే విధం చూచుకొమ్ము. బ్రతికి ఉంటే గదా అన్ని విధములగు మేళ్ళు పొందగలము! ఇక అసూయను మానుము. చచ్చిన తరువాత ఇంకేముంది!

**క. వెడతలఁపు లుడిగి, సంధికి । నొడఁబడు; మిది లెస్స; దీని కొడఁబడమి గడుం**
**జెడు తెరు; విప్పటి పదనున్ । గడవఁబడుట ద్రాటఁ దప్పకరణియ చుమ్మీ!' 273**

**ప్రతిపదార్థం:** వెడతలపులు= చెడు ఆలోచనలు; ఉడిగి= మాని; సంధికిన్= పొందుకు; ఒడఁబడుము= అంగీకరించుము; ఇది లెస్స= ఇది శ్రేయస్కరం; దీనికిన్; ఒడఁబడమి= ఒప్పుకొనకపోవటం; కడున్= మిక్కిలి; చెడుతెరువు= హానికరమైన మార్గం; ఇప్పటి పదనున్= ఈ సమయాన్ని (అవకాశాన్ని); కడవన్+పడుట= దాటటం; త్రాటఁ తప్పు కరణియ= త్రాడును వదలటం వంటిది; చుమ్మీ!= సుమా!

**తాత్పర్యం:** విపరీతపు యోచనలు మాని, సంధి చేసికొనటమే మేలు. దీనిని అంగీకరించకపోవటం త్రాడుపట్టును వదలి క్రింద పడటం వంటిదే సుమా!'

**విశేషం:** అలంకారం: దృష్టాంతం.

**చ. అన విని, యమ్మహీరమణుఁ డాతని కిట్లను 'నిప్డు దుస్ససే**
**నుని పని దీర్చి, మారుతతనూభవుఁ డాడిన మాట యేర్పడ**
**న్వినియును సంధి సేయుటకు నీ వభిలాషము సేఁత యొప్పునే?**
**పెనఁకువ కర్ణుఁ డే లుడుగు? బేలవె? మానుము ద్రోణనందనా! 274**

**ప్రతిపదార్థం:** అనన్ విని; ఆ+మహీరమణుఁడు= ఆ భూభర్త (దుర్యోధనుడు); ఆతనికిన్= అశ్వత్థామతో; ఇట్లు+అనున్; ద్రోణనందనా!; ఇప్డు; దుస్ససేనుని; పని= సంబంధించిన పని; తీర్చి= పూర్తిచేసి(దుశ్శాసనుడిని చంపి); మారుతి తనూభవుఁడు= వాయుపుత్రుడు - భీముడు; ఆడినమాట; ఏర్పడన్= వివరంగా; వినియున్= వినికూడా; సంధిచేయుటకున్; నీవు అభిలాషము చేఁత= నీవు కోరటం; ఒప్పునే?= తగి ఉన్నదా?; పెనఁకువ= యుద్ధము; కర్ణుఁడు; ఏల= ఎందుకు; ఉడుగున్?= మానుతాడు?; బేలవె?= నీవంత అమాయకుడవా?; మానుము= ఈ ప్రయత్నం మానుకొమ్ము.

**తాత్పర్యం:** అశ్వత్థామ పలుకులు విని దుర్యోధనుడు అతడితో ఇట్లా అన్నాడు: 'ద్రోణనందనా! ఇప్పుడే భీముడు మాట్లాడిన మాటలు విన్నావు గదా! దుస్ససేనునిపని పూర్తి చేశాడు. ఇక రెండవపని పూర్తి చేయక మానుతాడా? ఇదంతా విని కూడా నీవు సర్దుబాటు చేయటానికి పూనటం ఉచితమా?, పోతే కర్ణుడెట్లా యుద్ధం మానుతాడు? నీ వింత వెర్రివాడవైతే ఎట్లా? ఈ ప్రయత్నం మానుకొమ్ము.

**శా. శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ, డపరిశ్రాంతుండు గర్ణుండు; దు**
**ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీతం డాతనిన్; వహ్ని య**
**త్యంతంబున్ శిశిరత్వ మొందినను గోత్రాళుల్ వడం కాడినం,**
**గుంతీసూనునిచేతఁ గర్ణున కనిం గోల్పాటు వాటిల్లునే?' 275**

**ప్రతిపదార్థం:** పార్థుఁడు= అర్జునుడు; శ్రాంతిన్= అలసటను; పొందినవాఁడు= పొందాడు; కర్ణుండు; అపరిశ్రాంతుండు= అలసట పొందనివాడు; దుర్దాంత= అణచరాని; ఉదగ్రతన్= భయంకర స్వరూపంతో; నేఁడు; ఈతఁడు= ఈ కర్ణుడు; ఆతనిన్= అర్జునుడిని; గీటడఁచున్= సంహరిస్తాడు; వహ్ని= నిప్పు; అత్యంతంబు= మిక్కిలి; శిశిరత్వము= చల్లదనాన్ని; ఒందినను= పొందినను; గోత్ర+ఆళుల్= పర్వతశ్రేణులు; వడంకు+ఆడినన్= గడగడ కంపించినప్పటికిన్నీ; కుంతీసూనునిచేతన్= అర్జునుడిచేత; కర్ణునకున్; అనిన్= యుద్ధంలో; కోల్పాటు= ఓటమి; పాటిల్లునే?= సంభవిస్తుందా?

**తాత్పర్యం:** పార్థుడు అలసట పొంది ఉన్నాడు. కాని కర్ణుడు అలసట పొందనివాడు. ఈ దినం కర్ణుడు అర్జునుడిని నిర్నిరోధమైన కోపాతిశయంతో తుదముట్టిస్తాడు. నిప్పునకు చల్లదనం క్రమ్మినా, కొండలు కంపించిపోయినా, కుంతీపుత్రుడి వలన యుద్ధంలో రాధాతనయుడికి ఓటమి కలుగుతుందా?'

**వ. అని పలికి, యజ్జనపతి తన సైనికుల నాలోకించి సమరసముత్సాహ పోషణంబులగు భాషణంబుల ముఖరుం డగుటయు నఖిల తూర్యంబు లొండొండ మ్రోసెఁ బాండవబలంబునను భేరీ పణవాదుల రణనంబులు నిగిడె; నప్పుడు కర్ణుండును నర్జునుండును. 276**

**ప్రతిపదార్థం:** అని పలికి; ఆ+జనపతి= ఆ రాజు; తన సైనికులన్; ఆలోకించి= తేరిపారజూచి; సమరసముత్సాహ= యుద్ధోత్సాహప్రయత్నాలను; పోషణంబులు+అగు= పెంపొందజేసే; భాషణంబుల= మాటలను; ముఖరుండు= మాట్లాడేవాడు; అగుటయున్; అఖిల తూర్యంబులు= వివిధములైన వాద్యాలు; ఒండొండ= క్రమంగా; మ్రోసెన్= మ్రోగాయి; పాండవబలంబునను; భేరీ= దుందుభి; పణవాదులు= తప్పెటలు మొదలగువాటియొక్క; రణనంబులు= మ్రోతలు; నిగిడెన్= వ్యాపించాయి (సంకులశబ్దాలు రేగినవి); అప్పుడు; కర్ణుండును; అర్జునుండును.

**తాత్పర్యం:** అని పలికి, దుర్యోధనుడు తన సైనికులను చూచి యుద్ధయత్నానికి బలంచేకూర్చే మాటలు మాట్లాడగా, యుద్ధవాద్యాలు క్రమంగా మ్రోగాయి; పాండవబలంలో కూడా మ్రోగాయి. అప్పుడు కర్ణుడూ, అర్జునుడూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. కరి కరి, గిరి గిరి, నంభో । ధర మంభోధరముఁ బెలుచఁ దాఁకిన క్రియఁ దాఁ**
**కిరి కడఁగి గగన తటియును । ధరణియు మ్రోయుచు వడంక ధరణీనాథా! 277**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!; కరి కరిన్= ఏనుగు ఏనుగును; గిరి గిరిన్= కొండ కొండను; అంభోధరము= మేఘం; అంభోధరమున్= మేఘాన్ని; పెలుచన్= గట్టిగా; తాఁకిన క్రియన్= ఎదుర్కొన్న విధంగా; గగనతటియును= ఆకాశభాగమూ; ధరణియున్= భూమీ; మ్రోయుచున్ వడంకన్= శబ్దిస్తూ దద్దరిల్లి చలించపోగా; కడఁగి= పూనుకొని; తాఁకిరి= ఒకరినొకరు ఎదుర్కొన్నారు.

**తాత్పర్యం:** ఏనుగు ఏనుగును ఢీ కొన్నట్లు, కొండతో కొండ కలియబడినట్లు, మబ్బు మబ్బుతో ఒరుసుకొన్నట్లు ఆకాశం, భూమి శబ్దంతో దద్దరిల్లి చలించగా ఒకరినొకరు పూనికతో ఎదుర్కొన్నారు.

**క. మెఱయు వెలిమావులును, గడు మెఱుఁ గారెడు నరదములును, మింటను మంటల్**
**వఱపెడు వాలమ్ములుఁ జూ । పఱ నత్తొలుతాఁకు వెఱఁగుపడఁ జేసె నృపా! 278**

**ప్రతిపదార్థం:** నృపా!= ఓ రాజా!; మెఱయు= ప్రకాశించే; వెలిమావులును= తెల్లగుర్రాలు; (అర్జునుడి రథానికి పూన్చిన నాలుగు గుర్రాలు); కడున్= మిక్కిలి; మెఱుఁగు+ఆరెడు= తళుకొత్తే; అరదములును= తేరులు; మింటను= ఆకాశంలో; మంటల్; వఱపెడు= వ్యాపింపజేసే; వాలమ్ములున్= వాడిబాణాలు (వీటి); ఆ-తొలుతాఁకు= ఆ మొదటి తాకిడి; చూపఱన్= చూస్తున్నవారిని; వెఱఁగుపడ చేసెన్= ఆశ్చర్యపడేటట్లు చేశాయి.

**తాత్పర్యం:** రాజా! మెరుస్తున్న తెల్ల గుర్రాలు, అత్యంత కాంతులు ప్రసరించే రథాలు, ఆకాశమంతా మంటలతో నింపే పదునైన బాణాలు - వీటితో కూడిన ఆ కర్ణార్జునుల మొదటి తాకిడి ప్రేక్షకులను బిత్తరపోయేటట్లు చేసింది.

**వ. ఇ వ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం దలపడి పెనంగం దొడంగిన, నుభయ సేనలవారలు నార్పులు నింగి ముట్టఁ జెలంగి; రట్టియెడ. 279**

**ప్రతిపదార్థం:** ఈ+విధంబునన్; ఆ+వీరోత్తములు= ఆ శూరాగ్రేసరులు; ఉదాత్తభంగిన్= గౌరవప్రదమైన విధంగా; తలపడి= ఎదుర్కొని; పెనంగన్+తొడంగినన్= పోరనారంభించగా; ఉభయసేనలవారలు= రెండువైపుల ఉన్న సైనికుల; ఆర్పులు= పెడబొబ్బలు; నింగిముట్టన్= ఆకాశం అంటుకొనగా; చెలంగిరి= మ్రోయించారు; అట్టి ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈవిధంగా ఆ వీరశ్రేష్ఠులిద్దరూ గొప్పగా తలపడి పోరాడుతూ ఉండగా, రెండు సేనలలో ఉన్నవాళ్ళ కేకలు ఆకాశాన్ని అంటాయి. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం.)

**మ. 'భరితోత్సాహతఁ బేర్చి, దీప్తు లడరన్ భల్లమ్ము లొక్కుమ్మడిం**
**బరఁగం జేయుము కర్ణు గాత్రములలోఁ బార్థుండ! వే త్రుంపు మి**
**క్కురుభూపాలకు రాజ్యకాంక్ష, దొరయే కోదండపాండిత్య వి**
**స్ఫురణ గర్ణుఁడు నీకు? నీబలుపు నేపుం జూపు మత్యుగ్రతన్.' 280**

**ప్రతిపదార్థం:** పార్థుండ!= ఓ అర్జునా!; భరిత+ఉత్సాహతన్= పరిపూర్ణమైన ఉత్సాహంతో; పేర్చి= విజృంభించి; దీప్తులు+అడరన్= కాంతులు వ్యాపించేటట్లు; భల్లమ్ములు; ఒక్కుమ్మడిన్= ఒక్కపెట్టున; కర్ణు గాత్రములలోన్= కర్ణుడి శరీరభాగాలలో; పరఁగన్ చేయుము= ప్రవర్లిల్లేటట్లు - నాటుకొనేటట్లు చేయుము; ఈ+కురు భూపాలకు; రాజ్యకాంక్ష= రాజ్యంపై గల ఆశను; వే= త్వరగా; త్రుంపుము= త్రెంచివేయుము; కర్ణుఁడు; కోదండ పాండిత్య= ధనుర్విద్యా సామర్థ్యముయొక్క; విస్ఫురణన్= కౌశలమునందు; నీకున్; దొరయే?= సమానుడా ఏమి?; నీ బలుపున్= నీశక్తిని; ఏపున్= ఆధిక్యమును; అత్యుగ్రతన్= విశేషించిన ఆగ్రహావేశంతో; చూపుము= ప్రదర్శించుము.

**తాత్పర్యం:** 'ఓ పార్థా! పౌరము ముట్టిన ఉత్సాహంతో విజృంభించి ఒక్కపెట్టున కాంతులు విరజిమ్మేటట్లుగ బాణాలు కర్ణుడి దేహంలో దిగబడేటట్లు వేయుము. ఆ దుర్యోధనుడి రాజ్యకాంక్షను త్రుంచివేయుము. ధనుర్విద్యా పాటవంలోను, దాని ప్రయోగదక్షతలోను కర్ణుడు నీకు సమానుడా ఏమి? ఇక నీ భుజబలసామర్థ్యాన్ని చండప్రచండంగా చూపుము.'

**వ. అని పాంచాలురు పార్థజయార్థ సంభాషణంబులు సేసిరి, కౌరవులు గర్ణు డగ్గఱి. 281**

**ప్రతిపదార్థం:** అని, పాంచాలురు; పార్థజయార్థ సంభాషణంబులు= విజయుడి విజయమును అపేక్షించే సంభాషణంబులు; చేసిరి; కౌరవులు; కర్ణుడిని; డగ్గఱి= సమీపించి.

**తాత్పర్యం:** అని పాంచాలదేశీయులు అర్జునుడి విజయంకొరకు పై సంభాషణలు చేశారు. కౌరవులు కూడా కర్ణుడిని సమీపించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'కడఁగుము నీదుబాణములఁ గవ్వడి గూలినఁ జాలు నంతతోఁ**
**జెడుదురు పాండవుల్ రణము సేయు నుదగ్రత యెల్లఁ దక్కి పే**
**రడవుల కేఁగి సాధుమునులై చరియింతురు; కౌరవేంద్రుఁ డీ**
**పుడమి సమస్తముం బొగడు పొంపిరివోవఁగ నేలు లీలతోన్!' 282**

**ప్రతిపదార్థం:** కడఁగుము= గట్టి పూనికతో ప్రయత్నించుము; నీదు బాణములన్; కవ్వడి= సవ్యసాచి అయిన అర్జునుడు; కూలినన్= చనిపోతే; చాలున్= ఇంకే ప్రయత్నంతో పనిలేదు; అంతతోన్= దానితో; పాండవుల్; రణము చేయు; ఉదగ్రత= ఆధిక్యం; ఎల్లన్+తక్కి= అంతా పోగొట్టుకొనినవారై; చెడుదురు= పాడైపోతారు; పేరడవులకున్= దట్టమైన అడవులకు; ఏఁగి; సాధుమునులై= శాంతస్వభావం కలిగి తపస్సు చేసికొనేవారై; చరియింతురు= తిరుగాడుతారు; కౌరవ+ఇంద్రుఁడు; ఈ పుడమి సమస్తమున్= ఈ భూమండలాన్నంతా; పొగడు= కీర్తి; పొంపిరిపోవఁగన్= వ్యాపిస్తుండగా; లీలతోన్= అవలీలగా; ఏలున్= పరిపాలిస్తాడు.

**తాత్పర్యం:** 'యుద్ధానికి సిద్ధం కమ్ము. నీబాణాహతితో, రెండు చేతులా బాణాలు విసరే ఆ అర్జునుడు పుటమారి పోతే చాలు! దానితో పాండవులు ఆధిక్యాన్ని కోల్పోయి నిర్వీర్యులై కారడవులకు పోయి, మునివృత్తితో మెత్తటివారై సంచరిస్తూ ఉంటారు. ఆ తర్వాత కౌరవేంద్రుడు కీర్తిని పెంపొందగ ఈ పుడమినంతా పాలిస్తాడు.

**వ. అని తఱిమి పలికిరి; ప్రొద్దునుం జాల వ్రాలెఁ, గాలాంతక ప్రతిము లగు నప్పార్థకర్ణు లన్యోన్య జయార్థు లై పెనంగునప్పుడు. 283**

**ప్రతిపదార్థం:** అని, తఱిమి పలికిరి= వెంటబడి గట్టిగా చెప్పారు; ప్రొద్దునున్= సూర్యుడు కూడా; చాల వ్రాలెన్= అస్తంగతు డౌతున్నాడు; కాలాంతక= ప్రళయకాల యముడికి; ప్రతిములు అగు= మారురూపాలు అగు; ఆ+పార్థ కర్ణులు; అన్యోన్య జయ+అర్థులు+ఐ= ఒకరినొకరు ఓడించి తాము గెలవాలనుకొన్న కోరిక గలవారై; పెనంగునప్పుడు= పోరాడుతున్న సమయంలో.

**తాత్పర్యం:** అని వెంటపడి గట్టిగా చెప్పారు. ప్రొద్దుకూడా బాగా వాలింది. ప్రళయకాలంలో యముడివలె ఆకారాలు గల అర్జునుడూ, కర్ణుడూ ఒకరిపై ఒకరు జయంకోరి యుద్ధం చేస్తున్నప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

కర్ణార్జును లొండొరులమీఁద దివ్యబాణంబు లేయఁబూనుట (సం. 8-65-12)

**సీ.** **కర్ణుండు పది చండకాండంబు లర్జును। తనువునఁ జొనుప, నర్జునుఁడు దీప్త**
**ఘనబాణములు పదునెనిమిది కర్ణు మైఁ। బరఁగింప నయ్యంగపతి దశోగ్ర**
**చక్రమార్గణముల సరభసంబున నొంచె। నన్నరు, నాతండు నట్టి వన్ని**
**శరములు రాధేయు నురమున నాటించె। నతఁడు దొమ్మిది వాలుటమ్ము లతని**

**తే.** **వక్షమునఁ గ్రుచ్చి సాయకద్వయము శౌరి। మేన నిగిడింప, బీభత్సుఁ డేను మెఱుఁగు**
**తూపు లా సూతపుత్త్రు నెత్తుట మునుంగ। నేసె బాహాసముల్లాస మెసక మెసఁగ!** **284**

**ప్రతిపదార్థం:** కర్ణుండు; అర్జును తనువునన్= అర్జునుడి దేహమునందు; పది; చండకాండములు= దారుణమైన బాణాలను; చొనుపన్= చొప్పించగా; అర్జునుఁడు; దీప్తఘన= వెలుగొందే గొప్ప; బాణములు; పదునెనిమిది; కర్ణుమైన్= కర్ణుడి శరీరంలో; పరఁగింపన్= అలముకొనచేయగా; ఆ+అంగపతి= ఆ అంగదేశాధీశుడైన కర్ణుడు; దశ= పది; ఉగ్ర= తీక్ష్ణమైన; చక్ర= చక్రంవలె గుండ్రమైన (చక్రాలు-బాణాలు అని కూడా); మార్గణములన్= బాణాలతో; ఆ+నరున్= ఆ అర్జునుడిని; సరభసంబునన్= అత్యంతవేగంతో; నొంచెన్= బాధించాడు; ఆతండు= ఆ నరుడు; అట్టివి= అదే విధమైన; అన్ని= అదే సంఖ్యగల; శరములు= బాణాలను; రాధేయు; ఉరమునన్= ఎదురురొమ్మున; నాటించెన్= గ్రుచ్చి నిలబెట్టాడు; (దీనికి ప్రతిఫలంగా) అతఁడు= కర్ణుడు; తొమ్మిది; వాలు+అమ్ములు= వాడి బాణాలను; అతని= అర్జునుడి; వక్షమునన్= ఎదలో; గ్రుచ్చి; సాయకద్వయము= రెండు బాణాలను; శౌరిమేనన్= కృష్ణుడి దేహంలో; నిగిడింపన్= నాటగా (దీనితో); బీభత్సుఁడు= అర్జునుడు; ఏను= అయిదు (ఐదు); మెఱుఁగు= మెరిసే; తూపులు= బాణాలు; ఆ సూతపుత్రున్= ఆ సారథి పుత్రుడైన కర్ణుడిని; నెత్తుటన్= నెత్తురులో; మునుంగన్= మునిగిపోయేటట్లు; బాహాసముల్లాసము= భుజ బల భీకరాకృతి; ఎసకమెసఁగన్= అతిశయించే విధంగా; ఏసెన్= ప్రయోగించాడు; (కర్ణుడి బాణసంపత్తిలో ఒక ప్రత్యేకత; తన బాణాలపై తన పేరు చెక్కించి, వాటిని బండ్లమీద తోలించుకొని వచ్చేవాడు. (కర్ణ. 1. 236; ద్రోణ- 5-113).

**తాత్పర్యం:** కర్ణుడు అర్జునుడి మేనిలో పది తీవ్రబాణాలను గ్రుచ్చగా, దానికి ప్రతిగా అర్జునుడు పద్దెనిమిది ప్రకాశవంతములైన బాణాలను ప్రయోగించాడు. కర్ణుడు దానికి ప్రతిగా చక్రాలవంటి బాణాలు పదింటితో అర్జునుడిని బాధించాడు. అప్పుడు అర్జునుడు అన్నే బాణాలను కర్ణుడి వక్షఃస్థలంపై గ్రుచ్చాడు. తిరిగి కర్ణుడు తొమ్మిది వాడి బాణాలను అర్జునుడిపైన, రెండు బాణాలను కృష్ణుడిపైన ప్రయోగించాడు. దానితో అర్జునుడు తన బాహుబలం అతిశయించేటట్లుగా, ఆ సూతపుత్రుడు నెత్తుటిలో మునిగేటట్లుగా ఐదు మెరుగు బాణాలు వేశాడు.

**చ.** **అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణపం**
**క్తులఁ బొదువం బరాక్రమ కుతూహలి య వ్విజయుండు పిన్న న**
**వ్వొలసి ముఖాంబుజంబునకు నొప్పుగఁ దద్రథ రథ్య కేతు సూ**
**తులను దదీయగాత్రమును దూపులవెల్లి మునుంగఁ జేసినన్.** **285**

**ప్రతిపదార్థం:** సూతసుతుఁడు= కర్ణుడు; అలిగి= కోపగించుకొని; కడంగి= ప్రయత్నపూర్వకంగా; అచ్యుతపార్థులన్= కృష్ణార్జునులను, తీవ్రబాణ పంక్తులన్= నిశితమైన బాణపరంపరలతో; పొదువన్= దెబ్బతీయగా; పరాక్రమ కుతూహలి= తన శౌర్యమును ప్రదర్శించేందుకు తహతహపడే; ఆ+విజయుండు; ముఖాంబుజమునకున్= ముఖ కమలమునకు; ఒప్పుగన్=

రాణింపుగా; పిన్ననవ్వు= చిరునవ్వు; ఒలసి= ప్రసరింపజేసి; తద్= ఆ కర్ణుడి; రథ రథ్య కేతుసూతులను= తేరును, గుర్రాలను, టెక్కమును, రథం తోలేటివాడిని; తదీయగాత్రమును= కర్ణుడి దేహమును; తూపులవెల్లిన్= అమ్ములవెల్లువలో; మునుంగన్= మునిగిపోయేటట్లు; చేసినన్= చేయగా.

**తాత్పర్యం:** కర్ణుడు కోపోద్దీపితుడై కృష్ణార్జునులను పదునైన బాణాల వరుసతో దెబ్బ తీశాడు. దీనితో, ఎప్పుడును తన శౌర్యసంపదను ప్రదర్శించేందుకు ఉత్సాహపడే విజయుడు, చిరునవ్వుతో ముఖపద్మం శోభిల్లగా కర్ణుడి శరీరాన్ని, రథాన్ని, గుర్రాలను, ధ్వజాన్ని, సారథిని, బాణప్రవాహంలో మునిగిపోయేటట్లు చేయగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆతఁడును దురగ సారథి । కేతుయుతము గాఁగ ముంచెఁ గ్రీడయపోలెన్**
**శాతశరవృష్టి నన్నరు । నీతెఱఁగున మఱియుఁ బెనఁగి రిద్దఱుఁ గడఁకన్. 286**

**ప్రతిపదార్థం:** ఆతఁడును= కర్ణుడు కూడా; క్రీడయ పోలెన్= శ్రమలేకుండా ఒక ఆటవలె; ఆ+నరున్= ఆ అర్జునుడిని; తురగ= గుర్రాలు; సారథి; కేతు యుతము కాఁగన్= జెండాతో సహా; శాత= వాడి అయిన; శరవృష్టిన్= అమ్ములవానలో; ముంచెన్= మునిగిపోయేటట్లు చేశాడు; ఈ తెఱఁగునన్= ఈ విధంగా; మఱియున్; ఇద్దఱున్; కడఁకన్= పట్టుదలతో; పెనఁగిరి= పోట్లాడుకొన్నారు.

**తాత్పర్యం:** కర్ణుడు కూడా అర్జునుడి గుర్రాలను, సారథిని, ధ్వజాన్ని ఒక ఆటవలె అవలీలగా పదునైన బాణవర్షంలో మునిగిపోయేటట్లు చేశాడు. ఈ తీరుగ గట్టిప్రయత్నంతో వారిద్దరూ పోరు సాగించారు.

**శా. ఆయుగ్రాహవకేలి నిట్లు నిపుణుం డై యొప్ప, నప్పార్థుఁ డా**
**గ్నేయాస్త్రం బరివోసి దారుణ మహాగ్ని జ్వాలికల్ భీషణ**
**స్ఫాయద్భంగి నభస్థ్సలిన్ నిగుడ, దర్పస్ఫూర్తి శోభిల్ల రా**
**ధేయాంగోద్దహనాభిలాష మెడఁదన్ దీపింప బె ట్టేసినన్. 287**

**ప్రతిపదార్థం:** ఆ; ఉగ్ర= భీకరమైన; ఆహవకేలిన్= వినోదరూపమైన యుద్ధమునందు; ఇట్లు; నిపుణుండు+ఐ ఒప్పన్= ఆరితేరినవాడై ఉండగా; ఆ+పార్థుఁడు; ఆగ్నేయ+అస్త్రంబు; అరివోసి= సంధించి; దారుణ= భయంకర; మహాగ్ని జ్వాలికల్= ప్రచండమైన అగ్నిజ్వాలలు; భీషణ= భయంకరంగా; స్ఫాయత్ భంగిన్= విశాలంగా వ్యాపించే విధంగా; నభఃస్థలిన్= గగనతలాన; నిగుడన్= అలముకొనగా; దర్పస్ఫూర్తిన్= నిండైన సాహసంతో; శోభిల్లన్= ప్రకాశించగా; రాధేయ= కర్ణుడిని; అంగ= శరీరభాగాలను; ఉద్దహనాభిలాషన్= ఎక్కువగా కాల్చివేయాలన్న కోరిక; ఎడఁదన్= మనస్సులో; దీపింపన్= ప్రకాశించగా; బెట్టు+ఏసినన్= తీవ్రంగా ప్రయోగించగా.

**తాత్పర్యం:** దారుణమైన యుద్ధాన్ని ఒక వినోదక్రీడగా సాగించటంలో ఘటికుడైన ఆ పార్థుడు ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. దాని ప్రచండ జ్వాలలు ఆకాశాన్నంతా అలముకొని, వెలుతురు ముంచివేసినవి. తన శౌర్యాటోపం రాణించేటట్లు రాధేయుడి శరీరాంగములన్నింటిని మాడ్చివేయాలన్న తీవ్రమైన అభిలాషతో ఆయన మది ఉప్పొంగగా ఆ ఆగ్నేయాస్త్రం ప్రయోగించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. అంతక కోపవహ్ని విపులాకృతి గైకొని వచ్చినట్లు, మి**
**న్నంతయుఁ దాన యై కవియు నవ్విశిఖంబు మనంబులోన నా**
**వంతయు శంక లేక, సముదగ్రత వారుణ మార్గణా హతిన్**
**శాంతముఁ జేసి విక్రమ విశాలుఁడు గర్ణుఁడు మాకు నుబ్బుగన్. 288**

**ప్రతిపదార్థం:** అంతక= యముడియొక్క; కోపవహ్ని= కోపాగ్ని; విపులాకృతిన్= సర్వత్రా వ్యాపించిన స్వరూపాన్ని; కైకొనివచ్చినట్లు= చేకొని ప్రత్యక్షమైన విధంగా; మిన్ను+అంతయున్= ఆకాశమంతా; తాన ఐ= తన రూపమే అయినట్లు; (అంతటా అలముకొని); కవియు= సమీపించే; ఆ+విశిఖంబు= ఆ బాణాన్ని (అర్జునుడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రాన్ని); మనంబులోనన్= చిత్తంలో; ఆవంతయున్= కొద్దిపాటైనా; శంక లేక= సందేహంలేకుండా; విక్రమవిశాలుఁడు= సాహసం నిండారి ఉన్న (శౌర్యం ప్రత్యంగమునందు దీపించి ఉన్న); కర్ణుఁడు; మాకున్; ఉబ్బుగన్= సంతోషాతిశయం కలిగేటట్లు; సముదగ్రతన్= అత్యంత తీక్ష్ణమైన విధంగా; వారుణ= జలసంబంధమైన; మార్గణ+ఆహతిన్= బాణపుదెబ్బతో; శాంతము చేసెన్= ఆర్పివేశాడు; (ఆగ్నేయాస్త్రాన్ని ఆర్పటానికి వారుణాస్త్రమే ఉచితమైనది).

**తాత్పర్యం:** యముడి కోపాగ్ని వ్యాపించి భీషణాకారాన్ని ధరించి ప్రత్యక్షమైనట్లు, అర్జునుడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్ర శక్తి ఆకాశమంతా వ్యాపించి తన్ను సమీపించినా, కించిత్తు కూడా కలకబారని మనస్సుతో సాహసమే రూపాంతరం పొంది ఉన్నట్లు విలసిల్లే కర్ణుడు కడు బెట్టిదమైన వారుణాస్త్రాన్ని దానిపై ప్రయోగించి, ఆ మంటలను ఆర్పివేశాడు. ఇది కౌరవవర్గం ఉబ్బితబ్బిబ్బు అయ్యేటట్లు చేసింది.

**ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన, భూన । భోంతరంబు సంభృతాంధకార**
**మయ్యెః సూతసూనుఁడనిలాస్త్ర మేయుడు । నా తమంబు విరిసె నా క్షణంబ! 289**

**ప్రతిపదార్థం:** ఫల్గునుండు= అర్జునుడు; మేఘబాణము; ఏసినన్; భూనభోంతరంబు= భువి దివి మధ్య ప్రదేశమంతా; సంభృత అంధకారము+అయ్యెన్= చక్కగా, చిక్కగా అలముకొన్న చీకటితో నిండిపోయింది; సూతసూనుఁడు= కర్ణుడు; అనిల+అస్త్రము= వాయురూపమైన అస్త్రాన్ని; ఏయుడున్= ప్రయోగించగా; ఆ తమంబు= ఆ చీకటి; ఆ క్షణంబు+అ= అప్పటికప్పుడే; విరిసెన్= చెదరిపోయింది.

**తాత్పర్యం:** ఫల్గునుడు మేఘబాణం వేశాడు. తోడనే రోదసి అంతా కారుమబ్బులు అలముకొని, అంధకారమై పోయింది. దానికి కర్ణుడు విరుగుడుగా వాయవ్యాస్త్రం ప్రయోగించగా ఆ చీకటి అంతా ఆ క్షణంలోనే విరిసిపోయింది.

**ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచిత భక్తి ధరించి మంత్రవి**
**స్ఫూర్జిత గాండివుం డయి రిపుప్రకరంబులు సంచలింప న**
**త్యూర్జితశక్తి నేయుడు, మహోగ్రబహు ప్రదర ప్రకారతా**
**దుర్జయ లీల నిర్మథన దోహలి యై యది కర్ణుఁ గిట్టినన్. 290**

**ప్రతిపదార్థం:** అర్జునుఁడు; ఐంద్రబాణము= ఇంద్రశక్తియుతమైన బాణాన్ని; సమంచితభక్తిన్= ఒప్పిదమైన భక్తిభావంతో; ధరించి; మంత్రవిస్ఫూర్జిత= మంత్రశక్తిచేత అత్యంత ప్రకాశమానమైన; గాండివుండు+అయి= గాండీవాన్ని ధరించినవాడై; రిపుప్రకరంబు= శత్రుసమూహం; సంచలింపన్= వణకిపోగా; అతి+ఊర్జితశక్తిన్= విశేషంగా పెంపొందిన బలంతో; ఏయుడున్=

ప్రయోగించగా; మహోగ్ర= మిక్కిలి భయంకరమయిన; బహుప్రదర= అనేక బాణాల; ప్రకారతా= విధమైన; దుర్జయలీలన్= జయింప సాధ్యంగాని విలాసంతో; నిర్మథన= నిర్మూలించుటయందు; దోహలి ఐ= సమర్థమై; అది= ఆ ఇంద్రబాణం; కర్ణున్; కిట్టినన్= సమీపించగా.

**తాత్పర్యం:** అర్జునుడు ఇంద్రబాణాన్ని అత్యంత భక్తితోచేపట్టి, గాండీవం మంత్రపూతమై శక్తిమంతము కాగా, అత్యధికబలంతో శత్రుసమూహాలు వణకిపోగా ప్రయోగించాడు. ఆ బాణం అత్యంత తీక్ష్ణమైన శస్త్రసమూహంవలె నిర్నిరోధమైన విలాసంతో సర్వం నిర్మూలించ సమర్థమై కర్ణుడిని సమీపించగా (తరువాతి పద్యంతో అన్వయం).

**క. అతఁ డభిమంత్రిత బాణ । ప్రతతిఁ దదుద్రేక మడఁచి పార్థుని మేనన్**
**శిత శరములు నినిచిన మా । రుతపుత్రుఁడు గనలి, యన్నరున కి ట్లనియెన్. 291**

**ప్రతిపదార్థం:** అతఁడు= కర్ణుడు; అభిమంత్రిత= మంత్రింపబడిన; బాణ; ప్రతతిన్= సమూహంతో; తద్+ఉద్రేకము= దాని తీవ్రాటోపాన్ని; అడఁచి= పోగొట్టి; పార్థుని మేనన్; శితశరంబులు= వాడిబాణాలు; నినిచినన్= నిండింపగా; మారుతపుత్రుఁడు= భీముడు; కనలి= కోపగించుకొని; ఆ+నరునికిన్= ఆ అర్జునుడితో; ఇట్లు+అనియెన్= ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** తోడనే కర్ణుడు మంత్రశక్తిదీప్తమైన బాణసముదాయంతో ఆ ఇంద్రబాణశక్తిని అణచి, అర్జునుడి దేహంలో పదునైన శరములు నాటాడు. ఇది చూచి భీముడు కోపోద్రిక్తుడై, అర్జునుడితో ఇట్లా అన్నాడు:

**ఉ. 'సూతసుతుండు నీయెదుర స్రుక్కక నిల్చుట కాక, నీశర**
**వ్రాతము నిల్వరించి యనివారణ నొంపఁ దొడంగె; ఖాండవం**
**బే తెలివొంది కాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁగందియుండఁగా**
**నా తెలి వాత్మ నూల్కొలిపి యగ్గలికం దెగటార్పు మీతనిన్. 292**

**ప్రతిపదార్థం:** సూతసుతుండు= కర్ణుడు; నీ ఎదురన్; స్రుక్క= భయపడి వెనుదీయక; నిల్చుటకాక= నిలబడటమే కాకుండా; నీ శరవ్రాతమున్= నీ బాణసమూహాన్ని; నిల్వరించి= అరికట్టి; అనివారణన్= అడ్డులేకుండా; నొంపన్= (నిన్ను) నొవ్వజేయుటకు; తొడంగెన్= పూనుకొన్నాడు; మహేంద్రుఁడు= ఇంద్రుడు; నివ్వెఱఁగంది ఉండఁగన్= ఆశ్చర్యంతో చేష్టలుడిగి నిలబడి ఉండగా; ఖాండవము= ఖాండవారణ్యాన్ని; ఏ తెలివి+ఒంది= ఎట్టి వివేకాన్ని పొంది; కాల్చితి(వి)= తగలబెట్టావో; ఆ తెలివిన్= ఆ వివేకాన్నే; ఆత్మన్= మనస్సులో; నూల్కొలిపి= గట్టిచేసికొని; అగ్గలికన్= ఉత్సాహంతో; ఈతనిన్= ఈ కర్ణుడిని; తెగటార్పుము= చంపివేయుము.

**తాత్పర్యం:** 'కర్ణుడు నీ యెదుట నిలబడి నీవు ప్రయోగించిన బాణసమూహాన్ని నడుమ నిలిపివేయటమే కాకుండా, నిర్నిరోధంగా నిన్ను నొప్పింపసాగాడు. ఇంద్రుడు ఆశ్చర్యంతో నిలిచి చూస్తుండగా ఖాండవ మహారణ్యాన్ని ఏ నైపుణ్యంతో కాల్చివేశావో, ఆ దక్షతనే మనసులో నిలుపుకొని, ఉత్సాహంతో ఇతడిని తుదముట్టించుము.

**చ. తెగి మన కగ్గమై యరుగుదెంచిన వాఁ డితఁ డల్కి యింక నొం**
**డుగడకుఁ బోవకుండఁగఁ గడున్ వెస డగ్గఱి, యేఁ గపాలముం**
**బగులుతునో గదానిహతిఁ బార్థ! భవత్ప్రకటప్రతిజ్ఞకై**
**తగ దని మాన్చె దేని, నిశిత ప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్.' 293**

**ప్రతిపదార్థం:** పార్థ!= ఓ అర్జునా!; తెగి= తెగించి (అటో ఇటో తేల్చుకొనాలని సాహసించి) మనకున్; అగ్గమై= అసాధ్యుడై; అరుగుదెంచినవాఁడు; ఇతడు; అల్కి= భయపడి; ఇంకన్+ఒండు= ఇంకొొక; కడకున్= దిక్కుకు; పోవకుండఁగన్= పోకుండేటట్లు; కడున్= మిక్కిలి; వెసన్= అత్యంత శీఘ్రంగా; ఏన్= నేను; డగ్గఱి= సమీపించి; గదానిహతిన్= గదదెబ్బతో; ఏన్= నేనే; కపాలమున్= తలను; పగులుతునో= పగులగొట్టియుందునో కదా (కాని); భవత్+ప్రకట= నీవు చాటిపలికిన; ప్రతిజ్ఞకై= శపథపాలనకై (కర్ణుడిని చంపుతానని చేసిన బాస నెరవేరటానికి); తగదని= చంపటం పనికిరాదని; మాన్చెదు+ఏని= మాన్పించేటట్లయితే, నన్ను విరమింపజేసేటట్లయితే; (అతని-కర్ణుడి) కంఠమున్= మెడను; నిశిత= పదునైన; ప్రదరంబులన్= అమ్ములతో; త్రుంపు(ము)= నరికివేయుము.

**తాత్పర్యం:** తెగించి అటో ఇటో తేల్చుకొనాలని మనతో తలపడేందుకు వచ్చినవాడు ఈ కర్ణుడు. భయంతో ఇంకొక దిక్కుకు పోకుండా అడ్డగించి, త్వరత్వరగా అతడిని సమీపించి, నా గదదెబ్బతో అతడి తలను ముక్కలుగా చేసియుండేవాడినే. కాని, నీవు ఆ కర్ణుడిని చంపుతానని చేసిన శపథంవలన తగదని నా పూనికను మాన్పించేటట్లయితే, నీవే పదునైన బాణాలతో అతడి మెడను త్రుంచివేయుము.

**వ. అని పలికె నప్పుడు. 294**

**తాత్పర్యం:** అని (భీముడు) అన్నాడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ. పుండరీకాక్షుండు గాండీవితో 'నీదు । దివ్యబాణములు రాధేయుచేతఁ**
**దూలపోవుటయు, బల్ దూపుల నాతండు । నిను నొంచి యిట్లు పేర్చిన విధంబు**
**నుత్సాహ మెడలి నీ వునికియుఁ గని, కురు । సంతతి యార్వఁ బాంచాలకోటి**
**పిఱుసనిపోవంగ నెఱుఁగవో? యెఱిఁగియుఁ । దగఁ జేయునది లేక వెగడుపడితొ?**

**తే. చక్ర మిచ్చెద నతని మస్తకము దునుము' । మనిన నగుచుఁ గిరీటి, బ్రహ్మాస్త్ర మధిక**
**నిష్ఠమై నేయ నది బహునిష్ఠుర ప్ర । దీప్త శరమూర్తిఁ గర్ణుని దెసకు నడరె. 295**

**ప్రతిపదార్థం:** పుండరీకాక్షుండు= శ్రీకృష్ణుడు; గాండీవితోన్= అర్జునునితో; నీదు= నీయొక్క; దివ్యబాణములు= దైవికశక్తిచేత ఊర్జితములైన బాణాలు; రాధేయుచేతన్; తూలపోవుటయున్= నిర్వీర్యమై పోవటమేకాక; బల్ తూపులన్= గొప్ప బాణాలతో; ఆతండు; నిన్; నొంచి= బాధించి; ఇట్లు; పేర్చిన విధంబు= విజృంభించిన రీతి; ఉత్సాహము; ఎడలి= సడలి(తగ్గి); నీవు+ ఉనికియున్= నీవుండుటయు; కని= చూచి; కురుసంతతి= కౌరవసమూహం; ఆర్వన్= కేకలుపెట్టగా; పాంచాలకోటి= పాండవసమూహం; పిఱు చని పోవంగన్= వెనుదిరిగిపోవటం; ఎఱుఁగవో!= తెలిసికొనలేవా!; ఎఱిఁగియున్= తెలిసికూడా; తగన్+చేయునది లేక= ప్రతిక్రియను చేయటం చేతగాక; వెగడుపడితొ?= తబ్బిబ్బు అయినావో?; (ఏదైనా) చక్రము+ఇచ్చెదన్; అతని మస్తకము= కర్ణుడి తలను; తునుముము= నరికివేయుము; అనినన్; నగుచున్= నవ్వుతూ; కిరీటి; బ్రహ్మాస్త్రము; అధికనిష్ఠమైన్= అత్యంత శ్రద్ధతో; ఏయన్= ప్రయోగించగా; అది; బహునిష్ఠుర= అత్యంత కఠినమైన (శక్తిమంతమైన); దీప్త శరమూర్తిన్= ప్రకాశించే బాణాకృతితో; కర్ణుని; దెసకున్= దిక్కుకు; అడరెన్= విజృంభించింది.

**తాత్పర్యం:** కృష్ణుడు అర్జునుడితో ఇట్లా అన్నాడు: 'దైవదత్తాలైన నీ బాణాలు కర్ణుడిచేతిలో పనికిరాకుండా పోవటమేగాక, అతడు అనేకబాణాలతో నిన్ను బాధపెట్టిన విధాన్ని, అతడి విజృంభణతో నీ ఉత్సాహం, నీ యుద్ధ

ప్రేరణశక్తి నిన్ను వదలిపెట్టిపోయిన నీ దైన్యస్థితిని చూచి కౌరవులు ఉప్పొంగి బొబ్బలు పెట్టారు. దీనితో పాండవ పక్షంవారు పిరికివారై వెన్ను చూపి మరలిపోవటం నీ మనసుకు పట్టలేదా? లేక తెలిసికూడ దానికి విరుగుడు చేయలేక తడబడుతున్నావో - తెలియటం లేదు. ఏదైతేనేమి? నా చక్రమిస్తాను, కర్ణుడి తలను నరకి పారవేయుము' అనగా, అర్జునుడు నవ్వుతూ అతిశ్రద్ధతో బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు; అది శక్తిమంతమైన, తేజోవిలాసమైన ఒక బాణాకృతిని దాల్చి, కర్ణుడివైపు అతివేగంగా దూసుకొని పోయింది.

**క. ఆ రథికుఁడు దలఁకక నియ । మారూఢ ప్రౌఢభావుఁ డగుచుఁ దదస్త్రో**
**దారతర బలమునన త । ద్దారుణ సంరంభ ముడిపె ధరణీనాథా! 296**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా!; ఆ రథికుఁడు= ఆ కర్ణుడు; తలఁకక= జంకి వెనుదీయకుండా; నియమ ఆరూఢ= నియమావళిని పాటించుటయందు పరిపూర్ణత చెందిన; ప్రౌఢభావుఁడు-ధీరచిత్తుడు; అగుచున్; తద్= ఆ; అస్త్ర= అస్త్రముయొక్క; ఉదారతర= ఎక్కువగా పెంపొందిన; బలమునన= శక్తితోనే; తద్= ఆ బ్రహ్మాస్త్రముయొక్క; దారుణ సంరంభమున్= ఉపద్రవకరమైన దాని ఆర్భాటమును; ఉడిపెన్= తగ్గించివేశాడు.

**తాత్పర్యం:** ఆ కర్ణుడు నియమాలను పాలించటంలో ప్రౌఢుడై, నిశ్చలచిత్తుడై, ప్రయోగింపబడిన అస్త్రముయొక్క తీవ్రతరమైన బలముతోనే దాని భయంకరమైన విజృంభణాన్ని శక్తిహీనం చేశాడు.

**విశేషం:** కర్ణార్జునులు ఇద్దరు ఒకే కడుపున పుట్టినా, పుట్టినది మొదలు ప్రతి విషయంలో తీవ్ర ప్రత్యర్థులు, అయినా, ఇద్దరూ స్వధర్మ దీక్షా కంకణబద్ధహస్తులు. రణకళాపారీణతయందు, భయద దివ్యఅస్త్రసంపదయందు అకుంఠిత శౌర్యాటోపము నందు సమతుల్యులుగానే పోషించబడ్డారు. ఇక మరణించిన ఆయనకు వీరస్వర్గం, బ్రతికిన ఆయనకు ప్రాపంచిక కీర్తి మకుటం. కర్ణుడు సమర సముదాచారానికి భంగంగా తల దునుమబడినప్పుడు, ఆయన దివ్యతేజం వారిజాప్తబింబమందే కలిసింది. ఇట్టి మహిమోపేతమైన మరణయోగం భారతీయవీరులలో ఇంకెవరికీ దక్కలేదు. అయినా, పార్థుడికి శాశ్వత తత్త్వశాస్త్ర రంగంలో శోభాయమానమైన కీర్తిస్థానం లభించినది. సర్వమత సమన్వయరూపమై, ఉపనిషత్తుల సారభూతమై ప్రపంచదార్శనికులకు ఆదర్శమై ఇంటింట జ్ఞానదీపమై వెలుగుతున్న భగవద్గీతలో పృచ్ఛకుడై ధన్యుడైనాడు. ఇది అపూర్వఫలం. మతములున్నంత వరకూ ఈయన పేరు నిలిచి ఉంటుంది. ఇట్లా భారతేతిహాసానికి శిరోభూషణమైనాడు.

**తే. ఉడిపి, తోడన కవ్వడి యొడలఁ గృష్ణు । మేన మూఁడుమూఁ డడరించె మెఱుఁగుఁదూపు**
**లన్నరుఁడు గర్ణుతనువు శల్యాంగకములుఁ । జించెఁ దొమ్మిది తొమ్మిది శితశరముల. 297**

**ప్రతిపదార్థం:** ఉడిపి= అట్లు దాని శక్తిని తగ్గించి; తోడన= వెంటనే; కవ్వడి= అర్జునుడి; ఒడలన్= దేహమునందు; కృష్ణుమేనన్= కృష్ణుడి దేహమునందు; మెఱుఁగు తూపులు= కాంతితో తళతళలాడే బాణాలు; మూఁడు మూఁడు= మూడేసి; అడరించెన్= ప్రయోగించాడు; ఆ+నరుఁడు; (దీనికి ప్రతిక్రియగా) కర్ణ తనువున్= కర్ణుడి దేహమును; శల్య+అంగకములున్= శల్యుడి అవయవాలను; తొమ్మిది తొమ్మిది= తొమ్మిదేసి; శితశరములన్= వాడి బాణాలతో; చించెన్= చీల్చివేశాడు.

**తాత్పర్యం:** పార్థుడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రం ఆర్భటిని వమ్ముజేసి, కర్ణుడు కృష్ణార్జునుల దేహాలలో మూడేసి పదునైన బాణాలను చొప్పించాడు. వెంటనే ఆ నరుడు కర్ణుడి దేహాన్ని, శల్యుడి అవయవాలను తొమ్మిది తొమ్మిది బాణాలతో చీల్చివేశాడు.

**ఆ. మొనసి క్రీడి మఱియు మూఁడు నెనిమిదియు । రెండు నాల్గు పదియుఁ జండమార్గ**
**ణములు గ్రుచ్చె; సూతనందనుమై నతఁ । డులక యతని మౌర్వి యూడ నేసె! 298**

**ప్రతిపదార్థం:** క్రీడి= అర్జునుడు; మొనసి= పూని; మఱియున్= మరల; మూఁడు ఎనిమిదియు రెండు నాల్గు పదియున్; చండ మార్గణములు= తీవ్రమైన బాణాలను జోడించి; సూతనందను= కర్ణుడి; మైన్= శరీరంలో; క్రుచ్చెన్= చొనిపినాడు; అతఁడు= ఆ కర్ణుడు; ఉలక= అవలీలగా, అతని= అర్జునుడి; మౌర్వి= అల్లెత్రాడు; ఊడన్+ఏసెన్= ఊడిపోయేటట్లు బాణం ప్రయోగించాడు.

**తాత్పర్యం:** కర్ణుడి ప్రయోగాన్ని ప్రతిఘటిస్తూ కిరీటి తీవ్రబాణ సముదాయాన్ని సూతనందనుడి దేహాన నాటాడు. అతడు అనాయాసంగా పార్థుడి అల్లెత్రాటిని ఊడగొట్టాడు.

**వ. ఏసి మఱియు శితశరంబులం బొదువం బొలివోవక, పార్థుం డా గుణంబు సమాహితంబు సేసి పెల్లేసిన రయంబున రాధేయుం డతని శింజిని శిథిలంబు గాద కాక యని తలంచె; నాధనంజయుం డతని వింటినారి వికలంబుఁగాఁ జేసి. 299**

**ప్రతిపదార్థం:** ఏసి= ఆ విధంగా ప్రయోగించి; మఱియున్= ఇంకా; శితశరంబులన్= వాడి అమ్ములను; పొదువన్= ప్రయోగించగా; పార్థుండు; పొలిపోవక= భంగపడక; ఆ గుణంబును= జారిన ఆ అల్లెత్రాటిని; సమాహితంబు+చేసి= సరిచేసి; పెల్లు+ఏసినన్= ఎక్కువగా బాణాలను ప్రయోగించగా; రాధేయుండు; అతని= కిరీటియొక్క; శింజిని= అల్లెత్రాడు; శిథిలంబు కాద కాక= నాశనం కాలేదని; అని తలంచె; ఆ ధనంజయుండు= ఆ అర్జునుడు; అతని= కర్ణుడి; వింటినారిన్= అల్లెత్రాడును; వికలంబున్+కాన్+చేసి= తెగేటట్లుచేసి -

**తాత్పర్యం:** అట్లా కొట్టి వాడిబాణాలతో క్రమ్ముకొన్నాడు. అయినా అర్జునుడు వెనుకాడక అల్లెత్రాటిని సరిచేసికొని పెక్కుబాణాలు వేయగా, కర్ణుడు అర్జునుడి అల్లెత్రాడు తెగలేదని తలంచాడు. అంతలో అర్జునుడు కర్ణుడి వింటి నారిని త్రెంచివేశాడు.

**క. చిఱునగవుతోడ మైమఱువుఁ । వఱువుళ్ళుగఁ జేసి యతనియంగము దోఁగం**
**బఱపె రుధిరంబు, బెడిదపు । మెఱుఁగు వెడఁద యంపగమి నమిత్రులు దలఁకన్. 300**

**ప్రతిపదార్థం:** చిఱునగవుతోడన్= చిన్ననవ్వుతోడన్; మైమఱువున్= కవచాన్ని; అఱువుళ్లుగన్= శిథిలముగా; చేసి; బెడిదపు= గట్టి; మెఱుఁగు; వెడఁద= వెడల్పుగల; అంపగమిన్= బాణసమూహముతో; అమిత్రులు= శత్రువులు; తలఁకన్= అదరిపోగా; అతడి అంగము= అతడి (కర్ణుడి) శరీరము; రుధిరంబు= రక్తంబు; దోఁగన్= కారునట్లు; పఱపెన్= చేసినాడు.

**తాత్పర్యం:** (అర్జునుడు) చిరునవ్వు చిందులాడగా కవచాన్ని చిదురుగా చేసి, భయంకరకాంతులు చిమ్మే విశాల బాణసమూహంతో కర్ణుడి శరీరం నెత్తురు కారేటట్లు చేశాడు. దీనితో విరోధులు భయపడిపోయారు.

**చ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ దీవ్ర శర త్రయవిద్ధుఁ జేసి, మం**
**దరధరు నస్త్రపంచక నితాంతహతిం గడు నొంచె నా శరో**
**త్కరము వరప్రభావకలితం బగుటన్ మగుడంగ వచ్చె ని**
**ష్ఠుర రభసం బెలర్ప మధుసూదనుఁ గ్రమ్మఱ నేసె నాతఁడున్. 301**

**ప్రతిపదార్థం:** కర్ణుఁడు; తెరలక= వైదొలగిపోకుండా; ఆ+విజయున్; తీవ్రశరత్రయ= మిక్కిలి పదునైన మూడుబాణాలతో; విద్ధున్+చేసి= బాధించి; మందరధరున్= మందరపర్వతము నెత్తిన (మోసిన) కృష్ణుడిని; అస్త్రపంచక= అయిదుబాణాల; నితాంతహతిన్= తెరిపి లేని దెబ్బలతో; కడున్ నొంచెన్= ఎక్కువగా బాధించాడు; ఆ శర+ఉత్కరము= ఆ బాణసమూహం; వరప్రభావ కలితంబు+అగుటన్= దైవం ప్రసాదించిన వరంచేత శక్తిమంతమైనది కావటంవలన; నిష్ఠుర= కర్కశమైన; రభసంబు= వేగం; ఎలర్పన్= అతిశయించగా; మగుడంగన్+వచ్చెన్= లక్ష్యాన్ని తాకి తిరిగి వచ్చింది; మధుసూదను= మధురాక్షస సంహారి అగు కృష్ణుడిని; ఆతఁడున్= కర్ణుడు; క్రమ్మఱన్= మరల; (దానిని); ఏసెన్= (బాణాలతో) కొట్టాడు.

**తాత్పర్యం:** పార్థుడు చేసిన బాణప్రయోగానికి కర్ణుడు వెనుదీయకుండా నిలిచి, ఆ విజయుడిని మూడు బాణాలతో బాధించాడు. కృష్ణుడిని ఐదుబాణాలతో అలయింపజేశాడు. కర్ణుడుపయోగించిన బాణాలన్నీ దైవానుగ్రహంతో శక్తిస్ఫూర్తిని పొందినవైనందున, లక్ష్యాన్ని తాకి వెనుదిరిగి వచ్చి కర్ణుడిని చేరాయి. వెంటనే ఆతడు కృష్ణుడిపై ఆగ్రహావేశంతో వాటిని తిరిగి ప్రయోగించాడు.

**విశేషం:** సారథియైన శ్రీకృష్ణ భగవానుడికి కూడా ఆ సూతుడి దెబ్బలు తప్పలేదు. శ్రీకృష్ణుడి చక్రం వలెనే కర్ణుడి బాణాలు కూడా లక్ష్యాన్ని దెబ్బతీసి, తిరిగి ఆయన చేతికి వస్తున్నవి. (ఆస్ట్రేలియా ఆదిమజాతులు కొడవలివలె వంక తిరిగిన కొయ్య సాధనం విసిరితే అది దెబ్బకొట్టి తిరిగివచ్చి, వారిచేతిలో చేరుతుందట. ఇందు హస్తలాఘవం, ఆ పనిముట్టు తీరేగాని వరప్రసాదం లేదేమో?)

**క.** **అలఘు పటుభల్ల పంచక । ముల రెంటం గ్రీడి చిత్రముగ నయ్యస్త్ర**
**మ్ములు మూఁడు మూఁడు శకల । మ్ములుగాఁ దునుమాడె, జనులు పొగడ నరేంద్రా!** **302**

**ప్రతిపదార్థం:** నర+ఇంద్రా!= రాజా!; అలఘు= తక్కువగాని; పటు= పటిష్ఠమైన; భల్ల పంచకముల= ఐదుబాణాల; రెంటన్= రెండుబాణాలతో; క్రీడి; చిత్రముగన్= ఆశ్చర్యంగా; ఆ+అస్త్రమ్ములు= కర్ణుడు వేసిన (అయిదు) బాణాలు; జనులు పొగడన్= ప్రజలు పొగడగా; మూఁడు మూఁడు; శకలమ్ములుగాన్= తునకలుగా; తునుమాడెన్= ఖండించాడు.

**తాత్పర్యం:** కర్ణుడు మళ్ళీ ప్రయోగించిన పటిష్ఠమైన అయిదుబాణాలను అర్జునుడు రెండుబాణాలతో మూడేసి తుంటలుగా విరుగగొట్టాడు. ఆశ్చర్యకరంగా జరిగిన ఈ విధ్వంసాన్ని చూచినవారు కొనియాడారు.

**క.** **కర్ణునిమెయి నాలోనన । కర్ణాంతాకృష్ట చండకాండము లధికో**
**దీర్ణక్రోధంబున న । భ్యర్ణగతుం డగుచుఁ గ్రుచ్చె నతఁ డే పలరన్.** **303**

**ప్రతిపదార్థం:** ఆలోనన= ఆలోపలనే; కర్ణాంత+ఆకృష్ట= చెవులు తాకేటట్లు లాగబడిన; చండకాండములు= దారుణమైన బాణాలను; అధిక ఉదీర్ణ= అత్యంతము అధికమైన; క్రోధంబునన్= కోపంతో; అభ్యర్ణ గతుండు+అగుచున్= సమీపించినవాడై; అతఁడు= అర్జునుడు; కర్ణుడి మెయిన్= కర్ణుడిదేహంలో; ఏపు అలరన్= విజృంభణం ఒప్పగా; క్రుచ్చెన్= చొరబడచేశాడు.

**తాత్పర్యం:** ఆ లోపలనే కిరీటి చెవులంట లాగివిడిచిన బాణాలను అత్యంతం రేగిన క్రోధంతో కర్ణుడిని సమీపించి, ఉప్పొంగుతూ అతడి శరీరంలో నాటాడు.

**చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన**
**న్నెఱుఁగులు గ్రమ్మునమ్ముల వినిశ్చలధైర్యము పేర్మి నాతఁ డు**
**క్కఱక పెనంగె దానఁ గన లగ్గలమై వెస నమ్మహాభుజుం**
**డఱిముఱిఁ జీఁకటుల్ గవియు నట్లుగ రోదసి నించెఁ దూపులన్. 304**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; నరుండు; సూతసుతు= కర్ణుడి; మర్మ= జీవస్థానాలను; విభేదనము= చీల్చటం; ఆచరించినన్= చేయగా; అతండు= కర్ణుడు; ఉక్కు= సత్తువను; అఱక= పోగొట్టకొనకుండా; మెఱుఁగులు క్రమ్మ= కాంతులు వ్యాపింపజేసే; అమ్ములన్= బాణాలతో; వినిశ్చల ధైర్యము= అచంచలమైన ధైర్యముయొక్క; పేర్మిన్= వృద్ధితో; పెనంగెన్= పోరాడాడు; దానన్= దానితో; కనలు= కోపం; అగ్గలమై= అతిశయించి; వెసన్= వెంటనే; ఆ+మహాభుజుండు= ఆ బాహుబలశాలి; అఱిముఱి= సంభ్రమించి (త్వరపడి); చీఁకటుల్; కవియునట్లుగన్= వ్యాపించేటట్లుగా; రోదసి= భూమ్యాకాశాల మధ్య ప్రదేశమంతా; తూపులన్= బాణాలతో; నించెన్= నిండింపచేశాడు.

**తాత్పర్యం:** అంతేకాక అర్జునుడు కర్ణుడి జీవస్థానాలైన మర్మాంగాలను భేదించగా, ఆ దెబ్బలకు కర్ణుడు చెక్కు చెదరని ధైర్యంతో ప్రజ్వలించే నిశిత శరపరంపరను ప్రయోగిస్తూ యుద్ధం సాగించాడు. దానితో ఇంకా కోపం ఉగ్రమై పెరగగా, ఆ దోర్బలశాలి అర్జునుడు వెంటనే అత్యంత ఉత్సాహి అయి భూనభోంతరాలు చీకట్లు క్రమ్ముకొనేటట్లు బాణాలతో నింపాడు.

**తే. వెగడువడి చక్రరక్షకుల్, వెనుక దిక్కు । గాచు రథికులుఁ బార్శ్వసంగతులుఁ దమ్ము**
**విడువఁ జాలక లజ్జ వో విడిచి రపుడు । గర్ణువారలు వాఱుట గని, విభుండు. 305**

**ప్రతిపదార్థం:** వెగడు+పడి= తడబాటు పొంది; చక్రరక్షకుల్= రథచక్రాలను కాపాడుతున్నవారు; వెనుక దిక్కు= వెనుక పార్శ్వమును; కాచు= కావలికాస్తున్న; రథికులున్= రథ సైనికులు; పార్శ్వసంగతులు= ప్రక్కల ఉన్న సైనికులు; తమ్మ విడువజాలక= రథమందున్నవారిని విడిచిపెట్టి పోయేందుకు మనస్కరించకపోయినా; లజ్జ పోన్ విడిచిరి= సిగ్గు విడిచి; పరుగెత్తి పోసాగారు; అపుడు; కర్ణువారలు= కర్ణుడి మనుష్యులు; పాఱుట= పలాయనులవటం; కని= గమనించి; విభుండు= ప్రభువైన దుర్యోధనుడు.

**తాత్పర్యం:** రథచక్రాలను రక్షించేవారు, వెనుక దిక్కు రక్షగా ఉండేవారు, రథానికి రెండుప్రక్కల రక్షగా ఉండేవారు- తమతమ స్థానాలను వదలిపోలేక, చివరకు భయపడి సిగ్గువిడిచి పారిపోయారు. ఈ విధంగా కర్ణుడి సహాయకులు పరుగెత్తిపోవటం చూచి దుర్యోధనుడు - (తరువాతి పద్యంతో అన్వయం)

**క. ఆ దిక్కువారు భీముం । డాదిగ నని సేయకుండు నన్నియతి యెడం**
**దా దైన్యమొంది తప్పం । గా దని యూహింపనీని కలఁక కతమునన్. 306**

**ప్రతిపదార్థం:** భీముండు+ఆదిగన్= భీముడు మొదలుకొని; ఆ దిక్కువారు= ఆ పక్షంవారు; అని చేయకుండు= యుద్ధం చేయరాదనే; ఆ+నియతి= ఆ కట్టడి; ఎడన్= పట్ల; తాన్= తాను; దైన్యమొంది= దిగులుపడి; తప్పన్+కాదని= అది తప్పించుకొనటానికి వీలుకానిదని; ఊహింపనీని= యోచించేందుకు వీలు కల్పించకుండా చేసిన; కలఁక= దిగులు; కతమునన్= కారణంవలన.

**తాత్పర్యం:** ప్రతిపక్షంలో భీముడు మొదలైనవారు యుద్ధంలో పాల్గొనరాదు అన్న నియమంపట్ల దుర్యోధనుడు బాధపడి, ఇది తొలగించుకుందామని అనుకోవటానికి కూడా అవకాశమివ్వని మనోవ్యాకులతవల్ల. (తరువాతి గద్యంతో అన్వయం).

**దుర్యోధనుఁడు తన యోధుల నర్జునుం దలపడఁ బురికొలుపుట (సం. 8-65-42)**

**వ. ఇరుగెలంకుల మూఁకలం గలయం గనుఁగొని యెలుంగెత్తి. 307**

**ప్రతిపదార్థం:** ఇరు కెలంకుల= ఉభయపక్షాల; మూఁకలన్= గుంపులను; కలయన్ కనుఁగొని= పరికించి చూచి; ఎలుంగెత్తి= ఉదాత్తస్వరంతో.

**తాత్పర్యం:** ఉభయపక్షాల సైనికులను కలయచూచి గొంతెత్తి (ఇట్లా అన్నాడు). (తరువాతి పద్యంతో అన్వయం).

**క. 'తొడరుఁడు పొదువుం డేయుఁడు । పొడువుఁడు బీభత్సుఁ బ్రిదిలి పోనీక వెసం**
**బడవైపుం డొక్కుమ్మడిఁ । గడఁగి!' యనుచుఁ జేయి వీచెఁ గౌరవనాథా!' 308**

**ప్రతిపదార్థం:** కౌరవనాథా!= ధృతరాష్ట్రుడా!; తొడరుఁడు= ధిక్కరించండి; పొదువుండు= పైబడి క్రమ్ముకొనండి; ఏయుఁడు= దెబ్బతీయండి; పొడువుఁడు; ఒక్కుమ్మడిన్= కలిసికట్టుగా ఏకమైన ప్రయత్నంతో; కడఁగి= సాహసం చూపి; బీభత్సుని= వివ్వచ్చుడిని; ప్రిదిలి పోనీక= తప్పించుకొని పోనీయకుండా; వెసన్= వెంటనే; పడవైవుండు= నేలపై పడేటట్లు చేయండి; అనుచున్= అంటూ; చేయి వీచెన్= చేయి ఆడించాడు.

**తాత్పర్యం:** దుర్యోధనుడు గొంతెత్తి సమరోత్సాహ దీపకాలైన ప్రబోధవాక్యాలతో, 'అర్జునుడు తప్పించుకొని పోకుండా పట్టండి, పొడవండి నేలపాలు చేయండి. అందరూ ఒక్కుమ్మడిగా క్రమ్ముకోండి' అని అంటూ చేయివీచి ప్రోత్సాహించాడు.

**క. విను, మతఁ డిమ్మెయిఁ బురికొలి । పిన, రథ కరి తురగ సుభటబృందములు రయం**
**బున నురవణించె నయ్యు । ర్జును పైఁ దగువారు నిలిచి చూచుచు నుండన్. 309**

**ప్రతిపదార్థం:** విను= బాగా చెవియొగ్గుము; అతఁడు= దుర్యోధనుడు; ఈ+మెయిన్= ఈ విధంగా; పురికొలిపినన్= కవ్వించేటట్లు చేయగా; రథ; కరి= ఏనుగులు; తురగ= గుర్రాల; సుభటబృందములు= ఆరితేరిన గట్టి సైనికుల సమూహాలు; రయంబునన్= త్వరత్వరగా; ఆ+అర్జునునిపైన్; తగువారు= అర్హులైనవారు; నిలిచి చూచుచున్; ఉండన్= ఉండగా; ఉరవణించెన్= విజృంభించాయి.

**తాత్పర్యం:** ఇట్లా రెచ్చగొట్టగా చతురంగ బలాలు, అందరు చూస్తుండగా వెంటనే మహావేగంగా అర్జునుడిపై పడి చుట్టుకొన్నారు.

**వ. ఎదిరి సైన్యంబు సమరంబు దొఱంగి యుండుట యెఱింగి కడఁగుట పాడిగా దని దొరలు దురంబునకుం జొరకుండిరి; గాండీవి కోదండగుణ రణన భరిత భూనభోంతరుం దగుచు వివిధ విశిఖ జ్వాలా**

**కలాపంబుల వేఁడిమి సూపిన, నేపఱి వెఱచి యమ్మూఁకలు పఱచినం గనుంగొని యక్కురునాథుం డద్దొరల నుద్దేశించి. 310**

**ప్రతిపదార్థం:** ఎదిరి సైన్యంబు= విరోధిసేన; సమరంబు= యుద్ధమును; తొఱంగి= విడనాడి; ఉండుట ఎఱింగి; కడఁగుట= పైబడి తాకుట; పాడికాదు+అని= ఉచితం కాదని; దొరలు= నాయకులు; దురంబునకున్= యుద్ధమునకు; చొరకుండిరి= పూనుకొనకుండిరి; గాండీవి= అర్జునుడు(తన); కోదండగుణ= వింటి అల్లెత్రాటి; రణన= మ్రోతతో; భరిత= నిండిన; భూనభోంతరుండు+అగుచున్= దివి భువి మధ్యప్రదేశం కలవాడవుతూ; వివిధ విశిఖ= పలురకాలైన బాణాల; జ్వాలాకలాపంబుల= నిప్పుల సమూహంతో; వేఁడిమి చూపినన్= ఉడుకు చూపగా; ఏపు అఱి= ఉద్ధృతి అణగి; వెఱచి= భయపడి; ఆ+మూఁకలు= ఆ సైన్యసమూహాలు; పఱచినన్= పారిపోగా; కనుంగొని; ఆ+కురునాథుండు= ఆ దుర్యోధనుడు; ఆ+దొరలన్= ఆ సేనాపతులను; ఉద్దేశించి= వారితో ఇట్లాఅన్నాడు.

**తాత్పర్యం:** పాండవసైన్యం యుద్ధంమాని ఉండటం గమనించి కౌరవపక్షం యుద్ధం చేయటం న్యాయం కాదని నాయకులు ఊరకున్నారు. అర్జునుడు గాండీవి గుణధ్వనిని భూనభోంతరాలు మ్రోగేటట్లు చేశాడు. పలురకాలైన బాణాల మంటలతో వేడి పుట్టేటట్లు చేయగా ఆ మూకలు పరుగెత్తిపోయాయి. అది చూచి దుర్యోధనుడు ఆ రాజులతో (తరువాతి పద్యంతో అన్వయం.)

**క. 'బీరమును లావుఁ గల్గిన । మీరందఱుఁ గర్ణు నొకని మీఁదన యిమ్మెఁ**
**బోరెల్లఁ ద్రోచి ఫల్గునుఁ । జేర కునికి యాయుధోపజీవుల తెఱఁగే?' 311**

**ప్రతిపదార్థం:** బీరమును= పరాక్రమం; లావున్= దేహసౌష్ఠవమిచ్చిన బలం; కల్గిన; మీరు+అందఱున్; ఈ+మెయిన్= ఈ విధంగా; పోరు+ఎల్లన్= సంపూర్ణ సమర నిర్వహణబాధ్యతను; కర్ణునొకని మీఁదన= ఒక్క కర్ణుడి తలపైననే నెట్టిపెట్టి; ఫల్గునున్= అర్జునుని; చేరకునికి= ఎదుర్కొనకుండటం; ఆయుధ= ఆయుధాలవలననే; ఉపజీవుల= బ్రతికే మీయొక్క; తెఱఁగే?= విధానమా? (ఉచితం కాదని భావం.)

**తాత్పర్యం:** పరాక్రమం, బలం కలిగిన మీరంతా, ఈ యుద్ధనిర్వహణ బాధ్యతనంతా కర్ణుడొక్కడిమీదనే మోపి, అర్జునుడి జోలికి పోకుండా ఉండటం పోరులతోనే పొట్టపోసికొని బ్రతికే మీ బోంట్లకు తగి ఉన్నదా?'

**వ. అనిన విని, యుల్లంబుల లేని యుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నురవడించిన. 312**

**ప్రతిపదార్థం:** అనినన్ విని; ఉల్లంబులన్= మనస్సులలో; లేని; ఉత్సాహంబు; తెచ్చికొని; వారు; ఒక్కుమ్మడిన్= ఒక్కపెట్టున; ఉరవడించినన్= పరాక్రమించగా.

**తాత్పర్యం:** అనగా విని కౌరవవీరుల మనసులలో లేని ఉత్సాహాన్ని బలవంతంగా పొందుపరచుకొని ఒక్కసారిగా విజృంభించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. భరిత క్రోధ మహోగ్రవృత్తి సిడముల్ భంజించుచున్, సూతుల**
**న్ధరణిం గూల్చుచుఁ, జాపముల్ నఱకుచున్, రథ్యంబులం జంపుచున్,**
**నరుఁ డాభీల పరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి వి**
**చ్చిరి వా రందఱు; దివ్యసంఘము నుతించెం జూచి యవ్వీరునిన్. 313**

**ప్రతిపదార్థం:** నరుఁడు= అర్జునుడు; ఆభీల= భయంకరమైన; పరాక్రముండు= పరాక్రమవంతుడు; అగుడున్= కాగా; భరిత= పరిపూర్ణమైన; క్రోధ= కోపంయొక్క; మహా+ఉగ్రవృత్తిన్= మహాభయంకరమైనవిధంగా; సిడముల్= పతాకధ్వజాలను; భంజించుచున్= విరుగగొట్టుతూ; సూతులన్= రథాలు నడిపేవారిని; ధరణిన్= నేలపై; కూల్చుచున్= పడగొట్టుతూ; చాపముల్ నఱకుచున్= విల్లులు తుంటలు చేస్తూ; రథ్యంబులన్= తేరులు లాగే గుర్రాలను; చంపుచున్= చంపివేస్తూ; (ఆభీల పరాక్రముడు కాగా); వారందఱున్= విరోధి సైనికులందరు; దైన్యంబు+అంది= దీనస్థితిని పొంది; వెన్ను+ఇచ్చి= వీపు చూపి; విచ్చిరి= చెల్లాచెదరై పారిపోయారు; చూచి= దీనిని చూచి; దివ్య సంఘము= దేవతాగణం; ఆ+వీరున్= మొనగాడైన ఆ అర్జునుడిని; నుతించెన్= పొగడింది.

**తాత్పర్యం:** భయంకర పరాక్రమోపేతుడైన పార్థుడు కోపాతిరేకంతో మహాదారుణంగా విజృంభించి విరోధివీరుల పతాకాలను, సారథులను నేలపాలు చేస్తూ, గుర్రాలను, విల్లులను తునుమాడుతూ చెలరేగగా విరోధిసైన్యాలు దీనస్థితిలో పడి, వెనుదిరిగి చెల్లాచెదరై పరుగెత్తిపోయాయి. దీనిని చూచిన దేవతలు విజయుడిని స్తుతించారు.

**చ. కురుపతి వెండియుం దఱుమఁ గోల్తల సేయర క్రమ్మఱంగ నె**
**వ్వరు నతిభీతి నిట్లు మనవా రెడగాఁ జని చూచుచుండి; ర**
**ప్పరుసున నా సమిద్ధరణిభాగము శూన్యతఁ బొందఁ గర్ణుఁ డ**
**న్నరుఁ దలపడ్డ నప్పటి రణంబు మహాద్భుత మయ్యె భూవరా! 314**

**ప్రతిపదార్థం:** భూవరా!= రాజా!; కురుపతి= దుర్యోధనుడు; వెండియున్= మరలా; తఱుమన్= ముందుకు రండని త్వరపెట్టగా; అతిభీతిన్= మిక్కిలి భయంతో; క్రమ్మఱంగన్= వెనుదిరిగి పోరు చేయటానికీ; కోల్తల= ఎదురెదురుగా నిలబడి చేసే యుద్ధం; చేయరు+అ= చేయలేకుండిరి; ఇట్లు; మనవారు; ఎడగాన్+చని= దూరంగా పోయి; చూచుచుండిరి; ఆ+ పరుసునన్= ఆ విధంగా; ఆ సమిద్ధరణిభాగము= ఆ యుద్ధ భూభాగము; శూన్యతన్+ఒందన్= ఎవరూ లేకుండా వట్టిది కాగా; కర్ణుఁడు; ఆ+నరున్; తలపడ్డన్= ఎదుర్కొనగా; అప్పటి రణంబు= ఆ సమయంలో యుద్ధం; మహాద్భుతము+అయ్యెన్= అత్యంత ఆశ్చర్యకరమైనది అయింది.

**తాత్పర్యం:** దుర్యోధనుడు పరుగెత్తి వచ్చిన సైనికులను మరల ముందుకు తరుమగా, భయభ్రాంతులై వారందరూ ముఖాముఖి పోరాటానికి విముఖులై, దూరంగా పోయి జరిగే యుద్ధాన్ని చూస్తూ నిలబడిపోయారు. వారి పోకతో, ఆ యుద్ధభూమి వట్టి బయలైనది. అప్పుడు కర్ణార్జునులు తలపడ్డారు. ఆ యుద్ధం చాలా వింత గొల్పింది.

**చ. శ్రమమున సోలుచుండియుఁ బరాక్రమసంపద సొంపు మీఱ, దు**
**ర్దమ వివిధాస్త్రజాల తిమిరంబుల నొండొరుఁ గప్పి కప్పి శౌ**
**ర్యములును బాహువీర్యములు రాజుల నచ్చెరు వందఁజేయ ను**
**గ్రముగఁ బెనంగి రయ్యమరరాజతనూజుఁడు సూతసూనుఁడున్. 315**

**ప్రతిపదార్థం:** శ్రమమునన్= పడిన కష్టంవలన; సోలుచుండియున్= తూలిపోతూ ఉండి కూడా; ఆ+అమర రాజ తనూజుఁ డున్= ఆ దేవేంద్ర తనయుడగు అర్జునుడు; సూతసూనుఁడున్= సారథి పుత్రుడగు కర్ణుడు; పరాక్రమ సంపదన్= శౌర్య సమృద్ధి; సొంపుమీఱన్= అందగించగా; దుర్దమ= ఎదురులేని; వివిధ+అస్త్రజాల= నానావిధాలైన ఆయుధాల సమూహాలచే (కల్పించిన); తిమిరంబులన్= చీకట్లతో; ఒండొరులన్= ఒకరినొకరు; కప్పి, కప్పి; శౌర్యములును= వారి ప్రతాపములు;

బాహువీర్యములున్= బాహుబలములు; రాజులన్= చూస్తున్న ప్రభువులను; అచ్చెరువు+ఒందన్+చేయన్= ఆశ్చర్యపడేటట్లు చేయగా; ఉగ్రముగన్= భయంకరంగా; పెనంగిరి= పోరాడారు.

**తాత్పర్యం:** కర్ణార్జునులిరువురూ యుద్ధక్లేశంతో తూలిపోతున్నప్పటికీ, శౌర్యలక్ష్మీశోభతో అణచ శక్యంగాని నానావిధ ఆయుధాలప్రయోగంతో, అలముకొన్న చీకట్లతో ఒకరినొకరు కప్పివేసికొంటూ భయంకరంగా పోరాడారు. ఇది చూస్తూఉండిన నానారాజ్య పాలకులు వీరిద్దరు చూపుతున్న ప్రతాపానికీ, భుజబలశక్తికీ ఆశ్చర్య చకితులైనారు.

**వ. అట్టియెడఁ, దక్షకునపత్యంబై తత్సోదరుం డగు నైరావతుండు పెనిచి యుపలాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుం డగు నాగకుమారుండు, సర్పముఖశరాకారంబుగైకొని తనయొద్ద నుండఁ, దాను బసిండి యొఱం బెట్టి యనుదినంబును గంధపుష్పంబులు నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించువాఁడై యున్న, యట్టి యమ్మహనీయాస్త్రంబు రోషావేశ వివశుం డగుచుఁ బుచ్చికొని, తల దెగవ్రేయుటకై యక్కర్ణుండు సముదీర్ణ జ్వాలాజాలంబు లంబరంబునం బర్వఁ జూపఱులు హాహాకారంబులు సేయం గార్ముకగుణంబున సంధించి తెగవాపినం గని, యారథికుచూపు కంఠంబు దక్కటికిం గాక తప్పి యపాంగ ప్రదేశంబు కొలంది యగుటంజేసి, యది నెపంబుగా శల్యుం డతనికిఁ జిత్తవైకల్యం బాపాదింపం దలంచి 'యీ సంధానంబు మెడ దునుముట కనుగుణంబు గాదు! నిపుణంబుగా నిరూపించి యొండుభంగి సంధింపు' మనినఁ గర్ణుండు గనలునఁ గనుఁగవఁ గెంపు గడలుకొన, నమ్మద్రపతిం జుఱచుఱం జూచి.** **316**

**ప్రతిపదార్థం:** అట్టియెడన్= ఆ సమయంలో; తక్షకు అపత్యంబై= తక్షకుడి సంతానమై; తద్= ఆ తక్షకుడి; సోదరుండు+అగు= తోబుట్టువగు; ఐరావతుండు; పెనిచి= పెంచి; ఉపలాలింపన్= బుజ్జగించగా; ఉల్లసిల్లిన= వికాసంపొందిన; అశ్వసేన, అభిధానుండు+అగు= అశ్వసేనుడనే పేరు కలవాడగు; నాగకుమారుండు; సర్పముఖ= పాముపడగవంటి; శరాకారంబు= బాణరూపాన్ని; కైకొని= తాల్చి; తనయొద్దన్= తనదగ్గర; ఉండన్= ఉండగా; తాను; (దానిని) పసిండి ఒఱన్= బంగారు ఒరలో; పెట్టి; అనుదినము= ప్రతిదినం; గంధపుష్పంబులన్; అక్షతంబులన్; అర్చించుచున్; ఆ+అర్జునుమీఁదన్; ప్రయోగించువాఁడై= ఉపయోగించాలనే సంకల్పం కలవాడై; ఉన్నన్= ఉండగా; అట్టి= అటువంటి; మహనీయ అస్త్రంబు= గొప్ప మంత్రచోదిత బాణం; రోష ఆవేశ= రేగిన కోపపు పొంగువలన; వివశుండు+అగుచున్= తన వశం దప్పిన మనస్సుగల వాడౌతూ; పుచ్చికొని= చేపట్టి; తల తెగ వ్రేయుటకై= (అర్జునుని) తల నరికివేసేందుకు; ఆ+కర్ణుండు; సముదీర్ణ= మిక్కిలి గొప్పదైన; జ్వాలాజాలంబులు= మంటలసమూహం; అంబరమునన్= ఆకాశంలో; పర్వన్= వ్యాపించగా; చూపఱులు= చూచేవారు; హాహాకారంబులు= బొబ్బరింతలు; చేయన్= చేస్తుండగా; కార్ముక గుణంబునన్= వింటి అల్లెత్రాడుతో; సంధించి= కలిపి; తెగవాపినన్= ఎక్కుపెట్టగా; కని= చూచి; ఆ రథికు= ఆ యోధాగ్రేసరుడైన కర్ణుడి; చూపు= దృష్టి; కంఠంబు చక్కటికిన్= గొంతు దగ్గరకు; కాక తప్పి= కాకుండా తొలగిపోయి (లక్ష్యం దాటిపోయి); అపాంగ ప్రదేశంబు= కడగంట చూపు పారే స్థలం; కొలంది అగుటన్+చేసి= వరకు ఉండటం వలన; అది నెపంబుగన్= అది ఒక సాకుగా; శల్యుండు; అతనికిన్; చిత్తవైకల్యంబు= మతిభ్రమ; ఆపాదింపన్+తలంచి= కలిగించుటకు నిర్ణయించుకొని; ఈ సంధానంబు= బాణాన్ని వింటినారిలో అమర్చే పద్ధతి; మెడ దునుముటకున్= గొంతు త్రుంచుటకు; అనుగుణంబుకాదు= అనుకూలం కాదు; నిపుణంబుగాన్= నేర్పరితనంతో; నిరూపించి= ఏర్పరచి; ఒండు భంగిన్= ఇంకొక విధంగా; సంధింపుము= అమ్మును అమర్చుము; అనినన్; కర్ణుండు; కనలునన్= కోపంతో; కనుంగవన్= రెండు కన్నులలో; కెంపు= ఎఱ్ఱదనం; కడలుకొనన్= వ్యాపించగా; ఆ+మద్రపతిన్= మద్రదేశాధీశుడైన శల్యుడిని; చుఱచుఱన్= కరకుగా; చూచి.

**తాత్పర్యం:** అప్పుడు తక్షకుడి కొడుకు - అతడి సోదరుడైన ఐరావతుడు పెంచి ఉపలాలించిన అశ్వసేనుడు అనే పేరుగల నాగకుమారుడు సర్పముఖ బాణాకారంలో తన వద్ద ఉండగా, దానిని బంగారుఒరలో పెట్టి గంధపుష్పాలతో ప్రతిదినం పూజిస్తూ, అర్జునుడి మీద ప్రయోగించాలని దాచి ఉంచిన ఆ మహాస్త్రాన్ని కర్ణుడు రోషావేశంతో చేపట్టి అర్జునుడి తల తెగవేయాలని లక్షించి, మంటలు చెలరేగి ఆకాశాన్ని అంటగా, చూచేవారు హాహాకారాలు చేయగా, వింటికి అల్లెత్రాడు సంధించి ప్రయోగించటానికి సిద్ధం అయ్యాడు. అప్పుడు అతడి గురి కంఠాన్ని తప్పి క్రీగంటి ప్రాంతంలో తగిలేటట్లు ఉండగా గమనించి, దానిని నెపంగా చేసికొని శల్యుడు కర్ణుడికి మనశ్చాంచల్యాన్ని కలిగించటానికి 'ఈ లక్ష్యం మెడ నరకటానికి అనుగుణంగా లేదు. నేర్పరితనంతో నిరూపించి మరొకవిధంగా సంధించుము' అని అనగా కర్ణుడు కోపంతో కన్నుల నిప్పులు రాలగా శల్యుడిని చురచుర చూచి (ఇట్లా అన్నాడు).

**క. 'ననుబోఁటి జోదునుం గా । దని పలుకఁగ నేర్పు నీకు నంత గలదె? య**
**ట్లును గాక వినుము కర్ణుం । డినుమాఱొక శరము దొడుగునే పరులు నగన్?' 317**

**ప్రతిపదార్థం:** ననుబోఁటి= నావంటి; జోదునున్= యుద్ధవీరుడిని; కాదని= త్రోసిపుచ్చి; పలుకఁగ నేర్పు= అనగలిగిన సామర్థ్యం; నీకున్; అంతకలదె?= నీకు అంతగా ఉన్నదా?; అట్లునుగాక= అదీగాక; వినుము; పరులు= ఇతరులు; నగన్= నవ్వేటట్లు; కర్ణుండు; ఇనుమాఱు= రెండుసార్లు; ఒక శరము= ఒకే బాణాన్ని; తొడుగునే?= ధనుస్సుకు సంధిస్తాడా?

**తాత్పర్యం:** నా వంటి యోధుడిని త్రోసిపుచ్చి మాట్లాడే సామర్థ్యం నీకు అంతగా ఉన్నదా? అదీగాక నా సంగతి వినుము. ఇతరులచేత నగుబాట్ల పాలయ్యేటట్లు ఈ కర్ణుడు ఒకమారు గురిపెట్టి సంధించిన బాణాన్ని మళ్ళీ గురి మార్చి సంధిస్తాడా?

**వ. అని పలికి, కలుషం బగుచిత్తంబుతో నెలుంగెత్తి 'ఫల్గున! ఫల్గున! పొలిసి' తంచు నేసిన. 318**

**ప్రతిపదార్థం:** అని పలికి; కలుషంబగు= కలకబారిన; చిత్తంబుతోన్; ఎలుంగెత్తి= బిగ్గరైన కంఠస్వరంతో; ఫల్గున! ఫల్గున!= అర్జునా!; పొలిసితి(వి)= చచ్చిపోయావు; అంచున్= అని కేకలేస్తూ; ఏసినన్= (బాణం) వేయగా.

**తాత్పర్యం:** అని పలికి కోపగించిన మనస్సుతో గొంతెత్తి 'అర్జునా! అర్జునా! ఈ దెబ్బతో చచ్చావు' అంటూ ప్రయోగించగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. పలుదెస మంటలు ప్రబ్బఁగ । నలఘుస్ఫురణమున నిగుడు నయ్యస్త్రంబున్**
**జలజాక్షుఁడు గని పంచాం । గుళ మాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్. 319**

**ప్రతిపదార్థం:** పలుదెస= అన్నిదిక్కులా; మంటలు; ప్రబ్బంగన్= వ్యాపించగా; అలఘు= తక్కువగాని; స్ఫురణమునన్= ప్రకాశంతో; నిగుడు= అలముకొనే; ఆ+అస్త్రంబున్; జలజాక్షుఁడు= కమలాక్షుడు - కృష్ణుడు; కని= చూచి; పంచ అంగుళమాత్రము= సరిగా అంగుళాల పరిమాణముగా; రథము; ధరణిన్= భూమిలో; క్రుంగన్= దిగబడిపోయేటట్లు; అదుముడున్= నొక్కివేయగా. (ఈ అంగుళపు కొలత పేరు తిక్కనకాలం నాటిదే.)

**తాత్పర్యం:** అన్ని దిక్కులా నిప్పులు క్రక్కుతూ అత్యధిక కాంతితో వ్యాపించే ఆ అస్త్రాన్ని కృష్ణుడు కనిపెట్టి, రథ చక్రాలను ఐదు అంగుళాల లోతుకు నేలలో క్రుంగేటట్లు అదిమాడు.

**క. సుర గరుడ ఖచర విద్యా । ధర ఖేచరు లంబరం బుదాత్తధ్వనిసం**
**భరితముగఁ బొగడి రమ్మర । హరు దివ్య ప్రసవ విరచితార్చనతోడన్. 320**

**ప్రతిపదార్థం:** సుర; గరుడ; ఖచర= ఆకాశంలో సంచరించేవారు; విద్యాధర; ఖేచరులు= దేవతలు మొదలైన దివ్యులు; అంబరంబు= ఆకాశము; ఉదాత్త= ఘనమైన; ధ్వని= ధ్వనితో; సంభరితముగన్= నిండిపోయేటట్లు; ఆ+మురహరున్= ఆ మురసంహారుడైన కృష్ణుడిని; దివ్యప్రసవ= స్వర్గ పుష్పాలచేత; విరచిత= కావించబడిన; అర్చనతోడన్= పూజావిధానంతో; పొగడిరి= స్తోత్రం చేశారు.

**తాత్పర్యం:** స్వర్గ, ఆకాశ చరులైన వివిధ దేవతాగణాలవారు, శ్రీకృష్ణుడిని స్వర్గ తరు పుష్పాలతో పూజించి, స్తోత్ర ధ్వని గగనతలం నిండేటట్లు ప్రశంసించారు.

సర్పముఖ శరంబున నర్జునకిరీటంబు భూమిపైఁ బడుట (సం. 8-66-11)

**మ. కురువంశోత్తమ! వారిదిక్కు ప్రజ సంక్షోభింప నప్పాఁప తూ**
**పు రయం బుగ్రము గాఁగ బి ట్టడరి, దంభోళిప్రభగ్న క్షమా**
**ధర శృంగాకృతిగా హరించె బహురత్నస్ఫీత రశ్మిచ్ఛటా**
**స్ఫురితం బైన కిరీటమున్ విజయునొప్పుం దేజముం గుందఁగన్. 321**

**ప్రతిపదార్థం:** కురువంశోత్తమ!= కురువంశశ్రేష్ఠా! వారి దిక్కుప్రజ= పాండవపక్షమందున్న జనం; సంక్షోభింపన్= తల్లడిల్లగా; ఆ+పాఁపతూపు= ఆ నాగాస్త్రం; రయంబు= వేగం; ఉగ్రము కాఁగన్= తీక్ష్ణముకాగా; బిట్టు= అధికంగా; అడరి= వ్యాపించి; దంభోళి= వజ్రాయుధంచేత; ప్రభగ్న= ఎక్కువగా ఖండించబడిన; క్షమాధర= పర్వత; శృంగాకృతిగాన్= శిఖరరూపంతో ఉన్న; విజయు= అర్జునుడి; ఒప్పున్= అందమైన తీరు; తేజమున్= కాంతి; కుందఁగన్= క్షీణించిపోయేటట్లు; బహురత్న= నానావిధ రత్నాలచేతను; స్ఫీత= అధికమైన; రశ్మి= కాంతి; ఛటా= పుంజముచేత; స్ఫురితంబు+ఐన= దీపించే; కిరీటమున్; హరించెన్= తొలగించింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! కర్ణుడు ప్రయోగించిన ఆ నాగాస్త్రం పాండవపక్షంవారిని తల్లడిల్లచేసి, పుంజుకొన్న వేగం భయంకరంకాగా, బహువిధరత్నాల బహుళ కాంతులతో ప్రకాశించే పార్థుని కిరీటాన్ని - అతని అందమైన తీరు, తేజస్సు క్రుంగేటట్లుగ, వజ్రాయుధం పర్వతశిఖరాన్ని పడగొట్టినట్లు పడగొట్టింది.

**విశేషం:** ఉపమానంయొక్క సొంపు, పదబంధ గాంభీర్యం, ప్రాణప్రదమైన దృశ్యవర్ణన ఈ పద్యానికి మెరుగులు. తిక్కన కవితాశిల్ప భూరిమందిరంలో ఇట్టి పద్యాలు రత్నఖచిత కీర్తిస్తంభాలు. అలంకారం: ఉపమ.

**తే. జనులు విహ్వలు లగునట్టి ఘనరవంబు । దిశలయందు నాకసమున దీటుకొనఁగఁ**
**గర్ణుఁ డట్లు భేదించె దిక్పతులచేత । నైనఁ జెడని కిరీట మయ్యహిశరమున. 322**

**ప్రతిపదార్థం:** జనులు; విహ్వలులు అగునట్టి= భయంచేత మనస్సులు చలించినవారు అగునట్లు చేసిన; ఘనరవంబు= మేఘఘర్జనతో సమానమైన ఆ శబ్దం; దిశలందున్= ఎనిమిది దిక్కులందు; ఆకసమునన్= ఆకాశంలో; దీటుకొనఁగన్= అలముకొనగా; దిక్పతులచేతనైన= దిక్పాలకులచేతకూడా; చెడని= చెడగొట్టబడరాని; కిరీటము; ఆ+అహిశరంబునన్= ఆ నాగాస్త్రంచేత; కర్ణుండు; అట్లు= పై విధంగా; భేదించెన్= పడగొట్టాడు.

**తాత్పర్యం:** ఆ నాగాస్త్రం పుట్టించిన బెట్టిదమైన మేఘగర్జనవంటి ఆ శబ్దం ప్రజలను భయభ్రాంతులను చేసి భూనభోంతరాళాల్లో నిండింది. దిక్పాలకులకు కూడా చెరుప సాధ్యపడని ఆ కిరీటాన్ని నాగాస్త్రంతో కర్ణుడు సులభంగా పడగొట్టాడు.

**క. సురపతి తపంబు సేసినఁ । బరమేష్ఠి ప్రియంబుఁ బొంది, బహుమానపుర**
**స్సరముగ నిచ్చినయది య । క్కిరీట మరిభీషణత్వ కీర్తిదము నృపా! 323**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; సురపతి= దేవేంద్రుడు; తపంబు= తపస్సు; చేసినన్= చేయగా; పరమేష్ఠి= బ్రహ్మ; ప్రియంబునొంది= ప్రీతుడై; బహుమాన పురస్సరముగన్= ఆదరించి సగౌరవంగా ఇచ్చే పారితోషికంగా; ఇచ్చినది; ఆ+కిరీటము; (అది) అరిభీషణత్వ= శత్రువులకు భయాన్ని కలిగిస్తూ; కీర్తిదము= కీర్తిని ఇచ్చేది.

**తాత్పర్యం:** ప్రభూ! దేవేంద్రుడు చేసిన తపస్సుకు బ్రహ్మ మెచ్చి గౌరవపురస్కారంగా, బహూకరించింది ఆ కిరీటం. అది కీర్తిని చేకూర్చేదే కాక శత్రువులను భయపెట్టి తరుమగొట్టేది.

**ఆ. వనధివాసులగు నివాత కవచులను । దనుజు లాపురందరున కజయ్యు**
**లైన, నతఁడు వనుప నర్జునుఁ డోర్చిన । మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప! 324**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; వనధి= సముద్రమున; వాసులు+అగు= నివసించే; నివాతకవచులు; అను; దనుజులు= రాక్షసులు; ఆ పురందరునకున్= ఆ ఇంద్రుడికి; అజయ్యులు= జయింప సాధ్యంగానివారు; ఐనన్= కాగా; అతఁడు= ఇంద్రుడు; పనుపన్= పంపగా; (పనిపెట్టగా); అర్జునుఁడు; ఓర్చినన్= ఆ రాక్షసులను ఓడించగా; మెచ్చి= ఆమోదంతో పొగడి; ఆ కిరీటము+ఇచ్చెన్= అర్జునుడికి ఆ కిరీటం ఇచ్చాడు. (ఇట్టి చరిత్రగల కిరీటాన్ని ధరించినవాడగుటచే ఆ పార్థుడు 'కిరీటి' పేర ప్రఖ్యాతుడయ్యాడు.)

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! సముద్రంలో నివసించే నివాతకవచులనే రాక్షసులు ఇంద్రుడికి అణచటానికి సాధ్యం కాని వారు కాగా, ఇంద్రుడు పంపగా వెళ్ళి అర్జునుడు వారిని అణిచివేశాడు. అందుకు మెచ్చి ఇంద్రుడు ఆ కిరీటాన్ని అర్జునుడి కిచ్చాడు.

**చ. వినుము నరేంద్ర! చూడ విన విస్మయ మిట్టిది పాఁపరమ్ము వా**
**త నెగయు ఘోర రూప భయద ప్రథమాన విషాగ్ని జిహ్వకల్**
**దనికినఁ బెల్చ మండుచు నిలాస్థలి డొల్లె నినుండు పశ్చిమాం**
**బునిధి నితాంతదృశ్యరుచి పొల్పెసఁగం బడుభంగి దోఁపఁగన్. 325**

**ప్రతిపదార్థం:** వినుము; నరేంద్ర!= ఓ రాజా!; ఇట్టిది= ఈ విధమైనది; చూడన్ వినన్= చూచుటకు, వినుటకు; విస్మయము= ఆశ్చర్యం; ఇనుండు= సూర్యుడు; పశ్చిమ+అంబునిధిన్= పడమటి సముద్రంలో; నితాంత= ఎడతెగని; దృశ్యరుచి= దర్శనకాంతి; పొల్పు+ఎసఁగన్= అందం అతిశయించేటట్లుగా; పడుభంగిన్= క్రుంకేవిధాన్ని; తోఁపఁగన్= జ్ఞప్తికి తెస్తుండగా; పాఁపరమ్ము= కర్ణుడు ప్రయోగించిన ఆ నాగాస్త్రం; వాత= నోటినుండి వెడలెడు; ఘోరరూప= భయంకరాకృతితో; ప్రథమాన= పెరిగిపోతున్న; విష+అగ్ని= విషమనే అగ్నితో కూడుకొన్న; జిహ్వకల్= నాలుకలు; తనికినన్= మండి మెరయుటను; పెల్చన్= అధికంగా; మండుచున్= ప్రజ్వలిస్తూ; ఇలాస్థలిన్= భూభాగంపై; డొల్లెన్= పడి దొర్లింది.

**తాత్పర్యం:** సూర్యుడు నిరంతరాయమైన తన దర్శనకాంతి అతిశయించి అందగించే విధంగా పడమటి సముద్రంలో క్రుంకేరీతిని మనస్సుకు తెస్తూ ఆ నాగాస్త్రం, నోటినుండి వెలువడుతున్న విషపూర్ణమైన నిప్పు నాలుకలు అనుక్షణం వృద్ధిపొందుతూ అంటుకొన్నందున పెల్లెగసి మంటలు క్రక్కుతూ నేలపై పడింది.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**వ. అప్పుడు.** **326**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. శృంగములేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁ డ**
**య్యుం గనుపట్టె వెల్లతల యొల్లియ మౌళి దృఢంబుగా నమ**
**ర్చెం గురునాథ! పూర్ణశశి చెన్నునఁ బూర్వమహీధరంబు కాం**
**తిం గడచన్నయందము ప్రతీతము గాఁగ నటించు చాడ్పునన్.** **327**

**ప్రతిపదార్థం:** కురునాథ= ధృతరాష్ట్రా!; క్రీడి= అర్జునుడు; కిరీటహీనుఁడు+అయ్యున్= కిరీటంలేనివాడై కూడా; శృంగము లేని= శిఖరంలేని; నీలగిరి= నల్లకొండ; చెల్వునన్= అందంతో; కనుపట్టెన్= కనుపడినాడు; (ఈ దృశ్యాన్ని మంచి ఉపమానంతో ప్రాణంపోసి, కవి మన కనుల ఎదుట నిలబెట్టుతున్నాడు); పూర్ణశశి= నిండుచంద్రునియొక్క; చెన్నునన్= అందంతో; పూర్వమహీధరంబు= తూర్పుకొండ; కాంతిన్= ప్రకాశంతో; కడచన్న అందము= అతిశయించిన అందము; ప్రతీతము కాఁగన్= ప్రసిద్ధికెక్కేటట్లుగ; నటించు= అనుకరించే; చాడ్పునన్= విధంగా; వెల్లతల ఒల్లియ= తెల్లని తలపాగాను; మౌళిన్= శిరస్సుపై; దృఢంబుగాన్= గట్టిగా; అమర్చెన్= సమకూర్చాడు.

**తాత్పర్యం:** ఇట్లు కిరీటి, కిరీటం లేనివాడైనా శిఖరంలేని నల్లకొండవలె శోభిల్లాడు. పూర్ణచంద్రబింబకాంతితో పూర్వాద్రికాంతి అతిశయిల్లే అందంతో ప్రసిద్ధం కావటాన్ని అనుకరిస్తున్న విధంగా, తెల్లని తలపాగాను తలకు గట్టిగా చుట్టుకొన్నాడు.

**వ. అట్లు రాధేయకర ప్రముక్తంబై కిరీటంబు నిర్దహించి నేలం గలసిన యమ్మహోరగంబు గ్రమ్మఱం గవిసినం గని, కమలనాభుండు గవ్వడితో 'మనమీఁద మగుడ నిమ్మహాసర్పంబు సనుదెంచు చున్నయది' యనిన నతం 'డిది యెక్కడి పా? మిట్లు వచ్చుటకుఁ గతం బేమి?' యని యడిగిన 'దీని నెఱుంగవే? ఖాండవం బేర్చునప్పుడు దనతల్లిని రక్షించుకొని యనలంబునకుఁ దప్పిపోవం, బోవ నీక, నీ వేసిన నన్నాగాంగన మృతిం బొందె; నప్పగ వాటించికొని కర్ణుకడ నమ్మెయి నున్న యశ్వసేనాభిధాన భుజంగంబు.'** **328**

**ప్రతిపదార్థం:** అట్లు; రాధేయ; కరప్రముక్తంబు+ఐ= చేతినుండి వదలబడినదై; కిరీటంబున్= ఆ కిరీటాన్ని; నిర్దహించి= బాగా కాల్చివేసి; నేలన్+కలిసిన= భూమిపాలైన; ఆ+మహా+ఉరగంబు= ఆ గొప్పపాము; క్రమ్మఱన్= వెనుదిరిగి మరల; కవిసినన్= పైబడగా; చూచి; కమలనాభుండు; కవ్వడితో; మనమీఁదన్; మగుడన్= మరల; ఈ+మహాసర్పంబు= ఈ పెద్దపాము; చనుదెంచుచున్న+అది; అనినన్; అతండు= అర్జునుడు; ఇది ఎక్కడి పాము?; ఇట్లు వచ్చుటకు; కతంబు+ఏమి?= కారణమేమి?; అని అడిగినన్; దీనిన్ ఎఱుంగవే?; ఖాండవంబు= ఖాండవవనాన్ని; ఏర్చునపుడు= కాల్చేటపుడు; తన తల్లిని రక్షించుకొని;

అనలంబునకున్= నిప్పునుండి; తప్పిపోవన్= తప్పించుకొని పోబోతుండగా; పోవనీక; నీవు ఏసినన్= నీవు ప్రయోగించగా; ఆ నాగాంగన= ఆ ఆడపాము; మృతిబొందెన్; ఆ+పగ= ఆ ద్వేషాన్ని (కసిని); పాటించికొని= పాటించుకొని; కర్ణుకడన్; ఆ+మెయిన్= ఆ ప్రకారంగా; ఉన్న= చేరి ఉన్నటువంటి; అశ్వసేన; అభిధాన= అనుపేరుగల; భుజంగంబు= పాము (అది).

**తాత్పర్యం:** అట్లా రాధేయుడు ప్రయోగించిన నాగాస్త్రం అర్జునుడి కిరీటాన్ని దహించి నేల కలిసి తిరిగి రాగా, చూచి, కృష్ణుడు అర్జునుడితో 'మనమీద మరల ఈ మహాస్త్రం వస్తున్నది' అనగా, అతడు 'ఇది ఎక్కడిపాము? ఇట్లా రావటానికి కారణం ఏమిటి?' అని అడిగాడు. 'ఇది నీకు తెలియదా? ఖాండవవనం దహించేటప్పుడు తన తల్లిని రక్షించుకొని అగ్నినుండి తప్పుకొనిపోతుండగా నీవు ఆ నాగాంగనను పోనీయక బాణంతో కొట్టగా ఆమె చనిపోయింది. అప్పటినుండి నీ మీద పగపట్టి' నాగాస్త్రంగా కర్ణుడివద్ద ఈ విధంగా ఉన్న అశ్వసేనుడనే పాము ఇది.

**తే.** **'ఆతఁ డేయఁ గిరీటంబు నపహరించి । దానఁ గోపంబు వోవక తాన కడఁగి**
**నిన్నుఁ బరిమార్పఁ గడఁగెడు' నన్న నెఱిఁగి । యాఱు పటుభల్లములఁ దునుమాడె నతఁడు.** **329**

**ప్రతిపదార్థం:** ఆతఁడు= కర్ణుడు; ఏయన్= ప్రయోగించగా; కిరీటంబున్; అపహరించి= దొంగిలించి; దానన్= దానితో; కోపంబు పోవక= కసి తీరక; తాన= స్వయంగా తానే; కడఁగి= ప్రయత్నించి; నిన్నున్; పరిమార్పన్= చంపుటకు; కడఁగెడున్= సాహసిస్తున్నది; అన్నన్= అనగా; ఎఱిఁగి= తెలిసికొని; ఆరు; పటుభల్లములతోన్= గట్టి బాణాలతోన్; అతఁడు= అర్జునుడు; తునుమాడెన్= (దానిని) ముక్కలుచేశాడు.

**తాత్పర్యం:** ఆ నాగాస్త్రం అర్జునుడి కిరీటాన్ని పడగొట్టి, ఆక్రోశం తీరక, స్వయంగా తానే అర్జునుడిని చంపటానికి ఉద్యుక్తమయిందని విని, కిరీటి ఆరు పటుబాణాలు ప్రయోగించి ముక్కలు చేశాడు.

**వ.** **అత్తెఱంగున.** **330**

**తాత్పర్యం:** ఆ ప్రకారంగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**సీ.** **ఉరగంబుఁ దునిమి, వే మరలి కర్ణునిమీఁదఁ । బదియుఁ బండ్రెండును బటుశరములు**
**నిగిడించి యుజ్జ్వలంబగు దొడ్డనారసం । బేసిన, నది రుధిరాసవంబు**
**పానంబు సేయుచు మే నుచ్చి చనిన, దం । డాహతం బైన మహాహివోలె**
**నా సూతనందనుఁ డత్యుదగ్రుం డయ్యు । నంతకుమును పాఁపరమ్ము చేత**

**తే.** **నర్జునుఁడు సావమికి వెఱఁగంది యాతఁ । డటులు గెరలి పండ్రెండువాలమ్ము లేసి**
**పద్మనాభుని నొప్పించి, పార్థు నొకటి । కొఱఁతగా నూరు శరముల నుఱక నొంచె.** **331**

**ప్రతిపదార్థం:** ఉరగంబున్= పామును; తునిమి= ముక్కలు చేసి; వే= వెంటనే; మరలి= కర్ణుడివైపు తిరిగి; కర్ణుడిమీఁదన్; పదియు పండ్రెండును; పటుశరంబులు= పటిష్ఠమైన తూపులు; నిగిడించి= ప్రయోగించి; ఉజ్జ్వలంబు+అగు= ప్రకాశించే; దొడ్డ నారసంబు= పెద్ద బాణం; ఏసినన్; అది; రుధిర ఆసవంబు= నెత్తుటి తేనెను; పానంబు చేయుచున్= త్రాగుతూ; మేనున్= కర్ణుడి శరీరమును; ఉచ్చి చనినన్= చీల్చుకొని బయటపడగా; దండాహతంబు+ఐన= కర్రచేత దెబ్బతిన్న; మహా అహివోలెన్= పెద్దపామువలె; ఆ సూతనందనుండు; అతి ఉదగ్రుండు+ఐ= మిక్కిలి భయోత్పాది అగుచు; అంతకుమును= అంతకుముందు; అర్జునుఁడు; పాఁపరమ్ముచేతన్= నాగబాణంచేత; చావమికిన్= చచ్చిపోనందుకు; వెఱఁగంది= ఆశ్చర్యపడినవాడై; అతఁడు=

కర్ణుడు; అటులు= ఆ విధంగా; కెరలి= చెలరేగి; పండ్రెండు; వాలమ్ములు= వాడి పొడవైన బాణాలు; ఏసి= ప్రయోగించి; పద్మనాభునిన్; నొప్పించెన్= బాధించాడు; పార్థున్= అర్జునుడిని; ఒకటి కొఱఁతగాన్= ఒకటి తక్కువగా; నూఱుశరములన్= నూరుబాణాలతో; ఉఱక= అవలీలగా; నొంచెన్= బాధించాడు.

**తాత్పర్యం:** కర్ణుడు విసరిన నాగాస్త్రాన్ని పార్థుడు ముక్కలు చేసి, కర్ణుడివైపు తిరిగి ఆయన ఒంటినిండా పది పన్నెండు గట్టి బాణాలు విసిరాడు. వెంటనే కాంతులు చిమ్మే ఒక పెద్ద బాణం వేశాడు. ఆ దారుణశస్త్రం కర్ణుడి నెత్తురును తేనెవలె త్రాగి, శరీరంగుండా దూసుకొనిపోయింది. దీనితో కర్ణుడు కర్రదెబ్బ తిని బుసపెడుతూ రేగిన పెద్దపాము మాదిరి కోపోద్దీపితుడయ్యాడు. తన నాగాస్త్రంవలన అర్జునుడు చావలేదని తెలిసికొని ఆశ్చర్యపడి, పొడవు వాడిగల పన్నెండు బాణాలతో ఆ పద్మనాభుడిని నొప్పించాడు. ఒకటి తక్కువ నూరమ్ములతో పార్థుడిని బాధించాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. వెండియు బలువిడి నయ్యా । ఖండలసుతు నురము గ్రూరకాండంబుల నొం
డొండ కడు నొవ్వనేసి, య । తం డుబ్బున నార్చె గగనతల మద్రువంగన్. 332**

**ప్రతిపదార్థం:** వెండియున్= మరల; బలువిడిన్= పరాక్రమంతో; ఆఖండలసుతు= పర్వతాలను భేదించిన ఇంద్రుడి కుమారుడైన అర్జునుడియొక్క; ఉరము= రొమ్ము; క్రూరకాండములన్= భయంకరాలైన బాణాలచేత; ఒండొండ= క్రమంగా; కడు నొవ్వన్+ ఏసి= మిక్కిలి బాధించి; అతండు= కర్ణుడు; గగనతలము= ఆకాశప్రదేశం; అద్రువంగన్= కంపించేటట్లు; ఉబ్బునన్= సంతోషంతో; ఆర్చెన్= కేకలు వేశాడు.

**తాత్పర్యం:** సత్తువ చేకూర్చుకొని, అర్జునుడి ఎదను భీకర నారాచాలతో బాధపెట్టి, ఆకాశమంతా అదిరిపోయేటట్లు సంతోషాతిశయంతో కర్ణుడు కేకలు వేశాడు.

**తే. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన । నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు పాలు పఱ నఱకి, యు । ల్లసిత మకుటకుండలములు డులిచె. 333**

**ప్రతిపదార్థం:** ఆర్చి= ఇట్లు పెద్దగా అరిచి; పెలుచన్= గట్టిగా; అట్టహాసంబు= పెద్దనవ్వు; చేసినన్; అలిగి= కోపగించుకొని; అతఁడు= అర్జునుడు; భల్లములన్= బాణాలతో; తదీయ= కర్ణుడికి చెందిన; భూరికంకటంబు= పెద్ద కవచాన్ని; పొలుపు అఱన్= అతిశయం పోకారేటట్లు; నఱకి; ఉల్లసిత= ప్రకాశమానమైన; మకుట, కుండలంబులు= కిరీటాన్ని, చెవిపోగులను; డులిచెన్= ఊడిపడేటట్లు కొట్టాడు.

**తాత్పర్యం:** ఇట్లా కర్ణుడు వీరవిహారంగా, అట్టహాసం చేయగా, కిరీటి కుపితుడై, అతడి కవచాన్ని రూపులేకుండా ఖండించి, ప్రకాశించే అతడి కిరీటాన్ని, చెవిపోగులను (అంటుజోడును) నేలరాల్చాడు.

**విశేషం:** సహజకవచము, కర్ణ కుండలాలతో పుట్టినందువల్లనే కర్ణుడనే నామం వచ్చిందని ప్రతీతి. ఈ వంటబుట్టిన వాటిని ఇంతకుముందే కోసి దానం చేసి ప్రాణాపాయం నెత్తికి తెచ్చుకొన్నాడని పెద్దల వచనం. భారతం కూడా ఇట్లే నుడువుతున్నది. ఇవి పెట్టుకొన్న కవచకుండలాలు.

**వ. డులిచిన నబ్బలుమగండు. 334**

**తాత్పర్యం:** అట్లా నేలపై రాల్చగా ఆ వీరుడైన కర్ణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. శిరమునఁ గర్ణంబుల నె । త్తు రొలుక బరిమేనితోడఁ దూలక బాహు**
**స్ఫురణంబు మెఱయ సాయక । పరంపరలు నరునిమీఁదఁ బఱపెం బెలుచన్. 335**

**ప్రతిపదార్థం:** శిరమునన్= తలమీద; కర్ణంబులన్= చెవులలో; నెత్తురు ఒలుకన్= నెత్తురు కారుతుండగా; బరిమేనుతోడన్= కవచము కిరీట కుండలాలులేని శరీరంతో; తూలక= తూలిపడిపోకుండా; బాహు స్ఫురణంబు= బలప్రకాశనం; మెఱయన్= తళతళలాడగా; నరునిమీఁదన్; సాయక పరంపరను= బాణాల వరుసను; పెలుచన్= తీవ్రంగా; పఱపెన్= నింపాడు.

**తాత్పర్యం:** అర్జునుడి దెబ్బలకు కర్ణుడు తల, చెవులనుండి నెత్తురు కారుతుండగా తొనకక, కవచము, కిరీట కుండలాలు లేని శరీరంతో తూలి పడిపోకుండా తన బాహు పరాక్రమ దీప్తిని వ్యాపింపజేస్తూ, అమ్ములను వరుసలు వరుసలుగా అర్జునుడి మీద ప్రయోగించాడు.

**తే. వానిఁ దునుమాడి యాపాండుసూనుఁ డలఘు । శరచతుశ్శతిఁ బొదివి నెత్తురులు మేనఁ**
**బఱప గైరిక నిర్ఝరప్రకర శోభి । తాచలము వోలి పొలిచె నయ్యంగరాజు. 336**

**ప్రతిపదార్థం:** ఆ+పాండుసూనుఁడు= ఆ పాండురాజు కొడుకు - అర్జునుడు; వానిన్= వాటిని; తునుమాడి= విరుగగొట్టి; అలఘు= గట్టి; శరచతుశ్శతిన్= నాలుగువందల బాణాలతో; పొదివి= (ఆయనను) కప్పి; నెత్తురులు; మేనన్= ఒంటిమీద; పఱపన్= వ్యాపింపజేయగా; ఆ+అంగరాజు= ఆ అంగదేశాధీశుడైన కర్ణుడు; గైరిక= గిరికొండ చాలుకు సంబంధించిన (కొండరాళ్ళ వన్నెలతో కనబడే); నిర్ఝర ప్రకర= సెలయేళ్ళ సమూహంచేత; శోభిత= ఒప్పారే; అచలము పోలి= కొండవలె; పొలిచెన్= చెలువొందాడు.

**తాత్పర్యం:** కర్ణుడేసిన బాణాలను అర్జునుడు విరుగగొట్టి, గట్టి నన్నూరు బాణాలను విసరి, ఆ కర్ణుడి శరీరమంతా రక్తం పారేటట్లు చేశాడు. అప్పుడు రక్తసిక్త దేహుడైన ఆ వీరుడు, ఎర్రని పర్వత ధాతువులవర్ణంతో సొంపుమీరే కొండవాగులతో శోభిల్లే చలించని పర్వతంవలె అందగించాడు.

**విశేషం:** అలం: ఉపమ.

**ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు నర్జునుఁ డుజ్జ్వలవత్సదంతకాం**
**డమ్ములు పెక్కు సత్వర దృఢస్ఫురణం బలరంగ నేసి, ర**
**థ్యమ్ముల సూతుఁ గేతనము నాతనితేరును గూడఁ గప్పె, మే**
**ఘమ్ముల గ్రమ్మి భూధరము గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్. 337**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; అర్జునుఁడు; ఆ+మెయిన్= ఆ విధంగా; ఉగ్రుఁడై= భయం కొల్పువాడై; పట్టుగన్= పట్టుదలతో; ఉజ్జ్వలవత్= జ్వలిస్తున్న; సదంతకాండంబు= ఆవు దూడ దంతంవలె కూచి అయిన బాణాలను; పెక్కు= పెక్కింటిని; సత్వర= వేగవంతమైన; దృఢస్ఫురణంబు= బలమైన పూనిక; అలరంగన్= ఒప్పగా; ఏసి= ప్రయోగించి; రథ్యంబులన్=

గుఱ్ఱాలను; సూతున్= సారథిని; కేతనమున్= పతాకాన్ని; ఆతని; తేరును గూడన్= రథాన్ని కూడా; మేఘంబులు= మబ్బులు; క్రమ్మి= చుట్టుకుని; భూధరమున్= పర్వతాన్ని; కప్పిన భంగిన్= మూసిపెట్టినవిధాన్ని; తలంపన్= మనసుకు వచ్చేటట్లు, కప్పెన్= కప్పాడు.

**తాత్పర్యం:** ఇంకా అర్జునుడు ఆ విధంగా కోపోద్దీపితుడై, తళతళలాడే ఆవుదూడ దంతాలవలె ఉండే చాలా బాణాలను వేగం, బిగువు చూపుతూ పట్టుదలతో విసరాడు. వీటితో కర్ణుడి గుఱ్ఱాలను, సారథిని, ధ్వజాన్ని, రథాన్ని కూడ మబ్బులు క్రమ్మి కొండ శిఖరాన్ని కప్పివేసిన విధం మనస్సులో తోచేటట్లు కప్పివేశాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**వ. ఇ వ్విధంబున విక్రమ కుతూహలియై విజృంభించె నప్పుడు. 338**

**ప్రతిపదార్థం:** ఇవ్విధంబునన్= ఈ రీతిగా; విక్రమకుతూహలి+ఐ= తన ప్రతాపాన్ని ప్రదర్శించాలన్న గట్టి అపేక్షకలవాడై; విజృంభించెన్; అప్పుడు= ఆ సమయంలో.

**తాత్పర్యం:** ఈ రీతిగా పరాక్రమ ప్రదర్శనంలో ఆసక్తి కలవాడై విజృంభించాడు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార, బాణసం**
**పత్తి యుదగ్రతన్ మెఱయ, భాస్వరుఁడై యరదంబుమీఁద భూ**
**పోత్తమ! కర్ణుఁ డొప్పె నరుణోజ్జ్వలమండల కాంతిపూరము**
**న్మొత్తపు దీప్తులుం దగ నినుం డపరాద్రి వెలుంగుచాడ్పునన్. 339**

**ప్రతిపదార్థం:** భూప+ఉత్తమా!= రాజశ్రేష్ఠా! (ధృతరాష్ట్ర మహారాజా!); నెత్తుటన్= నెత్తుటితో; తోఁగి= తడిసి; మేను= శరీరం; కమనీయ= మనోహరమైన; రుచిన్= కాంతితో; కొమరార= అందంగా అగుపించగా; బాణ= బాణాలయొక్క; సంపత్తి= సంపద; ఉదగ్రతన్= భీకరత్వంతో; మెఱయ= ప్రకాశించగా; అరుణ+ఉత్+జ్వల= ఎరుపురంగుచేత మిక్కిలి కాంతిమంతమైన; మండల= ప్రదేశమునందలి; కాంతి పూరమున్= కాంతి ప్రవాహము; మొత్తపు, దీప్తులున్= అన్ని కాంతులు; తగన్= ఒప్పగా; ఇనుండు= సూర్యుడు; అపర+అద్రి= (తాను) అస్తమించే కొండమీద; వెలుంగు, చాడ్పునన్= వెలిగే విధంగా; కర్ణుడు; భాస్వరుడు+ఐ= వెలుగుతూ ఉన్నవాడై; అరదంబు మీద= రథం మీద; ఒప్పెన్= తగువిధంగా ఉన్నాడు.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! నెత్తుటితో తడిసిన శరీరం చూడముచ్చటైన కాంతితో శోభిల్లగా, బాణసంపద భయంకరంగా ప్రకాశించగా - ఎఱ్ఱగా మిక్కిలి కాంతిమంతమైన మండలమందలి కాంతిప్రవాహము, అన్ని కాంతులు అలరారగా, అస్తాద్రిమీద వెలిగే సూర్యుడివలె కర్ణుడు వెలుగుతూ తన రథంమీద తగువిధంగా ఉన్నాడు.

**విశేషం:** అలం: ఉపమ. అనతికాలంలో వీరమరణం చెందనున్న కర్ణుడిని అస్తమించే సూర్యుడితో పోల్చటం సముచితం.

**వ. ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ బొలివోనిబంటుతనంబున జంట మెఱుంగులు చదలం బరఁగ శరంబు లడరించుచు, బహుబాణంబులు రేణువులుగాఁ జేయుచుండ సవ్యసాచి దివ్యాస్త్ర విలాసంబు భాసమానం బయ్యె నయ్యవసరంబునఁ గాలుం డదృశ్యాకారంబున. 340**

**ప్రతిపదార్థం:** ఇట్లు= పైన చెప్పిన రీతిగా; సూతనందనుండు= కర్ణుడు; నొచ్చియున్= బాధితుడయ్యు; పొలివోని= తరుగని; బంటుతనంబునన్= శౌర్యంతో; జంటమెఱుంగులు= రెండేసిగా కలసిన కాంతులు; చదలన్= ఆకాశంలో; పరcగన్= వ్యాపించేటట్లు; శరంబులు; అడరించుచున్= ప్రయోగం చేస్తూ; బహుబాణంబులు; రేణువులుగాన్= దుమ్ము దుమ్ముగా; చేయుచుండన్; సవ్యసాచి= రెండు చేతుల బాణప్రయోగం చేసే అర్జునుడి; దివ్యాస్త్ర= దేవదత్తమైన అస్త్రముల; విలాసంబు= సౌందర్యవికాసం; భాసమానము+అయ్యెన్= ప్రకటితమై చెలువొందింది. (అర్జునుడు ఎదురు ప్రయోగం చేస్తున్నాడు); ఆ+ అవసరంబునన్= ఆ సమయంలో; కాలుండు= యముడు; అదృశ్య+ఆకారంబునన్= కంటికి కనపడని రూపంలో.

**తాత్పర్యం:** ఈవిధంగా కర్ణుడు బాధపొంది కూడా మొక్కవోని పరాక్రమంతో జంటమెరుపులు ఆకాశంలో వ్యాపించగా బాణాలు వేస్తూ, అనేకబాణాలను పొడిపొడిగా చేస్తూ ఉండగా, అర్జునుని దివ్యబాణాల విలాసం ప్రకాశించింది. ఆ సమయంలో యముడు అదృశ్యమైన ఆకారంతో. (తరువాతి పద్యంతో అన్వయం).

**బ్రాహ్మణశాపంబునc గర్ణురథచక్రంబు భూమింగ్రుంగుట (సం. 8-66-42)**

**క. 'భూసురశాపంబున నిదె। యీ సూతజు రథము చక్ర మిలc గ్రుంగెడు, వీ**
**తాసుc డగు నీతc' డని సే। నాసముదయ యుగ్మకము వినం బలికె నృపా! 341**

**ప్రతిపదార్థం:** నృపా!= రాజా!; (యముడు) భూసురశాపంబునన్= బ్రాహ్మణునియొక్క శాపంవలన; ఇదె= ఇదే అనతికాలంలోనే; ఈ సూతజు; రథము; చక్రము; ఇలన్= భూమిలో; క్రుంగెడున్= కూరుకొనిపోతుంది; ఈతcడు; వీత= పోయిన; అసుcడు= ప్రాణం కలవాడు; అగున్= అవుతాడు; అని; సేనాసముదయ= సైన్యసమూహముయొక్క; యుగ్మకము= రెండును (ఉభయపక్షాలు); వినన్; పలికెన్.

**తాత్పర్యం:** బ్రాహ్మణుడి శాపంవలన ఈ కర్ణుడి రథచక్రం భూమిలో పాతుకొనిపోతుంది. ఇతడి బ్రతుకు కాలం తీరిపోయింది.' అని కురుపాండవ సేనలు రెండూ వినేటట్లు యముడన్నాడు.

**వ. పరశురామదత్తంబయిన భార్గవాస్త్రంబను పేరిటి మహనీయసాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింప కుండె; దాపటికల్లు గ్రుంగినc దేరు ఘూర్ణిల్లె; నట్లు జామదగ్న్య మహీసురుల శాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం బాపాదించి చిక్కువఱుచుటయును, సర్పముఖశరం బాభంగి నిష్ఫలప్రయత్నం బగుటయును దనమనంబున నొ వ్వడరి యక్కర్ణుండు గరంబులు విదుర్చుచు. 342**

**ప్రతిపదార్థం:** పరశురామదత్తంబు+అయిన= పరశురాముడిచేత ఇవ్వబడిన; భార్గవ+అస్త్రంబు+అను; పేరిటి= పేరు గలిగిన; మహనీయ= మహిమోపేతమైన; సాధనంబు= ఆయుధం; అప్పుడు; రాధేయునకున్; ప్రతిభాసింపక= మనసుకు తోచక; ఉండెన్= ఉన్నది; దాపటి కల్లు= ఎడమచక్రం (దాపటి- వెలపటి అనే పదాలు ఇంకా నెల్లూరు పల్లెలలో వాడుకలో ఉన్నవి. చక్రానికి కల్లుగాలు అనేవి సామాన్య పదాలు); క్రుంగినన్= అణగిపోగా; తేరు; ఘూర్ణిల్లెన్= మోతతో తిరగబడింది; అట్లు; జామదగ్న్య= జమదగ్ని కుమారుడు పరశురాముడి; మహీసురుల= బ్రాహ్మణుల; శాపంబులు; అస్త్రబలంబునకున్= ఆయుధశక్తికి; రథంబునకున్; వైకల్యంబు+ఆపాదించి= చెడగొట్టి; చిక్కు పఱుచుటయును= ఇరుకున పడవేయటంవలనను (అవస్థల పాల్జేయుటవలనను); సర్పముఖశిరము= నాగాస్త్రం; ఆ భంగి= ఆ విధంగా; నిష్ఫల ప్రయత్నంబు+అగుటయున్= వమ్మయి ప్రయోగానికి పనికిరానిదగుటవలనను; తన మనంబునన్; నొవ్వు+అడరి= బాధ అధికమై; ఆ+కర్ణుండు; కరంబులు= చేతులు; విదుర్చుచున్= విదిలించుకొంటూ.

**తాత్పర్యం:** పరశురాముడిచ్చిన భార్గవాస్త్రం కర్ణుడికి అప్పుడు జ్ఞాపకం రాలేదు. రథపు ఎడమచక్రం నేలలో క్రుంగింది. రథం పెళపెళలాడింది. ఆ విధంగా పరశురాముడూ, బ్రాహ్మణుడూ ఇచ్చిన శాపాలవలన అస్త్రబలం, రథబలం వికలమైపోయాయి. చిక్కులో పడవేశాయి. సర్పముఖబాణం ఆ విధంగా నిష్ఫలమైపోవటంచేత మనస్సు బాధపడగా కర్ణుడు చేతులు విదిలించుకొంటూ. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **'ధర్మవాదులు, ధర్మతత్త్వ ప్రధాన । చిత్తులగువారిఁ బూని రక్షించు ధర్మ**
**మందు; రది బొంకు గావించె నతులధర్మ । శీలుఁ డగు నాకు ధర్ము వు సెలవు లేద?'** **343**

**ప్రతిపదార్థం:** ధర్మవాదులు= ధర్మమును గురించి చెప్పేవారు; ధర్మతత్త్వ ప్రధానచిత్తులు అగువారిన్= ధర్మతత్త్వమునే మనసున గట్టిగా నిలుపుకొనినవారిని; పూని= పట్టుదలతో; ధర్మము; రక్షించున్= కాపాడును; అని; అందురు= అంటారు; అది; బొంకు కావించెన్= అబద్ధమని చాటింది; అతులధర్మశీలుఁడు+అగు= అత్యంతం ధర్మమునే పాలించే; నాకు; ధర్మువు= సత్యశీలం; సెలవు లేద?= ఆజ్ఞ - రక్షణ లేదా?

**తాత్పర్యం:** 'ధర్మం పలికేవారిని, ధర్మతత్త్వాన్ని మనసులో ఉంచుకొన్నవారినీ ధర్మం తప్పక రక్షిస్తుందని అంటారు. కాని, అది ఇప్పుడు అబద్ధమయింది. అత్యంత ధర్మాచరణస్వభావం గల నన్ను ధర్మం అనుగ్రహించదా?'

**క.** **అని ధర్మంబును దూఱఁగఁ । దను నర్జును బాణవితతి తద్దయ వడిఁ దాఁ**
**కినఁ గర్ణుండు విషాదం । బున వెండియుఁ బెద్ద దూఱు భూవరముఖ్యా!** **344**

**ప్రతిపదార్థం:** భూవరముఖ్యా!= రాజులలో ప్రధానుడవైన ఓ ధృతరాష్ట్రా!; అని= ఆ విధంగా; ధర్మంబును; దూఱఁగన్= నిందించగా; తనున్= తనను; అర్జును= అర్జునుని యొక్క; బాణవితతి= శరసమూహం; తద్దయున్= ఎక్కువగా; వడిన్= వేగంతో; తాఁకినన్= దెబ్బతీయగా; కర్ణుండు; విషాదంబునన్= దుఃఖాతిరేకంతో; వెండియున్= మరల; పెద్ద దూఱున్= ఎక్కువగా తిట్టసాగాడు.

**తాత్పర్యం:** కర్ణుడు ఈ విధంగా ధర్మాన్ని దూషిస్తుండగా, అర్జునుడి శరసమూహం పెద్దమోపున ఆయనను దెబ్బతీశాయి. దానితో ఆయన వెత ఎక్కువై, పెద్దగా దూషణను మొదలుపెట్టాడు.

**క.** **కన లధికమైన లావె । క్కిన యయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్**
**సునిశిత శరములు మఱియుం । జొనిపెను దనధైర్యమహిమ సురల లగ్గింపన్.** **345**

**ప్రతిపదార్థం:** కనలు= కోపం; అధికమైనన్= ఎక్కువ కాగా; లావు= చేవ(బలం); ఎక్కినన్= పెరగగా; ఆ+అంగపతి= అంగదేశాధీశుడైన కర్ణుడు; కృష్ణార్జునులన్; సునిశిత= ఎక్కువ పదునైన; శరములు= బాణములు; మఱియున్= అధికంగా; తన ధైర్య మహిమను= తన ధీరత్వపు గొప్పదనాన్ని; సురలు= దేవతలు; అగ్గింపన్= కొనియాడగా; చొనిపెన్= వారి దేహాలలో చొప్పించాడు.

**తాత్పర్యం:** ఆగ్రహంతోపాటు కర్ణుడికి దేహబలం కూడా పెరిగింది. చూస్తున్న దేవతలు తన ధైర్యాతిశయాన్ని మెచ్చుకొంటుండగా, వాడీ, వేడీ అయిన బాణాలను కృష్ణార్జునుల దేహాలలో నాటాడు.

**వ. అలిగి, యర్జునుం డాశీవిషంబులుంబోని విశిఖంబు లాఱు కర్ణుమే నుచ్చి చననేసినం గ్రోధభాషితుండై, యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు; నప్పార్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 346**

**ప్రతిపదార్థం:** అలిగి= కోపగించుకొని; అర్జునుండు; ఆశీవిషంబులున్ పోని= విషపాములవంటి; విశిఖంబులు= బాణాలు; ఆఱు; కర్ణుమేను= కర్ణుడిశరీరం; ఉచ్చి చనన్= చీల్చుకొనిపోయేటట్లు; ఏసినన్; అతండు= కర్ణుడు; క్రోధ= పగచేత; భాసితుండై= ప్రకాశించిన; బ్రహ్మాస్త్రంబు; ప్రయోగించుటయున్= ప్రయోగించగా; ఆ+పార్థుండు; ఐంద్రాస్త్రంబు; ప్రయోగించినన్= ప్రయోగించగా.

**తాత్పర్యం:** అర్జునుడు అలిగి, విషసర్పాలవంటి ఆరుబాణాలను కర్ణుడి శరీరంలో గ్రుచ్చుకొనిపోయేటట్లు వేయగా, కర్ణుడు కోపోద్రేకంతో బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించగా, అర్జునుడు ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు.

**క. అమితబలం బగు బ్రహ్మ । స్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగుటయుఁ, జి**
**త్తమున విషాదము దనుకఁగఁ । గమలాక్షుఁడు గారవమున గాండివితోడన్. 347**

**ప్రతిపదార్థం:** అమితబలంబు+అగు= మేరలు లేని శక్తియుతమైన; బ్రహ్మాస్త్రముచేన్; ఆ+అస్త్రము= ఆ ఐంద్రాస్త్రం; అపహృతము= నిర్వీర్యం (దొంగిలింపబడిన శక్తి గలది); అగుటయున్; చిత్తమునన్; విషాదము; తనుకఁగన్= కలుగగా; కమల+అక్షుండు= తామరలవంటి కన్నులు గలవాడు - కృష్ణుడు; గారవమునన్= ఆదరంతో; గాండివితోడన్= అర్జునుడితో (ఇట్లా అన్నాడు).

**తాత్పర్యం:** అఖండశక్తిమంతమైన బ్రహ్మాస్త్రంచేత తాను ప్రయోగించిన ఐంద్రాస్త్రం ఉడిగినందున కిరీటి మనస్సులో బాధపడుతుండగా, కృష్ణుడు గాండీవితో ప్రేమాభిమానపూర్వకంగా అర్జునుడితో (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. 'నీ యస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచే విధ్వస్తం బయ్యె; నిట్లుగా నేల? యనవుడుఁ గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహనీయ సాధనంబు బాధితంబు సేసి రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన, నమ్మేటిమగండు గాండీవంబు మౌర్వికోటిఁ బాసిపో నేసిన, నా సవ్యసాచి మగుడ నమర్చి మార్గణంబులు నిగిడించిన, రయంబున నా సూతపుత్రు చూడ్కి కమ్మౌర్వి యూడుట దోఁపకుండె; నవ్వీరుండు వివ్వచ్చు విశిఖంబులు వారించి యతని తనువు నొంచిన వెండియుఁ బుండరీకాక్షుండు సహస్రాక్షనందను నుద్దేశించి. 348**

**ప్రతిపదార్థం:** నీ అస్త్రంబు; ఇప్పుడు; కర్ణాస్త్రంబుచేన్; విధ్వస్తంబు+అయ్యెన్= పూర్తిగా నాశనమైనది; ఇట్లుకాన్+ఏల?= ఈ విధంగా ఎందుకైంది?; అనవుడున్= అనగా; కవ్వడి= అర్జునుడు; బ్రహ్మాస్త్ర ప్రయోగంబునన్= తానుగూడ బ్రహ్మాస్త్రమును ప్రయోగించి; ఆ+మహనీయ= ఆ గొప్ప; సాధనంబును= ఆయుధమును; బాధితంబుజేసి= దెబ్బతినేటట్లు చేసి; రాధేయాంగంబు= కర్ణుడి శరీరం; బాణజాలంబులన్= బాణసమూహాలచేత; పొదివి= కప్పి; నొప్పించినన్; ఆ+మేటిమగండు= శక్తి సామర్థ్యములో మొనగాడై ఆ కర్ణుడు; మౌర్వి= అల్లెత్రాటి; కోటిన్= చివరిభాగాన్ని; పాసిపోన్+ఏసినన్= వీడిపోయేటట్లు బాణంతో కొట్టగా; ఆ సవ్యసాచి; మగుడన్= మరల; అమర్చి= సరిజేసి; మార్గణంబులు= బాణాలను; నిగిడించినన్= ప్రయోగించగా; రయంబునన్= వేగంతో; ఆ సూతపుత్రు; చూడ్కికిన్= చూపునకు; ఆ మౌర్వి; ఊడుట; తోఁపకుండెన్= కనిపించకుండా పోయింది; ఆ+వీరుండు= ఆ శూరుడు-కర్ణుడు; వివ్వచ్చు= బీభత్సుడి- విజయుడి; విశిఖంబులు= వాడి అమ్ములను; వారించి= అడ్డగించి;

అతని= ఆ అర్జునుడిని; తనువున్= శరీరాన్ని; నొంచినన్= బాధించగా; వెండియున్= మరల; పుండరీకాక్షుండు= తెల్లతామరల వంటి కన్నులు కలిగిన కృష్ణుడు; సహస్రాక్ష= వేయికన్నులు కలిగిన ఇంద్రుడి; నందనున్= కొడుకును; ఉద్దేశించి= చూచి (అన్నాడు).

**తాత్పర్యం:** 'నీ అస్త్రం ఇప్పుడు కర్ణుడు ప్రయోగించిన అస్త్రంచేత ఎందుకు ధ్వంసమైనది?' అని కృష్ణుడు అర్జునుడిని ప్రశ్నించాడు. అప్పుడు అర్జునుడు బ్రహ్మాస్త్రప్రయోగంతో కర్ణుడి అస్త్రాన్ని బాధితం చేశాడు. కర్ణుడి శరీరం నిండా బాణాలు చొప్పించి బాధించాడు. కర్ణుడు అర్జునుడి గాండీవపు కొప్పునుండి అల్లెత్రాడు ఊడేటట్లు బాణంతో కొట్టాడు. అర్జునుడు వెంటనే దానిని సరిచేసికొన్నాడు. ఆ సంగతి కర్ణుడు గ్రహించలేకపోయాడు. కర్ణుడు అర్జునుడి బాణాలను అడ్డగించి అతడి శరీరాన్ని నొప్పించాడు. మరల శ్రీకృష్ణుడు అర్జునుడితో (ఇట్లా అన్నాడు).

**క. 'నిను నొంచువాఁడె కర్ణుం? । డనితర సులభప్రకారమగు భుజవీర్యం**
**బున నసమానోజ్జ్వల ఖే । లనమునఁ దెగటార్చు శరవిలాస నిరూఢా!' 349**

**ప్రతిపదార్థం:** కర్ణుడు; నిను; నొంచువాఁడె?= నొప్పించగలవాడా? (కాదనుట); అనితర= ఇతరులకు సాధ్యంకాని; సులభప్రకారము+అగు= సులభమైన పద్ధతితోకూడిన; భుజవీర్యంబునన్= బాహుబలంతో; అసమాన= సాటిలేని; ఉజ్జ్వల= ప్రకాశవంతమైన; ఖేలనమునన్= యుద్ధక్రీడతో; శరవిలాసనిరూఢా!= బాణప్రయోగకళారహస్యాలు తెలిసినవాడా!; (కర్ణుని); తెగటార్పుము= తుదముట్టించుము.

**తాత్పర్యం:** బాణప్రయోగపాటవముయొక్క కిటుకులు తెలిసిన ఓ కిరీటీ! నిన్ను ఆ కర్ణుడు నొప్పించగలవాడా? ఇతరులకు సాధ్యంకాని సులభమైన పద్ధతితో కూడిన బాహుబలంతో, సాటిలేని ప్రకాశంతో కూడిన యుద్ధక్రీడతో కర్ణుని సంహరించుము.

**వ. అనునప్పుడు, విష విస్ఫుర ద్భుజంగ భంగికం బైన బాణంబు రౌద్రమంత్ర సహితంబు సేసి, కర్ణుండు పార్థుప్రాణంబులు గొన నప్పళించి సంధింప, మున్న కొండొక క్రుంగిన చక్రంబు కుండ మునుంగం దిగఁబడిన, నొడ్డగెడవై యరదం బేటునకు ననువీక తక్కిన, నుక్కఱి యక్కర్ణుం డప్రతీకారంబులగు రోష విషాదంబులఁ గన్నీరొలుక, రథంబు డిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు నిట్లనియె: 350**

**ప్రతిపదార్థం:** అనునప్పుడు= అని అంటూ ఉండగ; విష= విషముచేత; విస్ఫురత్= ప్రకాశించే; భుజంగ= పాముయొక్క; భంగికము+ఐన= విధముగలదైన; బాణంబు; రౌద్రమంత్ర= భయంకరమైన నాశనకారి అయిన రుద్ర సంబంధిత మంత్రంతో; సహితంబుజేసి= కలిపి; కర్ణుండు; పార్థు ప్రాణంబులు= అర్జునుడి ప్రాణాలను; కొనన్= తీసికొనుటకు; అప్పళించి= పూనుకొని; సంధింపన్= ధనుస్సుకు జోడించగా; మున్న= ఇంతకుముందే; కొండొక= కొద్దిగా; క్రుంగిన; చక్రంబు= చక్రముయొక్క; కుండ= చక్రపు ఆకులు బిగించిన గుండ్రటి తుండు (దీనిగుండానే బండి ఇరుసుదూరి త్రిప్పుతుంది); మునుంగన్= బాగా నేలలో కూరుకొనిపోయేటట్లు; దిగఁబడినన్= చొచ్చుకొనిపోగా; అరదంబు; ఒడ్డగెడవై= వాటుపడి - తల క్రిందులై; ఏటునకున్= దెబ్బతీయటానికి; అనువు, ఈక= వీలు కల్పించక; తక్కినన్= తొలగిపోయినందున; ఉక్కఱి= బలం-ధైర్యం పోగొట్టుకొని; ఆ+కర్ణుండు; అప్రతీకారంబులు+అగు= ప్రతీకారము లేని; రోష= కోపంతో; విషాదంబులన్= దుఃఖంతో; కన్నీరు; ఒలుకన్= కారుతుండగా; రథంబు; డిగ్గి= దిగి; కవ్వడి దెసన్= అర్జునుడి వైపు; కనుంగొనుచున్= చూస్తూ; ఇట్లు+అనియెన్.

**తాత్పర్యం:** అంటూండగా విషం క్రక్కే సర్పంలాంటి బాణాన్ని రుద్రమంత్ర ప్రభావితంచేసి కర్ణుడు అర్జునుడి ప్రాణాలను తీసే ప్రయత్నంచేసి వింటికి తొడుగగా అంతకుముందే భూమిలో దిగబడిన రథచక్రం మరింత నేలలో కూరుకుపోయింది. దానితో రథం పూర్తిగా ప్రక్కకొరిగి బాణప్రయోగానికి వీలు చిక్కలేదు. అప్పుడు కర్ణుడు ధైర్యాన్ని కోల్పోయి రోషవిషాదాలతో కన్నీరు కారుస్తూ, రథం దిగి, అర్జునుడిని చూస్తూ ఇట్లా అన్నాడు.

**సీ. 'అరదంబు చక్రంబు ధరఁ జాలఁ గ్రుంగిన । నెత్తెద, నంతకు నేయ కుండు;**
**మేను భూమిస్థుఁడ నీవు రథస్థుండ । వియ్యెడఁ దగ వగు నేయ కునికి;**
**విరిదలవానిని విరథుని నాయుధం । బిడినవానిని శూరు లేయ రెండు;**
**మహిత శూరుఁడ వనుమాత్రగా దుత్తమ । కులుఁడవు, రణధర్మకోవిదుండ,**

**ఆ. విట్టి నీవు దగిన యట్టి భంగిన యని । సేయవలయు; నిట్లు సెప్ప టెల్లఁ**
**బాడి యేర్పడంగఁ బలుకుట గాని, గో । విందునకును, నీకు వెఱచి కాదు!'** 351

**ప్రతిపదార్థం:** అరదంబు= రథంయొక్క; చక్రంబు; ధరన్= నేలలోనికి; చాలన్= ఎక్కువ; క్రుంగినన్= దిగబడిపోయినందున; ఎత్తెదన్= పైకి లేవదీస్తాను; అంతకున్= దానిని పైకి ఎత్తేవరకు; ఏయకుండుము= బాణప్రయోగం చేయకుండా ఊరకుండుము; ఏను; భూమిస్థుఁడన్= నేలమీద ఉన్నవాడను; నీవు= నీవో; రథస్థుండవు= రథమెక్కి ఉన్నవాడవు; ఈ+ఎడన్= ఈ సమయంలో; ఏయక+ఉనికి= బాణాలు విసరకుండా ఉండటం; తగవు+అగున్= ఉచితమగును; విరిదలవానిని= తలవెంట్రుకలు విరబోసుకొన్నవాడిని; విరథునిన్= తేరు విరిగి భూమిపైనున్నవాడిని; ఆయుధంబు; ఇడినవానిని= విడిచిపెట్టినవాడిని; ఎందున్= ఎక్కడా; శూరులు= వీరులు; ఏయరు= బాణప్రయోగం చేయరు; మహిత= పేర్గాంచిన; శూరుఁడవు అను మాత్రకాదు= శూరుడవు మాత్రమే కాదు; (క్షాత్రధర్మం ఎరిగినవాడవేగాక దానిని ఆచరణలో పెట్టేవాడవు); ఉత్తమకులుఁడవు= ఉత్తమ వంశానికి (కురువంశానికి) చెందినవాడవు; రణధర్మకోవిదుండవు= యుద్ధనీతిని ఎరిగినవాడవు; ఇట్టి నీవు= ఇట్టి గుణగరిష్ఠుడవగు నీవు; తగిన అట్టి భంగిన్+అ= ఉచితమైన రీతిలోనే; అని చేయవలయున్= యుద్ధం చేయవలెను; ఇట్లు చెప్పుట; ఎల్లన్= అంతా; పాడి= ధర్మపద్ధతి; ఏర్పడంగన్= స్పష్టమయ్యేటట్లు; పలుకుటకాని= చెప్పటమే గాని; గోవిందునకున్; నీకున్; వెఱచి కాదు= భయపడి మాత్రం కాదు.

**తాత్పర్యం:** 'రథచక్రం భూమిలో చాల క్రుంగింది. దానిని ఎత్తేంతవరకు బాణాలు వేయకుము. నేను నేలమీద ఉన్నాను. నీవు రథంమీద ఉన్నావు. బాణప్రయోగం చేయకుండటం న్యాయం, తలజుట్టు విరబోసికొన్నవాడిని, రథం లేని వానిని, ఆయుధం విడిచినవాడిని శూరులు బాణాలతో కొట్టరు. నీవు గొప్ప వీరుడవే కాదు ఉత్తమక్షత్రియ వంశంలో పుట్టినవాడివి, యుద్ధధర్మాలు తెలిసినవాడివి, అటువంటి నీవు తగినవిధంగా యుద్ధం చేయాలి. ఇట్లా చెప్పటం ధర్మం తెలియచెప్పటానికే కాని, కృష్ణుడికీ, నీకూ భయపడికాదు.'

**విశేషం:** ఈ పద్యం కర్ణుడి గుణగౌరవానికి నిలువుటద్దము. పుట్టినది మొదలు ముళ్ళకిరీటాన్ని ధరించియున్నాడు. పొరపొచ్చెము లేని రీతిలో జీవయాత్ర సాగించినాడు. అంతకంతకు పేర్చే అధిపు మన్నన అప్పుదీర్చను శరాసనాన్ని దించకుండా, రణరంగాన గావించిన ఆత్మబలిదానంతో తీర్చుకొన్నాడు. తన సహజ కవచకుండలాలను కోసి దానం చేసిన త్యాగి. ధర్మదీక్షా కంకణబద్ధుడై, చలించని మానసంతో మిత్రసేవ చేసినాడు. తనతోపాటు తన కొడుకులను బలియిచ్చిన కర్మయోగి- ఈ రాధేయుడు.

వట్టిమాటలకే గాక చేతలకు అన్నిట చాలినవాడు, కాబట్టే రణనీతిసూక్తులు పలుకుటకు చాలికూడా ఉన్నాడు. విరోధి వంశగౌరవాన్ని, శౌర్యవిలాసాన్ని, రణరంగనీతిని కొనియాడి, నడివడికను దిద్దుకోమని చెప్పటం ఒక మహోదాత్త భావసరణి. అందువలన తాను ఇరుక్కొని ఉన్న అవస్థను గమనించి, నడుచుకొనుమంటున్నాడు. నీటికంటె నెత్తురు చిక్కన అయినదిగదా! తాను అర్జునుడి అగ్రజుడని తల్లి, కృష్ణులవలన తెలిసికొనే ఉన్నాడు. అయినా ప్రభుభక్తితో శక్తి వంచనలేకుండ అర్జునుడితో పోరాడాడు. ఇందు ఇంకొక చమత్కారం. ఈ మాటలు నిన్నూ ఆ కృష్ణుడిని చూచి పిరికి మనస్సుతో అనటంలేదు. యుద్ధధర్మాన్ని గుర్తుచేయటానికి మాత్రమే అని అనటం.

**వ. అనిన విని, యచ్యుతుం డతని కిట్లనియె : 352**

**తాత్పర్యం:** అనగా విని కృష్ణుడు, కర్ణుడితో ఇట్లా అన్నాడు:

**క. 'ఏమీ! తగవును ధర్మము । నీ మనమున నేఁడ పుట్టెనే? గర్వము ను**
**ద్దామ దురభిమానము నే । లా మఱచితి కర్ణ? యా చలం బెటఁ బోయెన్?' 353**

**ప్రతిపదార్థం:** కర్ణ!= ఓ కర్ణుడా!; ఏమీ!= ఏమేమి! (ఎగతాళితో కలిసిన ఎత్తిపొడుపు); తగవును= న్యాయము; ధర్మమున్= ధర్మము; నీ మనమునన్= నీ మనస్సులో; నేఁడు+అ పుట్టెనే?= ఈ దినమే కలిగినట్లున్నవే? (లేకుంటే); గర్వమున్= అహంకారాన్ని; ఉద్దామ= భయంకరమైన; దురభిమానమున్= అనుచితగర్వాన్ని; (నీకున్నవాటిని); ఏలా మఱచితి(వి)= ఎందుకు మరచిపోయినావు?; ఆ చలంబు= ఆ మాత్సర్యం; ఎటన్ పోయెన్?= (నిన్నువదలి) ఎక్కడికి పోయిందయ్యా!

**తాత్పర్యం:** 'ఎట్లెట్లా? ఈ న్యాయము, ధర్మము నీ మనసులో ఈనాడే పుట్టాయా? లేకుంటే నీ అహంకారాన్ని, ఆ చెడ్డ ఉత్కర్షను ఎట్లా మరచిపోయావయ్యా కర్ణా! ఆ ద్వేషం, ఆ అసూయ నిన్ను వదలి ఎక్కడికి పోయాయి?'

**ఆ. 'పరమధర్మపరులు పాండుభూవల్లభ । సుతులు, వారి నతులశుభము లొందు;**
**ధర్మహీను లైన ధార్తరాష్ట్రులకుఁ బా । టిల్లు నివ్విధమున నెల్లచేటు.' 354**

**ప్రతిపదార్థం:** పాండు భూవల్లభసుతులు= పాండురాజు కుమారులు; పరమధర్మపరులు= అత్యంత ధర్మపరులు; వారిని; అతుల= సాటిలేని; శుభములు= శ్రేయస్సులు; ఒందున్= చేరుతాయి; ధర్మహీనులు+ఐన= అధర్మపరులైన; ధార్తరాష్ట్రులకున్= ధృతరాష్ట్రుని కుమారులకు; ఈ విధమునన్; ఎల్లచేటు= అన్ని విధాలైచెడ్డలు; పాటిల్లున్= కలుగుతాయి. (ప్రాప్తిస్తాయి).

**తాత్పర్యం:** 'అత్యుత్తమమైన ధర్మాన్ని పాటించే పాండవులకు శ్రేయస్సులు కలుగుతాయి. అవినీతిపరులైన ధృతరాష్ట్రుడి పుత్రులకు ఈ విధంగానే అన్ని అరిష్టాలు సంభవిస్తాయి.'

**వ. 'దీనికి నీవు కటకటంబడినం బోవునే?' యని పలికి వెండియు. 355**

**ప్రతిపదార్థం:** దీనికిన్= రానున్న ఈ దురదృష్టాలకు; నీవు; కటకటన్+పడినన్= బాధపడితే; పోవునే?= తప్పిపోతాయా?; (దుఃఖించినంత మాత్రాన దుఃఖాలు గడచిపోవు) అని పలికి; వెండియున్= ఇంకా.

**తాత్పర్యం:** 'దీనికి నీవు బాధపడితే అవి తొలగిపోతాయా?' అని పలికి ఇంకా (తరువాతి పద్యంతో అన్వయం).

సీ. **'గొంతియు నందఱు గొడుకులు సుప్తులై । యుండంగ లక్కయిల్ మండఁ జేసి**
**కపటంపు జూదంబు ఘటియించి ధర్మాత్ముఁ । డగు ధర్మసుతు సిరి యపహరించి,**
**యంతఁ బోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స । భాస్థలి నమ్మెయి భంగపఱిచి,**
**యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోషయాత్రావిధి నెపమున దాడి వెట్టి,**

తే. **బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ । బనిచి చంపించె మీసుయోధనుఁడు; దలఁపఁ**
**గాని, యిప్పాపముల కాదికర్త నీవ; । యిన్ని యెడలను నీపాడి యెందుఁ బోయె?'** 356

**ప్రతిపదార్థం:** గొంతియున్= కుంతియు; అందఱు కొడుకులు; సుప్తులు+ఐ ఉండంగన్= నిద్రపోతూ ఉండగా; లక్కయిల్= లక్కఇల్లు; మండన్+చేసి= కాలేటట్లు చేసి; కపటంపు జూదంబున్; ఘటియించి= కల్పించి; ధర్మాత్ముఁడగు; ధర్మసుతు= ధర్మరాజుయొక్క; సిరి= సంపదను; అపహరించి= దొంగిలించి; అంతన్+పోవక= దానితో ఊరకుండక; ద్రుపద+ఆత్మజన్= ద్రుపదుడి కూతురుని ద్రౌపదిని; తెచ్చి= తీసికొనివచ్చి; సభాస్థలిన్= ఆ పెద్ద కొలువుకూటంలో; ఆ+మెయిన్= ఆ విధంగా; భంగపఱిచి= అవమానించి; ఆ+మహాత్ములన్= ఆ గొప్పవారిని-పాండవులను; చంపన్= చంపేటందుకు; అడవికిన్= అడవికి; ఘోషయాత్రా విధి= ఘోషయాత్రా విధానం అనే; నెపమునన్= సాకుతో; దాడి+పెట్టి= దాడిచేసి; బాలున్= చిఱుతప్రాయంవాడైన; అభిమన్యున్; ఒక్కనిన్= ఒంటరివాడిని; బహురథికులన్= అనేక రథసైనికులను; పనిచి= పంపి; మీ సుయోధనుఁడు; చంపించెన్; తలఁపన్+కాని= తలచుకోవటానికి తగని కూడా అతని పాపాలన్నిటికి; ఆదికర్త= మొదటివాడవు; నీవు+అ= నీవే; ఇన్ని ఎడలనున్= ఈ సందర్భాలన్నిటిలోను; నీ పాడి= నీవు చెప్పే ఈ న్యాయం (ధర్మోపదేశం); ఎందున్+పోయెన్?= ఎక్కడికి పోయింది?

**తాత్పర్యం:** 'కుంతీ, ఆమె కొడుకులూ నిద్రపోతూ ఉండగా లక్కయింటిని కాల్పించి, కపటపుజూదం కల్పించి, అందులో ధర్మరాజు సంపదనంతా దొంగిలించి, అంతటితో ఆగక ద్రౌపదిని నిండుసభలో ఆ విధంగా అవమానించి, పాండవులను చంపటానికి ఘోషయాత్ర నెపంతో దాడిచేసి, బాలుడైన అభిమన్యుడిని ఒక్కడిగా చేసి అనేక రథికులను అతడిపైకి పంపించి చంపించాడు మీ దుర్యోధనుడు. అనుకోవటానికి కూడా తగని ఈ పాపాలకన్నిటికీ మూలకర్తవు నీవే. ఈ సందర్భాలన్నింటిలో నీ విప్పుడు పలికే న్యాయం ఎక్కడికి పోయింది?

వ. **అని యిట్లు, కృష్ణుండు గర్ణుతో నాడుమాటలఁ దోడ్తోడం బెరిఁగిన యర్జునంజయు మనంబు రోషానలంబు రోమకూపంబులఁబటుజ్వాలారూపంబుల వెడలుట, యతివిస్మయ ప్రదంబై యుండె; నయ్యుగ్రమూర్తి సముదగ్ర పరాక్రమంబునం గురియు పటుబాణా సారంబు వారించి, యవ్వీరు నంగంబున నయ్యంగపతి నిశితాస్త్రంబులు నిగిడించుట మహాద్భుతంబయ్యె; నత్తెఱంగున నీడంబోక పెనంగు నతం డతిరయంబున నన్నరునిం బది దొడ్డనారసంబుల నొప్పించిన, నత్తేజోధనుం డాజ్యధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందిన హుతవహుండునుం బోలె మండి, శత్రుసంత్రాసనంబును మిత్రోల్లాసనంబును బ్రగుణమణి జాంబూనదమయంబును జనప్రస్తుతి పాత్రంబును హస్తికక్ష్యాత్మకంబును నగు నతని కేతనంబును గనకపుంఖప్రభా భాసితంబైన భల్లంబునఁ బడనేసినం గౌరవులు నిజ యశో బలదర్ప ప్రియంబుల మొత్తంబులు వడుటగాఁ దలంచుచు హాహాకారంబులతో నా రాధేయుని దెస నిరాశులై; రట్లు ప్రస్ఫీతకేతుపాతనం బాచరించిన, దానం గనలి కర్ణుం డతినిశిత క్రూరనారాచజాలంబులు గృష్ణార్జునులమీఁదం**

**గురిసి వెగడుపఱిచి యరదంబు పిఱిందికొమ్ము క్రిందికి మూఁపు సొనిపి లావున నెత్తిన, రథచక్రంబు విడువక, భూమి గులపర్వత కానన సముద్రసహితం బాఱంగుళంబు లెగసె; నట్లు కర్ణుండు రథంబు నిలిపి, మీఁదికిం జని, యెప్పటి బాణంబు సంధింప వెండియుఁ జక్రంబు దిగంబడినఁ; గ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్తనమరె; నయ్యవసరంబునఁ గృష్ణుపనుపునం గ్రీడి దోడన.** **357**

**ప్రతిపదార్థం:** అని ఇట్లు; కృష్ణుండు; కర్ణుతోన్; ఆడు మాటలన్= పలికిన మాటలచేత; తోడ్తోడన్= వెనువెంటనే; పెరిఁగిన= అతిశయమైన; ఆ+ధనంజయు= ఆ అర్జునుడి; మనంబు= మనస్సునందలి; రోష+అనలంబు= కోపం అనే నిప్పు; రోమకూపంబులన్= వెంట్రుకల పాదులలో; పటు= తీవ్రమైన; జ్వాలారూపంబులన్= మంటలవలె; వెడలుట= బయటపడటం అతి విస్మయప్రదంబు+ఐ= మిక్కిలి ఆశ్చర్యం కలిగించేదై; ఉండెన్; ఆ+ఉగ్రమూర్తి= ఆ కోపమే రూపం తాల్చినట్లున్న వీరుడు; సముదగ్ర= అతిశయమైన; పరాక్రమంబునన్= శౌర్యంతో; కురియు= వానవలె కురిపిస్తున్న; పటుబాణ+ఆసారంబున్= దిట్టమైన బాణాల జడివానను; వారించి= నిలిపివేసి; ఆ+వీరు= ఆ శూరుడైన అర్జునుడి; అంగంబునన్= శరీరమునందు; ఆ+అంగపతి= ఆ అంగదేశాధీశుడైన కర్ణుడు; నిశిత+అస్త్రంబులు= పదునైన బాణాలను; నిగిడించుట= వ్యాపింపచేయటం; మహాద్భుతంబు= గొప్పవింత; అయ్యెన్; ఆ+తెఱంగునన్= ఆ విధంగా; ఈడఁబోక= వెనుదీయక; పెనంగు; అతండు= కర్ణుడు; అతిరయంబునన్= మహావేగంతో; ఆ+నరునిన్= ఆ అర్జునుడిని; పది; దొడ్డ= పెద్ద; నారసంబులన్= బాణాలతో; నొప్పించినన్= కష్టపెట్టగా; ఆ+తేజోధనుండు= కాంతి సంపన్నుడగు ఆ నరుడు; ఆజ్యధారా= నేతి పోత చాలుయొక్క; ఛటా= సమూహంయొక్క; సేకంబున= తడుపుటచేత; ఉద్రేకంబు= పొంగు; ఒందిన= పొందిన; హుతవహుండునున్= వేల్చబడిన వస్తువులు ధరించే అగ్నిహోత్రుడి; పోలెన్= విధంగా; మండి; శత్రుసంత్రాసనంబు= విరోధులకు భయమును; మిత్ర+ఉల్లాసంబును= స్నేహితులకు సంతోషాతిశయాన్ని; కలుగన్+చేయు; ప్రగుణ= శ్రేష్ఠములైన; మణి= మణులతో; జాంబూనదమయంబును= బంగారుతో చేయబడినదియు; జనప్రస్తుత= ప్రజాప్రశంసలకు; పాత్రంబును= తగినదియు; హస్తి= ఏనుగుయొక్క; కక్ష్యాత్మకంబు= పొట్టక్రింద పట్ట రూపమును పొంది ఉన్నటువంటిదియు; అగు= అయినటువంటి; అతని= కర్ణుడి; కేతనంబును= ధ్వజాన్ని; కనకపుంఖ= బంగారు కాడ మొదలుతో; ప్రభాభాసితంబైన= (బంగారు) కాంతితో ప్రకాశిస్తున్న; భల్లంబునన్= బాణంతో (ఈటెతో); పడవేసినన్= పడగొట్టగా; (దీనితో) కౌరవులు; నిజ= తమయొక్క; యశః= కీర్తి; బలదర్ప= శక్తిగర్వం; ప్రియంబుల= ఇష్టమైనవాటి; మొత్తంబులు= అన్నీ పూర్తిగా; పడుటకాన్= భగ్నమైనట్లుగా; తలంచుచున్= అనుకొంటూ; హాహాకారంబులతోన్= కేకలతో; ఆ రాధేయుని; దెసన్= పట్ల; నిరాశులు+ఐరి= ఆశలు పోగొట్టుకొన్నవారైరి (కర్ణుడు జయిస్తాడన్న ఆశలు కోల్పోయిన వారైరి); అట్లు= ఆ విధంగా; ప్రస్ఫీత= మిక్కిలి పేర్గాంచిన; కేతు= టెక్కెముయొక్క; పాతనంబు= పడగొట్టుటను; ఆచరించినన్= చేయగా; దానన్= దానివలన; కర్ణుండు; కనలి= కోపగించుకొని; అతి నిశిత= మిక్కిలి పదునైన; క్రూర= కరకై బాధపెట్టునట్టి; నారాచజాలంబులు= బాణసమూహాలను; కృష్ణార్జునులమీఁదన్; కురిసి= వర్షింపజేసి; వెగడుపఱిచి= తల్లడిల్లజేసి, వ్యాకులపాటును కలిగించి; అరదంబు; పిఱింది= వెనుకటి; కొమ్ము= పొడవు దూలమునకు (దీనిని పరము అంటారు); క్రిందికి; మూఁపు; చొనిపి= దూర్చి; లావునన్= శక్తితో; ఎత్తినన్= పై కెత్తగా; రథచక్రంబు= రథచక్రాన్ని; విడువక= వదలక; భూమి; కులపర్వతములు= ఏడు కులపర్వతాలు; కానన= అడవులు; సముద్ర సహితంబు= సప్త సముద్రాలతో; ఆఱు అంగుళంబులు; ఎగసెన్= పైకి ఉబికినది; అట్లు= ఆ విధంగా; కర్ణుండు; రథంబు నిలిపి; మీఁదికిన్+చని= ఆ తేరుమీదికి ఎక్కి; ఎప్పటి బాణంబు= ఆ పాతబాణమును; సంధింపన్= ఎక్కుపెట్టగా; వెండియున్= మరల; చక్రంబు; దిగన్+పడినన్= నేలలో కూరుకొనిపోగా; క్రమ్మఱన్= మరల; రథంబు; డిగ్గి= దిగి; ఎత్తన్= పైకి లేవదీయటానికి; అమరెన్= సిద్ధపడ్డాడు; ఆ+అవసరమునన్= ఆ సమయంలో; కృష్ణుని పనుపునన్= కృష్ణుడు చెప్పినట్లు; క్రీడి= అర్జునుడు; తోడన్= వెనువెంటనే.

**తాత్పర్యం:** కృష్ణుడు కర్ణుడితో అన్నమాటలు, అర్జునుడి మనస్సులో ఆత్మగౌరవం ప్రేరేపించిన కోపాగ్నిని ప్రతివెంట్రుక కూపంనుండి మంటల రూపంలో బయటపడేటట్లు చేసింది. అందరికీ ఆశ్చర్యం కలిగించింది. భయంకరాకారుడై ఉన్న ఆ అర్జునుడు పెల్లుబికిన భీకర పరాక్రమంతో కురిపించే అమ్ములవానను ఆపి కర్ణుడు ఆ ప్రతాపశాలి కిరీటి దేహంలో బాణాలను చొప్పించటం ఇంకా అద్భుతంగా కనుపట్టింది. ఆ విధంగా వెనుకాడక, ఆ వీరుడు పోరాడుతూ, అత్యంతవేగంగా పది పెద్దబాణాలతో నరుడిని నొప్పించాడు. దీనితో పరాక్రమమే సంపదగా కలిగిన నరుడు నేతిధారలతో ప్రజ్వరిల్లిన అగ్నిదేవుడివలె మండి బంగారుకాడ గలిగి తళుకొత్తే ఈటెతో - శత్రువులకు భయోత్పాదకమైనట్టియు, మిత్రులకు సంతోషదాయకమైనట్టియు నానావిధాలైన రత్నాలు పొదువబడి బంగారుమయమై ప్రజల స్తోత్రాలకు అర్హమైనదియు, ఏనుగు నడుముపట్టి రూపాన్ని పొంది ఉన్న ఆ కర్ణుడి ధ్వజాన్ని పడగొట్టాడు. కౌరవులు ఈ ధ్వంసాలన్నీ తమ యశస్సు, బలం, గర్వం మొదలైన ప్రీతిపాత్రాల మొత్తం వికలమైనట్లుగా భావించి దుఃఖంతో కేకలు వేస్తూ కర్ణుడిపట్ల ఆశను వదలుకొన్నారు.

ఈ విధంగా ప్రఖ్యాతిగాంచిన తన ధ్వజం పడిపోవటం చూచి కర్ణుడు కోపపడి, బాధాకరమైన వాడి బాణాలను కృష్ణార్జునులమీద వానమాదిరి కురిపించి బాధించాడు. తోడ్తోడనే కర్ణుడు దిగబడిన తన తేరు వెనుకటి పాడవు దూలం క్రిందకు తన భుజాన్ని దూర్చి, ఉన్న బలాన్నంతా కూడగట్టుకొని ఎత్తగా, ఆ రథచక్రాన్ని వదలక భూమి కులపర్వతాలతో, అరణ్యాలతో అన్నీ సముద్రాలతోపాటు ఆరు అంగుళాలు పైకి లేచింది. (ఆ ప్రయత్న బలమట్టిది). ఆ విధంగా ఆ కర్ణుడు రథాన్ని నిలిపి, దానిపై కెక్కి చేతనున్న బాణాన్ని సంధించాడు. ఆ చక్రం ఇంకా లోతుకు దిగబడింది. మరలా ఆయన రథందిగి, పైకి ఎత్తటం ప్రారంభించాడు. ఆ సందు చూచుకొని కృష్ణుడి మాటమీద కిరీటి వెంటనే. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** కర్ణుడు రణధర్మాన్ని ప్రస్తావించేసరికి, అంతవూనికతో యుద్ధం చేస్తున్న అర్జునుడు అతడిని కొట్టటానికి తటపటాయించటాన్ని - కృష్ణుడు పాండవులకు జరిగిన అపకారాలన్నింటిని ఏకరువు పెట్టి, వాటిలో కర్ణుని పాత్రను ప్రస్తావించి, అర్జునుణ్ణి అమితంగా రెచ్చగొట్టి, అతడు రణధర్మాన్ని ప్రక్కన పెట్టి కర్ణుణ్ణి కొట్టటానికి పూనుకొనేటట్లు చేయటాన్ని - మనోధర్మజ్ఞుడైన తిక్కన మహాకవి చిత్రించిన తీరు అద్భుతం. అలాగే కర్ణుడు ఏమాత్రం సడలని ధైర్యంతో తన మూపుమోపి క్రుంగిన రథచక్రాన్ని పైకెత్తటానికి ప్రయత్నించటాన్ని కళ్ళకుకట్టినట్లు చిత్రించిన ఆ మహాకవి నాటకీయకవితా శిల్పం కూడ అమోఘం.

**మ.** **కులిశ ప్రస్ఫురణాపహాసననిభాగుచ్ఛంబులం గల్గి యాఁ**
**కలిమైవచ్చు కృతాంతవక్త్ర మన నుగ్రంబై మురారాతి రు**
**ద్రుల చక్రంబును శూలముం దెగడుచుం గ్రూరంపు టొప్పారు నం**
**జలికంబైన మహాస్త్రముం దొడివి కర్ణం బుబ్బునం జేయుచున్.** **358**

**ప్రతిపదార్థం:** కులిశ= వజ్రాయుధంయొక్క; ప్రస్ఫురణ= గొప్పవెలుగును; అపహాసన= గేలిచేసే; విభాగుచ్ఛంబులన్= కాంతిపుంజాలను; కల్గి= పొంది; ఆఁకలిమైన్ వచ్చు= ఆకలితోవచ్చే; కృతాంత= యముడి; వక్త్రము అనన్= నోరా ఏమి?- అన్నట్లు; ఉగ్రంబు+ఐ= భయంకరమై; ముర+అరాతి= మురారి-కృష్ణుడి; చక్రంబును= చక్రాన్ని; రుద్రుని= శివుడి; శూలమున్; తెగడుచున్= పరిహాసం చేస్తూ; క్రూరంపు= క్రౌర్యముయొక్క; ఒప్పారున్= అమరికతో; అంజలికంబైన= చేతులు జోడించదగిన;

మహా+అస్త్రమున్= గొప్పబాణాన్ని; తొడివి= తొడిగి; కర్షంబును= లాగుటను; ఉబ్బునన్ చేయుచున్= పొంగుతో చేస్తూ (అర్జునుడు).

**తాత్పర్యం:** వజ్రాయుధంయొక్క గొప్ప వెలుగును గేలిచేసే కాంతి సమూహాలను కలిగి, ఆకలితో వచ్చే యముడి నోరా అన్నట్లు భయంకరమై, శ్రీకృష్ణుడి చక్రాన్ని, శివుడి శూలాన్ని తిరస్కరించే క్రౌర్యంయొక్క అమరికతో, చేతులు జోడించి నమస్కరింపదగిన ఒక గొప్ప అస్త్రాన్ని వింట సంధించి, ఉప్పొంగి అల్లెత్రాటిని లాగుతూ (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** 'ఇది భయానికి ఇంపు గూర్చిన దీర్ఘ ఉపమాలంకారం. కర్ణుడి మెడ నరకటానికి ఇంతటి సన్నాహం కావలసి ఉన్నదంటే దాని బిగువును వెల్లడిస్తున్నది కదా!

**క.** **'ఏను దపశ్చరణంబున । దానంబున గురుజనాభితర్పణమున, ని**
**త్యానూన వ్రతశీలుఁడ । నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర' మనియెన్.** **359**

**ప్రతిపదార్థం:** ఏను= నేను; తపః+చరణంబునన్= తపమాచరించుటలో; దానంబునన్= దానము చేయుటలో; గురుజన= గురుదేవులకు; అభితర్పణమునన్= సంతృప్తిని కలిగించుటలో; నిత్యం= సదా; అనూన= తక్కువకాని; వ్రతశీలుఁడను= పుణ్యకర్మలాచరించేవాడను; ఏనియున్= అయినట్లయితే; ఈ శరము; కర్ణుతలను; త్రెంచున్= నరికివేయును; అనియెన్= (ప్రతిజ్ఞాపూర్వకంగా) అన్నాడు.

**తాత్పర్యం:** 'నేనే గనుక తపస్విని, దాతను, సేవలతో గురుదేవులకు సంతృప్తిని కలిగించేవాడను, పుణ్యకర్మలను ఎల్లప్పుడు ఆచరించేవాడను అయితే, ఈ బాణం కర్ణుడి తల నరికివేస్తుంది.' అని ప్రతిజ్ఞావచనం పలికాడు.

**క.** **అని, తెగ నిండఁ దిగిచి యే । సిన, నయ్యస్త్రంబు రోదసీకుహరంబుం**
**దనమెఱుఁగుల నించుచు నిరు । మొనల జనుల గాఢమూర్ఛ ముంచుచు నిగిడెన్.** **360**

**ప్రతిపదార్థం:** అని; తెగనిండన్= పూర్తిగా; తిగిచి= లాగి; ఏసినన్= వదలగా; ఆ+అస్త్రంబు= మంత్రబల సంపన్నమైన ఆ ఆయుధం; రోదసీ= భూమి ఆకాశమధ్య ప్రదేశములయొక్క; కుహరంబున్= దొప్పవంటి భూమ్యాకాశాల మధ్య ప్రదేశమందు; తన మెఱుఁగులన్= తన కాంతులను; నించుచున్= పూర్తిగా నిండింపజేస్తూ; ఇరుమొనల జనులన్= ఉభయపక్షాల జనులను; గాఢమూర్ఛన్; ముంచుచున్; నిగిడెన్= వ్యాపించింది.

**తాత్పర్యం:** అని సత్తువంతా చూపి పూర్తిగా లాగి ప్రయోగించిన ఆ అస్త్రం గగనతలాన్నంతా తన కాంతులతో నింపుతూ, చూచి వెరగందిన ఉభయపక్షాలవారిని గాఢమూర్ఛలో ముంచుచు దూసుకు వెళ్ళింది.

### అర్జున ప్రయుక్తం బగు ఘోరశరంబు కర్ణశిరంబు ద్రుంచుట (సం. 8-67-24)

**చ.** **నినద సముద్ఘటస్ఫురణ నింగి వగుల్పఁగ సర్వభూతకం**
**పన మగు చమ్మెయిన్ నిగిడి, పార్థివసత్తమ! యేమి సెప్పుదుం?**
**దునిమె, శిరంబు రక్తమునఁ దోఁగుచుఁ గర్ణుని యట్ట వజ్రఘో**
**రనిహతిఁ గూలు గైరిక ధరాధరముం దలఁపింపఁ బట్టుగన్.** **361**

**ప్రతిపదార్థం:** పార్థివసత్తమ!= రాజోత్తమా!; నినద= శబ్దంయొక్క; సముద్భట; స్ఫురణన్= భయంకరస్ఫూర్తిచేత; నింగి= ఆకాశం; పగుల్పఁగన్= బీటలు తీయగా; సర్వభూత= ఎల్ల భూతాలయొక్క; కంపనము+అగుచున్= చలనము కలది ఔతూ; ఆ+మెయిన్= ఆ విధంగా; నిగిడి= రేగి; ఏమి చెప్పుదున్?= ఏమని చెప్పగలను?; రక్తమునన్; తోఁగుచున్= తడిసిపోతూ (నెత్తురు కారుతుండగా); కర్ణుని; అట్ట= మొండెం; వజ్రఘోరనిహతిన్= వజ్రాయుధంయొక్క బెట్టిదమైన దెబ్బతో; కూలు; గైరిక= గైరికాది ధాతువులను తాల్చిన; ధరాధరమున్= కొండను; తలఁపింపన్= స్ఫురింపజేయటానికి; పట్టుగన్= స్థానం అయ్యేటట్టు; శిరంబు= తలను; తునిమెన్= ఖండించింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఏమని చెప్పగలను! ఆ అస్త్రం తన కఠోర శబ్దం దెబ్బతో ఆకాశాన్ని బ్రద్దలు చేస్తూ, అన్ని భూతాలను కంపింప చేస్తూ, రక్తంతో తడుస్తూ కూలుతున్న కర్ణుడి మొండెం వజ్రాయుధంయొక్క భయంకరమైన దెబ్బకు ఎఱ్రటి గైరిక ధాతువులతో కూలిపడే పర్వతాన్ని తలపిస్తుండగా అతడి శిరస్సును ఖండించింది.

**విశేషం:** కర్ణుడి మరణ వర్ణన కూడ అతని మహోన్నత వ్యక్తిత్వానికి అనుగుణంగా మహోదాత్తంగా కంటికి కట్టినట్లు సాగింది. తిక్కనగారి పాత్రోచితవర్ణన, వస్తు ప్రత్యక్షీకరణ శిల్పం అమోఘం.

**క. చరమగిరినుండి పడియెడు । తరణికరణి సూతపుత్రుతల వడఁ గాంతి**
**స్ఫురణోజ్జ్వలంబు నతి సుం । దరమును నగు కాయమట్లు ధరణిం బడియెన్. 362**

**ప్రతిపదార్థం:** చరమగిరి నుండి= పడమటి కొండమీదనుండి; పడియెడు; తరణి కరణి= సూర్యుడివలె; సూతపుత్రుని; తల; పడన్= పడిపోగా; కాంతి స్ఫురణ= కాంతి వెదజల్లుతూ; ఉజ్జ్వలంబు= మిక్కిలి ప్రకాశిస్తూ; అతిసుందరమును అగు= మిక్కిలి అందమైన; కాయము= దేహం; అట్లు= ఆ విధంగా; ధరణిన్+పడియెన్= నేలపై పడింది.

**తాత్పర్యం:** పడమటి కొండనుండి పడే సూర్యుడివలె కర్ణుడి తల పడగా, వెలుగును వెదజల్లుతూ మిక్కిలి ప్రకాశిస్తూ, ఎంతో అందమైన అతడి దేహం ఆ విధంగా (ముందు పద్యంలో వర్ణించినట్లుగ) నేల మీద పడింది.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**తే. అధిప! యంతన గను విచ్చి యఖిల జనులు । గనుఁగొనంగ, నయ్యుజ్జ్వలతనువు విడిచి**
**చని సముద్దీప్త మైన తేజంబు వారి । జాప్తబింబంబు సొచ్చె నత్యద్భుతముగ. 363**

**ప్రతిపదార్థం:** అధిప!; అంతన= వెంటనే; కను విచ్చి= కనులు తెరచి; అఖిల జనులు కనుఁగొనంగన్= ఉన్నవారంతా చూస్తుండగా; సముద్దీప్తము+ఐన= ఎక్కువకాంతితో ప్రకాశించే; తేజము= ప్రకాశం; సముజ్జ్వల తనువు= దేదీప్యమానమైన శరీరాన్ని; విడిచి చని= విడిచిపెట్టిపోయి; వారిజ+ఆప్త, బింబంబు= కమలములకు కూర్చువాడైన సూర్యుడి మండలాన్ని; అతి+ అద్భుతముగన్= ఆశ్చర్యజనకంగా; చొచ్చెన్= ప్రవేశించింది.

**తాత్పర్యం:** ధృతరాష్ట్ర మహారాజా! ఉన్నవారంతా బాగా కన్నులు తెరచి చూస్తుండగా అత్యంత ప్రకాశమాన కాంతిపుంజం కర్ణుడి తేజోవంతమైన శరీరాన్ని త్యజించి, కమలాప్తుని బింబంలో ఆశ్చర్యజనకంగా ప్రవేశించింది.

**వ. అట్టి యెడ. 364**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. వినుము! మహీసురుశాపము । మనుజేంద్రా! సూతపుత్రు మరణాంతం బై**
**యునికినొ, రథచక్రము మే । దినిఁ గ్రుంగుట లేక తొంటితెఱఁగున నుండెన్. 365**

**ప్రతిపదార్థం:** మనుజేంద్రా; వినుము; మహీసురు= భూదేవునియొక్క; శాపము; సూతపుత్రుని; మరణాంతంబు+ఐ= మరణంతో పరిసమాప్తి నొందినదై; ఉనికినొ= ఉండటంవలన కాబోలు; రథచక్రము; మేదినిన్= భూమిలో; క్రుంగుట లేక= దిగబడటం లేక; తొంటి తెఱఁగునన్= మొదటి రీతిగానే (యథాపూర్వకంగా); ఉండెన్= ఉండింది.

**తాత్పర్యం:** మనుజేంద్రా! ఆ బ్రాహ్మణశాపం కర్ణుడి మరణంతోనే ముగిసిపోయినట్లున్నది. అందువలననే కాబోలు ఆ రథచక్రం నేలలో దిగబడటం మానుకొని మునుపటివలెనే నేలపై నిలిచిఉన్నది.

**తే. దారుణాస్త్రజాలాంశుల వైరిసైన్య । తాప మొనరించి, యా సూతతనయ తరణి**
**పార్థదుస్తరకాలవైభవము గడవ । ననువు లేమి, నవ్విధమున నస్తమించె. 366**

**ప్రతిపదార్థం:** దారుణ= భయంకర; అస్త్రజాల= ఆయుధాలసమూహం అనెడి; అంశులన్= కిరణాలతో; వైరిసైన్య= శత్రుసేనకు; తాపము= వేడి; ఒనరించి= పుట్టించి; ఆ సూతతనయ= ఆ సారథిపుత్రుడనే (కర్ణుడనే); తరణి= సూర్యుడు (సూర్యుడు కాబట్టి వడదెబ్బ కలిగించటం సహజంగానే ఉన్నది); పార్థ= అర్జునుడి; దుస్తర= దాటరాని; కాలవైభవము= కాలమహిమను; కడవన్= సాగించటానికి; అనువు లేమిన్= అవకాశం లేనందున; ఆ+విధమునన్; అస్తమించెన్= క్రుంగిపోయాడు.

**తాత్పర్యం:** క్రూరాలైన ఆయుధసమూహకాంతులతో శత్రుసైన్యాలను వేడిదెబ్బ కొట్టి, కర్ణుడనే సూర్యుడు అస్తమించాడు. దీనికి కారణం - అర్జునుడు అనే దాటరాని కాలమహిమను గడవడానికి వీలులేనందున ఆ విధంగా అస్తమించాడు.

**విశేషం:** అలంకారం: రూపకం. కర్ణుడికీ, సూర్యుడికీ, అస్త్రాలకూ, కిరణాలకూ, అర్జునుడికీ కాలమహిమకూ - లేదా పార్థుడనే దుస్తరమైన కాల (యమ) మహిమకూ అభేదం చెప్పబడింది కాబట్టి రూపకం.

**క. సూతతనూజుఁడు పడినం । బ్రీతిం బాంచాలు రార్వఁ బెల్లుగఁ దూర్య**
**వ్రాతంబు సెలఁగ, సమ్మో । దాతిశయము వొందెఁ బాండవానీకంబుల్. 367**

**ప్రతిపదార్థం:** సూతతనూజుఁడు= కర్ణుడు; పడినన్= చనిపోయినందున; ప్రీతిన్= ఆనందంతో; పాంచాలురు; ఆర్వన్= కేకలు పెట్టగా; పెల్లుగన్= ఎక్కువగా; తూర్యవ్రాతంబు= వాద్యసమూహపు ధ్వని; చెలఁగన్= చెలరేగగా; పాండవ+అనీకంబులు= పాండవసైన్యాలు; సమ్మోద+అతిశయము= ఎక్కువైన సంతోషమును; పొందెన్= పొందినవి.

**తాత్పర్యం:** కర్ణుడు కూలగా సంతోషంతో పాంచాలురు బిగ్గరగా కేకలుపెట్టారు. యుద్ధవాద్యాలు తీవ్రంగా మ్రోగాయి. పాండవపక్షం వారందరూ అమితంగా సంతసిల్లారు.

**క. నిడుఁగేలున్ బలుతొడలు । న్వెడఁదయురమునై రణావనిం గర్ణునొడల్**
**పడియున్నఁ గని విషాదం । బడరి తొలఁగుమాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్. 368**

**ప్రతిపదార్థం:** నిడుఁకేలున్= పొడవైన చేయి; బలుతొడలున్= బలసిన తొడలు; వెడద= వెడల్పు అయిన; ఉరమును+ఐ= రొమ్మూ కలిగి; రణావనిన్= యుద్ధభూమిలో; కర్ణు ఒడల్= కర్ణుడి దేహం; పడి ఉన్నన్; కని= చూచి; విషాదంబు+అడరి= దుఃఖం పొంగి; తొలఁగుమాడ్కిన్= వైదొలగిపోయిన విధంగా; అంతన్= అప్పుడు; అర్కుండు= సూర్యుడు; క్రుంకెన్= అస్తమించాడు.

**తాత్పర్యం:** దీర్ఘబాహువులు, బలిష్ఠమైన తొడలు, విశాలమైన రొమ్ముతో యుద్ధభూమిలో పడి ఉన్న కర్ణుడి కళేబరాన్ని చూచి, సూర్యుడు (తన పుత్రుడైనందున) దుఃఖితుడై తొలగిపోయినట్లు ఆ సమయంలో అస్తమించాడు.

**విశేషం:** అలంకారం: ఉత్ప్రేక్ష.

**తే.** **నిర్గతప్రాణు రాధేయు నిజకరములఁ । గరుణ పెంపున నంటుట కారణముగఁ**
**బావనస్నాన మొనరింపఁ బోవునట్టు । లపరజలనిధిలోనికి నరిగె నినుఁడు!** **369**

**ప్రతిపదార్థం:** నిర్గత ప్రాణున్= వెడలిపోయిన అసువులు కలిగిన; రాధేయున్= కర్ణుడిని; నిజకరములన్= సొంత చేతులతో (కిరణములతో); కరుణపెంపునన్= దయాతిశయంతో, అంటుట కారణముగన్= తాకినకారణంగా; పావనస్నానము= పవిత్ర స్నానమును; ఒనరింపన్= చేయుటకుగా; పోవునట్టులు; అపర జలనిధిలోనికిన్= పడమటి కడలిలోనికి; ఇనుఁడు= సూర్యుడు; అరిగెన్= వెళ్ళాడు.

**తాత్పర్యం:** ప్రాణంపోయి పడి ఉన్న రాధేయుడిని తన కిరణాలతో (చేతులతో) కరుణాతిశయంతో తాకి మైలపడిన దోషపరిహారార్థం స్నానం చేయుటకో అనునట్లు, పడమటి సముద్రంలోనికి సూర్యుడు వెళ్ళాడు.

**విశేషం:** సూర్యతేజస్సుతో జన్మించి, సూర్యతేజస్సులో లీనమైన కర్ణుని వ్యక్తిత్వం మహోజ్జ్వలం. జీవితం మాత్రం విషాదాంతం. పరిస్థితుల ప్రాబల్యంవల్లనే కావచ్చు - మంచి చెడుతో చెయ్యి కలిపింది. చెడ్డపేరు తెచ్చుకొంది. చివరకు చెడుఫలితాన్ని పొందింది. విధి బలీయం. మహాభారతంలో పాఠకుల సానుభూతిని పొందే మరణం కర్ణునిది. కడకు అది శల్యుని సానుభూతిని కూడ పొందటం విశేషం.

**వ.** **అప్పుడు.** **370**

**తాత్పర్యం:** ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే.** **కామఁ బాసిన కమలంబుకరణిఁ బొలుచు । కర్ణుతల యిలఁ బడియు నుదీర్ణకాంతి**
**నొప్పు నట్టయుఁ జూచి శల్యుండు సిడము । ద్రెస్సి మోడైన యరదంబు ద్రిప్పె నధిప!** **371**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; కామన్= తూటిని; పాసిన= విడనాడిన; కమలంబు= తామరపువ్వు; కరణిన్= విధంగా; పొలుచు= అందగిస్తున్న; కర్ణు తల; ఇలన్= భూమిపై; పడియున్= పడి కూడ; ఉదీర్ణ= గొప్పదైన; కాంతిన్+ఒప్పు= కాంతితో ప్రకాశిస్తున్న; అట్టయున్= మొండెమును చూచి; శల్యుండు; సిడము= పతాకధ్వజం; త్రెస్సి= తెగి; మోడైన= రూపం చెడి మోడుబారి ఉన్న; అరదంబు= రథాన్ని; త్రిప్పెన్= వెనుకకు మరలించాడు.

**తాత్పర్యం:** తూటినుండి వేరైన తామరపువ్వువలె ఉన్న కర్ణుని తలను, నేలమీద పడి ఉన్నా మిక్కిలి కాంతితో ప్రకాశిస్తున్న అతడి మొండెమును చూచి శల్యుడు టెక్కెము త్రెగి, మోడుబారిన ఆ తేరును వెనుద్రిప్పి తోలుకొని పోయాడు.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**క. బలితపువెస నాఁబోతుం । బులి గొనినం, బసులు వాఱుపోలికిఁ గ్రోధో**
**జ్జ్వలుఁ డగు పార్థుఁడు గర్ణునిఁ । బొలియించిన నీదుసైన్యములు వెఱఁ బఱచెన్. 372**

**ప్రతిపదార్థం:** బలితపువెసన్= బలంతో కూడుకొనిన వేగంతో; ఆఁబోతున్= ఆబోతును; పులి కొనినన్= పెద్దపులి చంపి లాగుకొనిపోగా; పసులు= పశువులు; పాఱుపోలికిన్= పరుగెత్తిపోయే మాదిరిగా; క్రోధ+ఉజ్జ్వలుఁడు+అగు= పగసెంపుతో మండిపోతున్న; పార్థుఁడు; కర్ణునిన్; పొలియించినన్= చంపివేయగా; నీదు సైన్యములు; వెఱన్= భయంతో; పఱచెన్= పరుగెత్తిపోయాయి.

**తాత్పర్యం:** బలవత్తరవేగంతో పైబడి ఆబోతెద్దును పులి లాగుకొనిపోగా పరుగెత్తిపోయే పసుల మందవలె - ప్రతీకారక్రోధంతో మండిపడే పార్థుడు కర్ణుడిని తుదముట్టించగా, నీ సైన్యాలు భయపడి పరుగెత్తిపోయాయి.

**విశేషం:** అలంకారం: ఉపమ.

**తే. దీనవృత్తి శల్యుండు నీ సేనజనులు, నట్లు పాంచాలు రుబ్బున నార్వ, సిగ్గు**
**వడక పాండవమధ్యము సిడము మరలి । మరలి చూచుచుఁ బాఱిరి మనుజనాథ! 373**

**ప్రతిపదార్థం:** దీనవృత్తి= దీనమైన వర్తనంతో; శల్యుండున్; నీ సేనజనులున్= నీ సేనలోనివారూ; అట్లు= ఆ రీతిగా; పాంచాలురు ఉబ్బునన్= సంతోషంతో; ఆర్వన్= అరవగా; సిగ్గు+పడక; పాండవ మధ్యము సిడమున్= అర్జునుడి ధ్వజాన్ని; మరలి మరలి= తిరిగి తిరిగి; చూచుచున్ పాఱిరి= పరుగెత్తారు.

**తాత్పర్యం:** ఆ విధంగా పాంచాలురు విజయోత్సాహంతో ఉబ్బిపోయి కేకలు వేస్తుండగా, శల్యుడు, నీ సైనికులు సిగ్గుమాలి పాండవపుత్రులలో మూడవవాడైన పార్థుడి కేతనాన్ని తిరిగి తిరిగి చూస్తూ పలాయనం చిత్తగించారు.

**విశేషం:** పాండవమధ్యముడు అర్జునుడు. కుంతీసుత మధ్యముడు భీముడు. మధ్యమ శబ్దానికి నడిమివాడని అర్థం. కాని కొందరు చెప్పేటట్లు మూడవవాడని చెప్పటం సరిగాదు.

**ఉ. గాండివ ముక్తబాణమునఁ గర్ణుఁడు గూలుటయుం, గడంగి శ**
**ల్యుం డరదంబు దోలుటయు, నొక్కమొగిన్ భవదీయ సేన లొం**
**డొండ కలంగి పాఱుటయు నుల్లసితుం డయి చూచి, వాయుపు**
**త్రుండు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. 374**

**ప్రతిపదార్థం:** గాండివముక్త= గాండీవం నుండి విడువబడిన; బాణమునన్= బాణంచేత; కర్ణుఁడు; కూలుటయున్= పడిపోవటమూ; శల్యుండు; కడంగి= పూని; అరదంబు; తోలుటయున్= మరలించుటయు; ఒక్క మొగిన్= అందరు ఒక్కసారిగా; భవదీయ సేనలు= నీ సేనలు; ఒండొండ= క్రమక్రమంగా; కలంగి= కలతచెంది; పాఱుటయున్= పరుగెత్తిపోవటం; వాయుపుత్రుండు= భీముడు; ఉల్లసితుఁడు+ఐ= ఉల్లాసం చెందినవాడై; చూచి; మహా విరావమునన్= పెద్ద ధ్వనితో; రోదసి= గగనతలం; పిక్కటిలంగన్= నిండిపోయేటట్లు; ఆర్చినన్= అరవగా.

**తాత్పర్యం:** గాండీవం నుండి వదలబడిన బాణంచేత కర్ణుడు పడిపోవటం, శల్యుడు రథాన్ని వెనుకకు తోలుకొని పోవటం, కౌరవసేనలు ఒక్కసారిగ భయపడి పరుగెత్తిపోవటం, భీముడు చూచి సంతోషాతిశయంతో గగనభాగం మారుమ్రోగేటట్లు ఆర్వగా. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. ఆ నినదంబునఁ బాండవ । సైనికహృదయములు సౌఖ్యసంపద నొందెన్**
**మానవనాథ! భవత్సుత । మానసములు శోకఘూర్ణమానము లయ్యెన్. 375**

**ప్రతిపదార్థం:** మానవనాథ!= రాజా!; ఆ నినదంబునన్= ఆ మ్రోతలో; పాండవసైనిక; హృదయములు= మనస్సులు; సౌఖ్యసంపదన్= సుఖభాగ్యాన్ని; ఒందెన్= పొందాయి; భవత్సుత= నీ కొడుకుల; మానసములు= హృదయాలు; శోక= దుఃఖంచేత; ఘూర్ణమానములు= తిరుగుడుపడినవిగా; అయ్యెన్= అయ్యాయి.

**తాత్పర్యం:** మానవనాథా! భీముడు చేసిన ఆ శబ్దానికి పాండవసైనికుల హృదయాలు ఆనందాన్ని అనుభవించాయి. నీ కొడుకుల మనస్సులు దుఃఖంతో కలతచెందాయి.

**వ. ఇ వ్విధంబున కేతనరహితంబై మోడువడియున్న యరదంబు దోలికొని యరిగి, యమ్మద్రపతి బాష్పాకుల లోచనుండును దీనాననుండును సుదీర్ఘతర నిశ్వాసుండును నై యున్న కౌరవేశ్వరుం జేరంజని యతనితో నిట్లనియె : 376**

**ప్రతిపదార్థం:** ఈ విధంబునన్; కేతనరహితంబు+ఐ= టెక్కెం లేనిదై; మోడుపడి+ఉన్న= బోసిపోయి ఉన్న; అరదంబున్; తోలుకొని; అరిగి= వెళ్ళి; ఆ+మద్రపతి= ఆ శల్యుడు; బాష్ప+ఆకుల= కన్నీటితో కలతపడిన; లోచనుండు= కన్నులు కలవాడును; దీన+ఆననుండును= దిగులుతో కూడిన ముఖం కలవాడును; సుదీర్ఘతర= అత్యంతం పెద్దవైన; నిశ్వాసుండును= నిట్టూర్పులు కలవాడును; అయి; ఉన్న; కౌరవ+ఈశ్వరున్= దుర్యోధనుడిని; చేరన్+చని= సమీపించి; అతనితోన్+ఇట్లు+ అనియెన్.

**తాత్పర్యం:** ఈ విధంగా టెక్కెం లేనిదై, బోసిపోయిన రథాన్ని శల్యుడు తోలుకొనిపోయి, కన్నీటితో కలతపడినవాడు, దీనమైన ముఖంతో ఉన్నవాడు, పెద్ద నిట్టూర్పులు నిగిడిస్తున్నవాడు - అయిన దుర్యోధనుడి దగ్గరకు వెళ్ళి, అతడితో ఇట్లా అన్నాడు.

**చ. 'నరవర! యెందుఁ జూడమె రణంబులు! కర్ణుఁడు నర్జునుండు సం**
**గర మొనరింతురే యిటులు? క్రౌర్యనిరూఢికి దివ్యు లొంది ర**
**చ్చెరు; వది యట్టులుండె; విను చెప్పెద; నెంతయు భీతిఁ బొంది రా**
**హరియు నరుండుఁ గర్ణువడి; కంత విధాతృఁడు దప్పె వానికిన్.' 377**

**ప్రతిపదార్థం:** నరవర!= రాజా!; ఎందున్= ఎక్కడైనా; రణంబులు= యుద్ధాలు; చూడమె!= చూడమా!; కర్ణుఁడు; అర్జునుండు; ఇటులు= ఈ విధంగా; సంగరము= యుద్ధం; ఒనరింతురె!= చేస్తారా!; క్రౌర్య నిరూఢికిన్= క్రూరత్వాన్ని ప్రదర్శించిన ఆ నేర్పునకు; దివ్యులు= దేవతలు; అచ్చెరువు= ఆశ్చర్యం; ఒందిరి; అది అట్టులు+ఉండెన్= ఆ సంగతిని అట్లా ఉండనీ; విను చెప్పెదన్; కర్ణుని వడికిన్= కర్ణుడి ఆయుధప్రయోగవేగానికి; ఆ హరియున్= ఆ శ్రీకృష్ణుడు; ఆ నరుండున్= ఆ అర్జునుడు;

ఎంతయున్= మిక్కిలి; భీతిన్+పొందిరి= భయాన్ని పొందారు; అంతన్= అప్పుడు; విధాత్రుఁడు= ఆయుస్సు నిచ్చే బ్రహ్మ; వానికిన్= ఆ కర్ణుడికి; తప్పెన్= అనుకూలుడు కాకుండా పోయాడు. (అందువలననే కర్ణుడు ప్రాణాలు కోల్పోయాడు.)

**తాత్పర్యం:** 'నరవరా! ఇంతకుముందు ఎన్నెన్నో యుద్ధాలు చూచి ఉన్నాం కదా! కాని, కర్ణార్జునులు ఈ యుద్ధంలో ప్రదర్శించిన క్రూరత్వం ఎక్కడైనా చూచామా? అట్టిపోరును అట్లా సాగించినారే! ఆ యుద్ధ క్రూరత్వానికి దేవతలే ఆశ్చర్యపడ్డారు. ఆ విషయం అట్లుండనిమ్ము. కర్ణుడి యుద్ధతీవ్రతకు, వేగానికి ఆ నరనారాయణులిద్దరూ భయపడిపోయారు. ఇంతకూ కర్ణుడికి విధి చాలలేదు. ఆయుస్సు నిచ్చే బ్రహ్మదేవుడే అతడిపట్ల విముఖుడయ్యాడు. (కాబట్టే శౌర్యమున్నా ఆ చావు తప్పలేదు.)

**వ. అని వెండియు. 378**

**తాత్పర్యం:** అని మరల. (తరువాతి పద్యంతో అన్వయం).

**మ. 'ధరణీచక్రము నీవ యేలుటకు నుత్సాహంబు వాటించి పో**
**రిరి, ప్రాణంబులు డాఁపమిం బడిరి వీరిం జూడు!' మంచుం దురం**
**గ రథేభంబులు చుట్టుఁ గూలి వికటాకారంబులై యుండ నొ**
**ప్పి రణోర్విం బడియున్న భూపతులఁ జూపెం; జూపి యా రాజుతోన్. 379**

**ప్రతిపదార్థం:** ధరణీచక్రము= భూవలయాన్ని; నీవు+అ= నీవే; ఏలుటకున్= పాలించటానికి; ఉత్సాహంబు= ఆసక్తి; పాటించి; ప్రాణంబులు డాఁపమిన్= ప్రాణాలు దాచిపెట్టుకోనందున; పడిరి= నిహతులయ్యారు; (అట్టి) వీరిన్; చూడుము; అంచున్= అంటూ; తురంగ, రథ, ఇభంబులు= గుర్రాలు, రథాలు, ఏనుగులు; చుట్టున్; కూలి= చచ్చిపడి; వికట+ఆకారంబులు+ఐ= విరూపరూపాలై; ఉండన్= కన్పించగా; రణ+ఉర్విన్= యుద్ధభూమిలో; ఒప్పి= రాణించేటట్లు; పడి ఉన్న; భూపతులన్= రాజులను; చూపెన్; చూపి= అట్లా చూపించి; ఆ రాజుతోన్ (అన్నాడు)

**తాత్పర్యం:** నీ వొక్కడవే భూమినంతా పాలించాలని తమ ప్రాణాలను దాచుకొనకుండా పోరాడి, నిహతులై భూపతులు యుద్ధభూమిలో పడి ఉన్నారు. వీరిని చూడుము. 'చూపునకు వికటించే విధంగా పడిఉన్న వీరిచుట్టూ గుర్రాలు, తేరులు, ఏనుగులు కూలిపోయి ఉన్నవి. ఆ వీరుల ఒప్పిదాన్ని రాజరాజుకు చూపిస్తూ శల్యుడు ఇంకా అన్నాడు. (రణక్షేత్ర భీషణత్వానికి చారుత్వం చేకూర్చబడుతున్నది.) (తరువాతి పద్యంతో అన్వయం).

**వ. మఱియు నమ్మద్రపతి 'యింద్ర యమ వరుణ కుబేరులఁ బోల్పందగిన యింత లింతలు మేటిమగలు మనకార్యంబునకై శౌర్యంబును బాహు వీర్యంబును మెఱయించి ధైర్యంబు వొగడొందం బెనంగుట విఫలం బగుట విధికృతంబు; దీనికి వగవం బనిలే' దని చెప్పి ధనుఃఖండంబుల నాయుధ శకలంబులఁ గేతనాతపత్ర చామర గజఘంటా తురంగ కింకిణుల తునియలం, గంకణ కేయూర హారమకుటంబుల తుముళ్ళ నభిరామ భీషణం బగు రణాంగణంబు సూపి నీకయి పెనంగి సమసిన సైన్యంబు నాలోకింపు' మనునప్పు డసురాంతక పార్థులు పాంచజన్య దేవదత్తంబులు పూరించిన నింగి వగుల్చు నమ్మహారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంతవికలంబు లయి, వినిపాతిత రావణనందనుఁ డగు సుమిత్రానందను సింహనాదంబున**

**భయం బంది పఱచు దానవసేనల చందంబున, నీ కొడు కున్న నెలవు విడిచి వలియంబాఱిన వెలవెలంబాఱు నక్కురుపతితో నా శల్యుండు 'సంధ్యాసమయం బయ్యె నేఁటికిఁ గయ్యంబు సాలింపుము; వేగుటయుఁ జేయవలయు కర్జంబు సూచికొంద' మనియె; నట్టియెడఁ గృపాశ్వత్థామ కృతవర్మ శకుని సుశర్మ ప్రభృతులగు దొరలు పాండవ జయంబునకు దైన్యంబు నొందిన మానసంబులతో నిశ్వాసంబులు నిగుడ, నక్కురుపతిఁ జేరం జనుదెంచిన నతండు మూఁకల మరల్ప రామియు దొరల యుత్సాహ వైకల్యంబును శల్యుమాటల తెఱంగు నూహించి, మరలి కర్ణుం బేర్కొని విలాపంబు సేయుచు 'హా కర్ణ! హా కర్ణ!' యను నెలుంగులతో బలంబులఁ దివియ నియమించినఁ, దివిసి కౌరవులు దోడం జనుదేర నిజ శిబిరంబునకుం బోయె; న ప్పోవుట జూదంబున నోడి పాండునృపకుమారులు హస్తినాపురంబు వెడలి యడవికిం బోవునప్పటి భంగి యై యుండె; నయ్యవసరంబున. 380**

**ప్రతిపదార్థం:** మఱియున్= ఇంకా; ఆ+మద్రపతి= ఆ మద్రదేశాధీశుడైన శల్యుడు; ఇంద్ర, యమ, వరుణ, కుబేరులన్; వీరితో; పోల్పన్+తగి= సదృశులని చెప్పదగిన; ఇంతలు+ఇంతలు= ఇంతింత; మేటిమగలు= అగ్రశ్రేణి వీరపురుషులు; మన కార్యంబునకై; శౌర్యంబును= పరాక్రమాన్నీ; బాహువీర్యమును= భుజబల దర్పాన్నీ; మెఱయించి= ప్రకాశింపజేసి; ధైర్యంబు= వారు చూపిన సాహసం; పొగడు+ఒందన్= కొనియాడబడేటట్లు; పెనంగుట= యుద్ధం చేయటం; విఫలంబు+అగుట= ఫలితం దక్కకపోవటం; విధికృతంబు= పూర్వకర్మ ఫలితమైన నుదుటివ్రాత; దీనికిన్; వగవన్ పని లేదు= పశ్చాత్తాపపడవలసిన అగత్యం లేదు; అని; చెప్పి; ధనుఃఖండంబులన్= విల్లుల తునుకలను; ఆయుధ శకలంబులను= పోరు పనిముట్ల ముక్కలను; కేతన= ధ్వజ; ఆతపత్ర= గొడుగుల; చామర= చమరీమృగాల తోకవెంట్రుకలతో కుచ్చువలె కూర్చబడిన వింజామరల; గజఘంటా= ఏనుగుకు కట్టిన మువ్వల (గంటల); తురంగ= గుర్రాల; కింకిణుల= మువ్వల; తునియలన్= విరిగిపోయిన ముక్కలను; కంకణ= మానవులు ధరించే ముంజేతి వలయముల; కేయూర= రెట్ట కడియాల; హార= దండల; మకుటంబుల= కిరీటాల; తుముళ్ళన్= పొడితో; అభిరామ భీషణంబు+అగు= కనులపండువుగా ఉండియు, భీతిని పుట్టిస్తున్న; రణ+అంగణంబు= యుద్ధప్రదేశాన్ని; చూపి; నీకయి= నీకొరకు; పెనంగి= పోరాడి; సమసిన= మరణించిన; సైన్యంబున్; ఆలోకింపుము= బాగా పరికించి చూడుము; అనునప్పుడు= చెప్పే సమయంలో; అసుర+అంతక= రాక్షససంహారి కృష్ణుడు; పార్థులు (తమ); పాంచజన్య - దేవదత్తములు (శంఖముల పేర్లు - వరుసగా); పూరించినన్= ఊదగా; నింగి= ఆకాశమును; పగుల్చు= పగలకొట్టే; ఆ+మహారవంబునన్= ఆ గొప్పశబ్దం వలన; గుండియలు; అవిసి= పగిలి; కురుబలంబులు; అత్యంత= మిక్కిలి; వికలంబులు+ఐ= కలవరపడి; వినిపాతిత= చంపబడిన; రావణునందనుఁడు+అగు= రావణుడి కుమారుడైన మేఘనాథుని కలిగిన; సుమిత్రానందను= సుమిత్రాదేవి కుమారుడైన లక్ష్మణుని; సింహనాదంబునన్= సింహగర్జన శబ్దంబువలన; భయంబు+ అంది= భయపడి; పఱచు= పరుగెత్తిపోయే; దానవసేనల చందంబునన్= రాక్షస సేనలవలె; నీ కొడుకు; ఉన్న; నెలవు= స్థావరాన్ని; విడిచి= వదలిపెట్టి; వలియన్+పాఱినన్= వణకుతూ పరుగెత్తిపోగా; వెలవెలన్పాఱు= కాంతివిహీనుడైన; ఆ+ కురుపతితోన్= ఆ దుర్యోధనుడితో; ఆ శల్యుండు; సంధ్యాసమయంబు+అయ్యెన్= మాపటివేళ అయింది; నేఁటికిన్= ఈ దినానికి; కయ్యంబు= యుద్ధం; చాలింపుము; వేగుటయున్= తెల్లవారిన తరువాత; చేయవలసిన= ఆచరించవలసిన; కర్జంబు= కార్యాచరణ విధానం; చూచికొందము= చూచుకొనవచ్చును; అనియెన్; అట్టి+ఎడన్= ఆ సమయంలో; కృప అశ్వత్థామ కృతవర్మ శకుని సుశర్మ - ప్రభృతులు అగు= మొదలగువారైన; దొరలు= నాయకులు; పాండవజయంబునకున్; దైన్యంబు నొందిన= దీనత్వంలో వెలవెలబారిన; మానసంబులతోన్= మనస్సులతో; నిశ్వాసంబులు నిగుడన్= గట్టిగా దీర్ఘంగా ఊపిరి వదలుతూ; ఆ+కురుపతిన్= ఆ రారాజును; చేరన్= కలిసికొనుటకు; చనుదెంచినన్= రాగా; అతండు= దుర్యోధనుడు; మూఁకలన్= సైన్యాలను; మరల్పరామియున్= పొయ్యేవారిని నిలిపి తమతట్టు త్రిప్పుకొనజాలకపోవటాన్ని; దొరల; ఉత్సాహ=

ప్రేరకశక్తి; వైకల్యంబును= విరిగిపోవటాన్ని; శల్యుమాటల= శల్యుడి మాటల; తెఱంగున్= ధోరణిని; ఊహించి= మనస్సుకు తెచ్చుకొని; మరలి= వెనుకకు తిరిగి; కర్ణునిన్+పేర్కొని= కర్ణుడి పేరును పలుకుతూ; విలాపంబుచేయుచున్= ఏడుస్తూ; హాకర్ణ! హాకర్ణ!; అను ఎలుంగులతోన్= అంటున్న కంఠస్వరాలతో; బలంబులన్; తివియన్= వెనుకకు తగ్గమని; నియమించినన్= ఆజ్ఞాపించగా; తివిసి= తిరిగి; కౌరవులు; తోడన్= వెంట; చనుదేరన్= రాగా; నిజశిబిరంబునకున్= తన విడిదికి; పోయెన్; ఆ+పోవుట; జూదంబునన్; ఓడి; పాండునృపకుమారులు; హస్తినాపురంబు వెడలి; అడవికిన్; పోవునప్పటి భంగియై= పొయ్యేటప్పటి విధంగా; ఉండెన్; ఆ+అవసరంబునన్= ఆ సందర్భంలో.

**తాత్పర్యం:** శల్యుడు 'ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు మొదలైనవారితో పోల్చదగిన మహావీరులు మన కార్యసాధనకు పరాక్రమాన్నీ, బాహుబలాన్నీ ప్రదర్శించి ధైర్యంతో యుద్ధం చేయటం, అది విఫలం కావటం విధిప్రభావం. దానికి విచారించవద్దు' అని చెప్పాడు, విండ్లముక్కలు, ఆయుధాలముక్కలు, జెండాకర్రల, గొడుగుల, వింజామరల, ఏనుగుగంటల, గుర్రాల మువ్వల ముక్కలు, కంకణాల, కేయూరాల, హారాల, కిరీటాల పొడులు రణరంగమంతా పడి ఉన్నాయి. సుందరంగానూ, భయంకరంగానూ ఉన్న ఆ యుద్ధభూమిని చూపి 'నీ కొరకు పోరి ప్రాణాలు వదలిన సైన్యాన్ని చూడుము' అని అన్నాడు. అప్పుడు కృష్ణార్జునులు పాంచజన్య, దేవదత్త శంఖాలను ఊదారు. ఆకాశం బ్రద్దలయ్యే ఆ శబ్దానికి గుండెలుపగిలి కౌరవసైనికులు వికావికలయ్యారు. రామరావణయుద్ధంలో మేఘనాథుడు చనిపోగా లక్ష్మణుడు చేసిన సింహనాదానికి భయపడి పరుగెత్తిన రాక్షససైన్యంవలె కౌరవసేనలు దుర్యోధనుడున్న చోటును వదలి పరుగెత్తగా దుర్యోధనుడు వెలవెలపోయాడు. 'సంధ్యాసమయమయింది. నేటికి యుద్ధంచాలించి, తెల్లవారేసరికి తరువాతి కర్తవ్యాన్ని నిర్ణయించుకొనవచ్చు' నని శల్యుడు పలికాడు. కృపుడు, అశ్వత్థామ, కృతవర్మ, శకుని, సుశర్మ మొదలైనవారు పాండవవిజయానికి ఖిన్నులై నిట్టూర్పులు వదలుతూ దుర్యోధనుడి వద్దకు వచ్చారు. సేనలా - మరలి వచ్చేటట్లు లేవు. దొరలా - ఉత్సాహం కోల్పోయారు. ఆ పరిస్థితిలో శల్యుడి మాటలు స్మరించి, 'కర్ణా! కర్ణా!' అని ఎలుగెత్తి శోకిస్తూ, బలాలకు విరామమిచ్చి, కౌరవులు వెంటరాగా దుర్యోధనుడు తన శిబిరానికి వెళ్ళాడు. ఆ పోవటం కపటద్యూతంలో ఓడి పాండవులు హస్తినాపురాన్ని వదలి అడవికి పోయినప్పటి విధంగా ఉన్నది. ఆ సమయంలో. (తరువాతి పద్యంతో అన్వయం).

**విశేషం:** అలంకారం: స్మృతి.

**చ. తనువులఁ గర్ణబాణము లుదాత్తగతిం జెలువొందఁ గౌరవుల్**
**కనుకనిఁ బాఱ, శౌరియును గవ్వడియున్ వెలుఁగొంది రొక్కెడ**
**న్వినుత మరీచులై పొడిచి నిర్భర సంతమసంబు నల్గడం**
**జన నభిరామ మూర్తు లగు చంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టుగన్. 381**

**ప్రతిపదార్థం:** తనువులన్= శరీరములందు; కర్ణబాణములు= కర్ణుడి బాణాలు; ఉదాత్త భంగిన్= గొప్పగా; చెలువు+ఒందన్= అందగించగా; కౌరవుల్; కనుకనిన్= సంభ్రమంతో; పాఱన్= పరుగెత్తికొనిపోగా; శౌరియున్= కృష్ణుడూ; కవ్వడియున్= అర్జునుడూ; వినుత మరీచులు+ఐ= పొగడబడే కిరణాలుగలవారై; పొడిచి= ఉదయించి; నిర్భర సంతమసంబు= సంపూర్ణమైన చీకటి; నల్గడన్= నాలుగువైపులకూ; చనన్= పోగా; అభిరామ మూర్తులు+అగు= మనోహరాకారులగు; చంద్రునిన్; సూర్యునిన్; పోల్పన్= పోల్చుటకు; పట్టుగన్= స్థానమగునట్లు; ఒక్క+ఎడన్= ఒకచోట; వెలుఁగొందిరి= ప్రకాశించారు.

**తాత్పర్యం:** శరీరాల్లో కర్ణుడు నాటిన బాణాలు గొప్పగా ప్రకాశిస్తూఉండగా, కౌరవులు భయంతో పరుగెత్తిపోగా కృష్ణార్జునులు - స్తుతింపదగిన కిరణాలతో ఉదయించి, దట్టమైన చీకట్లు నలువైపులకు తొలగిపోగా మనోహరాకారులైన చంద్రసూర్యులతో పోల్చదగినవారై ఒక చోట శోభిల్లారు.

**విశేషం:** అలంకారాలు: ఉపమ - ఉత్ప్రేక్ష.

**వ. ఇ ట్లొప్పి, యమ్మెఱుంగుటమ్ములు పెఱికివైచి, యొండొరుల యాననంబు లాలోకించి 'రాత్రి ముఖం బయ్యె విరోధుల వెనుకొనుటకు సమయంబుగా' దని సంభాషణంబులు సేసి, తమ సేనలం దివియ నియమించి; 382**

**ప్రతిపదార్థం:** ఇట్లు+ఒప్పి= ఈ విధంగా రాణించి; ఆ+మెఱుంగు+అమ్ములు= తళతళలాడే ఆ బాణాలను; పెఱికివైచి; ఒండొరుల ఆననంబులు= ఒకరిముఖం ఒకరు; ఆలోకించి= చూచుకొని; రాత్రిముఖంబు+అయ్యెన్= రేయి తలచూపించి (చీకటి క్రమ్ముకొంటున్నదనుట); విరోధుల; వెనుకొనుటకున్= తరుముటకు; సమయంబు కాదు; అని; సంభాషణంబులు= సల్లాపాలు; చేసి; తమసేనలన్; తివియన్= ఉపసంహరించుకొనుటకు; నియమించి= ఆజ్ఞాపించి.

**తాత్పర్యం:** అట్లా శోభిల్లి, ఆ మెరిసే అమ్ములను పీకివేసికొని, ఒకరిమొగం మరొకరు చూచుకొంటూ 'రాత్రి కావస్తున్నది. శత్రువులను వెన్నాడటానికి సమయం కాదిది' అని పలికి, తమ సేనలను పోరు విరమించండని ఆజ్ఞాపించి. (తరువాతి పద్యంతో అన్వయం).

**తే. బలునిఁ దెగటార్చి మరలు గోపతియు హరియుఁ। బోలెఁ గర్ణుని సమయించి లీల మెఱయ**
**మరలి రత్యంత మోదసంభరితు లగుచుఁ। గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర. 383**

**ప్రతిపదార్థం:** బలునిన్= బలుడనే రాక్షసుడిని; తెగటార్చి= సంహరించి; మరలు= తిరిగివచ్చే; గోపతియున్= ఇంద్రుడును; హరియున్; పోలెన్; కర్ణుని; సమయించి= చంపి; లీల మెఱయన్= విలాసంశోభిల్లగా; అత్యంత= మిక్కిలి; మోదభరితులు+ అగుచున్= సంతోషంతో నిండిన వారౌతూ; కవ్వడియున్= అర్జునుడూ; కృష్ణుడును; బంధుగణములు= చుట్టాలు; అలరన్= సంతోషిస్తుండగా; మరలిరి= వెనుదిరిగిపోయారు.

**తాత్పర్యం:** బలుడనే అసురుడిని వధించి తిరిగివచ్చే ఇంద్ర ఉపేంద్రులవలె, కర్ణుడిని సంహరించి అర్జునుడు, కృష్ణుడూ ఆనందభరితులై, సంతోషంతో బంధుజనులు ఉప్పొంగుతుండగా, తిరిగి శిబిరం చేరారు.

**విశేషం:** అలంకారం: ఉపమ. బలుడు మాయాసురుని కుమారుడు. అతలం అనే అధోలోక నివాసి. పలుమాయలతో దేవతలను బాధించేవాడు. అతనితో జరిగిన యుద్ధంలో ఓడిపోయి ఇంద్రుడు అతడిని కీర్తించగా మెచ్చి బలుడు ఇష్టమైన వరాన్ని కోరుకో ఇస్తానన్నాడు. ఇంద్రుడు అతని దేహాన్ని కోరుతాడు. వెంటనే బలుడు తన శరీరాన్ని ముక్కలు చేసి ఇంద్రుడికి అర్పిస్తాడు. వాటిని ఇంద్రోపేంద్రులు అన్ని వైపుల విసరి వేయగా అవిపడిన చోట్లు వజ్రపుతునుకలవుతాయి. తన భర్తను బ్రతికించుమని అతనిభార్య ప్రభావతి కులగురువైన శుక్రచార్యులను వేడుకొంటుంది. అతడిని బ్రదికించడం శక్యం కాదనీ కంఠధ్వని వినేటట్లు చేయగలనని గురువుచెపుతారు. నీ శరీరాన్ని వదలి నన్ను చేరుకొమ్మని బలుడి గొంతు వినిపించగా ఆమె వెంటనే మరణించి అతడితో కలసి నదిగా మారుతుంది.

**వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు, నిజనివాసంబులకుం జనిరి; పాండవ సేనా జనంబులు సంతసంబునం దేలుచు ధనంజయుం జెలంగి పొగడుచుం బోయి; రివ్విధంబున జయంబునం బొంపిరి వోవుచుఁ బాండవులు విడిదల కరిగి, ధర్మనందను నగరిమొగసాలఁ జొచ్చి; రట్టియెడ. 384**

**ప్రతిపదార్థం:** అప్పుడు; దివ్యులు= దేవతలు; ఆ+నారాయణులన్= ఆ కిరీటిని కృష్ణుని; అనేక ప్రకారంబులన్= అనేక విధాలుగా; ప్రశంసించుచున్= కొనియాడుతూ; నిజనివాసంబులకున్= తమ తమ గృహాలకు; చనిరి; పాండవసేనాజనంబులు; సంతసమునన్= సంతోషంతో; తేలుచున్= తేలాడుతూ; ధనంజయుని= అర్జునుడిని; చెలంగి= ఉప్పొంగి; పొగడుచున్; పోయిరి; ఆ+విధంబునన్; జయంబునన్= సాధించిన విజయంవలన; పొంపిరిపోవుచున్= అతిశయమైన ఆనందాన్ని వెల్లడిస్తూ; పాండవులు; విడిదలకున్= విశ్రాంతి స్థావరానికి(బసకు); అరిగి; ధర్మనందను; నగరిమొగసాలన్= అంతఃపుర ప్రాంగణం; చొచ్చిరి= ప్రవేశించారు; అట్టి+ఎడన్= ఆ సమయంలో.

**తాత్పర్యం:** అప్పుడు దేవతలు ఆ కృష్ణార్జునులను పలురకాలుగా కీర్తిస్తూ తమ ఇండ్లకు వెళ్ళారు. పాండవసైనికులు సంతోషంతో పొంగుతూ అర్జునుడిని ఉల్లాసంతో పొగడుతూ పోయారు. ఈ విధంగా జయంతో పొంగిపోతూ పాండవులు విడిదులకు చేరి, ధర్మరాజు నగరి ప్రాంగణంలో ప్రవేశించారు. అప్పుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**క. చెన్నునఁ బాంచాలురు మును । ము న్నానృపుకడకు నేఁగి, ముదితాత్ముం డై**
**యున్న యతనిఁ గని, దీవన । ల న్నతులను సమ్మదానులాపములఁ దగన్. 385**

**ప్రతిపదార్థం:** పాంచాలురు; మునుమున్ను= మొట్టమొదటిసారిగా (ప్రప్రథమంగా); చెన్నునన్= వికాసంతో (అందగించేటట్లు); ఆ నృపుకడకున్= ఆ రాజు ధర్మజుడిదగ్గరకు; ఏఁగి= పోయి; ముదిత+ఆత్ముండై ఉన్న= సంతోషచిత్తుడైయున్న; అతనిన్+ కని= ఆయనను చూచి; దీవనలన్= ఆశీర్వాదాలతో; నతులను= నమస్కారాలతో; సమ్మద= సంతోషంతో కూడిన; అనులాపములన్= మాటలతో; తగన్= ఉచితరీతులలో.

**తాత్పర్యం:** పాంచాలురు అందరి కంటె ముందుగ ఆనందంతో ఉన్న ధర్మరాజు దగ్గరకు వెళ్ళి చూచారు. దీవించేవారు దీవించి, నమస్కరించి, ముచ్చట మాటలను చెప్పి, ఆయనను తగిన రీతులలో. (తరువాతి వచనంతో అన్వయం).

**వ. గారవించిరి; వివ్వచ్చుండు వేగంబ యరదంబు డిగ్గి చని, యజ్జనపతి చరణంబులకుఁ బ్రణతుండైన, నతం డెత్తి యాలింగనంబును మూర్ధాఘ్రాణంబును జేసె; భీమ నకుల సహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి, పార్థుం గౌఁగిలించిరి, కృష్ణసాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయ ప్రణామంబు లాచరించిన నమ్మహీవరుం డత్యాదరంబున నభినందించె; నప్పుడు కృష్ణుం డతని కిట్లనియె: 386**

**ప్రతిపదార్థం:** గారవించిరి= గౌరవించారు; వివ్వచ్చుండు= అర్జునుడు; వేగంబ= త్వరగా; అరదంబు= రథం; డిగ్గి= దిగి; చని; ఆ+జనపతి= ఆ ధర్మరాజుయొక్క; చరణంబులకున్= పాదాలకు; ప్రణతుండు+ఐనన్= వంగి నమస్కరించగా; అతండు= ఆ ధర్మజుడు; ఎత్తి= లేవదీసి; ఆలింగనంబును= కౌగిలింతను; మూర్ధ+ఆఘ్రాణంబును= శిరస్సును మూర్కొనుటను; చేసెన్; భీమ నకుల సహదేవులు; ఆ+నరదేవ+ఉత్తమునకున్= ఆ రాజశ్రేష్ఠునకు; ప్రణమిల్లి= నమస్కరించి; పార్థున్;

కౌఁగిలించిరి; కృష్ణసాత్యకులు (ఇద్దరు); ఆ+పాండవ+అగ్రజునకున్= ఆ పాండవ జ్యేష్ఠుడికి; సవినయ= వినయముతో కూడిన; ప్రణామంబులు= వందనాలు; ఆచరించినన్; ఆ+మహీవరుఁడు= ధర్మరాజు; అభినందించెన్= కొనియాడాడు; అప్పుడు; కృష్ణుండు; అతనికిన్; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు:

**తాత్పర్యం:** (ఆ విధంగా అందరు) గౌరవించారు. అర్జునుడు వేగంగా రథం దిగి, ధర్మరాజు పాదాలకు నమస్కరించాడు. ధర్మరాజు అతడిని ఎత్తి కౌగిలించుకొని శిరస్సు నాఘ్రాణించాడు. భీమనకుల సహదేవులు ధర్మరాజుకు నమస్కరించి, అర్జునుడిని కౌగిలించుకొన్నారు. కృష్ణ సాత్యకులు కూడా ధర్మరాజుకు సవినయ నమస్కారాలు చేయగా అతడు వారిని అభినందించాడు. అప్పుడు కృష్ణుడు అతడితో ఇట్లా అన్నాడు:

### శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో సరససల్లాపంబు చేయుట (సం. 8-69-16)

**క. 'భువనము లన్నియు నొక్కఁ । గవిసియుఁ గర్ణుఁ బరిమార్పంగా నోపునె? భూ**
**ధవ! భవదీయ క్రోధా । గ్ని విహతుఁడై క్రాఁగెఁ గాక నిక్కం బరయన్.' 387**

**ప్రతిపదార్థం:** భూధవ!= భూభర్తా!; నిక్కంబు+అరయన్= నిజాన్ని విచారించి తెలిసికొంటే; భవదీయ= నీయొక్క; క్రోధ+అగ్ని= కోపం అనే అగ్నితో; నిహతుఁడు+ఐ= చంపబడి; క్రాఁగెన్+కాక= కాలిపోయాడు కాని; భువనములు= జగత్తులు; అన్నియున్; ఒక్కటన్+కవిసియున్= ఒక్కటై ఎదుర్కొనినను; కర్ణున్= కర్ణుడిని; పరిమార్పంగాన్= చంపుటకు; ఓపునె?= చాలి ఉన్నవా?.

**తాత్పర్యం:** 'భూనాథా! ఈ లోకాలన్నీ ఒక్కటై ఎదుర్కొన్నా కర్ణుణ్ణి సంహరించగలవా? నిజాన్ని నిగ్గు దేల్చి చూస్తే, నీ క్రోధాగ్ని చేతనే అతడు చచ్చి కాలిపోయాడు. అంతే.'

**విశేషం:** అలంకారం: రూపకం.

**ఆ. 'రథిక వర్యుఁడైన రాధేయు పొలిసిన । యపుడ యెల్లఁ బొలిసె నని తలంపు**
**కౌరవుల; కడంగె వైరంబు, నీ కింక । నెదురు లేదు; ప్రీతిఁ బొదలు మధిప!' 388**

**ప్రతిపదార్థం:** అధిప!= రాజా!; రథికవర్యుఁడు+ఐన= రథయోధులలో శ్రేష్ఠుడయిన; రాధేయు పొలిసినన్= కర్ణుడు చనిపోయిన; అపుడు+అ= వెంటనే; ఎల్లన్= అన్నీ; పొలిసెన్+అని= నాశనమైపోయినవని; తలంపు= తలంపుము; కౌరవులకున్; వైరంబు= విరోధం; అడంగెన్= తీరిపోయింది; నీకున్; ఇంకన్; ఎదురులేదు= ప్రతిపక్షమే లేదు; ప్రీతిన్= సంతృప్తితో; పొదలుము= అభివృద్ధిని పొందుము.

**తాత్పర్యం:** 'రాజా! రథయోధులలో శ్రేష్ఠుడైన కర్ణుడు చావటంతోనే కౌరవులకు అన్నీ పోయాయని భావింపుము. దీనితో నీకు ఎదురే లేకుండా పోయింది. ఇక నీవు సంతోషంగా ప్రవర్తిల్లుము.'

**చ. అన విని, యమ్మురాంతకున కా నృపుఁ డిట్లను 'నీవు చక్కఁ జూ**
**చిన సులభంబు శోభనము శ్రీధర! నీదగు కూర్మి కేను భా**
**జన మటె! నాకు దుష్కరమె శత్రుజయంబు? భవత్ప్రసాద జీ**
**వనులము మాకు సంపదలు వచ్చు నవశ్యము నింత నమ్ముదున్.' 389**

**ప్రతిపదార్థం:** అనన్ విని; ఆ+ముర+అంతకునకున్= మురుని చంపిన ఆ కృష్ణుడితో; ఆ నృపుఁడు= ఆ ధర్మరాజు; ఇట్లు+ అనున్= ఇట్లా అన్నాడు; శ్రీధర!= శ్రీకృష్ణా!; నీవు; చక్క-చూచినన్= బాగా చూస్తే; శోభనము= శుభంబుకలుగుట; సులభంబు; నీదగు= నీయొక్క; కూర్మికిన్= వాత్సల్యానికి; ఏను= నేను; భాజనము+అటె!= పాత్రుడనయ్యానే; నాకున్; శత్రుజయంబు= పగవారిని జయించుట; దుష్కరమె?= కష్టమా? (సులభసాధ్యం); భవత్= నీయొక్క; ప్రసాద= అనుగ్రహంవలన; జీవనులము= జీవిస్తూ ఉండేవారము; (అయిన); మాకున్; సంపదలు= సౌభాగ్యాలు; అవశ్యమున్= తప్పక; వచ్చున్= కలుగుతాయి; ఇంత= దీనిని; నమ్మెదున్= విశ్వసిస్తాను.

**తాత్పర్యం:** చెప్పినదంతా విని ఆ కృష్ణుడితో ధర్మరాజు ఇట్లా అన్నాడు: 'కృష్ణా! నీవు కృపాదృష్టితో చూచినంత మాత్రాననే శుభం సులభంగా ప్రాప్తిస్తుంది. నీ ప్రేమకు నేను తగినవాడినయ్యాను గదా. ఇక శత్రుజయం నాకు కష్టమా? నీ దయతో జీవిస్తున్నవారము. అందువలన మాకు సంపదలు తప్పక చేకూరుతాయి. దీనిని గట్టిగా నమ్మి ఉన్నాను.'

**ఆ. 'అఖిల రక్షకుండ వగు నీకు భక్తుల । మైన మమ్ముఁ గాచు టరుదె? తలఁప**
**భయము నెవ్వగయును బాసి నా కంటికి । నిదుర వచ్చు నేఁడు నీరజాక్ష!'** **390**

**ప్రతిపదార్థం:** నీరజాక్ష!= కమలనయనా! కృష్ణా!; తలఁపన్= ఆలోచింపగా; అఖిల= సమస్త ప్రపంచానికి; రక్షకుండవు+అగు= కాపాడేవాడవైన; నీకు; భక్తులము+ఐన, మమ్మున్; కాచుట= ప్రోచుట; అరుదె?= ఏమంత ఆశ్చర్యకరమైన విషయమా?; భయము; నెవ్వగయును= ఎక్కువైన దుఃఖం; పాసి= పోగొట్టుకొని; నేఁడు; నాకంటికిన్; నిదురవచ్చున్.

**తాత్పర్యం:** 'పద్మలోచనా! నీవు సర్వలోకాలను కాపాడేవాడవు. భక్తత్రాణ పరాయణుడవు. కాబట్టి, నీ భక్తులమైన మమ్మి రక్షించటం అంత ఆశ్చర్యకరమైన విషయమా! భయం, దిగులు పోయి ఇప్పుడు నా కంటికి హాయిగా నిద్రపట్టుతుంది.'

**వ. అనవుడు, నచ్యుతుండు.** **391**

**ప్రతిపదార్థం:** అని అనగా శ్రీకృష్ణుడు. (తరువాతి పద్యంతో అన్వయం).

**చ. 'మనమునఁ గూర్తు గాన, తగుమాటల నాకుఁ బ్రియం బొనర్చు టొ**
**ప్పును; విను మీ జయంబునకు భూవర! యేను నిమిత్తమాత్ర; మీ**
**యనుజులు నీమఱందులు మహాద్భుత విక్రమశీలు; రిట్టి ని**
**న్ను నొకఁడు పోర మార్కొనఁగ నూల్కొని రూపఱకుండ నేర్చునే?'** **392**

**ప్రతిపదార్థం:** భూవర!= రాజా!; మనమునన్= మదిలో; కూర్తు(వు)= ఇష్టపడతావు; కాన= కాబట్టి; తగుమాటలన్= సందర్భోచితమైన మాటలతో; నాకు; ప్రియంబు+ఒనర్చుట= ప్రీతిని కలిగించటం; ఒప్పును= తగి ఉన్నది; విను; మీ జయంబునకున్; ఏను; నిమిత్తమాత్రము= ఒక సాధనప్రాయుడను; ఈ అనుజులు= ఈ తమ్ములు; నీ మఱందులు= నీ బావమరదులు; మహాద్భుత= ఆశ్చర్యం కలిగించే; విక్రమశీలురు= పరాక్రమగుణ సంపన్నులు; ఇట్టి= ఇటువంటి; నిన్నున్; ఒకఁడు= ఎవడో ఒకడు; పోరన్= యుద్ధంలో; మార్కొనఁగన్= ఎదిరించేటందుకు; నూల్కొని= పూనుకొని; రూపఱకుండన్= రూపుమాసిపోకుండా ఉండటానికి; నేర్చునే?= సాధ్యమా?

**తాత్పర్యం:** 'రాజా! నీ మనసుకు ఇష్టమైనవాడిని కావటంచేత తగు మాటలతో నాకు సంతోషాన్ని కలిగించటం ఉచితమే. అయినా ఉన్న సంగతి వినుము. మీరు సాధించిన విజయానికి నేను కేవలం ఒక నిమిత్తమాత్రుడనే. నీ తమ్ములు, నీ బావమరదులు అద్భుతమైన పరాక్రమవంతులు, ఇలాంటి నిన్ను ఎవడో ఒకడు యుద్ధంలో ఎదిరిస్తే, రూపుమాసిపోకుండా నిలబడగలడా?

**వ. అని యిట్లు, మధుర సల్లాప సౌఖ్యంబు నొంది, ధర్మనందనుండు పొలికలను సూచువేడుక దనకుం బుట్టినఁ, గృష్ణునితోడం జెప్పి యతం డనుమతి సేయం, గాలవాలంబులు దంత వర్ణంబులునగు రథ్యంబులఁ దన రథంబునఁ బూన్పించి, యారోహణంబు సేసి, కరదీపికా సహస్రంబులు వెలుంగ, సమస్తబంధు మిత్ర సోదర పరివృతుండై యరుగునప్పుడు, కృష్ణు నాలోకించి. 393**

**ప్రతిపదార్థం:** అని; ఇట్లు; మధుర= తీయని; సల్లాప= సంభాషణలతో; సౌఖ్యంబు= హాయిని; ఒంది= అనుభవించి; ధర్మనందనుండు; పొలికలను= యుద్ధభూమిని; చూచు వేడుక= చూడాలన్న అభిలాష; తనకున్; పుట్టినన్= కలుగగా; కృష్ణుడితోడన్ చెప్పి; అతఁడు; అనుమతి చేయన్= ఒప్పుకొనగా; కాల వాలంబులు= నల్లటితోకలు; దంతవర్ణంబులున్+అగు= ఏనుగుకొమ్ములవలె తెల్లని మెయిచాయ కలిగిన; (తెల్లనిగుర్రాలకు నల్లటితోకలు ఒకశోభ); రథ్యంబులు= తేరులాగే గుర్రాలను; తన రథంబునన్; పూన్పించి= కట్టించి; ఆరోహణంబు చేసి= ఎక్కి; కరదీపికా= చేతికాగడాల; సహస్రంబులు= వేలకొలది; వెలుంగన్= వెలుగుతుండగా; సమస్త= అందరు; బంధుమిత్రసోదర; పరివృతుఁడై= చుట్టూ చేరినవాడై; అరుగునప్పుడు= వెళ్ళేటప్పుడు; కృష్ణున్; ఆలోకించి= చూచి.

**తాత్పర్యం:** ఇట్లా తియ్యని ప్రీతిమాటలవలని సుఖాన్ని పొంది, ధర్మరాజుకు యుద్ధభూమిని చూడాలనే కోరిక కలుగగా శ్రీకృష్ణుడితో చెప్పి అతడి అనుమతి పొంది, నల్ల తోకలుగల తెల్లని గుర్రాలు పూన్చిన రథమెక్కి వేయి కాగడాలు వెలుగుతూ ఉండగా సమస్త బంధుమిత్ర సోదరబృందాలు వెంటరాగా వెళ్ళుతూ కృష్ణుడిని చూచి (తరువాతి పద్యంతో అన్వయం.)

**ఆ. 'సకలధరణివలయ సామ్రాజ్యమునకు నేఁ । డేను భర్తనైతి! నెల్ల పెంపు**
**గలిగి నీదుకరుణఁ గడిఁదిమగం డగు । పగతుఁ డశ్రమమునఁ దెగుటఁ జేసి!' 394**

**ప్రతిపదార్థం:** కడిఁది= గొప్ప; మగండు= వీరుడు; అగు; పగతుఁడు= శత్రువు; అశ్రమమునన్= అనాయాసంగా; తెగుటన్+చేసి= హతుడగుటవలన; నీదుకరుణన్= నీ దయవలన; సకలధరణివలయ= సమస్త భూచక్ర; సామ్రాజ్యమునకున్= సంపూర్ణ ఆధిపత్యానికి; ఎల్లపెంపున్+కలిగి= సమస్త వైభవము సమకూడి; నేఁడు= ఈనాడు; ఏను; భర్తను+ఐతిన్= ప్రభుడనయ్యాను.

**తాత్పర్యం:** 'శౌర్యఘనుడైన, శత్రువు సులభంగా చంపబడటంచేత, నీ దయవలన మొత్తం మండల సామ్రాజ్యానికి సంపూర్ణ వైభవంతో సమ్రాట్టునయ్యాను.

**క. అని కీర్తించుచు, నరుఁ గనుఁ । గొని యగ్గించుచు, ముదంబు గూరిన మదితోఁ**
**జని కర్ణునిశిరమును ద । త్తనయుల గాత్రములుఁ జూచె ధరణీనాథా! 395**

**ప్రతిపదార్థం:** ధరణీనాథా!= రాజా!; అని; కీర్తించుచున్= కొనియాడుతూ; నరున్; కనుఁగొని= చూచి; అగ్గించుచున్= పొగడుతూ; ముదంబు= సంతోషం; కూరిన= నిండిన; మదితోన్= మనస్సులో; చని= దగ్గరకు వెళ్ళి; కర్ణు శిరమును; తద్+ తనయుల= ఆయన కుమారుల; గాత్రములున్= శరీరాలను; చూచెన్= వీక్షించాడు.

**తాత్పర్యం:** భూమీశా! ధర్మజుడు శ్రీకృష్ణుడిని ఈ విధంగా స్తుతిస్తూ, అర్జునుడివైపు తిరిగి ఆయనను పొగడుతూ, సంతోషంతో నిండిన చిత్తంతో పోయి తెగిపడి ఉన్న కర్ణుడి తలను, ఆయన పుత్రుల దేహాలను చూచాడు.

**వ. చూచి తన్నప్పుడు గ్రమ్మఱ జన్మించినవానిఁగాఁ దలంచి, యాపదలకుం బాసి సంపదలకు భాజనంబ నైతి నని యూఱడిల్లి, యుల్లాసంబున మరలె; నిట్లు కర్ణసాగరంబు గడవ నీఁది పాండునందనులు పరమానందంబు నొంది రని, సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె: 396**

**ప్రతిపదార్థం:** చూచి; తన్నున్ అప్పుడు; క్రమ్మఱన్= మరలా; జన్మించినవానిన్+కాన్= పుట్టినవానినిగా(పునర్జన్మ పొందినవానినిగా); తలంచి= భావించుకొని ఆపదలకున్; పాసి= దూరమై; సంపదకున్; భాజనంబు+అ= పాత్రం; అయితిని; అని; ఊఱడిల్లి= ప్రశాంతచిత్తుడై; ఉల్లాసంబునన్= సంతోషంగా; మరలెన్= తిరిగిపోయాడు (ధర్మరాజు); ఇట్లు= ఈ విధంగా; కర్ణసాగరంబున్= కర్ణుడనే మహాసముద్రాన్ని; కడవన్= దాటేటట్లు; ఈది; పాండు నందనులు= పాండురాజు అయిదుగురు పుత్రులు; పరమ+ ఆనందంబు= పరిపూర్ణ సంతోషాన్ని; ఒందిరి= పొందారు; అని; సంజయుడు; ధృతరాష్ట్రునికి; చెప్పెనని= చెప్పాడని; జనమేజయునకున్; వైశంపాయనుండు; ఇట్లు+అనియెన్= ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** చూచి, తాను అప్పుడు పునర్జన్మ ఎత్తినట్లుగా భావించి, కష్టాలు తీరి, సంపదలు పొందానని ఊరడిల్లి సంతోషంతో తిరిగి వెళ్ళాడు. ఈ విధంగా కర్ణుడనే సముద్రాన్ని చివరిదాకా ఈది, పాండవులు అధికసంతోషం పొందారని సంజయుడు ధృతరాష్ట్రుడితో చెప్పగా వైశంపాయనుడు జనమేజయుడితో ఇట్లా అన్నాడు.

**విశేషం:** అలంకారం: రూపకం.

**చ. అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్**
**వినుము! నరేంద్ర! యీ క్రతువు విష్ణుమయం; బిది నిర్వహించి ర**
**ర్జునుఁడును గర్ణుఁడున్ సమరరూపమునం దగ; నీప్రబంధ మిం**
**పొనరఁ బఠించినన్ వినిన నొందు నరుం జిరసౌఖ్యసంపదల్. 397**

**ప్రతిపదార్థం:** నరేంద్ర!= ఓ రాజా; వినుము; ఈ క్రతువు= ఈ యజ్ఞం; విష్ణుమయంబు= విష్ణువునకు ప్రీతికరం గావించబడింది; అనలుఁడున్= అగ్నిదేవుడు; భాస్కరుండును= సూర్యుడును; సుధాంశుఁడున్= అమృతకిరణుడైన చంద్రుడు; అధ్వర= ఈ యజ్ఞాన్ని; సంప్రవర్తకుల్= నడిపినవారు; అర్జునుడును; కర్ణుడును; సమర రూపమునన్= యుద్ధరూపంలో; తగన్= ఉచితరీతిని; నిర్వహించిరి= నెరవేర్చారు; ఈ ప్రబంధమున్= ఈ కావ్యమును; ఇంపు+ఒనరన్= మది సంతసమందేటట్లు; పఠించినన్= చదివినా; వినినన్= విన్నా; నరున్= మానవుడికి; చిర= శాశ్వతమైన; సౌఖ్యము; సంపదల్= ఐశ్వర్యములు; ఒందున్= కలుగుతాయి.

